# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## (శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత యోగవాసిష్ఠము)

**మొదటి సంపుటం**

**వైరాగ్య, ముముక్షు వ్యవహార, ఉత్పత్తి ప్రకరణములు**

అనుసృజన:

**వై. హెచ్. రామకృష్ణ**

**రామకృష్ణ మఠం**

**దోమలగూడ, హైదరాబాదు-500 029**

# ప్రవేశిక

ఆర్షధర్మ వాఙ్మయ వినీలాకాశంలో జాజ్వల్యమానంగా భాసిస్తున్న తారలెన్నో. ఆ తారా సమూహంలో విశిష్టంగా భాసిస్తూ ధ్రువతార అని పరిగణించదగినది శ్రీ యోగవాసిష్ఠము. వాసిష్ఠ రామాయణము, మహారామాయణము, ఆఖండ రామాయణము అని కూడా గణుతికెక్కిన ఈ గ్రంథం వాల్మీకి మహర్షిచే విరచితమైనది. ముప్ఫైరెండు వేల శ్లోకాలతో ఒప్పారే ఈ బృహద్గ్రంథంలో వైరాగ్య–ముముక్షువ్యవహార–ఉత్పత్తి–స్థితి–ఉపశమ–నిర్వాణ అనే ఆరు ప్రకరణాలు ఉన్నాయి.

వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రమూర్తికి చేసిన అద్వైత వేదాంత బోధ ఇందలి విషయం. అనాదిగా జిజ్ఞాసువులను వేధిస్తున్న ప్రశ్న 'మోక్షోపలబ్ధి కర్మ వలన లేక జ్ఞానం వలన చేకూరుతుందా?' అని. కర్మ జ్ఞానాలు రెండు పరస్పర విరుద్ధమైన సాధనామార్గాలని, రెండింటినీ ఏకకాలంలో సమన్వయపరచటం అసాధ్యమనీ వారి భావన. దీనితో సాధకులు రెండు వర్గాలై కొంతమంది కర్మాభిముఖులై మరికొందరు కర్మను త్యజించి పూర్తిగా జ్ఞానమార్గాన్ని అవలంబించి ముక్తిని పొందడానికి ప్రయత్నిస్తూ వస్తున్నారు. ఐతే పూర్తిగా కర్మాభిరక్తులై ఉండటం కాదు; కర్మను పరిత్యజించటమూ కాదు; సమాజానికి, బాధ్యతలకు దూరంగా ఉండటం కాదు; వివేక విచక్షణలతో కూడి విహిత కర్మలను ఆచరించటం ద్వారా కైవల్యపదాన్ని చేరుకోవచ్చు అని ఘంటాపథంగా చెపుతుంది ఈ గ్రంథరాజం. భగవంతుడికి అతీతంగా ఏదీ లేదని తెలుపుతూ జ్ఞాన కర్మలను సమన్వయ పరచటానికి సంబంధించి సాధకుడికి ఉండే సంఘర్షణను తొలగించి లౌకిక, పారలౌకిక ప్రపంచా లంటూ రెండూ వేరుగా ఏమిలేవని, ఉన్నదంతా ఏకైక సాక్షీభూత కేవల చైతన్యం అని ఉద్బోధిస్తుందీ గ్రంథం. అనేక అద్భుత దృష్టాంతాలతో మహాజ్ఞానమైన అద్వైత వేదాంతాన్ని సామాన్య సాధకుడు కూడా అవలీలగా అర్థంచేసుకునే రీతిలో విషయాన్ని వివరిస్తుందీ గ్రంథరాజం.

'మోక్షకారణం కర్మయా లేక జ్ఞానమా? లేక కర్మ జ్ఞానాలు రెండూ మోక్షసాధనాలా అని 'సుతీక్ష్ణుడు' అనే బ్రాహ్మణుడు అగస్తి అనే మునీంద్రుని అడిగినప్పుడు 'కేవలం కర్మ వలనగాని, జ్ఞానం వలన గాని మోక్షం లభింపదు. ఈ రెండింటి వలన మోక్షం లభిస్తుంది. కనుక సాధుజనులు ఈ రెంటిని మోక్షోపాయాలుగా పరిగణింతురు,' అంటూ ఒక పురాణేతిహాసాన్ని ఉటంకించటంతో కథ ప్రారంభమవుతుంది. ప్రశ్నలు, వాటికి సమాధానాలుగా కథలో కథ, కథలో కథగా సాగిపోయే ఈ గ్రంథంలో పదే పదే ద్రష్టకు దృశ్యప్రపంచపు మిథ్యాత్వాన్ని నిరూపించి, సంసార విముక్తుణ్ణి చేయడం ముఖ్య ప్రయోజనంగా కనపడుతుంది.

ఎవరు ఈ గ్రంథాన్ని పఠించటానికి అర్హులు అన్న ప్రశ్నకు సమాధానం మనకు గ్రంథ ప్రథమ భాగంలోనే లభిస్తుంది. 'నేను సంసారబద్ధుడను, ముక్తుడనవుతాను' – ఇట్టి నిశ్చయం గలవాడే ఈ శాస్త్రాన్ని పఠించటానికి అర్హుడని వాల్మీకి మహర్షి తెలియజేస్తున్నారు. అంటే ముందు

జనన మరణ సంసార చక్రంలో చిక్కుకున్నాను అన్న స్ఫురణ కలిగినప్పుడే సాధకుడు ఈ పుస్తకంలోని విషయాన్ని పూర్తిగా ఆస్వాదించ గలుగుతాడు. బంధం అంటే ఏమిటో ఎరిగినప్పుడే స్వేచ్ఛకై ప్రయత్నించ గలుగుతాడు. మోక్షేచ్ఛ లేనివారికి గ్రంథంలోని విషయం సులభగ్రాహ్యం కాదు. వివేక వైరాగ్యాలు కలిగిన వ్యక్తికి ఇందులోని విషయం అమృతోపమై తోస్తుంది. ఐతే శ్రద్ధాళువులై పఠించేవారికి ఇందులోని జ్ఞానకౌముది వివేక వైరాగ్యాలను పెంపొందించి ఆహ్లాద భరితులను చేస్తుంది; నిర్వాణాభిలాషులుగా పరిణతి నొందిస్తుంది.

ఆర్యుల తత్త్వ చింతనాసక్తి, తత్త్వవిశ్లేషణా శక్తి, బుద్ధి కుశలతా, ధీశక్తి వైభవానికి ఈ గ్రంథం అద్దంపడుతుంది. గ్రంథంలోని విషయమంతా ఇద్దరు జ్ఞానుల మధ్య జరిగిన సంభాషణ. ఇప్పటి వరకూ హైందవ జాతికి తమ పూర్వీకుల నుంచి లభించిన ఆధ్యాత్మిక వారసత్వంలో అత్యంత విలువైనది, గొప్పగా ఎంచదగ్గది ఈ గ్రంథం అంటే అతిశయోక్తి కాదేమో!

**అస్మాచ్ఛా స్త్రవరాద్బోధా జాయన్తే యే విచారితాత్**
**లవణైర్వ్యంజనానీవ భాన్తి శాస్త్రాంతరాణి తైః!**

'ఈ ఉత్తమ శాస్త్రాన్ని (యోగవాసిష్ఠము) విచారించటంచే పరమోత్కృష్టమైన జ్ఞానం సంప్రాప్తమవుతుంది. అపుడే తక్కిన శాస్త్రాలన్నీ లవణ సంయోగం పొందిన శాకం వలె రుచిస్తుంది' అని వసిష్ఠ మహర్షి వచించడం ద్వారా ఈ గ్రంథ వైశిష్ట్యాన్ని, ప్రాశస్త్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

కేవలం ఈ గ్రంథాన్ని పఠించడం ద్వారానే ముక్తిని పొందవచ్చు. పఠనమే ఒక అద్భుత సాధనా ఫలాన్ని అందించగలదు.

ఈ కావ్యాన్ని శ్లోకాలూ, తాత్పర్యంతో సహా మొదట తెలుగులో ప్రచురించినది శ్రీ వ్యాసాశ్రమం, ఏర్పేడు వారు. బ్రహ్మలీన పూజ్య మలయాళ స్వామీజీ వారు, రామకృష్ణ మఠం స్వామీజీ శ్రీ నిర్వికల్పానంద వారిని ప్రోత్సహించి సగభాగానికి (సుమారు 15 వేల శ్లోకాలకు) తాత్పర్యాన్ని వ్రాయించారు. మిగతా సగభాగానికి వారి శిష్యులు బ్రహ్మలీన శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వామీజీ వారు తాత్పర్యాన్ని సమకూర్చారు. 1936వ సంవత్సరంలో ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టి 18 సంవత్సరాల శ్రమ తర్వాత 1954లో పుస్తకాన్ని ప్రచురించారు. ఈ వరిష్ఠ గ్రంథాన్ని తెలుగులో సరళ తాత్పర్యంతో అందించిన శ్రీ వ్యాసాశ్రమం వారికి తెలుగు ప్రజలు సర్వదా కృతజ్ఞులై ఉండాలి. శ్రీ నిర్వికల్పానంద, శ్రీ విద్యాప్రకాశానంద గిరి యతివరేణ్యులకు కూడా మనం కృతజ్ఞతా బద్ధులమై ఉండాలి.

పంతొమ్మిది వందల యాభయ్యవ దశకం తెలుగు భాషకు, ప్రస్తుత తెలుగు భాషకు తేడా ఉన్నది. శ్రీ వ్యాసాశ్రమం వారి పుస్తకంలోని తాత్పర్యాన్ని సరళీకృతం చేసి అందులోని సుదీర్ఘ సంభాషణల నిడివి తగ్గించి, ఆధునిక పాఠకుడు సునాయాసంగా అర్థంచేసుకోవటానికి వీలుగా సంస్కృత శ్లోకాలను అక్కడక్కడ మాత్రమే ఉటంకిస్తూ వచన కావ్యంగా తీర్చిదిద్దిన వారు శ్రీ హనుమ రామకృష్ణ గారు. వసిష్ఠ రామ సంవాదాలలో వసిష్ఠులవారి సమాధానం సుదీర్ఘంగా

ఉన్నచోట శ్రీరాముడిచే ఇతర ప్రశ్నలను సంధింపజేసి సంవాదాలను చిన్నవిగా చేసి తేలికగా విషయాన్ని గ్రహించటానికి దోహదపడేలా వీరు పుస్తకాన్ని వెలువరించారు. వారు ప్రస్తుత తరం పాఠకుడి సౌలభ్యాన్ని దృష్టిలో ఉంచుకొని సులభ గ్రాహ్యంగా అందించి అందరూ అర్థంచేసుకునే విధంగా పుస్తకాన్ని రచించారు. గృహస్థ జీవితపు బరువు బాధ్యతలను మోస్తూ తన లాంటి ఉద్యోగి చదివి అర్థంచేసుకోగలిగినప్పుడు ఇతరులు ఎందుకు చదవకూడదని భావించి, ఈ మహోత్కృష్ట గ్రంథంలోని అద్వైత వేదాంత మకరందం అందరూ గ్రోలాలని సంకల్పించి, వారు పుస్తకాన్ని స్వీయముద్రణగా ప్రచురించారు. ఒక దశాబ్ద కాలం పాటి వారి కృషి ఫలితంగా ఈ పుస్తకం రూపుదిద్దుకున్నది.

అమూల్యమైన ఈ జ్ఞానాన్ని అందరికీ పంచాలన్న వారి సత్సంకల్పానికి మా వంతు సహాయంగా పుస్తకాన్ని మఠం స్వయంగా ప్రచురించటానికి స్వీకరించింది.

మఠ గ్రంథాలన్నింటినీ విశేషంగా ఆదరిస్తున్న పాఠకులు ఈ గ్రంథాన్ని కూడా చదివి ఆస్వాదించి శ్రీ వసిష్ఠ మహాముని శ్రీరామచంద్రమూర్తి కృపాకటాక్షాలను పొందాలని మా ఆకాంక్ష. ఈ పుస్తకాన్ని వెలువరించటానికి సహకరించిన యావన్మందికీ మా కృతజ్ఞతలు.

**– ప్రకాశకులు**

❖❖❖

# పుష్పాంజలి

నా అభ్యున్నతి కొరకు అనేక త్యాగములు చేసి, నాకు బాల్యము నుండి భక్తి, జ్ఞాన, వైరాగ్య పూర్వకమైన అనేక విశేషములు బోధించిన మాతృదేవత శ్రీమతి ఆదిలక్ష్మీ కామేశ్వరమ్మ గారికి, పితృదేవులు శ్రీ లక్ష్మీనారాయణ గార్కి సాష్టాంగదండ ప్రమాణామములు, దైవసమానులు, ఆధ్యాత్మిక గురువులు అయిన శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశా నందగిరి స్వామివారి (శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి) పాదములకు వినమ్రతతో నమస్కరిస్తున్నాను. నాకు జీవనోపాధిని ప్రసాదించిన 'ఆంధ్రాబ్యాంకు'కు సర్వదా దిగ్విజయమగుగాక!

1990లో శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామివారు విజయవాడలో 'గీతాయజ్ఞం' నిర్వహించారు. "నాయనలారా! వాల్మీకి మహర్షిచే (కథారామాయణానంతరం) 32000 శ్లోకములలో రచించబడిన 'యోగ వాసిష్ఠం' అనే గ్రంథం చూడండి. మన ఋషులు ప్రకటిస్తున్నదేమిటో మరింత సుస్పష్టంగా గ్రహించగలరు" అని ఆయన సభను ఉద్దేశించి పలికారు. ఆ వాక్యాలు నన్ను ఎంతో ప్రభావితం చేశాయి. ఒకానొక జిజ్ఞాస నాయందు బయలుదేరింది. ఇక అప్పటి నుండి పూర్వం రచించబడిన వచన గ్రంథాలు కొన్ని చదవటం జరిగింది.

1. శ్రీ జ్ఞాన వాసిష్ఠ రామాయణము (1918), (వచన కావ్యం), బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామ శర్మగారు.
2. శ్రీ వసిష్ఠగీత (1982), వాసిష్ఠమహారామాయణము (1990), శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామిగారు.
3. జ్ఞానవాసిష్ఠము (వచనకావ్యము), బ్రహ్మశ్రీ చింతలపాటి లక్ష్మీ నరసింహశాస్త్రి గారు, ఘంటసాల
4. యోగవాసిష్ఠము (వచనకావ్యము), బ్రహ్మశ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు
5. యోగవాసిష్ఠము 8 సంపుటములు (32000 శ్లోకములు + తాత్పర్యము) శ్రీశ్రీశ్రీ పూర్ణానందుల వారు మరియు శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామివారు (యేర్పేడు, శ్రీ వ్యాసాశ్రమము & శ్రీ శుకబ్రహ్మాశ్రమము) 1937.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శ్రీరామచంద్రుల మధ్య సంభాషణా రూపంలో ఉన్న యోగవాసిష్ఠం (అఖండ రామాయణం, ఉత్తర రామాయణం అని కూడా చెప్పబడినది) "అద్భుతమైన గ్రంథం" అనుటలో సందేహమేమీ లేదు. ఎందుకంటే, ఈ గ్రంథం, "ఓయి! జీవుడా! నీవు ఇప్పటికే పూర్ణుడవై యున్నావయ్యా!" అని అత్యంత సుస్పష్టంగా నిర్దుష్టంగా నిరూపించి చూపుతోంది. ఇందలి విచారణ అత్యంత సులభమైనదేనని నా అభిప్రాయం. పాఠకుడు, తాను చదువుచూ ఉండగానే, తనయొక్క మోక్ష స్వరూపమును గుర్తుచేసుకొనేట్లు చేయగల ఉత్తమవిచారణ మనకు ఈ గ్రంథంలో లభిస్తోంది. ఇట్టి మహత్తరమైన గ్రంథం విశదీకరిస్తున్న విషయమేమిటో అనేకులు గమనించి ఉండనట్లు నాకు

అనిపించింది. ఇక మరికొందరు, "ఈ గ్రంథమును సామాన్యులు గ్రహించలేరు... ఇది అందరు చదివే గ్రంథం కాదు... కుటుంబ వ్యవస్థలోని వారికి ఇందలి విషయము గ్రహించడం కష్టమౌతుంది..." మొదలైన అవిచారణపూర్వకమైన అభిప్రాయాలు కలిగి ఉండటం గమనించాను. ఇంకొందరు తెలుగు నవలలో కనబడే అత్యంత సరళమైన భాష చదువుటకు మాత్రమే అలవాటుపడి ఉన్నారు. లోని ఆయా సిద్ధాంతాలు, 'ఉపనిషత్తులు' మొదలైన ప్రాచీన గ్రంథములచే ప్రతిపాదించ బడుచున్న సిద్ధాంతాలు - వాటి సమన్వయం గ్రహించాలని మరికొందరు అభిలషించటం గమనించాను. అట్టివారినందరిని దృష్టిలో పెట్టుకొని వర్తమాన వ్యావహారిక భాషలో "శ్రీ వసిష్ఠ - రావసంవాదము వచన కావ్యం" అనే ఈ ప్రయత్నం చేస్తున్నాను. ఈ పీఠికలో ఉదహరింపబడ్డ ఇతఃపూర్వపు గ్రంథాలు చదువుచు, ఒకానొక "ఉత్సాహము-ఆవేశములతో కూడుకొనిన ఉపన్యాసము" వింటున్న అనుభూతి పాఠకునికి రావాలనే ఉద్దేశముతో ఇందుకు ఉపక్రమించాను.

ప్రకృతి వర్ణనలకు సంబంధించిన సుమారు 500-550 శ్లోకాలు మాత్రం వదిలాను. మిగతా అన్ని శ్లోకాలు యథాతథంగా ఇందులో చోటు చేసుకుంటున్నాయి. ముఖ్యంగా జ్ఞాన విచారణకు సంబంధించిన శ్లోకాలన్నీ రావాలని నా ప్రయత్నం.

ఈ గ్రంథంలో 56 కథలు ఉన్నాయి. ప్రతి కథ పాఠకునికి 'మోక్షభావన' అంటే ఏమిటో రుచి చూపుతుంది. స్వస్వరూపము విషయమై సర్వసందేహాలు నివృత్తిచేస్తూ, అనేక విశేషాలు చర్చాపూర్వకంగా తెలియజేస్తోంది. పాఠకునకు "పునర్జన్మ-మృత్యువు-ఈ జన్మయొక్క ముందువెనుకలు-దేహి-దేహముల స్వభావ, స్వరూపములు - దుఃఖముల మూలకారణం" ఇవన్నీ సుస్పష్టమౌతాయి. "ఈ జీవుడు పూర్ణుడు, అనంతుడు, అఖండుడు, శాశ్వితుడు, ఈతడు సాక్షాత్ ప్రత్యగాత్మయే. వాస్తవానికి ఈతనికి జన్మమృత్యువులుగాని, ఆద్యంతాలుగానిలేవు" అని అనేక దృష్టాంతాలతో ఈ గ్రంథంలో ప్రతిపాదించబడింది.

**శృణ్వన్తి విశ్వే అమృతస్య పుత్రాః ఆయే ధామాని దివ్యాని తస్థుః ।**
**వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరిస్తాత్ ॥**

"ఓ అమృత పుత్రులారా! అది ఏమిటో మేము గ్రహించాము. ఆ మహత్తర తత్త్వము గురించి మీకు చెపుతాం వినండి" అని ఆ ఆత్మద్రష్టలు మనందరిని ఆహ్వానిస్తున్నారు.

మనందరిపై గల అవ్యాజమైన ప్రేమచే ఋషులు ఇదంతా చెప్పారు. "భక్తి-జిజ్ఞాస" - ఈ రెండూ ఉంటే చాలు, ఎవరైనా ఇది చదువవచ్చు. "ఇది మీది - అది మాది" అను రూపముగల మూర్ఖత్వమంతా అవిచారణచేతనే ప్రబలుతోంది. ఏ ఉత్తమ గ్రంథములోనిదైనా సరే, "జ్ఞానవిచారణ" అనేది అందరి కొరకే అయి ఉంటోంది. అందరికి సంబంధించినదే అవుతుంది. మహాత్ములగు వాల్మీకి, వ్యాసుడు, విశ్వామిత్రుడు, జీసస్, గురునానక్, మహమ్మద్, బుద్ధుడు, వసిష్ఠుడు, శంకరాచార్యులు వంటి వారికి "వీరు మా వారు. వారు మా వారు కాదు" అనుభేదభావం ఉంటుందా? ఉండదు. మనమంతా అది గ్రహించాలి. వారి వాక్యములలో ఉద్దేశమును అర్థం

చేసుకుని మనం బలోపేతులం కావాలి. మనందరి హృదయాలలో అవధులు లేని అకృత్రిమమైన ప్రేమ వెల్లివిరియాలి. మన స్వస్వరూప ప్రభావం గ్రహించి స్వస్థచిత్తులం కావాలి. "నేను అల్పుడను" అను రూపముగల బలహీనత, "ఇతరులు అల్పులు" అనురూపముగల జాడ్యము-ఈ రెండూ కూడా మనం అధిగమించగలగాలి.

ఈ గ్రంథములో విచారించబడిన విషయమేమిటో పరిచయం చేయటానికి, మరొక చిన్న దృష్టాంతము విన్నవిస్తాను. "ఒక అల్లరి బాలుడు ఉన్నాడనుకుందాం...అతడు బాధిస్తున్నాడు. లేక, తనను తానే బాధించుకుంటున్నాడు. ఇప్పుడు అతనికి సత్ప్రవర్తన అలవర్చటం ఎట్లా? భయ పెట్టటం ద్వారానా? నమ్మకం ద్వారానా? విచారణ ద్వారానా?

1. భయపెట్టటం : "నాయనా! బయటకువెళ్ళకు. ఇతర బాలురను బాధించకు. అట్లా చేస్తే కొడతాను. ఇతరులను దూషిస్తే పాపం వస్తుంది. పాపపు లోకములకు వెళ్ళవలసివస్తుంది."

2. నమ్మకం : పెద్దలు చెప్పారు. గ్రంథములు చెప్పుచున్నాయి. కనుక సత్ప్రవర్తన కలిగియుండు. మంచితనముతో పుణ్యకార్యములను ఆశ్రయిస్తే నీకు పుణ్యం కలుగగలదు. పెద్దల చరిత్రలు చదువు. వారిని అనుకరించు.

3. విచారణ - అవగాహన : నీవు కొందరిని బాధిస్తూ ఉంటే, నీకన్నా బలవంతులు నిన్ను బాధిస్తూ ఉంటారు కదా? చివరకు మిగిలేదేమిటి? బాధయేకదా!

"విచారణ చేయి, ఈ విశేషాలు దృష్టిలో పెట్టుకొని యోచించు. ఇతరులపట్ల క్షమ, ప్రేమ, ఆప్యాయత కలిగి ఉండు. అట్టి ప్రవర్తన స్వభావ సిద్ధంగానే శుభం చేకూరుస్తుంది. ఎందుకంటే, ఇదంతా ప్రసరించియున్నది నీవే. నిన్ను నీవు ప్రేమించు కోవటమే ఆనందంగానీ, ద్వేషించటం ఆనందమైన విషయం కాదు. నీవు వాస్తవానికి బలవంతుడవు, పూర్ణుడవు, సత్యమువు, నిత్యమువు."

భయము, నమ్మకముల కంటే కూడా అవగాహన ఉత్తమమైనది, బలమైనది, స్వస్వరూపమునకు సంబంధించిన 'విచారణ' ద్వారా ఈ గ్రంథము భగవంతునిపట్ల ఉత్తమ అవగాహన పెంపొందింప చేస్తోంది. అందుచేతనే ఇది ఉత్తమోత్తమమైన గ్రంథంగా శ్రీ స్వామి రామతీర్థ, శ్రీ రమణమహర్షి వంటి జ్ఞానమార్గావలంబులచే, సంత్ తుకారాం వంటి భక్తాగ్రేసరులచే శ్లాఘించబడింది. అట్లే మహనీయులు అనేకులు ఇట్టి అభిప్రాయం వెలిబుచ్చారు. మద్గురువులు శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానంద గిరిస్వామి వారు ఈ గ్రంథం పేరు వినగానే పులకిత శరీరంతో తన్మయులై మాట్లాడుతూ ఉంటారు. వారు తాము నిర్వర్తించిన 108 గీతాయజ్ఞముల సందర్భములో అనేకచోట్ల ఉదయంపూట ఈ గ్రంథముపై ఉపన్యసిస్తూ ఉండేవారు.

"శ్రీ వసిష్ఠ-రామ సంవాదము" అనబడు ఈ వచన కావ్యం ప్రచురించే ప్రయత్నం యొక్క లక్ష్యములు మూడు.

1. నా మనస్సు దోషరహితమై, నాయందు "యజ్ఞభావము" దృఢపడుట కొరకు. "యజ్ఞార్థాత్ కర్మణో అన్యత్ర లోకోయం కర్మబంధనః" అని గీతాచార్యులు చెప్పియున్నారు కదా!

2. నాతో సహా సర్వుల యొక్క అంతర్యామియగు ఆ భగవానుని ఈ "ప్రయత్నములు" అనే పూజాపుష్పములచే పూజించటం.

3. శ్రీ వాల్మీకి విరచితమైన "యోగవాసిష్ఠం" లోని వస్తువు అనేకమంది దృష్టికి తేవటం.

హే వెంకటేశ్వరా! సర్వేశ్వరుడవు, సర్వజీవరాసులలోని అంతర్యామివి, సర్వస్వరూపుడవు కూడా నీవే. 'శివుడు'గా 'అల్లా'గా, 'యహోవా'గా ఇంకా ఇంకా ఎన్నో నామరూపాలతో ఆరాధింపబడుచున్నదీ నీవే. నా యందలి వాస్తవతత్త్వము కూడా నీవే అయివున్నావు.

ఈ నా ప్రయత్నము సకల జనులకు శుభము, శాంతము, ఐకమత్యము, ఆనందము ప్రసాదించాలని నా ఆకాంక్ష. సమాజమంతటికీ క్షేమ, స్థైర్య, అభయ, విజయ ఆయురారోగ్యములు సిద్ధించుగాక! ధర్మ-అర్థ-కామ-మోక్షములనబడే చతుర్విధ ఫల పురుషార్థములు మానవాళికి ప్రాప్తించుగాక! భక్తి-జ్ఞాన-వైరాగ్యాలు, శాంతి, అన్యోన్యత వెల్లివిరియుగాక!

ఈ "వసిష్ఠ-రామసంవాదము" అను గ్రంథపుష్పమును పరమాత్ముని పాదపద్మములకు సమర్పిస్తున్నాను.

**సర్వేజనాః సుఖినో భవన్తు ।**
**సమస్త సన్మంగళాని సన్తు ॥**

**- వై. హెచ్. రామకృష్ణ**

❖❖❖

# గ్రంథ సంఖ్యా వర్ణనం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రాఘవా! వివేకం ఉదయించినవాడే నీతిశాస్త్రం వినటానికి అర్హుడగుచున్నాడు కదా! అట్టివాడే ఈ 'జ్ఞానశాస్త్రం' కూడా వినటానికి అర్హుడు. ఎవరైతే మూర్ఖ సంగమము త్యజించి, నిర్మలమైన బుద్ధితో ఉత్తమమైన ఆశయం కలిగి ఉంటున్నాడో – అట్టివాడు మాత్రమే 'సత్యవిచారణ' చేయగలుగుచున్నాడు. నీయందు అట్టి గుణసంపద ఉండి ఉన్నది. అందుచేతనే, మనోమోహము పోగొట్టగల ఆ 'ఆత్మజ్ఞానశాస్త్రం' నీకు చెప్పబోవుచున్నాను. ఒకడు అనేక జన్మలలో ఆర్జించిన పుణ్యం చేతనే, 'ముక్తి' కొరకై ఈ శాస్త్రమును వినాలనే కోరిక పొందుచున్నాడు.

నీ యొక్క ఉత్తమ ప్రవర్తనలు, ప్రయత్నములు, గుణములే ఆత్మ సమాచారం స్వీకరించటానికి నిన్ను తగినవానినిగా తీర్చిదిద్దాయి. ఈ అఖండ రామాయణం ఆరు ప్రకరణములు కలిగి ఉన్నది.

**1. వైరాగ్య ప్రకరణం :** (1500 శ్లోకాలు) దీనిని విచారిస్తే ఈ దృశ్యము పట్ల, శరీరాదులను పేరుకొని ఉన్న అజ్ఞాన జనితమైన బుద్ధి మాంద్యము తొలగుతుంది. సాత్విక వైరాగ్యం ఏర్పడుతుంది. "జీవితము – అనుదానిని వివేకముచే పరిశీలించకుండానే బ్రతికివేస్తున్నామా?" అను వివేకపూరితమైన శోధనం ఏర్పడుతుంది. అట్టి దృష్టియే ఆత్మవిషయమై సమాచారం పొందటానికి పునాది.

**2. ముముక్షు వ్యవహార ప్రకరణం :** (1000 శ్లోకాలు) 'ముముక్షుత్వము' అంటే ఏమిటో, ముముక్షువులు ఎట్లు వ్యవహరిస్తారో, వారి స్వభావమేమిటో, ఎట్టి దృష్టిచే ఆత్మవిషయం గ్రహించటానికి సిద్ధంగా ఉండాలో చెప్పబడింది. బద్ధకము, అశ్రద్ధ, మూర్ఖత్వము త్యజించి శమము, సంతోషము, విచారణ, సత్సంగములను ఆశ్రయించ వలసినదిగా బోధింపబడింది. 'పరిశీలనదృష్టి – ప్రయత్నము' – రెండు ఉన్నవాడే ముముక్షువు.

**3. ఉత్పత్తి ప్రకరణం :** (7000 శ్లోకాలు) అనేక దృష్టాంతముల సహాయం చేత, 'లౌకికములైన నీవు–నేను అను వ్యవహారములన్నీ అసలు ఉత్పన్నమే అయివుండలేదు" అని నిరూపించబడింది. స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు మూలమే లేనిదని, రూపరహితమని ప్రతిపాతించబడింది.

"ఈ సంసారమంతా స్వకీయకల్పిత మనోరాజ్యము వంటిదే కాని, వాస్తవము కాదు. స్వప్నంలో ఎట్లు జరుగుతోందో, అదేవిధంగా, ఇదంతా అవస్తు మాత్రమే, కల్పితానుభవమాత్రమై ప్రాప్తిస్తోంది" అని యుక్తియుక్తంగా నిరూపించబడింది. ఎండమావులలో నీరు లభిస్తుందా, మెల్లకన్నువాడికి ఆకాశంలో కనిపించే "రెండవ చంద్రుడు" ఉన్నాడా? అంధకారంలో కనిపించే మోదువారిన ఒకానొక వృక్షం దయ్యమై, అపరిపక్వ బుద్ధికి మాత్రమే ప్రాప్తిస్తోంది కదా! నావ కదులుతుండగా ఒడ్డున ఉన్న చెట్లు కదులుచున్నట్లు కనిపించినంత మాత్రం చేత, ఆ చెట్ల కదలిక వాస్తవమా? ఈ సంసారము కూడా కల్పితమాత్రమని, ఒకానొకప్పుడు, ఒకానొకదృష్టిచే, ఒకానొక విధంగా భావనను

అనుసరించి ప్రాప్తిస్తున్నదని తెలిసిపోతుంది. ఇది వాస్తవానికి సారరహితమని ఎరిగిన తరువాత, దీని గురించి ఎవడు దుఃఖిస్తాడు.

ఆభరణం – బంగారము కంటే వేరుకానట్లు, జలం కంటే తరంగాలు వేరుకానట్లు, ఈ జగత్తు పరమాత్మగానే దర్శించబడగలదు. ఇదంతా ద్రష్ట యొక్క దృష్టి కంటే వేఱేమీ కాదు. ఆకాశంలో నీలపు పదార్థం ఏదైనా ఉన్నదా? చిత్రపటంలోని అగ్నికి ఉష్ణత్వమెక్కడ? ఈ జగత్తు కూడా అసత్తే. కాని, అవివేకదృష్టికి మాత్రం 'సత్తు' గా తోచుచున్నది. ఎప్పుడో జరిగిపోయిన ఒకొనొక దృశ్యము ఇప్పుడు మనన కారణంగా మనోవీథిలో ప్రత్యక్షమై ప్రాప్తిస్తోంది చూచావా! అదేవిధంగా ఈ జగత్తు కూడా వర్తమానంలో అనుభవమౌతోంది. ఈ కనబడే పదార్థములను జ్ఞానదృష్టిచే పరిశీలించినప్పుడు ఇవన్నీ "అస్థిరము, తుచ్ఛము, శూన్యము" అని ఈ ప్రకరణం బోధిస్తోంది.

**4. స్థితి ప్రకరణం :** (3000 శ్లోకాలు) "ఈ జగత్తు అహంభావమునందే స్థితి పొంది ఉన్నది కాని, ఎక్కడో బాహ్యమునందు కాదు" అనే పరమార్థము అనేక కథల ద్వారా, దృష్టాంతముల ద్వారా నిరూపించబడింది. ఈ భ్రాంతిమయ జగత్తులు, ఈ ద్రష్ట–దర్శనము–దృశ్యములు ఇవన్నీ ఎట్లు వృద్ధి పొందుచున్నాయో చెప్పబడింది.

**5. ఉపశమన ప్రకరణం :** (5000 శ్లోకాలు) ఇందులో, "నేను, నీవు, అతడు, జగత్తు" – అను వ్యవహారమంతా ఉపశమింపచేయ గల యుక్తులేమిటో చెప్పబడింది.

ఈ జగత్తు ఒకనికి సుస్పష్టంగా, మరొకనికి అస్పష్టంగా ఉన్నప్పటికీ – వాస్తవానికి ఇది అసత్యమే. ఊహాకల్పితమైన రూపములు ఆ ఊహ ఉపశమించగానే తొలగిపోతాయి కదా! ఈ జగత్తు స్వకల్పితమనండి, లేక స్వప్న కల్పితమనండి. ఇది మనస్సు నుండి విభజిస్తోంది. జ్ఞానముచే తొలగిపోతోంది. ఎవరికైతే జగద్భ్రమ నశించుటలేదో, వారికి మాత్రం ఇదంతా ఒక అంతులేని అనేక సంఘటనలతో కూడిన 'కథ' వలె ప్రాప్తిస్తూపోతోంది. ఈ సంసారమంతా కల్పిత మాత్రమే. "అట్టి కల్పనలలోనే కొందరు మనోహరత్వమును, మరికొందరు దుఃఖపరంపరలను తమ అజ్ఞానం చేత, లేక మూర్ఖత్వం చేత పొందుచున్నారు" అని ఈ ప్రకరణం నిరూపిస్తోంది.

**6. నిర్వాణ ప్రకరణం :** (14500 శ్లోకాలు) జ్ఞానం వికసిస్తుంది. కల్పనలన్నీ తొలగిపోతాయి. "నిర్వాణము" అనబడే పరమశ్రేయస్సు లభించగలదు. ఇందలి విషయమును గ్రహించువాడు – నిర్విషయము, చిత్ప్రకాశమాత్రము, విజ్ఞానమయము, నిరామయము – అయినట్టి ఆత్మరూపమున ప్రతిష్ఠితుడగుచున్నాడు. సంసార భ్రమలన్నీ తొలగుట చేత పరమాకాశము వలె స్వచ్ఛుడౌతాడు. పరిపూర్ణుడు, కృతకృత్యుడు అగుటచేత, ఇక అతడు ప్రశాంతపూర్వకముగా ఈ 'జగత్‌యాత్ర' నిర్వర్తించగలడు.

"ఒక దర్పణం ఎదురుగా ఉన్న దృశ్యమును ఎట్టి ప్రత్యేకమైన ప్రయత్నం లేకుండానే, తన యందు ప్రతిబింబించుటకు ఆశ్రయమౌతోంది కదా! నేను కూడా పూర్ణమగు బ్రహ్మమునై ఈ

జగత్తులు, ఈ కార్యములు ప్రతిబింబించుటకు కర్తృత్వము లేకుండానే ఆశ్రయభూతుడ నగుచున్నాను." అని పఠించువాడు గ్రహిస్తున్నాడు. సమస్తము స్వస్వరూపముచే మ్రింగబడగా, అతడు తృప్తుడగుచున్నాడు. బాహ్యేంద్రియములు, చిత్తము, అహంకారము సర్వము చిదాకాశమేనని తెలుసుకొనుచున్నాడు. కార్య, కారణ, కర్తృత్వముల విషయంలో అత్యంత నిర్లిప్తుడై, దేనిచేత కూడా స్పృశించబడనివాడై ఉంటున్నాడు.

ఈ ప్రకరణము పఠిస్తున్నవాడు దేహము కలిగి ఉన్నప్పటికీ, తనను తాను విదేహిగా; సంసారి అయినప్పటికీ, అసంసారిలా గాంచుచున్నాడు. "నేను సర్వదా అఖండుడనే" అని గ్రహిస్తు న్నాడు. ఇక అతనిని లోక వ్యవహారములు తాకలేవు. పరిపూర్ణమగు చిన్మయావస్థను పొందినవాడై స్వయముగా, తానే, 'చిదాదిత్యుడు' అగుచున్నాడు. అతని పట్ల దృశ్యములన్నీ అదృశ్యమగుటచే, అతడు శుద్ధ స్వరూపము, స్వచ్ఛత్వము పొందుచున్నాడు. ఈ 'సంసారము' అనే కుత్సితవ్యాధి నశిస్తోంది. 'అహంకారము' అనే పిశాచం వదలిపోవుటచే తాను శరీరం కలిగి ఉన్నప్పటికీ, "నేను ఈ దేహమునే" అను దురభిప్రాయం తొలగించివేసుకుంటున్నాడు.

మహాత్ముడగు అట్టి జీవన్ముక్తుని హృదయమే పరమాత్మ. అతడు "సత్త" అనురూపము గల ఆనందము యొక్క విస్తారముచే, సర్వోత్తముడై, హరిహరాదులతో సమానమైన అనుభవమును పొందుచున్నాడు.

❖❖❖

# గ్రంథ ప్రశంస

శ్రీ వసిష్ఠ ఉవాచ :

మోక్షోపాయాభిధానేయం సంహితా సారసంహితా ।
త్రింసద్వేచ సహస్రాణి జ్ఞాతా నిర్వాణదాయినీ ॥ 1

దీపే యధా వినిద్రస్య జ్వలితే సంప్రవర్తతే ॥
ఆలోకో అనిచ్ఛతేపి యేవం నిర్వాణమనయా భవేత్ ॥ 2

స్వయం జ్ఞాతా శ్రుతావాపి భ్రాంతి శాంన్త్యైక సౌఖ్యదా ।
ఆపేక్ష్య వర్ణితా సద్యో యధా స్వర్గతరజ్గణీ ॥ 3

యధా రజ్వా మణి భ్రాంతిః వినస్యతి అవలోకనాత్ ।
తత్ ఏతత్ ప్రేక్షణాత్ శాంతిమ్ ఏతి సంసారదుఃఖితః ॥ 4

ఇదమ్ ఉత్తమమ్ ఆఖ్యానమ్ ఆధ్యేయమ్ వేదవత్ సదా ।
వ్యాఖ్యేయమ్ పూజనీయంచ పురుషార్థ ఫలప్రదమ్ ॥ 5

యదా అస్మాత్ ప్రాప్యతే శాస్త్రాత్ తత్తత్ వేదాత్ అవాప్యతే ।
అస్మిన్ జ్ఞాతే క్రియాజ్ఞానం ద్వయం యాతి పవిత్రతామ్ ॥ 6

వేదాంత తర్కసిద్ధాంతస్తు అస్మిన్ జ్ఞాతేచ బుద్ధ్యతే ।
ఇదముత్తమమాఖ్యానం వ్యాఖ్యాతం శాస్త్రదృష్టిషు ॥ 7

కారుణ్యాద్భవతామేతదహమ్ వచ్మి, న మాయయా ।
భవంతస్త్వవగచ్ఛంతి మాయామేతద్విచార్యతామ్ ॥ 8

అస్మాత్‌శాస్త్రవరాత్‌బోధా జాయంతే యే విచారితాత్ ।
లవణైర్వ్యంజనానీవ కాంతి శాస్త్రాంతరాణితైః ॥ 9

అనార్యమిదమాఖ్యానమ్ ఇతి అత్యనాదృత్యదృశ్యధీః ।
మా భవంత్యాత్మహన్తారో భవంతో భవభాగినః ॥ 10

మోక్షాభ్యుపాయాన్సు మహానుభావాన్
జ్ఞాస్యన్తి యే తత్త్వవిదాం వరిష్ఠాః ।
పునః నమేష్యన్తి న సంస్కృతింతే
కోఽర్ధః సుతాఃఽన్యేన బహూదితేన ॥ 11

శ్రీ వసిష్ఠమహర్షి :

ఓ సర్వజనులారా! 'యోగవాసిష్ఠము' అనబడే ఈ మోక్షశాస్త్రాన్ని 32000 శ్లోకములతో మీ అందరిముందు ఉంచుచున్నాను. ఇది సారవంతమైన అర్థప్రదాత నిర్వాణప్రదాతకూడా!

ఒకానొకడు గాఢనిద్రాపరవశుడై, దీర్ఘకాలంగా ఉండి అప్పుడే నిదురలేచి కనులు తెరచాడనుకోండి. ఆ గదిలో దీపం వెలుగుతూ ఉంటే, ఆ దీప ప్రకాశంలో – అతడు ప్రత్యేకమైన 'ఇచ్ఛ' కలిగి ఉండకపోయినా అక్కడ ఉన్న వస్తువులను చూస్తాడు కదా! ఈ గ్రంథములోని 'విచారణ'ను తెలుసుకొనుటకు ప్రయత్నించినంతమాత్రంచేత ఇచ్ఛ కలిగి ఉండకపోయినప్పటికీ నిర్వాణమగు మోక్షమును పొందగలడు.

దీనిని మీరు స్వయంగా పరిశీలిస్తే, చక్కగా గ్రహించగలరు. లేదా, ఇతరులు వ్యాఖ్యానిస్తున్నప్పుడు వినటం జరిగినా కూడా మంచిదే. గంగా జలం సర్వపాపములను హరించివేస్తుంది కదా! అట్లే ఇందు చర్చించబడిన విషయమును విచారిస్తే, అనేక జన్మలుగా వెన్నంటి వస్తున్న అజ్ఞానం తప్పకుండా తొలగిపోతుంది. ఒకడు చీకట్లో త్రాడును చూచి, "అమ్మబాబోయ్! ఇదిపాము!" అని భ్రమిస్తూ సర్వవికారములు పొందుచున్నాడనుకొందాం. ఆ భ్రమ తొలగిపోయేదెట్లా? "అఁ! ఇది పాముకాదే! త్రాడు మాత్రమే కదా!" అని గ్రహించుటచేతనే కదా! ఈ గ్రంథమును అవలోకించినంతమాత్రంచేత ఈ దృశ్యముపట్ల, శరీరాదులపట్ల కలుగుచున్నట్టి అనేక భ్రమలు సమూలంగా తొలగిపోతాయి. సంసారదుఃఖమంతా శమించిపోతుంది. మీరంతా పరమపురుషార్థమయినట్టి "మోక్షము" అంటే ఏమిటో గ్రహిస్తారు.

ఈ ఉత్తమగ్రంథము వేదమువలె నిత్యము పఠించబడుగాక! పూజింపబడుగాక! వ్యాఖ్యానించబడుగాక! వేదములందు, వేదమహావాక్యములందు ప్రసరించియున్నట్టి జ్ఞానమే ఇందు ప్రసరించి ఉన్నది. ఇందలి విచారణసారానికి వేదములే ప్రమాణం. ఇందలి విషయము తెలుసుకొనుటచే జీవుని 'కర్మ జ్ఞానములు' రెండూ కూడా పవిత్రవంతములౌతాయి. అనేక మంది తత్త్వజ్ఞానుల వేదాంత తర్క సిద్ధాంతములన్నీ కార్య కారణసహితంగా ఇందు పరిశీలించబడ్డాయి. శాస్త్రదృష్టిగల మహనీయులు దీనిని ఉత్తమ వేదాంత శాస్త్రముగా నిశ్చయించారు.

ఓ ప్రియజనులారా! మీపై మాకుగల అవ్యాజమైన ప్రేమచేతనే ఇదంతా చెప్పుచున్నాము. అంతేకాని, మాయకు లోబడియో, ఒకరి అభిప్రాయమును ఖండించుటకో మేము చెప్పుచుండుటలేదు. ఈ శాస్త్రము విచారించుటచే పరమోత్కృష్టమైన జ్ఞానము లభించగలదు. తద్వారా ఈ జగత్తు మాయ అని తెలిసిపోతుంది. ఇది విచారించుటచే ఇతర అధ్యాత్మశాస్త్ర గ్రంథాలు మరింత మధురంగా, సుస్పష్టంగా గ్రహించబడతాయి.

నాయనలారా! ఈ అఖండరామాయణము కావ్యమువలె లేదని (కథాగమనం తక్కువగా, చర్చ ఎక్కువగా ఉన్నదని) దీనిని నిరాకరించకండి. స్వస్వరూపమగు ఆత్మవిషయమై ఏర్పడిన దట్టమైన

అజ్ఞానం తొలగాలంటే ఓర్పు, నేర్పులతో కూడిన విస్తారమైన ప్రయత్నం అవసరమేనని మా అభిప్రాయం. అనేక రీతులైన ప్రవచనములు అవసరమే సుమా!

ఏదిఏమైనా నిష్కారణంగా ఆత్మ విషయం మరచి సంసారాసక్తులై ఉండటం శుభప్రదం కాదు. ధ్యానాదుల దృష్ట్యా, స్వల్పప్రయత్నమే చేసియున్నవారుకూడా మోక్షోపాయమైనట్టి ఈ గ్రంథం పఠిస్తూ ఉంటే క్రమంగా అమోఘమైన ప్రయోజనం పొందుచున్నారు. తత్త్వవిదులగు సద్గురువులు చెప్పుచుండగా శ్రవణం చేశారా ఇంకా ఎంతో మంచిది. అట్టివారు తత్త్వజ్ఞులలో ఉత్తమోత్తములై పునః సంసారమున పడబోరు.

❖❖❖

# విషయ సూచిక

❖❖❖

# మంగళాచరణం

**యతః సర్వాణి భూతాని ప్రతిభాన్తి స్థితానిచ ।**
**యత్రైవోపశమం యాన్ని తస్మై సత్యాత్మనే నః ॥** 1

ఏ అద్వితీయ వస్తువు నుండి సృష్టికాలంలో ఆకాశము మొదలైన మహాభూతములు, వాటి నుండి సమస్త పదార్థములు ఉనికిని పొంది భాసిస్తున్నాయో, అట్టి సత్స్వరూపమగు పరమాత్మకు మోకరిల్లి నమస్కరిస్తున్నాను.

**జ్ఞాతా జ్ఞానం తథా జ్ఞేయం ద్రష్టా దర్శన దృశ్యభూః ।**
**కర్తా హేతుః క్రియా యస్మాత్ తస్మై జ్ఞప్త్యాత్మనే నమః ॥** 2

జ్ఞాత (ఎఱుగువాడు) – జ్ఞానం (ఎఱుగబడే విధం) – జ్ఞేయం (ఎఱుగబడునది) – ద్రష్ట – దర్శనం – దృశ్యం – కర్త – హేతువు – క్రియ ఇవన్నీ దేని వల్ల భాసిస్తున్నాయో, అట్టి జ్ఞాన స్వరూపమగు పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

**స్ఫురన్తి శీకరా యస్మాత్ అనన్ద స్యామ్బరేః వనౌ ।**
**సర్వేషాం జీవనం తస్మై బ్రహ్మానందాత్మనే నమః ॥** 3

ఈ దేవతలు, మనుష్యులు, పశువులు మొదలైన ప్రాణులంతా ఏ మహానంద సముద్రంలో ఉపాధి భేదం చేత, ఆనంద బిందువులుగా స్ఫురిస్తున్నారో, ఏది సర్వదా ఆ సమస్త ప్రాణులకు జీవనమే అయివున్నదో, అట్టి బ్రహ్మానంద స్వరూపమగు పరమాత్మకు సాష్టాంగ నమస్కారం చేయుచున్నాను.

**దివి భూమౌ తథాకాశే బహిరంతశ్చమే విభుః ।**
**యో విభాత్యవభాసాత్మా తస్మై సర్వాత్మనే నమః ॥** 4

స్వస్వరూపుడు, ప్రకాశరూపుడు అయినట్టి ఏ పరమాత్మ స్వర్గంలోను, భూలోకంలోను, ఆకాశంలోను, బయట, లోపల కూడా – ఏకరూపుడైనప్పటికీ – నానా రూపములుగా ప్రకాశిస్తు న్నాడో, అట్టి సర్వరూపుడగు పరబ్రహ్మమును హృదయపూర్వకంగా మ్రొక్కుచున్నాను.

❖❖❖

రఘునాథాయ నాథాయా సీతాయాః పతయే నమః

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## I. వైరాగ్య ప్రకరణం

# మొదటి రోజు

## 1. ఉపోద్ఘాత కథ

పూర్వం 'సుతీక్ష్ణుడు' అనే ఒకానొక విద్యాకోవిదునకు ఒకప్పుడు ఒక సందేహం వచ్చింది.

కర్మ గొప్పదా? జ్ఞానం గొప్పదా? ....

కర్మలన్నీ త్యజించి 'విచారణ'ను అనుసరిస్తే మంచిదా? ....

విచారణను ప్రక్కకుపెట్టి ఉత్తమ కర్మను ఆశ్రయించటం ఉచితమా? ...

అప్పుడు అతడు సందేహనివృత్తి కొరకు సధర్మి, బ్రహ్మజ్ఞాని, తన సద్గురువు అయినట్టి అగస్తిమునిని సమీపించి వినయంగా ప్రణామంచేసి తన మనస్సులోని అనుమానం బైటపెట్టాడు.

అగస్తిముని చిరునవ్వు నవ్వి ఇట్లు పలికారు :

నాయనా! అదిగో! ఆకాశంలో ఎగురుచున్న పక్షిని చూచావా? అది రెండు రెక్కలు ఉంటేనే ఎగురుతోంది కదా! మానవుడు కూడా కర్మజ్ఞానముల రెండిటి సహకారంతో మాత్రమే మోక్షాకాశంలో విహరించగలడు. కేవలం కర్మవలనగాని, కేవలం జ్ఞానం వలనగాని జీవునికి మోక్షం లభించదు.

ఈ విషయంలో నీ సందేహాలన్నీ తొలగటానికి నీకొక కథన విశేషం చెపుతాను విను :

'అగ్నివేశ్యుడు' అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతని కుమారుడు 'కారుణ్యుడు' అనే యువకుడు గురుకులంలో వేద వేదాంగాలు చదివి ఆ తరువాత గురుకులవాసం నుండి ఇల్లు చేరాడు.

ఇంటికి వచ్చిన తరువాత వంశపారంపర్యంగా వచ్చే అగ్నికార్యములు, సంధ్యా వందనము చేయకుండా తిరుగుతూ ఉండేవాడు. అగ్నివేశ్యుడు అది గమనించాడు. ఒక రోజు, కుమారుణ్ణి దగ్గరకు పిలిచి, "కుమారా! కర్మానుష్ఠానం త్యజించినట్లున్నావు. కర్మలను త్యజించి సిద్ధి ఎలా పొందాలనుకుంటున్నావు?" అని అనునయంగా ప్రశ్నించాడు. అప్పుడా కారుణ్యుడు, "తండ్రీ! మరి నన్నేంచేయమంటారు చెప్పండి? వేదములలోని కొన్ని భాగములు "కర్మానుష్ఠానం చేయవలసిందే" అని ప్రవృత్తి మార్గం నిర్దేశిస్తున్నాయి. ఇక మరికొన్ని విభాగములలో, 'కర్మ, ధనము, సంతానము మొదలైనవి మోక్షం ఇవ్వలేవు. సర్వత్యాగమొక్కటే ఉపాయం'* అని నివృత్తి

---

* "త్యాగేనతు కైవల్యమ్"

మార్గాన్ని చూపుచున్నాయి. కర్మ చెయ్యాలా? మానాలా? ఏమీ తోచక ఇట్లు మౌనం వహించి ఉన్నాను” అని పలికి ఊరకున్నాడు. అప్పుడు అగ్నివేశ్యుడు పకాపకా నవ్వి ఇలా చెప్ప ప్రారంభించాడు.

ఓహో! అదా సంగతీ! సరే. నీకిప్పుడు ఒక కథనం వినిపిస్తాను. అంతా విన్న తరువాత నీకు ఎట్లా తోస్తే అట్లాగే చెయ్యి : ....

‘సురుచి’ అనే అప్సరస ఒకనాడు హిమాలయ పర్వతశిఖరంపై ప్రశాంతముగా కూర్చుని ఉండి, ఆకాశం వైపు చూచింది. ఒక దేవదూత కనిపించాడు. అప్పుడామె “ఓ దేవదూతా! మీ ముఖం ఏవో నూతన కాంతులతో వెలుగుచున్నది. ఏదైనా విశేషమా?” అని ప్రశ్నించింది.

అప్పుడా దేవదూత ఇట్లు చెప్పసాగాడు : ఔను! విశేషమే. ఇప్పుడే ఒక పరమాద్భుతమైన సంభాషణ వినివస్తున్నాను. అది తలచుకొంటేనే నా ఒళ్ళు పులకరిస్తోంది. అదేమిటో నీకు చెపుతాను విను.

దేవదూత వాక్యాలు ఆ అప్సరస శ్రద్ధగా వినసాగింది ...

**దేవదూత** : గంధమాదన పర్వతంపై ‘అరిష్టనేమి’ అనే ఒక చక్రవర్తి ఎంతో భక్తి శ్రద్ధలతో తపస్సు చేస్తూ ఉండేవాడు. మన ప్రభువు ఇంద్ర భగవానుడు ఆతని తపస్సుకు మెచ్చి అతనిని స్వర్గమునకు తీసుకురావలసినదిగా నన్ను నియమించారు. నేను ఆ రాజు వద్దకుపోయి స్వర్గ లోకమునకు ఆహ్వానించాను. అప్పుడారాజు “అయ్యా! నా ఈ నమస్కారం స్వీకరించండి. నాదొక చిన్న సందేహం. దేవలోకంలో నాకు అవధులు లేని ఆనందం లభిస్తుందా? లేక అక్కడకూడా మా భూలోకంలో లాగానే గుణదోషాలు ఉంటాయా?”అని అడిగెను.

అతని ఉత్తమ జ్ఞానయుక్తమైన ప్రశ్నకు సంతోషించి నేను “ఓ రాజా! జీవులు తమ పుణ్యకర్మానుభవం కొరకు స్వర్గం చేరుతూ ఉంటారు. అయితే, జీవులు చేసే పుణ్య కార్యములలో కూడా ఉత్తమ, మధ్యమ, అధమ బేధములు ఉంటాయి కదా! స్వర్గలోకవాసులలో మీ లోకంలో లాగానే అధికులైనవారు, అల్పులైనవారు ఉంటారు. ఫలితంగా దేవతా జీవులు కూడా ద్వేషాలు, అసూయలు, దురహంకారములు, స్పర్ధలు, గర్వములు, గర్వభంగములు, కలహములు పొందుతూ ఉంటారు. అంతేకాదు. పుణ్యమంతా వ్యయమైన తరువాత ఆ జీవులు భూలోకం రావలసిందే కదా! అప్పుడు అమితదుఃఖం పొందుతూ ఉంటారు. ఓ ఉత్తమ పుణ్యశీలుడా! ఇక మనం బయలుదేరుదామా?” అన్నాను.

అప్పుడారాజు, “క్లుప్తంగా ఉన్న విషయమంతా సుస్పష్టపరచినందుకు కృతజ్ఞుణ్ణి. ఓ దేవదూతా! ఒక విధంగా ఈ భూలోకము వంటిదే అయున్న, ద్వైతముతో కూడిన ఆ స్వర్గలోకం నేను కోరుకోవటం లేదు. నాకు నిర్వాణరూపమగు మోక్షమే కావాలి. అందుకొరకై ఇంకా ఇంకా తపస్సు చేస్తాను. ప్రకృతి సిద్ధమగు ఈ దేహం నేలకూలినా ఫరవాలేదు. నేను అందుకు సిద్ధమే” అని చెప్పి మౌనం వహించాడు.

ఇక చేసేది లేక నేను వెనుకకు మరలాను ఇంద్రదేవుని సమీపించి విషయమంతా విన్నవించాను. ఆయన ఆనందాశ్చర్యాలు పొంది ఇలా ఆజ్ఞాపించారు.

"ఓ దేవదూతా! అరిష్టనేమి లక్ష్యశుద్ధి నాకు ఆనందం కలుగచేస్తోంది. అయితే అతడు కోరుకొనే 'మోక్షస్థితి' ఉత్తమ విచారణ చేత మాత్రమే లభిస్తుంది. అతడు తన తపస్సుచే ఉత్తమ విరాగి అయినాడు. స్వర్గభోగములను ఉపేక్షించగల వితరణశీలం కూడా సంపాదించుకున్నాడు. అందుచేత ఉత్తమోత్తమైన ఆత్మ విచారణ వినటానికి అతడు తగి ఉన్నాడు. అందుచేత నీవు అతనిని వాల్మీకి ఆశ్రమం చేర్చు. మహత్తరమగు దేవదూత దర్శనం అతనిపట్ల వృథా కాకూడదు కదా!"

ఆయన సూచించినట్లే నేను ఆ రాజును వాల్మీకి ఆశ్రమం చేర్చాను.

❖

మోక్ష సాధనలో 1) తపో, ధ్యాన, నిష్కామ కర్మలవంటి ప్రయత్నములు,
2) సత్యాసత్యముల విచారణ – రెండూ ఆవశ్యకాలే!

భౌతిక సుఖరూపములగు స్వల్ప లక్ష్యములు మోక్షస్థితి వరకు జీవుని చేరకుండానే చేస్తాయి.

ఆత్మజ్ఞానం కొరవడినప్పుడు స్వర్గము కూడా తృప్తిదాయకము కాజాలదు.

ముముక్షువైనవాడు ఆత్మానుభవం గల మహనీయులను సమీపించాలి. వారి వాక్యములను వినటం, మననం చేయటం ఉత్తమ మోక్షోపాయమై ఉన్నది.)

❖❖❖

## 2. ఉపదేశ ప్రారంభం

అరిష్ఠనేమి రాజు వాల్మీకి ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడి ప్రదేశమంతా పవిత్రతో, ప్రశాంతతతో ఆనందమయమై ఉన్నది. మునికుమారులు మధురంగా సామగానం చేస్తున్నారు. మరికొందరు రామావతారకథ ఆనందంగా చెప్పుకొంటున్నారు. చల్లగా వీచే పిల్లగాలులు జీవులకు భక్తి జ్ఞాన వైరాగ్యములను గుర్తు చేయుచున్నట్లున్నాయి. విశాల వృక్షములు మధుర శబ్దములు వినిపింపచేస్తున్నాయి.

ఒక ఎత్తైన స్థానంలో మహర్షివాల్మీకి ఆసీనులై ఉన్నారు. బ్రహ్మానందం ఆయన ముఖంలో మూర్తీభవించి ఉన్నది. రాజు ఆయనను సమీపించి సాష్టాంగదండ ప్రణామం చేశాడు. మహర్షి రాజును ప్రేమగా పలుకరించి సుఖాసీనుణ్ణి చేశారు. రాజు అవనత శిరస్కుడై ఇట్లు ప్రార్థించాడు.

"హే వాల్మీకి మహర్షీ! నేను సంసారబద్ధుడనై అనేక దుఃఖ పరంపరలను అనుభవిస్తున్నాను. నేటికి ఈ దేవదూత దయవలన మీ దర్శనం లభించింది. ఎంతటి సుదినం! తండ్రీ! మీరు

రామాయణం రచించి లోకమునకు మహోపకారం చేశారు. అయితే నాదొక సందేహం. ఎట్టి విచారణచే రాముడు మొదలైనవారు దుర్భరమైన ఈ సంసార సాగరాన్ని అవలీలగా దాటవేశారు? నాకా విషయం చెప్ప ప్రార్థిస్తున్నాను. మీ ప్రవచనముచే నన్ను పవిత్రుణ్ణి చెయ్యండి.”

వాల్మీకి మహర్షి ఇది విని ఒక్క క్షణం మౌనం వహించారు. తనను ఆశ్రయించ వచ్చిన శిష్యుని పూర్వాపరాలు సంపూర్ణంగా గ్రహించారు. “ఇతడు వివేక దృష్టితో నిత్యానిత్యములను పరిశీలించా లనుకొంటున్నాడు. కనుక ఉత్తర రామాయణం (యోగవాసిష్ఠం) వినటానికి తగినవాడు. లోక కళ్యాణం కొరకు, జ్ఞానార్తులైన జనులపై నాకుగల అవ్యాజమైన ప్రేమచే వసిష్ఠ రామ సంవాద రూపమైన ‘వాసిష్ఠ రామాయణం’ ఇతనికి బోధించెదను గాక!” అని సంకల్పించారు. ఒక్కసారి ఆత్మ వస్తువును ధ్యానం చేశారు. పిమ్మట ఇట్లు ప్రవచించ ప్రారంభించారు :

**శ్రీ వాల్మీకి మహర్షి :**

**దివి భూమౌ తథాఽఽకాశే బహిరంతశ్చ మే విభుః ।**
**యో విభాత్యవభాసాత్మా, తస్మై సర్వాత్మనే నమః ॥** (II - 1)

స్వస్వరూపభూతుడు, ప్రకాశరూపుడు అయిన ఏ పరమాత్మ స్వర్గంలోను, భూలోకంలోను, ఆకాశంలోను, బయట, లోపల కూడా నానావిధ రూపము లందు ఏకస్థుడై ప్రకాశిస్తున్నాడో అట్టి సర్వస్వరూపుడగు పరబ్రహ్మమునకు నమస్కరిస్తున్నాను.

**శృణు రాజన్ ప్రవక్ష్యామి రామాయణమఖండితమ్ ।**
**శ్రుత్వాఽవధార్య యత్నేన జీవన్ముక్తో భవిష్యసి ॥** (I-52)

ఓ రాజా! జీవునియొక్క అఖండత్వాన్ని ప్రతిపాదిస్తున్న ‘మహారామాయణము’ చెప్పుచున్నాను. ఇది శ్రద్ధగా, ప్రయత్నపూర్వకంగా విని అవగతం చేసుకొన్నావా – నీవు ఇక్కడే ఇప్పుడే జీవన్ముక్తత్వము పొందగలవు.

ఈ ‘ఆత్మవిచారణ’ వినటానికి కేవలం అజ్ఞాని (“నే నీదేహమును అను దేహాత్మ బుద్ధి కలవాడు”) తగినవాడు కాలేకపోతున్నాడు. కేవలం జ్ఞానికి ఇక చెప్పవలసిన దేముంటుంది? ఎవరైతే, “నేను బద్ధుణ్ణి, ఈ దృశ్యములోని అవాస్తవత్వం నన్ను ముగ్ధుణ్ణి చేస్తోంది. ఎట్లైనా సరే, ఆత్మజ్ఞానం పొంది ముక్తుడను కావాలి” అనే తీవ్రేచ్ఛ కలిగి ఉంటారో – అట్టి వారందరూ ఈ ‘బోధ’ వినటానికి తగినవారే !

మొదట పూర్వ రామాయణం (ఏడు కాండలతో కూడిన శ్రీరాముని కథ) తెలుసుకొని ఉండటం జరిగితే అప్పుడు ఆ పాఠకుడు ప్రవృత్తి మార్గంలో చిత్తశుద్ధిని పొందుచున్నాడు. ఇలా శుద్ధినొందిన చిత్తము స్వయంగా అకృతిమంగా సులభంగా జ్ఞానం పొందటానికి అభిముఖమౌతోంది. అప్పుడు ఈ వసిష్ఠ – రామసంవాద రూపమైన ఆరు ప్రకరణములతో కూడిన ‘అఖండ రామాయణం’ విచారిస్తే ద్విగుణీకృతమైన ప్రయోజనం సిద్ధించగలదు. ఇది నివృత్తి మార్గంలో తప్పక మోక్షం ప్రసాదించగలదు.

పూర్వం దివ్యదృష్టితో శ్రీరాముని కథ దర్శించి 24,000 శ్లోకములతో రామాయణం వ్రాశాను. 'భరద్వాజుడు' అను వాడు నా శిష్యుడు. మహామేధావి, బుద్ధిమంతుడు, ఏకసంథాగ్రాహి, వినయము కలవాడుకూడా. అతనికి రామకథ వినిపించాను.

ఒకసారి అతడు ఆ కథంతా మేరుపర్వతంపై భగవంతుడగు బ్రహ్మదేవునికి వినిపించాడు. ఆయన పరమానందం పొంది "కుమారా! చాలా బాగున్నదయ్యా! రామచంద్రుని కథ లోకమునకు కళ్యాణం కలుగజేస్తుంది. నాకు ఈ కథ వినిపించినందుకు ఏదైనా వరం కోరుకో" అని ఆశీర్వాదపూర్వకంగా పలికారు. అప్పుడు భరద్వాజుడు "తండ్రీ! ఈ జనుల దుఃఖములకు అంతూపొంతూ ఉండుటలేదు. దేనివలన జనులు దుఃఖవిముక్తులౌతారో, దాని గురించి చెప్పండి" అని వేడుకున్నాడు. అప్పుడాయన భరద్వాజుని, నా వద్దకు తోడ్కొనివచ్చి ఇట్లు ఆజ్ఞాపించారు :

"నాయనా! వాల్మీకీ! ఇప్పుడు నీవు వ్రాయపూనుకొన్న అఖండ రామాయణం శ్రమ అనుకోకుండా పూర్తిచేయి. సప్తకాండలు మధురంగా వ్రాశావు. అయితే, రాముడు ఏ విచారణచే వసిష్ఠ మహర్షిచే బోధింపబడి పూర్ణుడు, ఆత్మస్వరూపుడు అయ్యాడో – ఆ విషయాన్ని నీ ప్రియశిష్యుడగు భరద్వాజునికి బోధించు. అట్టి విచారణ సహాయంతో జీవులు ఈ సంసారమును అతి లాఘవంగా దాటివేయుదురుగాక!" ఇలా ఆజ్ఞాపించి అంతర్ధానమయ్యారు.

అప్పుడు ప్రవచించబడినదే నీకు చెప్పబోవుచున్నాను. నీ మీద వాత్సల్యంతో భగవత్ప్రేరితుడనై పలుకుచున్నాను. ఉత్కృష్టమైన ఈ 'ఆత్మజ్ఞానం' పొందినవాడు శోకము, దైన్యము, అభిమానము త్యజించి వేస్తాడు. నిత్యతృప్తుడై వెలయగలడు.

❖❖❖

# 3. శ్రీరామావతారం

ఓ అరిష్టనేమీ! నీ ఇష్ట దైవము ఆ నారాయణుడే భక్తుల శపాలను పరిపూర్ణమొనర్చే నిమిత్తం ఒక రాజు వేషం ధరించి ఈ భూమిపై సంచరించినాడు. తన అఖండత్వము, అద్వితీయ చిదానంద స్వరూపమును ఏమరచినవానివలె అవతరించి లోకములను పావనం చేశాడు. చైతన్య విగ్రహుడగు శ్రీమన్నారాయణునికి లీలా మాత్రంగా వేరువేరు సందర్భములలో ప్రాప్తించిన శాపముల గురించి మొదటగా చెపుతాను.

ఒకప్పుడు జగత్ప్రభువగు నారాయణుడు బ్రహ్మలోకం వచ్చాడు. బ్రహ్మదేవునితో సహా సర్వ బ్రహ్మలోకవాసులు ఆయనను పూజించారు. బ్రహ్మమానసపుత్రుడగు సనత్కుమారుడు మాత్రం "నేను నిష్కాముడను కదా! ఈ చరాచర సృష్టిలో నాకు కావలసినదేమున్నది? ఆశ్రయించవలసినది ఏమున్నది?" అని తలచి మాధవుని పూజించనేలేదు. ఇది గమనించిన గోవిందుడు "ఓయీ! మిత్రమా! సనత్కుమారా! నీవు నిష్కాముడవే కావచ్చు. కాని యుక్తాయుక్తములు మరువరాదు కదా! అందుచేత కుమారస్వామివై జన్మించి కామార్తుడవగుదువుగాక" అని శపించాడు. అందుకు

ప్రతిగా సనత్కుమారుడు "నారాయణా! అట్లా అయితే నీవు నీ సర్వజ్ఞత్వమును కోల్పోయి కొంతకాలం అజ్ఞానివై భూమిపై సంచరించెదవుగాక" అని శపించాడు. మరి ఆ వాక్యం నారాయణుడు సఫలం చేయాలి కదా!

ఇది ఇతఃపూర్వం ఒకానొక కల్పంలోని విషయం. ఆ కల్పంలో "ఖ్యాతి" అను ఆమె భృగువు యొక్క భార్య. ఆ ఖ్యాతి విష్ణుభక్తురాలు. "సర్వాంతర్యామియగు విష్ణువునందు లీనమగుదునుగాక" అని కోరుకొని భక్తి శ్రద్ధలతో ఆరాధించింది. భక్త వత్సలుడగు విష్ణుమూర్తి తన భక్తురాలి కోరికను అట్లే సఫలం చేశారు. అప్పుడు భృగువు క్రోధపరవశుడై "ఓయీ విష్ణుమూర్తీ! భార్యావియోగం ఎంతటి బాధాకరమో నీకు తెలియాలి. నీకు కూడా నాలాగానే భార్యావియోగం కలుగుగాక" అని శపించాడు.

గోలోకంలో ఒకప్పుడు రాధ, సుధాముడిని చూచి ఏదో సందర్భంలో, "నీవు దానవకులంలో జన్మించెదవుగాక"! అని శపించింది.

అతడు జలంధరుడై జన్మించాడు. అతని భార్య బృంద. లోకకంటకుడగు జలంధరుణ్ణి ఆ బృంద పాతివ్రత్యం కాపాడుతూ ఉండేది. దేవతలచే ప్రార్థింపబడి, నారాయణుడు లోకకళ్యాణం కొరకు కపటరూపం దాల్చి బృంద పాతివ్రత్యం భంగపరచారు. జలంధరుడు సంహరించబడ్డాడు. అప్పుడు విష్ణువు మోసం చేసినాడని తెలిసి "నీకు కూడా భార్యా వియోగం కలుగుగాక" అని శపించింది.

మరొకప్పుడు విష్ణుమూర్తి భీకరాకారమగు నృసింహుడై నదీతీరంలో సంచరిస్తున్నాడు. అప్పుడు 'దేవదత్తుడు' అనువాని భార్య నృసింహస్వామిని చూచి భయంతో ప్రాణాలు వదలింది. అప్పుడా దేవదత్తుడు "నీవు కూడా భార్యావియోగం పొందెదవుగాక" అని శపించటం జరిగింది.

ఓ రాజా! పై కారణాల వలన విష్ణుమూర్తి రాముడై జన్మించాడు. నీ ప్రియముకొరకే వేరు వేరు పురాణములలోని సంఘటనలు వినిపించాను. ఇక మనం ఆత్మవిచారణలో ప్రవేశిస్తున్నాం. సావధాన చిత్తుడవై విను.

❖❖❖

## 4. వస్తుతత్త్వం

ఆకాశము యొక్క వాస్తవ స్వరూపం శూన్యమేకదా! ఈ నిజం తెలుసుకొన్న తరువాత, "ఆకాశంలో నీలవర్ణముగల పదార్థమేదో ఉన్నది" అనే భ్రమ ఎవరికి ఉంటుంది? ఈ కనబడే జగత్తుకూడా కల్పితమాత్రమని, స్వకీయమైన 'భ్రమ' అని ఎరిగిన తరువాత ఇందు ప్రాప్తిస్తున్న సర్వ వికారాలు తొలగుతాయి. అయితే, బ్రహ్మము యొక్క వాస్తవ స్వరూపం తెలుసుకొన్నప్పుడు మాత్రమే ఈ జగత్తు యొక్క నిజస్వరూపం మనం తెలుసుకోగలం.

అనేక సంభ్రమములు, దుఃఖ పరంపరలు, వికారములు అనుక్షణం జీవునికి కలుగజేస్తున్న ఈ "జగద్దృశ్యము" ఎక్కడి నుండి ప్రాప్తిస్తోంది? ఈ వ్యవహారములు, అనుభవములు, శరీరములు జీవునకు రచించుచూ అందచేస్తున్న వారెవరు? సునిశిత బుద్ధితో పరిశీలిస్తే ఈ దృశ్యమును ఒకడు ఆయా విధములుగా మననము చేయుట చేతనే ప్రియముగా అప్రియముగా, సుఖ-దుఃఖ భరితంగా, సామాన్యముగా, అసామాన్యముగా.... ఇట్లు అనేక విధములైన భావనలతో అనుభవమగుచున్నది".... అని తెలియవచ్చుచున్నది. మననమే మనస్సుయొక్క, జీవునియొక్క, జగత్తు యొక్క మూలకారణమై ఉన్నది. అనగా ఈ 'జగత్తు' అనబడునది మనస్సునందే ఉదయించుచున్నది. ఎప్పుడైతే 'జగత్తు' అనబడే అనుభవం మనస్సునందు ఉదయించకుండా విస్మరించబడుతుందో, అట్టి విస్మరణముచే ఏర్పడగల శుద్ధ స్వస్వరూపానుభవమే సర్వోత్కృష్టమగు ముక్తి అని జ్ఞానులు మనకు చెప్పుచున్నారు.

అయితే అట్టి విస్మరణ స్థితి అనుభవమయ్యేదెట్లా? "అనేక అనుభవములతో కూడిన ఈ దృశ్యము ఉన్నదా? ఉంటే బాలునికి ఒక రకంగా, వృద్ధునికి మరొక రకంగా ఎందుకు తోచుచున్నది? కాబట్టి ఈ కనబడు దృశ్యముగాని, దీని సాక్షిత్వము గాని ఏ కాలంలోను ఉండి ఉండనేలేదు" అను అభేదరూపమైన బోధ లేక జ్ఞానము జీవునియందు దృఢం కావాలి. అప్పుడు మాత్రమే దృశ్యము యొక్క విస్మరణ, స్వస్వరూపము యొక్క అనిర్వచనీయానుభవం ఒకేసారి జీవునికి కలుగుతాయి.

భ్రాంతి వలన కల్పించబడిన ఈ జగత్తునకు ద్రష్ట యొక్క స్వభావమైయున్న భావము కంటే వేరైన అస్థిత్వమేదీ లేదు. అయితే అట్టి జగద్భావరాహిత్యముచే కలుగగల ఆత్మసాక్షాత్కారం శాస్త్ర విచారణా ప్రభావంచే అనాయాసంగా తప్పక లభిస్తుంది.

అట్టి ఆధ్యాత్మ విషయమును ప్రతిపాదిస్తున్న ఉత్తమ శాస్త్రములు ఉన్నాయి. వాటిని మానవుడు చక్కగా పరిశీలించాలి. లేదా, ఆత్మానుభూతి పొందిన మహనీయుల ముఖతఃవింటే ఇంకా మంచిది. "దృశ్యముగాని, ద్రష్టత్వముగాని మిధ్యయే" అనునట్టి తత్త్వజ్ఞానము యొక్క ప్రభావంచేత మనస్సు నుండి ఈ దృశ్యము తొలగిపోగా అప్పుడు శేషించు భేదరహిత స్థితియే సర్వుల యొక్క స్వస్వరూపమైనట్టి "ఆత్మస్థితి".

కాబట్టి ఈ దృశ్యము యొక్క విచారణము కొరకు ఆత్మజ్ఞానముకై ప్రయత్నించాలి. అట్లా కాకుండా, ఆత్మజ్ఞానం విడిచి కేవలం శాస్త్ర వాసనలతో లోక వాసనలతో కూడుకొని అనాత్మపూర్వకంగా ఎంత ప్రయాసపడితే మాత్రం ఏం లాభం చెప్పు?

మొట్టమొదట ఉత్తమ నిష్కామ కర్మలచేత, ఉపాసనలచేత, శ్రవణమననాదులచేత, స్వవిచారణచేత జీవుడు వాసనాక్షయం సాధించాలి. ఈ విధంగా చిత్తము నిర్మలత్వం పొందుగాక! సర్వ వాసనలు (tendencies) సంపూర్ణంగా త్యజించుటయే ఉత్తమమైన మార్గం. 'ఆసక్తి' కలిగి ఉండుటయే వాసనల రూపంకదా. ప్రపంచముపట్ల గల భ్రమలు తొలగితే అప్పుడు మరికొంత అభ్యాసముచే ఆసక్తి పూర్వకమగు (ఇంద్రియములతోటి) తాదాత్మ్యము సన్నగిల్లుతుంది. ఇక జన్మజన్మలుగా వెంటనంటి వస్తున్న వాసనలు తమంతట తామే తొలగుతాయి. "భ్రాంతి వలననే

ఈ జగత్తు నాకు ఇట్లు కనబడుతోంది. భ్రాంతికి వేరుగా జగత్తు లేదు" అను స్వబోధ (self-training) సహాయం చేత ఆత్మజ్ఞానమునకు పరాకాష్ఠ అయినట్టి "నిర్వాణస్థితి" ఉత్పన్నమౌతోంది. వాసనా రాహిత్యము, దృశ్య మనన రాహిత్యము కలుగగా అప్పుడు లభించే స్థితే 'మోక్షం'. అనగా, ఇకప్పుడు మోక్షప్రాప్తికి వేఱే ప్రయత్నముల ఆవశ్యకత ఏదీ ఉండదు.

అయితే వాసనల యొక్క సంపూర్ణ పరిత్యాగం అవిద్యా దోషము లేనట్టి శుద్ధ చిత్తులకు మాత్రమే సాధ్యం. ఎండ ఎక్కుతున్న కొద్దీ మంచు కరిగిపోతున్నట్లు ఆత్మజ్ఞానం ఉదయిస్తున్న కొద్దీ క్రమంగా దృశ్యతాదాత్మ్యం, అవిద్యాభావన, అనేకత్వానుభవం, వాసనల ప్రభావం సన్నగిల్లుతాయి.

ఓ రాజా! పంచభూతములచే (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశం) తయారగుచున్న ఈ భౌతిక దేహం కూడా వాసనల చేతనే ధరింపబడుచున్నది. ఈ వాసనలు రెండు రకాలు–

1. శుద్ధ వాసనలు 2. మలిన వాసనలు

ఇందు మలిన వాసనలు శరీర పరంపరా ప్రాప్తికి (మరల మరల జన్మలు పొందటానికి) కారణమౌతున్నాయి. మలిన వాసనల యొక్క ఆకారముగాని, వాటికి మూలకారణంగాని అజ్ఞానమే అయ్యున్నది. అట్టి మలిన వాసనలే ఘనీభూతమై "అహంకారము" అనే రూపమును పొందుచున్నాయి. ఇక శుద్ధ వాసనలో, ... అహంకారమును, జన్మ పరంపరలను నశింపచేస్తున్నాయి. ఉడకపెట్టబడిన వేరుసెనగ గింజ మరల మొలుస్తుందా? కాని, రూపం మాత్రం కలిగే ఉంటుంది కదా! శుద్ధ వాసనలు కూడా జ్ఞేయమగు (తెలుసుకొనేది – తెలియబడునది) ఆత్మను ఎరిగిన తరువాత తమయందు 'పునర్జన్మ' అనే అంకురం కలిగి ఉండవు. 'శరీరం ధరించుట' అను బాహ్య వ్యవహార సరళి మాత్రమే కలిగి ఉంటాయి. అట్టి శుద్ధ వాసనలు మాత్రమే కలిగి ఉన్న జీవుణ్ణి "జీవన్ముక్తుడు" అని పిలుస్తున్నాం.

మహాత్ముడగు శ్రీరాముడు వసిష్ఠమహర్షిచే బోధింపబడి, సానపెట్టిన వజ్రంలాగా జీవన్ముక్తుడై, ఈ భూమిపై సంచరించాడు. ఆ రాముడు ఎట్టి విచారణచే అట్టి పరమోత్కృష్ట స్థితిని పొందాడో .... ఆ విచారణ నీకు కూడా చెపుతాను. ఇది వినినవారికి జరామరణభయం తొలగుతుంది. వారు తమ స్వరూపము యొక్క వాస్తవస్థితి గ్రహిస్తారు.

❖❖❖

## 5. కథా ప్రవేశం

అయోధ్యానగరం పాలించే దశరథ మహారాజుకు ఎంతోకాలం తరువాత పుత్రకామేష్టి మొదలైన యాగముల ఫలితంగా నలుగురు కుమారులు కలిగారు. వారే రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు. కులగురువు అయిన వసిష్ఠ మహర్షి వద్ద ఆ నలుగురు రాజకుమారులు విద్యాభ్యాస్యం పూర్తిచేశారు. స్ఫురద్రూపులై, నవనవోన్నత విలాసంతో ప్రకాశిస్తున్నారు. గురుకులం నుండి అంతఃపురానికి

తిరిగివచ్చిన రాముడు తండ్రి అనుజ్ఞపై సోదరులను వెంటబెట్టుకుని తీర్థయాత్రలకు బయలుదేరాడు. అనేక ఋష్యాశ్రమాలు, పుణ్యనదులు, దేవాలయాలు సేవించి తిరిగి అయోధ్యకు చేరాడు.

అయోధ్య చేరినప్పటినుండి రాముడు వేసవికాలంలోని తటాకజలంలాగా క్రమక్రమంగా క్షీణించసాగాడు. అప్పటికి అతని వయసు పదముడు ఏళ్ళు మించలేదు. కాని, తోటి బాలురతో ఆడటం మానివేశాడు. అంతఃపురంలో ఒక మూల పద్మాసనంలో కూర్చుని ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. పరిజనులు ఎంతో బ్రతిమలాడితేకాని, స్నానాదుల కొరకు కూడా లేచేవాడు కాదు. అతనిని చూచి ఆతని తమ్ములు కూడా చింతాక్రాంతులయ్యారు. అంతఃపురంలో రాజకుమారులున్న సందడేలేదు.

దశరథ మహారాజు రామునివైనం గమనించాడు. ఒక రోజు తన దగ్గరకు పిలిపించి, తొడపై కూర్చుండబెట్టుకొని లాలనగా "ఇంత దీనంగా ఉన్నావు. కారణమేమిటయ్యా? నీకు వచ్చిన లోటు ఏమిటో నాకుచెప్పు" అని తరచి తరచి ప్రశ్నించాడు. కాని ఏం లాభం? రాముడు మాత్రం ముక్తసరిగా "నాకేం అవసరం? ఇక లోటు ఏమి ఉంటుంది?" అని ఊరకున్నాడు. రాజు ఇక చేసేదిలేక, కులగురువు, వసిష్ఠుని రప్పించి రాముని నిస్తేజత్వం గురించి చర్చించాడు. అప్పుడు వసిష్ఠుడు, "ఓ రాజా! నీ కుమారుడు రామచంద్రుడు మేఘగంభీర స్వభావుడు. అట్టి వారికి స్వల్పకారణాలకు కోపం, సంతోషం, విషాదం మొదలైన వికారాలు పుట్టవు. స్వల్పులను మాత్రమే స్వల్పకారణాలు విచలితం చేస్తాయి. కనుక, మన రాముని యొక్క ఇట్టి విచిత్ర ప్రవర్తనకు ఏదో ఉత్కృష్టమైన కారణమే ఉండి ఉంటుంది. నీవు దిగులుపడవద్దు, దేనికైనా తగిన సమయం రావాలికదా!" అని అనునయంగా పలికాడు.

❖❖❖

# 6. విశ్వామిత్రుని రాక

'విశ్వామిత్రుడు' అనే మహర్షి ఉన్నారు. ఆయన ఒక సామాన్య రాజుగా జన్మించి స్వకీయ తపోధ్యానాది ప్రయత్నములచే బ్రహ్మర్షి అయ్యారు. ఒకప్పుడు శిష్య వాత్సల్యంతో ఇంద్రుని ఎదిరించి, 'త్రిశంకుడు' అను శిష్యుని కొరకు రెండవ స్వర్గం సృష్టించినట్టి మహామేధావి. అద్వితీయ ప్రతిభాశాలి. లోక కళ్యాణమే కార్యక్రమముగా కలిగియుండి సార్థకనామధేయుడైనారు. ఒక రోజు అకస్మాత్తుగా ఆయన అయోధ్యానగరం వచ్చారు. రాజు ఆయనను సభకు ఆహ్వానించి అర్ఘ్యపాద్యాదులు సమర్పించి ఒక ఉన్నతాసనంపై కూర్చుండబెట్టారు. సభలోని ముఖ్యులుంతా లేచి విశ్వామిత్రునికి సాష్టాంగ నమస్కారములు, ప్రదక్షిణలు సమర్పించారు. వసిష్ఠ – విశ్వామిత్రులు కుశల ప్రశ్నలతో పరస్పరం సంభాషించు కొన్నారు. యథాతథంగా సభ ప్రారంభించబడింది. దశరథ మహారాజు వినయ పూర్వకంగా సింహాసనము నుండి లేచి ఇట్లు పలికారు.

"లోక కళ్యాణమే జీవిత ధ్యేయంగా కలిగియున్న ఓ విశ్వామిత్ర మహర్షీ! సుస్వాగతం. మానవునకు అమృతం లభిస్తే ఎట్లా ఉంటుంది? రోజుల తరబడి కరువు కాటకం ఆవహించినపుడు అనుకోకుండా ఒక రోజు కుంభపోతవర్షం కురిస్తే ఎంత ఆనందం! గుడ్డివాడికి చూపు రావటమో, కుంటివానికి కాళ్ళు రావటమో జరిగితే ఎంత సంతోషం! మీ ఈ రాక మాకు, మా ప్రజలకు అంత ఆనందం కలుగచేస్తోంది. మేమంతా మీ దర్శనముచే పవిత్రులమయ్యాం. ఇచ్ఛాభయ క్రోధ రహితులగు మీ వంటి బ్రహ్మానందస్వరూపులు మా పూర్వజన్మల సుకృతం చేతనే మావంటి వారివద్దకు వస్తారు. మీరు ఎందుకు వచ్చారో అది నెరవేర్చబడినట్లే భావించండి. నిస్సంకోచంగా ఆజ్ఞాపించండి. ఈ రాజసింహాసనమైనా సరే, మీ పాదాలముందు ఉంచటానికి నేను సిద్ధంగా ఉన్నాను."

విశ్వామిత్రుడు ఆ మాటలకు సంతోషించి ఇట్లు పలికాడు.

"ఓ రాజా! మీకు, మీ రాజ్యమునకు శుభమగుగాక. నీ అతిథి మర్యాదలు నన్ను ఆనందింపచేస్తున్నాయి.

నేను ఒక మహాయజ్ఞం తలపెట్టాను. అది నిర్విఘ్నంగా నిర్వహించగలిగితే, లోకములకు శుభం చేకూరుతుంది. అయితే మేము యజ్ఞము ప్రారంభించి దేవతలను ఆహ్వానించినప్పుడల్లా కొందరు దానవులు వచ్చి యజ్ఞవాటికపై రక్త మాంసాలు కురిపిస్తున్నారు. మా ప్రయత్నాలన్నీ ధ్వంసమైపోతున్నాయి. మేము యాగదీక్షలో ఉన్నప్పుడు అత్యంత శాంత స్వభావులమై ఉంటాము కదా! అది వారు అవకాశంగా తీసుకొంటున్నారు.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాను. నీవు మా ఈ ప్రయత్నమును సఫలం చేయాలి. నీ కుమారుడు రాముడు ఇంద్రుని మించిన పరాక్రమము కలవాడు. ఈ పూజనీయుడగు వసిష్ఠమహర్షి వద్ద సర్వశస్త్రాస్త్ర విద్యలు నేర్చుకొని మహావీరుడై ఉన్నాడు. మాకు ఆ రాముడు కావాలి. అతడు మాత్రమే మృగములను వేటాడే వేటగానివలె ఆ రాక్షసులను మట్టుపెట్టగలడు. మా యజ్ఞం పదిరోజులు జరుగుతుంది. ఇక ఇప్పుడు ఎక్కువ సమయం వృథా కాకూడదు. అతిత్వరలో యజ్ఞం ప్రారంభించటానికి అన్నీ సిద్ధం చేసుకున్నాం.

నీవు రాముని పరాక్రమం గురించి శంకించవలసిన పనిలేదు. అతడు వేనవేలు రాక్షసులనైనా సరే, క్షణంలో దునుమాడి నీకు కీర్తి తెచ్చిపెట్టగలడు. రాముణ్ణి నాకు అప్పగించిన మరుక్షణం మమ్ములను బాధిస్తున్న ఆ రాక్షసుల ఆయువు మూడినట్లే. మన రాముడు స్వయంగానే గొప్ప శక్తి సంపన్నుడు. పైగా నాచే రక్షింపబడగలడు. ఇక అనుమానం ఎందుకు? ఒకవేళ పుత్ర వ్యామోహం చేత అన్నమాట తప్పుతావా – అది నీకు అర్హమైనది కాదు. ఇక్ష్వాకు వంశపు రాజులు ఇచ్చిన మాట తప్పుతారా? లేదు. నీ ప్రత్యుత్తరం కోసం వేచి ఉన్నాను."

దశరథుడు అంతా విని అవాక్కయ్యాడు. కొద్ది క్షణములలో తేరుకొని రెండు చేతులు జోడించి ఇట్లు విన్నవించాడు :

"ఓ మహర్షీ! అన్నీ తెలిసి కూడా నన్ను పరిహాసం చేస్తున్నారా? ఎన్నో యేళ్ళు పరితపించిన తరువాత నాకీ పుత్రులు లేక లేక కలిగారు. నా పంచప్రాణాలు రాముడి మీదే. అతనికి ఏమైనా అయితే నేను భరించగలనా? ఈ రాముడు ముక్కు పచ్చలారని పసిబాలుడు. ఇంతవరకు కల్పితయుద్ధంలోనే గాని, నిజమైన యుద్ధంలో ప్రవేశించి ఎరుగడు. మీకు తెలుసు. అది రాక్షసులతో యుద్ధం. నేను అక్షౌహిణీ సైన్యంతో వచ్చి మీ యాగం రక్షిస్తాను. అయినా, ఆ రాక్షసులెవరో మరికాస్త వివరించి చెప్పండి. వారు ఎంతమంది? ఎట్టివారు? వారు మాయాయుద్ధ విశారదులు కాదుకదా...? ఒకవేళ మీకు ప్రతిబంధకం కలిగించేది లవణాసురుడో, సుందోపసుందులో కాదుకదా? ఈ కాలంలో రావణుని గురించి వింటున్నాం. అతడు కుబేరుని తమ్ముడు. విశ్రవసుని కుమారుడు. వాళ్ళ ముందైతే మేమే నిలువలేం. ఇక మా రాముడు ఎంతటివాడు చెప్పండి? ఇది ఈశ్వరేచ్ఛానుసారం కొందరు రాక్షసులు రాణించే కాలం. స్వామీ! నన్ను క్షమించి అనుగ్రహించండి. పుత్ర మమకారంతో నేనిట్లా అంటున్నానంటారా? నిజమే. ఈ పుత్రులకొరకు నేను ఎన్నో ఏళ్ళు తపించాను. మహా మహా జ్ఞానులైన వారే పుత్రుల యోగక్షేమముల కొరకు పరితపిస్తూ ఉంటారు. సామాన్య మానవులమగు మేము ఎంతటివారం చెప్పండి? అట్లుగాక, బలాత్కారంగా నా పుత్రుని గొని పోతానంటారా .... మరుక్షణం నన్ను విగతజీవునిగా ఎంచండి. మీ సేవచేయటానికి అక్షౌహిణి సైన్యంతో నేను సిద్ధంగా ఉన్నాను."

విశ్వామిత్రుడు అంతా విని తటాలున లేచి నిలబడ్డాడు.

"నా కార్యము నెరవేరుస్తానని మాట ఇచ్చి, ఇప్పుడు అన్నమాట వెనుకకు తీసుకొంటావా? రఘువంశంలో పుట్టిన నీకు ఇది తగుతుందా? సింహం లేడి కావటమా? పూర్ణ చంద్రుని నుండి ఉష్ణ కిరణాలు బయల్వెడలటమా? సరేఁ! మంచిది. నీవు నా కోర్కె తీర్చకుంటే నేను వెళ్ళివస్తాను. ప్రతిజ్ఞాభంగం చేసినవాడవై బంధువులతో సుఖంగా ఉండు."

ఇంతలో వసిష్ఠుడు విశ్వామిత్రుని సమీపించి అనునయ వాక్యాలతో శాంతపరచాడు. దశరథుని ప్రక్కకు పిలిచి, "ఓ మహారాజా! నీవే ధర్మం తప్పితే ఎట్లా? పైగా, రాముని పరాక్రమం సంగతి నాకు తెలుసు. అతడు విశ్వామిత్రుని రక్షణలో ఉండగా తేరిపార చూచేవారు ఈ మూడు లోకములలో ఎవరైనా ఉన్నారా? అందుచేత రాముణ్ణి తప్పకుండా పంపు. నీకు శుభమే కలుగుతుంది" అని సముదాయించాడు. దశరథుడు పుత్ర మమకారం కొంత ప్రక్కకుపెట్టి వివేచనా దృష్టితో విషయమంతా పరిశీలించాడు. రాముణ్ణి పంపటానికే నిశ్చయించుకొన్నాడు.

❖❖❖

# 7. రామ సభాప్రవేశం

రాజు రామచంద్రుని యొక్క ఒక ఆంతరంగిక సేవకుణ్ణి పిలిపించాడు. "ఓయీ! మన రాముని స్థితి ఇప్పుడు ఎట్లా ఉన్నది? చింతలన్నీ త్యజించి ఉత్సాహం పుంజు కొన్నాడా?" అని ప్రశ్నించాడు.

**శ్రీరామ భృత్యువు :** మహారాజా! మన రామచంద్రుడు తీర్థ యాత్రలకు వెళ్ళి వచ్చినప్పటినుండీ, అదొక విధంగా ఉన్నాడు. మేమంతా ఎంతో ప్రార్థిస్తేగాని స్నాన భోజనాలకు లేచుటలేదు. మాతో మాట్లాడనే మాట్లాడడు. తనలో తానే "ఈ సంపదల వలన ఏం ప్రయోజనం? ఆపదలచే బాధింపబడనివాడెవ్వడు? ఈ అంతఃపురములు, సేవకజనం, రాజ్యాది వ్యవహారములు ఈ జీవుడిని కాపాడగలవా? అసలు కోరికలు ఎందుకు ఉండాలి? ఏది సిద్ధిస్తే ఏం ప్రత్యేకత? ఇదంతా శూన్యరూపమే కదా!" అని చెప్పుకొంటున్నాడు. ఎప్పుడు చూచినా ఏకాకివలె, ఏకాగ్రచిత్తంతో ఎక్కడో ఒక మూల కూర్చుని ఉంటాడు. తాను ఒక రాజకుమారుడననే స్ఫురణే లేదు. సుఖమైన విషయాలను పట్టించుకోడు. దుఃఖకరమగు వార్తలకు ఏమాత్రం స్పందించడు. అభిమానముగాని, కోరికలు గాని ప్రకటించడు. "రాజా! ఇది యేమి?" అని ప్రశ్నిస్తే మౌనమే అతని సమాధానం. ఎక్కడైనా స్త్రీలు తారసపడినప్పుడు "అమ్మలారా! మీరందరు కాలముచే భక్షింపబడబోతున్నారనే విషయం తెలుసుకొనియే ఉన్నారా? మోక్షపదము కొరకు ప్రయత్నించకుంటే మీరెందుకు జీవిస్తున్నట్లో చెప్పండి?" అని నిలదీసి ప్రశ్నిస్తున్నాడు. "రామచంద్రా! మీరు కాబోయే సామ్రాట్టుకదా! ఇలా మాట్లాడటం ఉచితమేనా? యోచించండి" అని మేము అన్నప్పుడు పకపక నవ్వుతాడు. ఒక్కొక్కప్పుడు మేము మాట్లాడుతుంటే అసలు వినిపించుకోవడం లేదు.

**"ఇయమ్ ఆపత్ ఇయంసంపత్" ఇత్యేవం కల్పనా మయః**
**మనసోఽభ్యుదితోమోహ ఇతి శ్లోకాన్ ప్రగాయతి!** (X-38)

"ఇది సంపద, ఇది ఆపద...అనబడునదంతా కల్పనామయమే కదా!" అని అర్థం వచ్చే పాటలేవో బిగ్గరగా పాడుచున్నాడు. ఒకసారి, మాలో ఒకణ్ణి పిలిచి, "ఏమయ్యా! 'హా ఇంక గతేమిటి?' అని అనుకునే రోజు వచ్చేవరకు ఈ జనులు వైరాగ్యం పొందుటలేదేమిటి? నీకేమైనా కారణం తెలుసా?" అని ప్రశ్నిస్తున్నాడు. దానికి మేమేం సమాధానం చెప్పగలం? మాలో ఎవరైనా రాజకీయవిశేషముల 'ఊసు' ఎత్తగానే, ఆ మాటలు ఏమాత్రం విలువలేనివిగా చూస్తాడు. "ఇదంతా చమత్కారంగా ఉన్నదే! బాహ్యదృష్టిచే మాత్రమే లభిస్తున్న ఈ జగత్తులేదు. స్థూలబుద్ధికి మాత్రమే తోచుచున్న అహంకారం కూడా వాస్తవమైనది కాదు. మరి జీవుడికి దుఃఖం ఎక్కడినుండి వస్తోంది?" అని ఒకచోట వ్రాసి దాన్ని గురించే యోచిస్తూ ఉంటాడు. ఆతని దృష్టిలో బంధువులు, మిత్రులు, శత్రువులు, రాజ్యములు, కష్టములు, సుఖములు ఉన్నట్లే మాకు కనిపించటం లేదు. అతడు మూఢుడు మాత్రం కాదు. ముక్తుడు కూడా కాకపోయి ఉండవచ్చు. అతనియందు ఆశ, ప్రయత్నము, శాంతి కనబడటం లేదు.

**కిం ధనేన కిమంబాభిః కిం రాజ్యేన కిమీహయా?**
**ఇతినిశ్చయవానంతః ప్రాణత్యాగపరః స్థితః ॥** (X-46)

"ఈ ధనంతో, ఈ బంధు జనంతో, ఈ రాజ్యములతో ఈ ప్రయత్నములతో నాకేమి పని? నేను నిశ్చయంగా ఇట్లే ప్రాణాలు వదిలేస్తాను" అని తనలో తానే గొణుక్కుంటుంటే, వింటున్న మాకు దుఃఖమే వస్తోంది. పరిపూర్ణమైన విభవములతో నిండిన అంతఃపుర ప్రాంగణమును, అతడు, కపటవేషం వేసిన మాంత్రికురాలిని చూచినట్లు చూస్తున్నాడు.

ఒకసారి ఏమైనదో చెపుతాను వినండి. మా భృత్యులలో ఒకడు మన రామచంద్రుని సమీపించి "యువరాజా! ఈ రాజవస్త్రాలు ధరించండి" అని వేడుకొన్నాడు. వెంటనే రాముడు అతనివైపు తిరిగి "ఓయీ! స్నేహితుడా! ఈ అన్నవస్త్రాలు చాలాగొప్పవైనట్లు మాట్లాడుచున్నావేమయ్యా? ఒకప్రక్క ఆయుష్షు ఎలా నిరర్థకమౌతోందో గమనిస్తున్నావా? ఆహా ఎంత ప్రమాదం! పరమానందరూపమైన మోక్షము కొరకు మనం ఏమైనా చేస్తున్నామటయ్యా? లేదు. అందుచేత ఈ స్వల్ప తతంగమంతా కాస్త కట్టిపెట్టు. ఈ జీవితం ఏమిటి? ఈ శరీరాదులు ఎందుకు ప్రాప్తిస్తున్నాయి? కొంచెం యోచించు" అని పలికాడు. ఆ ప్రక్కనే ఉన్న మేం ఆశ్చర్యపోయాం. మాలో ఒకడు ఒకసారి రామచంద్రుని ధనం యాచించాడు. అప్పుడాతడు, "ఓయీ! యాచకుడా! ధనం కోరుకుంటున్నావా? సరే మంచిది. కాని, 'ఈ ధనమే సర్వ అనర్థాలకు మూలం' అని మాత్రం మరువకు. ఇందలి దోషమును పరిశీలిస్తూ ఉండు" అని చెప్పి, ఎదురుగా ఉన్నదంతా ఇచ్చివేశాడు.

హే మహారాజా! రాముడు మహాధైర్యశాలి. ఔదార్యంలోను, పరాక్రమంలోను అతనికి అతడే సాటి. మరి అతడు అట్లు ఎందుకు ప్రవర్తిస్తున్నాడో? .... మాకు తెలియటం లేదు. అది నటన కాదు. కళ్ళలో నిర్మలత్వం, దృఢత్వం సర్వదా ప్రకటితమౌతూనే ఉన్నాయి. బైటనుండి పురుగుకూడా లోపలికి ప్రవేశించటం లేదు. మరి అతనిలో ఏదో మోహం చోటుచేసుకొన్నదని మాకు అనిపిస్తోంది. ఆ మోహం పోగొట్టి, అతనిని మరలించగలిగినవారు ఎవరైనా ఉన్నారా? ఎదురుగా ఉన్న వస్తువులను, జనులను చూడని వానికి మేమేం చెప్పగలం? దీనికి మీరే ఏదైనా పరిష్కారం కనుగొన ప్రార్థిస్తున్నాను.

❖

అంతా వింటున్న విశ్వామిత్ర మహర్షి కనులు ఆనందాశ్చర్యాలతో ప్రకాశించాయి.

**శ్రీ విశ్వామిత్రుడు :** ఓ రామభృత్యుడా! ఎంత చక్కగా వివరించావు! నీవు చెప్పినదంతా వింటే నాకు ఆనందం కలుగుతోంది. నీవు వెళ్ళి రాముణ్ణి ఇక్కడికి తీసుకురా. ఆశ్రిత వత్సలుడైన రాముడు మీ కోరిక, మా మాట, తండ్రి ఆజ్ఞ కాదనడు.

రామభృత్యుడు రాజాజ్ఞ గైకొని, రాముని అంతఃపురం వైపు పరుగులు తీశాడు.

**శ్రీ విశ్వామిత్ర మహర్షి :** ఓ సభికులారా! మన రామునికి కలిగిన ఈ చిత్తవైకల్యం వైరాగ్యయుక్తంగా కనబడుటలేదా! అతని వైరాగ్యం ఆపత్తుల వల్లనో, రోగాదులవల్లనో, కామాదుల వలననో కలిగింది

కాదు. వివేక వైరాగ్యముల వలన కలిగిన చిత్త ప్రబోధమేనని నాకు అనిపిస్తోంది. మహాసమృద్ధంలో కూడా ఇంతటి పరిశీలనాత్మక బుద్ధి ఉండటం మనం సంతోషించవలసిన విషయమే.

ఓ దశరథ మహారాజా! మీరు రాముని గురించి దిగులు పడవలసిన పనేమీలేదు. అతని చిత్తము జ్ఞాన వైరాగ్యములతో నిండి ఉన్నది. కాని, అందు స్వధర్మానికి సంబంధించిన లేశమాత్ర శంక ఇంకా మిగిలి ఉన్నది. ఆ దోషమును మనం యుక్తియుక్తాదులచే ఇప్పుడు తొలగించామా .... ఇక అతడు కూడా మావంటి ఋషులవలె స్వతఃసిద్ధమగు మోక్షము నందు విశ్రాంతి పొందగలడు. ప్రకృతి సిద్ధమగు రాజ్యపాలన మొదలైన లౌకిక వ్యవహారములకు, మోక్షస్థితికి ..... ఒకదానితో మరొకదానికి .... విరోధమేమీ వాస్తవానికి లేదు. ఆత్మ విచారణచే ఉత్తమ యోగస్థితిని పొంది, ఆపై ఎప్పటిలాగానే వ్యవహరించవచ్చు. మా వాక్యములు వింటే సత్త్వగుణం వృద్ధి చెందుతుంది. అతడు కార్యకారణతత్వమంతా తెలుసుకొంటాడు. సుఖదుఃఖములకు అతీతుడై గడ్డిపరకను, రాయిని, బంగారమును ఒకే తీరుగా చూడగలడు.

ఇంతలో సోదర సమేతుడై పదహారు సంవత్సరముల వయస్సుతో పూర్ణచంద్ర తేజస్సుచే ప్రకాశించుచున్న రాముడు సభలో ప్రవేశించాడు. సభలో నూతనోత్సాహం వెల్లివిరిసింది. సభికులంతా రామునికి జయం పలికారు. ఆతడు మొదట రాజసింహాసనం సమీపించి తండ్రి పాదాలు స్పృశించాడు. ఋషులకు, బ్రహ్మవేత్తలకు, చిన్నప్పటి గురువులకు వినయంగా నమస్కరించాడు. సామంతులకు, రాజోద్యోగులకు ప్రతినమస్కారం చేశాడు. దశరథుడు, "నాయనా! రామా! స్వాగతం. ఇటువచ్చి యువరాజు ఆసనంపై కూర్చో!" అని పలికాడు. కానీ ఆ మాటలు రాముని చెవిని పడనేలేదు. అతడు సభామధ్యంలో ఒక ప్రదేశమునందు చతికిలపడి కూర్చున్నాడు. ఎవరో భృత్యువు పరుగునపోయి ఒక కంబళంతెచ్చి అక్కడ పరచాడు.

**మహారాజు :** కుమారా! నీవు సద్గురువు అయిన వసిష్ఠ మహర్షి వద్ద విద్య అభ్యసించావు. జ్ఞానవంతుడవు. రాజువు. సర్వ విషయములకు ఆశ్రయభూతుడవు. ఏమీ తెలియని జడునివలె ప్రవర్తిస్తున్నావేమయ్యా? నిష్కారణమైన ఈ దైన్యం ఎక్కడి నుండి వచ్చింది? ఆత్మను వినోదంతో ఆనందింపచేయాలేకాని, మోహదైన్యాదులతో నిన్ను నీవే బాధించుకోవటం ఉచితమా? నీవంటి వివేకులు పెద్దలచే, గురువులచే ఉపదేశించబడిన మార్గమే అనుసరిస్తారు కదా! ఎవరికైనా స్వధర్మమే పుణ్యము, సద్గతీ కూడా. నిరర్థకమైన చిత్తచాంచల్యం వలన లాభమేముంటుంది?

**శ్రీ విశ్వామిత్రుడు :** ఓ రామచంద్రా! నీకు జయమగుగాక! నీ మనసులో ఉన్న చింత ఏమిటో మాకు చెప్పు. నీ మనోవ్యాకులత్వానికి కారణములు ఏమిటి? నిన్ను ఏఏ విషయాలు బాధిస్తున్నాయి? మేము వచ్చాము కదా! నీ మనోభావాలు ఎట్టి సంకోచం లేకుండా మా ముందుంచు. మేము నీ సంశయాలన్నీ తొలగించి, మనోవ్యాధుల ఊసైనా లేకుండా చేస్తాం. విచారణ లేకపోవుటచేతనే మానవుడు ఈ దృశ్యములో మ్రగ్గుచు, అనేక వ్యధలు అనుభవిస్తున్నాడు. నీ మనస్సులో ఉన్నదేమిటో మమ్ములను తెలుసుకోనీ.

విశ్వామిత్రుడు లాలన పూర్వకంగా చెప్పినదంతా రాముడు విన్నాడు. కొద్ది క్షణాలు సభ అంతా కలియచూచాడు. తనలో "ఆహా! నేడు ఎంత సుదినం! బ్రహ్మ విద్వరేణ్యులైన మహర్షులు ఈ సభను అలంకరించి ఉన్నారు. కనుక నా సందేహాలన్నిటికీ సమాధానాలు తప్పక లభిస్తాయి" అని అనుకొన్నాడు. పూర్ణార్థయుక్తంగా ఇట్లు సమాధానమిచ్చాడు.

❖❖❖

# 8. రాఘవ వైరాగ్య వర్ణనము

**శ్రీరాముడు :** ఉత్తమోత్తములచే అలంకరించబడిన సభకు నమస్కారం. ఇక్కడ వేంచేసియున్న విశ్వామిత్రాది మహర్షుల దర్శనభాగ్యం, సేవాభాగ్యం అనేక జన్మల సుకృతం చేతనే లభిస్తాయి.

హే విశ్వామిత్ర మహర్షీ! నా మనస్సులో ఉన్న భావాలన్నీ మీరు ఆజ్ఞాపించినట్లే చెపుతాను. నా ఈ వాక్యములలో దోషమేమైనా ఉంటే క్షమించండి. సత్పురుషులకు మనోగతమైనదంతా తెలియచేయటం శుభప్రదమే అవుతుంది కదా!

నేను పదహారు సంవత్సరముల క్రితం ఈ దశరథ మహారాజు ఇంట్లో జన్మించాను. క్రమక్రమంగా వృద్ధిచెందుతూ విద్యాభ్యాసం పూర్తి చేశాను. కొంతకాలం క్రితం తీర్థయాత్రలకు వెళ్ళివచ్చాను. వచ్చినప్పటినుండీ నా మనస్సులో ఒకానొక "విచారణ" ఉత్పన్నమైనది. ఆ విచారణ యొక్క స్వరూపమేమిటో చెపుతాను వినండి.

**కింనామేదం బతసుఖం యేయం సంసార సంతతిః?**
**జాయతే మృతయే లోకో, మ్రియతే జననాయచ ॥** (XII-7)

ఈ సంసార వ్యవహారంలో 'సుఖం' అంటూ ఏదైనా ఉన్నదా? ఇక్కడ ప్రాణి చావటానికే పుట్టుచున్నాడు. పుట్టడానికే చచ్చుచున్నాడు. ఇంతకన్నా ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషమేమున్నది? కొందరు, "అలా ఎందుకనుకోవాలి? ఇందులో ఐశ్వర్యములు, ధనములు, స్వజనులు, స్త్రీలు – మొదలైనవి సుఖప్రదములేకదా! అవి సంపాదించు కొన్నవారు సుఖంగానే ఉంటున్నారు కదా!" అని అంటున్నారు. కాని, ఇది వినండి!

**అస్థిరాః సర్వయేవేమే సచరాచర చేష్టితాః**
**ఆపదాం పతయః పాపా భావా విభవ భూమయః ॥** (XII-8)

ఇందులో స్థావరజంగమ జీవులు పొందుచున్న భోగములు, విభవములు – ఇవన్నీ అస్థిరములు, అసత్యములు, అశాశ్వతములు అయి ఉన్నాయి. ఒకప్పుడు కొంచెం సుఖకరంగా తోచినప్పటికీ, శాశ్వతమైన సుఖం మాత్రం ఖచ్చితంగా ప్రసాదించుటలేదు. ఒక్కక్షణంలో కనిపించి మరొక్క క్షణంలో మాయమైపోతున్న ధన, జన, యౌవనాదులు సుఖ ప్రదాతలని అనటం ఎట్లా? ఉదాహరణకు ఈ సంపదలే తీసుకోండి. వీటిని కూడబెట్టుకోవటంలోను, రక్షించుకోవడంలోను జనులు ఎన్ని

ఆపదలు ఎదుర్కొంటున్నారు! ఇవన్నీ ఎన్ని రకాలైన లోభమోహాది పాపపూరిత దుశ్చర్యలకు కారణభూతములౌతున్నాయి! అందుచేతనే సుఖకరములని అనేకమంది అనుకొంటున్న ఈ సంపదలు, ఈ విభవములు, ఈ పదార్థ జాలములు, ఈ మనుష్యుల సంబంధ – బాంధవ్యములు సత్పురుషుల దృష్టిలో తుచ్ఛములు, తిరస్కారములుగానే ఉంటున్నాయి. వీటికై ప్రయత్నిస్తున్న అనేకమంది సంసారజీవుల అనేక చేష్టలు కూడా నాకు అర్థరహితంగానే కనిపిస్తున్నాయి.

ఈ సంసారంలో మనకు కనిపిస్తున్న బంధుత్వాలు, స్నేహాలు, అనుబంధాలు, మొదలైనవాటిని పరిశీలనగా చూచినప్పుడు నాకు ఒకటి అనిపిస్తోంది: ఇందలి జనులు ఒకరికొకరు సంబంధించినవారే కారు. వీరందరు ఇనుప చీలలవలె (రింగులవలె) ఒకరికొకరు ముడిపడినట్లు పైకి ఉంటున్నారు. కాని, లక్ష్యాలు, కష్టాలు, ఆవేదనలు, సంస్కారాలు – ఎవరివి వారివే. ఒకరు మరొకరి వంటివారు కానేకాదు. అయితే జీవుడు "ఈ ఈ వ్యక్తులు, ఈ ఈ పదార్థములు నాకు సుఖకరములు" అని సంకల్పించుట జరుగుతోంది. అందుచేతనే అతనికి వాటితో సంబంధములు, బాంధవ్యములు ఏర్పడుచున్నాయి. చూచారా? ఈ ప్రపంచంలో మనకు కనిపిస్తున్న అన్ని రకములైన సంబంధములు కేవలం "సంకల్పించుట" అను ప్రక్రియ కారణం చేతనే ఏర్పడుచున్నాయి. అట్టి సంకల్పమాత్ర సంబంధాలు ఈ జీవుడిని ఎంతగా క్షోభింప చేస్తున్నాయో కదా!

ఈ జగత్తు, దీనియొక్క సృష్టి స్థితి లయాలు మనస్సుచే కల్పించబడినవి మాత్రమే. అయితే ఏం? ఈ జీవుడు అంతులేకుండా దుఃఖ క్లేశ పరంపరలు పొందుచూనే ఉన్నాడు. మనస్సే అన్నిటికి కారణం. కాని, పరికించి చూస్తే ఈ 'మనస్సు' అనునది ఎక్కడున్నది? దేనిచే తయారుచేయబడింది? 'మననము చేయుట' అనుదానికి వేఱుగా ఈ మనస్సుకు అస్థిత్వమే లేదు. అస్థిత్వం లేని వస్తువు కారణంగా జీవులమగు మేము బద్ధులం అవుతున్నాం. ఎంతటి దురదృష్టం! మూఢమృగములు అల్లంత దూరంలో మృగతృష్ణను చూచి "అందలి జలం మా దాహం తీరుస్తుంది" అని అనుకొని ఎంతో శ్రమకు ఓర్చుకొని పరుగెత్తుతాయి చూచారా! మూఢబుద్ధులమగు మేము కూడా 'అసత్తే' అయినట్టి ప్రాపంచిక సుఖములచే ఆకర్షించబడి, పరుగులు తీస్తున్నాం. ఈ విషయ సుఖములు చివరకు మా పట్ల దౌర్భాగ్యరూపములే అవుతున్నాయి. అజ్ఞానం చేతనే వాటియందు సుఖభ్రాంతి పొందటం జరుగుతోంది కాని, పొందుచున్నది మాత్రం సంకటములు మాత్రమే. 'అంతామాయ' అని తెలిసికూడా ఈ విషయసుఖములకు మేము అమ్ముడు పోతున్నాం. అరణ్యంలో ఒక లోతైన గోతిలో పడిపోయిన కొన్ని లేళ్ళు అక్కడి ఆకులను భక్షిస్తూ కాలం గడుపుతాయి. కొంతసేపటికి అవి "అయ్యో! మేము ఈ గోతిలో చిక్కుకున్నామే?" అని తెలుసుకొని దుఃఖిస్తాయి. మేము కూడా మోహవశంచేత 'ఇంద్రియముల ప్రియాప్రియములు' అనే గోతిలోపడి అనేక వాంఛలచే కట్టుబడి ఉన్నాం. ఎంతో కాలానికిగాని, "అయ్యో! ఇక్కడ ఈ అజ్ఞానంలో చిక్కుకున్నాం కదా" అనే విషయం తెలుసుకోలేకపోతున్నాం.

ఇప్పుడు చెప్పండి. ఈ రాజ్యాదులతో నాకేమి పని? ఈ భోగపాశాలలో నేను ఎందుకు

చిక్కుకోవాలి? అసలు నేనెవరిని? ఈ దృశ్య ప్రపంచమంతా నాకెక్కడినుండి దాపురించింది? నేను ఇక్కడికి ఎందుకు వచ్చాను? నా వాస్తవ స్వరూపమేమిటి? ఈ శరీరాదులు నాకెక్కడి నుండి ఎందుకు ప్రాప్తిస్తున్నాయి? ఈ ప్రశ్నలన్నీ వదలి నన్ను 'రాజ్యభోగాలు' అనే బురదలో చిక్కుకొమ్మంటారా? ఏది ఎక్కడినుండి వచ్చినా రానివ్వండి. ఏది మిథ్యయో అది మిథ్యగానే ఉండుగాక. అసత్యములు, అవాస్తవములు, అశాశ్వతములు అయిన పదార్థములచే నేను భ్రమపొందకుండెదను గాక!

❖

మహాత్మా! విశ్వామిత్రా! ఈ విధంగా అనేక కోణముల నుండి విమర్శన చేస్తూ, అంతా పరిశీలించాను. విచారణ చేయనివానికి రుచికరంగా తోచే ఈ ప్రాపంచిక పదార్థములపట్ల నాకు ఒక విధమైన 'అరుచి' పుట్టింది. ఒక బాటసారి తొందరపనిమీద దూరంగా ఉన్న గ్రామానికి త్వరత్వరగా నడచివెళ్ళుచున్నాడనుకోండి. అప్పుడు బాట ప్రక్కనగల శ్మశానభూములు తుచ్ఛములుగానే కనబడతాయి కదా! నాకు కూడా ఈ సంసార విషయాలు పరిశీలించాలని ఏమాత్రం అనిపించటంలేదు.

ఏది ఎట్లా ఉన్నా, నాకు మాత్రం నిర్దుష్టమైన, శాశ్వతమైన సుఖ శాంతులు లభించకయే ఉన్నాయి. స్వామీ! సంసారజీవులమైన మేము అనేకసార్లు పుడుతున్నాం. చస్తున్నాం. జరా–మరణములు, సంతోష –విషాదాలు, సుఖ–దుఃఖాలు, ఆవేశ–నీరసాలు వస్తున్నాయి. పోతున్నాయి. ఈ సంసారం కల్పిస్తున్న దుఃఖాలను మేము తొలగించుకోలేక పోతున్నాం. "ఈ 'సంసారము' అనే దోషం మమ్ములను ఆక్రమించకుండా ఉండేది ఎట్లా?" అనే ప్రశ్న నన్ను రాత్రింబవళ్ళు దహించివేస్తోంది. ఒక మహావృక్షపు తొఱ్ఱలో గొప్ప అగ్నికణం ప్రవేశించిందనుకోండి. అప్పుడు ఆ వృక్షం బైటకు తన ఆకులచే పిల్లగాలులు అనుభవిస్తూ ఉన్నా, లోనమాత్రం శిథిలత్వం పొందుతూ మౌనంగా రోదిస్తూ ఉంటుంది చూచారా? మా సంసారజీవుల గతి కూడా అట్లాగే ఉన్నది. మా మనస్సులు పరితాపాగ్నులచే క్షణక్షణం దహించబడుచున్నాయి. బైటకు మాత్రం ఏవేవో స్వల్ప కార్యక్రమములు కల్పించుకొని రోజులు గడుపుచున్నాం. ఈ సంసార భ్రమలకు, ఈ దుఃఖములకు మాకు అంతు కనబడుటలేదు.

స్వామీ! మరల మరల మాచే బలవంతంగా అనుభవించబడుచున్న తుచ్ఛ భోగములచే మేము శైథిల్యమే పొందుతున్నాం. వెదురు బొంగులవలె ప్రాణ వాయువులతో కూడినవారమై, శబ్దం మాత్రం చేస్తున్నాం. జడబద్ధులమై ఉంటున్నాం. ఎందుకంటే, దుఃఖనివృత్తి కొరకు శాశ్వతమైన ఉపాయమేదీ ఆశ్రయించని మేము జడపదార్థములకంటే అధికులమా? కాదు. కటిక దరిద్రునికి అధిక సంతానం లాగా వివేక రహితులమగు మాకు అనేక ఉచ్ఛ – నీచ ఉపాధులు వచ్చిపోతున్నాయి.

ఈ తుచ్ఛ ధనాదులు శాశ్వతమైన ఆనందం ఇవ్వలేకపోగా, అవి మమ్ములను క్షణక్షణం 'లోభము, మోహము, మాత్సర్యము' మొదలైన దుష్టమృగములు నివసిస్తున్న అజ్ఞానారణ్యములోకి త్రోసివేస్తున్నాయి. పోనీ, ఈ ధనములను, ఈ పరివారములను త్యజిద్దామా – అదీ కుదురునది

కాదు. ఇదంతా చూస్తుంటే నాకు దుఃఖమే కలుగుతోంది. కేవలం తల్లిదండ్రులు, తదితరులు కష్టపడతారేమోనని మాత్రమే పైకి ఏడ్చుటలేదు.

హే మహర్షీ! ఈ ప్రపంచమంతా అవిచారము, అజ్ఞానము, మూఢత్వము, మూర్ఖత్వము అన్నివైపులా దట్టంగా వ్యాపించి ఉన్నాయి. ఇంద్రియ ప్రియములగు "విషయములు" అనే దొంగలు మా హృదయ గృహములలో ప్రవేశించి మా 'వివేకము' అనే సంపదను దొంగిలించుకుపోతున్నారు. మేము ఆ దొంగలను గుర్తించుటలేదు. "ఇది మాకు చెంది ఉండుగాక. మా పేరు ప్రతిష్ఠలమాట ఏమిటి?" మొదలైన ఏవేవో ఫీంకారములతో ప్రొద్దుపుచ్చుతున్నాం. ఆ విషయదొంగలను నిరోధించుటకు మా ఈ శరీర సామర్థ్యాలు, శస్త్రాస్త్ర విద్యలు ఎందుకు పనికి వస్తాయి చెప్పండి? బ్రహ్మజ్ఞానులగు విద్వాంసులు మాత్రమే వారిని నిరోధించగలరు.

❖❖❖

# 9. ధన వ్యవహారం

ఓ మునిశ్రేష్ఠా! మేమంతా ఈ 'ధనం' అనునది సంసారంలో చాలా సారభూతమైన విషయమని భావిస్తున్నాం. అట్టి భావన మూఢత్వం చేతనే మా వద్దకు చేరుతోంది. దీనివలన నిజమైన సుఖముగాని, శాంతిగాని కలుగుతోందా? లేదు.

ఒకడు ఎంతో ప్రయాసతో "నేను ముందు ముందు సుఖపడెదను గాక" అని భావించి తన శక్తియుక్తులను, తెలివితేటలను, కాలమును వినియోగించి అట్టి ప్రయత్నమునందే నిమగ్నుడౌతున్నాడు. అనేక రోజులు గడచిపోతున్నాయి. అట్టి ప్రయత్నములో కొన్ని సఫలం, మరికొన్ని విఫలం అవుతున్నాయి. అయితే ఒక ప్రక్క విలువైన జీవితకాలం వృథా అగుటలేదా? జంతువుల, కీటకముల జన్మలన్నీ ఆహార నిద్రా మైథునాలతో గడచిపోతున్నాయి. మానవ జన్మకూడా అంతమాత్రమేనా? ఈ ధనమును అభివృద్ధి చేసుకోవటంలో ఎన్నో ప్రమాదాలు, భయాలు, దోషావేశాలు తారస పడుచున్నాయి. ఇది మనస్సును మోహమునందు చిక్కించి అనేక విధములుగా కలవరపెట్టుచున్నది. ఒక విచిత్రం గమనించారా? ధనము లేనివాడు, "అయ్యో! నాకు ధనములేదే? అతనికి ఉన్నదే?" అని వాపోవుచున్నాడు. కాని, ధనము కలిగియున్నవాడు మాత్రం, "నేను ఇప్పుడు అవిచ్ఛిన్నమైన తృప్తిని పొందుచున్నాను" అని అనుకోవటం లేదు. ఎంత చమత్కారమైన విషయం!

ఈ ధనము "నేను ఆశ్రయిస్తున్నట్టి ఈతడు గుణవంతుడా? కాదా?" అనునది చూడదు. రాజుయొక్క స్వభావంలాగానే అది ఒకచోట స్థిరంగా ఉండదు. నిప్పు త్రొక్కిన కోతిలాగా ఒకచోటినుండి మరొకచోటికి పరుగులు తీస్తూ ఉంటుంది. యుద్ధం, జూదం, వంచన, లోభం వంటి అధర్మ కార్యాలు కూడా ధనమును పెంచగలుగు చున్నాయి. ధనం ఉన్నచోట "ధర్మము"* ఉండగలదన్న

---

* ధర్మము = function, Duty consciousness

నమ్మక మేమున్నది? పాలు త్రాగి పాము విషమును క్రక్కునట్లు, ధనమును సంపాదించి ఈ మనుజుడు కూడా కామ, క్రోధ, లోభ, మోహాదులను అధికం చేసుకొంటున్నాడు. గొప్ప ప్రజ్ఞావంతుడు, శూరుడు, కృతజ్ఞుడు, అందరిపట్లా ప్రీతికలవాడు కూడా సంపదలు పొందినపుడు తన కోమల స్వభావం కోల్పోవుచున్నాడు. క్షణంలో కఠినాత్ముడుగా, అవివేకిగా తయారగుచున్నాడు. ధూళిలోపడిన కారణంగా రత్నముకూడా మలినపడుతుంది కదా! విచిత్రమేమిటంటే "జననిందా పాత్రుడు గాని ధనవంతుడు, తనను తానే పొగడుకొనని శూరుడు, సమదృష్టి కలిగివుండే ప్రభువు" – ఈ ముగ్గురు లభించటం లోకంలో దుర్లభమే అవుతోంది.

భయంకర విషసర్పం దాగివున్న పుట్టపైగల పూతీగ ఎట్టిదో, ఈ సంపదలు కూడా అట్టివే. ఎందుకంటారా? అవి ఉన్న కాస్త వివేకాన్ని ఊడ్చి పెడుతున్నాయి. కుసంస్కారమును, ఉద్వేగమును, దురభ్యాసములను తెచ్చిపెడుతున్నాయి. సత్యదృష్టిని మరచేటట్లు చేస్తున్నాయి. వీటి పటాటోపం ఎంతగా జీవుడిని ఆకర్షిస్తోంది! ధనమొక్కటే జీవితలక్ష్యంగా కలవారు నీచులతో, దుర్మార్గులతో, లోభులతో స్నేహం చేయవలసి వస్తోంది. గుణవంతులు దూరంగా ఉండిపోతారు. ఇక వీటియొక్క అంతిమ ఫలితం గమనిస్తే, అది అతి చంచలంగానే ఉంటోంది. ఎవరికోసం ఇంతగా శ్రమించి ఈ జీవుడు ధనాదులను సంపాదించాడో వారే ఆతనిని ద్వేషిస్తున్నారు. తిరస్కరిస్తున్నారు. ఇంతా సంపాదించి లెక్కించి చూచుకొంటూ ఉండగా మరొకవైపు ఈ శరీరమే శిథిలమౌతోంది. అతడు తాను సంపాదించినదంతా ప్రియంగా, మమకారంగా, నిస్సహాయంగా చూస్తూ "అయ్యో! ఇదంతా విడచి వెళ్ళవలసిందేనా? నేను పోయిన తరువాత ఏమౌతుందో, ఏమో?" అని అంతరంగమున తలచుచూ దుఃఖమునే పొందుచున్నాడు. బాహ్యవిషయములు మాత్రమే అయివున్నట్టి ఈ ధనాదులు ఇంతగా చిత్తమును ఆకర్షించటం నాకు చిత్రమని అనిపిస్తోంది.

ధనముతో బాటే భ్రాంతి, దుర్వ్యసనములు, బంధుద్వేషములు, దొంగలభయం, కారాగృహం, మృత్యుభయం మొదలైన అశుభ విషయాలు కూడా వెంటనంటి ఉంటాయి. ఈ అనుభవాలన్నీ జనులు గమనిస్తూనే, చూడనట్లే ఉంటున్నారే? మెఱుపువలె దీని రాకపోకలు క్షణికములు. దీనివలన 'సుఖం లభిస్తోంది' అని తలచటం వట్టి భ్రాంతి మాత్రమేనని నాకు అనిపిస్తోంది. జీవులను మోసగించటంలో ధనము తరువాతే ఏదైనా. ధనము ఉన్నచోట జ్ఞానము, వైరాగ్యము చోటు చేసుకోవడం దుర్లభమైన విషయమే.

❖❖❖

## 10. జీవితం - ఆయుష్షు

ఈ ఆయుష్షును చూచారా స్వామీ! ఇది చిగురాకు కొనయందున్న జలబిందువు లాగా చంచలమై ఉన్నది. చిల్లికుండలోని జలంలాగా నశించుటయే దీని స్వభావం. ఈ శరీరం ఉన్నట్లుండి ఏ క్షణంలోనో అకాలంగా రోగాల పాలు అవుతోంది. ఒక 'నియమము' అంటూ లేకుండా ఏ

క్షణంలోనో నేలకూలుతోంది. మునీశ్వరా! "ఇంద్రియ విషయములు" అనే సర్పములకు ఆలవాలమైన చిత్తము గలవారికి ఆయుష్షు శ్రమనే కలుగజేస్తోందని నాకు అనిపిస్తోంది. ఆత్మజ్ఞానం పొందినవారికి మాత్రమే అది ప్రయోజనకరం. ఎందుకంటారా? ఒకవైపు ఇంద్రియ శక్తులను ఇంద్రియ విషయములే బలహీనపరుస్తుంటే బ్రతుకు త్వరత్వరగా ఆయాసకరం అవటంలో ఆశ్చర్యమేమున్నది? మేము ఇంద్రియదృష్టిని మాత్రమే కలిగి ఉంటున్నాం. అందుకే మా ఆయుష్షు నిష్ప్రయోజనం అయిపోతోంది. ఈ జగత్తులో కొందరు స్వస్వరూపమగు 'ఆత్మ' గురించి ఎఱుగుచున్నవారై అట్టి ఆత్మపదము నందు విశ్రమించుచున్నారు. అందుచేత, లాభాలాభములందు సమబుద్ధి కలిగివుంటున్నారు. అట్టివారిపట్ల మాత్రమే ఈ ఆయుష్షు సౌఖ్యప్రదం అవుతోంది. ఇక మేము ఈ పరిమిత శరీరాదులందు "ఈ శరీరమే మేము" అనునట్టి దేహాత్మబుద్ధి కలిగి ఉంటున్నాం. అందుచేతనే కాబోలు, అనేక చింతలు మమ్ములను హింసించివేస్తున్నాయి.

అయినా ఈ ఆయుష్షును నమ్మి ఉండటం ఎట్లా చెప్పండి? ఏ క్షణంలో ఏదైనా కావచ్చును కదా! వాయువుయొక్క ప్రసరణమును, అలలను నిరోధించవచ్చునేమో కాని, నీటి బుడగవంటి ఆయుష్షును నిలపగలమని నమ్మి ఉండటం ఉచితమేనా? ఇది అతి చంచలమైనదికదా? అందుకే జ్ఞానులు దీనిని తరంగమువలె, చమురు లేని దీపంవలె త్వరలో నశించిపోయేదాని లాగానే చూస్తారు. కొందరు జనులు, "అయ్యా! మేము భగవంతుని గురించి ముసలితనంలో చూచుకొంటాం. ఇప్పుడు తొందర ఏమి వచ్చింది?" అంటూ ఉంటారు. వారికి ఆయుష్షుపై ఎంత నమ్మకం! అట్లు వారు నమ్మి మోసపోవుటలేదా?

తండ్రీ! మహర్షీ! మన పెద్దలు 'అశ్వతరి' అనే మృగం గురించి చెపుతూ ఉంటారు. అది ప్రసవించగానే మరణిస్తుంది. అయినప్పటికీ గర్భహేతువు అయినట్టి 'సంగమము' ను కోరుకొంటూనే ఉంటుంది. అట్లాగే లోకులుకూడా "మాకు ఎంతో ఆయుష్షు ఉండుగాక" అని కోరుకొంటున్నారు. కాని మూఢత్వం ఆశ్రయించి చిత్త ప్రశాంతతను కోల్పోయిన తరువాత దీర్ఘాయుష్షు ఉండి మాత్రం ప్రయోజనమేమున్నది? జీవించి ఉన్నందుకు ప్రయోజనంగా సర్వ విధ దుఃఖరహితమగు పరమానంద రూపమైనట్టి బ్రహ్మవస్తువు సాధించాలి. అఖండానందము, పరమశాంతి నిలయము అయిన ఆత్మను పొందినప్పుడే జీవితం సార్థకమౌతుంది.

**తరవోఽపి హి జీవన్తి, జీవన్తి మృగ పక్షిణః ।**
**స జీవతి మనో యస్య మననేన నజీవతి ॥** (XIV-11)

వృక్షాలు, మృగాలు, పక్షులు కూడా జీవిస్తున్నాయి. కాని ఏం లాభం? ఎవనికైతే, ఈ దృశ్య సంకల్పము యొక్క మననము క్షీణిస్తుందో, అట్టి మనస్సు కలవాడే వాస్తవమైన జీవితమును అనుభవిస్తున్నాడని నా అభిప్రాయం. ఈ జీవితము పట్ల, ఈ కనబడే దృశ్య వ్యవహారము పట్ల సరైన అవగాహన కలిగివుండాలి. సత్యదృష్టిని అవలంబించి వాసనలను త్యజించివేయాలి. తత్త్వబోధ పొంది ధన్యులు కావాలి. అట్టివారి విషయంలో మాత్రమే ఆయుష్షు ధన్యత చెందుతుంది. ఇక

తక్కినవారి విషయం ఏమి చెప్పమంటారు? వారు ముసలి గాడిదల వలె ధన, దార, శాస్త్రాది విషయములను మూలుగుతూ మోస్తున్నారు. (శాస్త్రజ్ఞానం కూడా 'కామము' మొదలైన రోగములచే పీడింపబడేవారికి, దృశ్య విషయములపట్ల అనురాగం పెంచుకొన్నవారికి భారముగానే పరిణమిస్తోంది). కనుక, "జ్ఞానం సంపాదించుకోవాలి" – అని అనుకొనేవారు ముందు కామాదులను జయించాలి. పెద్దబరువు మోసేవాడు ఆ బరువును దించుకొంటేనే సుఖిస్తాడు కదా!

చిత్తశాంతి లేనివారికి ఆ చిత్తమే పెనుభారము అవుతోంది. ఈ చిత్తము అనుక్షణం అనేక సంకల్పములను ఆహ్వానించి కలత చెందుతోంది.

అయితే, కొందరు మాత్రం, "ఇది ఆత్మ, ఇది అనాత్మ" అని ఎరిగినవారై శరీరాభిమానం త్యజించివేస్తున్నారు. ఈ శరీరమును కూడా ఇతర దృశ్య పదార్థముల వలె ఒకానొక బాహ్యమైన వస్తువువలె చూస్తున్నారు. వారి బుద్ధి నిర్మలం కాగా మనస్సుకు స్వస్థత చేకూరుతోంది. మనో స్వస్థత లేనిచోట అందమైన రూపం, శరీర పుష్టి, లౌకికమైన తెలివితేటలు, దీర్ఘాయుష్షు, శాస్త్రజ్ఞానం, సంకల్ప సామర్థ్యం, గొప్పజ్ఞానశక్తి – ఇవన్నీ నిష్ప్రయోజనమే అవుతున్నాయి. పెనుభారముగా పరిణమించి అనేక దుఃఖములను ప్రోగుచేసి పెడుతున్నాయి. అయితే మేము యౌవన గర్వాతిరేకం చేత ఇదంతా గుర్తించలేకున్నాము. ఏవేవైతే చూచుకొని "మేము ఇంతటివారముకదా" అని అనుకొంటున్నామో, అవన్నీ మా వెంటే ఉంటున్నాయా? లేదు. కొద్దికాలంలో మా మానగర్వాలన్నీ నేలరాచి మమ్ములను విడచిపోతున్నాయి. ఈ ఆయుష్షు స్థిరమైన సుఖంగాని, సారభూతమైన అంశముగాని కలిగిఉండనప్పుడు ఇది గుణహీనమై వ్యర్థమే అవుతుంది కదా!

**నూనం నిగరణాయాశు ఘన గర్ధమనారతం ।**
**ఆఖుర్మార్జాలకేణేవ మరణేనావలోక్యతే ॥** (XIV-19)

పిల్లి ఎలుకను ప్రియంగా చూచునట్లు ఒక ప్రక్క మృత్యువు ప్రాణిని మ్రింగి వేయదానికి మహాభిలాషతో నిరంతరం చూచుచున్నది. ఈ విషయం జీవులు ఎట్లా మరచుచున్నారో నాకు అర్థం కావటం లేదు.

రోగాలు శరీరాన్ని డొల్లచేస్తున్నాయి. వార్ధక్యం నక్కలాగా కాచుకు కూర్చున్నది. జరామరణాలు ప్రియమిత్రులవలె కరచాలనం చేసుకోవటానికి ఉత్సాహపడుచున్నాయి. ఇదంతా ఇట్లుండగా అనేకులు ఇదంతా గమనించకుండా తీరికగా కూర్చుని వర్తమానం వ్యర్థం చేసుకొంటున్నారు.

❖❖❖

# 11. అహంకార స్వరూపం

అన్నిటికన్నా ప్రబల శత్రువు ఈ 'అహంకారం'. ఇతడు కారణం లేకుండానే పుట్టుచున్నాడు. రూపం లేకుండానే వ్యవహరిస్తున్నాడు. సంసారారణ్యంలో విచ్చలవిడిగా సంచరించుచున్నాడు. పరీక్షించి చూస్తే "అహం" అనే అభిమానమే ఇతని రూపం. అట్టి అభిమానం వలననే రాగద్వేషాది

సర్వదోషాలు వచ్చిపడుతున్నాయి. ఆకారాదులు లేకపోయినప్పటికీ, ఇది అందరిని బాధిస్తోంది. ఓ మహర్షీ! భూమ్యాకాశాలమధ్య మరే శత్రువును చూచి నేను భయపడుటలేదు. కాని, ఈ అహంకార శత్రువు గుర్తుకు వచ్చినపుడు మాత్రం గజగజవణుకుచున్నాను. "దీని ఉత్పత్తికి కారణమేమి?" అని పరిశీలిస్తే 'అజ్ఞానమే' అని సమాధానం లభిస్తోంది. దీనినుండి సర్వ ఆపదలు, మనోవ్యధలు, వికారాలు జీవునకు ప్రాప్తిస్తున్నాయి.

'అహంకారము' అనే కిరాతకుడు 'మాయ' అనే వలపన్నుచున్నాడు. ఈ జీవులు అజ్ఞాన మృగములవలె అందులో చిక్కుకొంటున్నారు. ఇతడు, ఎందుకో, నా పాలపడ్డాడు. నన్ను బంధించయత్నిస్తున్నాడు. క్షణంలో శాంతి, సమత, సద్గుణములను పీల్చి పిప్పి చేస్తున్నాడు. ఇంతటి శత్రువు ఎదురుగా ఉండగా భోజనమే తీసుకోలేక పోతున్నాను. ఇక భోగముల మాట చెప్పేదేమున్నది?

మొదలే అసత్యమై ఉన్న ఈ అహంకారాన్ని ఆశ్రయించి ఏదేది చేస్తామో, గ్రహిస్తామో, వాంఛిస్తామో అవన్నీ కూడా అసత్యములే అవుతాయి కదా! అహంకారముపై నమ్మకమున్నంతకాలం, ఆశ, తృష్ణలు ఉంటాయి. అందుచేత నేను అహంకారమును తిరస్కరిస్తున్నాను. "నేను రాముడనే కాదు. నాకే కోరికలూ లేవు. నాకు చెందినదంటూ ఎక్కడా ఏదీలేదు. నేను దీనికి చెందినవాడనుకాను" అనే నిశ్చయం చేసుకొంటున్నాను. "నా మనస్సు ఎటూ ప్రసరించకుండుగాక" అని శాసిస్తున్నాను. కాని ఏం లాభం? అజ్ఞానం ఉండి ఉండుటచేతనే కాబోలు నాకు ఏమీ తెలియకయే ఉన్నది.

'దేహము' అనే కీకారణ్యంలో 'అహంకారము' అనే పిశాచం అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అతడు ఇట్టివే అగు అనేక పంచభూతాత్మకమైన దేహములను దండగా వేసుకొని ధరిస్తున్నాడు. ఈ జగత్తే అతని 'మెడ'వలె ఉన్నది. అసలు ఈ 'అహంకారము' యొక్క నివాస స్థానము ఎక్కడ? అంతఃకరణమే కదా! ఎప్పుడైతే అంతఃకరణము అమిత చంచలమై దుర్వాసనలతో కూడినదై, సద్గుణములు లేనిదై ఉంటోందో, అప్పుడు దానిలో అహంకారము వచ్చి తిష్టవేస్తోంది. సర్వ ఆపదలను వెంటబెట్టుకొని సంచరించే, ఈ అహంకారమును ఆశ్రయించి రాజ్యాదులు ఏలమని నన్ను మీరు ఆజ్ఞాపించకుండెదరుగాక! దానికి బదులు, ఈ అహంకారమును జయించివేయగల ఉపాయాలేమైనా ఉంటే నాకు ఉపదేశించి నన్ను కృతార్థుణ్ణి చేయండి. మనస్సులో పేరుకొన్న 'మహామోహము' అనే మంచు మీ ఉపదేశ ఉష్ణకిరణ ప్రభావంచేత కరిగిపోవాలనే కోరుకొంటున్నాను.

❖❖❖

## 12. మనస్సు - చిత్తము

సర్వ కార్యములు సాధించటంలో దిట్ట అయిన ఈ 'మనస్సు' గురించి చెపుతాను. వినండి. ఇది అనేక కామక్రోధాలతో నిండి అతి శిథిలమై ప్రవర్తిస్తోంది. అన్ని వేళలందు దోషదుర్గంధములతో కూడుకొన్న విషయానుభవములకొరకే పరుగులు తీస్తోంది. పెద్దలు చెప్పే మార్గమును, సత్కార్యములను

స్వీకరించమన్నప్పుడల్లా మొరాయిస్తోంది. దీని కదలికలు నెమలి పింఛపు తుదికొనలాగా అతి చంచలం. తండ్రీ! మీరు వీథికుక్కను చూచారు కదా! అది ఏ పనీ లేకపోయినప్పటికీ వీథులలో అటూ-ఇటూ తిరుగుచు ఆయాసపడుతూ ఉంటుంది కదా! అట్లాగే ఈ మనస్సు కూడా నిరర్థకంగా, నిష్కారణంగా, నిష్ప్రయోజనకరంగా అన్నివేళలలో 'అటూ ఇటూ' తిరుగుతోంది. నిద్రకు ఉపక్రమించినప్పుడు కూడా దీనివేగం ఆగటం లేదు. పోనీ, పొందేది ఏమైనా ఉన్నదా? లేదు.

ఓటికుండలాగా అది ఏమాత్రం నిండటంలేదు. ఎప్పుడైనా ఏదైనా లభించినా అంతటితో తృప్తిపడదు. తన సంకల్ప పరంపరలను త్యజించే శక్తిలేక అనేకసార్లు దీనత్వం, వ్యాకులత్వం పొందుతోంది. దురాశల వలలో చిక్కుకొన్న దానికి 'తృప్తి' అన్నమాట ఎక్కడిది? జల్లెడలో నీరు పోస్తుంటే నిండేదెప్పటికి చెప్పండి.

ఈ మనస్సు* గుంపులోంచి చెదరిన కోతిలాగా అవిశ్రాంతంగా ఎక్కడి నుండి ఎక్కడికో పరుగులు తీస్తోంది. హే బ్రహ్మవేత్తా! "స్తంభజాడ్యము" (అవయవములు బిగతీసుకుపోయే ఒక వ్యాధి)చే అవయవములు అస్వాధీనమగుటచే ఒకడు ఒకచోట పడి ఉన్నాడనుకోండి.... అతడు ఒక ప్రక్క కాళ్ళు చేతులు కదల్చలేక బిక్కచూపులు చూస్తూ ఉంటే, ఎక్కడి నుండో ఒక ఊరకుక్క అతనిని పీక్కుతినాలని "భౌ భౌ" మంటూ సమీపిస్తుంటే అతని మానసికస్థితి ఎలా ఉంటుంది? ఈ మనస్సు నాకు అలా కనబడుతోంది. సుడిగాలిలో చిక్కుకొన్న ఎండుటాకువలె దీనిచే నేను చాలా దూరం తీసుకుపోబడ్డాను. అది నన్ను ఎక్కడ నేలకూలుస్తుందో ఏమో?

ఈ మనస్సులో 'చిత్తవృత్తులు' అనే సుడిగుండాలు ఉన్నాయి. క్రూరత్వము, పరవంచన, దురభ్యాసము మొదలైనవి ఇందులో యథేచ్ఛగా సంచరిస్తున్నాయి.

మహాత్మా! నూతిలోకి దింపబడిన ఏతామును ఏతాము త్రాడు క్రిందికి పైకి త్రిప్పుతూనే ఉంటుంది చూచారా? మేము కూడా భోగవాంఛలతో, కామక్రోధములతో కూడుకొన్న వారమై మూడు లోకములలో మనస్సుచే త్రిప్పబడుచున్నాం. ఈ మనస్సును పట్టుకొని నియమిద్దామా అంటే, .... దీనికి ఒక రూపమే లేదాయె! తమవంటి జ్ఞానులు "మనస్సు అనబడు ఒకానొక వస్తువులేదు. దానికి అస్థిత్వమే లేదు" అని చెప్తూ ఉంటారు. అజ్ఞానబాలుడు కథలోని భూతమును చీకట్లో ఎదురుగా ఉన్నట్లు ఊహించుకొని బాధపడునట్లు "లేదు" అని చెప్పబడుతున్న మనస్సు మాకు ప్రాప్తిస్తోంది.

ఈ చిత్తము క్రోధాగ్నిజ్వాలలతో నన్ను ఒక ఎండుగడ్డి పరకవలె కాల్చి వేస్తోంది. ఇది అగ్నికంటె వేడి. కొండకంటే కఠినం. దీనిని మేము అసలు జయించగలమంటారా? స్వల్ప వస్తువులకోసం పరుగెత్తుతూ, స్వల్పత్వమునే పొందుచూ, నరకాదుల రుచి ఏమిటో మరల మరల

---

* ఒక పదార్థమును మనం ప్రీతిపూర్వకంగా ఆశ్రయించినప్పుడు మన మనోచిత్తములు ప్రవర్తిస్తున్నాయి.

ప్రీతి కలిగియుండు స్వభావం= చిత్తము; మననము చేయు స్వభావము = మనస్సు

చూపించే ఈ చిత్తము యొక్క గమనం నిరోధించటమెట్లా చెప్పండి? ఒక సింహమును ఉత్తచేతులతో బంధించవచ్చునేమో. సముద్రజలమునైనా పానం చెయ్యవచ్చునేమో. హిమాలయ పర్వతాన్ని కూడా పెకిలించవచ్చునేమో. అగ్నినైనా భక్షించవచ్చునేమో. ఈ చిత్తమును నిరోధించటం మాత్రం అంతతేలికైన విషయం కాదు. ఇది అవివేకమును ఆశ్రయించి ఉండుటచే, అన్ని ఉపాధులందు ఏకస్థమైయున్న 'ఆత్మ' దీనికి ఏమాత్రం కనిపించటంలేదు. ఏమి తెలుసుకొన్నా, ఎంత బోధింపబడినా, ఎల్లప్పుడూ భేద భావమునే పొందుతోంది. సామ్య – సమతా భావములను హరించివేసి దుఃఖములను కలుగచేయుటలో బహుప్రావీణ్యత చూపుతోంది. అనేక విషయాలలో అంతులేని ఆసక్తిని కల్పించుకొని అందులో జడత్వం వహించి నిదురపోతోంది. ఎంతలేపినా నిదురలేవదు. సమరసపూర్వకమగు ఆత్మజ్ఞానము కొరకు ఏమాత్రం ప్రయత్నం చేయదు. ఇప్పుడు నేను ఏమి చేయాలో నాకు అర్థమగుటలేదు.

ఈ మనస్సే అంతటికీ కారణం. ఇది క్షీణిస్తే లోకాలు క్షీణిస్తాయి. విజృంభిస్తే లోకాలు కూడా విజృంభిస్తాయి. కొండపై అడవులు పెరుగుచున్నట్లు, సర్వ సుఖ దుఃఖాలు ఈ మనస్సు నుండే బయలుదేరు చున్నాయి. ఆచార్యులు ఎంత బోధించినా ఇది తన జాడ్యమును త్యజించుటలేదు. క్రూరుడగు పోకిరిబాలుడు మరొక పసిబాలుని బెత్తము చూపి బెదిరిస్తున్నట్లు ఇది నన్ను బెదిరిస్తోంది. ఈ 'మనస్సు' అనే వ్యాధికి ఉత్తమమైన ఔషధం వివేకమే కదా! అట్టి ఔషధంతో ఇది క్షీణిస్తే సుఖదుఃఖ వికారాలు కూడా క్షీణిస్తాయి. తమవంటి మహాత్ములు చిత్తమును జయించుటచే సర్వము జయించివేశారు. అట్టి ఈ మనస్సును నశింపచేయ నిశ్చయించుకొన్నాను. ఇక నాకీ రాజ్యాదులతో పనేమున్నది చెప్పండి?

❖❖❖

## 13. ఆశ - తృష్ణ

ఎప్పటినుండో తెలియదుకాని, ఈ హృదయంలో ''ఆశ'' అనే అజ్ఞానాంధకారం వ్యాపించియున్నది. కామ, క్రోధ, లోభాది గుడ్లగూబలు ఆ చీకట్లో గూళ్ళు కట్టుకొని కాపురం చేస్తున్నాయి. నేను ఏమైనా సద్గుణాలను ఆశ్రయించాలని అనుకొంటూ ఉండగానే, ఇంతలో ఎక్కడినుండో తృష్ణ (Desire) వచ్చిపడుతోంది. ఎలుక ఇంట్లో ప్రవేశించి నూతన వస్త్రములను కొరికి పాడుచేయునట్లు, ఇది మా ఉత్తమ ప్రయత్నములను, సత్ప్రవర్తనలను పాడుచేస్తోంది. ఇక మేము వివేకము పొందేది ఎన్నటికి? ఆత్మ దర్శనం చేసేదెప్పటికి? వలలో చిక్కుకొని ఆక్రోశించే పిట్టలాగా మేము ఆశాపాశక్లేశ దుర్వాసనలలో పీకల దాకా చిక్కుకొన్నాం. అనేక తృష్ణలచే దగ్ధులమగుచున్న మేము అమృతంలో స్నానంచేస్తే మాత్రం సేద తీరుతుందా? ఊరట కలుగుతుందా? అనుమానమే.

బురదలోని తడిని సూర్యకిరణాలు పీల్చివేయునట్లు, మా అంతఃకరణములోని కొద్దిపాటి దయాదాక్షిణ్యములను తృష్ణవచ్చి పీల్చివేస్తుంటే మేము నిస్సహాయులమై చూస్తున్నాం. చూస్తూ ఉండగానే అది వచ్చి మా కళ్ళు కప్పివేస్తోంది. కన్నులు ఉండికూడా గ్రుడ్డివారము అవుచున్నాము. మామూలుగా అతిశాంతచిత్తుడైనవాడు కూడా, తృష్ణచేత కలవరపెట్టబడుచున్నాడు. ఎక్కడన్నా ధన, కనక, నారీజనమును చూస్తేచాలు, ఈ తృష్ణ ఎక్కడినుండో బొట్టుపెట్టి పిలిచినట్లు వచ్చిపడుతోంది.

ఆశ చేత నిండియున్న మనస్సు "నేను ఆశ్రయించబోయే వారు నాకు అనుకూలురా? కాదా? ఆయా వస్తుజాలం వాస్తవానికి శ్రేయోదాయకమా, ప్రమాదకరమా?" అని కూడా పరిశీలించుటలేదు. దీనంగా వారిని, వీరిని తుచ్ఛ పదార్థముల కొరకు అర్థిస్తోంది. "తాను తలచినది సాధ్యమా? అసాధ్యమా?" అనికూడా పరీక్షించుకోకుండా ఆతురపడుతోంది. కాని, ఏం లాభం? వయస్సుచెల్లిన స్త్రీ కామాతురత వలె ఏమీ పొందకయే పోవుచున్నది. దున్నపోతు ముక్కుకు త్రాడుకట్టి లాగబడునట్లు అది మమ్ములను దిక్కులన్నీ త్రిప్పుతోంది. పుత్ర, మిత్ర కళత్రాదులు అనే వలలను మాపై విసిరి మహామభ్యపెడుతోంది. అంతఃపురంలో సుఖశయ్యపై శయనించిన వానిని కూడా క్షోభింపజేసి, అడవిపాలు చేస్తోంది. ఉన్న కాస్త వివేకాన్ని ఊరేగిస్తోంది. లేని జాడ్యాలన్నీ తెచ్చిపెడుతోంది. ఆహా? నిర్దయుడగు ఆ భగవంతుడు ప్రపంచములోని జీవులందరిని 'తృష్ణ' అనే త్రాటితో 'సంసారము' అనే స్తంభమునకు కట్టి పారేస్తున్నాడు. అచేతనుణ్ణి కీటకములు బాధిస్తున్నట్లు మేము ఆశచే బాధింపబడుచున్నాం.

**అపి మేరుసమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరమ్**
**తృణీకరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్ ॥** (XVII-50)

మేరువుతో సమానమైన ధీరుడైనా, మహాప్రాజ్ఞుడైనా, నరోత్తముడైనా – తృష్ణచేత క్షణంలో జయింపబడుచున్నాడు.

❖

ఓ మహాశయా! విశ్వామిత్రా! ముసలినర్తకి ఏమాత్రం ఆనందకరం కాకపోయినా తన నృత్యం మానలేకపోయినట్లు, ఈ 'ఆశ' అనేది పొందే తృప్తి అంటూ ఏదీ లేకపోయినా, ఈ సంసారారణ్యంలో తన చపల సంచలనం మాత్రం మానలేకపోతోంది. సంసారములోని దోషములన్నిటిలో ఇది అతితుచ్ఛమైనది. ఇది ఉన్నంతవరకు మాకు మోహపూరితమైన పాట్లు తప్పవు.

ఈ లోకంలో జీవునకు దుఃఖమంతా నశించాలంటే ఒక్కటే ఉపాయం ఉన్నది. అది "విషయచింతన లేకపోవటమే". ఆశయొక్క రూపాంతరమే విషయచింతన అయివున్నది. కనుక ఆశను త్యజిస్తే జీవుడు ఒడ్డుకు చేరినట్లే. అయ్యో! ఆశ, స్త్రీ, రోగబాధ – ఈ మూడు ఎంతటి గంభీరపురుషుడినైనా తమ వైపు అభిముఖం చేసుకొంటున్నాయి కదా! ఈ తృష్ణ అంత నీచంగా, ఘోరంగా పదునైన కత్తివ్రేటుగాని, వజ్రాయుధ ఘాతంగాని అగ్నిహోత్రంగాని బాధింపజాలదనే నా అభిప్రాయం. ఎందుకంటారా? ఇది హృదయంలోనే ఉండి జీవుణ్ణి దహించివేస్తోంది కదా! ఇక

తప్పించుకోవటానికి అవకాశమెక్కడిది చెప్పండి? దాని వేగం ఎంతటిదంటే, ... ఆధివ్యాధులు"* గాని, శరీరశిథిలత్వంగాని దాని ప్రబలత్వాన్ని శమింపచేయలేక పోతున్నాయి. చేప ఎఱకోసం తాపత్రయ పడునట్లు, అది ఎదురుగా కనిపించినదంతా 'తనదే' అని అనుకొంటుంది. వృద్ధ మాంత్రికురాలివలె ఎంతో క్రూరమైనది కూడా.

అయినాసరే, కొందరు మహామహులు దానిని "వివేకము" అనే కత్తితో నరికి వేస్తున్నారు. అవిద్యాపూర్వకమైన కామ్యకర్మల నుండి బైటపడి పరమశాంతిని పొందగలుగుచున్నారు. ఈ ప్రపంచమంతా ఎందులో అయితే నిబిడీకృతమై ప్రవర్తిస్తోందో, – అట్టి ఆశను నేను విజ్ఞాన వివేకాదులచే జయించి వేయ నిశ్చయించుకొన్నాను. ఈ ధన, జన, సామ్రాజ్యాదులు ఆశను అధికమే చేస్తాయి కదా! అందుచేత ఇవి నాకు అక్కర్లేదు. సర్వ వాంఛలు నశిస్తే మనస్సుకు ఉత్తమ చికిత్స ప్రాప్తించినట్లే కదా!

❖❖❖

# 14. దేహము

ఈ దేహము ఉన్నది చూచారా? ఇది రక్తమాంసాదులతోనూ, తడిసిన ప్రేగులతోను, నాడులతోను, మలమూత్రాదులతోను నిండి ఉన్నది. ఒక గొప్ప కళాకారుడు తయారుచేసిన విచిత్రమైన బొమ్మవలె ఒప్పుచున్నది. క్షణభంగురమైన ఈ దేహములు జీవునకు అనేక వికారములతో కూడినవై దుఃఖము కొరకే ఏర్పడుచున్నాయి. జీవుడు వీటిని ఎందునిమిత్తం గ్రహిస్తున్నాడు? ఆనందం పొందటానికే కదా! అట్టి ఆనందం సంసార సముద్రాన్ని దాటివేసినప్పుడే లభిస్తుంది.

కానీ ఏం లాభం? ఈ జీవుడు పదేపదే ఇంద్రియములచే మోసగింపబడు చున్నాడు. "నేను ఒకానొకప్పుడు ఈ దేహం గ్రహించాను. మరొక సమయములో త్యజించబోవుచున్నాను" అనునట్టి విజ్ఞతను (లేక ఎరుకను) సమూలంగా మరచి వర్తమాన దృశ్యముతో సంసర్గము కలిగి ఉంటున్నాడు. అనేక ఉపాధులందు ప్రవేశించి ఎప్పటికప్పుడు "ఈ శరీరమే నేను" అని భావనచేసి, ఆ ఉపాధియొక్క హానివృద్ధులను తనకు ఆపాదించుకొంటున్నాడు.

ఈ శరీరము వాస్తవానికి జడమే అయివుండికూడా, 'ఆత్మ' సమీపమున ఉండుటచేత 'చేతనము'వలె ప్రవర్తనము కలిగి ఉంటోంది. అయితే దీనికి "పుట్టుక, అభివృద్ధి, పరిణామము, క్షయము, వినాశనము" అనే వికారాలు ఎల్లప్పుడు ఉండనే ఉన్నాయి కదా! అనేక రోగములు, తాపములు అనుక్షణం దీనిని వేధిస్తూ ఉన్నాయి. అనేక బాధలకు వికారములకు, ప్రమాదములకు ఆలవాలమైయున్న ఈ శరీరము కలిగియుండుట సుఖకరమని ఎవరంటారో చెప్పండి? అయినప్పటికీ ఈ జీవుడు, "ఇది నాకు సర్వదా ఉంటేనే బాగుంటుంది. అట్లే ఉండుగాక! ఇది తొలగితే, ఇంకేమైనా

* ఆధి = మానసిక రుగ్మత   వ్యాధి = శారీరక రుగ్మత

ఉన్నదా? ఎంతటి హాని! ఎంతటి విపత్తు! దీనితో నాకు ఏర్పడుచున్న మాత, పిత, భర్త, భార్య, సోదర, పుత్ర, మిత్రాది సంబంధములు ఎంతటి ప్రియమైనవి! ఇవన్నీ సత్యములే కదా" – ఇటువంటి రూపములు గల అనేక అసత్యపు అభిప్రాయ పరంపరలు కలిగి ఉంటున్నాడు.

హే మహర్షీ! ఇది కొంచెమునకే సంతోషిస్తున్నది. కొంచెమునకే దుఃఖిస్తుంది. ప్రపంచంలో ఇంతటి గుణహీనమైనది ఇంకేమన్నా ఉన్నదా? ఇందులో ప్రవేశించిన జీవుడు ఈ దేహము యొక్క వాస్తవత్వ – అవాస్తవత్వములు గ్రహించలేక 'ఇంద్రియ విషయములు' అనే తృణములను నెమరవేస్తూ దివారాత్రములు గడుపుచున్నాడు. అంతేకాని, 'పరమ పురుషార్థము' అంటూ ఏదీ పొందలేకయే ఉన్నాడు. ఇది అతనికి స్వగృహమువలెనే అనేక పదార్థముల కలయికచే ప్రాప్తించుచున్నది. "ఒకనాటికి దీని శిథిలత్వము అనివార్యము" అనే విషయం అందరికీ తెలిసిందే. వేఱువేఱు చోట్ల నుండి అరువు తెచ్చుకొని ఒకచోట ఒక వరుసక్రమంలో అమర్చబడిన వేఱువేఱు పదార్థముల అమరికవలె ఈ శరీరము నాకు కనబడుచున్నది.

**దేహ వృక్షములు - బాటసారులు :** చంకలు, భుజాలు వంటి అనేక పదార్థములతో కూడుకొని, వృక్షముతో పోల్చతగిన ఈ శరీరమునందు, బహుదూరపు బాటసారులగు ఈ జీవులు ఎక్కడినుండో వచ్చి కొంతసేపు విశ్రమించి, మరల ఎటకో బయల్వెడలుచున్నారు. ఈ శరీరము కలిగియున్న కొద్దిసేపట్లోనే, "ఇది నా శరీరం. దీని పేరు ఇది. ఈమె నా భార్య. వీరు నా పిల్లలు. ఇది నా గృహం. ఇవి నాకు ఉన్న పేరు–ప్రతిష్ఠలు" – అను రూపముగల అనేక సంబంధములను కల్పన చేసుకొని అనుభవిస్తున్నాడు. ఇట్టి తుచ్ఛ శరీరము పొందినట్టి ఇతడు "ఇది నాది, ఇది నాది కాదు" అంటూ మీమాంస ఎందుకు చేస్తున్నాడో నాకు అర్థమగుటలేదు. ఇట్టి ఈ నా యొక్క – తదితరుల శరీరములపై ఒకడికి ప్రేమ ఎందుకు? మరొకడికి ద్వేషమెందుకు? ఈ నా దేహము దుఃఖములందు, దారిద్ర్యములందు పొరలుగాక! లేదా, సుఖములందు, సమృద్ధములందు తేలియాడు గాక! దీనితో నాకేమి సంబంధం? ఇది 'ఆయుర్దాయం' అనే నదియొక్క జలం వంటిది. జన్మ – మృత్యువులే దీని ఈవలి – ఆవలి ఒడ్డులు.

❖

విజ్ఞులైన పెద్దలు "నాయనలారా! ఈ 'శరీరము' అనేది 'సంసారము' అనే సముద్రమును దాటుటకు తెప్పవంటిది. తగినంత జాగరూకులై దీనిని సరియైన ప్రయోజనమునకై వినియోగించండి" అని జనులందరినీ హెచ్చరిస్తున్నారు. విన్నవారు వింటున్నారు. విననివారు ఈ మాటలను అవహేళన చేస్తున్నారు. కొందరు తగినంత జాగ్రత్త వహించి విజ్ఞానమును పొంది ఆవలి ఒడ్డుకు చేరుచున్నారు. ఇక మరికొందరో, మధ్యలోనే మునిగిపోతున్నారు. శరీర తాదాత్మ్యము పొందినవారై "నాది–నేను" అను రూపముగల అనేక భ్రమలకు లోనగుచున్నారు. ఫలితం? అంతులేని దుఃఖములు, వేదనలు. రక్త మాంసములచే నిర్మించబడి, ఒకానొక బాహ్య వస్తువులాగానే దర్శన మిస్తున్న ఈ శరీరముపై 'నాది' అనే అభిమానం అసలు ఎందుకు కలుగుతోంది చెప్పండి?

దేహగృహం : 'దేహము' అనే గృహ ప్రాంగణములోగల పశువుల కొట్టాంలో 'ఇంద్రియములు' అనే పశువులు కట్టివేయబడ్డాయి. 'ఆశ' అనేది ఈ గృహము యొక్క గడుసరి ఇల్లాలు. 'చిత్తము' అనువాడే ఇక్కడి సరంజామా అంతా ప్రోగుచేసే సేవకుడు. విచారించి చూస్తే, సారమైన వస్తువంటూ ఇందులో ఏదీ లేదు. అందుచేత ఇదంతా దుఃఖకరమేకాని, వాస్తవసుఖమైనదేదీ ఇందులో నాకు కనిపించుటలేదు. ఈ శరీరగృహం 'నోరు' వాకిలిగా, 'నాలుక' గడియగా, 'వెన్నెముక' స్తంభముగా కలిగియున్నది. స్వల్ప కాలంలో నేల కూలబోయే ఈ శరీరగృహం పైకి మాత్రమే అందంగా కనిపిస్తోంది.

అయినా ఎంత రాజ్యముంటే ఏం లాభం? ఎట్టి సుందర దేహముంటే ఏమున్నది? అతికొద్ది కాలంలో ఇది కాలునిచే కబళించబడుతోంది కదా! ఈ దుష్టరోగములు సత్కర్మశీలుణ్ణి మాత్రం వదలుచున్నాయా? లేదు.

లోన రక్త మాంసములతో నిండియుండి, బైటకు 'చర్మము' అనే సున్నంతో పూయబడి, ఈ దేహము ఒక యంత్రమువలె చలించుచున్నది. 'మనస్సు' అనే భూతం దీనిలో ఉండి దీనికి నిలకడ లేకుండా చేస్తోంది.

నశించుటయే ధర్మముగా గల ఇట్టి స్త్రీ-పురుషుల శరీరములందు జనులకు కనబడే రమ్యత్వమేమిటో నాకు అర్థమగుటలేదు. దీనికి ఏమైనా తారతమ్య జ్ఞానం ఉన్నదంటారా? ఖరీదైన వంటకాలతో సుఖింపచేసినా, లేక దారిద్ర్యాదులచే బాధింప చేసినా కాలక్రమంగా ముసలితనం పొందకుండా ఉండదుకదా! "ఇదిగో, ఇక్కడ మేము సుఖంగా ఉన్నాము" అని అనుకొంటూ ఉండగానే కాలం అన్నిటినీ క్షణంలో మార్చి వేస్తోంది.

**కింశ్రియా? కిం చ రాజ్యేన? కిం కాయేన? కిమీహి తైః ?**
**దినైఃకతిపయైరేవ కాలః సర్వం వికృంతతి !** (XVIII-37)

ఈ శరీరము, ధనము, రాజ్యము, మనోరథములు, వాటికి సంబంధించిన చేష్టలు – వీటన్నిటివలన ప్రయోజనమేమున్నది చెప్పండి? కొద్ది రోజులలో కాలము అన్నిటినీ త్రుంచి వేయబోతోంది కదా!

❖

ఎంతోకాలం అత్యంత ప్రియముగా జీవునిచే పెంచి పోషించబడిన ఈ శరీరము ఒకానొక రోజు 'మరణము' అనే తన ఇష్టసఖుడు ఎదుటికి రాగానే, ఆ జీవుడిని అవిశ్వాస పూర్వకంగా త్యజించి (మరణ సఖునితో) ఎటకో లేచిపోతోంది. మెఱుపులను, శరత్కాల మేఘములను, ఊహాకల్పిత భవనములను, మాయాకల్పిత వస్తువులను "ఇవి వాస్తవం, శాశ్వతం" అని నమ్మియుండే మూర్ఖులు ఎవరైనా ఉంటారా? ఈ శరీరం విషయం కూడా ఖచ్చితంగా అంతే.

హే మహాత్మా! ఒకానొక పిల్లి ఏ రాత్రివేళో ఒక 'చినిగి డొల్లపడి, ధ్వనింపని డోలు' నందు చిక్కుకొంటే ఎట్లా అగచాట్లు పడుతుందో మా ఈ అవస్థలు కూడా అట్లాగే ఉన్నాయి. మాంసము,

నరములు, బొమికలతో నిర్మించబడిన ఈ 'శరీరము' అనే గూటిలో చిక్కుకొన్న మా వంటి అజ్ఞానుల అగచాట్లు ఏమని చెప్పమంటారు? మాకు ప్రాప్తించిన "ఈ శరీరమే నేను" అనే ఈ జాడ్యం తొలగేది ఎట్లా?

ఈ శరీర వృక్షము యొక్క ఆశల కొమ్మలపై 'చిత్తము' అనే కోతి గంతులు వేస్తోంది. ఈ వృక్షమును చిరకాలంగా ఆలోచనలు, దుఃఖాలు పురుగులవలె తొలుస్తున్నాయి. 'తృష్ణ' అనే కొండచిలువ చుట్టలు చుట్టుకొని వ్రేలాడుతోంది. దీనిలో కొన్ని పక్షులు, పిట్టలు గూడులు కట్టుకొని నివసిస్తున్నాయి. అవే ఈ కోపాలు, తాపాలు, నవ్వులు, ఏడ్పులు, పుణ్యాలు, పాపాలు, ఇంద్రియాలు, శబ్ద స్పర్శ రూపరస గంధాలు మొదలైనవి. కాముకులైన బాటసారులు (జీవులు) యౌవనము పైగల అపేక్షచే ఇందు విశ్రమించటానికి వస్తున్నారు. ఇది 'అహంకారము' అనే గట్టుపై 'వాసనలు' (tendencies) అనే వ్రేళ్ళతో ఆయాసమే సంచలనముగా కలిగి ఉన్నది.

❖

**కాలయాపన :** ఈ 'శరీరగృహం'లో అహంకార గృహస్థుడు 'తృష్ణ' అనే ఇల్లాలుతో కాపురం చేస్తూ రోజులు గడుపుచున్నాడు. ఇంద్రియ పశువులను మేపుకొంటూంటే కాలమంతా ఎటుపోతోందో ఆతనికి తెలియుట లేదు. ఇక, రక్తమాంస బొమికలచే నిర్మించబడిన ఈ శరీరం 'ముసలితనము' అనే శైథిల్యమునకు ఎదురుచూస్తున్నట్లు లేదంటారా? 'చిత్తము' అనే భృత్యుడు పాపం, ఇది పడిపోకుండా చూస్తున్నాడు. ఈ దేహగృహంలో "అబద్ధము – అజ్ఞానము" అనే పేరుగల రెండు నిలువెత్తు స్తంభాలు ఉన్నాయి. లోపల ఎక్కడి నుండో 'దుఃఖము' అనే బాలుడు ఎలుగెత్తి రోదిస్తున్నాడు. 'సుఖము' అనే మరొక బాలుడు ఆదమరచి నిదురపోతున్నాడు. 'దురాశ' అనే పాలిపోయిన క్రూరమైన ఎత్తుపళ్ళుగల దాసి పళ్ళు ఇకిలిస్తూ ఈ గృహంలో అటు ఇటు సంచరిస్తోంది. ఈ ఇంటిలో "ప్రాపంచిక విషయములు" అనే అనేక కుండలు ఆ మూల కొన్నీ, ఈ మూల కొన్నీ ఉన్నాయి. ఆ కుండలలో "అజ్ఞానం" అనే ఉప్పునీరు తప్ప మరింకేమీ లేదు.

ఇందలి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, బుద్ధి అట్టి ఉప్పునీటితో నిండి ఉన్నాయి. వెదురు బొంగులలో గాలి ప్రవేశించి ఈల శబ్దం చేస్తున్నట్లు, పంచప్రాణాలు ఈ దేహమంతా సంచరిస్తున్నాయి.

క్షణంలో దుఃఖం. క్షణంలో ఆనందం. ఈ దేహం నాకు అనేక రుగ్మతలతో కూడుకొన్నదై అతి చంచలంగా కనిపిస్తోంది. ఆకు నుండి క్రిందకు వ్రేలాడే నీటిబొట్టువలె క్షణభంగురమైన ఈ దేహం ఏ క్షణంలో నన్ను వీడనున్నదో తెలియదు కదా! అందుచేత, ఇది నన్ను వీడకముందే, నేనే దీనిని లేనిదానిగా తిరస్కరించివేస్తున్నాను.

**వహనైకార్థ యోగ్యాని కాయకాష్ఠాని భూరిశః**
**సంసారాబ్ధావిహోహ్యన్తే , కంచిత్తేషు నరం విదుః ॥** (XVII-47)

మహాత్మా! ఈ సంసార సముద్రమును చూచారా! కేవలం దహనం కొరకు మాత్రమే పనికివచ్చే అనేక శరీరాలు ఇందులో కొట్టుకుపోతున్నాయి. అట్లు కొట్టుకుపోయే వాటిలో కొన్ని కట్టెలను

చూచి "వీరు నరులు" అని అంటున్నాం. నా శరీరం కూడా, ఒకానొక కట్టె. ఈ కనబడే జగద్దృశ్యము లందు "ఇవి సత్యము" అని చిరకాలంగా విశ్వాసం కలిగి ఉన్నవారిని చూస్తే నాకు జాలివేస్తోంది. 'అజ్ఞానము' అనే కల్లు త్రాగి ఉన్మత్తులై గంతులు వేయుచున్న అట్టివారికి ధిక్కారమగు గాక!

అయ్యో! ఒక ప్రక్క "విషయములు" అనే బురదనీటి మడుగులో అనేక శరీరాలు క్రుళ్ళిపోవటం ఈ జనులు చూస్తూనే ఉన్నారు. కాని వీరు తమ శరీరమేమిటో, (దీని స్వరూప స్వభావములేమిటో) గ్రహించలేక పోతున్నారు. గాలియొక్క రాకపోకలు తెలుస్తున్నాయి. మనస్సుయొక్క ప్రసరణం కూడా కొంత గుర్తించవచ్చునేమో. కాని, ఈ శరీరాలన్నీ ఎక్కడినుండి వస్తున్నాయి? ఎక్కడికి పోతున్నాయి? అనేక పదార్థములతో కూడిన దీనిని ఎవరు ఎందుకు నియమిస్తున్నారు?

ఏదో 'అజ్ఞాతశక్తి' మాకు అర్థంకానిదై అన్ని వైపుల ఆవహించి ఉన్నదని నాకు అనిపిస్తోంది. అది మాకు "మానావమానములు, ప్రియాప్రియములు" మొదలైన రూపములుగల భ్రాంతిని చూపి మమ్ములను ఆకట్టుకొంటోంది. మా మనస్సులను హరించి మరల మరల మృత్యుముఖం వైపుకు దారులు చూపుతోంది.

ఓ దేవా! విశ్వామిత్రా! ఎవరైతే తమయొక్క అతి సూక్ష్మబుద్ధితో, "ఈ జడమగు దేహము నేను కాదు, నాకు ఈ దేహముతోగాని, ఈ దేహమునకు నాతోగాని సంబంధమే లేదు" అని గ్రహించి ఆత్మయందు విశ్రాంతి పొందుతారో, వారే మనుజులలో ఉత్తములు. ఆ విధంగా అతికొద్దిమంది మాత్రమే అనుభవపూర్వకంగా గ్రహిస్తున్నారు. వారి జీవితములే ధన్యములు. ఇక మిగతా జనుల అవగాహనలన్నీ అనేక భ్రమలతో, విక్షేపములతో నిండి ఉంటున్నాయి. వారంతా అధోగతి పాలే అవుతున్నారని నాకు అనిపిస్తోంది.

స్వామీ! ఈ శరీరమనే గోతిలో దాగుకొనియున్న 'అహంకారము' అనే పిశాచం చేత మేము మరల మరల మోసగించబడుతున్నాం.

❖❖❖

ఉన్నదేది? సత్యమేది?

**నకించిదపి దృశ్యేఽస్మిన్సత్యం తేన హతాత్మనా**
**చిత్రం దగ్ధ శరీరేణ జనతా విప్రలభ్యతే ॥** (XVIII-57)

ఈ దృశ్య ప్రపంచంలో "ఇది సత్యము" అని మనం అనుకోగలిగేది ఎక్కడైనా, ఏదైనా ఉన్నదా? ఈ కనబడే మొత్తము దృశ్యమునందు అంతర్గతమై ఒకానొక వస్తువువలె ఉన్న ఈ నా శరీరం కూడా అసత్యమే అయివున్నది కదా! అసద్రూపములై, దగ్ధ ప్రాయములైన ఈ శరీరాదులచే మేము ఎందుచేత మోసగింపబడుచున్నాం? ఎంత ఆశ్చర్యం! మెఱుపువలె అస్థిరంగా ఉండే ఈ శరీరంపై "ఇది మాకు కలదు. ఇది ఇట్లే ఉండబోవుచున్నది" అని విశ్వాసం కలిగి ఉండేవారికి ఎవరు మాత్రం ఏలా చెప్పగలరు?

అందుచేత మహర్షీ! ప్రబల దోషములచే దిక్కుమాలిన దానివలె ప్రవర్తిస్తున్న ఈ శరీరమును నేను తృణప్రాయంగాను, ఇప్పటికే నశించినదాని వలేనూ చూస్తూ సుఖమును పొందుచున్నాను.

❖❖❖

# 15. బాల్య స్వరూపం

జీవుడు ఈ దేహంలో ప్రవేశించి అనుభవమును పొందుచున్న బాల్యయౌవనవార్ధక్య దశలలో మొదటిదైన బాల్యదశ సుఖకరమైనదని కొందరు జనులు అనుకొంటూ ఉంటారు. "చిన్నతనంలో మేము ఆనందంగా ఉండేవాళ్ళం" అని చెప్పుకొంటూ ఉంటారు. అయితే వారంతా వర్తమాన ఆధివ్యాధుల దృష్ట్యా అలా అంటున్నారేకాని, అది వాస్తవం కాదని నాకు అనిపిస్తోంది.

చంచలము, సంకులము అయినట్టి ఈ సంసార సముద్రంలో జన్మించినప్పటి నుండీ అన్నీ కష్టాలే. బాల్యంలో శక్తి ఉండదు. అనేక వ్యాధులు, శారీరక దౌర్బల్యాలు బాధిస్తూ ఉంటాయి. "ఇది మంచి – ఇది చెడు" అనే విచక్షణ ఉండదు.

–ఇది కావాలి – అది కావాలి – అని ఎల్లప్పుడు కాంక్షించే స్వభావం.

–తనది కాకున్నా "నాకే ఉండాలి" – అనే లోభత్వం.

–అనుక్షణం మారిపోతూ ఉండే ఇష్టాయిష్టముల చపలత్వం.

–దీనత్వం, మూఢత్వం, తెలివితక్కువతనం.

–కల్పిత ఆటల మీద ధ్యాస.

–బుద్ధి నిలకడ లేకపోవటం.

–రోషం, రోదనం, చేతకాకపోవటం.

ఇవి బాల్యంలో చెప్పుకోదగ్గ విశేషాలు. ఏవేవో తినాలని, త్రాగాలని, పొందాలని కోరుకొంటాడు. కాని, లోపల ఉన్న భావాలేమిటో చెప్పుకోలేడు.

ఈ 'మనస్సు' అనేది స్వయముగానే పరమ చపలమైనది. బాల్యావస్థలో ఇక దీని చపలత్వానికి అంతూ పొంతూ ఉండదు. బాల్యంలో ఉండే అనేక అసమర్థతల కారణంగా ఏవేవో మనః చింతలు బాధిస్తూ ఉంటాయి. చేసే పనులన్నీ అతి మూఢంగా, అవిచారణాపూర్వకంగా ఉంటాయి.

అగ్నిజ్వాలలు, సముద్రపు అలలు, మెఱుపులు, స్త్రీల నేత్రములు ఇవన్నీ 'బాల్యావస్థ' అనుదాని నుండే చపలత్వం నేర్చుకున్నట్లు నా కనిపిస్తుంది.

ఈ బాలుడు కుక్కవలె అతి స్వల్పమునకే సంతోషించి స్వాధీనుడౌతాడు. అత్యల్ప విషయానికే పట్టరానంతకోపం పొందుతాడు. "ఈ పదార్థము పరిశుద్ధమా? కాదా? ప్రమాదకరమా? కాదా?" అని పూర్వాపరాలు విచారించకుండానే పైకి బాగున్నంత మాత్రంచేత "అది నాకు ఇప్పించండి" అని గోలచేస్తాడు. గుణదోషములు విచారించే బుద్ధి లేకపోవుటచే ఆయా పదార్థములు ఆతనికి అనేక బాధలే తెచ్చిపెడుతున్నాయి. పోనీ, పెద్దలు ఇవ్వనన్నారా, ఏడుపు ఆపడు. ఒకటి పొందగానే,

బుద్ధి విక్షేపం చేత మరొకటి కావాలనుకొంటాడే కాని, ఏది పొందినప్పటికీ ఏమాత్రం తృప్తి పొందదు. ఇంతలోనే ఏడుపు. ఇంతలోనే నవ్వు. అతని వెకిలి అల్లరి ప్రవర్తన చూచి ప్రతివాళ్ళు బెదిరించేవారే. పెద్దలు విధించే శిక్షలను నిస్సహాయంగా, మౌనంగా అనుభవించ వలసినదే కదా! పెద్దలు, తల్లిదండ్రులు, గురువులు పై తరగతి బాలురు – ఈ విధంగా అతడు భయపడనిది ఎవరికి? ఎవరో చెప్పిన కథలో వర్ణింపబడిన బేతాళుని ఎదురుగా ఊహించుకొని భయపడతాడు. నిద్రలో ఏవేవో ఊహించుకొని కలవరిస్తూ ఉంటాడు. ఇష్టమైన వారు దూరంగా ఉంటే బెంగపడతాడు. చూచారా స్వామీ! ఈ విధంగా బాల్యం అనేక భయములతో, తప్పుడు పనులతో, మనోవ్యాధులతో ఉద్వేగములతో నిండి ఉంటోంది. ఇట్లు అజ్ఞాన విజృంభణకు ఆలవాలమై ఉండగా, జనులు ఏ ఉత్తమానందం ఈ బాల్యంలో చూడగలుగుచున్నారు? చమత్కారమే కదా! దోష ప్రదములైన అజ్ఞానములు విజృంభించటం ఆనందకరమేమిటి?

ఈ బాలుడు పనికిరానిపనులను కూడా మహా కుతూహలంగా ప్రారంభిస్తాడు. దుశ్చేష్టలపై వ్యామోహం, దుర్బుద్ధి కలిగి ఉంటాడు. నిప్పన్నా భయం. నీరన్నా భయం. అందరిచేత చీవాట్లు. మనఃశాంతి ఉండదు. గోతిలో చిక్కుకున్న గబ్బిలం లాగా అనేక అమంగళమైన యత్నాలు, మనోవ్యాధులు, సందేహాలు, చెడు పోకడలు కలిగి ఉంటాడు. ఇక స్వస్థత ఎక్కడిది? ఎక్కడ మనోచాంచల్యం, అజ్ఞానం కలిసి ఉంటాయో, ఏ చోట దోషాలు, వ్యాధులు, ఆధులు, చిత్తవికారాలు, అస్వాధీనత సమావేశమౌతాయో – అక్కడ శాంతి, ఆనందం ఉంటాయా? లేనేలేవు.

బాలుని మనస్సు ఏదో అర్థంకాని నూతనత్వం వైపు అఱ్ఱులు చాస్తూ ఉంటుంది. పెద్దలు "స్వసంకల్పమే ప్రతిబంధకము" అనే విషయం నిరూపించటానికి "యథాబాలః" అంటూ ఈ బాల్యమునే దృష్టాంతంగా తీసుకొంటారు. ఒక వృక్షము యొక్క అనుభవం లాగా ఇతరుల (ముద్దుల వంటి) మూర్ఖపు క్రియలు, వంచనోపాయాలు ఒక బాలుడిని బాధించినట్లు మరి ఇంకెవరినీ బాధించవేమో! అనేక మనోరథాలతో, ఇతరులు విధించే క్రమశిక్షణాది అనేక నియమములతో, లోకాన్ని మ్రింగివేయాలనే మూఢత్వంలో బాలుడు పొందే సుఖసంతోషాలేమున్నాయి చెప్పండి? వృక్షం తను పడుచున్న బాధలు పైకి ఎవరికీ చెప్పుకోలేదు చూచారా! అదేవిధంగా అతడు తన అంతరంగములోని బాధలు పైకి చెప్పుకోలేడు.

పక్షులైతే ఆకలివేస్తే ఎటైనా వెళ్ళి ఆహారం తెచ్చుకొంటాయి. ఈ బాలుడో, నెత్తీ–నోరూ బాదుకోవటమేగాని చేసేది ఏమి ఉండదు. ఇతరులు ఎవరైనా కనికరిస్తేనే గతి.

ఇట్టి బాల్యావస్థలో ఏదో సుఖముగాని, విశేషముగాని ఉన్నదనుకొని, ఈ జీవుడు మరల మరల జన్మలు పొందాలనుకొంటే, ఈ విషయం నాకు జాలినే కలిగిస్తోంది. అనేక రోగ, విక్షేపాలతో, వివేక–విచారములకు అవకాశమేలేక, శాంతిని ఏమాత్రం ప్రసాదించలేని బాల్యమును నేను తుచ్ఛమైనదిగాను, అరమ్యమైనదానిగాను గాంచుచున్నాను.

❖❖❖

# 16. యౌవన దశ

ఈ మనుజుడు చివరికి ఎట్లో బాలానర్థముల నుండి గట్టెక్కి అనేక భోగ వాంఛలతో కూడుకొన్నవాడై, యౌవన ప్రాంగణంలో ప్రవేశిస్తున్నాడు.

ఇప్పటికే అతని మనస్సులో అనేక దోషాలు, కుసంస్కారాలు గూడుకట్టుకొని ఉంటాయి. ఇప్పుడిక అహంకార – కామములనే పిశాచాలు నెమ్మదిగా కనులు తెరచి జూలు విప్పుతున్నాయి. ఏవేవో గుర్తింపులు, సుఖములు పొందాలని స్వప్నం కంటూ ఉంటాడు హృదయంలోనే ఉద్భవించిన అహంకార – కామములకు ఇక 'దాసో ఽ హం' అనటం ప్రారంభించుచున్నాడు. అతి చంచలమైన మనశ్చింత లన్నిటికి స్వేచ్ఛ వచ్చేస్తోంది. బుద్ధి అనేక వికారములచే ఆక్రమించబడి కలుషితం అవుతోంది. ఈ మనస్సు, యౌవనములోని ఎండమావులవంటి పరిచయాలను, విలాసాలను, స్వోత్కర్షలను చూచి, "ఆహా! ఇవన్నీ ఎంత మధురమైనవి! ఎంతగా వాస్తవమైనవి!" అని అనుకొని, పరుగెత్తి చివరకు 'విషయములు' అనే మురికి గుంటలో కాలుజారి పడుతోంది. అందుకే "యౌవనము అనేక మహానరకములకు బీజము వంటిది" అని పెద్దలు అంటూ ఉంటారు. ఇందులో ప్రత్యక్షమయ్యే కామజ్వరాదులన్నీ జీవుని వినాశనము కొరకే ప్రవర్తిస్తున్నాయి. చిత్ర విచిత్రములైన వృత్తాంతములకు, వివశత్వాదులకు ఆలవాలమైన ఈ యౌవనము వలన (వివేకం విషయమై) నష్టపోయే వారే ఎక్కువ. కామపిశాచికి వశం కాకుండా, దుష్కార్యములను ఆచరించకుండా ఈ యౌవనావస్థను ఎవరైనా దాటివేయగలిగితే అట్టివారు నా దృష్టిలో వందనీయులే. వారే మహనీయులు.

ఈ యౌవనం భోగ సమయంలో మధురంగా ఉన్నట్లే కనబడుతుంది. కాని, కల్లు యొక్క విలాసమువలె ఇది అన్ని దోషములకు శిరోమణి వంటిది. దీనిలోని కథనమంతా అబద్ధమే అయినప్పటికీ, అప్పటికి మాత్రం నిజమేనని అనిపిస్తూ క్షణంలో జీవుణ్ణి మోసగించి వేస్తోంది. స్వప్నస్త్రీ సాంగత్యం లాగా, ఊహ యందు గాంచబడే రతనాల మేడ లాగా క్షణకాలపు అసత్యరమ్యత్వం ప్రదర్శిస్తోంది. వేశ్యాస్త్రీ సాంగత్యం లాగా ఈ యౌవనం మొట్టమొదట మెత్తమెత్తగా జీవునియందు ప్రవేశించి, క్రమంగా దుర్భావాలకు, రోగాలకు, దుఃఖాలకు, అరిష్టాలకు నాంది పలుకుతోంది.

హృదయములోని జ్ఞానమును యౌవనం కప్పివేస్తుంటే శివకేశవులంతటి వారే భయపడతారు. ఎందుకంటారా? ఇందులో జనించే మోహం మంచిపనులను మరపింపచేస్తుంది. వివేకమును రూపుమాపటంలో, కాంతా వియోగాది కణకణ మండే ఉష్ణత్వాలు సృష్టించడంలో, మంచి అలవాట్లను విరమింపచేయడంలో, భ్రాంతి జ్ఞానం ప్రసాదించటంలో ఈ యౌవనమునకు ఉన్నంత శక్తి మరిదేనికీ లేదు.

❖

అయ్యో! ఎంతటి నిర్మలమైన మనస్సు అయినప్పటికీ, ఈ దశలో కలుషితం అవుతోందే? హే మహర్షీ! తుపాను సమయంలో ఆకాశాన్ని చుంబించే కెరటాలు ఉన్నట్టి నదినైనా దాటవచ్చు. ఈ యౌవనంలోని తృష్ణా తరంగాలు దాటటం ఎంతమంది తరం? ఆహా! జీవుడు ఈ దశలో "ఆ స్త్రీ,

ఆ స్తనాలు, ఆ ముఖం, ఆ విలాసాలు, ఆ హావభావాలు" అని మననం చేసుకొంటూ, ఇంతలోనే ముసలివాడు అయిపోతున్నాడు. చంచలమైన ఆశలచే బాధించబడే యువకుడు సాధువుల దృష్టిలో తృణప్రాయుడు మాత్రమే.

కామక్రోధాది అనేక దోషములతో కూడిన గంటల హారాన్ని ధరించిన 'అభిమానము' అనే మదపుటేనుగు ఈ యౌవనారణ్యంలో సంచరిస్తోంది. ఇది జీవులు ఎంతో భయపడవలసిన విషయం కాదంటారా స్వామీ? 'దుఃఖములు' అనే కాల కూట విషసర్పాలు 'విషయవాసనలు' అనే గాలి పీలుస్తూ జీవుడిని కాటువేయటానికి అటూ ఇటూ సంచరిస్తున్నాయి. ఇది గమనించని ఆ యువకుడు మాత్రం "ఆహా! ఈ నా శరీరభాగాలు ఎంతగా మెరుస్తున్నాయి! ఈ నా నూనూగు మీసాలు చూస్తున్నారా?" అని చెప్పుకొంటూ భ్రమిస్తున్నాడు. కుత్సిత మనోవికారాలను, రాగాదులను, దుశ్చింతలను, ఆశ్రయించే యౌవన మనస్సుకు నిజమైన సుఖశాంతులు ఎక్కడ లభిస్తాయి? యౌవనపొరచే దట్టంగా కప్పబడిన కనులకు తనను అతివేగంగా సమీపిస్తున్న ఆధి-వ్యాధులు, సంకల్ప-వికల్పముల యొక్క పరిణామాలు, మూర్ఖచర్యల దుష్ఫలితాలు ఏమాత్రం కనిపించటం లేదు.

అంతా బాగానే ఉంది కాని, ఈ యౌవనదార్ఢ్యం ఎన్నాళ్ళు ఉంటుందంటారు? అయ్యో! ఎంతో ప్రయాసతో సంపాదించుకొన్న అనేక సద్గుణాలు ఈ త్రిగుణ రూపములైన యౌవన వాయు వీచికలచే పెకిలించివేయబడుచున్నాయే! అహంకారం, మోహం సుకుమారత్వాన్ని త్రుంచి వేస్తున్నాయి. వివేకము మరుగున పడిపోతోంది. కామాంధకారముచే గ్రుడ్డిది అయిన మనస్సు తాను ప్రసరించుచున్న స్థానాలు ఎట్టివో ఏ మాత్రం పరీక్షించుకోవటం లేదు.

❖

మహర్షీ ! ఈ యౌవనం శరీరమునకు వెన్నెలవలె కనిపించినప్పటికీ, చిత్తమును మాత్రం అధోగతిపాలు చేసి నీచత్వమును, మూర్ఖత్వమును తెచ్చిపెడుతోంది. అతి త్వరలో నశించబోయే ఈ యౌవనం చూపిస్తున్న పైపై మెరుగులు చూచి మోసపోవటానికి నేను సిద్ధంగా లేను.

ఒకానొకడు ఎంతో శ్రమించి, అనేక ప్రయాసలకు ఓర్చుకొని చివరికి ఒక 'చింతామణి'ని సంపాదించాడు. "ఆహా! చూచారా! నేను ఎంతటి గొప్పవాడినో! ఇప్పుడీ చింతామణి నాదేకదా!" అని తలచుచు మాన మద గర్వాలు పొందినవాడై ఇక ఇంటికి బయలుదేరాడు. కాని పాపం, నదిని దాటేయత్నంలో మధ్యలో మణిని చేయి జార్చుకొన్నాడు. చూస్తూ ఉండగానే ఆ మణి కాస్తా నీటి ఉరవడికి కొట్టుకుపోతోంది. అప్పుడు అతని మానసిక స్థితి ఎట్లా ఉంటుంది? ఈ యౌవనం విషయం కూడా అంతే. ఆశపడినన్నాళ్ళు పట్టదు. ఎప్పుడో ప్రవేశిస్తుంది. కామము మొదలైన వికారాలన్నీ తలెత్తుతాయి. రాగము మొదలైన అనేక దోషాలు వివేకమును కప్పివేస్తాయి. ఈ కథ ఇట్లా నడుస్తూ ఉండగా, ఇంతలో ఎక్కడినుంచో ముసలితనం వచ్చిపడుతోంది. చూచారా మహర్షీ! మరి ఈ విషయాలన్నీ ఈ బాల్యంలోనే ఎందుకు చక్కగా జనులు విచారించరాదు? యౌవనం

చూచి మురిసిపోవటం చావుకు సిద్ధంగా ఉన్న బాలుణ్ణి ముద్దుపెట్టుకోవటం వంటిదేనని నేను అనుకొంటున్నాను. ఎవడైతే, అవివేకంచే క్షణభంగురమైన యౌవనమును చూచి మోహితుడై "విషయానందమే జీవిత లక్ష్యము" అనే భావన కలిగి ఉంటాడో వాడు 'నరపశువు' అని చెప్పబడుచున్నాడు. ఆతడు అతిత్వరలో కాలముచేత మోసగించబడినవాడై, పశ్చాత్తాపపడబోతున్నాడు.

స్వామీ! మరల మరల చెప్పుచున్నాను. ఈ 'యౌవనము' అనే సంకటము నుండి క్షేమంగా బైటపడినవారే మెచ్చుకోతగినవారు. పెద్ద తిమింగలాలు ఉన్న నదినైనా దాటవచ్చు. రాగద్వేషాదులతో నిండియున్న ఈ యౌవనం దాటటం అంత తేలికైన విషయం కాదు. అది మహాప్రాజ్ఞులకు మాత్రమే సాధ్యం. శాంతి, దయ, దాక్షిణ్యము, వినయము మొదలైన ఉత్తమ గుణములు గల యౌవనముతో ప్రకాశించేవారు మనకు చాలా అరుదుగా మాత్రమే కనిపిస్తారు. అత్యంత మధురఫలములు, సుందర పుష్పములతో కూడిన ద్రాక్షతీగెలు ఎక్కడోగాని తారసపడవు కదా! అందుచేత నేను ఈ యౌవనము యొక్క పటాటోపమును తూష్ణీకరించి మౌనం వహించాలని నిర్ణయించుకొన్నాను.

❖❖❖

# 17. స్త్రీ వ్యవహారం

ఈ లోకంలో 'కామము' అనునది చాలా గొప్ప విషయంగా తలచుచు, ఈ జనులు ఎందుకో వ్యామోహం చెందుచున్నారు. నరములు, ఎముకలు, రక్తము, మాంసము – ఇట్టి వాటితో కూడిన ఈ స్త్రీ – పురుష దేహములందు శోభను చేకూర్చేది ఏది ఉన్నది? జనులు ఎందుకు మోహం చెందుచున్నారు?

ఈ స్త్రీ శరీరమును పురుషులు (అట్లాగే పురుష శరీరమును స్త్రీలు) మననం చేస్తూ పాపం, ఇప్పటికి ఎన్ని జన్మలు బూడిదపాలు చేసుకొన్నారో కదా! ఓయీ! మానవుడా! ఈ 'వనిత' అను వస్తువు యొక్క కాళ్ళు, చేతులు, చర్మము, మాంసము, కన్నీరు మొదలైనవి విడివిడిగా ఎప్పుడైనా పరిశీలించావా? ఇందులో మహత్తరమైన విషయమేమున్నది? మరి నీవు వృథాగా ఎందుకు ముగ్ధుడవు అగుచున్నావు?

ఓ స్త్రీ, పురుషులారా! ఒకచోట కేశములు, ఒకచోట చర్మము, ఒకచోట బొమికలు, ఈ శరీరములన్నీ ఇంతేకదా! మరి మీరంతా ఇంతగా బాహ్య శరీరాకర్షణలచే ఎందుకు బద్ధులు అవుతున్నారో చెప్పండి? తద్వారా మీ "వివేకము" మరుగున పడుటలేదా? ఈ రోజు ఈ దేహాలన్నీ వివిధ వస్త్రములతోను, లేపనములతోను తైతక్కలాడే బొమ్మలవలె అగుపించవచ్చు. వారి మెడలు రంగు రంగుల ముత్యాల హారములచే జాలువారుతూ, అత్యంత సుందరంగా కనిపించవచ్చు. కాని, ఒక్క విషయం గుర్తిస్తున్నారా? ఈ వర్తమాన క్షణంలో ఎంతో ఆకర్షణతో కనిపించే అవయవాలన్నీ

రేపో మాపో శ్మశానంలో ఒక మూలకు చేరి కుక్కలచే, నక్కలచే భుజింపబడబోవుచున్నాయి. లేదా కొన్ని ఎండు కట్టెలతోపాటుగా బూడిద కాబోవుచున్నాయి.

అయినా మునీంద్రా! పంచభూత నిర్మితమైన ఈ స్త్రీ-పురుషుల అంగములకు, అడవిలో సంచరించే కంచరగాడిదల అంగములకు భేదమేమున్నది చెప్పండి? మరి ఈ మనుజుడు స్త్రీ శరీరము చూడగానే వికారములు ఎందుకు పొందుచున్నాడు? ఈ జనులు చీరకుచ్చెళ్ళు, కేశములు వంటి పైపై మెరుగులకు ఆకర్షితులై అనేక వికారములు పొందుచున్నారే! కల్లుకు కామమునకు భేదమేమీ కనిపించుటలేదు. ఈ రెండు కూడా మత్తు, ఉల్లాసం, చిత్తవికారం కలిగించి జీవుణ్ణి వివశుణ్ణి చేస్తున్నాయి.

ఈ జీవుడు "దేహము" అనే కట్టుకొయ్యకు "మదము" అనే త్రాడుచే బంధింపబడి ఒక పశువువలె అనేక దుఃఖపరంపరలు అనుభవిస్తున్నాడు. ఎన్ని జన్మలు గడచిపోతున్నా, ఆతని యందు వివేకము మాత్రం ఉదయించుటలేదు. "ఆ కాటుక కన్నులు, జాలువారు కురులు, ఎత్తైన స్తనములు, నాజూకైన ముక్కు" .... అని అగ్ని జ్వాలలకు గడ్డిపరకవలె ఆహుతి అగుచున్నాడు. ఆ సరసములు, ఆ దూరం నుండి కనబడే బాహ్య సౌందర్యాలు – అవన్నీ ప్రజ్వరిల్లుచున్న 'నరకము' అనే అగ్నికి కట్టెపుల్లలవంటివే కదా! ఇక శృంగార కవులు "కారుచీకటి వంటి కనుబొమలు, నక్షత్రరాశులవంటి మిలమిల మెఱిసే కళ్ళు, చంద్రబింబము వంటి మోము, విరిసిన పువ్వులవంటి చిరునవ్వులు" మొదలైన అత్యంత మధుర భాషాయుక్తములైన ఉపమానాలన్నీ ప్రయోగించి భ్రమను ఇంతింతలు అధికం చేస్తున్నారు. ఇంకేమున్నది? ఈ జనులు క్షణంలో విలాసములలోకి పీకల వరకు దిగుచున్నారు. క్షణంలో ధర్మ వైరాగ్యాది కార్యక్రమముల నుండి వెనుకకు మరలుచున్నారు. ఫలితం? విలువైన మానవజన్మ వృథా అగుటయేకదా! కామిత స్త్రీలు విషతీగలవలె, తమను సమీపించు పురుషులను తమ కామోన్మాదం చేత వివశులను చేస్తున్నారు. ఎలుగుబంటి పుట్టలోని పామును తన ఉచ్ఛ్వాస-నిశ్వాసములచే ఆకర్షించి, బైటకు వచ్చిన ఆ పామును భక్షిస్తుంది చూచారా? అదే విధంగా, కామిని స్త్రీలు, "నీవే నాకు దిక్కు" వంటి అవాస్తవమైన మోసపు మాటలచేత, మాయలచేత, కృత్రిమ మర్యాదలచేత తళుకు బెళుకులచేత విటులను ఆకర్షించుచున్నారు. వారి మాన మర్యాదలను, శక్తి యుక్తులను హరించివేస్తున్నారు. సర్వస్వము పీల్చేసి బికారిని చేస్తున్నారు. కిరాతకుని వలలో చిక్కుకున్న పక్షిలాగా ఈ జీవులు అట్టి ఆకర్షణలో చిక్కుకొని బైటపడలేక విలవిలలాడుచున్నారు.

'సంసారము' అనే నీటిగుంటలో గల 'చిత్తము' అనే బురదలో సంచరించుచున్న ఈ జీవులు 'కామము' అనే 'ఎఱ'చే ఆకర్షించబడి, అనేక ఉపాధులను బలి చేసుకొంటున్నారు. గుఱ్ఱమునకు ముకుతాడు, ఏనుగుకు స్తంభము, పాముకు మంత్రము బంధములు అగుచున్నట్లు, ... ఈ కామమే జీవులకు పెద్ద గుదిబండగా పరిణమిస్తోంది. అనేక శోకమోహములచే రచించబడిన ఈ ప్రపంచమంతా 'కామము' అనే దానిచే ఆశ్రయించబడి, తత్ఫలితంగా స్థూలత్వం పొందుతోందని నాకు అనిపిస్తోంది.

❖

అందుచేత, ఓ మునీశ్వరా! స్త్రీ సాంగత్యమే సర్వ దోషములకు, సర్వ బంధములకు మూలకారణం. అద్దాని మాయలో పడకుండా తగు జాగ్రత్త వహించాలని నిర్ణయించు కొన్నాను. స్తనములు, కళ్ళు మొదలైనవన్నీ రక్తమాంసమయములే అయివుండగా, వాటిని చూచి నేనెందుకు వివశుణ్ణి కావాలి? ఒకప్పుడు స్థూల బుద్ధులగు పురుషునిచే అతిప్రియముగా, ఆప్యాయముగా లాలించబడిన సుందర స్త్రీలు ఇప్పుడు శ్మశానంలో దీర్ఘ నిద్రపోతున్నారు. వారి మాంస ఖండములను కాకులు, గ్రద్దలు భక్షిస్తున్నాయి. ఇప్పుడు ఇక్కడ నేను చూచే స్త్రీ-పురుష దేహముల గతికూడా అంతేకదా! వీరి కేశములు, తిలకము, అస్థులు కొద్ది కాలానికి కటిక నేలను అలంకరించబోతున్నాయి. ఇదంతా ఈ విధంగా విచారించిన తరువాత, ఇక నేను భ్రాంతిని పొందటానికి సిద్ధంగా లేను. బుద్ధిహీనులు మాత్రమే పంచభూతముల సన్నివేశమగు ఈ స్త్రీ-పురుష శరీరముల పట్ల ఆవేశపూరితమైన అనురాగం కలిగి ఉంటారు. అట్టి అనురాగం పెంచుకొన్నందుకు గాను, చివరికి, ఈ చిత్తము దీనత్వమునే పొందుతోంది. క్షణికావేశమయినట్టి కామముచే పరవశించు మనస్సు ఉత్తమ లక్ష్యముల నుండి చ్యుతి నొంది, చివరకు అనేక దుఃఖమోహములలో కూలిపోతోంది.

స్వామీ! వనిత ఉన్నవానికే కదా భోగేచ్ఛ! వనిత లేకుంటే "నాది, నాకు చెందవలసినది, నాతోనే ఉండవలసింది" అనునట్టి పదార్థజాలముల పట్ల భావావేశం కూడా సన్నగిల్లుట సులభమని నాకు అనిపిస్తోంది. నేను స్త్రీ వ్యవహారమునే త్యజించివేస్తాను. జరామరణముల పట్ల నాకు గల భీతి– ఆపాతారమణీయమై అతి చంచలమైనట్టి స్త్రీ సాంగత్యము పట్ల అత్యంత అరుచినే కలుగజేస్తోంది. అందుచేత ఈ మనస్సును అట్టి తుచ్ఛ వస్తువుల వైపు ప్రవేశించనీయకుండా, శాశ్వతమగు స్వస్వరూపజ్ఞానము కొరకే వినియోగించాలని నిశ్చయించుకొన్నాను.

❖❖❖

## 18. ముసలితనం

కోర్కెలు తీరని బాల్యమును యౌవనం మ్రింగివేస్తోంది కదా! ఇక మానమద గర్వాలతో నిండిన యౌవనమును ముసలితనం ఎక్కడి నుండో వచ్చి మ్రింగి వేస్తోంది. ఇట్లా చూస్తూ ఉండగానే పుష్టిగల ఈ అవయవములు శిథిలమైపోతున్నాయి. కుంచించుకు పోయిన దవడలు, వంగిన నడుము, ముడుతలుపడ్డ నుదురు, వణుకుచున్న కాళ్ళు, చేతులు - ఇవన్నీ స్త్రీలు, తదితరులు అత్యంత తిరస్కార దృష్టితో చూస్తున్నారు. మనస్సంతా దైన్యంతో నిండి ఉంటోంది. సూక్ష్మబుద్ధి, పాపం, గడుసరి సవతులచే హింసించబడే సాధ్వివలె, ఏ మూలకో వెళ్ళి దాక్కుంటోంది. ఇంతకాలం ఎంతో భయభక్తులతో ప్రవర్తించిన పుత్రులు, భార్య, బంధువులు, స్నేహితులు, సేవకులు ఇప్పుడు ఆతనిని ఒక పిచ్చివానివలె చూస్తున్నారు. "ఇదే మనకు మంచి సమయం" అనుకొని 'లోభం' వచ్చి మనస్సును ఆక్రమిస్తోంది. ఇక ఈ జీవుడు బుద్ధిహీనుడై, గుణహీనుడై, శక్తిహీనుడై అనుక్షణం ఏవేవో వ్యథలతో క్రుగ్గుతూ ఉంటాడు.

ఒక ప్రక్క శరీరం క్రమంగా శిథిలం అవుతూ ఉంటుంది. మరొకప్రక్క ఏదో అనుభవించాలనే తపన, దాహము, కామము వర్ధిల్లుతూ ఉంటాయి. ఏవేవో సంతాపములు, దీనత్వములు ఆ జీవుని చుట్టూ మూగి ఉంటాయి. "వీరంతా నా సొమ్ము తింటున్నారు. కాని, నన్ను లెక్కచేయటం లేదు. ఏవైనా రుచికరమైన పదార్థములు తింటే బాగుంటుంది. కాని, వంటికి సరిపడవు కదా! మరణం ఎక్కువ దూరంలో ఉన్నట్లు లేదు. పరలోకంలో ఏ దారుణమైన పీడ అనుభవించవలసి వస్తుందో ఏమో?" ఈ విధంగా ఉంటాయి అతని ఆలోచనలు. కోరికలు కోకొల్లలు. కాని భోగించే శక్తి ఉండదు. హృదయం నిస్సహాయంగా దహించుకొనిపోతూ ఉంటుంది. శరీరం అనేక ఆధివ్యాధులచే పీడించబడుచూ ఉండగా, క్రమంగా శక్తులన్నీ ఉడిగిపోతూ ఉంటాయి.

ఇట్లు జీవుడు అనేక వేదనలు అనుభవిస్తూ ఉంటాడు. మృత్యువు యొక్క క్రూరమైన వ్రేటును తలచుకొంటూ భయం భయంగా రోజులు గడుపుతూ ఉంటాడు. తాను బాల్య యౌవనములో వృథా పరచుకొన్న కాలమును, అవకాశములను నెమరు వేస్తూ సంగతి – సందర్భములను అనుచితంగా గుర్తు చేసుకొంటూ ఇప్పుడు వర్తమానంలో ఉన్న కొద్దిపాటి అవకాశములను కూడా వ్యర్థపరచుకొంటూ ఉంటాడు.

❖❖❖

# 19. మృత్యువు

ఈ శరీరం ఈ విధంగా అనేక వ్యాధులచే, ముసలితనముచే ఆక్రమించబడి, జీవుడు దీనాలాపనం చేస్తూ ఉంటాడు. ఇంతలో, ఒకానొక అనుకోని క్షణంలో 'మృత్యువు' అనే గుడ్లగూబ వచ్చి ఎదురుగా వాలుతోంది. సాయం సంధ్యను చూడగానే చీకటి ఎక్కడినుండో వచ్చి వాలదూ? గ్రద్ద మాంసమును మ్రింగటానికే గ్రహించునట్లు, ఈ శరీరమును మ్రింగటానికే 'ముసలితనం' దాపరిస్తోంది. బాలిక పువ్వును జడలో అలంకరించుకొని, కొంతసేపటికి ఆ పూవు వాడిపోగా, త్రుంచి దూరంగా విసరివేస్తోంది. చూచారా? అదే విధంగా 'కాలము' అనే బాలిక కూడా కొంతసేపు ఈ శరీరమును కలిగియుండి, ఆ తరువాత 'మృత్యువు' అనే చీకట్లోకి త్రోసివేస్తోంది.

ఈ జీవుడు బాల్య, యౌవనములలో ఉన్నప్పుడు అప్పటి ఆయా అల్పకాలిక కార్యములందు నిమగ్నుడై ఉంటున్నాడు. భగవంతుని ఆరాధించటం, జ్ఞానము కొరకై విచారణ చేయటం – మొదలైన పెద్దలచే ప్రవచించబడిన ఉత్తమ కార్యముల పట్ల, "ఇప్పుడేం తొందర? మాకు ఇంకా సమయమున్నది. పెద్ద అయిన తరువాత చూచుకోవచ్చులే" అని తలచి ఎంతో అలసత్వము, అశ్రద్ధ కలిగి ఉంటున్నాడు. మృత్యువు ఎదురుగా నిలచి ఉండగా, ఇప్పుడు ఆ అనుకున్న ప్రణాళిక అంతా ఏమైనది? మంచు బాగా కురియగా వాడిపోతున్న పుష్పంలాగా ఈ శరీరం శిథిలమౌతూ ఉంటే, మృత్యువు అను పేరుగల శరీర వినాశనం సమీపిస్తూ ఉంటే ఇక ఈ జీవుడు ఏమి చేయగలుగుతాడు?

❖

శరీరం జీర్ణం అయిపోతూ ఉంటుంది. వాతాదిరోగములు ప్రజ్వలిస్తూ ఉంటాయి. బూడిదగుమ్మడికాయ వలె తల తెలుపుతనం సంతరించుకొంటూ ఉండగా, 'కాలుడు' అనువాడు "ఆహా! ఈ పండు పక్వమునకు వచ్చినట్లున్నదే! ఇక కోసుకొందామా?" అని అనుకొంటూ ఒక రోజు వచ్చి కోయనేకోస్తున్నాడు.

'ముసలితనం' అనే నక్క యొక్క ఊళ వినేవరకే ఈ మానవుడి ప్రతాపమంతా. 'జర' అనే అగ్ని ఈ శరీర గృహమును తాకగానే ఇక అతడు అనేక శారీరక బాధలచే హింసించబడి దుఃఖితుడు అవుతున్నాడు. అంగములు పాలిపోతున్నాయి. నడుం వంగిపోతోంది. ఆధి–వ్యాధులు ముందు నడుస్తూ ఉండగా ఈతడు మృత్యువుకు 'కబళం' అవుతున్నాడు. పర్వత గుహలో దాగినా, సుతిమెత్తని పరుపులపై ధన–జనముల మధ్య ఉన్నప్పటికీ ఎవడైనా మృత్యువు నుండి తప్పించుకోగలడా? ఇంద్రియాలు బిగతీసుకు పోతూఉంటే ఏ లౌకిక తెలివితేటలు ఎందుకు పనికివస్తాయి?

'జర' మూడవకాలుతో (చేతికఱ్ఱతో) జీవుడిచేత తప్పటడుగులు వేయిస్తూ ఉంటే, అనేక అసంతృప్తులు, రోగాలు అందుకు తాళం వేస్తూ ఉంటాయి. ఏ క్షణంలో మృత్యువు పంజా విప్పబోతోందో ఎవరికి తెలుస్తుంది చెప్పండి? అశక్తి, ఆర్తి, ఆపద శరీరంలోనే తిష్ఠ వేసుకొని ఉంటున్నాయి కదా! ఓ మహాశయా! చూడండి. ఈ మనకు కనబడే శరీరాలన్నీ ముసలితనం పాలబడి, చివరికి మృత్యువుచే కబళించబడవలసినదే కదా! ఈ శరీరము యొక్క ఉత్పత్తి – ఉత్తరోత్తరగతి – ఇదంతా పరిశీలించుచున్న నాకు దీనిపై ఏమాత్రమూ విశ్వాసం కలగటం లేదు.

తండ్రీ! మహర్షీ! అసలు నాకొక విషయం చెప్పండి. ముసలితనం మీద పడ్డ తరువాత కూడా, జనులకు భార్య–పుత్ర–గృహాదులపై పేరాశ ఎందుకు ఉంటోంది? ఈ మోహమంతా కల్పిస్తున్నవారెవరు? ముసలితనాన్ని జయిచిన వారంటూ ఎక్కడా ఉండరు కదా! మరి ఈ విషయం అందరికీ తెలియదా? ముసలితనం వచ్చిపడే సమయానికి అనేక కోర్కెలు కలిగివున్న ఈ జీవుడు ఆ కోర్కెలు తీరక అపూర్ణత్వాన్ని అధిగమించలేకపోతున్నాడు. బాల్య యౌవనాలలోనే "అసలు కోర్కెలు లేకుండా ఉండేదెట్లా?" అనే విషయం విచారించి తగిన కర్మ – జ్ఞానములు అభ్యాసం చేసి ఉండి ఉంటే ఇప్పుడీ దిక్కుమాలిన గతి పట్టేదా? లేదు కదా !

అందుచేత, అట్టి ముసలితనం నన్ను సమీపించక ముందే ఆత్మ – అనాత్మ విచారణచే ఈ శరీర భావమును జయించి వేస్తాను. అందుకుగాను, నా శక్తి యుక్తులన్నీ వినియోగించ నిశ్చయించుకొన్నాను.

❖❖❖

# 20. కాల విలాసము

ఓ మహాత్మా! దేహాత్మబద్ధులమగు మేము "ఇవి మేము భోగించవలసిన వస్తువులు, ఈ ఈ ఉపాయములు అవలంబించి వీటిని పొందుతాము" అని చెప్పుకుంటూ మూఢులమై ప్రవర్తిస్తున్నాము. "వీరు నా వారు. వారు పరాయివారు. ఇవి నా ఇష్టాయిష్టములు. ఇతడు నా శత్రువు. వీటిని జయించి సొంతం చేసుకొంటాను" అను భావనలను కలిగివుంటూ, ఆయా వస్తు సమూహముల వలన కలుగుచున్న రాగద్వేషములచే ప్రభావితులం అగుచున్నాము. సజ్జనులైనవారికి ఇటువంటి విషయాలలో అభినివేశం ఉంటుందా? లేదు. మాబోటి బాలుర వంటివారం మాత్రమే అద్దంలో కనిపించే ప్రతిబింబ సమానములైన ప్రయోజనములను, ఫలములను ఆకాంక్షిస్తున్నాం. "ఇది పొందిన తరువాత మేము ఎంతో సుఖవంతులం కాబోతున్నాం. ఇది మాకు ఎప్పటికి తొలగుతుందో? ఈ వస్తుజాలం కలిగి ఉండుటచే వారెంత సుఖంగా ఉన్నారు? అవి వారికే ఎందుకు లభించాలి?" ఇటువంటి సంసార సంబంధమైన లోభమోహములతో, తుచ్ఛ హావభావములతో విలువైన కాలమంతా గడపివేస్తున్నాం. స్వామీ! సాలెగూడు ఎలుకచే కొరకబడునట్లు కాలముచే మేము ఎంతగానో మోసగింపబడుచున్నాం. "ఆహా! నేను ఎంత విశాలమైన దానిని!" అని గర్వించు సముద్రంలో బడబాగ్ని పుట్టి ఆ సముద్ర జలాన్నే స్వాహా చేస్తున్నట్లు అంతరంగమున పుట్టిన దుష్ట సంకల్పములే ఈ జీవుని దీనునిగా చేసివేస్తున్నాయి.*

ఈ సృష్టిలో కాలముచే మ్రింగబడనిది ఏమైనా ఉన్నదా? భయంకర సంహారాకార రుద్రస్వరూపుడగు కాలుడు ఈ కనబడే సమస్త దృశ్య పదార్థముల అస్థిత్వమును ఏదో ఒకనాటికి రూపుమాపబోవుచున్నాడు. విశ్వాత్ముడగు ఆ కాలదేవుడు "ఇతడు అధికుడు. ఇతడు స్వల్పుడు" -- అనే తేడా చూపకుండా సర్వమును ఆరగిస్తూ త్రేన్చుచున్నాడు. అతని స్వరూపమా, ... అగమ్యగోచరం. ఈ క్షణములు, నిమిషములు, గంటలు, రోజులు, సంవత్సరములు, యుగములు, మన్వంతరములు, కల్పములే అతని యొక్క ఉపాధి అని అనవచ్చునేమో! అట్టి ఉపాధితో కొంచెము రూపము దోపింపచేయుచు, ఈ చరాచర విశ్వమంతా తన వశం చేసుకొంటున్నాడు. ఈ వర్తమాన క్షణంలో అత్యంత శుభారంభములైనవి, రమ్యములైనవి, దృఢతరములైనవి కూడా కాలగతికి ఎర కావలసినదేకదా! క్రూరులైనవారు, నిర్దయులైనవారు, కఠినులైనవారు, పరుషంగా మాట్లాడేవారు, మహాగర్వితులు, అనేకులను నిరాటంకంగా దూషించ గలిగేవారు – వీరు, వారు అనటం దేనికి? అందరూ కూడా క్షణంలో కాలునిచే భస్మం చేయబడుచున్నారు.

ఆతనికి మ్రింగటమంటే మహా ఇష్టం. ఒక్కొక్కసారి ఒక్కొక్క వస్తువును, ఒకేసారి అనేక వస్తువులను మ్రింగివేయగలడు. అనంత లోకములను మ్రింగినాసరే, అతని పొట్ట నిండదు. ఈ సంసార నృత్యమంతా చేస్తున్నది 'కాలము' అని పిలువబడుచున్న అతడే! ఇదంతా సృష్టిస్తున్నాడు.

* మన అంతరంగమున పుడుతున్న సంకల్పముల దోషముచే మనం అల్పత్వం పొందుతున్నామని మనకు ఈ వాక్యం గుర్తుచేస్తోంది.

కలిగి ఉంటున్నాడు. మ్రింగివేస్తున్నాడు. అతనికి అడ్డం ఎవరు? చిలుక దానిమ్మకాయను పగిల్చి లోన ఉన్న గింజలను మ్రింగునట్లు, కాలుడు కూడా తన సంహార వ్యాపారము ద్వారా అనేక జగత్తులలోని నానావిధ ప్రాణులను మౌనంగా చప్పరించి వేస్తున్నాడు. అభిమాన సమన్వితులగు ఈ జీవాత్మల సమూహమంతా 'ఒక మహారణ్యం' అని అనుకొంటే, దీనిని పెంచి, పోషించి, ధ్వంసం చేసే యజమానే కాలుడు.

'కాలము' అనే ఏనుగుకు 'శుభాశుభ కర్మలు' అనే రెండు దంతములు ఉన్నాయి. వాటిచే జీవసమూహం చిగురుటాకువలె విచ్ఛిన్నం చేయబడుచున్నది.

**విరించిమూల బ్రహ్మాండ బృహద్దేవ ఫలద్రుమమ్**
**బ్రహ్మకాననమాభోగి పరమావృత్య తిష్ఠతి ॥** (XXIII-14)

ఈ 'బ్రహ్మాండము' అనుబడుదానికి మూలము బ్రహ్మదేవుడు (సమష్టి జీవుడు). దేవతలే (కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములే) ఫలములుగా గల బ్రహ్మాండవృక్షము స్వయముగా 'మాయ' అయి, బ్రహ్మమే ఉనికి స్థానంగా కలిగియున్నది.* ఈ గడుసరి కాలదేవుని విషయంలో మరొక చమత్కారం చెపుతాను వినండి. ఇతడు కార్యరూపంలో క్షణక్షణం భగ్నమగుచున్నప్పటికీ, కారణరూపంలో మాత్రం భగ్నుడు కాకుండానే ఉంటున్నాడు. ఒకచోట దహించబడుచున్నప్పటికీ, మరొకచోట, నిశ్చలుడై సుస్థిరంగానే ఉంటున్నాడు. ఒక విధంగా కనబడుచు మరొక విధంగా కనబడకయే ఉన్నాడు.**

❖

ఈ మనస్సు ఒక్క నిమిషంలో అనేక వస్తువులను, సంఘటనలను, రూపములను సంకల్పిస్తూ, త్యజిస్తూ ఉంటుంది కదా! అదేవిధంగా కాలము కూడా అనేక జగత్తులను ఒకవైపు సృష్టిస్తూ, మరొకవైపు మ్రింగివేస్తోంది. ఈ జగత్తుల ఆగమన నిష్క్రమణములను గమనించనట్టి ఈ జీవులు "ఈ శరీరమే మేము. ఇది పుష్టిగా ఉంటే మేము కూడా పుష్టిగా ఉంటాం. లేకుంటే లేదు. ఈ శరీరంలో ఏర్పడే అనుభవాలు, దీనితోపాటు ప్రాప్తిస్తున్న సంబంధాలు వాస్తవము" అను రూపముగల శరీర తాదాత్మ్య భావము పొందుచున్నారు. అవస్తువే అయివున్న ఈ దేహముతో ఐక్యభావము పొందుచున్నందుకు ఫలితంగా కాలుడు వారిని నిరంతరం స్వర్గనరకాదులందు త్రిప్పుచున్నాడు.

---

* ప్రతి శరీరము ఒక బ్రహ్మాండ నిర్మాణము యొక్క సంజ్ఞయే. అందుగల సంకల్ప తత్వము బ్రహ్మదేవుడుగా, ఇంద్రియములు దేవతలుగా ఇందలి జీవుడు (Absolute Experiencer) బ్రహ్మముగా వేదములలో వర్ణించబడింది.

** ఈ మూడు లక్షణాలు ప్రతి జీవునికి వర్తిస్తాయి.

1. అన్నిటికీ జీవునియొక్క శుద్ధ సత్తయే మూలకారణమై ఏమాత్రం భగ్నం కాకయే ఉంటోంది.
2. ఒకానొక చోట వాస్తవానికి అతడు నిశ్చలుడై జన్మకర్మలు లేనివాడై ఆత్మయే స్వరూపముగా కలిగియుంటున్నాడు.
3. అతని శరీరాదులను మనం చూడగలిగినా అతని వాస్తవ సత్త ఇంద్రియాదులకు కనుపించునది కాదు. మనం చూచే ఈ శరీరాదులు భగ్నము అయినా, ఆ శరీరములకు కారణమగు అతడు భగ్నము కాకయే ఉంటున్నాడు.

ఆహా! ఈ కాలుడు తృణమును, బూడిదను, కొండను, ఆకును, సముద్రమును కూడా కబళిస్తున్నాడే! ఇతని యందు క్రౌర్యము, లోభము, దౌర్భాగ్యము, చాంచల్యము దట్టంగా వ్యాపించి ఉన్నాయి. పసిబాలుడు బంతులతో ఆడుకొంటాడు చూచారా? అతడు కూడా సూర్యచంద్రులతో ఆడుకొంటున్నాడు. ప్రళయ సమయంలో జీవులందరినీ నాశనం చేసివేసి వారి అస్తులను ధరిస్తున్నాడు. ఇతని చర్యలను అడ్డగించగలిగే వారెవరు? ఒకప్పుడు అతడు రుద్రుడు, మరొకప్పుడు అతనికి రూపమే ఉండదు. ఒకే సమయంలో ఒకచోట సృష్టి, మరొకచోట సంహారం చేస్తూ ఉంటాడు.

'కాలము' అనే వృక్షం నుండి "దేవతలు – అసురులు" అనే పక్వ ఫలములు నేలరాలుచున్నాయి. 'బ్రహ్మాండములు' అనే కాయలు అనంత సంఖ్యలో కాస్తున్నాయి. ఆ కాయలపై వ్రాలే దోమలవంటి వారే ఈ జీవులు. "చిత్ప్రకాశము యొక్క సత్త" (ఏశుద్ధ తత్త్వమైతే 'స్వసత్త' కలిగియుండి 'తెలుసుకొనుట' అను ప్రకాశము స్వరూపముగా కలిగి ఉన్నదో. (That Absolute Self which is existence and Self -consciousness) సహాయంతోనే కాలుడు ఈ 'జీవులు' అనే రూపములు అవధరిస్తూ అనేక క్రియలు కల్పించుకొని, వినోదిస్తున్నాడు.

ఓ మహాత్మా! ఈ కాలుడు తుది–మొదలు లేని అనిర్వచనీయ వస్తువువలె వెలయుచున్నాడు. అతడు ఒకచోట కారునలుపు వస్తువులను (అజ్ఞానము, నైరాశ్యము, నిస్పృహ, నిష్క్రియత్వములను) మరొకచోట కాంతిమయ వస్తువులను (సుజ్ఞానము, ఉత్తమ ఆశయము, ఉత్సాహము, క్రియాచాతుర్యము) ఇంకొకచోట శూన్యమయ వస్తువులను (శుద్ధ సత్వమును) తనయందు తానే సృష్టించుకొనుచున్నాడు. తనదైన ప్రత్యేకమైన బాణిలో ఈ అనంత సంసారము యొక్క సారమైనట్టి "స్వకీయ సత్త"చే ప్రవర్తిస్తున్నాడు. వేలాది మహాకల్పములు ఎదురుగా గడచిపోతున్నా అతడు ఖేదముగాని, మోదముగాని పొందుటలేదు. దేనినీ చూచి ఆనందించడు, దేనినీ ఆదరించడు. ఏదీ స్థిరంగా కలిగియుండడు.

ఈ కాలము యొక్క స్థితిగతులకు ఆద్యంతాలు ఎక్కడ? ఇతడు అనాయాసంగా లభిస్తున్న "జగత్ సృష్టి" అనే క్రీడయందు నిరహంకారుడై తనను తానే పాలించుకొంటున్నాడు. తనకు తానే సూర్యకిరణ స్వరూపుడై నిర్లిప్తంగా, ఈ జగత్తంతా ఏమూల ఏమున్నదో సర్వదా చూస్తున్నాడు. సూర్యబింబ స్వరూపుడై అవిశ్రాంతంగా రేయింబవళ్ళను సృష్టించుకొంటూ పోతున్నాడు.

ఓ మహర్షీ! 'జగత్ సమూహములు' అనే దీర్ఘకథలో అతడు లోకపాలకులనే భక్షిస్తుంటే ఇక మేము ఎంతటి వారము చెప్పండి? ఆ కాలుడే జీవులను 'జగత్తు' అనే జీర్ణకుటీరంలో అమర్చి ఇంతలోనే త్రెంపి ప్రోగులు పెట్టుచున్నాడు. అత్యంత చపలుడై కాలగమనమును ప్రవహింప జేస్తున్నాడు. ఒకప్పుడు యౌవనమునకు చంద్రునివంటివాడై ఈ శరీరమును అలరించుచు, ఇంతలోనే సింహరూపుడై అవే శరీరములను కర కర నమిలివేస్తున్నాడు. 'కల్పాంతము' అనబడే ఒకానొక సందర్భంలో ప్రాణులన్నిటినీ సంహరించి "అభావ భావము" నందు ప్రకాశించుచున్నాడు. అట్టి అభావభావ* స్థితియందు ప్రవేశించినపుడు తన అధిష్ఠానమైయున్న స్వాత్మయందు (పరబ్రహ్మము

---

* అభావభావము = ఈ దృశ్యము గురించి భావనచేయకుండునట్టి (జీవునియొక్క) స్థితే 'కల్పాంతము'గా రామునిచే ఇక్కడ గ్రహించబడుతోంది.

నందు) రమించుచున్నాడు. ఒకప్పుడు శుభరూపంగాను, మరొకప్పుడు అశుభ రూపంగానూ ఎల్లవేళల, అన్నివైపుల మహాగోప్యంగా వెలయుచున్నాడు. ఆతనిని తెలుసుకో కలిగినవారెవరు? 'కాలము' కంటే మహత్తరమైనది, బలవత్తరమైనది ఎక్కడా, ఏదీ లేదేమో!

మహర్షీ! విశ్వామిత్రా! ఈ కాలము యొక్క విలాసం, ఇతని లీలలు అత్యద్భుతం. అతని పరాక్రమం అచింత్యమైనది. "పరబ్రహ్మము" అనే చక్రవర్తికి, 'మాయ' అనే అతని పట్టమహిషికి పుత్రుని వంటి  కాలస్వరూపుడు దీనులు, మోహితులు అయిన ప్రాణులను క్రీడామాత్రంగా వేటాడు చున్నాడు. 'ప్రళయము' అనునదే అతని ఉపాహారం. ఆ కాల రాజపుత్రుని భార్య 'చండి' అనబడే కాళరాత్రి సర్వభూత వినాశినియై ఈ జగత్తులో సంచరిస్తోంది.*

ఈ భూమి అంతా ఆ కాలుని చేతిలోని పానపాత్ర. మహా మహా దేవతలే ఇతనికి ఆహారమగుచుండగా, ఇక స్వల్పమైన ఆయుష్షు గల మా మానవుల మాన–మద గర్వాలు ఎంతటివి చెప్పండి? ఆ కాలుని ధనుస్సు నుండి నిరంతరం దుఃఖకారకములైన సంహారధ్వనులు వచ్చిపడు చున్నాయి. కాని మూర్ఖులగు అనేకమంది జనులు మాత్రం అదంతా పట్టించుకోకుండా, "ప్రక్కవారికంటే మేము అధికులమేనా? మాకు గొప్పదైన వస్తుజాలం లభిస్తోందా?" అని సరిచూచు కొంటున్నారు. అట్టి క్షుద్రజీవులమగు మమ్ము అతడు సర్వదా చమత్కారంగా వేటాడుచున్నాడు.

❖❖❖

## 21. క్రియా స్వరూపం - కృతాంత విలాసము

'కాలము' యొక్క ఉపాధి భూతమే "క్రియ". లోకాలన్నీ సృష్టించేది, సంహరించేది ఈ క్రియాతత్త్వమే. దీనినే 'దైవము' అని కూడా అంటున్నారు. ఈ క్రియా స్వరూపమునే వేదజ్ఞులు 'కృతాంతుడు' అనే సంజ్ఞచే పిలుస్తూ ఉంటారు. కర్మయొక్క ఫలమును ఉత్పాదనము చేయటమే ఈ 'కృతాంతుడు'**అనబడువానికి ఉన్న ఏకైక కర్తవ్యం. దట్టమైన మంచు సూర్యకిరణములచే కరుగుచున్నట్లు ఈ కృతాంతుని వలననే ప్రాణులు పుడుచున్నాయి. నశిస్తున్నాయి. ఈ కనబడే జగన్మండలమంతా అతని నృత్యశాలయే కదా!

ఈ కృతాంతుడు "క్రియ – ఫలితము" అనే భంగిమలను చూపుచూ కాపాలికా వేషం ధరించి నృత్యం చేస్తున్నాడు. పైకి అనురాగివలె కనిపిస్తూ అల్పబుద్ధులకు అర్థంకాని ఏదో నియతి (దీనికి ఇది ప్రయోజనము – అను నియమము fate, destiny)ని అనుసరిస్తూ జీవుల సుఖ దుఃఖాలకు కారకుడు అగుచున్నాడు. ఈ నియతిని అనుసరించే స్వర్గమర్త్య పాతాళ లోకములు, శుభాశుభములు, కలిమిలేములు కలుగుచున్నాయి. లౌకిక వైదిక కర్మలతో కూడిన ఈ ప్రపంచ రచన అతనిదే. బాలుడు విసుగు విరామం లేకుండా మట్టిబొమ్మలు చేస్తూ, నశింపచేస్తున్నట్లు, ఆ కృతాంతుడు

* కాలపురుషుడగు రుద్రుడు, కాళరాత్రి స్వరూపినియగు చండి (అనగా సృష్టి – ప్రళయములు)ల గురించి నిర్వాణ ప్రకరణంలో విస్తారంగా చర్చించబడినది.

** యముడు అను పురాణ నామముచే అష్టదిక్పాలకులలోని ఒకడుగా చెప్పబడుచున్నది ఈ కృతాంతుడే.

అసంఖ్యాకములగు జీవులను, వారివారి కర్మ వ్యవహారములను రచిస్తూ పోతున్నాడు. మరల ఆ కర్మల ప్రయోజనములను ప్రసాదిస్తూ సృష్టి ప్రళయములను సాగిస్తున్నాడు.

❖❖❖

## 22. దైవ విలాసం

నియతి – కృతాంతుడు – కాలుడు – మహాకాలుడు – వీరి సన్నివేశమే ఈ జగత్తంతా.

అట్టి విస్తార సంసారంలో ఏ మూలో స్వల్పాయుష్కులమై మేము అత్యంత అజ్ఞానముతోకూడి పడి ఉన్నాము. శరీరధారులమై ఈ దృశ్య ప్రపంచములోనికి ప్రవేశించియున్న మేము 'దైవము' అనబడే ఏమాత్రం గ్రహింపశక్యంగాని ఒకానొక శక్తిచే మోహితులు అవుతున్నాం. అట్టి దైవము అనుదానికి పూర్తిగా అమ్ముడుపోయి, తోలుబొమ్మలు ఆడించువాని చేతిలోని తోలుబొమ్మలవలె అస్వతంత్రులమై ప్రవర్తిస్తున్నాం.* వన్యమృగములవలె మూఢులమై సంచరించుచున్నాం.

దుష్ట చరితుడగు కాలుడు "సంహరించుట (ఎప్పటికప్పుడు దేనిని దానినే హరించుట)" అనే కార్యమునందు నిమగ్నుడై మమ్ములను నిరంతరం అనేక ఆపదల పాలు చేస్తున్నాడు. ఇక మేము తరంగాల వెంట పైకి క్రిందకు తేలియాడుతూ కదలుచుండే కొయ్యవలె కాలప్రవాహంచే, దాని ఇష్టము ననుసరించి దొర్లించబడుచున్నాం. ఎంత ఆలోచించినా అర్థంకానట్టి 'దైవము' అనబడు విషయం గురించి అత్యంత భయపడుతూ బ్రతుకుచున్నాం. మేము కల్పించుకొన్న మా దురాశలే మమ్ములను అగ్నిజ్వాలలవలె దహిస్తూ 'దైవము' అనే దానికి దాసోఽహం చేయిస్తున్నాయేమోనని అనుమానం.

మా బాల్య, యౌవన, వార్ధక్య దశలన్నీ అవిచక్షణాపూర్వకమైన, అర్థం–పర్థం లేని అనేక యత్నములచే గడచిపోతున్నాయి. ఏవేవో భయాలు, ఆశలు, ఉద్వేగాలు, మూఢత్వాలు మమ్ములను అణచిపెడుతున్నాయి. చివరకు జరాపతితులమై కాలునిచే మ్రింగబడుచున్నాము. ఈ కాలునికి ఉచితానుచితము లెక్కడ? సద్గుణుడు – దుర్గుణుడు కూడా అతనికి ఒక్కటే.

మా దౌర్భాగ్యం గమనిస్తున్నారా మునీంద్రా! "ఎంతో సుఖకరములు" అని తలచి అనేక ప్రయత్నములచే ప్రోగుచేసుకొన్న భోగములే కొంతకాలానికి మా పాలిట దుఃఖ హేతువులు అవుతున్నాయి. 'దైవము' యొక్క విలాసమేమిటో మేము ఏమాత్రం గ్రహించలేకపోతున్నాం.

ఒక్కసారి ఈ లోకాలన్నీ పరిశీలించి చూచినప్పుడు ఇవన్నీ దుఃఖకరములేనని నాకు అనిపిస్తున్నాయి. ఏవేవి పొందిన తరువాత ఈ జీవుడు 'నేను సుఖిస్తాను' అని అనుకొంటున్నాడో – అవన్నీ లభించినా అతడు ఏ వాస్తవమైన సుఖమును పొందకయే పోతున్నాడు. ఏది ఎట్లు జరుగబోవుచున్నదో, అదంతా దైవము యొక్క అధీనములో ఉండగా – జీవుడు దేనిని గురించి

---

* ఈ అఖండ రామాయణము జీవుడు ఎట్లు అస్వతంత్ర భావన పొందుచున్నాడో, కాని ఎట్లు వాస్తవానికి స్వస్వరూపాత్మ దృష్ట్యా స్వతంత్రుడో చెప్పటమే లక్ష్యముగా కలిగియున్నది.

సంతసించగలడు చెప్పండి? అయినప్పటికీ, అతనిలో ఏదో పొందాలనే తపన మాత్రం ఉండనే ఉంటోంది. అట్టి అంతర్గతమైన ఆరాటమును ఏవేవో ధన, జన, పేరు, ప్రతిష్ఠల వంటి వాటికొరకై చేసే ప్రయత్నములు అనే కాలయాపనతో కొద్దిసేపు కప్పి పెట్టినప్పటికీ – అతనియందు అంతర్గతమైన ఆవేదన సమసిపోవుటలేదు. ఓ మహర్షీ! ఏ ఏ పదార్థజాలమంతా మహదైశ్వర్యమని, మహద్భాగ్యమని, ఈ జీవులు భావించి ఆయా వస్తుజాలం పొందటానికి అనేక ప్రయాసలతో కూడిన ప్రయత్నములు చేస్తున్నారో, అవన్నీ కూడా నా ఉద్దేశంలో తుచ్ఛమే అయివున్నాయి. "సత్యదృష్టి, దూరదృష్టి, పరిశీలనాత్మక దృష్టి" లేకపోవుటచేతనే ఈ జీవుడు అనేక మోహములను పొందుతూ, అత్యంత ప్రయాసపడుచున్నాడు.

**ఆయురత్యంత చపలం, మృత్యురేకాంత నిష్ఠురః ।**
**తారుణ్యంచాతి తరళం, బాల్యం జడతయాహృతమ్ ॥** (XXVI-9)

ఈ ఆయువును చూద్దామా – అత్యంత చపలమైనది. మృత్యువా, – అల్లంత దూరంలో, అత్యంత క్రూరంగా ఎదురు చూస్తోంది. ఈ జీవుడు 'యౌవనము' అనే అందమైన, తెలివైన మోసకత్తెను చూచి, మాన–మద–గర్వాదులు పొందుతూ క్షణంలో విచక్షణ కోల్పోతున్నాడు. కాని యౌవనం శాశ్వతమా? కాదు. అది వాస్తవానికి క్షణికం. బాల్యం చూద్దామా, అది దట్టమైన అజ్ఞానంతో కప్పివేయబడి ఉంటోంది. ఈ లౌకిక విషయాలు చూస్తే, ఇవన్నీ అనేక విషయానుసంధానములచే కళంకితమై ఉన్నాయి. ఈ బంధువులు, ఈ మిత్రులు, ఈ స్వజనులు, ఈ పరిజనం, ఈ పరిచయాలు – ఇవన్నీ బంధాలేకాని, వాస్తవమైన సుఖమును, ప్రశాంతతను ప్రసాదించేవి కావు. ఈ భోగములు మహారోగముల ప్రతిరూపములు మాత్రమే. "ఎప్పటికో, ఎక్కడో, ఏదో పొంది సుఖించబోవుచున్నాను" – అను రూపముగల వ్యవహారమంతా "జింక దాహంతో పరితపిస్తూ అల్లంత దూరంలో గల మృగతృష్ణాజలం చూచి గంతులు వేయటం" వంటిదే.

❖

ఈ దైవము, లేక కాలగతి యొక్క చర్యలు ఎంత ఆశ్చర్యంగా చమత్కారంగా ఉన్నాయి! 'ఇంద్రుడంతటివాడు కూడా మృత్యుముఖమున పడుచున్నాడు. సర్వమును నిర్దేశించే యముడు నియమించబడుచున్నాడు. వాయువంతటివాడు ఒక రోజుకు ప్రాణహీనుడగుచున్నాడు. చంద్రుడు ధూళిగా మారిపోవుచున్నాడు. సూర్యుడు ఖండ ఖండములగుచున్నాడు. అగ్ని ఆరిపోవుచున్నాడు. విరించి వీగిపోయి, నామరూపాలు కూడా లభించకుండా అగుచున్నాడు. హరి అంతటివాడు హరించుకు పోవుచున్నాడు. భర్గుడు భస్మమగుచున్నాడు. కృతాంతుడు కాలునిచే మ్రింగబడుచున్నాడు. కాలుడు మహాకాలుని యందు విలయమైపోవుచున్నాడు. ఏ అనివార్య నియతి (Inevitable and indespensable destiny) దుస్సవహమై ప్రవర్తిస్తోందని అందరు అనుకొంటున్నారో, అట్టి నియతికూడా విలయించిపోతోంది. ఆకాశమే నిరాకాశమై వినాశనమగుచున్నది. ఇక తుచ్ఛ శరీరధారులమగు మాబోటివారి గురించి ఏమని చెప్పమంటారు? మాకు ఆలంబనం ఎక్కడిది?

హే మహాత్మా! ఇదంతా చూస్తుంటే నాకు ఒక్కటే అనిపిస్తోంది. అచింత్యమైన శక్తిరూపమగు 'అజ్ఞాతమూర్తి' ఏదో ఉన్నది. అట్టి అనిర్వచనీయమగు తత్త్వము వినుటకుగాని, చూచుటకుగాని, మాట్లాడుటకుగాని ప్రాప్తమయ్యేది కాదు. అయ్యది ఈ చక్షువులు మొదలైన సర్వేంద్రియములకు అగోచరము, అలభ్యము. అట్టి మహత్తర అజ్ఞాతమూర్తి తనంతట తానే, తనయందు, తనమాయచే – స్థూల సూక్ష్మ భూతములతో కూడిన విశ్వమునంతటినీ కనబడేట్లు చేస్తోంది. ఆ మహాద్భుత అజ్ఞాత వస్తువును అధిగమించేదేదీ ఈ ముల్లోకములలో ఎక్కడా లేనేలేదు. అదియే అహంకార రూపమున సర్వత్రా వెలయుచున్నది.

ఆ పరమ వస్తువుచే నిర్దేశింపబడుట చేతనే సూర్యుడు ఆకాశంలో ప్రభవిస్తూ రాత్రింబవళ్ళు నిర్మిస్తున్నాడు. ఆ పరతత్త్వ ప్రభావం చేతనే అనేక జీవ–గుణ ప్రదర్శనములచే ఆశ్రయించబడినట్టి ఈ భూగోళం ఉనికిని కలిగియున్నది. అదియే జ్యోతిశ్చక్రమును (నక్షత్ర మండలమును) ఆవేష్టించి నడిపిస్తోంది. ఆ పరమ పురుషుడు మనస్సుకు వాక్కుకు అతీతుడై, సర్వదా సర్వమై, అత్యంత మౌనస్వరూపుడై ఉన్నాడు. ఆయన తన తలపులతో సంకల్పించినంత మాత్రం చేతనే స్వర్గమున దేవతలు, భూలోకమున ఈ మనుష్యులు, పాతాళ లోకమున పాములు ప్రతిష్ఠితమౌతున్నాయి. దురాచారి అయిన మన్మథుడు కూడా ఆ ప్రభువుయొక్క అనుగ్రహంచేతనే బలిమిని సంపాదించి, ఈ లోకులను ఏలుచు, తన పరాక్రమం ప్రదర్శించుచున్నాడు. లేకుంటే ఆతడు వసంతఋతువులో పుష్పభరిత ప్రకృతి సమేతుడై మనస్సులను చలింపజేయ గలుగుతాడా? చిత్రం! ఈ విధంగా ఆ అప్రతిహత అజ్ఞాతమూర్తి నుండి శక్తిని పొందిన మన్మథుడు తన దుశ్చర్య ప్రభావంచేత, మహా వివేకులను కూడా ప్రియాంగనల వ్రేళ్ళను, కుచ్చెళ్ళను చూచి చిత్తభ్రమ పొందేట్లు చేస్తున్నాడు కదా!

**పరోపకార కారిణ్యా, పరార్తి పరితప్తయా,**
**బుద్ధ ఏవ సుఖీమన్యే, స్వాత్మ శీతలయాధియా ॥** (XXVI-39)

స్వామీ ఎవరైతే పరోపకారపారాయణులై ఉంటారో, ఇతరుల కష్టములు తమ వంటివేనని అనుకొని పరితపించుతారో, బుద్ధిబలంచేత తత్త్వజ్ఞానమును సంపాదించి స్వాత్మ యందే రమిస్తూ ఉంటారో … అట్టి మహనీయులే ధన్యులు. వారే ఈ మాయా జగత్తు నందు ఉత్తమమైన సుఖమును పొందుచున్నారని నాకు అనిపిస్తోంది. ఇక మిగతా వారి విషయమేమిటంటారా? వారి వలన వారికి గాని, ఇతరులకు గాని కలిగే లాభమేమున్నది చెప్పండి?

ఈ మనుష్యులలో అనేకులు మోహవశంచేత 'జీవనము' అనే మహారణ్యంలో చిక్కుకున్నారు. అనేక స్వకీయకల్పనలచే దురాచారములచే వేధింపబడుచున్నారు.

ఓ మహర్షీ! ఈ జనులంతా మరల మరల పుడుతున్నారు. చచ్చుచున్నారు. అనేక కర్మలు ఆచరిస్తున్నారు. స్వల్ప లభ్యములచే, స్వల్ప ఆశలచే, స్వల్ప క్రియలచే మరల మరల ఆయుర్దాయం వ్యర్థం చేసుకొంటున్నారు. వారు కోరుకొనే ఫలములన్నీ చివరికి వారికే ఉరిత్రాళ్ళుగా

పరిణమిస్తున్నాయి. మూర్ఖపు కార్యక్రమములను ప్రారంభించి, వాటినుండి ప్రాప్తిస్తున్న ఫలితముల నుండి మరికొన్ని కార్యక్రమములను స్వీకరిస్తూ – ఈ విధంగా అనేకసార్లు చేసినదే చేయుచు జన్మ పరంపరలు గడుపుచున్నారు. ఈ దుఃఖములకు అంతు ఉండటంలేదు. అయితే వివేకులు, జ్ఞానులు అయినట్టి వారికి మాత్రం, అవిద్యాజనితమైన సర్వకామ్య కర్మములు, వాటి ప్రయోజనములు తుచ్ఛంగానే ఉంటున్నాయి.

ఈ ప్రపంచంలోని అమాయిక జనులయొక్క సంచార వ్యవహారమంతా గమనించారా మునీంద్రా! "నేడు ఈ ఉత్సవం. ఇప్పుడు ఈ ఋతువు. ఈ రోజు ఈ ఊరుపోవాలి. ఆ రోజులలో యాత్రలు చేయబోతున్నాం. ఈ నా పిల్లల వివాహాలకోసం వేచియున్నాను. వీరంతా నా బంధువులు. ఇది సుఖం. ఇవి సరదాలు. ఈ విరామ సమయంలో ఈ ఆటలు ఆడుకొంటాం. ఈ విషయభోగాలు మేం పొందాలి. వీరి వలన నాకేం లాభం?" ఇత్యాది మిథ్యాకల్పనలన్నీ కల్పించుకొంటూ మేమంతా ఆ కల్పనలలో బద్ధులం అవుతున్నాం. చపల చిత్తము విజృంభిస్తూ ఉండగా, ఏది సత్యమో, ఏది నిత్యమో గ్రహించలేకపోతున్నాం.

❖❖❖

## 23. మనోవృత్తులు - అశాంతి

పైకి మాత్రమే మనోహరంగా కనిపించే ఈ కుత్సిత ప్రపంచంలో వాస్తవమైన మనశ్శాంతి కలిగించగలిగే వస్తువులు ఏమి ఉన్నాయి? బాల్యమంతా, కల్పిత క్రీడామయమే కదా! 'యౌవనం' అంటారా, స్త్రీ సాంగత్యం, స్వోత్కర్షలవంటి అనేక దురహంకార చర్యలతో నిండినదై కృశించిపోతోంది. ఇక ముసలితనం ప్రవేశించిందా, అన్నీ కష్టాలే. ఈ విధంగా ఈ జనులు వ్యర్థ జీవనులగుచున్నారు. ఈలోగా మృత్యువు వచ్చి వడలిన శరీరమును నోటకరచుకుపోతోంది. అప్పుడా జీవునికి ఇహలోకంలో శూన్యమే శేషించుచున్నది.

ఈ జీవుడు జీవించుచున్నంతకాలం "నా వయస్సు పెరుగుతోంది" అని సంతోషించుచున్నాడే కాని, "అయ్యో! నా ఈ ఆయుష్షు తరిగిపోతోంది కదా! ఇప్పటి వరకు స్వస్వరూపము విషయమై నేను గ్రహించినదేమిటి? ఇక ఇక్కడి నుండి ఏమి చెయ్యాలి? ఏ మార్గం అన్వేషించాలి? ఏ జ్ఞానులతో సంభాషణ చేయాలి" అని తలచుటయే లేదు. ప్రయత్నశీలుడు అగుటలేదు.

తృష్ణ అనుక్షణం సంతోషమును తన పొట్టన పెట్టుకొంటోంది. పంచేంద్రియములు తమ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తూ వివేక రత్నములను మఱుగున పడవేస్తున్నాయి. భ్రమాత్మకమగు సంసార క్రీనీడలు బ్రతుకంతా ఆక్రమించి వేస్తున్నాయి. తృష్ణ యందు యథేచ్ఛగా సంచరిస్తున్న ఈ మనస్సు ఈ జీవుని ప్రయోజనరహితంగా పరిభ్రమింప చేస్తున్నది. కాలమంతా వ్యర్థమైపోతోంది. ఉత్తమమైన ఫలితమేదీ లభించుటయే లేదు. ఆపదలకు శోకించనట్టి, సంపదలకు మత్తిల్లనట్టి, యువతులను చూచి విచలించనట్టి చిత్తము పొందగలిగిన వాడే ఈ జగత్తులో ఉత్తముడని నా అభిప్రాయం.

హే మునిశ్రేష్ఠా! యుద్ధరంగంలో గజ తురగములతో కూడిన గొప్ప శత్రు సైన్య సముద్రాన్ని ఎదుర్కొనేవాడు నా ఉద్దేశంలో గొప్ప శూరుడు కాదు. అనేక మనోవృత్తి తరంగాలతో విక్షిప్తం అగుచున్న ఈ ఇంద్రియములను జయించినవాడే వీరుడు. దురాశలే మానవుని నిజమైన శత్రువులు. దురాశాగ్రస్తమైన మనస్సును శాంతపరచగలిగే పదార్థములు ఈ ప్రపంచములో ఏమి ఉన్నాయి? దురాశకు అంతు ఎక్కడ?

కీర్తి, ప్రతాపం, సంపద ఉన్నచోట సత్వగుణం, వివేకం ఉండటం దుర్లభమైన విషయమే అగుచున్నది. ఓయీ! మానవుడా! పర్వతగుహలో ఉన్నా, లేక వజ్రనిర్మితమైన అంతఃపురంలో దాగినా – అదృష్టానుసారంగా వచ్చే సంపదలనుగాని, ఆపదలనుగాని నిరోధించగలమా? లేదు కదా! మరి "ఈ ధన, దార, పుత్రాదులు మధుర రసాయనములు" అని ఎందుకు భ్రాంతిని పొందుచున్నావు? ఈ సంపదలన్నీ జీవించి ఉన్నంతకాలం 'అజ్ఞానము' అనే మూర్ఛను కల్పిస్తున్నాయి. శరీరం త్యజించు క్షణంలో కూడా "ఇవన్నీ నావి. వీటిని విడచి ఎట్లుండటం?" అని మమకారముల రూపములలో దుఃఖములకే కారణమౌతున్నాయి. మరి అవి ఉత్తమ విషయములు ఎట్లా అవుతాయి? వాటిపై అంతటి నమ్మిక ఎక్కడి నుండి వచ్చిపడుతోంది? మృత్యువు శరీరమును ఆక్రమిస్తున్నప్పుడు ఈ భార్య, పుత్ర, బంధు, మిత్ర పరివారాదులు ఎందుకు పనికివస్తాయి?

❖

ఈ జీవుడు అవసానకాలంలో విషాదకరములైన అవస్థలు పొందటమే జరుగుతోంది. విషణ్ణుడై, తాను ఒనర్చియున్న పాపపు పనులను నెమరు వేసుకొంటున్నాడు. తాను మమకారం పెంచుకొన్న వాటినన్నిటిని మననం చేస్తూ, అంతరంగంలో దహించి వేయబడుచున్నాడు. ధర్మమునకు అనుకూలం కానట్టి అర్థ కామములకై జీవితమంతా వెచ్చించిన వారి మనస్సు అవసానకాలంలో నెమలి పింఛపు తుదిభాగంలాగా చంచలమే అవుతుందని విజ్ఞులగు పెద్దలు చెప్పుచున్నారు. మరి అట్టి మనస్సును అతడు ఎట్లా సముదాయించుకొంటాడు చెప్పండి?

దుష్కర్మల ఫలితాలు ఇట్లా ఉండగా, సత్కర్మ ఫలములు కూడా పడిలేచే నదీ తరంగాలవలె క్షణభంగురములే కదా! సంచితములైన సత్కర్మలు కూడా మృత్యు ముఖంలో ప్రవేశించువానికి శాంతిని కలుగచేయలేకపోతున్నాయి. ఇక జీవించి ఉన్నప్పుడు కూడా దైవవశాత్తు అట్టి సత్కర్మలు ప్రారబ్ధముగా (వర్తమానములో అనుభవించవలసినవిగా) ప్రాప్తించినప్పటికీ, – దేహాత్మబుద్ధి కలవారికి ఆ భోగములన్నీ శాశ్వతమైన తృప్తిని అందించగలవా చెప్పండి? కట్టెలసంఖ్య పెరిగినకొద్దీ అగ్నిజ్వాలలు అధికమే అవుతాయి కదా! ఆహా! "ఈ రోజు ఇది చేస్తాను. ఆ రోజు అది చెయ్యాలి" – ఇట్లు అవిశ్రాంతంగా చింతన చేయు మనుజుల ఆయా కర్మప్రయాసలన్నీ చివరికి ఏ రూపంగా చూచినా దుఃఖపరంపరలుగానే పరిణమిస్తున్నాయి. ఇటువంటి ప్రయత్నములు చేయుటలోను, పుత్ర–మిత్ర–కళత్రాదులను సంతోషపెట్టడంలోను కాలమంతా ఎంత ఘోరంగా వ్యర్థం అయిపోతోంది! ఇక, ముదిమి (old age) దాపరించిన తరువాత, ఉన్న కొద్దిపాటి వివేకము కూడా ఊడ్చిపెట్టుకు

పోతోంది. చెట్టుకు ఆకులు చిగురించి, కాలక్రమంగా ఎండి రాలిపోతాయి చూచారా? ఈ ప్రపంచంలో కూడా వివేకహీనులగు వారు జన్మిస్తున్నారు. మరల శీఘ్రంగా నశించుచున్నారు.

**ఇతస్తతో దూరతరం విహృత్య , ప్రవిశ్యగేహం దివసావసానే**
**వివేకి లోకాశ్రయ సాధుకర్మ రికేఽహ్నిరాత్రౌ! క ఉపైతి నిద్రామ్?** (XXVII-19)

నాకు ఒక విషయం చూస్తుంటే చాలా విచిత్రం అనిపిస్తోంది. ఈ జనులంతా ఏవేవో కార్యక్రమములను రచించుకొని, అందు నిమగ్నులై పగలంతా అటూ-ఇటూ తిరుగుచున్నారు. వివేకులను ఆశ్రయించకుండానే, సత్కర్మలను నిర్వర్తించకుండానే సాయంకాలానికి ఇల్లు చేరుకుంటున్నారు. రోజంతా ఏ వివేకము పొందకుండానే గడచి పోతోంది కదా! ఇక వారికి రాత్రిపూట నిద్ర ఎట్లా పడుతోంది? ఒక రోజు వృథా అయినందుకు చింతించరేం?

ఒకానొకడు అతి ప్రయాసతో శత్రువులందరిని జయించి వేస్తున్నాడు. పుష్కలంగా ధనాదులను సంపాదిస్తున్నాడు. సుఖకరములనుకొన్న పదార్థజాలమంతా చేకూర్చు కొంటున్నాడు. సరిగ్గా, అట్టి సమయంలో, ఎక్కడినుండో వార్ధక్య - మృత్యుదేవతలు వచ్చి ఎదురుగా నిలబడి "నాయనా! అయినదా? ఇక బయలుదేరుదామా?" అని పలుకరిస్తున్నాయి.

ఇక ఈ ఇంద్రియముల విషయానికి వస్తే, ఇవన్నీ కొంతకాలం జీవుడిని అలరిస్తున్నట్లే కనిపించుచు, ఇంతలోనే శిథిలత్వం పొందుతున్నాయి. అతి స్వల్పకాలంలో నిర్వీర్యమైపోతున్నాయి. తుచ్ఛరూపంగానే వృద్ధి చెందుతూ ఈ జీవుడిని విషయ లంపటములలోనికి త్రోసివేస్తున్నాయి. ఆహా! చిత్రం గమనించారా? వీటికి చిక్కిన ఈ జనులు ప్రక్కనే ఉన్న మృత్యువును కూడా ఏమాత్రం గమనించటం లేదు. కర్మపాశముచే బంధింపబడినవారై, యజ్ఞమునకు తేబడిన మేకలవలె అనేక జన్మ పరంపరలకు ఆహుతి అయిపోతున్నారు.

అయితే, ఉత్తములగు తత్త్వజ్ఞానుల విషయం మాత్రం ఆ విధంగా లేదు. వారు ఈ కర్మ పాశబంధములన్నీ విడనాడి ఆత్మయందే తమ ధ్యేయము కలిగి ఉంటున్నారు. కనుక వారి ఉత్తరోత్తర జన్మలు ప్రశాంతము, ఆనందము, జన్మ కర్మ బంధరహితము అయినట్టి ఆత్మానుభవమువైపే సంధింపబడి ఉంటున్నాయి.

ఓ విశ్వామిత్ర మహర్షీ! క్షణభంగురములైన కెరటాలవలె ఈ జన సమూహమంతా ఎక్కడి నుండి, వస్తున్నారు? ఎటు వెళ్ళుచున్నారు? చెప్పగలిగేదెవరు చెప్పండి? అనేకులు ఈ విషయమే యోచించకుండా ఎదురుగా ఉన్నట్టి క్షణికములైనట్టి స్త్రీ, ధన, జనాది వ్యవహారములందే దృష్టి పెట్టి, ప్రాప్తించబోవు దుస్థితులను గుర్తించుటకు ప్రయత్నించుట లేదు. వివేకము సముపార్జించ నందుకు పర్యవసానం దుఃఖ మోహములే కదా!

ఓ మానవుడా! ఈ స్త్రీలోలుత్వము కాలకూట విష వృక్షమునకు వ్రేలాడే పక్వమైన పండువంటిదేనని నీవు ఎందుకు గుర్తించటం లేదు? తుచ్ఛమైన పై పై సౌందర్యములు స్త్రీ పురుషులను

ఆకర్షించి వివశులను చేస్తున్నాయే? ఏది నిత్యమో, ఏది సత్యమో, అద్దానిని కనబడకుండా చేస్తున్నాయే? ఇంతా అయితే, ఈ శరీరములన్నీ రక్తమాంస నిర్మితములేకదా!

❖

**ఉత్సవ జనసమాగమం :** ఈ మూల నుండి కొంతమంది, – ఆ మూల నుండి మరికొంతమంది – ఏదో ఋణానుబంధం చేత కాబోలు, వచ్చి ఒక చోటికి చేరుతున్నారు. ఇదే బంధు – మిత్ర – పుత్ర – కళత్రాదుల సమాగమమంతా! ఉత్సవ సమయంలోని జనుల సమాగమము వంటిదే ఇది. ఓయీ! జీవుడా! ఇది చూచి నీవు ఎందుకు భ్రమిస్తున్నావు? ఎక్కడి నుండో జలప్రవాహమునకు కొట్టుకువచ్చిన కట్టెలవలె వచ్చి చేరిన వీరందరు అదృష్టానుసారం ఒకరికొరకై మరొకరు కొన్ని కార్యములను నెఱవేర్చటం జరుగుతోంది. కాని ఇందులో – ఎవరి లక్ష్యం, ఆర్తి, కార్యక్రమం – వారిదేకాని, ఒకరితో మరొకరు సంబంధించినవారే కాదు. "మనం మరొక జన్మలో కూడా ఇలాగే ఉందాం. స్వర్గ మర్త్య లోకాలలో మరల మరల కలుసుకొందాం" – అని జనులు అనుకునేదంతా కూడా భ్రమలాగానే ప్రాప్తిస్తోంది. ఎవరికి, ఎప్పుడు, ఎటు, ఏ విధమైన ప్రయాణం ప్రాప్తించనున్నదో, ఎవరేం చెప్పగలరు? కానీ, ఈ బహుదూరపు బాటసారులంతా ఒకరికి మరొకరు సర్వస్వమైనట్లు కబుర్లు మాత్రం చెప్పుకొంటున్నారు. అహంకరించు కొంటున్నారు. వాదులాడుకొంటున్నారు. కీచులాడుకొంటున్నారు. వివిధ కాలయాపనల రూపమున ఉన్నట్టి ఈ కార్యక్రమముల వ్యవహారమంతా ఎందుకు జీవుణ్ణి భ్రమింప చేస్తోంది? ఆలోచన, విమర్శ, పరిశీలన మొదలైన యుక్తులు కలిగి ఉండి కూడా అతడు ఇదంతా ఎందుకు గమనించుట లేదు? మహర్దశ–దుర్దశ, స్నేహము–ద్వేషము, స్థిరత–అస్థిరత మొదలైనవాటితో కూడుకొని కనబడుచున్న ఈ సంసారమంతా నాకు మాత్రం ఆరిపోవుటకు సిద్ధంగా ఉన్న దీపమువలెనే అనిపిస్తోంది. వినాశనము తప్పించి, ఇందులో నాకు సారమైనదేదీ కనిపించటం లేదు. ఒకానొక చక్రమువలె ప్రవృత్తమగుచున్న ఈ సంసారమంతా వాస్తవానికి వర్షాకాలపు జలబిందువు లాగా క్షణభంగురమే కదా! అయినప్పటికీ, అజ్ఞానియొక్క మనస్సుకు మాత్రం ఇదంతా వాస్తవమే అయినట్లు తోచుచున్నది. "ఆహా! ఈ వర్తమాన స్థితిగతులు ఎంతగానో నిజమై నాకు ప్రాప్తిస్తున్నాయి" అనే అతడు అనుకొంటున్నాడు.

ఈ శరీరం, ఈ యౌవనం, ఈ సుగుణ–దుర్గుణములు, ఈ గౌరవాగౌరవములు, ఈ పటాటోపములు – ఇవన్నీ కూడా ముదిమి (old age) అనుదాని ప్రభావంచేత వినష్టమై పోతున్నాయి కదా! ఇక ఈ చిత్తమును సంతోషింపచేయటం అసంభవమేనని నాకు అనిపిస్తోంది.

మహర్షీ! అటు ఆ మహావృక్షమును చూడండి. అది అదృష్టవశం చేత జన్మించింది. బాటసారులకు నీడను ప్రసాదిస్తోంది. పుష్పఫలాదులచే లోకానికి ఎంతో ఉపకారం చేస్తోంది. కాని, ఏం లాభం చెప్పండి? తాను ఎంతో సుఖింపచేసే ఈ జనులే ఒక గొడ్డలితో క్రూరంగా నరికివేస్తున్నారు. ఇక ఈ జగత్తులో దేనిని, ఏ విధంగా, ఎంతవరకు నమ్మి ఉండమంటారు? జనులతో ఏర్పడుచున్న సంసర్గమంతా అతి దుష్ట స్వభావమే కలిగియుండి, చివరికి వినాశనమే పర్యవసానముగా కలిగి ఉంటోంది. మోహమునే ప్రసాదించటం జరుగుతోంది.

వర్తమానం భారంగాను, దీర్ఘంగాను కనబడవచ్చునేమో కాని, మానవుని ఆయుష్షు ఎంత స్వల్పమైనది? అందులో మార్పుచెందుచున్నట్టి ఎన్నెన్ని దశలు? మానవుల జీవితకాలం దృష్ట్యా చూచినపుడు, బ్రహ్మ, యముడు మొదలైన లోకపాలకుల ఆయువు అధికంగానే కనబడవచ్చుగాక. కాని, కల్ప సమూహములను దృష్టిలో పెట్టుకొన్నప్పుడు, వారు కూడా క్షణమాత్రజీవులే కదా! అనేక క్షణముల సమన్వయమైనట్టి ఈ విచిత్ర కాలచక్రంలో ఆయువు యొక్క హెచ్చుతగ్గులు కూడా మిథ్యామాత్రములేనని నాకు అనిపిస్తోంది. తండ్రీ! విశ్వామిత్రా! దోషదృష్టి లేనట్టి, దుఃఖ తాపములు ప్రాప్తించనట్టి 'చోటు' ఎక్కడ? మాయకానట్టి క్రియలేమి ఉన్నాయి? ఏది పొందిన తరువాత, ఇక పొందవలసినదంటూ ఏమీ ఉండదు?

❖

పర్వతములన్నీ పాషాణమే కదా! భూమి అంతా మట్టి మాత్రమే. వృక్షములన్నీ కొయ్యకాక మరేమి? మనుష్యులంతా మాంసమయములే కదా! అసలు ఇక్కడ అపూర్వమైనదంటూ ఏమి ఉన్నది? ఈ కనబడే పదార్థములు, వాటి వికారములు – వాటియొక్క మూలకారణము కంటె వేఱైనవి కావు. మూలకారణమగు పరబ్రహ్మము నందే ఈ వివిధ నామరూపముల వ్యవహారం సంజ్ఞామాత్రంగా అనుభవమౌతోంది. ఆయా పదార్థ జాలమునకు లీలాభూమి అయినట్టి ఈ మిథ్యాజగత్తు అవివేకులకు మాత్రమే ఘనీభూతమై ప్రాప్తించుచున్నది. వివేకులు ఇదంతా పంచభూత వికారంగానే ఎఱుగుచున్నారు. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము రకరకాల పాళ్ళలో కలిసి "ఇదిగో..,ఇది గోవు, ఇది ఇల్లు, ఇది మనుజుడు" అను దృశ్య వ్యవహారమంతా ప్రత్యక్ష మగుచున్నదని వారు గ్రహిస్తున్నారు. ఏది ఏమైతేనేం? అనేకులు తమ స్వప్నమునందు కూడా సుఖదుఃఖాది అనుభవములన్నీ అత్యంత వాస్తవములైనట్లే అనుభవమును పొందుచున్నారు. మహాబుద్ధిమంతులైన వారు కూడా అనేక భావాభావములు పొందుచు ఇందు తగుల్కొనుచున్నారు. అజ్ఞాన వశంచేతనే మిథ్యారూపములైన వాటియందు ఇంతటి నిశ్చయం ఏర్పడుతోంది. నిజానికి అత్యంత స్వల్ప విషయములైనట్టి ఈ ఇంద్రియానుభవములు, ఈ ధనములు, ఈ గృహములు – ఇందుకోసమే బ్రతుకుచున్నట్లు ఇవే జీవితమందలి మహత్తర విషయములైనట్లు – కల్పన గావించబడుతోంది. ఇట్టి అనేక సంకల్ప వికల్పములతో బాల్యయౌవనాలు వృథా అయిపోతున్నాయి. వార్ధక్యం వచ్చేసరికి, అప్పుడిక ఈ మానవుడు ఏమీ చేయకుండానే ఉండిపోతున్నాడు. చివరికి, అతనికి స్వస్వరూపమునకు సంబంధించిన సమాచారమేమీ లభించకుండానే పోతోంది. ఇక నిరంతరమైన ఆత్మతాదాత్మ్యము లభించేది ఎప్పటికి? ఎన్ని జన్మలకు?

**ఆదాతుమిచ్ఛన్ పదముత్తమానాం స్వచేతసైవాపహతోఽద్య లోకః ।**
**పతత్యశంకం పశురద్రికూటా, దానీలవల్లీ ఫలవాంఛయైవ ॥** (XXVII-37)

పశువులు, మేకలు పచ్చటి ఆకులమీద దృష్టితో కొండయొక్క అంచుదాకా పోయి,

చూచుకోకపోవుటచే అప్రయత్నంగా లోయలోకి పడి కూలిపోతాయి చూచారా? అదేవిధంగా మూఢజనులమగు మేము రాజ్య, ధన, గృహాది భోగములను సంపాదించాలని మా శక్తియుక్తులన్నీ కూడగట్టుకొని ప్రయత్నిస్తూ పోతున్నాం. మా చిత్తము రాగ లోభాది దుర్గుణములచే దూషితమైపోతోంది. అట్టి దుష్టచిత్తముచే వేధించబడినవారమై అధఃపతితులమౌతున్నాం. అజ్ఞానులమగు మాయొక్క జీవితములు ఇంద్రియ వ్యాపారములకే పరిమితమై వృథా అవుచున్నాయి. ఇక మాకు దిక్కేమిటి? మా గుణములు, యుక్తులు, తెలివితేటలు, శరీర సౌందర్యాలు ఎందుకు పనికివస్తాయి చెప్పండి? మా గురించి మేము ఎరుగము కదా!

ఈ జనులలో కొందరు దయ, దాక్షిణ్యము, విద్య, వినోదము మొదలైన చిత్త వృత్తులు కలిగి ఉంటున్నారు. మరికొందరో..., క్రోధ లోభాది నిష్ఠూరములైన వృత్తులతో ఈ భూమిపై సంచరిస్తున్నారు.

హృదయవిహీనుడగు ఆ బ్రహ్మదేవుడు ఈ దృశ్యమునందు అనేక వస్తువులను, వ్యవహారములను కల్పించుచున్నాడు. అవన్నీ పైకి రమణీయంగా ఉండవచ్చు. కాని, వాటి పరిణామం మాత్రం భయమును, ఉద్వేగమును, దుఃఖమును, అశాంతిని ప్రసాదించేదిగానే ఉంటోంది. అట్టి అనేక నూతన కార్యక్రమములన్నీ దోషయుక్తము లైనప్పటికీ, అవివేకులమగు మేము అనుక్షణం మోహం చెందుచున్నాం. వివేకులగు జ్ఞానులు మా అగచాట్లను చూచి నవ్వుకొంటున్నారు.

అనేకమంది జనులు నిరంతరం అనేక కుటిల యత్నములను ఆశ్రయిస్తూ విషయములందే ఆసక్తులై ఉంటున్నారు. మాయందు ప్రజ్ఞ కొఱవడి ఉండుటచే కాబోలు, మేము వివేకులగు జ్ఞానులను గుర్తించలేకపోతున్నాం. ఇక జీవితం ఎట్లా గడపాలో నాకు అర్థమగుటలేదు.

❖❖❖

## 24. స్థిరాస్థిరములు - స్థితిగతులు

**యచ్చేదం దృశ్యతే కించిజ్జగత్ స్థావర జంగమమ్**
**తత్సర్వమస్థిరం, బ్రహ్మన్! "స్వప్నసంగమ సన్నిభమ్" ॥** (XXVIII-1)

ఈ కనబడే స్థావర జంగమాత్మకమగు జగత్తంతా కూడా స్వప్న సంగమమువలె అస్థిరమైనదే కదా? ఈ రోజు ఆకాశమునంటే మహారణ్యం, రేపటికి నేలమట్టమై పోతోంది. నేడు సముద్రమువలె కనబడుచున్న పెద్ద అఖాతం, ఒకనాటికి పెద్ద పర్వతమగుచున్నది. ఏ శరీరమైతే ఇప్పుడు పట్టువస్త్రములచే, గంధ లేపనములచే, సుకుమార పూలమాలలచే అలంకరింపబడి అనేకుల దృష్టిని ఆకర్షించుచు సంచరిస్తోందో – అదే శరీరం కొలది రోజులకు వస్త్రవిహీనమై ఊరికి దూరంగా గల ఒక గుంటలో పారవేయబడి, అక్కడ శల్యమగుచున్నది.

మహానగరాలు దట్టమైన అరణ్యాలుగా మారిపోతున్నాయి. గొప్ప తేజస్సుతో కూడుకొని అనేకమంది జనులను శాసించే ఒక మండలాధిపతి కొలది కాలంలో గుప్పెడు బూడిద అగుచున్నాడు.

అందంగా, రకరకాల రంగుల మెఱుపులతో అనేక దీపకాంతులతో విలసిల్లే గొప్పభవనం మరికొంతకాలానికి మొండిగోడలతో, పిచ్చి చెట్లతో శిథిలమై భయమును గొలుపుచు గబ్బిలముల చేత, సాలెగూళ్ల చేత ఆక్రమించబడుతోంది. పూతోటల చేత, సుందర పుష్ప-లతల చేత అలంకరించబడి జనులను ఆహ్లాదపరుస్తున్న భూప్రదేశము మరుభూమి (ఎడారి) అగుచున్నది. నీరు ఉన్నచోట భూమి వెలయుచున్నది. భూమి నీరగుచున్నది. ఈ కాష్ఠ - తృణమయ జగత్తులో పరివర్తనమవనిదంటూ ఏది ఉన్నది స్వామీ?

ఈ బాల్యం, ఈ యౌవనం, ఈ శరీరం, ఈ ద్రవ్యములు - ఇవన్నీ అనిత్యములే అయి, ఎప్పటికప్పుడు నిరంతరం జలతరంగాలవలె మరొక స్థితిని పొందుచూనే ఉన్నాయి. ఈ జీవితమే గాలిలో దీపం వంటిది. ఇక దేనిగురించి ఏమని చెప్పుకోవాలి? ముల్లోకములందు కనబడే ఈ వస్తువుల శోభ అంతా మెఱుపు వంటిదే కాని, మరేమీ కాదు. బీజము - వృక్షములవలె ఈ భూతజాలమంతా మాటిమాటికీ మార్పు చెందుతూనే ఉన్నాయి.

ఓ మహర్షీ! అనేక ఆడంబరములతో కూడిన ఈ సంసార రచన అంతా మహా నేర్పుగల ఒకానొక నర్తకి యొక్క తళుకు-బెళుకుల వలె కనిపిస్తోంది. ఇక ఈ జీవులు ధూళిరేణువులవలె 'మనస్సు' అనే వాయువుచే లేవనెత్తబడి ఆ నర్తకికి వస్త్రరూపులు అగుచున్నారు. వీరంతా స్వర్గ, నరక, భూ, పాతాళ లోకములకు రావటం - పోవటమే ఆమె అభినయం. ఎక్కడికక్కడ క్షణభంగురమైన అనేక కార్యక్రమములు! ఎన్నెన్ని వ్యవహారములు? ఇవన్నీ ఆ నర్తకి యొక్క చంచల నేత్రముల వీక్షణములే అవుతున్నాయి. ఈ ఎదురుగా కనబడేదంతా గంధర్వ నగరంలాగా మహాభ్రమను కలుగజేస్తోంది. ఆహా! ఇదేమి నృత్యం! ఇదేమి సంచలనం! ఏమి చంచలత్వం! ఈ రోజులు, ఈ సంపదలు, ఈ క్రియలు, ఈ మహాపురుషులు, ఈ అధికారములు - ఇవన్నీ ఏమైపోతున్నాయి? క్షణంలో దృష్టిపథం నుండి దాటిపోతున్నాయే? ఇక మనం మాత్రం ఇట్లే ఉంటామా? లేదు. క్షణకాలం కనబడి మరల ఎటో పోయే వారమే కదా! ప్రతిరోజు తెల్లవారుతోంది. క్షయించిపోతోంది. మరల ఇంతలోనే ఎచటినుండో ఉత్పన్నమౌతోంది. ఈ పాడు సంసారానికి 'అంతు' ఎక్కడో చెప్పండి?

హే ప్రభూ! మనుష్యులు పశువులు అగుచున్నారు. పశువులు మనుష్య జన్మలు ఎత్తుచున్నాయి. దేవతలంతటివారు తమ దైవభావమునే విడచివేస్తున్నారు. ఈ జగత్తంతటిలో స్థిరమైనదంటూ ఏది ఎక్కడ ఉన్నది? అటు సూర్యభగవానుని చూడండి. అతడు తన కిరణములతో మాటిమాటికి రాత్రింబవళ్ళను కల్పిస్తూ సర్వభూతముల ఉత్పత్తి - వినాశనములకు 'సాక్షి' అయి దర్శిస్తున్నాడు. ఇంతలో క్రమక్రమంగా తాను కూడా కరిగిపోతూనే ఉన్నాడు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో సహా ఈ జీవులందరు - నీరు బడబాగ్ని*లో ప్రవేశిస్తున్నట్లు - వినాశనము వైపునకే పయనించు చున్నారు. స్వర్గ-మర్త్య-పాతాళములు, వాయువు, ఆకాశము, భూమి, పర్వతములు, నదులు, దిక్కులు - ఇవన్నీ కూడా 'వినాశనము' అనే అగ్నికి ఎండుకట్టెలగుచున్నాయి.

"మేము అంతటివారము - ఇంతటివారము-మా జాతి గొప్పది" - ఇటువంటి పై పై పటాటోపాలన్నీ ఈ జీవుడు తలచుకొని మురిసిపోయేది 'మృత్యువు' అను రాక్షసుడు గుర్తుకు రానంతవరకే. మృత్యుభీతిగల మనుజునకు ధనధాన్యాదులు గాని, బంధుమిత్ర పరిజనంగాని, విభవములుగాని, ప్రీతిని, ప్రశాంతతను కలిగించగలవా? లేదు. ఇది ఇట్లుండగా, ఒక్క నిమిషంలో ధనవంతుడు 'దరిద్రుడు' అగుచున్నాడు. ఆరోగ్యవంతుడు రోగి అవుచున్నాడు. అశాశ్వతమగు ఈ జగత్తు అనుక్షణం భ్రాంతిని కల్పిస్తూనే ఉన్నది. దీనినంతటినీ చూచి విమోహితుడు కానివాడెవడో చెప్పండి? ఒకప్పుడు ఈ ఆకాశం కారుమేఘాలచే ఆక్రమించబడి, నలువైపుల చీకటి ఆవరించి ఉంటోంది. అదే ఆకాశం మరొకప్పుడు బంగారుకాంతులతో శోభిల్లుతోంది. ఇంకొకప్పుడు ప్రశాంత వాయు వీచికలచే నిండి ఉంటోంది. ఒకానొకప్పుడు బీభత్సధ్వనులతోను, ఉఱుములతోను, మెఱుపులతోను నిండి ఉంటోంది. కాసేపు మూగగా, మౌనంగా, ఇంకాసేపు అనేక సంరంభములతోను కనబడుతోంది. కొంతసేపు నక్షత్ర శోభితమై చంద్రకాంతులు విరజిమ్ముతూ ఉంటోంది. అదే విధంగా క్షణమొక రకంగా ఉండే ఈ జగత్తును చూచి భీతిల్లనివారంటూ ఎవరైనా ఉంటారా?

**ఆపదః క్షణమాయాన్తి, క్షణమాయాన్తి సంపదః**
**క్షణం జన్మ , క్షణం మృత్యుః ! మునే ! కిమివ న క్షణమ్?** (XXVIII-31)

ఓ మునీశ్వరా! క్షణంలో ఆపదలు వచ్చిపడుచున్నాయి. క్షణంలో సంపదలు చేరుతున్నాయి. క్షణంలో జన్మ. క్షణంలో మృత్యువు. ఆహా! ఈ ప్రపంచంలో క్షణికం కానిదేమిటో చెప్పండి? అయ్యో! భగవంతుడా! ఈ దృశ్య జగత్తులో కనిపిస్తున్న వస్తువులన్నీ కూడా ఇతఃపూర్వం ఒక విధంగా ఉన్నాయి. ఇప్పుడు ఒక విధంగా ఉంటున్నాయి. ఇకముందు ఇంకొకరకంగా ఉండ బోతున్నాయి. వీటిలో స్థిరము, ఏకము, సద్రూపము అయినట్టి వస్తువు ఒక్కటి కూడా లేదు కదా!

మట్టి 'ప్రత్తి చెట్టు' అగుచున్నది. ఆ వృక్షమునకు కాస్తున్న ప్రత్తికాయలు 'ప్రత్తి' అయి అటుపై 'వస్త్రము' అవుతోంది. ఆ వస్త్రము గర్వితములైన శరీరములను ఆచ్ఛాదించి కాలక్రమాన మట్టిలో కలిసిపోతోంది. చూచారా! 'మార్పు పొందని వస్తువు' అంటూ ఎక్కడా ఏదీలేదు. ఈ దేహాభిమానియగు జీవునిపట్ల "జన్మ - స్థితి - వృద్ధి - పరివర్తనము - అపక్షయము - వినాశనము" ఇవన్నీ రాత్రింబవళ్ళు నిరంతరం ప్రవర్తిస్తూనే ఉన్నాయి కదా! ఇది ఇట్లా ఉండగా ఇంకెన్నో చిత్ర విచిత్రాలు! బలహీనుడు బలవంతుని చంపుచున్నాడు. ఒక్కడు నూర్గురిని మట్టుపెట్టుచున్నాడు. నీచులు ప్రభువులు అగుచున్నారు. గొప్ప విచక్షణాజ్ఞానం, ప్రజ్ఞ కలవారు చేయునదే లేక నిస్సహాయులగు చున్నారు. జగత్తంతా పరివర్తనామయమే!

జలంలోంచి తరంగాలు లేస్తున్నాయి. ఆ తరంగాలు మరల ఎప్పుడో ఎక్కడో విపర్యయం పొందుతున్నాయి. చేతన స్వరూపులగు మనుష్యులు అచేతన పదార్థముల సంస్పర్శచే మార్పు చెందుచున్నారు. ఆలోచనలు, అభిప్రాయములు, క్షణంలో మారిపోతున్నాయి. బాల్యం

---

* సముద్ర మధ్యంలో బయలుదేరే అగ్నిపర్వతం

గతించిపోతోంది. యౌవనం వస్తోంది. ఆ యౌవనం కూడా గతించిపోయి ఎక్కడినుండో వార్ధక్యం వచ్చిపడుతోంది. ఈ శరీరము యొక్క గతే ఇట్లా ఉండగా, ఇక బాహ్యపదార్థముల, విషయముల మాట వేరే చెప్పేదేమున్నది?

**క్షణమానందితామేతి క్షణమేతి విషాదితాం**
**క్షణం సౌమ్యత్వమాయాతి సర్వస్మిన్నటవన్మనః ॥** (XXVIII-38)

మహాత్మా! ఈ మనస్సు ఉంది చూచారూ! నవరసాలు పోషించే నటునిలాగా, వచ్చిపోతున్న ఆయా విషయాలపట్ల క్షణంలో ఆనందం, క్షణంలో విషాదం, క్షణంలో సుముఖత్వం, క్షణంలో విముఖత్వం ప్రదర్శిస్తోంది. ఆ విరించి (బ్రహ్మదేవుడు) అల్లరిచేసే చలాకీ పిల్లవానివలె హర్ష – విషాద – మోహములు కలుగచేయగల అనేక వస్తుజాలములను సంఘటనలను ఎడతెగకుండా, విసుగు – విరామం లేకుండా సృష్టించుకొంటూ పోతున్నాడు. అట్లు తాను సృష్టించుచున్న జీవులను రక్షించుకొంటూ ఇంతలోనే భక్షించి వేస్తున్నాడు. ఆయన చర్యలకు మోహితులైన ఈ జనులు రాత్రిం బవళ్ళు అనేక దుఃఖాలలో మునిగితేలుచున్నారేకాని స్వస్వరూపమును గ్రహించుటలేదు.

ఈ సంసార భాగస్వామ్యులగు జనులు వస్తున్నారు. పోతున్నారు. ఇక్కడ శాశ్వతమైనదంటూ ఏదీ లేకపోయినప్పటికీ వారి దుఃఖములకు మాత్రం అంతు ఉండటంలేదు. వాస్తవానికి వారి సంపదలు, ఆపదలు కూడా అస్థిరములేకదా! భగవంతుడా! విశ్వామిత్ర మహర్షీ! ఈ 'కాలము' అనునది అతి చమత్కారమైనది. అతి చతురులైన వారిని కూడా అది విచలితులను చేస్తోంది. అది ఆపదలలో ముంచి తేల్చని జనులంటూ ఎక్కడా లేరేమో? 'సంసారము' అనబడే మహావృక్షపు ఫలముల వంటి ఈ ముల్లోకములందలి జీవులు నిరంతరం నేల రాల్చబడుచున్నారు. మరల క్రొత్త ఫలములు కాస్తున్నాయి. అయితే, అందులో అతికొద్ది ఫలములు మాత్రం 'జ్ఞానము' అనే మధురాతిమధురమైన రసమును కలిగి ఉంటున్నాయి.

హే మహర్షీ! ఈ తతంగమంతా బాగానే ఉన్నదికాని, జీవునికి ఈ దుఃఖాదులు ఎక్కడి నుండి వస్తున్నాయి చెప్పండి? మేమంతా ఈ కాలస్వరూపుని చేతిలోని కీలు బొమ్మలం మాత్రమేనా? అయ్యో! జ్ఞానదృష్టిని, దూరదృష్టిని కలిగి లేకుండానే జీవించి వేస్తున్నామే? అందుచేతనే ముందు ముందు ప్రాప్తించబోయే స్థితిగతులను తలచు కొన్నప్పుడు దుఃఖమునే పొందుతున్నాం. మేము ఊరుకొన్నా, జన్మ మృత్యు జరావ్యాధులు మమ్ములను సమీపించక మానవు కదా! కనుక దూరదృష్టి లేకుండా, పిల్లి కళ్ళు మూసుకొని పాలు త్రాగినట్లు, శక్తియుక్తులను కలిగియున్న రోజులు ఇట్లా వృథా అగుచుండగా ఇక మాకు ఏ గతి పట్టబోతోంది?

❖❖❖

# 25. పదార్థ దోషములు

స్వామీ! ఈ మా చిత్తమును చూచారా! ఇది అనేక విషయములందు ఆసక్తి కలిగినదై అట్లు ప్రాప్తించిన దోషములచే ఘోరంగా దహించబడుతోంది. ఈ చిత్తము జీవునకు కలిగించబోయే దుష్టదశలను గ్రహించినవారికి ఇక భోగాభిలాషేమి ఉంటుంది చెప్పండి? "దోషములు – దుఃఖములు – నీచస్థితులు" వీటిని గమనించనివారికి మాత్రమే పదార్థాభిలాష ఉండటం జరుగుతుంది. ఈ పదార్థములలో ఉండే దోషములు వీటిని ఆశ్రయించే వారికి కూడా సంక్రమిస్తున్నాయి. వేపచెట్టును ఆశ్రయించినందుకు పూతీగ కూడా చేదును సంతరించుకొంటుంది కదా!

రోజులు గడుస్తున్నకొద్దీ, ఈ పదార్థములతో ఏర్పరచుకొన్న 'సంబంధం' కారణంగా మేము దుర్బలులమే అవుతున్నాం. ఈ సంసారములో నిమగ్నమగుటచే పూర్వ జన్మల నుండి తెచ్చిపెట్టుకొన్న కొద్దిపాటి మంచి కూడా అడుగంటుచున్నది. తండ్రీ! మహర్షీ! ఈ జగత్పదార్థములన్నీ ఎండిపోయిన మినపతీగ లాగా ఒకనాటికి నిశ్శబ్దంగా విరిగిపోయేవే కదా!

విచారించి చూస్తే ఈ రాజ్యాలు, ఈ భోగాలు, ఇవి కలుగచేయగల చింతలు అతి దుర్భరమైనవేనని నాకు అనిపిస్తోంది. అందుచేత, ఎట్టి చింతలు దరిచేరనట్టి ఏకాంతమును నేను కోరుకొంటున్నాను. ఈ ఉద్యానవనాలు, ఈ ధనాదులు, ఈ స్త్రీలు నన్ను ఉద్ధరించలేవని, ఉత్తమమైన – శాశ్వతమైన ఆనందమును ప్రసాదించలేవని నేను గ్రహించాను. నా మనస్సు ఇప్పుడు శాంతిని మాత్రమే పొందాలని కోరుకొంటోంది. కాని పదార్థచింతన, తృష్ణ త్యజించటం సులువైన విషయం కాదని అనిపిస్తోంది. ఈ పదార్థములందలి దోషము గ్రహించినప్పటికీ వీటిని జయించి వేయటం జ్ఞానదృష్టి, ఉత్తమ ప్రయత్నము ఉన్నవారికే సాధ్యమేమో! నా చిత్తము చాంచల్యము కలిగియున్నంత వరకు నన్ను రక్షించేవారు ఎవరు? నేను ఎట్లు శాంతిని పొందాలి?

నేను ఇప్పుడు జీవితమును కోరుకోవటం లేదు. మృతిని కూడా కోరుకొనుట లేదు. ఏది ఎట్లో, అది అట్లే ఉండుగాక. నిశ్చితుండనై, ఏమియు కోరుకోక, ఆసక్తి కలిగి ఉండక ఇట్లే ఉండదలచాను. ఈ రాజ్యములతో, భోగములతో, ధనములతో, ప్రయత్నములతో నాకు పనిలేదు. వీటన్నిటి మూలకారణం అహంకారమే కదా! అట్టి అహంకారమే త్యజించివేయదలచుకొన్న నాకు వీటితో ఏమి పని చెప్పండి?

లెక్కింప అలవికానంత సంఖ్యలో జీవులు ఈ భూమిపైకి వస్తున్నారు. కాని, ఏం లాభం? వారిలో అత్యధికుల యొక్క ఇంద్రియగ్రంథులు "పూర్వజన్మ వ్యవహారముల ప్రభావములు– పునః జన్మ పరంపరలు" అనే దిశల వైపుకే ఎక్కుపెట్టబడి ఉంటున్నాయి. అట్టి "పునర్జన్మ సంస్కారములు" అనే చిక్కుముడులను విడదీయుటకు ప్రయత్నించువారు మాత్రమే ధన్యులు. వారు మాత్రమే ప్రశంసాపాత్రులు.

ఏనుగు సమూహం నిష్కర్షగా తమ పాదములచే తామర తూండ్లను త్రెంచి వేస్తున్నట్లు అనేక తెలిసీ తెలియని వాంఛల సమూహముచే మా మనస్సులు హింసించ బడుచున్నాయి. కాబట్టి ఈ

శరీరంలో శక్తి యుక్తులుండగానే నిర్మలమైన బుద్ధియోగంతో మనస్సులకు చికిత్స చేసుకోకపోతే ఇంకెప్పుడు, ఎట్లా, ఎక్కడ వీలౌతుంది చెప్పండి? తండ్రీ! 'విషం' నిజానికి విషం కాదు. విషయములే నిజమైన విషం. ఎందుకంటారా? విషము మహా అయితే ఒక్క శరీరాన్ని మాత్రమే హరించగలదు. మరి విషయములో – జన్మ జన్మాంతరాలుగా ముక్తికి అడ్డుగా నిలచి వందల – వేలసార్లు మా ప్రాణములు తోడివేయగలవు.

❖

**యజ్ఞచేతసులు :** ఇదంతా ఇట్లా ఉన్నప్పటికీ ఈ జనులలో కొందరు మహాత్ములగు జ్ఞానులు మాత్రం సర్వదా ఈ దృశ్యముచే, ఈ ఇంద్రియములచే ఈ జీవిత సంఘటనలచే, ఏమాత్రం విచలితులుకాక, అచంచల మనస్కులై ఉంటున్నారు.

**న సుఖాని న దుఃఖాని న మిత్రాని న బాంధవాః**
**న జీవితం న మరణం బంధాయజ్ఞస్య చేతసః ॥** (XXIX-14)

జ్ఞానదృష్టి కలవారి విషయములో ఈ సుఖదుఃఖములు కాని, ఈ బంధుమిత్రులు కాని, ఈ జీవన్మరణములుకాని ఏమాత్రం బంధకారణములు కాలేకపోతున్నాయి.

కార్యకారణ తత్త్వజ్ఞుడవగు ఓ మహాత్మా! మీ పాదములు స్పృశించి అర్థిస్తున్నాను. తత్త్వజ్ఞానమును పొంది మేము ఈ భయ శోకముల నుండి విడువడు మార్గమేదైనా ఉన్నదా? ఉంటే అది మాకు ఉపదేశించండి. ఈ అజ్ఞానారణ్యంలో మేము చిక్కుకున్నాం. ఇది అనేక వాసనా సమూహములచే మహాజటిలమై, దుః ఖకంటకములచే (ముళ్ళచే) ఆవృతమై అనేక ఎత్తుపల్లములు కల్గినదై, అతిభయంకరమై మమ్ములను ఎంతగానో క్షోభింపజేస్తోంది. ఓ మునీశ్వరా! పదునైన కత్తితో ఈ శరీరం కోయబడినప్పటికీ నేను సహించగలను. కాని, ఈ సంసారములోని ఆశలయొక్క విషయాకర్షణల కోతను మాత్రం నేను భరించలేకున్నాను. "ఇవి మాకున్నవి. అవి మాకు లేవు" అనునట్టి అజ్ఞాన వాయువీచికా పరంపరలు మా చిత్తములను దోషపూరితం చేస్తున్నాయి. ఈ అజ్ఞాన వ్రేటులను నిరోధించేదెట్లా?

హే మహాశయా! ఈ సంసార జీవులందరు 'తృష్ణ' అనే పొడవైన సూత్రపు త్రాడుకు గ్రుచ్చబడిన ముత్యములవంటివారు. సాక్షి స్వరూపమగు శుద్ధ చిత్తమే ఇందు మధ్య ఉన్న మణి. కాలుడు ఈ హారము ధరించి సర్వత్రా సంచరిస్తున్నాడు. మేము కామక్రోధాదులచే మా బంధములను మేమే కల్పించుకొని, అస్వతంత్రులమై కాలచక్రము నందు ఇరుక్కొని దిక్కుతోచక పరిభ్రమిస్తున్నాం.

అయినదేవో అయినది. ఇప్పటికైనా నిదురలేచి, సింహం బోనుయొక్క ఊచలను త్రెంచివేయునట్లు నేను వైరాగ్యాదులచే ఈ కామక్రోధాదులను త్రెంచివేయతలచాను. ఓ తత్త్వశ్రేష్ఠా! నేను మీ పాదపద్మములకు సాష్టాంగ ప్రణామం చేసి శరణు వేడుచున్నాను. నా హృదయారణ్యంలో దట్టంగా వ్యాపించియున్న అజ్ఞానాంధకారాన్ని, ఉత్తమ జ్ఞానమునకు సంబంధించిన సమాచారం చేత తొలగించి వేయండి. నాయందు జ్ఞానజ్యోతి వెలిగించండి. పరమసుఖదాయకుడగు పూర్ణచంద్రుడు

ఉదయించగానే చీకట్లు, ఆ చీకట్లో కనిపించే బేతాళాది వికారాలు తొలగిపోతాయి కదా! మీవంటి మహాత్ముల దర్శనం, ఆశ్రయం ఎన్నో జన్మల పుణ్యఫలితంగా కాని ప్రాప్తించునది కాదు. సత్సంగముచే నశించని జాడ్యము గాని, మనోవ్యాధి కాని ఏముంటుంది?

తండ్రీ! విశ్వామిత్రా! ఆకునుండి జాలువారు నీటిబొట్టువలె క్షణభంగురమైన ఈ ఆయువును గాని, చంచలములగు ఈ భోగములనుగాని, మోసపూరితములగు ఈ యౌవనాదులను గాని నేను నమ్మి కూర్చొనుటకు సిద్ధంగా లేను. స్వవిచారణచే వీటి 'అనిత్యత్వము'ను, ముందు ముందు ప్రాప్తింపజేయబోవు నీచస్థితులను ఇప్పుడే గ్రహించాను. నా ఉద్దేశంలో ఈ మానవజన్మ ఒకానొక ఉత్తమ అవకాశమే అయివున్నది. అందుచేత, తమవంటి తత్త్వజ్ఞులచే బోధింపబడుటకు నేను తగినవాడి ననుకొంటే మీ యొక్క బోధామృతం చేత నన్ను సముద్ధరించండి.

❖❖❖

## 26. ప్రయోజన కథనం

హే మహానుభావా! 'అనర్థవృత్తులు' అనే సంసార లంపటంలో, చిక్కుకున్న జనులను చూస్తుంటే నా మనస్సు భ్రమిస్తోంది. భయం వేస్తోంది. నా ఇంద్రియములు ఎండుటాకులవలె కంపిస్తున్నాయి. అల్పబలుడగు భర్తను పొందిన సౌందర్యవతి క్రూర జనులను చూచి భయపడుతుంది చూచారా? మా ఈ బుద్ధి కూడా – అల్పజ్ఞాన యుతమగుటచేత కాబోలు, – ఈ సంసారమును, చూచి కంపించిపోతోంది. ఏమాత్రం ధైర్య సంతోషాలు పొందలేకపోతోంది. పచ్చికపై గల ఆశతో లేడి పెద్దలోతైన గోతిలోపడి బైటకురాలేక ఎలుగెత్తి ఏడుస్తుంది చూచారా? ఈ మనస్సు తుచ్ఛమైన విషయాలకై పరుగెత్తి చివరకు దుఃఖమునందు కూలిపోతోంది. అవివేకమును నిరంతరం ఆశ్రయిస్తున్న ఈ మా చక్షురాది ఇంద్రియములు మమ్మల్నందరినీ అంధకూపములోనికి లాగివేస్తున్నాయి. అట్లు విషయములు, పదార్థముల పైపటాటోపాలు మమ్ములను బలవంతంగా వివశుల్ని చేస్తుంటే, మేమిక సత్పురుషులను ఆశ్రయించేది ఎన్నటికి? చింతలు చావవు. కోరుకొనే వాటికీ అంతు ఉండదు. లోనగల అసంతృప్తిని కప్పి పుచ్చుకొని "ఇప్పటికి ఈ ఈ వస్తువులు లభించుగాక" అని భావించి పిచ్చి పిచ్చి ప్రయత్నములందు నిమగ్నమౌతున్నాం. ఎవరెవరినో సమీపించి ఏదేదో అర్థిస్తున్నాం. ఏది పొందినా ఈ 'తృష్ణ' ఇట్లాగే ఉంటోంది. పొందినవాటియొక్క దుర్లక్షణానుభవం (Adverse effects) తొలగుటలేదు. ఓ జనులారా! ఇదంతా గమనించకుండానే పిల్లి పాలు త్రాగినట్లు ఆయువునంతా గడిపివేస్తున్నారా? ఎంతటి దౌర్భాగ్యం!

ఈ 'సంతోషము' అనునది కొన్ని వస్తువులు పొందుతున్నందుకు, కొన్ని పొందనందుకు అనుక్షణం క్రిందమీదగుచున్నది. చిత్త చాంచల్య కారణంగా కాబోలు, నాకీ సంసారంలో "ఇది సుఖకరమైనది" అనునదేదీ కించిత్ కూడా లభించటం లేదు. ఇది నన్ను సగం ఆక్రమించి, సగం ఆక్రమించక ఉన్నది. బాలుడు చీకట్లో మోడుబారిన చెట్టును చూచి భూతమనుకొని భ్రమించునట్లు ఆత్మనిశ్చయం పొందని నా మనస్సు అనేక భ్రమపరంపరలను మాత్రమే పొందుతోంది. అనేక

భోగవాంఛలు చిత్తమును ఇంకా పరిభ్రమింపచేయుటచే నేను దానిని నిశ్చయించుకొన్నట్లుగా (the way I decide) నియమించలేకయే పోతున్నాను. అది తన ఇష్టం వచ్చినట్లు దేశ ద్రిమ్మరివలె సంచరించుచునేయున్నది. దేవతలు వారి సంపదలను వీడలేకపోతున్నట్లు చిత్తము తన చంచలత్వమును ఎంతసేపటికీ పరిత్యజించుటయే లేదు.

**అతోఽ తుచ్ఛమ్, అనాయాసమ్ అనుపాధిగతభ్రమం**
**కింతత్ స్థితి పదం, సాధో! యత్ర శోకో నవిద్యతే ?** (XXX-11)

ఓ సాధువర్యా! ఉత్తమము, సుస్థిరము, ఉపాధి వర్జితము భ్రాంతి – దుఃఖరహితము అయినట్టి ఉత్తమ పదమేదో నాకు చూపండి. "ఈ సంసార వ్యవహారములు, ఈ కర్మలు స్వతహాగా బంధకరములు కావు. అజ్ఞానమే అన్నిటికి మూలకారణం" అని పెద్దలు చెప్పగా విన్నాను. అయితే అది ఎట్లో నేను గ్రహించజాలకున్నాను. జనకుడు మొదలైన శ్రేష్ఠపురుషులు ఈ సంసారక్రియా వ్యవహారమందుండి కూడా జ్ఞానులై ఎట్లా ఉంటున్నారు? ఈ సంసారమున ఉంటూ కూడా దీనిచే స్పృశించబడకుండా ఉండేదెట్లా? ఏ దృష్టిని పొందినవారై మీవంటి జీవన్ముక్తులగు మహాత్ములు ఈ సంసార క్షేత్రంలో వ్యవహరిస్తున్నారో నాకు చెప్పండి.

ఈ విషయ సర్పములు కుటిలములు, భయప్రదములు, నశ్వరములు (నశించబోయేవి), నరక కారణములు కదా! ఇవన్నీ యథేచ్ఛగా సంచరించే ఈ సంసారం శుభప్రదమెట్లా అవుతుంది? ఏనుగు ప్రవేశించి, స్వచ్ఛము నిశ్చలము అయిన సరోవరమును కెలికివేయుచున్నట్లు మోహము అనుక్షణం ఈ బుద్ధిని చంచలీభూతం చేస్తోంది.

**సంసార ఏవ నివహే జనోః వ్యవహరన్నపి**
**న బంధం కథమాప్నోతి, పద్మ పత్రే పయో యథా?** (XXX-17)

ఈ సంసార వ్యవహారంలో ఉంటూ కూడా తామరాకును నీరు అంటనట్లు నిర్లిప్తుడై ఉండటానికి ఉపాయమేమిటి? ఈ కామాది దుర్వృత్తులచే స్పృశించబడక ఉన్నవాడనై ఉండేదెట్లా? ఈ జగత్తును బాహ్యదృష్టితో తృణప్రాయంగాను, అంతర్దృష్టికి ఆత్మవలె చూడగలిగేదెట్లా? ఈ అజ్ఞాన సముద్రం దాటటం మహాపురుషులకు మాత్రమే సాధ్యం కదా! అట్టి ఏ ఏ మహాపురుషుల ఆచరణను ఆశ్రయించటంచే జనులు దుఃఖ రహితులు, ప్రశాంతచిత్తులు కాగలరు? మేమిపుడు ఏ శ్రేయోదాయకమైన బాటలో పయనించాలి? ఏ ప్రయత్నములచే ఉత్తమఫలం ప్రాప్తిస్తుంది? అనేక అసంబద్ధము లతో కూడిన ఈ జగత్తులో ఏ జ్ఞానం, ఏ బోధ కలిగి చరించాలి?

ప్రభూ! బ్రహ్మచేత సృష్టించబడిన ఈ అశాశ్వత జగత్తు యొక్క పూర్వాపరములను తెలుసుకొనుటకు వీలైనట్టి తత్త్వోపదేశం నాకు ప్రసాదించండి. హృదయాకాశంలో ఉన్న చైతన్య చంద్రుని మచ్చ తొలగిపోవాలి. ఇదే ఇప్పుడు నా ఏకైక ఆశయం. అందుకుగాను ఈ ప్రపంచంలో మేము స్వీకరించతగ్గదేది? త్యజించతగ్గదేది? ఈ రెండూ కానిదేది? ఈ చంచల చిత్తమును పర్వతమువలె స్థిరమొనర్చ గలిగేదేది? ఈ సంసార విషూచి వ్యాధి ఎన్నెన్ని బాధలు, వికారాలు,

విహ్వాలతలు కలిగియున్నదో చెప్పనలవికాదు. ఈ వ్యాధి ఏ పావన మంత్రముచే తొలగగలదు? హృదయంలో శీతలత్వము, పూర్ణత్వము, పరమశాంతి ప్రతిష్ఠింపబడేదెట్లా?

హే మహానుభావా! విశ్వామిత్ర మహర్షీ ! మీరు తత్త్వజ్ఞులు. అంతేకాదు. శరణన్న వారిని రక్షించటంలో మీ అంతటివారు లేరని లోకప్రతీతి. ఇప్పుడు మిమ్ములను వినమ్రతతో శరణు వేడుచున్నాను. నేను పూర్ణత్వము పొంది మరల దుఃఖము పొందనట్టి ఉపాయం, ఉపదేశించండి. అల్పజీవులను వారి ఉచ్ఛ్వాస – నిశ్వాసలే బాధిస్తాయి! ఆత్యంతిక విశ్రాంతి పొందనంతవరకు మా చిత్తవృత్తులు, మా కల్పనలు, మా భావాభావములు, మేము నమ్ముకొన్న విలువలే మమ్ములను వేధిస్తూ ఉంటాయి. కనుక మీ బోధతో మమ్ములను ప్రక్షాళనం చెయ్యండి.

❖❖❖

## 27. రాఘవ ప్రశ్న

ఓ మహానుభావా! దీర్ఘాయువుగాని, ఈ శరీర స్థితిగాని ఈ బంధుమిత్ర సమాగమాలు గాని నిజంగా ఈ జీవుని ఉద్ధరించగలవా? కోర్కెలు అంతూపొంతూ లేకుండా మమ్ములను 'సుడిగాలి'లా చుట్టివేస్తుంటే అవన్నీ మాకు బంధమునే కలిగిస్తున్నాయి. మోహ మేఘములు గర్జిస్తూ పిడుగులు రాలుస్తుంటే 'దురాశలు' అనే మెఱుపులు మెఱిసి మమ్ములను గ్రుడ్డివాళ్ళను చేస్తున్నాయి. లోభము మమ్ములను పట్టి పీడిస్తూ మా నరనరములందలి శక్తిని పీల్చివేస్తోంది. క్షణక్షణం అనేక అనర్థాలు వచ్చి మా ముంగిట వ్రాలుచున్నాయి. మా సుకృత దుష్కృతాలు మమ్ములను అనేక లోకములలో త్రిప్పుచున్నాయి. కృతాంతుడు (కర్మల ఫలితములను ప్రసాదించు కార్యకారణ తత్త్వము) అనే పిల్లి 'జీవులు' అనే ఎలుకలను పట్టడానికి కన్నం వద్ద వేచియున్నాడు. జలప్రవాహ పతితులైనట్లు ఈ జీవులు ఎక్కడి నుండో వస్తున్నారు. ఇక్కడ పతనం పొందుచున్నారు. స్వామీ! ఈ స్థితిలో మాకు ఉపాయమేది? గతి ఏది? దేనిని చింతించాలి? దేనిని ఆశ్రయించాలి? ఈ జీవితారణ్యం శుభప్రదమయ్యేదెట్లా?

మీ వంటి మహాత్ములకు ఇచ్ఛ కలిగింపజేసి రమింపజేయగల వస్తువేదీ ఈ మూడు లోకాలలో ఎక్కడా లేదు. మా విషయం అట్లాలేదు. మేము అత్యంత స్వల్పము, నశ్వరము అయిన విషయములకు కూడా దాసానుదాసులమౌతున్నాం. ఈ పాడు సంసారం మాకు నిరంతరం పీడనే కలిగిస్తోంది. ఇదంతా మోహరహితమైన దృష్టిచే మాచే చూడబడేదెట్లా? జ్ఞానము, సంతృప్తి సంపాదిస్తే కాని ఇదంతా సుకరం కాజాలదు. కామ కళంకితమైన మా మనస్సులు ఏ ఉపాయం అవలంబిస్తే తద్వారా మనస్సు – దృశ్యము అమృత కళలతో ప్రకాశించగలవు?

ఐహిక – ఆముష్మిక ఫలాశలను త్యజించి ఈ సంసారగతిని తెలుసుకొన్నవాడే 'మానవుడు' అని అనిపించుకోగలుగుతాడు. అట్టి ఏ ఏ మహాపురుషులను అనుసరించి మేమీ సంసారారణ్యంలో

చరించాలి? ఏం చేస్తే సంసారమందున్న మనుజుడు రాగద్వేషాత్మకములైన భోగేచ్ఛాసమూహములచే పీడించబడకుండా ఉండగలడు? రసమయమగు పాదరసం అగ్నిలోపడ్డా దహించబడదు కదా! మనుజుడు ఈ సంసారాగ్నిలో పడికూడా తపించకుండా ఉండ కలిగే ఉపాయమేది?

సముద్రంలో పడితే తడవకుండా ఉండగలమా? ఈ సంసారంలో పడి ఇందు దొర్లుచున్న మావంటివారి మనస్సులు ఇందలి పదార్థములచే ఆకర్షణ – వికర్షణలు పొందకపోవటం సాధ్యమయ్యే పనేనా? రాగద్వేషములు, సుఖదుఃఖములు లేనట్టి సత్క్రియలంటూ ఈ ప్రపంచంలో ఉన్నాయా?

తండ్రీ! మలిన భూయిష్ఠమైన ఈ మనస్సుపైననే ఈ జగత్తు యొక్క అస్థిత్వము ఆధారపడి ఉన్నది. అట్టి ఈ మనస్సు తత్త్వబోధచేత కానీ ప్రక్షాళనం కాదు. అందుచేత నాకు తత్త్వబోధయుక్తమైన వాక్యములను ఉపదేశించండి. ఎట్టి యోగము అవధరించటంచే కర్మలు ఒనర్చినను, లేక ఒనర్చకున్నను దుఃఖము యొక్క ఛాయ కూడా ఉండదో, అట్టి సద్వస్తువు గురించి ఉపదేశించండి. ఎట్లు ఆచరిస్తే ఈ మనస్సు పరమపవిత్రమౌతుందో, నాకు పరమశాంతి లభిస్తుందో – అట్టి ఉత్తమ ఆచరణ గురించి ఆజ్ఞాపించండి. అట్టి ఉత్తమ కార్యక్రమం ఇతఃపూర్వం ఎవరెవరు ఆచరించి ఆత్మోన్నతి పొందారో అట్టి వారి కథనం నాకు వినిపించండి. ఓ భగవంతుడవగు విశ్వామిత్రా! అట్టి మహనీయులుగా కొనియాడబడేవాళ్ళు ఎట్లు బ్రహ్మ వస్తువు గ్రహించారు? ఎట్లెట్లు విచారణ చేశారు? వారికి ఏ సాధనలచే మోహ నివృత్తి, దుఃఖముల ఉపశాంతి ప్రాప్తించాయి?

ఓ మునిసత్తమా ఒక్క మాట మాత్రం విన్నవించుకొంటున్నాను. అట్టి ఉపదేశ వాక్యాలు ఉంటే ఉండి ఉండవచ్చు. లేక ఉండి ఉండకపోవచ్చు. నాకెవరైనా చెప్పవచ్చు. లేక చెప్పుటకు సిద్ధపడకపోవచ్చు. నేనిప్పుడు ఒక నిర్ణయానికి వచ్చాను. అహంకారంతో సహా అన్ని కోర్కెలను పరిత్యజించి వేస్తాను. ఈ భోజన పానాదులు కూడా నాకక్కర్లేదు. వస్త్రధారణ, స్నానాదులను కూడా వదలివేస్తాను. ఇక ఆపదలు రానివ్వండి. లేక సంపదలు రానివ్వండి. క్రమంగా హస్త పాదాదులతో కూడిన ఈ శరీరం కృశించినా, లేక నశించినా, అందుకు నేను సిద్ధంగా ఉన్నాను. సర్వ సందేహములను, అహంకారమును, అసూయను పరిత్యజించి కేవలం మౌనం వహిస్తాను. ఒక స్థాణువులాగా, బొమ్మలాగా ఉండిపోతాను. క్రమంగా శ్వాసలను, జ్ఞానమును కూడా వదలివేస్తాను. సర్వ అనర్థములకు కారణమైన ఈ శరీరమునకు ఏది అవ్వాలో అట్లే అగుగాక. ఈ దేహము నాది కాదు. నేను నా దేహమునకు చెందినవాడను కాను. ఇతర దేహులు కూడా నా వారు కారు. నేను వారికి చెందినవాడిని కాను. అందుచేత అన్నిటినీ పరిత్యజించివేస్తాను. చమురులేని దీపంలాగా ఈ దేహము శుష్కించి లయించినప్పటికీ ఇందువలన నేను క్రొత్తగా పొందునదిగాని, కోల్పోవునదిగాని ఏమీ ఉండదు. దేని పర్యవసానమెట్లుంటే అట్లే అగుగాక!

రామచంద్రుడు ఈ విధంగా మనోమోహమును నశింపజేసే వాక్యాలు పలికి మౌనం వహించాడు. అవి విన్న అక్కడి సభికులందరు ఆశ్చర్యానందములతో పులకిత శరీరులయ్యారు. అప్పుడు జనించిన వైరాగ్యవాసనలచే అక్కడివారికి సంసారము పట్లగల అజ్ఞానముతో కూడిన

ప్రియత్వం శమించింది. వసిష్ఠ-విశ్వమిత్రాది ఋషులు పరమానందమొందారు. నారదాది మహాప్రాజ్ఞులు రాముని వాక్యములలోని విచిత్రార్థమును గ్రహించి ఉత్తేజితులయ్యారు. సిద్ధులు పుష్పవర్షం కురిపిస్తూ తమలో తాము ఇట్లు సంభాషించుకొన్నారు.

❖❖❖

**సిద్ధులు :** ఆహా! ఈనాడెంత సుదినం! కల్పారంభం నుండి ఇప్పటిదాకా మనం మూడు లోకాలలో సంచరిస్తున్నాం. కాని ఇంతవరకు ఇంతటి అమృతమయ వాక్యాలు ఎప్పుడైనా విన్నామా? బృహస్పతి కూడా ఇంతటి వైరాగ్యవాక్యాలు పలుకలేదేమో! నేటికి కదా మన జన్మలు ధన్యమైనాయి. ఈ వచనాలు విన్నంత మాత్రంచేతనే మనమంతా ఎంతో ఉద్బోధించబడ్డాం. ఆహా! రఘురాముడు పలికిన ఈ ఉత్తమ ప్రశ్నలకు మహర్షులు ఏమి సమాధానమిస్తారో విని తీరాల్సిందే. ఓ సర్వ మునీంద్రులారా! రండి! మనం ఈ దశరథుని సభలో ప్రవేశిద్దాం.

❖

అప్పుడు కమండలధారులగు అనేకమంది ఋషి పుంగవులు సభలో ప్రవేశించారు. మహారాజులేచి వారందరిని ఆహ్వానించి ఉచితాసనములను ప్రదానం చేశారు. వేద-వేదాంగులగు తత్త్వవేత్తలు అక్కడ ఉపవిష్టులవటంతో ఆ సభ ఇంద్రసభను మించిపోయింది. ఆహ్వానితులగు మునులు ఇట్లు శ్లాఘించారు.

ఆహా! మన రామచంద్రుడు వైరాగ్య పూర్ణములు, జ్ఞానప్రబోధకములు, శుభ ప్రదములు అయిన వాక్యాలు పలికాడు. ఇతడు, పలికినవన్నీ అత్యంత విచార యుతములు, సుస్పష్టములు, విశుద్ధములు, సంతోషదాయకములు కూడా! ఇతని మాటలు విని ఆశ్చర్యపడనివారెవరు? ఎక్కడోగాని ఇంతటి సర్వోత్కృష్టములు, సుందరములు, సువ్యక్తములు అయిన వాక్యాలు వినిపించవు. ఎవరి హృదయంలో ఇంతటి ప్రజ్ఞా సుగంధం గల వివేక పుష్పం వికసిస్తుందో అట్టివాడే 'పురుషుడు' అని అనిపించుకొంటాడు. ఈ లోకంలోకి అనేకులు వస్తున్నారు. వారిలో చాలామంది విషయలోలుత్వం ఆశ్రయించినవారై కేవలం రక్తమాంసమయ నిర్మితమగు యంత్రములు మాత్రమే అయివుంటున్నారు. వారియందు ప్రజ్ఞచే ఉద్దీపించు పరిశీలన లేకుండటచే జడమాత్రులే అగుచున్నారు. పురుషార్థముకొరకు, లక్ష్యశుద్ధిలేని వారి జీవితములు వ్యర్థములే కదా! "మేమెందుకు జరామరణ దుఃఖాదులచే వేధింపబడుచున్నాం? ఈ సంసారమనగా ఏమి?" అనునట్టి సారభూతమగు ప్రశ్నలు రాముని వాక్యములచే ఉదయింపజేయబడుచున్నాయి. పూర్వాపరవిచారము సల్పునట్టి నిర్మలాశయుడగు పురుషుడు మనకీరోజు రామచంద్రుని రూపములో లభించటం మనందరి పూర్వసుకృత ఫలమే. ఇంతటి తత్త్వసాక్షాత్కారత్వం ప్రకటించ గలగటం అత్యంత అరుదైన విషయం.

ఆహా! మాన్యుడు, మనీషియగు ఇతడు ఇంత చిన్న వయస్సులో ఎంతటి ఆత్మ వివేక మాధుర్యమును అనుభవమునకు తెచ్చుకొన్నాడు! ఇతడు జగత్స్వరూపమంతా చక్కగా గ్రహించియున్నాడు. ఓ జనులారా! ఎక్కడోగాని లభించనట్టి చందన, లవంగ వృక్షమువలె మనకీతడు ఈనాడిక్కడ లభించాడు. మీరంతా ఇతని మహద్వాణిని విన్నారుకదా! ఈ కుఱ్ఱవాడు చెప్పినట్లు

"అతి క్రూరమగు దైవదృష్టియా?" అన్నట్లున్న ఈ పాడు సంసారములో సారమును గాంచటం చాలా కష్టతరమైన విషయమే. ఎవ్వరైతే ఇక్కడ ఆత్మ వస్తువును పొందటానికి ప్రయత్నిస్తారో వారు మాత్రమే ధన్యులు. వారే అగ్రగణ్యులు. వారే పురుషోత్తములు.

రామచంద్రుని వంటి మహావివేకి-విచక్షణాజ్ఞాని ఇంతకుముందు కాని, ఇకముందు గాని అలభ్యుడనే మా అభిప్రాయం. ఇప్పుడీ రామచంద్రుని వచనములకు సరి అయిన సమాధానమిచ్చి ఇతని అభిమతం సిద్ధింపచేయకపోతే, మాకు మునులు-ఋషులు మొదలైన నామధేయములు వ్యర్థమే అవుతాయి.

ఈ శ్రీరాముడు తత్త్వవిచారణచే పూర్ణత్వము అనుభవించుటకు సర్వవిధముల తగినవాడై ఉన్నాడు.(రామయ్యా! ఇది కదయ్యా, నీ అవతార విశేషం!)

❖❖❖

# వైరాగ్య ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు - లోక కళ్యాణమస్తు

ఓం తత్సత్

❖❖❖

రఘునాథాయ నాథాయా సీతాయాః పతయే నమః

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

# II. ముముక్షు వ్యవహార ప్రకరణం

# ముముక్షు వ్యవహార ప్రకరణం

- ముముక్షువు అనగా ఎవరు? ప్రయత్నము – ప్రయత్నరాహిత్యముల స్థితి–గతులు ఎట్టివి? ఈ మానవుని, దోషపూరితమైన ప్రయత్నములందు నియమిస్తున్నది ఎవరు? వివేక–అవివేకములు ఎట్లు ప్రవర్తిస్తున్నాయి? వివేకము వికసించాలంటే మార్గాలు ఏమిటి? ఈ జీవుని వాస్తవ స్వరూపము ఏమిటి? సాధన – విచారణముల ప్రాశస్త్యమేమిటి? జీవుడు మోక్ష స్వరూపుడు అగుట ఎట్లు? ఈ మొదలైన విషయాలన్నీ ఈ ప్రకరణంలో చర్చించబడ్డాయి.
- శిష్యుడు ఏ దృష్టి కలిగియుండి ఈ శాస్త్రంలోని బోధ వినుటకు సిద్ధంగా ఉండాలో, శ్రీ వసిష్ఠ మహర్షి చర్చించారు. ఈ శాస్త్రము యొక్క లక్ష్యమేమిటో కూడా చెప్పారు.
- జీవుని 'పూర్ణుడు'గా తీర్చిదిద్దటమే ఈ శాస్త్రము యొక్క ఏకైక లక్ష్యము కదా! అతనిని స్వతంత్ర, యత్నశీలునిగా చేయుటకుగాను, "దైవము" అనబడు బాహ్యమగు వస్తువు అతనికి ఏదీ ప్రసాదించుటలేదని నిరూపించబడినది. జీవుని స్వకీయ యత్నములే జ్ఞానాజ్ఞానములకు కారణములగుచున్నాయి.

ఈ ప్రకరణం పాఠకుని సదాచారము – వివేకపూర్వక విచారణలకు సిద్ధం చేస్తోంది.

# 1. శ్రీ శుక విశ్రాంతి

శ్రీరామచంద్రుని వివేక, వైరాగ్య పూరితమైన వాక్యాలు సభలోని వారందరి హృదయాలు పులకింపచేశాయి. అనేక మంది సిద్ధులు, మునులు, ఆ సభలో ప్రవేశించారు. వారందరు ఉచితరీతిన సత్కరింపబడినవారై సభలో ఆశీనులయ్యారు. అంతటా మరల ప్రశాంత వాతావరణం అలముకొన్నది. శ్రీ విశ్వామిత్ర మహర్షి రాముని ఉద్దేశించి మధురస్వరంతో పలుకనారంభించారు.

**శ్రీ విశ్వామిత్ర మహర్షి :** ఓ రాఘవా! నీవు పరమ పవిత్రమైన సత్యమునే పలికావు. నీ సూక్ష్మబుద్ధిచే గ్రహించవలసినదంతా చక్కగా గ్రహించావు. వాస్తవానికి నీవు క్రొత్తగా ఎరుగవలసినదంటూ ఏదీ లేదు. అయితే, సహజ నిర్మలమగు నీ బుద్ధికి కొంచెము మెరుపు మాత్రం అవసరమై ఉన్నది. ఈ సందర్భంలో ఇతఃపూర్వపు ఒక సంఘటన నాకు గుర్తుకు వస్తోంది. శ్రీ వ్యాస మహర్షి కుమారుడు 'శుకుడు' అనువాని విషయంలో ఇటువంటిదే... ఒకానొక సంఘటన జరిగింది. అతడు కూడా నీవలెనే తెలుసుకోవలసినదంతా తెలుసుకున్నప్పటికీ, జనక మహరాజుచే బోధింపబడిన తరువాతనే ఆత్మయందు విశ్రమించాడు. నీకు మొట్టమొదటగా, శుభదాయకమగు ఆ శుక మహర్షి వృత్తాంతం చెపుతాను విను.

❖

ఓ రామచంద్రా! అటు చూడు. నీ తండ్రి సింహాసనం ప్రక్కనే, సూర్య తేజస్సుతో వెలుగుచు, ఆసీనుడై ఉన్న ... ఆయనే, వ్యాసమహర్షి. ఆయన కుమారుడే శుకుడు. సౌందర్యరాశి వంటి ఆ శుకుడు జన్మతః మహాప్రాజ్ఞుడు. యువకుడగు అతడు ఒకప్పుడు ఒక ఏకాంత ప్రదేశం చేరాడు. ప్రశాంతచిత్తుడై, పద్మాసనము వైచుకొని, ఈ సంసారము యొక్క గతి గురించి, ఇందలి మాలిన్యము గురించి చింతించసాగాడు. అట్లు విమర్శనా పూర్వకంగా విచారించుచు ఉండగా కొంతకాలానికి అతని మనస్సునందు ఉత్తమోత్తమమైన 'వివేకం' ఉదయించింది. మహాబుద్ధిమంతుడు అగుటచే నిజబుద్ధి బలంచేత, చిరకాల విచారణచే అతడు అకృత్రిమము, సహజము, సుందరము, సత్యము అయిన "ఆత్మస్థితి యొక్క ఆనందానుభవం" గ్రహించాడు.

అట్లు తనంతట తానే సత్య వస్తువును ఎరిగినప్పటికీ అతని మనస్సు మాత్రం పూర్ణమగు శాంతిని పొందలేదు. "నేను గ్రహించినదే సత్యమా? జీవుడనగు నేను వస్తుతః పరిశుద్ధమగు పరమాత్మనే అయివున్నానా?" అనునట్టి కించిత్ శంక ఇంకా అతనిని వదలలేదు. ఫలితంగా సంసార దుఃఖం ఉండనే ఉన్నది. అతని సుస్థిర చిత్తము క్షణభంగురములగు సర్వ సంసార విషయముల నుండి విడివడింది. అనగా రంగం సిద్ధమైనది. కాని అతడు ఉత్తమ శాంతిని పొందవలసి ఉన్నది. అప్పుడాతడు ధ్యానము చాలించి, తండ్రియగు వ్యాసమహర్షిని సమీపించి, ప్రణామంచేసి ఇట్లు ప్రశ్నించాడు: "స్వతఃగా ఆత్మ స్వరూపుడనగు నాయందు ఈ సంసారాడంబరమంతా ఎట్లా ఉదయించింది? 'సంసారము' అని చెప్పబడుచున్నదంతా ఇంతకాలం కల్పించుచున్నవారెవరు? ఈ

ఉపాధియందున్న నేను అఖండుడనై నిత్యుడనై ఉన్నమాట వాస్తవమేనా? నాకున్న శంకను తొలగించండి." ఆత్మజ్ఞానియగు వ్యాసుడు పుత్రుని ప్రశ్న విని నిర్మల భావంతో యథోచితంగా అనేక శాస్త్ర, లౌకిక యుక్తులతో జీవుని వాస్తవ స్వరూపము వివరించాడు. కాని, శుకుడు, "నా తండ్రి చెపుతున్న ఈ విశేషములన్నీ నేను ఇంతకు ముందే గ్రహించాను కదా!" అని అనుకోసాగాడు. కుమారుడు తన వివరణ పట్ల నిరాదరణపూర్వకంగా ఉండటం గమనించి వ్యాసుడు, "నాయనా! శుకా! నేను గ్రహించియున్నదంతా చెప్పాను. నేను ఇంతకన్నా ఎక్కువ ఎరుగను. మిథిలానగర రాజు 'జనకుడు' అను అతడు నాకన్నా కూడా ఉత్తమమైన జ్ఞాని. నీవు వెళ్ళి ఆయనను శరణు వేడు. ఆయన వద్ద నీవు తెలుసుకొనదలచినది తెలుసుకోగలవు" అని చెప్పి మౌనం వహించారు. శుకదేవుడు తండ్రి పాదాలకు నమస్కరించి, సెలవు తీసుకొని, మిథిలానగరం బయలుదేరాడు.

❖

ద్వారము వద్ద వచ్చి వేచియున్న శుకదేవుని, రాజాంతఃపురములోని ఒక ద్వార పాలకుడు గమనించాడు. వివరాలు తెలుసుకొని జనకమహారాజుకు నివేదించాడు. అప్పుడు జనకుడు ఒక్క క్షణం యోచించి, "సరే. వస్తే రానీ! ఇప్పుడు సమయం లేదు. అనేక రాచకార్యక్రమములలో ఉన్నాను" అని సేవకుణ్ణి పంపివేశాడు. ఏడు రోజులు గడచిపోయాయి. శుకుడు ద్వారం వద్దనే వేచియున్నాడు. అప్పుడు రాజు ఒక భటుని పిలచి "ఓయీ! నీవు పోయి 'శుకుడు' అను ద్వారంవద్ద వేచియున్న మునికి బసకొరకు మన నగరంలోని ఏదైనా వసతి గృహం చూపించు. రాచకార్యముల వత్తిడి వలన మరొక వారం రోజుల వరకు రాజదర్శనం లభించదని చెప్పు" అని ఆజ్ఞాపించాడు. ఒక విశ్రాంతి గృహంలో ఆయనకు బస చూపించబడింది. మరొక ఏడు రోజులు గడచిపోయాయి. శుకుడు ఏమాత్రమూ ఉద్వేగంలేక అట్లే వేచియున్నాడు. వార్తాహరుల ద్వారా అంతా గ్రహించిన జనకుడు అతనిని మరికొంత పరీక్షించాలనుకొన్నాడు.

అప్పుడు అంతఃపురంలోని ఒక విలాసవంతమైన గదిలో శుకునకు బస ఏర్పాటు చేయబడింది. ఆకర్షణీయమైన పదార్థములు, భోజన పానములు అమర్చబడ్డాయి. మదమత్తులైన స్త్రీలు అతనిని సేవించుటకు నియోగించబడ్డారు. శుకుడు ఆ అంతఃపురంలో కూడా స్థిరచిత్తుడై, మౌనం వహించియున్నాడు. పిల్లగాలులు మట్టి వృక్షపు కాండమును కదల్చగలవా? దుఃఖ స్వరూపములే అయివున్న అక్కడి భాగ్యవస్తువులు, సపర్యలు, వందిమాగధ వచనములు,సుందర స్త్రీల సరస-సల్లాపములు అతని మనస్సుకు ఏమాత్రం ఆకర్షితంగా అనిపించలేదు.

ఈ విధంగా ఇంకొక ఏడు రోజులు గడచిపోయాయి. శ్రీ శుకదేవుని చెక్కుచెదరని ప్రశాంత స్థితిని గురించి తెలుసుకొన్న జనకుడు చాలా సంతోషించాడు. స్వయముగా వెళ్ళి శుకదేవుని సభా మధ్యమునకు ఆహ్వానించి పూజించాడు.

**శ్రీ జనక మహారాజు :** ఓ శుకదేవా! ఇప్పుడు మీ స్వభావమేమిటో గ్రహించాను. నేను మహదానందం పొందాను. ఈ జగత్తులో ఉంటూనే జీవుడు ఏ విధంగా ప్రవర్తించటం ఉచితమో మీరు అట్లే

ప్రవర్తించారు. నాకు చాలా సంతోషంగా ఉన్నదయ్యా! ఇప్పుడు చెప్పండి. మీరు ఏమి తెలుసుకోవాలనుకుంటున్నారు?

**శ్రీ శుకుడు :** గురువర్యా! నన్నొక సందేహం పట్టి పీడిస్తోంది. ఈ జీవుడు ఎవరు? అఖండమగు పరమాత్మయే ఇతడై ఉంటే, మరి "నేను ఈ శరీర పరిమితుడను, నానుండి తదితరులు వేరైనవారు, నేను శ్రమించి మోక్షము పొందవలసి ఉన్నది" ఇటువంటి ఏకానేక రూపములైన చాంచల్యమంతా ఎట్లు ఎందుకు ప్రాప్తిస్తోంది?

అప్పుడు జనకుడు ఈ సంసారము యొక్క వాస్తవ – అవాస్తవముల గురించి పూసగ్రుచ్చినట్లు అంతా వివరించాడు.

**శ్రీశుకుడు :** హే మహావక్తా! మీరీ విషయములన్నీ ఉన్నది ఉన్నట్లు వివరించినందుకు కృతజ్ఞుడను. అయితే వివేకబలంచేత ఈ విషయాలన్నీ ఇదివరకే గ్రహించాను. (ఉపనిషత్తులు మొదలైన) శాస్త్రాలు ఈ విషయమే చెప్పుచున్నట్లు తెలుసుకొన్నాను. నా తండ్రి కూడా "నిస్సారమగు ఈ సంసారమంతా అజ్ఞానము నుండే వెలువడుచున్నది. అజ్ఞానము తొలగగా, ఈ జీవుడు స్వతహాగా నిత్యుడై, ఆనందమయుడై, పరమేశ్వరుడై ప్రకాశిస్తాడు" అని చెప్పియున్నారు.

మీరు చెప్పినట్లు "జీవుడు జ్ఞానముచే లేక అజ్ఞానము తొలగుటచే బ్రహ్మము అగును" అనే విషయం నా కర్థమగుచున్నది. కాని స్వామీ! "అజ్ఞానము తొలగుట" అనగా ఏమో నాకు సుస్పష్టమైనట్లు లేదు. "నాయందు అజ్ఞానము తొలగినది" అనుటకు గుర్తు ఏది? అట్టి స్థితి ఎప్పటికి లభిస్తుంది? నాకు అఖండత్వము యొక్క అనుభవం ఇంకను లభించలేదేమి? బ్రహ్మమే నేనైతే, మరి ఈ 'జీవుడను' అనేది ఎందుకు నాపట్ల ఏర్పడిఉన్నది?

**శ్రీ జనకుడు :** మునీశ్వరా! సత్యవస్తువగు బ్రహ్మమును మీరు స్వయముగానే స్వవిచారముచే సుస్పష్టంగా గ్రహించారు. ఆపై మీ తండ్రిగారివద్ద సవివరంగా విన్నారు. మీరు గ్రహించినదే బ్రహ్మతత్త్వము. ఇక మీరు తెలుసుకోవలసినదంటూ వేరే ఏమీ లేదు.

"బ్రహ్మతత్త్వము గ్రహించాను" అని మీరు నిరభ్యంతరంగా భావించవచ్చు. ఎందుకంటారా? మీ దృష్టిలో దృశ్య పదార్థజాలమంతా అవాస్తవము అయి ఉండుట చేతనే ఈ నగరంలో ఇరువది ఒక్క రోజులు నిర్లిప్తులై ఎట్టి వికారములకు లోను కాకుండా ఉన్నారు. సమృద్ధి – అసమృద్ధులు గాని, మానావమానములు గాని మిమ్ములను స్పృశించలేదు కదా! మీచే దృశ్యము త్యజించబడినట్లే అయినది.

ఈ విధంగా దృశ్యము తిరస్కరించబడగా, అప్పుడు శేషించు "శుద్ధము, అనిర్వచనీయము" అగు స్వస్వరూపమే పరబ్రహ్మముగా వేదజ్ఞులచే ప్రవచించబడినదని గ్రహించండి. ఓ మహర్షీ! అఖండ, నిత్యోదిత చైతన్య స్వరూపుడు, అద్వితీయుడు అగు ఆ ఆత్మ పురుషునికి ఒక్కనికే ఈ జగత్తునందు అస్థిత్వమున్నది. ఇక తక్కినవన్నీ కల్పనా మాత్రములే. అజ్ఞానయుతములగు సంస్కారముల వలననే "నేను, నీవు, పదార్థములు, శుద్ధబ్రహ్మము – ఇవి వేరువేరు" అను

భ్రమలు కలుగుచున్నాయి. ఆ భావనలే క్రమక్రమంగా స్వస్వరూపమగు ఆత్మతత్త్వమును బంధింపబడిన దానివలె అగుపింపచేస్తున్నాయి. అట్టి బంధము యొక్క అనుభవము ఉన్న వానిని మనం 'జీవుడు' అంటున్నాం. ఆ జీవుడు అజ్ఞానము నశించినపుడు ముక్తుడై స్వస్వరూపమగు ఆత్మగా శేషించుచున్నాడు. లేక, బ్రహ్మమే తానగుచున్నాడు.

మహాత్మా! మీరు ఈ భోగములపట్ల, ఈ సర్వదృశ్య వ్యవహారముల పట్ల, "ఇదంతా ఏమాత్రం సత్యము కాదు" అను సుస్థిరమైన బుద్ధి కలిగియున్నారని మీ ప్రవర్తచే నిరూపించారు. "ఇక తేజోమయమగు ఆత్మనే నేను" అని గ్రహించుటకు అడ్డేమున్నది చెప్పండి? ఎరుగవలసినది ఎరిగినప్పుడు మాత్రమే అకృత్రిమమగు 'విరాగము' ప్రకటితమౌతుంది. అట్లు నిస్సంగత్వం ప్రకటించి మీరు మహావీరులు అయ్యారు. శాస్త్రములచే బోధింపబడు అనేక విధి-విధానములు, వైదిక వ్యవహారములు జీవునకు అనాసక్త-బుద్ధిని నేర్పుటకే ఉన్నాయి. అట్టి 'అనాసక్తి'ని మీరు ఇప్పటికే సాధించారు. ఇక మీకు చెప్పవలసినదిగాని, మీరు వినవలసినదిగాని లేదు. పరిపూర్ణత్వము పొందినవారియందు రాగద్వేషరాహిత్యము, దృశ్యము పట్ల అంతరంగమున నిర్లిప్తత సహజంగానే ప్రాప్తిస్తాయి. మీరు స్వయముగా మీ వివేకబలంచేత పూర్ణత్వం పొందియే ఉన్నారు. మీ తండ్రి, వేదవ్యాసులు కూడా సర్వజ్ఞాననిధి, మహాతపస్వి అయినప్పటికీ, మీవలె ఇంతటి పూర్ణానుభవం పొందియుండలేదు. నేను వ్యాసుని కంటే శ్రేష్ఠుడను. ఇక మీరో, భోగరాగములను ఉద్వేగ-అనుద్వేగములను పూర్తిగా త్యజించి ఉండుటచే నాకంటే కూడా అధికులు అయ్యారు. పొందవలసిన ఉత్తమ స్థితి పొందనే పొందారు. కనుక మీ మనోరథం సిద్ధించినట్లే. ఈ దృశ్య ప్రపంచమున, ముల్లోకములందు మిమ్ములను వివశులను చేయునది, బద్ధులను చేయునది అంటూ ఏదీ లేదు. కనుక మీరు ముక్తులే అయి ఉన్నారు. ఇక మీకు సందేహం దేనికి? "ఇంతకు మించినది ఏదో ఉన్నది" అనే భ్రమను త్యజించండి. కట్టుకొయ్య త్రెంచుకొన్న ఆవువలె మీరు బంధ విముక్తులు అయ్యారు. ఇక మీకు ఎట్లు ఉచితమనిపిస్తే అట్లే సంచరించండి. ఆత్మ స్వరూపులు, ఆత్మ స్వభావులు అయివున్న మీకు నేను నమస్కరిస్తున్నాను.

❖

ఓ రఘురామా! మహాత్ముడగు జనకుని ఈ ఉపదేశం విన్న ఆ శుకయోగి సర్వ శంకలను అక్కడికక్కడే త్యజించి వేశాడు. మలినరహితమగు 'ఆత్మ' అను పరమ వస్తువును అధిష్ఠించి విశ్రాంతి పొందాడు. శోకము, సంశయము, ఆయాసముల నుండి విడివడ్డాడు. జనకునకు ప్రణామంచేసి అక్కడి నుండి బయలుదేరాడు. 'సమాధి'ని అభ్యసించుటకు మేరు పర్వతం చేరాడు. అక్కడ నిర్వికల్పయోగంలో అనేక సంవత్సరములు గడిపాడు. అటు తరువాత తైలరహిత స్వయంజ్యోతివలె 'ఆత్మ స్వభావము' అను నిర్వాణస్థితి పొందాడు. సర్వ అజ్ఞాన సంస్కారములు తొలగిపోయాయి. సునిర్మల స్వరూపుడై, పరమపావనుడగు పరమాత్మయందు లీనమై విదేహముక్తుడైనాడు.

❖

ఈ విధంగా వ్యాసపుత్రుడగు శుకదేవునకు కించిత్ 'గుర్తుచేయుట' అనే మార్జనం అవసరమైనది కదా! ఓ మునిశ్రేష్ఠులారా! మన ఈ రాముని విషయంలో కూడా ఇప్పుడు అట్టిదే అవసరమగుచున్నది. ఇతనికి కారణ రహితంగానే భోగములందు విరాగము పుట్టుటచే తన వివేకంచేత తెలుసుకోవలసినదంతా తెలుసుకొన్నాడు. భోగజాలము పట్ల అకృత్రిమమైన అరుచియే తత్త్వజ్ఞానిలో కనిపించే ఒక ముఖ్యమైన లక్షణం. ఈ సంసార బంధమంతా స్వతహాగా వాస్తవమైనది కాకపోయినప్పటికీ, "భోగచింతన"చే ఇదంతా దృఢపడి ఈ జీవునికి ప్రాప్తిస్తోంది. "వాసనాభివృద్ధే (Increase of tendencies) బంధము. వాసనాక్షయమే మోక్షము" అని మనకు జ్ఞానులైన పెద్దలు చెప్పుచున్నారు.

మరొక్క విషయం. ఆత్మ విషయమై ఆపాత జ్ఞానం (temporary & partial knowledge) అల్పశ్రమతో కూడా కలుగవచ్చు. ఎవరో చెప్పగా వినినంత మాత్రంచేత కూడా (స్వల్పమైన ఆవేశరూపంలో) వైరాగ్యం పొందవచ్చును. కాని, అట్టి వైరాగ్య భావన సుస్థిరపడాలంటే సంగరహితమైన బుద్ధి కావాలి. విషయములపట్ల వితృష్ణ (desirelessness) మాత్రం ఎంతో కష్టించితే కాని పొందుటకు వీలుకాదు. ఎవరి జ్ఞానధనమైతే కామక్రోధాదులచే ప్రతిహతం కాదో – అట్టివాడే తత్త్వజ్ఞుడు, జ్ఞాని, పండితుడు కూడా. ఎప్పుడైతే ఈ జీవుడు తెలుసుకొనవలసినదానిని తెలుసుకొంటాడో (నేను ఎవరు? అను ప్రశ్నకు ఉత్తమ సమాధానం పొందుతాడో), అప్పుడు మాత్రమే అతనికి ఈ శరీర పటాటోపం పట్ల, ఐశ్వర్యముల పట్ల, భోగములపట్ల సహజమైన విముఖత, అరుచి ఏర్పడతాయి. యశస్సు – దంభము కొరకు కాకుండా, వాస్తవదృష్టి వలన అకృత్రిమమైన వైరాగ్యము పొంది ఉండే వారే మానవులలో ఉత్తమోత్తములు. జ్ఞేయమగు (సర్వజ్ఞానుల ఉత్తమ లక్ష్యమగు) ఆత్మవస్తువు గ్రహింపబడనంతవరకు విషయవితృష్ణ కలగటం అసంభవమే.

రమణీయమగు భోగ భాగ్యములు కూడా, ఎంతటి దోషభూయిష్ఠమైనవో మన రామచంద్రుడు స్వవిచారణచే గ్రహించాడు. అందుచేతనే మహత్తరమైన ఆశయములను పొందగలిగాడు. ఓ సభికులారా! ఈ బాలుడు చెప్పినదంతా వాస్తవమే. అయితే ఇతనికి ఇంకా చిత్త విశ్రాంతి కలుగవలసియున్నది. స్వస్వరూపమగు ఆత్మ గురించి విచారణచే ఇతడు తప్పకుండా చిత్తవిశ్రాంతి పొందగలడు. ఇప్పుడు ఈ రాముని బుద్ధి కైవల్య శాంతి మాత్రమే కోరుకుంటోంది.

లోకకళ్యాణార్థం, రాముని చిత్తవిశ్రాంతి కొరకు రఘుకుల గురువు, సర్వము ఎఱిగినవాడు, సర్వసాక్షి, బ్రహ్మజ్ఞాని, త్రికాలవేత్త అయిన వసిష్ఠ భగవానుణ్ణి ఆత్మ విచారణ బోధించవలసినదిగా సభాముఖంగా అర్థిస్తున్నాను.

హే వసిష్ఠ మహర్షీ! ఒకప్పుడు మన ఇరువురి వైరం శాంతింపచేయటానికి భగవంతుడగు బ్రహ్మదేవుడు మీకు, నాకు, తదితర మునులకు ఆత్మజ్ఞానం ఉపదేశించారు కదా! ఆ యుక్తిపూర్వకమైన జ్ఞానోపదేశం చేత సర్వ సంసార వాసనలు తొలగిపోగలవు. ఓ బ్రహ్మజ్ఞా! మీ ప్రియశిష్యుడగు రామచంద్రునకు ఉత్తమమైన ఆత్మ విషయం ఉపదేశించుటచే ఇతడు, ఈ రాజ్యం, ఈ లోకం,

భవిష్యత్తులో అనేకమంది జనులు పవిత్రత పొందటం జరుగుతుంది. వివేక వైరాగ్యములతో ప్రకాశిస్తున్న రాముడు మీ ఉపదేశమునకు అన్ని విధాలా తగినవాడు. ఇతనికి ఉపదేశించటం చేత మీ వాక్యాలు సార్థకమౌతాయి. ధూళిచే కప్పబడక పరిశుభ్రంగా ఉన్న అద్దంలో ముఖం సులువుగా, సుస్పష్టంగా కనిపిస్తుంది కదా!

త్రికాలజ్ఞులగు మీకు మేము చెప్పగలిగేదేమున్నది? భక్తిశ్రద్ధలు కలిగినవాడు, నిగర్వి, వైరాగ్యవంతుడు అయిన శిష్యునకు బోధింపబడు శాస్త్రజ్ఞానమే సార్థకమౌతుంది. ఏ బోధ అయితే అజ్ఞానమును దగ్ధం చేస్తుందో, సర్వ సందేహములను మొదలంట్ల తొలగిస్తుందో, అనిందితమైన ఉత్తమ సత్యమును ప్రతిపాదిస్తుందో – అదే ఉత్తమబోధ. అట్టి బోధను మీరు మాత్రమే ప్రసాదించగలరు.

గురుశుశ్రూషబుద్ధి లేనివానికి, విరక్తుడు కానివానికి, అపాత్రునకు ఉపదేశించబడే జ్ఞానం కుక్కతోలులో పోయబడిన పాలవలె అపవిత్రమే అవుతుంది. హే వసిష్ఠ మహర్షీ! మీరు మహావైరాగ్యసంపన్నులు. భయక్రోధములంటూ లేనివారు. నిర్మలమైన స్వభావము కలవారు. సాధుపుంగవులు. అట్టి మీవంటి మహనీయులు ఆత్మ విషయమై ఉపదేశించటంచేత, ఆ ఉపదేశ సమయంలోనే బోధింపబడువాని బుద్ధి వికసించి విశ్రమించగలదు.

అప్పుడు వ్యాస, నారదాది మహర్షులు అభ్యర్థనపూర్వకంగా వసిష్ఠునివైపు చూచి చిరునవ్వు నవ్వారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ విశ్వామిత్ర మహర్షీ! ఈ సభకు వేంచేసిన వ్యాస–నారదాది మునిసత్తములారా! నేను మీ ఆజ్ఞను శిరసావహించటానికి సిద్ధంగా ఉన్నాను. సజ్జనుల వాక్యములు ఉల్లంఘించే శక్తి ఎవరికుంటుంది? మీరు నన్ను నియమిస్తున్నట్లుగానే ఈ రామాదులకు జ్ఞానోపదేశం చేసి అజ్ఞానమును నివృత్తింపజేస్తాను. దీపం వెలిగించిన తరువాత చీకటి ఆ సమీపంలో ఉంటుందా?

పూర్వము నా తండ్రియగు బ్రహ్మదేవుడు నాకు, తదితర మునివరేణ్యులకు ఉపదేశించిన ఆత్మజ్ఞానమును నేను ఇప్పుడు స్మరించుచున్నాను. ఈ నా ప్రయత్నము సంసార భ్రమను శాంతింప చేయటానికి, లోక కళ్యాణము కొరకు ప్రవృత్తమగుగాక!

❖

ఇట్లు ఆయన ప్రతిజ్ఞాపూర్వకమైన మంగళాశాసనం పలికారు. కొద్దిక్షణాలు ధ్యాన నిష్ఠులై దృష్టాంతములు, ఉపాఖ్యానములు, ప్రమాణములు మొదలైన పరికరములు చేకూర్చుకొన్నారు.

అప్పటికప్పుడు ఆ సభయందు వక్త–శ్రోతలకు అనుకూలమైనట్టి వాతావరణం, వేదికలు తయారు చేయబడినాయి. అప్పుడు బ్రహ్మర్షివరేణ్యులగు వసిష్ఠ మహర్షి అజ్ఞాన శాంతి కొరకు పరతత్త్వ బోధకమైన "యోగవాసిష్ఠము" లేక "అఖండ రామాయణం" ఇట్లు ప్రవచించ ప్రారంభించారు.

❖❖❖

# 2. సదేహముక్తి - విదేహముక్తి

**శ్రీ వసిష్ఠమహర్షి :**

**పూర్వమ్ ఉక్తం భగవతా యత్ 'జ్ఞానం' పద్మజన్మనా,**
**సర్గాదౌ, లోకశాంత్యర్థం తదిదం కథయామ్యహమ్ ॥** (III-1)

ప్రియశిష్యా! రామచంద్రా! పూర్వం సృష్టి ప్రారంభంలో బ్రహ్మదేవుడు జగశ్శాంతి కోసమై ప్రవచించిన ఆత్మ తత్త్వశాస్త్రమును నీ ముందు ఉంచబోవుచున్నాను. శ్రద్ధతో వినెదవుగాక!

**శ్రీరాముడు :** హే భగవంతుడా! వసిష్ఠమహర్షీ! మనం మోక్షశాస్త్రంలో ప్రవేశించే ముందు నాకు ఉన్న ఒక సందేహం నివారించ ప్రార్థిస్తున్నాను. శుకదేవుడు విదేహముక్తి పొందినట్లు విశ్వామిత్రమహర్షి చెప్పియున్నారు. అతని తండ్రి, గురువు, మహామతి, సర్వజ్ఞుడు అయిన ఈ మన వ్యాసమహర్షి ఎందుకు విదేహముక్తి పొందలేదు? శుకుడు మాత్రమే ఎందుకు పొందాడు? తత్త్వజ్ఞానమునకు విదేహముక్తియే ఉత్తమ ఫలితముగదా! శుకయోగి యందుగల ప్రత్యేకత ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! సూర్యునివలె స్వయంజ్యోతి స్వరూపుడగు ఆ 'పరమాత్మ' యొక్క చైతన్యశక్తి లేక చిత్ప్రకాశంలో కాంతిరేణువులవలె అనంత సంఖ్యలో బ్రహ్మాండాలు లేచి ప్రవర్తించి, లీనమైపోతున్నాయి. ఈ వర్తమాన క్షణంలో కూడా త్రైలోక్యములతో (స్వర్గ-మర్త్య-పాతాళములతో) కూడిన బ్రహ్మాండములు ఇసుకరేణువులవలె లెక్కింప అలవికాదు. అదే విధంగా ఇక ముందు కూడా ఆ 'పరమాత్మ' అనే మహాసముద్రంలో ప్రపంచ-తరంగాలు అసంఖ్యాకంగా లేచి లయించబోతున్నాయి.

అట్టి ఈ 'జగత్తులు' అనే రేణువులందు "ఇది సత్యమే" అను బుద్ధితో ఈ మాయామయులైన జీవులు ప్రవర్తిస్తున్నారు. అయితే, జీవన్ముక్త పురుషులకు మాత్రం ఇందలి అసత్యత్వమంతా అవగతం అయ్యే ఉంటుంది. అందుచేత ఇదంతా వారికి స్వప్నతుల్యంగానే ఉంటోంది. అట్టి స్వప్నము వంటివే అయిన ఈ బ్రహ్మాండములలో అంతర్గతమైయున్న ఈ దేహాదులు కూడా నశ్వరము (నశించపోవునవి), స్వప్న తుల్యము, అసత్ తుల్యము (వాస్తవానికి లేనట్టివి) అయి ఉన్నాయి. ఇట్టి దేహాదులు కలిగి ఉండుటలో,(లేక) లేకుండుటలో విశేషమేమున్నది? ఆత్మతత్త్వము చక్కగా ఎరిగిన జ్ఞానుల దృష్టిలో జీవన్ముక్తులకు వచ్చిన లోటేమీ లేదు. అది విదేహముక్తి కన్నా తక్కువైనదిగా వారు ఎంచుట లేదు. ఉన్న రహస్యమంతా తన వాస్తవస్వరూపమగు 'ఆత్మ' గురించి పొందియున్న విజ్ఞానపూర్వకమైన జ్ఞానములోనే ఉన్నది.

**శ్రీరాముడు :** మీరు భూతకాలపు, వర్తమానపు, భవిష్యత్ కాలపు, బ్రహ్మాండముల ఉత్పత్తి, స్థితి వినాశనముల గురించి చెప్పుచున్నది అత్యంత సమంజసమే. మనకు కనబడుచున్నదంతా అనుక్షణం మార్పు చెందుతూనే ఉన్నది. భూతభవిష్యత్ కాలముల మధ్య ఈ వర్తమానకాలంలో కనబడే బ్రహ్మాండము, ఇందలి పదార్థములు సర్వదా అనిశ్చింతంగా, అస్థిరంగా ఉంటున్నాయి. అందుచేత వర్తమాన బ్రహ్మాండము గురించి, ఇందలి వస్తుజాలము యొక్క ఆయా ధర్మముల గురించి ఎరిగినంత

మాత్రంచేత, మనం 'బ్రహ్మతత్త్వము' లేక 'ఆత్మయొక్క వాస్తవ స్వభావము' ఎరుగజాలమేమోనని నాకు అనిపిస్తోంది. భూత–భవిష్యత్ అనే రెండు గట్ల మధ్య మనకు లభిస్తున్న ఈ వర్తమానమును అట్లే ఉంచి, మనం ఈ బ్రహ్మాండము యొక్క పూర్వాపరాలను (ఇది ఎక్కడి నుండి వస్తోంది? ఎటు పోబోతోంది?) తప్పక విచారించవలసియున్నది. ఈ వర్తమాన బ్రహ్మాండము యొక్క అంతర్గత దృశ్య విశేషాల గురించి విచారణ అనవసర కాలయాపనయే అవుతుందేమో, ఎందుకంటారా? ఈ కనబడే వస్తుజాలమంతా అనుక్షణం భూతకాలం నుండి, భవిష్యత్తుకు పయనిస్తూ – వర్తమానంలో లేకయే ఉన్నాయని అనిపిస్తోంది. ఎప్పటికప్పుడు భూత భవిష్యత్తులచే కప్పివేయబడుతూ ఉన్నట్టి ఈ వర్తమాన "క్షణిక దృశ్యప్రపంచము"ను మనం ఎంత తరచి చూచినా, ఇది మనకు కావలసిన ఉత్తమ అవగాహనను ప్రసాదించజాలదేమో?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓహో! తత్త్వగ్రహణ సమర్థమైనట్టి నీ సూక్ష్మబుద్ధికి మెచ్చాను. అయితే భూత–భవిష్యత్, వర్తమానములు, ఈ బ్రహ్మాండములు, ఈ వ్యవహారమంతటిలో ఒకానొక మిథ్యాత్వము అజ్ఞానముచే సత్యమైన దానివలె ప్రవర్తించుచున్నది. అందుచేత, నీ రెండు ప్రశ్నలు దృష్టిలో ఉంచుకొని నేను చెప్పబోవు సమాధానం విను.

❖

| | |
|---|---|
| కారణ దేహమే.... (The Self) | ఆయా ధర్మములను అనుసరించి ప్రత్యగాత్మ తత్త్వం 'జీవుడు', 'శరీరి', ('The Experiencer') మొదలైన పేర్లతో చెప్పబడుతోంది. |

అదియే.... "తత్ – అది (తత్త్వమ్)", "సః – అతడు (సోఽహమ్)", "స్వస్వరూపాత్మ" ఇత్యాది పదములచే ఉద్దేశించబడుతోంది.

**స్థూలం** *:* ఈ పశువులలోను, పక్షులలోను, మృగములలోను, మనుష్యులలోను, దేవతలలోను 'శరీరత్యాగము' అను రూపముగల 'మృతి'ని చూస్తూనే ఉన్నాం కదా! ఈ కళ్ళకు కనబడే రక్తమాంస నిర్మిత శరీరమును జలము – వాయువు – అగ్ని – భూమి – ఆకాశములచే నిర్మించబడుటచే భౌతికశరీరం' లేక 'స్థూలశరీరం' అంటున్నాం.

**సూక్ష్మం :** ఈ స్థూల దేహం నశించినప్పటికీ, 'మనస్సు–బుద్ధి–చిత్తము అహంకారముల సమన్వయం మాత్రం నశించదు. దానిని 'సూక్ష్మశరీరం' లేక 'అతివాహికదేహం' అని అంటున్నాం. 'సూక్ష్మశరీరం' యొక్క రూపమే ఇష్టములు, అయిష్టములు, అవగాహనలు, అభిప్రాయములు, కోరికలు, భావనలు, కోపతాపములు మొ॥ అయి ఉన్నాయి. (మరికొన్ని శాస్త్రములు దీనినే 'సంస్కారశేషము' అని కూడా అంటున్నాయి).

*Any proof?* స్థూలదేహం నేలకూలినంత మాత్రం చేత అతివాహిక దేహం నశించదు. లేక, లేకుండాపోదు. అయితే, శరీర పరిమితులైన అతని బంధువులు మాత్రం పాంచభౌతిక దేహము వరకు మాత్రమే గ్రహించగలరు కనుక, "అయ్యో! మనవాడు చనిపోయాడే!" అని అనుకొని ఊరుకొంటున్నారు.

ఇప్పుడు భౌతిక శరీరం తొలగిపోగా సూక్ష్మశరీరము మాత్రమే ధరించి ఉన్న ఈ జీవుడు అప్పటికప్పుడు తన వాసనలను (tendencies) అనుసరించి తన హృదయాకాశంలో ముల్లోకములను గాంచుచున్నాడు. దీనినే 'పరలోకము' అని అంటున్నాం. ఇప్పుడు ఇక్కడ చూడబడే ముల్లోకములు కూడా అట్టివే సుమా! ఇది ఇతఃపూర్వమునకు (అనగా ఈ వర్తమాన శరీరధారణకు ముందున్న స్థితికి) పరలోకమే అయివున్నది కదా! అయితే దేహాత్మబుద్ధి లేక పంచభూతములకు పరిమితమైన బుద్ధి కలవారికి – ఇదంతా మరొక చోటగాని, లేక ఆలస్యంగా గాని జరుగుతోందని అనిపిస్తోంది. కాని, అది అట్లేమి కాదు. ఎందుకంటే అతివాహికానుభవం పంచ భూతముల కంటే సూక్ష్మమైనది కదా! అద్దాని అనుభవం పంచభూతములతోను, అవి ఉండనప్పుడు కూడా ఏర్పడగలదు.

ఇక్కడ ఒక విషయం గ్రహించాలి. మనం ఇక్కడ ఇప్పుడు చూస్తున్న ఈ స్థూల దేహమును జీవుడు తన సూక్ష్మదేహం సహాయంతోనే ధరించి, ప్రవర్తింపచేస్తున్నాడు. కనుక ఇక్కడ మనకు అనుభవమగుచున్నది కూడా, ఈ అతివాహిక దేహపు అభివ్యక్తీకరణే. ఉదాహరణకు, నేను నీతో మాట్లాడుతున్నప్పుడు "నా 'మనోబుద్ధి చిత్తాహంకారాలు' నీయొక్క మనోబుద్ధి చిత్తాహంకారాలతో ప్రతిస్పందిస్తున్నాయి" అనునదే సిద్ధిస్తుంది. అంతేకాని భౌతిక పదార్థములు, జడములు అయి ఉన్న చెవులు – నోరు మాట్లాడుకోలేవు కదా!

ఇంతవరకు గ్రహించావు కదా! ఇప్పుడు మనం మరొక విషయానికి వద్దాం. ఇంతకీ "ఇహ–పర" రూపములైన ఈ భూత–వర్తమాన–భవిష్యత్తుల దర్శనమంతా చేస్తున్నట్టి ఈ 'జీవుడు' అనబడువాడు ఎవడు? ఓ రాఘవా! ఇతడు స్వయముగా ఆ ప్రత్యగాత్మయే. ఇతనికి వాస్తవానికి ఈ జన్మ – మొదలైన వికారాలు ఏ సమయమందును లేవు. పరబ్రహ్మమే ఇతని నిజస్వరూపం.

"చిదాకాశ స్వరూపుడైన పరమాత్మయే వాసనామయమగు అతివాహిక శరీరంతో, స్వయముగా, తన హృదయాకాశమునందు, వాసనామయమే అయివున్న ఈ దృశ్యమంతా పొందుచున్నాడు" – అనునదే జీవునియొక్క 'జగత్తు' అను అనుభవమై ఉన్నది. ఈ శరీరము కూడా అట్టి జగద్దృశ్యములోని ఒక వస్తువు వంటిదే అగుచున్నది.

❖

ఈ విధంగా ప్రతి ప్రాణి తన చిత్తములోని వాసనలను లేక సంస్కారములను అనుసరించి, తాను భావించి, వాంఛించు అనుభవమునకు అనుకూలమైన ఉపాధులను (శరీరములను) పొందుతూ, త్యజిస్తూ ఉంటున్నాడు. అయితే ఈ జీవుడు విజ్ఞానమే (ఎరుక – consciousness) తన స్వరూపముగా కలిగి ఉన్నాడు. అతడు దేనినైతే "ఇది ఈ విధమైన సత్యము" అని సంకల్పిస్తున్నాడో అది అట్లే అతనికి సత్యమైన అనుభవమై ప్రాప్తించుచున్నది. అందుకే "ఈ జీవుడు సత్యసంకల్పుడు" అని కూడా చెప్పబడింది.

అట్టి ఈ జీవుడు ఈ భౌతికదేహం త్యజించటం జరిగినప్పుడు (లేక మరణించినప్పుడు) అతని మానస నగరంలో (In the zone of his subtle body) ఏ ఏ కోర్కెలు అగ్రగణ్యంగా

ఉంటాయో వాటిని అనుసరించి అందుకు తగినట్టి ఉపాధిని పొందుచున్నాడు. అప్పుడు "ఇతడు పుట్టాడురా" అని జనులు అనుకొంటున్నారు.

ప్రత్యగాత్మతత్వం (దేహి) 'నేను' అను దానితో సహా సర్వ భావనలకు కారణం "భావించుట" అను ప్రక్రియ ప్రారంభించబడకముందే ఉండి ఉంటున్నది.

"The self" which is the cause of everything else i.e., subtle body as well as physical body, That which is there prior to start of all experiences.




"SELF" — కారణ దేహం ప్రత్యగాత్మ — CAUSAL BODY

కనుక ఓ రామా! ఈ జీవుడు తన వాసనలను, కర్మ పరిపాకమును అనుసరించే మనుష్య, పశు, పక్షి, దేవత, రాక్షసాది యోనిభేదం చేత ప్రకాశించే పాంచభౌతిక సమన్వయములైన ఉపాధులను పొందుచున్నాడు*. దీనినిబట్టి ఈ దృశ్యవిషయమై ఒక చమత్కారం గమనించావా?

**సంకల్పనిర్మాణమివ- మనోరాజ్య విలాసవత్,**
**ఇంద్రజాలా మాల ఇవ - కథార్థప్రతిభాసవత్,**
**దుర్వాత భూకంప ఇవ- త్రస్త బాల పిశాచవత్,**
**ముక్తాళీవామలే వ్యోమ్ని - నౌస్పంద తరుయానవత్,**
**స్వప్నసంవిత్తి పురవత్ - స్మృతిజాత ఖపుష్పవత్,**
**జగత్సంసరణమ్ స్వాంతర్మృతోఽనుభవతి స్వయమ్!** (III - 11,12,13)

* (సింహోవా, వ్యాఘ్రోవా యద్భావంతి, తథాభవతి : జీవుడు తన భావనను అనుసరించే సింహముగానో, వ్యాఘ్రముగానో అగుచున్నాడు - ఉపనిషత్తు వాక్యం.)

ఈ ఎదురుగా కనిపించే చరాచరములతో కూడిన దృశ్యజగత్తు – ఎవడో అజ్ఞాతమూర్తి తన సంకల్పములచే ఎందుకో రచించినట్లు ఉంటోంది. ఏదో మనోరాజ్యము యొక్క విలాసమువలె తోచుచున్నది. ఎవరో గొప్ప ఐంద్రజాలికుడు తన ఇంద్రజాల చమత్కారంచే ఇది చూపుచున్నట్లు అనిపిస్తోంది. ఒక గొప్ప కవి తన ఊహా చమత్కారంతో రచించిన ఒక పెద్ద కథలోని మధ్యభాగంలాగా స్ఫురిస్తోంది. వాతము క్రమ్మిన రోగియొక్క భూకంపానుభవంవలె అనిశ్చితముగా, అతి చంచలంగా, దుర్భరంగా అనుభవమౌతోంది. ఒక బాలుడు ఏదో పిశాచం కథ విని నిద్రించి, అర్ధరాత్రి మెలుకువ రాగా కనులు తెరచి ఎదురుగా కథలోని భూతమును భ్రమచే చూచుచున్నట్లు కనిపిస్తోంది. తనకు తానే కల్పించుకొనిన భ్రమచేత ఆకాశంలో ఏవేవో ఆకారములు తోచునట్లు భ్రమకొల్పుతోంది. నౌకలో ప్రయాణించే వానికి ఒడ్డున ఉన్న చెట్లు అర్ధచంద్రాకృతితో కదులుచున్నట్లు ప్రాప్తిస్తోంది. ఒకడు స్వప్నంలో అనేక వస్తువులను చూచునట్లు, మరొకడు తన స్మృతి పథంలో ఎక్కడో చెప్పగా విన్న ఆకాశ పుష్పం గాంచునట్లు ఈ జగత్తు ప్రత్యక్షమై ఉంటోంది. కనుక రాఘవా! ఇదంతా మిథ్యయై, చూచువాని యొక్క కల్పనామాత్రమై, స్వయముగా ఏదీ కానిదై ఉన్నది. అయితే, తన అజ్ఞానము చేతనే ఈ జీవుడు మిథ్యారూపమగు ఇట్టి జగత్తును తాను శరీరము కలిగి ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా తన హృదయాకాశమునందు స్వయముగా గాంచుచున్నాడు. అనగా, మృతుడు ఇట్టి ఈ జగద్దృశ్యమును తన అంతరంగాకాశంలో తనకు తానే స్వయంగా అనుభూతపరుచుకొనటం జరుగుతోంది.

❖

ఇట్లు దేనిచేతనూ నిర్దేశించబడజాలని ప్రత్యగాత్మ స్వరూపుడే అయినట్టి ఈ జీవుని సమ్ముఖమునకు ఈ శరీరములు స్వకీయ–అనుభూతి రూపంగా మాటిమాటికీ వస్తున్నాయి. పోతున్నాయి. అట్టి రాకపోకలు గల దేహములు ఒకప్పుడు ఒకేవిధంగా, మరొకప్పుడు భిన్న – విభిన్నములుగా ఉంటున్నాయి. అనగా ఒకప్పుడు పూర్వ సంస్కారములన్నీ అట్లే ఉంటున్నాయి. మరొకప్పుడు పాత సంస్కారములన్నీ లయించగా క్రొత్తవి వచ్చి చేరుచున్నాయి. ఇట్టి అనుభవం మనమందరం ప్రత్యక్షంగా ఈ లౌకిక దైనందిన జీవితంలో కూడా చూస్తున్నాం కదా! అభిరుచులు, అభిప్రాయాలు, నమ్మకములు మొదలైనవి ఎప్పటికప్పుడు మారిపోతూ, కొత్తవి సంచరించుకొనుటలేదా?

ప్రతిజీవి పుట్టినప్పటినుండి ఈ దేహము త్యజించే లోపులో అనేక కర్మలు చేసి, వాటి వలన తనకు తానే తన పరలోకములను తయారుచేసుకొంటున్నాడు. తాను కలిగియున్న వాసనలవలన కొన్నిదేహాలు, ఆ దేహముల వలన మరికొన్ని వాసనలు, ఆ వాసనల వలన మరల పురుష, పశు, పక్షి దేహాలు – ఈ విధంగా అరటి స్తంభము లోని మట్టలవలె ఈ సంసార వ్యవహారమంతా పొందుచున్నాడు.

అయితే రామా! వాస్తవమైనట్టి 'ఆత్మదృష్టి'చే లేక 'శరీరి' దృష్టిచే చూచినప్పుడు, ఈ బ్రతికిఉన్న

వారికిగాని, శరీరము త్యజించిన వారికిగాని (అందరు స్వతహాగా చైతన్యమే రూపముగా కలవారు అగుటచే) ఈ పంచభూతముల సమావేశము, ఈ సృష్టిక్రమములు లేనేలేవు. అయినప్పటికీ ఈ జీవునకు ప్రపంచ భ్రాంతి తప్పుటలేదు. లేనిది ఉన్నట్లుగా భ్రమింపచేయుటయే ఈ జగత్తు యొక్క వైచిత్ర్యము. ఈ 'జగత్తు' అను మాయా నాటకమంతా అనాదిగా సిద్ధించియున్న 'అవిద్య' చేతనే నడుపబడుతోంది.

'పరమాత్మ' అనే మహాసముద్రంలో "సృష్టి - ప్రళయములు" అనే తరంగాలు మాటిమాటికీ బయలుదేరుచున్నాయి. లయిస్తున్నాయి. ఇందులో కొన్ని గుణములు, క్రమములు - మనస్సుయొక్క అనుభవం దృష్ట్యా - ఒకేరకంగా ఉంటున్నాయి. కొన్ని వేరువేరుగా ఉంటున్నాయి.

ఇక, నీకు ఎదురుగా కనిపిస్తున్న ఈ దృశ్యమునకు వద్దాం. ఈ 'సృష్టి' అంతా మాయారచితమే అయినప్పటికీ, నీయొక్క బోధ కొరకు, ఆద్యంతములు లేనట్టి దీనిని నా దృష్టి ప్రసరించ గలిగినంత వరకు పరిశీలించి నేను చూస్తున్నది చెపుతున్నాను. విను.

❖

ఈ సభకు వేంచేసియున్న వ్యాసుడు నాకు ముప్పదిరెండవ వానిగా కనిపిస్తున్నాడు. అందులో మొదటి పంద్రెండు మంది ఆకృతిలోను, చరిత్రలోను సమానులు. వారందరు 'ఆత్మతదాత్మ్యము' దృష్ట్యా కొంత అల్పజ్ఞులే. ఇక పదమూడవవాని వంశము మాత్రము భిన్నమైనది.

భవిష్యత్తులో కూడా ఎందరో వ్యాస, వాల్మీకాదులు జన్మించనున్నారు. వారిలో కొందరి శరీరముల ఆకృతులు పూర్వము ఉన్నట్లే ఉంటాయి. మరికొందరి దేహములు వేరువేరుగా ఉంటాయి.

ఎందరెందరో మనుష్యులు, దేవతలు, దేవర్షులు మొదలైనవారంతా ఇతఃపూర్వం లాగానే ఒకేకాలంలో జన్మించి, ఒకే సమయంలో జీవించనున్నారు. ఈ వర్తమాన బ్రహ్మ యుగంలో ఇది డెబ్బది రెండవ త్రేతాయుగం. ఇట్టి బ్రహ్మ యుగములు ఇతః పూర్వం ఎన్నో గడచిపోయాయి. ఇంకా ఎన్నో గడచిపోనున్నాయి. నీవు, నేను కూడా ఎప్పుడో పూర్వకాలంలో ఉన్నట్లే ఇప్పుడు కూడా ఉంటున్నాం. మనతో మరెందరో క్రొత్త వారు కూడా వచ్చి చేరుచున్నారు. ఇదంతా నేను తెలిసికొనే ఉన్నాను.

ఒకానొక క్రమమును అనుసరించి ఈ వ్యాసమునికి ఇది పదవ అవతారం. వ్యాస వాల్మీకులకు సమకాలికులమై మనం అనేకసార్లు పుట్టాం. మనలో చాలామంది మధ్య మధ్యలో విడివిడిగా పుట్టటం జరిగింది. మనమే కాదు. తదితర జ్ఞానులు, అజ్ఞానులు కూడా ఇట్టివేయగు అనేక శరీరములతో చాలాసార్లు జన్మించియున్నారు. ఈ వ్యాసుడు నా దృష్టిపథం ముందుకు వెళ్ళునంత వరకు చూడగా - మరొక ఎనిమిది సార్లు జన్మించనున్నారు. ఇతడు 'మహాభారతము" అను ఇతిహాసమును ఎనిమిది సార్లు వ్రాయబోవుచున్నారు. వెనుకటి లాగానే మరల వేదములను విభజించి భరత వంశమునకు గొప్ప కీర్తి తెస్తారు. ఆ తరువాత, బ్రహ్మదేవుడై విదేహముక్తుడు కాబోతున్నారు.

అయితే ఇతడు ఇప్పటికే జీవన్ముక్తుడు. ఉత్తమోత్తమమైన మనోనిగ్రహం కలవాడు. గొప్ప శాంతుడు. 'మోహము' అనునది ఏమాత్రం అతని యందు లేదు. అహంకార – మమకారాలు లేవు. అందుచేతనే శోకరహితుడై స్వచ్ఛముగా వెలుగొందు చున్నారు.

ఓ రామచంద్రా! ఈ జీవులందరు "భాగ్యము, బంధువులు, ఆయుర్దాయం, ప్రయత్నం, విద్య, జ్ఞానం" – మొదలైనవన్నీ సమంగా స్వీకరించి ఒకప్పుడు ఇట్లాగే ఉంటున్నారు. మరొకప్పుడు ఇట్లా ఉండరు. ఇవన్నీ ఎల్లప్పుడు సమానంగా ఉండుట లేదు. ఇంకొకప్పుడు కొన్ని సృష్టుల వరకు వీరు ఇట్లే ఉంటున్నారు. అయితే, ఇదంతా మాయయే సుమా! దీనికంతటికి అంతము ఉండదని కూడా అనవచ్చు. కొలవటం కోసం ధాన్యపురాశిని ఒకచోట పోశామనుకో. కొలిచిన తరువాత ఆ గింజలు ఒకే తీరుగా కలిసి ఉంటాయా? ఈ ప్రాణులు కూడా భిన్న–భిన్న సృష్టులలో భిన్న–భిన్నంగా ఉంటూ ఉంటారు. సముద్రంలోని తరంగాలు గమనించావా? అవన్నీ ఒకప్పుడు ఒకేవిధంగా మరొకప్పుడు మరొకవిధంగా ఉంటాయికదా! ఏ తరంగం ఏ నీరో, ఏది ఏ నీరు కాదో చెప్పటం ఎవరి తరం? 'కాలము' అనే మహాసముద్రంలోని ఈ సృష్టి తరంగాలు కూడా అంతే. ఒకప్పుడు ఒక రూపంగాను, మరొకప్పుడు మరొక రూపంగాను ప్రదర్శితమౌతూ ఉంటాయి.

❖

అయితే, తత్త్వజ్ఞాని దృష్టిలో అజ్ఞాన పూరితములగు ఈ వికల్పములన్నీ లేకయే ఉన్నాయి. ఈ సృష్టి తరంగాలన్నీ చూస్తున్నప్పటికీ, అతని అంతరంగము మాత్రం ఏమాత్రం తల్లడిల్లుట లేదు. అతడు తన సహజ సిద్ధమగు ప్రశాంతతను కోల్పోవుట లేదు. స్వయముగా పరబ్రహ్మ స్వరూపుడే అయివున్న ఈ జీవుని దృష్టిలో మాయావరణం తొలగనంత కాలం మాత్రమే ఈ సృష్టి పరంపరలన్నీ ప్రవర్తిస్తున్నట్లు తోస్తాయి. వాస్తవానికి ఇతడు పరమశాంత స్థితి అగు ఆత్మయే స్వరూపముగా కలిగి ఉన్నాడు. పరమాత్మ స్వభావమగు అఖండ స్థితుడే అయున్నాడు. మాయావరణము తొలగినప్పుడు ఇతడు బ్రహ్మస్వరూపముగానే శేషించుచు, బ్రహ్మముగానే వెలుగొందుచున్నాడు.

"జీవన్ముక్తత్వము" అనునది ఎట్లా లభిస్తుంది? తత్త్వజ్ఞానము యొక్క ఫలమే కదా! మన ఈ వ్యాసమహాముని అట్టి తత్వజ్ఞాన ఫలమును పొందే ఉన్నారు.

ఇక్కడ మనం సముద్రమునే దృష్టాంతంగా తీసుకొందాం. సముద్రంలో తరంగములు ఉన్న సమయంలోను, తరంగములు లేని సమయంలో కూడా అందలి జలము జలముగానే ఉంటుంది కదా! అదే విధంగా జనులు విదేహముక్తులైనా, లేక సదేహముక్తులైనా ఒక్కటే. ఈ రెండిటికీ భేదమేమీ ఉండదు. అసలు 'ముక్తి' అంటే ఏమిటి? జీవుడు విషయములకు (దృశ్య – ఇంద్రియ – వ్యవహారములకు) స్వాధీనుడు కాకపోవుటయే కదా! అది సదేహమైతే ఏమున్నది? విదేహమైతే ఏమున్నది? విషయములను విషయములుగా గ్రహించని వానికి ఇక 'భోగము' అనే అనుభవమే సిద్ధించదు కదా! విషయ భోగములకు సంబంధించిన భావన ఉన్నచోట మాత్రమే "ఈ స్థితి నిర్వాణస్థితి కంటే స్వల్పమైనది" అనే ప్రసక్తి లేక అవకాశం ఉంటుంది. 'జీవన్ముక్తత్వము' అను స్థితి యందు విషయభోగ భావనకు చోటే ఉండదు. కాబట్టి అది కూడా నిర్వాణముక్తి వంటిదే.

ఇప్పుడు వ్యాస, శుకదేవుల జీవన్ముక్తి – విదేహముక్తుల విషయానికి వద్దాం. జీవన్ముక్తుడగు ఈ వ్యాసునిగాని, లేక మరొకరిని గాని, "మట్టికుండ – వస్త్రము" వంటి పదార్థములను చూచినట్లు మాత్రమే (ఈ భౌతిక దృష్టిలో ఉన్నప్పుడు) మనం చూడటం జరుగుతుంది. ఇది అత్యంత పరిమితమైన దృష్టి మాత్రమే. అతని ఆంతరంగిక స్థితి ఎట్టిదో, అతడు ఈ దృశ్యమును, జగత్తును ఎట్టి దృష్టితో దర్శించుచున్నాడో భౌతిక దృష్టి మాత్రం చేత మనం గుర్తించగలమా? లేదు. అందుచేత ఉపాధిని అనుసరించి ఒకని జ్ఞానం లెక్కించటం సాధ్యం కాదు.

"బోధ స్వరూపులైనట్టి నిర్వాణముక్తులకు, జీవన్ముక్తులకు భేదమేమీ ఉండదు" అని మరల ప్రకటిస్తున్నాను. గాలి వీచినా, వీచకపోయినా – గాలి గాలేకదా! అలలు ఉన్నా లేకున్నా నీరు నీరే కదా! అట్లే ఇందు సందేహించవలసినదంటూ ఏమీ లేదు.

నా యొక్క, ఈ వ్యాస భగవానుని యొక్క లక్ష్యములు ఈ సదేహ – విదేహ ముక్తుల ప్రహసనం కానే కాదు. మా ఇరువురి ఉత్తమ లక్ష్యములు కూడా ద్వైత – ఏకత్వరహితమగు ఈ జీవాత్మ – పరమాత్మల అభేదము లేక ఐక్యతే అయివున్నది. అనగా "జీవుడే – పరమాత్మ" అని నిరూపించుటకే యత్నించుచున్నాము. ఎందుకంటే, ఉన్న సత్యము అదే కనుక.

ఇక మనం ప్రస్తుత విషయానికి వస్తున్నాం. ముముక్షువు శ్రద్ధతో తత్త్వజ్ఞానోప దేశమునకు సిద్ధపడవలసిన తీరు గురించి ఇప్పుడు విచారించబోతున్నాం. ఈ నా వచనములు లోక కళ్యాణకారకములై, అజ్ఞానమును, అంధత్వమును పారద్రోలుగాక! సర్వదా, సర్వమై, సర్వత్రా వెలయుచున్న ఆత్మతత్త్వము శ్రవణ భూషణంగా ప్రకటించబడు గాక.

❖❖❖

# 3. పురుష ప్రయత్నము

ఓ రఘునందనా! ఈ జగత్తులో ఎవరికైనా, ఏ వస్తువైనా లభించాలంటే పురుషకారమే (Effort) ఉపాయం కదా! పురుషకారం లేకుంటే ఎక్కడా ఏదీ జరుగదు. ప్రాప్తించదు. ఆకాశంలో ఆ చంద్రుని చూడు. అతడు లోకములకు ఆనందమును "శీతలత్వము ప్రసరించుట" అను క్రియ చేతనే ప్రసాదించగలుగుచున్నాడు కదా!

**"పరిస్పందఫల ప్రాప్తౌ పౌరుషాదేవ, నా–న్యతః"** (IV-9)

ఏ ఫలితమైనా పురుష ప్రయత్నం చేతనే లభిస్తోంది కాని, మరి దేని చేతనూ కాదు. అదే విధంగా పురుషకారము చేతనే జీవునకు జ్ఞానం ప్రాప్తించుచున్నది. అట్టి జ్ఞానము వల్లనే కామ – క్రోధాది తాపములను నశింపజేసే 'జీవన్ముక్తి' కూడా లభించుచున్నది.

పురుషకారము యొక్క రూపమే 'కర్మ'. అట్టి కర్మ యొక్క పర్యవసానంగానే ఒకడు ఒక చోటు నుండి మరొక చోటుకి వెళ్ళటం, భుజించటం, కావాలనుకొన్నది చూడటం మొదలైన దైనందిన లౌకిక క్రియలను కూడా నిర్వర్తించగలుగుచున్నాడు. ఇది అందిరికీ నిత్యానుభవమే కదా!

అయితే అనేక విషయ చింతనలచే మోహితులైనవారు, మందబుద్ధి కలవారు మాత్రం "ఆఁ ! మాదేమున్నది? అంతా దైవము లేక అదృష్టము యొక్క అధీనములోనే ఉన్నది" అని చెప్పుకొంటూ తమను తామే సముదాయించుకొంటున్నారు.

**పౌరుషం స్పందఫలవత్ దృష్టం ప్రత్యక్షతోనయత్**
**"కల్పితం మోహితైఃఉ మందైః దైవం కించిత్ న విద్యతే"** (IV-10)

నాయనా రామా! ఈ దైవము, అదృష్టము – అనునవి మూఢులు, మోహితులు అగు జనులకొరకై కల్పించబడినవి మాత్రమే. వాస్తవానికి, అవి స్వతహాగా లేవు.

మరి ఈ ప్రాప్తించునవి, కనబడుచున్నవి ఏమంటావా? ఇదంతా కూడా ఇతః పూర్వపు పురుషకారమే (essence of past efforts) ఈ విధంగా జీవునకు ప్రాప్తిస్తున్నాయి. ఇతఃపూర్వపు ప్రయత్నములే అట్టి ప్రభావం అతనిపట్ల కలిగి ఉంటున్నాయి.

అయితే, మా దృష్టిలో 'పురుషకారం' అనగా, ... సాధు పురుషుల ఉపదేశానుసారంగా మనస్సును, వాక్కును, కాయమును నియమించి చేయబడు ప్రయత్నమే అయి ఉన్నది.* జ్ఞానము కొరకై అట్లు నిర్వర్తించబడు ప్రయత్నమే జీవుని జ్ఞానిగా తీర్చిదిద్దుతోంది.

ఆ విధంగా కాకుండా, ఇంద్రియానుకూలంగా మాత్రమే ప్రవర్తించుచు "నేను పొందాలనే అనుకొంటున్నాను. కాని, సాధించలేకపోతున్నాను. అయినా, మా వల్ల ఎక్కడౌతుంది? దైవమే ప్రసాదించాలి" అని అనుకొని వగర్చుచూ కూర్చుంటే లాభం ఏమి ఉంటుంది?

ముందుగా నీవు ఏమి సాధించదలచుకొన్నావో, సుస్పష్టంగా నిర్ణయించుకో. ఇప్పుడు, సరైన అవగాహనతో శాస్త్రోక్తమైన (శాస్త్రములచే చెప్పబడిన) ప్రయత్నం చేయి. ఎవడు ఏది కోరుకొంటాడో అద్దాని కొరకు శాస్త్రములచే ఉపదేశించబడిన మార్గమును అనుసరిస్తూ, మధ్యలో తన ప్రయత్నమును విరమించకుండా ప్రయత్నం కొనసాగిస్తాడో, – అట్టివాడు ఆ లక్ష్యమును తప్పక సాధించి తీరుతాడు. కాబట్టి రామా! మానవుడు తన జీవిత లక్ష్యమును ముందుగా దృఢీకరించుకొని, ఆపై శాస్త్ర సమ్మతమైన నిజమార్గంలో ప్రయత్నం చెయ్యాలి. అంతేకాని, ఏదో కొంత ప్రయత్నం చేసి, మరికొంత ఎక్కడో దృష్టి పెట్టి, మధ్యలో తనపై తానే జాలిపడుతూ క్రుంగిపోవటం, మా ఉద్దేశంలో, అర్థం ఉన్న పని కాదు.

ఓ రాఘవా! ఒకానొకడు ఇంద్ర పదవిని పొంది త్రిలోకాధిపత్యం వహిస్తున్నాడు. అతడు అది ఎట్లా పొందగలిగాడు? దైవం ప్రసాదించాడా? లేదు. తన ప్రబలమైన పురుషకారము (Intensified effort) చేతనే ఆతడు దానిని సాధించాడు. మరొక జీవుడు పురుష ప్రయత్న ఫలితంగానే బ్రహ్మ పదవిని అలంకరిస్తున్నాడు. ఇంకొకడు స్వకీయమైన తీవ్రప్రయత్నం చేతనే విష్ణుదేవుడయ్యాడు. వేరొకడు నిజప్రయత్న శీలత్వంచే చంద్రశేఖరుడై కైలాసగిరిని పావనం చేస్తున్నాడు. ఇందులో 'దైవము' అను దానికి పాత్ర ఎక్కడున్నది?

❖

ఈ పురుష కారము (ప్రయత్నము) అనేది రెండు విధాలుగా ఉంటోంది–

1. ప్రాక్తనము = ఇతఃపూర్వం చేసియున్న ప్రయత్నములు (Past deeds / efforts made in the Past)
2. ఆద్యతనము = వర్తమాన ప్రయత్నములు (Present deeds / efforts)

ఈ రెండింటిలో మొదటిదైనట్టి 'ప్రాక్తన పురుషకారము'ను 'దైవము' లేక 'అదృష్టము' అని జనులు పిలుస్తున్నారు. అయితే ఇప్పటి ప్రయత్నములు ఇతఃపూర్వపు క్రియల యొక్క ప్రభావమును జయించివేయగలవు. ఇందులో ఏమాత్రమూ సందేహం లేదు. లేకుంటే, శాస్త్రములు ప్రయత్నముల గురించి, సాధనల గురించి, ఉపాసనల గురించి ఎందుకు ప్రబోధిస్తాయి?

ప్రాక్తన పురుష – ప్రయత్నముల ప్రభావమునే 'సంస్కారములు' లేక 'వాసనలు' అని కూడా అంటున్నారు.

**యత్నవద్భిః దృఢాభ్యాసైః ప్రజోత్సాహ సమన్వితైః**
**మేరవోఽపి నిగీర్యంతే! కైవప్రాక్పౌరుషే కథా ?** (IV-18)

ప్రయత్నము– దృఢమైన అభ్యాసము కలవారు, ఉత్సాహవంతులు అయినట్టి వారు, మేరు పర్వతాన్నైనా సరే,...మ్రింగి జీర్ణం చేసుకోగలరు. ఇక వారికి ఈ దైవము, అదృష్టము అనునవి ఒక లెక్కలోనివి కావు.

శాస్త్రోచితంగా ప్రయత్నించటమే ఉచితం. 'శాస్త్రోచితం' అంటే ఏమిటి? అనుభవజ్ఞులగు పెద్దలు సర్వుల సానుకూల్యతను దృష్టిలో పెట్టుకొని, తమ అనుభవమంతా రంగరించి "ఇది ఇట్లు అనుసరించబడుగాక! ఈ విధములైన విధి – విధానములు నిర్వర్తించబడుగాక! ఇట్లు జనులు చేయకుండెదరుగాక" అని చెప్పినదే "శాస్త్రానుశాసితం" అంటున్నాం. వాటిని సూక్ష్మబుద్ధితో గ్రహించి సర్వులకు శుభప్రదం అయ్యేవిధంగా ఆచరించటమే మంచిదని మా ఉద్దేశం. అట్లు కాకుండా, చిత్తమునకు ఆధీనులై, విషయలోలుత్వముచే చేయు ప్రయత్నాలు అనర్థదాయకం, వ్యర్థం అవుతాయి. శాస్త్ర విహితమైన ప్రయత్నమును వదలి యథేచ్ఛగా సంచరించేవానికి కొన్ని రోజులకు రెండుచేతులు ఎత్తి నమస్కరించటం కూడా కష్టతరం కాగలదు. తమ పురుష ప్రయత్నమును త్యజించియుండే మందభాగ్యులను కాపాడకలిగేదెవరు? ఓ రామా! ఈ ప్రపంచంలో అజ్ఞానం, పేదరికం తాండవించటానికి కారణం ప్రజలంతా తగినంత ప్రయత్నశీలురు కాకపోవటమే. ప్రయత్నశీలుడు తాను సమృద్ధుడు అగుటయేకాక, తాను ఉన్నచోట, తన చుట్టుప్రక్కల కూడా సమృద్ధిచే నింపివేయగలడు. అతనికి ఈ ధరణీమండలమంతా ఒక లెక్కలోనిదే కాదు. ప్రయత్నశీలుడిని

---

* త్రికరణశుద్ధిగా (మనోవాక్కాయముల ఏకత్వముచే) నిర్వర్తించబడినది మాత్రమే పురుషకారమని, ఫలప్రదమని వసిష్ఠమహర్షి అభిప్రాయం.

అతని లక్ష్యము నుండి దూరం చేయగలిగేది అతని "ప్రయత్నరాహిత్యము" ఒక్కటే కావచ్చునేమోకాని, మరింకేదీ కాదు.

❖❖❖

## 4. వర్తమాన పురుష ప్రయత్నములు (ఆద్యతన పురుషకారం)

ఓ రఘురామా! అంతరంగమునందు "ప్రవృత్తి"యే సర్వ బాహ్యప్రవర్తనల యొక్క అంతర్లీన కారణం. అట్టి ప్రవృత్తి శాస్త్ర విధిని, శ్రద్ధాసక్తులను అనుసరించి ఆయా ప్రయోజనముల సిద్ధికి కారణమగుచున్నది.

**మనసా వాంఛ్యతే యచ్చ యథాశాస్త్రం న కర్మణా,**
**సాధ్యతే మత్తలీలాసౌ! మోహనీనార్థ సాధనీ ॥** (V-2)

"మనస్సుతో కోరుకోవటం, కాని శాస్త్రవిధిని అనుసరించి ప్రయత్నం చేయకపోవటం" – ఇదీ, జీవునియొక్క దౌర్భాగ్యం. ఇది ఉన్మత్త క్రీడగాక మరేమిటి? దీనివలన ఏం ప్రయోజనం సిద్ధిస్తుంది చెప్పు? పైపెచ్చు అది మోహకారణమే అవుతుంది.* ఎవడు ఎట్లు యత్నించుచున్నాడో, వాడు అట్టి కర్మనే పొందుచున్నాడు. దైవకృతం లేక అదృష్టం దానికి వేరు విధంగా ఉండటం లేదు. ఈ కర్మ రెండు విధాలుగా చెప్పబడుతోంది.

1. శాస్త్రోచితమైన కర్మలు. 2. శాస్త్ర విరుద్ధములైన కర్మలు.

శాస్త్రోచితమైనవి పరమార్థము కొరకు, శాస్త్ర విరుద్ధములైనవి అనర్థము కొరకు ప్రవర్తిస్తున్నాయి.

అయితే ఒకడు "నేను ఈ విధముగా ప్రవర్తించకుండెదను గాక!" అని అనుకుంటాడు. (ఉదాహరణకు ఇతరులను దూషించుట, దురభ్యాసములు ఆశ్రయించుట, దురుసుగా సంభాషించుట, తీవ్రముగా వాంఛించుట, దీర్ఘముగా దుఃఖించుట, నిష్కారణముగా భయపడుట మొదలైనవి బాహ్య అంతరంగ క్రియా ప్రవృత్తులు). కాని, తాను అనుకొనుదానికి వేరుగా, బలవంతముగా నియమించబడిన దానివలె, ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? ఎందుచేతనో చెపుతాను విను.

ప్రతి సందర్భములోను ఈ మనుజుని ఇతఃపూర్వపు శారీరక–మానసిక క్రియాయత్నములు, ఇప్పటి ప్రయత్నములు నిరంతరం రెండు మేక పోతులవలె పోటీపడుచున్నాయి. ఈ ప్రాక్తన – ఆద్యతన ప్రయత్నములలో ఏది బలవత్తరమైనదైతే అదియే జయిస్తోంది. ఒకవేళ, వర్తమాన

---

* **పుణ్యాత్ఫ ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవః ।**
**నపాప ఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః ॥**

ఈ మానవుడు పుణ్యఫలం అయినట్టి సుఖ, శాంతులు కోరుకొంటున్నాడు. కాని పుణ్యకర్మలందు ప్రయత్నశీలుడు అగుట లేదు. పాపఫలమైన దుఃఖాదులు కోరుకోడు. కాని, ప్రయత్నపూర్వకంగా పాపకర్మలందే ప్రీతి కలిగి ఉంటాడు. ఏమి దౌర్భాగ్యం!

శ్రద్ధాసక్తులకన్నా, శారీరక-మానసిక యత్నములకన్నా ఇతఃపూర్వపు క్రియలు అధికబలము కలిగి ఉంటే, అప్పుడాతడు అయిష్టుడైనప్పటికీ బలవత్తరముగా అట్టి కర్మలందే ( సంకల్పములందే / లేక ప్రయత్నములందే) ప్రవేశించటం జరుగుతోంది.

అందుచేత రామచంద్రా! మానవుడు శాస్త్రవిధిని అనుసరించి సత్కర్మలకు సంబంధించిన ప్రయత్నములను ఎప్పటికప్పుడు అధికం చేసుకోవాలి. క్రమంగా అట్టి సత్కర్మలు బలవత్తరమై ఉత్తమ సంస్కారములుగా రూపుదిద్దుకుంటాయి. అట్టి సుసంస్కారం వివేకమును నిదురలేపి, శుద్ధ సత్వమగు ఆత్మవస్తువు యొక్క సామీప్యతను ప్రసాదిస్తుంది.

ఒకవేళ, అట్టి శుభకర్మలు ఆచరించటానికి ప్రయత్నములు చేస్తున్నప్పుడు ఏవైనా అవాంతరాలు వస్తున్నాయనుకో, "ఇవన్నీ ఇతఃపూర్వపు నా దుష్కర్మల ప్రబలత్వమే" అని గ్రహించబడుగాక అట్టి సమయములందు స్వప్రయత్నములను విడనాడకూడదు. పళ్ళతో పళ్ళు అదిమి అయినా సరే దృఢంగా శుభకరములగు కర్మలనే ఆశ్రయించాలి. ఫలోన్ముఖములగుచున్న ఇతఃపూర్వపు అమంగళకరములగు కర్మల ప్రభావమును (దుష్ట సంస్కారములను లేక వాసనలను) జయించివేయాలి. అణచివేయాలి. అందుకై ఓర్పు (తితిక్ష), పట్టుదల అవసరమైయున్నాయి. "విధియే బలీయమై నా చేత ఇట్టి దుశ్చర్యలు చేయిస్తోంది" అను రూపముతో మరల మరల తల ఎత్తే మూర్ఖభావములను వర్తమాన ప్రయత్నములచే అణగత్రొక్కివేయాలి.

ప్రత్యక్షముగా ఎదురుగా ఉన్న ఆద్యతన కర్మలను, వాటి ప్రయోజనములను గమనించకుండా "ఏదో శక్తి మమ్ములను నియోగిస్తోంది. లేక నిర్వీర్యులను చేస్తోంది" అని నమ్మువాడు చేతిలో ఉన్న ఫలమును వదలి, ఆకాశమువైపు చూస్తూ ఆ ఆకాశం నుండి ఏదైనా మధుర పదార్థము లభిస్తుందేమోనని ఎదురు చూచేవాడే అగుచున్నాడు. అట్టి దీనాలాపనలచే కలిగే ప్రయోజనమేమున్నది?అందుచేత రామా! ఇతఃపూర్వం ఆర్జించుకొనియున్న మనోదోషములు హరించిపోయేవరకు శాస్త్రోచితమైన సత్కర్మలను శరణువేడవలసిందే.

ఓ రాఘవా! ఇతఃపూర్వపు అశుభకర్మలు ఇప్పటి ప్రయత్నములచే జయించ బడతాయి. - అనుదానిలో నీవు ఏమాత్రం సందేహించవలసిన పనిలేదు. జనులు ఇప్పటి వ్రత-జప-నియమా దులచే రాబోవు దోషములను పరిహరించుకోవటం లేదా? ఇదే మనకు నిదర్శనం. కాబట్టి నీవు ప్రయత్నములతో కూడుకున్నవాడవై ఉండు. తద్వారా నిన్ను ప్రభావితం చేస్తున్న అశుభ-అదృష్టములను దూరంగా నెట్టివేయి. సంసారము నుండి నిన్ను తరింపజేయగల శమ-దమము*లను సంపాదించటానికే ప్రయత్నించు. ప్రయత్నహీనుడు గాడిదతో సమానం. అతడు ఇహమునందే ఉత్తమమైనదేదీ సాధించలేడు. ఇక పరమపదమును పొందే అవకాశమెక్కడ? శాస్త్రానుసారం యత్నించేవాడే ఇహ - పరముల రెండింటిని శుభప్రదం చేసుకో గలుగుచున్నాడు.

---

* శమము : కామక్రోధాదులు త్యజించి, శాంతము వహించుట ; దమము : ఇంద్రియములను నిగ్రహించుట.

**సంసారకుహరాదస్మాన్నిర్గంతవ్యం స్వయంబలాత్ ।**
**పౌరుషం యత్నామాశ్రిత్య హరిణేవారిపంజరాత్ ॥** (V-15)

ఓ జనులారా! సింహము తన పంజాతో పంజరమును భేదించి వెలువడునట్లు మీరు ఈ సంసార పంజరము నుండి వెలువడుటకై యోచించండి. అందుకొరకై పురుష ప్రయత్నమును ఆశ్రయించుటయే మీకు శుభప్రదం. అదే మీ తక్షణ కర్తవ్యం. ఎందుకంటారా? ఈ శరీరం స్థిరంగా కలకాలం ఉండేది కాదని మీ అందరికీ తెలుసు కదా! దీని అస్థిరత్వమును దృష్టిలో పెట్టుకొని మీరు విచారణశీలురు కావాలి. నాయనలారా! పశుతుల్యమగు మూఢత్వమును త్యజించండి. సాధుజన సాంగత్యమును, సచ్ఛాస్త్రములను ఆశ్రయిస్తూ, మీ మీ ప్రయత్నములను దృఢత్వం చేయండి. ఈగ కురుపుపై వ్రాలి, అక్కడి చీము-నెత్తురు త్రాగుచు సంతోషపడునట్లు మీరు స్వల్ప విషయములగు గృహ అన్నపానాదుల కొరకై మహత్తరమైన మానవజన్మను వృథా చేసుకోకండి. అది ఉచితం కాదు.

❖

శుభకర్మల వలన శుభం చేకూరుతోంది. అశుభకర్మల వలన అశుభం ప్రాప్తిస్తోంది. ఇక ఇందులో 'దైవము' లేక 'అదృష్టము' అనబడు మూడవ స్వతంత్ర వస్తువుకు అవకాశమెక్కడ? 'ప్రత్యక్షము'గా ఉన్నదానిని వదలిపెట్టి 'అనుమానము'ను ప్రమాణంగా స్వీకరించేవాడు ఒకానొక రోజున తన చేతులను చూచుకొని, 'పాములు' అని భావించి భయముతో బాటలవెంట పరుగెత్తవలసి వస్తుంది. 'అదృష్టమే నన్ను ఈ పనికి పురమాయించుచున్నది' అని తలచువారి ముఖమును చూచి లక్ష్మి కూడా విముఖత్వం చూపుతోంది.

అందుచేత మనుజుడు తన పురుషకార బలంచేత మొట్టమొదట సాధన చతుష్టయ సంపత్తిని* సమకూర్చుకోవాలి. వివేకమును సునిశితం చేసుకోవాలి. ఆత్మజ్ఞానమును ప్రతిపాదించే మహార్థపూర్వకమైన శాస్త్రములను విచారించాలి. "నేను ఉత్కృష్టత పొందాలి" అనే లక్ష్యమును (ఆశయమును) కలిగియుండికూడా కొందరు అందుకు అనుకూలమైన శాస్త్ర విహితములైన ప్రయత్నములను ఆశ్రయించుటలేదు. అట్టివారి ఆశయములకు అర్థం ఏమి ఉంటుంది? "ఆ! ఏమి ప్రయత్నములు? ఎంతని ప్రయత్నించాలి? ఈ సత్కర్మల వ్యవహారమునకు అంతు ఎక్కడ?" అని తలచి తాత్సారం చేయరాదు. అప్రయత్నపరులు కారాదు. రాతి నుండి రత్నం ఎలా వస్తుంది? ప్రయత్నములేని వాడు ఏది మాత్రం ఎట్లా పొందుతాడు?

శాస్త్రోచోదితమైన ప్రయత్నం ఎన్నటికీ వ్యర్థం కాదు. "మట్టి కొద్దీ కుండలు, దారము కొద్దీ వస్త్రములు, పిండి కొద్దీ రొట్టె లభిస్తాయి" అనునది అందరికీ తెలిసిందే కదా! అదేవిధంగా పురుషార్థమును అనుసరించే ప్రయోజనములు కూడా ఉండటం జరుగుతోంది. చేసిన ప్రయత్నమును

---

* "సాధన చతుష్టయ సంపత్తి" అంటే ఏమిటో ఈ ప్రకరణంలోనే ముందుముందు సవివరంగా చెప్పబోవుచున్నారు.

బట్టే ఫలితములు సిద్ధిస్తున్నాయి. బాల్యం నుండే మాటిమాటికీ, అధికంగా ఆశ్రయించబడుచున్న సత్సంగము, శాస్త్ర చర్చ, శుభమైన అభ్యాసములు - ఇవన్నీ లక్ష్యమును దృఢతరం, సుస్పష్టం చేస్తున్నాయి. "ఉత్తమ జ్ఞానము కొరకు, తదనుకూలమైన ప్రయత్నములను చేసెదను గాక!" అను సంకల్పము రూపు దిద్దుకుంటోంది. అట్లు ఆశ్రయించుచున్న స్వప్రయత్నమే మానవునకు అమోఘమైన ఫలమును ప్రసాదిస్తోంది.

ఈ విధంగా ప్రత్యక్షములు, అనుభూతములు, దృష్టములు, శాస్త్ర సమ్మతములు అయిన ప్రయత్నములను ఆశ్రయించాలి. అట్లు చేయకుండా "దైవము నాపట్ల లేదు అందుకే నేను ఉత్తమ ప్రయత్నమేదీ చేయలేకపోతున్నాను" అని తలచు మూఢజనులు జ్ఞానుల దృష్టిలో జీవన్మృతులే. చిత్రం ఏమిటంటే, అనేక అవకాశములకు స్థానభూతమైన, ఉత్తమమైన ఈ మానవజన్మ పొందికూడా అనేకులు ఏ ఉత్తమ ప్రయత్నములను ఆశ్రయించకుండా రోజులు గడపివేస్తున్నారు. అనర్థహేతువగు సోమరితనమే లేకపోతే, గొప్ప పండితుడో ధనవంతుడో అవనివాడు ఎవడుంటాడు? సోమరితనము వల్లనే ఈ ధరామండలమంతా అనేకమంది మూర్ఖులతోను, దరిద్రులతోను, నర పశువులతోను నిండి ఉన్నదని నాకు అనిపిస్తోంది. బద్ధకము, సోమరితనము త్యజించిన వారికే ఉత్తమ వస్తువు లభ్యపడుతోంది.

❖

ఓ రఘురామా! సచ్ఛాస్త్ర విధిని అనుసరించి, సత్సంగశీలుడై సదాచార పూర్వకంగా నిర్వహించబడిన కర్మ సంపూర్ణంగా ఫలప్రదమౌతోంది. లేకుంటే ఉత్తమమైన ప్రయోజనం లభించుటలేదు. పురుష ప్రయత్నము యొక్క, కర్మయొక్క స్వరూప స్వభావములు అట్టివి. ఇదే కర్మ సిద్ధాంతము. దీనిని గ్రహించి చరించు మనుజుడు ఎన్నటికీ విఫలుడు కాడు. హరిశ్చంద్రుడు మొదలైన అనేకమంది ఉత్తములు అనేక దుఃఖ -దారిద్ర్యములు పొందుచున్నప్పుడు కూడా తమ పురుషకారమును, ప్రయత్నమును త్యజించలేదు. అందుచేతనే వారు ఇంద్రతుల్యులు అయ్యారు. మీ పూర్వీకులగు అనేకమంది చక్రవర్తుల చరిత్రలు ఇట్టివే.

**బాల్యే గతే ఽ విరతకల్పిత కేళిలోలే,**
**దోర్దండమండితవయః ప్రభృతి ప్రయత్నాత్ ।**
**సత్సంగమైః పదపదార్థవిశుద్ధబుద్ధిః**
**కుర్యాన్నరః స్వగుణదోష విచారణాని ॥** (V-31)

ఓ జనులారా! ఒక్కసారి ఈ యావత్తు జీవితమును పరికించి చూడండి. బాల్యమంతా అతి చంచలమైన హావభావములతో, కల్పిత క్రీడలతో గడచిపోతోంది. ఉత్తమ కర్మాచరణం సులభంగా అలవడు అవకాశమున్న బాల్యము మూర్ఖత్వంతో, అజ్ఞానంతో వృథా అవుతోంది. ఈ బాల్యంలో సద్భావనలు, ఉత్తమ అభ్యాసములు ఆశ్రయించబడుట లేదు. పోనీ వారికి ఉత్తమ మార్గమును చూపగల విశాల బుద్ధి కలవారి శుశ్రూష (teachers and education - system) లభిస్తోందా?

లేదు. లభించినా, అనేకులు వినుటయే లేదు. జీవితము యొక్క ఉత్తమ లక్ష్యములను గ్రహించలేకపోతున్నారు. సరే, బాల్యం గడచిపోయిన తరువాత, ఇక తాత్సారం చెయ్యరాదు. యౌవనమునుండే "ఇది నిత్యము -- ఇది అనిత్యము" -- అని విచారణ చేయాలి. అట్టి వివేకమును అధికం చెయ్యగల సుగుణములను అలవరచుకోవాలి. సత్సంగం కొరకు ప్రయత్నం చెయ్యాలి. శ్రద్ధగా ప్రయత్నించినప్పుడు లభించనిదంటూ ఏమి ఉంటుంది?

ఎప్పటికప్పుడు స్వీయగుణ దోషములను పరీక్షించుకొంటూ, తగిన చికిత్సా పూర్వకమైన స్వప్రయత్నమును ఆశ్రయించాలి. అంతేగాని, పరుల దోషములు ఎంచుచూ, కాలం వృథాపరచుకోరాదు.

సాయం సమయమైనది. ఆ రోజుకు సభచాలించబడింది.

❖❖❖

**(మొదటిరోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# రెండవ రోజు

## 5. ప్రయత్నము - కార్యసిద్ధి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఓ సభికులారా! నిన్నటిరోజు మనం విచారించినదంతా మననముచే గ్రహించారు కదా! నిన్న చెప్పుకొన్నట్లు "ఇతః పూర్వపు ప్రయత్నరూపములైన కర్మలు" – అనునవి కాకుండా "అదృష్టము" అనబడు ఇంకొక వస్తువు ఏదీ లేదు. కనుక అట్టి అదృష్టమనునది దూరంగా నెట్టి వేయబడుగాక. "మానవుడు సాధుసంగం, సచ్ఛాస్త్రం, స్వవిచారణలను ఆశ్రయించి, స్వప్రయత్నముల ద్వారా ఆత్మ సముద్ధరణకు నడుం కట్టాలి" – అని గుర్తు చేస్తూ రెండవ రోజు విచారణ ప్రారంభిస్తున్నాను. ప్రయత్నమే అన్నిటికన్నా ముఖ్యమైనది.

**"యథా యథా ప్రయత్నః స్యాత్, భవేదాశు ఫలం తదా ।**
**ఇతి పౌరుషమేవ అస్తి, 'దైవమ్' అస్తు తదేవచ ॥** (VI-2)

చేసే ప్రయత్నములను బట్టే ఫలితములు ఉంటున్నాయి. 'అదృష్టము' అనునది కూడా పురుషకారమును అనుసరించే ఉంటోంది.

ఈ లోకులు దుఃఖములు పొందుచున్నప్పుడు "హా! హతవిధీ! ఎంత కష్టం" అంటూ ఉంటారు. ఏదైనా సంతోషకరమైన విషయం ప్రాప్తించినప్పుడు "ఓహో! ఎంతటి అదృష్టం!" అని పలుకుచున్నారు. వారు అట్లు 'హతవిధి' అని, 'అదృష్టము' అని సంబోధించునది పూర్వకాలపు లేక పూర్వజన్మల పురుష ప్రయత్నములనే అయి ఉన్నట్లు మేము గ్రహిస్తున్నాం. అంటే 'దైవము లేక అదృష్టము' అను పదములు పురుషకారమునే (పురుష ప్రయత్నములనే) సూచిస్తున్నాయి. ప్రాక్తన కర్మలు కాకుండా వేరుగా జీవుని నియమించగల దైవము – అనునది లేదు. ఎందుకంటావా? ఏ విధంగా అయితే బలశాలుడగు పురుషుడు ఒక బాలుని చిటికెలో వశపరచుకోగలడో, అదే విధంగా ప్రయత్నశీలుడైనవాడు అనాయాసంగా 'అదృష్టము' అనుదానిని వశపరచుకో గలుగుచున్నాడు.

ఒకడు తాను చేసిన అశుభ కర్మలను ప్రాయశ్చిత్త కర్మలచే శుభములుగా మార్చుకొంటున్నాడు కదా! అదే విధంగా పూర్వకర్మల దోషములను వర్తమాన ఉత్తమ ప్రయత్నములచే తప్పకుండా శుభప్రదం చేసుకోవచ్చు. అట్లుకాకుండా అల్ప విషయముల పట్ల లోభమును పొంది, "దైవము" అనుదానిని జయించుటకు ప్రయత్నించకుండా, అద్దానికి లోబడి ఉండువారు మా ఉద్దేశంలో దీనులు, మూఢులే.

ఎప్పుడైనా వర్తమాన పురుష ప్రయత్నం విఫలమౌతుంటే అప్పుడు, మనం నిన్నటిరోజు చెప్పుకొన్నట్లు, ఇతఃపూర్వపు 'వ్యతిరిక్త' పురుషకారం ప్రబలంగా ఉన్నదని గ్రహించాలి. ఇక ఇప్పుడు శాస్త్రవిధిని, పెద్దలను ఆశ్రయించి యే యే ప్రయత్నములు ఉచితమో, ఉత్తమమో సద్విమర్శనా

పూర్వకంగా నిర్ణయించుకోవాలి. మరల మరల ప్రయత్నశీలుడు కావాలి. ఒక గుత్తిలోని రెండు పండ్లలో ఒకటి తియ్యగా మరొకటి పుల్లగా ఉంటే, ఇందుకు ఆ ఫలభోక్త యొక్క ఇతఃపూర్వపు కర్మాచరణమే కారణం" అని గ్రహించుటే ఉచితం కాని, దైవముపై ఆపాదించుట ఉచితం కాదు. ఎందుకంటే సర్వసాక్షి, అకర్త, అభోక్త అగు పరమాత్మకు కర్మదోషం ఎలా అంటగట్టగలం?

మహాప్రసిద్ధమగు పదార్థములు క్షయం పొందుతున్నప్పుడు కూడా "ఇది క్షయ కర్త యొక్క పురుషకారమే" అని గ్రహించబడుగాక. ఈ జగత్తులోని ప్రతి అభివ్యక్తము వెనుక ప్రయత్నశీలత్వమే అంతర్లీనంగా ఉండి ఉన్నది. ప్రతిజీవుని యందు ప్రతి క్షణం ప్రాక్తన – ఆద్యతన* పురుషకారములు ఒకదానితో మరొకటి సంఘర్షణ పడుచుండగా అందులో అధికమైన బలముగలది గెలుస్తోంది.

"ఒకానొక రాజ్యంలో రాజవంశం నశించింది. అక్కడి మంత్రివర్యులు తమ రాజును నిర్ణయించుకోవలసి వచ్చింది. వారు ఒక శుభమైన రోజున ఒక ఏనుగును అలంకరించారు. దాని తొండమునకు ఒక పూలమాల అందించి రాజవీథిలో వదిలారు. అనేక ప్రదేశముల నుండి తండోపతండములుగా వచ్చిన జనులు ఆ వీథిలో గుమిగూడి ఉన్నారు. ఆ ఏనుగు ఒకానొక భిక్షకుని మెడలో ఆ దండను వేసి రాజుగా చేసింది. ఆ భిక్షకుడు చాలాకాలం రాజ్యం పాలించాడు". ఈ సంఘటనలో కూడా "అంతా దైవమే చేశాడు" అనటం భావ్యం కాదు. ఇందులో మంత్రుల యొక్క, పౌరుల యొక్క, ఏనుగుయొక్క, రాజశాసనము యొక్క ప్రయత్నశీలత్వమే (పురుషకారమే) అట్టి సంఘటనకు కారణమైనది. వారి సమానాభిప్రాయబుద్ధి, అందుకు సంబంధించిన ప్రయత్నమే భిక్షకుని రాజుగా చేసింది. ఇక, భిక్షకుడు అంతకు ముందు చేసియున్న ప్రయత్నములను మనం చూడలేం కనుక "ఇది దైవము చేశాడు" అనే పదప్రయోగం చేయటం జరుగుతోంది. అంతేకాని ఈ సంఘటనలో 'దైవము' ఎక్కడ పాల్గొన్నది?

❖

ఒకానొకడు ఏదైనా సాధించుటలో సమర్థుడు అగుచున్నప్పుడు అతని ప్రయత్నము దృష్టము కావచ్చు. లేక ఎదురుగా కంటికి కనబడకపోవుటచే 'అదృష్టము' కావచ్చు. కాని మరొకడు అట్టి సమర్థత వెనుక ఉన్న ప్రయత్నశీలత్వమును గమనించలేడు. కనుక "ఇదంతా దైవమే అతనికి ప్రసాదించింది" అని భావించి ఊరట చెందుచున్నాడు. అయితే అట్టి అభిప్రాయం జ్ఞానుల దృష్టిలో మూర్ఖమగు అభిప్రాయం మాత్రమే. ఈ ప్రపంచంలో మనకు ఒక సమర్థుడైన వ్యక్తి కంటే ఇంకా అధికమైన సమర్థతగల వ్యక్తి తారసపడుచున్నాడు కదా! ఆ భేదం ఎక్కడి నుండి వస్తోంది? ఆ రెండవవాడు అధికమైన ప్రయత్నం చేసియుండట చేతనే. కాబట్టి 'సమర్థత' అనునది అదృష్టానుసారం ఉండేది కాదని, స్వప్రయత్నముల అల్పాధిక్యములను బట్టి ప్రాప్తించేదేనని తెలిసిపోతోంది.

ఈ వర్తమానమునందు ఆశ్రయించబడు ప్రయత్నములచే ఇతఃపూర్వపు దుష్కర్మల సంస్కారమును జయించివేయవచ్చునని అనుకున్నాం కదా! అయితే, వర్తమానపు శుభ ప్రయత్నములను ఇతః పూర్వపు అశుభ ప్రయత్నముల (కర్మల) ఆకర్షణ ఓడించకుండా చూచుకోవాలి. ఉత్తమమగు

లక్ష్యమునుండి చలించనివాడే విజయమును పొందుచున్నాడు.

ఎప్పుడైనా సరే, ఈ ప్రాక్తన✷ – వర్తమాన పురుషకారములు రెండిటిలో ఐహిక (వర్తమాన) పురుషకారమే అధిక బలమైనదిగా భావించాలి. ఈ ఐహిక పురుషకారం ఇప్పుడు మన చేతిలో ఉన్నది. "ప్రయత్నం చేయుటచే నేను ప్రాక్తనమును జయించి వేయగలను" అను నమ్మకం కలిగి ఉండాలి. తనపై, గురువుపై, శాస్త్రముపై విశ్వాసము, నమ్మకము (faith and confidence) కలిగి ఉండాలి. "అయ్యో! నేనేమి చేయగలను? నేను ఒక స్వల్ప మానవుణ్ణి. ఇది ఇంతే. ఎవరో మహానుభావులే దీనిని అధిగమించగలరు. మా వంటి మామూలు మనుష్యుల వలన ఏమౌతుంది?" – ఇటువంటి దౌర్బల్యములైన భావములు కలిగియుండి, అప్రయత్నశీలురై ఉండేవారికి ధిక్కారమగుగాక!

ఓ రాఘవేంద్రా! ఒక రైతును గమనించు. ఆతడు సంవత్సరమంతా కష్టపడి పండిస్తాడు. ఒక్కొక్కసారి ఒక రోజు వచ్చిన తుపాను తాకిడికి చేతికి వచ్చిన పంట అంతా దెబ్బ తింటుంది. అతడు కొద్ది క్షణాలు నిరుత్తరుడౌతాడు. అయితే అట్టి నిరుత్సాహమునందే కృంగిపోయి ఊరుకుంటున్నాడా? లేదు. మరల "విత్తులు ఎక్కడ? నాగలి ఎక్కడ?" అంటూ పునః ప్రయత్నశీలుడై మంచి పంటను సాధిస్తున్నాడు. వర్షము యొక్క పురుషార్థము వలన దెబ్బతిన్న ఆ రైతు స్వకీయమైన పురుషార్థముచే తిరిగి పుంజుకొంటున్నాడు. ప్రతిజీవుడు ఇందలి పాఠమును గ్రహించాలి. అధిక ప్రయత్నం చేసేవాడు విజయం తప్పక సాధిస్తాడు.

❖

అదే విధంగా ఒక వ్యాపారస్తుడు కష్టపడి ఆర్జించిన విత్తమంతా నష్టపోయినప్పుడు కూడా ఏం చేస్తున్నాడు? తిరిగి ప్రయత్నించి లాభములు ఆర్జించటానికి నడుం కట్టుచున్నాడు కదా! అట్లు ప్రయత్నించుటయే ఉచితం. అట్లాకాకుండా, దుఃఖించుచు కాలం గడపటం, ప్రయత్నమును త్యజించటం ఉచితమెట్లా అవుతాయి?

అనువుకాని చోట, చేయకలిగినదేమీ లేనిచోట దుఃఖించటం అనవసరం, నిష్ప్రయోజనం కూడా. అట్లు దుఃఖించ తలచుకొంటే అనివార్యమైన మృత్యువు గురించి మననం చేస్తూ ప్రతి రోజు కొంతసేపు ఓ మూల కూర్చుని దుఃఖించాలి. అట్లా చేస్తున్నామా? లేదు కదా! కాబట్టి ఇప్పటికిప్పుడు ఏది చేయలేమో దానిని గురించి విచారించటం అప్రస్తుతం. చేయకలిగినట్టి ఉత్తమ ప్రయత్నమునకై వెతకి, అద్దానిని విధి – విధానముగా, శ్రద్ధతో, సదవగాహనతో నిర్వర్తించుటయే మనం ప్రస్తుతం చేయవలసినది.

❖❖❖

---

✷ 1. ప్రాక్తనము = ఇతఃపూర్వం చేసియున్న ప్రయత్నములు (Past deeds /efforts made in the past)

2. అద్యతనము = వర్తమాన ప్రయత్నములు (Present deeds / efforts)

# 6. దైవ ప్రేరణ - పురుషార్థము

ఈ జగత్తులోని పదార్థాలన్నీ దేశ – కాల – క్రియ – ద్రవ్యముల శక్తిని అనుసరించి ప్రకాశించుచున్నాయి. వీటన్నిటిలో అధిక యత్నశీలి అయినవే జయిస్తున్నది. మానవుడు సర్వదా పౌరుష బలమునే ఆశ్రయించాలిగాని, తెలియని దైవంపై భారంవేసి అప్రయత్నశీలుడగుట ఉచితంకాదు. సాధు సాంగత్యం, శాస్త్ర విచారణ ఆశ్రయించి ముందుగా చిత్తశుద్ధిని సంపాదించాలి. చిత్తశుద్ధి సహాయంచేత దుర్భరమైన సంసార సాగరమును దాటివేయాలి.

ఈ "ప్రాక్తన–ఐహిక పురుషకారములు" అనే ఫలవృక్షాలలో బలమైన వృక్షం బలహీనమైన దానిని కప్పివేస్తోంది. మానవుడైనవాడు నిజప్రయత్నములచే ప్రాక్తన కర్మలను అణగత్రొక్కివేయాలి. ఎవడైతే అట్లు చేయడో, – అట్టి వానికి తన సుఖ దుఃఖముల రెండిటి యందును స్వాతంత్ర్యము ఉండదు. నిజప్రయత్నములను బలవత్తరం చేయలేని పశుతుల్యుడగు జీవుడు ఈశ్వర ప్రేరితుడై స్వర్గ నరకములకు వెళ్ళి వస్తూ ఉంటాడేగాని, స్వతంత్రుడు కాలేడు. అట్టివాడు సర్వదా పరాధీనుడే. ఇక 'మోక్షము' అను మాట ఎక్కడిది? సదాచార సంపన్నుడు, ప్రయత్నశీలుడు అగువాడు మాత్రమే ఈ 'జగన్మాయ' అనే పంజరమును ఛేదించి బయటకు రాగలుగుచున్నాడు. అతనికి తన ఉదారము, చమత్కారము అయినట్టి స్వకీయ ప్రయత్నమే తోడుగా నిలచి బంధవిముక్తిని ప్రసాదించుచున్నది.

**కశ్చిన్మాం ప్రేరయిత్యేవమ్ ఇత్యనర్థ కుకల్పనే**
**యఃస్థితో దృష్టముత్సృజ్య నత్యాజ్యోఽసౌ దూరతోఽధమః ॥** (VI-29)

ఎవ్వరైతే ఎదురుగా (దృష్టమై) కనిపించుచున్నట్టి పురుషప్రయత్నమును, దాని యొక్క ప్రయోజనమును గుర్తించక, "నన్ను ఎవరో ఎక్కడినుండో ప్రేరేపిస్తున్నారు. లేక నా ప్రయత్నముల నుండి నన్ను నిరోధిస్తున్నారు. అందుచేతనే నేను ఇట్లు అగుచున్నాను" అని తలచుచు, కుకల్పనలు చేసుకొంటూ, లక్ష్యశుద్ధి లేకుండా అప్రయత్నశీలురై ఉంటారో, అట్టివారిని దూరంగా త్యజించటం మంచిది.

వేలకు వేలు వ్యవహారాలు ప్రతి రోజు ఈ జీవుని సమక్షమునకు వస్తున్నాయి. పోతున్నాయి. వాటియందు రాగద్వేషాలు కలిగియుండకుండా శాస్త్రానుసారం ఆచరించటమే ఉత్తమం. శాస్త్రానుసారంగా లోకానుకూలంగా స్వీయకర్మలను రక్షించుకొనువాని వద్దకు, రత్నాలన్నీ సముద్రంలోకి వచ్చి చేరుచున్నట్లు, ఉత్తమ గుణములు, అభీష్ట సిద్ధులు వచ్చి చేరుచున్నాయి.

ఏ యత్నములైతే సుఖదాయకములై, దుఃఖనివృత్తికరములై ఉంటున్నాయో, అట్టి యత్నములనే విజ్ఞులైన పెద్దలు "పౌరుషము" అని నిర్ణయిస్తున్నారు. శాస్త్ర విహితములైన అట్టి యత్నములే "పురుషార్థము" అను ప్రయోజనమును కలుగచేస్తున్నాయి. ఇట్టి కర్మయొక్క రహస్యమును (కర్మ సిద్ధాంతమును) గ్రహించినట్టి బుద్ధిమంతులగువారు ఊరకే కాలం వృథాచేయరు. వారికి "అయ్యో! ప్రాప్తిస్తుందో? లేదో?" – అను రూపముగల ప్రాప్తాప్రాప్తములు ఒక లెక్కలోనివి కావు. ప్రయత్నమును అనుసరించే ప్రయోజనము ఉంటుందని వారికి తెలుసు. అందుచేతనే వారు గురుసేవ,

స్వాధ్యాయనము, సాధు సంగం, శ్రవణము, పరోపకారము మొదలైన ప్రయత్నములచే, తమ చిత్తములను దోషరహితం చేసుకొంటున్నారు. తద్వారా ఆత్మోద్ధరణమును సాధించుచు, – స్వస్వరూపము, సర్వస్వరూపము అయినట్టి "ఆత్మానుభవము" అను పురుషార్థమును క్రమంగా పొందుచున్నారు. అనిర్వచనీయమగు ప్రశాంతత్వమును అవధరిస్తున్నారు. కనుక ఓ రామా! నీవు సర్వ విధములైన లౌకిక పార లౌకిక ప్రయత్నములన్నీ "చిత్తశుద్ధిని పొందెదను గాక" అను లక్ష్యముతో చెయ్యాలి కాని, మరింకెందుకూ కాదు.

నాయనా! రాఘవా! ఈ ద్వైత వైషమ్యమంతా అజ్ఞానముచేతనే ప్రాప్తిస్తోంది. అట్టి వైషమ్యమును నివృత్తింప చేసి, 'సమతానందము' అను దానిని పొందించునదే "పురుషార్థం" అని పెద్దలు పిలుస్తున్నారు. అట్టి అఖండానందమే జీవుని లక్ష్యము కావాలి. అయ్యది ప్రాప్తింపచేసే శాస్త్రములను, సాధువులను, సత్కర్మలను ఎల్లవేళల సేవించాలి.

❖

ప్రాక్తనకర్మ పరలోకములలో (In the past births) అనుభవించగా మిగిలినదే మనతో ఈ లోకానికి వచ్చి మన ఈ వర్తమాన అనుభవములకు కారణమగుచున్నది. దానినే జనులు 'దైవము' అని పిలుస్తున్నారు. "భ్రాంతము" (ఇది కష్టము – ఇది సుఖము అను భావన భ్రాంతియే కాబట్టి వసిష్ఠ మహర్షి ఆ అనుభవమును 'భ్రాంతము' అని వర్ణిస్తున్నారు), "అదృష్టము" (ఎదురుగా కనబడునది కాదు కాబట్టి) అయినట్టి ప్రాక్తన కర్మను ఉద్దేశించి "అయ్యో! దైవమా! ఇది ఇట్లగుచున్నదేమిటి?" అనునట్టి వాక్యములచే కొంత ఊరట చెందుచున్నారు. వారిని అట్లే పొందనీ, వారిని, నేనేమీ అనుటలేదు. కానీ, వర్తమానంలోని పురుషకారమును త్యజించి, మూఢులచే కల్పించబడిన "అదృష్టము"ను ఆశ్రయించేవారిని మాత్రమే నేను ప్రశ్నిస్తున్నాను. అట్టి అదృష్టము ఎక్కడ ఉన్నది? ఎక్కడి నుండి లభిస్తోంది? అదృష్టమును నమ్మి ఉండునట్టి నిష్క్రియులు క్షయము వైపే పయనించుచున్నారని గుర్తుచేస్తున్నాను. ఎందుచేతనంటావా? నిజ పౌరుషబలము చేతనే సకల శుభములు చేకూరచుండగా, అట్టి స్వప్రయత్నము విషయంలో అశ్రద్ధ కలిగియుండుట ఉచితము ఎట్లా అవుతుంది? వర్తమాన సత్కార్యములు, ప్రాయశ్చిత్త కర్మలు శుభములుగా మారి భవిష్యత్తునందు శోభను కలుగచేస్తున్నాయి.

అందుచేతనే ఓ రామా! ఈ జీవుడు కార్యశీలుడు కావాలి. బద్ధకమును, అశ్రద్ధను త్యజించాలి. అతడు స్వకీయమైన పురుష కారముచేత కోరుకొన్న ఫలమును అరచేతిలోని ఉసిరికకాయవలె ప్రత్యక్షం చేసుకోగలడు. మూఢుడైనవాడు మాత్రమే ప్రత్యక్షమును పరిత్యజించి 'అదృష్టము' అను మోహమునందు నిమగ్నుడగుచున్నాడు. ఓ శుభాశయా! రామచంద్రా! ఈ కార్యకారణములకు సంబంధించిన సమస్త సంశయములను కాస్త ప్రక్కకుపెట్టు. నీయొక్క చిత్తవృత్తి బలంచేత కల్పితము, మిథ్య అయినట్టి 'దైవము' అను దానిని అపేక్షించటం మానివేయి. పురుషకారమును (లేక ప్రయత్నమును) ఆశ్రయించి ఉద్ధారణ పొందెదవుగాక!

❖

ఈ జీవుడు చిత్తశుద్ధి పొందితే అంతా సుస్పష్టమే అవుతుంది. అయితే చిత్తశుద్ధి లభించేదెట్లా? జ్ఞానము వలననే. జీవుని సముద్ధరించగల ఉత్తమోత్తమజ్ఞానం (ఆత్మజ్ఞానం) లభించాలంటే, 'వేదములు' మొదలైన శాస్త్రములచేతను*, సత్పురుషుల ఆచరణ చేతను, వారిచే బోధింపబడుచున్న ప్రవచనముల చేతనే సాధ్యం. అట్లాగే, దేశకాలములను అనుసరించి చెప్పబడే ధర్మములను ఆచరించాలి. అన్ని వేళలలోను హృదయంలో "చిత్తశుద్ధి – జ్ఞానము" అనే మధుర ఫలములను ఉత్పత్తి చేయగలిగినట్టి ఉపాయములకొరకు అన్వేషించాలి. అట్టి నిరంతర ప్రయత్నములను ఆశ్రయించాలి. అందుకొరకై 'తీవ్రేచ్ఛ' కలిగియుండాలి.

ఓ రామా! ఒకడు కనుక "చిత్తశుద్ధి – జ్ఞానము" పొందవలెనను తీవ్రేచ్ఛ కలిగి ఉంటే, తదనుకూలమైన సాధనములు, ప్రయత్నములు వాటంతటవే సమకూరుతాయి. అప్పుడు అట్టి ప్రయత్నశీలునియందు స్ఫురించే కార్యక్రమ వ్యవహారమే "పౌరుషము" అని చెప్పబడుతోంది. మల్లయుద్ధ వీరుడు పోటీలో గెలవాలంటే బలము, తెలివి రెండూ కావాలి కదా! అట్లే జీవుడు కూడా మాయను జయించాలంటే "ఉత్తమ ప్రయత్నములచే (తపస్సు, ధ్యానము, లోకోపకారములగు కర్మలు, నామస్మరణ మొదలైనవి) పొందబడగల "చిత్తశుద్ధి" : సద్గురుసేవ, శాస్త్ర విచారణ, స్వయముగా విచారించుట మొదలైన వాటిచే వివేకము వికసించగా పొందబడగల "జ్ఞానము" – ఈ రెండింటిని సంపాదించుకోవాలి.

కనుక ఓ ప్రియ రామచంద్రా! మానవుడైనవాడు మొట్టమొదట బుద్ధిబలంతో పురుషకారమును ఆశ్రయించి, సర్వవేళలా, సర్వవిధములా ప్రయత్నించుటయే ఉచితం. అప్పుడే మానవ జన్మ సార్థకమౌతుంది. ఆ తరువాత, శాస్త్రములను, సాధువులను, పండితులను సేవించి ఆ ప్రయత్నములను సఫలం చేసుకోవటమే కర్తవ్యమైయున్నది.

మహాత్ములగు వివేకశీలురు దైవము–పురుషకారము – ఈ రెండిటి యొక్క బలాబలములను చక్కగా విచారించి, పరిశుద్ధమైన లక్ష్యముతో వర్తమాన ప్రయత్నములను ఉత్సాహపూరితం చేసుకొంటున్నారు. అందుకే వారు జీవించి ఉన్నందుకు ఉత్తమమైన ప్రయోజనమును పొందుచున్నారు. కనుక, నీవు కూడా జ్ఞాన సేవితమైనట్టి శ్రవణ మననాదులను ఆశ్రయించు. సర్వదా ఆత్మోద్ధారణ వైపునకే ప్రయాణించెదవు గాక!

స్వాభావికమైనట్టి ఐహిక (Present) పురుషకారమునే కార్యసిద్ధి యొక్క ఉపాయంగా జీవుడు ఎంచుకోవాలి. ఆత్మజ్ఞానులగు పండితులు ఉన్నారు. వారిని, వారు చెప్పుదానిని ఉపేక్షిస్తూ రోజులు గడపటం ఉచితంకాదు. వారిని సేవించుచూ సత్యాసత్య వివేక రూపమగు జ్ఞానమును సంపాదిస్తూ, సత్కర్మాచరణులై జనన మరణరూపమగు 'సంసారభ్రమ' అను రోగము నుండి విముక్తులు అగుటకు ప్రయత్నించెదరు గాక శాంతిని, సమతాభావమును పొందెదరుగాక!

❖❖❖

* అట్లాగే జీసస్, మహమ్మద్, బుద్ధుడు, గురునానక్ మొదలైన ప్రవక్తలచే బోధింపబడిన గ్రంథాల చేత కూడా.

# 7. నిజప్రయత్న ప్రాధాన్యం

ఓయీ! మానవుడా! నీవు ఈ ఉత్తమమైన ఉపాధిని పొందావు. నిత్యానిత్యములను విచారించి గ్రహించగలిగే సూక్ష్మబుద్ధినికూడా పొంది ఉన్నావు. (జంతువుల బుద్ధితో పోల్చినప్పుడు మానవుని బుద్ధి సునిశితమైనదే కదా!) అనేక ఉపాయములకు అవకాశమైయున్న ఈ జీవితమును వ్యర్థపరచుకోవటం తగిన పనేనా? కాబట్టి శ్రద్ధాసక్తుడవై, స్వస్వరూపమగు ఆత్మయందు సమాధానమును పొందు లక్ష్యముతో వ్యవహరించాలి. ఈ దుష్ట సంసార వ్యవహారమును అంతరంగము నుండి తొలగించివేయి.

'పురుషకారము'చే 'అదృష్టము'ను నివారింప యత్నించువానికి ఇహ-పరలోకముల రెండిటియందు అభీష్టసిద్ధి ప్రాప్తిస్తోంది. అట్లుకాక, అదృష్టమును నమ్మి అప్రయత్న పరులై ఉండేవారు తమకు తావే శత్రువు లగుచున్నారు. తమయొక్క ధర్మార్థ కామములను తావే నశింపచేసుకొంటున్నారు. ఇక మోక్షము విషయమై వేరే చెప్పేదేమున్నది?

పౌరుషము యొక్క స్వరూపములు మూడు-

1. పురుషార్థమును సాధించవలెనను 'ఇచ్ఛ'.
2. కర్మేంద్రియముల ప్రవృత్తి
3. తత్త్వజ్ఞాన వికాసము

ఈ మూడు, ఒకదానికి మరొకటి 'తోడు' అగుచు ఉత్తమ ఫలమును ప్రాప్తింప చేస్తున్నాయి. మనస్సునందు ఎట్టి విషయము స్ఫురిస్తుందో, చిత్తము కూడా అట్టి ఆకారమునే దాల్చుట జరుగుతోంది. అట్టి చిత్తము నుండి ఇంద్రియముల యత్నములు బహిర్గతమౌతున్నాయి. ఒకడు తన బాల్యమునుండి ఏఏ విషయముల గురించి ఏఏ ప్రయత్నములు చేస్తాడో - ఫలితములు కూడా ఆ ప్రయత్నములబట్టే ఉంటున్నాయి. ఇక 'దైవము' అనుదానికి వేరే చోటెక్కడ? అందుచేతనే 'పౌరుషము' అనునది సర్వమునకు మూలకారణమై ఉన్నదని మేము సిద్ధాంతీకరించటం జరుగుతోంది.

ఓ రాఘవా! తమ పురుషకారము చేతనే ఎవరైనా ఏదైనా ఈ జగత్తులో పొందగలుగుచున్నారు. పురుషకారము వలననే బృహస్పతి దేవతల గురువు అయ్యాడు. అట్లే శుక్రాచార్యుడు రాక్షసులకు ఆచార్యుడై వెలయుచున్నాడు. మనుష్యులలో కూడా కొందరు అనేక దైన్య, దారిద్ర్యములచే పీడింపబడుచూ కూడా, ఉత్తమ పురుషకారమును ఆశ్రయించినవారై ఇంద్రసమానులగుచున్నారు. అదేవిధంగా 'నహుషుడు' మొదలైన మరికొందరు అనేక సంపదలతో భోగములతో తులతూగుచు, తమ స్వప్రయత్నముల దోషములచే నరకమున కూలిపోయారు. ఎదురుగా ఉన్న ఈ ప్రపంచమునే చూడు. ఇక్కడ జీవులు వేలకువేలుగా సంభవిస్తున్న ఆపదలను, దుర్దశలను తమ పురుష ప్రయత్నము చేతనే అధిగమించుచున్నారు కదా!

శాస్త్రములు ఎందుకొరకు రచించబడ్డాయి? "అశుభ మార్గమున పయనించే చిత్తము సర్వప్రయత్నములచే శుభమార్గమునకు మరలించబడుగాక" అని ప్రతిపాదించి, మానవుని

చక్కదిద్దుటకే కదా! అవి సక్రమంగా అవగాహన చేసుకోబడుగాక! ఆచరించబడుగాక! గురుజనులు కూడా మానవులకు, "నాయనలారా! శుభదాయకము, అనపాయకరము, ఉత్తమ ఫలప్రదము అయియున్న ఈ ఈ క్రియావ్యవహారములను యథారీతిగా యత్నపూర్వకంగా ఆచరించండి" అనే ఉపదేశిస్తున్నారు. అంతేగానీ, "దైవమే అన్నీ ఇస్తాడు. మీరు ఇష్టం వచ్చినట్లు తిని–తిరగండి" .. అని చెప్పటం లేదే!

"నేను ఏ రీతిగా ప్రయత్నిస్తున్నానో, ఫలములు కూడా ఆ రీతిగానే ప్రాప్తిస్తున్నాయి. అందుచేత నేను నా ప్రయత్నములనే సరైన మార్గంలో నియమించెదను గాక" – అని మానవుడు భావించాలి. ఎప్పుడైతే అతడు అట్టి సద్విమర్శ చేయడో, అప్పుడు తనకు దైవము వలననో, అదృష్టము వలననో, ఇతరుల వలననో అశుభములు ప్రాప్తిస్తున్నాయని అనుకోవటం, వాపోవటం జరుగుతోందని మా అభిప్రాయం. అతడు అనేకసార్లు "నా సామర్థ్యము, ప్రయత్నము ఎట్లా ఉన్నాయి?" అని ప్రశ్నించుకోకుండా "వారి వలన నేను ఇది సాధించలేకపోయాను" అని అంటూ పరదూషణకు దిగుచున్నాడు.

❖

పౌరుష బలముచేతనే కార్యసిద్ధి జరుగుతోంది, – అనునది నిర్వివాదాంశము. బుద్ధిమంతులు పౌరుష బలమును ఆశ్రయించే తమ కార్యములచే అనేకులను ప్రభావితం చేయగలుగుచున్నారు. అయితే, జీవితంలో అయిష్టమైనవి, కష్టమైనవి సంభవిస్తున్నప్పుడు అల్పబుద్ధి గలవారిని ఓదార్చుటకు బుద్ధిమంతులైనవారు 'దైవము' అనే శబ్దమును ఉపయోగించటం జరిగింది. అట్లు కల్పించబడిన 'దైవము' అనుదాని పట్ల విశ్వాసముచే (లేక భీతిచే) ఉత్తమ కార్యాచరణము నిర్వర్తించబడగా, ఆ శిష్యులు ఉత్తమ బుద్ధి సమన్వితులై సర్వము గ్రహించగలరనునదే బుద్ధిమంతుల ఉద్దేశం. ఇది చిన్నపిల్లలకు ప్రమాదరహితమైన సత్ప్రవర్తన నేర్పుట వంటిదే. అయితే 'దైవము' అను శబ్దము ఏదీ స్వయముగా ప్రసాదించదు. ప్రయత్నబలమును అనుసరించే సదవగాహన – సత్ప్రవర్తనములనుండే ఔన్నత్యమనేది లభిస్తోందని గ్రహించు.

"పురుషకారమే ఫలవంతమగుచున్నది" .... అనునది అందరికి, అన్నివేళల ప్రత్యక్షానుభవమే. ఒకడు ఒక చోట నుండి మరొక చోటికి వెళ్ళాలంటే కూడా స్వప్రయత్నమే శరణ్యమగుచున్నది కదా! భుజించినవానికే రుచి తెలుస్తోంది. తృప్తి కలుగుతోంది. ఆకలి తీరుతోంది. భుజించనివానికి ఆకలి ఎలా తీరుతుంది? నడిచేవాడే వెళ్ళగలుగుతాడు. నడువనివాడు వెళ్ళేదెట్లా? మాట్లాడేవాడే చెప్పగలుగుచున్నాడు. మాట్లాడనివాడు తాను అనుకొన్నది ఎట్లా చెప్పగలుగుతాడు? అందుచేత, పౌరుషమే జనులకు సిద్ధిదాయకమగుచున్నదనుటలో ఎవరికీ, ఏమాత్రం సందేహం ఉండవలసిన అవసరం లేదు. అనేకమంది ధైర్యశాలురు పౌరుషమును ఆశ్రయించే గొప్ప సంకటముల నుండి విడివడుచున్నారు. "మా అదృష్టము ఇంతే కాబోలు" అని నమ్మి ఊరక కూర్చునేవారు ఏమి సాధించగలరో చెప్పు?

ఓ రామా! మరల మరల ప్రకటిస్తున్నాను. ఏ వ్యక్తి ఎద్దానికొరకు ఎంతగా ప్రయత్నిస్తాడో, అతడు అద్దానిని అంతవరకే అట్లే పొందుచున్నాడు. తూష్ణీభావం వహించి ఊరుకునే వానికి ఎక్కడా ఏమీ సిద్ధించుట లేదు. శుభ పురుషకారము శుభమునకు, అశుభ పురుషకారము అశుభమునకు దారితీస్తోంది. కాబట్టి నీవు దేనిని కోరుకొంటున్నావో, దాని కొరకే ఉత్తమ ప్రయత్నం చేయి. ఇక ఫలితమంటావా, అది వెనువెంటనే లభించవచ్చు. లేదా ఆలస్యంగా ప్రాప్తించవచ్చు. ఏది ఏమైనా శుభ ప్రయత్నములకు శుభము, అశుభ ప్రయత్నములకు అమంగళము వచ్చి తీరుతాయి. వాటిని ఎవరూ నిరోధించలేరు. ఇది అప్రతిహతమైన విధానశాసనం.

అయితే, దేశకాలాధీనంగా పౌరుషబలంచే లభిస్తున్న శుభాశుభ ఫలములనే 'దైవము' (ద-ఏవమ్ = ఏదైతే / ఇస్తోందో) - అని అందరు పిలుస్తున్నారు. అంతేకాని, 'దైవము' అనగా, కనులకు కనబడని ఏదో తెలియరానిశక్తి, లేక, అకస్మాత్తుగా కారణం లేకుండా ప్రవర్తించేది, లేక, ఇంకొకచోట ఎక్కడో ఉన్నట్టిది అయిఉండలేదు.

❖

పురుషుడు ఈ లోకమునందే జన్మిస్తున్నాడు. పెరుగుచున్నాడు. ముదుసలి అగుచున్నాడు. ఈ విధంగా బాల్య, యౌవన, వార్ధక్యాలు ప్రత్యక్షానుభవం అయినట్లుగా 'అదృష్టము' అనునది ప్రత్యక్షంగా లభిస్తోందా? లేదుకదా! కనుక మా ఉద్దేశంలో, కారణమే లభించనట్టి 'అదృష్టము' అనునది లేనే లేదు.

సత్పురుషులైన వారు "పరమార్థములను సాధించు యత్నములు" - అనువాటినే 'పౌరుషము' అను పేరుతో పిలుస్తున్నారు. లౌకిక దృష్టితో చూచినపుడు కూడా పౌరుషము లేక పురుషయత్నము వలననే అభీష్టములన్నీ సిద్ధిస్తున్నాయి. చేతులతో వస్తువులను కదల్చటం, మాట్లాడటం, చూడటం ఇట్లే సర్వేంద్రియ క్రియలు - ప్రయత్నము (లేక) పౌరుషబలం చేతనే జరుగుచున్నాయి. అంతేకాని, దైవబలంచేత కాదే! అయితే, 'అనర్థ కరములు - నిష్ప్రయోజనకరములు" అయిన ప్రయత్నములు అట్టి ప్రయోజనములనే కలుగచేస్తున్నాయి. అల్పాశయముతో కూడినవాటి ప్రయత్నముల వలన పొందేదేముంటుంది? అందుచేత, సత్సంగమందు, సచ్ఛాస్త్ర పర్యావలోకనమందు బుద్ధిని వినియోగిస్తే, ఆ బుద్ధి సునిశితమౌతుంది. ఇప్పుడు 'సమగ్ర - సదవగాహన'తో కూడిన ప్రయత్నము చేతనే అనుకొన్నది లభిస్తుంది.

❖

అజ్ఞానం చేతనే వైషమ్య మమకార వృత్తులు జనిస్తున్నాయి. ఏ ప్రయత్నములైతే "సర్వవైషమ్య భావములను మొదలంట నివృత్తింపచేసి, అఖండానందమును ప్రాప్తింప చేయటానికి కారణములు కాగలవో, అట్టి ప్రయత్నముల సమూహమునే "పరమ పురుషార్థము" అని తత్త్వజ్ఞులు పిలుస్తున్నారు. అట్టి పురుషార్థమును ప్రాప్తింపచేయగల సదసత్ వివేకులగు సత్పురుషులను, సచ్ఛాస్త్రములను, శరణువేడటం సంసారబద్ధుడగు మానవునకు అత్యంత ఆవశ్యకమైయున్నది. సరోవరంలో అందమైన

తామరలు వృద్ధి చెందాయనుకో. అప్పుడు తామరల వలన సరోవరం, సరోవరం వలన తామరలు పరస్పరం శోభింపచేసుకుంటాయి. అదేవిధంగా, సచ్ఛాస్త్ర – సాధు సాంగత్యాల వలన బుద్ధి, బుద్ధి వలన సచ్ఛాస్త్ర – సాధు సాంగత్యాలు శోభిస్తున్నాయి. అందుచేత, బాల్యము నుండి వాటిని అభ్యసించాలి. వాటి వలన ఆ అభ్యసించువాడు తనను తాను ఉద్ధరించుకొనుటేకాక, అనేకులను తనవలెనే సమున్నతులను చేయగలడు. ఎందుకంటే, అతనికి స్వాత్మలాభమే చేకూరుతుంది కదా!

ఓ రామచంద్రా! ఈ ప్రపంచమంతా అదృష్టముచేత నడుచుచున్నదని భ్రమింప బడకుండుగాక! ఏది ఎక్కడ ఎట్లు జరుగుచున్నా, దాని వెనుక ప్రయత్నమే అంతర్లీనమై ఉండి ఉంటోందని నేను నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను. భగవంతుడగు విష్ణుదేవుడు నిజప్రయత్నము చేతనే దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుట చేస్తున్నాడు. అంతేకాని ఆయనకు అదృష్టము కలసి వస్తోందా? కానే కాదు. ఈ జగత్తులో ఎవరికైనా పురుష ప్రయత్నమే ఇష్టసిద్ధిని ప్రాప్తింపచేస్తోంది. అందుచేత నీవు సర్వదా ప్రయత్నశీలుడవై ఉండు. సర్వశంకలను త్యజించి ఏ ఏ ప్రయత్నములు ఉచితమో వివేకముచే విచారించి వాటిని ఆశ్రయించు. అంతేకాని 'కొయ్య'ను చూచి "ఇది పాము కాదు కదా?" అని అనుకొంటూ 'దైవము' అనుదాని విషయమై లేనిపోని భ్రమలు పొందవద్దు. మహత్తరమైన అవకాశములు ఉన్న ఈ జీవితము అను దానిని జనులు లేనిపోని కల్పనలతో వృథా చేసుకోవటం తరచు జరుగుచున్నదని గుర్తు చేస్తున్నాను.

❖❖❖

# 8. అప్రయత్నశీలుడు - దుర్గతులు

ఓ రామచంద్రా! "దైవము" అని జనులు దేనిని దృష్టిలో పెట్టుకొని సంబోధిస్తున్నారో – ఎంత తరచి చూచినా, నాకు అర్థమగుట లేదు. "దైవం" లేక "అదృష్టం" అనునది ఎక్కడ ఉన్నది? అద్దానికి ఆకారముగాని, కర్మగాని, చలనముగాని, పరాక్రమముగాని లేదే? అందుచేత అది మిథ్యాజ్ఞానము చేతనే ఆరూఢమై ఉంటోందని మా అభిప్రాయం. లేదా, ఇతఃపూర్వపు కర్మలు (లేక ప్రయత్నములు) ఫలోదకమగు చున్నప్పుడు (ప్రయోజనత్వము పొందుచున్నప్పుడు) సుదూర దృష్టితోకూడిన సూక్ష్మబుద్ధి లేని జనులచే "ఇవి దైవము యొక్క చేతలే కదా!" అను మాటలచే కల్పించబడినదని చెప్పక తప్పదు. (People who cannot see a little far pacify themselves by attributing the incidents to the unknown 'DAIVAM' ). భ్రాంతిచే త్రాడునందు పామును ఆరోపించునట్లు, వారు 'దైవము' అను కల్పిత వ్యవహారము నందు సుదృఢులై ఉంటున్నారు.

❖

అయితే ప్రాక్తన కర్మలచే జీవుడు సర్వదా ప్రభావితమగుచు అస్వతంత్రుడుగా ఉండవలసినదేనా? లేదు. ఒక దృష్టాంతము విను. ఒకడు కొంత చెడ్డగా కొంత కాలం వ్యవహరించటం జరిగిందనుకో. అప్పుడు ఆతడు ప్రాయశ్చిత్తరూపములైన (అనునయ వాక్యాలు, క్షమించ వేడుకొనుట, అధికమైన

సేవా సహకారములు అందించుట మొదలైన) శుభకర్మలచే తాను బాధించియున్నవారి యొక్క సానుకూల్యము చూరగొనవచ్చును కదా! అశుభత్వం నుంచి తనయొక్క శుభత్వముచే దోషపరిహారం చేయబడుతోంది. అట్లే ప్రాక్తనకర్మలు (past deeds)చే ప్రాప్తించియున్న దుష్ట సంస్కారములను, వాసనలను (లేక దోషబుద్ధిని) ఇప్పటి ప్రయత్నములచే శుభప్రదం తప్పక చేయవచ్చు. వర్తమాన ఆద్యతన సత్కర్మలు ఇతఃపూర్వపు దోషములను ప్రక్షాళనం చేయగలవు. కాబట్టి రామా! నీవు సర్వదా సత్కార్యములు చేయుటకే యత్నించెదవు గాక!

కొందరు మూర్ఖులు ప్రత్యక్షమును ప్రక్కకునెట్టి అనుమానమును మాత్రమే ఆశ్రయిస్తూ "దైవమే అంతటికి కారణం. మాచేత సత్కర్మలు ఎప్పుడు చేయించాలో దైవమునకు తెలుసు. కనుక మేమేం చేయగలం?" అని చెప్పుకొంటూ వర్తమానంలో ఉత్తమ ప్రయత్నశీలురు కాకుండానే రాత్రింబగళ్ళు గడిపివేస్తున్నారు. అట్టి దుర్మతులు, మూఢులు నీకు తారసపడితే "దైవబలంచేత మమ్ము అగ్ని ఏమి చేయలేదు" అని తలచి అగ్నిలోకి దూకమను. ఒళ్ళు కాలకుండా బయట పడగలరేమో చూద్దాం. అందుచేత "నేను తగినంత ప్రయత్నశీలుడను కాలేదు కనుకనే ఉత్తమజ్ఞానం పొందలేకపోయాను" అని మనిషి భావించటం మంచిదికాని, "దైవం మాకు జ్ఞానం ప్రసాదించలేదు" అని సరిపెట్టుకొని కాలయాపన చేయటం ఉచితం మాత్రం కాదు.

సరే, "ఈ ప్రపంచమున దైవమే సర్వము నిర్ణయిస్తుంది. చూడరాని, చెప్పబడ జాలని ఆ దైవమే అన్నిటికి కర్త. ఇక కర్తృత్వమంటూ మరెవ్వరికీ లేదు" – అనే అనుకొందాం. ఇక పురుష ప్రయత్నమెందుకు? ఎవరో ఎక్కడో ఉండి నీ కాళ్ళు కదల్చుచున్నారా? "పురుషప్రయత్నము లేదు. దైవమే ఉన్నాడు" అని అనుకోదలచుకొంటే ఇక మానవునకు, యంత్రచలితమైన ఆటబొమ్మకు తేడా ఏమి ఉంటుంది? దైవమే సర్వము చేస్తున్నప్పుడు ఇక స్నాన, దాన, జప తపాదులు ఎందుకు శాస్త్రములచే చెప్పబడుచున్నాయి? దైవ నిర్ణయమే* అంతా అయినప్పుడు, శాస్త్రోపదేశం మాత్రం దేనికి? మనం ఇప్పుడు ఈ ఆత్మవిచారణ చేస్తే మాత్రం ఏమి ప్రయోజన ముంటుంది? ఈ విచారణ – ఉపదేశాలను మానివేసి, కాళ్ళు–చేతులు గాలికి వదలి కూర్చుంటే సరిపోతుంది కదా! ఆ 'దైవము'నే అన్ని ప్రయత్నములు చేయమని చెప్పి ఇక ఈ జనులను పురుషప్రయత్నం మాని చతికిలపడమందామా? కాబట్టి, దైవమును ప్రతిపాదించి, అప్రయత్నశీలురు కాగోరువారిని మేము లెక్కలోనికి తీసుకోము.

ఈ ప్రపంచంలో ప్రతిఒక్కరు ఏదో ఒక ప్రయత్నం చేస్తూనే ఉన్నారు – ఒక్క శవం తప్ప. యత్నము వల్లనే ఫలితమనేది లభిస్తోంది. "ఈ నా యత్న–ఫలితములు అల్పమైనవా? లేక పరమోత్కృష్టమైనవా?" – అనునది జీవుడు తన బుద్ధితో సరి అయిన నిర్ణయం చేసుకోవాలి. కాని,

* లోకంలో "శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు" అను నానుడి ప్రచారంలో ఉన్నది. అట్లే "నారుద్రో రుద్రమర్చతి" అనునది రుద్రాభిషేకంలోని వాక్యం. (రుద్రుడు కానివాడు రుద్రుని అర్చించలేడు). ఈ రెండిటియొక్క సమన్వయార్థం అతి సూక్ష్మబుద్ధితో గ్రహించాలి.

"యత్నము వలననే ఫలితం" అనునది కర్మల యొక్క సిద్ధాంతము, అప్రతిహతమైన శాసనం అయియున్నది. యత్నములను అనుసరించే జీవునకు త్రికాలములు ప్రాప్తిస్తున్నాయి.

అందుచేత, ఓ రామచంద్రా! "ఏది ఎట్లు అగుచున్నదో అదంతా ప్రయత్నాను సారమే ఉంటోంది" అని గ్రహించబడుగాక! 'దైవము' లేక 'అదృష్టము' అనునవి అర్థరహితమైన పదములేనని మా అభిప్రాయం. ఐనా, నాదొక ప్రశ్న. "ఆకృతిలేని దైవము, ఆకృతి కలిగిన మనుజుడు చేసే ప్రయత్నములు" ఈ రెంటికీ సమన్వయం ఏకత్వం, సమాధానం ఎట్లా కుదురుతాయి. ఆ రెండిటికి సంబంధం ఎట్లా ఉంటుంది? అందుకే ఆ మాట నిష్ప్రయోజనమైనది. మరొక విషయం. కలము – కత్తి – ఈ రెండిటినీ ఒకేసారి ఉపయోగించటం సాధ్యమా? "దైవమే అంతా చేయిస్తాడు. కాని పురుష ప్రయత్నం కూడా ఉండాలి" అని అనటం అట్టిదే అవుతుంది. కాళ్ళు, చేతులు లేనివానిచే దైవము ఏదైనా చేయించగలదా? లేదు కదా! ఈ జగత్తులో ఒక పసిబాలుని దగ్గరనుండి, మహామేధావి వరకు 'దైవము' అనుదానిని తమ మనోబుద్ధులచే ప్రత్యక్షపరచుకొన్న వారెవరైనా ఉన్నారా? ఈ విధంగా 'దైవము' అనునది అసత్తేనని తేలుట లేదా?

❖

'దైవము' అనబడునది వేరుగా ఎక్కడో ఉన్నదనే కొద్దిసేపు అనుకొందాం. అప్పుడు "ఈ బుద్ధి – దైవము – అనునవి రెండూ ఒక్కటేనా? వేరువేరా?" అనే మరొక ప్రశ్న ఉదయిస్తుంది. ఎందుకంటే, అట్టి భావన చేసేది ఈ బుద్ధితోనే కదా! కనుక ఈ ప్రశ్నకు మనకు సమాధానం కావాలి. "నిశ్చయము అనే ధర్మమును నిర్వర్తించే 'బుద్ధి' – 'దైవము' అనుబడునవి ఒక్కటే. దైవము యొక్క ప్రభావము చేతనే, దైవమును అనుసరించే బుద్ధి ప్రవర్తిస్తోంది" అని మనం నిర్ణయిస్తామనుకో, అప్పుడారెండింటికి భేదం లేనట్లే కదా! అనగా బుద్ధియే దైవము కనుక ఇక బుద్ధినే మనం ఆశ్రయిస్తే పోతుంది కదా!* 'దైవము' అనబడే మరొక వస్తువును ఎందుకు ఆశ్రయించాలి? ఎందుకంటావా? 'బుద్ధి' అనునది అందరికి అనుభవభూతమై ఉంటోంది. దైవమా, ఎక్కడున్నదో, ఎట్లు ఉన్నదో తెలియదు.

"దైవము – బుద్ధి వేరువేరు" అని అనుకుంటామనుకో, అప్పుడు, సంబంధంలేని రెండు విషయాలు సంబంధం కలిగి ఎందుకు ప్రవర్తిస్తున్నాయో చెప్పవలసి వస్తుంది. అనిర్వచనీయమగు దైవము ఈ సర్వజీవుల బుద్ధులను ఎందుకు ప్రభావితం చేస్తున్నది? దానికి వచ్చే ప్రయోజనం ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం లభించటం లేదు కనుక, మనం 'దైవము' అనుదానిపై ఆధారపడకపోవటమే మంచిది.

---

* బుద్ధౌశరణమన్విచ్ఛకృపణాఃఫలహేతవః" – శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీత – సాంఖ్య యోగంలో "నాయనలారా! బుద్ధినే శరణు వేడండి. ఫలహేతువు (ఇక్కడ 'దైవము'గా చెప్పబడుతోంది) చాలా అల్పమైన విషయం" అని హెచ్చరిస్తున్నారు. "బుద్ధం శరణం గచ్ఛామి" – బుద్ధభగవానుడు.

అట్లుగాక "సమాన బుద్ధిబలములు కలిగిన ఇద్దరు వ్యక్తులు ఒక ఫలము (లేక ప్రయోజనము) కొరకు ప్రయత్నించినప్పుడు, ఒకడు ఒక రకంగా, మరొకడు మరొక విధంగా ప్రయోజనము పొందుచున్నారు. ఇది దైవముయొక్క పాత్రే కదా!" అని ఎవరైనా అంటారేమో? దీనికి కారణం తెలియని "దైవము" అని ఎందుకు అనటం? వారివారి ప్రయత్నముల తీవ్రతను అనుసరించి అది అట్లున్నదని ఎందుకు అనుకోరాదు?

"మా బుద్ధిలో ఇది ఇట్లు చేయాలనే భావం ప్రతిఫలించింది. ఇది దైవముయొక్క చర్యయే కదా?" అని మరెవరైనా అంటారేమో? ఆయా శారీరక (క్రియలు) – మానసిక (ఆలోచనలు) యత్నములే నిశ్చయమును ప్రభావితం చేస్తున్నాయని ఎందుకు అనుకోరాదు? బుద్ధిచే "ఇది చేయాలి" అనే నిర్ణయం చేయబడుతోంది. అట్లు చేయబడిన యత్నములు మరల బుద్ధిని ప్రభావితం చేస్తున్నాయి.* కనుక 'దైవము' అనుదాని పాత్రను ఆశ్రయించే బదులు మనం పురుషకారమునే ఆశ్రయించవచ్చు కదా!

❖❖❖

# 9. కార్య కుశలత

ఆకాశానికి రూపం లేదు. ఈ శరీరానికో, రూపం ఉన్నది. అందుచేత ఈ శరీరము ఆకాశమును తాకజాలదు. అట్లే రూపములేని దైవముతో రూపముగల మనకు కారణాంతరము (ఏదో కారణము) యొక్క కలయిక అసంభవమైయున్నది. ఆకృతిగల రెండు వస్తువులకు పరస్పర సంయోగం సాధ్యమౌతుంది. అందుచేత "దైవము – అనునది లేదు" – అనియే ఏర్పడుచున్నది. ఈ ప్రపంచమున జరుగు సర్వ వ్యవహారములకు నియామక – నిర్ణయాత్మక కర్త దైవమే అయితే, ఈ ప్రజలందరిని హాయిగా పరుండనిమ్ము. ఇక ఆయా ప్రయత్నములు, కార్యకుశలతలు, జాగ్రత్తలు దేనికి? ఆ దైవమే వచ్చి చేయవలసినది చేస్తాడా?

**దైవేనతు అభియుక్తోఽహం, తత్కరోమీదృశం స్థితమ్**
**సమాశ్వాసన వాగేషా! న దైవం పరమార్థతః ॥** (VIII - 15)

"నేను అదృష్టముచే ప్రేరేపించబడి పనులన్నీ చేస్తున్నాను. అదృష్టబలం చేతనే ఇవన్నీ ఇట్లు సిద్ధిస్తున్నాయి" అని ఎవరైనా అనుకొంటే, మా ఉద్దేశంలో మాత్రం వారు తమను తాము అట్లు ఓదార్చుకోవటం మాత్రమే జరుగుచున్నది. పరమార్థ దృష్టికి 'దైవము' అనునదే లేదు, లభించుటలేదు. మూఢులే 'అదృష్టము (దైవము)' యొక్క కల్పన చేయుచున్నారు. అదృష్టపారాయణులగువారు స్వశక్తిపట్ల, స్వప్రయత్నముల పట్ల విశ్వాసము లేకపోవుటచే, వారు ఎప్పటికైనా చెడిపోవటం తథ్యమని మేము అనుకొంటున్నాం.

---

* "బుద్ధిః కర్మానుసారిణి" – "కర్మలను అనుసరించే బుద్ధి ఉంటోంది" అనునదే లోక ప్రసిద్ధంగాని, "బుద్ధిః దైవానుసారిణి" --- అనునది లోకప్రసిద్ధం కాదు కదా!

ఈ ప్రపంచంలో ఎందులో అయినా ఔన్నత్యం సాధించిన బుద్ధిమంతులను ఎవరినైనా తీసుకో. వారికి ఆ సామర్థ్యమును ప్రసాదించింది ఎవరు? నాయనా! రామా! వారందరు తమ పురుషకారం చేతనే, పురుషప్రయత్నము చేతనే, ఆ ఉన్నతిని సాధించారు. అందుకే, మనం వారి చరిత్రలు వ్రాసుకొని చదువుకొంటున్నాం. ప్రయత్నముల ప్రాముఖ్యతే లేకపోతే మనం మాత్రం వారి గురించి తెలుసుకోవటం దేనికి? "అంతాదైవమే" అని గ్రంథాల నిండా వ్రాస్తే సరిపోతుంది కదా!

**యే శూరా యే చ విక్రాంతా యే ప్రాజ్ఞా యే చ పండితాః**
**తైస్తైః కిమవ లోకేఽస్మిన్ వద! దైవం ప్రతీక్ష్యతే?** (VIII - 17)

ఓ రామచంద్రా! నీవు శూరులైనట్టి పరాక్రమవంతులైనట్టి, బుద్ధిమంతులైనట్టి, పండితులైనట్టి అనేకమంది మహాత్ముల గాథలు విన్నావు కదా! వారు తాము సాధించదలచుకున్నది ఎట్లా సాధించారు? ప్రయత్న బలము చేతనే కదా! వారిలో ఎవరు దైవము కొరకు వేచియున్నారు చెప్పు?

దైవమును ప్రతిపాదించువారు, "ఇతడు చిరంజీవి, బహుకాలం జీవిస్తాడు" – అని 'దైవ నిర్ణయం'గా ఒకని గురించి చెప్పారనుకో, అట్టి వానియొక్క తలను తీసినప్పుడు కూడా అతడు బ్రతికితే, అప్పుడే దైవమే గొప్పదని నేను ఒప్పుకొంటాను. అట్లుండుట లేదే? భవిష్యత్తు గురించి (జాతకం చెప్పేవారు), "ఇతడు పండితుడు అవుతాడు" అని చెప్పినప్పుడు, అట్టివాడు చదవకుండానే పండితుడు అవుతున్నాడా? అట్లా జరిగితే, దైవమే లోకంలో అదృష్టమై సర్వము నిర్వర్తిస్తోందని మనం కూడా ఒప్పుకుందాం.

**విశ్వామిత్రేణ మునినా దైవముత్సృజ్య దూరతః**
**పౌరుషేణైవ సంప్రాప్తం బ్రహ్మణ్యం! రామ! నాఽన్యథా ॥** (VIII - 20)

ఓ రామచంద్రా! ఈ సభకు దేవేంద్రునివలె వేంచేసియున్న బ్రహ్మర్షియగు ఈ విశ్వామిత్ర భగవానుని చూడు! ఇతడు జన్మతః ఒక సామాన్యమైన రాజు. ఈ రోజో, ఒక బ్రహ్మర్షిగా, లోకకళ్యాణ కారకుడుగా ముల్లోకములచే ఎట్లు ప్రశంసలు అందుకుంటున్నారో చూచావు కదా! ఇది ఈయనకు ఎట్లా సాధ్యపడింది? 'దైవము' అనబడుదాని కృపచేతనా? కానేకాదు. ఇతడు అదృష్టమును ప్రక్కకునెట్టి పురుష ప్రయత్నమును దృఢంగా ఆశ్రయించాడు. అందుచేతనే బ్రహ్మర్షిత్వము సంపాదించాడు. అంతే కాని అదృష్టము కొరకు వేచియుండి కాదు సుమా! నేను కూడా పురుషకారమును ఆశ్రయించే ఆకాశగమన శక్తి, సప్తర్షిమండలములో నివాసము సంపాదించాను. నన్ను 'మహర్షి' అని అందరు అంటున్నది నాయొక్క అదృష్టం చేతనా? కాదు. నా స్వప్రయత్నము యొక్క దృఢత్వం చేతనే ఈ రోజు అట్లు గుర్తింపబడుచున్నాను. రాక్షసరాజులు పౌరుషమును ఆశ్రయించే, అమరావతి నుండి దేవతలను పారద్రోలి ముల్లోకములలో తమ ఏలుబడి సాగించారు. దేవతలు కూడా పురుషకారము చేతనే శత్రువులను ఛిన్నాభిన్నంచేసి మరల ఈ జగత్తులను పాలిస్తున్నారు. అంతదాకా దేనికి? వెదురుతో అల్లిన బుట్టలో నీరు ఎలా నిలుస్తోంది? అదృష్టంవల్లనా? కాదు. దాని వెనుక పురుషప్రయత్నమే దాగి ఉన్నది.

ఈ లౌకిక కార్యములనే చూడు. కుటుంబ పోషణం, శత్రు రాజ్యాపహరణం, భోగవిలాసం, కోపం, నిగ్రహం, ఇతరులను అరికట్టటం, ఆకట్టుకోవటం - ఇత్యాది అనేక క్లిష్టమైన పనులన్నీ పురుషప్రయత్నబలము చేతనే ఒనగూడుచున్నాయి కదా! 'అదృష్టం' అనునది ఏదో తెలియని రూపంలో వచ్చి ఇవన్నీ చేయటంలేదే! ఆ దైవము అనుదాని క్రియాశక్తి ఎక్కడా కనబడకయే ఉన్నది.

ఓ శుభాశయా! రాఘవా! ఈ 'దైవము' అనబడే పదార్థం కార్య-కారణ విమర్శలకు లభించకయే ఉన్నది. అందుచేత, అది వికల్పవశంచేతనే కల్పించబడినట్లు, సుస్పష్ట మౌతోంది. కనుక అవశ్యమై, ఎదురుగా నిలిచియున్నట్టి పురుషకారమును ముందుగా ఆశ్రయించి ఉండు. మనకు ఎదురుగా లభించనట్టి ఈ దైవవ్యవహారమును కొంతసేపు ప్రక్కకుపెట్టు. దాని విషయమై ముందుముందు మన ఈ విచారణలో అనేక విషయములు నీవే గ్రహిస్తావు. ఈ 'దైవము' అనుదానిని అపేక్షించక, ఉత్తమమగు పురుషకారమునే ఆశ్రయించి, సమున్నతుడవుకమ్ము.

❖❖❖

# 10. కర్మవిచారము

**శ్రీరాముడు :** ఓ సర్వధర్మజ్ఞా! వసిష్ఠమహర్షీ! పురుషప్రయత్నం విషయంలో మీరు చెప్పినట్టి సోదాహరణ పూర్వకమైన విషయాలన్నీ నేను అంగీకరిస్తున్నాను. అయితే, మీరు "దైవము" అనబడునది ఏదీ లేదని కొన్నిచోట్ల అన్నారు. మరికొన్నిచోట్ల, "పూర్వ జన్మలందలి లేక ఇతః పూర్వపు కర్మ పరంపరల (లేక ప్రయత్నముల) సమ్మేళనమే దైవము" అని అంటున్నట్లు నాకు అర్థమగుచున్నది. "ప్రయత్నము ముందు - దైవము సంగతి తరువాత" .... అని సూచనగా కూడా అంటున్నారు.

ఈ ప్రపంచంలో అత్యంత ప్రసిద్ధిగాంచియున్న ఈ "దైవము" అనే పదార్థం అసలు ఉన్నదా? లేదా? అనేకులు అట్టిది కలదని నమ్ముచున్నారు కదా! అందుచేత దైవము-అనునది మీచే ఎట్లు గాంచబడుచున్నదో మరికొంత సుస్పష్టంగా తెలుసుకోవాలనుకొంటున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! రామచంద్రా! పురుషకారమే సర్వ కార్యక్రమములను ఒనర్చుచున్నది. వాటి ఫలితములను కూడా అదే అనుభవిస్తోంది. ఇక 'దైవము' అనబడు మరొక వస్తువు ఏదీ దేనికీ కర్తగాని, భోక్తగాని కాదు. దైవము స్వయముగా ఒనర్చునదంటూ ఏదీ లేదు. అది భోగించునదీ లేదు. అది ఇతరులను ఆదరించునది కూడా లేదు. దానిని ఎవరూ చూచుచున్నది లేదు. అది కేవలం కల్పనామాత్రమే. పౌరుషమే ఫలప్రదమగుచున్నది. అట్టి పురుషకారము (తనకు తానుగా నిర్వర్తించి యున్న ప్రయత్న పరంపరలు) వలన లభించుచున్న శుభాశుభములనే జనులు 'దైవము' అనే పేరుతో పిలుస్తున్నారు.

తమ పురుషప్రయత్నములచే తాము పొందుచున్నట్టి స్వల్ప - దీర్ఘములైన ఇష్ట - అయిష్టములను అల్పజ్ఞులగువారు 'దైవము' అనబడుదానికి ఆపాదించుచున్నారు.

ఈ లోకంలో ఎవరికైనా సరే, ఒక్క పురుషార్థము చేత మాత్రమే ఫలములు (Results) అవశ్యం లభిస్తున్నాయి. అయితే ఒక వ్యవహారము యొక్క ఆది-అంతములు, వేరైన దేశ-కాలములందు ప్రాప్తిస్తున్న ప్రభావములు [The effects (or) results that materialise at a different time and place] గ్రహించలేనట్టి (దూరదృష్టి లేనట్టి) జనులు ఆయా ఫలితములను "ఇవి దైవము ప్రసాదిస్తున్నాడు. లేక దైవమే ఇట్లు శిక్షిస్తున్నాడు" - అని భావన చేయుచున్నారు.

ఓ రాఘవా! రూపమేలేనట్టి 'దైవము' కారణంగా ఎవరికైనా, ఏదైనా చేకూరినదనుకొంటే, అది మా ఉద్దేశంలో భ్రమయే. "దైవమును ప్రార్థించటం", "అభీష్టములు పొందటం" అనే విషయానికివస్తే, ఆ కొంత కాలం అద్దాని కొరకు తీవ్రేచ్ఛచే వారు చేయునది అభ్యర్థనపూర్వకమగు పురుషప్రయత్నమే కదా! ఆ అభ్యర్థనచే లక్ష్యశుద్ధి ఏర్పడి, సాధించదలచినదానికి (లేక పొందదలచినదానికి) సానుకూలంగా ఆలోచన-క్రియాదులు ఒనగూడుతున్నాయి. అప్పుడు ప్రాప్తించినదానికి "ఇది దైవమే ఇచ్చినాడు" అని అనుకొనుట జరుగుతోంది. కనుక, ఇక్కడకూడా, పురుష ప్రయత్నమును అనుసరించే ఆయా శుభాశుభ ఫలములు లభిస్తున్నాయి.

జనులు కొందరు "వీడి అదృష్టము ఇట్లా ఉన్నది" అని అంటున్నప్పుడు, ఆ మాటయే 'దైవము'గా లోకంలో ప్రసిద్ధికెక్కింది.

ఇక కర్మల ప్రసంగం వచ్చినప్పుడు, "ఇతడు ఇట్లు పలికినాడు. అది విన్న నాకు ఈ బుద్ధి పుట్టింది. అప్పుడు ఈ విధంగా దృఢంగా నిశ్చయించుకొన్నాను. ఇట్లు ప్రయత్నించినాను. ఈవిధమైన ఉత్తమఫలితం పొందాను. కనుక, ఈ ఉత్తమ ఫలితం దైవవశాత్తు లభించింది" - అనునది కొందరికి అనుభవమౌతూ ఉంటుంది. ఇట్టి దృష్టాంతమే లేక సంఘటనయే 'దైవము' అనబడు కల్పనకు కారణమగుచున్నది. అయితే ఇందులో, "ఇతఃపూర్వపు ప్రయత్నములచే ఏర్పడిన బుద్ధే అందుకు సిద్ధమై ఆ ఆలోచనను స్వీకరించింది. మరల ప్రయత్నముచేతనే ఫలితం ప్రాప్తించింది" - అనునదే మనకు సూక్ష్మదృష్టితో చూచినప్పుడు లభిస్తోంది. ఎందుకంటావా? ఒక పదిమంది ఒకే విధంగా బోధింపబడినా, అందరూ ఒకే విధంగా స్పందించుట లేదు కదా! ఎవరైతే ఇతః పూర్వపు - వర్తమానపు ప్రయత్నములచే ఆ విషయమును స్వీకరించారో, వారు మాత్రమే ఆ ఫలితమును పొందుచున్నారని గ్రహించు.

ఒకనికి ఇష్టమైన, లేక అయిష్టమైన ఫలములు లభించుచున్నాయనుకో, దైవమే అది ప్రాప్తింపచేస్తున్నట్లు అల్పదృష్టి కలవారు భావిస్తున్నారు. సూక్ష్మదృష్టి కలవారో - "నా ఇష్ట - అయిష్టముల రూపమున ఏర్పడియున్న సంస్కారములే (లేక వాసనలే) నాకు 'ఇది సుఖము - ఇది కష్టము' అను భావనలు కలిగిస్తున్నాయి" - అని గ్రహిస్తున్నారు. ఇంతకుమించి 'దైవము' అనునది లేదు. కనుక, ఈ విషయమై నీవు నిశ్చింతుడవగుము. వర్తమానమునందు ఉత్తమ కర్మలను ఆశ్రయిస్తూ ఆత్మయొక్క తత్త్వమేమిటో వివేక దృష్టితో గ్రహించియుండుము.

❖

**శ్రీరాముడు :** హే మహర్షీ! "మీరు" "పూర్వజన్మల సంచితమే దైవము" అని మరల మరలా అంటున్నారు. ఇంతలోనే "దైవము లేదు" అని నిర్ణయం ప్రకటిస్తున్నారు. ఎందుచేత?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నేను నీకు ఏదైనా చెప్పినప్పుడు, నీవు అత్యంత సూక్ష్మదృష్టితో ఆ విషయం గ్రహించగలవు. నీ గురువుగా, నీపై నాకు ఉన్నట్టి అభిప్రాయం అది. అందుచేత, నేను చెప్పబోవునది సూక్ష్మదృష్టితో, నిర్మలహృదయుడవై, ఉద్వేగాదులు లేనివాడవై విను. నీ బుద్ధి చంచలత్వమును త్యజించి, స్థిరత్వము పొందగలదు. అప్పుడు 'ఉత్తమ సత్యము' విషయమై చెప్పినది, చెప్పబోవునది గ్రహించగలవు.

ఒకానొకడు తన 'మనస్సుచే, వాక్కుచే, కాయముచే" ఒకానొక విధంగా కర్మలు నిర్వర్తిస్తున్నాడు. అతడు అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? అలా ఎందుకు ఆలోచిస్తున్నాడు? అలా ఎందుకు మాట్లాడుచున్నాడు? (Why he is behaving the way he behaves?) దీనికి సమాధానం విను. ఇతః పూర్వపు (మరియు క్రితం జన్మల) స్వకీయ ప్రయత్నముల సారమై ఉన్నట్టి వాసనలను అనుసరించే, వాటిచే ప్రబోధితుడై ఈ వర్తమానమునందు ఆయా విధములుగా భావించుట, మాట్లాడుట ప్రవర్తించుట చేస్తున్నాడు. అనగా, వాసనలే కర్మలుగా పరిణమిస్తున్నాయి. వాసనలను అనుసరించే నేను, నీవు, అట్లే ప్రతి ఒక్కరు ఆయా విధములైన 'మనోవాక్కాయ' కర్మలను ప్రదర్శించుచున్నాము. అభిప్రాయములు, భావనలు కూడా వాసనలను అనుసరించే ఉంటున్నాయి. కర్మలు ఒక రకంగా, మనోభావాలు మరొక రకంగా ఉంటాయా? ఉండవు. పల్లెకు పోగోరువాడు పల్లెకే చేరుతాడుగాని, పట్టణం ఎలా చేరుతాడు?

ఎవనికి ఏ వాసనలుంటే, వాడు వాటి నిమిత్తమే ఎల్లప్పుడు ప్రయత్నిస్తూ ఉంటాడు. "ఎట్లాగైనా సరే, ఈ ఫలమును నేను పొందెదనుగాక" అనునట్టి బలమైన కోర్కెతో తీవ్రముగా నిర్వర్తించబడిన కర్మయే దైవమై పరిణమిస్తోంది. అంటే ఏమిటి? "కర్మల బలమే (ప్రయత్నముల ప్రయోజనమే) దైవబలంగా పరిణమిస్తోంది" అనునదే ఇక్కడ మనకు సిద్ధిస్తోంది. కర్మలకు (లేక ప్రయత్నములకు) వేరుగా 'దైవము' అనునది ఎవరికీ, ఏదీ ఇచ్చుట లేదు. ప్రతికర్త తన కర్మలను ఈ విధంగానే నిర్వర్తించటం, తత్ఫలితములను పొందటం జరుగుతోంది. ఇక ఇందులో స్వకీయమైన నిర్ణయంగల దైవము అనుదానికి పాత్ర ఎక్కడున్నది?

ఒకనిలో ఏ వాసనలైతే బలమును చేకూర్చుకొని ఉంటాయో – అవే అతని కర్మలు (Deeds)గా పరిణమిస్తున్నాయి.* అయితే తనయొక్క ఇతఃపూర్వపు ప్రయత్నముల వ్యవహారమంతా సమగ్రముగా పరిశీలించక పోవుటచే, (లేదా) అతనికి ఎదురుగా కనబడకపోవుటచే అతడు, "నన్ను ఎవరో ఈ కర్మ నిర్వర్తించవలసినదిగా ప్రేరేపిస్తున్నారు" అని తనకు తాను సమాధానం చెప్పుకొంటున్నాడు. కనుక, 'కర్మ' అనునది వాసనలకంటే భిన్నము కాదు – అని తేలుతోంది కదా! అయితే ఆ వాసనలు, మననమే ధర్మముగాగల మనస్సుకంటే వేరు కాదు. ఇక ఈ మనస్సు మననము అనే 'కర్మ'కు కర్త అయినట్టి 'ఆత్మ' కంటే వేరు కాదు.

కనుక హే సాధూ! 'దైవము' అని చెప్పబడుచున్నదే "ప్రయత్నము రూపముగాగల 'కర్మ' " అయివున్నది. అట్టి కర్మయే 'మనస్సు'. అట్టి మనస్సే 'పురుషుడు' అనబడు ఈ జీవుని స్వరూపము. కనుక ఈ జీవుని స్వరూపము పురుషకారమే కదా! అందుచేత పురుషకారము కంటే వేరొకటి ఎక్కడా ఏదీ లేదని తేలుచున్నది. పురుషకారముకంటే వేరైనదిగా 'దైవము' అనుదానిని గాంచదలచుకొంటే, "అట్టి దైవము లేదు" అని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను. అట్టి దైవము 'మిథ్య' మాత్రమే. ఇందులో ఏమాత్రం సందేహం లేదు.

ఇక 'ఆత్మ' అంటే ఏమిటి? అది ఎక్కడున్నది? అది జీవుని స్వస్వరూపముకంటె వేరైనది కాదు. అట్టి ఆత్మయే వాస్తవ స్వరూపముగా కలిగియున్నట్టి ఈ జీవుడు తన మనోరూపమున చేయు కార్యముల ఫలములను స్వస్వరూపమగు ఆత్మనుండే పొందుచున్నాడు. అదే 'దైవము'గా కూడా ప్రసిద్ధికెక్కింది. స్వస్వరూపముకంటే దైవము వేరుగా లేకపోవుటయే మనకు ఇక్కడ సిద్ధిస్తోంది. 'మనస్సు', 'చిత్తము', 'వాసన', 'కర్మ', 'దైవము' – వాస్తవానికి ఇవన్నీ పర్యాయపదములే. ఈ పర్యాయ పదములన్నీ సత్యమును ధరించినట్టి ద్రష్టలగు సాధువులచే, అజ్ఞానులకు బోధించుట కొరకు, కల్పించబడ్డాయి. "ఇది చిత్. ఇది జడము. ఇది దేహము. ఇది దేహి" – అను నిశ్చయము లేనట్టి అజ్ఞాన జనులు విషయమును గ్రహించటానికి వీలుగా ఇవన్నీ కల్పించబడి, విస్తారంగా చర్చించబడ్డాయి. ఇవి విచారించబడి, గ్రహించబడగా, 'బోధ' సుస్థిరమైతే, ఇకప్పుడు సర్వము ఎరుగబడుతుంది. అఖండము, జ్ఞానయుతము అయినట్టి స్వస్వరూప శుద్ధ చైతన్యమే శేషిస్తుంది.* అట్లు శేషించు శుద్ధ సత్యమే ఈ జీవుడు. అట్టి 'దేహి'కి సంబంధించిన ఉత్తమజ్ఞానం పరిఢవిల్లే వరకు ఈ శబ్దజాలం యొక్క అవసరం ఉంటోంది.

పురుషుడే అన్నిటికి మూలం. అతడు దృఢమగు భావనాబలంచేత ఎట్లు ప్రయత్నిస్తాడో, ఫలములను కూడా అట్లే పొందుచున్నాడు. కనుక ఓ రఘుపుంగవా! ఒక్క పురుషకారము వల్లనే అభీష్టములన్నీ సిద్ధిస్తున్నాయని గ్రహించు. అంతేకాని అదృష్టం చేత కాదు. "అదృష్టము చేతనే" అని అనుకొంటే ఇక శాస్త్రాలు ఎందుకు? నేను నీకు బోధించటం దేనికి? నీకైనా, నాకైనా, మరెవ్వరికైనా పురుషకారమే శ్రేయోదాయక మగుచున్నది.

❖

---

* **సంచితము :** ఇతఃపూర్వపు కూడబెట్టబడిన కర్మలన్నిటియొక్క సమన్వయ సంస్కార స్థితి.

**ప్రారబ్ధము :** వర్తమానపు పరిస్థితులకు అనుకూలముగా బహిర్గతమగు (సంచితము మనకు సంబంధించిన) సంస్కారము.

**ఆగామి :** ప్రాక్తన + ఆద్యతన యొక్క సంస్కారసారము, ముందు ముందు ఆగామి అయి (Accompany) జీవుని ప్రభావితం చేస్తోంది.

** "సర్వం ఖల్విదం బ్రహ్మ", "జీవో బ్రహ్మైతినాపరః", "అహం బ్రహ్మాస్మి" "త్వమేవాహం", "తత్త్వమసి", "తత్త్వమ్" – ఇత్యాది శ్రుతి వాక్యాలన్నీ ఈ సత్యమునే ప్రతిపాదిస్తున్నాయి.

**శ్రీరాముదు :**

**ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా,**
**మునే! తథైవ తిష్ఠామి! కృపణః, కిం కరోమి అహమ్?** (IX - 23)

మునీంద్రా! నాదొక ముఖ్యమైన సందేహం. ఇతఃపూర్వం లేక క్రితం జన్మలందు నిర్వర్తించబడిన 'ప్రాక్తనకర్మలు' ఉండనే ఉన్నాయి. అవి వర్తమానంలో మమ్ములను ప్రభావితం చేస్తున్నాయని మీరు కూడా ఒప్పుకుంటున్నారు కదా! ఆ ప్రాక్తనకర్మలు మమ్ములను ఎట్లా నియమిస్తే మేము అట్లా ప్రవర్తించవలసినదే కదా! ప్రాక్తనకర్మలు మమ్ములను నడిపిస్తుంటే, దీనులమైన మేము ఇప్పుడు చేయగలిగే దేమున్నది? ఆ కర్మలు ఒక విధంగా, మా ప్రవర్తన మరొక విధంగా ఉండే అవకాశం ఎక్కడున్నది చెప్పండి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నీ ప్రశ్న సుందరంగా ఉన్నది. కాని, నీవు మరల జడత్వమగు ప్రయత్నరాహిత్యమునే ప్రతిపాదిస్తున్నావు. ఈ సంభాషణ యొక్క లక్ష్యము, శ్రోతని ప్రయత్నశీలుని చెయ్యటం. ఎందుకంటే ప్రయత్నరహితుడు ఏమీ చేయలేడు, గ్రహించలేడు. ప్రయత్నపరుడు పొందవలసినది తప్పక పొందుతాడు. సరే, నీ ప్రశ్నకు సమాధానం విను.

'ప్రాక్తనకర్మలు' అంటే ఏమిటి? ఒకప్పుడు నీచేత నిర్వర్తించబడిన కర్మలే కదా! అప్పటి పురుషకారము నిన్నిట్లా ప్రవర్తింపచేస్తుంటే, అందుకు ఇచ్చగించని నీవు ఇక చూస్తూ ఊరుకొంటావా? ఓ రామచంద్రా! నీవు చైతన్యమూర్తివే కాని, ఒకానొక జడపదార్థం కావుకదా! మరి నీవు ఆ ప్రాక్తనకర్మల చేతిలో కీలుబొమ్మ అవటమేమిటి? ఇప్పటి పురుషకారము మాట ఏమిటి? ఇదీ నా ప్రశ్న. ఇప్పుడు అనుసరించబోవు పురుషకారము చేతనే నీకు శాశ్వతమైన శ్రేయస్సు లభిస్తుంది. అంతేకాని, "ఇది నాకర్మ. నేను ఇట్లు చేయకతప్పదు. ఏదో దైవము నాచేత ఇట్లు చేయిస్తోంది", అని తలచి నీవు సరయిన మార్గంలో ప్రయత్నమునకు అభిముఖం కాకపోతే, ఇక నిన్ను కాపాడగలిగేవాడెవడు? దైవం వచ్చి కాపాడతాడా?

❖

ప్రతి జీవునియందు శుభ-అశుభములైన ప్రాక్తనకర్మలు (The essence of past deeds) ఉన్నాయి. అందులో శుభ వాసనలు శుభకర్మలవైపు, అశుభవాసనలు అశుభకర్మలవైపు ఈ జీవుని ప్రేరేపిస్తున్నాయి. ఆ రెండింటిలో ఏది బలవత్తరమైతే, అది రెండవదానిని శీఘ్రంగా జయించి జీవుడిని అట్టి ఆచరణములో నియమిస్తోంది. సరే. ఇంతవరకు బాగానే ఉన్నది. కాని, "ఈ వర్తమానంలో ఏది చెయ్యాలి? ఏది చెయ్యకూడదు? దేనిని ఆశ్రయించాలి? దేనిని ఆశ్రయించకూడదు? దేనిని ఎట్లు గ్రహించాలి? దేనిని ఎట్లు గ్రహించకూడదు? (What should not be interpreted in what way)" ... ఇవి చైతన్య స్వరూపుడవగు జీవుని చేతిలోనే ఉన్నాయి. అందుకు సన్మార్గం చూపించగల గురువులు, పెద్దలచే చెప్పబడిన విధి-విధానములు మనకు ఇక్కడ వర్తమానంలో లభిస్తున్నాయి. అవన్నీ ఆశ్రయించటం వదలి, "నేను నిస్సహాయుణ్ణి" అని

వగర్చటం ఎంతవరకు ఉచితం? వాటి నన్నిటినీ వివేక బుద్ధితో గ్రహించి, చక్కగా ఉపయోగించుకొంటూ ఎందుకు ఆత్మజ్ఞానము కొరకై ప్రయత్నించరాదు? అల్పములు, దోషభూయిష్ఠములు అయినట్టి దృశ్య పదార్థముల వెంటబడి ఎందుకు దుఃఖకరమగు పరిణామములు తెచ్చిపెట్టుకోవాలి?

అందుచేత, నీవు శుభకర్మలనే ఆశ్రయించెదవు గాక! శుభమగు వాసనలచే ప్రేరేపితులైతే, ఈ జీవులు శుభపురుషకారబలం చేత క్రమంగా శాశ్వతమగు ముక్తిని పొందగలరు. ఒకవేళ, అశుభవాసనలు ప్రబలమై, అశుభ కర్మలందు ప్రవేశింప చేస్తున్నాయా? అయితే, వర్తమానంలో ఉత్తమ ప్రయత్నము అత్యంత ఆవశ్యకమై ఉన్నది. వర్తమాన పురుషకారయత్నం చేత క్రమంగా అశుభవాసనలను బలహీనం చెయ్యాలి. అట్లు ప్రయత్నిస్తూ, ఒక శుభతరుణంలో ఆ అశుభ సంస్కారములను మొదలంట పెకల్చివేయాలి.

ఓ రామచంద్రా! ఈ జడమగు దేహమే 'నీవు' అని అనుకొంటున్నావా? కానే కాదు. నీవు చిన్మాత్ర స్వరూపుడవు. ప్రజ్ఞాతత్త్వ స్వరూపుడవు. అట్టి నీవు పూర్వ సంస్కారములకు లొంగి ఉండవలసిన అవసరమేమున్నది? నీకే కాదు. నేనీ వాక్యములు సర్వజనులకు చెప్పుచున్నాను. నాయనలారా! మీరంతా, 'చిత్' నందు ఉదితమైన చైతన్యమే స్వరూపముగా కలవారు. అంతేకాని, బైట ఎక్కడినుండో ఎవరిచేతనో కదల్చబడుచున్న జడపదార్థమాత్రులు (Some matter that moves by Remote Control) కారని మరల మరల గుర్తు చేస్తున్నాను. మరి, "ఆఁ! మాదేమున్నది? అంతా దైవలిఖితం. ఇది ఇంతే. ఇది మా కర్మ. ఇక చేసేదేమీ లేదు" – అను రూపముగల దౌర్భాగ్యమంతా ఎక్కడి నుండి వచ్చిపడుతోంది? కొంచెం యోచించండి. మీ అంతట మీరే నిష్కారణంగా, అసంగతమైన నిష్క్రియత్వానికి పాలుపడి, ఆ దోషమును 'దైవము' అనబడుదానికి అంటగట్టి సంతృప్తి చెందుచున్నారా? అది సరికాదు.

ఓ రామా! ఎవ్వరో బాహ్యము నుండి నిన్ను చేతితం చేస్తున్నారంటావా? అయితే నాకీవిషయం చెప్పు. అట్లు ఏదైతే నిన్ను చేతితమొనర్చుచున్నదో, అద్దానిని నియమించి చేతితం (operative) చేసేదెవరు? ... కాబట్టి అట్టి అభిప్రాయానికి అనవస్థా దోషం (A doubtful state - whether it exists or not) సంభవిస్తుంది. ఇట్టి సరళి "వస్తు సిద్ధి ప్రతిబంధకము" (Hurdle to achieve the Truth) అని మా అభిప్రాయం.

నీవు స్వయంగా చేతన స్వరూపుడవు. కనుక, నీ ఈ వర్తమానమునకు నీవే కారకుడవు. నీ ఉత్తమ – అధమ ప్రయత్నములే నిన్ను ఒకానొక స్థితికి తెస్తున్నాయి. అట్లే ప్రతిజీవుని విషయం కూడా. అందుచేత ఈ దోషమును మూగవస్తువు అయిన దైవమునకు ఆపాదించకుండెదవు గాక! అట్టి ఆలోచనయే మిథ్య.

జీవునియొక్క ఇతఃపూర్వపు ఇంద్రియ–మనో సంబంధమైన కర్మలే "వాసనలు (tendencies)"గా పరిణమిస్తున్నాయి. అందుచేతనే, ఈ ఇంద్రియ – మనస్సులు తమయందు కలిగియున్న వాసనలను అనుసరించి శుభ–అశుభ మార్గముల రెండిటి వైపు ప్రసరించ యత్నిస్తున్నాయి. ఇప్పటి పురుష

ప్రయత్నం చేత ఇంద్రియ మనస్సులను, ఎట్లాగైనా సరే, శుభమార్గంలో నియోగించాలి. పురుషప్రయత్నమే అందుకు నీకు ఉపయుక్తమైన పరికరం. ఓ మహాపరాక్రమవంతుడా! రామచంద్రా! నీ మనస్సు చెడు త్రోవలలో ప్రవేశిస్తున్నప్పుడు, దానిని మంచిమార్గంలో నియమించటానికి చేసే ప్రయత్నమునే మనం ఇక్కడ "పురుషకారం" అని పిలుస్తున్నాం.

ఈ జీవునియొక్క చిత్తము అల్లరి చేసే పిల్లవానివలె అతిచంచలమైనది. అయితే, ఈ చిత్తమునకు ఒకానొక ప్రత్యేకత ఉన్నది. అద్దానిని మనం ఏ 'దిశ' (direction) కు నియమిస్తామో ఆ దిశకు ఉరకలు వేస్తూ పరుగులుతీస్తుంది. దానిని మనం అశుభము నుండి శుభము వైపు త్రిప్పితే క్రమంగా శుభకర్మలనే ఆప్యాయతతో ఆశ్రయిస్తుంది. అట్లా కాకుండా, మంచి నుండి చెడువైపుకు వెళ్లనిచ్చామా, అదేవేగంతో దుష్ట కర్మలను ప్రీతిగా ఆశ్రయిస్తుంది. అందుచేత, ఈ చిత్తమును కొంత పట్టుదలతో బలవంతంగా శుభప్రయత్నముల వైపుకే (శుభప్రదములైన ధ్యాన, సత్ప్రవర్తన, దాన, దయ, దాక్షిణ్యాదులతో కూడిన కర్మల వైపుకే) మరల్చాలి. అంతేకాని, "అట్లే" మాత్రం వదలి వేయరాదు. అశుభకర్మలను (ఇతరులను బాధించుట, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు చోటిచ్చుట – మొదలైనవి) క్రమంగా క్షీణింపచేస్తూ, త్యజిస్తూ, కరుణ సమదర్శనము మొదలైన ఉత్తమమార్గములను మనుజుడు ప్రయత్నపూర్వకంగా ఆశ్రయించాలి.

**సమతా సాంత్వనేనాశు నద్రాగితి శనైః శనైః**
**పౌరుషేణైవయత్నేన పాలయేచ్చిత్త బాలకమ్ ॥** (IX - 33)

'చిత్తము' అనే బాలుడు అనేక రాగద్వేషములను స్వీకరించి తన ఇచ్ఛ వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు. "త్యాగము" అనే కండబలంతో ఈ చిత్తబాలకుణ్ణి ఆ రాగ – ద్వేష – వైషమ్యాది లంపటం (బురద) నుండి బయటకు లాగాలి. స్వాభావికమైనట్టి సమత్వము, సాంత్వములలో నియోగించాలి. పురుషప్రయత్నములచే మెల్లమెల్లగా వానిని ఓదార్చుచు, క్రమంగా అఖండమగు స్వస్వరూపానుభవము నందు లగ్నం చేయాలి.

పసిపిల్లవాడు అల్లరి చేస్తున్నాడని చితకబాదుతామా? అతడు సరికాకపోగా, ఇంకా మొరాయిస్తాడు కదా! అప్పుడు అసలే మాట వినడు. చిత్తమును కూడా బాలునివలె లాలిస్తూ ఆత్మజ్ఞానము వైపు, ఆత్మానుభవం వైపు మరల్చాలి. అంతేగాని, హఠం మొదలై బలప్రయోగాలతో నిరోధించటం ఉపాయం కాదు.

ఓ రామా! ఇతఃపూర్వం నీవు శుభాశుభములైన రెండు వాసనలందు ప్రవర్తించి ఉండవచ్చు. అయినదేమో అయినది. ఇక మాత్రం శుభవాసనలను మాత్రమే రూఢి చేసుకొనెదవుగాక! ఓ శత్రుమర్దనా! "ఈ వాసనలు అభ్యాసవశం చేతనే దట్టమగు చున్నాయి" అనునది ఎవరూ కాదనటానికి వీలులేనట్టి సత్యం. అందుచేత, శుభ వాసనలనే అలవరచుకొనెదవుగాక. ఇంతకు ముందు నీవు అశుభవాసనలు అభ్యసించి ఉండకపోతే మంచిదే. అప్పుడు అశుభకర్మలు నీ మనోగమనమును అంతగా ఆకర్షించలేవు.

'వాసనలు' అనునవి అభ్యాసవశంచేత కానీ, లేక అజ్ఞానవశంచేత కానీ, లేదా మరింకే కారణంచేతనైనా వృద్ధిచెందనీ. అందుకు చికిత్సమాత్రం శుభకర్మలే సుమా! శుభాచరణం సర్వదా మంచిదే*. వాటి వలన కీడు ఉండదు. అవి భవిష్యత్తులో – దుర్వాసనలు ఏర్పడే అవకాశమును బలహీనపరచగలవు.

ఈ జగత్తులో ఏది ఎట్లా అభ్యసిస్తే, అది అట్లాగే పరిణమిస్తుంది. ఏ భావనతో, ఉద్దేశంతో ఒక కర్మ నిర్వర్తిస్తామో దాని పరిణామం ఆ భావన – ఉద్దేశములను అనుసరించే ఉంటుంది. ఈ విషయం అందరికీ నిత్యానుభవమే. ఇందులో సందేహం అనవసరం. అందుచేత నీవు శుభప్రదములైన ఆశయములు కలవాడవై పౌరుషమును (లేక పురుషకారమును) అవలంబించు. క్రమంగా ఈ పంచేంద్రియములను జయించివేయి. ఉత్తమ పురుషుడవు కమ్ము. ఉత్తమ పురుషకారము ఆశ్రయించినవాడు మాత్రమే 'పురుషుడు' అని అనిపించుకొంటాడు. ఈ మనస్సు యొక్క స్థితి గ్రహించ బడనంత కాలం, జ్ఞానం ప్రాప్తించనంత కాలం శుభ కర్మలను ఆశ్రయించవలసిందే. అందుకుగాను 'శుభకర్మలు' అంటే ఏమిటో ముందుగా గ్రహించాలి.

1. గురువు 2. శాస్త్రము 3. యుక్తి లేక ఉపాయం 4. అనుభవం.

ఈ నాలుగిటి సహాయంతో ఉత్తమ ప్రయత్నములను నిర్ణయం చేసుకోవాలి.

ఓ రాఘవా! ఈ జీవుని మనస్సులో జన్మజన్మలుగా అనేక రాగాది దుర్వాసనలు పేరుకొని ఉన్నాయి. వాటిని క్రమంగా శుభకర్మల ప్రభావం చేత 'రహితం' చెయ్యాలి. అప్పుడు ఆత్మవస్తువు తనంతట తానే స్వయంగా ద్యోతకమౌతుంది. సర్వ మనోవ్యాధులు నామరూపాలు లేకుండా నశిస్తాయి. మనస్సు పరిశుద్ధమైన తరువాత, ఇక శుభవాసనలతో కూడా పని ఉండదు. సర్వే సర్వత్రా ఆత్మనే దర్శిస్తావు. వాసనారహితుడవై, వృత్తిజాడ్యములు లేనివాడవై సూర్యకాంతిమణివలె స్వయముగా ప్రకాశిస్తావు.

అరికాలులో ముల్లు విరిగినదనుకో, అప్పుడు ఏం చేస్తాం? మరొక ముల్లును తీసుకువచ్చి దాని సహాయంతో కాలులోని ముల్లును తీసి, ఆపై ఆ రెండు ముల్లులను త్యజిస్తాం కదా! అదే విధంగా శుభవాసనలతో మనస్సులోని అశుభవాసనలను తొలగించి వేయాలి. ఆ తరువాత క్రమంగా ఆ మనస్సును వాసనారహితం చేయాలి. అప్పుడు శేషించు స్వస్వరూపమగు ఆత్మయందు ప్రశాంతానుభవము పొందెదవుగాక. ఓరామా! ఈ లోకంలో ఉత్తమ జ్ఞానులందరు అట్లే ప్రయత్నించుచు శుభమగు పదమును పొందుచున్నారు. నీవు కూడా అట్లే అనుసరించి, పరమార్థ వస్తువును సాక్షాత్కారం చేసుకో. స్వత్స్వరూపమునందు అవస్థితుడవుకమ్ము.

❖❖❖

---

* **నహి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి॥**
నాయనా! అర్జునా! మంచిపనులు చేసిన మానవుడు ఎన్నడూ దుర్గతి పొందదు. (గీత : ఆత్మసంయమ యోగం – 40)

# 11. జ్ఞానావతరణము

ఓ రామచంద్రా! "బ్రహ్మతత్త్వము" స్వయంప్రకాశమై, అనిర్దేశ్యమై మనోవాక్కులకు అతీతమై ఉన్నది. అయ్యది సత్–చిత్–ఆనంద రూపమున సర్వత్రా వెలయుచున్నది. దాని సత్త వల్లనే తదితరములన్నీ వెలుగొందుచున్నాయి. అదే భవిష్యత్తునందు 'నియతి' అని కూడా వ్యవహరించబడుచున్నది. కార్య–కారణ స్వరూపము కూడా అదే. దర్పణంలో దృశ్యప్రతిబింబమువలె, అనేక నదీతటాకాదులలో అనేక ప్రతిబింబములుగా ఒకే సూర్యబింబము ప్రతిబింబిస్తున్నట్లు, ఆ పరబ్రహ్మమే "నీవు–నేను–అతడు" – ఇత్యాదు లందు ఖండితమువలె ప్రకటితమగుచున్నది. ద్రష్ట యొక్క దృష్టి చమత్కారమే అట్లు ప్రాప్తిస్తోంది.

ఈ జీవుడు వాస్తవానికి స్వభావసిద్ధంగా పరబ్రహ్మస్వరూపుడే. అయితే అజ్ఞాన కారణంగా లేక అనిర్వచనీయమైన 'మాయ' కారణంగా, "నేను జీవుడను, ఖండుడను.* అల్పజ్ఞుడను. బద్ధుడను. కాళ్ళు, చేతులతో కూడుకొనిన దేహమే (ఈ శరీరమే) నా స్వరూపము" – ఇత్యాది అల్పభావములను తన చిత్తమునందు పొందుచున్నాడు. అట్టి అవాస్తవ భావములచే మూర్ఖుడు, దుఃఖితుడు అగుచున్నాడు. అట్టి అల్పత్వమును తొలగించి జీవునకు తన "అఖండ – సర్వనియమాతీత" స్వరూపమును గుర్తు చేయుటయే ఉపనిషత్తులు మొదలైన ఆత్మతత్త్వ ప్రతిపాదకములగు శాస్త్రములయొక్క ప్రయోజనమై ఉన్నది.

అందుచేత రామా! జీవుడు నిత్యబంధువు అయినట్టి ఈ చిత్తమును పౌరుష బలముచే ఏకాగ్రంచేసి, "ఖండానుభవం" నుండి "అఖండానుభవము"**నకు పయనించాలి. నాయనా! ఒక్కసారి ఈ ఇంద్రియములను చూడు. ఇవి విషయాభిలాష యందు మిక్కిలి ఆరూఢమై ఉన్నాయి. బురదపై వ్రాలే దోమలులాగా, ఇవి విషయ సుఖములందే విశేషంగా వ్రాలటం జరుగుతోంది. పురుషప్రయత్నం చేత మాత్రమే వాటిని అరికట్టి సంయమనం చేయగలగటం సాధ్యపడుతుంది. మనస్సును "సర్వసమత్వము" లేక "సమాధి" వైపునకు మరలిస్తేగాని, ఈ జీవునకు దుఃఖదోషాలన్నీ తొలగవు.

❖

ఇప్పుడు మనం జ్ఞానదాయకం, పురుషార్థప్రదం, సారయుతం, సవివరం అయినట్టి విచారణలో ప్రవేశించబోతున్నాం. మనం విచారించబోయే "ఆత్మయొక్క స్వరూప – స్వభావములు" సర్వలోకములకు వారివారి అధికారభేదమును అనుసరించి మహత్తరముగా ఉపయోగపడుగాక!

❖

దేనివలన జీవుడు ఇక్కడే, ఇప్పుడే, ఈ జగద్వ్యవహారములన్నీ ఇట్లు ఉండగానే (Here and now while everything is "as it is") తనయందలి పూర్ణత్వమును అనుభవమునకు తెచ్చుకోగలడు?

---

* ఖండానుభవం = Compartmental consciousness

** అఖండానుభవం = Comprehensive consciousness. An experience of indivisibility.

ఏది గ్రహించుటచే ఈ జన్మమృత్యువుల రహస్యము గ్రహించినవాడై జన్మకర్మల జాడ్యము నుండి సర్వదా విముక్తి పొందగలడు?

ఏది తెలుసుకొనుటచే ఇతడు సుఖ దుఃఖములు మొదలైన ద్వంద్వములకు అతీతుడు కాగలడు?

ఈ మనస్సును సమరసమునందు నిలిపినప్పుడు ప్రాప్తించే సమాధానస్థితి ఎట్టిది?

ఈ సర్వకర్మకాండ, జ్ఞానకాండల అర్థవిచారణ చేసినప్పుడు లభించగల ఉత్తమ వస్తువు ఏది?

ఈ సర్వసంసార వాసనలను త్యజించినప్పుడు సంపూర్ణ శమ సంతోషముల రూపమున ప్రాప్తించే అనుభవమేది?

ఏది పొందిన తరువాత ఇక అనంత సంఖ్యలో ఎదురుగా నిలిచియున్న ఈ బ్రహ్మాండములో పొందవలసినదేదీ 'కించిత్' కూడా మిగిలియుండదు?

అట్టి మోక్షోపాయం మనం విచారించబోతున్నాం. విస్తారంగా నాచే చెప్పబడబోయే ఈ మోక్షకథను వివేకులతో కూడి విచారించటం జరిగితే - ఎవరైనా ఎప్పుడైనా - తప్పక అక్షయము, దుఃఖరహితము అయిన పరమపదమును పొందగలరు. విచారించినంత మాత్రంచేత ఇది దుఃఖమును నశింపజేసి మనశ్శాంతిని ప్రసాదించ గలదు. మనం చెప్పుకోబోయే ఈ మోక్ష కథను పరమేష్ఠియగు బ్రహ్మదేవుడు లోక కళ్యాణార్థమై ప్రవచించియున్నారు. ఆయన కల్పాదిలో బోధించినదే మీముందు ఉంచుచున్నాను.

**శ్రీరాముడు :** మహర్షీ! ఇతఃపూర్వమే (మనం చెప్పుకోబోయే) మోక్షకథను బ్రహ్మదేవుడు ఎవరికి చెప్పారు? ఎందుకు చెప్పారు? అది మీరు ఎట్లా పొందారు? మొట్టమొదటి నుండి ఎట్టి సందేహములు ఉండకపోవుటే మంచిది కనుక ఇట్లు ప్రశ్నించుచున్నాను. అందుచేత, అన్యథా భావించకుండెదరుగాక!

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! రామా! నీవు కించిత్ సందేహము పొందటం జరిగినా, నిస్సంకోచంగా ప్రశ్నించవలసినదే.

మనం 'బోధ' (Main Text) ప్రారంభించకముందే, ఈ చెప్పుకోబోయే "జ్ఞానవిచారణ"ను నేను ఎట్లు పొందానో వివరిస్తాను. ఆ తరువాత వక్త (బోధించేవాడు) - పృచ్ఛక (ప్రశ్నించేవాడు).... వీరిరువురికి ఉండవలసిన లక్షణముల గురించి, మనం ఉపయోగించబోయే దృష్టాంతములు గ్రహించవలసిన విధానం గురించి, సాధనచతుష్టయం గురించి, సదాచారాదుల గురించి చక్కగా గ్రహించిన తరువాతే మనం (ఉత్పత్తి ప్రకరణము ఆదిగా) తదుపరి విచారణలో ప్రవేశిద్దాం.

ఇప్పుడు ఈ ఆత్మ సమాచారం నేను పొందిన విధమును వివరిస్తున్నాను. విను.

❖

భూత, భవిష్యత్, వర్తమానములచేత అవిభాజ్యమై, వినాశనమనునది లేనట్టి 'ఆత్మతత్త్వము' అను ఒకానొకటి ఉన్నది. అదియే ఈ మాయావిలాసమునకంతటికీ మునుముందుగా సర్వమునకు కారణభూతమైయున్నది. సర్వులయొక్క, సర్వముయొక్క అంతర్యామి, వాస్తవ స్వరూపము అదియే.

సర్వమునకు ఆధారభూతమై, శాస్త్రాదులచే అయ్యది "చిదాకాశము" అని, "ప్రత్యక్ చిద్రూపము" అని, "పరిశుద్ధ ఆత్మతత్త్వము" అనికూడా పిలువబడుచున్నది. అయ్యది అనిర్వచనీయమై, వేదోపనిషత్తులచే ప్రతిపాదింపబడుచున్నదై, సర్వుల స్వస్వరూపమై వెలయుచున్నది.

సముద్రంలో తరంగాలు ఉన్నా లేకున్నా, జలం జలంగానే ఉంటుంది కదా! నిర్వికారమగు ఆత్మతత్త్వముకూడా మాయ ఒనర్చుచున్నను, ఒనర్చకున్నను ఒకే రీతిగా ఉంటోంది.

అట్టి నిర్వికార ఆత్మతత్త్వము నుండి, ఒక సమున్నత తరంగమువలె "విష్ణు భగవానుడు" స్వయముగా ఉదయించినారు. ఆ విష్ణువు నాభికమలం నుండి "బ్రహ్మదేవుడు" జన్మించారు. ఆ బ్రహ్మదేవుడు దేవతల చేతను, మునులచేతను పరివేష్టించబడినవాడై, ఇక ప్రాణులన్నిటిని సృష్టించ సంకల్పించారు. మనస్సు వికల్పములు సృష్టించుచున్నది కదా! ఇది కూడా అట్టిదే.

❖

అయితే ఈ బ్రహ్మదేవుని సంకల్పబలం చేత, సృష్టించబడిన ఈ ప్రాణులు అనేక ఆధి-వ్యాధులతో, లాభాలాభ వ్యవహార భావనలతో అనుక్షణం మనోచాంచల్యం పొంది తల్లడిల్లుచుండిరి. వారంతా విషయభోగరతులై ఉండటం, అల్పాయుష్కులవటంతో అనేక దుఃఖపరంపరలు పొందటం జరుగుచుండేది. జీవులయొక్క ఈ కష్టదశలను చూచి - పిల్లల కష్టములను చూచి తల్లడిల్లు తండ్రివలె - సకల లోకకర్త యగు బ్రహ్మదేవుని హృదయం ద్రవించింది. "హతాశులు, అల్పాయుష్కులు అయినట్టి ఈ నా బిడ్డలందరి దుఃఖములు తీరేదెట్లా?" అని స్థిరచిత్తులై కొంతసేపు యోచించారు. అప్పుడు, సకల దుఃఖనివారణ సమర్థుడగు ఆయన కొన్ని ఉత్తమ సాధనములను సృష్టించారు.

1. తపస్సు/ధ్యానము 2. ధర్మము, 3. దానము, 4. సత్యము, 5. తీర్థములు.

ఈ ఐదింటిని సృష్టించిన తరువాత ఆయన మరికొంత యోచనచేస్తూ, "ఈ ఐదు సాధనములు బాగానే ఉన్నాయి. కాని, ఇంతమాత్రం చేత ఈ నా బిడ్డల దుఃఖములు సమూలంగా పోతాయా? లేదు. జన్మరహితమైనట్టి నిర్వాణపదము పొందాలంటే వీరికి జ్ఞానమే ముఖ్యమైన ఉపాయంకదా! తపో-ధర్మ-దాన-సత్య- తీర్థాదులచే వీరు కోరుకున్న సమృద్ధములన్నీ తప్పక పొందుతారు. కాని అంతమాత్రం చేత వీరికి ఉత్తమమైన శాంతి లభించదు. జీవుని ఉద్ధరించగలిగేది 'జ్ఞానము' మాత్రమే. అందుచేత అజ్ఞానమును పూర్తిగా తొలగించగల ఏదైనా ఉపాయం కనుగొని, ఈ జనులకు ప్రసాదించెదను గాక" అని అనుకొన్నారు. అప్పుడు మనస్సుచే సంకల్పమాత్రంగా నన్ను సృష్టించారు. అనగా నేను బ్రహ్మమానసపుత్రుడను.

❖

ఎక్కడో పుట్టిన తరంగాన్ని మరొక తరంగం చేరునట్లు అనిర్వచనీయమగు మాయ వలన జన్మించిన నేను జపమాలను, కమండలమును ధరించినవాడనై నా తండ్రియగు బ్రహ్మదేవుని సమీపించి సాష్టాంగ ప్రణామం చేశాను. ఆయన చిరునవ్వు నవ్వుచు, నన్ను చేరదీసి, "నీ మనస్సు

కోతివలె చంచలమగు గాక! అట్టి చంచల మనస్సు నందు కొంతసేపు అజ్ఞానం ప్రవేశించును గాక" అని నిర్దేశించారు.

అంతేం! ఒక్కక్షణంలో నేను నా నిర్మల స్వరూపం మరచాను. బుద్ధి జడత్వం పొందుటచే, దీనుడనై ఒక నిరుపేదవలె దుఃఖశోకములు పొందసాగాను. "ఆహా! ఈ సంసార దోషమంతా నాకు ఎక్కడి నుండి దాపరించింది?" అని చింతించసాగాను. ఎంత యోచించినా, చింతించినా నాకు దుఃఖవిముక్తి కలుగనే లేదు. అప్పుడు నా తండ్రి నన్ను సమీపించి "ఏమయ్యా! కుమారా! ఎందుకు నిష్కారణంగా నీలో నీవే దుఃఖిస్తున్నావు? ఈ దుఃఖములకు నివారణోపాయ మేమిటో ఎదురుగా ఉన్న నీ తండ్రినగు నన్ను అడుగవచ్చును కదా! అప్పుడు నీకు తగిన ఉపాయమేమిటో వివరిస్తాను!" అని లాలిస్తూ అనునయవాక్యాలు పలికారు.

అప్పుడు నేను ఆయన ప్రక్కన కూర్చుని వినమ్రతతో "తండ్రీ! దుఃఖమయ సంసారంలో ఈ జీవుడు ఎట్లు తగుల్కొనుచున్నాడు? దీనుడై అనేక దుఃఖములను అనుభవిస్తున్న ఇతడు వాటినుండి విడివడేదెట్లా?" అని ప్రశ్నించాను. అప్పుడాయన విస్తారమగు తత్త్వజ్ఞానం ఉపదేశించారు. ఆ అమృతతుల్యమగు జ్ఞాన ప్రవచనమంతా శ్రద్ధగా గ్రహించినవాడనై అత్యంత నిర్మలుడనయ్యాను. నా తండ్రిని మించినట్టి తత్త్వజ్ఞానమునందు అవస్థితుడనయ్యాను. ఏది తెలుసుకొన్నంతమాత్రంచేత జన్మ సార్థకత పొందుతుందో, పవిత్రత చెందుతుందో, అయ్యది తెలుసుకొన్నాను.

❖

ఆ విధంగా తిరిగి స్వస్వరూపమును పొందినట్టి నాతో ఆయన ఇట్లు పలికారు:

"ఓ ప్రియపుత్రకా! ఇంతకుముందు నీవు, అజ్ఞానవశం చేత జీవుడు ఎట్టి దుఃఖములను పొందుతాడో, స్వయముగా రుచి చూచావు కదా! నా సృష్టిలోని ఈ జీవులందరు అజ్ఞాన జాడ్యముచే దుఃఖ-మోహములందు చిక్కుకొని అనేక జన్మ పరంపరలందు బలవంతంగా ప్రవేశిస్తూ కొట్టుమిట్టాడుచున్నారు. అందుకు ఔషధమే ఇప్పుడు నీకు చెప్పిన అఖండ జ్ఞానము. ఈ జ్ఞానము అన్ని తరగతులవారికి ఉపయోగించాలనే ఉద్దేశంతో నేను నిన్ను శపించి మూఢుడిగా చేశాను. ఇప్పుడు మన ఇరువురి సంభాషణచే నీవు పరమజ్ఞానమును పొందావు. నీవుకూడా నావలెనే ఏకాత్ముడవయ్యావు.

ఇప్పుడు నీవు జనులను అనుగ్రహించటానికి భూలోకం వెళ్ళు. కర్మరతులైన వారికి క్రియాకాండను ఉపదేశించు. విరక్త-చిత్తులగు ప్రాజ్ఞులకు ఆనందదాయకమగు జ్ఞానం ఉపదేశించు."

ఆయనచేత ఆ విధంగా ఆజ్ఞాపించబడిన నేను జంబూద్వీపంలోని ఈ భరతవర్షానికి వచ్చాను. ఈ జ్ఞానము పొందుటకు తగినవారు ఉన్నంతవరకు నేను ఇక్కడే ఉంటాను. నాకు ఇక వేరే కర్తవ్యమంటూ ఏదీ లేదు. అయితే, ఇక్కడ నాకు యథాప్రాప్తములైన కార్యములను మాత్రం అభిమానరహితమైన చిత్తంతో నిర్వర్తిస్తూ ఉంటున్నాను.

ఇట్టి 'జ్ఞానవిచారణ' వినతగిన లోకకల్యాణకారకుడవైన నీవంటి ఉత్తమ శిష్యుడు లభించటం నాకు ఆనందకరమైన విషయం. నిన్ను నిమిత్తంగా చేసుకొని లోకములన్నిటికీ ఈ జ్ఞానామృతమును పంచిపెట్టుటకు ఉద్యుక్తుడనయ్యాను.

ఓ రామచంద్రా! నా జన్మవృత్తాంతం ఏమిటో, ఈ భూలోకమునకు 'జ్ఞానము' ఎట్లు ప్రవేశించిందో, నాయొక్క, నా తండ్రియొక్క ఆశయములు ఏమిటో – అంతా విన్నావు కదా! గొప్ప సుకృతం చేయుట చేతనే, స్వస్వరూపానందప్రదమగు ఈ పర–జ్ఞానం వినాలని నీ చిత్తము తహతహపడుతోంది. ఇట్టి మధురమైన సమయం సర్వలోకములకు శుభము, శాంతము, ఐశ్వర్యము, ఆనందము కలుగచేయునుగాక!

❖❖❖

# 12. సంసార చక్రం - వైరాగ్యం

**శ్రీరాముడు :** బ్రహ్మదేవునిచే సృష్టించబడిన ఈ లోకములకు జ్ఞానముయొక్క ఆవశ్యకత ఎట్లు కలిగిందో, అది ఏ విధంగా ఈ లోకమునందు ప్రవేశించిందో, దానియొక్క ప్రయోజనము, ఉద్దేశము ఏమిటో మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జ్ఞానావతరణము గురించి, జ్ఞానము యొక్క ఆవశ్యకత గురించి, ఇందుకు తగియుండుట గురించి, ఆ సంసారచక్రం గురించి మరికొన్ని విశేషాలు చెపుతాను, విను.

సముద్రంలో తరంగాలు ఉదయిస్తాయి చూచావా! అదే విధంగా పరబ్రహ్మము నందు స్వభావానుసారం బ్రహ్మదేవుడు క్రియాశక్తియుతుడై జన్మించారు.

ఆయన తన వలన సృష్టించబడిన జీవరాశులు "మేము పుట్టుచున్నాము – చచ్చుచున్నాము" అను రూపమున గల జరామరణ భావములను పొందటం గమనించారు. ఒక్కసారి భూత – భవిష్యత్తు – వర్తమానములనంతా పర్యవలోకించారు. ''ఆహాఁ! అనేక యుగములు గడచిపోతున్నాయి. 'స్వర్గము' మొదలైన ఊర్ధ్వగతులు పొందటానికి తగినట్టి సాధన సంపత్తి అంతా సృష్టించాను. ఇవన్నీ బాగానే ప్రవర్తిస్తున్నాయి. కాని, ఈ జన్మలు పొందుచున్న జీవులు మోహబద్ధులే అగుచున్నారు. అంతేకాని, సర్వదా నిత్యమైయున్నట్టి అఖండమైయున్నట్టి స్వస్వరూపమును ఏమాత్రం గాంచుటలేదు'' అని గమనించారు. ఇదంతా చూచి కరుణా పరవశులయ్యారు. అప్పుడాయన నన్ను సృష్టించి, చక్కగా ఉపదేశించి 'జ్ఞాని'గా తీర్చిదిద్దారు కదా! ఈ సర్వజనుల అజ్ఞానము బాపటానికి నన్ను ఈ భూలోకం పంపారు. ఒక్క నన్ను మాత్రమే కాదు. అందుకుగాను సనత్కుమార, నారదాది అనేకమంది మహర్షులను కూడా పంపారు. మమ్ములను నిర్ణయించుటలో ఆయన ఉద్దేశం 'మనోమోహము' అనే జాడ్యముచే కుంచించుకుపోవుచున్న జీవులను, "క్రియ–పుణ్య–జ్ఞానము"లచే సముద్ధరించుటయే సుమా!

ఆ విధంగా అనేక యుగాలు గడచిపోయాయి. విశుద్ధములైన యజ్ఞాది క్రియలు కూడా అశ్రద్ధ కారణంగా అంతరించిపోవటం ప్రారంభించాయి. అది గమనించిన మహర్షులు కర్మకాండను, శాస్త్ర మర్యాదలను ఉద్ధరించాలని (తిరిగి రక్షించాలని) అనుకొన్నారు. ఈ భూమండలమును వేర్వేరు దేశాలుగా విభజించి రాజులను కల్పించారు. ఆ తరువాత, ధర్మార్థకామముల ప్రయోజనం సిద్ధింపచేసే స్మృతి శాస్త్రములను (పురాణములను), యజ్ఞ శాస్త్రములను మరల రచించారు.

❖

ఆ విధంగా కాలచక్రం పరిభ్రమిస్తోంది. కాలమహిమ ఏమని చెప్పాలి? క్రమంగా జనులు ధన, గృహ, అన్నపానాదులందు మాత్రమే ఆసక్తి కలిగి ఉండటం ప్రారంభించారు. ప్రజలలో అనేకులు అనేక నేరాలు చేస్తూ దండార్హులు కావటం అధికమైనది. హింస, యుద్ధము మొదలైన దుష్టక్రియలు నిర్వర్తించకుండా రాజులు, ప్రజలను పాలించటం సాధ్యమయ్యేదికాదు. అటు రాజులు, ఇటు ప్రజలు దీనత్వం పొందటం జరుగుచుండేది. అప్పుడు మావంటి జ్ఞానదృష్టి కలవారు లోకంలో దీనత్వం పోగొట్టటానికి "ఆత్మతత్వము" ప్రచారం చేయవలసి వచ్చింది. ఈ 'విద్య' మొట్టమొదట రాజులకు చెప్పటం జరిగింది. అందుచేత దీనిని 'రాజవిద్య' అని అంటూ ఉంటారు. ఈ 'ఆధ్యాత్మవిద్య' సర్వవిద్యలకు మకుటంవంటిది అవటం చేత దీనికి 'రాజవిద్య' అనే పేరు తగినదే అయింది. రహస్యమగు ఈ విద్యను తెలుసుకొన్నట్టి రాజులు, తదితరులు దుఃఖ విముక్తులయ్యారు.

క్రమంగా నిర్మలమైన కీర్తి కలిగినట్టి అనేకమంది రాజులు గతించారు. ఇప్పుడు ఈ దశరథమహారాజు పుత్రునిగా నీవు జన్మించావు. సహజ నిర్మలము, ప్రశాంతశీలము అగు నీ మనస్సులో ఎట్టి కారణం లేకుండానే పరమపవిత్రమైన వైరాగ్యం జనించింది. అట్టి వైరాగ్యం నీయందు ఈ విధంగా జనించటం లోకములకు శుభము కలిగింపచేయటానికే అయివున్నది.

రాజసిక వైరాగ్యం, సాత్విక వైరాగ్యం అని వైరాగ్యం రెండువిధాలుగా ఉంటుంది–

**రాజసిక వైరాగ్యం :** ఏవైనా దుస్సంఘటనలు తారసపడినప్పుడు ఏర్పడే వైరాగ్యం. ఉదాహరణకు – ధనమునో, రాజ్యమునో, బంధువులనో కోల్పోవటం మొదలైనవి కారణాలుగా కలిగిన వైరాగ్యం.

**సాత్విక వైరాగ్యం :** ఎట్టి బాహ్యకారణం లేకుండానే, కేవలం పరిశీలనాత్మకమగు బుద్ధిచేత, నిత్యానిత్య వివేకము వలన ప్రాప్తించే వైరాగ్యం.

నీయందు ఇప్పుడు జనించింది సాత్విక వైరాగ్యం. అందుకే సాధు పురుషులు కూడా అది చూచి ఆశ్చర్యపడుచున్నారు.

**బీభత్సం విషయం దృష్ట్వా కోనామ నవిరజ్యతే?**
**సతాముత్తమ వైరాగ్యం వివేకాదేవ జాయతే ॥** (XI - 23)

జీవితంలో బీభత్సమైన విషయాలు చూచినప్పుడు వైరాగ్యం ఎవరైనా పొందుతారు. అది సహజమే. అందులో మహత్తరమైన విశేషమేమున్నది? అయితే సాధుపుంగవుల వైరాగ్యం

చమత్కారంగా ఉంటుంది. వారు ఇతర జనుల కష్ట సుఖములను గాంచినప్పుడో (అర్జునుడు, బుద్ధుడు మొదలైన మహనీయుల ఉదాహరణలు అట్టివే) లేక కేవలం ఏకాంతంలో నిర్వర్తించబడిన స్వవిచారణాపూర్వక వివేకముచేతనో (ఉదా॥ శుకుడు మొదలైనవారు) వైరాగ్యం పొందటం జరుగుతుంది. అట్టివారు మా దృష్టిలో మహనీయులే. వారే మహాప్రాజ్ఞులు. వారి మనస్సు అతి నిర్మలమై ఉంటుంది. అందమైన పూలతో సుందరముగా తయారుచేయబడిన దండ భగవంతునికి అలంకారమగునట్లు, "స్వవిచారముతో కూడిన పరామర్శ"చే జనించిన వివేకముచే ఈ సంసార గతిని విచారించి, ఇందలి అస్థిత్వ – నాస్థిత్వములను వైరాగ్యాభ్యాసంచే గ్రహించేవారు పురుషశ్రేష్ఠులు. వారు తమను తాము ఉద్ధరించు కొనుటయేకాక, అశుభమార్గమున చనుచున్న తదితర జనులకు కూడా జ్ఞానజ్యోతియై వెలుగొందుతారు.

❖

కాబట్టి, ఓ సభికులారా! వివేకముతో "నేను ఎవ్వరు? ఈ దృశ్యమంతా ఏమిటి? ఇదంతా ఎట్లు ఎక్కడి నుండి ప్రాప్తిస్తోంది? ఈ కనబడే సంబంధ – బాంధవ్యములు ఎచ్చట ఎట్లు ఏర్పడుచున్నాయి?" అనే విషయాలు చక్కగా, బాగుగా విచారించబూనెదరు గాక! "ఈ మాయా దృశ్య ప్రపంచము, ఈ దేహ–ఇంద్రియ–తదితర పదార్థములతో కూడిన బాహ్యజగత్తు, ఈ మనో–బుద్ధి–చిత్తాహంకారాలతో కూడిన అభ్యంతర జగత్తు – ఇదంతా అవిద్యయే" – అని గ్రహించినవారై వివేకమును ఆశ్రయించి అవిద్యను త్యజించి వేసెదరు గాక! "వీటిచే స్పర్శించబడజాలని నిత్యోదిత సాక్షీతత్త్వమే నేనైయున్నాను" అని గ్రహించెదరుగాక!

ప్రియ రాఘవా! శ్మశానము, ఆపదలు, దైన్యము – మొదలైనవి తారసపడినప్పుడు ప్రాప్తించే విరక్తి కంటే, స్వతహాగా విచారణాదులచే కలిగే వైరాగ్యం మహత్తరమైన ప్రభావం కలిగి ఉంటుంది. ఇందులో ఏమాత్రం సందేహం లేదు.* అందుకుగాను అనేక దృష్టాంతాలు (ఉదాహరణలు) మనం ఈ విచారణలో చూడబోతున్నాం.

నీవు ఈనాడు అకృత్రిమమైన వైరాగ్యమును, అతిశయపూరితమైన మహత్వమును పొందావు. చదునైన, తడిసిన నేల విత్తుటకు తగినదై ఉంటుంది కదా! ఇప్పుడు జ్ఞానోపదేశమునకు పాత్రుడవయ్యావు. సర్వాంతర్యామియగు ఆ భగవంతుని అనుగ్రహం చేతనే, నీబోటివారి బుద్ధి యిట్లు వివేకము పొందినదై వికసించటం జరుగుతూ ఉంటుంది.

ఓ రామచంద్రా! ఓ సర్వజనులారా! ఈ మనం చెప్పుకోబోయే బోధ యొక్క ఉత్తమ ప్రయోజనం మీ మీ వివేకము యొక్క ఔన్నత్యము వలననే ఒనగూడగలదు. కనుక మీ 'వివేకము' విషయంలో జాగరూకులై ఉండండి. 'వివేకము' అనునది యజ్ఞయాగాది సత్క్రియల వలన, గొప్ప తపస్సు

---

* బుద్ధుడు, జీసస్, గురునానక్, మహ్మద్‌ప్రవక్త వంటి మహనీయులు ఈ లోకుల అజ్ఞానజనిత దుర్భర స్థితులను గాంచుటచే వైరాగ్యం పొందారు. అంతేకాని, తాము పొందిన వ్యక్తిగత కష్టములచే కాదు. అందుచేతనే వారు తమ ప్రవచనములచే చెడుదారులను, అశుభములను ఆశ్రయిస్తున్న జనులకు దారిచూపారు.

వలన, చిరకాలం తీర్థయాత్రలు సేవించుట చేత, ఆయా సత్పురుషులచే, శాస్త్రములచే నిర్ణయించబడిన నియమ-నిష్ఠలు సదవగాహనచే అవలంబించుట వలన, పరోపకార ప్రభావంచేత ఉదయిస్తుంది. అట్టి ప్రయత్నములచే అంతరంగమున పేరుకొని ఉన్న పాప-దృష్టులు నశిస్తాయి. అప్పుడు కాకతాళీయ న్యాయముచే 'తత్త్వచింతన'యందు ఆసక్తి కలుగుతుంది.

ఓ రామచంద్రా! ఈ సంసారచక్రము యొక్క భ్రమణమునకు అంతులేదు. "పరమ పదము"ను దర్శించనంతవరకు, జనులు ఇట్లే, ఈ సంసార చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు. అనేక రాగద్వేషాదులచే చుట్టబడినవారై, అంతూ-పొంతూలేనట్టి ఐహిక - ఆముష్మికప్రదములైన క్రియావ్యవహారములు ఆచరిస్తూనే ఉంటారు. "ఈ సంసారము అపారము" అనే విషయం, వివేకము ఉదయించినప్పుడు మాత్రమే గ్రహించగలరు. సునిశితమైన బుద్ధిచే వివేకము ఉదయించిందా, ఇకప్పుడు, "త్రాళ్ళు త్రెంచుకొని అరణ్యంలో ప్రవేశించే ఏనుగు"లాగా ఈ జీవుడు "సంసార బుద్ధి"ని త్యజించి, తన స్వస్వరూపమగు పరమపదమును అందుకొని సుఖించగలడు.

❖

ఓ సభికులారా! ఈ సంసారము యొక్క గతి అతి కుటిలమైనది. దీనికి అంతు లేదు. "ఈ దేహమే నేను" అనునట్టి బంధమున చిక్కుకొన్న ఒక మహాజంతువు వంటి ఈ జీవుడు జ్ఞానమును ఆశ్రయించనంతకాలం ఈ సంసారము యొక్క అంతమును కనుగొనజాలడు. వివేకులైనవారు "జ్ఞానయుక్తి" అనే తెప్ప సహాయంచేతనే ఈ సంసార సాగరమును దాటివేసి, తరించుచున్నారు. అట్టి సంసార సాగరమును దాటించగల ఈ "జ్ఞాన విచారణ"ను మీరంతా శ్రద్ధాసక్తులతో, విచారణపూర్వకమైన బుద్ధితో, ఏకాగ్రమనస్కులై వినండి.

ఓ రామచంద్రా! నీకు సందేహాలుంటే ఎప్పటికప్పుడు ప్రశ్నించు.

ఈ జగత్తును గమనించావా? ఇది అజ్ఞానుల కొరకు నిరంతరం అనేక కామ, క్రోధ, మోహ, భయ, సందేహ సమన్వితములగు సందర్భములను, అనుభవములను నిర్మించుకొంటూ పోతోంది. ఫలితమేమిటి? ఈ జీవుని అంతరంగము అనేక దుఃఖములచే, భ్రమలచే దహించబడుతోంది. ఎక్కడా తృప్తిగాని, దోషరహితమైన ఆనందముగాని లభించుట లేదు. అందుకుగాను ఏదైనా ఉత్తమమైన ఉపాయం అన్వేషించాలి కదా! నిరర్థకంగా రోజులు గడిపివేస్తుంటే ప్రయోజనమేమిటి? "అవివేకమునకు ఏకైక ఔషధం జ్ఞాన విచారణయే" అని మేము మరల మరల ప్రకటిస్తున్నాము. "ఆ! ఈ ఆత్మవిచారణ మా కెందుకు? ఇప్పటి మా లౌకిక ప్రయత్నములు, అవి ప్రసాదిస్తున్న ప్రయోజనములు మాకు సానుకూలంగానే ఉన్నాయి కదా!" అని తాత్సారం చెయ్యటం ఉచితం కాదు. ఎందుకంటారేమో? అనుక్షణం మార్పులు చెందుతూ ఉండే ఈ 'ఉపాధి'ని (దేహాన్ని) నమ్మి, ఇందలి దోషములను గమనించకుండా రోజులు గడపటం ఉచితమెట్లా అవుతుంది? శీతల, వాత, తాపాది అనేక వ్యాధులు, దుఃఖాలు, మనోచింతలు, శిథిలత్వం, వృద్ధాప్యం, మృత్యువు - ఇత్యాదులతో కూడుకొనియున్న సంసార వ్యవహారమంతా మనిషిని క్షణకాలంలో దుఃఖ సముద్రము నందు ముంచివేయగలదు కదా! దూరదృష్టి లేనట్టి దుర్బుద్ధులకు నేను కాని, మరెవరు కాని ఏం చెప్పగలం?

సాధుపురుషులగు మహాత్ములు జ్ఞానము – నిగ్రహము – యుక్తి – ఏకాగ్రత (Awareness - Self control - discrimination - concentration) చేతనే (ఈ సంసార దుఃఖమును పొందవలసి వస్తున్నప్పటికీ) దీనిని సహించగలుగుచున్నారు. ఈ దృశ్యమునకు అతీతమైనట్టి అకళంకస్థితియందు తమను తాము స్థాపించుకొనుచు, సుస్థిరత శాంతములను పొందగలుగుచున్నారు.

అనుక్షణం మూఢ మానవులను అనేక దుఃఖచింతనలు సమీపించి వారిని –ఎండుగడ్డిని అగ్నివలె – దహించివేస్తున్నాయి. అందుకే "నాయనలారా! తాత్సారం చేయకండి" అని సర్వజనులకు మరల మరల మనవి చేస్తున్నాను. అమృతతుల్యమగు ఆత్మయే స్వరూపముగాగల ఓ సర్వజనులారా! వానకు బాగా తడిసిన ఎండుగడ్డిని నిప్పు దహించగలదా? మీరు ఆత్మ జ్ఞానమును పొందండి. ఆధ్యాత్మ శాస్త్రమును విచారణపూర్వకంగా గ్రహించండి. ఆత్మతత్త్వమును సాక్షాత్కరింప చేసుకోండి. సమ్యక్‌దర్శులు (సర్వమును సమరస భావముతో దర్శించువారు) ఎట్టి మానసిక వ్యాధులచే బాధింపబడజాలరు. ఈ 'సంసారము' అనే విశాలభూమిలో అనుక్షణం ''ఆధివ్యాధులు (మానసిక–శారీరక దోషములు)" అనే సుడిగాలులు లేస్తున్నాయి. ఒక్క తత్త్వజ్ఞుడగువాడు మాత్రమే ఇందులో 'కొండ'వలె నిశ్చలుడై ఉండగలుగుచున్నాడు.

ఏమాత్రం వివేకం కలిగి ఉన్నా, అట్టివాడు తన కాలమును వృథాచేసుకోడు. తత్త్వ జ్ఞానమును గ్రహించినట్టి ప్రాజ్ఞుడు, ప్రబుద్ధాత్ముడు, బుద్ధిమంతుడు అయినట్టి మహనీయుని కోసం వెతుకుతాడు. అట్టివానిని గుర్తించి, సమీపించి, సర్వ సందేహములను నివృత్తి చేసుకొని, శుద్ధజ్ఞానము నందు విలీనుడౌతాడు. నాయనలారా! ఎంతో ప్రయత్నపూర్వకంగా, నిరహంకారంగా, డంబము–దర్పము లేకుండా అన్వేషిస్తే గాని, అట్టి మహనీయుని సామీప్యత లభించదు. ప్రయత్నశీలుడైనవాడు అట్టి వ్యక్తిని సమీపించి, అతనిని నమస్కారాది సపర్యలచే సంతోషింపచేయాలి. ప్రేమపూర్వకంగా, సత్యాన్వేషణాదృష్టితో ప్రశ్నించి తెలుసుకోవాలి. వస్త్రమునకు కుంకుమ రంగు వేసినట్లు, ఈ మనస్సును జ్ఞానులు ప్రసాదించే సమాచారముతో నింపివేయాలి. అత్యంత శ్రద్ధతో సంశయములన్నీ నివర్తింపచేసుకోవాలి. బుద్ధికుశలతతో, ఓర్పు–నేర్పులతో, యత్న పూర్వకంగా, "ఇతడు ఇట్లు చెప్పుటలో ఏ ఉద్దేశమును ప్రకటించుచున్నాడు?" అనునది జాగరూకులై గ్రహించాలి.

❖❖❖

# 13. ప్రశ్న - సమాధానం

ఓ రామచంద్రా! తత్త్వజ్ఞుడు కాని వానిని, సత్యవస్తువగు ఆత్మను గ్రహించనివానిని, ఉపదేశములేని వానిని ఆత్మవిషయమై ప్రశ్నిస్తే ఏం ప్రయోజనం?

అదేవిధంగా "ఇతడు తత్త్వవేత్త. ఆత్మవిషయమై నాకంటే కూడా అధికంగా ఎరిగినవాడు" అని తెలిసికూడా అతనితో సంభాషించకుండా, అతడు ఏది చెప్పుచున్నాడో అది గ్రహించకుండా, పిడివాదాలతో జ్ఞానవస్తువును తిరస్కరించేవారు – మా ఉద్దేశంలో వృథా వ్యాసంగపరులు మాత్రమే.

**ప్రశ్నించువాడు (పృచ్ఛకుడు) :** ప్రశ్నించే ముందు మనం ప్రశ్నించువాని జ్ఞాన – విజ్ఞానస్థితులను చక్కగా గ్రహించి ఉండాలి. "ఇతడు ఇట్టి విషయమై పండితుడు" అని నిర్ణయించుకొనిన తరువాత ప్రశ్నించాలి. ఎట్టి అనుకూలమైన ప్రశ్నచే అతని వాస్తవమైన అభిప్రాయం మనకు లభిస్తుందో గ్రహించి ఉండాలి. ఆత్మజ్ఞాన జిజ్ఞాసతో ప్రశ్నించాలి కాని "నీవు మూర్ఖుడవు. నీకు ఏమి తెలియదు" అని నిరూపించుటకు ప్రశ్నించరాదు. ఒకనికి తెలియదని భావించినప్పుడు మనకు కావలసిన ఆత్మ సమాచారం లభించే మరొకవ్యక్తి కోసం అన్వేషించుటచే కాలం సద్వినియోగమౌతుంది. "మనలోని అహంకార మమకారములే ఇతరుల దోషములను ఎంచుటకు ప్రేరేపిస్తాయి" అనే విషయం మనం మరువరాదు. అజ్ఞుడైన వానిని ప్రశ్నించి, అంతటితో ఆత్మ విచార విషయమై దురభిప్రాయములు సమకూర్చుకొని, ఉత్తమ జ్ఞానము తిరస్కరించువాడు మా దృష్టిలో 'మూర్ఖుడు' మాత్రమే. అతడు పరమార్థజ్ఞానం ఎట్లా పొందుతాడు?

**సమాధానమిచ్చేవాడు :** "నన్ను ప్రశ్నించుచున్న ఇతడి పూర్వాపరములు ఏమిటి? ఇతని మనోదోషములు ఎటువంటివి? ఏ ఉద్దేశంతో, ఏమి కోరి ప్రశ్నిస్తున్నాడు? ఏ విధమైన వాక్యములు, దృష్టాంతములు అతనిని ఉద్వేగరహితునిగా, సత్యోన్ముఖునిగా చేస్తాయి? ఇతని అవధారణ సామర్థ్యం ఎట్టిది? అనిందితములైన నిర్ణయములు కలవాడేనా? నూతనమైన ఉన్నత సత్యమును అంగీకరించి, ఆకళింపు చేసుకోగలడా?" అని వితర్కించుకొని అప్పుడు ప్రశ్నించేవానికి తగినట్లుగా సమాధానం ఇవ్వాలి. పశు స్వభావుడగు అధమునకు ఏమీ చెప్పకపోవటమే మంచిది. ప్రశ్నించేవాని సామర్థ్యం విచారించకుండా ఉపదేశం ఇవ్వటం చెవిటివాని ముందు శంఖం పూరించటం వంటిదే కాకుండా, అతనిని తికమక పరచటమే అవుతుంది.

❖

ఓ రామచంద్రా! నీవు సద్గుణశీలివి. సాత్విక వైరాగ్యం ఆశ్రయించినవాడవు. సద్గుణ పక్షపాతివి. అట్టి నీవు ప్రశ్నిస్తున్నావు.

ఇక నేను, బ్రహ్మదేవునిచే 'బోధ' కొరకు నిర్ణయించబడినవాడను. లోక కళ్యాణము మాత్రమే శిష్యుల నుండి ప్రతిఫలంగా కోరుకొనేవాడిని. కాబట్టి మన ఇద్దరి ఈ గురు–శిష్య సంయోగం మధురమే కానున్నది.

❖

ఓ రాఘవా! నీవు శబ్దార్థ జ్ఞానమునందు మహా నిపుణుడవు. నేను చెప్పబోవు దానిని "ఇది అనుభవపూర్వకమగు తత్త్వము" అను భావన, గౌరవం, ఉత్తమ విశ్వాసము కలిగియుండుము. ఎందుకంటావా? మేము అనేక సంవత్సరములు సత్యము కొరకు అన్వేషించాం. తపోధ్యానాదులచే మనస్సును పరిపక్వం చేసుకొని ఆపై శాస్త్రవిషయాలు పరిశీలించాం. అనేకమంది ఉత్తమ జ్ఞానులతో కూడి, దీర్ఘకాలం విచారణ చేశాం. "సత్యము ఇది" అనే నిర్ణయానికి వచ్చాం. అందుచేత మా వాక్యములపై కొంత విశ్వాసము కలిగియుండటం ఉచితమే కదా! అప్పుడే ఉత్కృష్టమైన ప్రయోజనం

ఉంటుందని నా అభిప్రాయం. విశ్వాసంలేని వైద్యునివద్ద ఉపశమనం కష్టమగునట్లే గురువుపై విశ్వాసం లేనిచోట అవగాహన ఏర్పడటం అసాధ్యం.

❖

నాయనా! నీవు మహామతివి. అకారణ విరక్తుడవు. స్వవిచారణచే జీవుల 'గతి'ని గ్రహించినవాడవు. ఈ 'జీవితము' అనబడుదానిని, ఇందలి జన్మమృత్యు జరా దుఃఖాది దోషములతో సహా సమగ్రంగా చూస్తున్నావు. నీవంటి శిష్యుడు లభించటం కూడా మాకు సంతోషకరమైన విషయమే. శుభ్రమైన వస్త్రమునకు స్వల్ప ప్రయత్నంతో చక్కగా రంగు అంటుతుంది కదా! ఈ నా బోధ సులభంగా నీయందు ప్రవేశించి అంకితము, సుస్థిరము, పవిత్రము కాగలదని నేను భావిస్తున్నాను. నీవు నిన్నటి రోజు పలికిన దానినిబట్టి, "ఈ రాముని బుద్ధి పరమార్థ విచారణ సలుపుటలో ఏకాగ్రత, సమర్థత కలిగియున్నది" అని మేము మునులందరము నిశ్చయం చేశాం. సూర్యకాంతి నిర్మల జలంలో ప్రవేశించునట్లు, నేను ప్రతిపాదించబోయే తత్త్వార్థము అకృత్రిమంగా (స్వభావ సిద్ధంగా) సుందరంగా నీ హృదయములోనికి ప్రవేశించునుగాక! నేను చెప్పబోయేదంతా బహు యత్నపూర్వకంగా గ్రహించాలి సుమా! అట్లు విని, విచారించి, ఆపై నీవు ఎట్లు నిర్ణయించుకొంటావో అట్లే ఆచరించవచ్చు.

ఆయా సందర్భాలలో ప్రశ్నించవచ్చు. అయితే అనుమాన నివృత్తి కొరకు, ఆత్మజ్ఞాన సముపార్జనయే లక్ష్యముగా కలిగియుండి ప్రశ్నించాలి. వ్యర్థమైన ప్రశ్నలు వేయకుండెదవు గాక! ఇలా ఎందుకంటున్నా నంటావా? చంచలమైన ఈ "మనస్సు" అనే కోతి యథేచ్ఛగా సంసారారణ్యంలో సంచరిస్తోంది. అట్టి మనస్సును శుద్ధ పరచుకోవాలి. లేకుంటే, 'సంసార దృష్టి'యే పెత్తనం చలాయిస్తూ, మనస్సును అల్పత్వము వైపుగా ప్రసరింపచేస్తూ ఉంటుంది. అందుచేత నీ ప్రశ్నలు అల్ప లక్ష్యములు కలిగి ఉండే అవకాశమున్నది. యత్నపూర్వకంగా పరమార్థ తత్త్వమునే వినాలి. మహత్తరమైన ఆశయము కలవాడవై ఆత్మయొక్క స్వరూప-స్వభావములు ఎరుగుటకై ప్రశ్నించెదవు గాక!

❖

ఓ మానవులారా! ఈ 'ఆత్మ విచారణ' వినటానికి సిద్ధపడుచున్నారు కదా! అవివేకం చేత అజ్ఞత్వకారణంగా (Because of sheer ignorance) అసత్ వ్యవహారములతో క్షణక్షణం 'సంసర్గము' ఏర్పడటం ఈ సంసారము యొక్క లక్షణం. అట్టి సంసర్గమును క్షీణపరచుకోండి.

ఆత్మోన్నతి సాధించాలనుకొనేవారు సాధుపుంగవులకై వెతకాలి. వారిని గుర్తించి వారితో జ్ఞాన విచారణ చెయ్యాలి. అప్పుడు సత్యమేమిటో, అసత్యమేమిటో మీరే సుస్పష్టంగా తెలుసుకొనగలరు. సాధనపూనండి, నిరంతర సాధుసంగం ఆశ్రయించే వారికి అప్రయత్నంగానే వివేకము ఉదయించి వికసిస్తోంది. అట్టి వివేక వృక్షము యొక్క మధుర ఫలములలోని రసమే "మోక్షము" అని చెప్పబడుతోంది.

❖❖❖

# 14. మోక్షోపాయం

ఓ రామచంద్రా! "మోక్షము" అనబడే రాజాధిరాజు యొక్క దర్శనం కావాలంటే నీవు నలుగురు ద్వారపాలకులను ఆశ్రయించాలి.

1) శమము – Inner Calmness

2) విచారణ – Enquiry

3) సంతోషము – Contentment

4) సాధుసంగము – Company of Holy men

ఈ నాల్గిటిని యత్నపూర్వకంగా అభ్యసించాలి. నాల్గిటిని ఒక్కసారి అభ్యసించటం కష్టమనిపిస్తే, కనీసం ఏ మూడిటినో, రెండిటినో అభ్యసించు. అప్పుడు ఆ ద్వార పాలకులు నీ కొరకు మోక్షద్వారం తెరుస్తారు. అదికూడా కష్టమనుకొంటే, ఆ నలుగురిలో ఏ ఒక్క ద్వారపాలకుడినైనా ప్రాణాలు పణంగా పెట్టైనా సరే, ఆశ్రయించి ఆప్తమిత్రునిగా చేసుకో. ఆ నలుగురిలో ఒకరు నీ వశమైతే మిగతా ముగ్గురు తమంతట తామే వశమౌతారు.

శాస్త్రము, జ్ఞానము, తపస్సు, శ్రుతులు (వేదములు) – వీటికి వివేకిమాత్రమే యోగ్యుడగుచున్నాడు. అట్టి వివేకి ఆకాశంలో సూర్యునివలె సర్వజనులలో 'శ్రేష్ఠుడు' అగుచున్నాడు.

'చల్లదనం' చేత నీరు గడ్డ కడుతుంది కదా! ప్రయత్న మాంద్యము చేతనే (సరి అయిన ప్రయత్నములను ఆశ్రయించకపోవుటచేతనే) ఈ జీవుని బుద్ధి జడత్వం పొందుతోంది. ఫలితంగా "నేను ఈ కాళ్ళు, చేతులు కలిగినట్టి ఒకానొక భౌతిక శరీరమును. దీని వృద్ధిక్షయాలు నాకు సంబంధించినవే" – అనే భావన దృఢపడుతోంది.

అయితే రామచంద్రా! నీవు మాత్రం "సౌజన్యము, సుగుణములు, శాస్త్రదృష్టుల వలన వికసించిన అంతఃకరణం" పొంది ఉన్నావు. లేళ్ళు తమ చెవులు రిక్కించుకొన్నప్పుడు మంద్రమైన 'వీణధ్వని'ని వినగలుగుతాయి కదా! ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో, జ్ఞాన–పిపాసతో ఉన్నట్టి నీవు నేను చెప్పబోవు వాక్యములు విని, సత్య విషయము తప్పక గ్రహించగలవు.

❖

ఏది ఏమైనా నీవు శాస్త్రప్రవచితమైన ధ్యాన – భక్తి యోగాది అభ్యాస (Practice) – వైరాగ్యము (Analysis) లను మాత్రం వదలవద్దు. వాటి సహాయం చేతనే నీయందు తరగని సౌజన్య సంపద సుస్థిరం కాగలదు. మొట్టమొదట "నేను ఈ సంసారము నుండి విడివడవలసిందే" అని నిశ్చయం చేసుకో. శాస్త్ర, సజ్జన సాంగత్యములను గ్రహిస్తూ "స్వకీయమైన విచారణ" అను రూపముగల తపస్సు నిర్వర్తించు. అద్దాని వలన నీ ప్రజ్ఞాశక్తి వర్ధిల్లుతుంది.

ఓ సర్వజనులారా! శుద్ధమగు చిత్తముతో ఈ వాసిష్ఠ – రామాయణాది ఆత్మ తత్త్వబోధకమగు శాస్త్రములు పరిశీలించండి. "ఇప్పుడు అవన్నీ మా కెందుకు?" అను రూపముగల మూర్ఖత్వమును

వదలండి. ఈ సంసార మహావృక్షమును గమనించారా? ఒక ప్రక్క ఆయువు వృథా అగుచున్నది. నిదురలేచి మనోజాడ్యమును త్యజించండి. అజ్ఞులగువారిని (The Ignorant Lot) ఈ సంసారము నిత్యము మోసగించుచునే ఉన్నది. మూర్ఖత్వమును నశింపచేయాలంటే ప్రయత్నమే ఏకైకమార్గం. 'బద్ధకము, దురాశ, అవిచారము" – అనే మూడు విషసర్పములు ఈ 'జీవితము' అనే ప్రదేశమును సర్వదా విషపూరితం చేస్తున్నాయి. అవి హృదయమును సంకుచితపరుస్తూ ఉంటే మానవుడైనవాడు చూస్తూ ఎలా ఊరుకుంటున్నాడో మాకు అర్థం అవటం లేదు.

ప్రాజ్ఞులగువారియందు నిత్య ప్రసన్నత కానవస్తోంది. ఎందుచేత? తత్త్వదృష్టి చేతనే సుమా! మేఘం లేని ఆకాశంలోని చంద్రుని ఆహ్లాద కిరణములు లోకమునంతా సుఖమయం చేస్తాయి కదా! ఎవని బుద్ధి పూర్వాపర విచారణచే ఆత్మ జ్ఞానమును గ్రహించగలుగుతుందో అట్టివానియందే బ్రహ్మానందము బహిర్గత మౌతోంది. అట్టి బుద్ధి కలవాడే 'పురుషుడు' అని అనిపించుకొంటున్నాడు. అట్టి ఉత్తమ విచారణశీలత, తత్త్వదృష్టి లేనట్టి బుద్ధి కలవానిని ఏమని పిలవాలో నన్ను అడుగవద్దు.

అందుచేత ఓ సర్వజనులారా! మీరంతా "తమోరహితము, స్వచ్ఛము, శాంతి మొదలైన ఉత్తమ గుణములతో కూడినది" – అయినట్టి బుద్ధిని పెంపొందించుకోండి.

❖❖❖

# 15. జగత్‌భ్రమణ క్రీడ

ఓ రామచంద్రా! నీ మనస్సు చక్కటి సుగుణములతో కూడి ఉన్నది. చెప్పినది గ్రహించగల సూక్ష్మబుద్ధి కలిగియున్నావు. సముచితంగా ప్రశ్నించగలవు. నీపట్ల గల ఆప్యాయతచే, సర్వజనులపైగల అవ్యాజమైన ప్రేమచే లోకకళ్యాణ దృష్టితో ఉత్తమమగు తత్త్వజ్ఞాన విచారణ ప్రారంభించబోవుచున్నాను. అందుకు అనువుగా నీ మనస్సును మరల మరల రజస్తమోగుణరహితం చేయి. ప్రయత్నపూర్వకంగా మనస్సును సుస్థిరపరచుకొని, జ్ఞానము వినటానికి సిద్ధంగా ఉండు. నా తండ్రియగు బ్రహ్మదేవుని 'అభిలాష'ను అనుసరించి, నిన్ను నిమిత్తంగా చేసుకొని, సర్వజనుల ముందు ఈ ఆత్మ విచారణను ఉంచుచున్నాను.

నీ హృదయం వివేకం, అనాసక్తులచే బాల్యమునుండే ఆర్ద్రమైయున్నది. చంద్రుడు లేకుంటే ఆకాశం అందంగా ఉంటుందా? కలువలు వికసిస్తాయా? ఉపదేశమునకు అత్యంత తగినవాడవైన నీ వలన, నీయొక్క సుందరమైన ప్రశ్నల వలన ఈ నా 'ఉపదేశము' ఉత్తమమై ప్రకాశించగలదు. మన ఈ 'విచారణ' యొక్క సారము, లక్ష్యము అయి ఉన్నట్టి "పరమపదము" అను దానిని సముపార్జించుటచే బాహ్యాడంబర దృష్టులన్నీ సమసిపోతాయి.

ఓ రాఘవా! ఈ సంసారము కలుగజేయగల "చిత్తమౌఢ్యం" ఏమాత్రం స్వల్పమైన విషయం కాదు సుమా! 'జ్ఞానము' అనబడు ఉపాయం చేత మాత్రమే మనోవృత్తులన్నీ స్వయంగా లయిస్తూ ఉంటాయి.

ఈ సంసారమును జయించటానికి రెండు ఉపాయములు జ్ఞానులు మనకు చెప్పుచున్నారు.

1) యోగము (ప్రాణాయామము, ధారణ మొదలైనవి)

2) విచారణ (Self enquiry)

ఈ రెండు ఉపకరణములలో 'విచారణ' అనునది అతి సులభమైనది. పరమార్థ జ్ఞానమును సజ్జనులగు వ్యక్తులతోకూడి విచారించటం జరిగితే అమోఘమైన ప్రయోజనమును ప్రసాదించగలదు. "అట్టి 'జ్ఞానవిచారణ'చే దుఃఖములన్నీ నశిస్తాయి" – అనటంలో ఏమాత్రం సందేహంలేదు. అందుచేత విచారణపరులగు వారిని హేళన చేయకుండెదరుగాక! వారే అనేకమంది జీవులను సంసార నికృష్టత్వము నుండి కాపాడగలరు.

❖

ఓ జనులారా! మీరంతా వివేకులు కావాలి. పాము తన కుబుసమును విడచునట్లు, 'ఆధి' అను పేరుగల మనోవ్యాధులకు సరైన చికిత్సను ఆశ్రయించండి. విచారణాదులను ఆశ్రయించినవారై, సత్వసంపద, ఆత్మవిషయమై అనుభవమును పెంపొందించుకోండి. క్రమంగా, జ్వర–ఉద్వేగరహితులై, శీతలాంతఃకరణులై ఈ జగత్తునంతా ఒక ఇంద్రజాలమువలె దర్శించుట అభ్యసించండి. మీరు ఇప్పుడే, ఇక్కడే "సమ్యక్–దర్శనము"ను అలవర్చుకోకపోయారా ... తత్ఫలితంగా అనేక దుఃఖ పరంపరలనే పొందబోవుచున్నారని హెచ్చరిస్తున్నాను.

ఈ సంసారముపట్ల ఆసక్తి కలిగియుండటమనేది అతిభయంకరమైన విషయం. "ఈ సంసారము అనర్థకరమైనదే కదా!" అనే శంకను ఈ జీవుడు కలిగి ఉండాలి. లేకపోతే ఇయ్యది మోహగ్రస్తులగు జీవులను పామువలె కాటువేస్తోంది. ముడులతో కూడిన వస్త్రమువలె బాధిస్తుంది. త్రాడువలె కట్టిపడేస్తుంది. చురకత్తివలె గాయపరుస్తోంది. అగ్నివలె దహిస్తుంది. నిబిడాంధకారమైన రాత్రివలె చూపును పోగొడుతుంది. త్రోవలో పాతబడిన నిలువురాయివలె నేలపై కూలుస్తుంది. ప్రశాంత జలములోనికి విసరబడిన గులకరాయివలె బుద్ధి యందు దోష వృత్తులను పేట్రేపుతుంది. చెప్పనలవి కాని మోహాంధకారకూపం (నుయ్యి)లోనికి త్రోసివేస్తుంది.

దృశ్యాసక్తియే సంసారము యొక్క మూలరూపం. సంసారాసక్తుడగు వాడు అనుభవించని దుఃఖము లంటూ ఉండవు. అట్టి దురంతమగు విషయ విశూచికావ్యాధికి ఇక్కడే తగిన చికిత్స చేసుకోవాలి. లేకుంటే, అది 'రక్తమాంస నిర్మితములే' అయి ఉన్నట్టి బంధుజనుల శరీరములందు "ఆహా! వీరంతా నావారే! నాకు సంబంధించినవారే" అనునట్టి భ్రమపూర్వకమైన మమకారమంతా కలుగజేయగలదు. అట్లు ప్రాప్తించబోయే నరకయాతనలకు 'అంతు – పొంతు' ఉండదు.

అజ్ఞాని యొక్క యాతనలు ఎట్టివని చెప్పగలం? అతడు ఒకచోట రాళ్ళు భక్షించవలసివస్తోంది. మరొకచోట కత్తికోతలు అనుభవిస్తున్నాడు. కొండలమీద నుంచి దొర్లించబడుచున్నాడు. రాళ్ళపై మోదింపబడుచున్నాడు. నిద్రలేకపోవటం, కొండంత భారీ శరీరాలు పొందటం – ఇత్యాది అనేక

యాతనలు అనుభవిస్తున్నాడు. నాయనలారా! మరల మరల గుర్తు చేస్తున్నాను. పలుచేష్టలతో కూడుకొనిన ఈ సంసార యంత్రం అతి దారుణమైనదిగా మేము గుర్తించాం. దీనిని గమనించకుండా, తగిన విచికిత్సా పూర్వకమైన ఉపాయాలు లభిస్తున్నట్టి 'మానవ జన్మ' అను అవకాశమును వృథా చేసుకోవటం ఉచితం ఎట్లా అవుతుంది? కనుక 'అశ్రద్ధ' అను జాడ్యమును త్యజించండి. ప్రయత్నశీలురుకండి.

'శాస్త్ర విచారణ' వలననే ఉత్తమ శ్రేయస్సు లభిస్తుంది. శాస్త్రము అంటే ఏమిటి? కొందరు మహనీయులు – "ఈ దృశ్యము, ఇందలి పదార్థానుభవం మాత్రమే జీవితము యొక్క 'లక్ష్యము, ఔన్నత్యము, పరమావధి' కాదు. ఈ దృశ్యములో ప్రవేశించిన నాకు సంబంధించిన, స్వస్వరూపం విషయమై సత్యమేదో ఉన్నది" – అని గుర్తించి అత్యంత ప్రయత్నశీలురై ఆ సత్యమును గ్రహిస్తున్నారు. తదితరులపై వారికి గల అవ్యాజమైన ప్రేమ కారణంగా అట్టి సత్యమును విధివిధానములగు ప్రయత్నముల రూపమున, విచారణ రూపమున ప్రకటిస్తున్నారు. అట్టివే ఈ శాస్త్రములు. 'మానవజన్మ' అను అవకాశము లభించినందుకుగాను, అట్టి శాస్త్రముల సహాయం స్వీకరిస్తూ ఉత్తమ విచారణ ఆశ్రయించాలి. సత్యాసత్యములను, నిత్యానిత్యములను గ్రహించాలి. "కొందరు వివేకులు సంసార దుఃఖములను ఎట్లా జయిస్తున్నారు? సంసార పీడనం ప్రాప్తిస్తున్నప్పటికీ, నిరంతరం ఆనందచిత్తులై ఎట్లా సంచరించగలుగుచున్నారు?" – ఈ విషయము గమనించబడుగాక! 'జ్ఞానము' అను కవచమును ధరించియుండుట చేతనే వారికది సాధ్యపడుచున్నది సుమా!

❖

విశుద్ధచిత్తులగు అనేకమంది మానవులు హరి–హర–బ్రహ్మాదుల వలెనే ఈ సంసారంలో, ఈ భూమిపై, కౌతుకరహితంగా, విక్షేపములు లేనివారై సంచరించటం జరుగుతోంది. మానవులలోనే "మహామోహబద్ధులు" – "మహామోక్ష స్వరూపులు" కూడా కానవచ్చుచున్నారు. అట్లే దేవతల దానవుల పాతాళ జీవుల విషయం కూడా! అందుచేత రామచంద్రా! ఈ 'మోహము' అనునది ఎట్లాగైనా సరే, క్షీణింపచేయబడాలి. అందుకు జ్ఞానోదయమే ఉపాయం. జ్ఞాన ప్రభావంచేత ఆత్మతత్త్వము స్వయముగానే ప్రకటితం కాగలదు.

ఓ జనులారా! ఈ చెప్పబోవు విచారణను చక్కగా పరిశీలించండి. ఈ 'విచారణ' సహాయంతో మీ విజ్ఞతను సునిశితం చేసుకోండి. హృదయంలో అలుముకొనియున్నట్టి "మోహ–రాగ–కౌతుకములను (Delusion, Attachment, Inquisitiveness with out usefullness) బయల్వెడల కొట్టండి. అప్పుడు ఈ హృదయాకాశమునందే ఆత్మాకాశము పరిఢవిల్లుతుంది. అట్టి స్థితిలో ఈ జీవునకు ఈ జగద్వ్యాపారములన్నీ 'లీల'గా, 'క్రీడ'గానే ఉంటాయిగాని, 'పీడ'గా కాదు. చైతన్యమాత్రమగు (కల్పనారహితమగు, శుద్ధ స్వస్వరూపమగు) "ఆత్మ" ప్రసన్నం కాగా, అప్పుడు పరమశాంతి లభిస్తుంది. 'సర్వసమత్వము' అనబడు అమరభావన రూపుదిద్దుకుంటుంది. అంతఃకరణము బ్రహ్మరసమయమౌతుంది.

ఓ రఘునందనా! జ్ఞానులకు ఈ జగద్భ్రమణమంతా క్రీడగానే తోచుచున్నది సుమా! కాబట్టి నీవు జ్ఞానివి అగుము.

ఈ 'శరీరము' రథంగాను, ఈ 'ఇంద్రియములు' రథచక్రములుగాను, ఈ 'పంచప్రాణములు' ఐదు గుఱ్ఱములుగాను, ఈ మనస్సు-పగ్గముగాను పెద్దలు చెపుతూ ఉంటారు. ఆనందమే దీని గమ్యస్థానం. అట్టి దేహరథమును అధిరోహించిన ఈ జీవుడు "శుద్ధచిత్తము" యొక్క సహాయం చేత జగద్వ్యవహారమంతా "ఆనందరూపమగు" క్రీడగానే దర్శించగలగాలి గాని దుర్భరంగా కాదు.

అదే మా ఈ ప్రయత్నము యొక్క ఏకైక లక్ష్యము.

❖❖❖

# 16. వివేకులు - అవివేకులు

ఓ రామచంద్రా! ఈ భూమిపై వివేకులు, అవివేకులు కూడా సంచరించుచున్నారు. వారి గురించి కొన్ని విషయాలు చెపుతాను విను.

మనం విచారించబోయే ఈ "అఖండ రామాయణ శాస్త్రము" ఏ వివేకమును ప్రతిపాదిస్తోందో, ... అట్టి వివేకదృష్టి కలిగి ఉన్నట్టి ఎందరో బుద్ధిమంతులు సన్మార్గమును అనుసరించినవారై ఆత్మసాక్షాత్కారం పొందియున్నారు. ఆత్మజ్ఞాన సమన్వితులై రాజాధిరాజువలె ఈ భూమిపై సంచరించారు, సంచరించుచున్నారు. అట్టివారు ఈ కుటుంబ వ్యవస్థలో ఉండి ఉండవచ్చు లేదా, ఈ వ్యవస్థ (గృహస్థాశ్రమం) త్యజించి వీధిలో (సన్న్యాసాశ్రమంలో) ఉండవచ్చు. ఎక్కడ ఉన్నప్పటికీ వారు దేనికొరకైనా శోకించుట లేదు. హర్షించుట లేదు. దేనినీ కోరరు. త్యజించరు. శుభాశుభములకు వ్యధ చెందరు. శాస్త్ర విరుద్ధములైన వాటికి దూరంగా ఉంటూ ఉంటారు. "పవిత్రత" యందే సర్వదా సుస్థితులై ఉంటారు. వారు ఏది చేసినా శుభముకొరకు, అనేకమంది సుజనుల అనుకూలత కొరకు అయుంటుంది. అన్నివేళల సన్మార్గమునే ప్రయత్న పూర్వకంగా స్వీకరిస్తూ ఉంటారు. "ఈ ఈ పదార్థములన్నీ నాకుండాలి. ఇవి పొందాలి. ఇవి తొలగాలి" – ఇట్టి రూపముగల బుద్ధిపూర్వకమైన పట్టుదలచే వారు బాధింపబడరు. సర్వ సంఘటనల యొక్క ''పూర్వాపరములను'', "సత్యాసత్యములను" గ్రహించి ఉండుటచే వారు దేనికీ, ఏమాత్రం ఉద్వేగపడరు. అయినప్పటికీ ఆయా లోక ధర్మములను సర్వుల సానుకూల్యతను దృష్టిలో పెట్టుకొని నిర్వర్తిస్తూ ఉంటారు. బాహ్యమునకు ఏది, ఎప్పుడు, ఎట్లు అనుకూలమో, ఉచితమో అట్లే ప్రవర్తిస్తూ ఉంటారు. అంతరంగమున మాత్రం సర్వదా ఆత్మ నిష్ఠులై ఉంటారు. నిష్క్రియులై ఉంటారు.

ఈ లోకంలోని వారి రాక-పోకలు (జన్మ-మృత్యువులు) కూడా బుద్ధిపూర్వకములు కావు. అందుచేత వారు చేసేది, పలికేది నిష్కామమే అవుతుంది. "పరమపదము" అనగా ఏమో గ్రహించబడిన తరువాత, సమస్తకార్యములు, దృష్టులు గ్రాహ్య – త్యాజ్యములు (గ్రహించుట – త్యజించుటలు)

శూన్యరూపములుగానే ఉంటాయి. సర్వవిధములైన ఇచ్ఛలను, కర్తృత్వములను పరిత్యజించినవారై, సర్వదా మధురమైన మనోవృత్తి కలిగి ఉంటారు. శాంత రసమయమగు "బ్రహ్మాకార వృత్తి"చే చంద్రకిరణములవంటి 'ప్రశాంతత'ను అనుభవిస్తూ ఉంటారు. ఆత్మ స్వభావము తెలుసుకొన్నవాడు ఈ మాయమగు "దృశ్యము" అనే ఇంద్రజాలమును చూచి ఆకర్షితుడు కాడు. వికర్షితుడు కాడు. వాటికి కారణమైన వాసనలను అనుసరించడు.

**"బాల్యచాపల్య ముస్సృజ్య, పూర్వమేవ విరాజితే"*** (XIII.8)

బాల్య చాపల్యమును విడనాడినవాడై ఇతఃపూర్వమే సర్వదా (సిద్ధించియే) ఉన్నట్టి పరమాత్మ సుఖమునందే విరాజిల్లుతూ ఉంటాడు.

అయితే అట్టి జీవన్ముక్తత్వము ఆత్మదర్శనముచేత మాత్రమే లభిస్తోంది. అంతకు మించి వేరే ఉపాయం లేదు. అందుచేత మనుజుడు విచారణ సమన్వితమైన 'బుద్ధి'తో యావజ్జీవితము 'ఆత్మాన్వేషణము' చేస్తూనే ఉండాలి. ఆత్మతత్త్వమునే ఉపాసిస్తూ జ్ఞానమును పొందాలి. ఈ లౌకిక-పారలౌకిక కర్మలను కూడా అది దృష్టిలో పెట్టుకొని, అందుకొరకే నిర్వర్తించాలి. మరింకెందు కొరకు కాదు.

మరి ఆత్మానుభవం పొందేదెట్లా? అభ్యాసమే అనుభవమును ప్రాప్తింప చేస్తుంది.

శాస్త్రములను ఆశ్రయించి సమాచారమంతా గ్రహించాలి. శాస్త్రానుకూలమైన ప్రయత్నములను ఆశ్రయించాలి. గురువులను సమీపించి చురుకైన బుద్ధితో వారి ఉపదేశములలోని అంతర్లీన సారాన్ని గ్రహించాలి. ఏది ఏమైనప్పటికీ, యత్నము చేసేవాడే ఆత్మవస్తువును పొందుచున్నాడు.

❖

ఓ జనులారా! శాస్త్రార్థములను నిరసించుచు, మహాత్ముల ప్రవచనములను పెడచెవిని పెట్టుచు మూఢత్వముచే నిష్కారణంగా అష్టకష్టములను తెచ్చిపెట్టుకోకండి. మనుజుని "అజ్ఞానం - అవివేకం" బాధించునంతగా వ్యాధులుగాని, ఆపదలుగాని బాధించలేవు. అందుచేత మీరు యేయే అజ్ఞానములచే బాధింపబడుచున్నారో, పరిశీలనాత్మకమైన దృష్టితో గ్రహించండి.

---

* ఇక్కడ "పూర్వమేవ విరాజితే" అని మహర్షి మహత్తరమైన ప్రయోగం చేశారు. 'మోక్షము' లేక 'ముక్తి' అనబడునది క్రొత్తగా పొందబడేవస్తువు కాదు. అయ్యది నిత్యమై జీవుని వాస్తవ స్వరూపమై ఇతఃపూర్వమే సర్వదా సిద్ధించియే ఉన్నది. మరి మనం ప్రయత్నించేదంతా దేని కొరకు? ముక్తస్వరూపులమగు మనస్వరూపమును కప్పియున్నట్టి మాయను (లేదా "నేను జీవుడను - బద్ధుడను" - అను అభిప్రాయ రూపంలో గల అజ్ఞానమును) మాత్రమే తొలగించుకొనుటకు అయిఉన్నది. మనయందు, ఈ సర్వము నందు పూర్ణమైయున్న ఆత్మ వస్తువు దర్శించగల సుందరమైన దృష్టి స్థిరపడాలి. అట్టి దృష్టికే సాక్షీ స్వరూపులమై ప్రశాంతముగా శేషించాలి. అప్పుడు నిత్యనిర్మలత్వమే మన అనుక్షణానుభవం అవుతుంది. "మనమందరము ఏకైక ఆత్మస్వరూపులమే" అనునట్టి ఎరుకను బాల్యచాపల్యము వంటి 'ఇంద్రియ - లోలుత్వము' కప్పి ఉంచుతోంది. దృశ్యముపట్ల గల బంధపూర్వకమైన అనుభవం, ఆసక్తి తొలగించటానికే నియమములు, శాస్త్రములు, యజ్ఞములు, విధివిధానములు ఉన్నాయి - అనునది జ్ఞానుల అభిప్రాయం.

కొంచెము సంస్కరించబడిన దృష్టి కలవారు ఈ శాస్త్రమును పఠిస్తే వారి అజ్ఞానం తప్పకుండా తొలగిపోతుంది. వారికి ఇది తప్పకుండా తోడ్పడగలదు. ఇక "పరమాత్మను పొందుటే మా జీవిత లక్ష్యము" అను నిర్ణయముగల మహనీయులైతే ఇది శ్రవణ మధురమై, ఆత్మ సుఖదాయకము కాగలదు. శ్రుతి-స్మృతులందు (వేదపురాణములందు) కొంత మర్మగర్భంగా చెప్పబడిన విషయమే ఈ 'యోగవాసిష్ఠము' నందు అనేక సుందరమైన దృష్టాంతములతో, కథనములతో – సుస్పష్టముగా, ముక్కుకు సూటిగా చెప్పబడింది. అందుచేత ముముక్షువులు దీనిని ఆమూలాగ్రం పఠించి, ఆ తరువాత, నా ఈ అభిప్రాయముయొక్క నిజానిజములు తమకుతామే నిర్ణయించుకొనెదరు గాక!

అసలు, ఈ జీవునకు తుచ్ఛమైన, కుకారణమైన, అనివార్యమైన ఆపదలన్నీ ఎక్కడి నుండి ప్రాప్తిస్తున్నాయి? మూర్ఖత్వము నుండే సుమా! మూర్ఖంగా మూఢునివలె జీవితం గడపడం కంటే, ఒక మూకుడు తీసుకొని అడుక్కుతింటూ ఉండటం ఉచితం. చీకటి నూతిలోనో, చెట్టు తొఱ్ఱలోనో ఒక 'పురుగు'గా ఒంటరిగా జీవితం గడపటం మంచిది.

మోక్షోపాయమై ఉన్నట్టి ఈ గ్రంథము యొక్క సహాయంచే 'జ్ఞాన కాంతి'ని పొందువారు మోహాంధకారంచేత గ్రుడ్డివారు అవటం జరగదు. 'తృష్ణ' అనేది వివేకము ఉదయించనంత కాలమే ఉంటుంది. తృష్ణ ఉన్నంతకాలం వేదనలు తప్పవు.

ఓ జనులారా! లేవండి. ఈ శాస్త్రవిచారణను అనుసరిస్తూ రండి. సంసార బంధమును త్రెంచి వేయుటకు కృతనిశ్చయులు అవండి. మావంటి ఆప్తులు, హితులు, సద్గురువులు, శాస్త్రములు ప్రతిపాదిస్తున్నదేమిటో చక్కగా వినండి. గ్రహించండి. అనేక ప్రమాణముల సహాయంచేత, మనందరిలోని ఆత్మ స్వభావ స్వరూపములేమిటో మీ ముందు ఉంచబోవుచున్నాము. స్వస్వరూపమగు ఆత్మను గ్రహించి, అందు సుస్థిరులగువారు మా మహర్షులవలెనే జీవన్ముక్తులై వెలుగొందగలరు.

ఈ సంసారంలో దుఃఖములు ఒకదాని వెనుక మరొకటి వచ్చి పోతూనే ఉంటాయి. దీనికి అంతు ఉండదు. ఇక ఇందులో మిణుకు మిణుకుమంటూ కనిపించే 'సుఖము' లేశమాత్రమే. అందుచేత రామా! నీవు అల్పునివలె దుఃఖములతో కూడిన ఈ సంసార సుఖములవైపు దృష్టి మరల్చకుండెదవు గాక! వివేకియగువాడు "క్లేశరహితము, అద్వితీయము, అనంతము, స్వస్వరూపమాత్రము" – అయినట్టి మోక్షపదము పొందుటకే ప్రయత్నం చేస్తున్నాడు. మనస్సు నుండి కామము – క్రోధము మొదలైన దోషములను తొలగించుకొంటున్నారు.

ఈ రాజ్యాది సుఖములతోను, అన్నపానాది భోగములతోను సంతుష్టి పొంది జీవించేవారు మా దృష్టిలో గ్రుడ్డి కప్పల వంటి వారే. 'అజ్ఞాని' మాత్రమే ఈ ఇంద్రియ విషయానుభవములు చాలా గొప్పవైనట్లు భావించి, వాటివెంట పరుగులు తీస్తున్నాడు. ఫలితంగా అనేక దుఃఖములచే, ఆపదలచే, మోహములచే అనుక్షణం పీడింప బడుచున్నాడు. అవన్నీ వాస్తవానికి ప్రబల వంచకమైనవని, మిత్రరూపంలో కనబడే శత్రువులేనని నీకు వేరుగా చెప్పవలసిన పని ఏమున్నది? వాటియందు ఆసక్తి కలిగియున్నట్టి జీవులు 'మోహము' అనే చీకట్లో చిక్కుకుంటున్నారు. ఆయా

ఆసక్తుల ప్రతిఫలంగా అనేక భయములను, నరకములను, దుఃఖములను, కష్టములను పొందటం జరుగుతోంది.

ఈ సుఖదుఃఖాలు పరస్పర నాశకరములగు వెలుగుచీకట్ల వంటివి. పైగా, అవి క్షణభంగురములు కూడా. అవి అత్యంత శ్రేయోదాయకమైన మోక్షమును చేకూర్చగలవా? లేదు. ఈ సుఖము-దుఃఖము -మానము-అవమానము - ఆశించుట - అభిమానించుట - ప్రాపంచిక సంగతి / సందర్భములను ధ్యానించుట - అభియోగములు కలిగియుండుట - రోషము మొదలైన భావములచే బంధింపబడిన వారు విరక్తితో కూడిన వివేకమును పొందజాలరు. వాస్తవానికి 'వివేకి' అగువాడు మాత్రమే భోగ - మోక్షముల రెండింటిని అందుకొని, సర్వులకు వందనీయుడగుచున్నాడు.

❖

ఓ జీవుడా! నీవు భయమును ఎందుకు పొందుతావు? "నేను స్వల్పుడను" అనునట్టి అల్పత్వమును, దీనత్వమును కట్టిపెట్టి పరమవివేకమును ఆశ్రయించు. నీ స్వస్వభావమేమిటో ఈ "యోగవాసిష్ఠం" అనే దర్పణమును ఉపయోగించి గ్రహించు. వైరాగ్యాభ్యాసం ఆచరించుటచే ఈ సంసారసాగరమును అతి సులభంగా దాటి వేయగలవు.

అయితే అప్రయత్నశీలుణ్ణి మాత్రం త్రిమూర్తులు కూడా కాపాడలేరు. 'వివేకి' అయినవాడు అప్రయత్నవంతుడై ఈ సంసారమాయ యందు నిదురించడు. మోక్షం గురించి, శుద్ధమగు స్వస్వరూపము గురించి విచారించకుండా విషయానందములు మాత్రమే లక్ష్యముగా కలిగియుండి, రోజులు గడపటం ఎంతవరకు ఉచితం? ఈ సంసారములో చిక్కుకొని, తన విమోచనమునకై ప్రయత్నించనివాడు తగలబడుచున్న ఇంటిలోని ఒక గడ్డి పాన్పుపై మత్తుడై విశ్రాంతి పొందుచున్నవాడే అవుతాడు.

లోకమాన్యమైన పదము కేవలం జ్ఞానము వలన మాత్రమే లభిస్తుంది. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. ఒకవేళ "బ్రహ్మము - అనునది ఎక్కడున్నది? ఉంటే మాకు కనబడాలి కదా?" అని అంటారేమో! బ్రహ్మము ఉండనీ, లేకుండనీ. విచారణ చేస్తే తప్పేమున్నది? 'విచారణ' అనగానే ఎందుకు పిరికితనం, బద్ధకం వహించి ఉండాలి? "ఇప్పుడు స్వస్వరూపము గురించి తెలిసినదానికన్నా విచారణచే అనేక విషయాలు గ్రహించుటచే స్వస్థత చేకూరగలదు" - అని జనులు భావించెదరుగాక. "అట్టి ప్రయత్నము జీవులను ఈ సంసారసాగరము నుండి దాటించివేయగలదు" అని సర్వజనులకు శుభమును కలుగచేయుటయే ఆశయముగాగల మేము మా అనుభవము యొక్క సారముగా ప్రకటించుచున్నాము.

❖

ఓ సభికులారా! "మోక్షము" అని చెప్పబడుచున్న - దృశ్య వ్యవహారమునకు అతీతమైనట్టి, మీయొక్క - నాయొక్క సర్వులయొక్క స్వస్వరూపమే అయినట్టి "స్వసత్తా సామాన్యము (Absolute Existence)" అను రూపముగల - ఒకానొక స్థితి కలదు. ఈ వాక్యం మేము మా అనుభవమంతా

రంగరించి చెప్పుచున్నాం. మీరంతా అట్టి మోక్ష భాగులు కావాలి. ఈ విచారణమంతా ప్రకటించటంలో మాకు గల ఉద్దేశం అదే. సద్గురువును, సచ్ఛాస్త్రమును ఆశ్రయించుటచే, స్వవిచారణచే, సర్వాంతర్యామియగు ఈశ్వరుని (ఆత్మదేవుని) అనుగ్రహంచే ఎవరైనా అట్టి స్థితిని పొందవచ్చు. అట్టి శుద్ధచైతన్య స్వస్వరూపము గురించి విచారించండి. అప్పుడే స్వస్థత పొందగలరు. ఈ ముల్లోకములలో అట్టి మోక్ష స్థితి కంటే నిరపాయమైనది, భ్రమ – శంకారహితమైనది మరొకటి ఉండదు. ఇంద్రియ సుఖములు, స్వర్గసుఖములు – ఇవన్నీ స్వసత్తసామాన్యమగు మోక్ష స్థితితో పోల్చిచూస్తే సూర్యుని ముందు 'దివిటీ' వంటివి మాత్రమే సుమా! మీ హృదయంలో "మేము మోక్షోపాయం తెలుసుకోవాలి" అనే ప్రవృత్తి కనుక కలిగిందా – ఇక మోక్షం పొందటానికి ఎటువంటి ఆటంకం ఉండదు. అందుచేత సత్యదృష్టితో ఇందలి విచారణను గ్రహించండి.

❖❖❖

# 17. మనోజయం

నాయనలారా! ధనముగాని, బంధుమిత్రులుగాని, తీర్థయాత్రలుగాని, పుణ్య క్షేత్రములలో నివసించుటగాని, ఈ కాళ్ళు – చేతులతో నిర్వర్తించబడే కర్మల చేతగాని, ఈ శరీరమును శ్రమింపచేయునట్టి ఉపవాసాదులవలనగాని 'మోక్షము' అనునది లభించేది కాదు. మరెట్లా లభిస్తుంది? వినండి.

శ్రవణం = స్వస్వరూపమగు ఆత్మయొక్క స్వరూప– స్వభావముల గురించి శాస్త్రములు, గురువులు చెప్పే సమాచారం శ్రద్ధగా వినటం.

మననం = అందలి వస్తుసారాన్ని హృదయంలో మరల మరల విచారణచేస్తూ సుస్థిరం చేసుకోవటం.

నిధిధ్యాస = మనస్సు పరిపరివిధాల పోకుండా నిలువరించటం

= ఆత్మయొక్క స్వభావములైనట్టి అఖండత్వము, నిత్యత్వము, సర్వత్వము, అప్రమేయత్వము అనుభవమునకు తెచ్చుకోవటం. అట్టి అధ్యాస (thought constancy) కలిగి ఉండటం.

ఆత్మ విషయమై ఈ విధములైన పురుషప్రయత్నముల చేతనే మనస్సు జయించబడుతుంది. మనస్సు బ్రహ్మరసము, సర్వసమత్వములచే నింపబడగా అప్పుడు "ఆ మనస్సు, దానికి భోక్తలగు మీరు" కూడా "శుద్ధసత్వము" అయి శేషించగలరు. సమరస భావనను పొందినట్టి మీరు 'బ్రహ్మము'గానే ప్రకాశిస్తారు. అట్టి స్థితియే ప్రతి జీవునియొక్క వాస్తవమగు పరమలక్ష్యమైయున్నది. ఈ జీవుడు ఎరిగినా, ఎరుగకున్నా – అతని యొక్క సర్వ తాపత్రయములు అందుకొరకే. కాని, ఆ విషయం స్వకీయమగు (తనకు తానే నిర్మించుకొనిన) మాయావరణ కారణంచేత మరచుచున్నాడు. లేక అశ్రద్ధ చేయుచు, "ఈ వస్తుజాల సముపార్జనయే నా ఏకైక లక్ష్యం" అని భావించుచున్నాడు. అందుచేతనే అవి పొందినా, లేక పొందకున్నా ఆతడు పూర్ణత్వము యొక్క అనుభవమును ఏమాత్రం

పొందుట లేదు. వాస్తవానికి, అతనికి అనుభవమగుచున్న అసంతృప్తి 'ఆత్మస్థితి' యొక్క సమాచారం సముపార్జించు కోకపోవుట చేతనే కలుగుచున్నది.

సర్వ అసంతృప్తులను తొలగించగల బ్రహ్మపదము (కేవలీ స్థితి, లేక సమాధాన స్థితి) విచారణము (Enquiry) చేతనే సునిశ్చితం కాగలదు. అందుకుగాను, ఈ దేహేంద్రియములను అధిగమించినట్టి ఉత్తమ వివేకము ఆవశ్యకమైయున్నది. ఉత్తమమైన దానికోసం స్వల్పమైనది త్యజించటం లోకవిదితమే కదా! "బ్రహ్మపదము" అనబడు ప్రశాంత స్థితిని కోరుకొనునట్టివారు, దుఃఖజాలమే అయినట్టి (లేక దుఃఖ జాలముగా పరిణమించబోవునట్టి) విషయ వ్యవహారములను పరిత్యజిస్తున్నారు. దృశ్య వ్యవహారమును అధిగమించుటకొరకై తీవ్రప్రయత్నశీలురగుచున్నారు. సమము, సుఖకరము అయినట్టి ఆసనముపై కూర్చుని స్వయంగా సర్వదృశ్య వ్యవహారములను సూక్ష్మబుద్ధితో విచారించుచున్నారు. అట్టి విచారణచే శోకరహితమగు ఆత్మ పదమును పొందినవారై జన్మరహితులగుచున్నారు. అట్టివారి స్వకీయ విచారణ ఎట్టిదో మనం ముందు ముందు పరిశీలించబోతున్నాం. ఓ రాఘవా! మన ఈ సభలోని అనేకులు, అట్లే ఈ భూమిపైగల, అనేకమంది సాధువులు ఆ పరమ పదము గురించి తెలుసుకొనే ఉన్నారు. అయ్యది సమస్త సుఖముల పరమావధి, ఎనలేనిది, నాశనరహితమైనది, అమృత తుల్యమని వారందరికీ తెలుసు. అనేకమంది జ్ఞానుల అభిప్రాయం క్రోడీకరించి, వాటిని కూడా ముందు – ముందు అక్కడక్కడ ప్రకటించబోవుచున్నాను.

నాయనా! రామా! ఈ ప్రపంచంలో కొన్ని మధురమైన పదార్థములు ఉన్నమాట నిజమే. అయితే అవన్నీ ఒకనాటికి నశించబోయేవే కదా! అయినా, ఎండమావులలో నీరు ఎక్కడుంటుంది చెప్పు? ఈ స్వర్గ, మర్త్య, పాతాళ లోకములలో వాస్తవము, శాశ్వతము అయినట్టి సుఖమును ప్రసాదించగల పదార్థమంటూ ఎక్కడా ఏదీ లేదు. అందుచేత శాంతి – సంతోషముల ద్వారా మనోజయం సాధించుటయే ఉచితము, ఉత్తమము కూడా. అట్టి మనోజయము నుండి మాత్రమే ఏకరస స్వరూపమగు ఆనందము లభించుచున్నది. అందుకు వివేకం వికసించాలి. అట్టి వివేకముచే మనశ్శాంతి రూపమైనట్టి "ఆత్మపదం" అనే పరమ సుఖం లభిస్తోంది.

అట్టి ఆత్మజ్ఞానము కొరకు దేవ, దానవ, మనుష్యాది జీవులలో ఎవ్వరైనా సరే, తగియే ఉన్నారు. అది ప్రతి ఒక్కరి స్వస్వరూపమే కనుక "దీనికి ఈ ఈ దేశకాల జాతులకు సంబంధించినవారే తగినవారు" అనునది ఉచితము కాదు. 'ఈ విచారణ వీరికి మాత్రమే పరిమితం' అనునది మా ఉద్దేశమే కాదు.*

దీనిని పఠించుట ఆత్మవస్తువును ధ్యానించుటయే అవుతుంది. పైగా, ఇట్టి ఆత్మవిచారణ చేయటానికి, (ఆత్మ గురించి సమాచారం గ్రహించటానికి) ఏమాత్రం శరీర పరిశ్రమ అవసరం లేదు. అట్టి ముక్తి – సుఖము పొందినవాని అంతరంగము ప్రశాంతంగా, నిర్మలంగా, భ్రమరహితంగా,

* "నామ సంకీర్తనే ధ్యానే సర్వయేవాధికారిణః" : నామ సంకీర్తనమునకు, ధ్యానమునకు సర్వులు తగినవారే.

శ్రమశూన్యంగా, వాంఛాశూన్యంగా ఉండగలదు. అందుచేత అట్టి ఆత్మ విషయమై ఎరుకగలవాడు "ప్రపంచంలో ఏదో నేను పొందలేక పోయానే?" అనే రుగ్మత కలిగియుండడు. "ఇది ఎట్లైనా తొలగాలి. అప్పుడుగాని మరికొందరివలె నేను సంతుష్టుడను కాలేను" అనునట్టి ఆవేశపూరితమైన అభినివేశము కలిగి ఉండడు. దేనిపట్లా కూడా పట్టుదల గాని, ద్వేష-మోహములు గాని కలిగి ఉండడు. ఈ దృశ్య పదార్థముల వాస్తవ - అవాస్తవములేమిటో అతనికి తెలిసిపోతుంది.

అతడు ప్రవాహపతితములైన కర్మలు ఆచరించినప్పటికీ, "దీనికంతటికీ కర్తను నేను" అను ఉద్వేగం పొందడు. అకర్తాభావమునే సర్వదా, ఆశ్రయించి ఉంటాడు.* కనుక, ఆయా కర్మల ఫలితములు అతనికీ అంటవు.

ఓ రామచంద్రా! ఆకాశంలో ఆ సూర్యభగవానుని చూడు. ఆయన దేనినైనా పొందటం గాని, త్యజించటం గాని చేస్తున్నాడా? "ఇది కావాలి? వీరికే సహకరించాలి? ఇది ఇట్లే ఉండాలి" అను భావావేశం లేకుండానే సృష్టిలోని సర్వ పదార్థములకు కారకుడగుచున్నాడు కదా! ఆత్మజ్ఞాని కూడా ఏదీ పొందడు, త్యజించడు. నిర్లిప్తుడై, ఉంటున్నా కూడా, కార్యసమర్థుడై స్వీయ కర్మలను నిర్వర్తిస్తూ ఉంటాడు.

ఇక ఇప్పుడు మనం "మోక్షము" అనే రాజు యొక్క ద్వారపాలకులగు శమ, విచారణ, సంతోష, సత్సంగమముల గురించి విచారిద్దామా?

❖❖❖

## 18. శమము ( తృష్ణారాహిత్యము - శాంతము)

**Inner calmness**

ఇంద్రియనిగ్రహ రూపమగు ప్రశాంత స్థితియే 'శమము'. "మనస్సు ఆసక్తులను, ప్రాప్తాప్రాప్తములను త్యజించి సర్వదా ప్రశాంతముగా, తృష్ణారహితంగా ఉండుట" అను దానినే 'శమము' అని అంటున్నాం. శాంతి, ఆనందములతో సర్వవేళల ఉండి ఉండుటయే 'శమము'.

❖

"నేను సుఖమును పొందెదనుగాక" అనునదే 'సుఖాశ' కదా. అట్టి 'సుఖదాహము' అనే దోషము చేత ఈ సంసార పంజరం నిర్మించబడింది. ఈ విస్తారమైన సంసారపు ఎడారిలో 'శమము' అనునది 'సరస్సు' (Oasis) వంటిది. సూర్యుడు అస్తమించగా, పూర్ణచంద్రుడు ఉదయించుటచే ఆ చంద్రుని కిరణములు ఇసుక తిన్నెలను ప్రశాంత పరుస్తాయి. అట్లే శమము ఉన్నచోట ప్రశాంతత ఉంటుంది.

---

* అకర్త = "నాఽహం కర్తా! నైవకించిత్ కరోమి! బంధమోక్షః కుతోమే? - నేను దేనికీ కర్తను కాదు. (ఏదీ నేనైయున్నానో అది) ఏమియు చేయునది కాదు. ఇక నాకు బంధ మెక్కడిది? మోక్షమెక్కడిది?"

'శమము' వలన శ్రేయస్సు లభిస్తోంది. అది ముక్తిప్రదాత, శుభకరము, భ్రాంతి నివారకము కూడా. ఎవడైతే శమాలంకృతుడై, తృప్తుడై, శాంతుడై, నిర్మలుడై ఉంటాడో, అట్టివానికి శత్రువులు కూడా మిత్రులు అవుతారు. ఆతడు విష్ణువువలె శోభిల్లుతాడు. ఎవరి ముఖంలో శమము సర్వదా శోభిల్లుతుందో, అట్టివారి ముందు పూర్ణచంద్రుడు ఎందుకు పనికివస్తాడు? దానివలన కలిగే ఆనందం ముల్లోకములలోని సంపదలు లభిస్తే మాత్రం ప్రాప్తిస్తుందా?

సూర్యుడు ఉదయిస్తే ఏ విధంగా అయితే చీకటి ఉండటం జరుగదో, - అదే విధంగా శాంతచిత్తుని మనస్సులో కూడా దుఃఖములకు, తృష్ణలకు, దుర్భరమైన మనోవ్యాధులకు చోటు ఉండదు. శాంతచిత్తుని యందు లభించే మనోవికాస స్థితికి, ఈ విషయానందములకు, హస్తి - మశకాంతరమైన (ఏనుగుకు-దోమకు ఉండునట్టి) భేదముంటుంది.

శమయుతుడై, సర్వజీవుల పట్ల స్నేహబుద్ధి గల సజ్జనునియందు పరతత్త్వము తనంతటతానే స్ఫురిస్తోంది. శమసమన్వితుని మహా కఠినమైన హృదయము కలవారు కూడా తమ తల్లిని సేవించునట్లు సేవిస్తారు. విశ్వసిస్తారు. ఓ రామచంద్రా! ఇంద్రపదవి వలనగాని, విష్ణుపదవి వలనగాని, "శమము" నందు లభించునంతటి సుఖము లభించదని ఘంటాపథముగా ప్రకటిస్తున్నాను.

ఈ జీవుడు 'తృష్ణ' అనే పాశంచేత బంధింపబడి, అనేక శారీరక, మానసిక రుగ్మతలతో కలత చెందుచున్నాడు. అయితే ఈ మనస్సు 'శాంతి' అనే అమృతం సేవించటం జరిగితే తృష్ణాపాశాలన్నీ తమంతట తామే విడిపోతాయి. సర్వవేళలందు శాంతిని సేవించుటే 'శమము' అయియున్నది. వత్సా! శమము వలన శీతలత్వం పొందిన బుద్ధితో ఏది ఆచరిస్తామో, ఏది గ్రహిస్తామో అది మాత్రమే మధురంగా ఉంటుంది. శాంతితో కూడుకొని ప్రాప్తించిన "ఆనందం" యొక్క అంశలో ఒక ప్రత్యేకత ఉన్నది. అది ఏవైనా సంఘటనల కారణంగా విచ్ఛిత్తి (Breaking) పొందినప్పటికీ, కొద్ది సమయంలో అతని మనోబుద్ధులు తిరిగి శాంతిని సంతరించుకోగలవు. ఇంద్రియానందము అట్టిది కాదు.

శమముతో కూడుకొనిన వ్యక్తిని పిశాచములుగాని, రాక్షసులుగాని, విరోధులుగాని, పాములుగాని బాధించలేవు. ద్వేషించలేవు. బాణము ఒక వజ్రమును ఛేదించ గలుగుతుందా? శాంతిసుధ అనే కవచాన్ని ధరించినవానిని ఈ సాంసారిక దుఃఖములు ఏమీ చేయలేవు. ఒకడు సమము, స్వచ్ఛము, ఉపశమనము పొందినట్టి బుద్ధితో కూడుకొని ఉన్నప్పుడు శోభించునట్లు ఒక మహారాజు అంతఃపురంలో కూడా శోభించలేడు. నాయనా! నేను ప్రాణసమానుడైన ఒక స్నేహితుని చూచినప్పటికంటే కూడా శాంతి - ఆనందముతో కూడిన శమయుతుణ్ణి చూచినపుడు ఎక్కువ ఆనందం పొందుతాను.

ఎవడైతే శమయుతుడై సాధుభావయుతుడై, లోకశుభదాయకమగు ప్రవర్తన కలిగియుంటాడో, అతని జీవితమే ధన్యము. ఇక ఇతరుల జీవితములలో 'వ్యర్థము' అయ్యే పాలే ఎక్కువ. శమయుతుడే అభినందనీయుడు. నిగర్వి, శాంతియుతుడు అగువాడు నిర్వర్తించు కర్మలు శ్లాఘనీయమౌతాయి. శమయుతుడు ఎట్లా ఉంటాడు?

"ఏ వ్యక్తి అయితే శుభాశుభ వ్యవహారములు చూడటం జరిగినా, వినటం జరిగినా, స్మరించవలసివచ్చినా, అతడు హర్షముగాని, విషాదము గాని పొందడో, అతడే శమయుతుడు." అట్టి శాంతుడు భూత-భవిష్యత్తు సుఖములేవీ కోరడు. ప్రాప్తించిన విషయములను త్యజించడు. యత్నపూర్వకంగా ఇంద్రియములను మాత్రం జయించి వేసి ఉంటాడు. సర్వభూతములపట్ల 'సమము' అయినట్టి దర్శనము కలిగి ఉంటాడు. అట్లు ఉండుటయే శమము యొక్క పరాకాష్ఠ. అతడు ఇతరుల కుటిలములైన దుర్గుణములను చూస్తూ కూడా బాహ్య అంతరంగములందు "వ్యర్థ ఆవేశము – ఆవేదన" వంటివి పొందడు. తాను అంతరంగమున శుద్ధుడై ఉంటూ, ఎప్పటికి ఏది సముచితమో అట్లే తదనుకూలంగా మాత్రం ప్రవర్తనను ప్రకటిస్తూ ఉంటాడు. మరొకరి మెప్పు కొరకు కాకుండా కేవలం "మోక్షము" లేక "స్వగుణ దోషనివృత్తి" కొరకు మాత్రమే యథాప్రాప్తములైన ఆయా కర్మలను శాస్త్రోచితంగా ఆచరిస్తూ ఉంటాడు.

**స్థితోఽపి నస్థితయివ, నహృష్యతి నకుప్యతి**
**యః సుషుప్తసమః స్వస్థః స 'శాంత' ఇతి కథ్యతే ॥** (XIII.75)

ఈ ప్రపంచ వ్యవహారములందు అతడు కూడా ఇతరులవలెనే స్థితి పొంది ఉండవచ్చును. కాని అకర్తృత్వ భావనచే దేనియందు కూడా 'స్థితుడు' కాకుండానే ఉంటాడు. అతనికి హర్షముగాని, క్రోధముగాని ఉండదు. సుషుప్తితో సమానమైన స్వస్థతను, శాంతమును అన్నివేళల అన్ని పరిస్థితులందు కలిగి ఉంటాడు. ఎవని మనస్సైతే మరణ సమయమునందు, ఉత్సవ సమయమునందు కూడా ఏ మాత్రం భయ, క్రోధ, భావావేశములు పొందకుండా ఉంటుందో, పూర్ణచంద్రబింబమువలె తన పూర్ణత్వము త్యజించకుండా ఉంటుందో – అట్టి మనస్సు కలవాడు శాంతుడు, శమయుతుడు కూడా.

శమము అభ్యసించువాడు అమోఘమైన ప్రభావం కలిగి ఉంటాడు. ఆతని దృష్టి సకల జీవులపట్ల అమృతప్రవాహంవలె మధురంగా సర్వ సమానత్వంతో ప్రసరితమౌతూ ఉంటుంది. అతడు సర్వదా, సర్వవేళల శీతలాంతఃకరణుడై ఉంటాడు. ఒకవేళ విషయానుభవమునందు ప్రవర్తించవలసి వచ్చినప్పటికీ వాటిపట్ల మూఢము, మూర్ఛాశయము కలిగి ఉండదు. అసంగుడై ఈ ఈ దృశ్య సంసార వ్యవహారమంతటినీ 'దూరగ్రామంలో జరిగే ఒక జాతర'లాగా చూస్తూ ఉంటాడు. చిరకాలంగా ఉండే ఆపదలు అతనిని కృంగదీయలేవు. క్షోభింపజేయలేవు. ఓ రామా! "తపస్సు చేయువాడు – అనేక విషయములు తెలిసినవాడు – యజ్ఞములు చేసినవాడు – రాజు – బలవంతుడు – గొప్ప విశేషములతో కూడుకొనిన గుణవంతుడు" .... వీరందరిలో శాంతుడే మా ఉద్దేశంలో సర్వదా శోభించుచున్నాడు. అతడు పరమానందంతో ఈ భూమిపై సంచరిస్తూ ఉంటే, భూమాత ఆనందపరవశురాలు అవుతుంది. శమము, తృష్ణారహితము అయినట్టి అతని అంతరంగము నుండి అప్రయత్నంగానే 'ప్రశాంతత – పరమానందము' అనే కిరణపుంజములు వెలువడుతూ ఉంటాయి.

సంకట సమయములందు, భయ స్థానములందు శాంతియే గొప్ప బల ప్రదర్శనంగా చెప్పబడుతోంది. అట్టి 'శాంతి – సౌజన్యము' అను బలపరాక్రమములు కలవాడు ఎక్కడుంటే అక్కడ ఆ పరిసరాలు పవిత్రమౌతాయి.

ఓ రఘునందనా! నీవు 'శమము' అనే ఆభరణం చేకూర్చుకో. అద్దానిని నీనుండి మరెవరు హరించలేనంతగా ప్రవృద్ధం చేసుకో! మహాత్ములైనవారు ఈ శమమును తమయందు గుప్తముగా పదిలపరచుకొని, ఇక ఆపై బాహ్యమునకు మాత్రం ఆయా స్థితిగతులను బట్టి ప్రవర్తిస్తూ ఉంటారు. దీనిని అవలంబించినవారు "మోక్షము" లేక "పరమపదము"ను పొందినట్లే. నీవు కూడా శమ, శాంతియుతుడవై సర్వదా ప్రశాంత గంభీరత్వములను అవలంబిస్తూ లోకమాన్యుడవయ్యెదవు గాక!

❖❖❖

## 19. విచారణ (Enquiry)

ఈ కార్య – కారణ వ్యవహారమంతా గమనించుచున్న మానవుడు శాస్త్ర జ్ఞానమును ఆశ్రయించాలి. నిర్మలము, పవిత్రము అయినట్టి బుద్ధితో నిరంతరం ఆత్మ విచారణ చేస్తూ ఉండాలి. అట్టి విచారణచే బుద్ధి సునిశితమై పరమ పదమును గాంచగలదు. "దీర్ఘ సంసారము" అనే ఒకానొక దోషము ఈ జీవుని పట్టి పీడిస్తోంది. అందుకు దివ్యమైన ఔషధం విచారణయే సుమా!

ఈ ఆపదలన్నీ ఎక్కడి నుండి వస్తున్నాయి? రాగద్వేషాది ప్రవృత్తుల నుండే కదా! 'విచారణ' అనే చురకత్తితో ఈ నిరంతరం ప్రాప్తిస్తున్న రాగద్వేషములను ఛిన్నాభిన్నం చేయాలి. అసమృద్ధి, బంధువుల మృతి, శారీరక బాధలు మొదలైన కష్ట సమయములలోను, అట్లే సుఖసమయములలోను, ఎక్కడినుండో మోహము వచ్చిపడి ప్రాజ్ఞుడైనవాడి వివేకమును కూడా కప్పివేస్తోంది. మరి అట్టి సంసార స్థితులందు ఉపాయమేమిటి? విచారణయే.

సత్యాసత్య విమర్శ చేయగలుగుచున్న పండితులకు కూడా విచారణయే సాధనమగుచున్నది. విచారణబలం చేతనే సత్పురుషుల బుద్ధి అశుభమును పరిత్యజించి, శుభమును ఆశ్రయించటం జరుగుతోంది. మహనీయులందరు తమ విచారణశక్తి చేతనే – బుద్ధి, బలము, తేజము, సమయోచితమైన స్ఫురణ, ఉత్తమ ప్రయత్నము – మొదలైనవాటిని ఆశ్రయించటం, వాటి సత్ఫలితములను పొందటం జరుగుతోంది.

నాయనా! రామా! "విచారణ" అనేది, "ఇది ఉచితము. ఇది అనుచితము" అనుదానిని ప్రకాశింపజేసే దీపము వంటిది. అభీష్ట సాధనమైనట్టి విచారణను ఆశ్రయించే మహనీయులంతా సంసార సముద్రమును దాటివేయ గలుగుచున్నారు. వివేకమును కప్పివేస్తున్నట్టి మహామోహ మంతటినీ, ఒక్క 'విచారణ' మాత్రమే పటాపంచలు చేయగలదు. మూఢులగువారు విచారణ లేకుండుటచేతనే కాలమునకు వశులై అనేక జన్మపరంపరలు పొందుచున్నారు. వారు ఎక్కడో కాకతాళీయంగా విచారణచే ఈ సంసార వ్యవహారమంతా గమనించినవారై "అయ్యో! అసంగతము,

అసత్యము, దోషపూరితము అయిన ఏదో భ్రమసమూహంలో చిక్కుకున్నట్లున్నామే? ఇదంతా ఎక్కడి నుండి దాపరించింది? అసలు ఇదంతా ఏమిటి? నేనెవడను?" అను సదసద్విమర్శ (ఏది సత్యము, ఏది అసత్యము? అను మీమాంస)కు వస్తున్నారు. అప్పుడు ఈ సంసారమును దాటుటకు ఉపాయములను వెతకి, పొంది, ఆచరించి ముక్తి నొందుచున్నారు. అట్లు ముక్తినొందగోరు వారికి ఈ శాస్త్రములో చర్చించబడిన విషయము ఎంతగానో సహకరించగలదని అందరికీ మనవి చేస్తున్నాము.

'ముక్తి' అనునది, "ఇందు ఏది సత్యము? ఏది అసత్యము? ఏది స్వప్నతుల్యము? ఏది వాస్తవము?" అని విచారించుట చేతనే సాధ్యపడుచున్నది. లౌకికమగు రాజ్యము, సంపదలు, భోగములు, పారలౌకికమైనట్టి మోక్షము – అన్నీ విచారణ – ప్రయత్నము (Enquiry & effort) అను రెండిటిచేతనే సిద్ధిస్తున్నాయి. విచారణ, వివేకములతో కూడిన బుద్ధి ఆపదలందు కూడా కృంగదు. ఎండిన సొరకాయ బుఱ్ఱ నీటిలో మునుగుతుందా? పరిశీలన, విచారణ అవలంబించువారు ఈ సంసార పటాటోపంచే మోసగించబడక, శ్రేష్ఠమైన ప్రయోజనమును లక్ష్యముగా కలిగి ఉంటున్నారు.

❖

ఓ జనులారా! దుఃఖమే అంతిమ ప్రయోజనంగా గల అనేక లౌకిక వ్యవహారములు మూర్ఖుల హృదయంలో తిష్ఠ వేసుకొని ఉంటున్నాయి. బహుచిత్రంగా ముముక్షుత్వమును కప్పివేస్తున్నాయి. నాయనలారా! ఈ జీవుడు 'మోహము'లో నిద్రిస్తున్నాడు. అట్టి మోహము అనేక దుర్భర దుఃఖములకు కారణమగుచున్నదని హెచ్చరిస్తున్నాను. అయితే "మోహనిద్ర" అనే పదము, "విచారణారాహిత్యము" అనుదానికి పర్యాయపదమే సుమా! అది కల్లువలె జీవునకు మత్తు గొలుపుతోంది. ఎన్నడైనా తేజః స్వరూపుడగు సూర్యుడు 'చీకటి'లో మునుగుతాడా? లేదుకదా! విచారణతత్పరుడైనవాడు, "విషయములు" అనే బురదతో నిండియున్న దీర్ఘ మోహమునందు నిమగ్నుడు కాడు. మరల మరల గుర్తు చేస్తున్నాను, 'జీవితము' అనుదానిలో అవిచారణ చేతనే మోహము అనునది తాండవించటం జరుగుతోంది.

విచారణచే వికసించిన మనస్సే శోభించుచున్నది. అయ్యో! మూఢబుద్ధులగు అనేకులు 'విచారణ' లేకుండానే జీవితం గడిపివేస్తున్నారే? ఎదురుగా ఏమాత్రం లేనట్టి దయ్యమును బాలుడు గాంచుచున్నట్లు, విచారణహీనుడు స్వల్ప విషయముల చేతకూడా హింసించబడుచున్నాడు. అతడు ఆపదలను, దుఃఖములను తాను పొందుచు, ఇతరులకు పంచిపెట్టుచున్నాడు. మూర్ఖుడై 'ఆత్మవిచారణ'కు సంబంధించిన సమాచారమే దరిచేరనీయుటలేదు. "ఇదంతా మాకేమి ఉపకరిస్తుంది? ఎవరో ఏదో చెప్పితే మేము బాగుపడతామా? ఎవ్వరు మాకు చెప్పలేరు. మా గతి ఇంతే" అని ఆత్మ విషయకమైన జ్ఞానాన్ని తిరస్కరిస్తూ, మొండితనము వహిస్తున్నాడు. "ఏది ఎట్లో అది అట్లే అగుగాక! మేమిట్లే ఉంటాము. దుఃఖములా? రానిండు. ఎవరము ఏమి చేస్తాం?" అని చెప్పుకుంటూ విచారణ చేయుటకుగాని, వినుటకుగాని సిద్ధపడనివారికి ఎవరం ఏమి చెపుతాం? అట్టివారిని దూరంగా త్యజించుటయే మంచిది.

'దయ్యము' అనబడుదాని అనుభవం చీకట్లో మాత్రమే ప్రాప్తిస్తుంది కదా! ఈ ప్రపంచంలో విచారణ లేకపోవుట చేతనే ఇతరులను హింసించటం, మానసిక వ్యాధులు మొదలైనవి సంభవిస్తున్నాయి. మా ఉద్దేశంలో వివేకహీనుడు నిర్జన ప్రదేశంలోని చెట్టులాగా నిష్ప్రయోజకుడే. ఏ మనస్సు వాంఛాశూన్యమై, విచారయుతమై ఉంటుందో, అయ్యది పరమానందమే పొందగలుగుతుంది. అట్టి ఉత్తమమైన మనస్సు విచారణ లేనివారికి లభించుట లేదు. విచారణ కలవానిబుద్ధి మాత్రమే పరమార్థ బోధకు తగి ఉంటుంది. "వివేకము" అనునది విచారణయొక్క ఫలితమేకదా! విచారణ సామర్థ్యము కలవారు తాము ఉన్నచోట సర్వ భవభయములను తొలగించుచు, దశదిశల శోభించు చున్నారు. ఒక్క 'విచారణ' అనునది మాత్రమే ఈ సంసార భయమును తొలగించ గలదు. అదే ఈ కనబడే దృశ్యమును అభూతమయంగా చేసి చూపగలదు.

❖

ఈ జగత్తులో ఉండే పదార్థములన్నీ విచారించి చూడనంతవరకే మనోహరంగా కనిపిస్తాయి. విచారించి చూస్తేనో, ఇదంతా మట్టి-రాయిలాగానే అసారమని తెలిసి పోతోంది. ఓ రామా! ఈ సంసారము అనబడే మనోభూతమును గమనించావా? ఇది మనుజుని మనోమోహంచేత మాత్రమే కల్పించబడింది. అనేక దుఃఖములను కల్పిస్తున్నట్టి ఇది, 'విచారణ' చేతనే లయించి పోతోంది.

'కైవల్యము' - అనునది సర్వవైషమ్యశూన్యము, సుఖప్రదము, బాధారహితము, అఖండితము అయున్నది. అదియే అనుభవపూర్వకంగా మేము చెప్పునది. అట్టి కైవల్యము సద్విచారణ చేతనే ప్రాప్తిస్తోంది. విచారణచే "నేను ఇట్టి మోక్ష స్వరూపుడనే" అను ఎరుక ఉదయించగా, అప్పుడు 'నిష్కామత్వం' (ఒకానొకటి పొందవలెననెడి భావావేశం లేకుండుట) దానంతట అదే ప్రాప్తిస్తోంది. అప్పుడు ఈ జీవుడే స్వయముగా ఉదారుడు, నిశ్చలుడు, ఆనందరస స్వరూపుడు అగుచున్నాడు. శ్రేష్ఠత్వమును ప్రసాదించగల 'విచారణ' అనే ఉత్తమ ఔషధం సేవించినవాని చిత్తము, ఇక దేనిని కోరుకొనదు. దేనిని త్యజించదు. స్వీకరించబడని చోట త్యజించటం ఏమి ఉంటుంది? అతడు క్రమంగా గ్రాహ్య-త్యాజ్యములను అధిగమించిన ప్రశాంత స్థితిని నిశ్చలం చేసుకుంటున్నాడు.

❖

చిత్తము బ్రహ్మభావమును ఆశ్రయిస్తే, ఇక వాసనలన్నీ తమంతట తామే నశిస్తాయి. అప్పుడాచిత్తము 'ఆకాశము'వలె ఉదయాస్తమయములు లేకయే ఉంటుంది. అట్టి వ్యక్తి ఈ విశాల జగత్తును కేవలం సాక్షివలె చూస్తూ ఉంటాడు. ఇక అతడు ఎప్పుడూ లోపలగాని, వెలుపలగాని నివసించడు. ఏ విధమైన దుఃఖమును పొందడు. "ఈ ఈ కర్మలు నేనే చేస్తున్నాను" - అను కర్తృత్వముండదు. కనుక కర్మలను ఆచరించనివాడే అవుతాడు. "ఈ ఈ కర్మలు ఇంకా ఎంతకాలం చెయ్యాలి?" అనునట్టి ఆరాటము కూడా పొందడు. ప్రవాహ పతితంగా ఆయా కర్మలు ఇంద్రియములచే చేయవలసి వస్తున్నప్పుడు ఏవి శుభప్రదమో, శాస్త్రవిహితమో, లోకమునకు అనుకూలమో, - అట్లే ఆ కర్మలనే నిర్వర్తిస్తాడు. తదనుకూలంగానే వ్యవహరిస్తాడు. కోల్పోయేదానికి

చింతించడు. లభిస్తున్న దానికి స్వాభిమానుడు కాడు. దుఃఖించడు. సంతసించడు. సముద్రమును చూచావుకదా! నదులనుండి అనుక్షణం జలం వచ్చి చేరుచున్నప్పుడు, మరియు సూర్య కిరణములు తనలోని జలం త్రాగివేస్తున్నప్పుడు అది తొణుకు-బెణుకు లేకుండానే నిర్లిప్తంగా, ప్రశాంతంగా ఉంటుంది కదా!

❖

ఓ రాఘవేంద్రా! చక్కగా విచారణ చేసియున్నట్టి జీవన్ముక్తులగు మహాశయులు, యోగులు అయినవారు తమయొక్క నిండైన మనస్సుతో ఈ జగత్తునందు సంచరించు చున్నారు. ఆ విధంగా వారు చిరకాలం వసించి, అటు తరువాత ఈ ఉపాధి వ్యవహారములను కూడా త్యజించి ఒకానొకప్పుడు అపరిచ్ఛిన్నమగు విదేహముక్తిని స్వభావానుకూలంగా పొందుచున్నారు.

'విచారణ' అనునది అత్యంత ముఖ్యమైనదని నేను చేతులెత్తి ప్రకటిస్తున్నాను. దృష్టాంతంగా ఒక చక్రవర్తిని తీసుకో. అతనికి కష్టకాలంలో ఏదైనా సందేహం వస్తే ఏం చేస్తాడు? "ఇది సత్ఫలమైనదా? లేక, నిష్ఫలమైనదా?" అని తన మంత్రులతో కూడి యోచిస్తాడు. చీకట్లో దీపమే ఉపకరణమగుచున్నది కదా! 'విచారణ' వలననే మానవుడు ఇటు కర్మకాండలోని, అటు జ్ఞానకాండలోని ధర్మ సూక్ష్మమును గ్రహిస్తున్నాడు. "ఇది ధర్మం. ఇది అధర్మం. ఇది ఉచితం. ఇది అనుచితం" అని లౌకిక విషయాలను నిర్ణయించుకుంటున్నాడు. ఇదంతా మనం చూస్తున్నదే కదా! అదే విధంగా విచారణ చేతనే బ్రహ్మతత్త్వము కూడా గాంచగలరు.

'విచారణదృష్టి' అనునది ఈ భౌతిక దృష్టి వంటిది కాదు సుమా! అందుచేత అది చీకటిచే వినష్టం కావటంగాని, లేక అమిత తేజస్సును చూచి చెదిరిపోవటం గాని జరుగదు. అట్టి విచారణదృష్టికి ఎంతో దూరంగా ఉన్నవి, భూత భవిష్యత్ వర్తమానములలో ప్రాప్తించేవి కూడా కనబడతాయి. మా దృష్టిలో వివేకరహితుడే నిజమైన గ్రుడ్డివాడు. అతని స్థితి అతి శోచనీయం. వివేకము కలవాడే చివరికి అన్నిటిలోను, అందరిలోను ఉత్తముడగుచు, జయిస్తున్నాడు. ఈ 'ఆపదలు' అను వాటిని ప్రక్కకునెట్టి 'ముక్తుడు' అగుచున్నాడు.

ఓ రామా! వివేకము అనబడే మహత్తరమైన సుందరవస్తువు వలననే పరమాత్మ సులభ్యుడగుచున్నాడు. అందుచేత వివేకమును ఒక్క క్షణమైనా విడిచి ఉండరాదు. జ్ఞానులు వివేకవంతుని మాత్రమే కనికరించి ఆత్మవస్తువును బోధించుచున్నారు.

వివేకమును ఆశ్రయించినవారు మాటిమాటికీ గుంటలలో పడరు. విచారణ లేకపోవటమనేది ఆత్మఘాతుకం, ఆత్మద్రోహం కూడా. అట్టి మూర్ఖుడు జన్మ జన్మాంతరాలుగా అనుభవించే బాధల ముందు విషశస్త్ర ఘాతాలు కూడా ఎందుకూ పనికిరావు. విచారణహీనుడు మనుజుడై పుట్టి లాభమేమున్నది చెప్పు? అంతకంటే బురదలో కప్పగానో, మలములో కీటకముగానో, అంధకారంలో పాముగానో పుట్టడం మంచిది. (కనీసం, 'మానవజన్మ' అనే మహత్తర అవకాశం లభించి వృథా అయినట్లన్నా అవదు). పరిశీలనారాహిత్యమే సకల అనర్థముల నివాసభూమి. అందుచేతనే సాధు

పురుషులు విచారణ రహితులగు జనులను తిరస్కార భావంతో చూస్తారు. ఈ జీవుడికి ఎక్కడెక్కడినుండో అనేక దుఃఖములు, అనర్థములు వచ్చిపడుతున్నాయంటే దానికి మూలకారణం అవిచారణ, దూరదృష్టి మాంద్యములేనని గుర్తు చేస్తున్నాను. 'రాగ ద్వేషములు' అనే అంధకార కూపంలో (చీకటి నుయ్యిలో) చిక్కుకొన్నజీవుడు నిరంతరం విచారణను ఆశ్రయించి ఉంటేనే, ఎప్పటికైనా, ఆ నుయ్యిలోంచి బయటపడగలడు.

❖

"నేను ఎవడను? ఈ సంసారదోషమంతా నాకు ఎక్కడి నుండి వచ్చిపడింది?" – అను ప్రశ్నలకు జీవుడు మొట్టమొదట రావాలి. వాటి సమాధానము కొరకు సాధు పురుషులను, ఆత్మవిషయ ప్రతిపాదకములగు శాస్త్రములను, స్వబుద్ధిని ఆశ్రయించాలి. సునిశితమైన బుద్ధిచే విజ్ఞానపూర్వకమైన పరిశీలనం చెయ్యాలి. అట్టి పరిశీలననే "విచారణ" అని పిలుస్తున్నాం.

విచారణ హీనుని హృదయం రాయి కంటే మౌఢ్యమైనది. గ్రుడ్డికంటే గ్రుడ్డిది. ఆ హృదయం మోహము వలన మరింత ఘనీభవించి, నిరంతరం అనేక దుఃఖములను చేకూర్చుకుంటోంది.

ఓ రామచంద్రా! ఈ భూమిపై అనంత సంఖ్యలో జీవులు పుట్టుచున్నారు. చస్తున్నారు. అయితే వారిలో కొందరు మాత్రమే సత్యమును గ్రహించుటకు, అసత్యమును పరిత్యజించుటకు ప్రయత్నిస్తున్నారు. అట్టివారు మాత్రమే వందనీయులగుచున్నారు. వారు తత్త్వమును పరిపూర్ణముగా ఎరుగుటకుగాను 'విచారణ' అనుదానినే ఆశ్రయిస్తున్నారు. అందుకు వేరే ఉపాయమేమీ లేదు.

విచారణ → తత్త్వజ్ఞానం → ఆత్మవిశ్రాంతి → మనశ్శాంతి → దుఃఖవినాశనము.

కాబట్టి విచారణయే మనశ్శాంతిని, దుఃఖ నాశనమును ప్రసాదించగలదనుటలో సందేహం ఏమాత్రం లేదు. జనులంతా వివేకపూర్వకమైన విచారణను ఆశ్రయించి "ఇది ఇట్లు చేయుట ఉచితము" అని నిశ్చయించుకొని, ఆపై లౌకికమైన, వైదికమైన ప్రయోజనములను పొందుచున్నారు కదా! 'ఆధ్యాత్మ విషయం' కూడా అట్టిదేనని మరల మరల ప్రకటిస్తున్నాను. ఉత్తమ విచారణయే లేకపోతే లోకంలో సత్కర్మలు ఉండవు. హింస, లోభము, జాతిద్వేషము, మాత్సర్యము మొదలైనవన్నీ అవిచారణ చేతనే ప్రబలుచున్నాయి. ఓ రాఘవా! అత్యంత శమముతో కూడుకొని ఉన్నట్టి నీకు కూడా 'విచారణ' అనునదే ప్రీతికరమగుగాక!

❖❖❖

## 20. సంతోషము

**సంతోషోహి పరంశ్రేయః సంతోషః సుఖముచ్యతే ।**
**సంతుష్టః పరమభ్యేతి విశ్రామమరిసూదన ॥** (XV. 1)

ఓ శత్రుమర్దనా! రామచంద్రా! "సంతోషము" అనునది పరమ శ్రేయస్సు, సుఖము, విశ్రాంతి, మోక్షము కూడా అయివున్నది. అట్టి 'సంతోషము' అను దానిని సొంతం చేసుకొన్నవారికి సంపదలు,

రాజ్యాధికారములు, వందిమాగధ జనము వంటివి కూడా ఎండుగడ్డి పరకలవలె అతి తుచ్ఛమైనవే అయి ఉంటాయి.

సంతోషముతో కూడిన బుద్ధిని సంపాదించినవారు ఈ సాంసారిక దుఃఖములు వాటిల్లినప్పుడు తల్లడిల్లకుండా ఉంటున్నారు. సుఖములు పొందినప్పుడు తబ్బిబ్బు కాకుండా ఉంటున్నారు. ఆ మహనీయులు స్వయంగా సంతోషమనే అమృతం త్రాగి తృప్తులై, శాంతియుతులై ఈ భూమిపై సంచరిస్తున్నారు. వారికి ఈ భోగసంపదల యొక్క అర్థమేమిటో తెలియదు. (వీటిలో వారికి క్రొత్తగా ప్రాప్తించవలసినదేదీ కనిపించదు). మధురమైన సంతోషం అనే గుణం ఆశ, దైన్యము మొదలైన దుర్భరమైన అల్ప గుణములను నశింపచేస్తుంది. అన్నివైపుల ఆనందం వెల్లివిరియచేస్తుంది.

'సంతోషం' అంటే ఏమిటి?

**అప్రాప్త వాంఛాముత్సృజ్య సంప్రాప్తే సమతాంగతః**
**అదృష్టఖేదాఽ ఖేదో యః ససంతుష్ట ఇహోచ్యతే ॥** (XV.259)

ప్రాప్తించని వాటి గురించి వేదన చెందక, పొందిన వాటి గురించి తబ్బిబ్బుకాక, సుఖ-దుః ఖములచే చంచలుడుగాక, ఖేదాఖేదములకు అతీతుడై ఉండువాడే సంతుష్టుడు. సర్వదా పొందబడియే ఉన్నట్టి స్వస్వరూపముచే ఆనందము పొందుచు సర్వులను, సర్వమును ప్రశాంతముగా దర్శించువాడే సంతుష్టుడు. అట్టివాని మనస్సు తనయందు తానే మౌనస్వరూపమైన తృప్తి, ఆనందములను పొంది ఉంటుంది.

వాస్తవానికి ఈ జీవుడు స్వతహాగా ఆనందస్వరూపుడే కదా! అయితే మనస్సు వివిధ విషయములను కోరుకోవటం ప్రారంభించుటచే, అట్టి వాంఛలనుండే సర్వ మనోరుగ్మతలు వచ్చిపడుచున్నాయి. సంతోషముచే శీతలము పొందిన చిత్తమునందే విశుద్ధమైన విజ్ఞానము వికసిస్తోంది. సంతోష సూర్యుడు ప్రకాశించే చోట "దిగులు – అసూయ – దోషదృష్టి" మొదలైనవాటి రూపమైన అజ్ఞానపు చీకటి తొలగిపోతోంది.

'ఆశ' అనుదానికి వివశమై సంతోషం కోల్పోతున్న చిత్తము ధూళిచే కప్పబడిన 'దర్పణము' వంటిది. అందు జ్ఞానవాక్యములు ఎట్లా ప్రతిబింబిస్తాయి చెప్పు? "మాకీ లోటుపాట్లన్నీ ఉన్నాయి కదా! మేము జ్ఞాన విషయాలు ఎట్లా వింటాం? మేము పొందాలనుకొన్నవి పొందనివ్వండి. అప్పుడు చూద్దాం" అని జీవుడు ఆశల వెంటే పోవుచున్నాడు. దుఃఖించుట, ద్వేషించుట, ఒకరినొకరు తప్పులు ఎంచుకొనుట – ఇవే అలవాటు అయి ఉంటున్నాయి. "సంతోషముగా ఉండుట" అనునది ఎందుకు అభ్యాసముగా (As a Practice) చేసుకోరాదు? సంతోష మనస్కుని నుండి శారీరక – మానసిక వ్యాధులు దూరంగా ఉంటాయి. ఒకానొకడు నిరుపేదయే అయినప్పటికీ, అతడు కనుక తన మనస్సు నందు ఆకృత్రిమమైన 'సంతోషము'ను నింపుకోవటం జరిగితే అట్టివాడి ముందు ఈ రాజ్యాలు ఏలే వాళ్ళుకూడా ఎందుకూ పనికిరారు. "అట్టి అభ్యాసము తప్పకుండా సాధ్యమే" అని సర్వజనులను దృష్టిలో పెట్టుకొని చెప్పుచున్నాం.

**నాభివాంఛత్యసంప్రాప్తం ప్రాప్తం భుంక్తే యథాక్రమమ్**
**యః సుసౌమ్య సమాచారః సంతుష్ట ఇతి కథ్యతే ॥** (XV. 12)

అప్రాప్తములైన విషయముల గురించి ఖేదము చెందకుండా, ప్రాప్తములైన వాటిని ఉత్తమ అవగాహనతో అనుభవిస్తూ, సౌమ్యమైన ఆచరణ కలిగియుండే వానికి 'సంతోషము' ఒక అలవాటుగా అవగలదు. అట్టి సంతోషముతో పరిపూర్ణముగ తృప్తి పొందిన విశుద్ధ చిత్తముగల మహాత్ముని వదనము చూచినవారు అనిర్వచనీయమైన సంతోషానుభవం పొందుతారు. లక్ష్మీదేవి వేంచేసియున్న క్షీరసముద్రం ఎట్లా ఉంటుందో ప్రసన్నత్వము సంతరించుకొనియున్న అతని ముఖము కూడా అట్లే అత్యంత శుభదాయకమై ఉంటుంది.

❖

ఓ జనులారా! మీరు సర్వదా నిరతిశయమైన ఆనందరూపమునే అవలంబించండి. అభ్యాసవశంచేత ఇది తప్పక సాధ్యమే. "మేము ఏమి పొందామని?" అని స్వల్ప విషయములను దీర్ఘ దర్శనం చేయుటచే మీకు అట్టి అభ్యాసం కొరవడుతోంది. స్వయంకల్పిత దోషములైనట్టి తృష్ణ, అసంతృప్తులు అత్యంత ప్రమాదకరమైనవి. అవి మనస్సును అనేక దోషములచే, మోహములచే, అపార్థములచే నింపివేస్తున్నాయి. అందుచేత పౌరుషబలం చేత తృష్ణను జయించి వేయండి. 'తృష్ణ' ఉన్నచోట సంతోషమెట్లా ఉంటుంది చెప్పండి?

'సంతోషము' అను మాధుర్యముతో నిండియున్న చిత్తము స్వయముగా తనంతట తానే శాంత శీతలమగు బుద్ధి స్థైర్యములను పొందుతోంది. సంపదలు కూడా సంతోష చిత్తుని భృత్యునివలె అనుసరిస్తున్నాయి. తనయందు తానే సంతుష్టుడైన వాడు ఇతరుల శారీరక-మానసిక రుగ్మతలను క్షీణింపచేయగలడు. కళంకరహితము, శీతలము, విశుద్ధము అయినట్టి చిత్తవృత్తి స్వయంగా సంతోషమును పొందుతోంది. అట్టి చిత్తవృత్తి కలవాడు సమబుద్ధితో కూడుకొనినవాడై ప్రశాంతము, మౌనము, ఆనందము, ఉత్సాహము ఒకే సమయంలో తన ముఖమునందు ప్రకటించుచున్నాడు. అట్టి వాని ముఖము చూచినంత మాత్రం చేత మనందరికీ ఆనందము, సుఖము కలుగుచున్నాయి. అట్టి పురుషుడు తారస పడినప్పుడు ఆతనికి దేవతలు, మునులు కూడా నమస్కరించుచున్నారు.

❖❖❖

## 21. సాధు సాంగత్యం

ఓ రఘురామా! మహాత్ములు సాధుసాంగత్యాన్ని, తద్వారా లభించే ఉత్తమ వివేకమును సర్వదా కాపాడుకుంటూ ఉంటారు. అదే మోక్ష ఫలమును ప్రసాదించ గలదని వారు ఎరుగుదురు. ఒక వ్యక్తి యొక్క అభ్యున్నతి - పతనములను అతడు ఆశ్రయించు స్నేహములే నిర్ణయిస్తాయి.

ఈ లోకంలో ఉత్తమ పురుషులైనవారు, విద్వజ్జులు, ఆత్మవిషయమై పూర్ణులైనవారు - కొందరు సంచరించుచున్నారు. వారితో సమాగమం శూన్యప్రదేశమును కూడా జనమయం చేస్తుంది. మృత్యువు

కూడా ఉత్సవంగా, ఆపదలు కూడా సంపదలుగా మారిపోతాయి. మోహము కూడా అట్టి స్నేహప్రభావం చేత తప్పక తోక ముడుస్తుంది.

**హిమం ఆపత్ సరోజిన్యా, మోహనీహార మారుతః ।**
**జయత్యేకో జగత్యస్మిన్ సాధుః సాధుసమాగమః ॥** (XVI.4)

"ఆపదలు అనే పద్మములకు మంచును, మోహమనే మంచునకు మారుతమూ అయనట్టిది సాధుత్వము. సాధుత్వము పొంద యత్నించువారే సాధుసాంగత్యము పొందుచున్నారు." అట్టి సాధువులు – ఆ సాధువులను ఆశ్రయించినవారు కూడా ఈ జగత్తును అతి సులభంగా జయించి వేస్తున్నారు. సాధు సాంగత్యం వలన బుద్ధి సునిశితమౌతుంది. అనాదిగా పెరిగి ఊడలు వేసుకొనియున్న 'అజ్ఞానము' అనే విశాలవృక్షం, "సాధు సంగం" అనే ఝంఝామారుతం చేత కూకటివ్రేళ్లతో సహా పెకలించివేయబడగలదు. మనోవ్యాధులు వాటంతట అవే నశిస్తాయి. మనోహరమైన సువాసనలు వెదజల్లగల వివేకము ఉదయిస్తుంది. అట్టి సాధుసమాగమములకు సర్వదా దిగ్విజయమగుగాక!

సాధు సంగం పొందుచున్నవాని సంపదలు కూడా అనపాయకరమై, బాధారహితమై, నిత్యప్రవర్ధకమై యజమానికి శుభమే చేకూరుస్తాయి. కొందరు, "అనేక సమస్యలచేత సతమతమగుచున్న మాకు సాధు సంగానికి సమయమెక్కడిది?" అని సరిపుచ్చుకొంటున్నారు. అయితే, మనిషి కష్టముల చేత వివశుడగుచున్నప్పుడు సాధుసంగం మరీ ముఖ్యమని నేను గుర్తు చేస్తున్నాను. అది దీపపు వెలుగువలె హృదయములోని చీకటిని తొలగించివేస్తుంది. 'జ్ఞానప్రకాశము' అనే శాశ్వతమైన వెలుగును ప్రసాదిస్తుంది. చిత్తశుద్ధిని, మంచి ప్రవర్తనను మనశ్శాంతిని ప్రసాదించగలిగే సత్పురుషుల సాంగత్యమే ఉంటే – ఇక, ''గంగాస్నానం చేయలేదే? యజ్ఞ తపోధ్యాన తీర్థాదులు సేవించలేకపోతున్నామే?" అనే బెంగతో మానవునికి పనిలేదు.

ఓ రామచంద్రా! రాగశూన్యులు, మమకారాహంకారాలు లేనివారు, సందేహ రహితులు అయినట్టి సాధు పురుషులతో స్నేహం లభించటమంటే * – అది మహత్తరమైన విషయమేసుమా! ఎందుకంటే, నీవు కూడా రాగరహితుడవైతేగాని, వారితో స్నేహము చేయగల బుద్ధి పుట్టదు.** అట్టి మహాపురుషులు ఎక్కడన్నా తారసపడినా రాగబద్ధులైన జనులు వారిని గుర్తించలేరు. వారి

---

* "మహత్సంగస్తు దుర్లభో, అగమ్యో, అమోఘశ్చ. లభ్యతే తత్కృపయైవ"॥ మహనీయులతో స్నేహం దొరకటం దుర్లభమే. కాని దొరికిందా, అమోఘమైనది. అది ఆ పరమాత్మయొక్క కృపచేత మాత్రమే లభించగలదు.

*(నారదభక్తి సూత్రాలు)*

** **దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహేతుకమ్ ।**
**మనుష్యత్వం, ముముక్షుత్వమ్ మహాపురుష సంశ్రయః ॥** – *వివేకచూడామణి; ఆదిశంకరులు*

మనుష్యజన్మ, మోక్ష స్వరూపులం కావాలనే లక్ష్యము, మహాపురుషులతో స్నేహం – ఈ మూడు భగవంతుని అనుగ్రహంచేతనే లభిస్తాయి. అందుచేత మనం మహాపురుషులతో సాంగత్యం కలిగియుండుటకు ప్రయత్నించాలి.

స్నేహమును (స్వాభిమాన కారణంగా) పొందలేరు. ఆత్మజ్ఞానులగు మహనీయులతో సామీప్యత గొప్ప తపస్సు, తీర్థములతో సమానం. అది అతి పవిత్రమైనదని సర్వజనులు గ్రహించెదరు గాక! దరిద్రునకు ఒక మణి లభించటం ఎటువంటిదో, జ్ఞానులతో స్నేహం అట్టిదని విజ్ఞుల అభిప్రాయం. కనుక వినయము, గౌరవము, స్నేహము, సహకారము మొదలైన సత్ప్రవర్తనతో, సద్భావముతో జనులు అట్టివారి స్నేహములకై యత్నించాలి.

ఎంత ప్రయత్నం చేసైనా సరే, సాధుపుంగవుల దర్శనం చేసుకోవాలి. వారితో సంభాషణమే పూర్వజన్మ సుకృతం అనక తప్పదు. బుద్ధి, మేధస్సు కూడా సత్సంగమము వలన సౌందర్యమును పొంది, సునిశితమౌతాయి. సాధుసంగం వదలనివాడు నిర్మల విచారణచే తప్పక బ్రహ్మపదమును పొందుతాడు.

బంధరహితులు, తత్త్వజ్ఞులు, సర్వ సమ్మతులు అగు సాధుపుంగవులు మనకు అక్కడక్కడ తారసపడుతూనే ఉంటారు. వారిని తప్పకుండా సేవించాలి. గౌరవించాలి. సర్వ ప్రయత్నములచే సంతసింపచేయాలి. ఎందుకంటావా? ఈ సంసార సముద్రం దాటటానికి వారే ఉపాయ స్వరూపులు సుమా! ఈ జీవుడిని నరకాగ్నులు సమీపిస్తుంటే వారు ఆ అగ్నులను ఆర్పగల వర్షధారలవంటివారు. అంతటి సాధు పురుషులను అనాదరించటం ఎంతటి దౌర్భాగ్యమైన విషయం! అట్టి అనాదరణ చేయువారు నరకాగ్నులకు ఇంధనం కాదలచుకొన్నారా? ఓ రాఘవా! దారిద్ర్యం, దుఃఖం, మోహం, అజ్ఞానం మొదలైన సంసార రోగములకు సాధుపుంగవుల సాన్నిధ్యమే ఔషధం. వారి వచనామృతము వలన మాత్రమే పూర్ణార్థపూరితమైన అవగాహన వృద్ధి చెందుతోంది. తద్వారా లోకంలో శాంతి స్థాపించబడగలదు.

❖❖❖

## 22. మార్గాన్వేషణం

చూచావా రామా! సాధన చతుష్టయములైనట్టి సంతోషము, శమము, విచారణ, సాధు సంగం – అనేవి సంసార సాగరము నుండి తరింపచేసే ఉపాయాలు.

**సంతోషః పరమోలాభః ! సత్సంగః పరమాగతిః !**

**విచారః పరమం జ్ఞానం ! శమోహి పరమం సుఖమ్ ॥** (XVI.19)

సంతోషమే పరమలాభము. సత్సంగమే పరమగతి. విచారణమే పరమజ్ఞానం. శమమే పరమసుఖం. ఈ నాలుగు రకములైన ఉపాయములను అభ్యసించేవారే ఘనీభూతమైయున్న ఈ మోహజాలమును జయిస్తున్నారు. వీటిలో ఏ ఒక్కటైనా సర్వశక్తి యుక్తులచే అభ్యసింపబడినప్పుడు, మిగతా మూడు కూడా లభిస్తున్నాయి. అందుచేత రామా! తాత్సారం చెయ్యకుండా ఎంతటికైనా సిద్ధపడి అందులో ఒక్కదానినైనా అభ్యసించాలి.

స్వచ్ఛమైన శమము వలన హృదయం నిర్మలమైనప్పుడు అట్టివాని వద్దకు మిగతా మూడు వచ్చి చేరుచున్నాయి. సంతోష, విచార, సాధు సాంగత్యాలు ఉన్నచోట 'జ్ఞానం' రూపు దిద్దుకుంటోంది. సుగుణములన్నీ ఆశ్రయిస్తున్నాయి. విజయలక్ష్మి వరించుచున్నది.

ఓ జనులారా! మీరంతా "స్వప్రయత్నము" అనబడే పురుషకారం చేత మనస్సును జయించి, ఈ నాల్గిటిలో ఏ ఒక్కదానినైనా నిరంతరం ప్రయత్నపూర్వకంగా అవలంబించ కోరుచున్నాను. "శ్రద్ధతో, ఓర్పుతో, నేర్పుతో ఒక్కదానినైనా దైనందికమైన అలవాటుగా మార్చుకోండి" – అని మీ శ్రేయోభిలాషులమగు మేము మరలమరల చెప్పుచున్నాం. కొంచెం కొంచెం ఈ నాల్గిటిని ఆశ్రయిస్తూ పోగా, కొంతకాలానికి అంతా సుసాధ్యమే అవుతుంది. మొదట్లో కొంత పట్టుదల వహించి, ఆ తరువాత, ప్రయత్నము వీడకుండా ఉంటే మీకు సాధ్యము కానిదంటూ ఏదీ ఉండదు. కొంతవరకు సాధించగలిగినా, అక్కడి వరకు, మీకు శుభమే కలుగుతుంది. అసలు ప్రయత్నమనునదే చేయకుండా, "మానవమాత్రులం! మావల్ల ఏమౌతుంది?" అని మిమ్ములను మీరే సముదాయించు కుంటూ తుచ్ఛ విషయములకై పరుగిడితే అది మూర్ఖత్వమే కదా! ఎందుకంటే మానవులలోనే అత్యంత మహనీయులు, ఆత్మజ్ఞులు ... అత్యంత మూర్ఖులు కూడా ఉన్నారు. అందుచేత సాధన పూనండి. అసలు ఉన్న రహస్యమంతా సాధనలోనే ఉన్నదికాని, దైవమునందు కాదు.

ఈ చిత్తము అనుదానిని పురుషకారంతో (పౌరుషంతో) జయించి ఈ నాల్గిటిలో ఒక్కదానినైనా వశం చేసుకుంటేనే 'ఉత్తమగతి'. అట్లా కాకుండా, చిత్తము యొక్క ఇచ్ఛ ప్రకారం వర్తించటం, ఇంద్రియ విషయములను మాత్రమే ఆశ్రయించటం, కల్పిత వ్యవహారములనే నమ్ముకొని ఉండటం ... అది శుభప్రదమౌతుందా? పళ్ళతో పళ్ళు నొక్కిపెట్టి ఎట్లాగైనా సరే, ఈ నాల్గిటి కొరకు యత్నించెదరు గాక!

❖

ఒకానొకడు 'మానవుడు' అగుగాక! లేదా దేవత అగుగాక! యక్షుడు అగుగాక! లేదా ఒక చెట్టు అగుగాక! ఏది ఏమైనా ఉత్తమ గుణములు ఆర్జించకపోతే గతిలేదని గ్రహించాలి. ఈ చంచల చిత్తము అనుక్షణం అనేక గుణదోషములనే, ప్రీతిపూర్వకంగా, ఆశ్రయిస్తోంది. ఆ గుణదోషములను మొట్టమొదట జాగ్రత్తగా గుర్తించాలి. అయ్యో! ఈ సాంసారిక జీవులు తమ చిత్తమును ఆశ్రయించు గుణ దోషములేమిటో గమనించుటకు కొంచెమైనా ప్రయత్నించకుండా, పరుల దోషములు మాత్రం మహా తెలివితేటలతో ఎంచుచు కాలం వెళ్ళబుచ్చుచున్నారే? ఇది అత్యంత దౌర్భాగ్యకరమైన విషయం. అట్టి మూర్ఖజనులకు ధిక్కారమగు గాక!

అయితే స్వచిత్తము యొక్క గుణదోషములు తొలగేదెట్లా? సుగుణములను ఆశ్రయించుటయే అందుకు ఉపాయం. "క్రమక్రమంగా సుగుణములను ఆశ్రయిస్తూ పోగా దోషగుణములు సన్నగిల్లుతాయి. దోషగుణములు వృద్ధిచెందుచున్న కొద్దీ, సగుణములు బలహీనపడతాయి" – అని కూడా గుర్తు పెట్టుకోండి.

కనుక రామచంద్రా! నీకు ఏ త్రోవ కావాలో ఈ బాల్యంలోనే నిర్ణయం చేసుకో. చక్కగా విచక్షణ చేయి. మార్గాన్ని అన్వేషించు. అనుసరించు. అంతేకాని, దుఃఖిస్తూ కూర్చుంటే నీకుగాని, నీ వలన మరెవరికి గాని ఎట్టి లాభం ఉండదు.

ఈ మనస్సు తనయొక్క వాసనా వేగంతో (force of tendencies) ఎప్పటికప్పుడు జీవుని ముంచెత్తుతోంది. అయితే అట్టి వాసనలు, నదికి రెండువైపుల ఉన్నట్టి గట్లవలె, శుభ-అశుభ రూపములలో ఉంటున్నాయి. 'శుభం' అనే ఆవలి ఒడ్డుకు చేరుతావా? 'అశుభము'నే ఆశ్రయిస్తూ రోజులు గడుపుతావా? నీ ఇష్టం. ప్రయత్నమును బట్టే ప్రయోజనం ఉంటుంది. తాత్సారం చేసేవారికి అనేక జన్మలు గడచిపోతున్నాయేగాని, నివృత్తి లభించటం లేదు. కాబట్టి రాఘవా! పురుషకారమును ఆశ్రయించు. అప్పుడు అశుభవాసనలు నిన్ను ఏమాత్రం సమీపించలేవు.

❖❖❖

# 23. దృష్టాంతములు

ఓ రామచంద్రా! ఏదైనా ఒకానొక క్రొత్త విషయం గురించి ఒకరికి తెలియజేయాలనుకున్నామనుకో. అట్లు తెలియచేయుటకు వీలుగా రోజూ చూచే విషయాలను ఉపమానంగా తీసుకొంటూ ఉంటాము. అట్లు విషయమును గ్రహింప చేయుటకు ఉపకరించే ఉదాహరణనే 'దృష్టాంతము' అని అంటున్నాం. రాత్రిపూట గదిలోని వస్తువులను దీపం లేకపోతే గ్రహించలేము కదా! దృష్టాంతముల సహాయం లేకపోతే శిష్యునకు ఒకానొక నూతనార్థం బోధించటం చాలా కష్టం. అసాధ్యమేమో కూడా. ఎందుకంటావా? గురువు తపోధ్యానాదులచే ఎంతో ప్రయత్నించి సత్యమును గ్రహించి ఉంటాడు. సత్యమును అత్యంత వివేక దృష్టితో చూస్తూ ఉంటాడు. కాని శిష్యుడో - మనస్సునందు అనేక జన్మలలో పేర్చుకొనియున్న దుర్వ్యసనములను, దురభిప్రాయములను పొరలుగా కలిగియుంటాడు. కాని, సత్యమును గ్రహించుటకై ఆరాటపడుతూ ఉంటాడు. వాస్తవానికి 'సత్యము' నిర్దుష్టమైనది. సుస్పష్టమైనది. ఒక్క వాక్యంలో చెప్పగలిగేదే. కాని శిష్యుని వివేకము అంతటి సునిశితంగా (అనేకమంది విషయంలో) ఉండదు. అందుకే బోధకులంతా దృష్టాంతాలు ఉపయోగించుచున్నారు.

❖

అయితే ఒక్క విషయం నీవు గమనించాలి. దృష్టాంతాలన్నిటికీ 'కారణము' అనేది ఒకటి ఉంటుంది. కాని జ్ఞేయము, సర్వప్రయత్నముల ప్రయోజనకంగా తెలియబడే ఆత్మవస్తువు, సద్వస్తువు అయినట్టి 'పరబ్రహ్మము' అనునది సర్వదా కార్య- కారణరహితమైయున్నది. కారణము లేదు కనుక నిత్యమైనది కూడా. ఈ విధంగా, ఒక్క పరమాత్మయందు తప్ప తక్కిన ఉపమాన - ఉపమేయములందు కొంత కార్య - కారణ భావములు ఉండనే ఉంటాయి.

ఈ బ్రహ్మోపదేశ సందర్భంలో కూడా నేను కొన్ని దృష్టాంతాలు ఉపయోగించ బోతున్నాను. అయితే, నేను ఒక దృష్టాంతమును ఏ బోధయొక్క అంశమును (విషయమును) దృష్టిలో పెట్టుకొని చెప్పుచున్నానో అది గ్రహిస్తూ ఉండాలి. అంతవరకే ఆ దృష్టాంతము గ్రహించాలి. అందుచేత నీవు నిర్మలమైన, సూక్ష్మమైన బుద్ధితో నేను చెప్పేది విను.

ఉదాహరణకు "త్రాటియందు పాము వలె, బ్రహ్మమునందు జగత్తు కలదు" అని మనం చెప్పుకున్నామనుకో. ఇందులో వివర్తాంశమును (that deduced) మాత్రమే గ్రహించాలి. అనగా చీకట్లో త్రాడు 'సర్పము' అనే పదార్థంగా తోచుచున్నట్లే బ్రహ్మమే సర్వదా ఉండి ఉన్నది. చూచేవారి భ్రమ వలన జగత్తు అనబడుదానిగా తోచుచున్నది" – అని గ్రహించాలి. అంతేకాని, "ఏ విధంగా బ్రహ్మము నిత్యము, అఖండము, నిరతి శయానందము అయిన స్వభావము కలిగియున్నదో, అట్లే ఈ జగత్తులోని పదార్థ జాలం అట్టి స్వభావమే కలిగి ఉన్నది" – అనే నిశ్చయానికి రాకూడదు.

బ్రహ్మమును బోధించటానికి మనం తీసుకొనే ఉపమానాలన్నీ స్వప్నవస్తువుల లాగా, మిథ్య అయినట్టి ఈ జగత్తులోనివే కదా! అయితే ఏం? అట్టి ఉపమానములు మేము ఉపయోగించి శిష్యుని అజ్ఞానం తప్పకుండా పోగొట్టగలుగుచున్నాం. అందుచేత, "నిరాకారమగు బ్రహ్మము విషయంలో సాకారమగు దృష్టాంతాలు ఎందుకు పనికి వస్తాయి?" అని తలచి బోధకు తిరస్కరించకండి.* ఓ సర్వ సభికులారా! నేను ఏది దృష్టిలో పెట్టుకొని ఒకానొక దృష్టాంతము చెపుతూ వస్తున్నానో, అది గ్రహించగలిగినట్టి సుతీక్ష్ణమైన బుద్ధి మీరంతా కలిగిఉండాలి సుమా!

పరమవస్తువును ఏ ఒక్క దృశ్య పదార్థముతో కూడా పోల్చి "ఇది ఇట్టిది" అని చెప్పలేనిమాట నిజమే. ఎక్కడ వాక్కు, మనస్సు గ్రహించజాలక వెనుకకు మరలుతాయో, ఏదైతే 'అనుభవమాత్రమే' అయి శేషించుచున్నదో, అట్టి ఆత్మతత్త్వం విషయంలో ఏది సమగ్రమైన దృష్టాంతముగా ఉపయోగించగలదు చెప్పు? అందుచేత ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క విశేషమును ఒక్కొక్క దృష్టాంతమును ఉపయోగించి ప్రతిపాదిస్తున్నాం. దృష్టాంతముల సహాయంతో "ఇది మాత్రం ఇట్లు కాదు" అని తప్పక ప్రతిపాదించి చూపుచున్నాం. నేను ఉపయోగించే ఒక దృష్టాంతమును మాత్రమే దృష్టిలో పెట్టుకొని, "ఈ దృష్టాంతములోని దోషము ఇది. కనుక వీరు చెప్పేది కుదరదు" అని వితండవాదాలు చేసుకోకండి. దృష్టాంతాలను చూచి మాచే ప్రతిపాదించబడుచున్న బ్రహ్మతత్త్వము యొక్క అస్థిత్వమును తిరస్కరించే వారితో వాదించి లాభమేమున్నది?

కొంచెం విచారించిచూస్తే, ఈ జాగ్రదవస్థలోని వస్తువులకు, స్వప్నావస్థలోని వస్తువులకు భేదమేమి లేదు. ఇది కల్పనచే ఇప్పటికి సత్యమువలె అనిపిస్తున్నట్లే స్వప్న సమయంలో కూడా స్వప్నదృశ్యం సత్యమనియే అనిపిస్తోంది. అయితే ఈ రెండూ మిథ్యయే. అందుచేత ఈ జగత్తు సర్వ కాలములందు అవస్తువే అయివున్నది. ఆహా! చూచావా రామా! ఎంతటి చమత్కారమో! సరే, –

---

*గణితం (Mathematics) లో "X" అనుకొనుము అని అంటాం. "X" – అనునది ఒక అక్షరం కదా! ఆ కావలసిన సమాధానం ఒక సంఖ్య కదా? – అని అనుకొంటున్నామా?

ఇప్పుడు, "బాల్యము నుండి మనలను ఆవహించియుండే ఈ 'జగత్తు' అనే భ్రమ మిథ్యయే" అనునట్టి నగ్న సత్యము బోధించుట ఎట్లా? అందుకుగాను మేము "స్వప్నము, సంకల్పము, ధ్యానము, వరము, శాపము, ఔషధము" – ఇత్యాది అనేక దృష్టాంతాలు సమయోచితంగా తీసుకొని చెప్పుచున్నాం. అప్పుడా శిష్యుడు, "ఔను. నిజమే. ఇది స్వప్నము వంటిదే" అనే నిశ్చయానికి వస్తున్నాడు. ఇదే నియమము తత్త్వబోధన చేసే అన్ని గ్రంథములలోను అనుసరించబడింది.

కనుక మేము దృష్టాంతం చెప్పుచున్నప్పుడు బోధింపబడుచున్న అంశమును సూక్ష్మబుద్ధితో గ్రహించాలి!

❖

మరొక ముఖ్యమైన విషయం. "ఈ జగత్తు స్వప్న – సంకల్పములలోని వస్తు జాలమువలె భ్రమమాత్రమే. లేక అసత్యమే" అనే జ్ఞానం ఈ శాస్త్రం పఠించుటచే తప్పకుండా కలుగుతుందని కూడా చెప్పలేం. ఎందుకంటావా? విషయం బోధ పడినప్పటికీ, వాసనలు కూడా శమించాలి కదా! కాబట్టి అది సంస్కారమును అనుసరించి క్రమంగా ప్రాప్తించవలసినదే. అయితే, అట్టి ప్రయత్నమునకు సిద్ధంగా ఉన్న జీవులకు తగిన విచారణ, ప్రోద్బలం ఇందు లభిస్తున్నాయి.

ఏది ఏమైనా, నిష్కల్మష సంస్కారవంతులు, విచారశీలురు మాత్రం ఇది పఠించు చుండగానే ఉత్తమమగు సర్వసమత్వం, ఆత్మ తాదాత్మ్యము పొందటం జరుగుతోంది.

❖

ఈ కనబడేదంతా స్వప్న, సంకల్ప, ధ్యానములందలి 'నగరము' వంటిదే కనుక, నేను ఈ స్వప్న – సంకల్ప – ధ్యానములను, అందలి అనుభవములను దృష్టాంతంగా తీసుకుంటున్నాను.

ఒకడు నిద్రిస్తున్నప్పుడు ఒక 'కల'కంటాడనుకో.... ఆ కలలోని అనుభవములు గుర్తు చేసుకోవటంలోనూ, భూతకాలపు 'జాగృదవస్థ'కు సంబంధించిన అనుభవములను గుర్తు చేసుకోవటంలోనూ భేదమేమున్నది? అది అట్లుండగా, స్వప్నంలోని ఘోర దృశ్యములు (బాధింప బడటం, ప్రేమించటం వంటివి) జాగ్రత్తులో 'అరవటం, కలవరించటం, వణకటం' వంటి ప్రతి–స్పందములుగా అప్పుడప్పుడు పరిణమిస్తూ ఉంటాయి కదా! ఈ స్వప్న జాగ్రత్తులు ఎప్పటి కప్పుడు, అప్పటికి మాత్రం, వాస్తవమేనని అనిపిస్తూ, మరొకప్పటికి (ఆ రెండూ కూడా) గడచిపోయినట్టి అనుభవమాత్రంగా, జ్ఞాపకమాత్రంగా ఉండిపోతున్నాయి. అందుకే ఆ రెండింటికి భేదంలేదని చెప్పుచూ దృష్టాంతంగా తీసుకొంటున్నాం.

"సువర్ణమే ఆభరణమునకు కారణం కదా" అనే దృష్టాంతము చెప్పాననుకో. నా ఉద్దేశం, "బ్రహ్మమే ఈ జగత్తునకు కారణం" అని చెప్పాలని. అట్లు చెప్పినప్పుడు "బంగారము ఆభరణములుగా ఆకారం పొందునట్లు, బ్రహ్మము జగత్తుగా ఆకారాదులు పొందుచున్నది"... అని గ్రహించవద్దని మరల గుర్తుచేస్తున్నాను. ఎందుకంటే, ఇక్కడ సువర్ణము యొక్క సర్వధర్మములు గ్రహించకుండా ఒకానొక "అంశ (character)" మాత్రమే తీసుకొని తత్త్వవిషయమై బోధిస్తున్నానని గ్రహించాలి.

అట్లాగే, "ఆభరణం రాళ్ళు దాగి ఉంటాయి కదా!" అనే మీమాంస చేయబడకుండుగాక. చీకట్లోగల వస్తువు చూడాలంటే దీపపు వెలుగే ఉపయోగిస్తుంది కాని, "ప్రమిద-నూనె-వత్తి" కాదు కదా! అదేవిధంగా ఉపమానంలోని ఒకానొక లక్షణం ఉపమేయానికి ఉన్నట్లు గ్రహించటమే శిష్యుని సూక్ష్మబుద్ధికి తార్కాణం.

❖❖❖

# 24. కుతర్కములు

బ్రహ్మజ్ఞానమే మన ఈ విచారణ యొక్క ఏకైక లక్ష్యము! మహావాక్య బోధను, ఆ బోధయొక్క అర్థమును నిశ్చయపూర్వకంగా గ్రహించుటచే తప్పకుండా బ్రహ్మజ్ఞానం ప్రాప్తిస్తుంది.

1. ప్రజ్ఞానం బ్రహ్మ = ప్రజ్ఞ (ఎరుక)యే బ్రహ్మము
2. అయమాత్మా బ్రహ్మ = ఈ జీవాత్మ బ్రహ్మమే అయివున్నది
3. తత్త్వమసి = అదియే (ఆ పరమాత్మ వస్తువే) నీవై ఉన్నావు.
4. అహం బ్రహ్మాఽస్మి = నేను బ్రహ్మమునే అయివున్నాను.

ఈ నాలుగు వాక్యములు పరమ నిత్య-సత్యమును బోధించటానికి నాలుగు వేదములు ఉపయోగించాయి. వీటిని గురుముఖతః విని, వీటి అర్థమును గ్రహించి, ఆ అర్థముయొక్క ధ్యాస అలవర్చుకుంటే (నిరంతర ధ్యానం చేస్తే) బ్రహ్మజ్ఞానం కలుగుతోంది.

ఈ మన సంవాదము అదే అర్థమును, అనేక దృష్టాంతములద్వారా, కథానికల ద్వారా నిరూపిస్తోంది.

ఇంతకన్నా ఉత్తమమైన సత్యము ఏదైనా ఉంటే ఎవరైనా ప్రకటించవచ్చు. లేదా, ఇదే సత్యమును ఇంతకన్నా మధురంగా, సుస్పష్టంగా చెపితే, అదీ మంచిదే. అట్లా కాకుండా, అనుభవం లేకయే, అపవిత్రంగా తర్కంలోకి దిగుటకు ప్రయత్నించే వారికి నేను చెప్పుచున్నదొక్కటే! నాయనలారా! స్వానుభవముచే మేము చెప్పుచున్న తత్త్వజ్ఞానాన్ని ఎందుకు తిరస్కరిస్తారు? అనేకమంది ముముక్షువులను దృష్టిలో పెట్టుకొని, అనేక సోదాహరణములతో "మీరు బ్రహ్మముకంటే వేరుకాదు" అని మేము నిరూపిస్తున్నాం. ఈ పరమ సత్యమును సర్వజనులపైగల ఆప్యాయత చేతనే ప్రకటిస్తున్నాం. ఓ కుతర్కము చేయు మిత్రులారా! మీరు అనుభవపూర్వకంగా సత్యమును ఎరుగకుండానే, ఎవరైనా చెప్పినదానిని వ్యతిరేకించుటకు మాత్రమే ఎందుకు ప్రయత్నిస్తారు చెప్పండి? మీపై మాకు ప్రేమయే సర్వదా ఉంటుంది. దయచేసి మొట్టమొదట మీ దృష్టిని శుద్ధపరచుకోండి. యత్నశీలురై ప్రాణాయామ, ప్రత్యాహార, తితిక్షాది అష్టాంగ యోగములచే బుద్ధిని సునిశితం చేసుకోండి. అప్పుడు ఈ శాస్త్రమును విచారించండి. ఇది సత్యమో, కాదో మీరే నిర్ణయం చేసుకోండి. ఇంతకు మించి మీకు మేము ఏమి చెప్పగలం?

❖

ఓ సర్వ జనులారా! మీలోని ప్రతి ఒక్కరిలో స్రవించుచున్న అమృత తత్త్వమును మేము గ్రహించాం. అట్లు ఎరిగినదానినే మీ అందరికీ ఈ ప్రయత్నముచే, ఇట్టివేయగు అనేక ప్రయత్నములచే గుర్తు చేస్తున్నాం. అట్టి మేము శ్రేయోభిలాషులమేకాని, ఏమాత్రం శత్రువులంకామే! ఈ సంసారములోని దోషమేమిటో గ్రహించినట్టి మేము బ్రహ్మ జ్ఞానమును ఉదయింపజేసే వాక్యములనే చెప్పుచున్నాం. అందుచేత శ్రద్ధగా వినండి. వింటూ ఉంటే సత్యమేమిటో మీ అంతట మీరే, మీ మీ హృదయాకాశములోనే గాంచగలరు. పరమార్థసత్యమేమిటో నిర్దుష్టంగా, దోషరహితంగా, ఆనందోత్సాహాలు కలుగజేసేవిధంగా చెప్పటానికే ప్రయత్నిస్తాం. ఏ వాక్యాలైతే పూర్ణమగు మీ స్వరూపము గురించి, ఈ దృశ్యముతోను, శరీరాదులతోను గల సంబంధం గురించి సమగ్రంగా బోధించుట లేదో, అవి ఆప్తవాక్యాలు కాజాలవు సుమా!

ఓ రామచంద్రా! మేము తపోధ్యానాది అనేక ప్రయత్నములచే బ్రహ్మసాక్షాత్కారము కలిగించగల బుద్ధిని కలిగియున్నాము. భగవంతుని సంకల్పముచేతనే ఇట్లు మీ అందరిపై కురుస్తున్న కరుణామృత రసంగా ఈ మా వాక్యాలు చేరుచున్నాయి. మనం చేయబోయే ఈ విచారణ, సమస్త వేదోపనిషత్తులు ప్రతిపాదించుచున్న ఏక వాక్యమగు "అఖండ బ్రహ్మతత్త్వమే" లక్ష్యముగా కలిగియున్నది.

❖

కనుక, సర్వజనులారా! నిస్సంకోచంగా ఇది వినండి. ఇది గ్రహిస్తే పరమ పురుషార్థము లభించగలదని చేతులెత్తి ప్రకటిస్తున్నాను.

జీవుని యందలి పరమాత్మతత్వమును మరుగున పరచు వేదాంత విరోధములగు అనేక శాస్త్రములచే అనేక తర్కములు ప్రతిపాదించబడ్డాయి. "ఈ దృష్టిచే దర్శించబడుటచే ఇట్లు ప్రతిపాదించబడింది" అను రూపమైన విచారణచే ఆయా ప్రచారములో ఉన్న వేఱు వేఱు సిద్ధాంతములు, అభిమతములు మనం ముందు ముందు చర్చించబోతున్నాం. ఈ విచారణ అంతా విజ్ఞానదృష్టితో, పరిశీలనాత్మకమైన వివేచనాపూర్వకంగా చేయబడుచున్నది. "మేము చెప్పుచున్నాము. కనుక మీరు గ్రుడ్డిగా నమ్మవలసిందే" అని చెప్పటం మా ఉద్దేశం ఏమాత్రం కాదు. అందుచేత, చెప్పబోవునదంతా వివేక – విమర్శక దృష్టులచే తప్పక పరిశీలించవచ్చు.

మరొక్క ముఖ్యమైన విషయం. మేము అనేక పురుషప్రయత్నములచే, తపోధ్యానాదులచే మా చిత్తమును పరిశుద్ధపరచుకొని, అప్పుడు మాకు అనుభవమైన సత్యమును మీముందు ఉంచుచున్నాం. జనులలో అనేకమంది తగుయత్నం చేసి ఉండకపోవుటచే, వారి మనస్సులలో పదార్థికదృష్టి (material view point), ప్రాపంచకదృష్టి బలవత్తరమై ఉండిఉండే అవకాశమున్నది. అందుచేత కొంచెము మాపై విశ్వాసముంచి ఈ విచారణను స్వీకరించెదరు గాక! "మేము తపోధ్యానాదులు అధికంగాచేసి ఉండలేదు కదా! మరి ఇది వినటానికి అర్హులమా?" అనే శంకను కూడా త్యజించండి. ఉత్తమ కార్యాచరణము కొరకు ఇందలి విచారణ జీవుని తీర్చి దిద్దగలదు. అందుచేత ఇది పఠించునపుడు, వినునపుడు ఓర్పును, శ్రద్ధను వీడకండి. ఒకచోట కొంచెము అర్థమగుట సులభంగా

లేనంతమాత్రం చేత వెనుకకు మరలవద్దు. అవసరమనుకొంటే, విజ్ఞులైనవారితో సంభాషించి, అనుమాన నివృత్తి చేసుకోండి. గ్రంథమంతా చక్కగా పరిశీలించటం జరిగితే, అటు తరువాత దీని ప్రయోజనమేమిటో మీరే గ్రహిస్తారు.

❖

"ఈ జీవుడు బ్రహ్మమే కదా! ఇక ప్రయత్నం మాత్రం ఎందుకు?" అనే తర్కమునకు లోబడి, అప్రయత్నశీలత్వం ప్రతిపాదించే వాదోపవాదములను నెత్తిపై మోయటానికి మేము సిద్ధంగా లేము. ఊరకే వాదోపవాదములచే మనస్సు కలత చెందుటయే జరుగుతోంది. జీవితము అమూల్యమైనది. కేవలం తర్క – వితర్కములచే ఉత్తమ వస్తువును సాధించలేమని మా ఉద్దేశం.

అనుభవమాత్రమగు 'పరమాత్మ తత్త్వము'ను పొందుటకు, చివరికి పఠించు వాని అంతరంగమే స్థానము సుమా! మన ఈ విచారణ యొక్క పాత్ర 'లేనిదానిని లేనట్లుగా, ఉన్నదానిని ఉన్నట్లుగా' చెప్పటం వరకే. గ్రహించువాడు దోషరహితమైన వివేకంతో ఈ బోధను పరిశీలిస్తూ ఉండగా "అద్వితీయమగు ఆత్మను నేనే" అనే అనుభవము పొందగలడు.

మేము ప్రతిపాదించుచున్నదంతా వేద–వేదాంగములలోని విజ్ఞానసారమునకు అనుకూలంగానే ఉంటుందని మాత్రం చెప్పగలము. 'మహావాక్యములు' అని చెప్పబడే "అహం బ్రహ్మాస్మి" వంటి వేదవాక్యములే మన ఈ విచారణ అంతటికీ ప్రమాణాలయి ఉన్నాయి.

❖❖❖

## 25. ప్రమాణ నిరూపణ

మనం ఉపయోగించబోయే ప్రమాణముల విషయమై మరికొన్ని విషయాలు చెప్పుచున్నాను విను.

మనం ఒక ఉపమానం తీసుకొనునపుడు, ఆ ఉపమాన–ఉపమేయాలలో ఉండే ఒకానొక సమానధర్మం మాత్రమే తీసుకుంటూ ఉంటామని చెప్పాను కదా! 'ఉపమానము (comparison)' అంటేనే అది. ఒకవేళ ఉపమాన – ఉపమేయాలు అన్ని అంశము లందు ఒకేవిధంగా సమాన ధర్మములు కలిగి ఉండటం జరిగితే, అప్పుడు ఆ రెండింటికీ భేదమే ఉండదు కదా! ఇక ఒకదానిని 'ఉపమానం' అని, రెండవదానిని 'ఉపమేయం' అని అనటం దేనికి? లోకంలో, ఏ సందర్భాలలోనైనా సరే, ఏ ఉపమానం గ్రహించటం జరిగినా ... అట్టి అన్ని సందర్భములలోను "ఒకానొక అంశ" అనునదే ఉద్దేశం. ఉదాహరణకు "ఆమె కనులు కలువలవలె తీర్చిదిద్దినట్లు ఉంటాయి", అని ఒక కవి వర్ణించాడనుకో "అట్లాగా? అయితే మరి ఆ కళ్ళు తటాకంలో తేలియాడుట లేదేమి?" – అని తర్కం చేయటం ఉచితం కాదు కదా!

జీవబ్రహ్మముల స్వరూపం గ్రహించటానికి ఈ శాస్త్రం చేతను, తదితర ఆధ్యాత్మ శాస్త్రముల చేతను అనేక దృష్టాంతములు తీసుకోబడ్డాయి. (ఉదా : మాండూక్యోపనిషత్తు. కప్ప యొక్క నాలుగు

కాళ్ళు దృష్టాంతంగా జాగ్రత్ స్వప్న సుషుప్తి, తురీయములు విశదీకరించబడ్డాయి). అట్టి దృష్టాంతములను, ప్రమాణములను సరైన రీతిలో అర్థం చేసుకుంటే అప్పుడు అఖండాకార చిత్తవృత్తి ఉదయిస్తుంది. మహావాక్యార్థ బోధ వలన ఆత్మ తత్త్వము స్ఫురిస్తుంది. ఆ 'స్ఫూర్తి' వలన అజ్ఞానము, దాని కార్యములైయున్న అనేక వికారములు నశిస్తాయి. సర్వ సంకల్పములు, వాటి స్వభావములు గ్రహించబడగా, వాటన్నిటికీ ఆవల ఉన్న "శుద్ధ స్వస్వరూపము" యొక్క అనుభవము మాత్రమే శేషించుచు, 'నిర్వాణస్థితి' అనునది సుస్థిరమౌతుంది. అట్టి ఉత్తమ ప్రజ్ఞ దృష్టాంతజ్ఞానము వలననే లభిస్తోంది.

❖

ఓ జనులారా! మీరు ఉపమాన – ఉపమేయముల గురించి ఘర్షణ పడకండి. దానివలన సాధించేదేమీ ఉండదు. ఎందుకంటారా? సర్వవేద – వేదాంతముల యొక్క, ఋషుల ప్రవచనముల యొక్క సారమైన విషయం ఇది!

"ఓ జీవుడా! నీవు నిత్యమగు బ్రహ్మమువే! బ్రహ్మమునకు వేరుగా జగత్తు లేదు.

భూత –భవిష్యత్ – వర్తమాన కాలములో ద్రష్టగా, ద్రష్టాతీతుడుగా కూడా ఉన్నది నీవే."

మనం ఏ యుక్తిని అనుసరించినా ఫరవాలేదు. "తత్వమ్ – సోఽహమ్" మొదలైన వాక్యముల అర్థసారమును ఎంతవరకు అనుభవమునకు తెచ్చుకోగలిగాం? ఎంతవరకు ఆశ్రయించాం" – అనునదే మనందరికీ ముఖ్యం. అప్పుడే జీవునకు 'శాంతి' లభిస్తుంది. శాంతియే పరమశ్రేయస్సు కదా! అట్టి అంతరంగ ప్రశాంతస్థితి విచారణ చేతనే ప్రాప్తిస్తోంది. ఈ మా ప్రయత్నము యొక్క ఉత్తమ లక్ష్యము అదే. ఇందు విచారించబడిన వస్తువు గ్రహించుటకు సర్వజీవులు తగియే ఉన్నారు.

అసలు విషయం వదలి ఒక ఉపమానమో, ప్రమాణమో విమర్శిస్తూ ప్రక్క త్రోవలు పట్టుటచే లాభమేమి ఉంటుంది? ఆహారం లభించినప్పుడు చక్కగా స్వీకరించాలి. అంతేకాని, "ఈ బియ్యం ఎవరి చేనులో, ఎప్పుడు పండాయి? ఆ చేను పొడవు – వెడల్పులు ఎట్టివి?" – అనునవి ముఖ్యమైన విషయాలు కావు కదా!

❖❖❖

# 26. ఏకాగ్రదృష్టి

కారణముతో కూడుకొన్న ఉపమానమునకు (i.e. Simile or example), కారణరహితమగు ఉపమేయమునకు (ఆత్మ వస్తువు Absolute self which is the subject matter of the present book) కొంతభేదముండవచ్చు. అయితే కొంత పోలిక కూడా (ఒకానొక లక్షణము దృష్ట్యా) ఉండుటచేతనే అట్టి ఉపమానము, ప్రమాణము (reference) కొనిరాబడినది. గురువు అట్లు ప్రయోగించుటచే శిష్యునియందు సాదృశ జ్ఞానము ఉదయిస్తోంది.

నాయనలారా! వివేకహీనులై భోగములందు ఆసక్తులైయుండు మనుజులకు, రాతియందు పుట్టి పెరిగి, నశించే గోదురుకప్పలకు జ్ఞానుల దృష్టిలో తేడా లేదు. కనుక, వివేక దృష్టితో శాస్త్రములలో చెప్పబడిన దృష్టాంతములను గ్రహించాలి. పాఠకునిలో ఉండే అనుమానాలు నివృత్తంజేసి, బోధ దృఢపరచుటకే గురువులు ప్రమాణాలు చెప్పుచున్నారు. వీటన్నిటి యొక్క లక్ష్యము శాంతియుతమగు పరమ పదము సాధించుటయే కదా! ఆ పని వదలి, "ఈ దృష్టాంతము – ఉపమానములలో మరొక లక్షణము మాటేమిటి? ఆయా ప్రమాణములు మాకు సరిపడవు" – అని పలుకుచూ, చెప్పే విషయాన్ని ప్రక్కత్రోవ పట్టించకుండెదరుగాక. మీరంతా మహా బలవంతులు కావాలి. మేము భగవత్ప్రేరణచే, శుభ–సంకల్పులమై, పరమశాంతిని ప్రసాదించగల మీ స్వస్వరూపముయొక్క ఔన్నత్యం ప్రకటిస్తున్నాం. మా వాక్యములలోని అంతర్లీన సత్యమును వివేక దృష్టితో గ్రహించుటకు సిద్ధంగా ఉండండి.

❖

ఆత్మజ్ఞానం లభించనంతవరకు శాస్త్రోపదేశములను, సౌజన్య స్వభావమును, సాధు సంగములను ఆశ్రయించవలసిందే. పురుషార్ధములను సంపాదించవలసిందే. అట్లు ప్రయత్నించుచున్నవాడే క్రమంగా శాస్త్రముల అంతరార్ధమును గ్రహించి ఉత్తమ విచారణ పారాయణుడగుచున్నాడు. తద్వారా ఆత్మానుభవమునకు తగిన వాడగు చున్నాడు. అప్పుడు 'తురీయము' అను మరొక పేరుచే చెప్పబడుచున్న పరమ శాంతిని పొందుచున్నాడు. ఎవడైతే భావసముద్రమును దాటివేసి శుద్ధ స్వస్వరూపమగు అట్టి తురీయపదమున సుస్థితుడై ఉంటాడో, అతడే సర్వులకు వందనీయుడు. అట్టివాడు గృహస్థుడు కావచ్చు. సన్యాసి కావచ్చు. అతడు సర్వవిధములైన ఐహిక – ఆముష్మిక ఫలములను మాత్రం త్యజించివేసి ఉంటాడు. ఒకానొక నిశ్చలత్వమును సదా అనుభవిస్తూ ఉంటాడు.

❖

ఓ రామచంద్రా! నీ దృష్టి అంతా ఆశయము పైననే నిలిపెదవుగాక. ఉపమాన, ఉపమేయములను నీ మనోపథంలో ఒక్కసారి ధరించు. ఆ రెండింటిలోని ఏకాంశ ధర్మమును సూక్ష్మబుద్ధితో గ్రహించు. మరల తరువాత చెప్పుచూ పోయేది విను.

అర్ధమును నాలుకపై ఉంచుకొని ప్రయోజనమేమున్నది? దానిని చిత్తములోనికి ప్రవేశింపచేసినప్పుడే ఉపయోగం. బోధార్థం సదవగాహన రూపము, అనుభవరూపము పొందాలి. అందుకు యుక్తి ఏదైనా ఫరవాలేదు. అయితే, కొందరు చంచల బుద్ధి కలిగియున్నవారు, తాము భ్రమయందు ఉన్నవారై, భ్రమాత్మకమైన దృష్టితో, యుక్తా యుక్తములను చూడలేకపోవటం మేము గమనిస్తున్నాము. వారిని "బోధచంచువులు" అని పిలుస్తారు. వారు ఉత్తమమైన ఆత్మవస్తువుయొక్క స్వభావ స్వరూపములు నోటితో మాట్లాడకలిగినప్పటికీ "పరమాత్మ ఈ సర్వమునకు వేరైనది కాదు" అనునట్టి అనుభవాత్మకమైన భావన కలిగి ఉండలేకపోతున్నారు.

అనుభవమే స్వరూపముగా కలిగినట్టి బ్రహ్మవస్తువు ఒక పురుగు నుండి బ్రహ్మదేవుని వరకు సర్వజీవులయందు ఉండనే ఉన్నది. అట్టి బ్రహ్మమును గ్రహించునప్పుడు అనర్థములైన కల్పనలను అనుసరించేవానికి ఏమి చెప్పగలం? అల్ప పరిశీలనాత్మకుడగు అతడు అనేక అభిమానరూపములగు కుకల్పనలు కలిగి ఉంటున్నాడు. " 'అహం బ్రహ్మాఽస్మి' – 'తత్త్వమ్.' నేను బ్రహ్మము అయున్నాను. నీవుకూడా అదే" ... అనునట్టి బ్రహ్మ – భావాకారవృత్తికి అనేక దురభిప్రాయములను ఆపాదిస్తూ, బోధను కలుషితం చేయడం మేము అక్కడక్కడ చూస్తున్నాము. మేఘములు ఆకాశమును కప్పివేయుట లేదా? అయితే ఆకాశమునకు లోటేమి ఉంటుంది? అట్లే సత్యమగు బ్రహ్మతత్త్వము సనాతనమై, శుద్ధమై అన్నివేళలందు ప్రకాశించుచునే ఉంది. సరైన సమయంలో, మేఘాలు తొలగునట్లు, విజ్ఞాన దృష్టిచే అజ్ఞానం తొలుగగలదు.

❖❖❖

# 27. అపరోక్షానుభవం

జలములన్నిటికీ సముద్రమే ఉనికి స్థానమైనట్లు ప్రమాణములన్నిటికీ ప్రత్యక్షమే ఆధారం. అనగా ఇప్పుడు ఇక్కడ మనకు లభించేదే ప్రమాణం కాని, ఎప్పుడో – ఎక్కడో – ఏ మరణించిన తరువాతో లభించేది ప్రమాణం కాజాలదు. అయితే ప్రత్యక్ష జ్ఞానములన్నిటిలోను ఉత్తమమైనది "అపరోక్షానుభూతి" అని మనకు ఆత్మజ్ఞులు చెప్పుచున్నారు.

ఈ దృశ్య ప్రపంచంలో అనేక పాంచభూతాత్మికమైన వస్తువులు మనకు కనిపిస్తున్నాయి! అనగా, ఇవన్నీ ప్రత్యక్షమై మన ఈ ఇంద్రియములకు అనుభవమౌతున్నాయి. కాని 'ఆత్మ' అనునది ఇంద్రియములనే ప్రకాశింపచేయునది, ప్రవర్తింపచేయునది. పాంచభూతాత్మకమై ఎదురుగా కనబడే వస్తువు కాదు. కనుక, అది ప్రత్యక్షము అని అనలేము.

పోనీ, 'ఆత్మ' అనగా, అది ఎప్పుడో – ఎక్కడో – ఎప్పటికో లభించేదా? కాదు. అది అనుభవమే స్వరూపముగాగల నీకంటే–నాకంటే వేరైనది కాదు. అందుచేత దానిని "పరోక్షము" అని అనుటకు వీలులేదు. అందుచేత దానిని "అపరోక్షానుభవం" అని అంటున్నారు. అదియే........,

"జ్ఞాత – జ్ఞానము – జ్ఞాతృత్వము" ["Perceiver - object - perception"]

"తెలుసుకొనువాడు – తెలుసుకొనబడునది – తెలుసుకొనుట" ["Knower - Object to be known - process of Knowing"] అగుచున్నది.

❖

అనుభవం, ఎరుక, ప్రతిపత్తి (Experience - knowing - Reflective Existence) అను మూడిటితో కూడుకొన్న సాక్షి చైతన్యమే అపరోక్షానుభవం యొక్క స్వరూపం.

❖

అట్టి సాక్షి చైతన్యమే ఈ జీవుడు. ఆ సాక్షి చైతన్యము "అహం-నేను" అను భావన కలిగియున్నప్పుడు "పురుషుడు" లేక "ప్రమాత" అని అంటున్నాం.

ఆ సాక్షి చైతన్యము ఉపాధి (body) పట్ల వృత్తి కలిగియున్నప్పుడు అట్టి స్థితిని "సంవిత్తు" అని పిలుస్తున్నాం. "శుద్ధ సంవిత్" - అని ప్రయోగించినపుడు మనం శుద్ధ చైతన్యమునే ఉద్దేశిస్తున్నాము.

అట్టి సంవిత్తు పదార్థములపట్ల 'దృష్టి' కలిగి ఉన్నప్పుడు అట్టి పదార్థాకర్షణలను లేక దృశ్యాకర్షణలను "విషయములు" అని చెప్పుకుంటున్నాం. ఆ సంవిత్తును "పదార్థ సవితుడు" అని కూడా అంటున్నాం.

అనగా :

1. సాక్షి చైతన్యము = వృత్తిరహితము, శుద్ధ తత్త్వము అగు ఆత్మ. ఆత్మయే ఈ జీవుని వాస్తవ స్వరూపము.
2. సాక్షి చైతన్యము + 'నేను' అనుభావన (అహంభావన) = పురుషుడు, ప్రమాత
3. సాక్షి చైతన్యము + 'నేను' అను భావన + ఉపాధిపట్ల వృత్తి = సంవిత్తు
4. సాక్షి చైతన్యము + అహంభావన + ఉపాధిపట్ల వృత్తి + ఇంద్రియములకు ప్రాప్తిస్తున్న పదార్థజ్ఞానం = పదార్థ సవితుడు / విషయములు

ప్రతి శాస్త్రములోను కొన్ని సాంకేతిక శబ్దములు ఉన్న విధంగానే, ఈ శాస్త్రంలో కూడా, "శుద్ధ తత్త్వము, సాక్షీ చైతన్యము, పురుషుడు, ప్రమాత, సంవిత్తు, విషయములు, జీవుడు" .... ఇత్యాది శబ్దములు ఉపయోగించబోతున్నాం. ఈ శబ్దముల అర్థముల ముందు ముందు మరికొంత వివరించబడతాయి.

❖❖❖

## 28. చైతన్యము - జగత్తు

ఈ జీవుని వాస్తవ స్వరూపము "శుద్ధచైతన్యమే" అని అనుకొన్నాం కదా.

ఒకే నీరు అనేక తరంగములుగా, సుడులుగా, బుడగలుగా అనేక రూపములు దాల్చుచుండుట గమనించావా? అదేవిధంగా చైతన్యమే సంకల్ప - వికల్పాది నానావిధ భ్రాంతులతో జగత్తు రూపమున ప్రతిభాసితమగుచున్నది. అనగా, అద్దంలో ఎదురుగా ఉన్న దృశ్యం ప్రతిభాసం (reflect) అగుచున్నట్లు చైతన్యమునందే సంకల్పమాత్రంగా ఈ దృశ్య జగత్తు స్ఫురిస్తోంది.

అయితే సృష్టికి పూర్వం, సృష్టి సమయంలోను, సృష్టి లయించినప్పుడు కూడా అట్టి చైతన్యమే సత్యమై, నిత్యమైయున్నది. అట్టి చైతన్యము దేనికి కారణముగాని, కార్యముగాని కాకపోయినప్పటికీ, ఈ 'సృష్టి' అనబడే లీలను తనయందుతానే ప్రకాశింప చేయుచున్నది.

❖

తన వాస్తవ స్వరూపము శుద్ధ చైతన్యమే అయినప్పటికీ, ఈ జీవుడు తనయందు విచారించని కారణంగా ఒకానొక అజ్ఞానం పొందుచున్నాడు, చూచుచున్నాడు. అట్టి అజ్ఞానం స్వయముగా అసత్యమే అయినప్పటికీ – అది జగత్తు రూపముగా సత్యమువలె అనుభవమగుచున్నది.

అవిచారముతో కూడిన ఆత్మ "ప్రకృతి" అనబడే దృశ్యభావనయందు ప్రవేశించి, ఈ జగత్తును సత్యమైనదానివలె స్ఫురింపచేస్తోంది.

చైతన్య రూపుడగు ఈ జీవుడు ఒకానొకప్పుడు ఈ దృశ్యవిషయమై కొంత విచారణ శీలుడగుచున్నాడు. "ఈ దృశ్య వ్యవహారమంతా నాకు ఎక్కడి నుండి, ఎట్లా ప్రాప్తిస్తోంది? ఇంతకీ నేనెవరు?" అను ప్రశ్నలకు వస్తున్నాడు. అప్పుడు ప్రయత్నశీలుడై, విచారించి చూచి అంతా గ్రహించినవాడై జగద్భావమును త్యజించి వేస్తున్నాడు. "పరమ మహత్" రూపమున ప్రకాశించుచున్నాడు.

అయితే, ఒక ముఖ్యమైన విషయం. కెరటం ఉన్నా, లేకున్నా జలము జలమే కదా. అదేవిధంగా ఈ జీవుడు విచారించకపోవుటచే జగద్భావము కలిగియుండి ఉండవచ్చు. లేదా సర్వ సంకుచిత భావములను త్యజించివేసి ఆత్మానందములో తేలియాడవచ్చు. (అనగా జ్ఞానముచే అజ్ఞానము త్యజించినవాడై విచారణ పూర్వకమగు అఖండత్వమును వహించి ఉండవచ్చు). ఏది ఏమైనా, ఈ జీవుని వాస్తవ స్వరూపము సర్వదా శుద్ధచైతన్యమే అయున్నది సుమా!

అందుచేత ఈ జగత్తునందు చైతన్యమే వ్యాహ్యాళి చేయుచున్నది. అదియే భావనా పూర్వకంగా ఈ జగత్తును ఉత్పత్తి చేయుచు స్థితింపచేసి, చివరకు లయింప చేస్తోంది. అది సర్వజగత్తునకు అతీతమైనట్టి తన విలక్షణత్వమును ఏ క్షణమందును కోల్పోవుచుండుట లేదు. దేనినీ పొందుట లేదు, కోల్పోవుట లేదు, తాను జన్మించుట లేదు, క్షయించుట లేదు. ఇందుకు ఒక దృష్టాంతం చెపుతాను. విను. నీవు ఒకానొక భావన పొందావనుకో అప్పుడు 'నేను రాముడను' అనే స్ఫురణను కొంచెము మరచి ఆ భావావేశంలో తాదాత్మ్యము చెందవచ్చునేమో. కాని నీవు రాముడివి కానిది ఎప్పుడు? ఆ భావము జనించునప్పుడు, ప్రభావితమగునప్పుడు, తొలగునప్పుడు నీవు అట్లే ఉన్నావు కదా! జీవునికి ప్రాప్తించుచున్న ఈ సృష్టి స్థితి లయములుకూడా అట్టివే.

❖

ఓయీ జీవుడా! నీ స్వస్వరూపము, "స్వ–సత్త–సామాన్య అనుభవమగు (Self - Exisence - Commonality - Experience) శుద్ధ చైతన్యమే కదా! అట్టి శుద్ధ చైతన్యమునకు చావు–పుట్టుకలు ఎక్కడున్నాయి? మరి నీవు దుఃఖించవలసిన పనేమున్నది? "నేను–నీవు, అట్లే ప్రతి ఒక్కరు అమృతతుల్యమగు ఆ అద్వితీయ చైతన్యమే" – అని ఈ మన విచారణ సర్వులకు నిరూపించగలదు.

ఎవరైతే విచారణపరులై ఆత్మను, దాని స్వభావ – స్వరూపములను గ్రహిస్తారో – అట్టివారు, "సర్వ శబ్దములకు, మనస్సునకు అతీతమైయున్న పరబ్రహ్మమునే నేను" – అను అనుభవముతో ప్రకాశించుచున్నారు. "ఈ ప్రపంచము నానుండి వేరుగా సత్యమైయున్నది కాదు. స్వకీయ కల్పనచే

నేనిదంతా ఇట్లు గాంచుచున్నాను ఇదంతా నా ఆత్మస్వరూపమే!" అని తెలియబడుటచే మనస్సు శూన్యమై శాంతిస్తోంది. అట్టి స్థితిలో జ్ఞానేంద్రియములు తమ తమ కార్యక్రమములు నిర్వర్తించుచున్నప్పటికీ "కర్మఫలము" అనునది అతనిని ఏమాత్రం తాకుట లేదు. "ఇది చేశాను. ఇది ఇట్లున్నదేమి?" అనునట్టి కర్తృత్వ అహంకారమును, స్పర్థను త్యజించివేస్తున్నాడు. మనస్సు శూన్యమైనచోట వాసనల ప్రభావం మాత్రం ఏమి ఉంటుంది? కర్మేంద్రియములు ఆసక్తులను త్యజిస్తాయి. 'మనస్సు' అనే యంత్రం కదలాలంటే 'విషయవాసనలు' అనే త్రాడు కావాలి. విషయవాసనలు క్షీణించినప్పుడు మనస్సు శాంతించక ఏం చేస్తుంది? అట్టివాడు జీవన్ముక్తుడే అవుతాడు.

జీవన్ముక్తులు కూడా అనేక సందర్భములలో ఇతరులవలెనే కర్మలు నిర్వర్తిస్తున్నారు. అయితే వారికి ఆసక్తికాని, భ్రమలుగాని ఉండవు. అందుచేత వారి ప్రవర్తనచే లోకులకు శుభమే జరుగుతుంది. ఎవనికి దేనిపట్ల ఏమాత్రం ఆసక్తి ఉండదో – అట్టివాడు ఆ కర్మ విషయంలో 'అకర్మపరుడు' అనియే చెప్పబడుచున్నాడు.

గాలియందు చలనశక్తి అంతర్హితమై ఉంటుంది కదా. అట్లే ఈ జగత్తు కూడా జీవుని యొక్క వాసనలందే సంస్కార రూపమున ఉన్నది. ఆ సంస్కారములే బాహ్యమున భోగములు మొదలైన అనుభవములుగాను, అంతరంగమున అనేక చింతలుగాను వ్యవహరిస్తున్నాయి.

❖

ప్రాణుల కర్మఫల భోగము కొరకే ఈశ్వరునియందు సత్వగుణ ప్రధానమగు వాసన (tendency) ఉదయిస్తోంది. వెనువెంటనే ఆవాసన విశాల దిక్–మండల రూపముగాను, కాలముగాను, బాహ్య – అభ్యంతర* పదార్థములుగాను ప్రకాశిస్తోంది. ఆ తరువాత ఆ ఈశ్వరుడే నానావిధములైన మలిన – ఉపాధులతో సంసర్గమును (స్వకీయమైన self made) మాయచే అంగీకరించుచున్నాడు. అట్లు అంగీకరించి, "ఈ దేహములు మొదలైన దృశ్య స్వరూపములే తనయొక్క వాస్తవ స్వరూపము" అను అసత్ భావనమును పొందుచున్నాడు. "నేను జీవుడను" అనునట్టి ప్రమేయత్వమును, పరిమితత్వమును వహించి ఉంటున్నాడు. ఇక ఈ వస్తువుల స్వభావమంటావా – ఇదంతా నిజ (own) స్వభావా సంకల్పానుసారమే ప్రకాశించుచున్నది. వాస్తవానికి సర్వాత్ముడే అయి ఉన్నట్టి ఇతడు ఎచ్చట ఏ భావమున విరాజిల్లుతాడో అచ్చట ఆ రూపమునే (ఆ అనుభవమునే) పొందటం జరుగుతోంది.

'సర్వదర్శి'యగు ఆ పరమాత్మ సర్వ రూపములందు వెలయువాడేకదా. అతడు (జీవభావమును పొందిన ఈశ్వరుడు) ఎట్లు ఎచ్చట సంకల్పిస్తున్నాడో, ఈ దృశ్యము కూడా అట్లే ప్రాప్తించుచున్నది.

---

* బాహ్యపదార్థములు = ఈ దృశ్యములోని పదార్థజాలం. ఈ శరీరం కూడా అట్టి 'జగద్దృశ్యము'లోని భాగమే. అభ్యంతర పదార్థములు = మనసు (మనన స్వభావం). బుద్ధి (నిర్ణయాత్మక స్వభావం) చిత్తము (ప్రియము కలిగియుండు స్వభావం). అహంకారము (నేను – నాది అను స్వభావం).

ద్రష్ట ఉంటేనే కదా, దృశ్యము ఉండేది! కనుక ద్రష్టను అనుసరించే దృశ్యముంటోంది. దర్శించువాడు (ఈశ్వరుడు) దర్శనమునకు మునుముందే ఉన్నాడు.

❖

వాస్తవానికి దృశ్యముగాని, దృశ్యత్వముగాని, ద్రష్టత్వముగాని సత్యమైనవి కావు సుమా! ఈ జగత్తులోని పదార్థజాలమంతా సంకల్పమాత్రం చేతనే (స్వకీయ భావన చేతనే) అనుభూతమగుచున్నది. అందుచేతనే "ఈ జగత్తు మిథ్య" అని చెప్పబడుతోంది.

❖

సత్యరూపము, సర్వుల వాస్తవ స్వరూపము అయిన 'బ్రహ్మము' సర్వదా కారణ రహితమే అయి ఉన్నది. ప్రత్యక్ష – అనుమానముల* ద్వారా విచారించినప్పుడు ఆ అద్వితీయ బ్రహ్మమే సర్వుల వాస్తవ స్వరూపంగా సిద్ధించుచున్నది.

ఓ సాధూ! మనం తత్త్వవిషయంలో ప్రవేశించేముందు మరొక్కసారి ఒకానొక నగ్నసత్యమును సర్వజనులకు ప్రకటిస్తున్నాను.

**స్వయత్నమాత్రే యదుపాసకోయః తద్దైవశబ్దార్థమపాస్య దూరే**
**శూరేణ సాధోపదముత్తమం తత్ స్వపౌరుషేణైవహి లభ్యఉ తేంతః** (XIX. 34)

ఇతఃపూర్వపు, వర్తమానపు స్వప్రయత్నములకు వేరుగా, 'దైవము' అనబడు స్వయం నిర్ణయాధికారంగల వస్తువేదీ ఎచ్చటాలేదు. నీవు ఆ 'దైవము' అనబడు శబ్దార్థములను దూరంగా ఉంచి, ప్రయత్నశీలుడవయ్యెదవుగాక! 'ముముక్షువు' అయినవాడు తనను ప్రతి రోజు సమీపిస్తున్న అనేక వ్యవహారములను జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి. తన ఇంద్రియ–మనస్సులు వాటిపట్ల ఆసక్తిపూర్వకంగా ప్రసరించకుండా చూచుకోవాలి. దృష్టిని అపరోక్షమగు ఆత్మ వైపు తరలించాలి. అప్పుడే అతడు 'శూరుడు' అని అనిపించుకొంటాడు. అట్టివాడు దైవము అనుదానిని పరిత్యజించి, పౌరుషప్రభావం చేత తన హృదయంలోనే "ఆత్మసాక్షాత్కారం" పొందుచున్నాడు.

స్వీయ బుద్ధిబలంచేత 'బ్రహ్మము'ను సాక్షాత్కరింపచేసుకొనేవరకు 'స్వప్రయత్నము' అనుదానిని ఏమాత్రం విడచిపెట్టరాదు. ఒకవైపు ఆయా ఆచార్యులు నియమించినట్టి విధివిధానపూర్వకమైన ప్రార్థన, పూజ, ధ్యానము మొదలైనవి నిర్వర్తించవలసిందే! మరొకవైపు తత్త్వవిషయమై విచారణచేస్తూ ఉండవలసిందే!

❖❖❖

---

* ఏదైనా గ్రహించాలంటే (మీమాంసయందు) రెండు మార్గములు చెప్పబడుచున్నాయి.

1. ప్రత్యక్షము : Whatever evidence that can be seen, felt etc., physically here and now, to ascertain truth.

2. అనుమానము : Something that is logically filtered out basing on circumstances / situations "As this is like this .... that must have been like that".

# 29. సదాచార నిరూపణ

ముముక్షువైనవాడు మొట్టమొదట సాధువులతో స్నేహంచేసి వారి ఉపదేశములను, ఆ ఉపదేశముల ఉద్దేశమును, అంతర్లీన సారమును సుతీక్షణమైన బుద్ధితో గ్రహించాలి. వారు బోధించే మార్గంలో ప్రయత్నం చేయాలి. అట్టి ప్రయత్నముల వలన బుద్ధి ఇంకా ఇంకా వికసిస్తుంది. అప్పుడు క్రమంగా అతడు మహాపురుషత్వమును పొందగలడు.

మహాపురుషత్వం సాధించాలనుకుంటే, అట్టి మహాపురుషుల కొరకై వెతకాలి. వారిని గుర్తించి, సమీపించి సేవాదులచే సంతోషపెట్టాలి. అయితే, నీకు కావలసిన మహాపురుష లక్షణాలన్నీ ఒక్కనియందే లభించకపోవచ్చు. ఒకనిలో కొన్ని విశేషములు మాత్రమే ఉండవచ్చు. అంతమాత్రంచేత అతనిని త్యజించరాదు. ఎవనియందు ఎంతవరకు, ఏ ఉత్తమ లక్షణం నీవు గమనిస్తావో, – అంతవరకు అతనిచే బోధింపబడి అద్దానిని గ్రహించాలి. క్రమంగా నీ బుద్ధిని సునిశితం చేసుకోవాలి.

ఓ రాఘవా! 'శమము' మొదలైన ఉత్తమగుణములతోకూడిన "ప్రజ్ఞ"యే మహా పురుషుల లక్షణమైయున్నది. నీవు కూడా శమము, శాంతమును ఆశ్రయించు. అయితే 'సమ్యక్' జ్ఞానం (comprehension that all are equal) లేకపోతే శమాదులు సిద్ధించవు. బాహ్య-అంతరంగ ఇంద్రియములను సరైయిన మార్గంలో నియమించి, సత్ప్రవర్తన, సత్సంగమము ఆశ్రయించినప్పుడే ఉత్తమజ్ఞానం పొందటానికి ఈ జీవుడు తగినవాడగుచున్నాడు. జ్ఞాన ప్రభావం వృద్ధి చెందుచుండగా, అట్టి సర్వసమత్వ దర్శనము ఉత్తమ సుఖమును ప్రసాదిస్తోంది. జీవుడిని సంసారబంధము నుండి విముక్తునిగా తీర్చిదిద్దుతోంది.

ఆహారం వలన భూతజాలం, ఆ భూతజాలం చేయు పరిశ్రమ వలన ఆహారం వృద్ధి చెందుతూ ఉంటాయి కదా! అదేవిధంగా జ్ఞానము వలన శమ-దమాదులు, శమ-దమాదుల వలన జ్ఞానం వృద్ధిచెందుతూ ఉంటాయి. పద్మము - సరస్సులు పరస్పరం శోభింపచేసుకొనునట్లు జ్ఞాన-శమ దమాదులు ఒకటి మరొకదానిని శోభింప చేసుకొంటున్నాయి. శమదమాదులే సదాచారము యొక్క స్వరూపం. జ్ఞానమున్న చోట సదాచారం కూడా ఉంటుంది.

అందుకే శమ, ప్రజ్ఞాదులలో నిపుణులైన మహాపురుషుల చరిత్రలు చదివి, అందలి ఆదర్శం గ్రహించాలి. అట్లు ఆదర్శం గ్రహించకపోతే వారి చరిత్రలు చదివి ప్రయోజన మేమున్నది? శమ దమములు, సదాచారములవల్లనే జీవితం పవిత్రమౌతోంది.

వత్సా! రామచంద్రా! "జ్ఞానసముపార్జన సదాచారము" (Acquisition of Knowledge & Good conduct) ఈ రెండింటినీ ఒక్కసారే సమానంగా ఆచరించాలి. "మేము జ్ఞానము సంపాదిస్తున్నాము కదా. ఇక సదాచారంతో మాకు పనేమున్నది?" – అను మాట ఉచితం కాదు. "సదాచారులమగు మాకు జ్ఞానవిచారణతో పనిలేదు" – అనేమాట కూడా సరికాదు. ఈ రెండింటిలో ఒక దానిని నీవు తిరస్కరిస్తే, రెండవది నిన్ను తిరస్కరిస్తుంది. పొలంలో పాటలు పాడుతూ, చప్పట్లు చరుస్తూ,

పక్షులను పారద్రోలే వనితను చూడు. ఆమె పాటలు పాడటం, పక్షులను తరమటం ఒకేసారి చేస్తోంది కదా! ముముక్షువు కూడా జ్ఞాన, సదాచారముల రెండిటినీ ఒకేసారి అనుసరించాలి.

ఈ లౌకిక వ్యవహారములపట్ల కొంత నిస్సంగత్వమును అలవరచుకోవాలి. "శుద్ధచైతన్య స్వరూపుడనైన నేను దేనికీ, కర్తను కాను. కర్తను కాను కనుక భోక్తను కూడా కాదు" – అని అంతరంగమునందు ఉద్వేగరహితమైన అకర్తృత్వ భావనను అలవరచుకొన్నవాడు మా ఈ బోధను సులభంగా గ్రహిస్తున్నాడు. భ్రమ – ప్రమాదము (బద్ధకము) మొదలైన విఘ్నములను వినాశనమొనర్చి, ప్రయత్న – పరాక్రమములతో పరమ పదమును అధిరోహించాలి. అదియే ఈ జన్మల, కర్మల ఉత్తమ ప్రయోజనమై ఉన్నదని జనులు గ్రహించెదరు గాక!

ఓ సభికులారా! సదాచారము అత్యంత ప్రాముఖ్యమైనదని మాత్రం కొంచెము కూడా మరువవద్దు. ఇక మనం జ్ఞానవిషయ చర్చలోకి ప్రవేశించబోతున్నాం.

ఈ చెప్పబడబోవు మోక్షశాస్త్రం అందరి మనస్సులకు శాంతిని ప్రసాదించుగాక మానవ జీవితములకు, ఆయుష్షులకు అర్థ–పరమార్థములు ప్రసాదించును గాక! ఆప్తులగు జ్ఞానులచే ఇది అనేకులకు బోధింపబడు గాక! శ్రద్ధాసక్తులు గల అనేక ముముక్షువుల హృదయాలను అలరించును గాక! అనేకులు ముందు ముందు దీనిపై వ్యాఖ్యలు వ్రాయపూనెదరు గాక!

మురికినీటిలో చిల్లగింజలు వేసినప్పుడు, అందలి నిర్మలమైన నీరు పైకి లేచి, ఆ నీటిలోని దోషమంతా క్రిందకు జారిపోతుందికదా! ఈ మన విచారణ వినుచున్నవారి చిత్తములను శుద్ధి పరచి వారికి పరమపరాన్ని ప్రసాదించుగాక!

నాయనలారా! మీ మీ సాధనలు మాత్రం విడచిపెట్టకండి. ఎందుకో తెలుసా? సాధన వలన మనస్సులు పరిశుద్ధమొందుచుండగా, ఈ విచారణ అంతఃకరణమునందు ప్రవేశించినప్పుడు, తత్త్వజ్ఞానం జనిస్తుంది.

సాధనలను, వివేకసహితమైన జ్ఞానార్తిని, కలిగి ఉండండి. ఉత్సాహవంతులై సర్వదా ఉత్తమ ప్రయత్నమును నిర్వర్తించండి. జడమైన అభిప్రాయములందు, సంగమములందు రాగద్వేషములందు ఇరుకు కొనియున్న మీ మీ మనస్సులను ఉద్ధరించి, "ఆత్మజ్ఞానము" అను మంచినీటి సరస్సు వద్దకు చేర్చండి. బద్ధకము, అశ్రద్ధ ఆశ్రయించారా – మిమ్ములను ఆ హరిహరాదులు కూడా కాపాడలేరు. ఇక నేను చేయగలిగినదేముంటుంది?

శ్రద్ధాసక్తులతో ఈ శాస్త్రమును వినండి. అప్పుడు మీరు కోరకపోయినా మీ బుద్ధి పరమపదమున ప్రవేశిస్తుంది. అజ్ఞానం నశించగా, ఇక అట్టి పరమపదము మీ అంతఃకరణమును మరెప్పటికీ వీడజాలదు.

❖❖❖

# ఉత్పత్తి ప్రకరణము

## I. ప్రకరణ పరిచయము

### 1. మహావాక్య ప్రభావము

**శ్రీ వసిష్ఠమహర్షి :** "సోఽహం" "తత్త్వమ్" "త్వమేవాఽహమ్"
"జీవో బ్రహ్మేతి నాపరః" "అయమాత్మా బ్రహ్మ"

సోఽహం : అతడే నేను (నన్ను నేను అల్పుడిగా భావించుకోకూడదు).
తత్త్వమసి : అదియే నీవు అయివున్నావు.
త్వమేవాఽహమ్ : నీవే నేను
జీవో బ్రహ్మేతి నాపరః : ఈ జీవుడు బ్రహ్మముకంటే వేరైనవాడు కాదు.
అయమాత్మా బ్రహ్మ : ఈ జీవాత్మయే బ్రహ్మము.

ఈ విధంగా వేదములు మహావాక్యాలు ప్రసాదించాయి. ఈ మహావాక్యాలు బాగా విచారిస్తే, అప్పుడు అఖండ బ్రహ్మాకారవృత్తి కలిగి, జీవునికి తన నిజరూపం ప్రకాశిస్తుంది. ఈ జీవుడిని ఆవరించి ఉన్న అజ్ఞానం పటాపంచలు అవుతుంది. అట్టి అఖండాకార మహావృత్తినే, "మోక్షం" "నిర్వాణం", "జీవబ్రహ్మ స్వరూపం", "శుద్ధ - బ్రహ్మైకం" ... మొదలైన అనేక పేర్లతో పిలుస్తున్నారు.

ఆ పదాలన్నింటి అర్థం ఒక్కటే.

ప్రతి జీవి యొక్క ప్రయత్నములలోని అంతర్లీన లక్ష్యం నిత్య-ముక్త-పూర్ణ-స్వరూపంతో ప్రకాశించుటయే. అదే అతని ఆవేదన, ఆరాటం కూడా!

ఆత్మ యొక్క స్వభావం ..... "నిత్య శుద్ధత్వము , నీవు-నేను మొదలైన భేదములకు చోటులేని అఖండత్వము, ప్రశాంతత్వము" .... అయివున్నది. "నేను ఆత్మనే" అను ఎఱుక గలవాడు ఈ స్వభావములన్నీ పొందుచున్నాడు. అప్పుడాతడు ముక్తస్వరూపుడగు చున్నాడు. ముక్తికి మహావాక్యార్థజ్ఞానం కంటే ఇక వేరే ఏమీ అవసరం లేదు. ప్రతి జీవుని యందు అట్టి బ్రహ్మజ్ఞానం

సర్వదా జాజ్వల్యమానంగా వెలుగుతోంది. అయితే ఈ దృశ్యమును జీవునకు స్ఫురింపచేయుచున్నట్టి మాయ, అట్టి బ్రహ్మజ్ఞానమును కప్పి ఉంచుతోంది. అంతేకాదు. అతనిని వేలాది దుఃఖపరంపరలలో నిరంతరం ముంచి తేల్చుచున్నది. దిక్కుతోచనట్లు చేస్తోంది.

రామచంద్రా! ఈ మాయయొక్క దుశ్చర్యల గురించి భయపడవలసిన పనేమీ లేదు. ఎందుకంటే, ఈ దృశ్యప్రపంచ భావములలో జీవుని బంధించుచున్నట్టి 'మాయ' అనునది స్వప్నము వంటిది మాత్రమే. "మహావాక్యార్థజ్ఞానము" అనబడు మెలుకువ రాగానే ఈ భ్రమలన్నీ ఎక్కడికి పోతాయి ...? అది నన్ను అడుగవద్దు.

నిద్ర లేవగానే స్వప్నంలో చూస్తున్న పదార్థజాలమంతా ఎక్కడికి పోతున్నది?ఈ వర్తమాన జాగృత్-దృశ్య-భ్రమల గతి కూడా అంతే! "నేను ఏది అయివున్నాను? ఏది ఏ క్షణమునందునూ కాకయే ఉన్నాను?" అను రూపముగల ఎఱుక (లేక తెలివి, లేక జ్ఞానము, లేక ప్రబోధము) వలన సర్వము విదితము కాగా ... ఇకప్పుడు ఈ జీవుడే శివస్వరూపుడై స్వయంప్రకాశంతో జాజ్వల్యమానంగా వెలుగుచున్నాడు.

"ఈ సంసారము అనబడు దుస్తరమైన సాగరము జీవునికి ఎదురుగా ప్రాప్తించటానికి అసలు కారణమేమిటి?" అను ప్రశ్నను మనం పరిశీలిస్తే, "అజ్ఞానము కలిగియుండుటయే" అను సమాధానము లభిస్తోంది. ఇదంతా ప్రత్యగాత్మ యందే .... లేక, జీవ-చైతన్యము నందే .... లేక, నీ స్వస్వరూపమునందే ... కారణము లేకుండా ఇట్లు తోచుచున్నది. "ఇదంతయు బ్రహ్మమే" అని చెప్పు స్వబోధమైన మహావాక్యాలను, తద్ద్వారా ప్రకటించ బడుచున్న స్వాత్మరహస్యమును ఎవరైతే గ్రహిస్తారో వారే ఈ వర్తమాన జన్మ యొక్క ఉత్తమ ప్రయోజనము పొందుచున్నారు. అట్టి వాడే "బ్రహ్మజ్ఞుడు" అని అనిపించు కొంటున్నాడు.

కాబట్టి ఈ జీవుడు మహావాక్యముల అర్థం అభ్యసించి అఖండాకారవృత్తిని అలవరచు కోవాలి.

ఇది ఎవరి సృష్టి? ఎవరియందున్నది? ఎక్కడ ఉత్పత్తి పొందుచున్నది?

దీనికి సమాధానం విను.

ఈ జగత్తును ఎవరూ సృష్టించియుండలేదు. ఒకడు చీకటి కారణంగా తాను చూచుచున్న త్రాడుయందు పామును ఆరోపించి దర్శించునట్లు, అజ్ఞానియే ఉత్తమ విచారణ చేయక పోవుటచే ఏర్పడిన అజ్ఞానము వలన బ్రహ్మము నందు 'జగత్తు'ను ఆరోపించుచున్నాడు. అట్లు దర్శించుచు, స్వయముగా అనేక అనుభవములు పొందుచున్నాడు. అందు ప్రాప్తిస్తున్న సుఖ-దుఃఖభావములతో తాదాత్మ్యము చెందుచు, జన్మపరంపరలు పొందుచున్నాడు. అజ్ఞానం తొలగిందా – అంతా అతనికి సుస్పష్టమవగలదు. ఈ విషయమై యథార్థజ్ఞాన మేమిటో నీ ముందు ఉంచుతాను. దీనిని సూక్ష్మబుద్ధితో గ్రహించి పవిత్రుడవయ్యెదవుగాక!

❖

ఓ రాఘవా! ప్రతి జీవుని యొక్క నిజస్వరూపము "ఆత్మతత్త్వమే". అట్టి ఆత్మయొక్క స్వరూపము ఆకాశమువలె నిరాకారమైనది, చైతన్యమాత్రము. అయితే అట్టి నిర్లిప్త, నిస్సంగ, నిష్క్రియమగు ఆత్మ, "నేను జీవుడను" అనునట్టి జీవరూపమును దాల్చి ఈ జగత్తును చూడటం జరుగుతోంది. అందుచేత ఇదంతా ఒక కలవంటిది మాత్రమే. "నేను – నీవు – అతడు" .... మొదలైన రూపములుగా తోచుచున్న ఈ దృశ్యజగత్తు స్వప్నములోని ఆయా వస్తువులతో పోల్చవచ్చు.

"ఈ జగత్తును మేము వాస్తవముగానే చూస్తున్నామే?" అని ఎవరైనా అంటారేమో? వారు ఇంద్రియతాదాత్మ్యము పొందినవారై చూచు చుండుటచే అట్లు తోచుచున్నదని గుర్తు చేస్తున్నాను. అంతేకాని, ఇందలి వస్తువులు సత్యములు కావు. స్వప్నంలోని వస్తువులు కూడా అప్పటికి అవి సత్యములుగా తోచుచుండుటయే ఇందుకు మనకు దృష్టాంతం.

# 2. బంధహేతువు

దృశ్య ప్రపంచము యొక్క అనుభవం పట్ల, "ఇది వాస్తవమే" అను ఆరూఢత, నమ్మిక కలిగియుండుటచేతనే బంధము ఏర్పడుతోంది. "దృశ్యము అవాస్తవమే. ఇది లేదు" అను సదవగాహనచే దృశ్యము స్వప్నతుల్యమై "లేనిదే" అగుచున్నది. అప్పుడు బంధము అనునదే ఉండదు. మరి ఈ దృశ్యభావం తొలగిపోయేదెట్లా? ఇదంతా అసత్తుల్యమని గ్రహించేది ఎట్లా?

ఈ జగత్తులో ఏదైతే జన్మించుచున్నదో .... అదియే వృద్ధిచెందుతోంది. అదే స్వర్గ– నరకములకు ప్రయాణం చేస్తోంది. అట్టిదానికే "ముక్తి" అనునది అవసరమగుచున్నది. ఈ జీవుడు వాస్తవానికి సర్వాతీతుడు. ద్రష్ట స్వరూపుడు. స్వస్వరూపజ్ఞానము లేకపోవుటచేతనే జీవుడు బద్ధుడు అగుచున్నాడు. "స్వస్వరూపమగు ఆత్మ ఇతఃపూర్వమున్నట్లే సర్వవేళల ఉంటున్నది. అట్లే సర్వదా కేవల సాక్షిమాత్రమై ఉండబోవుచున్నది" అనునదే జ్ఞానం.

అయితే ఆత్మ ఎప్పటియట్లే ఉంటూ, ఎట్లు ఉత్పత్తి–బంధములను కలిగించుకొంటోంది?

ఈ ప్రకరణంలో ఈ విషయమై అనేక విశేషాలు నీముందు ఉంచబోవుచున్నాను. దీనిని వింటే ఆత్మస్వరూప జ్ఞానం లభించగలదు. మొట్టమొదట కొంత సంగ్రహంగా చెప్పి, ఆ తరువాత నీవు కోరిన విధంగా విస్తారంగా చర్చిస్తాను. ఇకపై మనం కొన్ని సంఘటనలు (ఉపాఖ్యానాలు) కూడా పరిశీలించబోవుచున్నాం.

❖

స్వప్నము 'సుషుప్తి'లో లీనమగుచున్నది కదా! స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు కూడా ఒకానొకప్పుడు "ప్రళయము" అనుదానిలో లీనమగుచున్నది. అనగా, ఈ దృశ్య తతంగమంతా స్వస్వరూపమునందు విలీనమైపోతోంది. అప్పుడు మిగిలియుండు సత్పదార్థమునకు నామరూపములు ఉండవు. అభివ్యక్తము ఉండదు. అది తేజము కాదు. అంధకారము కాదు, అది "నిష్క్రియము, అపరిచ్ఛిన్నము" అని మాత్రం గుర్తుగా శాస్త్రాలు చెప్పుచున్నాయి. లోకవ్యవహారం కోసం, పండితులు

అద్దానికి "ఋతము", "ఆత్మ", "పరబ్రహ్మము", "సత్యము", "శివము" మొదలైన అనేక నామములు కల్పించుచున్నారు. అయితే, అయ్యది శుద్ధ చిత్స్వభావమే అయినప్పటికీ, స్వమాయ వలన తనంతట తానే జడ రూపమున వివర్తమగుచున్నది. జీవభావము ఆశ్రయించినదానివలె కన్పట్టుచున్నది.

ఆ చైతన్యమయమైన వస్తువే సంకల్ప-వికల్పరూపమగు మనస్సుగా మారుచున్నది. క్రమంగా అది ప్రాణము యొక్క పంచభూతములయొక్క ఆకృతిని గైకొనుచున్నది. తన పరమార్థరూపమును మరచుట వలన ఆ చైతన్యము నుండే ఈ సంకల్ప-వికల్పములతో కూడుకొనిన మనోధర్మములన్నీ ప్రకటితమౌతున్నాయి. నిశ్చల సముద్రంలో తరంగములు లేస్తున్నాయి కదా! ఇది కూడా అట్టిదే.

**హిరణ్యగర్భుడు :** చైతన్యము సమష్టి (Collective) మనోభావము పొందినప్పుడు 'హిరణ్యగర్భుడు' అను శాస్త్రీయమైన పేరుతో చెప్పబడుతోంది. ఇట్లు ఆ చైతన్యమే వ్యష్టిగాను, సమష్టిగాను వెలయుచున్నది.

ఈ చైతన్యము "సత్య - సంకల్పతత్త్వము" అని కూడా చెప్పబడుతోంది. ఎందుకంటే అది తాను ఏది 'సత్యము' అని సంకల్పిస్తుందో, దానిని అట్లే పొందుతూ ఉంటుంది. తాను ఏది 'ప్రియము' అని భావిస్తుందో అది అట్లే ప్రియముగా ఏర్పడుచున్నది.

చైతన్యమే పూర్వసంస్కారములను అనుసరించి ఈ "అగ్ని, వాయు, జల, భూమి" అనబడే చతుర్విధ భూతములతో విరాట్‌భావమును (పదార్థజలములతో కూడిన విశ్వసృష్టిని) ఇంద్రజాలమువలె సంకల్పిస్తోంది. బంగారుతీగ బంగారము కంటే వేరా? బ్రహ్మ సత్త వలననే నిలిచియున్న ఈ జగత్తు బ్రహ్మము కంటే వేరుకాదు. బ్రహ్మము కూడా జగత్తు కంటే వేరుకాదు. అనగా ఈ జగత్తు యొక్క ఉనికి (ఉన్నచోటు, స్థానము) ఆదికారణమగు బ్రహ్మమునందే పర్యవసితమగుచున్నది.

జగత్తు భావమునందే ఉన్నది. భావమో? బ్రహ్మమునందే కలదు. ఇట్లు 'జగత్తు యొక్క ఉనికి స్థానం బ్రహ్మమే' అని చెప్పబడుతోంది.

ఎడారిలో ఎండమావుల ప్రభావంచేత నదీతరంగాలు కనబడతాయి. అవి అసత్యములే అయినప్పటికీ, "ఇవి జలకెరటములే" అని భావించి మృగములు అక్కడి జలం గ్రోలాలనే భ్రమచే పరుగెత్తుచున్నాయి. ఇంద్రజాలమయమగు ... ఈ "నీవు-నేను-అతడు" మొదలైన వాటితో కూడుకొని కనబడే ఈ జగత్తు ... అసత్యమే అయినప్పటికీ, 'మనస్సు' యొక్క ప్రభావం చేత నిత్యమైనదానివలె ప్రసిద్ధి పొందుతోంది.

**దృశ్యవ్యవహారం :** అందుకే, తత్త్వజ్ఞులైన పండితులు ... అనేకమైన భేదములతో కూడుకొని ఎదురుగా కనిపిస్తున్న ఈ దృశ్యవ్యవహారమునకు కొన్ని సాంకేతిక నామములు (technical terms) ఉపయోగిస్తున్నారు. ముందుముందు, వాటిని మనం కూడా ఉపయోగించబోతున్నాం కనుక వాటిని వివరిస్తున్నాను, విను.

**1. అవిద్య :** ఆయా భావనలు, పదార్థానుభవములు, ఆవేశపూరితమైన అభిప్రాయముల రూపంలో ఇప్పుడు 'వాస్తవం' లాగానే ఉంటాయి. కానీ, విద్య లేక జ్ఞానము ప్రాప్తించినప్పుడు తొలగిపోతాయి. ... అట్టి వ్యవహారమును 'అవిద్య' అని పిలుస్తున్నాను.

**2. సంసృతి :** యేయే భావనలు లేక దృశ్యమునకు సంబంధించిన అనుభవములు ఈ జీవుని స్వర్గ, నరక, పాతాళాది (లేక సుఖ, దుఃఖ, జడత్వాది) అనేక లోకములలో త్రిప్పుటకు కారణమగుచున్నాయో .... వాటిని 'సంసృతి' అని చెప్పుచున్నారు.

**3. బంధము :** ఈ 'దృశ్యభావన' లేక 'తాదాత్మ్యము' ఆత్మయొక్క స్వభావసిద్ధమైయున్న నిత్య స్వాతంత్ర్యమును అప్రకటితం (unmanifested, covered) చేస్తున్నది. అదియే 'బంధము'.

**4. మాయ :** "యామా" ... ఏదైతే సొంతంగా ఏ క్షణమందుకూడా ఉండి ఉండలేదో, కాని అజ్ఞానదృష్టికి మాత్రం వాస్తవమువలెనే తోచుచున్నదో .... అద్దానిని 'మాయ' అని అంటున్నాం.

**5. మోహము :** ఏదైతే .... భ్రమను కలుగజేయడానికి హేతువు అగుచున్నదో .... అట్టిదానిని 'మోహము' అని చెప్పుచున్నారు. లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా గారడీ లోలాగా తోచుట ఈ మోహము యొక్క వికారప్రభావమే.

**6. మహత్తు :** ఏదైతే దాటుటకు అత్యంత కష్టమైనదానివలె తోచుచున్నదో .... అద్దానినే 'మహత్తు' అను పేరుతో చెప్పుకొంటున్నాం.

**7. తమస్సు :** ఏదైతే స్వస్వరూపముయొక్క అనుభవమును కప్పి ఉంచి, ఈ జీవుని తన ఆత్మస్వభావం మరచేటట్లు చేస్తోందో ... దానినే 'తమస్సు' అనే మాటతో ఉదహరిస్తున్నారు.

ఇప్పుడు మనం 'బంధము' అంటే ఏమిటో విచారిద్దాం. అటు తరువాత మోక్ష విషయం కూడా.

❖❖❖

# 3. బంధ - మోక్షములు

"బంధము" అంటే ఏమిటి? ద్రష్టయొక్క "ప్రతిబింబ చైతన్యము"నకు బాహ్యంలో ప్రాప్తిస్తున్న ఈ దృశ్యమునకు గల సంబంధమునే 'బంధము' అని అంటున్నాం.

ఈ ద్రష్ట దృశ్యభావముచే బంధింపబడుచున్నాడు. దృశ్యము తొలగటం జరిగిందా, బంధము కూడా తొలగుతోంది. అయితే, "దృశ్యము" .... అంటే ఏమిటి? నీవు – నేను – మొదలైన మిథ్యా కల్పనలతో కూడిన జగత్తే కదా! అట్టి ఈ జగత్తు రూపు మాయనంత వరకు ముక్తి లభించదు.

అయితే రామచంద్రా! "ఇదంతా లేదు. ఇది ప్రతిబింబము వంటిదే" అని పైపై వాక్యాలు పలికినంత మాత్రంచేత ఈ "దృశ్యబోధ - Perceptual experience" నశిస్తుందా? లేదు. ఒక విధంగా చూస్తే ..... అధికమైన వాక్యాలు, సాంకేతిక పదజాలం చిత్త విక్షేపమునే కలిగిస్తూ

దోషమును వృద్ధిచేస్తాయి కూడా. ఎక్కువగా తర్కం చేయటంవలననో, లేక తీర్థయాత్రలు సేవించినంతమాత్రంచేతో ... ఈ జగత్తు మనోవీథి నుండి తొలగించటం సులభసాధ్యం అయ్యేదికాదని విచారణశీలురగువారు మనకు చెప్పుచున్నారు.

ఇక్కడ ఒక చమత్కారం ఉన్నది. చెపుతాను విను.

**జగద్దృశ్యంతు యద్యస్తి నశామ్యతేవ కస్యచిత్**
**నా஽సతోవిద్యతే భావో నా஽భావోవిద్యతే సతః ॥** (I. 26)

ఈ జగత్తు వాస్తవంగానే ఉండి ఉంటే, ఇక దీనిని తొలగించే ప్రసక్తి ఎక్కడ? ఎందుకంటావా? ఏది వాస్తవానికిలేదో ... అనగా అసత్తో .... అట్టిదానికి ఉనికి ఎక్కడ? ఏది ఉండియే ఉన్నదో .... అనగా సత్తో .... ఇకదానికి 'లేమి' అనునది అసంభవమే కదా!

కాబట్టి ఈ దృశ్యము లేదు. ద్రష్ట మాత్రం యథాతథుడై సర్వదా ఉండియే ఉన్నాడు.

కాని, స్వస్వరూపం యొక్క అపరిజ్ఞాన కారణంగా ఈ దృశ్యము ఉన్నట్లే తోచుచున్నది. చైతన్య స్వరూపమగు ఆత్మ స్వయముగా సర్వము తెలుసుకొంటోంది కనుక జ్ఞేయము. అది కొంతవరకే తెలుసుకొని మరికొంత గ్రహించలేదు కనుక "అపరిజ్ఞేయము" కూడా. అది దృశ్యనివృత్తి పొందనంతవరకు, తాను ఎక్కడ ఉంటే అక్కడ ఒక పరమాణువులో కూడా దృశ్యమును గాంచుచునే ఉంటుంది.

ఓ జీవుడా! నీవు ఇప్పుడు మానవజన్మ పొందావు. ఇదొక సదవకాశం. ఆత్మానుభవము కొరకై నీవు ఇప్పుడు ప్రయత్నించాలి. "ఈ దృశ్యము నా దృష్టిలో లేకుండా ఉండేది ఎట్లా?" అనుదాని కొరకై ప్రయత్నశీలుడవు కావాలి. సురాపానము (మత్తు-పానీయములు) సేవించువాడు, "ఈ మత్తు పానీయముల వలన నాకు తృప్తి కలుగుతుంది" అనే దురభిప్రాయం పరిత్యజించాలంటే ఎంతో ప్రయత్నం చేయవలసి ఉంటుంది కదా! "ఈ దృశ్యము వాస్తవమే" అను 'భ్రమ' మనస్సులో దృఢం అయివుండటం అట్టిదే. అది సూక్ష్మబుద్ధితో గ్రహించినట్టి మేము తపో, ధ్యాన, జపాది సాధనముల వలన చిత్తశుద్ధిని ముందుగా సంపాదించుకొన్నాం. అట్టి శుద్ధచిత్తము యొక్క సహాయం చేత "ఈ దృశ్యమునకు అస్థిత్వము లేదు" అను బుద్ధిని పెంపొందించుకొన్నాం. అందుచేత ఇప్పుడు దృశ్యము యొక్క మచ్చ కూడా మాకు కనబడటం లేదు.

ఓ రామచంద్రా! ఈ జగత్తుకు సంబంధించిన సంస్కారం నీయందున్నంత వరకూ నీవు పారిపోయి ఒక పరమాణువులో దాగినా లాభం లేదు. ఆ పరమాణువులో కూడా నీకు అనేక జగత్తులు ప్రాప్తిస్తూనే ఉంటాయి. చిత్స్వరూపదర్పణంలో ప్రతిబింబ పరంపరలవంటి అనేక జగత్తుల అనుభవం తప్పేది కాదు. ఒక అద్దము ఇరకు చోటులో ఉన్నా, లేక, ఒక సువిశాల ప్రదేశంలో ఉన్నా .... ఆయా తావులలో ఉన్నట్టి కొండలు, వాగులు, నేల, ఆకాశం, గోడ మొదలైనవి తనయందు ప్రతిబింబిస్తూనే ఉంటుంది కదా. ఈ చిత్స్వరూప దర్పణం విషయంలో కూడా అంతే

జరుగుతుంది. అట్లు ప్రతిబింబించటం వలననే చిత్స్వరూపమగు జీవునికి మాటిమాటికి ఈ జరా–మరణ దుఃఖములు, జాగ్రత్ – స్వప్న – సుషుప్తి అవస్థలు .... కలుగుచునే ఉన్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! "ఈ దృశ్యము లేదు" అని మీరు సిద్ధాంతీకరించుచున్నారు కదా! ఇక మేము ఇందులో పాల్గొనటం దేనికి? సర్వము త్యజించివేస్తే పోతుంది కదా! కర్మరాహిత్యమును ఆశ్రయిస్తేనే మంచిదా? 'సమాధి' మాత్రమే మమ్ములను ఈ దృశ్యము నుండి కాపాడుతుందేమో? మరి ఈ దృశ్యము మాకు బంధమే కదా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నిజమే. కాని, నీవు ఇక్కడ గమనించవలసింది ఒకటి ఉన్నది. సమాధి సమయంలో కూడా "ఇప్పుడు నేను దృశ్యమును గాంచటం లేదు. దానిని తుడిచి వేయుచున్నాను" అనే సంస్కారం ఉండనే ఉంటుంది కదా. ఈ సంస్కారము మరల సంసృతి స్మరణమునకు అనువు అయినట్టి .... ఒక అక్షయమైన బీజము అగుచున్నది. మరల మరల సంసారం ఉద్భవించటానికి ఆమాత్రం బీజం చాలు. దీనినిబట్టి మనం గ్రహించేదేమిటి? 'సవికల్పసమాధి' (నేను దృశ్యమును త్యజించివేస్తాను ... అను భావన ఉండి ఉన్నట్టి స్థితి) దృశ్యనాశనమునకు హేతువు కాగలదని మనం చెప్పలేం. మరి నిర్వికల్పసమాధి (thoughtless state) మాటేమిటంటావా? అవును. నిర్వికల్ప సమాధి లభిస్తే చైతన్యరూపమును, నిర్వాణమును కూడా పొందవచ్చు. కాని, నీ దృష్టిలో దృశ్యమున్నంతవరకు నిర్వికల్ప సమాధి సిద్ధించేదెట్లా?

అసలు 'సమాధి' అంటే ఏమిటి? ఆ సమయంలో జగత్తు యొక్క లేమిచే ఏర్పడు "నిశ్చేష్టత" వంటిదే కదా! ఒకడు గాఢంగా నిద్రిస్తున్నాడనుకో. అట్టి గాఢనిద్రలో జాగ్రత్‌కు సంబంధించిన ఏ అనుభవనం అతనికి ఉండదు. కాని, మేల్కొనిన తరువాత మరల ఇతఃపూర్వపు ప్రాపంచిక జ్ఞానమంతా వచ్చిచేరుతోంది కదా! సమాధి నుండి లేచినవాడు మరల మునుపటి విధంగానే అంతులేని దుఃఖములతో పరిపూర్ణమైయున్న జగత్తులను పొందుచునే ఉన్నాడు. మరల దుఃఖములు పొందవలసివున్నప్పుడు, ఇక క్షణిక సమత్వస్థితి (లేక సమాధి) వలన వచ్చే లాభమేమిటో చెప్పు?

"నేను నిర్వికల్పసమాధిని సంపాదిస్తాను. అది ఎన్నటికీ భంగము కాకుండా చూచు కొంటాను. ఆ విధంగా, అనంత సుషుప్తితో సమానమైన పవిత్ర బ్రహ్మపదమును పొంద వచ్చును కదా! ఈ జగత్తుతో నాకేమి పని? కాబట్టి నేను ఇప్పుడే నిష్క్రియుడను అవుతాను". అని నీవు అంటావేమో? ఇటువంటి అభిప్రాయం నీవు (వైరాగ్య ప్రకరణంలో) చెప్పావు కూడా. కాని, ఈ 'మనస్సు' అనబడే మూలదృశ్యము అంతరంగంలో ఉన్నంతవరకు, మహాయోగులు కూడా బాహ్యదృశ్యమును సంపూర్ణంగా రూపుమాపలేకపోతున్నారు. ఈ చిత్తము ఏ పదార్థములపై "పొందవలెను" అనే రూపమును గల ఆసక్తి కలిగి ఉంటుందో .... ఆయా విషయములందు జగద్భ్రమ కలిగి ఉన్నట్లే అవుతుంది. ఆ ద్రష్ట "లేదు. నేనొక పాషాణమును" అని తననుతాను భావించి ఊరుకొంటే మాత్రం ఏమి లాభం? అట్టి కల్పన నుండి తేరుకోగానే, మరల దృశ్యము ఎదురుగా ప్రత్యక్షమై నిలవనే నిలుస్తుంది. పైగా, ఇంతవరకు ఏ ఒక్క యోగియొక్క సమాధి కూడా పాషాణతుల్యమై

అనంతకాలం ఉండటంలేదు. ఇది పరిశీలకులమగు మా అనుభవం. పోనీ, పాషాణస్వరూపమైన 'స్థితి' లేక 'పరిణామం' కలిగివున్నట్టి 'నిర్వికల్ప సమాధి' అనునది ఒకటి ఉన్నదనే అనుకొందాం. అది అనంత కాలం స్థిరంగా ఉన్నప్పటికీ, ముక్తిని ప్రసాదించజాలదు. 'ముక్తి' .... అనునది శాంతము, జ్ఞానస్వరూపము, శ్రేష్ఠము, అనాది, అనంతము కదా! "పాషాణము వంటి నిర్వికల్పత్వములో ఘనీభూతమైన ఆలోచనారాహిత్య స్థితిలో అట్టి ముక్తిలేదు" .... అనేది మా అనుభవం, అభిప్రాయం కూడా.

❖

కాబట్టి రాఘవా! ఒకవేళ ఈ దృశ్యమే సత్యమై ఉంటే, ఇది ఎన్నటికీ నశించే ప్రసక్తే లేదు. "ఈ దృశ్యమును మేము తపోజపధ్యానాదుల సహాయంచేత నశింపచేస్తాం" అనునది ఎంతటి హాస్యాస్పదం! మూఢులే అట్లు భావిస్తున్నారు. లేనిది తొలగించటమేమిటి? దృశ్యము అసలేలేదు. ఒకవేళ ఉంటే .... నశించదు. మరి "దృశ్యము సంబంధము" ... అనే సంసారము తొలిగేది ఎట్లా? "దృశ్యము మిథ్య" .... అని తపోధ్యానాదులచే శుద్ధి పొందిన చిత్తమునకు సుస్పష్టమగుచున్నది. అనగా, తపోజప ధ్యానాదులు మోక్షమునకు నేరుగా కారణము కాదు. అవి చిత్తమును శుద్ధము చేయటానికి మాత్రమే ఉపకరిస్తాయి. అట్టి శుద్ధచిత్తము యొక్క సహాయంతో, "ఈ జగత్తు బ్రహ్మమే" అని సుస్పష్టముగా సందేహరహితంగా, అనుభవపూర్వకంగా తెలియవచ్చుటే మోక్షము" అని గ్రహించెదవు గాక! అనగా, "ఈ కనబడే సర్వము బ్రహ్మమే" అను అనునిత్యాభ్యాసం తపోధ్యానాదుల అంతిమ ఫలమునకు సమానమే కదా!

ఒక తామరపూవులో గింజలు (విత్తులు) తీసుకో, .... ప్రతి గింజలోను భవిష్యత్తులో మొలవబోవు తామరతీగె యొక్క లక్షణములన్నీ సంస్కారరూపంలో అణిగి ఉంటాయి కదా! అదేవిధంగా, ద్రష్టయందు కూడా దృశ్యము సూక్ష్మరూపమున (సంస్కార రూపమున) అణిగి ఉంటుంది. పదార్థములలో రుచి, నువ్వులలో నూనె, పువ్వులలో వాసన దాగి ఉంటాయి కదా! ద్రష్టయందు దృశ్యము కూడా అట్లే ఇమిడి ఉంటుంది.

కర్పూరం, ఎక్కడ ఉన్నా వాసన వెదజల్లుతూనే ఉంటుంది. 'నేను ఒక జీవుడను' అను జీవభావము వహించియున్న చిదాత్మకూడా ఎక్కడ ఉన్నప్పటికీ తన హృదయంలో దృశ్య జగత్తును పొందుచునే (గాంచుచునే) ఉంటుంది. "స్వప్నము, సంకల్పములు, మనోరాజ్యము" .... ఇవన్నీ ఎక్కడున్నాయి? ఈ జీవుని హృదయమునందే కదా! అదే విధంగా దృశ్య పదార్థములు కూడా నీ హృదయమునందే ఉన్నాయని స్వానుభవంచేత గ్రహించెదవుగాక!

ఒకానొక బాలుడు తన చిత్తము యొక్క వికల్పము చేతనే కొద్దిపాటి చీకటిలో ఒక దయ్యమును చూడటం, గజగజ వణకటం, చావటం కూడా జరుగుతోంది. ఈ దృశ్య పిశాచి ద్రష్టను కూడా అనేక శరీరప్రాప్తి .... వినాశముల రూపమున హింసించుచున్నది. ఒక గింజలో "మొలచుట" అను స్వభావం దాగివున్నది కదా! ఆ గింజ తగిన నేలను, ఋతువును పొందినప్పుడు మహావృక్షం

అవుతోంది. అట్లే "చిత్తు" (The Seer consciousness or substratum) లో రూపుదిద్దుకొని ఉన్న ఈ చిత్తమునందు 'దృశ్యజ్ఞానము' అనునది సంస్కార రూపంలో ఉంటోంది. అది దేశ-కాల పరిస్థితులను అనుసరించి వృద్ధి పొందుచున్నది. "విత్తనం" యొక్క 'మధ్య'లో చెట్టును వెలువరించగల శక్తి ఎప్పటికీ ఇమిడి ఉంటుంది. అయితే ఆ శక్తి అనువైన దేశకాలములు లభించనప్పుడు ప్రకటితం (manifest) కాకపోవచ్చు. అప్పుడు మొలకెత్తు శక్తి లోపించినట్లో త్యజించబడినట్లో అజ్ఞాన దృష్టిచే పైకి కనిపించవచ్చు. అదేవిధంగా "చిన్మాత్రశరీరి" (ఎరుకయే రూపముగా కలిగియుండి .... ఈ శరీరమును ధరించినవాడు) అయినట్టి ఈ జీవుని అంతరమున కూడా అతని స్వభావమే అయినట్టి ఈ జగత్తు సర్వకాలములందు ఉండనే ఉంటున్నది. అయితే, సమయ-భేదమును అనుసరించి సమాధికాలంలో అణగిపోయినట్లో, విడచి పోయినట్లో తోచుచున్నది. మరల వ్యుత్థాన కాలంలో వచ్చిపడుతోంది.

❖

మోక్షస్వరూపులగు జ్ఞానులదృష్టి ఎలా ఉంటుందో చెపుతాను విను.

"నేను ఈ జగత్తులో కనుపించుచున్న ఏదైనా ఒకానొక పదార్థము వంటి వాడను కాను. నన్ను బంధించగలిగినదంటూ ఏదీ ఎక్కడా లేదు. దేనికీ సంబంధించనట్టి శుద్ధ-చైతన్య స్వరూపుడనే నేను. అనంతుడనై సర్వదా, సర్వమును వెలిగించుచు, సర్వమునందు వెలుగొందుచున్నాను. ఈ జగత్తు నా స్వభావమే. నా గుణములు నేను కానట్లు, జగత్స్వరూపుడనగు నేను జగత్తుగా అగుటలేదు."

అట్టి ఉత్తమ భావనతో భావనారాహిత్యము పొందినవాడై తనను తాను అకర్తగా, అభోక్తగా, నిష్ప్రపంచకుడుగా, అద్వితీయుడుగా దర్శించుచున్నాడు. పూర్ణుడై ఉంటున్నాడు.

ఓ ప్రియరామచంద్రా! ప్రతి జీవీ పూర్ణుడే అయివున్నాడు సుమా! అయితే సంసార బద్ధుడగు జీవుడు అది మరచి ఇందు సంచరిస్తున్నాడు. "ఓయీ! జీవుడా! నీవు పూర్ణుడవేనయ్యా!" అని శాస్త్రకారులు, గురువులు గుర్తు చేయుటకు ప్రయత్నిస్తున్నారు. అంతే!

❖❖❖

# II . ఆకాశజుడు – మృత్యువు*

## 1. కథావిభాగం

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రాఘవా! "మృత్యువు" యొక్క అన్వేషణకు సంబంధించిన ఒక కథ ఉన్నది. చెపుతాను. దీనిని వింటే ఈ ఉత్పత్తి ప్రకరణమంతా చక్కగా గ్రహించగలవు.

"ఆకాశజుడు" అనబడే ఒక బ్రహ్మవేత్త ఉండేవాడు. అతడు గొప్ప ధ్యానపరాయణుడు. ఎల్లప్పుడు ఇతరుల హితము కోరుకొంటూ ఉండేవాడు. అత్యంత ధార్మికుడు.** అతడు కాలానుగతమైన హాని – వృద్ధులు లేకుండానే జీవిస్తూ ఉండేవాడు. సృష్టిలోని ప్రతి అణువును పొట్టన పెట్టుకోగల మృత్యువు అతనిని ఏమాత్రం సమీపించలేకపోయేది. అనేకసార్లు అతనిని మ్రింగివేయాలని అభిలషించిన మృత్యువు తనకు అతడు లభించకయే పోవటం చూచి ఆశ్చర్యపడింది. ఇతః పూర్వమైనదంతా హరించివేసి, నూతనత్వమునకు 'నాంది' పలకటమే మృత్యువు యొక్క కార్యక్రమం కదా!

"నాకు నాశనం లేదు. నేను మాత్రం క్రమంగా జీవులందరిని భక్షిస్తూ వస్తున్నాను. కాని చిత్రం! ఈ ఆకాశజుడిని మాత్రం భక్షించలేకపోతున్నానేమిటి? ఇతని "ఇతః పూర్వము" ను మ్రింగివేసి ఈతనిని 'నూతనత్వం' లో ప్రవేశింప చేయలేక పోతున్నానే? కొండరాయి ముందు కత్తిలాగా ఇతనిపట్ల నా ప్రయత్నమంతా వ్యర్థమైపోతోంది. ఎందుచేత?" అని ఆలోచించ సాగింది.

అసలు విషయమేమిటో తేల్చుకోవాలని నిశ్చయించుకొన్నది.

**"త్యజంత్యుద్యమముద్యుక్తా న స్వకర్మాణి కేచన"** (II. 5)

సమర్థులైనవారు అనుకున్నది సాధించేవరకు ప్రయత్నం వదలరుకదా! ఆ మృత్యువు ఆకాశజుడు ఉండే పురమునకు వెళ్ళి అతని మందిరంలో ప్రవేశించింది. వెనువెంటనే 'ప్రళయాగ్ని'తో సమానమైన అగ్ని ఆ మృత్యువును దహించటం ప్రారంభించింది. ఆకాశజుడు తీవ్ర ధ్యానంలో ఉన్నాడు. అట్టి సమయంలో విఘ్నం పొందటం ఇష్టం లేక అతడే ఆ అగ్నిని అక్కడ తనచుట్టూ నియమించాడు. కాని మృత్యువు ఏదో విధంగా ఆ అగ్నిజ్వాలల వలయమును భేదించి లోన ప్రవేశించింది. ఎట్లాగైనా అతిప్రయత్నంతో అతని చేతులు పట్టుకోవాలని ప్రయత్నించింది. మృత్యువు మహాబలిశాలి అయినమాట నిజమే. కాని ఏం లాభం? ఒకడు తన "ఊహ"లో చూస్తున్న ఒక భీకరమైన ఆకారమును మనం ఈ భౌతికమైన చేతులతో తాకగలమా? అట్లే మృత్యువుకు వేలాది చేతులు ఉన్నప్పటికీ, ఎదురుగానే ఉన్న ఆ బ్రహ్మవేత్తను తాకలేకపోయింది.

---

* ఆకాశజుడు = ఆకాశము నుండి పుట్టినవాడు ; మృత్యువు = పరిణామతత్వము

** ఎవడైతే తన స్వధర్మమును శ్రద్ధాభక్తులతో నిర్వర్తిస్తాడో .... అట్టివాడు 'ధార్మికుడు' అని చెప్పబడతాడు.

అప్పుడు మృత్యువు ఇక చేసేదేమీ లేక, తన నిష్ఫలమైన ప్రయత్నం విరమించింది. తన యొక్క నియామకుడు, యజమాని, భగవంతుడు అగు యముని సమీపించింది. "ప్రభూ! నేను ఎందుచేత ఆ ఆకాశజుడిని భక్షించలేకపోవుచున్నాను?" అని ప్రశ్నించింది.

**యముడు :** ఓ మృత్యువా! నీవు ఒంటరిగా నీ బలంతో ఏ ఒక్కరినీ ఏమీ చేయలేవు. చంపలేవు. వాస్తవానికి ఆయావ్యక్తుల పురాతన (ఇతఃపూర్వపు) కర్మలే వారివారి మరణములకు కారణములు అగుచున్నాయి. నీవు ఈ ఆకాశజుని సమీపించలేక పోవటానికి కారణం బహుశా అతనికి దృష్టి అవగాహనల యందు 'కర్మలు' అనునవే లేకపోవటం అయివుండవచ్చు. మరింకే కారణం ఉండటానికి వీలులేదు. అందుచేత, అతనికి ఇంకేమైనా అంతరంగంలో సంస్కారాలు, కర్మలు మిగిలి ఉన్నాయేమో పరికించిచూడు. అట్లు వెతికినప్పుడు ఇంకేమైనా కర్మలు మిగిలి ఉంటే అప్పుడు మాత్రమే నీవు అతనిని జయించగలవు. ("ఇది నేను చూశాను : ఇది నేను చేయవలసి ఉన్నది".... అను రూపములైన ఆసక్తులు ఉన్నప్పుడు మాత్రమే జీవునియందు కర్మలు శేషించి ఉన్నట్లు. కర్తృత్వభావమే లేనిచోట కర్మలు లేనట్లే)

మృత్యువు అతని కర్మలు వెతుకుచు సర్వభూమండలమును, దిక్కులను గాలించింది. గొడ్రాలి యొక్క రెండవ కుమారుడు ఎక్కడన్నా తారసపడతాడా? ఒకని సంకల్పిత నగరంలోని భవనాలు ఆ ప్రక్కనే ఉన్నట్టి మరొకడు చూడజాలడు కదా! అదేవిధంగా మృత్యువుకు ఆ ఆకాశజుని యొక్క కర్మలంటూ ఎక్కడా ఏమీ లభ్యపడనేలేదు. తిరిగి తిరిగి విసుగుపుట్టి ఆ మృత్యువు మరల సర్వార్థకోవిదుడైనట్టి యమభగవానుని వద్దకు వెళ్ళింది.

**మృత్యువు :** స్వామీ! నేను అంతా వెతికాను. కాని, అతని మనో ఆకాశంలో కర్మల జాడ ఏమాత్రం కనుగొనలేకపోయాను. మీరు సర్వజ్ఞులు. సంకట-సంశయ సమయములందు సేవకులకు ప్రభువులే దోవచూపించగలరు కదా! అతని కర్మలు ఎక్కడ ఉన్నాయి? నాకు అతని మనోఆకాశంలో కర్మల జాడ కనిపించలేదే!

ధర్మ-స్వరూపుడగు యముడు చాలాసేపు సమాలోచించి, ఆ తరువాత ఇలా పలుక సాగాడు.

❖

**యముడు :** ఓ మృత్యువా! ఈ ఆకాశజుని విషయం నేను కూడా సుదీర్ఘంగా పరికించాను. అతనికి 'కర్మలు' అనేవే లేవు. అతడు కేవలం నిర్విషయ-ఆకాశం నుండే జన్మించాడు. ఆకాశము నుండి జన్మించినవన్నీ నిర్విషయ-నిర్మల ఆకాశ స్వరూపములే కదా! అందుచేత ఆతనియందు .... మృత్యువునకు అవకాశము కలుగజేయగలుగు, "అభిమానము-రాగము" ...లతో కూడిన కర్మలంటూ ఏమీ లేవు. ఇతని హృదయమంతా వెతికి చూచాను. ఇతనికి తన ప్రాక్తన - కర్మలలో (ఇతః పూర్వం తనచే నిర్వర్తించబడిన కర్మలలో) ఏ ఒక్కదాని పట్లకూడా "ఇది నేనే చేశాను. అహమేవకర్తా" అనునట్టి అహంకారపూర్వకమైన సంబంధం కించిత్ కూడా లేదు. అతడు తనను జన్మరహితునిగాను, నిరాకారునిగాను గాంచుచున్నాడు. 'ఆకారము' అను వికారమే లేనిచోట ఇక కర్తృత్వమెక్కడిది?

కర్మలతో సంబంధమెక్కడిది? అతని దృష్టిలో అతని ఉనికికి ఆకాశముకాక మరింకే కారణమూ లేదు. కనుక ఇక అతడు ఆకాశమే స్వరూపముగా కలిగి ఉంటున్నాడు. ఆకాశము (Absolute-Space) ఎల్లప్పుడు ఆకాశముగానే ఉంటుంది గాని, దానికి అగ్ని, వాయు, జల, భూములతో సంబంధమేమి ఉంటుంది? (There may be form or may not. But 'Space' remains as space). ఆకాశమునకు – ఒక చెట్టునకు ఏమాత్రం పదార్థపూర్వక సంబంధం లేదు. అవి ఒక దానిని మరొకటి తాకజాలవు. కనుక "ఆకాశము, చెట్టు అయి ఉంటున్నది." "ఆ ప్రదేశం ఒకప్పుడు ఒక దట్టమైన అడవి. ఇప్పుడో, అది ఒక మహాపట్టణము అయినది" .... అనునవన్నీ అసమంజసమే కాదా! అట్లే అతడు తనను నిర్వికార–నిరాకార రూపునిగా భావిస్తూ (లేక తెలుసుకొంటూ) ఉండటం చేత అతని యందు కర్మలు చోటు చేసుకోలేకపోతున్నాయి. ఇతఃపూర్వం నేను ఈ ఈ కర్మలు చేశాను" అను రూపంగల సంస్కారమే లేనందువలన, అతని చిత్తము వర్తమానమునందు అత్యంత సుస్థిరమైయున్నది. "ఇప్పుడు నేను ఈ కర్మలు చేస్తున్నాను. భవిష్యత్తులో ఈ కర్మ ప్రయోజనములో, లేక వేరువేరు కర్మలో పొందెదనుగాక" .... అను వాసన అతనియందు లేదు. అట్లు చిత్తము సుస్థిరత పొందియుండుటచే అతనిని "ప్రారబ్ధకర్మ" లేక ఇదివరకు నిర్వర్తించబడి, ఇప్పుడు దానియొక్క ప్రయోజనము ఫలించుటకు సిద్ధంగా ఉన్నట్టి కర్మ కూడా ఏమాత్రం లేదు.

ఆ విప్రుడు, "నేను ఆకాశకోసుడనై, విశదాకాశరూపుడనుగా, అనంత – విశాల – అఖండ రూపుడనుగా, స్వకారణముననే (ఎట్టి బాహ్యమైన కారణము లేకుండా) నిలచియున్న వాడను" .... అని తన స్వరూప విషయమై భావన చేస్తున్నాడు. ఈ కారణంచేత అతడు నిత్యుడు. అతనికి ఇంకొక కారణమంటూ ఏమీ లేదు. ప్రాక్తనకర్మలు లేనట్లే నూతన కర్మలేవీ అతడు అసలు చేకూర్చుకోవటం లేదు. ఇతడు "కేవలం విజ్ఞానాకాశ స్వరూపుడే" అని అనవచ్చు."నేను కర్మలు నిర్వర్తిస్తున్నప్పటికీ కర్మలతో సంబంధం లేనివాడిని"..... అని తనగురించి భావన చేసుకుంటున్నాడు.

**మృత్యువు :** స్వామీ! అతనియందు కర్మలయొక్క సంస్కారమే లేదు కనుక, అతనిపట్ల కర్తృత్వ–భోక్తృత్వములు నిష్ఫలమౌతున్నాయి. (లేకయేపోతున్నాయి). మీరు చెప్పిన దానిని బట్టి ఇంతవరకు గ్రహించాను. కాని, నాదొక సందేహం. మనకు ఇతనియందు ప్రాణము యొక్క, దేహేంద్రియముల యొక్క చలనము కనిపిస్తున్నాయి కదా! మరి అతడు "నేను జీవిస్తున్నాను" అను కర్మ నిర్వర్తిస్తున్నట్లే కదా!

**యముడు :** అతనిని ప్రాణ–దేహ–ఇంద్రియముల స్పందరూపంగా చూడటమనేది మన 'అవిద్య' యొక్క భ్రమ మాత్రమే. అతడు మాత్రం అట్టి అవిద్యకు లోబడుటలేదు. "ఇది చేస్తున్నాను. ఇది చేయటంలేదు'' .... అనునట్టి కర్మలకు సంబంధించిన బుద్ధి అతని యందు లేదు. "జీవితము–మరణము–పునర్జీవితము" అనే భ్రమను అతడు దరికి రానీయటం లేదు. "ఈ దేహ–దేహస్పందనములు నాకు సంబంధించినవి కావు. నేను నిత్యనిర్మలాకాశరూపుడను" .... అను భావనచే సకల భౌతిక భావములకు అతీతత్వము సంతరించుకొని ఉన్నాడు.

ఒక దృష్టాంతం చెపుతాను. ఒక పెద్ద 'స్తంభము' ఉన్నది. అందు ఒక పద్మము, దానిపై స్త్రీ యొక్క ఆకారం శిల్పిచే చెక్కబడినది. ఆ స్త్రీ ఆకారం పొందిన శిల, అందుగల ఒక పద్మమునకు సంబంధించి శిల, స్తంభము యొక్క శిల ఒక్కటే కదా! అజ్ఞాన దృష్టి కలవానికి "ఇది శిల యందలి స్త్రీ, ఇది పద్మము, ఇది స్తంభము" అనే భేదదృష్టి ఉంటుంది. వాస్తవానికి మొత్తమంతా శిలయేకదా!

"చిన్మయ బ్రహ్మము" నందు ఈ "ప్రపంచరచన" కూడా తన వాస్తవ తత్త్వమగు బ్రహ్మము కంటే వేరైన దానివలె అజ్ఞానదృష్టికి కనిపిస్తోంది. కాబట్టి, ప్రియమైన ఓ మృత్యువా! ఆకాశము నుండి ప్రకటితమైన ఈ ఆకాశజుని నీవు ఆకాశమునకు అభేదముగానే గ్రహించెదవు గాక! తనను తాను శుద్ధునిగా, అఖండునిగా, కర్మరహితునిగా గాంచు చున్నాడు కనుక "ఇతడు బ్రహ్మవేత్త" అని అంటున్నాం. నీటియందు ద్రవత్వము, ఆకాశము నందు శూన్యత్వము, వాయువునందు స్పందత్వము సహజమే కదా! బ్రహ్మము నందు జగదత్వము అట్టిదే. "ఒకడు తనను తాను ఎట్లు గ్రహించుచున్నాడు?" అన్నదాని ననుసరించి "ఇది జీవుడు, ఇది శివుడు" అను విధమైన పదజాలం శాస్త్రం కల్పిస్తోంది. వాస్తవానికి బ్రహ్మము కానిదెవరు? కానిదేది?

ఈ విప్రుడు పరమపదమును పొందియున్నాడు. కర్మలకు అతీతముగా తననుతాను గ్రహించు చున్నాడు. ఇతనికి సంచిత (the total culmination of past deeds) –ప్రారబ్ధ (that part of past deeds that is to manifest in the present) – ఆగామి (the culmination of past and present deeds that dates ahead to future) ఏమీ లేవు. అందుచేత సంసారమునకు వశుడవడం లేదు.

ఒక 'కారణము' నుండి ఎటువంటి సహకారి–కారణము లేకుండానే ఏదైనా ఉత్పన్న మైనప్పుడు అట్లు జనించినది – ఆ 'కారణము' కంటే – వేరైనది కావటం లేదు కదా! బంగారము నుండి లభించిన ఆభరణం బంగారమే కదా! ఇతనికి చిదాకాశ కారణము కంటే వేరేమీ కారణం లేక పోవుటచేత, ఇతడు "స్వయంభువు" అని చెప్పబడుచున్నాడు. ఓ మృత్యుదేవతా! నీవు కర్మ–స్వరూపిణివి మాత్రమే కదా! 'పూర్వాపరకర్మలు' లేని చోటును నీవెట్లా ఆక్రమించగలవు చెప్పు?

ఈ జీవుడు వాస్తవానికి సత్యసంకల్పుడు. అతడు దేనిని ఎట్లు సత్యముగా భావిస్తాడో ... అతనికి అది అట్లే అనుభవమౌతుంది. అతడు, "నేను పంచభూత వికారమగు ఈ శరీరమునే" .... అని తలచినప్పుడు ఈ పార్థివ శరీరం (material body) అగుచున్నాడు. నీవు కాలక్రమంగా అతనిని గ్రహిస్తున్నావు. అసత్యదృష్టి ఉన్నచోటే నీ ఆటలు సాగుతాయి. ఏది అసత్యమో, అది అనిశ్చలమే అవుతుంది. అది మాత్రమే కాలస్వరూపమగు నీ పాల పడుచున్నది. ఈ ఆకాశజుడు అట్టివాడు కాదు సుమా! "ఈ పృథివి – మొదలైన పంచ భూతముల వికారములతో నాకు ఎటువంటి సంబంధం ఏ క్షణమందు లేదు. నేను .... అంతటా నిత్యమై, నిత్యోదితమై వెలయుచున్న చిదాకాశమునే" .... అనునట్టి దృఢ నిశ్చయము అతడు కలిగియున్నాడు. కాబట్టి రూపహీనుడే అగుచున్నాడు. రూపరహితుడగు వానిని, నీవు చేయకలిగినదేమున్నది? ఎంత గట్టి త్రాడు అయినప్పటికీ, ఆకాశమును బంధించగలదా? లేదు కదా! కాబట్టి నీవు అతనిని ఏమీ చేయలేవు.

**మృత్యువు :** భగవానుడా! ఆ ఆకాశజుడు "ఆకాశము నుండి జన్మించినాడు" అని అంటున్నారు. కాని, ఆకాశము శూన్యముకదా! శూన్యము నుండి ఇతడు ఎట్లా ఉద్భవించాడు? నాకు ఇంకొక సందేహం కూడా ఉన్నది. అది కూడా చెపుతాను. ఈ భూమి మొదలైనవి ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకపోవటానికి కారణం ఏమిటి?

**యముడు :** మన ఈ విప్రుడు ఏ కాలమందును, జన్మించియే ఉండలేదు. ఇతడు 'జన్మ' అనునదే లేనివాడు. నిత్యుడు. విజ్ఞానస్వరూపుడు. (విజ్ఞానమే రూపముగా కలవాడు).

దృశ్య సంబంధమైన సర్వసంకల్పములు స్వస్వరూపముయొక్క నిర్దుష్టానుభవముచే మ్రింగి వేయబడగా అట్టి మహాప్రళయ సమయమందు ఇక మిగిలిఉండేదేది? కేవలము ఏక మాత్రము, శాంతము, శూన్యము, నిత్యము, ప్రకాశము, సూక్ష్మము, నిరుపాధికము, అనంతము, జరామరణాది వృత్తులు లేనిది అయిన బ్రహ్మమే కదా! అట్టి బ్రహ్మమునకు, లేక బ్రహ్మభావనకు ఇక మార్పు–చేర్పులు ఏమి ఉంటాయి? మన ఆకాశజుని స్వరూపము ఆ పరబ్రహ్మమే అయివున్నది. మార్పు–చేర్పులు లేనిచోటికి నీవు చేరలేవు. ఎందుకంటే .... మార్పు–చేర్పులే నీయొక్క రూపము కదా!

**మృత్యువు :** హే యమ దేవా! ఈ ఆకాశజుని జన్మవృత్తాంతమేమిటి? ఇతని స్వరూప – స్వభావములు ఎట్టివి? ఇతడు ఏమి కానున్నాడు? సర్వమార్పులకు అతీతుడైన ఇతని విషయము మరికొంత వివరించండి.

**యముడు :** 'పరబ్రహ్మము' అని చెప్పబడుచున్న ఒకానొకటి ఉన్నది. అది శుద్ధ చైతన్యము, అనిర్వచనీయముకూడా. జ్ఞానమాత్ర స్వభావకమగు అట్టి 'పరబ్రహ్మము' నందు "నేను దేహమును" అను రూపముతో తేజోమయమగు విరాట్ పురుషుని విశాలదేహము 'కించిత్' ఆవిర్భవిస్తోంది. అప్పుడు బ్రహ్మమునందు ఈ మిథ్యామయమగు ఆకారవికారం కాకతాళీయంగా మనబోటి బద్ధదృష్టి కలవారికి గోచరిస్తోంది. అట్టి బద్ధదృష్టి (Bonded Perception) లేనివారికి అన్నివేళల కూడా బ్రహ్మమే ప్రస్ఫుటమౌతోంది.

ఒకానొక దృష్టాంత సహాయంతో విషయం చెపుతాను.

"బ్రహ్మము ఆకాశమువంటిది" అని అనుకొందాం. అప్పుడు, హిరణ్యగర్భుని ఉపాధియగు అజ్ఞానము ఒకానొక విశాల జలాశయం వంటిది. జలాశయంలో ఆకాశం ప్రతిబింబించినట్లు, హిరణ్యగర్భునియందు 'బ్రహ్మము' ప్రతిబింబిస్తోంది. అనేక ఉపాధులయందు ప్రవేశిస్తూ ఇంతలోనే త్యజిస్తూ ఉండే సమష్టి మనస్సే 'హిరణ్యగర్భుడు'.

ఆ జలాశయంలో నీరు కదలుచున్నదనుకో. అప్పుడు అక్కడ ఉండి చూచేవారికి "ఆకాశమే కదులుచున్నది కదా" అని అనిపిస్తుంది. కాని "ఆకాశం ఎప్పుడూ నిశ్చలంగానే ఉంటుంది. తరంగములు కదులుచుండగా అందు ప్రతిబింబిస్తున్న ఆకాశం కదులుచున్నట్లు నా అవగాహన యొక్క దోషంచేత అనిపిస్తోంది", అనే విషయం సూక్ష్మదృష్టి గలవానికి మాత్రం తెలిసిపోతోంది.

"బ్రహ్మము ఉపాధి దోషం పొందుతోంది" అని మనకు మన అజ్ఞానం చేతనే అనిపిస్తోందని మరల గుర్తుచేస్తున్నాను.

- ఆ జలాశయంలో ప్రతిబింబించే ఆకాశమును చూస్తున్నప్పుడు, అందులో కొద్ది నీటి భాగం 'వ్యష్టి'
- మొత్తం నీరంతా కలిపిచూస్తే 'సమష్టి'
- ఈ విధంగా వ్యష్టి-సమష్టిలు రెండూ అసత్యములే
- జలాశయంలోని కొద్ది భాగంలో కనిపించే ఆకాశం, విశాలజలంలో (మొత్తం జలాశయంలో) కనిపించే ఆకాశం కూడా వాస్తవంకాదు. జలాశయంలో కనిపించే ఆకాశమంతా ప్రతిబింబమాత్రమే.
- జలాశయంలో ఆకాశానికి ప్రాప్తిస్తున్న అనేక స్పందములు వాస్తవం కాదు.
- పైనున్న ఆకాశం వాస్తవం. అది యథాతథంగా ఉండగా, తరంగముల కదలికచేత జలంలోని ప్రతిబింబం - ఆకాశం, క్రింద - మీద అగుచున్నట్లు అనిపిస్తూ ఉంటుంది.
- ఈ అనేక స్థావర-జంగమములందు గల 'మనస్సు' అను జలంలో ప్రతిబింబించే బ్రహ్మము మనయొక్క అవగాహన లోపం చేత మార్పు-చేర్పులు పొందుచున్నట్లు మన దృష్టికి అనిపిస్తోంది.

బ్రహ్మము సర్వదా నిత్యసత్యమై, శుద్ధమై, శాంతమై వెలుగొందుచున్నది.

ఈ వ్యష్టి-సమష్టిలు ఉండనీ, లేకుండనీ, బ్రహ్మమునకు వచ్చు లోపమేమీ ఉండదు. తటాకంగాని, అందలి మొత్తం జలంగాని, లేక కొద్ది జలంగాని ఉన్నా, లేకున్నా, భీకర తరంగములు పొందినా, సుడిగుండములు ఏర్పడిన ... పైనున్న ఆకాశమునకు లోటేమిటో చెప్పు?

జలాశయజలంలోని ఒక విభాగంలో ప్రకటితమగుచున్న, ప్రతిబింబిస్తున్న ఆకాశం 'వ్యష్టి' అని, మొత్తం జలంలో ప్రతిబింబిస్తున్న ఆకాశం 'సమష్టి' అని అన్నాను కదా! "సమష్టి ప్రతిబింబిత బ్రహ్మము - "విరాట్-పురుషుడు, సమష్టి-జీవుడు, హిరణ్య గర్భుడు" .... అని చెప్పబడుతోంది.

ఓ మృత్యువా! ఈ జీవుడు, పై దృష్టాంతములోని జలాశయమునకు సంబంధించని ఆకాశమువలె "నేను బ్రహ్మమునే" అనునట్టి జ్ఞానానుభవ-దృఢత్వముచే నిన్ను అధిగమించి వేస్తున్నాడు.

మన ఈ ఆకాశజుడే విరాట్పురుషుడు. ఎందుచేత?

"నేను వేలాది శరీరములోని ఒకానొక శరీరమును కాను. ఈ స్థావర జంగమాత్మకమగు సమష్టి సృష్టిని నేనే" అని భావించటం చేతనే సుమా! బిడ్డా! మనం ఇంతకు ముందు "ఈ జీవుడు సత్యసంకల్పుడు" అని అనుకొన్నాం కదా! అతడు ఏది దృఢంగా భావిస్తే అది అతనికి సత్యమై తీరుతుంది. మన మందరము ఇట్టి స్వసంకల్పములచేతనే ఈ ఈ రూపములను, క్రియలను పొందుచున్నాం. అట్లే ఈ ఆకాశజుడు కూడా. అతడే సృష్టి ప్రారంభంలో పరమాకాశము, నిర్విశేష - చిదాకాశరూపుడుగా సంస్థితుడై ఉన్నాడు. అతనికి శరీరములుగాని, కర్మలుగాని, కర్తృత్వబోధగాని, వాసనలుగాని లేవు. విశుద్ధాకాశ స్వరూపుడై, కేవలుడై, జ్ఞానఘనుడై వెలయుచున్నాడు. ఇతనికి

ప్రాక్తన వాసనలు (tendencies that devolved from the past) ఏవీ లేవు. తేజస్సుకు దీప్తి కాక మరింకే రూపములేనట్లు, ఈ ఆకాశజునికి ఆకాశము కాక మరింకే రూపము లేదు.

ఇప్పుడితని ప్రాతిభాసితరూపము మనకు కనిపిస్తోంది కదా! అందుకు కారణం అతనిలో శేషించి ఉన్నట్టి స్వల్పచిత్తవృత్తులే. అవి కూడా రహితమైనప్పుడు ఇతనికి ఈ ప్రాతిభాసిత రూపము (Reflective appearence) కూడా ఉండదు. 'నేను చిదాకాశమే' అని గ్రహించినప్పుడు ఈ బహిర్ముఖ చిత్తవృత్తులు కూడా నశించిపోతాయి. కాబట్టి ఓ మృత్యువా! ఇతనికి 'ఘన-ద్రవ-వాయు' మొదలైన వాటితో సంబంధం లేదు. ఇతనిని నిగ్రహించాలని నీవు చేసే ప్రయత్నం వ్యర్థమైనదే. ఆకాశమును ఎవరైనా మ్రింగగలరా?

ఈ మాటలు విన్న మృత్యువు ఆశ్చర్యపడింది. ప్రభువగు యమధర్మరాజు వద్ద సెలవు తీసుకొని తన నివాసస్థానమునకు వెళ్ళిపోయింది.

❖❖❖

# 2. స్వయంభువు

శ్రీరాముడు కొంచెంసేపు మౌనం వహించాడు. వసిష్ఠమహర్షి చెప్పిన ఆకాశజ - మృత్యు - యమదేవుల కథ కొద్ది క్షణాలు మననం చేశాడు. పరిశీలనాత్మకంగా దర్శించి ఇట్లు పలుకసాగాడు.

**శ్రీరాముడు :** మీరు చెప్పిన ఆకాశజుని వృత్తాంతం, యమ-మృత్యువుల సంభాషణ విన్నాను. మీరీ కథ ఏదో గూఢార్థంతో చెప్పారని నాకు అనిపించింది.

మీరు చెప్పిన 'ఆకాశజుడు' అనగా లోకపితామహుడైన బ్రహ్మదేవుడే కదా! అతడే హిరణ్య గర్భుడు, స్వయంభువు, అద్వితీయుడు, జీవసమష్టిరూపుడు ... అని కూడా చెప్పబడ్డాడు. వివిధ రీతులైన భావాభావములకు అనుసంధానకర్తయే ఆ ఆకాశజుడు. మీరు చెప్పిన దానిని బట్టి ఈ జగత్తు మిథ్యయే అయివున్నది.

**శ్రీ వసిష్ఠమహర్షి :** అవును. నీకు బ్రహ్మదేవుని గురించే చెప్పాను. ఒకప్పుడు ఒకానొక మన్వంతరంలో మృత్యువు జీవులందరిని భక్షించి, బ్రహ్మను కూడా ఆక్రమించాలని అనుకొన్నది. అప్పుడు మనం చెప్పుకొన్న విధంగా యముడు బోధించటం జరిగింది. ఎవడు ఏ పని చేయాలనుకొంటాడో .... అతడికి ఆ విషయంలో సహజమైన ప్రవృత్తి ఉంటుంది కదా! అందుచేత మృత్యువు బ్రహ్మదేవుని భక్షించాలని ప్రయత్నించింది. అయితే బ్రహ్మ ఆకాశ-శరీరి మాత్రమే కదా! మృత్యువు అతనిని ఎట్లా ఆక్రమిస్తుంది?

"నేను మనోమాత్రుడను. పృథివి మొదలైన ఆకారాదులు లేనట్టి సంకల్పమాత్రుడను. చిదాకాశరూపుడను" అని ఎవడైతే సుస్థిరంగా భావిస్తాడో .... అతడు చిదాకాశమే అగుచున్నాడు.* అట్టివాడు కారణహీనుడు. 'ఉత్పత్తి' అనునదే లేనివాడు. అట్టివానిని మార్పు-చేర్పులు తాకజాలవు.

* చిదాకాశము : చిత్ = ఎరుక, ఆకాశము = ప్రసరణము
బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి : బ్రహ్మమును ఎరిగినవాడు బ్రహ్మమే అగుచున్నాడు.

మనస్సుచే సంకల్పించబడినప్పుడు ఆ మనస్సులోనే వస్తువులు, పురుషులు అగుపిస్తారు కదా! ఈ పంచభూతములతో సంబంధం లేనివాడు, స్వయంభువు అగు బ్రహ్మ కూడా 'ఆకాశజుడు' అనే రూపంలో పరిమిత దృష్టి గలవారికి గోచరిస్తున్నాడు. నిర్మలాకాశంలో సంకల్పబలం చేత ఒకనికి ముత్యాలు ఉన్నట్లు తోస్తుంది. స్వప్నం, స్వసంకల్పము ప్రవర్తిస్తున్నప్పుడు కల్పిత నగరం కనబడటం అందరికీ అనుభవమగుచున్న విషయమే. ఈ 'స్వయంభువు' కూడా అట్లే శరీరములతో అగుపడటం జరుగుతోంది. ఇతడు కేవలం పరమాత్మయే. అందుచేత అతని యందు దృశ్యత్వము గాని, ద్రష్టత్వము గాని లేవు.

❖

సంకల్పము లేక భావించటం మనస్సు యొక్క రూపము. శుద్ధమనస్సే బ్రహ్మము. అనగా మనోభావాలు ధరిస్తున్న చైతన్యమునకు నామరూపాలు లేకపోయినప్పటికీ, గుర్తుకోసం 'బ్రహ్మము' అను పేరు పెట్టబడింది. అట్టి శుద్ధ-మనోమయాకాశంలో ఈ పృథివి మొదలైన వస్తుజాలం లేదు. ఒక చిత్రకారుడు ఒకానొక సుందరమైన ప్రకృతి దృశ్యం చిత్రించాలను కొన్నాడనుకో .... ఇప్పుడు అతని మనస్సులో దేహరహితమైన ఆ 'ప్రకృతి దృశ్యం' రూపుదిద్దుకొంటుంది కదా! ఈ బ్రహ్మదేవుని చిదాకాశమునందు ప్రతిబింబము గ్రహించు స్వభావము గల శుద్ధమయినట్టి మనస్సుయొక్క స్వరూపము ఉదయించి ప్రకాశిస్తోంది.

కాబట్టి రాఘవా! 'బ్రహ్మము' అనునది వేరే ఏదో ఎక్కడో ఉన్నది కాదు. అది ఆదిమధ్యాంత రహితము. కేవలము, స్వస్వరూపము అయినట్టి చిదాకాశమే అయ్యది. అద్దానిని సృష్టించునది అంటూ ఇంకేమీ ఉండదు. అది సంకల్పించుటచేతనే సర్వము సృష్టించ బడుతోంది. స్వయముగా, సంకల్పరూపంచే ప్రదర్శితమగుచుండుటచే అద్దానిని 'స్వయంభువు' అని అంటున్నాం.

ఈ మనస్సు ఆకార రహితము అయినప్పటికీ చిత్తము వలన, ఆకారయుతముగా ప్రకాశించు చున్నది. వంధ్యాపుత్రునివలె (గొడ్రాలి కుమారునివలె) దానికి వాస్తవానికి శరీరాదులు లేవు.

❖❖❖

## 3. స్మృతి - మనస్సు - బంధము

**శ్రీరాముడు :** ఓ బ్రహ్మజ్ఞా! మీరు మనస్సును శుద్ధమని అంటున్నారు. "పృథివి మొదలైన భూతజాలమునకు ఏమాత్రం సంబంధించనిది" అని వర్ణిస్తున్నారు. ఈ మనస్సే బ్రహ్మమని కూడా చెప్పుచున్నారు. ఇంతవరకు ఈ విషయాలు నేను ఒప్పుకొంటున్నాను. అయితే, ఇక్కడ ఒక సందేహం. మీరుగాని, నేనుగాని, ఈ సభికులుగాని ఈ వర్తమాన శరీరములను ధరించుటకు ఇతఃపూర్వపు స్మృతియే కారణమైయున్నది కదా! అదే విధంగా ఆత్మకు ప్రప్రథమ సృష్టి సంకల్పుడగు బ్రహ్మదేవునికి కూడా ఇతఃపూర్వపు స్మృతే కారణమని ఎందుకు అనకూడదు? అతడు కారణరహితుడని, 'స్వయంభువు' అని ఎందుకు అనాలి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** పూర్వకర్మలతో కూడి ఉన్నప్పుడు "సంస్కారము" అనేది ఉంటుంది. అట్టి సంస్కారమునే "లింగదేహము" అని కూడా అంటున్నాం. "ఇతఃపూర్వపు స్మృతి"యే ఆ తదుపరి శరీరము దాల్చుటకు కారణమగుచున్నదనునది వాస్తవమే.

అయితే ఆకాశజునకు ప్రాక్తన కర్మలే లేవు. ఇక ఇతఃపూర్వపు స్మృతి ఎట్లా ఉంటుంది? స్మృతియే లేకపోతే జన్మకు ఏది కారణమౌతుంది? అందుచేత "అతని రూపం దానంతట అదే ఉత్పన్నమైనది" అని చెప్పటానికి "స్వయంభువు" అని చెప్పుచున్నారు. లేదా "చిత్తరూపమగు మనస్సే అతని శరీరమునకు కారణం" అనికూడా అనవచ్చు. అట్టి మనస్సు అనబడు చిత్పదార్థమునుండి అతడు భిన్నుడు కాడు. ఎందుచేత? "నేను చిత్పదార్థమునే" అనునట్టి నిత్యోదితమైన ఎరుకవలననే. ఇతని దేహము ఈ కనబడే కాళ్ళు, చేతులు, తల కాదు. అతని వాస్తవ దేహము 'అతివాహికము' లేక 'సూక్ష్మదేహము' అయివున్నది. జన్మరహితమగు అతనికి సామాన్యమైన పంచభూతములతో ఏమాత్రం సంబంధం లేదు. అతని వాస్తవ స్వరూపం పంచభూతములతో నిర్మించబడినది కాదు. "నేను పంచభూతనిర్మితమైన ఈ శరీరమును. ఇది శిథిలమగునప్పుడు నేను చచ్చుచున్నాను. రహితమగుచున్నాను." అని ఎవరైతే తలుస్తారో వారికి మాత్రమే జన్మ–మృత్యువులు, త్రిలోకములు ఉంటాయి. ఆ బ్రహ్మదేవునికి అట్టి భావము లేదు.

❖

**శ్రీరాముడు :** మహర్షీ! ప్రతి ప్రాణికి ఈ స్థూలదేహము – సూక్ష్మదేహము (లింగ శరీరం / అతివాహిక శరీరం) (Gross body & Subtle body) అనేవి రెండు ఉంటాయి కదా! మరి బ్రహ్మదేవునికి అతివాహిక శరీరం మాత్రమే ఉండటానికి కారణమేమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "పంచభూతములపట్లగల ఆసక్తి" అను కారణముతో కూడుకొనియున్న ప్రాణులందరికీ నీవు చెప్పినట్లు రెండు దేహాలు ఉంటాయి. కాని జన్మరహితుడగు బ్రహ్మకు కారణమంటూ ఏదీ లేదు. అందుచేత ఒక్క సూక్ష్మ శరీరం మాత్రమే ఉన్నది. జన్మ రహితుడగు ఆ బ్రహ్మయే భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశము.... అనబడు పంచభూతములకు పరమకారణము. అతనికి ఇంకొక కారణం లేకపోవటం చేత అతివాహిక శరీరమొక్కటే ఉన్నది. (He is beyond all causes. And all causes exist because of him)

❖

విషయరహితమగు ఆత్మనుండి ప్రప్రథమంగా నిశ్చల జలములో ఉత్పన్నమగు కెరటంలాగా "భావనచేయుట" అను స్వభావముతో కూడిన కర్తృత్వము ప్రకటితమౌతోంది. శాస్త్రములు ఆ తత్వమును 'ప్రజాపతి' అని పిలుస్తున్నాయి. సృష్టిలో ప్రప్రథముడగు ఈ ప్రజాపతికి భౌతిక శరీరం లేదు. ఇతడు అతివాహిక (లేక సూక్ష్మ) శరీర మాత్రుడగుటచే చిదాకాశ స్వభావమున స్వయంగా ప్రకాశించుచున్నాడు. అతడు "సంకల్పించుట" అనునదే రూపముగా కలిగియున్నాడు. ఈ పృథివి మొదలైన భూతముల క్రమసంబంధం అతనికి లేదు. ప్రథముడగు ఈ ప్రజాపతియే

ఆకాశ శరీరము దాల్చి ప్రజాసమూహమును సృష్టించు చున్నాడు.

**చిదాకాశము చిత్తాకాశము స్థూలాకాశము**




1. ప్రతివానియందు 'స్థూలదేహము - లింగదేహము' అనునవి ఉంటున్నాయి.
2. లింగదేహమును అనుసరించి స్థూలదేహం ఉంటోంది.
3. లింగదేహము సర్వకారణమగు 'చిదాకాశము' లేక 'శుద్ధ-చైతన్యము'ను ఆశ్రయించి ఉంటోంది.
4. చిదాకాశము కారణరహితము. చిదాకాశమే స్థూల-సూక్ష్మములకు కారణము, కర్త కూడా. కనుక అదియే 'కారణ-కారణం' అని పిలువబడుతోంది.
5. మృత్యువు అనబడునది స్థూలదేహమునకు సంబంధించినది మాత్రమే. సూక్ష్మ - కారణములను అది తాకజాలదు.

❖

ఓ రామచంద్రా! ప్రజాపతి ఆకాశ-శరీరమును దాల్చి ప్రజాసమూహం సృష్టిస్తున్నా డనుకొన్నాం కదా! ఈ ప్రజలందరు కూడా ఆకాశస్వరూపులే. ఎందుకంటావా? ఒక వస్తువు నుండి ..... ఏ బాహ్యమైన కారణము లేకుండా .... బయల్వెడలిన మరొక వస్తువు మొదటి వస్తువుకు అభిన్నమైనదే కదా! కాబట్టి 'పరమబోధ' స్వరూపుడైన పురుషుడు (జీవుడు) భ్రాంతిచేత చిత్తమాత్రుని వలె అగుపించవచ్చు. అయినప్పటికీ వాస్తవానికి ఇతడు చైతన్యస్వరూపుడే. అంతేగాని పాంచభౌతికస్వరూపుడుగా మారడు.

సంసారమున చరించుచున్న జీవులందరికి సూక్ష్మశరీరముతో కూడిన చిదాత్మయే కారణం. అహంకారం దానినుండే జన్మిస్తోంది. కనుక, 'నీవు-నేను' .... అనునదంతా అద్దాని రూపమే. వాయువునందు 'స్పందము' లేక చలనము కలుగుటచే "వాయువీచికలు" ఏర్పడుచున్నాయి కదా! ఆ వాయువీచికలన్నీ మొట్టమొదటిదయినట్టి వాయువు కంటే వేరు ఎట్లా అవుతాయి? మొదటి కదలిక (చలనము) అయినట్టి బ్రహ్మదేవుని నుండి అట్టివారేయగు ప్రజలు విస్తరిల్లుచున్నారు.

ఈ జీవసమూహమంతా పరమార్థ చిన్మాత్రకారుడగు 'బ్రహ్మ' నుండే జన్మిస్తోంది. కాబట్టి ఇదంతా చిన్మాత్రాకారమే. కాని, దర్శించువాని యొక్క సంకల్ప-దృఢత్వంచేత జడాకారముగా

ప్రకాశించుచున్నది. భౌతికమైన దృష్టికి ప్రాప్తించే ఆకారాదులే సత్యమని, వాస్తవమని సంసారదృష్టిగల జీవుడు భావిస్తున్నాడు. కనుక, ఇక్కడ 'దృష్టి' పవిత్రమైతే సర్వమూ సర్వదా బ్రహ్మమే!

❖

"అసద్వస్తువు సత్యమువలె క్రియ నిర్వర్తించుట" అనునది సుస్పష్టమవటానికి నీకొక దృష్టాంతము చెపుతాను. "ఒకడు ఒక స్వప్నం పొందాడు. ఆ స్వప్నంలో అత్యంత సుందరియైన స్త్రీ తారసపడింది. ఆమెను ఆతడు ఆలింగనం చేసుకొన్నాడు." .... అనే విషయం తీసుకొందాం. వాస్తవానికి అది సత్యమైన అనుభవమా? కాదు. ఎందుకంటే ఆ స్త్రీ ఊహామాత్రమే కదా! కాని, ఆ వ్యక్తి ధాతుక్షయానుభవం పొందుతాడు. ఈ జగత్తులో కనిపించే పదార్థముల సంస్పర్శ-అనుభవం కూడా అట్టివే. పంచమహా భూతత్వమంతటికీ ఈశ్వరుడు, నిరాకారుడు అయిన స్వయంభువే. అతడు దేహాదులు లేనివాడు. కాని "దేహి" వలె ప్రకాశిస్తున్నాడు. సంకల్పరూపి, స్వస్థుడు అయినట్టి స్వయంభువు ఉదయించినట్లు అగుపడటం కేవలం భ్రాంతివలననే సుమా! పారమార్థిక దృష్టితో చూస్తే అతడు ఉదయించుటయే లేదు. 'పృథివి' మొదలైన వాటితో సంబంధంలేనట్టి చిత్తమాత్రశరీరుడు, సంకల్పపురుషుడు అయిన బ్రహ్మ ముల్లోకముల స్థితికి కారణమగుచున్నాడు.

❖

మరొక ముఖ్యమైన విషయం. ప్రాణుల కర్మలను అనుసరించే సంకల్పములు రూపుదిద్దుకుంటున్నాయి. ఆకాశాత్ముడగు స్వయంభువు ఏఏ రూపములను భావిస్తున్నాడో ఆయారూపములనే ఈ కనబడే ప్రాణుల రూపముగా దాల్చుచున్నాడు. అంతేగాని, 'ఇతని రూపము ఇదే' ... అనునట్టి పరిమిత రూపమంటూ అతనికి ఏదీ లేదు. ఒకానొక పర్వతమును నీవు చూచావనుకో, నీవు దానిని ఎట్లు తలుస్తావో.... అది ఆ రూపముననే నీ చిత్తవృత్తిలో ప్రతిఫలిస్తోంది కదా! ఈ కొండ శిలామయము – ఇది పర్వత దేవుడు – ఇది వృక్ష, జంతువులకు ఆలవాలమైన ఒక ప్రదేశము – ఇది నిరుపయోగమైన స్థలము – ఇది ఒక గోపురము వంటిది – ఒక మునీశ్వర స్వరూపం..... మనస్సును అనుసరించే ఇదంతా రూపుదిద్దుకొంటోంది.

అది నీవు ఎట్లా తలస్తే ... నీ చిత్తంలో అది అట్లే ప్రతిఫలిస్తోంది. అదేవిధంగా ఈ జీవులు కూడా తమ అంతరమునందలి నిరాకారత్వమును మరచి పిశాచంలాగా పాంచభౌతిక శరీరమున ప్రకాశిస్తున్నారు. "నేను ఈ శరీరమునకు పరిమితమైనవాడను ...." అను దృఢమైన భావనను ఆశ్రయించటం జరుగుతోంది.

మాయతో కూడిన ఈ లోకములను సృజించుచున్న మూలకారణం సూక్ష్మభూతాత్మకమే. అట్టి సూక్ష్మభూతాత్మకము (లింగ శరీరము) యొక్క సంకల్పబలం చేతనే ప్రత్యక్ష జగత్తు ఆవిర్భవిస్తోంది. లింగదేహము (మనస్సు) వాస్తవానికి తమోరహితమైన సంవిత్స్వరూపమే. అందుచేతనే అది ఏ సమయమందు కూడా తన అతివాహిక (సూక్ష్మతత్వ) భావమును కోల్పోవుటలేదు. అట్లు కోల్పోకుండానే ఈ స్థూలత్వం అనుభవించటం జరుగుతోంది. మొట్టమొదటే పాంచభౌతిక శరీరం

ఉత్పన్నం కావటం లేదు సుమా! సూక్ష్మదేహం క్రమంగా స్థూలత్వం పొందగా ఈ పాంచభౌతికానుభవం సిద్ధిస్తోంది. దేహికి దేహము ఐహిక మోహము. కాబట్టి, భ్రమ దాయకమైన ఈ స్థూలదేహం తనకు కారణమైనట్టి సూక్ష్మదేహమును బాధించుటయేమిటి? అట్లు శరీరము మనస్సును బాధింపచేయుట .... అనునది అజ్ఞానం వలననే సిద్ధిస్తోంది.

కనుక ఓ రఘురామా! సృష్టికర్త బ్రహ్మదేవుడు మనోమయుడు మాత్రమే. అతడు శరీరాది ఆకారములు కలవాడు కాదు. దీనిని అనుసరించి, "ఈ విశ్వము మనోమయము మాత్రమే. ఇది పంచభూత సంబంధమాత్రమైనది కాదు" .... అని గ్రహించు. కార్యము తనకు కారణమైనదానికంటే వేరైనది ఎట్లా అవుతుంది?

జన్మరహితుడైన బ్రహ్మకు ఎట్లా సహకారి కారణాలు లేవో, అదేవిధంగా బ్రహ్మ నుండి జనించిన ఈ జగత్తుకు కూడా ఎట్టి సహకారి కారణాలు లేవు. కార్య-కారణములకు భేదం ఉండదని, కారణము ఎట్టిదో, కార్యము అట్టిదేనని అనుకున్నాం కదా! కనుక పరబ్రహ్మము ఎట్టిదో, ఈ త్రిజగత్తులు (దేవ-మర్త్య-పాతాళలోకములు - జాగృతి - స్వప్న - సుషుప్తులు - స్థూల - సూక్ష్మ - కారణములు) అట్టివేనను విషయంలో ఏమాత్రం సందేహం లేదు. నీరు నుండి ద్రవత్వం వేరా? అగ్నికంటే ఉష్ణత్వం వేరైనది కాదు కదా! బ్రహ్మ మనోభావములను పొందినవాడై ఈ జగత్తులను సృష్టించుచున్నాడు. బ్రహ్మ విశుద్ధ తత్త్వమే కదా! జగత్తు కూడా విశుద్ధతత్త్వముకంటే వేరేమీ అయివుండ లేదు. అవబోవుటలేదు.

❖

**మిథ్యాభావన :** ఈ మనస్సే సంకల్ప-పూర్వకంగా, గంధర్వనగరంలా, 'మిథ్య' అయినట్టి ఈ విశాల ప్రపంచమును కల్పించుచున్నది. ఇక్కడ 'మిథ్య' అంటే ఏమిటి? "ఈ జగత్తు బ్రహ్మము కంటే వేరు" .... అనే భావనే మిథ్య అని విజ్ఞుల అభిప్రాయం. ఒకడు చీకటిలో త్రాడును చూచి 'పాము' అని భ్రమించినాడనుకో. "ఆతడు భయముతో వణుకుచున్నాడు కదా! కనుక అది పామే అయివుంటుంది".... అని అనటం ఎంతవరకు సమంజసం? వాస్తవానికి "భూతత్వము" (Phenomenal Existence) అనునది ఈ జగత్తునందు లేదు. "సంకల్పత్వము" (Will or Volition) మాత్రమే ఉన్నది. అయితే ఈ సంకల్పత్వము ఎవరికి ఉంటుంది? అల్పజ్ఞులకే కదా! బ్రహ్మదేవుడు మొదలైనవారు తత్త్వజ్ఞులు కదా! వారియందు ఈ భూతత్వము ఎట్లా ఉంటుంది? తత్త్వజ్ఞులైనవారి దృష్టికి అతివాహికశరీరమే (మనోరూపమే) ఉండదు. ఇక భౌతిక దేహమెక్కడిది?

ఈ జగత్తు "మనస్సు" అనుదానియొక్క భావనయే అయివున్నది. అనగా జీవునియొక్క మనోరాజ్యమాత్రమే ఇదంతా! మనోరాజ్యము వంటి ఈ జగద్దృశ్యము ప్రాప్తిస్తోంది. 'మూఢత్వము' అంటే ఏమిటి? తన వాస్తవ స్వరూప-స్వభావములను మరచిన ఈ జీవుడు ఇంద్రియానుభవములతో తాదాత్మ్యము పొందుచూ భ్రమనే వాస్తవమన్నట్లుగా అనుభవించుటయే. అట్టి అనుభవమునే 'జగత్తు' అని అంటున్నాం. మనస్సే 'విరించి' లేక బ్రహ్మ యొక్క శరీరం. ఇక మనస్సు అంటే

ఏమిటి? సంకల్పమాత్రమే కదా! సంకల్పాత్మకమనోరూపియగు ప్రప్రథమ తత్త్వమే నిజశరీరమును (అనగా సంకల్పములను) విస్తరించి ఇట్లు ఈ జగత్తును సృష్టించుచున్నది.

❖

బ్రహ్మయొక్క రూపము, శరీరము కూడా మనస్సే. అందు 'పృథివి' మొదలైన పంచ భూతములు లేవు. "అట్లే ప్రతిప్రాణియొక్క మనస్సు విషయం కూడా" అని గ్రహించబడుగాక! కాని, మనస్సు చేతనే పృథివి మొదలైన పంచభూతములు కల్పించ బడుచున్నాయి. ఒక చిన్న కలువ విత్తులో, కలువ పుష్పము లక్షణములన్నీ ఇమిడి ఉన్నాయి కదా! అదే విధంగా మనస్సునందే ఈ దృశ్యమునకు సంబంధించిన సమాచారమంతా ఇమిడి ఉన్నది. మనస్సు-దృశ్యము వేరువేరని ఎవరైనా అనగలరా? మనస్సు ఉండటంచేతనే దృశ్యమగుపడుచున్నది. మనస్సు లేకపోతే, దృశ్యము కూడా లయించి పోతుంది. ఒకడు స్వప్నములోను, మనోవీథిలోను, వస్తుజాలము చూస్తున్నాడు. ఆ వస్తుజాలమంతా ఉన్నదెక్కడ? హృదయమునందే కదా! అదే విధంగా ఎదురుగా కనబడుచున్న ఈ దృశ్యమంతా ఒకడు తన హృదయమునందే గాంచుచున్నాడు. కాని, బాహ్యమున కాదని, సూక్ష్మబుద్ధితో గ్రహించెదవుగాక! బాలుడు తన చిత్తమున కల్పించబడిన పిశాచము చేతనే భయకంపితుడగుట చూస్తూ ఉంటాము. ఈ దృశ్య పిశాచము కూడా అజ్ఞానబుద్ధులగు మనుజులను పీడించి పీల్చి పిప్పిచేయుచున్నది.

ఒక బీజములో ఇమిడియున్న అంకురము, తగిన దేశ-కాలములు ప్రాప్తించినప్పుడు ఒక పెద్ద మహావృక్షమగుచున్నది. మనస్సులో ఇమిడివున్న ఈ దృశ్యము కూడా తగిన దేశకాలములు లభించినపుడు సంకల్ప రూపమున ప్రకాశిస్తోంది.

ఓ రామచంద్రా! ఒకవేళ ఈ దృశ్యము వాస్తవమే అయివుంటే, ఇక ఇది రూపుమాసే ప్రసక్తి ఎక్కడుంటుంది? అపుడు దుఃఖశాంతి చేకూరే వ్యవహారమే ఉండదు. జీవుని దృష్టిలో దృశ్యము ఉపశమించనంతకాలము ఆనందమయమగు కైవల్యము పొందే అవకాశమే లేదు. దృశ్యత్వము తొలగినపుడు ఈ జీవునకు ద్రష్టత్వము కూడ ఉండదు కదా! అపుడు శేషించేదేమిటి? "కేవలత్వం" అని ఈ స్థితిని విజ్ఞులు పిలుస్తున్నారు. అట్టి "కేవలత్వమే" మోక్షము అని చెప్పబడినది.

❖

శాంతి మంత్రాలు ఉచ్చరించబడిన తరువాత సభ చాలించబడింది.

❖❖❖

**(రెండవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# మూడవ రోజు

## 4. మనస్సు - దృశ్యము

**శ్రీరాముడు :** ఓ భగవానుడా! వసిష్ఠ మహర్షీ! మీరు నిన్న రెండవ రోజు బోధించిన దానిని బట్టి "ఈ జగత్తు అంతా మనస్సు నుండే వెలువడి ప్రకాశిస్తోంది" .... అనే విషయం సుస్పష్టమౌతోంది. అయితే ఈ మనస్సు యొక్క రూపమేమిటి? ఎక్కడ, ఎందుచేత, ఎట్లు ఉంటోంది? మాకు వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆకాశము అని మనం పిలుస్తున్నది దేనిని? అక్కడ శూన్యత్వము కాకుండా మరింకేదైనా ఉన్నదా? నీలపు రంగుగల ఏదైనా పదార్థమున్నదా? లేదే! అదే విధంగా శూన్యాకాశాత్మకమైన మనస్సుకు కూడా వేరే రూపం అంటూ ఏదీ లేదు. దాని వెలుపల గాని, లోపలగాని ఏదీ కానరాకుండానే ఉన్నది. అయినప్పటికీ, ఆకాశమువలె సర్వత్రా వెలయుచునే ఉన్నది. 'మృగతృష్ణ' యందు నీరు యొక్క అనుభవంలాగా, మనస్సు నుండి ఈ జగత్తు యొక్క అనుభవం ప్రాప్తిస్తోందనుమాట నిజమే. ఒకడు తన 'స్వసంకల్పము' చేతనే మనోదృశ్యం చూస్తున్నట్లుగా .... ఈ మనస్సు యొక్క రూపకల్పన కూడా భ్రమపూర్ణమే. శూన్యమైన ఈ మనస్సును నిర్వచించటమెట్లా చెప్పు? నీ బోధ కొరకు ఒక నిర్వచనం చెపుతాను. విను.

"సత్+అసత్ (వాస్తవ-అవాస్తవ) వస్తువులను ప్రకాశింపచేసేదే మనస్సు" .... అని చెప్పవచ్చు.

ఇంతకుమించి దానికి వేరే ఆకృతి లేదు. నిరాకారమైన చిత్తు (Absolute & Formless Consciousness) అర్ధాకారముగా అధ్యవసితమైనప్పుడు (taking half - form) 'మనస్సు' అంటున్నాం. అనగా మనస్సు చిత్తు కన్నా వేరైనది కాదు. 'మట్టి' నిరాకారం కదా! 'మట్టిగడ్డ' అనునది ఆకారము కలిగి 'మట్టి' కంటే వేరు కాకుండానే ఉన్నది కదా.

**సంకల్పించువాడు - సంకల్పములు :** సంకల్పమే మనస్సు యొక్క రూపము. సంకల్పము అనుదాని కంటే ముందే సంకల్పించు వాడు ఉన్నాడుకదా! సర్వమునకూ ముందేగల శుద్ధత్వము 'చిత్తు' అని, ఆ చిత్తు సంకల్పిస్తున్నప్పుడు 'మనస్సు' అని చెప్పబడుతోంది. అయితే నీటి నుండి ద్రవత్వము వేరా? వాయువునుండి వాయుచలనము వేరైనదిగా చెప్పగలమా? ఎక్కడ సంకల్పముంటే అక్కడ మనస్సు ఉంటుంది. ఈ రెండు వేరువేరుగా ఎక్కడా ఎవ్వరూ అనుభవించియుండలేదు.

వస్తు జాలమును, విషయములను 'ఎరుక' రూపమున అనుభవరూపమున ప్రకాశింప జేయునదే మనస్సు. "అట్లు - ప్రకాశింపజేయబడునది సత్యమైనదా? అసత్యమైనదా? అల్పకాలికమా?; అధికకాలికమా?" .... అనేది వేరే విషయం. మనస్సు దేనిని ఎట్లు సంకల్పిస్తుందో, దానిని అది అట్టి అనుభవంగానే పొందుతూ ఉంటుంది. అట్టి మనోభావముతో కూడుకొనిన శుద్ధ చైతన్యమే పితామహుడగు 'బ్రహ్మదేవుడు'. అతడే - "అధిభౌతిక బుద్ధి" (ఇది పదార్థజాలము ... అని గుర్తించుతత్త్వము)ను సృష్టించుచున్నాడు. నాయనా! రామా! ఉత్తములగువారు మనస్సున

ప్రాప్తిస్తున్న ఈ దృశ్యప్రపంచమునకు .... "అవిద్య, సంసృతి, చిత్తము, మనస్సు, బంధము, మలము, తమస్సు" ... అనునవి మారుపేర్లేనని గ్రహించి ఉంటున్నారు.

**మననము చేయు స్వభావమే మనస్సు :** ఈ దృశ్యప్రపంచము కాకుండా మనస్సునకు వేరే రూపమే లేదు. మనస్సు సంకల్పించ బడినప్పుడు ఉంటోంది. అందుచేత "అది ఇప్పుడు ఇట్లు ఉత్పత్తి అయినది" అని మనం నిర్దేశించలేం. అట్లే "ఈ దృశ్యమునకు కూడా వాస్తవానికి 'ఉత్పత్తి' అనునదే లేదు" ... అని చెప్పబడుతోంది. నిన్న చెప్పిన దృష్టాంతమే చెపుతాను. విను. తామరపువ్వు యొక్క బీజంలో ఆ పువ్వుయొక్క సూక్ష్మభావమంతా సంస్కారరూపంలో ఇమిడి ఉన్నది కదా? అట్లే చిత్-పరమాణువునందే ఈ జగత్తు అంతా సంస్కార రూపమున ఇమిడియున్నది. అనగా ద్రష్టయందే దృశ్యత్వము ఇమిడివున్నదని గ్రహించు. అయితే, ఒక చమత్కారం. బంగారమునకు ఆభరణత్వం ఉన్నదా? లేదు. కాని ఆభరణము బంగారము కంటే వేరు కాదు కదా! ఎండమావులలో జలమెక్కడ? కాని జలము యొక్క ఆకారమేకదా .... ఎండమావులలో స్ఫురించేది? స్వప్నపురంలో కనబడే గోడలకు పునాది ఉన్నదా? అదేవిధంగా ద్రష్టయందుగల ఈ దృశ్యత్వబుద్ధి కూడా భ్రమత్మాకమే. కార్యమునకు కారణము కంటే వేరైన 'సత్త' లేదు. అదేవిధంగా ..." ఈ దృశ్యము యొక్క ఉనికికి కారణం? "నీవు దీనిని ఈ రీతిగా దర్శించుటయే సుమా!" అనునదే సమాధానమగుచున్నది. ఇయ్యది నీకంటే వేరు కాదు. అనగా నీ మనస్సు నీకంటే వేరుకాదు. మనస్సు ఉన్నది నీయందే. నీ స్వరూపము చేతనే అది తయారగుచున్నది. స్వతత్త్వమే మనస్సు యొక్క మూలపదార్థం.

ఈ దృశ్యములన్నీ ద్రష్టయందే ఉన్నాయనేది పరిశీలించి చూచి గ్రహించినప్పుడు నీకే అవగతం కాగలదు. ఈ విషయం సుస్పష్టపడటానికే నీ చిత్తదర్పణమున ఉన్న మాలిన్యమును ఈ బోధచే తొలగించే ప్రయత్నం చేస్తున్నాను. చిత్తమాలిన్యము చేతనే ఒకనికి తనయందు ఈ విశ్వము అనబడే 'దృశ్యము' తోచుచున్నది. చిత్తములో గల మాలిన్యము తొలగించివేస్తే దృశ్యము ఉండదు. అప్పుడీ జీవుడు నిర్మలుడై, స్వచ్ఛుడై ప్రకాశించగలడు. గాలి వీచనప్పుడు ఆకులు కదలవు కదా! ఆత్మతో ఏకత్వము సంభవించినప్పుడు చిత్తము యొక్క స్పందనము ఆగి ఉంటుంది. అప్పుడు ఈ చిత్తము నందు ఉండి ఉన్న రాగ-ద్వేషములు, వాసనలు తొలగిపోతాయి.

చైతన్యమయజ్ఞానము వల్లనే ఈ దిక్కులు, భూమి, ఆకాశము మొదలైనవి ప్రకాశించు చున్నాయి కదా! (లేక అవి తెలియవచ్చుచున్నాయి కదా!) ఆ చైతన్యము యొక్క ప్రకాశము నందు దిక్కులు మొదలైనవన్నీ లేకపోయివున్నప్పుడు దానినే "ఆత్మప్రకాశం" అంటున్నాం. "నీవు-నేను-లోకములు" .... మొదలుగాగల దృశ్యములన్నీ - అసత్తే" అని బోధ పడినప్పుడు ఆ దర్శించువాడు లేక ద్రష్ట మలరహితుడై కైవల్యము పొందినట్లే! దర్పణంలో (అద్దంలో) కొండలు మొ॥వి ప్రతిబింబించనప్పుడు ఆ అద్దము కేవలం అద్దముగానే ఉంటుంది కదా! ద్రష్టయందు నేను-నీవు-జగత్తు .... మొదలైన భావాలు లేకపోయినప్పుడు (ప్రదర్శితమవనపుడు లేక అనుభవమవనప్పుడు) ఆ ద్రష్ట కూడా కేవలుడు అగుచున్నాడు.

❖❖❖

# 5. దృశ్యము - అదృశ్యము

**శ్రీరాముడు :** బ్రహ్మజ్ఞా! వాస్తవానికి సత్తునకు వినాశనమనునదే లేదు. అసత్తునకు ఉత్పత్తి లేదు. ఇంతవరకు నాకు సుస్పష్టమే అని అనిపిస్తోంది. కాని చిత్రం చూచారా? ఈ 'దృశ్యము' అనేక ఎడతెగని దోషములతో కూడినదై, సత్యమైనదానివలెనే మాపై ప్రభావం చూపిస్తోంది. "ఇది అసత్తు లేక అవాస్తవం" అని మేము గ్రహించలేక పోతున్నాము. ఇదంతా మాకు ఎంతో శ్రమను, దుఃఖమును మరలమరల కలిగిస్తూనే ఉన్నది. అందుచేత, ఈ దృశ్యవిషూచి శాంతించేది ఎట్లాగో చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఈ దృశ్యపిశాచమును శాంతిపజేయగల ఒకానొక మంత్రము (విచారణ) చెపుతున్నాను. విను.

ఓ రామా! ఈ దేహాదులను చూడు. ఇవి చేతనములవలె కనిపిస్తున్నాయి కదా! అయితే ఇవి కాలక్రమంగా ఒకనాటికి మృతి చెందుచున్నాయి. ఈ దేహాదులే నశిస్తుంటే, ఇక అచేతనమైన వస్తువుల గురించి వేరే చెప్పవలసినదేముంటుంది? అందుచేత ఏమేమి కనిపిస్తున్నాయో అవన్నీ నశించబోతున్నాయి. ఇంతకుముందు లేనివై, ఇప్పుడు ఉండి, ఒకప్పుడు నశించబోయేవి సత్యమెట్లా అవుతాయి? ❖ ఒక చిన్న ఉదాహరణ. జలం తరంగాకారంలో అనుక్షణం పారుచున్నది కదా! 'తరంగము' అనే వస్తువు ఎలా ఎప్పుడు లభిస్తుంది? అది జలమునందుగల జలము యొక్క ఆకారమే కదా! కాని, వేరైనట్లు కనబడుచున్నది. ఈ దృశ్యవ్యవహారమంతా అట్టిదే. ఇదంతా స్వస్వరూపాత్మ యొక్క విన్యాసమే!

నీవు చెప్పినట్లు ఉన్నదానికి (సద్వస్తువునకు) నాశనము ఏనాటికీ సంభవించదు. అట్టి అవినాశనమగు వస్తువు (ద్రష్టయే) జగత్తుకు, ఈ జగత్తులోని "నీవు-నేను-శరీరములు -జన్మలు-మృత్యువులు" మొదలైన పదార్థజాలానికి "మూలస్థానము" లేక "ఉనికిస్థానము" అయున్నది. అనగా అది ఈ సర్వదృశ్యము యొక్క బీజమును తనయందు సంస్కార రూపమున కలిగి ఉంటోంది. ఆ సంస్కారం సుషుప్తి సమయంలో బుద్ధియందు, ప్రళయ కాలంలో ప్రకృతి యందు అణగి ఉంటోంది. మరల, సుషుప్త్యానంతరం, ప్రళయానంతరం - "ద్రష్ట-దృశ్యము" రూపమున ప్రకటితమౌతోంది. అయితే ఈ ద్రష్ట-దృశ్యము లేనట్టి ముక్తి అసంభవమందామా? అట్లు అనటానికి వీలులేదు. ఎందుకంటే, ఈ రెండింటిని అధిగమించిన స్థితియందు సుస్థితులైనట్టి జీవన్ముక్తులు దేవతలలోను, ఋషుల లోను, మనుష్యులలోను, పాతాళజీవులలోను అనేకులు మనకు తారసపడుతున్నారు. అట్లు జీవన్ముక్తులై ప్రకాశించువారు ఈ దృశ్యమును పొందుచున్నారు. తదనుగుణంగా ప్రవర్తిస్తున్నారు కూడా. మరి ఆ జీవన్ముక్తులకు, సంసార జీవులకు గల భేదమేమిటి చెప్పు? అట్టి భేదము అంతరంగమున ఏర్పడియున్న అవగాహనయందే ఉన్నది సుమా!

ఈ దృశ్యము బయట ఉంటే ఉండనీ. లేదా లేకుండనీ. దానివలన లాభనష్టములేమీ లేవు. అది హృదయంలో ప్రవేశించకుండా చూచుకోవాలి. పడవ నీళ్లలో ఉన్నా, నీరు పడవలోకి

ప్రవేశించనీయము కదా! ఒకవేళ ఈ దృశ్యము హృదయంలోకి రాగ-ద్వేష- ఆసక్తుల రూపమున ప్రవేశించిందా ... ఇక అది ఈ జీవుని గాలిపటంలాగా మూడు లోకాలు త్రిప్పగలదు. ఆ త్రిప్పుటకు అంతు ఉండదు. అందుచేత జీవుడు మనస్సు విషయంలో జాగరూకుడై ఉండాలి. నీరు పడవలో ప్రవేశించకుంటే పడవకు వచ్చే ఇబ్బంది ఏం ఉంటుంది?

ఓ రామచంద్రా! అనుభవపూర్వకమైన మరియు ప్రతిజ్ఞాపూర్వకమైన ఈ నా వాక్యాలు విను. ఆ తరువాత నీవు అడిగినది చెపుతాను.

బాహ్యమున కనిపిస్తున్న ఈ ఆకాశాది పంచభూతములు గాని, అంతరమున అనుభవ మగుచున్న "అహం" మొదలైనవిగాని వ్యవహారదశలో మాత్రమే అపరిజ్ఞాన దృష్టికి వేరు-వేరుగా తోచుచున్నాయి. వాస్తవానికి పరమార్థ దృష్టిలో - ఇదంతా అవ్యయము - జరామరణరహితము అగు బ్రహ్మమే అయివున్నది. బ్రహ్మమునకు వేరైనట్టి "జగత్తు" అనబడు ఒకానొక పదార్థము ఏ క్షణమందు లేనేలేదు. పూర్ణమున పూర్ణుడు, ఆకాశమున ఆకాశద్రష్ట, శాంతమున శాంతుడు, బ్రహ్మమున బ్రహ్మము ఉన్నాయని గ్రహించేవాడే జ్ఞాని. ఉన్న సత్యము అదే. వాస్తవానికి ఈ "దృశ్యము-ద్రష్ట-దర్శనము" ... అనునవి లేవు. అంటే అవి శూన్యములని నా అభిప్రాయం కాదు. ఇదంతా శాంతమగు చైతన్య భరితమేనని గ్రహించబడుగాక!

**శ్రీరాముడు :** ప్రభూ! "ఈ జగత్తు లేదు" అని మీరు చెప్పుచున్నప్పుడు వినటానికి బాగానే ఉన్నది. కాని మా అనుభవం అందుకు తగినట్లు లేదు.

- గొడ్రాలి కుమారుడు పర్వతమును పగులగొట్టుచున్నాడు.
- కుందేటి రెండు కొమ్ములు ఎంత అందంగా ఉన్నాయి!
- బండరాయి చేతులు చాపి నృత్యం చేస్తోంది.
- ఇసుక చమురును ప్రసాదిస్తోంది.
- రాతిబొమ్మ ఎంతబాగా చదువుతోంది!
- ఆ చిత్రపటంలోని మేఘములు చేసే గర్జనచే నా చెవులు పూడిపోతున్నాయి.

పై వాక్యాలు ఎట్టివో, మాపట్ల "ఈ జగత్తు లేదు" అను వాక్యము కూడా అట్టిదే. ఎందుకంటారా? మృత్యువు, ముసలితనము, దుఃఖములు, వస్తుజాలం, ఆకాశం, పర్వతములు .... ఈ మొదలైన అనేక విషయములతో కూడిన ఈ జగత్తే లేదని అంటున్నారు కదా! ఇవన్నీ లేనప్పుడు మేము చూచే ఈ తతంగమంతా ఏమిటి?

అయితే, బ్రహ్మజ్ఞులగు మీరు వృథా అయిన ఏ వాక్యం పలుకరని కూడా నాకు తెలుసు. అందుచేత, "ఈ విశ్వము ఇతఃపూర్వము లేదు. ఇప్పుడు కూడా ఉత్పన్నమగుట లేదు. ఇంకెప్పటికీ ఉండదు" అని చెప్పుటలో అర్థమేదైయున్నదో మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రాఘవా! నా వాక్యములు అసంగతం కాదు. నేను చెప్పేది శ్రద్ధగా, ఉద్వేగరహితంగా విను.

నిజంగానే గొడ్రాలి కుమారునివలె ఇదంతా భ్రమమాత్రమే. "నాకు కనబడుచున్నది కదా!" అంటావా? స్వప్నంలో కూడా నీవు గృహములను, జనులను చూస్తున్నావు కదా! అవన్నీ ఉన్నాయా? ఉంటే ఎక్కడ ఉన్నాయి? లేకుంటే వికారాలన్నీ ఎట్లు కలుగుచున్నాయి? అదంతా మనస్సు యొక్క వికల్పము మాత్రమేనని తెలుసుకదా! స్వస్వభావమే స్వప్నమును చూచేటట్లు, స్వప్నానుభవం పొందేటట్లు చేస్తోంది. మనస్సు అసత్తే అయినప్పటికీ, నిజేచ్ఛ వలన నిజశరీరమును కల్పించుకొని, ఇక ఆపై ఇంద్రజాలమువలె ఈ జగత్తును ఇట్లు విస్తరింపచేస్తోంది.

చంచలశక్తితో కూడుకొనియున్న మనస్సే స్వయముగా స్ఫురిస్తోంది. అదే భ్రమిస్తోంది. సర్వమును కల్పించుకొని స్వర్గనరకాలకు పోయి వస్తోంది. యాచిస్తోంది. సంసారంలో నిమగ్నమౌతోంది. ఇంతలోనే ముక్తిని పొందుతోంది. ఇదంతా మనస్సు యొక్క కల్పన మాత్రమే. మనస్సు కాకుండా వేరే జగత్తు లేనేలేదు.

❖❖❖

## 6. బ్రహ్మము - స్వభావము

**శ్రీరాముడు :** స్వామి! "ఈ మనస్సు కూడా మిథ్యయే" అని అంటున్నారు కదా! ఎందుకని? మాయామయమగు ఈ మనస్సు ఎక్కడి నుండి ఉత్పన్నమౌతోంది? మొట్టమొదట ఈ విషయం గురించి వివరంగా చెప్పండి. అటుపై మిగతా విషయాలకు వద్దాం.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ దృశ్యసృష్టి అంతా నామరూపాలతో సహా లయించిపోయే "మహాప్రళయము" సమయంలో ..... అప్పుడిక శేషించేదేమిటి? ప్రశాంతము, అఖండము, నిర్లిప్తము, అద్వితీయము అయినట్టి సత్-వస్తువే. (A state of absolute self-existence). అనుభవమాత్రమగు అట్టి ఈ జీవుని స్థితికి నామరూపాలు లేకపోయినప్పటికీ శాస్త్రములు అద్దానికి 'బ్రహ్మము' అను పేరుపెట్టాయి.

అట్టి బ్రహ్మవస్తువుకు జన్మగాని, ప్రకాశముగాని, లయముగాని లేవు. అది నిత్యము, స్వస్వరూపము, సర్వశక్తివంతము, కారణరహితము అయివున్నది. దానినే 'పరమాత్మ', 'మహేశ్వరుడు' అని కూడా అంటున్నారు. ఎన్నిపేర్లతో ఎంత చెప్పినా ఏం లాభం? ఆ పరమవస్తువు వాక్యములచేత గ్రహించబడగలిగేది కాదు. ముక్తపురుషులు దానిని తమ యొక్క అనుభవమాత్రంగా ఎరుగుచున్నారు.

"ఆత్మ, బ్రహ్మము, బ్రహ్మ, పరమాత్మ, శివుడు.... అనునవన్నీ బోధించుటకు వీలుగా అద్దాని యందు కల్పించబడ్డాయి. అయితే ఈ పేర్లన్నీ దాని స్వాభావికములు కావని, నామరూపముల కల్పనమాత్రంచేత భేదభావం పొందవలసిన పనిలేదని సర్వజనులకు మనవి చేస్తున్నాను.

సాంఖ్యులు = దానిని 'పురుషుడు' అని పిలుస్తున్నారు.
వేదాంతులు = 'బ్రహ్మము' అని చెప్పుచున్నారు.
విజ్ఞానవాదులు = 'సునిర్మల విజ్ఞానము' అంటున్నారు.
శూన్యవాదులు = అది "పదార్థరహితము", 'శూన్యము' – అని పిలుస్తున్నారు.

అయితే అది సర్వ "నామ-రూప-భావన"లకు అతీతమైనది. అదియే సూర్య-చంద్ర-నక్షత్రాదులను, సర్వజీవులను ప్రకాశింపచేస్తోంది. కనుక సర్వజీవుల వాస్తవ స్వరూపమదే. నామరూపముల కల్పన అద్దానిని పొందే మార్గం సుగమం చేయటానికే సుమా! అదే వక్త-వినువాడు-భోక్త-ద్రష్ట-కర్తల రూపమున ప్రకాశిస్తోంది. అది 'సత్తు' అయికూడా అసత్తువలె ఉంటోంది. సర్వదేహములందు సర్వదా ఉంటూ కూడా దూరస్థమువలె అనిపిస్తోంది. చిత్ప్రకాశమే అది.

సూర్యుని నుండి కిరణపుంజములు బయలుదేరుచున్నట్లు ఆ చిత్తాకాశము నుండే బ్రహ్మ - విష్ణువు - ఇంద్రుడు మొదలైన దేవతలంతా బహిర్గతమవుతున్నారు. సముద్రజలంలో బుద్బుదములవలె (బుడగలవలె) అనంత సంఖ్యలో జగత్తులు బయల్వెడలటం జరుగుతోంది. నదులన్నీ సముద్రమువైపుకే అభిముఖమగుచున్నట్లు, ఈ దృశ్యములన్నీ అద్దానివైపుకే కదులుచున్నాయి. దీపంవలె అది తననుతానే ప్రకాశింపచేసుకొనుచు, తద్వారా సర్వ పదార్థములను ప్రకాశింపచేస్తోంది. అదియే ఆకాశంలో, శిలలలో, పర్వతములలో, పాతాళంలో, వాయువులో, ప్రతి ప్రాణియొక్క హృదయంలో సుస్థిరమై వెలుగొందుచున్నది. అదియే శరీరములందు ప్రవేశించి ఈ కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు తమ తమ పనులను నిర్వర్తించునట్లుగా శాసిస్తోంది. అయ్యది ఒకప్పుడు స్వస్వరూపమును మరచి మూఢునివలె, మూగవానివలె, జడునివలె ప్రవర్తిస్తోంది. శిలలు నిశ్చలంగాను, ఆకాశము శూన్యముగాను, పర్వతములు కఠినముగాను, జలము ద్రవత్వముతోను ఉండేటట్లు శాసించేది, నియమించేది ఆ బ్రహ్మవస్తువే. దాని శాసనమును అనుసరించే సూర్యుడు ఒకానొక నియమంగా ప్రకాశిస్తూ ఉదయిస్తూ అస్తమిస్తున్నాడు.

మేఘాల నుండి వర్షం కురుస్తుంది కదా! అదే విధంగా అక్షయసుఖముతో నిండిన ఆ పరమవస్తువు నుండి, "సంసారము" అనబడే అసారవృష్టి కురుస్తోంది. ఈ 'త్రిలోకములు' అనే వీచికలు దానినుండే వెలువడుచు అందులోకే పయనిస్తున్నాయి. అదే సర్వభూతముల అంతర్యామియై, అంతర్లీనగానమై, శాశ్వతమై, సర్వమై ఉండికూడా ... లేకయే ఉన్నట్లు భ్రమింపచేస్తోంది. మహత్తరమై ఉండికూడా అందరియందు సమాన భావమున వెలయుచున్నది. వాయువు తన వీచికలచే లతలను నాట్యం చేయిస్తుంది. చూచావా? అట్లే, అది .... 'ఇంద్రియములు' అనే దళములతోను, 'బ్రహ్మాండములు' అనే ఫలముల తోను 'చిత్' అనే మూలముతోను కూడుకొనియున్న ఈ "ప్రకృతి" అనే లతను నాట్యం చేయిస్తోంది. 'దేహములు' అనే అసంఖ్యాకమైన పెట్టెలలో చిన్మయమగు మనస్సును ఉంచింది అదే సుమా! చంద్రునినుండి కిరణములు వస్తున్నట్లు ఆత్మనుండే సృష్టులు వెలువడుచున్నాయి.

ఓ రాఘవా! ఆ చిదాకాశమునందు సృష్టి అనే విద్యుత్తు ప్రకాశిస్తోంది. 'ప్రాణములు' అనే శీతల వాయువులు వీచుచున్నాయి. అసద్వస్తువులను కల్పించేది, సద్వస్తువును మరుగుపరిచేది, లేక 'సత్త' ఏర్పరచేది అదే. దాని సాన్నిధ్యము చేతనే జడములైన ఈ శరీరాదులు చలించటం జరుగుతోంది. 'సత్త'లన్నిటికీ సత్త అయివున్నట్టి దానివలననే దేశకాలములు, నియతి (cause & effect), చలన-స్పందాది క్రియలు ప్రవర్తించటం జరుగుతోంది. శుద్ధ - చిన్మయమగు ఈ

పరమవస్తువే ఆకాశమున పదార్థములను స్వయముగా చింతించి, ఆయారూపములను అప్పటికప్పుడు దాల్చుచున్నది.

❖

ఆ పరమవస్తువే ఈ విశాల బ్రహ్మాండములను ఒక ప్రక్క సృష్టిస్తూ, మరొకవైపు ఏమీ చేయనట్లు మౌనము, నిష్క్రియత్వము, నిర్లిప్తత్వము, శాంతము వహిస్తోంది. సర్వప్రాణుల వాస్తవ స్వరూపము కంటే వేరైనది కానట్టి అద్దానికి స్థితిగతులు లేవు. అది సర్వదా ఈ ప్రపంచము యొక్క 'దృశ్యత్వము – ద్రష్టత్వము' లయించినట్టి నిర్వికార–చైతన్యముగా తనయొక్క అద్వైత ఆత్మతత్త్వమునందే నిలచియున్నది. ఓ రామచంద్రా! అదికాక– ఇక్కడ గాని మరెక్కడ గాని మరొక వస్తువు ఏదీ లేదు. అదియే సర్వులచే సర్వవిధముల ఆరాధించబడతగినది. నమస్కరించబడతగినది. దానిని గ్రహించినవారియందు సర్వ స్వల్పత్వములు నశిస్తాయి.

❖❖❖

## 7. బ్రహ్మ సాక్షాత్కారం

దేవదేవుడగు ఆ పరమాత్మునితో లేక, సర్వుల వాస్తవ స్వరూపమగు – శుద్ధ చైతన్యాత్మ భగవానునితో ఏకత్వము "జ్ఞానయోగము" వలన మాత్రమే లభిస్తుంది. అంతేకాని, శరీర కష్టములతో కూడిన ఆయా కర్మలు నిర్వర్తించినంత మాత్రంచేత లభించేది కాదని సర్వులకు గుర్తు చేస్తున్నాను. ఏ కర్మానుష్ఠానమైనప్పటికీ – అది 'మనస్సు యొక్క పవిత్రత' అను లక్ష్యముతో చేయబడాలి. అప్పుడు దోషరహితమగు మనస్సులో జ్ఞానస్ఫురణ స్వయముగా ఉదయిస్తుంది. ఆపై, ఆత్మదర్శనము యొక్క అనుభవం ప్రాప్తిస్తుంది.

ఓ రామచంద్రా! మేము ఈ సంసార వ్యవహారమంతా తరచి–తరచి పరిశీలించాం. ఇందు ఏర్పడుచున్న సుఖ–దుఃఖముల భ్రమ అంతా – మృగతృష్ణను చూచినప్పుడు ఏర్పడుచున్న జలభ్రాంతి వంటిది మాత్రమే. ఈ భ్రమను శాంతిపజేయగల ఉపాయం "తత్త్వజ్ఞానం" ఒక్కటేనని మేము గ్రహించిన తరువాతనే, ఆ విషయం ప్రపంచమంతటికీ చాటుచున్నాం. "నేను ఎవరు? వీరంతా ఎవరు? ఈ దృశ్యము, దృశ్యాంతర్గతములైన ఈ శరీరములు ఏమై ఉన్నాయి?" అను విషయమై సంపూర్ణ అవగాహనపూర్వకమైన జ్ఞానమే సర్వభ్రమలకు సరయిన ఔషధం.

ఓ జనులారా! వృత్తి–రహితుడు, శుద్ధ–స్వరూపుడు అయినట్టి పరమాత్మ ఎక్కడో దూరంగా ఉన్నవాడు కాదు. లేక దగ్గరగా ఉండేవాడుకూడా కాదు. దూరస్థుడు కాదు. సమీపస్థుడు కాదు. ఏదైనా బాహ్యమున ఉన్న వస్తువైతే .... ఇది దూరంగా ఉన్నది, లేక దగ్గరగా ఉన్నది ... అని అనవచ్చు. కాని పరమాత్మ ద్రష్ట యొక్క వాస్తవ స్వరూపమే అయినప్పుడు, ఇక దగ్గర, దూరములు ఎట్లా ఉంటాయి? అతడు లభించి ఉండనిది ఎప్పుడు? అతడు సులభుడు కాదు. దుర్లభుడు కూడా కాదు. స్వానంద ప్రకాశరూపమగు ఆ బ్రహ్మము మీ మీ నిజ–శరీరములందే, సర్వదా లభించియే

ఉన్నాడు. ప్రయత్నశీలురైనప్పుడు మీయందు అతని ఉనికిని తప్పక గాంచగలరు. మీయందే దివ్యమై వెలుగుచున్న ఆ ఆత్మదేవుని వదలిపెట్టి ఎక్కడెక్కడో ఎందుకు వెతుకుతారు చెప్పండి? తపస్సు - దానము - వ్రతములు మొ॥ మీ దృష్టిని శుద్ధపరచుటకు మాత్రమే ఉపకరిస్తాయి. వాటిలో ఏ ఒక్కటీ స్వయముగా తత్త్వజ్ఞానమును చేకూర్చలేవు. అయితే, వాటి సహాయం తీసుకోండి. మీరే స్వయముగా మీమీ స్వస్వరూప ఔన్నత్యమును దర్శించుటకు సిద్ధులు కావాలి. విజ్ఞులైన మహనీయులు స్వస్వరూపమును ఆశ్రయించి తమయందు ఆ పరమాత్మయొక్క అనుభవమును పొందుచున్నారు.

నాయనలారా! మీరు "దృశ్య సంసక్తత - (Attachment towards sensory impressions & experiences) అనబడు మోహజాలంలో చిక్కుకొనియున్నారని గుర్తుచేస్తున్నాను. ఈ మోహం తొలగేదెట్లాగో కొంచెం యోచన చేయండి. ఇందుకు మాకు తోచుచున్న ఉపాయములు చెప్పుచున్నాం. సాధుజనులను సమీపించండి. వారు చెప్పేది శ్రద్ధగా వినండి. మనన-నిధిధ్యాసలను సంపాదించండి. ఆత్మతత్త్వమును విశదీకరించే శాస్త్రములు జ్ఞానుల ప్రసాదమే కదా! అవి కూడా మిమ్ములను ఉద్ధరించగలవు. క్రమంగా "ప్రశాంతము - సర్వశేష్యము" అగు బ్రహ్మమే మీ స్వస్వరూపమై యున్నదని అనుభవపూర్వకంగా గ్రహించండి.

**అయం సదేవ ఇత్యేవ సంపరిజ్ఞానమాత్రతః**
**జంతోర్నజాయతే దుఃఖమ్, జీవన్ముక్తత్వమేతి చ ॥** (VI. 6)

"నాయందే వెల్లివిరిసియున్నట్టి ఇతడే దేవదేవుడగు పరమాత్మ" అను జ్ఞానము లభించిన తరువాత, ఇక ఈ దుఃఖానుభవముల క్రీనీడ కూడా ఉండదు. అట్టి జ్ఞానమునే "ఆత్మజ్ఞానం" అని అంటున్నాం. అది పొందినవాడు జీవన్ముక్తుడగుచున్నాడు.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! 'ఆత్మయోగం' చేత స్వస్వరూపమే ఆ పరమాత్మగా గ్రహించుటచే ఈ జనన-మరణ-సంసారాది దోషములన్నీ తొలగిపోతాయని మీ మాటల వలన గ్రహిస్తున్నాను. అయితే మహర్షీ! ఆ దేవదేవుని శీఘ్రంగా పొందాలంటే ఏ కఠోర నియమాలు ఆచరించాలో చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** రఘురామా!

**స్వపౌరుషయత్నేన వివేకిన వికాసినా**
**స దేవో జ్ఞాయతే, రామ! న తపః స్నాన కర్మభిః ॥** (VI. 9)

తనయొక్క ప్రయత్నముల చేత (పురుషకారము చేతనే) "వివేకము - వికాసము(Discrimination & Knowledge\wisdom)"లను పొందినవాడే బ్రహ్మసాక్షాత్కారం పొందుచున్నాడు. వివేకముతో కూడిన బుద్ధిని ఉపయోగించకుండా కేవలం స్నానము తపము మొదలైన కార్యక్రమముల చేత 'బ్రాహ్మీదృష్టి' అలవడదు. "కుటుంబ పోషణ" మొదలైన లౌకిక వ్యవహారములు నిస్సంగత్వముతో

ఆచరించువారికి, అవేమీ జ్ఞానసముపార్జనకు అడ్డుకావని ప్రకటిస్తున్నాను. "మేము ఈ భౌతిక వ్యవహారములందు నిమగ్నులమైయున్నాము. ఇప్పుడీ జ్ఞానమును, బ్రహ్మ సాక్షాత్కారమును పొందాలనుకొంటే లౌకిక వ్యవహారములు నిర్వహించలేమో ...." అని తలచి ఆత్మజ్ఞాన సమాచారమును పరిశీలించనివారు మా దృష్టిలో మూర్ఖులు మాత్రమే.

**రాగ ద్వేష తమః క్రోధ మదమాత్సర్య వర్జనమ్**
**వినా, రామ! తపోదానం, క్లేశఏవ న వాస్తవమ్ ॥** (VI. 10)

ఓ రామా! "కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను ఎంతవరకు త్యజించ గలిగాం?" అనునదే ముఖ్యం. అవి వదలాలనే "లక్ష్యము" కలిగియుండకుండా, తపోదానాదులు ఆశ్రయించటం కాయక్లేశకరములే అవుతాయి కాని, ఉత్తమోత్తమమైన ప్రయోజనం సిద్ధింపచేయలేవు. ఒకడు రాగద్వేషములకు లోబడి పరులను వంచించి సంపాదించినదానిని దానం చేశాడనుకో. అసలు ఆ ధనము ఎవరిదో అతడే దాని ఫలమును పొందుచున్నాడు. రాగద్వేషములకు లోబడి చేయబడే వ్రతములు మొ॥ సత్కార్యములు "దాంభికములు" అని చెప్పబడుచున్నాయి. ఇట్టి కార్యముల వలన ఏం ప్రయోజనం? "నేను నా మనస్సును శుద్ధి చేసుకొనుటకే ఈ వ్రత, జప, తపో దానాదులను ఆశ్రయిస్తున్నాను. మరెవరినీ ఉద్ధరించుటకు కాదు. అట్టి శుద్ధమైన మనస్సుచే - నాతో సహా సర్వులయందు వెలుగుచున్న ఆత్మదేవుని దర్శనం చేసుకుంటాను" అను అవగాహనతో తపస్సు, దానము మొ॥నవి నిర్వర్తించబడాలి.✵

కనుక ఓ జనులారా! మీరంతా ప్రయత్నశీలురు అవండి. ఎంత కష్టపడైనా సరే, సాధు-పుంగవుల సామీప్యత, సచ్ఛాస్త్రముల బోధసారం సంపాదించండి. నిజంగా మీరు దుఃఖరహితులు కాగోరుచున్నారు కదా! ఆత్మదేవుని పొందగోరుచున్నారు కదా! అయితే, ఈ రాగాది దోషములను వదలవలసినదే! అందుకు పురుషకారం కాకుండా వేరే ఉపాయమేమి ఉన్నది?

పురుషకారముచే తత్త్వజ్ఞానం ఎట్లా లభిస్తుందో చెపుతాను, వినండి. దీనిచే రాగద్వేషాది దోషముల రూపమున ఉన్న విషూచివ్యాధి ఉపశమించగలదు.

**యథా సంభవయా వృత్యా లోకశాస్త్ర-విరుద్ధయా**
**సంతోష సంతుష్టమనా భోగగంధం పరిత్యజేత్ ॥** (VI. 16)

మొట్టమొదట వీలైనంతవరకు లోక-శాస్త్రములకు విరుద్ధములు కానట్టి జీవితమును అవలంబించండి. యాదృచ్ఛికంగా పొందుచున్నదానితో సంతుష్టులు కండి. భోగవాసనల వలననే అసంతృప్తి బయలుదేరి మిమ్ములను పీల్చి పిప్పిచేస్తోంది. అందుచేత భోగవాసనలు (tendencies that keep you craving) త్యజించండి. ఆవేశ కావేశాలు వదలండి. క్రమంగా చిత్తమునకు ప్రశాంతత అలవాటు చేయండి. సాధువులు ఏమి చెప్పుచున్నారో వినండి. సచ్ఛాస్త్రములు ప్రకటించుచున్నది

---

✵ "దానాద్యస్యార్థాస్తస్య తత్ఫలమ్" అన్నట్లు.

గ్రహించండి. నిషిద్ధమైన కర్మలను వదలుచు విచారణ – ప్రయత్నములను ఆశ్రయించువాడు అతి శీఘ్రంగా ముక్తిని పొందగలుగు చున్నాడు. ఇది మా అనుభవసారం. ఏ బుద్ధిమంతుడైతే విచారణచే బ్రహ్మస్వరూపమును గ్రహిస్తాడో, అట్టివానిపట్ల బ్రహ్మ – విష్ణు – మహేశ్వర – ఇంద్రాది దేవతలు కూడా దయ చూపుతూ ఉంటారు. ఒక రైతు తన తోటలోని అందమైన పూలమొక్కలను కాపాడునట్లు కాపాడుకొంటారు.

ఓ రామా! 'సాధువు' అనగా ఎవరు? జ్ఞాన–వైరాగ్యాది విశిష్ట గుణములతో ప్రకాశించు నట్టివాడే సుమా! అట్టి సాధువులను సుజనులే గుర్తించగలరు. సుజనుల అభిప్రాయం ప్రమాణంగా తీసుకొని 'సాధువు'ను గుర్తించాలి. ఎంత ప్రయత్నించైనా సరే, అతనిని ఆశ్రయించి, అతడు చెప్పేది భక్తి–శ్రద్ధలతో వినాలి. అణకువతో ప్రశ్నించి, చెప్పింది విని, స్థిరీకరించుకొని పరిశీలనాత్మక బుద్ధిచే ఆత్మజ్ఞానివి కావాలి.

శాస్త్రముపై, గురువుపై, తనపై విశ్వాసము కలవాడే సద్వస్తువును దర్శించుచున్నాడు.

**సచ్ఛాస్త్రము :** విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనది 'ఆధ్యాత్మవిద్య'. అట్టి ఆత్మవిద్యను బోధించే శాస్త్రమే "సచ్ఛాస్త్రము".

యోగము అభ్యసించినవారి మనస్సులోని వృత్తులన్నీ తొలగుతాయి కదా! అదేవిధంగా "సాధుసంగము – సచ్ఛాస్త్రపఠనముల వలన వైరాగ్యము, దృశ్యముపట్ల రాగము తొలగుట" మొ॥ ప్రాప్తిస్తున్నాయి. తత్కారణంగా 'అవిద్య' అనబడే సంసారము నశిస్తోంది. సర్వదా సర్వత్రా సర్వవిధాలా దేవదేవుడగు పరమాత్మను సర్వకర్మలచే ఆరాధించటమే సర్వోత్కృష్టమైన ఉపాయం.

❖❖❖

# 8. మిథ్యాభ్రాంతులు

**శ్రీరాముడు :** ఓ మహర్షీ! దేవదేవుడగు పరమాత్మను సేవించమని ఆజ్ఞాపించుచున్నారు. అట్టి పరమాత్మతో సమీప్యతచే అమోఘమైన ప్రభావం ప్రాప్తించగలదని మీ వాక్కులచే గ్రహిస్తున్నాం. తత్వవేత్తలు, మా శ్రేయోభిలాషులు అయినట్టి మీయొక్క వాక్యములు మమ్ములను ఈ 'సాంసారిక దృష్టి' నుండి తప్పక కాపాడుతాయి.

కాని మహాశయా! నాకు మరొక సమస్య వచ్చిపడుతోంది. మీరు చెప్పు ఆ "పరమాత్మ" అనునది ఎవరి గురించి? ఎవని గురించి ఎరిగిన తరువాత ముక్తి లభిస్తుందని అంటున్నారో అట్టి పరమాత్మ ఎక్కడుంటాడు? అతనిని మేము తెలుసుకోవటం ఎట్లా? చేరటం ఎట్లా? మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** నేను చెప్పుచున్న ఆ ఆత్మ భగవానుడు ఎక్కడో దూరంగా లేడు సుమా! అతడు చైతన్యరూపమున మనందరి శరీరములలో నివసించుచున్నాడు. ఈ విశ్వమే అతడు.

కాని అతడు విశ్వరూపముగా అగుటలేదు. ఉన్నది అతడొక్కడే. అతనికి వేరుగా విశ్వము అనునది ఎక్కడా ఎన్నడూ లేదు. "ఆ చిన్మయ తత్త్వమే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, సూర్యుడు, నీవు, నేను, కూడా" .... అని గ్రహించెదవు గాక. సర్వము ఆ చైతన్య స్వరూపమే కాని, మరింకేమీ కాదు.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ విశ్వమంతా చైతన్యస్వరూపము మాత్రమే అయివుంటే .... ఆ విషయం ఇప్పటికే అందరు గ్రహించి ఉండాలి కదా! మరి మీవంటి సాధువులచే ఉపదేశములు ఇవ్వబడవలసిన అగత్యం ఎందుకు ఉంటోంది? ఆ చిత్‌తత్త్వము ఈరీతిగా "జడము – చైతన్యము : నీవు–నేను" అనబడు అనేక రూపములుగా ఎందుకు ప్రకటితమౌతోంది ....?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "ఈ భౌతిక దృష్టికి అనేకత్వముగా కనిపించు దృశ్యము చిత్ తత్వము యొక్క పరిణామము" అనునది సరికాదు. చిదాత్మ లేక చిద్వస్తువు సర్వదా పరిణామ రహితంగానే ఉండి ఉంటోంది. "అది అనేకత్వము పొందుచున్నది ....." అనే అభిప్రాయముతో కూడిన జాడ్యము ఉన్నంతవరకు ఈ జీవునికి 'సంసారము' అనే అనుభవము కొంచముకూడా ఉపశమించదు.

"సంసారము అంటే ఏమిటి?" అనే ప్రశ్నకు విజ్ఞులు, "అనేకత్వ రూపము దాల్చుచున్న ఈ దృశ్యమే సారవంతమైనది ... అని అనుకొనే పశుతుల్యులగు చేతన జీవుల దృష్టియే సంసారము" అని నిర్వచనం చెప్పుచున్నారు. అట్టి ఆలోచనా విధానమే జనన మరణాది ఫలములను కలుగజేస్తోంది.

ఈ జీవుని చూచావా? ఇతడు అజ్ఞుడై, సత్యవిషయమును గ్రహించనివాడై, తన వాస్తవ స్వరూప–స్వభావములు మరచినవాడై అందుకు ఫలితంగా అనేక దుఃఖపరంపరలు అనుభవిస్తున్నాడే? ఎందుచేత చెప్పు? "నే నీ శరీరమును. ఈ నా ఇంద్రియ అనుభవములు – వాస్తవం. ఇతరులతో ఏర్పరచుకొన్న సంబంధ బాంధవ్యములు సత్యము" అని భావించుటచేతనే సుమా! అతడు "స్వస్వరూపానుభవము" ను వదలినవాడై ప్రతిబింబితమగు అంతఃకరణ చైతన్యమున పడి వ్యర్థముగా అనర్థములు అనుభవిస్తున్నాడు. బహిర్ముఖ వృత్తులే (Avocations of external matters) ఇందుకు కారణం. అట్లు బహిర్ముఖం అగుచున్న చిత్తవృత్తి .... నిత్యచేతనమగు ఆత్మయొక్క దర్శనముచే ... నశించుచున్నది. బాహ్యమగుచున్న వృత్తులు అంతర్ముఖం కాగా ... అప్పుడు ఈ జీవునియందు ఒకానొక పూర్ణత్వము ప్రకాశించుచున్నది. అనగా ఈ జీవుడప్పుడు పూర్వాపూర్వస్వభావుడు అగుచున్నాడు. నేను "పూర్ణుడను – శుద్ధుడను – నిత్యుడను" అను అవగాహననే "తత్త్వసాక్షాత్కారం" అని అంటున్నాం. దానిని పొందిన వానికి ఇక శోక–మోహములు ఉండవు. పరాత్పరుడగు బ్రహ్మమును ఎరిగినవాని యొక్క హృదయగ్రంథులు, కుసంస్కారములు విచ్ఛిన్నమైపోతున్నాయి. "నేను ఒక రక్త–మాంస–బొమికలతో నిర్మించబడిన గూడు వంటివాడిని. వీరు మాత్రమే నా వారు. వారు పరాయివారు" .... అనునట్టి దుర్భాషలన్నీ త్యజించబడతాయి. సందేహములన్నీ తొలగిపోతాయి. సంచితకర్మలన్నీ లయించిపోతాయి.

❖

కాబట్టి ఓ రామచంద్రా! "నేను ఎవరు? ఏది కాదు? ఈ దృశ్యమేమిటి?" అనునది గ్రహించినప్పుడే ఈ జీవుని జాడ్యం మొదలంట తొలగిపోతుంది. అప్పుడీ జీవుడే శివుడు అవుతాడు.

అయితే ఈ చిత్తమును బాహ్యమువైపుకు ప్రసరించకుండా హఠంతో బలవంతంగా నిరోధిస్తే దృశ్యదర్శనం ఆగుతుందా? దృశ్యశాంతి ప్రాప్తిస్తుందా? లేదు. "ఈ దృశ్యభ్రాంతులన్నీ మిథ్యాభ్రాంతి చేతనే కలుగుచున్నాయి" అనే జ్ఞానం లేకపోతే, బహిర్ముఖమగుచున్న చిత్తవృత్తులను నిరోధించటం ఎవరి తరం? జ్ఞానసముపార్జన లేకుండా దృశ్యదర్శనం శాంతించటం అసంభవం. "దృశ్యవస్తువు మిథ్య" అనునట్టి సుస్థిరమైన అవగాహన (లేక జ్ఞానము) లేకపోతే దృశ్యాతీతమైనట్టి చిత్స్వరూపమోక్షం ఎట్లా లభిస్తుంది.

అందుచేత రాఘవా! ఏ హఠయోగంతోనో ఈ దృశ్యమును తిరస్కరించినంతమాత్రంచేత ఒరిగేదేమీ ఉండదు. పైగా, అట్టిదానితో ఈ జగత్స్వరూపమేమిటో అర్థం కాకపోగా, అపార్థమే మిగులుతుంది. మేము ఈ వర్తమాన బోధవంటి ఆయా ప్రవచనముల ద్వారా ఈ జగత్స్వరూపమేమిటో విడమర్చి చెప్పుచున్నాం.

మా ఈ ప్రయత్నము ... "ఈ జీవునిలో ఇతఃపూర్వమే సర్వదా వేంచేసియున్న "పరిశుద్ధాత్మ తత్త్వము"ను గుర్తుచేయటం మాత్రమే. అంతేగాని, క్రొత్తగా మరొకటేదీ తెచ్చి ప్రతిష్ఠాపన చేయుచుండుట లేదు సుమా!

❖❖❖

# 9. పరమాత్మ స్వరూపమెట్టిది?

**శ్రీరామచంద్రుడు :** హే మహర్షీ! "నేను ఇది" అని తెలుసుకోకపోవటం చేతనే జీవునికి ప్రాప్తించియున్న ఈ సంసారము తొలగకున్నది కదా! అయితే ఈ సర్వజీవులలోను ఉండి ఉంటూ, సర్వజీవులు 'తానే' .... అయినవాడు ఎవడు? అతడు ఆకాశరూపియా? అతడు ఏ ఆధారంతో ఎక్కడ, ఎట్లు వసించుచున్నాడు? మీరు చెప్పుచున్నట్లు సాధు సంగమములచే, సచ్ఛాస్త్రములచే లభ్యుడుకాగల ఆ పరాత్పరుని స్వరూపమెట్టిది? దయచేసి చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! రామా! "జన్మ" అనే అరణ్యంలో సంచరించుచున్న ఒకానొక చేతన – జీవునియందు "ఇతడే పరమాత్మ" అనునట్టి బుద్ధి ఉంచువారు ఎంతటి పండితులైనా మా దృష్టిలో సంపూర్ణమైన అవగాహన కలవారు కాదు. ఎందుకంటావా? ఈ సంసారమునకు, తదంతర్గతమైన దుఃఖములకు కారణం జీవభ్రాంతియే కదా! ఒక్కనిని ఎరిగినంత మాత్రం చేత లాభమేమున్నది? ఒకానొక జీవుని జీవత్వముతో ఉపాసన ప్రారంభించి అటుపై క్రమక్రమంగా "సర్వజీవులు పరమాత్మ స్వరూపమే" అనునట్టి సర్వాత్మభావమును గ్రహించినప్పుడే దుఃఖములన్నీ తమంతటతాము స్వయముగా ఉపశమిస్తున్నాయి. విషము తొలగితే ఆ విషము యొక్క ప్రభావం తొలగుతుంది కదా! అట్లాగే దృశ్యము పరమాత్మ స్వరూపంగా అనుభూతం కాగలదు.

**శ్రీరాముడు :** ఓ బ్రహ్మజ్ఞా! పరమాత్ముని రూపమేమిటో ఉన్నది ఉన్నట్లు వర్ణించండి. మీరు చెప్పేది విని, ఆ పరమాత్మను దర్శించి మేము ఈ మనోమోహము నుండి సంపూర్ణముగా విడివడ గలుగుతాం.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఏ జ్ఞాన స్వరూపమైతే క్షణంలో ఒకచోటినుండి మరొక చోటికి వెళ్ళుచున్నదో....

– ఏ బోధరూప సముద్రంలో అయితే ... ఈ భూత–భవిష్యత్–వర్తమానముల రూపములుగా ఉండునట్టి "కాలము" కూడా 'మిథ్యయే' అయిఉన్నదో ....

– ఏ "ఎరుక" అను దానిలో ఈ జగత్తు అంతా తేలియాడుచున్నదో ....

– దేని యందు ద్రష్ట–దర్శనము–దృశ్యము స్వతహాగా ఉన్నవి కానప్పటికీ, ఉన్నట్లే అగుపిస్తున్నాయో

– ఈ ప్రపంచమంతా అసత్తే అయినప్పటికీ దేని యందు సత్తువలె (సద్రూపము వలె) కనబడుతోందో

– అనాదియగు ఈ సృష్టి ప్రవాహమంతా దేనియందు మిథ్యారూపముతో భాసిస్తోందో....

– ఏ చిన్మాత్రము (Knowing concept) చైతన్యమే అయివుండికూడా బండరాయి వలె మార్పు–చేర్పులు లేకయే సర్వదా నిశ్చేష్టితమై ఉన్నదేదో ...

– ఏది జడము అయి కూడా జడము కాకయే ఉన్నదో ...

– ఈ బాహ్య–అభ్యంత (శరీరాదులు–మనోబుద్ధి అహంకారాదులు) వస్తువులన్నిటితో కూడి ఉండి, సర్వ వ్యవహారములు నిర్వర్తించుచున్నదేదో...

నాయనా! అదియే 'పరమాత్మ' యొక్క స్వరూపము. సూర్యుడు మొదలైన ప్రకాశ పదార్థము లన్నిటి యొక్క రూపము వెలుతురే కదా! ఈ కనబడేదంతా దేనిలో ఉన్నదో అదే పరమాత్మ యొక్క పరివేష్టితమని గ్రహించు.

❖

**శ్రీరాముడు :** "పరమాత్మ ఒక్కటే సద్రూపము. ఈ దృశ్యజగత్తు అంతా అనిత్యము–మిథ్య" ... అని మాకు అనుభవపూర్వకంగా తెలిసేదెట్లా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! అటు ఆ ఆకాశమువైపు చూడు. అక్కడ ఏదో నీలంగా కనబడుచున్నది కదా! అయితే, ఆకాశంలో నీలపురంగుగల పదార్థం ఉన్నదా? లేదు కదా! ఆకాశము వాస్తవానికి శూన్యము, రూపహీనమయి ఉన్నట్లు, చిన్మయ బ్రహ్మము నందు ఈ భ్రాంతిమయజగత్తు కూడా కనిపిస్తోంది. అట్టి జ్ఞానము లభించినప్పుడు బ్రహ్మము యొక్క స్వరూపము స్వయముగా బోధపడుచున్నది. "ఈ జగత్తు మిథ్యయే" అను జ్ఞానము కాకుండా, బ్రహ్మమును ఎరుగుటకు వేరే ఉపాయం అంటూ ఏదీ లేదు.

"ప్రళయకాలము" అనబడు స్థితిలో ఈ దృశ్యసమూహములన్నీ నశిస్తున్నాయి. అప్పుడు ఆ పరమపురుషుడొక్కడే శేషించుచున్నాడు అట్లు మిగిలియుండేదే "బోధస్వరూపము".

అనగా... నీ దృష్టిలో "నీవు – నేను – అతడు – జగత్తు" అనబడునదంతా సంపూర్ణంగా లయించగా... అప్పుడు నీయందు శేషించేదే అది. శుద్ధవిజ్ఞానతత్త్వమగు అద్వానియందే ఈ దృశ్య జాలమంతా జనించటం, ఉండటం, లయించటం కూడా జరుగుతోందని గ్రహించు.

అయితే ఒక ముఖ్యమైన విషయం. "గాఢనిద్రలో ఏర్పడే జడస్థితియే బోధస్వరూపము" అని భ్రమ పడకూడదు. 'ప్రతిబింబము' అనునదే ఉండని దర్పణం ఎక్కడన్నా ఉంటుందా? దృశ్యభావం లేకపోతే బ్రహ్మము యొక్క ప్రతిబింబము కూడా ఉండదు.

**శ్రీరాముడు :** మరి మీరు "సర్వము లయించగా అప్పటికీ శేషించు స్థితి" అని చెప్పునది దేనిని?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "ఈ జగత్తు సత్తుకాదు" అనునట్టి వాస్తవజ్ఞానమే అట్టి స్థితి. "ఇది మిథ్య మాత్రమే"... అని గ్రహించనంతకాలం పరతత్త్వమును ఎక్కడా ఎవరూ ఎరుగలేరు. కనుక "దృశ్యమును త్యజించటం" అంటే "జడత్వము ఆశ్రయించటం"... మాత్రంకాదని మరల గుర్తు చేస్తున్నాను. గాఢనిద్రాసమయంలో పిపీలికాది బ్రహ్మపర్యంతము (పురుగు నుండి – బ్రహ్మదేవుని వరకు) దృశ్యరహితమైన జడత్వం పొందుచూనే ఉన్నారు కదా! అది మోక్షం అనిపించుకుంటుందా? లేదు "ఈ దృశ్యము నేను చూడను" అని కళ్ళు మూసుకొన్నంత మాత్రంచేత పరతత్త్వానుభవం ప్రాప్తించదు.

ఈ దృశ్యము స్వతఃగా ఉన్నది కాదు. ఇది స్వకల్పితమాయ చేతనే ఈ సమస్త ప్రాణులకు ఆయా విధములుగా తోచుచున్నది. సమస్త జీవరాసులలో ఏకస్థమైయున్న బ్రహ్మము ఈ 'దృశ్యా నుభవము'చే ఏమాత్రం ఏ క్షణమందుకూడా తాకబడటంలేదు"... అనునట్టి ఉత్తమ సంస్కారం లేక దృష్టియే మోక్షము. కనుక రామా! ఈ దృశ్యము లేదు. బ్రహ్మము మాత్రమే ఉన్నది.

❖❖❖

# 10. భౌతికదృష్టి

**శ్రీరాముడు :** మాకందరికీ ఎదురుగా కనిపిస్తూ ఈ దృశ్యము స్పష్టముగా అనుభవ మగుచున్నది కదా! ఇది మిథ్య ఎట్లా అవుతుంది? మరొక ప్రశ్న. బ్రహ్మము అత్యంత సూక్ష్మమైనదిగా చెప్పబడింది కదా! అట్టి సూక్ష్మమైనదానిలో ఈ అత్యంత విస్తారమైన జగత్తు ఎలా ఇమిడి ఉన్నది?"* ఆవగింజలో మేరుపర్వతం ఇమడగలదా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! నీయొక్క ఇతఃపూర్వపు దృఢాభ్యాసం చేతనే ఇప్పుడు ఈ ప్రపంచమును పాంచభౌతిక దృష్టితో చూస్తున్నావు. అందుచేతనే నీపట్ల "ఇది స్థూలము – ఇది సూక్ష్మము" ... మొదలైన వ్యవహారములన్నీ ప్రవర్తిస్తున్నాయి.

ఇప్పుడు నీవు ఏకాగ్రతచిత్తంతో సాధుసంగం, సచ్ఛాస్త్రం, స్వవిచారణలను ఆశ్రయిస్తూ ....

---

* **"తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్"** అతి సూక్ష్మమై, హృదయాం తర్భాగమందున్న అద్వానియందే సర్వము ప్రతిష్ఠితమైయున్నది .... మంత్రపుష్పం.

"ఈ దృశ్యము వాస్తవానికి ఏమైయున్నది?" అనునది పరిశీలించటం జరుగుతోంది కదా! ఇక నీ చిత్తమును అంటిపెట్టుకొని ఉన్నట్టి దృశ్యభ్రాంతి తొలగుతుంది. ఎప్పుడైతే "ఈ దృశ్యము ఇట్లు ఉన్నది" అనునట్టి ఆసక్తిపూర్వక జ్ఞానం తొలగుతుందో ... అప్పుడు ద్రష్టత్వము యొక్క ఆవరణ కూడా నశించుచున్నది. అనగా "వీటిని దర్శించునట్టి ద్రష్టనగు నేను ఈ దృశ్యమునకు మాత్రమే పరిమితుడనై ఉన్నాను" అను భావన ఉండదు. అప్పుడు శేషించేదేమిటి? స్వస్వరూపమగు శుద్ధ చైతన్యమే. అద్దానియందు ప్రజ్ఞాపూర్వకంగా నిలకడ కలిగియుండుటే మోక్షం.

అసలు దృశ్యానుభవం ఎక్కడి నుండి సిద్ధిస్తోంది? ద్రష్టత్వము నుండే కదా! ఈ ప్రపంచంలో ద్విత్వము (రెండు కలవు) అనుదానినుండి ఏకత్వము; ఏకత్వయోచన (ఆలోచన) నుండి ద్విత్వము కలుగుచున్నాయి. 'ఒకటి' లేకపోతే 'రెండవది' కలుగదు. ఈ 'ద్విత్వ వివర్జితమైనట్టి సద్వస్తువు (that which is absolutely true) మాత్రమే మిగిలి ఉంటుంది. "ఈ జగత్తు (లేక దృశ్యము) అవాస్తవము. మిథ్య, భ్రమ వంటిది" అను బోధ నీకు కలిగించాననుకో ... అప్పుడు నీ చిత్త దర్పణమును అంటిపెట్టుకొనియున్న "అహంకారం, బుద్ధి, మనస్సు, వస్తుభావన" .... మొదలైన రూపమునగల "దృశ్యమలము" తొలగి పోతుంది. ధూళి తుడిచివేయబడినప్పుడు దర్పణము (అద్దం) సుస్పష్టముగా ప్రతిబింబములు చూపునట్లు, శుద్ధ చిత్తమునందు ఆత్మవస్తువు తన నిత్య అఖండాది స్వభావములతో మహా స్పష్టముగా ప్రకటితం కాగలదు.

"ఈ దృశ్యమూలము తొలగుట కష్టసాధ్యము కదా" అని నీవు భావించకూడదు సుమా! ఎందుకంటావా? అసత్తు అయినదానికి సత్తు (లేక ఉనికి) ఎక్కడ? సత్తుకు "లేకుండటం" అనునది ఎప్పుడుంటుంది? స్వాభావికంగానే మిథ్య అయినదానిని తొలగించటంలో కష్టమేమి ఉంటుంది చెప్పు?

ఓ ప్రియరాఘవా! ఈ కనబడు విశాల బ్రహ్మాండము ఎన్నడూ ఉత్పన్నమే అయి ఉండలేదు. ఇదంతా ఆ నిర్మల చైతన్యముననే కల్పితమైయున్నది. అందుచేత దీని వాస్తవ స్వరూపం బ్రహ్మమే. ఆభరణము బంగారమే అయివున్నది కాని మరింకేమీ కాదుకదా! అదే విధంగా ఈ జగత్తు కూడా మిథ్యయే. ఇది ఏనాడూ సృష్టించబడలేదు. "ఉంగరము" అనబడునది బంగారమునకు వేరుగా ఎక్కడైనా ఉన్నదా? కొయ్యయందు చెక్కబడిన వస్తుజాలమంతా కొయ్య కన్నా వేరుకాదు కదా! స్వతఃగా లేకుండా, ద్రష్టయందు కల్పితమాత్రంగా రూపుదిద్దుకొనియున్న ఈ జగత్తును మనస్సు నుండి తొలగించుటలో శ్రమ ఏమి ఉంటుంది చెప్పు? బ్రహ్మతత్త్వము నిత్యసత్యమైయున్నది. కనుక "అత్యంత సహజమైనది?" నీకు ఈ విషయం అనేక యుక్తులతో విశదీకరిస్తున్నాను.

ఎడారిలో భ్రమ చేతనే సూర్యకిరణముల ప్రతిభాస (refraction) వలన "సరోవరం" అగుపిస్తోంది. కాని మరుభూమి (లేక ఎడారి)లో సరోవరమెక్కడ? ఒకానొక కంటి దోషం చేత ఆకాశంలో రెండు చందమామ కనిపిస్తాయి. కాని ఇద్దరు చంద్రులు వాస్తవంగా ఉన్నారా? వంధ్య (గొడ్రాలు)కు కుమారులు ఉండటం ఏమిటి? భ్రమచేత ఆకాశంలో మేఘముల ఆకృతి కారణంగా ఆకాశంలో ఆయా వస్తుజాలముల ఆకారములు (కొండకొండల మధ్య సరోవరం మొ॥వి)స్ఫురించి

నంత మాత్రంచేత ఆ పదార్థములు అక్కడ ఉన్నాయా? ఈ జగత్తు కూడా లేదు. దీనికి అస్థిత్వము లేకపోయినప్పటికీ ... భ్రమచేతనే ఇట్లు గాంచబడుచున్నది.

ఓ రామచంద్రా! మరల చెప్పుచున్నాను. నీవు చూస్తున్నది, నీకు కనబడుచున్నది ... అంతా బ్రహ్మమే సుమా! ఇప్పుడు నేను చెప్పుచున్నదానిలో తగినంత నమ్మిక నీకు కలుగవచ్చు. కలుగక పోవచ్చు. నేను యుక్తియుక్తంగా చెప్పబోయేదంతా వినిన తరువాత ఈ విషయం నీవే గ్రహిస్తావు.

సర్వజనులారా! తత్త్వజ్ఞులు లోకానికి ప్రసాదిస్తున్న యుక్తితో కూడిన ఉపదేశములను చక్కగా వినండి. అంతేకాని, “ఇదంతా మాకెందుకు?” అని తలచుచు దృష్టాంతముల సహాయంతో ఆత్మజ్ఞులు, అనుభవజ్ఞులు అగువారు బోధిస్తున్నది తిరస్కరించకండి. అట్టి జ్ఞానుల వాక్యములను తిరస్కరిస్తూ ఆత్మ (స్వస్వరూపము) యొక్క స్వరూప - స్వభావములను గ్రహించకుండా, యుక్తిరహితమైన పంథాను అనుసరించేవారు తమ విలువైన ‘కాలము’ అను అవకాశమును వృథా చేసుకొంటున్నారు. అశ్రద్ధ కారణంగా ఆత్మసమాచారము విషయమై స్తబ్ధత వహించియుండే మూఢ బుద్ధులను, మంద భాగ్యులను, అజ్ఞులను, అప్రయత్నశీలురను ఈ ప్రపంచములోని పదార్థములు గాని, మరెవరుగాని కాపాడగలరా? లేదు.

❖❖❖

# 11. జీవన్ - విదేహముక్త లక్షణములు

**శ్రీ వసిష్ఠమహర్షి :** బ్రహ్మమునందు చిత్తమును నిలిపి, బ్రహ్మగతప్రాణులై ఒకరినొకరు బ్రహ్మము గురించి సంభాషించుకొనువారు కొందరు జ్ఞానదృష్టిచే సంతుష్టులై ఆనందమును పొందుచున్నారు. బ్రహ్మవిచారపరులగు అట్టి జ్ఞాననిష్ఠులకు జీవన్ముక్తి లభించుచున్నది. అట్టి జీవన్ముక్తులు విదేహముక్తులు కూడా అగుచున్నారు.

**శ్రీరాముడు :** హే బ్రహ్మజ్ఞా! మీరు మాకు “జీవన్ముక్తుల - విదేహముక్తుల” లక్షణములు ఏమిటో చెప్పండి. మీరు చెప్పినది విని శాస్త్రదృష్టితో, స్వబుద్ధితో వాటికొఱకై మేము ప్రయత్నం చేయగలుగుతాం.

**శ్రీ వసిష్ఠమహర్షి :**

**జీవన్ముక్తుడు :** శాస్త్రవిధిని అనుసరించుచూ, ఈ విశ్వమును శూన్యముగా గ్రహిస్తూ ఉండేవాడినే మనం “జీవన్ముక్తుడు” అని పిలుస్తున్నాం. ఆయా ప్రవాహపతితమైన లోకక్రియలను నిర్వర్తిస్తూ జ్ఞానసహితుడై, జాగ్రదవస్థయందు కూడా నిద్రితుని లాగానే, నిర్వికారుడై మెలగువాడే జీవన్ముక్తుడు.

అతని ముఖము సుఖము లభించినప్పుడు వికసించదు. దుఃఖము ప్రాప్తించినపుడు ముకుళించదు. అన్ని సమయములందు ఒకే రీతిగా ఉంటుంది. ఎప్పుడు ఏది చేయవలసి ఉంటుందో, అది ఆయా సమయములందు అట్లే ఇతరులకు అనుకూలంగా అవలంబిస్తూ ఉంటాడు. మేలుకొని ఉన్నప్పుడు కూడా నిర్వికార ఆత్మతత్త్వమును ఆశ్రయించినవాడై సుషుప్తునివలె ఉంటాడు కదా! అందుచేత “ఇతడు సుషుప్తుడేమో!” అనిపించవచ్చు. కాని, “అవిద్య” అను నిద్ర నశించియుండటంచే

ఆత్మయందు అతడు సర్వదా జాగ్రతుడే అగుచున్నాడు. ఈ దేహేంద్రియముల విషయంలో "ఇవి నాకు సంబంధించినవి" అనిగాని, "నేను వీటికి సంబంధించినవాడిని" అనిగాని అతడు అనుకోడు. అందుచేత అంతరంగంలో ఎట్టి ఉద్వేగం పొందకుండానే ఉంటాడు. జాగ్రత్ వాసనలన్నీ నశించియే ఉండటంచే అతడు స్వప్నస్థితికి కూడా సంబంధించినవాడు కాదు.




గాలి వేగంగా వీస్తున్నదనుకో... ఆ గాలి వేగానికి కొండపై చెట్లు కదులుతాయేమోగాని, కొండ కదలదు కదా! బయటకు సంతోష, దుఃఖ, రాగ, ద్వేష, భయాదులు అతడు ప్రకటించినప్పటికీ, అంతరంగంలో మాత్రం ఆకాశంవలె స్వచ్ఛుడై వెలయుచు ఉంటాడు. తన వాస్తవ స్వరూపమేమిటో, ఏది తాను కాకయే ఉన్నాడో తెలుసుకొనే ఉంటాడు. "నేను దేనికి కర్తను కాదు. చైతన్యస్వరూపుడనగు నేను పుట్టుటలేదు. చచ్చుటలేదు. ఏదియు నిర్వర్తించుట లేదు. ఇక నాకు బంధమేమిటి? మోక్షమేమిటి?" అనునట్టి నిరహంకారత్వము, అకర్తృత్వభావన కలిగి ఉంటాడు. కర్తృత్వాభిమానము లేనివాడూ, కర్మలు చేసినా, చేయకున్నా బుద్ధిచే దేనిని స్పృశించనివాడు అయి ఉంటాడు.

"చిదాత్మస్వరూపమగు నేనే ఆవరణము తొలగినప్పుడు ప్రళయమును, ఆవరణమున్నప్పుడు సృష్టిని కల్పించుకొనుచున్నాను" అనునట్టి గ్రాహ్యబుద్ధితో ఉంటాడు. చేస్తూ – చెయ్యనివాడుగా, చూస్తూ–చూడనివాడుగా కాలగమనం సాగిస్తాడు. ఎవరికీ భీతి కలిగించడు. తాను లోకములను చూచి భీతిచెందడు. సంతోషము–దుఃఖము–భయము ... అనువాటినుండి పూర్తిగా విడివడి ఉంటాడు.

జీవన్ముక్తునికి ఈ సంసారముపట్ల 'కించిత్' కూడా ఆసక్తి ఉండదు. ఆసక్తి ఉంటేకదా బంధము? ఆసక్తి లేకపోయినప్పుడు ఇక ఎవరికైనా జీవన్ముక్తత్వము వలన వచ్చే లోటు ఏం ఉంటుంది? అతడు దేహి అయి ఉన్నప్పటికీ నిరాకారుడై, మనస్సు ఉన్నప్పటికీ అమనస్కుడై ఉంటాడు. అందరిలాగానే ఈ జగత్తులో సంచరిస్తూ కూడా సర్వదా నిశ్చింతుడై ఉంటాడు. ఈ జగద్వ్యాపారములందు పాల్గొనుచున్నప్పటికీ, కామాదుల వేగానికి ఏమాత్రమూ లొంగడు. ప్రతి ఒక్కరియందును ఆత్మయొక్క పూర్ణత్వమును సదా దర్శిస్తూ ఉంటాడు.

**విదేహముక్తుడు :** అట్టి జీవన్ముక్తుడు కాలక్రమంగా దేహము త్యజించిన తరువాత విదేహ ముక్తుడగుచున్నాడు. వాయువు స్పందము వదలిన తరువాత నిశ్చలత్వము పొందుతుంది కదా! అట్టి విదేహముక్తుడు మరల జన్మించడు. మరణించడు. వ్యక్తుడుకాడు. అవ్యక్తుడుకాడు. దూరముగాని,

దగ్గరగాని ఉండడు. 'నేను–ఇతరులు' అను భేదదృష్టి అతనికి ఉండదు. సర్వాత్మకమగు బ్రహ్మమే తానగుచున్నాడు. అందుచేత, సూర్యరూపమున తాపమును, బ్రహ్మ అయి జగత్‌సృష్టిని, విష్ణువై రక్షణను, శివుడై సంహారమును చేస్తూ ఉంటాడు. ఆకాశస్వరూపుడై గాలియొక్క స్పందమును గ్రహిస్తూ ఉంటాడు. మేరుపర్వత స్వరూపుడై .... సుర, అసుర దైత్య, పాలకులకు, ఋషులకు కూడా నివాసస్థానమై ఉంటూ ఉంటాడు. భూమి అయి ఈ సృష్టినంతా వహించుచున్నాడు. వృక్షస్వరూపుడై మధురఫలములను ప్రసాదిస్తూ ఉంటాడు.

జలరూపంతో ద్రవత్వము, 'అగ్ని' రూపంతో దాహకత్వము ధరిస్తూ ఉంటాడు. ఆ ముక్త పురుషుడే దిక్కుల రూపమును సంతరించుకొని వెలుతురు, చీకటిలను విస్తరింపచేయుచూఉంటాడు. 'శూన్యరూపి' అయి ఆకాశమును, పర్వతమై స్థలమును ఆక్రమించుచు ఉంటాడు. వికసిత చైతన్యమై ఈ కనబడే జంగమపదార్థములను సృష్టించుచున్నాడు. సముద్రమై భూమిని చుట్టుకొని ఉంటున్నాడు. ఆవరణ లేనట్టి చిదాత్మ రూపమున (అనావృత్తంగా) ఈ విశాల విశ్వమును వెలిగించుచు .... శాంత రూపమున అవస్థితుడై ఉంటున్నాడు. ఓ రాఘవా! భూత–భవిష్యత్–వర్తమాన కాలములలో ప్రకాశితమైనది, అగుచున్నది, అవబోవుచున్నది అయినట్టి ఈ దృశ్యసమూహమంతా కూడా ఆ విదేహముక్తుడే అయివున్నాడు సుమా!

❖

**శ్రీరాముడు :** మహర్షీ! "సమదృష్టి పొందటం" ... అనునది చాలా కష్టమైనది, దుష్ప్రాప్యమైనది కూడా కదా! కనుక మీరు చెప్పుచున్నట్టి ఆ 'విదేహముక్తి' ఏమంత సులభమైన విషయం కాదేమో? ఈ చిత్తమును చూచారా? ఇది క్షణక్షణం చంచలమై ఉన్నది కదా! దీని చాంచల్యమును నిరోధించేదెట్లా? స్వామీ! ఇందుకు సరైన ఉత్తమమైన ఉపాయం ఉంటే చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రాఘవా! చిత్తమును నిరోధించాలని అనుకొంటే ఆ చిత్తముయొక్క వాస్తవ స్వరూపమేమిటో మొట్టమొదట గ్రహించాలి. చిత్తము విషయమై మనం విస్తారంగా చర్చించబోతున్నాం. శత్రువును మట్టుపెట్టాలనుకొంటే ... ఆ శత్రువు యొక్క స్వరూప - స్వభావాలేమిటో, శక్తి - యుక్తులేమిటో, గ్రహించాలి కదా! అయితే ఆ చిత్తము విషయమై నీవు దిగులు చెందవలసినపనిలేదు. ఈ మన విచారణను వెంటనంటి వస్తూ ఉండగా సర్వము విదితమౌతుంది. అప్పుడు నీ ముక్త స్వరూపము నీకే అవగతమౌతుంది.

'ముక్తి' అని దేనిని అంటున్నామో, అదే బ్రహ్మము, అదే నిర్వాణము. అది పొందటానికి ప్రతిజీవునకు హక్కు ఉన్నది. స్వగృహం చేరుటను ఎవరు కాదనగలరు? ఇక అది పొందటానికి ఉపాయమంటావా? విను.

"'నేను' అను బుద్ధితో కూడుకొని కనబడుచున్న ఈ దృశ్య – జగత్తంతా గొడ్రాలి కుమారుని వలె 'భ్రమ' మాత్రమే. ఇందేదీ సత్యము లేదు".... అనునట్టి జ్ఞానము వలన అట్టి ముక్తి లభిస్తోంది.

❖❖❖

# 12. దృశ్యము తొలగేదెట్లా?

**శ్రీరాముడు :** హే వేదజ్ఞా! ఇక్కడ నాదొక సందేహం.

"విదేహముక్తులే త్రిభువనములుగాను, సూర్యాది మహత్తర పదార్థములుగాను అగుచున్నారని మీరు చెప్పారు కదా! అనగా ఆ విదేహముక్తి – స్వరూపులే ఈ సృష్టిగా మారుచున్నారని అనుకోవచ్చా?"

**శ్రీ వసిష్ఠమహర్షి :** నీ ప్రశ్న బాగానే ఉన్నది. అయితే నేను నిన్ను మరొక ప్రశ్న అడుగుతాను. అసలు "త్రిభువనములు (స్వర్గలోకం, మర్త్యలోకం, పాతాళలోకం) ... అనే పేరుతో ఏదైనా ఉండి ఉన్నదంటావా? ఉండి ఉండటం వాస్తవమైతే "వారు అట్లు మారినారు" అని అనవచ్చు. "త్రిలోకములు" అనబడే పదార్థమే లేదని జ్ఞానులు ఎరిగియే ఉన్నారు. "ఆ బ్రహ్మమే చిత్‌శక్తి వలన ఈ సంసారముగా మారుచున్నది" అను ప్రవచనం కూడా భ్రమమాత్రమే అయున్నది. 'జగత్తు' అను శబ్దము, అర్థము కూడా కేవలము కల్పనయేనని సిద్ధాంతీకరించబడుచున్నది.

ఈ నా వాక్యములు సూక్ష్మబుద్ధితో గ్రహించాలి సుమా! వాస్తవానికి ... "అతి నిర్మలము – శాంతము – చిద్రూపము" ... అయినట్టి బ్రహ్మము ఒక్కటే ఉన్నది. 'జగత్తు' అనబడు వేరొకటి లేనేలేదు. నీవు సద్వస్తువును సూక్ష్మబుద్ధితో గ్రహించినప్పుడు ఈ సత్యము బోధపడగలదు. ఈ విషయంలో బ్రహ్మజ్ఞానుల అనుభవం అది. మేము కూడా ఈ "జగద్దృశ్యము"ను ఎంతో తరచి–తరచి పరిశీలించాం. ఎంత విచారించి చూచినా "బంగారు ఆభరణం" అనబడు దానిలో బంగారము కాకుండా 'ఆభరణము' అని చెప్పబడుదానిగా ఏదైనా పదార్థముగాని, వస్తువుగాని లభిస్తున్నదా? జలకెరటంలో జలము కాకుండా 'కెరటము' అనబడే ఏదైనా ఎక్కడున్నది? గాలి వీచికలు గాలి కంటే వేరా చెప్పు? శూన్యత్వము ఆకాశము కంటే వేరా? సూర్యుని కంటే సూర్యకిరణములు లేక సూర్యప్రకాశము వేరు కాదు కదా! అదే విధంగా "జగత్తు కూడా బ్రహ్మము కంటే వేరుకాదు" అనునదే సత్య ద్రష్టలగు మా అంతిమ నిర్ణయం. కనుక ఇదంతా బ్రహ్మమే అయున్నది.

❖

**శ్రీరాముడు :** స్వామీ! దేనియొక్క అత్యంత అభావము (భావించకుండటం) వలన ఈ దృశ్యజగత్తు అంతర్ధానమైపోతుంది? దేనిని వినటంచే మాలో పేరుకొనిన ఈ అజ్ఞానము తొలగుతుంది? అట్టి విషయమును, రహస్యమును మాకు బోధించండి.

అంతేకాదు, "పరస్పర సాపేక్షల రూపముననే (relative to each other) .... ఈ దృశ్యము–ద్రష్ట ప్రవర్తించుచున్నాయి" అనునది నిర్వివాదాంశమే కదా! ద్రష్ట–దృశ్యములలో ఒకటి ఉండటంచే రెండవదానికి ఉనికి లభిస్తోంది "ఈ ద్రష్ట–దృశ్యము అనునవి రెండు అంతరించినపుడు మిగలి ఉండేది నిర్వాణమే" అని మీరు చెప్పారు. ఈ జగత్తు యొక్క అభావము, అప్పుడు ఉండి ఉండే స్వభావస్థితి యగు బ్రహ్మము గురించి మరికొంత వివరించి చెప్పండి. దేనిని పొందిన తరువాత ఆపై మరింకే సాధనములచే పని ఉండదు? అట్టి దాని గురించి ప్రవచించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! ఈ జీవునియందు … "జగత్తు లేక దృశ్యము" … అనబడు జ్ఞానము అనేక జన్మలుగా పాతుకుపోయి ఉన్నది. ఎందుచేతనంటావా? అతడు ఈ దృశ్యజగత్తులోని వస్తుజాలముపట్ల, "ఇవి నన్ను సంతసింపజేయగలవు. ఇవి పొందినప్పుడే తృప్తుడను, లేదా అసంతృప్తుడనే" …. అనబడు ఒక విధమైన మూర్ఖత్వముతో కూడిన నమ్మకము కలిగి ఉంటున్నాడు. ఇంద్రియానుభవముల పట్ల తనయందు ఏర్పరచుకొన్న ప్రియత్వముచే, అట్టి అనుభవము కొరకు వేలాది జన్మలుగా పరుగులు తీస్తూనే ఉన్నాడు. సరే, అయినదేమో అయినది. ఇప్పుడైనా చక్కగా విచారించటం ప్రారంభిస్తే "మిథ్యాజ్ఞానము" అనబడే విషూచివ్యాధి తప్పక నయమౌతుంది.

కాని ఒక విషయం. నిట్టనిలువుగా, ఎత్తుగా ఉన్న కొండ ఎక్కడం-దిగటం అంత తేలికైన విషయం కాదుకదా! ఈ జ్ఞానం కూడా తనంతటతానే సహజంగా స్వయంగా లభించేది కాదు. నేనిట్లా అంటున్నానని నా ప్రియశ్రోతలు నిరుత్సాహపడకుండెదరు గాక! 'చాల కష్టము' అని చెప్పి నిరుత్సాహపరచటం నా ఉద్దేశమే కాదు.

ఈ ప్రపంచంలో మానవుడు అనేక కఠినమైన విషయాలు కూడా సాధిస్తున్నాడు. ఎట్లా?…. అభ్యాసము-యుక్తులను ఆశ్రయించే కదా! అదేవిధంగా ఈ జగద్భ్రాంతి కూడా …. అభ్యాసము వలన, యుక్తి - ఉపాయము వలన, సత్పురుషుల ఉపదేశములను వినటంచేత, శాస్త్రములచే చెప్పబడిన విజ్ఞానయుక్తమైన ప్రయత్నముల చేత … తప్పక ఉపశమిస్తుంది. నీకు చెప్పబోవు ఈ కథనము వలన బోధ (Awareness) స్వరూపమగు ముక్తి తప్పక లభిస్తోంది.

❖❖❖

# 13. నిత్యలభ్యమగు పరబ్రహ్మము

**శ్రీ వసిష్ఠమహర్షి :** శ్రీరామచంద్రా! ఈ 'ఉత్పత్తిప్రకరణం'లో మనం … "జగద్భ్రాంతి జన్మరహితమైన ఆకాశమువలె ప్రభాసితమగుచున్నది" అని ప్రతిపాదించబోవుచున్నాము.

ఈ దృశ్యజగత్తు దేవ-దానవ-మానవ-పక్షి-మృగ-పిపీలిక (చీమలు) మొదలైన జంగమ పదార్థములతోను, కొండ-నేల మొదలైన స్థావర పదార్థములతోను నిండియున్నట్లు నీవు చూస్తున్నావు కదా! అట్టి ఈ దృశ్యజగత్తు అంతా మహాప్రళయ సమయమున అదృశ్యమై పోతోంది. వినష్ట మగుచున్నది. రుద్రాది దేవతాగణం కూడా అదృశ్యమై పోతోంది. ఎందుచేత? ఇదంతా అసత్తే. కనుకనే, "ఏదైతే కనబడుతోందో, అది నశించబోవుచున్నది" … అనునది లోకవిదితమైన అనుభవమే కదా!* ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకుండా పోయేది సత్యమెలా అయి వుంటుందయ్యా? సద్వస్తువునకు 'లేకపోవటం' అనేది ఏ క్షణమందును ఉండదు. అసద్వస్తువునకు భ్రమచే కనబడినంత మాత్రంచేత 'ఉనికి' ఉన్నదా? లేదు. అయితే ఈ రెండింటినీ విభాగం చేయగల (వేరుచేయగల) దృష్టి కావాలి.

---

* యత్‌దృశ్యమ్ ….. తత్ నశ్యమ్

ఈ దృశ్యమంతా నీ దృష్టిలో అదృశ్యమైనప్పుడు, ఇక మిగిలేదేమిటి? అప్పుడు తేజము ఉండదు. అంధకారము కూడా ఉండదు. ఒకానొక సత్త (Absolute Existence Awareness) మాత్రమే మిగిలి ఉంటుంది. "అది అట్టిది" అనిగాని, "దాని పేరు ఇది" అనిగాని చెప్పటానికి వీలుపడదు. మనస్సు ఉన్నంతసేపు మాత్రమే... "ఇట్టిది - ఈ పేరు" అనేవి ఉంటాయి. కాని ఆ 'సత్త' మనస్సుకు ఆవల ఉన్నది కదా! అది శూన్యమా? కాదు. పోనీ నిరాకారమందామా? అదీకాదు. దృశ్యము కాదు. దర్శనము కాదు. పంచ భూతములలో ఏ ఒక్కటి కాదు. లేక మరియే ఇతర పదార్థము కాదు. దానిని 'ఇది' అని నిర్ణయించి చెప్పలేమని మరొక్కసారి ప్రకటిస్తున్నాను. సర్వపూర్ణములకంటే పూర్ణమైనదది. దానిని 'సత్తు' అని మనం మన సంవాదము కొరకు అనుకున్నప్పటికీ అది 'సత్తు' (ఉన్నది) కూడా కాదు. అసత్తు కూడా కాదు (That is beyond existence & non-existence). భావ పదార్థం కాదు. అభావ పదార్థం కూడా కాదు.

మాటలకు* అందనట్టి దానిని గురించి ఏమి చెప్పమంటావు? అయినప్పటికీ, నీవు సూక్ష్మగ్రాహివి కనుక, నీ బోధ కొరకు దాని గురించి కొన్ని గుర్తులు చెపుతాను : అది కేవల చిన్మాత్రము. అనంతము. ఆదిగాని, మధ్యగాని లేనిది. జన్మలేనిది. నిరామయమైనది. మంగళ స్వరూపమైనది. చమత్కారం చూచావా! సత్-అసత్‌రూపియగు ఆ పరమవస్తువు సర్వస్వరూపములు తానే అయివుండి కూడా ... ఏదియు కాకయే ఉన్నది. ఒక అతి ప్రావీణ్యము గల శిల్పి కొయ్యతో ఏనుగును తయారుచేసినప్పుడు, అది చూచుచున్నట్టి ప్రేక్షకునికి అక్కడ కొయ్య కాకుండా ఏనుగే కనిపిస్తుంది కదా! ఆ పరమ వస్తువునందే ఈ జగత్తు కనబడుతోంది.

చిదాకాశస్వరూపము, నీ-నా-సర్వుల వాస్తవ స్వరూపము అయినట్టి ఆ పరమ వస్తువునకు ... కళ్ళు, కాళ్ళు, ముక్కు, చెవి, నాలుక, చర్మము ... మొదలైనవి లేవు. అయినను అది అన్నిచోట్ల, ఎల్లవేళల చూస్తోంది. వింటోంది. వాసనచూస్తోంది. రుచిచూస్తోంది. స్ఫురిస్తోంది. అద్దాని ప్రకాశము వల్లనే సత్-అసత్ వస్తువులు వీక్షింపబడుచున్నాయి. అనాది, నాశనశీలము అయినట్టి ఈ సృష్టి దానియందే చిత్రింపబడినదని గ్రహించు. సగం మూసుకొన్న కళ్ళతో ఈ దృశ్యమును ప్రతిబింబ మాత్రంగా చూచేది కూడా అదియే సుమా!

సర్వవ్యాపియగు ఆ బ్రహ్మమునకు కారణమంటూ ఏదీ లేదు. నీటిలో తరంగములు లేస్తాయి. చూచావా? అట్లే బ్రహ్మమునందే ఈ సృష్టులన్నీ నిరంతరం ఉదయిస్తున్నాయి. కనబడుతున్నాయి. లయిస్తున్నాయి. ఎన్ని తరంగాలు లేచినా, లేవకున్నా-నీరు మార్పు చెందదు కదా! బ్రహ్మము విషయము కూడా అంతే. అయితే, అది ఎక్కడో ఉన్నదని, ఎన్నడో లభిస్తుందని భ్రమించకుండెదవు గాక! ఎందుకంటే అది చిత్తమునందే చిన్మాత్ర దీపమై వశించుచు, స్వతేజముచే ముల్లోకములను ప్రకాశింపజేయుచున్నది. ఆ పరమ వస్తువు యొక్క ప్రకాశము ఉండటం చేతనే, 'సూర్యుడు' మొదలైన తేజోమయ పదార్థములు చీకటిమయం కాకుండా ఉండగలుగుతున్నాయి. ఎండమావులలో

---

* యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా.

నీరు కనబడుచున్నట్లు అద్దాని సత్తయందే మూడు లోకములు ప్రకాశించటం జరుగుతోంది. దాని యందు 'ఇచ్ఛ' అనునది జన్మించినప్పుడు ఆ ఇచ్ఛను అనుసరించే ఈ 'జగత్తులు' అనే నిప్పురవ్వలు వెలువడటం, అట్టి ఇచ్ఛ త్యజించబడినపుడు, అవి కరిగిపోవడం జరుగుతోంది. ఆ మహద్వస్తువు యొక్క నిర్మల-అక్షయ స్వభావము లేక స్పందము వలననే సృష్టి - స్థితి - సంహారములు ప్రవర్తిల్లుతున్నాయి.

ఆ పరమవస్తువు యొక్క సత్త, వాయుస్వభావం వలెనే, సర్వగతము (All-Pervading), స్పందాస్పందమయము అయివున్నది. స్వల్పదృష్టిచే ఒకానొకప్పుడు అది "తన సద్రూప పూర్ణత్వము నుండి వేరుపడినదా?" అను విధంగా తోచుచున్నప్పటికీ ... వాస్తవానికి ఎట్టి భిన్నత్వము అది పొందటం లేదు. ఆ బ్రహ్మము సర్వదా నిద్రితము. సర్వదా జాగృతము. మరియు సర్వదా, సర్వత్రా జాగృతము కాదు. నిద్రితము కాదు. అద్దాని స్పందమునందే శాంతము, శివము అయినట్టి 'ముల్లోకములు' ఇమిడి ఉన్నాయి. అది ఏకాత్మకము, పూర్ణము. నశించే పదార్థాలలో ఉన్నప్పటికీ నాశనము లేకయే ఉన్నది. కుండ ఉండుటచే గాని, పగులుటచేత గాని ఆకాశమునకు వచ్చు లోటేమున్నది? మార్పు చేర్పులేమి ఉంటాయి? ఆ పరమ సత్త ఈ జగత్తు యొక్క భావము పొందుగాక, లేదా, త్యజించుగాక. దానికేమీ సంబంధము లేదు. అది మరొకటిగా కాబోదు.

అది వాగింద్రియము లేనిదగుటచే 'మూగ'. అయితే ఏం? వాక్ప్రవృత్తికి అదే కారణం. కనుక మూగది కాదు. రాతివలె సర్వదా నిర్వికారంగా ఉంటోంది. కాని, మననశక్తి అంతా దానిదే. నిత్యపరితుష్టమైనప్పటికీ, సర్వమునకు 'భోక్త' అదే. అది క్రియలకు ఏమాత్రమూ సంబంధించినది కాదు. కాని సర్వమునకు 'కర్త' అదే. అది ఆకారరహితమైనప్పటికీ, అసంఖ్యాకములగు హస్తపాదాది అవయవములతో విశ్వమంతా వ్యాపించియున్నది. ఇంద్రియశక్తులన్నిటికీ అది అతీతమైనప్పటికీ, సర్వ శరీరములలో ఇంద్రియ - వ్యాపారములన్నీ నిర్వర్తించేది అదే. తనకు 'మనస్సు' అనునది లేకపోయినప్పటికీ మనోచర్యలన్నీ తానే నిర్వర్తిస్తోంది.

ఓ రామచంద్రా! ఈ జీవుడు స్వస్వరూపమగు ఆ పరమవస్తువును గాంచకపోవటం చేతనే .... భ్రమ, సంసార వ్యాధి పొందుచున్నాడు. దానిని దర్శించాడా ... ఇక ఆపై సకలభయాలు, సర్వ వాసనలు ఎచటికో పారిపోతాయి.

దీపం ఉంటేనే కదా ... రంగము పై నాట్యము మొదలైన విన్యాసాలన్నీ జరిగేవి. సర్వవ్యాపియగు బ్రహ్మము అపరిచ్ఛిన్న ప్రకాశరూపమున "సాక్షి" అయి వెలయుచుండటం చేతనే ఈ చిత్తవృత్తులన్నీ తమ తమ కార్యములను నిర్వర్తిస్తున్నాయి. ఓ రాఘవా! సముద్రమందలి ఒకే జలము కెరటములుగా, ఆవర్తములుగా, బుడగలుగా, సుడులుగా ప్రకటితమగుటలేదా? ఒకే బంగారం గాజులుగా, గొలుసుగా, ఉంగరముగా, మరెన్నో నామరూపములుగల ఆభరణములుగా వ్యవహరించబడుతోంది కదా! అట్లే బ్రహ్మమే అవిభాజకమై కూడా అనేక రూపములతో వేర్వేరుగా కనబడటం అజ్ఞాన దృష్టికి జరుగుతోంది.

అయితే, నీకు జ్ఞానం లభించనంత కాలం … "వీరు–వారు–నేను–నీవు" …. అను భేదముతో కూడుకొనిన బోధ తొలగదు. జ్ఞానము సుస్థిరమైనప్పుడు "ఆ చిన్మయ స్వరూపుడు ప్రకాశించుచున్న ఏ వస్తువుతోనూ నాకు భేదం లేదు" అని నీవు గ్రహించగలవు. నీటియందు అలలు లేచుచున్నట్లు ఆ బ్రహ్మవస్తువునుండే ఈ 'దృశ్యజగత్తు' అంతా ప్రభవిస్తోంది. అట్లాగే కాలము కూడా ఉత్పన్నమౌతోంది. తేజము ప్రకాశిస్తోంది. ఈ మానసిక సృష్టి అంతా జరుగుతోంది. నీవు గ్రహిస్తున్న ఈ రూప – రస – గంధ – శబ్ద – స్పర్శాదులన్నీ దానివలననే గ్రహిస్తున్నావని గ్రహించు. అవన్నీ కూడా అదియే. ఈ జ్ఞానమంతా ఆ బ్రహ్మమువల్లనే కలుగుతోంది. ఓ సాధూ! నీవు ఏకాగ్రచిత్తు డవగుదువు గాక! ద్రష్ట – దర్శన – దృశ్యముల మధ్య ఉన్నట్టి సాక్షి స్వరూపమగు ఆత్మను గ్రహించెదవు గాక! దర్శన–ద్రష్ట–దృశ్యములను త్యజించి, స్వస్వరూపమగు ఆత్మను పరిశీలించినప్పుడే నీకు ఆత్మ లభించగలదు. ఏకాగ్రచిత్తము లేనివాని చిత్తము పరిపరి విధముల ద్రష్ట–దర్శన–దృశ్యముల వెంట పరుగులు తీయుటచే ఆత్మను గ్రహించలేకపోవుచున్నది.

అట్టి స్వస్వరూపమగు బ్రహ్మమునకు ఉత్పత్తి లేదు. క్షయము లేదు. ఆద్యంతములు లేవు. అయ్యది శాశ్వతమై, నిత్యమై, మంగళస్వరూపమై, పవిత్రమై, పదార్థత్వరహితమై, వందనీయమై, అనింద్యమైయున్నది. దానికి ఆగంతుక (శరీరములు పొందటం – త్యజించటం వంటి) ధర్మములు లేవు. రాకపోకలు లేవు. సర్వకారణములకు కారణము అదే. అది అజ్ఞేయము (తెలియబడజాలనిది). ఎందుకంటావా? తెలుసుకొనునది అదే అయినప్పుడు తెలుసుకోవటమనేది ఎక్కడ ఉంటుంది? ఒకడు తనకు వేరైన వస్తువునైతే తెలుసుకోగలడు. ఆత్మయో, తన వాస్తవ స్వరూపమే కదా! అది స్వానుభవము చేతనే తెలియబడగలదు గాని, మరొకరు ప్రసాదించునది కాదు. అయ్యది ఏకమాత్రజ్ఞేయమై వెలయుచున్నది. నీయొక్క–నాయొక్క–సమస్త ప్రాణులయొక్క – సర్వము యొక్క సత్యస్వరూపము అదే. మనం అదికాకుండా మరింకేదీ అయివుండలేదు. దానిని దూరముగా, భవిష్యత్తులో ఎన్నడో ఎప్పుడో ఎక్కడో లభించునదిగా చూచువారు మా దృష్టిలో మూర్ఖులు మాత్రమే. అది నీకు–నాకు వేరైనది కాదు కనుకనే 'అద్వితీయము' అని చెప్పుకొంటున్నాం.

❖❖❖

# 14. ఈ జగత్తు బ్రహ్మమే

**శ్రీరాముడు :** హే వసిష్ఠ ప్రభూ! మీరు అనిర్వచనీయ బ్రహ్మము గురించి చెప్పిన విషయాలు యుక్తియుక్తంగా ఉన్నాయి. మహాప్రళయ సమయంలో మిగిలి ఉండే ఆ సద్వస్తువు మీరు చెప్పినట్లు నామరూపరహితమనటంలో నాకు ఎట్టి సందేహమూ లేదు. "అది శూన్యము కాదు. ప్రకాశము కాదు. అంధకారం కాదు. తమోరూపం కాదు. చిత్స్వరూపము (Form of Consciousness) కాదు. జీవుడు కాదు. బుద్ధి–తత్వము కూడా కాదు. మనస్సు కూడా కాదు" … అని చెప్పారు. బాగానే ఉన్నది. ఇంతలోనే "అన్నియు అదే" అని అంటున్నారు. మీ వాక్యములలోను అర్థసమన్వయం నేను గ్రహించలేకపోతున్నాను. మరి కొంత స్పష్టంగా వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** నీ ప్రశ్నను మెచ్చుకొంటున్నాను. ప్రశ్న కొంత క్లిష్టమైనదే. సరే సూర్యుడు ఉదయిస్తే చీకటి పోతుంది కదా! నీ సందేహం పోగొట్టుతాను. విను.

'సర్వవిషయ రహితం' అయి ఉండునట్టి మహాప్రళయ సమయంలో శేషించి ఉండేది. "శూన్యము కాదు" :

ఒక కళాకారుడు ఒక శిలయందు సుందర స్త్రీయొక్క శిల్పమును మలచాడనుకో ....

– స్త్రీ శిల్పం చెక్కక ముందే 'శిల' అనునది ఉన్నది కదా!

– ఆ స్త్రీ యొక్క రచనకు శిలకన్నా వేరైన 'సత్తా' ఉన్నదా? లేదు. స్త్రీ యొక్క ఆకారమంతా శిలయే కదా!

– ఇప్పుడు కనబడుచున్న స్త్రీ ఆకారమంతా అంతకు ముందు ఎక్కడున్నది? శిలలోనే కదా!

– ఈ స్త్రీ ఆకారమునకు శిలకు ఏమి సంబంధం? శిల 'స్త్రీ'గా అగుచున్నదా? లేదే!

– శిల లేనిదే స్త్రీ ఆకారమెక్కడ ఉన్నది?

ఈ జగత్తు కూడా సృష్టికి పూర్వం బ్రహ్మమునందే ఉన్నది. అందుచేత, "బ్రహ్మము శూన్యము" అనటానికి వీలు లేదు. ఈ విశాల బ్రహ్మాండము జీవుని భోగనిమిత్తమై రచించబడినట్లు తోచుచున్నది. ఈ జగత్తు వాస్తవమే అయివుండనీ .... లేక శూన్యమే కాని ... లేదా ఎక్కడో ఏ మనస్సునందో ఉండనీ ... ఏది ఏమైనా, ఇది ప్రకాశించునట్టి అధిష్ఠానము (ఇది ఎందుకలదో – అయ్యది) శూన్యము కాదు. ఎందుకంటావా? శూన్యంలో "ఆరోపణ, విషయములు–జగత్తుకు సంబంధించిన అనుభవములు"... మొదలైన కార్యములు ఎలా సంభవిస్తాయి?

"శిలచే తయారుచేయబడిన 'స్త్రీ శిల్పం' ఇంతకుముందు శిలలోనే ఉన్నది." ఈ జగత్తు కూడా ఉత్పత్తికి పూర్వం బ్రహ్మమునందే ఉండి ఉన్నది.

– (శిల – స్త్రీ శిల్పములవలె) జగత్తు – బ్రహ్మము అభేదమైనది.

– స్త్రీ శిల్పం యొక్క కనులు, కాళ్ళు, ముక్కు వేరువేరైనట్లు 'శిల్పదృష్టి' కలవారికి కనిపిస్తుంది. కాని శిల దృష్టితో చూచేవారికి ఆయాభాగములన్నీ శిలగానే తెలియవస్తాయి కదా! ఖండదృష్టి గలవారికి ఈ జగత్తు "నీవు–నేను–వారు–వీరు– నీది–నాది–తదితర పదార్థములు"గా కనిపిస్తోంది. విజ్ఞానరూపమగు బ్రాహ్మీదృష్టి కలవారికి సర్వము బ్రహ్మముగానే ప్రదర్శితమౌతున్నది.

❖

నీకు ఇంకొక దృష్టాంతము చెపుతాను. ఒక తటాకంలో నిశ్చలంగా నీరు ఉన్నదనుకో ... ఇప్పుడు ఆ జలం నిశ్చలంగా కదలకుండా ఉన్నందుచేత తరంగములు కనిపించవు. అయితే 'తరంగములు' అనునవి బాహ్యము నుండి వస్తున్న ఏవైనా పదార్థములు కాదు కదా! ఆ నిశ్చలమైన నీరే స్పందము (చలనము) పొందినప్పుడు తరంగాలుగా మనకు కనబడటం జరుగుతోంది. "తరంగములు – అనునవి కదలికలేని జలంలో అంతర్లీనంగా ఉండియే ఉన్నాయి" అని మనం

అర్థం చేసుకోక తప్పదు. ఈ జగత్తు విషయం కూడా అట్టిదే. ఇది బ్రహ్మమునందే శూన్య-అశూన్య రూపమున ఉండీ-లేనట్లు, అనిర్వచ నీయంగా, నిలచియున్నది.

శిల, తదితర పరికరములు ఉన్నప్పటికీ, శిల్పి యొక్క ఇచ్ఛలేకపోతే శిల్పము ఎట్లా తయారవుతుంది? కల్పాంత కాలంతో కూడా బ్రహ్మయొక్క ఇచ్ఛ లేకపోతే ఈ జగత్తు సృష్టించబడదు. అయితే రామా! "జగత్తు బ్రహ్మమునందు ... శిలయందు శిల్పమువలె .... చిత్రించబడి ఉన్నది" అని చెప్పాను కదా! ఇక్కడ నేను ఉపయోగించిన ఉపమానం గ్రహించేటప్పుడు 'శిల-స్త్రీ శిల్పము వేరువేరు కానట్లు జగత్తు - బ్రహ్మము వేరువేరు కాదు" అని మాత్రమే బోధిస్తున్నానని గ్రహించు. ఆ అంశమును అంతమాత్రమే గ్రహించాలి. "ఈ జగత్తు అను శిల్పమునకు ద్రష్టయే శిల్పి. బ్రహ్మమే శిల" .... అని గ్రహించు. వాస్తవానికి ఈ 'జగత్తు' అనబడునది బ్రహ్మమునందు ఏనాడు ఉదయించి ఉండనేలేదు. ఏది ఉదయించనే లేదో ... అది ఇక అస్తమించటమనే ప్రసక్తి ఎక్కడ? ఇదంతా బ్రహ్మము కంటే వేరైనది కాదు. కనుక, సత్స్వరూపముననే నిలచియున్నది. ఇక ఈ జగత్తు విషయంలో "ఇది శూన్యము కాదు" అని చెప్పబడుతోంది.

పరబ్రహ్మము తమస్సు (చీకటి) కాదు, తేజము కాదు. అది సర్వదా మనందరి స్వస్వరూపమై విరాజిల్లుతూనే ఉన్నది.

నాయనా! రామా! ఈ సూర్యుడు, అగ్ని, నక్షత్రములు మొదలైన తేజోమయ పదార్థములు ఆ బ్రహ్మమును ప్రకాశింపజేయజాలవు. అవ్యయమగు పరమాత్మకు ఇట్టి తేజోమయ పదార్థములతో ఏమాత్రం సంబంధం లేదు. "చీకటి" అని మనం దేనిని అంటున్నాం? వెలుతురు లేకపోవుట (లేక వెలుతురు యొక్క అభావము)నే కదా! ఇట్టి భౌతికమైన తేజము లేకపోయినప్పటికీ బ్రహ్మము స్వయంప్రకాశమగుటచే, అది ఉండనే ఉంటుంది. అందుచేతనే "అది తమస్సు కాదు. తేజము కాదు" అని మనం చెప్పుకొన్నాం.

ప్రకాశస్వరూపమగు ఆ బ్రహ్మము స్వయంప్రకాశమై, బుద్ధి గుహ యందు ఉండి ఆ బుద్ధిని ప్రకాశింపచేస్తోంది. దానిని మరెవరూ, దేని చేతను ప్రకాశింపజేయలేరు. కాబట్టి "అది తమస్సు" అని కూడా చమత్కారంగా అంటూ ఉంటారు. అది సర్వప్రకాశములకు వేరైనదని గ్రహించు. అది అజరము (జరామరణములులేనిది). అవ్యయము, ఆకాశమువలె ఆది-మధ్య-అంతములు లేనిది. ఈ జగత్ స్థితికి ఆవల నిత్యమై స్వస్వరూపచమత్కారంగా జాజ్వల్యమానంగా సర్వదా ప్రకాశిస్తోంది. అందుచేత అది "పరమాత్మ" (ద్రష్ట - దృశ్యత్వ - దృశ్యములకు పరమై, ఆవలగా ఉన్నది....) అను శబ్దార్థము.... "పరమ్ ఆత్మః..." గా ప్రవచించబడుతోంది.

'మారేడుపండు' అని మనం పిలుస్తున్నదానికి, అందలి 'గుజ్జు'కు గల భేదమేమిటో చెప్పు? బ్రహ్మమునకు, జగత్తుకు కొంచెము కూడా భేదం లేదు. నీటియందు అలలు, మట్టియందు కుండలు ఉన్నట్లు ... బ్రహ్మమునందు ఈ జగత్తు ఉన్నది. అట్టి బ్రహ్మ పదార్థము శూన్యమెట్లా అవుతుంది? బ్రహ్మము నిరాకారమే అయినట్లు జగత్తు కూడా నిరాకారమే. ఆకాశరూపమగు ఆ

చిన్మయబ్రహ్మము ... ఈ పాంచభౌతికాత్మికమైన ఆకాశము కంటే అత్యంత సూక్ష్మమైనది. స్వచ్ఛమైనది. దాని అంతర్గతమై ఉన్నట్టి ఈ 'జగత్తు' అని చెప్పబడునది కూడా స్వచ్ఛమైనదే. సూర్యకిరణములకు ఉష్ణత్వము కాకుండా మరొక అనుభవం లేదు కదా! చిన్మయబ్రహ్మము "ఎరుక" అను అనుభవము మాత్రం కలిగి ఉంటోంది.

❖

పరమ్ – ఆత్మః = జగద్దర్శనమునకు మునుముందే సర్వాంతర్గతమై ఏర్పడియున్న స్వస్వరూపం.

"చిత్తు – అచిత్తు" అని రెండుగా శాస్త్రములచే చెప్పబడుచున్నదంతా పరమాత్మయందే ఉన్నాయి. ఆ "పరమాత్మ"యే దృశ్యముగా దర్శనముగా ప్రభవించుచున్నాడు. వాస్తవానికి పరమాత్మయే స్వరూపముగా గల జీవునకు 'దృశ్యత్వము' అనునది లేదు. దృశ్యత్వములేనట్లే జగత్తు కూడా లేదు. నామ–రూపములతో కూడిన బహిర్విషయములు, వీటికి అర్థములను కల్పిస్తున్న మనఃబుద్ధి – అహంకారాదులు, ఆయా విషయములు పరమాత్మయందు కల్పితమాత్రంగా ఉంటూ ... పరమాత్మకు వేరైనవి కాకుండానే (అద్వితీయమై) ఉన్నాయి.

ఈ విశ్వము ఏ విధంగానైనా ఉండనీ, చివరికి ఇందులో ఎదురౌతున్న ప్రతి విషయము 'సుషుప్తి'గా మారక తప్పదు. అనగా విషయములన్నీ ఒక స్థితిలో నిర్విషయమై పోతున్నాయి. అందుచేత "సుషుప్తి భూమిక" యందున్న యోగి ఈ జగత్తును పొందుచున్నప్పుడు ... అనగా ఇందు పాల్గొనవలసివచ్చుచున్నప్పుడు, (లేక) దీనిని త్యజించి ఒక మూల చతికిలపడి కూర్చొనవలసి వచ్చినప్పుడు ... ఉభయ సమయాలలో కూడా శాంత–చిత్తుడై ఉంటున్నాడు. సర్వప్రకాశము – అప్రకాశ్యము కూడా అయినట్టి (సర్వమును వెలిగించునది – దేనిని వెలిగించనిది కూడా అయినట్టి) బ్రహ్మభావమునందే సుస్థిరుడై నిశ్చింతగా ఉంటున్నాడు. ప్రశాంతత పొందిన జలంలో నానా విధములైన కెరటములు అణిగి ఉంటాయి కదా! అట్లే ఉత్తమయోగి దృష్టిలో నిర్వికార బ్రహ్మమునందు, నిర్వికారము, నిరాకారము అయినట్టి ఈ జగత్తు కూడా ... అన్నివేళల అణిగిపోయి ఉంటోంది. పూర్ణ బ్రహ్మము నుండి వెలువడుచున్న ఈ ఉపాధి–భేదముల వ్యవహారమంతా వాస్తవానికి నిరాకారమైనదే. మరి పూర్ణబ్రహ్మము నుండి వెలువడుచున్న అనేక అనుభవములతో, పదార్థములతో కూడుకొనిన ఈ జగత్తు యొక్క పాత్రఏమిటి? ఈ విషయంలో ఋషులమగు మేము ఇట్లు అర్థం చేసుకొంటున్నాం.

"'ఈ జగత్తు' అనే సువిశాల నాటకరంగం ఆయా ప్రాణులకు వారివారి ఇచ్ఛలకు అనుకూలములైన శరీరములు, అనుభవములు పొందుటకు తగిన స్థానమైయున్నది. ఈ జీవునకు ఆధికారిక శరీరమును (a body which he deserves and desires) ప్రాప్తింపచేస్తోంది. ఇదంతా 'స్వస్వరూపజ్ఞానము' అనబడు ప్రయోజన సిద్ధికొరకు కూడా ... అట్టి లక్ష్యముతో శరీరము పొందువారికి ... అనువైన స్థానమైయున్నది. కనుక ఈ జగత్తంతా ఉత్తమ దృష్టి కలవారికి ఉత్తమ ప్రయోజనము కొరకే సంకల్పించబడియున్నది.

**పూర్ణాత్ పూర్ణం ప్రసరతి సంస్థితం పూర్ణమేవతత్**
**అతో విశ్వమనుత్పన్నం యచ్చోత్పన్నం తదేవతత్ ॥*** (X.28)

పూర్ణము నుండి వెలువడునది పూర్ణమే అయివుంటోంది. ఈ జగత్తు పూర్ణమునందు ఏర్పడియున్న 'కల్పన' మాత్రమే. అందుచేత ఈ విశ్వము ఉత్పన్నమై, స్థితి పొందియున్నట్లు తోచుచున్నప్పటికీ … వాస్తవానికి "అనుత్పన్నమైనదే" (that which is never created) అని మేము గ్రహించుచున్నాము. ఎందుకంటావా? జ్ఞానులకు దృశ్యము – దర్శనముల భేదమే కనిపించదు. ఎవరు ఎట్లు చూస్తే ఈ విశ్వము వారికి అట్లే కనబడుతూ ఉంటుంది.

చూచే ఆయన = "ద్రష్ట"
ఎట్లు చూస్తే = "దర్శనము"
అట్లు కనబడుట = "దృశ్యము"

అందుచేత జ్ఞానులకు 'జగత్తు' అని చెప్పినపుడు, 'బ్రహ్మము' అని చెప్పినపుడు ఒక్క అర్థమే కనబడుచున్నది. "సూర్యకిరణములు వేడిగా ఉంటాయి" అనే విషయము … అట్లు వేడిపొందు స్వభావము గల ఉపాధి కలిగియున్నప్పుడు, 'ఆ ఉపాధి యొక్క అనుభవముతో జీవుడు ఏకత్వము అనుభవిస్తున్నప్పుడు మాత్రమే' …. ఏర్పడగలదు. 'అనుభవించువాడు' లేకుంటే 'అనుభవము'నకు ఉనికిగాని, అర్థముగాని లేవు కదా! అనుభవమయ్యేదంతా అనుభవించువాని స్వస్వరూపవిన్యాసమే! అయితే, వాక్యజ్ఞానము మాత్రమే కలిగియుండి, అర్థజ్ఞానము ఇంకను పొందనివారికి ఈ విషయము తగినంతగా గ్రాహ్యమగుట లేదు. అభ్యాసమే అందుకు దివ్యౌషధం.

❖❖❖

# 15. సాక్షి చైతన్యము

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! "ఘనీభూతమై, సత్యమువలె కనిపించుచున్న ఈ దృశ్యపదార్థములు – అట్టి దృశ్యపదార్థములను దర్శించుచు, పొందుచున్న ఈ చిత్తము" … ఈ రెండూ కూడా మిథ్యయే. ఇక ప్రతిబింబమాత్రమైనట్టి 'జీవుడు' అనబడునది మాత్రం సత్యదృష్టికి ఏం నిలబడగలదు చెప్పు? కనుక "నీవు–నేను–అతడు' మొదలైన జీవభావము కూడా భావనామాత్రమే. ఈ సర్వము బ్రహ్మము కంటే వేరుగా (అనేకముగా) ఏనాడూ ఉండుటలేదు.

అట్టి బ్రహ్మము అణువు కంటే కూడా అణువు. ఆ బ్రహ్మము యొక్క 'శుద్ధత్వము – సూక్ష్మత్వము'ల విషయానికి వస్తే …. అది ఆకాశము కంటే కూడా అనేకరెట్లు మహోన్నతమైనది. ఆకాశకోశము (మధ్యప్రదేశము) కంటే కూడా అత్యంత శాంతమైనది. దానికి రూపమంటూ ఏదీ లేదు. అది 'దిక్కు–కాలము' మొదలైనవాటిచే బంధింపబడునది కాదు. అందుచేత అది విస్తృతము,

* పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమదాయ పూర్ణమేవావశిష్యతే ॥ ….. ఋగ్వేదము

అనాది, స్వప్రకాశము అయివున్నది. అట్టి చిద్రూప బ్రహ్మము లేనిచోట వాసనలు, బుద్ధి, చిత్తము, ఇంద్రియములు, జీవము కూడా ఉండవు. ఈ విధంగా ఆ బ్రహ్మము పూర్ణమై నిరాకారమై ప్రశాంతమైనట్టి పరమపదముగా ఉత్తమ జ్ఞానులకు గోచరిస్తోంది. అయ్యది స్వస్వరూపంగా, సర్వస్వరూపంగా, సర్వాంతర్యామిగా, సర్వాతీతంగా సర్వదా అనుభవమౌతోంది.

**శ్రీరాముడు :** ఓ మహర్షీ! 'చిత్తు' అను ఆకృతి మాత్రమే కలిగియున్నట్టి ఆ పరమార్థ 'తత్త్వము' యొక్క రూపమెట్టిదో ... మరొక్కసారి "సూక్ష్మదృష్టి"ని అవలంబించి చెప్పండి. దాని వలన మాకు జ్ఞానం వృద్ధి చెందగలదని, మీరు చెప్పబోయేదంతా మరింత స్పష్టంగా గ్రహించగలమని అనుకొంటున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి :** సర్వవర్ణనములకు అతీతమై, మహాప్రళయ సమయమున కూడా ఇంకా శేషించి ఉండే .. కారణ-కారణమగు పరబ్రహ్మమును వర్ణించి చెపుతాను. విను.

అది ఎక్కడో ఉన్నది కాదు. ఎప్పటికో లభించేది కాదు. ఇప్పటికే సర్వజనులయొక్క వాస్తవ స్వరూపముగా ఎల్లవేళల లభించియే ఉన్నది.

ఓ మానవుడా! ఒకసారి నీ చిత్తవృత్తులను నిరోధించు. మనస్సును ఆయత్తమొనర్చి (సిద్ధం చేసి) చూడు. అప్పుడు మిగిలి ఉండేదేది? ఆ అవర్ణనీయ సాక్షి చైతన్యమే 'చిత్' అనబడు పరమాత్మ. అట్టి తత్త్వానుభవ సమయంలో ఈ దృశ్యజగత్తు నశిస్తుంది. శుద్ధ చైతన్య భావనచే దృశ్యము లేనిదగుటచే, దర్శనము కూడా లేనిదగుచున్నది. దర్శనము లేనప్పుడు ఇక ద్రష్ట ఎక్కడ ఉంటాడు? అట్టి త్రిపుటి లయించగా భాసించునదే బ్రహ్మము యొక్క స్వరూపానుభవం. ఈ త్రిపుటి అంతా భాసిస్తున్నది ఆ బ్రహ్మము వలననే, అద్దాని యందే. కనుక అది భాసించని క్షణమే లేదు. దాని అనుభవం మాత్రం ... ఈ త్రిపుటి (ద్రష్ట - దర్శనము - దృశ్యములు) పట్ల కించిత్ తన్మయత్వము కారణంగా మరుగునపడటం జరుగుతోంది. జీవ చైతన్యము యొక్క చేత్యభావము (ఆయా వస్తు - విషయములను ఆసక్తితో సమీపించి స్వీకరించు స్వభావము) లోపించిపోగా అప్పుడు మిగిలి యుండు "ప్రశాంత చిన్మాత్రమే" ఆ పరమాత్మ స్వరూపము.

ఒకానొకడు శరీరాదులతో కూడినవాడై ఈ లౌకిక జగత్తునందు సంచరిస్తున్నప్పటికీ .... అతని చిత్తము శబ్ద-స్పర్శాది-వికారములచే స్పృశించబడకయే నిర్లిప్తంగా, మౌనంగా, ప్రశాంతంగా ఉన్నదనుకో ... అప్పుడా చిత్తము ఉండే స్థితే పరమాత్మ యొక్క స్వరూపము.

మనస్సు స్వప్నరహితము, జాడ్యహీనము, అపరిచ్ఛిన్నము అయివుండగా ... అప్పుడు కలుగగల ఒకానొక "సుషుప్తస్థితి" వంటి అనుభవసారమే "పరమాత్మ" యొక్క స్వరూపము.

ఓ రాఘవా! ఆకాశము యొక్క, వాయువుయొక్క, శిలయొక్క హృదయములను గమనించావా? అవి శూన్యత్వము, పూర్ణత్వము, ఘనత్వము కలిగివుంటాయి కదా! "ఇవే చిన్మయబ్రహ్మము యొక్క విశేషములు"... అని గ్రహించు. 'అద్రష్ట' యొక్క భావాతీత స్వరూపమే శుద్ధతత్త్వమగు ఆత్మయొక్క

రూపము. ఈ జీవునియందు చైత్యభావము (తెలియబడటం) చిత్తభావము (తెలుసుకొనటం) .... శాంతించాయనుకో... అప్పుడు మిగిలియుండు శాంతి రూపసత్తయే ఆ ఆదివస్తువుయొక్క స్వరూపము.

చిత్ప్రకాశము యొక్క ఆకాశప్రకాశము యొక్క, ఇంద్రియ వృత్తులయొక్క అంత రాంతరాలలో సర్వదా వికసించియుండేదే బ్రహ్మము యొక్క స్వరూపము. 'సమస్త దృశ్య పదార్థములు', మరియు 'అంధకారము' కూడా ఏ 'అనాది–అనంత–చిచ్ఛక్తి' వలన తెలియబడుచున్నాయి? ఒక్కసారి ప్రశ్నించి, తర్కించి చూడు. అయ్యదియే పరమాత్మ. ఈ జగత్తంతా ఎద్దానియందు ఉత్పన్నమై, అద్దానికి అభిన్నమైనప్పటికీ .... వేరైనట్లుగా కనబడుతోంది? ఏది వ్యవహారపరమై కూడా, శిలలాగా నిశ్చేష్టితమై యున్నది? ఏది ఆకాశము కాకపోయినప్పటికీ, ఆకాశస్వరూపమైయున్నది? అన్నివైపుల అఖండితమై యున్నది? సర్వదా ప్రసరించుచు అనుద్వేగం (unemotional)గా ఉండి ఉన్నట్టి ఎద్దాని నుండి – ఈ జ్ఞాని – జ్ఞానము – జ్ఞేయములు ఉదయించి అస్తమిస్తున్నాయి? దర్పణంలోని ప్రతిబింబ వస్తువుల వలె ఎద్దానియందు ఈ జ్ఞాత–జ్ఞేయములు ప్రతిబింబిస్తున్నాయి? నాయనా! రామా! అయ్యదియే పరమాత్మ యొక్క స్వరూపము.

మనస్సు జాగ్రత్–స్వప్నముల నుండి విడివడినపుడు 'మహాచైతన్యము' అనబడే సుషుప్తి దశ వంటి శుద్ధ చైతన్యము నందు ప్రవేశిస్తోంది. చరాచర సృష్టి లయమైపోయినట్టి అట్టి స్థితి యందు పరమాత్మానుభవమే మిగులుచున్నది.

ఓ సూక్ష్మగ్రాహీ! వింటున్నావా! పరమాత్మ ఎక్కడ ఉన్నాడో అర్థమౌతోందా? ఒక ఉపమానం చెపుతాను, విను. అచలస్వభావముగల స్థావరపదార్థములను చూస్తున్నాము కదా! వాటికి మనస్సు బుద్ధి ఇంద్రియములు లేవు. అయితే వాటియందు శుద్ధ చైతన్యభావన మాత్రమే ఉన్నదనుకో ... అట్టి స్థితిని పరమాత్మతో పోల్చవచ్చు. బ్రహ్మ, విష్ణు, హర, ఇంద్రాదులు కూడా నశించగా, అప్పుడు పరమశివమగు సద్వస్తువు ఒక్కటే మిగిలివుంటుందో అద్దానికి ఎట్టి ఉపాధి ఉండదు. కాబట్టి 'నిరుపాధికము', 'నిర్వికల్పము' అను పేరుతో చెప్పబడుతోంది. "విశ్వసంజ్ఞ" పరిత్యజించ బడినప్పుడు, ఇక ఆపై చైతన్యమందు బ్రహ్మమే శేషించుచున్నది. నీయొక్క, నాయొక్క, ప్రతి ఒక్క జీవునియొక్క ... నిత్యమై వెలుగుచున్న సత్యస్వరూపము ఆ పరమాత్మయే గాని, వేరేమీ కాదు. "వేరు" అని తలచుటయే సంసారము "వేరు కాదు" అని తలచుటయే, అసంసార స్వరూప మోక్షము.

❖❖❖

# 16. జగత్తు అనగా ఏమిటి?

**శ్రీరాముడు :** ఓ బ్రహ్మజ్ఞా! ఈ స్థావర జంగమాత్మకమగు జగత్తు అంతా అత్యంత స్పష్టంగా ఘనీభూతమై కనబడుచున్నది కదా! ఇట్లు ప్రాప్తిస్తున్న ఈ జగత్తు ప్రళయ కాలంలో ఎక్కడికి పోతోంది? ఏమౌతోంది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఒకానొక గొడ్రాలి యొక్క రెండవ కుమారుడు ఎక్కడి నుండి వచ్చుచున్నాడు?

ఎక్కడ ఉంటున్నాడు? ఎక్కడికి పోవుచున్నాడు? ఆకాశంలో ఒక బాలునికి మేఘాకృతి కారణంగా కనిపించే వనములు, జంతువుల ఆకారములు ఎక్కడి నుండి వచ్చాయి? ఎక్కడ ఉన్నాయి? ఎక్కడికి కదలిపోతున్నాయి? ముందుగా ఈ నా ప్రశ్నలకు సమాధానమేమిటో చెప్పు?

**శ్రీరామచంద్రుడు :** గొడ్రాలికి కుమారుడు, ఆకాశంలో వనము ... అనేవి ఏ కాలము నందు జన్మించియుండలేదు. అవి అసలు ఎక్కడా ఉండవు. కనుక వాటికి అస్థిత్వమెక్కడ? అభావమెక్కడ? రెండూ ఉండవు. ఆ భావమునకు అర్థమేలేదు.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆ రెండూ అభావ పదార్థములే కదా! అదే విధంగా ఈ జగత్తు కూడా అభావ పదార్థమే. దీనికి అస్థిత్వమే లేదు. ఇక "ఎట్లు ఉత్పన్నమైనది?" అనే ప్రశ్న ఎక్కడుంటుంది? మొదలే అభావముచే కూడుకొనియున్న ఈ జగత్తుకు ఉత్పత్తిగాని, అస్థిత్వముగాని, వినాశనముగాని లేవు. "స్వప్నంలో కనిపించిన భవనం ఎవరు కట్టించారు? ఎప్పుడు ఎందుకు కట్టించారు?" .... అను ప్రశ్నలకు అర్థమేమున్నది?

**శ్రీరాముడు :** అయితే నాదొక చిన్న ప్రతిపాదన. "వంధ్యాపుత్రుడు", "ఆకాశవృక్షము (లేక ఆకాశవనము)" అనునవి కల్పనలు మాత్రమేనని అనుకొందాం. 'కల్పన' అనునది ఒకప్పుడు ప్రారంభమై, మరొకప్పుడు నశిస్తోంది. కనుక కల్పనలకు ఉత్పత్తి-క్షయాలు ఉన్నాయి కదా! ఈ జగత్తుకు కూడా ఉత్పత్తి-క్షయాలు ఉన్నాయని అనుకొంటే తప్పేమున్నది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఔను, 'కల్పన' అనునది ఉన్నప్పుడు "ఆకాశ వృక్షము - వంధ్యాపుత్రుడు" అనునవి ఉంటున్నాయి. కల్పన క్షయిస్తే అవికూడా లేనివే అవుచున్నాయి. ఈ జగత్తు విషయం కూడా అట్టిదే కూడా! కల్పన ఉన్నప్పుడు జగత్తు ఉన్నది. లేనప్పుడు లేదు. ఈ విధంగా వంధ్యాపుత్రునకు జగత్తుకు పోలిక ఉన్నది.

"మరి ఈ జగత్తు ఏదై ఉన్నది? ఎక్కడ ఉన్నది?" అను ప్రశ్నలకు వద్దాం. "బంగారపు గాజులు" అను దానిలో బంగారమునకు వేరుగా "గాజులు" అనుబడునది ఎక్కడైనా విడిగా ఉన్నదా? ఆకాశమునందు శూన్యత్వము కాకుండా వేరే ఆకాశత్వము ఎక్కడున్నది? అట్లే ఈ జగత్తు బ్రహ్మమునందే ఉన్నప్పటికీ, దీనికీ బ్రహ్మము కంటే వేరైన రూపం లేదు. కాటుక-నలుపు, మంచు-చల్లదనములకు భేదము ఏమాత్రం లేదు. ఎండమావి యందలి నీటికి, (మెల్లకన్ను దోషంచే చూడబడుచున్న) ద్వితీయ చంద్రుని చంద్రత్వమునకు గల అస్థిత్వమేమిటి? ఈ రెండూ లేకయే ఉన్నాయి. కనుక, 'అత్యంత అభావమే సిద్ధిస్తోంది కదా! ఒకానొకడు నీ దగ్గరకు వచ్చి "ఎండమావులలో నాకు నీరు కనబడుతోంది కదా! లేదంటే నాకేం ప్రయోజనం?" అంటే నీవు ఏం అంటావు?

"నాయనా! నీకు కనబడవచ్చు. కాని మేము దానిని నిశింతగా పరిశీలించి చూచాం. నీవు కూడా దృష్టిని శుద్ధం చేసి పరిశీలించు. నీకే ఆ విషయం తెలుస్తుంది. అక్కడ ఏమాత్రం జలం లేదు. తరంగాలు లేవు" అని అనవలసిందే కదా!

ఈ జగత్తు విషయం కూడా అంతే. ఇది సంసారదృష్టికి లోభమోహమదమాత్సర్యాదుల కారణంగా, అవిమర్శ నాత్మకంచేత, ఇంద్రియదృష్టిమాత్రంచేత, సంకుచిత–హ్రస్వదృష్టిచేత ఘనీభూతమై తోచుచుండవచ్చు. కాని శుద్ధ–స్వస్వరూపమగు బ్రహ్మము గ్రహించబడినప్పుడు .... ఈ జగత్తు యొక్క అభావమే సిద్ధించుచున్నదని మేము ప్రకటిస్తున్నాము.

అనేక కోణముల నుండి 'జగత్తు' అనబడుదానిని పరిశీలించినప్పుడు, "ఇది ఇట్లు" అని లభించకయే ఉన్నది. వేరువేరు దృష్టులకు వేరువేరు అనుభవమగుచున్నది.... వాస్తవానికి ఏమైఉన్నట్లు? అసలు ఉన్నట్లా? లేనట్లా? నాయనా! రామచంద్రా! ఈ జగత్తు అనబడునది ఇతఃపూర్వం లేదు. ఇప్పుడు కూడా లేదు. ఇదివరకు గాని, ఇప్పుడుగాని, లేనట్టి దానిని ... "ఇది ఒకానొకప్పుడు వినాశనమగును" అను వాక్యము సమంజసమెలా అవుతుంది? అయితే ఒకానొక ద్రష్ట దృష్టిలో, ఈ 'జగత్తు' అను భావము లయించిపోవుట సంభవించుచున్నది 'జగత్తు' అను రూపముగా అనుభవమయ్యే 'భావము' యొక్క ఉత్పత్తి–వినాశనములే "సృష్టి–ప్రళయములు" అను శబ్దములచే శాస్త్రములు బోధిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జగత్తుకు కారణమేలేదని ఎట్లు నిశ్చయిస్తున్నారో చెప్పండి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "ఈ జగత్తుకు బ్రహ్మమే కారణం" అని అంటామనుకో ... పృథివి మొదలైన జడవస్తువులకు జడమైనదేదో కారణం కావాలికాని, శుద్ధ–చైతన్య స్వరూపమగు 'బ్రహ్మము' ఎట్లా కారణమౌతోంది? "ఎండ" అనగా ప్రకాశము ... 'నీడ' అనగా ప్రకాశ రాహిత్యము. సూర్యకాంతికి ఏదైనా అడ్డు వచ్చినప్పుడు ఏర్పడు దానినే 'నీడ' అని అంటున్నాము. కాని "నీడ" అనుదానికి కారణం ఎండయే" అని అనలేము కదా! బ్రహ్మము జడము కాదుకదా! ఎండ అనునది నీడకు ఎట్లా కారణమౌతుంది? ...అట్లాగే, అఖండము– చైతన్యవంతము – సూక్ష్మాతిసూక్ష్మము – నిష్క్రియము – అనిర్వచనీయము అయివున్నట్టి బ్రహ్మము ఈ జగత్తును నిర్మించుటకు కారణమెట్లా అవుతుంది? బ్రహ్మము కాకుండా వేరే ఏదీ ఈ జగత్తుకు కారణంగా లభించుటలేదు. అందుచేత "ఈ జగత్తుకు కారణం లేదు" అని గ్రహించబడుతోంది. కారణము లేని చోట కార్యము ఎట్లా సిద్ధించగలుగుతుంది?

❖

ఇక మేము ఈ జగత్తును ఎట్లు గ్రహిస్తున్నామో చెపుతాను విను.

ఆదికారణమగు ఆ బ్రహ్మవస్తువే విశ్వమువలె గోచరించుచున్నది. ఇక ఈ అభాస* కు కారణమేమిటంటావా? అజ్ఞానము. బ్రహ్మవస్తువు నిష్క్రియమైనదగుటచే "బ్రహ్మము విశ్వమును సృష్టించుచున్నది" అను మాట సరికాదు. అతి సూక్ష్మమైనట్టి స్వస్వరూపము యొక్క స్వరూప – స్వభావములను జీవుడు ఏమరచి ఉంటున్న సమయంలో ఈ 'జగత్తు' అనబడు అనుభవం ప్రాప్తించి వాస్తవమువలె గోచరించుచున్నది.

---

* అభాస = ప్రతిబింబత్వము, లేనిది వాస్తవమువలె తోచుట (Illusionary)

కాబట్టి రాఘవా! ఈ జగద్దృశ్యమంతా స్వప్నమునందు కనిపించే వస్తుజాలము వంటిదేనని గ్రహించెదవు గాక! స్వప్నంలో ఒక పెద్ద మేడ కనిపించుచున్నప్పటికీ – అది వస్తువా? దేనితో తయారుచేయబడింది? స్వకీయమైన కల్పనయే స్వప్నసమయమందు అట్లు ప్రాప్తిస్తోంది కదా! అదేవిధంగా బ్రహ్మమునందు 'జగత్తు' అనబడు వస్తువు లేక పోయినప్పటికీ .... అజ్ఞానము వలన ఘనీభూతమైన అనుభవమువలె భావనాచమత్కారంతో కూడుకొని గోచరించుచున్నది" ... అనునది జ్ఞానులకు నిస్సందేహముగా, సుస్పష్టముగా తెలియవచ్చుచున్నది.

ఈ 'జగత్తు' అనబడునదంతా పరమాత్మయందు ఎల్లప్పుడు నిలచియున్నది. అంతేకాని, ఇది ఒకప్పుడు ఉదయించి, మరొకప్పుడు అస్తమించటం లేదు. నీరు ద్రవభావమును, వాయువు స్పందరూపమును, ప్రకాశము కాంతి ఆకారమును దాల్చియే ఉంటున్నాయి కదా! ఒకదానితో మరొకటి లేనిదెప్పుడు? బ్రహ్మము కూడా జగదాకారమును వహించియే ఉంటోంది. స్వప్నంలో గాంచబడే నగరం ఎక్కడి నుండి వచ్చింది చెప్పు? "ఆ స్వప్నద్రష్ట యొక్క చైతన్యమే అంతరమున అట్టి నగరమును కల్పించుకుని, తానే ఆ 'కల్పన' అయి, ఆపై తననుతానే అట్లు దర్శించుచున్నది" అని మనం ఒప్పుకోక తప్పదు. అదే విధంగా ఈ జగత్తు యొక్క విషయం కూడా!

స్వీయ ఆత్మయే బ్రహ్మమైయుండి, బ్రహ్మమునందు జగదాకారముగా కల్పనామాత్రంగా అభాసించుచున్నది.

❖❖❖

## 17. దృశ్యభ్రమ తొలిగేదెట్లా?

**శ్రీరాముడు :** బ్రహ్మజ్ఞా! విషంతో సమానంగా మమ్ములను అనేక యాతనలు పెట్టుచున్న ఈ దృశ్యజగత్తు స్వప్నానుభూతివలె "మిథ్యయే" అయిఉన్నదంటారా, స్వామీ! మీరు అత్యంత చమత్కారమైన విషయమే ప్రతిపాదిస్తున్నారు. ఇది స్వప్నసమానమే అయివుంటే ... మనుజునకు (జీవునకు) అనాదికాలం నుండి ఈ దృశ్యము విషయంలో విశ్వాసం ఎట్లా ఏర్పడుతోంది?

మరొక విషయం. దృశ్యము ఉంటే ద్రష్ట ఉంటాడు. ద్రష్ట ఉన్నంతవరకు దృశ్యము కూడా ఉంటుంది. ఈ రెండింటిలో ఒకటి ఉంటే రెండవదానితో సంబంధం ఏర్పడుతోంది. ఈ రెండిటిలో ఏ ఒక్కటి లేకపోయినా ... రెండవదానికి 'ముక్తి' కలుగుతోంది కదా! నేను అనుకోవటం ఏమంటే ... దృశ్యబుద్ధి సంపూర్ణంగా నశించనంతవరకు దృశ్యము కనిపిస్తూనే ఉంటుంది. ఈ దృశ్యము మా దృష్టిలో ఉన్నంతవరకు మాకు జ్ఞానం లభించనట్లే – అని.

మొట్టమొదట దృశ్యజ్ఞానము కలిగి ఉండి ... మధ్యలో ఎదురుగా ఉన్నది నశించటం జరిగినా ... మరలా సంసార రూపమున ఉద్భవిస్తూనే ఉన్నది. కాబట్టి మన ఎదురుగా ఉన్న ఈ దృశ్యము ఇక్కడినుండి తొలగించినంతమాత్రంచేత (దృశ్యబుద్ధి ఉండియే ఉన్నది కనుక) అనర్థమగు

బంధము తొలగుతుందని చెప్పలేం. గాఢ నిద్రా సమయంలో దృశ్యము ఉండదు. కనుక జీవుడు దృశ్యరహితుడు అయినట్లే, కాని నిదురలేవగానే మరల దృశ్యభావం వచ్చిపడుతోంది కదా!

కనుక, ఈ దృశ్యములోని వస్తుజాలము నశించటంచేతగాని, వీటిని వదలి మనం ఎటకో వెళ్ళటంచేత గాని ... ఈ దృశ్యబుద్ధి ఉన్నంతవరకు బంధము తొలగదు. అది మన సమస్యకు సమాధానం కూడా కాదు.

ఇంకొక విషయమేమంటే ... అద్దం ఎక్కడ ఉంటే అక్కడ అది ప్రతిబింబాన్ని గ్రహిస్తూనే ఉంటుంది కదా! 'చిద్వస్తువు' అనే అద్దం ఎక్కడ ఏ స్థితిలో ఉంటే అక్కడ స్మృతి నుండి జనించే సంసార సంస్కారం ప్రతిబింబితమౌతూనే ఉంటుంది.

"అసలు ఈ దృశ్యము ఉత్పన్నమే అయివుండలేదు. ఇదంతా వాస్తవానికి లేదు" అను వాక్యం సత్యమైనా, అసత్యమైనా "దృశ్య - దృష్టి" లేక "దృశ్య-బుద్ధి" గల మాపట్ల నిరర్థకమే అగుచున్నది. "దృశ్యరాహిత్యము" అను నిష్కల్మషమైన మనఃస్థితి ప్రాప్తించనంత కాలం ముక్తి అసంభవమే అవుతోంది. కనుక ఓ ఆత్మ విద్వరా! మా యొక్క "ముక్తి"ని అరికట్టుచున్న ఈ 'దృశ్యభావం' లేక 'దృశ్యబుద్ధి' తొలగిపోవటం ఎట్లా? అట్టి సంయుక్తులు మాకు ఉపదేశించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! సర్వాత్మకమగు ఈ జగత్తు అసత్యమైయుండి కూడా సత్యమువలె ప్రతిభాసిస్తోంది. దీని విధము ఎట్టిదో .... నీకు కొన్ని దీర్ఘమైన కథల ద్వారా తెలియజేస్తాను. ఈ చెప్పబోవు కథలన్నీ ఇతఃపూర్వమే వర్ణించబడ్డాయి. వర్షపుజల్లు పడితే ధూళి గాలికి లేవదుకదా! ఈ కథలు చక్కగా విను. అప్పుడు దృశ్యబుద్ధి తనంతట తానే తొలగుతుంది. నీ మనోనగరంలో ప్రశాంతత వర్ధిల్లగలదు.

మానవుడైనవాడు "ఈ జగత్ స్థితి అంతా సంపూర్ణముగా భ్రమాత్మకమే" అని గ్రహించాలి. అది వివేకాదుల చేతనే సాధ్యపడగలదు. సర్వవేళల బ్రహ్మవస్తువును ఒక్కదానినే చింతించుచు వ్యవహరించాలి. మహాపాషాణమును (కొండరాయిని) బాణము ఏమీ చేయలేదు కదా! బ్రహ్మభావమును అలవరచుకొంటే, ఇకప్పుడు ఈ భావాభావములు, స్థూల సూక్ష్మాదిభ్రమలు, స్థిరాస్థిర సంకల్ప వ్యవహారములు, నిన్ను ఏమీ చెయ్యలేవు.

ఓ ప్రియరాఘవా! ఆత్మవస్తువు ఒక్కటి మాత్రమే ఉన్నది. దానియందు ఇక ఎట్టి వికల్పములు లేవు. అట్టి ఆత్మవస్తువునందు ఈ జగత్తు ఎట్లు ఉత్పన్నమైనదో గ్రహిస్తే ... అంతా నీకే అవగతమౌతుంది. ఈ ఉత్పత్తి ప్రకరణంలో "జగత్తు" ఎట్లు ఉత్పన్నమైనది? అనే విషయం విచారించబోవుచున్నాము.

ఓ ప్రియతనయులారా! అమృతానంద స్వరూపులారా! సర్వజనులారా! ముందుగా ఒక విషయం నిర్ద్వంద్వంగా, నిస్సందేహంగా లోకమునకు ప్రకటిస్తున్నాను. వినండి. ఆత్మ వస్తువు నుండే స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు అంతా విజృంభిస్తోంది. ఆ మహదాత్మయే ఈ 'చక్షువులు' మొదలైన ఇంద్రియములచే ప్రాప్తిస్తున్న నామ రూపములతో కూడిన "బాహ్యదర్శనము" అగుచున్నది. అదేవిధంగా అదే సమయంలో అంతరింద్రియ గ్రాహ్యమగు మననము మొదలైన పదార్థముల

రూపముగను ప్రకాశించుచున్నది. మరల అదియే ఒకానొకప్పుడు తనయందు తానే లీనమగుచున్నది. అప్పుడు వృత్తిరహితమగు ఆత్మైకత్వమును ప్రకటిస్తోంది.

అట్టి ఆత్మభగవానునికి ఇవే మా ప్రణామములు.

❖❖❖

# 18. జగత్ భావోత్పత్తి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** పరమపవిత్రము, పరమశాంతము అయినట్టి బ్రహ్మపదము నుండి ఈ దృశ్యజగత్తు ఎట్లు ఉత్పన్నమైనదో చెపుతాను. విను.

నిద్ర పోతున్నవాడే కలలు కంటున్నాడు కదా! అదేవిధంగా స్వస్వరూపమే అయివున్నట్టి బ్రహ్మము కూడా సృష్టితో కూడుకొన్నదై ప్రతిభాసిస్తోంది.

ఈ విశ్వము ఏది అయివున్నది?

అనంత ప్రకాశ స్వరూపము, అనంత చిన్మయము అయినట్టి పరమాత్మయొక్క స్వాభావిక సత్తయే ఈ విశ్వమైయున్నది. ఇది మరింకొకటి ఏదీ కాదు. సర్వప్రాణుల స్వస్వరూపమగు ఆ పరమాత్మ ఆకాశము కంటే కూడా సూక్ష్మము, నిర్మలము అయివున్నాడు. అతనియందు తెలియబడుదానివలె ప్రకాశించుచున్నట్టి జ్ఞానమే, "అహం – నేను" అనునట్టి భావనతో కూడుకొని ఉంటోంది.

అట్టి పరమాత్మ నుండి ఈ ఈ జ్ఞాన సంస్కారములన్నీ లేచుచున్నాయి. ఆ జ్ఞాన సంస్కారము తదితర సంస్కారములతో కూడుకొని 'చిత్తము'ను ఉద్బోధించుచున్నాయి.

చిత్ = "చిత్తవృత్తులతో కూడుకొనియున్న చేతనాత్మక బ్రహ్మసత్త"

ఆ పరమవస్తువు అనాదికాలం నుండి అనుసరిస్తూ వస్తున్న "క్షణ–సంవేదము" వలన దృశ్యజ్ఞానఘనము అగుచున్నది. అనగా ఆ ఆత్మస్వరూపుడు ఒక్కక్షణంలో ద్రష్టత్వము (State of Perceiver) వహిస్తున్నాడు. అట్లు దృశ్యములలో సంచరిస్తూ ఆసక్తిపరుడై క్రమంగా ఆత్మభావమును విస్మరించుచున్నాడు. అనగా పరమపదమును త్యజించి, సంసారోపాధితో కూడిన జీవభావమును పొందుచున్నాడు. అయితే, ఆ విధంగా, "నేను జీవుడను, ఖండుడను, శరీరమాత్రుడను" అను భావము పొందుచున్నప్పటికీ – అతనియందు 'బ్రాహ్మీస్థితి' (బ్రహ్మమునే ... అను స్థితి లేక భావము) ఏమాత్రం తొలగకయే ఉన్నది. ఎందుచేతనంటావా? బ్రహ్మసత్త (లేక చిత్)యే ఒకానొక విశేష – భావంచేత "నేను జీవుడను" అను విధంగా భావిస్తోంది. కాని, వాస్తవానికి అది వేరే ఆకారమును పొందటంలేదు కదా!

ఈ విధంగా బ్రహ్మమునందు "జీవసత్త" ప్రకాశించిన తరువాత, క్రమంగా శూన్య రూపమగు ఆకాశసత్త (Space factor) ఆవిర్భవిస్తోంది. ఈ ఆకాశసత్తయే "ఆకాశము – శబ్దగుణము" అనబడు

భవిష్యత్-వ్యవహారములకు స్థానభూతమగుచున్నది. క్రమంగా కాలసత్త (time factor) జనిస్తోంది. దానితోకూడి అహంకారముతో కూడిన అభిమానము ఉద్భవిస్తోంది. ఇవే భావిసృష్టికి, ఈ జగత్ సృష్టికి మూలములు.

| చిత్ చైతన్యము |
|---|
| జీవ చైతన్యము |
| ఆకాశ సత్త ... శబ్ద గుణము |
| కాల సత్త |
| అహంకారాభిమానము |
| జగత్ సృష్టి |

ఆకాశ - అహంకార - కాలరూపమగు ఆ సృష్టిని సంకల్పమాత్రంగా సృష్టిస్తున్న తత్త్వమునే "హిరణ్యగర్భుడు" లేక "సమష్టిజీవుడు" అని శాస్త్రములు పిలుస్తున్నాయి. అయితే ఇదంతా చైతన్యతత్త్వమగు పరమాత్మసత్తను ఆశ్రయించే ఉంటున్నది. ఒక శిల్పి ఒకానొక గొప్ప శిల్పమును తయారుచేయాలనుకొంటున్నప్పుడు ... అతని మనస్సు నందు చిత్రించబడబోవు శిల్పము సంకల్పరూపంలో ఉంటుంది. అట్లే హిరణ్యగర్భుడు సమష్టిసృష్టి సంకల్పమే రూపముగా కలవాడు. కాని శిలసత్త వలననే శిల్పము నిలచి యున్నదికదా! నిష్క్రియమగు చైతన్యమే ఇదంతా అయివున్నది. ఆత్మచేతనే ఎరుగబడుచున్నట్టి ఈ అసద్రూపజగత్తు (illusionary world) పరమాత్మ నుండియే ఉత్పన్నమై సద్రూపమున ప్రకాశిస్తోంది.

అహంకారము మొదలైన తత్త్వములతో కూడుకొనిన సంవిత్తే 'సంకల్పము' అను వృక్షమునకు బీజమైయున్నది. అట్టి సంవిత్తు (Existence knowledge) యొక్క అంశము వలననే స్పందధర్మమగు వాయువు ఉత్పన్నమగుచున్నది. 'అహం'భావముతో కూడుకొనిన ఆకాశ రూపమగు సత్తను 'శబ్దతన్మాత్ర' అని అంటున్నాం. దీని నుండి క్రమంగా "ఆకాశ తన్మాత్ర (Physical space)" ఉదయిస్తోంది. శబ్దమయమగు శబ్ద తన్మాత్రము నుండి పదవాక్యముల ప్రమాణముతో కూడిన 'వేదములు' వికసిస్తున్నాయి. అర్థములతో కూడిన శబ్దములుగా పరిణమించిన వేద-స్వరూప బ్రహ్మమునుండే ఈ 'జగత్తు' అనునది ఉదయిస్తోంది.

క్రమంగా 'అహం-తన్మాత్ర'ల తత్త్వము నుండి ప్రియత్వము యొక్క ప్రభావంచేత "ప్రాణ తత్త్వము" ఉదయిస్తోంది. భావి (future) జీవుడగు ఈ ప్రాణతత్త్వమే ఇంద్రియములచే గ్రహించబడుచున్న ఈ రూపాదులకు కారణము. ఆ ప్రాణతత్త్వము నుండే పదునాలుగు లోకములు, జరాయుజ - అండాయుజ - స్వేదాయుజ - బీజాయుజములైన చతుర్విధ ప్రాణసమూహములన్నీ జన్మిస్తున్నాయి. ప్రాణతత్త్వాభిమాని యొక్క చిత్స్ఫురణ వలన ఈ భౌతికదేహము ఉత్పన్నమగుచున్నది. "స్పర్శతన్మాత్ర" అనబడే తత్త్వము నుండి నలుబదితొమ్మిది వాయుప్రసరణములు వెలువడుచున్నాయి.

తద్వారా, సర్వభూతముల స్పంద-కార్యనిర్వహణకు .... 'స్పర్శ తన్మాత్ర' కారణభూతమగుచున్నది. దీనినుండే ప్రకాశతత్త్వభావన వలన "తేజోతన్మాత్ర" (లేక రూపము) అను అనుభవము ఉత్పన్న మౌతోంది. అట్టి తేజస్సు నుండి సూర్యుడు, అగ్ని, విద్యుత్ మొదలైన తేజోపదార్థములన్నీ ఉత్పన్నం అవటం జరుగుతోంది. దానివల్లే రూపవిభజన జరిగి, ఈ సంసారం విస్తరిల్లటం కూడా జరుగుతోంది.

ఆ పరమవస్తువే సంకల్పమాత్రం చేత జలమయ శరీరమును గ్రహిస్తోంది. దాని ఆస్వాదననే 'రసతన్మాత్ర' అని అంటున్నాం. ఈ రసతన్మాత్రే ద్రవపదార్థములన్నింటికీ కారణమై, ఈ ఇంద్రియము లచే గ్రహించబడుచున్న సంసారవిస్తృతికి తోడ్పడుచున్నది.

కల్పనామయమగు ఆత్మయే తన కల్పనాప్రభావం చేత "గంధతన్మాత్ర" (Experience of Smelling)ను వీక్షించుచున్నది. అది భూగోళము, శరీరములు మొదలైన ఆకృతులకు కారణభూతమగు చున్నది.

❖

చూచావా? రామచంద్రా! నీరు బుడగలయి, మరల నీరు అగుచున్నది కదా! అట్లే చిత్‌శక్తి యొక్క భావనాప్రభావంచేత కలిగిన తన్మాత్రలే ఒకదానితో మరొకటి కలిపి బ్రహ్మాండములగుచున్నవి. ఈ బ్రహ్మాండములన్నీ అనేక బుద్బుదమువలె (బుడగలవలె) కొంతకాలం కూడి ఉంటాయి. మరల విడిపోతాయి. మహాప్రళయమై, ఇవన్నీ నశించనంతవరకు .... ఈ సంయోగ-వియోగములు ఇట్లు జరుగుతూనే ఉంటాయి. అయితే "ఇవన్నీ విశుద్ధ-శక్తిసంపన్నములే" ... అనే విషయం అల్పబుద్ధిచే గ్రహించలేము. ఒకచిన్న మఱ్ఱివిత్తులో ... భవిష్యత్ మహావృక్షము, దాని వేలాది ఆకులు, పూలు, కొమ్మలు, విత్తులు, ఆ విత్తుల నుండి మరల వేలాది వృక్షములు ... మొదలైన వ్యవహారమంతా అప్రకటితమై దాగివుంటుంది కదా! "చెట్టు నుండి విత్తు – విత్తు నుండి చెట్టు"వలె ఈ శబ్ద-స్పర్శ-తేజ-రస-గంధములనే పంచతన్మాత్రలు* ఆకాశముననే వెలయుచున్నాయి. మరల వాటి నుండి ఆకాశాదులు ప్రకాశిస్తున్నాయి.

అయితే నీవు ఇక్కడ ఒక విషయం సూక్ష్మబుద్ధితో గ్రహించాలి. "ఒక విత్తు అంకురించటం – ఆ అంకురము నుండి మహావృక్షము – ఆ వృక్షము వందలాది కొమ్మలతో ప్రకాశించుట – ఫలములను ఇవ్వటం" .... ఇవన్నీ ఆ విత్తులో అప్రకటిత సంస్కారరూపములో దాగివున్నాయి కదా! అట్లే చిదాత్మ పరమాణువులో ఈ విస్తారమైన చరాచర జగత్తు అంతా ప్రకటితమౌతోంది. అట్లు ఒక చిదాత్మ పరమాణువు నందు ఇదంతా కనబడుచున్నప్పటికీ .... వాస్తవానికి ఇదంతా 'మాయ'యేనని గ్రహించు.

**శ్రీరాముడు :** 'చిదాత్మ' అను సూక్ష్మపరమాణువులో ఇంతటి విస్తారమైన జగత్తు ఉండటమేమి? ఇదంతా ఎట్లా ఇముడుచున్నది?

---

* పంచతన్మాత్రలు = శబ్దము – స్పర్శ – రూపము – రసము – గంధము అనినబడు అనుభవములు.

**శ్రీ వసిష్ఠమహర్షి :** స్వప్నంలో అతిసూక్ష్మనాడియందు పెద్దపెద్ద వస్తుజాలమంతా కనబడుట లేదా? ఇదికూడా అట్టిదే. కాని ఈ కనబడేదంతా వాస్తవమైనది కాదు.

ఈ స్థూలభావములన్నీ ఒకప్పుడు రూపము పొందుచున్నాయి. మరొకప్పుడు రూపము పోగొట్టుకొంటున్నాయి. అనగా, 'చిత్' అను ఆధారమునందు సూక్ష్మత్వం పొందు చున్నాయి. ఒకానొకప్పుడు మరల స్థూలములౌతున్నాయి. సంకల్పాత్మకమగు చిత్-శక్తి వలననే ఈ 'జగత్తు' అను అనుభవం శబ్దస్పర్శరూప రస గంధముల ఆకారంగా ఏర్పడుతోంది. ఇంకొకప్పుడు ఆకారరహితమగుచున్నది.

ఓ రాఘవా! ఈ దృశ్యజగత్తుకు కారణం పంచతన్మాత్రలే. వీటికి పరమాత్మతో నిత్య సంబంధమున్నది. ఈ పంచతన్మాత్రలకు సాక్షాత్ కారణం మాయాశక్తియే. ఇక పరబ్రహ్మమో ... సర్వమునకు పరమకారణమగుచున్నది. మరి మాయాశక్తికి కారణమేమిటంటావా? 'ఆదిశక్తి' అని చెప్పబడే మాయాశక్తికి కారణం ... ఆదిభావమై, అనుభూతికి మాత్రమే గ్రహించబడునదై, జన్మరహితమై, చిత్స్వరూపమైనట్టి ... "పరమాత్మ"యే సుమా! పరమాత్మ లేక పరబ్రహ్మము కారణరహితము.

'మాయ' కారణంగానే జగత్తు వికసించటం – మరల ముకుళించటం జరుగుతోంది. "పరమాత్మ" అనునది సర్వదా ఒకే రీతిగా మార్పు-చేర్పులకు అతీతమైనదై ఉండి ఉంటోంది.

❖❖❖



# 19. జగత్తు లేదు

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! ఈ ఆకాశము తేజస్సు తమస్సు మొదలైనవన్నీ తమంతట తాము ఉత్పన్నమైనవి కావు. ఇవన్నీ కూడా చిదాత్మమగు పరబ్రహ్మము యొక్క సత్త వలననే నిలచివున్నాయి. అంతేకాని, వీటికి స్వతంత్రమైన ప్రతిపత్తి లేదు. అన్నిటికి కారణం చిదాత్మయే సుమా! ఆ చిదాత్మయే తెలియబడుచున్న విషయమునకు సంబంధించిన కల్పనను, ఆ తెలియబడు దానితో కలిసిన జీవభావమును, 'అహం' జ్ఞానమును కల్పించుచున్నది. అహంభావము యొక్క పరిణామము వలన బుద్ధి వికసిస్తోంది. అట్టి బుద్ధి, శబ్దము-మొదలైన తన్మాత్రలతో కూడి 'మననము' అను ధర్మముగల 'మనస్సు'గ మారుచున్నది. ఆ మనస్సే తన్మాత్రలతో కలిసి, మహా భూతములుగా మారి జగత్తుగా ప్రాప్తించుచున్నది.

'జగత్తు' అనబడే పూతీగకు ఈ విధంగా బీజము చిదాకాశమే. అయితే ఈ 'జగత్తు' అనబడుదానికి బీజము ఎవరూ ఎక్కడా పాతవలసిన అవసరం లేదు. భౌతికమైన పాదువలె నీరు, నేల, వెలుతురు అవసరం లేకుండానే ... భావనామాత్రంగా దానంతట అదే అంకురించుచున్నది.

'కేవల చిద్రూపము' అయినట్టి ఆ పరమవస్తువు స్వప్న సృష్టిలాగా ఈ పృథివి మొదలైన వాటిని సృష్టిస్తోంది. అయితే రాఘవా! ఆ విశుద్ధ చైతన్యము ఎక్కడ ఉన్నప్పటికీ ... అది ఈ 'జగత్' అను విషయమునకు అతీతమైయున్నదని గ్రహించెదవుగాక! దాని స్వభావము అసంగత్వమైనది. (It never gets attached to anything). అనగా సర్వసంగమములకు అతీతమైనది. నీవు స్థూల జగత్తును చూస్తున్నావు కదా! ఈ స్థూలజగత్తు యొక్క బీజము .... పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు). పంచతన్మాత్రలయొక్క బీజమో – అక్షయము, అవ్యయము అగు చైతన్యమే అయివున్నది. దీనినిబట్టి "ఈ జగత్తంతా బ్రహ్మమయమే" అని గ్రహించబడుగాక!

ఈ భూత (లేక/దృశ్య) సృష్టికి పూర్వమే మహాకాశమున తన్మాత్రపంచకము ఉన్నది. ఆ తన్మాత్రలను చైతన్యమే ... ఎట్టి ఉపకరణం లేకుండా ... స్వసామర్థ్యం చేత కల్పించుచున్నది. కల్పన వాస్తవం ఎట్లా అవుతుంది? అందుచేత పంచతన్మాత్రలు కూడా వాస్తవంకాదు. అవాస్తవమైన పంచతన్మాత్రలు వర్ధిల్లి, స్థూలజగత్తుగా మారుచున్నది.

❖

దీనినిబట్టి .... "సత్తు-కల్పన"లకు అధిష్ఠానమైయున్నట్టి "నిష్క్రియ – నిర్వికల్ప – చైతన్యము" నందు ఒక స్వప్న-కల్పనలాగా ఈ జగత్తు అవస్థితమైయున్నదని తేలుచున్నది. కాబట్టి రాఘవా! "నీవు-నేను-అతడు-అది-ఇది" మొదలుగా గల ఈ సమస్తము ఆ అద్వితీయ-చైతన్యమే అయివున్నది. దానికి వేరుగా ఈ త్రిలోకములలో ఏదీ లేదు సుమా!

"ఈ జగత్తు చైతన్యమునందు ఏర్పడుచున్న 'కల్పన' మాత్రమే" అని మనం నిర్వచించాము కదా! మరి కేవలం కల్పనచేత మాత్రమే వర్ధిల్లునది సత్యమెట్లా అవుతుంది? సృష్ట్యాదిగా మనం ఈ

వ్యవహారమంతా పరిశీలించినప్పుడు ... ఈ తన్మాత్ర–పంచకము, దాని నుండి ఉద్భవిస్తున్న ఈ జగత్తు కూడా బ్రహ్మచైతన్యము నుండే వికసిస్తున్నాయని తెలియవస్తోంది. బ్రహ్మమే ఈ 'జగత్తు' అను కార్యమునకు కారణము కూడా. చూచావా రామా! ఇక్కడ ఈ జగత్తుకు కార్య–కారణములు రెండూ బ్రహ్మమే అయివున్నాయి. కనుకనే మేము .... " 'జగత్తు' అనబడు మరొక పదార్థమేదీ ఉత్పన్నమే అయివుండలేదు" .... అని నిర్ద్వంద్వముగా లోకమునకు ప్రకటించుచున్నాయి. "లేదు, జగత్తు అనబడునది ఒకప్పుడు ఇన్ని సంవత్సరముల క్రితం జన్మించింది" అని ఎవరైనా అంటారేమో? పంచమహా భూతములు (ఆకాశము, భూమి, అగ్ని వగైరా), పంచతన్మాత్రలు .... ఈ రెండిటి కలయికే ఈ జగత్తు కదా! ఈ "అనుభవము – అనుభవించువాడు" అను రెండు తత్త్వములలో ఒకదాని కాలనియతి మనకు పూర్ణార్థమును ప్రసాదించజాలదు. ఇంద్రియాసక్తులను అనుసరించి అనేక విధములుగా తోచే ఈ జగత్తును నిర్వచించి, నిర్దేశించి, కాలనియతిని ఆపాదించుటెట్లు?

శబ్ద–స్పర్శ–రూపాది–అనుభవ సంస్కారం–జగత్‌పదార్థముల కలయిక–ఇదే జగదనుభవంగా ముందు ముందు నిరూపించబడుచున్నది.

"ఇదంతా లేదు" అని మేము అనునప్పుడు, "మాకు అనుభూతమగుచున్నది కదా! లేదంటారేం?" అని ఎవరైనా అంటారేమో? వారికి మేము ఒక దృష్టాంతము చూపుచున్నాం. స్వప్నంలో కనబడే నగరాలు వాస్తవానికి అసత్తే కదా! స్వకల్పిత మాత్రములే కదా! అయినప్పటికీ, అవి ఆ స్వప్నసమయంలో సద్వస్తువులవలెనే అనుభూతములగుచున్నాయి కదా! అట్లే ఈ జీవుడు స్వకీయకల్పనచే జగత్తు యొక్క అనుభవం తన స్వస్వరూపమునందే స్వసంకల్పానుసారం పొందుచున్నాడు. ఈ జీవుడు బ్రహ్మాకాశస్వరూపుడే. పరమప్రకాశ స్వరూపమగు బ్రహ్మాకాశమున .... బ్రహ్మాకాశమే అయివున్నట్టి ఈ "కాల్పనిక" యొక్క అస్థిత్వం గోచరిస్తోంది.

❖

విశుద్ధమగు బ్రహ్మమునందు "పృథివి" మొదలైన పదార్థముల ఉనికి అసంభవమని మనం అనుకొన్నాం కదా! అందుచేత ... ఈ 'జగత్తు' అనబడునది భ్రమాత్మక దృష్టికి మాత్రమే గోచరిస్తోందని సత్య–ద్రష్టలు మనందరికీ గుర్తు చేస్తున్నారు. ఆకాశమున ఊహాపూరితమైన నగరాదులు భ్రమదృష్టిచే దర్శించువానికి గోచరిస్తాయి. అట్లే బ్రహ్మము నందు కూడా 'జీవుడు' అనబడునది గోచరించటం జరుగుతోంది. 'ఉపాధి' దృష్టిని త్యజించి 'శరీరి' దృష్టితో పరిశీలించినప్పుడు ఈ విషయం సుస్పష్టమగుచున్నది. ఆహా! ఎంతటి చమత్కారం! శుద్ధ స్వరూపమగు బ్రహ్మమే ఈ జీవుని రూపమున ప్రకాశించటం జరుగుతోంది. అనగా ఆ పరమేశ్వరుడే ఈ "జీవుడు–సమష్టి" మొదలుగాగల ఆకారమున ... జీవసమష్ట్యాకాశమున (సద్రూపమున) ప్రతీయమాను దగుచున్నాడు.

❖❖❖

# 20. స్థూలదేహ ఆవిర్భావము

**శ్రీరాముడు :** స్వామి! ఈ జీవుడు – పరమేశ్వరుడు ఒక్కటే పని ప్రతిపాదిస్తున్నారు కదా! సర్వమునకు అతీతుడు, స్వరూపమంటూ ఏదీ లేనివాడు అయిన ఈశ్వరుడు ఈ స్థూలదేహమును ఎందుకు, ఎట్లు ఆశ్రయిస్తున్నాడు? "నేను జీవుడను మాత్రమే ... అత్యల్పుడను" అను రూపమున గల ఈ సంకుచిత స్వభావమంతా ఎక్కడినుండి వచ్చిపడుతోంది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** స్వయంప్రకాశమగు ఆత్మవస్తువును అత్యంత అసంగతమైనట్టి ఈ స్థూలదేహము యొక్క ఆపాదనంతా ఏర్పడుచున్న ఒకానొక క్రమమును విశ్లేషించి చెపుతాను. విను.

❖

మొట్టమొదట పరమేశ్వరునకు జీవకల్పన అగ్ని స్ఫులింగమువలె కొద్దిగా ఉదయిస్తోంది. క్రమక్రమంగా కల్పనాబలం చేత ఆయనే స్థూలజీవిగా భావన పొందటం జరుగుతోంది. ఆకాశంలో చంద్రుడు ఒక్కడేగాని, ఇద్దరు చంద్రులు లేరుకదా! కాని, మెల్లకన్ను దోషము కలవానికి రెండవ చంద్రుడు వాస్తవమువలెనే గోచరించుచున్నాడు. అట్లే, ఈ జీవభావము 'అసత్తు' అయివుండికూడా సత్తువలె ప్రతీయమానమగుచున్నది. అటు తరువాత భావనాబలము వలన ద్రష్టత్వము ... ఆ ద్రష్టత్వము నుండి దృశ్యత్వము ఏర్పడుచున్నాయి.

క్రమంగా, ఆ సూక్ష్మతేజము తనయొక్క స్ఫులింగభావమును మరచినదై, తనను స్థూలముగా భావించుచు ... స్థూలమే అగుచున్నది. ఒకడు స్వప్నంలో "నేను మరణించాను, నా బంధువులు నా చుట్టూ కూర్చుని ఏడ్చుచున్నారు" అనే అనుభవం పొందుతూ ఉంటాడు. తానే మరణిస్తే ... ఆ స్వప్నం ఎవరికి? అందలి ఏడ్చుచున్న జనులు ఎవరు? తాను ఉంటే కదా, స్వప్నము గాంచుట! ఇట్లు స్వప్నంలో తన మరణం ఎంతటి హాస్యాస్పదమో ... శుద్ధచైతన్యము స్వకీయమైన స్ఫురణచే ఈ జీవత్వము, జీవభావము, "నేను ఒక జీవుడను" అను భ్రమ పొందటం అట్టిదే. కంటి యందు 'పొర' అను దోషము పొందినవాడు ప్రతి వస్తువును రెండు వస్తువులుగా చూస్తాడు. వాస్తవానికి ఇక్కడ వస్తువులు 'రెండు అగుట లేదు కదా!

శుద్ధ చైతన్యము నందు జలతరంగమువలె ఉదయించినట్టి లింగదేహము* "జ్ఞానము – చిత్తము" అను కల్పనల ద్వారా స్థూల దేహములను గ్రహిస్తోంది. ఆయా ఉపాధులతో ఏకత్వము పొందుచు, "నేను ఈ రక్తమాంసమయ శరీరమునే" అని భ్రమిస్తోంది. ఆహా! చూచావా? ఎక్కడి .... నిత్య–నిర్మల–వృత్తి రహితమగు ఆత్మతోటి 'ఏకత్వము'? ఎక్కడి శరీరము తోటి తాదాత్మ్యము? ఎక్కడి "శరీరమే నేను–అను భావన?" ఎక్కడి "అఖండమగు ఆత్మయే నేను" అను ఎరుక?

ఇట్లు లింగాకారమే క్రమంగా స్థూలత్వమౌతోంది. ఒక లక్షాధికారి స్వప్నంలో తనను తాను ఒక భిక్షుకునిగా గాంచునట్లు, "వాస్తవానికి శుద్ధచైతన్యమే" అయున్న ఈ జీవుడు .... "నేను

---

* లింగదేహము = (Subtle body or Mind)

శరీరమును లేక శరీరమాత్రుడను, శరీరము చేతనే ఉంటున్నాను" అని భావించుకొనుచున్నాడు. ఒక దాని వెనుక మరొకటి చొప్పున భ్రమాత్మకమైన అనేక ఆశలకులోనై, నానాయాతనలు అనుభవించుచున్నాడు. చిత్తము ఏయే విషయముల ఆకారమును (లేక భావనలను) దాల్చుచున్నదో ... ఈ జీవుడు కూడా అట్టివే అగు ఉపాధులను దాల్చుచున్నాడు. ఒక దర్పణం (అద్దము) తనయందు, తన ఎదురుగా ఉన్న పర్వతమును ప్రతిబింబిస్తుంది చూచావా? అట్లే 'సర్వగామి'యగు ఈ ఆత్మకూడా తన జ్యోతిర్మయలింగ శరీరమును "అహం" అనునట్టి అభిమానమును దాల్చి వెలయుచున్నది. లోతైన నూతిలో పడినవాడు బయటకు రాలేక కొట్టుమిట్టాడు చున్నట్లు ... ఈ జీవుడు కూడా దేహాభిమానమును వదలలేకున్నాడు. అతడు తన ఆత్మయొక్క స్వరూప - స్వభావములను ఎరిగినప్పుడు మాత్రమే 'స్వస్థత' పొందగలడు సుమా! ఓ రాఘవా! ఈ జీవునికి అతని ఆత్మయొక్క స్వరూపమును గుర్తు చేయటానికే .... మేము ఈ 'ప్రవచనము' అను ప్రయాసతో కూడిన వ్యవహారమంతా చేస్తున్నామయ్యా! అయితే, జీవుడు తన ఆత్మతత్త్వమును ఏ క్షణంలో కూడా త్యజించి ఉండనే లేదు. ఇది సత్యము. మా ఈ ప్రబోధముచే "ఉండివున్న సత్యము"నే (that which is already true) ఎరుక పరుస్తున్నాము. లేక గుర్తు చేస్తున్నాము. అంతేగాని, మేము క్రొత్తగా ఏదీ తెచ్చి ఇచ్చుటలేదు.

❖

"స్వప్న దర్శనం - సంకల్పమునందలి కల్పితమైన దృశ్యము యొక్క అనుభవం" ... ఇవి రెండూ నిజశరీరమునందే జరుగుచున్నాయి కదా! ఈ జీవుడు ఆత్మతత్త్వమగు స్ఫులింగరూపమున (చైతన్య రూపమున) అహంకారాదులతో కూడినవాడై ఉపాధిని ఆశ్రయిస్తున్నాడు. అట్లు ఆశ్రయిస్తూ క్రమంగా తన వాస్తవమగు స్వరూప - స్వభావములను ఏమరచి, "నేను ఈ ఉపాధియందు ఉండువాడిని. ఈ ఉపాధికి మాత్రమే సంబంధించినవాడిని" అను భావనకు బద్ధుడగుచున్నాడు. ఇక ఆపై అట్లే కల్పనామయ దేహములను (స్థూల-సూక్ష్మ దేహములను) అనుభవించుచున్నాడు. అయితే ఈ జీవబుద్ధియొక్క నివాసస్థానము ఏది? ఇది "సత్త-చిత్తము" అను రెండిటితో కూడినదై, "ఉండటం-ఇష్టపడటం" అను రెండు స్వభావములతో స్వయముగా జ్యోతిరాకాశ మధ్యమున, తన లింగశరీరముననే లేక సూక్ష్మశరీరముననే వెలయుచున్నది. ఆ లింగ శరీరము జలమునందలి తరంగమువలె ఆత్మయందు ఉనికిని పొందియున్నది.

❖

మొట్టమొదట, "నేను అనుభవమును పొందెదను గాక! (ఉదాహరణకు .... చూచెదను గాక! వినెదనుగాక! మొదలైన రూపమున)" .... అను ఆసక్తితో కూడిన భావన ఉదయిస్తోంది. అప్పుడు నేత్రము నుండి దృష్టి రూపమున చైతన్యము ప్రసరించి "భవిష్యత్ బాహ్య దృశ్యము"ను సమీపిస్తోంది. అప్పుడు ఈ 'జీవుడు' అనబడు చైతన్యమూర్తి తనయందు ఆ వస్తువు యొక్క ఆకార-లక్షణములకు సంబంధించిన వృత్తిని పొంది, ఆ వృత్తిని అనుభవించుచున్నాడు. దేనివలన

చూచుచున్నాడో, అవి 'కళ్ళు' అని, దేనియందు స్పర్శానుభవం ప్రాప్తిస్తోందో అది 'చర్మము' అని, దేనివలన వింటున్నాడో అది 'చెవి' అని, దేనివలన వాసన పొందుచున్నాడో (ఆఘ్రాణిస్తున్నాడో) అది 'ముక్కు' అని పేర్లు ఇవ్వబడ్డాయి. ఈ విధంగా చైతన్యమునందలి వివిధ వృత్తులు .... 'వివిధ అనుభవములు ... వివిధ–ధర్మములు'గా పరిణమించి నామరూపములను సంతరించుకొంటున్నాయి.

దేనివలన అయితే "ప్రయత్నము–కర్మేంద్రియములు" కూడా వికసిస్తున్నాయో, దానిని 'వాయువు' అంటున్నాం. అది సర్వదా 'స్పందము' అను లక్షణము కలిగియున్నది కదా! ఈ వాయువే తన స్పంద క్రియ ద్వారా జీవునకు బాహ్యవిజ్ఞానము, అంతర్విజ్ఞానము కలిగించుచున్నది.

ఈ విధంగా ఆతివాహిక దేహి (లేక సూక్ష్మ – దేహి లేక 'అపంచీకృత దేహి' .... మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములే దీని రూపము) ... స్థూలాకారము ధరించుట వలన స్థూలధర్మము ప్రకటితమౌతోంది. అయితే అతని స్వస్వరూపము ఆత్మచైతన్యమే కదా! అనగా ఆత్మచైతన్య స్వరూపుడే "లింగ–స్థూల" శరీరములను ధరించి, అందలి "స్థూల–సూక్ష్మ" విషయముల మధ్య ఆకాశమువలె వెలయుచున్నాడు. అసత్యమే అయి కూడా సత్యమువలె తోచునట్టి కల్పనను ఆశ్రయించి బ్రహ్మ–జీవ శబ్దార్థబోధకమగు (ఆరెండు శబ్దముల అర్థమును ప్రతిబింబించు) జీవత్వమును .... స్వయంగా, లీలామాత్రంగా, అనిర్వచనీయ కారణంగా .... స్వీకరించుచున్నాడు.

ఈ 'జగత్' అనబడు దృశ్యప్రాప్తికి ఇస్తున్న ఒకానొక నిర్వచనం విను.

"ఆ పరమాత్మయే 'అతివాహికదేహి' అయి స్థూలదేహ – ఆవరణము నుండి స్వబుద్ధిచేత కల్పించబడిన ఈ బ్రహ్మాండమును గాంచుచున్నాడు".

**శ్రీరాముడు :** మరి వేరువేరు జీవుల మాటేమిటి? ఇక్కడ ఒక్కొక్క జీవుడు ఒక్కొక్క విధంగా ఇచ్ఛ, హావ–భావములు ఉనికి ప్రకటిస్తున్నాడు కదా! ఈ కనబడుచున్నదంతా ఏమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఔను! ఒక జీవి జగత్తును, మరొకజీవి విశాల బ్రహ్మాండ స్వరూపమును, ఇంకొక జీవి భావి బ్రహ్మాండమును గాంచుచున్నారు. ఒకే శక్తి అనేకచోట్ల అనేక వ్యవహారములను నిర్వర్తించుట లేదా? ఒకే చైతన్యము ... ఒకచోట జీవునిగాను, మరొకచోట విరాట్ స్వరూపము (విస్తారమైన పంచభౌతిక సృష్టి సమన్వయము) గాను, ఇంకొకచోట దీర్ఘ – హ్రస్వకాలస్వరూపము గాను... తనను తానే వ్యక్తీకరించుకొంటోందని గ్రహించెదవుగాక. అట్లు గాంచుచు, ఆయా అనుభవములను అంగీకారబుద్ధితో దర్శించుటయే ఈ బ్రహ్మాండ నిర్మాణములోని అంతర్లీన లక్షణము.

ఈ జీవుడు "నిజగర్భ గృహము (own inner recess of the house)" అనతగినట్టి తన చిత్తమునుండే... కల్పనానుసారంగా కాలము, కార్యము, కల్పన, ద్రవ్యములను అనుభవించు చున్నాడు. ఆయా రూప – నామ – శబ్దములకు బద్ధుడగుచున్నాడు. అయితే వస్తుతః ఇదంతా స్వప్న కల్పనవలె అసత్తు లేక అళీకము (భ్రమమాత్రము) అయివున్నది. అందుచేత, జ్ఞానులు "ఇదంతా అనుత్పన్నమైనది" అనే నిర్ణయిస్తున్నారు. "విశ్వరూపుడు, ఆదిప్రభువు అయినట్టి ఆత్మ

'స్వయంభువు'. అట్టి ఆత్మకు వాస్తవానికి "ఉత్పత్తి" అనునదే లేదు. కాని స్వకీయమగు మాయచే వ్యష్టి–సమష్టి సృష్టి రూపములుగా ప్రకటితమగుచున్నాడు" ... అని వేదములు ప్రవచించుచున్నాయి, బోధించుచున్నాయి. బ్రహ్మాండాకారముగా కనిపించే ఈ భ్రమయందు ... ఆతివాహిక దేహస్వరూపి, ఆది ప్రభువు అగు 'ప్రజాపతి' అని పిలువబడుచున్న శుద్ధస్వరూపుడగు 'ద్రష్ట' కాక మరింకేదీ ఎక్కడాలేదు. ఈ 'దృశ్యజగత్తు' అనబడుదానియందు ఏదీ ఉత్పన్నమయి ఉండలేదు. ఏది ఉత్పన్నము అవబోవుట లేదు. ఇంకేమీ ఎవరిచేత చూడబడటంలేదు. ఓ రామచంద్రా! మేము ఈ జగత్ వ్యవహారమంతా బాగా పరిశీలించాము. అనేక కోణముల నుండి ఈ "నీవు–నేను" మొదలైనవాటిని పరీక్షించి చూచాం. అనేక చర్చల తరువాత జగద్విషయమై మేము చేస్తున్న నిర్ణయం విను.

ఆతివాహిక రూపమును (మనోరూపమును) స్వయముగా ఆశ్రయించిన పరమాత్మ ఈ జగత్తును తనకుతానే చిత్తమునందు రచించుకొని – ఆ రచనచే బ్రహ్మాండముగాను, వస్తుజాలముగాను, ఉత్తమ – మధ్యమ – ప్రథమ పురుషులుగాను దర్శించుచు, అనుభవించుచున్నాడు.

"ఇక్కడ–అక్కడ, ఇప్పుడు–అప్పుడు బ్రహ్మాకాశమే ఉన్నది" అని గ్రహించుటే జ్ఞానం.

అందుచేత, రామా! ఈ దృశ్యవ్యవహారమంతా సత్తవలె (As if exists truly) గ్రహించబడవచ్చు. అనుభవించబడవచ్చు. కాని, వాస్తవానికి ఇదంతా స్వప్నములో గాంచబడే నగరమువలె "కల్పితము, ప్రతిబింబమాత్రము, భ్రమ, అలీకము" అని నీవు గ్రహించెదవుగాక! ఇదంతా వాస్తవానికి అనిర్మితం, రాగరహితం, బంధరహితం. అయితే ఏం? అత్యంత ఆశ్చర్యం కలిగిస్తూ ప్రకాశిస్తోంది.

ఆకాశములోని నక్షత్రములు, చంద్రుడు మొదలైనవి తటాకజలంలో ఎవరి కారణంగా ప్రతిబింబిస్తున్నాయి? ఈ అలీకదృశ్యము, నీటిలో ప్రతిబింబించే ఆకాశ దృశ్యమువలె, ఎవ్వరూ సృష్టింపకున్నప్పటికీ సత్యానుభవమువలె వెల్లివిరుస్తోంది. మహాప్రళయ సమయంలో బ్రహ్మాదులు కూడా లయమైపోతున్నారనటంలో ఏమాత్రం సందేహం లేదు. ఒకప్పుడు ఉండి .... మరొకప్పుడు లేకుండా పోయేది సత్యమెట్లా అవుతుంది? ఈ సృష్టి అంతటికీ కర్తయగు బ్రహ్మయే ఒకానొక దృష్టిచే, 'మాయ'లోని భాగంగా, "లేనివాడే" అగుచుండగా, ఇక ఆయన సృష్టియగు ఈ జగత్తు గురించి వేరుగా మనం చెప్పుకునేదేమున్నది? ఇది కూడా అట్లే లేనిదే అగుచున్నది. సృష్టికర్త ఎట్టివాడో, ఆ సృష్టికర్తచే కల్పించబడిన ఈ జగత్తుకూడా అట్టిదే అవుతుంది కదా!

శ్రీ ప్రియరాఘవా! 'జ్ఞానము' అనబడే జాగ్రత్ ప్రవర్తించినప్పుడు ఈ 'జగద్దర్శనము' అనే స్వప్నము తనంతటతానే అంతర్ధానమగుచున్నది. అప్పుడు పరమాత్మ తన జీవత్వభ్రమలు వదలి, తనయొక్క "కేవలం – అద్వితీయం – అద్వయం" అగు బ్రహ్మ స్వరూపమున వెలియుచుండటం జరుగుచున్నది. అప్పుడిక అతనిపట్ల ఈ దృశ్య జాడ్యములేవీ ఉండవు. స్వప్నం త్యజించుటచే మెలుకువ వచ్చిన తరువాత ... ఆ స్వప్నములోని గృహములు, మనుష్యులు, సంఘటనలు అసత్యముగా తెలియవస్తాయి. అప్పుడవన్నీ జ్ఞాపకమాత్రంగా మాత్రమే ఉంటాయి కదా! అట్లే ఈ జగత్తు – శరీరాదులు ఉండివున్నా, జ్ఞానము ప్రాప్తించినట్టి స్థితిలో ఇవన్నీ, వీటి మూలకారణముతో

సహా .... ఆకాశరూపముననే సాక్షాత్కారమౌతాయి. అప్పుడు "నేను – నీవు – అది – ఇది"లతో కూడిన జగత్తంతా 'బ్రహ్మము'గానే అనుభూత మగుచున్నది. జలమునకు వేరుగా ద్రవత్వమున్నదా? సృష్టికూడా పరమాత్మ నుండి వేరుకాదు.

"జ్ఞానులు" అంటే ఎవరు? తపస్సు మొదలైన ఆయా ప్రయత్నములచే మనస్సును నిర్మలం చేసుకొనినవారే కదా! అట్టి నిర్మల మనస్కులకు ఈ కనబడే బ్రహ్మాండము ఆకాశమువలె అతి నిర్మలము, ప్రశాంతము, నిరాధారము (ఏదీ ఆధారముగా కలిగి ఉండనిది) నిరాధేయము (దేనికీ కూడా తాను ఆధారము కానిది). అద్వయము, అద్వితీయముగా (తనకు వేరైనది కానిదిగా) తెలియవచ్చుచున్నది. ఇదంతా బ్రహ్మము నుండే ప్రాప్తిస్తున్నప్పటికీ, బ్రహ్మమునకు వేరుగా ఏదీ, ఏ సమయమందును ఉత్పన్న మగుటలేదు. ఇది పరమాకాశమువలెనే శూన్యము, నిర్మలము అయి వెలయుచున్నది.

ఓ మహాసూక్ష్మబుద్ధీ! ఒక విషయం ప్రకటిస్తున్నాను. వాస్తవానికి "సంసారము" అనునదే లేదు. ఇది (ఈ కనబడునది) ఆధారముగాని, ఆధేయముగాని, ద్రష్టగాని, దృశ్యముగాని కాదు. దీనియందు బ్రహ్మము – బ్రహ్మాండము అనబడు పదార్థములేవీ లేవు. ఇక్కడ రూపనామములకు సంబంధించిన కార్యకారణములను, కాలప్రతిపాదనలను నిరూపించాలని, సిద్ధాంతీకరించాలని ప్రయత్నించటం ఒక విధంగా "వితండవాదమే" నని అనిపించుకొంటుంది. అయితే శాస్త్రములు కొన్ని నామ–రూపముల సహాయం తీసుకొని, శిష్యునియందు సంసారరాహిత్యమును వెలిగించటానికి ప్రయత్నం చేస్తున్నాయి. పదజాలము యొక్క ప్రాస్త్యము అంతవరకే. (అనగా శిష్యులకు బోధించటం కొరకే).

వాస్తవానికి, ఇక్కడ జంగము–స్థావరాదులు కూడా లేవు. జలములో తరంగములు, ఆవృత్తములు, సుడిగుండాలు లేస్తాయి చూచావా? ఒకే జలం ఆ విధంగా అనేక రూపములలో ప్రవర్తిస్తోంది. బ్రహ్మము తనయందు తానే "జగత్కల్పన" చేసుకొని ఇంతలోనే ఆ కల్పనలన్నీ విలీనం చేసుకొంటోంది. ఇదంతా ద్రష్టకు వేరుగా చూచినప్పుడు అసత్తు అయివుండి కూడా దృశ్యదశలో దృశ్యరూపమున అనుభూతమై అనేక అనుభవములకు ఆలవాలమగుచున్నది. ఆహా! ఈ అసత్తు అయినట్టి దృశ్య వ్యవస్థలో ఎన్ని వేదనలను, ఎన్ని దుఃఖములను, ఎన్ని భయములను జీవుడు నిష్కారణంగా అనుభవించుచున్నాడో కదా! ఒకడు స్వప్నంలో తాను మరణించినట్లు కలగాంచుచున్నాడు. ఇంతలోనే, నిదుర లేచిన తరువాత, "ఈ స్వప్నానుభవం నాయొక్క భ్రమచే కల్పించబడినదే కదా! మరి నేను అంతగా ఎందుకు రోదించాను?" అని ఆశ్చర్యపడతాడు. ఇక ఆపై పట్టించుకోకుండా ఆ అనుభవంపట్ల మౌనం వహిస్తాడు. అదే విధంగా జ్ఞానము ప్రాప్తించినప్పుడు "ఈ సంసారము మిథ్యయే కదా" అని బోధపడుచున్నది. అప్పుడాతడు కేవలము అఖండము, అనాది, అనంతము అగు బ్రహ్మమునే జ్ఞానాకాశమునందు దర్శించగలడు. ఆపై పూర్వ–తత్పూర్వ జగత్ వ్యవహార మననము ఉండజాలదు.

ఆ పరమాకాశమునందే స్వయముగా శూన్యరూపమున "అతివాహిక దేహధారి" అయి ప్రజాపతి* వెలయుచున్నాడని గ్రహించు. అతని దేహము పాంచభౌతికము కాదు. కార్యము, కారణము కంటే వేరు కాదుకదా! (Effect in not different from the cause). ఆ ప్రజాపతి సంకల్పమాత్ర వ్యవహారమైనట్టి ఈ పృథివి మొదలైన స్థూలసృష్టి 'సత్తు' కాదు సుమా! ఇదంతా ప్రజాపతి నిజ స్వరూపమైన బ్రహ్మమే. "సర్వము సర్వదా బ్రహ్మమే" అని గ్రహించిన తరువాత ఇక్కడ నీకు తారసపడగల సుఖ – దుఃఖములేమి ఉన్నాయి? "సంసారము" అనునది ఎక్కడ ఉన్నది చెప్పు?

❖❖❖

## 21. ఈ జీవుడు పరిమితుడా? అపరిమితుడా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఇప్పటి వరకు మనం విచారించిన దానిని అనుసరించి "అహంభావము గాని, దానిని ఆశ్రయించి ఉన్న 'జగత్తు' మొదలైన దృశ్య సమూహములు గాని లేవు" ... అని తేలుచున్నది కదా! ఇదంతా జన్మరహితమైయుండుటచే "లేవు" అనునది యుక్తియుక్తమే అవుతుంది. 'బ్రహ్మము' ఒక్కటే సత్పదార్థము. ఇక ఇతరమైనదేదీ ఎక్కడా లేదు.

**పరమాకాశము - స్థూల/సూక్ష్మ దేహములు - దృశ్యము :**

నిశ్చలమగు సముద్రజలము తన జలత్వము త్యజించకుండానే చంచలమగు కెరటములుగా మారినది కదా! పరమాకాశమే తన ఆకాశరూపమును త్యజించకుండా జీవరూపమున ప్రకాశమును పొందుచున్నది. సంకల్పమే రూపముగా గల "చిద్వృత్తి" ఈ అసంఖ్యాకములగు జీవ రూపములను దాల్చుచున్నది.

ప్రథమజీవి (జీవత్వమునకు నాంది), విరాట్టు ప్రజాపతి అయివున్న ఆ బ్రహ్మదేవుని చిత్స్వరూప–ఆకాశదేహమునే మనం "అతివాహికము, సూక్ష్మదేహత్వము" అని పిలుస్తున్నాం.

ఇక ఈ 'దృశ్యము' విషయానికి వస్తే ఇదంతా కలలో కనబడే కొండలాగా భాసిస్తోంది. ఇది ... ఏ చిత్రకారుడో ఏకాగ్రచిత్తము నందు కల్పించిన "సేవాదళము" అను పంచరంగుల చిత్రమువంటిది. ఒక చిత్రకారుడు ఒక గొప్ప చిత్రమునకు రూపకల్పన చేసాడనుకోండి... ఆ చిత్రము యొక్క ప్రావీణ్యత అతని చిత్తమునందే అన్ని వేళల దాగియున్నది కదా!

ఈ జగత్తు ఒక స్తంభములో చెక్కబడిన శిల్పదృశ్యము వంటిది. విరాట్పురుషుడు (లేక ప్రజాపతి లేక బ్రహ్మదేవుడు లేక సమష్టి సృష్టి) ఆ స్తంభమున గల 'శిల' వంటివాడు, "ఆది ప్రజాపతి" ** అయిన ఆ బ్రహ్మదేవునికి, సామాన్యజీవునికి ఉన్నట్లు... సహకారికమైన "ఉత్పాతక కారణం" అంటూ ఏమీ లేదు. ఎట్లు అంటావా? జీవుడు... "ఈ ఇంద్రియానుభవములను

---

* ప్రజాపతి = సూక్ష్మతత్వము (Subtle body) యొక్క ఆదికారణ చైతన్యమే ప్రజాపతి యొక్క స్వరూపము.

** ఆది ప్రజాపతి = ప్రతిజీవుడు పూర్ణమగు ఆత్మయే కదా! శుద్ధతత్వమగు ఆత్మ సమష్టి–సృష్టి భావమును పొందునట్టి తత్వమునే 'ఆది ప్రజాపతి'గా చెప్పబడింది.

పొందెదనుగాక! వీరితో కలిసి జీవించెదను గాక" ... ఇట్టి ఆసక్తిపూర్వకమైన సంకల్పములచే అనేక శరీరములను పొందుచున్నాడు. ప్రజాపతియో ... అట్లు కాదు. అతడు స్వయముగానే పరమాకాశమున తననుతాను ప్రకటించుకొనుచున్నాడు.

ఇతఃపూర్వపు ప్రజాపతులు మహాప్రళయ సమయమున 'ముక్తులు' అయినారు. ముక్తులైన వారికి పూర్వపు కర్మలు, సంస్కారములు ఉండవు కదా! కెరటాలు జలంలో లేచి లయిస్తున్నట్లు బ్రహ్మమునందు బ్రహ్మలు వారివారి సృష్టులతో సహా లేవటం, లయించటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** అనగా ఆ ఆదిప్రజాపతియే దృశ్యములో ఎదురుగా ప్రాప్తిస్తున్న ఈ వస్తువులుగా అగుచున్నాడా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఈ జగత్ పదార్థములు అద్దంలోని ప్రతిబింబములాగా జీవుని చిత్తమునందు ప్రతిబింబిస్తున్నాయి. చిత్తమే శరీరముగాగల ప్రజాపతి "స్వతంత్రసత్త శూన్యుడు" అని చెప్పబడుచున్నాడు. దృశ్యమునకు అతీతమైన ఆత్మయే అతనికి ఆధారము. అతడు దృశ్యము గాని, దర్శనముగాని, ద్రష్టగాని స్వతహాగా కాకపోయినప్పటికీ ... అన్నీ తానే అగుచున్నాడు. దీపం నుండి మరొక దీపం వెలిగించబడునట్లు, ఆ ఆది ప్రజాపతి నుండే ఈ దృశ్య సమూహములన్నీ ఉత్పన్నమౌతున్నాయి. ఒక సంకల్పములో మరింకెన్నో సంకల్పములు, ఒక స్వప్నములో మరికొన్ని దుస్స్వప్నములు కలుగుచున్నట్లు, ఆ ఆది ప్రజాపతి యొక్క "సమష్టిసృష్టి" అను స్వప్నంలో అనేక 'జీవులు' అను అసంఖ్యాక స్వప్నములు ఉంటున్నాయి. చెట్టు నుండి కొమ్మలు, ఆ కొమ్మల నుండి అనేక ఆకులు ఉత్పన్నమగుచున్నట్లు, సమష్టి-సృష్టి స్వరూపుని స్వప్నము నందు అనేక వ్యష్టి-అల్ప-సమష్టి సృష్టులు బయల్వెడలుచున్నాయి. అతని స్పందము వలననే ఈ జీవుడు ఉత్పన్నమగుచున్నాడు. మట్టితో అనేక బొమ్మలు తయారు అయినప్పుడు ... ఆ మట్టికి - బొమ్మలకు అభేదమే సిద్ధిస్తోంది కదా! బాహ్యమైన సహకారి కారణము లేనప్పుడు - కార్య - కారణములు అభిన్నమే కదా! అదేరీతిగా ఈ సృష్టికి, పరమాత్మకు భేదం లేదు.

ఎవనియందు ఈ 'పృథివి' మొదలైన అలీకమైన (జలము నందలి ప్రతిబింబము వంటి) వస్తువులన్నీ కనబడుచున్నాయో, అతడే జీవాకాశస్వరూపుడగు* ఆదిబ్రహ్మ. అతడే ఈ "విరాట్ ఆత్మ ... విస్తారపదార్థ సృష్టి స్వరూపము" అని వేదజ్ఞులు చెప్పుచున్నారు.

❖

**శ్రీరాముడు :** భగవంతుడగు ఓ వసిష్ఠ మహర్షీ! మీరు చెప్పినదంతా విన్న తరువాత, ఇప్పుడు నాకు కొన్ని సందేహాలు కలుగుచున్నాయి. జీవుడు పరిమితుడా? అపరిమితుడా? జీవులు అనేకులు ఉన్నారా? ఒక్కడే ఉన్నాడా? ఒక వేళ అనేకులు ఉంటే వారందరు కూడా అనంతస్వరూపులేనా?

---

* ఈ కనబడే వస్తుజాలం ఇట్లు ఇంద్రియముల అనుభవంగా ప్రాప్తిస్తున్నాయి. ఆ ఇంద్రియములు శబ్దస్పర్శరూప రసగంధములను తన్మాత్రలలో ఉన్నాయి. ఆ తన్మాత్రలు చిత్తాకాశంలో ఉన్నాయి. చిత్తాకాశం జీవాకాశంలో ఉన్నాయి. 'శుద్ధచిత్' యొక్క ప్రథమ ప్రకటన అజీవాకాశమే.

వారందరు అచలము (కొండ) వలె మార్పుచేర్పులు లేకుండానే ఉంటున్నారా? అసలు ఈ జీవులందరు ఎక్కడి నుండి వెలువడుచున్నారు? విచిత్రం చూచారా? మేఘం నుండి జలధారలు పడుచున్నట్లు, సముద్రం నుండి అనంత సంఖ్యలో జలకణములు వెలువడుచున్నట్లు, అగ్ని నుండి రవ్వలవలె ఈ జీవులందరు అసంఖ్యాకంగా ఎటునుండో వెలువడుచున్నారు. ఉంటున్నారు. వీరందరు బయలుదేరినది ఎందులోంచి? ఎక్కడికి వెళ్ళుచున్నారు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నీ ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పమన్నావా? విను.

'జీవుడు' అనబడువాడు ఒక్కడూ లేడు. ఇక "చాలామంది జీవులు" అనే మాట ఎక్కడ ఉన్నది? నీ ప్రశ్న "కుందేటికి కొమ్ములు ఎందుకు కనబడుచున్నాయి?" అన్నట్లు ఉన్నది. జీవుడు లేడు. జీవరాశి లేదు. పర్వతమువలె జీవపిండము కూడా లేదు. నీకు కనబడుచున్న 'జీవుడు' అనబడుచున్నదంతా ... ప్రతిభాస, లేక ప్రతిబింబము వంటిదే కాని, వాస్తవము కాదు.

శుద్ధము, సర్వగతము (అంతయు ఆక్రమించి, ప్రసరించియున్నది), పవిత్రము అగు బ్రహ్మముగాక మరొక వస్తువే లేదు. ఆ బ్రహ్మము సర్వశక్తిమంతము. అందుచేత, ఈ కల్పనా కౌశలమంతా దానియందే ఉపస్థితమైయున్నది. ఆ చైతన్యమునందు సంకల్ప వృత్తులు ప్రతిబింబించి, తద్వారా ప్రతిబింబ (అళీక) మాత్రములైనట్టి ఈ సాకార – నిరాకారములగు పదార్థములుగా ఆవిర్భవిస్తున్నాయి. కాబట్టి ఇవన్నీ బ్రహ్మ ద్రష్టలకు ... బ్రహ్మమునందు, బ్రహ్మముగా కనిపిస్తున్నాయి. 'విత్తు' (Absolute knowing) అను లత "చైతన్యము" అను సంసర్గముచే "నీవు–నేను– పదార్థములు – అంతరంగ విషయములు" .... అను రూపుగల 'పూలు–కాయలు'గా వికసిస్తోంది. కనుక ఈ కల్పనా వృత్తుల ప్రకాశమంతా పూలు–కాయలతో కూడిన 'లత'గా పోల్చబడుచున్నది. దీనిని గాంచునది కూడా బ్రహ్మమే. "జీవుడు – బుద్ధి – స్పందము – మనస్సు – ద్వైతభావము – బ్రహ్మసత్త" ... ఇవే జ్ఞానగమ్యములగుచున్నాయి. అయితే వీటిలో ఏ ఒక్క దానికి స్వకీయమైన సత్త (Independent existence) లేదు. "ఏకమాత్ర బ్రహ్మము"నకు మాత్రమే అస్థిత్వమున్నది. మిగతావాటికన్నిటికీ బ్రహ్మము వలననే అస్థిత్వం ఏర్పడుతోంది. ఆ బ్రహ్మసత్తను తత్త్వపూర్వకంగా (తత్త్వమ్ = అదియే నీవు అను ఎరుకగా) తెలుసుకోకపోవటం చేతనే అది వేరైన సత్తవలె ప్రతిభాసమౌతోంది. తత్వతః గ్రహించిన తరువాత అది కాకుండా వేరొకటేదీ అగుపించదు. బ్రహ్మసత్తను అజ్ఞానము ఆవరించియున్నది. అయితే, భయపడ వలసినదేమీ లేదు. ఎందుకంటే, అట్టి అజ్ఞానమును 'ఆత్మజ్ఞానం' అనతికాలంలో వినాశనమొర్చుచున్నది.

❖

ఒక చమత్కారం ఏమిటంటే, "అజ్ఞానం ఎట్టిది? ఎందుకు సంభవిస్తోంది?" అనే విషయమై ఏమీ చెప్పలేం. "దీపపు వెలుతురు వలన చీకటి నశిస్తుంది"... అనే విషయం మనందరికీ తెలుసు. కాని 'చీకటి' అనగా ఏమో ఏమిచెప్పగలం? "వెలుతురు లేకపోవటమే చీకటి" అనిమాత్రం ఒక మాట అనగలం. అదేవిధంగా, "జ్ఞానము ఉదయించినప్పుడు అజ్ఞానము నశించుచున్నది"

... అని మనం తప్పకుండా చెప్పగలం. కాని, "ఈ అజ్ఞానం ఇట్టిది. ఇక్కడి నుండి వచ్చింది, ఇక్కడ ఉన్నది" అని మాత్రం నిర్వచించలేము. మేము బోధించునపుడు ... అజ్ఞానము తొలగే ఉపాయము లేమిటో చెప్పుచున్నాం. అజ్ఞానం ఎందుకు ప్రాప్తించిందో అది అనిర్వచనీయమే సుమా!

"పరిశుద్ధ తత్త్వమగు ఆత్మ మనన కారణంగా జగత్తును పొందుతోంది" అని చెప్పుచున్నాం. అట్టి బాహ్యప్రియత్వముతో కూడిన మననము ఎందుకు ప్రాప్తిస్తోంది?

**శ్రీరాముడు :** అవును ... ఎందుకు ప్రాప్తిస్తోంది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** అది మేము చెప్పజాలకపోతున్నాము. వాస్తవానికి అది అనిర్వచనీయము. నిజానికి మనకు ఆ విషయం అనవసరం కూడా! వ్యాధి ఏమిటో, దానికి చికిత్స ఏమిటో తెలిసిన తరువాత, "ఇతనికీ వ్యాధి ఎందుకొచ్చింది? ఎప్పుడు, ఎట్లా ప్రారంభమైంది?" అనునది అప్రస్తుతమేనని మా అభిప్రాయం. ఒకవైద్యుడు సుదీర్ఘకాలం వెచ్చించి వాటికి సమాధానాలు వెతక పూనటం కాలమును వృథాచేయుటయే కదా! వైద్యం చేయటానికి ఉపక్రమించటమే తక్షణ కర్తవ్యం కదా!

ఇప్పుడు మేము ప్రతిపాదించునది, "బ్రహ్మమే ఈ 'జీవుడు' అయివున్నది" అని కదా! కనుక నీవు నీ ప్రశ్నలలో తరచితరచి చెప్పుచున్న 'జీవుడు' అనువాడు బ్రహ్మమే. అట్టి బ్రహ్మము – "సర్వశక్తిమంతము, అఖండము, అపరిచ్ఛిన్నము, అనాది, అనంతము, సత్యము, చైతన్యరూపము" ... అయివున్నది. ఈ లక్షణములన్నీ జీవునియొక్క వాస్తవ స్వరూపము యొక్క స్వభావమే అయివున్నది. 'బ్రహ్మము' అనునది ఎక్కడో లేదు. ఎప్పటికో లభించునది కాదు. ఓ మహాబుద్ధిశాలీ! రామచంద్రా! ఈ జీవుని వాస్తవ స్వరూపమే బ్రహ్మము సుమా! దానియందు భేదకల్పనలు లేవు. ఈ కనబడుచున్న జగత్‌కౌశలమంతా కూడా (అపరోక్షానుభూతి సమయమందు) బ్రహ్మమునందే పర్యవసించుచున్నదని గ్రహించెదవుగాక!

**శ్రీరాముడు :** స్వామీ! మీరు చెప్పేదంతా బాగానే ఉన్నది. ఒప్పుకొంటున్నాను కూడా. కాని, మీరు "జీవసమష్టియే మహాజీవుడు" అంటున్నట్లు నాకు అవగతమౌతోంది. మరి ఈ వ్యష్టిజీవుడు ఎవడు? ఇతడు సమష్టిజీవుని అంగము వంటివాడా? ఒకవేళ అది నిజమైతే ... ఒక జీవుని యందు ఒక ఇచ్ఛ అన్ని జీవులలోను పుట్టాలి కదా? అలా జరుగుతోందా? లేదే! జీవులకు పరస్పరభేదమేదీ లేదని మీ అభిప్రాయమా? అట్లైతే ఈ వేరువేరు అభిప్రాయములు, జ్ఞానములు, సంకల్పములు మాట ఏమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** మంచి ప్రశ్నే వేశావు. చెపుతాను, విను.

బ్రహ్మమే సమష్టి జీవరూపమును గ్రహించి, అటు తరువాత వ్యష్టిరూపమును కూడా దాల్చుచున్నదని ... నేను ఇంతవరకు చెప్పినదానినిబట్టి గ్రహించే ఉంటావు కదా!

ఆ సర్వశక్తిమంతుడు, మహాజీవియగు అఖండ–బ్రహ్మమునందే ఈ 'జగత్‌వ్యవస్థ' అంతా ఇచ్ఛారూపమున ఉంటోంది. అతడు నిరంతరం దేనిని కోరుచూ ఉంటాడో, అయ్యది సత్వరము

ఫలిస్తూ ఉంటుంది. సత్యసంకల్పము (ఇది సత్యమైయున్నది – అను సంకల్పము) కూడా అతని ఇచ్ఛకు లోబడియే ఉంటోంది. అనగా ఆ బ్రహ్మము ఏది ఎట్లు సత్యమని భావిస్తే, అది అట్లే ప్రాప్తించుచున్నది.

అతనియందు ఇంతకుముందే "నేను 'వ్యష్టిజీవత్వము' అను అనుభవమును పొందెదను గాక" అనునట్టి భావబీజము ఉండి ఉంటోంది. ఈ విధంగా, సమష్టిజీవుడు 'వ్యష్టి' అగుట కూడా ఆ బ్రహ్మము యొక్క ఇచ్ఛాలీలయే. అతడు తన అంశలగు జీవన సమూహములను, "ఇది ఇట్లు అగును" అని సంకల్పించి కల్పించుచున్నాడు. ద్విత్వము (the second one) అనునది ఏకత్వము నుండే వస్తోంది కదా!

లౌకిక వ్యవహారం దృష్ట్యా ... ఏ కార్యము ఎట్లు చేయాలో సంకల్పించుటయే కాకుండా, తదనుకూలంగా అవలంబిస్తేనే ఆయా కార్యములు సిద్ధిస్తాయి కదా! కాని సమష్టిజీవి విషయం అట్లు కాదు. అతడు సంకల్పించినంత మాత్రం చేతనే, క్షణంలో కార్యము సిద్ధించుచున్నది. వ్యష్టిజీవి ఆయా కర్మలు నిర్వర్తించటం ద్వారా ప్రయత్నించినపుడు మాత్రమే ఏదైనా పొందుచున్నాడు. ఈ వ్యష్టి–సమష్టి జీవులకు (1) "సంకల్పించి + ప్రయత్నించి పొందటం, (2) సంకల్పించినంతమాత్రంచేత పొందటం" ... అనునట్టి నియమమునకు వ్యతిరిక్తంగా ఏదీ సంభవించదు.

**శ్రీరాముడు :** మహర్షీ! మహర్షుల కార్యములు సంకల్పమాత్రంగానే ఈడేరుచున్నాయి కదా!

**శ్రీ వసిష్ఠమహర్షి :** నిజమే. కాని, అది అట్లు జరుగుట కూడా మనం సమష్టి జీవుల ఇచ్ఛకే ఆపాదించవలసి వస్తుంది. "మహర్షుల సంకల్పము సత్యమై ప్రవర్తించుగాక" అనునట్టి సమిష్టి–జీవుని నిర్ణయమే అట్లు వారి వర–శాపాదులను శక్తివంతం చేస్తోంది. వ్యష్టి–జీవుని ఇచ్ఛకు కూడా కారణం సమిష్టిజీవుని ఇచ్ఛయే. అట్టి ఇచ్ఛ ఫలించటానికి కూడా అదే కారణం.

బ్రహ్మము ↦ ప్రధాన జీవుడు మహాజీవాత్మ → కల్పనా శక్తి → అనేక → వ్యష్టి జీవుడు

బ్రహ్మము ↦ క్రియాక్రమమునకు సంబంధించిన ఇచ్ఛ ⟶ ⟶ ⟶

'సమష్టిజీవి' లేక 'ప్రధానశక్తి' యొక్క నియమమునే "ఈశ్వరేచ్ఛ" అని అంటున్నాం. అట్టి ఈశ్వర–నియమమునకు వ్యతిరేకముగా ఏ కార్యమూ సిద్ధించదు. సర్వము దానిని అనుసరించే ప్రతిష్ఠితమై ఉంటుంది. కాబట్టి ఇవన్నీ ఈశ్వరేచ్ఛానుసారమే జరుగు చున్నాయి. వ్యష్టిజీవి ఇచ్ఛ వలన సిద్ధించేదంటూ ఏదీ లేదు.

బ్రహ్మమే స్వరూపముగాగల "మహాజీవి" ఆద్యంతరహితుడైయున్నాడు. అతడే కోట్లకొలది వ్యష్టిజీవుల – సమష్టిజీవుల యొక్క స్వరూపం. అతడు కాకుండా ఇంకేదీ ఇక్కడ లేదు. 'బ్రహ్మదేవుడు' అని మనం పిలుస్తున్నది సమష్టి జీవుని గురించేనని ఇతఃపూర్వమే చెప్పాను కదా! అయితే

"జీవుడు-బ్రహ్మ" ... లకు చైతన్యాంశమున భేదమేమీ లేదు. కాని ఉపాధియందు భేదమున్నది. 'జీవసమష్టి' అని మనం చెప్పుకొంటున్నవానికి ...

1. సూక్ష్మశరీరము (Subtle body),
2. కారణశరీరము (causal body - that body which causes every thing else)

... అని రెండు ఉంటాయి. ఇక వ్యష్టిజీవి విషయానికి వస్తే, అతనికి ఈ రెండు శరీరములే కాకుండా, క్రియకు ఆశ్రయమైన స్థూలశరీరము కూడా ఉన్నది.

నీవు చెప్పినట్లు, వేరువేరైన "వృత్తి-ఇచ్ఛ-ఫలము"ల తారతమ్యము వ్యష్టివిషయంలో తారసపడటానికి కారణం ఉపాధి భేదములే సుమా! "నాకీ శరీరము ప్రియము. నేను ఈ శరీరమునకు సంబంధించినవాడను మాత్రమే. ఈ శరీరమునకు సంబంధించిన హాని వృద్ధులు నావే. ఈ శరీరమునందుగల ఇంద్రియములకు అనుభవమగుచున్న ఆయా బాహ్యపదార్థముల సంస్పర్శచేత మాత్రమే నేను ఆనందించగలను" ... అని బ్రహ్మము (తాను చైతన్యతత్త్వమైనప్పటికీ) ఒకానొకప్పుడు జడభావమును పొందుచున్నది. జడవస్తువు చేత ఏర్పడుచున్న సంసర్గము చేతనే బ్రహ్మమునకు 'నేను జీవుడను' అనే అనుభవము, తద్ద్వారా విస్తారమైన
సంసారము వచ్చిపడుచున్నాయనే విషయం ఈ గ్రంథము చేతను, ఉపనిషత్తులు మొదలైన ఆత్మవిషయ ప్రతిపాదకమగు తదితర గ్రంథముల చేతను అనేక దృష్టాంతముల ద్వారా మరల మరల నిర్దుష్టముగా నిరూపించ బడుతోంది. ఈ సంసర్గము (attachment) దూరమైనప్పుడు "వ్యష్టిజీవభావము" తొలగిపోయి, ఆ స్థానంలో "మహాజీవత్వము" సిద్ధిస్తోంది. అదికూడా లయించినపుడు... ఇక సర్వదా సమరసపూర్వకమగు సమస్వరూపమే ఏర్పడుచున్నది. ఒక జడమైన కొయ్య, అగ్ని యొక్క స్పర్శచే అగ్నికణముగా మారుచున్నది కదా! రాగి, బంగారము యొక్క స్పర్శచేత గాని, ఔషధ ప్రభావం చేతగాని 'బంగారము'గా రూపమును పొందుతోంది కదా! వ్యష్టిజీవుడు కూడా తన సమష్టిత్వమును పొందుచున్నాడు. పరంపరా క్రమంగా ఆ సమష్టి జీవభావమును కూడా త్యజించటం జరిగినప్పుడు "నేను బ్రహ్మమునే" అనునట్టి బ్రహ్మభావమును పొందుచున్నాడు. అట్టి బ్రహ్మ భావమును పొందువాడు, "నేను అఖండుడను. సర్వదా సర్వతత్త్వములందు నిండియుండి, సర్వమునకు కారణమగుచు, దేనికి అంటకుండా ఉండెడివాడనైన నేను సర్వదా శుద్ధుడను. అనిర్వచనీయుడను. అనిర్దేశమగు సత్స్వరూపుడను" అనునట్టి అనుభవము కలిగి ఉంటున్నాడు. అట్టి స్వానుభవపూర్వకమగు అవగాహన కలిగియున్నవానికి ... పరమాత్మతత్త్వమగు బ్రహ్మమునకు భేదమేమీ ఉండదు. 'నేను బ్రహ్మమును' అని గ్రహించినవాడు బ్రహ్మమే కాక మరింకేమౌతాడు? చూచావా రామా! ఈ 'జీవుడు' అనబడువాడే కనిష్ఠ - జీవత్వము నుండి జేష్ఠ-జీవత్వము, జేష్ఠ-జీవత్వము నుండి జీవరాహిత్యమగు బ్రహ్మభావమును పొందుచున్నాడు. అట్లే ఇప్పుడు నీకు 'జీవుడు' అనబడు విధంగా కనబడువాడు ఒకప్పుడు 'నేను బ్రహ్మమునే" అను ఎరుకను త్యజించి, క్రమంగా 'నేను వ్యష్టిని' అనునట్టి స్వల్ప (లేక కనిష్ఠ) జీవత్వ భావనను పొందియున్నాడు.

| నేను బ్రహ్మమును. జీవతత్వమునకు అతీతుడను శుద్ధుడను / శాశ్వతుడను అఖండుడను అపరిమితుడను | నేను సమష్ఠి జీవత్వమును. జ్యేష్ఠ జీవత్వమును | నేను వ్యష్ఠిని. కనిష్ఠ జీవత్వమును పరిమితత్వమును |
|---|---|---|

ఈ వ్యష్టిజీవుడు (Individual soul) గా మనం (స్వదృష్టిదోషంచేత) చూస్తున్న ప్రతిజీవుని హృదయంలోను మహాకాశస్వరూపమగు ఆత్మ జాజ్వల్యమానంగా ప్రకాశిస్తోంది. అట్టి ఆత్మయందే ఈ జగత్తు 'అసత్తు' అయినప్పటికీ, సత్తువలె ప్రకాశించుచున్నది. వాస్తవానికి, ఆ విధంగా సత్తువలె ప్రకాశించటం చైతన్యముయొక్క చమత్కారమేగాని, వేరేమీకాదు. అనగా, చైతన్య స్ఫూర్తియే 'స్వచమత్కారం' చేత తనంతటతానే, భవిష్యత్ నామరూపములను గ్రహించుచు, "ఈ రూపమే నేను. ఈ పేరు నాది. ఈ వస్తువులు, వ్యక్తులు నాకు సంబంధించినవి" అనునట్టి అహంభావమును స్వీకరించుచున్నది. కాబట్టి రాఘవా! "ఈ వ్యష్టిజీవుడు 'చైతన్య బింబము' యొక్క చిదాభాస ప్రతిబింబమే" అని గ్రహించు.* చైతన్యము–చిదాభావము (Reflective) అనబడు బింబ– ప్రతిబింబాలు "చిన్మయము" గాక వేఱేమీ కాదు. అట్టి చిదాభాసయే జగత్తు రూపంలో ఆత్మచైతన్యము నందు ప్రతిబింబిస్తోంది. కనుక ఈ ప్రకాశము కూడా చైతన్యప్రకాశమే.

❖

'వ్యష్టిజీవుడు' అనబడుచున్న చిదాభాస చైతన్యము లేక ప్రతిబింబ చైతన్యము / (Reflection of pure consciousness) ..... బింబ చైతన్యము (సమష్టిజీవము, మహాజీవము) కంటే అభిన్నమే అయినప్పటికీ "పరిణామము" మొదలైన విషయాల దృష్ట్యా విభిన్నముగా తెలియబడుచున్నది. ఇట్టి విభిన్నత్వము కూడా చైతన్యము వలననే సంభవించుచున్నది. "చేతనము – జడము – జడప్రకాశము"... ల అభిన్నానుభవం, భ్రాంతిచేత భిన్నముగా కనబడటం... అనునదే జగద్రూపవ్యవహారమని గ్రహించెదవు గాక! చేతన–స్వరూపమగు బ్రహ్మము యొక్క విశాలశక్తి ఆకాశముకంటే కూడా అత్యంత సూక్ష్మమైనది. ఈ అహంభావం కంటే కూడా అత్యంత సూక్ష్మమైనది. ఈ అహంభావ దర్శనమంతా బ్రహ్మమునందే, దానిచేతనే, దానివలననే ఏర్పడుచున్నదని గ్రహించువారు బ్రహ్మస్వభావులే అగుచున్నారు.

"వ్యష్టిజీవుడు–సమష్టిజీవుడు" ... అను రెండు విషయములు వాస్తవదృష్టిలో అభిన్నములు. వ్యష్టిలో సమష్టిత్వమున్నది. సమష్టిలో వ్యష్టిత్వమున్నది. జలములోని అనేక తరంగములకు, అందులో

---

* సూర్యబింబము ఆకాశములో ప్రకాశించునప్పుడు ఆ బింబము ఒక తటాకంలోని జలంలో కూడా ప్రతిబింబిస్తుంది కదా! ఆకాశమున ఉన్న సూర్యుడు "బింబము" అని, నీటిలో ప్రతిబింబించే సూర్యుడు "ప్రతిబింబము" అని ఇక్కడ దృష్టాంతంగా గ్రహించాలి. ఆకాశ సూర్యుడు వాస్తవంగాని, ప్రతిబింబ సూర్యుడు కాదు కదా!

గల ఒకానొక తరంగమునకు భేదమేమున్నదో చెప్పు? ఒక తరంగమునకు, అనేక తరంగములకు, జలమునకు అభేదమే సిద్ధిస్తోంది కదా! అట్లే వ్యష్టిజీవుడు - సమష్టిజీవుడు - చైతన్యములు అభేదమైనవని గ్రహించెదవు గాక! భేదముగా గ్రహించబడటం అజ్ఞానము చేతనే సుమా! అజ్ఞానమే "నీవు - నేను - అతడు - జడము - చేతనము"లతో నిండినట్టి ఈ జగద్దర్శనమునకు అసలైన కారణమగుచున్నది. చైతన్యశక్తియే అహంకారముతో కూడినట్టి ఈ బ్రహ్మాండమును తనయందు తాను లీలామాత్రంగా దర్శిస్తోంది. ఇంతకుమించి ఇక్కడ ఏ ప్రత్యేకమైన విషయము లేదు. 'చిత్' శక్తి తన నిజరూపమున స్వయముగా కల్పించుకొనుచున్న మనోహర 'వివర్తవైచిత్ర్యమే' (down word view) ఈ 'జగత్తు' అనబడుచున్నది.

❖

ఈ 'బుద్ధి' మరియు 'అహంకారము' అనబడునవి కూడా ఆ చిత్‌శక్తి యొక్క వివర్తము మాత్రమేనని గ్రహించు. అనగా 'నేను జీవుడను' అను, మూలభావంతో కూడుకొని కనబడేదంతా ఒక 'కల్పన' వంటిదేగాని, వాస్తవము కాదు. అదేవిధంగా, "శబ్ద - స్పర్శ-రూప-రస-గంధములు" ... అనబడే పంచతన్మాత్రలు కూడా చైతన్యము యొక్క వివర్తములే అయివున్నాయి. ఇక ఈ ద్వైత-ఏకత్వభావం గురించి వేరుగా చెప్పేదే మున్నది? ఇదంతా చిత్‌శక్తి (లేక ఆత్మభగవానుని) కంటే వేరుగా కనబడుటకు మూలకారణం వాసనలే. వాసనలు అజ్ఞానము నుండే కలుగుచున్నాయి. "వాసనలు" అనగా ... అనేక శారీరక-మానసిక క్రియాపరంపరల పర్యవసానమే. కనుక రామా! నీవు ఈ వాసనలను, తత్సంబంధమైన కర్మల పర్యవసానమును మొదలంట పరిత్యజించెదవు గాక! ఈ "నీవు -నేను-నీది-నాది" అను స్వల్పదృష్టులకు అతీతుడవగుము. అప్పుడుగాని, నీకు సత్యము సుస్పష్టం కాదు. "సత్యము-భ్రమ"... అను ఈ రెండు అత్యంత జటిలంగా కలిసిపోయి ప్రవర్తిస్తున్నాయి. నీవు ఎప్పుడైతే వాసనలను, భేదభావనలను త్యజించివేస్తావో ... అప్పుడు సత్యము శేషించి అనృతము (అసత్యము) తొలగిపోగలదు.

నాయనా! రామా! "ఈ దృశ్యము ఏమై ఉన్నది?" అనునది ఎరిగినవాడవై, దాని కారణ - కారణమైయున్న నీ స్వస్వరూపముయొక్క ప్రాప్తియందు రమించుచుండుము. మేఘములచే కప్పబడి ఉన్నప్పుడు ఆకాశము యొక్క స్వరూపము గ్రహించగలమా? మేఘములు తొలగిపోయినప్పుడో? ఆకాశము యొక్క వాస్తవమైనట్టి, అఖండమైనట్టి స్వరూపము గోచరిస్తుందికదా! స్వస్వరూపము విషయము కూడా అట్టిదే. శరీరముల పట్ల, దృశ్యముల పట్లగల భ్రమలు తొలగిన మరుక్షణం స్వస్వరూపము యొక్క వాస్తవమైన అఖండత్వము, నిత్యత్వము, "దేశ-కాల"-అతీతత్వము గోచరిస్తాయి. ఈ ఆకాశము యొక్క స్థితత్వము ఆకాశమునందే గోచరిస్తుంది కదా! అదేవిధంగా దృశ్య ప్రపంచము తొలగిపోయినప్పుడు కూడా 'చిత్‌శక్తి' యొక్క స్వాభావికసత్త గోచరించ గలదు. నీ స్వరూపము ఆ స్వాభావికసత్తయే. చిత్‌శక్తి కంటే దాని స్వాభావికసత్త వేరైనది కాదు సుమా!

అసలు సత్త అంటే ఏమిటి? 'అసత్త' అంటే ఏమిటి? మాకీ తేడా ఏమిటో తెలియవచ్చుట లేదు. ఒక్క విషయం నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను. విను. "దృశ్యప్రపంచము విచారణచే తొలగిపోగా

... ఈ జీవుడే అప్పుడు స్వచ్ఛుడై వెలయును" అని ఖచ్చితంగా, అనుభవ పూర్వకంగా చెప్పుచున్నాం. ఆ స్థితిలో చిత్‌శక్తి యొక్క స్వాభావికత్వమునకు, స్వస్వరూపమునకు అభేదమే అనుభవమవుతోంది.

❖

ఓ రామచంద్రా! మనఃచేష్టారూపమగు సూక్ష్మజగత్తు (ఆతివాహిక జగత్తు Zone of thought process) శూన్యము మాత్రమే. ఇంద్రియములచే అధిష్ఠితమైయున్న ఈ శరీరాదులు, ఈ బ్రహ్మాండములు ... ఇవన్నీ చైతన్యము యొక్క భావనావివర్త మాత్రములే కదా! చైతన్యము కంటే భిన్నమైనది ఎక్కడ ఏమున్నది చెప్పు? ఏ పదార్థం ఎద్దాని నుండి ఉత్పన్నమౌతోందో, అట్లు ఉత్పన్నమైనది తన మూలమైన దానికంటే వేరైనది ఎట్లా అవుతుంది? నీటి నుండి ఉత్పన్నమైన మంచు నామ-రూప-రంగు భేదంచేత జలముకంటే వేరుగా తోచుచున్నప్పటికీ .... మంచుగడ్డ ఏ సమయమందు కూడా ... జలము కంటే వేరైనది అయివుండదు కదా! స్థావరపదార్థములకే ఈ నియమము చెల్లుచున్నప్పుడు ఒక నిరవయవ పదార్థముల గురించి వేరుగా చెప్పేదేమున్నది? వ్యష్టివలె తోచుచున్న అహంకారము, శుద్ధ బ్రహ్మ చైతన్యము నిరవయవములైనవే! అవి రెండు వేరువేరైనవి కావు.

❖❖❖

## 22. అహంకార స్వరూపము

చిత్‌శక్తి స్వయం ప్రకాశకము. దానికి నామరూపాలు లేవు. దాని స్వయంకల్పిత స్ఫురణయే 'జగత్తు' రూపంగా ప్రతిబింబిస్తోంది. ఈ మనస్సు, బుద్ధి, అహంకారము, పంచభూతములు, పర్వతములు, దిక్కులు... ఇదంతా చైతన్యము యొక్క సంకల్ప పూర్వక రచనా చమత్కారమే. ఎందుకంటావా? ఈ జగత్తు యొక్క స్వరూపము దీని దర్శనము చైతన్యమునందే పర్యవసిస్తోంది కదా! కనుక, "ఈ జగత్తు చిత్‌శక్తి యొక్క ధర్మము (function)" అనునది గ్రహించెదవు గాక! జగత్తును వదిలివేస్తే చిత్‌శక్తి యొక్క శక్తిత్వమే శేషిస్తోంది. అప్పుడు శేషించుదానికి నామరూపాలు లేవు. "జగత్తును వదలుట" అంటే ఏమిటి? జగద్భావమును వదలుటయే. ఓ రామచంద్రా! వాస్తవానికి నీవు భావములకు అతీతమై, భావములను కల్పించువాడవేగాని భావనా సిద్ధుడవు కాదు. ఇది నిత్యసత్యము. 'జగత్' భావము తొలగినప్పుడు జడపదార్థము యొక్క పరిణామము కూడా "చిత్‌శక్తి"లో కరిగిపోవుచున్నదని అనుకొన్నాము కదా! జగద్భావం ఉన్నంతవరకు భేదభావం తొలగదు.

ఇప్పుడు చెప్పు! ఈ జగత్తుకు స్వతంత్రసత్త ఎక్కడున్నది? మరల చెప్పుచున్నాను. విను. "చిత్‌శక్తి" యందు, "ప్రపంచమును ప్రకటించటం" అను శక్తి స్వయంకృతమై (Self designed) ... ఆ శక్తి నుండి వేరుకానట్టిదైయున్నది. అది జీవరూపమున, తన్మాత్ర ... (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముల అనుభవములను పొందునది) రూపమున ప్రతిభాసమై జగత్తుగా కన్పట్టుచున్నది.

చిత్తుతో కూడిన అహంభావ స్ఫురణయే ప్రాణముతో కూడి, "జీవుడు" అనబడు సంజ్ఞను పొందుచున్నది.

చమత్కారం చూచావా? "చిత్‌శక్తి" .... దానియొక్క 'స్ఫురణ' అనునవి అహంభావం చేత వేరుపరుపబడినవై జీవసంజ్ఞను దాల్చుచున్నాయి. అయితే ఈ వ్యవచ్ఛాధర్మము (the function of differentiation) క్రీనీడవంటిది మాత్రమే కాని వాస్తవము కాదు. "అహంభావమును జయించటం" అనగా ..... అద్దానిని అవాస్తవ – దృష్టిచే దర్శించుటయే. అంతేగాని, దానిని ఒక వస్తువులాగా భావించి, తొలగించుటకు యత్నించుట కాదు. లేదంటావా, అట్లు ప్రయత్నిస్తూ ఉంటే, 'అహంకారము' యొక్క ఉనికిని అంగీకరించుటయే అయి, ఇక ఆపై మాయ పరిఢవిస్తూనే ఉంటుందని గ్రహించు.

క్రీనీడ వంటిదే అయినట్టి 'అహంభావము' వాస్తవదృష్టిచే పరికించబడినప్పుడు, "ఇది బ్రహ్మమే" అని తెలియవచ్చుచున్నది.

❖

ఈ 'జగత్తు' విషయమై మరికొన్ని విశేషాలు చెపుతాను. విను.

చైతన్య ప్రధానమగు అహంకారమే అన్నింటికి కర్త. క్రియా ప్రధానమగు ప్రాణమే 'కర్మ'. "కర్త" అనగా ... 'క్రియనిర్వర్తించునది' అని కదా! కర్తకు – క్రియకు భేదం లేదు. అందుచేత, అహంకారమునకు – ప్రాణమునకు భేదంలేదు. కర్తయొక్క ధర్మ (functional) విశేషమే కర్మ. అందుచేత, మనం 'జీవుడు' అని పిలుస్తున్నది కర్మనే సుమా!

క్రియామయమగు జీవుడే పురుషుని* యొక్క చిత్తము. ఈ చిత్తమే ఇంద్రియరూపమున ప్రకటితమై నానావిధాలుగా ప్రతీయమానమగుచున్నది. ఇక కార్య–కారణభావముల (Effect & cause experiences) విషయానికి వస్తే ఇదంతా అళీకమే. (లేక దర్పణములోని ప్రతిబింబము వంటిదే). ఈ జగత్తు అంతా చిత్ప్రకాశముయొక్క అంశయే కనుక ఇందు భేదత్వమునకు తావు లేదు. ఇదంతా అభేదత్వమే అయివున్నది.

❖

**అచ్ఛేద్యోహమదాహ్యోహమక్లేద్యోశోష్యయేవచ**
**నిత్యః సర్వగతః స్థాణురచలోహమితి స్థితమ్ ॥**

అహంకారమునకే స్థానభూతమైన ఆత్మకు ఛేదింపబడుట, దహింపబడుట, తడుపబడుట, శోషింపబడుట అనునవి లేవు. అది సర్వవేళలందు సర్వవికారములకు అతీతమైయున్నది. అయ్యది నిత్యము, సర్వగతము, స్థిరము అచలము కూడా. ఓ రాఘవా! మేము ఆత్మయొక్క స్వరూపము (లేక బ్రహ్మతత్త్వమును) గ్రహించియున్నాం. అట్లు స్వానుభవంగా గ్రహించిన దానినే లోకములకు ప్రకటిస్తున్నాం. తమ స్వస్వరూపమును గ్రహించనట్టి అనేకమంది జీవులు భ్రమాత్మకము, దుఃఖప్రదము అయినట్టి పరహింస, పరదూషణ వంటి నీచకార్యములను ఆశ్రయిస్తున్నారు. శాస్త్రములు

---

* పురుషుడు : పురుషకారము (Effort) రూపముగలవాడు.

ప్రతిపాదించుదానిని తిరస్కరిస్తున్నారు. ఫలితంగా అనేక దౌర్భాగ్యములు అనుభవిస్తున్నారు. అయితే ఈ దృశ్యవ్యవహారము యొక్క ఆటలన్నీ 'అజ్ఞాని' వద్ద మాత్రమే సాగుచున్నాయి. అతనికి మాత్రమే ఇదంతా మూర్తివంతమై, వికారాదులతో కూడి సార్థకత పొందుతోంది. జ్ఞానికో ... ఈ దృశ్య ప్రపంచమే అగుపడటం లేదు. అతడికి అనుభవమగుచున్నది చిదాకాశమే. స్వీయా అహంకారంతో సహా ఈ సర్వ సత్-అసత్ భావములన్నీ నదీజలం సముద్రం చేరునట్లు, చిదాకాశమునందే ప్రవేశిస్తున్నాయి. నీటిలో వేయబడిన ఉప్పువలె, అతనిని చేరుచున్న రూప-నామాలన్నీ స్వస్వరూపమునందు నిశ్శేషముగా లయించిపోతున్నాయి. ఓ రామచంద్రా! ఇప్పుడు మనం జ్ఞానుల దృష్టినే మరల-మరల స్వీకరించాలి. అంతేకాని, అజ్ఞానుల భేదదృష్టిని ఎంతవరకు తరచి చూస్తే మాత్రం ఏం ప్రయోజనం?

❖

"చిత్"ను (ఉపనిషత్తు ద్రష్టలు) ఒక వృక్షముతోను,
"మాయ"ను వసంతము యొక్క రాకతోను,
"జడశక్తి"ని ఆ వృక్షములోని రసముతోను,
"కాల దూరాదుల"ను ఆ చిత్‌వృక్షము యొక్క పుష్ప-ఫలములతోను పోల్చుచున్నారు.

ఆ బ్రహ్మమే అన్నివేళల, అన్నిచోట్ల, అన్ని రూపములతోను ప్రకటితమగుచున్నదని చెప్పటానికే నేను ఈ ఉపమానం తీసుకొన్నాను. కనుక, శూన్యమే రూపముగా గల ఆకాశము, స్పందమే ధర్మముగా గల వాయువు, తేజము, జలరాశి, భూమి, ఓషధ స్వరూపుడగు చంద్రుడు, మహాజ్యోతి స్వరూపుడగు సూర్యుడు మొదలైన రూపములుగా ప్రకటితమగుచున్నది - ఆ అద్వితీయ బ్రహ్మమే సుమా! 'బ్రహ్మసత్త' కాకుండా వీటికి వేరైన స్వతంత్రసత్త లేదు. స్వస్వరూపజ్ఞానం చేత దృశ్యప్రపంచము లయించిందనుకో .... అప్పుడు 'చిద్బ్రహ్మము' తనయొక్క పూర్వభావముననే వెలయగలదు.

జాగ్రత్-స్వప్న-సుషుప్తులతో కూడా బ్రహ్మమే అట్లు స్ఫురించుచున్నది. ఈ మూడు స్థితులు - "జడభావ సమ్మేళనము" లేక "మనోభావ ప్రాప్తి" అనువానియందే ఉండి ఉన్నాయి కదా! వాటిలో కనబడే తేడా అంతా ఈ రెంటి యొక్క సమ్మిళితము నందు మాత్రమే. 'బ్రహ్మసత్త' నుండే 'జగత్‌సత్త' ఏర్పడుచున్నది. అయితే ద్రష్ట నుండి వేరుగా స్వరూపతః చూచినప్పుడు జగత్తు అసత్యమే. "మాకు ఈ జగత్తు ఇట్లు ఎందుకు ప్రాప్తించుచున్నది?" అను ప్రశ్నకు సమాధానంగా, "మీరు అద్దానిని అట్లు భావించటం చేతనే" అని చెప్పుచున్నాము.

ఈ "జగత్తు" అనబడునది :

చిత్‌స్వరూప - మహాకాశము యొక్క "శూన్యము"
చిత్‌స్వరూప - వాయువు యొక్క "స్పందము"
చిత్‌స్వరూప - గాఢాంధకారము యొక్క "స్పందము"
చిత్‌స్వరూప - సూర్యుని "దినకల్పన"

... అని విజ్ఞులు రసమయంగా చెప్పుచున్నారు. కనుకనే, ఇది స్వరూపతః చూచినప్పుడు "అసత్యము" అని నేను ప్రకటించాను.

కాని అధిష్ఠానరూపమున (ఇదంతా ఎందు నిక్షిప్తమై ఉన్నదో అట్టి శుద్ధతత్త్వమున) సత్యము. దీపశిఖ ఆరిపోతే మసి మాత్రమే మిగులుచున్నది కదా! జగత్తు నశించినప్పుడు బ్రహ్మమే మిగులుచున్నది. ఆకాశము నందు "నీలిరంగు పదార్థము ఉండుట" అను ప్రసక్తి అవాస్తవమైనట్లు, ఇక్కడ (ఈ దృశ్యమునందు) భేదవికారములు కనబడు చున్నప్పటికీ ... వాస్తవానికి ఈ భేదవ్యవహారం బ్రహ్మమునందు లేదు. ఈ స్వర్గ – మర్త్య – పాతాళ లోకములు అసత్తులే (స్వకీయమైన ఉనికి లేనివి) అయినప్పటికీ, సన్మయంగా (సత్+మయము .... వాస్తవమైన ఉనికి కలిగియున్నట్లు) కనబడటంచే ... అనేక శబ్ద వ్యవహారములకు యోగ్యములు అవుచున్నాయి.

ఒకడు చీకట్లో త్రాడును చూచి 'పాము' అని తలచుచున్నాడనుకో ... ఆ త్రాడు – పాముగా చూడబడుచున్నదాని కంటే వేరైనది కాదు కదా! అట్లే ఈ జగత్తే బ్రహ్మము. కల్పిత పదార్థముల సత్త (లేక అసత్త) అధిష్ఠాన సత్త కంటె వేరైనది కాదు. త్రాడు – పాముల (వాస్తవము – అవాస్తవము నందు కల్పించబడిన) భ్రమ సత్ – అసత్తులు ఒక్కటే కాని వేరువేరు అయిన విషయాలు కావు కదా! అట్లే బ్రహ్మము – ఈ జగత్తు ఒక్కటే.

"అవయవి–అవయవములు" అను శబ్దములకు నిరాకార–సాకార అర్థకల్పనలు చేసి "ఆ రెండింటికి వేరువేరైన 'సత్త' ఉన్నది" అని ఆరోపణ చేయటం దోషభూయిష్ఠమైన యోచన – అని మా అభిప్రాయం. ఇట్టి శబ్దార్థ – కల్పన కుందేటి కొమ్ములాగా అర్థం లేనిదే. "నది" అని మనం దేనిని పిలుస్తున్నాం? నీరు–నేల–గట్లు ... ఈ మూడింటి సమన్వయమే కదా? ఇవి కాక, నది అనునది ఎక్కడున్నది? ఇట్లే సముద్రం కూడా? అట్లే తదితర శబ్దార్థములన్నీ. అట్టిదే ఈ కనబడు "అవయవి–శరీరము" అనునవి కూడా! ఇట్లు ఈ జగత్తే బ్రహ్మము.

❖

ఒక దృష్టాంతము చెపుతాను. ఒక స్ఫటికం తన బైట–లోపల కూడా నిండి ఉన్నట్లు అగుపడుచున్నప్పటికీ, దానియందు ఆకాశము ఉండనే ఉండివున్నది కదా! ఐతే ఎదురుగా ఉండే పదార్థములను తనయందు ప్రతిబింబింపచేయుటకు (ప్రతిబింబమునకు అధిష్ఠానం) ఆ స్ఫటికమే కదా! అదేవిధంగా, చిన్మయమగు 'మాయ' కూడా, లోన–బయట జడమే అయినప్పటికీ, దానియందు "చిత్ ప్రతిబింబము" పడుతోంది. చిత్ ప్రతిబింబముతో కూడిన మాయయందు ఈ 'అసత్తు' అయినట్టి జగత్తు ప్రతిభాసితమగుచున్నది.

"స్ఫటికం" మొదలైన పదార్థ సమూహములలో అంతర్గతమైయున్న స్థూలాకాశంలో ఈ ఆకాశజనితమైన 'వాయువు' మొదలైనవాటి సంపర్కము ఉండదు కదా! అట్లే చిదాకాశమునందు కూడా "నీవు–నేను–అతడు" మొదలైనవాటి యొక్క 'సత్–అసత్తు'ల మాలిన్యం ఉండదు.

మరొక దృష్టాంతం ద్వారా జగత్–బ్రహ్మముల అభేదం చెపుతాను, విను. ఆకులో ఉండే

ఈనెలు ... ఆ ఆకునుండి వేరుకాకున్నప్పటికీ వేరైనట్లు తోచటం లోకవిదితమే కదా! జగత్తు కూడా బ్రహ్మము నుండి వేరుకాకపోయినప్పటికీ వేరైనట్లు కనిపించుటయే మాయ యొక్క చమత్కారం. కనుక జగత్తు–బ్రహ్మము పరస్పరం అభిన్నములే. బ్రహ్మము ఈ జగత్తును ధరిస్తోంది. కారణమునకే కారణము – ఆదికారణము బ్రహ్మమే. చిత్తమునకు అధిష్ఠానమగు చైతన్యము అదే. బ్రహ్మదేవునికే ఆదికారణం బ్రహ్మము. అదియే శివము, తత్త్వము, మర్మము మొదలైన అర్థపూరితమైన ప్రవచనములచే చెప్పబడుతోంది.

❖

**చిత్తు :** ఈ జగత్తు నందు స్వరూపాదులు తోచుచున్నాయి కదా! అయితే అట్టి స్వరూపాదుల అనుభవమునకు మూలకారణమేమిటి? ఆ స్వరూపాదులకు సంబంధించిన అంతరంగమునందలి జ్ఞానస్ఫురణయే కదా! అట్టి చిత్తు లేక జ్ఞానము అకారణమే (కారణరహితమే) అని చెప్పబడుతోంది. "సర్వ స్వరూపావస్థలకు ఉపాధి కారణము ... బ్రహ్మమే" అని కూడా శాస్త్రములు చెప్పుచున్నాయి. అట్టి ఈ చిత్తు స్వానుభవమాత్రమే గాని, మరొకరిచే ప్రసాదించబడునది, తెలియజేయబడునది కాదు.

**చేత్యము :** చేత్యము (తెలియబడునది) చిత్తు (లేక ద్రష్ట) యొక్క భావనను అనుసరించి మాత్రమే ఉంటోంది. జ్ఞానదృష్టిచే "చేత్యము–లేదు" అనునదే సిద్ధిస్తోంది. "ఇది బాగున్నది. ఇది పొందుటయే గొప్ప. ఇది లేకున్న దుఃఖమే" ... మొదలైన సమాచారమంతా ద్రష్ట యొక్క కల్పనను ఆశ్రయించే ఉంటోంది. ఒక కల్పనచే ఉండి, వేరొక కల్పనచే లేకుండటం వల్ల చేత్యమును "సదసత్తు" (ఉండి – లేకవున్నది) అని అంటున్నారు.

అయితే అసత్తా వ్యవహారమగు ఈ దృశ్య జగత్తు పట్ల 'దృష్టి' (లేక ఆసక్తి) ఉన్నంత కాలం, చేత్యమునకు (తెలియబడుదానికి) అతీతమైయున్నట్టి చిత్తు అనుభవమునకు వచ్చుట లేదు. అనగా నీవు, నీ స్వస్వరూపమగు ఆత్మ యొక్క అనుభవం (చిత్తు యొక్క అనుభవం) పొందాలనుకొంటే :

1. "ఎదురుగా ఉన్న ఈ దృశ్యము స్వతహాగా ఉన్నది కాదు. ఇది నా యొక్క సంస్కారములచే చేయబడుచున్న కల్పన యందే ప్రతిష్ఠితమైయున్నది" అని గ్రహించాలి.

2. అట్లా గ్రహించుటచే దృశ్యాతీతుడవు కావాలి. (అదియే సంసారాతీతము – లేక – చేత్యాతీతము).

ఇక్కడ నీవు మరొక విషయం కూడా గ్రహించాలి. "చేత్యచిత్తు"* మాత్రమే అనుభవమునకు లభ్యమౌతోంది. చేత్యరహితమైన చిత్తు** (Perceiver without perception or Knower without the function of knowing) లౌకిక వ్యవహారమునకు, పదజాలమునకు వర్ణనలకు లభ్యమవదు.

---

* చేత్యచిత్తు = చేత్యము లేక తెలియబడు దానిని గ్రహించు సంస్కారవృత్తులు గల చిత్తు.

** చేత్యరహితచిత్తు = బాహ్యసంస్కారవృత్తులు అంటూ లేని చిత్తు

చేత్యవృత్తితో కూడిన చిత్తు మాత్రమే ప్రకటితమౌతోంది. లేదా చేత్యరహిత చిత్తు అప్రకటితంగానే ఉండిపోతోంది. బీజము లోని అంకురమే వెలువడుతుంది కాని, బీజములో లేని అంకురం వెలువడదు కదా! ఓ రామా! బ్రహ్మమునందు జగద్బీజము ఉండనే ఉండి ఉన్నది సుమా! కనుక కృత్రిమదృష్టితో "ఈ జగత్తు తొలగుగాక" అనునట్టి ప్రయత్నముతో వ్యవహరించవలసిన పనేమున్నది? "ఈ జగత్తు ఎట్లైనను ఉండుగాక! లేక తొలగుగాక! ఇదంతా బ్రహ్మమే. ద్రష్టనగు నేను కూడా బ్రహ్మమే" ... అనునదే ఉత్తమదృష్టి.

ఆకాశమునకు ... "ఇది వేరు – అది వేరు" అను భేదము ఎక్కడ ఉన్నది? ఒకవేళ వేరు–వేరుగా (దిక్కులు, పదార్థరూపనామముల దృష్ట్యా) కనబడినా అదంతా ఆకాశము యొక్క స్వరూపమే కదా! కనుక నీవు భేద శూన్యుడవై "ఈ త్రిభువనములన్నీ బ్రహ్మ స్వరూపములే" అనునట్టి నిశ్చయము కలిగియుండుము.

సభ్యులందరు తమ సాయంసంధ్యా కార్యక్రమములు నిర్వర్తించుటకుగాను సాలోచనలతో గృహోన్ముఖులయ్యారు.

❖❖❖

## (మూడవ రోజు విచారణ పూర్తి అయింది)

❖❖❖

# నాల్గవ రోజు

# III. లీలోపాఖ్యానం - కథావిషయం

## (మండపోపఖ్యానము)

## 1. జగద్భ్రమ

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ దృశ్యజగత్తు చిదాకాశమే కాని వేరేమీ కాదని నిన్న మూడవ రోజు చెప్పుకొన్నాం కదా! ఇక మనం నాల్గవ రోజు విచారణలో ప్రవేశిస్తున్నాం.

సభికులంతా శ్రద్ధాసక్తులతో వినండి.

ఒకనికి నిర్మల-ఆకాశంలో ఆకారాదుల భ్రమ కలుగుచున్నట్లు, నిర్మలమగు ఆత్మయందే ఈ జగద్భ్రమ కలుగుతోంది. ఒక స్తంభమున చిత్రించబడిన శిల్పము ఆ స్థంభము లాగానే శిలయే అయివున్నది కాని - మరింకేమీ కాదు కదా! చిత్-రూపము అనే స్తంభమున చెక్కబడిన ఈ జగత్తు కూడా చిద్వస్తువు కంటే వేరు ఏమాత్రం కాదు. అయితే, మనం ఇక్కడ చెప్పుకొంటున్న ఉపమానంలో ఉన్న తేడా ఒక్కటే. మామూలు శిలాస్తంభములో శిల్పము లభించాలంటే, ఒకానొక శిల్పి ఉండాలి. కాని ఈ జగత్తు చిత్ - వస్తువు నందు ప్రకటితమవటానికో ... ఏ శిల్పి అవసరం లేదు. సముద్రజలంలో తరంగములు ఉండటం సహజమైన విషయమే కదా! బ్రహ్మము నందు ఈ దృశ్యజగత్తు ప్రతీతమై ఉండటం కూడా సహజమైన విషయమే. అజ్ఞాని యొక్క దృష్టిలో జగత్తు అత్యంత స్థూలమై ఎదురుగా నిలచి ఉంటోంది. ఇక జ్ఞాని దృష్టికో ... ఇదంతా అనేక మట్టి పాత్రలలోని ఒకే 'మట్టి' లాగా, అనేక కిరణములలోని ఒకే సూర్యతేజములాగా, సూక్ష్మముగాను, భేదశూన్యముగాను అనుభవమౌతోంది. వేరువేరు సూర్యకిరణములు వేరువేరు వస్తు సమూహములను ప్రకాశింపజేస్తున్నప్పటికీ, కిరణములన్నీ సూర్యతేజము నుండి బయల్వెడలుతూ, దానికి అభేదంగానే ఉంటున్నాయి కదా! అయితే, బ్రహ్మజ్ఞానము లేకపోతే జగత్తు యొక్క సూక్ష్మ భావము అనుభవము కాదు సుమా!

కనుక, ఈ జగత్తునందు భూమి, ఆకాశము మొదలైనవి అనుభూతమగుచున్నప్పటికీ వాటి స్వరూపము చిదాకాశమే. అవన్నీ స్వప్నమునందలి కల్పనవలె భ్రమాత్మకము, (భేదానుభవం దృష్ట్యా) అసత్యము మాత్రమే. ఎండమావుల గురించి తెలిసినవానికి, "ఇక్కడ ఒక నది ఉన్నది. ఈ కనబడేవన్నీ ఆ నదియొక్క తరంగములే" ... అను ఆవేశము ఉంటుందా? జలము - జ్ఞాన - విజ్ఞానముల యొక్క అనుభవపూర్వకమైన ఎరుకగలవానికి ఈ జగత్తుపట్ల పదార్థజ్ఞానము, భేదజ్ఞానము ఉండవు. కనుక రామా! "ఈ దృశ్యజగత్తు నిరాకారము, భ్రమమాత్రము, సంకల్పము

నందలి నగరము వంటిది" అని మొట్టమొదట నిశ్చయించుకో. ఇక ఆపై శాస్త్రోచితమైన విహిత కర్మలను ఎట్లు నిర్వర్తించాలో నిర్ణయించుకొని ప్రవర్తించు. అప్పుడు ఈ "అనేకత్వము" అనే మాయాజాలం నిన్నేమీ చెయ్యలేదు. "మెలుకువ" వచ్చిన తరువాత స్వప్నంలో చూచిన వస్తువుల కొరకు వెతకేవాడెవరైనా ఉంటాడా? జ్ఞానులకు "ఈ జగత్తు అసత్తే" అని బోధపడుచున్నది. వారు, "ఇదంతా బ్రహ్మతత్త్వమునకు వేరైనది కాదు" అని ఎరిగియే ఉంటున్నారు. అజ్ఞానులు మాత్రమే ... "ఇది జగత్తు – అది బ్రహ్మము" అనునట్టి శబ్దభేదములను ఆశ్రయించుచున్నారు. "వాస్తవానికి బ్రహ్మము – జగత్తులకు ఏమాత్రం భేదం లేదు" అని, మేము, అనేక పరిశీలనల తరువాత నిస్సంకోచంగా నిర్ణయించుకొన్నాం. ఆకాశంలో సూర్యమండలము, స్థూలమగు మేఘములు, సూక్ష్మజల కణములు, వాటి ఆకారములు ప్రతిభాసితమగుచున్నట్లు ఈ జగత్తుకూడా చిన్మయ బ్రహ్మమున ప్రకాశించుచున్నది.

ఒకనికి స్వప్నంలో కనబడేదంతా అతని కల్పనయొక్క ప్రభావంచేతనే తన హృదయాకాశంలోనే ప్రాప్తిస్తున్నట్లు, ఈ జాగ్రత్తులో కూడా ఇక్కడ కనిపించేదంతా "స్వకీయకల్పనచే ఏర్పడినట్టి దృష్టి" (Perception born of one's own volition / imagination) చే దర్శించబడుచున్నది. ఈ జాగ్రత్ జగత్తు కూడా సంకల్ప–జగత్తు లాగానే 'భ్రమ' మాత్రమే. ఈ రెండిటినీ తప్పకుండా ఒక దానితో మరొకదానిని పోల్చవచ్చు.

ఓ రామచంద్రా! నీవు జ్ఞానివే కావాలి సుమా! "ఈ జగత్తు చిన్మయాకాశమే కాని, మరింకేమీ కాదు" అని అనుభవపూర్వకముగా గ్రహించు! "జగత్తు–మహాకాశము" అను రెండు శబ్దములకు గల అర్థము ఒక్కటే. అవి చిన్మయబ్రహ్మము యొక్క రూపాంతరములే. ఈ కనబడే "జాగ్రద్దృశ్యము" ఏ సమయమందును ఉత్పన్నమే అయివుండలేదు. ఇది నిరుపాధికము (ఉపాధిలేనిది). దీనిని ఎక్కడి నుండీ, ఎవ్వరూ నియమించుటలేదు. ఇది ఎప్పటికప్పుడు 'యథాస్థితి' యందే వెలయుచున్నది. ఈ జగత్తు మహాకాశమున ఉన్నప్పటికీ ... దీనిచే బ్రహ్మము కప్పబడజాలదు. ఎక్కడన్నా మేఘములు ఆకాశమును కప్పివేయగలవా? "మేఘములు దట్టముగా పట్టినప్పుడు ఆకాశమును కప్పివేస్తున్నాయి కదా?" అంటావా? ఒక స్థలమున నిలుచున్నప్పుడు నీకు అట్లు తోచవచ్చును గాని ... నీవు చూచు మేఘములు ఆకాశమునంతటినీ కప్పివేస్తోందనుమాట భ్రమ మాత్రమే. ఈ కల్పిత–జగత్తు చిదాకాశమును ఒక అణుమాత్రం కూడా ఆవరించజాలదు. ఈ 'జగత్తు' అనబడునది వాస్తవానికి ఆకాశమువలె నిర్మలము, నిరాకారము అయి, సంకల్పనగరంలాగా, మహాకాశము నందు రచించబడిన చిత్రమువలె వెలయుచున్నది.

ఈ విషయమును నిరూపించుటకు నీకు ఒక ప్రాచీనమైన ఇతిహాసమొకటి చెపుతాను. సరస్వతీమాత – లీలల సంభాషణారూపమునగల ఈ ఇతిహాసం వినటంచేత నీకు అనేక సందేహాలు తొలగిపోతాయి. శాంతి లభిస్తుంది.

❖❖❖

# 2. శ్రీ సరస్వతీమాత వరం

పూర్వకాలంలో "పద్మడు" అను ఒక మహారాజు ఉండేవాడు. అతడు ఐశ్వర్యవంతుడు. బహు సంతానవంతుడు. వివేకి కూడా. అతడు విధివిహితంగా రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు. దోషరహితమైన ఉత్తమ గుణములు అతనిని ఆశ్రయించి ఉండేవి. అతని భార్య "లీల". ఆమె సౌభాగ్యవతి. మధురభాషి. సౌందర్యరాశి. ఆమె తన భర్తను నీడవలె సర్వదా వెన్నంటి సేవలు చేస్తూ ఉండేది. అవ్యాజమైన పరస్పరప్రేమతో, పరిహాస వాక్యములతో, పుణ్యకథాశ్రవణములతో, పరమాత్మ-తత్త్వము వంటి విషయ చర్చలతో వారు కాలం గడుపుతూ ఉండేవారు.

ఒక రోజు లీల అంతఃపురంలో ఒకచోట ఒంటరిగా కూర్చుని ఇట్లు యోచించసాగినది.

"ఈ నా భర్త పద్మడు నాకు నా ప్రాణముల కంటే కూడా అధికుడు. మా ఈ దాంపత్యము ఎప్పటికీ ఇదేవిధంగా ఉంటే ఎంత బాగుంటుంది! నా భర్త ముసలితనముగాని, చావుగాని పొంద కుండా ఉండే ఉపాయం ఏదైనా ఉన్నదా? నేను కూడా నా ఈ యౌవనం పోగొట్టుకోకుండా అనంతకాలం ఇతనితో వనసంచారాలు చేస్తూ ఉండేది ఎట్లా? ఏమి చేస్తే మనుష్యులు మరణమును జయించవచ్చు? శాస్త్రములలో దీనిగురించి చెప్పే ఉంటారు. యమ-నియమ-జప-తప-ధ్యానము లను వేటినైనాసరే, అనుసరించి నేను నా భర్తను ఎల్లకాలం పొంది ఉండేది ఎట్లా? దేశంలోని జ్ఞానవృద్ధులను, తపస్సంపన్నులను రప్పించి మరణమును జయించే ఉపాయం తెలుసుకొంటాను. అట్టి ఉపాయం ఆశ్రయించి నా భర్తను ఎప్పటికీ ఇట్లే పొంది ఉంటాను."

❖

ఇట్లు ఆలోచించి ఆ లీల దేశంలోని మహాజ్ఞానులందరినీ పిలిపించింది. "అమరత్వము" పొందటం గురించి తరచి-తరచి ప్రశ్నించింది. అప్పుడు ఆ జ్ఞానవృద్ధులు ఇట్లు పలికారు : "అమ్మా! లీలాదేవీ! జప-తప-నియమాదులు ఆచరిస్తే ఏదైనా సిద్ధిస్తాయి. కాని, అమరత్వం మాత్రం సాధ్యంకాదు. శరీరధారి అయిన ప్రతివాడు ఎప్పటికైనా ఆ శరీరము త్యజించక తప్పదు. ఇది అప్రతిహతమైన ప్రకృతి నియమము."

అది విని లీలాదేవి ఎంతో వ్యాకులత నొందినది. "అయ్యో! అయితే పతివియోగం పొందే అవకాశము ఉన్నదన్నమాట? దైవవశాత్తు నా భర్త పద్మునికన్నా ముందుగా నేనే మరణించినా - మంచిదే, గొడవవుండదు. ప్రియమైన భర్త నుండి వియోగదుఃఖం ఉండదు కాబట్టి సుఖంగానే ఉంటాను. కాని, కాలనిర్ణయం ఎవరికి తెలుస్తుంది? నా భర్తయే నాకన్నా ముందుగా మరణిస్తే? ఈ మహాజ్ఞానులు చెప్పినదానినిబట్టి శరీర క్షయము అనివార్యము కదా! అతని ప్రాణాలు శరీరం నుండి బహిర్గతం కాకతప్పనప్పుడు ఆ ప్రాణాలు అంతఃపురంలోని ఈ పడకగది నుండి బయటకు వెళ్ళకుండా ఉండేటట్లు చూచుకొంటాను. అప్పుడు నా పతి ఈ అంతఃపురంలోనే ఉంటాడు. నేను అతనిచే చూడబడుచు శేషించియున్న ఆయుష్షును సుఖంగా గడిపివేస్తాను. అందుకుగాను ఈ రోజు నుండే జప-ఉపవాసాది అనుష్ఠానముల ద్వారా చిద్రూపి, జగన్మాత అయివున్న సరస్వతీదేవిని

ఆరాధిస్తాను" అని అనుకొన్నది. స్థిరచిత్తురాలై శాస్త్రానుసారం కఠోర నియమాలతో ఆ జగజ్జనని సరస్వతీదేవిని ఆరాధించటం ప్రారంభించింది. అయితే ఈ విషయాలుగాని, ప్రయత్నాలుగాని, తన భర్తకు ఏమాత్రం తెలియనీయనేలేదు.

అత్యంత శ్రద్ధాభక్తులతో ఉపవాసాలు, పూజలు చేయసాగింది. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను సత్కరించింది. ప్రతి మూడు రాత్రుల తరువాత సరస్వతీమాత ఆరాధనావిధానము ముగింపుకు వచ్చేది. వెనువెంటనే ఆమె మరొక మూడు రోజుల నియమమును స్వీకరించేది. ఈ విధంగా స్నాన-దాన-తపో-ధ్యానాది అనేక క్లేశకర కార్యములందు శరీరమును వినియోగించుచు, శాస్త్రములందు, తనయందు, జగదీశ్వరి సరస్వతీదేవిపై అకుంఠితమైన విశ్వాసంతో ప్రయత్నం సాగించింది. అదే సమయంలో భర్తను సేవించుచు అతనికి సంతోషము చేకూర్చుచుండెడిది. ఈ విధంగా నూఱు "త్రిరాత్రివ్రతములు" పూర్తిచేసింది. ఆ వ్రతారాధనచే పూజింపబడిన భగవతి వాగ్దేవి అత్యంత ప్రసన్నురాలైనది. ఒక పవిత్ర క్షణంలో లీల ముందు ప్రత్యక్షమై "వత్సే! లీలా! పతిభక్తితో కూడిన నీ తపస్సుకు మెచ్చాను. నీకు ఏమి కావాలో కోరుకో" అని ప్రసన్నమైన వాక్కుతో పలికింది. లీల ఆ జగన్మాత దర్శనం చేత పునీతురాలై పరమానందం పొందింది.

**లీల :**

> **జయ జన్మజరాజ్వాలా దాహదోష శశిప్రభే!**
> **జయ హార్దాంధకారౌఘ నివారణ రవిప్రభే!**
>
> **అంబ మాతర్జగన్మాతస్త్రాయ స్వకృపణామిమామ్!**
> **ఇదం వరద్వయం దేహి! యదహం ప్రార్థయే శుభే ॥** (XVI.37, 38)

జన్మజరా అనెడి జ్వాలలచే దహింపబడుతున్న వారికి శశిప్రభవైన ఓ జగన్మాతా! హృదయాంధకారమును నివారించు రవిప్రభువైన ఓ జగజ్జననీ! అంబా! నీకు జయమగుగాక! నిన్ను దర్శించిన తరువాత జన్మజన్మల జాడ్యం తొలగక ఏం చేస్తుంది? ఇదే నా భక్తిపూర్వకమైన సాష్టాంగ నమస్కారం. నేను నిన్ను రెండు వరములు అర్థిస్తున్నాను. అందుకు నేను తగివుంటే ప్రసాదించమ్మా!

1. ఒకవేళ నా కన్నా ముందే నా భర్త మరణించటం జరిగితే, అతని ప్రాణములు లేక జీవాత్మ నా ఈ అంతఃపురములోని మా పడకగది నుండి వెలువడకుండా ఇక్కడే ఉండుగాక!

2. నేను నిన్ను తలచుకొన్నప్పుడు నీ దర్శనభాగ్యం నాకు ప్రాప్తించుగాక!

లీలాదేవి యొక్క అభ్యర్థనను విని, పుత్రికావాత్సల్యశీలియగు సరస్వతీదేవి, "అట్లే అగుగాక" అని పలికి, సముద్ర తరంగమువలె అంతర్ధానమయింది.

❖❖❖

# 3. పద్మని దేహ పతనం

కాలచక్రం తిరుగసాగింది. ఆకునందలి రసము శుష్కించునట్లు, పద్మని స్థూలదేహము ప్రకృతి నియమానుసారం శుష్కించసాగింది. ఒకానొక రోజు అతని స్థూలదేహ చైతన్యము సూక్ష్మ శరీరమున (లింగదేహమున లేక అతివాహిక దేహమున) లీనమైనది.

గృహమధ్యమున మృతుడైన భర్త భౌతిక దేహమును చూచి లీల ఎంతో రోదించింది. రోదనలోనే మూడు రోజులు గడిచాయి. విరహపీడితురాలై లీల తానుకూడా చచ్చిపోవాలని నిశ్చయించుకొన్నది. అత్యంత విషాదంతో, దిక్కుతోచకుండా ఉన్న ఆ లీలాదేవిని చూచిన ఆకాశవాణియగు సరస్వతీదేవి అశరీర వాక్కుతో :

"పుత్రీ! లీలా! నీవేల దుఃఖిస్తున్నావమ్మా? నేను ఇచ్చిన వరమును మరచిపోయావా ఏమిటి? నీ భర్తయొక్క భౌతిక శరీరమును పుష్పములతో కప్పి, జాగ్రత్తగా ఉంచు. అతనిని నీవు తప్పక మరల పొందుతావు. ఈ శరీరం పాడుకాదు. పూవులు వాడవు. ఇతడు మరల జీవించి, నిన్ను పాలిస్తాడు. ఆకాశమువలె నిర్మలమైనట్టి ఇతని జీవాత్మ నీ అంతఃపురమును, నీ శయన మందిరమును విడచి వెళ్ళదనునది నేను నీకు ఇచ్చిన వరము కదా!" అని మృదుమధురంగా పలికింది.

లీలాదేవి, ఆమె బంధువులు భగవతియగు సరస్వతీదేవి అశరీర వాక్కులు విన్నారు. ఊరట పొందారు. లీల తన భర్త భౌతిక దేహమును పుష్పములతో కప్పి ఉంచింది. ఆ రాత్రి అందరు నిదురించిన తరువాత ఆమె ధ్యానపరాయణియై సరస్వతీదేవిని ఆహ్వానించింది.

❖❖❖

# 4. అదే ఇంట్లో ద్వితీయ సృష్టి దర్శనం

**శ్రీ సరస్వతీదేవి :** వత్సే! నీవు ఎందుకు ఆహ్వానించావు? ఇదేమిటి దుఃఖిస్తున్నావు? ఈ సంసారమంతా భ్రమమయమని నీకు తెలియదా? ఇదంతా మృగతృష్ణలోని జలంలాగా మిథ్యయే కదా!

**లీల :** హే జగన్మాతా! నీ పాదములు స్పృశిస్తూ నేను చేస్తున్న ఈ నమస్కారం స్వీకరించు.

అమ్మా! ఇప్పుడు నా భర్త పద్ముడు ఎక్కడ ఉన్నాడు? ఏమి చేస్తున్నాడు? ఎట్లా ఉన్నాడు? నన్ను అతని వద్దకు తీసుకొని పోకూడదా? అతడు లేకుండా నేను ఒంటరిగా జీవించలేను.

**శ్రీసరస్వతీదేవి :** బిడ్డా! ఇప్పుడు నీవు నీ కళ్ళతో అనేక పదార్థజాలములతో కూడిన ఈ పాంచభౌతిక జగత్తును చూస్తున్నావు కదా! ఇది 'భూతాకాశము' లేక 'స్థూలాకాశము' అంటారు. ఇంతకన్నా సూక్ష్మమైనది చిత్తాకాశము. దానిని ఈ కళ్ళతో చూడలేవు. అయితే అంతకన్నా కూడా సూక్ష్మాతి–సూక్ష్మమైన, ఒకానొక ఆకాశము ఉన్నది. అదే "చిదాకాశము". ఆ చిదాకాశమునందే నీభర్త యొక్క ఆత్మ ఉన్నది. ఆ చిదాకాశమును ధ్యానించి, దానిని అనుభూతమొనర్చుకొన్నావా ... నీవు తప్పక దానిని గాంచగలవు. అవిద్యమానమగు ఈ పాంచభౌతిక దృష్టి ఘనీభూతమై ఉండటం

చేతనే (Crystallised material outlook) నీ అనుభవము (Range of Experiencing) పాంచభౌతిక వ్యవహారమునకు పరిమితమగుచున్నది. ఈ దృశ్యమానమగుచున్న వస్తుజాలమును ధ్యానించుట ఆపి చిత్తాకాశమును కూడా ధ్యానించటం వదలి, చిదాకాశమునే ధ్యానించుము. అప్పుడు అంతా నీవే ఎరుగగలవు.

"నాతో సహా సర్వము చిదాకాశమే", అను భావనను దృఢీకరించి, ఆ భావనలో ప్రవేశించు.

❖

**లీల :** అమ్మా! ఈ చిత్తము యొక్క ప్రవర్తనను గమనించారా? ఇది ఒక నిమిష మధ్యకాలంలోనే ఒకచోటి నుండి మరొకచోటికి పరుగులు తీస్తోంది కదా! అట్టి ఈ చిత్తము స్వయముగానే ప్రకాశించుచున్నదా? లేక, దీనిని మరెవరైనా ఎక్కడినుండైనా నియామకం చేస్తున్నారా?

**సరస్వతీదేవి :** లేదు. చిత్తమునకు స్వయముగా ప్రకాశించగల, ప్రసరించగల, శక్తి లేదు సుమా! మరి ఈ చిత్తమును కూడా ప్రకాశింపజేసేది, ప్రవర్తింపజేసేది ఏది? చిదాకాశము, లేక, బ్రహ్మమే దీనిని ప్రకాశింపజేస్తోంది. చిత్తము స్వతహాగా జడమైనది మాత్రమే. నీవు నీ చేతిని కదల్చుచున్నావనుకో. 'చేయి' స్వయంగా కదలదు కదా! దానిని కదల్చు చైతన్యమూర్తివి 'నీవు'. అవయవములు స్వయముగా జడమై చైతన్యమగు 'సత్తు'చే సంచలనము నిర్వర్తించబడునట్లుగానే, జడమగు చిత్తమును 'చిత్‌సత్త'యే క్రియాశీలత్వమొనర్చుచున్నది. ఒక్క చిదాకాశము మాత్రమే స్వయం చైతన్యవంతమని గ్రహించు. అట్టి చిదాకాశము యొక్క ప్రకాశమునే 'సంవిత్తు' లేక 'జ్ఞానము' అని అంటున్నాం. అటు 'మహాకాశము'ను ఇటు చిత్త-భూత-ఆకాశములను, ప్రకాశింప చేసేది, ఆధారభూతమైనది కూడా చిదాకాశమే సుమా! చిత్తవృత్తుల ప్రబలత్వం చేతనే నీకు విరహదుఃఖము, తదితర దుఃఖములు ప్రాప్తిస్తున్నాయి. చిత్తవృత్తులను పరిత్యజించి, చిదాకాశానుభవమున సుస్థిరమవగలిగినచో, నీవు నిశ్చయంగా సర్వాత్మకమగు బ్రహ్మ పదమును పొందగలవు కూడా. ఇందులో సందేహం లేదు.

**లీల :** మాతా! ఇప్పుడు నన్ను ఈ దృశ్య ప్రపంచము, నీవు చెప్పినట్లు ఎంతగానో భ్రమింపజేస్తోంది. ఎందుచేత? కారణమేమిటి?

**శ్రీసరస్వతీదేవి :** చెప్పాను కదా! నీవు మరల - మరలా పాంచ-భౌతిక దృష్టిని ఆశ్రయిస్తూ :

"నేను ఈ భౌతిక శరీరమును! నా భర్తయగు 'పద్ముడు' అనగా మరొక పాంచభౌతిక దేహము ! నా ఈ శరీరమునకు - ఈ నా భర్తయగు 'పద్ముడు' అనబడువాని శరీరమునకు చిరకాలం సామీప్యత ఉండుగాక!" అనునట్టి భౌతిక భావావేశము ఘనీభూతం చేసుకోవటం జరిగింది. క్రమంగా ఈ దృశ్యముపట్ల 'ఇది సత్యము' అను రూపముగల సత్యత్వబుద్ధి ఏర్పడి ఉండటం చేతనే, నేడు ఈ దైన్యమును, దుఃఖమును అనుభవిస్తున్నావు. ఈ చిత్తవృత్తులను పరిత్యజించి, అప్పుడు శేషించియుండుదానినే భావించుచున్నావనుకో ... నీకీ దైన్యత్వము ప్రాప్తించి ఉండేదే కాదు. అప్పుడు మాత్రమే ఈ దృశ్యము యొక్క అభావత్వము బోధపడగలదు. అట్టి తత్త్వజ్ఞానము

... తత్త్వానుభవము లభించటం కష్టతరమైనదనుమాట నిజమే. కాని నీవు నా భక్తురాలవుకదా! నా ప్రసాదము చేతను, నేను చెప్పునది 'స్వబుద్ధి'తో గ్రహించటంచేత, స్థిరమైన బుద్ధిని ఆశ్రయించటంచేత అట్టి 'తత్త్వదృష్టిని' తప్పకుండా పొందుతావు. 'సత్యస్వరూపిణి' అయినట్టి నా మాటలు అసత్యమెలా అవుతాయి? అందుచేత ఇప్పటికిప్పుడే సందేహములన్నీ జయించి 'తత్త్వదృష్టి'ని ఆశ్రయించు.

ఇట్లు పలికి ఆ వాగ్వాణి అంతర్ధానమైనది.

❖

ఇట్టివే అయినట్టి అనేక వాక్యములు – శ్రవణానందకరములుగా బోధించుటచే లీలాదేవి ఉద్బోధితురాలై, అనాయాసంగా, అభ్యాసశ్రమ లేకుండా నిర్వికల్పసమాధిని ఆశ్రయించినది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! లోకమాతయగు సరస్వతీదేవి ఏ విధమైన జ్ఞానముచే? తన భక్తురాలగు లీలయందు ఆత్మదృష్టిని సుస్థిరీకరించగలిగింది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** విను.

అంతఃకరణముతో కూడుకొనిన ఈ స్థూలదేహాభిమానం లోహ పంజరము వలె అత్యంత దుర్భేధ్యమైనదే. అయితే ప్రయత్నశీలుడు ఈ పంజరమును తప్పకుండా భేదించివేయగలడు. 'వాణి' యొక్క వరప్రసాదంచేత, దర్శన భాగ్యంచేత ఉత్తేజితురాలై, ఆ లీలాదేవి గూటి నుండి ఎగిరే పక్షిలాగా దేహాభిమానము వదలింది. చిత్తాకాశమును కూడా అధిగమించినది. చిదాకాశమునందు 'సత్తస్వరూపిణి' అయి ప్రవేశించింది. ఆ చిదాకాశమునందు స్వప్రయత్నముచే తన భర్త కొరకు వెతుకుట ప్రారంభించింది. అట్టి చిదాకాశమున ఒకానొకచోట పద్ముడు కనిపించాడు. అతడు ఒక రాజసింహాసనముపై ఆసీనుడై ఉన్నాడు. ఆ సభలో మంత్రులు, సేవకులు, సైనికజనం, ప్రజలు ఆయా ఆసనములపై పరివేష్టించి ఉన్నారు. సింహాసనారూఢుడై ఉన్న ఆ పద్ముడు ఏవేవో రాచకార్యములు నిర్వర్తిస్తున్నాడు. ఆ సభకు తూర్పువైపు ఉన్న ద్వారంవద్ద ఆశీనులై ఉన్న ఋషులు, మునులు, విప్రులు "జయ–జయ–దేవ" అంటూ ఆ పద్ముని ఆశీర్వదిస్తున్నారు. దక్షిణ ద్వారంవైపున అనేక మంది రాజులు, మహారాజులు ఆశీనులై ఉన్నారు. ఉత్తరద్వారంవైపుగా ఉన్న విశాల ప్రదేశంలో గుఱ్ఱాలు, ఏనుగులు పెద్దసంఖ్యలో ఉండి ఉన్నాయి. పశ్చిమ ద్వారంవైపు అనేకమంది యువతులు కూర్చుని ఉన్నారు. ఇంద్రసభలోని ఇంద్రునివలె, ఆకాశమున చంద్రునివలె ... రాజాధిరాజు, చక్రవర్తి అయిన ఆ పద్ముడు అనేకమందితో సంభాషిస్తూ, అనేక రాచకార్యములను నెరవేరుస్తున్నాడు.

ఇంతలో ఒక భృత్యుడు ఎక్కడినుండో పరుగుపరుగునవచ్చి ఆ సభలో ప్రవేశించాడు. రాజును సమీపించి "మహారాజా! మీకు జయమగుగాక! దక్షిణాపథములోని శత్రురాజు అకస్మాత్తుగా మన సామ్రాజ్యముపై దండెత్తివచ్చాడు ..." అని చెప్పి యుద్ధవిషయాలు చెప్పసాగాడు. అట్లు అతడు చెప్పుచుండగానే మరొక భృత్యుడు మహారాజువద్దకు వచ్చి "మహారాజా! ఇబ్బంది కలిగిస్తున్నందుకు క్షమించండి. ఒకప్పటి మనదేశమిత్రుడు కర్ణాటకరాజు తూర్పువైపు రాజ్యమును ఆక్రమించటానికి దండెత్తి వస్తున్నాడు. ఈ ఆకస్మిక పరిణామమునకు మన సైన్యం పూర్తిగా

సన్నద్ధమై లేదు. ఈ విషయమై సమాలోచించెదరు గాక!" అని పలికి ఊరుకున్నాడు. అట్లే మరికొంతమంది భృత్యులు ఆయా సరిహద్దురాజుల దండయాత్రలకు సంబంధించిన యుద్ధవార్తలు తెచ్చారు. ఆ రాజ్యమును ఒక్కసారి అనేకమంది శత్రురాజులు అనేకవైపుల నుండి చుట్టుముట్టినట్లు తెలియవచ్చింది. అంతవరకు ప్రశాంతముగా ఉన్న ఆ సభలో రణగొణధ్వనులు, సమాలోచనలు ప్రారంభమయ్యాయి. మంత్రులు, సామంతరాజులు మహారాజును సమీపించారు. యుద్ధవిషయమై మంతనాలు సాగించసాగారు.

❖

ఆకాశస్వరూపిణి (అశరీర స్వరూపిణి) యగు లీలాదేవి అట్టి సమయంలో సభాప్రవేశం చేసింది. ఆమె సభలో సంచరిస్తున్నప్పటికీ అక్కడివారు ఆమెను చూడలేకపోయారు. సంకల్పములోని నగరమును ప్రత్యక్షంగా (జాగ్రత్‌లో) చూడలేనట్లు, ఒకని సంకల్పము లేదా స్వప్నములోని వస్తు జాలమును ఆ ప్రక్కనే ఉన్న మరొకరు చూడజాలనట్లు, అక్కడి వారెవరికి ఆమె కనబడటం లేదు.

లీల ఒక్కసారి సభ అంతా కలయచూసింది. ఎంత ఆశ్చర్యం! అక్కడంతా ఆమెకు ఇతః పూర్వపు భృత్యులు, సామంతులు, మంత్రులు కనిపించారు. వారంతా తమ రాజసభలో ప్రతిదినము కనిపించే సభికులు. "మా రాజ్యసభ అక్కడి నుండి ఇక్కడికి తీసుకొనిరాబడిందా ఏమి?" ... అని ఆమెకు అనిపించసాగింది. అందరు మునుపటి వారే. వారి ఆచరణ కూడా మునుపటిలాగానే ఉన్నది. ఆ పరిచారికలే, ఆ మంత్రులే, ఆ పండితులే, ఆ సేవకులే, ఆ స్నేహితులే ఇక్కడ కూడా కనిపించారు. తమ రాజ్యము లాగానే ఇక్కడ కూడా పగలు, దిక్కులు, సూర్యచంద్రులు, ఆకాశము, మేఘములు, వాయువు కనిపిస్తున్నాయి. అట్టివేయగు వృక్షములు, నదులు, పర్వతములు, నగరములు, గ్రామములు, అడవులు కూడా ఇక్కడ ఉండటం గమనించింది.

మరల సభ అంతా అన్నివైపులా ఆ లీల సంచరించింది. అందరు మునుపటి విధంగా ఉన్నారు. కాని, సింహాసనం మీద ఆసీనుడైన పద్ముడు మాత్రం ఇతఃపూర్వమువలె అంతటి ముదుసలిగా లేడు. అతడు కొంత మధ్యవయస్కుడై ఉండటం కనిపించింది. "ఇది ఏమిటి? మా పట్టణంలోని వారంతా మరణించారా? లేకపోతే, వారే ఇక్కడెట్లా ఉన్నారు? ఇది ఎంతటి దుఃఖకరమైన విషయం!" అని ఆశ్చర్యచకితురాలై యోచించ సాగింది.

❖

ఇట్లు ఆమె చింతించుచుండగా, సరస్వతీదేవి అనుగ్రహంచేత ఆమెకు "సమాధి" భంగం అయినది. ఆమె నిద్రనుండి మేల్కాంచినట్లు లేచికూర్చుని చుట్టూ చూచింది. తాను యథారీతిగా తన అంతఃపురంలోనే ఉన్నట్లు గమనించింది. తన చుట్టూ పరిచారికలు మునుపటివలెనే నిద్రిస్తున్నారు.

"ఓ పరిచారికలారా! నిద్రలేవండి. ఇప్పుడు నా మనస్సంతా ఎంతో విషాదంగా ఉన్నది. మన సభలోని మంత్రులు, సామంతులు, తదితర సభికులు అనేకులు మరణించినట్లు నాకు అనిపిస్తోంది. ఇప్పటికిప్పుడు సభను సమావేశపరచండి. సభలో సింహాసనం అధిరోహిస్తాను. సభ్యులందరు

యథారీతిగా ఉన్నారా ... మంచిదే. అందరు మరణించారా ... ఇక నేనుమాత్రం ఉండి చేసేదే ముంటుంది? నేను కూడా మరణిస్తాను. పొండి. పరుగులుతీసి మంత్రులకు సభను సమాయత్తపరచ వలసినదిగా నా ఆజ్ఞను తెలియజేయండి."

పరిచారికలు ఆశ్చర్యపోయారు. ఆ అర్ధరాత్రి సభ సమావేశమవటమేమిటి? అయినా చేసేదే మున్నది? మహారాజ్ఞి ఆజ్ఞ కదా! పరుగుపరుగున వెళ్ళి ఈ విషయం మంత్రులకు, పురవాసులకు తెలియచెప్పారు. ఆ క్షణంలో లీలాదేవి ప్రాణాలు కాపాడుకోవటమే అక్కడి పురజనుల తక్షణ కర్తవ్యమైనది. అక్కడి పురజనులు, భృత్యులు సభాసమావేశమునకు సిద్ధమైనారు. 'డప్పులమోత' ద్వారా సభాసమావేశం గురించి నగరమంతా తెలియజేయ బడింది. కొందరు సభలో ప్రవేశించి సమావేశమునకు అంతా సిద్ధం చేశారు. క్షణాలలో పురజనులు సభలో ప్రవేశించి ఉచితాసనములలో ఆశీనులైనారు. మంత్రులు, సామంతులు ఆయాస్థానములు ఆక్రమించి ఉన్నారు. ఇంతలో లీలాదేవి స్నానాదులు ముగించుకొని, సభలో ప్రవేశించి, సింహాసనం అధిష్ఠించింది. సభంతా కలియచూచింది! ఎంత ఆశ్చర్యం! అక్కడ రాజన్యులు, స్త్రీలు, గురువులు, బంధుజనం, స్నేహితులు ఎప్పటిలాగానే సభలో ఉన్నారు. సభ అంతా యథాతథంగానే ఉన్నది. లీలాదేవి ఉపశాంతి పొందింది. అందరు జీవించి ఉన్నందుకు సంతోషపడుచూ, ఒక్కసారి పద్మని సింహాసనం వైపు చూచింది. ఒక్క మహారాజు మాత్రం అక్కడ లేదు. సింహాసనం బోసిపోయి ఉన్నది. అతని భౌతికదేహం (విగతజీవుడై) అంతః పురంలోనే ఉన్నదికదా! అప్పుడు లీలాదేవి సభను ఉద్దేశించి "ఓ సభికులారా! నా చిత్తము మహారాజు వియోగంచే భరించరానంత దుఃఖము పొందినది. దానిని కొంత వినోదింపచేయాలనే ఉద్దేశంతో ఈ సమావేశము ఏర్పరచాను. మీ అందరికి ఇప్పటికిప్పుడు ఇంత శ్రమయిచ్చినందుకు నన్ను క్షమించండి" అని పలికి, అక్కడనుండి లేచింది. పరిజనం వెంటరాగా, అంతఃపురమునకు నడుస్తూ వెళ్లింది. తన భర్త పద్మని భౌతిక శరీరాన్ని సమీపించింది. ఆ దేహము పూలతో కప్పబడి, ఎప్పటి యట్లే ఉన్నది. ఆ గదిలోనే ఒకచోట చతికిలపడి కూర్చుని ఇట్లు యోచించసాగింది.

"ఆహా! ఈ మాయ ఎంతటి విచిత్రమైనది! ఈ సభికులు, తదితరులు నా భర్త యొక్క భౌతిక దేహము ఉన్నచోట-ఈ నగరంలో-ఉన్నట్లే, చిదాకాశంలో కూడా అతని సూక్ష్మదేహము వెంటనంటి ఉన్నారే? ఇక్కడ ఉన్న కొండలు, భవనములు మొదలైన స్థావర వ్యవహారమంతా కూడా ... అక్కడా అట్లే ఉన్నదే? అద్దంలో ప్రతిబింబించే కొండయే బాహ్యమున కూడా ఉన్నట్లు, చిదాకాశమునందు వెలుపల కూడా సృష్టి ఒకే తీరుగా కనబడుతోంది. అయితే, నేను చూచిన ఈ రెండు దృశ్యములలో ఏది వాస్తవం? ఏది భ్రాంతి? ఈ కనబడేది వాస్తవమా? చిదాకాశమున నేను చూచిన మధ్య వయస్కుడగు నా భర్త 'రాజ్యము-ప్రజలు' వాస్తవమా? ఈ రెండింటిలో పారమార్థికమైనదేది? ఈ విషయం నేను నా స్వబుద్ధితో గ్రహించలేను. అందుచేత నా ఆరాధ్యదేవతయగు 'వాగ్దేవి'నే అడిగి తెలుసుకొంటాను".

ఇట్లు అనుకొని లీలాదేవి ఏకాగ్రతతో సర్వస్వతీ జగన్మాతను ధ్యానించింది. తన భక్తురాలి

పిలుపును అందుకొని, కుమారి రూపధారిణియై జగన్మాత, దర్శనమిచ్చింది. మహాశక్తి స్వరూపిణియగు వాణీదేవిని సువర్ణ సింహాసనం అధిరోహింపజేసి, లీలాదేవి ఉత్తమ స్తోత్రములతో ఆనందింపచేసింది.

❖❖❖

## 5. ఇక్కడ ఏది సత్యం? ఏది అసత్యం?

**లీల :** దేవీ! పరమేశ్వరీ! నీవు 'సృష్ట్యాది' యందు స్థాపించిన మర్యాద (System) విషయంలో నాకు చాలా సందేహాలు వస్తున్నాయి. వాటి గురించి ప్రశ్నిస్తాను. తెలియపరచి నా పట్ల నీకున్న దయను సఫలంచేయి మాతా!

ఈ 'జగత్తు' అనబడునది ఆకాశము కంటే కూడా అత్యంత నిర్మలమైనది కదా! కోటియోజనముల విస్తీర్ణం కూడా విస్తారజగత్తు దృష్ట్యా అత్యంత స్వల్పమైనదే. వేద మహావాక్యములు ఈ జగత్తును "జ్యోతిర్మయము, సూక్ష్మము, శీతలము" మొదలైన విశేషణములతో వర్ణించి చెప్పుచున్నాయి. ఇది "గోడలేకుండానే చిత్రం ఉన్నట్లు" ✺ ... నిరావరణమైనదానివలె కనబడుతోంది. ఇందు 'ఆకాశము, భూమి, దిక్కులు, కాలము' ... మొదలైన అనేక విశేషాలు కనబడుచున్నాయి. ఈ జగత్తే అన్నిటిని ప్రకాశింప చేస్తోంది. దీనిని ప్రకాశింపజేస్తున్న మరొకటి ఎక్కడన్నా ఏదన్నా ఉన్నదా? లేదనే నేను అనుకొంటున్నాను. వస్తువులన్నీ ఇందులోనే ప్రతిబింబించి, విలీనం అయిపోతున్నాయి. ఈ త్రిలోకసృష్టి కనబడుచున్నది "చిద్వస్తువు" అను దర్పణమునందే కదా!

ఇప్పుడు నాకు కలిగిన సందేహమేమిటో చెపుతాను. ఈ బయట కనబడే వస్తుజాలము వాస్తవమా? లేక ఇదంతా ప్రతిబింబిస్తున్న "చిద్వస్తువు" (The absolute consciousness in which phenomenal universe is reflected.) వాస్తవమా? ఈ జగత్తు సత్యమా? దీనిని దర్శించి అనుభవమును పొందుచున్న 'నేను' అనబడునది సత్యమా? ఈ రెండింటిలో కృత్రిమమైనదేది? అకృత్రిమమైనదేది? ఈ సృష్టితత్త్వమంతా ఏదైనా మరొకదానిలో ఉన్నదా? ఉంటే ఆ మరొకటి ఇంకెందులో ఉన్నది?

నీ ఆజ్ఞను అనుసరించి నేను స్థూలసూక్ష్మములను త్యజించి చిదాకాశంలో ప్రవేశించాను. ఆ చిదాకాశంలో ఒకానొకచోట నా భర్త పద్ముడు ఒక విస్తారమైన సామ్రాజ్యమునకు మహారాజై ఉండటం చూచాను. అతని సభలో ఇట్టి మంత్రులే, ఇట్టి ప్రజలే నాకు గోచరించారు. ఆ చిదాకాశములో నాకు కనిపించిన సభాదృశ్యము వాస్తవమా? ఇక్కడ సమావేశమైన సభ వాస్తవమా? ఈ ప్రశ్నలన్నీ నన్ను వేధిస్తున్నాయి. చిగురుటాకు కొనవలె నా మనస్సు చంచలమగుచున్నది. ప్రసన్న స్వరూపిణియగు నీవు ఇప్పుడు ఏది బోధించాలనుకొంటే, అదియే బోధించవేడుకొనుచున్నాను.

---

✺ గోడపై ఒకానొక చిత్రము (painting) చిత్రించటం మనం చూస్తూ ఉంటాం. అయితే లీలాదేవి ఈ జగత్తును "గోడ లేకుండానే చిత్రం కనబడువిధంగా (Painting without canvas or wall) పోల్చుచున్నది.

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! నీ ప్రశ్నలు అత్యంత చమత్కారంగా ఉన్నాయి. ఈ సృష్టిలో ఏది కృత్రిమమైనది? అకృత్రిమమైనదేది? సరే! ఇప్పటి వరకు నీకు తోచిన దానినిబట్టి ఏది వాస్తవమనుకొంటున్నావో, ఏది అవాస్తవమనుకొంటున్నావో చెప్పు? నీకు అర్థమైనదేమిటో చెప్పితే, దానిని అనుసరించి, నీకు అర్థము కావలసినదేమిటో సవివరంగా తప్పక చెపుతాను.

**లీల :** సరే! నేను ఏది వాస్తవమని అనుకొంటున్నానో చెపుతాను. నాకు ఇదంతా ఎట్లు అనిపిస్తోందో, అర్థమౌతోందో చెపుతాను.

ఇప్పుడు ఇక్కడ నీవు-నేను ఉండి సంభాషించుకొంటున్నాము కదా! ఇది అకృత్రిమ సర్గము లేక వాస్తవమైన 'సృష్టి'. నా భర్త పద్మడు చిదాకాశమునందు ఉండియున్న విధానము 'కృత్రిమసర్గము' లేక కల్పిత స్వప్నతుల్యమైన సృష్టి అని భావిస్తున్నాను. ఎందుకంటావా? స్వప్నములోని అనుభవంలాగా అది శూన్యమైనదే కదా! దేశకాలముల (Space & time) దృష్ట్యా అది, "ఇక్కడ ఆకాశములో ఇట్లు ఇప్పుడు ఉన్నది" అను విధంగా లభించటం లేదు కదా! ఇప్పుడు మనిద్దరం పాల్గొనుచున్న ఈ దృశ్యము దేశ-కాలముల పరిచ్ఛేదం కలిగియుండుటచే ఇది వాస్తవమని అనుకొంటున్నాను. (As this is available for factors of time and distance, this looks to me as true).

**శ్రీ సరస్వతీదేవి :** నీవు అంటున్నట్లు ఇక్కడ కనిపిస్తున్న ఈ సృష్టి అకృత్రిమమైనదనే అనుకొందాం. అకృత్రిమ సృష్టి నుండి కృత్రిమసృష్టి ఎట్లా ఉత్పన్నమౌతుంది? ఏదైనా ఒకానొక కారణము (cause) నుండి, ఆ కారణమునకు సంబంధంలేని విజాతీయమైన కార్యము (Entirely different type of "EFFECT") ఉత్పన్నము కాదు కదా! అందుచేత "ఈ సృష్టి అకృత్రిమం" అని అనుకొంటే ఇందులో పదార్థజాలమంతా అకృత్రిమమైనదే అయివుండాలి. ఈ సృష్టి నుండి బయలుదేరిన నీవు చూడటం జరిగినట్టి 'చిదాకాశము'లోని నీ భర్త రాజ్యం కూడా అకృత్రిమమే అయివుండాలి. ఇక్కడ, అక్కడ కూడా నీ అనుభవం ఒకే తీరుగా కొనసాగుతూ ఉన్నది కదా!

**లీల :** మాతా! "ఒక కారణము నుండి, ఆ కారణమునకు ఏమాత్రం సంబంధంలేని కార్యములు ఉత్పన్నమౌతాయి" అని అనటానికి అనేక దృష్టాంతాలు మనకి ప్రపంచంలో లభ్యమౌతున్నాయి. ఉదాహరణకు మట్టిలో మంచినీరు నిలువ ఉంచలేము. కాని ఆ మట్టితో తయారైన కుండలో నీరు నిలువ ఉంచగలం కదా!

**శ్రీ సరస్వతీదేవి :** సహకారి కారణం నుండి కలుగు కార్యము ముఖ్యకారణం కంటే కొంచెం విజాతీయమై కనబడటమే నీ దృష్టాంతములోని "మట్టి-కుండ"లలో చూస్తున్నాం. మట్టి కుండగా ఆకారము పొందుట అందుకు కారణమగుచున్నది.

కారణము = Main Cause ; సహకారికారణము = Supportive Cause

ఇప్పుడు నీ భర్త విషయానికి వద్దాము. అతడు ఇక్కడ ఒకతీరుగా, అక్కడ మరొక తీరుగా ఉండటానికి తగినంత కారణమేదైనా ఉన్నదా?

ఒక్క విషయం నీవు ముందుగా దృష్టిలో పెట్టుకో. ఈ పృథివి మొదలైన పంచభూతములు నీ భర్త యొక్క సృష్టికి కారణములని అనుకొంటున్నావా? లేదు. ఇప్పుడు నీ భర్త ఇక్కడ జన్మించి అక్కడికి వెళ్ళాడంటావా? అసలు ఈ భూమండలమంతా ఎక్కడ ఉన్నది? ఆ భూమండలం ఎక్కడున్నది? ఇదే అక్కడికి వెళ్ళి ఉంటుందంటావా? ఒకవేళ ఇది అక్కడకు వెళ్ళకపోతే ఇట్టిదే అయిన సృష్టి అక్కడ ఎందుకు సంభవిస్తోంది?

వాస్తవానికి నీ భర్త ఈ బ్రహ్మాండంలోగాని, అతనిచే అనుభవించబడుచున్న ఆ సృష్టిలో గాని పుట్టుకకు సహకారి కారణమంటూ ఏదైనా ఉన్నదా? లేదే! అన్య (బాహ్య) కారణమంటూ ఏదీ లేకుండా ఏదైనా సంభవిస్తుంటే అద్దానికి అతని పూర్వపు సృష్టులందలి కామకర్మ-వాసనలే కారణములగుచున్నాయా? ఆలోచించి చెప్పు?

**లీలాదేవి :** నీవు చెప్పినట్లు, "నా భర్త అసలు ఎట్లు సృష్టించబడ్డాడు?" అను ప్రశ్నకు "అతని ఇతః పూర్వపు జన్మలందలి జ్ఞానమే కారణము" అనునది సమాధాన మగుచున్నదని నేను అనుకుంటున్నాను. అట్టి 'జన్మాంతరజ్ఞానము' (The knowledge gained in past lives & Carried forward in thier life) వృద్ధి చెందుచుండగా, అదే ఈ సృష్టికి కారణమగుచున్నదని నాకు తోచుచున్నది.

**శ్రీ సరస్వతీదేవి :** అంటే, నీవు "సృష్టికి స్మృతియే కారణము" అనునట్టి వాక్యానికి వస్తున్నావు. నీ ఈ అభిప్రాయం ప్రకారం "ఈ జీవుడు జ్ఞప్తి లేక జ్ఞాపకము స్వరూపముగా గలవాడు మాత్రమే" అని కదా! అయితే 'జ్ఞాపకము' అనునది అనుభవము ఉన్న తరువాతే ప్రారంభమౌతుంది కదా! అట్టి అనుభవము కంటే ముందే అనుభవజ్ఞుడు ఉండి ఉండాలి కదా! జ్ఞప్తి ఎవరికి కలుగుతోందో అతడు ముందుగా ఉంటేనే, అతనియందు అనుభవములు రచించబడగలవు. కనుక 'జీవుడు' అనగా 'జ్ఞాపకములు' అని గాని, 'సంస్కారములు' అనిగాని అనటం సమగ్రమైన సమాధానం కాదు. ఈ 'సంస్కారములు' అనబడునవి మొదలంట అధ్యయనం చేస్తే అవి 'శూన్య రూపములే' అని తెలియవస్తున్నాయి. వాటి రూపము ఆకాశమే. అట్టి సంస్కారము ఆకాశరూపమే అయి ఉండటంచే, దాని నుండి కలిగిన సృష్టులు కూడా 'ఆకాశమయమే' అని గ్రహించు.

**లీలాదేవి :** మాతా! ఇప్పుడు నీచేత బోధింపబడటంచే ఒకానొక నూతన విషయం తెలుసుకొంటున్నాను. నాభర్తయొక్క "చిదాకాశసృష్టి" .... స్మృతి + ఊహ" జనితమే కదా! అది ఆకాశస్వరూపమే. శూన్యమే. అందుచేత ఇక్కడ ఇప్పుడు నాచేత గాంచబడుచున్న సృష్టి కూడా పైనచెప్పిన దృష్టాంతము ప్రకారం ఆకాశస్వరూపమేనని అనిపిస్తోంది. ఈ రాజ్యాదులు, నా భర్తతో గల సంబంధము, ఈ అనుభవములు ... ఇవన్నీ కూడా ఆకాశమువలె శూన్యరూపములే, సంకల్పమాత్రములే (లేక) ఊహామాత్రములే అయివున్నాయి.

**శ్రీసరస్వతీదేవి :** సువ్రతీ! ఇప్పుడు నీవు సరయిన అవగాహనకే వస్తున్నావు. నీ భర్త యొక్క చిదాకాశసృష్టి అతని ఊహామాత్రమే! అది అసత్తు-అవాస్తవం అయినట్లే, దృశ్యమానమగుచున్న ఈ సృష్టి కూడా అసత్తు-అవాస్తవమే. జ్ఞానప్రభావం చేత మేము ఇదంతా అట్లే దర్శించుచున్నాము. నీవు కూడా ఇది గ్రహించు.

**లీల :** హే జగజ్జననీ! నీవు సత్యస్వరూపురాలవు. అసత్యం ప్రకటిస్తావా? లేదు. కాని, నాలో ఏదో భ్రమ ఇంకా తొలగిపోలేదు. అందుచేత నాభర్తయొక్క భ్రమాత్మకమైన చిదాకాశసృష్టి ఎలా సంభవించిందో ... ఆ రీతిని నాకు వివరించు. అది వినటంచేత నా ఈ భ్రమ తొలగిపోగలదనే నేను భావిస్తున్నాను.

**శ్రీ సరస్వతీదేవి :** ఇతఃపూర్వపు స్మృతినుండే స్వప్నభ్రమవలె, 'కల' లోని మరొక 'కల' వలె .... ఈ ఈ సృష్టులన్నీ ప్రకాశిస్తున్నాయి. కనుక 'సృష్టి' అనబడేదంతా ద్రష్టయొక్క స్వయంకృత సంబంధమైన సంస్కారములతో కూడిన ఊహాపరంపరా ప్రదర్శనం మాత్రమే! ఈ విషయం ఇంకా సుస్పష్టపడటానికి ఒక చిత్రమైన సంఘటన గురించి చెపుతాను, విను.

❖❖❖

## 6. ఇతఃపూర్వపు సృష్టి - బ్రాహ్మణ దంపతులు

**శ్రీ సరస్వతీదేవి :** చిదాకాశమున, ఒక మారుమూల ఒక సంసారమండపము ఉన్నది. ఆ సంసారమండపము పంచభూత విభాగమగు "ఆకాశము" అనే గాజుతో కప్పబడివున్నది. ఆ మండపములో లోకపాలకులు స్తంభముల వంటివారు. దేవతాస్త్రీలు అందు చెక్కబడిన బొమ్మలు, పదునాలుగు లోకాలు అందుగల గదులు. ఆ గదులందు ఆమూల – ఈమూల పుట్టలవలె అనేకమంది ప్రాణులు ఉన్నారు. "ప్రజాపతి (బ్రహ్మదేవుడు)" అందు నివసించు బ్రాహ్మణుడు. సాలెపురుగు తనగూటిలో తానే చిక్కుకున్నట్లు, అందుగల అనేక ప్రాణులు (లేక జీవులు) తమ ఆశలతో కట్టుకొన్న గూటిలో తామే చిక్కుకొనియున్నారు. 'ఆకాశము' అనునది ఆ మండపముపై పట్టిన బూజువలె కనిపిస్తోంది. ఆకాశంలో సంచరించే సిద్ధులే ఆ ఇంటిలో రొదచేసే దోమలు, లోకములు, నగరములు అందలి 'కుండలు' వంటివి. అట్టి మండపంలో ఒకచోట 'గిరి' అను పేరుగల ఒక గ్రామము ఉన్నది. ఆ గిరి గ్రామంలో గల ఒక గృహమునందు వసిష్ఠుడు అను పేరుగల ఒక బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. అతడు శ్రోత్రియుడై, వేదములలో చెప్పబడిన నిష్ఠలను, విధివిధానములను అనుసరించినవాడై, భార్య – పిల్లలతో కాలం వెళ్ళబుచ్చుచున్నాడు. రోగహీనుడై, భయరహితుడై, శాంతచిత్తుడై ధర్మపరాయణుడై, సేవానిరతుడై, గృహస్థాశ్రమమును నిర్వర్తించుచున్నాడు. అతని పేరు, విత్తము, వయస్సు, విద్య, వైభవము, యత్నముల దృష్ట్యా వసిష్ఠమహర్షి వంటివాడే అయినప్పటికీ ... అతను ఇక్ష్వాకు వంశజుల పౌరోహిత్యము వహించు సప్తర్షి మండల సంబంధితుడగు వసిష్ఠమహర్షి కాదు. అతనిభార్య పేరు కూడా అరుంధతియే. ఇక్ష్వాకుల సద్గురువగు వసిష్ఠుని ధర్మపత్ని 'అరుంధతి' జీవన్ముక్త. కాని ఈమె విషయం అట్టిది కాదు. (అనగా ఆ దంపతులు వేరు. వీరు వేరు.)

ఆ బ్రాహ్మణుడు తన భార్యపై అకృత్రిమమైన ప్రేమ రసము కురిపిస్తూ ఉండేవాడు. అతని సంసారమంతా ఆమెయే అయివుండేది.

ఆ బ్రాహ్మణుడు ఒక రోజు ఒక పర్వతముపై గల 'పచ్చికబయలు' నందు ఆశీనుడై ఒంటరిగా ప్రకృతి సౌందర్యమును, ప్రశాంతతను అనుభవిస్తున్నాడు. అప్పుడు ఒకానొక రాజు తన పరివారమును వెంటబెట్టుకొని వేటవినోదమును ఆస్వాదించుచు ఆ కొండ క్రింద గల బాటవెంట రావటం జరిగింది. మన బ్రాహ్మణుడు ఆ సంరంభమంతా గమనించుచు తన అంతరంగమున ఇట్లు సమాలోచించసాగాడు. "ఆహా! ఈ రాజు ఎంతటి వైభవము అనుభవించుచున్నాడు! ఈ గుఱ్ఱాలు, ఈ ఏనుగులు, ఈ సేవకులు, ఈ నారీజనం! ఇవన్నీ నేనుకూడా పొందితే ఎంతబాగు! నేనుకూడా ఎప్పటికైనా ఇంతటి వైభవం అనుభవిస్తానా?"

ఆ రోజునుండి అతడు ఇట్లే చింతనచేయసాగాడు. అట్లా అనుక్షణికంగా 'చింతన' చేస్తూనే తన దైనందిక కర్మలను యథావిధిగా నిర్వర్తిస్తూ ఉన్నాడు. కాలక్రమంగా ముసలివాడయ్యాడు. ఒక రోజు అతని భార్య "అయ్యో! ఈ నా భర్త ఇక ఎంతోకాలం జీవించనట్లే ఉన్నదే?" అని అనుకొన్నది. మరణ రహితమనేది అసంభవమని ఆమెకు బాగా తెలుసు. ఆమె తన భక్తిప్రపత్తులతో నన్ను ప్రసన్నురాలిని చేసుకొని, "అమ్మా! ఈ నా భర్త ఒక వేళ విధివశాత్తూ మరణిస్తే అతని జీవము - నేను కూడా నా ఈ గృహమునుండి బయటకు వెళ్ళకుండునట్లు దీవించు" అని నన్ను వరం కోరుకున్నది. నేను అట్లే వరం ప్రసాదించాను.

కొంతకాలానికి ఆ బ్రాహ్మణుడు మరణించాడు. అయితే, అతని జీవచైతన్యము జీవ వాసనా ప్రభావం చేత ఆ ఇంట్లోనే నివసించసాగింది. అతడు ఆ గృహాకాశము నందే తన కల్పనాబలం చేత పరమశక్తి సంపన్నుడగు రాజు అయ్యాడు. తన ప్రతాప శక్తులతో ముల్లోకములను జయించి పాలించసాగాడు. అతడు సాధువులకు దిక్కై, శాస్త్రములకు ఆదర్శమై, యాచకులకు కల్పవృక్షమై, ద్విజులకు ఆశ్రయమై, ధర్మమునకు ఆలవాలమై రాజ్యపాలనం చేస్తూ వస్తున్నాడు. చూచావా బిడ్డా! ఆ బ్రాహ్మణుడు తన పాంచభౌతిక శరీరమును పరిత్యజించి ... ఆ గృహాకాశమునందే చిత్తాకాశ మయమగు శరీరమును దాల్చి విస్తారమైన రాజ్యపాలనను అనుభవించుచున్నాడు.

అతని భార్య విగతజీవుడైన తన భర్త శరీరమును చూచి అత్యంత దుఃఖమును పొందింది. కొద్ది సమయం ఎంతగానో దుఃఖించింది. అప్పుడామె కొయ్యబారిపోయి, తన దేహమును పరిత్యజించి తానుకూడా అతివాహిక దేహము (లేక చిత్తాకాశము)ను ఆశ్రయించి తన భర్త వద్దకు వెళ్ళినది. అక్కడ ఆమె తన భర్తతో సంతోషంగా కాలం గడపసాగింది. అది ఆమె కోరుకున్నట్లు ఆ బ్రాహ్మణ గృహంలోనే ఏర్పడి కొనసాగుతోంది.

❖

ఓ లీలాదేవీ! ఆ బ్రాహ్మణదంపతులు మరణించి నేటికి ఆ గిరి గ్రామంలో ఎనిమిది రోజులు గడచింది. వారిద్దరు తమ స్థూలదేహములను పరిత్యజించారు కదా! వారి ఇరివురి భౌతిక శరీరములు ఆ గిరి గ్రామంలో ఆ ఇంటికి సమీపంలో ఖననం చేయబడ్డాయి. అక్కడ, వారి భూములు 'స్థిర-చర' ఆస్తులు, ధనరత్న, గృహాదులు ఇప్పటికి అట్లే ఉన్నాయి.

ఓ పుత్రికా! ఆ బ్రాహ్మణ దంపతుల కథ అంతా చెప్పాను కదా! ఇప్పుడు విను. ఆ బ్రాహ్మణుడే నీ భర్తయగు 'పద్ముడు' ... అతడే ఇప్పుడు చిదాకాశమునందు – నీవు చూచిన–రాజ్యమును పొంది పాలన చేస్తున్నాడు. నీవే ఆ 'అరుంధతి' అనబడు బ్రాహ్మణ పత్నివి. అప్పుడు ఆ గిరి గ్రామంలో మీరిద్దరు పార్వతీ పరమేశ్వరులవలె బ్రాహ్మణ దంపతులుగా చాలాకాలం ఉండి ఉన్నారు. ఇప్పుడో ఆ నీవే ఇక్కడ నీ భర్త యొక్క వియోగమును పొందినదానవై, విరహము అనుభవిస్తూ, ఈ రాజ్యమును పాలించు చున్నావు.

"ఇతఃపూర్వపు – సృష్టులు, ఇప్పటి–సృష్టులు, ఇకముందు–సృష్టులు" భ్రమ మాత్రమేనని చెప్పానుకదా! బ్రహ్మాకాశమే (లేక శుద్ధ చైతన్యమే) భ్రమ వలన జీవ స్వరూపమును గ్రహించుచున్నది. భ్రమ వలననే చిదాకాశమునందు భ్రమ ప్రతిబింబిస్తోంది. ఏది సత్యమో, ఏది మిథ్యయో అనుభూతిపూర్వకంగా సుస్పష్టపడితే .... అప్పుడిక్కడ ఇక మిగిలేది ఏమీ ఉండదు. అందుచేత నీవు ఏది భ్రమయుతమో చక్కగా గ్రహించటానికి ప్రయత్నించు. అప్పుడు, "ఈ సృష్టి స్వతహాగా లేదు. నేను నాయొక్క స్వకీయ సంకల్పనాబలంచేత, కల్పనను ఆశ్రయించటంచే లేనిదానికి అస్థిత్వమును ప్రసాదించుచున్నాను. అట్లు ప్రాప్తించిన అస్థిత్వమును మరల అనుభవించుచున్నది నేనే" .... అనునట్టి ఆత్యంతికమైనట్టి "సృష్టి కేవలం దృష్టి మాత్రమే" అనే అవగాహన కలుగగలదు.

❖❖❖

# 7. జ్ఞాపకాలు

సరస్వతీ మాత చెప్పినదంతా విని లీలాదేవి మరల–మరల యోచిస్తూ అత్యంత ఆశ్చర్యం పొందింది. కొద్దిసేపు మౌనం వహించింది.

**లీల :** హే దేవీ! నీ పలుకులు కొంత అసందర్భముగా ఉన్నట్లు నా బుద్ధికి అనిపిస్తున్నాయి. ఆ బ్రాహ్మణుడు ఒక చిన్నగృహంలో మరణించి ఉండటమేమిటి? మేము ఇక్కడ ఉండటమేమిటి? మేమే ఆ బ్రాహ్మణ దంపతులమై ఉండి ఎనిమిది రోజుల క్రితం మాత్రమే మరణించియుండుటమనేది ఎంతటి చమత్కారం! బహు విస్తారమైన మా ఈ రాజ్యము ఆ బ్రాహ్మణ గృహములో ఇమిడి ఉండి ఉన్నదంటావా? ఇప్పుడు నా భర్త పరలోకమున ఉన్నాడు కదా! అక్కడి మహారాజ్యములు, విస్తారమైన భూములు, పర్వతములు, దిక్కులు ఈ చిన్న గదిలో ఎట్లా ఇముడుతాయి? మదించిన ఒక పెద్ద ఏనుగు ఆవగింజలో ఇమిడేదెట్లా? ఒక చిలక సింహముల గుంపును, అటువంటి చాలా చిలకల గుంపులను ఒక దోమ మ్రింగగలవా? "ఒక తుమ్మెద ఐదు క్షణములలో ఒక మేరుపర్వతమును నమిలి జీర్ణం చేసుకొన్నది" అన్నట్లున్నాయి నీ మాటలు. నా స్వప్నంలో చూస్తున్న మేఘములకు స్పందించి నేను నిద్రిస్తున్న గది వెలుపలగల నెమళ్ళు నాట్యం చేస్తాయా? ఓ సర్వేశ్వరీ! ఇవన్నీ అసంభవమైనట్లే ఆ విప్రభవనంలో పృథివీ – పర్వతాలు ఉండటం అసంభవమని నేను అనుకొంటు న్నాను. అమ్మా! మూఢురాలు, అజ్ఞానియగు నావంటి బిడ్డలు ఏదో తెలిసో–తెలియకో ప్రశ్నించి

నప్పటికీ మహాత్మురాలవు, జగత్తుకే మాతవు అయినట్టి నీకు కోపం వస్తుందా? లేదు. నాకు చిత్తశుద్ధి ప్రాప్తించే విధంగా నీవు ఉన్న–సత్యము ఉన్నట్లు నాకు విశదపరచ వలసినదని ప్రార్థన చేస్తున్నాను.

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రికా! లీలాదేవి! ఈ మాయ యొక్క స్వరూపస్వభావములను గ్రహించి, దీనికావల ప్రతిష్ఠితమైయున్న మేము నీ ప్రశ్నలకు ఆశ్చర్యపడం. నేను ఏదీ అసత్యం చెప్పటంలేదు సుమా! "జనులు అబద్ధము చెప్పరాదు" అను నియమమును లోకమున ప్రబోధించినది సత్యస్వరూపుల మగు మేమే కదా! మేమే ఆ నియమమును ఉల్లంఘిస్తే ఇక ఉత్తమ ఆచారములను పాలించే వారెవరుంటారు? కనుక నేను చెప్పుచున్నదంతా వాస్తవమేనని గ్రహించు. ఆ బ్రాహ్మణుని జీవాత్మ అక్కడి గృహాకాశంలో ఆకాశరూపమును పొంది అట్టి 'ఆకాశరూపము'నే విస్తారజగత్తువలె గాంచుచున్నది.

**లీలాదేవి :** అయితే మరి "నా భార్య, నా భర్త, నా పుత్రులు, మా గృహములు" .... వంటి స్మృతులన్నీ ఏమయ్యాయి?

**శ్రీ సరస్వతీదేవి :** రాత్రివేళ స్వప్నము గాంచుచున్నప్పుడు, ఏర్పడియున్న "నా భార్య – నా భర్త – నా పుత్రులు – నా గృహములు" ... అనునవన్నీ నిదుర నుంచి లేవగానే ఏమైపోతున్నాయో చెప్పు? స్వప్న సమయంలో ఆస్వప్నములోని పదార్థములు, సంఘటనలు, వ్యక్తులు 'సత్యము' వలె తోచుచు, జాగ్రత్ వ్యవహారమంతా అసత్యమువలె, అస్థిత్వము లేనిదానివలె అనుభవమౌతోంది. అదేవిధంగా, ఈ జాగ్రత్తుకు వచ్చినప్పుడు (నిదురలేచినపుడు) స్వప్నములోని వ్యవహారమంతా భ్రమమాత్రంగా, అవాస్తవంగా తోచుచున్నది. కాని ఈ జాగ్రత్ వ్యవహారము మాత్రం జాగ్రత్ సమయంలో ఘనీభూతమై సత్యమైనదానివలె అనుభవించబడుతోంది.




స్వప్న సమయంలో ఈ జాగ్రత్ స్మృతులు లేకుండా (అవాస్తవమై) ఉంటున్నట్లే. జాగ్రత్ సమయంలో స్వప్నస్మృతులు అవాస్తవముగా, అస్థిత్వము లేనివిగా మిగిలి పోతున్నాయి కదా!

అదేవిధంగా "మేము విప్రదంపతులమై ఉండి ఉంటిమి కదా!" అను విషయజ్ఞానం ఈ "రాజు–రాజ్ఞి" జన్మలలో మీకు ప్రాప్తించటం లేదు. అది "స్వప్నతుల్యమాత్రంగా, భ్రమగా భావన కలిగియుండుటయే అందుకు కారణం. ప్రతి ప్రాణియొక్క పూర్వ జన్మానుభవం ఇట్లే ఉంటున్నది.

అసలు, ఆ మాటకు వస్తే .... "మేము విప్ర దంపతులము" అనునది ఉల్లిపొరలవలె ఒకానొక స్వప్నతుల్యమే కదా! అనేక కెరటములలో నీరు మాత్రమే సత్యమై యున్నట్లు, మీ ఇరువురి యందు, నాయందు, సర్వులయందు గల "చిదాత్మ" మాత్రమే సత్యము.

1. ఒకడు తన స్వప్నములో జనులను, పదార్థములను దర్శించటం.
2. మరొకడు తన సంకల్ప ప్రపంచమందు 'నగరములు' మొదలైనవి పొందటం.
3. ఎడారిలో జలభావము కారణంగా నీటి కాలువలను (ఎండమావులను) గాంచటం.
4. ఆ బ్రాహ్మణుడు గృహాకాశంలో వన-పర్వతాదులతో కూడిన పృథివిని చూడటం.

ఇవన్నీ ఒక తీరుగల విషయాలే అయివున్నాయి. ఒక చిన్న అద్దంలో పెద్దవస్తువులు, విశాలమైన దృశ్యము కనబడటంలేదా? కాని ఆ కనబడునది అవస్తువే అయివున్నది కదా! అదేవిధంగా సూక్ష్మమైన అంతఃకరణమున ప్రతిబింబించు విశాలజగత్తులు కూడా మిథ్యయే. అందులో కనబడే పృథివి మొదలైనవి కూడా మిథ్యయే. అవన్నీ సత్యస్వరూపమగు 'చిదాకాశము' యొక్క - జలంలో 'ప్రతిబింబాలు' వంటి ప్రతిబింబ చమత్కారములు మాత్రమే.

దీనినిబట్టి నీవు గ్రహించవలసినదేమిటి?

"నిర్మలాకాశస్వరూపమగు పరబ్రహ్మమున - అసత్యమగు ఈ సృష్టి సత్యమైనదానివలె ప్రతిభాసితమగుచున్నది" అని ఓ లీలాదేవీ! జగత్తునందు ఇంతకుమించి వాస్తవమగు సత్యమంటూ ఏదీలేదు. సర్వుల హృదయాంతర్గతమైనట్టి, 'చిదాత్మ' యొక్క అనుభవమే ... ఆరోపమాత్రమగు ఈ జగత్తునందు ప్రతిబింబిస్తోంది. ఎడారిలోని ఎండమావులలో నీరెక్కడిది? భావనామాత్రంచే ఏర్పడిన స్మృతి నుండి కథా సంఘటనలవలె జనించే ఈ "పృథివి, అనుభవములు, సంఘటనలు, సంబంధములు" .... మొదలైనవన్నీ సత్యమెట్లా అవుతాయి? ఈ నీ గృహము, ఈ గృహాకాశమున ఉన్న నీవు, నేను, తదితరములగు వస్తువులు .... ఇవన్నీ చిదాకాశమే గాని, మరింకేమీ అయి ఉండలేదు. అయితే, చీకట్లో ఉన్న దానిని చూడటానికి దీపం సహకరిస్తున్నట్లు, ఇవన్నీ మనకు, "ఈ జగత్తు యొక్క మిథ్యాత్వం" అర్థం చేసుకోవటానికి ప్రమాణాలుగా, దృష్టాంతాలుగా సహకరిస్తున్నాయి.

❖

"గిరి" గ్రామంలో గల ఆ ఇంటిలోని చిదాకాశమునందే ఆ విప్రుడు ఉన్నాడు. ఆ గృహాకాశంలోనే సముద్రములతో గూడిన పృథివి కూడా ఉన్నది. ఓ పుత్రికా! ఒక త్రసరేణువులో (పరమాణువులో) అనేక జగత్ సమూహములు అనుభవం కాగలవు. ఇక ఆ విప్రగృహంలో నగరములు, ఉపవనములు మొదలైనవి ఇమిడి ఉండటంలో ఆశ్చర్యమేమున్నది? 'కల్పన' అనుదానికి అంతెక్కడ? అడ్డేముంటుంది? 'చిన్మయ పరమాణువు' అయినట్టి యీ 'మనస్సు'లోనే యీ జగత్తంతా ఉండివున్నదని నీవు ఎఱుగవా? ఇది అత్యంత సామాన్యమైన విషయమే. దీనిని గురించి నీవు యింతగా శంకిస్తున్నావేమిటి?

❖❖❖

# 8. కాల కల్పన

**లీలాదేవి :** ఓ పరమేశ్వరీ! ఇదంతా బాగానే ఉన్నది. కాని ఆ వసిష్ఠ నామధేయుడగు బ్రాహ్మణుడు మరణించి ఇప్పటికి ఎనిమిది రోజులు మాత్రమే అయినదని అన్నావు కదా! నేను-నా భర్త ఇచట ఈ రాజ్యం పాలిస్తూ ఈ అంతఃపురంలో అనేక పదుల సంవత్సరములు గడిపామే! ఇదెట్లా సాధ్యం? ఈ విషయం మరికొంత నాకు సుస్పష్టం చేయి.

**శ్రీ సరస్వతీదేవి :** "ఈ స్థలము ఇక్కడ ఉన్నది" అను మాట ఆయా సరిహద్దు స్థలములను దృష్టిలో పెట్టుకొని మాత్రమే అనగలం. అంతేకాని స్థలమునకు స్వయంనిర్మితమైన నామరూపస్థితులు ఎక్కడ ఉన్నాయి? 'దేశము' అనబడుదాని విషయము కూడా అంతే. "ఇది ఈ పేరుగల దేశము, దీని సరిహద్దులు ఇవి. దీని ఆవల ఆ దేశమున్నది" అను కల్పనల చేతనే దేశము యొక్క ఉనికి అనుభవమౌతోంది. అంతేకాని, దేశమునకు స్వతఃసత్త ఎక్కడ ఉన్నది? అదేవిధంగా "కాలము" అనుదానికి కూడా స్వతఃసిద్ధ నిర్ణీతమైన కొలత లేదని గ్రహించు. (Time and distance are relatively experienced. They do not have form and existence if relativity is removed or dropped).

"ఈ 'జగత్‌సృష్టి' అంతా బ్రహ్మము నందే దర్శించబడుచున్నది" .... అని అనుకొన్నాము కదా! అదే విధంగా "క్షణము-కల్పము" .... అనునట్టి కల్పనామయమగు కాలము కూడా "బ్రహ్మము" నందే అధ్యాసింపబడుచున్నది. అనగా .... "క్షణములు, సంవత్సరములు, యుగములు, కల్పములు, త్రిభువనములు, నీవు, నేను" .... మున్నగు వస్తువులన్నీ పరమాత్మయొక్క ప్రతిభాసలే అయివున్నాయి. అది ఎట్లో చెపుతాను. విను.

❖❖❖

# 9. మిథ్యామోహ స్వీకారం

ఈ జీవుడు క్షణకాలంలో మిథ్యామోహమున పడి, తన ఇతఃపూర్వపు విశేషములన్నీ మరచి, "అన్యధా" గాంచుచున్నాడు. అదియే భౌతిక దృష్టిచే 'మరొక జన్మ' వలె తోచుచున్నది. స్వప్నంలో ప్రవేశించుచున్నప్పుడు 'జాగృత్'ను క్షణంలో త్యజిస్తున్నాడు కదా! ఇది కూడా అట్టిదే.

శరీరమును ఆశ్రయిస్తున్నప్పుడు కూడా ఇతడు చిదాకాశమునందే చిదాకాశమే స్వరూపముగా కలిగినవాడై ఉంటున్నాడు. అయితే, మాయాబద్ధుడై ఉన్నప్పుడు అతని భావపరంపరలు ఇట్లు ఉంటున్నాయి.

"నేను ఈ పంచభూతాత్మికమైన వస్తుస్థితిపై ఆధారపడియున్నాను. ఇదియే నా రూపము. ఈ చేతులు-కాళ్లతో కూడుకొనియున్న శరీరము నాది. నేను ఈ శరీరమున నిండి ఉన్నాను కాని, మరింకెక్కడా లేను. ఈ తండ్రికి కొడుకునైనాను. క్రమంగా నాకు ఇంత వయస్సు గడచిపోయినది. ఈ బంధువులు అందరు నా వాళ్ళు. ఈ అందమైన ఇల్లు నాది. నేను పుట్టిన తరువాత బాల్యము

గడిపాను. ఇప్పుడు యువకుడనయ్యాను. అది కూడా గడచిపోయి, ఇప్పుడు వృద్ధుడనయ్యాను. నా బంధుమిత్రులు ఇదివరకటిలాగానే ఉన్నారు."

చూచావా లీలా? ఇట్టి భ్రమపూర్వకమైన జ్ఞానమంతా వచ్చిపడుతోంది. అయితే అట్టి జ్ఞానము యొక్క కారణము, అధిష్ఠానము (cause and substratum) కూడా చిదాకాశమే సుమా! అందుచేత ఈ ద్రష్ట దృశ్యములు, అనుభవజ్ఞుడు – అనుభవములు (Experiencer - Experiences) అనునవి చిత్స్వభావములే కాని, వేరేమీ కావు. చిదాకాశము (Zone of Consciousness / Awareness) కాకుండా ఇక్కడగాని, మరెక్కడాగాని మరింకేదీ లేనేలేదు.

ఈ జీవునియొక్క వాస్తవస్వరూపము 'చిత్–శక్తి'యే. సర్వవ్యాపియగు చిత్‌శక్తియే "నేను జీవుడను" అను రూపముగల స్వప్నమును గాంచుచున్నది. ఈ దృశ్యము – దర్శనముల స్వరూపమంతా అదియే. అందుచేతనే అసత్యములగు ఈ లోకములన్నీ సత్యములవలె కనబడుచున్నాయి. నీటికి–కెరటములకు భేదమేమున్నది చెప్పు? ఇహలోక–పరలోక – స్వప్నములకు భేదమేమీ ఉండదు. ఇహలోకము కూడా ఇతఃపూర్వమునకు పరలోకమే కదా! అసలు 'భేదబుద్ధి' అనునది భ్రమనుండే కలుగుచున్నది. "జగత్ – భావము" అనునది భ్రమయొక్క పరిణామమే. అనగా, 'జగత్తు అనబడుదానికి అస్థిత్వమే లేదు. భ్రమను ఆశ్రయించియున్నది వాస్తవమెట్లా అవుతుంది? ఆ కారణంగా "ఈ జగత్తు పుట్టుకయే లేనిది" అని చెప్పబడింది. పుట్టుకయే లేనప్పుడు ఈ దృశ్య జగదత్వమునకు నశించటం మాత్రం ఎక్కడ ఉంటుంది?

❖

ఓ లీలా! ఈ ప్రతిభాతమగుచున్నదంతా, లేక, మనస్సుచే జగత్తుగా చూడబడు చున్నదంతా "చిత్తు (consciousness) కాక మరొకటేదీ కాదు సుమా! ఇదంతా సర్వదా ఆకాశస్వరూపమే. దృశ్యములన్నీ ఈ చిత్తునందే ఆరోపించబడుచున్నాయి. ఒకడు చీకట్లో మెలితిరిగి పడియున్న త్రాడును చూచి 'పాము' అని భ్రమించటం ఎట్టిదో – ఈ జగద్దృశ్యము కూడా అట్టిది మాత్రమే. ఎందుకంటావా? ఈ దృశ్యములకు ద్రష్ట కన్న వేరైన 'సత్త' లేనేలేదు. 'తరంగములు' అని మనం చెప్పుకునేదంతా జలము అయివున్నది కదా! ఆరోపితమాత్రమైన ఈ సృష్టి (Superimposed one) కూడా చిదాకాశము కంటే వేరేమీకాదు. "నీటి నుండి తరంగములు వేరైనవా?" అని ఎవరు విమర్శించి పరీక్షిస్తారో వారికి "తరంగభావము మిథ్య" అని తెలియవచ్చుచున్నది. అదేవిధంగా జ్ఞానదృష్టితో ఈ సర్వము పరీక్షించినవారికి మాత్రమే "చిదాకాశమునకు వేరుగా సృష్టి లేదు" అని తెలియవచ్చుచున్నది. ఒకవేళ వేరుసృష్టి కనబడుతుంటే, అది "అవిచారణ, వ్యతిరిక్తమైన అభ్యాసము"ల చేత మాత్రమే. అందుచేత పుత్రీ! చిదాకాశమే స్వప్రకాశంచేత జగదాకారముగా కనబడుచున్నదని గ్రహించు. ఈ విధంగా 'దృశ్యపదార్థము' అనునదే మిథ్య (లేనిది) కాబట్టి, "ద్రష్ట – దృశ్యబోధ" … అనునవి కూడా మిథ్యయే."

❖❖❖

# 10. "మరణము పొందటం" అనగా?

ఈ ప్రాణి (లేక జీవుడు) 'మరణము' అనునది పొందటం మనం చూస్తూనే ఉన్నాము కదా! అట్టి సమయంలో నశించుచున్నదేమిటి? ఈ స్థూలశరీరము మాత్రమే నేలకూలుచున్నది. అనేక భావములు, ఆర్తులు, అభిప్రాయములు, కోరికలు, అభిరుచులు, ఉబలాటములు మొదలైనవన్నీ తన రూపముగా గల "సూక్ష్మదేహము" (ఆతివాహిక శరీరము లేక Subtle body) యథాతథంగా ఉండనే ఉంటుంది. అందుకు దృష్టాంతము గాఢనిద్రయే. గాఢనిద్రాసమయంలో మనోగతమైనదంతా అప్రకటితంగాను, జడంగాను ఉంటోంది. అంతేగాని, లేకుండా పోవుటలేదు కదా!

అట్టి సూక్ష్మ శరీరము ఉన్నంతవరకు మోహము ఎక్కడికీ పోదు. అది మరలమరల వచ్చి పడుతూనే ఉంటుంది. మోహము వికసించగానే మరల దృశ్యమునకు చెందిన అనుభవము స్వభావసిద్ధంగా ప్రాప్తిస్తూనే ఉంటుంది. అనగా, అద్దములో ప్రతిబింబము లాగా ఆత్మయందు జగత్తు ప్రతిభాసితమౌతూనే ఉంటుంది. అయితే దృశ్యములోని మార్పు – చేర్పులు, అది ప్రతిబింబించే అద్దమునకు ఏమాత్రం సంబంధించి ఉండదు కదా! ఆత్మయందు ప్రతిభాతమయ్యే జగదనుభవము ఆత్మకు ఏమాత్రం మార్పుచేర్పులు కల్పించటం లేదని గ్రహించు.

**జీవ చైతన్యము - సూక్ష్మ దేహము - స్థూల శరీరము :**

అతని జీవచైతన్యమునకు (లేక శుద్ధ–స్వస్వరూపమునకు) 'మృత్యువు' అనునది ఉండదు. అనగా మననమే స్వరూపముగా గలిగినట్టి సూక్ష్మదేహము ఎవరి కర్తృత్వమైయున్నదో అట్టి 'చిదాత్మ'కు పుట్టుకలుండవు. ఈ జీవుని వాస్తవ స్వరూపము అట్టి చిదాత్మయేగాని, ఈ సూక్ష్మ–స్థూలదేహములు కావు సుమా! 'మృత్యువు' అనునది పాంచభౌతిక దేహమునకు మాత్రమే పరిమితము. అద్దంలో ప్రతిబింబములాగా అతని చైతన్యము నందు ప్రతిబింబించేదంతా .... శరీరము ఉన్నప్పుడూ – లేనప్పుడూ కూడా .... ఇంతకుముందటి స్మృతి లేక జ్ఞానమునకు అనుసరించే ఉంటోంది. అనగా, మరల శరీరము ధరించిన ఈ జీవుడు తాను ఇంతకు ముందు గాంచిన "కాలము ఆరంభము – క్రమము – జగత్తు – తల్లి – తండ్రి – వయస్సు – జ్ఞానము – బంధువులు – భృత్యులు – యత్నములు – స్థానములు – క్షయము" మొదలైనవాటిని చిదాకాశము నందు గాంచుచున్నాడు. అట్లు ఎరుగుట అతని స్వభావం. "నేను జన్మించాను. వీరు నా తల్లిదండ్రులు. ఇప్పుడు నేను బాలుడను" అనునదంతా పూర్వస్మృతి బలంచేతనే కలుగుతోంది. క్రమంగా దేశ–కాలముల బోధకూడా ఏర్పడుతోంది. పువ్వు నుండి కాయ – పండు లాగా అవన్నీ రూపుదిద్దుకుంటున్నాయి.

అట్టి సమయంలో అతడు 'ఒక్క క్షణం'లో 'కల్పము' – అంతటి కాలమును కూడా అనుభవించగలడు. "స్వల్పకాలంలో దీర్ఘకాలము యొక్క అనుభవం" .... అనుదానికి అనేక దృష్టాంతాలు మనకు లభిస్తున్నాయి. 'హరిశ్చంద్రుడు' అను ఒక మహారాజు ఒక్కరాత్రిలో పండ్రెండు సంవత్సరముల కాలమును అనుభవించియున్నాడు. ఒకడు అత్యంత విరహముతో బాధ

పడుచున్నప్పుడు ఒక్కరోజు కాలం అత్యంత దీర్ఘంగా అనుభవమవుతూ ఉంటుంది కదా! బాగా ఆకలిచే బాధపడువానికి ఆయా జడాకారములు ఆహారపదార్థలవలె గోచరిస్తూ ఉంటాయి. ఈ జీవచైతన్యమునకు కూడా, "నేను జన్మించాను. మరణించాను. నా తల్లి, నా తండ్రి, నా బంధువులు" అనునట్టి బుద్ధి కలుగుచున్నది. ఇక అతడు అప్పుడు శూన్యస్థానములో జనసమూహమును దర్శిస్తాడు. విపత్తు ఉత్సవంలాగా ఉంటుంది. వంచన లాభంవలె తోస్తుంది. ఈ బుద్ధి యొక్క కల్పనకు అంతు ఎక్కడిది? అర్థమేమున్నది?

❖

ఇది ఇట్లుండగా, మరొక విషయం చెపుతాను విను. మిరియపుగింజలో 'కారం' బైటకు అగుపడకుండానే ఉంటుంది. ఒక శిలయందు శిల్పము చెక్కబడకపోయిన సమయంలో కూడా "శిల్పత్వము" ఉండే ఉంటుంది. శిల్పి ఆ శిలయందు శిల్పము చెక్కుచున్నప్పుడు బైటనుండి ఏదీ తెచ్చి అందు ఉంచుట లేదుకదా? "భ్రమ మయమైనట్టి ఈ జగత్తు ఉన్నది ఎక్కడ?" అనే ప్రశ్నకు సమాధానం విను :

"భ్రమాత్మకమగు ఈ దృశ్యజగత్తంతా మరెక్కడా లేదు. ఇదంతా జన్మరహితుడు, నిత్యుడు అయినట్టి ఆ పరమపురుషుని ఆశ్రయించుకొనే ఉన్నది. అంతేకాని దీనికి స్వకీయమైన 'సత్త' లేదు. ఈ జీవుడు స్వతహాగా ఆ పరమపురుషుడే సర్వదా అయివున్నాడు?"

❖❖❖

## 11. ఇదంతా స్వకీయ కల్పనయే!

ఓ లీలా! శ్రద్ధగా వింటున్నావు కదా! ఇందుకు ... ప్రతిరోజు, ప్రతిక్షణం, ప్రతి ఒక్కరికి అనుభవమగుచుండే ఒక చిన్న దృష్టాంతము నీ అవగాహన కొరకు చెపుతాను, విను.

"కళ్ళు మూసుకున్నప్పుడు ఏ రూపములు కనుపించవు. కాని, కళ్ళు తెరిచి చూచినప్పుడో ... నానావిధ రూపములు కనిపిస్తాయి కదా! అదేవిధంగా ద్రష్టయందు 'జ్ఞానదృష్టి' బలవత్తరమైనప్పుడు, "నానా రూపములుగా కనిపించేవన్నీ నానావిధములు కావు" అనునట్టి అంతర్గతమైన దృష్టి లేక అవగాహన తప్పకుండా సుసాధ్యమే. అజ్ఞాన దృష్టికి మాత్రం ఇవన్నీ పూర్తిగా మరొక విధంగా అనుభవమౌతున్నాయి.

ఈ జీవుడు మృతి పొందిన వెంటనే (శరీరము నేలకూలిన వెంటనే) అతనికి అసంఖ్యాకములగు దృశ్యజగత్తులు కనిపిస్తున్నాయి. ఈ దిక్కులు, కాలము, ఆకాశము, ధర్మము, కర్మలు .... ఇవన్నీ కల్పాంతము వరకు స్థిరముగా ఉండే వస్తువులే సుమా! ఇవన్నీ చిదాకాశములోనే ప్రస్ఫుటమౌతున్నాయి. చిదాకాశమునకు ఆద్యంతాలు ఎక్కడ? కల్పన ఉన్నంతవరకు జగద్వ్యవహారము ఉంటుంది. కల్పన తొలగితే ఏమీ ఉండదు. కల్పన లేనట్టి స్థితినే "కల్పాంతము" అని పిలుస్తున్నాము.

'స్మృతి' (జ్ఞాపకము) అనుదానినుండి ఉద్భవిస్తున్న ఈ 'స్మరణము' అనునది అత్యంత విచిత్రమైనది. స్వప్నంలో ... అంతకుముందు అనుకోనివి, చూడనివి, కోరనివి కూడా స్మరణకు వస్తాయి కదా! అదేవిధంగా ఈ జీవుడు అంతకుముందు గాంచనట్టి, ఒనర్చనట్టి విషయములు కూడా మరణానంతరం స్మరణకు వస్తున్నాయి. అయితే ఈ స్మరణ అంతా అతని అంతరంగమున గల సంస్కారమునకు వేరుగా ఉండినది కాదు. మనస్సుచే కల్పించబడి గాంచబడు ఊహానగరమునకు మూలమంటూ ఏదీ లేనట్లే, ఈ భ్రాంతికి కూడా మూలమంటూ ఏదీ లేదు. ఇదంతా వెలిసి ఉండేది చిదాకాశమునందే కదా! భ్రాంతియే పూర్వస్మృతిని ఆధారంగా చేసుకొని, "ఇది జగత్తు – ఇది సృష్టి', 'ఇది దూరము – ఇది దగ్గర', 'ఇది క్షణము – ఇది యుగము', 'ఇది స్వల్పము – ఇది దీర్ఘము' " అను రూపములుగా ముందుముందు భ్రమలన్నీ కల్పించుకొనుచున్నది.

'చిద్రూపము' ఒక్కటే కారణరహితమైనది. తదితరములన్నీ కల్పన యొక్క ప్రభావమే అయివున్నది. ఆ కల్పనకు కారణం చిద్రూపమే. స్వప్నంలో కనబడే వస్తువులు, వ్యక్తులు ఏమి అయివున్నాయి? అక్కడ అనుభూతమయ్యేదంతా స్మృతి యొక్క కల్పనయే కదా! తండ్రివలె ఉన్నవానిని చూచినప్పుడు తండ్రి గుర్తుకు వచ్చినట్లు. ఆయా నూతన వస్తువులు తారసపడినప్పుడు అంతరంగమున నూతనానుభవములు ఉద్భవించి బహిర్గతం అవుతున్నాయి. ఇట్లు జ్ఞప్తి రెండు విధాలుగా వర్తిస్తోంది.

1. స్మృతి  2. సంస్కారము

ఈ రెండు కూడా, నిశితంగా, పరిశీలించినప్పుడు, "ఈ రెండూ చిదాకాశము కంటే వేరు కాదు" అని తెలియవచ్చుచున్నది.

**స్మృతి - ముక్తి :**

ఓ లీలా! సంకల్పమయమగు ఈ సంసారమంతా కూడా సృష్టికాలంలో విధాత (లేక 'బ్రహ్మదేవుడు' లేక 'సమష్టి–సృష్టికర్త') యొక్క కల్పన యందే ఇమిడివున్నది. ఆ తరువాత స్థూలమగుచు క్రమముగా ఈ విస్తారమైన రూపమును దాల్చుచున్నది. కొందరు ఈ జగద్దృశ్యమును ఒకానొక బాహ్యమైనదానివలె గాంచుచున్నారు. మరికొందరు ఇదంతా తమ స్మృతియందే అనుభవమాత్రమై ఉండి ఉండుటను గమనించుచున్నారు. మరికొందరికి కాకతాళీయంగా స్మరణలేకుండానే ఇది అనుభవమునకు వస్తోంది.

ఈ సంసారవ్యవహారం ఈ విధంగా 'స్మృతి' చేతనే నిర్వచించబడుచు, స్మృతికి అందనిదై ప్రవర్తిస్తోంది కదా! అయితే జ్ఞానులు "ముక్తి" అనబడు మరొక స్థితిని మనందరికి ప్రతిపాదిస్తున్నారు. 'ముక్తి' అంటే ఏమిటి? ఈ సంసారము సంపూర్ణముగా విస్మరించబడుటయే సుమా! "ఈ సంసారము నందు నాకు కోర తగినది గాని, నిరాకరించ తగినదిగాని ఏదీ లేదు" అనునట్టి భావము సుస్థిరముగా యుండుటే "ముక్తి". ఈ 'అహం' అను జ్ఞానము దానిని అనుసరించియున్న దృశ్య జగత్తు అభావాన్నొందినప్పుడు మాత్రమే 'ముక్తి' అనునది బోధపడగలదు. "అహం–దృశ్యము"లు అంగీకరించబడినంతకాలం ఈ జన్మ–కర్మలు, అనుబంధ–బాంధవ్యములు ఉంటూనే ఉంటాయి.

అనగా దృశ్య పరంపరలు ఒకదానివెనుక ఒకటి వచ్చిపోతూనే ఉంటాయి. అవి జీవుని ప్రభావితం చేస్తూ, పోతూ ఉంటాయి. చీకట్లో మెలికలు తిరిగి–ఉండియున్న త్రాటియందు, "ఇది పాము" అనునట్టి "శబ్దము– దాని అర్థము" తొలగనంతవరకు సర్పము యొక్క భయం తొలగేదెట్లా?

**ప్రయత్నపూర్వకమైన చిత్తనిరోధము :**

"ఈ దృశ్యమును మరచిపోతాను. అట్లు మరచుటచే త్యజించివేస్తాను. దీనిని 'తిరస్కరించటం' అనునట్టి యోగమును ఆశ్రయిస్తాను" ... అని కొందరు యోగముచే చిత్తమును నిరోధింప ప్రయత్నిస్తున్నారు. అయితే అట్టి 'చిత్త–నిరోధము' అను బలవత్తర ప్రయత్నముచే కొద్దిసేపు శాంతి, ఉపశమనము లభించినప్పటికి, అది నిజమైన, శాశ్వతమైన శాంతి కాదు. ఆ 'యోగము' భంగమైనప్పుడు మరల, మరుక్షణం, 'సంసృతి' లేక 'సంసారము' వచ్చిపడుతోంది. ఒక దయ్యం వదలి మరొక దయ్యం పట్టుకొంటే లాభమేమున్నది? అందుచేత లీలా! నీవు జ్ఞానదృష్టిని అలవరచుకో.

**'జ్ఞానదృష్టి' అంటే ఏమిటి? :**

"ఈ దృశ్యము ఇట్లు ఉన్నప్పటికీ, ఇది సత్యము కాదు. ఇందు కనబడే అనేకత్వము వాస్తవము కాదు. అద్వితీయమగు❖ చైతన్యమే ఇట్లు "నేను–నీవు–దృశ్యము"గా స్వకీయమైన మాయచే ప్రవర్తించుచున్నది. "ఇందలి చిదాకాశస్వరూపమగు ఆత్మ తత్త్వమును దృష్టియందు ఉంచుకొని, ఆపై ఇక, ఏది ఎట్లో అట్లే ఆచరించెదనుగాక!" అనునదే జ్ఞానదృష్టి.

ఏది – 'భ్రమ' అయివున్నదో ... అది భ్రమగాను, ఏది – సత్యమైయున్నదో ... అది సర్వదా, సర్వత్రా, సర్వవేళల కార్య – కారణ రహితముగాను దర్శించుము. అప్పుడు నీకీ జాడ్యము తొలగిపోయి మావలెనే 'ముక్తస్థితి'ని అనుభవించగలవు. తత్త్వజ్ఞానమే ముక్తికి కారణం అవుతోంది. జ్ఞానము లభించినప్పుడు, "ఈ సంసారము బ్రహ్మమే అయివున్నది. ఈ ద్రష్ట – దర్శన – దృశ్యములందలి సారవస్తువు బ్రహ్మమే" అను బోధ కలుగుతోంది. నిద్రలేచిన వానిని కలలో చూడబడిన 'పులి' ఏమి చేయగలదు చెప్పు? ఈ సంసారముకూడా, నీవు జ్ఞానివైనప్పుడు, నిన్ను ఏమాత్రం స్పృశించలేదు. దుఃఖింపజేయలేదు.

❖❖❖

# 12. స్మృతికి ముందే ఉన్నదేది?

**లీల :** అమ్మా! నీవు చెప్పుదానిని అనుసరించి సృష్టికి పూర్వసంస్కారమే కారణమని గ్రహించు చున్నాను. అయితే ఒక ప్రశ్న. "అరుంధతి – వసిష్ఠులు" అనబడే ఈ బ్రాహ్మణ దంపతుల సృష్టికి కారణమగు అంతకుముందటి సంస్కారాలు నాకు ఎక్కడినుండి వచ్చాయి? నేను ఎప్పుడూ అవి అనుభవించినట్లే లేదేమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** మెలుకువ రాగానే స్వప్న వృత్తాంతాలన్నీ త్యజించబడుచున్నట్లు, ... నూతన దేహసందర్భముచే పూర్వ–తత్పూర్వ దేహ వ్యవహారాదులు స్వప్నమాత్రానుభవత్వం సంతరించు

కుంటున్నాయి. 'మృతి' అనబడు శరీరత్యాజ్యము తరువాత దృశ్యము అగుపడుటకు కారణం ... ద్రష్ట యొక్క స్మృతియే కదా! అసలు ఆ 'స్మృతి' అనబడుదానికి ప్రారంభము ఎక్కడ? స్మృతికి ముందు ఉన్నదేది? "స్మృతికి ముందు ఏదీ లేదు. లేక శూన్యము ఉంటుంది?" అను అభిప్రాయం సరికాదు. శూన్యములో నుండి స్మృతి ఎట్లా వస్తుంది? "ఏదీ లేనట్టి శూన్య ప్రదేశంలో, లేదా, శూన్యాకాశంలో బంగారు సంచులు లభించాయి" అనునది ఎంతటి అసమంజసమైన విషయం?

స్మృతికి కూడా ముందు ఆ స్మరణమునకు 'కర్త' అయినట్టి నీవు ఉండనే ఉండాలి. నీవు ఉన్నావు కనుకనే 'స్మృతి' అనునది ఉంటుంది. అట్టి నీ శుద్ధ స్వరూపమే. (స్మరణమునకు ఆవల ఉన్న శుద్ధ చైతన్యమే) పరమాత్మయొక్క స్వరూపము.

❖

సరే! ఇప్పుడు ప్రథమ జీవుడగుబ్రహ్మదేవుని గురించి శాస్త్రములు ఎట్లు విశద పరుస్తున్నాయో చెపుతాను. విను. ఇది వింటే నీ సందేహాలన్నీ తొలగుతాయి.

'స్మృతి'కి ఆవల ఉన్నది ముక్త స్వరూపము. బ్రహ్మ స్వతహాగానే ముక్తజీవుడు. ఎవడు ముక్తుడో అతడు తన స్వతత్త్వమునందు సుస్థిరుడై ఉంటాడు. అందుచేత బ్రహ్మకు 'పూర్వస్మృతి' అనే ప్రసక్తి ఉండదు. సృష్టికర్త. సమష్టిజీవుడు, చిత్తాకాశస్వరూపుడు (cosmic mind process) అగు బ్రహ్మ యొక్క కల్పనయే ఈ జీవుడు కదా! అట్టి ఈ జీవుని యొక్క ఈ 'జగత్' సృష్టికి కారణం 'స్మృతి' అనటానికి వీలులేదు. కనుక ఇక్కడ సిద్ధాంతీకరించబడిన విధం విను.

**వ్యష్టిజీవుడు :** ఒకానొక ఉపాధికి సంబంధించిన ద్రష్టత్వము – కర్తృత్వము.

**సమష్టి - జీవుడు లేక ప్రజాపతి :** పునర్జన్మ పరంపరల రూపంగా ఏర్పడి ఉంటున్న అనేక ఉపాధులలోని ద్రష్టత్వము – కర్తృత్వము.

అనేక జన్మలలోని వాడు, ఒక జన్మలోని వాడు ఒక్కడే అయివున్నాడు కదా! కాబట్టి ఆ ఇరువురు ఒక్కటే.

ఒక ప్రజాపతి (సమష్టి జీవుడు) నుండి మాయయొక్క సంపర్కముచే మరొక ప్రజాపతి ఉదయిస్తూ సృష్టిని దర్శించటం జరుగుతోంది. ఒకే ద్రష్ట వేరువేరు సందర్భములలో అనుభవం స్వీకరించుచున్నాడు.

ఇది ఇట్లుండగా, జన్మలు అంగీకరించుచున్న "ప్రజాపతి" నుండి ఉద్భవించుచున్న ప్రజాపతులలో కొందరికి కాకతాళీయంగా 'పూర్వస్మృతి'తో కూడిన ప్రతిభ వికసిస్తోంది.

❖

సృష్టులన్నీ చైతన్యాకాశంలో ఉదయించి కనబడుచున్నాయి. వాస్తవానికి ఈ సృష్టులన్నీ సంకల్పమాత్రములే కనుక, మిథ్యారూపములే. సంకల్పమున్నచోటే స్మృతి – సంస్కారములు కూడా ఉంటాయి. "సంకల్పమునకు ముందు ఉండక – సంకల్ప సమయంలో ఉన్నట్లు తోచుచు

– సంకల్పము తొలగినప్పుడు తాము కూడా తొలగుచుండే ఈ సృష్టులు ఏ సమయమందును ఉదయించి ఉండలేదు" ... అనునది ఇక్కడ సిద్ధాంతము. ఓ లీలా! నేను చెప్పుచున్నది కొంచెం సూక్ష్మదృష్టితో యోచించు. సంకల్పముచేత జనించి, ఆ సంకల్పము లయించినప్పుడు లేనట్లు అనుభూతమయ్యేది .... ఎప్పుడు ఉదయించినట్లు? ఎప్పుడు అస్తమించినట్లు? కనుక "నా సృష్టిని నేనే నా 'సంకల్పములు' అను ప్రక్రియచే సృష్టించుకొనుచున్నాను. నేను సంకల్పములు త్యజించినప్పుడు నా శుద్ధతత్త్వమే శేషించుచున్నది. సృష్టికి అతీతమై వెలుగుచున్నట్టి చిత్ చైతన్యమే 'పరమాత్మ' అను శబ్దముయొక్క అర్థము" అని గ్రహించు. అదే పరబ్రహ్మము.

బ్రహ్మకు కలిగే "పూర్వ–అపూర్వ" స్మృతులకు కారణం పరబ్రహ్మమే. అనగా పరబ్రహ్మమే కార్య–కారణస్వరూపమై చిదాకాశమున వెలయుచున్నది. కార్యకారణముల అభేదజ్ఞానమే ముక్తి. "అట్టి అభేదజ్ఞానము సుస్థిరం కానంతవరకు ముక్తి లభించునది కాదు" ... అని ముక్త స్వరూపులమగు మేము అనుభవపూర్వకంగా గ్రహించి, ప్రకటిస్తున్నాము. అందువల్ల 'పూర్వస్మృతి' అనునది కూడా "అఖండచిన్మయము" నకు వేరైనది కాదని గ్రహించు. అగ్ని–ఉష్ణము ఆకాశము–శూన్యమువలె కార్యము – కారణము (Effect-Cause) అనునవి శబ్దము నందే భేదము కలిగివున్నాయి గాని, అర్థము నందు కాదు. ఆ రెండింటికి భిన్నమైన సత్త లేదు. అందుచేతనే, "నాయనలారా! 'జగత్' అనబడు దృశ్యము ఏమాత్రము ఉత్పన్నమగుట లేదు. 'బ్రహ్మసత్త'నే నీవు నీ స్వకీయ కల్పనారచనచే ఇట్లు జగత్తుగా దర్శించుచున్నావు" ... అని గురువులు లోకములకు బోధిస్తున్నారు. "తత్త్వమ్" ("తత్ = అదియే, త్వమ్ = నీవు అయిఉన్నావు") అను మహావాక్యము యొక్క గూఢార్థము ఇదే కదా! కేవల పరబ్రహ్మస్వరూపమగు చిదాకాశముననే సర్వము వెలయుచున్నదని గ్రహించు.

❖❖❖

## 13. అన్య జగత్తులను ఎందుచేత చూడలేకపోతున్నాం?

**లీల :** హే జగజ్జననీ! మాతా! నీవు ఈ రోజు నీ వాక్యపరంపరలచే నాకు దివ్యమైన దృష్టిని ప్రసాదిస్తున్నావు. సూర్యుడు ఉదయించగానే సర్వము చూడబడునట్లు, నేను పరమజ్ఞానమును నీ ప్రసాదముచే పొందుచున్నాను.

హే లోకపావనీ! సత్యస్వరూపిణియగు నీవు సర్వదా సత్యమునే ప్రకటిస్తావు. అయినప్పటికీ, ఇతఃపూర్వపు సంస్కారములచేత కాబోలు, నాలో కించిత్ శంక, కుతూహలము మిగిలియే ఉంటున్నాయి. నీకు అభ్యంతరం లేకుంటే, నన్ను ఆ 'గిరి' గ్రామమున గల అరుంధతి – వసిష్ఠులు నివసించిన గృహమునకు తీసుకొని వెళ్ళు.

**శ్రీ సరస్వతీదేవి :** సరే. అట్లే అగుగాక. అయితే నీవు మొట్టమొదట సమాధిని ఆశ్రయించి, అట్టి సమాధియొక్క ప్రభావంచేత స్థూలదేహమును పరిత్యజించాలి. "అచేత్య (భౌతిక దృష్టిచే తెలియబడు దానికంతటికీ అతీతమైన) చిద్రూపమైనట్టి నేను చిత్‌చైతన్యమును" అనునట్టి పవిత్రదృష్టిని అవలంబించి,

మావలెనే పవిత్రురాలవు కమ్ము. అప్పుడు నీవు ఆకాశస్వరూపమగు సృష్టిని గాంచగలవు. ఈ నీ స్థూలదేహభావము ఆ సృష్టి దర్శనమునకు ప్రతిబంధకమైయున్నది సుమా! అందుచేత ఇప్పుడు "నేను చిదాకాశ స్వరూపమును" అను జ్ఞానదృష్టిని అవలంబించు.

**లీల :** దేవీ! ఈ భౌతిక దేహభావోద్రేకం ఉన్నంతవరకు అన్యజగత్తును ఎందుకు చూడలేము? దానికి కారణమేమిటి? నాపై కనికరంతో ముందుగా ఈ విషయం వివరించి చెప్పు.

**శ్రీ సరస్వతీదేవి :** వాస్తవానికి ఈ దృశ్యజగత్తు ఆకృతిరహితమైనది. అయితే మిథ్యా జ్ఞానవశం చేత ఆకృతి ఉన్నట్లు అగుపడుచున్నది. దృష్టాంతానికి ... "బంగారపు ఉంగరం" అను దానిలో ఉన్నదంతా బంగారమే కదా! కాని 'ఉంగరం' అను శబ్దంతో పిలుస్తున్నాం. బంగారంలో ఉంగరం ఉన్నదా? మరి ఉంగరం ఉన్నది దేనిలో? ఉంగరము అనునది ఆకారమే కదా! ఆ ఆకారము బంగారమునకు వేరైనది కాదుకదా! అట్లాగే ఈ దృశ్యజగత్తు కూడా పరమాత్మకంటే వేరైన సత్త లేదు. అందుచేతనే ఇది "మిథ్య" అని అనిపించుకొనుచున్నది.

ఈ జగదాకాశము బ్రహ్మము కంటే వేరు కాదు. తటాకంలోని జలంలో (పైనున్న) ఆకాశం లేకపోయినప్పటికీ, ప్రతిబింబిత-కారణంగా ఆ నిశ్చల-జలంలో "మేఘావృతమైన ఆకాశం" కనబడుతోంది కదా! నిరాకారమగు బ్రహ్మమునందు మిథ్యయగు జగత్తు యొక్క ఆకృతి అట్లే తోచుచున్నది.

**అయం ప్రపంచో మిథ్యైవ సత్యం బ్రహ్మాఽహమద్వయమ్ ।**

**అత్రప్రమాణమ్ వేదాంతా గురువోఽనుభవస్తథా ॥** (XXI.35)

"ఈ ప్రపంచమంతా మిథ్యయే. నేనే బ్రహ్మమును" అను జ్ఞానమొక్కటే సర్వవేళల సత్యమైయున్నది. "బ్రహ్మము నాకంటే వేరైనది కాదు" అనునదే ఉత్తమ జ్ఞానము. ఈ విషయంలో శాస్త్రమహావాక్యములే ("అహం బ్రహ్మాస్మి", "జీవోబ్రహ్మేతి నాపరః", "అయమాత్మా బ్రహ్మమ్", "సోహం", "తత్త్వమ్" మొదలైనవి) ప్రమాణాలు. 'స్వవిచారణ' అను ప్రయత్నముతో కూడుకొనిన మహనీయులగు గురువుల స్వానుభవమే, మరియు ఆత్మానుభవమే ప్రమాణం.

**"బ్రహ్మైవ పశ్యతి బ్రహ్మ, నాఽబ్రహ్మ బ్రహ్మపశ్యతి।**

**సర్గాదినామ్నా ప్రథితః స్వభావో అస్యైవచేదృశః॥** (XXI.36)

బ్రహ్మమే బ్రహ్మమును గాంచగలదు. బ్రహ్మము కానిది బ్రహ్మమును దర్శించగలదా? లేదు. ఆ బ్రహ్మమే జగత్తును కల్పించి జగత్తు అను పేరుచే తానే వ్యవహరించుచున్నది. అట్లు "కల్పించుట-దర్శించుట-అగుట" బ్రహ్మము యొక్క స్వభావమైయున్నది. అయితే బ్రహ్మము నందు జగత్తుయొక్క, కారణముగాని, కార్యముగాని లేవు. ఎట్టి బాహ్యమైన సహకారి కారణములు కూడాలేవు. బ్రహ్మము విశుద్ధమైనది. బ్రహ్మమే తన స్వకీయమైన అభ్యాసంచేత జగత్తును గాంచుచున్నది. అందుచేత, మరల అభ్యాసవశం చేతనే భేదజ్ఞానం తొలగుతోంది. భేదజ్ఞానము

తొలగనంతవరకు ఏ ఒక్కరు బ్రహ్మ స్వరూపమును పొందలేరు. అనగా – బ్రహ్మదర్శనం కావాలంటే భేదజ్ఞానం తొలగటం ఒక్కటే ఉపాయం. అట్టి లక్ష్యము సాధించు నిమిత్తమే చెప్పబడిన – చెప్పబడ బోవుచున్న శాస్త్ర – విధి – నియమాదులన్నీ ఉన్నాయి. ఓ లీలా! నీవు బ్రహ్మము విషయమై అభ్యాసబలంచేత దృఢజ్ఞానం సంపాదించాలి. అప్పుడు మాత్రమే ఆ పరమపదమును దర్శించు అధికారం లభిస్తుంది. నీచే చూడబడుచున్న ఈ నా భౌతిక శరీరము కూడా సంకల్పనగరమువలె ఆకాశస్వరూపమే. అట్టి ఎరుక చేతనే నేను దీనియందు కూడా బ్రహ్మపదమును గాంచగలుగుచున్నాను.

**లీల :** ఓ జగదీశ్వరీ! 'సమాధి' మొదలైన ఉపాయముల ద్వారా ఆతివాహికజ్ఞానం (Subtle consciousness) దృఢమైనదనుకో .... అప్పుడు ఈ శరీరం ఏ స్థితిలో ఉంటుంది? ఇది నశిస్తుందా? నశించకుండా ఇట్లాగే ఉంటుందా?

**శ్రీ సరస్వతీదేవి :** నీ ప్రశ్నకొంత అసంగతమైనదనే చెప్పాలి. ఎందుకంటావా? ఉన్న వస్తువుకు మాత్రమే క్షీణించటం–నశించటం వంటివి ఉంటాయి. అసద్వస్తువు స్వతహాగా లేనట్టిది. ఇక ఉద్భవించటమేమిటి? క్షీణించటమేమిటి? నశించటమేమిటి? చీకట్లో 'త్రాడు'ను చూచి 'పాము' అని భ్రమించావనుకో ... అప్పుడు ఒక దీపం తెచ్చి ఆ వెలుతురులో పరీక్షగా చూచినప్పుడు "ఇది త్రాడు మాత్రమే" అని తెలిసిపోతుంది కదా! భ్రమ తొలగిపోయింది. అప్పుడు, సర్పము ఏమైనది? చచ్చినదా? అసలు అట్టి ప్రశ్న ఎక్కడ ఉంటుంది? సత్యజ్ఞానం కలిగిన తరువాత 'త్రాడు'నందు పాము కనిపించదు కదా! ఆతివాహిక భావము (సూక్ష్మతత్త్వము) గ్రాహ్యమైన తరువాత ఆధిభౌతిక భావమే తొలగిపోతుంది. అనగా "నేను రక్త మాంసమయమైనట్టి ఈ భౌతిక దేహమును" అను భావమునకు చోటు ఉండదు. "ఈ శరీరము యొక్క పెరుగుదల – తరుగుదలలకు, ఉత్పత్తి – వినాశనములకు నాకేమీ సంబంధము లేదు" అనునట్టి నూతన జ్ఞానానుభవం ఉదయిస్తోంది.

"కల్పన"యే సర్వభ్రమలకు కారణం. అయితే, ఈ కల్పన కల్పిస్తున్నవారెవరు? ఎవరో బాహ్యము నుండి కల్పించుచుండటం జరుగుతుంటే, బాహ్యమైన ఉపాయాల కొరకు వెతుకవచ్చు. అది ద్రష్టయే తనకు తాను కల్పించుకొనుచున్నాడు. స్వప్నములోని శిల 'లేనిదే' అయివున్నది కదా! ఈ శరీరాలు కూడా వాస్తవానికి లేకయే ఉన్నాయి.

**లీల :** మరి ఈ కనబడుచున్న శరీరముల మాట ఏమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** ఇవన్నీ 'పరబ్రహ్మము' అనబడు పరిపూర్ణ భావమునందే కల్పనా చమత్కృతిచే ఉన్నాయి. వీటినన్నిటినీ మేము సత్యస్వరూపమునందే గాంచుచున్నాము. మరి, నీవో? ... నిత్యసత్యమగు స్వస్వరూపభావన సన్నగిలియుండుటచే, మిథ్యా జ్ఞానముచే, "అనేక శరీరములు" అను భావన పొందుచున్నావు. అందుచేతనే, ఇందలి సత్యత్వమేమిటో, అసత్యత్వమేమిటో తెలుసుకొలేకపోతున్నావు. ఇదంతా సృష్ట్యాదియందే చిత్స్వభావమున కల్పితమైయున్నది. అప్పటి నుండి అద్వయసత్తయే దృశ్యరూపమున పరిగ్రహించబడుచున్నది.

**లీల :** అనగా "దిక్కులచే, కాలములచే పరిచ్ఛిన్నము కానట్టి అద్వయపరతత్త్వము' ఒక్కటే ఉండి ఉన్నది. మరింకేదీ ఎక్కడాలేదు" ... అని నీ అభిప్రాయము కదా. మరి అట్టి దానికి, ఈ "నీవు-నేను-దృశ్యము" .... వంటి కల్పనలతో పని ఏమి వచ్చింది? ఈ భ్రమలన్నీ ఎందుకు ఉన్నాయి? ఎందుకు, ఎట్లు, ఎవరి వలన, ఎవరి కొరకు ప్రవర్తిస్తున్నాయి?

**శ్రీ సరస్వతీదేవి :** బంగారమునకు ఆభరణత్వము సత్యమా? జలమునకు తరంగత్వము వాస్తవమా? స్వప్నములోనో, సంకల్పములోనో, తారసపడే వస్తువులకు అస్థిత్వమెక్కడిది? అదేవిధంగా విశుద్ధ సత్స్వభావమగు బ్రహ్మమునందు ఈ "నీవు-నేను-దృశ్యము" అను కల్పనలు ఏమాత్రం ఏ క్షణమందు కూడా లేవు. సృష్ట్యాదియందు పరబ్రహ్మమునకు ఎట్టి రూపమూ లేదు. ఆ బ్రహ్మము శాంతము, అద్వయము, జన్మరహితము అయివున్నది. ఒక మణి లేక దర్పణమునందు ప్రకాశించేదంతా దృశ్యము యొక్క ప్రతిబింబమేకాని ఆ మణి లేక దర్పణమునందు ఉండి ఉన్న వస్తుజాలము కాదు కదా! ఈ దృశ్యమంతా బ్రహ్మము యొక్క ప్రతిబింబము మాత్రమే. బ్రహ్మమే ఇట్లిట్లు దర్శింపబడుచున్నదని గమనించు.

❖❖❖

# 14. అభ్యాస ప్రభావం

**లీల :** అట్లా అయితే మమ్ములను ఈ విధంగా ద్వైత అద్వైత జ్ఞాన విమూఢులుగా చేసి భ్రమింపజేసేదెవరు?

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! నిన్ను ఇంతవరకు భ్రమింపజేసేది బయట నుండి మరెవ్వరో కాదు. నీయొక్క 'అవిచారము' అను స్వరూపము గల మోహమే సుమా! అయితే స్వభావజనితమైన "అవిచారణ" .... విచారణ మాత్రం చేత తప్పక నశిస్తోంది. "అవిచారణ"ను ఎదుర్కొన గలిగినది "విచారణ" కాకుండా మరింకేముంటుంది? అయితే ఈ అవిద్య కూడా 'బ్రహ్మసత్త' కంటే భిన్నమైనది కాదు. బ్రహ్మసత్తయే ఇచ్ఛామాత్రంగా అవిద్యను అవలంబించటం, త్యజించటం కూడా నిర్వహిస్తోంది.

వాస్తవానికి 'బ్రహ్మము' ... అభిన్నము, అఖండము, శుద్ధము అయివున్నది. ఇంక విచారణ ఏమిటి? అవిచారణ ఏమిటి? అవిద్యలేదు, బంధములేదు, మోక్షములేదు. కేవలము విశుద్ధరూపమగు బ్రహ్మమొక్కటే సర్వదా ఉండి ఉన్నది. 'జగత్తు' అనునది అందు ఆరోపితమగుచున్నది. ఈ తత్త్వము నీవు ఇంతవరకు విచారించి ఉండ లేదు. అందుచేతనే భ్రాంతి నిన్ను కలచివేయటం జరుగుతోంది. కాని ఇప్పుడు ఉన్న విషయమేమిటో గ్రహించి ప్రబుద్ధురాలవగుచున్నావు కదా! అనగా "విదేహజ్ఞానము"ను పొందావు. ముక్తిని పొందావు. నీయందు వాసనలన్నీ క్షీణించిపోయాయి.

"నిర్వికల్ప సమాధి" సమయంలో చిత్తము "అద్వయబ్రహ్మము" నందు స్థిరీకృతమై ఉంటుంది. అందుచేత ద్రష్ట - దర్శనము - దృశ్యములు స్వస్వరూపమునందు లయించిపోయి ఉంటాయి. అట్టి సమయంలో ఒకవేళ హృదయ క్షేత్రంలో వాసనాబీజము ఒకింత అంకురించి ఉన్నప్పటికీ,

అది రాగ-ద్వేషాది భావములను ఏమాత్రం ఆశ్రయించదు. సంసారకారణములైనట్టి రాగద్వేషాలు నశిస్తే స్వయముగా సుస్థిర 'నిర్వికల్పసమాధి' స్థితి లభ్యమవుతుంది. సమరసభావమే స్వరూపముగా కలిగినట్టి సమాధి అభ్యసిస్తూరాగా, సంసారభావన క్రమంగానో, లేక వెంట-వెంటనేనో .... తొలగిపోతుంది. అందుచేత ఓ లీలా! నీవు నిర్మలపరమాత్మను అవలంబించు. తద్వారా భ్రాంతి మయమగు కార్యములు, సంకల్పములు నీనుండి తొలగిపోతాయి. అప్పుడు నీవు మోక్షస్వరూపురాలవు అవుతావు. అవధులు లేని "ప్రశాంత -ఆనందమయ స్వస్వరూప" స్థితిలో నిలిచియుంటావు.

❖

"ఇది స్వప్నము" అని తెలిసిన మరుక్షణం, ఆ స్వప్నములోని పదార్థములు, వ్యక్తులు, సంఘటనలు "మిథ్యయే" అని తెలిసిపోతాయి కదా! వాసనలు క్షయించి పోయినప్పుడు, ఇక ఆపై ఈ స్థూలదేహము అగుపడుచున్నప్పటికీ, "ఇది అసత్తే" అను బోధ కలుగుతుంది. సర్వవాసనలు క్షయమైనప్పుడు ఈ జాగ్రత్‌దేహము కూడా శామ్యత్వము పొందుతుంది. అనగా "ఈ శరీరము కలిగియున్నాను. ఇది నాకు ప్రియము. ఇది నాయొక్క పరిధులను నిర్ణయించుచున్నది. ఇది ఉన్నప్పుడే, ఉన్నచోటే ఉండి ఉన్నప్పటికీ,.... "దీని హాని వృద్ధులను అనుసరించే నేను హాని వృద్ధులను పొందుచున్నాను" అను భావములన్నీ తొలగిపోతాయి. "నేను సర్వదా శుద్ధ చైతన్యమునే! నా సంస్కారములను అనుసరించే ఈ శరీరాదులన్నీ ఉంటున్నాయి. సర్వమునకు కర్తనైయుండి కూడా, నేను అకర్తృత్వమే స్వభావముగా గల సాక్షి స్వరూపుడను" అను దివ్యమైన అవగాహన స్థిరీకరణ పొందుచున్నది.

స్వప్నము అనుభవించువాడు "నేను శరీరమునకు, శరీర-ధర్మములకు సంబంధించిన వాడను" అను భావనను త్యజించి, తన అంతరంగమునందు (లేక తన ఆతివాహిక దేహమునందు) ఆయా పదార్థములను, సంఘటనలను గాంచుచున్నాడు. కాని నిదుర లేవగానే జాగ్రత్‌లో "నేను కాళ్ళు-చేతులుగల భౌతిక దేహము యొక్క ధర్మములకు సంబంధించినవాడిని" అను భావన, అనుభవం పొందుచున్నాడు. సంకల్పములోని అనుభవములు కూడా స్వప్నమువలెనే ఉంటున్నాయి. ఎప్పుడైతే ఈ జీవుడు "నేను ఈ దేహస్వరూపుడను" అను భావమునుండి విడివడుతాడో, అప్పుడు "ఆతివాహిక దేహభావన" ప్రకాశిస్తోంది. వాసనలన్నీ తొలగటం జరిగితే ఒకానొక జాగ్రత్ - మౌనరూపమగు సుషుప్తివంటి 'భావనావ్యవస్థితి' కలిగి ఉండగలడు. వాసనాబీజము తొలగినప్పుడు "నేను శరీరమును, శరీరమునకు సంబంధించినవాడను" అనునది కూడా లేకుండా పోతుంది. అట్టి జీవునే "ముక్తస్వరూపుడు" అని అంటున్నాము. అతడే జీవన్ముక్తుడు.

జీవన్ముక్తులలో మనము చూచే వాసనలు ఈ సాంసారిక జీవుల వాసనలవంటిది కాదు. వారియందలి జీవసంస్కారము (లేక) వాసన - "శుద్ధ-సత్త్వ స్వభావము : సామ్య-సత్త" (An Experience of all pervading equality)-అని చెప్పబడుతోంది.

గాఢనిద్రాలో మనస్సు జడత్వం వహిస్తోంది. ఆ సుషుప్తిలో వాసనలన్నీ అప్రకటితంగా ఉంటున్నాయి. జాగ్రత్-స్వప్నదశలలో ఆ వాసనలు జడత్వమును త్యజిస్తున్నాయి. జాగ్రత్ -

సుషుప్తులు రెండూ వాసనాశూన్యములు అయినాయనుకో ... అప్పుడు, ఒకానొక ప్రపంచరహిత – మనోరహితస్థితి అట్టి జీవునియందు శేషించి ఉంటుంది. ఆ స్థితినే శాస్త్రములు 'తురీయము' అను పేరుతో పిలుస్తున్నాయి. జ్ఞానాగ్నిచేత వాసనలన్నీ నశించినప్పుడు అట్టి తురీయ స్థితి ఈ జీవునియందు జాగ్రత్‌లో ప్రకాశిస్తుంది. వాస్తవానికి ఆ స్థితి ప్రతిజీవుని వాస్తవ–స్వభావమే అయివున్నది. అట్టిస్థితినే, "బ్రాహ్మీస్థితి" లేక "మోక్షస్థితి" అనికూడా పిలుస్తున్నారు. ఇక దీనికంటే ఉత్కృష్టమైన స్థితి అంటూ ఏదీ లేదు. వాసనలు కలిగియుండుటే 'బంధము', లేకయుండుటయే 'మోక్షము'. ఒకానొకడు వాసనారహితుడై కూడా ఈ సంసారమునందు ఇతరులవలెనే యథాతథంగా ఉంటూ ఆయా కర్తవ్య– అకర్తవ్యములను నిర్వర్తించుచున్నాడు. అంతరంగమున పూర్ణమగు ఆత్మ భావననే కలిగి యున్నట్టి, అట్టివాడే జీవన్ముక్తుడు. అతడు స్వస్వరూపజ్ఞాన ప్రభావంచేత సర్వ సామ్యమును, పూర్ణానుభవమును (నేను "పూర్ణుడను" అను అనుభవమును) పొందుతూనే ఉంటాడు. ప్రవాహపతితంగా ప్రాప్తించుచున్న కర్మల వ్యవహారములు అతని నిశ్చలత్వమునకు ఏమాత్రం ప్రతిబంధకం కాదు. అతడు అంతరంగాన 'కొండ'వలె గాంభీర్యం వహించి, బాహ్యమునకు మాత్రం లోకానుకూలార్థం ప్రవర్తిస్తూ ఉంటాడు. అట్టి జీవన్ముక్తుని బద్ధజీవులు గుర్తించలేకపోవచ్చు కూడా!

మంచు వేడి వలన కరిగినప్పుడు తన ఇతఃపూర్వపు స్వభావమైనట్టి జలముగానే అగుచున్నది కదా! వాసనాశూన్యమైన చిత్తము కూడా తన సహజస్వరూపమైయున్న "శుద్ధసత్త్వ స్వభావము"నే పొందుచున్నది. అది తన స్థూలభావము (స్థూల విషయము స్మరించుట)ను త్యజించి స్వభావసిద్ధమైన సూక్ష్మత్వము వహించుచున్నది. 'స్థూలభావం' తొలగనంతవరకు ఈ ఇంద్రియములు, వీటిని అంటిపెట్టుకొని ఉండే పదార్థజాలము మరల మరల ప్రోగుపడుతూనే ఉంటాయి. 'జ్ఞానబలము' ప్రబుద్ధమైనప్పుడు ఆతివాహిక భావము పొందిన చిత్తము అన్యచిత్తములలో ప్రవేశించగలదు. అదేవిధంగా, ఆ చిత్తము జన్మాంతరీయములైన, సృష్టాంతరీయములైన పదార్థములతో కలియగలుగు సామర్థ్యమును కలిగివుంటుంది.

కాబట్టి ఓ లీలా! నీవు అభ్యాసబలం చేత "నేను ఈ దేహమును, ఈ దేహమునందు మాత్రమే ఉన్నాను" అనునట్టి దేహాభిమానత్వం దూరంచేయి. అప్పుడు నీయందు దట్టంగా పేరుకొనియున్న .... "ఈ దృశ్యము వాస్తవము. ఇది అనేక పదార్థములతో, నీవు–నేను–నీది–నాది అను అనేక వ్యవహారములతో నిండివున్నది." .... అను అజ్ఞానపూరిత – దోషం తొలగుతుంది. సంకుచిత లేక పరిమిత అనుభవజ్ఞానంతో కూడిన ఇప్పటి నీ బుద్ధి విశాలత్వము, అపరిమితత్వము సంచరించుకొంటుంది. "నేను చైతన్య తత్త్వమును" అనునట్టి దృఢమైన స్థిరమైన, అవగాహనను స్వీకరించునప్పుడు, అప్పుడు ఏర్పడుచున్న "ఆతివాహికదృష్టి" లేక "జ్ఞానము" సహాయంచేత పవిత్రమైన లోకములను గాంచగలుగుతావు.

పుత్రీ! వాసనలు క్షయింపజేయ గల ఉపాయములనే సర్వదా ఆశ్రయించు. వాసనలు క్షయించుటచే ఏర్పడు స్థిరబుద్ధియే నిన్ను జీవన్ముక్తురాలిగా తీర్చిదిద్దుతుంది. ఉత్తమోత్తమమైన

బోధ మరియు అనుభవజ్ఞానము ఉదయించేవరకు క్రమంగా స్థూలదేహానుభవమును సన్నగిల్లచేసుకొంటూ, ఆతివాహిక దృష్టికొరకు ప్రయత్నిస్తూ ఉండవలసినదే.

మాంసమయదేహము - మాంసమయదేహమును మాత్రమే తాకుతుంది. మాంసమయ దేహం చిత్తదేహమునుగాని, చిన్మయ దేహమునుగాని కలియగలదా? లేదు. నీ చిత్తదేహముతో మాత్రమే ఇతరుల చిత్తదేహమును గాంచగలవు. చిత్తస్వరూపమును స్వప్రయత్నముచే ధరించవచ్చు. సత్యదేవతాస్వరూపిణియగు నేను నీపైగల పుత్రికా వాత్సల్యంతో ఈ విషయాలు చెప్పుచున్నాను. వాస్తవానికి నేను చెప్పు ఈ వాక్యములలోని సత్యము ఆబాలగోపాలం అందరికీ అంతరంగంలో తెలిసియున్నదే. కాని, స్థూల దృష్టియొక్క అభ్యాసము ఈ జీవుని చిదాకాశత్వమును కప్పియుంచుటచే అనేకులకు తమపై తమ యొక్క ఆత్మ స్వరూపముపై తమకింకా విశ్వాసము కలుగటం లేదు. కనుక లీలా! చిత్తశరీరమును స్వయముగా అభ్యాసయోగంచేత ధరించవచ్చు. ఆ చిత్తశరీరము ఆయా వ్యవహారములు కూడా నిర్వర్తించగలదు. వరములు-శాపములు, ఇతర చిత్తాకాశములందు ప్రవేశించి ఆయా ప్రయోజనములను సిద్ధింపజేయుట మహనీయులగు గురువులు దేహానంతరం శిష్యులతో సంభాషించటం మొ॥నవి ఇందుకు మనకు దృష్టాంతము.

ఓ లీలా! మరల ప్రకటించుచున్నాను, విను. నిరంతర జ్ఞానాభ్యాసంచేత వాసనా సమూహములన్నీ క్షీణించగా, ఈ దేహము ఇట్లా ఉండగానే ఆతివాహిక దేహము పొందవచ్చు. ధరించవచ్చు. మరణించినప్పుడు మాత్రం జరిగేదేమిటి? అప్పుడు ఈ పాంచభౌతిక దేహము ఉండదు కదా! అనగా ఆ స్థితిలో ఆ ప్రాణి (లేక జీవచైతన్యము) ఆతివాహిక దేహి స్వరూపుడే అయివుంటాడు. అయితే, ఈ ఆతివాహిక దేహముయొక్క ఉత్పత్తి గురించి మాత్రం ఎవరికీ తెలియదు. ఈ జనులు భౌతిక దృష్టికి పరిమితు లగుటచే మృతదేహమును మాత్రమే చూడగలుగు చున్నారు. కాని, ముక్తపురుషుని దృష్టి యందు (ఆతివాహికదేహము దృష్ట్యా) జీవునకు ఉత్పత్తి వినాశనములు లేవు. అందుచేత, ఘనీభూతమై కనబడుచున్న ఈ 'జీవన్మరణములు' అనునవి భ్రమమాత్రమే. సంకల్ప-పురుషునికి పుట్టుక ఏమిటి? చావు ఏమిటి? అది మొదలే మిథ్యకదా! అదేవిధంగా, "జీవన్మరణములు మిథ్యయే" అని గ్రహించు.




సంకల్పము ఉన్నను, లేకున్నను నీకు లోటేముంటుంది? నీవు సర్వదా చిత్‌స్వరూపమువే కదా! శరీరముల విషయము కూడా అట్టిదే.

❖

**లీల :** హే భగవతీ! నీవు ఉపదేశిస్తున్న ఈ పవిత్రజ్ఞానం వింటుంటే నా దృశ్య-దర్శన రోగము దానంతట అదే ఉపశమించిపోతోంది. అయితే, "అభ్యాసము అవసరము" అని అంటున్నావు

కదా! ఇప్పుడు దీనిని, ఎట్లు, అభ్యసించాలి? ఆ అభ్యాసం దృఢపరచటానికి నేను ఏంచెయ్యాలి? అట్లు ఆచరిస్తే లభించే ప్రయోజనం ఏమిటి? నాపై దయతో వివరించి చెప్పు.

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! ఎవరైనా, ఎప్పుడైనా, ఏ పనైనా చేయాలంటే, ఆ పని అభ్యాసం లేకపోతే సిద్ధించదు కదా! బ్రహ్మమును గురించే చింతనచేయటం, మాట్లాడుకోవడం, ప్రసంగించటం, ప్రబోధించటం, స్థిరభావన కలిగివుండటమునే పండితులు (లేక నిత్యా నిత్యజ్ఞానము కలిగియున్నట్టి మహనీయులు) "అభ్యాసము" అని పిలుస్తున్నారు. మహాత్ములగువారు ఈ సంసారమందలి దోషములను గమనించినవారై, ఇందలి సత్యాన్వేషణమునకు ఉపక్రమించుచున్నారు. జనన-మరణ శాంతిని కోరినవారై భోగవాసనలను త్యజించివేయుచున్నారు. శాస్త్రములచే బోధింపబడిన అనేక విధి, విధానములలో తమకు తగినవాటిని ఎన్నుకొని, సర్వదా ప్రయత్నశీలురై ఉంటున్నారు. అందుచేతనే, వారు ఈ జగత్తును జయించివేయగలుగుచున్నారు. వారిబుద్ధి నిత్యమూ అన్ని పరిస్థితులందు ఔదార్యముచే సుందరంగా అలంకరించబడి ఉంటోంది. ఆ ఉత్తమ సాధకుల చిత్తము పరమ-వైరాగ్యముతో నిండియుండి, సర్వదా అకృత్రిమమగు స్వస్వరూపానందమును పొంది ఉంటోంది. "బ్రహ్మాభ్యాసులు" అని పిలువబడే అట్టివారు అనేకయుక్తులను ఆశ్రయిస్తూ, శాస్త్రావలోకనం చేస్తూ ఈ జ్ఞాతృజ్ఞేయముల ("Knower" and "that being known") యొక్క అత్యంత 'అభావము'ను పరిగ్రహించుచున్నారు.

ఓ ప్రియమైన లీలా! వాస్తవమేమిటో చెప్పుచున్నాను, విను. సృష్ట్యాదియందు దృశ్యము లేదు. ఇప్పుడూ లేదు. మరింకెప్పుడూ కూడా లేదు. అందుచేత "ఈ జగత్తు గాని, నేను-నీవు-అను పదార్థములు గాని లేవు" .... అనునట్టి జ్ఞానమునే "బోధాభ్యాసము" అని అంటున్నాం. ఈ విధంగా "దృశ్యము అసంభవము" అని గ్రహించిన తరువాత, పరమాత్మయందు ఆసక్తి స్వయముగానే కలుగుతుంది. అట్టి ఆసక్తియే "బ్రహ్మాభ్యాసము" అని కొందరు, "భగవద్భక్తి" అని మరికొందరు చెప్పుచూ ఉంటారు. పుత్రీ! "రాగ-ద్వేష క్షయము" అనునది సాధించుకోకుండానే, "మేము బ్రహ్మమును అభ్యసిస్తాం" అంటే ప్రయోజనం ఏముంటుంది. అట్టి ప్రయత్నములు రాగ-ద్వేషములు త్యజించనంతవరకు మూఢములు, తాపదాయకములు, దుఃఖకారకములే అయివుంటాయి. "దృశ్యము అసంభవము" అనునట్టి బోధనే (ఉపనిషత్తులు మొదలైన) శాస్త్రములు "జ్ఞానము, జ్ఞేయము" అని వ్యవహరిస్తున్నాయి. అట్టి అభ్యాసమే ఉత్తమమైన అభ్యాసము. దానినే 'నిర్వాణము' అని కూడా అంటున్నారు. వేసవికాలం వచ్చిన తరువాత మంచు-వర్షం ఉంటుందా? "నిరంతర వివేకాభ్యాసము" యొక్క ప్రభావంచేత ఈ చిత్తమునందు వర్షిస్తున్న సంసార- వ్యవహారమంతా రూపనామాలు లేకుండా తొలగిపోతుంది. నిద్రలేస్తే ఇక స్వప్నదృశ్యం ఎదురుగా ఉండి ఉంటుందా? ఉండదు కదా!

❖❖❖

**(నాలుగవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# ఐదవ రోజు

## 15. ఇతఃపూర్వానుభవ సృష్టి

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆ రాత్రి ఆ విధంగా లీలాదేవి, సరస్వతీదేవి సంభాషించుకొంటున్నారు. అంతః పురంలోని పరిజనులంతా గాఢనిద్రాపరవశులై ఉన్నారు. ఆ ప్రక్కనే పద్మని దేహము వాడని పూలతో కప్పబడియున్నది. అక్కడే వారిద్దరు (లీలా-సరస్వతులు) సమాధిని ఆశ్రయించి నిశ్చల శరీరులయ్యారు. వారి వదనములు ఒకానొక కాంతితో ప్రజ్వరిల్లుచున్నాయి. వారి ఇంద్రియ వ్యాపారములన్నీ స్తంభమున చెక్కబడిన శిల్పము యొక్క అవయవములవలె కట్టుబడ్డాయి.

వారిద్దరు సూక్ష్మభావమును పొందారు. నిర్వికల్పసమాధిని ఆశ్రయించి బాహ్య జ్ఞానమును త్యజించివేశారు. "నేను-నీవు-దృశ్యజగత్తు ... అనునదంతా మిథ్య" అని వారిద్దరిచే గ్రహించబడుటచే వారి చిత్తము నుండి దృశ్యపిశాచి తొలగిపోయింది. చూచావా, రామచంద్రా! ఈ 'జగత్తు' ఎంతగా ఘనీభవించి ఈ జీవుని మభ్య పెడుతోందో!

ఆ ఇద్దరు దృశ్య-దర్శన భావము నుండి విడివడినవారై, శూన్యమగు ఆకాశము వలె శాంత భావము వహించారు. జ్ఞప్తిదేవతయగు ఆ సరస్వతీదేవి వాస్తవానికి 'అశరీరి' అయినప్పటికీ, తన భక్తురాలి బుద్ధిని సునిశితం చెయ్యటానికి జ్ఞానమయమగు సూక్ష్మశరీరం దాల్చినది. ఆ లీలాదేవి "భౌతికదేహాభిమానము" లేనట్టి సూక్ష్మ శరీరముగా అవధరించినది. ఆ విధంగా, వారు ధ్యాన-జ్ఞాన మయమగు ఆతివాహిక దేహము అవలంబించి సంచరించసాగారు. పరిమితగృహాకాశము నుండి చిదాకాశ స్వరూపమును గ్రహించినవారై, పూర్వజ్ఞానము ననుసరించి "చిత్‌వృత్తి" సహాయంతో విహరించసాగారు.

వారి ఇప్పటి శరీరములు పాంచభౌతికము కాదు. అయినప్పటికీ, పూర్వ సంకల్పముతో కూడిన మనస్సు కలవారగుటచే, పరస్పర స్నేహదృక్కులతో ఒకరినొకరు వీక్షిస్తూనే ఉన్నారు.

❖

వారు చేతులు కలుపుకొని దూర-సుదూర ప్రదేశాలు దాటుకుంటూ, నభోమండలం వీక్షించసాగారు. అక్కడి ఆకాశమండలము ఒక ప్రశాంత-మహాసముద్రంలాగా అతి విస్తీర్ణముగా, గంభీరంగా, నిర్మలంగా కోమలంగా ఉన్నది. అది చిత్తమునకు ఆహ్లాదం కలిగిస్తూ సుందరంగాను, సుఖదాయకంగాను ఉన్నది. తమ ప్రయాణంలో మధ్యమధ్య వారిద్దరు దేవతల సౌధములలో విశ్రమించారు. మరికొంతసేపు శూన్యపథంలో ప్రయాణించుచు, అనేక జగత్తులు దాటారు. ఎన్నో లోకములు, ఎన్నో జగత్తులు కూడా ఆ ఆకాశపు 'శూన్యత్వము'ను ఏమాత్రం నింపలేకే పోతున్నాయి. కొన్నిచోట్ల సురాసురులు సంచరిస్తున్నారు. కాని, వారు ఒకరినొకరు గుర్తించలేకే పోతున్నారు. మరికొన్ని చోట్ల కూష్మాండ రాక్షస-పిశాచమండలములను కూడా వారు గమనించారు. మరికొన్ని

చోట్ల ఢాకినులు నృత్యం చేస్తున్నారు. ప్రళయమేఘాలు గల ప్రదేశాలు, కిన్నెర– గంధర్వ – దేవతా స్త్రీలు గానం చేస్తున్న ప్రదేశాలు, రుద్రపురములు, బ్రహ్మ పురములు చూచారు. ఇంకా మాయా నిర్మితమైన పట్టణాలు, కదలికలే లేని సరోవరాలు, సిద్ధులు వచ్చిపోయే స్థానాలు, చీకటి రాత్రులచే ఆక్రమించబడిన ప్రదేశాలు, పగలు మాత్రమే ఉన్న ప్రాంతాలు చూచారు. ఈ విషయములన్నీ వారు గమనిస్తూ సాగిపోతున్నారు. మధ్యమధ్యలో ఆకాశమండలమున విశ్రమిస్తున్నారు. జ్ఞప్తిదేవియగు సరస్వతీ జగన్మాత కల్పనా బలమును అనుసరించే ఆయా భూమి ప్రదేశములను చూస్తూ వెళ్ళుచున్నారు.

❖

ఓ రామచంద్రా! ఈ భూమండలము "బ్రహ్మాండము యొక్క హృదయపద్మమా?" అని అనిపిస్తోంది కదా! అష్టదిక్కులచే ఆవరించబడిన ఈ భూమిపై ప్రాణికోట్లు దోమల గుంపువలె ఉంటున్నారు. దీనిచుట్టూ దీనికి మూడింతలు లవణసముద్ర మున్నది. దానికి రెండింతలు శాకద్వీపం, దానికి రెండింతలు క్షీరసముద్రం ఆవరించి ఉన్నది. దానికి రెండితలు 'కుశద్వీపం'. ఆ ద్వీపం చుట్టు 'దధిసముద్రం' ఆవరించి ఉన్నది. దానికావల క్రౌంచ ద్వీపం. దానినావరించి ఘృతసముద్రం, దాని చుట్టూ గోమేధిక ద్వీపం, దానికావల ఇక్షు సముద్రం, దానిచుట్టూ పుష్కరద్వీపం, అక్కడ చుట్టు మంచినీటి సముద్రమున్నది. ఆ తరువాత ఒక బిలము ఉన్నది. అది పాతాళమునకు దారి తీస్తోంది. దానికి ఆవల పదిరెట్లు విస్తీర్ణముగల అరణ్యం ఉన్నది. ఆ అరణ్యంలో జీవరాశి లేదు. ఆ తరువాత అగ్నిజ్వాలలు, వాయు ప్రవాహం, శూన్యాకాశం, బ్రహ్మాండ కుడ్యము–ఇవన్నీ కూడా, ఒకదానికంటే మరొకటి పదిరెట్లు ఉండి ఉన్నాయి. ఇవన్నీ దాటి ఆ ఇరువురు వనితలు 'గిరి' అను గ్రామం ఉన్న భూమండలం చేరారు.

❖

క్రమంగా వారు 'వసిష్ఠుదు' అనబడు బ్రాహ్మణుని గృహంలో ప్రవేశించారు. ఆ ఇల్లు ఉత్సవరహిత నగరంలాగా, దుఃఖముతో నిండియున్న స్త్రీలాగా, కూలిన వృక్షంలాగా ఉన్నది. గృహపాలకులు లేకపోతే అంతేకదా!

అప్పుడు నిర్మల జ్ఞానము పొందియున్నప్పటికీ ఆ లీలాదేవి కొంత అజ్ఞానముచే ప్రభావితమవటం జరిగింది. ఉబలాటం అణచిపెట్టుకోలేక ... "ఇక్కడ ఉన్న నా బంధువులు నన్ను, ఈ సరస్వతీదేవిని చూడగలుగుదురు గాక!" అని తన చిత్తమున సంకల్పించినది. అంతే ... ఆ ఇంటిలోని బంధువులు ఆ ఇద్దరిని ఎదురుగా చూడగలిగారు. వారి రాకచే ఆ గృహములోని దుఃఖమంతా మటుమాయమైంది. వాతావరణమంతా అత్యంత ప్రకాశవంతమైనది. వారి చల్లని చూపులు అనే అమృతం చేత అక్కడి వారందరు పరమానందం పొందారు. ఆ గృహము యొక్క పెద్ద కుమారుడు అయినట్టి జ్యేష్ఠశర్మ వారిద్దరికి పుష్పాంజలి సమర్పించి పాదములకు నమస్కరించాడు.

❖

**జ్యేష్ఠశర్మ :** ఓ వనదేవతలారా! సుస్వాగతం. మీకు జయమగు గాక! మీరాకచే మా దుఃఖాలన్నీ ఒక్కసారి పటాపంచలు అయ్యాయి. సాధుజనులైనవారు దుఃఖజనుల ఆర్తిని పోగొట్టుటే అభ్యాసముగా కలిగివుంటారు. అందుచేతనే మీరిద్దరు మా ఈ గృహమును పావనం చేశారు.

**శ్రీ సరస్వతీదేవి :** నాయనా! ఈ గృహములోని వారంతా ఏదో దుఃఖమును పొందినట్లున్నారు. కారణమేమిటి? మీకు వచ్చిన కష్టమేమిటి?

**జ్యేష్ఠశర్మ :** అమ్మలారా! ఈ ఇల్లు ఎల్లప్పుడూ అతిథులకు ఆశ్రయమై, బ్రాహ్మణ మర్యాదలకు ఆధారమై ఉండేది. దీనులు ఇక్కడి ప్రేమ-సహకారములచే ఆనందము పొందుతూ ఉండేవారు. మా తల్లి-తండ్రులు ఈ ఇంట్లో సంచరిస్తూ ఉంటే, ఈ పరిసరమంతా దేవలోకంలోని నందనవనంలా ఉండేది. ఎనిమిది రోజుల క్రితం మా తల్లితండ్రులు మా గృహం విడచి స్వర్గస్తులయ్యారు. ఇంకేమున్నది? మాకీ మూడు లోకములు శూన్యములే అయ్యాయి. నాలుగు - ఐదు రోజుల క్రితం వారి దేహాలకు దహనసంస్కారాలు చేశాము. అటు చూడండి. ఆ పెంపుడు పక్షులు ఇంకా మా తల్లి-తండ్రుల మృతదేహములను గుర్తు తెచ్చుకొని కరుణతో రోదిస్తూనే ఉన్నాయి. అవి అశ్రుధారలతో తమ అమితదుఃఖమును వెలిబుచ్చుచున్నాయి. ఈ గిరి గ్రామ వాసులంతా ఇంకా నెత్తి-నోరు బాదుకొని దుఃఖిస్తూనే ఉన్నారు. కొందరు బంధువులు బ్రతకాలని లేకపోవుటచే తిండిని కూడా మానివేశారు. వీథులు నిర్మానుష్యమయ్యాయి. ప్రకృతి కూడా రోదిస్తోంది. ఆ దుఃఖముచే మా అంగములు సత్తువను కోల్పోయాయి. పుష్ప సుగంధం దుర్గంధంగానే తోస్తోంది. మా తల్లిదండ్రులు వచ్చి ఉండటంచేత కాబోలు - స్వర్గనరకవాసులు సంతోషంతో విద్యాధరగానం చేస్తున్నారు. మీవంటి మహాత్ముల దర్శనం వృథా అవుతుందా? లేదు. మీరు మా దుఃఖమును తప్పక పోగొట్టగలరని నేను అనుకొంటున్నాను.

❖❖❖

## 16. విస్తార దృష్టి

అది వింటున్న లీలావతి సరస్వతీదేవి వైపు అర్థయుక్తంగా చూచింది. పుత్రుడు జ్యేష్ఠశర్మ నుదురు ప్రేమగా స్పృశించింది. ఆమె హస్తస్పర్శచే అతడు "దుఃఖము" అనే దురదృష్టము నుండి క్షణంలో విడివడ్డాడు.

**శ్రీ రామచంద్రుడు :** హే మహర్షీ! వసిష్ఠా! ఇప్పుడు నాదొక చిన్న సందేహం. ఆ లీలావతి తన ఇతఃపూర్వపు జన్మకు సంబంధించిన పుత్రుడగు ఆ జ్యేష్ఠశర్మకు తన ఇతఃపూర్వపు రూపముతోనే కనబడి ఉండవచ్చును కదా! అట్లు ఎందుకు చేయలేదు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రాఘవా! ఈ నేల మొదలైన పదార్థములను చూస్తున్నప్పుడు, భౌతికదృష్టితో చూస్తున్నవారికి ఇక్కడ అనేక పదార్థములు, నీవు-నేను వంటి అనేక విశేషములు ఉన్నట్లు కనబడుచున్నాయి. జ్ఞానదృష్టి గలవారికి, (ఉత్తమమగు ఆత్మదృష్టిని అభ్యాసయోగముచే అవలంబించిన

వారికి)... ఇదంతా 'పరమాకాశము' గానే కనబడుతోంది. పాంచభౌతిక దృష్టి బలవత్తరమై ఉన్నంత వరకు అసత్పదార్ధములు (అనగా, వాస్తవమైన ఉనికి లేనివి) కూడా సత్పదార్ధమువలె తోచుతాయి. 'మాయ' యొక్క చమత్కారం అదేమరి! ఒక బాలుడు బేతాళదృష్టితో చీకట్లోకి చూచినప్పుడు అతనికి ఆ చీకట్లో ఉన్న బండరాయో, చెట్టో బేతాళుని ఆకారముగానే దర్శనమిస్తోంది. "అసలు బేతాళుడు (దయ్యము) అనబడే పదార్ధమే ఉండదు" అను దృఢదృష్టితో చూస్తే, అక్కడ బేతాళుడే ఉండదు. "ఇది స్వప్నము" అను జ్ఞానం కలిగిన తరువాత ఇక స్వప్న పదార్ధములకై "అవి ఎక్కడ ఉన్నాయి?" అని వెతుకువాడెవ్వడు? అదే విధంగా జాగ్రత్ అవస్థయందు కూడా! "ఆత్మవిషయ జ్ఞాన దృష్టి"చే, ఇక్కడి పదార్ధములన్నీ 'మిథ్య' గానే గోచరిస్తాయి. పైత్యరోగముచే విచలితమైన మనస్సు గలవానికి ఈ పరిసరమంతా గిఱ్ఱున తిరుగుచున్నట్లు తోచుచున్నది. సత్యజ్ఞానము, సమగ్రమైన అవగాహన లేనివాడే "సంసారము" అనబడుదానిని చూస్తున్నాడు. అనుభవిస్తున్నాడు, "ఈ భూమి మొదలైనవన్నీ 'భావన-భావికుడు'ల పరస్పర సంబంధమును అనుసరించి మాత్రమే ఉంటున్నాయి. స్వతహాగామాత్రం ఇదంతా ఆకాశసదృశమే" అను బుద్ధి పెంపొందించుకున్నవారికి ఇవన్నీ ఆ రీతిగానే గోచరిస్తాయి.

స్వప్నంలో కనబడే ఆకాశము, భూమి, జనులు మొదలైనవన్నీ శూన్యమే రూపముగా కలిగి యున్నవి కదా! స్వప్నంలో ఒకడు చూచు సుందరస్త్రీ శూన్యరూపమే. అయినప్పటికీ, ఆ స్వప్నానుభవము, 'స్ఖలనము' మొదలైన ప్రభావములు ఈ బాహ్యదేహమునందు కలిగింపజేయుచున్నది. అదేవిధంగా ఆకాశమునందు "ఇది పృథివి" అనునట్టి జ్ఞానము కలిగినప్పుడు, అది అట్లే పృథివి మొదలైన పదార్ధములుగా దర్శనమిస్తోంది. బాలుడు స్వల్పములగు ఆటవస్తువులలో మహత్తరమైన విశేషములు గాంచుచున్నాడు. మరణించబోవువాడు తనచుట్టు జలపాతమును, వాయు ప్రహారమును అనుభవించటం జరుగుతోంది. ఒకానొకడు మూర్ఛలో పరలోకములను గాంచు చున్నాడు. కొందరు పిచ్చివారు తమ ఎదురుగా ఏవేవో జ్ఞాపకములకు సంబంధించిన జనులను, పదార్ధముల ఆకారములను గాంచుచున్నారు. చక్షురోగము కలవాడు ఒక్క వ్యక్తినే అనేకమందిగా చూస్తూంటాడు. వారికి ఇవన్నీ అజ్ఞానావేశం ఉన్నప్పుడు వాస్తవముగానే అనిపిస్తూ ఉంటున్నాయి.

దీనిని బట్టి నీవు గ్రహించవలసినది ఏమిటి? ఈ జగత్తులోని పదార్ధ సమూహముల ఆకారము లన్నీ కల్పన యందే ప్రతీతమై ఉంటున్నాయి. వాస్తవానికి వీటికి ఎట్టి ఆకృతి లేదు. కనుక ఈ దృశ్యమంతా 'భావన-భావించువాడు' అను రెండిటి మధ్య ఏర్పడి ఉన్న సంబంధం యొక్క ప్రకటనయే.

❖

ఇక మనం లీలాదేవి విషయానికివస్తే, ఆమె "పృథివి-శరీరములు" మొదలైన వాటినన్నిటినీ 'అసత్తు' గానే గ్రహించుచున్నది. "చిదాకాశమే భ్రాంతి బలం చేత నానారూపములను దాల్చుచున్నది" అని ఆమె స్పష్టముగా గాంచుచున్నది. "ఇదంతా చిదాకాశ స్వరూపమగు బ్రహ్మమే" అని గ్రహించినట్టి మననశీలునకు, ... ఈ "నా కొడుకు - నా స్నేహితుడు - నా భార్య - నా జాతి" అను పరిమిత

భావనలు వీగిపోతాయి. అసలీ దృశ్యపదార్థములు ఏక్షణంలోను ఉత్పన్నమై ఉండలేదు. నీవు చూచేదంతా జన్మరహితమగు బ్రహ్మమేసుమా! సంపూర్ణ జ్ఞానం కలిగిన తరువాత ఇక రాగద్వేషాలు, అహంకార–మమకారాలు ఉంటాయా? ఉండవు.

**శ్రీరాముడు :** మరయితే స్వామి! ఆ లీలావతి జ్యేష్ఠశర్మను ఎందుకు ప్రేమగా స్పృశించింది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** అదా? అది అతనికి తత్త్వజ్ఞానము కలుగటం కొఱకే. ఆ స్పర్శ అతనికి ప్రాప్తించటం పూర్వజన్మల ప్రయత్నముల ప్రయోజనమే అయివున్నది. అంతేగాని లీలకు "ఇతడు నా పుత్రుడు. నాకు చెందినవాడే. ఇతనిని నేను కలిగియుండెదను గాక" అనునట్టి బుద్ధి లేదు. అందుచేతనే ఆమె అతనికి ఇతఃపూర్వపు మాతృరూపంలో దర్శనం ఇవ్వలేదు.

ఓ రాఘవా! 'బోధ' అను జ్ఞానానుభవం నీయందు ఉదయించిందా .... ఇక ఆపై నీకు సర్వేసర్వత్రా ఆకాశముకంటే కూడా అత్యంత సూక్ష్మమగు విశుద్ధ బ్రహ్మ పదార్థమే గోచరిస్తుంది. నాయనా! ఈ జాగ్రత్ పదార్థములు, స్వప్నమునందు చూడబడుచున్న పదార్థములు, సంకల్పపురమున అనుభవించబడేవి ... ఇవన్నీకూడా బ్రహ్మమే కాని, ఇంకేమీ కావు.

ఇక మనం మరల లీలాదేవియొక్క మరొక జన్మకు సంబంధించిన విశేషములకు వద్దామా?

❖❖❖

# 17. జన్మ - జన్మాంతరదృష్టి

అప్పుడు లీలా–సరస్వతులు ఆ గిరి గ్రామములోని బ్రాహ్మణ గృహములో ఉంటూనే అదృశ్యరూపులయ్యారు. ఆ గృహములోని జనులు "ఆహా! వనదేవతలు మన మీద అనుగ్రహంతో దర్శనమిచ్చి మాయమయ్యారు కదా!" అని అనుకొన్నారు. ఆ సంఘటనను తమతమ అనుభవరీతుల ననుసరించి మరలమరల చెప్పుకొన్నారు. దుఃఖములను త్యజించివేశారు. తమతమ పనులయందు ఇతఃపూర్వమువలె నిమగ్నులయ్యారు.

లీల–సరస్వతులిద్దరూ ఆ గృహమండపాకాశంలోనే లీనమై సూక్ష్మరూపమున ఉండి ఉన్నారు కదా! లీలాదేవి .... తాను గిరి గ్రామంలో ఆ ఇంటి ఇల్లాలుగా అనేక సంవత్సరములు ఉండివుండటం, తన మరణం ఎనిమిది రోజుల క్రితమే జరిగి ఉండటం, .... మొదలైనవిషయాలన్నీ చూచి చాలా ఆశ్చర్యపడింది. కొంచెము విచలితభావంతో ఉన్న లీలను చూచి సరస్వతీదేవి చిరునవ్వు చిలికించింది.

❖

**శ్రీరాముడు :** మహర్షీ! వారిద్దరు అశరీరులు కదా! ఎట్లా సంభాషించుకొంటున్నారు? ఎక్కడ సంభాషించుకొంటున్నారు?

**మహర్షి :** స్వప్నంలోను, సంకల్పమునందు జరిగే సంఘటనలు ఎట్లా జరుగుచున్నాయి? ఎక్కడ జరుగుచున్నాయి? అందు శరీరములు ప్రవర్తించటం లేదుకదా! అట్లే సూక్ష్మ శరీరమాత్రులగు

వారిరువురి సంభాషణలు కూడా కార్యరూపము పొందుచున్నది. భౌతిక శరీరము, నాడీ ప్రాణములు లేకున్నప్పటికీ స్వప్న–సంకల్పాలలోలాగానే వారిద్దరి మధ్య సంభాషణా రూపమగు జ్ఞానము ఉండియే ఉన్నది.

❖

**శ్రీ సరస్వతీదేవి :** ఓ లీలా! మనం ఇక్కడికి వచ్చినందుకు ఏది తెలుసుకోవాలో, అదంతా తెలుసుకున్నావు. నేను నీ జన్మాంతరవిషయమై చెప్పిన దానికి నిరూపణను గ్రహించావు కదా!

'బ్రహ్మసత్త' స్వరూపమే ఇదంతా! అజ్ఞానం ఉన్నంతకాలం జగద్భ్రమ కలుగుతూనే ఉంటుంది. జ్ఞానోదయమైన మరుక్షణం జగత్తు ఉండదు. దృశ్యము ఉండదు. అప్పుడు "స్వసత్తసామాన్యము" (All pervading Absolute self) అను స్థితియే శేషించుచున్నది. ఈ జీవులందరు స్వతఃగా మోక్ష స్వరూపులే అయినప్పటికీ, నిష్కారణంగా స్వకల్పితమోహంచేత భ్రమాత్మకమైన జగత్తును అనుభవించుచున్నారు. మరల ఒకానొకప్పుడు జ్ఞానోదయమగుటచే నిదురలేచి, ఇదంతా క్షణంలో కాకతాళీయంగా త్యజించివేస్తున్నారు. ఏది తమ వాస్తవస్వరూపమైయున్నదో అట్టిదానియందు సుస్థిరులై, 'జగద్వినాశనము'ను అనుభవించుచున్నారు. ఇంతకుమించి ఇందు ఏమీ విశేషం లేదు. ఇప్పుడు చెప్పు. ఈ విషయంలో ఇంకా నీకేమైనా సందేహాలు ఉన్నాయా?

**లీలాదేవి :** హే లోకపావనీ! నేను ఇతఃపూర్వం నాభర్త పద్మని యొక్క తదనంతరం జీవుడు (విదూరథుడు) రాజ్యమేలుచున్న చిదాకాశ నగరానికి వెళ్ళి ఉన్నాను కదా! అక్కడివారు నన్ను చూడలేకపోయారేమిటి? కాని ఇక్క డ "నేను వీరికి కనబడెదనుగాక" అని సంకల్పించగానే జ్యేష్ఠశర్మ, తదితర బంధువులు నన్ను చూడగలిగారు. అప్పుడుకూడా "వీరు నన్ను చూడటం జరిగితే వీరితో నేను సంభాషించెదను" అను రూపముగల ఇచ్ఛ ఉండేది సుమా!

**శ్రీ సరస్వతీదేవి :** ఓహో! అదా! అప్పటికి నీకింకా అభ్యాసం దృఢం కాలేదు. "నేను రాజపత్నియగు లీలాదేవిని" అనే ద్వైతభావము నీయందు గాఢంగా మిగిలియే ఉన్నది. ద్వైతము ఉన్నంతవరకు అద్వైతకర్మ యొక్క ప్రయోజనం లభించదు. ఎండలో నిలబడి "నాకు చల్లగా లేదేమిటి? అక్కడ చల్లగా ఉన్నది కదా" అంటే ఎట్లా? అభ్యాసం లేనంతకాలం "నేను లీల" అని పిలవబడుచున్న శరీరమాత్రమును" అను దృఢభావం తొలగదు. అందుచేతనే నీకు అప్పుడు సత్యసంకల్పము ఉదయించలేదు. నీవు కోరుకున్నప్పటికీ అప్పటి సభలో సమావేశమైయున్న నీ పతి, తదితర సభికులు నిన్ను చూడనేలేకపోయారు. ఇక ఇప్పటి విషయానికి వస్తే, "నేను 'శరీరము' అనబడు నిర్వచనముచే బంధింపబడజాలని నిష్కళంకచైతన్య తత్త్వమును, ఆత్మైక్యస్వరూపమును" అనునట్టి దృఢానుభవం మరికొంతగా బలపడియున్నది. అందుచేత, సత్యసంకల్పురాలవయ్యావు. అనగా, నీవు దేనిని ఎట్లు భావన చేస్తావో, అది ఆ రీతిగానే అనుభవమౌతోంది. "ఇతఃపూర్వపు జన్మయందలి ఈ నా పుత్రుడు నన్ను గాంచుగాక" అనునట్టి నీ అభిలాష ఇక్కడ నెరవేరింది. ఇప్పుడు నీవు నీభర్త వద్దకు వెళ్ళి ఇట్లే సంకల్పిస్తే నిన్ను అతడు తప్పక చూడగలడు.

**లీలాదేవి :** ఆహా! ఈ బ్రహ్మాండముల కల్పనావ్యవహారమంతా ఎంత చిత్రంగా ఉన్నది! గిరి గ్రామంలోని ఈ మందిరాకాశం (Space pertaining to this house) లోనే ఈ బ్రాహ్మణుడు (వసిష్ఠుడు) నా భర్త అయ్యాడు. మరల ఇక్కడే అతడు తన వసిష్ఠదేహమును త్యజించి, "పద్ముడు" అను రాజై విస్తారమైన రాజ్యమును పాలిస్తూ నన్ను అలరించాడు. మేమిద్దరం డెబ్బది ఏండ్లు దాంపత్యం చేశాము. ఈ అంతఃపురంలోనే అతడు మృతి చెందాడు. మరల ఈ అంతఃపురంలోనే వేరైన జనపదంలో విస్తారమైన సామ్రాజ్యానికి చక్రవర్తి అయి విదూరథనామ ధేయంతో రాజ్య మేలుచున్నాడు. ఒక చిన్నకాయలో అనేక వేరువేరు ఆవగింజలు ఉన్నట్లు, ఈ గృహాకాశంలో వేరువేరైన బ్రహ్మాండాలు అనేకం వర్తిస్తున్నాయన్నమాట. అమ్మో! ఏమి ఈ సృష్టి చమత్కారం!

ఇదంతా గమనిస్తుంటే, "ఇప్పుడు మనం నా భర్త ఉండి ఉన్న చిదాకాశ జగత్తుకు సంబంధించిన అంతఃపురానికి అత్యంత సమీపంలోనే ఉండి ఉంటాము కదా!" అని అనిపిస్తోంది. హే జగజ్జననీ! నేను నా భర్తయొక్క వ్యవహారసత్తనంతా ఇక్కడ ఉండే చూడగలిగేటట్లు అనుగ్రహించు. నా భర్తను విడచి నేను ఉండగలనా చెప్పు?

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! భూతల అరుంధతీ! నీకు అనేకమంది భర్తలు ఉండి ఉన్నారు. ఇప్పుడు మనం చూస్తున్న వ్యవహారం దృష్ట్యా కూడా ముగ్గురు ఉన్నారు. వారిలో మొదటివాడు 'వసిష్ఠుడు' అను బ్రాహ్మణుడు. అతడు భస్మమై 'పద్ముడు' అనుపేరుగల రాజయ్యాడు. అతని శవమే నీ అంతః పురంలో పుష్పగుచ్ఛములతో కప్పబడియున్నది కదా! అతడే ఈ సంసారమున 'విదూరథుడు' అను పేరుతో గొప్పరాజ్యం ఏలుచున్నట్లు చిదాకాశరూపిణివై నీవు వీక్షించావు. ఇప్పుడు విధూరథుడు 'సంసారము' అనబడే మహాసముద్రజలంలో పడి భ్రాంతుడై కొట్టుకుంటున్నాడు. భోగసమూహాలలో పడి వికలుడై ఉన్నాడు. 'మహాతమస్సు'లో మునిగిపోయి ఏవేవో రాచకార్యములను అత్యంత విశ్వాసముతో నిర్వర్తిస్తూ భ్రమనుండి మేల్కొనటం లేదు.

ఓ వనితా! ఇప్పుడు చెప్పు. సుగంధ కణములు గాలిచే ఒకచోటినుండి, ఇంకొక చోటికి తీసుకొని పోబడినట్లు, నీవు ఇప్పటికి అనేక దేహములలో ప్రవేశించియున్నావు. మరల వాటిని త్యజించావు. ఆయా జన్మలలో అనేక మంది బంధువులు ఉండి ఉన్నారు. "నాభర్త, నేను చూడాలి-నేను దూరమై ఉండలేను" అను ఆవేదన వెలిబుచ్చుచున్నావు కదా? అనేక జన్మలు చవిచూచినట్టి నీవు "నా భర్త" అని చెప్పుచున్నది ఎవరి గురించి? ఇప్పుడు నిన్ను నేను ఎక్కడికి తీసుకుపోవాలి?

ఈ 'సంసారము' అనునది ఒక తీరుగా ఉంటోంది. మరల బ్రహ్మాండముల విషయానికి వస్తే, అవన్నీ మరొక తీరుగా ఉంటున్నాయి. ఈ వ్యవహార పరంపరలన్నీ చైతన్యము యొక్క స్వయం కల్పితములే కదా! అందుచేత జ్ఞానదృష్టితో పరికించి చూచినప్పుడు ఈ సంసార మండపములన్నీ నీ ప్రక్కనే, ఎదురుగానే ఉన్నాయి. అట్లా కాకుండా, సంసార దృష్టితో చూస్తే ఒకదానికి మరొకటి కోటానుకోట్ల యోజనముల దూరంలో ఉన్నాయి. జ్ఞానదృష్టికి ఇవన్నీ ఆకాశస్వరూపములే కదా! నీ ఇతఃపూర్వపు అసంఖ్యాకమైన జన్మలన్నీ ఇట్టివే. సూర్యకిరణములందు అనేక త్రసరేణువులు

(కాంతి రేణువులు) ఉదయిస్తున్నట్లు (కిటికీగుండా ఇంట్లో ప్రవేశించే సూర్యకిరణములలో అట్టి త్రసరేణువులను మనం గమనించవచ్చు) కనబడటం లేదా? ఆ మహాచైతన్యము నందు గల ప్రతి పరమాణువునందు అనేక సృష్టిసమూహములు వికసించుచున్నాయి. ఈ బ్రహ్మాండ సమూహముల సృష్టి అంతా మహాకష్టతరంగా, గొప్ప ఘనీభూత స్వభావంతో ప్రవర్తిస్తున్నట్లు అనిపిస్తున్నప్పటికీ ... పరమార్థ దృష్టితో చూస్తే ఇవన్నీ కలిపి 'మట్టిగింజ' అంతకూడా ఉండవు. రకరకాలైన రత్నములను ఒకచోట ఉంచామనుకో ... అప్పుడు ఆ గుట్ట నుండి బయల్వెడలే రంగురంగుల కిరణముల సమన్వయం ఒక అరణ్యమువలె గోచరిస్తుంది. అట్లాగే ఈ జగత్తులు కూడా మాయవల్లనే ఇట్లు కనిపిస్తున్నాయి. జ్ఞాన చింతనతో చూచినప్పుడు ఈ 'పృథివి' మొదలైనవన్నీ శూన్యరూపములుగానే కనిపిస్తాయి.

"భ్రాంతి" వలన మాత్రమే ఆత్మయందు జగద్వ్యవహారమంతా స్ఫురిస్తోంది. వాస్తవానికి పృథివి మొదలైన పంచభూతజాలమంతా 'సృష్ట్యాది' యందే లేవు. ఆహాఁ! సరోవరంలో తరంగాలు మాటిమాటికీ లేచి లీనమౌతాయి చూచావా? అట్లే "జ్ఞానచైతన్యము" అనే తటాకంలో దేశ–కాలముల పట్ల ఏర్పడుచున్న "అనుభవములు" అనునవి అనేక విభాగముల రూపంలో సంసారతరంగాలుగా లేస్తున్నాయి. మరల లీనమైపోతున్నాయి.

**లీలాదేవి :** హే వాణీ! హే సర్వార్థశోభితా! నీ కరుణాప్రభావంచేత నా ఇతఃపూర్వపు అనేక జన్మలను ఇప్పుడే – ఇక్కడి నుండే చూడగలుగుచున్నాను. నీవు చెప్పుచున్నదంతా వాస్తవమేనని నాకు తెలియవస్తోంది. ఈ నా వర్తమాన జన్మ సాత్వికము కాదు. తామసికము కూడా కాదు. ఇది రాజసమైనదానివలె నాకు గుర్తుకు వస్తోంది*.

బ్రహ్మమే స్వరూపముగా కలిగి, బ్రహ్మమునుండి వెలువడినట్టి నేను నానా విధములైన యోనులలో జన్మించాను. ఇతఃపూర్వము ఎనిమిది వందల జన్మలు ఎత్తినట్లు ఇప్పుడు స్పష్టంగా గాంచుచున్నాను. ఒకప్పుడు ఒక విద్యాధరిని అయ్యాను. చెడ్డకోరికలచే కలుషిత మనస్కురాలనై మనుష్య జన్మనెత్తాను. మరల ఇంకొక సంసార మండపంలో 'నాగరాజపత్ని (సర్పరాజభార్యను)' అయ్యాను. ఆ తరువాత ఒక ఆటవిక స్త్రీనై ఆకులు ధరించి అడవులలో సంచరించాను. ఆ జన్మలో మానవునకు ఉండవలసిన దయ – దాక్షిణ్యములను వదలటంచే ఒక వనంలో పూలతీగనై జన్మించాను. అయితే, పుణ్య ప్రదమైన మునుల ఆశ్రమములో ఉండుటచేత, అగ్నిచే దహింపబడిన నేను ఆ మునికి కూతురునై పుట్టాను. అప్పటి పుణ్యకర్మల ప్రభావంచేత ఒక రాజునై నూరేళ్ళు ఉన్నాను. కాని రాజుగా నేను నిర్వర్తించిన పాపముల ప్రభావం చేత 'ముంగిస'నై పుట్టాను. ఆ తరువాత ఒక ఆవునై ఎనిమిదేళ్ళు గడిపాను. ఒక పక్షినై బోయవానికి చిక్కి, అతని వలలోంచి ఎట్లాగో తప్పించు కొన్నాను. తుమ్మెదనయ్యాను. ఒక లేడినై ఒకానొక బోయవాని చేతిలో మరణించాను. ఆ తరువాత

---

* లీలాదేవి ఇక్కడ తాను ఎట్టి మానసిక ప్రవృత్తిచే వర్తమాన జన్మపొందటం జరిగినదో గాంచగలుగుచున్నది; లేక గుర్తు చేసుకోగలుగుచున్నది.

'చేప'నై నీటిలో తేలియాడుచు, ఒక తాబేలు వీపుపై షికార్లు కొట్టాను. ఆ సమయంలో ఒకసారి ఒక జాలరి దెబ్బ తప్పించుకొని నీటిలోకి ఉరికాను కూడా!

అటు తరువాత కిరాత స్త్రీనై జన్మించి కొబ్బరికల్లు త్రాగుచూ ఉండేదానను. మరుజన్మలో ఒక సారసపక్షిగా జన్మించాను. ఆపై స్వర్గలోకంలో 'అప్సరస'గా జన్మించి యువకులతో రతిక్రీడలందు నిమగ్నమైనాను. ఆ తరువాత ఒక తాబేలునై పుట్టి చాలా రోజులు జీవించాను. చెట్టుపై రాజహంసనై కొన్నాళ్ళు ఊయలలూగాను. అప్పుడు ఒక బూరుగు చెట్టుపై అటు-ఇటూ ఊగుచూ దోమలను చూచి, ఆ దోమల పట్ల గల బుద్ధి కారణంగా దోమనై పుట్టాను. అటుపై ఒక లతనై జన్మించి కొండ వాగు యొక్క జలప్రవాహంచేత క్రిందకు-పైకి ఊగుతూ ఉండేదానిని. ఆ తదుపరి విద్యాధర పురంలో పుట్టాను. ఆహాః! హే జగన్మాతా! వింటున్నావా? ఎండమావులలో నీరు ఉన్నదని భ్రమించి ఒక లేడి పరుగులు తీస్తుంది చూచావా? నేను కూడా అనేక దుఃఖ భరితములైన జన్మలు ఎత్తాను. ఎంతటి భ్రమ, ఎంతగా అనుభవించానో చెప్పలేను! ఆ వేదన, పరితాపం వర్ణనాతీతమనే చెప్పాలి.

❖❖❖

## 18. బ్రహ్మాండ భ్రాంతి

**శ్రీరాముడు :** ఆ లీలయొక్క జన్మలు బహుచమత్కారంగా ఉన్నాయి. అనేకమంది జీవుల పరంపరలు ఇట్టివేనని నాకు అర్థం అవుతోంది. అయితే మహాత్మా! ఆ బ్రహ్మాండము కోటి యోజనముల విస్తీర్ణం వ్యాపించి వజ్రమువలె కఠినమై ఉన్నదని అనుకొన్నాంకదా! ఆ స్త్రీలిద్దరూ బ్రహ్మాండములను ఛేదించి ఎట్లా బయల్వెడలారు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! నీ ప్రశ్న బాగానే ఉన్నదయ్యా! కాని, బ్రహ్మాండము లెచట? వజ్రత్వమెక్కడ? వారిద్దరు ఆ అంతఃపురాకాశంలోనే ఉన్నారు సుమా! ఆ గిరి గ్రామంలోని గృహాకాశంలోనే 'వసిష్ఠుడు' అను పేరుగల బ్రాహ్మణుడు ఉండి ఉన్నాడు కదా! అదే శూన్యాకాశంలో పద్ముడై గొప్ప రాజ్యమును కూడా ఏలాడు. ఆ అరుంధతి రాణి అయి రాజ్యమును అనుభవించింది. ఆ లీల అనబడే రాణి సరస్వతీదేవిని ఆరాధించి, ఆమె కరుణచే, ఆ గృహాకాశంలోనే ఆమెతో కూడి మనోహరమైన ఆకాశ మండలమును దాటింది. వారిద్దరూ ఆ పరిమిత గృహాకాశంలోనే ఇంకొక బ్రహ్మాండమునకు పయనించటం చేస్తున్నారు. ఇదంతాకూడా .... ఒక నిద్రలోని స్వప్నము నుండి మరొక నిద్రలోని స్వప్నమున ప్రవేశించటం వంటిదే!

అందుచేత, ఇదంతా భ్రాంతిమాత్రమేనని గ్రహించు. వాస్తవానికి 'ఆకాశము' తప్పితే వేరొక వస్తువేలేదు. "బ్రహ్మాండము - సంసారము - దూరము" అను పదజాలమంతా మిథ్యయే. వాసనా ప్రభావం చేతనే వారిద్దరి చిత్తమునందు ఆయా మనోహర దృశ్యములన్నీ ప్రతిఫలిస్తున్నాయి. వాసనలే లేకుంటే, బ్రహ్మాండములెక్కడ? సంసారమెచ్చట? వారి చిత్తము యొక్క చమత్కృతి చేత చిదాకాశము ఆవరణసహితమైన బ్రహ్మాండమువలె కల్పించబడినది. చిదాకాశము సర్వత్రా, సర్వదా

జన్మరహితముగా శాంతముగా వెలయుచున్నదని గ్రహించు. చిదాకాశము తనయందు తానే 'జగత్తు' రూపమున ప్రకాశిస్తోంది. ఈ తత్త్వము గ్రహించినవారికి ఈ కనబడే జగత్తంతా ఆకాశము కంటే కూడా అత్యంత శూన్యముగా కన్పట్టుచున్నది. అట్లు కొందరు గ్రహించ గలుగుచున్నారు. ఇక మరికొందరో,.... గ్రహించలేకపోవుచున్నారు. ఎందుచేత? అజ్ఞానమే అందుకు కారణం. అట్టి అజ్ఞానానికి ఇదంతా వజ్రమువలె దృఢంగా కన్పట్టుచున్నది.

స్వప్నంలో నగరములు, బంధుజనులు ఆ స్వప్నసమయంలో వాస్తవమైన వాటివలెనే అనుభవమౌతాయి కదా! కాని అవి సత్యమా? కాదు. అసత్తే అయివున్న ఈ సంసారము కూడా చిత్పదార్థము నందు సత్తువలె ప్రతిభాసిస్తోంది. విశాలమైన ఎడారిలో కనబడే ఎండమావులలోని జలజ్ఞానం వాస్తవం కాదుకదా! బంగారంలో ఆభరణత్వమున్నదా? ఆత్మయందు ఈ దృశ్య సమూహములు అసత్తు అయివుండి కూడా సత్తువలె అగుపిస్తున్నాయి.

❖❖❖

# 19. పూర్వస్మృతులు

ఆ విధంగా లీలాదేవి పూర్వజన్మలను, అందలి కొన్ని సంఘటనలను జ్ఞానదృష్టిచే దర్శిస్తూ నెమరువేస్తోంది. వారట్లు సంభాషించుకొంటూ గిరి గ్రామంలోని బ్రాహ్మణ గృహంలోంచి బయటకు వచ్చారు. వారికి ఎదురుగా ఆ గ్రామంలో విశేషాలన్నీ కనబడుచున్నప్పటికీ, వారు మాత్రం ఎవరికీ కనబడటం లేదు. అప్పుడు ఎదురుగా వారికి ఒక పెద్దకొండ కనిపించింది. ఆ కొండలపైగల అడవిలో విచిత్ర వృక్షాలు, పక్షులు, సెలయేళ్ళు చిత్రమైన ధ్వనులను వినిపిస్తున్నాయి. లీలాదేవిలో తన పూర్వజన్మ జ్ఞాపకాలు పెల్లుబకసాగాయి. సరస్వతీదేవి అది చిరునవ్వుతో గమనిస్తూ లీలను తీసుకొని గ్రామమంతా సంచరించ సాగింది.

ఊరికి చివరిగా ఉన్న దట్టమైన వృక్షసమూహము నుండి పక్షుల కిలకిలారవాలు వినిపిస్తున్నాయి. పొలములన్నీ సస్యశ్యామలంగా ఉన్నాయి. మేకలను, పశువులను ఊరిచివర మేపుతున్న బాలురు కొందరు ఒక తాడిచెట్టు క్రిందకు చేరి చద్ది మూటలను విప్పుతూ, పైన కావుకావు మంటున్న కాకులకు భయపడి కాబోలు, జున్ను ముక్కలను ఒడిలో దాచుకొంటున్నారు. ఆ చుట్టుప్రక్కల గల అడవిబాటలలో నిస్సహాయులగు కొందరు బిచ్చగాళ్ళు తమ జీర్ణవస్త్రములతో వచ్చే-పోయే బాటసారులను యాచిస్తూ సంచరిస్తున్నారు. సోమరులు కొందరు వీథులలోని అరుగులపై కూర్చుని త్రోవలో వచ్చే పోయే వారితో సరసవిరసాలు చేస్తున్నారు. పాలు-పెరుగు వాసనలకు కాబోలు, కొన్ని ఇళ్ళలో ఈగలు వెఱ్ఱిగా ముసురుతున్నాయి. గుడిసెల ముందు పిల్లలు ఒంటికి మట్టిని పూసుకొని ఆడుకొంటున్నారు. ఒక ఇంటి ముందు ఒక వనిత కళాపి చల్లి ముగ్గులు వేస్తూ సహచరులతో పరిహాసాలాడుతోంది. ఆవులు 'అంబా' అని అరుస్తున్నాయి. అనేక విచిత్రమైన అలంకరణలతో కొన్ని గృహాలు చూపరులను ఆకర్షిస్తున్నాయి.

'శాంతి' మొదలైన సాధన సంపత్తిగల ఆత్మజ్ఞానిని భోగమోక్షాలు సమీపించి పావనం చేసినట్లు, ఆ ఇద్దరు వనితలు గ్రామంలో సంచరిస్తూ ఆ చోటులను పావనం చేస్తున్నారు. అభ్యాస వశంచేత జ్ఞానమయదేహం ధరించిన లీలాదేవి అక్కడ సంచరిస్తూ కూడా పూర్వజన్మల జనన మరణములను, భూత–భవిష్యత్–వర్తమాన కాలముల స్థితి గతులను, ఈ సంసారము యొక్క రచనా చమత్కృతుల గురించి యోచిస్తూ ఆశ్చర్యచకితు రాలగుచున్నది.

❖

**లీలాదేవి :** హే వాగ్వాణీ! విశ్వేశ్వరీ! నీ అనుగ్రహంచేత ఈ దేశమును చూస్తున్న నేను ఈ క్షణంలో ఒకప్పుడు ఇక్కడి నా జన్మలోని విశేషాలన్నీ స్మరించగలుగుచున్నాను.

ఇక్కడ నేను 'అరుంధతి' అను పేరుగల బ్రాహ్మణినై జన్మించిన విషయమంతా ఇప్పుడు నాకు గోచరమవుతోంది. నా శరీరము అప్పుడు జీర్ణమై, శుష్కమై, మలినమై ఉండేది. ఎండు దర్భలను చీల్చే అభ్యాసంచేత నా అఱచేయి మోటుబారి ఉండేది. ప్రతిరోజు కవ్వముతో మజ్జిగ చిలుకుతూ ఉండేదానను. నాకు అనేకమంది సంతానం ఉండేవారు. మేము అతిథులను, దేవతలను, ద్విజులను, సాధువులను భక్తితో సేవిస్తూ ఉండేవారము. ఆ విధంగా దేహమున్నంత వరకు పనిపాటలతో గడిపాను. ఎప్పటికప్పుడు ఏదో పనితొందరే. అందుచేత "త్వరగా .... త్వరగా ...." అంటూ పని వాళ్ళను అదలిస్తూ ఉండేదానను. నా భర్త కూడా ఛాందసుడై ఎప్పుడూ ఏవేవో పనులలో మునిగి – తేలుతూ ఉండేవాడు. చిత్రం చూచావా? అప్పుడు, "మేమెవరము? ఈ సంసారము ఎట్టిది?" అనునట్టి ప్రశ్నలు మాకు కలలో కూడా తట్టలేదు. క్రమంగా నా శరీరం శుష్కించింది. బొమికలు బైటపడ్డాయి. అయినా సరే, అట్లాగే దుప్పటి కప్పుకొని కూరలు, కట్టెపుల్లలు, పేడ ప్రోగుచేస్తూ ఉండేదానను. ఆ పనిలో ఎంత శ్రద్ధ, ఆసక్తి, ఆవేశం చూపేదాననో మాటలలో వర్ణించలేను.

ఎప్పుడైనా కొంచెం పనిలేకపోతే ఆవు–దూడల చెవులలో పురుగులు తొలగించేదాన్ని. అప్పుడప్పుడు ఆకు–కూరమళ్ళకు నీరు కట్టడానికి పాలేర్లను పురమాయించేదాన్ని. అదిగో, ఆ ఇల్లు చూచావా? ఆ ఇంటి గడపలకు ఎన్నిసార్లు రంగులు దిద్దానో! నా మర్యాద అతిక్రమించకుండానే అక్కడ ఇప్పుడు పనిచేస్తున్న ఆ సేవకులను అదమాయించేదాన్ని. ఈ విధంగా చాలాకాలం గడిచింది. ఇంతలో ఎక్కడి నుండో వృద్ధాప్యం వచ్చిపడింది. నా చెవులు, తల ఉయ్యాలలాగా ఊగుతూ ఉండేవి. అబ్బా! వార్ధక్యం ఎంతటి దుర్భరమైనది! ఒక్క జ్ఞానులను మాత్రమే ముసలితనం బాధించదేమో!

అమ్మా! వాఙ్మయీ! అదుగో. ఆ పుష్పవనం చూచావా? ఆ అశోకవృక్షాల మధ్య ఉద్యాన మండపం ఉన్నది కదా! ఆ ప్రక్కనే చెఱువుగట్టుపై కట్టబడియున్న దూడ నా కళ్ళ ముందే కొద్దిరోజుల క్రితం పుట్టింది. దానికి 'కర్ణిక' అని పేరుపెట్టి ముద్దుగా పిలుస్తూ ఉండేదానను. అది నా వియోగదుః ఖం భరించలేక కాబోలు 'అంబా' అని ఇంకా అరుస్తూనే ఉన్నది. ఈ పరిచారికలకు చెప్పిచెప్పి అలసిపోవలసిందే. వీళ్ళు ఈ దూడ గురించి పట్టించుకోరేం? పాపం వాళ్ళు మాత్రం ఏమిచేస్తారు? నా వియోగం చేత ఇంకా దుఃఖిస్తూనే ఉన్నారు కాబోలు. వాళ్ళ కళ్ళు వాచి ఉన్నాయి చూచావా?

నేను ఎటైనా వెళ్ళితే ఒక్కపని సరిగా జరుగదు కదా! ఇక్కడే రోజూ వచ్చి కూర్చుండేదానను. ఎండవేళ ఇక్కడ నీడలో కాస్త నడుంవాల్చేదాన్ని. చక్కటిగాలి వీస్తుంటే క్షణంలో కునుకు పట్టేది. ఇక్కడే నీళ్ళు తాగేదాన్ని. ఆ చెక్క వస్తువుల అమరిక చూచావా? అదంతా తీర్చిదిద్దేది నేనే! అటు చూడు. వాడు మా పెద్దపిల్లవాడు జ్యేష్ఠశర్మ. వాడు పాపం అలసి అలసి ఉన్నాడు. నేను లేకపోతే నా పిల్లలు ఎన్ని పాట్లు పడుచున్నారో కదా! ఈ వనంలో మా పాడి ఆవులు ఇంకా తిరుగుచూనే ఉన్నాయి.

ఈ మా ఇల్లు చూచావా! శరీరానికి ఐదు ఇంద్రియాలు ఉన్నట్లు, మా ఇంటికి ఐదు ద్వారాలు ఉన్నాయి.

సరస్వతీ దేవి, లీల చెప్పేదంతా మౌనంగా, చిరునవ్వుతో “ఊఁ” కొడుతూ వింటోంది.

❖

ఈ మా ఇల్లు అంటే ఎంత ఇష్టమో! అయినా ఏం లాభం? ఇప్పుడు ఎండవేడిమికి చౌడుబారి ఉన్నది. దొడ్లో అంత పేడ దొరుకుచుండగా, చక్కగా అలకవచ్చునుకదా! ఈ పనివాళ్ళు దగ్గరుంటే గాని మాట వినరు. ఈ ఇల్లు నా రెండవ శరీరమువంటిది సుమా! దీనిపై నేను పెంచిన ఆనపపాదును చూచావా? దీని విత్తనాలు మా బంధువుల ఇంటినుంచి చెప్పించాను. తయారైన ఆనప (సొర) కాయలను వీళ్ళు సరిగ్గా కోస్తున్నారో? లేదో? లేకపోతే, పాడైపోతాయి కదా! పాదుకు నీళ్ళు పోయమని కూడా నేను చెప్పాలి.

అక్కడ తిరుగుచున్న వాళ్ళందరు ఎవరో తెలుసా? వాళ్ళందరు ఆయా ఊళ్ళ నుంచి వచ్చిన మా బంధువులే. అదేమిటి? వీళ్ళ ఆభరణములన్నీ ఏమైనాయి? ఓహో! నేను మరణించాననే దుఃఖంతో వీళ్ళు తమ ఆభరణములన్నీ త్యజించి రుద్రాక్షమాలలు ధరించారా? నా వలన ఎన్ని కష్టాలు ఈ ఇంటికి వచ్చాయి? నా ఈ ప్రియమైన బంధువుల కళ్ళు నిరంతర రోదనంచేత ఎఱ్ఱబడ్డాయి. వీరికి సదుపాయాలన్నీ సక్రమంగా జరుగుచున్నాయో? లేదో? ఈ మా గృహమండపం ఆవలవున్న నదిని చూడు. ఈ నది ఒడ్డున చెట్లు నేలకు వంగి ఉన్నాయి. వాటి కొమ్మలు నేలకు వ్రాలి చివరలు నదీజలమును తాకుతున్నాయి. చూచావా? ఆ తాటిచెట్లకు తాటిపండ్లు సమయానికి కోసుకోకపోతే ఎండిపోతాయి. ఈ పనివాళ్ళు ఏమిచేస్తున్నారో? వీళ్ళకి తిండి ఘనంగా కావాలి. పని విషయాలు పట్టించుకోరు!

❖

సరస్వతీదేవి ఆ మాటలన్నీ వింటూ పకాపకా నవ్వింది. మరుక్షణం లీలాదేవి తన వాగ్ధోరణి పూర్వసంస్కారములను ఆశ్రయించటం గుర్తించి తానుకూడా కొద్దిసేపు నవ్వుకొని, మరల చెప్పసాగింది.

నా భర్త వసిష్ఠుని జీవాత్మ ఈ గృహాకాశంలోనే వెలసియున్నది. అతడు స్వతఃగా ఆత్మ స్వరూపుడే కదా! అనగా నిష్క్రియుడే కదా! అయితే ఏం? ఇప్పుడు విదూరథ మహారాజై, గొప్ప సామ్రాజ్యమునకు ఆధిపత్యం వహిస్తున్నాడు.

ఔను! ఇప్పుడు నాకొక విషయం బాగా గుర్తుకు వస్తోంది. నా భర్త వసిష్ఠ బ్రాహ్మణుడు "నేను మహారాజును అయితే ఎంత బాగుంటుంది!" అని ఎప్పుడూ నాతో అంటూ ఉండేవాడు. "ఏమిటి నీ చాదస్తం! నీవేమిటి? రాజు కావడమేమిటి?" అంటూ నేను కొంచం హాస్యం పట్టించేదాన్ని. అతని వాంఛాబలం చేతనే కాబోలు, ఇప్పుడు ఎనిమిది రోజులలో మహాచక్రవర్తి అయ్యాడు. ఏమి ఆశ్చర్యం! ఆకాశంలో వాయువు – ఆ వాయువులో సుగంధం ఈ మూడు ఒకదానిని మరొకటి తాకవు. కాని, ఒకదానిలో మరొకటి అదృశ్యస్థితిలో ఉండి ఉంటాయి కదా! నా భర్తకూడా ఈ గృహాకాశంలో అదేవిధంగా రాజ్యపాలనలో తలమునకలై ఉన్నాడు. మాయ ఎంతటి చమత్కార పూరితమైనది! వ్రేలెడెంత ఉండే ఈ గృహాకాశంలో కోటానుకోట్ల యోజనముల విస్తీర్ణము గల మహా సామ్రాజ్యమును చూచుచున్నాడు. మేమిద్దరం ఆకాశస్వరూపులమే కదా! నా భర్త పాలించే రాజ్యం కూడా ఈ గృహమండపా ఆకాశమునందే ఉన్నది. కాని స్వకీయమైన కల్పనా మహిమవలన వేలకొలది పర్వతములతో నిండి ఉన్నట్లు అగుపిస్తోంది. హే లోకమాతా! ఇప్పుడు నా భర్త యొక్క స్థితిని, రాజ్యపాలనను తిలకించాలని కోర్కె కలుగుతోంది. కాబట్టి మనిద్దరం ఆ రాజ్యమునకు వెళ్ళుదామా! ప్రయత్నవంతులకు కష్టమైన కార్యమేముంటుంది?

❖❖❖

# 20. అన్య జగత్ పునః ప్రవేశం

విఘ్నియగు సరస్వతీదేవి అందుకు చిరునవ్వుతో అంగీకరించింది. వారిద్దరు ఆ గృహంలోని ఆకాశమండలమున ప్రవేశించారు. మేఘమార్గమును, వాయుపథమును, సూర్యచంద్రమార్గములను, ధ్రువలోకమును, సిద్ధ–సాధ్య–భూ–స్వర్గ–బ్రహ్మలోకములను అధిగమించారు. శివలోకం, విష్ణులోకం, విదేహులు–సదేహులు ఉండే లోకములను దూరప్రదేశములను దాటివేస్తూ ఉండగా, ఇంతలో ఒకానొక క్షణంలో లీలాదేవి తన అపరిచ్ఛిన్న స్వరూపమును విస్మరించింది.

ఒక్కసారి వెనుకకు చూచింది. వెనుకగా ఎక్కడాకూడా సూర్య–చంద్ర–నక్షత్ర–గ్రహాదులు కనబడనేలేదు. అభేద్యమైన చీకటి మాత్రమే కనబడుతోంది. ఆ చీకటి నలుదిక్కులా వ్యాపించియున్నది.

**లీల :** మాతా! ఇదేమిటి? సూర్యచంద్రాదుల తేజము ఏమాత్రం కనబడటం లేదేం? ఈ కొండవలె ఘనీభూతమైన చీకటి ఎక్కడి నుండి వచ్చింది?

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! మనం సూర్యచంద్రాదుల తేజము చొరలేనంతదూరం వచ్చేశాం. అందుకే అవి మనకు కనిపించటం లేదు. లోతైన నూతిలో అట్టడుగులో ఉండి చూస్తే భూమిపై ఉన్న మిణుగురుపురుగు – మెఱుపులు కనిపిస్తాయా?

**లీల :** ఓహో! సూర్యుడు ఒక అణువులాగా కూడా కనబడనంత దూరం వచ్చేశామా? ఎంత ఆశ్చర్యం? ఓ తేజోస్వరూపిణీ! ఇంకా మనం ఎంతదూరం పయనించాలి? ఎటు వెళ్ళుచున్నాం? ఎంత సేపు?

**శ్రీ సరస్వతీదేవి :** ఇక మనకు "బ్రహ్మాండ కర్పరము" అగుపడబోతోంది. సూర్య-చంద్ర- నక్షత్రములు ఆ బ్రహ్మాండ కర్పరము నుండి లేచిన ధూళికణముల వంటివారే సుమా!

❖

వారిద్దరు అట్లు సంభాషించుకొంటూ బ్రహ్మాండమండపం చేరారు. దానిని వారు ఒక శూన్య ప్రదేశం దాటినట్లు దాటివేశారు. దేనిపట్ల ఎవరికి సత్యత్వబుద్ధి ఉంటుందో అది మాత్రమే వారికి వజ్రంలాగా కఠినమై అగుపడుతోంది.

క్రమంగా శుద్ధ చిత్తులగు ఆ ఇద్దరు బ్రహ్మాండము వెలుపల గోడవలె ఆవరించియున్న జల ప్రదేశాన్ని దాటారు. దానికంటే పదిరెట్లు మంచుచే చర్మమువలె కప్పియున్న చోటును కూడా దాటారు. అటు తరువాత వారు అగ్ని-వాయువు-మేఘ-ఆకాశములను చూచారు. ఇక ఆ ఆకాశము నందు "ఇది ఇక్కడ మొదలు. అది అక్కడ చివర" అనబడునదంతా 'గొడ్రాలి కుమారుడు' అను దృష్టాంతములాగా భ్రమమాత్రమే. అదంతా విశాలము, శాంతము, ఆదిమధ్యాంతరహితము అయినట్టి ఆత్మయందే దర్పణంలోని దృశ్యం వలె వెలయుచున్నదని గ్రహించు. వాస్తవానికి చిదాకాశం నందు ఎట్టి భ్రమలకు తావులేదు. ప్రళయ-వాయువులు కూడా చిదాకాశమును తాకలేవు.

❖

ఆ విధంగా వారు ఆ బ్రహ్మాండ మండలములోని పంచభూత - ఆవరణలన్నీ దాటి వేశారు. పరమాకాశమును దర్శించారు. ఆ పరమాకాశంలో ఈ జగత్తువంటి అండ ప్రమాణంగల అనేక అసంఖ్యాక జగత్తులు ఉన్నాయి. సూర్యకిరణములలోని త్రసరేణువుల (Moles of dust in Sun-beams) వలె వారు అక్కడ అనేక ఆవరణలను కూడా చూచారు. ఇంకొక చిత్రం. ఆ 'మహాకాశం' అనే శూన్యంలోంచి కోట్లకొలది జగత్తులు లేస్తూనే ఉన్నాయి. మరికొన్ని లయించిపోతున్నాయి. కొన్ని నిశ్చలంగా ఉన్నాయి. కొన్నికొన్ని వంకరటింకరగా తిరుగుతున్నాయి. ఇదంతా ఆయా బ్రహ్మాండములందున్న జీవుల జ్ఞానమును అనుసరించే జరుగుచున్నది సుమా!

ఎవరికి ఎచ్చట ఎట్లు ప్రాక్తన (ఇతఃపూర్వపు) వాసనా జ్ఞానం స్ఫురించటం జరుగుతుందో వారికి ఆ తావులలో అట్టి రూపములే కనిపిస్తూ ఉంటాయి. అందుచేత తత్వజ్ఞుల దృష్టిలో ఈ ఊర్ధ్వ-అధో-మధ్య లోకముల కల్పనయే ఉండదు. వారు వాటిని అసద్వస్తువులుగా దర్శిస్తూ స్వసత్తాసహితులై ఉంటారు. స్వసత్తరూపమగు బ్రహ్మము కాక, ఇక మిగిలినదంతా కల్పనా చాతుర్యమునకు సంబంధించినదే కదా! వారు "వచ్చుట-పోవుట-ఉండుట" అను వ్యవహారమంతా అంతరంగమునందు ఏమాత్రం పొందకుండానే ఉంటున్నారు. సర్వత్రా, సర్వదా, స్వస్వరూపముతో బ్రహ్మానుభవమునందే ఉంటున్నారు.

**శ్రీరాముడు :** పరమాకాశము నిశ్చలము, అద్వితీయము" అని చెప్పియున్నారు కదా! అందులోంచి జగత్తులు పుట్టటమేమిటి? లయించటమేమిటి?

❖❖❖

# 21. బ్రహ్మాండముల చమత్కారం

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఈ 'జగత్తులు' అనబడునవన్నీ చిదాకాశము కంటే వేరు కాదు. కాని, అజ్ఞానుల దృష్టికి స్వకల్పనా కారణంగా అట్లు పదార్థజాలానుభవంలో ప్రాప్తిస్తున్నాయి. వారి అనుభవమును దృష్టిలో పెట్టుకొనే ఇదంతా చెప్పాను. అజ్ఞానము చేతనే ఈ జగత్తులు ఉత్పన్నమై నశిస్తున్నాయి. దీనికి మనకు దృష్టాంతము బాలుని చిత్తము యొక్క కల్పనా వ్యవహారమే. ఆటబొమ్మలలో "ఇది పెళ్ళికూతురు, ఇది పెళ్ళికొడుకు" వంటి వివాహాదికల్పనల్ని కల్పించి బాలుడు అదంతా వాస్తవమువలె క్రీడించుచున్నాడు కదా! ఈ బ్రహ్మాండముల సృష్టి స్థితి లయాలు కూడా అట్టివే. అవి కల్పనయందే ఉద్భవించి, కల్పన చేతనే నశిస్తున్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ "ఊర్ధ్వ–అధో–తిర్యక్ (పైన–క్రింద–వెనుక)" కల్పనలు, ఈ బ్రహ్మాండములు ఎక్కడినుండి వస్తున్నాయి? ఇవన్నీ అధిష్ఠానమగు బ్రహ్మము నందు స్వతహాగా ఉన్నవి కావు కదా! కాని బ్రహ్మాండములోకి ఈ పైన–క్రింద–వెనుక–ముందు కల్పనలు వచ్చిపడు చున్నాయే? ఈ బ్రహ్మాండముల గురించి మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** రేచీకటి దోషం ఉన్న కన్నులు కలవానికి ఆకాశంలో జడలు కనిపిస్తాయి చూచావా? అవిద్య యందున్న వానికి నాశరహితమగు పరబ్రహ్మము నందు ఈ బ్రహ్మాండములన్నీ అగుపిస్తున్నాయి.

పదార్థములన్నీ ఈశ్వరేచ్ఛను అనుసరించే ప్రవర్తిస్తున్నాయి. అంతేకాని, వాటికి ఎట్టి స్వాతంత్ర్యం లేదు. ఈ మన బ్రహ్మాండంలో పార్థివ (స్థూల) భాగము క్రిందకు, ఆకాశం పైన ఉన్నాయి. జ్యోతిశ్చక్రమును దర్శించునట్టి మహాపండితులు, "ఈ బ్రహ్మాండము ఆకాశమున ఉన్నట్టి మట్టి–ముద్ద వంటిది. దశదిక్కులు దీని 'కాళ్ళు' వంటివి. ఒక చీమ యొక్క దేహంవలె దీని క్రింది భాగంలో భూమండలం ఉన్నది" అని వర్ణిస్తున్నారు.

కొన్ని–కొన్ని బ్రహ్మాండభూములలో మనుష్యులు లేరు. చెట్టు–పుట్టలు మాత్రమే ఉన్నాయి. వాటిలో ఆకాశభాగంలో మాత్రం దేవతలు, కిన్నెరలు ఉన్నారు. మరికొన్ని బ్రహ్మాండములు అప్పటికప్పుడు కల్పించబడినట్టి ప్రాణసమూహములతో, గ్రామములతో, పురములతో, పర్వతములతో ఉత్పన్నములౌతున్నాయి. ఇవన్నీ చిదాకాశము నందే ఉంటూ, అందులోనే లీనమౌతున్నాయి. మంచుగడ్డలు అనేక ఆకారములు సంతరించుకొంటున్నప్పటికీ స్వతహాగా అంతా జలమే కదా! "ఈ సృష్ట – వస్తువులన్నిటికీ ఆత్మవస్తువే కారణం" అని చెప్పబడుతోంది. అదియే అంతా అయివున్నది.

శుద్ధబోధమయమైన చిదాకాశసముద్రంలో "బ్రహ్మాండములు" అనే తరంగాలు నిరంతరం లేస్తున్నాయి. మరల అందులోనే లీనమగుచున్నాయి. భవిష్యత్తులో కూడా అనేక బ్రహ్మాండ తరంగాలు లేవబోతున్నాయి. అందులో కొన్ని, "సంకల్పరాహిత్యం చేత, 'అంధకార' స్వరూపములై శూన్యమునందు నిద్రిస్తూ ఉన్నాయి" అని అనుమానించబడుతోంది. కొన్ని కొన్ని బ్రహ్మాండతరంగాలు కల్పాంత

సూచకమైన ధ్వనులు చేస్తున్నప్పటికీ, విషయరస మోహితులైన ఆ బ్రహ్మాండములందలి జీవుల చెవులకు అవేమీ వినిపించటం లేదు. వారి బుద్ధికి ఏదీ గోచరించటం లేదు.

కొన్ని బ్రహ్మాండములు అప్పుడే ఉద్భవిస్తూ ఉండగా వాటిలో మొట్టమొదటి విశుద్ధములైన జీవసమూహములు లేచుచున్నాయి. మరికొన్ని బ్రహ్మాండములలో మహాప్రళయ సమయం ఆసన్న మగుట చేత సూర్య-చంద్ర-నక్షత్రాదులు భూమిని దగ్ధం చేస్తున్నాయి. భూమి కరిగిపోతోంది. కొన్నిటికి పట్టుకొమ్మ దొరక్క పడిపోతున్నాయి. మరికొన్నిటి యందు లేవవలెననే ఆశ కూడా కలిగియుండటం లేదు. "అట్లు బ్రహ్మాండములు కూలిపోవటం ఎట్లా సంభవం?" అని అనుమానించ వలసిన పనిలేదు. ఇవన్నీ చిద్రూపములే కదా! కనుక బ్రహ్మాండములయొక్క ఉత్పత్తి పతనాలు తప్పకుండా జరుగుచున్న విషయాలే.

కొన్నికొన్ని స్తబ్ధములై ఉన్నాయి. వాయువునందు స్పందము (లేక ప్రసరణ) ఉదయిస్తున్నట్లు "చిత్‌తత్త్వము" (Knowledge consciousness) నందు పైన చెప్పిన కల్పనలన్నీ ఉదయిస్తున్నాయి. అయితే, ఈ బ్రహ్మాండముల నిజస్వరూపమేమిటి? చెపుతాను. విను. పూర్వపూర్వ జన్మలందు ఆచరించబడిన జ్ఞానకర్మాదుల అనుష్ఠానంచేత ఒకానొక ద్రష్ట (లేక జీవుడు) సంకల్పమాత్రంచేత సృష్టిని నిర్మించగల సామర్థ్యం పొందుచున్నాడు. అట్లు "ప్రజాపతి" అయినట్టి ఒకానొకనిచే ఈ బ్రహ్మాండములు నిర్మించబడుచున్నాయి. తత్కారణంగా ఈ కల్పమున ఉన్న సృష్టికి, ముందు-ముందు రాబోయే కల్పములందు ఏర్పడబోయే సృష్టులకు భేదం ఉంటే ఉండవచ్చు. ఈ విషయం శాస్త్రాలు కూడా అంగీకరిస్తున్నాయి.

కొన్ని బ్రహ్మాండములు బ్రహ్మదేవుడు రచించాడు. మరికొన్నిటిని విష్ణువు కల్పించాడు. ఇంకొన్నిటిని ప్రజాపతులు రచిస్తున్నారు. కొన్నింటికి కర్తయే లేడు. అందుచేత అవి వృక్షాదులతో మాత్రమే ఉన్నాయి. అందు బుద్ధిజీవులు లేరు. కొన్ని బ్రహ్మాండములు కొందరు కలిసి విచిత్రంగా సృష్టిస్తున్నారు. కొన్ని బ్రహ్మాండముల సమూహం ఏకైక నియమము ననుసరించి ప్రవర్తిస్తున్నాయి. కొన్నిటిలో సృష్టియే లేదు. కొన్నిటిలో మానవులు మాత్రం లేరు. మిగతావన్నీ ఉన్నాయి. కొన్ని పాషాణములతో మాత్రమే నిండివున్నాయి. కొన్నిటినిండా క్రిములు మాత్రమే ఉన్నాయి. కొన్నికొన్ని కేవలం దేవతలతోను, మరికొన్ని కేవలం మనుష్యులతోను, ఇంకొన్ని ఈ రెండిటితోను నిండి ఉన్నాయి. కొన్నిట్లో చలనములేని జంతువులు మాత్రం ఉన్నాయి.

ఓ రాఘవా! ఇట్టివేయైన సృష్టులతో నిండిన బ్రహ్మాండములు ఇంకా అనేకం ఉన్నాయి. వాటివాటి వ్యవహారాదులు యోగుల ఊహలకు కూడా అందనంతటివి. అవన్నీ శూన్యమునందే ఉండి మహాకాశస్వరూపమై వ్యవహరిస్తున్నాయి. విష్ణువు మొదలైన దేవతలు కూడా తమ జీవితమంతా వెచ్చించినప్పటికీ వాటి పరిణామము తెలియజాలరు. ఆభరణములలో రత్నములు పొదగబడినట్లు, ఈ బ్రహ్మాండములలో 'భూతాకర్షణశక్తి' ఉన్నది. అందుచేతనే అవి జలము, జీవులు మొదలైన వాటిని కోల్పోకుండా ఉన్నాయి. ఓ మహామతీ! ఈ జగత్తుల విషయం నా దృష్టి పథంలో ఉన్నంతవరకు,

ఇక్కడ మనకు అవసరమైనంత వరకు వర్ణించాను. వాస్తవానికి వాటినన్నిటిని వర్ణించి నేను చెప్పలేను. ఎన్ని లక్షల, కోట్ల బ్రహ్మాండములు ఎన్నెన్ని విభేదములతో ఉన్నాయో ... అదంతా భాషకు, భావానికి అందదని మాత్రం మనం ఇక్కడ చెప్పుకోవచ్చు.

❖❖❖

# 22. విదూరథుని యుద్ధ విన్యాసం

లీలా–సరస్వతులు ఆ విధంగా కబుర్లు చెప్పుకొంటూ పయనిస్తున్నారు. తాము చూస్తున్న జగత్తుల నుండి మరల వెలువడుచున్నారు. అట్లు పయనిస్తూ హఠాత్తుగా ఒకానొక క్షణంలో లీలయొక్క అంతఃపురంలో ప్రవేశించారు. అక్కడ పద్మని భౌతికదేహం, ఆ ప్రక్కనే సమాధియందు నిమగ్నమైయున్న లీలాదేవి శరీరం ఉన్నాయి. అక్కడ ఉన్న వారందరు కలతనిద్ర అనుభవిస్తున్నారు. లీలాదేవి అచ్చటికి వెళ్ళాలనే ఇచ్ఛ కలిగి ఉన్నంతమాత్రంచేత వాళ్ళిద్దరు అక్కడికి వచ్చారు. మరల అతికొద్ది సేపట్లో లీల సరస్వతీ దేవితోసహా బ్రహ్మాండ కర్పమును భేదించి భర్తయొక్క సంకల్పమయ సంసారంలో ప్రవేశించింది.

❖

ఆ సమయంలో సింధురాజు తన సర్వ సైన్యముతో సహా విదూరథుని (క్రితం ఉపాధిచే లీలాదేవి భర్త పద్ముడు) రాజ్యంపై దండెత్తి ఉన్నాడు. అక్కడ గొప్ప యుద్ధం జరుగుతోంది. భూత, పిశాచ, రాక్షసగణాలు రక్తమాంస పిపాసతో యథేచ్ఛగా యుద్ధభూమిలో సంచరిస్తున్నాయి. మునులు ఆ భయంకర యుద్ధం చూచి లోకశాంతి కొరకు దేవస్తవం పఠిస్తున్నారు. ఎందరో వీరులు నేలకూలుచున్నారు.

❖

**శ్రీరాముడు :** ఓ వసిష్ఠమహర్షీ! ఎట్టి భటుడిని 'వీరుడు' అని అంటాం? ఎట్టి వారు వీరస్వర్గమునకు అర్హులౌతారు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** శాస్త్రానుకూలమైన ధర్మయుద్ధం ఆచరించే ప్రభువు యొక్క ప్రయోజన నిమిత్తం యుద్ధంలో ప్రావీణ్యం చూపేవాడే వీరుడు. అట్టి ప్రయత్నంలో ప్రాణములు త్యజిస్తే అట్టివాడు వీరస్వర్గం అలంకరిస్తున్నాడు. శాస్త్రవిరుద్ధంగా సంచరించే ప్రభువు కొరకు పోరాడి మరణించినవాడు స్వర్గానికిపోడు. అతడు నరకమును పొందుచున్నాడని, అట్టివాడు ఉత్తరోత్తర వేదన– రోదనలను పొందుచున్నాడని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. 'ధర్మరక్షణ' అను ప్రవృత్తిగల రాజు కొరకు, గోబ్రాహ్మణహితము కొరకు, మిత్రుని కొరకు, శరణాగతులను రక్షించటం కొరకు యుద్ధంచేసి మరణించేవాడు స్వర్గమునకు ఆభరణమే అగుచున్నాడు.

స్వదేశరక్షణార్థం పోరాడి మృతి చెందే రాజు, అతని భటులు కూడా స్వర్గమునకు వెళ్ళుచున్నారు. అట్లాకాకుండా, ప్రజాపీడనం చేస్తూ, పరరాజు కొరకు పోరాడుతూ మరణించేవాడు నరకమునే

పొందుచున్నాడు. ఒకడు రాజు కావచ్చు. మరెవ్వరైనా కావచ్చు. శాస్త్రవిరుద్ధంగా ఆచరించువాని కొరకు పోరాడి మృతిచెందితే నరకపతనం నిశ్చయం. అధర్మయుద్ధమత్తులై ప్రాణులను చంపి పాపమే మూటకట్టుకొంటున్నారని నేను గుర్తు చేస్తున్నాను. "శూరుడు ఎటువైపు, ఏ స్థితిలో యుద్ధం చేసి మరణించినా స్వర్గమే చేరుకొంటాడు" అను ఒక అభిప్రాయం లోకంలో ప్రచారంలో ఉన్నది. కాని, "శాస్త్రప్రవచనం ప్రకారం ధర్మయుద్ధం ఒసరించినవాడు మాత్రమే స్వర్గం చేరుతాడు" అని చెప్పబడుచున్నది. సదాచార పరాయణులగువారిని రక్షించటానికి యుద్ధం చేసేవారే శూరులు. ఇక తక్కినవారు చేస్తున్నది బాలుర పోట్లాట వంటిది మాత్రమే. ఆకాశమున చరించు దేవతాస్త్రీలు ధర్మయుద్ధం చేసే శూరులను ఆహ్వానించి గౌరవించటానికి ఉత్కంఠతో సిద్ధంగా ఉంటారు.

❖

ఆ యుద్ధ ప్రదేశంలోని ఆకాశం దేవతాస్త్రీలతో, దేవతా-విమానములతో, ఉత్సవ స్థానమువలె శోభిల్లుతోంది. ఇరువైపు రాజులు యుద్ధరచనలలో తలమునకలై ఉన్నారు. లీలా-సరస్వతులు ఇద్దరూ యుద్ధవిన్యాసం చూడాలనే ఉత్సుకతతో తమ సత్యసంకల్ప ప్రభావంచే ఆకాశంలోనే ఒక విమానం నిర్మించుకొని, అందు అధిరోహించి యుద్ధ విశేషమంతా చూడసాగారు.

ఇరువైపుల మత్స్య-మకరవ్యూహాలు రచించబడ్డాయి. ఆయుధాల తళతళ మెరుపులు, భీకర శబ్దాలు ఆకాశాన్ని అంటుతున్నాయి. లీలాదేవి తన భర్తయొక్క సైన్యం హింసించబడటం చూచి ఓర్చుకోలేక, "నేను కూడా యుద్ధం చేస్తే ఎంతబాగు!" అనుకొంటూ ఉద్వేగపడుతుంటే, విమానంలో ఆ ప్రక్కనే ఆశీనురాలైన సరస్వతీదేవి గంభీరంగా చిరునవ్వు చిలికిస్తూ తన భక్తురాలిపై చేయి వేసి ఉంచుతూనే యుద్ధం వైపు దృష్టి సారిస్తోంది.

అక్కడ యుద్ధ శబ్దాలు గాక ఇంకేమీ ఎవరికీ వినబడటం లేదు. అనేకమంది సేవక జనం వేలాది మానవ-జంతు కళేబరాలను తొలగించటంలో నిమగ్నమైయున్నారు. అర్ధమృతులు కటిక నేలపై పరుండి మూలుగుచున్నారు. "ప్రళయం దాపురించిందా?" అన్నట్లు యుద్ధ వాతావరణమంతా అతిభయంకరంగా ఉన్నది. "ఓ మిత్రులారా! వీరులారా! విజయమో, వీరస్వర్గమో, అంతే. స్వదేశరక్షణ కొరకు మరణించామా ... ఈ యుద్ధభూమిలోని ధూళిలో ఎన్ని కణాలు ఉన్నాయో అన్ని వేల సంవత్సరములు వీరస్వర్గం అనుభవిస్తాం. మన మాతృదేశపు గడ్డపై జన్మించినవారికి పిరికితనం, భయం గురించి అసలు తెలుసా? లేదు. మన మాతృదేవతలు మనకు చనుపాలలో వీరరసాన్ని ప్రసాదించారు. ఆకాశంలో దేవతాస్త్రీలు మీ వీరత్వము చూచి మురిసి పోతున్నారు. తాము తెచ్చుకొన్న పూలదండలు మీరు చేస్తున్న త్యాగముల ముందు వెలవెలపోవటం చూచి సిగ్గుతో తలవంచుకొంటున్నారు. మనకు వెనుకంజ ప్రసక్తే లేదు. పదండి ముందుకు" అని ఉభయ సైన్యములలోని సేనానాయకులు ఎలుగెత్తి అరుస్తున్నారు. అయినప్పటికీ పిరికిపందలైన కొందరు సైనికులు మాత్రం వెనుకకు మరలుచున్నారు. రక్తప్రవాహం పైనుండి ప్రసరిస్తున్న గాలి దిక్కులను ఎఱ్ఱదనంతో నింపివేస్తోంది. యుద్ధ శబ్దములు, నినాదములు పర్వతగుహలను ప్రతిధ్వనింప

చేస్తున్నాయి. తోటివారు నేలకూలుతుంటే ఇరువైపు సైనికులు వీరావేశం పొందుచున్నారు. దిక్కులు పిక్కటిల్లుచున్నాయి. సైనికులు "మేము ముందర .... మేము ముందర ...." అంటూ యుద్ధభూమిలోకి దూకుతున్నారు. ఇంతలోనే అనేకులు నిహతులగుచున్నారు. ద్వంద్వ యుద్ధాలలో కొంచెం విజయం చవిచూచినవారు హాస్య నృత్యగానాలు చేస్తూ, మరొకవైపుకు ఉరుకుచున్నారు. కొందరు ఆయుధం చేయి జారిపోగా, కోపావేశంతో శత్రువు యొక్క ఖడ్గఘాతానికి ఎదురుచూస్తూ తదితర మృతదేహాలకు నమస్కరిస్తున్నారు. ఉపనాయకుని పోగొట్టుకొన్న కొన్ని సైనిక సమూహాలు ఇతర సమూహములతో జేరి యుద్ధం కొనసాగిస్తున్నారు.

ఈ విధంగా యుద్ధం అతిభీకరంగా సాగుతోంది. ఇంతలో ఎనిమిదవ జాము ముగిసింది. ఉభయపక్ష సేనాపతులు యోచించి యుద్ధమును ఆ రోజుకు ఆపు చేయుటకు తమ దూతలను ఒకరివద్దకు మరొకరు పంపారు. ఇరువైపువారు బాగా అలసి ఉండటం చేత యుద్ధవిరామం అందరికీ అంగీకారమే అయింది. క్షణాలలో ఆ కల్లోలమంతా శాంతించింది. ఉభయ పక్షములకు సంబంధించిన సేవకులు యుద్ధరంగంలో ప్రవేశించి క్షతగాత్రులైనవారిని తీసుకొనిపోతున్నారు. అక్కడ మృత్యుదేవతకు కడుపునిండా మృష్టాన్నము లభించినట్లైనది.

❖

క్రమంగా రాత్రి అవటంచేత అంతటా అంధకారం అలముకొన్నది. ప్రాణులందరు నిద్రితులయ్యారు. రాజమందిరంలో విదూరథుడు మరుసటిరోజు యుద్ధం గురించి మంత్రులతో సమాలోచన చేసి, ఆ తరువాత విశ్రాంతి గైకొనమని ఆజ్ఞాపించి వారినందరిని పంపివేశాడు. తన పానుపుపై పవళించి కళ్ళుమూసుకొని ఒకింత నిదురించాడు.

లీలాదేవి సరస్వతీదేవి ఆకాశమును పరిత్యజించి తలుపు రంధ్రం గుండా రాజగృహంలో ప్రవేశించారు.

❖❖❖

## 23. స్థూలదేహ భ్రాంతి - చిత్త నైపుణ్యం

**శ్రీరాముడు :** ప్రభూ! సన్నటి తలుపు రంధ్రం గుండా వారు ఎట్లా రాజగృహ ప్రవేశం చేశారు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆధిభౌతిక భ్రాంతియుతులైన వారు అణుప్రమాణమైన సన్నటి రంధ్రంలో ప్రవేశించలేరన్నమాట నిజమే. "నేను స్థూలశరీరబద్ధుడను. ఒక స్వల్ప రంధ్రంలో నేనెట్లా ప్రవేశించగలను?" అను సంస్కారము కలవారు అట్లు ప్రవేశం చేయలేరు. కాని, స్థూలదేహబుద్ధిని జయించివేసినవారు, "నేను ఆతివాహిక దేహమును. ఆకాశము కంటే కూడా సూక్ష్మాతిసూక్ష్మ స్వరూపుడను" అను నిశ్చయం కలవారు మాత్రం తమ సంస్కారబలంచేత సూక్ష్మ ప్రదేశమునకు కూడా వెళ్ళిరాగలరు. ఏ వస్తువునకు ఏ స్వభావం స్వతహాగా ఉంటుందో, ఆ వస్తువు ఆ స్వభావమును వీడజాలదు. నీరు మెరకవైపు పారుతుందా? అగ్నిజ్వాలలు అధోముఖంగా ప్రజ్వరిల్లుతాయా?

లేదు కదా! "నేను ఈ భౌతిక శరీరమునై ఉండలేదు" అనునట్టి అనుభవపూర్వకమైన 'ఎరుక' గలవారు ఈ పంచభూతతత్త్వమును అధిగమించి ప్రవర్తించగలరు.

అయితే, ఒక్క ముఖ్యమైన విషయం. నీడలో ఉన్నవానికి ఎండవేడిమీ తగలదు కదా! పరమాత్మను తెలుసుకొన్న తరువాత ఎట్టి దుఃఖములు కలిగే ప్రసక్తే ఉండదు. అన్నిటికీ కారణం ఈ చిత్తమే. ఈ చిత్తము శరీరత్వము యొక్క దృఢభావం వదలి చైతన్యమును ఆశ్రయించాలి. అందుకుగాను యోగాభ్యాసాది ప్రయత్నములు చెయ్యాలి. భక్తి-జ్ఞాన- వైరాగ్యాది మార్గాలన్నీ ఈ చిత్తముయొక్క 'స్థూలత్వము' అనే జాడ్యం వదలించుటకొరకే. ఒక త్రాడును చూచి "ఇది పాము" అనే అభిప్రాయాలు, అట్టి అభిప్రాయముల వలన కలిగిన వికటచిత్తవృత్తులు తొలగేదెట్లా? "తెలుసుకొనటం" అను ప్రక్రియ వలననే అది సాధ్యం.

1) త్రాడును చూచి 'పాము' అని భావించటం.

2) "కాదు. ఇది త్రాడు మాత్రమే" అని గ్రహించటం.

పై రెండూ కూడా 'తెలుసుకొనటం' అను రూపముగల జ్ఞానశక్తి వలననే ఏర్పడు చున్నాయి కదా! అందుచేత "జ్ఞానశక్తి మాకింతవరకు పరిచయమైన విషయం కాదు" అని ఎవరూ అనకుండెదరు గాక! ఉత్తమప్రయత్నం ఆశ్రయించాలి. అట్టి ప్రయత్నము వలన స్థూలశరీరబుద్ధి నశిస్తుంది. "చిత్తము సంవిత్తును అనుసరించి ఉన్నట్లే, ప్రయత్నము చిత్తమును ఆశ్రయించి ఉంటుంది" అని సకల జనులు గ్రహించండి.

**చిత్తము :** మరొక విషయం. స్వప్న పురుషునితో లేక సంకల్పములోని పురుషునితో పోల్చదగిన ఆకాశరూపము గల వానిని ఎవరు ఎట్లు దేనిచే నిరోధించగలరు? 'చిత్తము అనునదే ఆకృతిగా కలిగినట్టి ఆతివాహిక దేహమును నిరోధించకలిగినదేదీ ఎక్కడా ఉండదు. ఈ స్థూలశరీరమే జ్ఞానప్రభావం చేత ఆతివాహిక భావమును పొందుతోంది. ఓ రామచంద్రా! పరమాత్మ యొక్క చిత్తవృత్తులను అనుసరించే ఈ భౌతిక దేహము యొక్క ఉత్పత్తి-లయములు జరుగుచున్నాయి సుమా! "ఈ పంచీకరణమునకు (పంచభూత సమన్వయమైన దేహముల నిర్మాణమునకు) అసలు కారణమేమిటి?" అనునట్టి ముఖ్యమైన ప్రశ్నకు సమాధానం శాస్త్రకారులు వెతికి, "జ్ఞానస్వరూపమగు చిదాత్మ అజ్ఞానమును అంగీకరించుటయే" అనే సమాధానమును నిర్ణయిస్తున్నారు. ఆ అజ్ఞానమే స్థూలదేహ విభాగము ఒనర్చుచున్నది. వాస్తవానికి "అధిష్ఠానసత్త (the absolute self in which every thing else is placed)"కు వేరుగా ఏదీ ఎక్కడా లేదు. అందుచేత "చిదాకాశము", "చిత్తాకాశము", "మహాకాశము" అనునవి వేరువేరు కావు. అవి వేరుకావని, ఒక్కటేనని గ్రహించుటే "జ్ఞానం". 'జ్ఞానేచ్ఛ'ను అనుసరించే 'జ్ఞానం' ఉదయిస్తోంది. అందుచేత, చిత్తమునందు ఉదయించే శరీరభావమే దృశ్యవస్తువులందు కూడా స్ఫురిస్తోంది.

ఈ చిత్తము అనబడునది అత్యంత సూక్ష్మమైనది. అది త్రసరేణువుల మధ్య అత్యంత సూక్ష్మమై వెలయుచున్నది. ఒక భావమునకు మరొక భావమునకు మధ్య భావాభావములకు కారణమై

వెలయుచున్నది. ఈ చిత్తము ఆకాశము కంటే బాగా అంతర్హితమై ప్రవర్తిస్తోంది. అది అంకురము (మొలచుట అను ప్రక్రియయందు)లో విలీనమై, చిగురాకులందు రసస్వరూపమై వెలయుచున్నది. జలమందలి తరంగంగా, శిలా మధ్యమునందు సౌమ్యంగా, మేఘములలో వర్షస్వభావంగా ప్రవర్తిస్తోంది. తన ఇచ్ఛ వచ్చినట్లు ఆకాశంలో మనగలదు. కొండ గుహలలో ప్రవేశించగలదు. ఆహా! ఈ చిత్తము యొక్క మహిమ ఏమని చెప్పమంటావు? ఇది అనంతాకాశవ్యాపి అయివుండి కూడా, అదే సమయంలో పరమాణువుగా మారగలదు. పర్వతమై దృఢంగా వెలయునది, ఆ పర్వతంపై 'వనము' రూపమున ప్రకటితమయ్యేదికూడా ఈ చిత్త-శరీరమే.

సముద్రజలమునకు ఆ జలం కంటే సుడిగుండములు వేరా? కావు కదా! కోటానుకోట్ల బ్రహ్మాండములు ఉండవచ్చు. కాని అవన్నీ చిత్తము కంటే ఏమాత్రం వేరు కాదు. ఈ 'బ్రహ్మాండములు' అను రూపమును దాల్చుచున్నది ఆ చిత్తాకాశమే. అదియే సృష్ట్యాది యందు ఉద్వేగరహితమైన జ్ఞానస్వరూపముగా వెలయుచున్నది. మరల, అదియే ఆకాశ రూపమున ప్రారబ్ధ కర్మలను అనుసరించు చున్నది. ఎండమావుల పట్ల "ఓహో! అది జలమే" అను జలత్వబుద్ధి ఎందుకు ఉదయి స్తోంది? విచారణ రహితంగా అసత్యమును ఆశ్రయించుటచేతనే కదా! "అతడు గొడ్రాలి రెండవ కుమారుడు" అను అర్థరహిత ప్రయోగం ఏర్పడుచున్నట్లే చిత్తమునందు 'జగత్తు' అనబడు మహా చమత్కారమంతా జరిగిపోతోంది. వాస్తవానికి ఆకాశాత్మస్వరూపుడే అయినట్టి ఈ జీవుడు తన యందు స్వయంకల్పితంగా ఏర్పడుచున్న భ్రమాత్మకమైన బుద్ధిచే బ్రహ్మాండ రూపుడై విస్తరిల్లుచున్నాడు.

❖

"నేను శరీరమును. కర్మ బద్ధుడను. ప్రారబ్ధకర్మలు నన్ను బంధిస్తున్నాయి. ఈ దృశ్యము లోని ఈ పదార్థములు నేను పొందకపోతే ఎట్లా? ఈ భౌతిక దేహములు నా వారు. ఇక వారో ... పరాయి వారు. ఈ శరీరము క్షీణిస్తున్నప్పుడు నేనే పీడించబడు చున్నాను..."

ఈ జీవుడు ఇటువంటి అనేక అసత్యభావపరంపరలను గాలిలో ఏర్పడే సుడులులలాగా పొందుచున్నాడు. ఫలితంగా, చిత్తము సంకుచితమై ప్రవర్తిస్తోంది. అట్టి సంకుచితత్వము త్యజించ బడినప్పుడు ఈ చిత్తము ఉత్తమోత్తమమైన కల్పనాసామర్థ్యమునే పొందగలదు. అట్టి సామర్థ్యముతో స్వయముగా బ్రహ్మాండములను నిర్మించగలదు. తనకుతానే బ్రహ్మాండమై విస్తరిల్లగలదు.

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు చాలా చిత్రమైన విషయం చెప్పుచున్నారు. మా చిత్తమునకు బ్రహ్మాండమై విస్తరిల్లునట్టి శక్తియున్నదా? అది నూతన బ్రహ్మాండములను కూడా కల్పించగలదా? ఎంత ఆశ్చర్యం! మేము, "ఎవరో కల్పించిన జగత్తులో కర్మల ప్రభావం చేతనో, ఆసక్త్యాదుల కారణంగానో ప్రవేశించాం" అని మాత్రమే అనుకొంటున్నాం. మేము ఈ ప్రకృతి యొక్క నిరంకుశంచే అస్వతంత్రులమై ఉన్నామని భావిస్తున్నాం. ప్రారబ్ధకర్మల చేతిలో కీలుబొమ్మలమై ఉన్నామని నమ్ముతూ వస్తున్నాం. కాని, మీరు చెప్పుచున్న దానినిబట్టి మా చిత్తమునకు మహత్తరమైన ప్రభావం ఉండియే ఉన్నదని తెలియవస్తోంది.

ఇక్కడ నాకొక సందేహం కలుగుతోంది. మా చిత్తములన్నీ వేరువేరు జగత్తులను చూస్తున్నాయా? లేక, ఒకే జగత్తును చూస్తున్నాయా? ఈ కనబడే జగత్తు సద్రూపము (స్వతహాగా అస్థిత్వము కలిగి సత్యమైయున్నది) కాదంటారా? ఎందుచేత? ఎట్లు?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ ప్రియరాఘవా! నేను చెప్పేది నీవు అత్యంత సూక్ష్మబుద్ధితో గ్రహిస్తున్నావు. చాలా సంతోషం. నేను చెప్పేది నిజమే. ప్రతి చిత్తమునకు ఇట్టి అనేక బ్రహ్మాండములు విస్తరిల్లజేయగల శక్తి ఉండియే ఉన్నది. నాయనా! "అసలు ఈ చిత్తము ఎవరికి చెందినది?" అను ప్రశ్నకు మొట్టమొదట సమాధానం తెలుసుకో. "ఆకాశాత్మ స్వరూపుడే తనయందున్న భ్రమతో కూడిన బుద్ధి వలన ఈ విధంగా బ్రహ్మాండమై విస్తరిల్లుచున్నాడు" అని చెప్పాను కదా! అట్టి అసత్యత్వము యొక్క మనన ప్రభావమే 'చిత్తము'గా చెప్పబడుతోంది. కనుక, నీవు–నేను–ఈ సభికులు–భూత భవిష్యత్ వర్తమానమునందలి ప్రతి ఒక్కరు .... చిదాకాశ స్వరూపులమే. తరంగములు లక్షలాదిగా ఉండవచ్చు. కాని జలం సర్వదా ఒక్కటే అయి ఉంటోంది కదా! తరంగములు జలమును భిన్నముగా, ఖండముగా చేయుచున్నాయా? లేదు. అట్లే చిదాకాశము సర్వదా అభిన్నము, అఖండము. చిదాకాశస్వరూపుడే బ్రహ్మాండముగా విస్తరిల్లి, మరల ఆ బ్రహ్మాండములో తననుతాను ఒక వ్యష్టి జీవుని (Individual soul) గా గాంచటం జరుగుతోంది. జలమే మహాసముద్రముగా విస్తరిల్లి, అందు ఆ జలమే లక్షల–కోట్లాది తరంగములుగా ప్రకటితమవటం లేదా? 'వ్యష్టిజీవుడు' అంటే ఎవరు? "నేను బద్ధుడను, నేను శరీరమును, నేను జన్మలు ఎత్తువాడను, నాకు ఇంకే త్రోవ లేదు" అనునట్టి భావావేశమే వ్యష్టిజీవుని రూపము కదా! స్వయముగా అట్టి భావావేశమును, స్వల్పత్వమును తనకు తానే అతడు ఆపాదించుకొంటున్నాడు. కారణం? (స్వయముగా అసత్యత్వ బుద్ధిని అంగీకరించి అద్దానిని అనుసరించుటచేతనే.)

సరే, నీకీ విషయం మరికొంత సుస్పష్టపడటానికిగాను "ప్రళయానంతర సృష్టి" గురించి చెపుతాను. అప్పుడు నిమిషంలో లెక్కకు మించిన జగత్తులు ఎట్లు ఉద్భవించి, విలీనమైపోతున్నాయో గ్రహించగలవు. విను.

❖❖❖

## 24. ప్రళయానంతర సృష్టి - భ్రమయొక్క 'ప్రవేశం'

ఓ సునిశితమతీ! రామచంద్రా! ఈ జగత్తులో 'మరణము' అనబడే మూర్ఛ అందరు పొందటం మనం చూస్తూనే ఉన్నాము కదా! దీనినే "ప్రళయరాత్రి" అని కూడా అంటూ ఉంటారు. అట్టి ప్రళయరాత్రి గడచిన తరువాత అందరూ కూడా వేర్వేరు సృష్టులను కల్పించుకొనుచున్నారు. మోహబుద్ధి కలవాడు, లేక, ఒక త్రాగుబోతు "ఈ కొండ భలే నృత్యం చేస్తోంది" అని అనుకొంటాడు చూచావా? అదేవిధంగా మరణించిన వారందరు తమతమ సంస్కారములకు తగినట్టి దృశ్యములను తమ చిత్తమునందే గాంచుచున్నారు.

ఇక సమష్టి మనోరూపుడగు హిరణ్యగర్భుని విషయానికి వస్తే, అతడు మహా ప్రళయానంతరం మరల సమష్టి-భోగ సమూహములను విస్తరింపజేయుచున్నాడు. అదేవిధంగా, "నేను వ్యష్టిని " అనునట్టి స్వయం సంభావన కలిగినవారు మృత్యువు తరువాత వ్యష్టిభోగ సమూహములను కల్పించుకొనుచున్నారు. ఏది ఏమైనా మహా ప్రళయానంతరం సమష్టి జీవునియందు, వ్యష్టి జీవుని యందు కూడా ప్రవర్తించుచు విరాజిల్లునది శుద్ధ స్వస్వరూపమే. "అట్టి శుద్ధ స్వస్వరూపము ఏకైక అద్వితీయ చిదాకాశమే" .... అని సునిశితమైన బుద్ధితో గ్రహించెదవు గాక. దీనిని బట్టి మనం గ్రహించవలసినదేమిటి? "ఆ చిదాకాశమే బంధముక్తులను తనకు తానే చిద్విలాసంగా, చమత్కార పూర్వకంగా కల్పించు కొనుచున్నది" అని మనం గ్రహించాలి సుమా! అందుకే ....

"ఓ జీవుడా! నీవు ఏమాత్రం స్వల్పుడవు కాదు సుమా! నీయొక్క వాస్తవ స్వరూపము చిదాకాశమే. మరి ఎందుకు విచారిస్తున్నావు? నీకు నీవే బంధమోక్షములను కల్పించుకొని, అనుభవిస్తున్నావు. ఈ రెండిటి ఆవలనున్న నిత్య-నిష్కళంక-ఆత్మచైతన్యమైయున్న స్వస్వరూపమును గాంచుటే జ్ఞానము యొక్క పరాకాష్ఠ" ....

అని శాస్త్రములు సర్వజనులకు ఎలుగెత్తి బోధిస్తున్నాయి. ఇదంతా మేము స్వానుభవము క్రోడీకరించి చెప్పుచున్నదే.

**శ్రీరాముడు :** స్వామీ! జీవుడు తాను మరణించిన తరువాత మరల సృష్టిని తన స్మృతిని అనుసరించి పొందుచున్నాడని మీరు అనియున్నారు కదా! ఈ విశ్వసృష్టిని రచించుచున్న సమష్టి జీవుడగు హిరణ్యగర్భుడు కూడా తన యొక్క స్మృతిని అనుసరించే ఈ జగత్తును ఇట్లు నిర్మించియున్నాడని మనం ఎందుకు అనుకోకూడదు? జీవుడు స్మృతిని అనుసరించి మరొకజన్మ పొందుచున్నాడని మనం అంగీకరిస్తే అప్పుడు "ఈ జగత్తును సమష్టి సృష్టికర్త తన స్మృతిలో కల్పనచేసి రచించాడు" అని చెప్పవచ్చు. అప్పుడు "ఈ జగత్తు కారణరహితము" అనే బదులు సమష్టి సృష్టికర్త (లేక హిరణ్య గర్భుడు) దీనికంతటికీ కారణము" అని అనవచ్చు కదా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "ఈ 'జగత్తు' అనబడే కార్యమే లేదు" అని ఉపనిషత్తులు మొదలైన ఆత్మవస్తువును ప్రతిపాదించు గ్రంథాలద్వారా శాస్త్రకారులు నిర్ద్వంద్వముగానే చెప్పుచున్నారు. అందుకు శాస్త్రములచే చెప్పబడిన ఒకానొక నిరూపణ చెపుతాను. విను.

మహాప్రళయసమయంలో హరి-హరాది దేవతలు కూడా విదేహముక్తులగుచున్నారు. అప్పుడు ఇంకేమీ మిగలనప్పుడు ఇక 'స్మృతి' అనునది ఎవరికి? ఎట్లు? మాబోటి తత్వవేత్తలే ఆ మహాప్రళయ సమయంలో ముక్తులౌతుంటే ఇక బ్రహ్మాదుల విషయం వేరే చెప్పేదేమున్నది?

నాయనా! రామా! ఎప్పుడైతే ఈ చిదాత్మ తన అఖండ విన్యాసత్వమును మరుగు పరుచుకొని, "నేను బద్ధుడను" అను భావమును పొంది ఉంటుందో, అట్టి సమయంలో అది అనేక ఉపాధి పరంపరలను పొందటం-త్యజించటం అను తతంగంలో ప్రవేశిస్తోంది. అట్టి తర్వాతి ఉపాధులకు స్మృతియే కారణమగుచున్నమాట నిజమే. అయితే స్మృతి ఉండుటకు, ఉపాధి నిర్మాణములకు

.... వీటన్నిటికి మూలకారణం ఆ చిదాత్మ తనయొక్క పూర్ణమగు మోక్షస్వరూపమును, విస్మరించుటయే. దృశ్యము భావించబడిన చోట ఆత్మ బావము కలుగరు. "ఇక్కడ కనబడుచున్న నీవు–నేను–అతడు–మనస్సు– అహంకారములు–పదార్థములు–వ్యష్టి–సమష్టి–ఇదంతా ఆత్మయే. ఆత్మయొక్క ప్రభావమే" .... అను రీతిగా ఆత్మ స్మరించబడుచున్నప్పుడు, స్వస్వరూపము అనుభవంకాగా, దృశ్యము యొక్క అదృశ్యత నిత్యానుభవమౌతుంది. ఈ జీవుడు ఇతఃపూర్వమే సర్వదా మోక్షస్వరూపుడై ఉన్నాడు. "ఓయీ, జీవుడా! నీవు సర్వదా స్వతంత్రమగు చైతన్యమూర్తివేగాని "స్మృతి" అనబడు ఒకానొకదానిచే బంధింపబడి అటూయిటూ దొర్లింపబడు జడవస్తువు కాదు. స్మృతికి ముందే నీ స్వరూపమున్నది. 'స్మృతి' యొక్క స్వరూప – స్వభావములు నిర్ణయిస్తున్నది నీవే" .... అని మేము సర్వజనులకు గుర్తు చేస్తున్నాం.

"ఈ జీవుడు మృతి తరువాత స్మృతిని అనుసరించి స్వకీయ – కల్పితమైన సృష్టిని గాంచుచున్నాడు" అనునది (బ్రహ్మపురాణం మొదలైన శాస్త్రములందు) ఇతఃపూర్వమే శాస్త్రకారులచే ప్రతిపాదించబడింది. స్వస్వరూపము గ్రహించబడనంత వరకు ఇట్టి సృష్టులు ప్రవర్తిస్తూనే ఉంటాయి. అట్టి సృష్టులనే "ఆకాశప్రకృతి" అని కూడా అంటారు. అయ్యది వ్యక్తము–అవ్యక్తము, జడము–అజడము కూడా అయివున్నది. నీకిక్కడ సృష్టి గురించి, జన్మాదుల గురించి కొన్ని విషయాలు చెపుతాను. విను.

❖

ఈ "ద్రష్ట–దృశ్యము" అనబడు రెండు పదార్థములు సమ్మేళనమైనట్లు తోచుచున్న ఆకాశ ప్రకృతి "చిద్వస్తువు" నందు ప్రతిఫలించినప్పుడు ... అహంభావము, శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములనబడు పంచతన్మాత్రలు, దిక్కులు ... మొదలైన సూక్ష్మభావాలన్నీ ఉదయిస్తున్నాయి. అట్లు ఉదయించిన 'సూక్ష్మభావ ప్రకృతి' మరికొంత విస్తరిల్లుటచే ఈ సూక్ష్మేంద్రియ పంచకమునకు (శబ్దానుభవం, స్పర్శానుభవం, రూపానుభవం, రసానుభవం, గంధానుభవం పొందటానికి) కారణమగుచున్నది. దానినే మనం 'ఆతివాహిక దేహం' అని అంటున్నాం. కొంతకాలానికి బాలుడు ఆటవస్తువులను, ఆ ఆటవస్తువుల ఆయాఆరోపణలను కల్పించుకొనునట్లు ఆదిభౌతిక దేహము సూక్ష్మదేహ ప్రభావం చేత రూపుదిద్దుకొంటోంది. అప్పుడు స్థూల–దేహమును ఆశ్రయించుకొనియున్న ఈ కళ్ళు, చెవులు, చర్మము మొదలైన ఇంద్రియములు వాటికి సమీపంలో ఉన్న పదార్థముల పట్ల మిథ్యాభావములను పొందుచున్నాయి. వాయువునందు స్పందముండటం లేదా? అట్లే జగద్భ్రాంతి కూడా 'చిలువలు–పలుకలు'గా వర్ధిల్లుచున్నది. స్వప్నంలోని స్త్రీ సాంగత్యములాగా ఇదంతా ఈ విధంగా అనుభూతమగుచున్నప్పటికీ ... ఇది అసత్యమే అయివున్నది సుమా!

ఈ జీవుడు ఎక్కడ మరణించటం జరిగినా, అతడు అక్కడే తక్షణమే తన అంతరంగము లోని సంస్కారముల ప్రభావం అనుసరించి "నీవు–నేను–అతడు–పదార్థజాలము" మొదలైన వ్యవహారమంతా గాంచుచున్నాడు. అయితే స్థూలాకాశమునందు ఈ "కాలము – దూరము" వంటి విషయాలు ప్రవర్తిస్తున్నాయి. సూక్ష్మాకాశమునందు ఈ దూరాదులు వర్తించవు. అందుచేత, "ఎంతకాలం

తరువాత? ఎంతదూరంలో?" అనే ప్రశ్నలు స్థూలాకాశబుద్ధికి సంబంధించినవి మాత్రమే. సూక్ష్మాకాశమున (నిశితబుద్ధికి) ఇట్టి ప్రసక్తి ఏర్పడదు. ఎంత చిత్రమో చూచావా! వాస్తవానికి ఆకాశమువలె సూక్ష్ముడగు ఈ జీవునకు జన్మాదులు లేవు. కాని ఆగంతుకములైన ఈ దేహాదుల యొక్క భావనలలో పడి జన్మాది భ్రమలకు లోనగుచున్నాడు. భ్రాంతియే అంతటికి కారణం. ఈ భ్రాంతియే .... దేవపురం, సూర్యుడు, నక్షత్రములు, భూమి – మొదలగు వాటితో కూడుకొని సుందరమై కన్పట్టుచున్నది. జరా–మరణ–వ్యాధులతో బహుసంకటంగా అగుపిస్తున్న ఈ "దేహఛిద్రము" యొక్క అనుభవమునకు కూడా భ్రమయే కారణమై ఉన్నది. ఓ రాఘవా! ఒక్కసారి పరికించి చూడు. ఈ జగత్తంతా విస్తరించియున్న చరాచర జంతువులన్నీ తమ స్థూల–సూక్ష్మ దేహములతో కూడుకొన్నవై "ఇష్టాను భవముల ప్రాప్తి – అయిష్టానుభవముల పరిహారము" అను రూపముగల అనేక ప్రయత్నములందు నిమగ్నమై ఉంటున్నాయి. అట్టి వ్యవహారం చేతనే "నదులు, కొండలు, భూమి, దిశలు, రాత్రింబవళ్ళు, క్షణములు" అనునట్టి భ్రమలన్నీ కలుగుచున్నాయి. "ఇష్టాయిష్టములే భ్రమలకు దారితీయగలవు" అని గ్రహించెదవుగాక.

"నేనతనికి పుట్టాను. వీరు నా తల్లిదండ్రులు. వీరు నా మిత్రులు. ఇది నా ధనము. ఇది నా కోర్కె. ఇవి నా పుణ్య–పాపములు, నేను బాలుడను, ఇప్పుడు యువకుడను, కాని క్రమంగా వృద్ధాప్యం పొందుచున్నాను." ఇటువంటి భ్రమాత్మకదృష్టులే జీవుని "పరిమితునివలె" చూపుతున్నాయి. ఈ జగద్భ్రమ మాటిమాటికీ వేరువేరుగా హృదయమునందే స్ఫురించటం జరుగుతోంది.

'మరణము' అను మూర్ఛను పొందిన ఈ జీవుడు మరల తన హృదయము యొక్క బాహ్యప్రసరణం కారణంగా తనయందే తన సంస్కారములకు, ఇచ్ఛలకు అనుకూలమైన జగత్తును గాంచుచున్నాడు. అదేవిధంగా ఈ జీవించియున్న తరుణంలో జీవునిచే గాంచబడునది కూడా సంస్కారానుగుణంగానే ఉంటోంది కదా! జీవుడు ఇట్లు ఎక్కడ మరణిస్తే అక్కడ ఇట్టి సంసారవనభూమిని దర్శించుచునేఉన్నాడు. ఈ విధంగా త్రిలోకములు, బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, సూర్యాది దేవతలు, పర్వతములు, సముద్రములు, ద్వీపములు ... ఇట్టివి కోట్లకొలది కనబడుచున్నాయి. మరల నిష్క్రమిస్తున్నాయి. నిరాకారమగు పరబ్రహ్మమునందు ఈవిధంగా ఎన్ని అసత్స్వరూపములు ఉద్భవించాయి? ఎన్ని ఉద్భవించబోతున్నాయి? ఇవన్నీ లెక్కించటం, నిరూపించటం ఎవరితరం చెప్పు!

ఈ విశ్వము ఒక గోడవలె స్థూలంగా ఎదురుగా నిలచియున్నది కదా! వాస్తవానికి ఇదంతా మనస్సు యొక్క సంకల్పమే అయివున్నది. మనో సంకల్పమునకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు. మనస్సే తనకొరకు ఈ దృశ్యవ్యవహారములతో కూడిన సృష్టులను నిర్మించుకొని, అనుభవించి, మరల త్యజించివేస్తోంది. కనుక 'జగత్తు' అనబడునది మనస్సులోనే సంకల్పరూపమున ఉద్భవించి బాహ్యమైన వస్తుజాలమువలె ప్రాప్తిస్తోంది. స్వప్నములోని వస్తుజాలం "అంతరంగమున ఏర్పడియున్న భ్రమ" అయినప్పటికీ అదంతా ఆ స్వప్న సమయంలో "బాహ్యజగత్తు"వలె తోచుచున్నది కదా! ఈ జాగ్రత్ అనుభవం కూడా అట్టిదే.

**శ్రీరాముడు :** అయితే, ప్రభూ, "మనస్సు చంచలము – ఈ విశ్వము స్థిరము" అని మనం అనుకోవచ్చా? ఎందుకంటే ఈ విశ్వమంతా మాకు ఎదురుగా ఘనీభూతమై అనుభవమగుచుండగా, ... "ఇదిలేదు" అనునది సమంజసమెట్లా అవుతుంది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! ఈ కనబడేదానిని కొంచెం విచారించిచూడు. ఈ విశ్వము కూడా చంచలమని, క్షణభంగురమని నీవు తప్పక గ్రహించగలవు.

చిదాకాశమే మనస్సునకు ఆశ్రయమైయున్నది. అట్టి చిదాకాశమే 'పరమపదము' కూడా. నీరే, కెరటము. నీరే సుడిగుండము కూడా కదా! ఆ రెండింటికీ భేదమేమున్నది? అట్లే ఈ విషయం విను.

"ద్రష్టయే దృశ్యముగా ప్రసరించుచున్నాడు. (Perceiver is extending himself as perception) ద్రష్ట – దృశ్యములకు భేదమేమీ లేదు."

**"ద్రష్టేవాస్తేదృశ్యమివ దృశ్యంనత్వస్తివస్తుసత్"**

ద్రష్టయే దృశ్యంగా అవతరిస్తున్నాడు. ద్రష్టకు వేరుగా దృశ్యమనునది వస్తుతః ఎక్కడా లేదు.

ఐంద్రజాలికుడు ఆకాశము నుండి వివిధ వస్తువులను కల్పించి నానావిధములైన వాటిని మన కళ్ళకు సత్యమువలె అగుపడేట్లు చేస్తాడుకదా! అదేవిధంగా అనాదియగు మాయ కూడా – నామరూపములను కనుగొనజాలునట్టి జీవభావమును చిదాకాశము నందే (లేక చిత్తాకాశమునందు) స్ఫురింపజేయుచున్నది. 'అహం' అను జ్ఞానం ఉన్నంత మాత్రంచేతనే ఆ 'అహం' అనబడుదానియొక్క 'ఉనికి' ప్రభావంచేత పరమార్థ స్వరూపము నందు జగత్తు యొక్క శబ్ద–అర్థములు ప్రాప్తిస్తున్నాయి. అనుభవ మౌతున్నాయి. 'అహం' అనుదాని యొక్క స్వరూపము వాస్తవమునకు అమృతమయమగు చిదాకాశమే అయివున్నది. 'అహం' అను "భావన మరియు ఉనికి" యొక్క ప్రభావం చేతనే, 'నీవు' అను జ్ఞానము కలుగుచున్నది. నీవు అను ''శబ్దము–అర్థము'' .... ఆరోపితమైనట్లు, బోధితమగుచున్నది.

"అహమ్‌బ్రహ్మాஉస్మి", "తత్ త్వమ్" అను రెండు మహావాక్యములు అహమ్–త్వమ్ (నేను–నీవుల) అభేదమునే సిద్ధాంతీకరిస్తున్నాయి.

❖❖❖

## 25. విదూరథుని సుదీర్ఘ జీవితం

మరల మనం కథలోకి ప్రవేశిస్తున్నాం. ఆకాశస్వరూపులగు లీలా, సరస్వతులిద్దరూ తమ తమ ఇచ్ఛలను అనుసరించే ఆ గృహంలో ప్రవేశించగలిగారు.

చిద్వస్తువు సర్వవ్యాపి కదా! "యథార్థజ్ఞానము", "సత్యకామ", "సత్యసంకల్పము", ఈ మూడు కూడా చిద్వస్తువు యొక్క ధ్యానము చేతనే కలుగుచున్నాయి. సర్వగామి, అప్రతిహతము, సూక్ష్మము

అగు చిద్వస్తువును ఎవరు ఎట్లు అడ్డగించగలరు చెప్పు?

ఆ యువతులిద్దరు రాజాంతఃపురంలో ప్రవేశించటంచే అక్కడ ఇద్దరు పూర్ణచంద్రులు ఉదయించినట్లైనది. ఆ చోట సుగంధపూరితమైన పిల్లగాలులు వీచాయి. ఆ సమయంలో ఆ గృహంలో ఒక రాజు తప్ప అంతా యుద్ధరంగమున అలసి ఉండుటచే గాఢనిద్రా పరవశులై ఉన్నారు.

రాజు ఎందుకో పాన్పుపై నుండే కనులు తెరచి చూచాడు. ఎదురుగా రెండు సింహాసనములపై అధిష్ఠితులైయున్న అప్సరసల వంటి వారిద్దరినీ చూచి తటాలున లేచాడు. ప్రక్కనే ఉన్న సువర్ణపాత్రలో నుండి దోసిలి నిండుగా పూలు తీసుకొని వారి పాదములపై ఉంచాడు. ఎదురుగా పద్మాసనాసీనుడై కూర్చుని ఇట్లు పలుకరించసాగాడు.

**విదూరథుడు :** ఓ దేవతాస్త్రీలారా! మీ ఇద్దరికీ మరల మరల నమస్కారం. మిమ్ములను చూడగానే ఈ "జన్మములు పొందియుండటం" ... అను రూపముగల దాహ దోషములన్నీ తొలగిపోతున్నాయి. బాహ్యాభ్యంతర తమస్సు అంతా పటాపంచలై పోతోంది. మీకు జయమగుగాక!

ఆ ఇద్దరు పద్ముని వాత్సల్యంగా పలకరించారు. ఇంతలో సత్యసంకల్పురాలగు సరస్వతీ దేవి యందు "ఈ నా భక్తురాలు లీలకు తన భర్తకు సంబంధించిన ఇక్కడి సమాచారం తెలియజేసెదను గాక" అను సంకల్పం ఉదయించింది. ఆమె ఇచ్ఛను అనుసరించి ఆ ప్రక్కనే నిదురిస్తున్న మహామంత్రి నిదురలేచాడు. ఆ అప్సరసలిద్దరికి పుష్పాంజలి సమర్పించాడు. రాజు ప్రక్కన వినమ్రతతో ఆశీనుడై కూర్చునియున్నాడు.

**శ్రీ సరస్వతీదేవి :** ఓ రాజా! నీవెవడవు? ఎవరి పుత్రుడవు? ఎట్లు జన్మించావు? ఇక్కడికి ఎట్లా వచ్చావు? నీ వృత్తాంతమేమిటో సమూలంగా వినగోరుచున్నాము. మీ మహామంత్రి మాకు వివరించుగాక!

**మహామంత్రి :** ఓ దేవతలారా! మీకు శుభమగుగాక! మీరు కోరినట్లు మా ఈ ప్రభువు యొక్క వృత్తాంతము నేను చెపుతాను, వినండి.

ఇక్ష్వాకువంశీయుడైన 'కుందరథుడు' అను నాతడు లోకప్రసిద్ధుడైయున్నాడు. ఆయన వంశపరంపరలోని 'నభోరథుడు' అను మా పూర్వరాజు కుమారుడే ఈ మా మహారాజగు 'విదూరథుడు'. ఇతడు తన స్నేహాది సుగుణములచే మా అందరిని సంతోషపెట్టుచూ, మమ్ము పాలించుచున్నాడు. ఇతని తల్లి – తండ్రులగు 'నబోరథుడు – మిత్ర"లు ఇతనికి పదవఏటనే రాజ్యాభిషేకం చేసి తాము 'వానప్రస్థం'* జేరారు. అప్పటి నుండి ఈతడు యేబది ఏండ్లుగా ధర్మానుసారం రాజ్యపాలన చేస్తున్నాడు. నేడు మీ రాకచే మా పుణ్యం ఫలించింది. ఎంతో తపస్సు చేసినప్పుడు మాత్రమే

---

* వానప్రస్థం : పూర్వం రాజులు వృద్ధాప్యంలో రాజ్యం యువరాజులకు అప్పచెప్పి, నిర్జన ప్రదేశంలో (లేక) అరణ్యంలో ఆశ్రమం నిర్మించుకొని తపోధ్యానాదులతో శేష జీవితం గడిపివేసేవారు. అదే 'వానప్రస్థాశ్రమం'.

మీవంటి దేవతల దర్శనం లభిస్తుంది. మీ దర్శనముచే ఈ రాజ్యసేవకునిగా నేను, మహారాజుగా, ఈ మా విదూరథుడు కూడా ధన్యులమైనాం.

అప్పుడు సరస్వతీదేవి సింహాసనం దిగింది. ఆరాధనాపూర్వకంగా తనవైపే చూస్తున్న 'విదూరథమహారాజు'ను సమీపించింది. భక్తులపాలిటి అమృతహస్తమయిన ఆమె అభయ హస్తముతో అతని మస్తకమును స్పృశిస్తూ "నాయనా! వివేకబలంచేత పూర్వజన్మను స్మరించు" అని లాలనగా పలికినది. నాగస్వరం విన్న సర్పమువలె జగన్మాత పలికిన పలుకులకు రాజు అర్థనిమీలితనేత్రుడు అయ్యాడు. అంతే. అతని హృదయంలోని తమస్సు అంతా తొలగిపోయింది. హృదయం వికసించింది. ఒక్క క్షణంలో తన పూర్వ వృత్తాంతమంతా గ్రహించగలిగాడు.

- తాను 'పద్ముడు' అనే రాజై ఉండటం ....
- 'లీల' తన ధర్మపత్ని. ఆమెకుగల అత్యంత త్యాగపూర్వకమైన అనురాగం ....
- కాలక్రమంగా తాను దేహమును, రాజ్యమును పరిత్యజించటం ....
- సరస్వతీదేవి వృత్తాంతము. లీలాదేవి విలాసము?

అంతా సవివరంగా గ్రహించాడు. సముద్రముపై తేలియాడుచున్న వానివలె అయ్యాడు. "ఆహాఁ! ఎంత ఆశ్చర్యం! నేటికి ఇప్పుడు ఈ సరస్వతీదేవి కరుణ వలన సంసార మాయ అంతా గ్రహించాను. ఇదంతా ఎంత చిత్రమైనది!"

❖❖❖

## 26. జగత్తు యొక్క నిజరూపం

**విదూరథుడు :** ఓ దేవతలారా! నేను 'పద్ముడు'గా మరణించి మూడు రోజులు మాత్రమే అయినది కదా! మరి ఇక్కడ నాకు అరువది ఏండ్ల అనుభవం గడచిపోయింది సుమా! పైగా, ఈ అరువది ఏండ్లుగా నా తాతలు, తండ్రులు, పుత్రులు, సేవకులు, మిత్రులు, బంధువులు నా స్మరణలో ఉండియే ఉన్నారు. ఓ జ్ఞప్తిదేవతా! ఇదంతా ఏమిటమ్మా? నాకసలు ఏమీ అర్థమగుటలేదు. విషయమంతా నాకు వివరించి చెప్పమని నిన్ను ప్రార్థిస్తున్నాను.

**శ్రీ సరస్వతీదేవి :** నాయన! 'వసిష్ఠుడు' అను బ్రాహ్మణుడిగా పిలువబడుచున్న శరీరము శిథిలం కావటం జరిగినది. 'మృత్యువు' అను మూర్ఛను పొందిన తరువాత అంతకు ముందు అధిష్ఠించియున్న దృశ్య వ్యవహారము నీ దృష్టి పథము నుండి తొలగిపోయింది. ఆపై 'పద్ముడు' అని పిలువబడిన ఉపాధిని నీవు ఆశ్రయించావు. గిరి గ్రామంలోని విప్రగృహాకాశమే గొప్ప రాజ్యంగా నీ హృదయంలో ప్రతిబింబించింది. ఇక్కడ ఇప్పుడు నీకు కనబడుచున్నవి కూడా ఆ గృహమండపములోనే ఉన్నాయి. పద్ముడుగా నీవు నన్ను ఉపాసిస్తూ ఉండేవాడవు. పద్ముడుగా గృహములు, రాజ్యములు చూచావు కదా! ఆ అంతఃపురాకాశంలోనే మరణానంతరం ఈ వర్తమాన బ్రహ్మాండమును చూచుచున్నావు.

వసిష్ఠ బ్రాహ్మణుని - పద్మని - ఈ విదూరథునికి సంబంధించిన దృశ్యానుభవములన్నీ ప్రాప్తిస్తున్నది ఎక్కడా బాహ్యమునందు కాదు సుమా! నిర్మలాకాశంకంటే కూడా నిర్మలమైన నీ చిదాకాశమునందే నీ 'ఇచ్ఛ'ను అనుసరించి ఇవన్నీ ఇట్లు ప్రాప్తిస్తున్నాయి.

"నా పేరు ఇది. ఇది నా జన్మ. నేనీ వంశమున జన్మించాను. వీరు నా తల్లిదండ్రులు. నా తండ్రి నా పదేళ్ళ వయసులో నాకు రాజ్యము ఇచ్చి తాను పరివ్రాజకుడయ్యాడు. నేను శత్రువులను జయించి, మంత్రులతో విశాల సామ్రాజ్యమును, ప్రజలను పరిపాలిస్తున్నాను. యజ్ఞక్రియా సహితుడనై ప్రజలకు అనుకూలమైన విధంగా రాజ్యపాలన సాగిస్తున్నాను. నాకు అరువది(60) ఏండ్లు గడచిపోయాయి. ఇప్పుడు శత్రురాజులు మాపై దండెత్తివచ్చారు. దారుణయుద్ధం జరుగుతోంది. నా కళ్ళు తెరవగానే సింహాసనా రూఢులైన ఇద్దరు దేవతా స్త్రీలను చూచాను. వీరిని పూజించాను. పూజిస్తే వారు నా కోర్కెలు తీర్చగలరు. ఈ దేవి నా పూర్వస్మృతిని వికసింపజేసింది. నేనిప్పుడు కృతకృత్యుడనయ్యాను. నా సంశయములన్నీ తొలగిపోతున్నాయి. ఇప్పుడు నాకెట్టి దుఃఖములు లేవు. ఏక రసరూపమగు సుఖమున మగ్నుడనయ్యాను.".... ఇట్టివేయగు అనేక భ్రాంతులు అద్దమునందు ప్రతిబింబములవలె నీ శుద్ధ చిత్స్వరూపము నందు ప్రతిబింబిస్తున్నాయి.

అయితే నీవు ఇతఃపూర్వం మరణించినప్పుడే ఇట్టి జ్ఞానపరంపరావ్యవహారం హృదయంలో ఉదయించివున్నది. నీరు ఒకచోటి నుండి మరొకచోటికి ప్రవహిస్తూ .... ఒక సుడిగుండం నుండి మరొక సుడిగుండమును ఆశ్రయిస్తూ పోతుంది చూచావా? నీయొక్క ప్రజ్ఞాప్రవాహం కూడా అట్లే ఒక దృశ్యమును వదలి ఇంతలోనే మరొక దృశ్యమును ఆశ్రయించి ప్రతిభాసింపజేయుచున్నది. ఒకానొక సుడిగుండం ఇంకొక దానితో కలసి ప్రవర్తించటం ఎట్లా జరుగుతూ ఉంటుందో, ఈ సృష్టి-విభవము కూడా 'మిశ్రమ-అమిశ్రమ' భావములతో పెంపొందించబడుచున్నది. చిత్రమేమిటంటే, నీ మరణసమయంలో 'చిత్' స్వరూపము నందు ప్రతిభాసితమగుచుండే ఈ జగత్తులన్నీ అసత్స్వరూపములే సుమా! స్వప్నంలో ఒక్క 'నిమిషం' కాలంలో అనేక సంవత్సరాలుగా విస్తరిల్లినట్టి అనుభవము భ్రమవలన కలుగటం జరుగుతోంది. ఊహయందు ఊహచే నిర్మించబడే గంధర్వనగరంలోని సౌధాలకు కూడా గోడలు, పునాదులు అగపడుతాయి. సంకల్ప నగరంలో శత్రువుల జననమరణాలు ఆ సంకల్పములోనే సంకల్పద్రష్టకు కనిపిస్తూ ఉంటాయి కదా! నావ నీటిలో కదులుచూ ఉండగా, ఆ నావలో ఉన్న జనులకు ఒడ్డున ఉన్న చెట్లు కదులుచున్నట్లు తోచదా? స్వప్నంలో, "నేను చచ్చినానట. అప్పుడు నా చుట్టూచేరి నా బంధువులు ఏడ్చుచున్నారు" అని ఒకానొకడు గాంచటం లేదా? హాస్యరసపూర్వకమైన విషయమేమంటే, స్వప్నద్రష్టయే మరణిస్తే, ఆ స్వప్నములోని బంధువులు ఎవరు? ఎక్కడ ఉన్నారు? ధాతువులు ప్రకోపించినప్పుడు పర్వతములు నృత్యమాడుచున్నట్లు కనబడుతుందికదా! ఈ వర్తమానపు - ఇతఃపూర్వపు - ఇక ముందటి జన్మకర్మల వ్యవహారము అట్టిదే. ఇది ఎంత ప్రౌఢంగా ఘనీభూతమై కనిపిస్తున్నప్పటికీ .... ఈ దృశ్యజగత్తు భ్రాంతిమాత్రమై, మిథ్య అయి ప్రాప్తిస్తోంది.

పుత్రా! విదూరథా! వాస్తవానికి నీవు జన్మించటం లేదు. మరణించటం లేదు. నీవు ఉన్నది మరెక్కడో కాదు. సర్వదా శుద్ధవిజ్ఞాన స్వరూపము, శాంతము అయినట్టి పరమాత్మయందే వెలయుచున్నావు. అట్టి నీ స్వస్వరూపమునకు సంబంధించిన వాస్తవ జ్ఞానం నీయందు విచారణ ప్రభావంచే వికసించవచ్చు. లేదా, నీయందు 'విచారణ' అను వెలుగు తగినంత ప్రభవించకపోవటం చేత, 'దృశ్య తాదాత్మ్యము' అనునది ఆత్మజ్ఞానమును కప్పి ఉంచుటచే, నీవు ఇట్లే అనేక శరీరములందు సంచరిస్తూపోవచ్చు. ఏది, ఏమైతేనేం? నీ వాస్తవస్వరూపము శుద్ధ-విజ్ఞాన సత్తయే! అట్టి నీశుద్ధ స్వస్వరూపమునకు కలుగగల బంధముగాని, అవాంతరముగాని లేనేలేదు. ప్రతి ఒక్క తరంగము జలముయొక్క రూపమే అయినట్లు, ప్రతిజీవుని యొక్క వాస్తవ స్వరూపము పరబ్రహ్మమే అయివున్నది.

ఏ దృశ్యజగత్తైతే ఇప్పుడు ఘనీభూతమై ఎదురుగా ఉండి ఉంటోందో .... అట్టి ఈ దృశ్య సర్వసంకల్ప రాహిత్యముచే "నిర్వికల్ప సమాధి" అను "అంతరంగమౌనస్థితి" యందు లేకయే పోవుచున్నది. అయితే, ఆ సమయంలో కూడా "స్వస్వరూపసత్త (లేక) "ఉనికి" ఉండియే ఉన్నది. ఆ ఉనికి 'జాగ్రత్'ను స్వీకరించడానికి అనుక్షణం సిద్ధంగానే ఉన్నది కదా!

కాబట్టి, ఓ లీలాపతీ! నీవు సర్వాత్మకుడవేగాని, వాస్తవానికి ఒకానొక స్వల్ప ఉపాధి మాత్రుడవు కాదు. ఇందులో సందేహం లేదు. నీవు నీయందే దృశ్య-అదృశ్యములనబడు ఉభయ సమయము లందు సర్వదా ప్రకాశించుచున్నావు. "భూపీటము, సూర్యప్రకాశము, 'గిరి' మొదలైన గ్రామాదులు, నీవు నేను" .... ఇవన్నీ మిథ్యయే అయివున్నాయి. వసిష్ఠవిప్రుని గృహాకాశమండపమే లీలాదేవి-పద్మల విస్తార రాజ్యమునకు స్థానభూతమైనది. ఆ ఇద్దరి అంతఃపురాకాశ మండపంలోనే ఈ విదూరథ రాజ్యమంతా ఉండివున్నది. అయితే ' మండపాకాశము,' 'ఈ నీవు చూస్తున్న రాజ్యము' కూడా నిర్మలమగు బ్రహ్మమే అయివున్నాయి. అట్టి బ్రహ్మమునందు భూమి, పట్టణములు, అరణ్యములు, పర్వతములు, నదులు మొదలైనవి లేవు. ఈ జనుల పరిభ్రమణము, పరస్పర దర్శనము కూడా మిథ్యయే. "అంతయు చిన్మాత్రముచే పూర్ణమైయున్నది" అని గ్రహించు!

**విదూరథుడు :** సర్వజ్ఞప్తులకు మూలకారణమైన ఓ జ్ఞప్తిదేవీ! అయితే, ఈ నా అనుచరులంతా ఎవరు? వీరంతా కూడా ఆత్మయందే జన్మించి, ఆత్మయందే వెలయుచున్నారా? లేక, వారి ఉనికికి ఆధారం ఇంకేదైనా వస్తువు ఉన్నదా? స్వప్నంలో చూడబడే నామరూపాలవలె, వీరంతా ఉండి ఉన్నట్లు నాకు అనుభవమవటం మిథ్యానుభవమేనంటావా? వీరందరు ఆత్మయందు సత్స్వరూపులై వెలయుచున్నారా? లేదా? లేక 'ఆత్మ' అనబడునది కూడా మిథ్యయేనా? నీ వాక్యములచే కొంత విషయం చూచాయగా అర్థమౌతున్నప్పటికీ, కొంత అయోమయమే ఏర్పడుచున్నది. నన్ను సందేహాలు ఇంకా పట్టుకొనే ఉన్నాయి.

**శ్రీ సరస్వతీదేవి :** ఓ విదూరథా! ఆత్మస్వరూపము 'విదిత-వేద్యము' (తెలుసుకొనబడు చున్నది - తెలుసుకొనుచున్నది), శుద్ధస్వరూపము కూడా అయివున్నది. చిదాకాశ స్వరూపమగు "ఆత్మ-తత్త్వము" నందు ఆత్మ కాకుండా వేరుగా సద్రూపమంటూ ఏదీ లేదు. శుద్ధబోధ స్వరూపమగు దానియందు

జగద్భ్రమ ఉండి ఉండటమేమిటి? ఆ భ్రమ వాస్తవమైన రూపము పొందటం ఏమిటి? చీకట్లో చూడబడిన త్రాడు విషయంలో "అది పాము కాదు, త్రాడు మాత్రమే" అను సత్యజ్ఞానము ఉదయించిన తరువాత ఇక వికారములకు చోటెక్కడ? "అసత్‌భ్రమ" యొక్క స్వరూపమేమిటో గ్రహించిన తరువాత ఇక జగద్భ్రాంతికి చోటు ఉండదు. 'ఎండమావులు' అనగా ఏమిటో గ్రహించే వారికి వాటియందు జలభ్రాంతి శేషించి ఎందుకు ఉంటుంది? స్వప్నము నుండి తేరుకున్న తరువాత స్వప్నములోని సంఘటనలకు అస్థిత్వమెక్కడ?

వత్సా! 'అజ్ఞానము' అనే మేఘం తొలగితే "స్వస్వరూపాకాశము" స్వచ్ఛమై, పూర్వమైన దానికంతటికి పూర్వమై, ఏకరసస్వరూపమై ప్రకటితమౌతోంది. అట్టి స్వస్వరూపానుభవము" నందు … "నేను, నీవు, జగత్తు" మొదలైన కుత్సిత శబ్దములకు అర్థమేమిటో కూడా బోధపడదు. వాస్తవానికి ఈ నేను నీవు–జగత్తు అనబడునదంతా వాచారంభము మాత్రమే. నీవు–నీ అనుచరులు పరమాత్మానందస్వరూపులే!

❖❖❖

**(ఐదవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# ఆరవ రోజు

## 27. స్వప్నజాగ్రత్తులు

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఇక మనం ఆరో రోజు విచారణ ప్రారంభిస్తున్నాము.

మూఢుడు, అప్రబోధితుడు, ఉత్తమబుద్ధిలేనివాడు .... అగువానికి ఈ అసత్‌జగత్తు వజ్రతుల్యమై సత్యమువలె అగుపడుచున్నది. అజ్ఞాని, అమాయకుడు అయిన బాలుడు చీకట్లో ఒక మోడుబారిన చెట్టును చూచి "ఇది బేతాళుడే" అని భావించి దుఃఖమును పొందుతాడు చూచావా? అసత్ ఆకారము కలిగియున్నట్టి ఈ జగత్తు కూడా తత్త్వజ్ఞాన ప్రయత్నము లేనట్టి మూర్ఖజనులకు అనేక దుఃఖపరంపరలను కలుగజేయ గలుగుచున్నది. సూర్యకిరణములు ఎడారిలో జంతువులకు నీటియొక్క భ్రమ కలుగజేయుచున్నట్లు, మూఢునకు ఇదంతా సత్యమువలెనే గోచరిస్తోంది, ప్రాప్తిస్తోంది. స్వప్నంలో ఒకానొకడు "నేను మరణించాను" అనే అనుభవం పొందటం లేదా? మూఢునకు, మూర్ఖత్వము వహించినవానికి ఈ 'జగత్తు' అను దృశ్యము నుండి ప్రాప్తించని కష్టమంటూ ఏదీ ఉండదు.

అజ్ఞునకు ఆభరణమే కనబడుతుంది గాని, ఆ ఆభరణములో బంగారము కనిపించదు కదా! బంగారము చూచు కంసాలికి అనేక ఆభరణములలో ఏకత్వమే అనుభవం కాగలదు. "మహాశయత్వము" లేని వానికి ఈ జగత్తు నందు పరమవస్తువు కనబడకుండా, "నీవు-నేను-పురము-నగరము" ... వంటి భ్రమాత్మకమగు విషయములు మాత్రమే గోచరిస్తున్నాయి. ఒకానొక చక్షురోగికి ఆకాశంలో పుష్పాలు, కేశములు, పింఛాలు మొదలైన అసత్యవస్తువులు అగుపిస్తూ ఉంటాయి కదా! అట్లే పరమార్థ దృష్టిహీనునకు ఈ జగత్తు కనిపిస్తోంది. కనుక, రాఘవా! 'అహంకారము' మొదలైన భావములతో కూడుకొనియున్న ఈ జగత్తు ఒక దీర్ఘస్వప్నమువంటిది మాత్రమేనని గ్రహించెదవుగాక!

**శ్రీరాముడు :** 'విదూరథుడు' తనకంటే వేరుగా తాను చూస్తున్న సృష్టిలో కనిపిస్తున్నవారి గురించి సరస్వతీదేవిని అడిగినాడు కదా! స్వప్నసదృశులగు ఆ పురుషులు ఎంతవరకు సత్యమో మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** శుద్ధ స్వరూపమైనట్టి పరమాత్మ మనోబుద్ధులచే ప్రకటింపబడజాలని వాడు. అందుచేత అతనిని 'అచేత్యుడు'* అని చెప్పుచున్నారు. అతడు చిన్మాత్ర స్వరూపుడు, శాంతుడు, నిరతిశయుడు. అతడే సత్యము. నీయొక్క, నాయొక్క సర్వుల యొక్క వాస్తవ స్వరూపము అతడే. సర్వగతుడు, సర్వశక్తియుతుడు, సర్వాత్మకుడు అయి వుండి కూడా ఖండునివలె భ్రమాత్మకమైన

---

* చేత్యము = తెలియబడునది.

దృష్టికి కానవచ్చుచున్నాడు. అతడు స్వమాయ వలన అర్థక్రియాదులకు అనుకూలమై ఉదయించ సంకల్పించినప్పుడు, తదనుసారమే ఈ క్రియలన్నీ ఏర్పడుచున్నాయి. ఇక్కడ మనం స్వప్నమునే దృష్టాంతంగా తీసుకుందాం. స్వప్నములో చూడబడే నగరంలోని నగరవాసులందరు ఆ స్వప్న సమయంలో సత్యముగానే తోచుచున్నారు కదా! వారిని కల్పించినది ఎవరు? స్వప్నద్రష్టయే కదా! ద్రష్టయొక్క స్వరూపచైతన్యమే స్వప్నాకాశమధ్యమున ఉన్నది. ఆ చైతన్యము స్వప్నద్రష్టయొక్క వాసనలను అనుసరించి, తనకు ఆధారమైనట్టి 'చిత్తము'*తో కలిసి ప్రకాశత్వం పొందుతోంది. ఫలితంగా, ఆ ద్రష్టకు "నేను మానవుడను .... వీరు నా వాళ్ళు .... వారు వేరైనారు" ఇత్యాది రూపములు గల బోధ కలుగుతోంది. అయితే చైతన్య శక్తియొక్క ప్రభావం చేతనే "నేను నరుడను. నేను ఇట్టివాడను" అనునట్టి 'బోధ' (Sense of deep understanding) కలుగుచున్నది. అట్టి భావన యొక్క పటిమ చేతనే స్వప్న – జాగ్రత్ జగత్తులు సత్యములైనట్లు అనుభవమగుచున్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మాయామాత్ర శరీరుడగు "స్వప్నద్రష్ట" (లేక స్వప్న స్వరూపుడు), అతనిచే గాంచబడు స్వప్నదృశ్యము .... ఈ రెండూ కూడా మిథ్యయేనని నేను ఒప్పుకుంటాను. కాని, ఈ 'జాగ్రత్'లో కనబడే జగద్వ్యవహారం 'మిథ్య' అని అనటం ఎట్లా? ఈ 'నీవు–నేను' మొదలైనవన్నీ ఘనీభూతమై మాకు సుస్పష్టంగా అనుభవమగుచుండగా, "ఇదంతా అసత్యము" అని భావించియుండుట ఎట్లు? మీరు "ఇవన్నీ అవాస్తవములే" అని చెప్పుచున్నప్పటికీ మాకు మాత్రం ఈ విషయమై పూర్ణమగు విశ్వాసము కలుగుచుండటంలేదనే చెప్పాలి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** "స్వప్నము నందు .... ఆ స్వప్నములోని వ్యక్తులు, వస్తువులు .... ఆ స్వప్న సమయంలో వాస్తవమనే అనిపిస్తున్నాయి" .... అని చెప్పటానికి ప్రమాణం ఏమిటి? ప్రత్యక్షానుభవం తప్ప వేరే ప్రమాణం లేదుకదా! ఈ జాగ్రత్ విషయంలో కూడా ప్రత్యక్షానుభవమే ప్రమాణం. "ఇది ఇప్పుడు సత్యము" అని ఈ దృశ్యము విషయంలో భావించబడునదంతా ... ఆయా వ్యక్తులపట్ల, సంఘటనల పట్ల, పదార్థ జాలముపట్ల ఏర్పడియున్న అభిప్రాయ సమూహముల సారమే కదా! (It is all the essence or "culmination of opinions" on persons, incidents and matters). కాని అవన్నీ క్షణక్షణం మార్పు చెందుచూనే ఉన్నాయి. పైగా వాటి మూలము కల్పనయే. కల్పననుసరించే ఈ జాగ్రత్ వ్యవహారమంతా ప్రాప్తించుట జరుగుతోంది. "అనుభవ పరంపరలు" ఏర్పడుచుండగా, మరొక దృష్టిచే .... "ఇదంతా స్వప్నమువలె అసత్యము" .... అనటం మా అనుభవం ప్రకారం సమంజసమే అయివున్నది.

❖

సృష్టి ప్రారంభమునకు ముందు ఉన్నట్టిదేది? సృష్టిరహితమగు శుద్ధచైతన్యము కదా! అట్టి "నిర్మల–అఖండ–అద్వితీయ" చైతన్యము నుండి సమష్టి–సృష్టి స్వరూపముగా స్వయంభువు (Self creator) లేక సమష్టి మనస్సు స్వప్నతుల్యుడై, అనుభవాత్మకుడై ప్రకాశించుచున్నాడు. అట్టి 'స్వయంభువు'

---

* చిత్ = సర్వము గ్రహించునట్టి శుద్ధతత్త్వము;

యొక్క సంకల్పరూపమున జనించిన ఈ జగత్తు కూడా స్వప్నతుల్యమే! "సమష్టి జీవుడు, - అతనిచే రచించబడిన ఈ విశ్వము - స్వప్నతుల్యములే" .... అని ఉత్తమ పరిశీలకులగు వేదాంత శాస్త్రకారులు సిద్ధాంతీకరించుచున్నారు.

అయితే ఇక్కడ "నేను-నీకు, నీవు-నాకు" సత్యమైనవారుగా ప్రాప్తిస్తున్నట్లు, జగత్తులో ఒకరు మరొకరికి సత్యమువలె ప్రాప్తిస్తున్నారు. "స్వప్నంలో కనబడే నగరవాసులు సత్యము కాదు" అని అనుకొందాము? మరి అట్టివారే అయినట్టి ఈ జాగ్రత్ జగత్తులో అనుభవమయ్యే 'నీవు-నేను' మొదలైనవి సత్యముకానివిగానే అయివుండాలి సుమా!

నావద్ద నీవు సత్యాత్ముడవై ప్రాప్తిస్తున్నట్లే, తదితరములు కూడా 'సత్యాత్మ' అయి ప్రాప్తిస్తున్నాయి. కనుక "ఇక్కడ భ్రమ ఏది? సత్యమేది?" అనునది విభాగించబడినప్పుడు కానీ ఈ జాగ్రత్ యొక్క వాస్తవస్వభావం మనకు అవగతం కాదు. "స్వప్నములో సంసారము సిద్ధించుచున్నది" అనగా, "అప్పటికి అదంతా సత్యమువలెనే ప్రాప్తిస్తున్నది" అనే అర్థం. అందుకు ఈ వర్తమానంలో సత్యమై ప్రాప్తిస్తున్న 'నీవు-నేను' అనునవే దృష్టాంతము (లేక ప్రమాణం).

ఈ విశాలమగు స్వప్నసంసారమున నేను నీకు సత్యమైనట్లు, నీవు కూడా నాకు సత్యమగు చున్నావు. అనగా నీవు నీ స్వప్నమున నన్ను గురువుగా, బోధకుడుగా పొందుచున్నట్లే, నేను నా స్వప్నమునందు నిన్ను దశరథమహారాజు కుమారునిగా, నా ప్రియ శిష్యునిగా, నాకిష్టునిగా నిన్ను గాంచుచున్నాను. వాస్తవానికి శుద్ధ-వ్యాపక- అద్వితీయ చైతన్యము అఖండమై, నీ-నా స్వరూపాలుగా వెలయుచున్నది. దానికి వేరుగా కనబడేదంతా స్వప్నమాత్రమే! "ఇది స్వప్నమాత్రము" అను విషయం సత్యదృష్టి దృఢతరమగుచుండగా స్వయంగా అవగతం కాగలదు.

**శ్రీరాముడు :** మహర్షీ ! ఈ జాగ్రత్‌లోని 'నీవు-నేను' మొదలైనవి అధిష్ఠానమగు చైతన్యదృష్టిచే సద్రూపములేకదా! స్వప్నము కూడా ఇట్టిదేకదా! స్వప్నద్రష్ట మేల్కొనిన తరువాత స్వప్నములో చూడబడిన నగరాదులు అట్లే ఉంటాయా? లేక స్వప్న ద్రష్ట మేల్కాంచగానే అవన్నీ తొలగిపోతాయా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ద్రష్ట ఎక్కడుంటే అక్కడ ద్రష్టను అనుసరించే జాగ్రత్‌గాని, స్వప్నము గాని ఉంటుంది. 'జాగ్రత్'గా దేనినైతే నీవు గ్రహిస్తున్నావో .... అదంతా నీవు ఆ విధంగా సంకల్పించుట చేతనే అట్లు లభించుచున్నదని గ్రహించు. చైతన్యము తనను తాను ఇంద్రియానుభవమాత్రంగా ఖండితముగా దర్శించుచున్నప్పుడు అనగా తనను తాను పరిమితమైనదానిగా దర్శించునప్పుడు .... ఆ సమయంలో ఇంద్రియానుభవములపట్ల ఏర్పడియున్న ఘనీభూతమైన భావనయే 'జగత్తు' అని చెప్పబడుచున్నది. స్వప్న దేశకాలాదులు ... జాగ్రత్ దేశకాలాదులు .... ఇవన్నీ "ఇవి ఇట్లు" అని భావించు దృష్టిలోనే ఏర్పడి ఉంటున్నాయి సుమా!

మరొక చమత్కారమేమంటే, అనేకులు ఒక విషయమును ఒకే తీరుగా దర్శించుచు స్వప్నము పొందుచుండటం జరుగుతోంది.

ఒకానొక స్వప్నద్రష్ట యొక్క స్వప్నములోని వ్యష్టిచైతన్యము, ఆ స్వప్నం త్యజించబడిన తరువాత కూడా, ఉనికిని పొందియుండటం జరుగుతూ ఉంటుంది. ఈ విషయం మనం ముందు-ముందు చర్చించబోతున్నాం. 'మాయ'లో సాధ్యము కానిదేది? ఇవన్నీ స్వతహాగా సత్యములు కాకపోయి నప్పటికీ సత్యముల వలెనే వెలయుచున్నాయి. స్వప్నంలోని 'స్త్రీ సంగమము'వలె మోహమును వెలయుచున్నట్లు తోచుచున్నప్పటికీ .... చైతన్యము దేశకాలాది సంకల్పములను అంగీకరించుట చేతనే ఈ మాయాజాలమంతా ప్రాప్తిస్తోంది. మరల జ్ఞానభావన వికసించటంచే సర్వత్రా అకృత్రిమమగు సమరసభావన వెల్లివిరుస్తోంది. చిదాకాశమే తనయందు 'జగత్తు' యొక్క స్వప్నము కలిగియుండి, ఆ స్వప్నములోని "నీవు-నేను" .... అనబడు పదార్థజాలమంతా తానే అయి, ప్రకటన-అప్రకటనలను నిర్వర్తించుచున్నది. ఇది మాత్రమే ఇక్కడ ఉన్న విశేషం, సన్నివేశం కూడా!

❖❖❖

# 28. యుద్ధరంగ ప్రవేశం

ఆ విధంగా జ్ఞప్తిదేవి కరుణచే విదూరథుని హృదయం జ్ఞానామృతంతో నిండిపోయింది. వివేకము అంకురించింది.

**శ్రీ సరస్వతీదేవి :** ఓ రాజా! అంతా గ్రహించావు కదా! ఈ లీలకు జ్ఞానబోధ చేయు నిమిత్తమే ఇక్కడకు తీసుకువచ్చాను. ఈమె ఇప్పుడు దృష్టాంతపూర్వకంగా "ఈ బ్రహ్మాండకల్పన అంతా మిథ్య మాత్రమే" అని గ్రహించినది. మేము వచ్చినపని పూర్తి అయినది. నీకు శుభమగుగాక! ఇక మేము సెలవు తీసుకుంటాము.

**విదూరథుడు :** అమ్మా! జ్ఞప్తిమాతా! మానవులలో ఉత్తములైనవారి దర్శనభాగ్యమే వ్యర్థముకాక, శుభము ప్రాప్తింపజేస్తుంది కదా! ఇక కరుణాసముద్ర స్వరూపిణివగు నీ దర్శనము వృథా అవుతుందా? లేదు. నీ ఆజ్ఞ ప్రకారమే సర్వము జరుగుతుంది. ఒకడు ఒక స్వప్నము నుండి మరొక స్వప్నమునకు వెళ్లునట్లు ... నేను ఈ దేహమును పరిత్యజించి నీ సంకల్పానుసారం పూర్వదేహమును గ్రహిస్తాను. నిన్ను దర్శించినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. నేను సర్వదా నీకు శరణాగతుడనే. నాదొక విన్నపం. ఉత్తములకు తమను ఆశ్రయించిన వారిని త్యజించటం తగదు కదా! అందుచేత, నేను వెళ్ళబోవుచోటికి నా ఈ మంత్రి, మహారాణి కూడా వచ్చేటట్లు అనుగ్రహించు.

**శ్రీ సరస్వతీదేవి :** అటులనే అగుగాక. ఈ రణరంగమున నీవు మరణించవలసి ఉన్నావు. మీరు 'ఆతివాహికదేహం'చే పద్మని నగరం చేరబోవుచున్నారు. అక్కడ జీవచ్ఛవమై, శరీరమాత్రమై పడివున్న నీ దేహము పొందుతావు. అక్కడ నీ మంత్రిని, మహారాణిని కూడా పొందుతావు. ఆపై యథాతథంగా రాజ్యం ఏలుతావు.

మేము ఎట్లు వచ్చామో అట్లే మరలగలము.

❖

ఆవిధంగా వారు సంభాషించుకొంటూ ఉండగా, ఇంతలో ఒక సైనికుడు అక్కడికి వచ్చాడు. "ప్రభూ! సముద్రము లాంటి శత్రుసైన్యము ఈ వైపునకు వస్తోంది. మన నగరము నాలుగు వైపుల నిప్పు అంటుకొని 'ఛటఛట' ధ్వనులతో తగులబడిపోతోంది" అని చెప్పసాగాడు.

కోలాహలం మిన్నుముట్టింది. ఒక్కసారిగా పురజనుల గావుకేకలు, అగ్నిశిఖల 'ధగధగ' ధ్వనులు వినవచ్చాయి. ఆకాశమంతా పొగతో నిండిపోయింది. కర్కశ శబ్దఘోషలతో స్త్రీలు, బాలురు, తదితరులు రోదించసాగారు. ఆ అగ్ని ఎంతో రాజసంపదను బూడిద చేసింది. సజ్జనుల మనస్సులలో ఉపదేశములు దాగివుండునట్లు, కొందరు జనులు తగులబడుచున్న ఇళ్ళను వదలి ప్రశాంతమగు కొండగుహలలో సకుటుంబముగా పరుగులు తీసి దాగుకొనియున్నారు. మరికొందరు అగ్నికి ఆహుతి అయిన తమ బంధువుల కళేబరములను వదలి ఈవలకి రాలేకపోతున్నారు. ఆహాఁ! ఈ ప్రాణులను మమకార బంధములు ఎంతగా కట్టి పడేస్తాయి! సైనికులు కూడా "మమ్ములను రక్షించేవారెవరూ లేరా?" అని ఆ అగ్నిశిఖల మధ్యలోంచి ఆక్రందనం చేస్తున్నారు.

❖

ఇంతలో రాజ పట్టమహిషి తన చెల్లికత్తెలతో రాజప్రసాదం ప్రవేశించి, రాజును సమీపించింది. చెలికత్తెలు, "ఓ రాజా! ఆయుధములు ధరించి శత్రుసైనికులు అంతఃపురంలో అకస్మాత్తుగా ప్రవేశించారు. మీ భార్యలనందరినీ బంధించి గొనిపోయారు. శాఖ-ప్రశాఖలుగా విస్తరిల్లుచున్న ఈ ఆపదల నుండి మమ్ము రక్షించేశక్తి మీకొక్కరికే ఉన్నది" అని రోదిస్తూ చెప్పుకోసాగారు. అప్పుడు రాజు లీలాసరస్వతుల వైపు చూచి, "ఓ దేవతలారా? నేను యుద్ధసన్నద్ధుడనై వెళ్ళుచున్నాను. నా శత్రురాజులు యుద్ధనీతిని అతిక్రమించి అంతఃపురంలో సైన్యప్రవేశమునకు ఉద్యుక్తులైనట్లున్నారు. ఇక విజయమో, వీరస్వర్గమో తేల్చుకోక తప్పదు. మిమ్ములను విడచి వెళ్ళుచున్నందుకు క్షమించండి. నా భార్యను రక్షించే భారం మీదే" అని పలికి వినమ్రతగా నమస్కరించాడు. ఆయుధ పాణియై భీకరంగా గర్జనచేస్తూ యుద్ధభూమివైపు తరలివెళ్ళాడు. అతని రాకకై వేచియున్న సైనికులు అతనిని అనుసరించారు.

లీలాదేవి యుద్ధభూమికి తరలివెళ్ళుచున్న విదూరథుని వైపు నుండి దృష్టిని మరల్చి రాజ పట్టమహిషి వైపు చూచింది. ఎంత ఆశ్చర్యం! ఆ పట్టమహిషి అచ్చు తనలాగానే .... తన ప్రతిబింబమా అన్నట్లున్నది.

❖❖❖

## 29. చిత్తము ఎట్లా ఉంటే .... దృశ్యము అట్లే!

**లీలాదేవి :** అమ్మా! జగన్మాతా! ఇది గమనించావా? ఈ మహారాణిని చూడు. పద్మని రాజ్యంలో నేను ఏ రూపము కలిగి ఉన్నానో, ఈమె కూడా అచ్చు అదే రూపము కలిగి ఉన్నదేమిటి? దీనికేమైనా ప్రత్యేక కారణమున్నదా? ఇది కాకతాళీయమా? ఇక్కడి మంత్రులను, సామంతులను చూస్తుంటే "ఇదంతా పూర్వరాజ్యమే" అన్నట్లు తోచుచున్నది? అద్దంలో ప్రతిబింబించే దృశ్యంలాగా

వీరు నా 'వెలుపల-లోపల' కూడా ఉన్నట్లున్నారే? వీరంతా సచేతనులా? లేక కల్పిత రూపము కలవారా?

**శ్రీ సరస్వతీదేవి :** హృదయంలో .... వ్యక్తులకు, వస్తువులకు సంబంధించిన జ్ఞానం- కలుగుచున్నది కదా! అదేవిధంగా క్షణకాలంలో అనుభూతులు కూడా కలుగుచూ ఉంటాయి. స్వప్న సమయంలో వస్తువులను, వ్యక్తులను, సంఘటనలను చూస్తున్న చిత్తమే .... ఆయా రూపములన్నీ స్వయముగా ధరించి వ్యవహరిస్తోంది. అంతేకాని స్వప్నంలో చిత్తమునకు వేరైనది, బాహ్యమైనది ఏ సమయమందు ఏదీ లేదు.

చిత్‌శక్తియే చిత్తముయొక్క ఆకారమును పొందుచున్నది. చిత్ చైతన్యము అను దర్పణమును అనుసరించే ఈ 'జగత్తు' అను దృశ్యము అందు ప్రతిబింబిస్తోంది. చైతన్య దర్పణమును అనుసరించే దృశ్యముయొక్క అనుభవం ఉండి ఉంటోంది.

1. కుంభాకార (Concave Lense) దర్పణంలో పెద్ద దృశ్యము చిన్నగా కనబడుతోంది.
2. పుటాకార (Convex Lense) దర్పణంలో చిన్నవి పెద్దవిగా కనిపిస్తాయి.

సంస్కారము ఎట్టిదై ఉంటుందో ... చిత్తమున ప్రతిబింబించే జగత్తు కూడా అట్టిదే అవుతుంది.

వాస్తవానికి చిత్‌చైతన్యము సర్వావస్థలందును (జాగ్రత్ - స్వప్న - సుషుప్తులందును) మధ్యస్థమైయున్నది. కాని, అది ఎక్కడో బాహ్యమున ఉన్నట్లుగా తోచుచున్నది. స్వప్నంలో కనబడే వస్తువులే ఇందుకు మనకు దృష్టాంతము. స్వప్నపదార్థజాలమంతా అంతరముననే ('with-in' only) ఉన్నప్పటికీ ఎక్కడో బయటగా ఉన్నట్లు తోచుచున్నది కదా! ఓ లీలాదేవీ! కొంత సూక్ష్మబుద్ధితో విను.

"జగత్తు" అనగా ఎక్కడో బాహ్యమున ఉన్నది కాదు. అంతఃపరికల్పితమైన దృశ్యావ గాహనయే (Internally or Inwandly visualised perception) బాహ్యజగత్తువలె ప్రాప్తిస్తోంది. కాబట్టి ఈ జగత్తు అనబడునది బాహ్యమున కాకుండా అంతరంగము నందే భావనారూపమున ఉండియున్నది.

అట్టి అంతఃపరికల్పితమైన ఈ జగత్తే ఎక్కడో బయట ఉన్నట్లు తోచుచున్నది.

**లీలాదేవి :** అమ్మా! నీవు చెప్పేది అత్యంత చమత్కారంగా ఉన్నది సుమా! "ఈ మాచే చూడబడేదంతా వాస్తవానికి మేము మా అంతరముననే కల్పనా వ్యవహారముచే అట్లు గాంచుచున్నాము" అని నీవు ప్రతిపాదిస్తున్నట్లున్నావు. కాని మేము వాస్తవానికి ఇదంతా బాహ్యముననే ఉన్నట్లు పొందుచున్నామే? ఎందుచేత?

**శ్రీ సరస్వతీదేవి :** అట్లు తోచుటకు (లేక పొందుటకు) కారణమేమిటో చెపుతాను. విను.

"ద్రష్ట-దృశ్యము" .... ఈ రెండూ చైతన్యమే కదా! కనుక "స్వస్వరూపము .... ఈ నేను - నీవు - జగత్పదార్థములతో కూడిన జగత్తు" .... ఇదంతా వాస్తవానికి శుద్ధ చైతన్యమునకు వేరైనది కాదు. అయితే చైతన్యము సర్వవ్యాపకము కదా! అందుచేత "అంతరముననే తోచుచున్న మిథ్యాజగత్తు

చిరకాలపు అభ్యాసం వలన, ఎట్టి ఆటంకము లేకుండా, బాహ్యమున సంస్థితమైన వ్యవహారమువలె తోచుచున్నది" .... అని గ్రహించు. "ఈ దృశ్యప్రపంచము ఇట్లు బయటగా ఇప్పటికిప్పుడే చూస్తున్నాను" అని ఈ జీవుడు అనేక జన్మల అభ్యాసవశంచేత దృఢంగా భావించుటచే అది అతనికి అట్లే ప్రాప్తించుచున్నది కాని, "ఇదంతా నా అంతరంగమే ఇట్లు గ్రాహ్య విషయముగా కల్పించి, దర్శించుచున్నది" .... అనునది గ్రహించలేకున్నాడు. తాను ఎచ్చటికైతే ప్రసరించడో అచ్చట అతనికి ఏ అనుభవం ఏర్పడియే ఉండదు. అయితే ఈ జీవుడే ఒకానొకప్పుడు గురువాక్యశ్రవణ ప్రభావం చేతనో, లేక, శాస్త్రబోధ గ్రహించటం చేతనో, లేక స్వవిమర్శచేతనో .... లేక ఈ మూడిటి సమన్వయం చేతనో .... "ఈ చూడబడునదంతా నా అంతరంగమునందే చిత్తముచే సంస్కారరూపమున ఇట్లు అనుభవమగుచున్నది" అని గ్రహిస్తున్నాడు. అట్టి అవగాహన సుస్థిరపడగా అభ్యాసవశం చేత .... "ఔను! నేను చైతన్యమే స్వరూపముగా గలవాడను. ఈ సర్వము కూడా చైతన్యమే. చైతన్యము కంటే వేరుగా 'నేను-నీవు-జగత్తు' అనునవి లేవు" .... అను చైతన్యానుభవం పొందుచున్నాడు. అదియే దివ్యమగు స్వస్వరూపానందానుభూతి. అట్టివాడు మోక్షస్వరూపుడే అగుచున్నాడు. అట్టి అనుభవజ్ఞానము గల జీవుడే శివ స్వరూపుడై శేషిస్తాడు.

❖

ఇప్పుడు, ఈ మహారాణి – ఈ మంత్రులు ఇతఃపూర్వపు రాజ్యములోని వారివలె ఎందుకు ఉంటున్నారో చెపుతాను. విను.

నీ భర్త ఇతఃపూర్వము మరణించియున్నాడు కదా! అట్లు 'పద్ముడు'గా మరణించినప్పుడు శేషించియున్నట్టి సంస్కారములను అనుసరించే, అతడీరూపములను గ్రహించినాడు. మహారాణి విషయమే కాకుండా, మంత్రుల విషయంలో కూడా అట్లే జరిగింది. అతడు ఇప్పుడు కూడా "ఈ నా మంత్రి నా వెంటనే ఉండును గాక" అని నన్ను అభ్యర్థించటం విన్నావు కదా! అయితే వీరందరు మునుపటివలెనే అగుపడుచున్నప్పటికీ "మనస్సు – బుద్ధి – అహంకారము"ల దృష్ట్యా వీరు వారికి అభిన్నులనుకొంటున్నావా? కాదు. వీరు వేరైనవారే. అయితే చైతన్యమునందు వీరంతా 'సద్రూపులే' సుమా!

జాగ్రత్‌లో అనుభూతములగుచున్న వస్తువులు స్వప్నవస్తువులవలె కాకుండా కొంత సర్వ సాధారణత్వముతో కూడి ఉన్నట్లనిపిస్తున్నమాట నిజమే. కాని, ఈ జాగ్రత్ వస్తువుల సంబంధము కూడా కాలవశంచేత నశిస్తూనే ఉన్నాయి కదా! అనగా "ఏ ఏ సంబంధములు అత్యంత ఘనీభూతము లగు వాస్తవమని ఒక సమయంలో తోచుచున్నాయో, మరొక సమయంలో అవి అట్లు తోచటంలేదు" .... అనే విషయం పసిపిల్లవాడు కూడా గ్రహించగలుగుచున్నట్టి విషయమే. ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు తొలగిపోయే సంబంధాలు 'వాస్తవము' అని ఎట్లా నిర్ణయిస్తాము?, దృష్టాంతానికి – "ఈమెను నేను ప్రేమించాను. ఈమె నా దేవత. ఈమె లేకుంటే నా జీవితమే నిస్సారము" అని భావించబడిన ఒకానొక సంబంధము, మరికొంత కాలం తరువాత, "ఈమె నాకెట్లా ఎందుకు

దాపరించింది?" అను రూపమును కూడా పొందవచ్చును కదా! ఇక ఇక్కడేది వాస్తవం? అయితే ఈ జీవుడు ఎప్పటికప్పుడు .... "ఇది ఇంతే, ఇంత మాత్రమే" అనునట్టి ఘనీభూతభావము కలిగి యుండుటచేత .... ఈ జగద్దృశ్యము యొక్క చంచలత్వమును, అసత్యత్వమును గ్రహించ లేకపోవు చున్నాడు. అన్నిటికీ కారణం అవిచారణయే సుమా! దూరదృష్టి గల జ్ఞానులగు మహనీయులకు ఈ వర్తమానజగత్తులోని అసత్యత్వము, స్వప్నదృశ్యమువలెనే బుద్ధియందు సుస్పష్టముగా తోచుచున్నది.

ఓ లీలాదేవి! మన ఈ విచారణను అనుసరించి "స్వప్నజాగ్రత్తులలో అనుభూతమగుచున్న వస్తుజాలమంతా, 'నాస్తిత్వము' అను గతియే కలిగియున్నది" .... అని తెలియవచ్చుచున్నది.

**"స్వప్నే జాగ్రదసద్రూపా స్వప్నో జాగ్రత్యసన్మయః"**




స్వప్నకాలంలో జాగ్రత్ 'అసత్తు' అగుచున్నట్లే, జాగ్రత్‌కాలంలో స్వప్నము 'అసత్తు' అగుచున్నది. అట్లే సూక్ష్మబుద్ధితో మరొక విషయం కూడా విను : జన్మించిన క్షణం నుంచి మృత్యువునకు సంబంధించిన స్థితి అసద్రూపమే అగుచున్నది కదా!




అట్లే మృత్యుసమయంలో ఈ జన్మయందలి అనుభవములు స్వప్నమాత్రంగా 'అసద్రూపములు' అగుచున్నాయి. వస్తువులు ధ్వంసమగుచున్నప్పుడు .... మొట్టమొదట ఆ వస్తువు యొక్క అవయవములు వినష్టమౌతున్నాయి. ఆ తరువాత క్రమంగా ఆ వస్తువు యొక్క అభావం సిద్ధిస్తోంది. అట్లు ఆ వస్తువు తొలగిపోతున్న సమయంలో ఒకానొక విపర్యానుభవం (Altogether a different state of Experience) కలుగుచున్నది కదా! అట్లే (1) జన్మకు ముందు ఎదురుగా ఉండే అనుభవం, (2) జన్మించేటప్పుడు అనుభవం, (3) ఆ శరీరము కలిగియున్నప్పుడు ఏర్పడుచున్న అనుభవం, (4) దేహానంతర అనుభవం ఇవన్నీ ఒకదానిని మరొకటి మ్రింగివేస్తున్నాయి. అయితే లీలా! ఈ అన్ని స్థితి-గతులు ఏ ద్రష్ట యొక్క అనుభవంగా రాక-పోకలు చేస్తున్నాయో ... అట్టి ఆ ద్రష్టయే ప్రత్యగాత్మ స్వరూపుడు. అతడే శుద్ధచైతన్య స్వరూపుడు. అతనికి ఈ జన్మమృత్యువులు ఆపాదించబడజాలవు.

ఓ ప్రియపుత్రీ! లీలాదేవి! ఈ విధంగా ఈ జగత్తు "సత్తు" (ఉండియున్నది that which exists) కాదు. "అసత్తు" (లేకయున్నది : that which does not exist) కాదు. ఇదంతా చిత్తమును అనుసరించి కేవలము భ్రాంతి రూపంగా భాసిస్తోంది. "మహాప్రళయము" అనబడు ఒకానొక స్థితి శాస్త్రములచే బోధింపబడుచున్నది. ఆ స్థితి యందు జీవుడు ఈ జగత్తు, ఇందలి 'నేను-నీవు' మొదలైన పదార్థములు ఉండవు. ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లభించనిది సత్యమెట్లా అవుతుంది. సత్యమైనది త్రికాలములచే (భూత-భవిష్యత్-వర్తమానములచే) అబాధ్యమై (బాధింపబడజాలనిదై, తొలగింపబడజాలనిదై) ఉండాలి. "మరొకప్పుడు లేకపోవునది ఇప్పుడు కూడా ఉండియుండలేదు" అని గ్రహించుటే జ్ఞానము.

అందుచేత, "అధిష్ఠానమగు 'బ్రహ్మము' ఒక్కటే సత్యము" అని గ్రహించు. బ్రహ్మమే ఈ జగత్తు అయివున్నది. ఎందుకంటే, ఆ 'బ్రహ్మము', నందే 'సృష్టులు' అను భ్రాంతులు ఉదయిస్తున్నాయి. సముద్రము నందు తరంగములు లేచుచున్నట్లు బ్రహ్మమునందే ఈ జగత్తులు తోచుచున్నాయి. కానీ - "ఈ 'జగత్తులు' అనబడేవన్నీ ఆకాశములో దృష్టిదోషం చేత కనిపించే కేశములు (వెంట్రుకల వంటి ఆకారములు) వలె మిథ్యమాత్రమే" .... అనటంలో సందేహం లేదు. ఆహాఁ! ఏమి చమత్కారం! ఏమి వైచిత్ర్యం! పెనుగాలియందు వాయువీచికలు లేచి, కొంతసేపు ప్రసరించి, ఇంతలోనే లయించుచున్నట్లు .... ఈ సృష్టులు కూడా ఉత్పన్నములై మరల బ్రహ్మము నందు విలీనములై పోతున్నాయి. అందుచే, లీలాదేవీ! ఆత్మవస్తువునందు ఒనర్చ బడుచున్న ఈ "నీవు-నేను-నీది-నాది-అప్పుడు-ఇప్పుడు" అను విభాగములన్నీ మిథ్యయే అని గ్రహించు. మృగతృష్ణా జలమువలె భస్మప్రాయమై, భ్రమాత్మకమైయున్న సృష్టిపై నీకు విశ్వాసమెందుకో చెప్పు? ఎచ్చటైయితే ఎట్టి భ్రాంతికి ఏమాత్రం చోటు ఉండదో .... అదియే 'పరమపదము' అయివున్నది సుమా!

గాఢాంధకారమువైపు చూచుచున్న అజ్ఞానబాలుడు, "అవును! అక్కడ ఒక దయ్యము నాకు కనబడుతోంది. ఆ కదలికలు దయ్యానివే! అనుమానం లేదు" అనునట్టి భ్రాంతిని పొందుచున్నాడు. "నాయనా! అక్కడ దయ్యమేమీ లేదు. నీ భ్రమయే నీకు అట్లు తోపింపచేస్తోంది. అవన్నీ వెలుతురులో నీవు చూచే చెట్టు, గుట్ట, గోడలే" అని ఎవరైనా చెప్పినా, అతనికి నమ్మకం కుదరకపోవుటచే "లేదు. అది దయ్యమే" అని పలుకుతాడు, చూచావా? అట్లే జనన-మరణములతో కూడుకొనియున్న "అజ్ఞాన-వ్యామోహ ఫలితము" అయివున్న ఈ జగత్తుపై గల అజ్ఞానపూర్వక అభిప్రాయముల వలన ఈ జీవుడు సత్యమేమిటో గమనించలేకపోవుచున్నాడు. దురభ్యాసమే, .... అనగా, "పదార్థములు వాస్తవం. నేను శరీరమాత్రుడను. ఏదో శక్తి చేతిలో కీలుబొమ్మను" .... మొదలైన దురభిప్రాయాల్ని అనేక జన్మలుగా అభ్యసించుటయే అందుకు కారణం. అయితే ఈ 'దురభ్యాసము' "ఆత్మయొక్క స్వభావము నా వాస్తవస్వభావమైయున్నది. మరి నేను ఆత్మనేకదా" .... వంటి "సదభ్యాసము"చే జయింపబడగలదు. ఈ 'జగత్తు' అనబడు భావావేశం జీవునియందు శేషించగా ... అప్పుడు మిగులునది పరమసత్యమగు బ్రహ్మము ఒక్కటే.

"ఈ జగత్తు సత్యము కాదు. నాకు ద్రష్టత్వము లేదు. ద్రష్టత్వమే లేనిచోట దృశ్యమెట్లా ఉంటుంది? కనుక 'నేను' అను రూపమున స్ఫురించుదానితోసహా ఈ సర్వము చైతన్య స్వరూపమగు బ్రహ్మము యొక్క ప్రసరణమే అయివున్నది." .... అనునట్టి జ్ఞానముచే ఈ జగద్వ్యాకులతలు, విపరీత-ధోరణులు తొలగిపోతాయి. అందుకొరకై జీవుడు ఎందుకు ప్రయత్నించరాదో చెప్పు? స్వకీయమగు అజ్ఞానమే అందుకు అడ్డు అగుచున్నది. అజ్ఞానముచే ఉత్తమమార్గములను ఉపేక్షించటం చేతనే ఈ జీవుడు తన వాస్తవ స్వభావమును గ్రహించలేకపోవుచున్నాడు.

'బ్రహ్మము' కాక ఇక సత్యమంటూ మరేదీ లేదు. ఈ దృశ్యము సత్యము కాదు. ఒకే పదార్థము "సత్యము-అసత్యము" .... అనునట్టి రెండు వేరువేరు ధర్మములను పొందలేదు కదా! "మార్పు చెందటం" అను ధర్మము గలిగినట్టి సర్వము విడనాడి "మార్పుచెందని" తత్త్వమును గ్రహించినప్పుడు లభించునదే ఆ బ్రహ్మము యొక్క స్వరూపము.

"ఈ జగత్తుయొక్క మిథ్యాత్వము గ్రహించటం అత్యంత దుర్లభమైన విషయం" అను అభిప్రాయం కలిగి ఉండువారితో మేము ఏమాత్రం ఏకీభవించటం లేదు.

❖

**లీలావతి :** అమ్మా! అసలు ఈ జగత్తు యొక్క నిజరూపమేమిటి? అట్టి దీని నిజరూపమును గ్రహించగలిగేవారెవరు? మేము ఇందు గ్రహించవలసినదేమిటి? త్యజించవలసినదేమిటి? జననీ! "ఈ జగద్వ్యవహారములు మమ్ము పట్టి పీడించు చుండగానే మేము పరమాత్మను గ్రహించగలమా?" .... అను సందేహం మమ్ము వదలటం లేదు.

**శ్రీ సరస్వతీదేవి :** ద్రవ్యాదులందు, ఆకాశమునందు పరమాణువులే ఉన్నాయి కదా! ఆ పరమాణువుల మధ్యగల చైతన్యతత్త్వమే ఈ జగత్తు యొక్క, నిజరూపము సుమా! అయితే, అణు సముదాయ మాత్రముచే బాహ్యేంద్రియములకు లభిస్తున్న ఈ నామరూప వ్యవహారము ఈ జగత్తు యొక్క వాస్తవ స్వభావముగాని, రూపముగాని ఏమాత్రం కాదు. ఆకారాదులుగా ప్రాప్తించేదంతా 'మిథ్యయే' అని గ్రహించు. ఈ "నేను-నీవు-పదార్థములు" .... అనునదంతా వాస్తవముగా ఉన్నది కాదు. కాని, 'భ్రమ' కారణంగా అనుభూతమగుచున్నది.

ఇక, ఈ జగత్తు యొక్క వాస్తవస్వరూపము 'బ్రహ్మము' అని గ్రహించునది కూడా బ్రహ్మమే అగుచున్నది. బ్రహ్మమే బ్రహ్మమును గ్రహించగలదు. బ్రహ్మము కానిదేదీ బ్రహ్మమును గ్రహించ జాలదు. (బ్రహ్మైవ పశ్యతి బ్రహ్మన్! నాఽబ్రహ్మన్ బ్రహ్మపశ్యతి) చిదాత్మయే తన వాస్తవ స్వరూప స్వభావములను మరచి తన తత్త్వమునే జగత్తుగా గాంచుచున్నది.* మరొకప్పుడు ఆ చిదాత్మయే తన స్వరూప స్వభావములను ఎరిగి, అట్టి ఎరుకయొక్క దృఢత్వముచే ఈ జగత్తును అద్వితీయమగు స్వస్వరూపముగా గాంచుచున్నది.

---

* "నారుద్రో రుద్రమర్చతి" ..... రుద్రుడు కానివాడెవ్వడూ రుద్రుని అర్చించజాలడు .... అను రుద్రంలోని వాక్యార్థం ఇదే.

అందుచేత ఓ లీలాదేవి! నీవు బ్రహ్మముయొక్క తత్త్వమును గ్రహించుటకే ప్రయత్నం చేయి. "ఇది మాకెట్లు సాధ్యం? మరెప్పుడో, ఎక్కడో ఈ విషయం యోచిద్దాం" .... ఇట్టి అజ్ఞాన దృష్టి నీవు పొందకుండెదవు గాక!

సూర్యోదయమైనప్పుడు కిటికీ గుండా, ఇంట్లోకి ప్రవేశించి సూర్యకిరణాలలో 'త్రస రేణువులు' పరిభ్రమిస్తాయి, చూచావా? అదేవిధంగా 'పరమాకాశము' అనబడు దానియందు "బ్రహ్మాండ సమూహములు" వంటి అనేక త్రసరేణువులు (ధూళికణములు) పరిభ్రమిస్తున్నాయి. వాయువునందు 'చలనము' ఆ చలనమునందు పుష్పముల నుండి బయలుదేరిన "సుగంధం" ఇమిడివున్నాయి కదా! ఆకాశము నందు 'శూన్యత్వము' అనునది ఆ ఆకాశముయొక్క స్వరూపము-స్వభావము అయివుంటోంది కదా! 'అవయవ హీనము' అయినట్టి ఈ జగత్తు అట్లే బ్రహ్మమునందే ఉండి ఉంటోంది. పైకి సాకారంగా అజ్ఞానదృష్టికి కనబడుచున్న ఈ జగత్తు వాస్తవానికి నిరాకారమైనదే సుమా! అయితే "ఇదంతా నిరాకారము" అను అభ్యాసాన్ని ఆశ్రయించాలి. అట్లు గ్రహిస్తున్న అభ్యాస బలంచేత అతిశీఘ్రంగా సర్వవికారాలు వాటంతట అవే తొలగిపోగలవు.

❖❖❖

# 30. భావాతీతం

**లీల :** "అసలు ఈ విశ్వము ఎక్కడి నుండి వచ్చి ఈ జీవునకు దాపరించింది?"

**శ్రీ సరస్వతీదేవి :** ఇదంతా ప్రాప్తిస్తున్నది నిజభావనాబలము చేతనే. "భావనలన్నిటికీ ఆవల అఖండమై, శుద్ధమైయున్న "శుద్ధచిత్‌తత్త్వము" ... తన వాస్తవ స్వభావములగు అద్వితీయత్వము, సర్వాంతర్యామిత్వము మరచి, స్వకీయ కల్పనలను ఆశ్రయించటం చేతనే అయ్యది ఈ జగత్తు యొక్క అనుభవం పొందుచున్నది" ... అని వేదజ్ఞులు ప్రకటించుచున్నారు.

అందుచేత లీలా! భావనచే ప్రాప్తించినదానిని భావనాబలంతోనే ఎదుర్కోవాలి. ముల్లును ముల్లుతోనే తొలగించాలి కదా! "ఈ జగత్తు పరిపూర్ణబ్రహ్మమునందే నిలిచియున్నది 'పూర్ణమిదమ్' " .... అనునట్టి భావనాబలమునే ఆశ్రయించాలి.

"ఈ జగత్తు అసత్యము" అని చెప్పుటలో, "ఇదంతా లేదు" అని ప్రతిపాదించటం శాస్త్రముల ఉద్దేశం కాదు సుమా! "రజ్జువునందు సర్పముయొక్క అనుభూతివలే .... బ్రహ్మమే అయివుండి స్వతహాగా నిరాకారమైయున్న ఈ జగత్తునందు నీవు భ్రమాత్మకమైన అనేకత్వమును దర్శించుచున్నావు. అట్టి భ్రమను త్యజించు" అనునదే శాస్త్రముల ఉపదేశసారమైయున్నది.

ఒకానొకచోట ఒక మిథ్యాభావం (False impression) అనుభూతమై ఉంటోందనుకో ... ఆ దురవగాహన తొలగేదెట్లా? సత్యాసత్యముల రెండిటినీ సూక్ష్మబుద్ధి - వివేచనములతో పరిశీలించి "ఇది సత్యము ... ఇది అసత్యము ; ఇది గ్రాహ్యము. ఇది త్యాజ్యము" .... అని గ్రహించుటచేతనే కదా! మాయ తొలగింపబడిన తరువాత ... ఇక అప్పుడు "ఈ జీవుడే సర్వమునకు పరమకారణము"

అను విషయం అనుభవపూర్వకంగా తప్పకుండా తెలియవచ్చుచున్నది. ఈ జీవుడు స్వతహాగానే పూర్ణుడు. అయితే 'నేను జీవుడను' అను జీవభ్రాంతివలననే జీవత్వము ప్రాప్తిస్తోంది. ఈ జగత్తు సత్యమవనీ! కాకపోనీ! ఏది ఏమైనా ఇది చిదాకాశమునందే నెలకొనియున్నది. మోక్షస్వరూపులమగు మేము అట్టి అనుభవమునే కలిగియుంటున్నాము. మమ్ములను ఆశ్రయించు మా భక్తులకు అట్టి విజ్ఞాన యోగమునే ప్రసాదించుచున్నాము. బోధించుచున్నాము.

అసలు ఈ సంసారము యొక్క ఉత్పాదనమునకు మూలకారణం ఏమిటి? "జీవుని యందుగల భోగేచ్ఛయే ఇందుకు మూలకారణము" .... అని చెప్పబడుచున్నది. వాస్తవానికి ఈ "సృష్టి" అనబడు దానికి, ఇందలి సత్యత్వ–మిథ్యత్వములకు సంబంధమే లేదు. ఒక విషయం సత్యము కావచ్చు. మిథ్య కావచ్చు. ఇందులో గొప్ప విశేషమంటూ ఏదీ లేదు. కాని .... "ఇది పొందినప్పుడే నేను సంతోషము పొందువాడనగుదును. లేకున్న దుఃఖితుడను" అను రూపముగల భోగేచ్ఛావృత్తియే సర్వసంసారానర్థములకు ఉత్పత్తిస్థానమగుచున్నది. అనగా, ఈ జీవుడు స్వయముగా శివస్వరూపుడై ఉండి కూడా, తనకుతానే 'ఇచ్ఛ' అను దోషముచే, లేక, "కోరుకొను విషయములు" అను దోషధూళిచే కప్పబడి ఉంటున్నాడు. ఆ ఇచ్ఛలే తదనంతరము అతనికి ఇష్టాయిష్టములుగా, సుఖ–దుఃఖములుగా ప్రాప్తిస్తున్నాయి. ఆ అనుభవం ఒక్కొక్కప్పుడు సంపూర్ణంగా మునుపటివలెనే ఉంటోంది. మరొకప్పుడు ఒకింత పోలికతోనూ, ఇంకొకప్పుడు పూర్తి వ్యతిరిక్తముగానో ఉంటోంది. చూచావా! లీలా! 'ఇచ్ఛ'ను అనుసరించి దృశ్యము పొందబడడం ఈ జీవుని 'సత్యసంకల్పత్వ న్యాయము'ను నిరూపించుచున్నది. కాని, ఈ 'అనుభవములు' అనబడునవన్నీ మిథ్యా స్వరూపములే అయివుండి, జీవాకాశమును ఆశ్రయించుకొని ఉంటున్నాయి.

❖

ఈ జీవుని ఇచ్ఛా–సంకల్పముల బలమును అనుసరించి కొన్నిసార్లు శరీరత్యాగానంతరం కూడా వెనుకటివలెనే యత్నములు, సంబంధములు, వ్యక్తులు మొదలైనవి సంభవింపజేసు కుంటున్నాడు. అట్లు జరుగునట్లే మన ఈ విదూరథుని విషయంలో మంత్రులు భార్య మొదలైనవారు ఇతఃపూర్వమువలెనే ప్రతిభాసించటం జరుగుతోంది. అయితే అట్టి ఈ సంసార వ్యవహారమంతా సత్యస్వరూపమగు ఆత్మయందు ఏర్పడి ఉంటోంది. "ఇది సత్యము" అని ఎట్లు ఏది సంకల్పించ బడుచున్నదో, అది అట్లే వాస్తవమై ప్రాప్తించుచున్నది. విదూరథుని శుద్ధ సంకల్పతత్త్వమగు ఈశ్వరుని ఇచ్ఛను అనుసరించే ఈ పట్టమహిషి లీల అచ్చు నీ వలెనేయున్నది. సర్వమునందు ఏకరీతిగా ప్రసరించి ఉండే ఆత్మచైతన్యమునందు ఇట్లు 'ప్రతిభ' సర్వదా ప్రతిబింబిస్తూనే ఉన్నది. ఆయా రూపములన్నీ ఆయా అంతరంగ భావనాబలం అనుసరించే ఉదయిస్తూ ఉంటాయి. జీవాకాశమునందు మొట్టమొదటగా సంకల్పము ఉదయించి, ఆ తరువాత క్రమంగా ఆ సంకల్పమే బాహ్యమునందు ఇట్లు దృశ్యరూపమున గాంచబడుచున్నది. అంతరంగమున ఉన్నదే బాహ్యమున ప్రకాశించుచున్నది సుమా!

ఓ లీలాదేవి! నీవు, నేను, ఆకాశము, పృథివి, ఈ రాజు, ఇతని పట్టమహిషి, మంత్రులు .... మొదలైనవన్నీ చిన్మాత్రమే స్వభావముగా కలిగినవై అహంభావము నందు స్ఫురించుచున్నాయి. ఈ జగత్తులో కనబడేదంతా 'సత్త' మాత్రస్వభావము కలిగియుండుటచేత, తత్త్వజ్ఞులు "ఈ జగత్తంతా చిదాకాశము యొక్క గర్భమునందే, వాయువునందు స్పందమువలె, ఉండివున్నది" అని చెప్పు చున్నారు. ఇది గ్రహించినప్పుడే, నీ స్వస్వభావము ఏమిటో కూడా గ్రహించి, స్వస్థురాలవు అవుతావు.

❖❖❖

# 31. ఆరాధన - లక్ష్యార్థం

ఇంతలో, క్రోధావేశంతో ఆయుధములు ధరించి యుద్ధరంగమునకు వెళ్ళుచున్న తన భర్తను చూస్తూ ఉన్న "ద్వితీయలీల (విదూరథుని పట్టమహిషి) అతడు కనుమరుగు అవగానే, తన దృష్టిని మరల్చి ఆ ప్రక్కనే ఉన్న సరస్వతీదేవిని చూచింది. వెంటనే ఆమెను సమీపించి ప్రణామం చేసింది.

**ద్వితీయలీల :** హే మాతా! అప్సరసవలె, దేవతామూర్తివలె, కరుణారసమూర్తివలె వెలుగొందుచున్న మీరెవ్వరు? నేను ప్రతిరోజు జ్ఞప్తిదేవతయగు సరస్వతీదేవిని అర్చిస్తూ ఉంటాను. ఓ అంబా! అట్టి నా ప్రియాతిప్రియమగు హృదయదేవత నీవే అయి ఉంటావనిపిస్తోంది. ఆ తల్లి నాకు ప్రతిరోజు రాత్రిపూట దర్శనం ప్రసాదిస్తూ ఉండేది.... అవును. ఆ పరమపావనిని నీవే. ఈ ఆపత్కాలంలో మమ్ము కాపాడటానికి వచ్చావా? నా తల్లీ! నీకు మరల మరల నమస్కరిస్తున్నాను.

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! విదూరథ పత్నీ! నీవు యావజ్జీవితము నాపట్ల చెల్లించిన భక్తి ప్రపత్తులకు నేను ఎంతగానో మెచ్చుకొంటున్నాను. అందుచేత నిశ్చింతురాలవు కమ్ము. నీ ఇచ్ఛ వచ్చిన వరం కోరుకో.

**ద్వితీయలీల :** దేవీ! ఒకవేళ, నా భర్త విదూరథుడు ఈ యుద్ధంలో పరాజయం చవిచూడవలసివస్తే దేహమును త్యజించి మరొకచోటికి వెళ్ళటం జరుగుతుంది కదా! అతడు ఎక్కడికి వెళ్ళునో అక్కడ నేను ఈ దేహముతోనే అతని భార్యనై ఉండునట్లు వరం ప్రసాదించు.

**శ్రీ సరస్వతీదేవి :** వత్సే! నీవు చిరకాలంగా నిర్విఘ్నంగా ధూప-దీప-పుష్పాదులతో అర్చించావు. అందుచేత నీ కోరిక అట్లే నెరవేరుగాక!

ద్వితీయలీల పరమసంతుష్టురాలై కృతజ్ఞతాపూర్వకంగా ప్రణామం చేసింది. ఇదంతా గమనిస్తున్న పూర్వలీల సరస్వతీదేవి వైపుకు తిరిగి తనకు కలిగిన సందేహం వెలిబుచ్చసాగింది.

❖

**పూర్వలీల :** ఈశ్వరీ! నీవు సత్యసంకల్పురాలివి కదా! నీవంటి సత్యసంకల్పులకు ఏది ఎట్లు సంకల్పిస్తే అది అట్లే సిద్ధిస్తుంది. నాకొక సందేహం వచ్చింది. నీవు నన్ను ఇతఃపూర్వం గిరిగ్రామం తీసుకువెళ్ళునప్పుడు నా పూర్వశరీరముతో తీసుకుపోలేదు. ఆ శరీరమును పద్మని దేహము ప్రక్కనే త్యజింపచేయించావు. ఆతివాహిక దేహముతో (మనోమయరూపముతో) మాత్రమే నీవు-నేను

కూడా గిరి గ్రామం వెళ్ళాము. నీవు అప్పుడు అట్టి నిర్ణయం ఎందుకు తీసుకొన్నావు? ఇప్పుడు ఈ ద్వితీయ లీల విషయంలో భౌతిక దేహంతో భర్తను ఉత్తరలోకములవరకు అనుసరించటానికి అనుజ్ఞ ఇస్తున్నావే? ఎందుచేత?

**శ్రీ సరస్వతీదేవి :** ఓ వరవర్ణనీ! నీ ప్రశ్న ఉత్తమమైనదే. కాని, "సరస్వతీదేవి" అను నామ-రూపములతో మీరు ఆరాధించుచున్న నేను వాస్తవానికి ఎవరిని? "నిష్క్రియతత్త్వమగు ఆత్మవస్తువు"ని మాత్రమే. నేను స్వయముగా ఏదీ చేయను. దేనికీ కూడా కర్తనుకాను. నాకు వాస్తవానికి ఈ నామ-రూపాదులు కూడా లేవు. ప్రతిజీవిలో ఇచ్ఛ-జ్ఞాన స్వరూపిణిగా ఉన్న నాకు భౌతికరూపం ఏమి ఉంటుంది? అయితే ఈ ఈ నామరూపాదులు నన్ను ఉపాసించుచున్న నా భక్తులయొక్క ఉపాసన - ఆరాధనల సౌలభ్యం కొరకు అంగీకరించుచున్నాను. ఈ జీవులు నన్ను ఆరాధించటం ద్వారా చేస్తున్నది. తమతమ స్వస్వరూపారాధనయే. అట్టి ఆరాధనయొక్క ప్రయోజనంగా వారు ఆయా కోరుకొనుచున్న ఫలితములను పొందటం జరుగుతోంది. ఇందులో నేను దేనికీ 'కార్యమును' గాని, 'కారణమును' గాని కాను.

సంవిత్ - స్వరూపమే అధిష్ఠానముగా గలిగినట్టి 'జ్ఞప్తి' అనునదే నా బాహ్యరూపము. జీవశక్తి స్వరూపమగు 'చిచ్ఛక్తి'యే నేను కదా! ఇట్లు నేను సర్వజీవుల అంతరంగము నందు "సాక్షిత్వము" రూపమున ఉండియే ఉన్నాను. అట్లు ఉండి జీవుల వాంఛితములను సత్తమాత్రంచేతనే ప్రకాశితమొనర్చుచూ ఉంటాను. దీపం వెలుగుచుండుట మాత్రంచేతనే తనకు 'ఇచ్ఛ' లేకుండానే గదిలోని వస్తువులనన్నిటినీ ఆ దీపం కనబడునట్లుగా చేస్తోంది. నాయొక్క 'ఉనికి' మాత్రంచేత జీవుల హృదయములోని ఆయా వాంఛిత విషయములు ప్రకాశిస్తున్నాయి. ఏ జీవునియందు ఎట్టి శక్తి ఉదయిస్తోందో, అది అట్లే ఫలించుచున్నది. నేను ఎవరి ఇచ్ఛకు కారణము కాదు సుమా!

**అందరూ ఉపాసిస్తున్నది స్వస్వరూపమునే :**

నీవు నన్ను ఆరాధిస్తున్నప్పుడు, నీయొక్క జీవశక్తి "నేను ముక్తిని పొందెదను గాక" అను రూపమున ఉండి ఉన్నది. దానిని అనుసరించే నీకు ఇంతవరకు ప్రబోధం చేశాను. చేస్తున్నాను. నా ప్రవచనము, చర్చ మొదలైనవాటిచే యుక్తిపూర్వకంగా నీకు దోషరహితమైన భావమును ప్రసాదించుచున్నాను. "ముక్తి పొందాలి" అను అంతరంగము నందలి తీవ్రేచ్ఛ మరియు బుద్ధి ఉండి ఉండుటచే 'చిత్‌శక్తి' ప్రభావంచేత అట్లే ముక్తిని పొందావు. ఎవని పురుషకారము లేక ప్రయత్నశీలత్వము ఏ రీతిగా ఉంటుందో, అతడు ఆ ఫలమునే యథాసమయమునందు, పొందుచున్నాడు. ఓ సూక్ష్మబుద్ధీ! లీలా! వాస్తవానికి "స్వీయచిచ్ఛక్తి"యే, 'తపస్సు'గానో, లేక 'దేవత'గానో అయి, "ఆకాశము నుండి వాలే ఫలములా?" .... అను విధంగా ఆయా మిథ్యా భూతములగు ప్రయోజనములను సిద్ధింపచేయుచున్నది. అయితే ఈ జీవుడు అట్టి సమయంలో కించిత్ భ్రమకు లోనగుచు, "ఈ పేరుగల దేవుడు, ఆ శక్తిగల దేవత, ఈ విధంగా నాకు ఈ ప్రయోజనములను ప్రసాదిస్తోంది" .... అని భావించుచున్నాడు.

అనగా .... ఎవరు, ఏ పేరుతో, ఎట్లు ఆరాధించినా ... అట్లు ఆరాధించబడునది "స్వీయ చిచ్ఛక్తియే" .... అని గ్రహించెదవు గాక! స్వీయచిత్ ప్రయత్నము కాకుండా ఇంకెక్కడా ఏదీ లేదు. "ఆరాధన" అనునది పురుషకారము యొక్క రూపము. అట్టి ప్రయత్నశీలత్వమే ఆయా ఫలములను ఇస్తోంది. అందుచేత నీవు ఏది పొంద గోరుచున్నావో అద్దానికి అనుగుణంగా ప్రయత్నించు. అంతేగాని, నామ-రూప- క్రియాక్రమాదుల భేదదృష్టిచే భ్రమ చెందకుండెదవుగాక.

**స్వసంవిద్యతత్ అన్య న కించిత్ కదాచన ।**
**ఫలం దదాతి తేనాశు! యథేచ్ఛసి తథాకురు ॥**

'చిద్భావము' అనునది సృష్టియందంతటా వ్యాపించియున్నది. దాని యత్నానుసారమే 'ఫలశ్రీ' ఉదయించటం జరుగుతోంది. కాబట్టి ఓ లీలా! ఏది ఉత్తమమో, ఏ మార్గము నందు వ్రతశీలురాల వగుట సముచితమో, శ్రేయస్కరమో, మొట్టమొదట బాగుగా విచారణ చేయి. శాస్త్రములు, గురువులు అందుకు నీకు సహకరించగలరు. ఆ పవిత్రమైన మార్గమును గ్రహించి, అందుకొరకే ప్రయత్నించు. ఈ సంసార భ్రమలను త్యజించి ఆత్మ పథమందు 'అచ్యుత స్థితి'ని ఆశ్రయించు.

❖❖❖

# 32. యుద్ధ విశేషాలు

సరస్వతీదేవి ప్రసాదంచేత పూర్వలీల, ద్వితీయలీల, ఆకాశములోంచి యుద్ధ విశేషాలు గమనించసాగారు. జయజయశబ్దములు వెన్నంటి రాగా, విదూరథుడు తన రథములో శత్రుసేనల మధ్య ప్రవేశించాడు. యుద్ధం అతిభయంకరంగా సాగుతోంది. ఇటు - అటువైపు వారిచే నానా విధములైన శస్త్రాస్త్రములు దోమలగుంపువలె విరజిమ్మబడుచున్నాయి. ఎటువైపు చూచినా ధనుచ్చల చట చట, కవచముల ఝణ ఝణ.... శబ్దములు, సైనికుల యుద్ధోన్మాద-ఘీంకారాలు, హాహాకారాలు వినబడు చున్నాయి. ఆ యుద్ధంలో సింధురాజుదే కొంచెము పైచేయి కావటం ఉభయలీలలు గమనించారు.

**ఉభయలీలలు :** హే జగన్మాతా! ఇదేమిటి? ఈ మన విదూరథుని సైన్యం వెనుకంజ వేస్తూ, "ఓటమిని, చవిచూడబోవుచున్నదా"? .... అని అనిపిస్తోందే? నీ భక్తుడగు విదూరథునికి నీవు తోడు ఉండి-ఉండగా అపజయం కలుగటమా? శత్రువగు సింధుదేశ రాజు విజయము పొందటమా? అట్లు జరగటం అసాధ్యమని మేము అనుకొంటున్నాము.

**శ్రీ సరస్వతీదేవి :** బిడ్డలారా! అదిగో, విదూరథుని శత్రువగు ఆ సింధుదేశ రాజును గమనించారా? అతడు "నేను నా శత్రువులపై విజయము పొందెదను గాక! విస్తారమైన రాజ్యమునకు చక్రవర్తిని అగుదును గాక!" అని కాంక్షించినవాడై నన్ను చాలాకాలం ఆరాధించాడు. అందుచేత అతడే ఈ యుద్ధంలో జయించవలసియున్నది. విదూరథునికి విజయము ప్రసాదించే ప్రసక్తి లేదు. అతడు అపజయమే పొందబోవుచున్నాడు. ఎందుచేతనంటారా? వినండి.

నేను చిత్‌స్వరూపిణిని కదా! అందుచేత ఇచ్ఛ-జ్ఞాన-క్రియాశక్తుల రూపమున అందరి మనస్సులలో ఉండియే ఉన్నాను. ఎవడెవడు ఎట్లెట్లు ఎంతగా ఆరాధించుచున్నాడో, అతనికి అట్టి ప్రయత్నము అనుసరించి అట్టి ఫలమునే ప్రసాదించుచున్నాను. ఎవరు ఏ విధంగా ఏ నామ రూపాదులతో ఆరాధించినా చిచ్ఛక్తి స్వరూపమగు నన్నే ఆరాధించి నట్లగుచున్నది.* అగ్నియొక్క ఉష్ణ స్వభావము మారనట్లు, నా స్వభావము కూడా ఒక్క తీరుగానే ఉంటోంది. నేను సర్వదా, సర్వులందు జ్ఞప్తి తత్త్వమునై (జ్ఞాపకాలను-ఆశయములను స్వరూపంగా కలిగి, ఇచ్ఛాశక్తి స్వరూపిణినై) వెలయుచుండగా ఇక నాకు శత్రువులేమిటి? మిత్రులేమిటి? అందరు నా వారే. అంతయు నాదే. నేను అప్రకటిత చైతన్యమూర్తినై, అందరికీ అధిష్ఠానమునై వెలయుచున్నానని గ్రహించండి.

ఇక ఈ వర్తమాన విషయానికి వస్తే .... ఈ విదూరథుడు, "నేను ముక్తుడనగుదును గాక" అనునట్టి తీవ్రేచ్ఛతో నన్ను ఆరాధించాడు. అంతేగాని, ఈ యుద్ధము నందు విజయము పొందటమనేది అతని ప్రప్రథమ లక్ష్యమై యుండలేదు. అతని ఆరాధనకు ప్రయోజనంగా అతడు ముక్తస్వరూపుడు కాగలడు. ఇతని సరిహద్దు దేశపు సింధురాజు, "నేను ఎట్లాగైనాసరే, ప్రక్కరాజ్యమును జయించాలి. చక్రవర్తిని కావాలి" అని నన్ను ఆరాధించుటచే, అతని పట్ల ఆ ప్రయోజనము అట్లే సిద్ధిస్తోంది. యుద్ధంలో గెలిచిన తరువాత ఈ సింధురాజు చక్రవర్తి అవుతాడు. చాలాకాలం ప్రజారంజకంగా ఈ భూమండలం పాలించబోవుచున్నాడు.

❖

ఆ రోజు యుద్ధం ముగిసింది. మరునాడు మరల యుద్ధం ఆరంభమైనది. త్రిశూలములు, గండ్రగొడ్డళ్ళు, బాణములు, అస్త్రములు .... మొదలైన వాటిచే సంకులసమరం జరిగింది. క్రమంగా ఇరువైపుల సైన్యం పలచబడింది. సింధురాజు-విదూరథ రాజు ఒకరినొకరు ఎదుర్కొన్నారు. వారు అపర నరసింహమూర్తులవలె తమ యుద్ధవిన్యాసాలతో ఆకాశాన్ని కప్పివేశారు. విష్ణువును ఆరాధించి యున్న వారిద్దరు ఒకరినొకరు తీసిపోవుటలేదు. ఆయుధముల శబ్దములతో, ధనుష్టంకారములతో దిక్కులు పిక్కటిల్లాయి.

తన భర్త యొక్క బాణ ప్రయోగ నైపుణ్యం గాంచిన ద్వితీయలీల, "మాతా! దేవీ! చూచావా, నా భర్త యొక్క యుద్ధ విన్యాసం? నా నాథుడు తప్పక గెలుస్తాడు" అని తల త్రిప్పకుండానే చెప్తుకు పోతోంది. అది చూచి పూర్వలీల-సరస్వతులు గుంభనగా నవ్వుకొంటున్నారు.

---

* **యేయథామాంప్రపద్యన్తే తాంస్తథైవభజామ్యహమ్ ।**
**మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥** – *భగవద్గీత*

భగవద్గీత జ్ఞానయోగంలో కృష్ణపరమాత్మ "అర్జునా! ఎవరు ఏ విధంగా నన్ను సేవిస్తున్నారో, వారిని ఆ ప్రకారంగానే అనుగ్రహిస్తున్నాను. వాస్తవానికి ఎవరు ఎట్లు ఆరాధించినా (ఏ రూప-నామములు ఆశ్రయించినా) వారు వస్తున్నది నా వైపుకే" .... అని చెప్పియున్నారు కదా!

ఆ ఇద్దరు రాజులు ఒకరి అస్త్రప్రయోగములను మరొకరు వ్యర్థపరచుచున్నారు. సింధురాజు "మోహనాస్త్రం" ప్రయోగిస్తే అందుకు ప్రతిగా విదూరథుడు "ప్రబోధాస్త్రం" ప్రయోగించి నిర్వీర్యం చేసివేశాడు.

సింధురాజు "నాగాస్త్రం" ప్రయోగించాడు. పదార్థములన్నీ విషపూరితమైనాయి. అందుకు గాను "గరుడాస్త్రం" ప్రయోగించబడింది. సింధురాజు "తమోస్త్రం" ప్రయోగించాడు. అక్కడంతా భయంకరమైన చీకటి క్షణంలో అలుముకున్నది. అందుకు ప్రతిగా "సూర్యాస్త్రం" ప్రయోగించబడింది. అనంతరం సింధురాజుచే ప్రయోగించబడిన "రాక్షసాస్త్రం" .... "నారాయణాస్త్రం" చేత, ఆగ్నేయాస్త్రం .... వారుణాస్త్రం చేత, శోషణాస్త్రం ... మేఘాస్త్రం చేత ఉపశాంతింపజేయబడ్డాయి. అప్పుడు సింధురాజు కోపావేశంతో వాయువ్యాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రముచే జనించిన వాయువీచికలచే విదూరథుని రథం గిఱ్ఱున తిరుగసాగింది. ప్రతిగా 'పర్వతాస్త్రం' ప్రయోగించబడింది. వాయువు యథాతథంగా ప్రశాంతత పొందినది. సింధూరరాజు 'వజ్రాస్త్రం' ప్రయోగిస్తే, అది 'బ్రహ్మాస్త్రం'చే నిరోధించబడింది. వెంటనే సింధురాజు 'పిశాచాస్త్రం' ప్రయోగించాడు. అప్పుడు పుట్టిన పిశాచాలు విదూరథుని మ్రింగటానికి నాలుకలు సాచి సమీపించసాగాయి. వెంటనే విదూరథుడు "పిశాచవశ (వినష్ట) అస్త్రంచే వాటిని నియంత్రించాడు. పిశాచాలన్నీ ధూళిగా మారి నేలరాలాయి. అప్పుడు సింధురాజు ప్రయోగించిన 'రూపికాస్త్రము' నుండి పుట్టిన భూత-ప్రేత గణం తన సైన్యంపై ఉరకటం గమనించిన లీలాపతి బేతాళాస్త్రం ప్రయోగించాడు. బేతాళుడు జన్మించి ప్రేతగణాస్త్రాన్ని మ్రింగివేశాడు.

లీలాపతి ఉగ్రుడై ఒక గడ్డిపరకను చేత్తో పట్టుకొని 'మహారాక్షసాస్త్రం' సంకల్పించి ప్రయోగించాడు. దానిని నిరోధించడానికి ఉన్న ఉపాయం ఒక్కటేనని గ్రహించిన సింధురాజు 'వైష్ణవాస్త్రం' ప్రయోగించాడు. అది గమనించిన విదూరథుడు తాత్సారం చేయకుండా తానుకూడా, వైష్ణవాస్త్రం ప్రయోగించాడు. ఆ రెండు అస్త్రముల నుండి ఇతర అస్త్రములు, ఆయుధములు జలప్రవాహంలా వెలువడసాగాయి.

❖

సింధురాజు అంతా గమనించాడు. "ఆహా! ఈ విదూరథుడు ఇంతవరకు అస్త్రములను నిరోధిస్తూనే కాలం గడిపివేస్తున్నాడే? ఇతనికి ఉన్న అస్త్రబలం ఎంతటిదో కదా! ఇట్లా కాకుండా ఇతనిని ఖడ్గయుద్ధంలో నిర్జించివేస్తాను" అని అనుకున్నాడు. ఖడ్గమును చేబూనినవాడై రథం మీద నుంచి క్రిందకు దుమికాడు. విదూరథుడు యుద్ధ మర్యాదను అనుసరించి తానుకూడా ఖడ్గధారియై రథం దిగాడు. వారిద్దరి మధ్య చాలాసేపు భీకరమైన పోరాటం జరిగింది. చివరకు సింధురాజు విదూరథుని విగతజీవుని చేసివేశాడు. విజయోత్సాహంతో సింహానాదం చేశాడు. తమ రాజు నేలకూలడం చూచిన విదూరథుని సైనికులు పరాజయం అంగీకరిస్తూ లొంగిపోయారు.

విదూరథరాజు నేలకూలినాడన్న వార్త దావానలంలా వ్యాపించింది. శత్రు సైనికులు నగర ప్రవేశం చేశారు. "ఏకఛత్రమండలాధిపుడైన సింధురాజుకు జయమగుగాక" అను నినాదములు

నగరంలోని నలువైపుల వినవచ్చాయి. అతని అభిషేకమునకు రంగం సిద్ధం చేయ బడసాగింది. యుద్ధ పరిసమాప్తిచే దిక్కులు ప్రశాంతములయ్యాయి. నూతన రాజు సింహాసనం అధిరోహించాడు.

❖❖❖

# 33. "ద్రష్టత్వము" నకు ముందే ఉన్న 'ద్రష్ట'

పూర్వలీల మూర్ఛితుడై ఉచ్ఛ్వాస నిశ్వాసములను మాత్రం ప్రకటిస్తూనే నేలపై పడియున్న .... తన ప్రియుడగు విదూరథుని చూచింది. ఆమె హృదయం చెప్పరానంత బాధతో నిండిపోయింది.

**పూర్వలీల :** అంబా! నేను ఈ దుఃఖము భరించలేకుండా ఉన్నాను. నా భర్త అక్కడ రక్తపుమడుగులో కొట్టుకుంటున్నాడు. అతడు ప్రాణాలు త్యజించబోవుచున్నాడు. ఆయన అంతటి దుఃఖమును పొందే బదులు నేను ఖండఖండములుగా చీల్చబడవచ్చును కదా! అమ్మా! నీ శిక్షలతో అతనిని బాధించవద్దు. నన్నే శిక్షించు. నీవు చల్లటి తల్లివి కదా! నీ భక్తులమగు మాకు ఇన్ని కష్టాలా చెప్పు?

**శ్రీ సరస్వతీదేవి :** ఏవమ్మా? లీలాదేవీ? మరల నీవు చమత్కారంగా మాయలో పడుచున్నావుసుమా! ఇప్పుడు నీవిక్కడ ఒక అద్భుతమైన విప్లవం-సంగ్రామం చూచావు కదా! అయితే, స్థిరదృష్టి మరియు వాస్తవ దృష్టులతో చూస్తే ... ఇదంతా స్వప్నతుల్యము మాత్రమే సుమా! ఈ స్వప్నమాత్ర జగత్తులో స్థిరమైనదంటూ ఏమి ఉన్నది చెప్పు? విదూరథుని యొక్క ఈ విస్తారరాజ్యము పద్మని గృహాకాశంలోనే ఉన్నదని, ఆ పద్మని సామ్రాజ్యమంతా వసిష్ఠని గృహాకాశంలోనే ఉన్నాయని మరచావా? అనగా వసిష్ఠబ్రాహ్మణ గృహాకాశంలోనే ఇదంతా విదూరథుని సంకల్పజగత్తుగా ఉండియున్నది.

"నీవు-నేను-ఈ మూర్ఛితురాలైన ద్వితీయలీల-విధూరథుడు-సింధురాజు - వీరి శస్త్రాస్త్ర ప్రయోగాలు - చతుస్సాగర పర్యంతమగు ఈ బ్రహ్మాండము" .... ఇవన్నీ గిరిగ్రామ గృహాకాశంలోనే వెలయుచున్నాయి. ఇట్టి స్వప్నసదృశము, అసత్యము అయిన సంఘటనలకు నీవు దుఃఖించవలసిన పని ఏమున్నదో నాకర్థమగుటలేదు.

కనుక పుత్రికా! నీవు మోహము చెందకుండా ఈ సంబంధ-బాంధవ్యములు ఎట్టివో, ఎవరిచేత కల్పించబడి దుఃఖములను ప్రసాదిస్తున్నాయో గ్రహించు. ఇదంతా స్వయం కల్పితమేకాని వేరేమీ కాదు.

శుద్ధ స్వరూపమగు ఆత్మే ఒకానొకప్పుడు వ్యర్థంగా దృశ్యమును, ప్రేమ మొదలైన భావములను కల్పించుకొని, అందు తాదాత్మ్యము చెందుచు, తన 'స్వస్వరూప స్వస్థితి'ని ఏమరచి అనేక ఉపాధులలో తన్మయమై ప్రవర్తిస్తోంది. మరొకప్పుడు ఉపాధితో ఏకత్వము చెందక, తన 'చిన్మయత్వము' నందే ప్రశాంతబుద్ధిని కలిగియుంటున్నది. సర్వమునకు అధిష్ఠానమగు (ఈ సర్వము ఎందులో ఉండి-ఉన్నదో అట్టిదగు) ఆత్మకు వాస్తవానికి ఉత్పత్తి వినాశనములు లేవు. ఈ శరీరాదుల ఉత్పత్తి - స్థితి - లయములు ఆత్మ - యొక్క 'శుద్ధత్వము- నిత్యత్వము- అఖండత్వము- అప్రమేయత్వము' "

మొదలైన లక్షణములు గల స్వభావమునకు ఏమాత్రం హాని కలిగించలేదు. ఇక నీకు దుఃఖ మెందుకు? అందుచేత ఓ లీలా! "ఇతడిట్లున్నాడేమి? ఈ ఈ సంఘటనలు ఇట్లు ఎందుకు జరగాలి?" అనునట్టి సంసారమునకు సంబంధించిన స్వల్ప ప్రశ్నాసరళిని ప్రక్కకునెట్టి, ఆత్మత్వమునే అనుభవిస్తూ మనస్సులో ఆత్మయొక్క స్వభావమునే ప్రతిక్షేపించుకోవాలి సుమా!

**అప్రమేయము :** దేనిచేతను ఎట్టి మార్పు–చేర్పులు పొందదు. అందుచేత ఆత్మకు దేనితోను ప్రమేయం లేదు.

సర్వదా, సర్వత్రా, సర్వమునందు వెల్లివిరిసియున్న ఈ ఆత్మయే ద్రష్టత్వముతో కూడుకొని దృశ్యమునందు ప్రకటితమగుచున్నది. అట్లు ప్రకటితమైన తరువాత, ఆ ద్రష్టత్వమును, దృశ్యమును తనకు బాహ్యమైన దానివలె గాంచుచున్నది. ఇక ఈ ఈ బ్రహ్మాండ మండపముల రెండిటి మధ్య ఉన్న ఆకాశమే ఈ బ్రహ్మాండముల యొక్క ఉనికికి స్థానము, కారణభూతము కూడా! కాని అట్టి చిదాకాశము వాస్తవానికి పదార్థశూన్యమైనదే సుమా! అందుచేత ఈ 'జగత్తు' అనబడునది వాస్తవానికి లేదు. "మరి కనబడుతోందే?" అంటావేమో? అట్లు కనబడునది స్వయం కల్పితమగు భ్రమాభ్యాసము మాత్రమే!

భ్రమను గాంచువాని (ద్రష్టయొక్క) వాస్తవ–స్వరూపము శుద్ధచైతన్యమే కదా! అనగా, 'ద్రష్టత్వము' కన్నా ముందే ఈ జీవుడు శుద్ధచైతన్య స్వరూపుడై ఉండియే ఉన్నాడు.




సూర్యుని నుండి కిరణములవలె, సముద్రము నుండి తరంగములవలె 'శుద్ధచైతన్యము' నందు ఈ ద్రష్టత్వము బహిర్గతమౌతోంది.

❖❖❖

# 34. దృశ్యం తొలగేదెట్లా?

ఇట్లు భ్రమను గాంచువాడే (ద్రష్టత్వము–ద్రష్ట) అసత్యమై, లేకయే ఉండగా, ఇక భ్రమాత్మకమగు విషయమెక్కడ? అట్టి భ్రమలు కలుగుచున్నది ఎవరికి? అందుచేత "భ్రమ" అనబడుదానికి 'సత్త'యే లేదు. ఉత్పత్తి–వినాశరహితమగు పరమపదము లేక ఆత్మ ఒక్కటే ఉండి ఉన్నది.

**ప్రథమ (పూర్వ) లీల :** మరి ఈ దృశ్యమంతా ఎక్కడి నుండి వచ్చింది? ఇది తొలగే ఉపాయమేమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** ఇదంతా "నేను ద్రష్టను అగుదునుగాక" అనునట్టి స్వకీయకల్పిత భావన నుండి ఏర్పడినట్టి .... ద్రష్ట వ్యాపారము యొక్క – ఫలితము మాత్రమే. ద్రష్ట యొక్క చైతన్యతత్త్వమే

కార్యమునకు, కారణమునకు స్థానభూతమై యున్నది. అందుచేత ఈ దృశ్యము ఉంటే ఉండనీ, దానివలన మనకు వచ్చే లాభముగాని, నష్టముగాని లేదు. ఈ కనబడేదంతా జ్ఞానదృష్టితో చూడబడితే చాలు. అప్పుడు ద్రష్ట-దర్శనముల అభావం సహజంగానే సిద్ధించగలదు.

**ప్రథమ లీల :** అమ్మా! "పరమ పదము" అంటే ఏమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** నిన్ను నీవు జనన-మరణ రహితముగాను, స్వయం-ప్రకాశకముగాను, శాంతముగాను, ఆద్యముగాను, అనామయము (It only exists in it, nothing else exists in it)గాను గ్రహించు. "అట్లే తదితరుల వాస్తవ స్వరూపము కూడా" అనునట్టి 'ఎరుక' కలిగియుండుము. నీవు "నిన్ను - తదితరులను" అట్లు దర్శించుచుండుటయే "పరమపదము" అని చెప్పబడుతోంది. (పరమ=ఆవలనున్న ; పదము= స్వస్వరూపస్థానము)

❖❖❖

# 35. ఈ కనబడేవారంతా ఎవరు?

**ప్రథమ లీల :** జగజ్జననీ! ఈ విదూరథుడున్న చిదాకాశ బ్రహ్మాండములోను, అట్లే గిరిగ్రామ జగత్తునందు... అనేకమంది జనులు కనిపిస్తున్నారు కదా! వారంతా ఎవరు? 'స్వప్న కల్పిత రూపాలు' వంటివేనా? వారందరికీ స్వకీయమైన 'అస్థిత్వము', 'అనుభవము' ఉండి ఉన్నాయా? లేదా?

**శ్రీ సరస్వతీదేవి :** ఆ జనులందరి ఆత్మ వారివారి స్వభావమును అనుసరించే అట్లట్లు స్ఫురించుచున్నది. ప్రతివారు వారివారికి అనుకూలమగు స్థితియందే సంచరించు చున్నారు. అయితే తత్త్వజ్ఞులగువారు మాత్రం ఈ జగత్తును గాని, సృష్టినిగాని తమ అంతరంగమున పొందకుండానే ఉంటున్నారు. వారు ఈ దృశ్యమధ్యమునందు తదితరులతోపాటు ఆయా సాంసారిక వ్యవహారములందు ఇంద్రియాదులచే పాల్గొనుచున్నప్పటికీ, ఇందలి సత్యాసత్యముల విభాగము గ్రహించియుండుటచే, ఈ దృశ్యమునందలి స్వప్నత్వము-అసత్యత్వములను అవగాహన చేసుకొనిన తరువాతనే అట్లు పాల్గొనుచున్నారు. కనుక ఓ లీలా! ఈ జగత్తు, ఇందలి నేను-నీవు -మొదలైన సర్వ పదార్థములతో సహా, జన్మరహితమైనది. ఇదంతా ఆకాశ స్వరూపమగు 'బ్రహ్మము' కంటే వేరు ఏమాత్రం కాదు. దృశ్యభాగమై చెన్నొందుచున్న ... ఈ భూమి, పర్వతములు, వస్తుజాలములు .... మొదలైనదంతా అజ్ఞానముచేతనే హృదయము నందు విజృంభిస్తోంది. దృష్టాంతానికి, 'స్వప్నద్రష్ట' చూచే మహానగరం యందలి కోటలు శూన్యాత్మకములే కదా! ఈ జాగ్రత్ దృశ్యము కూడా అట్టిదే. హృదయాంతరాళమై యున్న ఆకాశమునందు ఆత్మచైతన్యము పర్వత-భూమయమైయున్న ఈ జగత్తును గాంచుచున్నది.

'జగత్తు' అనునది 'ఆత్మ' లేక 'చిత్' యొక్క కల్పన మాత్రమే! అందుచేత ఒక అణు మాత్రమైన చోటునందు కూడా నానా ఆకారములతో కూడిన జగత్తులు అరటిపట్టలవలె ఇమిడివున్నాయి. స్వప్నపురము ఎంతటి విస్తారమైనదైనప్పటికీ, అదంతా ఉన్నది ఒకానొక 'చిత్అణువు' నందే కదా! ఈ విస్తారమైన జగత్తు కూడా ఒకానొక చిత్-అణువు'లో ఇమిడివున్నది. ఇట్టి ఈ జగత్తులో

అనంతసంఖ్యలో చిదణువులు ఉన్నాయి. అందలి ప్రతి చిదణువులో మరల ఇట్టివేయగు అనేక జగత్తులు ఉన్నాయి. ఆ జగత్తులలోని ప్రతి అణువులో మరల అనేకానేక జగత్తులు ... అట్టి జగత్తులలో ఒకానొకదాని యందు గల ఒక ప్రదేశంలోని అంతఃపురంలో పద్మని భౌతిక శరీరం ఉండియున్నది.

ఈ విధంగా గిరిగ్రామజగత్తు – పద్మరాజ్య జగత్తు – విధూరథ రాజ్యజగత్తులలో తారసపడే వరకూ నీవు–నేను వంటి స్వస్వరూపాత్మ ప్రదర్శనారూపులే సుమా!

❖❖❖

# 36. మరణానంతరం

నీ సహ–పత్నియగు ద్వితీయలీల తన భర్తయగు విదూరథుడు నేలకొరగటం చూడగానే తాను మూర్ఛిల్లటం చూచావు కదా! విదూరథుని జీవచైతన్యము పద్మని దేహం ఉన్నచోటికి పయనించుచున్నది. ఈ ద్వితీయలీల జీవచైతన్యము కూడా పద్మని చేరుటకే ఆరాటపడుచున్నది.

**ప్రథమలీల :** ఈ ద్వితీయలీల మా అంతఃపురం ఎలా జేరనున్నదో? అక్కడ ఎట్లు ధరిస్తుందో? నీవు "నీ సహపత్నియగు ద్వితీయలీల" అని వర్ణించావు కదా! నేను ఆమెకు సహపత్నిని ఎట్లా అవుతాను? అక్కడ పద్మని రాజభవనంలోని పరిచారికలు ఈమెను ఎట్లా చూడబోవుచున్నారు? ఇదంతా బహుచమత్కారంగా ఉన్నది కదా!

**శ్రీ సరస్వతీదేవి :** అవును. ఇదంతా బహుచమత్కారమే. ఇందులోని కొన్ని విశేషాలు చెప్పుచున్నాను. విను. ఇది వింటే నీవు నీ స్వప్న వృత్తాంతమును, మరణానంతర దశలను కూడా గ్రహించగలవు. విదూరథుని రూపములో ఉన్న నీ భర్త పద్మడు ఆ 'పద్మని భౌతిక శరీరము' ఉండివున్న గృహంలోనే ఈ జగద్భ్రాంతినంతా దర్శించు చున్నాడని అనుకొన్నాము కదా! ఇక ఈ యుద్ధము, ఇందలి జనన, మరణము మొదలైన సంఘటనలన్నీ స్వప్న సంఘటలనలవలె భ్రాంతి మాత్రములేనని మరల ఒకసారి గుర్తు చేస్తున్నాను. అనగా అర్థం ఏమిటి? ఇందులో కనబడే జనులంతా జన్మాది వికారములు ఏమాత్రం లేనట్టి ఆత్మస్వరూపులే అయివున్నారు సుమా! భ్రాంతి చేతనే లీల ఇక్కడ ఆ విదూరథుని భార్య అయినట్లు కనబడినది. వాస్తవానికి ఆమే కాదు. నీవు కూడా స్వప్నదృశ్యము వలెనే ప్రాప్తించుచున్నావు. ఈ 'జగత్తు' అనబడుదానిని పొందుచున్న ప్రతిప్రాణి (జీవుడు) ఇట్లే ఇదంతా స్వప్నసదృశంగా గాంచుచున్నాడు.

"నీవు నన్ను చూడటం – నాతో సంభాషించటం" అనబడు మనిద్దరి మధ్య ఇప్పుడు ఏర్పడుచున్న ఇదంతా కూడా స్వప్నమువంటిదే సుమా! ఈ జగత్తు ఇట్లు ప్రతిభాసించటం వలననే, ఇది "దృశ్యము" అని చెప్పబడుతోంది. తత్త్వము గ్రహించినప్పుడు మాత్రమే ఈ దృశ్యత్వము తొలగిపోతోంది. ఆత్మ ఒక్కటే సర్వకాలము లందు సంపూర్ణసత్యమై ఉండివున్నది. దానిని ఆశ్రయించే నీవు – నేను – మహారాజు మొదలైనవన్నీ విజృంభిస్తున్నాయి. అదేవిధంగా, ద్వితీయ–లీల విషయం

కూడా. ఈమె పద్ముని మనోవృత్తి వలన ఉద్భవించింది. నీ భర్త పద్ముడుగా మరణించిన మరుక్షణం అతని చిత్తము లీలయొక్క ఆకృతి దాల్చగా, అట్టి మనోవికారరూపమగు ఆకృతి నుండే ఈ ద్వితీయ లీల వెలువడింది. అతని సంకల్పానుసారమే నిన్ను బోలిన లీలను బాహ్యమున గాంచగలిగినాడు.

ఈ చిత్తము అతిచిత్రమైనది. అది "ఆధిభౌతిక భావము," అనగా, భౌతిక రూపములను భావించటం .... అను సంకుచితత్వము పొందుచున్న సమయంలో "ఈ నామ రూపములే సత్యము" అని తలచుచు ఉంటుంది. మరల "ఈ ఆధిభౌతిక వ్యవహారమంతా పంచభూత – సంగమమై, స్వప్న–సదృశమై, అసత్యమై ఉన్నది కదా" అనునట్టి బుద్ధి సుస్థిరపడినప్పుడు 'ఆతివాహకభావన'యే సత్యమని తలచుచుండటం జరుగుతోంది.

నీ భర్త 'మరణము' అనబడు మూర్ఛను పొందిన తరువాత, 'పునర్జన్మ' అనబడు మరొక భ్రమను పొందటం ప్రారంభించాడు. ఇదంతా ఒకడు ఒక స్వప్నములో నుండి మరొక స్వప్నములోనికి ప్రయాణించటం వంటిది మాత్రమే. అట్టి ఈ పునర్జన్మానుభవంలో తన వాసనలనే ఈ 'లీల' రూపంగా అతడు ఇక్కడ పొందినాడు. పునర్జన్మ అనునది ఒక స్వప్నము నుండి మరొక స్వప్నములో ప్రవేశించటం వంటిదని, ఆ రెండిటిని దర్శించు ద్రష్టయొక్క వాస్తవ స్వస్వరూపమే పరమాత్మ యొక్క స్వరూపమని చెప్పాను కదా! చూచావా! నీ గురించి ఏర్పడిన సంకల్పమే ఆ లీల అయి వుండటంచే, నీవే ఆ లీలవై ఉన్నావు సుమా! "చిదాత్మ" సర్వగతమైయున్నది కదా! అందుచేత, వాసనా మయమగు మరొక శరీరమును (నీవే, నిన్ను, బోలిన రూపమును) గాంచితివి. ఆ చిదాత్మ యొక్క ఇచ్ఛా ప్రభావం చేత ద్వితీయ లీల కూడా నిన్ను గాంచగలిగినది.

సర్వగతమైనట్టి బ్రహ్మవస్తువునకు ఒకానొక చమత్కారయుతమైన స్వభావ–విశేషము కానవచ్చుచున్నది. అది ఎక్కడ నీ రూపమున ఎట్టి వాసనలు కలిగివుంటుందో, అచ్చట ఆ తీరుగానే ఆయా దృశ్యవ్యవహారమంతా "బాహ్యమునందువలె" గాంచుచుండును. ఇందుకు స్వప్నమే మనకు దృష్టాంతము. "నేను స్వప్నములో ఒక ఊరు వెళ్ళినాను. అక్కడ గల కాలిబాటలో కొందరు జనులతో సంభాషించాను" .... అనునట్టి స్వప్నాను భవమంతా అంతరంగముననే ఏర్పడుతోంది. కాని, బాహ్యమందువలె ప్రాప్తిస్తోంది. ఆత్మ సర్వదా సర్వవ్యాపి, సర్వశక్తియుతము కదా! అందుచేత, అది తనయొక్క వాసనాను సారం కనబడటం, ప్రకాశించటం, అనుభవాదులు పొందటం మొదలైనవి లీలామాత్రంగా జరుగుతోంది. దృష్టాంతమునకు, "వసిష్ఠుడు–అరుంధతి" .... బ్రాహ్మణ దంపతులు ఇద్దరు తమతమ "మరణమూర్ఛ"లను పొందిన తరువాత, మరల "మరొకచోటు" అను భ్రమను పొందుచుండిరి. ఆ మరొకచోటు అని భావించబడుచున్న చోట, ".... వీరు మా తల్లిదండ్రులు ... ఇది మా దేశము .... ఇది మా ధనము .... ఇది మా కర్మము .... మేము ఇట్లు వివాహం చేసుకొన్నాం .... ఏకమయ్యాం .... వీరు మా పరిజనులు ... ఈ నా భార్య నాకు అత్యంత ప్రియమైనది ... ఈ నా భర్త నాకుగల ఒక మధురానుబంధం .... ఇతడు నన్ను ఏ సమయమందును విడచి ఉండకూడదు ....." అనునట్టి బుద్ధి–బలమును సమకూర్చుకొని ఉన్నారు. అవన్నీ ఇరువురిపట్లా

అట్లే ప్రవర్తిస్తున్నాయి. ఈ సృష్టిలోని జీవులందరు ఆయా వస్తువుల పట్ల, వ్యక్తులపట్ల, విషయముల పట్ల ఇట్లే తమయొక్క బుద్ధిబలంచే, భ్రమాత్మకమైన అనేక విధములైన సంబంధములు తమకుతామే, కల్పించుకొనుచున్నారు. ఇందుకు మనం నిత్యానుభవమైన స్వప్నమునే దృష్టాంతముగా తీసుకోవచ్చు. స్వప్నంలో చూచిన ఇంటిని, "ఇది నా ఇల్లు" అని, స్వప్నంలో చూచిన జనులను, "వీరు నా శత్రు–మిత్రులు" .... అని ఆ స్వప్న సమయంలో స్వప్నద్రష్ట వాస్తవానుభూతినే పొందుచున్నాడు కదా! కాని ఆ ఇల్లు, ఆ జనులు, ఉన్నారా? ఉంటే ఎక్కడ ఉన్నారు? లేకుంటే అనుభవాలన్నీ ఎక్కడి నుండి వచ్చిపడ్డాయి? ఆ స్వప్నద్రష్ట "భయము, ఉద్వేగము, ఆవేశములు....." వంటివి ఎందుకు పొందుచున్నాడు? స్వప్నంలోని ఆయా సంఘటనలు అతనికి అనుకూలంగానో, ప్రతికూలంగానో ప్రాప్తిస్తూ ... అతనిని సంతోషింపజేయటం, దుఃఖింపజేయటం .... మొదలైన వ్యవహారసరళి గలిగి ఉంటున్నాయి కదా! ఈ జాగ్రత్‌దృశ్యము, ఇందలి జనులు, పదార్థజాలము కూడా అట్టిదే. అయితే తగినంత పరిశీలనాత్మకమైన బుద్ధి లేకపోవుటచే "ఇది వాస్తవము" .... అను బుద్ధి ఏర్పడుతోంది. ఇందలి క్షణక్షణ .... "మార్పుచేర్పులు" .... గమనించిన వారికి ఇక్కడ కూడా ప్రవాహములోని జలమువంటి అస్థిరత కనబడుచూనే ఉంటున్నది.

ఈ ద్వితీయలీల తన భర్త మరణించటానికి కొద్ది క్షణాల ముందే జీవము–ప్రాణములతో సహా ఈ దేహము నుండి బయల్వెడలినది."మరణమూర్ఛ"ను పొందిన తరువాత ఆమె స్వసంకల్పానుసారంగా చిత్తాకాశమునందు 'ఉనికి' యొక్క అనుభవమును పొంద సాగినది. క్రమంగా ఆమె పూర్వవాసనలు (ద్వితీయలీలగా కలిగియున్న సంస్కారములు) అనుసరించి వికాసము పొందసాగింది. పూర్వస్మృతిని అనుసరించి తన భర్త సాన్నిధ్యము పొందుటకు పద్మని భౌతిక శరీరం ఉన్న గృహమండపమునకు వెళ్ళుచున్నది. అక్కడ ఆమె పద్మని కలుసుకోవటం జరుగగలదు.

❖❖❖

# 37. ద్వితీయలీల

**శ్రీ వసిష్ఠమహర్షి :** వింటున్నావా, రామచంద్రా! ద్వితీయలీల సరస్వతీదేవిని తన పూజాదులచే ప్రసన్నం చేసుకొన్నది. అయితే, స్వస్వరూపము యొక్క అవగాహన విషయంలో మాత్రం కొంత అసంపూర్ణత్వము కలిగియున్నది. బుద్ధి మరికొంత వికసించ వలసియున్నది. తన ఆ వాసనామయ దేహముతోనే భర్తయొక్క సమక్షమును పొందాలనుకొన్నది. తన శరీరముతో సహా ఆకాశమునందు కోమలాకారమగు పక్షివలె పయనించసాగింది. "నా భర్తను పొందబోవుచున్నాను కదా" .... అను ఏకైక భావన ఆమెను పులకింపజేస్తోంది. అట్లు వెళ్ళుచూ ఒకచోట ఎదురుగా ఒక స్త్రీని చూచింది. అనగా, ద్వితీయ లీలాదేవి యొక్క 'సంకల్పము' అనే అద్దంలో సరస్వతీదేవి సంకల్ప ప్రభావంచేత 'కుమారి' అను స్త్రీరూపం ప్రతిబింబించింది.

❖

**కుమారి :** ఓ జ్ఞప్తిదేవత యొక్క భక్తులారా! సుందరీ! నీకు స్వాగతం! నేను నీ కొరకే సరస్వతీదేవి ఆజ్ఞపై ఈ ఆకాశపథంలో వేచియున్నాను.

**ద్వితీయలీల :** ఓహో! నీవు నాకంటే ముందేవచ్చి ఇక్కడ వేచియున్నందుకు కృతజ్ఞతలు. దైవాంశసంభూతురాలవైన నీవు కనిపించకపోతే ఈ సువిశాల ఆకాశంలో ఇక నా గతి అగమ్యగోచరమే అయ్యేది.

**"మహతాందర్శనం యన్మాంన్నకదాచన నిష్ఫలమ్"**

నీవంటి ఉత్తముల దర్శనం ఊరకే పోగూడదు కదా! నా భర్త ఎక్కడున్నాడు? నన్నక్కడికి వెంటనే తీసుకొనిపో.

**కుమారి :** అట్లే అగుగాక! "నేను స్థూలముకంటే అతిసూక్ష్మము, స్వభావసిద్ధము అయినట్టి ఆతివాహిక దేహమును. లేక, సూక్ష్మశరీరమును" అను భావనను దృఢంగా ఆశ్రయించు. అట్టి సూక్ష్మశరీర ధారిణివై నన్ను అనుసరించు. అప్పుడు నిన్ను నీ భర్త ఉన్నచోటికి కొనిపోగలను.

ద్వితీయలీల అట్లే ఆతివాహిక దేహధారియై కుమారిని అనుసరించసాగింది.

❖

జ్ఞప్తిదేవతయగు సరస్వతీదేవిచే పంపబడిన ఆ కుమారి ముందుదారి చూపుతూ ఉండగా, ద్వితీయలీల బ్రహ్మాండ ఛిద్రమగు ఆకాశమున ప్రవేశించింది.

క్రమంగా వారిద్దరు 'మేఘమండలం' దాటివేసి, 'వాయుమండలం' ప్రవేశించారు. సూర్య మార్గమును దాటారు. నక్షత్రమండలమును అధిగమించారు. ఇంద్రుడు, దేవతలు, సిద్ధలోకమును, త్రిమూర్తులను కూడా అనాయాసంగా దాటివేశారు. 'బ్రహ్మాండ కర్పరము' చేరుకొన్నారు. మంచు ముక్కలు కుండలో పెట్టినప్పుడు ఆ కుండకు, చిల్లి లేకున్నప్పటికీ, బాహ్యమునకు మంచు ఖండములు నీటిబిందువుల రూపమున చేరుతూ ఉంటాయి కదా! అట్లే 'సంకల్పసిద్ధ'యగు ద్వితీయలీల బ్రహ్మాండము నుండి వెలువడింది. చిత్తమాత్ర శరీరియగు ఆమె సంకల్పమాత్ర జనితములైన 'బ్రహ్మాండములు' అనే విభ్రమములన్నీ తన అంతరముననే అనుభవించుచున్నదని గ్రహించు. అన్ని అనుభవములకు మూలకారణం సంస్కారములే.

ఈ విధంగా ఆమె బ్రహ్మాదిలోకములన్నీ దాటింది. కుమారి దేవతతో కూడుకొన్నదై, బ్రహ్మాండ కర్పరము (సర్వలోకముల కావలనున్న space) దాటివేసింది. జలము మొదలైన ఆవరణములన్నీ అధిగమించింది. అంతము అంటూ లేనట్టి చిదాకాశంలో ప్రవేశించింది. ఆ చిదాకాశమునందు అసంఖ్యాకములగు బ్రహ్మాండములు ఒకదాని కింకొకటి కనబడకుండా ఉండి ఉన్నాయి. ఒక పురుగు ఒక రేగుపండులో ప్రవేశిస్తుంది చూచావా? అట్లే, అక్కడ ఉన్న అసంఖ్యాకములగు బ్రహ్మాండములలోని ఒకానొక దానిలో మన ద్వితీయలీల, మరియు, కుమారి ప్రవేశించారు. ఆ బ్రహ్మాండమండలము క్రింద ఉన్న పద్మని రాజ్యమును సమీపించారు. క్రమంగా అంతఃపురంలో, పద్మని భౌతిక దేహము ఉన్న గదిలో ప్రవేశించారు.

ద్వితీయలీల ఎదురుగా భర్తయొక్క భౌతికదేహము చూచి భర్తతో పునఃసమాగమం పొందుచున్నందుకు పరమానందభరితురాలైనది. అప్పటికప్పుడు తాను భౌతికదేహము కలిగియున్న అనుభవమును పొందినది. తన మృదువైన చేతివ్రేళ్ళను విదుల్చుచు, కించిత్ పరిశీలనగా అరచేతులను చూచుకొన్నది. నుదురుపై పడేజుట్టును సరిచేసుకొనుచు, కుమారితో సంభాషించటానికి ప్రక్కకు చూచినది. కాని, ఆ ప్రక్కన ఎంతగా ఆమె కనులు వెతికినా, కుమారి కనబడలేదు. "ఈ కుమారి ఎటు వెళ్ళిపోయినదో కదా! అవునులే! మాయ ఎరుగబడిన తరువాత భ్రమ కారణంగా ఏర్పడిన దృశ్యానుభవం, అట్టి దృశ్యదర్శనంచేత ఏర్పడిన వికారాలు ఎక్కడికి పోతున్నాయో ఏమి చెప్పగలం?" అని అనుకొన్నది. ఆమె తన దృష్టిని శవరూపి అయి పరుండియున్న తన భర్త ముఖమువైపు మరల్చినది. తన "స్వయంప్రతిభ"చే విషయమంతా గ్రహించ నారంభించింది. "ఆహాఁ! ఇతడే నా భర్త. విదూరథుని రూపమున యుద్ధంలో సింధురాజుచే చంపబడి, వీరలోకములను పొంది ఇచట సుఖంగా నిదురిస్తున్నారు కాబోలు! దేవీప్రసాదంచేత నేను ఈ భౌతిక శరీరంతో ఇచటికి రాగలిగాను. నావంటి అదృష్టవంతులు ఇంక ఎక్కడైనా, ఎవరైనా, ఉంటారా? ఇదంతా సరస్వతీమాత కృపయే కదా!" అని అనుకొంటూ ఆ గది అంతా కలియజూచింది. అక్కడ గల ఒక నెమలిపింఛపు చామరము (విసనికఱ్ఱవంటిది) చేతికి తీసుకొన్నది. తన భర్తయొక్క ఆహ్లాదము కొరకు వీచసాగింది.

❖❖❖

# 38. సూక్ష్మదేహ భావనా ప్రభావం

పూర్వలీల సరస్వతీదేవి ప్రక్కనే ఉన్నది కదా. ఆమె తాను ఉన్న స్థానంలోంచే – ద్వితీయలీల పద్మని భౌతికదేహం ఉండియున్నట్టి తమయొక్క అంతఃపుర గృహంలో ప్రవేశించటం గమనించింది.

**ప్రథమలీల :** అమ్మా! సరస్వతీదేవీ! నీ వరప్రసాదంచేత ఆ ద్వితీయలీల పద్మని దేహం ఉండి ఉన్నట్టి మాయొక్క అంతఃపుర గృహంలో ప్రవేశించటం గమనించాను. ఈ మాయాతతంగమంతా గమనిస్తున్న నాకు అంతా అవగతమగుచుండటంచే నాకు ఏ సంఘటన కూడా ఆశ్చర్యంగాని, సుఖంగాని, దుఃఖంగాని, మరింకే భావావేశంగాని కలిగించటంలేదు. కాని ఆ గృహంలోని దాసీగణం, భృత్యులు ద్వితీయలీలను చూచినప్పుడు ఏమి అనుకొంటారో కదా? వారు ఏమి చేయనున్నారో?

**శ్రీ సరస్వతీదేవి :** పరమాత్మ సర్వవ్యాపకము కదా! 'నియతి' యొక్క ప్రేరణవలన, చిత్–ప్రతిభాస వలన, మనఃసంకల్పము యొక్క ప్రభావము వలన అక్కడి భృత్యులు, లీలకూడా తమ్ము తాము చిరపరిచితులుగానే భావించుకొనుచున్నారు. దాసీగణం మొదలైన వారిని చూచి ద్వితీయలీల. "వీరందరు నా భర్తకు సంబంధించినవారే కదా! కనుక, నాకుకూడా సంబంధించినవారే. ఇందులో నూతనమైన విశేషం అంటూ ఏదీ లేదు" అనే భావించుచున్నది.

పైగా, నీకు – నాకు – ఆ ద్వితీయలీలకు, ఆశ్చర్యకరమైన "జన్మ–జన్మాంతరము"ల వృత్తాంతము తెలుసు. అక్కడి పరిచారికలకు తెలియదుకదా! వారు ఎప్పటిలాగానే నిదురలేచి తమ యజమానుల సేవలో నిమగ్నమగుచున్నట్లే భావించటం జరుగుతోంది.

**ప్రథమలీల :** ఈ చమత్కారమంతా బాగానే ఉన్నది. కాని, నాదొక సందేహం. “ఈ స్థూలదేహము తోడనే నేను నా భర్తయొక్క సామీప్యత పొందాలి” అనే వరం నీ వద్ద నుండి ఆ ద్వితీయలీల పొందియున్నది కదా! మరి ఆమె తన భౌతిక దేహమును ఆకాశంలో త్యజించింది. బ్రహ్మాండములను సూక్ష్మదేహం తోడనే దాటివేసింది. ఆ పద్ముడు ఉన్న గృహంలో, అనగా నా అంతఃపురంలో, ప్రవేశించగానే ఎక్కడి నుండో ఆమెకు స్థూలదేహం ప్రాప్తించింది. అట్లా ఎందుకు జరగాలి? ఆమె భౌతిక దేహంతోనే బ్రహ్మాండకర్పరము దాటివుండవచ్చును కదా!

**శ్రీ సరస్వతీదేవి :** ‘ఎండ’లో నీడ ఉండగలదా? ఎండవున్నచోట నీడగాని, నీడ ఉన్నచోట ఎండగాని ఉండజాలవు కదా!

అప్రబుద్ధులగువారు పుణ్యవశంచేత సిద్ధలోకములు పొందినప్పటికీ, వారు స్థూల దేహంతో ఆయా సిద్ధలోకములలో ప్రవేశించలేరు. హిరణ్యగర్భుడు (బ్రహ్మదేవుడు) మొదలైన సృష్టి నియామకులు సృష్టియొక్క ప్రారంభమునందే .... ఒక ఆటలో కొన్ని నియమములు రచించబడినట్లు, .... ఈ సృష్టి వ్యవహారమునందు కొన్ని నియమములను కల్పించియున్నారు. “సత్యము అసత్యముతో కలువకుండుగాక” .... అను నియమమును నిర్ణయించి ఉన్నారు. ఒకనియందు అసత్యదృష్టి పూర్తిగా తొలగనంత వరకు అతడు భౌతికదేహముతో బ్రహ్మాండాంతర్గతంగా పయనించలేడు.

కానీ, బిడ్డా! ఉత్తమోత్తమమైన ఆత్మజ్ఞానం కలవారు సంకల్పపూర్వకమైన భావన –ఆశయము కలిగివుంటే, వారు తమ భౌతిక దేహములతో సహా సిద్ధలోకములలో ప్రవేశించగలరు. సర్వేసర్వత్రా ఆత్మనే దర్శించు అట్టివారు తమను ఆశ్రయించు శిష్యులకు బోధించుట కొరకో, లేక, దుష్ట శిక్షణ కొరకో, తమ స్థూలదేహముతోనో, లేక వేరైన స్థూలదేహముతోనో, వేరువేరు లోకములు ప్రవేశించ గలుగుచున్నారు. ఒక దృష్టాంతం విను. ఒక బాలుడు, అత్యంత అజ్ఞానం అంతరంగమున పేరుకొని వుండగా, చీకటివైపు చూచినప్పుడు, అతనికి ఆ చీకటిలో బేతాళుడు లేక భూతములు కనిపిస్తాయి. కాని అట్టి బేతాళభ్రాంతి లేని పెద్దవారికి ఆ చీకట్లో దయ్యాలు కనిపిస్తాయా? లేదు కదా! “అవివేకము” అను జ్వరం ఉన్నంతవరకు ‘వివేకము’ అను శీతలత్వము ఉదయించదు.

అసలు “అవివేకము” అని మనం దేనిని పిలుస్తున్నాం? “నేను పృథివి మొదలైన పంచభూత నిర్మితమైన ఈ దేహమును కలిగియున్నాను. ఈ దేహముచే, ఇట్లు ఇంతవరకు నియమించబడ్డాను. నా ఈ పరిధి దేహసంచలనమునకు పరిమితమై యున్నది. అనురూపముగల దేహాత్మభావనయే ‘అవివేకము’ అని అనిపించుకొంటోంది. “స్థూలదేహధారి అయిన నాకు ఆకాశమున పయనించగల శక్తి ఎక్కడ ఉంటుంది?” అనునట్టి కృతనిశ్చయము గలవారు ఆకాశ సంచారం ఎట్లా చేయగలరు? చెప్పు? అందుచేత, “జ్ఞానము–వివేకము–వరము–పుణ్యదేహము” ల శక్తి వలననే జనులు ఈ భౌతిక దేహముతో అనేక లోకములందు సంచరించగలుగు చున్నారు. అయితే, ఎండుటాకులపై నిప్పురవ్వపడితే అవి దగ్ధం అగునట్లు, జీవునకు ‘ఆతివాహిక దేహభావము’ ప్రస్ఫుటమై ప్రాప్తించి నప్పుడు ఈ స్థూలదేహము అధిగమించబడినది – తిరస్కరించబడినది అగుచున్నది.

**ప్రథమ లీల :** ఆకాశ గమనములు, పరలోక సంచారములు, వర-శాపములచే ప్రాప్తించ గలవని నీవు అంటున్నట్లునావు. అంటే అట్టి సామర్థ్యములు స్వప్రయత్నముచే ప్రాప్తిస్తున్నాయా? లేక, జగన్మాతవగు నీచే ఆయాదేవతల రూపమున వరశాపములు ప్రసాదించుటచే లభిస్తున్నాయా?

**శ్రీ సరస్వతీదేవి :** వర-శాపములు కూడా ప్రాక్తనకర్మలను (ఇతఃపూర్వము నిర్వర్తించ బడిన శారీరక-మానసిక క్రియలను), అనుసరించే ఉంటున్నాయి. కాబట్టి, "జీవునకు ప్రయత్నములను అనుసరించే ప్రయోజనములు సిద్ధిస్తున్నాయి" అను అప్రతిహత సిద్ధాంతమునకు వరశాపాదుల వ్యవహారంచేత వచ్చే లోటు ఏమీ ఉండదు. ఓ ప్రియ భక్తులారా! లీలా! ఈ సంసార వ్యవహారమంతా కొంత సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే ఈ విషయం అవగతమౌతోంది.

నిత్యసత్యమగు సద్వస్తువు సర్వదా అవ్యయమై, శుద్ధమై, శాన్తమై ... తన స్వరూప - స్వభావములు త్యజించకుండానే ... సర్వదా ఉండి ఉంటోంది. త్రాడునందు ఒకనికి సర్పభ్రాంతి కలిగితే కలుగవచ్చు. కాని, ఆ త్రాడు సర్పమువలె పనిచేయలేదు కదా! స్వస్వరూపము లేనట్టిదేదీ ఎట్టి కార్యము ఒనర్చలేదు. కాబట్టి కార్యనిమగ్నులగుచున్న ప్రతి ఒక్కరు స్వస్వరూపము కలిగియే ఉన్నారు. అట్టి స్వస్వరూపము సద్వస్తువే అయివున్నది. అట్టి సద్వస్తువే బ్రహ్మమని, ఆత్మభగవానుడని, పరమేశ్వరుడని యిట్లు అనేక నామరూపములతో కీర్తించబడుతోంది.

అందుచేత, ఓ లీలా! మనందరిలో ఏ ఒక్కరు పుట్టుటలేదు. చచ్చుటలేదు. ఈ చావు - పుట్టుకలనబడునవన్నీ దేహాత్మదృష్టిలో మాత్రమే ఉండి ఉంటున్నాయి. కాని "ఇది మృతిచెందినది. నేను పుట్టాను. చచ్చుచున్నాను" అనునట్టి మిథ్యానుభవమంతా పూర్వాభ్యాసము (Previous Experience) వలననే విజృంభిస్తోంది. జీవునకు అత్యంత అనాయాసంగా ఈ స్వానుభూతములగు సంస్మృతభ్రమ కలుగుచున్నది. "జన్మించుట, ఇంద్రియములు, ఇంద్రియానుభవములు - సర్వ అనుభవముల రహితస్థితి అయిన నిర్విశేషానుభవం" ... ఇవన్నీ కల్పన చేతనే భావించబడుచున్నాయి. "కల్పన" .... కల్పనయే అవుతుందికాని సత్యమెట్లా అవుతుంది? ఈ 'సంసారస్మృతి' అంతా అజ్ఞానుల 'అంతరము'ననే ఉదయిస్తోంది కాని, ఎక్కడో బాహ్యమున మాత్రం కాదని గ్రహించు. నీటిలో ప్రతిబింబించే చంద్రుని చూచి "అవును. ఇదియే వాస్తవమగు చంద్రుడు" అని బాలుడు భ్రమిస్తాడు చూచావా? ఈ సంసారము అనే భ్రమ కూడా, "ఇది బాహ్యముననే వాస్తవత్వము కలిగియున్నది" అను రూపమున అజ్ఞానము చేతనే వికసిస్తోంది.

ఓ లీలాదేవీ! తత్త్వజ్ఞులు, ధర్మపరులు అగువారు మాత్రమే ఆతివాహిక లోకములకు వెళ్ళగలుగుతారు. భౌతికదృష్టి ఉన్నవారు వెళ్ళలేరు. ఎందుచేతనంటావా? మిథ్య - భ్రమమయము అయినట్టి ఈ 'ఆధిభౌతిక దేహము' సత్యమును ఆక్రమించుకొనగలదా? లేదు.

మన ద్వితీయలీల పూర్ణత్వము గాంచి ఉండలేకపోయినప్పటికీ తత్త్వజ్ఞురాలే! నన్ను నిరంతరం ఆరాధించి ఉండటంచే ఉత్తమభావము ('నేను ఆత్మను' అనునట్టి ఆత్మ భావము) పొందియే ఉన్నది, అందుచేతనే పద్మడు ఉన్న నగరం వెళ్ళగలిగింది.

జ్ఞాన దృష్టిలో ఈ జగత్తు లేనిదానిగను, అవాస్తవముగాను తెలియవచ్చుచున్నది. ఇందు కనిపిస్తున్న కష్టసుఖములవంటివన్నీ భావనచేతనే ఏర్పడుచున్నాయి. కాని, స్వతహాగా ఏర్పడుచున్నవి కావు. అట్లే సకల సంబంధములు కూడా సుమా!

❖❖❖

# 39. కష్ట - సుఖములు

**ప్రబుద్ధలీల :** అమ్మా! జగన్మాతా! ఈ జగత్తులోని కష్టసుఖముల రూపమున ఏర్పడుచున్నవన్నీ అవాస్తవమని, స్వకల్పితమని అనటం వినటానికి బాగానే ఉన్నది. అటుచూడు నేలపై ఒరిగియున్న నా భర్త ఇప్పుడు ప్రాణములు త్యజించనున్నాడు కదా! ఇది నాకు సంభవిస్తున్న కష్టమే కదా! ఇట్లు మాకు ప్రాప్తిస్తున్న అనేక దుర్భర సంఘటనల వలన "దృశ్యము అసత్యము" అను వాదన ఎట్లా సమర్థించగలదగును చెప్పు? "సుఖము – దుఃఖము" అను రూపములు కలిగినట్టి "అదృష్ట దురదృష్టములు" ఈ జీవుని సమీపించటం, దూరం కావటం ఎప్పుడూ దైనందికంగా జరుగుచున్న విషయాలే కదా! ఈ అదృష్ట – దురదృష్టముల స్వభావం ఎట్లా సిద్ధిస్తోంది? అసలు ఈ పదార్థముల 'సత్త' అంతా ఎట్లా ఏర్పడుతోంది?

పోనీ! ఈ అదృష్ట–దురదృష్టములు కేవలం కల్పనామాత్రములేనని కొద్దిసేపు అనుకొందాం. కాని అగ్నికి ఉష్ణత్వము, పృథివి మొదలైన ఘనపదార్థములకు స్థిరత్వము, 'మంచు'కు చల్లదనము, ఈ ఆకాశము, ఈ కాలము ... ఈ పదార్థముల ఉనికి ఇవన్నీ ఎట్లా ఏర్పడుచున్నాయి? ఈ ఇంద్రియములు, వాటి అనుభవములు, దృశ్యములు, వాటి బంధమోక్షములు .... ఇవన్నీ ఎట్లా ప్రాప్తిస్తున్నాయి? ఇవన్నీ ఇట్లు ఉండగా "జగత్తు లేదు" అని మనం ఎట్లా సమీక్షించగలం? ఇవన్నీ ఎవరు కల్పిస్తున్నారు? ఎందుకు ప్రాప్తిస్తున్నాయి? తృణములు, కొండలు, సముద్రములు వంటి ఆయా ఆకారములన్నీ కనబడుచున్నాయి కదా! ఇవన్నీ ఎట్లా రూపం పొందుచున్నాయి? ఈ జన్మ–మృత్యువులు ఎట్లు ఎవరికి ఎందుకు సంభవిస్తున్నాయి? ఈ విషయాలు సందర్భోచితంగా నేను ఎంతవరకు తగివుంటే అంతవరకు వివరించు."

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! చాలా పెద్ద ప్రశ్న వేశావు. సరే, నీవు అడిగిన విషయమై కొన్ని విషయాలు వివరిస్తాను. విను.

❖

"మహా ప్రళయము" అని పిలువబడుచున్న ఈ జీవునికి సంబంధించిన ఒకానొక స్థితియందు సర్వపదార్థములు వినష్టమై పోతున్నాయి. అనగా జీవుని దృష్టియందు సర్వ పదార్థములకు అతీతమైన మౌనస్థితి శేషించుచున్నది. అప్పుడు బ్రహ్మవస్తువు ఒక్కటే సద్రూపమై వెలయుచున్నది.

**మహాప్రళయము :** అనగా ఈ జీవునియొక్క (లేక ద్రష్ట యొక్క) "దృశ్యమును అవగాహన చేసుకొను ఒకానొక స్థితి"గా గ్రహించాలి. అంతేగాని ఈ పదార్థ జాలమునకు సంబంధించినది కాదు.

బ్రహ్మము ఒక్కటే సద్రూపమై శేషించటం – అనగా ఈ జగత్తులోని పదార్థములు కరిగిపోవుటయో, లేక, ఇవి సముద్రంలో మునిగిపోవుటో కాదు. “ఇదంతా ద్రష్టయగు నాతోసహా ఏకైక అద్వితీయ బ్రహ్మమే. ద్వితీయమైనదేదీ ఎక్కడా లేదు. నేను – నీవు – అతడు – అది – ఇది – అక్కడ – ఇక్కడ – నాది – నీది … అనునదంతా బ్రహ్మమే” అను దృఢభావన ఏర్పడుటయే. అప్పుడు చూడబడునదంతా బ్రహ్మముగానే శేషిస్తోంది.

❖

ఒకడు తన స్వప్నంలో పదార్థములు, నీవు – నేను – నీది – నాది వంటివి, ఆకాశ గమనాదులు పొందుచున్నాడు కదా! అతడే స్వప్నద్రష్ట అయివుండి, ఆ స్వప్నమంతా రచించబడుచున్నది తనయందే అయివుండికూడా …ఆ స్వప్నమునందు పదార్థ జాలము మొదలైన వాటిని తనకు వేరైనవాటివలె దర్శించి “సుఖము – దుఃఖము – మానము – అవమానము” మొదలైన అనుభవములు పొందుచున్నాడు. అదేవిధంగా బ్రహ్మము – బ్రహ్మప్రకాశ స్వరూపములు మాత్రమే అయినట్టి – సూక్ష్మభూతములను, పంచభూతములను – (ద్రవ–ఘన–వాయు–తేజ–ప్రదేశములను) తనయందు అనుభవించుచున్నాడు. సూక్ష్మభూతరూపమును దాల్చిన అబ్రహ్మవస్తువు ఈ జలము మొదలైన ఆవరణముల రూపములుగా అనుభవమగుచున్న స్థూలత్వమును తన కల్పనా బలముచే పొందుచున్నాడు. అట్టి సమయంలో ఆ బ్రహ్మము తనకు తానే ఈ బ్రహ్మాండ స్వరూపముగా గోచరించుచున్నది. బాహ్యమున ఉన్నట్లు తోచుచున్న ఈ వ్యవహారమంతా వాస్తవానికి అసత్యమే అయినప్పటికీ “దృఢమైన సత్యము”వలె అభ్యాసవశంచేత గోచరిస్తోంది. చూచావా? ఇట్లు బ్రహ్మవస్తువు “నేను సమష్టి జీవుడను” అని చింతన చేసి తన మనోరాజ్యమును ఈ ‘బ్రహ్మాండము’ రూపమున విస్తరింపజేస్తోంది. అట్టి మనోరాజ్యమునే ‘జగత్తు’ అనే పేరుతో మనం చెప్పుకొంటున్నాం.

ఓ ప్రియలీలా! సంకల్పమాత్రమే అయినప్పటికీ ఇదంతా ఒకానొక “సంకల్ప వృత్తి –నియమము”ను అనుసరించే ప్రవర్తిస్తోంది. అట్టి నియమము సృష్ట్యాదియందు ఎట్లున్నదో, ఇప్పుడు అట్లే ఉండి ఉన్నది. చిత్తవృత్తులు ఏ రీతిగా ఉంటాయో ఆత్మచైతన్యం ఆరీతిగానే స్ఫురిస్తూ ఉంటుంది.

ఈ జగత్తునందు ‘అనియతి’ యగు కార్యము ఒక్కటి కూడా జరగటంలేదు.

బంగారము తన ఆకారమును ఎప్పుడైనా వదలి ఉంటుందా? లేదుకదా! అట్లే ఈ జగత్తు కూడా. ఇది మాయతో కూడుకొనిన బ్రహ్మమునందే ఉండివున్నది. బ్రహ్మము నందే వెలసియున్న ఈ ‘జగత్తు’ ప్రళయసమయంలో కూడా శూన్యం కాజాలదు. సృష్టి ప్రారంభంలో ఎట్లు ఏ వస్తువు ఆవిర్భవించియున్నదో అట్లే ఇప్పుడు కూడా ఉన్నది. నీటికి తరంగత్వమువలె బ్రహ్మమునకు జగదత్వము ఉండియే ఉంటోంది. జగత్తు ప్రకటితం కావచ్చు. లేక కాకపోవచ్చు. సర్వ సందర్భములోను బ్రహ్మము తన స్వసత్తను ఏమాత్రం వదలుటయే లేదు.

బ్రహ్మము తన “స్వసత్త – అఖండత్వము – శాశ్వతత్వము” మొదలైన లక్షణములు ఏక్షణమందు పరిత్యజించటం లేదు.

'మంచు–చల్లదనము' 'నిప్పు–ఉష్ణము'వలె 'చైతన్యము–నియతి' కలిసియే ఉంటాయి.

చైతన్యము ఉన్నచోట సృష్టికూడా ఉండి ఉంటోంది. ఆకాశరూపములే అయిన ఈ పృథివి – జలము– వాయువు మొదలైనవి ఒకానొక నియతిని అనుసరించి సృష్ట్యాది యందు ఎట్లా ఉన్నాయో ఇప్పుడూ అట్లాగే ఉన్నాయి. వాటి స్వభావము నందు కొంచెము కూడా మార్పు ఉండటంలేదు.

ఆకాశము - (Space) ⟶ శూన్యస్వరూపము
జలము – (ద్రవము - Liquid) ⟶ ప్రసరించు స్వభావము

ఇట్లు ఆయా నియమములు అట్లే ప్రవర్తిస్తున్నాయి. చావు–పుట్టుక–బ్రతుకుల నియమము కూడా అట్లే మారకుండానే ప్రవర్తించుచున్నది. జీవులందరు ఆ నియమమును అనుసరించే ప్రవర్తిస్తున్నారు. కాని, ఈ జీవుని వాస్తవ స్వరూపము సర్వ సంఘటనలకు అతీతమైనట్టి "నిత్యోదిత చైతన్యమే". ఇందు సందేహించవలసినదంటూ ఏమీ లేదు.

❖❖❖

## 40. ఈ అనుభవమంతా ఏమిటి?

అయితే ఈ "నియతి–పదార్థములు–స్వభావములు–శరీరములు–ఉత్పత్తి– వినాశనములు" ... మొదలైన దృశ్యజగత్తు వ్యవహారమంతా మాయయొక్క, లేక భ్రమయొక్క ప్రభావమును దృష్టిలో పెట్టుకొని చెప్పాను. కాని, ప్రియమైన లీలాదేవి! వాస్తవానికి ఈ 'జగత్తు' అనబడునది ఉత్పన్నమే అయివుండలేదు.

**లీల :** అదేమిటమ్మా? మరి ఈ అనుభవించబడుచున్నదంతా ఏమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** స్వప్నములోని స్త్రీ సంగమమువలె దృశ్యమునకు సంబంధించిన అనుభవమంతా మిథ్యయే. అయితే, ఈ జీవునకు తన స్వస్వరూపము గురించిన అజ్ఞానము చేత, అజ్ఞాన జనితమైన అభిలాషచేత, అభిలాష జనితమైన దృఢాభ్యాసం చేత ఈ బాహ్యానుభవములపై ఒకానొక భ్రమాత్మకమైన విశ్వాసం ఏర్పడుతోంది. తత్ఫలితంగా అతడు అనేక సుఖదుఃఖానుభవములకు లోనగుచున్నాడు. చిదాకాశము యొక్క లీలయే ఇదంతా. ఇప్పుడు మనం చెప్పుకొన్న నియతి స్వభావములైనట్టి జీవన–మరణాది అనుభవములు అసత్యములే అయివుండి కూడా జీవునకు అభ్యాసవశం చేత సత్యమువలెనే తోచుచున్నాయి. ఇదంతా సత్త (Absolute self) + సంస్కారములు – రెండిటి యొక్క సమన్వయ ప్రభావమని గ్రహించు.✳ అయితే ఓ లీలా! జ్ఞానార్తితో నేను చెప్పుచున్నదంతా వింటున్న నీకు, ఒక హెచ్చరిక చేస్తున్నాను. మనం సద్వస్తువు గురించి గ్రహించటానికి ప్రయత్నిస్తున్నప్పుడు, "జ్ఞాని అనుభవము"నే అధికంగా ప్రమాణంగా అంగీకరించాలి సుమా! అంతేగాని, అజ్ఞాని అనుభవములు క్రోడీకరించి ఎంతగా తర్జన–భర్జనలు చేస్తే మాత్రం ఏం ప్రయోజనం?

---

✳ శివ తత్త్వజ్ఞానము ప్రవచించు శివపురాణం 'సత్త'యే శివుడుగా, సంస్కారములు లేక ప్రకృతియే పార్వతిగా, జలతరంగములవలె ఆ ఇద్దరి అభేదమే ఉత్తమ జ్ఞానయోగముగా చాటుచున్నది.

'నేను-నీవు' మొదలైన వాటితో కూడుకొని కనిపిస్తున్న ఈ సర్వము చిదాకాశమే అయివున్నదని అనుకున్నాము కదా! ఆ చిదాకాశమే సృష్ట్యాదియందు

"ఆకాశ సంవిత్తు"ను గ్రహించుటచే 'ఆకాశము' గాను,

"కాలసంవిత్తు"ను స్వీకరించుటచే 'కాలము' గాను,

"జలసంవిత్తు"ను అవధరించుటచే 'జలము' గాను

గాంచుచున్నది. ఒకడు తన అంతరంగమునందలి స్వప్నంలో తనయందే ఆయా వస్తుజాలమంతా గాంచుచున్నాడు కదా! అట్లే చిద్వస్తువు తనయందు ఆయా ఆకాశాది భావములను పొందుచున్నది. మరి 'మాయ' యొక్క మహిమ అట్టిది. అది లేచి వస్తువులను కల్పించగలదు. అంతేనా .... అట్లు కల్పించబడి, సత్యమువలె అనుభవించబడుచున్న వస్తువులను, ... కల్పనయొక్క అంతమును ఆశ్రయించుట ద్వారా, "ఇదంతా అవాస్తవమే" అను భావనను పొందగలదు. అందుచేత లీలాదేవీ! ఈ ఆకాశతత్త్వము, జలతత్త్వము పృథ్వీతత్త్వము, వాయుతత్త్వము ... ఇవన్నీ అసత్తులే సుమా! ఈ శరీరవే 'అసత్తు' అయివుండగా అట్టి ''శరీరములోని ఇంద్రియముల అనుభవమాత్రములు'' అయినట్టి ఈ 'దృశ్యము' సత్యము ఎట్లా అవుతుంది? చిత్‌శక్తియే పంచభూతములతో కూడిన ఈ సృష్టిని, ఇంద్రియాదులకు సంబంధించిన ప్రియా ప్రియములను, ఆ ప్రియాప్రియముల అనుభవమునకు అనుకూలమైన ఉపాధులను (శరీరములను) తనయందు స్వప్నములోని వస్తువులవలె కల్పించుకొంటోంది. అనుభవమును పొందుతోంది. ఈ నేను చెప్పుదానికి దృష్టాంతముగా;

**1. స్వప్నం :** ఒకడు ఒక 'కల' కంటూ, ఆ కలలో పొందుతున్న ఆయా సంఘటనలు, సుఖ దుఃఖాలు, ప్రియ-అప్రియములు, భయ-ఆందోళనలు అదంతా 'స్వకల్పితమాయ' అనక తప్పదు.

**2. సంకల్పము :** మరొకడు సంకల్పములో ఆయా ఊహకు సంబంధించిన పదార్థజాలము, వాటి అనుభవం పొందుతాడు. ఒకానొక పిచ్చివాడు తన ప్రక్కనే తాను ప్రేమించే, లేక ద్వేషించే ఆకారమును సంకల్పించుకొని, అట్టి సామీప్యతకు స్పందిస్తూ ఉంటాడు. అదంతా స్వయంకల్పితమైన భ్రమయే కదా!

**3. ధ్యానము :** ఒక మాంత్రికుడు తన ధ్యానశక్తిచే ఒకానొక దృశ్యమును కల్పించి ప్రేక్షకులకు ఎదురుగా చూపించగలడు. అది అతనిచే కల్పించబడినదే అయినప్పటికీ, ప్రేక్షకులు అది వాస్తవమని తలచి చూస్తూ ఉంటారు.

కాబట్టి ఇక్కడ ఎవడు ఎట్లు దర్శిస్తున్నాడో అతడు 'అట్లు దర్శించటం' అనేది స్వయంకల్పితమైన మాయ, లేక భ్రమయే సుమా!

సరే! ఇప్పుడు నీకు .... "మరణానంతరం జీవుడు కర్మఫలములను ఎట్లా అనుభవిస్తాడు?" .... అనే విషయం విశదీకరిస్తాను. అప్పుడు ఈ విషయంలో నీకు ఉన్నట్టి అనేక సందేహాలు తొలగిపోతాయి. నీకు శ్రేయస్సు చేకూరగలదు.

ముందుగా ఈ "మానవుని ఆయుష్షు" అనబడుదాని నియతి గురించి విను. సృష్ట్యాదియందే ఒకానొక నియమము ప్రకారం ఈ మానవుని ఆయుష్షు ఈ విధంగా నిర్ణయించబడినది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృతయుగం | = | 400 సంIIలు | త్రేతాయుగం | = | 300 సంIIలు |
| ద్వాపరయుగం | = | 200 సంIIలు | కలియుగం | = | 100 సంIIలు |

అయితే ఈ 'ఆయుర్దాయం' విషయంలో హెచ్చు తగ్గులు ఉంటున్నాయి. దేశ, కాల, క్రియ, ద్రవ్యముల యొక్క "పవిత్రత-అపవిత్రతలు" అనుసరించి ఆయా మనుష్యుల జీవితములు నడుస్తున్నాయి. వారు నిర్వర్తించు కర్మ - అకర్మల ఫలములు జీవితమును ప్రభావితం చేస్తున్నాయి. అందుచేత ఆయుర్దాయంలో కూడా మార్పు-చేర్పులు కలుగుతూ ఉంటాయి. నిర్దుష్టములైన 'కర్మ'ల యొక్క - ఆ కర్మల యొక్క ఫలితము అయినట్టి 'ధర్మము' యొక్క హెచ్చు-తగ్గులను అనుసరించే ఆయువు యొక్క హెచ్చుతగ్గులుంటాయని అధర్వణవేదము మొదలైన శాస్త్రములు వచిస్తున్నాయి. నిర్దుష్టములైన స్వధర్మమునకు సంబంధించిన శ్రద్ధతో కూడిన ఆచరణము పెరుగుచున్నప్పుడు జనుల ఆయువు కూడా పెరుగుతూ ఉంటుంది. ప్రజలు స్వధర్మములను మరచి చరిస్తూ ఉన్నప్పుడూ వారి సరాసరి ఆయుష్షు తగ్గుతోంది. నిర్దుష్టకర్మల ఆచరణము ఏ విధంగా ఉంటే జనుల సరాసరి ఆయుర్దాయం ఆ విధంగానే ఉంటోంది. ఈ విధంగా వ్యష్టి-సమష్టి జనుల ఆయుర్దాయం ఆయా మార్పులు-చేర్పులు పొందటం జరుగుతోంది.

ముఖ్యంగా ఆయా నిర్వర్తించబడు కర్మలను అనుసరించే ఈ ఆయుర్దాయము మొదలైనవి ఉంటున్నాయి. ఉదాహరణకు, ఒకడు బాల-మృత్యుకారకమగు కర్మలు ఆచరించాడనుకో. అప్పుడు అతనికి తదనంతర జన్మలందు బాల్యమునందే మృత్యువు ప్రాప్తిస్తోంది. అదేవిధంగా నిషిద్ధ కర్మలు ఆచరించినప్పుడు, తదనుసారంగా అకాల మృత్యువు యౌవన-కౌమారాలలో వచ్చిపడుతోంది. శాస్త్రములచే విధించబడిన ఆయా సుకర్మలను ఆచరించుచు ప్రశాంత చిత్తమును అలవరచుకొనుచున్న వాడు నిర్దుష్టమైన దీర్ఘాయుర్దాయమునకు తగిఉంటున్నాడు.

ఆయుష్షు క్షీణించి అంతిమకాలము ప్రాప్తించగానే అప్పుడు కర్మానుసారం మర్మ ఛేదకమగు 'వేదనం' ప్రారంభమౌతుంది. క్రమంగా మృత్యువు లేక మరణము జీవుని ఆక్రమించివేస్తుంది.

❖❖❖

# 41. మరణానుభవం : అందుకు విచికిత్స

**ప్రబుద్ధలీల :** హే సర్వజ్ఞానవిధాతా! జగన్మాతా! 'మరణము' అంటే ఏమిటో చెప్పు. మరణం విషయంలో నన్ను అనేక సందేహాలు వేధిస్తున్నాయి. మరణదుఃఖం ఎట్లా ఉంటుంది? అప్పుడేమైనా సుఖం ప్రాప్తించగలదా? ఏదైనా తెలుసుకొనటం చేతగాని, ఆచరించటం చేతగాని అనివార్యమగు మరణము ఒక సునాయాసమైన అనుభవంగా ఉండుటకు వీలున్నదా? మరణానంతరం ఏమి జరుగుతోంది? యోగుల మృతికి సాధారణ జనుల మృతికి భేదమేమైనా ఉన్నదా?

**శ్రీ సరస్వతీదేవి :** మనం మరణము గురించి చర్చించటానికి వీలుగా ఈ చనిపోవుచున్న జీవులందరిని మూడు రకాలుగా విభజించవచ్చు.

**1. మూర్ఖులు:** కొందరు దృశ్యములోని విషయములపట్ల, ఇంద్రియానుభవముల పట్ల అత్యంత తాదాత్మ్యము, విశ్వాసము, మమకారము, భ్రమ కలిగివుంటున్నారు. అట్టి వారిని 'మూర్ఖులు' అని పిలుస్తున్నాం. వారు వివేచనారహిత స్థితిలోనే మరణమును పొందుచున్నారు.

**2. ధారణాభ్యాసులు :** "ధారణ"ను అభ్యసించేవారు. అనగా, ప్రాణములను స్వసంకల్పవశం చేసుకొని అభ్యాసంచే నాడీ మండలములోని ప్రాణసంచారము నిరోధించగలిగినవారు. ప్రాణములను + మనస్సును నాభివద్దగాని, హృదయ ప్రదేశమున గాని, కంఠమున గాని, భ్రూమధ్య ప్రదేశమునగాని, బ్రహ్మరంధ్రము వద్దగాని అభ్యాసవశం చేత నిలుప గలిగినవారు.

**3. యుక్తిమంతులు:** "మేము శుద్ధ - చైతన్య - స్వరూపములమైయున్నాము. ఈ దృశ్యములోని ఒక వస్తువు కాము. ఈ దృశ్యము మాకు సంబంధించినది కాదు. ఈ దృశ్యమునకు మేము సంబంధించినవారము కాము.

"శుద్ధ - సంవిత్ - స్వరూపులమగు మేము జన్మించటం లేదు. మరణించటం లేదు. తరంగములు పొందుచున్నప్పుడు, పొందనప్పుడు కూడా జలము జలమే కదా! ఈ శరీరాదుల రూపములను మేము స్వీకరించవచ్చు. లేక త్యజించవచ్చు. మాకు ఏ భేదములేదు. మా స్వస్వరూపమునకు వేరుగా ఎప్పుడూ ఎక్కడా ఏదీ లేదు. ఇక్కడ తారసబడేదంతా పరమాత్మ యొక్క సంప్రదర్శనావిన్యాసమే!"

ఇట్టి మోక్ష భావములను గురువులతో సంభాషించుటచేత, శాస్త్రములను విచారించటం చేత, స్వబుద్ధిచేత (స్వవిచారణచేత) కొందరు మృత్యువు ప్రాప్తించుటకు మునుముందుగానే పెంపొందించు కొంటున్నారు. అట్టివారిని "యుక్తిమంతులు" అంటున్నాం.

వీరిలో ధారణాభ్యాసులు, యుక్తిమంతులు అగువారు ఈ దేహమును పరిత్యజించే టప్పుడుగాని, ఆ తరువాత గాని ఏమాత్రం దుఃఖం పొందరు. సుఖమునే పొందుచున్నారు. అట్లు కానట్టి మూర్ఖులు మరణసమయంలో దుఃఖమునే పొందుచున్నారు. ఎందుకంటావా? విను.




ధారణాభ్యాసముగాని, వివేక-విచారణలుగాని ఆశ్రయించనట్టివారి చిత్తము జీవించి యున్నంతకాలం అనేక వాసనలచే ఎల్లప్పుడు చలిస్తూనే ఉంటుంది. వాటి గురించి ఆలోచిస్తూనే ఉండటం చేత అట్టివారు మరణసమయంలో అత్యంత దీనత్వమును పొందుచున్నారు. చిత్తమే వాసనలకు ఉనికి స్థానం కదా!

ఈ జీవులలో అనేకులు శాస్త్రసంస్కారం, ఉత్తమ అభ్యాసం పొందకుండానే "మానవులై జీవించటం" అను ఒకానొక అవకాశమును చేజార్చుకొంటున్నారు. దుస్సాంగత్య పరులగుటచే నిప్పులో పడినవా-నివలె మరణసమయంలో ఎడతెగని దుఃఖములను పొందుచున్నారు.

❖

మృత్యువు సమీపించినప్పుడు .... కంఠము బొంగురుపోతోంది. చూపు తగ్గిపోతోంది. రంగు వాడిపోతోంది. వారి దృష్టికి దిక్కులన్నీ వెలుగు తగ్గి, అంధకారమయం అగుచున్నాయి. దిక్ మండలములన్నీ కారుమేఘములు క్రమ్ముకొన్నట్లు అయిపోతున్నాయి. పగటిపూటనే నక్షత్రములు ఏర్పడుచున్నాయి. ఆ జీవుడు అపరిమితమైన బాధతో .... భూమిని ఆకాశంగాను, ఆకాశమును భూమిగాను ... చూస్తూ ఉంటాడు. కళ్ళు తిరిగిపోతున్నట్లు ఉంటుంది. దిక్చక్రములు తేలిపోతున్నట్లు, ఆకాశంలోనికి కొనిపోబడుచున్నట్లు, గాఢమగు నిద్రచే ఆవరించబడుచున్నట్లు వారికి అనిపిస్తూ ఉంటుంది. ఒక్కొక్కసారి చీకటి నూతిలో పడిపోవుచున్నట్లు, రాతి మధ్యభాగంలో ఒక కప్పవలె చిక్కిపోయినట్లు అనుభవం పొందుచున్నారు. ఏదో చెప్పాలని ఉంటుంది. కాని నోరు పెగలదు. హృదయం ఛిన్నమై పోయినట్లు ఉంటుంది. ఈ అనుభవములన్నీ జన్మ-జన్మార్జితమైన అజ్ఞానం చేతనే ప్రాప్తిస్తున్నాయి సుమా!

❖

అందుచేతనే, ఈ జీవుడు శరీరధారి అయి, జీవించి ఉన్నంతకాలం "నేను ఎవరు? ఈ దృశ్యము యొక్క వాస్తవ స్వరూప-స్వభావములు ఏమై ఉన్నాయి?" అనునది గ్రహించుటకు ప్రయత్నించాలి. అట్లు ప్రయత్నించటమే ఉచితమని మా అభిప్రాయం. స్వవిచారణచేత, శాస్త్రపరిశీలనచేత, గురువాక్యమననము చేత, దైవోపాసనచేత, సర్వులయందు వెలసియున్నట్టి ఆత్మదేవుని సంతోషింపజేయుటచేత మనస్సు నిష్కల్మషమౌతోంది. అట్టి ప్రయత్నముల ప్రయోజనంగా ఆసక్తులు, వాసనలు, మనో వ్యసనములు సన్నగిల్లుచున్నాయి. సర్వాత్మకుడగు ఆత్మదేవుని సర్వమునందు దర్శించటం అభ్యసిస్తూ రాగా, అప్పుడు ఆత్మజ్ఞానం ఆరూఢమగుచున్నది. అనగా "స్వసత్త సామాన్యము (Absolute Self - Existence) ..... అనబడు మోక్షస్థితి సుస్థిరమౌతోంది. అట్టివానికి శరీరముయొక్క రాకపోకలు ఉన్నప్పటికీ అతడు "నేను పుట్టుచున్నాను. చచ్చుచున్నాను" ... వంటి భావనా సంపర్కములు పొందటంలేదు. అట్టి ఉత్తమ స్థితి కొరకే మానవ జన్మ వచ్చినందుకు ప్రయత్నించాలి. అంతేకాని, మహత్తరమైన అవకాశమైయున్నట్టి మానవజన్మను శుష్కవాదనలతోను, అజ్ఞానక్రియాకలాపములతోను, స్వల్ప లక్ష్యముల తోను వృథా చేసుకోకూడదని సద్గురువుల స్థానములో ఉన్న మేము ప్రియులగు సర్వజనులకు గుర్తు చేస్తున్నాం.

❖

అజ్ఞానిని మృత్యువు సమీపించినప్పటి మనోగతమైన స్థితి విషయమై మరికొన్ని విశేషాలు చెప్పుచున్నాను. విను.

మూర్ఛత్వమును ఆశ్రయించి, దృశ్య-సంపర్కముతో కూడి మునిగితేలుతున్న జీవుడు, మరణం ఆసన్నమైనప్పుడు చిత్ర-విచిత్రములైన స్థితిగతులు అంతరంగమునందే అనుభవిస్తున్నాడు. సుడిగాలిచే లేవనెత్తబడిన గడ్డిపరక క్రింద పడినట్లు తాను కూడా ఎగిరి క్రిందపడుచున్న అనుభవం పొందు చున్నాడు. వేగంగా ప్రయాణిస్తున్న రథం ఎక్కినట్లు, మంచులాగా కరిగిపోతున్నట్లు తాను తనకే కనిపిస్తాడు. అట్టి స్థితిలో అతడు తను పొందుతున్న సంసారదుఃఖములన్నీ తన బంధువులకు తెలియచెప్పు కోవాలని తాపత్రయపడుతూ ఉంటాడు. కాని మాట పెగలదు. తను అరుస్తూ ఉండటం అనుభవిస్తాడు. కాని, తన కేకలు తనకే వినబడవు. ఒక పెద్ద క్షేపణ యంత్రమునో (Giant wheel) లేక వాయు యంత్రమునో, లేదా ఒకానొక భ్రమయంత్రమునో అధిరోహించినట్టి భావన పొందుతాడు. నాలుకను ఎవరో పట్టి లాగినట్లు ఉంటుంది. సుడి-గుండమున పడినవానివలె ఉంటాడు. సముద్రము, భూమి తలక్రిందు లగుచున్నట్లు, తాను ఏదో అగాధంలో పడిపోవుచున్నట్లు, మరల ఇంతలోనే పైకి లేచుచున్నట్లు ఉంటుంది. ఇదంతా అతడు భ్రమవంశంచేత, లేక, అజ్ఞాన ప్రభావం చేత అట్లు అనుభవమును పొందుచున్నారు. తనయొక్క 'ఉచ్ఛ్వాస-నిశ్వాస' ధ్వనులను విని తుఫాను - శబ్దములను వింటున్నట్లు భయమును పొందుతూ ఉంటాడు. ఇంద్రియములకు సంబంధించిన వ్రణబాధలు అనుభవిస్తూ ఉంటాడు.

**లీలాదేవి :** అసలు ఈ దౌర్భాగ్యమంతా ఈ జీవునికి ఎందుకు ప్రాప్తిస్తోంది?

**సరస్వతీదేవి :** ఈ జీవుడు జీవించి ఉన్నంతకాలం సరైన జ్ఞానసముపార్జనకు ప్రయత్నించక, అవసానదశలో, శరీరము నేలకూలునట్టి దశలో "నేను ఈ భౌతిక శరీరమును. నేనీ శరీరమునందు మాత్రమే శరీరపరిమితుడనై ఉన్నాను. ఈ శరీరముతో ఏర్పడుచున్న సంబంధ-బాంధవ్యములు అత్యంత వాస్తవములు. ఈ ధన-గృహాదులు నావి. ఈ బంధుజనులు నా వారు" అను భ్రమ కలిగియే ఉంటున్నాడు. అట్టి శరీర తాదాత్మ్యము చేతనే జీవునకు ఈ బాధలన్నీ వాటిల్లుతున్నాయి. "నేను చైతన్యస్వరూపుడను. సర్వాత్మకమగు ఆత్మస్వరూపమే నాయొక్క స్వరూపము" అనునట్టి ఎరుకను ఈ దృశ్య తాదాత్మ్యము కప్పివేస్తోంది. ఫలితంగా ఆత్మ వ్యతిరిక్తమగు అనుభవములన్నీ వచ్చి పడుచున్నాయి. మేఘములు ఆకాశమును కప్పివేస్తున్నప్పుడు, ఆ ఆకాశము యొక్క నీలత్వాదులు కనబడకుండానే ఉంటాయి. అయితే ఆకాశము యొక్క సహజ నిర్మలత్వము, అఖండత్వము, అనంతత్వము ఎక్కడికి పోతున్నాయి? అట్లే ఉంటున్నాయి కదా! జీవుని వాస్తవస్వరూపమునకు ఈ మృత్యువు యొక్క దుర్భర - అనుభవం వలన వచ్చే లోటుగాని, మార్పుగాని ఉండదు.

❖

సూర్యుడు అస్తమిస్తూ ఉండగా, వెలుగులు తగ్గిపోవుచుండగా, దిక్కులన్నీ క్రమంగా మలినమై పోతూ ఉంటాయి కదా! అట్లే, మృత్యువు సమీపిస్తున్న కొలదీ, ఆ జీవుని ఇంద్రియములన్నీ చావ తగ్గి మాలిన్యమును పొందుతాయి. క్రమంగా 'స్మృతిశక్తి' (జ్ఞాపకశక్తి) తగ్గిపోతుంది. పూర్వాపరా జ్ఞానం (Knowledge of Past and inquisitiveness for Future) క్రమంగా సన్నగిల్లిపోతుంది. చూపు

కనబడకుండా పోతుంది. మనస్సు తన కల్పనా సామర్థ్యమును కోల్పోయి, వివేకరహితంగా ఉండిపోతుంది. అది ఒకానొక మహామోహమును పొందుచున్నది. ఆ మోహమునకు ఇక అంతు కనబడదు. ప్రాణవాయువులు అతని అంగములలో ప్రవేశించవు. అందుచేత, అవయవములన్నీ క్రమంగా నిస్తేజమైపోతాయి. అతడు అట్లే మోహమున పడిఉంటాడు. మోహము, పూర్వ సంస్కారములు, భ్రాంతులు .... ఈ మూడు ఒకదానిని మరొకటి బలపరచుకొంటూ ఉంటాయి. అతడు పాషాణమువలె జడుడై ఉంటాడు. ఓ లీలా! మూర్ఛజీవుని తిప్పలు ఇట్లు ఉంటాయి. సృష్టి మొదలుగా అజ్ఞానజీవుని విషయంలో ఇట్లే జరుగుతూనే ఉంటుంది. జ్ఞానము ప్రాప్తించువరకు ఈ తతంగమునకు అంతు ఉండదు.

**ప్రథమలీల :** అమ్మా! సరస్వతీదేవీ! ఇక్కడ నాకొక సందేహం. ఈ శరీరమును చూడు. ఇది .... శిరస్సు, రెండు పాదములు, రెండు చేతులు, గుహ్యము, గుదము ... అనబడు అష్టాంగములతో కూడుకొని మనకు ఎదురుగా కనబడుతూనే ఉన్నది. ఇట్టి ఈ శరీరమునందు "బాధ- మోహము-మూర్ఛ-భ్రాంతి-వ్యాధి-జడత్వము" .... అనునవన్నీ ఎట్లా ఏర్పడుచున్నాయి? ఈ దౌర్భాగ్యములను పొందుచున్న జీవాత్మ అట్లు దుఃఖములు ఎందుకు పొందుతోంది? ఇవి తప్పించగల ఉపాయమేమిటి? ఈ ప్రశ్నలు నన్ను వేధిస్తూ ఉన్నాయి.

**శ్రీ సరస్వతీదేవి :** శుద్ధచైతన్యమే వాస్తవ స్వరూపంగా కలిగియున్నట్టి ఈ జీవుడు "సంకల్పించటం" చేతనే సర్వము ప్రాప్తించటం జరుగుతోంది. కనుక అదంతా సంకల్పనా వైచిత్ర్యమే అయివున్నది.

"క్రియాశక్తి" అను బాహ్యత్వమును స్వీకరించిన ఈశ్వరుడు .... "నా కంటే అభిన్నుడగు జీవుడు బాల్య-యౌవన-వార్ధక్యములందు ఆయా కర్మఫలముల అనుభవమును పొందుగాక" .... అని, ఏదో కారణంచేత సంకల్పించుచున్నాడు. అప్పుడాతడు, తన చిత్తము నందే కల్పించబడిన దృశ్యమునకు పోల్చదగిన ఈ స్వసంకల్పజనితములైన అనుభవములన్నీ పొందుచున్నాడు. ఈశ్వరుడే "జీవుడు-గుణములు" అను వ్యాపకమును స్వయముగా కల్పించుకొని జగన్నాటకంలో క్రీడిస్తున్నాడు.

'కారణము అనిర్వచనీయము' అని కూడా శాస్త్రములచే ప్రతిపాదించబడింది.

❖

జీవుని దేహమునందున్న నాడులు పిత్తము, మొదలైనవి ధాతుప్రకోపంచేత రసపూరిత మగుచున్నాయి కదా! అయితే, ఆ నాడులు మృత్యుసమయము ఆసన్నమగుచుండగా క్రమంగా తమ స్పందత్వాన్ని కోల్పోతున్నాయి. ధాతువులు బలహీనపడుటచే నాడులు రసరహితమై నిస్తేజమై పోతున్నాయి.

ఆరోగ్యవంతుని శరీరంలో "సమానవాయువు" సంచరిస్తూ ఉంటుంది. ప్రాణవాయువు శరీరమంతా ప్రసరించు ప్రవర్తన (లేక క్రియ) కలిగియున్నప్పుడు ఈ అవయవములు క్రియాపూర్వక మౌతున్నాయి. అయితే, సమానవాయువు తన సమత్వపూరితమైన (Balanced) సంచారం త్యజించినప్పుడు, జీవుని శరీరం అనారోగ్యవంతమగుచున్నది. నాడులందు ప్రవేశించిన వాయువు

బయటకు వెలువడకపోవుటచేతనో, లేక బయటకొచ్చిన వాయువు మరల నాడులందు ప్రవేశించకపోవుటచేతనో ... నాడుల వ్యాపారము కుంటువడిపోవుచున్నది. అప్పుడు కళ్ళు మొదలైన ఇంద్రియములు తమతమ శక్తిసామర్థ్యములను కోల్పోవుచున్నాయి. అనగా, ఈ జీవుడు ఇంద్రియజ్ఞానమును, క్రమక్రమంగా, సమాన వాయువుయొక్క ప్రసరణము సన్నగిల్లుచున్న కొలదీ, కోల్పోవుచున్నాడు. నాడుల వ్యాపారము ఆగిపోయి వాయువుయొక్క గతి పూర్తిగా నిరోధమైనప్పుడు "ఇతడు మృతుడైనాడు" అని అంటున్నాం. ప్రాణవాయు ప్రసరణమే జీవనము, దాని ప్రసరణము ఆగిపోవుటయే మరణము.

"నేను జన్మించెదను. మరల ఒకానొకప్పుడు మరణించెదను" అనునట్టి ఇతఃపూర్వపు చిత్ సంకల్పనియతియే మృతికి కారణమగుచున్నది. అట్టి నియతిని ఈశ్వరస్వరూపుడగు ఈ జీవుడే తనకు తాను కల్పించుకొనుచున్నాడు. "నేను ఈ స్థానమున ఇట్లు అగుదును అనునట్టి "సంకల్ప మాయాశక్తి" సృష్ట్యాదియందే ఉదయించింది.* అది ఎన్నటికీ నాశం పొందదు. ఈ బాహ్యత్వమును ప్రాప్తింపజేస్తున్న మాయాశక్తి అవినాశి. దానికి నాశనము అంటూలేదు. అట్టి ఈ స్వభావజ్ఞానమే జనన-మరణముల రూపమున ప్రకటితమౌతోంది. అయితే, ఆత్మకు, ఈ వచ్చి-పోవుచున్న ఉపాధులతో గాని, భావాభావములతోగాని సంబంధము లేదు. సర్వులందు వెలుగొందు ఆత్మ ఎప్పుడూ శుద్ధముగానే ఉండి ఉంటోంది.

❖❖❖

# 42. ద్వంద్వ వ్యవహారం

**ప్రథమ (ప్రబుద్ధ)లీల :** అమ్మా! " 'ఆత్మ' అనునది సర్వుల వాస్తవస్వరూపమై సర్వదా నిర్మలంగానే ఉండి ఉన్నది" అని నీవు అంటున్నావు కదా! మరి, ఈ 'జ్ఞానులు- అజ్ఞానులు', 'పుణ్యులు-పాపులు', 'సుఖి-దుఃఖి' మొదలైనవారు లేరా? ఉన్నారా? ఈ తత్వము తెలుసుకొనుచున్నవాడు-తెలియనివాడు .... మొదలైన అనేక తీరులుగా జనులు మాకు తారసపడుచున్నారు కదా! వీరి మాట ఏమిటి?

**శ్రీ సరస్వతీదేవి :** నదీజలం చూచావు కదా! అది ఒకచోట అనేక తరంగములతో కూడి కలుషితమై ఉంటుంది. ఇంకొకచోట 'తరంగములు' అనునవి లేకుండానే నిర్మలంగా, ప్రశాంతముగా ఉంటుంది. ఈ చైతన్యము కూడా జీవధర్మము తనయందు ఆరోపించుకొనుటచేత రాగ-ద్వేష రూపములతో కూడిన అజ్ఞానముచే కలుషితమై ఉంటోంది. మరొకప్పుడు 'సాధన' యొక్క ప్రయోజనంగా కర్మల వలన అత్యంత నిర్మలత్వము సంతరించుకొని ఉంటోంది. ఏది ఏమైనప్పటికీ .... జ్ఞానియందలి, అజ్ఞానియందలి 'చైతన్యతత్త్వము' మాత్రం ఒక్కటే అయివున్నది కాని, వేరువేరు కాదు. అది వేరువేరు

---

* సృష్ట్యాది = అఖండ-శుద్ధ-సంవిత్ (Existence - knowledge) - స్వరూపుడగు ఈశ్వరుడు ఒకానొకప్పుడు తన వాస్తవస్వభావం మరచి బాహ్యదృష్టిని ఆశ్రయించుటయే "సృష్ట్యాది" లేక "సర్గాది" అని ఈ శాస్త్రంలో చెప్పబడింది. అంతేగాని, "సృష్ట్యాది" అంటే "ఈ కనబడే వస్తుజాలం యొక్క ప్రారంభం" అని అర్థం చేసుకోకూడదు.

అగుటలేదు. అజ్ఞానదృష్టికి వేరువేరువలె కనబడుతోంది. ఋషులందు, మునులందు, దేవతలందు, మానవులందు, రాక్షసులందు, జంతువులందు, నీ యందు, నా యందు .... నిత్యసత్యమై ఒప్పుచున్న ఆత్మ సర్వదా ఒక్కటే. అది వేరువేరుగా లేదు. ఉండబోదు. ఓ ప్రియపుత్రికా! లీలాదేవీ! భేదమును దర్శించుటయే "సంసారము". అభేద దర్శనమే "ముక్తి". పొడవైన లతలందు మధ్యమధ్య కణుపులు ఉంటాయికదా! అదేవిధంగా ఈ "అచేతనసత్త" యందు జనన-మరణరూపములైన గ్రంథులు, అనుభవములు ఉంటున్నాయి.

శరీరదృష్టితో చూచేవారికి, అట్లు చూచేంతకాలం ఈ "చావు-పుట్టుకలు' కనిపిస్తూనే ఉంటాయి. చైతన్యదృష్టి వేరొకవిధంగా ఉంటోంది. వాస్తవానికి చైతన్యపురుషుడు జన్మించటంలేదు. మరణించటం లేదు.




**ప్రథమ (ప్రబుద్ధ)లీల :** అమ్మా! మరి ఈ కనబడుచున్నదంతా ఏమిటి? సత్యమును అనేక కోణముల నుండి అనేకమార్లు వింటేగాని, మాయందు సత్యభావన దృఢంకాదు. అందుకే మరలమరల అడుగుచున్నాను.

**శ్రీ సరస్వతీదేవి :** లీల! నీవు సందేహనివృత్తి అయ్యేవరకు నన్ను ప్రశ్నించవలసినదే. సరే! ఇదంతా ఏమిటో చెపుతాను విను.

శుద్ధ స్వరూపమగు 'చైతన్య పురుషుడు' కేవలము స్వప్నభ్రాంతివలె ఈ జనన- మరణములు, ప్రియ-అప్రియములు, స్థూల-సూక్ష్మములు మొదలైనవన్నీ స్వకీయ మాయచే గాంచుచున్నాడు. ఈ జీవుడు చైతన్య స్వరూపుడేగాని, మరింకేదీ కాదు. చైతన్య స్వరూపుడగు పురుషునకు నాశనము లేదు. ఇక చేతన రహితమైనదానికి పురుషకారం గాని, కర్తృత్వముగాని లేవు. ఇంతవరకు ఎక్కడా ఏ కాలమందు చేతన వస్తువు నశించటంలేదు. కేవలం అచేతనములు,* స్వయంప్రతిపత్తి లేనట్టి ఈ శరీరములు మాత్రమే నశిస్తున్నాయి. అది చూచి జనులు 'అయ్యో! నేను చచ్చుచున్నాను కదా! ఆహా! నేను పుట్టుచున్నానే!" అని భ్రమించుచున్నారు. చేతనము సర్వదా అక్షయమై, సుస్థిరమై ఉంటోంది. అది అన్నివేళల ఏకమేగాని, అనేకము కానేకాదు.

---

* చేతనము = కదిలించేది; : అచేతనము = కదిలించబడేది.

**ప్రబుద్ధలీల :** ఈ "శరీరములు పొందటం, చిత్తములు కలిగి ఉండటం" ... ఆత్మయొక్క స్వభావమై యున్నదంటావా?

**శ్రీ సరస్వతీదేవి :** శరీరములుగాని, చిత్తములుగాని ఆత్మయొక్క స్వభావము అయివుంటే, ఒకడు మరణించిన మరుక్షణం అందరు మరణించేవారే. అట్లు జరుగుట లేదు కదా! కనుక ఈ శరీరములు, చిత్తములు ఆత్మయందు లేవని గ్రహించు.

అసలు జీవునకు ఈ జననమరణాలు ఉన్నాయా? మా దృష్టిలో లేవు. ఇవన్నీ శరీరదృష్టి కలవారిచేతనే పరికల్పించబడింది గాని, ఇవి ఏమాత్రం వాస్తవం కాదుసుమా! అట్లు చూడబడుచున్న దంతా వాసనావైచిత్ర్యమే. ఈ సుఖ-దుఃఖములు, ఈ దృశ్యతాదాత్మ్యము, ఈ జీవభావము, ఈ -నీవు - నేను మొదలైనవి .... ఇవన్నీ వాసనాప్రభావములే కాని మరింకేమీ కాదు. వాసనావైచిత్ర్యమే జనన-మరణముల అనుభవమని గ్రహించేవారు భ్రమచెందరు.

కనుక, జీవునికి జనన-మరణములు లేవు. అతడు జన్మించడు. మరణించడు. కాని, నిష్కారణంగా "వాసనాప్రవాహం" అనబడు సుడియందు కొట్టుకొనుచున్నాడు. ఎందుచేత? దృఢ విచారణ లేకపోవుట చేతనే. దృఢ విచారణ ఆశ్రయించటంచేత దృశ్య వస్తువుల యొక్క 'అత్యంత అభావము' ఏర్పడుచున్నది. అప్పుడు వాసనలన్నీ వినాశనమొందుచున్నాయి. 'ఈ దృశ్యముపై గల దృఢమైన నమ్మకం' కాకుండా వాసనలకు వేరు రూపం ఎక్కడ చెప్పు? వాసనలు క్షయించగా దృశ్య సత్త కూడా క్షీణించి పోవుచున్నది. కాబట్టి లీలా! వైరాగ్యముతో కూడిన సాధన సంపత్తి గల వాడు వికారములను జయించి వేస్తున్నాడు. అప్పుడాతడు తత్త్వదృష్టిచే, "ఈ దృశ్య జగత్తు మిథ్యయే" అని గ్రహించుచున్నాడు. అట్టివాడు ద్వైత వాసనల నుండి తొలగినవాడై భవ భయముల నుండి ముక్తుడగుచున్నాడు.

ఓ బిడ్డా! ఒకానొక ఉత్తమ సత్యమును సర్వజనులను దృష్టిలో పెట్టుకొని మరల మరల ప్రకటిస్తున్నాను. "శుద్ధాత్మ స్వరూపము ఒక్కటే సత్యము. తదితరములన్నీ మిథ్య మాత్రమే."

❖❖❖

## 43. పునర్జన్మ

**ప్రబుద్ధలీల :** హే జగజ్జననీ! దేవేశీ! మనుజుడు మరణించిన తరువాత మరల ఎట్లు జన్మిస్తాడో నాకు వినాలని ఉన్నది. అట్టి విషయములు వినటంచే నా జ్ఞానము వృద్ధి చెందుతుందని నీవు అనుకుంటే ఆ విషయం చెప్పు.

**శ్రీ సరస్వతీదేవి :** సరే చెపుతాను. విను.

ఈ శరీరముయొక్క నాడీస్పందము శాంతించినప్పుడు ప్రాణవాయు చలనము కూడా ఆగిపోతుందని అనుకున్నాము కదా! అప్పుడు మనుజుని చైతన్యము ఉడిగినట్లు అనిపిస్తుంది. అయితే, స్వాభావికంగా చూస్తే ఈ చైతన్యము శుద్ధము, నిత్యము. దీనికి క్షయము గాని, ఉత్పత్తిగాని

ఉండదు. శుద్ధ చిన్మాత్రమే స్థావర - జంగమము లందు, ఆకాశమునందు, శిలలయందు, వాయువునందు, సర్వపదార్థములందు వెలయుచున్నదని సూక్ష్మగ్రాహ్యులగు జ్ఞానులు సర్వదా ఎరుగుచునే ఉన్నారు.

ప్రాణవాయువు నిరోధమైనప్పుడు నాడీస్పందము ఆగిపోతోంది. అప్పుడు "ఈ జడదేహము మృతి చెందినది" అని చెప్పబడుతోంది. అయితే, మృతి అనునది శరీరము యొక్క ధర్మమేగాని, ఆత్మధర్మము ఏమాత్రమూ కాదు. ప్రాణవాయువులు మహా వాయువులలో కలసిపోవుటచే శరీరము శవముగా మారిపోవుచున్నది. కాని చైతన్యము తన వాసనలతో కూడినదై ఆత్మతత్త్వముననే వెలయుచున్నది. సూక్ష్మమగు ఈ చైతన్యము పునర్జన్మకు కారణములగు వాసనలతో కూడుకొని ఉంటోంది. అందుచేత శాస్త్రములు, శాస్త్రవేత్తలు, అద్దానిని "జీవుడు" అను పేరుతో పిలుస్తారు. అయితే 'వాసనలు' అనునవి చైతన్యముకంటే వేరైన బాహ్యపదార్థములు కావు సుమా! జలము కంటే తరంగములు వేరు కావు కదా! చైతన్యము యొక్క "దృశ్యాసక్తి"నే 'వాసనలు' అను పేరుతో పిలుస్తున్నాం.

ఈ చైతన్యము ఎక్కడికో వెళ్ళటంలేదు. ఎక్కడి నుండి రావడంలేదు. ఎందుచేతనంటావా? ఈ "ఇక్కడ - అక్కడ, దూరము - దగ్గర" అనునవి పంచభూత దృష్టికి మాత్రమే ఉంటున్నాయి. సర్వము చైతన్యమయమే అయివుండగా, జీవుని చైతన్యము వెళ్ళుటకు వేరుగా చోటు ఎక్కడ ఉన్నది? కాబట్టి లీలా! ఈ సూక్ష్మమగు చైతన్యము వాసనా బలంచేత శరీరము ఉన్నప్పుడు ఏ స్వస్థానంలో ఉన్నదో, శరీరం తొలగినప్పుడు కూడా అదే 'స్వస్థానం'లో ఉంటోంది. అనగా అది శరీరము వచ్చినప్పుడు ఒక చోటికి, ఈ శరీరము నేలకూలినపుడు మరొకచోటికి వెళ్ళటంలేదు సుమా! "పరలోకమునకు వెళ్ళటం - ఇహలోకమునకు రావడం" ... ఈ వ్యవహారమంతా స్వప్నతుల్య వ్యవహారమే. అంతేకాని, ఈ జీవుని జీవచైతన్యము స్థానభ్రంశము పొందటం లేదు.

❖

సంస్కార సహితము - ఉపాధిరాహిత్యము అయినప్పుడు, వ్యవహారజ్ఞులు (లేక) శాస్త్ర రచయితలు ఈ జీవుని "ప్రేతము" అను పేరుతో పిలుస్తున్నారు. చైతన్యము జీవవాసనలు కలిగి యున్నప్పుడు అట్టి వాసనాసహిత - చైతన్యమే అది. వాయువునందు సుగంధం వేరైన రూపం అంటూ లేకుండానే ఉన్నట్లు చైతన్యమునందు సంస్కారము లేక వాసనల రూపమున జీవత్వము ఉండి ఉంటోంది.

ఆ జీవుడు "మృత్యువు" అను ప్రక్రియ ద్వారా "వర్తమాన శరీరమును గాంచటం" అను దానిని త్యజించుచున్నాడు. ఇంతలోనే మరొక శరీరమును గాంచుచున్నాడు. స్వ-వాసనా వశంచే (Indulgence of one's own tendencies) అట్టి వాసనలను అనుకూలమగు వ్యవహారముగా గాంచు చున్నాడు. భోగానుభవములు పొందుచున్నాడు. అదియే అతనిపట్ల పరలోకమగుచున్నది. అచట మరల మునుపటివలెనే భావములను, ఆవేశములను, స్మృతిసంస్కారములను ప్రకటించుచున్నాడు

.... "నా 'మరణమూర్ఛ' అనే అనుభవం గతించినది" .... అని భావించుచు క్రమంగా మరణ స్థితి (శరీర రహిత ప్రేతస్థితి)ని స్వప్నతుల్యంగా త్యజించి వేస్తున్నాడు. ఒకడు నిదురలేవగానే మనస్సు నుండి స్వప్నానుభవమంతా తుడిచివేసి జగత్‌లో ప్రవేశించి ప్రవర్తిస్తున్నట్లు, అతడు ఇప్పుడు "ఈ నూతన శరీరమే వాస్తవము, దీనికి ముందుగా ఏదీలేదు. ఆవలా ఏదీ లేదు. నేను ఈ శరీరమునకు సంబంధించిన వాడిని మాత్రమే. ఇప్పుడు ఇక్కడ గాంచుచున్న దృశ్యములు, వ్యక్తుల సంబంధములే వాస్తవం" అనునట్టి ఒకానొక భ్రమాత్మకమైన బుద్ధిచాంచల్య స్థితిని పొందుచున్నాడు. తనకుతానే అట్టి బుద్ధి వ్యవహారమునందు తన అఖండ స్వస్వరూపమును – బంధింప బడినదానివలె గాంచుచున్నాడు.

ఓ లీలా! ఇదంతా ఇట్లు అనేక జన్మల దురభ్యాసముచేతనే ప్రాప్తించుచున్నది. 'భావన' నుండే జీవునకు బంధ–మోక్షములు ప్రాప్తిస్తున్నాయి. ఆకాశంలో మేఘ సమూహములు ఏర్పడుచున్నట్లు, ఈ జీవుని చిత్తాకాశములోకూడా పృథివి మొదలైన పదార్థములతో కూడిన విశ్వమంతా ప్రాప్తిస్తోంది. అతడట్లు చూచునదంతా అతని ఆత్మయందే సుమా! అదే విధంగా మనం ఇప్పుడు ఇక్కడ చూచునదంతా వాస్తవానికి మన ఆత్మయందేగాని వేరుగా ఎక్కడా లేదు. అట్లే ప్రతి ఒక్క శరీరధారుడగు జీవుని విషయం కూడా.

ఇట్లు శరీర పతనానంతరం ప్రాప్తించే తదనంతర దృశ్యము, ఉపాధి, అనుభవములు, సంబంధములు మొదలైనవి ఈ క్రింది లక్షణములు కలిగి ఉంటాయి.

**1. సంస్కారములు - వాసనలు - అభిలాషలు :**

ఆ జీవుని సంస్కారములు పూర్వవాసనలను అనుసరించే ఉంటాయి. అనగా జీవుడు ఇతః పూర్వము దేనిదేనిపట్ల ఎట్లెట్లు అధికమైన ఆసక్తి – అభిలాషలు కలిగివుంటాడో – వాటిని అనుసరించి అవన్నీ అట్లే గాంచుచు ఉంటాడు.

**2. తన అంతరంగమునందే తాను దర్శించుట :**

ఒకడు తన స్వప్నంలో జగత్తులు గాంచుచున్నట్లు, ఆ జీవుడు తన సంస్కారములను అనుసరించి, తనయందే సర్వమును (పూర్వం చూచినది, ఇప్పుడు చూస్తున్నది. ఇక ముందు చూడబోవునది) గాంచుచున్నాడు.

**3. సృష్టి - పరిమితమైన దర్శనం :**

అతడు అట్లు గాంచుచున్న జగత్తును ఇతరులు గాంచలేరు. ఇతరులకు ఆ స్థానం గృహాకాశంగానే కనబడటం మనం నీ విషయంలోను, పద్మని విషయంలోను చూచాము కదా! ఒకడు తన స్వప్నంలో గాంచు విషయములను, దృశ్యములను, వ్యక్తులను ఆ ప్రక్కనే ఉన్నవాడు గాంచలేడు కదా!

❖❖❖

# 44. ప్రేతస్థితి

శరీరము త్యజించినప్పుడు, అప్పుడు శేషించు ఈ జీవునిస్థితి 'ప్రేతము' అని అంటారు. అట్టి ప్రేతస్థితులు ఆరు విధములుగా విభజించి వివరిస్తాను. విను.

**1. స్థూలపాపి :** గొప్ప దుష్టకార్యములను నిర్వర్తించినవాడు, మనస్సునందు క్రూరత్వము వహించినవాడు – శరీరము త్యజించినప్పుడు 'స్థూలపాపి' కోవకు చెందుతాడు. అతడు పాషాణమువలె జడుడు అయి దీర్ఘకాలం 'మరణమూర్ఛ' అను ఘనీభూతస్థితిని అనుభవిస్తున్నాడు. మరల యథాసమయంలో ప్రబుద్ధుడై వాసనల మధ్య చిక్కుకుని – ఉండిపోయి చాలాకాలం నరకయాతనలు పొందుచున్నాడు. క్రమంగా నూర్లకొలది జన్మలు ఎత్తి అసంఖ్యాకములగు ఉపాధులలో అనేక దుఃఖములను అనుభవించుచున్నాడు. మరల ఈశ్వరప్రసాదముచే ఒకానొకప్పుడు వాని సంసార స్వప్నము శాంతిస్తోంది.

ఇట్టివారిలో కొందరు తమ 'మరణమోహము' గడచిపోయిన తరువాత, అత్యంత దుఃఖపూర్ణమై యుండే "నేను వృక్షమును" మొదలైన భావనలను తమ హృదయము నందే అనుభవిస్తున్నారు. తరువాత భూతలంపై నానావిధములైన యోనులలో పరిభ్రమించటం జరుగుతోంది.

**2. మధ్యపాపులు :** మధ్యరకములైన ద్రోహచింతనలు, ఇతరులను బాధించటం వంటి పాపములను చేసిన వారు 'మరణమూర్ఛ'ను పొందిన తరువాత కొంత కాలం పాషాణము వలె జడత్వం పొందుచున్నారు. ఆ తరువాత యథా సమయంలో ప్రబుద్ధులై 'పశువులు' మొదలైన యోనులందు తిరుగాడటం జరుగుతోంది.

**3. సామాన్యపాపులు :** వీరు స్వల్ప పాపములు చేసియున్నవారు. అందుచేత వాసనానుసారంగా ఉత్పన్నమైనట్టి ఆతివాహిక దేహమును పొంది, స్వప్న – సంకల్పములందువలె జనన – మరణములు పొందుతూ ఉంటున్నారు. వారియందలి భ్రమతో కూడిన 'ఆశ'యే వారిని అనేక దుఃఖ స్థితులను ప్రాప్తింపజేస్తోంది. అనగా "అది పొందుతాను. అప్పుడు సుఖవంతుడనౌతాను" అని తలచుచు మూఢమృగములు ఎండమావుల కొరకై పరుగులు తీస్తున్నట్లు అనేక ఉపాధులందు ద్రష్టత్వము వహిస్తూ ఉంటున్నారు. కాని శాంతి పొందటం లేదు.

**4. సామాన్య ధర్మి :** ఇతడు స్వల్పముగా మాత్రమే ధర్మము నిర్వర్తించినవాడు. ధర్మము నిర్వర్తించుటయే పుణ్యస్వభావము అగుచున్నది. అయితే, ఇతడు కూడా సామాన్య పాపివలె అనేక జన్మ–మృత్యువులు పొందుతూనే ఉంటున్నాడు. కాని 'సామాన్యపాపి' కంటే కొంత ధర్మాధిక్యత పొందియున్నాడు కదా! అందుచేత ఇతనికి ధనాదుల ప్రాప్తి జరుగుతూ ఉంటుంది. కొంత సమృద్ధిని అనుభవిస్తూ ఉంటాడు. స్వధర్మనిరతి, లోకోపకారములు, శాస్త్రవిహితమైన కర్మల నిర్వహణ శ్రద్ధాసక్తులతో నిర్వర్తించువాడే 'ధర్మి' అని చెప్పబడుచున్నాడు.

**5. మధ్యధర్మి :** ఇతడు మరణానంతరము ఆకాశవాయువులచే కొనిపోబడి ఉత్తమ స్థానము లందు ఉంచబడుచున్నాడు. తన ధర్మమును కొంత చక్కగా నిర్వర్తించి ఉండటంచే కిన్నర – కింపురుష – యక్ష – మొదలైన సుఖవంతములగు శరీరములను పొందుచున్నాడు. అచ్చట పుణ్యము యొక్క ఫలము (సుఖము) అనుభవించి, మరల ఆ పుణ్యము క్షయించగా, అక్కడి నుండి చ్యుతుడు (displaced) అగుచున్నాడు. వీర్యరస సమన్వితమగు భోజన ద్రవ్యములందు రసరూపమున ప్రవేశిస్తున్నాడు. ఆ తరువాత తనకు యథోచితమైన జాతి (సామాన్యధర్మి–మధ్యధర్మి వగైరా)కి చెందినవాని హృదయంలోను, రేతస్సులోను ప్రవేశిస్తున్నాడు. స్త్రీ గర్భంలో కొంతకాలం వసించి, అటు తరువాత జన్మను గ్రహిస్తున్నాడు.

**6. ఉత్తమధర్మి :** ఉత్తములు, మహాపుణ్యశీలురు అయినట్టి కొందరు మరణానంతరం తమ పూర్వస్మృతిని అనుసరించి ... స్వర్గము, విద్యాధరపురము మొదలైనవి అనుభవించుచున్నారు. ఇలావత (దేవత) కింపురుషాది రూపానుభవములను, ఇతర కర్మల ఫలములను అనుభవించు చున్నారు. ఇక ఆ తరువాత సంపద యుక్తము, సజ్జనులతో నిండియున్నట్టి ప్రదేశములో మానవులై జన్మించుచున్నారు. ఇట్లు మనుష్య లోకంలో ప్రవేశించి పూర్వసంస్కారములు కారణంగా మరల తపస్సు, ధ్యానము, త్యాగము మొదలైన ఉత్తమ క్రియలయందు ప్రేరితులగు చున్నారు.

❖

ఎట్టి వ్యక్తి అయినాసరే, పైన చెప్పినట్టి నియమములకు లోను అవుతూనే ఉన్నాడు. అయితే క్రమము నేను చెప్పినట్లే ఉండవచ్చు. కొంతవేరుగా ఉండవచ్చు. "మోకాలి బొటనవేలు బండరాయిని వేగంగా తాకినప్పుడు గాయము అగును" అనునది నిర్దుష్టమైన సత్యము కదా! అట్లే ఈ లోకంలో ధర్మ–పాపముల నియతి కూడా ప్రవర్తిస్తోంది. "పాపము వలన దుఃఖము, పుణ్యము వలన సుఖము, జ్ఞానము వలన మోక్షము" అనునట్టి ఒకానొక అప్రతిహతమైన సిద్ధాంతము ఈ అంతర్ బహిర్ సృష్టి – వ్యవహారమునందు ప్రవర్తిస్తోంది. వాస్తవానికి ఆత్మ వ్యతిరిక్తమైనదంతా స్వప్న తుల్యమే అయినప్పటికీ, ఈ సిద్ధాంతము యొక్క నియమమునకు లోటు ఉండటం లేదు. బ్రహ్మ రుద్రాదులైనా సరే, ఈ సిద్ధాంతము యొక్క ఫలితము నుండి తప్పించుకో లేకపోతున్నారు.

❖

మృతుడు శరీరము నేలకూలినప్పుడు (లేక శరీరము త్యజించబడినప్పుడు) ఒకానొక "మరణ మూర్ఛ"లో ప్రవేశిస్తున్నాడని అనుకొన్నాం కదా! అట్టి మరణమూర్ఛ నుండి నిద్ర లేచినవాని వలె తేరుకొనిన తరువాత "ఓహో! నేను మరణించితిని" అని భావించు కొనుచున్నాడు. "మరల పిండప్రదానానంతరం శరీరము వచ్చినది కాబట్టి నేను ఇప్పుడు పుట్టాను" అను వేరొక భావపరంపరను పొందుచున్నాడు. పిండప్రదానమునకు ముందు చిత్రమైన అనుభవములు పొందుచున్నాడు. "నేను ఇట్లిట్లు ఈ ఈ విధముగా వీరిని బాధించియున్నాను. అందుకు ఫలితం లేకుండా పోతుందా?

అందుచేతనే కాలపాశమును ధరించి యమభటులు నన్ను గొనిపోవుచున్నారు" అను భావమును అనుభవమును పొందుచున్నాడు. ఆ మృతులలో పుణ్యవంతులు దివ్యములగు విమానములను, ఉద్యానవనములను అనుభవించుచున్నారు. ఓ లీలా! ఈ భావనలు, అనుభవములు ఆ మృతుని శారీరక–మానసిక కర్మలు అనుసరించే ఉంటున్నాయి. అందుచేతనే ప్రతిజీవుడు ప్రతిక్షణం, తనను తాను ఇట్లు ప్రశ్నించుకొంటూ ఉండాలి.

**1. ఉత్తమ కర్మలను ఆశ్రయించటం - దుష్ట కర్మలను త్యజించటం.**

నేను ఉత్తమ కర్మలనే ఆచరిస్తున్నానా? (లేక "ఇతరులను బాధించటం – వేధించటం" వంటి పాపకర్మలను నిర్వర్తిస్తున్నానా?)

**2. రాగము - ద్వేషములను జయించి వేయటం.**

రాగ – ద్వేష పూరితుడనై వ్యవహరిస్తున్నానా? అట్లు ప్రవర్తించుటచే ప్రాప్తించు ప్రయోజనం దుఃఖమే కదా!

**3. జన్మను, కాలమును సద్వినియోగపరచుకోవటం.**

నేను సోమరివలె కాలం వృథా చేయటం లేదుకదా?

ఇట్లు ఆత్మవిమర్శ చేసుకొంటూ సర్వదా ఉత్తమ కర్మలనే ఆశ్రయించాలి. అంతేగాని, కర్మలకు సుస్థానమైన ఈ మానవజన్మను వృథా చేసుకోకూడదు.

పాపకర్మలను ఆచరించియున్నవాడు, "అయ్యో! నాకర్మలకు తగినట్లే మంచు – ముళ్ళు – పెద్ద గుంటలతో కూడిన "అసిప్రతము" మొదలైన నరకములే నాకు ప్రాప్తిస్తున్నాయి" అని తలపోయుట జరుగుతోంది. దీనినే జనులు "నరకమునకు వెళ్ళుట" అను పదములచే చెప్పుకొంటున్నారు.

మధ్యరకమగు పుణ్యము ఆచరించినవాడు, "ఆహా! నేను ఇప్పుడు ఉన్నది. ప్రయాణించునది.... చల్లటి పచ్చికతో కప్పబడిన సుందర మార్గమునందు కదా! చల్లటి నీడగల ఈ మార్గమున నేను 'యమపురము'నకు వచ్చాను. కృతపతియగు యముడు ఈ నా పుణ్య–పాప కార్యములను విచారించుచున్నాడు" అనునదంతా తన హృదయంలోనే పొందుచున్నాడు.

❖

చూచావా లీలా! ఈ విధంగా అందరు కూడా మరణానంతరం భిన్నభిన్నములైన పారలౌకిక అనుభవములను తాము శరీరం త్యజించినచోటే అనుభవిస్తున్నారు. అయితే, ఇందలి చమత్కారమేమిటో గమనించావా! అనేక అర్థ క్రియలతో కూడిన ఈ విస్తారమైన సంసారమంతా "సత్యమే అయివున్నది" అని అనేకమంది జీవులు భావించుకొనటం జరుగుతోంది. మరి, మాయ యొక్క ప్రభావం అట్టిది. ఒకవైపు ఈ సంసార వ్యవహారమంతా ఇట్లు ఉంటూ, జరిగిపోతూ ఉండగానే మరి కొందరు జీవులయందు మరొకవైపు సుస్థిరమైన 'ఆత్మదృష్టి' లేక 'స్వస్వరూపదృష్టి' ఉంటోంది. అట్టి స్వస్వరూప దృష్టి శాస్త్రముల యొక్క అర్థమును గ్రహించటం చేత, గురువులు చెప్పు వాక్యములను మననము

చేయుటచేత, స్వప్రయత్నరూపమగు సునిశితబుద్ధి చేత కలుగుచున్నది. అట్టి దృష్టి కలవారు, "ఆకాశ సదృశ్యము – ఆకార రహితము – అద్వయము – స్వస్వరూపమునకు అభిన్నము – సర్వుల సత్యస్వరూపము ..... అయినట్టి "ఆత్మ" ఒక్కటే ఉన్నది. అది మాత్రమే జాగరిల్లియున్నది. ఈ దేశ – కాల – క్రియలు, హ్రస్వ – దీర్ఘములైన ఈ ఆకృతులు, ఈ దృశ్యములు .... ఇవన్నీ సత్యము కాదు సుమా" .... అని గ్రహించే .... ఉంటున్నారు.

❖

అది అట్లా ఉంచి, యముని పురమునకు పోయినట్టి జీవుల గురించి విచారిద్దాం. వారు ఇట్లు అనుభవమును పొందుతూ ఉండటం జరుగుతోంది.

"ఆహాఁ! యముడు మా కర్మలను మాచే అనుభవింపచేస్తున్నాడు. ఇక ఆ అనుభవం పూర్తి అయినది .... ఇప్పుడు త్వరగా స్వర్గలోకం వెళ్ళుచున్నాం.... స్వర్గానుభవం కూడా, చేసిన పుణ్యం ఖర్చు అయిపోవుటచే గతించింది... అయ్యో! ఇప్పుడు పశువు జన్మలు ఎత్తుచున్నామే! ధాన్యములోని అంకురమునయ్యాను .... ఇప్పుడొక 'ఫలము' అయ్యాను...."

ఇట్లు వారివారి అనుభవములు కొనసాగుతూ పోతున్నాయి. "శరీరము – అంతఃకరణములు – క్రియలు" .... ఈ మూడు లేనట్టి ఆ ధ్యానాంకురము మనుష్యునిచే తినబడినప్పుడు 'రేతస్సు'గా మారుచున్నది. ఆ తరువాత అది యోని ద్వారం గుండా మాతృగర్భంలో ప్రవేశిస్తోంది. గర్భవాసి యగు ఆ జీవుడు పూర్వకర్మానుసారంగా అదృష్టవంతుడుగానో, దురదృష్టవంతుడుగానో, చక్కటి బాలుడుగానో, లేక అవయవముల లోపముగల అనారోగ్య బాలుడుగానో జన్మించుచున్నాడు. ఇక ఆతరువాత చంచలముతో కూడుకొనియున్న బాల్య–యౌవనములను అనుభవించుచున్నాడు. ఇంతలో అతనికి ఎక్కడినుండో వృద్ధాప్యం వచ్చిపడుతోంది. మరల వ్యాధి – మరణము – మరణమూర్ఛ ... మామూలే. ఇదంతా ఒక మహాచక్రమువలె ప్రవర్తిల్లుతోంది. మరల ఇంకొక దేహము గ్రహించటం ఒక 'కల' వలె జరిగిపోతోంది. ఎంత విచిత్రమో చూచావా? ఆకాశమే రూపముగా గల ఆత్మ చిత్తాకాశమునందు "జీవభ్రాంతిని పొందటం" అనబడు స్థితి మొదలుకొని, "స్వస్వరూపమేమిటో గ్రహించి మోక్షమును పొందటం" అనబడు ప్రశాంత – మౌన – చిదానంద స్థితివరకు ఆయా భ్రాంతిపరంపరలన్నీ ఒకదానివెనుక ఒకటి పొందుతూనే ఉన్నది. పక్షి తన గూడు విడచి ఎక్కడెక్కడో సంచరించి మరల తన గూటికి సాయంకాలం చేరుతుంది చూచావా? ఈ జీవుడు కూడా తన వాస్తవమగు ఆత్మ స్వభావమును మరచి బాహ్యాడంబరములను ఆశ్రయిస్తూ అనేక సుఖ–దుఃఖ, జీవన – మరణ అనుభవములను పొందుతూ ఒకానొకప్పుడు కాకతాళీయంగా సర్వదా – స్వభావ సిద్ధమైయున్న ఆత్మత్వమును పొందుచున్నాడు.

❖❖❖

# 45. సృష్ట్యాది - జీవభ్రాంతి

**ప్రబుద్ధలీల :** హే జగజ్జననీ! సరస్వతీదేవీ! నాయొక్క జ్ఞానాభివృద్ధి కొరకు మరొక ప్రశ్న అడుగుచున్నాను. అసలు "సృష్ట్యాది" యందు అఖండ స్వభావమగు ఆత్మకు ఈ "జీవభ్రాంతి" (లేక - "నేను పరిమితుడను" అను భ్రాంతి) ఎట్లా కలుగుతోంది? నాపై అనుగ్రహంతో ఈ విషయం చెప్పు.

**శ్రీ సరస్వతీదేవి :** నీకు కనబడుచున్నట్టి, లేక నీవు చూస్తున్నట్టి, ఈ "పర్వతములు - వృక్షములు - పృథివి - ఆకాశము" మొదలైనవన్నీ విశుద్ధ - చైతన్య స్వరూపములే సుమా! అందుచేత వీటిని ఆత్మవేత్తలు "పరమార్థ ఘనములు" అని పిలుస్తున్నారు. అనగా, అద్వితీయ* విశుద్ధ చైతన్యమే ఇన్ని రూపములతో మాయా ప్రభావంచేత ఉదయించుచున్నట్లు అగుపిస్తోంది.

చేతనామయమగు ఈశ్వరుడు సర్వాత్మకుడై, సర్వవ్యాపి అయి వెలయుచున్నాడు. అతడు ఏ రూపమున ప్రతిభాసించుచున్నాడో, అచ్చట ఆ రూపముననే వెలయుచున్నాడు. అట్లే పేర్కొనబడుచున్నాడు. అతడే ... ఒక కలగంటున్న పురుషునిగా .... జీవసమష్టి రూపమున 'ప్రజాపతి' అగుచున్నాడు. అతడే అట్లు ప్రజాపతి రూపమున సప్త లోకములుగా వివర్తము పొందుచున్నాడు. సృష్టి ప్రారంభమున ఉన్న ఆ సంకల్పమే నేటికీ నిలచియున్నది. ఆ సంకల్పమే పదార్థముల అనుభవంగా ప్రాప్తిస్తోంది.

"నేను పరిమితుడను, అసంపూర్ణుడను, ఏదో పొందవలసినవాడను" అను భావన ఏర్పడటం యొక్క ప్రారంభముచే సృష్టి ప్రారంభముగా చెప్పబడింది.

ఈ దేహమును చూచావా? వాయువు రోమకూపములగుండా ఈ దేహమును ప్రవేశిస్తోంది. ప్రాణవాయువు శరీరంలో ప్రవేశించి అన్ని అవయవములు కదలాడేటట్లు చేస్తోంది. ఇట్టి ఈ 'మానవ - జంతు' దేహములను "జీవిత దేహములు" లేక "జంగమములు" అని అంటున్నాం. ఇక వృక్షాల విషయానికి వస్తే వాటికి కూడా దేహములు కనబడుచున్నాయి కదా! అయితే అవి చేతనములు అయివుండి కూడా చలనము లేక ఉంటున్నాయి. అందుచేత, వాటిని "స్థావరములు" అని అంటున్నాం. అయితే, ఈ స్థావర - జంగమ జీవారణ్యంలో విహారం చేస్తున్నదెవరు? ఈశ్వరుడే సుమా! ఈశ్వరుడే ఈ స్థావర జంగమములలో ఏకస్థుడై, హృదయస్థుడై ఉండి ఉన్నాడు. ఉపాధి భేదములచేత "ఇది జడము - ఇది జంగమము" అనునదంతా ఏర్పడుతోంది.

చిదాకాశమే తన స్వరూపము కంటే అన్యము కానట్టి 'బుద్ధి' అను దానిలో తనకు తానే ప్రవేశించుచున్నది. అట్టి బుద్ధితో కూడి ఈ ఉపాధి అను నగరం ప్రవేశిస్తోంది. ఈ శరీరములో "చక్షువులు - చెవులు - ముక్కు - చర్మము" .... మొదలగు ఇంద్రియ స్థానములను ఆ చిదాకాశ చైతన్యమే దర్శిస్తోంది. అటు తరువాత అయ్యది బుద్ధివృత్తులు ద్వారా 'బాహ్యము' అనుదానిని కల్పించుకుని ఆ బాహ్యమునందు ఆయా పదార్థ జాలమంతా ప్రకాశింపజేస్తోంది. ఓ లీలా! ఈ

---

* అద్వితీయము = దేనికైతే రెండవది అనుదే ఉండదో, అద్దానిని 'అద్వితీయము' అని అంటాం.

కళ్ళు మొదలైనవి స్వయంగా చేతనములు కావు. అవి తమంతట తామే ఎట్టి అనుభవమును పొందలేవు. కనుక జడములే అయివున్నాయి. కాబట్టి సర్వనియామకములకు కారణము, కారణ కారణము చిత్సంకల్పమే సుమా! కొంత సూక్ష్మదృష్టి గలవారే .... "సర్వేంద్రియములలో ఏకరీతిగా వెలుగుచున్నట్టి – సర్వేంద్రియములకు సంబంధించనట్టి" .... చిత్సకంల్పమును గుర్తించుచున్నారు. విభాగించుచున్నారు.

- శూన్యాకారమగు చిత్సంకల్పమే ఆకాశము.
- భూమ్యాకారమైన చిత్సంకల్పమే .... ఈ విశాల నదీ నద గ్రామ పట్టణాలతో ఉన్న భూమి.
- జలశక్తి సంపన్నమగు చిత్సంకల్పమే "జలము".
- ఆ చిత్సంకల్పమే జంగమ సంకల్పము వలన జంగమ పదార్థములుగాను, స్థావర సంకల్పము వలన స్థావర – పదార్థములుగాను వివర్తము పొందుచున్నది.
- "చిత్ సంకల్పమే అన్నివైపులా ప్రసరిస్తూ ఉండి ఉంటోంది. చిత్ సంకల్పము తప్ప వేరుగా 'జగత్తు' అనబడునది లేదు. ఆ చిత్ శక్తియే మనుష్యులు – జంతువులు – వృక్షములు – శిలల రూపమును గ్రహించుచున్నది" అని జ్ఞానులు నిస్సంకోచంగా గ్రహించుచున్నారు.

ఇక అజ్ఞానుల దృష్టి అంటావా? అది అట్లు లేదని వేరుగా చెప్పనక్కర్లేదు. అజ్ఞానులు ఎట్లా భావిస్తున్నా, అది మనకు ప్రమాణం కాదు కదా!

❖

చూచావా లీలా? ఆ చిత్సంకల్పము "సృష్ట్యాది" యందు .... అనగా అది తన అఖండత్వము అప్రమేయత్వములతో, కూడిన చిత్స్వభావము నుండి 'చ్యుతి' పొందినప్పుడు ... ఏయే రూపములుగా ఉండగోరినదో, ఇప్పుడు కూడా ఆయా రూపములుగానే ఉన్నది. అప్పుడు ఏ విధంగా అయితే 'వృక్షములు' మొదలైన పదార్థములు భావించబడ్డాయో ఇప్పుడు కూడా అవన్నీ అట్లే ఉంటున్నాయి. అయితే బిడ్డా! "జడము" అని "చేతనము" అని వేరువేరు పదార్థములు లేవు సుమా! ఈ జడ–చేతముల "సత్త"గా బ్రహ్మపదార్థము ఒక్కటే ఉండి ఉన్నది. సద్వస్తువగు ఆత్మ ఒక జడవస్తువునుగాని, లేక, ఆత్మను జడవస్తువుగాని ఆశ్రయించుకొని ఉండజాలవు. అందుచేత " 'జడము' అనబడు విభాగమే మిథ్య అయివున్నది" అని సత్య ద్రష్టలగు మేము సిద్ధాంతీకరించు చున్నాము. వృక్ష – పర్వతాదులు కూడా చిదేకరసముతోడనే నిండియున్నాయి. ఇక, "ఇవి జడములు" అనునట్టి కల్పనచే ఏర్పడుచున్న అనుభవం – 'బుద్ధి' యొక్క 'ఆరోపణ' మాత్రమే అయివున్నది.

ఆయా వస్తువులయందున్న "ప్రత్యక్‌బుద్ధి" తమ్ము ఆయా వృక్ష–శిలాదులుగా భావించుకొనుచు, ఆరూపముననే అభివ్యక్తమౌతున్నాయి. అట్లే వ్యవహరించబడు చున్నాయి. అట్లే–క్రిమి–కీటక–పక్షి–జంతువులు మొదలైన జంగమ పదార్థముల భావన కూడా. ఆయా జంగమ – జాతులపట్ల గల బుద్ధి – వికారభేదములే ఆయా నామ–రూప భేదములతో ప్రాప్తిస్తున్నాయి. ఒకే జలంలో తరంగములు, ఆవర్తములు, బుడగలు, నురుగు, సుడిగుండములు కలుగుచున్నట్లు, ఒకే చిత్స్వభావము

నందు ఏర్పడు బుద్ధివృత్తులే ఈ స్థావర – జంగమ వ్యవహారమంతా కల్పిస్తున్నాయి. అయితే, 'కల్పన'తో కూడిన బుద్ధియందే నామ – రూపభేదములు ఉండి ఉన్నాయని గ్రహించు. ఒక సముద్రము యొక్క ఉత్తరమున ఉన్నవారు దక్షిణమున ఉన్నవారి గురించి తెలియకనే ఉండటం జరుగవచ్చుకదా! అదేవిధంగా, ఈ స్థావర – జంగమ పదార్థములు కూడా తమ 'స్వస్వరూపము'ను గ్రహించలేకపోతున్నాయి. ఇవి తమతమ "ప్రత్యక్ చైతన్య జ్ఞానవలయము" నందే పడివుంటున్నాయి. అనగా, "నేను వేరు. ఈ కనిపించేదంతా వేరు. నీవు వేరు, ఇవి నాకు చెందినవి. ఇవి నాకు సంబంధించినవి కావు. వీరు మాత్రమే నా వారు" .... అనునట్టి భావావేశమునే ఇక్కడ మనం ''ప్రత్యక్ జ్ఞానవలయము'' (Compartmentalised individual sphere of consciousness)గా చెప్పుకొంటున్నాం. అట్టి వలయమున బంధింపబడటం చేతనే ఒక ఉపాధిలోని బుద్ధి మరొక బుద్ధిలోని కల్పనలను ఎరుగజాలకున్నది. ఇదంతా కూడా బుద్ధికల్పనను అనుసరించే జరుగుతోంది.

"పరబ్రహ్మము" సత్ + చిత్‌రూపము కదా! అది వాస్తవానికి నామరూపరహితమై ఉన్నది. అట్టి పరబ్రహ్మమునందు సత్యదృష్టికి .... వాయువు, భూమి, ఆకాశము, మొదలగు పదార్థముల సత్త లేనేలేదు. అయినప్పటికి వాటికి కల్పనా మాత్రమైన సత్త ప్రాప్తిస్తోంది. రాతిలో ఉన్న కప్ప బైట కప్పను, బైట ఉన్న కప్ప రాతిలోని కప్పను కనుగొనలేవు కదా! ఈ ఈ నీవు–నేను మొదలైన వ్యవహారములు, వాటితో ముడి వేసుకొని ఉంటున్న ఈ పదార్థజాలం .... ఇవన్నీ ఆక్రమించి ఉన్న సమయంలో "సర్వసమత్వము" మరుగునపడి ఉంటోంది.

అయితే ఆత్మకొరకై అన్వేషిస్తున్న విజ్ఞులు ఈ జగత్తు యొక్క "సూక్ష్మావస్థ"వైపు దృష్టిని సారిస్తున్నారు. "మహాప్రళయ సమయంలో ఈ సమష్టి చిత్తము మాయయందు లీనమై ఉంటోంది. అట్టి సృష్టి చిత్తమే ఈ బాహ్యానికి కనబడే 'జగత్తు' యొక్క "సూక్ష్మావస్థ"గా వారు దర్శిస్తున్నారు. మహాప్రళయస్థితి తరువాత మరల ఆ ప్రత్యక్ చైతన్యము చిదాకాశమునందు భావనావ్యవహారమును గావించుచున్నది. అట్టి భావనను ప్రారంభించటంచే సృష్టి ప్రారంభము అని అంటున్నాం. సృష్ట్యాదియందు ఇదంతా ఎట్లు ప్రారంభించబడినదో, నేటికీ అట్లే నిలిచియున్నది. ఉదాహరణకు, సృష్ట్యాది యందు వాయువు స్పందన ధర్మముగా చింతించబడినది. అది ఇప్పటికీ అట్లే నిలచియున్నది. ఉపాధులు వచ్చి పోవుచున్నంత మాత్రంచేత ఈ కల్పన తొలగదు. సర్వకల్పనలు త్యజించబడునట్టి 'మహా ప్రళయము' వరకు ప్రత్యక్ చైతన్యము పట్ల ఈ కల్పన ఇట్లాగే ఉంటోందని గ్రహించాలి.

❖

అట్లు ఛిద్రరూపమున చింతింపబడినదే ఇక్కడ ఎదురుగా ఆకాశము రూపమున ప్రాప్తిస్తోంది. అట్టి ఆకాశమునందు 'స్పందము' అను ధర్మము గల వాయువు వెలయుచున్నది. వాయువు సర్వవ్యాపి కదా! అయినప్పటికీ శుష్క గడ్డిపరకలను కదల్చగలుగుతోంది కాని, భారమైన పదార్థములు కదల్చకలుగుతోందా? లేదు. దాని ధర్మము అట్లు సంకల్పించబడింది. ఈ కల్పనలను చేయుచున్న 'చిత్తము' యొక్క వ్యవహారం కూడా చమత్కారంగా ఉంటోంది. ఇది సర్వత్రా వ్యాపించియుండి,

సర్వత్ర ప్రసరించగలిగిన శక్తి కలిగియే ఉన్నది. కాని ఇది తనను తానే స్వయముగా పరిమితము చేసుకొనుచున్నది. వాయువునకు 'స్పందము' అనునది ధర్మము అగుచున్నట్లు, అగ్నికి 'ఉష్ణత్వము' సహజమగుచున్నట్లు, ఈ చిత్తమునకు "పరిమితత్వము" సహజధర్మమగుచున్నది. ఈ చిత్తమే స్పందాస్పందములను రెండు ధర్మములను స్వీకరిస్తోంది. అట్టి స్పందము – అస్పందము (Responsive - Non-responsive) అను ధర్మముల ననుసరించి 'స్థావరములు – జంగమములు' అను రెండు ఆకారములను దాల్చుచున్నది.

ఈ విధంగా "బుద్ధి–చైతన్యము" నందు భ్రమమయములైనట్టి జగత్ పదార్థములు కిరణముల వలె సృష్ట్యాది నుండి నేటివరకు ప్రకాశిస్తూనే ఉన్నాయి. ఇదంతా ప్రత్యక్ చైతన్యము తనయందు కల్పించుకొని ఇట్లు దర్శించుటయేనని నీవు గ్రహించు. ఈ జగత్ పదార్థముల విజృంభణమంతా అసత్యమే అయినప్పటికీ సత్యమువలె ప్రతిభాసిస్తోంది. కాబట్టి లీలా! నీవు నీ అత్యంత సుతీక్షణమైన సూక్ష్మదృష్టిని అలవరచుకో. అట్టి నిర్మల–సూక్ష్మ దృష్టిచే, "ఈ దృశ్యజగత్తు ఏమైయున్నది? జగత్తులోని విషయములేమిటి? నేను–నీవు .... మొదలైనవాటి వాస్తవమైన స్వరూప – స్వభావములు ఏమిటి?" అనే విషయాలు స్వవిచారణాపూర్వకంగా గ్రహిస్తావు.

ఓ ప్రియలీలా! అటు చూడు. అక్కడ యుద్ధభూమిలో ఏమి జరుగుతోందో గమనించు. చైతన్యము యొక్క 'పరిమిత దృష్టి'చే, ఒకప్పటి పద్ముడు అయిన విదూరథుడు ఇప్పుడు నేలపై మృతప్రాయుడై పడియున్నాడు కదా! ఈతడిప్పుడు మరణించి, పుష్పములచే కప్పబడియున్న పద్ముని మృతదేహముయొక్క హృదయ కమలంలో ప్రవేశించ బోవుచున్నాడు.

**ప్రబుద్ధలీల :** అమ్మా! ఈతడిప్పుడు ఏ మార్గం అనుసరించి ప్రయాణం చేయబోవు చున్నాడు? ఆ పద్ముని మృతదేహము ఉన్నచోటికి ఎట్లా చేరబోవుచున్నాడు? మనం కూడా అట్లే ఆతనిని అనుసరించి ప్రయాణం చేద్దామా?

❖❖❖

# 46. వాసనలు - పరలోక ప్రయాణం

**శ్రీ సరస్వతీదేవి :** చిన్మయస్వరూపుడగు జీవుడు "దూరముగా ఉన్నట్టి పరలోకమునకు వెళ్ళుచున్నాను" అని భావిస్తూ ఉంటాడు. అట్లే విదూరథుని విషయం కూడా. అతడు అట్లే భావించుచు, తన హృదయంలో గల వాసనాపథమును అనుసరించే పయనించుచున్నాడు. మనం కూడా ఆ మార్గమునందే పోదాము, పద! నీవు అతని సాన్నిధ్యం కోరుకొంటున్నావు కదా! నీ అభీష్టం కూడా తీరగలదు. నీ వాంఛ సిద్ధించినప్పుడే మన స్నేహం దృఢం అవుతుంది. అందుచేత, నీవు సర్వము దర్శించటానికి వీలుగా దివ్యదృష్టి ప్రసాదిస్తున్నాను.

సరస్వతీదేవి యొక్క ఈ పలుకులు వినుటచే లీలాదేవి హృదయంలో ఎక్కడో దాగివున్న శోకమంతా ఉడిగిపోయింది. ఆమెయందు జ్ఞానసూర్యుడు ఉదయించాడు.

❖

అక్కడ యుద్ధభూమిలో విదూరథుని దేహం క్రమంగా చైతన్యం కోల్పోసాగింది. మూర్ఛితులై పడివున్న అతని కనుపాపలు తిరుగసాగాయి. పెదవులు ఎండిపోసాగాయి. ప్రాణము ఒక్కటే మిగిలియున్నది. శరీరమంతా ఎండిన ఆకువలె తయారయింది. ముఖములో కాంతి క్షీణించుటచే పాలిపోయింది. ప్రాణవాయువులు తుమ్మెదలవలె ధ్వనిస్తూ ముక్కు వద్ద సంచరించసాగాయి. ఇంద్రియముల చేతలన్నీ కట్టుబడిపోయాయి. అవయవముల కదలిక ఆగిపోయింది. ఒక పక్షి వృక్షపు కొమ్మలను త్యజించి ఆకాశంలోకి ఎగిరిపోతుంది చూచావా? ప్రాణవాయువులు అట్లే క్రమంగా అతని భౌతిక శరీరాన్ని విడచాయి. ఆ పడతులిద్దరూ దివ్యదృష్టిచే ఆకాశంలోకి ఎగిరిన ఆ జీవుని గాంచసాగారు. అతని జీవచైతన్యము వాయువుతో కలసినదై, తనయందలి వాసనలను అనుసరించి, ఆకాశపథంలో దూరంగా పయనించసాగింది. సరస్వతీ-లీలలు ఆ జీవచైతన్యమును అనుసరించారు.

శరీరము త్యజించినప్పుడు "మరణమూర్ఛ" అను జడత్వము పొందిన ఆ జీవచైతన్యము ఆ మరణమూర్ఛ నుండి చేరుకొని అనుభవజ్ఞానం పొందసాగింది. వాయువులో ఉండే సువాసన యొక్క కణమువలె, ఆ జీవచైతన్యము ఆకాశప్రదేశంలోనే ఉండి ఈ విధమైన అనుభవం పొందసాగినది .....

❖

.... "బంధువులు నన్ను ఉద్దేశించి" ఊర్ధ్వదైహిక (Trace-body) కార్యములను ఒనర్చటం జరిగింది. అట్టి సంకల్పపూర్వకమైన, మంత్రముగ్ధమైన కార్యముల ప్రభావంచేత నేను ఇప్పుడు ఒకానొక సూక్ష్మతత్వపూర్వకమైన ఏదో దేహమును పొందాను. అట్టి నా ఈ నూతన సూక్ష్మదేహమును యమభటులు వచ్చి గొనిపోవుచున్నారు. ఇప్పుడు కర్మఫలములను అనుభవించునట్టి యముని పట్టణము చేరాను. నేనిప్పుడు యముని సమక్షమునకు కొనిరాబడ్డాను. ఇప్పుడు యముడు నావైపు చూచాడు. తన దూతలవైపు తిరిగి "ఓ దూతలారా! ఇతడు ఎన్నడూ ఈ పాపములు ఒనర్చలేదే? పైగా, ఎల్లప్పుడూ ఏదైనా పవిత్ర కార్యములనే నిర్వహించాలనే ప్రయత్నంలో ఉండేవాడు. జగజ్జననియగు సరస్వతిని ఎల్లప్పుడూ భక్తితో పూజించుచుండటంచే ఆమె దయకు పాత్రుడయ్యాడు. ఆమె వరప్రసాదంచేతనే ఇతడు వర్ధిల్లినాడు. ఇతని ఇతః-పూర్వపు 'పద్మని' ఉపాధి ఇప్పుడు పుష్పములతో కప్పబడి, చెక్కుచెదరకుండా ఉన్నది. ఇతనిని విడచిపెట్టండి. ఇతడు ఆ శరీరములో ప్రవేశించును గాక!" మరుక్షణం యమభటులు నన్ను బంధవిముక్తుని చేశారు. యంత్రము నుండి విడివడిన రాయివలె నాయొక్క జీవచైతన్యము ఆకాశదేశంలో పడింది. నేను జగద్గృహము నుండి వెలువడి ద్వితీయ బ్రహ్మాండములో ప్రవేశిస్తున్నాను. ఇక్కడ నాకు చెందిన భౌతిక దేహము ఉన్నది....." ఇట్లు ఆ విదూరథ జీవచైతన్యము అనుభవము పొందుతోంది. అతని దృష్టిలో పడకుండానే సరస్వతీ-లీలలు కూడా అతనిని అనుసరిస్తూ రాజగృహంలో ప్రవేశించారు.

❖

**శ్రీరాముడు :** హే బ్రహ్మజ్ఞా! వసిష్ఠమహర్షీ! విదూరథుని జీవచైతన్యము పద్మని భౌతికదేహము ఉన్నట్టి రాజగృహమునకు మార్గము ఎట్లా గ్రహించింది? ఆ గృహంలో ఎట్లా ప్రవేశించింది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** విదూరథుని జీవచైతన్యము యొక్క హృదయంలో పూర్వ వాసనాబలం చేత, "నేను పద్మని శరీరమును" అనునట్టి అహంకారము ఇమిడియున్నది. అందుచేతనే పద్మని దేహము ఉన్నట్టి రాజమందిరమునకు అనాయాసంగా ప్రయాణించింది. ఒక మఱ్ఱివిత్తు తనయందు సూక్ష్మరూపంలో ఒక "ఊడలతో కూడిన మహావృక్షము" కలిగియుండి, ఆయా తగినట్టి దేశకాలాదులు ప్రాప్తించినప్పుడు విస్తారమైన మహావృక్షంగా ప్రకటితమౌతోంది కదా! అదేవిధంగా జీవచైతన్యము కూడా తన హృదయమందు ఉన్నట్టి వాసనల "ఉద్బోధకము" లభించినప్పుడు, అవి "పరిపుష్టం" అవటం (లేక దృఢంగా ప్రకటితం కావటం) గాంచుచున్నది. బీజంలో అంకురం ఉంటున్నట్టు, హృదయంలోనే స్వప్నం ఉంటున్నట్లు ... చిత్స్వరూపుడగు ఈ జీవుడు తనయందే ఈ ముల్లోకములను అనుభవించు చున్నాడు. ఒకడు ఒకచోట ఉండి స్వీయ కల్పనాజగత్తులో ఎక్కడో ఉన్న స్త్రీ, పురుషులు, సమస్త వస్తుజాలమును గాంచుచున్నాడు కదా! జగత్తుగా, ముల్లోకములుగా కనిపించేదంతా ఆ జీవుని యొక్క సంస్కారములే సుమా! ఈ జీవుడు వందలకొలది జన్మలను, స్వీయ వాసనలను అనుసరించి అభీష్టములను, అందుకు ప్రయోజనంగా సుఖదుఃఖ ములను, ఆ సుఖదుఃఖములకు సముచితములై కర్మలను, ఆ కర్మల నుండి వాసనలను ... ఇట్లు చెట్టు-విత్తుల వలె పొందుతూ పోతూనే ఉన్నాడు. ఇదంతా భ్రాంతియే సుమా! వాస్తవానికి జీవుడు జన్మించడు. మరణించడు. అయినను ఈ జననము – జీవనము – మరణము – అంతా సత్యమువలెనే అతనికి కనిపించుచున్నది.

❖❖❖

# 47. పిండప్రదానం

**శ్రీరాముడు :** హే భగవానుడా! వసిష్ఠమహర్షీ! సర్వము సంస్కారబలంచేతనే ప్రాప్తిస్తున్నదని అంటున్నారు కదా! మరి "పిండప్రదానము బంధువులచే ఒనర్చబడినప్పుడు, ఆ పిండప్రదాన ప్రభావం చేత ఒకానొక నూతన శరీరం ప్రాప్తిస్తోంది" అని మీరు ఎందుకు చెప్పారు? బంధువులు చేసే పిండ ప్రదానము వలన మృతుడికి ఏమైనా లభిస్తుందా? లభిస్తే ఎట్లా లభిస్తుంది?

**శ్రీ వసిష్ఠమహర్షి :** పిండము వేయబడవచ్చు. వేయబడకపోవచ్చు. కాని, "వేయబడినది" అని మృతుడు భావించినంతమాత్రంచేతనే అతనికి పిండప్రదాన ఫలము లభిస్తుంది.

"చిత్తము ఏ రూపంలో ఉంటే, జీవుడు కూడా ఆ రూపమునే దాల్చును" అని విద్వాంసులు గ్రహిస్తున్నారు. ఈ నియమము మృతులపట్లనే కాదు. జీవితులపట్ల కూడా వర్తిస్తోంది. పిండము పొందినవాడు, "పిండమును పొందితిని" అని భావించటంచే అతనికి పిండ ఫలము దక్కుచున్నదని అనుకొన్నాం కదా! అదే విధంగా పిండము ప్రదానము చేయబడినవాడు, "నేను పిండము పొందలేదు" అని భావిస్తే అతనికి ఆ ఫలము లభించటంలేదు.

నేను చెప్పేది చమత్కారంగా ఉన్నమాట నిజమే. కాని, నేను చెప్పేదానికి దృష్టాంతము ఈ జగత్తులోని పదార్థములే. భావనాబలము చేతనే ఈ ఎదురుగాగల దృశ్యములోని పదార్థములు సత్యమైన విషయములవలె అనుభవించబడుచున్నాయి. చూపునుండే సౌందర్యము అనుభవించబడు చున్నది కదా! భావన నుండే పదార్థముల ఉనికికి సంబంధించిన అనుభవం ప్రాప్తిస్తోంది. భావనాబలంచే విషము అమృతంకాగలదు. "గరుడోపాసకుల"* విషయంలో ఇది మనకు కనిపిస్తోంది కదా!

అసత్యపదార్థములు, విషయములు కూడా భావనాబలముచే ఆ భావనను అనుసరించి సత్యములే అగుచున్నాయి. ఈ అసత్య – పదార్థములన్నీ సత్యమైయున్నట్టి బ్రహ్మము నందే అధ్యారోపితములై ఉన్నాయి. అందుచేత రామా!

"కారణము లేకుండా ఎవరికీ ఎట్టి భావన ఉదయించదు. సర్వమునకు మూలకారణము సద్వస్తువే. ఆత్మకు సంబంధించని విషయముగాని, ఆత్మయందు బీజత్వము లేనట్టి వ్యక్తిగాని, ఆత్మకు బాహ్యమైయున్నట్టి (వేరుగా ఉన్నట్టి) ప్రవర్తనగాని, వ్యవహారములు గాని లేవు....."

అనునట్టి సమాధానము అంతరంగమున పొందియుండుము. సర్వసమత్వ సాధనచే మాత్రమే ఆత్మ అనుభవమునకు రాగలదు. అట్టి బ్రహ్మమునకు వేరు కారణమంటూ లేదు. అనగా అది కారణరహితము. అదియే సర్వమునకు కారణము, స్థానము, ప్రేరణము కూడా. ఈ జగత్తు విషయానికి వస్తే, ఇక్కడ 'మహాప్రళయము' అను స్థితివరకు ఏ ఒక్క కార్యమునకైనా కారణము ఉండియే తీరుతుంది. కారణం లేనట్టి కార్యము ఎవ్వరూ గాంచటం లేదు. వినటంలేదు.

విశుద్ధమగు చైతన్యమే వాసనారూపమున 'కార్య–కారణములు' అను ఉభయ భావములను పొందుచున్నది. చైతన్యమే జగత్తుగా ప్రతిభాసిస్తోంది. అందుచేతనే జీవించియున్నవారి శుభ సంకల్పములు ప్రేతమును స్పర్శించగలుగుచున్నాయి.

**శ్రీరాముడు :** ఒకానొక జీవుడు ఈ విధంగా తలచాడనుకోండి : "నాకు పిండప్రదానాదులను చేసేవారు లేరు"

ఇప్పుడు ఇట్టి అభిప్రాయంగల ఆ జీవుడు మృతిచెందాడని అనుకొందాం. అట్లు మృతిచెందన వ్యక్తిని ఉద్దేశించి అతని బంధువులు గోదాన, భూదానాది అనేక ధర్మ కార్యములు కూడా నిర్వర్తించారనే అనుకొందాం. అప్పుడా ధర్మకార్యములన్నీ ఆ జీవునిపట్ల ఫలప్రదం అవుతాయా? కావా? బంధువులు చేస్తున్న దాన–ధర్మాది కార్యములు క్రియాపూర్వకమైన సత్–సంకల్పము. కాని, అతడు చింతించునది అసత్యము కదా! మరి, వీటిలో ఎద్దానిబలం ఎక్కువగా ఉంటుంది? "నాకు వీటి నుండి ప్రాప్తించగల ధర్మమంటూ ఏదీ లేదు" అని తలచినప్పుడు అట్టి మృతుని పట్ల జరుగుచున్నదేమిటి?

---

* (గరుడోపాసకులు = "నేను ఈ పేరుగల వ్యక్తియొక్క శరీరమునందు పాముకాటుచే ప్రవేశించిన విషమును బయటకు తోలివేయుచున్నాను" అని దూరముగా ఉన్న ఒకని శరీరము గురించి సంకల్పించినప్పుడు, అది అట్లే సిద్ధిస్తూ ఉంటుంది. ఇది సంకల్పము యొక్క బలమునకు నిదర్శనం)

**శ్రీ వసిష్ఠమహర్షి :** మరణించినవాని బంధువులు ధర్మవాసనతో కూడుకొన్నవారై, శాస్త్రములచే విధించబడిన ద్రవ్య-క్రియ-మంత్ర-స్థల-కాలముల నియమమును అనుసరించి చేస్తున్నారు కదా! కాబట్టి శాస్త్రములచే చెప్పబడిన విధంగా శ్రాద్ధాదులు, దాన - ధర్మాదులు ఆ ప్రేతమునకు శుభమే కలుగజేస్తాయి. ప్రేతము యొక్క వాసనల కంటే 'ధర్మము' యొక్క వాసనయే సాధారణంగా బలవత్తరమై ఉంటుంది. ప్రేతవాసన స్వకల్పితము. అంతేగాని శాస్త్రప్రమాణితము కాదు కదా! కనుక ప్రేతమును (మరణించినవానిని) ఉద్దేశించి చేసిన సశాస్త్రీయములైన దాన-ధర్మాదులు ఆ ప్రేతమునకు సుఖ-శాంతులనే కలుగజేస్తాయి. ఆ కర్మను నిర్వర్తిస్తున్న బంధువుయొక్క శుభసంకల్పమే అందుకు కారణమగుచున్నది.

అయితే ఇక్కడ ఒక విషయం నీవు గమనించాలి. ప్రేతము (మరణించిన జీవుడు) శాస్త్రకర్మలను ద్వేషించువాడు, వేదములను మొదలంట తిరస్కరించువాడు, నాస్తికుడు అయితే, ఆ ప్రేతము యొక్క సంకల్పమే అధికబలము కలిగియుంటుంది. అట్లు కాకపోతే అతని నికృష్టవాసన తప్పకుండా ధర్మవాసనచే (బంధువులచే నిర్వర్తించబడిన దానాదుల సంకల్పబలంచే) జయించబడగలదు. ఈ విధంగా, "బంధువుల శాస్త్రీయమైన సంకల్పబలం - మృతుని అభిప్రాయబలం" .... ఈ రెండిటిలో ఏది అధికబలము కలిగినదైతే అయ్యదియే రెండవదానిని జయించి వేస్తోంది. అందుచేత, మిక్కిలి ప్రయత్నముచే శుభకర్మలను (దాన-ధర్మములను) నిర్వర్తించటం, "ఈ ప్రేతమునకు శుభమగుగాక! శాంతమగుగాక" అని సంకల్పించటం ఉచితమే అని మా అభిప్రాయం. ప్రేతమును దృష్టిలో పెట్టుకొని, శుభకర్మలు శుభసంకల్పములచే నిర్వర్తించబడుగాక!

❖❖❖

# 48. వాసనయొక్క ఆరంభం

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఇక్కడ నాకు ఒక ముఖ్యమైన సందేహం ఉదయిస్తోంది.

అంతరంగమున ఉన్న "వాసన" దేశ-కాలాదుల సానుకూల్యతను అనుసరించి వికసించినప్పుడు విత్తు మహావృక్షం అగుచున్నట్లుగా, ఈ శరీరాదులు, బాహ్య జగత్తు ప్రాప్తిస్తున్నాయని మీరు అన్నారు కదా! మరి మొట్టమొదటగా ఈ సృష్టి ఎక్కడి నుండి వచ్చింది? కల్పాది* లో దేశ-కాలాదులు లేవంటారా? అట్లా అయితే, ప్రథమ సృష్టికి కావలసిన వాసన ఎక్కడి నుండి వచ్చింది? ఈ దృశ్యసమూహములు ఇట్లు ప్రాప్తించుచుండుటకు అంతరంగమునందలి వాసనలే కారణమని పెద్దలు అంటున్నారు కదా! ఎవరి యొక్క వాసనలచే మొదలు ఏది? అవి జీవచైతన్యము నందు... దేశము - కాలము అనబడే సహకారికారణాలు (supportive cause) లేక పోయినప్పుడు కూడా... ఎట్లా దాగి ఉంటున్నాయి?

---

* కల్పాది = శుద్ధచిత్ స్వరూపమగు ఆత్మ, "అభిలాష ఆకాంక్ష"లతో కూడిన బాహ్యకల్పన నాశ్రయించినప్పుడు, అదియే సృష్టి అనబడుదానికి ప్రారంభంగా చెప్పబడింది. శాస్త్రములు దానిని "సృష్ట్యాది" అని పిలుస్తున్నాయి. అదియే 'కల్పాది' కూడా.

**శ్రీ వసిష్ఠమహర్షి :** మంచి ప్రశ్నే వేశావు. సరే సమాధానం చెబుతాను. సూక్ష్మబుద్ధితో విను. "సృష్ట్యాదియందు దేశకాలాదులు లేవు" అని నీవు నీ మాటలననుసరించి గ్రహించియే ఉన్నావు కదా! అవును. అది అక్షరాలా నిజం. ఎందుచేతనంటావా? సృష్టికి ముందు బ్రహ్మము మాత్రమే కలదు. అట్టి బ్రహ్మమందు దృశ్యపదార్థములు ఉత్పన్నము అగుటకు కారణము లేదు. ఎందుకంటే, "కారణము" అనేది ఎంత పరిశీలించినా లభించకయే ఉన్నది. ఒకవేళ "ఈ దృశ్యము బ్రహ్మమునందు ఉండి ఉండుటకు ఒకానొక కారణము ఉన్నది" అని ఎవరైనా నిర్ణయిస్తే, అకారణమునకు మరల కారణ-కారణం (cause for that cause)గా మరొకటి ఉండి ఉండాలి. ఈ విధంగా దీనికి అంతువుండదు. 'కారణము' అనునది లభించక పోవుటచే ఈ "దృశ్య-పదార్థములు" అనబడు కార్యము కూడా లేనిదే అగుచున్నది. అనగా ఈ దృశ్యపదార్థములు స్వతహాగా ఉత్పన్నమే అయి ఉండలేదు.

సృష్ట్యాది యందే ఉత్పన్నము అయివుండనట్టి ఈ 'జగత్తు' అనబడు దానికి ఇక వినాశనమెక్కడ ఉంటుంది? ఏదైనా ఉత్పన్నమైతేకదా, దానికి వినాశనం ఉండటం!

అందుచేత, ఈ కనబడేదంతా ఇందలి దేశకాలాదులతో సహా సర్వదా చిదాకారమగు బ్రహ్మమే అయివున్నది. మరింకేమీ అయి ఉండలేదు. ఈ విషయం నిరూపించటానికి నేను మన ఈ విచారణయందు అనేక యుక్తుల సహాయంతో ప్రయత్నించబోవుచున్నాను. "ఈ దృశ్యము ఏ సమయమందు కూడా ఉద్భవించియుండలేదు. ఇదంతా బ్రహ్మముకాక మరింకేమీ కాదు" అని తెలియచెప్పుటయే ఆ మన ఇరువురి సంవాదము యొక్క ప్రయోజనమైయున్నది. ఈ ఉత్పత్తి ప్రకరణము యొక్క సారము అదే. అయితే ఇదంతా జీవుడు తన వాసనానుసారంగా మాత్రమే గాంచుచున్నాడు" అనుశబ్దములచే "సృష్టి-సంసారము" అనుశబ్దములచే ఉద్దేశ్యించబడుతోంది.

మరల మనం కథలో ప్రవేశిద్దాం.

❖

జ్ఞప్తి దేవతయగు సరస్వతీదేవి, లీలాదేవి పద్మని అంతఃపురంలో ప్రవేశించారు. పద్మని భౌతిక దేహం ఇతఃపూర్వంవలెనే ఒక విశాల గృహం మధ్యలో సువాసనలు వెదజల్లు పూలతో కప్పబడి ఉన్నది. తలవైపు మంగళ ద్రవ్యములు ఉండే పూర్ణకుంభములు ఉంచబడి ఉన్నాయి. గది తలుపులు, కిటికీ తలుపులు మూయబడి ఉన్నాయి. అవతలి గదులలో దాస-దాసీజనం గుఙ్ఞుపెట్టి నిద్ర పోతున్నారు. పద్మని భౌతికదేహము ప్రక్కనే ద్వితీయలీల కూర్చుని ఉన్నది. ఆమె కళ్ళలో ప్రేమ, ఆవేదన గూళ్ళు కట్టుకొని ఉన్నాయి. చేతిలో వింజామరులు ఉన్నాయి. ఆమె వేషము, నడవడి, శరీరము, వాసనలు, ఆకారము, రూపము, అవయవములు, స్పందము, కట్టుబట్టలు, నగలు .... మొదలైనవన్నీ మునుపటివలెనే ఉన్నట్లు ప్రబుద్ధలీల గమనించింది. భేదమల్లా .... ఆమె విదూరథుని ఇల్లు విడచి ఇక్కడ ఉండటం మాత్రమే. ఎడమచేతిమునివ్రేళ్ళతో ముఖమును స్పృశించుకొనుచు ఆ ఉత్తమ ఇల్లాలు మౌనము వహించియున్నది. మధ్యమధ్యలో అభిలాషతో భర్త మోము చూస్తోంది.

ప్రబుద్ధలీల సరస్వతులు, ఆమెను చూచుచున్నారు. కాని ఆమె మాత్రం "సత్య-సంకల్పి" కాకపోవుటచే వారిని చూడలేకపోవుచున్నది.

❖❖❖

# 49. ఆధిభౌతిక భ్రాంతి

**శ్రీరాముడు :** ప్రభూ! ప్రబుద్ధలీల అదే గృహంలో తన శరీరమును ఉంచి ధ్యానబలం చేత విదూరథుని భవనమునకు వెళ్ళియున్నదని మీరు చెప్పియున్నారు కదా! మరల ఆమె భౌతిక-దేహము విషయమై మీరు ఏమీ ప్రస్థావించలేదే? ఆ దేహం ఏమైనది? ఎచ్చటికి అరిగినది?

**వసిష్ఠమహర్షి :** ఓహో! ఆ దేహము గురించా, నీప్రశ్న? బాగానే ఉన్నది. ముందుగా జీవుని "దేహభ్రాంతి" విషయమై ఈ విశేషాలు విను. లీల యొక్క ఆ దేహము సత్యము అయినప్పుడు కదా, ఆ ప్రశ్న? ఆ శరీరము ఎడారిలోని ఎండమావులందలి జలం వలె భ్రాంతి మాత్రమే. ఓ రాఘవా! మహత్తరమైన ఆశయముతో కూడిన బుద్ధి కలవాడవై ఈ విషయంలో నేను చెప్పబోవునది గ్రహించు.

ఈ జగత్తు అంతా ఆత్మయే. ఇందులో దేహాదుల కల్పనకు తావు ఎక్కడ ఉన్నది చెప్పు? ఇక ఎదురుగా కనిపిస్తున్న నామరూపములతో కూడిన, ఈ శరీరముల మాటేమిటంటావా? ఇదంతా ఆనందరూపమగు చిన్మయబ్రహ్మమే సుమా!

❖

పూర్వలీల యొక్క జ్ఞానము వృద్ధి అగుచున్నకొలది, ఆమె శరీరము మంచులాగా కరిగిపోయింది. అయితే ఇప్పటి ఆమెయొక్క ఆతివాహిక దేహముతోటి ద్రష్టత్వము కూడా మునుపటి భౌతిక + ఆతివాహిక దేహములతో కూడిన ద్రష్టత్వమును పోలియే ఉన్నది. కాని, ఆమెయందు మునుపటి 'ఆధిభౌతిక భ్రాంతి' మాత్రం లేదు.

ఓ రామచంద్రా! వాస్తవానికి "ఆధి భౌతికము" అనునదే లేదు సుమా! దాని శబ్దము - అర్థములు కూడా సత్యములు కావు. "కుందేటి కొమ్ములు" అను పదప్రయోగం ఎంతటి అర్థరహితమో, ఈ కనబడే నామ-రూపాత్మక సృష్టి అట్టిది. ఇదంతా మొదలంట అసత్యమై ఉన్నప్పటికీ, ఈ జీవుడు ఆ విషయం ఎందుకో గ్రహించటంలేదు. అతడు ఈ శరీరము గురించే అనేక రీతులుగా భ్రమాత్మక భావములు కలిగి ఉంటున్నారు. అంతేకాని, "ఈ శరీరము ఏమిటి? ఇందు ఉన్నట్లు తోచుచున్న నేనెవ్వడను? నా వాస్తవ స్వరూప-స్వభావములు ఎట్టివి?" అని విచారణ చేయకుండానే ఉంటున్నాడు. స్వప్నంలో అనేక అనుభవములు, దృశ్యములు పొందుచున్న స్వప్నద్రష్ట." "ఇదంతా నా కల్పనయే కదా!" అని గ్రహించకుండానే, అప్పుడు ప్రస్తావించబడు, ప్రాప్తించు విషయములతో తాదాత్మ్యము చెందుచూ అనేక సుఖదుఃఖము పొందుచున్నాడు. ఆయా వ్యక్తులు, వస్తువులు, నగరములు వాస్తవమేనని దృఢమైన భ్రమపొందుచున్నాడు. స్వప్నములోని అనేక సంఘటనలతో

కూడిన కథనమంతా మెళుకువ వచ్చే వరకు అట్లే ఉంటుంది కదా! ఈ జాగ్రత్‌కు సంబంధించిన, భౌతికశరీరమునకు సంబంధించిన అనుభవములు కూడా .... జ్ఞానము వికసించేవరకు వాస్తవమై ఉంటూనే ఉన్నాయి. త్రాడుపట్ల ఉన్న సర్పభ్రాంతి తొలగిపోతే సర్వవికారాలు తొలగిపోతాయి. భ్రాంతి, భ్రమ తొలగిపోతే సత్యదృష్టే శేషించుచున్నది.

ఈ ఆధిభౌతిక ప్రపంచమంతా అప్రబుద్ధమగు మనస్సు చేతనే కల్పించబడుతోంది. ఈ మిథ్యాభావము క్రమంగా మనస్సునందు సత్యమువలె ఆరూఢమై ఉంటోంది. జనులు ఏ చక్ర యంత్రమునో ఎక్కినపుడు భూమి, భవనములు, ఎదురుగాగల జనులు చక్రము వలె తిరుగుచున్నట్లు కనిపిస్తారు చూచావా? అట్లే అజ్ఞానులు మాత్రమే స్వప్నమును బోలినట్టి ఈ సృష్టులను, అట్టి ఈ సృష్టులలోని ఈ బాంధవ్యములను వాస్తవమైనట్లు అనుభవించుచున్నారు. ఇది ఇట్లుండగా, స్వప్నంలో భౌతికదేహం లేకుండానే అనుభూతులు–అనుభవాలు కొనసాగుచున్నాయి కదా!

**శ్రీరాముడు :** ఒక 'యోగి' పూర్తిగా 'ఆత్మప్రాప్తి' పొందాడని అనుకొందాం. ఆ యోగి దేహమునకు సంబంధించిన "ఆధిభౌతిక భావము" పూర్తిగా త్యజించి, "ఆతివాహిక భావము"నే సర్వదా ఆశ్రయించుకొని ఉంటాడు కదా! మీరు, "ఆతివాహికదేహము కన్నులకు కనబడనిది. నాశ రహితమైనది కూడా" అని చెప్పియున్నారు.

ఇప్పుడు నా సందేహము ఏమిటంటే, "ముక్తి" సమయంలో కూడా ఆధిభౌతికదేహం ఉంటుందా? ఉండకుండా, పోతుందా? ఆధిభౌతిక దేహం ఉన్నంతవరకు 'ముక్తి' సాధ్యమా? అసాధ్యమా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** జాగ్రత్‌లో ఘనీభూతమై కనిపిస్తున్న ఈ భౌతికదేహము త్యజించ బడకుండానే, స్వప్నంలో స్వప్నద్రష్టకు మరొక దేహం లభిస్తోంది కదా! ఈ జాగ్రత్ దేహం ఇట్లు పాన్పుపై జడత్వముచే పడి ఉండగానే, స్వప్నద్రష్ట నూతన దేహంతో శబ్దాలు వింటున్నాడు, నడుస్తున్నాడు, పరుగులు తీస్తున్నాడు, నవ్వుచున్నాడు. ఆ స్వప్నంలో తారసపడే బంధుమిత్రులతో సంభాషిస్తున్నాడు కూడా.

యోగులు "కాయవ్యూహము"* అను ప్రక్రియ ద్వారా, ఈ భౌతిక దేహము ఇట్లు ఉండగానే, తమ ఆతివాహిక దేహప్రభావంచేత వేరైన దేహములు పొంది అనుభవములు పొందుచున్నారు. అంతేకాదు, కొందరు యోగుల శరీరములు అదృశ్యవస్తువులవలె ఆతివాహిక దేహమాత్రమై ఉంటున్నాయి. వారు "నేను భౌతిక శరీరధారినై ఈ భక్తునికో, శిష్యునికో కనిపించెదను గాక" అని సంకల్పించినపుడు, అట్లే భౌతిక శరీరధారులై ఇతరులకు కనిపించటం జరుగుతోంది. "ఈ నా

---

* **కాయవ్యూహం :** యోగశాస్త్రంలో ఈ కాయవ్యూహం గురించి చెప్పబడింది. యోగి ధ్యాననిష్ఠలో ఉంటూనే తన ప్రారబ్ధకర్మలను నశింపచేసుకోవటానికి, స్వకల్పన యొక్క సామర్ధ్యముచే తదనుకూలములైన దేహములను ఆతివాహికము నందు నిర్మించుకొను చున్నాడు. అట్టి కల్పిత దేహములచే అట్టి యోగులు ఆయా కర్మలను నిర్వర్తించటం, సుకృత – దుష్కృత కర్మలను అనుభవించుచు, తద్వారా ప్రారబ్ధకర్మలను తొలగించుకొని 'కైవల్యం' పొందటం చేస్తూ ఉంటారు.

భౌతిక శరీరము ఇతరుల దృష్టికి అదృశ్యమై ఉండుగాక" అనునట్టి సంకల్పబలంచేత వారు అదృశ్య రూపులు అగుచున్నారు. అప్పుడు వారి శరీరములను తదితర యోగులు కూడా గాంచలేకపోతున్నారు. ఇక ఇతరులు గాంచలేరని వేరుగా చెప్పాలా?

"ఒకడు బ్రతికియున్నాడు. మరణించుటచే గతించినాడు...." అను రూపమున దర్శించటం స్వవాసనా ప్రభావముచేత మాత్రమే సుమా! త్రాడునందు పామును చూచువాడు, సర్పజ్ఞానము తొలగిపోయినప్పుడు "ఇది త్రాడు మాత్రమే" అని గ్రహించునట్లు, జ్ఞానోదయము అయిన తరువాత శరీరభ్రాంతులు నశిస్తున్నాయి. "నేను పూర్వదేహమును చూచెదను గాక! పొందెదను గాక" అనునట్టి భ్రమాత్మకమైన ఆవేశం ఇక ఉండదు. అట్టి జ్ఞాని ఇట్లు "భావన" కలిగి ఉంటాడు.

"ఈ 'శరీరము' అనగా ఏమి? దీని ఉనికి ఎక్కడ? ఇది నశించుట ఏమి? ఇవన్నీ 'ప్రతిబింబము' వలె అవస్తువులే కదా! ఈ శరీరమును ధరించు 'శరీరి' – స్వరూపుడనగు నేను సత్యమై, నిత్యమైవున్నాను. ఉండవలసినదేదో సర్వదా, సదా ఉండనే ఉంటోంది. అసత్తుకు ఉనికి ఎక్కడ? ఉనికి లేనిదాని వలన సుఖ దుఃఖాదులు ఎక్కడివి? అజ్ఞానమున్నంతవరకే అవి ఉంటున్నాయి. అజ్ఞానము తొలగిపోయిన తరువాత, ఇక ఈ దేహాదులు ఉండాలనిగాని, తొలగాలనిగాని అభినివేశం ఉండవలసినపని లేదు. ఏది ఎక్కడ ఎట్లు ఎందుకు ఉన్నా, ఉండకున్నా ... నేను ఆత్మయే 'స్వరూప – స్వభావము' లుగా కలవాడిని కదా!"

జ్ఞాని యొక్క సంకల్పములు, అభిప్రాయములు, భావనలు పై విధమైన పునాదిని కలిగి ఉంటాయి.

❖❖❖

## 50. ఆధిభౌతికం - ఆతివాహికం

**శ్రీరాముడు :** హే సద్గురూ! యోగుల యొక్క ఆధిభౌతిక దేహమే యోగబలంచేత "ఆతివాహికం" అగుచున్నదంటారా? లేక, ఆధిభౌతికం తిరస్కరించబడి (త్యజించబడి) 'ఆతివాహికం' కలుగుచున్న దంటారా? ముందుగా ఈ విషయం చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! నీకీవిషయం ఇదివరలో చాలా మార్లు చెప్పాను. కొంత వివరణతో ముక్కుకు సూటిగా కూడా చెప్పాను. అయినా నీవు ఇంకా గ్రహించటం లేదేమిటి? సరే. మరల ప్రకటిస్తున్నాను. విను. ఈమారు మరింత నిర్దుష్టంగా సత్యమైయున్నదానిని చెప్పుచున్నాను.

"ఆతివాహికదేహము" (లేక సూక్ష్మదేహము) ఒక్కటే ఉన్నది. 'ఆధిభౌతికదేహము' అనునది లేనే లేదు. ఇక శరీరభ్రాంతి అంటావా .... అది స్థూలమునకు సంబంధించిన "అధ్యాస" (superimposition) వలననే కలుగుచున్నది. ఆ అధ్యాస తొలగితే, ఆధిభౌతిక బుద్ధి పోయి, "ఆతివాహిక బుద్ధి" ఉదయించగలదు. ఒకడు ఒక 'కల'లోంచి తేరుకున్న తరువాత, ఆ కలలోని "భవనము–ఆ భవనముయొక్క కాఠిన్యము" .... మొదలైనవి ఏమైనా కనబడుచున్నాయా? లేదు

కదా! అట్లే, ఆతివాహిక జ్ఞానము ఉదయించిన తరువాత ఇక ఈ భౌతిక దేహము యొక్క గురుత్వ* కాఠిన్యాదులు తోచవు ఆధిభౌతికమైన పరిమితభావన స్ఫురించక లయించిపోతోంది.

స్వప్నమునందు ఏర్పడుచున్న దట్టమైన స్వప్నభ్రాంతి తొలగాలంటే ఉపాయం ఏమిటి? "ఇది స్వప్నము మాత్రమే" .... అను జ్ఞానము కలుగుటయే కదా! ఆతివాహిక బుద్ధి, లేక, "నేను అంతః తత్త్వమును. ఎట్టి వస్తుజాలము చేతను బంధింపబడనంతటి సూక్ష్మ – అంతఃకరణ స్వరూపుడను" .... అను బుద్ధి లేక "బోధ" ఉదయించిన మరుక్షణం ఆధిభౌతిక శరీరబుద్ధి ఎటో పోతుంది.

అట్టి ఆతివాహిక జ్ఞానము ఉదయించిన యోగుల శరీరము దూదివలె అతితేలిక, లాఘవము అగుచుండ వచ్చుకూడా! దృష్టాంతము స్వప్నమే. స్వప్నసమయంలో, "ఇది స్వయం కల్పితమైన స్వప్నము. నిజానికి స్వప్నము అవాస్తవమే కదా!" అను జ్ఞానము కలగటం జరిగితే, అప్పుడు ఆ స్వప్నద్రష్ట యొక్క శరీరం తేలికయి, 'భారం' అనిపించకుండా ఉంటుంది. అట్లే జ్ఞానోదయమైన తరువాత, కొందరు యోగులు తమ ఇచ్ఛను అనుసరించి ఆకాశమున ఎగురగలగటం మనం చూస్తూ ఉంటాం.

సంకల్పమే ఆతివాహికము యొక్క స్వరూపము కదా! చాలాకాలం సంకల్పదేహమునే ఆశ్రయించువారు, అనగా, – "నేను సూక్ష్మస్వరూపుడనే గాని, భౌతిక దేహమును గాను" .... అను భావనయందు దీర్ఘకాలం ఉండేవారు ..... వారి పూర్వదేహము దగ్ధమైనను, శవంగా మారినను సూక్ష్మదేహము అట్లే ఉంటున్నది. ఇక యోగులైతే వేరుగా చెప్పేదేమున్నది? వారికి జ్ఞానాతిశయంచేత సూక్ష్మదేహత్వము ఈ జీవదశ యందు లభించుచున్నది. వారిలో కొందరు, "నేను సంకల్పమయుడను" అనునట్టి స్మృతిని పొందినప్పుడు, అట్టి జ్ఞానమహిమచే ఆకాశవిహారం, అదృశ్యమగుట మొదలైన స్థితులు వారు కోరుకొనటం, పొందటం జరుగుతోంది. స్వప్నంలో, "నేను సంకల్పమయుడను" అని అనుకోగానే, స్వప్నంలోని ఆకాశంలో విహరిస్తున్న అనుభవం ప్రాప్తిస్తోంది కదా! ఇది కూడా అట్టిదే.

ఓ రామచంద్రా! "ఈ స్థూలదేహమే నేను" అనునట్టి అనుభవం కేవలం భ్రాంతి వలన, అజ్ఞానము వలన, అవిచారణ వలన ఏర్పడుచున్నది మాత్రమే సుమా! అట్టి భ్రాంతి తొలగిపోతే ఆధిభౌతికభావం తొలగిపోతుంది. దానితో ఈ సంసారాడంబరం కూడా తొలగిపోతుంది. దుః ఖములన్నీ కూడా తొలగిపోతాయి. భ్రాంతి ఉన్నచోటికి మాత్రమే దుఃఖములన్నీ వచ్చి చేరుచున్నాయి.

❖

**శ్రీరాముడు :** ప్రభూ! మరొక ప్రశ్న. ఆతివాహిక దేహముతో కూడినదై, ఇప్పుడు ప్రబుద్ధలీల పద్మని మందిరంలో ప్రవేశించియున్నది కదా! ఆమె కనుక, "నేను ఈ అంతఃపురములో ఉన్నవారికి కన్పించెదనుగాక" అని సంకల్పేచ్ఛ కలిగి ఉంటే, అక్కడివారు ఆమెను చూడగలుగుతారా? ఒకవేళ

---

* గురుత్వము = Experience of physical body as weight and mass.

చూడగలిగితే వారు ఏమనుకొంటారు? గిరిగ్రామంలోని జ్యేష్ఠశర్మలాగా "ఈమె దేవత" అని అనుకొంటారా? లేక, "ఈమె మా మహారాణియే కదా" అని గుర్తిస్తారా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆ గృహములోనివారు ఆమెను "ఈమె దుఃఖముచే ఆక్రమించ బడియున్న మా మహారాణియే కదా" అని భావిస్తారు. పరమేశ్వరుడు తమకు రాణిని తిరిగి ప్రసాదించినట్లు భావిస్తారు.ద్వితీయ లీలవైపు చూచినప్పుడు మాత్రం, "ఈమె ఎక్కడి నుండో వచ్చిన చెలికత్తె" అని అనుకొంటారు. ఎందుచేతనంటే, అక్కడివారు ద్వితీయ లీలను ఎప్పుడూ చూచి ఉండలేదు కదా! అయితే ఇప్పటికి మాత్రం "ఈమె ఎవరు?" అనే అనుమానం ద్వితీయలీల విషయంలో వారికి వచ్చుట లేదు. రాజు మరణించాడనే దుఃఖం వారి మనస్సులను కలచివేయుచున్నది. అందుచేత అక్కడివారు సూక్ష్మమైన విషయములను గ్రహించుటకు ఆ సమయంలో సిద్ధంగాలేరు.

మరొక విషయం. అవివేకులైనవారు తాము చూచిన పదార్థములను అనుసరించే వ్యవహరిస్తూ ఉంటారు. వారికి తీవ్రమైన విచారణశక్తి ఎక్కడినుండి వస్తుంది చెప్పు? తమ చుట్టుగల పరిస్థితులందు రాగద్వేషములు ఏర్పరచుకొని, వాటియందు ఆవేశ పూరితంగా నిమగ్నమైనవారికి పరీక్షాత్మకమైన సూక్ష్మదృష్టి ఏర్పడుతుందా? లేదు. మట్టిగడ్డతో వృక్షము యొక్క కాండమును కొట్టినప్పుడు ఆ మట్టి నేలరాలుతుందేకాని, కాండములోనికి ప్రవేశించదు కదా! పశుతుల్యులగు అజ్ఞానులు కూడా పదార్థములను సూక్ష్మదృష్టితో గాంచలేరు. అందుచేతనే వారు తత్త్వనిర్ణయం చేయలేకపోతున్నారు. వారు – ఈ శరీరాదులు వాస్తవమై ఉన్నట్లు, వీటితో ఏర్పడుచున్న సంబంధాలు, బంధాలు నిజమే అయినట్లు భావిస్తున్నారు. భావనను అనుసరించే వారికి ఆయా అనుభవములు సత్యమై ప్రాప్తిస్తున్నాయి.

వాస్తవానికి ఈ ఆధిభౌతికశరీరము 'మిథ్య' మాత్రమే సుమా! ఆతివాహిక దృష్టి (లేక సూక్ష్మదేహదృష్టి) కలవారు ఈ భౌతిక శరీరములను గాంచకయే ఉన్నారు. అనగా, ఈ కనబడే శరీరాదులన్నీ వారి దృష్టిలో స్వప్నములోని పదార్థములవలె భ్రమాత్మకములు మాత్రమే. ఈ ఆధిభౌతిక దేహములు ఏమగుచున్నవో, ఎటువైపు పోవుచున్నవో ఎవరమూ చెప్పలేం. స్వప్నంలో గాంచబడిన శరీరములు, పదార్థములు మెళుకువ వచ్చినప్పుడు ఏమౌతున్నాయి? ఎక్కడికి పోతున్నాయి? భ్రమ, భ్రమగానే తేలిపోతోంది కదా! వర్తమానంలో కనిపించే ఈ దృశ్యవ్యవహారం కూడా అంతే.

**శ్రీరాముడు :** ఓ సర్వజ్ఞా! వసిష్ఠమహర్షీ! స్వప్నంలో చూచిన పర్వతములు, జనులు ... మొదలైనవి నిద్రమేల్కాంచినప్పుడు ఎక్కడికి పోతున్నాయి? ఏమౌతున్నాయి? ఈ సందేహం కూడా తొలగించండి.

❖❖❖

# 51. స్వప్నంలోని వస్తుజాలం ఏమౌతున్నాయి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** గాలిలో కదలిక ఉన్నది. అట్లు కదలుచున్న గాలి కదలని గాలిలో ప్రవేశిస్తోంది. కదలని గాలి కదలుచున్నది. లేక కదలుచున్న గాలి కదలిక త్యజిస్తోంది. కాని, గాలి సర్వదా గాలియే కదా! కలలో గాంచబడుచున్న కొండలు మొదలైనవి నిదురలేవగానే స్వప్న-చైతన్యము నందు విలీనమగుచున్నాయి. స్వప్న పదార్థముల వాస్తవ స్వరూపమేమిటి? శూన్యమే కదా! అవి 'చైతన్యము'ను కప్పిపుచ్చునవై ఉంటున్నాయి. ఇంతలోనే చైతన్యములో విలీనమైపోతున్నాయి. ఆత్మ యొక్క చైతన్యమే స్వప్నమున కనబడే ఆయా పదార్థముల రూపమున స్ఫురిస్తోంది. అంతయు ద్రష్ట యొక్క 'స్ఫురణ', 'కల్పన', 'భ్రమ' కాకుండా మరింకేమీ కాదు. ఆ స్ఫురణ లేక కల్పన లేక భ్రమ తొలగినప్పుడు సర్వము అద్వయమగు ఆత్మతత్త్వముగానే శేషించుచున్నది. జాగ్రత్తు కూడా అట్టిదే సుమా!

ఒకడు ఒకానొక 'ఊహ' యందు ఒక దృశ్యమును సంకల్పించుకొని అంతరంగము నందు దర్శిస్తున్నాడనుకో .... అతడు ఆ ఊహను త్యజించినప్పుడు, అంతరంగ దృశ్యములోని వస్తుజాలం, జనులు మొదలైనవి ఏమౌతున్నాయి? శూన్యము నుంచి జనించినవి శూన్యమే అయిపోతున్నాయి కదా! స్వప్నములోని పదార్థజాలం విషయం కూడా అంతే! ఈ జాగ్రత్తు కూడా అందుకు వేరైనదికాదు. ఈ జాగ్రత్‌లో ప్రాప్తిస్తున్న "నేను - నాది - నీవు - ప్రియములు - అప్రియములు - కాలము - స్థానము - శరీరములు - సంబంధములు - మిత్రులు - శత్రువులు" ..... ఇవన్నీ కూడా జ్ఞాన ప్రాప్తి పొందిన తరువాత స్వప్నతుల్యముగా తెలియబడుచున్నాయి. అంతయు అద్వయమగు ఆత్మగానే ఎరుగబడుచున్నాయి.

నీటికి - ద్రవత్వమునకు భేదమేమిటో చెప్పు? గాలి - స్పందత్వములు వేరువేరు కాదుకదా! వీటికి భేదము తెలియబడనట్లే ఆత్మచైతన్యము - స్వప్న పదార్థములకు భేదము తెలియబడదు. "ఆత్మ చైతన్యము వేరు - స్వప్న పదార్థములు వేరు - ఈ జగత్తు వేరు. ఇవన్నీ ఆత్మకు ఎక్కడి నుండో దాపురించాయి" అనునట్టి భేదజ్ఞానమే మహాదట్టమైన అజ్ఞానం. అట్టి భేదదృష్టియే మిథ్యాజ్ఞానాత్మకమైనట్టి "సంసారము", అని "సంసృతి" అని, "అలీకము" అని శాస్త్రములచే ఆయా శబ్దములచే చెప్పబడుతోంది. "స్వప్నములో తోచు పదార్థములు స్వప్నద్రష్ట (లేక చైతన్యము) కంటే వేరు" ... అని చెప్పటానికి మనకేమైనా - నిమిత్త కారణములు (purpose & cause) లభిస్తున్నాయా? లేదు. అందుచేత "స్వప్న పదార్థములు నిరర్థకములే. అర్థరహితములే" .... అని అనక తప్పదు.

ఇప్పుడు స్వప్న పదార్థములను, జాగ్రత్ పదార్థములను పోల్చి చూద్దాం. "ఈ రెండు ఒకే తరగతికి చెందినవి" అని చెప్పటానికి మాకు కించిత్ సందేహం కూడా లేదు. స్వప్నంలో కనబడే గ్రామ - నగరాలు ఏ విధంగా అసత్యమో 'సృష్ట్యాది' యందు ప్రతిభాసితమగుచున్న ఈ జాగృత్-జగత్తు కూడా అసత్యమే. మేము తపోధ్యానాదులచే మా దృష్టిని శుద్ధిపరచుకొనియున్నాము. అందుచేత సత్యద్రష్టలమగు మాయొక్క అనుభవ పూర్వకమైన వాక్యముల పట్ల మీరంతా కొంత

విశ్వాసము ఉంచక తప్పదు. ఎందుకంటే, దృశ్య – సంబంధమైన "అజ్ఞానదృష్టి" పేరుకొని ఉన్నంతసేపు, ఈ దృశ్యములోని స్వప్నత్వము దర్శించగల ప్రజ్ఞ ప్రాప్తించటం లేదు.

❖

స్వప్న పదార్థములు సత్యములని ఎవరైనా అనగలరా? అవి అసత్యములే కదా! ఓ రాఘవా! ఒక్క "ఆత్మచైతన్యము" మాత్రమే ఇటు జాగ్రత్ నందు, అటు స్వప్నము నందు, అట్లే సుషుప్తియందు ... అన్ని దశలందు కూడా .... సత్యమై, నిత్యమై, సాక్షియై వెలయుచున్నది. ఇది మాయొక్క అనుభవసారం. వేదాంగములైన ఉపనిషత్తులు, తదితర ఆత్మ ప్రతిపాదక శాస్త్రములు అనేక దృష్టాంతముల సహాయంచేత ఈ విషయం నిరూపిస్తున్నాయి. మనం కూడా ఈ గ్రంథంలో అదే విషయం నిర్ద్వంద్వంగా నిరూపిస్తున్నాం. స్వప్నంలో గాంచబడిన పర్వతం మేల్కొనగానే ఏమౌతోంది? ఆ ఆధిభౌతిక శరీరభావన, ... ఆ దృశ్యప్రాప్తి, ఆధిభౌతిక తాదాత్మ్యము, ఆ దృశ్యతాదాత్మ్యము శూన్య మాత్రములే అగుచున్నాయి. ఆతివాహిక భావము, ... పొందిన ఉత్తమ పురుషుల విషయంలో, "ఇతడు శరీరము పొందుచున్నాడు జన్మిస్తున్నాడు. మరణిస్తున్నాడు, జీవిస్తున్నాడు" అని లోకులు గాంచటం వారివారి అజ్ఞానము వలన మాత్రమే సుమా! యోగపురుషులకు తమపట్లగల అవగాహన అందుకు వేరుగా ఉంటోంది. వారు, "మేము ఈ ఉపాధులను నియమించువారము. సర్వము నిర్ణయము చేస్తున్న సత్త స్వరూపులము" ..... అని భావన చేస్తున్నారు.

స్వప్నద్రష్ట చూస్తున్న స్వప్న పదార్థమువలెనే ఈ 'సృష్టి' అనబడునది కూడా శూన్య స్వరూపము, మిథ్య, మోహకల్పితము, భ్రాంతి మాత్రమే!

ఓ జనులారా! మీరు మీ స్వస్వరూపమగు 'ఆత్మ' ను ఏమరచి భ్రమాత్మకమైన వస్తువులందు, భ్రమయుతమైన వ్యవహారములందు సత్యత్వమును నిష్కారణంగా ఆపాదిస్తున్నారు. అట్లు ఆపాదించటం చేతనే అనేక దుఃఖపరంపరలను అనుభవించు చున్నారు. ఈ భ్రమ – అను నిద్రను వదలండి. మహావాక్యములను శ్రద్ధగా వినండి. ఆత్మ స్వరూపమందు నిదురలేవండి. మరుక్షణం సర్వవికారాలు తొలగిపోతాయి.

ఓ రామా! 'అనాది' అయినట్టి భ్రమప్రవాహమున పడిన ఈ జీవుడు 'మరణమూర్ఛ'కు ముందు "ఆతివాహికశరీరము"ను పొందుచున్నాడు. అయితే, భ్రాంతి వలన భవిష్యత్ సృష్టికి అనుకూలమైనట్టి "సృష్టి–ప్రతిభాస"ను అనుభవిస్తున్నాడు. అవియే అతని యందు మనకు కనబడుచున్న ఈ దేహములు. ఇవన్నీ అతని మనస్సునందే వెలయుచున్నాయి. అంతేగాని, బయట ఎక్కడో, ఏదీ లేదు. కాని చమత్కారం చూచావా? అతడు భ్రాంతి ప్రభావం చేత "సృష్టి ప్రతిభాస" అంతా బాహ్యము నందే ఉన్నదని తలచుచున్నాడు.

❖❖❖

# 52. భౌతికదేహము - యోగిదృష్టి

ఆ మందిరంలో ఇప్పుడు జ్ఞప్తి దేవతయగు సరస్వతీదేవి, ప్రబుద్ధలీల ప్రవేశించియున్నారు కదా! ఇంతలో పద్మని జీవచైతన్యము కూడా (అనగా యుద్ధభూమిలో విదూరథ – ఉపాధి త్యజించిన జీవచైతన్యము) ఆ గృహంలో ప్రవేశించింది. పద్మని భౌతిక దేహం పొందటానికి ప్రయత్నించ నారంభించింది. ఈలోపు జ్ఞప్తిదేవతయగు సరస్వతీదేవి విదూరథుని జీవచైతన్యము ఆ దేహములో ప్రవేశించనీయకుండా నిరోధించింది. ఒకడు తన సంకల్పబలంచేత చిత్తవృత్తిని నిరోధిస్తాడు చూచావా? ఇది కూడా అట్టిదే.

❖

**ప్రబుద్ధలీల :** హే లోకపావనీ! జగజ్జననీ! జ్ఞప్తిదేవీ! ఈ మందిరంలో నేను ఎంతకాలంగా సమాధిలో ఉండటం జరిగింది? నా శరీరము కనబడటం లేదేమి? అది ఇక్కడ, నేను త్యజించిన తరువాత ఎంతకాలమున్నది. ఎప్పుడు, ఎట్లు తొలగినది? ఈ పద్మరాజు ఇట్లా ఎంతకాలంగా శవమై పడియున్నాడు?

**శ్రీ సరస్వతీదేవి :** పుత్రీ! నీవు నీ శరీరమును ఇచటనే త్యజించి విదూరథుడు ఉండియున్న బ్రహ్మాండములోనికి వెళ్ళియున్నావు కదా! అది జరిగి ఇక్కడికాలమానం ప్రకారం ఒక నెల గడిచినది.

నీ శవమును రక్షించుచు ఇద్దరు దాసీలు రాత్రింబవళ్ళు ఇక్కడే ఉండేవారు. ఇక శవము ఏమైనదంటావా? పదిహేను రోజుల తరువాత నీ భౌతిక దేహము శుష్కించసాగింది. బాష్పభావము పొందసాగింది. జీవరహితమై ఎండిపోయిన ఆకులాగా నేలపై పడియున్నది. మరొక రోజుకు 'కొయ్య'వలె బిగదీసుకుపోయింది. మంచువలె చల్లనైపోయింది. ఆ తరువాత మీ మంత్రులు ఇక్కడికి వచ్చి నీ భౌతికకాయమును పరిశీలించారు. "ఈమె మరణించినది" అని స్థిరపరచుకొన్నారు. ఇంకేమున్నది? నీ శరీరమును బైటకు కొనిపోయారు. దానిని చితిపై ఉంచి గంధపు చెక్కలతోను, నేతితోను కాల్చి భస్మం చేశారు. ఇక నీ పరిజనులు "అయ్యో! ఎంతకష్టం? మా రాణి మరణించినది కదా!" అని ఎంతగానో ఆందోళన చెందుతూ రోదించారు. నీ కొరకు పారలౌకిక "శ్రాద్ధము" మొదలైన కర్మలు నిర్వర్తించబడ్డాయి. ఇప్పుడు వాళ్ళు నిన్ను చూడటం జరిగితే "పరలోకం నుండి మరల దిగి వచ్చింది కాబోలు" అని భావించి ఆశ్చర్యపడతారు కూడా! ఇప్పుడు నీవు ఆతివాహిక దేహముతో ఉన్నావు కదా! అందుచేతనే నీవు వారికి కనిపించటం లేదు. సత్యసంకల్ప ప్రభావంతో ఇతఃపూర్వపు దేహంతో కనబడితే శారీరక దృష్టి మాత్రమే కలిగినట్టివారు ఆశ్చర్యపడక ఏం చేస్తారు?

బాలా! నీకు నీ పూర్వ శరీరము నందు ఉన్న 'అనురాగము'ను అనుసరించే ఇప్పటి నీ దృష్టియందు అవే రూపలావణ్యములు కలిగియున్నావు. అందరు తమతమ వాసనలను అనుసరించే అందుకు అనుకూలములైన వస్తువులను గాంచుచున్నారు. "బాలుడు చీకట్లో కల్పిత బేతాళుని దర్శించటం" అనునదే ఇందుకు మనకు సుస్పష్టమైన దృష్టాంతము. నీ వర్తమాన విషయానికి వస్తే, నీవు పూర్తిగా "ఆతివాహిక దేహభావము"ను పొందావు. అందుచేత, "ఇతఃపూర్వపు వాసనలతో

కూడిన దేహమును విస్మరించి వేశావు. "ఆతివాహిక దృష్టి" దృఢమైనప్పుడు "ఆధి–భౌతిక దేహభావన" ఉపశమించగలదని చెప్పానుకదా.

ఒకవేళ, ఈ భౌతిక శరీరములు, బాహ్యజగత్తులు అజ్ఞానులకు అగుపడుచున్నప్పటికీ, 'జ్ఞానులు' మాత్రం ఇదంతా క్షణం ఉండి పోయేదానిగా మాత్రమే దర్శించుచున్నారు. ఒకనిలో "ఆతివాహిక భావము" దృఢమైనప్పుడు, అట్టివానికి ఈ సర్వశరీరములు నీరులేని మేఘంలాగా, వాసనలేని పుష్పంలాగా నామమాత్రమే అవుతాయి. అనగా అతని దృష్టిలో వీటిలో శాశ్వతము, ప్రత్యేకము, స్పష్టము, ఆశ్చర్యము అయినదేదీ ఉండకుండానే పోతోంది. అట్టివారిలో కొందరు తమ ఆధిభౌతిక దేహమును విస్మరిస్తారు. మరి కొందరు దానిని జ్ఞప్తి పథంలో కలిగి ఉన్నప్పటికీ, దానిని ఒక బాహ్యమైన వస్తువు వలెనే దర్శిస్తున్నారు. గృహము, వస్త్రము, పొలమువలెనే ఈ దేహము కూడా వారికి తోచుచున్నది. తదితరుల దేహములు కూడా వారికి అట్లే స్వప్న వస్తు జాలంలాగా కనిపిస్తున్నాయి. "నేను ఈ శరీరమునకు సంబంధించినవాడను కాను. ఈ శరీరము నాకు సంబంధించినది కాదు" అను రూపముగల ఒకానొక ఉత్తమ ప్రజ్ఞ వారు కలిగి ఉంటున్నారు. ఓ ప్రియ లీలా! దృఢమైన సద్వాసనలు కలవారికి, "నేను బాలుడను. నేను యువకుడను" అను భావమే ఉండదు సుమా! ఎవరి దృష్టిలో ఈ దేహము స్వప్నతుల్యమో, అట్టివారు "ఈ దేహము లేనట్టి వారే" అని చెప్పబడుచున్నారు. ఇక ఇతరులకు వారిపట్ల గల దృష్టి విషయమేమిటంటావా? అది ఆ ఇతరుల జ్ఞానాజ్ఞానముల బట్టి ఉంటోంది కాని, అది ఆ యోగికి సంబంధించినది కాదని గ్రహించు.

ఈ విధంగా నీవు నీ శరీరము ఇక్కడ వదలి ముప్పది రోజులు అవుతోంది. మనము ఈ ఉదయమే ఈ ఆకాశంలో ప్రవేశించాం. నేను నీ ఇరువురి పరిచారికలను నిద్రమోహితులను చేశాను కూడా. ఓ లీలాదేవీ! ఇక, రమ్ము. మనం మన సంకల్ప ప్రభావం చేత ఈ ద్వితీయలీలకు 'దర్శనం' ఇద్దాం. అప్పుడు నీవు యథోచితంగా ప్రవర్తించెదవు గాక!

❖❖❖

# 53. పద్ముని పునరుజ్జీవనం

అప్పుడు జ్ఞప్తిదేవి, "ఈ ద్వితీయలీల మా ఇద్దరిని గాంచుగాక" అని సంకల్పించినది. అప్పుడు ఆ ద్వితీయలీలకు వారిద్దరు ప్రకాశపూర్వకంగా కనిపించసాగారు. వారి తేజము ఆ గృహమున ప్రవేశించగానే, ఆమె ఉలిక్కిపడి, తలెత్తి ఆ ఇంటి నాలుగువైపులా కలియచూచింది. ప్రబుద్ధలీల – సరస్వతులను చూచి ఎంతో సంతోషమును, ఉత్తేజమును పొందింది. వారి పాదములపై వ్రాలింది.

**ద్వితీయలీల :** ఓ దేవతలారా! నా సాష్టాంగ నమస్కారం స్వీకరించండి. మీ రాక నాకు ఎంతో సంతోషమును కలుగజేస్తోంది. మీరు నాకు ప్రాణదాతలు. వరప్రదాతలు కూడా. మీ పరిచారికనైయున్న నేను మీకంటే ఒకింత ముందుగా ఇక్కడికి వచ్చియున్నాను. మీకు సుస్వాగతం. ఇదిగో, ఈ సింహాసనములను అధిరోహించి సుఖాసీనులు కండి.

**శ్రీ జ్ఞప్తిదేవి :** పుత్రీ! నీవు ఇచటికి మాకన్నా ముందే ఎట్లా వచ్చావు? దారిలో ఎచట ఏమి చూచావు? ఆ వృత్తాంతమంతా మాకు చెప్పు.

**ద్వితీయలీల :** నేను మీరు చూచియున్నచోట 'కాలాగ్ని'వలె దహించబడ్డాను. ఒకానొక మూర్ఛను పొందియున్న నేను అప్పుడు "ఇది - అది" అను జ్ఞానమే లేక ఉంటిని. కళ్ళు మూసుకొనియున్న నేను మరణమూర్ఛ గతించిన తరువాత తేరుకొని చూడగా, ఎక్కడో ఆకాశంలో ఎగురుతున్నట్లు స్థితిపొందియున్నాను. అట్లు కొంతసేపు ఎగురుట జరిగిన తరువాత, ప్రాణములు అనే రథమును అధిరోహించాను. సువాసన కణము (the particles of sweet smell) వలె పయనించి ఇచ్చటికి వచ్చాను. ఇక్కడ ఈ అంతఃపురం అనేక దీపకాంతులతో ప్రకాశిస్తోంది. కొందరు దాస-దాసీ జనం అక్కడక్కడ గాఢనిద్రాపరవశులై నిద్రిస్తున్నారు. ఇక్కడి వాతావరణమంతా మౌనంగా, ప్రశాంతముగా ఉన్నది. ఉత్తమమైన పాన్పులు కూడా నాకు కనిపించాయి. ఈ గృహంలో ఉత్సుకతచే సంచరిస్తూ ఉండగా, ఇక్కడ ఈ మూల నాభర్త విదూరథుడు శయనించి ఉండి కన్పించాడు. అతడు పూలచే కప్పబడియున్నాడు. ఇతడు ఇంతక్రితమే మహాశ్రమయుతమైన యుద్ధం చేసియున్నాడు కదా! పాపం, ఎంతో దస్సి ఉంటాడు. అందుకే, నిదుర లేవలేదు. ఇతడు తన అలసట మరువటానికి వింజామరం వీస్తూ ఉన్నాను. ఇంతలో మహాతేజస్వరూపులగు మీరిద్దరు ప్రత్యక్షమయ్యారు. మీ కరుణ అపారమైనది కదా! నన్ను కరుణించ వేడుకొనుచున్నాను.

❖

**జ్ఞప్తిదేవి :** ఓ ఉభయ లీలలారా! ఇప్పుడు "శవశయ్య"పై పరుండియున్న ఈ రాజును నేను నిదుర లేపుచున్నాను.

❖

ఇట్లు పల్కి రుద్రాక్షమాలచే అలంకితురాలగు ఆ జగజ్జనని సరస్వతీదేవి, సంకల్ప బలంచేత శరీరంలో ప్రవేశించకుండా బైటయే నిరోధించియున్న విదూరథుని ప్రాణములను సంకల్పమాత్రముగా విడచివైచింది. అప్పుడు ఆ జీవుడు ప్రాణ వాయు స్వరూపంతో ముక్కురంధ్రముల ద్వారా శరీరంలో ప్రవేశించాడు. సముద్రగర్భంలో మణులు ఉంటాయి చూచావా? అట్లాగే, ఆ జీవునియందు 'వాసనలు ఉన్నాయి. జీవుడు ఆ శరీరంలో ప్రవేశించగానే అతని ముఖం కాంతివంతమైంది. క్రమంగా అవయవములు చైతన్యవంతం కాసాగాయి. జీవరసము శరీరమంతా ప్రసరించింది. నెమ్మదిగా కనులు విప్పాడు. అప్పుడు ఇరువురు - లీలలు అతని ముందు వినమ్రతతో, ప్రేమభావముతో "స్వామి! మీకు శుభమగుగాక! మమ్ములను ఆజ్ఞాపించవేడుకొంటున్నాం" అని ఒక్కసారిగా పలికారు.

లేచికూర్చున్న పద్ముడు ఇరువురు లీలను చూచాడు. ఎంత ఆశ్చర్యం! అతనికి ఇద్దరు లీలలు... ఆచార-వ్యవహార-రూప-మర్యాద-వాక్య-ప్రయత్న-వినమ్రతలో-సమానులైయుండటం కనిపించింది.

**పద్ముడు :** ఓ వనితలారా! మీరిద్దరు ఎవరు? ఇది అత్యంత చిత్రంగా ఉన్నది సుమా! మీరిద్దరు అచ్చు ఒకే తీరుగా ఉన్నారే? ఎందుచేత?

**ప్రబుద్ధలీల :** ఓ దేవా! ఉద్వేగరహితులై మీరు మేం చెప్పేది వినండి. నేను మీ అర్ధాంగిని. "వాక్కు – అవాక్కు యొక్క అర్థము" ఏ విధంగా అవినాభావసంబంధం కలిగియుంటాయో, నేను కూడా మీతో కలసి అట్లే ఉండేదానను. బహుదీర్ఘకాలం మనమిద్దరం భార్యా – భర్తలమై సంచరించాం. ఇక ఈ ద్వితీయలీలను చూచారా? ఈమె కూడా మీ భార్యయే. మీ కొరకే నా ప్రతిబింబము అయినట్టి ఈమెను మీరు కల్పించుకున్నారు. అదిగో అటు, మీ తలవైపు చూడండి. ఆ బంగారు సింహాసనముపై కూర్చున్న వనితవైపు చూడండి. ఆమెయే త్రిలోక జననియగు సరస్వతీదేవి. ఆమె మనయొక్క పూర్వపుణ్యవశంచేత మనపైగల అవ్యాజమైన ప్రేమచే మనకు సాక్షాత్కరించింది. ఆమెయే మనలను తన భక్తవత్సలత కారణంగా స్వమహిమచే పరలోకము నుండి ఇక్కడికి చేర్చింది. ఆమెకు భక్తి – పూర్వకంగా నమస్కరించండి!

ఆ మాటలు విన్న రాజు తటాలున కొంత తొట్రుపాటుతో లేచి నిలబడ్డాడు. మాలలు, వస్త్రములు నేలతాకుచుండగా, లోకమాతయగు జ్ఞప్తిదేవత పాదాలుపై పడ్డాడు. భక్తి పూర్వకంగా మరలమరల కళ్ళకు హత్తుకొన్నాడు.

**పద్ముడు :** సర్వహితప్రదమగు ఓ తల్లీ! సరస్వతీమాతా! నా ఈ నమస్కారం కొంత ఆలస్యమైనందుకు క్షమించమ్మా! నీ దర్శనము ఊరకే పోతుందా? లేదుకదా! మాకు గొప్ప మేధను, దీర్ఘాయువును, ధనమును ప్రసాదించెదవు గాక!

**శ్రీ సరస్వతీదేవి :** ఓ ప్రియపుత్రా! శుభమస్తు – వాంఛితార్థములన్నీ పొంది ఈ గృహంలో వసించుము. నీ విషయంలో అన్ని ఆపదలు, పాప–బుద్ధులు తొలగుగాక! నీ ప్రజలు నిత్యసంతోషమును పొందెదరు గాక! నీ రాష్ట్రమునందు లక్ష్మి స్థిరమై వెలయును గాక! ఇట్లు పలికి జగదోద్ధారిణియగు సరస్వతీదేవి అంతర్ధానమైనది.

అప్పుడే తెల–తెల్లవారుతోంది. లీల పునర్జీవితుడైన తన భర్తను చూచి పులకిత శరీరురాలైనది. క్రమంగా అక్కడ అంతఃపురంలోని జనులు నిదురలేచి అటు–ఇటు సంచరించ ప్రారంభించారు.

❖

రాజభవనం ఆనందపరవశులగు జనుల సంచారంతోను, గీతములతోను, జయ–జయ ధ్వానాలతోను, మంగళప్రదమగు పుణ్యాహవచన మంత్రధ్వనులతోను ఒక్కసారి ఉత్తేజం పొందినది. రాజు పునర్జీవితుడయ్యాడనే వర్తమానం మంత్రులకు, సామంతులకు, పురజనులకు అందింది. అప్పటికప్పుడు "రాజు, రాణి పరలోకము నుండి మనకొరకు మరల తిరిగి వచ్చారు" అనే అర్థం వచ్చే పాటలు రచించబడి, గానం చేయబడ్డాయి.

లీల జరిగినదంతా వివరించగా, పద్మభూపతి శ్రద్ధగా ఆలకించాడు. అప్పటికప్పుడు నాలుగు సముద్రాల నుండి జలం తేబడ్డాయి. అతడు మంగళస్నానాలు చేశాడు. మరల అతనికి మంగళాభిషేకం చేయబడింది. ఆ రాజు, ఇరువురు లీలలు తమ పూర్వవృత్తాంతము గురించి చిత్రంగా గుర్తు చేసుకొంటూ, ప్రసంగం చేసుకొంటూ, ఉద్యానవనాలలో విహరించారు.

❖

చూచావా, రామా! ఆ పద్మడు నిజప్రయత్నబలంచేత, సరస్వతీదేవి కటాక్షంచేత పరమ శ్రేయోదాయకమగు జ్ఞానమును పొందాడు. అట్లే పునర్జన్మను, రాజ్యమును కూడా పొందాడు. ప్రబుద్ధలీల సరస్వతీదేవిచే ప్రసాదించబడిన జ్ఞాన విషయములన్నీ ఆ ఇద్దరితో కూడి విచారించేది. ఆ ముగ్గురు జీవన్ముక్తులై రాజ్యమును పాలిస్తూ చాలా సంవత్సరాలు గడిపారు. ఆ రాజు ప్రజాహితంగా, పండితులకు సంతోషం కలుగజేసేట్లుగా, దోషరహితంగా రాజధర్మాన్ని నిర్వర్తించాడు. యశస్సు, ధర్మము, సౌభాగ్యము స్వయముగానే అతనియందు ఉత్తమత్వము పొందాయి.

ఆ తరువాత కొంతకాలానికి సాధన-విచారణలు ప్రయోజనంగా పద్మడు - ద్వితీయలీల కూడా ఉత్తమజ్ఞానము పొందారు. విదేహముక్తి పొందారు.

ప్రథమలీల ఇతఃపూర్వమే ముక్తస్వరూపిణి కదా!

❖❖❖

# IV. లీలోపాఖ్యానం - సమీక్ష

## 1. కాలము - భావన - పురుషకారము - దైవము - అఖండ బ్రహ్మము

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవుని యందు "దృశ్యముతో ఏర్పరచుకొనిన బంధము" అనబడు ఒకానొక దోషము రూపుదిద్దుకొని ఉంటోంది. అట్టి దోష నివృత్తి కొరకే నీకు ఈ 'లీలోపాఖ్యానం' చెప్పాను. "ఈ దృశ్యజగత్తు సత్యము" అను రూపము గల భ్రమావేశము నీవు కలిగియుండకూడదు సుమా! ఈ దృశ్యము నీపై చూపుచున్న ప్రతాపమును నిరోధించతలచుకొంటే, అదొక్కటే ఉపాయం. ఈ ఎదురుగా ఉండి, ప్రాప్తించుచున్నట్టి దృశ్యమునందు, "ఇది వాస్తవమే" అను "సత్యత్వబుద్ధి" ఉన్నంత వరకు దీనిని నిర్మూలించటం బహుకష్టతరమగుచున్నది. ఉత్తమ భావనచే ఆ భ్రమబుద్ధి తొలగిపోయిందా .... ఇక సంసారాన్ని జయించటంలో, ముక్తిని పొంద గలగటంలో, కష్టమైనదేదీ ఉండదు.

జ్ఞానులగు వారు ఈ దృశ్య పదార్థములను చూస్తున్నప్పుడు "ఇవన్నీ ఆకాశము వలె 'శూన్యము, మిథ్య' మాత్రమే" అని స్వవిచారణా సామర్థ్యంచే ఎరుగుచున్నారు. ఈ ప్రపంచమంతా ఆకాశతుల్యుడగు పరమపురుషుని యందే వెలయుచున్నది. అతడే అన్నిటికి కారణము – కార్యముకూడా. అతడొక్కడే స్వయంప్రభువు. తన ఉనికికి తానే కారకుడాతడు. అట్టి ఆ పరమాత్మ ఈ పృథివి మొదలైన పంచభూతములకు సంబంధించినవాడు కాదు సుమా! అతడు చిన్మాత్రమే (that which knows, sees, experiences all else) శరీరముగా కలవాడు. అతడు మాయాపూర్వకముగా తనయందు ఈ వివర్తమంతా కల్పించుకొని, అందు వెలయుచున్నాడు. అంతే గాని, ఎక్కడా ఏదీ బాహ్యమునందు లేదు. అనగా, ద్రష్టగా, దృశ్యముగా భాసించుచున్నది అతడే. అతడు ద్రష్టత్వముకన్నా ముందే ఎల్లప్పుడూ ఉన్నాడు. ఆ చైతన్యరూపుడగు స్వయంభువు ఎప్పుడు ఎట్లు యత్నించునో, లేక భావించునో, లేక సంకల్పించునో, .... అప్పుడు అట్లే వివర్తము పొందుచున్నాడు. అతడు 'సృష్టి' కొరకు యత్నించి నపుడు లేక సంకల్పించినపుడు సృష్టియే జరుగుతోంది. 'స్థితి' కొరకు భావించుచుండగా స్థితియే ప్రాప్తిస్తోంది. లయము కొరకు ప్రయత్నించుచుండగా 'ప్రళయము' ప్రాప్తించుచున్నది. (He Creates, sustains and destroys of his own volition)

ఓ ప్రియ రఘురామా! ఈ జగత్తంతా "బ్రహ్మాత్మకము అగు (బ్రహ్మమే స్వరూపముగా కలిగి నట్టి) నిర్మల చిదాకాశమునందే ప్రతిభాసించుచున్నది. అయితే పరమార్థదృష్టితో పరికించి చూచి నప్పుడు మాత్రం బ్రహ్మమున "జగత్తు" అనబడు పదార్థమునకు తావే లేదు. పరిమితాశయముల దృష్ట్యా చూచినపుడు "వ్యవహారదృష్టి" అని, మహోన్నతమగు సత్యమే ఆశయముగా కలిగియున్నప్పుడు 'పరమార్థదృష్టి' అని చెప్పబడుతోంది. ఈ జగత్తు బుద్ధి వికారముచే ప్రాప్తిస్తున్నది మాత్రమే!

అందుచేత ఇదంతా బుద్ధిపరిచ్ఛిన్నుడగు జీవుని యందు మాత్రమే వెలయుచున్నదని గ్రహించు. మరి అట్టి వ్యర్థమగు భ్రాంతికి 'సత్త' ఏమి? వాసనఏమి? స్థిరత్వమెక్కడ? నియతి ఏమి ఉంటుంది? దేనికొరకు ఏది ఆవశ్యకత కలిగి ఉంటుంది? మాయవలన మాత్రమే ఇదంతా ఇట్లు స్వప్నములోవలె దీర్ఘమైన దృశ్యముగా ప్రాప్తిస్తోంది. ఘనీభూతమైనదానివలె, ఈ జీవులను తోలుబొమ్మల వలె ఆడించుచు, వ్యవహర్తవలె ప్రవర్తిస్తోంది. పరమార్థదృష్టిచే ఇదంతా శూన్యమే! 'మాయ' అను శబ్దమునకు గల అర్థమేమిటి? "ఏదైతే లేదో" ... అని కదా! అవాస్తవకతతో కూడినదై, భ్రమ మాత్రమే అయినదానినే 'మాయ' అంటున్నాం. అంతేకాని ఇక్కడ 'మాయ' అనబడు ఒకానొకదానికి కర్తృత్వం ఆపాదించటం మన ఉద్దేశం కాదు సుమా!

❖

**శ్రీరాముడు :** హే భగవన్! మీరు ఈ 'లీలోపాఖ్యానం'లో యథోచితమైన దృష్టాంతము లచే, జీవులకు శాంతిని ప్రసాదించకలిగినట్టి పరమార్థ దృష్టిని ప్రదర్శించారు. ఆహా! ఆశ్చర్యం! ఎంతో కాలం తరువాత ఇప్పుడు మేము తెలుసుకోవలసినది తెలుసుకొంటున్నామని మాకు అనిపిస్తోంది. స్వామి! మీరు చెప్పిన ఉపాఖ్యానం, అందలి శాస్త్రవ్యాఖ్యానం అత్యంత అద్భుతంగా ఉన్నాయి. అది విని, స్వయముగా విచారణ చేయుచుండుటచే, తత్త్వమును గ్రహించి శాంతిని, నిర్వాణమును తప్పకుండా మేమంతా పొందగలం. మీ వాక్యామృతం ఎంత విన్నప్పటికీ తనివి తీరటం లేదు. ఇప్పుడు నాకు కలుగుతున్న కొన్ని సందేహములు ప్రస్తావిస్తున్నాను. అనుగ్రహించండి.

**ఒకే కాలము యొక్క వివిధ గతులు - రీతులు**

ఒకానొక జీవుడు "వసిష్ఠ-పద్మ-విదూరథుల" .... సృష్టులందు జీవించియుండటం మనం చెప్పుకున్న కథనంలో జరిగినది కదా! అట్లు మూడు తీరులుగా గడచినట్టి కాలము యొక్క స్వరూపము ఎట్టిది? ఆ కాలము కూడా మన ఈ కాలంలాగానే రాత్రింబవళ్ళు కలిగియున్నదేనా? అది మాసములు - సంవత్సరములు - క్షణములుదీర్ఘకాలం మొదలైనవి కలిగియున్నదా? ఒకేసారి వేరువేరు ప్రమాణములతో వేరువేరు రీతులుగా కాలగమనం ఉంటుందా? ఆ జీవుని వేరువేరు జన్మస్థానము లందు కాలగమన ప్రక్రియ వేరువేరు సాపేక్షలు ఎట్లు కలిగియున్నది? ఒకచోట ఎనిమిది రోజులు జరుగగా మరొకచోట డెబ్బది సంవత్సరములు గడచినాయే? నా సందేహం ఇది. ఈ విషయమై మీరు చూచాయగా కొన్ని విషయాలు చెప్పియున్నారు. కాని నాయందు ఇంకా సందేహనివృత్తి కాలేదని నాకు అనిపిస్తోంది. అజ్ఞానులమగు మేము ఒక్కసారి విన్నంత మాత్రంచేత గ్రహించవలసినదంతా గ్రహించగలమా? ఎండిన మట్టి ఒకటి రెండు జలబిందువులు పొందినంత మాత్రంచేత తడుస్తుందా? లేదు. హే సద్గురూ! నా బుద్ధి తగినంతగా వికసించియుండక పోవచ్చును. నన్ను క్షమించండి. ఈ 'కాలము' విషయమై మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** 1) సంకల్పము 2) జ్ఞానము 3) అనుభవము .... ఈ మూడింటికి ఒకానొక చమత్కారమైన అవినాభావసంబంధం ఉన్నది. ఎవడు ఎక్కడ ఎట్టి జ్ఞానమును పొందుతాడో,

అతడు దానిపట్ల అట్టి అనుభవమునే పొందుచున్నాడు. జ్ఞానము- సంకల్పములు ఒకటికి మరొకటి తోడు, ఆధారము, మూలము అగుచున్నాయి.

ఈ విషయం కొన్ని దృష్టాంతములను తీసుకొని మరికొంత స్పష్టంగా చెపుతాను. విను. "ఇతడు నాకు ప్రియమైనవాడు" అని నిరంతరం భావించుటచే ఒకడు అట్లే ప్రియమైనవాడు అగుచున్నాడు. "ఇతడు నాకు మిత్రుడు" అని భావించుటచే శత్రువు కూడా మిత్రుడైపోతాడు. ఒకానొకడు విషమును "ఇది నాకు అమృతముతో సమానం" అని భావించుటచే కొంత కాలమునకు అది అతనికి అమృతప్రాయమే అగుచున్నది. పదార్థములు, వ్యక్తులు, సంఘటనలు .... ఇవన్నీ ఏ భావంతో భావించబడితే, అట్టి భావనా ప్రభావంచేత ఆయా పదార్థములు, వ్యక్తులు, సంఘటనలు అట్లే ప్రతిభాసిస్తున్నాయి. కార్యకారకములు కూడా అగుచున్నాయి.

"ఒక నిమిషము"ను అనేక కల్పములుగా భావించి, అట్టి బుద్ధిని బడయకలిగితే, అట్టివానికి ఆ ఒక్క నిమిషమే కల్పములుగా తోచగలదు. అదేవిధంగా కల్పముల యందు "ఇది ఒక్క నిమిషముతో సమానం" అనునట్టి బుద్ధి ఉంచినప్పుడు అవన్నీ మరుక్షణం నిమిషమాత్రములే అగుచున్నాయి. చిత్తముయొక్క స్వరూపమే అట్టిది. మనం దృష్టాంతంగా లౌకిక-జీవిత విశేషములే తీసుకొందాం. దుఃఖములతో, భయముతో బాధితుడగుచున్నవానికి 'ఒక రాత్రి' అత్యంత భారంగా, అనేక సంవత్సరము లంత పొడవైనదిగా తోచుచున్నది. సుఖసంపదలు పొందియున్నవానికో .... అదే రాత్రి - బంధు సమాగమంతో, ఆనంద-ఆహ్లాదములతో - ఒక క్షణమువలె గడచిపోతోంది. అది అట్లా ఉండగా, ఒకడు స్వప్నానుభవం పొందుచున్నప్పుడు, అతనికి స్వల్పకాలం అతిదీర్ఘంగా, దీర్ఘకాలం అతిస్వల్పంగా అనుభవమగుచున్నది. స్వప్నంలో, "అయ్యో! మరణించాను. మరల పుట్టాను బాల్య-యౌవనాలు గడచిపోయి, ముసలివాడినయ్యాను. వందలాది యోజనముల విస్తీర్ణం ప్రయాణం చేశాను. ఎక్కడో, ఎప్పుడో ఉండియున్న వారితో కలసి సంభాషించాను" -అనునట్టి భావనోద్వేగం కలుగుతోంది కదా! ఇట్లు దీర్ఘకాలం స్వల్పంగా ఉండటం, కొద్దికాలం దీర్ఘంగా అనుభవమవటం ప్రతివారికి ఏదో ఒక సందర్భంలో ఏదో ఒకరూపంగా అనుభవం అవుతూనే ఉన్నది సుమా! 'హరిశ్చంద్రుడు' అనే రాజు ఒక్కరాత్రి యందు 12 సంవత్సరముల కాలక్రమము యొక్క అనుభవం పొందినట్లు వినియున్నావు కదా! 'లవణుడు' అనే మరొక రాజు ఒక్కరాత్రి యందు డెబ్బది సంవత్సరముల ఆయువును అనుభవించియున్నాడు.* అంతేకాదు. "మహర్షి మనువు' యొక్క ఒక్క జీవితకాలం .... ప్రజాపతి బ్రహ్మదేవునికి ఒక ముహూర్తకాలం అగుచున్నది. బ్రహ్మయొక్క ఒక జీవితకాలం విష్ణువునకు ఒక రోజు అగుచున్నది. విష్ణువుయొక్క జీవిత కాలం శివునకు ఒక్కరోజు. నిర్వికల్ప సమాధియందు దివారాత్ర భేదమే ఉండదు. ఎందుచేత నంటావా? నిర్వికల్ప సమాధిని ఆశ్రయించినవానికి ఇక 'కాలము' అనునది మొదలంటా అసత్యముగును, ఆత్మపదార్థమొక్కటే సత్యముగాను అనుభవమగుచున్నది.

---

* లవణుని కథ ఈ ప్రకరణంలో "ఇంద్రజాలోపాఖ్యానం" లో చెప్పబడింది.

ఒకప్పుడు ఈ ధన-దార-పుత్ర-రాజ్యాది భోగఫలములు అత్యంత మధురంగా, గొప్పవైన వాటివలె ఉంటున్నాయి కదా! ఇవన్నీ వైరాగ్యభావముతో దర్శించినప్పుడో? వాటి యొక్క చింతనయే అప్రియం అవుతోంది. ఎంతమంది చక్రవర్తులు త్రుటిలో సర్వ భోగములు త్యజించి వానప్రస్థం స్వీకరించలేదు చెప్పు? మధుర భావముతో చింతించుట చేతనే కదా. "ఉపవాసములు, తీర్థయాత్రలు, సుదీర్ఘమైన పాదయాత్రలు" .... మొదలైనవి ఆహ్లాదకరంగా తోచుచున్నాయి. మధురభావము యొక్క ప్రభావము చేతనే అతి కష్టతరమైనట్టి "మనోనిరోధము" కూడా ఆత్మ సుఖమును ప్రసాదిస్తూ, మధురముగా ప్రాప్తించుచున్నది. మహాపురుషులగు కొందరు తమపట్ల శత్రుత్వము వహించువారు తారసపడినప్పుడు కూడా, "వీరు నాకు మిత్రులతో సమానమే. తమ తమ ఈ పరుష వాక్యములచే నాకు మేలే చేస్తున్నారు" అని సౌమ్యభావంతో చింతించుచూ ఉంటారు. అట్టి చింతనా ప్రభావంచేత లోకరీతిగా అప్రియులు కావలసినవారు కూడా ఆప్త పురుషులగు మిత్రులుగానే పరిణమించుచున్నారు. అట్లే విషయభోగాదులు పొందుటకు గాను, కొందరు బంధువులు సాయపడువారు కావచ్చు. కాని, "వీరు నా ఉత్తమ పురుషార్థమునకు విఘాతమునే కలుగజేస్తున్నారే!" అని భావించినప్పుడు ఆ బంధువులు అతనికి అప్రియులే అగుచున్నారు కదా!

ఓ మహాభాగా! రామచంద్రా! "అసలు ఈ జగత్తు అంతా ఏమిటి? ఏమైయున్నది" అని పరిశీలించినప్పుడు "ఇదంతా కేవలం భావనామయం మాత్రమే" అని మనకు తెలియవచ్చుచున్నది.

"శాస్త్రాలు పఠించటం, జపములు, తపములు" మొదలైనవి .... ఉత్తమమైన "భావన, అభ్యాసం" .... ఈ రెండూ లేకపోవటం చేత ... కొందరికి ఎంతో దుస్సాధ్యమైన వాటివలె అనిపిస్తున్నాయి. మరికొందరికి "చక్కగా గ్రహించి ఉండటం .... 'ఇవి శుభప్రదములు' అని భావన కలిగియుండటం .... అభ్యాసం" .... వీటి వలన జపతపాది వ్యవహారములు ఎంతో తేలికైనవిగా, ఆహ్లాదకరమైనవిగా, సుఖకరమైనవిగా అనుభవ మగుచున్నాయి. పరిశీలనాత్మకమైన బుద్ధి లేనట్టివాడు, నౌకలో పయనించుచున్నప్పుడు, ఒకవైపుకు చూచి "ఆహా! ఈ వృక్షములు గుండ్రముగా కదులుచున్నాయి" అని అనుకొంటున్నాడు. అట్లా కాకుండా, "ఈ విధంగా చెట్లు కదులుచున్నట్లు కనబడుచున్నప్పటికీ, అట్లు జరుగుట అసాధ్యం. వాస్తవానికి ఈ నౌకయే కదులు చున్నదిగాని, చెట్లు కాదు" అను భావనను దృఢం చేసుకొన్నవాడో, భ్రమకు లోనుకాడు.

ఓ రామా! బాగుగా పరిశీలించకపోవటం, విచారణ చేయకపోవటం చేతనే .... శూన్యము కూడా అనేక వస్తుజాలముతో కూడుకొని పూర్ణమువలె అనుభవం అవుతోంది. స్వప్నంలో గోడలు, భవనములు, తదితర వస్తుజాలం, బంధుజనులు కనబడటం జరుగుతోంది. వారు వాస్తవమా? కాదు. కాని అనుభవం మాత్రం ఉంటోంది. అంతరంగమందు 'భావన' గావించబడటం చేతనే ఆ స్వప్నవస్తువులన్నీ కనబడటం జరుగుతోంది. అవన్నీ 'జాగ్రత్తు'కు లభించకపోయినా, స్వప్న సమయంలో స్వప్నద్రష్టకు వాస్తవమనే అనిపిస్తున్నాయి. "గ్రహించటంలో గల దోషం" చేత పసుపు-పచ్చటి పదార్థములు కూడా నీలంగానో, తెలుపుగానో కనిపిస్తూ ఉంటాయి. రంగుటద్దం

(coloured glass) లోంచి సూర్యకాంతి పడుచున్నవైపు చూస్తుంటే ఎదురుగా ఆ రంగే సర్వత్రా ఉన్నట్లు తెలియవస్తూ ఉంటుంది.

బాలుడు తన "పుట్టినరోజు పండుగ" వంటి ఆనందించవలసిన సమయంలో కూడా "ఈ ఆటవస్తువు చెడిపోయిందే" అని క్షణంలో ఖిన్నుడై దుఃఖం పొందుచున్నాడు. పేదవాడు "అయ్యో! నాకు కనుక ధన–ధాన్య సమృద్ధి ఉంటే ఎంత బాగు!" అని అనుకొంటున్నాడు కదా! మరి, ధన–ధాన్య సమృద్ధి కలిగినవాడు సుఖించవలసినది పోయి, "నేను ఆ స్త్రీ యొక్క ప్రేమను పొందలేకపోతిని కదా!" అని తలచుచు, ప్రపంచములోని 'నిస్తేజము' నంతా ప్రోగుచేసుకొని కొంపకు తెచ్చుకొంటున్నాడే? వివేకహీనుడు, – తన ఎదురుగా ఉన్నది గోడే అయినప్పటికీ ... ఆ గోడపై నేర్పుతో రచించబడిన రంగులచిత్రం చూచి, "ఇది సరస్సు. అది ఖాళీ స్థలం. ఇవి చెట్లు. ఇవి పుట్టలు. అక్కడ హంసలు నీటిలో ఈత కొడుతున్నాయి" అని భ్రమను పొందుతాడు. వస్తుతః మిథ్యయే అయివున్న చీకటిలోని 'దయ్యం' అనబడునది, పిరికివాని దృష్టికి ఆయా కదలికలతో సహా కనిపించి, అతనికి చెమటలు పట్టేటట్లు చేస్తోంది. చివరికి ఒక్కొక్కసారి ఆ పిరికివాడిని చంపేస్తోంది కూడా! "ఇది వాస్తవమే" అను రూపముగల జ్ఞానము వలననే ఒకడు స్వప్నంలో చూచిన సుందర స్త్రీతో ఆలింగన భావం పొంది, తత్కారణంగా ఆయా వికారములు ఈ జాగ్రత్–భౌతిక దేహమునందు పొందుచున్నాడు.

ఓ రాఘవా! నిన్నొక ప్రశ్న వేస్తున్నాను. సమాధానం చెప్పు. ఎదురుగా ఘనీభూతమై నిలచి ప్రాప్తిస్తున్న ఈ "జగత్తు" ఏమయి ఉన్నదంటావు?

**శ్రీరాముడు :** ఇది మిథ్యయగు ఆకాశము మాత్రమే.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఒక్కొక్కడు మేఘముల ఛాయను చూచి, తన కల్పనా బలంచేత, అది కదులుచున్నప్పుడు .... "ఇక్కడ ఒకానొక మిథ్యానటుడు ఉన్నాడు. అతని నీడే ఇది. అతనిదే ఈ అభినయం. అవును, ఇప్పుడు అతడు కోపం చూపిస్తున్నాడు" .... అని భ్రమ చెందుతాడు చూచావా! అదంతా అజ్ఞాన చాపల్యమే కదా! అజ్ఞాన ప్రభావం చేతనే అనేక పదార్థములు, నీవు – నేను మొదలైనవాటితో కూడిన ఈ జగత్తు అనుభవమగుచున్నది. "స్వకీయమగు భ్రమయే ఆత్మయందు 'జగద్రూపము'ను విస్తరింపజేయుచున్నది" .... అని అనేకమంది జ్ఞానులచే, శాస్త్రములచే నిర్ద్వంద్వముగా ప్రకటించబడుతోంది.

"సర్వ సమష్ఠిరూపమగు ఆకాశము నందు వృత్తి రూపమున ఏర్పడుచున్న మనోస్పందమే ఈ జగత్తు".

అని మేము అనుభవపూర్వకంగా గ్రహిస్తున్నాం. బాలుడిని అదలించటానికి, పెద్దవాళ్ళు .... "అదుగో బూచి. నీవు ఏడ్చావా, అది వచ్చి మీద పడుతుంది" అని పలుకుతూ ఉంటారు. అప్పుడా అజ్ఞాన బాలుడు, "ఔను. నిజమే కాబోలు" అని అల్లరి మానుకొంటాడు. "మోహము – మూర్ఖత్వము – ప్రజ్ఞారాహిత్యము"ల కారణంగా అక్కడ నిజంగానే "బూచి" అనబడునదేదో చూస్తాడు. అతను

చూస్తున్నదంతా మనోవికారములు కాక మరింకేమిటో చెప్పు? ఈ దృశ్య విషయం కూడా అట్టిదే. లేకుంటే ఇక్కడ సుఖములేమిటి? దుఃఖములేమిటి? ప్రియములేమిటి? అప్రియము లేమిటి? నీవారేమి? నావారేమి? అంతా మనోవికారములే సుమా! అట్లే "అక్కడ - ఇక్కడ, అప్పుడు - ఇప్పుడు" .... లతో కూడిన దూరము, స్థానము, సమయము కూడా అంతే! ఇవన్నీ మనస్సుయొక్క స్వకీయకల్పనను అనుసరించే ఏర్పడుచున్నాయి. అనుభవమునకు వస్తున్నాయి.

❖

ఓ రామచంద్రా! ఈ జగత్తు మాయాకల్పితము. ఆకార రహితము. స్వతహాగా ఎట్టి నిర్ణయము లేనట్టి జడము, 'బోధ' శక్తిహీనము. అందుచేతనే తత్వజ్ఞులైనవారు, ఈ జగత్తు విషయమును, "అనిద్రుడైనవాడు చూచుచున్న అపూర్వ-స్వప్నము వంటిది మాత్రమే" అని చక్కగా ఎరుగుచున్నారు.

❖

స్తంభము తనయందు ఆయా శిల్పదృశ్యములను ( స్త్రీ, ప్రకృతి, జంతువు మొదలైన ఆకారములను) అగుపింపచేస్తోంది చూచావా? సర్వమునకు ఆధారమై, చిన్మయమై, నిర్వికారమై, పరమార్థసత్యమై, మార్పు-చేర్పులులేనట్టి 'ఆత్మ' అనబడు స్తంభమునందు ఈ సృష్టి ప్రాప్తిస్తోంది. "ద్రష్ట - దృశ్యము" .... ఈ రెండూ కూడా ఆత్మకంటే ఏమాత్రం వేరైనవి కావు. ఆహా! ఎంతటి చమత్కారమైనవిషయం! ఒకడు మహా విద్వాంసుడు, తెలివిగలవాడు అయివుండి కూడా, తన స్వప్నమునందు తారసపడిన యోధులచే బాధించబడుతూ, గావుకేకలు వేస్తూ ఉంటాడు. అయితే, ఆ యోధులందరు అంతరంగమున స్వయముగా తనచేత కల్పన చేయబడినవారే కదా! మరి స్వప్న - శత్రుయోధులకు బాధించగల సామర్థ్యం ఎట్లా వచ్చింది? ఆ సామర్థ్యము ప్రసాదించిన వారు ఎవరు? స్వప్నద్రష్ట యొక్క కల్పనాచాతుర్యమే అదంతా అయివుండి కూడా, అతడు అది ఎరుగనివాడై ఎలుగెత్తి ఏడ్చుచున్నాడు. ఈ జాగృత్ - దృశ్యానుభవముల విషయము కూడా అట్టిదే అనటంలో మాకేమీ సందేహం లేదు.

"శీతకాలం తరువాత వసంతకాలం వస్తోంది. అప్పుడు భూమి పుష్పములతో, ఫలములతో లేత చిగురులతో 'రసమయము' అగుచున్నది" అనునది జనులు చూస్తూనే ఉన్నారు కదా! ఆ 'రసత్వము' ఎక్కడ దాగివుంటోంది? వసంతకాలం వచ్చేసరికి ఎక్కడి నుండి బయల్వెడలుతోంది, చెప్పు? ఆ రసత్వం భూమియందే అప్రకటితంగా ఒదిగి ఉండి, తగిన దేశ - కాలములు ప్రాప్తించి నప్పుడు బహిర్గతం అవుతోంది. బంగారం కరగించినప్పుడు ద్రవమగుచున్నది. అంతకుముందు ద్రవత్వము ఎక్కడ దాగివుంటోంది? బంగారమునందే కదా!

అట్లాగే సూక్ష్మమగు "పరమచైతన్యము" నందే ఈ ప్రపంచము అణిగి ఉంటోంది.

నీ కాళ్ళు - చేతులు మొదలైన అంగములు 'రాముడు' అనబడు నీకంటే వేరుకాదు కదా! ఈ జగత్తు కూడా బ్రహ్మము కంటే వేరుకాదు. కాని 'బ్రహ్మము' లేక 'పరమాత్మ' అవయవరహితము. అట్టి ఈ జగత్తునందు తోచుచున్న ఈ 'జీవాత్మ' కూడా 'పరమాత్మ' కంటే వేరైనది కాదు. కనుక

'జీవాత్మ' కూడా వాస్తవానికి ప్రజ్ఞామాత్రము, అవయవరహితము అయివున్నది. ఇక ఈ జగత్తు విషయం ఏమిటంటావా? ఒక దృష్టాంతము చెపుతాను. విను.

ఒకడు ఒక పెద్ద స్వప్నమును గాంచుచున్నాడు. అందులో తాను గొప్ప చక్రవర్తి అయి శత్రురాజులతో భీకరంగా యుద్ధం చేస్తున్నాడు ..... అప్పటికి ఆ విషయం అతనికి సత్యముగానే తోచుచుండును కదా! ఇతరులకో? అదంతా మిథ్యమాత్రమే. ఇంతలోనే, అతడు తటాలున కనులు తెరచి, తన ప్రక్కన పరుండినవానితో "ఏమయ్యా? ఆ శత్రురాజు నన్ను అంతగా హింసిస్తుంటే నీవు వచ్చి సహాయపడవచ్చును కదా? నేను నీకు ఇదివరలో ఎన్నిసార్లు ఎన్ని సహాయాలు చేయలేదు చెప్పు?" అని ప్రశ్నించాడట.

ఇది ఎంత హాస్యాస్పదం! ఆ స్వప్నం దర్శిస్తూ మధ్యలో నిదురలేచి కనులు తెరచిన వాని ప్రశ్నకు అర్థమేమున్నది? అతని స్వప్నము అతని మిత్రునకు అనుభవం అవదు కదా!

ఈ జగత్తు మాయా దృష్టికి పరమనిర్దుష్టమైన సత్యముగాను, విశుద్ధదృష్టికి మొదలే అసత్యమైన దానివలె తోచుచున్నది. వాస్తవానికి ఈ 'జగత్తు' అను పేరుతో చెప్పబడుచున్నదంతా సృష్టికాలమందు ప్రళయకాలమందు ... మధ్యకాలమందు కూడా పరమాత్మయందే సత్ (that which exists) + అసత్ (that which does not have existence as such) రూపమున వెలయుచున్నది. ఇదంతా "స్మృతి-జ్ఞప్తు"ల (Remembrance and Knowledge retained) నుండి మాత్రమే ఇట్లు అనుభవ మగుచున్నది. అంటే,... ఈ 'జగత్తు' యందు సంస్కార రూపమగు సత్త మాత్రమే సంచరిస్తోంది. ద్రష్ట కనుక సంస్కారమును త్యజించటం జరిగితే, ఈ 'జగత్తు' అనబడునది లేనట్లే. అనగా ఏమిటి? ఒకడు తన పూర్వ స్మృతి-జ్ఞప్తులను అనుసరించి సంస్కారపూర్వకంగా దేనిని ఎట్లు దర్శించుతాడో, అది అట్లే ప్రాప్తిస్తోంది. అందుచేతనే, ఒకే 'సంఘటన' లేక 'విషయము' (లేక 'వ్యక్తి' లేక 'వస్తువు') ఒకనికి సుందరంగా తోచుచుండగా, మరొకనికి అందవిహీనంగా ఉంటోంది. ఒకినికి ప్రియంగా, మరొకనికి అయిష్టంగా, ఒకనికి అనుకూలంగా, మరొకనికి ప్రతికూలంగా, ఒకనికి రాగభరితంగా, మరొకరికి ద్వేషయుక్తంగా ... ఇట్లు రకరకములుగా ప్రాప్తిస్తోంది. అంతేగాని ఈ జగత్తులో, ఏ విషయమైనాసరే, .... "ఇది ఇట్లే ఉంటుంది. ఇది ఇట్లు పరిమితము" అని మనం పరిధులు కల్పించి, నిర్వచించలేము. అందుచేతనే ఇది "అనిర్వచనీయము" అని అంటున్నాం.

**శ్రీరాముడు :** స్వామి! మీరు ఇప్పుడు మహోన్నతమైన విషయమునే ప్రతిపాదించారు. అయితే ఇక్కడ నాది మరొక సందేహం. లీలోపాఖ్యానంలోని విదూరథుని వంశపరంపర అక్కడ మంత్రులకు, పౌరులకు ఒకే తీరుగా కనిపించింది. 'విదూరథుడు' అనువాడు పుట్టటం, పెరగటం మొదలైనవన్నీ ఒకానొక జీవుని స్వప్న మాత్రమై ఉన్నది కదా! ఇదంతా ఒకరికి – మరొకరికి ఎట్లా పొసగుతోంది? ఒకరు చూస్తున్నదే మరొకరు ఎట్లా చూస్తున్నారు? ఒకని స్వప్నములోనిది మరొకరికి కనబడగూడదు కదా! ఈ జగత్తులో అనేకులకు ఒక విషయం ఒకే తీరుగా కనిపించటం ఎట్లా జరుగుతోంది? ఉదాహరణకు, "ఇది గోడ. ఇది ఇల్లు. ఇతడు మానవుడు. ఇది జంతువు" అని నేను ఎట్లా

చూస్తున్నానో, మీకు కూడా అట్లాగే కనిపిస్తోంది కదా? ఒకని మరణం అనేకమంది బంధువులకు దుఃఖకారణమౌతుంది. ఇవన్నీ ఎట్లా సంభవిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** (1) ముఖ్య సంస్కారం (2) సహకారి సంస్కారములు.

ఒక చిన్న 'వాయురేఖ' విశాలమగు వాయువీచికను అనుసరించే పయనిస్తుంది కదా! ఈ "చిత్తము" యొక్క ముఖ్య సంస్కారమును అనుసరించే మిగతా జ్ఞానమంతా ఉండటం జరుగుతోంది. అందుచేతనే, పౌరులకు, మంత్రులకు కూడా పరంపరాక్రమమంతా ఒకే రీతిగా కనిపిస్తోంది. "ఇతడు మా రాజు, ఈ కులము నందు జన్మించిన ఇతడు ఇక్కడి వంశపారపర్య వ్యవస్థను అనుసరించి మమ్ములను పాలించువాడగుచున్నాడు! మేము ఇక్కడి పురవాసులము" అను స్వకల్పిత స్వప్నభావనను ఇక్కడి అనేకులు పొందుచున్నారు. ఆ అందరి వాస్తవ స్వరూపము 'సంవిత్తే' కదా! ఒకే వాయువు అనేక వీచికలగుచున్నట్లు, ఒకే జలము అనేక కెరటములగుచున్నట్లు, ఒకే సంవిత్తు ఆయా ప్రజలందరి రూపము దాల్చుచున్నది సుమా!

అయితే ఇక్కడ ఒక విచిత్రం. విదూరథుడు–రాజు–రాజ్యము–మంత్రులు–ప్రజలు .... ఇవన్నీ కూడా ఆరోపితవిషయాలే కదా! 'సంవిత్తు' ఈ విధంగా ఆరోపిత విషయాలలో 'ఇది వాస్తవమే' అని భావన (లేక) అనుభవం ఎందుకు పొందుతోంది? ...... అనేది ఒక ప్రశ్న. 'ఎందుకు'? అను ప్రశ్నకు మా వద్ద సమాధానం లేదు. అయితే "ఆరోపిత విషయములను స్వీకరించుట" అనునది సంవిత్తు యొక్క స్వభావమే అయివున్నదని మాత్రం చెప్పబడుతోంది. "ఇది ఆరోపిత విషయము – ఇది వాస్తవము" .... అని గ్రహించినప్పుడు ఆ సంవిత్తు తన వాస్తవస్వరూప – స్వభావానుభవం పొందటం మాత్రం జరుగగలదు. మణి ఇచ్ఛారహితంగానే తన కాంతి పుంజములను ఎదురుగా ఉన్న వస్తువులపై వెదజల్లుచున్నట్లు, సంవిత్తు సంకల్ప–వికల్పాదులను కలిగి ఉంటోంది. ఒకడు ఒకచోట ఒక త్రాడును చూచాడు. 'పాము' అని అనుకొన్నాడు. సర్వ వికారములు పొందుచున్నాడు. ఇప్పుడు అతనికి, "అది పాము కాదు. త్రాడే" అని తెలియటం ముఖ్యం. వెనువెంటనే వికారాలన్నీ పోతాయి. అతడు ప్రశాంతమగు స్వస్థితిని మరల సంతరించుకుంటాడు. సత్యవిషయము ప్రతిపాదించుటను వదలిపెట్టి, తదితర చర్చలు ఎంత చేస్తే ఏం ప్రయోజనం?

❖

'చింతామణి' ఏది కోరితే అది ఇస్తుంది చూచావా? అదేవిధంగా విదూరథుని జీవ చైతన్యము కూడా, "నేను ఈ వంశమున ఈ తీరుగా జన్మించెదను గాక" అనునట్టి అంతర్గత వాసనాబలం కలిగియుండటంచే అట్లే జన్మించటం జరిగింది. "చిత్పదార్థము సర్వగామి (All pervading). ఈ "జీవుడు" అని మనచే పిలవబడుచున్నవాడి వాస్తవస్వరూపము చిత్పదార్థమే కదా! అందుచేత, 'జీవచైతన్యము' నందు ఏమేమి అధ్యస్థమై ఉంటున్నాయో అవన్నీ సృష్టి సమయంలో పరస్పరం సంబంధితములై ప్రాప్తిస్తున్నాయి. వాసనా ప్రభావంచే ఏర్పడే అనుభవజ్ఞానమునకు జీవచైతన్యమే ఉనికి – స్థానము అగుచున్నది.




ఒక గ్రామమునకు ఎల్లలు
కల్పనయే అయినట్లే, ఈ
'జీవుడు' అనబడే తత్త్వము
యొక్క పరిధులు భ్రమతో
కూడుకొన్న 'కల్పన' మాత్రమే.

ప్రతి జీవుని యందు ఒకానొక బ్రహ్మాకార స్వభావం వెలయుచున్నది. అది విషయ దోషములచే ఏమాత్రం స్పర్శించబడకుండా సాక్షీభూతమై ఉండియున్నది. గదిలోని దీపమునకు, ఆ వెలుగులో జరుగు సంఘటనలకు సంబంధములేనట్లు అది దేనికీ సంబంధించకుండా ఉండి ఉంటోంది. "ఒక బాలుడు దీపపు వెలుగులో పఠించు చున్నాడు" అను విషయమే తీసుకొందాం. దీపపు వెలుగు అతని చేత చదివించు చున్నదా? లేదు. కాని వెలుగులేకపోతే చదవటం జరిగేది కాదు. బ్రహ్మాకార తత్త్వము కూడా అట్లే .... "సర్వమునకు కారణమై, కాని ఎట్టి 'కర్తృత్వము' అనునది లేకనే" .... ఉండి ఉంటోంది. అది 'విదేహముక్తి' వరకు ఉండి, అటుపై బ్రహ్మమున విలీనమగు చున్నది. అయితే బ్రహ్మమునకు వేరైనది ఏ క్షణంలో కూడా, ఎక్కడా ఏదీ లేదు సుమా! ఆ బ్రహ్మాకార స్వభావం అట్లు ఉండి ఉండగానే, ఈ జీవునియందు భావనాబలము వెల్లివిరియుచున్నది. భావనాబలంచేత చిన్మయ వస్తువు ఆయా ఆకారంలో స్ఫురిస్తోంది. జీవులందరు కూడా స్వాభావికంగానే ఇట్లు స్ఫురిస్తున్నారు. అనగా, "నేను ఎక్కడ ఏ రూపమున స్ఫురిస్తున్నానో అక్కడ ఆ రూపమున నాకు ప్రాప్తిస్తున్నాను. నేను లేనిదేది నాకు ప్రాప్తించదు. అందుచేత అంతటియందు నేను విస్తరించియున్నాను" అనునది ఆత్మజ్ఞానుల అనుభవం.

❖

ఓ రామచంద్రా! ఆ విధంగా చిన్మయవస్తువు 'జగత్తు' ఆకారంగా స్ఫురించటం సహజం. పరిపాటి కూడా. అంతమాత్రం చేత సత్యజ్ఞానమునకు వచ్చే ప్రమాదమేదీ ఉండదు. మట్టి ఎన్ని ఆకారములు పొందితే ఏమున్నది? ఆ మట్టికీ, ఆకారములకు సంబంధం లేదుకదా! మట్టితో ఏనుగును చేసినంతమాత్రంచేత మట్టి ఏనుగు అవుతుందా? మట్టి ఎప్పుడు, సర్వదా మట్టిగానే ఉంటున్నట్లు, జగత్తును పొందుచున్న ఈ జీవుడు, – జీవునిచే పొందబడుచున్న జగత్తు .... ఈ రెండు చిన్మయమగు ఆత్మ స్వరూపములే. అయితే, సముద్రమువైపు పయనించే మహానది ఇతర ఉపనదులను తనయందు విలీనం చేసుకొంటుంది చూచావా? అదేవిధంగా, "మాయ – చిత్స్ఫురణ" అయినట్టి ఈ "జగత్ – స్వభావన"ను, నిత్యసత్యమై ఉండి ఉంటున్నట్టి "బ్రహ్మాకారపు జ్ఞానము" లోబరచుకొనుచున్నది. ఈ సృష్టులు, ఈ జన్మలు, ఈ జగద్వ్యవహారములు ముక్తిని నిరోధించజాలవు.

అనగా, ఇవి ఇట్లు ఉండి ఉండగానే జీవుడు "నేను సర్వదా ఆత్మ స్వరూపుడనే కదా!" అనునట్టి ముక్తస్వభావము తప్పకుండా పొందవచ్చు. వాస్తవానికి ఈ జీవుడు ముక్తస్వరూపుడేకాని, బద్ధుడుకాదు. అట్టి ముక్త స్వరూపమును మరుగునపరచి ఉంచుచున్నది .... "అజ్ఞానము - అవిచారణ"యే సుమా! అంతేకాని ఈ భౌతిక దేహముయొక్క రాకపోకలు ముక్తత్వమును భేదపరచజాలవని గ్రహించబడు గాక! జీవునకు అతని "సర్వదా సిద్ధించియున్న ముక్త స్వరూపము"ను గుర్తుచేయుట కొరకే శాస్త్రములు, శాస్త్రములచే చెప్పబడు విధి - విధానములు, నియమనిష్ఠలు, సద్గురువులు ఉండటం జరుగుతోంది.

"నేను బ్రహ్మమును. అంతేగాని ఖండ - సంకుచిత స్వరూపములగు శరీరముగాని, పరిమితాత్మ స్వరూపముగాని కాను" .... అనునదే బ్రహ్మ భావముగా చెప్పబడుచున్నది. అత్యంత దృఢంగా యత్నించువాడు ఈ జీవభావము త్యజించివైచి, విజయుడై, బ్రహ్మ భావమునందు తప్పక ప్రవేశించగలడు. ప్రతి జీవియొక్క వాస్తవస్వరూపము అపరిమితము, శుద్ధము, అప్రమేయము అగు బ్రహ్మమే కనుక, ప్రతిజీవి బ్రహ్మభావన పొందుటకు తాపత్రయపడుచూనే ఉన్నాడు. తెలిసినా, తెలియకున్నా... ప్రతిజీవి తన పూర్ణత్వమును ఎరుగుటకు, ప్రకటించుటకు .... బాహ్యజగత్తునందు, అంతరంగమునందు ఆయా ప్రయత్నములను చేస్తూనే ఉంటున్నాడు.

ఓ రామచంద్రా! ఒక పరమాణుకణము నుండి కూడా భ్రాంతిమయ జగత్తులు వెలువడు చున్నాయి. నశించుచున్నాయి. అజ్ఞానవశంచేత, ఉత్తమోత్తమమైన ఆశయం కలిగియుండకపోవుటచేత, ఈ జీవుడు అనేక మూర్ఖయత్నములను కలిగియుండి ఈ జగత్తులలో ప్రవేశిస్తున్నాడు. ఎంతగా ప్రయత్నిస్తే ఏం ప్రయోజనం? ప్రతిబింబ మాత్రమగు ఈ బాహ్యజగత్తులో లభించగలిగినదేమి? లభించకపోవటం ఏమిటి? జ్ఞానము లభించనంతవరకు అతనికి ఉత్తమశాంతి లభించటంలేదు.

❖

తుదిగాని, మొదలుగానిలేనట్టి (ఆద్యంతములు లేనట్టి), 'జన్మ' మొదలైన వికారములు గాని లేనట్టి 'చిదాకాశము' (The All-Pervading Consciousness) ఒక్కటే సర్వదా ఏకమై వెలయుచున్నది. సత్-చిత్ (Absolute Existence-Absolute Knowledge) దాని స్వరూప-స్వభావములని చెప్పబడుతోంది. ఇక, జగత్తు ఎక్కడ? బంధమెక్కడ? విముక్తి ఎవరికి? వివేక రహితమగు లేక స్వప్నతుల్యమగు బుద్ధి కలిగియున్నప్పుడు మాత్రమే "నేను బద్ధుడను, ముక్తిని పొందవలసియున్నది" అను అభిప్రాయ పరంపరలు ఏర్పడు చున్నాయి. సర్వమునకు అధిష్ఠానము (that which support & substraction of everything) బ్రహ్మమే అయివున్నది. అట్టి బ్రహ్మము మాత్రమే సత్యము. జగత్తు మిథ్యయే. ఇక బంధమేమిటి? మోక్షమేమిటి?

ఇదంతా ఒకానొక సుదీర్ఘమైన వ్యవహారము వలె, కథారచన వలె .... ఒకదాని కొకటి సంబంధించినదై ఉంటే ఉండనీ, ఏదిఏమైనా ఇది మిథ్యయే. ఒక వృక్షము ఆకులతోను, పండ్లతోను, పువ్వులతోను నిండి ఉన్నప్పటికీ అవన్నీ ఉన్నది వృక్షమునందేకదా! అనేక పళ్ళు-పూలు-కాయలు

ఉండవచ్చునుకాని, "వృక్షము మాత్రం సర్వదా ఏకమే (ఒక్కటే) అయివున్నది" అనటంలో సందేహం ఎక్కడిది? బ్రహ్మము కూడా సర్వశక్తి సంపన్నమై, నానావిధ – ఆకారములలో స్ఫురించుచున్నప్పటికీ .... అది సర్వదా "ఏకము – అఖండము – అద్వితీయము" అయివున్నది. దానియందు నానాత్వాది కల్పనలు (that - this - I - you - he - mine - your - his - now - then మొదలైన కల్పనలు) ఏ క్షణమునందు కూడా ఉండియే ఉండలేదు. అంతేకాదు. అది సర్వవ్యాపకము. అది కానిదంటూ ఏదీ లేదు. బ్రహ్మతత్త్వము గ్రహించబడినదా, ఇక మరెన్నటికీ ఎట్టి వికారములు ఉండవు.

ఆత్మకు ఉదయాస్తమయములు లేవు. అంధకారములను కూడా ప్రకాశింపచేయటం, 'ఇది అంధకారము' అని గుర్తించటం, అనుభవమును పొందటం.... ఇవన్నీ ఆత్మ వలననే జరుగుచున్నాయి. ఆత్మయే దిక్కుల రూపము. కాలరూపము కూడా అదే. అయినప్పటికీ, అది ఆదిమధ్యాంతరహితము, అద్వితీయము అయివున్నది. నీయొక్క, నాయొక్క, ఈ సర్వులయొక్క స్వస్వరూపము అట్టి 'బ్రహ్మము' లేక 'ఆత్మ'యే కాని, మరింకేదీ కానే కాదు. అది సర్వదా సౌమ్యముగా మృదుతరంగములతో కూడిన సముద్రమువలె వెలయుచున్నది. ఓ రాఘవా! వాస్తవానికి ఈ 'నీవు–నేను' .... అను భావములే మూలముగా కలిగియుండి కనబడుచున్న ఈ జగత్తు వాస్తవమైనది కాదు. ఇదంతా .... ద్వైత – ఐక్య – సంకల్ప – వికల్ప .... రూపకమైనట్టి "మనస్సు" నుండే ప్రతిభాసించుచున్నట్లు అగుపించుచున్నది. ఆకాశము శూన్యమే అయినప్పటికీ, అందు భ్రాంతిచేత నీలత్వము, ముత్యములు మొదలైనవి గోచరిస్తున్నాయి చూచావా? ఈ జగత్తు కూడా బ్రహ్మమునందు భ్రమాత్మకమైన దృష్టి కారణంగా గోచరిస్తోంది. భ్రమ అజ్ఞానముచేత ఏర్పడుచున్నది. 'అజ్ఞానము' అంటే ఏమిటి? జ్ఞానరాహిత్యమే సుమా! 'చీకటి' అనగా వెలుగు లేకపోవటం మాత్రమేకాని మరింకేమీ కాదు.

❖❖❖

## 2. జగత్స్వభావం

**శ్రీరాముడు :** హే బ్రహ్మజ్ఞా! సాధూ! ఈ "నేను–జగత్తు" అనునవి భ్రాంతి మాత్రములని మీ వాక్యానుసారం గ్రహిస్తున్నాను. అయితే ఈ భ్రాంతి ఏ కారణంచేత ఏర్పడుచున్నది? ఏ కారణము లేకుంటే, అవి ఎట్లా ప్రభవిస్తున్నాయి? వాటి స్వరూప–స్వభావాలు ఏమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! నీ ప్రశ్న బాగానే ఉన్నదయ్యా! ఉత్తమము, నిర్మలము, సుతీక్ష్ణము అయినట్టి బుద్ధిచే ఈ క్రింది ప్రశ్నలను ముందుగా పరిశీలించు.

1. నేను ఎవరు?
2. ఈ చిత్తమేమిటి?
3. ఈ జగత్తును నేను ఎట్లా పొందియున్నాను?
4. దీనియందు నాచే అనుభవించబడుచున్న ఆయా పదార్థములతోటి, వ్యక్తులతోటి ఏర్పడుచున్న సంబంధ – బాంధవ్యములు సత్యములా? కల్పితములా?

5. ఒకవేళ కల్పితములైతే, అవి కల్పించుచున్నది నేనేనా? లేక, బాహ్యమున ఎక్కడో ఉన్నట్టి మరెవరోనా?
6. బాహ్యమున ఉన్నట్టి ఎవరో ఈ కల్పనలకు కారణమైయుంటే, అతడు ఎట్లు ఏ ప్రయోజనము కోరి చేస్తున్నాడు?
7. ఈ ప్రశ్నలకు 'ఉపనిషత్తులు' మొదలైన శాస్త్రములు ఇస్తున్న సమాధానమేమిటి? ఈ విషయమై అనుభవజ్ఞులగు ఆత్మజ్ఞానులు ఏమంటున్నారు?
8. బుద్ధి దోషరహితం అయితేకానీ ఉత్తమజ్ఞానం వికసించదు. మరి స్వబుద్ధిని సుతీక్ష్ణం నిర్మలం చేయాలంటే అనుసరించవలసిన మార్గములేమిటి?

ఈ ప్రశ్నలను పరిశీలించటం, ఉత్తమ ప్రయత్నములను ఆశ్రయించటం చేయుచుండగా ఈ జీవుడు "విదితవేత్త" (తెలుసుకొనవలసినది తెలుసుకొనినవాడు) అగుచున్నాడు. అప్పుడాతడు, "ఆహాఁ! నేను చైతన్యమే స్వరూపముగా కలిగియున్నాను. ఈ భ్రాంతి అంతా చైతన్యము నందు అంతర్గతమైయున్నది. చైతన్యమునకు బాహ్యమున, దానికంటే వేరుగా ఏ పదార్థము ఎక్కడా ఉండకయే ఉన్నది. నేను కానిదేదీ నా ముందు ప్రాప్తించటం లేదు" అని గ్రహించుచున్నాడు. అట్టివాడు తనను తాను సర్వజీవుల యొక్క అంతర్యామిగా, నిష్క్రియుడుగా, నిస్సంగుడుగా దర్శిస్తున్నాడు.

అయితే రామచంద్రా! ప్రయత్నశీలుడు మాత్రమే 'విదితవేద్యుడు' అగుచున్నాడు. ఉత్తమ ఆశయముతో ప్రయత్నించనట్టి 'అప్రయత్నశీలుడు' .... ఉత్తమభావనను పొందలేక పోవుచున్నాడు. అతడు ఈ భ్రమాత్మకమైన సంసారంలో నిష్ప్రయోజనంగా పైకి – కిందికి సంచరిస్తూనే ఉంటున్నాడు.

❖

సర్వాత్మకము (సర్వులయొక్క ఆత్మస్వరూపమైయున్నది), జన్మరహితము అయినట్టి బ్రహ్మము ఒక్కటే త్రికాలములందు సత్యము. ఇక ఈ అసత్యములైనట్టి 'నీవు – నేను – జగత్తు' మొదలైనవన్నీ భ్రమ కారణంగానే ప్రవర్తిస్తున్నాయి. అట్టి సత్యమును అధికారులగు జనులు (Those who have become competent to receive this knowledge by cultivating dispassion & discrimination) గ్రహించటం కొరకే, నిన్ను–నన్ను నిమిత్తంగా చేసుకొని, ఈ 'వాసిష్ఠ రామాయణము' అను గ్రంథమును సర్వతత్త్వస్వరూపుడగు పరమాత్మ వారిముందు ఉంచుచున్నాడు.

❖

**అవయవములకన్నా వేరైన 'అవయవి'**

ఈ జగత్తులో జనులకు అనుభవమయ్యే పదార్థములన్నీ "పంచేంద్రియములచే గ్రహించబడు చున్నవి" మాత్రమే కదా! అట్లు ఇంద్రియములకు అనుభవమగుచున్న పదార్థములన్నిటికీ వాస్తవానికి శాశ్వతమైన రూపమంటూ ఏదీ లేదు. "ఇవన్నీ బ్రహ్మమునందే. బ్రహ్మముగానే వెలయుచున్నాయి" అని బ్రహ్మజ్ఞులు చెప్పుచున్నారు. ఆభరణము బంగారము నుండి వేరా? 'తరంగము' అనబడునది నీరు కాకుండా వేరుగా ఇంకేదన్నా అయివున్నదా? ఈ జగత్తు కూడా ఈశ్వరునకు వేరైనది కాదు.

ఈ అభిప్రాయం అనేకమంది జ్ఞానులచే, శ్రుతిస్మృతులచే నిర్ద్వంద్వంగా ప్రకటించబడింది. ఈశ్వరుడే జగత్తు రూపమున స్ఫురించుచున్నాడు.

కాని ఈ జగద్రూపము ఈశ్వరునియందు లేదు సుమా! దృష్టాంతము సువర్ణాభరణమే. బంగారమే ఆభరణంగా ప్రాప్తిస్తోంది. అయితే 'బంగారము తన స్వరూప-స్వభావములు కోల్పోయి ఆభరణముగా మారినది" అనునది సమంజసము కాదు కదా! బంగారము బంగారముగానే ఉంటోంది. ఒకానొక ఆకారమునకు "గొలుసు-గాజు" మొదలైన ఆభరణనామము మనం ఇస్తున్నాం.

మరొక దృష్టాంతము. ఈ 'శరీరి'ని తీసుకో. ఈ అవయవి (అవయవములు కలిగియున్నవాడు. The Experiencer cum operator of the body) సర్వ అవయవాత్మకుడై .... చెవులందు వినటం, కళ్ళయందు చూడటం, చర్మమునందు స్పర్శ అనుభవించటం ... మొదలైన క్రియలన్నిటికీ 'కర్త' అయి ఉంటున్నాడు. అంతమాత్రంచేత అతడు "చూపు – వినికిడి – స్పర్శ" మొదలైనవిగా మారిపోవటం లేదు కదా! అదేవిధంగా చిదాత్మ (లేక అవయవశూన్యమగు చిద్వస్తువు) కూడా సర్వాత్మకమై ఉండటంచేత నానారూపములుగా ప్రకాశించుచున్నాడు. కానీ సర్వదా యథాతథుడు.

ఈ ప్రాణుల అంతరమున ఒకానొక సమయంలో అజ్ఞానంచేత "నేను – జగత్తు" మొదలైన రూపములన్నీ ప్రకాశిస్తున్నాయి. అయితే, "సూర్యుడు-సూర్యకిరణములు" వలె అట్టి భావన కూడా బ్రహ్మము యొక్క స్వభావమే అని గ్రహించు. అంతమాత్రము చేత బ్రహ్మమునకు వచ్చేలోటేమీ ఉండదు. "అజ్ఞానమును స్వీకరించటం కూడా బ్రహ్మము యొక్క స్వభావమైయున్నది" అని గ్రహించినప్పుడే ఆ బ్రహ్మము యొక్క సర్వాత్మకత్వము అనుభవమవగలదు. ఈ 'అనేకత్వము' అను రూపముగల 'జగత్ జాడ్యము' అప్పుడు మాత్రమే తొలగుచున్నది.

ఒక స్ఫటిక శిలయందు (అట్లాగే ఒక దర్పణమునందు) ఎదురుగా ఉన్న అరణ్యం ప్రతిబింబిస్తోందనుకో .... అప్పుడు ఆ స్ఫటికంలో కనిపించే ప్రతిబింబ దృశ్యము స్ఫటికము కంటే వేరైనదా? కాదు కదా! దర్పణంలో ప్రతిబింబించే నీ ముఖము దర్పణమునకు వేరైనదని అనలేము కదా! చిన్మయుడగు పరమేశ్వరుని నుండి ఈ "అహంభావాత్మకము" అయినట్టి జగత్తు వేరైనది కాదు. కాని, వేరైనట్లు తోచుచున్నది. నీటినుండి తరంగాలు లేస్తున్నాయి. మరల ఇంతలోనే విలీనమైపోతున్నాయి. ఆ తరంగములు జలముకంటే వేరైన రూప-నామములతో ప్రాప్తించినప్పటికీ, "తరంగములు జలము కంటే వేరు" అని ఎవరనగలరు? అదేవిధంగా 'బ్రహ్మము' అను మహా సముద్రంలో "సృష్టులు" అనే తరంగాలు లేస్తున్నాయి. మరల లీనమై పోతున్నాయి. కాని ఆ సృష్టులన్నీ బ్రహ్మముకంటే వేరేమీకాదు.

ఓ రఘుకుల తిలకమా! రామచంద్రా! వాస్తవానికి పరబ్రహ్మము పదార్థరహితము. సృష్టియందు పరబ్రహ్మము లేదు. పరబ్రహ్మమునందు సృష్టియు లేదు. ఎందుకంటావా? పరబ్రహ్మ దృష్టితో దర్శిస్తే ఇక్కడ 'సృష్టి' అనబడునదే తోచదు. 'సృష్టి' అనబడు భేదదృష్టికి 'పరబ్రహ్మము' అనబడు అఖండ-అప్రమేయ- అద్వితీయ తత్త్వము యొక్క అనుభవము లభించుచున్నది. దర్పణంలోని

ప్రతిబింబము వలె ఈ సృష్టి 'మాయా ప్రతిభాస' మాత్రమే. జ్ఞానులగువారికి 'బ్రహ్మసత్త' మాత్రమే ఇక్కడ లభిస్తోంది. అజ్ఞానులకే ఈ నీవు-నేను-జగత్తు అనబడు వివిధత్వమంతా తోచుచున్నది. చిత్ నందు ప్రతిఫలిస్తున్న 'విషయజ్ఞానము' కారణంచేత చిన్మయపరబ్రహ్మమే జగత్తుగా గాంచబడుచున్నది. కల్పన చేస్తున్నది .... కల్పనగా గాంచబడుచున్నది కూడా చిన్మయ బ్రహ్మమే సుమా!

అట్టి కల్పన యొక్క ఆరంభమున ... "కారణ-కారణము" (కారణముల కెల్ల కారణము) అయినట్టి బ్రహ్మమున అంతవరకు లీనమైయున్న శబ్దతన్మాత్ర ఆకాశరూపమును ధరించుచున్నది. అట్టి ఆకాశరూపమగు బ్రహ్మము ఆ తరువాత స్పర్శతన్మాత్రతో గూడి వాయుత్వము అనుభవిస్తోంది. అట్లు వాయురూపము ధరించిన బ్రహ్మమే తేజః ప్రకాశమువలె రూపతన్మాత్రతో గూడి తేజోమయత్వము పొందుతోంది. అట్లు తేజోరూపము పొందిన బ్రహ్మమే రస తన్మాత్రతో గూడి జలత్వము పొందుచున్నది. ఈ జలరూపాభిమానియగు బ్రహ్మము 'గంధ తన్మాత్ర'తో గూడి తన చిత్తముతో పృథ్వి భావము పొందుతోంది. ఇట్లు జగత్తు చిన్మయాకారముననే ప్రకాశించుచున్నది. ఈ క్రమము ప్రకాశించటం - ఇదంతా నిమిషములో లక్షవ భాగ సమయంలో జరిగిపోతోంది. ఇదే కోటి కల్పముల వరకు వెలయుచున్న సృష్టి. కాని, 'బ్రహ్మము' అన్ని సమయములందు మార్పు చేర్పులు లేకయే ఉంటోంది. అయ్యది "విశుద్ధము, నిత్యప్రకాశము, సృష్టి-ప్రళయములకు కూడా స్థానము, ఉదయాస్తమయరహితము, ఎట్టి ఆధారము లేకయే ఉంటున్నది" అయివుంటోంది. అయ్యది నిర్లిప్తంగా, నిష్కళంకంగా, నిర్లేపంగా సర్వదా స్వమహిమ యందే వెలయుచున్నదని గ్రహించు.

❖

'పరమార్థసత్త' యందు సృష్టి-ప్రళయములు ఉంటున్నప్పటికీ, అందు ఏర్పడుచున్న 'వైషమ్యం' అంటూ ఏదీ లేదు. ఈ జీవుడు అజ్ఞానముచే కప్పబడియున్నప్పుడు అనేక భేదములు పొందుచున్నట్లు కనిపించినప్పటికీ అతని వాస్తవస్వభావమగు ఆత్మ యొక్క అఖండత్వమునకు ప్రమాదమేమీ ఏర్పడటంలేదు. అదే జీవుని బుద్ధి ప్రబుద్ధమైనప్పుడు "మనస్సు-దృశ్యము" మొదలైనవి ఇట్లు ఉండగానే అతడు ముక్తి స్వభావము పొందుచున్నాడు. ముక్తి స్వభావముచే అంతరంగమున ప్రశాంతబుద్ధిని పొంది బాహ్యమునకు యథాతథముగా వ్యవహరిస్తున్నాడు.

ఎవరు ఎట్లు తమ అంతరమున బ్రహ్మ వస్తువును గ్రహిస్తారో అది అప్పుడు వారిపట్ల అట్లే ప్రతిఫలిస్తూ ఉంటుంది. అదియే 'మాయాశక్తి విలాసము' అని చెప్పబడుతోంది. అట్టి పరిణామము గ్రహించినట్టి సత్యద్రష్టలగు మేము "ఈ జగత్తు బ్రహ్మముయొక్క విలాసమే కాని, మరింకేమీ కాదు" అని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాం. తపస్సు, ధ్యానము, విచారణల మొదలగువాటిచే మేము ఈ విషయం గ్రహించిన తరువాతనే ఈ విషయం చెప్పుచున్నాం. "ఈ మనస్సు ఇంద్రియములతో కూడినదై బహిర్వృత్తులను పొందుచున్నది. తత్ఫలితంగా చూచేది, వినేది, అనుభవించేది ... అంతా కేవలం నామరూపాత్మకమైన స్వకీయ కల్పనయే" అని మేము గుర్తించుచున్నాము. కాబట్టి ఇవి భేద దృష్టి దృష్ట్యా సత్యమే అవుతాయి కాని, వాస్తవము కాదు.

❖

వాయువు చలించనప్పుడు దాని ఉనికిని మనం గ్రహించము. చలించునప్పుడు మాత్రమే దాని స్పర్శను అనుభవిస్తున్నాం. చలనము లేనప్పుడు గాలి లేనట్లే అనిపిస్తుంది. కాని, అది లేని సమయమెప్పుడో చెప్పు? 'అజ్ఞానము' ఉన్నంతవరకు "చైతన్య బ్రహ్మము" మరుగునపడి, జగత్తే కనిపిస్తోంది. అజ్ఞానం తొలగితే జగత్తు లేదు. చైతన్య బ్రహ్మమొక్కటే వాస్తవమైన సత్త కలిగియున్నది. ఆ సత్తయే "సర్వుల యొక్క - సర్వము యొక్క స్వరూప - స్వభావముల గురించి ఎరుక"గా ప్రభవిస్తోంది. ఒక్కొక్కచోట అది తన స్వస్వరూపమును ఏమరచి ఉంటోంది. మరొకచోట పూర్ణమగు స్వస్వరూపజ్ఞానముతో ప్రకాశిస్తోంది. ఆకాశం అఖండమై నిర్మలమై ఉండగా అందు కొంతభాగం నిర్మలంగాను, మరికొంతభాగం మేఘాదులచే కప్పబడి ఉంటోంది కదా! ఇది కూడా అట్టిదే. అట్టి ఎరుక యొక్క త్యాజ్య-గ్రాహ్యములనే (స్వస్వరూపము గురించిన జ్ఞానము త్యజించి ఉండుట .... గ్రహించియుండుటనే) మనం "బంధము" అని, "మోక్షము" అని వ్యవహరిస్తున్నాం.

ఒకడు "తేజము వేరు, ప్రకాశము వేరు. సూర్యుడు వేరు. కిరణములు వేరు" అనునట్టి బుద్ధితో చూడటం జరిగితే, అవి అట్లే వేరువేరుగా తోచటం జరుగుతుంది. "తేజ - ప్రకాశములు అభిన్నములు. సూర్యుడు - సూర్యకిరణములు వేరు-వేరు కావు" అనునట్టి దృష్టితో చూచినప్పుడు మాత్రం, అభిన్నత్వమే అనుభవముగా శేషించుచున్నది. "బ్రహ్మతత్త్వము" ప్రాప్తించుచున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా!

1) సృష్టికి ముందు 'బ్రహ్మము' ఒక్కటే కలదు.

2) జగత్తు - బ్రహ్మము ఒక్కటే

ఈ రెండు వాక్యములు ఒకేసారి ఒనగూడగలవంటారా? ఏ విధంగా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** మట్టితో ఒకబొమ్మ తయారుచేశామనుకో ... ఆ బొమ్మ మనం తయారు చేయటానికి ముందే "మట్టి" ఉన్నది కదా! కొయ్యతో ఒక బొమ్మ లేక ఆకారము (ఏనుగు, గుఱ్ఱము మొదలైనవి) ఒక కమ్మరి శిల్పి మలచినాడనుకో .... ఆ ఆటబొమ్మ ఆకారమునకు ముందే 'కొయ్య' ఉండి ఉన్నది కదా! మట్టిబొమ్మగా మలచబడినప్పుడు, కొయ్య బొమ్మగా తయారు చేయబడినప్పుడు .... మట్టి-మట్టిగానే, కొయ్య-కొయ్యగానే ఉండి ఉంటున్నాయి. అట్లే ఆ మట్టి బొమ్మ ముక్కలైనప్పుడు కూడా మట్టిమట్టే కదా! ఈ "జగత్తు" అనబడునది కూడా, (బొమ్మ ఆకారము మట్టితో ఉండియే ఉన్నట్లు), బ్రహ్మమునందు అవ్యక్తమై ఉండి ఉంటున్నది. వ్యక్తమగుట జరిగినప్పుడు కూడా, (జగత్తు ప్రాప్తిస్తున్నప్పుడు కూడా) ఇదంతా బ్రహ్మము కంటే ఏమాత్రం వేరైనది కాదు. అయితే సాంసారికదృష్టి గలవానికి మాత్రం "పరబ్రహ్మము" అనబడే ఒకానొక సువిశాల ఎడారిలో నీటిచెలమల వలె లభిస్తున్న ఈ జగత్తులు ఎండమావులవలె అసత్యములే అయినప్పటికీ "సత్యమేనా?" అన్నట్లుగా భ్రమింపచేస్తున్నాయి. విచిత్రం ఏమిటంటే, "చిన్మయ బ్రహ్మము" .... భ్రాంతి వలన జీవరూపమును గ్రహించి, 'సృష్టి-క్రమము' అనుదానికి లోబడు చున్నది. ఇక్కడ ప్రాప్తిస్తున్న జగత్ చమత్కారమంతా అదియే కారణంగా కలిగియున్నది.

పాలలో 'తీపి' ఉన్నది. మిరియపు గింజలలో 'కారము' ఉంటోంది. నీటియందు ద్రవత్వం ఉంటోంది. గాలియందు కదలికలు ఉన్నాయి. అవన్నీ ఆ పదార్థములకు వేరైనదానివలె పదప్రయోగం దృష్ట్యా చెప్పబడుచున్నప్పటికీ .... ఒకదాని నుండి మరొకటి వేరు కాదు. వాటికి భిన్న-భిన్నమైన సత్త ఎక్కడ ఉన్నది? "బ్రహ్మసత్త దృశ్యము వంటిది కాదు. సృష్టికి వేరుగా బ్రహ్మమనునది ఎక్కడో లేదు. ద్రష్టయొక్క సత్తకు వేరుగా 'బ్రహ్మము' అనబడునదేదీ లేదు. అందుచేత 'జగత్తు' అనబడునది "మిథ్య" అనియే సిద్ధాంతీకరించబడుచున్నది.

❖

ఎట్టి కారణం లేకుం.డానే బ్రహ్మము జగత్తు రూపమున ప్రకాశించుచున్నది. అట్టి ప్రకాశము బ్రహ్మముకంటే వేరేమీ కాదు. "వాసనలు-చిత్తము-జీవులు" ... అనబడునవన్నీ మనస్సునుండే ఉత్పన్నమౌతున్నాయి. ఉన్నదంతా మనస్సులోనే ఉన్నది. మనస్సు కానట్టి జగత్తే లేదు. ఇక మనస్సుయొక్క రూపమేమిటి? మననమే కదా! అనగా .... బ్రహ్మసంవిత్తే తన మనన శక్తిని ఉత్తేజితం చేసి 'జగత్తు-జీవుడు' అను జాడ్యమును స్వయముగా అనుభవించుచున్నది. "జ్ఞాన యోగము" వలన, "దృఢాభ్యాసం" వలన, "పురుషప్రయత్నం" వలన, ఈ మనస్సు లయించి పోయినప్పుడు, అట్టివాని దృష్టిలో ఈ జగత్తు "లేనిదే" అగుచున్నది.

ఓ రఘురామా! బ్రహ్మము సర్వాత్మకమై, శాంతమై, అజమై, చిన్మయమై, నిత్యప్రకాశకమై ఉన్నది. దానికి జనన-మరణములనునవే లేవు. అది చిద్ఘనము అయివున్నది. ఇక ఈ సృష్టి పరంపరాప్రాప్తి అంటావా.... ఇదంతా నిజానికి పరమాణు సమూహ రూపమున సంకల్పానుసారంగా ప్రతిభాసిస్తోంది. భ్రాంతి-చిత్తము యొక్క సహాయం చేతనే కలుగుచున్నది కాని, అందుకు వేరెవరో కారణం కాదు. అసలు పరమాణువులేమి? ఆ పరమాణువునందు సృష్టి ఉండటం ఏమిటి? ఈ కనబడుచున్న - అనుభవమగుచున్న "సుఖ-దుఃఖ-రాగ-ద్వేషము"లతో కూడిన జగత్తు మిథ్య మాత్రమే .... అనటంలో సందేహం లేదు. (లేక) స్వకీయకల్పిత భావనావైచిత్ర్యమే!

❖

నీటియందు అలలు వెలువడుచు, ఇంతలోనే అణిగిపోతున్నాయి చూచావా? ఈ జీవుని యందు కూడా జాగ్రత్-స్వప్న-సుషుప్తి అవస్థలు ఏర్పడుచున్నాయి. తొలగుచున్నాయి. అట్లే ఈ శరీరాదులు ఏర్పడుచున్నాయి, తొలగిపోవుచున్నాయి. "ఈ శరీరములు, భావనలు, సంకల్పములు ఎందులేచి విలీనమైపోతున్నాయో అట్టి తత్వమే 'స్వస్వరూపము' అనబడునది" అని విజ్ఞులు నిర్వచించు చున్నారు. ఈ జీవుడు తన స్వస్వరూపము గ్రహించలేకపోవుటచేతనే స్వస్థత పొందలేకపోతున్నాడు. అతనికి ఒకింత భోగముల యెడ విరాగము కలిగిందా అంతమాత్రం చేతనే అతడు ఉత్తమమగు పదము పొందగలుగుచున్నాడు. సంపూర్ణంగా విరాగము కలిగినదా ... ఇక 'జీవన్ముక్తి'కే తగినవాడగు చున్నాడు. "నేను-దేహము" అను రూపముగల దేహాత్మబుద్ధి కలిగియున్నవానియందు మాత్రమే "రాగములు-భోగములు" మొదలైనవన్నీ ప్రదర్శితములు అవుచున్నాయి. 'దేహాత్మబుద్ధి' లేనివానికి జనన మరణములే లేవు. ఆ అనుభవములన్నీ అతని దృష్టిలో స్వప్నసంఘటనవంటివే.

"ఈశ్వరచైతన్యము – జీవుని చైతన్యము" ... ఈ రెండూ కూడా కారణము–కార్యము–ఉపాధి (cause - effect - adjunct) లేనివేనని గ్రహించెదవు గాక! వాటి అభేదమును, ఐక్యత్వమును గ్రహించిన వారే ఈ సంసారమును జయిస్తున్నారు. ముక్తికి అర్హులు అగుచున్నారు. ఈ బాహ్య దృశ్యబంధము నుండి విముక్తులై తరిస్తున్నారు. నీటినుండి తరంగములన్నీ వేరుకానట్లు, తరంగములన్నీ జలమే అయివున్నట్లు, జీవచైతన్యము ఈశ్వర చైతన్యము నుండి వేరు కానేకాదు. ఈశ్వర చైతన్యము అద్వితీయమై స్వయంప్రకాశరూపమై (Self effulgent or luminous) వర్ధిల్లుచున్నది. ఆ ఈశ్వరచైతన్యమే ఒకానొకప్పుడు, – ఆకాశము మేఘముల ఆచ్ఛాధన పొందుచున్నట్లు,– 'అహంభావము' అను ఆచ్ఛాదన పొందుచున్నది. అప్పుడది జగద్భావనను ధరించటం జరుగుతోంది. అట్లు అహంకారాచ్ఛాదముతో జగద్భావనను పొందుచున్న ఈశ్వర చైతన్యమే ఈజగత్తు. ఈశ్వర చైతన్యాత్మకమై (లేక ఈశ్వరచైతన్యమే అంతఃతత్త్వముగా గల) 'జగత్తు' అని చెప్పబడే ఇది 'సత్తు' కాదు. ఇదంతా అసత్తు కూడా కాదు.

చైతన్య స్వరూపుడగుచు, బాహ్యమున అహంభావముతో ప్రకటితం అయ్యేది బ్రహ్మమే సుమా! ఆ బ్రహ్మము యొక్క భావనయే సంకల్ప భేదానుసారంగా విశ్వమును ప్రకాశింపచేస్తోంది. అట్టి 'అహం' యొక్క స్వరూపము బ్రహ్మమే. ("అహం బ్రహ్మోస్మి" .... ఋగ్వేదం)

ఓ రాఘవా! ఈ జగత్తుగా బాహ్యమున దృఢమై అనుభవమగుచున్నదంతా జ్ఞానదృష్టిచే దర్శించినప్పుడు క్షణంలో స్వస్వరూప సత్త యందు లయిస్తోంది. స్వస్వరూపంగా సందర్శించబడుతోంది.

❖❖❖

# 3. "దైవము" - అర్థము

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఒక పరమాణువును లక్ష భాగములుగా విభజించామనుకో .... అట్లాగే ఒక నిమిషకాలమును కూడా లక్ష భాగములుగా చేసినా మనుకో ... అప్పుడు ఆ లక్షవభాగమైన కాలము నందు వేలకొలది జగత్తులు, వేలకొలది కల్పములు ("కల్పన" యొక్క చమత్కారం చేత) సత్యమువలె ప్రతిభాసించగలవు సుమా! మరల అట్లు ప్రతిభాసించు ప్రతి జగత్తులోని ప్రత్యేక పరమాణువునందు ఇట్టివేయగు అనేక జగత్తులు అనుభవమునకు లభిస్తున్నాయి. అందుకే ఈ "జగత్తు" అనబడునదంతా "అంతులేని భ్రాంతి మాత్రమే" అని చెప్పబడుతోంది.

నీటియందు సుడిగుండములు లేదా ఆవర్తములు (circles) స్పష్టంగానే కనిపిస్తున్నాయి కదా! ఈ భూత–వర్తమాన–భవిష్యత్ సృష్టులు కూడా స్పష్టంగా స్థిరంగా ఉన్నట్లే కనిపిస్తున్నాయి. అయితే నీకు ఆ సుడిలో కనిపిస్తున్న నీరు ఏ క్షణంలో అయినా స్థిరంగా ఉంటోందా? అసలు అక్కడ నీరు కాకుండా వేరుగా 'సుడి' అనబడునది ఎక్కడ ఉన్నది?

ఎడారిలో కనబడే ఎండమావుల రూపమైనట్టి నదీతరంగములు, ఆ తరంగములలో "పెద్ద–చిన్న– పొడవు–వెడల్పు" కెరటముల వ్యత్యాసములు వాస్తవమా?

బ్రహ్మమునందు స్వకీయ అజ్ఞానముచే కనిపిస్తున్న ఈ సృష్టి పరంపరలన్నీ కూడా 'మిథ్య' మాత్రమే! స్వప్నంలోను, ఇంద్రజాలంలోను కనబడుచున్న ఆయా పదార్థములు, సంఘటనలు అప్పటికి వాస్తవమనే అనిపిస్తున్నాయి కదా! ఈ జగత్తులోని పదార్థములు, సృష్టులు మిథ్యా రూపమునే కలిగి ఉండి, కేవలం సంకల్పబలంచేత మాత్రమే అనుభవ యోగ్యములౌతున్నాయి. ఇప్పటికిప్పుడు ఇదంతా "సత్యమే"... అని అనిపించటం అట్టిదే!

**శ్రీరాముడు :** ఓ తత్త్వజ్ఞా! జ్ఞానులు తమ విచారణా బలం చేత "ఏకాత్మరూపకము-నిర్వికల్పము" అయినట్టి పరమాత్మ బోధ" అను స్థితిని పొందుచున్నారు కదా! ఇక అప్పుడు ఆ స్థితిలో వారికి ఈ శరీరము నిలచి ఉంటుందా? లేక 'దైవము' అనబడు దానిచే ఆక్రమించబడి ఉంటుందా? వారిపట్ల దైవము ఎట్లా వర్తించటం జరుగుతుంది?

మరొక ప్రశ్న. "అంతా 'నియతి'యే నిర్ణయిస్తోంది. మనదేమీ లేదు" అని చెప్పు 'నియతివాదం' గురించి మీ అభిప్రాయం చెప్పమని వేడుకొంటున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామా! ఒకానొక "మహానియతి" ఉన్నది. ఆ మహానియతియే ప్రాణ ప్రయోజనము కొరకు "స్పందరూపిణి" గాను, వస్తు శక్తి – ప్రయోజనం కొరకు "అవశ్యం – భావని"గాను సంకల్ప – ప్రయోజనం కొరకు "ఈశ్వర సంకల్పి" గాను అగుచున్నది. ఆ నియతి వలననే తత్త్వజ్ఞుల శరీరములు కూడా నిలచియుండటం, ఆ శరీరములు లౌకిక వ్యవహారముల కొరకు యోగ్యం అవటం జరుగుతోంది. ఆ నియతియే సృష్టి యొక్క ప్రారంభము. లేక కల్పన యొక్క ప్రారంభమే అది. కనుక కల్పారంభమందు "ఇది అగ్ని, దీని నియతి ఇట్టిది, ఇది ఊర్ధ్వమునకు జ్వలించును గాక! ఇది జలము, దీని ధర్మములు ఇవి. ఇది పల్లమునకు ప్రవహించునుగాక!" అను రూపంగా పరబ్రహ్మమునందు కల్పనా వృత్తిగా జనించుచున్నది. అట్టి ఈ మహానియతియే "మహాసత్త-మహాచిత్-మహాశక్తి-మహాదృష్టి-మహాక్రియ-మహోద్భావము-మహాస్పందము-మహాత్మరూపము" ... ఇత్యాది నామరూపములతో శాస్త్రములచే ఆయా విలక్షణములను అనుసరించి వ్యవహరించబడుతోంది. అట్టి మహానియతి యొక్క బలముచేతనే బ్రహ్మదేవుడు జగత్సమూహములను గడ్డిపరకలవలె పరివర్తన మొనర్చుచున్నాడు. దానిని అనుసరించే రాక్షసులు, దేవతలు, దైత్యులు, నాగులు ... మొదలైనవారు కల్పాంతము వరకు వ్యవస్థితులై ఉండటం జరుగుతోంది.

ఓ రామా! "బ్రహ్మ సత్త" యందు జగత్తు ఉంటే ఉండవచ్చు. లేక "జగత్తు లేదు" అని చెప్పబడవచ్చు. ఏది ఏమైనా, 'నియతి' మాత్రం ఎన్నటికీ మారజాలదు. అయితే, "బ్రహ్మము, నియతి, సృష్టి" .... ఈ మూడు ఒక్కటేగాని, వేరువేరు కాదు. తత్వజ్ఞులు దీనిని ఇట్లే గాంచుచున్నారు. అజ్ఞానులకు విషయం తెలియపర్చే ఉద్దేశంతోనే ఈ నియతికి, "సృష్టి" అనే పేరు పెట్టారు. అట్టి ఈ సృష్టి ఆదిమధ్యాంత రహితమైన బ్రహ్మమునందే నిలచియున్నది.

స్ఫటికము నందు ఎదురుగా ఉన్న వనం ప్రతిబింబించుచున్నదనుకో ... అట్లు ఆ వనం స్ఫటికము యొక్క స్వచ్ఛత వలననే ప్రకాశిస్తోంది కదా! 'మాయ'తో కూడుకొని ఉన్న 'బ్రహ్మము'

స్వరూపముగా గల 'సమష్టి సృష్టి సంకల్పుడు' .... (అతడే 'బ్రహ్మదేవుడు, హిరణ్యగర్భుడు, ప్రజాపతి' అని కూడా పిలువబడుచున్నాడు) .... తనయందున్న నియతిని గ్రహించి, దానికి తగినట్లే సృష్టిని ఒనర్చుచున్నాడు. ఇది "నిద్రించేవ్యక్తి యొక్క హృదయాకాశంలో స్వప్నము లభించటం" వంటిదేసుమా! దేహి యొక్క ఈ దేహమునందు "ఇవి చేతులు, ఇవి కాళ్ళు....." ఇట్లే వేరువేరు అవయవములు వేరువేరుగా చూడబడుచున్నాయి కదా! బ్రహ్మము కూడా 'హిరణ్యగర్భ భావము' పొంది, చైతన్యబలంచేత ఈ నియతి మొదలైన వ్యవహార సరళిని గాంచుచున్నది. తద్వారా, ఈ కనబడేదంతా తననుండి వేరుకాకున్నను, వేరైనట్లు గాంచుచున్నది.

ఆ మహానియతినే 'దైవము' అనికూడా అంటున్నాము. అదియే సర్వకాలములందు, సర్వ వస్తువులందు ప్రసరించి ఉంటోంది. విశుద్ధచైతన్య స్వరూపమగు "ఈశ్వర సంకల్పము" అనగా ఆ మహానియతియే. "ఇది ఇట్లు నిర్వర్తించబడుటచే కాలాను గుణంగా ఇట్లు అవశ్యము ఏర్పడును" అను నియమమునే పెద్దలు 'దైవము'గా వర్ణిస్తున్నారు.

'పురుషకారము' (effort) అను స్పందము, సర్వక్రియలు, వృక్షములు, జంతువులు, మానవులు, రాత్రింబవళ్ళు .. ఇదంతా ఆ నియతియే. అయితే ఆ నియతికి మూలం పురుష ప్రయత్నశీలత్వమే. పురుషప్రయత్న శీలత్వము వలన నియతి, నియతి వలన పురుష ప్రయత్నశీలత్వము .... ఒకదానిపై మరొకటి ఆధారపడి ప్రళయం వరకు అట్లే నిలచి ఉంటున్నాయి. మహాప్రళయానంతరం ఈ రెండూ ఏకమైపోతున్నాయి. అనగా, అవి రెండూ స్వస్థానమగు బ్రహ్మమునందు కలిసిపోతున్నాయి.

అయితే రాఘవా! నియతి – పురుషకారము* .... ఈ రెండూ పురుష ప్రయత్నము మీదే ఆధారపడి, అనుసరించి ఉంటున్నాయని మరల ప్రకటిస్తున్నాను. ఇన్ని మాటలు దేనికి? నీవు నన్ను "దైవ–పురుషకారము"ల గురించి ప్రశ్నించటం, నేను చెప్పటం. ఇదంతా కూడా పురుష – ప్రయత్నరూపమే. "ఈ పురుష ప్రయత్న వ్యవహారము కూడా నియతియొక్క విభవమే" అని నీవు తప్పక గ్రహించాలి.

"ఒక్కొక్కడు దైవపరాయణుడై 'దైవమే నన్ను నడుపును' అని తలచి నిష్క్రియుడై ఉండటం కూడా 'నియతి' యొక్క ప్రభావమే. నియతి యొక్క నిర్ణయం ప్రకారం 'పురుషుడేమీ చేయకుండుగాక' అని అయివుంటే, అప్పుడు ఏమైనా చెయ్యవలెననే బుద్ధిగాని, ఆ బుద్ధి వలన జరుగు కర్మగాని, ఆ కర్మ వలన ఏర్పడు ప్రయోజనములు గాని జరిగెడివి కావు. అందుచేత కల్పారంభం నుండి, ప్రళయము వరకు జరిగెడివన్నీ నియతివలెననే జరుగుచున్నాయి". ... అని నియతివాదులు చెప్పుచున్నారు. అవశ్యము జరుగవలసి యున్న దానిని రుద్రుడు మొదలైన వారి బుద్ధి కూడా అతిక్రమించలేక పోతోందని వారి అభిప్రాయం.

---

* నియతి = An arrangement of cause and effect.

పురుషకారము = That which results because of efforts.

ఓ రామా! నియతి యొక్క ప్రభావము చెప్పుచున్న 'నియతి'వాదుల అభిప్రాయము అట్లే ఉండనిమ్ము. బుద్ధిమంతుడైనవాడు పురుషకారమును త్యజించి "నియతియే అంతా చేసుకుపోతుంది" .... అను నిర్లిప్తత్వమును ఆశ్రయించుకుందునుగాక! ఎందుకంటావా! నియతి పురుషకారముల రూపముననే కర్మలను నియమించుచున్నది. ఆయా కర్మలు ఆచరించినప్పుడే ఆయా ఫలితములు లభిస్తున్నాయి. వివిధ ప్రయోజనములు పురుష ప్రయత్నముల దృష్ట్యా వీక్షించబడకుండా, "ఈశ్వర సంకల్పము" అనబడు భావనచే దర్శించినప్పుడు, అద్దానిని "నియతి" అను పేరుతో పిలవటం జరుగుతోంది. అట్లుగాక సృష్టి-క్రియ ప్రయోజనముల దృష్ట్యా చూచినపుడు 'పురుషకారము' అని పిలుస్తున్నారు. ఈశ్వరసంకల్పము కూడా తుదకు పురుషకారము రూపమునే దాల్చి జీవుని సమీపిస్తోంది సుమా!

❖

"నేను నియతినే ఆశ్రయిస్తాను. జరుగవలసినదేదో జరుగుతుంది. నిష్క్రియుడనై ఉంటాను" అని పనిచేయటం మానివేసి చతికిలపడి కూర్చునేవాడు సాధించగలిగినదేమీ ఉండదు. అట్లని భోజనం, ఊపిరిపీల్చటం కూడా మానివేయగలుగుతాడా? "పురుషకారము ఆశ్రయించండి. అప్పుడే ఉత్తమ ప్రయోజనం పొందగలరు" అని మనం ఈ విధంగా పునరుద్ఘాటించుకుంటున్నాం. "ప్రయత్నము యొక్క తీవ్రతను అనుసరించే ప్రయోజనం ఉంటుంది" అనునట్టి సర్వదా సిద్ధించియేయున్న విధానమునే 'నియతి'గా జనులు గ్రహించెదరుగాక!

❖

"అసలు పురుషకారమే ముక్తి అని ఎందుకు అనాలి? ఒకడు సర్వకర్మలు త్యజించి, నిర్వికల్ప సమాధియందు వాయువును - మనస్సును నిరోధించి ముక్తిని పొందుచున్నాడు కదా! అందుచేత పురుషకారమును ప్రక్కకునెట్టి నియతివాదమునే స్వీకరించటం ఉచితం" అని కొందరు నియతివాదుల అభిప్రాయం. అయితే నిర్వికల్ప సమాధిని ఆశ్రయించటం, వాయువును నిరోధించటం ఇవి కూడా పురుషకారము వల్లనే సాధ్యపడుచున్నాయి కదా! పురుషకారం లేకుండా ఎక్కడైనా, ఎన్నడైనా, ఎవ్వరికైనా, ఏదైనా లభిస్తోందా? లేదు సుమా! అయితే ఒకానొకని వర్తమాన ప్రయత్నములను మనం చూడగలమేమో కాని, అతని ఇతఃపూర్వపు కర్మలను, వాటి ఫలితంగా వర్తమానంలో ప్రాప్తిస్తున్న ప్రయోజనములను మనం సమన్వయపరచలేము. అందుచేతనే "ఇతనికి ఇది అదృష్ట కారణంగా ప్రాప్తించింది. అతనికి అది ఎంత ప్రయత్నించినా దురదృష్టకారణంగా ప్రాప్తించలేదు" ఇత్యాది వాక్యముల సహాయం చేత 'అదృష్టము' అనబడుదానికి ఆరోపిస్తున్నాం. వాస్తవానికి నిశిత దృష్టితో పరిశీలించి చూచినప్పుడు, పురుషకారం లేకుండా ఏదైనా లభిస్తోందని నిరూపించటం అసాధ్యమే. అందుచేత, శాస్త్రవిధిని అనుసరించి "పురుషకారమును అవలంబించటం, అనగా, ప్రయత్నమును ఆశ్రయించటం" అనునదే పరమశ్రేయోదాయకమని మా అభిప్రాయం. సిద్ధి లభించిందా .... ఇక ఆపై అట్టి జీవుని కర్మలేవీ బంధించజాలవు. ఆ సిద్ధి యొక్క ఫలితమే నైష్కర్మ్య రూపమగు మోక్షము. ఎవడు 'తాను కర్మలకు, ఆ కర్మల ప్రయోజనములకు అతీతమైన

శుద్ధచైతన్యతత్త్వము అయివున్నాను', అని తెలుసుకుంటాడో అట్టి వానిని ఈ జన్మమృత్యువులు గాని, కర్మ-అకర్మలు గాని ఏమాత్రం నిర్దేశించలేవని గ్రహించు. "మోక్షస్థితి" అని చెప్పబడుచున్నట్టి అట్టి అంతరంగ - అవగాహన స్థితియే పరమశ్రేయోదాయకమైనది సుమా!

అయితే, కేవలం కర్మలు త్యజించినంతమాత్రంచేత ఏ ఒక్కరికి 'నైష్కర్మ్యసిద్ధి (కర్మరాహిత్య స్థితి)" ప్రాప్తించదు. మనస్సును ఇచ్ఛారహితంచేసినప్పుడే అది లభిస్తోంది. అది అట్లా ఉంచి, మేము సాధ్యము-సాధనము (achievement - process of achieving) లను బాగా పరిశీలించి చూచి, "కర్మలకంటే జ్ఞానమే ఉత్తమమైనది" అని కూడా ఇక్కడ ఒప్పుకొంటున్నాం.

❖

ఈ నియతి .... 'జ్ఞానుల నియతి' - 'అజ్ఞానుల నియతి' .... అనునట్టి రెండు విధములైన వ్యవహారశీలత్వము మనకు జగత్తులో లభిస్తోంది. "జ్ఞానుల నియతి" యందు దుఃఖరాహిత్యమే అంతిమ ప్రయోజనమగుచున్నది. దానివలన 'అవిద్య' (Ignorance) నాశనమైపోవుచున్నది. అట్టి నియతికి అనుకూలమైన పురుషప్రయత్నముచే 'పరమప్రాప్తి'యగు ఉత్తమ గతి లభిస్తోంది.

ఇక అజ్ఞానుల నియతి .... "ఇది ఇట్లు చేయుడు, ఫలితంగా ఈ దృశ్యమునకు సంబంధించిన ప్రాపంచిక లేక లౌకిక ప్రయోజనములు సిద్ధించగలవు" అను రూపము కలిగి ఉంటోంది. సంకల్ప - ప్రయత్నబలముల ననుసరించి ఆయా లౌకిక ప్రయోజనములు ఒనగూడుచున్నాయి. అయితే జీవుని సముద్ధరించగలిగినది బ్రహ్మజ్ఞాన మొక్కటే. నీటియొక్క ద్రవత్వమే కెరటములుగా, సుడులుగా, బుడగలుగా ప్రదర్శితములగు చున్నాయి కదా! బ్రహ్మమే నియతిరూపమున ప్రకాశించుచున్నది. బ్రహ్మమే సకల పురుషార్థముల సాధకము, సాధ్యము, సాధనము కూడా అయివున్నదని సూక్ష్మ ద్రష్టలగు ఆత్మజ్ఞానులు గ్రహించుచున్నారు.

❖❖❖

## 4. బ్రహ్మమే - ఇదంతా!

ఓ రఘురామా! ఆ బ్రహ్మతత్త్వమే సర్వకాలములందు, సర్వదేశములందు, సర్వశక్తి మంతమై వెలయుచున్నది. అంతేకాదు. సర్వుల ఆకారము అదియే. సర్వైశ్వర్యము, సర్వవ్యాపి, సర్వము కూడా అదే. ఆ బ్రహ్మమే ఆత్మ. అది సర్వశక్తిమంతమగుటచే, దాని ఇచ్ఛను అనుసరించి కొన్నిచోట్ల ప్రకటితం అవుతోంది. మరికొన్నిచోట్ల ప్రకటితం అగుటలేదు. కాని సర్వేసర్వత్రా ఆక్రమించియే ఉన్నది. ఎదురుగా దర్పణం ఉంటే నీ ప్రతిబింబము కనబడుతుంది. దర్పణం లేకపోతే ... ప్రతిబింబము కనబడదు కాని, ప్రతిబింబము అక్కడ వరకు ప్రసరించియే ఉన్నది కదా! ఉండియే ఉన్నది కదా! బుద్ధి ఉన్నచోట మనస్సు - ఉపాధి మొదలైన రూపములుగా కనబడుతోంది.

ఆ బ్రహ్మము సాత్విక ఉపాధులందు శాంతభావమును, రాజస ఉపాధులందు చలనశక్తిని, తామసిక ఉపాధులలో జడత్వమును ప్రకటించుచున్నది. ప్రళయ - సుషుప్తులందు ప్రకటనారహితంగా

ఉంటోంది. అది ఎచ్చట ఏ రూపమును ఎట్లు సంకల్పించుచుండునో, అచ్చట అట్టి రూపమునే అవలోకిస్తూ ఉంటుంది. దానిశక్తి ఎచ్చట ఏ రూపమున ఉదయిస్తుందో అచ్చట ఆ రూపముననే 'వివర్తము' చెందగలదు. అదియే నానా రూపములుగా వ్యవహృతమగుచు, వ్యవహారదృష్టికి విభిన్నములుగా అగుపించుచున్నది. కాని పరమార్థదృష్టికి ఈ జగత్తులో తోచుచున్నదంతా ఒక్కటే అయివున్నది కాని, వేరువేరు కాదు. బ్రహ్మమే ఇదంతా. ఈ "ఉపాధి-మనస్సు-బుద్ధి-జీవుడు - ఈశ్వరుడు" ... మొదలైన పేర్లు బుద్ధిమంతులచే లౌకిక వ్యవహారము కొరకు కల్పించబడ్డాయి. ఇంతమాత్రంచేత ఆత్మయందు ఎట్టి భేదమూ లేదు. "నీరు-అలలు-నదులు-సముద్రములు -కాలువలు-చెరువులు" .... ఇదంతా నామాదుల కల్పనయే కదా! అన్నిచోట్ల ఉన్నది జలమే కదా! ఒకే బ్రహ్మతత్త్వము త్రిమూర్తులు మొదలుకొని ఒక పురుగు వరకు సర్వేసర్వత్రా అంతర్యామిత్వము వహించియున్నది. ఆభరణములు అనేకం కావచ్చు. కాని బంగారం ఒక్కటే కదా! బ్రహ్మము, అది ప్రకటించుచున్న మనోబుద్ధ్యహంకారరూపములగు 'శక్తి' ఒక్కటే కాని వేరువేరు కాదు.

ఈ 'బుద్ధి'ని చూచావా? ఇది దేనిని ఎట్లు నిర్ణయించుకొంటోందో, అట్లే బాహ్యదృష్టి ఏర్పడటం, అట్లే అనుభవం కావటం జరుగుతోంది. బుద్ధి కూడా బ్రహ్మము యొక్క శక్తిస్వరూపమే కదా! ఈ బుద్ధి పరమార్థదృష్టిని పొందటం జరిగినప్పుడు మరుక్షణం సర్వే-సర్వత్రా ఆత్మనే దర్శించుచున్నది. అట్టి దర్శనముచే బుద్ధియందున్న దోషములన్నీ భస్మమైపోతున్నాయి. సర్వ సమత్వభావన, సమరసానుభూతి అనుభవమగుచున్నాయి. "బ్రాహ్మీస్థితి" అని చెప్పబడుచున్నది అదియే!

బ్రహ్మము సర్వాత్మకమైయున్నది. అందుచేత జ్ఞానులకు సర్వత్రా సమభావముగానే గోచరిస్తోంది. జ్ఞానము - అజ్ఞానము .... ఈ రెండిటికీ అది ఒకే రీతిగా సాక్షీభూతమై ఉంటోంది. ఒక క్షణంలో "నేను నిష్కళంక సాక్షీతత్త్వమును" అని గ్రహించినదై ఉంటోంది. మరొక క్షణంలో భ్రాంతికిలోనై ఎచ్చటనో, ఎద్దానినో గాంచుచున్నది. అభిలాష పూర్వకంగా రాగద్వేషములకు లోనై తనను తానే తిరస్కరిస్తోంది. అయితే "అట్టి దర్శనమంతా స్వప్నసదృశమే" అని జ్ఞానులు బోధించుచున్నారు.

ఈ చిత్తము ఎద్దానిని, ఎట్లు సంకల్పించుతోందో, ఎద్దానియందు "అభినివేశం (Desire to have)" పొందుతోందో, అద్దానిని అట్లే గాంచుచున్నది. కనుక, 'జగత్తు'గా నీకు ప్రాప్తించుచున్నదంతా చిత్తము యొక్క చమత్కారమే సుమా! అట్లు జగత్తుగా పొందటం "చిచ్ఛక్తి"యే అయివున్నది కదా! అందుచేత బ్రహ్మమొక్కటే సత్యము. తక్కినదంతా లేకయే ఉన్నది.

మరి "నేను జీవుడను అయివున్నాను కదా! నాకింక గతి ఏది?" అను నైరాశ్యం దేనికి? ఎవరికి? బలహీనత - స్వల్పత్వము త్యజించబడుగాక.

ఓ రామచంద్రా! నిదురలే! అజ్ఞానము త్యజించు. ఆత్మస్వరూపుడవై నిశ్చింతుడవై వెల్లివిరియుము!

❖❖❖

# 5. బ్రహ్మము - ద్వితీయ 'సత్త'

**శ్రీ వసిష్ఠమహర్షి :** "పరమాత్మ" ఎల్లప్పుడూ "నిర్మలము, స్వప్రకాశము, ఆనంద స్వరూపము, ఆద్యంతములు లేనిది, విశుద్ధము, సర్వగమము (అన్నివైపుల ప్రసరించి యున్నది)" అయివున్నది. అది ఏకాలమందు ఎట్టి మార్పు-చేర్పులు పొందటం లేదు. అట్టి పరమానందమయమగు పరమాత్మ నుండి తటాక జలంలో మొట్టమొదటి పెద్ద కెరటము ఉత్పన్నమైనట్లు, ప్రథమచిత్తయుతుడగు 'బ్రహ్మదేవుడు' ఉత్పన్నమగు చున్నాడు. "నేను సమష్టిసృష్టి స్వరూపుడను" అను చిత్తము యొక్క స్వభావమే అతని శరీరము. శాస్త్రములచే 'హిరణ్యగర్భుడు' అని చెప్పబడుచున్న 'ప్రథమ జీవతత్త్వము' నుండి ఇక ఈ మిగతా జగత్తు అంతా వచ్చిపడుతోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! బ్రహ్మము అపరిచ్ఛిన్నము, అద్వితీయము, స్వప్రకాశకము, అఖండము కదా! ఇక ఈ జీవుని చూచారా? ఇతడు పరిచ్ఛిన్నుడు. "రెండవది కలదు. నాకన్నా 'ఇది' వేరు" అనునట్టి ద్వితీయత్వమును అనుభవిస్తున్నాడు. "నేను పరిమితుడను. ఆధారపడిఉన్నవాడను" అను భావనోద్వేగమును పొందుచున్నాడు.

నా సందేహమేమిటో వినండి.

అట్టి బ్రహ్మము నుండి, అందుకు వ్యతిరిక్తములైన గుణములు గల ఈ 'జీవునిసత్త' ఎట్లు బయల్వెడలుతోంది? లేక, బ్రహ్మము ఈ 'జీవసత్త' అనబడు పరిమితానుభవం ఎట్లా పొందటం జరుగుతోంది? ఈ జగత్తులు ఎక్కడి నుండి ఉత్పన్నమౌతున్నాయి?

ఈ విషయం నేను గ్రహించలేకపోతున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి :** అట్టి బ్రహ్మము నందు 'మిథ్య' అయినట్టి ద్వైతభావము అకారణం గానే కలుగుచున్నది. పెద్ద-చిన్న తరంగములు సముద్రజలంలో లేస్తాయి చూచావా? అట్లాగే "నేను సమష్టిజీవుడను. నేను వ్యష్టిజీవుడను" అనునట్టి పెద్ద-చిన్న తరంగ రూపకల్పనలు బ్రహ్మము నందు కలుగుచున్నాయి.

అయితే, బ్రహ్మము ఏనాడూ 'జీవుడు' అగుటలేదు. "మరి మాకు జీవుడు కనిపిస్తున్నాడు కదా?" అంటావా? అట్లా తోచటం అవిద్యాసంస్కారము చేతనే సుమా! మట్టితో బొమ్మను తయారుచేశామనుకో .... మట్టి తన ఆకారమును పోగొట్టుకుంటోందా? అసలు మట్టికి ఆకారమంటూ ఏదైనా ఉన్నదా? మరి బొమ్మకు ఆకారం ఉన్నది కదా? బొమ్మకు ఆకారం మట్టిలోంచే వచ్చింది కదా! అట్లే బ్రహ్మము కూడా సర్వదా నిర్మలము, సర్వవ్యాపి అయివుండి కూడా, "జీవుడు" అనబడు ఒకానొక సంకుచితత్వము తనయందు ఆపాదించుకుంటోంది. కాని బ్రహ్మమునందు "జీవుడు అగుట" అను స్వభావం లేదు. ఈ జీవుడు బ్రహ్మమే అయివున్నాడు కాని, మరింకేమీ కాదు.

మరి ఈ స్వల్పత్వాదులు ఎక్కడి నుండి వస్తున్నాయంటావా? "ఆత్మ దర్శనము" అను విషయంలో కొంత భ్రమ, అసామర్థ్యము, అవిచారణ స్వయముగా కారణరహితంగా ఆత్మయందు ఏర్పడుచున్నాయి.

ఫలితంగా "విశాలచిదాకాశమే" అత్యంత భీషణమై తోచుచున్నది. కాని అదే చిదాకాశము జ్ఞానులకు మాత్రం ఆనందమయము, శాశ్వతము, ప్రశాంతము, ఉద్వేగరహితముగా తెలియవచ్చుచున్నది. అట్టి చిదాకాశము ఉపాధి రహితము, పరిపూర్ణము, సత్వమయము అగుటచేత, పండితులు కూడా అద్దానిని "ఇది" అని నిర్దేశించలేకపోతున్నారు. ఆ బ్రహ్మమునే .... "శాంతిమయమగు పరమపదము" అని శాస్త్రములు నిర్వచిస్తున్నాయి. అదే పరమాత్మయొక్క ఆద్య స్వరూపము. ఓ రామా! నీవుగాని, నేనుగాని, మరెవరుగాని  ఏ క్షణములో కూడా అద్దాని నుండి వేరైన వారము కాదు. దానిని గ్రహించుటయే జ్ఞానము. "అది వేరు, నేను వేరు. నేను అద్దానిని పొందవలసియున్నది" ... అనునట్టి స్థితి 'బ్రాహ్మీస్థితి కాదు" అని గ్రహించు. "అద్దాని నుండి నేను వేరు" – అను భావమును జయించి అనిర్వచనీయమైన స్థితి పొందియుండుము. లేదా, అట్టి ప్రయత్నమునే ఆశ్రయించుము.

❖

ఆ బ్రహ్మమే ఒకానొకప్పుడు ఉపాధితో కూడినదై, సంవిదాత్మకమై (సత్ = Entity experience విత్ = knowing experience) ప్రాణములను ధరించుచున్నది. అప్పుడు, "నేను ప్రాణతత్వమును, లేక నాకు ప్రాణములు ప్రియమైనవి" అని భావిస్తోంది. అట్టి భావము తొలగి, ముక్తి లభించేంత వరకు ఆ సంవిత్తు "జీవుడు" అని పిలువబడుతోంది. కనుక జీవుడు అనునది బ్రహ్మము యొక్క ద్వితీయ రూపమని, 'మరొక ప్రస్ఫుటము' (another manifestation) అని అనవచ్చు.

**శ్రీరాముడు :** స్వామీ! బ్రహ్మమునకు నామరూపములే లేనప్పుడు, ఇక 'జీవుడు' అనబడు ద్వితీయరూపమేమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నిజమే. అయితే, 'జీవుడు' అని మనం పిలుస్తున్న తత్వమునకు మాత్రం నామరూపములు ఎక్కడ ఉన్నాయి? జీవుడు ప్రజ్ఞాతత్వమే కాని కాళ్ళు-చేతులు కాదుకదా! ఇక నామరూపాదులు ఆపాదించటం, దర్శించటం భ్రమాత్మకమగు అవగాహన వలననే ఏర్పడుచున్నాయి. బ్రహ్మము ఎట్లు వాక్కునకు అందనిదై అనిర్వచనీయమైయున్నదో, ఈ జీవుని విషయము కూడా అట్టిదే. ఈ జీవుడు కూడా వాక్కుకు అందనివాడు, అనిర్వచనీయుడు. వాస్తవానికి ఈ జీవునకు, బ్రహ్మమునకు భేదం వట్టి కల్పన మాత్రమే. అయితే అశాంతితో నిండియున్న ఈ జనుల అవగాహనను చూచినప్పుడు సత్యద్రష్టలమగు మా హృదయం ఆర్ద్రతతో నిండిపోతోంది. అందుచేతనే "ఇది సత్యము – ఇది భ్రమ" అని బోధించుటకు ఉపక్రమిస్తున్నాం. అందుకు అనువుగా "జీవుడు" "బుద్ధి" "మనస్సు" "నేను" "నీవు" "జగత్తు" అను పదజాలం ఉపయోగిస్తున్నాం. "ఈ జీవుడే పూర్ణమగు బ్రహ్మమైయున్నాడు. కనుక సర్వసందేహములను, వివాదములను, స్వప్నతుల్యములను త్యజించి నిశ్చింతులై పూర్ణభావము వహించి ఉండండి." అని నిరూపిస్తున్నాం. ఫలితంగా అనేకమంది విచారణపరులు విచారణ-విమర్శ-విశ్వాసములను సమన్వయించుకొని, ప్రయత్నశీలురై పూర్ణానందమయులగుచున్నారు. ఇదంతా బ్రహ్మముయొక్క చమత్కారము, కల్పనా చాతుర్యమే కాని మరింకేమీ కాదు.

చిదాకాశరూపమగు పరబ్రహ్మమున అసంఖ్యాకములు, అనుభవాత్మకములు అగు జగత్తులు ప్రతిబింబిస్తున్నాయి. అయితే ఏది ప్రతిబింబించినా, ప్రతిబింబించక పోయినా దర్పణములో మార్పు చేర్పులేమి ఉంటాయి? ఏమీ ఉండవు కదా! అట్లే చిదాత్మ విషయం కూడా! వాయువు ప్రసరించనప్పుడు సముద్రం ప్రశాంతంగా ఉంటుంది. వాయువు ప్రసరించినప్పుడో .... జలమంతా అనేక తరంగాలతో కల్లోలమై ఉంటుంది. కాని సముద్రజలం 'జలం'గానే ఉభయస్థితులందు ఉంటోంది.

నిశ్చలజలంలో వేయబడ్డ గులకరాయివలె .... చిత్తచాంచల్యము కలిగినప్పుడు, మనోవృత్తులతో కూడిన జీవసత్తనే 'జీవుడు' అని అంటున్నాం. నిర్మలమగు బ్రహ్మ వస్తువునందు ప్రాణస్పందము అధ్యారోపితమైనప్పుడు.... జలం కనిపించకుండా తరంగం కనిపిస్తున్నట్లు ..... బంగారం తోచకుండా ఆభరణమే తోచునట్లు ..... ఆ బ్రహ్మవస్తువునందు గల "నిష్క్రియత్వము" కనిపించకుండా ఉన్నది. అప్పుడు పరిచ్ఛిన్నానుభవంతో కూడిన 'అహంభావం' యొక్క స్ఫురణ ఏర్పడుతోంది. అట్టి స్ఫురణయే జీవుడుగా నిర్వచించబడుతోంది.

నిప్పులో 'వేడి' ఉన్నట్లు, మంచులో 'చల్లదనము' ఉంటున్నట్లు .... బ్రహ్మము నందు చాంచల్య స్వరూపమగు జీవభావము కూడా, ముక్తి లభించనంతవరకు, ఉండి ఉంటోంది.

చిద్రూపమగు ఆ ఆత్మతత్త్వమునందు స్వభావవశంచేత కలుగు పరిచ్ఛిన్నత్వమే ఈ జీవుడు. బ్రహ్మము యొక్క 'పరిచ్ఛిన్నత్వము' లేక జీవభావము మొదలైనదంతా దృఢమగు వాసనాబలం చేత క్రమంగా అహంభావ రూపమును దిద్దుకొనుచున్నది.

❖

ఓ రామచంద్రా! అటు ఆకాశంవైపు చూడు. అక్కడ నీకు 'నీలిరంగు' కనబడుతోంది కదా! ఆ వర్ణము ఎక్కడ ఉన్నది? అసలు ఉన్నదా? లేదు. అయినను కనిపించుచున్నది. ఈ అహంభావము జీవునియందు "ఇక్కడ ఇట్లు ఉన్నది" అని గుర్తించుటకు వీలుగా లభించటం లేదు. కాని, అనుభవం అవుతోంది. ఆత్మదర్శనం కాకపోయినట్టి కారణంచేత 'చిత్‌చైతన్యము' తననుతాను అహంభావముచే కుదించబడినదానివలె గాంచుచున్నది. ఈ జీవుడు పూర్వసంకల్ప సంస్కారములచే ప్రబోధితుడై, అట్టి అధ్యాసవలన 'అహంభావము' అను అనుభవం పొందుచున్నాడు. ఆ అహంభావమే స్వసంకల్పబలం చేత పరిచ్ఛిన్నమై "దేశము – కాలము – దేహము" మొదలైన భావావేశములకు లోనగుచున్నది. ఈ దేహాది ఆకారములను దాల్చుచున్నది. వాయుస్పందమువలె స్ఫురించుచు. "స్వసంకల్పించటం" అను స్వభావంచేత "చిత్తము, జీవుడు, మనస్సు, మాయ – ప్రకృతి" అనే పేర్లతో పేర్కొనబడుతోంది. సంకల్పాత్మకమైనట్టి ఈ చిత్తమే 'హిరణ్యగర్భుడు' అగుచున్నది. అదే సంకల్పబలంచేత పంచభూతములను, వాటి స్వభావములైనట్టి పంచతన్మాత్రలను కల్పించుచున్నది. చూచావా, రామా! ఈ విధంగా ఆ బ్రహ్మము చేతనాత్మకమగు "పూర్వావస్థ" నుండి చ్యుతిపొంది జడమగు పంచతన్మాత్రలుగా మారుచున్నది.

| పంచభూతములు | పంచ తన్మాత్రలు |
|---|---|
| ఆకాశతత్త్వము నుండి | శబ్దతత్త్వము |
| వాయుతత్త్వము నుండి | స్పర్శతత్త్వము |
| తేజోతత్త్వము నుండి | రూపతత్త్వము |
| జలతత్త్వము నుండి | రసతత్త్వము |
| భూతత్త్వము నుండి | గంధతత్త్వము |

"పంచతన్మాత్రభావము" (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధ భావన లేక సంస్కారము) పొందినట్టి ఇతఃపూర్వపు శుద్ధ చిత్తము ఆకాశంలోని నక్షత్రంలాగా తేజఃకణంగా మారుచున్నది. బీజము, అంకురిస్తుంది చూచావా? నీరు గడ్డకట్టి ఆయా రూపములను పొందుచున్నట్లు ఆ తేజఃకణము, తనయందు బ్రహ్మము ప్రకాశించుచుండగా, అండత్వము పొందుతోంది. 'దివ్యదేహకల్పన' ఆశ్రయించి దివ్య దేహమును పొందుచున్నది. అహంభావ శూన్యమైన పదార్థములందు అహంభావమును పొందుతోంది. ఇక ఆయా లోకములన్నిటియందు సంచరిస్తోంది. కొన్నిటియందు స్థావర భావమును, మరికొన్నిటియందు జంగమభావమును, ఇంకొన్నిటియందు ఖేచరత్వమును (ఆకాశ సంచారభావనను) స్వసంకల్పమహిమచేత పొందుచున్నది.

❖

సృష్టికి పూర్వం "పంచతన్మాత్ర సంకల్పము" నుండి ఉదయించినట్టి జీవదేహమే క్రమంగా బ్రహ్మదేవుని పదమును పొందుచున్నాడు. అట్లు పొంది, సమష్టి-జీవభావముచే అతడు ఈ జగత్తును నిర్మించుచున్నాడు. స్వయంభువు అయిన సమష్టి సృష్ట్యానుభవి, స్వభావవశంచేత తాను సంకల్పించి దర్శించుదానిని తానే "ఆహాఁ! ఇది ఎక్కడినుండో ఉత్పన్నమైనది కదా" అని భావిస్తున్నాడు. అట్లే అనుభవం కూడా పొందుచున్నాడు. అయినప్పటికీ, అతడు చిత్స్వభావుడే అయివున్నాడు కదా! అందుచేత అన్నిటికీ కారణము, స్థానము అయివున్నట్టి బ్రహ్మభావమును త్యజించివేయటం లేదు సుమా! అట్లు త్యజించకుండానే 'జగత్తు'కు కారణమైన కర్మలను నిర్మించుచున్నాడు. జలము తన జలస్వభావం త్యజించకుండానే తనయందు "తరంగములు" అనబడు ఆకార వికారమును ప్రకటిస్తోంది కదా! 'చిత్తు' నుండి స్వాభావికంగానే 'చిత్తము' ఉదయించు చున్నది. తరంగములు వేరైన క్రియ - రూప - నామము కలిగియున్నప్పటికీ, విచారించి చూచినపుడు, చేతితో స్పృశించినప్పుడు జలంగానే అగుచున్నది కదా! అట్లే జగత్కారణమగు కర్మలు 'జలములోని నురుగు యొక్క తెలుపు'వలె భ్రమాత్మకములు గానే ఉండి ఉంటున్నాయి. ఎందుకంటావా? వాస్తవానికి 'చిత్' అనునది ఈ జగత్తుల చేత గాని, జన్మలచేత గాని, కర్మలచేతగాని, మరింకెద్దాని చేతనైనాగాని, 'బద్ధము' అగునది కాదు. అయినప్పటికీ, భ్రమచే "నేను పరిమితాచరణ పరుడను" అను స్వప్న సదృశభావన మాత్రం పొందుతోంది. ఈ జీవుడు సర్వదా చిత్స్వరూపుడే సుమా! అట్లే సమష్టిరూపుడగు హిరణ్యగర్భుడు కూడా!

❖

ఒకడు తన అంతరంగమున, లేక మనస్సు నందు సంకల్పించి, అట్టి సంకల్పాను సారంగానే ఈ జగత్తును దర్శిస్తున్నాడు. అనగా, సంకల్పములు ఉదయించటానికి ముందే మనస్సు ఉన్నది. మనస్సు ఉదయించటానికి ముందే 'జీవుడు' ఉన్నాడు. మొట్టమొదట అతడు నిష్క్రియుడైయున్నాడు. ఆ తరువాత సంకల్పించి కర్మలను ఒనర్చుచున్నాడు. ఒక విత్తనములో "అంకురము మొలుచుట" అను సూక్ష్మభావమున ఉత్పన్నమై పెరిగి, క్రమంగా "ఆకులు-కాండము-శాఖలు-ఫలములు -పుష్పములు" .... మొదలైన రూపములుగా మారుచుండుట చూచావు కదా!

అట్లే హిరణ్యగర్భునియందు ఇంతకుముందే 'సంకల్పము' రూపమున ఉండిన జీవులు ఇట్లు నానారూపములుగా ప్రకాశము నొందుచున్నారు. అదే సమయమున "ఈ జీవులు పూర్వకల్పములలో తాము ఒనరించిన కర్మలను అనుసరించి, తదనుగుణములైన శరీరములను ఇందు పొందుచున్నారు" అనునది కూడా ఇక్కడ సహేతుకమే అగుచున్నది. ఆ తరువాత వారు జనన-మరణ కారణమగు తమ కర్మలను అనుసరించి స్వర్గ-నరకాదులను పొందుచున్నారు. అయితే "కర్మ" అనునది కూడా చిత్స్పందమేకాని వేరేమీ కాదు. అట్టి చిత్స్పందమే లేక సంకల్పచమత్కారమే "దైవము-చిత్తము-కర్మ -శుభము-అశుభము" ..... కూడా అయివున్నది.

చెట్టునుండి పూలు-కాయలు ఉత్పన్నమగుచున్నట్లు ఆదికారణమగు 'చిత్స్పందము' నుండే ఈ జగత్తులు మరల-మరల ఉద్భవిస్తున్నాయి. మరల మరల లయిస్తున్నాయి. జగత్కారకుడగు ఆత్మభగవానుడు మాత్రం నిశ్చింతుడై యథాతథంగా ఉండి ఉంటున్నాడు.

❖❖❖

## 6. మనస్సు - జీవుడు - బ్రహ్మము

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఆ పరమకారణమగు బ్రహ్మము నుండి మొట్టమొదట 'మనస్సు' ఉదయిస్తోంది. కనుక ప్రతి అనుభవమునకు వస్తున్న వస్తువు మనోమయమే సుమా! ఈ దృశ్యపదార్థముల వ్యవస్థితి అంతా మనస్సునే ఆశ్రయించుకొని ఉన్నది. అయితే, ఈ 'మనస్సు' కూడా స్వకారణము అయినట్టి 'పరబ్రహ్మము' కంటే వేరైనది ఏమాత్రం కాదు.

ఈ మనస్సు తరంగమువలె 'అటు-ఇటు' మారుతూ తాను ఆశ్రయిస్తున్న వస్తు జాలముల మార్పు-చేర్పులను తనయందు, అనుభవరూపంగా పొందుతూ ఉంటోంది. ప్రపంచంలో ఉన్న భేదములన్నీ మనస్సుచే కల్పించబడుచున్నవి మాత్రమే సుమా! ఈ మనస్సే నాశనమైతే ఇక ఈ "సుఖ-దుఃఖ-అధిక-అల్ప" .... భేదభావములు తొలగిపోతాయి. అప్పుడు ఆ "సద్వస్తువు" ఒక్కటి మాత్రమే ప్రతిష్ఠించబడగలదు. మనస్సు లయమైతే ఆత్మ ఒక్కటే శేషిస్తోంది. ఇక .... "సమష్టి స్వరూపజీవుడగు హిరణ్యగర్భుడు (బ్రహ్మ)-జీవుడు-మనస్సు-మాయ-కర్త-జగత్తు" మొదలైన భేదములు తొలగుతాయి. ఈ కనబడేదంతా అప్పుడు "ఆత్మజ్ఞానము" అను జలముతో కూడిన చిత్సముద్రమై వెలయుచున్నది.

ఈ "జగత్తు – చిత్తము" .... అనునవి ఒకానొకప్పుడు ఉంటున్నాయి. మరొకప్పుడు లేనివి అగుచున్నాయి. అనగా, "అవి అనిత్యములే" అని అనక తప్పదు కదా! అందుచేత అవి "అసత్తు" అని చెప్పబడుచున్నాయి. ఒక్క అజ్ఞానులకే ఈ "జగత్తు – చిత్తము" అనబడునవి సంకుచిత దృష్టి వలన సత్యమువలె ప్రతిభాసించుచున్నాయి. వారిపట్లనే అవి సత్త కలిగి ఉంటున్నాయి.

**సదసదాత్మకము**

వ్యవహారదృష్టితో చూచినప్పుడు కూడా ఈ జగత్తు "సదసదాత్మకము" (ఉన్నది–లేదు) అని తెలియవస్తోంది. ఎట్లాంటావా? విను. ఒక మనస్సు "ఇది ఉన్నది" అను విధంగా సంకల్పించు చున్నప్పుడు అది అట్లే ఉంటోంది. ప్రాప్తిస్తోంది కూడా. "ఎక్కడ ఉన్నది? లేదు కదా?" అని తలచినప్పుడు ఈ జగత్తు లేకయే పోతోంది. అందుచేతనే పెద్దలు దీనిని "సదసదాత్మకము" అని చమత్కారంగా పిలుస్తున్నారు.

ఏది ఏమైనప్పటికీ పారమార్థికదృష్టియందు "చిత్తము", "జగత్తు" ... ఈ రెండూ కూడా స్వప్నములోని అనుభవంలాగా అలీకములు (ప్రతిబింబమాత్రములు) మాత్రమే. ఇందులో సందేహమంటూ ఏదీ లేదు. జ్ఞానముచే ఈ చిత్తము సంస్కరించబడనంత వరకు ఈ 'జగత్తు' యొక్క అనుభవం సత్యముగానే ప్రాప్తిస్తూ పోతుంది. ఎప్పుడైతే చిత్తమునందు ఉత్తమజ్ఞానము జాగృతమౌతోందో .... ఇక ఆ క్షణము నుండి ఈ జగత్తు, ఇందలి పదార్థముల అనుభవం .... ఇదంతా "మిథ్య"గానే తెలియవచ్చుచున్నది. అందుచేతనే 'చిత్తము ఈ జగత్తును గాంచటం' అనునది ఒకవిధంగా సత్యము, మరొక విధంగా అసత్యము కూడా అయిఉంటోంది.

ఓ రామచంద్రా! అంతటికీ కారణం మనస్సేనయ్యా! మనస్సే వ్యర్థంగా ఈ సంసార స్వప్నమును గాంచుచున్నది.

భ్రాంతిచే విచలితుడైయున్న బాటసారి చీకట్లో కొంచెము దూరములో గల కొండరాయిని చూచి "ఇది క్రూరమృగమో, కసాయిదొంగో కాదు కదా?" అని బెంబేలు పడతాడు చూచావా? అట్లాగే ఆత్మజ్ఞానహీనమైన ఆ మనస్సు పరమాత్మయందు మిథ్యా మాత్రమగు ఈ జగత్తును గాంచుచున్నది. అజ్ఞానబాలుడు చీకట్లోకి చూచి "అదిగో, అక్కడ బూచి ఉన్నది. అది వచ్చి నాపై పడదు కదా?" అని గజగజ వణుకుచున్నాడనుకో .... అందుకు కారణమేమిటో చెప్పు? తన చిత్తమునందు కలిగిన భయమునకు కారణమైనట్టి ఆ 'బూచి' అనబడునది అక్కడ వాస్తవంగా ఉన్నదో, లేదో సమగ్రంగా విచారించకపోవుటయే కారణం" అని మాకు అనిపించుచున్నది. ఆహా! ఆత్మభావము నుండి 'చ్యుతి' నొందినట్టి ఈ చిత్తము మరల తన ఉనికి స్థానమై ఉన్నట్టి ఆత్మ తత్త్వమును విచారించకయే ఉంటోంది. అట్లు విచారించనంతకాలం, "జగత్తులు–జన్మలు–కష్టములు–సుఖములు–అస్మదీయులు–ఇతరులు" ... అనునట్టి భ్రమలను పొందుతూనే ఉంటుంది.

ఆత్మ అవ్యక్తము, సర్వశాంతి స్వరూపము అయివున్నది. అట్టి ఆత్మయొక్క "సృజనేచ్ఛ" నుండే చిత్తము జనిస్తోంది. లేదా, ఆ సృజనేచ్ఛ (desire to project)నే 'చిత్తము' అని పిలుస్తున్నాం.

సృజనేచ్ఛ → చిత్తము → జీవత్వము → అహంకారము

అహంకారము → "విషయతన్మాత్ర" (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములకు సంబంధించిన ఆవేశము) → ఇంద్రియములు → దేహములు

దేహములు → శోక-మోహములు → స్వర్గ-నరకములు → బంధ-మోక్షములు

ఆత్మస్వరూపుడే అయివుండి కూడా తనను తానే మరచి ఉంటున్న జీవుడు అంతు లేకుండా అనేక దేహపరంపరలు, వాటి నుండి స్వర్గ నరకములు, బంధమోక్షములు అనుభవమౌతున్నాయి. బీజం నుండి వృక్షం - వృక్షం నుండి బీజం అంతులేకుండా వస్తున్నట్లు, జన్మల నుండి కర్మలు, కర్మల నుండి జన్మలు .... ఈ విధంగా ఒకానొక పరంపర అంతు లేకుండా సాగిపోతోంది.

అయితే రామా! ఏది ఎట్లాగైనా కావచ్చు గాక! ఆత్మ సర్వదా నిష్కళంకమే. అది జన్మించుట లేదు. దానికి దేహములు లేవు. జననమరణములు లేవు. ఈ జన్మలు, మరణాదులు, అనగా, .... "ఇప్పుడు నేను జీవిస్తున్నాను. మరొకప్పుడు జీవించను" .... మొదలైనదంతా మనస్సే అనుభవిస్తోంది. ఒక గదిలో వెలుగుచున్న దీపపు కాంతిలో ఒక బాలుడు చదువుకొనుచున్నాడనుకో ... ఆ చదువబడుచున్న విషయమునకు, దీపమునకు సంబంధం లేదుకదా! దీపపు వెలుగు లేనిదే అతడు చదువగలడా? లేదు. ఆత్మకూడా, నిష్క్రియమై, సర్వమునకు సాక్షియై, సర్వమునకు కారణమై, అకర్త అయి ఉంటోంది. ఇట్లు ఆత్మ ఎన్నడు తన స్వచ్ఛతను కోల్పోవుటలేదు. ఈ దేహమునకు 'కర్మలు' కాకుండా వేరే "సత్త" లేదు. అందుచేత కర్మలే చిత్తము. చిత్తమే అహంభావ సమన్వితమగు ఈ జీవుని రూపము. చిత్తము కాకుండా జీవునకు వేరే రూపమేమి ఉన్నది? ఆ జీవుడే బ్రహ్మము. బ్రహ్మమే శుద్ధచైతన్య దృష్టిలో ఆత్మతత్త్వముగా, మననాదుల ద్వారా 'జీవుడు'గా వ్యవహార నామములు పొందుచున్నదని గ్రహించ బడుగాక!

❖❖❖

# 7. దృశ్యాభిలాష

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఒక దీపం నుండి లక్షలాది దీపములు వెలిగించ వచ్చు కదా! ఒకే పరమాత్మ ఈ నానావిధరూపములుగా వెలుగొందుచున్నాడు. అయితే, విచారపూర్వకమైన దృష్టికి మాత్రమే బ్రహ్మము యొక్క యథార్థరూపం గోచరించటం జరుగుతోంది.

ఓ జనులారా! మీరు 'పరమాత్మజ్ఞానము' పొందటానికి సంసిద్ధులు కండి. పరమాత్మ జ్ఞానము లభించినపుడు, "ఈ చిత్తముయొక్క జీవకల్పన, దృశ్యసంగము, తత్ఫలితంగా ప్రాప్తిస్తున్న బంధము

.... ఇదంతా మిథ్యాకథనమే" అని బోధపడగలదు. అప్పుడు స్వతఃసిద్ధమైయున్నట్టి 'మోక్షము' యొక్క అనుభవం ప్రాప్తించుచున్నది. అనగా, "భ్రమ-శోకము-మోహము-సంకుచిత్వము-నైరాశ్యము -భయము-ఉద్వేగము" .... మొదలైన స్వకల్పిత దోషములు తొలగిపోతున్నాయి.

చిత్తమే "నేను జీవుడను" అను రూపముగల జీవస్వభావం తనపై ఆపాదించుకొంటోందని విచారణ చేయబడుగాక! విచారణ చేసినంతమాత్రంచేత ఈ చిత్తము, దానిచే ఆరోపించబడి, అనుభవించబడుచున్న ఈ దృశ్యప్రపంచము తమంతటతామే స్వయముగా తొలగిపోతాయి. సత్యమేదో ఎరిగిన తరువాత అసత్యమును దర్శించు చున్నప్పటి భావనలు, ఉద్వేగాలు ఏమౌతున్నాయి? ఈ చిత్తము-ప్రపంచముల విషయం కూడా అంతే. ఇక ఇంతమాత్రం ప్రయత్నంచేసి, విచారణశీలురు అగుటకు సిద్ధంకాకుంటే, అట్టివారిని ఎవరు రక్షించగలరు? మూర్ఖుడు తనకు శుభం కలుగచేయ యత్నించువాని వాక్యములలో స్వార్థమును, మోసమును, గాంచునట్లు, అజ్ఞానియే పరమాత్మకు అజ్ఞానమును ఆపాదించుచున్నాడు. అజ్ఞానమే ప్రపంచము రూపమున అగుపించుచున్నది. అజ్ఞాన దృష్టినే "సంసారము" అని అంటున్నాం.

❖

ఓ ప్రియరఘురామా! మరల-మరల చెప్పుచున్నాను. భ్రాంతికి లోనైన చిత్తమే ఈ జనన-మరణములను, బాల్య-యౌవన-వార్ధక్యములను, స్వర్గ-నరకములను గాంచుచు నృత్యం చేస్తోంది. సురాపానం చేసినవానికి శూన్యాకాశంలో కెరటములు, వృత్తములు, కేశములు, రూపములు కనిపిస్తూ ఉంటాయి చూచావా? అజ్ఞానముతో కూడిన చిత్తము ఈ జీవునిచే అసంఖ్యాకములైన బ్రహ్మాండములను తిలకింప చేస్తోంది. "తిమిరరోగము" అను దోషముతో కూడిన కళ్ళు కలవానికి ఆకాశంలో ఇద్దరు చంద్రులు కనిపిస్తారు. 'చిత్తరోగము'చే పీడింపబడుచున్న ఈ జీవుడు కూడా పరమాత్మయందు ద్వైతభ్రాంతిని గాంచుచున్నాడు. నల్లమందు మ్రింగినవాడు స్థావరములైనట్టి వృక్షాలు గాలిలోకి లేచి నృత్యం చేస్తున్నట్లు చూస్తున్నాడు. చిత్తవిమోహితుడైన ఈ జీవుడు కూడా నిశ్చలమగు ఆత్మయందు సంసారమును గాంచుచున్నాడు. బాలుడు గుండ్రంగా తిరిగే యంత్రం ఎక్కి .... "అహో! చూచారా? ఈ ఇళ్ళు, నేల, చెరువులు, కొండలు ... అన్నీ గుండ్రములుగా తిరుగుచున్నాయి కదా" అని కేకలు వేయునట్లు, చిత్తముయొక్క అనుక్షణ పరివర్తనము వలననే ఈ ఈ దృశ్యములన్నీ ఇట్లు అత్యంత అనేకత్వముతో కూడుకొని చిత్రాతి చిత్రంగా అగుపిస్తున్నాయి. చిత్తము ద్వైతభ్రాంతి పొందినప్పుడు మాత్రమే ఈ ద్వైతభ్రమ అంతా కలుగుతోంది. ద్వైతానుభూతి నశిస్తే అప్పుడు ద్వైత ప్రపంచము నశించిపోవుచున్నది. "అనగా, లేనిదే అగుచున్నది". ఒక్క పరమవస్తువు మాత్రమే ప్రతిష్ఠింపబడుచున్నది.

❖

కట్టెలు తొలగిస్తూపోతే నిప్పు ఆరకేం చేస్తుంది? "ఆత్మ తత్త్వవిచారణ" చేత, తదనుకూలమైన అభ్యాసంచేత ఈ "విషయదర్శనము" అనే అగ్ని తొలగిపోతుంది. అప్పుడు చిత్తముకూడా

తొలగిపోతుంది. "ఇదంతా, ఆత్మయే. వీరంతా ఆత్మ స్వరూపులే" అని చిత్తమును అభ్యసింపచేయాలి. చిత్తము కంటే వేరుగా ఇంద్రియ విషయములు గాని, మరింకేది గాని లేవు. అందుచేత, ఓ జనులారా! ఆత్మవిషయమై జ్ఞానమును, అజ్ఞానమును వేరుపరచగల క్రియా విశేషములను అభ్యసించండి. చిత్తము యొక్క "విషయములను దర్శించటం – ఆశ్రయించటం" అనే దుర్వ్యసనములను లుప్తం చెయ్యండి. అట్టి అభ్యాసంచేత జీవుడు "ఇది నేను. ఇది నేను కాదు" అను రూపముగల ఉత్తమజ్ఞానం పొందగలడు. అప్పుడు కర్మలను ఆచరించుచున్నను, లేక త్యజించు చున్నను .... అతడు "ముక్తుడు" అనియే చెప్పబడుచున్నాడు.

వత్సా! రాఘవా! కొద్దిగా కల్లు త్రాగితే కొంచెము కైపు కలుగుతుంది. అప్పుడు బుద్ధి కొంత చంచలమౌతుంది. అదే కనుక అధికంగా త్రాగితే? మత్తు పూర్తిగా కలిగి మనిషి 'నిశ్చేష్టితుడు' అవుతాడు కదా! చైతన్యము సంపూర్ణంగా ప్రకాశించినప్పుడు ఇక, విషయముల దర్శనమే ఉండదు. కొంత చైతన్యదృష్టి, కొంత జడత్వదృష్టి ఏర్పడి ఉన్నప్పుడు మాత్రమే ఈ జీవుడు విషయోన్ముఖుడై ప్రవర్తిస్తున్నాడు. 'నిర్వికల్ప సమాధి' యందు చైతన్యము యొక్క ప్రకాశము అత్యధికంగా ఉంటుంది. "ఘన చైతన్య పూర్వక స్థితి" లేక "ప్రపంచరహిత స్వసత్త"యే "పరమపదము" అని చెప్పబడుతోంది. సర్వకల్పనలు లయించినట్టి – సిద్ధి పొందినట్టి చిత్తమే విషయరహితం అవగలుగుతోంది. దృశ్యమంతా స్వస్వరూపంగా ఆస్వాదించేస్థితియే "నిర్వికల్పస్థితి"!

❖

ఈ చిత్తము వలన, శుద్ధచైతన్యము చేత్యభావము ('నేను అనుభవించుచున్నాను' అను భావము) పొందుచున్నది. అనగా, "నేను కర్తను. నేను ద్రష్టను" అను భ్రమను సత్యమువలె అనుభవించుచున్నది. అయితే, గాలికి 'స్పందము' కంటే వేరైన సత్త లేనట్లుగా, ఈ చిత్తమునకు "విషయోన్ముఖత్వము" కంటే వేరైన 'సత్త' లేదు. వేడి తొలగితే నిప్పు ఆరిపోవునట్లు, ఇంద్రియ విషయములు తొలగిపోగా! 'చిత్తము'నకు ఇక ఆకారమంటూ కనిపించదు. శుద్ధచైతన్యము అనుభవించు విషయముతో "శుద్ధ చేత్యములు (లేక) శుద్ధ దర్శనములు" అని చెప్పబడుచున్నాయి.

అప్పుడిక చైతన్యము చైతన్యరూపజగత్తును చైతన్య మాత్రంగా ఆస్వాదిస్తున్న దగుచున్నది.

❖❖❖

## 8. పరమాత్మను ఎరుగుటయే ఉపాయం

'త్రాడు' నందు 'ఇదిపాము' అను భ్రాంతి ఏ విధంగా కలుగుతోందో, అదే విధంగా అవిద్య కారణం చేత ఏర్పడుచున్న మిథ్యాభ్రాంతియే శుద్ధచైతన్యము నందు విషయముల భ్రమానుభవమునకు కారణమగుచున్నది. ఈ సంసార వ్యాధికి 'ఆత్మజ్ఞానం' ఒక్కటే సరయిన ఔషధం. అయితే చిత్తము బాహ్యవిషయములందు వైముఖ్యాన్ని (ఆకర్షించబడకపోవటం) అభ్యసించినప్పుడు మాత్రమే అంతరంగమునందు ఆత్మజ్ఞానం సుస్థిరం అవుతుంది. అందుకు వేరే ఇంకే ఉపాయం లేదు.

ఓ రామా! ఎవడైతే బాహ్యదర్శనములను, అంతరమున ఉన్న వాసనలను పరిత్యజిస్తాడో ... అతనికి ఇక్కడే ఇప్పుడే ముక్తి లభించినట్లే! వాసనలుండటమే బంధం. వాసనా త్యాగపూర్వకమైన స్వసత్తా సామాన్యమే ముక్తి. యథార్థజ్ఞానం కలిగిన తరువాత రజ్జువు పట్ల సర్పభ్రాంతి తొలగక ఏం చేస్తుంది?

❖

ఆత్మజ్ఞానం లభించగానే యీ వర్తమానపు సంసారభ్రాంతి అంతా తొలగిపోగలదు. విషయ వాసనలు పరిత్యజించావా .... మోక్షము నిశ్చయంగా లభించగలదని మరల గుర్తు చేస్తున్నాను. దృశ్య విషయముల పట్ల ఆసక్తి, నమ్మకము, మూర్ఖత్వము, అభిలాష తొలిగితే వాసనలు జయింపబడినట్లే కాబట్టి ఓ రఘుకులతిలకమా! రామచంద్రా! నీవు ఆసక్తిరహితుడవై ప్రవాహపతితములైన కర్మలను ప్రశాంత స్వభావముతో నిర్వర్తించుము. ఇందులో కష్టమేమీ ఉండవలసిన పనిలేదు. అనేకమంది తాము కోరుకొన్న వస్తువుకోసం, ప్రాణములైనా సరే, తృణంలాగా త్యజించివేయటం మనం ప్రపంచంలో చూస్తూనే ఉన్నాం. మరి కేవలం "అభిలాష"ను త్యజించినంత మాత్రంచేత ఉభయతారకమైనట్టి మోక్షము లభిస్తున్నప్పుడు, అందుకు వెనుకాడవలసిన అవసరమేమున్నది చెప్పు? నీవు కనుక వాంఛితములన్నిటినీ (ఇది ఇట్లు ఎందుకు ఉన్నది? అది నానుండి తొలగుగాక .... ఇటువంటి అభినివేశములను) పరిత్యజించి నిర్వికారుడవై ఉండకలిగితే ఈ నిమిషంలోనే కృతార్థుడవు అవుతావు. చేతిలోని పండులాగా, ఎదురుగా గల పర్వతం లాగా పరమాత్మతత్త్వమును, ఇప్పుడే, ఇక్కడే, ప్రత్యక్షంగా పొందగలుగుతావు. దృశ్యాసక్తి తొలగగా, వృత్తిరహితుడవై ఉన్నప్పుడు ఇక నీయొక్క ఏ రూపము శేషిస్తుందో అదియే పరమాత్మ యొక్క స్వరూపం. అంతేకాని, ఆ పరమాత్మ స్థానంలేక, స్వరూపం ఎప్పుడో ఎన్నడో ఏదో నిర్వర్తించగా ఎక్కడినుండో వచ్చిపడేది కానే కాదు సుమా!

తరంగముల రూపంలో కనిపించేదంతా ఒకే సముద్రజలము కదా! పరమాత్మయే అజ్ఞానులకు 'జగత్తు' రూపమున ప్రతిభాసించుచున్నాడు. జ్ఞానులకో ... జగత్తు స్వస్వరూపంగా అనునిత్యంగా అనుభూతమగుచున్నది. ఈదృశ్యమును ఆత్మగా ఎరుగుటచేతనే మోక్షం లభిస్తోంది. ఎరుగకున్నంత కాలం ఈ సంసారబంధం ఉండియే తీరుతుంది.

❖❖❖

# V. కర్కటి ప్రశ్నలు

## 1. ఈ జీవుడెవ్వడు? ఎందుకు ఉద్భవిస్తున్నాడు?

**శ్రీరాముడు:** మహర్షీ! "చిత్తము" అను ఉపాధితో కూడుకొనియున్న ఈ 'జీవుడు' అనువానికి, ఆ "పరమాత్మకు" గల సంబంధం ఏమిటి? అసలు ఈ జీవుడు ఎవ్వడు? ఇతడు పరమాత్మనుండే ఉధ్భవించాడా? ఎప్పుడు ఏ కారణంచేత ఉద్భవిస్తున్నాడు? లేక ఇంకెక్కడినుంచో వచ్చాడా?

ఈ విషయమై మరికొంత వివరించి చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** శ్రద్ధగా విను. చెప్పుచున్నాను.

స్వతహాగా "శుద్ధము-నిర్మలము-నిత్యము-అఖండము" అయినట్టి బ్రహ్మము ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కచోట అవిద్యతో కూడుకొని ఉంటోంది. అట్లు అవిద్యతో కూడుకొని ఉన్నప్పుడు... అది ఏ విధమైన శక్తితో కూడుకొని ప్రకటితం అగుచున్నదో, తనను తాను ఆ స్వరూపముగానే భావన, అవగాహన, దర్శనములను కలిగి ఉంటోంది. అట్టి దర్శనమునే 'సంసారము' అని అంటున్నాం.

అట్టి 'దృష్టి' లేక 'సంభావన' యొక్క రూపములే బంధ - మోక్షములు. అంతేగాని, ఈ బంధ-మోక్షములు అనేవి భౌతికమైన జన్మ - కర్మలకు సంబంధించినవి కావు. అఖండ చైతన్యమే స్వరూపముగా గల ఈ 'ద్రష్ట' యొక్క అవగాహనను అనుసరించే బంధమోక్షములు ఉంటున్నాయి.

బ్రహ్మమునందు అనాదికాలంగా ప్రకటితమౌతున్న 'చేతనశక్తి' ని "జీవుడు" అని అంటున్నాం. చిచ్ఛక్తి (The manifestation of knowing) ఒకానొకప్పుడు సంకల్ప స్వరూపమును, చిత్త సంస్కారములను అవలంబించి ఉంటోంది. ఇట్లు భావనలను తనంతట తానే సంకల్పించుకొని "ద్వైతభావన" ను దృఢంగా పొందుతోంది. దాని ఫలితంగా "నేను జీవుడను.... నేను పుట్టుచున్నాను.... నేను చచ్చుచున్నాను...." అను రూపముగల జననమరణాది భావములన్నీ పొందుతోంది.

**శ్రీరాముడు :** మునిశ్రేష్ఠా! మీరు చెప్పేదానిని బట్టి "ఉత్తమోత్తమమైయున్నట్టి 'చిచ్ఛక్తి'యే స్వభావవశంచేత 'జీవుడు' అగుచున్నది. జనన - మరణాది భావములు పొందుచున్నది".... అని నాకు అర్థం అవుతోంది. అయితే జీవుడే చిచ్ఛక్తి అయి ఉండి, ఇదంతా స్వభావవశం చేతనే జరిగిపోతున్నప్పుడు ఇక "ఇది దైవము, ఇది కర్మ, ఇది బద్ధజీవి, ఇది మోక్షజీవి, ఇది కారణము" అని చెప్పటంలో అర్థం ఏమున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆకాశము నందు వాయువు ఉంటోంది. ఆ వాయువు ఒకప్పుడు అధికమైన స్పందన కారణంగా వేగంగా సంచరిస్తోంది. మరొకప్పుడు అల్పమైన స్పందనముచే కదలిక లేకయే ఉంటోంది. ఇట్లు స్పంద-అస్పందములు (Vibration - Non vibration) కలిగియుంటున్న వాయువును

మనం స్పర్శ-అస్పర్శలను అనుసరించి గుర్తిస్తున్నాం. అయితే ఆకాశము అనేది అనిర్వచనీయం. అది సాపేక్ష (By Relativity / In relation to certain Presumptions & Assumptions) చేత మాత్రమే మనం గ్రహించగలుగుచున్నాం. అది నిరాకారముకూడా!

ఆత్మాకాశమునందలి 'జీవ చైతన్యము' నందు 'భావనచేయుట' అను వాయు సంచలనమువంటి స్వభావతత్త్వము ప్రకటితమగుచున్నది. అట్టి భావన (లేక) కల్పన యొక్క స్పంద-అస్పందములే "ఈ జగత్తు ఉండటం - లేకుండా పోవటం" అను రూపములుగల సృష్టి ప్రళయములుగా ఏర్పడుచున్నాయి. ఇక ఈ జీవునియొక్క వాస్తవతత్త్వానికి వస్తే, అది ఆకాశమువలె అనిర్వచనీయము. అయినప్పటికీ అది సర్వదా లభ్యమైయున్నది. నిత్యానుభవమైయున్నది. ఈ జీవుడు వాస్తవానికి ఆకారరహితుడే. దేహమునకు ఆకారం ఉన్నది. దేహికి ఆకారం ఏది ?

ఈ జగత్తంతా చైతన్యమే సుమా! చైతన్యము కాక ఈ జగత్తుకు వేరు సత్త లేదు. ఆ చైతన్యము తాను రజోగుణసంపన్నమైన తరుణంలో తదనుగుణమైన ఉపాధిని ఆశ్రయిస్తున్నప్పుడు ఈ సృష్టి సంరంభమంతా ఏర్పడుతుంది. తాను రజోగుణమును ఉపశమింపజేసినప్పుడు తనయందు తానే శాంతమై వెలయుచున్నది. "అనిర్వచనీయం, స్వవిషయకం" అయినట్టి అజ్ఞానము కారణంగా, ఆ చైతన్యము తనయొక్క "చిద్భావము" ను, బాహ్యమైనదానివలె 'ఇది నా చిత్తము' అని తలచుచున్నది. అట్లు తలచుటను శాస్త్రకారులు "చిత్స్పందము" అనే పేరు పెట్టారు.

అట్టి చిత్స్పందమే ఈ "జగత్తు"
అస్పందమే (స్పందరాహిత్యమే) "బ్రహ్మము"

ఆ చిత్స్పందము యొక్క వేరువేరు అవస్థలకు ఇవ్వబడిన సాంకేతిక నామములు (Jargons) ఈ "జీవుడు-దైవము-కర్మలు" మొదలైనవి. ఈ జీవుడు, ఈ శరీరమునకు కారణమైనట్టి కర్మలు, ఆ కర్మల ప్రయోజనమైనట్టి దైవము.... ఇవన్నీ జల-తరంగములవలె బ్రహ్మము యొక్క స్పందములు. కాబట్టి, "అనుభూతి స్వరూపమగు చైతన్యమే చిత్ స్పందము" అని తేలుచున్నది. దానికి జీవుడు, సంసృతి, కారణము.... ఇట్లు వివిధ శాస్త్రములలో ఆయాచోట్ల చెప్పటం జరిగింది.

❖

చైతన్యము తనకు తానుగా అవిద్యను ఆశ్రయించి, ఆ అవిద్యయందు ప్రతిబింబించుచున్నది. అట్టి ప్రతిబింబత్వం "ద్వైతభ్రమ" ('యిదివేరైనది'- అను భావన)కు కారణమై ఈ దేహాదుల అనుభవం పొందుతోంది. అనగా చైతన్యం స్వవిషయకమైనట్టి అజ్ఞానం వలన ఈ కనబడుచున్న నానావిధములైన రూపములను ధరించి సృష్టిగా కనబడుచున్నది. ఇదంతా స్వసంకల్పానుసారమే అనుభవమగుచున్నది. జీవచైతన్యము తనయొక్క "ఇచ్ఛ - అభిలాష" ల కారణంగా నానావిధములైన యోనులందు "ప్రవేశము - నిష్క్రమణము"లను అవిశ్రాంతంగా చేసుకుంటూ పోతోంది. అయితే స్వస్వరూపాత్మ సర్వదా యథాతథం సుమా!

❖

ఈ విధంగా చైతన్యము నానావిధములైన జన్మలు లేక యోనులందు ఎందుకు సంచరిస్తోంది? అవిచారణ, అజ్ఞానము, ఇంద్రియములకు సంబంధించిన దృశ్యతాదాత్మ్యము అందుకు కారణమ గుచున్నాయి. ఏది ఏమైతే ఏం? చేతనము యొక్క అంశయే ఈ జీవుడు.

అట్టి దృశ్యాసక్తితో కూడిన చేతనాంశమును "పరిమిత ద్రష్ట" అని అంటున్నాం. అద్దం మరొక వైపు తిరిగి ఉండుటచే దృశ్యము ప్రతిబింబించదు కదా! చేతనాంశము బాహ్యానుభవ దృష్టి కలిగి యుండుటచే అది తనయొక్క వాస్తవ స్వరూపమునకు సంబంధించిన 'ఎరుక' (లేక) 'దృష్టి' ని ఏమరచుచున్నది. ఆ చేతనాంశమే మరొకసారి 'ఆత్మ' (లేక) 'నిర్మల సత్త' యొక్క పూర్ణానుభవమును ఆశ్రయించి ఉంటోంది. అనగా అది సర్వ జగత్ విశేషములకు అతీతత్వము సంతరించుకుంటోంది. అట్టి స్థితియే "ఉత్తమ జ్ఞాన స్థితి", "స్వయంజ్యోతిత్వము", "ముక్తి" మొదలగు పేర్లతో చెప్పబడుతోంది.

అట్టి ఎరుక స్థితి పొందేది ఎట్లా?

'నేను దృశ్యమునకు సంబంధించినవాడను కాను. ఈ దృశ్యము నాకు సంబంధించినది కాదు. నిష్కళంకము, నిర్మలము, సర్వాత్మకము అయినట్టి శుద్ధతత్వమునే నేను" అనునట్టి 'మననము' దృఢపడుటచేతనే అట్టి జ్ఞానార్హత లభిస్తోంది. "ఏది తానో, అదే తదితరులు" (తత్ త్వమ్ అసి – సోఽహమ్) అను సంభావనచే ఆ జ్ఞానము పూర్ణమగుచున్నది.

ఈ చైతన్యము ఏ ఉపాధియందు 'దృష్టి' ఉంచుచున్నదో, అది ఆ దృష్టికి సంబంధించిన ఆకృతినే పొందుచున్నది. తనయొక్క "సంకల్పము–ఆసక్తి–అభిలాష"లను అనుసరించి సూక్ష్మ భూతము లతో ఏకత్వము పొందుచున్నది. పితృశరీరమునుండి 'శుక్రము' రూపమున వెలువడి ఆయా అభిలషిత దేహములను ఒక దానివెనుక మరొకటి పొందుతూనే పోతోంది. అట్టి ప్రతి శరీరము పొందినట్టి కాల – స్థానము లందు (Time and place) కొన్ని అనుభవములను పొందుతోంది. మరల ఆ అనుభవము–జ్ఞానములను అనుసరించి బంధమో, స్వర్గమో, మోక్షమో పొందుచున్నది.

ఏది ఏమైనప్పటికీ, ఆయా ఉపాధులందు సంచరిస్తున్న ఈ "చైతన్యాంశము" తనయొక్క "సర్వమునందు విస్తరించి ఉండుట" అను స్వరూపమును ఏమాత్రం ఏక్షణంలో కూడా త్యజించుట లేదు. కాని, ఇక్కడ కేవలం మరచుట–భ్రమించుట... మాత్రం జరుగుతోంది. అనేక శాస్త్రములు, అనేక ప్రవక్తలు అనేక రీతులుగా చెప్పుచున్నదంతా అంతిమసారం దృష్ట్యా చూస్తే "ఈ జీవునికి ఇతని సర్వసమత్వరూపమైనట్టి సర్వాత్మకత్వమును గుర్తు చేయుటయే" అని మా అభిప్రాయం.

❖

ఈ సర్వజీవులలోని వాస్తవతత్వమగు చైతన్యము సర్వదా ఒక్కటిగానే ఉన్నది. దానియందు ఏ క్షణమునందుకూడా అనేకత్వమునకు తావే లేదు. కాని కేవలం భిన్నభిన్న ఉపాధులతో భిన్నభిన్న విధములుగా తనను తాను సందర్శించుకుంటోంది. "ఇతడు తండ్రి, ఇతడు కుమారుడు. ఇతడు మిత్రుడు. వీరంతా తదితరులు"... ఇత్యాది వ్యవహారమంతా కేవలం ఉపాధికి సంబంధించినదే. స్వయంకృతమగు మనోకల్పితమే! సువర్ణము సర్వదా ఒక్కటే అయినప్పటికీ, "ఉంగరం– గాజులు

– కంకణము" వంటి ఆకృతులను పొంది భిన్నము అయినట్లు అగుపడుచున్నది కదా! చైతన్యము సర్వదా ఒక్కటే! అది అద్వితీయము! అయినప్పటికీ వేరువేరు స్థావర–జంగమ శరీరములను ధరించి భిన్నము, ఖండము అయినట్లు ఒకానొక విచిత్రమైన భ్రమానుభవం తనకుతానుగా కల్పించుకుని పొందుతోంది. ఈ శరీరములకు ఉపాదానకారణం పంచభూతములుకదా! పంచభూతముల ఉత్పన్నము, రకరకములైన సమ్మేళనములు, నానాత్వపు అనుభవం, జ్ఞాన–అజ్ఞానములు.... ఇవన్నీ జలములో ఏర్పడే తరంగాలవలె ఏర్పడుచున్నాయి. "కెరటము–ప్రశాంత జలం" లాగా చింత – నిశ్చింతలు ఆ నిత్యసత్య చిద్వస్తువునందు స్వప్నసదృశంగా ఏర్పడుచున్నాయి. "శుద్ధము – నిత్యము– అనంతము" అను స్వభావము కలిగియున్నట్టి ఆ చిద్వస్తువు, "నేను జన్మించుచున్నాను. మరణించు చున్నాను".... మొదలగు భ్రాంతులన్నీ పొందుతోంది. స్వప్నంలో 'కాలుజారి పడడం' మిథ్యయే అయినప్పటికీ ఆ స్వప్నసమయంలో దృఢమైన సత్యమువలెనే అగుపించుచున్నది కదా! "నేను–నాది" మొదలైన భ్రాంతులతో కూడిన ఈ చిత్తము..... మిథ్యా మాత్రము అయి ఉన్న...... ఈ జనన మరణములను అనుభవించుచున్నది.

లవణుడు అను ఒక మహారాజు ఒక గంట సమయంలో అనేక సంవత్సరములుగా విస్తరించి యున్న సుదీర్ఘమైన–చండాలుని జీవితం చవిచూడడం మనం ఈ ప్రకరణంలో గమనించబోవుచున్నాం. 'అవిద్య' చే మోహము చెందినట్టి ఈ చిత్తము తనయొక్క అధిష్ఠానమైయున్న ఆత్మయందు "జగద్దృశ్యము" అనబడు స్వప్నమును గాంచుచున్నది. ప్రశాంత సముద్రంలో తరంగాలు లేచినట్లు, శాంతిమయమగు "చిదాకాశము" నందు సృష్టివైపు ఉన్ముఖమైన 'చిత్తు' ఉదయిస్తోంది.

❖

ఓ రామచంద్రా! ఇలా జగత్తుగా గాంచబడుచున్నదంతా 'మనోవికారము' మాత్రమే సుమా! ఉల్లాసముతో కూడిన మనోతరంగములు మననరూపము ధరించి, ఆత్మకు వేరైనదానివలె ప్రవర్తించు టయే ఈ సంసారచమత్కారం. అయితే, మనస్సు ఒకానొకప్పుడు ఉద్బోధింపబడినదై "స్వసత్త" యందు లయించిపోతోంది. అనగా అది స్వరూపస్వభావముల దృష్ట్యా 'ఆత్మ' యే అగుచున్నది.

"చిత్" అను జలముతో కూడిన "బ్రహ్మసాగరము" నందు ఈ కనబడుచున్న అనేక జీవులంతా 'సుడులు' వంటివారు. ఈ దృశ్యమునందు పాల్గొనుచున్న చిత్తములు దానియందు కెరటముల వంటివి. ఇక్కడ కనిపించే స్వర్గము–నరకము మొదలగునవన్నీ నీటి బుడగలవంటివి. ఇక్కడి చమత్కారమేమిటంటే... "పరిశీలించి చూడటం జరిగితే, ఏదైతే స్వతహాగా, (లేదా, ఉత్తమమైన వాస్తవదృష్టిచేత) లేనే లేదో"...... అట్టిదే ఇదంతా! అయితే, ఇదంతా కూడా "నిర్దుష్టమైన సత్యమా?" అన్నట్లుగా ప్రాప్తిస్తూ వస్తోంది. అట్టి రూపముగల అనుభవమునే "మాయ" అని అంటున్నాం.

మరి ఈ మాయ తొలిగేది ఎట్లా?

పరబ్రహ్మమును గ్రహించటం ఒక్కటే ఈ మాయను ఛేదించుటకు ఉపాయం. పరబ్రహ్మము యొక్క సమక్షము అచింత్యము, మహాశక్తియుతం కూడా. అట్టి శుద్ధ పరబ్రహ్మమునందు 'మాయ'

యొక్క విజృంభణము స్వాభావికంగానే ఒకచెట్టు యొక్క నీడవలె ఏర్పడుతోంది. అట్టి విజృంభణమే ఒకవైపు జీవుడు (లేక ద్రష్ట) యొక్క రూపముగాను, మరొకవైపు జగత్తు (లేక దృశ్యము) రూపముగాను ఒకే సమయంలో ప్రకటితం అవుతోంది.

వాస్తవానికి జ్ఞానుల దృష్టిలో– ఈ జీవుడు, సంకల్పాత్మకమగు ఈ మనస్సు, ఈ బుద్ధి, చిత్తము, అహంకారము, మాయ– ఇవన్నీ కూడా చిత్తు యొక్క వివిధ నామములే అయిఉన్నాయి. అంతటికీ కారణం మనస్సే. మనస్సే స్వయముగా తనయందు శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములను (పంచతన్మాత్రలను) కల్పించుకొని 'మిథ్య' యే అయినట్టి జగత్తును సత్యమువలె విస్తరింపచేస్తోంది. మనస్సుయొక్క ఈ జగద్దర్శనం ఒకడు తన స్వప్నంలో ఆయా వస్తువులను చూచుటవంటిది. నిజానికి శుద్ధము–నిత్యము అయినట్టి ఆత్మ సర్వదా శాంతభావముననే వెలయుచున్నది. పరమార్థ దృష్టితో చూస్తే... అది దేనినీ గాంచుటయే లేదు. అట్లు అయివుండికూడా, వ్యవహారికంగా చూచినప్పుడు ఈ ఆత్మ 'చిత్తము' అనబడు ఒకానొక స్వభావమును ఆశ్రయించి, తత్ఫలితంగా భ్రమను అనుభవిస్తోంది.

**1. 'జాగృత్' అవస్థ** (జాగృత్‌లో 'నేను') : ఈ చిత్తము ఒక సమయంలో ఇంద్రియముల ద్వారా బాహ్యత్వమును పొందుచున్నది. దీనినే "సంసృతమగుట (లేక) సంసృతి" అని యోగశాస్త్రం చెప్పుచున్నది. అప్పటి ఆత్మయొక్క స్థితిని "జాగ్రదవస్థ" అని అంటున్నాం.

**2. స్వప్నావస్థ** (స్వప్నంలో 'నేను') : మరొకప్పుడు ఇదే చిత్తము అహంభావముతో కూడుకొని హృదయ–కంఠమధ్య ప్రదేశంలో సంచరిస్తోంది. అది "స్వప్నావస్థ" అనబడుచున్నది.

**3. సుషుప్తి** (సుషుప్తిలో 'నేను') : ఈ చిత్తమే ఇంకొకప్పుడు "స్మృతి" అనబడు గూటిలో వాసనలన్నీ దాచివేసి మౌనావస్థను అనుభవిస్తున్నది. దానిని "సుషుప్తి" అని అంటున్నాం.

**4. తురీయస్థితి** (నాలో జాగృత్–స్నప్న–సుషుప్తిజగత్తులు) : పై మూడు అవస్థలను కూడా దాటి అది తన యొక్క చిత్స్వరూపమున వెలయుచున్నది. అప్పుడు ఆ స్థితి యందు తననుతానే సర్వే–సర్వత్ర, సర్వమునందు చూచుచున్నది. ఈ సర్వము తనయందే ఉన్నట్లు గాంచుచున్నది. "జాగృత్‌లో నేను – స్వప్నంలో నేను – సుషుప్తిలో నేను" అను దర్శనమును అధిగమించి "నాలో జాగ్రత్ స్వప్న సుషుప్తులు" అను రూపంగా సందర్శిస్తోంది. అట్టి దర్శనమే 'తురీయము' అని పిలవ బడుతోంది. ఈ స్థితి 'దృక్ – దృశ్యము' అను రెండింటిని అధిగమించినప్పటిది సుమా! ఆ 'తురీయపదము' లేక 'పరమపదము' అత్యంతశుద్ధము, సన్మాత్రము, నిరామయము, శాంతము, అఖండానందప్రదము అయి ఉన్నది. అద్దానిని పొందడం జరిగినప్పుడు ఈ దుఃఖములు, శోకములు సమూలంగా వినష్టమైపోతున్నాయి.

❖

ఓ రాఘవా! ఒకనికి మిథ్యాదృష్టి కారణంగా నిర్మలాకాశంలో ముత్యములు ఉన్నట్లు అనిపిస్తూ, ఇంతలోనే మటుమాయం అగుచున్నట్లు తోచుతూ ఉంటుంది చూచావా? అదేవిధంగా ఆ

పరమపదమందు (లేక) పరమాత్మయందు బ్రహ్మాండములు ప్రకాశించటం, ఇంతలోనే విలీనమై పోవటం, ద్రష్టయొక్క మిథ్యాదృష్టిచేత కానవచ్చుచున్నాయి. భ్రమచేత నిర్మలాకాశంలో కనిపించే ముత్యములకు వాస్తవమైన 'సత్త' ఎక్కడఉన్నది? ఏ సమయంలోకూడా మిథ్య అయినట్టి ముత్యములకు నిర్మలాకాశం ఆధారమని అనలేం కదా! అదంతా చూచువాని దృష్టిలోపమే అయినట్లు, ఈ బ్రహ్మాండములకు కూడా 'సత్త' లేదు. ఇవి బ్రహ్మమునందు అధిష్ఠితమై ఉండియుండనేలేదు. కాని, అజ్ఞాన దృష్టిచే ఈ దృశ్య బ్రహ్మాండములు ఆత్మకు వేరైనట్లు వీక్షింపబడుచున్నాయి.

ఒక బాలుడు తనకు తానే కల్పించుకొనిన 'కల్పన' కారణంగా ఆకాశంలో ఏదో పెద్ద వృక్షం ఉన్నట్లు చూస్తూ ఉంటాడు. అట్టి భ్రమాత్మకమైన వృక్షమును "ఆకాశవృక్షం" అంటారు. "ఆ వృక్షమునకు ఉత్పత్తిగాని, ఉనికిగాని, వృద్ధిగాని, వినాశముగాని పొందుటకు ఆకాశము కారణము" అని అన గలమా? లేదు. ఎందుకంటే అదంతా చూచిన అజ్ఞానబాలకుని భ్రమయేకాని, అసలు ఆకాశంలో వృక్షం ఎట్లా ఉంటుంది?

నిష్క్రియమగు బ్రహ్మము దేనికీ కారణం కాదు.

❖❖❖

## 2. జగత్తుకు కారణం బ్రహ్మమా?

**శ్రీరాముడు:** అయితే మహర్షీ! "మాయచే విజృంభించుచున్న ఈ జగత్తుకు మూలకారణం బ్రహ్మమే. సర్వమునకు కర్త బ్రహ్మమే" అని లోకమునందు వ్యవహరించబడుతోంది కదా!

**శ్రీవసిష్ఠమహర్షి:** అవును. అట్టి లోకరీతి ఉన్నమాట నిజమే, కాని అట్టివాక్యము బోధకొరకు మాత్రమే చెప్పబడుతోంది. "ఈ 'జగత్తు' అనబడునది లేదు" అనునట్టి సత్యమునకు సంబంధించిన దృఢనిశ్చయం ఏర్పడే వరకే ఆ వాక్యాలు చెల్లుతాయి.

ఇక్కడ నీకు మరొక దృష్టాంతం చెపుతాను. విను. ఒక దర్పణంలో ఎదురుగా ఉన్న వస్తుజాలం, ఆ వస్తువుల కదలికలు ప్రతిబింబించుతాయికదా! ఆ దర్పణం తనయందు ఎట్టి ఇచ్ఛాద్వేషములు, ప్రియ- అప్రియములు, రాగ-విరాగములు లేకుండానే తనయందు చూపుతోంది. అనగా, "నేను ఈ వస్తువులనైతే చూపుతాను. వాటిని చూపను. ఎందుకంటే, అవి నాకు ఇష్టం కాదు...." అనునది ఆ అద్దమునకు ఉండదు. అందుచేత, ఆ ప్రక్రియ యొక్క కర్తృత్వమును దర్పణమునకు ఆపాదించలేం. సామీప్యత-సన్నిధానముల మాత్రం చేత దృశ్యము అద్దము నందు ప్రతిబింబిస్తోంది. అంతమాత్రం చేత ఆ ప్రతిబింబిస్తున్నది అద్దములోని భాగమని కూడా అనలేం కదా! అట్లాగే, సామీప్యత-సన్నిధానం కారణంగా ఈ 'జగత్తు' అనబడునది ప్రకాశించబడుటచే "ఈ జగత్తుకు కారణం ఆత్మచైతన్యము" అని చెప్పబడుతోంది. అద్దమే లేకపోతే ప్రతిబింబమే ఉండనట్లు, ఆత్మచైతన్యమే లేకుంటే 'జగత్తు' అను అనుభవం ఎక్కడిది? ఎవరికి?... కాని, ఈ జగత్తు ఆత్మయొక్క ఒక శరీర భాగమని అనటానికి కూడా వీలు లేదు.

ఒక బీజము నుండి అంకురములు, ఆకులు, ఫలములు ఉత్పన్నమగునట్లు, 'చిత్తు' నుండే చిత్తము – జీవులు–మనస్సులు.... అంతా కలుగుచున్నాయి. ప్రళయసమయంలో సృష్టిరహితమై 'శుద్ధ చిత్తు' శేషిస్తోంది. ప్రళయానంతరం మరల "సృష్టి" ఆకారమున వివర్తమునొందుచున్నది. అంకురశక్తి మౌనంగా నిదురించియున్న బీజంలోంచి వృక్షంగా.... మరల ఆ వృక్షంలోంచి బీజముగా ఉత్పన్నమగుట లేదా? ఇది కూడా అట్టిదే.

బీజంలో ఉండిఉంటున్న "వృక్షమును జనింపజేయగల శక్తి" మరియు బ్రహ్మమునందు ఉండి ఉన్నట్టి "జగత్తును జనింపజేయగల శక్తి".... ఈ రెండూ ఒక రకంగా సమానములైనవే. అయితే ఆ రెండింటిమధ్య ఒక భేదము గోచరిస్తోంది. 'బీజము' కంటే వేరుగా 'వృక్షము' అనబడునది ప్రాప్తిస్తోంది కదా! కాని బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానము ఉదయించిన తరువాత "బ్రహ్మము కంటే వేరుగా విశ్వము లేదు" అనబడు బోధ ఏర్పడుచున్నది. బీజము–వృక్షములు, బ్రహ్మము – జగత్తులు అను దృష్టాంతములకు ఉన్న తేడా ఇంతే.

❖

దీపం ప్రకాశిస్తూ ఉండగా, ఆ దీపపు కాంతిలో వస్తువులు కనబడతాయి. కాని "ఆ దీపమే ఈ వస్తువులను మాకు చూపుచున్నది" అని అనగలమా? అనలేము. ఎందుకంటే, "ఈ వస్తువులను ఇతనికి చూపాలి. ఇవి ఇతనికి చూపకూడదు" అనునట్టి ఇచ్ఛ ఆ దీపమునందు లేదుకదా! అయితే దీపమే లేకుంటే చూడనేలేమే! బ్రహ్మము యొక్క సమక్షంలో ఈ జన్మాదులు, భావాభావములు ఉంటున్నాయి, లేకుండా పోతున్నాయి కూడా. అయితే "వీటికి బ్రహ్మము కారణము" అని అనలేం. కాని, బ్రహ్మమే లేకుంటే ఇక ఈ జగత్తు, జన్మమృత్యువులు, మొదలైనవన్నీ పొందేదెవరు? కాబట్టి, బ్రహ్మము ఉన్నది కాబట్టే జగద్వ్యవహారము, తదితరములు ఉంటున్నాయి.

భూమిని ఎక్కడ త్రవ్వటం జరిగితే.... అక్కడ ఆకాశం ఉండనే ఉండి ఉంటుంది కదా! విచారించి చూస్తే.... సర్వేసర్వత్ర "ఏకము–అద్వితీయము" అగు చైతన్యమే గోచరించగలదు.

ఒక పిల్లవాడు ఒక అద్దంలోనో, లేక స్ఫటిక శిలాఖండంలోనో ప్రతిబింబిస్తున్న ఆకాశంలోని చంద్రుని చూచి "ఇతడు వాస్తవ చంద్రుడే. ఇతనిని మనం పట్టుకోగలం" అని అనుకుంటూంటాడు చూచావా? అవిద్యామోహితులైన వారు మాత్రమే బ్రహ్మమునందు 'జగత్తు'ను గాంచుచున్నారు. స్ఫటికశిలాఖండంలో స్ఫటిక పదార్థమే ఉన్నది గాని చంద్రుడు మొదలైనవి ఉన్నాయా? జలంలో పున్నమిరోజు చంద్రుడు కనిపిస్తున్నాడనుకో.... జలంలో జలమే ఉన్నదికాని చంద్రుడు ఎక్కడ? అద్దములో 'గాజు–తగరము' అను రెండు పదార్థములే కాని, అందు చంద్రుడు–ఆకాశం ఎక్కడ ఉంటాయి? 'అరణ్యం' అద్దములో ప్రతిబింబిస్తున్నప్పుడు, ఆ అద్దంలో మృగముల, పక్షుల కదలికలు కనిపించినంత మాత్రంచేత అవన్నీ అద్దంలో ఏర్పడుచున్నాయని అనగలమా? బ్రహ్మముకూడా 'ప్రపంచము' వలె ప్రతిభాసిస్తోంది. బ్రహ్మమునందు జగత్తుగా ప్రతిభాసించేదంతా బ్రహ్మమే అయిఉన్నది.

కాబట్టి ఓ రామచంద్రా! నీచే గాంచబడుచున్న 'ప్రపంచము' అనబడునదంతా నీ స్వస్వరూపమునకు ఏమాత్రం వేరుకానట్టి "బ్రహ్మమే" అయిఉన్నది. "వేఱు"గా గాంచుట స్వకల్పితమైన 'మాయ' చేతనే. ఇట్టి ఆత్మస్వరూపమునకు సంబంధించిన 'ఎరుక' అంతరంగమున దృఢత్వం పొందిన జ్ఞానికి – జన్మ మృత్యువులతో సహా ఇందు ఏదీ విపరీతమైనదిగా కనిపించదు.

**శ్రీరాముడు :** మీరు చెప్పుచున్నదంతా ఎంత చిత్రమైన విషయం! చూచారా మహర్షీ! పరిదృశ్యమానమై, ఘనీభూతమై కనిపిస్తున్న ఈ జగత్తు వాస్తవానికి 'మిథ్య' యే అయిఉన్నది కదా! కాని మా అనుభవమునకు మాత్రం "ఇదంతా ఇట్లే వాస్తవం" అను రూపముగల ఏదో దృష్టి ఏర్పడుతోంది. ప్రభూ! మీరు చెప్పినది వింటూ ఉండటంచేత ఈ జగత్తు యొక్క స్వరూప – స్వభావాలు క్రమక్రమంగా తెలియవస్తున్నాయి. ఇదంతా ఎంతో సూక్ష్మం, స్వచ్ఛం, ప్రస్ఫుటం అయి ఉన్నది. మహాత్మ స్వరూపమే అయిఉన్నది. కాని "మంచుతుంపరలుతో పోల్చతగిన ఈ తన్మాత్రల (శబ్ద–స్పర్శ–రూప–రస –గంధముల) అసత్  దృష్టి కారణంగా, అందుకు వ్యతిరిక్తంగా కానవస్తున్నది.

తండ్రీ! ఇప్పుడు "సమష్టి – వ్యష్టి" దేహముల గురించి, ఆ దేహముల అభిమానులగు "విశ్వుడు (Universal 'I') – వైశ్వానరుడు(Individual 'I')" అనబడువారి గురించి... వారు ఎట్లా ఉత్పన్నమగుచున్నారో చెప్పండి.

**శ్రీవసిష్ఠమహర్షి :** 'ఆకారము' అంటూ ఏదీ లేనట్టి "పిశాచము" అనబడునది ఒక అమాయిక బాలుని హృదయంలో ఆకృతి కలిగిఉన్నట్లు స్ఫురిస్తుంది కదా!

ఈ జీవుడు వాస్తవానికి 'ఆకృతి' అంటూ ఏదీ లేనివాడే! అతడు మొట్టమొదట పరబ్రహ్మమున ప్రకాశించుచున్నాడు. అతని స్వరూపము సర్వదా పరబ్రహ్మమే. పూర్వ కల్పీయమైన జీవ సంస్కారములను అనుసరించి 'జీవభావము' అనునది పరబ్రహ్మమునందు జలమునందలి తరంగమువలె ప్రకాశిస్తోంది. ఈ జీవుడు ఒకవైపు పరమశుద్ధుడు. పరబ్రహ్మము యొక్క సర్వలక్షణములను కలిగియే ఉన్నాడు. అట్లు స్వతహాగా 'శుద్ధుడు' అయి ఉండి కూడా వాసనలచే ఉద్భవించిన దేహములను అనుభూతిచెందుచున్నాడు. ఇతడు పరమాత్మకు అభిన్నుడే కాని, భిన్నుడుగా గోచరిస్తున్నాడు. అతడు సత్యస్వరూపుడై ఉండికూడా కల్పనతోకూడి ఈ జగత్తును దర్శిస్తున్నాడు.

పరమాత్మయే "నేను జీవుడను–దేహమును–ఖండుడను" అను కల్పనను ఆశ్రయించుటద్వారా జీవభావమును పొందుచున్నాడు. చైతన్యమే ఈ జీవుని స్వరూపము. అట్టి ఈ జీవుడు మననజ్ఞానము వలన "మనస్సు" గా ప్రకాశమును పొందుచున్నాడు. ఆ మనస్సే తన్మాత్రల గురించి చింతించుటచేత శబ్దస్పర్శాదుల అనుభవం పొందుతోంది. పరమాణువుకంటే కూడా ఎంతో సూక్ష్మమైనట్టి ఆ మనోచైతన్యం నిర్విషయ చిదాకాశమున చమత్కార పూర్వకంగా స్ఫురించటం జరుగుతోంది.

ఒకేజలం "ఒక నీటిబిందువు.... అనేక తరంగములు"గా కూడా అవుతోంది చూచావా! చిదాకాశమునందు వ్యష్టి (Individual 'I')– సమష్టి (Universal 'I')తత్వములు కూడా అట్లాగే ప్రభవిస్తున్నాయి.

సమష్టి పట్ల అభిమానము గల జీవుడు = హిరణ్యగర్భుడు (విశ్వుడు)

వ్యష్టితత్వము పట్ల అభిమానముగల జీవుడు = వ్యష్టిజీవుడు (వైశ్వానరుడు)

సమష్టిమనో రూపుడగు హిరణ్యగర్భుని యందు మనోకల్పనా రూపంగా అసంఖ్యాకములైన బ్రహ్మాండములు స్ఫురిస్తున్నాయి. అనగా, ఈ బ్రహ్మాండములన్నీ సమష్టిమనస్సు నందే ఉన్నాయి ఇక ఈ బ్రహ్మాండములందు సూక్ష్మదేహములు ఒక గొప్ప శిలయందు చిత్రించబడిన అనేక చిత్రముల వలె ఉంటున్నాయి. విచిత్రం చూచావా? అట్టి మనోరూపమును పొందిన జీవ చైతన్యము తన స్వస్వరూపమును విస్మరించుటచే తన వాస్తవస్వభావమును గుర్తించజాలక "నేనెవడను?" అను ఒకానొక సందిగ్ధజ్ఞానము పొందుచున్నది.

ఇట్లు 'మననము' అను రూపముగల సూక్ష్మదేహములను (మనస్సు + బుద్ధి + చిత్తము + అహంకారములను) ఆ జీవచైతన్యం ధరిస్తోంది. ఎప్పటికప్పుడు ఇతఃపూర్వపు సంస్కారములు, పురుషార్థములతో కూడి 'ఉపాధి' రూపమున ఉదయిస్తోంది. క్రమంగా 'జగత్తు' అను శబ్దము యొక్క అర్థమును, తత్వమును అస్ఫుట – జ్ఞానరూపమున పొందుతోంది. మనోచైతన్యం "నేను శరీరమును, వ్యష్టిని" అనునట్టి మననముచే ఈ శరీరములను ప్రకాశింపచేయుచున్నది. అట్లు ప్రకాశిస్తున్న ఈ శరీరము నుండి ఆ "జీవచైతన్యస్ఫూర్తి", అంతరమున మనో–బుద్ధి–చిత్త–అహంకారములను, వెలుపల ఇంద్రియముల ఉత్పత్తిని, ఆ ఇంద్రియములకు అనుభవమగుచున్న వస్తుజాలముతో కూడిన జగత్తును పొందుచున్నది.

| | | |
|---|---|---|
| వెలుపల "రసము" | --- | శరీరమునందు 'నాలుక' |
| వెలుపల "రూపము" | --- | శరీరమునందు 'కనులు' |
| వెలుపల "గంధము" | --- | శరీరమునందు 'ముక్కు' |
| వెలుపల "శబ్దములు" | --- | శరీరమునందు 'చెవులు' |

ఇట్లు ఆయా ఇంద్రియ భావనలు ఘనీభూతమగుచుండగా అతనికి "శబ్దములను వినుట" మొదలైన ప్రక్రియవ్యవహారమంతా సమీపిస్తోంది. ఇట్లు జీవాత్మ కాకతాళీయంగా క్రమక్రమంగా దేహభావమును అనేకసార్లు గ్రహించుచున్నాడు.

ఈ జీవాత్మ ఏ అంశమునందు శబ్దం వినటం జరుగుతోందో దానిని 'చెవులు' అని అంటున్నాం. వాస్తవానికి 'జీవాత్మ' అనునది మిథ్యయేనని జ్ఞానులు గ్రహిస్తున్నారు. ఎందుచేతనంటే, జగన్నాటకాంతర్గతంగా పాత్రధారునివలే కనిపించే ఈ జీవుడు... జగదతీతంగా పరంజ్యోతి స్వరూపుడే! అయినా, 'అజ్ఞాన' అనే పాత్ర రూపంగా అజ్ఞానదృష్టికి సత్యమువలె గోచరిస్తున్నాడు.

'చెవులు' లాగానే ఆ జీవచైతన్యము రూపమును గ్రహించే చోటును 'కళ్ళు' అని, గంధమును గ్రహించేచోటును ముక్కు అని అంటున్నాం. ఈ ఇంద్రియములన్నీ భావనామయములే సుమా! ఈ జీవాత్మ భావావేశముచే, "నేను ఈ దేహము కలవాడను. బాహ్యవిషయములను 'గుర్తించుట, అనుభవించుట, ప్రకాశింపచేయుట' మొదలగు ధర్మములను నిర్వర్తించగల ఇంద్రియ రంధ్రములు కలవాడను" అని తలపోయుచున్నాడు.

సమష్టి జీవుని-వ్యష్టిజీవుని భావమయములైన 'ఆతివాహిక దేహములు' (లేక సూక్ష్మ దేహములు) మొట్టమొదట ఉత్పన్నమౌతున్నాయి.

ఓ రామచంద్రా! ఈ విధంగా అవ్యక్తమైనట్టి పరమాత్మయే అజ్ఞానముతోగూడి - ఆతివాహిక - దేహములను పొందుచున్నది. అజ్ఞానము తొలగిందా, ఇక "నేను స్థూలదేహిని, సూక్ష్మదేహిని" అను భ్రమకూడా తొలగుతోంది. ఆత్మజ్ఞానము కలిగిన తరువాత ప్రమాణము ఉండదు. ప్రమేయము (జీవుడు : Objected Created) కూడా ఉండదు. ప్రమాతృత్వమూ (process of creation) ఉండదు. అజ్ఞానముచే ఏర్పడినట్టి "వ్యష్టి అభిమాని-సమష్టి అభిమాని"... లేనివే అవుచున్నాయి.

ఒకే 'పరాసత్త'- "నేను బ్రహ్మమును" అను భావనచే బ్రహ్మముగను, "నేను సమష్టిజీవుడను" అను భావనచే 'సమష్టి'గను, "నేను వ్యష్టిజీవుడను" అను భావనచే 'వ్యష్టి' గను ప్రతిభాసిస్తోంది.

**శ్రీరాముడు :** ఈ జీవుని స్వస్వరూపమైనట్టి "చిన్మాత్రతత్వ" అగు బ్రహ్మమునందు అజ్ఞానము యొక్క ఉనికి ఎలా సాధ్యం? అందుచేత బ్రహ్మముయొక్క అద్వైతస్థితి (దానికి వేరైనదంటూ ఏదీ లేకపోవడం) స్వతఃసిద్ధమే అయిఉన్నదికదా! మరి ఇంక విధి-నియమములు-విచారణ-మోక్షము.... మొదలైన భేదకల్పనతో ఆవశ్యకత ఎందుకుంటోంది?

**శ్రీవసిష్ఠమహర్షి :** మంచి ప్రశ్నే వేశావు. ప్రశ్న గొప్పది అయినప్పటికీ అది తగిన సమయంలో వేస్తేనే ప్రాశస్త్యం. ఏదైనా యోగ్యమైన కాలంలోనే శోభిస్తుంది కదా! నీ ప్రశ్న ఇప్పటికి తగినట్లే ఉన్నది. ఇక విను. "ఈ జగత్తంతా సమష్టి జీవాభిమాని అయినట్టి 'హిరణ్యగర్భుడు' అను పేరుతో పిలువబడువాని స్వప్నము' అని చెప్పబడుతోంది. ఆ హిరణ్యగర్భుడు (అతడే బ్రహ్మదేవుడు - పితామహుడు అని శాస్త్ర ప్రసిద్ధి) ఓంకారరూపమగు ప్రణవమును ఉచ్చరించుచు అద్దాని యొక్క అర్థమును గ్రహించుచు మనోరాజ్యమును విస్తరింపజేయుచున్నాడు.

ఇక ఈ 'జీవాత్మ' (వ్యష్టిజీవుడు) కూడా అట్లే యథాకాలమున స్వప్నతుల్యంగా స్వప్నాత్ముడగు హిరణ్యగర్భుని స్వప్నవ్యవహారమునందు ఆవిర్భవించుచున్నాడు. జీవాత్మలన్నీ హిరణ్యగర్భుని రూపమే. స్వప్నములో కనబడే స్వరూపములన్నీ స్వప్నద్రష్టవేగాని, మరింకెవరివో కాదు కదా!

అయితే, ఈ సమష్టిమనోరూపము 'పరమాత్మ' యందు దర్పణాంతర్గత ప్రతిబింబమువలె అగుపిస్తున్న ఈ దృశ్యజగత్తు స్వప్నప్రాయమే కనుక, "ఇదంతా అసత్తే" అని చెప్పబడుతోంది. అదేవిధంగా 'వ్యష్టి - మనోరాజ్యము' అయినట్టి జగత్తు, కూడా చిదాకాశమునందు అసత్తే అగుచున్నది. వాస్తవానికి ఈ 'జగత్తు' అనబడునదేదీ జన్మించుట లేదు. మరణించుటలేదు. స్వప్నంలోని సంకల్పమాత్ర రూపములకు జన్మఏమి? మరణం ఏమిటి? ఒక్క బ్రహ్మము మాత్రమే సర్వదా పరమార్థ సత్యము. ఆ బ్రహ్మమే జగద్రూపంగా, మరియు 'ప్రతిభాసితమాత్ర సత్యము'గా అగుపిస్తోంది. ఊహాతత్వముగా ప్రకాశిస్తోంది.

అట్లు 'ప్రకాశించుట' లేక 'తోచుట' కేవలం అవిచారణచేత మాత్రమే సుమా! పరిశీలించి చూస్తే 'బ్రహ్మదేవుడు' మొదలుకొని ఒక పురుగు వరకు.... ఈ జీవుల అందరి 'సత్త' కూడా

'సత్-అసత్' మయమే. అజ్ఞానం తొలగిపోతే అన్నీ అసత్తులే అగుచున్నాయి. అజ్ఞానకాలంలో ఉండియే తీరుచున్నాయి.

**ఒక్కొక్క జీవిది ఒక్కొక్క సృష్టి**

పిపీలికాది బ్రహ్మపర్యంతము (ఒక పురుగు మొదలుకొని బ్రహ్మదేవుని వరకు) అందరి సృష్టులు సమానమే. ఇక బేధమేమిటంటావా? 'విశుద్ధ - సత్వప్రధానము' చే బ్రహ్మదేవుడు 'గొప్ప వాడు' మహోన్నతుడు, మహాశయుడు అని అంటున్నాం. 'మలినసత్వ ప్రధానము అగుటచే 'కీటకము తుచ్ఛమైనది' అంటున్నాం. ఆ రెండిటిలోని ఇచ్ఛ, భావన మొదలైనవాటి యొక్క మూలము "సంకల్పము" ఒక్కటే. ఉభయుల అనుభవములు స్వయంకల్పితమే!

**శ్రీరాముడు :** "బ్రహ్మదేవుని సృష్టి - పురుగుయొక్క సృష్టి" అంటున్నారేం? ప్రతి ఒక్కజీవునికి ఒకానొక సృష్టి ఉన్నదా? మీకు ఒకతీరు సృష్టి, నాకు మరొక తీరుసృష్టి ఉన్నదని మీ ఉద్దేశమా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** అవును. ఎందుకంటే, దృష్టియే సృష్టి కదా! బ్రహ్మదేవాఽహంకారి... "నేను ఈ సమష్టి సృష్టియందలి సూక్ష్మదేహతత్వమును, సర్వమునకు అంతర్యామియై కల్పనకు కారకుడనగు చున్నాను" అను దృష్టి కలిగి ఉంటున్నాడు. కీటకాహంకారియో- "ఈ రెక్కలు - కాళ్ళు - తల గల శరీరమునే నేను. ఈ శరీరమునకు ఆకలి తీర్చటం, - నిద్ర కంటే వేరుగా యింక ఎక్కడా ఏదీ లేదు".... అను పరిమిత దృష్టి కలిగి ఉంటున్నాడు. సూర్యుడు ఒక్కడే అయినా, సూర్యకిరణాలు అనేకమై, ఒక్కొక్క కిరణం ఒక్కొక్క వస్తువును వెలిగిస్తోంది కదా! ఎవరు ఎట్టి దృష్టి కలిగి ఉంటారో, వారికి అట్టి సృష్టియే అనుభవమగుచున్నది.

శ్రద్ధ భావనలను అనుసరించే "జీవుడు - అతని పురుషకారము" ఉంటున్నాయి. అట్టి పురుషకారము ననుసరించి కర్మలను ఆచరించటం, ఆ కర్మల ఫలములు లేక ప్రయోజనములు, ఉపాధులు ఏర్పడుచున్నాయి. సుకృతఫలముచే బ్రహ్మదేవుని జన్మలు, దుష్కృత ఫలముచే కీటక జన్మలు వస్తున్నాయి. అయితే ఈ "జన్మలు-కర్మలు-సుకృతకర్మలు-దుష్కృత కర్మలు".... ఇదంతా బ్రహ్మజ్ఞానము యొక్క 'అభావము', లేక, 'ఏమరుపు' చేతనే ఉనికిని సంతరించుకొంటున్నాయి. అనగా ఉత్తమ పరిశీలన సన్నగిల్లిన సమయంలో 'ఉన్నవి' అగుచున్నాయి. జ్ఞానోదయం అయినదా.... ఇక ఈ భేదబోధలన్నీ సమసిపోగలవు. ఎందుచేతనంటావా? బ్రహ్మదేవునియందు, కీటకమునందు ఉన్నట్టి 'సత్త' ఒక్కటే కదా!

1. తెలుసుకొనువాడు = జ్ఞాత (Knower - Experiencer - Perceiver)
2. తెలియబడుచున్నది = జ్ఞేయము (The object being known - the experience - the perceived)
3. తెలుసుకోవటం = జ్ఞాతృత్వము (Knowledge - Experience - Perception)

ఈ మూడు తత్వములు సర్వద్రష్టలందు, లేక, సర్వ జీవులందు ఒకే రీతిగా ఏర్పడి ఉంటున్నాయి. 'శక్తి' అనునది ఒక్కటే అయి ఉండి, అనేక చోట్ల అనేక నామరూపములను పొందుచున్నట్లే ఒకే

బ్రహ్మము ఆయా ద్రష్ట-దర్శన-దృశ్యములను సంతరించుకొంటోంది. ధారణ కలిగి ఉంటోంది. ఏది ఏమైతేనేం? బ్రహ్మమునకు భిన్నమైనదంటూ ఎక్కడా ఏదీ లేదు. ఇక ఈ 'ద్వైత-అద్వైత' భేదములన్నీ భ్రమలు మాత్రమే. సాలెపురుగు తన లాలాజలముచే నిర్మించుకొనిన సాలెగూడులో తానే చిక్కి, శల్యమై బంధమును అనుభవిస్తోందికదా! అట్లాగే స్వయంగా, సహజంగా బ్రహ్మానందమయ స్వరూపుడే అయిఉన్న ఈజీవుడు తన కల్పనాశక్తిచే తానే నిర్మించుకొనినట్టి తన మాయవలన తానే 'బంధం' అనుభవిస్తున్నాడు.

సమష్టి మనోస్వరూపుడైన బ్రహ్మదేవుడు దేనిని ఎట్లు భావిస్తున్నాడో, ఈ జీవుడు కూడా దానిని అట్లే గాంచుచున్నాడు. ఇది 'నియతి' యొక్క వ్యవస్థ. ఈ 'నియతి' లేక 'స్వభావము' ను అనుసరించే 'మఱ్ఱివిత్తు నుండి మఱ్ఱి వృక్షమే రావటం; బ్రహ్మాండములు మహాకల్పాంతము వరకు వెలసి ఉండటం'.... మొదలైనవన్నీ సిద్ధించటం జరుగుతోంది.

❖

అయితే రామా! "ఇక్కడ ఒక నియతి (ఒకానొక నియామకపూర్వకమైన విధానం) జరుగుచున్నది కదా! కనుక ఇదంతా సత్యమే" అని తలచరాదు సుమా! ఎందుకంటే, ఇదంతా ద్రష్ట యొక్క 'భావన' ను అనుసరించే దర్శించబడుతోంది. 'భావనామయములు' అయివున్న ఈ సృష్టి యొక్క స్థితిలయాలు అవాస్తవములే అనటంలో ఏమాత్రం సందేహం లేదు. శుద్ధము, సర్వవ్యాపి, ఏక మాత్రము, అనంతము అయివున్న బ్రహ్మము జ్ఞానము యొక్క స్వల్పత్వ కారణంచేత అశుద్ధంగా, ఉపాధి పరిమితంగా, అనేకములుగా, జన్మ-మృత్యు సహితంగా కనిపించడం జరుగుతోంది. మూఢుడైన ఒక బాలుడు తటాక జలంలోని అలలనుచూచి, ఆ అలలను "ఇదంతా జలమే" అను దృష్టిని ఏమరచినవాడై, "ఇవన్నీ ముందుకు దూసుకుపోతున్న చమత్కార పూర్వపు ఎత్తు – పల్లములతో కూడిన వేరువేరు కెరటములు" అని అనుకుంటూ ఉంటాడు. వివేకములేనట్టి ఒకడు చీకట్లో త్రాడునుచూచి 'పాము' అనుకొని అనేక వికారములు పొందుచూ ఉంటాడు. అట్లాగే ఇదంతా ప్రాప్తిస్తోంది. అయితే, ఏ జీవునియందైతే 'ఉత్తమము – పవిత్రము' అయినట్టి దృష్టి, మరియు "సంపూర్ణము – సమగ్రము" అయినట్టి అవగాహన లేవో, ....అట్టి వాడు మాత్రమే ఈ జగద్భేదములన్నీ అనుభవిస్తున్నాడు. కాని ఇక్కడ జీవునికి – జీవునికి మధ్యగా కనిపించే ఆయా భేదములన్నీ సత్యదృష్టికి లభించవు. ఒకడు ఇతరులతో తనచే కల్పించబడిన భేదములను అనుసరించి 'ఇతడు నా మిత్రుడు. అతడు వేరైనవాడు. వీరు నాకు ప్రియులు. వీరికి కలుగు దుఃఖము నా దుః ఖమే".... అనునవన్నీ "వాస్తవములే" అనునట్లు పొందుచున్నాడు. "శత్రువు – మిత్రుడు" మొదలైన ఏవేవో పరస్పర విరుద్ధములైన భేదవ్యవహారములు గాంచుచున్నాడు.

బ్రహ్మమునందు పరస్పర విరోధములైన భేదాభేదములన్నీ వెలయుచున్నాయి.

తరంగాలు అనేకంగా వేరువేరుగా కనిపించినా, అవన్నీ వేరువేరా? అంతా జలమే కదా! "సువర్ణం – ఆభరణం" అనే ద్వంద్వం ఉన్నదా? 'ఏక మాత్రమగు బ్రహ్మము' నందు ఈ 'జగత్తు' అనబడునది ఆరోపించబడుతోంది. ఇక ఆపై "జగత్తువేరు... బ్రహ్మమువేరు" అనునదంతా ప్రాప్తిస్తోంది.

మొట్టమొదట శుద్ధతత్వము, పరిపూర్ణము అగు 'ఆత్మ' యే ఉన్నది. ఆ 'ఆత్మ' యే మనో రూపమున ప్రకాశించుచున్నది. ఆ 'మనస్సు' నుండి అహంకారం ఉత్పన్నమౌతోంది. అనగా.... ఈ మనస్సు మొట్టమొదట "నిర్వికల్పము" నందు మౌనరూపమున ఉండి ఉన్నది. నిశ్చల జలంలో తరంగములవలె, ఆ తరువాత కల్పనా ప్రభావమునకు లోనై 'అహంభావము' అనుదానిచే విశిష్టమగుచున్నది. అట్టి అహంభావ - విశిష్టమైన మనస్సునుండి పూర్వానుభవరూపమైన 'స్మృతి' ని అనుసరించి "శబ్దేచ్ఛ-స్పర్శేచ్ఛ-రూపేచ్ఛ-రసేచ్ఛ-గంధేచ్ఛ" అనబడే పంచతన్మాత్రలు కలుగు చున్నాయి. ఈ భూతతన్మాత్రలు కల్పించబడిన తరువాత, చిత్తాత్ముడు (చిత్తముతో కూడిన ఆత్మ స్వరూపుడు) అగు ఈ జీవుడు కాకతాళీయంగా జగత్తును దర్శించుచున్నాడు.

ఈ మనస్సు దేనిని దీర్ఘకాలం 'సత్తే' గా భావిస్తుందో, అయ్యది అట్లే సద్రూపంగానే భాసించటం జరుగుతోంది.

కనుక మనస్సే అంతటికీ కారణం.

❖❖❖

# 3. కర్కటీ తపస్సు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ సందర్భంలో ఒక పురాతన ఇతిహాసం చెపుతాను. ఇందులో ఒక రాక్షసి అధ్యాత్మశాస్త్ర పూర్వకమైన కొన్ని జటిల ప్రశ్నలు ప్రతిపాదించింది.

❖

హిమాలయపర్వతపు ఉత్తరభాగంలో గల ఒక అరణ్యంలో ఒకచోట 'కర్కటి' అనే పేరుగల ఒక భయంకర రాక్షసి ఉండేది. అక్కడ నివసిస్తున్న జనులు ఆ రాక్షసిని 'అన్యాయబాధిక' అని కూడా పిలుస్తూ ఉండేవారు. ఆ రాక్షసి కాటుకవలె నల్లగా, అతి భయంకరంగా ఉండేది. అది అసామాన్యమైన బలంతో భీతిని గొలుపు కార్యములు చేస్తూ ఉండేది. లోతైన కళ్ళతో, పొడవైన గోళ్ళతో, నర - కంకాళములను పుష్పమాలగా ధరించి బేతాళ నృత్యం చేస్తూ ఆ మహారణ్యంలో సంచరించేది. దానిని చూడటం తటస్థించిన జనులు బెంబేలెత్తిపోయేవారు.

దానికి ఎందుకో, ఎంత తిన్నా ఆకలి తీరేది కాదు. తీవ్ర జఠరాగ్నితో ఆకలి అరుపులు అరుస్తూ, ఒక రోజున ఇట్లు ఆలోచించసాగింది.

"ఆహాఁ! ఈ నా ఆకలి ఎంత క్రూరమైనది? ఈ జంబూ ద్వీపంలో నివసించే మనుష్యులందరినీ ఒక్కసారి మ్రింగినా ఈ ఆకలి తీరేటట్లు లేదే? వీరందరిని నేను చంపగలనా? వీరిలో కొందరు మంత్ర - ఔషధములు కలిగి ఉంటున్నారు. వారిని నేనేమీ చెయ్యలేను. ఇక మరికొందరు 'నీతి-దానము-పూజ' మొదలైనవి నిర్వర్తిస్తూ ఉంటారు. వీరందరిని నిర్జించటం, తినటం, నాకు ఒనగూడే పని కాదేమరి? ఇప్పుడు నా ఆకలి తీరేది ఎట్లా?.... పోనీ, ఒకపని చేస్తాను. తపస్సుచే సాధించరానిదంటూ ఏదీ ఉండదుకదా! అందుచేత వీరందరిని అడ్డంకులు లేకుండా నమిలి

మ్రింగుతూ, పీల్చివేస్తూ ఉండగలందులకు శక్తి సంపాదిస్తాను. అటువంటి శక్తియుక్తుల కొరకు తపస్సు ప్రారంభిస్తాను".

ఈ విధంగా యోచించి ఒక కొండ యొక్క అగ్రభాగంచేరింది. అక్కడ గల ఒక ప్రదేశంలో ఒంటికాలుపై నిలబడి తీవ్రమైన తపస్సు ప్రారంభించింది. అనేక రోజులు, మాసములు, ఋతువులు గడచిపోయాయి. అది నిశ్చలంగా ఘోరతపస్సు చేస్తూనే ఉన్నది.

కొంతకాలానికి బ్రహ్మదేవుడు ఆ రాక్షసియొక్క ఏకాగ్రతపస్సుకు మెచ్చి ప్రత్యక్షమయ్యారు.

**శ్రీబ్రహ్మదేవుడు :** పుత్రీ! పట్టుదలతో కూడిన నీ సుదీర్ఘ తపస్సుకు మెచ్చాను. ఏమి కోరి తపస్సు చేస్తున్నావో చెప్పు. నీకు ఇష్టసిద్ధిని ప్రసాదిస్తాను.

**కర్కటి :** హే భగవానుడా! పితామహా! నమోనమః! మీ దర్శనంచేత నా భాగ్యం పండింది. నా బాధ ఏమని చెప్పమంటారు? నాకు ఆకలి దంచివేస్తోంది. ఓ భూతభవ్యేశా! నన్ను "అనాయసి–ఆయసి".... రెండూ అయినట్టి "జీవి సూచిక"*గా చేసివేయండి. అప్పుడు నేను జీవుల శరీరములలో ప్రవేశించి, వారి రక్తమును జుఱ్ఱుకుంటాను.

**శ్రీబ్రహ్మదేవుడు :** వత్సే! సరే అట్లే అగుగాక! నీవు రూపముకలిగి ఉండి, లేనిదానివౌతావు. అతి సూక్ష్మమైన 'రూపము' ను అవలంబించి, నీవు – నిషిద్ధమైన, అపక్వమైన, అకాలమైన అతి అయిన – "భోజనం" చేయు జనుల శరీరములలో ప్రవేశిస్తూ ఉంటావు.

కుకర్మలను నిర్వర్తించేవారిని, కుప్రదేశవాసులను (People who stay at unhealthy places) సర్వదా హింసిస్తూ ఉండగలవు. వాయు పరమాణువువలె అయి, ఆయా జనుల 'ముక్కు' ల ద్వారా శరీరములలో ప్రవేశించి, అపాన మార్గంగా ** హృదయప్రదేశమును ఆక్రమించగలుగుతావు. ప్రేగులను, ఇతర అవయవములను పీడించుచు, అక్కడి రక్తమాంసములను భక్షిస్తూ ఉంటావు. జనులు ''వాతలేఖాత్మక, విసూచికావ్యాధి'' అను పేర్లతో నిన్ను పిలుస్తూ ఉంటారు. గుణవంతులు–గుణహీనులు" అను భేదము లేకుండా నీవు ఎందరినో బాధిస్తూ ఉంటావు.

అయితే, గుణవంతులను దృష్టిలో పెట్టుకొని, నీ వలన కలుగు 'విసూచికావ్యాధి' చికిత్స కొరకు సాధక జనులకు ఒక మంత్రము ప్రసాదిస్తున్నాను.

ఓ సాధకజనులారా! వినండి! హిమాలయ పర్వతములకు ఉత్తరంగా 'కర్కటి' అనే ఒక రాక్షసి ఉన్నది. దానికి 'విసూచి – అన్యాయబాధి' అనే పేర్లు కూడా ఉన్నాయి. అది వరప్రభావం

---

* ఆయసి : లోహమయము; అనాయసి : కంటికి కనబడనంత సూక్ష్మము;
జీవిసూచిక : రక్తం పీల్చే సూక్ష్మజీవి

** ప్రాణవాయువులు శరీరములో కదులుచుండు విధిని అనుసరించి "ప్రాణము–అపానము–వ్యానము–ఉదానము–సమానము" అనే పేర్లతో చెప్పబడింది. ఈ విషయమై ఈ గ్రంథంలో 'నిర్వాణప్రకరణం'లో 'భుశుండోపాఖ్యానం'లో విస్తారంగా చర్చించబడింది.

చేత రక్తాన్ని పీల్చే వ్యాధిరూపంతో బయల్వెడలుతోంది. అది కలుగచేయగల బాధకు, రోగమునకు ఇప్పుడు నాచే ఉచ్చరించబడుచున్న మంత్రము 'ఉపశమనము' గా పరిణమించుగాక!

**" ఓం హ్రీం హ్రాం రీం రాం విష్ణుశక్తయేనమః**

**ఓం నమో భగవతి విష్ణుశక్తిమేనాం !**

**ఓం హర-హర! నయ-నయ! పచ-పచ! మథ-మథ!**

**ఉత్సాదయ దూరేకురు స్వాహా !**

**హిమవంతం గచ్ఛ జీవ సః స ః సః**

**చంద్రమండల గతోసి స్వాహా ॥ "**

*("ఓం హ్రీం హ్రాం రీం రాం బీజాక్షర రూపమగు "విష్ణుశక్తి" కి ఇదే నా నమస్కారం. ఓ భగవతీ! విష్ణుశక్తీ! నీ 'అంశ' యే అయిఉండి, రోగరూపమున ఉన్నట్టి ఈ నీ శక్తిని దయయుంచి హరించు. ఉపసంహరించు. పచనమొనర్చు. మథింపుము. దూరము చేసివేయి. స్వాహా రూపిణివగు ఓ రోగశక్తీ! నీవు నీ స్వస్థానమగు హిమాలయమునకు వెళ్ళిపో.")*

❖

సాధకుడు ఈ 'మహా మంత్రము' ను తన ఎడమచేతిపై వ్రాసి, ఆ చేతితో రోగి దేహమును తుడుస్తూ, ఏకాగ్రచిత్తంతో.... "ఈ కర్కటి రాక్షసి మంత్రముచే మర్దించబడుచున్నది. రోగి దేహము నుండి వెలువడి, హిమాలయములవైపు పారిపోవుచున్నది" అని మనస్సుతో సంకల్పించాలి. "ఈ రోగి చంద్రమండలము నుండి అమృతరసమును పొందుచున్నాడు. అందుచేత సర్వవ్యాధి వినిర్ముక్తుడు అగుచున్నాడు..." అని భావన చెయ్యాలి. ఈ విధంగా సాధకుడు శుచిఅయి, ఆచమనం చేసి, ఏకాగ్రతచిత్తంతో శబ్దమును - అర్థమును ఒక్కసారే ఆశ్రయిస్తూ నిస్వార్థ-ప్రేమభావంతో అనుష్ఠానం చేస్తే, అప్పుడా విసూచికావ్యాధి సమూలంగా ఉపశమించగలదు.

త్రిలోకనాథుడగు బ్రహ్మదేవుడు ఇట్లు పలికి, ఆకాశమార్గంగుండా వెళ్ళసాగారు. ఆకాశంలోని సిద్ధులు అతనికి నమస్కరించారు. ఇంద్రునికి పై మంత్రం ప్రసాదించి తన నిజలోకానికి చేరారు.

❖❖❖

## 4. కర్కటి సూక్ష్మజీవత్వం

పర్వతమంత నల్లటి శరీరంగల ఆ రాక్షసి క్రమంగా సూక్ష్మత్వం పొందసాగింది. 'సూది' అంత అయినది. ఆ తరువాత అణుమాత్రమంత అయింది. నల్లటి యినుపసూదిగాను, 'జీవసూచిక' గాను అయినది. పంచ మహాభూతములచే, పంచ జ్ఞానేంద్రియములచే, పంచకర్మేంద్రియములచే, అవిద్యచే, కామముచే, కర్మముచే (వీటినే "పుర్యష్టకము" అంటారు) కదలించబడుచు, ఆకాశంలో సంచరించసాగింది.

**శ్రీరాముడు :** మహర్షీ! ఇప్పుడు ఆ కర్కటి ఒక 'విసూచి – వ్యాధి' రూపమై పరిణమించింది కదా! ఇప్పుడు దాని దేహము–రూపము లోహము వంటివా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "సూచి (సూది) రూపత్వము" అని మనం చెప్పుకొంటున్నది. ఆ రాక్షసి తనయందు తనయొక్క కల్పనచే అనుభవముగా గాంచుచున్నది మాత్రమే. అంతేగాని దానియందు 'లోహత్వము' అనునది లేదు. భ్రమచేతనే అది అట్లు అగుపిస్తోంది.

అది ఒకానొక రక్తపిపాసియగు సూక్ష్మజీవి.

అది మననశీలమగు మనస్సుతో, మిలమిలమెరిసే అతి సూక్ష్మమైన కంటి పాపలతో ఇక సంచరించసాగింది. ఆకాశమువలె నీలంరంగును పొంది, ఇతరులచేత తెలియబడకుండానే తన వ్యాపారము కొనసాగించసాగింది. ఇతరులకు మహాహానికరమై, బాధను ప్రసాదించునదై, అవయవములను క్షీణింపచేయునదై ప్రవర్తించసాగింది.

ఆహాఁ! చూచావా? ఆ రాక్షసి ఈ జగత్తంతా భక్షించాలనే కోరికతో సూది రూపమును దాల్చింది. కాని, స్వల్పమైన రూపంతో దేనిని భక్షించగలదు చెప్పు? అది తనయొక్క మూర్ఖత్వం చేత సూచీరూపం పొందిందేకాని, "ఈ అల్పమగు సూచి (సూది) రూపంతో ఇంతటి తుచ్ఛత్వముతో నేను ఏ రుచి అనుభవించగలను?"..... అని ముందు చూపుతో యోచించనే లేదు. అవును మరి. ముందు – వెనుకలను, గుణ దోషములను విచారించకుండానే "అది నాకు ఇష్టం. కనుక పొంద వలసిందే" అని మూర్ఖంగా అభిలషించేవారు చివరికి లేని–పోని దుఃఖములన్నీ తెచ్చిపెట్టుకొంటారు. పాపం, ఆ రాక్షసి.... "నేను విసూచిని అవుతాను".... అని ప్రయత్నించి ఆయా శరీరములలో ప్రవేశించే హింసాతత్వముగా మారిపోయింది. కాని, "నేను ఎంతో ఆహారం భక్షించి ఆనందిస్తాను" అను రూపము గల దాని సంకల్పము చివరకు నిరర్థకమే అయింది. 'రుచి' అను అనుభవం లేకుండా రక్తపానం మాత్రం చేయసాగింది.

మూఢబుద్ధితో ఇతరులను బాధించవలెనని చింతించే వారికి 'పూర్వ–పర' విచారణ లోపిస్తూ ఉంటుంది. వారు స్వార్థంతో అభిలషించిన వస్తువుపై మాత్రమే దృష్టిఅంతా కేంద్రీకరిస్తారు కనుక, వారియొక్క ఉత్తమమైన బుద్ధి కలుషితమైపోతుంది. చివరకు అనుకున్నది లభించదు.

❖

ఆ రాక్షసి తన స్థూల దేహమును పోగొట్టుకొని, "సూచిత్వము" గ్రహించి, కొద్దికాలం తరువాత, "అయ్యో! ఈ అతిసూక్ష్మమగు 'సూచి' రూపంతో నేనేమీ చేయలేకపోతున్నానే? ఇంతకన్నా ఆకలితో అలమటించినప్పటి స్థూల శరీర స్థితియే బాగున్నదే !" అని వాపోవటం ప్రారంభించింది. ఆహా! ఒకే వస్తువు (లేక) విషయముపై అనురాగము కలిగియున్న జీవునిగతి అధోగతి కాగల ప్రమాద మున్నది. ఇతరజీవుల రక్తమాంసములపై గల ప్రీతిచే ఆ కర్కటి, తన ఇతఃపూర్వపు స్థూల శరీరమును కూడా తృణమువలె వర్జించివేసింది.

ఓ రామచంద్రా! ఈ జీవుని చూచావా? ఇతడు ఆయా వస్తువులపై, విషయములపై, నామ రూపములపై పెంచుకొంటున్న "అతిప్రీతి – అభిమానము"ల కారణంగా జ్ఞాన సముపార్జనకు అర్హత – సామర్థ్యములను పోగొట్టుకొంటున్నాడయ్యా!

❖

ఆ విధంగా మరికొంతకాలం గడచిపోయింది. ఆ కర్కటి మూఢబుద్ధిని ఆశ్రయించుటచేత "నేను స్థూల దేహమును కోల్పోయాను".... అనే విషయమే యోచించుట మానివేసింది. 'వ్యాధియే స్వరూపముగా గల విసూచి' అయి ఇతర దేహములందు ప్రవేశించటం ప్రారంభించింది. "మూర్ఖునకు తన వినాశనము కూడా ప్రీతినే కొలుపుతుంది" అని అందుకే అంటూఉంటారు కాబోలు. అది ప్రాణులందు కంటికి కనబడనంత సూక్ష్మ రూపమున చుట్టలుచుట్టుకొని యున్న 'దారము' వలె ఆకారం కలిగియుండేది. పాపయుక్తము, క్రూరము అయిన మనోవృత్తి కలిగియుండి ప్రాణుల దేహములలో ప్రవేశిస్తూ, అక్కడ తారసపడుచున్న రక్తమాంసములను పీల్చసాగింది. అది ఏదైనా ప్రాణిని ఆశ్రయించిందా.... ఇక ఆ ప్రాణియొక్క రక్తమంతా హరించిపోవలసిందే. అది ఆ సమయంలో "లోహదేహము – సూక్ష్మదేహము" అను రెండు దేహములు కలిగిఉండి, విచ్చల విడిగా, అన్ని వైపుల.... ఆ రెండు దేహములతో కూడి తిరుగసాగింది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఆ కర్కటి ఉగ్రమైన తపస్సుచేసి భగవానుడగు బ్రహ్మదేవునే ప్రత్యక్షం చేసుకొన్నదికదా! అయినప్పటికీ, అది తన తుచ్ఛమైన 'విసూచికత్వము' ను (The form of a disease) ఎందుకు కోరుకొన్నది? "తపస్సుచే బుద్ధి పవిత్రత పొందుతుంది" అని అంటారు కదా! మరి ఆ కర్కటి విషయంలో అట్లు జరుగలేదేం? పైగా, బ్రహ్మదేవుడు, "నీవు పొందగోరునది అతితుచ్ఛమైనది" అని చెప్పిఉండవచ్చును కదా! ఎందుకు చెప్పలేదు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ సృష్టిలో కనబడుచున్న సర్వజీవులు తమయొక్క సంకల్పవశంచేతనే స్థూలంగానో, సూక్ష్మంగానో అగుచున్నారు. ఆ కర్కటికూడా స్వకీయ అభిలాషతో కూడిన సంకల్పము కారణంగానే గొప్ప స్థూలశరీరము వదలి 'సూచిత్వము' (సూదిభావము) కోరుకొన్నది. క్షుద్రబుద్ధి కలిగి ఉన్నప్పుడు ఈ జీవుడు నీచవస్తువులనే అభిలషిస్తూ ఉంటాడు. ఆ రాక్షసి గొప్పతపస్సుచేసి సూచియై పిశాచత్వమును అనుభవిస్తోంది. "తపస్సు" అనునది కోరుకొనుదానిని సముపార్జించుటకు మార్గము అయిఉన్నది. ఈ జీవుడు తాను కోరుకొనునది తన జ్ఞాన–అజ్ఞానములను అనుసరించే ఉంటుంది. మరొక విషయం. తపస్సుచే పవిత్రమైనప్పుడు కూడా గుణ–కర్మ విభాగములను అనుసరించి ఆయా జీవులకు కొన్నికొన్ని వాసనలు, ఆ వాసనలను అనుసరించి లౌకికయత్నములు ఉంటూనే ఉండవచ్చు.

కర్కటి ఆ విధంగా తన తపస్సుచే ఇతరులను బాధించుటకొరకే సూచీత్వము కోరుకొన్నది. అట్లే అభ్యర్థించింది. అట్లే పొందింది. భగవంతుడు నిష్క్రియుడు సర్వసాక్షి. అకలంకుడు. జీవుడు సంస్కారము, లక్ష్యములను అనుసరించి సాధనను, సాధనను అనుసరించి ప్రయోజనములను;

ప్రయోజనములను అనుసరించి ఆయా స్థితిగతులను పొందుచున్నాడు. ఎవడు దేనికొరకు విధి – విధాన పూర్వకంగా ప్రయత్నించటం, కర్మలను నిర్వర్తించటం జరుగుతుందో అద్దాని దిశలోనే బుద్ధి, ప్రయోజనములు మొదలైనవన్నీ ఉంటున్నాయి. అందుచేత మానవుడు ఉత్తమ ఆశయములను మాత్రమే కలిగి ఉండాలి.

మహాశయుడు కావాలి.

❖❖❖

## 5. పశ్చాత్తాపం

ఆ విసూచి స్వస్థుల దేహములలో ప్రవేశిస్తూ ఉండేది. ప్రాణవాయువులతో కలసియుండి, దేహము లందు మరింతగా వ్యాధిని కలిగిస్తూ ఉండేది. 'రక్తము పీల్చుట' అను హింసాక్రియ ద్వారా బుద్ధిమాంద్యము గాని, రోగము గాని లేనివారిని కూడా క్షణములలో ఆక్రమించివేసేది. ఒక్కచోట ఒక శరీరములో ప్రవేశించి రక్తమాంసములను పీల్చుచు తృప్తిగా ఉండేది. ఆ శరీరం ప్రాణరహితమైన తరువాత మరొక శరీరంలో ప్రవేశించేది. మరొకచోట మణి (మరకతము మొదలైన ఆయా రాళ్ళు, మణులు) – మంత్రము – ఔషధములచే నిరోధించబడుచూ ఉండేది. ఈ విధంగా స్థూల–సూక్ష్మము లైన రెండురూపములతో ఆకాశమునందు, భూమియందు సంచరిస్తూ అనేక సంవత్సరములు గడపివేసింది. అది ఎల్లప్పుడూ ధూళియందు, మురికివస్త్రములందు, దోషముతో కూడిన నాడులందు, శిథిలమైన తృణములందు, ఎముకలందు, పక్షులు విశ్రమించేచోట, వికృతమైన ఆవేశాదులు కలిగియున్నవారి యందు, సురాపానమువంటి మత్తు కలిగించు దురాభ్యాసములు ఉన్నచోట, యాత్రికులు ఉండే ప్రదేశంలో, బురదతో కూడిన మడుగులలో, మురికి కాలువలలో సంచరిస్తూ ఉండేది. ఇట్లా అది ఒకచోటినుండి మరొకచోటికి అవిశ్రాంతంగా పయనిస్తూ, జీవులను దుఃఖింప చేస్తూ కొంతకాలానికి ఎంతగానో అలసిపోయింది. దాని బారినపడిన ఎందరో ప్రాణుల శరీరాలు నేలకూలాయి. ఇతరులను బాధించకలిగినపుడు ఆనందమును, నిరోధించబడినప్పుడు దుఃఖమును పొందుతూ వచ్చేది. క్రూరత్వం, బాధించటం – ఈ రెండూ దాని స్వరూప, స్వభావాలు అయినాయి.

ఈ విధంగా అది అంతఃకరణముచే ప్రేరేపించబడుచున్నదై, తన లోహసూచిక (స్థూలము), జీవసూచిక (సూక్ష్మము) రూపముతో దిక్కులన్నీ తిరుగుతూ చాలాకాలం గడిపింది.

అనేక సంవత్సరాల తరువాత అది ఒకప్పుడు తన దేహమును చూచుకొని పశ్చాత్తాపం పొందసాగింది. పాపం! ఆ కర్కటి కూడా ఆనందమే పొందాలని అనుకొన్నది కదా! కాని ఆకలికి 'దాసోఽహం' అయి, అట్టి దుస్థితి తెచ్చుకొన్నది. దాని హృదయంలోకూడా ఇతర జీవుల పట్ల కరుణ – ప్రేమలు ఎక్కడో కొంతైనా లేకపోలేదు. అయితే, అది కాస్త మౌనం వహించి 'ప్రశాంతత' ను ఆశ్రయిస్తూ ఉండగా ఇంతలోనే, రాక్షస స్వభావం ప్రవృత్తమౌతూ ఉండేది. వస్త్రములందు

ప్రవేశించి, "ఈ జీవుని బాధించటం ఎట్లా?" అని మరల యోచిస్తూ ఉండేది. ఒకప్పుడు ఉన్ని వస్త్రములలోను, మరొకప్పుడు పిల్లల చేతివ్రేళ్ళ–కాలివ్రేళ్ళ సందులందు ఉంటూ ఎంతో గర్వంపొందేది. కొయ్య–మట్టిగోడ కూడా దానికి నివాసయోగ్యమైన స్థానములే. మధ్య మధ్యలో ఏదో చెప్పరాని నిస్తేజమును, పశ్చాత్తాపమును, అనిర్వచనీయమైన దిగులును పొందుతూ ఉండేది.

ఈ విధంగా ఆ కర్కటి అనేకమంది మనుష్యుల రక్తమాంసములను పీల్చుచు, ఆకలి తీర్చుకొంటున్నప్పటికీ, దానియందు 'తృష్ణ' ఏమాత్రం చల్లారలేదు.

ఒకరోజు అది తన అంతరంగంలో ఎట్లు యోచించసాగిందో రేపు విచారిద్దాం.

❖❖❖

## (ఆరవ రోజు విచారణ పూర్తి అయింది)

❖❖❖

# ఏడవ రోజు

## 6. పునః తపస్సు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ కర్కటి ఇట్లు యోచించసాగింది.

అయ్యో! ఈ సూచీత్వమును నేను ఎందుకు గ్రహించినట్లు? ఇంత సూక్ష్మమైన, శక్తిహీనమైన రూపంతో ఒక కబళం కూడా తినలేను కదా! ఇతఃపూర్వపు నా సువిశాలమైన అవయవములన్నీ ఏమైనాయి? అప్పట్లో రుచికరమైన మాంసపు ముద్దలను సమృద్ధిగా భుజించేదానిని. ఇక ఇప్పుడో.... ఇతరుల పాదములందు గ్రుచ్చుకొనుచు, నేలపై దొర్లుచు, రక్తమాంసములలో ఇంకిపోతూ ఇట్లు నికృష్టస్థితులు పొందుచున్నాను. మరలమరల మలినమగుచున్నాను. ఏమి నా బ్రతుకు? అనాథనైన నాకు బంధువులుగాని, మిత్రులుగాని లేరు. ఆశ్రయమంటూ ఏదీ లేదు. ఎంత దయనీయమైన విషయం! ఎంతటి దుఃఖసంకటం! సఖిగాని, దాసిగాని, తల్లిగాని, తండ్రిగాని, బంధువులుగాని, సేవకులుగాని, సోదరులుగాని, పుత్రులుగాని లేనట్టి ఈ బ్రతుకు ఎందుకు? ఊరికే గాలివాటుగా అటూఇటూ తిరగటానికేనా?

అస్సలు, విషాదమైన విషయం ఏమిటంటే,.... నేను తపస్సు చేసి మరీ ఈ "విసూచిస్థితి" అనే విపత్తు మరియు సంకటమును తెచ్చిపెట్టుకున్నాను. ఇప్పుడు చావాలన్నా, చావురాదు కదా! మూఢబుద్ధితో చక్కటి శరీరమును పోగొట్టుకున్నాను.

ఎక్కడ 'అజ్ఞానం' ప్రవేశిస్తుందో అక్కడ ముందుగా 'దుర్బుద్ధి' వచ్చి చోటు చేసుకొంటుంది కాబోలు. అట్టి దుర్బుద్ధితో కూడిన చిత్తమే అనేక అనర్థములకు దారి తీస్తుంది.

పొగలోను, తృణములలోను పడత్రోయబడుచున్న ఈ నా దుఃఖములకు అంతు ఎక్కడున్నది? ఇతరుల (అనగా మంత్రద్రష్టల) ఆజ్ఞలకు లోబడి వారి ఆజ్ఞలచే నియమించబడుచు, విరమించబడుచు, వారి ఆధీనంలో ఉంటున్నాను. మంత్ర – తంత్ర – ఔషధములచే నిరోధించబడుచు, అంతులేకుండా బాధలను పొందుచున్నాను. ఛీ! తుచ్ఛమైన రక్తం త్రాగాలని నేను ఎందుకు కోరుకొన్నట్లు? నాకు నాలుక ఉన్నదా? రుచి తెలుసా? లేదు. కాని, నా కారణంగా ఇతర జీవులు మాత్రం హింసించ బడుచున్నారు. "ఒక దయ్యం వదిలితే, మరొకదయ్యం పట్టుకొన్నది".... అను 'నానుడి' నాపట్ల అక్షరాలా నిజం అయింది. 'వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లుగా నాపని తయారైనది. ఇక, ఒక క్రిమికీటకము వంటి శరీరముగల నన్ను ఉద్ధరించగల వారెవ్వరు? పోనీ, శాంతి సముపార్జనకై జ్ఞానముకొరకు మహాత్ముల నెవరినైనా ఆశ్రయిద్దామా? దుష్టజీవినైన నన్ను వాళ్ళు దగ్గిరకు రానిస్తారా? ఈనా అజ్ఞానస్థితి తొలగేదెట్లా? ఈ విపత్తు తొలగటానికి ఏదైనా త్రోవ ఉన్నదా? ఇంకా ఎంతకాలం ఈ దుస్థితులలో దొర్లవలసి ఉన్నదో కదా!

ఇప్పటికిప్పుడు నేను నా పూర్వపు విశాలదేహమును పొందగలిగితే ఎంత బాగుంటుంది. ఆహాఁ! భీకరమైన ఆకృతిని ధరించి ఈ కొండపై ఒక కాలు, ఆ కొండపై రెండవ కాలు ఎప్పటికి ఉంచగలుగుతానో? మానవ కంకాళములను దండగా అలంకరించుకొని, కొండగుహలు దద్దరిల్లేటట్లు నవ్వుతూ హిమాలయ పర్వత ప్రాంతములలో ఎప్పటికి హుందాగా సంచరిస్తానో? ఒక చేత్తో మద్యపు కుండను, మరొకచేత్తో శవమును పట్టుకొని శిఖరాగ్రంపై కూర్చుని ఎప్పటికి తింటూ, త్రాగుతానో? దృఢమైన ఆ నల్లని విశాల శరీరమెక్కడ? అతి సూక్ష్మమైన ఈ 'విసూచి' ఉపాధి ఎక్కడ? ఓ నా పొడవైన చేతులారా? మీరు ఇప్పుడు ఎక్కడికి వెళ్ళారు? నా ఈ దుస్థితికి కారణం నేనేకదా! మిమ్ములను పోగొట్టుకొన్నది నేనే!"

❖

ఈ విధంగా ఆలోచించిన ఆ కర్కటి కొంతసేపు 'ఏకాగ్రచిత్త' అయింది. మౌనం వహించింది. ఇంతలోనే అద్దాని మనోపథంలో పూర్వసంస్కారముల ప్రేరేపణచేత "తపస్సు" అనే విషయం తళుక్కున మెరిసింది. "ఔను. ఇప్పుడు నేను తపస్సు చేయటమే ఉచితం. అదియే నా ఈ ప్రవృత్తికి తగిఉన్నది" అని యోచించింది. తన సూచీరూపమును ప్రాణవాయురూపమగు ప్రాణములందు, ప్రాణములను 'జీవసూచిక' యందు, జీవసూచికను 'లోహసూచిక' యందు ప్రవేశింపజేసింది. హిమవత్పర్వతములపై జేరి తపస్సు చేయటం ప్రారంభించింది. అప్పుడు ఇంద్రుడు చేస్తున్న విఘ్నములను కూడా లెక్కచేయకుండా, స్వస్థానమునుండి కదలకుండా, అనేక సంవత్సరములు తపస్సులో గడపివైచింది.

'శ్రద్ధ'తో కూడిన తపస్సు ఊరికేపోతుందా! ఆ రాక్షసి బాహ్యచేష్టలను త్యజించివేసి ఏకాగ్రతతో తపస్సు చేయటంచేత, 'సత్స్వరూపమగు ఆత్మభావన'తో అనుసంధానం ఏర్పడింది. స్వయముగా ఆత్మయొక్క స్వరూప స్వభావములను విచారించుటచే, ప్రబోధం పొందింది. ఆత్మసాక్షాత్కార అనుభవం లభించింది. భూతభవిష్యత్తులందలి ఆత్మయొక్క సమస్థితిని ఎరిగినదై పవిత్రత పొందింది. తపస్సుచే పాపమంతా నశించిపోగా, తెలుసుకొనవలసిన ఆత్మను చక్కగా తెలుసుకొన్నది.

ఆ విధంగా సర్వలోకములను తపింపజేయుచు ఏడువేల సంవత్సరాలు తపస్సు చేసింది. ఆ తపస్సు కలుగజేస్తున్న తాపమును గమనించిన ఇంద్రుడు కూడా వ్యాకులత పొందాడు. అతడు నారదమహర్షిని సమీపించి, "మహర్షీ! ఇది ఏమి?" అని అడిగాడు. అప్పుడు నారదమహర్షి "ఓ ఇంద్ర దేవా! మహాతపస్వినియగు కర్కటీదేవి అనేక సంవత్సరాలు తపస్సు చేసింది కదా! ఇప్పుడు విజ్ఞానమయ శరీరం పొందింది. అందుచేతనే దాని తపోతేజస్సుచే జగత్తంతా ప్రదీప్తం అవుతోంది. ఆ ఉగ్రతపస్సుచే ప్రకృతి కూడా ఎంతగా శుష్కించుచున్నదో చూచారా?" అని పలికారు.

**ఇంద్రుడు:** ఓ నారదమహర్షీ! ఆ కర్కటి యొక్క అప్రియమైన వృత్తాంతమంతా విన్నాను. అది ఇతః పూర్వం తన తపస్సుచే బ్రహ్మదేవుని మెప్పించి పిశాచంలాగా అదృశ్యమగు జీవసూచిత్వమును పొందింది కదా! జడబుద్ధితో అది ఏమైనా భోగములను పొందకలిగిందా? అది ఎక్కడేమి చేసింది?

**శ్రీ నారదుడు :** అది నల్లటి లోహసూచిక అయి 'కత్తి' లేక 'ముల్లు' చివరిభాగం ఆశ్రయంగా కలిగిఉండేది. చంచలత్వంతో, పైశాచిక భావంతో.... ప్రాణవాయు మార్గంగా జీవుల శరీరములో ప్రవేశించేది. అచట ప్రవాహరూపమున సంచరిస్తూ 'శూలబాధ' కలిగించేది. మేధస్సు, ప్రేగులు, మొదలైనవి దానికి విశ్రాంతి స్థానం. ఆయా జీవుల భోజనమును, మాంసవిశేషములను తాను అనుభవించేది. జీవుల శరీరాంతర్భాగమును హింసించుచు అపవిత్రరసములను పొందేది. అది ఎందరు జీవుల శరీరములను పీల్చివేసిందో లెక్కే లేదు. అయితే మాత్రం ఏమున్నది? విషయ భోగముల అనుభవము యొక్క ఆనందం పొందలేకపోయింది. అశక్తతతో దుఃఖముపాలు అయినది. అనేకసార్లు "మంత్రము-ఔషధము-తపస్సు"లచే దండింపబడి, హిమాలయములవైపు పరుగులు తీసింది కూడా. ఎంత ఆహారం పొందినా దానికి 'తృప్తి' అంటూ ఉండేది కాదు. శరీరములేని వానికి అనుభవమే ఉండదుకదా మరి! అందుచేత "నేను నా ఇతఃపూర్వపు దీర్ఘదేహమును పొందెదను గాక!" అని ఇచ్ఛపొందింది. ఒక పక్షి శరీరంలో ప్రవేశించి, దానిని ప్రేరేపించుటద్వారా హిమాలయం చేరింది. ఆ పక్షి ముక్కులోంచి బయటికి వచ్చింది. ఒకచోట ఆసీనురాలై దీర్ఘతపస్సు ప్రారంభించింది. అప్పటినుండి ఇప్పటిదాకా తపస్సు చేస్తూనే ఉన్నది. చాలా సంవత్సరములు గడచిపోయాయి. ఆ కర్కటికి ఏదైనా వరం ఇచ్చి సంతోషింపచేసి తపస్సు నుండి విరమింపజేయటమే ఇప్పుడు ఉచితం.

❖

నారదుడు చెప్పినదంతా విన్న ఇంద్రదేవుడు వాయుదేవునితో "ఓ వాయుదేవా! మీరు నలుదిక్కుల ప్రసరించి ఆ కర్కటి ఏ ప్రదేశమున ఉన్నదో గమనించండి. అది ఎట్లు ఏ స్థితిలో ఉన్నదో నాకు తెలియజేయండి. ఆ వర్తమానమును అనుసరించి తరువాత చేయవలసినది నిర్ణయించుకొందాము" అని ఆజ్ఞాపించాడు.

అప్పుడు వాయుదేవుడు భూతలముపై 'దివ్యజ్ఞానాంశము' వలె చరించుచు, జంబూద్వీపం పైగల హిమాలయ పర్వతంపై ఒకచోట కర్కటిని చూచాడు. అది అత్యంత సూక్ష్మమై, శిథిలమై ఉండి ఏకాగ్రతతో తపస్సు చేసుకొంటోంది. వాయుదేవుడు ఆ కర్కటిని సమీపించాలని ప్రయత్నించి కూడా విఫలుడైయ్యాడు. "ఓరాక్షసీ! నీవు ఎందుకు ఈ తపస్సు చేస్తున్నావు?" అని ఎలుగెత్తి బిగ్గరగా పలికాడు. కాని ఏం లాభం? ఆ శబ్దం ఆ రాక్షసి చెవులను సమీపించనే లేదు. అప్పుడాతడు ఇంద్రుని వద్దకు తిరిగివెళ్ళి ఇట్లు పలికాడు.

**వాయుదేవుడు :** ఓ ఇంద్రదేవా! మీరు ఆజ్ఞాపించిన విధంగా ఆ 'విసూచి' కొరకు వెతకి అది ఉన్నట్టి స్థానం గుర్తించాను. అది ఎందుకొరకో, ఏమో.... ఉగ్రతపస్సు చేస్తోంది. ఆ తపోసమయంలో వాయువును కూడా భక్షించుటలేదు. అది తన శరీరమును లోహమయం ఒనర్చుకొన్నది. మనమెవ్వరం కూడా దానిని వరములచే తృప్తిపరచలేం. మనం పితామహుడగు బ్రహ్మదేవుని, ఈ విషయంలో, ఆశ్రయించటం మంచిది. దాని తపఃప్రభావం చేత ఆ హిమవత్పర్వతం తన సహజలక్షణమై యున్న శీతలత్వమును వదలి ఉష్ణత్వము సంతరించుకొంటోంది. అందుచేత అట్టి తీవ్రమైన తపస్సు లోకమునకు హానికరమే అయిఉన్నది.

అప్పుడు ఇంద్రాదిలోకపాలకులు బ్రహ్మదేవుని సమీపించి విషయం నివేదించారు. పితామహుడు అంతా విని వారికి అభయం ఇచ్చి, వారిని పంపివేశారు.

❖❖❖

# 7. స్థూలదేహప్రాప్తి

ఆ కర్కటి తన యొక్క తీవ్రమైన తపస్సు యొక్క ప్రభావం చేత పవిత్రమైన బుద్ధిని పొందింది. ఆత్మవిషయమై విచారించసాగింది. అనేక యుక్తులతో బ్రహ్మమును సుస్పష్టంగా తెలుసుకొన్నది. "ఆహాঃ! 'నేను ఆత్మనే' అను భావనయే సర్వస్వము. ఆత్మజ్ఞానమే గురువు. దైవము. మమాత్మయందే ఈ సర్వము కూడా!" అని గ్రహించసాగినది. జ్ఞానదృష్టిచే ప్రశాంతముగా అనేక సంవత్సరములు మౌనం వహించియున్నది. ఒకరోజు బ్రహ్మదేవుడు ఆ కర్కటికి ప్రత్యక్షమైనాడు. కర్కటియొక్క మనోదర్పణంలో ప్రతిబింబించి సంబోధించసాగాడు.

**శ్రీబ్రహ్మదేవుడు :** ఓ పుత్రీ! దీక్షాపూర్వకమైన నీ తపస్సుకు మెచ్చాను. ఏమి కావాలో కోరుకో.

జీవము మాత్రమే కలిగియుండి, కర్మేంద్రియములు లేనట్టి ఆ విసూచి బ్రహ్మదేవుని మధురవచనములు విన్నది. కాని, ఎట్టి ప్రత్యుత్తరం ఇవ్వలేదు. తనలో తాను ఇట్లు అనుకొన్నది.

"నా సంశయాలన్నీ నశించాయి. పూర్ణత్వం పొందాను. ఇక వరములతో నాకేమిపని? ఇప్పుడు నేను శాంతమును, తృప్తిని సుఖమును పొందుచున్నానుకదా! తెలుసుకోవలసినదంతా తెలుసుకొన్నాను. వివేకము లభించిన తరువాత ఇక పొందవలసినది ఏమి ఉంటుంది? ఇప్పుడు ఎట్లు ఉన్నానో, అట్లే ఉంటానుగాక! నేనే సత్యస్వరూపిణినై యుండగా, ఇక నాకు మిథ్యయగు వస్తువులను ఆశించవలసిన పని ఏమి ఉన్నది? ఆహాঃ! ఇంతకాలం అవివేకంతో ఎక్కెడెక్కడో సంచరిస్తూ అనేక దుఃఖములను పొందాను. ఇప్పటికి ఆత్మవిచారణ మాత్రంచేత నా అవివేకమంతా నశించింది. నాకు ఇష్టములేమిటి? అయిష్టములేమిటి?.....!"

అని అనుకొంటూ బదులు చెప్పకుండా మౌనం వహించియున్నది. నియతియుక్తుడైన బ్రహ్మదేవుడు ఇది చూచి చాలా సంతోషించారు. రాగరహిత అయిన ఆ కర్కటితో ఇట్లు పలికాడు.

**శ్రీ బ్రహ్మదేవుడు :** ఓ పుత్రీ! ఆత్మజ్ఞానము పొందుటచే పరమపవిత్రురాలవయ్యావు. నీ తపస్సుకు ప్రయోజనంగా వరం స్వీకరించు. మరి "నియతి" గౌరవించబడాలికదా! ఈ భూమండలమునందే ఉంటూ మరికొంతకాలం భోగములను అనుభవించు. ఆ తరువాత ఉత్తమోత్తమమగు బ్రహ్మపదమును పొందెదవుగాక! ఇది ఈశ్వరనియతి. దీనిని మేము కూడా మార్చలేము సుమా!

ఈ తపస్సు యొక్క ప్రయోజనంగా నీ సంకల్పము ఈడేరుగాక! మరల నీ ఇతఃపూర్వపు విశాల శరీరం పొందుతావు. రాక్షసివై హిమాలయములపై సంచరిస్తావు. ఒక బీజంలో సూక్ష్మ రూపమున అంకురం (మొలకెత్తు స్వభావం) దాగి ఉంటుంది కదా! అదే విధంగా "నేను పూర్వ దేహమును పొందాలి" అనే కోరిక నీయందు అంతర్భూతమై ఉన్నది. అయితే ఏం? చిత్తశుద్ధిచే

స్వస్వరూపమగు పరబ్రహ్మమును తెలుసుకొన్నావు కదా! అందుచేత, నీవు నీ పూర్వదేహము పొంది నప్పటికీ, ఇంతకుముందువలె లోకములను బాధించవు. విశాలమైన రాక్షసి ఉపాధి పొందినప్పటికీ, నీవు ఎల్లప్పుడు నిర్వికల్పసమాధియందే ఉండి ఉంటావు. ఎప్పుడైనా ఆ సమాధినుండి లేచినప్పుడు, ఆ సమయంలో సర్వులను ఆత్మస్వరూపులుగానే చూస్తూ ఉంటావు. వ్యావహారిక దృష్టికి మాత్రం "ధారణ–ధ్యానము" లను అవలంబిస్తూ ఉంటావు. వాయువుకు స్పందము ఎట్లా స్వభావసిద్ధమో, అట్లాగే నీవు కూడా నిర్వికారంగా ఉంటూనే ఈ చేష్టాయుక్తమైన శరీరం బాహ్యానికి కలిగిఉంటావు. జ్ఞానముచే మనోపవిత్రత ఆర్జించిన నీవు రాక్షసస్వభావులు నిర్వర్తించే ఆశాస్త్రీయ హింసకు స్వభావసిద్ధంగానే దూరంగా ఉంటావు. న్యాయమును పరిపాలిస్తూనే, ప్రకృతి సిద్ధమైన ఆకలిని తీర్చుకొనుటకు మాత్రమే కొన్ని ప్రాణులను భక్షిస్తావు. నీయందు అకృత్రిమమైన న్యాయవృత్తి వచ్చి చేరుటచే, న్యాయమును అతిక్రమించువారలను మాత్రమే బాధిస్తావు. జీవన్ముక్తవై వివేకము కలిగియుండి, ఈ భూమిపై సంచరిస్తావు. నీకు శుభమగుగాక!

❖

ఇట్లు పలికి భగవంతుడగు బ్రహ్మదేవుడు అంతర్ధానమైనారు. అప్పుడా రాక్షసి, "పితామహుడు బ్రహ్మదేవుని అభిప్రాయం అనుసరించి, అట్లే అగుగాక! ఒకానొక ఉపాధి ప్రాప్తించినంత మాత్రంచేత ఆత్మజ్ఞానమునకు లోటు ఉండవలసిన పని ఏమున్నది?" అని తలచి, తన పూర్వశరీరము గురించి చింతించసాగింది. అట్టి సంకల్పబీజంచే క్రమంగా పూర్వపు దేహం యథాతథంగా పొందింది.

ఆ విధంగా స్థూలత్వము పొందినదై హిమాలయ పర్వతములపై సంచరించసాగింది. చిత్స్వరూపమునకు సంబంధించిన జ్ఞానము తనయందు ఉదయించియుండుటచేత ఆ సంచారం కూడా ఆ రాక్షసికి ఆనందమే ఇచ్చింది. ఆ కర్కటి యందు ఇప్పుడు రాక్షసస్వభావం లేదు. ప్రాపంచిక దుఃఖ సమ్మిళితములైన వాసనలు లేవు.

❖❖❖

## 8. వాయుదేవుని ఉద్బోధ

ఆ కర్కటి ఆయా ప్రదేశాలలో సంచరిస్తూ ఒకసారి ఒకచోట పద్మాసనం వైచుకొని, శుద్ధ జ్ఞానమును ఆశ్రయించి ఆత్మధ్యానపరాయిణ అయి స్థిరంగా పర్వతంవలె ఉండిపోయింది. అట్లు ఆరునెలలు గడచిపోయాయి. ఒకరోజు సమాధినుండి లేచింది. మరల బాహ్యవృత్తులు పొందింది. మరుక్షణం ఆ రాక్షసికి ఎంతో 'ఆకలి' అనిపించింది. శరీరము ఉన్నంతవరకు, ఆ శరీరము యొక్క స్వభావం ఉండనే ఉంటుంది కదా!

"ఆహా నాకిప్పుడు ఎంతో ఆకలి వేస్తోందే? ఏమైనాసరే! నేను న్యాయమును మాత్రం అతిక్రమించను. పూజ్యులగు మహానుభావులను బాధించటం, వారిచే దూషించబడటం, అన్యాయంగా సంపాదించి భుజించటం.... ఇట్టి క్రియల కంటే చావటం మంచిది. ఒకవేళ న్యాయంగా సంపాదించ

బడిన ఆహారం దొరకకపోవటం జరిగితే, అట్టి పరిస్థితులలో ఈ శరీరం నశించినా కూడా మంచిదే. అన్యాయార్జితమైన ఆహారం విషతుల్యమే. లోకసమ్మతము కాకుండునట్టి భోజనం సంపాదించి జీవిస్తే మాత్రం ఏంప్రయోజనం? పైగా, ఆత్మయే స్వరూపముగా కలిగియున్నట్టి నాకు జీవించితే ఏం ఉన్నది? మరణిస్తే మాత్రం ఏం? ఈ శరీరాదుల రాకపోకలచే సత్స్వరూపుడనగు నాకు లభించునది గాని, నేను కోల్పోవునది గాని ఏమీ ఉండదు. ఈ 'దేహం' అనబడే వ్యవహారమంతా సంకల్ప మాత్రమే కదా! దేహాభిమానం ('నేను దేహమును' అనునట్టి అల్పజ్ఞత) ఉన్నంతవరకు ఆత్మజ్ఞానం లోపిస్తూనే ఉంటుంది. కనుక ఈ జీవన్మరణముల వైపు దృష్టినే సారించను."

ఇట్లు తలచుచు, మౌనం వహించి ఉన్నది. సర్వప్రసరణశీలుడైయున్న వాయుదేవుడు ఆ కర్కటిని, ఆమె ఆలోచనల తీరును గమనించాడు. రాక్షస స్వభావం త్యజించినందుకు సంతోషం పొందాడు. ఆకాశమునందు ఉంటూనే ఇట్లు పలికాడు.

**వాయుదేవుడు :** బిడ్డా! కర్కటీ! నీ వితరణశీలము చాలా ఉత్తమంగా ఉన్నది. ఉత్తమ జ్ఞానివయ్యావు. అయితే, నీయొక్క శరీరధారణ, తదితర సంసారిక క్రియలు శుభప్రదమే అవుతాయి. ఆత్మ జ్ఞానులు తమయొక్క ఆయా మాటలచే, చర్యలచే ఈ భూమిని పవిత్రం చేస్తూ ఉంటారు. నిన్ను జ్ఞానము కొరకు ఆశ్రయించేవారికి జ్ఞానోపదేశం చెయ్యవచ్చును కదా! మూఢులకు అజ్ఞానం తొలగించుటయే మహాత్ముల స్వభావమైయున్నది. ఇంద్రియవిషయముల పట్ల మాత్రమే ధ్యాసగల అల్పజీవులు తారసపడినప్పుడు, అట్టివారు నీకు ఆహారమవటానికే ఉత్పన్నమైనారని భావించవచ్చు. అట్టివారిని నీవు న్యాయముగా లభించిన ఆహారంగా తలచవచ్చు. అట్టివారిని భుజించుటచే దోషము ఉండదని నా అభిప్రాయం.

**కర్కటి :** తండ్రీ! వాయుదేవా! మీరు నాకు ఉత్తమమైన విషయమునే గుర్తుచేశారు. నన్ను అనుగ్రహించి ఉద్ధరించినవారయ్యారు. మీరు చెప్పినట్లే ఈ ఆత్మజ్ఞానమును అజ్ఞానులకు వినిపిస్తాను. అట్లు వినుటకు తగినట్టి సంస్కారం లేనివారిని మాత్రమే భక్షిస్తాను. తద్ద్వారా ప్రకృతి సిద్ధమైన ఈ నా ఆకలిని తీర్చుకొంటాను. ఇట్టి ఆలోచనను ప్రసాదించినట్టి సద్గురుతుల్యులగు మీ పాదములకు నమస్కరిస్తున్నాను.

❖❖❖

## 9. అరణ్య ప్రవేశం - కిరాతరాజుతో సమావేశం

ఇట్లు పలికి ఆ కర్కటి అక్కడి నుండి లేచింది. వనభూములు, పర్వత ప్రదేశములు దాటి, ఒక కిరాతరాజ్యం ప్రవేశించింది.

అప్పుడు అర్ధరాత్రి సమయం. అంతా చీకటి తాండవిస్తోంది. ఆకాశంలో దట్టంగా మేఘాలు క్రమ్ముకొని ఉండటంచేత, నేలపై కాటుకవంటి చిమ్మచీకటి వ్యాపించి ఉన్నది. అల్లంత దూరంలో ఆ కిరాతరాజ్యంలో గల ఇండ్లలో దీపాలు మినుకుమినుకుమంటూ వెలుగుతున్నాయి. ఆ చీకట్లో

పిశాచాలు తాండవిస్తున్నాయి. ఆ చుట్టుప్రక్కల దూరంగా కనిపిస్తున్న అనేక గ్రామాలలో ఆయా జీవరాశులు నిద్రాసుఖం అనుభవిస్తున్నాయి. కప్పల బెకబెకలు, కీచురాళ్ళ రణగొణలు, వాయు వీచికలకు చెట్లు కదులుచున్న శబ్దాలు వినబడుచున్నాయి.

❖

ఆ కిరాతరాజ్యాన్ని "విక్రముడు" అనే రాజు పాలిస్తున్నాడు. అతడు మహాధీశాలి, వీరుడు కూడా. ఆరోజు అతడు తనమంత్రితో కూడుకొని ఆయుధములు ధరించి, రాజ్యమునకు సమీపంలో ఉన్న ఆ అరణ్యంలో సంచరిస్తూ ఉన్నాడు. ప్రజలను బాధించే మృగములను, బేతాళాది దుష్టజీవులను నిరోధించి ప్రజలకు ప్రశాంతత కలిగించటానికి వారు ఆ అడవిలో ప్రవేశించారు. తమ ప్రజలను ఆయా దుష్టవ్యాధులనుండి రక్షించటానికి ఏవైనా ఉపాయాలు వెతకటం కూడా వారి ఉద్దేశ్యం.

కిరాతరాజును, అతని మంత్రిని దూరమునుండి చూచి మన కర్కటి తనలో, "ఆహాఁ! సంతోషం, నాకిప్పుడు మంచి భోజనం లభించింది. వీరు ఒకవేళ ఆత్మజ్ఞానము లేనట్టి మూర్ఖులే అయితే, వీళ్ళ ఉనికి భూమికి భారమే అవుతుంది కదా! మూఢులు, మూర్ఖులు ఇహ-పర లోకములందు దుః ఖములను, వినాశనములను మరల మరల పొందనున్నారు. అనర్థం కలుగజేయు ప్రాణులను భక్షించటం కూడా లోకహితమే అవుతుంది. ఏ అజ్ఞాని ఆత్మను ఎరుగకుండానే జీవిస్తూ ఉంటాడో, అట్టివాడు మరణించి, నా ఆకలి తీర్చటమే ఉచితం. నేడు ఈ ఇద్దరిని భుజిస్తాను. అయితే వీరు జ్ఞానులో, అజ్ఞానులో తెలుసుకోవాలి. ఎట్లా? రూపురేఖలను బట్టి మనం జ్ఞానులను, అజ్ఞానులను నిర్ణయించలేమే? జ్ఞానులైనవారు మానవులలోను, జంతువులలోను, రాక్షసులలోను, పిశాచములలోను, దేవతలలోను ఉండవచ్చు. అట్లే అజ్ఞానులు కూడా. అందుచేత వీరిని ముందుగా పరీక్షిస్తాను. వీరు కనుక ఉత్తమజ్ఞానాన్వితులైతే మాత్రం వీరిని తాకను. సుఖము, కీర్తి, ఆయువు అభిలషించేవాడు గుణవంతులను పూజించాలే కాని, బాధించకూడదు. నేను చావటానికైనా సిద్ధమేకాని గుణవంతుల జోలికిమాత్రం పోను. ఆత్మజ్ఞానులైన సాధువులు తమవాక్యములచే తదితర జనులకు ఈ "జీవించుట" అనుదాని కంటే కూడా అధికమైన సుఖమును, ప్రసాదించగలరు. ఈ 'శరీరపోషణ' అను వ్యవహారం కూడా "ఆత్మగురించి వినుట" అనుదాని కొరకు నిర్వర్తించబడినప్పుడే సార్థకత కదా!

నేను నా శరీరాన్ని అర్పించి అయినా సరే గుణవంతుని రక్షిస్తాను. అట్లు రక్షించి ఈ భూమాత యొక్క సంతోషమునకు కారణమవుతాను. ఎందుకంటే, గుణవంతుడైనవాడు తన సాంగత్యంతో ఈ లోకమును పవిత్రమొనర్చగలడు. అతని సాంగత్యం ఉన్నచోట మృత్యువు కూడా సుఖప్రదమై తోచగలదు. నేను రాక్షసినైనప్పటికీ గుణవంతులైన ఆత్మజ్ఞానులను పూజించినప్పుడే కర్తృత్వమునకు సంబంధించిన తృప్తి-సంతోషములు కలుగుతాయి. ఉత్తమ గుణాన్వితులైనట్టి జ్ఞానధనులు ఈ భూమిపై సంచరిస్తూ ఉంటే, ఆ భూదేవతల వాక్యామృతములచే జనులకు పవిత్ర దృష్టి, ఉత్తమ అవగాహన, సామరస్యము, కారుణ్యము, ఐకమత్యము, అభివృద్ధి మొదలగు శుభములు యాదృచ్ఛికంగానే చేకూరుతాయి.

అవును. అట్టివారు తమ సాంగత్యముచే, అమృతమయమగు గుణములచే నావంటివారి హృదయాలలో శాంతి – సౌఖ్యములను నెలకొలుపగలరు. "గుణవంతులను తిరస్కరించి, వారి వచనములను సాంగత్యమును కోల్పోవటమే మృత్యువు" అని నాకు అనిపిస్తుంది. ఓ గుణవంతులారా! మీరు ఎక్కడెక్కడ ఉండి ఉన్నా మీకు నమస్కరిస్తున్నాను. మీతో స్నేహం లభించిందా, ఇక నాకు స్వర్గమోక్షములు కూడా అక్కర్లేదు. ఎన్నో సత్క్రియలకు ప్రయోజనంగా గుణవంతులతో, జ్ఞానవంతులతో నేస్తం ఏర్పడటం జరుగుతుంది.

వీరిని కొన్ని ప్రశ్నలు అడుగుతాను. వీరు ఏమి సమాధానం ఇస్తారో వింటాను. వీరి సమాధానం అనుసరించి వీరు జ్ఞానులగు గుణవంతులో, లేక జ్ఞానహీనులగు గుణహీనులో నాకు తెలిసిపోతుంది. వీరు గుణహీనులైతే సుష్టుగా భుజించివేస్తాను. కాక, గుణవంతులా.... పూజించి తరిస్తాను. వీరిని సంతసింపజేస్తాను.

❖

ఈ విధంగా తనలో అనుకొన్న కర్కటి ఆ కీకారణ్యంలో కారుచీకటి యొక్క అంతర్భాగం నుండి "రాళ్ళవానయా?" అన్నట్లు మేఘగర్జన చేస్తూ ఇట్లు నిష్ఠూరంగా పలుకసాగింది.

**కర్కటి:** ఓ అల్పజీవులారా! మీరెవ్వరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు? మాట్లాడక పోయారో, ఒక్కక్షణంలో మీరిద్దరు మృత్యువాత పడగలరు. ఊ! త్వరగా మీరెవ్వరో చెప్పండి.

**విక్రముడు:** ఓరీ! తుచ్ఛుడా! ఇంతకూ నీవెవ్వరు? ఎక్కడినుండి మాట్లాడుచున్నావు? ఏదీ? నీ అల్పశరీరం మాకు కాస్త చూపించు. నీ అరుపులు విన్నంత మాత్రంచేత భయపడి మూర్ఛిల్లేవారు ఇక్కడెవ్వరూలేరు. కాస్త క్రోధం త్యజించు. అరుపులతో మమ్ము భయపెట్టాలనే ప్రయత్నం కట్టిపెట్టు. నీ సామర్థ్యమేమిటో మాకు కూడా చూడాలనే ఉన్నది.

నీవు మమ్ము భయపెట్టాలని పెద్దగా అరచి, ఆ అరుపులకు నీవే భయపడుచున్నట్లు మాకు అనిపిస్తోంది. ఆ గావుకేకలు ఆపి ఇటు రా. నీకేం కావాలో చెప్పు. ఆలస్యం చేసేవారికి కార్యసిద్ధి కష్టతరమే అవుతుందని వినియుండలేదా?

ఆ రాక్షసి ఆ మాటలు విన్నది "సరే. ఇదీ బాగానే ఉన్నది. నా భీకర రాక్షస స్వరూపం వీరికి చూపుతాను. అప్పుడు వీరి ధైర్యమెంతటిదో చూద్దాం!" అని అనుకొన్నది. మందహాసంతో గర్జిస్తూ ఒక దీర్ఘమైన కేక వేసింది. ఆ శబ్దమునకు దిక్కులు పిక్కటిల్లాయి. "ఒక పెద్దనల్లటి కొండయా?" అనుకునేంత శరీరంతో వారికి ఎదురుగా ప్రత్యక్షమైనది. ఆ రాక్షసి ఆకారం చూస్తే పిశాచాలకు కూడా గుండె బెంబేలెత్తి పోగలదు. కాని, మహావీరులగు ఆ రాజు, మంత్రి – ఇద్దరికీ కించిత్ కూడా క్షోభ కలుగలేదు. సత్యాసత్యములను వివేచన చేయగల బుద్ధి కలవారిని మోహింపజేయ గలిగినట్టిది ఈ సృష్టిలో ఏ దృశ్యం ఉంటుంది?

❖

**మంత్రి :** ఓ రాక్షసీ! నీకు అంత క్రోధం దేనికి చెప్పు? అల్పులు మాత్రమే స్వల్పకార్యము లందు కూడా అత్యధికమైన కోపతాపాదులు చూపిస్తూ ఉంటారని నీవు విని ఉండలేదా? కాస్త ఆ కోపం విడచిపెట్టు, బుద్ధిమంతులకు కోపము తగినది కాదు కదా! ధీమంతులు ఎల్లప్పుడూ యోగ్యమైన, న్యాయమైన రీతిలో మాత్రమే తమతమ కార్యక్రమములను నిర్వర్తించుకొంటూ ఉంటారు. ఓ అబలా! ఇక మా ధైర్యము సంగతి అంటావా? నేను ఒక్కమాట చెపుతాను విను. మా ధైర్యవాయువు యొక్క వీచికచే, నీవంటి అల్పకీటకములు వేలాది కూడా ఎండు గడ్డిపరకల వలె ఎగురగొట్టబడ గలదు. కనుక, దయచేసి నీ క్రోధమును ముందు త్యజించు, ఎవ్వరైతే సమత్వము, నిర్మలబుద్ధి కలిగి ఉండి, ఉచితరీతిగా వ్యవహరిస్తారో.... అట్టివారు మాత్రమే కార్యసిద్ధిని పొందగలుగుచున్నారు.

ఒక పని సిద్ధించవచ్చు, లేదా, సిద్ధించక పోవచ్చు. ఏది ఏమైనా, మొట్టమొదట మాత్రం సామమునే అవలంబించాలి కదా! వ్యవహారసమర్థులలో అనేకులు అట్లే చేస్తారు. కార్యము సునిశ్చితమైన తరువాత ఇక మూర్ఖంగా ప్రవర్తించవలసినపనేమి ఉంటుంది?

ఉపాయములు నాలుగు రకములుగా చెప్పబడ్డాయి.

1. సామము (Requesting & seeking consent)
2. దానము (Offering - increased consideration)
3. భేదము (differentiating)
4. దండము (Applying force - punishing)

ఎదుటివారి సంసిద్ధత మొ॥ వాటిని అనుసరించి ఆయా పరిస్థితులకు ఆయా ఉపాయములను అవలంబించటం ఉచితం. ఇప్పుడు నీ కార్యసిద్ధి కొరకు 'సామము' ను ఉపయోగించవచ్చు. మేము అందుకు మా 'సుముఖత'ను ప్రకటిస్తున్నాం.

మంత్రియొక్క ఉత్తమమైన, సందర్భోచితమైన వాక్యములు విని ఆ కర్కటి ఆశ్చర్యపడింది. తనలో ఇట్లు అనుకొన్నది.

"ఆహాఁ! పురుషులలో శ్రేష్ఠులైన ఈ ఇద్దరిబుద్ధి ఎంతో నిర్మలమైన దానివలె నాకు తోచుచున్నదే? ఓహో! ఏమి బుద్ధిబలం! ఏమి ధైర్యం! వీరిద్దరు అనేకమంది మూఢజనులవలే నాకు అనిపించుటలేదు. వీరి వాక్కు ఎంతో ప్రశాంతత, విజ్ఞత కలిగిఉంది. ముఖకాంతులను పరిశీలించిచూస్తుంటే కూడా, వీరు ఆత్మజ్ఞానులవలెనే ఉన్నారే! రెండు నదులు ఒకచోట కలుస్తున్నప్పుడు, ఆ రెండు నదులలోని జలం ఏకమైపోతాయికదా! అదే విధంగా, ఇద్దరు – ముగ్గురు బుద్ధిమంతులు ఒకచోటికి చేరి యున్నప్పుడు వారి "చూపు, వాక్కు, అభిప్రాయములు"– ఏకం అవుతూ ఉంటాయి. అవి మహాశయమును కలిగి ఉంటూ ఉంటాయి.

ఇప్పుడు నేను వీరియొక్క అభిప్రాయము లేమిటో తెలుసుకొంటాను. వీరిని చంపను. ఎందుకంటే, ఆత్మదృష్టిచే, "మేము నాశరహితులము" అని తెలుసుకొన్నప్పుడు మాత్రమే ఈ విధంగా – మృత్యువు ఎదురుగా నిలిచినప్పుడు కూడా – ఇంతటి ధృతి–ఉత్సాహములు ఉండటం జరుగుతుంది. అందుచేతనే నా ఈ భీకరాకారం చూచిన తరువాత కూడా వీరు వ్యధ చెందలేదు కదా!

ఒక్క ఆత్మజ్ఞానులే మృత్యువు యొక్క వాస్తవతత్వం తెలుసుకొనగలుగుతారు. జీవులలో అట్టివారు మాత్రమే ఇంత నిర్భయంగా నిలబడి ఉండగలరు. ఆత్మజ్ఞానము ఇటు జీవించుటయందు, అటు మరణించుట యందు కూడా గల 'ఆశ-భ్రమ' లను మొదలంట్లా లేకుండా చేసివేయగలదు. అట్టిజీవుడు 'జన్మ-మృత్యువులు' రెండిటినీ బాహ్యామైన విషయములవలె దర్శించగలడు.

ఇప్పుడు నాకుగల సందేహములను వీరిముందు ఉంచుతాను. మహాత్ముల సామీప్యత పొందిన తరువాత వారిని ప్రశ్నించాలి. వారి వచనామృతమును గ్రోలాలి. ఏవైనా సందేహాలు మిగిలి ఉంటే, వాటిని నివృత్తి చేసుకోవాలి. అట్టివారి 'సమక్షం' పొందికూడా చక్కగా ప్రశ్నించి, విని, విచారణ చేయనివారి దౌర్భాగ్యం ఏమనిచెప్పాలి? వారు అరచేతిలోని ఆహారం నేలవిడుస్తూ ఆకలితో అలమటించేవారే అవుతారు.

ఇట్లు ఆలోచనలు పొంది, ఇక కల్పాంత మేఘగర్జన వంటి గొంతుకతో ఇట్లు ప్రశ్నించసాగింది.

❖

**కర్కటి:** ఓ పాపరహితులగు ధీరపుంగవులారా! మీరెవ్వరు? కాస్త సవివరంగా చెప్పండి. నిర్మల చిత్తులను చూచిన మరుక్షణం మనయందు మిత్రత్వం స్వయంగానే సిద్ధిస్తుందని పూజ్యులు అంటారు. మీ విషయంలో నాకిప్పుడు అట్లే అనిపిస్తోంది. అందుచేత ముందుగా మీ వివరములు తెలియజేయండి.

**మంత్రి:** ఓ రాక్షసీ! ఇతడు కిరాతరాజ్య ప్రభువు. పేరు 'విక్రమమహారాజు'. నేను ఇతని మంత్రులలో ముఖ్యుడను. ఈ రాజ్య ప్రజల క్షేమము కోరి నీవంటి హింసక స్వభావులను దండించటానికి ఉద్యుక్తులమై ఈ రాత్రివేళ ఇటు వచ్చాం. "దుష్టశిక్షణ-శిష్టరక్షణ" అనునది రాజుల కర్తవ్యమే కదా! ఇట్టి మా స్వధర్మం ఉపేక్షిస్తే మేము ధర్మభ్రష్టులమౌతాము. అందుకే ఈ మా ప్రయత్నమంతా!

**కర్కటి:** ఓ విక్రమరాజా! నీ మంత్రి స్వల్పబుద్ధి కలవాడని నాకు అనిపిస్తోంది. ఇతని సలహా అనుసరించే ఈ అర్ధరాత్రి వేళ ఇటు వచ్చి నాపాల బడ్డావు. ఇట్టివానిని మంత్రిగా పెట్టుకొన్నావేమిటి? నీవేమిరాజువయ్యా? ఉత్తమ మంత్రి ఉంటేనే రాజు కీర్తివంతుడౌతాడని నీకు తెలియదా ఏమి? రాజును అనుసరించే ప్రజలు కూడా ఉంటారు. "యథారాజా తథాప్రజా" అని లోకప్రసిద్ధి కదా!

సరే అది అట్లా ఉంచు. నీకు ఒక విషయం తెలుసా?

❖❖❖

# 10. ప్రశ్నలు

సమస్త జ్ఞానములందు 'ఆత్మజ్ఞానము' ఉత్తమోత్తమమైనది కదా! రాజులందరిలోకూడా ఆత్మజ్ఞానము కలిగియున్నరాజు మాత్రమే ఉత్తమోత్తముడని అనిపించుకొంటాడు. 'ఆత్మజ్ఞుడు' అయినట్టి మంత్రి మాత్రమే దూరదృష్టిచే రాజును, రాజ్యమును కాపాడి – "శోభ" కలిగించగలడు.

"ఆత్మజ్ఞానము" ను 'రాజవిద్య' అనికూడా అంటారు. అట్టి ఆత్మజ్ఞానము లేకపోతే రాజు సమదృష్టితో వర్తించటం అసంభవం.

'ఆత్మజ్ఞానం' అనబడే రాజవిద్య ఎరుగని రాజు రాజే కాదు. ఆ మంత్రి మంత్రే కాదు.

అట్టి ఆత్మజ్ఞానము మీరు ఎరుగుదురా? ఎరిగియే ఉంటే, మీరు ధన్యులే. అప్పుడు మీరు నా వలన శ్రేయమునే పొందగలరు.

ఆత్మజ్ఞానము ఎరుగకుండానే జీవిస్తుంటే మాత్రం మీరు.... మీ రాజ్యమునకు, మీ ప్రజలకు, లోకములకు, అంతదాకా దేనికీ.... మీకుమీరే కూడా అనర్థమును కలుగజేసుకొంటున్నవారవుతారు. మీరు జ్ఞానులు కాకపోతేమాత్రం, నా స్వభావానుసారం మిమ్ములను మ్రింగి నా ఆకలి తీర్చుకొంటాను.

ఓ రాజ – మంత్రులారా! ఇప్పుడు నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. మీరు ఇవ్వబోయే సమాధానాలు నాకు తృప్తిని కలిగించాయా.... ఒక బిడ్డ తన తల్లికి ప్రీతిపాత్రమైనట్లు మీరు కూడా నాకు ప్రీతిపాత్రులౌతారు. లేదా, ఇక పర్యవసానమేమిటో మీరు ఇప్పటికే గ్రహించి ఉండాలి!

ఓ స్నేహితులారా! నేను అడగబోయే ప్రశ్నలకు చక్కగా, స్వానుభవం దృష్టిలో పెట్టుకొని, నిర్భయంగా, విమర్శనాపూర్వకంగా సమాధానం ఇవ్వండి. "నీ కార్యము సునిశ్చితమైనట్లే" అని మంత్రి చూచాయగా పలికాడు కదా! అనగా, నా కోర్కె సఫలంచేస్తానని మీరు 'ప్రతిజ్ఞ' చేసినట్లే! మీవంటి ఉత్తములు అన్నమాట తప్పుతారా? ఇక నా ప్రశ్నలు దయచేసి శ్రద్ధగా వినండి.

❖

యథార్థానికి "ఒక్కటే" అయినప్పటికీ, ఉపాధిభేదంచేత మాత్రమే అనేకముగా కనబడుచున్నదేది?

సముద్రంలో అసంఖ్యాకంగా కెరటములు లేచి లయిస్తున్నట్లు, ఏ పరమాణువులో ఈ అనేక బ్రహ్మాండములన్నీ లేచి లయిస్తున్నాయి?

'శూన్యము' కానట్టి ఆకాశము ఏది?

"లేనిది" అయినప్పటికీ, ఉనికిని కలిగియున్నదేది?

ఇంతకీ నేనెవ్వరు?

మీ ఇద్దరిలోను ఉండి ఉంటూ, "అహం" అను భావమును కలిగి ఉంటున్నదేది?

తాను నడుస్తూకూడా, కదలక ఉంటున్నదేది?

తన 'గతి' (Direction) ని నిరోధించుకోకుండానే, ఒకేచోట స్థిరంగా ఉంటున్నదేది?

అది చేతనవస్తువే, కాని, ఒక పెద్ద బండరాయిలాగా ఎటూ కదలకుండా ఉంటోంది. అదేమిటి?

"చిదాకాశము" నందు ఈ విచిత్రమైన జగత్తులన్నీ చిత్రించుచున్నదెవ్వరు?

ఏకాలమునందూకూడా--- తనరూపమును ఏమాత్రం త్యజించనట్టిదేది?

తాను అగ్ని అయివున్నప్పటికీ, దహనశక్తి లేకయే ఉన్నట్టిదేది?

అది స్వయముగా అగ్ని కాకపోయినప్పటికీ, దాని నుండి నిరంతరం ప్రకాశం ఉత్పన్నమౌతోంది. అది ఏది?

తాను నాశరహితుడై, ఈసమస్తమును ప్రకాశింపజేయుచున్నవాడెవడు?

చంద్ర, సూర్య, అగ్ని, నక్షత్రముల కంటె విలక్షణమైనట్టి ప్రకాశము కలిగినట్టిది ఏది?

చూచుటకు అది విషయమేకాదు. కాని అది దృష్టికి హేతువు. అనగా, చూడటానికి తానే కారణమైయున్నది. అదేమిటి?

చెట్లను, తీగలను, పుట్టు గ్రుడ్డివారిని, ఇంద్రియములు లేనివారిని, తదితర సర్వజీవులను ప్రకాశింపజేయునది ఏది?

ఈ ఆకాశము మొదలైనవాటిని ఉత్పన్నం చేసినవారు ఎవ్వరు?

అన్నిటికీ కూడా "సత్త" కలుగజేస్తున్నదెవ్వరు?

ఈ జగత్తంతా ఎందులో ఉన్నది?

జగత్తంతా నిండియున్నదేది?

ఈ జగత్తు వాస్తవానికి ఏదై ఉన్నది?

చీకటిని కూడా ప్రకాశింపజేసేదేది?

ఉన్నది - లేనిది కూడా అయిన అణువు ఏది?

అత్యంత దూరంగాను, అత్యంత సమీపంగాను ఉండేది ఏది?

గొప్ప మహాపర్వతమువలె ఉండే అణువు ఏది?

నిమేషస్వరూపమై [నిమిషములు - (minutes) స్వరూపముగా కలిగినదై].... తానే ఒక 'కల్పము' రూపమున కూడా ఉండేదేది?

ప్రత్యక్షంగా ఉన్నప్పటికీ, లేనట్లే తోచేది ఏది?

చేతనము అయినప్పటికీ "ఇది అచేతనము" అని నిర్ణయింపబడగలిగేది ఏది?

వాయువువలె ప్రసరించగలిగి కూడా, వాయురూపము కానిది ఏది?

శబ్దరూపమైనప్పటికీ, అశబ్దమై ఉండేది ఏది?

అంతయు 'తానే' అయి ఉండి, ఏదీ కానిది ఏది?

'అహం' భావనారూపంగా-'అనహం' భావనారూపంగా.... ఈ రెండు విధాలుగా ఒక్కసారే ఉంటున్నదేది?

ఒకానొకటి ఉన్నది. అది జీవుని స్వస్వరూపమునకు వేరైనది కాదు. కానీ, అదేమి చిత్రమో, అట్టి అనుభవం ఈ జీవునకు అనేక జన్మలలోని ప్రయత్నములచేత మాత్రమే లభిస్తోంది. ఏమిటది?

ఏది లభించిన తరువాత, ఇక అంతకు మించిన లాభము కలుగజేయునదిగాని, లాభమైనదిగాని, కోరతగినదికాని ఉండదో అది ఏది?

దేనియొక్క సర్వస్వము ఎప్పటికీ లభించకుండానే ఉంటోందో.... అది ఏది?

విషయ భోగములందలి ఆసక్తిచే, తాను ప్రసరించియున్నట్టి చోటునే తనకు బాహ్యమైన దానివలె గాంచుచు, స్వస్థతకోసం వెతుకుతోంది. తనకుతానే విస్మరించుకొంటోంది. అది ఏది?

మేరుపర్వతమును కూడా తనయందు ధరించుచు, త్రిలోకములను తృణప్రాయంగా చేసివేస్తున్నది ఏది?

దేనిని అవలోకించినంతమాత్రంచేత ఈ జగద్వ్యవహారమంతా ఒక చిన్నపిల్లవాడి నృత్యమువలె హాస్యంగా తోచగలదు?

గొప్పపర్వతములు కూడా ప్రవేశించగలిగే అణువు ఏది?

తన అత్యంతసూక్ష్మత్వము త్యజించకుండానే, మేరువు కంటే కూడా అధికమైన స్థూలత్వము కలిగి ఉండేది ఏది?

ఒక వెంట్రుకకొనలో లక్షవవంతుకంటే కూడా సూక్ష్మంగా ఉండి, అదే సమయంలో అనంతకోటి యోజనముల విస్తీర్ణం విస్తరించి ఉండేది ఏది?

ప్రకాశమును – అంధకారమును కూడా వ్యక్తపరచునది ఏది?

'వృత్తి' తో కూడిన జ్ఞానమంతా అసలు ఉంటున్నది ఎందులో?

అత్యంత ఆనందమయము, రుచికరము అయిఉండికూడా.... ఈ 'తీపి' మొదలైన రసములు లేకయే ఉన్నట్టిది ఏది?

సమస్త పదార్థములకు విలక్షణమై ఉన్నప్పటికీ, అన్నిటికీ ఆశ్రయభూతమై ఉండేది ఏది?

తననుతాను ఆచ్ఛాదించుకోలేక పోయినప్పటికీ, ఈ జగత్తునంతా ఆచ్ఛాదించివేస్తున్నది ఏది?

ఎద్దానిశక్తిచేత ఈ జగత్తంతా ప్రళయసమయంలోకూడా సత్స్వరూపమై వెలయుచున్నది?

తాను అవయవరహితమైనప్పటికీ, ఈ సమస్తమైన కాళ్ళు, కళ్ళు, "తనవే" అయిఉన్నదేది?

అనేక కల్పములు, మహాకల్పములు కూడా ఎద్దానికి ఒక నిమిషమాత్రం కూడా కాకుండా ఉంటున్నాయి?

తాను యథార్థానికి ఉత్పత్తి అనునదే లేక ఉంటోంది. కాని, దాని నుండే సృష్టికాలంలో 'జగత్తు' అనే వృక్షం ఆవిర్భవిస్తోంది. అది ఏమిటి?

ప్రళయకాలంలో ఈ 'జగత్తు' అంతా అస్పష్టమయిపోయి లయించేది ఎందులో?

మఱ్ఱి బీజములో తదనంతర మహావృక్షం దాగి ఉన్నది. అదేవిధంగా ఈ కల్పములు, ఈ సృష్టులు, ఈ జగత్తులు, నీవు, నేను ఈ మంత్రి మొదలైన చమత్కారమంతా దాగి ఉన్నది ఎందులో?

ఎట్టి ప్రయోజనముగాని, కర్తృత్వము గాని లేకపోయినప్పటికి అన్నిటికీ "కర్త" అయి ఉన్నవాడెవ్వడు?"

ఒకానొక "ద్రష్ట" ఉండి ఉన్నాడు. అతడు తన అభిలాషను అనుసరించి భోగ్యపదార్థములు

సిద్ధించుటకుగాను, తనయొక్క రూపమునే దృశ్యముగా దర్శింపజేయుచున్నాడు. అతడు ఎవ్వరు?

బంగారము తనయందు "గొలుసులు - ఉంగరములు - గాజులు" మొదలైన ఆభరణత్వము కలిగిఉన్నది కదా! అదేవిధంగా, "దృశ్యము-దర్శనము-ద్రష్ట".... అనబడు త్రిపుటిని తనయందు వ్యక్తీకరించుచున్నది ఎవరు?

ఒక మహాసముద్రం ఉన్నది. అందులో సహజంగానే అసంఖ్యాకంగా తరంగాలు ఉన్నాయి. అయితే, ఆ సముద్రంలో తరంగాలన్నీ జలంకంటే వేరైనవి కాదుకదా! అట్లాగే ఈ కల్పనామయ జగత్తులన్నీ ఒకానొకదానికంటే ఏమాత్రం వేరైనవి కావు. అది ఏది?

తరంగములు సముద్రముకంటే వేరైనవన్నట్లు అనిపిస్తూ ఉంటాయి. ఎవని కోర్కెను అనుసరించి ఈ దృశ్య జగత్తు అంతా అతనికి వేరైనదానివలె అనిపించటం జరుగుతోంది?

జలము కంటే, సముద్రము కంటే, ద్రవత్వము వేరా? కాదుకదా! అట్లాగే, ఈ ద్వైతప్రపంచ మంతా కూడా అతి సూక్ష్మమైయున్న ఏ అద్వితీయవస్తువునకు వేరు కాకుండానే ఉండియున్నది?

ఒకచిన్న విత్తనం తనయందు మహావృక్ష తత్వమంతా ధరించియున్నది కదా! ఈ త్రిలోకములన్నీ ద్రష్ట-దర్శన-దృశ్యములతో కూడియున్నాయి. సత్-అసత్ స్వరూపమైయున్నాయి. అట్టి ఈ త్రిలోకములను సర్వదా తనయందు ధరించియున్నది ఎవరు?

భూత-భవిష్యత్-వర్తమాన రూపముతో కూడియున్న ఈ మిథ్యాజగజ్జాలమంతా ఏ సమరసపూరిత వస్తువునందు ఎల్లప్పుడు స్థితి కలిగియున్నది?

ఉత్పత్తి రహితమగు ఏ వస్తువు తన ఏకస్వరూపమును త్యజించకుండానే సవికారమగు ఈ జగత్తు అగుచున్నది?

బీజము వృక్షముగాను, వృక్షము బీజముగాను అగుటకు, అట్లే తదితర సర్వ పర్యవసానములకు కారణమై ఉంటున్నది ఏది?

దేనిసమక్షంలో 'మేరుపర్వతం' వంటి మహాఘనముకూడా ఒక కలువపూవులోని ఒక తంతువువలె అతిస్వల్పమైన దానివలె అగుచున్నది?

ఏది తనయందు కోట్లకొలది బ్రహ్మాండములుకూడా ఒక్కసారే కలిగియున్నది?

ఉపాధి భేదముల దృష్ట్యా (due to different adjuncts) అనేక చైతన్యములతో ఈ విశ్వమును విస్తరింపచేస్తున్నది ఎవరు?

దేనిశక్తియొక్క ప్రభావంచేతనే నీవు, ఈ మంత్రికూడా ఆయా సమస్త వ్యవహారములలో చక్కగా నిర్వర్తించగలుగుతున్నారు? ప్రవర్తించగలుగుచున్నారు?

దేనిని ఒక్కసారి దర్శించామా.... ఇక మనమంతా నిర్మలమైన బుద్ధిని పొందినవారమై అద్దానిని తప్ప, ఇంకదేనిని తలచకయే ఉంటాం?

❖

ఓ రాజా! నా ప్రశ్నలన్నీ విన్నావుకదా! నేను చిత్తశాంతిని పొందుటకుగాను అట్టి వస్తువు లేక 'విషయము' గురించి సవివరణపూర్వకంగా చెప్పండి.

మీ ప్రత్యుత్తరంతో నాలోని సంశయమంతా తొలగిపోగలదని నేను అనుకొంటున్నాను. ఎవడైతే ఈ సంశయములను తొలగించుటకు శక్తుడై ఉండడో, అట్టివాడు అవిద్యతో కూడుకొన్నవాడే కదా! అట్టివాడు అపండితుడే. ఓ బుద్ధిమంతులారా! నా సంశయాలన్నీ నివారించమని మరల మరల అర్థిస్తున్నాను.

ఆ విషయమేదీ మీకు ఇప్పటివరకు ఏమాత్రం తెలియదంటారా? మీరిద్దరు నాకు ఆహారం అవండి. మిమ్ములను భక్షించిన తరువాత, మీ రాజ్యములోని ప్రజలనుకూడా మ్రింగివేస్తాను.

కనుక నా ప్రశ్నలకు సమాధానమిచ్చి, తద్వారా మీ ప్రజలను కాపాడుకోండి. ఆత్మజ్ఞాన శూన్యులకు భోగాదులు ఉండి ఏమి లాభం? అదంతా వారి వినాశనము కొరికే అగుచున్నదిసుమా! అందుచేత మీరు కనుక 'అజ్ఞానులే' అయిఉంటే, ఆకలిచే బాధింపబడుచున్న నేను మిమ్ములను ఆరగించుటలో దోషం ఏమి ఉంటుంది? ఉండదు కదా!

❖

ఈ విధంగా గంభీరంగా పలికి ఆ రాక్షసి మౌనం వహించింది. ఒక్కసారి ఆ అంధకారారణ్యం అంతా నిశ్శబ్దం తాండవించింది. రాజు, మంత్రులిద్దరూ అత్యంత ఆశ్చర్యంతో ఆ ప్రశ్నలన్నీ విన్నారు. మహాధీశాలియగు మంత్రి ఒకచిరునవ్వు నవ్వి, ఆపై ఇట్లు ప్రత్యుత్తరమివ్వసాగాడు.

❖❖❖

## 11. మంత్రి సమాధానం - "ఆత్మ యొక్క స్వరూప - స్వభావాలు"

**మంత్రి :** ఓ రాక్షసీ! నీ ప్రశ్నలన్నీ ఎంతో శ్రద్ధగా విన్నాం. నీవన్నీ అత్యంత ఆశ్చర్యకరమైన ప్రశ్నలే. ఆ ప్రశ్నలలో మహాజ్ఞానం శోభించటం మేము గమనించాము. వాస్తవానికి నీ ప్రశ్నలకు చెప్పగల సరిఅయిన సమాధానం మనోవాక్కులచే ప్రకటించబడేదికాదు. అయితే ఆత్మజ్ఞానులు, శాస్త్రములు వ్యవహరిస్తున్నతీరుగా అనుభవమే నిరూపణ అయిఉన్న సమాధానం చెప్పచున్నాను. విను.

❖

నీ యొక్క ఉత్తమోత్తమవచనములచే "పరమాత్మ" గురించే తెలిపావు. ఆ పరమాత్మయే నేను, నీవు, మరియు ఈ సర్వంకూడా.

**ఈ వర్తమానక్షణంలోనే ప్రతి ఒక్కరి స్వరూపం అది! :** అట్టి ఆ పరమాత్మ "వాక్కు" నకు అతీతమై, మనస్సుకు కూడా అలభ్యమై, పంచేంద్రియముల అనుభవమునకు అందనిదై ఉంటోంది. అణుస్వరూపమై, 'ఆకారము' కంటేకూడా అత్యంత సూక్ష్మమై వెలయుచున్నది. ఒక విత్తనంలో "ఫలములు-పుష్పములు-ఆకులు-కొమ్మలు-కాండము-వ్రేళ్ళు -భవిష్యత్ విత్తులు".... మొదలైన వ్యవహారమంతా ఉండిఉన్నట్లు, 'చిత్' అణువునందే 'సత్-అసత్' రూపమగు ఈ జగత్తంతా

స్ఫురిస్తోంది. అట్టి ఆ సద్వస్తువు ఎప్పటికో ఎక్కడో ఉన్నదికాదు. అందరియొక్క ఈ క్షణములోని ఆత్మస్వరూపము అదే. అనుక్షణం ప్రతిజీవుడు అదియే అయిఉన్నాడు. సృష్టి మొదట్లో స్థితి కలిగియున్నది అదొక్కటే. అందుచేత, సమస్తపదార్థములు దానియందే సత్త పొందుచున్నాయి.

**సర్వము – సర్వరూపము – రూపరహితము! :** ఆ పరమాత్మయే సర్వము. అందుచేత, ఇకదానికి బాహ్యమైనదంటూ ఏదీ లేదు. అదియే ఆకాశము. అయితే అది జడము కాదు. అది సర్వదా శుద్ధము, దోషరహితము కూడా. శుద్ధ చైతన్యమగు అది ఈ ఆకాశము కంటే వేరైనదికూడా. అనంతమగు ఆ 'చిత్' అణువు ఈ భౌతికమైన ఇంద్రియములచే దర్శించబడజాలదు. ఇంద్రియాలకు 'అవిషయము' అయిఉండటంచేత "అది రూపరహితము" అని చెప్పబడుతోంది. అంతయు తనరూపమే అగుటచే "సర్వరూపము" కూడా. దృశ్యము దానియందు లేదు. అందుచేత "అరూపము" అనటం కూడా సమంజసమే.

**గోచరించేదంతా అదే – కాని అగోచరం! :** సర్వము తానే అయిఉన్నది. ఏదియు కాకుండానే ఉన్నది. నేను – తండ్రిగా, సోదరునిగా, మిత్రునిగా, సేవకునిగా కుమారునిగా – ఇట్లు అనేకముగా అనేకులకు ప్రాప్తించుచు......., వీటిలో ఏ ఒక్కటీ కాకుండానే ఉన్నాను కదా. ఇది కూడా అట్టిదే.

ఒకే బంగారమునందు అనేక రకములైన అభరణములు ఉంటూకూడా, బంగారముమాత్రం మార్పులేకుండా యథారీతిగానే ఉండిఉంటోంది కదా! ఆ తీరుగానే ఒకే చైతన్యము అనంతసంఖ్యలైన ఉపాధులలో ప్రతిబింబించుటచే భిన్నభిన్నములుగా గోచరిస్తోంది. పరమాకాశస్వరూపమగు ఆ చిదణువే అన్నిటిని ప్రకాశింపజేస్తోంది. అత్యంతసూక్ష్మమై, ఇంద్రియములకు లక్షితము (object of perception) కాజాలకున్నది. అందుచేత అలక్షితము. సర్వులరూపము, సర్వరూపము అదే అయినప్పటికీ–అది ఇంద్రియములకు గోచరించేది కాదు.

**శూన్యము – సర్వవ్యాపకము! :** పరమాత్మస్వరూపమగు ఆ సద్వస్తువు వస్తురహితమగుటచే "శూన్యము". అయిననూ అయ్యది సర్వుల ఆత్మస్వరూపమై ఉన్నదికదా!.... అద్దానిని 'శూన్యము' అని ఎట్లా అనగలం? ఎవ్వరైనా తననుతానే "నేను లేను. నేను శూన్యమును" అని ఎట్లా నిషేధించుకోగలడు, చెప్పు? ఏ యుక్తిచే విచారించినా సరే "సత్తు" అసత్తు అవుతుందా? లేదు. కస్తూరి తన సువాసనలచే నాలుగువైపులా వ్యాపించియే ఉంటుంది కదా! (అంతట వ్యాపించి ఉంటున్నది. సద్రూపమగు ఆత్మయే అది. అది ప్రతి ఒక్కరి స్వస్వరూపము.)

**ఏకము – అనేకము! :** ఈ ఇంద్రియవృత్తులచే చిద్వస్తువే (లేక ఆత్మయే) అనేక రూపములుగా అనుభవమౌతోంది. అంతాకూడా అది మాత్రమే. అయితే, అది శుద్ధచైతన్య మాత్రమై, ఇంద్రియములకు అతీతమగు తత్త్వమై, ఆ ఇంద్రియములను ప్రకాశాపజేయునదియై, అపరిచ్ఛిన్నమై ఉండి ఉంటోంది. అందుచేత అది మరింకేదీ గాకుండానే ఉంటోంది. ఆ పరమాత్మ సర్వదా ఏకమే అయిఉన్నప్పటికీ, ఉపాధిభేదం చేత అనేకంగా తోచుచున్నది. సర్వుల ఆత్మస్వరూపము అదేకనుక, ఈ జగత్తును ధరిస్తున్నది అదే. 'జగత్తు' అనే రత్నం ఉన్నట్టి పెట్టె ఆ పరమాత్మయే. ఆ చైతన్యమహాసముద్రంలో

"జగత్తులు" అనే తరంగాలు ఆవర్తముల వలె (Circles or Revolutions) వ్యక్తమౌతున్నాయి.

**స్వానుభవము - అలభ్యము! :** అట్లు ఇంద్రియ - మనస్సులకు లభించక, "శూన్యమా"? అని వితర్కించబడుచున్న ఆ పరమాత్మ వాస్తవానికి "స్వానుభవమే" అయిఉంటోంది. ఆత్మసాక్షత్కారముచే తనయందే లభించుచున్నది. కాని, లభించకయే ఉన్నది. ఎందుకంటావా?

ఏ 'అనుభవి' కైనా (Experiencer) అతని కంటే వేరైనది మాత్రమే లభించటం జరుగుతుంది. అతని కంటే ఏమాత్రం వేరుకానిది అతనికి "లభించుట" ఎట్లా?

వాస్తవానికి అది ఎల్లప్పుడు లభించియే ఉన్నది. "అది ఆకాశరూపము అయి ఉన్నప్పటికీ, శూన్యము మాత్రం కాదు" అని జ్ఞానులు ప్రకటిస్తున్నారు.

**"నేను-నీవు-నాది-నీది" - అంతాకూడా "తానే"! :** ఓ రాక్షసీ! అద్వైతతత్వ సాక్షాత్కారముచే నేను ఆత్మనే అయిఉన్నాను. నీ రూపమున వెలుగుచున్నదికూడా నేనే. అయినప్పటికీ, పారమార్థిక దృష్టిచే ఆత్మ నాది కాదు. నీదికాదు. మరెవ్వరిదీ కూడాకాదు. నేను, నీవు, అతడు --- ఇత్యాది వ్యవహారమంతటికీ ఆవల అది ఉన్నది. అది కేవలం 'బోధ' స్వరూపం మాత్రమే. "నీవు - నేను - అతడు" అనే భేదభావమంతా అట్టి కేవలస్వరూపమగు ఆత్మయందే ఉద్భవించి లయించుచున్నది. అది మాత్రమే తనంతతానుగా అంతటా వెలుగుచూ, ఈ సర్వమును భాసింపజేయుచున్నది. ఆత్మతో ఏకత్వము సంపాదించిన నిర్మల హృదయములకు అది ఇప్పటికిప్పుడే అనుభవమౌతోంది.

**నిశ్చలము - వ్యాపకము! :** ఆ "శుద్ధ" చైతన్యమే ఆకాశమువలె అనేక యోజనములు వ్యాపించియున్నది. అన్నివైపులా చలించుచూనే సర్వదా చలించకుండానే ఉంటోంది. ఒకడు తన స్వప్నమునందు స్వీయకల్పనా ప్రభావంచేత తన హృదయమునందే వేలాదిమైళ్ళ విస్తీర్ణం, అసంఖ్యాకమైన పదార్థములను వ్యక్తులను దర్శించుచున్నాడు కదా! ఈ బాహ్యమున తోచుచున్న విస్తీర్ణములన్నీ ఆ 'చిత్‌వస్తువు' నందే ఉండిఉన్నాయి. ఇక, అద్దాని చలనము విషయమేమిటంటావా? అది సర్వత్రా వ్యాపించియుండుటచే, అన్నివైపులా సంచరిస్తూ ఉన్నప్పటికీ స్థిరముగానే ఉండిఉంటోంది. తనయొక్క చిదాకాశ గర్భమునందు సర్వదేశ - కాలాదులు కలిగియుండి, ఏ మాత్రం చలనము లేకయే ఉంటోంది. పొందతగిన ప్రదేశమంతా దానియందే ఉండియుండుటచే ఇక అది ఎటూ పోలేదు. ఒకతల్లి తన 'పైట' క్రింద పాపను ఉంచుకొని, ఆ పాపకొరకు వెతుకుచున్నదనుకో .... కొంతసేపటికి ఆ పాప పైటలోనే ఉన్నదని గమనించినప్పుడు క్రొత్తగా పొందినది ఏం ఉన్నది? ఈ జీవుడు వాస్తవానికి ఆత్మవస్తువే అయిఉండగా --- ఇక అట్టి ఆత్మవస్తువు ఒకప్పటికి ఏదో నిర్వర్తించి ఆపై పొందటమనేది ఎక్కడ ఉంటుంది?

**రాక - పోకలు లేనిది! :** ఒక కుండకు మూతనుపెట్టి, దానిని ఒక చోటునుండి మరొకచోటికి తీసుకుపోయామనుకో.... ఆ కుండలోని ఆకాశమునకు రాకపోకలు ఉంటాయా? ఉండవు. ఆత్మకు కూడా గమనాగమనములు లేవు. సమస్త "దేశ-కాల-కల్పనలన్నీ (Space - time - Imaginations) జరుగుచున్నవి. తనయందే అయిఉండగా, ఇక ఎట్లా, ఎటు పోగలదు? దృష్టాంతము

నీ యొక్క స్వప్నమే. నీ స్వప్నంలో కనబడే విస్తారమైన ప్రదేశములు, వస్తువులు, వ్యక్తులు నీయొక్క కల్పన చేతనే దర్శించబడుచుండగా, అందులో నీవు ఒకచోటునుండి మరొకచోటికి పోవుట ఏమిటి?

**జడము – చేతనము – కర్తృత్వరహితము!**

ఆ చైతన్యము ఒకానొకప్పుడు, "ఈ జడమగు దేహమే నేను" అను రూపముగల తెంపులేని "ధ్యాస" (Cogitation) కలిగి ఉంటోంది. అప్పుడు అది చిత్తమును పొందినట్లు, జడముగా అయినట్లు భావనను ప్రదర్శిస్తోంది. అందుచేతనే, "ఆత్మ జడము – చేతనము కూడా" అని చెప్పబడుచున్నది.

**కర్త – అకర్త – భోక్త – అభోక్త! :** ఆ చిద్వస్తువు రాతియందు కూడా వ్యాప్తమైయున్నది. అది ఒక బండరాయిలాగా 'మహాఘనము' అని చెప్పబడింది. అనాది–అనంతము అయినట్టి 'చిదాకాశము' అను గొప్ప శిలయందు ఈ 'స్వర్గలోకం–మర్త్యలోకం –పాతాళలోకం' అనబడు విచిత్రములైన శిల్పభాగములను చిత్స్వరూపుడగు పరమాత్మయే చిత్రించుచున్నాడు. అయితే ఆ త్రిలోకముల వ్యవహారమంతా మిథ్య, కల్పన మాత్రమే సుమా! శిలలో కన్పించే ఆయా శిల్పలేఖనమంతా శిలకు వేరైనది కాదు కదా! శిల శిల్పస్థితిలో కూడా శిలగానే ఉండి ఉంటోంది. అట్లే "ఇక్కడ ఏదియు సృష్టించబడుట లేదు. ఇదంతా అకృతమే. అనగా, దీనికి ఎవ్వరూ 'కర్త' లేదు" అను వాక్యములు కూడా సమంజసములే అగుచున్నాయి.

'అగ్ని' యొక్క సత్త, తదితర భూతముల సత్త కూడా ఆత్మసత్తకు అధీనమై ఉంటోంది. ఇక ఆత్మయో, సర్వవ్యాపి కదా! ఈ జగత్తును ప్రకాశింపజేసేది ఆత్మయే. కాని అది అగ్నిలాగా మరొక దానిని దహించేది కాదు. ఆ ఆత్మచైతన్యము దేదీప్యమానమై, ప్రకాశవంతమై, ఆకాశము వలె నిర్మలమై ఉంటోంది. అట్లు ఉండగానే అద్దానినుండి జ్వలనశక్తి గల అగ్ని, తదితర భూతజాలం ఉత్పన్నమౌతున్నాయి.

**దానిని స్పర్శించగలిగేదేదీ లేదు .... కాని అంతటికీ స్థానం అదే! :** ఆత్మకు రూప–నామాలు లేవు. అనుభవరూపమగు ఆ ఆత్మయే చంద్ర–సూర్యాదులనుకూడా ప్రకాశింపజేయుచున్నది. అట్టి ఆత్మ యొక్క ప్రకాశమును 'మహాకల్పాంతములు' కూడా స్పృశించలేవు. ఈ భౌతికమైన నేత్రాదులకు లభ్యము కానట్టి అనుభవ రూపమగు ఆ ఆత్మయే హృదయంలో దీపమువలె ప్రకాశిస్తూ, సమస్తమైన తదితర ప్రకాశములకు 'సత్త'ను కలుగజేస్తోంది. స్వయం జ్యోతిస్వరూపము..... ఇంద్రియమనస్సులకు అతీతము .... అయినట్టి ఆత్మ నుండే "నీవు, నేను, తదితర జగత్తు" అను ప్రకాశమంతా ఉత్పన్నమగు చున్నది. దీపపు వెలుతురులో వస్తువులు కనబడుచున్నట్లు, ఆత్మ యొక్క ఉనికిచేత ఈ దేహము – ఇంద్రియముల అనుభవం కలుగుతోంది. చెట్లను, పూతీగలను కూడా పోషించేది ఆ పరమ ప్రకాశరూపము, అనుభవమాత్రము అగు ఆత్మయే.

అంతా ఉన్నది అద్దానియందే.... కాని దానికి దేనితోకూడా సంబంధమే లేదు. అద్దానియందు జగత్తు – జీవులు అనబడేవేవీ లేవు. దర్పణంలో అన్నీ అగుపడుచున్నప్పటికీ, దర్పణంలో ఏ వస్తువూ లేదుకదా! స్వప్నాంతర్గత వస్తువులతో స్వప్నదృష్టకు పోలికయే లేదుకదా!

ఓ ఆత్మస్వరూపిణీ! అనుభవస్వరూపమగు ఆత్మయందే ఈ "దేశ-కాల-క్రియాదులు, జగత్‌సత్త" కూడా ఉండి ఉన్నాయని సూక్ష్మ బుద్ధికి తెలియవచ్చుచున్నది. మన బాహ్య దృష్టితో చెప్పుకొంటే- పరమాత్మయే ఈ జగత్తుకు తండ్రి అయి ఒప్పుచున్నాడు. అన్నిటికి కర్త-భోక్త-ప్రభువు అతడే. కాని పరమార్థ దృష్టితో చూచినప్పుడు ... అతడు పరిశుద్ధాత్ముడు అగుటచే ఏదియు కాకయే, దేనికి సంబంధించకుండానే ఉంటున్నాడు.

**జగత్కారణము-జగత్స్వరూపము! :** ఆ "చిత్ అణువు" తన అణుత్వమును ఏమాత్రం త్యజించకుండానే ఈ "సువిశాలజగత్తు" అను రత్నమును ధరిస్తోంది. స్వప్నములో, ఆ స్వప్నమునకు ద్రష్టవై ఉన్నట్టి నీవు ఆ స్వప్నజాలమంతా చూస్తూ ఉన్నప్పటికీ-అందులో కొన్నింటిని త్యజిస్తున్నప్పటికీ నిన్ను నీవు త్యజించుట జరుగుతోందా? లేదుకదా! అందులో నీవు పాల్గొనుచు సుఖదుఃఖములు, సంయోగవియోగములు అనుభవిస్తున్నప్పటికీ, ఆ స్వప్నములో తటస్థపడుచున్నదంతా నీ కంటే వేరైనదేదీ కాదు. ఈ దృశ్య జగత్తు విషయం కూడా అట్టిదే! అయితే వాస్తవానికి "ద్రష్ట-దృశ్యము -దర్శనము" ... అను రూపముతో తోచుచున్న ఈ జగత్తు శుద్ధమగు ఆత్మయందు లేనేలేదు. 'మరి ఈ జగత్తు ఉన్నదెక్కడ?- అని మనం పరిశోధిస్తే, ఇది ఆత్మలోనే ఉన్నది కాని, మరింకెక్కడా లేదు. అని కూడా తేలుచున్నది. స్వప్నము నీలోనే ఉన్నదికాని, ఆ స్వప్నమునందు నీవు లేవు కదా! నీవే ఆ స్వప్న రచనా వ్యవహారము కంతటికీ కర్తవు. అంటే ఏమిటి? నీయందు, నీవే, నీ కల్పనచే (లేక) ఊహచే ఆ స్వప్నమును ఆ రీతిగా దర్శించుచున్నావు. అయితే, పరిశుద్ధమగు ఆత్మయే స్వరూపముగా గల నీయందు స్వప్న తుల్యమగు ఈ వస్తుజాలమంతా ఎక్కడుంటుంది? ఉండదు.

**అద్వితీయం - నిత్యోపలబ్ధం! :** ఆత్మవస్తువును పొందాలంటే అధికమైన ప్రయత్నం అవసరమగు చున్నది. అందుచేత "అది కష్టసాధ్యం" అని అంటున్నారు. బాహ్యదృష్టిచే ఎంతగా వెతికినా లభించదు కనుక "తమస్సు" అని చెప్పుచున్నారు. చిన్మాత్ర స్వరూపమే అది కనుక "జ్యోతిర్జ్యోతి" (అది వెలుగులకే వెలుగు) అని అనటంకూడా సమంజసమే. అది ఇంద్రియములకు అలభ్యం కనుక "అత్యంతదూరంగా ఉన్నది" అని చెప్పబడుతోంది. అదియే ద్రష్ట కదా! అందుచేత అంత సామీప్యములో ఉన్నది మరొకటేదీ లేదు" అను మాట వాస్తవమే అగుచున్నది. నీకు 'నీ'కన్నా వేరేది సమీపమున ఉన్నది చెప్పు? అన్ని సమయములలోను "... నేను ...నేను ..." అను రూపమున అది ప్రత్యక్షముగానే ఉన్నది కదా! అత్యంత సూక్ష్మమై అత్యంత ఘనీభూతమైకూడా ఉన్నది అదే. ఈ "నేను" అనునది ఉండనిది ఎప్పుడు?

**స్వీయస్ఫురణ! :** జగత్తు = స్వకీయ స్ఫురణ!

ఓ చిదానంద స్వరూపిణీ! దృశ్యమానమై కనబడు ఈ జగత్తంతా "చిత్తము యొక్క స్వయంకృతమైన స్ఫురణ" మాత్రమే సుమా! కనుక ఈ కనబడే పర్వతములు, భూమి, నీవు, నేను - మొదలైన వస్తువులన్నీ సత్యములు ఏమాత్రం కావు. స్వకల్పనచే ఘనీభూతమైన 'దృష్టి' కారణంగా ఇవన్నీ ఈ విధంగా జీవునకు తోచుచున్నాయి. సర్వము కల్పనతో కూడిన దృష్టి యొక్క పర్యవసానమే అయి

ఉండగా, ఇక ఒక అణుస్వరూపమునందు ఒక మహాపర్వతము యొక్క 'సత్త' సిద్ధించుటలో ఆశ్చర్యం ఏమి ఉంటుంది?

**కాలము – కాలాతీతం! :** ఆత్మ "క్షణము" లో కూడా ప్రకాశిస్తూనే, అదియే 'నిమిషము' అని, 'కల్పము' అని కూడా కల్పింపజేస్తోంది. ఉదాహరణకు, అనేకకోట్ల మైళ్ళ దూరంలో ఉన్న ఒకానొక నగరం క్షణంలో మనస్సునందు భాసించుచున్నది కదా! 'కల్పము' – అంతటి కాలములోని క్రియలనన్నిటినీ ఈ ఆత్మ తనయందు ఒక్క నిమిషంలో ప్రతిభాసింపజేయగలదు. ఒక చిన్న – నిర్మలదర్పణం విశాలనగరమునను కూడా తనయందు ప్రతిబింబింపజేయకలదు. అట్లాగే, ఒక్క నిమిషములో "అనేక కల్పములు" కూడా సంభవమే. ఈ "నిమిషము – కల్పము" మొదలైనవన్నీ ఒకానొక మిథ్యాత్వమును ఆశ్రయించి సూక్ష్మాతి సూక్ష్మమైన అణువులోనే ఉండి ఉంటున్నాయి. ఇక అద్దాని యందు 'ద్వైతము–ఏకత్వము' ఈ రెండూ సంభవములే. మిథ్యాదృష్టికి ఏది ఏ రూపంగానైనా ప్రాప్తించగలదు. ఒకని 'ఊహాకల్పన' యందు ఏది ఎట్లైనా ఉండగలదు కదా! ఇందుకు మనకు దృష్టాంతము "స్వప్నభ్రమ"యే. ఎంతో కాలం ప్రయత్నించిన తరువాత కూడా సంభవించనిది, స్వప్నంలో క్షణకాలంలో సంభవిస్తోంది. హరిశ్చంద్రమహారాజుకు ఒక్క రాత్రియే పండ్రెండు సంవత్సరాలుగా తోచటం జరిగింది. దుఃఖంతో బాధింపబడేవానికి కొంచెము కాలము కూడా అత్యంత దీర్ఘంగా తోచుచున్నది. సుఖము అనుభవించువానికి దీర్ఘకాలం కూడా స్వల్పకాలము వలె గడచిపోతుంది. పాచికలాడేవారికి అనేక రోజులు ఇట్టే గడచిపోతున్నాయి. "కొద్ది సమయం దీర్ఘంగాను, భారంగాను ఉండటం, దీర్ఘకాలం త్వరత్వరగా గడచిపోవటం" అనే ఈ రెండూ విషయాలు మనలో ప్రతి ఒక్కరికీ ఈ లౌకిక జీవితంలో కూడా అనుభవమగుచున్నవే!

బంగారమునందు "ఈ ఈ ఆభరణములు వేరు వేరు" అని తోచుచున్నది కదా! అట్లే, చైతన్యమునందు కూడా ఈ సత్య–అసత్యముల రూపమున గల నిశ్చయమంతా ఏర్పడుతోంది. ఈ అనేక జీవుల రూపంతో, సత్యాసత్యములతో కూడినదై ప్రకాశించుట అద్దాని చమత్కారము మాత్రమే. ఓ చైతన్యస్వరూపీ! పరమార్థ దృష్టియందు "నిమిషము–కల్పము" గాని "దూరము–దగ్గర" గాని, లేనే లేవు. "చిత్ అణువు" నందే ఉండి ఉన్నట్టి చిత్తము యొక్క వృత్తులే భిన్నభిన్నములుగా కనిపిస్తున్న వివిధ రూపములతో కూడిన ఈ దృశ్యజగత్తుకు కారణమగుచున్నది. సర్వము దేనిచే అవధరించబడుతోందో.... అట్టి అధిష్ఠానమగు చైతన్యమునందు 'ప్రకాశము – అంధకారము', 'దూరము – దగ్గర', 'జడము – చైతన్యము' మొదలయినవన్నీ అభ్యాసపూర్వకంగా సంకల్పించబడి, అనుభవించబడుచున్నాయి.

**ప్రత్యక్షం – అప్రత్యక్షం! :** సర్వేంద్రియములకు 'ఆత్మ' యే శక్తిని ప్రసాదిస్తోంది. కనుక, అది సర్వదా (ఆధార–రూపంగా) ప్రత్యక్షము అయి ఉండనే ఉన్నది. అయితే అది ఇంద్రియాదులకు ఎదురుగా ప్రత్యక్షమై ఉండుటలేదు. కనుక "అది అప్రత్యక్షమైనది" అని అనటం కూడా సరియే. ఆ ఆత్మయే ఒక వైపు ద్రష్ట (Seer) అయి , సద్రూపమై, ఉండి ఉంటోంది. అదే సమయంలో

మరొకవైపు దృశ్యమై ప్రకాశించుచు ప్రాప్తించుచున్నది. అయితే, "ఎదురుగా నిలచియున్నట్టి ఈ దృశ్యము సత్యమే" అను బుద్ధి ఉన్నంతవరకు "చిత్స్వరూపబుద్ధి" ఏర్పడుటలేదు. శిల్పమును చూచేవాడు 'ఇది శిలయే' అనే దృష్టి కలిగి ఉండడు కదా! ఆభరణమును చూచుచున్నప్పుడు "వీటి అన్నిటిలో ఉన్నది ఒకేరకమైన 'బంగారము' మాత్రమే" అనే విషయం ఏమరుపాటు పొందుతోంది. బంగారము అను దృష్టితో చూస్తే "అనేక ఆభరణములు" అను భావావేశం ఉండదు. ఈ దృశ్యమునకు సంబంధించిన సంకల్పములన్నీ క్షీణించటం జరిగినప్పుడు --- తనతో సహా ఈ కనబడే సర్వులయందు, సర్వమునందు 'శుద్ధబ్రహ్మము' ఒక్కటే వ్యాప్తించియున్నట్లు సుదృఢంగా తెలియవచ్చుచున్నది.

**సత్తు – అసత్తు! :** ఆత్మయే – సర్వులయొక్క వాస్తవ స్వరూపమై ఉండి ఉండుటచే అది 'సత్తు'. అయితే, అది ఒక బాహ్యవస్తువు కాకుండుటచే, అది దుర్లక్ష్యమైన "అసత్తు" కూడా! కథారచయిత నాటకంలోని సంఘటనలను రచిస్తూ, అతడు మాత్రం కథాగమనంలో (లేక) తెరపై అగుపించనట్లు, ఆత్మ ఇంద్రియములకు ఎదురుగా అగుపించకపోవటంచేత 'అసత్తు' కూడా అగుచున్నది.

అది ఎల్లప్పుడు చైతన్యరూపిణిగానే ఉన్నది. ఆత్మయందు ఈ విషయములు, అనుభవములు మొదలైనవన్నీ ఉండుట అసంభవం. ఎట్టి అనుభవములు, మార్పులు, చేర్పులు, దాని యందు ఉండవు. కనుక "ఆత్మ అచేతనమైనది" అని కూడా అంటున్నారు. ఇక ఈ జగత్ విషయం ఏమిటంటావా, ఇది చిత్ (Absolute Awareness) 'ఎరుక కలిగియుండుట' అను తత్త్వము యొక్క చమత్కారం మాత్రమే. చిత్ స్ఫురణమే దీని రూపము. అందుచేత, "జగత్తును చైతన్యమే నిర్మించు చున్నది" అనుట మాత్రం ఎట్లా? సూర్యకిరణములు "మృగతృష్ణయందలి జలం"గా కనిపిస్తున్నప్పుడు, "సూర్యకిరణాలు మమ్ము భ్రమింపజేయుటకే అట్టి పని నిర్వర్తిస్తున్నాయి" అని అనగలమా? సూర్య కిరణాలకు కర్తృత్వం ఆపాదించగలమా? లేదే! అసలు, మృగతృష్ణ కనబడటానికి కారణం ఏమిటి?

1) ద్రష్ట యందలి అజ్ఞాన దృష్టి
2) సూర్యకిరణముల స్వభావసిద్ధమైన ప్రసరణ

'అద్వైతము – విశాల రూపము' అయిన చిద్వస్తువే ఈ జగత్తురూపంగా 'భావన' చే పొందబడుచున్నది.

'సూర్యగోళము' అనగా ఏమిటి? 'కిరణములు – అగ్ని' యొక్క సంయోగమే సూర్యగోళము రూపమున మనకు ప్రాప్తిస్తోంది కదా! 'ప్రకాశము –కిరణములు' కాకుండా సూర్యునకు వేరైన అస్థిత్వమెక్కడ? నాస్థిత్వమెక్కడ? ఈ "నిమిషము–కల్పము" మొదలైన వాటితో కూడిన జగత్తు కూడా బ్రహ్మమునందు కల్పించబడినదై భాసించుచున్నది. సూర్యకిరణముల సంయోగం కారణంగా ఆకాశంలో వర్ణములు ఏర్పడినప్పుడు, అది చూస్తున్నవారిలో కొందరు అజ్ఞాన బాలురు "ఓహో! ఆకాశములోని ఈ ప్రదేశమును ఎవరో బంగారముతో పూతవేశారు" అనుకొంటారు. అజ్ఞానబాలురకు మాత్రమే అట్లు అనిపిస్తుంది కదా! అజ్ఞానికి మాత్రమే అవిద్య యొక్క ప్రభావం చేత ఈ జగత్తు ప్రత్యక్షమై ఎదురుగా నిలచుచున్నది. జ్ఞానికో – ఇదంతా బ్రహ్మముగానే తెలియవచ్చుచున్నది.

వాస్తవానికి బ్రహ్మమునందు (శుద్ధస్వస్వరూపమునందు) "చిత్ – ఎరుగునది, చేత్యము –ఎరుగ బడునది" అను భేదమే లేదని విజ్ఞులైనవారు గ్రహించుచున్నారు.

స్వప్నంలో కనబడే వస్తువులు, వ్యక్తులు సత్యమెట్లా అవుతాయి? అయితే స్వప్నద్రష్టకు మాత్రం ఆ స్వప్నసమయంలో అవన్నీ సత్యమే అయినట్లు అనుభవమౌతున్నాయి. అందుచేతనే ఆ నిదురించేవాడు భయాదులు ప్రదర్శిస్తూ గావుకేకలు వేయటం జరుగుతోంది. అతడు కలవరిస్తుంటాడు. స్వప్నములోని పదార్థములు సత్యములు గాని, అసత్యములు గాని కావు. కేవలం "స్వకీయ భ్రమ మాత్రము" అయి ఉన్నాయి కదా! అట్లే ఈ జగత్తుకూడా భ్రమమాత్రమేనని గ్రహించటం ఉచితం.

ఈ విధంగా, "ఈ జగత్తు మిథ్యయే" అని సూచించే యుక్తులను మరల మరల చింతిస్తూ ఉండాలి. ఇట్లు క్రమంగా అభ్యసిస్తూ రాగా... అట్టి "ముముక్షువు" యొక్క చిత్తము నిర్మలత్వం పొందుతూ ఉంటుంది. క్రమక్రమంగా 'అవిద్య' అంతా నశించిపోతుంది. అప్పుడిక శేషించునది చిదాకాశ సందర్శనానందం మాత్రమే. అట్టి చిదాకాశానందము ప్రాప్తించిన ఇక ఈ సంసారదుఃఖము మచ్చుకైనా మిగిలియుండదు.

గోడకు బహువిస్తారమైన ఆకాశమునకు భేదమంటూ ఏమీ లేదు. అయితే మరి ఈ కనబడేదంతా ఏమిటంటావా? భేదంగా కనిపించేదంతా కల్పితము మాత్రమే. బ్రహ్మదేవుని నుండి ఒక చిన్నపురుగు వరకు భిన్నభిన్న అనుభవరూపములుగా రూఢిపడి ఉన్నదంతా కల్పనను అనుసరించే ఏర్పడుచున్నది. అట్టి కల్పన ఆ ద్రష్టకు వేరైనది కాదు. కల్పించువాడు కాకుండా కల్పనకు వేరు అస్థిత్వమెక్కడ?

**అపరిమితము – సర్వాత్మకము!** : సూర్యప్రకాశము ప్రసరించుచున్న చోట దర్పణమో, మణియో ఉంటే, అవి కూడా ప్రకాశిస్తూ ఉంటాయికదా! చిదాకాశము నందు చిత్ప్రకాశము చేతనే ఈ లోకములన్నీ ప్రకాశిస్తున్నాయి. 'అద్వైతము, అపరిమితము' అయినట్టి చిద్వస్తువే తన యొక్క చమత్కారముచే భిన్నత్వము కలుగజేయగల శక్తి కలదై, ఇట్లు ద్వైతముగా తోచుచున్నది. అట్లు ఏర్పడుచున్న ఈ ద్వైతమంతా కూడా సర్వమునకు అధిష్ఠానమైనట్టి బ్రహ్మము కంటే ఏమాత్రం ఏ క్షణంలోను భిన్నమైనది కాదు. బీజములో వృక్షము యొక్క తత్వమంతా (ఆకులు, పూవులు, కాయలు, కాండము, వ్రేళ్ళు మొదలైన స్వభావమంతా) వ్యాపించియున్నట్లు పరమోత్తమమగు ఆత్మప్రకాశమే సర్వేసర్వత్ర సర్వాత్మకమై వ్యాపించియున్నది. ఒక బీజము తనయందు భిన్నాభిన్నరూపములైన వృక్షవిభాగ తత్వములను కలిగి ఉన్నట్లుగా, నిర్మలాకాశము వంటి బ్రహ్మమునందు అసంఖ్యాకములైన జగత్తులు విన్యాసము కలిగి ఉంటున్నాయి. "ఈ జగత్తు అనబడునది – అత్యంత సూక్ష్మమైనట్టి బ్రహ్మమునందు ఉన్నట్లు అనుభవమగుట అనిర్వచనీయం, అవిచారణ యొక్క ఫలితం" అని జ్ఞానులు మనకు తెలియజేస్తున్నారు.

❖

ఓ రాక్షసీ! 'బ్రహ్మము' ఒక్కటి మాత్రమే సర్వదా, సత్యమై వెలయుచున్నది. దానికి ఆది–మధ్య–అంతములు లేవు. అది పరమశాంతమై, జన్మాదివికారములు లేనట్టిదైయుండియున్నది. ఎవ్వరైతే

ఈ మాయను, ఈ మాయ యొక్క కార్యములను రహితం చెయ్యగలుగుతారో – అట్టివారు మాత్రమే ఆ బ్రహ్మమును అనుభవపూర్వకంగా పొందగలుగుచున్నారు. మనమంతా ప్రయత్నించవలసినది అద్దాని కొరకే సుమా! అది ఏకరూపమని, గుణరహితమని, నిర్మలమని, అద్వైతరూపమని, నిరాటంకంగా అంతటా వ్యాపించియున్నదని –– జ్ఞానులు ప్రవచించుచున్నారు. శుద్ధ మానసులమగు ఈ రాజుకు, నాకు కూడా అది అనుభవయోగ్యమగుచున్నది.

యథార్థానికి అద్దాని యందు "నేను–నీవు–రాజు–మంత్రి–రాక్షసి" మొదలైన కల్పనలు ఏమాత్రం లేవు. ఆ బ్రహ్మమే నేను, నీవు, ఈ రాజు అయి ఉన్నాము.

ఓ ప్రియమైన రాక్షసీ ! నీ ప్రశ్నలు అత్యంత ఉత్తమ వస్తువునే సమాధానంగా సూచిస్తున్నాయి. జ్ఞానము కలిగినట్టి ఉత్తములు మాత్రమే అద్దాని విషయమై అట్లు ప్రశ్నించగలరు. 'పరమ విజ్ఞాన పరవశం' చేతనే నీవు అంతటి ఉత్తమ ప్రశ్నలు వేయగలిగావు.

నీ ప్రశ్నలన్నిటికీ సమాధానం ఏకరీతిగా ఒక్కటే అయి ఉన్నది.

**"అది నామరూపరహితము" :** ముముక్షువులమగు మనం, మన సౌలభ్యం కొరకు అద్దానిని 'బ్రహ్మము' అంటున్నాం. అది "మనందరి యొక్క అద్వితీయమగు, సచ్చిదానంద విశేష పూరితమగు ఆత్మయే."

❖

**కర్కటి :** ఆహా! అమోఘం! ఓ మంత్రీ! నీవు నా ప్రశ్నలకు ఇచ్చిన సమాధానం ఉత్తమమైన అర్థం కలిగియున్నది. ఈ జీవునికి, సర్వ దుఃఖములను నశింపజేయగల విషయమునే గుర్తు చేస్తున్నది. మిత్రమా! విక్రమమహారాజా! ఇప్పుడు మీ వాక్యామృతమును గ్రోలాలని నాకు ఉన్నది. నా ప్రశ్నలకు మీరు చెప్పాలని భావించినది నాపై ప్రేమచే చెప్పవలసినదని అర్థిస్తున్నాను. ప్రార్థిస్తున్నాను.

❖❖❖

## 12. విక్రమరాజు సమాధానం - "ఆత్మ ఉన్నచోటు"

ఓ ఆత్మస్వరూపీ ! విను.

ఈ జీవునకు మూడు అవస్థలు ఉంటున్నాయి.

1) జాగ్రత్,

2) స్వప్నము,

3) సుషుప్తి

ఈ మూడు విధములైన అవస్థలందు ప్రాపంచికమైన వృత్తులను రహితం చేసివేయుటచేతనే "తురీయావస్థ" అనబడు ఆత్మస్థితి కలుగుచున్నది. సమస్త సంకల్పములు తొలగించబడినపుడే అట్టి 'ఆత్మనిష్ఠ' ప్రాప్తించగలదు.

ఎవని యొక్క సంకల్పమునకు సంబంధించిన సంకోచ-వికాసములచే ఈ జగత్తు యొక్క సృష్టి ప్రళయాలు సంభవిస్తున్నాయో... అట్టి పరమాత్మ గురించి ఏమని చెప్పాలి? "ఆ చైతన్య భగవానుడు 'వాక్'కు అతీతుడు" అని వేదాంత శాస్త్రముచే ప్రతిపాదించబడుచున్నది.

బ్రహ్మము సత్-అసత్తులకు, అనగా ఉండుట-లేకుండుట అనునట్టి వ్యవహారస్థితికి, శూన్య అశూన్యములకు విలక్షణమై, అనిర్వచనీయమై ఒప్పుచున్నది. ఈ దేశ-కాల పరిచ్ఛేదముచే భాసించు చున్నదంతా అదే...! అయినప్పటికీ, అది దేశ-కాలములు కలిగియున్నట్టిది కాదు. దాని యందు ఈ దేశ-కాలాదులు లేవు. ఈ చరాచర జగత్తు అంతా సమష్టి జీవస్వరూపుడగు ఆ హిరణ్యగర్భుని చిత్తము యొక్క లీల మాత్రమే! కనబడేదంతా సత్-అసత్‌ల, చిత్-జడముల సంధిరూపము మాత్రమే!

ఓ మంగళస్వరూపిణీ! ఈ విశ్వరూపమున భాసించుచున్ననూ ఏతత్త్వం యొక్క ఏకరూపత్వము నకు భంగం వాటిల్లదో అట్టి తత్త్వాన్ని శాస్త్రములు 'బ్రహ్మము' అని పిలుస్తున్నాయి. అట్టి పరబ్రహ్మము గురించే నీవు ప్రశ్నించావు.

'చిత్' అణువు వాయురూపానుభవం పొందితే, మరుక్షణం భ్రాంతిచే వాయువు యొక్క ప్రాప్తి సంభవిస్తోంది. అయితే, శుద్ధ చైతన్యమగు బ్రహ్మమునందు వాయురూపాదులు లేవు. అట్లే, అది శబ్దరూపమును భావించినప్పుడు భ్రాంతిచే ఏర్పడుచున్న భావనా మాత్రంచేత "శబ్దము"ను పొందుచున్నది. కాని 'బ్రహ్మము' అనబడునది సర్వశబ్దార్థముల కంటే వేరైనదిసుమా! ఈ విధంగా మాయతో కూడిన పరమాత్మయే సమస్తము అగుచున్నది. కాని శుద్ధరూపము దృష్ట్యా ఏదీ కాకుండానే ఉండి ఉంటోంది.

మట్టితో అనేక ఆకారములు చేసినప్పుడు, ఆ ఆకారములన్నీ మట్టియే. ఆకారాదులు ఎదురుగా కనబడుచున్నది నిజమే కావచ్చు. అయితే ఏం? మట్టి మట్టిగానే ఉండి ఉంటోంది కదా! 'మట్టిముద్ద - మట్టిబొమ్మ' అను మాటలు మనం చెప్పుకుంటున్నాం. వాటి యొక్క అర్థం 'మట్టిచే ముద్ద - మట్టిచే బొమ్మ' (తృతీయా విభక్తి) అని మాత్రమే. మట్టికి ఆకారమెక్కడిది? సర్వశక్తివంతమగు చైతన్యమే అహంకారాదులుగా కనబడుచున్నది. అయినప్పటికీ అది అహంకారాదులుగా మారుట లేదు సుమా! అది సర్వదా అహంకార రహితమగు శుద్ధ చైతన్యముగానే శేషించి ఉంటోంది.

అయితే, ఆత్మజ్ఞానం లభించటం కష్టసాధ్యమే అగుచున్నది. అనేక యత్నములచే మాత్రమే అది పొందబడుచున్నది. 'ఆత్మజ్ఞానము' అను లాభం పొందిన తరువాత, ఇక దానికి మించిన లాభం అంటూ ఏదీ ఉండదు. మూలఅజ్ఞానం (root cause of ignorance) తొలగనంతవరకు, 'ఆత్మబోధ' కలుగనంతవరకు ఈ సంసారము విజృంభిస్తూనే ఉంటుంది.

ఓ రాక్షసీ! నిరాకారమగు ఆత్మయే సాకారరూపము వహించి ఇట్లు దృశ్యముగా ప్రాప్తించు చున్నది. అనగా, ఈ జీవుడు తానే ఈ దృశ్యమై, తనయందు తానే 'నిమగ్నుడు' అగుచున్నాడు. కాని, అజ్ఞాన కారణంగా అతడు ఆ విషయము ఎరుగుటలేదు. ఎడారిలోని ఎండమావులలో జలము ఉన్నట్లే ఉంటుంది చూచావా? జీవుడు ఈ దృశ్యజగత్తును కల్పించుకొని అందు వస్తుజాలము కొరకు, విషయభోగములకొరకు తన దృష్టిని సారించుచున్నాడు. ఫలితంగా, తన స్వస్వరూపమును

ఏమరచుచున్నాడు. అనగా, తన ఆత్మను తానే తిరస్కరించుచున్నాడు! చూచావా! సర్వజీవుల యొక్క స్వస్వరూపమే అయి ఉన్నట్టి ఆ చిత్ అణువే ఒకానొకప్పుడు ఈ 'జగత్తు' అనబడు దానిని వెలుపలకు ప్రవర్తిల్ల చేసి మాయారూపమున దానిని బాహ్యంలో గాంచుచున్నది. మరొకప్పుడు స్వస్వరూప జ్ఞానముచే త్రిలోకములను తృణప్రాయంగా దర్శించుచున్నది.* ఈ చేతనాణువు తనయందు ఏదిభావిస్తూ ఉంటే, అట్లు భావించుచున్నదానినే బాహ్యమున గాంచుచున్నది సుమా!

కాముకుడు తాను సంకల్పించు స్త్రీని బాహ్యమున భావనామాత్రంగా గాంచి, ఆలింగనం చేసుకొంటాడు చూచావా! ఇది కూడా అట్టిదే. సర్వశక్తిమంతుడగు ఆ పరమాత్మ ఆదిసృష్టి యందు ఏ విధంగా వ్యక్తమౌతాడో ... ఆ విధంగానే తన సంకల్పము నందు అతిశీఘ్రంగా సర్వమును పొందుచున్నాడు. నామరూపరహితుడగు ఆ ప్రత్యగాత్మయే మొట్టమొదట "సమష్టిసృష్టి నాచే దర్శించబడు గాక" అనబడు కర్తృత్వము వహించుచున్నప్పుడు అదియే "సృష్ట్యాది"గా ప్రాప్తిస్తున్నది. ప్రత్యగాత్మ బాహ్య జగత్తును ఇచ్ఛచే దర్శించటమే సృష్ట్యాది. అట్టి "ప్రథమ సృష్టి" అను కర్తృత్వమునకు "హిరణ్యగర్భుడు" అను పేరు శాస్త్రములు ఇచ్చాయి. ఒక దృష్టాంతము విను. ఒక బాలుడు ఏ వస్తువునైతే ఎట్లు "ఇది నాకు ప్రియము" లేక "ఇది నాకు అప్రియము" అను రీతిగా (అట్టి దృష్టిచే) గాంచుచున్నాడో .... ఆయా ఆట వస్తువులు మొదలైనవి అట్లే ప్రాప్తిస్తూ ఉంటున్నాయి కదా! అదే విధంగా చైతన్యము విషయంలో కూడా జరుగుతోంది. అనగా...... మనోరూపముతో వ్యక్తమైన పరమాత్మ యందు ఏయే పదార్థములు ఏఏవిధంగా భావనాపూర్వకంగా భాసించుచున్నాయో – చైతన్యము అద్దానిని అట్లే గాంచుచున్నది. ఆ 'చిత్ అణువే' దేశ–కాల–వస్తు రూపమున అంతటా నిండి యున్నది. ఈ "నేనూ–నీవు–ఈ మంత్రి– ఈ సర్వ సృష్టి స్థితిలయ సమన్వితమైన జగత్తు" – ఇదంతా చిత్ పరమాణువు యొక్క రూపమే.

ఈ జీవుని యొక్క వాస్తవరూపమే అయిఉన్న ఆ చిద్వస్తువు సర్వగామి (All pervading), అనాది (ఆది లేనిది) కూడా! ఆ పరమాత్మ అనబడుచున్నదానికి 'ఆకారము' అంటూ లేదు. ఆకారమే లేని దానికి పరిమితి ఏమి ఉంటుంది. అందుచేత, అనంతవిస్తీర్ణంగా వ్యాపించియున్నది. అనంతమైన వస్తువులు రెండు ఎట్లా ఉంటాయి? రెండవది ఉంటే అది మొదటి దాని యొక్క 'అంతము' నిర్దేశిస్తున్నట్లే అవుతుంది కదా! అందుచేత అద్దానికి రెండవది అనునది లేదు. ఇందుకే జ్ఞానులు "అది అద్వితీయము" అని చెప్పుచున్నారు. అయ్యది అప్రమేయము కూడా (It is not related to anything).

**కలిగియుండటం – ప్రకాశింపజేయటం! :** ఇక ఈ కనబడే జగద్దృశ్యము విషయానికి వస్తే, ఇదంతా అత్యంత చమత్కారమైనదనే చెప్పాలి. ఎందుకంటావా? ఒక కాముకుడు, ధూర్తుడు అయినవాడు "కళ్ళు కదల్చుట" మొదలైన ఆయాచేష్టలచే అమాయకురాళ్ళైన స్త్రీలను వశపరచుకొంటూ

---

* ఒకపరి జగములు వెలినిడి యొకపరి లోపలికి గొనుచుఁ నుభయముఁదానై
సకలార్థసాక్షియగున య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్. అని అనుటలో భావం ఇదే!

*భాగవతము – గజేంద్ర మోక్షము 8.34*

ఉంటాడుకదా! ఈ జగత్తు కూడా పర్వతములు, తృణములు మొదలైన అనేక పదార్థములతోను, చేష్టలతోను, సంఘటనలతోను కూడుకొనియుంటున్నది. అట్టి ఈ జగత్తు శుద్ధచిత్ ప్రకాశమును తనవశము ఒనర్చుకొని, నాట్యం ఆడించుచున్నది. ఇదంతా 'చమత్కారం' కాక మరింకేమనాలి? అయితే చేతనారూపమగు ఆ ఆత్మవస్తువే స్వయముగా బాహ్యజగత్తును గాంచుచున్నది. ద్రష్ట ఉంటేనే కదా, దృశ్యము! ద్రష్ట యొక్క దృష్టిని అనుసరించే దృశ్యము ఉంటోంది. ఏది ఏమైతేనేం? "ఈ బాహ్యమునందు చూడబడుచున్న జగత్తు అంతా ఆ చిద్వస్తువు ఆ విధంగా తనయందే అట్లు కలిగియున్నది" అని జ్ఞానులు గమనించుచున్నారు. ద్రష్టయొక్క స్వస్వరూపమగు ఆత్మయే ఈ జగత్తును కలిగియుండి, దీనిని పరివేష్టించుచు, ప్రకాశింపజేయుచున్నది.

**పరిచ్ఛేదరహితం – దృష్టాంతములకు అతీతం! :** ఒక వెంట్రుకలోని చిట్టచివరి భాగపు అణువులోని లక్షవ భాగంకంటే కూడా అత్యంత సూక్ష్మాతిసూక్ష్మమైయున్న ఆ ఆత్మ వస్తువు 'దేశ–కాల–వస్తు పరిచ్ఛేదము లేనిదే' అయి ఉన్నది. అందుచేత అది "అస్థూలము" అనబడుతోంది. దానిని మాటలలో ప్రకటించలేము. అయితే, ఏవో కొన్ని దృష్టాంతముల ద్వారా ఆ ఆత్మ వస్తువు గురించి మనం చెప్పుకుంటున్నాం. శుద్ధజ్ఞానమే స్వరూపముగా కలిగియున్నట్టి ఆ 'ఆత్మచైతన్యము' ఎట్టి సామ్యము (Example) తోకూడా నిరూపించలేం. వాక్కుచేత గాని, ఆయా శబ్దములచేతగాని, ఇంద్రియములచేతగాని చెప్పుటకు అలవికాదు. అది అనుభవమాత్రమై యున్నది. ఒక పెద్ద కొండ – ఒక పరమాణువు.... ఈ రెండింటి నిర్మాణమును పోల్చడం ఎట్లా?

మాయతో కూడుకొని ఉన్నప్పటికీ 'చిద్వస్తువు' నందు అణుత్వములేదు. పోనీ "బంగారము – ఆభరణము" లను దృష్టాంతముగా తీసుకొందామా అంటే... ఆత్మ ఎట్టి వేరైన ఆకారములను కూడా పొందుట లేదు. అది నిర్లిప్తము, సంకల్పముల కంటే కూడా మునుముందే ఉండి ఉన్నది. సర్వమునకు ఆధారమైయున్నది. ఏకత్వ – అనేకత్వములకు ఏమాత్రం సంబంధించినది కాదు. ఏ వస్తువూ అది కాదు. అట్టి ఆ ఆత్మ వస్తువును ఆయా దృష్టాంతములతో ఎట్లా ప్రకటించగలం? 'అణుత్వము – మహాత్వము' ఇత్యాది మాటలన్నీ పరమాత్మ యందు కల్పిత వచనాలే అవుతున్నాయి. నీ యొక్క, నా యొక్క, అట్లే భూత – భవిష్యత్తులలోని ప్రతి ద్రష్టయొక్క జడ–చైతన్యముతో కూడిన సత్స్వరూపము ఆ పరమాత్మయే. ద్రష్టత్వమునకు ఆవల ఉన్నట్టి ద్రష్టయొక్క స్వరూపమే ఆత్మయొక్క స్వరూపము. అంతేకాని, ఆత్మ అనగా ఎక్కడో ఉన్నట్టిది కాదు. మరెప్పటికో లభించనున్నది కాదు.

**అన్ని అనుభవములకు మూలకారణం! :** ప్రకాశము, అంధకారము – రెండూనూ చైతన్యము నందే వెలయుచున్నవి. అందే కల్పితమైయున్నవి. అనుభవ రూపమైయున్నట్టి 'ఆత్మ' అనబడు దీప ప్రకాశమే లేకపోతే, ఇక ఈ జీవులకు ప్రకాశము – అంధకారముల అనుభవమే ఎన్నడూ కలిగేది కాదు. వారియందు సద్వస్తువు లేకపోతే అసత్ వస్తువుల దర్శనం సాధ్యపడేది కాదు. సూర్యుడు మొదలైన అనేక పదార్థములు కలిగియున్న ఈ జగత్తంతా జడమే అయి ఉన్నది కదా! దానిని ప్రకాశింపజేయుచు, అనుభవము పొందగల చైతన్యమే లేకుంటే, ఈ జగత్తును అనుభవించేదెవరు?

కాబట్టి "ఆత్మచైతన్యము-అనబడునదేదీ లేదు. అనుభవములు మాత్రం ఉన్నాయి"-అనునది అత్యంత అసంగతమైన మాట.

శుద్ధజ్ఞాన స్వరూపమగు ఆ చైతన్యము తన రూపములే అయి ఉన్న ఈ ప్రకాశము - అంధకారములను తనయందు కల్పన చేసుకొనుచున్నది. ఆ చైతన్యమే ఈ ఎదురుగాగల జగత్తు తనకు బాహ్యమునందు ఉన్నదానివలె భావావేశము పొందుచున్నది.

ఓ విజ్ఞాన స్వరూపీ! ప్రియ రాక్షసీ! నీచే గాంచబడుచున్న ఈ 'జగత్తు' అనబడునదంతా నీ చేతనే కల్పించబడినదై, అనుభవించబడుచున్నదని గ్రహించు.

దృష్టాంతానికి, "సూర్య-చంద్ర-అగ్ని" ల ప్రకాశమే తీసుకొందాం. అవి జడ రూపమగు 'తమోఘనము' కంటే వేరే ఏమీ కాదు. ఎట్లా అంటావా? ప్రకాశము యొక్క వర్ణము తెలుపు. అంధకారము యొక్క వర్ణము 'నలుపు'. వెలుతురు లేకపోవటమే చీకటి. వెలుతురు ఉండటమే చీకటి యొక్క లేమి. జడత్వదృష్టితో చూస్తే ...రెండూ జడమే. "ఆ రెండిటినీ 'ఇది వెలుతురు - ఇది చీకటి' అని గ్రహించుచున్నట్టి 'స్వసత్త' రూపమగు చైతన్యమే బ్రహ్మము" అని గ్రహించు. ఏ చైతన్యమైతే సూర్యగోళముచే జనింప చేయబడుచున్న ప్రకాశమును, అంధకారమును గ్రహిస్తోందో ... అట్టి చైతన్యము నుండి ప్రకటితమగు సత్త సర్వవేళల ఒకే రీతిగా ఉంటోంది.

**ఆత్మయొక్క ప్రవృత్తియే ఈ జగత్తు! :** ఈ కనబడే భౌతికమైన సూర్యుని ప్రకాశమునకు ఆత్మ యొక్క ప్రకాశమునకు ఏమాత్రం పోలిక చెప్పజాలము. సూర్యుని ప్రకాశము కొన్ని ప్రదేశములలో కొన్ని సమయములలో ప్రసరించుచున్నది. అయ్యది వాస్తవానికి ఆత్మ యొక్క అనుభవ - భావనల చేతనే అస్థిత్వము పొంది ఉంటోంది. కాని, ఆ చైతన్య-సూర్యుడు రాత్రింబవళ్ళు యెడతెగకుండా బాహ్యాభ్యంతరములందు, శిలయందు, జీవపదార్థములన్నిటియందు, జడములందు, ప్రకాశించు చున్నది. అద్దానియందు తమస్సునకు చోటే లేదు. ఆత్మసాక్షాత్కారము పొందినట్టి జ్ఞానులకు ఈ వివిధ భోగములతో కూడిన జగత్తు అంతా, 'ఆత్మయందు ఆత్మగానే' తెలియవచ్చుచున్నది. 'త్రిలోకములు' అని చెప్పబడుచున్న వాటితోసహా ఈ సర్వమూ ఆత్మతేజము చేతనే ప్రకాశించుచున్నాయి. చైతన్యమే ఈ జగత్తును నశింపచేయనీయకుండా ఇట్లు కార్య-కారణరూపమున (As effect & cause) తనయందు ప్రవృత్తి కలిగియుండుట ద్వారా ప్రకటించుచున్నది.

సర్వ అనుభవములు ఏర్పడుచున్నది అద్దానియందే!

"తమస్సు" లేక "అజ్ఞానము" (Ignorance) ఈ జగదనుభవం రూపమున ప్రకాశితమై యున్నదని విజ్ఞులు ఎరిగియే ఉంటున్నారు.

'ఏకైక చిద్వస్తువే ప్రకాశము యొక్క - అంధకారము యొక్క రెండింటి 'సత్త'ను వ్యక్తపరచుచున్నది" అని సూక్ష్మబుద్ధికి తప్పక తెలియవచ్చుచున్నది. సత్తుకు అసత్తుకు కూడా 'సత్త' ను కలుగజేయునది ఆ చిద్వస్తువే. అద్దానియందే సర్వ అనుభవములు స్థితి కలిగియున్నాయి. ఆ చిత్‌సత్త అత్యంత

సూక్ష్మమైనది అవటంచేత "అనాస్వాదువు – ఏమియు అనుభవించనట్టిది" వలె కనిపించినప్పటికీ, సర్వరుచులకు హేతువు అదే.

చైతన్యము సర్వవేళలందును సర్వజనులచే అనుభవరూపమున అస్వాదింపబడుచునే ఉన్నది సుమా! కనుక మేము చెప్పు ఆ చిద్వస్తువు ప్రతిఒక్కరికి అత్యంత సమీపమునందే ఉండియున్నది.

వివిధ జలములలోని రసరూపమున ఉన్నది ఆ చైతన్యమే. చైతన్యమే లేక పోతే, రసమే సిద్ధించేది కాదు.

**సర్వతత్త్వాత్మకం – సర్వతత్త్వవిదూరం! :** ఆ పరమాత్మ 'శుద్ధ చైతన్యస్వరూపుడు' అయిఉండుటచేత, అతడు వ్యక్తము కాకుండానే ఉండి ఉంటున్నాడు. అందుచేత "అతడు సర్వము త్యజించివేసియున్నాడా?" అని అనిపిస్తోంది. కాని స్ఫురణ మరియు జ్ఞాపకము రూపమున సర్వజగత్తుకు ఆశ్రయమైనవాడు అతడే.

చేతనారూపమగు ఆ పరబ్రహ్మము సర్వవ్యాపకము. సర్వము తానే అయి ఉన్నది. "అది మరియొక దానిని అచ్ఛాదిస్తోంది" అనుట సమంజసం కాదు. అది తనను తానే ఎట్లా ఆచ్ఛాదించుకో గలుగుతుంది? కాని అదియే విస్తరించి సర్వమును కప్పివేయుచు, సర్వము తనయందే ధరించు చున్నది. పచ్చగడ్డి మొక్కల సమూహము మధ్యలో ఉన్న ఏనుగు తనునుతానే కనబడకుండా ఆ పచ్చగడ్డి మొలకల మధ్యలో దాగుకోగలదా? ఆకాశమువలె విశాలమైన ఆకృతిగల పరమాత్మ తనను తాను దేనితో కప్పుకోగలడు?

**అందరియందు ప్రదర్శితమై ఉంటున్నది అతడే! :** అందరియందు ప్రదర్శితమగుచున్నదంతా అతడే. అతడు ఈ విశ్వమంతా వ్యాపించియుండి, క్షణక్షణం ఈ జగత్తంతా రక్షించుచున్నాడు. ఈ విధంగా తననుతానే ఆచ్ఛాదించుకొనజాలక, జగత్తునంతా ఆచ్ఛాదించుట మాయయొక్క విచిత్రశక్తి మాత్రమే.

చేతనమును ఆశ్రయించి ఉండుటచేతనే ఈ జగత్తు ప్రళయమునందు లీనమై సంస్కారరూపమున దాగి ఉంది. మరల ఉత్పన్నమగుచున్నది. వికాసము పొందుట జరుగుతోంది.

❖

ఓ రాక్షసేశ్వరీ! ఈ విశ్వమంతా వాస్తవానికి 'ఎరుగుట' అను చమత్కారము యొక్క రూపం మాత్రమే. అందుచేతనే శాస్త్రములు "జగత్తు యొక్క వాస్తవరూపము చిన్మాత్రమే" అని నిర్ణయం చేస్తున్నాయి.

ఆ చిన్మాత్రమునకు కాళ్ళు, చేతులు మొదలైన అవయవములు లేవు. కాని, సర్వప్రాణుల అంతరాత్మ అదేకదా! ఈ అనేక హస్తములు, పాదములు, నేత్రములు కలిగియున్నది అదియే. ఒక బాలుడు తన స్వప్నంలో "నేను ముసలివాడను అయ్యాను" అని కల కనటం జరిగినట్లు ఈ చేతనవస్తువు నందు ఒక్క నిమిషము అనేక కల్పములవలె తోచుచున్నది.

చేతన సత్త యొక్క స్ఫురణయే 'కల్పాది' రూపమును ధరించి శోభించుచున్నది. అనగా, "ఈ 'బాహ్యజగత్తు' అనబడు అనుభవము పొందెదనుగాక" అను కల్పనను ఆశ్రయించుటయే 'కల్పాది' గా చెప్పబడుచున్నది.

ఒకడు తాను భుజించక పోయినప్పటికీ, తన స్వప్నమునందు, "నేను ఇప్పుడు భుజించుచున్నాను. తృప్తిగా త్రేన్చుచున్నాను" అను రూపముగల అనుభూతిని పొందుచున్నాడు కదా! ఆ స్వప్నానుభవ మంతా అంతరంగమునందే ఉండి ఉన్నట్లు బ్రహ్మమునందే ఈ మిథ్యానుభవము కలుగజేయగలుగు చున్న చిత్తవృత్తులు ఆయా వాసనలతో గూడి, ఆవృతమై ఉన్నాయి. అయినప్పటికీ బ్రహ్మము జగత్ రహితముగానే ఉండి ఉంటోంది.

అట్టి చైతన్యాణువునందే ఈ జగత్తులన్నీ ఉండిఉంటాయని అనుకొన్నాము కదా! జగత్తునందలి స్ఫురణలన్నీ కలుగుచున్నది ఆ చైతన్యాణువునుండే. స్తంభములో చెక్కబడిన స్త్రీరూపము స్థంభముయొక్క రూపమే అయినట్లు, ఈ జగత్తు బ్రహ్మముయొక్క స్వరూప-స్వభావములకు వేరైనది కాదు. అయితే, ఏ పదార్థము ఎచ్చట ఉనికి కలిగి ఉంటుందో, అది అచ్చటనే ఉత్పన్నమౌతుంది. ఏది ఎక్కడ ఉండ జాలదో, అది అచట ఉత్పన్నమే అగుట జరుగదు. సర్వదా కారణరహితమే అయిఉన్న చిదాకాశము నందు ఏదీకూడా ఎన్నటికీ ఉత్పన్నము కాకయే ఉన్నదని జ్ఞానుల అవగాహన.

**కాలము మొదలగు వాటిచే తాకజాలనిది :** ఆహాఁ! ఆ చైతన్యము నందే భూత-భవిష్యత్ -వర్తమానకాలమునందలి ఈ జగత్తులు, ఇందలి ప్రాణసమూహములు, వాటివాటి అనేక చిత్ర విచిత్రములైన అనుభవములు ఉండి ఉంటున్నాయి. నిమిషము, కల్పము కూడా చిద్వస్తువు చేతనే ఆవృతమై ఉన్నాయి. అయినా, మిత్రమా! ఒక నిమిషమునకు, ఒక కల్పమునకు తేడా ఏమిటో చెప్పు? విషయానుభవములే కదా! విషయరూపములే అయిఉన్న ఆ రెండింటినీ కూడా ఈ చైతన్యము తనయందు ఏకంచేసివేయగలుగుచున్నది. చైతన్యమే జగత్తుకంతటికీ ఆత్మ. అది ఏ సమయమందు కూడా, ఎట్టి కర్తృత్వ - భోక్తృత్వములచేతనూ స్పృశింపబడకుండానే ఉంటోంది. కేవలం ఉదాసీనంగా, మౌనంగా, ప్రశాంతంగా, నిర్లిప్తంగా, పూర్ణంగా ఉండి ఉంటోంది. ఈ విషయం జ్ఞాన-విజ్ఞాన పూర్వకముగా గ్రహించువారు సర్వదుఃఖములనుండి సహజంగానే విడివడు చున్నారు. అట్టి ఆత్మనుండే స్వభావసిద్ధంగా నీటినుండి కెరటములువలె - జగత్‌సత్త ఉదయిస్తోంది. ఇక ఈ భేదకల్పన, ఈ కర్తృత్వ, భోక్తృత్వ భావనలు, ఈ సుఖ-దుఃఖములు, ఈ "నేను-నాది-మేము- మాది-మీరు-వారు" అను రూపంగల ఖండభావనలు.... వీటి విషయమేమిటంటావా? ఇదంతా అవిచారణచే స్వప్నమందువలె ఏర్పడుచున్న మాయయే సుమా!

ఇంకొక చమత్కారం చెపుతాను. విను. ఈ 'జగత్తు' అనబడుదానిని ఎవ్వడు, ఏనాడు సృష్టించియుండలేదు. అట్లే ఏకాలమందు, ఎవ్వరు దీనిని లయం ఒనర్చుట లేదు. "సృష్టి - లయములు" అనబడునవి కెరటత్వము - జలత్వములవలె అంతా కల్పితములు మాత్రమే.

**సృష్టి :** "నేను-నీవు-అది-వస్తుజాలము - ఇంద్రియానుభవములతో కూడిన బాహ్యజగత్తు మొదలుగాగల "ద్వితీయానుభవము" యొక్క ప్రారంభము.

**లయము :** "నేను – తదితరము" అంతయు ఏకమే అయిఉన్నది అను "అద్వితీయానుభవస్థితి". ఈ రెండు అనుభవస్థితులందును ప్రశాంతస్వరూపుడగు ప్రత్యగాత్మ యథాతథంగానే ఉండి ఉంటున్నాడు. కాని ఆయాభావనలను ఆయారూపములైన అనుభవములుగా పొందుచున్నాడు. భావనామాత్రంచేత ఏర్పడుచున్నదంతా 'మాయ' (యామా–ఏదైతేలేదో) అను శబ్దముచే శాస్త్రకారులు ప్రతిపాదిస్తున్నారు. వేదాంతవాక్యములు ("ఏకమేవాద్వితీయం బ్రహ్మ" మొదలైనవి) – "ఈ దృశ్యము లేదు. ఈ దృశ్యమునకు అధిష్ఠానమై యున్న పరమాత్మ మాత్రమే కలదు. ఈ దృశ్యము అధిగమించ బడుగాక! పరమాత్మయే పొందబడుగాక!" – అని పలుకుచున్నాయి. పరమార్థదృష్టిని ఆశ్రయించ వలసినదిగా మనముందు ప్రతిపాదిస్తున్నాయి. కనుక, జన్మ – మృత్యువులతో కూడిన ఈ కనబడు 'జగత్తు' అనబడునదంతా మాయాపరికల్పితమే అయికూడా, 'ఇది వాస్తవము' అనురూపముగల అనుభవమును ఎందుకో ఈ జీవుడు పొందుచున్నాడు.

భావాత్మకమే అయి ఉన్న ఈ దృశ్యము స్వతహాగాలేదు. కాని స్వప్నంలో వస్తుజాలమంతా దర్శనమిచ్చుచున్నట్లు, ఇంద్రియబుద్ధికి ఇక్కడ ఎంతయో నామరూపాత్మకమైన వ్యవహారం ఘనీభూతమై గోచరిస్తోంది. ఇది 'వాక్కు' నకు అవిషయమై, వికారవంతమై, అనిర్వచనీయమై యున్నదని పరిశీలనాత్మక దృష్టికి (ఆత్మ బుద్ధికి) సుస్పష్టంగా తెలియవస్తోంది. వాస్తవానికి, ఈ 'జగత్తు' గా కనబడుచున్నదంతా – "సమము, స్ఫురణరూపము" – అయిఉన్న చిదాకాశమేకాని, మరింకేమీ కాదు. చిత్‌వస్తువే, తనయందలి మాయావిశిష్టమగు 'చైతన్యరూపచమత్కారం' చేత, దృశ్యమును సిద్ధింపచేసుకోవటానికి బాహ్యప్రపంచ రూపము ధరిస్తోంది. ఆ చిద్వస్తువే 'ద్రష్ట' యొక్క శుద్ధ స్వరూపము. అనగా, ద్రష్ట అయినట్టి ఆత్మ నేత్రములద్వారా బాహ్యావలోకనం చేస్తోంది. అయితే, అట్లు బాహ్యముగా చూడబడేదంతా 'వేరు' అయిన దృశ్యముగాని, వస్తువుగాని కాదు. ఎందుచేత నంటావా? బాహ్యమున–అంతరమున కూడా సర్వదా ప్రకాశించుచున్నది – నిత్యానిత్యము, సత్ స్వరూపము అగు 'ఆత్మ' యేకాని, మరింకేదీ కాదు. ఈ ఆత్మ – తానే అయిఉన్న సత్యవస్తువగు చైతన్యమును "ఇది బాహ్యము" అని భావన చేసి, ఆపై "ఇది కుండ–ఇది వస్త్రము" మొదలగు ఆయా పదార్థములుగా గాంచుచున్నది.

❖

ఒకానొకప్పుడు ఆత్మయే స్వస్వరూపముగా గల ఈ ద్రష్ట "ఇది బాహ్యము–ఇవి బాహ్యవస్తువులు" అను భావావేశమును కించిత్ త్యజించి, కాకతాళీయంగా "ఇది ఇట్లేనా?" అని చింతించుచున్నాడు. విమర్శించుచున్నాడు. 'ధ్యానము, యోగము, గురువాక్యమననము, స్వవిచారణ' మొదలైనవి ఆశ్రయించి తన బుద్ధిని శుద్ధిచేసుకొంటున్నాడు. ఈ మనస్సు "ఆహాఁ! నాకు ఈ శరీరముయొక్క ధర్మములు గాని, 'ద్రష్ట' యొక్క ధర్మములుగాని లేనేలేవు. లోన, బయట సర్వదా శాశ్వతమై, అఖండమై ప్రసరించియున్నది, ప్రసరించుచున్నది–నేనే. అందుచేత శాస్త్రములచే చెప్పబడిన ఆత్మయొక్క స్వరూప – స్వభావములన్నీ నాయొక్క స్వరూప స్వభావములే అయి ఉన్నాయి" అనునట్టి ఒకానొక

ఎరుకను సంతరించుకొంటోంది. “నేను అనామయమగు ఆత్మనే” అను జ్ఞానము ప్రాప్తించినప్పుడు, సర్వదా ఏర్పడియున్న సత్యమే తెలుసుకొనబడుచున్నది కాని, నూతనమైనదేదీ వచ్చిచేరుట లేదు సుమా!

“అవును నాకు జన్మ-కర్మలుగాని, బంధ-మోక్షములుగాని లేవు. ‘త్రిజగత్తులు’ అనబడునవే లేవు.”అని ఆత్మచే గ్రహించబడుతోంది. అప్పుడు అయ్యది తన విశుద్ధత్వమును పునః స్వీకరించుచున్నది. ఇంతమాత్రమే బంధ-మోక్షములు అయివున్నాయి.

ఆత్మయందే అంతర్భూతమైయున్న ఈ దృశ్యజగత్తు గురించి ఆయా విధి విధానములు, చర్చలు, సిద్ధాంతములు, శబ్దజాలము, నిర్వచనములు - ఇవన్నీ కూడా వేరువేరు ‘అవగాహన - సంస్కారము’లతో కూడియున్న ఆయా జీవులకు ఉపదేశించడానికే గురువులచే కల్పించబడుచున్నాయి.

**ద్రష్టయొక్క దృష్టియే - ఈ దృశ్యము :** ఓ ప్రియరాక్షసీ! మరొకసారి ప్రకటిస్తున్నాను. విను. ‘ద్రష్ట’ అయిఉన్న ఆత్మయే, బాహ్యవిషయముల దృష్టిని పెంపొందించుకొని తదనుకూల భావనాబలం చేత, ఆయా బాహ్యపదార్థములు తానే అగుచు, ‘అసత్తే’ అయిఉన్న ‘జగత్తు’ అనబడు దానిని గాంచుచున్నది. అంటే, దీని అర్థం ఏమిటి? నిన్ను నీవే “బాహ్యమందు జగత్తు” గా గాంచుచున్నావు. ఇంతలోనే, మరొకప్పుడు, ఈ విషయమును అనుభవపూర్వకంగా గ్రహించి, మోక్షస్వరూపిణివి అగుచున్నావు.

అయితే, పరమార్థ దృష్టితో అదంతా గమనిస్తేనో? “శుద్ధచైతన్య స్వరూపుడు” అయినట్టి ద్రష్ట దృశ్య రూపమును పొందజాలడు. అతడు అన్ని వేళలు సర్వదృశ్యములకు అతీతుడై వెలయుచునే ఉన్నాడు. దృష్టత్వమునకు కూడా అతడు “కేవలసాక్షి”. కనుక, “అజ్ఞానము-అవిచారణ” లే ఈ ‘జగత్తు’ అనబడు అనుభవమునకు అసలైన కారణములు. నీవు సర్వదా ఆత్మస్వరూపమే!

విచారించినప్పుడు “లేదు” అని తెలియవచ్చుచున్న ఈ జగత్తుకు, “ఇది ఇప్పుడు పుట్టినది. ఇన్నాళ్ళు ఉంటుంది. ఇట్లు కరిగిపోవుచున్నది” అనబడు కాలనియతి మాత్రం ఎక్కడో చెప్పు?

❖

“నేత్రములు” అంటే ఏమిటి? దృక్ శక్తియే కదా! ‘ప్రత్యక్షము’ గాని, పరోక్షముగాని కానిదై (అపరోక్షమై), నిత్యమైయున్నట్టి చైతన్యమే దృక్‌శక్తిగా ప్రకటితం అవుతోంది. అట్టి దృక్ శక్తినే ‘నేత్రము’ అని పిలుస్తున్నాం. అంతేకాని, జడమాత్రమైన ఈ ‘కంటి గ్రుడ్డు’ ను కాదు. అట్టి దృక్ శక్తియే వాసనారూపమైనట్టి దృశ్యమును రచించి, అట్లు రచించబడుచున్నదానికి ద్రష్టత్వము వహించు చున్నదని సూక్ష్మగ్రాహ్యులు గ్రహించుచున్నారు. తండ్రిలేనిచోట పుత్రుడు ఉంటాడా? సూక్ష్మ దృష్టితో చూస్తే - ఏకత్వము లేనిచోట అనేకత్వముకూడా ఉండదు. ‘ద్రష్ట’ యొక్క సత్తయే లేకపోతే, ఇక దృశ్యము యొక్క సత్త మాత్రం ఎక్కడ ఉంటుంది? ఈ ‘దృశ్యము’ అనబడేది ఎట్లు, ఎవరికి స్వయంగా సిద్ధించగలదు చెప్పు? కనుక ‘దృశ్యము’ అనునది ద్రష్టను అనుసరించే ఉంటోంది. ద్రష్టయొక్క నిర్వచనములే దృశ్యము.

**ద్రష్టైవ దృశ్యతామేతి నద్రష్టృత్వంవినా అస్తి తత్**
**వినా పిత్రేన తనయో, వినా భోక్తేన భోగ్యతా ॥** (సర్గ 81, శ్లో. 65)

తండ్రిలేకుంటే కొడుకేమిటి? 'భోక్త' లేకుంటే భోగ్యవస్తువుయొక్క ఉనికి ఎక్కడ?

ద్రష్టయగు ఆత్మయే దృశ్యభావమును పొందుచున్నది. అట్టి భావనను అనుసరించే దర్శనం కూడా ఉంటోంది. అందుచేత, ఈ దృశ్యము – "భావనాస్వరూపము, స్వసంకల్పమాత్రము, స్వప్న దర్శనము వంటిది" – అని అంగీకరించక తప్పదు.

ఎక్కడ 'ద్రష్ట' భావము (A feeling that 'I am perceiver') ఉన్నదో, అక్కడ మాత్రమే దృశ్యము సిద్ధిస్తోంది. ఎవ్వడైతే "నేను ద్రష్టత్వమునకు కూడా అతీతమైనవాడను. సత్యస్వరూపమగు పరిశుద్ధ చైతన్యమును. నాకు దృశ్యముగాని, జన్మాదులుగాని లేవు" అను దృఢభావనయందు సుస్థిరుడై ఉంటాడో, అట్టివానికి ఈ దృశ్యములేదు, జన్మలులేవు, మృత్యువులేదు, జగత్తులేదు. "నా స్వస్వరూపము నకు జన్మమృత్యువులు లేవు" అను రూపముగల దృఢమైన ఎరుకయే "జన్మరాహిత్యము" గా చెప్ప బడుచున్నది. ఇప్పుడు చెప్పు! "నేను ద్రష్టనుకూడా కాదు ద్రష్టత్వమునకు మునుముందే ఉండిఉన్నట్టి కేవలసాక్షి స్వరూపస్వభావుడను" అని ఇంతమాత్రం భావించుటలో కష్టమేమి ఉన్నది? బంగారము అనేక ఆభరణములుగా ప్రదర్శితమగుటకు సామర్థ్యము కలిగియున్నది కదా! అట్లే ఈ ద్రష్ట కూడా, తాను చైతన్యస్వరూపుడే కనుక, దృశ్యములో అనేకత్వము నిర్మించుకొనుటలో సామర్థ్యము కలిగి ఉంటున్నాడు. ఆకారాదులు వహించుచు, దర్శించుచు కూడా నిరాకారుడై ఉంటున్నాడు.

అయితే, ద్రష్ట, ఈ దృశ్యమును గాంచకలుగు సామర్థ్యము కలిగి ఉంటున్నాడు. కానీ, ఈ దృశ్యమునకు......అది స్వతహాగా జడమే కాబట్టి.....ద్రష్టకు సత్త కలుగజేయగల సామర్థ్యము లేదు సుమా! ఆభరణము బంగారమునకు 'సత్త' కలుగజేయుట ఎంత అసమంజసము? బంగారమే ఆభరణమునకు సత్త కలుగజేయుచు, నిరాకారముగా ఉండిఉంటోంది. బ్రహ్మము జీవుడగుట అట్టిదిగా గ్రహించబడుగాక!

వాస్తవానికి, సువర్ణమునందు 'ఆభరణము' అనబడు భ్రమ అవివేకముచేతనే కలుగుచున్నది. అట్లే, చిత్‌శక్తి చేత నిర్మించబడిన దృశ్యమునందు చిత్‌ప్రసరణచే సత్యభ్రాంతి కలుగుతోంది. ఆభరణ దృష్టితో చూచేవానికి బంగారమునకు సంబంధించిన లోహదృష్టి ఉండదు కదా! దృశ్యస్ఫురణ ఉంటున్నప్పుడు, ఆ దృశ్యము దర్శించుటలో ఆ ద్రష్ట తనయొక్క పాత్రేమిటో గమనించకుండానే దర్శనము చేస్తున్నాడు. అయితే, బంగారు ఆభరణమునకు ఆభరణ సత్తను ప్రసాదిస్తున్నది ఏది? బంగారమే కదా! ఈ దృశ్యమునకు కూడా చేతనస్వరూపుడగు 'ద్రష్ట' యే దృశ్యత్వమును కలుగచేయు చున్నాడు. ద్రష్ట లేనప్పుడు దృశ్యము ఎక్కడవుంటుందో చెప్పు?

ఒకడు ఒకచోట ఒక బల్లపై గల రెండు వేరువేరు రకములైన రెండు బంగారు గొలుసులను చూస్తున్నాడనుకో ....ఆ చూచువాడు. 'ఆభరణ దృష్టి' తో చూస్తుంటే రెండు వేరువేరైన ఆభరణములు కనిపిస్తాయి. అతడు 'సువర్ణ దృష్టి' తో చూస్తుంటేనో....ఒకే బంగారం రెండు గొలుసులలోను

కనిపిస్తోంది. అనగా, సువర్ణదృష్టికి 'ఆభరణములు' అనేది మరుగునపడిఉంటోంది. ఆభరణ దృష్టికి బంగారమునకు సంబంధించిన ధ్యాస మరుగునపడుతోంది. అదే రీతిగా :

దృశ్యదృష్టి ఉన్నసమయంలో 'ద్రష్ట'కు సంబంధించిన పాత్ర మరుగునపడి ఉంటున్నది.

ద్రష్టను పరిశీలింపబడుచున్నప్పుడు దృశ్యము విషయం దృష్టిలో ఉండుట లేదు.

ఈ విషయమై మరొక చిన్న దృష్టాంతము చెపుతాను. విను.

**వృత్తిని కప్పి ఉంచే మరొక వృత్తి :** దూరంగా కదలివచ్చుచున్న ఏదో ఆకారమును ఒకడు చూస్తున్నాడనుకో.... ఇంతలో, "అది పశువా? మనిషా?" అని పరిశీలనాత్మకంగా చూస్తున్నాడు..... "ఓహో అది పశువు కాదు ..... మనిషే.... అరె, మనవాడేనయ్యా....! అని అనటం జరిగిందని అనుకొందాం.

**ఇప్పుడు ఈ సంఘటనలో జరుగుచున్నదేమిటి? :**

1. మొట్టమొదట "విషయరహితమైన శుద్ధ చైతన్యము" స్వరూపముగా గలిగియున్నట్టి ఆ వ్యక్తి అక్కడ ఉన్నాడు. అతనియందు 'ద్రష్టత్వము' అను సామర్థ్యము ఉన్నది. అయితే ఆ సామర్థ్యము "మూసుకున్న కళ్ళలోని చూచుశక్తి" లాగా అప్రకటితమైయున్నది.

2. నిర్మల జలంలో తరంగం బయలుదేరుతుంది....చూసావా? అలాగే అతనియందు "ద్రష్టత్వము అను వ్యాపకమునకు ఉపక్రమిస్తాను..." అను 'భావపూర్వకమైన-క్రియాపూర్వకమైన' స్పందన బయలుదేరింది.

3. అట్టి ప్రారంభవృత్తినుండి, "ఆ దూరంగా, కదలి వస్తున్న ఆకారము ఏమైయున్నది?" అను రూపముగల రెండవ 'వృత్తి' లేక 'ధ్యాస' బయలుదేరుతోంది. ఈ రెండవ ధ్యాస మొట్టమొదట 'వృత్తి' (Thought)ని కప్పివేస్తోంది.

4. ఆ రెండవ వృత్తి నుండి "అది పశువా? లేక మనిషా?" అను మూడవ నిర్ణయాత్మ వృత్తి రూపం పొందుతోంది.

5. "అవును అది పశువుకాదు....మనిషే.... మనవాడే కూడా!" అను మరొక వృత్తి బయలుదేరి తదితర వృత్తులనన్నిటినీ మరుగు పరచుతోంది.

ఆ తరువాత ఆ స్థానంలో మరొక వేరైన 'వృత్తి' ఏర్పడుచూ ఉంటుంది....!

విషయరహితమైన శుద్ధ సత్,

ద్రష్టత్వము వహించు 'వృత్తి' లేక ధ్యాస,

విషయమును గ్రహించటం, నిర్ణయించటం, అనుభవం,

కొంత సమయానంతరం ఆ విషయమును త్యజించటం,

మరొక విషయమును స్వీకరించటం ........

ఇదంతా కొద్ది క్షణములలోనో-ఒక్కక్షణంలోనో-ఒకటి తరువాత మరొకటిగా జరిగిపోతోంది.

ఈ విధంగా ప్రతి జీవుడు వాస్తవానికి విషయములకు అతీతుడు, విషయరహితుడు అయి ఉండి కూడా, ఈ అనేక విషయపరంపరలను ఒకదాని తరువాత మరొకటిగా స్వీయఇచ్ఛ చేతనే పొందటం జరుగుతోంది.

❖

"ద్రష్ట" –ఈ దృశ్యమును గాంచుచున్నప్పుడు... తన స్వస్వరూపాత్మను గాంచుటలేదు. అనగా, "దృశ్యాకారవృత్తి" మనస్సునందు ఏర్పడి ఉన్నప్పుడు, ఆత్మాకారవృత్తి సంభవించదు. అయితే, దృశ్యము సంభవిస్తున్న సమయంలో ఆత్మాకారము మరెక్కడికో పోవుచున్నదా? లేదు. అది యథా తథంగా ఉండి ఉండగా, అందు దృశ్యమునకు సంబంధించిన 'భావన' లేక 'వృత్తి' ఏర్పడిఉంటోంది. ఆత్మాకారమే లేకపోతే, ఇక దృశ్యాకారము ఏర్పడునది ఎక్కడ? కాని దృశ్యాకారము ఏర్పడిఉన్నప్పుడు "ఆత్మాకారము లేదేమో" అనురీతిగా (అసత్తుల్యంగా) ఆ ద్రష్టయొక్క దృష్టియందు ఏర్పడుచున్నది. అయితే, వివేకముచే దృశ్యభ్రాంతి తొలగినప్పుడు, ఇక "కేవల ద్రష్ట" మాత్రమే ప్రకాశిస్తూ ఉంటాడు.

అందుచేత ముముక్షువు అయినవాడు "ఈ దృశ్యాకారవృత్తి నన్ను మోహింపచేయకుండునుగాక! ఈ దృశ్యము ఉంటే ఉండనీ. లేక తొలగనీ. ఏది ఏమైనా నేను ద్రష్టత్వమునకు కూడా అతీతమైనట్టి అనిర్వచనీయ – శుద్ధతత్వమునే" అనియే భావించాలి. అట్టి భావమును దృఢపరచుకొనుటకే ప్రయత్నశీలుడు కావాలి. అప్పుడిక అతని యందు అకృత్రిమమగు ఆత్మాకారవృత్తి ('నేను ఆత్మనే' అను రూపముగల ఎరుక) తనంతట తానే స్వయముగా ప్రాప్తించుచున్నది. కాని, అనేక మంది అవివేకులు, "ఈ దృశ్యము నందలి ఈ ఈ విషయములు పొందితిని. అయ్యో! ఇంకను ఇవి పొందలేకపోయాను కదా?" అని వేదనను ఆశ్రయించి ప్రయత్నించుచు, తద్వారా దృశ్యాకారవృత్తినే అభివృద్ధి చేసుకొంటున్నారు. "నేను ఆత్మతత్వమునే" అను ఉద్దేశమును అభివృద్ధి చేసుకొన్నంతమాత్రం చేత ఈ జీవుడు దుఃఖరహితుడు కాగలడు. ఇక తాత్సారం ఎందుకు చెప్పు?

**దర్శనము లేనట్టి ద్రష్ట :** ఈ "ద్రష్ట–దృశ్యము" ల విషయమై మరికొంత విచారిద్దాం. "ద్రష్ట" అనబడువారు త్రిపుటియందు (ద్రష్ట–దర్శనము–దృశ్యము అను వ్యవహారమునందు) అంతర్గతుడై, ఉంటున్నాడు. తాను 'దర్శనము' నకు వేరుగా ఉంటూ, ఈ 'దృశ్యము' చే ఏమాత్రం స్పర్శించబడనివాడై ఉంటున్నాడు. కాని, ఈ దృశ్యమునకు కారకుడు తానే అగుచున్నాడు. అతడు 'అద్రష్ట' అయిఉన్నప్పుడు 'వాక్యములకు అందనివాడు' గా అగుచున్నాడు. దర్శించుచున్న సందర్భమునందు మాత్రమే మనో వాక్కులకు లభించుచున్నాడు.

**దృశ్యము ఉన్నప్పుడే ద్రష్ట ఉంటున్నాడు :** "ద్రష్ట" దృశ్యరహితుడు అయినప్పుడు "పరిశుద్ధ చైతన్యము" అని అనిపించుకొంటాడు. అంతేకాని, ద్రష్ట అని పిలువబడడు. కనుక ఎప్పుడైతే, జ్ఞానోత్పత్తి యొక్క ప్రభావంచేత 'ఈ దృశ్యము ఏక్షణమందూకూడా లేనిదే' అనునట్లు అనుభవం అవుతుందో, అప్పుడు ద్రష్ట–దృశ్యములు రెండూ కూడా లేనివే అగుచున్నాయి. ఓ ప్రియరాక్షసీ! వాస్తవానికి నీకు దృశ్యముగాని, ద్రష్టత్వముగాని లేవు. నిర్మలచైతన్యమే నీవు, నేను, ఈ మంత్రి,

తదితరులు కూడా! కాని, ఆకాశమును మేఘము కప్పివేసి ఉంచుతుంది చూచావా? అట్లే, దృశ్యము పట్లగల "ఇది సత్యము" అను బుద్ధి ద్రష్టత్వమునకు కారణమగుచున్నది. అట్టి భావావేశమే స్వస్వరూపముయొక్క అఖండానుభవమును కప్పి ఉంచుచున్నదని గ్రహించు. శుద్ధ సత్వమైయున్న ఆత్మ యొక్క స్వరూపమును గ్రహించిన తరువాత, ఇక దృశ్యవృత్తిగాని, భేదములుగాని ఉండవు. ఇది గ్రహించువాడు తాను 'నిత్యము – నిర్మలము – సత్యము' మొదలైన విశేషణముల అనుభవం పుణికిపుచ్చుకుంటున్నాడు. సాక్షాత్ బ్రహ్మమే అగుచున్నాడు.

**దీపపు వెలుగు – వస్తువులు – చూచేవాడు :** మరొక దృష్టాంతము చెపుతాను. సూక్ష్మ బుద్ధితో గ్రహించు.

ఒక గదిలో అంతా చీకటిగా ఉన్నది. అప్పుడు ఒక దీపం వెలిగించబడినది. ఆ దీపము వెలుగుచుండగా, దీపపు వెలుగులో అక్కడున్న ఆయాకొన్నివస్తువులు కనిపిస్తున్నాయి. ఇప్పుడు :

నీవు చూస్తున్న ఆయావస్తువులపై వెలుగుగా ప్రసరించి అవి నీవు చూడకలుగునట్లు చేస్తున్నదేది? దీపమే కదా....!

కాని "ఆ వస్తువులను నీకు చూపునది దీపమే" అని అనగలమా? 'చూపుట' అనబడు కర్తృత్వము దీపమునకు ఎట్లా ఆపాదిస్తాం? దీపమునకు ఇచ్ఛ–అయిచ్ఛలు లేవుకదా!

నీయందలి వస్తువృత్తులే ఆయా వస్తుజాలములలో కొన్నిటిని చూచుటకు కొన్నిటిపై దృష్టి సారించక పోవటానికి కారణము అగుచున్నాయి.

కాని, దీపం లేకుంటే ఆ వస్తువులు కనబడేవే కావు కదా!

ఈ దృష్టాంతమును దృష్టిలో పెట్టుకొని, ఇక నేను చెప్పునది విను :

"ద్రష్ట–దర్శనము–దృశ్యము" ... ఈ మూడిటిని (త్రిపుటిని) ఆత్మయే ప్రకాశింపజేయుచున్నది. అనగా చైతన్యరూపమగు ఆత్మయొక్క సమక్షము (Presence) చేతనే ఈ మూడు స్థితివంతము లౌతున్నాయి.

అయితే "దృశ్యత్వబుద్ధిని ఆత్మయే కల్పించుచున్నది" అని అనలేం. అనగా, ఈ కల్పనయొక్క కర్తృత్వము ఆత్మకు ఆపాదించలేము.

ఆత్మయే లేకపోతే ఈ ద్రష్ట–దృశ్యముల ఎరుకయే ఏర్పడేది.

ఆత్మయొక్క విశేషము ఏమిటో ఏమరచిన అజ్ఞాని దృశ్యవృత్తిలో నిమగ్నమగుచున్నాడు. జ్ఞానియో "ద్రష్ట–దర్శనము–దృశ్యము" లనే త్రిపుటిని ఆత్మయందు లయము ఒనర్చుచున్నాడు. 'ఆత్మవృత్తి' ని మాత్రమే అంగీకరించుచు, ఆత్మానుభవము పొందుచు, ఆత్మయే అయిఉంటున్నాడు. అసద్రూపంగా వెలయుచున్న 'ఆభరణము' యొక్క ఆకారాదులను, ఆ బంగారమును పరిశీలించు కంసాలి, – తన తార్కిక బలంతో ఆభరణ సంబంధమైన ఆకారాదులను ప్రక్కకు పెట్టి బంగారము, అద్దాని నాణ్యత పై దృష్టి పెట్టుచున్నాడు కదా! అది కూడా అంతే.

❖

ఓ ప్రియా! బ్రహ్మానంద స్వరూపిణీ ! కర్కట నామధేయీ ! అసలు ఒక్కసారి ఈ కనబడే దృశ్యమంతా సమగ్రంగా గమనించు. నీ చుట్టూ, నా చుట్టూ ఉన్నదంతా పంచభూతసముదాయము మాత్రమే కదా! అంతకు మించిన దృశ్యవస్తువంటూ ఎక్కడ ఏది ఉన్నది చెప్పు? అయితే, ఇదంతా ఆత్మయొక్క వృత్తిని అనుసరించే అనుభవమౌతోంది. ఆవిధంగా, స్వభావసిద్ధమైయున్న 'చైతన్యతత్త్వము' కంటే భిన్నమైనట్టి దృశ్య-పదార్థమంటూ ఎక్కడా ఏదీ లేదు. ఆత్మ సర్వవ్యాపి, సర్వానుభవస్వరూపము అయి ఉన్నది కదా! అందుచేత ఆత్మానుభవం సిద్ధించిన మరుక్షణం ద్రష్ట-దృశ్యముల ఐక్యత సహజంగాను అకృత్రిమంగాను ప్రాప్తించగలదు. ఆత్మ యొక్క ఇచ్ఛానుసారమే ఫలప్రాప్తి జరుగుతోంది కనుక, "పదార్థములు - ఇచ్ఛ' '... రెండిటి యొక్క ఐక్యత స్వయముగానే సిద్ధించుచున్నది. దీనిని బట్టి నీవు గ్రహించవలసినది ఏమిటి? సముద్రము కంటే తరంగములు వేరుకావు కదా! అట్లే "ఆత్మేచ్ఛ" కు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేదని గమనించు.

**పరమాత్మ :** ఆ పరమాత్మ దేశ-కాల వస్తువులచే పరిచ్ఛిన్నుడు కాడు. అందరియొక్క 'ఆత్మ' అతడే. వానికి భిన్నమైనదంటూ ఎక్కడా ఏదీ ఉండదు. అతడు ఎక్కడోలేడు. ఎన్నటికో లభించబోయే వాడుకాడు. సర్వుల అనుభవస్వరూపుడై వెలుగుచున్నది అతడే. కాబట్టి "సర్వ ఇచ్ఛల స్వరూపము అతడే" అనే ఒకానొక ఉత్తమ రహస్యం జ్ఞానివైన నీ ముందు ప్రస్తావిస్తున్నాను. "ఆ పరమాత్మ సత్-చిత్ స్వరూపుడు" అని (ఋగ్వేదాది) శాస్త్రములు ప్రతిపాదిస్తున్నాయి. నేత్రములనే ప్రకాశింప జేయుచున్న అతడు, అవే నేత్రములచే ఎట్లా చూడబడగలడు చెప్పు? అందుచే అవివేకులు అతని గురించి... "అతడు ఎవ్వరికీ కనబడుటలేదు కదా! అందుచేత అసత్తుల్యుడేమో! అనగా, అతడులేడేమో!" - అని భావిస్తున్నారు.

స్వస్వరూపుడగు పరమాత్మ యందు ద్వైతమేమిటి? ఏకత్వ మేమిటి? అందుచేత "ద్వైతము మిథ్య - ఏకత్వము సత్యము" అనికూడా చెప్పలేము. ఎందుచేతనంటావా? రెండవవస్తువు ఉన్నప్పుడు కదా... "అది - ఇది ఒక్కటే" అను ఏకత్వమును సంభవింప చేయకలిగేది! 'ఆకారము-దాని నీడ' వలె, ద్వైత - ఏకత్వములలో ఒకటి ఉంటేగాని, రెండవది సిద్ధించదు. రెండవవస్తువే లేనప్పుడు ఒకే వస్తువు యొక్క ఏకత్వం ఎట్లా ఉంటుంది? "ఏకత్వము లేదు" అని అనుకొన్న మరుక్షణం ద్విత్వము కూడా లేనట్లే అగుచున్నది.

"ఆత్మ ద్వైతాద్వైత భేదరహితము"...అను భావము నీ హృదయమునందు పదిలపరచుకో! - సముద్రముకంటే ద్రవత్వము వేరైనదా? కాదుకదా! "ద్వైత-ఏకత్వములు పరమాత్మ కంటే భిన్నమైనవి కావు" అని గ్రహించుటయే జ్ఞానము.

**జగత్తు :** సత్త్వము-రజము-తమోగుణముల 'సామ్యస్థితి' లేక 'అతీతస్థితి' నుండి చ్యుతి నొందనట్టి బ్రహ్మమునందు అనేక కార్యవ్యవహారముతో కూడియున్న ఈ జగత్తు కన్పట్టుచున్నది. ఒక బీజమునందు మహావృక్షము ఉన్నట్లు. ఈ జగత్తు అంతా ఆత్మయందే ఉండియున్నది. బంగారము - ఆభరణములు వేరు వేరు కానట్లు, ఈ ద్వైత ప్రపంచము బ్రహ్మమునకు వేరైనది కాదు. ఉత్తమ

"బోధ" పొందినట్టి తత్వవేత్త ఈ 'ద్వైతము' ఏమిటో, ఏమై ఉన్నదో ఎరిగియే ఉంటున్నాడు. కనుక అతడు "ఇది ద్వైతము ... కాదు, అద్వైతము" మొదలగు మీమాంసలు కలిగియుండుట లేదు. జలత్వము ద్రవత్వము వేరా? వాయువు కంటే దాని చలనత్వము వేరువేరని ఎవరనగలరు? ఈ ద్వైత ప్రపంచమంతా ఈశ్వరునికంటే వేరైనది కాదు. నీవు, నేను ఈ మంత్రి కూడా అంతే ! ఓ చైతన్య స్వరూపిణీ ! రాక్షసీ ! ఈ ద్వైత – అద్వైత అనుభవములు రెండూ క్రియాత్మకములే కాబట్టి దుఃఖప్రదములే అవుచున్నాయి. బుద్ధి నైపుణ్యం చేత ఈ రెండింటినీ రహితం చెయ్యాలి. 'అదియే ఉత్తమ జ్ఞానం' అని అనిపించుకొంటోంది.

**త్రిపుటి :** ద్రష్ట – దర్శనము – దృశ్యము; ప్రమాతృత్వము – ప్రమాణము – ప్రమేయము త్రిపుటితో కూడిన ఈ జగత్తు "చేతనము" అయి ఉన్న స్వస్వరూప తత్వమునందే ఉండియున్నది. వాయువు ఒకప్పుడు తనయందు చలనము కలిగి ఉంటూ, మరల ఇంతలోనే మరొకప్పుడు ఆ చలనమును రహితము చేసుకొనుచున్నది కదా! ఆత్మకూడా, ఒక సమయంలో తనయందు 'జగత్తు' అను కల్పన కల్పించుకొనుచు, మరొకప్పుడు, దీనినంతటినీ తన స్వస్వరూపమునందు లయము చేసుకొనుచున్నది. ఆహాఁ! ఈ మాయ ఎంతటి చిత్రమైనదో, ఎంతటి భయంకరమైనదో చూచావా? జీవులను మోహింపచేయుటలో దీనిని మించినవారు మరెవ్వరూ లేరు. అది ఒక పరమాణువులో కూడా విస్తారమైన త్రిలోకములను అనుభవింపజేయగలదు.

(**ప్రమాత:** ఎరుగెడువాడు, ప్రమేయము: ఎరుగతగినది, ప్రమాతృత్వము: ఎరుగుట అను స్వభావం, ప్రమాణము – ఎరుగబడు విధము.)

అయితే, వేదములు, "ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మ", "జీవో బ్రహ్మేతినాపరః" అను వాక్యముల ద్వారా "రెండవవస్తువే లేదు" అని ప్రతిపాదించుటచేత, అస్సలు ఆత్మయందు 'మాయ' అనబడు మరొకవస్తువు ఉండటం ఏమిటి? అందుచేత ఈ జగత్తంతా చిత్‌చైతన్యమే కాని మరింకేమీకాదు. ఏదైతే తదితరంగా తోచుచున్నదో, అదంతా 'అవిచారణ' కారణంగానే అట్లు తోచుచున్నది.

"దృశ్యము ద్రష్టకు అభేదమైనదే!" ..... అని గమనించు.

**సదసత్తు :** చిదణుస్వరూపుడగు పరమాత్మయే తనయందు లీలామాత్రంగా, సంకల్పమాత్రంగా, కారణం లేకుండానే, ఈ బ్రహ్మాండములను ధరించుచున్నాడు. కనుక ఓ రాక్షసీ! ఈ కనబడే జగత్తులన్నీ చిత్ – చైతన్యమునందే ఉండి ఉన్నట్లు సర్వదా నీవు గ్రహించి, ఆపై ఇక్కడ యథాతథంగా సంచరించు. ఈ ద్వైత ప్రపంచమును చిద్రూపపరమాణువు నందు అద్వైతరూపంగా (చిత్ భగవానునకు వేరు కానట్టిదిగా) గాంచువాడే సత్యదర్శి–సమదర్శి కూడా! యథార్థానికి ఈ ద్వైతాద్వైతములు గాని, బీజ–అంకురములు గాని, స్థూల – సూక్ష్మములు గాని, అణు – బ్రహ్మాండములు గాని లేవు. ఉండజాలవుకూడా. 'త్రిలోకములు' అనబడునవి ఏమైనా ఉన్నాయని మనం అనుకోదలిస్తే – అవి చైతన్యాణువునందే "సత్ – అసత్" రూపములుగానే ఉండి ఉన్నాయి. వ్యక్తులకు – వ్యక్తులకు, వ్యక్తులకు – పదార్థములకు సంబంధములన్నీ కల్పనచే ఉంటూ, కల్పనాతీత

దృష్టితో పరిశీలిస్తే ఉండడం లేదు. ఈ త్రిలోకముల ఉనికి కూడా అట్టిదే. ఇవి శాంతములు కావు. అశాంతములు కూడా కావు. పరమార్థ దృష్టితో చూచినప్పుడు పంచభూతముల యొక్క ఆయా పాళ్ళ కలయిక మాత్రమే అయిన ఈ పదార్థజాలం లేనివి గానే జ్ఞానులచే గాంచబడుచున్నాయి. ఒకానొక దృష్టికి మాత్రం ఘనీభూతమై తోచుచు, మరొకదృష్టిచే లేకయేపోతున్న దానిని "ఉన్నది" అనాలా? లేక "లేదు" అనాలా? అందుకే, "ఇదంతా సదసత్తు" అని చెప్పబడుతోంది.

**త్యాగి - అత్యాగి :** ఈ జగత్తు గాని, దానికి భిన్నమైన మరొకటి గాని లేవు. కేవలము 'చైతన్యము' మాత్రమే ఉన్నది. అది ఎప్పుడు, ఎట్టి పూర్వ సంస్కారములను ఆశ్రయించి ఆవిర్భవిస్తుందో, అట్లే స్ఫురించుచు, అట్టి అనుభవమునే పొందుచున్నది. ఈ సృష్టి రూపమున ఆ చైతన్యమే ఉత్పన్న మగుచు ఉంటున్నప్పటికీ, అంతమాత్రం చేత తన "యథాతథ-నిత్యోదిత-ప్రకాశత్వము"నకు తరుగు పొందుట లేదు. కనుక "ఈ సృష్టి ఏ సమయంలో కూడా ఉత్పన్నము కాకయే ఉన్నది" అను వాక్యము కూడా సముచితమే అగుచున్నది. ప్రపంచరహితమైన చిదాకాశము సర్వదా ఏకరూపముననే ఉన్నది. కాని, భ్రమానుభవముచే అనేక రూపములుగా కన్పట్టుచున్నది. వృక్షము తన వృక్షస్వభావము త్యజించకుండానే బీజమును ఉత్పన్నము చేయుచున్నది. ఆ బీజము మరల భూమిపై మహావృక్షము అగుచున్నది. పరమార్థతత్త్వమగు బ్రహ్మము ఈ జగత్తు రూపమున ఉదయిస్తోంది. జనన - మరణాది కల్పనలతో కూడిన ఈ 'జగద్రూపము' యొక్క అనుభవమును పొందుతోంది. కాని ఆ అనుభవకాలంలో కూడా బ్రహ్మము తన స్వరూప-స్వభావములు ఏమాత్రం కోల్పోవుటలేదు. ఒక యువకుడు వివాహము చేసుకొని పుత్రులు పొందుటచే తండ్రిగా పిలువబడు చున్నప్పుడు "తండ్రి" అనబడు మరొకటేదీ అగుటలేదు. అతడు తన స్వస్వరూపమునకు సంబంధించిన స్వరూప-స్వభావములు త్యజించుటగాని, మార్పు-చేర్పులు పొందుటగాని జరుగుటలేదు కదా! బ్రహ్మము విషయము కూడా అట్టిదే. ఈ జీవునికి వేరైనవాడు కానట్టి 'బ్రహ్మము' అనబడు ఆ పరమాత్మ త్యాగ-అత్యాగములు రెండూ కలవాడే. ఎట్లా అంటావా? అతడు అసంగుడు, అద్వితీయుడు (ద్వితీయము అనునది లేనివాడు) కదా! అందుచేత అతడు సర్వత్యాగపరుడైయున్నాడు. అతడు సర్వవ్యాపి కదా! అందుచేత, దేనినీ త్యజించకయే, ఏకరూపమున సర్వదా ప్రకాశించుచున్నాడు.

**చిత్‌అణువు :** కమలనాళములోని తంతువుకంటే కూడా కోట్లాదిరెట్లు సూక్ష్మాతిసూక్ష్మమైయున్న 'చిత్'- అణువునందు కోట్లాది జగత్ సమూహములు ఉండగలవు. ఉండియున్నాయి. మహత్తరమగు అట్టి చిత్ - పరమాణువు చేతనే ఈ జగత్తంతా వ్యాప్తమైయున్నది. అద్దానిచేతనే ఉత్పత్తిని పొందుతోంది. అద్దాని సహాయంచేతనే కార్యవంతం అవుతోంది కూడా. అయినప్పటికీ, ఈ పరమాత్మ ఈ 'జగత్తు' అనబడు దానిచే స్పృశించబడక నిర్వికారుడే అయిఉన్నాడు. కల్పిత - గంధర్వనగరం (Ilusion Visualised in the Sky) చే స్పృశించకుండానే ఆకాశం ఎల్లప్పుడూ నిర్మలంగానే ఉంటోంది కదా! మేఘములు మొదలైనవి ఆకాశపు స్వచ్ఛతను తొలగించ గలుగుచున్నాయా? లేదే! అట్లే పరమాత్మయే అయి ఉన్న ఈ జీవుని వాస్తవస్వరూపము జన్మ-మృత్యువులచే, తదితర సంబంధ-బాంధవ్యములచే స్పృశించబడుటలేదు. ఆకాశము ఏ సమయమందూ కూడా దేని చేతనూ ఏ

దోషమూ తాను పొందకుండా, ఎప్పటి అట్లే స్వచ్ఛంగా, నిర్లిప్తంగా, అఖండంగా, నిర్మలంగా, ఏకంగా ఉండి ఉంటున్నది. అట్లాగే, పరమాత్మకూడా సర్వదా నిర్వికారుడు, నిర్మలుడూ, నిర్లిప్తుడు! అయితే, ఆ పరమాత్మయే 'నేను జీవుడను' అను భావనను స్వయంగా భ్రమపూర్వకంగా పొందుచు న్నాడు (జీవోశివః! జీవో బ్రహ్మైవ ఇతి నాపరః). అట్టి అజ్ఞానకాలంలో – "జడము, అవిద్యాస్వరూపము, సుషుప్తి" – మొదలైనవాటితో సమానమైనట్టి 'ద్వైతస్థితి'ని గాంచుచున్నాడు. అట్లు 'ద్వైతము' దర్శించు సమయము నందు కూడా, పరబ్రహ్మము 'ఏకమై ప్రకాశించుట' అనుదానికి లోటేమీ ఉండుట లేదు.

క్రియారూపమైనట్టి ఈ జగత్తు అధిష్ఠానమగు ఆత్మతత్త్వము కంటే ఏమాత్రం వేరు కాదు. కాబట్టి ఓ స్నేహితురాలా! నీ ప్రశ్నలన్నిటికి సమాధానం... "ఆ పరమాత్మయే."

ఈ 'జగత్తు' పరమార్థమగు బ్రహ్మమే అయి ఉన్నది. కనుక "ఈ జగత్తే" అని నీ ప్రశ్నలకు సమాధానంగా చెప్పటం కూడా ఉచితమే అవుతుంది.

ఈ ప్రపంచమునకు రూపకల్పన చేస్తున్నది నేనే. అయితే నేను ఈ ప్రపంచమునకు అతీతమైనట్టి "పరమోత్కృష్టమైన" నేను అను "తత్త్వము"ను కూడా! అంతేగాని నేను ఈ ప్రపంచరూపుడను గాను. ఈ కనబడే జగత్తునందు నేనుగాని, ఇది నాయందుగాని లేవు.

అద్వైత బ్రహ్మస్వరూపుడనే "నేను."

ఇక నాకు జన్మ–మృత్యువులెక్కడ? ఉనికి ఎక్కడ? లేమి ఎక్కడ? నేను ఏదై ఉన్నానో, నీవు కూడా అదే (తత్ త్వమ్). కనుక, నీ ప్రశ్నలన్నిటికీ మేము ఇచ్చే సమాధానం ఇదే.

"అది నేనే!"

"అది నీయొక్క వాస్తవ స్వరూపమే! ప్రతి ఒక్కరియొక్క వాస్తవ స్వస్వరూపమే!"

❖❖❖

# 13. పరస్పరం

రాజు–మంత్రులను చూడకముందు ఆ కర్కటి కొంత చపలచిత్తము కలిగి ఉండేది. ఆ ఇద్దరి 'విజ్ఞానమయమైన–ఆత్మవస్తునిర్ణయాత్మక' వాక్యాలు శ్రద్ధగా విన్నది. మరుక్షణం ఆత్మజ్ఞానముయొక్క ప్రాప్తిచే పరమానందం పొందింది. తన మనస్సునందు శేషించియున్న కొద్దిపాటి మాత్సర్యమును, చాపల్యమును విడనాడింది. ఇక ఆ రాక్షసికి బాహ్యదృష్టిగాని, ఆ బాహ్యదృష్టిచే ఏర్పడు సంతాపము గాని తొలగిపోయాయి. చిత్తము ప్రశాంతత పొందినది. ఆనందమయంగా ఇట్లు పలికినది.

**కర్కటి :** ఓ రాజ–మంత్రులారా! మీ ఇద్దరి వాక్యములు వినినంత మాత్రంచేతనే నా జన్మ ధన్యమైనది. మీ ఇరువురిలోను శాంతమయమై, నిత్యోదితమై, ఏకరసమైన చంద్రకిరణములవంటి ఉత్తమ ఆత్మజ్ఞానం వెల్లివిరుస్తోంది. ఇది చాలా మహత్తరమైన విషయం! వివేకయుక్తములైన మీ ఇరువురి వాక్యములు

వినిన తరువాత నేను మీకు "దాసోఽహం" అంటున్నాను. మీరిద్దరు నాకు పూజ్యులు. మీతోకూడిన సత్సంగముచే నేను నిర్మలంగా ప్రకాశించుచున్నాను. "సజ్జనులతోటి సాంగత్యము అద్భుతమైన ప్రభావం కలిగి ఉంటుంది" అనే శాస్త్రప్రవచిత విషయం మీరిద్దరు మరొక్కసారి నిరూపించి చూపారు. మరల మరల మీ పాదాలు స్పృశిస్తూ ప్రణామంచేస్తున్నాను. చేతిలో దీపం ఉన్న తరువాత, ఇక అంధకారమెక్కడ ఉంటుంది? మీయొక్క సంసర్గముచే నా మనస్సులోని రాక్షస ప్రవృత్తులు, కుసంస్కారములు ఉపశమిస్తున్నాయి. దుఃఖం తొలగిపోతున్నది.

ఓ రాజ–మంత్రులారా! ఒక రాక్షసినైనట్టి నాపట్లే మీ విజ్ఞానసమన్విత వాక్యములు ఇంతటి ప్రభావం చూపించినప్పుడు, ఇక తదితరులు వింటే ఎంతటి ఉత్తమ ప్రయోజనం కలుగుజేస్తాయో? ఇతరులలో అనేకులు ఈ వాక్యములు వింటే మరుక్షణం దుఃఖరహితులు అవుతారు. ఈ మీ వాక్యములు అనేకమంది ముముక్షువుల చెవులకు విందు చేయునుగాక!

ఓ విక్రమ మహారాజా! సుబుద్ధివగు ఓ మహామంత్రీ! "మహాత్ములు" అయి ఉన్న మీ ఇద్దరితో ఇంతకుముందు నేను పరుషవాక్యములు పలికినందుకు నన్ను క్షమించండి. 'క్షమ' యే మీవంటి మహనీయులకు భూషణమై ఉంటుందని పెద్దలు చెప్పగా విన్నాను. ఆకాశములో సూర్య–చంద్రులవలె భూమిపై వెలుగొందుచున్న మీ ఇద్దరు నాకు అత్యంత పూజనీయులు, ప్రీతిపాత్రులు అగుచున్నారు. ఇప్పుడు ఏదైనా కోరుకొమ్మని మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను. అత్యంత వినమ్రతతో మీ మనోరథం ఈడేర్చటానికి సిద్ధంగా ఉన్నాను.

**విక్రమమహారాజు :** ఓ ప్రియరాక్షసీ ! మా రాజ్యములోని ప్రజలు ఒక ఈతిబాధకు లోనగుచున్నారు. 'విసూచిక' అనబడు ఒక వ్యాధిరూపమైన మహమ్మారి ఇక్కడి ప్రజలను పట్టి పీడిస్తోంది. అది హృదయమును బలహీన పరచివేయుటచే, ఆ రోగికీ ఏ ఔషధము ఇచ్చినప్పటికీ నిష్ప్రయోజనమే అవుతోంది. మా దగ్గర ఉన్న మంత్ర – తంత్ర శక్తులన్నీ ఆ మహమ్మారి ముందు కొఱగాకుండా పోతున్నాయి. మీ వంటి మహాత్ములనెవరినైనా ఆశ్రయించి ఏదైనా మంత్రము–తంత్రము–ఔషధము పొంది తద్వారా మా ప్రజలకు సుఖశాంతులను కలుగజేయాలనే ఉద్దేశంతోనే మేమిద్దరం ఈ అర్ధరాత్రి ఇటువైపు వచ్చాం.

మీ వంటి రాక్షసులు అట్టి మహమ్మారులను నిరోధించగలిగే శక్తియుక్తులు, ఉపాయములు కలిగి ఉంటారని వింటూ ఉంటాం. మీవంటివారిని వశపరచుకొని, తద్వారా మా ప్రజలను మేము కాపాడుకోవాలని మా ఉద్దేశం. అది రాజులమగు మాకు విధ్యుక్తధర్మమే కదా!

మా రాజ్యములోని మంత్రద్రష్టలు మాకు చెప్పిన కొన్నికొన్ని విషయములను అనుసరించి "నీవు గొప్ప మంత్రశక్తిగల దానవు" అని మేము అనుకుంటున్నాం. మా సంకల్పము, దైవనిర్ణయం కూడా ఒకే తీరుగా ఉన్నాయి కాబోలు! ఇప్పుడు నీవు తారసపడ్డావు. నిన్ను ఒక కోరిక కోరుతున్నాం.

ఆ విసూచివ్యాధి మా ప్రజలను హింసించకుండా ఉండునట్లు అనుగ్రహించు. అంతేకాదు. మా ప్రజలను నీవు హింసించవద్దని మా మనవి.

**కర్కటి:** ఓ రాజా! ఒక రాజుగా, నీ ప్రజాక్షేమం కోరినవాడవై, మంచి కోరికనే కోరావు. నీ వితరణశీలత తప్పక మెచ్చుకోతగ్గదే. మీరిద్దరు నాకు ఇప్పుడు గురుతుల్యులు కదా! ఇక ఇప్పటి నుండి మీ రాజ్యములోని ఏ ప్రాణిని నాకు నేనుగా హింసించనని మీకు మాట ఇస్తున్నాను. మీ అభీష్టమును అనుసరించే ఉంటాను. ఆ విసూచి వ్యాధిని నివారించటానికి మంత్రం తప్పక చెపుతాను.

**విక్రముడు:** కానీ, నీవు జన్మతః రాక్షసివి కదా! ప్రకృతి నిర్ణయమును అనుసరించి నర-జంతు దేహములను భుజించుట నీయొక్క స్వభావమే అయిఉన్నది. మరి నీవు 'అహింస' ను నియతిగా గ్రహిస్తే ఇక ఈ నీ శరీరనిర్వహణయే కష్టతరం అవుతుందేమో? ఇంకొక విషయం. నీవు ఎవరో, నీ పూర్వవృత్తాంతమేమిటో, ఇంతటి ఆత్మదృష్టి ఎట్లా పొందావో తెలుసుకోవాలని మాకు ఉన్నది.

**కర్కటి:** హే మహాత్మా! మీరిద్దరు ప్రవచించిన ఆత్మవచనములు నాయొక్క 'ఆత్మదృష్టి' కి ఎంతో దృఢత్వం చేకూర్చాయి.

నేను ఒకానొకప్పుడు ఒక పర్వతముపై ఆరునెలలు సమాధియందు ఉండి ఉన్నాను. ఆ తరువాత సమాధినుండి లేవగానే (వ్యుద్ధానకాలమునందు) నాయందు 'భోజనము' గురించి సంకల్పము ఉదయించింది. జీవులను భక్షించాలనే ఉద్దేశంతోనే ఇటువైపు వచ్చాను. ఇప్పుడు మరల ఆపర్వతశిఖరం చేరుతాను. ధ్యాననిష్ఠయందు నిమగ్నమైపోతాను. ఒక శిలాశిల్పంలాగా నిశ్చలత్వము వహిస్తాను. అమృత స్వరూపమగు ఆత్మ గురించి భావనచేస్తూ ఉంటాను. మీరు చెప్పిన వాక్యార్థములను మననం చేస్తూ ఈ జీవితము గడుపుతూ ఉంటాను. ఆ తరువాత నా ఇచ్ఛానుసారంగా ఎప్పటికో అప్పటికి ఈ ఉపాధిని త్యజించివేస్తాను. ఈ శరీరము త్యజించబడేవరకు నేనిక ఏ ప్రాణిని హింసించను.

ఇక నా ఇతః పూర్వపు విశేషాలు చెపుతాను వినండి. నేను 'కర్కటి' అనే పేరుగల రాక్షసిని. హిమాలయ పర్వతపు ఉత్తరదిక్కునగల ఒకగుహలో నివసిస్తూ ఉండేదానను. ఒకసారి గొప్పతపస్సు చేసి బ్రహ్మదేవుని మెప్పించాను. బుద్ధిమాంద్యంచేత "విసూచిక" అనే సూక్ష్మ ఉపాధితో వ్యాధి స్వరూపురాలయ్యాను. అనేకజనుల రక్తమాంసములు పీల్చుచు ఉండేదానను. అప్పుడు గుణవంతుల రక్షణకై బ్రహ్మదేవుడు ఒక మంత్రమును లోకములకు ప్రసాదించటం జరిగింది. ఓ రాజా! బ్రహ్మదత్తమైన ఆ మంత్రమును మీకిప్పుడు ఉపదేశిస్తున్నాను. అది శ్రద్ధగా పఠించువారు అట్టి ఉపాసనాబలంచేత.... ఇతరుల హృదయములోని శూలబాధను క్షణంలో నశింపజేయగలరు. కలుషితనాడులందలి శూలబాధను తొలగించుట కొరకు బ్రహ్మదేవునిచే ప్రవచించబడిన విసూచికామంత్రమును నావద్దనుండి మీరిద్దరు స్వీకరించుటకు సిద్ధంకండి. అదుగో.... అక్కడ ఏదో సరస్సు కనబడుతోంది. అక్కడికి మనం ముగ్గురం నడచివెళ్ళుదాం. స్నానము, ఆచమనము ముగించిన తరువాత నేను మంత్రప్రదానం చేస్తాను.

❖

వారు ముగ్గురు నదీతటం జేరారు. ప్రజల క్షేమమే ఆశయముగా గల రాజు - మంత్రులిద్దరూ ఆ రాక్షసికి గురుభావంతో ప్రణామం చేశారు. బ్రహ్మప్రోక్తము, సిద్ధిదాయకము అయినట్టి విసూచి

మంత్రమును, ఆమంత్రమునకు సంబంధించిన సంకల్పవిధానమును కర్కటి నుండి నేర్చుకొన్నారు.

**కర్కటి :** మిత్రులారా! మీకు, మీ రాజ్యమునకు శుభమగుగాక! ఇక నాకు సెలవు ఇప్పిస్తే, నా స్వస్థానమునకు చేరుకొంటాను.

**విక్రమరాజు :** ఓ స్నేహితురాలా! దీర్ఘదేహీ! ఈ విసూచీమంత్రము మాకు ప్రసాదించుటచే ఇటుమాకు, అటు మా ప్రజలకు ఎంతో మేలు చేశావు. ఇప్పుడు నీవు మాకు గురువువు, స్నేహితురాలివికూడా అయ్యావు. నీ మీద వాత్సల్యంతో గౌరవంతో నీకు తగిన భోజనసదుపాయం చెయ్యాలని మేము అనుకొంటున్నాము. ఎందుకంటే, జ్ఞానుల ఆవశ్యకత ఈ భూమిపై ఎంతో ఉన్నది.

ఇప్పుడు మేము ఒక నిశ్చయానికి వచ్చాం. మాపై కరుణతో, ప్రేమతో మా ఈ నిశ్చయమును అంగీకరిస్తావని తలుస్తాము. సజ్జనులగు మహాత్ములను ప్రేమతో దర్శించినంత మాత్రంచేత వారితో స్నేహం సిద్ధిస్తుందని పెద్దలు అనగా విన్నాము. మా నిశ్చయమేమిటో విను.

నీవు అందమైన ఆభరణములు ధరించి మనోహరమైన ఆకృతితో మా రాజగృహమునకు రావచ్చు. అచట నీవు సుఖంగా ఏలోటూ లేకుండా ఉండవచ్చు. అక్కడ మేము మా సేవకులను నియమిస్తాం. వారు నీకు అన్న పానీయములు చేకూర్చుచు నీకు సేవ చేస్తూ ఉంటారు.

**కర్కటి :** ఓ రాజా! నీవు కోరినట్లే, నేను ఒక సుందరస్త్రీ రూపం ధరిస్తే, నీవు తప్పక అన్నపానీయములు చేకూర్చుతావు. కాని, నేను జన్మతః రాక్షసిని కదా! మీ మానవులు భుజించే అన్నపానీయములు మాకు రుచిస్తాయా? లేదు. సామాన్య భోజనం మాకు తృప్తిని కలిగించవు. ఈ రాక్షస ప్రవృత్తితో కూడిన దేహము ఉన్నంతవరకు మా స్వభావం ఇట్లే ఉంటుంది. కనుక, నా అన్నపానాదుల గురించి నీవు చింతించవద్దు. నిశ్చింతగా నీ రాజ్యం చేరి, ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుకో. నాకు సెలవు ఇప్పించు.

**విక్రమరాజు :** నీవు అన్నమాట నిజమే. అయితే మాత్రం ఏం? ముందుగా ఒక సుందర స్త్రీ రూపము దాల్చినదానవై, బంగారు ఆభరణములతో శోభిల్లుచు, మా అంతఃపురంలో కొన్నాళ్ళు ఉండి విశ్రాంతి తీసుకో. మా రాజ్యములోని దుష్టులను, చోరులను, నిరంతర-హింసాపరాయణులను వధించటానికి ఒకచోటకు చేరుస్తూ ఉంటాము. అట్టివారిని నీకు ఆహారంగా సమకూరుస్తాము. నీవప్పుడు నీ సుందర స్త్రీ రూపము త్యజించి, రాక్షసిరూపివై ఆ వధింపతగువారిని హిమాలయపర్వత గుహలోనికి గొనిపోయి అక్కడ భుజించు. నీవలె అధికంగా భుజించేవారికి ఏకాంతభోజనమే బాగుంటుంది కదా! అట్లు భుజించి తృప్తిగా ఆ గుహలో కొంతకాలం విశ్రమించు. ఆ తరువాత నిదురలేచి సమాధిస్థితి స్వీకరించు. సమాధినుండి లేచిన తరువాత మా నగరం వస్తూఉండు. మరల యథావిధిగా క్రూరులు, పాపులు అయినట్టి ప్రాణులను నీ కొరకు సిద్ధంచేసి ఉంచుతూ ఉంటాము.

నీకు సంకోచం అక్ఖర్లేదు. ఇట్లాచేయటం పాపం కాదు. "స్వధర్మేణచ హింసైవ మహాకారుణయా సమా".... స్వధర్మ పూర్వకమైన హింస కూడా మహాకరుణతో సమానమే.

అందుకు నీవు ఒప్పుకుంటే, ఈ నీ స్నేహం మాకు మరెంతో కాలం లభ్యమౌతుంది. అది మాకు మహదానందమైన విషయమే అవుతుంది. స్నేహం స్థిరపడిన తరువాత, విరుద్ధస్వభావముతో కూడిన జీవులైనప్పటికీ, వారిమధ్య స్నేహబంధం తొలగదుకదా! మేము, ఇకపై నిన్ను 'కందరాదేవి' అని పిలుస్తాం.

**రాక్షసి :** ఓ స్నేహితుడా! అట్లే అగుగాక! నీవంటి ఉత్తమ శ్రేయోభిలాషుల మాట తీసివేయగలనా? నా 'ఆకలిబాధ' విషయంలో నీవు చూపుచున్న ఔదార్యమునకు సంతసించుచున్నాను. నీకు, ఈ మంత్రికి, నీ ప్రజలకు శుభమగుగాక!

❖

ఆ ముగ్గురు రాజగృహం చేరారు. ఆ రాత్రంతా ఆత్మవిషయమై అనేక విషయాలు చర్చించు కొంటూ గడిపివేశారు. సుందరస్త్రీ రూపం ధరించిన ఆ రాక్షసి మరునాడు నగరంలోని వింతలు, విశేషాలు అన్నీ చూచివచ్చింది. రాజు, మంత్రులు తమ తమ రాచకార్యములలో నిమగ్నమైనారు.

ఆ విధంగా ఆరు రోజులు గడచిపోయాయి. ఏడవ రోజు రాత్రి విక్రమమహారాజు తన భటులను పిలిపించాడు. ఓ భటులారా! తక్షణం వెళ్ళండి. తమయొక్క దుష్టప్రవృత్తి కారణంగా మన రాజశాసనమును అనుసరించి మరణశిక్ష విధింపబడి, చావుకై ఎదురుచూస్తున్న నేరస్థులు ఏఏ చెఱసాలలో ఎక్కడెక్కడ ఉన్నారో విచారించండి. అట్టి నేరస్థులందరినీ మన నగరానికి తీసుకురండి" --- అని ఆజ్ఞాపించాడు. శిక్షయొక్క అమలుకై ఎదురుచూస్తున్న కొంతమంది నేరస్థులను ఒకచోటికి రప్పించారు. రాజు ఆ రాక్షసిని సమీపించి, "ఓ కందరాదేవీ! ఇదిగో..... వీరందరిని నీకు ఆహారంగా ఇస్తున్నాను. వీరు నేరప్రవృత్తి కలవారు. మా రాజశాసనములను అనుసరించి మరణదండన విధింపబడినవారు. అందుచేత నీకు ఆహారం అవుతారు" అని పలికాడు.

ఆ రాక్షసి సంతోషించింది. రాజువద్ద సెలవు పుచ్చుకొన్నది. తన భీకరమైన ఆకారమును ధరించి, వారందరిని తన భుజంపై వేసుకొని హిమాలయపర్వత గుహకు రివ్వున ఎగిరింది. వారిని సుష్టుగా భుజించి మూడురోజులు నిదురించింది. ఆకలి తీరుటచే స్వస్థచిత్త అయి 'సమాధి'ని అవధరించింది. ఐదు సంవత్సరాలు సమాధిలో ఉండిపోయింది. ఒకానొక రోజు సమాధినుండి వ్యుత్థానం పొందింది. రాజు విక్రమార్కుని అభిప్రాయం గుర్తుకువచ్చుటచే మళ్ళీ కిరాతరాజ్యం ప్రవేశించింది. అక్కడ రాజు - మంత్రులను కలుసుకొన్నది. ఉచితమర్యాదల తరువాత, ఆ ముగ్గురు ఆత్మవిషయమై సంభాషణలతోను, అనేక కథాప్రసంగములతోను కొన్ని రోజులు గడిపారు. ఒక రోజు, రాజుచే సిద్ధము గావించబడినట్టి, వధింపబడతగ్గ ప్రాణులను తనవెంట గైకొని హిమాలయ పర్వతములవైపు రివ్వున ఎగిరిపోయింది.

❖❖❖

# 14. కందరాదేవి

ఓ రామచంద్రా! నేటికికూడా ఆ రాక్షసి ఆ పర్వతముపైనే నివసిస్తోంది. ఒకప్పుడు ధ్యాననిష్ఠ యందు, మరొకప్పుడు వ్యుత్థానస్థితియందు ఉండిఉంటోంది. ఆ కిరాతప్రభువు, అతని మంత్రి మాత్రం కాలానుగుణంగా కోర్కెలన్నీ త్యజించివేసి, శాంతచిత్తులై, విదేహముక్తిని పొందారు. ఆ రాజు యొక్క వంశపరంపరలోని తర్వాతి ప్రభువులు కూడా ఆ రాక్షసితో మిత్రత్వము కలిగి ఉంటున్నారు. అప్పుడప్పుడు ఆ రాక్షసి రావటం, వారు దుష్టజీవులను ఆమెకు ఆహారంగా ఇవ్వటం... ఇప్పటికీ ఆ రాజ్యంలో జరుగుతోంది. అయితే మహాత్ములు ప్రత్యుపకారం చెయ్యటమే స్వభావంగా కలిగిఉంటారు కదా! యోగసిద్ధిని పొందియున్న ఆ రాక్షసి తన మంత్ర – యోగశక్తిచే అక్కడి ప్రజలకు కలిగే అరిష్టములను, పిశాచాదుల నుండి వచ్చే భయాదులను తొలగిస్తూ ఉంటోంది. ఆయా రోగములను కూడా నివారిస్తూ ఉంటోంది. రాజ్యం వలన రాక్షసికి, రాక్షసివలన రాజ్యమునకు ఉపకారమే జరుగుతూ వస్తోంది.

ఎప్పుడైనా ఒక్కొక్కసారి ఆ కర్కటి చాలాకాలం వరకు ధ్యాననిష్ఠయందు ఉండటం జరిగితే, ఆ కారణంచేత చాలాకాలం కిరాతరాజ్యం వచ్చేదికాదు. అప్పుడు అక్కడి ప్రజలు, రోగనివారణకొరకై ఒక ఎత్తైనప్రదేశంలో ఆమె విగ్రహం స్థాపించి.... ఆ విగ్రహాన్ని పూజిస్తూ ఉంటారు. ఆమెను "కందరాదేవి", "మంగళేతర" అనే పేర్లతో ఆరాధిస్తూ ఉంటున్నారు.

అప్పటినుండి, ఆ రాజ్యమును పాలించే రాజులంతా సింహాసనం అధిష్ఠించేముందు కందరాదేవియొక్క విగ్రహప్రతిష్ట రాజ్యంలో ఎక్కడో అక్కడచేసి, అప్పుడు మాత్రమే రాజ్యభారం స్వీకరించేవారు. అట్లా ప్రతిష్ఠ చేయకపోతే అక్కడి ప్రజలకు అరిష్టం కలుగగలదని అక్కడి పెద్దల అభిప్రాయం. "కందరాదేవిని పూజించుటచే ప్రజలు అరిష్టముల నుండి, రోగములనుండి విముక్తిని పొందుతారు" అను ఒకానొక దృఢభావన అక్కడి ప్రజలకు శుభ, శ్రేయస్సులనే కలుగుజేస్తూ ఉన్నది. ఆమె విగ్రహములు, దేవాలయములు నేటికీ ఉన్నాయి. పూజింపబడుచున్నాయి. ఆ దేవి యొక్క లిఖిత చిత్రముకూడా అక్కడి ప్రజల ఇండ్లలో అలంకరించబడి కష్టములు, రోగములు తొలగించునవై ఉంటున్నాయి.

**సకల కోమల మంగళకారిణీ కవీలితాఖిల వధ్యమహాజనా ।**
**జయతిసాత్ర కిరాతజనాస్పదే పరమబోధవతీ చిరదేవతా॥**

అని ఆ కందరాదేవి ప్రార్థింపబడుచున్నది. "సర్వులకు సస్యసమృద్ధి, ఐశ్వర్యము, సకలసంపత్తులు, ఆయురారోగ్యములు ప్రసాదించు మా కందరాదేవి దుష్టశిక్షణ–శిష్టరక్షణ చేస్తూ సర్వదా మమ్ములను కనికరించునుగాక" అని, అక్కడి సర్వజనులు ప్రార్థనలు చేస్తూ ఉంటారు.

❖❖❖

# 15. సమీక్ష

ఓ రామచంద్రా! మన ఈ "ఆధ్యాత్మ తత్వ్రప్రసంగం" లో "ఈ ప్రపంచము యొక్క ఉత్పత్తి" విషయమై కొన్ని విశేషాలు వివరించటానికే, నీకు, ఈ 'కర్కటి ప్రశ్నలు' చెప్పాను. దీనిని బట్టి గ్రహించవలసింది ఏమిటి?

ఈ జగత్తంతా – ఆదిగాని, మధ్యగాని, అంతముగాని లేని, పరమకారణము అయినట్టి – 'బ్రహ్మము' నుండే ఉత్పన్నము అయినది. ద్రష్ట–దృశ్యము కూడా పరబ్రహ్మ స్వరూపమే!

కాని, యథార్థానికి, బ్రహ్మమునందు ఏ క్షణంలో కూడా ఏదీ ఉత్పన్నమే అగుటలేదు. నీటిలో వేరువేరు ఆకారములు కలిగిఉండే చంచల తరంగాలు, గుండ్రటి ఆవృత్తములు మొదలైనవన్నీ కనబడుతూ ఉంటాయి. నీరే ఆ అన్ని ఆకారములుగా పరిణమించటం జరుగుతోంది కదా! కానీ, నీరు ఏదైనా మార్పుచెందుతోందా? మరింకేదైనా అగుచున్నదా? లేదే! అట్లాగే పరబ్రహ్మము నందు భూత – భవిష్యత్ – వర్తమాన కాలాత్మకమైనట్టి ఈ జగత్తు ఉన్నది. పరబ్రహ్మము తనయొక్క స్వభావసిద్ధమైన సమత్వ – సామ్యత్వములను ఏమాత్రం ఏ క్షణంలో కూడా త్యజించటం లేదు. అట్లు త్యజించకుండానే, సర్వమునకు కర్త అయి, ఈ జగత్తు యొక్క నిర్మాణం చేస్తోంది.

'కొయ్య 'లో ఒక విగ్రహం చెక్కబడుచున్నట్లుగానే, ఈ కనబడుచున్న 'సృష్టి' అనబడే దంతా స్వయముగా, బ్రహ్మమునందే ఒకానొక 'మిథ్యాకల్పన' రూపమున ఉదయించటం జరుగుతోంది. అంతేకాని "ఈ సృష్టి అంతా ఎక్కడినుండో బయలుదేరి ఇక్కడికి ఎప్పుడోవచ్చి చేరుచున్నది" అని భ్రమించకూడదు సుమా! ఈ దృశ్యము బ్రహ్మమే!

బీజముకంటే – ఆకులు, పుష్పములు, ఫలములు వేరా? కాదు కదా! కానీ, అవన్నీ వేరు వేరు ఆకారములతో విలక్షణంగా కనిపిస్తున్నాయి. ఈ అనేక పదార్థములతో కూడుకొని కనిపిస్తున్న జగత్తు బ్రహ్మము కంటే వేరుకాదు. కాని, భిన్నంగా కనిపిస్తోంది. పుష్ప – ఫల – ఆకుల సత్త బీజములో ఉన్నంత వరకు – "పుష్పాదుల సత్తకు – బీజము యొక్క సత్తకు" – ఏమైనా భేదం ఉన్నదా? బ్రహ్మము నందు చిత్‌నకు ('తెలుసుకొనుట' అను తత్త్వమునకు).... చేత్యమునకు (తెలియబడు తత్త్వమునకు) భేదము లేదు. వాయువునకు, ఆ వాయువు యొక్క చలనమునకు భేదమేమి ఉంటుందో చెప్పు? చిత్‌కు, చేత్యములకు (తెలుసుకొనుటకు, తెలియబడుటకు) భేదభావ మంతా విచారణలేనట్టి సమయమునందే ఏర్పడుతోంది. లేక స్ఫురిస్తోంది. అట్టి భేదభావన అసత్యమే కాబట్టి, "అయుక్తము, దుఃఖకారకము" కూడా అగుచున్నది. అనిర్వచనీయమగు 'మాయ' చేత మాత్రమే ఏర్పడుచున్నట్టి ఆ 'భేదదృష్టి' నశించాలంటే, 'ఆత్మవిచారణ' అనేది మాత్రమే ఉపాయం. ఆత్మవిచారణచే, "దృశ్యము ద్రష్టయొక్క స్వస్వరూప విన్యాసమే!"... అని సుస్పష్టం కాగలదు.

ఈ భ్రాంతి కారణరహితంగానే ఉత్పన్నమగుచున్నది. మరల ఇంతలోనే, జ్ఞానముచే నశించ గలదు. అవిచారణచే ఉత్పన్నమైనది కాబట్టి విచారించుటచేత తొలగిపోతోంది. ఓ రఘుకులతిలకమా! రామచంద్రా! నీవు "భేదదృష్టియే రూపముగా గల భ్రాంతి" ని త్యజించివేయి.

ఎప్పుడైతే బ్రహ్మసాక్షాత్కారం అవుతుందో అప్పుడు ఈ మాయను సమగ్రంగా ఎరుగ గలుగుతావు. ఈ మన వర్తమాన 'ఉపదేశం' శ్రద్ధగా వింటూ ఉంటే.... భ్రాంతి రూపమునగల హృదయగ్రంథులు క్రమంగా తప్పక ఛేదించివేయబడుతాయి. ఆ తరువాత ఇక అజ్ఞానముయొక్క శబ్దార్థముల గురించిన భేదభావమంతా స్ఫురించకుండానే పోతుంది. అట్టి సమయంలో నీవే స్వయముగా 'బ్రహ్మము' అయి ఉన్నట్లు గ్రహిస్తావు. 'చిత్తము' నకు కారణమైనట్టి అవిద్య, అట్టి ఈ చిత్తముచే కలుగుచున్న అనర్థములు.... అన్నీకూడా, ఈ ఉపదేశముచే తప్పక శాంతించగలవు.

❖❖❖

**ఈ కర్కట్యుపాఖ్యానం యొక్క సారం:**

ఈ జగత్తు బ్రహ్మము నుండే బయల్వెడలుతోంది.

బ్రహ్మము నందే ఉంటోంది.

బ్రహ్మము నందే లయిస్తోంది.

కనుక ఈ జగత్తు సర్వదా బ్రహ్మమే!

ఈ ద్రష్ట బ్రహ్మమే.

'దర్శన – దృశ్యములు' ఈ ద్రష్టకన్న వేరు కాదు.

కనుక అవి కూడా బ్రహ్మమే.

❖❖❖

# VI. ఐందవ - బ్రహ్మాండములు

## 1. బ్రహ్మము 'వలన' జగత్తు?

**శ్రీరాముడు :** శ్రుతులు, ("తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" వంటి) కొన్ని మహావాక్యముల ద్వారా, "బ్రహ్మము వలన జగత్తు ఉత్పన్నమైనది" అని ప్రకటిస్తున్నాయి కదా! ఇక్కడ 'వలన' (because of) అనే పంచమీతత్పురుష* మనకు వినబడుతోంది. అనగా, ఆ వాక్యములు 'జగత్తు – బ్రహ్మములు వేరు వేరు" అని ప్రకటిస్తున్నట్లే కదా! అప్పుడు "ఈ సర్వము అభిన్నము" అని మనం ఎట్లా అనగలం?

పోనీ, "జగత్తు, బ్రహ్మము వేరు వేరు" అనే నిర్ణయానికే వస్తే, మనం మన ఈ సంభాషణలో ఉపయోగిస్తున్న శబ్ద ప్రవృత్తి అంతా ఈ జగద్వ్యవహారమునకు సంబంధించినదే కదా! ఇట్టి శబ్ద జాలంతో బ్రహ్మమును ప్రతిపాదించటం ఎట్లా? ఇక విచారణగాని, ఉపదేశంగాని సాధ్యపడేదెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** అవును. శబ్ద ప్రవృత్తి బ్రహ్మమును స్వయముగా ప్రకటించలేని మాట నిజమే. ఉపదేశము కొరకు శాస్త్రకారులచే శాస్త్రములందు తాత్కాలికంగా కావించబడుచున్న భేదకల్పనచేత మాత్రమే ఈ శబ్ద ప్రవృత్తి (మనస్సు, బుద్ధి, ఆత్మ, బ్రహ్మం మొదలైన శబ్ద ప్రయోగాలు) సంభవించటం జరుగుతోంది. లోక వ్యవహారం కొరకై కావించబడుచున్న శబ్ద ప్రవృత్తితో కూడిన ఉపదేశమంతా 'ప్రతియోగి' మరియు 'పక్షము'** (To Counter an approach before proposing a finer concept) మాత్రమే సుమా!

వాస్తవానికి "సత్యము" అనుభవపూర్వకమై మాత్రమే వెలయుచున్నది. దానిని మరెవ్వరు దేని చేతకూడా చూపించలేరు. అయితే శిష్యుడు ఉత్తమ ప్రయత్నశీలుడై, ఆత్మను గ్రహించుటకు ఉద్యుక్తుడైయున్నప్పుడు (ఉద్యమిస్తున్నప్పుడు) తత్వదర్శి అయినట్టి గురువు "ఇది కాదు"–"నేతి"– అనే అర్థాన్ని సూచించే అనేక శబ్దార్థముల సహాయంతో, దృష్టాంతములతో సంభాషిస్తూ, శిష్యునకు తన అనుభవం – అవగాహన ఏమైయున్నదో ఏమిటో తెలియజేస్తున్నాడు. అట్లు గురువులచే శిష్యులకు తెలియజేయబడుచున్నవే శాస్త్రములు కూడా! శాస్త్రముల ద్వారా కొంత విధి – నియమములను, మరికొంత విచారణను సద్గురువులు లోకమునకు అందిస్తున్నారు. శాస్త్రములను జీర్ణం చేసుకొన్నట్టి కొందరు మహనీయులు శాస్త్రసారాన్ని మరల తమను ఆశ్రయించినవారికి

---

* పంచమీ తత్పురుష / విభక్త ప్రత్యయం : 'వలనన్, కంటె, పట్టి.

** ప్రతియోగి (Criticism) : దేని గురించి అయినాసరే, దాని భేదముగాని, అభావము గాని తెలియచేసే ప్రతిపాదనము ("అది అట్లు అగుటకు వీలు లేదు" అను ప్రతిపాదన)

పక్షము (Holding) : ఏదైనా సందిగ్ధమైన విషయమును కొన్ని అనుమాన ప్రమాణములచే నిశ్చయించటం.

బోధిస్తున్నారు. బోధస్వరూపమై ఎట్టి పదజాలములకు, వాక్యపరంపరలకు అందజాలనట్టి ఆ బ్రహ్మతత్త్వమును ఆ శిష్యుడు గురుశాస్త్రవాక్యముల సహాయంచేత, స్వవిచారణాప్రభావం చేత తనయందే, అనుభవపూర్వకంగా దర్శించుచున్నాడు.

ఇక నీ ప్రశ్నకు వద్దాం. ఒక దీర్ఘమైన, సమగ్రమైన విషయమును పరశీలిస్తున్నప్పుడు మనం మహత్తరమైన తత్త్వబోధను అవగతం చేసుకోవటానికి ప్రయత్నించాలి. అంతేకాని, మధ్యలో మధ్యే మార్గంగా చెప్పిన ఒక్కవాక్యమును మాత్రం తీసుకొని, మిగతాదంతా ప్రక్కకునెట్టి, తర్జన – భర్జనలు మొదలుపెట్టడం ఉచితంకాదు.

బాలునితో తల్లి "నాయనా! అదిగో దయ్యం, నీవు ముద్ద తినకపోతే వచ్చిపడుతోంది," అని 'దయ్యము' అనబడే అక్కడ లేని విషయం కల్పించి చెప్పుతుంది. కాని అది వాస్తవమా? కాదు. "ఆ తల్లికి అక్కడ దయ్యం కనిపించింది" అని ఏమాత్రం అనుకోము కదా! అక్కడ ఆ తల్లికి బిడ్డ కడుపు నిండా తిండి తినటం ముఖ్యం. అట్లాగే శాస్త్రాలు కూడా "బ్రహ్మము – జగత్తు" అని చెప్పుచున్నప్పుడు "జగత్తు–బ్రహ్మము".... అనబడే రెండు విషయాలు ఉన్నాయి. అందులో ఒకటి ఒక తీరుగా, మరొకటి మరొక తీరుగా ఉన్నాయి" అని చెప్పుచున్నట్లుగా కొద్దిసేపు ఎవరికైనా అనిపించవచ్చేమో. "అట్టి భేదవ్యవహారమంతా 'అభేదదృష్టి' కొరకే కల్పించబడుతోంది". అని గ్రహించటమే సదవగాహన అని మా ఉద్దేశం. "అసలీ వ్యవహారభేద కల్పనలు శాస్త్రములు ఎందుకు చేయాలి?" అని అంటావా? మనం స్వప్నంలో వస్తువులను, మనుష్యులను, కొండలను, మొదలైనవి చూస్తూ ఉంటాము. అవన్నీ ఉన్నాయా? ఉంటే ఎక్కడున్నాయి? లేకుంటే, కలుగుచున్న అనుభవం మాటేమిటి? స్వప్నంలో కనబడే "ఒక ఇల్లు, ఒక మిత్రుడు " – ఈ రెండు ఒకే 'కల్పన' లేక 'ఊహ' చే తయారుచేయబడ్డాయా? ఆ రెండింటిని ద్వైతం అనాలా? అద్వైతం అనాలా? అనిర్వచనీయం అనాలా? ....ఒక స్వప్నంలోని ఆయా కల్పితవస్తువులకే ఇన్ని లక్షణములు ఆపాదిస్తున్నాము కదా! ఇక సత్యవస్తువు అయినట్టి ఆత్మ గురించి ప్రతిపాదించాలంటే ఎన్ని పద్ధతులు కావాలి? ఉపదేశము కొరకై ఆయా శబ్దార్థాలు అవశ్యకమే అగుచున్నది. శాస్త్రములు రచించబడే సమయంలో, లేక తత్త్వము బోధించే సమయంలో అనేక శబ్దములు, వాటికి అర్థములు కల్పించబడుచున్నాయి. దానినుండి విషయం విభాగం చేయబడుతోంది.

| | | |
|---|---|---|
| కారణ భావము | – | కార్యభావము (Cause & Effect) |
| స్వామి భావము | – | స్వభావము |
| హేతువు | – | హేతుమంతము |
| అవయవములు | – | అవయవి |
| భేదపరిణామము | – | అభేదపరిణామము |
| భావము | – | పదార్థముల వైచిత్ర్యము |
| విద్య | – | అవిద్య |
| సుఖము | – | దుఃఖము |

ఇవన్నీ కల్పిత విభాగములు, పదజాలములే....ఒప్పుకొంటాను. ఎందుకంటే యథార్థానికి, వర్తమాన ప్రవచనము యొక్క "లక్ష్యము" అయి ఉన్న బ్రహ్మమునందు ఏ విధమైన భేదకల్పనలు లేవు. కాని, ఇవన్నీ శాస్త్రములచే గురువులచే కల్పించబడ్డాయి. ఎందుకోసం? అజ్ఞానులకు (People who are not aware of), అర్ధజ్ఞానులకు (People who are half-aware of) బోధించుట కొరకే.

అట్టి భేదకల్పన అంతా.... సత్యవస్తువును ప్రతిపాదిస్తున్న ఆత్మజ్ఞాని అయిన గురువుకు (శిష్యుడికి బోధించటానికై) అత్యంత అవసరమే అవుతోంది. తత్త్వజ్ఞానం ప్రాప్తించిన తరువాత శిష్యుని హృదయం నుండి ఈ భేదకల్పన స్వయంగానే ఉపశమించుచున్నది. ఇకప్పుడు మౌనము మాత్రమే శేషించుచున్నది.

అజ్ఞానికి, ఈ ఎదురుగా కనబడే దృశ్యమంతా కూడా.... ఖండముగా, అర్థము కానిదిగా, దుఃఖ భరితమైనదిగా, అగమ్యమైనదిగా ప్రాప్తిస్తోంది. అప్పుడు సంక్లిష్టమైన విచారణ ఆవస్యకమూ, శరణ్యమూ అవుతోంది. అట్లు ఈ దృశ్యం, అగమ్యంగా, అర్థం కానిదిగా కనిపించటం జరుగకపోతే, మా వంటి గురువులు రంగప్రవేశం చెయ్యవలసిన అగత్యం ఏమి ఉంటుంది? మేము ఆత్మ గురించి, అనాత్మ గురించి బోధిస్తున్నాము. అట్లు మా వాక్యములు వింటున్న ఆ శిష్యుడు క్రమంగా "ఈ దృశ్యము – ఆద్యంతరహితము, విభాగశూన్యము, అఖండము – అయినట్టి పరమాత్మయే కాని మరింకేమీ కాదు" అని దృఢంగా తెలుసుకుంటున్నాడు. అందుచేత రామా! అట్టి ఆత్మబోధప్రాప్తి క్రమంగా తప్పక లభించగలదు.

అయితే ఇప్పటికి మాత్రం ఈ ద్వైతకల్పనను ఉద్వేగరహితుడవై శ్రద్ధాసక్తులతో విను. కాలులో ముల్లు విరిగినప్పుడు ఏం చేస్తాం? మరొక ముల్లుతెచ్చి కాలిలో విరిగిన ముల్లును ఆ ముల్లు సహాయంతో బైటకు లాగి, ఆపై ఆ రెండుముళ్ళు ఆవల పారవేస్తాం కదా? అట్లాగే, ఈ ద్వైతాద్వైత బోధ కూడా జ్ఞానప్రాప్తి జరిగేవరకే ముముక్షువును వెంటనంటి ఉంటుంది. ఆపై, అంతా గ్రహించ బడిన తరువాత, అతడు స్వయంగా, స్వభావ సిద్ధంగా సర్వపదజాలమును తానే త్యజిస్తున్నాడు.

ఈ ప్రపంచంలో కొందరు తమతమ కల్పనల గురించి వాదోపవాదములు చేసుకొంటూ ఉంటారు. కాని ఈ వాదనలన్నీ వేదాంతోపదేశమునకు పూర్వము మాత్రమే సంభవిస్తూ ఉంటాయి. తత్త్వం ఎరిగిన తరువాత, ఈ జీవుని "వాస్తవ–కల్పిత" స్వరూప స్వభావాలు గ్రహించబడిన తరువాత ఇక ఆపై ద్వైతము యొక్క స్ఫురణయే ఉండదు. ఈ వాచ్యము (చెప్పుట) వాచకము (చెప్పబడునది) ల సంబంధం 'ద్వైతదృష్టి' సమయంలో మాత్రమే ఏర్పడగలుగుచున్నది. ఉత్తమదృష్టికి తార్కాణం అనుభవమే. అట్టి అనుభవమునకు ఈ చర్చ అంతా ఎంతో అవసరమగుచున్నదని మరల గుర్తు చేస్తున్నాను.

ఓ రాఘవా! నీవు 'వలన – నుండి' అని చెప్పు మహావాక్యములను బోధ కొరకు ఉపయోగించబడే సాధన పరికరములుగా మాత్రమే చూడాలి.

(ఉదా: "యతోవా ఇమాని భూతాని జాయన్తే" దేని నుండైతే సమస్త భూతములు ఉత్పన్న మవుతున్నాయో:".... ఇది సాధనవాక్యము మాత్రమే.)

ఇక అఖండబ్రహ్మమును ప్రతిపాదించే మహావాక్యాలు* ఉన్నాయి. ఈ మహావాక్యముల లక్ష్యార్థం అయినట్టి "నేను అఖండుడను" అను ఉత్తమమైన ఎరుకయందే నీవు నీ చిత్తమును నిలపాలి. అట్లు నిలుపుతూనే నేను చెప్పుచున్నదంతా వింటూ ఉండు.

❖

"భ్రాంతి మాత్రమే" అయినట్టి ఈ మనస్సు అనిర్వచనీయమైన మాయయొక్క ప్రభావం చేత ఉదయించి, తన రూపమే అయి ఉన్న, ఈ జగత్తును విస్తరింపజేయుచున్నది.

మనస్సును బట్టే జగత్తు ఉంటుంది. మనస్సుకు వేరుగా జగత్తు లేదు.

మనస్సు లేకుంటే జగత్తు కూడా లేదు.

'మాయారూపము' అయి ఉన్న ఈ జగత్తును ద్రష్టయొక్క మనస్సే ఎట్లా విస్తరింపచేస్తోందో నీకు చెప్పటానికి, సుబోధకమైన 'ఐందవులు' అను వారికి సంబంధించిన ఒక వృత్తాంతము చెపుతాను. అది విన్నావా.... "ఈ జగత్తు అంతా భ్రాంతి మాత్రమే".... అను విషయము గురించి సుస్థిరమైన నిశ్చయం పొందగలవు. సంకల్పమాత్రంచేత ఉదయించగలుగుచున్నట్టి ఈ త్రిలోకముల గూర్చిన భ్రాంతిని త్యజించి, శాంతచిత్తుడవౌతావు. అట్టి పరిజ్ఞానము నీకు ఆత్మయందు సుస్థిరుడవై ఉండటానికి సహకరించగలదు. నాయనా! సూక్ష్మమైన దృష్టి సునిశితమైన ప్రజ్ఞతో నా వాక్యములలోని వివేకసారాన్ని గ్రహించావా, ఇక ఆపై మనోవ్యాధి యొక్క 'ఊసు' అయినా ఉండదు. "ఐందవ ఉపాఖ్యానము" అనబడే ఈ పురాతనమైన కథలోని విషయపరిజ్ఞానంచే "ఈ జగత్తంతా మనోమాత్రమే. ఇసుకలో నూనె ఉంటుందా? ఈ శరీరాదులు కూడా సత్యదృష్టిచే లేవు" అనునట్టి ఒకానొక నూతన దృష్టి అలవడుచున్నది.

నాయనా! రాఘవా! రాగద్వేషాలచే కలుషితమైయున్న ఈ చిత్తమే "సంసారము" అని పిలువ బడుతోంది. రాగాదులు మనస్సునుండి తొలగిన మరుక్షణం ఈ సంసార భ్రమకూడా తొలగిపోతోంది. చిత్తమే అన్నిటికీ మూలం. చిత్తమే.... పాలన, విచారణ, వ్యవహారములకు సంబంధించిన సమాలోచన, సంపాదన, ధారణ మొదలైన ఆయా లౌకిక క్రియా వ్యవహారంగా తనకుతానే విస్తరిస్తోంది. కనుక ఓ సభికులారా! మనం ఎప్పుడెప్పుడు ఏదేది లక్ష్యముగా కలిగి ఉంటామో, అదంతా అట్లుగా స్వీయచిత్తమే పరిణమించుచున్నదని గ్రహించండి. ఈ దృశ్యమునంతటినీ తనయందు ధరించుచున్నది ఆకాశరూపమగు చిత్తమేకాని, మరింకొకటేదీ కాదు. చిత్తమే క్రమంగా ఈ దేహము – ఇంద్రియములతో కూడి వర్తిస్తున్నప్పుడు, "ఈ దేహము నేను. ఈ ఇంద్రియములు నేను. ఇది

---

| | | |
|---|---|---|
| * "అహం బ్రహ్మాస్మి" | : | నేను బ్రహ్మమును. |
| "తత్త్వమసి" | : | నీవు అదియే అయి ఉన్నావు |
| "సర్వం ఖల్విదం బ్రహ్మ" | : | ఇదంతా బ్రహ్మమే |
| "జీవో బ్రహ్మేతి నా పరః | : | ఈ జీవుడు బ్రహ్మయే అయి ఉన్నాడు. |

నేను చేస్తున్నాను. వీరు నా వారు. ఇవి నా పరిమితులు" అనునట్టి అహంభావమును, మమకారమును, ప్రమేయమును పొందుచున్నది. చిత్తములోని చిదంశము అహంకారంగాను, జడంశము జగద్రూపం అయిన దృశ్యముగా ప్రకటితమౌతోంది.




నిరాకారుడగు బ్రహ్మదేవుడు ఆదిసృష్టి* యందు 'స్వతహాగా లేనివే' అయినటి.... ఈ భూమి, ఆకాశం మొదలైన దృశ్యజాలమును ఒక సమయంలో ఒకానొక స్వప్నమువలె గాంచుచున్నాడు. మరొకప్పుడు సర్వమును (స్వప్న విశేషములవలె) త్యజించుచున్నాడు. అనగా, అప్పుడు అతడు దృశ్యమును గాంచుటలేదు. ఇంకొకప్పుడు అతడు.... ఈ సృష్టి, స్థితి, లయములను, పంచభూతాత్మికమైన బ్రహ్మాండములను, అహంభావమును, సమష్టి – సూక్ష్మ స్వరూపమగు హిరణ్యగర్భ దేహమును, సూత్రాత్మస్వరూపమును.... వీటినన్నిటినీ కూడా "శూన్యమే కదా!" అను జ్ఞానదృష్టిచే చూస్తున్నాడు. అనగా, అతని దృష్టిలో ఇవన్నీ స్వప్నవస్తువులవలె 'లేనివే' అగుచున్నాయి.

**బ్రహ్మదేవుడు :** అట్టి ప్రథమ భావనను చేయువాడు. త్రిలోకములతో కూడిన ఈ సమష్టికి కర్తృత్వము వహించుటయే అతని స్వభావం.

ప్రశాంతము, నిర్మలము అయిన జలంలో సూర్యప్రకాశం అత్యంత సుందరంగా వ్యాపిస్తూ ఉండునట్లు, సర్వవ్యాపి అయినట్టి ఆత్మ భగవానుడు. 'విషయ రూపములు' అనదగినట్టి ఈ సర్వదేహ – మనస్సులలో వ్యాపించియున్నాడు. అది అట్లా ఉండగా.... ఈ 'చిత్తము' అనే బాలుడు అజ్ఞాన కారణంచేత "మిథ్యారూపమే" అయినట్టి ఈ జగత్తును బేతాళవిన్యాసమువలె చూచుచున్నాడు. అదే చిత్తము జ్ఞానము పొందినప్పుడు నిర్వికారము, శుద్ధము, నిత్యము అగు తత్త్వమే తానని, 'అదే తదితరులు కూడా' అని ఎరుగుచున్నది.

ఇప్పుడు "ఐందవోపాఖ్యానం" అని లోకప్రసిద్ధికెక్కియున్న ఒకానొక కథనం విన్నావో, ఇక... మమకారమును, భ్రమను కలుగజేయకలుగుచున్న ఈ దృశ్యమును ఆత్మ ఎట్లు పొందుట జరుగుచున్నదో నీవు గ్రహించగలవు. మధురమైన శబ్దములతో ఉత్తమమైన అర్థసహితంగా, దృష్టాంతయుక్తంగా నీకు అది చెప్పటానికి ప్రయత్నిస్తాను. ఇది అనేక సంశయాలను నివారించగలదు. శ్రోతల హృదయాలలో వ్యాపించి కలకాలం ఉండగలదని అభిలాష.

---

*ఆదిసృష్టి : సర్వదా శుద్ధతత్త్వమే అయిఉన్న చైతన్యము "బాహ్యమునకు సంబంధించిన అనుభవం పొందెదను గాక" అను భావన పొందుట 'ఆదిసృష్టి' గా చెప్పబడినది.

శాస్త్రవిధిని అనుసరించకుండా, దృష్టాంతాలు లేకుండా, కఠినపదజాలంతో ఎంత గొప్పవిషయం చెప్పినా శ్రోతలు ఆనందించలేరు కదా! కథలు, దృష్టాంతాలు మొదలైనదంతా శ్రోతల అభిరుచిని దృష్టిలో పెట్టుకునే మేము చెప్పుచున్నాం సుమా!

❖❖❖

# 2. వేరు వేరు బ్రహ్మాండములు

ఓ ప్రియరామచంద్రా! భగవంతుడగు మత్పిత్రుదేవులు బ్రహ్మదేవుడు - ఈ ఐందవులకు సంబంధించిన ఒకానొక కథన చమత్కారమును నాకు, మన ఈ విశ్వామిత్ర మహర్షికి-ఒకప్పుడు చెప్పియున్నారు. ఇందు "ఈ జగత్తు మనోమాత్రమే" అని నిరూపించబడింది. శ్రద్ధగా విను.

❖

సర్వాంతర్యామి, పరమానందస్వరూపుడు అగు నా తండ్రి బ్రహ్మదేవుని నేను ఒక సందర్భంలో ఇట్లు ప్రశ్నించటం జరిగింది- "తండ్రీ! ఈ సృష్టులన్నీ ఎట్లా కలుగుచున్నాయి? ఈ సృష్టిరూపమున కనిపిస్తున్నదంతా వాస్తవానికి ఏదైఉన్నది? ఎక్కడినుండి ప్రాప్తిస్తోంది.?"

**శ్రీ బ్రహ్మదేవుడు :** పుత్రా! వసిష్ఠా! ఒక తటాకంలోని జలంలో విచిత్రమైన ఆవర్తములు (Circles) ఏర్పడుతూ ఉంటాయి. అవన్నీ జలముయొక్క రూపములే కదా! ఈ మనస్సు మహత్తరమైన కల్పనాశక్తి కలిగి ఉంటోంది. అదే ఇట్లు జగత్తు రూపమున స్ఫురిస్తోంది. ఈ ప్రశ్న వింటున్నప్పుడు నాకు ఒకప్పటి చమత్కారమైన సంఘటన ఒకటి గుర్తుకు వస్తోంది. చెపుతాను, విను.

❖

**శ్రీబ్రహ్మదేవుడు :** అద్వితీయుడనగు నేను ఒకానొక కల్పాంతములో జగత్తునంతా యథారీతి ఉపసంహారం చేశాను. ఏకాగ్రమనస్కుడనయ్యాను. స్వస్థచిత్తుడనై, ఆ కల్పముయొక్క రాత్రి అంతా ప్రశాంతముగా విశ్రమించాను. తెల్లవారింది యథాప్రకారంగా సంధ్యావందనాదులు ముగించాను. ఇక కల్పప్రారంభసూచకంగా ప్రజలను సృష్టించుటకు ఉద్యుక్తుడనై తలెత్తి ఆకాశమువైపు పరికించి చూచాను. ఆ ఆకాశంలో అంధకారముగాని, ప్రకాశముగాని లేవు. అంతములేనట్టి ఆ ఆకాశం శూన్యమే అయి ఉన్నది. అట్లా కొద్ది క్షణములు పరికించి చూస్తూ ఉండగా, ఆ ఆకాశంలో ఎక్కడో నా మనోనేత్రానికి వేరువేరు సృష్టులు కనిపించాయి. ఆ సృష్టులన్నీ కూడా ఎట్టి ప్రతిబంధకములు లేకుండా, చక్కగా వ్యవస్థితమైయున్నట్లు గమనించాను. ప్రతి ఒక్క సృష్టిలోను ఒక్కొక్క బ్రహ్మ ఉండటం గమనించాను. వారందరు నా ప్రతిబింబమువలెనే ఉన్నారు. ప్రతిసృష్టి యందు స్వర్గ-మర్త్య -పాతాళ లోకములు ఉన్నాయి. కాలచక్రము, ఋతువులు, పృథ్వి, ఊర్ధ్వ-అథో లోకములు, స్వర్గ-నరకములను ప్రాప్తింపజేయగల శుభ-అశుభ ఆచారములు, వేద-ఇతిహాస, పురాణములు, ఉపనిషత్తులవంటి విచారణ గ్రంథములు ప్రవర్తిస్తున్నాయి. ప్రతి సృష్టి ప్రకాశ-అంధకారములతో, నక్షత్రమండలములతో, సముద్రములతో, పర్వతములతో - మనోహరంగా కనిపిస్తోంది. ఆ

బ్రహ్మాండములలో వేరువేరుగా దేవతలు, మనుష్యులు, నాగులు, గంధర్వులు.... వారివారి లోకములలో వెలయుచుండటం చూచాను. యుగములు, కల్పములు, క్షణములు, నిమిషములు, పదార్థముల ఉత్పత్తి-స్థితి-ఉపశమనములు.... ఇవన్నీ కొంతసేపు గమనించాను. నా మనో నేత్రమునకు కనిపించిన ఆ పది బ్రహ్మాండములను చూచి చాలా ఆశ్చర్య చకితుడనయ్యాను.

"ఇది ఏమిటి? ఈ బ్రహ్మాండములన్నీ ఎట్లా ఉత్పన్నమైనాయి? నా మనోనేత్రములకు ప్రత్యక్షమై కనిపిస్తున్న ఈ సృష్టులు ఇక్కడికి ఎలా వచ్చాయి?".... నాలో నేను ఎంత తర్కించుకున్నప్పటికీ ఆ సృష్టుల వ్యవహారమేమిటో నాకు బోధపడనేలేదు.

అప్పుడు నాకు ఆకాశంలో ఒకానొక బ్రహ్మాండంలో ఒక సూర్యుడు తారసపడ్డాడు. వెంటనే, నేను అతనిని ఎలుగెత్తి పిలిచాను. "ఓ సూర్యభగవానుడా! ఇటు రావయ్యా! నీవెవరు? నిన్ను సృష్టించింది ఎవరు? నేను ఇంతవరకు 'కల్పాంత నిద్ర' పోయి, ఇప్పుడే నిదుర లేచానే! ఈ జగత్తులన్నీ ఎట్లా ఉత్పన్నమైయున్నాయి? ఈ విషయం నీకు తెలుసా? నిన్ను ఎవరు సృష్టించారు? నీకు తెలిస్తే తెలిసినదంతా చెప్పు!" అన్నాను.

**సూర్యుడు :** "హే బ్రహ్మదేవా! ఈ దృశ్యప్రపంచమునకంతటికీ సర్వదా కారణరూపులు మీరే కదా! దీనిని మీరే ఎరుగక పోవటమేమిటి? సర్వవ్యాపియగు ఓ మహాత్మా! పితామహా! నన్ను అడిగి, నా వలన ఆ బ్రహ్మాండముల విషయం విని వినోదాన్ని పొందుదామనుకొంటున్నారా? సరే. ఇది కూడా సంతోషమే. విచిత్రమైన నా యొక్క ఉత్పత్తి గురించి చెప్పుచున్నాను. వినండి.

హే పరమాత్మా! 'మాయాశక్తి' యే నిరంతరం ఈ జగన్నిర్మాణమంతా చేసుకొంటూ పోతోంది. తత్త్వజ్ఞానము యొక్క అభావము (లేక) 'మరుపు' కారణంగా ఆ మాయాశక్తిచే ప్రకటించబడునవన్నీ 'సత్యము'గా తోచటం జరుగుతోంది. ఒక్కసారి ప్రబోధం పొందటం జరిగిందా.... ఇక ఆ తరువాత ఇదంతా అసత్యముగానే తెలియవస్తోంది. ఇట్లు ఈ మాయ 'సత్-అసత్' రూపమైయుండి, దేశ-కాలాదులతో కూడుకొన్నదై, పరిచ్ఛిన్నత్వము సంతరించుకొని విజృంభిస్తోంది. అయితే ఇదంతా మనోవిలాసమాత్రమేనని తత్త్వజ్ఞులైనట్టి మీకు వేరుగా చెప్పేదేమున్నది? సర్వము ఎరిగియున్నట్టి మీకు 'మాయ-మనస్సు' ల విలాసం గుర్తుచేస్తూ, ఇక ఐందవులకథ వినిపిస్తున్నాను.

❖

కైలాసపర్వతపు క్రింద భాగంలోగల జంబూద్వీపంలో 'సువర్ణజట' అనే ఒక ప్రదేశం ఉన్నది. మీ కుమారులగు మరీచి మొదలైనవారి నివాసం అక్కడేకదా! అచ్చట 'ఇందువు' అనే ఒక గృహస్థుడు నివసిస్తూ ఉండేవాడు. అతడు కశ్యపుని వంశమునకు సంబంధించినవాడు. గొప్ప ధర్మాత్ముడు. బ్రహ్మజ్ఞాని. ఎల్లప్పుడు, బ్రహ్మనిష్ఠులగు సాధు - సత్పుంగవులతో సాంగత్యము కలిగి ఉండేవాడు.

అతనికి చాలాకాలం వరకు సంతానం కలగలేదు. అందుచేత భార్యతోసహా, కైలాసపర్వత సమీపంలో గల ఒక నిర్మానుష్యప్రదేశం చేరి, అక్కడ జలము మాత్రమే తీసుకొంటూ ఘోరతపస్సు ప్రారంభించాడు. చాలాకాలం గడచిన తరువాత ఒకరోజు కైలాసనాథుడగు పరమేశ్వరుడు

పార్వతీసమేతుడై ప్రత్యక్షమయ్యాడు. ఋషభారూఢులై వేంచేసియున్న ఆ ఆదిదంపతులను ఇందువు, అతనిభార్య భక్తిరసపూరితమైన స్తోత్రాదులతో పూజించారు.

**ఇందువు :** దేవేశా! భగవానుడా! పార్వతీనాథా! మీ దర్శనముచే మా జన్మలు సార్థకమయ్యాయి. మాపై కరుణతో గొప్ప తెలివితేటలు, ధారణాసామర్థ్యము, మేథస్సు గల పదిమంది కుమారులను ప్రసాదించమని వేడుకొంటున్నాను. అనుగ్రహించండి.

**పరమేశ్వరుడు :** "అట్లే అగునుగాక" అని వరమును ప్రసాదించి సపరివారంగా అంతర్ధానమయ్యాడు.

ఇందువు భార్యాసమేతంగా సంతోషంగా నిజాశ్రమం చేరాడు. వారికి కాలక్రమంగా మహాతేజః సంపన్నులు, సౌందర్యవంతులు అయిన పదిమంది పుత్రులు కలిగారు. వారంతా ఏడు సంవత్సరముల ప్రాయమునకే సర్వశాస్త్రములు అభ్యసించారు.

చాలాకాలం గడచిపోయింది. కాలక్రమంగా ఇందువు, అతనిభార్య తమ తనువులను చాలించి విదేహముక్తులు అయ్యారు. ఆ పదుగురు ఐందవులకు అక్కడ బంధువులెవ్వరూ లేరు. వారు తలితండ్రుల వియోగంచే ఖిన్నులై, ఆ ఆశ్రమంలో ఉండలేక అక్కడినుండి బయలుదేరారు. కైలాస పర్వతశిఖరంచేరి, అక్కడ ఒకచోట కొంతసేదతీరుటకై బసచేశారు. ప్రయాణపు బడలిక తీరినతరువాత, ఒకచోట అందరు సమావేశమై, ఇట్లు సంభాషించుకోసాగారు.

## సమావేశం – సమాలోచన

**జ్యేష్ఠసోదరుడు :** తమ్ములారా! మన తల్లితండ్రులు మనను విడచి విదేహముక్తులయ్యారు. ఇక వారల గురించి శోకించడం అనవసరం, అప్రస్తుతం, అర్థరహితం కూడా. వారు మనకు ఈ మానవదేహములను ప్రసాదించి మహోపకారం చేశారు. ఈ మానవజన్మ ఒక మహత్తరమైన అవకాశంగా మనకు శాస్త్రాలు బోధిస్తున్నాయి. అందుచేత మనం ఇప్పుడు భవిష్యత్తు కొరకు ప్రయత్నశీలురం కావాలి. ప్రయత్నించువాడే ఏదైనా సాధిస్తాడు. ప్రయత్నమే చెయ్యనివారు పొందేదేముంటుంది? చేయకలిగేదేముంటుంది?

అయితే ఇప్పుడు దేనికొరకు ప్రయత్నించాలి? మనకు ఇహ – పరములందు అత్యంత సుఖమును, శ్రేయస్సును చేకూర్చకలిగేది ఏది? కీర్తి, ఐశ్వర్యం, సంతృప్తి, ఆనందాలను సొంతం చేసుకోవాలంటే, ఏది లక్ష్యముగా కలిగియుండి మనం ప్రయత్నించాలి? మన ప్రధాన లక్ష్యము ఏమిటో మీరంతా మీమీ అభిప్రాయములు చెప్పండి. అందరి అభిప్రాయాలు సేకరించిన తరువాత మనమంతా ఒక నిర్ణయానికి వద్దాం. అప్పుడు భవిష్యత్తు కార్యక్రమం నిర్ణయించుకుందాం.

**రెండవ సోదరుడు :** నా దృష్టిలో, ఎవరికైతే మంచి గృహములు, గ్రామములు ఉంటాయో – అట్టివాడు ఐశ్వర్యవంతుడు. మండలాధిపతి అనేక మందిపై పెత్తనం చెలాయించగలడు. కనుక మనమందరం మండలాధిపతులం అయ్యే ఉపాయం యోచించడం మంచిది.

**మూడవ సోదరుడు :** సోదరులారా! మనకు స్వల్పవిషయమైనట్టి 'మండలాధిపతి' ఎందుకు చెప్పండి?

మండలాధిపతులను నియమించేది, పెరికివేసేది రాజులే కదా! రాజే మహదైశ్వర్య సంపన్నుడు. కనుక మనమందరం రాజులం కావటానికి ప్రయత్నిద్దాం.

**నాలుగవ సోదరుడు :** అన్నలారా! తమ్ములారా! దేశాధిపత్యమా? అంతటితో తృప్తి చెందుచున్నారా? అది సరి కానేకాదు. మహద్విభవోపేతుడగు "చక్రవర్తి" అయితే అనేక రాజ్యాలను పరిపాలించ వచ్చును కదా! కాబట్టి మనకు చక్రవర్తి ఐశ్వర్యమే వాంఛనీయం. అందుకొరకే ప్రయత్నశీలురం కావాలని నా అభిప్రాయం.

**ఐదవ సోదరుడు :** కాదు. చక్రవర్తి ఎంత? అతని మహారాజ్యమెంత? మనం మహేంద్రపదవికే ఎందుకు ప్రయత్నించకూడదు?

ఈ విధంగా అనేక తర్జన భర్జనలు జరిగాయి. చివరికి ఆఖరి సోదరుడు లేచాడు.

**ఆఖరి సోదరుడు :** మహేంద్రపదవి అవీ ఇవీ, ఉత్తమమైనవంటున్నారా? ఏమి తెలివి తక్కువ ఆలోచన? ఎందుకంటారా? అది బ్రహ్మదేవుని విభవములు, ఆయుష్షు దృష్ట్యా చూస్తే, స్వల్పమైనదే కదా? బ్రహ్మదేవుని యొక్క కొద్దినిమిషములకాలంలో మహేంద్రుని దీర్ఘమైన ఆయుష్షు సమసి పోతోంది. కాబట్టి కల్పము గడచిపోయినా కూడా నశించనట్టి ఉత్తమపదవి ఏదైనా ఈ లోకంలో ఉన్నదేమోనని యోచన చేస్తే "బ్రహ్మదేవుని పదవి మాత్రమే" అని నాకు అనిపిస్తోంది.

**జ్యేష్ఠ సోదరుడు :** ఓ తమ్ములారా! మీ సమాలోచనలన్నీ విన్నాను. మన ఆఖరి సోదరుడు చెప్పుచున్నట్లు, సమస్త ఐశ్వర్యములలో కెల్లా బ్రహ్మదేవుని పదవే ఉత్తమోత్తమమైన పదవి అని మాకు కూడా అనిపిస్తోంది. కల్పము నశించినా, ఆ పదవి మాత్రం నశించుట లేదు.

❖

మిగతా సోదరులంతా ఈ ఆలోచనను, "మంచిది-మంచిది, బాగున్నది-బాగున్నది"; అని ప్రశంసించారు. అందరూ కలసి "జగత్ పూజ్యుడైన బ్రహ్మదేవుని పదవి మనం పొందవలసిందే" అని తీర్మానించుకున్నారు.

బాగానే ఉన్నది. కాని బ్రహ్మపదవి పొందటం అంటే మాటలేం కాదే! ఎట్లా పొందటం? ఈ ప్రశ్న వారి మనస్సును, అన్ని ఆలోచనలను ఆక్రమించివేసింది. అప్పుడు అత్యంత తేజోసంపన్నుడైనట్టి పెద్ద కుమారుడు దీర్ఘంగా ఆలోచించుకొని, ఆపై ఇట్లు పలుకసాగాడు.

**జ్యేష్ఠ కుమారుడు :** ఓ సహోదరులారా! మీరు విచారించవలసిన పనేమీలేదు. మనం బ్రహ్మదేవుని దివ్యపదము పొందువిషయమై నాకు ఒక గొప్ప ఉపాయం తట్టుచున్నది. మీరంతా దృఢ చిత్తంతో నేను చెప్పేది వినండి.

మనమంతా ఉత్తమమైన 'ఆసనం' స్వీకరించి ఆసీనులమౌదాం.

"సర్వప్రకాశములకు కారణభూతుడై, పరమప్రకాశవంతుడగు బ్రహ్మదేవుడను 'నేనే!' నా శక్తి యొక్క సహాయం చేత నేనే స్వయముగా బ్రహ్మాండమును సృష్టిస్తున్నాను. ఇంతలోనే సంహారం

కూడా చేసివేస్తూ ఉంటాను.” అని భావనచేద్దాం. జీవన పర్యంతము అట్టి ధ్యానము విడువవద్దు. మనం బ్రహ్మపదవి పొందేవరకు అట్లు నిశ్చలంగా ధ్యానం చేస్తూనే ఉందాము. ఓ తమ్ములారా! ఈ శరీరాలు ఎప్పటికైనా శిథిలం కావలసిందేకదా! కనుక, ఈ శరీరము వైపు మనం దృష్టి సారించనేవద్దు. మన దేహముల విషయం కాల క్రమేణా,... “ఏది ఏట్లో– అది అట్లే”... అగుగాక!

మిగతావారందరికి ఆ వాక్యాలు అత్యంత సమంజసంగా కనిపించాయి. వారంతా ఒక చక్కని ప్రశాంతమైన ప్రదేశంలో ప్రవేశించారు. అక్కడ ఆయాస్థానాలలో ఉచితాసనములను ధరించి కూర్చున్నారు. మనస్సుచే, వాక్కుచే, శరీరముచే మౌనం వహిస్తూ ధ్యానపరులయ్యారు. చిత్రంలో లిఖించ బడిన చెట్లయొక్క, ఆకులవలె నిశ్చలత్వం వహించారు. బాహ్యావృత్తులను నిరోధించి, చిత్తమును అంతర్ముఖం చేశారు. ఇక ఆపై ఇట్లు చింతించసాగారు.

❖

“ఇప్పుడు నాకు ఒక వికసించిన, విశాలమైన కమలం గోచరమౌతోంది. ఆ కమలముపై ఆసీనుణ్ణి అయిఉన్నాను. ఈ జగత్తు అంతటికీ స్రష్ట – కర్త – భోక్త కూడా నేనే. నేనే ఈశ్వరుడను. యజ్ఞస్వరూపుడను. జ్ఞానవేత్తలగు మహర్షులంతా నాయందే ఉన్నారు.

శిక్ష, వ్యాకరణము–మొదలైన అంగములు, పురాణములు–మొదలైన ఉపాంగములు, గాయత్రీ యుక్తమైన వేదమంత్రములు, సర్వమానవకోటి.... ఇవన్నీ నాయందే స్థితి కలిగి ఉన్నాయి. లోక పాలకులు, యముడు, సిద్ధులు నివసించే లోకములన్నీ నాయందే ఉన్నాయి. ఉత్తమ స్వరములతో విభూషితమైన స్వర్గలోకము కూడా నాయందే ఉన్నది. అనేక పర్వతములు, ద్వీపములు వనములతో కూడి భూమండలము, నక్షత్రమండలము.... ఇవన్నీ నాయందు నిక్షిప్తమై, ఇదిగో, ఇప్పుడు ప్రకటిత మవుతున్నాయి.

ఆహాఁ! ఈ విశాల ఆకాశము, దేవతాస్త్రీలతో అత్యంత సుందరంగా ఉండే దేవలోకము, దైత్యదానవులతో నిండి ఉండే పాతాళలోకం.... ఇవన్నీ నాయందు ఎంత సహజంగా శోభిస్తున్నాయి! యజ్ఞభోక్త అయినట్టి ఇంద్రుడు నాయందే త్రిలోకనగరములను పాలించుచున్నాడు. అరుగో. పన్నెండు మంది ఆదిత్యులు తమ కిరణములచే దిక్కులను నింపివేస్తూ, పన్నెండు మాసములను తపింపజేయు చున్నారు. గోపబాలుడు గోవులను మేపుతూ ఉంటాడు కదా! అట్లే ఇంద్రుడు, యముడు, కుబేరుడు మొదలైన లోకపాలకులు నియతియుక్తులై, నా అంతరంగములో ఉన్నట్టి తమ తమ లోకములను పాలించుచున్నారు.

జలమునందే తరంగములు ఉత్పన్నమగుచున్నట్లు, నాయందే చమత్కారములైన వివిధ నామ రూపాత్మకమైన వేల వేలాది జీవజాతులు–జీవ ధర్మములు, జీవులు; వారి కొరకై ఆహార–విహారములు ఉత్పన్నములగుచున్నాయి. నశించుచున్నాయి. జీవులంతా ఒకప్పుడు ఐశ్వర్యయుక్తులు అగుచున్నారు. మరొకప్పుడు దారిద్ర్యబాధచే క్రుంగిపోవుచున్నారు. వీరందరి కొరకై తపస్సు–ప్రార్థన–యోగ సాధనాలు ప్రవర్తిస్తున్నాయి.

ఈ సృష్టి అంతా నా చేతనే నిర్మించబడుచున్నది. దీనినంతా మన్వంతరాలుగా మారి పోషిస్తున్నాను. మరల మరొకప్పుడు, నేనే దీనినంతా సంహారం చేస్తూ ఉంటాను. సమస్త లోకములకు ఈశ్వరుడను నేనే. ఏది ఏమైతేనేం? సర్వదా ఆత్మయందే స్థితి కలిగియున్నాను. కనుక పరమ శాంతియే నా స్వరూపము. ఇదిగో, ఇప్పుడు సృష్టికాలం. ఇప్పుడిప్పుడే లయము సంప్రాప్తిస్తోంది. యుగము తరువాత యుగము వస్తోంది. పోతోంది. ఇప్పటికి ఒక బ్రహ్మసంవత్సరము గడచి పోయింది. ఈ రోజుకు ఈ కల్పము గడచిపోయింది. ఇప్పుడు బ్రహ్మరాత్రి గడచుచున్నది. కాబట్టి పూర్ణాత్మ స్వరూపుడను, పరమేశ్వరుడను అయి ఉన్న నేను తదనంతర సృష్టిని కల్పించుచున్నాను.......”

❖

ఆ పదిమంది ఐందవులు ఈ రూపము కలిగినట్టి భావపరంపరలను మనస్సుతో అనుసంధానం చేయసాగారు. కొంతకాలం గడచింది. వారంతా పర్వతమువలె నిశ్చలులయ్యారు. ఒక శిలావిగ్రహం లాగా స్థిరచిత్తంతో ధ్యాన నిమగ్నులయ్యారు. బ్రహ్మదేవుని ధర్మములు చాలా కాలం భావన చేస్తూ ఉండిపోయారు. కొంతకాలానికి వారు మనస్సులోని సర్వదోషములను జయించివేయుటచే, “బ్రహ్మ పదము”ను సమీపించసాగారు. అత్యంతశోభతో కూడుకొన్నవారై చిరకాలం విరాజిల్లుచున్నారు.

హే బ్రహ్మదేవా! ఆ విధంగా ఆ ఐందవులు ఉపాసనా క్రమముచే.... లోకముల యొక్క ప్రాణులయొక్క సృష్టి – స్థితి – సంహారముల గురించి భావించుచు వచ్చారు. అట్లు బ్రహ్మోపాసన యందు నిమగ్నులైయుండగా, ఎప్పుడో వారి భౌతిక శరీరాలు ఎండకు – వానకు – గాలికి సంస్పృశ్య విషయమైయుండే ఒక ఎండుటాకు వలె నేల వ్రాలిపోయాయి. ఇటు అటు – చిందర వందరగా పడియున్న వారి శరీరభాగములను మాంసాహారులైనట్టి అడవి మృగాలు భక్షించాయి. ఇట్లు దేహములు పతనము చెందినతరువాత కూడా వారు “బ్రహ్మభావన” (....నేను సృష్టి కర్తయగు బ్రహ్మను – అను భావన) చేస్తూనే ఉన్నారు. నాలుగు యుగములు గడచిపోయాయి. కల్పక్షయం అయింది. కల్పాంతము వచ్చిపడినది. సూర్యుడు తన తీక్ష్ణ కిరణములచే లోకములను ధ్వంసం చేయటం ప్రారంభించాడు. ప్రళయమేఘములు, కల్పాంతవాయువులు అనేక ప్రాణికోట్లను నేల కూల్చివేశాయి. జగత్తంతా జలమయమైపోయింది. ఇంత తతంగం జరుగుచున్నప్పటికీ, ఆ ఐందవులు మాత్రం, శరీరరహితులై, అట్లే సూక్ష్మ శరీరముతో కూడి ధ్యానమునందు నిమగ్నులై ఉండి ఉన్నారు.

వారంతా ఆ విధంగా సుఖంగా “నేను బ్రహ్మదేవుడను. సర్వము సృష్టిస్తున్నాను” అను రూపము గల ధ్యానములో నిమగ్నమైయున్నారు కదా! “అహం బ్రహ్మదేవాస్మి” అను నిష్ఠను వారు వీడలేదు. కాలక్రమంగా వారు పదిమంది బ్రహ్మలు అయినారు. వారిచే సంకల్పించబడిన పది బ్రహ్మాండములు వారి చిత్తాకాశమునందే ప్రతిష్ఠితమైయున్నాయి.

అట్టి పదిబ్రహ్మాండములలో, ఒకానొక బ్రహ్మాండమునందు నేను సూర్యుని రూపము ధరించినవాడనై ప్రవర్తిస్తున్నాను. రాత్రి – పగళ్ళను, తదితర వస్తుజాలమును అత్యంత అకర్తృత్వము వహించి నిర్వర్తించుచున్నాను. ఆకాశములో సంచరిస్తూ, కాల – కర్మ విభాగములను నిర్మించు స్వభావముచే నియమించబడి ఉన్నాను.

శుద్ధ చిత్తముతో కూడుకొన్న మనోనేత్రములతో మీరు చూచిన ఆ పది బ్రహ్మాండములు ఎట్లా సృష్టించబడ్డాయో వివరించి చెప్పాను. ఇక మీకేది ఉచితమని తోస్తే, అట్లే నిర్వర్తించండి. హే ప్రభూ! మీకు తెలియనిదేమున్నది! ఈ దృశ్యము వివిధ కల్పనలచే.... బంధహేతువై మోహదాయకమే అగుచున్నది. జీవునకు సంభవిస్తున్న బాహ్య – అభ్యంతర ఇంద్రియతాదాత్మ్యమే ఇందుకు దృష్టాంతము. కాని, ఈ దృశ్యమంతా చిత్తభ్రాంతి మాత్రమే. ఇదంతా యథార్థమైనది కానేకాదు. ఎందుకంటే, ఇందులో మార్పుచెందని దంటూ ఎక్కడా ఏదీ లేనేలేదు కదా!

❖

పుత్రా! వసిష్ఠా! అదంతా విని నేను చాలా ఆశ్చర్యపడ్డాను. చాలా సేపు నా యందు ఎంతో తర్జన – భర్జనలు జరిగాయి. అప్పుడు నేను ఆ సూర్యభగవానునితో ఇట్లా అన్నాను.

**నేను (బ్రహ్మదేవుడు) :** ఓ భాస్కరా! ఆ ఐందవులు తమయొక్క దృఢసంకల్పమాత్రంచేత తమ చిత్తాకాశంలో ఈ బ్రహ్మాండములన్నీ సృష్టించి, దర్శించుచున్నారు కదా! ఇక నేనేం చెయ్యాలి? క్రొత్తగా సృష్టి చేయుటచే ఒరిగే ప్రయోజనమేమున్నది? కాబట్టి, నా ధర్మము అయినట్టి "సృష్టించటం" అనే కార్యక్రమం ఆపివేయాలా? మౌనం వహించి ఉండాలా? లేక, ముందుగా వీరి సృష్టి లేకుండా చేయాలా? ఇప్పుడు నా కర్తవ్యమేమిటి? నాకేం పాలుపోవటంలేదు.

**శ్రీసూర్య భగవానుడు:** ఓ బ్రహ్మదేవా! జనులు కర్మలు ఎందుకు నిర్వర్తిస్తున్నారు. ....కొందరు, 'భవిష్యత్తులో ఏదో పొందాలి' అనే ఆశచే ... ఇంకొందరు, 'దైవ లిఖితం' అని అనుకుంటూ, ... మరి కొందరు, 'దోష నివారణకై' అని భావించి, ... వేరేకొందరు, 'నా వారికొరకై' అని అనుకుంటూ, ... ఇంకా కొందరు, 'తప్పదు కదా' అని అనుకుంటూ ఆయా కర్మలు చేస్తున్నారు.

అయితే, మీరు సంకల్ప వర్జితులు, సర్వసంకల్పములకు ఆవల ఉన్నట్టి నిర్మల స్వరూపులు, ఇచ్ఛారహితులు కదా! అట్టి మీరు ఏదైనా ప్రయోజనం ఆశించి ఈ సృష్టి కార్యమును నిర్వర్తిస్తున్నారా? లేదుకదా! ఓ జగన్నాథా! బాలుడు ఏమీ కోరకుండానే ఆడుట, పాడుట చేస్తున్నట్లు మీరుకూడా ఈ విధిని క్రీడాపూర్వకంగా నిర్వర్తిస్తున్నారు. ఈ సృష్టి అంతా ఒక 'లీల' యే కాని, మరింకేమీ కాదు. అట్లే అగ్నిగోళస్వరూపము ధరించినట్టి సూర్యుడనగునేను కూడా, – ఎట్టి ఇచ్ఛ లేకుండానే – నిశ్చల–నిర్మల జలంలో ప్రతిబింబిస్తున్నాను. నిష్కాముడగు మీచే ఈ జగత్తు యొక్క ఉత్పత్తి సంభవిస్తోంది. మరి నేనో, కోరకుండానే నా ఎదురుగా నడచివెళ్ళుచున్న మానవుని యొక్క నీడ ఏర్పడుటకు కారకుడనగుచున్నాను.

విజ్ఞానమే స్వరూపముగా కలిగియున్నట్టి మీకు దేహాభిమానమేమిటి? ద్వంద్వములెక్కడ? మీరు అహంభావరహితులు. 'నేను – నాది' ....అను భావావేశం లేనివారు. అందుచేత మీ వంటి వారు దేనిని వాంఛించరు. త్యజించరు. ఇచ్ఛాద్వేషములు లేకుండానే, నేను, రాత్రింబవళ్ళను నిర్మిస్తూ పోతున్నట్లు మీరుకూడా "ఇది ప్రాప్తించుగాక! ఇది తొలగుగాక" అను రూపము గల ప్రాప్తాప్రాప్తములకు సంబంధించిన దృష్టిని ఆశ్రయించ కుండానే సృష్టిస్తున్నారు; మరల

పరిపోషిస్తున్నారు. ఇట్టే సంహరిస్తున్నారు. సత్యద్రష్టలగు జ్ఞానుల అభిప్రాయం ప్రకారం ఇదంతా మీయొక్క విలాసం మాత్రమే.

ఇంతకాలంగా మీరు "ఇది నా కర్తవ్యము" అని తలచి, ఆసక్తిరహితంగా నిత్యము చేస్తూవస్తున్నట్లే, ఇప్పుడు కూడా ఎట్టి స్వార్థము లేకుండా పరమార్థ భావనతో యథారీతిగా చేస్తూ ఉండటమే ఉచితం. ఒకవేళ యథాప్రాప్తములైన కర్మలను త్యజించి, ఈ 'సృష్టించడం' అనేది మానివేశారనుకుందాం. అప్పుడు మాత్రం మీరు పొందే అపూర్వవస్తువు ఏమున్నది చెప్పండి? ఒక దర్పణము దేనిని వాంఛించకుండానే, దేనిపట్లకూడా ఇచ్ఛాద్వేషములు లేకుండానే, ఎదురుగా ఉన్నదంతా "తనయందు ప్రతిబింబింపజేయుట" అను క్రియా వ్యవహారం సల్పుచున్నది కదా! అదేవిధంగా సత్పురుషులు కూడా "ఇది నాకు ప్రాప్తించాలి" లేక, "ఇది మరోవిధంగా ఉండాలి" వంటి కల్పనకు, వాంఛకు తావు ఇవ్వకుండానే ఎల్లప్పుడు తమకు ప్రాప్తించిన కర్మలను నిర్వర్తిస్తున్నారు. ఆత్మజ్ఞానులకు "అయ్యో! మేము అది చేయలేదే?" అను రూపముగల అప్రాప్తములైన కర్మలను మననం చేయాలని ఏమాత్రం కోర్కె ఉండదు. అజ్ఞానులు, మాయామోహితులు మాత్రమే తమకు ప్రాప్తించిన కర్మలయందు దృష్టి ఉంచక, అప్రాప్తములైన వాటి గురించి యోచించుచూ, "వారి పనులు మాకు ఇచ్చి ఉంటే ఎంత బాగు!" అని ఆవేదన చెందుతూ ఉంటారు. వారంతా కర్మహస్యం ఎరుగనివారే అగుచున్నారు. జ్ఞానులకు, తమకు ప్రాప్తములైన కర్మలను త్యజించాలనే పట్టుదలగాని, అంటిపెట్టుకొని ఉండాలనే ఇచ్ఛ–ఉబలాటములు గాని ఉండవు.

❖

కాబట్టి, ఓ బ్రహ్మదేవా! "వాస్తవానికి నేనేమీ చేయుటలేదు" అను అనుభవమునే జ్ఞానులు కలిగి ఉంటున్నారు. మీరుకూడా కర్మను నిర్వర్తిస్తున్న సమయమందు **"నాహంకర్తా నైవకించిత్ కరోమి"** – నేను కర్తను కాదు. నేనేమీ చేయుటలేదు... అనురూపముగల మౌనము లేక సుషుప్తి వంటి భావన వహించటమే ఉచితం. ఎవ్వడైనా ఎప్పుడైనా ఆసక్తితో కూడుకొన్నవాడై ఏదైనా చేస్తే మాత్రమే ... అట్టి కర్మయొక్క కర్తృత్వము, వాటి ఫలితముల భోక్తృత్వము సంప్రాప్తిస్తుంది. కర్తృత్వ –భోక్తృత్వ భావములు ఉన్నచోట మాత్రమే, సుఖ దుఃఖానుభవములు దీర్ఘమైన ప్రభావం కలిగి ఉంటున్నాయి. 'నాహంకర్తా' అనునట్టి భావన కలవానికి కర్మ ఎక్కడ? ఫలితమెక్కడ? ఒకవేళ ఏ సమయమందైనా కర్మ ప్రతీతి ('నేను చేయవలసి వచ్చుచున్నదే?' అను భావన) కలిగినా కూడా – "ఆఁ! ఇదంతా స్వప్నమాత్రమే కదా!" అని తలచుచు, నిష్కాములమై, ప్రాప్తించిన కార్యములను నిర్వర్తించటమే ఉచితమని నా అభిప్రాయం. జన్మలు ఏర్పడుచూ ఉండగా కూడా జన్మ రాహిత్యం ఆస్వాదించటం మోక్షస్వరూపుని అంతిమ లక్షణం కదా!

ఓ దేవా! ఇప్పుడు మీరు ఐందవుల సృష్టిని చూచి కొంత ఆశ్చర్యమును, కొంత వినోదమును పొందియున్నారు కదా! మీ సృష్టి తదితరులకు వినోదకరంగా, సంతోషం ప్రసాదించేదిగా ఉంటూ ఉంటుంది. అందుచేత, మీ కర్తవ్యమై ఉన్నట్టి సృష్టిని తదితరుల వినోదము, ఉల్లాసముల కొరకై నిర్వర్తిస్తూనే ఉండండి.

ఇప్పుడు మీరు ఆ ఐందవులు సృష్టించిన సృష్టులను మనోనేత్రములచే మాత్రమే దర్శిస్తున్నారు. చర్మచక్షువులచే చూడలేరు. అన్యులచే గావించబడిన సృష్టులను మనం మనోనేత్రములచే మాత్రమే చూడగలం. కాని, సృష్టికర్త తాను సృష్టించినదానిని మాత్రం అవశ్యం తన చర్మచక్షువులచే చూడగలుగుతాడు. ఒకడు ఒక వస్తువుపట్లగాని, వ్యక్తిపట్లగాని ఏర్పరచుకొన్న ప్రియత్వము, అట్టి ప్రియత్వ కారణంగా కనిపిస్తున్న అందచందాలు అతనికే ఆ విధంగా తెలియవస్తాయికాని, ఇతరులకు కాదుకదా! అట్లే సృష్టికర్త మాత్రమే "దీనిని నేను సృష్టించితిని" అని ఎరుగగలడు.

మరొక్క విషయం. ఈ పది బ్రహ్మాండములు ఆ ఐందవులయొక్క దృఢచిత్తముచే ప్రతిష్ఠితములై, సృష్టించబడ్డాయి. బ్రహ్మాండములను గాని, వీటిని సృష్టించినట్టి ఐందవులను గాని ఎవ్వరూ నశింపజేయలేరు. ఎందుచేతనంటారా? మనమెవ్వరమైనా ఒకని కర్మేంద్రియములచే చేయబడిన కార్యం నిరోధించగలం కాని, మనోనిశ్చయముచే చేయబడే కార్యము నిరోధించటమెట్లా? ఇక్కడ చమత్కారమేమంటే .... ఎవని చిత్తమునందు ఏది దృఢంగా నిశ్చితమై ఉంటుందో – అద్దానిని అతడే తొలగించుకోవాలి. అంతేగాని, మరెవ్వరు దానిని తొలగించజాలరు. అసలు ఒక వ్యక్తియొక్క మనస్సులో ఒక దృఢనిశ్చయం ఎట్లా ఏర్పడుతుంది చెప్పండి? బహుకాలంగా మనస్సునందు ఆ నిశ్చయమునకు సంబంధించిన సంకల్పములను అత్యంత ప్రియంగా, తీవ్రేచ్ఛతో అభ్యసించటంచేతనే కదా! కనుక, అట్లు ఏర్పడిన దృఢనిశ్చయం శాప–వరాదులచేతగాని, దేహపతనము చేతగాని, మరింకే బాహ్యమైన ప్రయత్నంచేతగాని నివారించబడజాలదు. దృఢనిశ్చయమును సంకల్పిస్తున్నట్టి మనస్సు స్వయంగా దానికి వ్యతిరేకమైన సంకల్పములచే ఆ దృఢనిశ్చయమును ఉపసంహరించ వలసిందే. అట్లా ఉపసంహరించబడేవరకు ఆ నిశ్చయం 'అట్లే' ఉంటుంది. ఏదైతే మనస్సులో స్థిరంగా నిశ్చయింపబడుతుందో – ఆ మనుజుడు ఆ నిశ్చయమునకు సంబంధించిన రూపమునే పొందుచున్నాడు కాని, అన్యమైనరూపమును కాదు. ఏది ఏమైతేనేం? రాతిపై నీళ్ళు ఉన్నప్పటికీ, ఆ నీళ్లు ఒక బీజము అంకురించటానికి సహాయం చెయ్యలేవు కదా! ఈ సంసారదుఃఖం ఉపశమించాలంటే – ఒక్క ఆత్మబోధ తప్ప తక్కినవన్నీ నిష్ప్రయోజనములే.

❖

ఈ జగత్తులన్నీ సృష్టించుచున్నది 'మనస్సే' కదా! మనస్సే పరమపురుషుడు. ఈ ప్రపంచంలో ఎవ్వరు, ఎప్పుడు, ఏది, ఎక్కడైనా పొందుచున్నా అదంతా మనస్సుద్వారానేగాని, శరీరంచేత ఏ మాత్రం కాదు. ఈ మనస్సుయొక్క సామర్థ్యమేమిటో ఇప్పుడే ఈ ఐందవుల బ్రహ్మదేవత్వంలో చూచాము కదా! వారు కొంతకాలం క్రితం సామాన్యమైన మానవులై ఉండి, మనస్సు యొక్క దృఢ భావనచే బ్రహ్మపదమును పొందగలిగారు. ఈ జీవుడుకూడా మనస్సుయొక్క భావనను, ఆశ్రయించు స్వభావమును అనుసరించే ఆయా దేహములను పొందుచున్నాడు. ఒకనికి "నేను దేహమును" అనే భావనయే లేదని అనుకొందాం....అప్పుడు అతడు ఈ దేహముయొక్క ధర్మములైనట్టి జనన–మరణములచే కూడా బాధింపబడజాలడు. బాహ్యదృష్టి మరియు శరీరదృష్టి కలవానికి

మాత్రమే ఈ సుఖదుఃఖాది అనుభవములు ఉంటున్నాయి. కనుక, ఈ ప్రపంచములోని అనుభవము లన్నిటికీ కారణం మనస్సే. "(కృత్రిమ)ఇంద్రుడు–అహల్య"ల వృత్తాంతమే ఇందుకు మనకు తార్కాణం.

బాహ్యదృష్టి : బాహ్యమునందు "ఇది ప్రియము - ఇది అప్రియము" అను భావన.

అంతర్దృష్టి : "ఈ శరీరము, ఈ మనో–బుద్ధి–అహంకారాలే నేను" అను పరిమిత భావన.

**బ్రహ్మదేవుడు :** నాయనా! సూర్యుడా! నీ వచనములు చాలా యుక్తియుక్తంగానే ఉన్నాయి. నీవు చెప్పినదంతా అత్యంత సత్యము. నాకు చాలా సంతోషం కలుగజేశాయి. ఇప్పుడు సందర్భానుసారంగా "అహల్య - ఇంద్రుల వృత్తాంతం" అని అన్నావు కదా! వారి వృత్తాంతమేమిటో వినిపించవూ? వారిద్దరి కథ వింటే నా దృష్టి మరికొంత పవిత్రత పొందగలదని భావిస్తున్నాను. అనంత కిరణములచే నిత్యోదితుడవై ఉండే ఓ సూర్యుడా! నీవు చెప్పబోయేది శ్రద్ధగా వింటున్నానయ్యా!

❖❖❖

## 3. ఇంద్ర-అహల్యల ప్రహసనం

**సూర్యభగవానుడు :** పితామహా! మీరు ఆజ్ఞాపించినట్లే చెప్పుచున్నాను వినండి.

పూర్వము 'ఇంద్రద్యుమ్నుడు' అనే మహారాజు మగధదేశమును పరిపాలిస్తూ ఉండేవాడు. "మనరాజు గొప్ప ప్రతిభాశాలి" అని ఆ రాజ్య ప్రజలు చెప్పుకుంటూ ఉండేవారు. అతని భార్య అహల్య. ఆమె అత్యంత సౌందర్యవతి. ఆ పురములోనే 'ఇంద్రుడు' అనే పేరుగల ఒక జారుడు (స్త్రీ లోలుడు) ఉండేవాడు. అతని గురించి ఆ నగరంలో పరిపరి విధములుగా చెప్పుకొంటూ ఉండేవారు.

అంతఃపురములోని చెలికత్తెలు ఆ ఇంద్రునియొక్క (స్త్రీ సాంగత్యములకు సంబంధించిన) విచ్చలవిడి ప్రవర్తన గురించి చెప్పుచున్నప్పుడు రాణి అహల్య నవ్వుకుంటూ వింటూ ఉండేది. ఒకసారి, ఆ అహల్య గౌతముని పత్నియగు అహల్య–ఇంద్రులగురించిన పురాణగాథ వినటం జరిగింది. ఆ కథాప్రసంగమును తనకే అన్వయించుకొని, చంచలము – దుష్టసంకల్పములు గల మనస్సు కలిగియుండుటచే, జారుడగు ఇంద్రునియందు ఆసక్తి కలిగియుండటం ప్రారంభించింది. "ఈ ఇంద్రుడు అనబడేవాడు ఎంత అందంగా ఉంటాడోమరి! లేకపోతే, అంతమంది స్త్రీలను ఆకర్షిస్తాడా! లేదుకదా! అతడు నాయందు ఆసక్తి కలిగి, నన్ను వెతుక్కుంటూ వస్తే ఎంత బాగు! అవును, ఎందుకు రాకూడదు?" అని కుసంకల్పం చేయటం ప్రారంభించింది. చిలవలు – పలవలుగాను, అత్యంత దీర్ఘంగా తలపోయుటచేత కొన్నాళ్ళకు "ఇంద్రుని సాంగత్యము నాకు ఆవశ్యకము" అను భావన ఆమెయందు దృఢతరం కాజొచ్చింది. ఫలితంగా దుఃఖితురాలు అయ్యేది. అక్కడి రాజభోగములు ఆమెకు ఏమాత్రం ప్రీతిగొలిపేవి కావు. తన ఆలోచనలకు తానే 'వివశ' అయి సిగ్గునుకూడా విడచివేసింది. "ఇదిగో! ఇక్కడ ఎవ్వరో నిలబడ్డారు.... ఇతడే ఇంద్రుడు..... అవును. సందేహం లేదు. ఇతడే నా ప్రియుడు.... నా కోసమే వచ్చాడు....." అని చెట్టును, గోడను, స్తంభమును చూచికూడా అరవటం ప్రారంభించింది. ఆ రాణియందు మిక్కిలి స్నేహంగల

ఒక సఖి ఆమెయొక్క దీనావస్థనంతా గమనించింది. "ఓ రాణీ! ఈ పిచ్చి ఏమిటి? ఈ దుఃఖమేమిటి? సరే. ఏడవవద్దు. ఊరుకో. ఎట్లాగైనా సరే, నేను ఆ యువకుడగు ఇంద్రుని నీ వద్దకు తప్పకుండా తీసుకొస్తాను" అని లాలనగా పలికింది. అది విని ఆ రాణి వికసిత నేత్రములతో కొంత ఉపశమనం పొందింది. తన ఇష్టసఖి పాదాలపై వ్రాలి మరల మరల దీనంగా వేడుకొన్నది. మరింకే ఊసు ఎత్తినా, అది ఆమె చెవికి చేరుటలేదు.

ఎట్లాగైతేనేం... ఆ సఖి 'ఇంద్రుడు' అనబడు యువకుణ్ణి కలుసుకొన్నది. రాణి వృత్తాంత మంతా తెలియజేసింది. ఎట్లాగో..... అతనిని ఒక రహస్య ద్వారం గుండా అంతఃపురంలోకి తీసుకొచ్చింది. ఆ రాత్రి అహల్య ఒక రహస్య ప్రదేశంలో ఇంద్రునితో పొందు అనుభవించింది. ఆ విధంగా ఆ రాణి ఒక సామాన్యయువకునికి వశమైపోయింది. అతనియందు ఆసక్తిచే, "ప్రపంచమంతా అతనితోడిదే! అతని తరువాతే ఇక ఏదైనా సరే!" అను రూపం గల తన్మయత పొందసాగింది.

ఆ విధంగా అనేక రోజులు గడచిపోతున్నాయి. అతనియందు వ్యామోహము ఎప్పటికప్పుడు అధికమగుచు ఉండేది. అతడు కూడా ఆమె పట్ల అత్యంత ప్రేమ కలిగి ఉండేవాడు. అతనిపై గల వ్యామోహంచేత అహల్య ఉత్తమగుణములుగల తన భర్త ఇంద్రద్యుమ్నుని కూడా అల్పునిగా తలచుచూ ఉండేది. ఇంద్రుని గురించి తలచుకొనుచున్నప్పుడెల్లా ఆమె ముఖము ఎంతో సంతోషంతో వికసిస్తూ ఉండేది. ఇక ఇంద్రుడు కూడా ఆమెయందు ఆసక్తి కలవాడై, ఆమె వియోగమును ఒక్కక్షణమైనా సహించలేకపోయేవాడు. కొన్నాళ్ళకు, అతిసంతాపకరము, జుగుప్సాకరము, అధర్మప్రవృత్తి రూపము అయినట్టి వారిరువురి దృఢప్రేమబంధము రాజుయొక్క దృష్టిలోకి వచ్చింది. అప్పుడు 'జ్ఞానము-తితిక్ష' మూర్తీభవించిన ఆ ఇంద్రద్యుమ్నుడు "వీరిద్దరి పరస్పర ప్రేమ సాంఘిక విరుద్ధంకదా! కాబట్టి వీరిద్దరిని తగినరీతిగా శిక్షించక తప్పదు. అది నా రాజధర్మమై యున్నది. తద్ద్వారా ఇట్టి నీచ ప్రవర్తనము నుండి వీరిని విరమింపజేస్తాను" అని తలచాడు.

అది శీతకాలం. వారిద్దరిని రాజు సభకు పిలిపించి, గట్టిగా మందలించాడు. భయపెట్టాడు. కాని ఏం లాభం? వాళ్ళు మాత్రం "ఏది ఏమైనాకానీ, మేము మాత్రం ఇంతే. మా ఇద్దరికీ ఒకరి కొకరు కావాలి" అని మూర్ఖంగా మాట్లాడసాగారు. ఇక చేసేదేముంది? రాజశాసనమును అనుసరించి, వారిని సంస్కరించే ఉద్దేశంతో "ఇంద్రియములను బిగదీసివేయు చలి వాతావరణంలో వీరిద్దరు నాలుగు రోజులు కట్టివేయబడుదురుగాక" అని న్యాయవేత్తలచే నిర్ణయించబడింది. భటులు వారిని చల్లని నీటిలో నాలుగు రోజులు ఉంచారు. వారిలో ఏమాత్రం పరివర్తనలేదు. పైగా మామూలు వాళ్లెవరైనా రెండో రోజుకో, మూడో రోజుకో ఆర్తనాదాలు చేసేవారే! వారిద్దరికి కించిత్ కూడా బాధ గాని, దుఃఖము గాని కలుగలేదు. ఒకరితో మరొకరు సంభాషించుకొంటూ సంతోషముతో ఉండి ఉన్నారు. వారి పట్ల ఆ శిక్ష నిష్ప్రయోజనమే అయింది. ఆ వార్తను భటులు రాజుకు నివేదించారు. అప్పుడు ఇంద్రద్యుమ్న మహారాజు కొంత ఆశ్చర్యపడి, వారిద్దరిని సమీపించి "ఓ దుష్టజీవులారా! మేము విధించిన శిక్షచే ఏమాత్రం బాధ ప్రకటించనేలేదని, ఆ శిక్షచే మీరిద్దరు ఆనందమే

పొందుచున్నారని, ఈ భటులు చెప్పారు. నిజమేనా? ఎందుచేత?" అని ప్రశ్నించాడు. అప్పుడే నీటి నుండి బయటకు తేబడిన ఆ ఇద్దరు రాజుతో "ఓ రాజా! మీరు విన్నది నిజమే. మేమిద్దరం శిక్షా సమయంలో కూడా ఒకరినొకరం స్మరించుకొంటున్నాం. దృఢప్రేమబద్ధులమై యున్నాము. అందుచేత మాకు దేహస్మృతియే లేదు. దేహస్మృతి లేనివానికి చలి ఏమి చేస్తుంది? మా మనఃసంబంధం అత్యంత దృఢమైనదవటంచేత, మీ భటులచే బాధించబడినప్పటికీ మేము ఆనందంగానే ఉన్నాము. ఈ అవయవములు ఛేదించబడతాయంటే, అందుకుకూడా మేము సిద్ధమే. మేము మా ప్రేమ సంబంధబలం చేత సంతుష్టులంగానే ఉంటాము."

అంతావిన్న రాజుకు చాలా కోపంవచ్చింది. "ఓ భటులారా! వీరిని అగ్నిచే కుత-కుత ఉడికి పోతున్న గదిలోకి త్రోయించండి. రెండు రోజుల వరకు వీరిని పలకరించనే వద్దు. అరిచి గీపెడుతున్నా సరే, మీరు జాలి చూపవద్దు. ఈ లోగా మరణించారా, సరే. రేc!, లేదా, రెండు రోజుల తరువాత వీళ్ళని నా దగ్గరకు తీసుకురండి, అప్పుడు చూద్దాం....." అని ఆజ్ఞాపించాడు. అచటకూడా వారు ఏ మాత్రం ఖేదం చెందలేదు. ఒకరినొకరు తలచుకొంటూ ప్రసన్నులైయున్నారు. అప్పుడు ఏనుగులచే త్రొక్కించబడ్డారు. వారు విషాదమే చెందలేదు. అస్సలు, ఆ త్రొక్కిసలాట వారిని ఏమీ చెయ్యలేక పోయింది. వారిద్దరు మాత్రం అన్నివేళల అన్యోన్య స్మృతిచే హర్షమునే పొందుచున్నారు. అప్పుడు రాజు వారిని కొరడాలచే కొట్టించాడు. అయినప్పటికీ వారిద్దరు ప్రసన్నముగానే ఉండియున్నారు. ఇక వారిని శిక్షించి ప్రయోజనం లేదని గ్రహించిన మహారాజు వారిద్దరిని తన వద్దకు పిలిపించాడు.

❖❖❖

# 4. నేను మనోమాత్రుడను!

**ఇంద్రద్యుమ్నుడు:** ఓ తుచ్ఛబుద్ధులారా! మీ ఇద్దరినీ సంస్కరించాలని ప్రయత్నించాం. ఇంత జరిగినప్పటికీ, మీరు ఇంకా సుఖసంతోషములతో ఎట్లా ఉంటున్నారో--- నాకు కాస్త చెపుతారా?

**ఇంద్రుడు :** ఓ రాజా! నాకీజగత్తు అంతా అహల్యామయంగానే కనిపిస్తున్నది. నాయొక్క 'ప్రేమ' కారణంగా కాబోలు - నాకు ఈ ప్రపంచం ఈమె రూపముగానే తోచుచున్నది. ఈమెకు కూడా సర్వదా నా రూపమే గోచరిస్తోంది. అందుచేతనే, మీరు విధిస్తున్న దండనలన్నీ మాకు బాధకలుగజేయ లేకపోతున్నాయి. మా ఇద్దరికీ ఈ ప్రపంచమంతా ఒకరిరూపంగా మరొకరికి కన్పించుటచేతనే, అగ్నిబాధ, జలస్పర్శ, తాడనము మొదలైనవిగాని, "ఎవ్వరేమనుకొంటారో?" అనే భీతి మొదలైనవిగాని మమ్ములను ఏమీ చేయలేకపోయాయి.

ఓ మహారాజా! ఇంద్రద్యుమ్నా! నేను ఈ శరీరమునా? కాదు. నేను మనోమాత్రుడను. మనస్సే పురుషుడు. ఇక, మీకు కన్పించే ఈ దేహము మనస్సుయొక్క కల్పనాదృష్టికి ఇట్లు కనబడు చున్నదే కదా! అతిశక్తివంతమైన మనస్సును, దానియొక్క స్వకీయమైన (ప్రేమ మొ॥) కల్పనలను మీ పంచభూతపరిమిత దండనలు ఏమీ చెయ్యలేకపోతున్నాయి. ఎంతటి శక్తి కలవారైతే ఏం?

మనస్సుచే నిర్మించబడుచున్న అనుబంధమును, భావకలాపమును ఎట్లా ఛేదించగలరు? ఈ శరీరము వృద్ధి పొందవచ్చు. కాని, మనస్సు మాత్రం... "దృఢభావన" చే ఇష్టములైన, "అనుభూతి" మొదలగు వాటిని ఎప్పటికీ అట్లే ఉంచుకోగలదు. ఈ విషయం మా ఇరువురిపట్ల నిరూపించబడుతోంది కదా! ఈ మనస్సు చాలాకాలం ఒక పదార్థమును వాంఛించుచున్నదనుకోండి..... అప్పుడది దాని యందు సంలగ్నమగుచుండుటచే, ఆ పదార్థాకారమునే పొందుచున్నది. అట్టి దృఢభావము పొందిన 'మనస్సు'ను ఆయా భౌతికమైన ప్రతిబంధకములు తాకనైనా తాకలేవు.

ఓ ప్రియమహారాజా! ఈ మనస్సుకు గల ఒక ముఖ్యమైన లక్షణం గురించి చెపుతాను. వినండి. ఇది తనయొక్క తీవ్ర సంకల్పముచే దేనిని ఎట్లు నిశ్చయిస్తుందో– దానిని అట్లే స్థిరముగా "గాంచుట – పొందుట" చేస్తూ ఉంటుంది. ఇక వరములుగాని, శాపములుగాని, మరింకే బాహ్యమైన ప్రయత్నములుగాని అట్టి తీవ్రసంకల్పయుతమైన మనస్సును నిరోధింపజాలవు. ఒక లేడి పెద్ద బండరాయిని కదల్చగలదా? తీవ్ర అభిలాష కలిగిన మనస్సును తనయొక్క ఇష్టవస్తువు నుండి దృష్టిని మరలింపగలిగిన వారెవ్వరు చెప్పండి?

ఈ అహల్య నా కంటికి చూపువలె, దేవాలయములో వేంచేసియున్న దేవతారూపమువలె – నా మనస్సులో ప్రతిష్ఠితమైయున్నది. మేఘాలుగాని, గ్రీష్మఋతువుగాని, ఒక కొండను బాధించలేవు కదా! నా "జీవహేతువు" అయినట్టి ఈ నా ప్రియురాలిని భావన చేసినంతమాత్రంచేత, తదితర దుఃఖములు ఎన్నైనా భరించుటకు ఓర్పు, శక్తి వచ్చిపడుతున్నాయి. "నేను ఎట్లాగైనా ధనికుణ్ణి కావాలి" అని కోరుకొనువానికి డబ్బు సంపాదించటంలోను, దాచి పెట్టుకోవటంలోను, లోభ వ్యవహారసరళిలోను వచ్చే సాధక–బాధకములన్నీ సుఖప్రదములే అగుచున్నాయి కదా! నా విషయం కూడా అట్టిదే. నేను ఈ వర్తమాన మానసిక స్థితిని అనుసరించి, ఈమె పొందు కొరకు ఏ దుఃఖా నుభవమునైనా పొందటానికి సిద్ధంగా ఉన్నాను. మీరు మా ఇద్దరిని అనేక విధాలుగా భయపెట్టారు. కాని మాకు ఏ క్షణంలోకూడా భయమని అనిపించనేలేదు. నేను ఎక్కడైనా ఉండవచ్చు. లేదా, ఎక్కడైనా పతనం చెందవచ్చు. అచ్చట కూడా నేను నా ప్రియురాలి సమాగమము తప్ప, ఇంకేమీ తలచను...... భావించను. ఓ మహారాజా! మీరు సర్వము తెలిసినవారే. అంతా మనస్సే కదా! నా మనస్సుచేతనే అహల్య నాకు ప్రియురాలు అయినది. ఆమెయొక్క మనస్సుచేతనే సామాన్య పౌరుడనగు నేను ఒక మహారాజ్ఞికి అత్యంత ప్రియుణ్ణి అయ్యాను. దృఢాసక్తి పొందియున్నట్టి మా ఇరువురి మనఃస్వభావములను ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికీ ఎవ్వరూ మార్చలేరు. ధీరులయొక్క చిత్తము దేనియందైనా నిమగ్నమైనదా.... ఇక దాని స్థిరత్వం ఎవరు పాడుచేయగలరు చెప్పండి? ధీరులు కానివారు మాత్రమే కొంతవరకు (ధ్యానము – పూజ – పఠించుట మొదలైన) ప్రయత్నములను ఆశ్రయించి, ఇంతలోనే ఒక చిన్న అడ్డంకి రాగానే వెనుకకు మరలుచూ ఉంటారు. "అట్లు కొనసాగించ లేకపోవటానికి ఫలానా పరిస్థితులు, ఫలానా వ్యక్తులు కారణం" అని వారు తమను తామే మోసం చేసుకొంటూ ఉంటారు.

వర-శాపములచే ఈ భౌతిక శరీరము ఒక రూపమును పోగొట్టుకొని, మరొక రూపం (మరొక శరీరం) పొందితే పొందవచ్చు. అంతేగాని, దృఢచిత్తం మాత్రం తప్పకుండా అన్ని విక్షేపాలను జయించి స్థిరంగా ఉండగలదు. ఇందులో సందేహించవలసిన పనిలేదు. ఒక వేళ విక్షేపం కలిగితే... అందుకు కారణం చిత్తము స్థిరత్వము కలిగియుండక పోవటము మాత్రమే సుమా!

❖

ఈ శరీరము మాత్రం మనస్సునకు ఎప్పటికీ కారణం కాదు. మనస్సే శరీరమునకు కారణమగుచున్నది. లతలలోను, వృక్షములలోను రసము వ్యాపించి ఉంటుంది చూచారా? అట్లాగే మనస్సే శరీరము నందు అంతటా వ్యాపించియున్నది. జీవాత్మకు మనస్సే మొట్టమొదటి శరీరమై ఆయా భోగానుభవములకు హేతువు అవుతోంది. ప్రపంచములోని ప్రాణికోట్ల శరీరములన్నీ మనస్సు చేతనే కల్పించబడుచున్నాయి. మనస్సుచేతనే దర్శించబడుచున్నాయి. స్వీకరించటం - త్యజించటం... అంతా మనస్సుయొక్క వ్యవహార దక్షతయే అయిఉన్నది. "ప్రథమ శరీరము" అని చెప్పబడుచున్న మనస్సునందే "నేను-నేను" అను అభిమానం కూడా ఉదయిస్తోంది. అట్లు ఉదయించుట చేతనే... అట్టి మనస్సుచే భిన్న శరీరములు ఏర్పడుచున్నాయి. ఇన్ని మాటలెందుకు? ఈ జీవత్వమునకు ముఖ్యకారణం (లేక) అంకురం మనస్సే సుమా! దానినుండే ఈ దేహములన్నీ ఏర్పడుచున్నాయి.

ప్రభూ! అంకురం ('మొలచుట' అను స్వభావం) నశిస్తే పుష్పములు కూడా నశిస్తాయి. కాని పుష్పములు నశిస్తే అంకురము నశిస్తుందా? లేదు. అదేవిధంగా, ఈ దేహము నశించినా - మనస్సు ఉంటుంది. కాని, మనస్సు నశించటం జరిగితే, ఇక దేహమెక్కడ?

కనుక అయ్యా! మేమిద్దరం పరస్పరం ప్రేమబద్ధులం. మా గురించి మీరు ఎందుకు వేసటచెందుతారు చెప్పండి? మీ శ్రేష్ఠమగు చిత్తమును పరమ పురుషార్థమునందే నియోగించితే ఈ 'జన్మలు-కర్మలు' అను బంధము నుండి మిమ్ములను మీరు రక్షించుకోగలరు. అట్లుచేసి, బంధము నుండి, విముక్తులు అవటానికే ప్రయత్నించండి. అదే ఉచితం.

ఓ సుబుద్ధీ! చక్రవర్తీ! నేను ఈ అహల్యనే అన్నివైపులా, అంతటా చూస్తున్నాను. నా చిత్తము ఇప్పుడు ఈమె రూపమే అయి ఉండటంచేత ఈమె సాంగత్యం చేత సర్వదా ఆనందము పొందుచున్నది. మీరు ఇప్పటికే అనేక రకాలుగా మమ్ములను హింసించుటకు యత్నించారు. అవన్నీ మీకు, మీ ప్రజలకు దుఃఖములను కలుగజేస్తాయేమోకాని, మాకు మాత్రం కాదు. అందుచేత ఇక మమ్మల్ని మా త్రోవలో పోనివ్వండి. ఇక్కడికి దూరంగా మా ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళిపోతాం.

❖

అంతా విన్న మహారాజు ఎంతో ఉద్రిక్తుడైనాడు. తన ఆసనం ప్రక్కనే ఆసీనుడైఉన్న రాజగురువగు "భరతుడు" అనునాతని వైపుచూచి ఇట్లు పలుకసాగాడు.

**ఇంద్రద్యుమ్నరాజు :** గురువర్యా! భరతమునీ! ఇతని ఆగడపు మాటలు వింటున్నారా? పరస్త్రీని అపహరించి మహాపాపమునకు ఒడిగట్టాడు. ఇంకా, ఏవేవో గర్వోక్తులు పలుకుచున్నాడు. నేను అనేక ప్రయత్నములచే కూడా, ఇతనిని ఏమీ చేయలేకపోయాను. మీరు మహాశక్తి సంపన్నులు కదా! "శిక్షించతగ్గవానిని శిక్షించకపోతే, ఆ రాజుకు పాపం చుట్టుకుంటుంది"– అని మన రాజ్యపు న్యాయశాస్త్రం ఘోషిస్తోంది. అందుచేత, మీరు మీ తపోశక్తిచే ఇతని పాపకార్యమునకు తగిన విధంగా ఏదైనా శాపం ఇవ్వండి. అటుపై వీళ్ళిద్దరిని పంపివేద్దాం.

అప్పుడా రాజగురువు ఇంద్ర – అహల్యల పాపకృత్య మంతా మరల విచారణ చేశాడు. ఎంతో చెప్పి చూచాడు. లాభం లేకపోయింది.

**భరతమునీంద్రుడు :** ఓ దురాత్ములారా! మీరిద్దరు చెయ్యరాని దోషపూరిత క్రియలు చేశారు. ఓయీ అహల్యా! నీవు భర్తృ దోహం చేసి పాపం చేశావు. ఓ ఇంద్రుడా! నీవు పరాయి స్త్రీతో అపవిత్రమైన సంబంధము కలిగి ఉన్నావు. ఈ రాజ్య-శాశనానుసారం, రాజాజ్ఞను అనుసరించి మిమ్ములను శిక్షించే నిమిత్తం నా తపస్సును వినియోగిస్తున్నాను. మీఇరువురి దోషపూరిత ప్రవర్తన శిక్షార్థం. అందుకు ఇదే నా శాపం. "మీరిద్దరు మరణించెదరు గాక!"

**ఇంద్రాహల్యలు :** ఓ రాజా ! ఓ మునీంద్రా ! మీరిద్దరు అల్పబుద్ధి కలవారే అగుచున్నారు.

ఓ మహామునీ! మీరు మాకు ఇట్టి శాపం ఇచ్చి, నిష్కారణంగా మీ దుష్కరమైన తపస్సు వ్యర్థం చేసుకొన్నారు. మా ఉద్దేశంలో ఈ శాపము మా ఇద్దరికి చేయగల హాని ఏదీలేదు. మీ వాక్య ప్రభావం చేత ఈ దేహాలు నశించవచ్చు. కాని ఒకరినొకరు ప్రేమించుకొంటున్నది ఈ భౌతిక దేహాలనా? కాదు. మనోరూపులమైనట్టి మాకు నాశనమెక్కడిది? మా చిత్తము సూక్ష్మము, చిన్మయము, అగోచరము కదా! మా మనస్సులు మీయొక్క శాపపర్యవసానానంతరం కూడా నశించకుండానే ఉంటాయని గ్రహించండి.

❖

దృఢస్నేహబద్ధులగు వారిద్దరు ఇట్లు ఎలుగెత్తి పలికారు. ఒకరు చెప్పుచుంటే మరొకరు 'అవును.... అవును' అనురూపముగల అనుకూల శబ్దములు చేశారు.

శాప ప్రభావంచేత వారిద్దరు నేలకూలి మరణించారు.

వారిద్దరికి ఒకరిపై మరొకరికి విడదీయరాని అనురాగమున్నది కదా! అందుచేత, మరుజన్మలో రెండు లేళ్ళుగా జన్మించారు. ఆ తరువాత అనేక పక్షి జంటల జన్మలు ఎత్తారు. ఇక ఇప్పుడు, నేను సంచారం చేసే ఒకానొక బ్రహ్మాండములో ఒకచోట వారిద్దరు పరస్పరాసక్తత కలిగియుండి--- తపః సంపన్నులగు బ్రాహ్మణ దంపతులుగా జన్మించారు.

చూచారా! పితామహా! దుస్సాధ్యములగు శాపములు కూడా వారిద్దరి మనస్సులను విడదీయ లేకపోతున్నాయి. వారియొక్క స్నేహసంస్కారముచే వారు ఎక్కెడెక్కడ జన్మించినప్పటికీ స్త్రీ – పురుషులు

గానే ఉంటున్నారు. వారి సహజ ప్రేమ భావమును, అత్యధిక స్నేహమును చూచి వృక్షములు కూడా ప్రేమరసపూర్ణములై ఉంటున్నాయి.

❖❖❖

# 5. యథావిధి

కనుక, శాపాదులు మనస్సును భేదింపలేవు. మరలింపజాలవు. ఐందవుల సృష్టులను నశింప జేయటం ఇప్పుడు ఉత్తమమైన పనికాదు. మీవంటి మహాత్ములు రాగము, మదము మాత్సర్యములను దగ్గిరకు రానివ్వరు కదా! ఈ లోకమునకు, అనేక బ్రహ్మాండములకు ప్రభువు అయినట్టి మీరు అట్లా చేయటం దీనత్వమునకే హేతువు అవుతుంది. బ్రహ్మాండములను సృష్టించగలశక్తి - సంపన్నములు గల వారి-వారి మనస్సులను ఎవ్వడూ దేనిచేతా నశింపజేయలేడు. అందుచేత, ఆ ఐందవులను తమ దివ్యదృష్టి కలిగియే ఉండనివ్వండి.

మీరు కూడా, మీ చిత్తాకాశమునందు యథావిధంగా ప్రజలను సృష్టించండి.

చిత్తాకాశము ఈ పాంచభౌతిక సంబంధమైన ఆకాశము వంటిది కాదుకదా! అది అనంతము. మీకు సర్వము తెలిసే ఉన్నప్పటికీ... మన ఉభయుల పునశ్చరణ కొరకు - సందర్భం వచ్చినది కనుక చెప్పుచున్నాను. మనం పూర్ణతత్త్వాన్ని పరిశీలించినప్పుడు, ఆకాశములు మూడు రకములుగా విభజించబడుచున్నాయి-

1. భూతాకాశము (Zone of matter)
2. చిత్తాకాశము (Zone of thoughts)
3. చిదాకాశము ( Zone of Consciousness)

మొదటి రెండూకూడా చిదాకాశము చేతనే ప్రకాశింపబడుచూ, అనంతములే అయిఉన్నాయి. కాబట్టి ఓ జగదీశా! మీరు 'ఒకసృష్టి' గాని, లేక 'రెండుసృష్టులు' గాని, లేక 'అనేక సృష్టులు' గాని ఇతఃపూర్వము వలెనే సృష్టించండి. ఆ పదిమంది ఐందవులు మీదైనదంటూ ఏదీ ఆక్రమించియుండ లేదు కదా! ఇక వారిపై కోపందేనికి చెప్పండి? చిదాకాశమునందు వాస్తవానికి సృష్టిత్వము లేకయే ఉన్నది. అది ఎవరిది? ఎట్టిది? మాయచేతనే "నేను-నాది-నీవు-నీది-అది-ఇక్కడ-అక్కడ"... అను భేదమంతా తోచటం జరుగుతోంది. కనుక, సర్వజ్ఞులగు మీరు మీ "స్వకీయ ప్రేరేపణ"ను అనుసరించి సృష్టికార్యము చేయుచు, నిరభ్యంతరంగా ఆత్మయందు స్థితి కలిగియుండవచ్చు.

**బ్రహ్మదేవుడు :** ఓ సూర్యభగవానుడా! నీవు చెప్పుచున్నదంతా చాలా దీర్ఘంగా ఆలోచించాను. చాలా చక్కగా సత్యవిషయమును, నా యొక్క విహిత - అవిహితములను గుర్తుచేశావు. నీవు అన్నట్లు ఆకాశములన్నీ అనంతములే. "చిత్తాకాశము" అనగా "మనస్సహితమైన చిదాకాశము" కాకుండా మరింకేమీ కాదు. కాబట్టి చిత్త - చిదాకాశములు రెండూ అనంతములే. ఇక ఈ భూతాకాశము ఈ కనబడే సృష్టియందు అంతర్భూతమై ఉంటోంది. బ్రహ్మాకాశము (లేక చిదాకాశము)

నకు వాస్తవానికి దేనితోనూ సంగము (Attatchment) లేదు. కనుక నాకు అభిమతమగుచున్న ఈ సృష్టిని ఒనర్చుచు, స్వధర్మమైనట్టి నిత్యకర్మను నిర్వర్తించెదను గాక! ఓ భాస్కరా! నాకు ఇప్పుడు ఉత్తమ విషయమును (ధర్మమును) గుర్తు చేసినట్టి నీవే నా ఈ 'సృష్టి' అను కార్యక్రమము నందు, "ప్రథమ–మనువు" అగుదువుగాక! ఇక ప్రాణులను సృష్టించుటే నా తక్షణ కర్తవ్యం. నాయొక్క ప్రతినిధిగా నీవు నాచే ప్రేరితుడవై, నీ ఇచ్ఛానుసారంగా సృష్టిని గావించు!

❖

**బ్రహ్మదేవుడు :** నాయనా! వసిష్ఠా! మహాతేజస్వియగు ఆ భానుడు నేను చెప్పినదానికి అంగీకరించాడు. అప్పటికప్పుడు తన శరీరమును 'రెండు భాగాలు'గా విభజించాడు. అందులో ఒక శరీరమును 'ఐందవ సృష్టి' లోని సంచరించుచున్న బ్రహ్మాండము నందు "సూర్యుడు"గా ఉండి యథాతథంగా లోకములను ప్రకాశింపచేయటం కొనసాగించాడు. రెండవ శరీరముతో, నాచే ప్రసాదించ బడిన 'మనువు' పదవిని అలంకరించి నా అభిమతానుసారం సృష్టులను నిర్మించ ప్రారంభించసాగాడు.

❖❖❖

## 6. 'జీవుడు' అనగా?

**శ్రీ బ్రహ్మదేవుడు :** ప్రియపుత్రా! వసిష్ఠా "ఈ సృష్టులన్నీ ఎట్లా కలుగుచున్నాయి?" అను నీ ప్రశ్నకు సమాధానంగా "ఐందవ బ్రహ్మాండము" మరియు "ఇంద్రాహల్యల ప్రహసనం" చెప్పాను. 'మనస్సు' యొక్క సర్వకర్తృత్వము, శక్తి గురించి తెలియజేయుటయే నా ఉద్దేశం. ఇది ఇట్లు కనిపించి, అనుభవమగుటకు కారణం? నీ మనస్సు ఇట్లు భావించుట – సంకల్పించుటయే సుమా!

ప్రతిజీవిలోని మనస్సు అంతటి మహాశక్తి సమన్వితము, సర్వకర్తృత్వ సహితము, సర్వభావనా సమర్థము అయి ఉన్నది సుమా! అయితే ఈ జనులు స్వల్ప విషయములనే మళ్ళీ మళ్ళీ ఆశ్రయిస్తూ, సంకల్పించుచుండుటచే, వారి మనస్సులు స్వల్ప ప్రయోజనములను మాత్రమే పొందుచున్నాయి.

ఈ చిత్తమునందు ఏదేది ప్రతిభాసిస్తోందో – అది మాత్రమే వ్యక్తమగుట, స్థిరత్వము పొందుట, సాఫల్యమగుట జరుగుచున్నది. ఈ మనస్సుయొక్క సామర్థ్యమెట్టిదో ఐందవబ్రహ్మాండములు నిరూపిస్తున్నాయి. ఐందవులు మనోభావనాబలం చేతనే బ్రహ్మపదమును పొందగలిగారు. ఐందవుల చైతన్యమే చిత్తత్వము పొందటం జరిగింది. ఆ చిత్తత్వము నందలి 'భావన' యే, హిరణ్యగర్భత్వము (సమష్టిసృష్టి భావన)ను సంతరించుకొన్నది. అంతేకాదు, మనందరి విషయం కూడా అట్టిదే. చైతన్య స్థితి నుండి చిత్తత్వము పొంది, తత్ఫలితంగా మనం ఈ ఈ రూపములను ఆశ్రయించాము. చిత్తమే ప్రతిభాసారూపముచే (In the process of reflection) 'దేహము' మొదలైన రూపములను ప్రకాశింపజేయుచున్నది. అనగా, ఈ దేహాదులు చిత్తముకంటే ఏమాత్రం వేరైనవి కావు.

ఈ చిత్తము చాలా సమయాలలో అనేక కల్పనలతో కూడుకొని ఉంటోంది. మిరియపుగింజ కారంగాను, ద్రాక్షపండు తియ్యగాను ఉంటూఉంటాయి కదా! ఈ జీవుని చిత్తము కూడా

కామ్యకర్మలను, వాసనలను ఆశ్రయించటం, కలిగియుండటం స్వభావంగా పొంది ఉంటోంది. చిత్తము ఎట్లా ఉంటే అద్దాని భావసంస్కారములను అనుసరించే వ్యక్తీకరణ కూడా ప్రాప్తిస్తూ ఉంటుందని గ్రహించు. చిత్తము యొక్క మననమును – మననములను అనుసరించే సృష్టిలోని వివిధ దేహాలు రూపుదిద్దుకుంటున్నాయి.

ఈ జీవుడు భ్రాంతిచే తన సూక్ష్మ వాసనలనే స్థూలముగా భావించి, "నేను మనుజుడను, నేను దేవతను"... అని తలచుచూ వ్యర్థముగా మోహితుడు అగుచున్నాడు.

సూక్ష్మవాసనలతో కూడుకొని యున్న చిత్తమునే 'జీవుడు' అంటున్నాం. స్థూలత్వ భ్రాంతిచే అదియే 'దేహము' అని కూడా దర్శించబడుచున్నది. ఏది ఏట్లైనా ఉండనీ! ఈ సూక్ష్మ, స్థూల శరీరములు, వీటిని దర్శించటం – ఇదంతా కల్పనామాత్రమే. వాస్తవానికి ఈ జీవుడు సాక్షాత్ బ్రహ్మమే అయి ఉన్నాడని సర్వదా ఎరుక కలిగియుండుము.

❖

ఓ విశ్వామిత్ర – వసిష్ఠులారా! దారము కంటే వస్త్రము వేరైనదని అనగలమా? ఈ "నేను'–నీవు– అతడు" మొదలుగాగల తదితరములన్నీ... అత్యంతాశ్చర్యకరమైన ఈ చిత్తముకంటే వేరేమీ కాదు. అయితే, ఈ చిత్తము వాస్తవానికి స్వరూపరహితమైనదే. కల్పిత మాత్రమైనదే. కాని, మనం ఐందవ బ్రహ్మాండములు (ఐందవోపాఖ్యానం) విషయంలో గమనించినట్లు ఇది సత్తను పొంది వర్తించుచున్నది. "జడము మాత్రమే" అయిన ఈ చిత్తము ఇద్దాని ఆధారమగు చైతన్యము చేతనే సత్తను పొందుచున్నదని గ్రహించు. ఐందవుల మనస్సే 'బ్రహ్మ', 'బ్రహ్మాండము' లుగా పరిణమించినది కదా!

1) భూతికంగా ఘనీభూతమై కనిపించే ఈ పాంచ భౌతిక దృశ్య సృష్టి వస్తుతః మనోరూపమే అయి ఉన్నది. (లేక) ఇదంతా సంకల్ప రూపమే!
2) అనుభవమునకు కారణమగుచున్న 'అనుభూతి'– స్వయంకృతమే! (లేక) స్వయం నిర్మితమే!
3) జగత్ సంకల్పము ఆత్మ సంకల్పమునందు లయిస్తే ..., సర్వమూ పరమాత్మనుభవంగా శేషించగలదు.

మనం కూడా మన సంకల్పముల ప్రభావంచేతనే బ్రహ్మ – మహర్షులము అయినాము. అట్టి మనస్సుచే స్థితి పొందినట్టి మనం, మనచే రచించబడిన ఈ జగత్తు ... ఈ సర్వం సంకల్ప రూపముననే భాసించుచున్నది.

ఈ చిత్తముయొక్క కల్పనచేతనే ఒకడు 'నేను బ్రహ్మను' అని, మరొకడు "నేను అత్యంత పరిమితమగు పురుగును" అని అనుభవం పొందుచున్నారు. వాస్తవానికి, పరమాత్మయే ఈ సర్వ దేహాదుల రూపమున ప్రకాశించుచున్నాడు. పరమాత్మయే జగత్తు – జగద్రహితమగు చిదాకాశము కూడా అగుచున్నాడు.

నిర్మలమగు చిత్తమే పరమార్థ స్వరూపము సుమా! అంతేకాదు. పరమార్థ స్వరూపమగు చిత్తమే ఏమరపుచే, భావనావశంచేత 'జీవుడు' గాను, 'మలిన చిత్తము' గాను పరిణమించుచున్నదని

గ్రహించు. అట్టి మలిన చిత్తమే ఈ దేహాదుల రూపమున వ్యక్తమగుచున్నది. కల్పనయే అయినప్పటికీ, ఈ దృశ్యము సుఖదుఃఖముల రూపమున ఈ జీవునికి బంధము, బాధ కలిగించుచునే ఉన్నాయి కదా! ఎందుచేత?

ఒక దృష్టాంతము చెపుతాను. విను. ఒకడు తనయొక్క అజ్ఞానశక్తిచే ఉత్పన్నము చేసుకొన్నట్టి స్వప్నమునో, ఊహనో, లేక సంకల్పమునో చాలాకాలం అట్లే కలిగియున్నాడనుకో..... అప్పుడు ఏమవుతుంది? అది అతనిచే జాగ్రత్‌వలెనే దర్శింపబడుతుంది. అనగా "ఇది అత్యంత వాస్తవమే" అని అనిపిస్తుంది. అదే విధంగా చిద్వస్తువుచే వ్యాప్తమైయున్న ఈ జాగ్రత్ ప్రపంచము కూడా ఈ జీవునకు,... నాకు ఆ ఐందవసృష్టిలాగా,... సత్యమువలెనే అనుభూతమౌతోంది.

❖

నాయనలారా ! విశ్వామిత్ర వసిష్ఠులారా ! ఈ చిత్తమే ప్రపంచమునంతటినీ ఉత్పన్నము చేయుచున్నది. అతి సూక్ష్మ వాసనా మయమైనట్టి "శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు" అనే తన్మాత్రలకు సంబంధించిన 'అధ్యాస' (Avocaiton) బలపడుటచేత 'జగత్తు' అనబడు అనుభవం ఏర్పడుతోంది. ఒకనికి కంటిచూపు దోషంచేత ఆకాశంలో రెండవచంద్రుడు కనబడుతూ ఉంటాడే! ఈ 'జగత్తు' దర్శనముకూడా అట్టిది మాత్రమే.

ఈ 'అహంభావము' రూపమున ప్రకాశించునది, దానిని ఆశ్రయించుకొని అనుభవమగు చున్నది... ఇదంతా సత్తు కానేకాదు. ఎందుకంటావా? ఏదైతే త్రికాలములందు అనగా, ఇంతకు ముందు - ఇప్పుడు - ఇకముందు కూడా, ఉండి ఉంటుందో... అట్టి దానిని మాత్రమే మనం 'సత్తు' అని అనగలం. 'గాఢనిద్ర' లో ఈ జీవుడు ఉండి ఉన్నప్పుడు జాగ్రత్ రూపమైన అహంకారము అనుభవమగుటలేదు కదా! ఒకప్పుడు ఉన్నట్లుతోచి, మరొకప్పుడు లేకుండా పోయేదానిని సత్తు అనిగాని, సత్యమనిగాని ఎట్లా అనటం? పోనీ, అహంభావమును ఆశ్రయించి లభ్యమయ్యేదంతా "ఇది అసత్తు మాత్రమే" అని అందామా? అసత్తు అయిన వస్తువు లభించనే కూడదు కదా! సద్వస్తువు ఎల్లప్పుడు సత్తుగానే (అనగా ఉండియే) ఉంటుంది. అసద్వస్తువు అసత్తుగా (లేకయే) ఉంటుంది. ఈ 'అహంకారము' అనునది - సత్తుకు, అసత్తుకు కూడా విలక్షణమై ఉండిఉండుటచే - అద్దానిని "మాయకము, అనిర్వచనీయము" అని విజ్ఞులు అంటున్నారు. ఎందుకంటే విచారణ ప్రభవించి, వికసించేవరకు అది ఉంటోంది. విచారణచే నిర్మలమైన బుద్ధి కలవాని దృష్టిలో అది ఉండుట లేదు. 'అహం' అని భావించుటకు మునుముందే ఆ భావకుడు భావరహితుడై భావములకు అతీతుడై ఉండి ఉన్నాడు కదా! అదియే ఈ జీవుని వాస్తవస్వరూపం.

ఈ మనస్సు సంకల్పాత్మకము, విశాలము అయి ఉంటోంది. అట్లే అది జడము, అజడముకూడా అయి ఉన్నది. ఎట్లా అంటావా? బ్రహ్మము అద్వితీయముకదా! కనుక మనస్సు స్వతహాగా బ్రహ్మ స్వరూపమే కదా! కనుక అజడము. కాని దానికి స్వకీయమైన ఉనికి ఎక్కడ? ద్రష్ట ఉంటేకదా, దాని ఉనికి! కాబట్టి జడమే. అది ఈ దృశ్యమే తన రూపముగా కలిగియున్నది. 'దృశ్యము యొక్క

అనుభవం' ఉండి ఉంటున్న సమయంలో ఈ మనస్సు సత్యమైనదానిలాగానే కనిపించుచున్నది. కాని, బ్రహ్మానుభవకాలమందు మాత్రం ('నేను బ్రహ్మమునే' అను ఎరుక కలిగి యున్నప్పుడు) అది బ్రహ్మము కంటే వేరుగా ఏమాత్రం లభించుటలేదు. ఇందుకుగాను ఒక దృష్టాంతము చెపుతాను. ఒకడు ఒక ఆభరణము యొక్క ఆకారమును, అంద–చందములను పరిశీలిస్తున్నాడనుకో.... అప్పుడతనికి "ఇది గొలుసు, అది ఉంగరం, ఇది గాజు, ఇది ముక్కుపుడక" మొదలైన ఆకారములే (ఆభరణత్వమే) కనిపిస్తాయి కాని, అందలి అన్ని ఆభరణములలోని బంగారమువైపు దృష్టి ఉండదు. ఆభరణమును చూస్తున్నప్పుడు బంగారము కనిపించదు. అనగా అదే ఆభరణములను సువర్ణదృష్టితో చూచినప్పుడు... ఆ ఆభరణములన్నీ బంగారముకన్నా వేరు కానివిగా (అభిన్నమైనవిగా) తెలియవస్తాయి. మనస్సుకూడా బ్రహ్మంలో,–బంగారంలో ఆభరణత్వమువలె,–స్థితి కలిగియున్నది.

**చైతన్యము జడమును ఎట్లా ఎరుగుతోంది?**

హిరణ్యగర్భుడు (సమష్టి సృష్టి స్వరూపుడు) అగు బ్రహ్మ సర్వస్వరూపుడు కదా! అందుచేత జడ–చైతన్యములన్నీ బ్రహ్మమే అవుతాయి. అయితే, బ్రహ్మదేవుడు మొదలుకొని, ఒక రాయి వరకు సమస్త పదార్థములు యథార్థానికి "జడ – చైతన్యముల" రెండింటికీ విలక్షణమై ఒప్పుచున్నాయి. 'అహంకారము' గురించి మనం అనుకొన్నట్లే, అవికూడా మాయారూపములై అనిర్వచనములై (Illusionary and undefinable) ఉంటున్నాయి. జీవుడు చైతన్యమే స్వరూపముగా కలవాడుకదా! కొయ్య మొదలైనవి జడము. చైతన్యరూపుడగు జీవుడు కొయ్యమొదలైన జడపదార్థములు పొందికను ఎట్లు అనుభవిస్తున్నాడు? ఈ ప్రశ్నకు శాస్త్రకారులు ఇస్తున్న సమాధానమేమిటో విను.

ఇక్కడ నాలుగు విషయాలు పాల్గొనుచున్నాయి.

| | | |
|---|---|---|
| ప్రమాత | : | ఎరిగెడువాడు (that which is knowing) |
| ప్రమాతృచైతన్యము | : | చైతన్యముయొక్క 'ఎరుగుట' అను స్వభావం. |
| ప్రమేయము | : | ఎరుగబడుచున్నది (that which is being known) |
| ప్రమేయ చైతన్యము | : | 'ఎరుగబడుట' అను స్వభావము. |

జీవునిలోని ప్రమాతృచైతన్యము, ఆ కొయ్యలోని ప్రమేయచైతన్యము... ఈ రెండు వృత్తిద్వారా అభేదము పొందుటచేతనే – ఆ రెండిటి యొక్క పొందిక (Association) సందర్భపడుతోంది.

కాబట్టి 'చైతన్యము'తో 'చైతన్య సంబంధము' కలుగుట వలన అనుభవము – అనేది సిద్ధిస్తోంది. సాదృశసంబంధము వలననే పొందిక లభిస్తోంది. చైతన్యరహితమైన వస్తువు అనుభవమునకే లభించదు. కనుక, జగత్తు అంటే చైతన్యమే రూపముగాగల జీవుడు... చైతన్యమే స్వరూపముగాగల ఆయావస్తువులతో ఏర్పడుచున్న సామ్యముయొక్క "అనుభవం పొందటం."

**బ్రహ్మము సర్వదా విషయరహితమైనదే!**

అయితే ఒక్క విషయం. విశాలమైన ఇసుక ఎడారి మధ్యలో ఎక్కడైనా ఫలవృక్షాలు ఉంటాయా? ఉండవు కదా! వాక్కుకు కూడా అతీతమై (అనుభవ మాత్రమైయున్న) 'పరబ్రహ్మము' నందు

చేతనారూపంగా కనిపించే 'నీవు – నేను' అనునవిగాని, అచేతనంగా కనిపించే పదార్థజాలముగాని లేవు. బ్రహ్మమునందు 'ఇది జడము'–'ఇది చైతన్యము' అనునట్టి శబ్దార్థముల కల్పనయే ఉండదు. అయితే ఈ చిద్వస్తువు ఒకానొకచోట దృశ్యమునందలి ఆయా పదార్థములతోను, వ్యక్తులతోను, సంఘటనలతోను ఏర్పరచుకొన్న సంబంధము కారణంగా ఒక 'స్ఫురణ' కలిగి ఉంటోంది. జలము కొన్ని సమయములలో ఆవృత్తములు (Circles) తోకూడి ఉంటుంది చూచావా? బ్రహ్మమునందు ఏర్పడు ద్రష్టత్వము–దృశ్యత్వము కూడా అట్టివి మాత్రమే. సర్వదా జలము జలముగానే ఉంటోంది. ఆ వృత్తమునకు ముందు, ఆవృత్తసమయంలో, ఆ తరువాతకూడా జలం జలమేకదా! జగద్భావము ఏర్పడుచున్నప్పుడు కూడా బ్రహ్మము బ్రహ్మముగానే ఉండిఉంటోంది. విషయసంబంధమైన చైతన్యము లేక బ్రహ్మముయొక్క స్ఫురణనే 'మనస్సు' అంటున్నాం. మనయొక్క విచారణ, మనస్సును రెండు రకాలుగా విభజించవచ్చు.

1. 'చిత్' అంశము లేక జ్ఞానాంశము : (Awareness consciousness / 'The knower' dimension / The experiencer)
2. విషయాంశము లేక విషయరూపానుభవం : (The knowing dimension / The experiences)

చిత్ అంశమును 'అజడము' అని, విషయాంశమును 'జడము' అని అంటున్నాం. మనం చూస్తున్న ఈ జడవస్తు జాలమంతా ఆ విషయాంశమే. ఈ జీవుని యందుగల "తెలుసుకొనుట" అను స్వభావం రెండు విధములైన ప్రసరణ కలిగి ఉంటోంది.




ఈ జీవుడు అన్ని వేళల చాంచల్యమును పొందుచున్నాడు. జగద్భ్రాంతిని అనుభవిస్తున్నాడు.

**జగత్తు చిద్రూపమే :** చిత్తమునందలి చిదంశమే (Knower concept) (1) చిత్తము (2) జగత్తు అను రెండు విధములుగా విభజించబడుచున్నది. కాని, ఈ కనబడే జగత్తుకూడా, విజ్ఞాన దృష్టితో చూస్తే, చిద్వస్తువు మాత్రమే అవుతుంది. చైతన్యముతో ఈ జగత్తు అభేదమే! అందుచేత ఆత్మదృష్టి కలవారు, "ఈ జగత్తు చిద్రూపమే అయి ఉన్నది, మరింకేమీ కాదు" అని సిద్ధాంతీకరించుచున్నారు.

భేద దృష్టిచే మాత్రమే... ఈ చైతన్యము-మరొక ఏవేవో రూపములు ధరించుచున్నట్లు అనుభూత మవుతోంది. వాస్తవానికి చైతన్యము విభాగరహితం సుమా! కాని, విభాగము కలదాని వలె కన్పట్టుచున్నది.* అది భ్రమ రహితమే అయినప్పటికీ, భ్రమయుక్తముగా ప్రవర్తించుచున్నది.

నాయనా! వసిష్ఠా ! యథార్థానికి 'భ్రమ' అనబడునది ఏదీ లేదు. "చేతనస్వరూపుడగు ఈ జీవుడు భ్రమను పొందుచున్నాడు" అనటం కూడా మా ఉద్దేశంలో సరికాదు. మరి ఇదంతా ఏమంటావా? పూర్ణసముద్రము తనయందు "తరంగములు" అను అనుభవం పొందుచున్నది కదా! సర్వదా పూర్ణమే అయిఉన్న చైతన్యము తనయందు ఈ "జగత్తులు-పదార్థములు-భావాభావములు" మొదలైన రూపముగల అనుభవం పొందుచున్నది. అంతే!

❖

'చిద్వస్తువు' - స్వస్వరూపం లేక ప్రతి ఒక్కరి వాస్తవ శుద్ధ స్వరూపం అయి ఉన్నది కదా! 'జడము' కూడా చిద్రూపమే అయిఉన్నది సుమా! ఎందుచేతనంటే 'జడము' అని చెప్పబడుచున్నది కేవలం జడము మాత్రమే అయి ఉంటే... స్వస్వరూపము దృష్ట్యా చిద్వస్తువగు నీకు అది భాసించ కుండానే ఉండేది. జాగ్రత్‌లో ఉన్నవాడే జాగ్రత్‌లో ఉన్నవాడితో సంభాషించగలడు. నిద్రించువాడు జాగ్రత్ - పురుషునితో ఎట్లా మాట్లాడుతాడు చెప్పు? స్వతహాగా చైతన్యమే అయిఉన్న నీవు అట్టి చైతన్యము యొక్క జడంశమునందు జడమునకు సంబంధించిన అనుభవం పొందుచున్నావు. కనుక జడంశము 'చిత్' యొక్క ఒకానొక అంశ మాత్రమే!

❖❖❖

# 7. అహంభావము

**శ్రీ బ్రహ్మదేవుడు :** "జ్ఞానము యొక్క చైతన్యాంశమునందు 'అహంభావము (నేను-నాది)' అను జడత్వపు భావన ఉదయిస్తోంది" - అనునదే ఇక్కడ మనకు సిద్ధాంతము. ఏదైతే ఎందులోంచి - బాహ్యకారణమేదీ లేకుండా ఉదయిస్తుందో... అట్లు ఉదయించేదంతా ఆ మూలవస్తువుకు వేరైనది అయిఉండదు కదా! శుద్ధతత్వమగు బ్రహ్మము లేక ఆత్మ 'జీవుడు' అనబడు మరొక తత్త్వముగా పరిణమించినట్లు తోచినప్పటికీ వాస్తవానికి బ్రహ్మమునందు బాహ్యమైన లేక బాహ్యము నుండి నియోగించబడిన కారణమేదీ లభించుటలేదు కాబట్టి... ఈ జీవుడు సర్వదా బ్రహ్మమే అయివున్నాడు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** తండ్రీ! అట్లా అయితే మరి ఈ 'అహంకారము,' అద్దానిచే అనుభవించబడుచున్న 'జడత్వము' మాట ఏమిటి?

**శ్రీ బ్రహ్మదేవుడు :** సూర్యుని తేజస్సే సూర్యకిరణరూపమై వస్తువులపై ప్రసరిస్తోంది కదా! అనగా, సూర్యకాంతి వస్తువు ఆకారం సంతరించుకొని కనబడుతోంది. "చైతన్యాంశమే అట్లు వివర్త భావము

---

* అవిభక్తంచ, భూతేషు విభక్తమివచ స్థితమ్.... *శ్రీమద్భగవద్గీత 13వ అధ్యాయం.*

పొందుచున్నది" అని అనక తప్పదు. అనగా ఈ జగత్తు, ఈ జగత్తును దర్శించుచున్నట్టి ద్రష్టవగు నీవు, నీతో ఈ సంభాషణ చేయుచున్నట్టి నేను... అంతా చైతన్యము యొక్క ప్రకటనయే అయిఉన్నది. చైతన్యమునకు అన్యమైనదంటూ ఏదీ ఎక్కడా లేదు. జలమునకు వేరుగా "తరంగములు" అనబడు మరొక బాహ్యవిశేషమేమైనా పరిణమించుచున్నదా? ఆ జలం మరొకటిగా మారుచున్నదా? లేదు. ఆ సమయంలో జలమునకు వేరుగా మరొకటి ఏదీ అగుచున్నదిలేదు. అదేవిధంగా 'పరమాత్మ' యందు అహంకారము మొదలైనవేవీ లేవు. మరి లేని అహంకారమును తొలగించుట లేక త్యజించుట ఏమిటి చెప్పు? కనుక, "అహంకారము చైతన్యముయొక్క సంప్రదర్శనమే!" అను సందర్శమును పెంపొందించుకొండి.

- "నేను శుద్ధ చైతన్యమునే" అనునదే జ్ఞానసారం.
- దృశ్యమందలి సారము కూడా ... 'ద్రష్ట' యందలి సారముకంటే వేరైనదేదీ కాదు.
- అనగా, అన్నిటియందును ఏకైక చైతన్యమే ఏకరసమై సర్వదా ప్రకాశించుచున్నది.

నాయనా! అహంభావమే 'మిథ్య' అయినప్పుడు, ఇక అట్టి 'అహం' భావనచే ఉత్పన్నములగుచున్న విషయముల మాట ఏం చెప్పాలి? అవన్నీ ఎండమావులలోని నీటిని కడవలలో నింపి తెచ్చుకోవటం లాగా అత్యంత భ్రమాత్మకమే అవుతాయి. అందుచేత "అవన్నీ అప్రస్తుతం అనగా, ప్రస్తుతమే లేవు" అని గ్రహించు. ద్వైతదృష్టి అంతా తొలగిపోగా, అప్పుడు శేషించేదే 'ఆత్మ' అయి ఉన్నది కదా! అట్టి ఆత్మయందు ఇక అహంకారమునకు, అల్పత్వభావనకు, అఖండమునకు వేరైన అస్థిత్వమునకూ చోటెక్కడ?

**శ్రీ వసిష్ఠమహర్షి :** పితృదేవా! మరి మాకు ఘనీభూతమై తోచుచున్న ఈ 'అహంభావన' ఎక్కడి నుండి వచ్చిపడుతోంది?

**శ్రీ బ్రహ్మదేవుడు :** నీరు అధికమైన శీతల వాతావరణము నందు ఉంచబడినప్పుడు 'మంచు' గా ప్రాప్తించుచున్నది చూచావా? చేతన వస్తువు స్వస్వరూపమునకు సంబంధించిన అజ్ఞానమును అంగీకరించి, అట్లు అంగీకరిస్తున్న సమయంలో "అహంకారము – 'విషయానుభవము' అనునట్టి రూపమును పొందుచున్నది.

ఒక చిన్న హాస్య సంఘటన చెపుతాను. విను. ఒకడు ఒక అర్ధరాత్రి తటాలున నిద్రలేచి, తన ప్రక్కనే నిద్రిస్తున్న తన స్నేహితుని నిద్రలేపి, "మిత్రమా! ఇప్పుడు నాకొక కల వచ్చింది. ఆ కలలో – నేను చచ్చినానట. అప్పుడు నా శరీరమును ఎవ్వరో మోసుకొని వెళ్ళుచూ, నా మంచితనము గురించి చెప్పుకొంటున్నారు. 'ఇతడు మరల బ్రతికితే ఎంత బాగుండు!' అని అనుకొంటున్నారు. కాని చనిపోయినట్టి నేను మరల బ్రతకటం అసాధ్యం కదా, ...." అని చెప్పుకుపోతున్నాడు. స్వప్న ద్రష్టయగు తానే మరణిస్తే స్వప్నమెక్కడిది? తన కల్పన ఉంటేకదా, .... ఆ కల్పనలో ఆయా వ్యక్తులుండటం! అతని శరీరము మోయుచున్నవారెవరు? స్వప్నద్రష్టచే సంకల్పించబడి, దర్శించబడేవారే కదా!

మరొకడు "రాత్రి కలలో నేను గాఢ నిద్రపోతూ ఉండగా, ఆ కలలో ఒకడు మా ఇంటిలో ప్రవేశించి నన్ను నిద్రలేపినట్లు కలవచ్చింది. అప్పుడేమైనదంటే....." అని కలలోని విశేషాలు చెప్పుచున్నాడు. తానే గాఢనిద్రలో ఉంటే ఆ స్వప్నములోని మరొకడు ఎక్కడి నుండి వచ్చాడు? స్వప్నమంతా స్వప్నద్రష్ట యొక్క స్వకీయకల్పనయే కదా! అదే విధంగా చైతన్యము కూడా మిథ్యారూపంగా జడత్వానుభవం పొందుచున్నది. సర్వాత్మకమగు ఆ చైతన్యము తన అనంత రూపములోని ఒకానొక చోట జడస్థితిని అనుభవించుచున్నది. దృఢమైన అజ్ఞానమును ఆశ్రయించుట ద్వారా స్వస్వరూపానుభవం ఏమరుస్తోంది. 'సంసృతి' అని చెప్పబడు బాహ్యదృష్టి కలిగియుంటోంది. అనగా అది తన సర్వాత్మకత్వమును మరచి, తనకు ఎక్కడ 'దృష్టి (Avocation) ఏర్పడుచున్నదో ..... అక్కడ జడాకారము, పరిమితత్వమును వహించి ఉంటోంది. సమస్త వస్తువులకు ఆదికారణం మనస్సే. ఆ మనస్సే అన్నిటా, అన్ని రూపములలోను వ్యక్తమగుచున్నది. అదే ఆకాశమువలె, అత్యంత విశాలమై అనేక రూపములను స్వయముగా దర్శించుచున్నది. ఇక దానిని నియమిస్తున్నది ఎవ్వరంటావా ? దాని వాస్తవ స్వరూపమైనట్టి ఆత్మయే.

❖

ఓ జనులారా! మీరు మొట్టమొదట అభ్యాసము, వైరాగ్యము మొదలైన ఉత్తమ గుణములను అలవర్చుకోండి. అప్పుడు మీ చిత్తములు జ్ఞానము పొందుటకు 'అర్హత' పొందుతాయి. జ్ఞానము అభివృద్ధి పొందుచూ ఉండగా ఇక "స్థూల – సూక్ష్మ – కారణ" శరీరముల భ్రాంతిని మీ అంతట మీరే పరిత్యజించివేస్తారు. "ప్రతిభాసాత్మక (Image like) చిత్తము" అనుదానిని మీయొక్క 'చిత్తము' నే ఉపయోగించి స్వయముగా విచారణ చేయండి. అప్పుడు నేను చెప్పు దానిలోని వాస్తవాన్ని మీరే గ్రహించగలరు. చిత్తము అపరిశుభ్రంగా ఉన్నంతకాలం భ్రమాత్మకములగు అనుభవములు, తత్ఫలితములు, సంసారదుఃఖ పరంపరలు తప్పునవికావు. చిత్తము శుద్ధమైనంతమాత్రం చేతనే నిత్య నిరతిశయానందమును పొందగలరు. మీరంతా ఈ దేహాదుల పరిశుభ్రతకొరకు ఎన్నో ప్రయత్నములు చేస్తున్నారుగాని, చిత్త నిర్మలత్వము కొరకు తగినంత ప్రయత్నశీలురు అగుచున్నారా? లేదు. కనుక, పరిశీలించి చూచుకోండి. చిత్త నిర్మలత గురించి అశ్రద్ధ వహించియుండుటచేత అనేక దౌర్భాగ్యములు వచ్చి పడుచున్నాయి. చిత్తముచే "చైతన్య పరబ్రహ్మము" అయిఉన్న స్వస్వరూపమును గ్రహించాలి. అది మానివేసి ఈ దేహాది ఖండములను మాత్రమే విచారించుచు ఆయుష్షును వృథా చేయుటచే ప్రయోజనమేమున్నది?

ఏది సత్యమో దానిని గురించే విచారించాలి. అట్టి విచారణ రూపమగు జ్ఞానమే సఫలమౌతుంది. అసత్యము, కల్పితము అయిన దాని గురించి ఎంత విచారించి ఏం ప్రయోజనం? అట్టి అసత్యమైన దానిని ఆశ్రయించుటచే శ్రమకు ఫలితంగా అసత్యమైనది, కల్పితమైనదే ప్రాప్తించటం జరుగుతుంది. అందుచేతనే సంసారజీవులను దుఃఖాదులు ఆశ్రయించుకొనియే ఉంటున్నాయి. ఆకాశంలో "తన యొక్క కల్పన" అను వికారముచే గాంచబడే వృక్షమును ఎవరైనా శోధిస్తారా? ఈ దేహాదుల

విషయం కూడా అట్టిదే. అందుచేత, జ్ఞానులు ఈ దేహముల రాక – పోకల గురించిన విచారణను ప్రక్కకు పెట్టి, దేహి (లేక) చైతన్యతత్త్వము గురించి శోధించుచున్నారు. నాయనలారా! సర్వప్రసరణ శీలమగు 'ఆత్మ'యే మీరు. కాబట్టి "నేను ఈ దేహపరిమితుడను" అని భావించి ఖేదము చెందకండి.

ఓ ప్రియ తనయులారా! వసిష్ఠా! విశ్వామిత్రా! "జీవుడనగా ఈ దేహమే. మరింకేమీ కాదు" అని చెప్పుచూ, కొందరు దేహాత్మవాదులు ఆయా ప్రమాణములతో ఈ జీవునకు అల్పత్వం ఆపాదించు చున్నారు. ఈ చిత్తము దేనిని ఎట్లు భావించునో అది అట్లే అయి, ప్రాప్తిస్తూ ఉంటుంది. అహల్య, ఇంద్రుల మనోనిశ్చయము యొక్క ప్రభావమే మనకు ఇందుకు దృష్టాంతము. కనుక అట్టి ఈ చిత్తముతో ఉత్తమోత్తమమైన భావనయే చెయ్యాలి. కాని, "నేను స్వల్పుడను, శరీరమును, అల్పుడను" అను రూపము గల నీచ భావనలు ఎందుకు చెయ్యటం? "సర్వాత్మకమైనట్టి చైతన్య పరబ్రహ్మమే ఈ "నీవు–నేను" మొదలైన సర్వరూపములుగా ... ఒకే జలం అనేక తరంగములు అగుచున్నట్లు ... ప్రకటితమౌతోంది. కనుక నేను పరబ్రహ్మమును. నాకు ఆద్యంతాలు లేవు. జన్మ–జరా–మృత్యువులు లేవు. ఇదంతా నాకంటే వేరైనది కాదు" అని భావన చెయ్యాలి. అట్లే "ఈ కనబడే ప్రతి ఒక్కరు పరబ్రహ్మ స్వరూపులే(తత్–త్వమ్అసి)" ... అను మననమును ప్రవృద్ధం చేసుకోవాలి. అట్లు భావించుట చేతనే మీరు ఉత్తమత్వమును పొందగలరని గ్రహించండి.

❖

ఈ చిత్తము ఏ విధంగా స్ఫురించుచున్నదో, అట్టి స్ఫురణను అనుసరించే ఆయా ఉపాధి పరంపరలు వచ్చి చేరుచున్నాయి. వాస్తవానికి, ఈ దేహముగాని, లేక, అహంకారముగాని ... స్వప్నములోని వ్యక్తులు, వస్తువుల వలె ... "లేనివే" సుమా! కనుక ఓ వసిష్ఠా! సర్వదా ఏకరూపమై, ఇచ్ఛారహితమై ఉన్నట్టి ఆత్మనే ఎరుగుము. అట్లు ఎరుగుచూ ఇచ్ఛారహితుడవై ఉండుము.

ఒక బాలుడు ఎవ్వరో చెప్పిన మాటలు విని తనకుతానే కల్పించుకొనినట్టి భ్రమపూర్వకమైన కల్పన చేత బేతాళదేహమును ఎదురుగా చూస్తూ, భయాదులను అనుభవిస్తూ ఉంటాడు. పంచభూతాత్మకమైన తన ఈ దేహమెక్కడ? జడలు – కోరలు – నాలుక మొదలగు కల్పనలతో మనస్సుచే ఊహగా చూడబడే బేతాళ దేహము ఎక్కడ? ఆ రెండింటికీ సంబంధమే లేదు కదా! కల్పనలు నశించగానే ఆ బేతాళుడు, భయాదులు, ... అన్నీ తొలగిపోతున్నాయి. ఆత్మ కూడా కల్పనావశం చేతనే ఈ 'మనుష్యుడు' మొదలైన దేహములుగాను, ఈ సర్వదృశ్య ప్రపంచముగాను అగుచున్నది. ఆ దేహాదులు నశించుచున్నప్పుడు తానే నశించుచున్నట్టి భావనకు లోను అగుచున్నది. అవిద్యా కల్పన నశించిన మరుక్షణం సర్వభ్రమలు తొలగిపోతాయి. అప్పుడు స్వస్వరూపప్రాప్తి స్వయముగానే సంభవించుచున్నది.

❖❖❖

# 8. శాప - మంత్రములు

**శ్రీవసిష్ఠమహర్షి :** తండ్రీ! బ్రహ్మదేవా! మీరు నాకు అత్యుత్తమమైన విషయమే బోధిస్తున్నారు. ఆత్మజ్ఞానమే అన్నిటా ఉత్తమమైనది. అయితే, మీరు చెప్పిన విషయాలలో ఒక్కటిమాత్రం నాకు యుక్తియుక్తంగా కనిపించటం లేదు. మీరు ఒకప్పుడు నాతో "శాప – మంత్రాదులు అమోఘమైనవి. అవి తమ ప్రభావం కలిగియే ఉంటాయి" అని చెప్పియున్నారు. మరి ఇప్పుడేమో "దృఢమైన మనోబలిమి కలవానిని శాప–మంత్రాదులు ఏమీ చెయ్యలేవు" అనే అర్థం వచ్చేవిధంగా చెప్పుచున్నారు. అంటే, 'శాప', 'మంత్రములు' మొదలైన శక్తులు వ్యర్థమైపోగలవంటారా? "శాపమంత్రాదుల శక్తిచే మనస్సు, బుద్ధి, జ్ఞానేంద్రియములు మూఢావస్థ చెందగలవు" అని అనేక సందర్భములలో నిరూపించబడినట్లు నేను వినియున్నానే?★ స్వామీ! వాయువు–దాని చలనము, నువ్వులు–నూనె, అగ్ని–ఉష్ణము వేరువేరైనవి కావు కదా! అట్లే ఈ మనస్సు–శరీరము ఒక్కటే కదా! ఎందుకంటే "మనస్సును అనుసరించే ఉపాధి ఉంటుంది" అని మీరు కూడా ఇప్పుడు చెప్పియున్నారు. కాబట్టి ఈ శరీరము మనస్సు యొక్క రూపమే. వర – శాపాదులు మనస్సును ప్రభావితం చేయలేకపోతే, ఇక దేహమును కూడా ఏమీ చెయ్యలేకపోవటమే జరగాలి. కాని అహల్య, కృత్రిమ ఇంద్రుల భౌతిక దేహములు శాపము యొక్క ప్రభావం చేత నేల కూలి, వారిద్దరూ మరణించారు కదా! ఎందుచేత?

పోనీ, మీరు అంటున్నట్లు, "ఈ దేహము వాస్తవము కాదు. అది చిత్తముయొక్క కల్పన మాత్రమే" అనే అనుకుందాం. "ఎండమావులవలె, రెండవ చంద్రునివలె ఈ దేహము వ్యర్థముగా అవాస్తవత్వముతో కూడి కనబడుతోంది. అయినప్పటికీ కూడా, ఈ దేహము, మనస్సులలో "ఒకటి నశిస్తే, రెండవది కూడా నశిస్తోంది" ... అనునదే లౌకిక దృష్టికి తెలియవస్తోంది. రెండూ సమాన సత్తయే కలిగి ఉంటున్నాయి. మనస్సు నశించినప్పుడు అట్టివాని శరీరం మాత్రం ఉంటుందా? నశిస్తుందనే నా ఉద్దేశం. మరి ఇక, శరీరము నశించినప్పుడు కూడా మనస్సు నశించవలసియే ఉంటుంది కదా?

వరశాపాదులచే శరీరము నశించినప్పుడు కూడా మనస్సు నశించదంటారా ఏమిటి?

శాపాదులవలన మనస్సు ఎందుకు ప్రభావితం కాకుండా ఉండగలుగు చున్నది? శరీరము మాత్రమే ఎందుకు ప్రభావితమౌతోంది?

ఈ విషయాలన్నీ మరికొంత వివరించి చెప్పండి.

---

★ "శాపము మనస్సుపై పనిచేస్తుంది" అని నిరూపించే కొన్ని ఇతిహాస సంఘటనలు ఉన్నాయి. నహుషుడు శాపవశం చేత సర్పము అయ్యాడు. అట్లు సర్పంగా మారి, తన వంశమునకు సంబంధించిన వారు, తనకు ప్రియాతి ప్రియులు అయి ఉన్న భీముడు మొదలైనవారిని బాధించాడు.

కొందరు ధర్మాత్ములు కూడా శాపవశం చేత పిశాచజన్మలు ఎత్తి తమ జాతివారగు మానవులనే భక్షించినట్లు కొన్ని కథలు చెప్పుచూ ఉంటాయి. అవన్నీ దృష్టిలో పెట్టుకొని మహర్షి బ్రహ్మదేవుని ఇట్లు ప్రశ్నించుచున్నారు.

**శ్రీ బ్రహ్మదేవుడు :** కుమారా! శుద్ధమైనట్టి శుభకర్మల చేత, పురుష ప్రయత్నముచేత ఈ జగత్తులో పొందరాని వస్తువంటూ ఏదీ లేదు. ప్రయత్నము చేతనే ఎవ్వరైనా ఏదైనా అధిరోహించగలరు, వహించగలరు, నిరోధించగలరు.

ఈ ప్రపంచంలో బ్రహ్మ నుండి ఒక పురుగు వరకు దేహధారులైనట్టి ప్రాణికోట్లన్నిటికీ రెండు శరీరములు ఏర్పడి ఉంటున్నాయి.

1) మాంసనిర్మితమగు ఈ 'భౌతిక దేహము'

2) సర్వకార్యములకు కారణమగుచు, సదా స్థిరమై ఉండి ఉంటునట్టి 'మనస్సు'

**"మాంసదేహము" :** అందరికీ కనబడుతూనే ఉంటుంది కదా! ఇది సకల విధములైన శాపముల చేతను, శస్త్రములచేతను, క్షుద్రవిద్యలచేతను బాధింపబడగలదు. ఈ పాంచభౌతికదేహము జడము. స్వయముగా ఏదీ నిర్వర్తించలేదు. కాబట్టి అత్యంత అసమర్థము. అతి దీనమైనది. తామరాకుపై నీటి బిందువు వలె అతిచంచలము కూడా. ఇది ఏ క్షణమైనను వినాశనం కావచ్చు. ప్రారబ్ధకర్మల చేత, రాజదండనము చేత, వాయువు - జలము - క్రియలు మొదలైన ప్రకృతి పదార్థములచేత ఎదుర్కొనబడుతూ ఉంటుంది.

**"మనస్సు" :** ఇది ఇతరుల భౌతిక దృష్టికి కనబడేది కాదు. ఈ మనస్సు స్వతంత్రమైనదీ - అస్వతంత్రమైనదీ కూడా! ఎవ్వరైతే పురుష ప్రయత్నమును ఆశ్రయిస్తూ, నిత్యము ధైర్యమును అవలంబిస్తూ ఉంటారో ... అట్టివారి మనస్సు దుఃఖమును పొందకుండా ఉంటుంది. జీవుని యొక్క ఈ మనోమయదేహము, ఏ విధమైనయత్నము ఇతడు చేస్తాడో, ఆ విధమైన ఫలములను పొందుతూ ఉంటుంది.

మాంసమయ దేహము తనంతటగా ఏ ప్రయత్నం చేయలేదు. దేనినీ సాధించలేదు. ఏదైనా సరే, మనోమయ దేహము క్రియావంతమగుచున్నప్పుడే అంతా ఫలవంతమవటం జరుగుతోంది. ఈ మనస్సు కనుక ఎల్లప్పుడు పవిత్రమైన దానినే చింతించటం, ధ్యానించటం జరుగుతూ ఉంటే, మాంసమయదేహమునందలి మార్పుచేర్పులు ఆ చింతనను ఏమీ చెయ్యలేవు. "ఒకడు ఒకదానికొరకు ఎంతటి తీవ్రేచ్ఛతో భావన-సంకల్పము -ప్రయత్నములను గావించుచున్నాడు?" అనునదే ప్రయోజనం యొక్క సరళిని నిర్ణయిస్తోంది. ఈ మాంసమయదేహము అగ్నియందు పడుగాక! మట్టిలో కలిసిపోవుగాక! లేక అనేక నామరూపములతో విజృంభించుగాక! ఏది ఏమైనప్పటికీ ... "మనస్సు దేనినైతే దీక్షతో చింతించుచున్నదో, అద్దానినే ఈ జీవుడు పొందుచున్నాడు" అని గ్రహించు.

ఈ భౌతికదేహము స్వయముగా ఏమాత్రం క్రియాకారకము కాదని అనుకొన్నాముకదా! అయినప్పటికీ పురుషప్రయత్నం అధికంగా సిద్ధించుచున్నప్పుడు ఇది కూడా నిర్విఘ్నంగా కొన్ని ఫలములను కలుగజేస్తూ ఉంటుంది. ఒక గొప్ప 'ముని' లో కనిపించే ముఖవర్చస్సు, ప్రశాంతచిత్తుని చూడగానే మనకు కనిపించే ప్రశాంత - ప్రజ్ఞ - ఆనందములు ఇట్టివే. పురుష ప్రయత్నము మనస్సు యొక్క రూపమే అయిఉన్నది. అనగా అట్టి ఫలములన్నీ "మనస్సే మనస్సుకు అట్టి

ఫలమును కలుగజేస్తోంది" అనియే గ్రహించాలి కాని "పాంచభౌతికమైన ఉపాధి అట్లు కొందరిని ప్రభావితం చేస్తోంది" అని భ్రమించటం ఉచితంకాదు. పురుష ప్రయత్నంచేతనే కృత్రిమేంద్రుడు తన యొక్క "మనస్సు"ను "అహల్యామయం"గా చేసివేశాడు. అట్లు మనస్సు అహల్యనే మననం చేస్తూ ఉండటం చేత భౌతికదేహము ఎంత బాధింపబడుచున్నప్పటికీ అతడు ఆ బాధను పొందనేలేదు. ఇట్లు "భౌతికదేహం బాధింపబడటం – కాని మనస్సులు ఆ బాధను పొందకపోవటం" అనే చమత్కారం అనేక గాథలలో నీవు వినే ఉంటావు. ఉదాహరణకు మాండవ్య మహర్షి ఒకసారి తన మనస్సును తీవ్రమైన తపస్సులో వినియోగించాడు. కొందరు దొంగలు రాజభటుల దృష్టినుండి తప్పించుకొని ఆ మహర్షి ఆశ్రమంలో ప్రవేశించి తలదాచుకొన్నారు. భటులు ఆ ఆశ్రమంలో ప్రవేశించి మహర్షిని చూచి "ఇతడు కపటముని వేషం ధరించిన దొంగల నాయకుడే అయిఉంటాడు" అని తలచి, అతనిని బంధించి, తీసుకుపోయి, రాజాజ్ఞపై 'కొరత'* వేశారు. కాని అతడు కొంచెము కూడా బాధ అనుభవించనేలేదు. ఎందుచేత? మనస్సు తపస్సునందు లగ్నమైనప్పుడు శారీరకశ్రమ బాధగా అనుభవమునకు రాలేదు కాబట్టి ! ఆ విధంగా బాధ దృష్టికి రాకపోవడం ప్రతిరోజు ప్రతిఒక్కరికీ అనుభవమయ్యే విషయమే. ధ్యాన నిష్ఠ కూడా ఉత్తమ పురుష ప్రయత్నము చేత మాత్రమే సాధ్యం కదా!

ఇలా, మానసికప్రవృత్తి ప్రభావం గురించి ఎన్నో దృష్టాంతాలు ఉన్నాయి. మరొక సంఘటన చెపుతాను. విను. 'దీర్ఘతపుడు' అనే మహర్షి ఒకసారి ఒక యజ్ఞం చేయతలపెట్టాడు. యజ్ఞసామాగ్రి కొరకై ఒకరాజును ఆశ్రయించాలని బయలుదేరాడు. అట్లా నడచిపోతూ ఉండగా త్రోవలో విధివశాత్తూ ఒక నూతిలో పడిపోయాడు. ఆ నూతినుండి తనంతటతానే బయటకు వచ్చుటకు ఏమాత్రం వీలు కాలేదు. అతని మనస్సు మాత్రం "నేను లోకమునకు శుభం కలుగజేయగల ఈ యజ్ఞం చెయ్యాలి" అనునట్టి బలవత్తరమైన సంకల్పము కలిగి ఉన్నది. అప్పుడు ఆ నూతిలోనే ఊహతో, లేక, మనస్సుతో మహాయజ్ఞం ప్రారంభించాడు. ఋత్విక్కులను ఆహ్వానించాడు. అగ్నిగుండమును సంకల్పించాడు. సశాస్త్రీయంగా అంతా నిర్వర్తించాడు. అప్పుడు ఇంద్రుడు ప్రసన్నుడై ఆ నూతి నుండి దీర్ఘతపుని బైటకుచేర్చి, తన ఇంద్రపదవిని సమర్పించాడు. చూచావా? వసిష్ఠా! ఇక్కడ మనస్సుచే చేసిన పురుషప్రయత్నం శరీరం పాల్గొనకపోయినప్పటికీ ఉత్తమ ప్రయోజనం ప్రాప్తింపజేసింది. ఇంతకు ముందు మనం ఐందవుల గురించి చెప్పుకొన్నాం. వాళ్ళు సామాన్య మానవులే కదా! ఐతే ఏం?పురుష ప్రయత్నంచే మనోబలం (చిత్తైకాగ్రత) సంపాదించారు. మనోబలం చేత బ్రహ్మపదప్రాప్తిని పొందారు. వారినిప్పుడు ఆ స్థానం నుండి తొలగించటం నా వల్ల కూడా కాదు కదా! ఆ విధంగానే, ఈ దేవతలలో, మానవులలో, జంతువులలో, తదితర పాతాళ జీవులలో కొంతమంది తమ యొక్క చిత్తైకాగ్రత్త మరియు, "జ్ఞాన, ఉపాసనలు" ఏమాత్రం త్యజించకుండా ఉంటున్నారు కూడా. నాయనా! ధ్యేయ వస్తువు (The aspect aimed at as the goal) నందు ఏకాగ్రచిత్తము కలిగి ఉంటే అట్టి చిత్తమును

---

* కొరత : పదునైన శూలమునకు శరీరమును నిలువుగా గ్రుచ్చటం.

శారీరక, మానసిక వ్యాధులుగాని, శాపములుగాని, విద్రోహచర్యలు గాని, పాప స్వభావులగు రాక్షసుల ప్రయత్నములు గాని విరమింపజేయలేవు. బండశిలను కమలము ఛేదించగలదా?

కొందరు శాపమును పొందినప్పుడు (నహుషుడు మొదలైనవారు) ఆయా శాపములచే నిర్ణయించ బడిన నూతన శరీరాలు పొందటం, జ్ఞానప్రాప్తి విషయంలో అసమర్థులై ఉండటం జరుగుచున్నమాట నిజమే. దానికి కారణం చిత్తము యొక్క అదృఢత్వమే సుమా! "నేను చచ్చాను. ఇప్పుడు నేను ఒక పామును అయ్యాను" అనునట్టి భ్రమాత్మకమైన అనుభవం ఒక జీవుడు పొందటానికి కారణం ... ఈ శరీరమును ఎంతో నమ్మికతో గాంచుటచేతనే. అనగా "నేను ఈ శరీరమును" అను భావనయే అట్టి దౌర్భాగ్యమునకు దారితీస్తోంది. అది కూడా చిత్తము యొక్క అశుభములకు దారితీయు ప్రయత్న రూపమే.

❖❖❖

# 9. సావధానులై ఉండండి!

సావధానచిత్తులైనవారు ఈ ప్రపంచమునందు జాగృత దశయందు గాని, స్వప్నమునందుగాని ఎట్టి దోషముల చేత కూడా పీడింపబడజాలరు. అసావధానచిత్తులే ఎప్పటికప్పుడు రాగ ద్వేషముల చేత, సుఖదుఃఖముల చేత, మాన అవమానముల చేత తాడనం పొందుచున్నారు. ఆ ద్వంద్వముల ప్రభావం చేత అనేక క్లేశములు అనుభవిస్తున్నారు. 'సంసారము' అని శాస్త్రములచే చెప్పబడుచున్నది ఏమిటి? ఈ జీవుడు నిజరూపమగు ఆత్మ విషయమై అసావధానచిత్తుడై ఉండుటయే సుమా! ఓ సర్వజనులారా! మీరు పురుష ప్రయత్నమునే ఆశ్రయించండి. మనస్సును మనస్సుచేతనే పవిత్రమార్గంలో నియోగించండి.

**మనసైవ మనస్తష్మా త్పౌరుషేణ పుమానిహ ।**
**స్వకమేవ స్వకేనైవ యోజయే త్పావనే పథి ॥** (సర్గ : 92; శ్లో. 28. )

అంతేగాని, "నేను ఈ శరీరమును. ఒకప్పుడు పుట్టుచున్నాను. మరొకప్పుడు చచ్చుచున్నాను. ఇవన్నీ నావి. వీరు నా వారు" అని పలుకుచు మీమీ చిత్తములను అల్పత్వమువైపు నియోగించకండి. 'అజ్ఞానము' అనే చీకటినూతిలోకి మిమ్ములను మీరే త్రోసివేసుకోకండి.

ఓ మునీంద్రా! ఈ చిత్తమునందు ఏ వస్తువు స్ఫురిస్తే అది రూఢిపడి క్రమంగా స్థూలత్వమును పొందుచున్నది. క్రమంగా అదియే అతనికి సత్యముగా తోచుచున్నది. తల్లి తన బిడ్డ మొరాయిస్తూ అల్లరిచేస్తున్నప్పుడు. "ఓయీ! అల్లరి మాను. లేదా, అటువైపు ఆ చీకట్లోకి చూడు. అక్కడ ఒక బూచి ఉన్నది.... కనిపిస్తోంది కదా! ఆ బూచిని పిలుస్తాను. ఆపై నీ ఇష్టం" అని, అంటూ ఉంటుంది. ఆ వాక్యములు ఆ బాలుని చిత్తమునందు ప్రవేశిస్తాయి. రూఢిపడతాయి. అప్పుడు అతనికి ఆ చీకట్లో నిజంగా 'బూచి' అనునదేదో కించిత్ కదలికలతో కనిపిస్తూ ఉంటుంది. మనస్సే అట్లు కల్పనచేసుకొని కనులతో చూస్తోంది.

ఈ మనస్సు ఆయా పురుష ప్రయత్నములచే ఎప్పటికప్పుడు యితః పూర్వపువాసనలను త్యజించివేస్తూ, నూతన – దృఢ వాసనల ప్రాబల్యంచేత నూతన రూపములుగా అగుచున్నది. ప్రవహించటం ప్రారంభించిన జలం ఒక క్షణంలో తరంగరూపం చెందుతోంది కదా! ఈ మనస్సు కూడా క్రొత్త క్రొత్త దృఢభావనలచే వెంటవెంటనే ధ్యేయ వస్తురూపమును పొందగలదు. అందుకే మానవుడు మనస్సును ఉత్తమభావనలవైపే నడిపించాలి.

దృఢభావనకు మహత్తరమైన శక్తి ఉన్నది. దృఢభావనచే మనస్సు సూర్యబింబమునందు కూడా అంధకారమును గాంచగలదు. ఓ కుమారా! సర్వము భావనామయమే సుమా! ఈ మనస్సు దేనిని భావిస్తే అద్దానినే శీఘ్రంగా పొందుచున్నది. అట్లు పొందినదానిని హర్ష విషాదములతో అనుభవించుచున్నది. "కర్తయగు మనస్సే భోక్త కూడా అగుచున్నది" అని మేము గ్రహిస్తున్న నిత్య సత్యమును ప్రకటిస్తున్నాము. దృఢభావనచే ఈ చిత్తము చంద్రుని యందు కూడా అనేక అగ్ని జ్వాలలు గాంచుచు, ఉష్ణత్వమును అనుభవించగలదు. దగ్ధమై, పరితాపం కూడా పొందగలదు. ఈ చిత్తము తన భావము చేత రాతినేలలో జలానుభవము పొంది ఆ జలమును త్రాగి తృప్తిగా నాట్యం చెయ్యగలదు. తన కల్పన చేతనే ఆకాశంలో గొప్ప వనమును దర్శించి ఆ వనంలో సంచరిస్తూ పుష్పాలను, ఫలములను కోయటం, వృక్షములను పెంచటం, నరకటం కూడా చెయ్యగలదు.

ఇట్లు మనస్సే బంధము, మనస్సే మోక్షము. మనస్సు తాను కల్పించిన ఇంద్రజాలమును తానే వీక్షించుచున్నది. జీవుని యొక్క జగద్దర్శనమంతా అట్టిదే సుమా!

❖

కాబట్టి ఓ వసిష్ఠ-విశ్వామిత్రులారా! సర్వ జనులారా! "ఈ జగత్తు సత్తు కాదు! అసత్తు కాదు." అనియే భావించండి. మీమీ ఉత్తమ ప్రయత్నములచే .... పలువిధములైన కల్పనలతో కూడిన ఈ పరిచ్ఛిన్నదృష్టిని క్రమక్రమంగా త్యజించండి.

"సర్వగామి, అఖండము, అద్వితీయము అయిఉన్నట్టి ఆత్మతత్వమునే 'నేను'. ఈ నా చిత్తముయొక్క స్వరూపము కూడా ఆ చిదాకాశతత్త్వమే"

అని భావించి, సర్వకల్పనలను త్యజించి, సుఖరూపులు అగుదురుగాక!

❖❖❖

# శ్రీవసిష్ఠ - రామచంద్రుల పరిశీలన

## 10. చిత్ర - విచిత్ర భ్రమలు - సమ్యక్‌దర్శనము

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నా తండ్రి బ్రహ్మదేవుడు ఆ సందర్భంలో నాకు, ఈ విశ్వామిత్ర మహర్షికి, తదితర మునివర్యులకు ఏమేమి చెప్పియున్నారో ... ఆ విషయాలు నీకు చెప్పాను. ఈ మనస్సు గురించి నా దృష్టిలో ఉన్నట్టి మరికొన్ని విషయాలు నీ ముందు ఉంచుతాను. విను.

❖

బ్రహ్మము సర్వదా అనిర్వచనీయము. వాక్కుకు అతీతము. అట్టి అనిర్దేశ్య తత్త్వమగు బ్రహ్మము నుండి మొట్టమొదట సర్వ వ్యాపకమగు అవ్యాకృతము ఉదయించింది. అది కాలక్రమంగా సంకల్ప వికల్పరూపమగు మనన శక్తిచే కొంత స్థూలత్వమును చెంది "మనస్సు" అగుచున్నది. ఆ మనస్సు ఒకానొకప్పుడు సూక్ష్మ భూత కల్పనతో కూడి ఉంటోంది. అప్పుడు అద్దానినుండి తేజోరూపమగు "సమష్ఠి లింగ శరీరాభిమాని" అయినట్టి "పురుషుడు" (పురుషకారమే స్వభావముగా గల తత్త్వము) ఉదయిస్తున్నాడు. అట్టి సమష్టిసృష్టి – అభిమానిని, 'బ్రహ్మ' అని, 'హిరణ్యగర్భుడు' అని, 'స్వయంభువు' అని – లక్షణములను దృష్టిలో పెట్టుకొని శాస్త్రములు వర్ణిస్తున్నాయి. ఈ సమష్ఠియగు ఆ బ్రహ్మ మనోరూపుడు మాత్రమే కదా! కనుక, మనోరూపమే జగత్తునకు కర్త అయి ఉన్నది.

మననతత్త్వమే ఆకారముగా గల భగవంతుడు బ్రహ్మదేవుడు 'సంకల్పరూపుడు' అయిఉన్నాడు. అతడు దేనిని ఎట్లు సంకల్పిస్తాడో, దానిని వెంటనే అట్లే దర్శిస్తూ, మరియు పొందుతూ ఉంటాడు. అతడు "సంకల్పసిద్ధి" కలవాడు. అతడు తనయొక్క సంకల్పశక్తి ప్రభావంచేత అవిద్యను* కల్పించినాడు.

అట్టి అవిద్యాకల్పన చేతనే బ్రహ్మదేవుడు ఈ పర్వత – తృణ – సముద్రయుక్తమగు జగత్తును సృజించారు. చిత్తమే స్వరూపముగా గల బ్రహ్మ నుండే సృష్టి జనించుచున్నది.

కాని కొందరు, "జడములగు పరమాణువుల చేతనే ఈ సృష్టి ఏర్పడినది" అని వాదిస్తున్నారు.

**పరమాత్మ భగవంతుడు – జగత్తు .... వేరు వేరు సిద్ధాంతములు**

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జగత్తు గురించిన వేరువేరు సిద్ధాంతములు ప్రవచించబడుచున్నాయి కదా! వాటి గురించి సంగ్రహంగా చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆయా వాదములలో కొన్నిటిని ఇక్కడ వివరిస్తాను.

1) పరమాణు వాదము : "జడములైన వేరు వేరు పరమాణువులే ఈ సృష్టి. పరమాణువులు తప్పిస్తే, ఇక ఎక్కడా ఏదీ లేదు. భగవంతుడు అనబడునదేదీ ఎక్కడా లేదు."

---

* అవిద్య = అనాత్మయందు ఆత్మాభిమానము కలుగజేయునది.

మనకు ఇది ఉత్కృష్టమైన సత్యమును ప్రసాదించగలుగుటలేదు. ఎందుచేతనంటావా? ఈ వస్తుజాలములన్నీ అనేక స్వరూప - స్వభావములు కలిగి ఉంటున్నాయి కదా! ఇంద్రియములకు వస్తువులకు ఒకానొక సానుకూల్యత ఎట్లా ఏర్పడుతోంది? ఈ పరమాణువులు ఇన్ని రకములుగా ఒనగూడవలసినదిగా శాసించుచున్నదెవరు? నాలుక-ఉప్పులందు ఆ సమన్వయమును కల్పించి, రుచి యొక్క అనుభవమును పొందింపచేస్తున్నదేది? కర్తయే లేకపోతే, ఈ సూర్య-చంద్ర-నక్షత్ర-భూమి-వృక్షాది చమత్కారమైన వస్తువులతో కూడిన ఈ జగన్నిర్మాణము ఎట్లా సిద్ధిస్తోంది?

2) ప్రధాన కారణ వాదము : ఈ వాదము ప్రతిపాదించు ద్రష్టలు "సర్వమునకు పరమాత్మయే కర్త" అని చెప్పుచున్నారు. అయితే "భగవంతుడు అసంగుడు. ఉదాసీనుడు. కార్య-కారణములకు అతీతుడు" అని సామవేదాదులు శ్లాఘిస్తున్నాయి. ఆయనకు ఈ సృష్టి కార్యము నిర్వర్తించుటవలన కలిగే ప్రయోజనం ఏమి ఉంటుంది? సర్వ ప్రయోజనములకు అతీతుడై, సాక్షీభూతుడైయున్న పరమాత్మ తత్త్వమునకు ఈ "జగత్ కర్తృత్వం" (Intention of designing th world) ఎట్లా ఆపాదిస్తాం? కనుక ప్రధాన కారణ వాదము కూడా సరిపోదనే మేము భావిస్తున్నాం.

3) విజ్ఞానకారణ వాదము : వీరు "భగవంతుడే ఈ జగత్తురూపమున వివర్తం పొందుచున్నాడు" అని చెప్పుచున్నారు. అయితే, చైతన్య స్వరూపుడగు భగవంతుడు జడరూపమును ఎట్లా పొందుతాడు? అందుచేత, ఈ విజ్ఞానవాదము కూడా అత్యుత్తమ సత్యము ప్రకటించలేదని అనిపించుచున్నది.

4) శూన్యవాదము : "శూన్యమునుండే ఈ జగత్తు వచ్చుచున్నది. కొంతకాలానికి శూన్యమునందే లయించపోబోవుచున్నది" అని వీరు చెప్పుచున్నారు. అయితే "శూన్యం నుండి పదార్థములు ఎట్లా ఎవరి కారణంగా ఎందుకు ఉత్పన్నములు అవుచున్నాయి?" ఈ ప్రశ్నకు సమాధానం లభించటం లేదు.

ఈ విధంగా, ఈ వాదములన్నీ ప్రకటించబడ్డాయి.

ఇక, ఈ విషయంలో మరొక అభిప్రాయం కూడా చెపుతాను, విను.

ఈ సృష్టి యథార్థానికి ఉత్పన్నమే అయి ఉండలేదు.

చైతన్యమే, అనిర్వచనీయమగు మాయాశక్తిచే, "నేను జీవుడను" అను సంకల్పమును స్వీకరించి తనయందు దీనినంతా ఇట్లు తానే గాంచుచున్నది. (తద్భావయ - తద్విశతే)! కనుక ద్రష్ట - దృశ్యములు 'అద్వితీయ చైతన్యము'నకు వేరైనవి కావు.

సముద్రములోని తరంగములవలె ఈ త్రిలోకములందలి పదార్థజాలమంతా .... స్వసంకల్పమే స్వరూపముగా గల సమష్టి మనోరూపము చేతనే ఉత్పన్నమగుచున్నది, భావించబడుచున్నది, అనుభవించబడుచున్నది. కనుక ఇదంతా భావనామయమే. సమష్టి మనోరూపప్రజ్ఞ కలిగినట్టి 'సమష్టి-అహంకారి'ని 'బ్రహ్మదేవుడు' అని పిలుస్తున్నాం.

❖

చైతన్యమే సమష్టి మనోరూపమున పదార్థ జాలమంతా సంకల్పించి దర్శించుచున్నది. చైతన్యము సంకల్పించనట్టి దానికి అస్థిత్వమే లేదు. కనుక, "ఈ జగత్తు ఉత్పత్తి కాకయే ఉన్నది" అని నిశ్చయించ

బడుతోంది. బ్రహ్మము యొక్క 'చిత్‌శక్తి'యే "సమష్టి అహంకారోపాధి యందు ప్రవేశించుచున్నాను" అను కల్పన చేయుచు హిరణ్యగర్భుని (బ్రహ్మదేవుని) పొందుచున్నది. వ్యష్టి-సమష్టి అహంకార ఉపాధులలోని చిదాభాస శక్తులు సర్వశక్తివంతమగు బ్రహ్మముకంటే వేరేమీ కాదు. అనగా, ప్రతి వ్యక్తీ బ్రహ్మమే అయిఉన్నాడు. కాని అజ్ఞానముచే "నేను జీవుడను. నేను శరీరధారిని. పరిమితుడను" .... ఇట్లు అనేక విధములుగా భ్రమించుచున్నాడు. 'అవిచారణ' (Non enquiry) ఉన్నంతవరకు ఈ భ్రమ ఉంటూనే ఉంటుంది.

సూర్యుని నుండి వేలాది కిరణములు బయలుదేరుచున్నాయి. అయితే ఆ వివిధ కిరణములన్నీ సూర్యుని నుండి వేరైనవా? కావు కదా! అదేవిధంగా, బ్రహ్మదేవునియొక్క వివర్తభావము పొందిన వివిధ శక్తులే ఇట్లు అనేక జీవుల వలె ప్రకటితం అగుచున్నాయి. ప్రతి ఒక్క కిరణము వేరువేరైన వస్తువులపై ప్రసరించవచ్చుగాక ! కాని, అనేక సూర్యకిరణములలో ఏకత్వమే సత్యము కదా! బ్రహ్మదేవుడు, అతని నుండి ప్రసరించుచున్న ఈ వ్యష్టిజీవులు .... వీరంతా చైతన్యముకంటే వేరైన వారు కారు. సమష్టి జీవుని సంకల్పము సుదృఢం అగుచున్న సమయంలోనే ఈ జగత్తు ఆవిర్భవించు చున్నది. సమష్టి జీవుడే వివిధ జీవులుగా అయి, ఈ జగత్తును అనుభవించుచున్నాడు.

ఇందలి ప్రతిజీవి సమష్టిజీవుని తత్త్వమే అయి ఉన్నది.

సమష్టిజీవుడు బ్రహ్మముకంటే వేరు కాదు. వ్యష్టి జీవుడు కూడా బ్రహ్మమే.

ఈ జీవులంతా 'చిదాకాశము' నుండే బయలుదేరియున్నారు. అట్లు బయలుదేరి మాయాకాశ మందలి పంచభూతమాత్రమగు ఉపాధులతో కలయుచున్నారు. "అన్నివేళలందూ వీరంతా చిదాకాశ స్వరూపులే" అని వేదవాక్యములు ప్రకటిస్తున్నాయి కదా! వీరు "వాసనలు, కర్మలు" అనుసరించి స్థావర జంగమ రూపాలను పొందుచున్నారు. ప్రాణశక్తి ద్వారా వీర్య-రక్తాది రూపమున బీజత్వమును పొందుచున్నారు. అయినప్పటికీ తమయొక్క చిదాకాశత్వమును త్యజించుట లేదు. అట్లు బీజత్వము పొంది, యోనిమండలమునుండి వారు ఈ జగత్తున ఉత్పన్నమగుచున్నారు. కాకతాళీయ న్యాయముచే సంభవించిన వాసనాజాలమును అనుసరించి తమ తమ కర్మఫలములను అనుభవించుచున్నారు. శుభాశుభవాసనలతో కూడుకొని "పుణ్య-పాపకర్మలు" అనే త్రాడుచే కట్టబడి లింగశరీరాలను ధరించుచున్నారు. ఒకప్పుడు ఉత్తమలోకములకు, మరొకప్పుడు నరకలోకములకు పోవుచున్నారు.

❖❖❖

# 11. ఇచ్ఛారూపములు

ఈ ప్రాణులన్నీ ఇచ్ఛారూపములే అయి ఉన్నవి సుమా! అనగా 'చిత్తశక్తి' తన ఇచ్ఛను అనుసరించే ఈ ఏకానేక రూపములను ధరించుచున్నది. ఈ జీవులు తాము గాఢముగా కోరుకొన్నట్టి ఉపాధులను భావాభావములను పొందుచున్నారు.* రామచంద్రా! మరొక చెప్పుచున్నాను. విను.

---

* కామమయయేవాయమ్ పురుషః = ఈ జీవుడు ఇష్టమే స్వరూపముగా కలిగియున్నాడు –శ్రుతి

ఆయా జీవులు తమ ఇచ్ఛను అనుసరించే అసంఖ్యాకములగు జన్మలు పొందుచున్నారు. సంసారములోని చమత్కృతులన్నీ మరల మరల అనుభవిస్తున్నారు. వాసనలను అనుసరించి వర్తించుచూ 'కర్మ' అనే వాయువీచికలచే ఒకచోటినుండి మరొకచోటికి ఎగురగొట్టబడుచు సంచరిస్తున్నారు. ఒకానొక జన్మయందు ఈ జీవుడు యాదృచ్ఛికంగా "నేను ఉపాధిమాత్రుడనుగాను. ఈ కార్య-కారణములకు (Cause & effect) సంబంధించినవాడను కూడా కాను; కార్య-కారణరహితమగు ఆత్మయే నేను" అనునట్టి ఆత్మజ్ఞానమును సముపార్జించుచున్నాడు. అట్టి ఆత్మ జ్ఞానము యొక్క ప్రభావం చేత 'ముక్తుడు' అగుచున్నాడు. ఈ జన్మ, కర్మ, దృశ్యాదులను తన ఆత్మ యొక్క జడంశముగా ఆస్వాదిస్తూ ఆత్మత్వమును పుణికి పుచ్చుకొని ఉంటున్నాడు.

మరికొందరు జీవులు తమ స్వస్వరూపమే అయి ఉన్నట్టి చిద్వస్తువును ఎరుగుటలేదు. అజ్ఞానముచే మోహితులై అనేక కల్పముల పర్యంతము ఈ ప్రపంచములో జన్మిస్తూనే ఉన్నారు. ఇంకా కొందరు శుభజన్మలను అనుభవించినవారై, ఈ జన్మలో కూడా శుభకర్మపరాయణులై ఉంటున్నారు. అట్టి శుభకర్మపరాయణులు కొద్ది జన్మలలో ముక్తిని పొందగలరు. సముద్రంలో ఆవిరి రూపమున లేచిన జలము ఎప్పటికో సముద్రమే జేరుచున్నది కదా! ఈ జీవులంతా ఒకానొకప్పుడు తమ స్వస్వరూప స్థితినుండి చ్యుతిపొంది ఈ సంసారారణ్యంలో అశాంతిగా, అవిశ్రాంతిగా సంచరిస్తూ ఉన్నారు. తత్త్వజ్ఞానము పొందనంతవరకు ఆ సంచారము కొనసాగుతూనే ఉంటుంది. ఉత్తమం, ప్రశాంతం అయిన మోక్ష స్థితియే సర్వజీవులలోని అంతర్లీనమై ఉంటున్న ఆర్తి సుమా!

ఓ దశరథవరపుత్రా! రామచంద్రా! ఈ విధంగా జీవులందరి ఉత్పత్తి బ్రహ్మము నుండే కలుగుచున్నది. బ్రహ్మము ఏమాత్రం మార్పు-చేర్పులు పొందక, యథాతథంగా ఉండియుండగా .... ఈ మనస్సు మాత్రం అనేక ఆవిర్భావ, తిరోభావములను కలిగి ఉంటోంది. క్షణభంగురములైన ఈ జన్మలను చూచుకొని, ఎప్పటికప్పుడు "ఇట్లు ఇప్పుడు ఇక్కడ కనబడుచున్నదంతా ఇట్లే సర్వదా శాశ్వతంగా ఉండబోవుచున్నది" అని భ్రమిస్తోంది. అనేక జన్మలకు కారణమై ప్రవర్తిస్తున్న "వాసనలు" అనువాటిచే వ్యాకులత్వము పొందుతోంది. సంసార జ్వరముచే పీడింపబడుచున్న జనులకు అనేక సంకటములు, అనర్థములు కలుగజేస్తున్నది ఎవరనుకొంటున్నావు? ఈ మనస్సే సుమా! ఇది ద్రష్టను (లేక జీవుని) అనేక దిక్కులందు, అనేక దేశములందు, అనేక కాలములందు సంచరింపజేస్తోంది. చిత్రవిచిత్రములైన భ్రమలను కలుగజేస్తూ, అనేక విక్షేపములతో కూడియున్న ఈ మనస్సును "సమ్యక్‌జ్ఞానము" (Perception of Unity in Diversity) అనే గండ్రగొడ్డలిచే నరికివేయాలి. అప్పుడు అది ఇక ఈ జగత్తు అనే మహారణ్యంలో మరల ఉత్పన్నము కాదు. సమ్యక్‌జ్ఞానమే ఈ జీవుని యొక్క సంసారవ్యాధికి దివ్యమైన ఔషధం.

❖❖❖

# 12. జీవుల విభాగము

ఓ రామచంద్రా! బ్రహ్మవస్తువు సర్వదా అన్నిచోట్ల అభేదరీతిలోనే ఉండిఉంటోంది. కాని, త్రిగుణములతో కూడుకొన్నదై, "సాత్విక-రాజసిక-తామస" గుణభేదములచే ఈ లోకంలో ప్రకటిత మగుచున్నది. అనేక కెరటములవంటి ఈ అనేక జీవులు శాస్త్రములచే విభాగించబడి జ్ఞానాభివృద్ధి కొరకు వర్ణించి చెప్పబడుచున్నారు. అట్టి ఉత్తమ-మధ్యమ జీవుల ఉత్పత్తి గురించి చెపుతాను విను.

**ఈ ప్రపంచంలో కనిపించే జీవుల విభాగం**

(1) 'ఇదం ప్రథమతా' జన్మ : ఒకానొకడు ఇంతకుముందు కల్పములోని చివరి జన్మయందు తన యొక్క అనేక ప్రయత్నముల సహాయంచేత "శమము - దమము" సంపాదించియే ఉంటాడు. కాని జ్ఞాన విశ్లేషణం వినక పోవటంచేతనో, లేక ఏవైనా బలవత్తరమైన విఘ్నములు కలగటం చేతనో జ్ఞానప్రాప్తిని, స్వస్వరూప అనుభవమును పొంది ఉండడు. ఇప్పుడు ఈ కల్పమునందు జన్మను పొందియుంటాడు. ఇట్టివాడు బాల్యమునుండే శమ - దమాది గుణములు, భక్తి, సాత్విక భావములు కలిగియుంటాడు. కనుక, జ్ఞాన ప్రాప్తికి యోగ్యుడు అగుచున్నాడు. ఇట్టివారిలో కొందరు ప్రవక్తలై తమ బోధామృతంచే అనేకులను అజ్ఞానాంధకారం నుండి కాపాడుతూ ఉంటారు.

అయితే పూర్వకల్పము నందు పూర్ణముగా శుభాభ్యాసము కలిగియున్నవారే ఈ "ఇదం ప్రథమతా" అనే విభాగానికి చెంది యుంటారు. వారు ఈ జన్మ యందో, లేక మరు జన్మ యందో ముక్తికి అర్హులు అగుచూ ఉంటారు.

(2) ఉత్తమ సంపన్నమైన జన్మ (గుణపీవరీ) : వీరు ఇంకా ఇదంప్రథములంతటి తీవ్రవైరాగ్యం పొందియుండరు. పుణ్యలోకముల కొరకై ఉపాసనాదులను మాత్రం ఇంకా చేస్తూ ఉంటారు. వీరు ఇక పది లేక పదిహేను జన్మలలో ముక్తులు అగుటకు క్రమంగా సిద్ధమగుచున్నారు.

(3) స-సత్వులు : వీరు గుణపీవరీల తరువాత తరగతికి చెందినవారు. వీరు పుణ్య పాపములతో కూడుకొనిన మిశ్రమ కర్మలు నిర్వర్తిస్తూ ఆయా సుఖ-దుఃఖములను పొందుచూ ఉన్నారు. కాని "మేము మెల్లమెల్లగా సత్వగుణమును పెంపొందించుకొనెదముగాక" అను ఉత్తమమైన లక్ష్యము, ఆశయము కలిగిఉంటున్నారు. ఉత్తమ కర్మలవైపు ఇంకనూ శ్రద్ధను అభివృద్ధి చేసుకోవలసి ఉన్నది.

వీరు సుమారు వంద జన్మలలో సత్వగుణమును ఆరూఢం చేసుకోగలరు. క్రమంగా ముక్తిని పొందటానికి సిద్ధమౌతున్నారు.

(4) అధమసత్వులు : వీరు విచిత్రములైన ప్రాపంచికవాసనలు కలిగి వ్యవహరిస్తూ ఉంటారు. మలినమైన అంతఃకరణముతో ఆయా సుఖదుఃఖరూపములుగల ఫలముల కొరకై మరల మరల ఆశ్రయించటం, జన్మలు ఎత్తటం చేస్తూ ఉంటారు. వారు తమ "దృష్టి"ని పరిశీలించుకొనే దాకా అట్లు వేలాది జన్మలు ఎత్తుతూనే ఉంటారు. వీరికి అశ్రద్ధ బాగా ఉండి ఉంటుంది. కాని, అధ్యాత్మశాస్త్రం పట్ల (ఆత్మ విషయమై విచారణ పట్ల) విముఖత మాత్రం కలిగి ఉండరు. కనుక, వారు అభివృద్ధి

చెందుటకు అనేక అవకాశములు కలిగియే ఉంటారు. ఏవైనా ఉత్తమ సంఘటనల వలన గాని, కాకతాళీయంగా గురువులబోధ వినుటచేతగాని వీరు ఆత్మజ్ఞానము వైపు సుముఖులు కావటానికి కొంత అంతరంగమునందు సిద్ధపడే ఉంటారు.

(5) అత్యంత తామసీ : వీరు కూడా కొంత వరకు అధమసత్త్వుల లక్షణములే కలిగి ఉంటారు. అయితే వీరు అధ్యాత్మశాస్త్రం పట్ల విముఖత్వము (disliking, Non-accepting) కలిగి ఉంటారు. సర్వదా అనేక సంశయములచే – శాస్త్రము యొక్క, గురువుల యొక్క సామీప్యతను తిరస్కరిస్తూ ఉంటారు. ఎన్నో కల్పములు, వేలకొలది జన్మలు గడచిపోవచ్చుగాక! "ఆత్మవస్తువు" అనే దూరస్త వస్తువు వైపు పయనించే విషయంలో, వీరికి వీరియొక్క సంశయత్వము–ప్రయత్నరాహిత్యములే అడ్డుపడుతూ ఉంటాయి.

(6) రాజసులు : వీరు పూర్వ కల్పమునందలి తమయందు శేషించియున్న వాసనలను అనుసరించి విచిత్ర కర్మాచరణములు కలిగి ఉంటూ ఉంటారు. అనేక మధ్యరకపు (జంతు) జన్మలు ఎత్తుతూ ఉంటారు. అయితే వారిలో "ప్రయత్నము" అను రూపముగల ఆర్తి బయలుదేరింది. అందుచేత వారు కొన్ని జన్మలలో మనుష్యత్వమును గ్రహించి, ఆ తరువాత కర్మానుసారంగా స్వర్గ – నరకములకు వెళ్ళివస్తూ మరి కొన్ని జన్మలు గడుపుతారు. వారు మోక్షప్రాప్తియందు ఏమాత్రం నిశ్చయం ప్రస్తుతానికి కలిగిలేరు.

(7) రాజస – సాత్త్వికులు : వీరికి ఇప్పుడిప్పుడే వైరాగ్యం కొంచం కొంచెం ఉదయించుచున్నది. సమీపంలోనే 'జ్ఞానప్రాప్తి' సిద్ధించు జన్మలను పొందగలరు. మోక్షార్హమైన ఉపాధులను పొందుచు, మోక్షప్రాప్తికి యోగ్యమైన కర్మాచరణం కలవారై ఉంటారు. వీరు కొంత నిశ్చలబుద్ధి గల మోక్ష – యత్నపరులని అనవచ్చు. వీరు ఇప్పటికి ఇంకా పూర్ణమైన 'లక్ష్యశుద్ధి' ఏర్పడి ఉండకపోవచ్చు. కాని వారి యందలి ప్రయత్నశీలత్వమే వారి కవచం.

(8) రాజస–రాజసులు : వీరు యక్ష – గంధర్వ యోనులలో ఎక్కువగా పుట్టుచూ ఉంటారు. కొలది జన్మలలో 'రాజస–సాత్త్వికత'ను స్వీకరించనున్నారు. అప్పటినుండి ముక్తికొరకై యత్నించగలరు. వర్తమానంలో మాత్రం 'ముక్తి' యొక్క శబ్దార్థములు వారికి తెలియవు. వీరు సర్వదా ఏవేవో మానసిక, శారీరక క్రియావ్యవహారములందు నిమగ్నులగుచు, స్వప్నంలోలాగా విజ్ఞాన దృష్టి లేకుండా కాలం గడుపుచున్నారు.

(9) రాజస–తామసులు : వీరు అల్పమైన ప్రయత్నము కలవారు. ఎన్ని వందల జన్మల తరువాతో గాని, వారియందు 'ప్రయత్నము' అనునది కొంత వేగం పుంజుకోదు. వీరు ఎప్పటికో 'రాజస రాజసులు' ఆపై, రాజస సాత్త్వికులు కాబోవుచున్నారు. వీరు "అత్యంత తామసీలు" సమానమే.

(10) రాజసాత్యంతామసీలు : వీరు తమస్సుచే ఆవరించబడి కార్యములను చేస్తూ ఉంటారు. ఎన్ని వేల జన్మలు జరుగుచున్నప్పటికీ "నేనేమిటి? నేనెవ్వరు?" అనే విషయం వారి దృష్టిన పడుటయే లేదు.

(11) తామసులు : వీరు ఇప్పటికే అనేక కల్పములందు జన్మించారు. బహుకాలం జరిగి పోయింది. మోక్ష విషయమై ఒకానొక ప్రగాఢ నిద్ర అనుభవిస్తున్నారు. ఎవ్వరేది చెప్పినా వినుటలేదు. వారికి తోచుటలేదు. కాని, వీరిలో కొందరు వర్తమాన జన్మను సార్థకపరచుకొనువారు కూడా లేకపోలేదు సుమా!

(12) తామస-సత్వులు : తామసులై ఉండి, మోక్షప్రాప్తికి యోగ్యమైన కార్యాచరణం ప్రారంభిస్తున్నారు. అట్లు ప్రారంభించి ఉత్తమ పదమును పొందిన ఉదాహరణలు కూడా అనేకం (కర్కటి, ప్రహ్లాదుడు ఇట్టివారే).

(13) తమోరాజసులు : దూరంగా ఎక్కడో మినుకు మినుకుమంటున్న కాంతిని చూచి, అటువైపు వెళ్ళుట గురించి యోచించుచున్నట్లు, ఈ తమోరాజసులు ఇప్పుడిప్పుడే ప్రయత్నశీలుర గుచున్నారు. వీరు కొన్ని జన్మలలో అట్లే కొంచము కొంచము ప్రయత్నశీలురగుచు ఉంటారు. ఆ ప్రయత్నముల నుండి విముఖులు కాకపోతే, వీరు తామససత్వులు కాగలరు.

(14) తామస-తామసులు : వీరు ఇప్పటికే అనేకవేల స్థావర జంగమ జన్మలు ఎత్తారు. ఇంకా ఎంతగానో జన్మిస్తూ పోవాలనే దృష్టియే కలిగి ఉంటున్నారు. వీరు ఎప్పటికి ఎట్లు జ్ఞానము వైపు దృష్టి మరల్చుతారో ఎవ్వరం చెప్పలేం. వీరు అత్యంత తామసులు.

లక్షలాది జన్మలు గడచిపోతున్నాయి. 'జ్ఞానం' విషయమై మూఢత్వం ఆవరించి ఉన్నది. మార్పు చేర్పులు లేవు. ప్రగాఢమగు దుఃఖ మోహములు ఆక్రమించివేసి ఉన్నాయి. వారు ఏమాత్రం ముక్తి గురించి వినరు, చూడరు. వారికేమీ తెలియదు. మౌనము, మౌఢ్యము వారి యందు తాండవిస్తున్నాయి. అయితే, వారందరిలో ఎవ్వరైనా-ఏక్షణంలోనైనా నిదురలేచి 'ఆత్మజ్ఞానం' వైపుగా అడుగులు వేయటానికి, నడచి వెళ్ళుటకు సర్వదా 'సంసిద్ధత' అంతరంగమున కలిగియే ఉన్నారు.

**అంతా బ్రహ్మమే**

ఓ రామచంద్రా! భిన్నభిన్న ఉపాధులు (Physical bodies) గల ఈ జీవజాతులన్నీ బ్రహ్మము నుండే ఉత్పన్నమౌతున్నాయి. బ్రహ్మమునకు వేరైనవి కావు. చలించుచున్న సముద్ర జలంలో అసంఖ్యాకంగా తరంగాలు బయల్వెడలుచున్నాయి కదా! ఆ తరంగములన్నీ జలముకంటే వేరైనవా? కాదు. దీపం నుండి వేలాది కిరణములు ప్రసరిస్తున్నాయి. ఆ కిరణములు దీపం కంటే వేరైన అస్థిత్వం కలిగి ఉంటున్నాయా? లేదు. అట్లే ఆ సర్వవిధ భౌతిక, మానసిక స్థితిగతులతో ప్రకటిత మగుచున్న జీవరాసులన్నీ బ్రహ్మముకంటే వేరుకాదు. ప్రజ్వలించుచున్న అగ్నినుండి సన్నటి కాంతి పుంజములు లేచుచున్నట్లు, ఈ ప్రాణికోట్లన్నీ బ్రహ్మమునుండే ప్రభవిస్తున్నాయి. వృక్షం నుండి శాఖల వలె, బంగారము నుండి ఆభరణములవలె, జలము నుండి "జలబిందువులు - ఆవర్తములు- తరంగములు-బుడగలు" వలె, చంద్రబింబము నుండి చంద్రకిరణములవలె, మహాకాశం నుండి ఘటాకాశం వలె .... బ్రహ్మం నుండే ఈ ప్రాణికోట్లు, అవి దర్శించుచున్న దృశ్యములు ఉత్పన్న మవుతున్నాయి.

ఎండమావులలో జలతరంగముల అనుభూతి కలుగుతూ ఉంటుంది. ఆ ఎండమావులు సూర్యకాంతి కన్నా వేరైనదాని మూలంగా ఏర్పడుట లేదుకదా? సూర్యకాంతి ప్రసరించకుంటే ఎండమావులే ఏర్పడేవికావు. ఈ ద్రష్ట బ్రహ్మము యొక్క స్వరూపమే. ద్రష్ట యొక్క దృష్టిని అనుసరించే దృశ్యం ఉంటోంది. మనం ఇప్పుడు చెప్పుకొన్న అనేక విభాగములతో కూడిన జీవజాతులన్నీ ఏ పరమాత్మ నుండి ఆవిర్భవిస్తున్నాయో, ఆ పరమాత్మయందే లీనమౌతున్నాయి.* కొన్ని లేచిన కొద్ది క్షణాలకే లీనమౌతున్నాయి. మరికొన్ని అనేక జన్మల తరువాత ఎప్పటికో లీనమౌతున్నాయి.

ఏది ఏమైనప్పటికీ, జగత్తుకు బ్రహ్మమునకు భేదం లేదు. ఈ రెండిటికీ జల-తరంగముల సంబంధమే దృష్టాంతము. మరి ఈ కనబడుచున్న అనేకత్వము మాట ఏమిటంటావా? ఉపాధులందు ద్రష్ట కలిగియుంటున్న భ్రమాత్మకమైన దృష్టి కారణంగానే ఈ భేద ప్రతీతి అంతా ఏర్పడుతోంది. ఈ జీవజాతులన్నీ ఉపాధిభేదం చేత బ్రహ్మాండములందు అంతటా వ్యవహరిస్తున్నాయి. మరల ఆ సర్వేశ్వరుని యందే లయిస్తున్నాయి. వ్యవహరిస్తున్నట్టి సమయంలో స్వర్గాదులకు పోతున్నాయి. మరల అక్కడి నుండి అధోలోకములైనట్టి నరకాదులకు వెళ్ళుచు, పరిభ్రమిస్తున్నాయి. మాయ యొక్క చమత్కారం అట్టిది. అది అనిర్వచనీయం, అద్భుతం.

అయితే నాయనా! రామచంద్రా! ఇదంతా చూచి నీవు భ్రమించవలసిన పనేమీ లేదు.

ఆ సర్వేశ్వరుని శరణువేడు. సర్వదా సర్వేశ్వరత్వమును ఆరాధించు. ఆ సర్వేశ్వరత్వమునే భావించు.

"ఇదంతా నాదే. నేనే ఈ సర్వమునందు అంతర్లీనంగా ప్రసరించియున్నాను. నేను కానిదంటూ ఎక్కడా ఏదీలేదు".... అను సంభావనను ఆశ్రయించు.

మనస్సులో ఉండే దోషభావనలన్నీ తొలగించుకొని, నిర్మలుడవుకమ్ము.

ఆత్మారాముడవై విరాజిల్లు. ఈ దృశ్యమంతా నీ స్వస్వరూపంగా ఆస్వాదించు.

❖❖❖

# 13. జీవుల ఉత్పత్తి స్థానము

**శ్రీరాముడు :** హే సద్గురూ! "బ్రహ్మము నుండే ఈ జీవులు ఉత్పన్నమైనారు" అని చెప్పబడుచున్నది కదా! అట్టి వ్యవహారమును కలుగజేయుచున్న ఫలప్రదాత ఎవ్వరై ఉన్నారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఒక వృక్షమునుండి ఆ వృక్షము యొక్క పూలు, ఆ పూలలోని సుగంధము – ఆ వృక్షమునకు అభిన్నమైనవే కదా! అట్లే కర్త, ఆ కర్త యొక్క క్రియ ఏకమే అయి ఉంటాయి. ఈ కర్త – క్రియలనబడు రెండూ కూడా పరమపదమైనట్టి బ్రహ్మము నుండే వ్యక్తము

---

* లీనమగుట = ఆత్మభావము నందు సువ్యవస్థమై ఉండుట (లేక) "నేను బ్రహ్మమునే" అను అఖండ – అప్రమేయ–అద్వితీయ–సర్వనియామక–"తత్త్వభావం" అవధరించి ఉండటం.

లవుతున్నాయి. ఇక్కడ చమత్కారం చూచావా? వాస్తవానికి ఏ కల్పనలు ఉండనట్టి నిర్మల– పరబ్రహ్మము నందు అజ్ఞానముచే జీవత్వము స్ఫురించుచున్నది. ఆకాశంలో, 'లేని నీలత్వం' కనిపిస్తోందికదా! ఇది కూడా అట్టిదే.

"ఈ జీవులు బ్రహ్మము నుండి ఉత్పన్నమయ్యారు" అనేదికూడా అసత్యమైన సిద్ధాంతమేనని, అది అజ్ఞానముచేతనే ప్రబలుచున్నదని గ్రహించు. పూర్ణాత్మ జ్ఞానులు ఉండేచోట ఇట్టి భ్రాంతి వాక్యములకు చోటు ఉండదు. ఎందుకంటే ద్వైతకల్పన ఉన్నచోట మాత్రమే, "ఒకదాని నుండి, మరొకటి ఉత్పన్నమగుట" అనే దర్శనము ఏర్పడగలదు. "ద్రష్టయే దృశ్యమును కల్పించి దర్శించుటచే, ద్రష్ట కంటే వేరుగా దృశ్యము లేదు" అను అవగాహనతో కూడిన అద్వైతస్థితియందు విజ్ఞానము సుస్థిరపడినప్పుడు, ఇక ఆపై అట్టి భేదభావనయే ఉండదు.

అయితే గురువులు తమ శిష్యులయందు ఉత్తమోత్తమమైన లక్ష్యము రూపుదిద్దుకొనుటకు వీలుగా ఒకానొక బోధక్రమమును రచించుచూ, "ఇది బ్రహ్మము, వీరు జీవులు. వీరు బ్రహ్మమునుండే బహిర్గతమయ్యారు" అను ద్వైత కల్పనను ప్రతిపాదిస్తున్నారు. ఇదంతా బోధ కలిగించుటకే అయి ఉంది. లోకము నందు గాంచబడేది కూడా ఇట్టి కల్పనాక్రమమే. ఒకవేళ 'అద్వితీయమగు బ్రహ్మము నుండే లేక అసంగుడగు పరమాత్మ నుండే ఈ కనబడేదంతా ఉత్పన్నమౌతోంది" అని చెప్పుకొన్నా, అట్లు ఉత్పన్నమగుటకు ఉపాదానకారణం బ్రహ్మమే (లేక పరమాత్మయే) అయిఉండాలి. ఎందుకంటే పరమాత్మను నియమించునది మరేదీ ఉండజాలదుకదా! కనుక, "ఈ జగత్తు బ్రహ్మము యొక్క రూపమే. ద్రష్ట బ్రహ్మము కంటే వేరైనవాడు కాదు" అని మనకు ఇక్కడ సిద్ధిస్తోంది. ఎందుకంటావా?

"ఉత్పత్తి"కి ముందు ఈ జగత్తు ఎక్కడ ఉన్నది? బ్రహ్మమునందే సంస్కారరూపంలో అణిగియున్నది సుమా! బ్రహ్మము ద్రష్ట–దర్శనములకు ముందే, దేనిచేతనూ తాకబడక, అసంగమైయున్నది. భ్రాంతిచే "ఉత్పత్తి–ఆకారము–భావన–అనుభవము" అను రూపములతో కూడి ఈ జగత్తు ప్రాప్తి స్తోంది. భ్రాంతిచేత బ్రహ్మమే ఇట్లు జగత్తుగా కనిపించటం జరుగుచున్నదని మేము సిద్ధాంతీకరిస్తున్నాం.

❖

అసంఖ్యాకములైన ఈ జీవరాసులన్నీ బ్రహ్మము నుండే ఉత్పన్నమై మరల ఆ పరమపదమగు బ్రహ్మమునందే లయించుచున్నాయి. జలములోనే బుద్బుదములు (Bubbles) లేచి లీనమగు చున్నాయి కదా! త్రికాలము* లందు ఈ జీవరాసుల "సృష్టి–స్థితి–లయలు" అనే ప్రక్రియ ఇట్లే జరుగుచున్నది. అయితే, పురుషునికి, అతని కర్మలకు పుష్ప–గంధముల వలె భేదం లేదు. జలము–జల కదలికల వలె అవి రెండూ పరమాత్మ నుండే ఉత్పన్నమై, తిరిగి పరమాత్మ యందే లయించుచున్నాయి.

**శ్రీరాముడు :** మునీంద్రా! మనకు ఈ దైత్య–నాగ–మనుష్య–దేవత–జంతు రూపములలో పాంచభౌతిక ఉపాధులు కనిపిస్తున్నాయి కదా! ఇవన్నీ ఎట్లా ఏర్పడుమన్నాయి?

---

* త్రికాలములు = సృష్టి – స్థితి – లయములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మరల మరల ఏర్పడుచున్న పాంచభౌతిక ఉపాధులన్నిటినీ నిర్మించుచున్నది అంతరంగములోని వాసనలే. వాసనలు ప్రియాప్రియ సంకల్పములకు వేరుగా ఏవీ కావు కదా! బాహ్యమునందు ఏర్పడుచున్న ప్రియ–అప్రియములకు మూల కారణం ఆత్మయొక్క విస్మరణమే సుమా! "ఆత్మ యొక్క స్వరూపమును ఏమరిచియుండుట" అనుదానికి వేరుగా జన్మాంతర ఫలదాత ఏదీ లేనేలేదు. "బాహ్యమున ఎక్కడో ఉండి ఎవ్వరో ఏదో చేస్తున్నారు" అనునదంతా వాస్తవం కాదు. ద్రష్ట యొక్క (1) అభిలాష, (2) ఆత్మవిస్మరణ.... ఈ రెండే అంతటికీ కారణమగుచున్నదని గ్రహించు. వాస్తవానికి జన్మలు లేవు, కర్మలు లేవు.

❖❖❖

## 14. "కర్మలు - ప్రభావములు" ఉన్నాయా? లేవా?

**శ్రీరాముడు :** మహాత్మా! "జన్మలూ లేవు – కర్మలూ లేవు" అని మీరు అంటున్నప్పుడు, నాకు చాలా సందేహాలు వస్తున్నాయి. రాగరహితులైన పెద్దలచే ఈ లోకమున వేదసమ్మతంగా ధర్మము, వ్రతము మొదలైనవి నిర్ణయించబడినాయికదా! అట్లాగే స్మృతులు, పురాణాలు, కాలకల్పసూత్రములు ప్రవచించే ఇతిహాసములు మొదలైనవి, కూడా ఉన్నాయి. "నాయనలారా! ఇది పుణ్యం. ఇది పాపం. ఇది ఇట్లా చేయండి. అది అట్లు చేయకండి" అని ఆయా విధి–విధానములను శాస్త్రములు జనులకు చెప్పుచున్నాయి.

ఈ ప్రపంచంలో విశుద్ధ సత్వగుణోపేతులు, ధీరులు, చక్కటి సమదృష్టి కలవారు, బ్రహ్మ సాక్షాత్కారము పొందియున్నవారు అగు సాధువులు సంచరిస్తున్నారు. వారి వాక్కులు, వారి ఆచరణలు, వారి శాస్త్రవ్యాఖ్యానములు తత్వజ్ఞానానుభవం లేని అనేకులకు ప్రమాణాలు అవుచున్నాయి. అనుసరణీయమౌతున్నాయి. అట్టి శాస్త్రనియమములు, ఆర్యనిర్ణయములు అనుసరించి అనేక మంది జనులు తమయొక్క ఉచిత – అనుచితములను నిర్ణయించుకొని, అప్పుడు ప్రవర్తిస్తున్నారు. కొందరైతే – "ఇతడు సాధువులు చెప్పిన మార్గంలో నడచుకోవటంలేదు. అందుచేత ఇతనిని మేము బహిష్కరిస్తున్నాం" అని కూడా అంటూ ఉంటారు. సంధ్యావందనము వంటి శిష్టాచారములను అనుసరించని వారికి దుఃఖమే కలుగగలదని లోకప్రతీతి కూడా ఉన్నది.

పైగా మహాత్మా! ఈ "కర్మ–కర్త" అను రెండూ కూడా, ఒకదానిచే మరొకటి కలుగుచున్నవని లోకంలో అంటూ ఉంటారు. శాస్త్రప్రతీతి కూడా అట్లాగే ఉంటోంది. అనగా, "కర్మచేత కర్త ఏర్పడుతుంది. కర్త, కర్మని సిద్ధింపచేస్తోంది. చెట్టు నుండి విత్తు, విత్తునుండి చెట్టు ఏర్పడుచున్నట్లు.... జీవుని వలన కర్మ, ఆ కర్మ వలన జీవుడు ఉనికిని ఏర్పాటు చేసుకొంటున్నారు" అని అర్థం అవుతోంది. మీరు చెప్పుచున్నట్లుగానే, ఈ జీవుడు ఏ వాసన కలిగియుండి ఈ సంసార పంజరంలోనికి త్రోయబడుచున్నాడో అట్టి వాసనలను అనుసరించే ఫలానుభవములను కూడా పొందటం జరుగుతోంది. వాసనలే జన్మకు మూలం. ఆ వాసనలు ఏర్పడుచున్నది ఎక్కడినుండి? కర్మలనుండే కదా!

మహర్షీ! ఇదంతా ఇట్లుండగా, ఇప్పుడు అసలు నా సందేహమేమిటో చెపుతాను. వినండి.

"జన్మకు బీజభూతమైన కర్మ అంటూ ఏదీ లేదు. ఎట్టి కారణం లేకుండానే ఈ జీవులు బ్రహ్మము నుండి ఉత్పన్నమగుచున్నారు" అని మీరు అక్కడక్కడ అంటున్నట్లుగా నాకు అనిపిస్తూ వస్తోంది. ఎందుచేత? కర్మలు అసలు ఉన్నాయా? జన్మలు కలిగేది కర్మ ప్రభావం చేత కాదా? శ్రుతులలోని కొన్ని వాక్యాలు ఉన్నాయి.* ఆ వాక్యములలోని సారమును అనుసరించి దుష్కర్మలు, సుకర్మలు వాటి వాటి ప్రయోజనమును కలిగియే ఉంటాయికదా! మరి, మీరు కర్మల వ్యవహారమే తిరస్కరించి, "ఇచ్ఛ, ఆత్మ విస్మరణలే అంతటికీ కారణం" అంటున్నారేమిటి? 'కర్త', 'కర్మ' – ఈ రెండూ కూడియే ఉత్పన్నమౌతాయికదా! కాబట్టి ఈ జగత్తు జన్మ – కర్మల హేతు – ఫలరూపమే కదా! బ్రహ్మము నందు కర్మల వ్యవహారమే లేదనుకొంటే బ్రహ్మరూపులగు ఈ అనేక విధములైన ద్రష్టలు, (లేక) జీవులంతా కర్తృ – కర్మల వ్యవహారం లేకుండా ఎట్లు జన్మించుచున్నారని అర్థం చేసుకోవాలి?

బ్రహ్మము (ఆ పరమాత్మ) కారణరహితుడు, మాయాసహితుడు అని కదా మీరు అన్నారు! అట్టి బ్రహ్మము నందు 'ఆకాశము' మొదలైన ఈ అనుభవమునకు వచ్చుచున్న పదార్థములు, బ్రహ్మదేవుడు మొదలుగా అనేక స్థూల – సూక్ష్మ ఉపాధులు, ఆయా ఫలానుభవాలు ఎట్లా ఏర్పడుచున్నాయి? కర్మలకంటే వేరైన కారణం ఏముంటుంది? ఈ కనబడేదంతా 'సృష్టి' అను కర్మ రూపఫలమే కదా? ఇదంతా కర్మఫలానుభవమే అయినప్పుడు ఈ జన్మ కర్మల వ్యవహారం తిరస్కరించటమెట్లా చెప్పండి?

ఒకవేళ మీరు "కర్మలు లేవు. కర్మలు నిష్ప్రయోజనమైనవి" అని సిద్ధాంతీకరించటం జరిగితే, అప్పుడు లోకంలో నరకాదులను గూర్చిన భయమే లేకుండాపోతుంది. అప్పుడు లోక సంకరమే ఏర్పడుతుంది. పాపభయం పోతుంది. పాపభయం లేకపోతే లోకంలో "మత్స్యన్యాయం" (చిన్నచేపను పెద్దచేప మింగటం) ప్రవర్తించి, బలవంతుడు బలహీనుణ్ణి హింసిస్తాడు. అప్పుడు సర్వనాశనమే చేకూరగలదు కూడా. స్వామీ! "బ్రహ్మమునందు కర్మలు లేవు. జన్మలకు కర్మ కారణం కాదు" అని అంటున్నప్పుడు మీరు కొంత సందిగ్ధమునే కలుగజేస్తున్నారు. ఓ వేదవరేణ్యా! ముందు నాకీ ప్రశ్నకు సమాధానం ఇవ్వండి.

ఒకనిచే నిర్వర్తించబడిన కర్మలు ఫలవంతము అవుతాయా? కావా? ఈ నా సంశయమును తొలగించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! కర్మల విషయమై మంచి ప్రశ్నే వేశావు. ఈ సమాధానం విను. దీని వలన కొంత విశేషమైన జ్ఞానం కలుగుతుంది.

❖

---

* ఉదా ॥ "సాధుకారీ సాధుభవతి – పాపకారీ పాపోభవతి ॥
"పుణ్యోవై పుణ్యేన కర్మణా భవతి – పాపః పాపేన కర్మణా జాయతే॥"

మనః సంబంధమైన క్రియయే కర్మకు బీజము కదా! ఇట్లు మనస్సుతో చేసిన క్రియకే ఫలితం కూడా లభిస్తూ ఉంటుంది.

ప్రథమ సృష్టి యందు* పరబ్రహ్మము నుండి మనోరూపము ఆవిర్భవించింది. అట్టి ప్రథమసృష్టి సమయంలోనే మనోరూప ఉపాధులచే కలుగుచున్న సమష్టి-వ్యష్టి జీవుల కర్మలు కూడా ప్రకటితం అవుచున్నాయి. అప్పుడే ఈ జీవులు పూర్వ కర్మ వాసనానుసారం దేహములందు అభిమానం కలిగి ఉంటున్నారు. "పుష్పము - దాని సువాసన" వేరువేరు కానట్లే "మనస్సు, కర్మలు" అనబడు రెండూ వేరువేరైనవి కావు. వాటియందు భేదం లేదు. విజ్ఞులైనవారు 'క్రియాస్ఫురణ (tinge of activity)" నే 'కర్మ' అని అంటున్నారు. సంస్కార రూపమగు మనస్సే అట్టి కర్మకు ఆశ్రయం కాబట్టి, కర్మయే మనస్సు. నాయనా! రామా! ఎవ్వడు ఎక్కడైనా ఉండవచ్చు. కర్మయొక్క ఫలితంనుండి మాత్రం తప్పించుకోలేడు. అది ప్రాప్తించియే తీరుతుంది.

❖

"కర్మ" అంటే ఏమిటి? ఈ జన్మ యందు గాని, ఇతఃపూర్వపు జన్మలందు గాని నిర్వర్తింప బడియున్న మనస్సుతో కూడినట్టి పురుషప్రయత్నములే సుమా! అట్టి పురుష ప్రయత్నం ఎన్నటికీ నిష్ప్రయోజనం కాదు.

అవిద్యచే ఉద్భవించిన ఈ మనస్సే క్రియావంతమగుచున్నది. ఈ మనస్సు 'చిదాత్మ' యొక్క ఉపాధియే కదా! కనుక కర్త-భోక్త కూడా ఈ మనస్సే అగుచున్నది. నీవు చెపుతున్నట్లు "చేయబడిన కర్మ ఫలవంతము కాకుండా ఉండుట - చేయబడని కర్మ ఫలించుట" ఈ రెండూ కుదిరే విషయాలే కావు. శాస్త్రప్రమాణములు ఈ విషయమే అనేకచోట్ల నిరూపిస్తున్నాయి. అందుచేత 'మత్స్యన్యాయము' ప్రసక్తే లేదు.

**శ్రీరాముడు :** అయితే మహర్షీ! ఒక కర్మ, దాని నుండి ఫలితము..... ఆ ఫలితము నుండి మరొక కర్మ.... ఈ విధంగా చర్వితచరణంగా సాగవలసినదేనా? ఈ కర్మల వ్యవహారమునకు నాశనమంటూ లేనే లేదా? ఈ మనస్సు ఎల్లప్పటికీ ఇంతేనా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'నలుపుదనము' లేకుండాపోతే అప్పుడిక 'కాటుక' కూడా ఉండదు కదా! అట్లే, కర్మ నశిస్తే, కర్మ రూపమే అయి ఉన్న మనస్సు కూడా స్వయంగా శాంతిస్తుంది.

"నేను అకర్తను" అను అవగాహనయే కర్మనాశనము.

కర్మనాశనమే మనోనాశనము. అట్లే, మనస్సు నశించుటయే కర్మయొక్క సంక్షయము అయి ఉన్నది. అయితే, అట్టి మనోనాశనము ముక్తులకు మాత్రమే కలుగుచున్నది సుమా! "నేను సర్వాత్మకమగు బ్రహ్మమునే" అనునట్టి అనుభూతిపూర్వకమైన ఎరుక గలవాడే, అనుభవపూర్వకమైన ప్రజ్ఞను

* ప్రథమసృష్టి : వృత్తిగాని రాగముగాని లేనట్టి చిన్మయస్వరూపుడే ఈ జీవుడు. అట్టి పూర్ణానుభవము నుండి బాహ్యదృష్టిని లేక 'వృత్తి'ని, 'రాగము'ను అవలంబించటం ప్రారంభించుట చేతనే సృష్టి ప్రాప్తిస్తోంది. అట్టి ప్రారంభమే ప్రథమసృష్టి.

సుస్థిరపరచుకొన్నవాడే ముక్తుడు. కనుక ముక్త స్వరూపము పొందిన తరువాత ఇక మనస్సు ఉండదు. మనస్సు లేదు కనుక 'కర్మ' కూడా ఉండదు. బద్ధులైనట్టి అజ్ఞానులకు మాత్రం మనస్సు ఉండియే ఉంటుంది. మనస్సు ఉన్నంతవరకు కర్మలు, ఆ కర్మలకు ఫలితములు ఉండియే తీరుతాయి.

అగ్ని, ఉష్ణత్వములను గమనించావా? ఆ రెండిటిలో ఒకటి క్షీణిస్తే రెండవది కూడా క్షీణిస్తుంది కదా! 'చిత్తము – కర్మలు' అను ఈ రెండింటిలో ఒకటి నశిస్తే, రెండవది కూడా స్వయముగానే నశిస్తోంది. ఈ చిత్తము స్ఫురణ రూపమును పొంది, విహితమైనట్టి – నిషిద్ధమైనట్టి కర్మల (acts which one 'should do' and 'should not do') ద్వారా పుణ్య – పాపముల రూపమున, ధర్మాధర్మముల రూపమున పరిణమించుచున్నది. కర్మ కూడా, దాని ఫలభోగానుసారంగా, 'స్ఫురణ' రూపమును (లేక చలనరూపమును) పొంది 'చిత్తము' అగుచున్నది. వాస్తవానికి ఈ రెండూ ఒక్కటే. అయినాకూడా 'చిత్తము, కర్మ' అను రెండు పేర్లతో లోకంలో వ్యవహరించబడుతోంది. ఇవి రెండు ఒకదానికి మరొకటి కారణమూ, రూపము అగుచున్నవి.

చిత్తరాహిత్యమే మోక్షము. లేక కర్మరాహిత్యమే మోక్షము.

'కర్మరాహిత్యము' అనగా "నిష్క్రియ రూపమైన జడత్వమును ఆశ్రయించుట" అని మాత్రం అర్థం చేసుకోకూడదు సుమా! మరింకేమంటావా?

తననుతాను 'అకర్త'గా తనయందలి అకర్తాతత్త్వమును దర్శించుచున్నవాడు ఆత్మవస్తువుగానే శేషించుచున్నాడు. ఫలితంగా కర్తృత్వమునూ, భోక్తృత్వమునూ అధిగమిస్తున్నాడు.

శాస్త్రములలో అనేకచోట్ల చెప్పబడిన విహిత–నిషిద్ధ కర్మల అంతిమ ప్రయోజనం కర్మరాహిత్యమే లేక చిత్తరాహిత్యమే. అనగా, "నాఽహం కర్తా! నాఽహం భోక్తా!" – నేను కర్తను కాదు భోక్తను కాదు! ....అను రూపముగల ఆత్మ యొక్క ధర్మమును ఈ జీవుడు సంతరించుకొనుటయే ఉత్తమోత్తమ ప్రశాంత స్థానమైయున్నదని సూక్ష్మదృష్టిచే జనులు గ్రహించెదరుగాక! అట్టి ప్రశాంత–మౌన–అంతరంగ స్థితియే 'మోక్షము' అను శబ్దముచే వ్యవహరించబడుతోంది. సర్వం యొక్క అంతర్యామిత్వం స్వభావ సిద్ధంగా అభ్యాసఫలంగా అవధరించువాడు స్వతఃసిద్ధంగా కర్మలకు అతీతుడై వెలుగొందుచున్నాడు.

❖❖❖

# 15. మనస్సు యొక్క స్వరూపము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! ఈ మనస్సు యొక్క రూపం భావనయే సుమా! భావించుటయే "మనస్సు కలిగియుండుట" అయి ఉన్నది. భావన చలన స్వభావం కలది. మనస్సు చేతనే ఆయా కర్మలన్నీ నిర్వర్తింపబడుచున్నాయి. క్రియలు సూక్ష్మత్వమును, అదృశ్య రూపత్వమును పొందియున్నప్పుడు అవి అంతరంగంలో సంస్కార రూపమును లేక సూక్ష్మవాసనల రూపమును (Subtle tendencies) పొంది ఉంటున్నాయి. అట్టి సంస్కారములను అనుసరించే భావికాలపు జన్మలు, కర్మలు, ఫలములు జీవులు పొందటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** స్వామీ! మీరు మనస్సు గురించి కొన్ని విషయాలు చెప్పారు. చమత్కారమైన కథలు కూడా వినిపిస్తున్నారు. ఈ మనస్సు దృఢసంకల్పాత్మకమైన రూపం కలిగి ఉంటోందని, జడ – చైతన్యములనే ఉభయ – స్థితులు కలిగి ఉంటోందని నేను గ్రహిస్తున్నాను. ఈ మనస్సు యొక్క స్వరూపమేమిటో దయచేసి మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అనంతుడు, సర్వశక్తిమంతుడు, మాయావేష్టితుడు అయినట్టి ఆ పరమాత్మ మొట్టమొదట "సంకల్పించుట" అను భావనతోకూడిన క్రియారూపమును స్వీకరించుచున్నారు. అట్టి సంకల్పాత్మకమగు ప్రథమ కల్పన యొక్క స్వరూపమే మనస్సు. అదియే వికల్పాత్మకమైన వ్యవహారములలో సత్ – అసత్ ల రెండిటిమధ్య 'స్మృతి' రూపమున ఉండి ఉంటోంది.

**స్మృతి రూపమగు భావనయే "మనస్సు".**

చిద్రూపమై, సర్వజ్ఞమై భాసించు ఆత్మయందు "నాఽహమ్‌వేదోస్మి – నేను ఏదో ఎరుగను" అనునట్టి ఒకానొక ప్రతీతి అనిర్వచనీయమైన కారణంగా కలుగుచున్నది. అట్టి ప్రతీతియే "మనస్సు".

అకర్త – అభోక్త అయినట్టి చిదాకాశాత్మయందు "నేను కర్తను" అను వ్యవహారము దేనివలన కలుగుతోందో .... అదే "మనస్సు".

ఓ రాఘవా! ఎక్కడైనా గుణరహితుడైన 'గుణి' ఉంటాడా? 'గుణి' అని అంటేనే "గుణములు కలవాడు" అని అర్థం కదా! ఈ జగత్తునందు స్పందస్వభావముగల కల్పనాత్మకమైన శక్తియే లేకపోతే మనస్సు కూడా ఉండటం సంభవించేదేకాదు. అగ్ని – ఉష్ణములు వేరువేరుగా ఉండటం సంభవిస్తుందా! లేదు కదా! కర్మయుక్తమైన మనస్సులు – మనోయుక్తమైన జీవులు వేరువేరుకాదు. వేర్వేరుగా ఉండజాలరు. ఈ చిత్తము (లేక మనస్సు) "ఫలధర్మిణి" (that which produces fruits of action) అను సంకల్పమునే శరీరంగా కలిగియున్నది. ఇది మాయామయము. కారణరహితము. అనేక విధములైన రచనలతో, కల్పనలతో కూడియున్నది. వాసనాయుతము. అట్టి ఈ చిత్తము జగత్తంతా వ్యాప్తమైయున్నది.

❖

ఎవడు, ఎచట – ఏ రూపమున ఉన్నట్లు కల్పన చేస్తాడో, ఆ కల్పనను అనుసరించి ఫల స్వరూపముగా అట్టి రూపమునే అతడు పొందుచున్నాడు. 'వాసన' అనబడు వృక్షము (The tree of tendency) నకు కర్మయే బీజము అయి ఉన్నది. మనస్సు యొక్క గతియే ఈ శరీరము. (This 'Physical Body' is merely one sequence of 'Thought') చిత్రవిచిత్రములైన ఆయా క్రియలన్నీ వాసనావృక్షము యొక్క శాఖలు. ఆయాఅనుభూతములు అగుచున్న క్రియాఫలములు ఆ వృక్షము యొక్క పండ్లు. అయితే జ్ఞానులగువారు మాత్రం 'అసంగము' (Unattachment) అనే ఒకానొక పదునైన గొడ్డలితో ఈ వాసనావృక్షమును కూకటివ్రేళ్ళతో సహా త్రెంచివేస్తున్నారు.

మనస్సు తాను ఏమి చింతిస్తుందో దానిని అనుసరించే కర్మేంద్రియాలు ఆయా పనులు నిర్వర్తిస్తూ ఉంటాయి. అందుచేత "మనస్సే కర్మ" అని మనం నిర్ణయిస్తున్నాం. స్వస్వరూపమును

మరచిన "అపరిచ్ఛిన్న - చిదేకరూపుడు" అగు పరబ్రహ్మము కాకతాళీయ యోగముచేత, అకస్మాత్తుగా ఒక సమయంలో బాహ్య విషయములవైపు ఉన్ముఖమగుచున్నది. అట్లు ఉన్ముఖమగుచున్న 'చిత్‌శక్తి'నే ఆయా స్థితిగతులను అనుసరించి అనేక పేర్లతో శాస్త్రకారులచే పిలువబడటం జరుగుతోంది.

శుద్ధ చైతన్యమునందు బోధ కొరకు రకరకాల పర్యాయపదములు కల్పించబడ్డాయి. శుద్ధ చైతన్యము ఏ బాహ్యకారణముగాని, ఉపాదానముగాని లేకుండానే, అకారణంగా ఒకానొకప్పుడు అవిద్యచే కలుషితమైనట్లు ఉంటోంది. అప్పుడు "స్ఫురణ" (జ్ఞాపకము) యొక్క రూపము కలిగి, వికల్పములచే అనేక రూపములను పొందుచున్నట్లు భావించుచున్నది. "వృత్తులు ఎట్లా రూఢి పడుచున్నాయి?" అనే విషయం నీవు గ్రహించటానికి వీలుగా ఈ యోగవాసిష్ఠమునందు, తదితర ఆధ్యాత్మ శాస్త్రములందు ఉపయోగించబడిన కొన్ని పదజాలములను చెపుతాను, విను-

1) మనస్సు : "స్ఫురణ"ను మూలముగా కలిగియున్న భావన. 'భావించుట' అను స్వభావము.

2) బుద్ధి : పదార్థముల "ముందు వెనుక" లను పరిశీలించటం. "ఈ వస్తువు (లేక విషయము, లేక వ్యవహారము లేక వ్యక్తి) ఇట్టిది" అను విశేషమును గ్రహించగలుగునట్టి సామర్థ్యము.

3) అహంకారము : మిథ్యయే అయినట్టి ఈ దేహము పట్ల "నేనీ దేహమును, ఈ దేహమునందు మాత్రమే ఉన్నాను. దేహ పరిమితుడను. తదితరులు కూడా దేహమాత్రులే" అనునట్టి దేహాభిమానము కలిగి, అట్టి "పరిమితసత్త" ను స్వయంగా ఆశ్రయించునప్పుడు, ఆ స్వభావమే అహంకారము. "నేను-నేను-నాది-నాది" అను రూపముగల అహంకారమే సర్వ అనర్థములకు హేతువు అగుచున్నది. అందుచేతనే దీనిని 'బంధహేతువు' అంటూ ఉంటారు.

4) చిత్తము : తగినంతగా విచారణ చేయకుండానే ఒక విషయమును స్వీకరిస్తూ, మరొక విషయమును త్యజిస్తూ ఉండే "నిలకడలేనితనము".

5) కర్మ : చైతన్యం స్పందము (చలనం)ను ముఖ్యధర్మముగా కలిగి ఉంటోంది. అట్టి స్పందము ఏర్పడుచున్న సమయంలో, అసద్వస్తువు సత్యమైనదానివలె గోచరిస్తూ ఉంటుంది. "నేను కర్తనగు చున్నాను". అను భావన పొందిన చైతన్యం శరీర, అవయవాదులను ఒకచోటి నుండి మరొక చోటికి కదల్చుటకు ఆయత్తమగుచున్నది. ఆయా ఇంద్రియములను నియమించుటకు ఆలోచనల - భావనల రూపమున ప్రవృత్తమగుచున్నది. అట్టి ప్రవృత్త వ్యవహారమునే 'కర్మ' అంటున్నాం.

6) కల్పన : చైతన్యము ఆకస్మికంగా (కాకతాళీయంగా) తనయొక్క స్వస్వరూపమునకు సంబంధించిన పూర్ణభావనను త్యజించి, తాను అభిలషించిన పరిచ్ఛిన్న భావమును, లేక, 'నేను అసంపూర్ణమును అను వెలితిని కల్పించుకొనుచున్నది. అప్పుడు ఆ చిద్వస్తువే "కల్పన" అనే పేరుతో పిలువబడుతోంది.

'కల్పారంభం - కల్పాంతము' అనునవి ద్రష్ట యొక్క "కల్పనా వ్యవహారం స్వీకరించుట - సర్వకల్పనలు త్యజించుట"ను అనుసరించే ఉంటున్నాయి.

7) సంసృతి : పూర్వము చూచినవి, చూడనివి, మరియు ఇప్పుడు చూస్తున్నవి అగువాటి

గురించి ఏర్పడుచున్న నిశ్చయములచే అంతఃకరణము చేష్టితం (flexible) అగుచున్నది. దృశ్యముతో ఏర్పడుచున్న సుఖ–దుఃఖ సమన్వితమైన సంబంధమే "సంసృతి".

8) వాసన : చైతన్యము తాను అనుభవించిన మరియు భావించిన పదార్థములను సూక్ష్మశక్తుల భావనారూపమును కలిగి ఉంటోంది. అట్లు సూక్ష్మమై, సూక్ష్మచేష్టా సహితమై ఉండునప్పటి ఆ చైతన్యమే 'వాసన' అని పిలువబడుతోంది.

9) విద్య : ఒకానొకప్పుడు ఈ చైతన్యమే – "శుద్ధమగు ఆత్మతత్త్వమొక్కటే సత్యమైనది. ఈ ద్వైత దృష్టి అవిద్య చేతనే కలుగుచున్నది. యథార్థానికి ఈ దృశ్యప్రతీతి అంతా మూడువేళల సత్యము కానేకాదు" అనునట్టి జ్ఞాన రూపమున ప్రకాశించుచున్నది. అప్పుడు ఆ సంవిదాత్మనే 'విద్య' అనే పేరుతో పిలుస్తున్నారు.

10) ప్రయత్నము : ఈ చైతన్యము క్రియాశీలత్వం పొందటమే ప్రయత్నం. అట్టి అనేక ప్రయత్నములలో కొన్ని ఆత్మను మరపించేవి, మరికొన్ని ఆత్మను గుర్తు చేసేవి అయి ఉంటున్నాయి.

11) మలము : తదితరమైన భావన యొక్క "ఆవరణ" ఈ ఆత్మను మరుగుపరచి, విస్మరించేట్లు చేస్తోంది. అట్టి ఆవరణ శక్తి ప్రాధాన్యము (over-covering) వలన ఈ ఆత్మయందు ఆరోపించ బడునదంతా 'మలము' అనే శబ్దముచే వ్యవహరింపబడుతోంది.

12) విస్మృతి : మిథ్యారూపమైన ఆయా వికల్పములచే అనేక రకములైన ఆలోచనలకు సంబంధించిన విక్షేపములు (perturbances) ఏర్పడుచున్నాయి. చైతన్యము యొక్క 'విక్షేప శక్తి' ప్రాధాన్యమే విస్మృతి.

13) ఇంద్రియములు : మనోరూపమును సంతరించుకొన్న చైతన్యము – వినుచూ, చూచుచూ, స్పృశించుచూ, ఆస్వాదించుచూ, వాసన చూచుచూ, సంకల్పించుచూ – ఉంటోంది. ఇట్లు ఆయా ఇంద్రియములచే భోగానుభవకార్యములను నిర్వహిస్తోంది. తద్వారా ఈ జీవత్వము పొందిన 'ఇంద్రుడు' అను పేరుతో చెప్పబడు ఈశ్వరుని తృప్తిపరచుచున్నాయి కనుక, వాటిని 'ఇంద్రియములు' అంటున్నాం.

14) ప్రకృతి : పరమాత్మ ఇంద్రియాలకు ఎదురుగా కనబడేవాడు, గాంచబడేవాడు కాదు. అనగా దృశ్య దృష్టిచే అతడు అలక్షితుడు (one who cannot be experienced by 'sences')" అయి ఉన్నాడు. అట్టి పరమాత్మయందు, అతని కంటే ఏమాత్రం వేరు కానట్టి కర్తృత్వరూపము ఏర్పడుతోంది. ఇది నీటి యందు తరంగములు ఏర్పడుటవంటిదే. "నేను కర్తనగుచున్నాను" అను కర్తృత్వ రూపము కారణముగా ఏర్పడుచున్నదే 'ప్రకృతి'.

15) మాయ : శుద్ధ చైతన్యమునందు ఒకానొక విస్మరణ ఏర్పడుచున్నది. ఆ విస్మరణ .... సత్యమగు ఆత్మను మిథ్యగాను, మిథ్యారూపమైన ఈ జగత్తును, ఇందలి అనుభవములను అత్యంత దృఢమైన సత్యముగాను దోపింపచేయుచున్నది. సత్యాసత్యముల వికల్పమునకు హేతువగుచున్న చైతన్యము యొక్క స్వభావమే "మాయ".

16) క్రియ : వినటం, చూడటం, ఆఘ్రాణించటం, రుచిచూడటం, స్పర్శ వంటి ఆయా కర్మలచే చైతన్యం లోకమునందు కార్యకారణరూపత్వము పొందుచున్నది. అదే 'క్రియ' అనబడుతోంది.

❖

ఓ రామా ! ఒక విషయం గమనిస్తున్నావా? ఇవన్నీ చైతన్యము యొక్క రూపాంతరములే. చైతన్యం విషయోన్ముఖమైనప్పుడు అవిద్యచే మలినమగుచున్నది. స్ఫురణ రూపదర్శనాన్ని పొందుతోంది. చైతన్యమే స్వయముగా చిత్తము యొక్క రూపము స్వీకరిస్తోంది, తద్వారా సంసార బంధమున తగుల్కొనుచున్నది. అట్టి త్రోవలో రూఢిపడినదై, మనం చెప్పుకొంటున్న అనేక పేర్లకు తగుచున్నది.

చైతన్యము తనకు తానే "నేను అజ్ఞానిని, బద్ధుడను, ఈ దేహపరిమితుడను" అనునట్టి దోషముతోకూడిన భావనను, అనుభవ సిద్ధిని పొందుచున్నది. ఇంద్రియానుభవములపట్ల గల ఆసక్తిచే ఏర్పడిన ద్వైతవాసనా కళంకమును "తన స్వభావమే" అయినట్లు ఆపాదించుకొంటోంది. అవిచారణ వశంచేత పూర్ణమగు తన స్వస్వరూపము నుండి 'చ్యుతి' (displacement) పొందుచున్నది. చూచావా, ఎప్పుడైతే చైతన్యము వివిధ కల్పనలతో గూడిన జడమగు ఈ దేహాదులవైపు అభిముఖం అగుచున్నదో అప్పుడు ఆ చిద్వస్తువునే 'జీవుడు' అని, 'మనస్సు' అని, 'చిత్తము' అని, 'బుద్ధి' అని .... ఇట్లు అనేక విధములైన శబ్దములతో చెప్పుకుంటున్నాం.

పరమాత్మ పదము నుండి తొలగి, అవిద్యచే కళంకితమైన ఈ చైతన్యమే.... ఆయా ప్రకటిత మగుచున్న వృత్తులను అనుసరించి .... ఆయా పేర్లుతో శాస్త్రకారులచే పిలువబడుతోందని గ్రహించు.

❖❖❖

## 16. మనస్సు జడమా? చేతనమా?

**శ్రీ రాముడు :** గురువర్యా! మునీంద్రా! ఇంతకీ ఈ 'మనస్సు' అనునది జడమా? చేతనమా? ఈ విషయం ఇంకా నాకు బోధపడనేలేదు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు చిత్ – అచిత్ రూపమైయున్నది. అనగా, ఇది జడముకాదు. చేతనము కాదు. చైతన్యమే సంసార దశ యందు ఉపాధి దోషంతో కూడుకొని ఉన్నప్పుడు 'మనస్సు' అని పిలువబడుతోంది. అనగా, చైతన్యమునకు వేరుగా 'మనస్సు' అనబడునది ఏదీ లేదు. 'ఆలోచన' అనునది ఆలోచించువానికి వేరుగా ఉంటుందా? ఉండదు కదా!

"మనస్సు సత్–అసత్తులకు విలక్షణమై ఉంటోంది" అని చెప్పబడుతోంది. ఈ మనస్సే జగత్తు అనబడు అనుభవమునకు కారణభూతమై ఉంటోంది. కాని మనస్సునకు పరమాత్మ కారణం కాదు సుమా! ఉపాధి భేదం చేత భిన్నభిన్నంగా కనబడేటట్లు చేస్తున్నది ఈ మనస్సే. అవిద్యచే కళంకితమైన చైతన్యమే మనస్సు లేక, చిత్తము. ఆత్మను గూర్చిన నిశ్చయత్వము లేకపోయినప్పుడు కలుగు స్థితియే 'చిత్తము' అని చెప్పబడుతోంది. చిత్తము చేతనే ఈ జగత్తు అను రచన సాగించబడుతోందని గ్రహించువాడు ఆత్మ యొక్క స్వభావమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

మనస్సును – "మలినోపాధిని పొందినట్టి చైతన్యము యొక్క జడ – చేతనముల మధ్యగా స్వీయకల్పితమైన చంచలరూపమే" అని కూడా అనవచ్చు.

చిద్వస్తువు మలినోపాధితో సంబంధం ఏర్పరచుకొనుచున్నప్పుడు (నాచే గాంచబడు చున్న ఈ దృశ్యములో అంతర్గతమైయున్న ఈ శరీరమే 'నేను' అను భ్రమ పొందినప్పుడు), అట్టి సంబంధముచే చంచల భావయుక్తమగుచున్నది. అయితే ఆవరణరాహిత్యము దృష్ట్యా చూచినప్పుడు అన్నివేళల దోషరహితంగాను, కళంక వర్జితంగానే ఉండిఉంటోంది కూడా! అందుచేత మనస్సు జడమూ కాదు, చేతనమూ కాదు. ఈ మనస్సుకే అహంకారము, బుద్ధి, జీవుడు మొదలైన చిత్రవిచిత్రములైన పేర్లు ఉన్నాయి. ఒకే నటుడు అనేక వేషములు ధరించి, నాటకమాడుచున్న సమయంలో అనేక పేర్లతో ప్రేక్షకులచే గాంచబడతాడు చూచావా? ఈ మనస్సే క్రియా భేదంచే అనేక పేర్లు కలిగియున్నది.

ఈ చిత్తం యొక్క వివిధ సంజ్ఞల గురించి మనం చెప్పుకొన్నాం కదా! దీనినే భిన్న అభిప్రాయాలు కలవారు కల్పనా భేదంచేత అనేక రీతులుగా చెప్పటం జరుగుతోంది. అనేక తర్క– వితర్కములచే ఏర్పడుచున్న అభిమతములను అనుసరించి, కొందరు 'అణుత్వము, ద్రవత్వము' మొదలైన ధర్మములను మనస్సుకు ఆపాదిస్తున్నారు. తమ బుద్ధి ప్రసరణమును అనుసరించి మనో–బుద్ధి–ఇంద్రియములకు సంజ్ఞాభేదములను ఇస్తూ, వారు చిత్రవిచిత్రములైన రీతులుగా దర్శించుచున్నారు. ఈ మనస్సును కొందరు 'జడమైనది' అంటున్నారు. మరికొందరి అభిప్రాయానుసారం – ఇది జీవునికన్న భిన్నమైనది. అలాగా 'అహంకారం, బుద్ధి'ల గురించి కూడా ఒక్కొక్కరూ ఒక్కో విధంగా చెప్పటం జరుగుతోంది.*

ఇక మా అభిప్రాయమేమిటో చెపుతాను విను.

❖

---

* <u>నైయాయికులు</u> *(గౌతమ మహర్షి) :* అహంకారం ఒకానొక ద్రవ్యవిశేషం. ఈ జీవుడు అహంకారమునకు భర్త వంటివాడు. మనస్సు అణుస్వరూపమైనది. ఇక బుద్ధి, అంతఃకరణం – ఆత్మకు సంబంధించినవి. ఆత్మ సాక్షాత్కారమైన తరువాత బుద్ధి, అంతఃకరణాలు ఉండియే ఉంటాయి. కాని మనస్సు, అహంకారాలు మాత్రం త్యజించబడతాయి.

*సాంఖ్యులు (కపిలముని) :* "బుద్ధి" అనేది ప్రకృతి చేస్తున్న పనే. సత్వ–రజ–తమోగుణముల ప్రదర్శనమే ప్రకృతి. బుద్ధియే మహతత్త్వము. బుద్ధిని మించినదేదీ ఎక్కడా లేదు. బుద్ధిని అనుసరించే అంతా ఉంటోంది. మనస్సు పదకొండు ఇంద్రియముల అంతర్గతమై ఉన్నట్టిది.

*చార్వాకులు (చార్వాకుడు) :* బుద్ధి ఈ శరీరమునకు అంతర్గతమయ్యే ఉంటోంది. అది శరీరము యొక్క ధర్మం అయి ఉన్నది. చైతన్యము కూడా శరీరము యొక్క గుణము లేక లక్షణము మాత్రమే. అహంకారరూపముననే 'ఆత్మ' అని చెప్పబడేది ఉన్నది. అయితే, అది శరీరముతో వస్తుంది. శరీరంతో పోతుంది. పూర్వాపరవిచారము చేయునది మనస్సు. అట్టి ఈ మనస్సును సంతసింపచేయుటయే బుద్ధియొక్క ధర్మము.

*పంచరాత్రులు :* 'వాసుదేవుడు' అను పేరుగల పరమాత్మ నుండి 'సంకర్షణుడు' అను పేరుగల జీవుడు కలిగాడు. ఆ సంకర్షణుడే అహంకారము. వాని నుండి 'ప్రద్యుమ్నుడు' అను మనస్సు, 'అనిరుద్ధుడు' అనే బుద్ధి ఏర్పడుచున్నాయి. సర్వము వాసుదేవమయమే. మిగతాదంతా మాయయే.

<u>వైశేషికులు</u> : 'అహంకారము' అనేది కూడా ఒకానొక ద్రవ్యవిశేషమే. ఇక ఈ 'బుద్ధి' ఐదు వికల్పములచే ఐదు విధములుగా ఉంటోంది. అవి – స్మృతి, ప్రత్యక్షము, అనుభవము, తర్కము, విపర్యము. అహంకామునకు కర్త జీవుడు. అహంకారమును దాటినప్పుడు శేషించునదే పరమాత్మ స్థానము.

అహంకారం, మనస్సు, బుద్ధి మొదలైనవన్నీ సంకల్పవృత్తి భేదంచేత వేరువేరుగా పిలువబడు చున్నప్పటికీ, అంతఃకరణము యొక్క ఏకత్వముచే అవన్నీ ఒకరూపమే అయి ఉన్నాయి. సంకల్పించు వాని నుండి సంకల్పము వేరుకాదు కదా! చూచువాని నుండి చూపువేరా? అందుచేత చైతన్యమే

అహంకరించునపుడు – అహంకారము,

నిర్ణయించునపుడు – బుద్ధి

మననము చేయునపుడు – మనస్సు

అంతేగాని 'అహంకారము', 'మనస్సు', 'బుద్ధి' .... అనునవేవీ విడిగా ఏమాత్రం లేనేలేవు. కర్తకు వేరుగా క్రియలు ఎక్కడుంటాయి? సూర్యుని నుండి సూర్యకిరణములు వేరా? అయితే, .... అట్లు అహంకరించుటకు ముందు .... చైతన్యము ఉండిఉన్నది. భావించుటకు ముందే భావించు వాడు ఉండనే ఉన్నాడు కదా! అట్టి 'అహమ్' అను భావనాక్రియ 'జరుగుచున్నప్పుడు –త్యజించునపుడు' .... ఏర్పడి ఉండేది, శేషించేదీ ఆ చైతన్యమే. అహంకారమునకు అతీతమైన దృష్టితో పరికించి చూస్తే "సర్వము చైతన్యమయమే" అని తెలియవస్తుంది.

అఖండమగు చైతన్యము 'నేను ఖండితుడను" అని భావించుటయే.... అహంకరించుట అయి ఉన్నది.

ఈ మనోబుద్ధి చిత్త అహంకారముల గురించి వేరు వేరు ఆచార్యులు వేరు వేరు కల్పనలతో తమ శిష్యులకు బోధించటం జరిగింది. వేరు వేరు కాలములందు బయలుదేరిన బాటసారులు దూరంగా ఉన్న ఒకే నగరమును ఆకారాదులకు సంబంధించిన వివిధ అవగాహనలతో వివిధ రీతులుగా దర్శిస్తూ ఉంటారు కదా! అట్లే వేరువేరు గురువులు తమ శిష్యులను తీర్చిదిద్దటానికి వేరు వేరు సిద్ధాంతాలు ప్రతిపాదించియున్నారు. వారంతా వారి వారి బుద్ధి యొక్క అనుభవమును బట్టి, శిష్యుల యొక్క అవగాహనా సామర్థ్యమును అనుసరించి–తమ యొక్క తపోఫలితంగా తాము గ్రహించింది నిర్ణయించి ప్రజలకు చెప్పటం జరుగుతోంది.

అట్టి వారిలో కొందరు ఆత్మపథమును అధిష్ఠించుటకు ప్రయత్నించుచున్నారు. మరికొందరు పరమార్థమగు బ్రహ్మతత్వమును అధిష్ఠించక పోవుటచే కొంత అపరిపక్వతతో కూడిన అవగాహన కలిగి ఉంటున్నారు. ఇక వారివారి శిష్యులలో కొందరు అపూర్ణమగు అవగాహనచేత, గురువుల ఉద్దేశము ఏమిటో సరిగ్గా గ్రహించకుండా, "మీ సిద్ధాంతములన్నీ తప్పు. మా సిద్ధాంతమే సరి అయినది" అనునట్టి కాలయాపనకు, రాగద్వేషములకు దారితీయగల వాదోపవాదములందు నిమగ్నులగుచున్నారు.

వాస్తవమేమిటో గ్రహించిన తరువాత .... "ఆయాదూరముల నుండి ఆత్మవస్తువు దర్శించినపుడు, అట్లు తోచుచున్నది. ఆత్మ వాస్తవానికి అనిర్వచనీయమైనది. అద్దానిని వాక్కుగాని, మనస్సుగాని ప్రకటించలేవు. ద్రష్ట యొక్క స్వస్వరూపము నుండి అది వేరుకాదు. అందరు అదియే అయి ఉండి, అటే పయనిస్తున్నారు. శ్రద్ధను బట్టి మనస్సులో దోషములు తొలగుచున్నాయి. నిర్మలమైన మనస్సుకు

పరమాత్మ స్వయముగా, సుస్పష్టముగా అంతర్-హృదయేశ్వరుడై ప్రకటితమగుచున్నాడు" – అని తెలియవస్తోంది. సత్యమేదో గ్రహించినవాడు ఇక వాదోపవాదములు నిష్ప్రయోజనమని, కాలయాపన యేనని తెలుసుకొంటున్నాడు. "సర్వము లయించగా, ఇక అప్పటికీ శేషించి, విస్తరిల్లియుండే నాయొక్క స్వరూపమే ఇదంతా" – అని గ్రహించుచున్నాడు. తనయొక్క వాస్తవ స్వస్వరూపం గురించి మరొకరు సిద్ధాంతీకరించి చెప్పవలసిన అగత్యం ఇక కనిపించదు.

❖

అనేకులు వేరువేరైనట్టి "దేశ–కాల–దృష్టులు" యొక్క ప్రభావంచేత కొన్ని విధినియమములకు సంబంధించిన ఆచార–అవగాహనల భేదం కలిగి ఉంటున్నారు. అట్టి వారిలో కొందరు, "ఈ మార్గమే ఉత్తమమైనది" అని ప్రశంసిస్తూ పరులను దూషిస్తూ ఉంటున్నారు. అట్టివారిలో మరికొందరు "ఫలేచ్ఛ"చే అట్టి ఫలమునకు సాధన భూతమగు కర్మయందే ఆసక్తిగల చిత్తులు అగుచున్నారు. గురువుల వాక్యములలోని జ్ఞానసారాన్ని తిరస్కరిస్తూ కేవలం బాహ్య ఆచారవ్యవహారములకు పరిమితులై అనేక భేదదృష్టులకు లోనగుచున్నారు. "సర్వం ఖల్విదం బ్రహ్మ .... ప్రతి ఒక్కడు బ్రహ్మమే అయిఉన్నాడు" వంటి ఉపనిషత్ ప్రమాణ వాక్యములను ఏమరచుచున్నారు.

కర్మలు, విధి–విధానములు అనేక రీతులుగా ఉంటేఉండనీ. ఆత్మవిచారణ విషయంలో అనేక గురువుల అభిప్రాయాలు ముముక్షువు తప్పక గ్రహించవచ్చును. ఇందులో తప్పేముంటుంది? అయితే, మానవుడు మనోనైర్మల్యము కొరకు ప్రయత్నించాలి, గ్రహించాలి, వినాలి. అనేకత్వములో అంతర్లీనమై జాజ్జ్వల్యమానంగా ప్రకాశిస్తున్న ఏకత్వము యొక్క అనుభూతిని పొందుటకు ఉద్యుక్తుడు కావాలి. అంతేగాని, "ఇది ఇంతవరకే. ఇక మేమేదీ వినం, గ్రహించం" అనునట్టి వ్యర్థమగు పలుకులతో, విచిత్రయుక్తులతో కల్పితవచనములతో ఆత్మకు భిన్నత్వము ఆపాదించుట ఉచితము కాదని మా అభిప్రాయం.

❖

స్నానము, దానము మొదలైన క్రియలు చేసేవాడు ఆ క్రియలను ఏ విధమైన కర్తృత్వముతో చేస్తాడో, అతని మనస్సు అట్లే విషయములను పొందుచున్నది.

ఈ క్రియలన్నీ – నన్ను పవిత్రుణ్ణి చేయగలవు – పుణ్యవంతుని చేయగలవు– పరిశుభ్ర పరచగలవు – ధనికునిగా చేయగలవు – జ్ఞానినిగా చేయగలవు – అందగానిగా చేయగలవు.

.... ఈ విధాలుగా ఎవడు ఏ విధమైన భావనచేస్తే అతడు ఆతీరుగానే పొందగలడు. మరి, మనస్సు యొక్క వైచిత్ర్యము అట్టిది. మనస్సు దేనిని ఎట్లు భావిస్తే అది అట్లే సత్యమై ప్రాప్తిస్తోంది. వేరువేరు ఆచార్యులు "అహంకారము–మనస్సు–బుద్ధి–పరమాత్మల"ల గురించి చెప్పిన సమాచారం కూడా వారివారి శిష్యులకు అట్లే సత్యమై తోచుచున్నది.

❖

ఒకడు వేరువేరు సమయ - సందర్భములలో వేరువేరు కార్యక్రమములందు నిమగ్నమై ఉన్నాడనుకో... అతడు ఎప్పటికప్పుడు చేస్తున్న పనిని బట్టి "మావటివాడు-సారథి-వ్యవసాయ దారుడు-కుటుంబపు యజమాని-సేవకుడు-మిత్రుడు" .... అని ఆయా సందర్భములలో వేరువేరు జనులచే పిలువబడుచూ ఉండవచ్చు. అయినప్పటికీ, ఆ వ్యక్తి ఆ అన్ని సందర్భములలోననూ "ఒక్కడే" అయి ఉన్నాడు కదా! మనస్సు అన్ని వేళల ఒక్కటే అయిఉంటున్నప్పటికీ, అది నిర్వర్తించే కార్యక్రమములను అనుసరించి, "జీవుడు, వాసన, కర్మ" మొదలైన పేర్లతో పిలువబడుచున్నది.

అయితే ఈ జీవులయందు ఉండి, ఈ సర్వ అనుభవములను పొందుచున్నది చిత్తమే కదా! ఎందుకంటావా? చిత్తరహితుడు ఏదైనా చూస్తున్నప్పటికీ ఏదియు గాంచకయే (గ్రహించకయే) ఉంటున్నాడు. చిత్తసహితుడు, భుజించుట, వాసనచూచుట, తద్వారా సుఖదుఃఖములను పొందుట జరుగుతోంది. ఒకచోట ఉండియున్న రూపములను చూడగలుగుటకు వెలుతురే కారణం అయినట్లు, సమస్త పదార్థములను ఆయావిధములుగా గ్రహించటానికి మనస్సే కారణం. అందుచేత, "బద్ధ చిత్తము" కలవాడు మాత్రమే బంధమును పొందుచున్నాడు. "ముక్త చిత్తము" కలవాడు 'మోక్షభావి' అగుచున్నాడు.

❖

'మనస్సు జడము' అనటం ఎట్లా? అది సంచలనము కలిగి ఉంటోంది కదా! పోనీ 'చేతనము' అని అందామా?

1. అది స్వయముగా చలించలేదు. ఆత్మయొక్క సామీప్యములో మాత్రమే 'చలనము-గతి'లను స్వీకరించగలుగుచున్నది.
2. అది చేతనమే అయి ఉంటే ఇక అద్దానికి జడరూపమైన జ్ఞానమే (పరిమితమైన, ఖండమైన జ్ఞానమే) ఉండేది కాదు.

అందుచేతనే "అది జడము కాదు. చేతనము కాదు" అని మొట్టమొదటే చెప్పాను. అట్టి మనస్సు ఎప్పుడైతే వ్యక్తమవటం జరుగుతుందో, అప్పుడే ఈ జగత్తు కూడా జడ-చేతనములకు విలక్షణమై ఆవిర్భవించుచున్నది.

మనస్సు ఏకరూపమైనప్పుడు (భ్రాంతి రూపమును త్యజించి బ్రహ్మాకారమును పొందినప్పుడు) ఇక ఆ మరుక్షణం ఈ జగత్తు ఇట్లుండదు. అనగా అట్టివాని దృష్టిలో జగత్తు లేనిదే అగుచున్నది. ఇందలి అనేకత్వము, పదార్థత్వము నశించుచున్నది. అనగా, ఈ జడచేతన జగత్తంతా స్వస్వరూపాత్మ యొక్క సంప్రదర్శనా విలాసంగా అనుభూతమవగలదు. అట్లుగాక మనస్సు మలినజలం లాగా కలుషితమైనప్పుడు మనస్సే జగత్తుకు కారణరూపముగా (ఇదంతా ఇట్లు తోచుటకు "కారణము"గా) రూపొందుచున్నది. అట్టి కలుషితమైనట్టి సమష్టిరూప మనస్సు నుండే ఈ కనిపించే జగత్తు అంతా ఉత్పన్నమైయున్నది సుమా!

ఓ రామచంద్రా! దోషదృష్టి, జడదృష్టి తొలగినాయా, అప్పుడు ఈ మనస్సు బ్రహ్మమే అగుచున్నది.

"ఈ మనస్సు జగత్తుకు కారణము" అనటం కూడా అసమంజసమే అని అనిపించుకొంటోంది. పోనీ "బాహ్యపదార్థజాలమే సంసారమునకు కారణము" అందామా? బాహ్యపదార్థమంతా జడ రూపమే కదా! జడమైనది ఒకానొక కర్తృత్వమును ఎట్లా నిర్వర్తించగలదు చెప్పు? అందుచేత "సంసారమునకు దృశ్యమే కారణం" అనటం యుక్తియుక్తం కాదు.




జడ మాత్రమగు మనస్సు సంసారమునకు కారణం కాజాలదు. కనుక "జడము – చైతన్యము" కూడా కానట్టి మనోవిభాగమే పదార్థములకు కూడా కారణమగుచున్నది.

చిత్తము లయిస్తే జగత్తుకూడా లయించుచున్నది. చిత్తములేనివానికి జగత్తే ఉండదు. ఇక్కడ "రహితం కావటం" అనగా "నిర్మలమగుట" అనియే అర్థం. కాలము ఒక్కటే అయి, ఋతుభేదంచే అనేక రూపములు ధరించుచున్నట్లు .... ఒకే మనస్సు వివిధ కర్మలచే (చిత్తము, అహంకారము మొదలైన) వివిధ నామములను ధరిస్తోంది.

**శ్రీరాముడు :** మునీంద్రా! ఈ జీవునియొక్క అహంకారం, ఇంద్రియాలు, క్రియలు, దేహము మొదలైనవన్నీ .... అనేక సందర్భములలో అతనినే బాధించుచున్నాయి కదా! మరి, 'ఇదంతా మనస్సే అయి ఉన్నది. జీవునియొక్క మనస్సే అతనిని బాధిస్తోంది" అనటం సమంజసమా? కాదేమో? ఈ జీవుని దుఃఖింపజేయటంలో "అహంకారం, ఇంద్రియాలు, క్రియలు, దేహము"ల పాత్ర ఏమిటి ? అవన్నీ మనస్సుకంటే వేరేకదా! మనస్సు యొక్క పాత్ర ఏమిటి?

**శ్రీవసిష్ఠమహర్షి :** మనస్సుతో సంబంధం లేకుండానే ఈ అహంకారము, ఇంద్రియములు, క్రియలు, దేహములు జీవుని బాధిస్తున్నాయంటావా?....ఊహూ! మనస్సు లేనప్పుడు కూడా అవి ఇతనిని క్షోభింపజేయగలిగితే, అప్పుడు "మనస్సు కంటే అవన్నీ వేరు" అని నేనుకూడా ఒప్పుకుంటాను. కాని అట్లు జరగటంలేదు. కనుక మనస్సు కంటే అవన్నీ వేరుకాదు. ఓ రామా! ఎవరైనా "దేహము వేరు. మనస్సు వేరు. జీవుడు వేరు" అని వాదిస్తుంటే, అట్టివారు యథార్థ వస్తువును ఎరిగినవారు కాదనే మా అభిప్రాయం. జ్ఞానమునకు సంబంధించిన ఉత్తమ శిక్షణ పొందకపోవుటచేతనే వారు అట్లా వాదిస్తున్నారు. మనస్సే "దేహానుభవము" అను వేషమును వేస్తోంది. 'జీవుడు' అని మనం అంటున్నది మనస్సునే.

❖

'మనఃశ్శక్తి' సర్వవ్యాపకమై ఉండుటచే, కుతర్క శక్తి కూడా మనస్సు అనే దేవుని యందే ఉండి ఉంటోంది.

శుద్ధ చైతన్యమునందు జడత్వ రూపమగు కలుషిత – శక్తి ఉదయించిన మరుక్షణం ఈ జగద్వైచిత్ర్యమంతా కలుగుతోంది.

'చేతనము' అయినట్టి సాలెపురుగు నుండి జడమగు సాలెతంతువులు (దారం) ఉత్పన్నమగు చున్నది కదా! నిత్యజ్ఞాన స్వరూపుడైన పరబ్రహ్మము నుండి మనోరూపమగు ప్రకృతి జననంపొంది, రూపుదిద్దుకొంటోంది.

అవిద్యా కారణం చేతనే కుతర్క – వితర్కములైన అనేక భావనలు చిత్తమునందు రూఢిపడుచున్నాయి.

చైతన్యము యొక్క పర్యాయ వృత్తులే 'జగత్తు'. కాని, భ్రమచే జగత్తు చైతన్యమునకు వేరైనదిగా తలచబడుచున్నది. అనగా, మనస్సు యొక్క వాస్తవరూపం ఆత్మచైతన్యమే! కనుక, ఈ ఎదురుగా కనబడేదంతా–జడచేతనములతో సహా ఆత్మ చైతన్యవిన్యాసమే!

❖

నిర్మలమగు చైతన్యమొక్కటే ఈ జీవ–మనోబుద్ధి–అహంకార రూపములుగా ప్రసిద్ధికెక్కుచున్నది. అదియే లోకంలో చేతనమని, జీవమని, చిత్తము అని జడమని .... ఇంకా అనేక సంజ్ఞలచే పిలువబడుచున్నది. ఈ విషయంలో సంశయము అవసరములేదని చేతులెత్తి ప్రకటించుచున్నాను.

ఆత్మచైతన్యం ఈవిధంగా అద్వితీయం! నిత్యనిర్మలం!

❖❖❖

# VII. చిత్తచాంచల్యము

## 1. ఈ కనబడేదంతా ఉన్నది మనస్సులోనేనా?

**శ్రీరాముడు :** హే మహర్షీ! మనకు కనబడుచున్న ఈ జగత్ వైచిత్ర్యమంతా మనస్సు నుండే ఆవిర్భవిస్తోందంటారా? ఇదంతా మనః కల్పితమేకాని, మరింకేమీ కాదని మీ అభిప్రాయమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఒక ఎడారిలో ప్రచండ సూర్యతేజము కారణంగా ఉత్పన్నమైన మృగతృష్ణ ఆ సూర్యతేజమును ఆవరించినదై జలభ్రాంతిని కలుగజేయటం జరుగుతోంది కదా! అట్లే జడమగు మనస్సు స్వయం ప్రకాశవంతమైన ఆత్మను ఆవరించివేసి ఉండగలుగుతోంది. మనస్సు యొక్క జడమునకు సంబంధించిన అంశమే ఆత్మను మరుగుపరచి ఉంచుతోంది. అట్టి "మరుగు" యే జగత్తుగా ప్రాప్తిస్తోంది. ఈ విధంగా "మనస్సే జగత్తునకు కారణం" అని నీవు చెప్పినది అక్షరాలా నిజమే.

ఈ జగత్తు బ్రహ్మరూపమే! అయితే,... మనస్సే 'జగత్తు' అను ఆకృతిని పొంది, ఒక చోట మనుష్యరూపముగాను, మరొకచోట దేవతారూపముగాను రూఢిపొందుచున్నది. ఒకచోట రాక్షస రూపంగాను, మరొకచోట యక్షరూపంగా, ఇంకొకచోట గంధర్వ రూపంగాను, కిన్నెర రూపంగాను అవతరించుచున్నది. అంతేకాదు. ఈ మనస్సే భిన్న భిన్న ఆచారములుగా, పంచభూతములుగా, గ్రామ, నగరాది రూపములుగా విస్తరించుచున్నది. మహావిశాలరూపమై కూడా మనస్సే వ్యక్త మగుచున్నట్లు మేము దర్శిస్తున్నాము. కాబట్టి ఓ సర్వజనులారా! మీరంతా ఈ మనస్సు గురించే బాగా విచారించండి. ఈ మనస్సు యొక్క శక్తి – యుక్తులు, స్వభావ వైచిత్ర్యములు గ్రహించండి. అట్టి మనస్సును పరిశీలించటం వదలి, గడ్డి పరక – కొయ్య – లతలవంటి ఈ స్థూల దేహముల గురించి, ఎదురుగా కనిపించే ఆయా దృశ్య సంబంధ వ్యవహారముల గురించి మాత్రమే విచారించటం చేత వచ్చే ప్రయోజనమేమీ ఉండదు.

❖

సర్వవ్యాపకమగు ఈ జగత్తంతా మనస్సు చేతనే పరిపూర్ణమైయున్నది. అట్టి ఈ మనస్సును శోధించినప్పుడు మాత్రమే ఈ కర్త–కర్మల రూపము చక్కగా తెలియబడగలదు. కర్త–కర్మల చమత్కార మంతా గ్రహించిన తరువాత ఇక ఆపై పరమాత్మయే శేషించుచున్నదని మా అనుభవమైయున్నది. అట్టి ఆత్మ సర్వ వస్తువులకు అతీతమై, సర్వవ్యాపి అయి, సర్వమునకు ఆశ్రయమైయున్నది. అద్దాని కృపాతిశయంచేతనే ఈ మనస్సు లోకంలో పరుగిడగలగడం, పలు విధములుగా విజృంభించటం జరుగుతోంది కూడా! ఈ 'మనస్సు' అనునది ఆత్మయొక్క 'ఇచ్ఛ–ఆలోచన' అను రూపమైన 'కర్మ' యేనని మేము ఎంచుచున్నాము.

అట్టి మనస్సే ఈ దేహాదులకు కూడా కారణం. మనస్సే ఉత్పన్నమౌతోంది. అదియే విజృంభిస్తోంది. అదియే అన్ని వైపుల ప్రవర్తిస్తోంది. అదియే లయించుచున్నది.* అంతే కాని 'ఆత్మ' కాదు. ఎందుకంటావా? ఆత్మకు జనన మరణాదులు, ఉత్పత్తిలయాలు లేవు. నాయనా! రామా! ఈ ఆత్మ విచారించబడిందా, ఇక మనస్సు స్వయంగానే లయించగలదని శాస్త్రనిశ్చయం. మనస్సు లయించిన మరుక్షణం మోక్షం ప్రాప్తించగలదు. భ్రమదాయకమైనట్టి 'మనస్సు' అనబడే కర్మ క్షయించినపుడు ఈ జీవుడు ముక్తుడు అగుచున్నాడు. అట్టివాడు ఈ ప్రపంచంలో మరల జన్మించుట లేదు.

**శ్రీరాముడు :** ఓ ముని శ్రేష్ఠా! మీరు ఇంతకుముందు .... సత్వరజస్తమోగుణముల దృష్ట్యా ఈ జీవులను పదునాల్గు విధాలుగా వర్ణించారు కదా! వాటన్నిటికీ ముఖ్య కారణం సదసదాత్మకమగు ఈ మనస్సే అయిఉన్నదని నేను గ్రహిస్తున్నాను. అయితే, నాదొక సందేహం. బుద్ధిరహితమగు శుద్ధ చైతన్యమునందు ఈ 'మనస్సు' అనబడునది ఎట్లా ఉత్పన్నమైనది? ఈ చిత్ర-విచిత్రములైన జగన్నిర్మాణం చేసే విధంగా అది ఎట్లా విస్తరిస్తోంది? బుద్ధి ఉంటే కదా సృష్టి సంభవించటం? మరి బుద్ధిగాని, మనస్సుగాని ఎట్లా ఏర్పడుచున్నాయి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** అతి విశాలమైన మూడు 'ఆకాశములు' ఉన్నాయని ఇతఃపూర్వమే చెప్పియున్నాను. ఇప్పుడు మళ్ళీ చెప్పుచున్నాను. అవి :

1) భూతాకాశము (Zone of matter)

2) చిత్తాకాశము (Zone of thought)

3) చిదాకాశము (Zone of awareness, consciousness)

సర్వసామాన్యములైన ఈ మూడు వాటి వాటి కార్యములందు సువ్యవస్థిములై ఉన్నాయి. ఈ మూడిటికి "శుద్ధ చిత్ శక్తి" చేతనే స్థితి లభించుచున్నది.

**చిదాకాశము**: బాహ్య జగత్తునకు అంటక, అంతటికీ 'సాక్షి' అయిఉంటోంది. అది - ఈ బుద్ధి, మనస్సు మొదలైనవి - ఉండుటకు, లేకుండుటకు కూడా సాక్షీభూతమై, ఈ సర్వభూతములందు ఏకస్థమై, సర్వమునందూ వ్యాపించి ఉంటున్నది.

**చిత్తాకాశము :** ఈ జీవులందరి వ్యవహారములకు ఇదే హేతువుకదా! అందుకే దీనిని "సర్వ హితము" (సర్వజనులకు హితమైనది) అని కూడా అంటూ ఉంటారు. కార్య-కారణములన్నిటికీ ఇదే మూలమై ఉన్నది. అందుచేత సర్వశ్రేష్ఠమై ఉంది. ఇది జగద్వ్యాపకమై వికల్పరూపమై ఉంటోంది.

**భూతాకాశము :** ఈ భౌతికమైన కంటికి కనబడుచున్నది. ఇది పది దిక్కులలోను వ్యాపించి, విశాలమైన దేహము కలదై ఉంటోంది. ఇది వాయువు యొక్క, సూర్యుని యొక్క, మేఘము యొక్క .... విశాల రూపమై వెలయుచున్నది.

❖

* **"మనయేవ మనుష్యానాం కారణం బంధమోక్షయో"**

- మనస్సే ఈ జీవుని యొక్క బంధమునకు, మోక్షమునకు కూడా కారణమగుచున్నది.

భూతాకాశ – చిత్తాకాశములు రెండు చిదాకాశము నుండే ఉత్పన్నమౌతున్నాయి. 'పగలు' జరుగుచున్న కార్యములన్నిటికీ పగలే కారణమగుచున్నట్లు చైతన్యమే అన్నిటికీ కారణమగుచున్నది. "నేను జడస్వరూపుడను... నేను జడస్వరూపుడను" అనునట్టి చిద్వస్తువు యొక్క మలిన నిశ్చయమే మనస్సు. దీనివలననే ఈ ఆకాశాదులు ఉత్పన్నమౌతున్నాయి. అయితే రామా! ఇక్కడ నీవు ఒక ముఖ్యమైన విషయం గమనించాలి. అదేమిటంటే, ఆత్మతత్త్వము ఎరుగనట్టి వానికి ఉపదేశించటం కోసమే ఈ మూడు అకాశాలు కల్పించబడుచున్నాయి. జ్ఞాని యొక్క దృష్టికి మాత్రం ఈ మూడు విభాగములతో పని లేనేలేదు.

ఎందుకంటే, పరమమగు బ్రహ్మమొక్కటే అంతటా నిండియున్నది. అంతయు తానే అయి వెలుగుచున్నది. భూత–భవిష్యత్–వర్తమాన కాలములందు అదియే ఏకరసమై, నిత్యమై, 'కాలము' అనే కల్పనయే లేనిదై ప్రకాశించుచున్నది. ఓ రఘురామా! జ్ఞానప్రాప్తి కలుగనంతవరకు నీకీ మూడు ఆకాశముల కల్పన ఉండనే ఉంటుంది. సర్వకల్పనలు నశించేవరకు, జ్ఞానోదయం అయ్యేవరకు ఇట్టి ఉపదేశములు అవసరమే అగుచున్నాయి. నీవు కూడా జ్ఞానోదయం అయ్యేవరకు ఈ విభాగమంతా పరిశీలిస్తూ ఉండు.

మాయా కళంకితమైన చిదాకాశము నుండి చిత్తాకాశము, భూతాకాశము ఉత్పన్నమౌతూనే ఉంటున్నాయి. ఆహాఁ! ఏమి విచిత్రమో చూచావా? మాయావేష్టితమైనట్టి చైతన్యమే "చిత్తత్వము ('చిత్తము' అను స్వభావం)" ను పొంది ఆ మలినరూప సంచయమంతా జగత్తు రూపమున గాంచు చున్నది. వివిధ కల్పనలతో కూడినదై, "త్రిలోకములు" అను ఇంద్రజాలమును నిర్మించుకొనుచున్నది. "ఇది ముత్యపు చిప్పయే కదా! ఇందు వెండి ఉండటానికి అవకాశమెక్కడ?" అను జ్ఞానము లేనివాడు ఆ ముత్యపు చిప్ప యందు వెండినే చూస్తూ ఉంటాడు. అజ్ఞానికి మాత్రమే చైతన్యము నందు మలిన రూపమగు చిత్తము యొక్క అనుభవం కలగటం జరుగుతోంది. లోకంలో 'అజ్ఞానము' అనే దోషముచే మాత్రమే బంధము కలుగుచున్నది 'జ్ఞానము' అను బలముచే మోక్షరూపమగు ఆనందము సిద్ధించుచున్నది.

ఈ జగద్రూపము యొక్క రహస్యము ఇంత మాత్రమే.

❖❖❖

## 2. అడవిలో చిక్కుకున్న బాటసారులు

ఓ రామచంద్రా! ఈ 'చిత్తం' అనునది ఎక్కడినుంచో ఆకస్మికంగా ఉత్పన్నమై వచ్చిపడింది. సరే, ఇప్పుడేం చేయాలి? ఈ చిత్తం ఎక్కడినుండి వస్తే మనకేం? ముందుగా ఈ చిత్తాన్ని 'ఆత్మవిముక్తి' యందు జాగరూకతతో నియోగించాలి. స్వస్వరూపి, సర్వాత్మకుడు, బ్రహ్మతత్త్వ స్వరూపుడగు పరమాత్మ యందు దీన్ని లగ్నం చేయాలి. క్రమంగా వాసనలన్నీ రహితం కావాలి. అప్పుడు ఏ విధమైన కల్పన లేనిదై, ఈ చిత్తం 'ఆత్మ స్వరూపము'నే పొందుచున్నది. ఆత్మ రూపంగానే వెలుగొందుచున్నది.

ఈ చరాచరజగత్తంతా చిత్తమునకే అధీనమైయున్నది. అనగా, బంధ-మోక్షములు కూడా చిత్తము యొక్క అధీనంలో ఉన్నట్లే కదా! ఈ సందర్భంలో పూర్వం నా పితృదేవులగు బ్రహ్మదేవుడు నాకు చెప్పిన చిత్తచాంచల్యమునకు సంబంధించిన ఒక చమత్కారమైన కథ గుర్తుకు వస్తోంది. అది చెపుతాను విను.

❖

ఒకచోట ఒక గొప్ప అరణ్యం ఉన్నది. ఆ అరణ్యం అతి విశాలమై, శూన్యవంతమై, అశాంతి మయమై, అతిభయంకరమై ఉన్నది. దాని ముందు అనేకవేల లక్షల యోజనాలు కూడా అత్యంత స్వల్ప భాగంగా కనిపిస్తున్నాయి, అది అంత విస్తీర్ణమైనదన్నమాట! ఆ మహారణ్యలో అతిభీకరమైన ఆకారము కలిగిన ఒక పురుషుడు ఉన్నాడు. అతడు అనేక చేతులు, అనేక కాళ్ళు కలిగియున్నాడు. "మహావ్యాకులచిత్తుడై ఉన్నాడా?" అని అతనిని చూచినపుడు అనిపిస్తోంది. చూడటానికి అతిభయంకర మైన ఆకృతితో ఉన్నాడు. "ఇతడు ఇక్కడ ఏం చేస్తున్నాడు?" అని నేను మరికొంత పరిశీలనగా చూచాను. అతడు తన వేలాది చేతులతో అనేక గుదిబండలు తీసుకొని తన వీపుపై తానే బాదుకొంటూ, ఆ అరణ్యంలో పిచ్చిపిచ్చిగా సంచరిస్తున్నాడు. అటుఇటు పరుగులు తీస్తున్నాడు. అతిదీనంగా తనను తానే బాధించుకొంటున్నాడు. అట్లా అతడు అనేక యోజనముల దూరం పరిగెత్తడం చూచాను. పాపం, వివేకదృష్టి లేకపోవడం చేత అత్యంత వివశుడై పడుచూ, లేస్తూ. ఇటు అటు తిరుగుచూ, బాగా అలసిపోయి ఉన్నాడు. అతని అవయవములన్నీ తీవ్రమైన హింసను అనుభవిస్తున్నాయి.

అట్లా అతడు పరుగులు తీస్తూ పోయి పోయి ఒక లోతైన నూతిలో పడ్డాడు. ఆ నుయ్యి యొక్క లోపలిభాగం అత్యంత దట్టమైన చీకటి అలుముకుని ఉండటంచేత అసలేమీ కనిపించుటలేదు. చాలా సేపటికి ఆ పురుషుడు ఆ నూతిలోంచి బయటకు వచ్చాడు. బయటకు వచ్చిన మరుక్షణం మరల తననుతానే బాదుకొంటూ పరిగెత్తడం ప్రారంభించాడు. చాలా దూరం పరుగెత్తి ఈమాటు మరొక ప్రదేశం ప్రవేశించాడు. అతడు ప్రవేశించిన ప్రదేశమంతా దట్టమైన ముళ్ళపొదలతో నిండి ఉంది. అది అత్యంత బాధాకరంగా ఉండినది. అగ్నిని సమీపించిన మిడుతలాగా అక్కడ ఎంతో క్లేశం అనుభవించాడు. అక్కడ గల రక్కిస ముళ్ళు అతని దేహమును నిర్దాక్షిణ్యంగా బాధించాయి. ఇంతలోనే అక్కడి నుండి లేచాడు. తననుతానే కొట్టుకొంటూ అటు-ఇటు పరుగెత్తసాగాడు. అట్లా చాలాదూరం వెళ్ళాడు. ఈ మాటు ఒక అరటిచెట్ల వనంలో (తోట) ప్రవేశించాడు. ఆ తోట పున్నమినాటి చంద్రుని కిరణాలులాగా శీతలంగాను, మనోహరంగాను ఉండియున్నది. మరల ఎందుకో ఒక్క క్షణంలో ఆ అరటితోటను వదలి తనను తాను బాదుకొంటూ పరుగెత్తసాగాడు. చాలా దూరం పరిగెత్తటంచేత అతని అవయవములు ఛిన్నాభిన్నం కాసాగాయి. మరల గుడ్డివాడిలాగా ఇతఃపూర్వపు అంధకూపంలోకి పోయి పడ్డాడు.

కొంతసేపు గడచింది. ఆ చీకటి నుయ్యిలోంచి మరల బైటకు వచ్చాడు. మళ్ళా అరటితోటలో ప్రవేశించాడు. అక్కడి నుండి ముళ్ళతోకూడిన గంభీరమైన అరణ్యంలోకి ప్రవేశించాడు. ఆ విధంగా

అతడు ముళ్ళపొదల నుండి నూతిలోకి, నూతిలోంచి అరటితోటలోకి తనను తాను పీడించుకొంటూనే పరిగెత్తటం చాలాసేపు నా వివేక దృష్టితో నేను గమనించాను. అతడు నిష్కారణంగా పరుగులు తీస్తూ అలసిపోవటం, తనను తానే హింసించుకోవటం, రోదించటం చూచి నాకు ఎంతో జాలివేసింది.

అప్పుడు నేను నా యోగబలంతో అతనిని మార్గంలో ఒకచోట ఒక ఐదు నిమిషాలు ఆపాను. "ఏమయ్యా బాబూ! నీవు ఎవరవు? ఇటువంటి విచిత్ర కార్యం ఎందుకు చేస్తున్నావు? నీ బాధ ఏమిటి? నిన్ను నీవే ఎందుకు బాధించుకొంటున్నావు? నీకేం కావాలి? వ్యర్థంగా ఇట్లు ఎందుకు విమోహితుడవగుచున్నావు?" అని ప్రశ్నించాను. నేను ఇట్లా ప్రశ్నిస్తూ ఉండగానే అతడు పెద్ద గొంతుకతో "ఓ మునీ! నేనెవ్వరనూ కాదు. నేనేమీ చేయుటలేదే? నీవే నన్ను హింసిస్తున్నావు. ఇక్కడ నీకేం పని? నీవే నా శత్రువు" అని ఆవేశంగా అరవసాగాడు. నేను అనునయ వాక్యాలతో అతనిని కొంత ప్రశాంత పరచాను. నాపై గౌరవంతో, నమ్మికతో నేను చెప్పేది వినటం ప్రారంభించాడు. చాలాసేపు గడచిన తరువాత లేచి నిలబడి కృతజ్ఞతాపూర్వకంగా తలపంకించాడు. "అవునులే, మిత్రమా! నిన్ను చూడగానే నేను సుఖముగాని దుఃఖముగాని పొందుటలేదు. నీ సహచర్యంతో సత్యాసత్య, నిత్యానిత్య విషయం ఏమిటేమిటో తెలుస్తోంది" అని పలికాడు. తనయొక్క శిథిలములైన అవయవములవైపు ఒకసారి తేరిపార చూచాడు. కొద్దిసేపు సంతుష్టుడైనాడు. ఇంతలోనే ఎలుగెత్తి దుఃఖించసాగాడు. కన్నీళ్లు ప్రవహించసాగాయి. కొన్ని క్షణాలకు ఎందుకో ఏడుపు ఆపాడు. తన అంగములను చూచి నన్ను ఎరుగుచు నవ్వుకొన్నాడు. ఇంతలోనే వికటాట్టహాసం చేశాడు. ఆ అట్టహాసం ముగించిన తరువాత నా ఎదుట అతడు క్రమంగా తన అవయవములన్నిటినీ త్యజించి వేయసాగాడు. మధ్యమధ్యలో నాతో సంభాషిస్తున్నాడు, సంప్రదిస్తున్నాడు. అతిభయంకరమైన అతని శిరస్సు మొదట నేల వ్రాలింది. ఆ తరువాత క్రమంగా అతని కాళ్ళు, చేతులు, వక్షస్థలం, పొట్ట జారి పడ్డాయి. ఈ విధంగా నియతి శక్తి-జ్ఞానముల ప్రభావములచే అతడు అంగములన్నీ త్యజించాడు. అటు తరువాత స్వస్థత చెందటానికి ఉద్యుక్తుడయ్యాడు.

అతనిని అట్లాగే వదలి నేను మరొకవైపు చూచాను. అక్కడికి మరికొద్దిదూరంలో, మరొక ఏకాంత ప్రదేశంలో అట్టివాడే అయినట్టి మరొకడు కనిపించాడు. అతడు కూడా మొదటివానివలెనే తనను తాను బాదుకొంటూ హింసించుకొంటున్నాడు. గట్టి బాహువులతోను, ఆ బాహువులలో గల గుదిబండలతోను తనను తాను బాదుకోవడం అతిదారుణమైన విషయమనిపించింది. అతడు కూడా నూతిలో పడటం, బయల్వెడలటం, ముళ్ళ పొదలలోకి పరుగులు తీయటం, అక్కడినుండి అరటితోటలో ప్రవేశించటం చేస్తున్నాడు. మరల మరల దుఃఖిస్తున్నాడు. ఇంతలోనే తననుతానే సుదాయించుకుంటూ సంతోషిస్తున్నాడు. మరల, మరికొంతసేపైనతరువాత తననుతాను బాదుకొంటున్నాడు. అతని వింతక్రియలను కూడా చాలాసేపు చూస్తూ ఉన్నాను. అప్పుడు అతనిని కూడా ఆపాను. కొన్ని ప్రశ్నలు వేశాను. అతడు సమాధానాల కొరకు యోచించాడు. లభించలేదు. అప్పుడు నన్ను మరికొన్ని ప్రశ్నలు అడిగాడు. ఆ విధంగా మా ఇద్దరి మధ్య అనేక ప్రశ్నలు-

జవాబులు నడిచాయి. ప్రశ్న-సమాధానాల ద్వారా అతనికి అనేక విషయాలు బోధించాను. అతడు ఒక ప్రక్క ఏడుస్తూ - నవ్వుతూనే మరొక ప్రక్క నేను చెప్పుచున్నదానినంతా విచారించాడు. అతని అంగాలన్నీ అప్పటికప్పుడే ఛిన్నాభిన్నములైనాయి. అప్పటికప్పుడు నిర్మలరూపుడయ్యాడు. ప్రయాసతో కూడిన పరుగులను ఆపి, ఇక అక్కడినుండి బయల్వెడలటానికి సిద్ధమైనాడు.

ఇక త్రోవలో ఆ అడవిలో మరికొంతదూరం పరిశీలిస్తూ పోయాను. మరొక ఏకాంత ప్రదేశంలో అట్టివాడే మరొకడు తారసపడ్డాడు. అతడు కూడా పరిగెత్తుకుంటూపోయి ఒక అంధకూపంలో పడటం చూచాను. అతడు ఆ నూతిలోంచి బైటకు వస్తాడేమోనని అతనికోసం కాచుకు కూర్చున్నాను. చాలా సమయం గడచిపోయింది. ఏదీ? ఆ మూర్ఖుడు ఆ నూతిలోంచి బైటకు రాడే? ఇక వెనుకకు మరలాలని ఉద్యుక్తుడనౌతున్నాను. ఇంతలో అతడు బైటకు రావటం చూచాను. నేను అతనిని పలకరించాలని ప్రయత్నం చేస్తూ ఉండగానే అతడు నా కేకలు వినిపించుకోకుండా మరల ఆ చీకటి నూతిలోకి దూకబోయాడు. ఎట్లాగో అతి కష్టంగా నా యోగబలంతో బలవంతం మీద అతనిని ఆపాను. ఇతఃపూర్వంలోలాగానే అవే ప్రశ్నలు వేశాను. అతడు నా ప్రశ్నలను అర్థంచేసుకున్నట్లు లేడు. నన్ను గుడ్లు ఉరిమి చూస్తూ "ఓ మూర్ఖుడా! నీకేమీ తెలియదు. నేను నిన్ను నమ్మను. నన్నెందుకు ప్రశ్నిస్తావు? నీవు దుష్టుడివలె ఉన్నావే? నువ్వు నాకేం చెపుతావు? ఇక ఆపు. నీలాంటి వారిని ఎందరినో చూచాను. నిన్ను నమ్మేది లేనేలేదు. నేను-నాసంగతి ఇంతే" అని అరచుచు యథాప్రకారం తన వ్యాపారంలో మునిగాడు. మరల ఆ చీకటి నూతిలోకి దూకాడు.

❖

ఆ తరువాత నేను ఆ మహారణ్యంలో సంచరిస్తూ, ఇట్టి వారినే అనేకులను చూచాను. వారిలో కొందరు నా ప్రశ్న, సమాధానాల ప్రభావంచే బోధితులైనారు. వారి దృష్టి పథంలోనించి స్వప్నం వలె మిథ్య అయినట్టి వారి గుదిబండలు ధరించిన చేతులతో కూడిన దేహము "లేనిది" కాసాగింది. వారు శాంతులయ్యారు. కొందరు నా వాక్యములు విననైనాలేదు. వారు అక్కడి అంధకూపములలో పడిలేస్తూనే ఉన్నారు. మరికొందరు అరటితోటలోంచి చాలాసేపటికి బైటకు వస్తున్నారు. నేను చెప్పేది లక్ష్యపెట్టకుండా మళ్ళా పొదల అడవిలోకి పరుగెత్తుకుపోతున్నారు. ఇంకా కొందరు ముళ్ళపొదల అడవిలోనే ఉంటూ, అక్కడే అంతులేని వేదనలు పొందుచున్నారేగాని, బయటకు వచ్చుటలేదు.

కొందరు "నువ్వు చెప్పక్కర్లేదు.... ఇది మా ఇష్టం" అని నాతో పలుకుచూ, కామ్య కర్మ పరాయణులై ఇటూ - అటూ తిరుగుచూనే ఉన్నారు. నన్ను పట్టించుకోవటంలేదు.

ఆ మహారణ్యమంతా ఈ విధంగానే ఉన్నది.

ఓ రామచంద్రా! ఆ మహారణ్యము ఇప్పటికి అక్కడే ఉన్నదయ్యా! దానియందు ఆయా పురుషులు ఆ విచిత్ర వ్యవహారములను అట్లే చేస్తున్నారు. నేనే కాదు. నీవు కూడా ఆ మహారణ్యం చూచావు. చూస్తున్నావు కూడా! కాని, సూక్ష్మబుద్ధితో గమనించకపోవుటచే ఆ అరణ్యమును

ఎరుగకపోతున్నావు. ఆ అరణ్యం అందరికీ కనిపిస్తూనే ఉన్నది. ఈ సభలో చాలామందికి ఆ ఆరణ్యబాటసారులు తారసబడుతూనే ఉన్నారు.

ఆహాఁ! ఏమి దౌర్భాగ్యం! ఉత్తమమైన మనుజ జన్మ పొందికూడా తాము సంపాదించుకొన్న బుద్ధికౌశలత్వాన్ని సద్వినియోగపరచుకోవటం లేదే? దానిని వృథాయే చేసుకుంటున్నారు కదా! అతి భయంకరము, ముళ్ళచే నిండియున్నది. గాఢాంధకారముచే వ్యాప్తమైనది అగు ప్రదేశములను వారు "ఇవి పుష్పవాటికలే కదా" అని తలచి మోహం చెందుచున్నారే? వాటినే మరల మరల సేవిస్తూ దుఃఖితులౌతున్నారు. "వీరు సంస్కరించబడేది, శాంతిని పొందేది ఎట్లా" అనియే నేను మరల మరల యోచించటం జరుగుతోంది. మేము వారికి ఏ రకంగా సహాయం చేసేది?

❖❖❖

## 3. కథా సంఘటనలు - ఉద్దేశము

**శ్రీరాముడు :** మహాత్మా! ఆ మహారణ్యం ఉన్నది ఎక్కడ? ఎట్లా ఉన్నది? నేను దానిని చూచానని అంటున్నారే? చూచినట్లు నాకు గుర్తులేదే? అందున్న ఆ భీకరమైన ఆకారములుగల జీవులు ఎవరు? వారంతా అట్లా ఆయారీతులుగా ఎందుకు ప్రవర్తిస్తున్నారు? మీరు ఎప్పుడు ఎందుకు ఆ మహారణ్యంలోకి వెళ్ళారు? ఈ సభలోని మహనీయులెందరో ఆ అరణ్యం చూస్తూనే ఉన్నారని అన్నారుకదా! మీరు ఏ ఉద్దేశంతో ఈ సంఘటన చెప్పారో నేను గ్రహించలేకపోతున్నాను. దయచేసి మీ ఉద్దేశమేమిటో మీరే వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ వృత్తాంతమంతా చెపుతాను. విను. ఆ మహారణ్యముగాని, ఆ పురుషులుగాని ఎక్కడో లేరు సుమా! అత్యంత గంభీరము, విశాలము అయిన ఈ సంసారమే ఆ శూన్యారణ్యము.

బ్రహ్మము విచారించబడినప్పుడు "ఇదంతా ఆత్మచే పరిపూర్ణమైయున్నది. కదా" అని గ్రహించ బడుతుంది. అప్పుడిక ఆత్మకు వేరైనదేదీ ఎక్కడా గోచరించదు. అనగా, పరమార్థ దృష్టిచే ఈ సర్వము బ్రహ్మము రూపంగానే కనిపిస్తుంది. అప్పుడీ సంసారారణ్యం వస్తురహితమై శూన్యంగా గోచరిస్తుంది.

అట్లా కాకుండా జగద్దృష్టితో చూచినప్పుడు మాత్రం ఇది మహావికారయుక్తమై ఉంటోంది. ఈ సంసారారణ్యంలో అనేక సాంసారిక దృష్టులచే వికృతాకారం కలిగి సంచరిస్తున్నవారు ఈ జీవులే సుమా! వీరు భ్రాంతిచే అత్యంత దుఃఖితమైన చిత్తము కలవారై ప్రవర్తిస్తున్నారు. వారలను చూస్తున్న ద్రష్టయగు నేను ఆ జీవునియందలి వివేకమును. నేను వారిని ఈ సంసారారణ్యంలో అట్టి సంచలనముతో చూస్తున్నది నాయొక్క వివేకము చేతనే కదా! వివేకముచే వారి మనస్సులకు "ప్రబోధము" కలుగజేయుటకు నిరంతరం శాస్త్రములు, గురువులు యత్నించుచునే ఉన్నారు. వారంతాకూడా 'వివేకము', అనుదానిచే ఉద్దేశింపబడ్డారు. ఈ సంసారంలో సంచరిస్తున్న కొందరు తత్త్వజ్ఞానరూపమగు ప్రబోధమును పొందినవారై అద్దాని ప్రభావంచేత చిత్తశాంతిని పొంది ముక్తులు

అవుతున్నారు. మరికొందరు వారివారి వివేకములను వాంఛించక తిరస్కరిస్తూ అజ్ఞానకూపంలో పడుచున్నారు.

"అగాధమగు చీకటి నూతులు" = నరకములు

"అద్దాని నుండి లేవనివారు" = పాపకార్యములందు ప్రవృత్తి కలవారు.

"అరటితోటలో ప్రవేశించినవారు" = స్వర్గలోక భోగములందు ఆసక్తులై తత్సంబంధమైన యజ్ఞాది పుణ్యకార్యములకు ఆయత్తమగుచున్నవారు. పుణ్యవంతులు.

"ముళ్ళపొదల అరణ్యంలో ప్రవేశించువారు" = కర్మపరంపరాసక్తులతో కూడిన మనుజ రూపమున పరిణామము పొందినవారు. అంటే, కర్మ చక్రమును పొందినవారు.

ఈ మనుజ జన్మ పొందినవారిలో కొందరు జ్ఞానసంపన్నులై సంసార బంధము నుండి తప్పించుకొని ముక్తులగుచున్నారు. మరికొందరు ఒక యోని నుండి మరొక యోనికి వెళ్ళుచు స్వర్గ – నరక – భూలోకముల మధ్య పరిభ్రమిస్తున్నారు.

'ముళ్ళపొద' = దుఃఖములచే పూర్ణమై, భౌతిక స్వభావయుక్తమై, కుటుంబ, బంధు, స్నేహాదులు కలిగి రకరకాల ఇచ్ఛలతో కూడుకొని యున్నట్టి ఈ చిత్తము యొక్క స్థితి.

కొందరు ఆయా శాస్త్రములచే నిర్ణయింపబడుచున్న పుణ్యకర్మలను ఆచరించుచున్నారు. తద్వారా, తమ మనస్సును పరిశుద్ధ పరచుకుంటున్నారు. ధ్యేయ వస్తువు నందు (పరమాత్మయందు) తమ చిత్తమును సంలగ్నం చేస్తున్నారు. ఆయా ఉపాసనలను, సుహృద్భావపూర్వకమైన త్యాగాదులను ఒనర్చుచు, "గ్రహమండలము–సప్తర్షి మండలము–ధ్రువమండలము" మొదలైన ఉత్తమ పదములకు, గతులకు అర్హులగుచున్నారు. అట్టివారు అధికమైన తేజోసంపన్నులై తత్త్వజ్ఞానముచే ఎల్లప్పుడు శ్రేయమునే పొందుచున్నారు.

"కొందరు అజ్ఞులు నన్ను తిరస్కరించారు" = ఆత్మ జ్ఞానమును ఆశ్రయించక, కొందరు తమ వివేకమును తామే తిరస్కరిస్తూ దూషించుచున్నారు.

"నిన్ను చూడగానే నశించుచున్నాను. నీవు మా శత్రువు" = ఈ మాటలు చిత్తము యొక్క విలాసమే. వివేక దృష్టి ఏర్పడుచుండగా చిత్తము క్రమంగా వినాశనం పొందటమే అది.

"ఆర్తనాదం చేస్తూ బిగ్గరగా ఏడ్చువాడు" = భోగములు, విషయములు త్యజించుచుండగా ఖేదము పొందుచున్నట్టి ఈ చిత్తము యొక్క చమత్కారం.

వివేకము కొంత కొంత వికసించుచున్నప్పుడు ఇక భోగములు త్యజించబడుతూ వస్తాయి. అప్పుడు ప్రారంభదశలో ఈ చిత్తము కొంత కొంత దుఃఖము పొందుతూ ఉంటుంది. అల్పవివేకము గల చిత్తము స్త్రీ, పుత్రులు మొదలైన వాటిని కరుణాదృష్టితో తిలకిస్తూ "ఎంత కష్టం వచ్చింది! నా బంధువుల గతి ఏమిటి? వీరికి నేనంటే ఎంత అభిమానం!" అని తలచుచూ దుఃఖములు పొందు తోంది. పూర్ణజ్ఞానము, ఆత్మపదప్రాప్తి ఇంకా పొందనప్పుడు ఈ స్నేహములు మొదలైనవి కోల్పోయే సమయంలో చిత్తము కొంత ఆవేదన పొందటం సహజమే. ఇదంతా సంసార వైచిత్ర్యమే సుమా!

"నన్ను ఎరుగుచు, ఆ పురుషుడు నవ్వాడు = వివేకమును పొందిన చిత్తము సంతుష్టిని పొందుచున్నది.

వివేకము పొందిన చిత్తము క్రమంగా సంసార స్థితిని, తనయొక్క చిత్తత్వమును త్యజిస్తుంది. అప్పుడు ఆ చిత్తములో అకృత్రిమమైన ఆనందం వెల్లివిరుస్తుంది. అందరిపట్ల స్నేహభావం స్వయముగా పెంపొందించుకొంటుంది. ఇంతవరకు తనయందు చోటు చేసుకొన్న మోహము, ద్వేషము, లోభము మొదలైన అజ్ఞాన వీచికలను గుర్తుకు తెచ్చుకొని, "ఆహాఁ! మిథ్యావికల్పములతో రచించబడుచున్న విషయములచే నేను ఇంతకాలం ఎంతగా వంచింపబడ్డాను! ద్వేషము, ఆవేశము, కోపము, రాగము మొదలైనవి ఎంతటి హాస్యాస్పదమైన విషయాలు!" అని ఆ జీవుడు ఆశ్చర్యపడుతూ ఉంటాడు. వివేక ప్రాప్తిని పొంది "వ్యాపక బ్రహ్మము" నందు విశ్రాంతి పొందిన చిత్తమునకు ఇతఃపూర్వపు సంసారానుభవమంతా హాస్యాస్పదంగాను, స్వప్నమాత్రంగాను ఉంటూ ఉంటాయి. "నేను పడ్డ క్లేశములన్నీ నా అజ్ఞానము యొక్క పరిణామమే కదా" అని అతడు గ్రహిస్తాడు.

"నేను అతనిని ఆపి ప్రశ్నించాను" = వివేక బలముచే చిత్తము నిగ్రహించబడినది.

"అవయవములన్నీ ఛిన్నాభిన్నమై లుప్తం అయ్యాయి" = చిత్తము శాంతించగా, సర్వ పదార్థములపట్ల ఆశలు ఉపశమించాయి.

"వెయ్యి చేతులు, వెయ్యి కాళ్ళు గలవాడు" = ఇష్ట-అయిష్టములే రూపముగాగల ఈ చిత్తమే ఆ విధంగా వర్ణించబడినది. మనస్సులో ఎన్ని ఆశలు? ఎన్ని ఆసక్తులు? ఎన్ని ప్రియాప్రియములు?

"తనను తానే బాదుకొనుచున్నాడు. హింసించుకొనుచున్నాడు" = దుష్ట సంకల్పములచే ఈ మనస్సు తనను తానే బాధించుకొనుచున్నది.

"తననుతానే కొట్టుకొనుచు, పరుగెత్తుచున్నది" = మనస్సు తన యందలి వాసనలచే కొట్టబడుచు, ముల్లోకములందలి అనేక యోనులలో ప్రవేశించుచున్నది.

❖

ఓ రామచంద్రా! అజ్ఞానము యొక్క విచిత్రమైన లీలలు చూచావా? ఈ చిత్తము తన కోర్కెలను అనుసరించే తననుతానే బాధించుకొనుచు పరుగులు తీయుచున్నది. జీవుడు బ్రహ్మపదము పొందవలెనని లక్ష్యము పొందియుంటున్నప్పటికీ, "వాసనారాహిత్యము" అతడు పొందనంతవరకు అతని చిత్తము దుర్విషయముల అభ్యాసముచే 'క్షోభ' చెందుచూనే ఉన్నది. చిత్తములన్నీ సంసారారణ్యంలో పరుగులు తీస్తున్నాయి. ఈ జీవుని  దుఃఖములను విస్తరింపజేయుచున్నది మనస్సే. అది అనేక ఆవేదనలను తనయందు దాచుకొన్నదై, మిక్కిలి భిన్నముగా అటు-ఇటు పరుగులు తీస్తోంది. పట్టుపురుగును గమనించావా? అది తనచేత నిర్మించబడిన గూటియందు తానే చిక్కుకొని బాధపడుతూ ఉంటుంది. ఈ మనస్సు కూడా తననుండి బయలుదేరిన సంకల్ప-వాసనాదులచేతనే బంధింపబడి, అనేక వేదనలకు గురి అగుచున్నది. ఊరకుక్కను గమనించావా! అది ఎందుకో- ఏమిటో తెలియకుండానే వీధులలో చుట్టి-చుట్టి పరుగులు తీస్తోంది. బాలుడు భవిష్యత్తులోని సాధకబాధకాలు

తెలియక దుష్ట పదార్థాలను భుజించటం, దుష్టప్రదేశాలలో సంచరించటం చేస్తూ ఉంటాడు. ఈ మనస్సు ముందు-వెనుకలను, ప్రయోజన-నిష్ప్రయోజనములను చూచుకోకుండానే అనర్థములను ఆశ్రయిస్తోంది. అనేక దుఃఖపూరితములైన కార్యక్రమములకు తనను తానే బలవంతంగా సమర్పించుకొంటోంది. చపలమగు కోతి తన చాపల్యం చేత చీల్చబడుచున్నట్టి దుంగలో కాలుపెట్టి యమయాతనలు తెచ్చిపెట్టుకొంటుంది చూచావా? చంచలమగు మనస్సు కూడా అనేక ఆసక్తులచే రాగద్వేషములను సంతరించుకొని సంచరించుచు అనేక దుర్భర పరిస్థితులన్నీ తెచ్చిపెట్టుకొంటోంది.

**శ్రీరాముడు :** మహర్షీ! మరి ఈ మనస్సు తన చాంచల్యము వదలదా? దీని గతి ఇంతేనా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నిరుత్సాహపడవలసిన పనిలేదయ్యా! దీనిని అభ్యాస ప్రభావంచేత తప్పకుండా వశం చేసుకోవచ్చు. ఓ జనులారా! బాహ్యాడంబరములను, వృథాకాలయాపనలను, అల్ప లక్ష్యములను క్రమక్రమంగా తగ్గించుకోండి! మనసుకు మౌనం, ప్రశాంతత, సర్వులపట్ల అవ్యాజమైన ప్రేమ అలవాటు చేయండి. ఈ మనస్సు చిరకాలం ప్రపంచ-రహిత-సమాధిని అభ్యసించాలి. అనగా, మీ మనస్సు ప్రపంచమునకు సంబంధించిన మననము చేయకుండా చూచుకోండి. ఆత్మభావననే (సర్వము ఆత్మస్వరూపంగా) దృఢం చేసుకోవాలి. ఇక వేరే ఉపాయంలేదు. మనస్సు యొక్క ప్రమాదము వలననే ఈ జీవునకు అనేక దుఃఖములు పర్వతమంత ఆకారంగా వృద్ధి చెందుచున్నాయి. ఈ మనస్సు వశీకృతమైనదా.... ఇక మిగతా జాడ్యమంతా తనంతటతానే నశిస్తుంది.

మానవుడైనవాడు, శాస్త్రార్థములను చక్కగా గ్రహించాలి. ఉత్తమమైన సంస్కారములను అలవరచుకోవాలి. సమభావనను అన్నివేళల అభ్యసిస్తూ ఉండాలి. రాగద్వేషములకు విచలితం కావటమును తగ్గించుకొంటూ ఉండాలి. ఇంద్రియముల ప్రభావమును నిరోధిస్తూ దృష్టిని సర్వాత్మస్వరూపుడగు పరమాత్మవైపుకు సారించాలి. అప్పుడాతడు తప్పక అతి పవిత్రమగు బ్రహ్మపదమున చిరకాలం ప్రతిష్ఠితుడు కాగలడు. అట్టి "ఆత్మసారూప్య స్థితి" యందు జన్మాది వికారములు ఉండవు. అది పరమశాంతిదాయకమైనది. అందు ఈ ఆధ్యాత్మిక - ఆధిభౌతిక - ఆధిదైవిక తాపములకు చోటు ఉండదు. అట్టివాడు దుఃఖములు పొందడు. విపత్తులకు విచలితుడు కాడు. ఓయీ! మానవుడా! ఈ జన్మయందే, ఇప్పుడే ఉత్తమమైన ప్రయత్నములు, విచారణలచే అట్టి ఆత్మస్థితిని ప్రాప్తింపజేయు విషయమై ఎందుకు శ్రద్ధ కలిగి ఉండరాదు? చిత్తమును జయించి, జ్ఞానస్థితిని పొందుటకు ఇంతకన్నా ఉత్తమమైన అవకాశము ఎక్కడున్నది?

❖❖❖

# VIII. బాల వినోదము

## 1. ఆత్మకు వేరైనదంతా అజ్ఞానమే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సముద్రంలో తరంగములు ప్రకటితమగుచున్నట్లు, పరమపదమగు బ్రహ్మము నుండే ఈ 'మనస్సు' అనునది ప్రకటితమగుచున్నది. "మనస్సు లేదు" అని, "మనస్సు తప్ప మరింకేమీ లేదు" అని కూడా చెప్పవచ్చు సుమా!

మనస్సు లేదు = 'మనస్సు' వాస్తవానికి లేదు. బ్రహ్మం మాత్రమే ఉంది. అయితే మనస్సుగా ప్రాప్తించేదంతా బ్రహ్మం గురించిన ఏమరుపు-అజ్ఞానం యొక్క వికాసము మాత్రమే అయి ఉంది.

మనస్సు తప్ప మరింకేమీ లేదు = శుద్ధబ్రహ్మమే ఇట్లు స్వకీయమైన ఇచ్ఛచే సువిశాల దృశ్యరూపంగా వివర్తము చెందుచున్నది. కనుక, ఈ కనబడే సర్వము ఆ ద్రష్టయొక్క మనస్సే!

రెండు వివరణలూ సమంజసమే అగుచున్నది. జలసామాన్య రూపము ఎరిగినవానికి "జలము వేరు, తరంగము వేరు" అను దృష్టి ఉంటుందా? ఉండదుకదా! జ్ఞానుల దృష్టిలో ఈ మనస్సు బ్రహ్మమే అయిఉన్నది? అంతేకాని ఇది వేరే ఏదీ కాదు. "జలమే ఇట్లు తరంగము అగుచున్నది" అనే దృఢభావం లేనివానికి "ఈ తరంగము వేరు, ఆ తరంగము వేరు" అనే దృష్టి బలపడి ఉంటుంది. అజ్ఞానుల యొక్క స్వకీయచిత్తమే సంసారభ్రమణకు కారణమగుచున్నది. అట్టి అజ్ఞానులకు ఉపదేశించటానికే మేము వాచకములను (Technical words, jargons), వాచ్యములను (Meaning conveyed by such words) కల్పించుచున్నాము. అట్టి భేదకల్పన అంతా బోధను సునిశితం చెయ్యటానికీ, అజ్ఞాని యందు జ్ఞానదీపము వెలిగించటానికీ అయిఉన్నది.

పరమాత్మ సర్వశక్తిమంతుడు, నిత్యుడు, సర్వత్రా పరిపూర్ణుడై వెలుగు చున్నవాడు. అట్టి సర్వశక్త్యోపేతునికి సర్వశక్తిత్వమే శోభిస్తుంది కాని, అల్పత్వము కాదు. అతనిలో లేని వస్తువే లేదు. సర్వవ్యాపి అగు అతడు తనయొక్క సర్వశక్తిత్వము అంతటా క్రియారూపమున ప్రకటితం చేస్తున్నాడు. అతడు ప్రతి జీవునియందు ఉండిఉన్నాడు. ప్రతి జీవుడు అతనికంటే వేరు కాదు. ఆ బ్రహ్మము యొక్క చేతనశక్తి సర్వవిధ ప్రాణులందు కలదు. అదియే వాయువునందు చలనశక్తిగాను, బల్లయందు కఠినశక్తిగాను, జలమునందు ద్రవశక్తిగాను, అగ్నియందు ప్రకాశశక్తిగాను, ఆకాశమందు శూన్యశక్తి గాను, సంసారస్థితియందు వ్యవహారయోగ్యత్వ శక్తిగాను గాంచబడుచున్నది. ఈ విధంగా ఆ బ్రహ్మము యొక్క శక్తులన్నీ దశదిశలా వ్యాపించి ఉన్నాయి. నాశనవంతములగు పదార్థములందలి నశింప జేసేశక్తి ఇదే. దుఃఖితులైన వారిలోని శోకశక్తి, ప్రసన్నులందలి ఆనందానుభవశక్తి, సృష్ట్యాది యందలి- ప్రళయము నందలి ఉత్పత్తి - వినాశకశక్తి ఆ బ్రహ్మమే అయి ఉన్నది. సర్వపదార్థముల యొక్క "బీజము" అదే.

ఒక బీజంలో .... భవిష్యత్ వృక్షము, ఆ వృక్షముయొక్క ఆకులు, పూలు, కాయలు, కొమ్మలు ....ఇదంతా సంస్కార రూపమున దాగియున్నది కదా! వృక్షముయొక్క ధర్మములన్నీ ఒకప్పటి విత్తుకు వేరైనవి కావు. ఈ జగత్తు, ఇందలి శుభ – అశుభ వ్యవహారములు .... ఇవన్నీ బ్రహ్మమునందే ఉండిఉన్నాయి. అట్లే, "చిత్తము – జడము"ల మధ్య ఉన్నట్టి ఈ 'జీవుడు' అనబడుచున్న చిదాభాసుడు (చిద్వస్తువు యొక్క ప్రతిబింబము వంటివాడు) కూడా సాక్షి చైతన్యము యొక్క ప్రకటనయే. అట్టి సాక్షి చైతన్యమే స్వరూపముగా కలిగి, అతడు బ్రహ్మమునందే స్థితి కలిగియున్నాడు. 'నేను జీవుడను' అను భావన చేయటం బ్రహ్మము యొక్క ఒకానొక స్వభావమే అయి ఉన్నది. ఇక ఈ దృశ్యప్రపంచం విషయానికి వస్తే, ఇందలి పదార్థములన్నీ మాయతో కూడుకొనినట్టి చైతన్యము యొక్క వివర్తమే. ఇవన్నీ కూడా శుద్ధ చైతన్య రూపములే అయి ఉన్నాయి. కనుక రామా! ఈ జగత్తు, ఇందలి 'నేను' అను 'భావన' చేస్తున్న జీవత్వము.... "ఇదంతా చిద్రూప బ్రహ్మమే" ..... అను దృష్టితోనే చూడాలి.

"చిత్ లేక ఎరుక" శరీరముగా కలిగియున్న ఆ పరమాత్మయే మహత్తరమైన శరీరము కలిగియున్నవాడై ఈ 'నేను – నీవు – జగత్తు' మొదలైన సర్వవ్యవహారములతో కూడుకొని సదా ప్రకాశించుచునే ఉన్నాడు.

మనస్సు అంటే ఏమిటి? మనన శక్తిని కలిగియున్నప్పటి చైతన్యమే 'మనస్సు' అనే శబ్దంతో పిలువబడుతోంది. జలమును ఒడ్డున ఉండి చూస్తున్నవానికి "ఇది జలము – ఇవి వేరువేరు తరంగములు – ఇది ఆవర్తము" అను బుద్ధి కలుగుచున్నట్లు, ఈ జీవుడు–మనస్సు అనేవి ప్రతిభాసా రూపమున ఆత్మయందే ఉండి ఉంటున్నాయి. "ఆత్మనుండే మనన రూపమగు మనస్సు ఆవిర్భవిస్తోంది" అనుటలో సందేహమేమిటో చెప్పు? ఓ రఘురామా! ఈ సమస్తము బ్రహ్మము యొక్క శక్తియే. కనుక ఈ బ్రహ్మాండమంతటినీ బ్రహ్మస్వరూపముగానే దర్శించు. ఇక 'అది–ఇది–నేను' ఇత్యాది భిన్న విభజన అంతా ప్రతిభాసావశంచేతనే ఉత్పన్నమగుచున్నది.

ఒక దృష్టాంతము విను. ఒకచోట ప్రశాంతజలముతో కూడిన ఒక తటాకం ఉన్నది. అందలి జలంలో విశాలమైన ఆకాశం ప్రతిబింబిస్తోంది. ఇప్పుడు నక్షత్రములు ప్రతిబింబిస్తున్న విభాగములోని జలము, చంద్రుడు ప్రతిబింబిస్తున్న విభాగములోని జలము వేరువేరా? ఏది ఎట్లు ప్రతిబింబిస్తున్నా జలమంతా ఒక్కటే అయి ఉన్నది కదా! అద్వితీయ బ్రహ్మమునందే ఈ సమస్తము ప్రతిబింబిస్తోంది. వేరు వేరు సంస్కారములతో కూడిన ఈ వేరు బాహ్యా–అభ్యంతర (Outward and inward) చిత్త రూపములను ధరిస్తున్నది ఒకే పరబ్రహ్మము. నిప్పుకు నిప్పురవ్వలులాగా, ఆ బ్రహ్మము యొక్క చిత్ శక్తియందు ప్రకటితమగుచున్న కిరణపుంజములమే మనమంతా! అన్ని అగ్నికణములు అగ్నియే అయి ఉన్నట్లు మనమంతా బ్రహ్మమే అయి ఉన్నాము. దేశకాలానుగుణంగా భూమి యందు ధాన్యశక్తి ప్రకటితం అవుతూ ఉంటుంది కదా! అట్లాగే పరమాత్మకూడా దేశకాలములను అనుసరించి వ్యవస్థితమగుచున్న ఫలరూపంగా ఈ "నీవు–నేను–దృశ్యము" మొదలైన రూపములలో కనబడే ఆయా శక్తులను వ్యక్తమొనర్చుచూ ఉంటాడు.

అయితే ప్రతిభాసగా కనిపిస్తున్నది యథార్థముగా ఉన్నదౌతుందా? "ప్రతిభాసితం కారణంగా ఎండమావులలో జలము కనిపిస్తోంది. కనుక, అట్లు కనిపించటానికి కారణం అందలి జలమే" అని అనగలమా? అక్కడ వాస్తవమైన జలము లేనే లేదు కదా? ఇక అది కారణమవటమేమిటి? "దృశ్యము ఉండుట చేతనే దృష్టి ఉంటున్నది" అనునది సమంజసంకాదు. లేక, అది పరిపూర్ణమైన అవగాహన కాదు. ఇక పరమార్థ దృష్టితో చూస్తే, ఎవ్వరూ దేనిని గాంచుటలేదు. ఎందుకంటే ఈ ద్రష్ట యొక్క స్వభావం 'సత్తే' ("Existence" Experience) యే కదా! ఎక్కడ 'సత్తే' (Absolute Experience) మాత్రమే కలదో, అక్కడ ఎవరు దేనిని చూస్తారు?*

"ఆత్మ సత్తే"కు అన్యమైన దృష్టి ఏర్పడుతుంటే, అందుకు కారణం అజ్ఞానమే" అని గ్రహిస్తావు గాక!

❖❖❖

# 2. బంధం ఎవరికి?

**శ్రీరాముడు :** మరి మేము ఈ దృశ్యమును 'ఘనీభూతమైన సత్యము' వలె పొందుచున్నామే?

**శ్రీ వసిష్ఠమహర్షి :** కారణం? తగినంత విచారణ, పరిశీలన, లేకపోవుటయే! జ్ఞానులు మీమాంస యొక్క నాలుగు అంగములను ఉపయోగించి దృశ్యము యొక్క సత్యాసత్యములను పరిశీలిస్తున్నారు.

1) ప్రతియోగి = "అది ఉన్నదా? లేదా?" అను విచారణ
2) వ్యవచ్ఛేదము = విభాగించి పరిశీలించుట
3) సంఖ్య = విడివిడిగా పఠించుట (Studying in separate components)
4) రూపము = Analysis of "what is its actual form?"

వారు ఈ దృశ్యజగత్తును "మీమాంస" (Logic) చే పరిశీలించి, ఆపై శాస్త్రముల రూపంలో ప్రవచిస్తూ, మనకుకూడా చెప్పుచున్నారు.

❖

ఈ జగద్వైచిత్ర్యములన్నీ స్వయముగా వాస్తవమైనవికావు. ఇవన్నీ మనస్సు చేతనే కల్పించ బడుచున్నాయి. మనస్సు చైతన్యము యొక్క మనన శక్తియే. కనుక అట్టి మనన శక్తి యొక్క కల్పితదృష్టిచే కనిపించుచున్న ఇవన్నీ కూడా .... వివర్త రూపమున బ్రహ్మము నందే, బ్రహ్మము నుండే ఉత్పన్నమౌతున్నట్లు అగుచున్నది. ఇదంతా బ్రహ్మమే. ఇవన్నీ బ్రహ్మమునకు వేరైనవి కావు".

"ఈ దృశ్యము బ్రహ్మమే అయిఉన్నది (విశ్వమ్ విష్ణుః)" అను విషయమే ఉపనిషత్తులు, సత్య ద్రష్టలగు మహర్షులు అనేక రీతులలో ఘంటాపథంగా నిరూపించుచున్నారు. ప్రతిభాసాత్మకమైన ఈ మనస్సుకు అతి విచిత్రమైన ఒక శక్తి ఉన్నది. ఇది ఏ విధంగా దేని యందు ప్రవృత్తమగుచున్నదో అది ఆ విధంగానే ప్రాప్తించగలదు. ఐందవుల సృష్టియే మనకు ఇక్కడ దృష్టాంతము.

---

* **"యత్తత్వస్యాత్ అద్వైతమేవాభూత్ తత్ర కేన పశ్యత?"**
– అనే శ్రుతి వాక్యార్థమే ఇక్కడ వసిష్ఠ మహర్షి ఉద్దేశిస్తున్నారు.

అందుచేత, రామా! "నాతో సహా ఈ సర్వము సర్వదా అంతా చైతన్యమే అయి ఉన్నది. త్రికాలములలోను (In the past, in the present and also in the future) పరబ్రహ్మమునకు వేరైనది ఎచ్చటా లేదు" .... అనియే నీ మనస్సు అన్ని వేళలా ప్రవృత్తమగుచుండుగాక! దాని ఫలితంగా మోక్షం స్వయంగా ప్రాప్తించగలదు. ఒకడు తనకు ప్రవాహపతితంగా ప్రాప్తిస్తున్న ఆయా కార్యములను నిర్వర్తిస్తూ "నాతో సహా సర్వం బ్రహ్మమే" అను భావన కలిగియుండుటలో ఏమి కష్టముంది చెప్పు?

❖

ఏ జలములో అయితే ప్రశాంతత ఉన్నదో అదే జలములో తరంగత్వము కూడా ఉంటున్నది కదా! "తరంగము" అనబడేది ఎక్కడో బైటనుండి వచ్చిచేరే ఏదైనా పదార్థముకాదు. 'చ్యుతి' (Deviation) పొందటం (అనగా, ఈ జగద్భావమును అనుసరించటం); 'అచ్యుతి' పొందటం, (అట్టి జగద్భావమును త్యజించి ఉండటం) .... ఇదంతా కూడా బ్రహ్మము లేక పరమాత్మ యొక్క చమత్కారముతో కూడిన స్వభావమే అయి ఉన్నది. పరమాత్మయందే ఈ ప్రపంచ కల్పనంతా ఉండి ఉన్నది. ఇట్టి కల్పన అంతటికీ కారణం జీవరూపమున ఉన్నట్టి పరబ్రహ్మమేకాని, మరిక వేరే ఏదీ కాదు. కల్లోలముతో కూడిన సముద్రంలోని బుద్బుదములు, తరంగాలు, ఆవృత్తములు – అంతా జలమే కదా! జ్ఞానికి అంతటా బ్రహ్మమే వ్యాపించియున్నట్లు అగుపిస్తోంది. వికారవంతమైయున్నట్టి ఈ జగత్తునందు పరమాత్మకు వేరుగా ఏదీ లేదు. ఆ పరమాత్మయందు – నామరూప క్రియాత్మకమైన – వేరొక సత్త ఎక్కడి నుండి ఎట్లా వచ్చిచేరగలదు చెప్పు? ముత్యపు చిప్పలో వెండి ఉంటుందా? భ్రమచేత మాత్రమే నిర్లిప్త-నిరవయవమగు బ్రహ్మమునందు .... "ఉత్పన్నమగుట, నశించుట, ఉండుట, పోవుట" మొదలైన దృశ్యవికారములు భాసించుచున్నాయి. ఆత్మ వాస్తవానికి నామరూప రహితమే అయి ఉన్నప్పటికీ, తన ఇచ్ఛను అనుసరించే ఈ జగత్ వైచిత్ర్య రూపమున భాసించుచున్నది. అట్లు 'భాసించుట'ను తానే గాంచుచు, తన శృంఖలములను (Fetters or Limitations) తానే నిశ్చయించుకొనుచున్నది. మరొక తరుణంలో అఖండత్వమును ఆశ్రయించుచున్నది.

❖

"కర్త-కరణము-కర్మలు-జననములు-మరణములు" ..... ఇవన్నీ కూడా ఆ పరమాత్మయే. అతనికి అన్యముగా ఎక్కడా ఏ కల్పనా ఉండజాలదు.

పరమార్థ దృష్టికి లోభమోహములు కూడా లేవు. ఆత్మయందు ఆత్మకు లోభముగాని, తృష్ణగాని ఎట్లా ఉంటాయి? ఈ జగత్తు, దీని కల్పనా క్రమము ఆత్మయే అయి ఉన్నది. సువర్ణమే ఆభరణములుగా ప్రకాశించుచున్నట్లు ఆత్మయే ఈ ఈ మనస్సుల రూపమున ప్రకటితమగుచున్నది. ఇక చిత్తము గురించి ఒక్క మాటలో చెప్పాలంటే ....ఇది ఉత్తమోత్తమమగు ఆత్మ పదము యొక్క "అనభిజ్ఞత్వము" లేక "ఏమరపు".... మాత్రమే! అదియే ఈ జీవుడు!

**శ్రీరాముడు :** స్వామీ! మరి ఈ బంధముల మాటేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అజ్ఞాన దశలో ఎంతగానో అనుభవమునకు వచ్చుచున్న ఈ బంధము జ్ఞానముచే విచ్ఛేదనమగుచున్నది. అప్పుడు "బంధమనునది మొదలే లేదు" అను అనుభవమే

శేషిస్తోంది. ఆకాశమే శూన్యత్వమును వ్యక్తమొనర్చుచున్నట్లు, "అజ్ఞాత-చిన్మయి" అగు ఆ పరమాత్మయే తన సంకల్పముచే జీవత్వమును (నేను జీవుడననే స్థితిని) లీలగా, క్రీడగా ప్రకటిత మొనర్చుచున్నాడు.

ఆహాఁ! ఎంత చమత్కారం! ఈ జీవుడు వాస్తవానికి ఆత్మ స్వరూపుడే అయినప్పటికీ, అనాత్మ భూతమగు ఈ అహంకారము మొదలైన వాటితో "అభేదము"ను సంపాదించుకొనుచున్నాడు. మరుక్షణమే ఈ దృశ్య జగత్తు అంతా ఆవిర్భవించటం, ఎదురుగా నిలచియుండటం జరుగుతోంది. జీవుని యొక్క ద్వైత రూపముతోకూడిన ఈ కలుషిత దృష్టి అంతా మిథ్యమాత్రమే.

**నిత్యాసంభవః బంధస్య, బద్ధోఽ స్మీతి కుకల్పనా?**
**యస్య కాల్పనికస్తస్య మోక్షో మిథ్యా స తత్త్వతః ।**
**సత్యత్వాదాత్మనశ్చైవ, క్వాత్మా బద్ధః? క్వముచ్యతే ।**

ఓ సర్వజనులారా! మీరంతా ఆత్మయే అయి ఉన్నారు కదా! మరి, "కాదు నేను బద్ధుడను, ఎప్పటికో ఎవరి దయ వలననో ఎట్లో బంధ విముక్తి పొందవలసి యున్నది" అను కుకల్పన ఎందుకు చేస్తున్నారో చెప్పండి? యథార్థానికి "మోక్షము" అనుబడునది కూడా లేదు. ఎవరిపట్ల అయితే...., 'బంధమే కుకల్పితము' (false attribution) అని నిరూపిస్తున్నామో, అట్టి ఆత్మకు మోక్ష వ్యవహారం కూడా మిథ్యయే గాక మరేమిటి?

**శ్రీరాముడు:** గురువర్యా! మీరు చెప్పుచున్న దానిని అనుసరించి "ఆత్మ, మనస్సు" - అనబడు ఈ రెండింటిలో ఆత్మకు బంధముగాని, మోక్షముగాని ఉండజాలదు. ఈ జీవుడు ఆత్మయే స్వరూపముగా కలిగియున్నాడు. ఇంతవరకు బాగానే ఉన్నది. ఈ మనస్సు దేనిని ఎట్లా నిర్ణయిస్తే అది అట్లే అగుచున్నది. కాబట్టి మనస్సే బంధమై యున్నదా? మనస్సే బంధమునకు, మోక్షమునకు కారణ మగుచున్నదని మీరు చెప్పియున్నారు. అయితే, ఈ మనస్సు యొక్క దర్శనమంతా కల్పితము మాత్రమే కదా! అంతా కల్పితమే అయినప్పుడు, ఈ మనస్సుకు మాత్రం బంధమెక్కడిది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును, మనస్సు కల్పితమైనదే. చైతన్యము జగద్వస్తువుపై ఆసక్తి కొనియున్నప్పుడు, అట్టి ప్రసరణముయొక్క రీతినే 'మనస్సు' అని అంటున్నాం. అదికాక మనస్సుకు వేరే రూపమేమి ఉన్నది? ఒకడు దీర్ఘస్వప్నంలో చూచిన అనేక పదార్థాలు అతడు జాగ్రత్తుకు వచ్చేసరికి మిథ్యయే అగుచున్నాయి కదా! అదేవిధంగా, బంధమును గూర్చిన అజ్ఞానుల కల్పన మిథ్యయే. జ్ఞానుల దృష్టిలో 'మోక్షము' యొక్క కల్పన కూడా మిథ్యయే. అనిర్వచనీయము, తుచ్ఛము అయినట్టి 'అజ్ఞానము' వలననే ఈ బంధ - మోక్షముల కల్పన అంతా జరుగుచున్నదని గ్రహించు. బంధ మోక్షములు సత్యములేనని అనటం వేద - ఉపనిషత్తులు ప్రతిపాదిస్తున్నదానికి విరుద్ధంకూడా. ఉపనిషత్తులు - "ఓయీ! జీవుడా! నిత్యోదిత చైతన్యస్వరూపుడగు నీకు బంధమెక్కడిది? నీవు సర్వదా అమృత పరమానంద స్వరూపుడవే" అని అవి ఎలుగెత్తి చెప్పుచున్నాయి.* నేను కూడా, నా స్వానుభవముచే "పరమార్థమున బంధమోక్షములు లేవు" అనే ప్రకటిస్తున్నాను.

---

* **"నముముక్షుర్నవైముక్త ఇత్యేషా పరమార్థతః"**

... యథార్థానికి ముముక్షువు గాని, ముక్తుడు గాని లేరు. ఆత్మ మాత్రమే ఉంది.

ఓ ప్రాజ్ఞుడా! రామచంద్రా! "త్రాడును చూచి పాముని అనుకోవటం" మొదలైన అనేక దృష్టాంతములచే ఈ "కల్పన" యొక్క అవస్తుత్వము గురించి ప్రబుద్ధుడైయున్న శిష్యుని దృష్టిలో పెట్టుకొని మేము చెప్పుచున్నాం. ఇక ప్రబుద్ధుడు కానట్టి అజ్ఞాన శిష్యుని దృష్టిలో పెట్టుకొని "బంధము – బంధవిముక్తి" మొదలైన తతంగమంతా విశదీకరిస్తున్నాం. "నాయనా! నీవు నిష్కారణంగా 'నేను బద్ధుడను' అను భావం స్వీకరించావు. నీయొక్క బంధమునకు విచారణయే ఉపాయం. నీవెవ్వరో, ఈ దృశ్యమేమిటో గ్రహించు. తద్వారా మోక్షభాగివి కమ్ము" అని బోధిస్తున్నాం. సర్వము గ్రహించిన తరువాత ఆ అజ్ఞాని .... విజ్ఞాని అగుచున్నాడు. ఇక ఆపై అతనికి బంధమోక్షముల ప్రసక్తి అక్కర్లేదు. అట్టి విజ్ఞాన శిష్యునితో సంభాషించునపుడు "బంధ–మోక్షములు లేవు" అను పరమ సత్యం సంభాషిస్తున్నాం. తత్త్వవేత్తలకు బంధ–మోక్షముల వ్యామోహం ఉండదు. బంధ మోక్షముల కల్పనంతా అజ్ఞానియొక్క జ్ఞానాభివృద్ధి కొరకేనని సూక్ష్మబుద్ధితో గ్రహించు. అజ్ఞానిని జ్ఞానిగా తీర్చిదిద్దుటయే గురువుల ధర్మము నిర్వర్తిస్తున్న మా కర్తవ్యమైయున్నదికదా! అందుచేత ప్రథమంలో కొంత కల్పన అవసరమై ఉంటోంది. ఈ విషయములన్నీ తత్త్వజ్ఞులు ఎరిగియే ఉన్నారు. ఓ సత్యవ్రతా! రామా! మాయావేష్టితుడగు పరమాత్మ నుండి మొట్టమొదట మనస్సు, ఆ తరువాత బంధ మోక్షముల గురించిన కల్పన, అటుపై ఈ జగన్నిర్మాణం క్రమక్రమంగా ఒక బాలక్రీడవలె రూఢీ పడుతోంది. ఈ స్థితి అంతా "బాల వినోదము" లోలాగా ఈ జీవునికి ప్రాప్తిస్తోంది. ఈ జగదృశ్య బాలవినోదం ఎట్లా ఉంటే ఏం?పరమాత్మయే సర్వదా, అన్నిటా వెలుగొందుచున్నాడని గ్రహించు.

❖❖❖

# 3. కథావినోదం

**శ్రీరాముడు :** మునీంద్రా! "బాల వినోదము నందువలె" అని అంటున్నారు కదా! అనగా ఏమిటి? ఆ "జగదృశ్య–బాలవినోదం" అనబడే చమత్కారమేమిటో చెప్పండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** "బాలకాఖ్యాయిక" లేక "బాల వినోదము" అను ఒక మాట అధ్యాత్మ శాస్త్రంలో ప్రచారమై ఉన్నది. దాని వెనుక ఒక కథ ఉన్నది. అదేమిటో చెపుతాను. విను.

❖

అనగా, అనగా, ఒక బాలుడు ఉన్నాడు. అతని బుద్ధి "ఇది నిజము, ఇది కాదు" అనే విమర్శ చేయలేనట్టిది. బుద్ధి మాంద్యము గల ఆ పిల్లవాడు ఒక రోజు తన దాదితో "అవ్వా! నాకు నిద్ర రావటం లేదే. ఏదైనా రాజుల చరిత్ర వినిపించవూ?" అని అంటూ మారాం చేశాడు.

**దాది :** సరే, అబ్బాయీ! నీ వినోదంకొరకు ఆనందదాయకము, మధుర శబ్దములతో కూడినది అయిన "ముగ్గురు రాజకుమారుల అనుభవాలు" అనే కథ చెప్పుచున్నాను. ఇది విని, నీవు ఎంతో నేర్చుకోవచ్చు.

❖

ఒకచోట ఒక నగరము ఉన్నది. ఆ నగరంలో ఇళ్ళు-వాకిళ్ళు-బాటలు-వృక్షములు... ఇటువంటివేవీ లేనేలేవు. ఆ నగరమంతా 'శూన్యము' తో మాత్రమే నిండియున్నది. ఆ శూన్యనగరంలో ముగ్గురు రాజకుమారులు ఉన్నారు. ఆ ముగ్గురు గొప్ప అందగాళ్ళు, ధార్మికులు, వీరులుకూడా! అయితే, ఆకాశంలో ఎక్కడన్నా ఒక చెరువు ఉంటుందా? ఎక్కడన్నా నీళ్ళలో నక్షత్రాలు ఉంటాయా?

**బాలుడు :** అబ్బే! ఉండవు. ఉండవు. ఎట్లా ఉంటాయి?

**దాది :** అదేవిధంగా, ఆ ముగ్గురు రాజపుత్రులలో ఇద్దరు ఇప్పటికింకా జన్మించనేలేదు. ఇక మూడవవాడు, ఇంకా ఎప్పటికో తల్లి గర్భంలో ప్రవేశించవలసియున్నది.

**బాలుడు :** అవ్వా! ఆశ్చర్యంగా ఉన్నదే ! అయితే ఆ రాజపుత్రుల గురించి నేను వినాలి. ఎందుకంటే పెద్ద అయిన తరువాత నేను కూడా రాజకుమారుడనౌతాను కదా! అట్లాగే చేస్తాను. వాళ్ళేంచేశారు?

**దాది :** పాపం, దైవవశంచేత ఆ ముగ్గురు రాజపుత్రుల బంధు జనమంతా మరణించారు. అప్పుడు వారు ఎంతో దుఃఖాక్రాంతులయ్యారు. మలిన ముఖంతో ఒకచోట గుమిగూడి, కొంత సమాలోచన తరువాత ఒక నిశ్చయానికి వచ్చేశారు. "మనం ఇక్కడ ఇంకా ఉండి ఏం ప్రయోజనం? మన బంధువులంతా మరణించారాయె! ఇక లాభంలేదు. ఈ శూన్యనగరం వదలి ఏదైనా మరొక నగరం వెళ్ళిపోదాం" అని అనుకొన్నారు. ఒక రోజు వాళ్ళు బుధ - శుక్ర - శనులవలె ఆ శూన్య నగరం నుండి ఆకాశమార్గంలో బయలుదేరారు. ఆకాశ మార్గమధ్యంలో ఎండవేడిమికి ఎంతో తపించారు. అక్కడ (ఆకాశంలో) వేడి ఇసుకలో నడవటం చేత గుఋాల కాళ్ళు కాలాయి. మంద నుండి వేరుపడ్డ మృగములలాగా వాళ్ళు ఎంతో పరితాపం పొందారు.

**బాలుడు :** ఊఁ! ఆ తరువాత?

**దాది :** అయినాసరే, వాళ్ళు ఆ ఆకాశంలోని ఇసుకతిన్నెలపై (ఇసుక గట్లపై) ఎట్లాగో అట్లా చాలా దూరం పయనించారు. ఒకచోట వాళ్ళకి మూడు పెద్దచెట్లు కనిపించాయి. ఆ మూడు వృక్షాలు లతలతోను, ఫలములతోను, పుష్పములతోను నిండి ఉన్నాయి. వాటి కొమ్మలు అనేక పక్షులకు ఆశ్రయమయి ఉన్నాయి.

అయితే, ఆ మూడు మహావృక్షములలో రెండు ఇంకా మొలవలేదు. మూడవదానికి ఇంకా బీజం ఏర్పడలేదు.

మన రాజకుమారులు అప్పటికే ఎంతో అలసిపోయి ఉన్నారు కదా! అందుచేత ఆ చెట్ల నీడలలో ఇంద్రుడు - అగ్ని - వరుణుడులాగా చాలాసేపు విశ్రమించారు. కొంత సేదతీర్చుకొన్నారు. తృప్తితీరా చాలా పండ్లను భుజించారు. పుష్పములను మాలలుగా చుట్టి ధరించారు.

**బాలుడు :** చెట్లే మొలవని ఆ పళ్ళు తియ్యగానే ఉన్నాయా? పుల్లగా ఉంటాయా ?

**దాది :** అబ్బో! భలే తియ్యగా ఉన్నాయి. ఆ తరువాత చాలాసేపు అక్కడే విశ్రాంతి తీసుకొని మరల బయలుదేరారు. చాలా దూరం వెళ్ళిన తరువాత వారికి ఒకచోట తరంగములచే చంచలమై గొప్ప శబ్దం చేస్తూ ఉండే మూడు నదులు కనిపించాయి.

ఆ నదులలో ఒకదానికి గట్లు అనేవి లేనేలేవు. ఇక తక్కిన రెండు నదులలో గట్లేకాదు,.... 'నీరు' కూడా ఉండదు.

గంగలో త్రిమూర్తులు స్నానం చేస్తున్నట్లు సూర్యతాపముచే పీడితులైన ఆ మన ముగ్గురు రాజకుమారులు ఆ మూడు నదులలో తీరికగా స్నానాలు చేశారు. ఎంతోసేపు జలక్రీడలాడారు. స్వచ్ఛమైన ఆ నీరు త్రాగి ప్రసన్నులైనారు.

**బాలుడు :** గుఱ్ఱాలకు నీళ్ళు పట్టారా ? లేదా ? ఊఁ!

**దాది :** ఆఁహా! గుఱ్ఱాలకు నీళ్ళు పట్టారు కూడా! ఇంతలో క్రమంగా సూర్యాస్తమయం అయింది. వారికి కనుచూపుదూరంలో నూతనంగా నిర్మించబడిన ఎత్తైన భవనములు కలిగిన ఒక నగరం కనిపించింది. ఆ నగరంలో, విశాల నీలాకాశంలో లాగానే, వృక్షాలు-పూమొక్కలు-జలము ఉండనట్టి సుందరవనములు, శూన్యసరోవరములు ఉన్నాయి. ఆ శూన్యసరోవరాలలో అందమైన కమలములు అప్పుడప్పుడే వికసిస్తున్నాయి. దూరానికి నగరవాసుల గానములు వినిపిస్తున్నాయి. ముగ్గురు రాజకుమారులు ఆ నగరంలో ప్రవేశించారు. అక్కడ వారికి అన్నిటికన్నా ఎత్తైన మూడు భవనాలు కనిపించాయి.

వాటిలో రెండింటికి నేల, పునాదులు లేవు. మూడవదానికి గోడలు కూడా లేవు.

వారు మొదటి రెండు భవనాలను వదలి, గోడలు - నేలకూడా లేనట్టి మూడవ గృహంలో ప్రవేశించారు. ఆ రాజకుమారులు తమ అందమైన ముఖములతో ఆ భవనంలో పచార్లు చేయసాగారు. అట్లా సంచరిస్తూ ఒకచోట బంగారంతో తయారైన మూడు పాత్రలు చూచారు.

ఆ పాత్రలలో రెండు కపాలములవలె అన్ని వైపులా మూసుకొని ఉన్నాయి.

ఇక మూడవపాత్ర 'చూర్ణం' (Powder) రూపంలో ఉన్నది.

వారు ఉత్తమధీశాలురు కదా! అందుచేత చూర్ణమైన పాత్రనే ఎంచుకొన్నారు. దానితో అప్పటికప్పుడు పదిశేర్లు అన్నమును, తదితర పదార్థములను వండుకొన్నారు. మరి ఆ ముగ్గురూ ఏమన్నా సామాన్యులా? గొప్ప ధర్మబుద్ధి కలవాళ్ళాయె! అందుచేత వాళ్ళు భోజనం చేయటానికి అతిథులుగా ముగ్గురు బ్రాహ్మణులను ఆహ్వానించారు.

అందులో ఇద్దరికి దేహాలే లేవు. ఒకనికి ముఖము కూడా లేదు.

ఓ బాలకా! వింటున్నావా!

**బాలుడు :** ఓఁ! బాగా వింటున్నాను. భలేగా ఉన్నది. ఇంకా చెప్పు. అప్పుడేం జరిగింది?

**దాది :** ఇంకేమున్నది? వారిలో ముఖములేని అతిథి ఉన్నాడు చూచావా? అతడు అన్నములోని చాలాభాగం తినివేశాడు. ఇక మిగిలిన దానిని ఆ ముగ్గురు రాజకుమారులు సుష్టుగా భోంచేశారు. తృప్తిచెందినవారై, అప్పటికీ-ఇప్పటికీ కూడా లేనట్టి - భవిష్యత్తులో ఎప్పటికో ఉండబోయే.... ఒకానొక నగరంలో (భవిష్యన్నగరంలో) వేటాడటానికి వెళ్ళారు. వారు నేటికికూడా అట్లే వేటాడుచూ

సుఖంగా ఉన్నారు. ఆ భవిష్యన్నగరంలోని మృగాలు – పక్షులు ఆ రాజకుమారులు వేటాడుతూ ఉంటే – తోడుగా ఉంటూ ఉన్నాయి.

ఓ అబ్బాయ్! ఈ ఉత్తమమైన చరిత్రను మొదటినుండి చివరిదాకా విన్నావు కదా! ఇది మరిచిపోకూడదు సుమా! దీనిని చక్కగా నీ మనస్సులో పెట్టుకో. అప్పుడు గొప్ప పండితుడవు అవుతావు. సరేనా?

**బాలుడు :** అవ్వా! అలాగే. నాకు చాలా సంతోషంగా ఉంది. ఇక నీవు నిద్రపో. నేను ఇట్లా ఆ రాజకుమారులను మననం చేస్తూనే పడుకొంటాను.

❖

ఓ రామచంద్రా! నీకు ఇంతకుముందు "చిత్తాఖ్యానం" చెప్పానుకదా! ఇప్పుడు, 'ఈ జగత్తంతా మనోవికల్పం మాత్రమే' అని నిరూపించటానికే దృష్టాంతపూర్వకమైన ఈ 'బాలవినోదం' చెప్పాను. సంకల్ప – కల్పనలన్నీ దృఢపడటంచేతనే ఈ 'సంసార రచన' అంతా స్థిరత్వం పొందుతోంది. ఈ కల్పనా దృశ్యమంతా ప్రతిభాసా రూపమే. అయినప్పటికీ, ఈ బంధమోక్ష వ్యవహారమంతా విస్తరింప జేస్తోంది. "ఇది ఎట్లా సాధ్యం!" అని ప్రశ్నించుకోకుండానే, ఆ పిల్లవాడు ఆయా సంఘటనలు వింటూ ఎంతగా ఆనందించాడో చూచావా! జీవుడు కూడా ముందు – వెనుకలను పరిశీలించకుండానే ఈ "భావములు–అభిప్రాయములు–నిర్వచనములు–సంబంధములు, ఉద్వేగములు (Perceptions, Opinions, Definitions, Relationships, Emotions etc.)" .... మొదలైన వాటిని అవధరిస్తున్నాడు.

ఈ కనపడేదంతా సంకల్పమాత్రమేగాని వేరే ఏమీ కాదు. సంకల్పముచే భాసించేది యథార్థ మెట్లా అవుతుంది చెప్పు? ఇదంతా వాస్తవానికి లేనిదిగా, అనిర్వచనీయంగా చెప్పబడింది. ఈ ఇంద్రియములు, ఇవి గాంచుచున్న భూమి–ఆకాశము–వాయువు–దిక్కులు–పర్వతములు మొదలైన పదార్థజాలం .... స్వప్నములోని వస్తువులవలె ఊహామాత్రము, అసత్త్యుల్యము అయి ఉన్నాయి. నేనిప్పుడు చెప్పిన భవిష్యన్నగరంలోని ముగ్గురు రాజకుమారులు, నదులు, ముగ్గురు అతిథులు 'సంకల్ప మాత్రమే' అయినప్పటికీ, ఆ పిల్లవాడుమాత్రం అంతరంగమునందు ఉత్సుకత, అభిలాష, వికల్పములు పొందుచూనే ఉన్నాడు కదా!

"ఈ జగత్తు యొక్క అనుభూతి అంతా సంకల్పమాత్రమే" అనటంలో ఏమాత్రం సందేహం లేదు. అయితే. ఆత్మతత్త్వజ్ఞానము ఎరిగినవారు, జ్ఞానదృష్టికలవారు ఈ సత్యమును గ్రహించగలుగు చున్నారు. వారికి మాత్రమే అది గ్రాహ్యమగుచున్నది. ఇక తక్కినవారంతా 'ఇది సత్యమే' అని భావించుచు, ఒక అనుభవమునుండి మరొక అనుభవమునకు ప్రయాణిస్తూనే ఉన్నారు. అట్టి ప్రయాణమునకు 'అంతు' ఉండుట లేదు. అనేక తరంగములుగా కనబడుచున్నదంతా సముద్ర జలమే అయినట్లు, ఈ స్ఫురించునది, – మరియు ఇట్లు స్ఫురించుదాని అనుభవము పొందుచున్న "ఖండభావన" తో కూడిన 'ద్రష్ట' లేక 'జీవుడు' కూడా సంకల్పమాత్రమే. పరమాత్మ నుండి మొట్టమొదట సంకల్పము మాత్రమే ఉదయించింది. ఆ తరువాత, ఈ "ప్రాణుల యొక్క మరియు సూర్యుని

యొక్క” దైనందిన క్రియలచే ‘కాలము’ విస్తరిస్తోంది. క్రమంగా ఆ కాలమును అనుసరించి ఈ జగద్రూపమంతా విస్తారం పొందుతోంది.

కాబట్టి రామా! ఈ ప్రపంచమంతా సంకల్పరూపమే. మనోవికారములు, రాగద్వేషవృత్తులు, వాటికి సంబంధించిన తదితర విషయములు – ఇవన్నీ సంకల్పమాత్రమే. కనుక, నీవు నిర్వికల్ప (వికల్పములు లేనట్టి) సమాధి (మానసిక సుస్థిరత) ను ఆశ్రయించు. అనగా, సర్వసంకల్పములకు ఆవల గల “స్వస్వరూపము”ను అభ్యసిస్తూ–ఆస్వాదిస్తూ ఉండు. సర్వసంకల్పములనుఅధిగమించిన వాడవై ఉండు. అట్లు సంకల్పములను త్యజిస్తే ఇప్పుడే, ఇక్కడే, ఇదంతా ఇట్లు ఉంటూ ఉండగానే నీవు పరమశాంతిని పొందగలవు.

❖❖❖

# 4. నీకెక్కడి బంధం? నిదురలే!

అజ్ఞాని తన యొక్క సంకల్పవశం చేతనే మోహితుడగుచున్నాడు. జ్ఞానికో, ... మోహమే ఉండటం లేదు. ఆహాఁ! అజ్ఞుడు, నాశరహితమగు పరమాత్మ యందు క్షణభంగురము, భావనానుసరణము, అనుక్షణ పరిణామయుతము అగు ‘జగత్తు’ అనబడు దానిని మనస్సు యొక్క సంకల్పం చేత గాంచుచున్నాడు. భ్రాంతిని పొందుచున్నాడు.

**శ్రీరాముడు :** ఓ బ్రహ్మవిద్వరా! ఈ ఆత్మ మహామోహమయమగు సంసార భ్రమను దేని వలన పొందుతోంది? “నశ్వరము”,* అగు సంకల్పములను కల్పన చేస్తున్నదెవరు? నిత్యాత్మ చేస్తోందా? లేక నశ్వరాత్మ చేస్తోందా? జగత్పారవశ్యమును పొందుతోంది నిత్యాత్మయా! నశ్వరాత్మయా? అహంకారమా?

“నిత్యాత్మ చేస్తోంది” అనటానికి వీలు లేదు. అట్లా అంటే సంకల్పముతోబాటు అదీ నశించాలి. అప్పుడు ఆత్మయొక్క నిత్యత్వానికి హాని కలుగుతుంది కదా!

ఇక “నశ్వరాత్మ తన సంకల్పముచే తనను రచించుకొంటోంది” అని ఎట్లా అంటాము? అట్లా అంటే, ఆత్మను మరొకటేదో వచ్చి ఆశ్రయించుచున్నట్లు అవుతుంది కదా? అది కూడా వేదవాక్యములకు సరిపోదు. సంకల్పితమగు నశ్వరాత్మ జడమా? చేతనమా? ‘జడము’ అని అంటే, అది చిదాత్మతో ఐక్యం ఎట్లా పొందుతోంది? ‘చేతనము’ అందామా? చిద్వస్తువు నిష్క్రియము కదా! అది ఎట్లా సంకల్పిస్తుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** పరమాత్మ ‘అహం’ అను అనుభవరూపముగల అవిద్యతో కూడుకొని ఈ సర్వప్రాణులందు ఉండిఉన్నాడు. బాలుడు దయ్యములను హృదయంలో కల్పించుకొని వాటిని బాహ్యమున చూస్తాడు చూచావా? అట్లే ఆ పరమాత్మ ఈ నశ్వర–సంకల్పాత్మకులగు ప్రాణులను

---

* **నశ్వరము :** ఏ క్షణమునందునూ నిలకడయే లేనట్టిది; ఎప్పటికప్పుడు మార్పుకు లోనగునట్టిది.

మిథ్యా రూపములుగానే కల్పించుకొని దర్శించుచున్నాడు. "ఒకే పరమాత్మయందు అంతయు స్థిర పడియున్నది" అనునది నిర్వివాదాంశము. ఇక "అహంకారము" అనబడునది వేరొకటి ఎట్లా ఎక్కడ ఉంటుంది? వాస్తవానికి పరమాత్మ భేదరహితుడు. భేదరహితుడగు పరమాత్మ యందు 'అహంకారము' అనునదే లేదు. అతడు సర్వదా అఖండుడే. కాని మండుటెండలో మృగతృష్ణ కనబడునట్లు, స్వతహాగా ఏమాత్రం లేనట్టి అహంకారము భ్రాంతిచే భాసించుచున్నది. ఏది భ్రాంతి మాత్రమే అయి ఉన్నదో అట్టిదానిని "ఇది అసత్యమే కదా!" అనే దృష్టిచే దర్శించటమే జ్ఞానం. అనిత్యమైన దానిలో నిత్యాత్మే దాగి ఉన్నది. నిత్యాత్మలోనే అనిత్యమైనది కనబడటం జరుగుతోంది.

జలము తనయందు తానే 'తరంగము' రూపమున వ్యక్తమగుచున్నది కదా!

**"ఆత్మానాత్మనమాశ్రిత్య, స్ఫురత్యతః యథా అంబసా"**

"ఈ ఆత్మ తనను తానే (మనస్సు రూపమున) ఆశ్రయించినదై, అటుపై తానే కార్యరూపమగు, (As an Eventuality) ఈ జగత్తుగా ప్రకటితమగుచున్నది" అని మేము ఈ జగత్తు విషయమై గ్రహిస్తున్నాం. కనుక ఓ విజ్ఞానఖనీ! రామచంద్రా! అసద్విషయము, (that which is not infact true) గురించిన భ్రాంతిని నీవు త్యజించు. ఇక అహంకారము విషయానికి వస్తే ...... జాగ్రదహంకారం స్వప్నంలో లేదు. స్వప్నాహంకారం సుషుప్తిలో లేదు. కనుక అహంకారం స్వతహాగా లేదు. స్వతహాగా లేనట్టి ఈ అహంకారమును చూచి, "అయ్యో! దీనిని నేను ఎట్లా తొలగించుకోవాలి?" అనే భ్రమాత్మక మైన ప్రయత్నము అనవసరం. అసత్యమును అసత్యముగానే దర్శించు. సత్యస్వరూపము, ఆనంద మయము అగు 'సమ్యక్‌దర్శనము' (Perception of Equality in all) నే ఆశ్రయించు. అట్టి సమ్యక్‌స్థితియే పరమాత్మ యొక్క స్వరూపము.

అజ్ఞానరహితుడవై సునిశితమైన బుద్ధిచే ప్రయత్నపూర్వకంగా ఆత్మతత్త్వ విచారణ చేయటమే ఉచితం. అసద్వస్తువు గురించి ప్రయత్నము, అనగా, "ఈ నా అహంకారము తొలగించుకొంటాను" అనే అభినివేశము ఉచితం కాదు.

**అబద్ధో బద్ధ ఇత్యుక్త్వా కిం శోచసి ముధైవహి?**
**అనంతస్య ఆత్మతత్త్వస్య కిం, కథం, కేన బధ్యతే?**

ఓ రామచంద్రా! ఓ సర్వజనులారా! మీలో ఏ ఒక్కరు బద్ధులు కానేకారు. మరి మీరు "నేను బద్ధుడను. విముక్తి ఎప్పటికి?" అని తలచుచూ ఎందుకు అనవసరంగా దుఃఖిస్తున్నారు? మీ అందరి వాస్తవస్వరూపము ఆత్మయే కదా! అనంతమగు ఆత్మ ఎవనిచే ఎట్లు బంధింపబడగలదు? ఆహాఁ! భేదరహితమగు పరమాత్మయందు భేదాభేదముల గూర్చిన భ్రాంతి కల్పించబడుచున్నది. తొలగవలసింది భ్రాంతి మాత్రమే. భ్రాంతి తొలగగానే, ఇక బంధమేమిటి? ముక్తి ఏమిటి? ఆత్మ యందు వాస్తవానికి ఈ దేహాదులు లేవు. అది దేహరహితమే అయినప్పటికీ, దేహముతో కూడి యున్నట్లు కనిపించుచున్నది. ఈ దేహము ఛిన్నాభిన్నమవవచ్చు గాక! ఆత్మకు వచ్చే హాని ఏమీ ఉండదు. భేదా భేదములు, తదితర వికారములు ఈ శరీరమునకే గాని, ఆత్మకు ఉండవు. ఈ

దేహము నశించవచ్చు. లేక, అనేక గాయములచే, పుండ్లచే నిండిపోవచ్చు. ఎంతో బలం పుంజుకో వచ్చు. లేక క్షీణించవచ్చు. ఇవన్నీ ఆత్మకు సంబంధించినవే కావు. కంసాలి (లేక వడ్రంగి) ఉపయోగించే కొలిమివద్ద ఉండే తోలుతిత్తి చిరిగిపోవటం జరిగితే అందలి వాయువుకు ఏమైనా హాని కలుగుతుందా? సూర్యకిరణములు గోడపై పడుచున్నప్పుడు, ఆ గోడ నేలకూలటం జరిగితే సూర్యకిరణములు పోగొట్టుకున్నదేముంటుంది? ఈ దేహము యొక్క, మరియు ఈ జగత్తు యొక్క ఉత్పత్తి - వినాశనములచే ద్రష్టలగు మనకు వచ్చే హానిగాని, లోపముగాని ఏమీ ఉండదు. "నేను శరీరము కంటే విలక్షణ స్వరూపము కలవాడను. అట్టి నా యొక్క స్వరూపమునకు ఈ శరీరాదులవలన, తదితర భావాదులవలన కలిగే మార్పు చేర్పులేమి ఉంటాయి?" అనియే మనం భావించాలి. ఓ రామా! "దేహము-ఆత్మ" ఈ రెండింటికీ సంబంధము "మేఘము - ఆకాశము" ల సంబంధము వంటిది మాత్రమే. ఈ జగద్రూపమంతా మనస్సే. మనోరూపమగు ఈ జగత్తు యొక్క అంతర్లీనశక్తి చిదాత్మయే. ఆ చిదాత్మ మనస్సు కంటే కూడా అతి సూక్ష్మమైనది. అది ఎన్నటికీ నశించేది కాదు.

ప్రజ్ఞాస్వరూపమునకు జనన-నాశనాది వికారములు ఉండవు. అది ఎచ్చటికీ పోదు. ఎక్కడి నుండి రాదు. "ఆత్మ" సర్వవేళల అవినాశి అయిఉండగా, ఇక ఈ దేహాదుల వినాశమునకు ఎందుకు దుఃఖితులం కావాలి? ఒక మేఘం నశిస్తే, దానిని తాకుచున్న వాయువు ఏమౌతుంది?

**శ్రీ రాముడు :** మరొక మేఘమును తాకుతుంది. లేదా, ఆకాశమును పొందుతుంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అంతేగాని, మేఘము నశించినంతమాత్రం చేత, దానిని తాకుచున్న వాయువు నశించదు కదా! ఈ దేహము నశించటం జరిగినప్పుడు బద్ధాత్మ మరొక దేహమును పొందుతుంది. 'ముక్తాత్మ' అయితే పరమపదమునే పొందుచున్నది. ఇందులో దుఃఖించవలసిన విషయమేమున్నది? ఈ సంసారంలో పరిభ్రమిస్తూనే ఉంటున్నట్టి జీవుని మనస్సే శాశ్వతమై ఉంటూ ఉంటుంటే, ఇక, ఆత్మ విషయం వేరుగా చెప్పాలా?

నాశనభూతమగు ఈ దేహమునకు అవినాశియగు ఆత్మకు ఉన్న సంబంధం, కుండ బదర న్యాయము వంటిది.

ఒక కుండలో ఒక ఫలము వున్నది. ఏదో ప్రమాదవశాత్తు ఆ కుండచిట్లిపోయింది. అంతమాత్రం చేత ఫలము నశిస్తుందా? శరీరము నశించినప్పుడు ఈ జీవాత్మ చిత్తాకాశమును పొందుచున్నది. అట్లాగే, పగిలినప్పుడు కుండలోని ఆకాశము ఏమౌతోంది? కుండలోపల, కుండ బయట కూడా ఉన్నట్టి మహాకాశముతో లీనమగుచున్నదికదా! అసలు, "కుండలోని ఆకాశము కుండ పగులుటచే బాహ్యాకాశమున లీనమగుట" అనునది మాత్రం ఎక్కడున్నది? ఆకాశమంతా సర్వదా అఖండంగా ఉండి ఉన్నదికదా! చిత్తము కూడా క్షయించినప్పుడు ఈ జీవుడు అఖండుడు అగుచున్నాడు. మహాకాశ స్వరూపుడుగా వెలుగొందుచున్నాడు.

ఈ ప్రాణుల యొక్క మనోమయదేహము 'మృత్యువు' అనే వస్త్రం కప్పుకొని 'దేశ-కాలములు' అనే ప్రదేశము లందు దాగుకొనుచున్నది. ఆత్మ వస్తువుకు చిత్ర విచిత్రములైన రంగులను

పూయుచున్నది. ఇట్టి మోసయుక్తమైన మనస్సు గురించి నీవు తపించవలసిన పనేమున్నది? ఇక మరణము మాటేమిటంటావా? పాపం అనేక గృహవ్యవహారములందు నిమగ్నమైన ఈ జీవుడు అంతిమశ్వాస సూచితమగు మరణమువరకు 'ఆత్మ' యొక్క స్వభావమేమిటో, ఎంతటిదో ఎరుగకయే ఉంటున్నాడు. తనపై తనకే సమగ్రమైన-అవగాహన లేకుండుటచే అనేక భ్రమలకు లోనగుచున్నాడు. ఆత్మ మరుగునపడుటయే మరణము. ఆత్మను ఎరుగనట్టి మూర్ఖుడు మాత్రమే "అయ్యో! నేను చచ్చుచున్నాను" అనే భావావేశము పొంది 'మరణము' అనుదానిని గాంచుచున్నాడు. ఆత్మయే స్వరూపముగా గలిగిన నీకుగాని, నాకుగాని, మరింకెవ్వరికిగాని మరణమనేదేదీ లేదు. మనమంతా అమృతానంద స్వరూపులమే. నిత్యత్వము, అప్రమేయత్వము మన సహజ స్వభావమే అయిఉన్నది. మరిక మరణము గురించి భయమెందుకు? ఈ మరణమనునది జీవునియొక్క ప్రారంభముగాని, అంతముగాని కాదు. లోకంలో ఎవరైనా "నేను లేకుండా పోవుచున్నాను" అను అనుభవం పొందు చున్నారా? అట్టిది ఎవరూ గాంచుటలేదు. జ్ఞాని తన యొక్క శరీరము తొలగినపుడు 'స్వసత్త' (Self State with the sense - "I exist") ను అనుభవిస్తూనే ఉన్నాడు. కనుక అతనికి మరణానుభవం లేదు. వాసనలతో కూడిన అజ్ఞానియొక్క మనస్సు జన్మలను, మృత్యువులను ఎప్పటికప్పుడు పొందుచూ, అనుభవిస్తూనే ఉన్నది. కనుక, 'మరణము'-అతని విషయంలో-మరొక దేహమునకై 'నాంది' పలుకుటయే అగుచున్నది.

రెక్కలు వచ్చిన తరువాత పక్షి గూటిలో ఇక ఉండదుకదా! అట్లాగే నీవు ఈ 'వాసనలు' అను గూటిని త్యజించివేయి. మనఃశక్తియే ఇష్ట-అయిష్ట వస్తువులందు, రాగ-ద్వేషములు కలిగి ఉంటున్నది. తద్వారా బంధమున తగుల్కొనుచున్నది. స్వప్నంలోలాగా, మనస్సు భ్రాంతి చేతనే ఈ 'కల్పన' అంతా వ్యర్థంగా చేసుకొంటోంది. ఇది అవిద్యారూపమే కదా! కాబట్టి ఈ మనస్సును నశింపజేయటం సుఖప్రదం. ఇది అభివృద్ధి పొందుచున్నప్పుడు దుఃఖమే కలుగుచున్నది.

'మనస్సు వృద్ధి పొందుట' అనగా అవివేకము పరిఢవిల్లుటయే.

**శ్రీ రాముడు :** ఈ మనస్సు నిరంతరం తుచ్ఛత్వం, మలినత్వం ఆశ్రయిస్తోందే? ఎందుచేత? దీనిని నిరోధించటం ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** తత్త్వజ్ఞానముయొక్క 'అల్పత్వము' చేతనే ఈ మనస్సు మిథ్యారూపమైనట్టి ఈ జగత్తును విస్తరింపజేస్తోంది. మంచుతోను, మేఘములతోను కప్పబడినప్పుడు ఆకాశము మలినమైనట్లు కనబడుతుంది. కాని, వాస్తవానికి ఆకాశము సర్వదా నిర్మలమైనదే కదా! స్వతహాగానే స్వచ్ఛమే అయినట్టి ఆకాశము మలినమొనర్చగలిగేది ఏది ఉన్నది చెప్పు? ఇక ఈ మంచు, మేఘములు అంటావా .... అవన్నీ వస్తూ, పోతూ ఉంటాయి. అంతమాత్రంచేత అవి ఆకాశమును తాకలేవు, మార్చలేవు కదా! భ్రాంతిచేతనే నీ మనస్సు "నేను సహజంగా తుచ్ఛమైనదానను. మలినమైన దానను" అని భావించుచున్నది. అది ఏమాత్రం వాస్తవం కాదు.

❖

మానసిక శక్తియే దీర్ఘస్వప్నము వంటి మిథ్యారూపమగు ఈ జగద్వైచిత్ర్యమంతటినీ సత్యమైనదానివలె కల్పన చేయుచున్నది. ఒక చిన్న దృష్టాంతము విను. ఒకని కంటికి 'తిమిర–రోగము' (a disease that leads to constant movement of eye-lids) అనే వ్యాధి వచ్చినదనుకో ... అప్పుడాతడు ఆకాశంలో రెండు చంద్రులను, రెండు సూర్యులను చూస్తాడు.

1) రెండు చంద్రులు కనబడుటకు కారణం? చంద్రుడా? కాదుకదా! కంటియొక్క దోషమే అట్లు కనబడుటకు కారణమగుచున్నది.

2) రెండవది దృష్టిదోషమును ఆశ్రయించి ఉన్నప్పటి భావనామాత్రవైచిత్ర్యమే కదా! అంతేకాని, సత్యం కాదు కదా!

మానసిక శక్తియే జగత్తుయొక్క ఆకారమును భావనామాత్రంగా గాంచుచున్నది. కనుక ఈ జగత్తు యొక్క కర్తృత్వమును మనస్సుకే ఆపాదించక తప్పదు. రెండు చంద్రులు కనబడుటకు చంద్రుడు కారణం కానట్లు ఈ జగత్తుల స్థితికి ఆత్మకారణం కాదు. దృశ్యము కూడా కారణం కాదు. ఉన్నదంతా ద్రష్టయొక్క మనోరాజ్యములోనే ఉన్నది.

ఓ రామా! సూర్యుడు తన తీక్ష్ణ కిరణాలతో మంచును కరిగించివేస్తాడు చూచావా? నీవుకూడా ఆత్మవిచారణచే మనస్సుయొక్క స్వరూపమును నశింపచేయి. తత్త్వవిచారణచే చిత్తము లయంకాగా, "నిర్మలాకాశం" లాగా ఆత్మసాక్షాత్కారం తప్పక సిద్ధించగలదు. ఓ సర్వసభికులారా ఆత్మతత్త్వము ఎరుగకపోయారా .... అనేక అనర్థములు కలిగించగల అవిద్య పలువిధములైన జన్మలకు, అనేక రకములైన బ్రహ్మాండముల అనుభవమునకు కారణం కాగలదు.

ఈ మనస్సు ఆత్మను ఆశ్రయించటం జరుగుచున్నప్పుడు తనను తానే వివేక – వైరాగ్యములచే నాశనము చేసుకొంటోంది. అందుకే కవులు, "మనస్సు ఆత్మను సమీపిస్తున్నప్పుడు స్వసంహార నాటక పాత్ర ధరించి నృత్యం చేస్తోంది" అని వర్ణిస్తూ ఉంటారు. తనయొక్క నాశనము కొరకే ఇది ఆత్మను దర్శించుచున్నది. ఆత్మ ప్రాప్తించనంతకాలం తన నాశనము ఎట్లా సాధ్యమో తానే ఎరుగలేకపోతోంది. దుర్బుద్ధికలవాడు తాను పొందుచున్న సంకటములకు, దౌర్బల్యములకు తానే కారణం అని ఎరుగలేడు చూచావా? ఇది కూడా అట్టిదే. ఏ వివేకులైతే మనోనాశనమును వాంఛించుచున్నారో, అట్టివారి అభీష్టమును ఈ మనస్సు తప్పక, సంకల్పబలమును అనుసరించి, సిద్ధింప చేస్తోంది. కాబట్టి ఈ మనస్సు ఆత్మయొక్క ఇచ్ఛను అనుసరించే ప్రవర్తిస్తోందని గ్రహించు. ఆత్మకు ఇచ్ఛగల వ్యవహారములను నిర్వర్తించటంలో ఈ మనస్సుకు క్లేశమేమీ ఉండదు. వివేకము, ఉత్తమ సంస్కారములు గల చిత్తము తన యొక్క వివేకబలమును అనుసరించి ఇతఃపూర్వపు సర్వసంకల్ప వికల్పములను త్యజించివేస్తోంది. ఆశలన్నిటినీ వదలుచున్నది. అప్పుడిక సహజంగానే బ్రహ్మాకారవృత్తి కలిగి ఉంటోంది.

మనస్సు లయించినప్పుడు పరమపురుషార్థమగు మోక్షము స్వయముగానే సిద్ధించుచున్నది.

"మనస్సుకన్నా ముందే స్వసత్తస్వరూపుడనై నేను ఉండనే ఉన్నాను" అను ఎరుక, అట్టి ఎరుకతో కూడిన సుస్థిరస్థితియే 'మనోనాశనము' అనే శబ్దముచే చెప్పబడుతోంది, ఉద్దేశించబడుతోంది కూడా! మనస్సు కన్నా (ఆలోచనల కన్నా) ఆ "ఆలోచనలు చేయుచున్నవాడు" మునుముందుగానే ఉండాలి కదా! అతడే ఆత్మ యొక్క ఉనికికి తార్కాణం. అతని గురించిన మననమే "ఆత్మోపాసన– మోక్షస్థితి కూడా".

అట్టి మోక్షస్థితిలో దుఃఖములన్నీ శమించుచున్నాయి. కనుక ఓ రాఘవా! అట్టి మనోనాశనము కొరకే నీవు ప్రయత్నించాలి. అంతేగాని.... మనోవిస్తృతి, విస్తరణ– కొరకు నీ ప్రయత్నములను వ్యర్థం చేసుకోరాదు సుమా! సంసారమనే ఘోరారణ్యం మిక్కిలి దట్టమైనది. ఈ అరణ్యంలో 'సుఖ – దుఃఖములు' అనే అసంఖ్యాకములైన వృక్షములు, 'మృత్యువు' అనే కొండచిలువ నివసిస్తున్నాయి. ఈ అరణ్యమునకు అవివేకముతో కూడిన మనస్సే ప్రభువు. అన్ని విపత్తులకు అవివేకమే హేతువు. కనుక జాగరూకుడవై ఉండాలి సుమా!

❖❖❖

# IX. మహేంద్రజాలం

## పరిచయము
## 1. చిత్త విన్యాసము - జగద్రూపము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ సభికులారా! ఇక మనం తొమ్మిదవ రోజు విచారణలో ప్రవేశిస్తున్నాం.

సముద్రంలో తరంగాలు ప్రకటితమౌతాయి చూచారా? పరమాత్మయందే ఈ చిత్తము ప్రకటితమై, క్రమంగా విస్తారమగుచున్నది. అది అల్పకాలంలో హ్రస్వమును దీర్ఘంగాను, దీర్ఘమును హ్రస్వంగాను చేసివేయుచున్నది. తన రూపమును అన్యముగాను, అన్యమైనదానిని తన రూపముగాను ఒక్క క్షణంలో మార్చివేయుచున్నది. ఆత్మను 'అనాత్మ' గాను, 'అనాత్మ' ను ఆత్మగాను అనుభవించు చున్నది. ఈ చిత్తముయొక్క వైచిత్ర్యము, చమత్కారము అంతటిది. అది తాను చూడని వస్తువును కూడా తన భావనచే అత్యంత ఘనీభూతముగా పొంది అనుభవించగలదు.

బ్రహ్మ చైతన్యమునుండి వికాసము పొందిన ఈ మనస్సు ఒక్క నిమిషంలో అనేక బ్రహ్మాండము లను నిర్మించుచూ, మరల వినాశనమొనర్చగలదు. రాఘవా! స్థావరజంగమములతో (Non-moving, moving) కూడిన ఈ దృశ్యమాన ప్రపంచమంతా కూడా చిత్తమునుండే ఆవిర్భవిస్తోంది సుమా! అట్లు ఆవిర్భవించి దేశ-కాల-క్రియా శక్తులచే సర్వదా పూర్ణమై ఒప్పుచున్నది. ఒక నటుడు అనేక వేషములు వేయుచున్నట్లు ఈ మనస్సు తన చంచలత్వకారణంగా ఎల్లప్పుడు భావనా శక్తిచే సత్యమును 'మిథ్య' గాను, 'మిథ్య' ను సత్యముగాను చేసివేయగలుగుతోంది. స్వయంకల్పితోపార్జితమైన అనేక సుఖ-దుఃఖములను స్వీకరించి అనుభవిస్తోంది. అది దేనిని సుఖముగా భావిస్తే అది సుఖము గాను, దేనిని దుఃఖంగా భావిస్తే అది దుఃఖముగాను పొందుచుండుట గమనార్హం. ప్రాప్తించిన వస్తువులను, విషయములను ఎప్పుడు ఏవిధంగా ('అనుకూలం' అనో, లేక 'ప్రతికూలం' అనో) గ్రహిస్తుందో, అప్పుడు ఈ కాళ్ళు-చేతులు-చెవులు ....మొదలైన ఇంద్రియాలన్నీ అట్లే ప్రవృత్తం అగుచున్నాయి. "ఇది సుఖరూప ఫలము-ఇది దుఃఖరూప ఫలము" అని ఏ క్రియను ఈ చిత్తము సంకల్పించి ఆచరిస్తుందో, అది అట్లే పరిణతి చెందటం జరుగుతోంది. పిల్లలు ఇంటిలో మట్టితో అనేక బొమ్మలు తయారుచేసి "ఇది రాజు-ఇది రాణి-ఇది మంత్రి-ఇవి సైనికులు-ఇవి శత్రురాజులు -ఇవి శత్రురాజుల గుఱ్ఱాలు" ....అని కల్పనచేసుకొని ఆడుకొంటారు చూచావా? అదేవిధంగా ఈ మనస్సు కూడా ఈ ఈ 'జగత్తు' అనే వికల్పములన్నీ నిర్మించుకొని క్రీడించుచున్నది. అట్టి క్రీడలోనే నవ్వటం, ఏడ్వటం, సుఖించటం, దుఃఖించటం, గర్వించటం, అవమానపడటం, కోపించటం... మొదలైన అనేక క్రియలు నిర్వర్తిస్తోంది. మనస్సుయొక్క సృజనాత్మకమైన 'బాలక్రీడ' యందు ఈ

మనుజుల దేహములు, తదితర దేహములు మట్టితో చేసిన ఆటవస్తువుల వలె ఉంటున్నాయి. అట్టి మట్టి ప్రతిమల వంటి తదితర దేహములందు, "ఇవన్నీ సత్యమే" అను సత్యత్వబుద్ధి చిత్తముచే కల్పించబడుచున్నది. కాని ఇదంతా మిథ్యయే అయి ఉన్నది. ఆహాఁ! ఈ చిత్తము పదార్థములన్నిటి యందు అనేక మార్పులను కలుగజేయుచూ, భేదమును ప్రదర్శించుచున్నది. స్వప్నము నందు, సంకల్పము నందు, మనోవీథియందు ఈ చిత్తము దీర్ఘకాలమును స్వల్పంగాను, అనేక యోజనముల దూరం బెత్తడంతగాను చేసివేస్తోంది. ఓ రామా! సూక్ష్మబుద్ధి కలిగియున్నవాడవై, ఈ చిత్తముయొక్క చిత్ర–విచిత్ర కథనమంతా గమనించుచూ ఉండు.

❖

మనస్సు క్షణమును కల్పంగాను, కల్పమును క్షణంగాను చేసివేయగలదు. అందుచేతనే – "దేశకాలములు మనస్సుచేతనే భావించబడుచున్నాయి. అట్టి భావనయే 'అనుభవం' అగుచున్నది. అందుచేత అవి మనస్సుయొక్క అధీనంలోనే ఉన్నాయి" అని విజ్ఞులు చెపుతూ ఉంటారు. ఈ మనస్సు రజోగుణమును అధికముగా ఆశ్రయిస్తున్నప్పుడు తీవ్రమైన కార్యశీలత్వమును, తమోగుణం అధికంగా కలిగియున్నప్పుడు మందత్వమును పొందుతోంది. ఏ కార్యమునందైతే ఈ మనస్సు అధికంగా ప్రసరించి ఉంటోందో ఆ కార్యము ఆ రీతిగానే తప్పక సిద్ధిస్తోంది. దేనియందైతే ఈ మనస్సు మందకొడిగా ఉంటుందో, అట్టి కార్యక్రమము కష్టసాధ్యముగాను, అయిష్టముగాను తోచుచూ ఉంటుంది. మనస్సు యొక్క ఏకాగ్రత ఆత్మ సందర్శనాయుతంగా ఉన్నదా; ... ఇక, సర్వ విలంబనము లను ఈ జీవుడు తప్పక అధిగమించగలడు. చెట్టునుండి కాండములు, ఆకులు, పూలు, మొదలైనవన్నీ వస్తున్నట్లు, ఈ భ్రమలు, వ్యామోహములు, దేశకాలాదులు, గమనాగమనములు – ఇవన్నీ చిత్తము నుండే బయల్వెడలుచున్నాయి.

"అగ్ని" అంటే ఉష్ణత్వమే అయి ఉన్నది కదా!

'సముద్రము' అనగా జలము మాత్రమే కదా!

ఈ వివిధ సాంసారిక కార్యక్రమమంతా సంకల్పముల రూపమగు చిత్తమే అయి ఉన్నది. ఈ "ద్రష్ట – దృశ్యము – దర్శనము" "కర్త – కర్మ – కరణములు", "భోక్త – భోగ్యము – భోగములు".... ఇట్టి అనర్థములతో కూడుకొనియున్న ఈ జగత్తంతా చిత్తము మాత్రమే. మరింకేమీ కాదు. ఒక కంసాలి ఆభరణ విశేషము చూడకుండా, "ఈ నగలోని బంగారము ఎట్టిది?" అని మాత్రమే చూస్తాడు కదా! వివేకులు ఈ జగత్తును గాంచుచున్నప్పుడు, "ఆహాఁ! ఈ బ్రహ్మాండములు, ఈ లోకములు, ఇందలి వస్తుజాలములు ... ఇవన్నీ చిత్తము యొక్క విన్యాసములే. చిత్తమే ఇట్లు ప్రకటితం అవుతోంది" అని వారు గ్రహిస్తున్నారు.

ఈ సందర్భంలో మరొక చమత్కారమైన సంఘటన చెపుతాను. ఇందులో "జగద్రూపముగా కనిపిస్తున్న ఈ ఇంద్రజాలమంతా చిత్తము యొక్క అధీనములోనే ఉన్నది" అని నిరూపించబడుచున్నది.

❖❖❖

# 2. సభామధ్యంలో మహేంద్రజాలం

ఈ భూతలంలోగల "ఉత్తరపాండవము" అనే రాజ్యమును హరిశ్చంద్రుని వంశములోని వాడైన 'లవణుడు' అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని యొక్క శౌర్యము, ఉదారగుణము, వినయములను ఇంద్రలోకవాసులు కూడా మెచ్చుకొంటూ ఉండేవారు.

ఒకరోజు అతడు రాజసభలో సింహాసనం అధిష్ఠించియున్నాడు. ఏవేవో రాజవ్యవహారాలు నిర్వర్తిస్తూ ఉన్నాడు. ఇంతలో ఒక ఐంద్రజాలికుడు ఆ సభలో ప్రవేశించాడు. వేషభాషల విషయంలో గొప్ప ఆడంబరములను ప్రకటిస్తూ లవణమహారాజుకు ప్రణామం చేసి "ప్రభూ! తమ అనుజ్ఞ అయితే నా ఇంద్రజాల విద్య ప్రదర్శించి మీకు, మీ ప్రజలకు వినోదం కలిగిస్తాను" అని విన్నపం చేసుకొన్నాడు. అప్పటికే ముఖ్యమైన రాచకార్యాలన్నీ పూర్తి అయినాయి. అక్కడి వారందరి మనస్సులు వినోదించాలని అభిలషించాయి. అందుచేత రాజాజ్ఞానుసారంగా ఇంద్రజాల ప్రదర్శన ప్రారంభించ బడింది. కొంచెము సేపు అవీ – ఇవీ చూపిన తరువాత ఆ ఐంద్రజాలికుడు రాజసింహాసనమునకు కొంచము దూరంలో నిలబడ్డారు. తన చంకకు తగిలించియున్న సంచిలోంచి ఒక నెమలి పింఛం బయటకు తీశాడు. అది అనేక రంగులతో వెలుగొందుచు, ఈశ్వర మాయవలె భ్రమను గొలుపుచున్నట్లు ఉంది. రాజు యొక్క దృష్టి అసంకల్పితంగా ఆ పింఛముపై కేంద్రీకరించబడింది. వివిధ కాంతులు విరజిమ్ముతున్న ఆ పింఛమును ఐంద్రజాలకుడు గాలిలో చిత్రమైన విన్యాసంతో అటు ఇటు ఊపాడు. రాజు కళ్ళు అనాలోచితంగా మూతబడ్డాయి.

❖

అప్పుడు ఒక రౌతు (Horse Rider) ఆ సభలో ప్రవేశించాడు. అతని వెంట ఒక పంచకళ్యాణ లక్షణములు గల గుఱ్ఱం నడచివచ్చింది. ఆ గుఱ్ఱం అత్యంత సౌందర్యముగాను, శాంతగుణమును కలిగినదై ఉన్నది.

**రౌతు :** రాజా ! ఇది అశ్వములన్నిటిలో శ్రేష్ఠమైన పంచకళ్యాణి – తెల్లగుఱ్ఱం. బహుప్రావీణ్యం గల ఈ గుఱ్ఱం వాయువేగంతో పరుగెత్తగలదు. మా ప్రభువు దీనిని మీ కోసం పంపించారు. మహాత్ములకు సమర్పించబడినప్పుడు అట్టి పదార్థములు మరింత శోభిల్లుతాయి కదా!

**ఐంద్రజాలికుడు :** ఔను ప్రభూ! మీరీ అశ్వమును అధిరోహిస్తే సూర్యభగవానునిలాగా స్వయంప్రకాశం తో వెలుగొందుతారు. భూమిపైకి విచ్చేసిన ఇంద్రభగవానునిలాగా మీరు ఈ గుఱ్ఱము పై కొంతసేపు స్వారీ చెయ్యండి. దీనిని మీ కొరకే తీసుకొచ్చాం!

రాజు ఆ గుఱ్ఱమును చూచి, దాని సౌందర్యమునకు ఎంతో ఆశ్చర్యచకితుడైనాడు.

❖

అనాలోచితంగా కళ్ళుమూసుకున్న ఆ రాజు ఇంతలోనే ఒక్క క్షణంలో విచిత్రమైన ఆకృతి కలవాడయ్యాడు. గోడ మీద చిత్తరువులో లిఖించబడిన పురుషుని యొక్క తెరచియున్న కన్నులువలె

తదేకదృష్టితో అవలోకించసాగాడు. అట్లాగే కొద్ది క్షణాలు ఉండి నెమ్మదిగా కనులు మూసుకొన్నాడు. సింహాసనముపై కూర్చుని ఉండియే చేష్టారహితుడైయ్యాడు. ఒక రాగరహితుడగు మునీశ్వరుడు అంతర్ముఖుడై ఆత్మానందము పొందుచున్నప్పుడు ఎట్లా నిశ్చలంగా ఉంటాడో, అతడు కూడా అట్లే ఉండిపోయాడు. గొప్ప బలశాలి, స్వబుద్ధిచే అత్యంత సునిశితమైన దృష్టిగలవాడు అయిన ఆ రాజు ధ్యానాసక్తుడై ఉన్నాడని అక్కడివారు తలచారు. చాలాసేపైన తరువాత మంత్రులు కొందరు సింహాసనము నకు సమీపంగా వెళ్లి నిలుచున్నారు. మహాధీశాలి అయిన ఆ రాజును సమీపించటానికి, తాకటానికి అక్కడివారెవ్వరికీ ధైర్యం చాలటం లేదు. వింజామరలు కదలటం మానివేశాయి. వింజామరలు వీచే స్త్రీలు కూడా రాజును గమనిస్తూ, పాపం చేష్టారహితులయ్యారు. సభాసదులందరు క్రమంగా నిశ్చేష్టితులై ఉండిపోయారు. అక్కడి కోలాహలం క్రమంగా శాంతించింది. మహామేధావులైన అక్కడి మంత్రులు ఇదంతా విస్తుపోయి గమనిస్తున్నారు. ఏమి చెయ్యాలో తెలియక సంశయగ్రస్తులై విషాదంలో మునిగిపోయి, ఒకరి ముఖాలు ఒకరు చూచుకొంటున్నారు. సభికులలో చాలామంది ఆశ్చర్యంగా అంతా గమనిస్తూ నిరుత్సాహం, దుఃఖం పొందసాగారు.

ఒక గంట కాలం గడచిపోయింది. లవణ మహారాజు శరీరం అకస్మాత్తుగా కొంచెం ప్రబోధం పొందింది. అతడు అవయవములను కొద్ది కొద్దిగా కదల్చసాగాడు. ఇంతలోనే అతని అవయవములు వేగంగా కదలసాగాయి. పెద్ద భూకంపం సమయంలో ఎత్తైన మేడ ఒక్కసారి నేలకూలుతుంది చూచావా? ఆ విధంగా ఆ రాజు ఒక్కసారి పైకి ఎగిరి నేలకూలసాగాడు. ఆ ప్రక్కనే ఉన్నట్టి అత్యంత సమయస్ఫూర్తి గల అతని మంత్రులు రాజు నేలపై పడకముందే పట్టుకున్నారు. కొంచెము వగర్చుచు రాజు కొద్ది క్షణములైన తరువాత నెమ్మదిగా కనులు తెరచాడు. చుట్టూ చూచి ఒక్కసారిగా "ఏమిటిది? ఆశ్చర్యంగా ఉన్నదే? నేను ఇప్పుడు ఎక్కడ ఉన్నాను? ఇది ఏ ఊరు? అయ్యగార్లూ? మీరంతా ఎవరు? ఈ సభ ఏమిటి? పిల్లాడు ఏడీ? అయ్యా ! అయ్యా ! దణ్ణం పెడతాను. నన్ను వదలండి" అని కలవరిస్తున్నట్లు పలుకసాగాడు.

**మహామంత్రి :** దేవా! మహారాజా! రాహువును చూచినప్పటి సూర్యునిలాగా తాము ఇట్లు చింతా క్రాంతులు అయ్యారేమిటి? తమకు ఇట్టి స్థితి ప్రాప్తించటం, ఇట్లా మాట్లాడటం చూచి మేమంతా ఎంతో వ్యాకులచిత్తులమౌతున్నాం. మీ వంటి దృఢచిత్తము కలవారిని కూడా కారణం లేకుండానే భ్రాంతి భేదించగలదంటే మాకు ఆశ్చర్యంగానే ఉన్నది. మేమంతా చాలా కాలంగా ఉన్నతమైన తమ వ్యక్తిత్వమును గమనిస్తూ వస్తున్నాం. ప్రియమైన మిత్రునివలె మమ్ములను మామా ధర్మములందు సముత్సాహపరుస్తూ ఉండేవారు. మమ్ములను మా పూర్వజన్మసుకృతం చేతనే, మీరు పాలించటం జరుగుతోంది. వికల్పరూపముతో కూడిన అల్పభోగములందు మీ చిత్తం తగుల్కొనటం మేమెప్పుడూ చూడలేదు. అవిచారముచే మొదట రమణీయంగా కనిపించినా, ఆ తరువాత తుచ్ఛంగా పరిణమించే అల్పభోగవ్యవహారములు, మాయతోకూడిన ఆయా ప్రాపంచిక వ్యవహారములు... ఇవన్నీ, అనుభవజ్ఞు లగు మీకు తెలియునవి కాదు. ఉత్తమ గుణసమన్వితమైన మీ చిత్తము ఇప్పుడు ఏవైనా రాగాదులచే

మోహితం అయిందా? లేదే! మీరు నిత్యము రాజసభలో వివేకమును నిదురలేపే ఉత్తమ కథలను, చరిత్రలను ప్రవచించు కార్యక్రమములు ఆజ్ఞాపిస్తూ ఉండేవారు కదా! అట్టి శాంతనిర్మలమైన మీ మనస్సు ఏ భయోత్పాత విషయములందు నిమగ్నమై భ్రమ పొందటం జరిగింది?

మహారాజా! మీరు సర్వము తెలిసినవారు. "విషయములు నశించటం జరిగితే నేను కూడా నశిస్తాను" అని తలచటమే ఈ మనస్సు యొక్క ఒకానొక దుర్లక్షణం. అట్టి క్షుద్రభావముతో కూడియుండుట చేత ఈ మనస్సు లోకకార్యములందు విమోహితమగుచున్నది. అయితే శుద్ధము, వివేకయుక్తము అయిన మనస్సు మాత్రం అట్లా మోహం చెందుటలేదు. దేహాభిమానము కలిగి, అజ్ఞానము నందు ఉండి ఉన్నప్పుడు ఈ మనస్సు తనయందు ఏ 'విషయవృత్తి' ఉదయిస్తే ఆవైపే పరుగెత్తుతుంది. ఓ మహారాజా! ఏ మనస్సైతే వివేకమును తగినంతగా అభ్యసించకుండా దేశ కాలముల వైపు నిత్యం పరుగులు తీస్తూ ఉంటుందో అట్టి మనస్సు మాత్రమే మంత్ర – ఔషధములకు వశమౌతూ ఉంటుంది. మీరు అట్టివారు కాదు. వివేకయుక్తమై, ఉదారవృత్తిగల మీవంటివారి మనస్సు దేని చేతనూ బలహీనం కాదు. ఒకవేళ దైవవశాత్తూ కించిత్ విక్షేపం కొద్దిసేపు సంభవించినా, మీరు సంపాదించియున్న విజ్ఞాన–వివేకాదుల ప్రభావంచేత మరల ప్రశాంతత పొందగలదు. నిత్యము వివేకము కలిగియుండే మీ వంటివారి మనస్సు... ప్రజ్ఞ కోల్పోవటమో అల్పవిషయములను ఆశ్రయించటమో.... చేస్తుందా? అట్లా జరగకూడదే? గాలి కొండను కదల్చగలుగుతుందా? దృఢచిత్తమును విషయవృత్తులు ఏమీ చెయ్యలేవు.

❖

మంత్రుల యొక్క తదితర స్వజనుల యొక్క ప్రియవచనములు ఆ రాజు ఆలకించాడు. మరల కొంచెం కొంచెం ధైర్యం పుంజుకొన్నాడు. పూర్ణచంద్రునివలె అతని మనస్సు–బుద్ధి వర్తమానమైన పరిసర జ్ఞానంతో వికాసం పొందాయి. సభ అంతా కలియచూస్తూ కొంచెం సేపు గడిపాడు. అనేకులను కళ్ళతోను, చిరునవ్వులతోను పలకరించాడు. ఆ తరువాత కొంత భయ–ఆశ్చర్యములతో తన యందు ఉదయించిన 'తీవ్ర ఉద్వేగము' గురించి విచారించసాగాడు. ముందు వెనుక వృత్తాంతమంతా స్మరించుచు, ఇక ఇట్లు పలికాడు.

**లవణ మహారాజు :** ఓయీ! ఇంద్రజాలికుడా! నీ మాయాజాలం క్షణంలో శాంత సముద్రమును కూడా క్షుభితం చేయగలిగేదేనయ్యా! ఎంత విచిత్రంగా రచించావు! ఆహాఁ! మంత్రాదులందలి ఈశ్వరశక్తి అత్యద్భుతమైనది కదా! ఎంతటి సమర్థుల చిత్తమైనప్పటికీ, అది విమోహం చేసి వేయగలదు కాబోలు! మేము ఈ లోకవ్యవహారం నిర్వర్తించటంలో దక్షత కలిగిఉండవచ్చు. ఏం లాభం? ఆ దక్షతంతా నీ మాయ ముందు ఎందుకూ పనికి రాకుండా పోయింది కదా! మోహప్రదములైన ఆ ఆపదలు గుర్తుకు వస్తేనే ఒళ్ళు జలదరిస్తోంది. గొప్ప ప్రజ్ఞావంతుల ఉత్తమ వివేకయుక్తమగు మనస్సు కూడా అప్పుడప్పుడు స్వప్నములాగా, ఇంద్రజాలంలాగా మోహం చెందుతుందని విన్నాను. ఇక నేనెంతటివాడను?

ఓ సభికులారా! ఈ ఇంద్రజాలికుడు శంభరాసురుడంతటి మాయా రచయిత అయిఉన్నాడు. కొద్ది సమయంలో అతి దీర్ఘమైన, దుర్భరమైన, విచిత్రమైన జీవితమును చవిచూపించాడు. ఒకప్పుడు బలిచక్రవర్తి ప్రార్థించగా బ్రహ్మదేవుడు ఒక గొప్ప ఇంద్రజాలమును రచించి, ఇంద్రుని యొక్క పటాటోపమంతా వినాశనమొనర్చి, కొంతసేపు బలిచక్రవర్తికి ఇంద్రపదవి కట్టబెట్టిన అనుభవం కలిగించాడని పురాణాలలో చదివాం.

అదే విధంగా ఇతని ఇంద్రజాలంలో 60 సంవత్సరములుగా విస్తరించిన అనేక కార్యములను, చంచల పరిస్థితులను చూచాను.

ఇప్పుడు నేను భ్రమచే పొందియున్న అనేక వ్యవహారములను, స్థితి – గతులను వివరించి చెపుతాను. అంతా వినండి.

❖❖❖

## 3. వాహ్యాళి - ఆకలి - వివాహం

**లవణ మహారాజు :** సభికులారా!కొద్దిక్షణాలలో నా మనస్సుకు అనుభవమైన సుదీర్ఘ అనుభవ పరంపరల గురించి చెపుతాను. వినండి.

నేను ఈ సింహాసనముపై కూర్చుని ఉండగా ఈ ఇంద్రజాలికుడు ఎక్కడనుండో వచ్చి ఇక్కడ మన ముందు ఇంద్రజాలవిద్యలు ప్రదర్శించటం మీరు చూచారుకదా! అతడు ఒక నెమలి పింఛమును నా కళ్ళముందు వేగంగా త్రిప్పాడు. అందులోంచి చిత్రవిచిత్రములైన రంగులు కనిపించాయి. నా పరిసరాలన్నీ మరచి, ఒంటరివాడనై విరజిమ్ముచున్న ఆ రంగులనే కొంత సేపు చూచాను. ఏదో భ్రాంతి నా బుద్ధిని ఆవహించింది. తలవిదిల్చి చూడగా, ఎదురుగా నాకొక గుఱ్ఱం కనిపించింది. ఎవ్వరో "మహారాజా! ఈ ఉత్తమజాతి గుఱ్ఱం మీకే తగినది. దీని తెల్లటి స్వచ్ఛత, జూలు చూచారా? దీనిని మీవంటి వీరాధివీరులు అధిరోహించటం, స్వారీ చేయటం ఎంత సుందరమైన విషయం!" అని ఉత్సాహపరిచారు. అది విని నేను ఆ తెల్లటి పంచకళ్యాణి గుఱ్ఱం అధిరోహించాను. వేటకై అడవిలో ప్రవేశించాలనే ఉత్సుకతతో మన ఈ రాజధానికి ఉత్తరంగా గల అడవుల వైపు గుఱ్ఱమును పరిగెత్తించాను.

❖

ఆ గుఱ్ఱం ఎక్కి వాయు వేగంతో చాలా దూరం ప్రయాణం చేశాను. ఈ మనస్సు అవిచారణచే పైకి మాత్రమే రమ్యంగా కనిపించే విషయములను సేవిస్తూ జడత్వం పొంది, పరమాత్మానుభవమునకు దూరమౌతుంది చూచారా! నేను కూడా ఆ విధంగా తెలిసీ తెలియకుండా చాలా దూరం వెళ్లి, చివరికి ఒక వనంలో ప్రవేశించాను. ఆ వనం అతి భయంకరంగాను, సహించరానిదిగాను కనిపించింది. అందులో కొంత భాగం 'విరాగుల చిత్తము' వలె పదార్థరహితమై యున్నది. అయినప్పటికీ నేను అట్లా పోతూనే ఉన్నాను. ఎక్కడా కనుచూపు మేరలో చెట్టుగాని, నీరుగాని

కనిపించటం లేదు. గుఱ్ఱం ఎంతగానో అలిసిపోయి ఉండటం గమనించి ఆగి, అన్నివైపుల కలయ చూచాను. అనంతంగా కనబడుచున్న ఆ ప్రదేశంలో ఎక్కడా జనసంచారం ఉన్నట్లు లేదు. ఆ పరిసరాలు చూచి ఎందుకో ఎంతో ఖిన్నుడనయ్యాను. ఏదో దైన్యం నా గుండెలో ప్రవేశించింది. మరల గుఱ్ఱం ఎక్కి ఎట్లో ప్రయాణం సాగించాను. ఎట్లాగైతే ఏం? సూర్యాస్తమయం అయ్యే సమయానికి, వివేకులు ఈ సంసారమును దాటి వేయ కలుగుచున్నట్లు, నేను ఆ విశాలశూన్యవనమును దాటి వేశాను. ఎంతో అలసిపోయి ఉన్న ఆ గుఱ్ఱంతో మరొక అరణ్యంలో ప్రవేశించాను.

ఆ అరణ్యంలో ఆకాశమును అంటుచున్న పెద్ద పెద్ద వృక్షాలు కనిపించాయి. పక్షులు చెట్లపై నుండి మధురంగా గానం చేస్తున్నాయి. అయితే అక్కడ నాకు ఒక చిత్రం కనిపించింది. అధర్మముచే ధనము ఆర్జించే దుష్టుని యందు ఆనందవృత్తులే కనిపించవు చూచారా? అట్లాగే అక్కడ నేలపై ఎక్కడా పచ్చికయే కనిపించలేదు. కాని వెనుకటి వనంకంటే ఇది కొంత సుఖకరంగా అనిపించింది. ఈ జీవులు "అత్యంత దుఃఖదాయకమగు మరణముకంటే ఈ రోగములే మేలు" అని చెప్పుకొంటూ ఉంటారు చూచారా? నా పరిస్థితి కూడా అట్లాగే ఉన్నది.

❖

సాయంకాలమయింది. కొంచెం – కొంచెం సూర్యుడు అస్తాద్రి చేరుకున్నాడు. వెలుగు మందగించ నారంభించింది. నేను గుఱ్ఱంపై చెట్ల మధ్య నుండి వంకరటింకరగా ప్రయాణిస్తూ ముందుకు పోతూ ఉన్నాను. ఇంతలో ఒక పెద్ద వృక్షమునకు వ్రేలాడుతున్న ఏదో తీగ నా మెడకు చుట్టుకొన్నది. నేను నేలపై చతికిలపడ్డాను. గుఱ్ఱము నన్ను వదలి ఎటో వెళ్లిపోయింది. అప్పటికే ఎంతో అలసిపోయి ఉండటం చేత కొంతసేపు అక్కడే పడి ఉన్నాను. ఇంతలో సూర్యుడు పూర్తిగా అస్తమించాడు. అరణ్యమంతటా నిబిడాంధకారం వ్యాపించింది. అక్కడి నుండి లేచి నెమ్మదిగా ఒక చెట్టు యొక్క తొఱ్ఱలోకి పోయి, దాక్కున్నాను. ఏవైనా క్రూరమృగములు అక్కడ సంచరిస్తూ ఉండవచ్చని నా భయం. ఆహాఁ! ఇక ఆ రాత్రి ఆ చెట్టు తొఱ్ఱలో ఎట్లా గడచిందో చెప్పలేను. పాము కరిస్తే మనిషి తన వివేకం కోల్పోతాడు చూచారా? నా బుద్ధి కూడా అట్లాగే అయింది. జ్ఞాపకశక్తి మందగించింది. త్రాళ్ళతో చెట్టుకు కట్టివేయబడినవానివలె విలవిలలాడాను. చీకటినూతిలో పడినవానివలె అస్వతంత్రుడనయ్యాను. మనస్సు మోహముచే కప్పివేయబడింది. "ఒక మహాసముద్రంలో ఎటో తెలియని వైపుగా కొట్టుకుపోతున్నానా?" అని అనిపించింది. ఆ రాత్రి ఒక కల్పమంత దీర్ఘంగా గడచి పోయింది. క్రమంగా తెల్లవారటం ప్రారంభమైనది. కాని, అప్పుడు నాకు స్నానం లేదు. పూజలేదు. భోజనం చెయ్యలేదు. ఒక్కొక్క క్షణం ఎంతో బరువుగా సాగుచున్నది.

సూర్యోదయం చూచి ప్రాణం లేచి వచ్చినట్లైనది. ఒక దరిద్రుడు గొప్ప బంగారపు మూటను చూచినట్లు, ఒక అజ్ఞాని గురుకృపచే సమగ్రమైన జ్ఞానం పొందినట్లు నేను సూర్యభగవానుని చూచాను. చెట్టు దిగి ఇక ఆ అరణ్యంలో సంచరించసాగాను. అక్కడ నాకు ఒక్క ప్రాణి కూడా కనిపించనే లేదు. అక్కడక్కడ పళ్లు ఏమాత్రం లేని వృక్షములపై ఏవో చిన్న పిట్టలు మాత్రం

కనిపించాయి. వాటి "కూచికూచి" శబ్దములు వింటూ అటూ ఇటూ తిరుగసాగాను. క్రమంగా నాలో నీరసం అధికం అయింది. మిట్టమధ్యాహ్నమైనది. ఆకలితో, దాహంతో, కడుపు కరకర లాడుతోంది. అన్నార్తితో నా కళ్ళు అటూ ఇటూ వెతుక నారంభిచాయి.

ఇంతలో నాకు అల్లంత దూరంలో ఒక 11 - 12 సం॥ల వయస్సు ఉండే బాలిక కనిపించింది. ఆమె మట్టి కొట్టుకుపోయి, చినిగి, జీర్ణమైన వస్త్రములు ధరించియున్నది. జుట్టు ముళ్ళుపడి సంస్కార రహితంగా మట్టి ఊడలవలె వ్రేలాడుచున్నది. ఆమె చేతిలో అన్నపు మూట కనిపించింది. నా ప్రాణాలు లేచివచ్చాయి. ఎట్లాగో ఓపిక చేసుకొని చంచలనేత్రములుగల ఆమె దగ్గరకు పరుగులు తీశాను.

"ఓ బాలికా! ఒక్కమాట. ఇప్పుడు నాకెంతో ఆకలిగా ఉన్నది. ఈ ఆపద సమయంలో నాకీ అన్నం పెట్టు. దీనుల దుఃఖములను తొలగించువారి సంపదలు వృద్ధిపొందుతాయని పెద్దలంటారు. నా ఆకలి బాధ మాటలతో చెప్పలేను..." అంటూ ప్రార్థించసాగాను. కానీ ఏం లాభం? స్త్రీలను హింసించే వానికి లక్ష్మీదేవి ధనం ఇవ్వదు చూచారా? అట్లాగే ఆమె నాకు ఆహారం ఇవ్వకుండానే నడచి వెళ్లిపోతోంది. అయినాకూడా నేను ఆమె వెంటపడి బ్రతిమిలాడాను. అప్పుడా కన్య "ఏమయ్యోయ్! ఓ భుజకీర్తులు ధరించిన అయ్యగారూ! నా వెంటపడుచున్నావేమిటి? నేను చండాల కన్యనే! మేము మనుష్యుల, గుఱ్ఱముల, ఏనుగుల మాంసం తింటూవుంటాం కదా! నేను అతి క్రూరమైన రాక్షసివంటిదాననని నీవంటి పెద్ద అయ్యలు అంటూ ఉంటారు. మా ఆహారం నీవు తినటమేమిటి? చాలు చాలు. నా వెంటపడబోకు. నానుంచి నీకు ఒక ముద్ద బువ్వ కూడా లభించదు. వెళ్ళెళ్ళు" అంటూ పోతూనే ఉన్నది. మధ్యమధ్యలో వినోదంగా చెట్టు వెనుక, పుట్టవెనుక దాగుడు - మూతలాడుతూ నన్ను ఏడిపించసాగింది. "రా బాబు! రావయ్యా...రాఁ" అంటూ నన్ను కవ్విస్తోంది. పిల్లికి చెలగాటం - ఎలుకకు ప్రాణసంకటం అంటే ఇదే కాబోలు .... అని అనుకొన్నాను. ఎట్లాగో అట్లా ఒకచోట ఆమెను సమీపించాను. ఆమె నేలపై కూర్చుని నావైపు చిలిపిగా చూస్తోంది. నేను ఆ ప్రక్కనే చతికిలపడ్డాను.

**నేను :** చూడు అమ్మాయీ! ఇక నా ఓపిక క్షీణించింది. ఇప్పటికన్నా నీ చేతిలోని ఆహారం నాకు ఇచ్చి పుణ్యం కట్టుకో.

**బాలిక :** ఓ దొరా! ఇప్పుడు నా మనస్సులోని మాట చెపుతాను. విను. నీవు అందమైన కుఱ్ఱవాడివి. నాకు నచ్చావు. నీవు నాకు మొగుడు కావటానికి ఒప్పుకుంటే ఇప్పటికిప్పుడు ఈ ఆహారం నీకు ఇస్తాను. లేదంటావా, నా దోవన నేను పోతాను. నువ్వు ఒప్పుకోకపోతే, నీకు నేను బువ్వ ఎందుకు పెట్టాల? నా తండ్రి అదిగో, అల్లంత దూరంలో ఎద్దులు తోలటం, పొలములు దున్నటం చేస్తూ ఉంటాడు. ఈ ఆహారం మా అయ్యకోసమే తీసుకుపోతున్నాను. కాని నీవు నా మొగుడివైతే ఇదంతా ఇచ్చివేస్తాను. ఆడదానికి మొగుడు ప్రాణంతో సమానం కదా!

❖

అంత ఆకలిగా ఉన్నప్పుడు కుల – జాతి ధర్మాలు ఎవడికి కావాలి? ఆహాఁ! ఆకలి సకల విభేదాలు విస్మరింపజేస్తుంది.

**నేను :** ఓ అమ్మాయీ! సరే. నీవు కోరినట్లే నీకు భర్తను అవుతాను. ముందు ఆ ఆహారం నాకు పెట్టు.

అప్పుడామె ఆ ఆహారంలో సగభాగం ఇచ్చింది. నేనది ఆవురావురంటూ అమృతతుల్యంగా తిన్నాను. ఆ సమయంలో ఆకలి తీర్చుకోవటమే యోచించాను. మరింకే విషయంలోనూ నా బుద్ధి పనిచేయటమే మానివేసింది. ఆ ప్రక్కనే పొదలలో ఉన్న ఏవో పళ్ళు తెచ్చి వాటిరసం ఒక తోలు పాత్రలో పోసి ఆ బాలిక నాకు ఇచ్చింది. అది గటగటా త్రాగివేశాను. అక్కడే కొద్దిసేపు విశ్రమించాను. ధూళిచే కప్పబడి, నల్లటి రంగు పుణికి పుచ్చుకొన్న ఆ అమ్మాయి నా చెయ్యి పట్టుకొని తన తండ్రి ఉన్న ప్రదేశానికి తీసుకుపోసాగింది. అప్పుడామె నా ప్రాణం తనవశం చేసుకొని తీసుకుపోతున్నట్లుగా అనిపించింది. ఒక అరగంటసేపు నడచిన తరువాత ఆమె తండ్రిని సమీపించాం. అతడు పొడవైన శరీరం కలవాడు. అతని ఆకారం చూడగానే భయము కొల్పేట్లు ఉన్నది. కురూపుడు, దుష్టుడు అయిన అతని కళ్ళు క్రూరత్వమును నిర్వచిస్తున్నట్లున్నాయి.

**ఆ పిల్ల తండ్రి :** ఏమేవ్? ఏందీ, ఇంత ఆలస్యమైనది? ఏం పోయేకాలం?

**ఆ పిల్ల :** అయ్యా! ఈ పోరగాడిని చూచావా? ఈడు నాకు నచ్చాడు. ఈడు నన్ను మనువాడుతాడంట! నువ్వు "ఊఁ" అనువే ...

**ఆ పిల్ల తండ్రి :** సరేలేయే .... ఆడు ఒప్పుకున్నాడు గందా .... అట్లాగే మనువాడుదువుగాని .... ముందు బువ్వపట్టుకురా.

అతడు ఆహారం తీసుకొని మరల పనిలోకి పోయాడు. ఆమె నా ప్రక్కన చేరి వినసొంపు గాని భాషలో ఏవేవో సరస – విరసాలు ఆడసాగింది. "నేను ఏమగుచున్నాను?" అనునది అర్థం కాక ఏదో విషాదంగా యోచిస్తూ అట్లే చతికిలపడి ఉన్నాను. ఇంతలో సాయం సమయమయింది. మేము ముగ్గురం నడచుకొంటూ చండాలవాటికకు చేరాం. అక్కడ గుడిసెల ముందు కోళ్ళు, కాకులు, కోతులు, పందులు మొదలైనవి ముక్కలు–ముక్కలుగా కోయబడి ఉన్నాయి. అనేకచోట్ల, నేల రక్తముచే తడుపబడి ఉన్నది. ఆ ప్రదేశాలలో దోమలు, ఈగలు దట్టంగా ముసురుతున్నాయి. కొన్ని గుడిసెల ముందు దండాలకు తడిప్రేగులు ఎండబెట్టి ఉన్నాయి. గొఱ్ఱె చర్మములు త్రాళ్ళకు వ్రేలాడుచుండగా, వాటిలోంచి రక్తపు చుక్కలు ఇంకా నేలకు రాలుచున్నాయి. కొన్నిచోట్ల వేపచెట్లపై పక్షులు శబ్దాలు చేస్తున్నాయి. నేలంతా ఎండిన వేపాకులతోను, పుల్లలతోను, మురికినీరు గల చిన్న చిన్న గుంటలతోను నిండిఉన్నది. అక్కడి బాలుర చేతులలోగల పచ్చి మాంసపు ముక్కలపై దోమలు వ్రాలుచు ఝుంకారం చేస్తున్నాయి. వృద్ధులు, శ్రేష్ఠులు అయిన అక్కడివారు ఆ బాలురను మందలి స్తున్నారు. నేను నడచి వెళ్ళటం చూచి, వాళ్లంతా ఆ రణగొణలు ఆపి నా వైపే చూడనారంభించారు. అట్లా కొంతసేపు నడచి, ఆ బాలిక యొక్క గృహంలో ప్రవేశించాం.

ఆ ఊరి పేరు 'పుష్కరఘోష'.

ఆ బాలికావాళ్ళ ఇంటి ప్రదేశమంతా నాడులతోను, జంతువుల బొమికలతోను నిండి ఉన్నది. ఆ కన్యక పరుగు పరుగున ఇంటిలోకి పోయి తల్లితో ఏదేదో చెప్పింది. ఆ ఇంటిలోనివారు ఆదరంతో నన్ను ఒక గోనెసంచీ ఆసనంపై కూర్చోబెట్టారు. ఆ చుట్టుప్రక్కల గుడిసెల వాళ్ళకి నా రాక గురించి తెలిసింది. కంకరరాళ్ళు దొర్లిస్తున్నట్లు భీకరమైన గొంతుగల మా అత్తగారు అక్కడి ఆడవాళ్ళతో 'ఓసి అత్తా! పిన్నీ! చూడండే. ఈడే మా కాబోయే అల్లుడు. మాకు శ్రమలేకుండా మా అమ్మాయే తెచ్చుకుంది" అని అరుస్తూ చెప్పసాగింది. వాళ్ళందరు, 'ఒక బుట్టబొమ్మను పిల్లలు చూచునట్లు' నన్ను చూడసాగారు. ఆ తరువాత నేను కొంతసేపు విశ్రమించాను. మా మామగారు, అత్తగారు ఏవేవో పదార్థములు తెచ్చిపెట్టారు. అవన్నీ "ఇవేమిటి?" అని అడగకుండా తినసాగాను. మరి ఆకలియొక్క మహిమ అట్టిది. ఇక ఆ పిల్ల, మా అత్తగారు అనేక దుఃఖములకు హేతువైన కుత్సిత ప్రణయవాక్యాలు పలుకసాగారు. ఆ వాక్యాలలోని నీచత్వం నాకు బాధ కలిగిస్తున్నది. అయితే వాళ్ళుమాత్రం గొప్ప ధనపుమూట దొరికినట్లు నవ్వుకొంటున్నారు.

ఒక శుభముహూర్తాన ఆ బాలికను నేను పెళ్ళి చేసుకున్నాను. మా పెళ్ళిరోజున అక్కడివారంతా ఒకచోట గుమిగూడారు. పచ్చివి, పచనము అయినట్టివి అయిన మాంసాదులను సేవించారు. చాలా మంది పీకల దాకా మద్యమును త్రాగారు. పెద్దపెద్ద వాయిద్యములతో భీకర శబ్దములు చేశారు, ఆడారు, పాడారు. నాకు మాత్రం – ఆ స్థలము ఒక మహానరకమువలె, ఆ వాయిద్యములు బ్రహ్మహత్యాది మహాపాపముల సముదాయమువలె నాకప్పుడు తోచింది. జీవుడు యమలోకమునకు పోయినప్పుడు స్తబ్ధుడైనట్లు నేను మౌనం వహించి అదంతా నిర్లిప్తంగా చూస్తూ ఉన్నాను. ఓ సభికులారా! ఇక ఎక్కువగా చెప్పేదేమున్నది? ఆ వివాహమహోత్సవమునకు వశుడనై, అది మొదలుగా, నేను అక్కడి వారిలో ఒకడనయ్యాను. క్రూరత్వము మొదలైన అక్కడివారి గుణములు నేను కూడా ఆశ్రయించాను. మా పెళ్ళి ఉత్సవం ఏడు రాత్రులు జరుపబడింది.

❖❖❖

# 4. క్రౌర్యం

క్రమంగా రోజులు గడుస్తున్నాయి. ఎనిమిది నెలల తరువాత నా భార్య ఋతుమతి అయింది. దుష్క్రియలు ఆపదలు కలుగజేస్తాయి చూచారా? మూర్ఖుడు అనర్థములైన సంకల్పములు చేస్తూ ఉంటాడు కదా! అదే విధంగా కాలం అనేక మూర్ఖపు పనులతో గడువసాగింది. మాకు కాలక్రమేణా ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు పుట్టారు. క్రమంగా మా పిల్లలు ఎదుగనారంభించారు. బ్రహ్మ హత్య చేసినవాడు అనేక దుఃఖములను పొందుతూ ఉంటాడే! అట్లాగే నేను కూడా అనేక సంసార దుఃఖములను మరల మరల పొందుతూ కాపురం చేశాను. నా పరిస్థితి అల్పజలాశయంలోని ముసలిచేపవలె తయారయింది. ఎండకు, చలికి వివశుణ్ణి అవుతూ ఇంతకుముందు నేను ప్రవేశించియున్న అరణ్యంలో ఎంతోకాలం సంచరించాను. "కుటుంబపోషణ" అనే చింతలో ఎందరు

ఈ మహాసంసారారణ్యంలో సంచరించటంలేదు చెప్పండి? నా సంచారం కూడా అట్టిదే అయింది. అనేక క్షుద్ర ప్రయత్నముల ప్రభావంచేత నా బుద్ధి మందగించింది. అనేక సంసార క్లేశములచే దుఃఖ పీడితుడనయ్యాను. "పిల్లలు-ఆరోగ్యములు-ఆహారములు-ధనములు".... ఇట్టి ఏవేవో కార్యక్రమములలో నిమగ్నమగుచు దిక్కుతోచక దిక్కులన్నీ పరిభ్రమించాను. పాపభారం మోసినట్లు, చినిగియున్న వస్త్రమును తలకు చుట్టుకొని, గడ్డిమోపును నెత్తిన ధరించి వేలాదిసార్లు అనేక మైళ్ళ దూరం నడిచాను. దుర్గంధ భూయిష్ఠమైన ఒక గోచి ధరించి ఎక్కడెక్కడో తిరిగాను. ఈగలు వ్రాలు చుండే అనేక మురికి ప్రదేశములలో విశ్రమించాను. నా కుటుంబాన్ని పోషించుకోవాలనే తపనతో అనేక ప్రయత్నములందు నిమగ్నమగుచు జీర్ణదేహుడనయ్యాను. జంతువులను వేటాడే ప్రయత్నాలలో ఎక్కడెక్కడో దాక్కున్నాను. ఎవరెవరినో ఎంతగానో హింసించాను. అనేక కలహములచే కలిగిన దుఃఖ తాపములకు రక్త బిందువులతో సమానమైన కన్నీళ్ళు కార్చాను.

అక్కడి అడవిలో కొన్ని శిలల క్రింద రహస్య గృహములవలె గుహలవంటివి ఉన్నాయి. ఆ రహస్యగృహములలో ఉండి అప్పటికప్పుడు కాల్చుకొన్న పంది మాంసము భక్షిస్తూ ఎన్ని రాత్రులు గడిపానో చెప్పాలంటే, అలవి కాదు.

ఆ విధంగా అక్కడ చాలా కాలం గడిచిపోయింది. నిరంతరం కొందరు బంధువులంటే ఇష్టం, మరికొందరు బంధువులంటే ద్వేషం కలిగియుండేవాళ్ళం. అనేకమందితో ఏర్పడిన పోట్లాటలు నన్ను దుఃఖితునిగాను, దీనునిగాను చేశాయి. కొన్నాళ్ళైన తరువాత నేను నా భార్య - పిల్లలతో మరొక చండాల గృహంలో ప్రవేశించి, అక్కడ చాలా కాలం ఉన్నాం. నా ముఖం ఎల్లప్పుడు భార్యతో పోట్లాడటంలోను, ఇతర చండాలురతో ఘర్షణ పడటంలోను ఆయత్తమగుటచే అతి క్రూరంగా ఉండేది. పైకి క్రూరంగాను, లోన దీనంగాను ఉంటూ ఉండేవాడను. మేక, పులి, లొట్టిపిట్ట, గొఱ్ఱె, పంది, ఎలుక మొదలైన రకరకాల మాంసములను చిత్ర - విచిత్రములైన విధానములలో పచనం చేసుకొని, దాచుకొని - దాచుకొని తినేవాళ్ళం. యాచకులు వస్తే ఎంతో సేపు దూషించిన తరువాత కొంచము పెట్టే వాళ్లం.

ఓ మిత్రులారా! సభికులారా! నాకు బట్టలు కూడా లేవు. గోచితోనే సంచరిస్తూ దుఃఖప్రదములగు అనేక అనుభవములు పొందాను. మన ఈ వర్తమానం "నిజమే కదా!" అని అనిపించినట్లు, అప్పుడు కూడా, అదంతా వాస్తవములాగానే నాకు అనుభవమయింది. మూఢచిత్తుడనై అనేక వృక్షాలను నిర్దాక్షిణ్యంగా నరికాను. పిట్టల రెక్కలు పెడవిరిచి బుట్టలో కుక్కాను.

మట్టి కుండలో మాంసం వండుకోవటం.... వికృతమైన ఆకారంతో, లేళ్లు మొదలైన అనేక మృగముల కోమల భాగములను నీళ్ళతో కడగటం ... నా చర్యలకు హింసింపబడుతూ, రోదిస్తున్న మృగముల ఆర్తనాదములు మధురసంగీతం వలె విని ఆనందించటం ... మాంసమును ఎండలో ఆరబోయటం .... ఆ చండాలి భార్యతో అపవిత్ర ప్రదేశములలో కూడటం. ఎంతో ఆకలితో ఏవేవో తుచ్ఛపదార్థములు నములుతూ భుజించటం ...

ఇవన్నీ ఇప్పుడే జరిగిన సంఘటనలవలె నా కిప్పుడు స్పష్టంగా అనిపిస్తోంది. "అనేక జన్మల పాపఫలితం ఆ విధంగా పరిణమించిందా? లేక నేను మహాశాపగ్రస్థుడనయ్యానా?" అన్నట్లుగా నా బుద్ధి ప్రవర్తించింది. వచ్చిపడుతున్న ఏవేవో ఆపదలను ఎదుర్కోవటం, జంతువుల బారి నుండి శరీరాన్ని రక్షించుకోవటం, భార్యా - పుత్రులను పోషించటం గురించే ఎప్పుడూ యోచిస్తూ ఉండటం, ఇవే అప్పటి పెద్దపెద్ద కార్యక్రమాలు. ఇక ఒక్కొక్క రోజైతే నా భార్య నాకోసం తుచ్ఛమగు మాంసపు ముక్కలు మిగల్చనందుకు ఎంతోసేపు నీచమైన మాటలతో దూషించేవాడిని. "బేతాళుని బంధువా?" అన్నట్లు మలిన దేహంతో నదీతీరంలో అటూ - ఇటూ పచార్లు చేస్తూ చేపలు పట్టేవాడిని. ఇంకా నా అప్పటి ప్రవర్తనల గురించి ఏమని చెప్పమంటారు? తల్లి పాలు బిడ్డ త్రాగినట్లు, నేను, కోయబడిన మృగముల వక్షస్థలములోని రక్తమును జుర్రుతూ పానం చేస్తూ ఉండేవాడను. అపవిత్ర భోజనం చేసే అక్కడి అనేక జనులు కూడా నన్ను వీథిలో చూడగానే దూరంగా పారిపోయేవారు.

నాయందు 'పాపము - క్రౌర్యము' అనే వాయువీచికలు ప్రసరిస్తూ ఉండేవి. నాచేత హింసించబడే పక్షుల, జంతువుల చావుకేకలు నాకు ఆహ్లాదం గొలిపే సంగీతంలా అనిపించేది. నాలో కొంచెం కూడా జీవకారుణ్యం లేదు. నిష్ఠుర భాషణం చేస్తూ క్రౌర్యంగా దుర్గంధభూయిష్ఠమైన ప్రదేశాలలో ఏవేవో 'పేర్లు - ఆకారములు' గల జంతువులకోసం వెతుకుతూ, వలపన్నుతూ ఉండేవాడను. ఆహాఁ! "ఇప్పుడిట్లా ఈ ప్రాణిని హింసిస్తే నియమితకాలంలో దీని ఫలితంగా నేను దుఃఖమురూపంగా అనుభవించవలసి వస్తుందేమో?" అనే సంకోచమే లేకుండా ప్రవర్తించాను. భవిష్యత్ స్థితి-గతులు చింతించకుండా నరకభూములలో అజ్ఞానవిత్తులను నాటినవాడనయ్యాను.

గోచి పెట్టుకొని, బొంతనొకదానిని కప్పుకుని చేతిలో పొడవైన లావుపాటి కఱ్ఱతో, సంస్కార రహితమైన మీసము - గడ్డముతో నేను వస్తుంటే, సున్నితంగా వ్యవహరించు కోమల స్వభావులంతా గజగజ వణికేవారు.

❖

దోషరహితమైన రాజపుత్రుడనగు నేను ఆ విధంగా పూర్వజ్ఞానరహితంగా అనేక సంవత్సరాలు గడిపాను. ఓ సభ్యులారా! మన ఈ కాలమునకు వేరైన కాలక్రమంలో ఎన్నో ఏండ్లకు పైగా వర్తించాను. ఈ విషయం నాకే ఆశ్చర్యం గొలుపుతోంది.

అప్పుడు అక్కడ దుష్టవాసనలు అనే ఇనుపతీగలకు బద్ధుడనయ్యాను. క్రోధ పారవశ్యంతో వెనుక - ముందు చూడకుండా అసభ్యపదజాలం ఉపయోగిస్తూ, భయమును కలిగించే గర్జనలు చేశాను. ఆపదలు వచ్చినప్పుడు ఏడ్చాను. నింద్యమైన పదార్థాలు భుజించాను. ఏ మానసిక స్థితి నుండి ఎక్కడకు చేరి బ్రతుకసాగానో .... అదంతా మాటలకు అందదు.

❖

కాలచక్రం పరిభ్రమించసాగింది. సంవత్సరాలు వస్తున్నాయి. పోతున్నాయి. నా శరీరం కృశించింది. వృద్ధాప్యం వచ్చిపడింది. చర్మం ముడతలు పడింది. మీసము, గడ్డము, తల నెఱసి

పోయాయి. ముసలితనమును చూస్తే దుఃఖములకు, మానసిక వేదలనకు పండగే కదా! "తోటివారితో తగాదాలు. హింసించుకోవటాలు" మొదలైన అమానుష ప్రవర్తనలలో చిక్కుకొన్న నన్ను అందరు నిరాదరించటం ప్రారంభించారు. ఆకాశంలో ఎగురుతూ అకస్మాత్తుగా శక్తినంతా కోల్పోయిన పక్షిలాగా నిరాధారుడనయ్యాను. ఎంతో భ్రాంతికి లోనయ్యాను. చింతాక్రాంతుడనై చక్రయంత్రమును (Giant Wheel) అధిరోహించిన వానివలె పరిభ్రమించసాగాను. 'కాలము' అనే సాగరంలో కొట్టుకు పోతున్న గడ్డిపీచులాగా ఆటు-పోట్లు నన్ను ఆవరించివేశాయి. నిస్సత్తువ క్రమ్మివేసింది. ఇట్టి శారీరక - మానసిక దౌర్భాగ్యం అనుభవిస్తూ, ఒక్క భోజనం విషయం మాత్రమే పట్టించుకొంటూ ఉండగా మరొక సంవత్సరం గడచిపోయింది.

"నేను రాజును" అనే కించిత్ ఇంగితజ్ఞానం కూడా ఆ సమయంలో లేదు.

"నేను చండాలుడను. ఈమె నా భార్య. ఈ పిల్లల యొక్క తండ్రిని. ఈ ఆహారం నాకు లభించుగాక! ఈ నా శత్రువులు బాధింపబడెదరుగాక..." ఇంతమాత్రమే నా ఆలోచనా పరిధి. ఫలితంగా ఆయా ఆశ - నిరాశల మధ్య నా చిత్తము అన్ని వేళల వ్యాకులత పొందుతూ ఉండేది. అట్లు ఒంటిలో సత్తువ క్షీణిస్తూ ఉండగా రోజులు ఉదాసీనంగా గడచిపోతున్నాయి.

❖❖❖

# 5. భయంకర దుర్భిక్షం

అప్పుడు ఆ ప్రదేశంలో ఒక భయంకర దుర్భిక్షం వ్యాపించింది. ఎండిన చెట్టుపై పిడుగుపాటు వలె, దావాగ్నిలాగా ఆ దుర్భిక్షం అక్కడి ప్రజలను ఎంతగానో భయభ్రాంతులను చేసింది. చాలాకాలంగా వర్షాలు లేవు. ఎండవేడిమిచే కలిగిన ఉష్ణవాయువుల వలన చెట్లన్నీ నశించాయి. ఆ వేడికి గడ్డి మొక్కలు కూడా ఎండిపోయాయి. పాషాణాలు కరిగాయి. ప్రాణుల అవయవాలు ధూళితో కప్పబడ్డాయి. జనులు ఆకలిబాధచే అలమటించసాగారు. తృణ - అన్న - పానములు లభించకపోవటం చేత పెద్ద - పెద్ద జనపదాలే నిర్మానుష్యం కాసాగాయి. దూరంగా మృగతృష్ణలను చూచిన దున్నలు అవి జలశయములని భ్రమించి పరిగెత్తి-పరిగెత్తి నేల కూలి ప్రాణాలు విడవ సాగాయి. అక్కడ వీచే వాయువులో జలకణమనే మాటే ఉండేది కాదు. ఎక్కడైనా 'జలము' అనే మాట వింటే చాలు, అక్కడి జనులు ఎంతో ఉత్కంఠులు అవుతూ ఉండేవారు. వాతావరణంలో ఉష్ణము పెరుగుతూ పదార్థములను శుష్కింపచేస్తున్నది. ఆకులను నమలి మ్రింగునంతటి ఆకలితో ప్రజలంతా విలవిల్లాడారు. కొన్ని చోట్ల కొందరు ఒకరినొకరు చంపుకుతినటం కూడా జరిగింది. కొందరు క్షుద్బాధకు తట్టుకోలేక ఏనుగులను, గుఱ్ఱములను చంపి తినసాగారు. ఆకలి కారణంగా జీవులలో విపరీతమైన ప్రవృత్తులు ఉదయించసాగాయి. తమ సంతానం నిస్సహాయంగా క్షోభిస్తుంటే, తల్లిదండ్రులు చేసేదేమీ లేక శిలామౌనం వహించి ఉండేవారు. ఉన్నట్టుండి ఇళ్ళలోంచి పెద్ద ఆర్తనాదాలు వినవచ్చేవి. కాని ఎవ్వరిని ఎవ్వరు పట్టించుకొనేవారు కారు. స్త్రీ పురుషులు కొంచెము

ఆహారంకోసం ఎక్కడెక్కడికో పరుగు తీస్తూ ఉండేవారు. ఇట్లు అకాలదుర్భిక్షం కారణంగా ఆ ప్రదేశ మంతా శుష్కించి పోయింది. శని-అగ్ని-సూర్యులు ఆ ప్రాంతమంతా విలయతాండవం చేయసాగారు.

దైవం ప్రతికూలించి, అకాలంగా ప్రళయం సంభవిస్తే ఎవరు మాత్రం ఏం చేయగలరు? పరమదుఃఖకరమైన ఆపదలు సంభవించటంచేత అక్కడి జనులు అనేకులు తమ బంధు-మిత్రులతోసహా దూర దేశాలకు వెళ్ళిపోయారు. మరికొందరు తమ పుత్ర - మిత్ర - స్త్రీ - బంధుజనులను వదల లేక అక్కడే ఉండిపోయి మరణించారు. ఎంత బాధించినా ఈ జీవుడు అట్లు బాధిస్తున్నట్టి అంగములను వదలలేడు కదా! అట్లాగే కొందరు తాము ప్రేమగా శ్రమించి ప్రోగుచేసుకొన్న గృహ - ధనాదులు వదల లేక అక్కడే ప్రాణాలు వదిలారు. మరికొందరు ఉన్న ఊరు వదలి దూరదేశాలకు ప్రయాణం చేస్తూ త్రోవలో క్రూరమృగములకు ఆహారమయ్యారు. మరికొందరు త్రోవలో నేలకూలి, ఆహారము, జలము లభించక అక్కడికక్కడే ప్రాణాలు విడిచారు.

అట్టి మహాసంరంభముతో, భయోత్పాతంతో కూడిన సమయంలో నేను ఎంతో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. నా భార్యను, పిల్లలను వెంటబెట్టుకొని దూరంగాగల ఒక దేశం వెళ్ళి పోయే ఉద్దేశంతో బయలుదేరాను. మా మామగారు, అత్తగారు ఉన్న ఊరు వదలబుద్ధిగాక, అక్కడే ఉండిపోయారు. వారికి "వర్షములు పడవచ్చు" అనే ఆశ ఇంకా ఉన్నది.

త్రోవలో పులులవల్ల, అగ్నివల్ల వచ్చే అనేక ప్రమాదాలు తప్పించుకొంటూ ముందుకు పోతున్నాం. ఒక రోజు ఒక ప్రదేశానికి చేరాం. నా భార్య, పిల్లలు చాలా అలసిపోయి ఉన్నారు. వాళ్లు ఒక తాడిచెట్టు నీడలో కాసేపు విశ్రమించారు. నా ముగ్గురు పిల్లలు తల్లి ఒడిలో నిదురించారు. మా ఆఖరివాడు మాత్రం నా వెంటే ఉన్నాడు. వాడి పేరు పృచ్ఛకుడు. వాడంటే నాకు మొదటినుంచీ ఎంతో ఇష్టం. వాడు కళ్ళ నీళ్ళు కారుస్తూ నా కాళ్ళు పట్టుకొని, "అయ్యా! నాకిప్పుడు ఎంతో ఆకలి వేస్తోందే! తినటానికి మాంసం కావాలి. త్రాగటానికి రక్తం కావాలి. నువ్వు తెచ్చిపెట్టాలిసిందే! నాకింకేం తెలియదు" అంటూ దీనంగా ఏడుస్తూ పలుకసాగాడు. ఎంత చెప్పినా వినడు. ఎంత సముదాయించినా ఏడుపు ఆపడు. వాడు మాత్రం ఏం చేస్తాడు? ఆకలి బాధ అంతటిది మరి. అప్పుడు నేను, "ఓరీ! పృచ్ఛకా! ఇప్పుడు మాంసము ఏడదిరా? అయినా కాసేపు ఆగు. ఏడుపు ఆపు. చూద్దాంగా!" అంటూ బుజ్జగించసాగాను. అనేకసార్లు చెప్పిచూచాను. వినుటలేదు. కొంతసేపటికి వాడు దగ్గటం ప్రారంభించాడు. దాహంతో, ఆకలితో వాడి ప్రాణాలు రెపరెపలాడుతున్నాయి. వాడి అవస్థను చూచి నాకు చెప్పరానంత ఏడుపు వచ్చింది. పుత్రవాత్సల్యంతో నా మనస్సు ఎంతో వేదన పొందింది.

"నాయనా! పృచ్ఛకా! నీవు ఆకలితో నకనకలాడటం నేను చూడలేనురా. ఇప్పుడు మాంసముగాని, రక్తముగాని నీకు తెచ్చిపెట్టగలిగే అవకాశమే లేదు. ఇక ఒక్కటే ఉపాయం. నీవు నన్ను పీక్కు తిను. నా రక్తమాంసములతో నీవు నీ ఆకలి తీర్చుకో".

అని ఉద్దేశపూర్వకంగా పలికాను. అప్పుడాబాలకుడు "ఓరై అయ్యా! పోనీ అట్లాగేచేయి. నేను ఈ ఆకలి భరించలేను. నీ మాంసమే తింటాను" అని అంటూ తన నుదుటితో నా మోకాలు

స్పృశించసాగాడు. అప్పుడు అత్యంత దుఃఖభారంతో క్రుంగిపోతున్న నా కుమారుని యొక్క సంకటస్థితిని చూచాను. అది నాకు గొప్ప ఆపదవలె కనిపించింది. ఆ ఆపదను సహించలేకపోయాను. కొడుకు కొరకై స్నేహ-కారుణ్యములకు వశుడనయ్యాను. సర్వదుఃఖములను ఉపశమింప జేయగలదని భావించి, మృత్యువుకు నా శరీరం అర్పించాలని నిశ్చయించుకొన్నాను.

అక్కడ - ఇక్కడ పడిఉన్న కొన్ని చితుకులను ఏరి ఒక చోటికి జేర్చాను. ఆ వాతావరణంలో వాటిని మండించటం ఏమాత్రం కష్టమనిపించలేదు. అగ్ని చటచట శబ్దములను చేస్తూ పైకి లేచింది. ఆ శబ్దములు నా ప్రాణములను కాంక్షిస్తున్నట్లు అనిపించింది. లేచి వెళ్ళి అమాంతంగా ఆ అగ్నిలోకి దూకాను.

అంతేః! మరుక్షణం నా ఈ శరీరం సింహాసనము మీద నుండి క్రిందకు పడుతోంది. ఈ మంత్రివర్యులు నన్ను నేలకు ఒరగకుండా పట్టుకొన్నారు. ఇక్కడి మీ అందరి గొంతుకలు నా చెవిన బడ్డాయి. వెంటనే ప్రబోధితుడనయ్యాను.

ఓ సభ్యులారా! ఈ విధంగా ఈ ఐంద్రజాలికుడు నన్ను మోహములో ముంచి, తేల్చాడు.

❖❖❖

# 6. అంతా మనోవిలాసమే

మహాతేజస్వి అయిన ఆ లవణ మహారాజు ఇట్లు చెప్పుచూ ఉండగా, అక్కడివారందు ఐంద్రజాలికుని వైపుగా ఆశ్చర్యంగా చూస్తూ ఉన్నారు. ఇంతలో ఆ ఇంద్రజాలికుడు ఒక్కక్షణంలో అక్కడి సభామధ్యం నుండి అంతర్ధానమయ్యాడు. అది చూచిన అక్కడి సభ్యులు ఆశ్చర్యచకితులయ్యారు. సభలో కలకలం బయలుదేరింది. అంతా గమనిస్తున్నట్టి మహామంత్రి లేచి నిలుచున్నాడు. సభనంతా నిశ్శబ్దపరచి, ఇట్లు ప్రసంగించ ప్రారంభించాడు.

**మహామంత్రి :** ఓ మహారాజా! చూచారా! ఈ క్షణం వరకు మన మధ్య ఉన్న ఐంద్రజాలికుడు ఇప్పుడే అంతర్ధానమయ్యాడు. ఇంత ఇంద్రజాలం చూపినతరువాత మిమ్ములను ధనం అర్థించాలికదా? కానీ, అట్లు చేయలేదూ అంటే, అతనికి ధనాపేక్ష లేదు. ఈ ప్రపంచస్థితిని మనకు బోధించటానికి వచ్చిన ఒక దైవమాయయే అతడై ఉంటాడు. అంతేకాని, అతడు ఒక సామాన్య ఐంద్రజాలికుడు మాత్రం కాదు.

మీరు చెప్పినది ఇక్కడ జరిగినది పరిశీలించినప్పుడు, "ఈ ప్రపంచమంతా మనోవిలాసము మాత్రమే" అని మనకు తెలియవచ్చుచున్నది. సర్వశక్తిమంతుడగు విష్ణుభగవానుని మనస్సే కదా ఈ జగత్తు!* ఆ పరమాత్మకు అనేకానేక చమత్కారములు ఉన్నాయి. అతడు తన మాయచేత ఉత్తమ వివేకవంతులను కూడా మోహంలో ముంచివేయగలడు.

---

* విశ్వమ్ విష్ణుః - విష్ణు సహస్రనామమ్

ఆహాఁ! ప్రజ్ఞ–చతురత, మహావివేకము, ఎంతో లోకానుభవము కలిగియున్న మన ఈ లవణచక్రవర్తి ఎక్కడ? సామాన్య మానవుల మనోవృత్తి అనతగ్గ ఈ అల్పభ్రమ ఎక్కడ? ఓ రాజా! మేము అనేకమంది మాంత్రికులను, ఐంద్రజాలికులను చూచాం. వారికెవ్వరికీ ఇట్లు జనులను విమోహితులను చేసే ఆలోచనగాని, సామర్థ్యముగాని ఉంటుందనునది వినలేదు, చూడలేదు. ఈ ఐంద్రజాలికులంతా ప్రజల చిత్తములను రంజింపజేసి తద్వారా ధనం సంపాదిస్తూ మాత్రమే ఉండటం చూచాం! పైగా, మనం చూస్తూ ఉండగా అంతర్ధానం కాగలరా? ఈ విషయాలన్నీ గమనించిన తరువాత మేము "ఇతడు దైవమాయ యొక్క స్వరూపమే" అని తలచుచున్నాం. ఆ భగవంతుడే మనలను జ్ఞానులుగా తీర్చిదిద్దటానికి ఇట్లు చేసి ఉంటాడు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ లవణమహారాజు యొక్క సభలో నేను కూడా ఉండిఉన్నాను. ఈ వ్యవహారమంతా నేను స్వయంగా చూచాను. ఆ చూచినదే నీకు చెప్పాను.

దీనినిబట్టి నీవు గ్రహించవలసినదేమిటి? ఈ మనస్సే వివిధరచనలచే వృద్ధి పొందుతోంది. చెట్టు యొక్క కొమ్మలు, ఆకులు, పుష్పములు, కాయలు వలె విస్తరిస్తున్నది ఆ వృక్షమే కదా! ఈ మనస్సే స్వయముగా ఈ జగత్తు రూపమున విస్తరిస్తోంది. మరల మరొకప్పుడు ఇదే మనస్సు జ్ఞానవిచారణాదులు చేపట్టుటచే, తన ప్రయత్నముల సాఫల్యంగా వాసనారహితం అవుతోంది. ఆత్మతో ఏకత్వమును పొందుతోంది. అప్పుడు భేదకల్పన అంతా నశించుటచే "ప్రశాంత, మౌన, అద్వితీయ, నిర్వికల్ప" అనుభవస్థితిని అవధరిస్తోంది.

ఓ రామా! సర్వభేదకల్పనలు నశించినప్పుడే (అతీతత్వమును సముపార్జించుకొన్నప్పుడే) పరిపూర్ణమగు ఆత్మపదము లభించగలదు. ప్రతి జీవుడు శాంతి పొందుటకు మార్గం ఇది మాత్రమే.

❖❖❖

## 7. చిత్తము - దాని చమత్కారము

**శ్రీరాముడు :** మహర్షీ! నాదొక సందేహం. అసలు మా ఈ చిత్తములు ఎందుకు విషయములపైనే అభిముఖమౌతున్నాయి? స్వస్వరూపమగు ఆత్మను ఎందుకు గ్రహించటం లేదు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అన్నిటికీ మూలకారణమైయున్న అజ్ఞానము – అవిచారణల వలననే ఈ చిత్తము విషయాభిముఖమగుచున్నది. అట్లు అభిముఖమై, ఆయా పదార్థముల రూపమును పొంది, పలురకములైన వైచిత్ర్యములతో కూడిన మలినత్వమును పొందుచున్నది. స్వయంకృతంగానే అనేక మిథ్యావ్యాపారములచే భ్రాంతి దృఢమగుచున్నది! అట్టి భ్రాంతి యొక్క దృఢత్వ కారణంగా చైతన్యము తన పూర్ణరూపమును మరచి, మనోరూపమును పొంది, అనాది కాలంగా ఈ జనన–మరణాల పరంపరలో తాదాత్మ్యం చెందుతూ పరిభ్రమిస్తోంది. తుచ్ఛ మనోవృత్తి రూపమున అనేక వాసనలను తనయందు నిక్షిప్తం చేసుకుంటోంది. చిన్నపిల్లవాడు బేతాళుని రూపమును ఊహించుకొని, ఆ

ఊహకు అనుగుణంగా ఎదురుగా "జడలు–కోఅలు–కొమ్ములు" తో కూడిన రూపమును చూస్తాడు చూచావా? అట్లాగే చిద్వస్తువే తనయొక్క కల్పనలను విస్తరించుకొనుచూ దుఃఖములను పొందుచున్నది. అయితే, .... ఏది ఎప్పుడు ఎట్లైనా కావచ్చు – కాకపోవచ్చుగాక! ఈ జీవుడు సర్వదా చిద్వస్తువే అయి ఉన్నాడు.

వాసనలు క్షయించుటయే శాస్త్రప్రవచితములగు అన్ని ప్రయత్నములలోని గూఢార్థం. వాసనలు క్షయిస్తే ఇకప్పుడు సద్వస్తువగు చైతన్యం నిర్మల మనోవృత్తిని పొందుచున్నది. సర్వ దుఃఖములకు కారణం ఈ జీవుడు ప్రాపంచిక వృత్తులు కలిగి ఉండుటయే. సూర్యకిరణం ప్రసరించినచోట చీకటి ఉండదుకదా! ప్రపంచవృత్తులు ఏ చిత్తములో లయిస్తాయో, ఇక అట్టి చిత్తమునందలి దుఃఖమంతా క్షణకాలంలో పటాపంచలౌతోంది.

**శ్రీరాముడు :** మునీశ్వరా! చిత్తమునకు ఈ జాగ్రత్ – స్వప్నముల రూపమున గల వేరువేరు అనుభవములు ఎట్లా సంప్రాప్తిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు దూరమును దగ్గరగా, దగ్గరను దూరముగా చేసి వేయగలదని ఇతఃపూర్వమే చెప్పుకొన్నాంకదా! పిల్లవాడు చిన్న చిన్న క్రీడల మధ్య క్రీడించుచున్నట్లు ఈ మనస్సు జీవులందు విజృంభిస్తోంది. "తదితరులు" అను అనుభవముయొక్క కల్పన చేసుకుంటూ పోతోంది.

అజ్ఞానియగు ఒక బాటసారి దూరంగా ఉన్న ఒక శిలను చూచి "అదిగో.... పిశాచం".... అని తలుస్తూ ఉంటాడు, చూచావా? వాసనలతో కూడిన చిత్తమునకు అభయమైన విషయములందు కూడా భయంకలుగుతోంది. మత్తుపానీయం సేవించినవానికి బుద్ధి యొక్క అల్పత్వం ఏర్పడుట చేత ప్రపంచమంతా గిఱ్ఱున తిరిగిపోతున్నట్లు అనిపిస్తుంది. వాసనలచే కళంకితమైన మనస్సుకు మిత్రుని యందు "శత్రువేమో?" అనే శంక కలుగుతోంది. మనస్సు వ్యాకులత చెందియున్నప్పుడు చంద్రుడు కూడా భరించరానంత వేడిమిని వెడలగ్రక్కుచున్నట్లు కనిపిస్తాడు. దుర్విషయ భావన గల వానికి అమృతమిచ్చినా, అది చేదుగా ఉంటుంది.

వాసనలచే ఆచ్ఛాదితమైన చిత్తము ఈ జగత్‌రచనను తనయొక్క 'అర్థము – అనుభవము' లను అనుసరించి గాంచుచున్నది.

ఓ రాఘవా! ఈ జాగ్రత్ స్థితి కూడా స్వప్నము వంటిదేనని సర్వజనులను ఉద్దేశ్యించి మరల మరల ప్రకటించుచున్నాను.

**శ్రీరాముడు :** ఈ దేహములోనికి దుర్భావాలు, దురభ్యాసాలు ఎందుకు వచ్చి చేరుచున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మరల చెప్పుచున్నాను. ప్రబలమగు వాసనలే ఈ జీవుని మోహమునకు కారణమగుచున్నాయి. అట్టి వాసనలను సమూలంగా ఛేదించి, పెరికివేయాలి.

ఈ సంసారవనంలో మనస్సు అనే మృగం వాసనాజాలం చేత ఈడ్వబడుతోంది. ఫలితంగా అనేక దుఃఖములను మరల మరల అనుభవిస్తోంది. ఎవని యందైతే తత్త్వవిచారణ యొక్క

దృఢత్వం చేత పదార్థములపట్ల "ఇవి నాకు కలగాలి, ఇవి తొలగాలి" .... అను రూపము గల వాసన (లేక) అభినివేశం నశించిపోతుందో, అట్టివానియందు జ్ఞానం అత్యంత సులభంగా ప్రవేశిస్తోంది. మేఘాలు తొలగితే ఆకాశంలో సూర్యుని ప్రకాశం స్వయంగానే ద్యోతకమౌతున్నట్లు "ఏదో పొందాలి" అను భావావేశం త్యజించగానే ఆత్మజ్ఞానం ఈ జీవునిలో ప్రకాశిస్తోంది. జ్ఞానమే ఈ జీవుని సత్యమగు స్వరూపము, స్వభావము కూడా. అట్టి జ్ఞానమును అజ్ఞానము ఆవరించుట చేతనే ఈ జగద్దృష్టులు ఏర్పడుచున్నాయి.

ఓ ప్రియరాఘవా! మనస్సే జీవుడు. అంతేగాని, ఈ తుచ్ఛమైన దేహము జీవుడు కాదు సుమా! ఎందుకంటావా? ఈ దేహము జడమైనది. ఇక దీనియందలి మనస్సు మాత్రం అటు జడము గాని, ఇటు చేతనముగాని కాక, ఈ రెండింటికీ విలక్షణమై ఉంటోంది. ఈ మనస్సు ఏ కార్యమైతే చేస్తుందో, అది మాత్రమే ఈ జీవునిచే వాస్తవంగా చేయబడినదౌతోంది. ఇది దేనిని త్యజిస్తుందో, అది మాత్రమే త్యజించబడుచున్న దగుచున్నది. ఈ జగత్తంతా మనస్సే. మనస్సుకాక ఇక్కడెక్కడా ఏదీ లేదు. ఈ భూమండలము, ఆకాశము, పృథివి, వాయువు, మహత్తు .... ఇవన్నీ మనస్సు మాత్రమే. ఈ మనస్సు కనుక ఆయా పదార్థము లందు భావన చేయటం జరుగకపోతే ఆయాపదార్థజాలము యొక్క ఉనికే అనుభవమవటం జరిగేదికాదు!

ఎవరి మనస్సైతే అజ్ఞానాన్ని ఆశ్రయిస్తోందో, అట్టివాడు "మూఢుడు" అని అనిపించుకొంటు న్నాడు. అదే మనస్సు వివేకమును ఆశ్రయించినపుడు "జ్ఞానయుక్తుడు" అని అంటున్నారు. అంతేగాని ఈ జడ శరీరమును దృష్టిలో పెట్టుకొని, "ఇతడు జ్ఞాని. ఇతడు మూఢుడు" అని అంటామా? లేదు.

అట్లాగే ఎదురుగా ఉన్నదానిని చూచేది మనస్సే కాని ఈ కనుగ్రుడ్లు కానేకావు. ఆ మనస్సే వినుటను నిర్వర్తించు చోటును "చెవులు" అని, స్పర్శను పొందేచోటును 'చర్మము' అని, సువాసన ఆస్వాదించే చోటును ఘ్రాణేంద్రియము (ముక్కు) అని, రుచిచూచే స్థానమును నాలుక అని అంటున్నాం. ఆయా వృత్తులందు ప్రవర్తిస్తున్నట్టి ఈ మనస్సు యొక్క శక్తి అతి విచిత్రమైనది. మనస్సు లేకపోతే ఇంద్రియాలకు ఉనికే లేదు. కవిత్వం అల్లుచున్నది కవియేగాని, కలముకాదు కదా! మనస్సే ఇంద్రియములలో ప్రవేశించి ఆయా అనుభవములను రచించుకొంటోంది.

ఒకే నటుడు అనేక వేషాలు వేస్తూ ఉంటాడు.... ఆ వేషములన్నీ అతడే....

కాని ఆ వేషములన్నిటికీ విలక్షణమై ఉండి ఉంటున్నాడు కదా! అట్లే

ఒక వ్యక్తి తండ్రి, తాత, తమ్ముడు, అన్న, కొడుకు, స్నేహితుడు మొదలైనవన్నీ అగుచున్నాడు.

అన్నీ అతడే....

కానీ అతడు వాటిలో ఒకటి నుండి మరొకటిగా పరిణమిస్తున్నాడా? లేదేఁ!

ఈ మనస్సు కూడా అన్ని ఇంద్రియములలోను వేరువేరుగా వర్తిస్తోంది. అందులో ఏ ఒక్కటీ తాను కాకుండానే ఉంటోంది. దీనికి వేరుగా ఇంద్రియములకు అస్థిత్వమే లేదు. ఇది అల్పమైన దానిని అధికంగాను, అధికమైనదానిని అల్పంగాను చేసి వేయగలదు. స్వజనుల తప్పులు

స్వల్పమైనవిగా, విరోధిజనుల అవే తప్పులు తీవ్రమైనవిగాను కనిపించటమే మనకు ఇందుకు తార్కాణం. సత్యమును అసత్యముగా, అసత్యమును సత్యముగాను మార్చివేసి దర్శించటంలో ఈ మనస్సుకున్న శక్తి మరింక దేనికీ లేనే లేదు కదా! ఇది కటు (చేదు) వస్తువును కూడా మధురంగా భావిస్తే, అట్టి మధురానుభవంగానే పొందగలదు. శత్రువుని మిత్రునిగా, శ్రేయోభిలాషిని కూడా శత్రువుగా చూపించటంలో దీనికిదే సాటి.

ఈ చిత్తము దేనియందు ఏ వృత్తిచే ప్రతిభాసిస్తుందో, ఆ వస్తువు అట్లే పరిణమిస్తుంది. "ఇది నాకు ప్రియము" అను వృత్తితో అది దర్శించుచున్నప్పుడు, ఆ వస్తువు అట్లే ప్రియమై ప్రాప్తిస్తోందికూడా. ఇట్టి ప్రతిభాస (Reflection) లేక స్ఫురణ లేక భావన వల్లనే, వ్యాకులచిత్తుడైయున్న హరిశ్చంద్రుడు ఒకే రాత్రి కొద్ది గంటల కాలంలో పంద్రెండు సంవత్సరముల సుదీర్ఘమైన అనుభవం అత్యంత జాగ్రత్ లాగా, వాస్తవానుభవంలాగా స్వప్నంలో పొందాడు. ఈ చిత్తప్రభావం చేతనే ఇంద్రద్యుమ్నుడు అనబడు ఒక వ్యక్తి ఒక గంటకాలంలో ఒక యుగం కట్టివేయబడి ఉన్నాడు... అయితే ఆ బంధనము నకు ప్రయోజనంగా ఆ మరునాడు తాను తప్పక "ఒక రాజు" కాబోవుచున్నట్లు తెలిసింది..... అప్పుడు ఆ బంధమును కూడా సంతోషముతోనే అనుభవించగలుగుతూ ఉంటాడు. మనస్సు యొక్క వైచిత్ర్యము అట్టిది. భగవద్భక్తుల విషయంలో కూడా ఈ చమత్కారం చూస్తున్నాం. వారి మనస్సులు పరమాత్మ యొక్క చింతనాప్రభావంచేత ఒకానొక ప్రియవృత్తి కలిగి ఉంటున్నాయి. అట్టి సమయంలో వారు మహానరకములను కూడా నిశ్చింతంగా అనుభవించ గలుగుచున్నారు. అదంతా మనస్సు యొక్క ప్రభావమే.

దారం తెంచితే పూదండయందు గల పూలన్నీ నేల రాలుతాయి కదా! మనస్సు జయించబడితే చాలు. ఇక, తక్కిన ఇంద్రియములన్నీ తమంతట తామే అప్రభావితం అవుతాయి.

పదార్థముల గురించి విపరీత కల్పన చేయటంలో (ఇది ప్రియము. ఇది అప్రియము - అని త్వరితగతిని నిర్ణయించుకోవటంలో) ఈ మనస్సుకు మహాసామర్థ్యము ఉన్నది.

ఆత్మ అంతటా సమరూపమై యున్నది. అది స్వచ్ఛమై, నిర్వికారమై, సూక్ష్మమై, నిత్యమై, సాక్షి స్వరూపమై, సర్వపదార్థము లందు వ్యాపించియున్నది. సర్వ విషయములకు అతీతమై, వాక్-ఇంద్రియములకు అలభ్యమై మౌనభావము వహించి ఉంటోంది. అట్టి బ్రహ్మమును ఈ దేహ రూప మాత్రంగా చూస్తున్నది ఈ మనస్సే. శరీరముతో అభేద కల్పన చేస్తూ, ఇక తన జన్మ స్థానమగు బ్రహ్మము (లేక ఆత్మ)నే జడంగా దర్శిస్తోంది ఈ మనస్సు.

అంతరంగంలో .... ఇచ్ఛ, సంకల్పములు మొదలైనవి కలిగియున్న ఈ మనస్సు బాహ్యంలో - నది, ఆకాశం నగరాలు, సముద్రాలు మొదలైన కల్పనలు వ్యర్థంగా కలుగచేస్తోంది. ఎంత వివేకబోధ పొందుచున్నప్పటికీ, ఎంతగా నియమించబడినప్పటికీ .... ఈ మనస్సు దేనినైనా ఇష్టమైతే అమృతతుల్యంగాను, లేదా, ఇష్టంలేకపోతే, విషతుల్యంగాను చూచుట మానటం లేదు. అందుచేత 'ఇచ్ఛ'యే మనస్సు యొక్క బీజము ... అని చెప్పబడుతోంది. బీజమే వృక్షమగుచున్నట్లు, ఇచ్ఛయే మనస్సు అగుచున్నది.

**శ్రీరాముడు :** ఈ మనస్సు ఇష్టానిష్టములను ఎందుకు పొందుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏ మనస్సైతే పూర్ణమగు ఆత్మ స్వరూపము యొక్క సాక్షాత్కారం పొందదో, అదియే ఆయా వస్తువులందు "ఇది నాకు ఇష్టము. ఇది నాకు కష్టము" మొదలైన కల్పనలన్నీ చేసుకుంటోంది. అయితే, తత్త్వజ్ఞుల మనస్సు ఇట్టి చపలత్వము కలిగియుండదు. మనస్సు అనేది చేతనశక్తినుండే స్ఫురిస్తోంది. కాబట్టి ఈ వాయుత్వము ప్రకాశత్వము, ద్రవత్వము కూడా "మనస్సే"! కఠినత్వము, శూన్యత్వము పొందుచున్నది అదే. చైతన్యము అనిర్వచనీయమైన తన ఇచ్ఛాశక్తిచేతనే ఇట్లు మనస్సు యొక్క రూపమును స్వీకరిస్తోంది. అట్టి మనోరూపముతో భావనామాత్రంగా దేశ కాలాదుల అనుభవం తనయందు అంగీకారబుద్ధిచే పొందుతోంది.

**మనస్సు – సంలగ్నము :** ఈ మనస్సు ఎక్కడ సంలగ్నమైతే అక్కడ మాత్రమే ఆ భావనకు సంబంధించిన అనుభవమును పొందుతోందని మరొకసారి ప్రకటిస్తున్నాను. ఒకడి మనస్సు ఎక్కడో లగ్నమై ఉన్నప్పుడు, అతడు తాను తింటున్న పదార్థపు రుచిని కూడా గుర్తించడుకదా! దృష్టి పథంలో ఎదురుగా ఉన్నా కూడా, మనస్సు లగ్నం కాకపోతే, ఆ వస్తువుగాని, విషయంగాని చూడబడకపోవటం మనందరికి అనుభవమే.

అట్లాగే ఈ మనస్సు చీకటియందు విచిత్ర కల్పనలన్నీ చేసి, వాటినన్నిటినీ స్వయంగా పొందగలదు. (అనగా అక్కడ లేని వాటినికూడ తానే కల్పించుకొని ఉన్నట్లే చూడగలదు). ఈ మనస్సు – ఇటు ఇంద్రియముల – అటు ఆ ఇంద్రియములచే అనుభవించబడుచున్న పదార్థముల – ఆకారములను పొందుచున్నది.

మనస్సే ఇంద్రియములకంటే శ్రేష్ఠమైనది. అది ఇంద్రియములకంటే మునుముందే ఉన్నదని గ్రహించు. ఓ రామా! ఈ చిత్తము – శరీరములు వేరువేరు వలె అజ్ఞాన దృష్టికి మాత్రమే కనిపించటం జరుగుతోంది. "మనస్సుయొక్క కార్యక్రమమే ఈ భౌతిక శరీరము."

ఈ మనస్సే "నేనిట్లు అగుదును" అని భావించి, అట్టి భావనకు అనుకూలమైన ఈ ఈ ఉపాధులను నిరంతరం పొందుతోంది. ఇదే మనస్సుతో ఉపాధుల కావల నిశ్చలంగా ఉన్న ఆత్మను గ్రహించువారు ఉపాధిభావనను అధిగమించి, ఆత్మభావనను స్వీకరించగలుగుచున్నారు. అఖండమగు ఆత్మను ఎరిగినవారు అఖండభావననే పొందుచున్నారు. మహాత్ములు సర్వము గ్రహించియుండుటచే మనోరహితులై ఉంటున్నారు. ధీరులై, వాసనలను జయించివేయుటచే మనోరాహిత్యమును పొందుచున్నారు. సుందరస్త్రీల లయవిన్యాసములు చూచినప్పుడుకూడా, వారు ఒక కొయ్య–రాయి లాగా వికారరహితులై ఉంటున్నారు. కొందరు మహనీయులగు మునులు తమ యొక్క మనస్సు ఆత్మయందు సంలగ్నమై ఉంటున్నప్పుడు తమ కాళ్లు – చేతులు త్రెంచబడటం కూడా గ్రహించకపోవటం మనం కొన్ని చరిత్రలలో విన్నాం కదా!* అదంతా అభ్యాసవశంచేతనే అట్లు

* మాండవ్య మహామునిని 'దొంగ' అని అనుకుని కొరత వేయడం జరిగినప్పుడు, ఆ శరీరము పొందిన హింస అతడు పొందకపోవడం.

'సుస్థిర' లేక 'అతీత' స్థితి సాధ్యపడుతోంది. "ఈ సాంసారిక వ్యవహారాలకు కలతచెందుట" అనేది కూడా ఈ జీవునకు మనస్సు యొక్క అభ్యాసవశంచేతనే ప్రాప్తించింది సుమా! జ్ఞానులు అభ్యాసబలం చేతనే దుఃఖములను సుఖములుగా, స్త్రీ-ధన-వస్తుప్రాప్తులన్నీ తుచ్ఛమైనవిగా గాంచగలుగుచున్నారు.

అంతదాకా దేనికి? ఒకని మనస్సు ఎక్కడో సంలగ్నమైయున్నదనుకో ... అప్పుడు నీవు అతనికి అనేక వివరణలతో కూడిన కథ చెప్పితే అది అతడు గ్రహిస్తాడా? లేదు కదా!

ఒకడు ఇంటిలోనే ఉండి "నేనిప్పుడు ఈ కొండను అధిరోహించాను. ఇక్కడ సరస్సు ఉన్నది. ఆ సరస్సును సమీపించాను. చల్లనిగాలి వీస్తోంది. స్వచ్ఛమైన మేఘములు అంతటా విహరిస్తున్నాయి. ఇప్పుడిక ఈ గుహలో ప్రవేసిస్తున్నాను. ఆహాఁ! సువిశాలమైన గుహాంతర్భాగంలోని ఈ చెట్టు క్రింద నే నిప్పుడు ఎంతో ప్రశాంతంగా విశ్రమిస్తాను..." అని భావించుచున్నాడనుకో... అప్పుడాతడు అక్కడి స్వచ్ఛమైన మేఘములను, గుహలను భ్రాంతిచే పొందగలడు. అట్లాగే మరొకడు సుందరమైన పాన్పుపై పరుండి, స్వప్నవశంచేత అనేక దుఃఖకరములగు ప్రదేశములలో సంచరిస్తూ ఏడవటం, నవ్వటం మొదలైనవి అనుభవిస్తూ ఉంటాడు. స్వప్నంలో మనస్సు విజృంభిస్తున్నప్పుడు అనేక వ్యక్తులను, సంఘటనలను పొందుతోంది. స్వప్నములోని ఆయా పదార్థజాలమంతా ఆ స్వప్న సమయంలో వాస్తవంలాగానే ప్రాప్తిస్తోందికదా! ఆ స్వప్నపదార్థములన్నీ ఎక్కడి నుండి వచ్చాయి? ఆత్మ తన స్వస్వరూపమునుండి చ్యుతి చెందినదై, క్షుభితం (disturbed) అయినప్పుడు, తన హృదయం లోనే ఆ స్వప్న వ్యవహారమంతా అట్లు దర్శించుచున్నది. అనగా ఆత్మయే అట్లు విస్తరిస్తోంది.

సముద్రజలం నుండి తరంగాలు ఉత్పన్నమౌతున్నాయి. అట్లే, ఈ దేహమునందు అంతర్గమై యున్న మనస్సునుండే 'స్వప్నము' అనే అవస్థ, అట్టి అవస్థలో ఆయా ఆకార-వికారములు ఏర్పడు చున్నాయి. ఈ జాగ్రత్ విషయం కూడా. అట్టిదే.

ఈ జాగ్రత్, స్వప్నములు రెండూ మనస్సు నుండే ఉత్పన్నమౌతున్నాయి.

ఒక కొండరాయి యందు చెక్కబడిన స్త్రీవిగ్రహం ఆ కొండరాయికి వేరైనది అవుతుందా? అట్లే ఈ జాగ్రత్ - స్వప్నములు చిత్తమునకు వేరైనవి కావు. సకల విధములైన వైచిత్ర్యములు చిత్తమునుండే కలుగుచున్నాయి. స్వకీయమైన చిత్తవృత్తియే జాగ్రత్ స్వప్నములందు, ఇష్ట-అయిష్టములందు, సుఖ-దుఃఖములందు, భావ - అభావములందు ప్రవర్తిస్తోంది.

❖

**శ్రీ రాముడు :** హే మహర్షీ ! లవణుడు ఆ అనుభవములన్నీ సుదీర్ఘమైన వాస్తవంగా పొందటం ఎట్లా జరిగింది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ప్రతిభాసావశం చేతనే (as a process of Refraction) అతనికి ఆ అనుభవాలు ప్రాప్తించాయి. అనగా, ఒకానొక సుదీర్ఘమైన దృశ్య వ్యవహారం అతని చిత్తమునందు ప్రతిబింబించటం చేతనే అతనికి ఆ అనుభవాలు కలిగాయి. "స్ఫురణ" యే రూపంగా కలిగియున్నట్టి ఈ మనస్సు ఏ రూపమును భావిస్తే అద్దానినే శీఘ్రంగా పొందటం జరుగుతోంది. దేనిని ఎట్లు భావన చేస్తూవస్తే,

అది అట్లే పరిణమిస్తూ ఉంటుంది. కనుక రామా! నీకు ఏది సమ్మతమై ఉంటుందో అదే భావనచేయి. ఒకటి భావనచేసి, మరొకదానిని పొందటం జరగదు.

ఆత్మ యొక్క సర్వసమ్యత్వమును భావనచేస్తే 'ఆత్మ' రూపమునే పొందగలవు.

ఈ 'మనస్సు' అనేది జీవుల యొక్క అంతరమున ఉండి, ఈ అనేక రూపములను తానే పొందుతోంది. అట్లు పొంది, జాగ్రత్ – స్వప్నమయమగు ఈ జగత్తును విస్తరింపజేస్తోంది. లవణమహారాజు చండాలత్వము పొందిన విధంగానే, ఈ చిత్తము ప్రతిభాసావశం చేత "దేవత్వం నుండి ఆసురత్వం, సర్పత్వము నుండి వృక్షత్వము" పొందుతోంది. ఒకడు, అతని భార్య దృష్టిలో భర్తగాను, అతని తండ్రి దృష్టిలో కొడుకుగాను, ఒక స్నేహితుని దృష్టిలో స్నేహితుడుగాను, అతని శత్రువు దృష్టిలో శత్రువుగాను అగుచున్నాడు కదా! స్వసంకల్పమును అనుసరించి ఈ మనస్సు కూడా అనేక వేషములు ధరిస్తోంది. అది ఆకారరహితమైనప్పటికీ, చిరకాలపు అభ్యాసముచే "జీవుడు" అను ఆకారమును అవధరిస్తోంది. మోహమయమగు వాసనలతో కూడుకొన్నదై, సర్వత్రా వ్యాపించి ఉంటోంది. ఒకడికి తన తల్లి–చెల్లి–భార్య–స్నేహితులు–శత్రువులు వేరువేరు రీతులుగా అనుభూతమవటమంతా మనో చమత్కారమే!

**శ్రీ రాముడు :** ఈ మనస్సు ఎందులోంచి ఉత్పత్తి అవుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇది జన్మించేది ఎక్కడినుండో కాదు. ఆత్మయొక్క స్వసంకల్పమే మనస్సు యొక్క రూపము, ఉనికి, స్థానం కూడా! అట్టి సంకల్పము యొక్క ఆశ్రయము కారణంగానే శుద్ధస్వరూపమగు ఆత్మకు సుఖ–దుఃఖములు, భయ–అభయములు మొదలైన అనేక ద్వంద్వములు వచ్చిపడుచున్నాయి. నూనె నువ్వులలోనే ఉండి ఉన్నట్లు, ఈ ద్వంద్వములన్నీ కూడా మనస్సునందే ఉండి ఉన్నాయి. అందుచేత మనస్సుకి చికిత్స చేసుకోవాలి. మనస్సులో ఉన్నట్టి ఆవేశపూరితమైన భావనాక్రమమే ఆయాసందర్భాలలో అల్పంగానో, అధికంగానో ప్రకటితమవటం జరుగుతోంది. చిత్తమునందు ఘనీభూతమై ఇంతకుముందే నిలచియున్న ఆయా సుఖ–దుఃఖములు మనస్సు యొక్క స్ఫురణచే వ్యక్తమౌతున్నాయి. ఓ రామా! వేటినైతే మనం "దేశ–కాలములు" అని అంటున్నామో .... అదంతా మనస్సంకల్పమే అయి ఉన్నది. అనగా, సంకల్పముల ప్రభావంచేతనే దేశ – కాలములు స్థితి పొందినవై ఉంటున్నాయి. అంతేకాదు ఈ స్థూలశరీరం శోభించటం, విజృంభించటం, శాంతిని పొందటం, వేరైన స్థానములను పొందటం .... ఇవన్నీ కూడా మనస్సు యొక్క కార్యక్రమములే సుమా! అంతఃపురంలో మహారాణి గొప్పదర్పంతో సంచరిస్తూ ఉంటుంది కదా! ఈ మనస్సు తనయొక్క అనేక సంకల్పములచే రచించబడిన అనేక క్రియాసంరంభములను వెంటబెట్టుకుని ఈ దేహములందు గొప్ప అతిశయంతో వర్తిస్తోంది. "స్తంభనాస్త్రము" (మోహనాస్త్రం) ప్రయోగించినప్పుడు శత్రువులు చేష్టారహితులు అవుతారు చూచావా? అదే విధంగా ఎవడైతే తనయందు "విషయచింతన" అనే చాపల్యమునకు చోటు ఇవ్వడో ...అట్టివాడి మనస్సు, ఆ మనస్సు కల్పించే కల్పనా విశేషాలు తమంతటతామే సశాంతిస్తాయి. తత్త్వవిచారముచే విషయములనుండి మరలించబడిన మనస్సు

కలవాడే అందరికంటే 'శ్రేష్ఠుడు' అగుచున్నాడు. నాయనా! రామా! ఇక తక్కినవారి జీవితవిధానమంతా బురదలోని పురుగుల జీవితములకంటే, గొప్పవి కాదు.

ఎవని మనస్సు ఏకాగ్రతను పొంది స్థిరంగా ఉంటుందో అతడే తనయొక్క ఆత్మధ్యాన ప్రభావంచే సర్వోత్తమమగు బ్రహ్మపదమును పొందగలడు.

మందర పర్వతం చలించకపోతే క్షీరసాగరం ప్రశాంతంగా ఉంటుంది కదా! ఈ మనస్సు సంయమనం పొందితే సంసార భ్రమ కూడా శాంతిస్తుంది. అసలు ఈ సంసార విషవృక్షం మొలిచేది ఎక్కడో తెలుసా? విషయభోగములందు ప్రవర్తించు "మనోవృత్తులు" అనే ప్రదేశంలోనే సుమా! ఈ జీవులలో అనేకులు క్రోధ-మోహాదులతో కూడుకొన్నవారై, ప్రమత్తులై మందబుద్ధితో ప్రవర్తిస్తున్నారు. చపలమైన చిత్తము కలవారై ఈ సంసారము (wordly attachment) అనుదానిని ఆశ్రయిస్తున్నారు. జడత్వములో తగుల్కొని, తత్ఫలితంగా ప్రబలమైనట్టి అనేక దుఃఖములచే 'విచ్ఛిన్నులు' అగుచున్నారు. 'చక్రభ్రమణము' వలె అనేక చింతలలో మునిగి – తేలుచు, చివరికి ప్రవాహపతితంగా అనేక లోకసంచారములను మరల మరల పొందుచున్నారు.

వారి పతనము – ఉత్పతనములు సముద్రకెరటములవలె వచ్చి – పోతూనే ఉన్నాయి.

మనస్సును నిరోధించటంలో అప్రయత్నశీలురై ఉండేవారి దుస్థితికి అంతు ఉండుట లేదు.

❖❖❖

## 8. చిత్తము - చికిత్స - ఔషధం

నాయనా! రామా! ఇప్పుడు ఈ 'చిత్తము' అనే ఘోరవ్యాధిని నిర్మూలించటానికి ఒక గొప్ప 'ఔషధం' మీ అందరిముందు ఉంచుతాను. ఈ ఔషధం సేవించటానికి ఏ ఒక్కరు ఎక్కడికీ పోనక్కర్లేదు. ఎవ్వరినీ ఆశ్రయించవలసిన అవసరంలేదు. ఎవరికి వారికే తమ అధీనంలోనే ఉన్న ఔషధం ఇది. బాహ్య ప్రయత్నములు, ఇతరుల సహాయం అవసరముండదు. ఇది పురుషార్థ సాధకము. ఉత్తమ సుఖదాయకము కూడా.

మేము అనేక సంవత్సరములు సుదీర్ఘమైన తపస్సులచే, ధ్యానములచే, శాస్త్రవిచారణలచే, పరస్పర వాదోపవాదములచే ఎంతగానో విచారించాం. అట్లు విచారించిన తరువాతనే ఇక్కడ ప్రస్తావిస్తున్నాము. ఈ చెప్పబోయే 'ఔషధం' యొక్క ప్రాశస్త్యమేమిటో ఇక్కడకు వేంచేసియున్న అనేకమంది జ్ఞానులు గ్రహించియే ఉన్నారు. ఇప్పుడు ఆ 'ఔషధము' యొక్క విశేషమును చెప్పుచున్నాను. అంతా శ్రద్ధగా వినండి.

"ఇష్ట – వస్తువుల పట్ల ఏర్పడే వృత్తిని త్యజించటం"

ఈ 'చిత్తము' అనే బేతాళుణ్ణి నిరోధించాలంటే 'వాంఛిత వస్తువు' (I want some-thing).... అను దానిని త్యజించివేయాలి. అట్లు త్యజించాలంటే ఆత్మకు సంబంధించిన ఎరుకను, సాక్షాత్కారమును

పెంపొందించు శారీరక – మానసిక క్రియలను ఆశ్రయించటమే ఉపాయం. అట్లు ఆశ్రయిస్తూ ఉండగా కొంతకాలానికి, ఈ దృశ్యముపట్ల ఏర్పడుచున్న 'ఇది వాస్తవమే' అను అల్పభావం సన్నగిల్లుతూ వస్తుంది. 'ఇష్టవస్తువు' అను వృత్తిని త్యజించుచు, క్రమక్రమంగా 'రాగము–ద్వేషము' అను రెండు దోషములకు చిత్తమునందు చోటు ఇవ్వకుండా ఉంటూ ఉంటే చాలు. అట్టివానిచే మనస్సు జయింపబడటం అతిసులభం.

'ఆత్మసాక్షాత్కరము' అనునట్టి యత్నములచే ఈ చిత్తమును మిథ్య అయినట్టి ఈ సంసారపదార్థ సముదాయముల నుండి తొలగించాలి. ఎట్లాగైనా సరే 'ధ్యానము'ను 'ఆత్మస్వరూపము' అను సత్య వస్తువునందు నియమించాలి. "ఆయా గుణములతో కూడి కనిపిస్తున్న ఈ సహజీవులంతా మమాత్మ స్వరూపులే!" అనే మననమును రోజు–రోజుకూ పెంపొందించుకోవాలి. అప్పుడు నీవు జ్ఞానయుక్తుడవై, ఈ సంసారము అనబడుదానినుండి రక్షింపబడగలవు. శ్రేష్ఠమైన విషయములను విని, మననము చేయకలిగిన మనస్సు గల ఓ రామచంద్రా! దుఃఖాగ్నియందు పరితప్తమగుచున్న నీ మనస్సును మరొక నీ మనస్సుతో జయించివేయాలి. మనస్సుతోనే మనస్సును అణచివేయాలి. జయించివేయాలి. ఆ రెండవ మనస్సును చింతారాహిత్యముతోను, శాస్త్ర – సత్సంగములతోను, ధీరత్వముతోను, ప్రశాంతతతోను నింపివేయాలి.

ఒక బాలుడు దుష్ట, తుచ్ఛ కార్యము లందు నిరంతరం నిమగ్నమగుచున్నాడనుకో .... అప్పుడు ఏం చేస్తాం? అతనిని అనేక ఉపాయాలతో సరిదిద్ద యత్నిస్తాం.

సామం : Affectionalety explaining / Gentle cajoling

దానం : offering/showing the advantages

భేదం : differentiation

దండం : punishing

ఇట్లు ఈ నాలుగు ఉపాయాలు సమయోచితంగా తగినంతగా ఉపయోగించి అతనిని మరొక ఉత్తమ – కార్యమునందు వినియోగిస్తాం. అట్లే ఈ చిత్తముయొక్క 'దృశ్యాసక్తి' అనబడే ఒక భాగమును "దృశ్య తిరస్కృతి .. ఆత్మాంగీకారము" అను సమృద్ధితో నింపబడిన మనస్సుయొక్క మరొక భాగంతో నియమించాలి. సమయోచితంగా పై నాలుగు ఉపాయాలు ఉపయోగిస్తూ ఉండాలి. ఇందులో కష్టం ఏమీ లేదు. కొంత ప్రయత్నశీలుడవై, "ఈ దృశ్యము సత్యము కాదుకదా! ఇందు నాకు ఆసక్తి ఎందుకు ఉండాలి? కాబట్టి అన్ని పరిస్థితులలోను, అన్ని వేళలలోను 'ఈ దృశ్యము అవాస్తవమే' అను ఎరుక కలిగి ఉంటాను" అని నిర్ణయించుకో. నీ దృష్టిలో ఈ దృశ్యము అవాస్తవమైనదిగా సుస్థిరపడితే అప్పుడు ప్రాప్తించుచున్న స్థితినే "సమాధాన స్థితి" అని అంటున్నాం. అట్టి నిశ్చల సమాధియందు నియమితుడవై ఉండు. ఇక ఆయా ప్రవాహపతితమైన కార్యక్రమములను నిశ్చింతగా, అనాసక్తిపూర్వకంగా, సంగరహితంగా, ఉద్వేగరహితంగా నిర్వర్తిస్తూ ఉండు. అప్పుడు అట్లు నీచే నిర్వర్తించబడుచున్న ఆయా క్రియావ్యవహారముల కారణంగా నీ 'సమాధి స్థితి' కి వచ్చే లోటేమీ ఉండదు. మేమంతా కూడా అట్లే 'సమాధి' యందు సుస్థిరులమై "శిష్యులకు ఆత్మవిషయమై

బోధించుట" అను ఈ గురుధర్మమును, తదితర యజ్ఞాది లోక శుభకరమగు కార్యక్రమములను నిర్వర్తిస్తున్నాం. నీవు కూడా ఉత్తమ ఫలదాయకమగు 'సమాధి' అను సత్కర్మయందు మనస్సును నియోగించి, అట్టి సమాధి ద్వారా చిదాత్మ తోటి మనస్సును సర్వదా ఐక్యపరచి ఉంచు.

ఓ రాఘవా! "బాహ్యవిషయములు అభిలషించటం" అనే జాడ్యమును నిరాకరించటం (లేక) త్యజించటం నీ అధీనంలోనే ఉన్నది సుమా! దానికి గురువులుగాని, మరింకెవరోగాని ఏం చేయగలరు చెప్పు? నీవే అందుకొరకై ప్రయత్నించాలి. అట్టి ప్రయత్నం నీకు సర్వదా హితమును చేకూర్చగలదు.

"అభిలాషను జయించుట" అనే వైరాగ్యవృత్తిని అనుసరించుటకు సిద్ధముకానట్టి మనుజుడు కీటకముతో పోల్చతగినవాడు. అట్టివానికి ధిక్కారమగుగాక!

**శ్రీ రాముడు :** స్వామీ! ఏవేవో రమణీయమైన వస్తువులు మా ఎదుటకు వస్తూ – పోతూ ఉంటాయి. వాటిపట్ల ఆకర్షణ – వికర్షణలు ఏర్పడకుండా చూచుకోవటం ఎట్లా సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మసాక్షాత్కారరూప భావనచే అది సుసాధ్యమే! రమణీయమైన–అరమణీయమైన వస్తువులు, ఇష్ట – అయిష్టమైన వారు తారసపడుతూ ఉంటారు కదా! అయితే, "ఇవన్నీ కూడా పరమోత్తమమగు పరబ్రహ్మము యొక్క రూపమే అయి ఉన్నాయి కదా! పరమాత్మకు చెందినదే కదా!" అని భావిస్తూ ఉండు. అప్పుడు గొప్ప మల్లయోధుడు ఒక బాలుని జయించివేయునట్లు నీవు ఈ చిత్తమును జయించి వేయగలవు.

**అరమ్యం రమ్య రూపేణ భావయిత్వా స్వసంవిదా ।**
**మల్లేనేవ శిశుశ్చిత్త మయత్నేనైవ జీయతే ॥**

ఓ జనులారా! "ధ్యానము – ప్రార్థన – తపస్సు – పూజ – దానము – సత్సంగము – విచారణ" వంటి ఆత్మసాక్షాత్కారరూపమగు పురుష ప్రయత్నములు మీచే సర్వదా ఆశ్రయించబడుగాక! అప్పుడీ చిత్తము తప్పక జయించి వేయబడగలదు. అట్లు జయించబడిన చిత్తము అప్రయత్నంగానే బ్రహ్మమును పొందుచున్నది.

తన అధీనములోనే ఉన్నట్టి "అభిలాషను జయించుట" అనబడు మనోనిగ్రహంకోసం ప్రయత్నించువాడే 'మనుజుడు' అను పదమునకు తగుచున్నాడు. అట్లు ప్రయత్నించనివాని జన్మ తదితర జంతువుల జన్మలతో సమానమే అగుచున్నది. "అభిలషిత వస్తుత్యాగం", "ఈ కనబడే వారంతా పరమాత్మ స్వరూపులే", అను రూపముతో కూడిన ఉభయ అభ్యాసములు ఎవరికైనా స్వప్రయత్నము వలననే సుదృఢతరం అవుతున్నాయి. ఈ రెండిటిని ఆశ్రయించకుండా ఉన్నంతకాలం వేలాది జన్మలు గడచినప్పటికీ మోక్షం దుస్సాధ్యం. ఆత్మసాక్షాత్కారం కొరకై చేయు ప్రయత్నముల బలం చేతనే దృశ్యాసక్తి రూపమైన మనస్సు నశింపజేయబడుతోంది. మనస్సు నశించటం జరిగిందా, ఇక ఈ కామము, ఆకర్షణ, వికర్షణ మొదలైన శత్రువులు తమంతట తామే నశిస్తాయి. అట్టి ఆద్యంతరహితమగు స్వారాజ్యసుఖమును, మనోరహితస్థితిని ఈ జీవుడు, ఈ దేహం, ఉండి ఉండగానే తప్పక సంపాదించవచ్చు. కనుక రామా! నీవు సర్వదా జీవన్ముక్తత్వము కొరకే యత్నించెదవుగాక!

బాహ్యావిషయములపట్ల తిరస్కారం, మనోనాశనము కొరకు సంసిద్ధత లేకపోతే, ఇక గురువులు శ్రమతీసుకొని బోధించటం... శాస్త్రములలోని అర్థమును విచారణచేయటం ... ఏళ్ళ తరబడి మంత్రములను ఉచ్చరించటం ... ఇవన్నీ ఇవ్వవలసినంత ఫలితం ఇవ్వవు.

**సంకల్పించకుండటం :** 'సంకల్పరాహిత్యము' అనే శస్త్రమును సునిశితం చేసుకుంటూ ఉండు. అట్టి శస్త్రముచే ఈ చిత్తమును తప్పకుండా సమూలంగా ఛేదించవచ్చు. చిత్తము శాంతించిన మరుక్షణం ఈ జీవుడు "సర్వరూపము – సర్వవ్యాపి – శాంతము" అయినట్టి బ్రహ్మముయొక్క రూపమును తప్పక సంతరించుకుంటున్నాడు.

ఓ రాఘవా! "ఈ 'సంకల్పములు' అనే అనర్థం నిర్మూలించబడకపోవుట చేతనే ప్రశాంతమగు 'జీవన్ముక్తస్థితి' లభించుటలేదు" అని గ్రహించు. ఉత్తమమైన మనుజ జన్మ పొంది, తద్ద్వారా మోక్షమునకు అర్హుడు అగుచున్న ఈ జీవుడు "సంకల్పములు చేయకుండుట" అనునది అభ్యసిస్తూ ఉండుటలో ఏమి కష్టమున్నదో మాకు అర్థమగుటలేదు.

**శ్రీ రాముడు :** తండ్రీ! ఏది ఏమైనప్పటికీ, ప్రారబ్ధము (The culmination of past deeds) మా పట్ల ప్రవర్తించియే తీరుతుంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ ప్రజ్ఞాస్వరూపా! రామచంద్రా! 'అల్పజ్ఞానదశ' ను సంస్కరించుట కొరకు మాత్రమే కల్పించబడి, చెప్పబడుచున్న 'ప్రారబ్ధము' అనబడునది నీచే ఇప్పుడు ఆదరింపబడవలసిన పనేమున్నది?

ఓ మానవులారా! మీ అందరికి మరల మరల గుర్తుచేస్తున్నాను. ఆత్మసాక్షాత్కారమగు పురుషప్రయత్నముచే ఈ చిత్తమును 'అచిత్తం' చేయండి. అంతేగాని ఆ కారణాలు – ఈ కారణాలు చెప్పుకొంటూ, మీనమేషాలు లెక్కించుకొంటూ, "మానవజన్మ పొందియుండుట" అనబడు మహత్తర అవకాశమును వృథా చేసుకోకండి. "నేను జీవుడను. మనోబద్ధుడను" అను తుచ్ఛకల్పనలు చేయటం మీ స్వస్వరూపమగు ఆత్మను తిరస్కరించటమే సుమా!

అందుచేత మీరు "అభ్యాసవశంచేత ప్రాప్తించగల ఉత్తమ బ్రహ్మపదమును పొందుటయే మేము లక్ష్యంగా కలిగి ఉంటాం" అని దృఢంగా నిర్ణయించుకొని 'మహాశయులు' (మహత్తరమైన ఆశయము కలవారు) కండి. అంతేగాని, "నేను స్వల్పుడను, అల్పుడను" అని ఎందుకు భావన చేయాలి? అట్లు తలచి స్వల్పత్వము పొందవలసిన అగత్యమేమున్నది? మీ స్వస్వరూపమగు ఆత్మకు అట్టి అల్పత్వమును ఆపాదించుటచే మీకు వచ్చే లాభమేమున్నదో కొంచెం చెపుతారా?

చిరకాలాభ్యాసంచే "నేను బ్రహ్మమునే. అంతేకాని, ఈ దేహ – మనో – బుద్ధ్యాదులు నేను కాను" అని భావించుచు ప్రసిద్ధమైయున్న ఉత్తమ బ్రహ్మపదమునే పొందండి.

అంతిమసాక్షాత్కారవృత్తిచే ఆవిర్భవించు నిష్కళంక చైతన్య భావమును స్వీకరించి, తద్ద్వారా అవిద్యను సంపూర్ణంగా నశింపజేయండి. మీ చిత్తములను ఆత్మయందు లయింపజేయండి.

"చిద్వస్తుభావన"ను క్రమక్రమంగా అలవరచుకోండి. అద్దానిని హృదయంలో తీర్చిదిద్దుకోండి. మహత్తరంగా పదిలపరుచుకోండి.

❖❖❖

# 9. 'చిత్' ను భావన చేయటం

"నా యందు ఈ నా మనస్సుకు కూడా సాక్షీభూతమైయున్న "సత్య – నిత్య" వస్తువు అగు "ఆత్మ", నాయందున్నట్లే, సర్వులందు – సర్వజీవరాసులందు కూడా సాక్షీభూతమైయున్నది" అని భావించుటయే చిద్వస్తు భావన.

అట్టి చిద్వస్తుభావనను, సుస్థిరపరచుకొనుటయందు సావధానముగా ఈ 'బుద్ధి' ని నియోగించాలి. ఓ జనులారా! మీరంతా స్వస్థచిత్తులై... చిత్తమునకు పరమైనట్టి, చిత్తమును కూడా మ్రింగివేయ కలుగునట్టి ...పరమాత్మయందే నిలకడ కలిగి ఉండండి.

ఓ రామచంద్రా! ఒకానొకడు కొంత భ్రమకు లోనగుటచేత పశ్చిమదిక్కును చూచి "ఇదియే తూర్పుదిక్కు" అని తలచటం జరిగిందనుకో...! విజ్ఞులగు వారిచే ఏది పశ్చిమమో, ఏది తూర్పో తెలియజేయబడగా, అది అతడు గ్రహించిన తరువాత, ఇతఃపూర్వపు దోషజ్ఞానం తొలగిపోతుంది కదా! పురుషప్రయత్నం చేసేవారికి కొంత కాలానికి దోషజ్ఞానం తొలగుతుంది. అప్పుడు మనస్సును జయించటం సులభమే అవుతుంది.

ఒకడు అనుద్వేగంగా, ఓర్పుతో, నేర్పుతో ప్రయత్నిస్తేనే ధనములు, పదవులు, రాజ్యములు పొందుచున్నాడు. మనోజయం కూడా అట్లు ప్రయత్నించినవానికే సిద్ధిస్తోంది. అయితే రాజ్యము, ధనము, పదవి మొదలైనవాటిలో రాజభయం, చోరభయం, శత్రుభయం వంటివి ఉంటాయి. స్వర్గలోకములో కూడా, "నా పుణ్యమంతా ఖర్చైతే అధోలోకములకు పోతానే...." అనే మనోవ్యాధి ఉండవచ్చు. కాని, "ఈ మనస్సును జయించి, ఆత్మయందు నిలిపి ఉంచుట" అనుదానిలో అట్టి తదనంతర క్లేశములు ఉండవు. అట్టి "స్వభావమాత్రవ్యావృత్తి" (Natural avocation towards one's own self) అయినట్టి 'ఆత్మస్థితి' కొరకు ఈ జీవుడు ఎందుకు ప్రయత్నిస్తూ ఉండరాదు? ఓ సర్వజనులారా! అట్టి చిత్తలయరూపమగు ఆత్మస్థితి పొందక పోవుటకు కారణం అజ్ఞానమే అయి ఉన్నది. "మేము ఈ ఈ పనులలో ఉన్నాం. అందుకే ఆత్మస్థితిని అవధరించలేకపోతున్నాం" అని పలకటం ఏమాత్రం భావ్యం కాదు. "సర్వము ఆత్మతత్త్వమే" అని నిశ్చయించుకుని యథాతథంగానే మీమీ ధర్మములు నిర్వర్తిస్తూ ఉండండి. ఆత్మయొక్క చమత్కారమంతా గ్రహించిన తరువాత, ఆపై మీకు ఎట్లు ఉచితమని అనిపిస్తే అట్లే చేయండి. (కర్మలు నిర్వర్తించండి – లేదా త్యజించండి).

కాబట్టి "ఆత్మతత్త్వమగు ఆ భగవంతుడే ఇదంతా" అని గ్రహించి, అట్టి సంగ్రహణము యొక్క శక్తి ద్వారా మనస్సు యొక్క సంచలనమును జయించివేయండి. ఇంతమాత్రపు భావన కలిగియుండుటలో కష్టమేమున్నది?

తన మనస్సునందలి దోషములేమిటో గ్రహించి, అట్టిదోషపూరిత మనస్సును జయించుటకు సిద్ధపడుచుండనివాడు ఈ లోకంలో ప్రశాంతంగా ఎట్లు జీవిస్తాడో మాకర్థమగుటలేదు.

**శ్రీ రాముడు :** మహర్షీ! ఈ జన్మ జరా మరణములు, ఇహ పరలోకములు, పురుష – స్త్రీజన్మలు మొదలైన తతంగమంతా ఏమైయున్నది? ఆత్మ అభేదస్వభావము కలదిగదా! ఈ భేదమంతా ఎందుకుంటోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "నేను పురుషుడను. నేను స్త్రీని. నేను జన్మించితిని నేను జీవించుచున్నాను. నేను మరణిస్తున్నాను...." మొదలైన సర్వకుకల్పనలు చంచలచిత్తము యొక్క వృత్తులే అయి ఉన్నాయి. యథార్థానికి ఎవ్వరూ మరణించుటలేదు. జన్మించుట లేదు. ఈ మనస్సే "ఇది నా జన్మ, ఇది నా మరణము. ఇది ఇహము. ఇది పరము" అని స్వయముగా కల్పించుకొని అనుభవిస్తోంది. ఈ మనస్సే ఇక్కడికి వస్తోంది. మరల పరలోకమునకు పోతోంది. మరొక రూపముగా స్ఫురిస్తోంది. ఈ విధంగా మోక్షప్రాప్తి పర్యంతము మనస్సుయందు కల్పనలు సంభవిస్తూనే ఉన్నాయి. సర్వము కల్పనామయమే అయిఉండగా, ఇక మరణభయం ఎందుకు? ఎవరికి? ఎచట?

ఈ సర్వము చిత్తముయొక్క ప్రభావమే. చిత్తమునకు వేరైన రూపమేదీ ఈ జగత్తుకు లేదు. బంధువులు మరణించినప్పుడు, తదితర సందర్భములలోను ఆయా క్లేశములను పొందుచున్నది చిత్తమేకాని శుద్ధచైతన్యము కాదు సుమా!

పరమాత్మ సర్వవేళల ఆపేక్షారహితుడు, మహత్తర శక్తిమంతుడు. సర్వహితుడు. మాయాదోష రహితుడు. శ్రుతులచే ప్రతిపాదించబడినట్టి అట్టి స్వస్వరూపమగు పరమాత్మయందు ఈ చిత్తమును లయం చేయాలి. ఇంక మరే ఉపాయంచేతను ముక్తి లభించదు. ఈ నా నిర్ద్వంద్వమైన అభిప్రాయం ఈ త్రిలోకములందలి అనేకమంది తత్వవేత్తలచే అంగీకరించబడుచున్నది.

ఈ విషయమే వేదాంగములైన ఉపనిషత్తులు నిర్దుష్టంగా ప్రకటిస్తున్నాయి.

చిత్తము ఉపశమించగా, కేవల – చిన్మాత్రవస్తువుగా శేషించుటే ముక్తి.

ఇంతకుమించి 'మోక్షము' అనబడునది వేరుగా లేదు. ఆత్మసాక్షాత్కార రూపమైన ప్రబోధము హృదయమునందు ఉత్పన్నముకాగా అప్పుడు ఈ జీవునకు పరమశాంతి లభిస్తోంది. "నా ఆత్మయే సర్వుల ఆత్మ. సర్వులు ఆత్మస్వరూపులే! ఆత్మయే ఇదంతా!" ..... అనునదే ఆత్మజ్ఞానం.

అట్టి ఆత్మవస్తువు మాత్రమే సత్యమైయున్నది. అది త్రికాలములచే అభేద్యమై సర్వదా వెలుగొందుచున్నది. సర్వవ్యాపకమై, అఖండమైయున్నది. అజ్ఞానమాలిన్య రహితమగు అట్టి ఆత్మయొక్క స్వరూపమే ... నేను, నీవు, ఈ సర్వసభికులు, సర్వ భూత–భవిష్యత్–వర్తమాన జీవరాసులు కూడా.

ఓ రామచంద్రా! అతివిస్తీర్ణమగు హృదయాకాశమునందు ఈ 'మనస్సు' ఒక దురాక్రమణదారుని వలె తాండవం చేస్తోంది. అందుచేత, నీవు అంతిమసాక్షాత్కారవృత్తి (The final beautitude of self) చే ప్రకాశమానమగు, 'చిద్రూపము' అను సుదర్శనచక్రం చేతిలో ధరించు. అప్పుడు ఈ మనస్సును ఛేదించివేయి. ఆపై ఇక ఎట్టి మానసిక వ్యథలు నిన్ను బాధించలేవు.

ఈ స్త్రీ – పుత్రాదులు, తదితర విషయానుభవములు అవిచారణ చేతనే రమణీయంగా కన్పట్టుచున్నాయి. వాటియందలి అరమణీయత్వము గాంచబడిందా, మరుక్షణం మనస్సుయొక్క సర్వాంగములు తెగి నేలరాలినట్లే. ఎందుకంటావా? ఈ దృశ్యమానమగు ప్రపంచంలో ప్రాప్తిస్తున్న ఈ దేహపరంపరలు తదితర సంబంధ – బాంధవ్యములు, గృహ – ధన – క్షేత్రాదులు – ఇవన్నీ కూడా మనస్సు యొక్క వివిధ అంగములే అయిఉన్నాయి. అవన్నీ మనస్సు భావించకున్నంత మాత్రంచేత విచ్ఛిన్నం కాగలవు. సంకల్పరాహిత్యం చేత మనస్సే లయించిపోతోంది.

**"సంకల్పరాహిత్యము" – అనే అభ్యాసం :** శస్త్రములో, అగ్నియో, శత్రువులో ఉన్నచోటైతే భయం వేయవచ్చు. "సంకల్పరాహిత్యము" అను ప్రయత్నమునందు భయమెందుకు? సంకల్పించక పోయినంతమాత్రం చేత మనస్సు లయించగలదు కదా? సంకల్పరాహిత్యమును ఆశ్రయించుటలో ఏం కష్టం ఉన్నది? ఈ జనులంతా ఏది శ్రేయమో, ఏది బంధమో గ్రహించెదరుగాక! ఈ చిత్తము వ్యవహారంలో అత్యంత జాగరూకులై ఉండెదరుగాక! లౌకిక వ్యవహారాలలో ఉన్నప్పుడు "ఇది లాభదాయకము. ఇది కాదు" అని ఈ జనులు గ్రహిస్తున్నారు కదా! మరి, వీరు "సంకల్పరాహిత్యము – అచిత్తలాభము" ల గురించి ఎందుకు గ్రహించుటలేదో నాకు అర్థం కావటం లేదు!

మన బాలురను మనం ఉత్తమమైన క్రియలందే నియమిస్తూ ఉంటాం. అదే విధంగా ఈ మనస్సును కూడా ఉత్తమ శ్రేయోమార్గంలోనే నియోగించాలి. లేకుంటే దీనిని జయించటం కష్టమే అవుతుంది. ఏ మహాత్ములైతే ఈ మనస్సును ఒక పద్ధతిగా నియమించుచూ, క్రమంగా దీనిని నశింపజేస్తారో, అట్టివారే సర్వులలో ఉత్తములు అగుచున్నారు. అట్టివారు ఎక్కడవుంటే అక్కడ తదితరులను కూడా తమవలెనే 'ముక్తులు'గా చేసివేయగలరు.

ఎడారి భూములలోనే మృగతృష్ణలు అనుభవమౌతూ ఉంటాయికదా! ఈ "సంకల్పములు" అనే వ్యవహారమునుండే భయంకరములు, భ్రమదాయకములు అయిన, అనేక విపత్తులు ఉత్పన్నమౌతున్నాయి. అయితే కొందరు మహనీయులు సంకల్పములకు ఆవల ఉన్నట్టి ఆత్మతత్త్వమును సర్వదా పొందుతూనే ఉన్నారు. ఓ రామా! ప్రళయవాయువులు వీచుగాక! సప్తసముద్రములన్నీ పొంగిపోయి, లోకములన్నిటినీ ముంచివేయుగాక! ద్వాదశాదిత్యులు ఒక్కసారిగా ప్రజ్వలించుగాక! తమ మనస్సును జయించివేసి సుస్థిరం చేసివేసియున్న మహాత్ములు ఖేదము పొందరు. మోదము పొందరు. స్వస్థానమునుండి చ్యుతి పొందరు.

ఈ జగత్తులో, ఈ సృష్టిలో ఉత్తమోత్తమమైనది ఏదైనా ఉన్నదనుకొంటే, అది … అకృత్రిమము, జడత్వరహితము అయినట్టి అమనస్కమే సంకల్పరాహిత్యత్వమే అయి ఉన్నది.

ఈ జనులలో అనేకులు, "అయ్యో! ఏదో మహత్తరశక్తి లేక 'విధి' అనబడేది మమ్ములను ఈ సంసారకూపంలో పడవేసి బాధిస్తోంది" అని అనుకొంటూ ఉంటారు. అది సరికాదు. ఈ 'మనస్సు' అనే బీజంలోనుంచే సుఖ–దుఃఖ రూపకములైన శుభాశుభములు, ఈ ఊర్ధ్వ, అధోలోకములతో కూడిన సంసారారణ్య సంచారం సంప్రాప్తిస్తున్నాయి. మరి మనస్సో, స్వసంకల్పముల నుండే

ప్రభవిస్తోంది. తన తలను తానే గోడకు బాదుకుంటూ "ఈ గోడ నన్ను హింసిస్తోంది" అని తలచటం మూర్ఖత్వమే అవుతుంది కదా! అట్లే, స్వసంకల్ప రచన అయి ఉన్న ఈ సంసారదోషమునకు పరులనెవ్వరినో దూషించటం 'మూర్ఖత్వం' అని అనిపించుకుంటుంది.

ఓ రామచంద్రా! ఇన్ని మాటలు అఖ్ఖర్లేదు. ఒక్కమాట ముక్కుకు సూటిగా చెపుతాను. విను.

**అసంకల్పనమాత్రైక సాధ్యే సకల సిద్ధిదే ।**
**అసంకల్పనసామ్రాజ్యే తిష్ఠావష్టబ్ధతత్పదః ॥**

నిశ్చల తత్వపూర్వకమైన 'నిస్సంకల్పం' అనబడే మహాసామ్రాజ్యం ఈ భౌతిక సామ్రాజ్యములకన్నా, స్వర్గాది లోకములకన్నాకూడా పరమోత్తమమైనది. "నేను దేనిని సంకల్పించకుండెదను గాక" అను భావం సుస్థిరం చేసుకున్నంత మాత్రంచేత అది సాధించబడగలదు. అట్టి నిస్సంకల్పము ఈ జీవుని "ఆత్మపదము" అను సింహాసనముపై కూర్చుండబెట్టగలదు. ఇంతమాత్రపు రహస్యమే అనేక మాటలు ఉపయోగించి శాస్త్రయుక్త – ప్రయత్నరూపములలో శాస్త్రకారులు ఈ జనులకు బోధిస్తున్నారు. ఇంతమాత్రం సాధించటంలో కష్టమేమి ఉన్నది? ఒకడు ఉష్ణతాపముచే బాధింపబడుచున్నాడనుకో .... అప్పుడు ఆతని సమీపంలో గల అగ్ని ఉపశమిస్తూ ఉంటే, ఉష్ణతాపం తొలగుతుందికదా! అట్లాగే దృశ్యతాదాత్మ్యము వలన కలుగుచున్న దృశ్యముయొక్క మననము –("విషయములను ఆశ్రయించటం – దృశ్యమును సంభావించటం" వలన కలుగుచున్న) 'అమననము' అను అభ్యాసం చేత క్రమంగా ఆ జీవునికి ఉపశమనాన్ని కలిగించగలదు. దృశ్యము గురించి మననము క్రమంగా క్షయించుచుండగా, ఈ మనస్సు జీవునకు అనిర్వచనీయమగు ఉత్తమసుఖమును అందిస్తూ ఉంటుంది.

ఈ మనస్సు కనుక తలచుకొంటే, ఒక చిదణువునందు లక్షలకొలది బ్రహ్మాండములను వేర్వేరుగా, విస్పష్టముగా, గోచరింపజేయగలదు. సంకల్పమాత్రంచేత అనేక సృష్టులను రచించుకుంటూ పోగలదు. అది జీవునకు రుచి చూపించగల స్థితి గతులకు, విభ్రమములకు, దుర్లక్ష్యములకు, దుష్ట – అసత్య ఆకర్షణలకు అంతు ఉండదు. "అట్టి దుష్టము, దుర్భరము అయినట్టి ఈ మనస్సును జయించుట ఎట్లా?" అనునదే అందరియొక్క ముఖ్యమైన సమస్య. శాస్త్రకారులచే చెప్పబడుచున్న అనేక నియమములు, నిష్ఠలు – అన్నిటియొక్క ఉద్దేశము ఒక్కటే. ఈ మనస్సును సన్మార్గములలో నియమించుటే. అట్టి ఈ మనస్సు నిరంతర అభ్యాసముచే సిద్ధించగల రెండు ఆయుధములచే మాత్రమే జయించివేయబడగలదు.

1. తృష్ణారాహిత్యము (Desirelessness)
2. సంతోషము (Contentment)

ఈ రెండు ఆయుధములను నిర్మించుకో. అప్పుడు ఈ మనస్సును జయించివేయి. విజయమును పొందు. ఆత్మపదమును అధిరోహించు. అట్టి ఆత్మపదము ఇప్పుడే, ఇక్కడే లభించవలసినదే గాని "మరెక్కడో ఎప్పటికో లభించవలసినది" అని భావించతగదు. పరమపవిత్రమైన, అమనస్కరూపమైన,

అహంకారరహితమైన, దుఃఖరహితమైన, శాంతరూపమైన, ఈ 'జన్మలు' మొదలైన వికారములు ఏ క్షణమందును ఉండనట్టి స్థితియే 'ఆత్మపదము' అని పిలువబడుచున్నది. ఆత్మవేత్తలచే మహత్తరమైనదిగా చెప్పబడుచున్న ఆ ఆత్మపదము – కేవలం సంకల్పరాహిత్యంచేత ఏర్పడగల అమనస్కస్థితియే అయి ఉన్నది. ఏది నీయొక్క, నాయొక్క, సర్వులయొక్క సత్యస్వరూపమే అయి ఉన్నదో …అది పొందటానికి ప్రతిఒక్కరికి సర్వహక్కులు ఉన్నాయి. ఓ రామా! అట్టి 'ఆత్మస్థితి' ని ఏమరచి అనేక భ్రమలకు లోను అగుచు ఆసక్తి కారణంగా ఈ సంసారసాగరంలో కొట్టుమిట్టాడవలసిన అవసరం ఏమున్నది? అట్టి అగత్యంలేదు. జ్ఞానివి అయి, ఆపై యథారీతిగా వర్తించుటయే ఉచితం.

❖❖❖

# 10. మనస్సు యొక్క స్వభావం - ఉపశమనము

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ మనస్సు ఏ పదార్థం గురించి ఏ విధంగా తీవ్రవేగంతో ప్రవృత్తమౌతోందో –ఆయా కోరుకునే పదార్థములను ఆ విధంగానే గాంచుచున్నది. తటాకపు నీటిలో బుద్బుదములు (బుడగలు) ఏ నిమిత్తము లేకుండానే స్వాభావికంగా ఉత్పన్నమై నశిస్తూ ఉంటాయికదా! అట్లే ఈ మనస్సులో కూడా సంకల్ప–వికల్పములు తీవ్రవేగముతో ఉత్పన్నమగుచు, నశించుచున్నాయి. శీతలత్వము మంచుయొక్క రూపం, నలుపురంగు కాటుకయొక్క రూపంకదా! "సంకల్పముల యొక్క తీవ్రాత్రీవములు" అను చంచలత్వమే ఈ మనస్సు యొక్క రూపం. సంకల్పముల పరంపరయే మనస్సుగా చెప్పబడుతోంది.

**శ్రీ రాముడు :** ఈ చపల మనస్సే సర్వ ప్రవృత్తులకు ముఖ్యహేతువు కదా! దీని వేగమును, బలాత్కారంగా అయినా సరే, నివారించేదెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! ఈ లోకంలో ఎక్కడా మనస్సు తన చంచలత్వం విడిచిపెట్టి కనిపించుటలేదు. అగ్నికి ఉష్ణత్వం ఎట్లాగో, మనస్సుకు కూడా చంచలత్వము ధర్మమైయున్నది.

చిత్తము = "మాయతో కూడుకొన్న చైతన్యము యొక్క భావనాస్వరూపము"

చిత్తమునందలి చంచల క్రియాశక్తియే "మానసికశక్తి" అని పిలువబడుతోంది. అదియే ఈ జగదాడంబరమంతా. వాయువు స్పందాస్పందములే రూపముగా కలిగి ఉంటోంది కదా! 'స్పందము' లేక 'చపలత్వము' కాకుండా ఈ చిత్తమునకు వేరురూపం లేదు. చంచలత్వము లేకుండా పోయిందా, ఈ చిత్తమే లేకుండాపోతోంది. అట్టి మనోనాశనమే 'తపస్సు–మోక్షము' కూడా అయిఉన్నదని శాస్త్రముల సిద్ధాంతము. మనస్సు గనుక 'అఖండము – అప్రమేయము' స్వభావముగా గల ఆత్మనే నిత్యము మననం చేస్తుంటే, ఇక దుఃఖములన్నీ మటుమాయమవక తప్పదు. "అందరూ – అంతా (నాతో సహా) ఆత్మరూపమే" అనే సంకల్పంతో మనోసంకల్పములను జయించాలి.

ఈ మనస్సు లేక 'చిత్తము' అనే రాక్షసుడు స్ఫురించి విజృంభిస్తూ ఉంటే అనేక వేసటలు, దుఃఖములు, నీచప్రవృత్తములు, భేద దృష్టులు పొంగిపొరలి వచ్చిపడుచున్నాయి. అందుచేత, రామా!

నీవు ఈ మనస్సును ప్రయత్నపూర్వకంగా ఆత్మదేవునివైపుగా నడిపించగలిగితే ... అప్పుడు "దేశ – కాల – వస్తువులచే పరిచ్ఛిన్నము కాజాలనట్టి అనంత మోక్షసుఖము"ను అనుభవించగలవు.

**దుఃఖముత్పాదయత్యచ్చై రుత్థితశ్చిత్త రాక్షసః**
**సుఖ యానంత భోగాయ తం ప్రయత్నేన పాతయ.** (శ్లో.10, సర్గము. 112)

అనేక దుర్వాసనలకు (Bad tendencies) ఆహ్వానం పలుకుచున్న ఈ మనోచాంచల్యమునే "అవిద్య" అనే శబ్దంతో చెప్పుచున్నారు. అట్టి మనస్సును, దాని చాంచల్యమును "ఆత్మ – విచారము" అను ఉద్వేగరహిత తీవ్రయత్నము (Unemotional - intensified effort) చే నాశనము చేయవచ్చు.

**శ్రీరాముడు :** అది ఎట్లా సాధ్యం మహర్షీ!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ముందుగా, ఈ చిత్తశక్తి దేనివైపు ప్రసరించి అచ్చట తిష్టవేసుకొని ఉంటోందో గమనించు. ఏఏ ఇంద్రియ – ప్రాపంచిక విషయములపట్ల ప్రమేయము–ఆసక్తి–భయము–ఉద్వేగము ఏర్పడితే అచ్చటచ్చట నీ చిత్తము తగులుకొంటున్నట్లే! అట్టి ప్రియంగా భ్రమను గొలుపుచున్న బాహ్య విషయములపట్ల అనాసక్తి (Un-attachment) పెంపొందించుకో. క్రమంగా ఆయా బాహ్య విషయములను త్యజించివేయి. ఆత్మవస్తువు గురించి, దాని ధర్మముల గురించి మరల మరల మననం చేస్తూ ఉండు. ఆత్మ గురించిన సమాచారం విను, యోచించు, అవలంబించు. అప్పుడు తప్పకుండా "మోక్షము" అను ఉత్తమశ్రేయస్సు లభించగలదు.

ఓ రాఘవా! అసలు మనస్సు అనునది ఉన్నదెక్కడ? సత్–అసత్‌లకు, జడ–చైతన్యములకు మధ్యగల రూపము లేక తత్త్వమునే మనస్సు అంటున్నాం. ఈ మనస్సు అటు చైతన్యమువైపు, ఇటు జడమువైపు ప్రవృత్తము కలిగినదగుచున్నది.



ఈ మనస్సు జడపదార్థముల విషయమై, "ఇది ప్రియమైనది. ఇది అప్రియమైనది" అను చింతన చేయుచున్నది. అట్టి జడత్వమునకు సంబంధించిన దృఢాభ్యాసంచే కలుషితమైన ఈ చిత్తము జడత్వమునే పొందటం జరుగుతోంది. అదే చిత్తము చిద్వస్తువును చింతించటం జరిగినప్పుడు, అట్టి 'చిద్వస్తుచింతన' యొక్క దృఢాభ్యాసంచే చైతన్యముతో ఏకమౌచున్నది. శాస్త్రీయ-పురుషప్రయత్నముచే దేనియందు ఈ చిత్తము నియోగించబడితే, అభ్యాసబలం అనుసరించి, అద్దానిరూపమునే పొందుచున్నది. అందుచేత రామా! నీవు పురుష ప్రయత్నముచే చిత్తమును చిత్తముచే జయించివేయి. సర్వదా దుఃఖరహితమగు ఆత్మపదమునే ఆశ్రయిస్తూ ఉండు. సర్వసందేహములను అధిగమించి, నిశ్చలత, అద్వితీయత, అఖండత అలవరచుకో. 'మనోనాశనము' అని మనం చెప్పుకొంటున్న క్రియాక్రమమునందే సంలగ్నుడవై ఉండెదవుగాక! ఈ మనస్సును బలాత్కారంగా విషయముల నుండి విముఖం చెయ్యాలి. ఇంతకుమించి మోక్షప్రాప్తికి వేరే ఉపాయం లేదు. బాలుడు అల్లరిని ఆపి పాఠ్యాంశాలు పఠిస్తేనేకదా, చదువు వచ్చేది!

మనస్సును నిగ్రహించగలిగేదేది?

ఈ మనస్సును నిగ్రహించకలిగేది ఈ సృష్టిమొత్తం మీద ఒక్కటే – ఒక్కటి వున్నది.

అది ... "నీ మనస్సే"

రాజును రాజే జయించగలడు గాని బాలుడు రాజును జయించలేడుకదా!

ఈ జీవుడు 'సంసారము' అనే సముద్రంలోపడి 'తృష్ణ' అనే మొసలిచే పీడింపబడుచు, దిక్కుతోచకున్నాడు. 'విషయములు' అనే సుళ్ళలో చిక్కి దూరదూరాలకు కొట్టుకుపోతూ ఉన్నాడు. అట్టి ఈ జీవునకు 'వివేకము' తో కూడిన మనస్సే 'నౌక' అగుచున్నది. దీర్ఘపాశము వంటిది, దృఢబంధన రూపముగలది అయిన మనస్సును మనస్సుతోనే ఛేదించాలి. ఆత్మను బంధమునుండి విడిపించాలి. మరింకే క్రియలచేతను బంధవిమోచనము కలుగదు. 'మనస్సు' అను పేరుతో చెప్పబడుచున్న 'వాసనాసమూహం' అనేక 'ప్రాపంచిక – విషయములు' అనువాటికి గ్రుచ్చబడియున్నది. ఈ మనస్సు బాహ్య పదార్థములవైపు ప్రవృత్తి కలిగియున్నది.

ప్రాజ్ఞుడైనవాడు అట్టి వాసనలను రహితం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. 'ప్రజ్ఞ – పరిశీలన' కొరవడినప్పుడో... వాసనలను అధికం చేసుకుంటున్నాడు. ఫలితం? బద్ధుడు అగుచున్నాడు.

ఉష్ణత్వం క్షయిస్తే అగ్ని ఆరిపోవుచున్నట్లు వాసనలు క్షయిస్తే అవిద్యకూడా క్షయించగలదు. కనుక, రామా! మొట్టమొదట భోగవాసనలను త్యజించు. అటుతరువాత భేదవాసనలనుకూడా వదలివేయి. ఇక విషయములను కూడా త్యజించి, వికల్పరహితుడవై సుఖంగా ఉండు.

'పూర్ణానందము' ను 'దృశ్యవ్యామోహము' అను ఆవరణము మరుగుపరచుచున్నది. అట్టి అవిద్యను "ఆత్మసాక్షాత్కార రూపభావన" చే తొలగించివేయుటయే "వాసనలను క్షయింపజేయుట" అగుచున్నది.

ఓయీ! జీవుడా! నీవు వాస్తవానికి సర్వమునకు సర్వదా కేవలసాక్షివై ఉన్నావు. "ఈ చిత్తము ద్వారా సాక్షి (The Witness of Experiences) ఏఏ పదార్థములను అనుభవిస్తోందో అట్టి ఆయా అనుభవములు సాక్షియందు గాని, ఆ అనుభవములయందు 'సాక్షి' గాని లేకుండా పోవుట" అనుదానినే "నిర్వాణము" అని పిలుస్తున్నారు.

విషయానుభవం కలిగియుండుటయే "దుఃఖం".

విషయానుభవములకు అతీతమైనస్థితి కలిగియుండుటయే ... "నిర్వాణం".

అట్టి నిర్వాణము స్వప్రయత్నముచే తప్పక లభించుచున్నది. "ఆఁ! మేమెక్కడ? ఆ నిర్వాణమెక్కడ? మేము దానిని ఇప్పట్లో పొందలేం" అని చెప్పుకొంటూ అప్రయత్నశీలురై ఉండేవారితో పలుకనైనావద్దు. ఎవరైతే ప్రయత్నశీలురై ఆత్మవిశ్వాసముతో విచారణపూర్వకంగా వ్యవహరిస్తున్నారో వారికి సత్యము కరతలామలకము అగుచున్నది. పిడివాదములతో ఆత్మ స్థితిని గ్రహించని వారితో వాదులాట అనవసరం.

ఓ రామచంద్రా! జాగ్రత్తగా విను. నీ మనస్సులో "ఆయా విషయములు – వాటిని పొందవలెననే ప్రయత్నములు" కాపురం చేస్తూ ఉంటే,.... "అవన్నీ మిథ్యయే" అని గ్రహించు. "అవన్నీ అజ్ఞానము నుండి ఉత్పన్నమైన భావనా క్రమములే కదా" అని భావిస్తూ ఉండు. క్రమంగా అట్టి అజ్ఞానవాసనల బీజమునే తొలగించి వేసుకోటానికి ప్రయత్నిస్తూ ఉండు. అట్లు ఆ వాసలను మొదలంట త్యజించి నిత్యతృప్తుడవైయుండు. ఇక ఆయా విషయజనితమైన హర్షశోకములను మరింకెన్నటికీ పొందకుండెదవు గాక!

❖❖❖

# 11. అవిద్య

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కంటిదోషం వలననే ఆకాశంలో రెండవచంద్రుడు కనబడునట్లు, వాసనవలననే దృశ్యజగత్తు సుఖ–దుఃఖ బంధముల రూపంగా సంప్రాప్తిస్తోంది. అయితే, "వాసనలు" అనేవి మిథ్యారూపంగానే ఉదయిస్తున్నాయి. నీటిలో ప్రతిబింబించే ఆకాశంలాగా అవస్తువు అయినప్పటికీ, ఈ దృశ్యవ్యవహారం అవివేకముచే సత్యము అయినట్లుగా ప్రాప్తిస్తోంది. ఇదంతా అవిద్య యొక్క ప్రభావమే. వివేకులు దీనిని చూస్తున్నప్పుడు "ఇదంతా 'గొడ్రాలి రెండవకుమారుడు' అను మాటలాగా మొదలే అసత్యమై, అవాస్తవమైయున్నది" .... అను దృష్టిని కలిగి ఉంటున్నారు. వారి దృష్టిలో ఇదంతా లేనిదే అయి ఉన్నది. అవివేకుల దృష్టియో,... వేరొక విధంగా ఉంటోంది.

ఓ రామచంద్రా! నీవు అజ్ఞానివి కాకూడదు సుమా! చక్కగా ఆత్మవిచారణచేసి తత్వజ్ఞానివే అవ్వాలి. ఆకాశంలో రెండవచంద్రుడు అవాస్తవమే అయినట్లు, ద్వైతరూపమగు 'అవిద్య' లేక 'సంసారము' లేక 'దృశ్యము' అనునవికూడా ఉనికి కలిగిలేవు. ఈ ప్రపంచంలో బ్రహ్మతత్త్వమొక్కటి తప్ప ఇతరములైనట్టివన్నీ లేనేలేవు. వేలాది తరంగములతో కూడిన విశాలసముద్రమంతా జలమయమే

అయి ఉన్నదికాని, మరింకేమీ కాదుకదా! భావాభావయుక్తములై, మిథ్యారూపములే అయివున్న ఈ పదార్థములన్నీ 'సంకల్పము' నకు వేరైనవి ఏమాత్రం కాదు. ఆత్మ సర్వదా మాయారహితము, నిత్యము, వ్యాపకము, శుద్ధము, "నీ – నా – ఈ సర్వుల" స్వస్వరూపము అయి ఉన్నది. అట్టి ఆత్మయందు ఈ ద్వైతమును ఆరోపించుట తగదు.

**శ్రీరాముడు :** మేము ఆత్మస్వరూపులమే అయినప్పటికీ కూడా, మరి ఏవేవో క్రియావ్యవహారములందు ప్రవేశించవలసివస్తోంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అయితే ముక్కుకు సూటిగా నిన్ను ఒక ప్రశ్న అడుగుచున్నాను. ఈ ప్రాపంచిక సంఘటనలన్నింటికీ నీవు కర్తవా? కాదు కదా!

నీవు కర్తవు కానప్పుడు ఈ క్రియలందు నీకు మమత్వం ఎందుకో చెప్పు?

అద్వితీయుడగు పరమాత్మ ఒక్కడే సర్వే – సర్వత్రా సర్వదా స్థితి కలిగియుండగా, ఇక ఎవనిచే ఏ క్రియ ఎట్లు ఒనర్చబడగలదో చెప్పు?

ఓ ప్రాజ్ఞుడా! ప్రియరాఘవా! అట్లని, నీవు అకర్తవుకూడా కావద్దు. స్వప్రయత్నముచే సాధ్యంకాగల ఫలమేదీ ప్రయత్నరహితునకు లభించదు కదా!

**శ్రీరాముడు :** స్వామీ! "కర్తవు కావద్దు – అకర్తవు కావద్దు" అని ఒకేసారి పరస్పర వ్యతిరేకములైన రీతిగా ఆజ్ఞాపిస్తున్నారు.....? అద్దాని సమన్వయం ఎట్లా ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇప్పుడు నీకు కర్మరహస్యం ఒకటి చెప్పుచున్నాను. విను.

**కర్మలు, ఆసక్తి –**

ఏదైనా కార్యమును అభిమానరహితుడవై నిర్వర్తించావనుకో. అప్పుడు నీయందు ఆసక్తి ఉండదు కాబట్టి అకర్తవే అవుతావు సుమా!

అదేవిధంగా "నేను దీనికి అకర్తను" అను అభిమానం కించిత్‌కూడా లేకయే ఉన్నప్పుడు "సర్వకర్త" గానే ఉండి ఉంటావు.

నీవు వాస్తవానికి ఆత్మయే స్వరూపముగా గలవాడవు. కనుక నిష్క్రియుడవు. అట్టి నీకు ఈ దేహముచే చేయబడు క్రియలకు సంబంధించిన 'బంధనం' ఎట్లా అంటుతుంది? ఈ క్రియావ్యవహారములేవీ నీ స్వస్వరూపమును స్పృశించలేవు.

"నిష్క్రియుడను, ఆత్మదర్శిని అయిన నాకు ఈ కర్తృత్వము వాస్తవంగా ఉన్నదా?" అనే విషయం ముందు యోచించు. అసలు 'కర్తృత్వము' అనేది సత్యమైతే, "నేను దీనికి కర్తను" అనునది గ్రహించటం ఉచితం. అసత్యం అయితే? త్యజించవలసిందేకదా! 'క్రియాప్రసక్తి' అంతా కర్మఫలములను దృష్టిలో పెట్టుకునే ఏర్పడుతోంది కదా! క్రియాఫలములు (The ultimate results of all acts) సత్యమై ఉంటే, అప్పుడు నీవు కర్మలందు ఆసక్తి కలిగి ఉండటం ఉచితమౌతుంది. పరిశీలనాత్మక దృష్టితో చూచినప్పుడు ఈ క్రియాఫలములన్నీ కూడా స్వప్నతుల్యము, అవాస్తవము

అయి ఉన్నాయి. అట్టి మిథ్యావ్యవహారమే అయివున్న ఈ కర్మలందు ఆసక్తి కలిగి ఉండటం ఎట్లు ఉచితమో చెప్పు? ఒక ఇంద్రజాలంలోని వస్తుసమూహంలాగా ఏ దృశ్యవ్యవహారమందైతే పదార్థములన్నీ మాయామయమై, స్వప్నతుల్యమై, భావనానుసారమై అలరారుచున్నాయో అట్టిచోట ఆసక్తి కలిగియుండుట ఉచితం ఎట్లా అవుతుంది చెప్పు? ఎదురుగా కనిపిస్తున్న ఈ సంఘటనలు, అనేక క్రియావ్యహారములను ఆశ్రయించుటచే పొందబడబోవు ఈ పదార్థజాలం... ఈ రెండుకూడా ఆత్మదృష్టితో చూచినపుడు సత్యము కాదు. ఇక వీటిలో గ్రహించవలసినవేవి? త్యజించవలసినవేవి?

ఓ రఘుకులతిలకమా! రామచంద్రా! "ఈ సంసారమునకు బీజము వంటిది" అని మనం చెప్పుకొంటున్న 'అవిద్య' సర్వదా లేనిదే అయిఉన్నది సుమా! అయినప్పటికీ చమత్కారంగా ఉన్నట్లే తోచుచు, విశాలరూపముగా పొందబడుతోంది.

కృత్రిమ వేషధారణి యగు ఈ అవిద్య అసారమగు ఈ సంసారయంత్రమును ప్రారంభించు చక్రము వంటిది. ఇదియే ఈ జీవుని చిత్తమునందలి వాసన అని గ్రహించు. వెదురు తీగ (వెదురు పుల్లలు విస్తళ్ళను కుట్టుటకు వాడతారు) అందంగా ఉండవచ్చు. కాని అందులో తినుటకు రుచికర మైనదేదీ లభించదుకదా! ఈ అవిద్యకూడా పైకి జీవుని ఆకర్షిస్తోంది. కాని, అంతరమున మాత్రం శూన్యంగాను, నిస్సారంగాను ఉండి ఉంటోంది. నదీతరంగమును ఒక కత్తితో విభజించుటకు ప్రయత్నించి సఫలులం కాగలమా? అట్లాగే ఈ అవిద్య కూడా అనేక ప్రయత్నముల తరువాత కూడా నశించుట లేదు. చేతితో తాకుటకై ఏమన్నా అందుతుందా? లేదు. విషయాసక్తులైన వారిని దుఃఖింపజేయటంలో దీనిని మించింది వేరొకటి లేనేలేదు.

ఈ అవిద్య అనేక కారణసమూహములు కలిగియున్నట్లు, అట్టి అవిద్య కార్యసమర్థములు అయినట్లు గోచరిస్తోంది. కాని, కొంచం "పరిశీలనాత్మక చతురత" తో చూస్తే, ... 'సత్యము – నిత్యము' ... దృష్ట్యా దీనికి ఏ ఉపయోగం లేనేలేదని తెలియవస్తోంది. 'మృగతృష్ణ' లో కూడా తరంగాలు వాస్తవమైనవాటివలె అనిపిస్తాయి. కాని అక్కడ జలం ఎక్కడ? ఈ కార్య – కారణములు కూడా ఆకారమాత్రంగా మాత్రమే కనబడుచున్నవి. ఈ అవిద్య ఒకచోట వక్రంగా – మరొకచోట స్వచ్ఛంగాను; ఒకచోట లఘువుగాను – మరొకచోట దీర్ఘంగాను; ఒకచోట సుస్థిరంగా – మరొకచోట చంచలంగాను భాసిస్తోంది. దీని ప్రభావంచేతనే ఉత్పన్నమైయున్న ఈ సకలపదార్థములు పరస్పర భేదభావాలు పొంది ఉన్నాయి. అవిద్యా ప్రభావంచేత కనబడుచున్న ఈ దృశ్యవ్యవహారమంతా లోన శూన్యమే అయినప్పటికీ, బయటకు మాత్రం సారవంతంగాను, సుందరంగాను కనిపిస్తోంది. ఎచ్చటా లేనిదే అయినప్పటికీ అంతటా విస్తరించి ఉన్నట్లే కనబడుతోంది. 'జడమే' అయినప్పటికీ చైతన్యమువలె కనిపించుచూ, మనస్సుయొక్క చపలత్వమును ఉజ్జీవింపజేయుచున్నది. ఇందులో ఏదైనా ఒక నిమిషమైనను ఒకచోట స్థిరత్వం కలిగి ఉంటోందా? లేదు. అయినను ఇదంతా స్థిరంగా ఉన్నట్లే అనిపిస్తోంది. సత్వగుణంచేత శుద్ధంగాను, తమోగుణంచే మినపగింజలాగా మలిన వర్ణంగాను కనబడుతోంది.

అయితే 'అవిద్య' అనే పేరుతో వ్యవహరించబడుచున్న ఈ దృశ్యవ్యవహారము (లేక) ఈ కనబడే ప్రపంచము స్వయంప్రకాశకము కానేకాదు. పరమాత్మయొక్క ప్రభావంచేతనే ఇది విజృంభించుచున్నది. మరల అతని సాక్షాత్కారంచేత నశించుచున్నది. ఎవని "ప్రభావముచే – కల్పనచే – దృష్టిచే" ఇది విజృంభిస్తోందో అట్టి వాని జ్ఞానదృష్టిచే క్షణంలో మటుమాయమౌతోంది.

ఇప్పుడు చెప్పు. ఒకానొక 'భావన' లేక 'దృష్టి' చే ఉండి, మరొక భావన–దృష్టులచే లేకుండా పోయేది ఉన్నట్లా? లేనట్లా? అజ్ఞానాంధకారంచే శోభిస్తున్న ఈ దృశ్యానుభవమంతా ఆత్మప్రకాశంచే రహితమగుచున్నది.

ఆహాఁ! ఈ దృశ్య–అవిద్య 'మృగతృష్ణ' వలె శుష్కప్రాయమైనప్పటికీ, పలువిధములైన వర్ణనము లతో విలాసవంతముగా ఒప్పుచున్నదే?

వక్రమై, విషపూర్ణమై, అతి సూక్ష్మమై అనేక ఆపదలకు ఆలవాలము – హేతుభూతము అయినట్టి ఈ 'అవిద్య' యొక్క వాస్తవమైన రూపమేమిటో గ్రహించటానికి మేము ఎంతగానో ప్రయత్నించాం. చివరకు, "ఈ అవిద్యకు 'తృష్ణ' లేక 'రాగము' తప్ప వేరే రూపం లేదు" అని గ్రహించాం. ఆ రాగము నశించిందా ...ఇకప్పుడు నూనె లేని దీపంలాగా ఇది శీఘ్రంగా నశించ గలదు. రాగము ఉన్నంతవరకు ఈ అవిద్య ఉంటూనే ఉంటుంది.

ఆహాఁ! ఈ అవిద్య క్షణకాలంలో స్ఫురించుచు, చంచలమై, మరల మరల జీవుని జడత్వమును ఆశ్రయింపచేస్తోంది కదా! అజ్ఞులగువారిని ఇది ఎంతగా దుఃఖింపచేస్తోంది! యత్నపూర్వకంగా ఈ జీవులను మెఱుపుతీగవలె పట్టిదహిస్తోందే? మరలమరల ఈ అవిద్యయొక్క ఉపశాఖలు ఉత్పన్న మవుతున్నాయి. మరల మరల లయించుచున్నాయి. మేఘముల సమూహంమధ్య ఏర్పడి క్షణకాలంలో మాయమయ్యే విద్యుల్లతలాగా ఈ అవిద్యయందు ప్రేమ, ద్వేషము మొదలైనవి క్షణంలో కనబడి, మరుక్షణం ఎటుపోతున్నాయోకూడా తెలియవచ్చుటలేదు. ఇదంతా కోరుకోనప్పటికీ ఎదురుగా ప్రాప్తిస్తోంది. పైకి రమణీయంగా ఉన్నప్పటికీ, నిజానికి అర్థరహితం–అనర్థకారిణియే కదా! ఈ 'అవిద్య' లేక 'సంసారం' అంతా ఏర్పడేది శ్రేయము కొరకు మాత్రం కాదు. ఇది ఒక అకాల పుష్ప మాల వలె ప్రాప్తిస్తోంది. ఈ జీవుడు దీనిని బాగుగా విస్మరించటానికి ప్రయత్నించినప్పటికీ, ఇది అతిశయమైనట్టి "సుఖభ్రమ" కలుగజేయటానికి ఎప్పటికప్పుడు సంసిద్ధపడుతోంది. అనగా ఇందులో ప్రవేశించిన జీవుడు "ఏదో పొందాలి. అట్లు పొంది సుఖించెదనుగాక" అను భ్రమకు ఎప్పటికప్పుడు లోను అగుచున్నాడు.

దుఃస్వప్నకల్పన సుఖమైన విషయమా? కాదు కదా! "ఈ అవిద్య అనర్థకారిణియే" అని జ్ఞానులైనవారు మనందరినీ అనేకసార్లు హెచ్చరిస్తున్నారు. "నాయనలారా! ఈ 'అవిద్య' అనే అనర్థమునకు ఇక్కడ చికిత్స పొందండి" అని అనేకమంది సద్గురువులు చెవులో దూరి మరీ చెప్పుచున్నారు. కాని, ఏం లాభం? అనేకమంది జనులు అశ్రద్ధగానే జీవితాలు గడిపివేస్తున్నారు. ఆహాఁ! ఎంత చిత్రం! ఆ అవిద్య తన కల్పనచే కొన్ని క్షణాలలో విశాలమగు త్రిలోకములను

సృష్టించి, ధరించి, మరల నశింపజేయుచున్నది! లవణమహారాజు ఒక గంటన్నర కాలంలో ఎన్నో సంవత్సరముల అనుభవం పొందాడుకదా! అదంతా అవిద్యయొక్క ప్రభావమే. హరిశ్చంద్రుడు ఒక్క రాత్రిలో పండ్రెండు సంవత్సరముల అనుభవం పొందటం అట్టిదే.

అవిద్య చేతనే 'వియోగము' అనుభవించేవారికి కొద్ది సమయం కూడా దుర్భరమైన దీర్ఘకాలంగా ప్రాప్తిస్తోంది. అట్లే, ఏదైనా చమత్కారమైన విషయము నందు ధ్యాస ఏర్పడునప్పుడు దీర్ఘకాలం కూడా క్షణాలలో గడచిపోతుంది. దీని ప్రభావంచేతనే భ్రమకు లోనైనవారి దృష్టియందు కాలము అనేక విభిన్నరూపములుగా స్ఫురించుచున్నది. సుఖవంతులకు అల్పముగాను, దుఃఖితులకు దీర్ఘంగాను ఒకే పరిమిత కాలం స్ఫురించటమే అవిద్యకు ఒక "దృష్టాంతము".

**శ్రీరాముడు :** స్వామీ! ఈ అవిద్యకు ఇంతటి సామర్థ్యం ప్రసాదిస్తున్నవారు ఎవరు? ఇది ఇంత గమ్మత్తుగా ఎందుకు ప్రవర్తిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఒక గదిలో దీపం వెలుగుచుండగా ఆయా వస్తువులు కనిపిస్తున్నాయి. ఆ వస్తువులు అట్లు ప్రకాశించటానికి కారణం గదిలోని ఆ దీపమేకదా! కాని, ఆ దీపం తానుగా "నేను ఈ ఈ వస్తువులను చూపుతాను. వీటిని చూపను, ఇది బాగు – ఇది బాగుకాదు" అను కర్తృత్వ భావనతో సంకల్పించి అట్లు వెలిగిస్తోందా? లేదు. గదిలోని ఆ వస్తువులను చూచునది మనం. అంతేగాని, దీపం చూస్తుందా? లేదు. అట్లాగే ఆత్మ యొక్క సమక్షంలో మనస్సే అంతా చూస్తోంది. ఆత్మ యొక్క ఉనికి– ఔన్నత్యములను ఏమరచిన ఈ మనస్సు దృశ్యమునకు అధీనమై చరించుటే అవిద్య! అయితే, చైతన్యము యొక్క సమక్షంలో ఈ అవిద్యకు పరిమితమైన కర్తృత్వము మాత్రమే ఉన్నది. అన్నిటినీ గ్రహించేది, అనుభవించేది చైతన్యమేకాని, అవిద్య కాదు. అవిద్యకు స్వతంత్రమైన అస్థిత్వమే లేదు. అది ద్రష్ట యొక్క అవికాసదృష్టిని ఆశ్రయించుకొని మాత్రమే ఉంటోంది. అస్థిత్వమే లేనిది ఎట్లు అనుభవిస్తుంది? ఎట్లు ఏదైనా నిర్వర్తిస్తుంది? ఒక రంగులచిత్రంలో స్త్రీ మూర్తిని అందరు "ఇది స్త్రీయే" అని గుర్తించవచ్చు. అంతమాత్రంచేత ఆ స్త్రీమూర్తి ఒక స్త్రీ యొక్క మాతృవాత్సల్యాది ధర్మములన్నీ కలిగి ఉంటుందా? లేదు.

అవిద్యకు ఇతఃపూర్వం, ఇప్పుడు అనుభూతమైన విషయాలు, పదార్థాలు ... ఇవన్నీకూడా, "స్వవాసనలే అట్లు ప్రాప్తిస్తున్నాయి," అని గ్రహించాలి. ద్రష్ట దృశ్యవాసనలను కొనసాగిస్తున్నంతసేపూ అవిద్య ఉంటుంది.

అట్టి స్వవాసనలే ముందుముందు ఆయా ప్రవర్తనలుగా పరిణమిస్తున్నాయి.

అంతేగాని "అవిద్యయే అట్లు ప్రవర్తిస్తోంది" అనటం సమంజసంకాదు.

**శ్రీరాముడు :** తండ్రీ! ఈ అవిద్యను జ్ఞానులు ఎట్లా దర్శిస్తున్నారు? వారి దృష్టిలో ఇదంతా ఎటు పోతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! ఈ అవిద్య అంతా ఒక 'మనోరాజ్యం' లాగా కల్పితమైన ఆకృతి కలిగి ప్రకాశిస్తోంది. నిత్యసత్యమై యున్నదానిని కప్పిఉంచే భ్రమయే అవిద్య. ఇదంతా అనేక

శాఖలుగా విస్తరించి కనబడవచ్చుగాక! అయినప్పటికీ, పరమార్థమున (At its highest meaning) ఇదంతా 'లేనిది' మాత్రమే సుమా! ఇది అనేక మిథ్యారూపమైన ఆడంబరములు గలిగి, అజ్ఞులను మాత్రమే మోహపెట్టుచున్నది. విజ్ఞులు సర్వము గ్రహించి ఉంటున్నారు కనుక, వారు ఏమాత్రం మోహితులు కావటంలేదు. ఒక నదిలో నీరు ప్రవహిస్తూ ఉంటుంది కదా. ఆ నీరు అనుక్షణం ప్రవహించుచూ, అస్థిరమైనప్పటికీ, నదీ ప్రవాహరూపంగా 'నిత్యము' గానే కనబడుతూ ఉంటుంది. ఈ అవిద్య (లేక) సంసారం కూడా చంచలమైన ఆకృతి కలిగి ఉంటోంది. అవిద్య గ్రహించబడిందా, ఇదంతా ఏదీ కాకుండానే పోతోంది. ఇది తనశక్తిచే లోకములన్నీ ఆక్రమించి, సర్వత్రా పరిభ్రమించు చున్నమాట నిజమే. అయితే, ఈ అవిద్య తన గర్భమునందు పరమాత్మను ధరించుటచేతనే అట్లు ఆక్రమించి సంచరించుచున్నదని గ్రహించు.

ఆకాశంలో విశాలమైన మేఘములు రకరకాల ఆకారాలు ధరిస్తుంటాయి చూసావా? అక్కడ తోట, వృక్షములు మొదలైనవి ఉన్నట్లు మేఘముల ఆకారమును చూస్తూ మైమరచే ద్రష్టకు అనిపిస్తూ ఉంటుంది. ఈ సంసారము కూడా అట్టిదే. ఇది వాస్తవానికి అసారం. అందుకే జ్ఞానులగు కవులు దీనిని తరంగములతోను, కమలనాళములలోని తంతువులతోను పోలుస్తూ ఉంటారు. "మేము ఇక్కడ అభివృద్ధి చెందుచున్నాము" అని ఈ జనులు చెప్పుకునేదంతా భ్రమాత్మకమే. అవిచారముచేతనే ఈ అవిద్యాపూర్వక దృశ్యపదార్థములు ఆరంభంలో మధురంగా, చివరికి అతిభయంకరంగా పరిణమించుచున్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! అవిద్యచేతనే విజృంభిస్తున్న ఈ సంసారవ్యవహారం అవిద్య తొలగి పోయినప్పుడు ఏమగుచున్నది? ఎటు పోవుచున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** దీపం ఆరిపోయినప్పుడు, ఆ దీపమునందలి జ్వాలయొక్క ఆకారం ఏమవుతోంది? ఎక్కడికి పోతోంది? అవిద్య నశించినప్పుడు ఈ దృశ్యవ్యవహార ప్రహసనమంతా 'రహితం' అవుతోంది. ధూళిని చేతిలోకి తీసుకొన్నామనుకో.... ఒక ముద్దవలె ఉంటుంది. అదే ధూళి వెదజల్లబడినప్పుడో? 'ముద్ద' కనబడదు. నిజానికి, అదంతా కణములమయమేకదా! అవిద్యను పరిశీలించి చూచామా, అదంతా శూన్యమనియే తెలియవస్తోంది. ఆకాశం శూన్యమయమే కదా! మరి నీలపురంగుతో కనబడటానికి కారణమేమిటి? ద్రష్టయొక్క భ్రమయే కదా! అదేవిధంగా అవిద్య అకారణంగానే వ్యక్తమగుచున్నది. నౌకయందున్నవానికి ఒడ్డునవున్న చెట్లు కదలుచున్నట్లు తోచుచు ఉంటాయి. స్వప్నంలో అనేక పదార్థజాలమంతా కనిపిస్తోంది. అదంతా అవాస్తవము, స్వయంకల్పితము, మిథ్యా రూపము కదా! కాని ఆ స్వప్నసమయంలో మాత్రం అజ్ఞానదృష్టికి అదంతా వాస్తవమువలెనే ప్రాప్తిస్తోంది. మెలుకువ రాగానే స్వప్నము, ఆ స్వప్నములోని పదార్థములు ఎటు పోతున్నాయి?

అవన్నీ వాస్తవంగా ఉంటే కదా ఎటైనా పోవటం! అట్లే భ్రాంతి పూర్వకమైన ఈ అవిద్య మిథ్యారూపంగానే అజ్ఞానియొక్క దృష్టికి ప్రాప్తిస్తోంది. అవిద్యచే చిత్తము కలుషితమైన మరుక్షణంనుండి ఈ జీవుడు తనకు తానే చిరకాలంగా ఉండగల "దీర్ఘ – సంసారస్వప్నము" ను కల్పించుకొనుచున్నాడు.

ఆత్మ ఈ అవిద్యచేతనే ఆవరణయుక్తం అగుచున్నది. అట్టి తరుణంలో ఈ చిత్తంలో అనేక రకములైన భ్రమలు ఉదయించి నశించుచున్నాయి. సముద్రంలో తరంగాలు లేవటం, నశించటం జరుగుచున్నది కదా! కానీ, జలమో? సర్వదా యథాతథం. అట్లాగే భ్రమలయొక్క ప్రభావంచేత సత్యము, సర్వోత్తమము అగు బ్రహ్మము అసద్రూపంగా (లేనిదానిగా) భావించబడుతోంది. అమనోజ్ఞము, అత్యంత మిథ్యారూపము అయిఉన్న ఈ జగత్తు రమణీయంగా, సత్యంగా అనుభవం అవుతోంది. ఇంతకన్నా చమత్కారం ఏం ఉంటుంది?

'వల' క్రింద ఉంచబడిన ధాన్యపు గింజలు ఎక్కడో ఆకాశంలో ఎగురుచున్న పక్షియొక్క దృష్టిని ఆకర్షిస్తూ ఉంటాయి చూచావా? 'ఇంద్రియ విషయములు' అను వాసనారూపమైన అవిద్య చిత్తమును విమోహితం చేసివేస్తోంది. క్షణంలో ఈ జీవులను బంధములో పడద్రోస్తోంది. కొంతసేపు ఆనంద – ఉల్లాసములను కల్పించటం, ఇంతలోనే సర్వమును విషపూరితం చేసివేయటంలో ఈ అవిద్యకు ఉన్న సామర్థ్యం మరింక దేనికీ ఉండదు. ఈ అవిద్యకు వాక్ మొదలైన ఇంద్రియములు లేకపోయినప్పటికీ, ఆయా కార్యక్రమములను రచిస్తూ,... ఇది జీవులను గ్రుడ్డివారిగా చేసివేయ గలుగుతోంది. ఒక బండరాయిని ఉన్మత్తనృత్యం చేస్తున్నట్లుగా చూచేట్లు చేస్తోంది. దీని ప్రభావం చేతనే "మట్టి, శిలలు" కూడా మహత్తరమైన విషయాలుగా చూడబడుతున్నాయి. "ఇదంతా మాదే. మాకే ఉండాలి" అను అర్థరహితమైన భావనలన్నీ హృదయంలో ప్రవేశించి ఈ జీవులను ఘోరంగా హింసించ గలుగుచున్నాయి.

సంహారకుడగు కాలునికి అతిదీర్ఘమైన ప్రళయరాత్రి కూడా అల్పంగా తోస్తుంది. అట్లాగే 'అవిద్య' కారణంగా దీర్ఘమైన కాలం కూడా 'క్షణికము' వలె అగుచున్నది, కొద్దిక్షణాల కాలం అతిదీర్ఘంగా అనుభవమౌతోంది. ఆహా! దీని సామర్థ్యం గురించి ఏం చెప్పాలి? తనయందు 'సత్యము' అనునదే లేకపోయినప్పటికీ, ఈ అవిద్య విజృంభిస్తోంది. వర్ణనాతీతమైన వ్యవహారమంతా నడిపిస్తోంది. కనుక వివేకవంతుడు – బుద్ధిమంతుడు అయినవాడు స్వప్రయత్నముచే తన చిత్తమును విషయములనుండి ప్రయత్నపూర్వకంగా మరల్చాలి. ఎట్లాగైనాసరే, ఆత్మయందే ప్రతిక్షేపించాలి.

❖

**శ్రీరాముడు :** ఆహాఁ! మునీంద్రా! మిథ్యారూపం, అల్పం, తుచ్ఛం, అవస్తువు అయినట్టి ఈ అవిద్య జగత్తును ఎంతగా అంధకారంలో ముంచివేస్తోంది! ఎంత ఆశ్చర్యం!

ఈ అవిద్యకు రూపంగాని, ఆకృతిగాని, స్థానంగాని లేదు. పోనీ ఇది స్వయంప్రతిభా సమన్వితమైన చైతన్యమా? కానే కాదు. ఇది అసత్తే అయినప్పటికీ 'అంతు' అనేది లేకుండా జనులందరిని మోహపరుస్తోంది.

ప్రకాశరూపమైనట్టి జ్ఞానంచేత నశిస్తోంది.

అంధకార రూపమైన అజ్ఞానంచేత స్ఫురిస్తోంది.

అరెరె! గుడ్లగూబయొక్క రెండు కన్నుల వలె ఇది ఎంత చాంచల్యంగా ప్రవర్తిస్తోంది! క్రియాశక్తిని

ఆశ్రయించి అనేక దుష్కర్మలకు కారణమగుచున్నదే! ఈ అవిద్య ప్రకాశమును (జ్ఞాన–వాక్యములను, జ్ఞాన–సమాచారమును) ఏమాత్రం సహించలేకపోతోంది.... దగ్గరకు రానిచ్చుటలేదు. అది జ్ఞానశూన్యం కదా! అందుచేత, "నేను ఇట్టిదానిని అను స్వ–శరీరజ్ఞానం లేదు. తనను ఆశ్రయిస్తున్న జీవుని కూడా స్వస్వరూప జ్ఞానరహితం చేసివేస్తోంది. "దుష్టాచారములు, నీచ స్వభావములుగల మనుజులు ఎక్కడెక్కడున్నారు?" అని వెతికివెతికి, అట్టి అజ్ఞుల ముంగిటవాలి, తీరికగా వారితో కాపురం చేస్తోంది. అనేక విధములైన దుఃఖములతో కూడుకొని, మృతప్రాయమై, జ్ఞానరహితమై ఇది ఈ జీవునియొక్క అనేక జన్మపరంపరలకు కారణభూతమగుచున్నది. కామము – క్రోధము... ఈ రెండూ అవిద్యయొక్క రెండు కళ్ళు. అజ్ఞానం ఎట్లెట్లు విస్తరించాలో నూతన విధానాలు ఎప్పటికప్పుడు కనిపెట్టుచు, భయంకరంగా ఒప్పుచున్నది.

జ్ఞానోదయంచే ఈ అవిద్య శీఘ్రంగా నశించగలదు. నిజమే. సందేహం లేదు.

కాని, అజ్ఞానకాలంలో జ్ఞానాకాశమును అంధకారమయం చేస్తోంది కదా! ఏమి విచిత్రం!

"ఓ అవివేకమా! ఇంతకీ నీ నివాసం ఎక్కడ?" అని మేము విజ్ఞానదృష్టితో పరిశీలించినప్పుడు, "ఇదిగో! ఇక్కడ! మీ అజ్ఞానుల హృదయములే నా నివాసస్థానం" అను సమాధానం వినవస్తోంది.

'జడత్వం' దృష్ట్యా ఎప్పటికప్పుడు శిథిలత్వమునే ఆశ్రయిస్తోంది.

తాను కలిగించగల దుఃఖములచే అది అతిదీర్ఘంగా అనుభవమౌతోంది. దాని ప్రతాపములు వింటుంటే భయంకరమైన రాక్షసియొక్క భీకర నినాదాలు గుర్తుకు వస్తున్నాయి.

చివరికి 'చైతన్యము' అను పురుషునియొక్క "ఏకత్వధ్యానం" అనే ప్రక్రియచే అవిద్య సమసిపోతోంది.

**పురుషసంగి –** ఈ అవిద్యను కవులు చమత్కారంగా "పురుషసంగి" అని కూడా చెప్పుచూ ఉంటారు. ఎందుకంటారా? ఇది అనేక కల్పనలు చేస్తూ భోగములను అనుభవించాలనే ఇచ్ఛతో పురుషునియందు అనురక్తమై ఉంటోంది. కాబట్టి, ఏ జీవుడైతే 'ఆత్మతత్త్వవిచారణ' అనే సుక్షేత్రం వదలి దూరంగా వస్తాడో అట్టి వానిని ఈ పురుషసంగి పిశాచివలె విమోహితుని చేసి 'అనర్థములు' అనే పేరుగల తన అంతఃపురమునకు గొనిపోతోంది. ఇది తన ఆవరణప్రభావంచేత ఈ జీవుడు నిలబడి ఉన్నచోటును అంధకారమయం చేసివేస్తోందే? ఇదేమన్నా స్వయంప్రతిభావంతమా? కాదు. అయినాసరే, ఇది మరింక ఏ బాహ్యవస్తువుచేతను నాశనం చేయబడజాలదు. ఏమి దీని ప్రతాపం!

**శ్రీరాముడు:** ఓ మహర్షీ! ఈ అవిద్య కలుగజేసే దుష్టభ్రమలకు అంతు–పొంతు లేకుండా పోతోంది. జనన – మరణములు, ఉత్పత్తి – నాశనములు కలుగుచున్నది కూడా దీని వలననే కదా! తండ్రీ! "విషయములు" అనే మనోగృహంలో 'వాసనలు' అనే రూపంలో ఉన్న ఈ అవిద్య నశించేదెట్లా? ఈ విషయం తలచుకుంటేనే నాకు వేదనగా ఉన్నది.

❖❖❖

# 12. మనస్సు - పరమేశ్వరుడు

**శ్రీరాముడు :** కాబట్టి, మునీంద్రా! మాయందు ఎక్కడినుంచో విచిత్రమైన అంధత్వం వచ్చిపడుతోంది. ఘనీభూతమై, ఆవరణరూపమున ప్రవర్తిస్తోంది. అట్టి ఈ అంధత్వం నశించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అంధకారంలో ఉన్నప్పుడు భయ–ఉద్వేగ–నిస్తేజాదులు వచ్చి మీదపడుచున్నాయి. సూర్యుడు ఉదయించిన మరుక్షణం దిక్కులలోని అంధకారమంతా పటాపంచలైపోతుంది కదా! సర్వవ్యాపి, బోధస్వరూపము (of the nature of awaremess) అగు ఆత్మానుభవమే అవిద్యకు మందు. ఆత్మావలోకనం చేసినంతమాత్రంచేత సర్వసంసార వికారాలు తొలగిపోతాయి. ఆత్మదర్శనము గురించి తీవ్రేచ్ఛ ఉత్పన్నం కానంతకాలం మోహరూపమగు అవిద్య ఉండనే ఉంటుంది. అది అత్యంత దుఃఖకంటకయుక్తమై, ఈ జీవుని ఆందోళనపరుస్తూనే ఉంటుంది.

పరమాత్మను దర్శించిన మరుక్షణం ఈ అవిద్య నశిస్తుంది.

**శ్రీరాముడు :** స్వామీ! అసలు అవిద్యయొక్క మూలకారణం....?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఇచ్ఛ" యే అవిద్య. అంతకుమించి అది వేరే ఏదీ కాదు. మిగతాదంతా ఆ 'ఇచ్ఛ' యొక్క వికారస్వభావమే. అందుచేతనే ఆత్మద్రష్టలగు జ్ఞానులు "నాయనలారా! ఇచ్ఛానాశనమే మోక్షము" అని మనకు బోధిస్తున్నారు. అట్టి మోక్షము 'దృశ్య అసంకల్పత్వం' చేత సిద్ధిస్తోంది. "నేను చైతన్యమే స్వరూపముగా కలవాడను" అను భావన ఉదయించగానే, వెలుతురుచే చీకటి యొక్క గతివలె, కామవాసనారూపమైన అవిద్యావరణ (The cloudy cover of ignorance) స్వయంగా క్షయిస్తోంది. వివేకము ఉదయించనంతకాలం సంకల్పపరంపరల రూపంలో ఈ అవిద్య ఉండి తీరుతోంది. ఘనవాసనలచే దృఢమైన బంధనమునకు దారితీస్తోంది.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ దృశ్యప్రపంచమంతా అవిద్యాత్మకమని, ఆత్మభావనచే నశించిపోగలదని చెప్పియున్నారుకదా! ఆత్మస్వరూపము ఎట్టిదో ఇంకా కొన్ని విశేషాలు తెలియజేయండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! 'చిత్తము' లేక మనస్సు' అనబడునదే పరమేశ్వరుడు. మనస్సు ఈ అవిద్యతో కూడుకొనియున్నప్పుడు చిత్తమని, పరిపూర్ణమగు ఆత్మజ్ఞాన – అనుభవములతో కూడుకొని ఉంటే సర్వాతీతస్వరూపమగు 'భగవంతుడు' (భ=జ్ఞానము) అని చెప్పబడుతోంది. వాస్తవానికి ఈ మనస్సు – అనేది విషయవర్జితం, ఆవరణ – విక్షేపములు లేనట్టిది, సర్వవ్యాపకము, సర్వమునకు కారణము అయిఉన్నది.

ఈ మనస్సు (లేక, చిత్తము) తనయొక్క దృశ్యతాదాత్మ్యము త్యజించినప్పుడు ... ఇక, ఆపై, ఏది స్వయంసిద్ధంగా శేషిస్తోందో అదియే "చిత్‌వస్తువు".

ఈ మనస్సుకు ఆత్మలక్షణములన్నీ స్వతహాగా ఉన్నప్పటికీ ఇది చిరకాలంగా ఆర్జించుకొనియున్న పదార్థములపట్ల ఆసక్తి చేతనే పరిమితత్వము – ప్రమేయత్వములతో కూడి వ్యవహరిస్తోంది.

ఓ ప్రియశిష్యా! రామా! బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక గడ్డిపఱక వరకు కూడా ఈ జగత్తు అంతా సర్వదా ఆత్మస్వరూపమే అయి ఉన్నది. 'అవిద్య' అనబడేది వాస్తవానికి లేనే లేదు. ఈ దృశ్యప్రపంచమంతా కూడా "నిత్యము – నాశరహితము – చిద్ఘనస్వరూపము" అగు బ్రహ్మమే సుమా! అసలు ఆత్మకు వేరుగా 'మనస్సు' అనబడే కల్పనయే లేదు.

**శ్రీరాముడు :** అదేమిటి స్వామీ! మా అందరికీ 'మనస్సు' అనబడేది అనుభూతమౌతోంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మ యొక్క మననము చేయు స్వభావమే మనస్సు. ప్రీతి పూర్వకముగా ఆయా బాహ్య విషయములను దర్శించుటే చిత్తము. "మననము – ప్రియత్వము" ఈ రెండూ కర్తకంటే వేరైనవి కావు కదా! అందుచే "మనస్సు అనబడునదేదీ నీకు వేరుగా లేదు" అని మేము చెప్పుచున్నాం. మనస్సు – లేకుండునప్పుడు, మనస్సును ఆశ్రయించుకొనియున్న మిగతా వ్యవహారము మాట ఏమిటి? నాటకమే 'కల్పన' అయినప్పుడు నాటకంలోని ఒకానొక పాత్రయొక్క స్వరూప–స్వభావాల గురించి 'కల్పనయే' అని వేరే చెప్పాలా? ఈ దృశ్యమంతా మనస్సును ఆశ్రయించి మాత్రమే ఉన్నది. కాబట్టి తదితర జగత్తు వ్యవహారం విషయము కూడా అట్టిదే. పరమార్థమున ఈ మూడు లోకములందు ఏదీ ఉత్పన్నమగుట లేదు, నశించుట లేదు. ఇక ఈ పదార్థముల వికారములు అంటావా? ఇవన్నీ ద్రష్ట యొక్క దృష్టిని అనుసరించి మాత్రమే ఉన్నాయి. అందుచేత ఇవి స్వతహాగా సత్యములే కావు.

ఈ జగత్తంతా కేవలము చైతన్యమే అయి ఉన్నది. చైతన్యము సర్వదా అద్వితీయమై, స్వయం ప్రకాశమై సర్వవ్యాపకమై, నాశరహితమై, విషయవర్జితమై, సద్రూపమై వెల్లివిరియుచున్నది.

ఈ జీవుడు అనబడేవాడు చైతన్యమే స్వరూపముగా కలిగియున్నాడు.

ఓ రాఘవా! ఆత్మ నిత్యమై, వ్యాపకమై, శుద్ధమై, చిన్మాత్రస్వరూపమై, దుఃఖరహితమై, శాంతమై, విశాలమై, సర్వత్రా ఏకరూపమై వెలయుచున్నది. అట్టి స్వతహాగా నిర్వికారమగు ఆత్మ తనయొక్క "చిత్స్వభావము" నకు విరుద్ధంగా ఆవరణయుక్తమైన జడత్వమును గ్రహిస్తోంది. పరిచ్ఛిన్నములగు విషయములను సంకల్పించుచు, వాటివైపే మరల మరల పరుగులు తీస్తోంది. అట్టి మలినముతో కూడిన 'విక్షేపణశక్తి' నే 'మనస్సు' అని పిలుస్తున్నారు.

సర్వవ్యాపి, సర్వశక్తిమంతము, మహత్తరము అయిన ఈ 'మనస్సు' అనబడే దైవము చేతనే, సముద్రంలోని తరంగాలులాగా, ఈ అనేకపదార్థముల కల్పనాశక్తి ఉత్పన్నం చేయబడుతోంది. వాస్తవదృష్టితో పరిశీలిస్తే "ఏకము – అద్వితీయము – వ్యాపకము – శాంతము" అగు పరమాత్మ యందు ఈ 'అవిద్య' అనబడేది ఉండటమేమిటి? ఎట్లా ఉంటుంది? కాని, సంకల్పమే రూపంగా కలిగి, స్ఫురణ మాత్రంగా అది అల్పదృష్టికి అనుభవమౌతోంది.

'అవిద్య' అనేది సంకల్పముగానే ఉత్పన్నమగుచున్నది.

మరల సంకల్పబలంచేతనే నశించిపోవుచున్నది.

అగ్నిజ్వాల వాయువు యొక్క ఉనికి చేతనే కలుగుచు, మరల వాయువుచేతనే నశించుచున్నది కదా! ఇది కూడా అంతే! ఏది దేనిచేత ఉత్పన్నమగుచున్నదో దానిచేతనే నశించబడుచూ ఉంటుంది. "విషయభోగాభిలాష" రూపమును గ్రహించుచున్న ఈ అవిద్య దృఢమైన నిధిధ్యాసలతో కూడిన పురుషప్రయత్నముచే సిద్ధించగల "అసంకల్పత్వము"చే నశించగలదు.

ఈ మనస్సు "నేను అల్పమగు వస్తువును; అంతేకాని, నేను బ్రహ్మమును కాను" అను దృఢమైన సంకల్పమును ఆశ్రయించి బంధమును తెచ్చిపెట్టుకుంటోంది. మరల ఇంతలోనే "నాతో సహా ఈ సర్వము ఆత్మస్వరూపమగు బ్రహ్మమే అయిఉన్నది" అను దృఢసంకల్పముచే ముక్తిని పొందుచున్నది.

దృశ్య - సంకల్పమే "బంధము".

దృశ్య - అసంకల్పమే "ముక్తి".

ఓ రామచంద్రా! "నేను బ్రహ్మమును కాను" అను సంకల్పమును "సర్వము బ్రహ్మమే" ("సర్వం ఖల్విదం బ్రహ్మ") అను విరుద్ధ సంకల్పమును ఆశ్రయించుటచే పొందబడు జ్ఞానబలంతో జయించివేయాలి. అట్లు జయించుటలో విజయము సాధించి, ఆ తరువాత నీకెట్లు తోస్తే అట్లే ఈ ప్రపంచమున వ్యవహరించు.

స్వతహాగా 'లేనిదే' అగు ఈ అవిద్య చిదాకాశమునందు చిత్రముగా ఉత్పన్నమై, చంచలమైన భ్రమణము కలిగినదై, అన్నివైపులా పుష్పసువాసనవలె వ్యాపించి ఉంటోంది. ఇది తన జన్మస్థానమైనట్టి ఆత్మప్రకాశమునే పరిహాసం చేస్తోంది! అనేక వికల్పజాలములను కల్పించుకొనుచూ, అట్టి జాలము లందు తనకుతానే బంధితురాలు అవుతోంది. యథార్థానికి అవిద్య లేకున్నప్పటికీ, కనిపించటం జరుగుతోంది. బంధహేతువు, చపలము అయిన ఈ అవిద్యకు అజ్ఞానులు తమయొక్క దుఃఖము కొరకే కల్పనచేసుకుంటున్నారు కాని, సుఖము కొరకు కానేకాదు. బాలుడు "వినోదము కొరకు" అని తలచి అల్లరిని ఆశ్రయించి, తద్వారా అనేక శారీరక - మానసిక వేదనలను కొనితెచ్చి పెట్టుకొంటాడు చూచావా? ఈ జీవుని విషయము కూడా అట్టిదే. ఇతడు "నేను శరీరమాత్రుడను. అతి దుర్బలుడను, దుఃఖితుడను, బద్ధుడను, ఈ చేతులు - కాళ్ళు నా స్వరూపమునకు సంబంధించినవి, వీటిచే నేను పరిమితుడను....." అని దృఢంగా భావిస్తూ, తదనుగుణంగానే వ్యవహరిస్తున్నాడు. ఫలితం? బంధమునందు తగుల్కొనుచున్నాడు. "నేను దుఃఖితుడను కాను. చైతన్యమే స్వరూపముగా కలిగియున్నట్టి నేను ఒక పాంచభౌతిక పదార్థమును ఎట్లా అవుతాను? చైతన్యము సర్వమును ప్రకాశింపజేస్తుంది. అట్టి దానికి బంధ - మోక్షములేమి ఉంటాయి? నాకు దేహమే లేదు. ఇక బంధము ఎవరికి?" అని ఈ జీవుడు ఎందుకు ఉత్తమ భావనను ఆశ్రయించరాదో చెప్పు? అప్పుడు అతడు ముక్తరూపుడే అవుతాడు కదా! "నేను ఈ మాంసముగాని, బొమికలుగాని కానేకాను. ఈ దేహమునకు విలక్షణమైనవాడను. బుద్ధికి అతీతమైనట్టి చిద్రూపమే నేను" అని నిశ్చయించు కొన్నవాడే అవిద్యారహితుడు అగుచున్నాడు.

**ఆకాశము–నీలత్వ ధర్మము : ప్రపంచము – అవిద్యాధర్మము**

ఓ రామా! అటు ఆకాశంలోకి చూడు. అక్కడ నీకు నీలత్వం కనబడుతోంది కదా! "అట్లు నీలంగా ఎందుకు కనబడుతోంది? ఇంతకీ అక్కడ ఉన్నదేమిటి?" అను ప్రశ్నలకు వివిధరూపములైన సమాధానాలు చెప్పబడుచున్నాయి.

**యోగ భాష్యకారులు :** 'మేరువు' అనబడే ఒక మహాపర్వతం ఉన్నది. అందులో ఈ భూమి, ఈ నక్షత్రములు, మర్త్య–పాతాళ–స్వర్గాదిలోకములు ఒక స్వల్పభాగం వలె ఉన్నాయి. ఆ మేరు పర్వత శిఖరం 'నీలమణి' చే ప్రకాశిస్తోంది. ఆ శిఖరపు రంగే మనకు కనబడే ఈ నీలత్వం.

**జ్యోతిష్కులు :** సూర్యమండలమునకు దూరంగా ఉండుటచే ఏర్పడే అంధకారపు కాంతే అది.

**వేదాంతులు :** ఆ ఆకాశం అనేక విధములుగా గాంచబడుచున్నది. అనేక కల్పనలు చేయబడుచున్నది. అదే విధంగా అనాత్మభూతములగు ఈ దేహము, తదితర పదార్థములు మొదలైనవి, అవిద్య – అజ్ఞానముల ప్రభావంచేత పరిపరివిధములైన కల్పనా దృష్టులచే గాంచబడుచున్నవి. ఆకాశంకూడా కల్పనాదృష్టికి అట్లు కనిపిస్తోంది.

**శ్రీరాముడు :** మహాత్మా! ఆకాశంలో మనకు కనిపిస్తున్న ఆ నీలత్వమునకు కారణం " మేరు పర్వతం పై గల నీలమణి శిఖరం యొక్క కాంతి, అంధకార కాంతి" ... ఈ రెండు కావని నాకు అనిపిస్తోంది. ఎందుకంటారా? "మేరుపర్వతం ఎఱ్ఱగా రక్తవర్ణంగా ఉంటుంది" అని పురాణద్రష్టలు (దేవీభాగవతము మొదలైన) పురాణాలలో చెప్పుచున్నారు. ఈ కనబడే ఆకాశం మేరుపర్వతము యొక్క శిఖరాగ్రం అయిఉంటే, ఇది ఎఱ్ఱగా ఉండాలిగా? నీలంగా ఉన్నదేం? ఇక బ్రహ్మాండముయొక్క ఆవలి (ఊర్ధ్వ) భాగం 'సువర్ణచ్ఛాయలో ఉంటున్నట్లు పెద్దలు చెప్పుచున్నారు. కనుక సూర్యునకు దూరంగా ఉన్నంతమాత్రంచేత నీలంగా కనబడుటకు వీలులేదు.

పైగా ఊర్ధ్వలోకమైనట్టి "తపోలోకం", "సత్యలోకం" మొదలైనవి ప్రకాశవంతములైనవి కదా! మరి ఆకాశమునకు నీలత్వం ఎట్లా వచ్చింది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామా! ఈ నీలత్వము శూన్యరూపమగు – 'ఆకాశము' యొక్క గుణము కాదు.

మేరుపర్వతశిఖర కాంతి కాదు. సూర్యకాంతి అంధకారమువైపు పయనించుచున్నప్పుడు అట్లు నీలంగా కనిపిస్తోంది – అనేది కూడా కారణం కాదు. ఈ రెండు కారణాలు నీవు నిరాకరించటం ఉచితమే. మరి ఆ ఆకాశము ఏమై ఉన్నది? ఆ కనబడేదంతా కేవలం శూన్యం. అవిద్య వలన మిథ్యా రూపముగా అదంతా అట్లు కనిపిస్తోంది. ఆకాశమున నేత్రదృష్టి ప్రసరించనిచోట "అదర్శనము (Failure to see)" ఏర్పడుతోంది. అట్టి అదర్శనము వస్తుస్వభావముచే నీలత్వముగా దృష్టికి గోచరించుచున్నది. కనుక ఆకాశములోని నీలత్వమునకు అసలు కారణం "ద్రష్టయొక్క దృష్టి చమత్కారమే".

ఒకడు ఈ విషయమును ఇట్లు తెలుసుకొన్న తరువాత మరల ఆకాశంలో నీలత్వం కనిపించినప్పటికీ ... "ఈ నీలత్వము ఆకాశము యొక్క గుణము కాదు నాదృష్టి యొక్క వస్తుస్వభావ విశేషమే!" ... అను బుద్ధిని కలిగి ఉంటాడు కదా!

ఈ 'అవిద్య' అనే అంధకారం విషయం కూడా అట్టిదే. ఇదంతా స్వసంకల్ప మాత్రంగానే ఏర్పడుతోంది. జ్ఞానదృష్టి స్థిరపడియున్నప్పుడు, "నాచే అనుభవం పొందబడుచున్న ఇదంతా ప్రపంచ ధర్మముగాని, వస్తుధర్మముగాని, శరీరధర్మముగాని అయిఉండలేదు. నాకు నేనే నాయొక్క 'విక్షేపముతో కూడిన బుద్ధి' చేత ఇదంతా ఇట్లు దర్శించటం జరుగుతోంది" –అని సుస్పష్టంగా ఎరుగగలవు.

❖❖❖

# 13. అవిద్యను త్యజించేదెట్లా?

ఈ అవిద్య మిథ్యారూపంగానే ఉదయిస్తోంది. దీనిని జయించాలంటే ఉపాయం:

"సంకల్పములను త్యజించుటయే"

"దృశ్యమును అభావించుటయే!"

అని విజ్ఞులు చెప్పుచున్నారు. "అది కష్టసాధ్యంకదా?" అని అంటావేమో? సంకల్పం చేయటంలో కొంత క్రియాపూర్వకమైన శ్రమ ఉన్నదికాని, సంకల్పం చేయకపోవటంలో శ్రమ ఏమి ఉంటుంది, చెప్పు? కాబట్టి అవిద్యను జయించుట సులభసాధ్యమేనని ప్రకటించుచున్నాను. ఓ రాఘవా! 'మిథ్య' యే అయి ఉన్న ఈ జగద్భ్రమను పూర్తిగా విస్మరించివేయి. అనగా మిథ్యగానే దర్శించు అట్లు విస్మరించివేయగా ఏదైతే శేషించుచున్నదో అదే "స్వసత్త ('That which exists absolutely by itselfÑ) రూపమగు ఆత్మచైతన్యము." అట్టి స్వస్వరూపమునందే సుస్థిరుడవై యుండుము. ఇదియే ఉత్తమోత్తమమైన మార్గము.

ఒకడు తన స్వప్నంలో "అమ్మబాబోయ్! ఈ మృగం నాపైకి దూకుతోంది. నన్ను చంపుతోంది. ఇప్పుడు నేను చచ్చాను. నన్ను మోసుకుపోతున్నారు" అని అనుభవం పొందుతూ, దీనాలాపన చేస్తూ ఉంటాడనుకో.... ఆ దుఃఖస్థితికి విమోచనమేమిటి? "నేను మేల్కొన్నాను" అను అనుభవం చేత స్వప్నంలో ఏర్పడిన దుఃఖములను పారద్రోలివేయవచ్చు కదా! మెలుకువ రాగానే ఆ స్వప్నద్రష్ట సుఖమునే పొందుచున్నాడు. ఈ మనస్సు కూడా అనేక దుష్టసంకల్పములచే మరల మరల అల్పత్వమును పొందుతోంది. జ్ఞానరూపమగు ఉత్తమ సంకల్పముచే ఇది "బ్రహ్మైక్యజ్ఞానము"వైపునకు పరుగులు తీస్తున్నది.

ఓ రామా! ఈ అవిద్య ఎప్పుడు ఎట్లు ఉదయిస్తోందో చెపుతాను, విను.

ఈ ఆత్మయందు "నేను అల్పుడను, ఖండుడను" అనునట్టి సంకల్పముచే క్షణకాలంలో 'అనాది' యగు అవిద్య ఉదయించుచున్నది. నశ్వరము – క్షణికము అయిన అసంఖ్యాకమైన సంకల్పములు

రూపంపొంది అంతరంగంలో ఎప్పటికప్పుడు సంచారం చేస్తున్నాయి. వాటి రాక పోకలను సాక్షిత్వబుద్ధిచే గమనించాలి. నీ స్వస్వరూపము నుండి వాటిని వేరు పరచాలి. వాటితో ఏర్పడే "తాదాత్మ్యము"ను నిరోధించాలి. మొదలే, "ఇదంతా కల్పనామాత్రమే కదా! నేను స్వచ్ఛుడను. నిత్యుడను. సర్వసంకల్పములకు మును–ముందే వీటికి వేరై ఉండియున్నాను" అను భావనచే, దృష్టిని పవిత్రం, సుదృఢం చేయాలి. అప్పుడు సంకల్పములు తమంతటతామే ఛేదించబడతాయి. సంకల్పముల వైపు ప్రసరించుచున్న దృష్టి ఉపశమిస్తూ ఉంటే, ఇక ఈ జగత్తు యొక్క వాస్తవ – అవాస్తవములు తెలిసిపోతున్నాయి.

పదార్థములన్నిటిని ఉత్పన్నము చేసేది, జీవులందరిని మోహితులను చేసేది, నిరంతర దుర్భరమైన సంకుచితము ప్రసాదించేది అయిన ఈ అవిద్య "ఆత్మదర్శన ప్రభావం"చేత సువిశాలత పొందుచున్నది. సంకుచితమును త్యజిస్తోంది. అనగా 'విద్య' గా రూపుదిద్దుకొంటోంది. అపరిచ్ఛిన్న మైన ఆత్మస్వరూపము ప్రాప్తించినప్పుడు ఇక 'అవిద్య' ఏమగుచున్నదో కూడా చెప్పలేం.

**శ్రీరాముడు :** తండ్రీ! మరి ఈ ఇంద్రియముల మాటేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రాజుగారి ఆజ్ఞను మంత్రులు పాటిస్తూ ఉంటారు చూచావా? మనస్సు దైనినైతే చింతిస్తూ ఉంటుందో అద్దానిని ఈ ఇంద్రియవృత్తులు వెంటవెంటనే సిద్ధింపచేస్తూ ఉంటాయి. ఎప్పుడైతే ఈ మనస్సు "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మను) అను భావనయందు నిమగ్నమై ఉంటుందో, అప్పుడా మనస్సు విషయములు చింతించుటలేదు కాబట్టి, ఇంద్రియములు కూడా పరమశాంతినే పొందుతాయి. సర్వత్రా ఆత్మసందర్శనంలో ఉపకరణాలుగా అవి రూపుదిద్దుకుంటాయి.

ఓ రాఘవా! ఏ జగత్తైతే సృష్టికి పూర్వంలేదో, అది ఇప్పుడు కూడా లేనిదే అగుచున్నది. ఇక ఈ జగత్తు రూపమున భాసించుచున్నదంతా ఏమిటి? ఇదంతా శాంతము, పరమోత్తమము అగు బ్రహ్మమే అయిఉన్నదని గ్రహించు. బ్రహ్మమునకు వేరైనదంటూ, చింతింపతగినదేదీ ఎచ్చటా, ఎప్పుడూ ఎవ్వరికీ లభించుటలేదు. ఏమాత్రంలేదు. ఈ సర్వము అనాది – అనంతము – నిర్వికారము అగు బ్రహ్మమునందే స్థితి కలిగియున్నది. అట్టి భావనను ఆశ్రయించినవాడవై నీవు బ్రహ్మమునందే స్థితి కలిగియుండుము. అందుకుగాను, శాస్త్రాదులచే సవివరంగా చెప్పబడిన విచారణను గ్రహించు. ఉత్తమ బుద్ధిచే పురుష ప్రయత్నమును ఆశ్రయించు. "విషయ భోగాశ" రూపమగు భావనను నీ చిత్తము నుండి సమూలముగా తొలగించివేయి.

నాయనా! రామా! ఎందుకో, మహామోహము జీవునియందు ఉదయించుచున్నది. అది అనేక ఆశాపాశములతో కూడుకొని ఉంటున్నది. అది "వార్ధక్యము – మరణము" మొదలైన అనేక వికారములకు, అంతులేని అజ్ఞాన పరంపరలకు హేతువు అగుచున్నది. అట్టి మహామోహమంతా వాసనావిజృంభణము మాత్రమే. "నా పుత్రులు, నా ధనము, నా దేహము, నా గృహము, నా పొలములు, నా రాజ్యములు, నా పేరు ప్రతిష్ఠలు...." మొదలైన భ్రమాత్మకమైన ఇంద్రజాలమంతా వాసనలచేతనే ప్రాప్తిస్తోంది. వాయువుచే జలంలో తరంగాలు కల్పించబడునట్లు శూన్యమయమగు

ఈ దేహమునందు వాసనచేతనే "అహంభావము" అనునది కల్పితమగుచున్నది.

**ఈ జీవుని "దృష్టి" .... ఈ దృశ్యము యొక్క "సృష్టి"**

ఓ తత్త్వజ్ఞా! పరమార్థమున 'నేను – నాది' అనునదేదీ లేదు. ఎందుకంటావా? ఆత్మతత్త్వమునకు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ సత్యమై లభించుటయే లేదు కదా!

ఒక చమత్కారమైన విషయం చెప్పుచున్నాను, విను:

ఈ రెండు ఒకే కాలంలో సంభవిస్తున్నాయి. అనగా, దృష్టిచేతనే సృష్టిఏర్పడుతోంది. అధ్యాత్మశాస్త్రాలలో ప్రచారంలో ఉన్న "దృష్టి – సృష్టి" న్యాయం (లేక) వాదము యొక్క అంతరార్థం ఇదే.

అవిద్యయే, వేరు రూపమును పొందినట్లున్నదై, అనేక విచిత్రములైన ఆకారములను ధరించుచు మరల మరల ప్రవర్తించుచున్నది. దేశ – కాల వస్తువులచే పరిచ్ఛిన్నమై కనబడుచున్న ఈ అవిద్య అజ్ఞానము చేతనే ఉదయిస్తోందని అనుకొన్నాము కదా! ఒకడు ఒక క్రీనీడగల ప్రదేశంలో ఒక త్రాడును చూచి "అమ్మబాబోయ్! ఇక్కడ పెద్దపాము మెలికలు తిరిగిపడి ఉన్నది" అని గావుకేకలు పెడుతున్నాడనుకో. ఇప్పుడు అతనియందు ఏర్పడియున్న త్రాడునందు "పాముకు సంబంధించిన బుద్ధి" పోవలసి ఉన్నది. మరి పోయేదెట్లా? 'ఎరుక' లేక జ్ఞానము' చేతనే కదా! ఈ అవిద్య కూడా ఎరుక (లేక) 'జ్ఞానము' చేత నశించగలదు. అట్టి అవిద్యానాశనము ఒక్కసారిగా కాని, లేక క్రమక్రమంగా కాని జరుగవచ్చు. దానికి "ఇది ఇట్లాగే జరగాలి" అను నియమమంటూ ఏదీ లేదు. "కాదు....ఏదో నియమము ఉన్నట్లే ఉన్నది" అని నీకు అనిపిస్తోందా? అట్లు అవిద్య తొలగుటకు ఏదో క్రమము ఉన్నదని అనిపించటం కూడా అవిద్య యొక్క ప్రభావం చేతనే.

"ఆఁ! అప్పుడే ఎక్కడ? మేము జ్ఞానులము కాగలమా? మాయను తొలగించగలమా? లేదు. అది ఎప్పటికో, ఎన్నటికో సాధ్యపడాల్సిందే. ఇప్పటికి మాత్రం ఇది ఇంతే...." అనునదంతా అజ్ఞానవశం చేతనే అట్లు అనిపిస్తోంది.

ఈ 'ఆకాశము–నేల–నదులు–గృహములు' మొదలైన రూపములో ఉన్న అవిద్య అంతా అజ్ఞాని దృష్టిలోనే ఉదయిస్తోంది కాని, జ్ఞాని దృష్టియందు కాదు.

**శ్రీ రాముడు :** మహర్షీ! జ్ఞాని దీనినంతా చూస్తూ ఏమని అనుకొంటున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జ్ఞాని, "ఈ కనబడుచున్న సర్వరూపములందు ఉన్నది బ్రహ్మమే. బ్రహ్మమే తనయొక్క మహిమాతిశయంచేత ఈ విధంగా ప్రతిష్ఠితమైనది. బ్రహ్మము యొక్క స్వభావము కానిదంటూ ఇక్కడ ఏదీ లేనే లేదు" అనియే గాంచుచున్నాడు. అతనికి "వికార రహితమగు పరమార్థ దృష్టి" మాత్రమే అన్ని వైపులా నిర్ణీతమై ఉంటోంది. ఇక ఈ రజ్జు – సర్ప భ్రాంతులు (తాడును చూచి 'పాము' అనుకోవడం), ఈ ప్రాతిభాసికదృష్టులు ఇవన్నీకూడా అజ్ఞాని చేత, అజ్ఞాన విన్యాసము కొరకు కల్పించబడి, అనుభవించబడుచున్నాయి.

❖❖❖

# 14. దుఃఖించడమెందుకు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! నీవు ఏమాత్రం అజ్ఞానివి కావద్దు. జ్ఞానివే కావాలి. అజ్ఞానభూతమగు ఈ దేహము మొదలైన వాటియందు ఆత్మ భావము కలిగి ఉండవలసినపనేమున్నది? నీవు అసలు ఎందుకు అజ్ఞానివలె దుఃఖిస్తున్నావో చెప్పు? ఈ సుఖ-దుఃఖ వ్యవహారములు నిన్ను వివశుణ్ణి చేయడమేమిటి? వాటి చేత నీవు పరాజితుడవు కావటమేమిటి? అట్టి సుఖ-దుఃఖములకు కారణమగు ఈ జడదేహం నీ కెక్కడున్నది? "కత్తిపీట - కుండలోని పళ్ళు" గమనించు.



కత్తిపీటలో లోహము - కొయ్య కలిపి ఉన్నంత మాత్రంచేత అవి రెండు ఒక్కటే అవుతాయా? కుండలో మామిడిఫలములు ఉన్నాయనుకో. అప్పుడా పళ్ళు - కుండ ఒక్కటే అవుతాయా?

ఈ దేహము, ఆత్మ కూడా ఒకదానితో మరొకటి ఎన్నడూ సంబంధం లేకుండానే ఉంటున్నాయి.

'కొలిమితిత్తి' దహించబడినంత మాత్రం చేత అందలి వాయువు దహించబడుతుందా? లేదు కదా! ఆత్మ శరీరముచే పుట్టునది కాదు. శరీరంలో చిక్కి ఉన్నది కాదు. శరీరంతో నశించేది కూడా కాదు. నీవు ఆత్మ స్వరూపుడవు. అంతేగాని, "జడము - తుచ్ఛము" అగు శరీరరూపుడవుకాదు.

**రెండు విధములైన "భావనాబీజములు" :**

1) **"నేను స్వతహాగా దుఃఖిని :** అయితే, ఆయా వస్తువులు, స్థితి గతులు లభించినప్పుడు నేను 'సుఖి' ని అగుచున్నాను"

2) "**నేను స్వతహాగా 'సుఖి' ని :** ఆయా వస్తువులు, స్థితి గతులు వస్తూవుంటాయి, పోతూ ఉంటాయి. అయినా కూడా నా స్వస్థితిని సుఖ స్వరూపముగానే ఉంచుకోగలను!

మొదటిది త్యజించాలి. రెండవదానిని ఆశ్రయించాలి.

ఓ నరశార్దూలా! రామా! ఉత్తిష్ఠ! ఇక "నేను స్వతహాగా దుఃఖిని. కానీ విషయ సుఖములు పొందుచున్నప్పుడు మాత్రమే సుఖిని" ... అనునట్టి కలవరింతలు కట్టిపెట్టు. "ఇది ఇట్లే ఉండాలి? అది అట్లు ఉన్నదేం? వీరు నా వారు. వీరు సుఖించాలి. వారు వేరైనవారు. వారికి ఆ ధనాదులు ఎందుకు కలగాలి? ....." ఇట్టి అసంఖ్యాకమైన భ్రమలు ఎందుకు కలుగుచున్నాయి? భ్రాంతి చేతనే కలుగుచున్నాయి. ఇవన్నీ మృగతృష్ణలో జలబిందువువలె మిథ్యయేనని తెలుసుకొని త్యజించివేయి. నీవంటివారు సత్యమునే ఆశ్రయించాలి గాని అసత్యమును ఆశ్రయించటమేమిటి? దుఃఖించటమేమిటి? అనేకమంది అసత్యమును ఆశ్రయిస్తూ "నేను దుఃఖితుడను, స్వల్పుడను,

శరీరమాత్రుడను. ఇక ఈ నియమము ఇంతే, నా గతి అంతే!" అని సన్ననికేకలో – గావుకేకలో పెట్టటం మేము వింటున్నాము. ఓ జనులారా! మీరంతా ఆత్మస్వరూపులే. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. ఇక దుఃఖితులు కావలసిన పనియేమున్నది చెప్పండి? "సర్వదా శాశ్వతమై, అనంతమై, విశుద్ధమై, సర్వమునకు అంతర్యామి అయి ఉన్న ఆత్మనే నేను" అను భావనను ఆశ్రయించండి. అంతేగాని, ఈ శరీరముయొక్క ధర్మములను మీపై ఆపాదించుకొని భ్రమించమని, దుఃఖించమని మీకు ఎవరు చెప్పారు? మీ యొక్క "సేవకులు" మాత్రమే అయి ఉన్న ఈ ఇంద్రియములతో తాదాత్మ్యముచెంది, నిష్కారణంగా అల్పత్వం ఎందుకు ఆశ్రయించాలి?

ఆహాఁ! ఏమి ఆశ్చర్యం! సత్యమగు బ్రహ్మమును మరచి ఈ జనులు గొప్ప అసత్యమగు "అవిద్య"నే ఎల్లప్పుడు స్మరించుచున్నారే? ఓ రామా! ఆత్మను విస్మరింపజేయగల ఈ అవిద్యకు చోటు ఇవ్వకూడదయ్యా! అట్లా చోటు ఇచ్చావా... ఇక నీ చిత్తము కలుషితమై తీరుతుంది. ఫలితం? దుఃఖ పరంపరలు వచ్చి నిన్ను వివశుణ్ణి చేసి కూర్చోబెడతాయి. నీవు వాటిని జయించవలసిందిపోయి, అవే నిన్ను ఆక్రమించివేస్తాయి. ఈ అవిద్య :

– మిథ్యారూపంగా అనేక పదార్థములను ఎదురుగా ఉంచి చూపుతోంది.

– సంకల్పమాత్రంచేత బహు విశాలత్వం పొందుతోంది.

– చివరకు అజ్ఞానమే రూపముగాగల అనేక ఫలములను తెచ్చి పెడుతోంది.

అమృతతుల్యము, స్వయంప్రకాశవంతము అయి ఉన్న నీ యొక్క సత్య – నిత్య స్వరూపమగు ఆత్మను మరుగు పరచి, నిన్ను దుఃఖితునిగా చేస్తున్నది ఈ అవిద్యయే సుమా! ఈ జనులు చేస్తున్నదేమిటి? వేద – ఉపనిషత్తులచే ప్రతిపాదించబడుచు, ఋషులచే అనేక ఉపాయములద్వారా గుర్తు చేయబడు చున్న స్వస్వరూపమగు ఆత్మ యొక్క సమాచారమును – జ్ఞానమును తిరస్కరిస్తున్నారు. ఫలితంగా ఈ జీవుడు అనేక దుస్సహమైన అనుభవములను పొందుచున్నాడు. అవిద్యాప్రభావం చేతనే, సరోవరమును ఎడారివలె గాంచుచున్నాడు. ఊహాసౌధనిర్మాణం (గంధర్వ జన్మలు), నరకములు, స్వర్గములు – ఇటువంటి సుఖ, దుఃఖ ప్రదములైన విచిత్ర భ్రమలు స్వప్నంలోలాగానే అజ్ఞాన కారణంగా ఈ జీవునకు అనుభవమౌతున్నాయి.

అవిద్య కనుక చిత్తమునందు సాంసారికవాసనలు నింపియుండకపోతే ... ఇక ఈ జాగ్రత్ –స్వప్న విభ్రమములు ఆత్మను క్షోభించగలిగేవా? లేదు. మిథ్యారూపమగు 'అజ్ఞానాభివృద్ధి' చేతనే ఈ జీవుడు తన జాగ్రత్ స్వప్నములందు భయంకర దృశ్యములను నిర్మించుకుని, "అయ్యో! నన్ను ఎవరు కాపాడుతారోకదా?" అని రోదిస్తున్నాడు. 'అవిద్య' అను అస్వస్థతను పొందిన ఈ చిత్తము క్షణంలో 'విశాల సంసారసాగర' రూపమైనట్టి 'భ్రమ'ను, ఆ భ్రమకు అంతర్గతమై ఉంటున్న అనేక అనర్థములను తనయందే గాంచుచున్నది. చిత్తము రోగగ్రస్తమైనప్పుడు ఇక అట్టి జీవుడు రాజ్యాధిపత్యం పొందితే మాత్రం లాభమేమి ఉంటుంది? అతడు నిరుపేదకు కూడా అయోగ్యమైనట్టి దుఃఖములు అనుభవిస్తూనే ఉంటాడు.

కాబట్టి రాఘవా! ఈ ప్రపంచంలో బంధహేతువై, రాగమయమై, అవిద్యామయమై ప్రవర్తిస్తున్న వాసనల బారి నుండి నిన్ను నీవు రక్షించుకో. రాగరహితుడవై స్వచ్ఛమైన స్ఫటికమువలె వెలుగొందు. ఒక దర్పణములో ప్రతిబింబిస్తున్న ఆయా పదార్థజాలములపట్ల ఆ దర్పణమునకు ఏదైనా ఆసక్తి ఉంటుందా? ఉండదు కదా! అట్లాగే నీచే నిర్వర్తించబడు ఆయా కార్యములందు నీ మనోదర్పణమునకు ఎట్టి ఆసక్తి-రాగము ఉండకుండునుగాక!

నిరతిశయానందరూపమగు బ్రహ్మమును ఎరిగిన తత్త్వవేత్తలు ఈ భూమిపై నిరాడంబరముగా సంచరిస్తూ ఉన్నారు. వారిని సమీపించు. వారితో సంసర్గము కలిగియుండు. వారు బోధించునది భక్తి-జ్ఞాన-వైరాగ్యపూర్వకంగా గ్రహించు. మరల మరల విచారణ చేయి. బ్రహ్మభావనను దృఢపరచుకో! అట్టి దృఢ నిశ్చయముచే శోభించు. సమత్వము, సౌశీల్యము సర్వదా ఆశ్రయించి ఉండు. ఆసక్తి రహితుడవై ఉత్తమ వివేకబుద్ధితో కూడి సదా వ్యవహరిస్తూ ఉండు.

స్వల్పములగు శరీరాదులందు, ఈ దృశ్యవస్తువులందు 'మమత్వము'ను వదిలివేయి.

అప్పుడు అవిద్యాజనితములైన ఈ జనన, మరణాది వికారములు చేరజాలనట్టి స్థితి పొంది ఉండగలవు. నిత్యముక్తుడవై ఉంటావు.

ఓ రామచంద్రా! ఒక ఉత్తమ సత్యమును ప్రకటిస్తున్నాను.

"ఆత్మైక్యస్థితి" కలిగి ఉన్నావా, ఇక నీతో హరి-హర-బ్రహ్మాదులు కూడా సాటిరారు.

❖❖❖

# 15. కర్త - భోక్త

అమృతతుల్యములగు వసిష్ఠ భగవానుని వాక్యములు విని రామచంద్రుడు వికసితమైన అంతః కరణుడు అయ్యాడు. గొప్ప అనిర్వచనీయమైన వికాసం(Splendour)చే శోభించాడు. ఇట్లు పలికాడు.

**శ్రీరాముడు :** ఆహాఁ! ఏమి ఆశ్చర్యం! "ఒక బారెడు పొడుగు దారము పోయి ఉన్నతమైన ఒక కొండను బంధించినది" అనునది ఎంత హాస్యాస్పదమో, ఇదంతా కూడా అంతే మహా హాస్యాస్పదంగా ఉన్నదే! "స్వతహాగా ఏమాత్రం లేనిదే" అయినప్పటికీ ఈ అవిద్య అందరిని తన వశం చేసుకొంటున్నది కదా! ఎక్కడి ఆత్మ? ఎక్కడి అవిద్య? ఒక గొడుగు ఆకాశమును కప్పివేస్తున్నట్లు ఈ అవిద్య ... సర్వుల స్వస్వరూపము, దేశ - కాలాతీతము ...అయిన ఆత్మను మరుగున పడవేస్తోంది. తృణప్రాయమై, ఉండి కూడా, వజ్రప్రాయమై ప్రవర్తిస్తోంది. దాని ప్రభావంచేత 'అత్యంత మిథ్య' అయినది కూడా 'ఎంతో సత్యము' అని అనిపిస్తోంది.

మహాత్మా! ఈ 'మాయ' యొక్క స్వరూపమేమిటో మరికొంత గ్రహించాలని ఉన్నది. అందుచేత దీని గురించి ఇంకా కొన్ని వివరాలు చెప్పండి. ఇంతకుముందు లవణమహారాజు యొక్క అనుభవములు గురించి చెప్పుచున్నారు కదా! ఉత్తమజ్ఞాని, భాగ్యశాలి అని అందరిచే కీర్తించబడు

ఆ చక్రవర్తికి అట్టి అనుభవం ఎందుకు సంభవించింది? నాకీ విషయంలో ఇంకా సంశయం పోలేదు.

మరొక్క విషయం. లోహము – కొయ్యవలె పరస్పరం కూడియున్న ఈ దేహము – ఆత్మలందు ముఖ్యంగా శుభ – అశుభ కర్మలను అనుభవించేది ఏది? దేహమా? ఆత్మయా? లవణ మహారాజు యొక్క ఆ సభకు వేంచేసిన ఆ ఐంద్రజాలికుడు ఎవడు? ఎందుకు, ఎక్కడి నుండి వచ్చాడు? మరల ఎక్కడికి వెళ్ళాడు? ఆ సభలో మీరు కూడా ఉన్నానని అన్నారు కదా! ఇదంతా గమనించే ఉంటారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ముందుగా ఈ "శరీరము – ఆత్మ"లందు అనుభవము స్వీకరించుచున్న విభాగం గురించి కొన్ని విశేషాలు చెప్పుచున్నాను, విను.

కొయ్య, గోడలవలె ఈ దేహము జడమైనది మాత్రమే. స్వప్నంలో కనబడే వస్తువులను ఆ 'స్వప్నద్రష్ట' యే అట్లు కల్పించుకొని దర్శించుచున్నాడు కదా! చిత్తమే ఇదంతా ఇట్లు కల్పించుకొనుచున్నది. అయితే, ఈ చిత్తము తనంతట తానే ప్రవర్తిస్తోందా? లేదు. అది స్వయంప్రకాశం కాదు.

ఈ చిత్తము చైతన్యముచేతనే ప్రకాశితం అగుచున్నది.

అయితే ఇది చిదాభాసుని (Refractive Awareness Reflective part of Atman) తో ఐక్యము పొందుచున్నదై ఉంటున్నది. ఫలితంగా ప్రపంచమున భోక్తృత్వాభిమానం కలదగుచున్నది. 'వానర సంచారము' వలె అతి చంచలమైన ఈ చిత్తమే 'నేను జీవుడు' అను భావనకు ఉత్పత్తి స్థానం అగుచున్నది. చిత్తమే అనేక రకములైన దేహములను ధరిస్తోంది కాబట్టి, "జీవుని దేహము ఈ చిత్తమే" అని అనటం కూడా ఉచితమే. ఇదే కర్మ ఫలభోక్త. వాస్తవానికి చిత్తమే జీవుడు. అంతేకాని, ఈ భౌతికదేహం జీవుడుకాదు.

అనంతంగా కనిపించే ఈ సుఖదుఃఖములన్నీ అజ్ఞాని యొక్క చిత్తమునందే ఏర్పడుచున్నాయి కాని, జ్ఞానియందు కాదు.

**జడో దేహో న దుఃఖార్హో! దుఃఖీ 'దేహి' అవిచారతః ।**
**అవిచారోఘనాఽజ్ఞానాత్! అజ్ఞానమ్ దుఃఖకారణమ్ ॥**

"సుఖదుఃఖములు శరీరమునకు సంబంధించిన ధర్మములు" అని అనటానికి వీలులేదు. ఎందుకంటే ఈ శరీరము జడమైనది కదా! శరీరం సుఖమునుగాని, దుఃఖమునుగాని పొందజాలదు.

ఇక శుద్ధస్వరూపమగు ఆత్మకో... సుఖదుఃఖాదులు ఉండజాలవు.

మరి ఈ సుఖదుఃఖాలు అనుభవిస్తున్నది ఎవరు?

అజ్ఞానియొక్క మనస్సు అనేక సంజ్ఞలచే కల్పితములైన భ్రమలను కలిగి ఉంటోంది. చిత్ర – విచిత్రములైన వృత్తులందు తగుల్కొనుచు, విచిత్రమైన ఆకృతులను పొందుతోంది. చమత్కారం చూచావా? ఈ మనస్సు తాను ప్రబుద్ధం కానంతవరకు ఇట్లే నిద్రిస్తూ ఉంటుంది. జ్ఞాన విషయమై అజాగ్రత్త వహించి ఉంటోంది. స్వప్నస్థితివలె అజ్ఞానమున ఉన్నదై అవిచారణను ఆశ్రయిస్తోంది.

"స్వసత్తాసామాన్యము" (Existence Absolute) ను మరచి దుఃఖాదులను పొందుతోంది. అధికమగు అజ్ఞానముచేతనే "అవిచారము" {Non-Enquiry} అనేది ఉత్పన్నమౌతోంది.

కాబట్టి అజ్ఞానమే సర్వదుఃఖములకు కారణం

పట్టుపురుగు తాను నిర్మించుకొనిన గూటిలో తానే చిక్కుకుంటుంది చూచావా? ఈ జీవుడు తనయొక్క అవివేకము చేతనే శుభాశుభములకు లోను అగుచున్నాడు. తన ఆసక్తి యొక్క ఆడంబరమే తనకు దుఃఖ వ్యవహారముగా పరిణమించుచున్నది. అయితే, ఎంతకాలం గడచిపోయినప్పటికీ, ఆ విషయం అతడు గ్రహించుటలేదు. 'అజ్ఞాన నిబిడాంధకారము' లో చిక్కుకొని బాధపడుచున్న ఈ మనస్సు అనేక వృత్తులను కలిగియుండి, వివిధ ఆకారములను పొందుచు, ఒక పెద్ద చక్రంలా పరిభ్రమిస్తోంది...., ఉత్పన్నమగుచున్నది...., దుఃఖించుచున్నది...., వధించుచున్నది..., భుజించుచున్నది..., సంచరించుచున్నది..., విజృంభించుచున్నది..., నిందించుచున్నది. దీని చేతలకు అంతు ఉండుట లేదు. ఇవన్నీ చేస్తున్నది మనస్సే కాని, జడశరీరం కాదు. మనస్సే తాను తెరవెనుక ఉండి, ఈ శరీరమును ప్రవర్తింపచేస్తోంది. లేకుంటే శరీరమే స్వయంగా ఈ పనులు చేయగలదా? ఇంటిలోని సమస్త వ్యవహారములు నిర్వర్తిస్తున్నది ఇల్లాలే గాని, ఇల్లు, ఇంటిలోని వస్తువులు కాదు కదా! అట్లే ఈ శరీరమునందు మనస్సే వర్తిస్తోంది.

సర్వ సుఖదుఃఖములందు, సర్వవిధ కల్పనలందు మనస్సే కర్త, మనస్సే భోక్త. ఇన్ని మాటలెందుకు? "మనస్సే మానవుడు గాని, ఈ శరీరము మానవుడు కాదు".

**సర్వేషు సుఖదుఃఖేషు సర్వాసు కలనాసు చ ।**
**మనః కర్తృ మనో భోక్తృ మానసం విద్ధిమానవమ్ ॥**

ప్రబుద్ధమైన మనస్సు ఆయా కార్యక్రమములకు సంబంధించిన క్రియావిశేషములను నిర్వర్తిస్తున్నప్పటికీ, వాటి పట్ల 'ఆసక్తి' అను భ్రమ కలిగి యుండదు. 'ఆత్మతత్త్వము' ను గ్రహించినదై ప్రశాంతమును, మౌనమును అనుభవిస్తూనే ఆయా క్లిష్ట – సాంసారిక విషయములను దర్శించగలదు. అజ్ఞానాంధకారం పటాపంచలైతే, ఇక అట్టి మనస్సే పరమాత్మ స్వరూపమై ఉంటుంది.

ఇప్పుడు నీకు లవణమహారాజు తన సింహాసనముపై కూర్చుని ఉండియే అరువది (60)యేళ్ళ ఆటవిక వ్యక్త్యానుభవం ఎందుకు పొందాడో వివరిస్తాను. ఇది వింటే "శుభాశుభ – కర్మఫలములను అనుభవిస్తున్నది మనస్సే" అని గ్రహిస్తావు.

హరిశ్చంద్రుని వంశములోని వాడైన లవణ మహారాజు ఆ సభాసమావేశమునకు కొద్దిరోజుల క్రిందట ఒక రోజు ఒంటరిగా వ్యాహ్యాళికై సముద్రపు ఒడ్డు చేరాడు. ఒక ఏకాంత ప్రదేశంలో ఇసుక తిన్నెపై సుఖాసీనుడైనాడు. "ఆహాఁ! నా పితామహుడు హరిశ్చంద్రుడు రాజసూయయాగం చేశాడు కదా! నేను కూడా ఆ యాగం చేస్తే ఎంత బాగుంటుంది! కాని, రాజసూయయాగం చేయాలంటే గొప్ప యజ్ఞసామగ్రి సంపాదించాలి. పైగా తోటి రాజులను,వారి ప్రజలను హింసించటం, బాధించటం వంటి దుష్ట వ్యవహారాలు కూడా చేయవలసివస్తుంది. మంత్ర తంత్రములతో, మహా

ప్రయాసతో కూడుకొనియున్న అట్టి యాగము ఎట్లా చేయటం?" అని యోచించసాగాడు. ఇంతలో అతని మస్తిష్కంలో ఒక మహత్తరమైన ఆలోచన మెరసింది.

తత్త్వజ్ఞులగు మహాశయులు "ఏ క్రియకుగాని, అనుభవమునకుగాని కారణం మనస్సే. అంతే గాని, ఈ జడశరీరం కాదు "– అని చెప్పటం విన్నాను కదా! అందుచేత రాజసూయయాగమును ఇప్పుడే, ఇక్కడే మానసికముగా చేసెదనుగాక!"

ఇట్లు నిర్ణయించుకొని, అప్పటికప్పుడు అక్కడే 'మానసిక యజ్ఞం' ప్రారంభించాడు. మనస్సుతోనే యజ్ఞసామాగ్రినంతా సమకూర్చుకొన్నాడు. దీక్ష వహించాడు. మనస్సుతో ఋత్విక్కులను ఆహ్వానించాడు. ముందుగా శ్రేష్ఠులైన మునులను, దేవతలను, సంకల్పపుష్పములతో పూజించాడు. హవిస్సు ద్వారా అగ్నిని ప్రజ్జ్వలింపజేశాడు. యజ్ఞవాటికామధ్యంలో మానసిక యజ్ఞ కార్యక్రమం ప్రారంభించాడు. అట్లు ఒక సంవత్సరకాలం ఆయా యజ్ఞవిధులన్నీ నిర్వర్తించబడ్డాయి. అతడు తన సర్వస్వము బ్రాహ్మణులకు, పేదలకు దక్షిణగా ఇచ్చి వేశాడు. మనోకల్పితులగు ఋత్విక్కులు "యజ్ఞపరిసమాప్తి – శాంతి" పలికిన తరువాత అతడు మానసిక – యజ్ఞం నుండి మేల్కొని బాహ్య దృష్టికి వచ్చాడు. సంతుష్టమానసుడై, "నేను రాజసూయయాగము చేశాను కదా!" అను తృప్తిని పొందాడు. అద్దాని ఆయా ఫలితములను అతడు పొందవలసియున్నది కదా! చేసిన కర్మ యొక్క ఆయా ప్రయోజనములు వచ్చి తీరుతాయి.

ఓ రాఘవా! సుఖదుఃఖములన్నిటికీ ఈ మనస్సే కారణమని అనుకున్నాం కదా! అట్టి మనస్సు లేక చిత్తమును "విచారణ(Enquiry as to its real nature)"చే నిగ్రహించాలి సుమా! క్రమంగా ఈ చిత్తమును 'పవిత్రము – సత్యవంతము' అయిన వస్తువు యొక్క సామీప్యత పొందేటట్లు చేయాలి.

మనస్సే క్రియాశక్తి. కర్త–కరణము–క్రియ కూడా అదే.

ఏ క్రియ యందైతే మనస్సు పాల్గొనుచు, నిర్వర్తించబడుతుందో, అది మాత్రమే సుఖ–దుః ఖాది రూపమున పరిణమించి ఫలదాయకం అగుచున్నది.

ద్రష్ట యొక్క ప్రతిబింబమే ఈ దృశ్యమంతటిలో వ్యాపించియున్నది. దృశ్యములో–దృశ్యముగా ప్రతిబింబించే ద్రష్టయొక్క స్వరూపతత్వమును 'చిదాభాసుడు' అని పిలుస్తున్నారు.

అనగా "చిత్ స్వరూపుడవగు నీవే నీ చేత దర్శించబడుచు, అనుభవించబడుచున్న దానియందు ప్రసరించియుండి, 'నిన్ను నీవే' అట్లు గాంచుచున్నావు" అనునదే వేదాంత రహస్యం. చూచువానితో సహా సర్వము చిత్‌శక్తి యొక్క ప్రసరణమే. ఇట్లు మనస్సే భోక్త – భోగము కూడా అగుచున్నది. కర్తృత్వ – భోక్తృత్వ భావనయే మాయయొక్క స్వరూపము. ఆత్మ సర్వదా నిర్మలం. అసంగము. అప్రమేయము. ఇట్లు 'తత్త్వమ్' యొక్క తాత్వికార్థం అదే!

'దేహము – ఆత్మ' లలో శుభాశుభ కర్మలను అనుభవించేదేది?

ఈ నీ ప్రశ్నకు మరల సమాధానం చెప్పుచున్నాను. విను. సర్వకర్మల కర్తృత్వముగాని, అనుభవముగాని ఇటు దేహమునకు సంబంధించినవి కావు.

అటు నిష్క్రియమగు ఆత్మకు సంబంధించినవి కూడా కావు.

'పాపము – పుణ్యము', 'సుఖము – దుఃఖము', 'కర్మ – కర్మ ఫలము' ఇవన్నీ చిత్తమునకు సంబంధించినవి మాత్రమే.

ఓ సభికులారా! ఎప్పుడైతే ఈ మనస్సు దేశ–కాల–వస్తువులకు అందజాలనట్టి 'ఆత్మతత్త్వము' ను అవలంబిస్తుందో, అందు ప్రతిష్ఠితమౌతుందో, అప్పుడు ఇది 'పరిపూర్ణత్వము' ను పొందుతోంది. అట్లా కాకుండా, పరిచ్ఛిన్నమగు ఈ దేహాదులను, ఈ దృశ్యమును ఆశ్రయించిందా ... ఇక ఫలితం అల్పత్వము, దుఃఖము, అగమ్యత్వమే. కనుక, మీరంతా ఒక్క విషయం గ్రహించండి. "ఈ దేహమే నేను" అను భావము ఎవరు కలిగియుంటారో, అట్టివానికి గాని, లేక వారి వలన ఈ ప్రపంచమునకు గాని ఉత్తమ ప్రయోజనం లభించుటలేదని మనవి చేస్తున్నాను. వారి దుఃఖములు తొలగేదెట్లా?

**వివేకులు** – కొందరు ఉత్తములు వేదాంతము ప్రతిపాదిస్తున్న శాస్త్రములను తరచి – తరచి విచారిస్తున్నారు. ఆచార్యులను (విజ్ఞులను) సమీపించి సమ్యక్ విచారణ చేస్తున్నారు. అట్టి వివేకులు ప్రబుద్ధమైన తమ చిత్తమునందు, "అతిత్వరలో నశించబోయే ఈ దేహము నేను కాను. పూర్ణానంద ప్రకాశరూపమగు బ్రహ్మమే నేనై ఉన్నాను"... అను దృఢనిశ్చయం కలిగి ఉంటున్నారు. అట్టి బ్రహ్మాకార వృత్తి కలిగి, అభ్యాసవశం చేత దృఢంగా ఉండే జీవునికి దుఃఖమంతా పూర్తిగా నశించుచున్నది. సూర్యుడు ఉదయించగానే కమలములు విచ్చుకొనుచున్నట్లు, అట్టివాడు అంతటిని తనయందు, అంతటియందు తనను గాంచుచున్నాడు.*

**శ్రీరాముడు :** మీ ప్రవచనం మహత్తర సత్యమును ప్రతిపాదిస్తోంది. స్వామీ! మీరు లవణ మహారాజు యొక్క మానసికయాగం గురించి ప్రస్తావించారు. అయితే అట్టి మానసిక–రాజసూయ యాగం ఫలితంగానే లవణమహారాజు ఐంద్రజాలికునిచే కల్పించబడిన వివిధ కల్పనామయమగు మాయా జాలం పొందాడంటారా? 'అది రాజసూయ యాగ ఫలితమే' అనటానికి ప్రమాణం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ ఐంద్రజాలికుడు సభలో ప్రవేశించే సమయంలో నేను అచ్చటనే ఉన్నాను. అక్కడ జరుగుచున్నదంతా ప్రత్యక్షంగా అవలోకించుచున్నాను. ఇంద్రజాలమంతా సమాప్తమైన తరువాత ఐంద్రజాలికుడు అంతర్ధానమైనాడు కదా! అప్పుడు లవణమహారాజు నా వైపు చూచి ఇట్లు పలికాడు.

**లవణ మహారాజు :** తండ్రీ! వసిష్ఠ మహర్షీ! ఈ చిత్రమంతా ఏమిటి?

అప్పుడు నేను యోగబలంతో అంతా పరిశీలించి, అటు తరువాత ఇట్లు చెప్పాను–

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ లవణమహారాజా! మీరు పది రోజుల క్రితం ఒక సముద్రపు ఒడ్డున ఇసుక తిన్నెపై కూర్చుని మానసికంగా రాజసూయయాగం చేసియున్నారు. గుర్తున్నదా? "రాజ

* **"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని"** – *శ్రీమద్భగవద్గీత (VI. 29)*

సూయము నిర్వర్తించినవారు పంద్రెండు సంవత్సరములు వివిధ ఆపదలను అనుభవిస్తారు. ఆయా దుఃఖములను ఆ 12 ఏళ్ళలో అనుభవించవలసివస్తుంది" అనేది శాస్త్రనిర్ణయం. ఆ దుఃఖములను కలుగజేయటానికే ఇంద్రుడు స్వధర్మనిర్వహణార్థం దేవదూతను ఐంద్రజాలికుని రూపంలో పంపించాడు.

**శ్రీ లవణ మహారాజు :** స్వామీ! అట్లా అయితే నేను చండాలునిగా అరువది సంవత్సరములు జీవించిన అనుభవంపొందానే? ఎందుచేత?

**నేను :** ఓ అదా! దానికి కారణం విను. శారీరక యజ్ఞము కంటే మానసిక యజ్ఞమునకు ఐదు రెట్లు అధిక ఫలము ఉంటుంది. ఆ నిర్ణయం ప్రకారమే నీకు 5×12 = 60 సంవత్సరాల ఆధి వ్యాధులతో కూడిన దుర్భర జీవితానుభవం కలిగింది.

**శ్రీ లవణ మహారాజు :** మరి ఐంద్రజాలికుని రూపంలో వచ్చిన దేవదూత ఎటు వెళ్ళారు?

**నేను :** ఓహో! ఆయనా! ఆయన తనకు నియమించబడిన కార్యమును నెఱవేర్చి, ఆ తరువాత సిద్ధులచే సేవించబడుచు ఆకాశమార్గంలో తిరిగి దేవలోకం చేరారు.

❖❖❖

# 16. సాధన ప్రయోజనం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! ఇదంతా నాకు ప్రత్యక్షంగానే జరిగింది. ఇందులో నీవు సందేహించవలసినదంటూ ఏమీ లేదు.

ఈ సర్వ విలక్షణములగు క్రియలకు కర్త, భోక్త కూడా మనస్సే. అందుచేత ఈ మనస్సును శుద్ధి చేసుకోవాలి. అందుకొరకుగాను ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము మొదలగు హఠయోగ క్రియలు కొంచెము ఆశ్రయించు. విధి, నియమములు, రాజయోగములతో కూడిన శ్రమ నుండే ఉత్తమ అవగాహనతో కూడిన ధీశక్తి అలవడుతోంది. అట్లు మనస్సుకు యుక్తులతో ఏకాగ్రత నేర్పి, అటుపై నిర్వికల్పసమాధియందు దానిని లయం చేయాలి. ఆవేశరహితంగా లక్ష్య శుద్ధితో యోగ – విచారణలను నిర్వర్తించటం ఉచితం.

ఈ చిత్తమే జీవులందరిని మోహపరుస్తున్న అవిద్య. అట్టి అవిద్యయే విచిత్రమైన ఇంద్రజాల రచనలాగా ఈ జగత్తునంతా ఉత్పన్నం చేస్తోంది. 'వృక్షము' అన్నప్పుడు, 'చెట్టు' అన్నప్పుడు, .... ఈ రెండు శబ్దాలు సూచించేది ఒక్కదానినే కదా! అదే విధంగా, – ఈ 'అవిద్య', 'జీవుడు', 'చిత్తము', 'బుద్ధి', 'మనస్సు' మొదలైన శబ్దముల వాస్తవార్థంలో భేదమేమీ లేదు. ఇది గ్రహించి నీవు ముందుగా నీ చిత్తమును సంకల్పరహితం చేయి. "చిత్త నిర్మలత్వము" అనే సూర్యుడు ఉదయించాడా.... ఇక అప్పుడు చోటు చేసుకొన్న అజ్ఞానాంధకారమంతా స్వయముగా సమసి పోతుంది. 'చీకటి' అంటే ఏమిటి? 'వెలుగు లేకపోవుట' అనియే కదా! అట్లే 'అవిద్య' లేక 'అజ్ఞానము' అంటే జ్ఞానము అసంపూర్ణమై ఉండుటయే. 'స్వస్వరూపము' గురించిన ఎరుక ఏమరుచుటచేతనే ఈ జీవులు జగత్తు అనబడుదానిని, అందలి ఏకానేకత్వములను గాంచుచున్నారు.

**పురుషేణ జాతమాత్రేణైవ బాల్యాత్ ప్రభృతి**
**విద్యాగ్రహణమ్ కర్తవ్యమ్ । గురువో అనుగన్తవ్యమ్ ॥**

తాత్సారం చేయరాదు. చిన్నప్పటి నుండే గురువులను సమీపించటం, సత్య వస్తువుకై ప్రయత్నించటం చేయాలి.

"ఈ లౌకిక వ్యవహారముల మధ్య ఉన్నంతకాలం నేను జ్ఞానం కొరకు ప్రయత్నించటం ఎలా సాధ్యం?" ...అని భ్రమించకుండెదవు గాక! చిత్తము లయించగా, అవిద్య శమించగా, అప్పుడు నీ యందు 'అవిద్యా వృత్తి' మాత్రమే నశిస్తుంది. అనగా ఈ దృశ్యమును, ఇందలి సంఘటనలను అర్థం చేసుకొనే రీతి మాత్రం వేరుగా ఉంటుంది.

మేఘములు లయించిపోతే ఆకాశం కోల్పోయేది ఏమైనా ఉంటుందా? లేదు కదా! దృశ్యమునకు సంబంధించిన వృత్తుల సమూహమే చిత్తము యొక్క రూపము. చిత్తము లయించినప్పుడు కూడా, చిత్స్వరూపుడు, ఆత్మాకాశ స్వరూపుడు అగు ఈ ద్రష్ట అట్లే ఉండిఉంటున్నాడు. నిత్యసత్యమైయున్న 'ఆత్మదృష్టి' కొరవడుటచేతనే 'అవిద్య' అనేది ఉంటోంది.

**శ్రీరాముడు :** అవిద్యాకార్యము అయి ఉన్న అవివేకమునకు, లేక, ఈ సంసారానుభవమునకు కారణం చిత్తమేనంటారా, మునీంద్రా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కాదు. ఆ చిత్తములోని అజ్ఞానవృత్తులే కారణం. "ఈ చిత్తము నా యందు తొలగుట లేదే?" అని నీవు దిగులు పడవలసిన అవసరం లేదు. అజ్ఞాన వృత్తి తొలగితే, ఇక శేషించేది పరిశుద్ధమగు "ఆత్మతత్త్వమే"! అప్పుడు ఆ శుద్ధచిత్తము ఆత్మనే అంతటా, సర్వదా గాంచుచున్నది.

భోగింపబడు పదార్థ జాలముల ఉనికి (లేక) అనుభవమునకు కూడా అజ్ఞానమే కారణం.

నాయనా! రాఘవా! 'సర్వాత్మకము' అని ఎలుగెత్తి చాటబడుచున్న 'స్వాత్మదర్శనము' అనునదే అన్ని దోషములకు ఔషధమైయున్నది. ఆత్మవంతము కానిదేదీ అనుభవసిద్ధమై ప్రాప్తింపజాలదు. ఏదేదైతే ఆత్మకు వేరుగా స్వీకరించబడుచున్నదో... అదంతా మరొక సమయంలో త్యజించబడబోవుచున్నదని గ్రహించు. "ఆత్మీయముకానిది, పరకీయముకానిది" అంటూ ఎక్కడా ఏదీ లేదు. ఎప్పుడైతే 'స్వాత్మదర్శనము' ఏర్పడుచున్నదో అప్పటికప్పుడు అంతాకూడా అన్ని వేళలందు సర్వరూపమగు 'ఆత్మ' యే అయి వెలుగొందుచున్నది. ఇదే సత్యము, పరమార్థస్థితి కూడా.

మట్టితో తయారుచేసిన అనేక నామరూపములుగల వస్తువులు ఒకచోట ఉన్నాయనుకో.... వాటినన్నిటినీ జలంలో వేసినప్పుడు ఏకమే అవుతాయికదా! ఈ దృశ్య ప్రపంచము, ఇందలి సర్వజీవులు, ఈ దృశ్యజ్ఞానము... ఇదంతా కూడా ఆత్మజ్ఞానప్రభావంచేత "బ్రహ్మైక్యరూపము" నే పొందుతాయి. అందుచేత నీవు బ్రహ్మైక్యదృష్టినే రూఢిపరచుకో.

❖❖❖

# 17. బ్రహ్మానుభవం పొందేదెట్లా?

**శ్రీరాముడు :** హే మహర్షీ! "సర్వము బ్రహ్మ సత్తయే" అని మీరు మీ వాక్యములచే ప్రతిపాదిస్తున్నారు. "మనస్సు నశిస్తే సుఖ-దుఃఖములన్నీ నశిస్తాయి" అని కూడా మీరు సెలవిచ్చారు. అతి చంచలమైన 'చపలవృత్తి' కలిగియున్న ఈ మనస్సుకూడా 'బ్రహ్మసత్త' యే నంటారా? అది ఎట్లా?

మనస్సు శమిస్తే ఆత్మానుభవం శేషిస్తుందని అన్నారు. మనస్సు నశించేదెట్లాగో మరికొంత విశ్లేషణతో వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రఘురామా! నీకు మనోనాశనమునకు ఉపాయం చెపుతాను. విను. నేను చెప్పబోవుచున్న ఉపాయం గ్రహిస్తే ఈ బాహ్యోన్ముఖములు అగుచున్న ఇంద్రియవృత్తులేవీ ఉండజాలనట్టి 'శుద్ధబ్రహ్మము' నందు నీవు నీ మనస్సును జేర్చగలుగుతావు.

ఈ బ్రహ్మాండమున సాత్విక - రాజస - తామస భేదములచే మూడు విధములగు జీవులు బ్రహ్మదేవుని వలన సృష్టించబడుచున్నారు. ఈ గుణముల గురించి కొంత చెప్పియున్నాను. మరికొంత ముందు ముందు మనం చర్చించుకోబోతున్నాం కూడా!

జలమునందు తరంగము లేచునట్లు, సమష్టి ఉపాధిరూపమగు మనస్సు 'మననము' రూపమున ఆత్మయందు అనిర్వచనీయచమత్కారంగా ప్రకటితమౌతోంది. అట్టి ప్రథమ మనన స్వభావమే 'సమష్టి రూపము', 'హిరణ్యగర్భము' 'చతుర్ముఖ బ్రహ్మ' మొదలైన నామరూపములచే దర్శించ బడుతోంది, అర్చించబడుతోంది.

అట్టి 'సృష్ట్యాది' యందలి మనస్సే "నేను చతుర్ముఖుడగు బ్రహ్మను అగుదునుగాక! సమష్టి సృష్టిని దర్శించెదనుగాక" అని సంకల్పిస్తోంది. అనగా, స్వతహాగా చైతన్యమే స్వరూపముగా గల ఈ జీవుడు "హిరణ్యగర్భుడు, లేక, సమష్టి సృష్టిని సంకల్పించువాడు"... అని పిలువబడు స్వభావమును ఆశ్రయించి, సృష్టివ్యవహారమునకు నాంది పలుకుచున్నాడు.

చైతన్యమే ఇట్లు క్రియాశీలకమగుచున్నది, అట్టి క్రియాశీలత్వమే 'మనస్సు'.

మనో-బుద్ధి-చిత్త-అహంకార స్వరూపుడు, సమష్టి మనన స్వరూపుడు అగు ఈ జీవుడు సత్యసంకల్పుడు. అనగా, అతడు తాను ఏది సత్యమని భావించి సంకల్పిస్తాడో, అదే సత్యమై పరిఢవిల్లుతుంది. అందుచేత, జీవుడే ఈ సమస్తలోకములను కల్పన ఒనర్చుచున్నాడు. అతడు తన "సమష్టి మనస్సు" నందు ఈ జనన-మరణములతో కూడిన సంసారమును కల్పించుకొనుచున్నాడు. ఇదంతా సుఖదుఃఖరూపమై, సంస్మరణశీలమై ప్రాప్తిస్తున్నది అతని యొక్క కల్పనా ప్రభావంచేతనే.

సత్ (Existence Absolute) = విష్ణుత్వము (The State of "I exist")

చిత్ (Knowledge Absolute) = బ్రహ్మత్వము (The State of 'I experience')

అతడు "సహస్రకల్పముల పరిమితి" కలిగిన దినములతో గూడిన తన ఆయువునందు

ఆయాప్రదేశములకు అనుకూలమైనట్టి దేవ – అసుర – మనుష్యాది వివిధ జీవులను సృష్టించు చున్నాడు. అట్లు చాలాకాలం ఉండి, ఆ తరువాత తనయొక్క మూలకారణమగు విష్ణుభగవానునియందు లీనమగుచున్నాడు. మంచు బిందువు సూర్యతేజమునందు లీనమగుచున్నట్లు ఇది జరుగుచున్నది. మరల సృష్టికాలమున విష్ణుభగవానుని నాభికమలము నుండి అభివ్యక్తము అగుచున్నాడు. అప్పుడు మరల 'పూర్వకాలపు – సృష్టి సంకల్పము' ఉదయించగా, ఆ సమష్టి – మనస్సుచే సృష్టి ఒనర్చుటకు ఇచ్ఛగించుచున్నాడు. అనగా సత్ నందు చిత్ ప్రకటితమగుచున్నది.

అప్పుడు మరల చతుర్ముఖ రూపము ధరించి ఈ జగద్రచన కొనసాగించుచున్నాడు. కల్పాంత మున మరల లయం అగుచున్నాడు. అనేకసార్లు ఇట్లు సృష్టి కల్పన ఒనర్చుచు, ఒకానొకప్పుడు తన అధికార సమాప్తికాగానే, ద్విపదార్థాంతమున (రెండవ పదార్థము అనుభావనయే త్యజించబడినప్పుడు) పూర్ణముగా శాంతిని పొందుచున్నాడు.




(ఈ చతుర్ముఖమే జాగ్రత్–స్వప్న–సుషుప్తి–తురీయములుగా కూడా చెప్పబడింది.)

ఈ విధంగా ఈ బ్రహ్మాండమునందు, తదితర బ్రహ్మాండములందు అనేక జగత్తులు ఉత్పన్నములై ఉన్నాయి. ఇప్పుడూ ఉత్పన్నం అవుచున్నాయి. ఇంకనూ ముందుముందు అంతర్గతమైయున్న ఒక్కొక్క పరమాణువు నందు ఇంకా ఎన్నో అసంఖ్యాకములగు జగత్తులు ఉన్నాయి. ఇట్టి విశేషణములు గల పరమాత్మయందు నెలకొనియున్న సమష్టి మనస్సునందు ఈ వ్యష్టి జీవుడు స్థితి కలిగియున్నాడు.

ఈ వ్యష్టి జీవుడు ఏ విధంగా స్థితి కలిగి ఉంటున్నాడు? ఎట్లు ముక్తుడౌతున్నాడు?... ఈ విషయమై వేదప్రవచనమేమిటో చెప్పుచున్నాను. విను.

ప్రళయకాలంలో, ఉపాధులన్నీ నశిస్తున్నాయి. జీవులందరు అవ్యాకృత్యము (Unmanifested state) నందు లీనమై, అప్పుడు మౌనము – అనుభవాతీతము సంస్కారమాత్రులై శేషించుచున్నారు. అట్లు శేషించియున్న మనఃశ్శక్తినుండి మరల సృష్టి ప్రారంభమగుచున్నది. అప్పుడు :

– అవ్యాకృత్యము నుండి శబ్దతన్మాత్రకమగు ఆకాశశక్తి ప్రకటితమగుచున్నది.

– ఆకాశశక్తి నుండి శక్యాత్మకమగు వాయుశక్తి ప్రస్ఫుటమౌతోంది.

అందలి వాయుత్వమును అనుసరించి కించిత్ చలనయోగ్యమగు రూపమున 'మనస్సు' ను పొంది 'దృఢసంకల్పత్వము' అనుదానిని కలిగి ఉంటోంది. అట్టి మనస్సు తనకు ఎదురుగా ఉన్న రూప-రస-గంధాత్మకమగు 'తన్మాత్ర' యొక్క అనుభవము (The experience) పొందుచున్నది. ఉత్పత్తి క్రమముచే అదియే 'అపంచీకృత 'భూతము- అని అంటున్నారు. ఎందుకంటే మననమే స్వరూపముగాగల ఈ 'మనస్సు' అనబడేది శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములకు స్పందన కలిగి ఉంటున్నప్పటికీ, అది ఆ పంచతన్మాత్రలకు అతీతమై, వాటికి కారణమై కూడా ఉంటోంది.

ఆ అపంచీకృతమే అంతఃకరణదశ (మనస్సు-బుద్ధి-చిత్తము-అహంకారము...అనగా... మననము - నిర్ణయము - ఇష్టము - భేదము) పొందుచున్నది. అట్లు క్రమంగా వృద్ధి చెందుచూ, ఆ తరువాత, అది 'పంచీకృత స్థూల పంచభూత ప్రకృతి' అయిన ఆకాశ - వాయు - అగ్ని - జల - పృథివి రూపములను కల్పన ఒనర్చుచున్నది.

**వ్యష్టిత్వము** - అట్టి కల్పన కలిగియున్న మనస్సు మంచు - వర్షముల ద్వారా ఔషధులందు ప్రవేశించి అన్న రూపమును పొందుచున్నది. అప్పుడా అన్నము పురుషులచే భక్షించబడినదై, వీర్యరూపమున స్త్రీ గర్భంలో ప్రవేశించి క్రమంగా 'పిండత్వము' ను పొందుచున్నది. అట్లు గర్భము నుండి జనించిన ఆ శిశువు పెరుగుచు, అనుభవములనుండి అవగాహన, అవగాహనలనుండి అనుభవము పెంపొందించుకొనుచున్నాడు. అతని 'అవగాహన'ను ఆశ్రయించియున్న ఆశ - అర్తి - భ్రమ లను అనుసరించి ఒకదానివెనుక మరొకటి అనేక ఉపాధులు వచ్చిపోతున్నాయి. ఎప్పటి కప్పుడు, ఆ జీవుడు 'ఇదిమాత్రమే నేను, ఇంతమాత్రమే అంతా'... అను పరిమితభావనచే, తన స్వరూపమును తానే, నిబంధించుకొనుచున్నాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జీవునకు అనేక సుఖ - దుఃఖములు, జన్మ - మృత్యువులు వస్తున్నాయి, పోతున్నాయి. ఇతనికి 'దుఃఖనివృత్తి' గానవచ్చుట లేదు. దీనికి అంతెక్కడ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నివృత్తి ఎందుకు లేదు? తప్పక ఉన్నది. అట్లు జన్మలు పొందుచున్న ఈ జీవుడు, అతని అధిక సుకృతముల (Good deeds) బలంచేత ఒకానొకప్పుడు కర్మ-జ్ఞానములకు తగినవాడగుచున్నాడు. ఉత్తమ కర్మ-జ్ఞానములను ఆశ్రయించుటకు తగియున్న ఉపాధులలో ఈ మానవజన్మ ఎంతో కష్టించి పొందినందుకుగాను, బాల్యమునుండే వివేకాన్ని పెంపొందించుకోవాలి. "సత్యము-అసత్యము, నిత్యము-అనిత్యము, దేహము-దేహి" మొదలైన ద్వంద్వములను విభాగంచేసి పరిశీలించాలి. తత్త్వవేత్తలగు గురువులను ఆశ్రయించాలి. అట్లు ఆశ్రయిస్తూ ఉండగా ఆ జీవుని యందు కూడా నీలాగానే క్రమంగా "సాధనచతుష్టయసంపత్తి" అను చమత్కృతి ఉదయిస్తుంది. అట్టి సాధనములచే క్రమంగా పరిశుద్ధచిత్తుడగుచు, అతడు "ఈ సంసారము అనర్థభూతమైనదే కదా! దీనిని జయించాలి, త్యజించాలి" ... అని గ్రహించి మోక్షమునకు అర్హుడై ఉంటున్నాడు. ఆపై విచారణ- వైరాగ్యాదులచే "నాకు జన్మ - మృత్యువులు గాని, దృశ్యాదులుగాని లేవు. పరమోత్కృష్టమైన ప్రజ్ఞాతత్వమునే నేను" అను జన్మరాహిత్యరూపమగు అవగాహనకు చేరుచున్నాడు. "పరిశుద్ధమూ,

సర్వమునకు అంతర్యామీ, కారణ – కారణమూ, సర్వమూ అయిన ఆత్మనే నేను" అనే జ్ఞానం దృఢపడిన తరువాత అతడు బ్రహ్మానందమయుడు అగుచున్నాడు. ఇక అప్పుడు "నేను ఒక కీటకమును అగుదునుగాక! మానవునిగా అగుదునుగాక! దేవతను అగుదునుగాక!" అని భావించుట జరుగదు.

ఈ జీవునియందు ఎట్టి భావన సుస్థిరమై ఉంటుందో, అట్టి భావన యొక్క ఆసక్తి లేక ఆపేక్షలకు అనుగుణంగా ఈ జీవుడు సర్వదా అట్లే అగుచున్నాడు.

కనుక రామా! బ్రహ్మరూపానుభవం పొందాలంటే సర్వభేదములు త్యజించాలి. "సర్వమునకు అధిష్ఠానమై, ఏమియు కాకయే ఉన్నట్టి బ్రహ్మమే నా వాస్తవ స్వరూపం; అదే సర్వదా నా స్వభావం కూడా" అని మననం చేయాలి. అట్లు ఎందుకు మననం చేయరాదో చెప్పు? అట్టి మనన ప్రభావంచే ఇతడు బ్రహ్మముగానే శేషించుచు, ఈ సర్వమును బ్రహ్మముగానే దర్శించుచున్నాడు.

సత్వగుణమును ఆశ్రయిస్తున్న వివేకి ఉత్తమ జన్మలందు స్థితి పొందుచు, క్రమంగా 'మోక్షము' అను శ్రేయమును పొందుచున్నాడు. జ్ఞానముచే చిత్తము ప్రకాశించినప్పుడే సత్వగుణ సమన్వితమైన సంస్కారం రూపుదిద్దుకొంటుంది.

ఓ రాఘవా! నీయందు అత్యుత్తమ జ్ఞానం వికసించాలనే ఉద్దేశంతో ఇప్పుడు నీకు ఈ క్రింది విషయాలు వివరిస్తాను.

1) సప్త అజ్ఞాన – భూమికలు

2) సప్త జ్ఞాన – భూమికలు

❖❖❖

# 18. సప్త "అజ్ఞాన" భూమికలు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! అజ్ఞాన భూమికలు ఏడు, జ్ఞాన భూమికలు ఏడు ఉన్నాయి. ఇంకా వీటిలో అవాంతర భేదములు (Sub - divisions) ఎన్నో ఉన్నాయి.

**శ్రీరాముడు :** మహర్షీ! అసలు ఈ అజ్ఞాన భూమికాస్థితికి కారణం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**I.** అసాధారణ హేతువులు (From Unity towards Diversity) – అజ్ఞాన భూమికలు* :

1) స్వాభావికమైన ప్రవృత్తి (tendency) రూపమగు పురుష ప్రయత్నము.

2) విషయభోగములపట్ల ఏర్పడుచున్న దృఢమైన ఆసక్తి

ఇవి బ్రహ్మసత్తకు అధీనమైయున్న "ఆత్మత్త్వం" అను అఖండానుభవం నుండి దూరం చేస్తున్నాయి.

ప్రయోజనం : సంసారము, దుఃఖము

---

* భూమిక = వేషము. నటుడు వేరు, వేషము వేరు అయినట్లే... ఆత్మ వేరు, భూమికలు వేరు. (స్వప్న ద్రష్ట వేరు – స్వప్నాంతర్గత విశేషాలు వేరు ..... అయినట్లుగా),

**II.** సాధారణ హేతువులు (From Diversity towards Unity)

–శాస్త్రోచితమైన సాధనములు.

ఇవి ఆత్మ లాభ ప్రాప్తి కలుగజేస్తున్నాయి. అందుచేత 'జ్ఞానభూమికలు' అని పిలువబడుచున్నాయి.

ప్రయోజనం : దుఃఖ విముక్తి రూపమగు నిరతిశయానంద ప్రాప్తి.

**అధోలోకములు –** (అసాధారణ మార్గం–అజ్ఞానభూమికలు) : అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము.

**ఊర్ధ్వలోకములు –** (సాధారణ మార్గం–జ్ఞానభూమికలు) : భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము.

**ఊర్ధ్వలోకములు ఏడు** – ఒకదానికంటే మరొకటి అధికమైన జ్ఞానముతో నిండి ఉంటున్నాయి. అధోలోకములలో – ఒకదానికంటే మరొకటి అధికమైన అజ్ఞానావరణంచేత దుఃఖప్రదములుగా ఉంటున్నాయి. 'ఈ పదునాలుగు జ్ఞాన – అజ్ఞాన భూమికలు కూడా' జీవునియొక్క జ్ఞానమును, ప్రయత్నములను అనుసరించియే ఉంటున్నాయి.

ఇక, శుద్ధమగు ఆత్మస్వరూపమునందు స్థితి కలిగియుండుటయే "ముక్తి" అను శబ్దముచే చెప్పబడుతోంది. "అట్టి స్వస్వరూప స్థితి నుండి తొలగుట... తొలగి బాహ్య ప్రవృత్తి కలిగి యుండుట... బాహ్యప్రవృత్తి వలన రక్తమాంసనిర్మితమైన ఈ దేహాదులందు అహంభావము కలిగియుండుట."

ఇదియే అజ్ఞానము. అజ్ఞానమే అన్ని దుఃఖములకు "హేతువు" అగుచున్నది.

**సంక్షిప్తంగా చెప్పాలంటే :**

జ్ఞానము = "నా యొక్క స్వరూపం ఆత్మయే" అను ఎరుక వైపుగా ప్రయాణించే స్థితి గతులు.

అజ్ఞానము = "నేను ఈ భౌతిక శరీరమును" అను ఆత్మయొక్క స్వయంచమత్కారం అనే ఏమరుపు వైపుగా ప్రయాణించే స్థితి గతులు.

ఈ జీవుడు ఏమాత్రం రాగ – ద్వేషములు పొందక, సద్వస్తువగు శుద్ధ – జ్ఞాన స్వరూపము నుండి చలింపకయే ఉన్నాడనుకో.... ఇక అతడు అజ్ఞాని అవటం ఎన్నటికీ సంభవించదు.

స్వస్వరూపమునుండి మరలి విషయములందు మగ్నము అగుటయే 'అజ్ఞానము'. దీనికి మించిన అజ్ఞానమంటూ వేరే ఎక్కడా లేనే లేదు, ఉండబోదు.

**స్వస్వరూపస్థితి :** ఒక ముఖ్యమైన విషయం చెప్పుచున్నాను. శ్రద్ధగా విను.

ఈ చిత్తము ఒక పదార్థమును ఆశ్రయిస్తూ, మరల ఇంతలోనే మరొక "పదార్థము" లేక "విషయము" వైపు ప్రసరిస్తూ అంతకుముందు విషయాన్ని (లేక పదార్థం) త్యజిస్తూ ఉంటుంది కదా! ఇట్లా అది నిరంతరం ఒక విషయమును వదలి మరొక విషయమువైపు వెళ్ళుచునే ఉంటోంది. అయితే, అట్లు త్యజించబడుచున్న – స్వీకరించబడుచున్న విషయముల మధ్య మననరహితమగు స్థితి ఉన్నది.




పూర్వ విషయము విడిచిన తరువాత, మరియొక విషయము చింతించబడకముందు, ఆ రెండింటి మధ్య సర్వదా ఏర్పడియున్న శుద్ధ చైతన్యము యొక్క స్థితే "స్వస్వరూపస్థితి" అని చెప్ప బడుతోంది. అది అకళంకస్థితి, సర్వ సంకల్పరహితమైన స్థితి, సర్వము కానిది, నిద్ర – జడత్వ రహితమైనది కూడా. అది శిలవలె అచంచలము అయిన చైతన్యస్థితి.

ఈ దేహాదులందు 'అహం' భావము నశించినప్పుడు భేదజ్ఞానమంతా సమసిపోతుంది. అప్పుడు చైతన్యరూపమున ప్రకాశించుచున్నదే ఆత్మయొక్క స్వరూపము. అట్టి భేదవ్యవహార రహితమగు శుద్ధ చైతన్యమే నేను, నీవు, మనందరిలోని ప్రతి ఒక్కరూ కూడా! అయితే, ఈ జీవుడు విషయ రహిత స్థితిని త్యజించి వేరు వేరు జ్ఞాన–అజ్ఞాన భూమికలందు ప్రవేశించటం జరుగుతోంది.

**అజ్ఞాన భూమికలు –**

సాక్షి చైతన్యమునందు అనాది కాలము నుండి అధ్యస్తమై యున్న అజ్ఞాన భూమికలు ఏడుగా చెప్పబడుచున్నాయి. ఇవన్నీ పరస్పరం మిళితమై అనేక విధములుగా ఉన్నాయి.

**1) బీజ జాగ్రత్తు –** ఇది జాగ్రత్ అవస్థకు ప్రారంభబీజం. సృష్ట్యాదియందు – అనగా జాగ్రత్తుకు ప్రప్రథమారంభంగా ... 'ప్రాణధారణ' అను క్రియారూపమున చిత్తుయే ఆభాసరూపంగా– ఏర్పడుతోంది. అదియే చిత్తము యొక్క ఆవిర్భావం. నీటిలో ప్రప్రథమ కెరటంలాగా ఏర్పడుచున్న చిత్తముయొక్క ప్రప్రథమ చైతన్య స్ఫురణను 'బీజజాగ్రత్తు' అని అంటున్నారు. చిత్త ప్రప్రథమస్ఫురణయే 'జీవుడు', 'బుద్ధి' మొదలైన సంజ్ఞలచే చెప్పబడుతోంది. ఇద్దానిని "సుషుప్తి అంతరించినప్పటి, జాగ్రత్ అవస్థయొక్క ప్రప్రథమస్ఫురణారంభం"... తో పోల్చుకొని అర్థం చేసుకోవచ్చు.

**2) జాగ్రత్ స్థితి –** ఇది బీజజాగ్రత్ కంటే కొంత సుస్పష్టమైనది, విలక్షణమైనది. ఈ దశలో, "ఈ స్థూలదేహమునకు సంబంధించినవాడనే నేను! ఈ భోగ్యపదార్థములు నావి' అను రూపముగల ఒకానొక ప్రతీతి ఏర్పడుచున్నది. ఈ స్థితియందు, "ఇతఃపూర్వం గురించిన భావన" మరుగునపడుతూ ఉంటుంది. "ఈ దేహమే నేను, దేహసంబంధమున గృహ ధనాదులు నావి" అను రూపముగల అనేక జన్మపరంపరల దృఢసంస్కారంచేత జాగ్రత్‌దశలో క్రమక్రమంగా అనేక సంస్కార సమూహాలు ప్రవృద్ధమౌతున్నాయి.

**3) మహాజాగ్రత్ –** 'జాగ్రత్‌స్థితి' అనగా దృశ్యవస్తుజాలమునకు – ద్రష్టకుగల సంబంధమే! ఇక మహాజాగ్రత్ ద్రష్టకు – సంస్కారములకు సంబంధించినది. అనేక జన్మసంస్కారములచే – మహాభ్రమరూపంగా 'మహాజాగ్రత్' అనుభవమౌతోంది.

**4) జాగ్రత్‌స్వప్నము –** అదృఢమైన అభ్యాసం చేత ఈ జాగ్రత్‌ద్రష్ట తన జాగ్రత్‌లో మనోరాజ్యము (Realm of thought) వీక్షిస్తూ ఉంటాడు. అట్టి మనఃకల్పితమైన దానిని వాస్తవ బుద్ధితో చూడటం, అనుభవించటం 'జాగ్రత్ స్వప్నం' అని అంటున్నారు. లవణమహారాజు ఒక గంటసేపటిలో అరువది సంవత్సరముల జాగ్రత్ స్వప్నం (జాగ్రత్‌లో జాగ్రత్ స్వప్నం) అనుభవించటం మనం చూచాముకదా!

కంటి దోషం చేత రెండవ చంద్రుని చూడటం.... ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు చూడటం.... మృగతృష్ణలో స్వచ్ఛమైన నీరు, కెరటములు చూడటం..... ఇవన్నీ జాగ్రత్ – స్వప్నములోని రకరకాల స్థితులతో పోల్చదగినవిగా చెపుతూ ఉంటారు. స్వప్నంలో అనేక విధములుగా ఉన్న అభ్యాసం చేత క్రమంగా జాగ్రత్‌దశ పొందుతుంది. కనుక దీనిని "జాగ్రత్–స్వప్నం" అని అంటున్నాం.

**5) స్వప్నము –** స్వప్నంలో ఇతఃపూర్వం అనుభవించిన, చూచిన లేక ఊహించిన పదార్థాలు ప్రాప్తిస్తూ ఉంటాయి. దీనియొక్క బీజము స్వయంకల్పనయే. ఇక్కడ మనస్సు తనకు ప్రీతి అయిన ఊహయందు నివసించుటకు ఉద్యుక్తమౌతూ ఉంటుంది. స్వప్నం జాగ్రత్ స్థితి దృష్ట్యా "స్వల్పకాలం"గా అనిపిస్తూనే, అప్పటికి అత్యంత సత్యమైన దానివలె పొందబడినట్లు ఈ జీవుడు భావిస్తూ ఉంటాడు. ఈ స్వప్నము యొక్క అనుభవము 'మహాజాగ్రత్ స్థితి' యందున్న ఈ జీవుని యొక్క స్థూలశరీరంలోని కంఠభాగము – హృదయభాగముల మధ్య వ్యాపించియున్న నాడీప్రదేశంలో ఏర్పడుచున్నది.

**6) స్వప్న జాగ్రత్తు –** ఇది 'చిరకాలపు జాగ్రత్ భావం' చేత ఏర్పడుతుంది. దృఢమైన 'అభిమానము' చేతగాని, చిరకాలము ఒకేరీతిగా భావావేశము, కల్పన కలిగియుండుట చేతగాని జాగ్రత్ రూపంగా వృద్ధిపొందుతుంటుంది. జీవునిపట్ల ఇది మహచ్ఛరీరయుతమై ఉంటోంది. 'మహాజాగ్రత్' పొందిన స్వప్నమే 'స్వప్నజాగ్రత్తు'గా ప్రాప్తిస్తోంది.

హరిశ్చంద్రుడు ఒక్క రాత్రిలో పండ్రెండు సంవత్సరముల అనుభవం పొందటం ఈ స్వప్నజాగ్రత్ స్థితికి సంబంధించినదే.

స్వప్న జాగ్రత్ స్థితి ఈ దేహము ఉన్నప్పుడు, నశించినప్పుడు కూడా సంభవిస్తూ ఉండగలదు.

**7) సుషుప్తి –** స్వప్నజాగ్రత్తు పొందిన ఈ జీవునియొక్క స్థితి కొంత కాలానికి పూర్ణజడస్థితి పొందటం జరుగుతోంది. అప్పటిస్థితిలో ఈ జీవుడు తనకు సంభవిస్తున్న దుఃఖాదులకు ఉపశమన క్రియలను ఏమాత్రం ఆశ్రయించలేడు. (He becomes absolutely and deeply un-responsive). వాసనలు దట్టమై, తద్వారా ప్రాప్తిస్తున్న జడస్థితినే 'సుషుప్తి' అని అంటున్నాం.

ఓ రామచంద్రా! ఈ ఏడు భూమికలు అనేక రూపములు వహించి ఉంటున్నాయి. ప్రతి భూమిక అనంతశాఖలుగా విస్తరించి ఉంటున్నది.

చిరకాలము రూఢిపడియుండిన 'జాగ్రత్-స్వప్నము' చివరకు జాగ్రత్‌నందే 'పరిసమాప్తి' పొందుతోంది. ఆహాఁ! నానా ప్రకారములైన పదార్థములతో కూడిన ఈ జాగ్రత్ స్వప్నము విశాలరూపమును ధరించి ఉంటోంది. జాగ్రత్‌నందు స్వప్నమునందు కూడా 'మహాజాగ్రత్తు' యొక్క అసంఖ్యాకములైన అనుభవములు స్థితి పొంది ఉంటున్నాయి.

ఈ 'సంసారము' అనబడునది కూడా దీర్ఘకాలపర్యంతము స్వప్న – జాగ్రత్ రూపముననే ఉంటోంది. ఈ జీవులు ఒకరికి మరొకరు వారి యొక్క స్వప్నజాగ్రత్‌నందు స్వప్న జాగ్రత్ రూపముననే ఉంటున్నారు.

అనేక విధములైన అవాంతర భేదములచే "నింద్యములు (despicable)"... అయి ఉంటున్న ఈ సప్త అజ్ఞాన భూమికల గురించి విన్నావు కదా! అయితే జీవుడు ఈ అజ్ఞాన భూమికలన్నీ తప్పకుండా దాటివేయగలడు. ఉత్తమ విచారణ చేత, జ్ఞానముచేత నిర్మలమగు ఆత్మ స్వరూపమును సాక్షాత్కరించుకోవటమే అందుకు ఉపాయం. ఆత్మజ్ఞానరూపమగు స్వస్వరూపస్థితిని ఆశ్రయించినవారు ఈ ఆజ్ఞాన భూమికలను సులభంగా దాటివేస్తున్నారు. నెట్టివేసినవారై ఉంటున్నారు.

❖❖❖

# 19. సప్త "జ్ఞాన" భూమికలు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! ఇప్పుడు నీకు సప్తజ్ఞానభూమికల గురించి చెపుతాను విను. ఇది వింటే ఇక నీవు 'అజ్ఞానం' అనే బురదలో పడవు. ఆయా ప్రబోధకులు, ప్రవక్తలు ఈ జ్ఞాన భూమికలనే అనేక రకములుగా తమ ప్రవచనములలో నిక్షిప్తం చేస్తూ చెప్పుచున్నారు. అయితే 'ఇది సునిశ్చయమే' అని అనిపించినట్టి వేదాంత సిద్ధాంతమును అనుసరించి వివరిస్తున్నాను.

ఈ జ్ఞాన భూమికలలో ప్రవేశించుటయే జీవుడు అజ్ఞానమునుండి నివర్తించగలడు. సహజము, అఖండము అయిన స్వాత్మాకారవృత్తియందు ఆరూఢమై ధరించగలడు. అందుకే ఈ భూమికలకు ఈ పేరు వచ్చింది.

ఈ సప్త భూమికలే జ్ఞానము. వాటికి పరమైన ముక్తియే జ్ఞేయము.

సత్స్వరూపమగు పరమాత్మ గురించిన జ్ఞానము – మోక్షము.... ఈ రెండు పర్యాయపదములే కాని, వేరువేరు కాదు. ఎవడైతే అట్టి సత్యవస్తుజ్ఞానమును పొందుతాడో, అట్టివాడు ఈ సంసారమున మరల జన్మించడు. ఈ చెప్పబోవు సప్త భూమికల చివర 'ముక్తి' అనబడేది అవస్థితమై ఉన్నది. దానిని పొందినవాడు ఇక ఎప్పటికీ సాంసారిక దుఃఖాలను పొందడు. ఈ జ్ఞాన భూమికల గురించి విను.

**1) శుభేచ్ఛ :** 'స్వకీయ వాసనలు' కారణంగా అనేక అజ్ఞాన అనుభవములను పొందుచున్న ఈ జీవుడు ఒకానొకప్పుడు కాకతాళీయ న్యాయంచే వైరాగ్యపూర్వకమైన సత్సంకల్పము (Detachment from falsehood and inquiry into the nature of Truth) పొందుచున్నాడు. అంతే కాక, "ఒక మూఢునిలాగా ఉండిపోతున్నానేమిటి? ఇంతకీ శాస్త్రములు ఏమి ప్రకటిస్తున్నాయి?– వాటిని

పరికిస్తాను. సజ్జనులగు మహాత్ములను సమీపిస్తాను. వారి అభిప్రాయాలు సేకరిస్తారు. అప్పుడు ఉత్తమమైనదేదో చక్కగా నిర్ణయించుకొని, అట్టిదానినే మననం చేస్తాను"... అనే నిర్ణయానికి వస్తున్నాడు. అట్టి భావమునకు (లేక నిర్ణయమునకు) రావటమే 'శుభేచ్ఛ' అని అంటున్నాం.

**2) విచారణ :** ఈ జీవుని "శుభేచ్ఛ" యొక్క ప్రయోజనంగా శాస్త్రములతోటి, సజ్జనులతోటి సంపర్కము ఏర్పడుతోంది. ఒక నూతన ప్రవృత్తి అతనియందు ఏర్పడుతోంది. అప్పుడాతడు "వినుట – మననముచేయుట"... మొదలైన రూపములలో ఉండే ఆయా సదాచారములందు నిమగ్నమగుచున్నాడు. తాను వినుచున్న గురువాక్యములను, శాస్త్రవిషయములను మననపూర్వకంగా పరిశీలిస్తూ "విచారణభూమిక" (Sphere of Enquiry) లో పరిఢవిల్లుచున్నాడు. క్రమంగా తన వాస్తవ స్వరూపమేమిటో, తదితరుల వాస్తవ స్వరూపమేమిటో పరిశీలించటం ప్రారంభిస్తున్నాడు.

**3) తనుమానస :** శుభేచ్ఛ – విచారణ ప్రభావంచేత ఈ జీవునకు క్రమంగా ఈ శబ్ద – స్పర్శ – రూప – రస – గంధములందు 'అనాసక్తి – తనుమానస (Non-attachment)' ప్రారంభం అవుతోంది. క్రమంగా ఇది చెదరనిది, భంగపడనిది అగుచున్నది. ఈ అనాసక్తి నిధిధ్యాసలు బల పడేందుకు సహకరిస్తున్నందుచేత దీనిని 'తనుమానస' అని పిలుస్తున్నారు. "దృశ్యము పట్ల ఏర్పడుచున్న అనాసక్తి – ఆత్మజ్ఞాన – అనుభవముల విషయములై ఏర్పడుచున్న ఆసక్తి" ఈ రెండూ నాణెము యొక్క రెండు వైపులు వలె, తనుమానస యొక్క స్వరూపములు.

**4) సత్త్వాపత్తి :** ఇట్లు "శుభేచ్ఛ – విచారణ – తనుమానస"లను అభ్యసింస్తూ రాగా, అట్టివాని చిత్తము బాహ్యవిషయములనుండి వెనుకకు మరలుచున్నది. కొంత విరామము లేక విశ్రాంతి స్థానము పొందుట జరుగుతోంది. అట్టి విరతియొక్క స్థైర్యము పొందుచున్నప్పుడు ఆ ద్రష్ట లేక జీవుడు ఇంకొక నూతన దృష్టిని పొందుచున్నాడు. ఆ నూతన దృష్టికి ఈ మాయగాని, దీని కార్యరూపమైనట్టి జాగ్రత్–స్వప్న–సుషుప్తి అవస్థలుగాని 'లేనివే' అగుచున్నాయి. అప్పుడాతడు సర్వమునకు అధిష్ఠానమైయున్న ఆత్మయందు స్థితి కలిగి ఉంటున్నాడు. అతడు సత్త్వమగు ఆత్మయందు స్థితి కలిగియుంటాడు కాబట్టి, దీనిని 'సత్త్వాపత్తి' అని పిలుస్తున్నారు. ఇది నిర్వికల్పసమాధి యొక్క బీజం. ఈ భూమికయందు ఉండే వివేకిని బ్రహ్మవిత్తు' అని పిలుస్తారు.

**5) అసంసక్తి :** పై నాలుగు భూమికలు అభ్యసిస్తూ రాగా, అప్పుడాతడు ఈ బాహ్య – అభ్యంతర విషయముల (Outer as well as inner aspects) చేతగాని, వాటియందు అంతర్గతమైయుండే సంస్కారములచేతగాని స్పృశించబడడు. 'అసంగము' అను రూపము గల సమాధి అతనియందు పరిపాకమౌతూ ఉంటుంది. అతడు నిరతిశయానందమగు బ్రహ్మాత్మభావన కలిగి ఉంటాడు. 'ఆత్మసాక్షాత్కారము' యొక్క సామీప్యత అనుభవిస్తూ ఉంటాడు. ఇట్టి జ్ఞానిని "బ్రహ్మవిద్వరుడు" అని అంటారు.

**6) పదార్థాభావని :** ఈ భూమికలో ఉన్నవానిని 'బ్రహ్మవిద్వరీయుడు' అని కూడా అంటారు. ఈ జీవుడు 'శుభేచ్ఛ విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి' అను ఐదు భూమికలు బాగా అభ్యసిస్తూ ఉండగా అతనియందు 'ఉపరతి' (withdraw) అనే ప్రక్రియాబలం ఏర్పడుచున్నది.

అతడు సదా ఆత్మారాముడై ఉంటాడు. ఇక బాహ్య అభ్యంతరములందు దేనిని భావించవలసిన అవసరం అతనికి కనబడదు. బాహ్య అభ్యంతరములన్నీ ఆత్మయొక్క సంప్రదర్శనంగా దర్శిస్తూ ఉంటాడు. కేవలం దేహయాత్ర కొరకు మాత్రం ఇతరుల బలవంతముచే కొంత ప్రబోధితుడై ఆయా విషయములవైపు కొద్దిగా దృష్టిని మరలిస్తూ ఉంటాడు. అతని అంతరంగము మాత్రం పదార్థరహితం, విషయరహితంగానే ఉంటుంది. ఈ భూమికలో పదార్థములు అభావించబడతాయి. కనుక దీనికి 'పదార్థాభావని' అనే పేరు వచ్చింది. పదార్థముల విషయమై అతనికి ఏమాత్రం రాగయుక్తమైన భావన ఉండదు. "పదార్థములన్నీ ఆత్మయొక్క భావనా చమత్కారమే".... అనురూపంగా గమనిస్తూ ఉంటాడు.

**7) తుర్యగ :** ఆరవ భూమిక అయినట్టి 'పదార్థ – అభావన' చే భేదభావన అంతా 'కించిత్' కూడా లేకుండా సమసిపోతుంది. ఇతడు కేవలం 'స్వస్వరూపానుభవము' నందు మాత్రమే స్థితికలిగి ఉంటాడు. ఈ జాగ్రత్ మొదలైన అవస్థల నుండి విముక్తుడై కేవలము, శివము, అద్వైతము అగు తురీయస్థితియందు నిలకడచెంది ఉంటాడు. తానే అంతటా అయిఉంటాడు. అంతటా – అన్నీ తానుగా ఆస్వాదిస్తాడు.

ఇతనిని 'బ్రహ్మవిద్వరిష్టుడు' అని కూడా అంటారు. ఈ తురీయస్థితి జీవన్ముక్తులకు మాత్రమే సిద్ధిస్తుంది. ఈ ఏడవ భూమిక పొందిన మహనీయులే ఆత్మారాములు. అట్టివారు బ్రహ్మరూపమగు స్థితి – నిరతిలను ప్రాప్తించుకొనినట్లే.

ఇక విదేహ ముక్తికి సంబంధించినదగు 'తురీయస్థితి' దీనికి పరమై ఉంటుంది.

**సామాన్య జనుల మనస్సు**  సుఖభావన / సమభావన / దుఃఖభావన

**తుర్యగుల మనస్సు** ———————— సమభావన

జీవన్ముక్తులగు ఈ 'తుర్యగులు' అని చెప్పబడుచున్న మహాత్ములు సుఖ దుఃఖములచే చలింపక సర్వదా సమస్థితియందే ఉండి ఉంటారు. సామాన్యజనుల మానసికస్థితి ఉద్వేగ–ఉదాశీనములతో, ఉత్సాహ–నిరుత్సాహములతో, హర్ష–వేదనలతో అల్పాధికములతో ఉండగా, తుర్యగుల మనస్సు ఒకానొక సమస్థితి అవధరించి ఉంటోంది.

తుర్యగులు, కేవలం దేహ రక్షణ కొరకు మాత్రమే స్వల్పంగా వ్యవహారాసక్తి కలిగియుంటారు. 'తాము శరీరము ధరించియుండుటను కూడా 'నదీజలప్రవాహం' లాగా ప్రకృతి చమత్కారంగా యజ్ఞభావనతో దర్శిస్తూ ఉంటారు. లేదా, వ్యవహారాసక్తిని పూర్తిగా త్యజించి అయినా ఉంటారు.

ఇతరుల ప్రోద్భలంచేత మాత్రమే శరీరరక్షణ ధర్మములు, వర్ణాశ్రమ ధర్మములు నిర్వర్తిస్తూ ఉండవచ్చు. ఏది ఏమైతేనేం? గాఢనిద్రలో ఉన్నవాడిని అందమైన స్త్రీ సౌందర్యం లాలించగలదా? సదా ఆత్మారాములై ఉండే జీవన్ముక్తులకు ఈ ప్రపంచములోని ఆయా విశేషములు సుఖమునుగాని, దుఃఖమునుగాని కలిగించలేవు.

ఇట్టి జ్ఞానదశను పొందినవారు మానవ-పశు-మ్లేచ్ఛాది ఉపాధులు కలిగి ఉండవచ్చు. లేదా దేహరహితులై ఉండవచ్చు. వారు ఎప్పటికీ 'ముక్తులు' గానే ఉంటారు. విషయములు అప్రభావికంగా, అసత్యములుగా తోచుటయే ఈ 'భూమిక' యొక్క గుర్తు. నిజమేమిటో తెలుసుకొన్న తరువాత మృగతృష్ణలోని నీరు, ముత్యపు చిప్పలోని వెండి ఆకర్షించగలవా? జ్ఞానము పొందినవాని విషయంలో కూడా ఈ దృశ్యము అట్టిదే. ఈ సంసారవస్తు సముదాయమంతా మిథ్యారూపంగానే అతనికి గోచరిస్తుంది. విదేహస్థితికి శుకుడు మొదలైనవారు, సదేహముక్తస్థితికి ప్రహ్లాదుడు మొదలైనవారు మనకు ఈ అభిప్రాయంలో దృష్టాంతములు.

రెండవ భూమిక నుండి నాల్గవ భూమిక వరకు జ్ఞానోదయము కలిగి ఉండవచ్చు. అజ్ఞానము శమిస్తూ ఉండవచ్చు. కాని ప్రబల ప్రారబ్ద విశేషము చేత నిరతిశయమగు పూర్ణానందము మాత్రం వారు పొంది ఉండరు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఒక జీవుడు ఈ జన్మ - కర్మల దోషమేమిటో గ్రహించినవాడై శుభేచ్ఛను ఇప్పుడే ఆశ్రయించాడనుకోండి. అతడు తుర్యగస్థితి పొందుట ఎప్పటికి సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మస్థితి లేక ఆత్మానుభవము అనేది హృదయము యొక్క నిర్మలత్వము - దోషరాహిత్యములను అనుసరించే ఉంటుంది. కొందరు మహాత్ములు ఈ భూమికలన్నీ ఒక జన్మలో పొందగలిగి ఉంటున్నారు. మరికొందరు రెండవ భూమికకుగాని, మూడవ భూమికకుగాని రాగలిగి ఉంటారు. ఇంకొందరు ఆరవభూమికలోగాని, మరే ఇతర భూమికలో నాలుగవవంతు, మూడవవంతు, ఒకటవవంతు పొంది అట్లే సంచరిస్తున్నవారు కూడా ఉన్నారు. మహాత్ములగు సనకుడు, సనందుడు వంటివారు మొదటి జన్మలోనే 'తుర్యగ' స్థితిని అవధరించటం జరిగింది. ఈ విధంగా ఆయా భూమికలకు కాలమానంగాని, కాలయాపనగాని ఆపాదించటం కుదరదు.

❖

చూచావా! వివేకులైనవారు ఈ భూమికలయందు సంచరించుచున్నారు. వారంతా విశాలమగు 'ఆత్మస్థితి' ని కలిగి ఉండటం జరుగుతోంది.

ఈ బాహ్య-అభ్యంతర ఇంద్రియములు..... ఈ ఇంద్రియములందు అంతర్గతమై ఉంటున్న విషయములు.... వీటికి ఆధారభూతమైన ఈ శరీరము..... ఈ శరీరమునకు సంబంధించిన ఆదిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపములు.....

వీటన్నిటివలన ఏర్పడుచున్న అల్పత్వమును నివారించటానికి వారు ఆత్మనిష్ఠ యందు నిమగ్నమై ఉంటున్నారు.

ఓ రఘురామా! వాస్తవానికి ఈ భౌతికమైన రాజ్యాలు ఏలే రాజులు ఉత్తమ దృష్టిలో నిజమైన రాజులు కారు. ఎవరైతే ఈ భూమికలను పొంది 'మనస్సు' అనే శత్రువును నిగ్రహిస్తారో, వారే నిజమైన నృపతులు. "ఆత్మజ్ఞానప్రాప్తి' తో పోల్చినప్పుడు ఈ శత్రు పరాజయాలు, సప్తద్వీప సామ్రాజ్యాలు తృణప్రాయమే అవుతాయని గ్రహించు.

ఈ ఏడు భూమికలు పొందిన మహాత్ములు ముక్తస్వరూపులు. వారు మాకుకూడా నిరంతరం వందనీయులు. వారు తమ 'ఇంద్రియములు' అనే శత్రువులనే జయించి వేస్తున్నారు. అనుక్షణికంగా ఆత్మసామ్రాజ్యాధినేతలై వెలుగొందుచున్నారు..... వారికి 'బ్రహ్మపదవి' కూడా స్వల్పమైనదే.

దేవతల ఆనందం గొప్పదైన విషయమే. కాని, అంతకంటే పరమావధి బ్రహ్మదేవుని ఆనందం. అట్టి బ్రహ్మదేవుని పదవికంటే కూడా పరమైయున్న కైవల్యానందమును ముక్తస్వరూపులు ఇప్పుడే ఇక్కడే పొందుచున్నారు.

ఓ జనులారా! అట్టి కైవల్యానందము లక్ష్యముగా కలిగి, ధర్మనిరతులై ఉండటము శ్రేయోదాయకమని గ్రహించెదరుగాక!

❖❖❖

## 20. బంగారంలో ఉంగరం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రఘువంశతిలకమా! రామచంద్రా! ఒక చమత్కారమైన విషయం చెపుతాను, విను. ఒక స్వచ్ఛమైన బంగారపు ఉంగరం ఉన్నది. అది 'అంగుళీయబుద్ధి' కలిగియున్నదై తనయొక్క ఆకారరాహిత్యమును సహజమైన రంగును మరచి "అయ్యో! నేను సర్వము కోల్పోయి, ఈ ఉంగరాకారమునకు పరిమితమైనాను! ఈ ఆకారత్వము తొలగేదెట్లా? నేను 'నిరాకారమగు బంగారం' గా ప్రభవించేది ఎన్నటికి?" అని నిష్కారణంగా రోదిస్తుంటే ఎట్లా ఉంటుంది? ఈ జీవుడు కూడా అజ్ఞానజనితమైన అహంకారముచే తన 'యథార్థము, సహజము' అయిన ఆత్మస్వరూపమును మరచి నిష్కారణంగా రోదించుచున్నాడు. తన స్వస్థత కొరకు ఈ దృశ్య వ్యవహారములో ప్రవేశించి అనేక జన్మలుగా ఎక్కడెక్కడో వెతకుచున్నాను.

**శ్రీరాముడు :** మహాత్మా! బంగారము నందు 'నేను ఉంగరమును' అనే బుద్ధిలాగా, ఆత్మ యందు ఈ అహంభావబుద్ధి ఎందుకు, ఎప్పుడు, ఎట్లా కలిగింది? ఈ విషయం యథారీతిగా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏదైనా పదార్థం ఉండి ఉంటే, "ఓహో! ఇది ఇప్పుడు ఇట్లా ఇక్కడి నుండి వచ్చింది అను సమాచారమునకు చోటు ఉంటుందేమో! అసత్తైన పదార్థమునకు ఒకప్పుడు రాక ఏమిటి? మరొకప్పుడు పోకడ ఏమిటి? బంగారము నందు అంగుళీయత్వము గాని, ఆత్మ యందు అహంకారము గాని ఏ కాలమందు కూడా లేవు.

నీ మిత్రుడెవడైనా నీతో "రామా! పది గురివింద గింజల బరువుగల బంగారపు ఉంగరం పట్టుకురా!" అని అన్నాడనుకో....అప్పుడు నీవు అతని కొరకు విక్రయదారుని వద్ద డబ్బు ఇచ్చి

పుచ్చుకునేదేది? ఉంగరమైతే అది బంగారము కన్నా వేరు కాదు కదా? అక్కడ "బంగారం సత్యము, ఉంగరం అనేది ఆకారమాత్రం అయి ఉన్నట్లే ఈ జీవుడు పరబ్రహ్మమే కాని మరింకేమీ కాదు."

**శ్రీరాముడు :** అట్లా అయితే స్వామీ? "ఇది బంగారం, ఇది ఉంగరం, ఇది జీవుడు, ఇది పరబ్రహ్మం" అని అనటందేనికి? ఈ 'బంగారము' 'బంగారపుటుంగరము'ల అర్థమేమిటో మరికొంత వివరించి చెప్పండి. దీని అర్థనిర్ణయం వలన నేను బ్రహ్మరూపమును మరింత బాగా, సునిశ్చయంగా ఎరుగగలను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అసత్ పదార్థమునకు రూపం ఏమి ఉంటుంది? లేని దాని ఉత్పత్తిని నిర్వచించటం ఎట్లా? అది "గొడ్రాలి రెండవ కుమారుడు - మూడవ కుమార్తెల మధ్యగల తగాదా ఎందుకు వచ్చింది?" అనునది పరిశీలించటం వంటిదే.

'సువర్ణము' నందు 'అంగుళీయత్వము' అనేది కల్పన మాత్రమే. మిథ్యారూపమగు భ్రాంతి వంటిదే. 'ఉంగరము' అనబడే వేరైన పదార్థం బంగారమునందుగాని, మరెక్కడాగాని లేనేలేదు. బంగారము బంగారముగానే ఉండిఉండగా, ఒక ఆకారమునకు 'అయ్యా! 'ఇది ఉంగరం' అని నిర్ణయించుకున్నాం. తదితర ఆకారములకు 'ఇది గొలుసు. ఇది గాజు. ఇది వడ్డాణం' ... ఈ విధంగా పేర్లు పెట్టుకున్నాం. అన్నిటిలోను ఉన్నది సర్వదా బంగారమే. "బంగారము ఆ ఆకారమును పొందినది ఎప్పుడు?" అన్నప్రశ్నకు "బంగారము మరొక ఆకారమును ఏనాడూ అవధరించలేదు. బంగారము మరింకేదీ కాకుండానే ఆకారాదుల దృష్టిచేత ఆయాపేర్లకు తగుచున్నది" అని మనం అనక తప్పదు.

ఈ జగత్తు యొక్క కల్పన చేస్తున్న 'మాయ' కూడా మిథ్యయే. ఇది అసత్స్వరూపము మాత్రమే. విచారణా దృష్టిచే దీనికి రూపమే ఉండజాలదు. దీని స్వరూపవ్యవహారమంతా అంతవరకే. శుద్ధాత్మ మరింకేదీ ఏనాడూ పొందుటలేదు. ఏమియు కోల్పోవుట లేదు. కాని "ఆరోపితదృష్టి" (Attributive look) కారణంగా ఈ 'జగత్తు' అనబడేది కనబడటం జరుగుతోంది. ఇక్కడ కనిపించే అనేకత్వమంతా 'మృగతృష్ణ' లోని చిన్నతరంగం-పెద్ద తరంగం వంటిది మాత్రమే. ఈ దృశ్యమంతా యథాతథంగా బ్రహ్మమే! బ్రహ్మమునకు వేరుగా అనిపించేదంతా ఇది మెల్లకన్నువానికి కనబడే 'రెండవ చంద్రుడు' వంటిది. అంటే, విచారణ చేసి చూచామా, ఇందు ఏమీ ఉండజాలదని మా ఉద్దేశం.

ముత్యపు చిప్పలోని వెండి ఎప్పుడు వచ్చింది? ఎప్పుడు ఎలా పోతుంది? అసలు ముత్యపుచిప్పలో వెండి ఎక్కడున్నదయ్యా బాబు? అది చూచేవాని భ్రమసహిత దృష్టియే కారణముగా కలిగి ఉన్నది కదా? తత్త్వవిచారము యొక్క అభావకారణంగా 'మాయ' చే కనిపించటం జరుగుచున్న ఈ జగత్తు, ఇందులోని "నేను-నీవు-అతడు-దృశ్యము" మొదలైనదంతా అట్టిదేనని గ్రహించు.

**శ్రీ రాముడు :** తండ్రీ! ఇవన్నీ మాకు ఉన్నట్లే ఉంటున్నాయి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏ విషయమైతే, లేక, పదార్థమైతే - యథార్థానికి లేదో, కాని, ఉన్నట్లు కనిపిస్తోందో... అది లేనట్లు తెలిసేది ఎట్లా?

"తత్త్వ విచారణ చేతనే! 'తత్-త్వమ్' అను శబ్దార్థమును నిరంతరం అభ్యసించుటచేతనే!

విచారణ లేకపోవుట చేతనే "ఇది నేను. ఇది నాది, ఇది జగత్తు' అనునట్టి రూపము (లేక) అనుభవము ఈ జీవునకు స్ఫురిస్తోంది. ఒక దృష్టాంతము చెపుతాను విను.

'ఒక బాలుడున్నాడు. అతడు అతి పిరికివాడు. బలహీనుడు. ఆ పిల్లవాడి తల్లి ఒకనాడు "ఒరేయ్! బైటకు వెళ్ళకు. అక్కడ దయ్యాలున్నాయి" అని చెప్పి వంటఇంటిలోకిపోయింది. ఆ బాలుడు 'నిజమా? ఈ కిటికీలోంచి దయ్యం కనబడుతుందేమో చూద్దాం" అని అనుకున్నాడు. ఒక బల్లపై ఎక్కి బయటకు చూస్తున్నాడు. ఆ కిటికీ దగ్గరలో గల పెద్ద చెట్టు గాలియొక్క ఆకస్మికవేగానికి అటు-ఇటు కదలి పెద్దగా శబ్దం చేసింది. "అయ్యబాబోయ్! దయ్యం!" అని పెద్దగా కేక వేసి నేలమీద పడ్డాడు.

ఈ దృష్టాంతంలో ఏ విధంగా అయితే 'దయ్యము' అనబడేది సిద్ధిస్తోందో అట్లాగే అసత్తే అయినట్టి ఈ జగత్ పదార్థములు స్థిరరూపము, కార్యవంతము కాగలుగుచున్నాయి. ఇసుకలో నూనె ఉంటుందా? సువర్ణంలో సువర్ణమే ఉంటుందిగాని ఆభరణం ఎక్కడ ఏ స్థానంలో ఉంటుంది? చైతన్యములో చైతన్యమే ఉంటుంది? ఇక 'నీవు - నేను' అనబడునవి ఎక్కడివి చెప్పు?

మరి అవి ఎందుకున్నాయంటావా?

ఈ నీవు - నేను అను వాటియొక్క వాస్తవ స్వరూపము విచారించకపోవుటచేతనే.

ఒక ఉత్తమ రహస్యం చెప్పుచున్నాను. ఉద్వేగరహితుడవై విను.

ఈ ప్రపంచంలో సత్యవస్తువు యొక్క, మిథ్యావస్తువులయొక్కగాని 'అర్థక్రియాసామర్థ్యము' నకు ఒక నియమమంటూ ఏదీ లేదు. కాని, అధిష్ఠానమగు 'సత్త' యందు ఏది ఎట్లు ఆరోపించబడుచున్నదో అది అర్థక్రియాపూర్వకంగా అట్లే అగుచున్నది. బాలుడు తన మనస్సులో కల్పించుకొనిన దయ్యమును ఎదురుగా చీకట్లో చూచుటలేదా? మహచ్ఛక్తియుతమైనట్టి "యద్భావం - తద్భవతి" అనునట్టి ఈ 'అవిద్య' యే 'మాయ' లేక 'సంసారము'. అనాత్మ విషయములకు నిజానికి సత్తుగాని, ప్రతిష్ఠగాని లేదు. అట్టి అనాత్మయందు "నేను - నాది" అను భావము ఈ జీవునకు కలుగుతోంది! ఎందుచేత? లేనిది ఉన్నట్లుగా కనిపించుటయే 'మాయ' అనే శబ్దంచే చెప్పబడుతోంది. స్వచ్ఛము, నిర్మలము, శాంతము అగు ఆత్మయందు 'అహంకారము' అనబడేది ఉండజాలదు. ఆత్మకానిదంటూ ఎక్కడా, ఏదీ లేదు. అద్దానియందు 'అసత్తు' అంగీకరించినప్పుడే 'నేను - నీవు' అను భ్రమలు ఏర్పడుచున్నాయి. లేని అహంకారమును తొలగించుకోవాలనే ప్రసక్తి ఎక్కడిది? లేనిదానిని లేనిదానిగా చూడటం అభ్యాసం చేస్తూ ఉంటే సరిపోతుంది కదా!

❖❖❖

# 21. బ్రహ్మమే ఇదంతా

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'సనాతనత్వము - బ్రహ్మత్వము - బ్రహ్మాండము - ప్రజాపతిత్వము" ... ఇవన్నీ యథార్థానికి లేవు. అట్లాగే "వేరే లోకములు, స్వర్గాదులు, అమరత్వము, మనస్సు, సత్త్వము, దేహములు, మహాభూతములు, కారణత్వము, త్రిలోకత్వము, వస్తుగతము, భావ-అభావములు, నేను-నాది-నీవు, సత్-అసత్తులు, భేద కల్పనలు, రాగము, ఆసక్తి' ... ఇవన్నీ పరమార్థదృష్టితో చూస్తే లేనేలేవు. ఈ వ్యవహారమంతా నీ దృష్టిలో ఉత్తమోత్తమమగు 'ఆత్మస్థితి - ఆత్మభావన' పొందటానికి ముందు మాత్రమే గాని, ఆ తరువాత కాదు. వాస్తవానికి ఈ జగత్తంతటి యొక్క పారమార్థికస్వరూపము బ్రహ్మమే అయి ఉన్నది.

అట్టి బ్రహ్మము శాంతము, సర్వమునకు అధిష్ఠానము, అభాసవర్జితము (that in which nothing can reflect), నామరహితము, కారణవర్జితము అయి ఉన్నది. దానికి 'ఆది-మధ్యము -అంతము' అనునవి లేవు. ఉత్పత్తి వినాశనము మొదలైన వికారములు కూడా లేవు. అది వాక్కునకు గాని, మనస్సునకు గాని 'విషయము' అయ్యేది కాదు. ఏదీ అవకుండానే అంతయూ తానే అయి ఉంటున్నది. ఒకతను "తండ్రి-తాత-కొడుకు-మనుమడు-స్నేహితుడు" అనబడునవన్నీ, ... తాను మాత్రం ఏకించిత్ మార్పు పొందకుండానే.... "తానే" అయి ఉంటున్నాడు కదా!

ఈ సత్స్వరూపమగు ఆత్మ ఆకాశము కంటే కూడా అతిసూక్ష్మమైనది. సుఖములన్నిటికంటే కూడా ఉత్తమోత్తమ సుఖప్రదమైనది.

**శ్రీరాముడు :** మహాత్మా! అంతటా సమరూపమై వ్యాపించియున్న బ్రహ్మమును నేనిప్పుడు ఎరుగు చున్నాను. నామ రూపములతో కూడిన ఈ జగత్తుకు 'హేతువు' అజ్ఞానము అనేది నిర్వివాదాంశమే. అయితే, అట్టి ఈ జగత్తు జ్ఞానముచే శమించి కూడా, మరల ఏర్పడియే ఉంటోంది కదా? ఎందుచేత? పరబ్రహ్మము తన యందు ఈ జగత్తులను ఎందుకు పొందుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామా! పరబ్రహ్మము సర్వదా తన రూపముననే ఉండి ఉంటోంది. అది స్వస్థానమునుండి ఏమాత్రం, ఏ సమయమందునూ "చ్యుతి" (deviation) పొందుటయే లేదు. కాబట్టి, "సృష్టి" అని, "జగత్తు" అని నీవు దేనిని అంటున్నావో, అది ఆ బ్రహ్మమునకు వేరుగా ఏ సమయమందునూ లేదు. బ్రహ్మమే ఈ కనబడే సర్వముయొక్క స్వరూపము. మహాసముద్రం యొక్క రూపమేమిటి? జలమే కదా! "మహాసముద్రంలో జలము ఉన్నది" అని కూడా ప్రయోగించ బడుతోంది! ఈ సృష్టి కూడా అట్లాగే పరమాత్మయందు ఉన్నది.

కాని - సముద్రజలం ద్రవశీలం కనుక చంచలం. పరమాత్మయో, చలనరహితం. ఆ రెండిటి భేదం అంతే. పరమాత్మయే సృష్టిరూపంగా సందర్శించబడుచున్నారు. అయితే, ఎక్కడైతే ఏ విధమైన మార్పు-చేర్పులు, లేవో; అక్కడ "సుఖ-దుఃఖములు, ప్రాప్త - అప్రాప్తములు" .... మొ॥ ద్వంద్వములు ఆరోపించబడి, ఆ అనుభూతి అంగీకరించబడుతోంది. ఎంత చమత్కారం!

❖

పరమాత్మ సూర్యునివలె ప్రకాశించువాడు కాదు. ఈ సూర్యాదుల ప్రకాశము భౌతిక స్వభావము మాత్రమే కదా! నిష్క్రియుడు, స్వయంజ్యోతి స్వరూపుడు అగు పరమాత్మకు ఈ భౌతికవికారములను ఎట్లా ఆపాదించగలం?

తటాకంలో "ఇది తూర్పువైపు జలము. ఇది పడమరవైపు జలం", అని అన్నట్లుగా పరబ్రహ్మమున వివిధరూపములు గల ఈ జగత్తు స్ఫురిస్తోంది. అందుచేత సర్వదా, అంతాకూడా పరబ్రహ్మమే. దృఢమైన జ్ఞానం లేనివానికి మాత్రం ఈ జగత్తు పరమాత్మ కంటే భిన్నమైనదానిగాను, విషయ రూపంగాను కనిపిస్తోంది. అందుచేత అతనియందు "ఇది సృష్టి" అనే జ్ఞానం ఉండియే ఉంటోంది. కాని, జ్ఞాన పరిపక్వ స్థితియందు ఇదే సృష్టి "అంతా నిత్య సత్యమైయున్న పరబ్రహ్మమే" అని అనుభూతమౌతోంది.

ఓ మహాప్రజ్ఞానస్వరూపా! ప్రియ రామచంద్రా! అజ్ఞానికి నానావిధములుగా కనబడుచున్న ఈ జగత్తు యథార్థానికి ఏ కాలమందును లేకయే ఉన్నది. ఆకాశంలో ఎక్కడన్నా మరొక ఆకాశం ఉంటుందా? పరమార్థ వస్తువునందు, ఆ పరమార్థమునకు అన్యమైనదేదీ ఉండజాలదు. కనుక ఈ సృష్టి కూడా పరబ్రహ్మము యొక్క 'సంజ్ఞ' యేనని తేలుచున్నది.

"చిత్తమే పరమాత్మను సృష్టిరూపంగా గాంచుచున్నది". ఈ సృష్టిని ఇట్లు గావించుచున్నది చిత్తమే అని సత్యాన్వేషనానంతరం మునిజనులమగు మేము గ్రహించాము. ఈ చిత్తము బ్రహ్మము నందు పూర్ణముగా లయించినప్పుడు ఈ భ్రమపూర్వకమైన సృష్టి దర్శనమంతా తనంతటతానే లయిస్తుంది. అనగా చిత్తము లయిస్తే ఇదంతా పరబ్రహ్మస్వరూపమే అవుతుంది. చిత్తము ఉదయించి నప్పుడు మాత్రమే 'అసత్తు' అగు ఈ నామరూపాత్మక జగత్తు 'సత్త' ను పొందటం జరుగుతోంది.

అనేకసార్లు చెప్పాను. మరల చెప్పుచున్నాను, విను. ఈ సృష్టి అంతా 'అభిమానముతో కూడిన చిత్తము" కాక మరింకేమీ కాదు. చిత్తము ఉపశమించినచోట ఇదంతా 'జడము'గా కాకుండా పరబ్రహ్మముగానే అనుభవం కాగలదు.

ఒక శిల్పి ఎంతో చాతుర్యంతో మట్టితో "యుద్ధదృశ్యము"ను తయారు చేశాడనుకో.... మట్టిబొమ్మలతో కూడిన ఈ దృశ్యమునందు "ఇతడు రాజు, ఇతడు సైనికుడు, ఇతడు శత్రురాజు, ఇవి గుఱ్ఱములు, ఇవి ఆయుధములతో కూడిన బండి".... ఇట్టి దృష్టి ఒక చూచువాడు (A spectator) కలిగియుండవచ్చు. అయితే, అందలి అన్ని ఆకారములలో ఉన్నది మట్టియే కదా! రాజు బొమ్మకు, మంత్రి బొమ్మకు భేదము కల్పిత మాత్రమే కదా! జ్ఞానికి కూడా, ఈ దృశ్యమునందు ధృవీకరించబడియున్న 'నేను – నీవు – అతడు' అనబడునవన్నీ బ్రహ్మ చైతన్యముగానే గోచరిస్తున్నాయి. జ్ఞాని వ్యవహారసరళి కొరకు ఈ భేదములు (వారు – వీరు అనునదంతా) దృష్టిలో పెట్టుకున్నప్పటికీ, అంతర్లీనంగా 'చైతన్య దృష్టినే' కలిగి ఉంటున్నాడు. అతనికి సర్వే – సర్వత్ర శివాత్మకమే గోచరిస్తోంది. అతనియొక్క పరమార్థ దృష్టిలో ఈ జగత్తు, ఉత్పత్తిరహితము, నాశనరహితము, వికారరహితము. ఇదంతా పరమాత్మ యొక్క వ్యాప్తిచే పూర్ణమైనదై, పరమాత్మయందే వెలుగుచున్నది. కనుక సర్వదా

పూర్ణమే అయి శేషిస్తోంది. ఇక్కడెక్కడా అపూర్ణత్వమనేది లేశమైనాలేదు. ఆకాశమునందు ఆకాశము శాంతముగా ఉండి ఉంటున్నట్లు శివరూపమగు పరమాత్మయందు, శివరూపమగు ఈ జగత్తు వెలయుచున్నది.

"బ్రహ్మమునందే దూరత్వము – సమీపత్వములు కూడా ఉన్నాయి" అని తెలియజేయటానికి విజ్ఞులు ఒక దృష్టాంతము చెపుతారు. ఇక్కడికి కొద్దిమైళ్ళ దూరంలో ఒక నగరం ఉన్నదనుకో.... ఆ నగరం నీ ప్రక్కనే ఉన్న ఒక నిలువుటద్దంలో ప్రతిబింబిస్తోంది.

అద్దం నీ సమీపంలోనే ఉన్నది కనుక 'నగరం' నీకు దగ్గరలో ఉన్నట్లే కదా! కాని వాస్తవనగరం ఎక్కడో కొద్ది మైళ్ళ ఆవల ఉన్నది కదా!

ఇట్లా బ్రహ్మమునందే ఈ దృశ్యముంటూ, 'బ్రహ్మము – దృశ్యము" లకు ఎట్టి సంబంధము లేకుండానే ఉంటోంది. వాస్తవానికి బ్రహ్మమునందు దృశ్యాదులు ఉండజాలవు. అద్దంలో ఎక్కడన్నా భవనాదులు ఉంటాయా? "మరి కనిపిస్తున్నాయి కదా?"...... అని తర్కించేవారికి ఏం చెప్పగలం?

"అసత్తు మాత్రమే" అయినట్టి ఈ జగత్తు అనబడునది అజ్ఞానదృష్టికి మాత్రమే స్థితికలిగి ఉంటోంది. జ్ఞానుల దృష్టికో, ఇదంతా సత్స్వరూపమగు బ్రహ్మమే. "కొయ్యబొమ్మలన్నీ కొయ్యయే. మట్టి బొమ్మల వాస్తవస్వరూపం స్వరూపరహితమగు మట్టియే" అను విధంగా సత్స్వరూపమగు బ్రహ్మమే ఒకానొక భేదదృష్టికి ఇట్లు ప్రాప్తించుచున్నది. ఇదంతా "బ్రహ్మముకంటే వేరైనదికాదు" అనునది సిద్ధించుచుండుటచేతనే "ఈ జగత్తు సద్రూపమే" అనికూడా చెప్పబడుతోంది. భేదదృష్టితో చూస్తే మాత్రం ఇదంతా అవస్తువే కనుక, "అసన్మయమే". ఓ రామా! "అద్దంలో ప్రతిబింబించే నగరం" లాగా నీ చిత్తమునందు ప్రతిబింబించే 'అనేకత్వముతో కూడిన జగత్ చమత్కారం' వాస్తమెట్లా అవుతుందయ్యా? ఇంద్రజాలికుడు మాయాచూర్ణమును గాలిలోకి విసిరి, మిథ్యారూపమైన వస్తువులను చూపిస్తూ ఉంటాడు చూచావా? ఇది కూడా అట్టిదే.

ఈ జగత్తు 'చేతన వస్తువు' నందలి సారము, అసారము కూడా అయిఉన్నది.

అంటే "అధిష్ఠానరూపముగా (As "that concept" which is instrumental for the perception) ... సత్యము, దానికి వ్యతిరేకంగా చూస్తే మిథ్య" అని కూడా చెప్పబడుతోంది. (All this is one's own perception. The perception is a form of one's ownself.)

ఓ మానవులారా! ఒక్కసారి మీమీ చిత్తములను శోధించుకోండి. వాటియందు వాసనారూపమైన అవిద్య పేరుకొనియున్నది. మీరు చూచీ చూడక ఉన్నారా, ఉత్తరోత్తర స్థితిగతులు దుష్ఫలిత పూర్వకంగానే ఉండబోతున్నాయి. అందుచేత "ఆత్మవిచారము" అనే అగ్నిలో 'వాసనలు' అనే కట్టెలను సమూలంగా మసి చేసివేయండి. అప్పుడు నాచే ప్రకటించబడుచున్న సత్యము మీకే బోధపడుతుంది.

అట్లుగాక, ఉదాసీనత వహించి ఉన్నారా, ఈ అవిద్య శాఖోపశాఖలుగా విస్తరించి, సుఖ దుఃఖ రూపములైన అసంఖ్యాక జగత్తులను మీ ముంగిట ఉంచగలదని హెచ్చరిక చేస్తున్నాను. అట్టి 'సుఖ – దుఃఖ రూపములు' అనబడు 'మాయానృత్యశైలి' కి అంతు అంటూ లేదు. నేను చెప్పిన

జ్ఞానభూమికలను చక్కగా విచారించి, ఆపై మీమీ కర్తవ్యములను సముచితంగా నిర్ణయించుకోండి. అంతేకాని, విలువైన ఆయుష్షును స్వల్పవిషయములకొరకు వెచ్చించి, పారవశ్యము పొందకండి.

❖❖❖

## 22. పునః కథాప్రవేశం ప్రదేశము - పరిశీలన

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ రోజు ఆ సభలో ఒక గంట సమయంలో దేవదూత ప్రభావంచేత లవణ మహారాజు అరువది సంవత్సరముల జీవితమును చవిచూచాడుకదా! ఆ రాత్రి సభ చాలించి రోజూలాగే అంతఃపురం జేరాడు. చాలాసేవు నిద్రపట్టలేదు.

"ఎంత ఆశ్చర్యం! మహద్దుఃఖం అనుభవించటం, ఆ ప్రదేశాలు, ఆ పరిచయాలు నా జ్ఞప్తిలో అత్యంత స్థూలంగా ఏర్పడి ఉన్నాయే? మరలమరల ఆ అరణ్యములోని విశేషాలే గుర్తుకొస్తున్నాయి! ఇంతకీ వింధ్యపర్వత సమీపంలోని ఆ ప్రదేశం, ఆ అరణ్యం, ఆ గృహాదులు అసలు ఉన్నాయా? లేవా?

నేను దర్శించినది స్వప్నసదృశ్యమా? వాస్తవమా?"

చాలాసేపు ఆలోచించిన తరువాత ఆ రాజు పెదవులపై ఒక చిరునవ్వు వెల్లివిరిసింది.

"దీనికి ఇంత బుఱ్ఱ పగులగొట్టుకొనవలసిన పనేమున్నది? ఉదయమే వెళ్ళి ఆ ప్రదేశమంతా పరిశీలించి వస్తే సరి కదా!" అని అనుకొన్నాడు. తాను విని, యోచించి, అలవర్చుకొనియున్న ఆత్మ జ్ఞానవిషయాల ప్రభావంచేత ఆలోచనలన్నీ కట్టిపెట్టి నిశ్చింతగా నిద్రాదేవత ఒడిలోకి జారుకొన్నాడు.

ఆ మరునాడు ఒక జాతిగుఱ్ఱమును అధిరోహించి, అతడు మహారణ్యంవైపు బయలుదేరాడు. కొందరు మంత్రులు కూడా అతనిని అనుసరించారు. తాను 'స్వప్నజాగ్రత్తు' లో మొట్టమొదట ప్రయాణించిన త్రోవలోనే ముందుకు పోసాగాడు. త్రోవ అంతా ప్రకృతి సంబంధమైన చిన్నచిన్న మార్పులు కలిగి ఉన్నప్పటికీ, ఇతఃపూర్వం చూచిన విధంగానే ఉన్నట్లు అనిపించింది. కుతూహలంగా ప్రయాణిస్తున్న అతనికి కొంతసేపటికి పూర్వం సంచరించియున్న అరణ్యం కనిపించింది. ఇతః పూర్వం జ్ఞాపకంలో పదిలంగా ఉన్న ఆయావృక్షములను పరిశీలిస్తూ ప్రదేశములను సరిచూచుకొంటూ, 'పుష్కరఘోష' అనే గ్రామంలో ప్రవేశించాడు.

ఆశ్చర్యం! తాను ఇంతకుముందు నివసించిన ఆ కుగ్రామంలోని జనులు, గృహములు, వృక్షాదులు యథాతథంగా తనలోని జ్ఞాపకములవలెనే ఉన్నాయి. చాలాకాలంగా సుపరిచయమై యున్న స్త్రీపురుషులను, ప్రదేశములను చూస్తూ ముందుకు అడుగులు వేస్తున్నాడు. ఆకస్మికంగా ఏర్పడిన కరువుకాటకాల వలన ఎండిపోయిన మహావృక్షములను చూచి తలపంకించసాగాడు. అప్పటి తన సహచరులగు అనేకమంది కిరాతకులు తమ మిత్రులను, పుత్రులను, తదితర బంధువులను పోగొట్టుకొనుటచే రోదిస్తూ తారసపడ్డారు. వారందరి సహచర్యం రాజుకు గుర్తు ఉన్నా, వారుమాత్రం రాజును గుర్తించలేదు. ఇట్లా చూచుకొంటూ క్రమంగా, తన అత్తగారి ఇంట్లో ప్రవేశించాడు. అక్కడి తమ పూర్వగృహంలో అతని అత్తగారు, ఇతర వృద్ధస్త్రీలతో కూడి బిగ్గరగా ఏడ్చుచు ఆర్తనాదములు చేయటం గమనించాడు.

**అత్తగారు :** హాఁ! నా కూతురా! నీవు నీ పిల్లలను లాలిస్తూ మమ్ములను ఎంతగానో ఆనందింప జేస్తూ ఉండేదానివే? పాపం. ఒకసారి మూడురోజులు అన్నం దొరక్కపోతే ఎంతగా విలవిల్లాడావో! ఎంత కృశించావో? ఈ చేతులతో నా కూతురుకు, నా మనుమళ్ళకు ఇంత అన్నం పెట్టలేకపోయాను. నా జన్మ ఎందుకు? కాల్చనా? మా అల్లుడిని మీరంతా ఎరుగుదురు కదా! మొలలో కత్తి పెట్టుకొని ఈ ఊరిలో ఒక రాజులాగా సంచరిస్తూ ఉంటే, ఎవడైనా బైటకు వచ్చేవాడా? అయ్యయ్యో! మీ రంతా నన్ను వదలి ఎక్కడికెళ్ళారట్టా? ఆరి దేవుడో?

ఓ అల్లుడుగారూ! నీవు నిమిషంలో ఎత్తైన తాడిచెట్లు ఎక్కి, అక్కడే తాళఫలములను జుర్రేవాడివి. ఒకవేళ, అంత ఎత్తైన తాడిచెట్టు నుండి క్రింద పడితేమాత్రం 'అబ్బా' అనేవాడివా? లేదు. మళ్ళా సాహసంగా ఇంకొకచెట్టు ఎక్కేవాడిని. మాకు నువ్వు కొడుకుకన్నా ఎక్కువ ప్రియంగా ఉండేవాడివి కదయ్యా! ఏమట్టోయ్! మా అల్లుడు పులులను కూడా ఒంటిచేత్తో ఎదుర్కోగలడు తెలుసా! అయ్యా అల్లుడూ? ఇప్పుడెక్కడున్నావో? ఏం చేస్తున్నావో? ఆ అరుపులు, ఆ పెడబొబ్బలు, ఆ గంతులు, ఆ జంతువుల చర్మం ఒలవటం, ఆ నెత్తురు జుర్రటం ఇవన్నీ మళ్ళా నేను చూడగలనా? అతడు మద్యం త్రాగేటప్పుడు, నా కూతురు నోట్లోంచి మాంసపు ముక్కలను గుంజుకుని తినేవాడు. అప్పటి మా అల్లుడి ముఖం చూస్తుంటే మన్మథుడు ఎందుకూ పనికిరాడు. ఆరి నాయనో! వేగంగా వీచిన గాలి తామరాకును త్రెంచుకుపోతుంది చూచారా? అట్లా ఆ యముడు వచ్చి, నా కూతురుని, అల్లుడిని ఎత్తుకొని పోయాడా? ఓరి యముడో!

గురివిందగింజల మాల ధరించి, విశాలమైన పాలిండ్లతో ఈ ఊళ్లో నా కూతురు తిరుగుతుంటే, అప్పుడందరు ఎంత సంతోషపడేవారు! ఓ నా కూతురా! కాటుక కళ్ళు, నారవస్త్రములు, నల్లని దంతములు గల నువ్వు నన్నొదిలి ఎక్కడికెళ్ళావే? అల్లుడా! నువ్వు ఎక్కడో గొప్ప పట్టణం వదలి మా దగ్గిరకు వచ్చి, మా కూతురుని మనువు ఆడావని అనుకుంటూ ఉండేవాళ్ళం. మీ ఇద్దరిది ఎంతటి ప్రేమ? ఒకరినొకరు వదిలి ఎప్పుడైనా ఉండేవారా? నా చిట్టితల్లిని పెళ్ళిచేసుకొన్న నా అల్లుడు చెయ్యని గొప్ప పనులు ఉన్నాయా? అట్లా, లేడికళ్ళు గల నా కూతురు, సింహము వంటి బలం గల నా అల్లుడు ఇద్దరూ క్షణంలో నశించిపోయారే?

అంతా అయిపోయింది. నా మొగుడు పోయాడు. కూతురు పోయింది. అల్లుడు పోయాడు. ఈ అనాగరక దేశంలో ఇంకా నేను మాత్రం మిగిలి ఉన్నాను. ఈ ఆపదలన్నీ అనుభవించటానికే మిగిలాను కాబోలు! ఇవన్నీ చూచినా, ఇంకా నాకు చావురాలేదేం? ఇంకా నేను బ్రతికేది ఎట్లా? బ్రహ్మదేవుడా! ఈ విధంగా, అనాథనై, ఇక్కడి వాళ్ళచేత – వీళ్ళచేత అవమానించబడటానికి, ఆకలిచే అలమటించటానికి, ఈ జనులకు ఆహారం కావటానికి, ఈ దుఃఖములు అనుభవించటానికి, నన్నుమాత్రం ఇంకా బ్రతికించి ఉంచావా? బంధువులు పోయి, అనేక మానసిక వ్యధలు – ఆపదలు పొందుచున్నట్టి నాకంటే, జీవంలేని ఒకరాయి నయం. స్వజనం లేరు. దుష్టజనం గల ప్రదేశంలో ఉంటున్న నా దుఃఖాలకు అంతు అంటూ ఉన్నదా? నా మొగుడు, నా అల్లుడు, నా

కూతురు చిల్లిగవ్వ కూడా మిగల్చకుండా పోయారు. ఓ స్వజనులారా! మీకేం? హాయిగా వెళ్ళిపోయారు. నా గతి ఏమిటి?

నూరుఏళ్ళు పైబడిన వయసుగల ఆ అత్తగారి రోదనమంతా రాజు విన్నాడు. వాళ్ళను సమీపించాడు. తన మంత్రులతో వాళ్ళకు ధైర్యం కలిగింపజేశాడు. "ఏం అవ్వా! ఇంతగా ఏడుస్తున్నా వేమిటి? నీవెవరు? నీ కూతురు, అల్లుడు ఏమయ్యారు! ఈయన మా లవణ చక్రవర్తి. వీరు నీకు ఈ లోటులేకుండా చేస్తారులే. అసలు విషయమేమిటో చెప్పు" అని ఒక మంత్రి పలికాడు.

అప్పుడు కళ్ళనీరు కారుస్తూ ఆ వృద్ధస్త్రీ ఇట్లు చెప్పింది.

**వృద్ధస్త్రీ :** బాబుగారూ! మాది ఈ 'పుష్కరఘోష' అనే ఊరే. నా మొగుడు 'పుష్కరయ్య' ఇక్కడే పుట్టాడు. మా ఇద్దరికి చందమామవంటి ఒక కూతురు ఉండేది. ఒకసారి దైవయోగం చేత ఇక్కడి అడవికి ఒక కుఱ్ఱవాడు వచ్చాడు. అతడిని, నా కూతురు మనువు ఆడింది. నా అల్లుడు, కూతురు చాలాకాలం చిలకా-గోరింకలలాగా కాపురం చేస్తూ అనేకమంది సంతానం కూడా కన్నారు. హాయిగానే ఎన్నో రోజులు గడిచాయి. ఇట్లా ఉండగా, కొంత కాలానికి మా కర్మ కాలి, ఇక్కడ ఒక పెద్దక్షామం వచ్చింది. వర్షాలు చాలా కాలంవరకు లేకుండా పోయాయి. తిండి, నీరు లేక ఇక్కడివాళ్ళు ఎంతమంది చచ్చారో చెప్పలేము. ఇక బాధలు పడలేక, ఇక్కడివారు ఎంతోమంది ఈ చోటు వదలి ఎటో దూరంగా పిల్లా - జల్లాతోసహా వెళ్ళిపోయారు. అట్లా దూరప్రదేశాలకు వెళ్ళే ప్రయత్నంలో కొందరైతే త్రోవలోనే మరణించారు. దురదృష్టవంతులమగు మేమంతా మా బంధువులను పోగొట్టుకొన్నాం. ఎంతమంది చచ్చిపోయారో, ఎంతమంది ఎక్కడ ఇంకా బ్రతికే ఉన్నారో మాకేం తెలియదు. ఈ మధ్యనే మా ఆయన కూడా పోయాడు. ఇట్లా అందరినీ పోగొట్టుకొని శూన్య హృదయులమయ్యాం. మాకిక ఏడుపు గాక, ఇంకేం మిగిలింది? నెలరోజులక్రితం దేశాలు పట్టి పోయిన నా కూతురు - వాళ్ళు ఏమయ్యారో? ఏమో?

రాజు ఈ మాటలు విని విస్మితుడై సాలోచనగా మంత్రివైపు చూచాడు. ఆ తరువాత, తన పూర్వవృత్తాంత విశేషాలు అనేకం అడిగి తెలుసుకొన్నాడు. ఆ సమాధానాలన్నీ తన క్రితం రాత్రి సభలోని దేవదూతచే కల్పించబడిన అనుభవాలకు సరిగ్గా సరిపోతూనే ఉన్నాయి. అట్లు కొంతసేపు సంభాషించి, ఆ ముసలి స్త్రీని కొంత ధనముతో, పదార్థములతో సంతోషపరచి, మంత్రులతో కూడుకొని వెనుతిరిగినాడు. "ఆహాఁ! ఏమి ఈ దైవగతి?" అని యోచిస్తూనే నగరం చేరాడు.

అత్యంత ఆశ్చర్యచకితుడైన రాజు ఆ మరునాడు సభలో నాతో "హే వసిష్ఠమహర్షీ! స్వప్నతుల్యమైన జగత్తులో ప్రవేశించి నేను అనుభవించినదంతా, ప్రత్యక్షమై ఎట్లా ప్రాప్తిస్తోంది? ఈ విషయం నాకేమీ బోధ పడుటలేదు. దయచేసి, ఇందలి చమత్కారం, తాత్త్వికార్థం నాకు తెలియచేయండి" అని అభ్యర్థించాడు. అప్పుడు నేను అతని ప్రశ్నకు తగిన సమాధానమిచ్చి, అతని సంశయం నివారించాను.

చూచావా రామా? ఈ అవిద్య విశేషమైన 'భ్రమ' ను కలుగ జేయగలదు సుమా! క్షణంలో సత్తును అసత్తుగాను, అసత్తును సత్తుగాను చూపించగలదు.

❖❖❖

# 23. ఒకని మనస్సులో విశేషాలు - మరొకరి మనస్సులో ప్రతిబింబించటం

**శ్రీరాముడు :** మునీంద్రా! ఆ లవణ మహారాజు లాగానే నాకుకూడా సందేహం వస్తోంది. స్వప్నంలో చూచినది 'జగత్కాలాంతరతం' ఎట్లా అయినది? భ్రమదాయకములైన మీ వాక్యాలు నేను విశ్వసించ లేకపోతున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవిద్యయందు ఇదంతా సంభవమే. స్వప్నంలో కనిపించే కుండ, వస్త్రము, జనులు మొదలైనవి అప్పటికి సత్యమే అయినట్లు కనబడుచున్నాయా, లేదా? అవిద్యయొక్క కల్పనా ప్రభావంచేత, అద్దంలో ప్రతిబింబించే కొండ, దూరంగా ఎక్కడో ఉన్న కొండకూడా దగ్గరగా సమీపమునే ఉన్నట్లు తోస్తోంది. గాఢంగా రెండు – మూడు రోజులు నిద్రించినవానికి, ఆ మూడు రోజులు అత్యంత అల్పంగా ఒక్కక్షణంలాగా తోచుట జరుగుతోంది. ఒకడు, "రాత్రి ఒక కలవచ్చింది. అందులో నేను చచ్చిపోయాను. నా మిత్రులు, బంధువులు నాపైబడి ఏడుస్తున్నారు" అని అన్నాడనుకో. అతడు మరణించటం జరిగితే కల ఎవరికి? అందలి జనులు ఎక్కడివారు? ఈ విధంగా అవిద్యయందు అసంభవము కూడా సంభవము కాగలదు. అత్యంత అసత్యము కూడా సత్యమువలె ప్రాప్తించగలదు.

ఒకడు కొద్దిసేపు తనచుట్టూ తాను తిరిగాడనుకో ... అప్పుడాతనికి ఎదురుగా ఉన్న వస్తువులు స్థిరంగా ఉన్నప్పటికీ గిఱ్ఱున తిరుగుచున్నట్లు కనిపిస్తాయి కదా! కల్లు మత్తుగా సేవించినవానికి ఇళ్ళు, రహదారులు గాలిలో తేలుచున్నట్లు కనిపించుటలేదా? కదలకుండా ఉన్న వస్తువు కూడా అవిద్య కారణంగా కదలుచున్నట్లు ఒకడు పొందుచున్నాడు.

ఈ ప్రపంచంలో అనేక పదార్థములు తారసపడుచున్నాయికదా! "ఇవి సత్యమైనవా? లేక మిథ్యాభూతములేనా?" అనే విషయం ప్రక్కన ఉంచు. ఒక్కటి మాత్రం అందరు ఒప్పుకోక తప్పదు.

ఈ చిత్తం ఏ పదార్థమును ఎట్లు తీవ్రంగా భావిస్తే అది అట్లే సత్వరం అనుభవానికి రాగలదు.

అహంకారముతో కూడిన అవిద్య ఎప్పుడు ఉదయిస్తుందో, మరుక్షణాన ఆదిమధ్యాంతములు లేనట్టి భ్రమయొక్క అనంతత్వముకూడా ఉదయిస్తోంది. వాస్తవానికి పదార్థములన్నిటియొక్క 'పరిణామము – అనుభవము' ప్రతిభాసావశంచేతనే (ప్రతిబింబించు స్వభావముచేతనే) కలుగుతోంది. అట్టి ప్రతిభాసావశం చేత ఒక్కక్షణం కల్పంగా, ఒక కల్పకాలం క్షణంగా అనుభవం కాగలదు. విపరీత బుద్ధి గల ఒకానొక మానవుడు "నేను ఒక కోతిని" అని భావించి, నిజంగానే కోతివలె ప్రవర్తనను ప్రకటిస్తూ ఉంటాడు. అట్లాగే, భావనావశంచేత ఒక మేక కూడా సింహత్వము ప్రకటించ వచ్చు. అంతటికీ కారణం అంతరంగమునందలి వాసనలే.

"అవిద్య – మోహము – అహంభావము" ఈ మూడూ తెలుపుచున్నవి ఒక్క విషయాన్నేకాని, వేరువేరు విషయాలను కాదు. ఇవే చిత్తవైపరీత్యము కలిగించటానికి కారణం అవుచున్నాయి. చిత్తమునందలి వాసనలు కారణంగా ఒకనికి ఒక స్వల్పవిషయం కూడా మహత్కార్యంగాను,

మరొకడికి అదే మహత్కార్యం అత్యంత స్వల్పవిషయంగాను తోచుట జరుగుతోంది. అట్లాగే, ఒకని మనస్సు నందు ఏది తోచినదో, అదే కాకతాళీయ న్యాయంచే మరొకరి మనస్సునందు కూడా తోచు చుండుట జరుగుతోంది. లవణమహారాజు విషయంలో – ఆ దేవదూత ఇంద్రజాలికుడు మనస్సుద్వారా ఒక జరిగిపోయిన సంఘటన "చండాలకన్యా వివాహం" వృత్తాంతమంతా లవణుని మనస్సులో కూడా భాసించేటట్లు చేశాడు. అనగా, అవన్నీ మరొక జీవుని మనస్సుకు ప్రాప్తించిన అనుభవ పరంపరలు మాత్రమే !

**శ్రీరాముడు :** అదేమిటి? ఒకని మనస్సులోని అనుభవ విశేషాలు మరొకని మనస్సులో ప్రతిబింబించేటట్లు చేయబడగలవా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మాయలో చమత్కారములకు అడ్డేమున్నది?

**జ్ఞప్తిని అనుసరించి భావము ఏర్పడటం –** ఒకడు తాను భుజించికూడా, మరొక చోటికి పోయినప్పుడో, లేక స్వప్నములో ప్రవేశించినప్పుడో, "నేను ఈ రోజు ఏమి తినలేదే?" అని మననం చేసి, ఆకలిని అనుభవిస్తాడు. మరల ఎవరో, "నీవు భుజించావుకదా?" అని గుర్తుచేస్తే, "ఓహో ! ఈ విషయం గుర్తులేదు" అని ఆకలిని త్యజిస్తాడు. ఇక్కడ జ్ఞప్తిని అనుసరించి భావన ఉండటం జరుగుతోంది.

**భావనను అనుసరించి మనస్సునందు అనుభవం ఏర్పడటం –** దృఢంగా ఒక భావపరంపం వైపు దృష్టిసారించి, తదితర విశేషములన్నీ త్యజించటం జరిగినప్పుడు, అట్టి సమయంలో స్వప్నజాగ్రదనుభవం సిద్ధించగలదు. అట్టిసమయంలో "చేసియున్నట్టి – చేసి ఉండనట్టి" క్రియల గురించి కూడా ఆ భావమే అనుభవముగా పరిణమించుచున్నది. దృఢభావన ఉన్నచోట 'అనుభవం' రూపుదిద్దుకొనగలదు. ఒకానొకని ఊహలో – ఆటలలో ఎదుటివారిపై గెలుస్తున్నట్లు భావించటం.... యుద్ధంలో శత్రువును బాధించుచున్నట్లు భావించటం.... ఇవన్నీ పరధ్యాసచే నిజమైన సంగతుల వలె అనుభూతం కాగలవు.

**స్మృతిలో లేని క్రియలు నిష్క్రియలు కావటం –** అట్లే ఒకడు ఒక మహత్కార్యం చేసికూడా, అది పూర్తిగా మరచుటచే, దాని కర్తృత్వము తనయందు ఏమాత్రం కలిగియుండకపోవచ్చు.

ఇక లవణ మహారాజు విషయంలో – స్వప్నమందలి 'అపూర్వానుభవం' లాగా "వింధ్యపర్వత సమీపమున ఉన్న ఒక గ్రామములో ఇట్టి వ్యవహారము జరుగుచున్నది" అనునది రాజు మనస్సులో ప్రతిభాసించింది. ఆ లవణమహారాజు గాంచిన 'స్వప్నభ్రమ" వంటిదే అక్కడి ఒక చండాలుని చిత్తము నందు స్ఫురించింది. అనగా, లవణునిచే పొందబడిన వృత్తాంతమే అక్కడి వేరొక ఒక జీవుని హృదయము నందు రూఢిపడి ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! ఒక జీవుని హృదయములోని అనుభవం మరొక జీవునియందు స్ఫురించగలదా? లేక ప్రతిబింబించగలదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎందుకు కాగూడదు? "సమస్యాపూరణము" మొదలైన సందర్భాలలో అనేకమంది కవులలో ఒకే భావన, ఒకే వచనములు ఒకే రీతిగా ఉండటం జరుగుతూ ఉంటుంది కదా! ఇదికూడా అట్టిదే. అనేకమంది స్వప్నములో కూడా ఒక్కొక్కసారి దేశ-కాల-క్రియలు సమముగానే ఉంటాయి.

**శ్రీరాముడు :** అంటే ఆ లవణుని యొక్క "నేను చండాలుడనైయున్నాను. ఈమెను వివాహం చేసుకున్నాను. ఇట్లు ఈ అడవిలో ఈ క్రియలు నిర్వర్తిస్తున్నాను. ఈ పిల్లలు నాకు ఇష్టులు. వీరికొరకై ఇవన్నీ చేస్తున్నాను....." అను వ్యవహారమంతా స్వప్నముతో సమానమైనదేనంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అది స్వప్నసదృశమే. కాని ఇక్కడ నీవు మరొక ముఖ్యవిషయం దృష్టిలో పెట్టుకోవాలి. అది ఒక స్వప్నంలో ఏర్పడిన మరొక స్వప్నము. ఎందుకంటే, "నేను లవణుడను. ఈ దేశపురాజును" అనునది మాత్రం స్వప్నసదృశం కాదా? ప్రతి జీవుని యొక్క ఈ వర్తమాన దర్శనావ్యవహారము కూడా, భావించినదానిని అనుసరించే ఉంటోంది. కనుక, "ఇదంతా చైతన్యము యొక్క ప్రతిభాసచే ఏర్పడుచున్నదే" అని సూక్ష్మబుద్ధితో గ్రహించు. సమస్తవిషయములయొక్క పదార్థములయొక్క సత్త - దానికి అధీనమైయున్న (That in which every thing else finds place) 'చైతన్యసత్త' యొక్క స్ఫురణవల్లనే కలుగుతోంది. అట్టి 'అధిష్ఠానము' అయిఉన్న 'చేతన సత్త' యే భూత-భవిష్యత్-వర్తమాన ప్రపంచమున వ్యాప్తమైయున్నది.

అయితే జలములో తరంగములు జలముకంటే విలక్షణమైన (ఆకారములు కలగియుండుట మొదలైన) కొన్ని విశేషములతో ప్రకటితమౌతున్నాయి కదా!

బీజములో నిబిడీకృతమైన వృక్షం బీజం కంటే వేరైన నామరూపములతో ప్రాప్తిస్తోంది కదా!

'బంగారపు ఉంగరం' అను వస్తువు బంగారముకంటే వేరైన దృష్టిచే దర్శించబడుతోంది కదా! అధిష్ఠానమగు "చేతన సత్త" కంటే (ద్రష్ట సత్తకంటే) భాసించుచున్న పదార్థముల సత్త (దృశ్యసత్త) వేరైనది కాదు. కాని, వేరైనట్లు అల్పదృష్టికి ప్రాప్తిస్తోంది.

బంగారములో అంగుళీయకిత్వమన్నదా? లేదు. బంగారమునకు ఉంగరాకారం ఎక్కడున్నది? ఉంగరము బంగారముకన్నా వేరా?.... కాదు. బంగారమునకు వేరుగా అక్కడేదీ లేనేలేదు?

అట్లాగే 'ద్రష్టసత్త' యందు స్ఫురిస్తున్న ఈ దృశ్యసత్తకూడా సత్తు కాదు. అసత్తు కూడా కాదు. ఆ రెండిటికీ విలక్షణమైనది. (నాసదాసీనోసదాసీత్ : ఈ జగత్తు సత్తుగాని, అసత్తుగాని కాదు.)

అందుచేత, "ఈ జగత్తు 'స్థూలదృష్టి' కి 'సత్తు' గాను, పరమార్థదృష్టికి 'అసన్మయము' గాను ఉంటోంది. ఎక్కడన్నా ఇసుకలో నూనె ఉంటుందా? వాస్తవానికి 'అవిద్య' అనబడునది కూడా ఏదీ లేదు. 'ఆభరణం' అనగా బంగారమేగాని, మరింకేముంటుంది?

**శ్రీ రాముడు :** మహర్షీ! చేతనవస్తువును ఆశ్రయించి ఉంటోంది కనుక అవిద్య కూడా సత్త కలిగియున్నదని అనుకోవచ్చు కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జడమగు అవిద్యకు, చేతనమగు చైతన్యమునకు సంబంధం ఎట్లా పొసగగలదు చెప్పు? ఎక్కడైనా సమాన వస్తువులకే సంబంధం ఉండటం సహజంగాని, అసమాన వస్తువుల సంబంధం అసహజమే కదా!

**శ్రీ రాముడు :** ద్రవశీలమగు లక్క, అద్రవశీలమగు కొయ్య ఒకచోట ఒకే వస్తువు నందు అమరిక పొంది ఉంటున్నాయి కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవి రెండు పాంచభౌతిక పదార్థములే! రెండూ అవిద్యయందే అంతర్గతమై ఉంటున్నాయి. కనుక సదృశవస్తువులే అవుతాయి. చైతన్యమో, అనుభవమాత్రం. ఈ జగత్తో, అత్యంత వికారయుక్తమై, ఘనీభూతమై కనిపిస్తోంది.

అనుభవ మాత్రమగు చైతన్యము ఈ 'జగత్తు' యొక్క ఉనికిని అంగీకరించి, అట్టి భావనానంతరం ఇట్లు దృశ్యముగా దర్శిస్తోంది. భావనకు వేరుగా 'జగత్తు' అనబడునది ఎక్కడా ఏ సమయమందు కూడా లేనే లేదు.

సమస్త పదార్థములు చైతన్యమయములే. చైతన్యం వల్లనే, సాదృశ సంబంధం చేత (The relationship that a Perceiver undertakes) అవన్నీ ప్రకాశితములౌచున్నాయి.

ఈ జగత్తులోని పదార్థములన్నీ సత్ + చిత్ మాత్రములే. (Mere combination of Existence and Conscionsness). కనుక 'స్వప్రకాశము' యొక్క బలముచేతనే అవన్నీ ప్రకాశితము అగు చున్నాయి. అంతేగాని, అవి ఎక్కడో ఉన్న మరొక చైతన్యముచే కాదు సుమా! ఒక దీపం ప్రకాశమును ప్రకటించటానికి మరొక దీపం దేనికి?

ఓ రామా! ఒక సిద్ధాంతము చెపుతాను. విను.

1. అసదృశ వస్తువులకు సంబంధం ఎన్నటికీ కలుగదు. ఒకటి ఇంకొక దాని వంటిది అయితేనే "ఆ రెండు సాదృశవస్తువులు" అని అంటాం.
2. పరస్పర సంబంధం లేకపోతే పరస్పర – అనుభవం ఘటిల్లే ప్రసక్తే లేదు..... కనుక
3. సదృశమగు పరమాత్మయందు సదృశమగు ఈ జగత్తు ఉండి ఉన్నది. ఇదంతా పూర్ణంగా ఏకత్వం పొందినదై, అట్టి ఏకత్వబలంతో, తన రూపమును విస్తరించుచున్నది. అంతేగాని, పరమాత్మ స్వరూపముకంటే వేరుగా ఈ జగత్తు లేదు.

ద్రష్ట–దర్శనము–దృశ్యము (Perceiver - perception - object) చేతన–చేత్యము–చేతయిత్వము (Knower - thing being known - knowing) ఈ త్రిపుటీ రూపమంతా అజ్ఞుల దృష్టిలో మాత్రమే ఉదయిస్తోంది. అయితే ఇట్లు ఉదయించేదంతా చిత్ – జడముల అభేద సంబంధం వలననే ఏర్పడుతోంది కాని, కేవలం జడముయొక్క ఉనికి చేతనే అనటం ఏమాత్రం తగదు. ఎందుకంటావా? జడము జడముతో కలిస్తే ఇంకా అధిక జడమే కావాలి కదా!

చిత్ – జడములు పరస్పరం విలక్షణమై ఉన్నాయి. కనుక వాటికి ఐక్యత సంభవించదు. నీవు ఒక పదార్థమును స్పృశిస్తున్నప్పుడు, ఆ అనుభవం పొందుచున్న నీవు, స్పర్శానుభవం కలిగిస్తున్న

పదార్థజాలము, 'స్పర్శ' అనబడే అనుభవమూ – ఈ మూడు చైతన్యము యొక్క ప్రసరణశీలత యొక్క ప్రభావం మాత్రమే. సర్వము చైతన్యమునకు సంబంధించినదే అగుటచే, "అసలు ఈ దృశ్యమే లేదు" అనునది సిద్ధించుచున్నది.

**శ్రీ రాముడు :** గృహము నిర్మించుటలో పనికివచ్చే చెక్క, పాషాణం మొదలైన నామరూపాత్మకమైన పదార్థములు ఏమై ఉన్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవి చిదాత్మకములు కావు. అవన్నీ ఒకటి మరొకటిగా పరిణామం చెందుతూ ప్రాప్తిస్తున్నాయి. అందుచేత "అవి మాయ యొక్క విలాసములే" అని చెప్పబడుతోంది. కాని చైత్యమునకు పరిణామాదులంటూ ఉండవు.

మరొక సమన్వయం కూడా విను : మనం నాలుకతో వివిధ పదార్థములను ఆస్వాదిస్తున్నాం. అట్టి క్రియ 'సజాతివస్తు సంబంధమే' అవుతుంది. "ఎల్లప్పుడు సాదృశ వస్తువులకు మాత్రమే సంబంధము ఏర్పడుచున్నది" అని అనుకొన్నాం కదా! అసదృశములైన (Unequal) జడ – చైతన్యము ఒకదానిని మరొకటి పొందలేవు.

కనుక చైతన్యమే శిల – గోడ మొదలైన రూపములను 'అనుభవము' అను చమత్కారం ద్వారా ధరిస్తోంది.

సద్వస్తువు అయి ఉన్న చైతన్యమే, భావసారూప్యము పొందినదై "ద్రష్ట – దృశ్యము" మొదలైన భ్రమలన్నీ కలుగజేస్తోంది. అందుచేతనే 'ఈ సర్వము చైతన్యమే' అని సిద్ధాంతీకరించబడుతోంది. సత్యద్రష్టలమగు మేము "చిదాత్మతోటి చిదాత్మ యొక్క సంబంధమే కల్పిత దృశ్యరూపమున ఉదయిస్తోంది" అని స్వానుభవ పూర్వకంగా ప్రకటిస్తున్నాం. అనగా, "ఇది కొయ్య, ఇది శిల" మొదలైన రూపత్వమంతా కల్పితమైనది మాత్రమే. అట్టి కల్పన చైతన్యము చేతనే గావించబడుచున్నది. అనంతమగు పరబ్రహ్మమే సర్వవిధముల పరిపూర్ణమై, సర్వరూపములందు సమముగా వెలుగొందుచున్నది.

కనుక, ఉత్తమ తత్త్వజ్ఞుడవగు ఓ రామా! "ఈ విశ్వమంతా సన్మాత్రమే" అని గ్రహించు! ఇక ఈ జగత్తు అంటావా? ఇది పలువిధములైన భ్రమలతో మిథ్యాగ్రహణం (false understanding) అను రూపముతో, చిత్‌యొక్క చమత్కృతి చేతనే ఒప్పుచున్నది. అట్టి చిత్‌చమత్కృతి ఈ జగత్తులోని ఏ పదార్థజాలముచేతను పూరింపబడజాలదు. ఒకడు తన స్వప్నంలో ఒక గొప్ప నగరమును చూస్తున్నాడనుకో.... ఆ నగరంలో "ఇది వీథి, ఇది ఇల్లు, ఇది వేరేవారి గృహములు, వీరు బంధువులు, వీరు అపరిచితులు" అనే రూపముగల అనేకత్వ భేదమంతా ఏర్పడుతోంది. కాని అదంతా స్వప్నద్రష్టయొక్క స్వసంకల్పపరంపరల ఘనీభూతస్థితియే కదా! ఈ బాహ్యమున కనిపించే 'బాహ్యజగత్తు' కూడా అట్టిదే. "ఇది ఉంగరం" అనే దృష్టి తొలగితే అప్పుడు అందులోనూ, మరొక గొలుసులోనూ కూడా బంగారమే కనిపిస్తుంది. భేదజ్ఞానము చేతనే "సృష్టి – అహంకారము" ఇత్యాది భ్రమలన్నీ ఉదయిస్తున్నాయి.

అనేక ఆభరణముల ఉత్పత్తి-ఉనికికూడా సువర్ణముయొక్క ఉనికి మీదనే ఆధారపడి ఉన్నాయి కదా? జడ, చేతనముల చమత్కారమంతా ఆత్మయొక్క "భావన"యందే అద్వితీయంగా ప్రదర్శనమగుచున్నాయి.

ఈ జగత్ స్థితి కూడా సద్వస్తువు అగు చైతన్యముపైనే ఆధారపడి ఉన్నది. దృక్ - దర్శనములకు వేరుగా 'అవిద్య' అనబడునదేదీ ఎక్కడా లేదు. చైతన్యపరమాత్మ స్వరూపమే అజ్ఞానదృష్టి కలవారికి జగత్తుగా అనుభవమౌతోంది.

❖❖❖

# 24. పరమాత్మయొక్క నిర్వచనము

అసద్రూపం అయి ఉన్న ఈ జగత్తును తత్త్వజ్ఞానం మాత్రమే సత్స్వరూపమగు పరమాత్మతో ఐక్యపరచుచున్నది. మట్టితో నిర్మించబడిన సైన్యము చిత్రవిచిత్రములుగా, "రాజు-మంత్రి-సైనికులు -గుఱ్ఱములు" మొదలైన విధంగా కనబడుచున్నప్పటికీ, విచారదృష్టికి అంతా మట్టిగానే తెలియవచ్చు చున్నది కదా! జగత్తు కూడా పరమాత్మ స్వరూపము మాత్రమే అయి ఉన్నది. ఇందులో ఎంత మాత్రమూ సందేహం ఉండవలసిన అవసరం లేదు.

తరంగములన్నీ జలమే కదా?.... కొయ్యవిగ్రహములన్నీ కొయ్యమయమే కదా?.... కుండలన్నీ మృత్తికామయమే కదా?.... ఈ ముల్లోకములలో సర్వము బ్రహ్మమయమే! బ్రహ్మమే!.... అందుకు వేరైనట్లుగా తోచుటయే 'అవిద్య'.

ఇప్పుడు పరబ్రహ్మమును గ్రహించుటకు వీలుగా కొన్ని నిర్వచనములు చెపుతాను విను.

**I. పరబ్రహ్మము :** ఈ దృశ్యము ద్రష్ట యొక్క భావనలను ఆశ్రయించి ఉంటోంది. 'ద్రష్ట దృశ్యము' ల సంబంధమును వివేకబుద్ధితో పరిశీలిస్తే తేలుచున్నది ఏమంటే

1) ద్రష్టయే దృశ్యమునందు ప్రవేశిస్తూ, స్వకీయసంస్కారములను అనుసరించి ఇదంతా ఆయా రీతులుగా దర్శిస్తున్నాడు.

2) ద్రష్టత్వము వహించుటచే అతనిని 'ద్రష్ట' అని పిలుస్తున్నాం.

3) ద్రష్టత్వము వహించటానికి మునుముందే అతడు ఉండిఉన్నాడు. ద్రష్టయొక్క 'దర్శన - దృశ్య' రహితమగు శుద్ధ స్వరూపము అనుభవమునకు మాత్రమే గోచరించగలదు.

అట్టి " సర్వమునకు ఆవల, సర్వమునకు కారణమై" యున్న ద్రష్టయొక్క నిత్యసత్యస్వరూపమే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మం త్రిపుటియందు అంతటా వ్యాపించియున్నది.

**II. మననరహిత శుద్ధచైతన్యము :** ఈ చిత్తము ఒక స్థానమునుండి (లేక విషయము నుండి) మరొక స్థానమునకు వెళ్లుచున్నప్పుడు, ఆ రెండిటి మధ్యగల చిత్తము యొక్క జడత్వరహితమగు శుద్ధస్వరూపము ఉన్నది.

ఆ శుద్ధ స్వరూపమే చైతన్యము(తెలుసుకొంటున్నది). అదియే చేత్యము(తెలియబడునది) కూడా.

బ్రహ్మజ్ఞానులగు మహనీయులు ఎల్లప్పుడు ఆ శుద్ధ చైతన్య స్వరూపులై వెలయుచు, ఖేద రహితంగా ఆయా కర్మవిషయములను నిర్వర్తిస్తున్నారు. ఓ రామా! నీవు కూడా "నేను సర్వదా అట్టి శుద్ధ చైతన్య స్వరూపుడనే" అనే ఎరుకను వీడకుండా, ఆపై ఏది ఎట్లు ఉచితమో, అది అట్లే నిర్వర్తించు.

**III. శుద్ధ చిత్తము :** చిత్తము మననరహితం చేయి. లేదా, సర్వమననములకు అతీతమైన దృష్టి, అవగాహన కలిగియుండు. అప్పుడు మిగిలి ఉంటున్న శుద్ధ చిత్తమునకు, 'పరమాత్మ' అనుదానికి భేదమేమీ లేదు. సర్వదా శేషించి ఉంటున్న 'అనుభవాత్మకసత్త'యే పరమాత్మ స్వరూపము.

ఓ రామచంద్రా! జాగ్రత్-స్వప్న-సుషుప్త రహితమై, చిత్తవృత్తి రహితమైనట్టి 'శుద్ధచిన్మాత్రమే' నీ యొక్క, నా యొక్క ఈ సర్వజీవుల యొక్క, వాస్తవ స్వరూపము. కాబట్టి నీవు సర్వదా అట్టి చిద్వస్తు - స్వరూపుడవై ఉండెదవుగాక! నాయనా! నీవు ఈ జడత్వమంటూ ఏదీ లేనివాడవు. సర్వమును త్యజించి సమాధిని ఆశ్రయిస్తావా? లేక ఈ ప్రాపంచిక ద్వైత వ్యవహారములు నిర్వర్తిస్తూ ఉంటావా? అది నీ ఇష్టం. కాని ఉభయ సమయములందు కూడా "నేను సర్వదా చిద్ఘనస్వరూపుడను. నిష్కళంకవృత్తిరహిత - శుద్ధ చైతన్యమే నేను" అను భావనమాత్రం వదలవద్దు. వదలవలసిన పనేమీ లేదు కూడా!

**శ్రీ రాముడు :** తండ్రీ! మరి మాకు ఈ దుఃఖాదులు వచ్చిపడుచున్నాయి కదా? వీటిలో తగుల్కొనకుండా ఉండేదెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** పరమార్థదృష్టితో పరిశీలిస్తే, ఈ ప్రపంచంలో ఎవ్వరికీ ఏదీ ప్రాప్తించుటలేదు, నశించుటలేదు. మరి ఈ దుఃఖాదులు ఆశ్రయించవలసిన పనేమున్నది? విచారణ లేకపోవుటయే అన్ని అనర్థములకు మూలకారణం. ఆత్మ ఈ దేహమునందు ఏదీ వాంఛించుటలేదు, త్యజించుటలేదు, ద్వేషించుటలేదు. కాబట్టి నీవు ఇచ్ఛారహితుడవై, ప్రశాంత చిత్తుడవై, నశ్వరమగు ఈ దేహాదులందు ఏమాత్రం తగుల్కొనకుండా ఉండు. "నేను ఈ దేహాదులందు, దృశ్యములందు లేను. నా యందు ఇవి లేవు. నేను వ్యవహరించుచున్ననూ, లేక సమాధిని ఆశ్రయిస్తున్ననూ సర్వదా స్వస్థుడనే. నిశ్చింతుడనే" అను మననమును ఆశ్రయించు.

ఒకనికి భవిష్యత్తులో నిర్మించబోయే నగరంలోని ఒక ఇంటిలో చేయవలసినదేమైనా ఇప్పుడుంటుందా? అప్పటి అందలి పదార్థముల గురించి ఆసక్తి అనవసరమైనదే కదా! అదే విధంగా చిత్తవృత్తుల నుండి విడివడి ఉండు. ఈ చిత్తవృత్తులందు నీకు ఎట్టి ఆసక్తి ఉండవలసిన పనేమీ లేదు. సదా, సర్వదా, సత్స్వరూపమగు ఆత్మయందే నీవు నిష్ఠ కలిగి ఉండెదవుగాక! ఎప్పుడో చాలాకాలం క్రితం ఎక్కడో తారసపడి, కొద్దిసేపు నీతో సంభాషించి, తనదారిన తాను వెళ్లిపోయిన ఒక అపరిచిత వ్యక్తి ఇప్పుడు నీ దృష్టికి ఎట్లా ఉంటాడో, ఈ వర్తమాన దృశ్య వ్యవహారము పట్ల ఇప్పటికిప్పుడు కూడా అట్టి దృష్టినే సంతరించుకొనియుండు. ఎందుకంటే ఈ వర్తమానము యొక్క భవిష్యత్ పరిణామము అదే కాబోవుచున్నది. ఇదంతా అసత్తుల్యముగాను, కొయ్య శిలల

వలె స్వల్పవిషయములు గాను గాంచుచూ ఉండు. ఈ మానవులు తమ దృష్టిని శుద్ధ పరచుకోకుండా పదార్థజాలములోకి ప్రవేశించుట చేతనే సకల అనర్థములను పొందుచున్నారు. కాస్త ఆత్మదృష్టి కలిగి, వివేచించి చూస్తే ఇక్కడంతా అసారమే శేషిస్తోంది. కనుక అచిత్తత్వమునే బుద్ధిమంతులు అలవాటు చేసుకొంటున్నారు.

రాతియందు జలం ఉంటుందా? జలంలో అగ్నికణం దాక్కోగలదా? అట్లాగే, ఈ జీవాత్మయందు ఆత్మకన్న వేరైనదేదీ ఉండజాలదు. ఇక పరమాత్మయందు 'జగత్తు' అనబడునది ఎట్లా ఉంటుంది చెప్పు? 'చిత్తము' అనబడునది కూడా జీవాత్మయందుగాని, పరమాత్మయందుగాని ఆ రెండిటికి వేరుగా లేదు. అవిచారదృష్టితో చూచినప్పుడు మాత్రమే "ఇదియే చిత్తము" అనబడేదొకటి ఆత్మకు వేరైనదాని వలె తోచటం జరుగుతోంది. విచారణాదృష్టితో చూచినపుడు చిత్తమనునదే ఉండజాలదు. "ముగ్గురు రాజకుమారులున్నారు. ఇద్దరింకా పుట్టనే లేదు. ఇక ఒకరింకా ఎప్పటికో తల్లి గర్భంలో ప్రవేశించ వలసి యున్నది ....." అను వర్ణనవలె, మొదలే లేనట్టి చిత్తముచే చేయబడు కార్యమంతా అకృతమే అయి ఉన్నది.

ఓ రాఘవా! నీవు చిత్తము యొక్క అస్థిత్వమును నిష్కారణంగా నమ్మి "అయ్యో! ఇక నేను ఈ చిత్తమును త్యజించేదెట్లా?" అని వాపోవుచూ, అకారణంగా, ఆత్మస్థితి నుండి చ్యుతి పొందకూడదు సుమా! ఈ జనులు దేనినైతే 'చిత్తము' అని పిలుస్తున్నారో, అట్టిదానికి పరమైనట్టి "సుఖస్థితి" (A state beyond) యందు సర్వదా ఉండియుండుము.

ఆత్మను ఏమరచుటచే "చిత్తము" అనేది అనుభవమగుచున్నది కనుక "ఈ చిత్తము మిక్కిలి అనాత్మభూతము" అని విజ్ఞులు అంటూ ఉంటారు. అట్టి చిత్తవృత్తిని అనుసరిస్తూ, "ఇది ఉండనే ఉన్నది. మేము దీనిని తొలగించుకునేది ఎట్లా?" అని తలచుచు రోజులు గడపువారు లేని దయ్యమును ఊహించుకొని గజగజ వణకువారే అవుతారు. మా దృష్టిలో వారు అల్పమైన అవగాహన కలవారు మాత్రమే. నీ చిత్తమును ఇట్లు సంబోధించు–

"ఓ చిత్తమా! స్వస్వరూపమగు ఆత్మయే అయి ఉన్న నాకు వేరుగా నీవెక్కడున్నావు? మొదలే లేనట్టి నిన్ను నిరోధించటమేమిటి? నేను ప్రియత్వముతో కూడుకొని, సంకల్పములను ఆశ్రయిస్తున్నప్పుడు అట్టి నా కార్యక్రమమునే 'చిత్తము' అని అంటున్నారు. నేను సంకల్పించటం జరిగితే నీవు ఉంటావు. నా సంకల్పములకన్నా నీవు వేరు కాదు. కాబట్టి ఓ చిత్తమా! నిన్ను లేనిదానిగా నేను నిర్వచిస్తున్నాను. నిరంతరం ఈ 'చిత్తము' అనుదానిని దూరమునుండే అనాదరిస్తూ ఉండదలిచాను!"

కనుక రామా! ఈ చిత్తము విషయంలో, ఒక 'మట్టి విగ్రహం' లాగా అచంచలంగా ఉండు. సర్వదా ఇచ్ఛారహితుడవై ప్రశాంతముగా ఉండటం అభ్యాసవశంగా నిర్వర్తించు.

ఓ రాఘవా నీవు వైరాగ్యప్రకటన చేస్తున్నప్పుడు ఈ చిత్తము గురించి అనేక విశేషాలు చెప్పావు. బాగానే ఉన్నది. కాని, యథార్థానికి ఈ చిత్తము అనేదేదీ లేదు. "మరి కనిపిస్తోంది కదా?" అంటావా? అపరిపక్వమైన మిథ్యాదృష్టికి మాత్రం అది అట్లా అగుపిస్తోంది. ఆకాశంలో

మేఘములు రూపుదిద్దుకొన్న తీరు చూచి "అక్కడ ఒక తోట ఉన్నది. ఆ ప్రక్కనే ముఖద్వారం" అని ఊహను జోడించి గాంచుటవంటిదే ఈ చిత్తము విషయం కూడా! కనుక ఈ చిత్తము యొక్క మిథ్యాత్వము నిశ్చయించుకున్నవాడవై, శిలాపురుషునివలె నిశ్చలంగా ఉండు.

ఆత్మానుభవదృష్టికి చిత్తము లేనేలేదని మరల ఒక్కసారి ప్రకటిస్తున్నాను.

ఓ ప్రియరామచంద్రా! నీవు యథార్థానికి చిత్తరహితుడవే సుమా! ఓ సర్వ జనులారా! మీరంతా 'చిత్తము' అనే కల్పనకు బద్ధులు కానట్టి చైతన్యాత్మానంద స్వరూపులే! మరి అనర్థములకు హేతుభూతమైన ఈ చిత్తముతో కూడి ఎందుకు దుఃఖించుచున్నారో చెప్పండి?

'అసత్తు' అయిన ఈ చిత్తమునకు వశీకరణమైపోతున్న 'అదృఢబుద్ధి" నుండే వజ్రపాతముతో సమానమైన అస్వస్థత' అంతా వచ్చిపడుతోంది.

ఓ రామా! అట్టి చిత్తమును తొలగించగా, ఇకప్పుడు మిగులుచున్నదేమిటి? నీ యొక్క స్వస్వరూపమే కదా! అట్టి ఆత్మస్వరూపముననే సుస్థిరుడవై ఉండు.

ఇంతమాత్రములో కష్టమేమున్నది చెప్పు? అందులకై "ఆత్మస్వభావమును మననము చేయుట" అను ఉత్తమ ఉపాయమును పొంది ధ్యాననిష్ఠుడవై ఉంటూ ఉండు. కొంతకాలానికి ఆత్మభావన అకృత్రిమముగా, అప్రయత్నంగా సుస్థిరం కాగలదు."పరమాత్మయే ఈ కనబడే సర్వజీవులుగా, సర్వవిశేషములుగా ప్రదర్శనమగుచున్నారు".... అనే మననమును సర్వదా అవధరించు.

"అసత్తే" అగు చిత్తమును అనుకరించుచు ఆకాశమును భేదించాలని అనుకోవటం మా దృష్టిలో మూర్ఖత్వమే! అట్టి మూర్ఖత్వమునకు ధిక్కారమగుగాక! ఓ జనులారా! మొట్టమొదట మీరంతా తత్త్వబోధయందు కుశలురు కావాలి. తద్వారా మనోనాశనము సంపాదించండి. అనగా అసత్ పదార్థములను మననము చేయటం తగ్గించండి. ఆ తరువాత నిర్మలాత్ములై ఈ సంసారమును దాటివేయండి. నాయనలారా! మేము ఎంతో పరిశీలించిన తరువాతయే ఈ వాక్యములు మీ ముందు ఉంచుచున్నాము. నిర్మలమగు ఆత్మయందు 'మనస్సు' అనబడు మాలిన్యమునకు ఏ మాత్రం చోటులేదు. అందుచేత, నా మాట వినండి. ఈ నా వాక్యములు విశ్వసించి, అనుకరించి ఆత్మ యందే సుస్థిరులై ఉండండి. ఆ తరువాత ఏది ఏట్లో అది అట్లే ఉండుగాక, అగుగాక! మీరు మాత్రం ఆత్మస్థితి నుండి చ్యుతులు కావద్దు. సర్వదా అచ్యుతులై వర్ధిల్లండి!

❖❖❖

# X. ప్రకరణ సమీక్ష

## 1. సమీక్ష

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! మనం ఈ 'ఉత్పత్తి ప్రకరణము'లో విచారణ చేసిన విశేషాలన్నీ క్లుప్తంగా సమీక్షించుకుందాం! విను.

ఈ మానవులలో అనేకులు జన్మించినది మొదలు మరణించే వరకు తుచ్ఛమైన లక్ష్యములతో, అర్థం లేని ఆశలతో, అల్పమైన జ్ఞానముతో బ్రతికివేయటం జరుగుతోంది. స్వల్ప సంఘటనలకు కూడా విచలితులగుచున్నారు. ఇంద్రియ విషయముల పట్ల వ్యామోహితులగుచున్నారు. అవిచారణచే కాలయాపన చేస్తున్నారు. అందుచేతనే 'సంసారము' అను వృద్ధమాంత్రికురాలు ఈ జీవులను తన వశం చేసుకొని, తన ఇష్టం వచ్చినట్లు ఆడిస్తోంది. ఫలితం? అంతు లేని దుఃఖపరంపరలు. 'పరమాత్మ –ఆనందము' అనునవే స్వరూప, స్వభావములుగా కలిగి యున్న ఈ జీవుడు దుఃఖించుటయా? ఇతనికి కర్మబంధ మెక్కడిది? మోహ మెక్కడిది?

**అవిద్యను నిరోధించటం ఎట్లా? –** పుట్టిన తరువాత, ఈ మానవుడు, కాస్త బుద్ధి వికసించగానే, సత్సంగతత్పరుడై ఉండాలి. "నిరంతర ప్రవాహశీలము" వంటి ఈ అవిద్య అనబడే నదీజలవేగాన్ని నిరోధించాలంటే ఈ రెండూ అవసరమై ఉన్నాయి–

1) శాస్త్రాభ్యాసం (సాధనలతో సహా) 2) సత్సాంగత్యము

ఈ రెండిటి ప్రభావం చేతనే జీవునకు, "ఏది గ్రహించాలి? ఏది త్యజించాలి?" అనే వివేకం ఉత్పన్నమగుచున్నది.

అప్పుడాతడు "శుభేచ్ఛ" అనబడే మొదటి భూమికను పొందుచున్నాడు.

అట్టి శుభేచ్ఛ వివేకముతో కూడుకొని బలపడగా, క్రమంగా అతడు "విచారణ" అనే రెండవ భూమికలో ప్రవేశిస్తున్నాడు. సత్కర్మలు, ఉత్తమ ఆత్మజ్ఞానం ... ఈ రెండు బండికి రెండు చక్రముల వంటివి. అట్టి ప్రయత్నశీలుని చిత్తములో జన్మజన్మలుగా పేరుకొని తిష్ఠవేసుకొనియున్న 'దుష్టవాసనలు' బయటకు పంపివేయబడతాయి. అప్పుడు ఏర్పడే నిరంతర పరమార్థభావనచే మనస్సు సూక్ష్మత్వం పొందుచున్నది. అతడు 'సూక్ష్మగ్రాహి' అవుతాడు.

అప్పుడు ఈ జీవుడు 'తనుమానస' అని చెప్పబడే మూడవ భూమికలో ప్రవేశించుచున్నాడు.

క్రమంగా అతనియందు భేదభావము సన్నగిల్లుచున్నది. "మట్టితో రచించబడిన యుద్ధ దృశ్యములో మన సైన్యమేమిటి? శత్రుసైన్యమేమిటి? అంతా మట్టియే కదా!" అను ఎరుక ఉండనే ఉంటుంది చూచావా? అట్లే ఈ మూడవ భూమికలోని వానికి "నేను–నాది–అతడు–నీవు–నీ

గుణములు–నా పదార్థములు"... ఇవన్నీ మొదలంట్లా లయించిపోతాయి. సమ్యక్ పూర్వకమైన (Unity Oriented) సమగ్రమైన (Comprehensive) అవగాహన ఉదయించి, బలం పుంజుకుంటుంది.

అప్పుడాతడు "సత్త్వాపత్తి" అను నాలుగవ భూమికను పొందినవాడగుచున్నాడు.

ఆత్మజ్ఞానం వికసిస్తూరాగా ఆ యోగియందు వాసనలు సన్నగిల్లి, సూక్ష్మత్వాన్ని పొందుతాయి. వాసనలే అన్నిటికీ మూలం. ఈ అసత్యవస్తువులందు ఏర్పడుచున్న ఆసక్తి, ఈ జన్మపరంపరలు ... ఇవన్నీ వాసనల నుండే ఉద్భవిస్తున్నాయి. వాసనల రూపమే ఆసక్తి. కీలుబొమ్మను ఆడించినట్లు, ఆసక్తులు ఈ జీవుని తమ ఇచ్ఛ వచ్చినట్లు ఆడిస్తున్నాయి. అయితే నాలుగవ భూమికయగు సత్త్వాపత్తిని ఆశ్రయిస్తూ ఉండగా కొంతకాలానికి ఈ జీవుడు అకృత్రిమమైన అనాసక్తిని తనయందు పెంపొందించుకొంటున్నాడు.

అట్టి అనాసక్తుడు 'అసంసక్తుడు' అను ఐదవ భూమిక యందు ప్రవేశిస్తున్నాడు.

అట్టివాడికి కర్మల చేత గాని, ఆ కర్మల ఫలితముల చేతగాని సంబంధము ఉండదు. అవి అతనిని బంధింపజాలవు. దీర్ఘకాలంగా వాసనలను సూక్ష్మం చేస్తూ, బాహ్యపదార్థములకు సుదూరుడు అగుచూ ఉంటాడు. స్వయంగా, అంతర్ముఖ వృత్తిచే "నేను జీవుడనుగాను. నిర్జీవుడను గాను. సర్వదా బ్రహ్మమునే అయిఉన్నాను. ఈ శరీరము మొదలైనవి నేను కాదు. ఈ పదార్థ జాలము నా యందు లేదు. నేను ఈ పదార్థజాలమందు లేను. నన్ను బ్రహ్మమునుండి వేరుపరచు కారణము గాని, కార్యముగాని ఏ సమయమందును లేనేలేవు", అను రూపముగల బ్రహ్మాకార స్వభావమును సంతరించుకొంటున్నాడు. అట్టి భావనా దృఢత్వం చేత అతనియందు బాహ్యపదార్థవిస్మృతి రూపమైన ఒకానొక 'అతీత స్థితి' ఏర్పడుతోంది.

అట్టివాడు సమాధినిష్ఠుడై ఉండవచ్చు. లేదా, 'అసత్యములే' అయి ఉన్న ఈ స్త్రీ పుత్రాది ప్రాపంచక వస్తువుల మధ్య యథాతథంగా తదితరులులాగానే ఉండవచ్చు. "స్నానం, భోజనము" మొదలైన బాహ్యక్రియలు చేస్తూ ఉండవచ్చు లేక మానవచ్చు. ఎప్పుడైతే మనస్సు 'సూక్ష్మత్వం' చెందినదో ఇక అతడు 'బ్రహ్మోఽహమ్' అను భావన యొక్క అభ్యాసంచే, జన్మమృత్యువులతో సహా సర్వ సంఘటనలకు వేరైన స్వభావసిద్ధ స్థితిలో ఉండి ఉంటాడు. 'స్వధర్మము' అను 'ప్రవర్తనను' తదితరుల అనుకూలతను దృష్టిలో పెట్టుకొని నిర్వర్తించినప్పటికీ, వాటి ప్రయోజనములపట్ల ప్రీతి, మమకారాదులు ఉండవు. వాసనలు సన్నగిల్లినవాడు, ఆయా సంఘటనలను చూస్తున్నప్పుడు ఒక పసిబాలుడు ఈ ప్రపంచమును చూస్తున్నట్లు చూస్తాడు. అప్పుడే మేల్కొన్నవానివలె, నిర్లిప్తమానసిక స్థితిని ఆశ్రయించి ఉంటాడు.

వీరిలో కొందరు తమ దైనందిన సామాన్య విషయములైవున్న స్నాన – అన్న – పానాదులను కూడా ఇతరుల ప్రేరణచే మాత్రమే నిర్వర్తిస్తూ ఉంటారు.

ఏది ఎట్లైనా ఉండవచ్చు. అట్టివానికి దేనిపట్ల కూడా సంగముగాని, అసంగముగాని ఉండదు. "ఒక యంత్రముచే త్రిప్పబడుచున్న చక్రము" వలె ప్రవాహపతితమైన ఆయా క్రియా వ్యవహారములు

నిర్వర్తిస్తూ ఉంటాడు లేక ఏదీ నిర్వర్తించక పోవచ్చు! లేక, అన్నీ ఉత్సాహంతో నిర్వర్తిస్తూ ఉండవచ్చు కూడా! కానీ అవి అతనిని స్పృశించజాలవు.

ఏది ఎట్లా జరుగుచున్నప్పటికీ తాను మాత్రం బాహ్యపదార్థవిస్మృతి' ' అను ఒక చమత్కారమైన రూపము గల "ఉపరతి" స్థితియందు ఉంటాడు. అభ్యాసమే దృశ్యము నుండి ఉపరతికి (For withdrawal from involvement) ఉపాయం కదా!

తన 'స్వస్వరూపము' నందు నిలకడ పొందేవరకు ఆ యోగి శాస్త్రవిహితంగానో, లేక ఉత్తమ ఆచరణపూర్వకంగానో అభ్యాసం మాత్రం చేస్తూనే ఉంటాడు. ఇప్పటి అతని లక్ష్యము "స్వస్వరూపము నందు సంస్థితుడై ఉండుట" మాత్రమే. అంతే గాని, బాహ్యము నుండి ఏదియో పొందుట కాదు.

**పదార్థాభావని –** ఇట్లు సూక్ష్మమగు 'బ్రహ్మము' తో తన చిత్తమును ఐక్యపరచిన యోగి అసంసక్త భావన కలవాడై కొంతకాలానికి "పదార్థములను కించిత్ కూడా భావించకుండుట" అనబడు ఆరవ భూమికలో ప్రవేశిస్తున్నాడు. సర్వ భావములకు అతీతత్వము, మౌనస్థితులను అభ్యసిస్తూ వస్తాడు.

**జీవన్ముక్తుడు –** ఆ విధంగా పదార్థములను, సంఘటనలను, వివిధ స్వభావులగు జీవులను భావన చేయక, బ్రహ్మము నందు మరల మరల తన చిత్తమును లయంచేస్తూ ఉండగా, కొంత కాలమునకు అతనియందు ఆత్మవిషయమై ఉత్తమమైన ఏకాగ్రత ఏర్పడుచున్నది. ఇతరుల ప్రేరణచే, లేక ఇతరుల శుభము కొరకు మాత్రమే కొన్ని ప్రాపంచిక వ్యవహారములు నిర్వర్తిస్తున్నప్పటికీ, అతని అంతరంగము మాత్రం నిర్వికారంగా, ప్రశాంతంగా, ఏదీ కోరకుండానే ఉంటూ ఉంటుంది. చమత్కారం చూడు. ఏదీ తాను కోరకుండానే, ఆయా విషయములందు వ్యవహరిస్తూ ఉంటాడు. కర్మలు నిర్వర్తిస్తున్నప్పటికీ అతని అతీతస్థితి – మౌనస్థితి యథాతథమై ఉంటాయి.

దీనిని 'దృశ్య–అభావనస్థితి' అని కూడా అంటూ ఉంటారు.

అట్లు 'దృశ్యాతీత' స్థితిలో ఉంటూ ఉండగా, ఆ యోగి ఒకానొక తరుణంలో స్వయముగా 'తురీయుడు' అగుచున్నాడు. అనగా "నేనే సర్వేసర్వత్ర అందరియందు, అంతట, సర్వదా నిర్వికారముగా వ్యాపించియున్నాను. నేను సర్వమునకు చెందినవాడను. దేనికీ చెందనివాడను కూడా" అను అనుభవంలో ఉంటున్నాడు.

అట్టివానిని మనం "జీవన్ముక్తుడు" అని అంటున్నాం.

అతడు అభిలషితమైన వ్యవహారములు లభించినప్పుడు ప్రసన్నుడుకాడు. "ఇవి ప్రాప్తించలేదు" అని దుఃఖించడు. "నేను జీవించాలి. లేదా, మరణించాలి" అని కోరుకోడు.

"నేను జన్మమృత్యువులు, అద్యంతములు లేనివాడను" అను భావన నుండి ఏమాత్రం 'చ్యుతి' పొందడు. ఇచ్ఛారహితుడై ప్రారబ్ధకర్మానుసారంగా ప్రాప్తించిన దానిని మాత్రం అనుభవిస్తూ ఉంటాడు.

**దుఃఖాదులు ఏర్పడుచున్నది 'భ్రమ' చేతనే –** ఓ రామా! నీవు ఇప్పటికే అత్యంత చిత్తనైర్మల్యమును పొందావు. తెలుసుకోవలసిన ప్రత్యగాత్మను తెలుసుకుంటున్నావు. కనుకనే స్థిరాస్థిరములను

విభాగింపగలుగుచున్నావు. ఈ ప్రపంచవిషయములను సమగ్రంగా పరిశీలించి ఉన్నావు కాబట్టే వైరాగ్యప్రకటనంలో ఉత్తమమైన అభిప్రాయాలు వెలిబుచ్చగలిగావు. 'వైరాగ్యము' అనేది వాసనలు సన్నగిలుటచేతనే ఏర్పడుచున్నది.

కనుక, ఇక నిరుత్సాహమెందుకు? ఎల్లవేళల సమస్థితుడవై ఉండుము. ఏ వ్యవహారమైనప్పటికీ "లోకహితము" దృష్టిలో పెట్టుకొని నిర్వర్తిస్తూ ఉండు.

నీవు స్వతహాగానే సర్వదుఃఖరహితమగు చిదాత్మ స్వరూపుడవు.

ఇక ఎన్నటికీ, హర్ష-శోకములు పొందకుండెదవుగాక! ఏ ఒక్కక్షణంలోను ఈ భౌతిక శరీరాదులు నీ రూపము అయి ఉండలేదు. స్వయంప్రకాశము, నిర్మలము, సర్వవ్యాపకము, నిత్యము అయిన ఆత్మస్వరూపమే నీవు. ఈ శరీరాదులు ఉన్ననూ, లేకున్ననూ వాటితో నీకు ఏ మాత్రం సంబంధం లేదు. ఆత్మయే స్వరూపముగా గలిగినట్టి నీకు దుఃఖాదులు గాని, విషయ సుఖములుగాని, జననమరణములుగాని ఎట్లా ఉంటాయి? "నాకు జనన మరణములు లేవు" అనునదే వాస్తవమైన జ్ఞానం.

"లేదు. నేను పుట్టాను. చావబోవుచున్నాను. నాకు ఏవేవో లేవు; ఎన్నో లేనివి నేను పొందవలసి ఉన్నది ; కొన్ని తొలగించుకో వలసియున్నది - ఎప్పటికో, ఏదో పొంది, ఇక ఆపై పూర్ణుడను కావలసి యున్నది:" అను రూపములు గల భ్రమలన్నీ కట్టిపెట్టు.

ఇక, "నా గురించి అట్లా ఉంచు. నేను జ్ఞానము ఆర్జించుటచే జన్మమరణాదుల దుఃఖం నశిస్తుంది. కాని, నా బంధువుల విషయమై దుఃఖము నశించేదెట్లా?"... అని సంశయించకూడదు సుమా! ఎందుకంటావా? నీవు బంధు - మిత్ర రహితమగు శుద్ధాత్మస్వరూపుడవు కదా! అట్టి పరిశుద్ధ - ఆత్మ వస్తువుకు బంధువులేమిటి? దుఃఖములేమిటి? మిత్రులేమిటి? చింతలేమిటి? ఈ బాలుర కేరింతలు త్యజించు. అద్వితీయమగు పరమాత్మకు లేనిపోని బంధనవ్యవహారము అజ్ఞానం చేత ఆపాదించవద్దు. ఎవరైతే "నా బంధువులు-నా వాళ్లు" అని నీవు తలచుచున్నావో, వారి శరీరముల గురించి గాని, లేక వారి వాస్తవస్వరూపమగు ఆత్మ గురించిగాని నీవు శోకించవలసినపని ఏ మాత్రం లేదు. ఈ దేహము, పృథివి మొదలైనవి పంచభూతముల పరమాణు సమూహముచే నిర్మించబడినవే కదా! ఇది సర్వదా దేశ-కాల భేదములచే 'పరివర్తనశీలము' అయి ఉన్నది. అనుక్షణం పరివర్తనమయ్యేదానికి దుఃఖించటమేమిటి? అట్లాగైతే ఈ శరీరములో ప్రకృతి సిద్ధంగా నిత్యమూ ఏర్పడే మార్పు చేర్పులకు స్పందిస్తూ ప్రతి రోజు ఒక్కొక్క బంధువు పేరు చెప్పి కాసేపు దుఃఖిస్తావా? కాబట్టి అనివార్యమగు శరీరాదుల పరిణామశీలత్వము గురించి దుఃఖించటం ఎందుకు? ఇక ఆత్మ విషయానికి వస్తే, ఇది ఉత్పన్నమగుట లేదు. నశించుటలేదు.

ఓ మిత్రులారా! మీరంతా వాస్తవానికి నాశరహితులై ఉండగా, "నేను మరణించుచున్నాను" అను భావన ఎందుకు పొందుచున్నారో చెప్పండి? మృత్యురహితమగు ఆత్మకు దోషం అంటగట్టకండి.

కుండపగిలితే, ఆ కుండలోని ఆకాశం కూడా బ్రద్దలగుచున్నదా? లేదే. ఘటాకాశం (space within the pot) నకు మహాకాశం (Totality of space) నకు తేడా ఏమున్నది? మహాకాశమును ఘటం వేరుపరచగలదా?

"ఘటాకాశము" అని అసలు ఉన్నదెక్కడ?

ఆత్మకు వేరుగా ఈ జీవుడెక్కడ ఉన్నాడు?

లేని విషయం గురించి దుఃఖించుట ఏమిటి?

'దుఃఖము' అనుదానిని మనస్సు ఆశ్రయించుచున్నప్పుడు నిత్య – అనిత్య, సత్య – అసత్య విభాగము చేయు దృష్టిని అలవరచుకోవటం ఆవశ్యకం.

**అభిలాషను త్యజించాలి –** సూర్యకాంతి విశాల ప్రదేశము నందు ప్రసరించుటచే, మృగతృష్ణలో జలతరంగముల కదలికలు స్ఫురిస్తున్నాయి కదా! ఆ మృగతృష్ణాస్రవంతి వినాశనమైనంత మాత్రం చేత సూర్యరశ్మి కోల్పోయేది ఏమైనా ఉన్నదా? లేదు. ఈ శరీర నాశనము కూడా ఆత్మకు సంబంధించినదే కాదు.

నాయనలారా! అసలు నిరర్థకమూ, భ్రాంతి రూపకము అయిన పదార్థములందు మీకు అభిలాష ఎందుకు ఉదయిస్తోందో చెప్పండి?

**కొంచెము సమాలోచన చేయండి –** ఆత్మయే సర్వవస్తుస్వరూపమై ఉండగా ఇక వాంఛించవలసిన రెండవ పదార్థం ఎక్కడున్నది? వినేది, చూచేది, స్పృశించేది, ఆస్వాదించేది. ఆఘ్రాణించేది ... అంతా ఆత్మయే సుమా! ఆత్మకు అన్యమైన వస్తువంటూ ఎక్కడా ఏదీ లేదు. ఆకాశమునందు శూన్యత్వం ఉన్నట్లే ... సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు, సుప్రసిద్ధుడు అగు ఆ పరమాత్మయందు .... ఈ "స్పర్శ" మొదలైన శక్తులన్నీ ఉన్నాయి.

నీ ఈ భౌతిక శరీరము ప్రజ్ఞాస్వభావుడవగు నిన్ను నిర్వచించగలదా? లేదు.

అట్లాగే, ఈ శబ్ద – స్పర్శాది శక్తులన్నీ కలసికూడా పరమాత్మను నిర్వచించలేవు.

జీవుని ఆశ్రయించుకొని మాత్రమే 'శరీరము' ఉంటున్నట్లు ఈ శక్తులన్నీ పరమాత్మ నుండి బయల్వెడలి, పరమాత్మను ఆశ్రయించుకునే ఉంటున్నాయి.

అభిలాషయే 'వాసన' యొక్క స్వరూపం. ఈ త్రిలోకాలలో కనిపిస్తున్న ఉపాధులన్నీ సాత్త్విక–రాజస–తామసముల ఆయామిశ్రమములచే ఏర్పడి ఉన్నాయి. అయితే, ఇదంతా చిత్తము నందే ఉత్పన్నమగుచున్నది.

**వాసన క్షయిస్తే మనస్సు నశిస్తోంది –** మనస్సు నశిస్తే, కర్మకు నివాసభూతమైన 'మాయ' కూడా స్వయంగా నశిస్తోంది.

అందుచేత రామా! ఈ సంసారచక్రమును నడుపుచున్న 'వాసన' అనే త్రాడును నీవు ప్రయత్నపూర్వకంగా వివేకబలంచే ఛేదించివేయి. ఎరుగబడనంతవరకు, వాసనారూపమగు ఈ

మాయ గొప్పమోహమును కలుగజేయగలదు. ఎరుగబడిందా, ఇది అనంత-సుఖమునే ప్రసాదించ గలదు. అంతేకాకుండా, బ్రహ్మసాక్షాత్కారం కూడా ప్రాప్తింపజేయగలుగుతుంది.

**ఈ 'మాయ' వచ్చేది ఎక్కడి నుండి? –**

**ఆగతా బ్రహ్మణోభుక్త్వా సంసారమిహలీలయా**

**పునర్బ్రహ్మైవసంస్మృత్య బ్రహ్మణ్యేవ విలీయతే ॥**

ఈ 'మాయ' బ్రహ్మమునుండి ఉద్భవిస్తోంది. లీలామాత్రంగా 'సంసారము' ను స్మరించుచున్నది. అనుభవించి, మరల స్వలీలయగు బ్రహ్మవిద్యచే సంసారనాశనమొనర్చుచున్నది. బ్రహ్మమును ఎరుగుచు, బ్రహ్మమునందే లీనమగుచున్నది. ఆహాఁ! ఎంతటి చమత్కారం ! మంగళస్వరూపుడు, రూపరహితుడు, అప్రమేయుడు, నిరామయుడు అయి ఉన్న పరబ్రహ్మనుండి, ... నిప్పు నుండి నిప్పురవ్వలులాగా .... ఈ ప్రాణికోట్లు ఉత్పన్నము లౌతున్నాయి.

| | |
|---|---|
| ఆకులో | ఈనెలు |
| జలంలో | తరంగాలు |
| బంగారంలో | ఆభరణాలు |
| అగ్నియందు ఉష్ణము | ప్రకాశము |

ఇవన్నీ ఎట్లాగైతే అంతర్భాగంగా ఉన్నాయో, అట్లాగే ధ్యాన రూపమును దాల్చుచున్న ఆ పరమాత్మ యందు ఈ ముల్లోకములు ఉన్నాయి.

ఆయన యందే ఈ జగత్తు ఉత్పన్నమైనది. ఆయన యందే స్థితి కలిగి యున్నది. ఆయన యందే లయిస్తోంది. అయితే ఏం? ఆయనయందు 'జగత్తులు' మొదలైనవేవీ లేవు. ఉండబోవు కూడా!

అందుచేత ఈ జగత్తు పరమాత్మయే అయి ఉన్నది. ఆ పరమాత్మయే సమస్త ప్రాణికోట్ల యొక్క అంతరాత్మయగు 'బ్రహ్మము' అని చెప్పబడుతోంది. ఆతనిని ఎరిగినవాడు ఈ జగత్తంతా ఎరుగుచున్నాడు.

**అంతేకాదు, ఎరుగుచున్నది కూడా అతడే –** అతనికి నామరూపాలు లేవు. అయినప్పటికీ అనంతాకారము కలిగిన ఆ పరమాత్మకు శాస్త్రములు రచించటానికి, శిష్యులకు బోధించటానికి (వ్యవహారార్థం) "చిత్తు-బ్రహ్మము-శివుడు-విష్ణువు-ఆత్మ-పరమాత్మ" ఇత్యాది అనేక పేర్లు తత్త్వజ్ఞులు కల్పించారు. అదంతా అపరిపక్వమైన అవగాహనగల శిష్యజనులను ఉద్ధరించుటకొరకే అయి ఉన్నది. అట్టి కల్పిత నామములు, రూపములు భవిష్యత్తులోకూడా తత్త్వజ్ఞులచే ప్రవచించ బడబోవుచున్నాయి.

**శుద్ధసాక్షీతత్త్వము-బుద్ధి-జగత్తు –** జీవన్ముక్తులు సర్వదా "నేను సాక్షీతత్త్వమును. నా స్వరూపము సర్వదా నిశ్చలమై, వికార రహితమై ఉన్నది. అది అట్లే ఉండబోవుచున్నది కూడా" అను ఎరుకయే కలిగి ఉంటారు. ఒకవేళ ఎప్పుడైనా దైవకృతంగా ఇంద్రియములకు ప్రియాప్రియములైన సంఘటనలు పొందటం జరిగినా, వాటియందు ఆసక్తిగాని, భావోద్రేకముగాని పొందరు. సర్వదా అవినాశియగు

చిదాత్మయొక్క భావనను, అనుభవమును కలిగి ఉంటారు. అంతేగాని, సంసారస్వభావులు అగుటలేదు. వారు 'చ్యుతి' నుండి వెనువెంటనే నిశ్చల స్వరూపమగు 'అచ్యుతి' ని అవధరించుచున్నారు.

ఆకాశము కంటేకూడా అతి సూక్ష్మము, నిర్లిప్తము అయినట్టి ఆ చిదాత్మయందే ఈ జగత్తు ప్రతిబింబితమగుచున్నది. ఇది 'శుద్ధ సాక్షిస్వరూపదృష్టి'కి వేరుగా "సంకల్పములు-వికల్పములు, అహంకారములు - మమకారములు" మొదలైన చమత్కారములతో ప్రకటితమౌతోంది.

**అట్లు ప్రకటితమగుచున్నది ఏది? జగత్తా? జగత్తుజడమైనది కదా! -**




1) సాక్షిచైతన్యము - జగత్తులమధ్య 'బుద్ధి' ప్రతిబింబించుచున్నది.
2) 'బుద్ధి' అనునది 'ప్రియము - అప్రియము' అను విభాగములు కలిగి ఉంటోంది.
3) ఈ బుద్ధి జగత్తువైపు ప్రసరించుచున్నంత వరకు జడత్వమును పొందుతోంది.
4) సాక్షి చైతన్యముయొక్క అవివేకదృష్టియే జగత్తు ;
"ఇదమ్ సర్వమ్ బ్రహ్మమ్" అనునదే వివేకము.

ఈ 'బుద్ధి' .... లోభము, మోహము మొదలైన విషయములందు అవిచారణాపూర్వకంగా ప్రవేశించుచున్నది. అయితే బుద్ధి ప్రేరేపిత మాత్రం చేతనే కనిపిస్తున్న ఈ 'లోభమోహాలు' అనబడేవాటికి స్వకీయమైన అస్థిత్వం లేదు. అందుచేత "అవి యథార్థానికి లేవు" అని చెప్పబడుతోంది. భ్రమచేత మాత్రమే ఉన్నట్లు కనబడుచు, భ్రమతొలగగానే లేకుండా పోయేవాటిని 'ఉన్నాయి', అనాలా?, 'లేవు' అనాలా? అయినను, అజ్ఞానదృష్టి ఉన్నంతవరకు ఈ లోభమోహాలు ప్రతిబింబించి, దుఃఖాదులు ప్రాప్తించటానికి కారణ భూతములౌతున్నాయి.

**మూర్ఖత్వము త్యజించబడుగాక! -** ఓ రామచంద్రా! 'దేశ-కాల' రహితమైన నిర్వికల్ప స్వరూపమగు చిదాకాశమే నీ-నా రూపము, ఆకారము కూడా. అట్టి చిదాకశము (Pure-Realm of consciousness or awareness) నందు నీకు ఈ లజ్జ-భయ-విషాదములతో కూడిన మోహ మంతా ఎక్కడినుండి దాపురించుచున్నదో చెప్పు? దేహమే లేనట్టి నీవు అసత్యము అయి ఉన్న ఈ దేహమును ఆశ్రయించి ఉత్పన్నములగుచున్న ఆయాస్థితి-గతులను చూచి దుఃఖించుటయా? దుర్బుద్ధితో కూడుకొన్న మూర్ఖత్వమే నిన్ను దుఃఖితుని చేయుచున్నదని గుర్తు చేస్తున్నాను.

**ఆత్మ - చిత్తము - దేహము -** నాయనా! రామా! ఈ దేహము ఖండఖండములుగా ఛేదించబడుగాక! అఖండమగు చైతన్యమునకు ఖేదన-అఖేదనములు ఉండనే ఉండవు. ఎవరైనా ఉన్నట్లు చూస్తుంటే, అది అజ్ఞానము చేతనేనని మేము గమనిస్తున్నాము. దేహము నశిస్తే "అజ్ఞాని యొక్క ఆత్మయే నశించుటలేదు" అని జనులు ప్రవర్తనలను ప్రకటించటం చూస్తూనే ఉన్నాము కదా!* ఇక జ్ఞాని గురించి వేరే చెప్పేదేమున్నది? సమ్యక్‌దర్శి యగు (One who perceives equality, evenness and sameness everywhere, all times) జ్ఞాని యొక్క ఆత్మకు ఈ దేహ నాశనముచే కలుగు లోటుపాటు లేమి ఉంటాయి?

వాస్తవానికి ఈ చిత్తము స్వతంత్రమైనదేకాని, పరాధీనమైనది కాదు. అనగా? నీ చిత్తము నీ అధీనంలోనే ఉంటుందిగాని, ఎవరో పరాయివారి అధీనంలో కానేకాదు. ఇకదాని చంచలత్వమంతా- స్వకీయమైన విషయ మననరూపమగు అభ్యాసవశంచేతనే సుమా!

అనగా, ఇది ఎక్కడినుండో, ఎవరిచేతనో నియమించబడుటలేదు. దాని గమనాగమనములు దాని అధీనంలోనే ఉన్నాయి. "దానిశక్తి 'ఇంతింత' అని చెప్పలేము" అని ఐందవోపాఖ్యానంలో చూచాము కదా! ఏ ఆశ్రయము లభింపజాలని 'సూర్యమార్గము (The orbit of Sun)' లోకూడా అది క్షణంలో పయనించగలదు. అట్టి చిత్తమునే మనం 'పురుషుడు' అని అంటున్నాం. మనం ఎవరినైనా, ఎందుకైనా, సంబోధించేటప్పుడు, దృష్టిలో పెట్టుకుంటున్నది చిత్తమునే గాని, ఈ దేహమును ఏమాత్రం కాదు సుమా! జనులు మాట్లాడుకునేది, వ్యవహరించేది, ప్రేమించేది, ద్వేషించేది ఈ చిత్తమునే. కాబట్టి చిత్తమే జీవుడు. ఈ పాంచభౌతిక - దేహము జీవుడు కాదు. 'జీవించుట' అను కర్తృత్వమును ఈ శరీరమాత్రమునకు ఆపాదించుట ఉచితం కాదు.

**ఆత్మ దేనిచేతనూ స్పృశించబడజాలదు -** ఓ రాఘవా! ఒకడు జ్ఞాని కావచ్చు, లేక అజ్ఞాని కావచ్చు, దేహము ఉండవచ్చు, లేక నశింపవచ్చును. ఆత్మమాత్రం యథారీతిగా, ముల్లోకములందు అచంచలంగా ఉండియే ఉంటోంది. అంతేకాదు, స్వస్వరూపాత్మ ఈ ముల్లోకములకు ఈవల- ఆవల సర్వదా ఆక్రమించుకొని వెలుగొందుచున్నది.

ఈ దేహం నశించినంత మాత్రం చేత ఆత్మ నశించదు. దీనిని సందేహించువారు తమ ఉనికిని తామే సందేహించువారు అగుచున్నారు.

ఇక ఎదురుగా కనిపిస్తున్న ఈ సుఖ-దుఃఖాలన్నీ శరీరమునకే గాని, లేదా మనస్సుకే గాని.... అగ్రాహ్యమగు ఆత్మకు కానేకాదు. చిద్వస్తువగు ఆత్మ మనోమార్గముకంటే కూడా అతీతమైనది. ఆకాశము కంటే కూడా అత్యంత విస్తీర్ణంగా వ్యాపించియున్నది. అట్టి చిద్వస్తువు ప్రాపంచక దుఃఖముల చేత గాని, విషయసుఖముల చేత గాని ఎట్లా ప్రభావితం అవుతుంది చెప్పు?

---

* సోది అడుగుట, ఆత్మశాంతికై ప్రార్థనాదులు చేయడం, చిత్రపటమును ఆవిష్కరించడం, సావత్సరీకములు జరపడం, మానసిక ఆహ్వానాదులు..... ఇవన్నీ ఈ అభిప్రాయము యొక్క దృష్టాంతాలు.

**"దేహోఽహమ్ - ఆత్మాఽహమ్"** - ఈ చైతన్యము అనేక జన్మలుగా అభ్యస్తమై యున్న వాసనలతో కూడుకొని ఉంటున్నది. అయితే ఈ 'వాసనలు' అనునవి "నేను ఈ దేహమును" అను భావన యొక్క పరిధిలో మాత్రమే ఉనికి కలిగి ఉంటాయి. ఒక సమయంలో ఈ చైతన్యము జ్ఞానమును ఆశ్రయించి, ఆ జ్ఞానబలంచేత తననుతాను ఎరుగుచున్నది. అప్పుడీ "దేహోఽహమ్" భావనను త్యజించివేస్తోంది. తనయొక్క యథార్థ స్వరూపమైయున్న పరమాత్మ యందే ప్రతిష్ఠిత మగుచున్నది.

**అసలు 'జీవుడు' అనగా ఎవడు?** - 'ఉపాధి' అనే ప్రదేశంలో ఏర్పడి ఉండువాడు మాత్రమేనా? కానేకాదు! అట్లా అయితే, అతనికి ఉపాధికంటే వేరైన సత్తాయే ఉండేది కాదు. ఉపాధి నశిస్తే అతడు కూడా నశించేవాడే. కాబట్టి, ఈ జీవుడు దేహపరిమితుడుకాదు.

**కాని, ఆత్మగా జీవుడుగా అగుట ఏమిటి?** - ఆత్మను ఉపాధిపరంగా, చిత్తపరంగా చూచు అజ్ఞానదృష్టికి మాత్రమే జీవుడు అనబడువాడు తారసపడుచున్నాడు. ఆత్మకంటే వేరుగా జీవుడు అనబడే వాడే లేడు. ఇందులో సందేహం లేదు. ఆత్మ జీవుడే అగుటలేదు కదా ! ఇక 'దేహము'గా ఎట్లా అవుతుంది?

జీవుడు ఆత్మయే అయి ఉండుటచే, ఈ 'దేహము' అనే పంజరం నశించినప్పటికీ అతనికి కలుగుచున్న నష్టమేమీ ఉండదు. ఓ రామా! నీవు జీవుడవే కావు. ఆత్మయే అయి ఉన్నావు. అట్లే ప్రతిఒక్కరుకూడా. ఇక దుఃఖము పొందవలసిన పనేమున్నది?

"నేను ఈ శరీరమును కాదు." "జీవుడు' అనబడునది కూడా నేను కాదు."

"నేను సదా సత్స్వరూపమగు బ్రహ్మమునే అయి ఉన్నాను." ....

అని భావిస్తూ ఉండు. అంతేకాని, భ్రాంతి రూపములైన నశ్వరదేహములందు "ఈ దేహమునే నేను" అనునట్టి దేహాత్మభావన చేయటం ఉచితమా? .... కాదు.

ఓ సర్వసభికులారా! సర్వజనులారా! మీలోని ప్రతిఒక్కరు "నేను అఖండుడను, అప్రమేయుడను" అనురూపమైనట్టి "ఆత్మసారూప్య భావనను" నిరభ్యంతరముగా చేయవచ్చు. శుద్ధము, అకళంకము అగు పరమాత్మకు ఏ విధమైన 'ఇచ్ఛ' ఉండదు కదా! 'చిదాత్మ - స్వభావులే' అయి ఉన్నట్టి మీరంతా "నేను ఇచ్ఛారహితుడనే" అని ఎందుకు భావించరాదు?

**జగత్తు భావనామాత్రమే** - చిదాత్మ సర్వులయందు సాక్షీభూతమై, సర్వత్రా సమమై, నిర్మలరూపమై, నిర్వికల్ప స్వభావయుతమైయున్నది. అట్టి చిదాత్మయందు, అద్దమునందు వస్తువులు కనబడునట్లు, ఈ బ్రహ్మాండములన్నీ ప్రతిబింబిస్తున్నాయి. స్వచ్ఛమైన మణి అనిచ్ఛాపూర్వకంగానే (Without maintaining intentions) తనయందు సూర్యకిరణములను ప్రకాశింపజేయుటలేదా? ఆత్మకు ఏ ఇచ్ఛ లేకున్నప్పటికీ, వికల్పరహితమగు ఆత్మయందు ఈ జగత్తు ప్రతిబింబించుచున్నది. అద్దం కదలకుండానే తన యందు వస్తువుల కదలికలను చూపుచున్నది కదా! "దర్పణం - ప్రతిబింబం"ల అనిచ్ఛా పూర్వకమైన సంబంధం ఎట్లు సిద్ధిస్తుందో, ఆత్మ - జగత్తుల భేదాభేద సంబంధం సిద్ధిస్తోందని

గ్రహించుటయే "జ్ఞానము". అద్దములోని ప్రతిబింబము అద్దముకంటే వేరా? యథార్థానికి ఆ రెండు ఒక్కటే అయినప్పటికీ, భావనామాత్రంచేత వేరువేరుగా ఉంటున్నాయి. జగత్తుకూడా భావనా మాత్రం చేతనే ఆత్మకు వేరుగా తోచుచున్నది.

సూర్యుని సన్నిధానం చేతనే (Just by mere presence), అతని ఇచ్ఛ లేకుండానే (కిరణజన్య సంయోగము Photosynthesis మొదలైన) జగత్ కార్యములన్నీ సిద్ధిస్తున్నాయికదా! 'చేతనసత్త' యొక్క ఔన్నత్యమాత్రంచేత ఈ జగత్తు అంతా ఉత్పన్నమగుచున్నది. ఓ రామా! ఎప్పుడైతే నీ దృష్టి నుండి ఈ నామరూపాత్మక జగత్తు నివృత్తిస్తుందో, అప్పుడు నీ చిత్తము నందు 'ఆకాశము' వంటి శుద్ధ చైతన్యస్వరూపము రూఢి కాగలదు. 'దీపము' గదిలో వెలుగుచున్నంత మాత్రంచేత ఆ వెలుగులో ఆయా వస్తువులు, వాటి భేదాభేదములు కనబడుచున్నాయి కదా! "అయితే వస్తువుల భేద వ్యవహారము దీపపు వెలుగుచేతనే కల్పించబడుచున్నది" అని అంటామా? లేదు. ఈ జగత్తులోని భేద వ్యవహారమునకు, భగవంతునికి గల సంబంధము అట్టిదే.

చిద్వస్తు స్వభావ మాత్రంచేత, భావనానుగుణంగా ఈ జగత్తు ఏర్పడి ఉంటోంది.

మోహం తొలగితే చాలు! సర్వము విదితము, అనుభవము కాగలదు.

ఆకాశము యొక్క స్వరూపమేమిటి? శూన్యమేకదా! అయినప్పటికీ జనులంతా అక్కడ సుందరము, శోభాయమానము, కాంతియుతము అయిన నీలత్వమును చూస్తున్నారు. అట్లాగే, జనులు ఆత్మయందు జగత్తులను దర్శిస్తున్నారు. భావన-అనుభవం... ఒకదానిని రెండవది నిర్మిస్తోంది. భావనలో ఏర్పడుచున్న భ్రమ తొలగితే అంతా విదితమే అవుతుంది.

పరమాత్మ నుండి మనస్సు, మనస్సు నుండి జగత్తు ఉత్పన్నములవుతున్నాయి. ఈ జగదాడంబర మంతా మనస్సు చేస్తున్న పనే! సంకల్పము నశించినంత మాత్రంచేత చిత్తము క్షయించగలదు. మనో-జగత్తుల వాస్తవస్వరూపం ఆత్మయే!

చిత్తము క్షయిస్తే మోహం స్వయంగానే నశిస్తుంది. మేఘాలు తొలగగానే నిర్మలాకాశం స్వయం గానే శోభిస్తుంది కదా! మోహం తొలగగానే అంతఃకరణము నందు, "జన్మవర్జితుడు, అనాది, అనంతస్వరూపుడు, నిర్మలుడు, చిన్మాత్రస్వరూపుడు" అగు పరమాత్మ స్వయంగానే ప్రకాశిస్తున్నాడు.

❖❖❖

## 2. లఘు సమీక్ష

మరికొంత లఘువుగా సమీక్షిస్తున్నాను. విను -

సర్వాత్మకమగు చిదాత్మయందు మొట్టమొదట "సమస్తప్రాణుల సమష్టికర్మ" రూపమున సమష్టి క్రియాశక్తి ప్రధానం అయినట్టి "మనస్సు లేక, చిత్తము" ఆవిర్భవిస్తోంది. అట్టి సమష్టిచిత్తరూపునే "బ్రహ్మదేవుడు" అని అంటున్నాం. ఆతని మనోసంకల్పమునుండి 'మనువు' మొదలైన మానసదేహులు ఏర్పడుచున్నారు. వారు దేహమును ధరించి, వివిధనామరూపములతో కూడిన ఈ మిథ్యాజగత్తును

విస్తరింపజేస్తున్నారు. బాలుడు బేతాళుని రూపమును మనస్సునందు కల్పించుకొని, అదియే బాహ్యమున చూచుచున్నట్లు, ఇదంతా ఏర్పడుతోంది.

సమష్టి – వ్యష్టి భేదములచే కల్పితమగుచున్న ఈ జగత్తంతా 'మనోమాత్రమే'! మనస్సు కూడా 'అసత్తే' అయి ఉన్నది. అజ్ఞానముయొక్క కార్యమే అది. సర్వమునకు అధిష్ఠానమై వెలుగుచున్న 'సాక్షిచైతన్యము' యొక్క స్ఫూర్తి చేతనే 'అసత్తు' అగు ఈ జగత్తు స్ఫురిస్తోంది.

అట్లు జగత్తుగా స్ఫురించుటయే దీని "ఉత్పత్తి". అంతయు విజ్ఞానదృష్టిచే పరిశీలించుచున్న మేము, "ప్రపంచ రహితమైన సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మమే ఈ 'జగత్తు' రూపముగా అజ్ఞానదృష్టికి తోచుచున్నది" అని సిద్ధాంతీకరిస్తున్నాం. వాస్తవానికి 'జగత్తు' అనబడునదేదీ ఉత్పన్నమే అయిఉండలేదు. నిత్యోదిత–పరమానంద స్వరూపమగు ఆత్మయే స్వకీయ–అజ్ఞానకారణంగా జగత్తుగా దర్శించబడుతోంది.

పూర్ణ మహాసముద్రము యొక్క 'సత్తామాత్రము' నందు వలయాకారములగు తరంగముల పంక్తి (Water - ripples) ఉద్భవించి స్థితి పొందుచున్నాయి కదా! నీటిని ఆధారం చేసుకునే వలయాకారములు ఉంటున్నాయి. ఈ మనస్సు తనకు అధిష్ఠానమైయున్న సాక్షి చైతన్యము యొక్క ప్రభావం చేతనే "సద్వస్తువా?" అన్నట్లుగా భాసిస్తోంది.

వాక్కునకు లభ్యమగుచున్న ఈ విచిత్రమైన జగత్తు, ఈ దృశ్యము 'మిథ్యయే' అయి ఉన్నాయి.

సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మమే అవికృతరూపమున సదా నెలకొనియున్నది. ఇది గ్రహించటమే– బోధించటమే శాస్త్రముల – సర్వప్రయత్నముల అంతరార్థమైయున్నది.

❖❖❖

## ఉత్పత్తి ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు – లోక కళ్యాణమస్తు

ఓం తత్‌సత్

❖❖❖

మోక్షోపాయమై ఉన్నట్టి ఈ గ్రంథము యొక్క సహాయంచే 'జ్ఞాన కాంతి'ని పొందువారు మోహాంధకారంచేత గ్రుడ్డివారు అవటం జరగదు. 'తృష్ణ' అనేది వివేకము ఉదయించనంత కాలమే ఉంటుంది. తృష్ణ ఉన్నంతకాలం వేదనలు తప్పవు.

ఓ జనులారా! లేవండి. ఈ శాస్త్రవిచారణను అనుసరిస్తూ రండి. సంసార బంధమును త్రెంచి వేయుటకు కృతనిశ్చయులు అవండి.

**వసిష్ఠ మహర్షి**

**పుట: 130**

**శ్రీరాముడు :** గురువర్యా! మునీంద్రా! ఇంతకీ ఈ 'మనస్సు' అనునది జడమా? చేతనమా? ఈ విషయం ఇంకా నాకు బోధపడనేలేదు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు చిత్ - అచిత్ రూపమైయున్నది. అనగా, ఇది జడముకాదు. చేతనము కాదు. చైతన్యమే సంసార దశ యందు ఉపాధి దోషంతో కూడుకొని ఉన్నప్పుడు 'మనస్సు' అని పిలువబడుతోంది. అనగా, చైతన్యమునకు వేరుగా 'మనస్సు' అనబడునది ఏది లేదు. 'ఆలోచన' అనునది ఆలోచించువానికి వేరుగా ఉంటుందా? ఉండదు కదా!

**పుట: 522**

CONQUER YOURSELF
ISBN 93-83972-14-2 (Set)
9 789383 972142
www.rkmath.org

**రామకృష్ణ మఠం**
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org

Vasishta Rama Samvadam : Vol 1
ISBN 93-83972-10-4 ₹ 1000/- (set)

# వసిష్ఠ రామ సంవాదం

## (యోగ వాసిష్ఠమ్)



రెండవ సంపుటం

స్థితి, ఉపశమన ప్రకరణములు

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## (శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత యోగవాసిష్ఠము)

**రెండవ సంపుటం**

**స్థితి, ఉపశమన ప్రకరణములు**

*అనుసృజన:*

**వై. హెచ్. రామకృష్ణ**

**రామకృష్ణ మఠం**

**దోమలగూడ, హైదరాబాదు-500 029**

# ప్రవేశిక

మొదటి సంపుటంలో వైరాగ్య–ముముక్షు–ఉత్పత్తి ప్రకరణాలను అధ్యయనం చేశాము. ప్రపంచం అనిత్యం, అసుఖం అంటే మనకు అర్థం అవుతుంది. దృశ్య జగత్తు మూడు కాలాలలోనూ లేనే లేదు; ఉన్నదంతా ఒకే పరబ్రహ్మ చైతన్యం అంటే మనకు అంత తొందరగా అర్థమవదు. మనం అనాదిగా ఈ జగత్తు నిజమని భావిస్తూ వివిధ కర్మలనొనరిస్తూ, ఆ కర్మఫలాలను అనుభవిస్తూ వస్తున్నాము. కర్మాచరణం వలన ఏర్పడే సంస్కారాలు, మరల మరల ఆ కర్మల నొనరించే దిశగా మనల్ని ప్రేరేపిస్తుంటాయి. ఈ వాసనలు మనచే శరీరాలను ధరింపచేస్తూనే ఉన్నాయి. వాసనామయ మనోదేహాలే తన నిజస్వరూపం అన్న మిథ్యావగాహనతో సంసార యాత్రలో అనేక మజిలీలు చేస్తున్న జీవుడు ఎప్పటికో గమ్యం చేరుకుంటాడు. అజ్ఞానజనిత దృశ్య ప్రపంచంతో పూర్తిగా తాదాత్మ్యం చెంది ఉన్న జీవుడికి తాను అనుభవిస్తున్న జగత్తు మిథ్య అని వెంటనే బోధించటం వలన ప్రయోజనం ఉండదు. అందుకని వసిష్ఠ గురువరేణ్యులు ప్రపంచానికి జ్ఞానం గరపే నిమిత్తం దశరథాత్మజుడి మూలకంగా చేసిన బోధ ఐన ఈ కావ్యంలో ముందుగా వైరాగ్య భావనను ఉద్దీపింపచేయటానికి ప్రయత్నించారు; రామచంద్రుడికి కలిగిన వైరాగ్యాన్ని ప్రశంసిస్తూ, ఆ భావనే స్వస్వరూపాన్ని గ్రహించటానికి ప్రథమ సోపానం అని తెలియజేశారు. ప్రపంచం అనిత్యం, అశాశ్వతం, అపరిపూర్ణం, దుఃఖమయం కనుక విజ్ఞుడైనవాడు వైరాగ్యాన్ని పెంపొందించుకోవాలని సూచించారు.

తరువాతి ప్రకరణమైన ముముక్షు ప్రకరణంలో కేవలం పురుషప్రయత్నం ద్వారానే సాధకుడు జన్మ మృత్యు సంసార చక్రంనుంచి బయటపడగలడని, అంతకు మించి మార్గంలేదని నొక్కి వక్కాణించారు. వివిధ దృష్టాంతాలతో, ఇతఃపూర్వం ఎవరెవరు అలా పురుష ప్రయత్నంతో జగదవిద్యా వల నుంచి తప్పించుకున్నారో వారి జీవితగాథల ద్వారా జిజ్ఞాసువును తీవ్ర ప్రయత్నోన్ముఖుడిగా చేశారు.

ఇక మూడవదైన ఉత్పత్తి ప్రకరణంలో దృశ్య ప్రపంచం యావత్తూ మనోకల్పితమని, మనస్సుకు ఆవలగా జగత్తులేదని నిరూపించటానికి ప్రయత్నించారు. ఈ జగద్భావనను పునః పునః ధ్యానించటం వలన అసత్తు ఐన దృశ్యం, అవిద్య వలన రజ్జువులో సర్పాన్ని దర్శించే తీరున, సత్తుగా కనబడుతుందని బోధించారు.

ఈ రెండవ సంపుటంలో నాల్గవదైన స్థితి ప్రకరణము, ఐదవదైన ఉపశమన ప్రకరణములను అధ్యయనం చేయబోతున్నాం.

స్థితి ప్రకరణంలో అజ్ఞానం, భ్రాంతి గురించి ఎక్కువగా చెప్పకుండా సృష్టి అనేది నిజానికి ఏదీ లేదనీ, అది కేవలం ఒక పదం, ఒక శబ్దం మాత్రమేనని తెలుపుతూ దృశ్యం ఇంద్రధనుస్సు లాగా శూన్యంపై వేసిన చిత్రం అని సాధకుడి మనస్సు నుంచి దృశ్య భావనను ఉన్మూలించటానికి

ప్రయత్నించారు. పగటి కలలాగా, జగదనుభవం కూడా ఒక కలే అని ఇంద్రియగోచర దృశ్య అవాస్తవికతను చాటుతూ, అహంకార జనిత మనస్సుకు సంబంధించిన ఎరుక వలననే ఈ అనుభవం కలుగుతుందని అంతకు మించి ఈ జగత్తుకు ఉనికి లేదని చాటారు.

ఐదవదైన ఉపశమన ప్రకరణంలో మనో మాలిన్యాలైన రజో తమస్సులను తొలగించుకొని, సత్త్వం వృద్ధి చెంది, ద్రష్ట దర్శన దృశ్య భేదం తొలగి కేవాలానంద స్వరూపమైన చిన్మాత్ర చైతన్యాన్ని అనుభూత మొనర్చుకోవచ్చని వసిష్ఠ మహర్షి వచిస్తారు. విచారణ ద్వారా అవిద్యాజనిత దృశ్యానుభూతిని తొలగించుకొని మనోరాహిత్యాన్ని పొందవచ్చునని ఈ ప్రకరణంలో తెలియజేస్తారు. శాస్త్రాధ్యయనం, సత్సాంగత్యం, సద్గురువును ఆశ్రయించటం ద్వారా మోక్షం కరతలామలకం అవుతుందని బోధ. దేహ భావన వలన ఆత్మ మలినమవదు. మనస్సు స్వభావాన్ని అర్థంచేసుకొని కోరికలను, సంకల్పాలను త్యజించినవారు ఉన్నత భూమికలను చేరుకుంటారు.

'ద్వంద్వ భావనను వదిలి ఆత్మోపస్థితులవండి' అని సర్వులను ఉద్దేశించి ఎలుగెత్తి చాటుతుంది ఈ ప్రకరణం.

**– ప్రకాశకులు**

# విషయ సూచిక

❖❖❖

# I. జగత్ స్థితి

## 1. ఈ జగత్తు ఏర్పడి ఉన్నదెక్కడ?

**శ్రీరాముడు:** తండ్రీ! ఈ జీవుని యొక్క వాస్తవ స్వరూపము అనంతగుణ గంభీరమగు చిదాకాశమేనని అనుకున్నాముకదా! మరి ఈ జన్మ-కర్మ-బంధ-మోక్ష పరంపరల చమత్కారం అంతా ఏమిటి? ఇవన్నీ ఎందుకు ఏర్పడుతున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** మహా ప్రభావవంతమైనట్టి చిదాకాశము ఒక సమయంలో రజోగుణముచే కప్పబడిన దవుతోంది. ఆకాశము మేఘావృతము అవుతూ ఉంటుంది చూచావా? ఇది కూడా అట్టిదే. అట్లు రజోగుణముచే కప్పబడినప్పుడు అహంకారము అనబడే పరిమిత త్వమును, లేక ఆచ్ఛాదనను పొందుతోంది. మేఘములు కారణంగా ఆకాశము ఇంత మాత్రమే... అది పరిమిత మైనదే... అని బాలుడు అనుకుంటాడు చూశావా! బాలునితో సమానమైన ఈ జీవుడు నేను పరిమితుడను అను భావన పొందుచున్నాడు. ఆకాశము తన అనంతత్వమును త్యజించ కుండానే పరిమితత్వము పొందినదానివలె అగుపిస్తున్నట్లు, చిదాకాశము కూడా తన యొక్క ప్రకాశ రూపమును, అఖండత్వమును త్యజించకుండానే అహంకార-ప్రాణ-ఇంద్రియాలను అనుభవిస్తూ, తనపై తానే పరిమితత్వమును ఆపాదించుకుంటోంది!

మృగతృష్ణ అసత్తే. కానీ అందులో జలము కనిపిస్తున్నది కదా!

భ్రాంతి (Illusion) రూపముగా గల వాసనచే చిదాకాశము తన చిద్రూపము నుండి భావనా మాత్రంగా విడివడుచున్నది. ఒక వైపు ఈ పతనము ఇట్లు ఉండగా, మరొకవైపు విజ్ఞులైనవారు ఉత్తమ బుద్ధిని సంపాదిస్తున్నారు. ఇట్టి నిర్మల-సునిశిత బుద్ధి యొక్క ప్రభావం చేత ప్రత్యగాత్మ వైపుకు అభిముఖమగు అవగాహన సముపార్జించుచున్నారు. జీవో బ్రహ్మేతి నాపరః ( ఈ జీవుడు బ్రహ్మమే కాని, మరింకేమీ కాదు), సర్వం ఖల్విదం బ్రహ్మ (ఇదంతా ఇప్పటికీ, ఎప్పటికీ బ్రహ్మమే అయి ఉన్నది), అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మమే అయి ఉన్నాను). తత్త్వమసి (నీవు బ్రహ్మమే అయి ఉన్నావు) సోఽహం (నేను ఆ బ్రహ్మమే) ఇత్యాది మహావాక్య రూపమగు వేదాంత శాస్త్ర జ్ఞానముచే, ఈ దృశ్యము అసత్తు అని ఎరుగుచున్నారు. ఇట్టి దృశ్యమును తమయందు రహితం చేసివేస్తున్నారు. తద్వారా సంసార సాగరమును దాటి వేసి నిర్వాణపదమును పొందుచున్నారు.

ఈ విధంగా ఈ జీవులు రెండు వేరువేరు మార్గములలో ప్రవృత్తులగుచున్నారు.

ఏది ఏమైనా, వారంతా చిదాకాశమే స్వరూపముగా కలిగి ఉన్నారు కదా! కనుక మనలోని ప్రతి ఒక్కరియొక్క చిదాకాశత్వమునకు ఏక్షణంలోనూ ఏమాత్రమూ హాని కలుగుట లేదు.

ఓ రామచంద్రా! ఒక విషయం నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను. మోక్షమునకు దారి చూపగల అట్టి వేదాంత శాస్త్రమే సత్యము, సుఖప్రదము, అనుసరణీయము కూడా! అందుకు వేరైనట్టి శుష్కమైన తర్కములన్నీ దుఃఖ–భయ–అసత్యమయములే అయి ఉన్నాయి. అట్టివన్నీ అనేక విధములైన వికారములకు కారణమగుచున్నాయి.

**తర్కము, ఆత్మానుభవము -** కేవలం తర్కశాస్త్రమును ఆశ్రయించదలిచేవారు పరమపురుషార్థ రూపమగు 'ఆత్మలాభము'ను పొందలేకపోవచ్చునని మా అభిప్రాయం. అట్లు కాకుండా, స్వానుభవము జోడిస్తూ, శ్రుతులచే ప్రసిద్ధముగా ప్రకటించబడుచున్న దానిని అనుసరించుచూ, ఉత్తమగతిని పొందుటకు సిద్ధపడేవానికి వినాశనము చేకూరు ప్రసక్తి ఉండదు. "ఇది ఒక గొప్ప సిద్ధాంతము – దీనిని విజయవంతముగా ప్రతిపాదించుట మాత్రమే మా లక్ష్యం. ఇంత మాత్రమే సత్యము – ఇంకేమీ వినము – వినసీయము" అనునది సంకుచితత్వమునకే దారి తీస్తోంది. సత్యము సర్వదా నిర్దుష్టము, అనుభవమాత్రమే అయివున్నది. 'తర్కము' అనునది అనేక సందర్భములలో 'పరిమితదృష్టి' అను జాడ్యముచే బాధింపబడుచూ ఉంటోంది.

❖

ఈ జీవుడు "ఇది నాకు ఉండుగాక... ఇది నేను పొందనుగాక! వీరు నా వారు... వారు తదితరులు... ఈ శరీరమునందే నేను ఉన్నాను... ఈ శరీర శిథిలత్వముచే నేను శిథిలమగు చున్నాను..." అగు రూపముగల లోభ–మోహములచే బాధింపబడుచున్నాడు. అట్టి భావనచే దీనత్వమును ఆశ్రయిస్తున్నాడు. మహావాక్యముల అర్థసారమును తిరస్కరిస్తూ తనను తానే దౌర్భాగ్యమునకు సమర్పించుకొనుచున్నాడు. అట్టివారు రక్షించబడేది ఎట్లా? వారు పొందే పురుషార్థము ఏమున్నది?

**శ్రీరాముడు:** హే సద్గురూ! అట్టి ఈ జీవుని గతి ఏమిటి? ఇతడు అనేక దుఃఖాదులను భరిస్తూ ముల్లోకములందు ప్రయాసతో సంచరిస్తూ ఉండవలసిందేనా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామా! నిరుత్సాహపడవలసిన పనేమీలేదయ్యా! ఏ ఉదార చరితుడైతే ఈ ముల్లోకములను 'తృణప్రాయం'గా చూస్తాడో, అట్టి మహాత్మునిచే సమస్త ఆపదలు కూడా – సర్పముచే కుబుసము విడవబడినట్లుగా విడువబడుతాయి. ఎవని అంతఃకరణమునందు సర్వ వేళల సాత్వికత్వం స్ఫురిస్తూ, ఉట్టిపడుతూ ఉంటుందో అట్టివానిని ఇంద్రుడు మొదలైన దేవతలు కూడా, తమకు ఆధారమైన బ్రహ్మాండములను కాపాడుకుంటున్నట్లు పాలించి రక్షించుకుంటూ ఉంటారు.

**సన్మార్గము, అసన్మార్గము -** ఓ ప్రియ రాఘవా! ఎట్టి ఘోరవిపత్తు నందు కూడా ... అసన్మార్గము నందు ప్రవేశించకుండుటయే ఉత్తమము సుమా! అసన్మార్గము అవలంబించుట చేతనే రాహువు అమృతపానం చేసి కూడా 'కురూపము – మృత్యువు' – ఈ రెండింటినీ మరల మరల పొందుచున్నాడు.

ఓ జనులారా! మీరంతా సద్వస్తువును ప్రతిపాదిస్తున్న శాస్త్రములను అభ్యసించండి. సాధువులగు వారిని సేవించండి. ప్రేమ – సాత్విక – నిరహంకారములను ఆశ్రయించండి. మీకు తప్పక శుభము కలుగుతుంది. తదితర జీవులపట్ల ప్రేమ ఆప్యాయతలు అభ్యాసపూర్వకంగా ప్రకటించే వారియందు జగత్సంహారకారకుడు, ఉగ్రస్వరూపుడు అగు ఆ శివభగవానుడు ఆత్మ వస్తువును ప్రకాశింపజేస్తాడు.

**సదాచారం** (Good Conduct) - సదాచారవంతులు మాత్రమే ఆత్మ సాక్షాత్కారమును ప్రకాశింపజేసుకో గలుగుచున్నారు. సచ్ఛాస్త్రములను, సాధువులను సేవించువారు మరల ఇంకెన్నటికీ మోహాంధకారమున చిక్కుకోరు. అట్టివారికి అవశములైనవి కూడా వశము అవుతూ ఉంటాయి. సమస్తమైన ఆపదలు తమంతట తామే శమిస్తాయి. 'శమము–దమము' మొదలైన ఉత్తమ గుణములను ఆశ్రయించే సత్పురుషులకు నాశరహితమైనట్టి 'పరమోత్తమశ్రేయస్సు' లభిస్తోంది. శమదమాదులే ఉత్తరోత్తర ప్రయోజనకరములౌతాయని మీరంతా నమ్మకం కలిగి ఉండండి. ఆధ్యాత్మ శాస్త్రములను వినుటయందును, సత్యమునందును మిక్కిలి ప్రీతి కలిగి ఉండండి. ఉత్తమ ఆశయమును, ప్రయత్నమును కలిగియున్నవారే 'మనుష్యులు' అని అనిపించు కుంటారు. ఇక తక్కినవారి గురించి నన్ను అడుగవద్దు. వారు పశుతుల్యులే.

ఎవరి 'ప్రవర్తన' అయితే ఇతర జీవుల హృదయసరోవరములను ఆహ్లాదపరుస్తూ ఉంటుందో అట్టి క్షీరసముద్రము వంటి పవిత్రమూర్తులందు సాక్షాత్తూ శ్రీమన్నారాయణమూర్తియే నివసిస్తూ ఉంటారు. వారు మాత్రమే చూడవలసినది చూడటం, పొందవలసినది పొందటం జరుగుతోంది.

ఓ జనులారా! ఈ ప్రాపంచిక విషయభోగములు మీ నుండి ఆత్మతత్త్వమును దూరంగా ఉంచుచున్నాయి. భవిష్యత్తులో అనేక దుర్భరమైన జన్మపరంపరలకు కారణం అగుచున్నాయి. "విషయముల పట్ల, పేరు ప్రతిష్ఠలు మొదలైనవాటిపట్ల ఆసక్తి యుక్తం కాదు. ఉచితం కాదు. పైగా, దుఃఖప్రదము" – అని మీరు దామ – వ్యాళ – కటుల జీవితల చరిత్రలను చూచి ఈ "స్థితి" ప్రకరణములో గ్రహిస్తారు.

కాబట్టి మీ అధికారమును అనుసరించి శాస్త్రానుకూలంగా ప్రవర్తించండి.

ఆచార్యులచే మీ క్షేమము కోరి నియమించబడిన సదాచారములను జ్ఞానపూర్వకముగా, రాగద్వేషరహితులై శ్రద్ధతో ఆశ్రయించండి. ఏ భూమికయందు ఎంతకాలం 'స్థితి' కలిగి ఉండాలో, ఆ భూమికను అంతకాలం అభ్యసిస్తూ ఉండండి. క్రమంగా మీ అంతఃకరణము నుండి మిథ్యా భోగాల పట్ల భావన పూర్తిగా తొలగించుకోండి. మీ ఉత్తమగుణాలు, మహాశయాలు, యశో మహిమ స్వర్గపర్యంతము వ్యాపించు గాక! మీ సత్ప్రవర్తనచే సత్పురుషులను సంతోషింపజేయండి.

**ప్రయత్నము** - నాయనలారా! తుచ్ఛములైన ఈ ప్రాపంచిక భోగములు మృత్యువుతో 'అంతము' అయ్యేవే కదా! ఆ తరువాత గతి ఏమిటో చెప్పండి? ఒక ఉపమానం చెపుతాను. పైకి రుచికరంగా కనబడి, అర్ధరాత్రివేళకు భయంకరమైన అజీర్ణమును కలుగజేయగల పదార్థములను

ఎవరైనా "ఆహా బాగున్నాయి... బాగున్నాయి" అని అనుకుంటూ తింటుంటే ఏమౌతుంది? అతి త్వరలో "అయ్యో! నేను ఎందుకు తిన్నాను?" అని పశ్చాత్తాపపడవలసి వస్తుంది కదా! ఈ అహంకార – మమకారములు (I & Mine) మీకు కలుగచేయగల శ్రేయస్సు ఏమున్నది చెప్పండి? ఎవని సుందర గుణములైతే వర్తమానము నందు, భవిష్యత్తు నందు శ్రేయస్సు కలుగజేస్తాయో, అట్టివారు ఈ భూమిని తమ ఉనికిచే ఆనందమయం చేస్తున్నారు. వారే జీవించి ఉన్నట్లు. ఇక తక్కినవారో, మృతప్రాయులే. నాయనలారా! మునులమైన మేము లోకశ్రేయస్సు, ఈ జీవుని శ్రేయస్సు కోరి ఈ సత్ప్రవర్తన – సదాచారము – ఉత్తమప్రయత్నముల గురించిన వాక్యాలు చెప్పు చున్నాము. మీరంతా ఉత్తమమైన శుభప్రయత్నములందే ఉద్యుక్తులు అవండి. తదనుకూలమైన ఉద్యమమునే ఆశ్రయించండి. ఎవరు శాస్త్రానుసారం ఉద్వేగరహితంగా ప్రయత్నశీలుడౌతారో, అట్టివారు మోక్షసిద్ధిని ఎందుకు పొందరు? తప్పక పొందుతారు.

**ఏమరుపు -** చిరకాలము చేయబడిన ప్రయత్నముచే పరిపాకము పొందిన మనస్సు గల వ్యక్తి యొక్క సిద్ధి, దాని ప్రయోజనములు దృఢతరంగా ఉంటాయి. అందుచేత అవరోధములను, కష్టములను చూచి దిగులు చెందరాదు. పట్టుదలను ద్విగుణీకృతం చేయాలి. ఎట్టి లక్ష్యముల కొరకు పరిశ్రమిస్తున్నామో, అట్టి లక్ష్యములను పరిశుద్ధపరచుకోవాలి. ఓ ప్రియజనులారా! మీరంతా శోకమును, భయమును, క్రోధమును, పారుష్యమును దరిజేరనీయకండి. దైన్య–దుఃఖ ములను ఆశ్రయించి, తద్వారా విలువైన కాలమును వృథా చేసుకోకండి. మూర్ఖత్వము, పరిశీలనా రాహిత్యములను ఆశ్రయించి విషయములను సేవిస్తూ రోజులు గడపటం ఉచితమా? ఫలితంగా ఈ జీవుడు 'సంసారము' అను అంధకూపమున పడి వినాశనమే పొందుచున్నాడు కదా! అనేక పదార్థములందు ఆసక్తుడై ఉంటున్న ఈ జీవుడు 'ఇంద్రియములు' అనే త్రాళ్ళతో బంధించ బడినవాడై, 'నేను చచ్చుచున్నాను' అను అనుభవమును మరల మరల పొందుచున్నాడు. నిష్కారణముగా మృత్యువుకు అనేకసార్లు వశమగుచున్నాడు.

"ఎందుచేత?" అనే ప్రశ్నను మేము పరిశీలించాం.

"అతడు తన యొక్క చిదాకాశ స్వరూపమును ఏమరచుట చేతనే" అని కనుగొన్నాం.

'సంసారము' అను నిబిడాంధకారంలో కొట్టుమిట్టాడుతూ, సరిఅయిన మార్గములలో తన ప్రయత్నములను నియమించకపోవటం మానవుడైన వాడికి ఉచితం కాదు. ఈ శరీరముతో తాదాత్మ్యము 'నా అంతటి వాడు లేడు.....' వంటి మూర్ఖపు కేకలు అధమాధమ గతికే దారి తీస్తున్నాయని గ్రహింపబడుగాక!

'వేదాంతము'ను ప్రబోధించు శాస్త్రములు ఆత్మవస్తువు గురించి అనేక విశేషాలు ప్రతిపాది స్తున్నాయి. స్వస్వరూపమును గుర్తు చేస్తున్నాయి. ఈ జీవుని ఘోరములైన 'మృత్యువు' మొదలైన భయముల నుండి రక్షిస్తున్నాయి. నాశరహితము, నిత్యము అయినట్టి 'నిరతిశయానందము"ను ప్రసాదిస్తున్నాయి.

"ఈ ప్రాపంచిక జీవితము ఎట్టిది?" అనునది ఒకసారి సునిశిత బుద్ధితో పరిశీలించండి. ఇదంతా వేసవికాలంలో ఉష్ణత్వముచే నీరు ఇంకిపోవుచుండగా, మిక్కిలి దుర్గంధయుక్తమై యున్న బురద నీటిలోని కప్ప యొక్క జీవితము వంటిదే" – అని విజ్ఞులు గ్రహిస్తున్నారు. ఇదంతా పరమ తుచ్ఛమై ప్రవర్తిస్తోంది.

అందుచేతనే "హృదయము నుండి భోగాశను ముందుగా పారద్రోలండి" అని మేము హెచ్చరిస్తున్నాం. అనర్థప్రదములైన భోగముల కొరకు మాత్రమే ఉపయోగపడే ద్రవ్యలేశములను ఎంతో కష్టపడి సంపాదిస్తూ జీవించుటలో ఏమీ ఉత్తమత్వమున్నది? కాబట్టి, మీరు ఏదేది చేస్తున్నారో అదంతా "స్వధర్మము" అను అవగాహనచే ప్రక్షాళన చేసి ఉంచండి. ఓ మా స్వరూపమునకు వేరు కానట్టి సహజీవులారా! శ్రేష్ఠ బుద్ధి కలిగివున్న మీరందరూ మేము ప్రేమచే చెప్పుచున్న ఈ వాక్యములు ఆలకించండి. మోక్షప్రదములగు శాస్త్రములను అవలోకించండి. "ఈ కనబడేదంతా పరమాత్మ యొక్క సంప్రదర్శనమే! నీకునీవే ఇదంతా అయి ఆస్వాదిస్తున్నావు! సర్వతత్వాత్మవు–సర్వతత్వ విదూరకుడవు నీవే!"... అని బోధిస్తున్న తత్త్వశాస్త్రాన్ని అవలోకించండి, పఠించండి, ఆస్వాదించండి.

**చైతన్యము, జీవుడు ... బింబము, ప్రతిబింబము -** ఎట్టి పరిచ్ఛిన్నము లేని చైతన్యమే బింబము. ఆ చైతన్యం అంతఃకరణం నుండి విషయాకారవృత్తులందు ప్రతిబింబించుచున్నది. అట్టి చిదాభాసుడే ఈ జీవుడు. వాస్తవానికి చైతన్యము (లేక) శుద్ధ బ్రహ్మమునకు జన్మ–కర్మ– ఉపాధి–మొదలైన వాటితో ఏమాత్రం సంబంధం లేదు. బింబము – ప్రతిబింబముల సంబంధమే – 'బ్రహ్మము – జీవుడు' లకు ఉన్న సంబంధము. అయితే, అంతఃకరణంలో ప్రతిబింబించే చిదాభాస ప్రతిబింబం, దానికి సంబంధించిన ఉపాధులు కూడా మిథ్యారూపాలే అయివున్నాయి. సర్వదా సర్వత్రా అభిన్నమైయున్న బింబము (లేక శుద్ధ చైతన్యపరమాత్మ) మాత్రమే సత్యమైనది.

ఓ సభికులారా! సర్వజనులారా! ఈ విధంగా తత్త్వవిచారణ చేయండి. ఇది మీకు శాంతిని కలుగజేస్తుంది. "నామ రూపములచే ఎదురుగా ప్రాప్తిస్తున్న జగత్తు, అట్టి జగత్తును నిర్విరామంగా పొందుచున్న అహంకారము – ఈ రెండు కూడా స్వతహాగా ఈ వర్తమాన క్షణంలోనే (ఇప్పటికే) లేవు మరెప్పటికీ ఉండబోవు – అను భావనను ఆశ్రయించి, అభ్యాసం చేయండి. అట్లు భావించుటచే మీరు కోల్పోయేదేమీ ఉండదని మనవి చేస్తున్నాను. అలా కాకుండా " ఈ శరీరమే ఉన్నది... మరింకేమీ లేదు"... అనునట్టి బుద్ధిని ఆశ్రయించారా, ఈ మనస్సు పశుత్వమును పొందగలదు. దౌర్భాగ్యజనకము, అతి దీనము అయిన ధన–గృహ–స్వజనాదులకు సంబంధించిన సంకుచితదృష్టిని వహించి, తద్వారా ఆత్మవిషయంలో (లేక) మీ యొక్క స్వస్వరూపం విషయంలో గాఢనిద్ర వహించి వర్తమానమును వృథాపరచుకుంటే ఎట్లా? దీర్ఘనిద్ర నుండి లేవండి. మూఢత్వమును త్యజించి మోక్షమార్గమునందు జాగరూకులు కండి. ఒక అల్ప తటాకంలో ముసలి ఎద్దు వలె కునుకులు తీయవద్దు. 'బద్ధకము' అను జాడ్యమును ప్రయత్న

పూర్వకంగా జయించండి. ఇప్పటికిప్పుడే జరామరణములను అధిగమించిన స్థితిని ఆక్రమించుటకు సంసిద్ధులు కండి.

ఈ ధన-బంధుజన-వస్తువాహనాదులను చూచి మురిసిపోతున్నారా? లేదు. ఇవన్నీ అనర్థదాయకములుగానే పరిణమిస్తున్నాయి."ధనాదులు సొంతం చేసుకొనుటచే ఉత్తమోత్తమమైన సంతృప్తి కలుగుతోందా? జీవితలక్ష్యము నెరవేరుతోందా?"... అనే విషయాలు ఇప్పటికే ఎంతో ధనవంతులై ఉన్నవారి మానసిక స్థితి గతులను సత్యదృష్టితో పరిశీలిస్తూ యోచించండి.

భోగములు భవరోగకారకములే అగుచున్నాయి. సంపదలన్నీ విపత్తులనే కలుగజేస్తున్నాయి. వాటిని మీరు ఏ విధంగానూ ఆదరించకున్నారా, అప్పుడు వాటిని మీరు జయించి వేస్తున్నట్లే. అసలు ధనాదులు "మీరు జీవించియుండుట" అను కార్యక్రమమునకు లక్ష్యమై ఉన్నాయా? అందుకొరకే బ్రతుకుచున్నారా? అవి మిమ్ములను నిజంగా రక్షించగలవా? తాను సంపాదించిన ధనాదులను తన మరణానంతరం తన వెంట తీసుకుపోయిన వారినెవ్వరినైనా మీరు చూచారా? బిడ్డలారా! ఇదంతా అవిచారణ చేతనే మిమ్ములను ఈ విధంగా భ్రమింపజేస్తోందని మీకు గుర్తు చేస్తున్నాను.

**విచారణ, విశ్లేషణ -** కనుక మీరు వెంటనే విచారణపరులు కండి. తదితర జనులకు, ప్రాణులకు అవిరోధముగా వ్యవహరిస్తూ, మీ స్వబుద్ధిని సునిశితం చేసుకునే ప్రయత్నంలో ఉండండి. శాస్త్రములను, శిష్టాచారములను అనుసరించి సత్కర్మలను అనుష్ఠించండి. సత్ఫలములను పొందుటలో సావధానులై ఉండండి.

ఉత్తమ ఆచరణ, పవిత్ర భావన, సునిశిత బుద్ధి - ఈ మూడు విస్తృత పరచుకుంటున్నవారు ధన్యులు. వారు అతి స్వల్పకాలంలో "ఈ ప్రాపంచిక సౌఖ్యములు కేవలం దుఃఖప్రదములే" అని గ్రహించగలుగుచున్నారు. శాస్త్రరూపంలో ప్రకటించబడిన పెద్దల అనుభవజ్ఞానమును వారు అనుద్వేగపూరితంగా గ్రహిస్తున్నారు. సత్యమేమిటో వారికి తెలిసిపోతోంది.

అట్టివారి యశస్సు, ఆయుష్షు, గుణములు మొదలైనవన్నీ లోకములకు సౌభాగ్యప్రదం అవుచున్నాయి. అట్టి సత్ఫలమే మేము శిష్యుల నుండి కోరుకొను ప్రయోజనమని ప్రకటిస్తున్నాను.

❖❖❖

# 2. అసంభవం ... కాని ప్రత్యక్షం!

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! మనం ఇప్పటివరకు జగత్తు యొక్క ఉత్పత్తి గురించి విచారించాము కదా! ఇక మనం 'స్థితిప్రకరణం'లో ప్రవేశిస్తున్నాము. ఇది వింటే, అభ్యసిస్తూఉంటే - తప్పక స్వయముగా మోక్షము చేకూరగలదు. శ్రద్ధగా విను.

ఒక్కసారి క్రితం ప్రకరణంలోకి తొంగిచూచి, ఆపై ముందుకు పోదాము.

ఇప్పటివరకు అనేక యుక్తులచే, న్యాయ నిర్ణయంచే "నేను–నీవు మొదలైన ప్రత్యయములతో కూడి ఈ దృశ్య జగత్తు ఆకారరహితము, శూన్యము, భ్రాంతి మాత్రము, అసత్‌మయము" అని మనం చెప్పుకున్నాం. ఇది నీవు స్పష్టీకరించుకున్నావనే అనుకుంటున్నాను.

కొందరు మహాజ్ఞానులగు పెద్దలు, విలక్షణమైన ఈ జగత్తును చమత్కారంగా కనబడే ఒక చిత్రపటంతో పోలుస్తూ ఉంటారు. అయితే, ఈ 'జగత్తు' అనే చిత్ర పటమునకు చిత్రకారుడంటూ ఎవరూ లేరు. అనగా, దీనికి 'కర్త' అంటూ ఎవరూ లేరు. హేతువు లేకుండా... కుంచెలు–రంగులు–చిత్ర కారుడు లేకుండా ఈ 'జగత్తు' అనే చిత్రం బ్రహ్మాండంగా భాసిస్తోంది.

**శ్రీరాముడు :** అదేమిటి స్వామీ! చిత్రకారుడే లేకుండా చిత్రపటం ఉండటమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును అందుకు స్వప్నమే మనకు దృష్టాంతము. స్వప్నద్రష్టయే తన స్వప్నమును రచించుకొనుచున్నాడు కదా! అట్టి స్వప్నద్రష్ట ఆ స్వప్నంలో విభాగంగా ఉన్నాడా? స్వప్నమునకు ఆవల ఉన్నాడా? స్వప్నం అతని కంటే వేరైనదా? అందులోని వ్యవహారమంతా అతని ఇచ్ఛ యొక్క నిర్ణయమేనా? కాదా? ఏం చెప్పగలం? ఈ జగత్ చిత్రం కూడా – ద్రష్ట రహితం (అనగా దృశ్యమును చూచువాడు దృశ్యములో ఉండలేదు). నిద్రావర్జితం, అనుభవరూపం అగు ఒక సుదీర్ఘమైన స్వప్నంలాగా – 'ఆకాశంలో' ఉదయిస్తోంది. "భవిష్యత్తులో ఎప్పటికో ఏర్పడబోవుచున్నట్లున్న నగరంలోని వీధులలో విహారమునకు ఇప్పుడు వెళ్ళటం" అను అనుభవంలాగా చిత్తము నందే ఆవిర్భావం పొందుతోంది. ఒక చమత్కారమైన దృష్టాంతం చెపుతాను. కొన్ని కోతులు ఒక రోజు కొన్ని గురువిందగింజలను తెచ్చి ఒకచోట పోశాయట. ఎందుకో తెలుసా? అందలి ఎరుపును చూచి "ఇది అగ్నియే. అందుచేత మనం చలికాచుకోవచ్చు" అని భావించి, ఉపశాంతి పొందటానికి! వాటికి ఆ గురువిందగింజలను చూస్తున్నంతసేపు నిజంగానే చలికాచుకుంటున్నట్టి అనుభవం కలుగుతూ ఉన్నదట!

ఆ విధంగానే అసత్తు, అర్థరహితం అయినప్పటికీ, ఈ జగత్తు 'అర్థసాధకం' అగుచున్నది.

జలంలోని ఆవర్తం "జలం కంటే వేరు" అని అనగలమా? ఈ జగత్తు కూడా బ్రహ్మం కంటే భిన్నం కాదు. కాని, భిన్నంగా తోచుట మాత్రం జరుగుతోంది. ఈ కనబడే 'జగచ్చిత్రం' సద్రూప మగు పరమాత్మయే అయి, మరొకవైపుగా ఆకాశంలోని నీలత్వం వలె ఉనికిని పొందుతోంది.

రత్నము మధ్యలో కిరణసమూహముల సమన్వయం ఏదో చమత్కారమైన 'దృశ్యం'లాగా కనబడుతుంది. ఈ దృశ్యము కూడా ద్రష్ట యొక్క హృదయములోనే చమత్కారంగా రూపు దిద్దుకుంటోంది.

మృగతృష్ణలోని జలంలాగా, ఇదంతా అసత్యమై ఉండి కూడా సత్యం వలె అనుభవమౌతుంది.

ఒకడు "తనయొక్క దృఢ–దీర్ఘ–తీవ్ర సంకల్పము (Zone of Visualisation) నందు చూచే భవనములు" వలె... ఇదంతా కూడా విస్తారమై ప్రాప్తిస్తోంది. అయితే ఏం? వాస్తవానికి అసద్రూపమే (actually not existant) అయివున్నది.

ఒక కవిచే కల్పించబడిన కథలోని పాత్రలు, ప్రదేశములు, సంఘటనలు పాఠకునికి “ఆహా! అయ్యోః!” అనురూపంగా ఆశ్చర్య-సంతోష-దుఃఖ-కోపాదులను కలిగిస్తూ ఉంటాయి చూచావా? ఇదంతా కూడా అట్లే కల్పనామాత్ర స్వరూపం కలిగియున్నది.

స్వప్నంలో చూడబడిన పర్వతంలో సారమేమున్నది? లేదు. కానీ, స్వప్నసమయంలో అది దృఢంగానే ప్రాప్తిస్తుంది కదా! ఇదంతా కూడా, అట్లే, భూతాకాశరూపమున వెలుగొందుచున్నది.

మేఘములు ఆకాశమును కప్పివేసి ఆకాశం కనబడకుండా, కేవలం అంతా మేఘమయం గానే ఉంటుంది చూచావా? ఈ జగద్దృశ్యము కూడా ఆత్మ సత్తను కప్పివేసినదై ఉంటోంది.

ఇదంతా అక్షయంగా ప్రాప్తించటానికి కారణం జ్ఞానము యొక్క అభావమే.

స్వప్నములోని సుందరస్త్రీతో ఏర్పడే సమాగమం లాగా ఇక్కడ ఒకరికొకరికి సంబంధ - బాంధవ్యములు, ప్రియ-అప్రియములు, సుఖ-దుఃఖములు ఏర్పడుచున్నాయి. ఇదంతా నిరర్థకమై, వైచిత్రమై, ‘జగత్తు’ అను పేరుతో ఏర్పడి ఉంటోంది.

మనోరాజ్యము యొక్క ‘అనుభూతము’ వలె ఇదంతా అసత్యము, అవస్తువు అయి ఉన్నది. చిత్రంలోని కమలమునకు సువాసన ఉంటుందా? ఈ దృశ్య విషయం కూడా అంతే.

**అనుభూతం మనోరాజ్య మివాసత్యమవాస్తవమ్ ।**
**చిత్ర పద్మాకర ఇవ సార సౌంగధ్య వర్జితమ్ ॥**

‘కల్పనామయంమాత్రమే’ అయివుండి కూడా ఇదంతా శూన్యమునందు వికశితమై, అనేక విధములైన వర్ణనలతో ఒప్పుచున్నది.

‘ఇది మాత్రమే దీని ఆకృతి” అని చెప్పగలిగేదేదీ ఇక్కడెక్కడా లేదు. కనుక ఇదంతా మిథ్యారూపమే.

ఎందుచేత ఈ జగత్తు ప్రాప్తిస్తోంది?

“పరామర్శ” విచారణ లేనంతవరకు మాత్రమే ఈ జగత్తు ఇట్లు అనేక సత్య సంఘటనలు కలిగియున్న దాని వలె ప్రవర్తిస్తూ పోతుంది. ఎప్పుడైతే ‘పరమాత్మ’ గురించి సద్విచారణ చేస్తామో... మరుక్షణం, ఇదంతా శుష్కించి, ‘స్వస్వరూపానుభవము’ నందు లయించిపోతోంది.

అత్యంత అసంభవమైనప్పటికీ, ప్రత్యక్షమై తోచుచుండుటయే ఈ జగత్తు యొక్క చమత్కారం!

❖❖❖

## 3. జగత్తు - వివిధ నిర్వచనములు

జలములో ఏర్పడిన బుద్బుదముల (Bubbles) యొక్క ఆకారం కల్పితమైనదే కదా! లేకుంటే జలము బుద్బుదములుగా మార్పు చెందుచున్నదా? లేదు. చివరకు ఇదంతా శూన్యమే అయినప్పటికీ దీర్ఘము - ప్రకాశవంతము అయిన శరీరం కలిగి ఉంటోంది.

**శ్రీరాముడు :** తండ్రీ ఈ జగత్తులో కొంత మనోహరత్వము కూడా మనకు కనబడుతోంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నిజమే. కాని, 'సుదీర్ఘ దృష్టి, తత్త్వ విచారణ' లేకపోవుటచేతనే ఇది స్వల్ప సమయములలో ఈ జీవుని దృష్టికి 'మనోహరంగా' కనిపించటం జరుగుతోంది. 'మనోహరము' అని వర్తమానంలో చెప్పబడుచున్న అనేక విషయముల (వ్యవహారముల) పరిణామం అనేక సందర్భములలో 'కటు' ప్రదం (Soarness), దుఃఖ ప్రదంగానే ఉంటోంది. జనన మరణములతో కూడినదై, జీవులను భ్రమింపజేయుటలో ఈ జగత్తును మించినదేమున్నది? పరిశీలించి, గ్రహించటం జరిగితే మాత్రం, ఈ జగచ్చిత్రంలో 'ఏమీ లేదు" అనియే తెలియవస్తోంది. 'రంగుల మేళనము' అయినట్టి చిత్రపటంలో నిజమైన సూర్యుడు, కొండలు, పక్షులు ఉంటాయా? ఉండవు. కానీ, ఉన్నట్లు ఆ చిత్రపటం చూచే కొందరు ప్రేక్షకులు ఆ అనుభూతిని పొందుచున్నారే!

వివిధ శాస్త్రకారులు ఈ జగత్తును రకరకాలుగా నిర్వచించుచున్నారు.

**సాంఖ్యులు -** ఇదంతా కేవలం జడాత్మకం.

**వేదాంతులు -** ఇదంతా అవిద్యారూపమే.

**పదార్థవాదులు -** ఇదంతా కాలానుగుణంగా పరమాణువుల "కలయిక–విడిపోవుట" అను ప్రక్రియచే ఏర్పడుతోంది. కనుక ఇదంతా రూపరహితం. నామరహితం.

**కణాదగౌతములు –** దీనికి "ఇది" అనబడు నియతి ఏదీ లేదు. ప్రతిదీ ఎప్పటికప్పుడు మరొక రూపాంతరం చెందుతుంది. కనుక ఈ జగత్తు లేదు. పరమాణువులు మాత్రం ఉన్నాయి.

ఇవన్నీ నిజమే కావచ్చు లేదా కాకపోవచ్చు. ఏది ఏమైనా, ఈ ద్రష్ట యొక్క అంతరంగము మాట ఏమిటి? ఈ చూచు, గ్రహించు, అర్థము చేసుకొను ద్రష్ట ఎవరు? ఈ ద్రష్ట యొక్క వాస్తవ స్వరూపం ఏమిటి? ఎట్టిది?

**బాహ్య అభ్యంతర న్యాయం -** ఒకడు బాహ్య జగత్తును ఏ అభిప్రాయంతో అవగాహన చేసుకుంటాడో అంతరంగమున తన స్వరూపము గురించి అట్టి అవగాహనయే కలిగి ఉంటాడు. బాహ్య జగత్తు గురించిన న్యాయమే అంతరంగమునకు కూడా వర్తిస్తూ ఉంటుంది. అందుచేత, "నాచే, బాహ్య దృష్టిచే చూడబడుచున్న ఈ తదితర జీవులు భౌతికమాత్ర శరీరులు కాదు".... అను అవగాహనయే క్రమేపీ స్వస్వరూపము గురించిన ఔన్నత్యమును ధృవీకరించగలదు.

"నేను పంచభూతమయుడను. శరీర పరిమితుడను" అను అనుభవం ఈ జీవునకు ప్రత్యక్షంగా ఉండిఉండవచ్చుగాక! కాని, యదార్థానికి ఇతడు భౌతిక ధర్మరహితుడు. (He is never bound by physical barriers) ఆకారము లేనివాడు. వాని రూపము ఒక నిశాచరుని వలె, చీకట్లో కదులుచున్నట్లు భ్రమచే కనిపించే రూపాల వలె ఆవిర్భవిస్తోంది. ఈ రూపాదులు – అవాస్తవములు. ఈ విషయం సమగ్రమైన, సమున్నతమైన అవగాహనచే మాత్రమే అర్థమై, అనుభవమగుచున్నది.

వాస్తవానికి ఈ జీవుడు రూపరహితుడు.

❖❖❖

# 4. బీజము-అంకురము-బ్రహ్మము-జగత్తు

**శ్రీరాముడు :** "ఒక విత్తనములో మహావృక్షము యొక్క స్వభావములన్నీ నిద్రాణంగా దాగి వున్నాయి కదా!* అట్లాగే 'మహాప్రళయం' – సమయంలో ఈ జగద్దృశ్యమంతా పరమాత్మయందే ఉండి ఉంటోంది. మరలా సృష్టికాలంలో ఆ పరమాత్మ నుండే ఉత్పన్నమై పరిఢవిల్లుతోంది"... అని మనకు శ్రుతులలోని కొన్ని సూత్ర వాక్యాలు చెప్పుచున్నాయి. అయితే, పరమాత్మ నిరాకారుడని, నిస్సంగుడని, జగద్రహితుడని మీరు ప్రతిపాదించారు. మరి ఈ రెండు అభిప్రాయాలకు, పొంతన ఎట్లా ఏర్పడుతుంది? మహా ప్రళయంలో ఈ జగత్తు 'స్వసత'తో కూడినదై తన కారణము నందు లయించి ఉంటోంది. ఇంతలోనే ఎప్పుడో విజృంభించి బహిర్గతమౌతోంది. మరల ఆ కారణము నందే లయించబోవుచున్నది" – అని కొందరి అభిప్రాయమై యున్నది కదా! అట్లు భావించేవారు మీ దృష్టిలో జ్ఞానులా? అజ్ఞానులా? మా అనుమానాలన్నీ తొలగాలనే ఉద్దేశంతో మిమ్ములను ఇట్లు ప్రశ్నిస్తున్నాను. ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటో చెప్పప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** విత్తనంలో 'అంకురించటం' అనే స్వభావం దాగివున్నట్లు, మహాప్రళయ సమయంలో స్వసత్తతో కూడిన పరమాత్మయందు ఈ జగత్తు దాగి వుంటోంది, అనేది నిర్వథికమైన సత్యం కాదని, మరి అది మధ్యేమార్గంలోని అభిప్రాయమేనని మేము అనుకుంటున్నాం. ఎందుచేతనంటావా? ఇది నీవు గ్రహించటానికి నీకొక యుక్తి చెపుతాను. విను.

ఆత్మయందు 'జగత్తు' అనబడేది ఏదైనా అసలు ఉన్నదా?

"ఉత్పత్తికి ముందే కారణము నందు కార్యము ఉండి ఉంటుంది" అని చెప్పువారిని ఒక చిన్న ప్రశ్నవేద్దాం. అట్టి కారణము నందు కార్యము (అనగా, బ్రహ్మము నందు జగత్తు)... ఏ రూపంలో ఉంటోంది?

**1. సత్త...?** "సత్త" రూపంగా ఉంటోందా? (లేక)

**2. సంస్కారం...?** నిద్రాణమైయున్న 'సంస్కారం' రూపంలో ఉంటోందా?

దృష్టాంతానికి, విత్తులో భవిష్యత్తులో ప్రకటన కాబోయే మహావృక్షం, ఆకులు, కాయలు లాగా! గాలి, నీరు తగలగానే విత్తు మొలకెత్తునట్లుగానే... ఏదైనా పరిస్థితులచేత ఆత్మయందు జగత్తు ప్రకటితమగుచున్నదా? (లేక)

**3. మరి ఇంకొక తత్త్వంగా ?** ఆత్మయందు ఆత్మకు వేరైనట్టి మరొక తత్త్వంగా ఉండి ఉందా? ఉదా: బీజము నందు, ఆ బీజము కంటే వేరైన అంకురము ఉన్నట్లు.

❖

---

* **సదేవ సోమ్యేఽ దమగ్ర అసీత్ :** ఈ జగత్తు మొట్టమొదట పరమాత్మ యందే ఉన్నది – వేదవాక్యం

ఒక విత్తనం తగిన నేలలోనే, గాలి-నీరు లభిస్తూ ఉన్నప్పుడే మొలకెత్తుచున్నది అట్లా కాకుండా, ఆ విత్తును కఠిన శిలపైననో, లేక, నాటకుండా మరెక్కడో ఉంచితే మొలకెత్తుతుందా? లేదు. మరి, పరమాత్మయందు ఈ జగత్తు ఎట్లా ఉద్భవిస్తోంది? "ఏ సారవంతమైన నేల, నీరు, గాలి" మొదలైన బాహ్యకారణములచే జగత్తు యొక్క ఆవిర్భావం సాధ్యపడుతోంది? ఒకవేళ ఏదో సహకారి కారణములు ఉన్నాయనే అనుకుందాం. ఆ బాహ్య కారణములకు కర్త ఎవరు? పరమాత్మయేనా? మరెవరైనానా?

మరొక ప్రశ్న? ఒక బీజమున ఉండి ఉంటున్న "సత్తా సామాన్యమే" సర్వవస్తువులందు కూడా ఉండి ఉన్నది కదా! మరి ఒక విత్తనమును ఇనుముపై ఉంచినపుడు కూడా మొలవటం జరగాలి కదా? అట్లా మొలుస్తుందా? లేదే! పరమాత్మయందు ఏ అనుకూల స్థలప్రాప్తిచే ఈ జగత్తు ఉద్భవిస్తుంది? ఏ ప్రతికూల స్థలములందు ఇది ఉద్భవించదు?

పరమాత్మ ద్వితీయమా? అద్వితీయమా?

పోనీ... "బీజము వేరు. అంకురసత్త (మొలుచుట అను ధర్మము నిర్వర్తించు తత్త్వము) వేరు. 'బీజము' అను దాని యందు 'అంకురము' అనబడు వేరొక ధర్మము లేక తత్త్వము లేక 'స్వభావ-సత్త' ఉన్నది. ఆ విధంగానే పరమాత్మ వేరు... జగత్తు వేరు. కానీ, ఈ జగత్తు పరమాత్మయందే ఉన్నది..." అని అనవచ్చునా? అప్పుడు బీజము - అంకురముల సంబంధము, మరియూ, ఆత్మ - జగత్తుల సంబంధము ఈ రెండూ కూడా వస్త్రము - కుండలవంటి వేరు వేరు వస్తువుల సంబంధము వంటిదే అవుతుంది. "పరమాత్మ యందు జగత్తు వేరుగా ఉన్నది" అని అనదలచుకుంటే, పరమాత్మకు ద్వితీయమైనది కలదనీ, అది అద్వితీయం కాదనీ... నిర్ణయించవలసివస్తుంది...!

**శ్రీరాముడు:** అట్లా అనలేము కదా! అట్లా అంటే "పరమాత్మకు వేరైనదేదీ లేదు, అద్వితీయుడు. మరియు పరమాత్మ వస్తురహితము" అను ఉభయ వేదముల అభిప్రాయానికి భంగం వస్తుంది. ఆ తరువాత ఇంకా అనేక సమాధానాలు లేని ప్రశ్నలు కూడా ఉదయిస్తాయి.

**శ్రీవసిష్ఠుడు:** అవును. నీవు అన్నది వాస్తవమే. "విత్తనము కంటే అంకురము వేరైనది, అట్లే జగత్తు వేరు. పరమాత్మ వేరు"... అందామంటే వాటి ఆద్యంతాల కొరకు, ఆవిర్భావ - తిరోభావాల కొరకు, ఆ రెండింటికీ సంబంధం కలుగజేయుచున్న మరొకదాని కొరకు వెతకాలి. పైగా, నీవు చెప్పినట్లు... 'అద్వితీయం' అను వేదవాక్కు తిరస్కరించబడినట్లే అవుతుంది.

**బీజము-అంకురముల న్యాయము; పరమాత్మ-జగత్తుల న్యాయము -**

మూడు సిద్ధాంతాలు మన ముందు ఉన్నాయి.

**1. ఆత్మ చేత జగత్తు...!** ("సామాన్యసత్త"చే అసమాన్యమగు అంకురాదులు కలుగుచున్నట్లు) నిష్క్రియమగు ఆత్మచే జగత్తు నిర్మించబడటం

**2. ఆత్మయందు జగత్తు...!** (అంకురము "బీజసత్త" రూపమున ఉన్నట్లు) జడజగత్తు అజడమగు పరమాత్మ యందు ఉండటం

**3. ఆత్మయే జగత్తు...!** (అంకురమే బీజము రూపమున, వృక్షము రూపమున ఉన్నట్లు) పరమాత్మయే జగత్తు రూపమున, అనేకత్వము వహించి ఉండటం.

ఈ మూడింటిలో కొంత లోపం కనబడుతోంది.

"కార్యము 'స్వసత్త' రూపమున తన కారణము నందు ఉండి ఉంటుంది" (The effect that is manifesting here was earlier hiding in its cause) అను బోధ వాస్తవం కాదు. "జగత్తు బ్రహ్మం నందు ఒకప్పుడు ఉండి ఇప్పుడు బయల్వెడలుచున్నది" అనేది సరికాదు. "భగవంతుని యందు ఈ జగత్తు కలదు" అనే బోధ విపరీత భావనయే అని అనక తప్పదు. ఇట్టి బోధ చెప్పేవాడిని, వినే వాడిని కూడా మోహంలో ముంచుతుంది.

చూచావా రామా! మరల చెప్పుచున్నాను. "ప్రళయ సమయంలో ఈ జగత్తు సత్స్వరూపమగు పరమాత్మయందు దాగి ఉన్నది. బీజంలో అంకురంలాగా పరమాత్మలో ఈ జగత్తు ఉన్నది"... అనునదంతా అనుచితమేనని మా అభిప్రాయం. అట్టి ఉపమాన దృష్టాంతముల కూడిన పాఠాలను ఆశ్రయిస్తే, అట్టి బుద్ధి భ్రాంతిరూపమునే పొందుతుంది. ఎందుకంటావేమో? బీజం ఇంద్రియాలకు గోచరిస్తుంది. కంటికి కనబడుతోంది. అట్లాగే దానియందలి అంకురము, ఆకులు, పూలు, పళ్ళు, కాయలు కూడా కళ్ళకు కనబడుచున్నాయి. కాని పరమాత్మ విషయమో?

పరమాత్మ మనస్సుకు ఇంద్రియములకు అతీతుడు కదా! మనస్సు లయించినప్పుడు మాత్రమే 'పరమాత్మ' యొక్క అనుభవం అవుతుంది. అతి సూక్ష్మము, స్వయం ప్రకాశకము, అసంగము అయిన పరమాత్మ స్థూలము, కార్యకారణ జనితము (something that is bound by cause and effect) అయినట్టి ఈ బ్రహ్మాండములకు, ఇందలి పదార్థములకు బీజమెట్లా అవుతాడు?

అసలు – ఆకాశము కంటే సూక్ష్ముడు (more subtle than even space), వాక్కులన్నిటికీ అతీతుడు, నామరూప రహితుడైన పరమాత్మ యందు "జగత్తు" అనబడే బీజమెట్లా సంభవిస్తుంది? పరమాత్మ సదా ఏకరసమై సత్స్వరూపమై ఉంటాడు కదా! అతడు అతి సూక్ష్ముడు. కాబట్టే స్థూల దృష్టిగల అజ్ఞానుల అనుభవమునకు 'అసత్తుల్యుడు – అగమ్యము" అయి ఉంటున్నాడు.

కొందరు ద్రష్టలు తమయొక్క స్థూల దృష్టి చేతనే, "ఈ జగత్తు ఒకప్పుడు ఒక రూపమున పరమాత్మ యందు కలదు" అని దర్శించటం జరుగుతోంది. బుద్ధి సూక్ష్మత్వము చెందగా, తత్ఫలితంగా ఈ జగత్తు యొక్క భ్రమ తొలగిపోతుంది. భ్రమలను ఆశ్రయించుటచేతనే ఏర్పడి ఉండి ఉంటున్న జగత్తు భ్రమ 'రహితస్థితి'లో స్వతహాగా లేనిదే అగుచున్నది.

పరమాత్మ యందు బీజత్వమెచ్చట? బీజమే లేని చోట అంకురం ఎచ్చట?

ఆకాశము కంటే నిర్మలమై, అజ్ఞానుల దృష్టియందు శూన్యమువంటిదై ఉంటున్నట్టి పరమ పదమున జగత్తుగాని, జగత్-పదార్థములు గాని ఎట్లా ఉంటాయి? పరమాత్మ యందు దృశ్య

మానమగు అవయవమే లేదే! ఇక అందులో బ్రహ్మాండము అనబడు వస్తువు ఎక్కడ ఉండ గలదు? ఒకవేళ ఉంటే, అది ఎక్కడి నుండి వచ్చిందో మనకు ఎందుకు లభించుట లేదు? రూపమే లేనట్టి దాని యందు ఏ పదార్థమైనా ఎట్లా వచ్చి చేరుతుంది? ఎక్కడి నుండి వస్తుంది? శూన్యం లోంచి పర్వతాలు వస్తాయా?

ఆకార రహితమగు పరమాత్మ యందు ఏదీ ఉండజాలదు. ఈ 'జీవుడు' అనబడేవాడు కూడా సదా-సర్వదా నిరాకారుడేగాని, సాకారుడు కానేకాదు.

**శ్రీరామచంద్రుడు :** మహర్షీ! 'బ్రహ్మము-జగత్తు... ఇవి రెండూ భేదరూపమున లేవు. ఏకత్వ రూపముననే ఉన్నాయి' అని అనవచ్చా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చిత్స్వరూపమగు పరమాత్మకు, జడరూపమగు జగత్తుకు ఏకత్వమెట్లా ఘటిల్లగలదయ్యా? ఒక మఱ్ఱివిత్తు ఒక ఆకారము కలిగి ఉన్నది. 'అందు అంకురము కలదు' అంటే ఒప్పుకోవచ్చు. అంతేకాని, 'నిరాకారమగు పరమాత్మయందు విశాలాకారమగు ఈ జగత్తు ఉన్నది' అనునది అసంగతమే కదా!

'ప్రళయసమయంలో ఈ జగత్తు 'స్వసత్త' రూపమున పరమాత్మయందు ఉన్నది' అను సిద్ధాంతం కొందరిచే ప్రతిపాదించబడుతోంది. అయితే ఇక్కడ రెండు ప్రశ్నలు-

1. ఆ విధంగా లౌకిక ప్రమాణములచే నిశ్చయిస్తున్నామా? లేక
2. శ్రుతి వాక్యములను (ఉదా: సదేవసౌమ్యేౖ దమగ్ర అసీత్) అనుసరించి అట్లా నిర్ణయానికి వస్తున్నామా?

ఈ రెండు విధానములను మనం విమర్శించవచ్చు.

**లౌకిక ప్రమాణముల దృష్ట్యా -** మనం ఈ దృశ్యమును చూస్తున్నాం. దేని సహాయంతో? 'బుద్ధి మొదలుగాగల ఈ సమస్త ఇంద్రియ శక్తుల సహాయం చేతనే కదా? ఈ బుద్ధి, ఇంద్రియాలచే, వాటిని అనుసరించి అనుభవమయ్యే పదార్థజాలం 'ఇంద్రియాతీతస్థితి'కి సంబంధించనిదే అవుతుంది కదా?

"ఈ పదార్థములు ప్రళయంలో లయించిపోయి, మరల ఆ తరువాత ఉద్భవిస్తున్నాయి." - అని ఇంకొక అభిప్రాయం.

బాగానే ఉన్నది కానీ, అవి బుద్ధి వృత్తులను అనుసరించి ఒకరికి ఒక విధంగా, మరొకరికి మరొక విధంగా (అందంగాను-సామాన్యంగాను, ఇష్టంగాను-అయిష్టంగాను, ముఖ్యంగాను -స్వల్పంగాను....) తోచుచుండవలసిన పనేమున్నది? 'ప్రత్యక్షము-అనుమానము' అనబడు ఆయా బుద్ధి వృత్తులచే దర్శనము వేరు వేరుగా ప్రభావితం ఎందుకు అవుతోంది?

ఈ దృశ్యము ఒకప్పుడు కనిపిస్తుంది. మరొకప్పుడు లేకుండా పోతుంది. ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకుండా పోయేది వాస్తవమెట్లా అవుతుంది? లౌకిక ప్రమాణములందు సమగ్రమైన అవగాహన ఉన్న కుశలురు ఈ విషయం గ్రహిస్తూనే ఉన్నారు.

ఎందుచేతనంటే...

ఏ దృశ్యము జాగ్రత్తులో చూస్తున్నామో, అది స్వప్నసమయంలో ఏర్పడి ఉండుటయే లేదు. స్వప్న సమయంలో మరొక రంగము ఏర్పడి ఉంటోంది.

**శ్రుతి వాక్యముల దృష్ట్యా -** "ఇది పరమాత్మయందు ఉన్నదై పరిఢవిల్లుతోంది." – అని కదా శ్రుతి యొక్క అభిప్రాయం! (సదేవసౌమ్యేౖ దమగ్ర అసీత్)ను అనుసరించి 'కార్యము – కారణములకు రెండు వేరైన సత్తలు లేవనియే తెలియవస్తోంది. మా ఉద్దేశ్యం ప్రకారం ఈ వాక్యం ... ఏకమేవాద్వితీయం బ్రహ్మ – కేవలం అద్వితీయమగు బ్రహ్మము ఒక్కటే ఉన్నది ... అను వాక్యమునకు గల అర్థం అనే లక్ష్యానికి మార్గమధ్యంగా అందించబడిన మధ్యేమార్గవాక్యమే గాని అందుకు వేరైన సిద్ధాంతం మాత్రం కాదు.

**కార్య - కారణ సంబంధములు -** ఇక్కడ సాంఖ్య సిద్ధాంతములో కనబడే ఒక అభిప్రాయం గురించి చెపుతాను, విను.

**కార్యమే (దృశ్యము) సత్యమా? -** పై వాక్యములను అనుసరించి కార్యమే సత్యమై అట్టి కార్యసత్యమే కారణత్వముగా రూపొందించుచున్నదా? లేక

**కారణమే (ద్రష్టయే) సత్యమా? -** "కారణమే సత్యమై, ఆ కారణమే కార్యము నందు ఆరోపించబడుచున్నది" అనాలా? లేక

**కార్య - కారణములకు ఆవల ఉన్నట్టి పరమాత్మయే సత్యమా? -** పరమాత్మయే సత్యమై, అద్దాని సత్తయే కార్య–కారణములందు ఆరోపించబడుచున్నదా?

ఈ మూడు ప్రశ్నలను సాంఖ్య సిద్ధాంతాలు బాగా తర్కించి విచారించాయి. చివరికి ఇలా నిర్ణయింపబడినది–

కార్యసత్యమే ఒకానొకప్పుడు కారణత్వము పొందుతోంది.

(అనగా బ్రహ్మమే ఒకానొకప్పుడు జగత్తుగా పరిణమిస్తోంది.)

మరల మరొకప్పుడు ఆ కారణత్వమంతా కార్యత్వములోనే లయిస్తోంది.(మరల ఈ జగత్తు మరొకప్పుడు బ్రహ్మమునందే లయిస్తోంది?)

**ఇక మా అభిప్రాయం విను -** ఆయా 'బోధ'లలో మాకు కొంత భ్రాంతి కనబడుతోంది. "వాచారంభమ్, వికారో నామధేయమ్" అన్నట్లుగా మట్టివలన కలిగిన "కుండ–గోడ'...ఇవన్నీ కేవలం పేరుకు మాత్రమే వేరు వేరుగా ఉన్నాయి. 'మట్టిగోడ' అనునది మట్టికంటే వేరా? మట్టిగోడ అవటం, కుండ అవటం ఎక్కడున్నది? మట్టిలో గోడగా ఏర్పడవలసిన కారణమే ఉండదు కదా! బ్రహ్మమునందు కారణమే మిథ్య. కారణమే మిథ్య అయినప్పుడు కార్యము కూడా మిథ్యయే కదా! బ్రహ్మము నందు జగత్తు ఏర్పడటానికి ఏ సహకారి కారణం లభించుటయే లేదు.

కారణమే అసత్యమైన చోట ఇక కార్యము ఉత్పన్నంకాజాలదు.

"సత్యమగు కారణము - కార్యత్వమును పొందుచుచున్నది ... బ్రహ్మమే జగత్తుగా పరిణమిస్తోంది" ... అనునది ఆత్యంతిక సత్యము కాజాలదు. అందుచేత-

సద్వస్తువగు పరమాత్మ యందు కార్య-కారణములు ఏ క్షణంలో కూడా లేవు. అద్దాని సత్త యందే "కార్య - కారణములు ఆరోపించబడుచున్నాయి. తదనంతరం, జాగ్రత్తుగా భ్రమ యందు వలె దర్శించబడుతోంది."

ఈ అవగాహనయే జీవుని తన సత్యత్వము వైపు నిత్యత్వము వైపు నడిపిస్తుందని మా అభిప్రాయం. ఆరోపణ బుద్ధి కారణంగా ఆత్మయందు ఈ జగత్తు యొక్క కారణము, జగత్తు అనబడే కార్యము అసమగ్రమైన అవగాహన కలవారికి కనబడుచున్నది.

"ఈ జగత్తు పరమాత్మ నుండి ఆవిర్భవిస్తోంది" అనే మాట శిష్యులకు బోధించుట కొరకై గురువులచే కల్పించబడిన ఒక మాధ్యే మార్గ విధానంగానో, లేక అసంపూర్ణమైన అవగాహన చేతనో ఏర్పడుచున్నది. అదంతా మిథ్య మాత్రమే...! అందుచేత "ఈ జగత్తు అనబడు ఒకానొకటి ఏర్పడింది" అనే అసత్యత్వపు భావనయే నీ నుండి తొలగించి వేయి. జగద్భావన త్యజించివేయ బడుగాక! అప్పుడు "ఆదిమధ్యాంత రహితము, సత్స్వరూపము" అగు పరమాత్మయే శేషిస్తోంది.

అదియే నీ యొక్క వాస్తవ స్వరూపం. 'దానికి మించి వేరుగా ఎక్కడా ఏదీ ('జగత్తు' అనే పేరుతో) లేనే లేదు' అని గ్రహించు.

❖❖❖

# 5. ఈ జగత్తుకు కర్త ఎవరు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ రామచంద్రా! సర్వదా తెలుసుకొనబడవలసిన వస్తువైయున్న ఆత్మను ఎరుగుటలో శ్రేష్ఠుడవు. ఇప్పుడు "ప్రళయ సమయంలో ఈశ్వరుని యందు ఈశ్వరునికంటే వేరైన జగత్తు ఉన్నదనుట దోషయుక్తము" అని నిరూపించబోవుచున్నాను. విను.

❖

సృష్టి ఉంటే జగత్తు ఉంటుంది. మరి జగత్తే లేకపోతే...? సృష్టి ఉండజాలదు కదా! "ఉత్పత్తి" అనే క్రియ, కర్త ఉంటేనే సాధ్యపడుతుంది.

**ఈ జగత్తుకు కర్త ఎవరు?** - ఒకవేళ "సద్రూపమగు పరబ్రహ్మమే జగత్తుకు కర్త" అని అంటామనుకో... అప్పుడాతను కర్తృత్వ , భోక్తృత్వములు కలవాడౌతాడు. ఈ జగత్తు ఒకప్పుడు ఉండటం, మరొకప్పుడు లేకపోవటం (ఉదా : జాగ్రత్ - సుషుప్తులు) అందరికీ అనుభవమే కదా! జగత్తును సృష్టిస్తున్న కర్తను సృష్టించుచున్న వేరొక 'మహాకర్త' ఉండి ఉండాలి.

(ఈ జగత్తును ఎవరో సృష్టించుచున్నాడని అనుకుంటే, ఆ వ్యక్తిని సృష్టించుచున్నదెవరు? అను ప్రశ్న ఉదయిస్తుంది)

'కాని కూటస్థమగు పరబ్రహ్మమునకు కర్త లేదు' అనునది వేదవచనం. బ్రహ్మము ఉత్పత్తి రహితమైనది. ఉత్పత్తి అనబడు ప్రసక్తియే లేని పరబ్రహ్మమునందు 'జగత్తు యొక్క సత్త' మహాప్రళయ సమయంలో (జగత్తు రహితమైన స్థితియందు) ఎట్లు, ఎచ్చట, దాగి ఉండగలదు? కల్పనారహితమైన చిదాకాశము నందు 'కర్త'ను గురించి కల్పన చేయాలనుకుంటే, ఆ కర్తను సృష్టించునట్టి సహకారి కారణము ఏమిటో కూడా మనం గుర్తించగలగాలి.

బ్రహ్మమే కర్తయా? బ్రహ్మము సర్వదా 'అకర్త' కదా!

అసలు ఏ సహకారి కారణాలు లేకుండా జగత్తు తనంతట తానే బ్రహ్మము నందు ఉత్పత్తి పొందుచున్నదా? నీరు, గాలి, నేల వంటి సహకారి కారణాలు లేకుండా విత్తనం ఎక్కడన్నా మొలకెత్తుతుందా? 'గొడ్రాలి రెండవ కూతురు గడుసుది' అనేది ఎట్లా ఏర్పడగలదు? అట్లు ఎవ్వడూ, ఎక్కడా, ఏదీ గాంచుచుండుట లేదు కదా?

**సర్ప రజ్జు భ్రాంతి -** కనుక, 'సహకారి కారణము' లేకుండా ఎవరికైనా ఏదైనా కనిపిస్తుంటే, అది "త్రాడులో కనబడే పాము వంటిది" అని అనక తప్పదు.

త్రాడు పాముగా కనిపించుటంలో త్రాడు పాత్ర ఉన్నదా?– ఉన్నది.

త్రాడు స్వయముగా పాముగా అగుచున్నదా?– లేదు.

పాముగా కనబడవలెనను ఇచ్ఛ త్రాడు కలిగియున్నదా? – లేదు.

ద్రష్టయే అట్లు త్రాడునందు పామును ఆరోపించుచున్నాడా? – అవును.

ద్రష్ట "పామును చూచెదనుగాక" అను ఇచ్ఛ కలిగియున్నాడా?–అట్లని అనలేము. కానీ, అతని సంస్కారములే త్రాడును పాముగా చూచుటకు తెరవెనుక నుండి ప్రోత్సాహక కారణాలు అగుచున్నాయని అనవచ్చు. అయినప్పటికీ, త్రాడే లేకుంటే పాము స్ఫురించేదే కాదు కదా! పాము త్రాడునే ఆశ్రయించుకొనియున్నదా? అవును. కానీ, పాము' అనబడునది మొదలే లేదుకదా! ఈ 'పాము' అనునది ఇతఃపూర్వం త్రాడునందే దాగి వున్నదా? లేని పాము త్రాడులో దాగి ఉండట మేమిటి? ఈ పాము త్రాడు కన్నా వేరా? కాదు. ఇదియే 'సర్పరజ్జు భ్రాంతి'.

❖

సృష్ట్యాది యందు ఈ "జగత్తు" లేక "సృష్టి" రూపమున బ్రహ్మమే తనయందు స్థితి పొంది ఉంటోంది. ఆ బ్రహ్మం ఇప్పటికీ (సృష్టి సమయంలో కూడా) ఆకారరహితమై, తన స్వస్వరూపం నందే సర్వదా నెలకొనియే ఉంటోంది. అట్టి బ్రహ్మమునందు మరి "ఇది జనించునది. ఇది జనింపజేయునది" – అను భేదమెక్కడిది చెప్పు? అట్టి భావమునకు చోటే లేదు.

అట్లా కాకుండా, ప్రళయము నందు 'జగత్తు' అనబడుదాని ఉనికిని అంగీకరించామనుకో... అప్పుడు "బ్రహ్మములో ఉన్నట్టి 'జగత్ సత్త', జగత్తుగా పరిణామం చెందటానికి, ఎక్కడి నుండో సహకారి కారణాలు వచ్చి చేరుతున్నాయి" అని అనవలసి ఉంటుంది. (అంటే "బ్రహ్మమునకు వేరుగా వేరొకచోట ఏదో ఉన్నది. అక్కడి నుండి ఈ సహకారి కారణాలు బయలుదేరుచున్నాయి"

అనాలి.) అట్లా అనలేము కదా? బ్రహ్మమునకు బాహ్యమంటూ ఏదీ లేదని 'వేద-ద్రష్టల' యొక్క అనుభవం కదా!

**శ్రీరాముడు :** మట్టి కుండ కావడానికి కుమ్మరి చక్రం, కుమ్మరివాడు సహకారి కారణాలు. అట్లాగే బంగారు ఆభరణం కావటానికి కొలిమి, వివిధ ఆకారములతో కూడిన లోహపాత్రలు, కంసాలి సహకారి కారణాలు. ఇక్కడి సహకారి కారణాలు బాహ్యము నుండి వస్తున్నాయి. అయితే, బ్రహ్మము నందు జగత్తు ఉద్భవించటానికి కారణమగుచున్న ఆ సహకారి కారణాలు "బ్రహ్మము నుండే వస్తున్నాయి" అని అనవచ్చు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్లా అయితే ... బ్రహ్మము-జగత్ సత్త - సహకారి కారణాలు ... ఇవన్నీ ఒక్క బ్రహ్మమే అయివున్నాయని నిరూపించబడుచున్నట్లే కదా!

బ్రహ్మమే అయివున్న ఈ జగత్తు బ్రహ్మమే కారణంగా బ్రహ్మమునందే స్ఫురించుచు, మరల బ్రహ్మమునందే లీనమగుచున్నది - అను ప్రవచనమునకు అర్థమగుచున్నది.

**శ్రీరాముడు :** మీరు చెప్పేది వాస్తవమే స్వామీ! "ప్రళయములో ప్రకృతితో కూడుకొనిన పరమాత్మ యందు సహకారి కారణసహితమైన ఈ జగత్తు తిరోహితమై (having been withdrawn) నిశ్శబ్ద అప్రకటిత రూపమున ఉంటోంది" అని చెప్పబడేదంతా చిన్న పిల్లలు చెప్పుకొనేదే కాని, బుద్ధి మంతులు అట్లు గాంచరని ఇప్పుడు ఒప్పుకుంటున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి:** చూచావా? రామా? దీనిని బట్టి తేలేదేమిటి? ఈ జగత్తు సత్యమైన రూప మంటూ ఏదీ కలిగియుండలేదు. కలిగియుండుట లేదు. కలిగియుండబోవుట లేదు. శుద్ధమగు చిదాకాశమే భావనామాత్రంచేత శీఘ్రంగా తనయందు ఈ 'జగత్ అనుభవం' అను రూపమున వికసించుచున్నది. ఎప్పుడైతే ఈ విధంగా విచారణచే జగత్తు యొక్క అభావమే సిద్ధిస్తోందో అప్పుడిదంతా బ్రహ్మమే అవుతుంది కాని, మరింకేమీ కాదు".

❖❖❖

# 6. స్మరణ-విస్మరణ

ఈ బ్రహ్మము "తనను తాను" స్మరించుచున్నప్పుడు (పూర్ణముగా ఎరుగుచున్నప్పుడు) బ్రహ్మానుభవమే పొందుతోంది. అప్పుడిక జగత్తు యొక్క అనుభవం ఉండుటలేదు. తనను తాను విస్మరించినప్పుడో, ఈ జగత్తులోని అనేకత్వమును ఆశ్రయించి ఉంటోంది. జగత్సంబంధమైన సంస్కారముల ప్రభావం చేత ఇంద్రియములచే పొందబడుచున్నదే 'జగత్తు'గా చెప్పబడుతోంది. తనను తాను అంతటా దర్శించునట్టి అనుభవమే బ్రహ్మానుభవం సుమా!

మట్టికి రూపం లేదు. కాని కుండకు రూపం ఉన్నది. కుండ మట్టి కంటే వేరైనది కాదు. 'రూపము పొందుట' అను చమత్కారం మట్టి యందు సర్వదా ఉండియే ఉన్నది. అదే బ్రహ్మం నందు గల చిచ్ఛక్తి. కుండ పగిలినప్పుడు మట్టి-మట్టియే అగుచున్నది.

**శ్రీరాముడు :** అంటే, ఈ జీవుడు గాఢ నిద్రాపరవశుడు అయినప్పుడో, లేక మరణించినప్పుడో జగత్తు యొక్క రాహిత్యమును అనుభవించుచున్నాడు కదా. కుండపగిలితే మట్టి అగుచున్నట్లు ఈ జీవుడు దేహము తొలగినప్పుడు పరబ్రహ్మమే అగుచున్నాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** లేదు. అది సరి కాదు. ఈ జీవుడు గాఢనిద్రాపరవశుడైనప్పుడో, లేక మరణించినప్పుడో ఈ పదార్థ వ్యవహారము అతని నేత్రములకు గోచరించకపోవచ్చు. అంత మాత్రం చేత జగత్ సంస్కారం చిత్తమునందు 'నివృత్తి' చెందదు సుమా! ఈ చిత్తము మరల తదుపరి శరీరములను తనయందలి 'మననత్వము' అను కారణంచేత పొందుతూ పోతూనే ఉన్నది. సంకల్పవశంచేతనే అదంతా ప్రాప్తించటం జరుగుతోంది. అనగా మరణానంతరం కూడా ఈ జీవుడు పదార్థ పూరితమైన జగత్తును దర్శిస్తూ పోతూనే ఉన్నాడు. ఓ రామా! "ఈ దృశ్యమును పొందుట" అనబడునది శరీరప్రాప్తితోనే ప్రారంభమగుచున్నదని అనుకొంటున్నావా? లేదు. అట్లే శరీరము నశించిన మాత్రం చేత చిత్తము శమించుట లేదు. అసలీ దృశ్యమును ఇట్లు చూస్తున్నది ఎవరు? శరీరమా? చిత్తమా?... చిత్తమే చూస్తూన్నది గాని, శరీరము కాదు సుమా!

'చిత్తం' అంటే ఏమిటి?... "కామ్యకర్మలకు సంబంధించిన వాసనల యొక్క బీజమే చిత్తం".

దృశ్య శమనము అంటే అట్టి బీజము (చిత్తం) శమించుట.

అంతేగాని, 'దృశ్యము శమించుట' అంటే 'పదార్థములు తొలగించుట' – అని కాదు సుమా! పదార్థములు ప్రక్కకు పెట్టినంత మాత్రంచేత 'దృష్టి – భావన' తొలగుతాయని అనలేం. పదార్థములు శమిస్తే ఏమియు శమించనట్లే. చిత్తము శమించటమే నిజమైన శమము. జ్ఞానము లేకపోతే చిత్తము శమించదు. చిత్తం శమించకపోతే దృశ్యం ఉండియే తీరుతుంది. కనుక రామా! "దృశ్యం నాకుండకూడదు" అని భావించి, రాజ్యాదులను త్యజించినంతమాత్రంచేత ఏం లాభం? చిత్తములో సంస్కారవృత్తులు ఉన్నంతవరకు దృశ్యానుభవం యథారీతిగా ఉండనే ఉంటుంది.

"మనస్సులో అజ్ఞానము ఉండి ఉన్నది" అని గుర్తించబడాలి. అట్టి మూల అజ్ఞానం సహితంగా మనస్సును సంపూర్ణంగా అధిగమించివేయాలి.

అదే (లేక, అప్పుడే) మోక్షం. అంటే 'దృశ్య' మనే అనర్థమును సంక్షయింపజేయటమే మోక్షం.

ఒకడు తనలోని అజ్ఞానపూర్వకమైన పదార్థ – సంస్కారములను ఎదుర్కోకుండా, "ఈ జగత్తు ప్రళయంలో ఏమౌతుంది? ప్రళయానంతరం ఎక్కడి నుండి వస్తుంది?" అని వాదోపవాదములు ఎన్ని జన్మల వరకు చేసినా మనకు లభించేదేమీ ఉండదు. ఏది స్వతహాగా లేదో "అది లేదు" అను జ్ఞానమే ముక్తికి సాధనము గాని, "ఉన్నట్లు ఎంత కాలం ఉంటుంది? నిద్రాణంగా మరెంత కాల ముంటుంది?" అని నిరుపయోగంగా కాలం వృథా చేసుకోవద్దని సత్యాన్వేషకులందరికి మా మనవి. "పదార్థములు ఉండవచ్చు, లేకుండవచ్చు. ఈ రెండింటియందు అభేదమే సర్వదా సత్యం. కాబట్టి నా చిత్తం నుండి 'పదార్థములను స్మరించటం' తొలగించి, బ్రహ్మమును స్మరించటంతో నింపివేస్తాను" అని లక్ష్యము కలిగియుండి, ఆ తరువాత ఏది ఎట్లు ఉచితమో అట్లే ఆచరించు.

'అజ్ఞానము' అనబడు జాడ్యమునకు "ఆత్మ సాక్షాత్కారము" అనునదే ఔషధం. ఆత్మ సాక్షాత్కారముచే "చిదాకాశము" అనబడు రూపముగల ప్రబోధం కలుగుతుంది. అనగా, "ఈ జగత్తంతా చిన్మాత్రమగు బ్రహ్మమే అయి ఉన్నది. చిన్మయ రూపము కానిదంటూ లేశం కూడా ఎక్కడా లేదు" – అను జ్ఞానం పరిపక్వత పొందుతుంది. "ఇతని పేరు ఇది, వీరు నా వారు, ఇవి నావి, నేను పుట్టాను, చచ్చాను"... అను భ్రమలు హృదయాంత రంగములలో ఉండజాలవు.

ఒక గోడపై చిత్రించబడిన చిత్రము వాస్తవమా? అందులో కనబడే పులి, మనుష్యులు మొదలైనవి బాలునకు భావావేశం కలిగించవచ్చునేమో! గోడపై చిత్రించబడిన కథా చిత్రంలోని సంఘటనను చూచి దుఃఖించటం అజ్ఞులు వ్యవహారమేకదా! గోడపై చిత్రముతో 'తాదాత్మ్యము' తొలగితే 'గోడ' యొక్క అనుభవము మాత్రమే సిద్ధించునట్లు, ఆత్మజ్ఞానానుభవం సముపార్జించు వారికి ఈ జగత్తు అంతా కూడా "తనయొక్క మరొక స్వరూపం" గానూ, "స్వకీయమైన దర్పన చమత్కారం" గానూ గోచరించటం జరుగుతోంది.

**చిత్రకథా న్యాయము -**

1. గోడపై చిత్రించబడిన ఒక కథా దృశ్యం.
2. గోడ
3. ఆ గోడనూ, ఆ రంగుల కథా దృశ్యములను చూస్తున్నవాడు

ఈ మూడింటి సంబంధమునే 'చిత్రకథాన్యాయం' అని అంటూ ఉంటాము. ఈ కనబడే పర్వతాలు, భూములు, వర్షాలు, కాలము, జన్మ, మరణములు మొదలైనవన్నీ చిత్రకథా న్యాయమును అనుసరించే ఉన్నాయి. అట్లే కల్ప–మహాకల్పములు, ఈ సృష్టి, వేదావాఙ్మయములో చెప్పబడిన "సృష్ట్యాది (సృష్టి యొక్క ఆరంభము)" మొదలైనవన్నీ కూడా సుమా! అంతే కాదు. ఈ ఆకాశాదుల సృష్టి క్రమము, కోట్ల కొలది బ్రహ్మాండములు, భూత – భవిష్యత్ – వర్తమానములోని సంబంధ బాంధవ్యములు, దేవతలు మనుష్యులు, చతుర్దశ భువనములు, సప్తద్వీపములు ... ఇవన్నీ చిత్రకథాన్యాయమును అనుసరించే ఉన్నాయి. ఇవన్నీ అల్పదృష్టికి వాస్తవముగానూ, ఉపాధి పరంపరల దృష్ట్యా స్వప్నతుల్యంగానూ, ఆత్మ దృష్ట్యా భ్రమగానూ ప్రాప్తిస్తున్నాయి. అనగా ఇవన్నీ "ఈ జీవుడు అనబడు ద్రష్టయొక్క స్వస్వరూపమే" అయివున్న 'సర్వాత్మ' అను గోడపై చిత్రించబడిన చిత్రకథ వంటిది.

ఆత్మకు వీటన్నిటితో సంబంధము లేనేలేదు. ఆత్మ యందు ఇవి లేవు.

**శ్రీరాముడు :** మరి ఇవన్నీ ఎందుకు కనబడుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** నీవు ఆత్మదృష్టిని దృఢీకరించుకోక పోవుటచేతనే 'జగద్దృష్టి' అనునది ఏర్పడి ఉంటోంది. అట్టి జగద్దృష్టికి అవాస్తవమగు ఇవన్నీ దృశ్యమానమౌతున్నాయి.

పైన చెప్పిన దృశ్య వ్యవహారమంతా ఆవరణ రహితమే.

ఒక సత్యమును ప్రకటిస్తున్నాను, విను.

అనంతమగు చిదాకాశమున ఏ చిత్స్వరూపము ఉండి ఉన్నదో అది ఇతఃపూర్వం ఎట్లున్నదో, ఇప్పుడు కూడా అట్లే స్ఫురించుచున్నది.

'కిటికీ' లోంచి సూర్యకిరణాలు గదిలోకి ప్రసరిస్తూ ఉంటే, ఆ కిరణాలలో కనబడే పరిచ్ఛిన్నములైన పరమాణువులన్నిటిలోను ప్రకాశించే సూర్యకాంతి ఒక్కటే కదా! ఈ సర్వ పదార్థములు 'మహాచైతన్యము' యొక్క ప్రభవములే అయివున్నాయి.

అయితే గోడపై చిత్రమునకు, ఈ జగత్తుకు ఒక భేదము ఉన్నది.

గోడపై చిత్రం సాకారమైనది. ఈ సృష్టియో, రూపరహితము.

మనస్సుచే 'క్షుభితం' అగుచున్న చైతన్యము తనయందలి చిత్-చమత్కారమైనట్టి ఈ జగద్రూపమంతా మననము చేయుచు (అనగా, భావన చేయుచు) అనుభవించుచున్నది.

మరొకప్పుడు అది మననమునకు అతీతమైయున్న తన స్వస్వరూపమగు ఆత్మవస్తువుతో 'ఏకీభావము' పొందుచున్నది.

'చిత్రములోని కథ'ను చూచువాడు 'గోడ'ను, 'గోడ'ను చూచువాడు 'చిత్రము' లోని సంఘటనలను చూడరు కదా! చైతన్యమే స్వరూపముగాగల ఈ జీవుడు ఆత్మను ఏమరచి ఉండు నప్పుడు జగత్తును గాంచుచున్నాడు. అట్లు జగత్తును గాంచుట ప్రారంభించుటయే 'కల్పారంభం". "జగత్ రాహిత్యం" అను అనుభవమే "కల్పాంతం" లేద జగద్రాహిత్యం.

'దృష్టి' యొక్క దోషం చేత ఒకనికి పెద్ద 'స్ఫటికశిల' యందు ఏవేవో రేఖలు చలనరహితంగా ఉన్నట్లు కనిపిస్తూ ఉంటాయి. ఆత్మయొక్క వాస్తవమైన స్వరూపమునందు ఈ బ్రహ్మాండములు ఉత్పన్నమగుట లేదు. నశించుటలేదు. అవి వచ్చుట లేదు,పోవుట లేదు. నిరాకారమగు 'ఆకాశం' నందు 'నిరాకారమే' అయివున్న 'ఆకాశ విభాగము' ప్రాప్తిస్తూ ఉన్నట్లు నిర్మలమగు ఆత్మ యందు, ఆత్మయే రూపముగా గల ఈ సృష్టులన్నీ స్ఫురించుచున్నాయి.

నీటి యందు ద్రవత్వము, వాయువు నందు చలనము, సముద్రము నందు కెరటములు, గుణవంతుని యందు గుణములు ఉన్నట్లే ఆత్మయందు ఈ జగత్తు ఉంటోంది. శాంతము, ఏకరసము, విజ్ఞానఘనము అయినట్టి బ్రహ్మమే స్వయముతో 'ఉత్పత్తి – నాశనములు" అను వ్యవహారముగా కూడుకొనిన ఈ జగత్తు రూపమున వ్యాప్తమైయున్నది.

**శ్రీరాముడు :** స్వామి! ఈ 'జగత్తు' ఆత్మనుండియే ఉద్భవిస్తోందనునది మీరు ఒప్పుకుంటున్నారు కదా? లేక ఇవి ప్రకృతి నుండి ఉత్పన్నమౌతున్నాయా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మనుండి ఏదైనా ఉత్పన్నం కావటానికి సహకారి కారణమనేది ఏదీ లభించుటయే లేదని మనం చెప్పుకున్నాం కదా! అందుచేత "జగత్తు ఆత్మ నుండి ఉత్పన్నమౌతోంది" "ప్రకృతి నుండి ఆత్మయే రూపముగా గల ఈ జగత్తులు ఉదయిస్తున్నాయి." మొదలైన భావాలన్నీ పిచ్చి పిచ్చి వాక్యాలూ, మధ్యేమార్గ వాక్యాలేగాని, 'పూర్ణార్థవాక్యాలు' కావు.

ఆత్మ నుండి ఏదీ ఉద్భవించుటలేదు. స్వసంకల్పముచే ఆ చైతన్యమే జగద్దృష్టి కలిగియుండి, తన స్వరూపమునే ఇట్లు జగత్తుగా గాంచుచున్నది.

నాయనా! రాఘవా! ఇప్పుడు చెప్పుకున్న ఇన్ని వాక్యముల సారమేమిటో మరొక్కసారి సమీక్షిస్తూ వివరిస్తాను. ఈ సంక్షిప్త వాక్యాలు విను –

**1. నిత్యోదిత స్వస్వరూపం -** నీవు సర్వదా నిత్యోదయ స్వరూపముగల చైతన్యమువే గాని ఈ జడదేహమువు కాదు. నీవు భావనలుగా పరిణమించుటలేదు. అనగా, సర్వ భావములకు ఆవల స్వస్వరూపమునందే సర్వదా ఉండి ఉన్నావు.

**2. సర్వమునకూ ముందుగానే...!** సర్వ కల్పనలకు ముందే ఉన్న శుద్ధ స్వరూపమువే నీవు. కల్పనారూపములగు కళంకములేవీ నీ పట్ల ఉండజాలవు. అందుచేత ఇప్పటికిప్పుడే సర్వవేదనలు త్యజించి నిశ్చింతుడవై ఉండు.

**3. సదవగాహన, నిస్సంగముల అభ్యాసం -** స్వప్నరూపములతో పోల్చతగ్గ ఈ దృశ్యవస్తువులకు సంబంధించిన వికల్పములన్నీ నీనుండే బయల్వె డలుచున్నాయి. కనుక, అట్టి వికల్పములన్నీ "సదవగాహన – నిస్సంగము"ల సహాయంతో తొలగించుకో.

**4. స్వస్వరూపంలో జాగరుడవు కావటం -** 'అవిద్య' అనబడే సుదీర్ఘమైన గాఢనిద్ర నుండి మేలుకో. నీ యొక్క పరమాకాశ స్వరూపమును గ్రహించి ప్రశాంతుడవు కమ్ము.

**5. జ్ఞానమును జ్ఞాన మార్గాలను ఆశ్రయించటం -** నిర్భయుడవై ఆత్మజ్ఞానమును ఆశ్రయిస్తూ జాగృతి పొందు.

**6. "సర్వమునందు నన్ను, నాయందు సర్వమును గాంచటం" -** "బ్రహ్మవిత్" స్వభావుడవై వెలుగొందుము. అన్ని భేదభావములను త్యజించివేయి. సర్వమును నీయందు, నిన్ను సర్వము నందు గాంచుచుండు. అప్పుడు నీ ఉనికి, సంచారం ఈ భూమండలమును "భూషితం' చేగలదు.

❖❖❖

# 7. స్మృతి

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! మీరు మమ్ములను ఉత్తమోత్తమమైన భావనవైపుకే నడిపించు చున్నారు. చాలా సంతోషం. ఇప్పుడు నాదొక సందేహం.

**మహాకల్పాంతము, సృష్ట్యాది -** మహాకల్పాంతము తరువాత, సృష్ట్యాదియందు, ప్రథమ ప్రజాపతి (బ్రహ్మ) 'స్మృతి" లేక "సంస్కారం" రూపముగా కలిగియుండి, జన్మించుచున్నాడని నేను అనుకుంటున్నాను. అట్టి ఆ ప్రజాపతి యొక్క స్మృతి లేక మనస్సే ఈ జాగ్రత్ రూపమున ఉత్పన్నమగుచున్నది కదా? అంతేనంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. నీవు చెప్పినట్లు "మహాప్రళయం" గతించిన తరువాత మరల "సృష్ట్యాది" యందు ప్రథమ ప్రజాపతి 'స్మృతి' రూపముననే ఉత్పన్నమగుచున్నాడు. కనుక

"స్మృతి" యందే ఈ జగత్తు భాసిస్తోంది. అనగా, స్మృతి యందే ఈ జగత్తు యొక్క అనుభవం సంకల్పరూపమున స్థితి కలిగియున్నది.

అయితే, మట్టితో కొన్ని బొమ్మలు తయారయ్యాయనుకో... 'మట్టి ఆకారములుగా మారుచున్నది' అన వచ్చునా? ఆత్మ స్మృతి రూపమును పొందటం ఉంటుందా? ఒక మహా వృక్షమును చూపించి, 'దీని వ్రేళ్ళు ఆకాశంలో ఉన్నాయి. ఆకులు మాత్రం ఇక్కడ చేయికి అందుతున్నాయి' అనటం ఎంత అసమంజసమో – అదీ అంతే.

పరమాత్మ యందు స్మృతి లేదు. 'జన్మ' మొదలైన వికారములు లేవు.

'స్మృతియే జన్మలకు కారణం' అనేది మధ్యేమార్గవాక్యం మాత్రమే. ఈ వాక్యం, 'జీవుడు ఆత్మస్వరూపుడే కనుక జన్మరహితుడు' అను వాక్యాలు రెండూ ఒకేసారి ఒనగూడుచున్నాయి. "నదీ జలం–తటాకజలం–జలం"; "బొమ్మలోనికుండలోని మట్టి – మట్టి" ఒనగూడుచున్నట్లే ఆ రెండూ ఏర్పడుచున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! 'ప్రళయం' అంటే ప్రతి రోజు ఈ జీవుడు అనుభవించే 'సుషుప్తి' వంటిదే కదా! మనమందరం రాత్రిపూట గాఢనిద్ర అనుభవిస్తున్నాం. మరల మేల్కొన్నపుడు పూర్వ స్మృతులన్నీ యథాతథంగా ఉండి ఉంటున్నాయి.

అట్లాగే సృష్ట్యాదియందు ప్రజాపతి తనయందు స్మృతి కలిగి ఉంటున్నాడు అని అనవచ్చు కదా! 'మహా ప్రళయము యొక్క ప్రబల మోహము కారణంగా పూర్వకల్పములోని సంస్కారము లచే జనించిన స్మృతి అంతా నశిస్తుంది" అని కొందరు అభిప్రాయం వెలిబుచ్చుతున్నారు. అట్లా ఎందుకు అనుకోవాలి? గాఢనిద్రలో లాగా మహాప్రళయంలో కూడా జగత్తుకు సంబంధించిన స్మృతులు దాగియే ఉంటాయని అనుకోవచ్చునంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఈ జన్మకు సంబంధించినవాడను మాత్రమే నేను" అను దృఢమైన అహంకారము కలవాడు – 'జీవుడు'

" ఈ అనేక సర్వఉపాధులను ధరించువాడను నేనే" అను సమష్టి అహంకారము గలవాడు – "ప్రజాపతి (లేక) బ్రహ్మదేవుడు".

ఓ రాఘవా! విను–

పూర్వము జనించియున్న బ్రహ్మలందరు (సమష్టి సృష్టికర్తలందరు) జ్ఞానులే కదా! అందుచేత వారంతా మహాప్రళయ సమయంలో దృశ్యాన్ని త్యజించివేస్తున్నారు. అనగా ముక్తులే అగుచున్నారు. అంటే అవశ్యము నిర్విషయ పరబ్రహ్మ స్వరూపమును పొందుచున్నారు. అప్పుడిక... "పూర్వ కాలమున ఉత్పన్నమైన 'స్మృతి'ని కలిగియుండి మరల కల్పారంభమున ప్రకటితం చేయటం" అనే క్రియకు కర్త ఎవ్వరో చెప్పు?

కర్త ముక్తుడు అయినప్పుడు, ఇక స్మృతి కూడా ముక్తిపొందినదై నిర్మూలనమగుట జరుగుతుంది కదా!

ఒకడు ఒక దీర్ఘ స్వప్నమును గాంచుచూ, మేలుకొన్నాడనుకో... అప్పుడాతని స్వప్నములోని వ్యవహారమును మరొకడు వచ్చి కొనసాగించగలడా? లేదుకదా!

**అతఃస్మర్తురభావేన స్మృతిర్వోదేతికిం కథమ్ ।**

**అవశ్యంహిమహాకల్పే సర్వేమోక్షైకభాగినః ॥** (సర్గ.3; శ్లో. 8)

కర్మయే లేనప్పుడు, స్మృతి ఎట్లా సంభవిస్తుంది? ఏ విధానమును అనుసరించి సంభవిస్తుంది? 'మహాకల్పము' నందు సర్వము మోక్షము పొందుచుండును కదా! సర్వులు మోక్ష భాగులే అవుతారు. 'మోక్షము' పొందటం జరిగిన తరువాత ఇక ఇచ్ఛ – సంస్కారము – స్మృతి అనునవన్నీ నిష్ఫలములే అవుతాయి.

**శ్రీరాముడు :** మరి మీరు "స్మృతియే కల్పారంభమున ప్రవర్తిస్తోంది" అని అన్నారు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును, అన్నాను. కల్పారంభ వ్యవహారంలో 'స్మృతి' ప్రవర్తిస్తోందని చెప్పటంలో నా ఉద్దేశమేమిటో చెపుతాను, విను–

'చిదాకాశము' అనబడునది ఒకటి ఉన్నది. అది అనుభూతమా? కాదు. పోనీ అననుభూతమా కాదు. అట్టి చిదాకాశమందలి ఏ 'స్మృతి' అయితే ఈ జగత్తు యొక్క ఉత్పత్తికి హేతువు అగుచున్నదో అయ్యది చిదాకాశము యొక్క కళయే గాని వేరేమీ కాదు. సూర్యుని నుండి సూర్యకిరణములు వేరు కానట్లు 'స్మృతి' అనేది చిదాకాశమునకు వేరైనదేదీ కాదు. శ్రుతులు ఈ ఆశయమునే ప్రకటిస్తున్నాయి. ఈ జగదనుభవం అనబడే "స్మృతి కల్పిత చిత్కళ" అనునది అనంతము కూడా! చిదాకాశమే దాని స్వరూపము.

అంటే అర్థమేమిటి?... స్వయంభువు అగు పరమాత్మయే జగద్రూపమున ఉన్నాడని గ్రహించెదవు గాక! అతడే ఈ జగములను. మరల లోపలికి గొనుచున్నాడు. సూర్యకిరణములు ఒక గోపురంపై ప్రసరించటం, మరల ఆ ప్రసరణ ఉపసంహారం కావటం సహజమే కదా!

అనాదికాలంగా సిద్ధించియున్న బ్రహ్మము యొక్క నిజప్రకాశరూపమే ఈ 'జగత్తు'కు సూక్ష్మదేహం. ఈ బ్రహ్మాండ దేహమునకు ఉపాదాన కారణం పరమాత్మయే. కనుక, "ఈ బ్రహ్మాండము కూడా పరమాత్మయే" అని సిద్ధాంతీకరించబడుతోంది.

ఓ రామా! "దేశము, కాలము, క్రియ, ద్రవ్యము, రాత్రింబవళ్ళు, ఆకాశము, మేఘములు" మొదలైన అనేక విశేషములతో కూడి ఈ సువిశాల జగత్తు అంతా కనిపిస్తోంది కదా! అట్టి ఈ త్రిలోకములతో కూడిన జగత్తుఅంతా ఒక్క పరమాణువునందే భాసించుచున్నది. మరల ఈ త్రిలోకములలోని పరమాణువులందు ఈ త్రిలోకములంత విశాల సృష్టులు అసంఖ్యాకంగా భాసిస్తున్నాయి. మరల ఆ సృష్టులలో అసంఖ్యాకములైన పరమాణువులు – ఈ విధంగా వ్యవస్థ అవ్యవస్థారూపంగా ఒకదానియందు మరొకటి గ్రుచ్చబడి ఉన్నాయి. ఆయా దృష్టులకు అవన్నీ దృశ్యమానమగుచున్నాయి. అయితే రామా! అవన్నీ సత్యమని అనగలమా! కానే కాదు. ఇవన్నీ ద్రష్ట యొక్క చిత్కళాభావనా వైచిత్ర్యములే!

ఈ విధంగా జ్ఞానుల దృష్టి సర్వదా జాగృతమై ఉంటోంది. వారికి ఇదంతా ఒక మొదలుగాని, చివరగాని లేని వ్యవహారంగా, సత్–అసత్స్వరూపంగా ప్రాప్తిస్తోంది. అజ్ఞానుల దృష్టి మిథ్యా రూపముగా అనుక్షణం గతించిపోతున్న వ్యవహారంగా అంతులేకుండా ఉండి ఉంటోంది.

జ్ఞానుల దృష్టిలో ఈ ప్రపంచమంతా, నాశరహితము, శాంతము అగు కేవల పరబ్రహ్మమే అయి ఉన్నది. అదే ప్రపంచము అజ్ఞానుల దృష్టికి పదు నాలుగు లోకముల రూపమున ఉంటోంది.

❖

**యథేదంభాసురంభాతి జగదండకజృంభితమ్ ।**
**యథాకోటి సహస్రాణి భాంత్యన్యాన్యణావణౌ ॥** (సర్గ.3; శ్లో. 17)

ఈ బ్రహ్మాండము ఎట్లా భాసిస్తోందో, అదే విధంగా ఒక్క పరమాణువులో ఇటువంటి కోట్ల కొలది బ్రహ్మాండములు భాసించుచున్నాయి. స్తంభములో విగ్రహం, ఆ విగ్రహంలోని కాళ్ళు, చేతులలో మరి కొన్ని చిత్రములు లిఖించబడుచున్నట్లు, జగత్తులోని ప్రతి పరమాణువులో ముల్లోకముల విగ్రహము ఉన్నది.

ఆ ముల్లోకములలోని ప్రతి అణువులోను జగత్తులు ఉన్నాయి. ఈ వ్యవహారము అజ్ఞానము ఉన్నంతవరకు ఇట్లే ఉండి తీరుతుంది.

ఒక పర్వతము ఉన్నదనుకో... అందుగల అసంఖ్యాకములైన పరమాణువులు ఆ పర్వతముకంటే వేరు కాదు కదా! అలాగే, 'బ్రహ్మము' అనే మహాపర్వతములో ఆ బ్రహ్మమునకు వేరు కానట్టి బ్రహ్మాండములు అనబడే పరమాణువులు అసంఖ్యాకంగా ఉన్నాయి.

సూర్యకిరణాలలో కనిపించే సూక్ష్మ పరమాణువులను (త్రసరేణువులను) లెక్కించగలమా? "చిత్" అను సూర్యునిలో త్రిలోకముల రూపమున ప్రకాశించే బ్రహ్మాండ పరంపరలను లెక్కించ గలిగే వారెవ్వరు?

జలంలోను, ధూళిలోను అనేక పరమాణువులు పరిభ్రమించుచున్నట్లు చిదాకాశములో 'ప్రపంచములు' అనబడే అనేక పరమాణువుల పరిభ్రమణం చేస్తున్నాయి.

❖❖❖

## 8. ఆత్మదృష్టి - సృష్టిదృష్టి

**శ్రీరాముడు :** స్వామి! ఆ విధంగా చిదాకాశములో ప్రపంచముల రూపమున ప్రకాశించేదంతా ఏమిటి? అది బాహ్యము నుండి వస్తోందా? అంతకుముందే బ్రహ్మమున ఉండి ఉన్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! 'శూన్యము, నిరాకారము' అయివున్న ఆ కనబడే 'భౌతిక–ఆకాశము' వైపు చూడు... అది నీలముగా కనబడుతోంది... అయినప్పటికీ ఆ నీలత్వము యథార్థానికి శూన్యరూపమే అయి ఉన్నది కదా! అట్లాగే, సృష్టి రూపంగా మనకు ఇక్కడ అనుభూతమగుచున్నదంతా చిదాకాశమే అయివున్నది.

దీనిని 'బ్రహ్మం' రూపంగా ఎరిగితివా, ఆ దృష్టి 'మోక్ష'మను ఉత్తమ శ్రేయస్సును ప్రసాదిస్తుంది. అట్లా కాకుండా "సృష్టి" అనబడు ద్వైతభావనగా చూచావా, ఇది 'నరకము' మొదలైన అనేక అథోస్థితులను రుచి చూపిస్తుంది.

ఈ రెండు దృష్టులు నీ ఎదురుగానే ఉన్నాయి.

'సృష్టి - దృష్టి' అనుసరిస్తావా? 'ఆత్మ-దృష్టి' లేక 'బ్రాహ్మీదృష్టి' అనుసరిస్తావా? - నీ ఇష్టం.

వాటి పర్యవసానం మాత్రం రెండు వేరైన త్రోవలుగా... ఒకటి సంసారము వైపూ, మరొకటి మోక్షము లేక దుఃఖ రాహిత్యమువైపు... ఉన్నాయి.

ఓ రామచంద్రా! ఇప్పటి వరకు అనేకసార్లు చెప్పిన వాక్యమునే మరొకసారి చెప్పుచున్నాను. ఈ జీవుడు మరింకేదో కాదు. ఇతడు సాక్షాత్, స్వయముగా ప్రత్యగాత్మ స్వరూపుడే. సూర్యకిరణాలన్నీ సూర్యుని ప్రతిభా విశేషాలే అయినట్లు, - ఈ బ్రహ్మాండాంతర్గత జీవులంతా చిదానంద సూర్యుని ప్రజ్ఞాకిరణపుంజాలే!

ప్రపంచము యొక్క ఉనికికి కారణభూతుడైన ఈశ్వరుడు - ఈ జీవుడు ... వీరిద్దరు కూడా పరమార్థ దృష్టితో చూసినప్పుడు పరిపూర్ణము, ఏకరసము అయిన పరబ్రహ్మమే అయి ఉన్నారు.

అందుకు ప్రమాణం వేద వాక్యాలే. (పూర్ణమదః పూర్ణమిదమ్ - ఋగ్వేదము) "ఈ బాహ్య - అభ్యంతరములు (The external & internal zones) రెండూ ఉపాధి భేదం చేత బ్రహ్మము నుండే ఉత్పన్నమౌతున్నాయి" - అని శ్రుతులు ప్రవచిస్తున్నాయి. ఏది ఎందులోంచి వస్తోందో అది అద్దాని రూపమే అయి ఉంటుంది. ఇందులో సందేహించవలసినదేమీ లేదు.

**జ్ఞానోదయము -** ఈ తెలియబడుచున్న 'వేద్య వస్తు సముదాయము' అంతా, ఈ 'నీవు-నేను -అతడు' మొదలైన వాటితో సహా ... శుద్ధము, చిన్మాత్రము జ్ఞాన స్వరూపము అయిన ఆ స్వస్వరూప బ్రహ్మమే. అనగా, ఈ 'జీవుడు' గా కనబడుచున్న ద్రష్టయే దృశ్యము రూపముగా విస్తరిస్తూ, అద్దానిని ఆస్వాదిస్తున్నాడు.

అనేక కోణముల నుండి ఈ సర్వమును దీర్ఘకాలంగా పరిశీలించిన మాకు ఈ విషయం నిస్సందేహంగా గ్రాహ్యమగుచున్నది. బ్రహ్మము తప్పితే మరింకెక్కడా ఏదీ లేనే లేదు.

❖❖❖

# 9. మనస్సే ఇదంతా !

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఇంద్రియ సమూహములను జయించుట" అను వంతెన చేతచే ఈ భవసాగరము దాటబడుచున్నది. మరింకే ఇతర కర్మల వలన గాని, వ్యవహారముల వలన గాని అది సాధ్యపడేది కాదు. 'శాస్త్రము-సజ్జన సాంగత్యము-సాధన" ... వీటి సహాయం చేత జీవుడు జితేంద్రియుడు, వివేకవంతుడు కాగలుగుచున్నాడు. జితేంద్రియుడు (ఇంద్రియముల

ప్రభావమును అధిగమించినవాడు) మాత్రమే ఈ దృశ్యం యొక్క అత్యంత అభావమును ఎరుగగలడు. ఇంద్రియ జయమే సంసార భేదనము. ఇంద్రియవశత్వమే సంసారబంధనము.

చూచావా! రామా! ఇదీ, సంసార స్వరూపము. ఈ సంసార సాగరములు ఎట్లా ప్రాప్తిస్తున్నాయో, ఎట్లా నిర్వర్తిస్తున్నాయో ఈ విచారణల సహాయం చేత నీకు నీవే గ్రహించు. నిష్కామభావమును అవధరించు. ఆ పై ఏది ఎట్లు ఉచితమని భావిస్తావో, అట్లే నిర్వర్తించు.

ఇక ఎక్కువగా చెప్పవలసిన పనేమున్నది? ఈ మనస్సే 'కర్మ' అను వృక్షము యొక్క అంకుర మని గ్రహించు. ఈ మనస్సును ఉత్తమ అవగాహనతో నియమించితివా, ఇక విహిత – నిషిద్ధ (must do - must not do) కర్మల రూపమగు ఈ జగద్వృక్షము స్వయముగానే భిన్నమైపోతుంది. అంతా ఈ మనస్సే అయివున్నదని మరల మరల ప్రకటిస్తున్నాను. ఈ మనస్సుకు ఇక్కడే, ఇప్పుడే సరి అయిన చికిత్స చేయాలి. మరి ఇంకెప్పుడు ఏమి చేయగలవు చెప్పు?

**మనః సర్వమిదం రామ, తస్మిన్ అంతఃచికిత్సి తే ।**
**చికిత్సితోవై సకలో జగజ్జాలాఽ మయో భవేత్ ॥** (సర్గ. 4; శ్లో. 5)

ఈ మనస్సుకు ఇక్కడ సరి అయిన చికిత్స చేశావా, ఇది శమించిపోగలదు. అప్పుడు "జగత్సమూహము" అనబడే దృశ్యజాడ్యము మొదలంట్ల తొలగిపోగలదు.

మనస్సే ఈ దేహాకారముగా స్ఫురిస్తూ స్వప్నంలోలాగా 'క్రియాసమర్థం' అగుచున్నది. మనస్సుకంటే వేరుగా ఈ జడదేహం కార్యసమర్థమగుచున్నదెక్కడ? ఈ భౌతిక దేహం మనస్సుకన్న వేరైన లక్ష్యములు కలిగియుంటున్నదా? లేదు.

**దృశ్యాత్యంతాసంభవేన ఋతేనాన్యేనహేతునా ।**
**మనఃపిశాచః ప్రశమం యాతికల్పశతైరపి ॥** (సర్గ. 4; శ్లో. 7)

అసలు ఈ 'సంసారము' అనబడే జాడ్యమునకు మూలకారణమేమిటి? విను, చెపుతాను. ఎప్పటి నుంచో తెలియదు గాని, ఈ జీవుణ్ణి "దృశ్యము" అనబడే ఒకానొక పిశాచము పట్టి పీడిస్తోంది. ఎందుకో, అతడు అది గుర్తించుట లేదు.

నా ఈ మాటలు జనులు శ్రద్ధగా ఆలకించెదరు గాక! జ్ఞానముచే ఈ దృశ్యమును పూర్తిగా రహితం చెయ్యాలి. అనగా, మొత్తము దృశ్యమునకు అతీతంగా వెళ్ళాలి. అదియే సర్వ ప్రయత్నముల యొక్క ఉత్తమ ప్రయోజనం.

మరింకే వ్యవహారం ఎంతగా ఆశ్రయించినా సరే, ఈ దృశ్యము శమించేది కాదు సుమా!

మనోరోగమునకు పరమోత్తమమైన ఔషధం – "దృశ్యము యొక్క పూర్ణ రాహిత్యం–లేక సంపూర్ణమైన 'అతీతత్వం' " అయివున్నది. ఇందుకు వేరే మందేమీ లేదు.

ఈ మనస్సే దేహాదులందు ఆత్మభావనమును కలుగజేసి, మోహమును ఉత్పత్తి చేసి అంది స్తోంది. జన్మించేదీ అదే. మరణించేదీ కూడా అది మాత్రమే. ఈ మనస్సు యొక్క ప్రభావం చేతనే

జీవుడు బంధంలో తగుల్కోవటం జరుగుతోంది. ఎవడైతే ఈ మనస్సును ఆత్మజ్ఞానంవైపుగా ఉన్ముఖం చేస్తాడో, అట్టివాడు స్వయంగా విముక్తిని పొందుచున్నాడు. "ఓ దృశ్యమా! నీవు నా మనస్సు యొక్క ప్రదర్శనమే!" అని గానం చేసే వాని మనస్సు దృశ్యంలో తగుల్కొనే ప్రసక్తి ఎక్కడిది?

ఓ జనులారా! మీరంతా చూస్తున్న ఈ జగత్తు మరెక్కడో లేదు సుమా! ఇది మీ చిత్తములందు ఇట్లు సంకల్పాదుల బలంచే జగత్తుగా ఏర్పడుచున్నది. 'శూన్యం'లో విశాల గంధర్వ నగరంలాగా స్వప్నంలో చమత్కారములైన అనేక వస్తుజాలమువలె ఇదంతా ప్రాప్తిస్తోంది. అవస్తువే అయి వుండి కూడా ఎంతో సత్యముగా తోచుచున్నది. నాయనలారా! మీరంతా వాస్తవానికి సత్య–నిత్య–నిరుపమానంద స్వరూపులే అయివున్నారు. కాని ఏం లాభం? నిష్కారణంగా మనస్సుచే ప్రభావితులై 'అసత్యము'ను అత్యంత సత్యముగాను, నిత్యసత్యమగు 'నిర్మల చైతన్య తత్త్వము'ను లేనట్టిదానిగాను గాంచుచున్నారని మనవి చేస్తున్నాను.

ఒక్కసారి మీ మనస్సులను నిలదీసి ప్రశ్నించండి. నిరోధించండి. ఆత్మవైపు ఉన్ముఖులు కండి. అప్పుడు ఈ జగత్తు సత్యమో, అసత్యమో నన్ను ఏమాత్రం అడగవలసిన పని ఉండదు.

❖

ఒక పూలగుత్తిలోంచి వస్తున్న సుగంధం ఆ పూలగుత్తికి వేరైన దానిలాగా గోచరిస్తూ ఉంటుంది కదా! మనస్సు నందే స్థితించియున్న ఈ జగత్తు కూడా, మనస్సుకు వేరైన దానివలె గోచరిస్తూ ఉండటం జరుగుతోంది. ఎందుచేత? ఆత్మజ్ఞాన లేమి చేతనే సుమా!

"ఒక నువ్వు గింజలో నూనె", "ఒక గుణిలో గుణములు" (చెడ్డవానిలో చెడుతనం, మంచివానిలో మంచితనం, అందగానిలో అందం, ధర్మపరునియందు ధర్మము మొ॥) ఎట్లా అంతర్లీనంగా ఉంటున్నాయో, ఈ చిత్తమునందే 'జగత్తును గాంచుట' అనబడు వాసనలతో కూడిన 'ప్రవృత్తి' ఉండి ఉంటోంది. సూర్యునియందు కిరణములు, తేజమునందు ప్రకాశము, అగ్నియందు ఉష్ణత్వము ఉన్నట్లే –మనస్సునందు ఈ జగత్తు ఉన్నది. మంచునందు చల్లదనం లేదా? ఆకాశంలో శూన్యత్వం ఇమిడి ఉంటోంది కదా! వాయువు నందు చంచలత్వం అత్యంత సహజమై ఉంటోందే! అట్లాగే ఈ మనస్సునందు దృశ్య భావము ఉండి ఉన్నది.

ఇట్లు మనస్సే "జగదనుభవము" అను "సుఖ–దుఃఖ–ఆశ్చర్య–తిరస్కార–స్వ–పర" ఆదిగా గల చమత్కారములకు కారణమగుచున్నది. కాబట్టి రామచంద్రా!

**మనస్సే ఈ సమస్త జగత్తు -**

మరొక చమత్కారమైన విషయం :

మనస్సు నశిస్తే ఈ దృశ్య జాతమంతా స్వయంగా నశిస్తుంది.

కాని, ఈ జగత్తు నశించినంతమాత్రంచేత మనస్సు నశించదు.

అందుచేత రామా! ఈ జగత్తు విషయం కొంత సేపు ప్రక్కకు పెట్టు, మనస్సును ఎట్లా లయింపజేయాలో ఆలోచించు.

సర్వ సంకల్పముల రహిత స్థితియగు 'స్వసత్త'ను అన్నివేళల ఆశ్రయించటం అలవరచుకో.

అట్టి నిష్ఠను బలపరచగల కర్మ – జ్ఞానాదులను సముపార్జించు.

❖❖❖

# II. భృగు – యమ సంవాదము

## 1. శుక్రుడు - ఇంద్ర సభాప్రవేశము

**శ్రీరాముడు :** ఓ మనీంద్రా! సర్వధర్మజ్ఞా! మా మీద అవ్యాజమైన ప్రేమతో మీరు మీ తపోధ్యానాదుల ప్రభావముచే గ్రహిస్తున్నదంతా చెప్పుకొస్తున్నారు. దోషరహిత మనోబలముచే, నిర్మలజ్ఞానంతో దర్శించుచున్న విశేషమంతా మాకు బోధించడం మా పూర్వజన్మల సుకృతమే! మీ వాక్యములు ప్రతిపాదిస్తున్న విచారణ విషయం చేత మమ్ములను మేము ఈ 'దృశ్యము' అనబడుదాని నుండి వేరు చేసుకొని పరిశీలించగలుగుచున్నాము.

మీరు సవివరంగా చెప్పుచున్నప్పటికీ, ఎక్కడో హృదయకుహరంలో ఇంకా ఏవేవో, ఎనెన్నో సందేహాలు దాగి ఉండటం చేత, మరల ఒక సందేహం ప్రకటిస్తున్నాను.

సువిశాలమైన ఆకారం కలిగియున్న ఈ ప్రపంచమంతా మనస్సునందే స్థితి కలిగి ఉన్నదని మీరు చెప్పుచున్నారు కదా! అది ఆ విధంగా ఎలా ఉండగలదు? మనస్సు నందు స్ఫురిస్తూ బాహ్యమున ఎట్లా తారసపడుతోంది? మేము తాకుట; చూచుట మొదలైన అనుభవములచే ఎదురుగా చూస్తున్నాం కదా? స్వామీ! ఏదైనా ఉత్తమ దృష్టాంతం ద్వారా చెప్పితే మరికొంత సుస్పష్టం కాగలదని నా విన్నపము.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామా! ఇంతకుముందే ప్రవచించియున్న ఉపాఖ్యానాలలో మనం ఈ విషయం చూచాము. ఐందవులు (ఉత్పత్తిప్రకరణం) స్థూల శరీరరహితులైనప్పటికీ తమ యొక్క సమాధిస్థితిలో తమచే ఆశ్రయించిన భావావేశం చేత అనేక జగత్తులను నిర్మించుకుని అనుభవించారు కదా! ఆ జగత్తులన్నీ మనస్సులోంచే వచ్చాయి కదా! లవణ మహారాజు యొక్క మనస్సు (ఉత్పత్తి ప్రకరణం) ఇంద్రజాలముచే వ్యాకులము పొందినదై చండాలత్వానుభవం అత్యంత స్థూలభావంతో పొందింది.

అవన్నీ "మనస్సు నందే ఈ జగత్తు కలదు" అని నిరూపిస్తున్నాయి.

నీవు మరొక దృష్టాంతం వినాలని కోరినప్పుడు నాకు "భృగుమహర్షి" యొక్క పుత్రుడు శుక్రుడు అప్సరసను చూచి సంసారస్థితులను పొందటం, భృగు – యమ సంవాదము గుర్తుకు వస్తున్నాయి.

మహాజ్ఞానియగు శుక్రుడు తన బాల్యంలో బాల్యచాపల్యంగా ఎట్లా సంసారిత్వము పొందాడో, కాలదేవుడు ఏ విధంగా ఈ సంసార వ్యవహారమును, మనస్సు యొక్క స్వభావ – స్వరూపములను భృగువుకు వివరించి చెప్పటం జరిగిందో చెపుతాను, విను.

❖

భృగువు అనే ఒక మహానుభావుడు ఉన్నారు. ఆయన ఋషులలో ఉత్తమోత్తముడని శ్లాఘించ బడుతూ ఉంటాడు. ఆయన ఒకప్పుడు మందరపర్వతముపై గల ఒక శిఖరంపై ఒక ప్రశాంతప్రదేశంలో ధ్యాన నిష్ఠలో ఉన్నారు. ఆయన కుమారుడే శుక్రాచార్యుడు. బాలుడైన ఆ శుక్రుడు తన తండ్రి సేవలో రాత్రింబవళ్ళు గడుపుతూ ఉండేవాడు. ఆ పిల్లవాడు మహా తేజః సంపన్నుడై, పూర్ణచంద్రుని వలె గొప్ప సౌందర్యముతో అక్కడ సంచరిస్తూ ఆ శిఖరమును పావనం చేస్తూ ఉండేవాడు.

ఒక రోజు భృగువు నిర్వికల్పన సమాధి యందు ప్రవేశించాడు. "నిర్విషయ-మౌనము" వహించుటచే అచంచలుడై 'శిల'వలె ఉండియున్నారు. శుక్రుడు తన తండ్రిసేవలో ఉంటూనే ఆ వనంలో అటూ ఇటూ సంచరించేవాడు. కొంతసేపు ప్రకృతిచే నిర్మించబడిన పుష్పశయ్యలపై, మరికొంతసేపు పర్వత-వనములందు ఆహ్లాదంగా పవళించి, చల్లటి గాలులు, పుష్పాసువాసనలు ఆస్వాదిస్తూ ఉండేవాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! శుక్రాచార్యులు 'మహాజ్ఞాని' యని చెప్పబడుతోంది కదా...!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కాని ఆ బాల్యస్థితిలో అప్పటికి మాత్రం విద్య - అవిద్యల మధ్య స్థితి కలిగి ఉండేవాడు. అనగా, అప్పటికాతడు పూర్ణమగు ఆత్మజ్ఞానమును ఇంకా పొందియుండలేదు. అట్లా అని, కేవలం అవిద్యయందు కూడా తగుల్కొనియుండలేదు. మన ఈ విశ్వామిత్ర మహర్షి శిష్యునిపైగల వాత్సల్యం చేత 'త్రిశంకు-స్వర్గం' నిర్మించి ఇచ్చారు కదా! అట్టి భూ-ఆకాశముల మధ్య ఊగిసలాడే త్రిశంక స్వర్గంలాగానే జ్ఞాన - అజ్ఞానముల మధ్య ఊగిసలాడుతూ ఉండేవాడు.

ఇట్లా అనేక రోజులు గడిచాయి. ఒక రోజు సాయంత్రం అతడు అత్యంత ప్రశాంతమైన చిత్తము కలవాడై, శత్రురాజులందరినీ జయించి, అతఃపురంలో విశ్రాంతి పొందుతున్న ఒక రాజువలె... ఒక ఏకాంత ప్రదేశంలో నడుమువాల్చి ఉన్నాడు. ఆకాశమును చూస్తూ క్షణములు, నిమిషములు గడుపుచున్నాడు.

ఆ సమయంలో ఒక బహుసుందరమైన అప్సరస ఆకాశంలో కనిపించింది.

సుకుమారమైన ఆమె శరీరము, అందమైన కెరటములను గుర్తు చేయు కురులు, ఆ హంసవంటి నడక - ఇవన్నీ ఆమె ఉండియున్న స్థానమును అమృతమయం చేస్తున్నాయి. ఆ అప్సరస ఆకాశంలో ఎటునుంచో వచ్చి ఎచటకో వెళ్ళుచుండటం మన శుక్రుడు చూచాడు.

అంతేc! నిశ్చలమైన జలంపై ఒక బరువైన రాయిని విసరితే ఆ జలము యొక్క ఉపరితలం ఏమౌతుంది? ఆవృత్తములు ఏర్పడుచూ, నీరంతా సంక్షుభితం అవుతుంది కదా! ఆ అప్సరసను చూస్తున్న శుక్రుని మనస్సు కూడా ఎంతో క్షుభితం అయింది.

ఆ అప్సరస ఎందుకో వెనుకకు చూచింది. కాకతాళీయంగా ఆమె కళ్ళు శుక్రుని కళ్ళలోకి చూస్తూ నాలుగు ఐదు క్షణాలు 'అలాగే' ఉండిపోయాయి. ఆమె అలా చూస్తూ చూస్తూ మోహ పరవశం చేత చిరునవ్వు నవ్వింది.

ఆమె సౌందర్యమునకు, ప్రేమతో చూచిన చూపులకు అతడు ఎంతో ముగ్ధుడయ్యాడు. కరిగిపోతున్న ఒక మధురస్వప్నంలాగా ఆమె క్రమక్రమంగా దృష్టి పథం నుండి వెళ్ళిపోయింది.

అతడు అప్పటికప్పుడు ఆకాశగమనం ద్వారా ఆమెను అనుసరించాలనే అనుకొన్నాడు. అప్పటికి మాత్రం ఎట్లాగో అతి కష్టం మీద తన వివేకాదుల సహాయం చేత కొంత నిగ్రహించు కున్నాడు. కాని ఏం లాభం? ఆ క్షణం నుండి అతని మనస్సును ఆ అప్సరస సౌందర్యము, ఆమె చిరునవ్వూ ఆక్రమించివేశాయి. అప్పటి నుండి అన్ని సమయములందూ ఆ అప్సరస యొక్క సౌందర్యమును, నడకను భావన చేస్తూ ఉండేవాడు. సకల ఇతర వృత్తులను వదలివేసి, కేవలం ఆమెనే మననం చేస్తూ ఉండుటచే అతడు 'అప్సరసామయుడు' అయ్యాడు.

అత్యంత మోహావేశంతో ఒక రోజు ఒకచోట కూర్చుని తన మనోరాజ్యంలో ఆమె యొక్క రాక పోకలను కల్పన చేసుకొని, ఇట్లు చింతన చేయసాగాడు.

❖

**శుక్రుడు (హృదయాకాశంలో....) :**

ఆహాఁ! ఈ కనబడే అప్సరస సౌందర్యము ఏమని చెప్పాలి? అయ్యో! ఈమె వెళ్ళిపోతోందే? ఓహో! ఆకాశమార్గంగా ఆమె స్వస్థానమైనట్టి ఇంద్రలోకం వెళ్ళుచున్నది కాబోలు. ఆమె వెళ్ళిపోయిన తరువాత "చంద్రుని పోగొట్టుకున్న రాత్రి" లాగా ఈ ప్రకృతి ఎంత నిస్తేజమై పోయింది!... సరే, ఆమె వెళ్ళే మార్గంలోనే నేను కూడా వెళ్తాను. నా మనస్సు యొక్క 'మననశక్తి – ఊహాశక్తి'లను ఉపయోగించి బయలుదేరుచున్నాను....

ఇప్పుడు నేను దేవతల అధివాసమైన అత్యంత మనోహరమగు 'స్వర్గలోకము' చేరాను. ఇదిగో, ఇదే అమరావతి. ఇక్కడ ఎవరెవరో అనేక శిరోభూషణములతో, పట్టువస్త్రములతో ఆహ్లాదంగా కనిపిస్తున్నారేఁ? వీరంతా ఎవరు? ఓహో! పురాణములలో వర్ణించబడిన 'దేవతలు' అంటే వీరే కాబోలు ... వీరే దేవతా స్త్రీలు కదా...! వీరందరినీ తమ మనోదృష్టిచే వీక్షించి కవులు తమ రచనలలో వర్ణించటం గుర్తుకు వస్తోంది. ఆ మహాకవులను మెచ్చుకోక తప్పదు. వారంతా ఎక్కడో ఉండి ఇక్కడి చమత్కారమంతా కళ్ళకు కట్టినట్లు వర్ణించి చెపుతున్నారే! వారి వర్ణనములు అతిశయోక్తులు (hyperboles) కానేకావు!

ఇక్కడి వారంతా అత్యంత ఘుమఘుమలాడే అద్భుతమైన ఏవో పుష్పములను ధరించియున్నారు. పారిజాత పుష్పమాలలు ఇవే కాబోలు! ఆహాఁ వీరంతా విశ్వరూపుడగు విష్ణువు వంటి ఆకృతి కలవారై సంతోషంగా సంచరించుచున్నారు. ఈ వినబడే సంగీతమే దేవగీతికలు. ఇదే 'మందాకిని' అనే పేరుతో ప్రసిద్ధికెక్కిన ఆకాశగంగ. ఈ మందాకినిలో బ్రహ్మదేవుని వాహన మైన హంస విలాసముగా సంచరిస్తూ ఉంటుందని విన్నాము. ఇంద్రుడు విశ్రాంతి తీసుకునే వనవాటికలు ఈ నది ఒడ్డునే ఉన్నాయి.

ఇవే కాబోలు, యమ–చంద్ర–సూర్య–ఇంద్ర–అగ్ని–జల–వాయు మొదలైన లోకపాలకుల వసతిగృహాలు.

తన దంతములచే క్రూర రాక్షసులను ముక్కలు చేయగల ఐరావతం ఇదిగో.

ఈ వైమానిక దేవతలు ఎంతగా శోభించుచున్నారు...! అప్సరసలు ఉండే ఇంద్రుని ఉపవనాలు ఇవేనా? ఈ పిల్లగాలులు – పారిజాత వృక్షము నుండి వచ్చుటచే కాబోలు – ఎంత ఆహ్లాదం కలుగజేస్తున్నాయి!... ఈ నందనవనం గురించి చెప్పుకోవటానికి మాటలు చాలవు.... ఆహాఁ! దేవతా స్త్రీలు తన్మయత్వంతో నృత్యం చేస్తూ ఉంటే, తదనుగుణంగా వీణ మీటి మధుర స్వరముతో పాడే తుంబురులు వీరే కాబోలు...! అనేక అలంకారములతో విమానములలో సంచరించే ఈ దేవతలు ఎంతటి పుణ్యకార్యములు చేసి ఉంటారో కదా...! 'అందము' అనబడుదానికి ప్రతీకయే ఈ ఇంద్రసభ.

... ఈ విధంగా నేను ఈ స్వర్గంలో ప్రవేశించాను... అదిగో... ఇంద్రుడు సింహాసనం అధిష్ఠించి విరాజిల్లుచున్నాడు... రెండవ బ్రహ్మవలె శోభిల్లుచున్నాడు... ఆయనను సమీపించి ప్రణామం చేస్తాను."

ఈ విధంగా చింతన చేస్తూ శుక్రుడు ఇంద్రునకు ప్రణామం చేశాడు. ఇంద్రుడు సాదరణ పూర్వకంగా ఆహ్వానించి ఉచితమైన ఆసనం చూపాడు. పూలతో, ప్రశంసలతో అతిథి మర్యాదలన్నీ సమర్పించాడు.

**ఇంద్రభగవానుడు:** ఓ భృగుకుమారా! శుక్రాచార్యా! స్వాగతం. మీ ఆగమన కారణంగా స్వర్గము ధన్యతను పొంది శోభించుచున్నది. మీరిక్కడ మీ ఇష్టమొచ్చినంతకాలం నిరభ్యంతరంగా ఉండవచ్చు.

శుక్రుడు అతిథి మర్యాదలు స్వీకరిస్తూ రెండు గంటలకాలం సభలోనే గడిపాడు. ఆ తరువాత స్వర్గంలో సంచరించే ఉద్దేశంతో అక్కడి నుండి బయలుదేరాడు. అక్కడి వారిలో కొందరైతే అతనిని ఇంద్రుని కుమారుడుగా భావించసాగారు.

❖❖❖

## 2. భావావేశము - జన్మపరంపరలు

ఆ విధంగా తన యొక్క పుణ్యప్రభావంచేత శుక్రాచార్యుడు స్వర్గమును పొందాడు. ఇప్పుడాతనికి "మరణదుఃఖము" అనునదే లేదు. అయితే అతడు "నేను భృగుమహర్షి కుమారుణ్ణి. నా తండ్రి సేవలో ఉన్నాను" అనే విషయమును దృష్టిపథంలోంచి పూర్తిగా కోల్పోయాడు. క్రమంగా అప్సరస గణమును వీక్షించాడు. వారి మధ్యలో తాను ఇతఃపూర్వం చూచిన అప్సరసను కనుగొన్నాడు. ఆ 'విశ్వాచి' అను పేరుగల అప్సరస కూడా శుక్రుని చూచి పరవశురాలైనది. వారిద్దరు ఒకరిపై మరొకరు ప్రీతిపూర్వకమైన చిత్తము కలిగియుండటం జరిగింది. పరస్పర ప్రేమాధిక్యతచే ఒకరినొకరు సమీపించారు.

వారిరువురు ఉన్న ఆ నందనవనం సంకల్పించినంత మాత్రంచేతనే ఏ పదార్థమునైనా ప్రసాదించగలదు. అప్పటికప్పుడు అక్కడ వారిద్దరూ తమ ఇరువురి కొరకు ఒక గొప్ప ఉద్యాన వనం నిర్మించుకున్నారు. ఆ వనం మధ్యలో ధవళకాంతులు విరజిమ్మే గొప్ప మందిరం వెలిసింది. ఆ అప్సరస శుక్రాచార్యుని చెయ్యి పట్టుకొని, "నాథా! మీ సౌందర్యం నన్ను వివశురాల్ని చేస్తోంది. అబలనైన నేను మిమ్ము శరణువేడుచున్నాను. సత్పురుషులగు మీరు నావంటి దీనురాలిని రక్షించకుండా ఉంటారా? 'ప్రేమదృష్టి' అంటే ఏమిటో ఎరుగని మూఢులు మాత్రమే ప్రేమను తిరస్కరిస్తారు. అనురక్త చిత్తులగు స్త్రీ పురుషుల పరస్పర ప్రేమకంటే ఉత్సాహభరిత వస్తువు ఈ సృష్టిలో ఇంకేమున్నది? మీ కరస్పర్శచే నేను ఇప్పుడు ఎంతో ఉపశాంతిని పొందుచున్నాను. మీరు నా ప్రక్కన ఉంటేనే నేను జీవించగలను. పద్మము తుమ్మెదను ఆదరించినట్లు మీరు నన్ను ఆలింగనం చేసుకోండి. రండి, మనం ఆ భవనంలో ప్రవేశిద్దాం' అంది.

ఆ తరువాత వారిద్దరు ఆ ఉద్యానవనంలో యథేచ్ఛగా సంచరించసాగారు. వారి ఆ సమాగమం, ఆ చిత్తవిలాసములు, చిరకాల కల్పితమైన 'ప్రేమ భావావేశం' చేత చమత్కారంగా పెంపొందసాగాయి. అతి ప్రసన్నత పొందిన వారిద్దరు ఒకరి సాన్నిధ్యం మరొకరు ఆస్వాదిస్తూ చాలా కాలం గడిపారు. వారిద్దరు మందరపర్వతంపై ఎన్నో ఏండ్లు గడిపారు. శ్వేతద్వీపంపై మరికొంత దీర్ఘకాలం గడిచింది. శుక్రుడు గంధర్వనగరములను, ఉద్యానవనములను నిర్మిస్తూ, "ఇతడు కాలస్వరూపునితో సమానుడా" అన్నంత ఠీవిగా ఆ అప్సరసతో సంచరించసాగాడు.

ఆ విధంగా ఎనిమిది చాతుర్యుగములు గడిచిపోయాయి.

అంతా కాలమహిమయే కదా! "వస్తువు-భావన-సుఖము-దుఃఖము" ... ఇవన్నీ కూడా కాలముచే పుట్టి, కాలముచే నశించవలసిందే!

వారిద్దరు కొంతకాలానికి "మేము అధఃపతనం పొందవలసి ఉంటుందేమో?" అను సందేహం పొందసాగారు. పుణ్యము యొక్క క్షయానుసంధానం కారణంగా వారి దివ్యశరీరాలు క్రమక్రమంగా నశించసాగాయి.

క్రమంగా వస్త్రాలు, విమానాలు, భూషణాలు, నందనవనాలు మటుమాయం కాసాగాయి. ఆ ఇద్దరు భూమండలముపైకి వచ్చిపడ్డారు. అప్పుడు వారిద్దరూ యుద్ధంలో నేలకూలిన శూరుల వలె ఉన్నారు. నేలపై పడుటచే వారి దేహాలు ఛిన్నాభిన్నమైనాయి. గూటిని విడచిన పక్షిద్వయంలాగా వారిద్దరు సూక్ష్మ శరీరులై దుఃఖమయ చిత్తముతో సంచరించసాగారు. వారి రెండు లింగశరీరాలు ఆకాశమున గల చంద్రకిరణాలలో ప్రవేశించాయి. ఆ కిరణాలలో నుండి మంచు బిందువులలోకి ప్రవేశించాయి. అక్కడి నుండి ధాన్యరూపమును పొందాయి.

'దశార్ణవము' అను పేరుతో పిలువబడే గ్రామంలో నివశిస్తూ ఉండే ఒక బ్రాహ్మణుడు శుక్రచైతన్యముచే పరిపక్వమైన ధాన్యమును భుజించాడు. అప్పుడు శుక్రాచార్యుడు వీర్య రూపమును పొంది, ఆ బ్రాహ్మణునకు పుత్రుడై జన్మించాడు. అప్పుడాతనికి కొందరు మునులతో

శుశ్రూష సాంగత్యము లభించింది. ఆ మునుల వద్ద నుండి తగినంత ఉత్తమ సంస్కారము పొందినవాడై, కొంతకాలానికి మేరు పర్వతం చేరాడు. ఒక ప్రదేశంలో ఆశ్రమం ఏర్పరచుకొని ఉగ్రమైన తపస్సు ప్రారంభించాడు.

అట్లు చాలా కాలం గడిచిపోయింది. ఆ తరువాత ఏదో సందర్భంలో ఒక మృగమును చూచాడు. తన ప్రియురాలగు అప్సరసయే అట్లు ఏదో శాపవశంచేత మృగముగా జన్మించి సంచరిస్తున్నట్లు గ్రహించాడు. పూర్వ సంస్కారబలం కారణంగా అతనియందు ఆ అప్సరసపట్ల అత్యంత ఆకర్షణ ఏర్పడింది. తన తపస్సులో కొంతభాగం వెచ్చించి ఆ మృగానికి స్త్రీ రూపం కలిగించాడు. ఆ అప్సరసతో సంగమించి, మనుజాకారము గల ఒక పుత్రుని పొందాడు. ఆ పుత్రునిపైగల వాత్సల్యభావంతో అతడు మరికొంత మోహం, మమకారం పొందాడు. ఇంకే మున్నది... జ్ఞానవిషయంలో మరల మొదటికి వచ్చాడు. "ఈ పుత్రుడు నాకు అత్యంత ప్రియమైన వాడు. ఇతడు నా ప్రక్కన లేకపోతే నేను బ్రతుకగలనా? లేదు. నా పుత్రునకు బాగా డబ్బు, గుణములు, దీర్ఘమైన ఆయువు కలుగుగాక!" అను రూపముగల నిరంత చింతనకు బద్ధుడై పోయాడు. పాపం, వేద విహితములైన సత్యము, తపస్సు, దానము మొదలైన సన్మార్గములన్నీ క్షణంలో త్యజించివేశాడు. ధర్మ మార్గముల నుండి పతితుడై పుత్రుని భోగముల గురించి మాత్రమే ఎల్లపుడు చింతించుచు ఉండేవాడు. ధనాదుల సంపాదన, పరిరక్షణలకు సంబంధించిన అనేక కార్యక్రమములలో నిమగ్నమై సంచరించసాగాడు. ఫలితంగా అతని శరీరం కృంగి కృశించ సాగింది. సర్పము గాలిని పీల్చునట్లు, ఒక రోజు మృత్యువు అతనిని మ్రింగనే మ్రింగింది.

మరణదశను చేరే సమయానికి అతని లింగశరీరము ఏవేవో భోగములకు సంబంధించిన ఇచ్ఛలను, భావావేశములను (వృత్తులు) కలిగి ఉండినది. మనోవృత్తుల తీవ్రత కారణంగా అనేక జన్మలు పొందాడు. అటు తరువాత అతడు మద్రదేశపురాజుకు పుత్రుడై జన్మించాడు. కాలక్రమేణా 'రాజు' అయ్యాడు. అనేకమంది శత్రువులతో యుద్ధాలు చేస్తూ చాలాకాలం గడిచి పోయింది. కొంతకాలానికి ముసలివాడయ్యాడు. ఉత్తమ ధర్మమును ఆశ్రయించి, కాలక్రమేణా 'వానప్రస్థాశ్రమము'ను స్వీకరించాడు. వాస్తవానికి అతని యొక్క ఇతఃపూర్వపు "తపస్సు చేయు బుద్ధి" యే అతనిని ఆశ్రమజీవనం వైపు నడిపించింది. రాజ్యమును త్యజించి, రాగాదులు లేనివాడై బుద్ధిమంతుడైనాడు. అతడు పరిజన్మలో సమంగానది ఒడ్డున ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేయ ప్రారంభించాడు.

చూచావా రామా! ఆ విధంగా భృగుమహర్షి కుమారుడైన శుక్రాచార్యుడు అనేక వాసనలతో అనేక స్థితి గతులను అనుభవించాడు. అనేక చిత్రవిచిత్ర జన్మలన్నీ పొందాడు. చివరికి, సమంగా నది ఒడ్డున ఆశ్రమంలో ఆసీనుడై ధ్యానమగ్నుడై యున్నాడు.

ఈ మాయ యొక్క ప్రభావం ఏమని వర్ణించాలి చెప్పు?

❖❖❖

# 3. భౌతికం - కల్పితం

ఓ రామచంద్రా! వింటున్నావుగా! మన శుక్రాచార్యుడు తండ్రియగు భృగుమహర్షి ఎదుటనే ఉండి, పైవిధంగా చింతన చేయుచుండగా అనేక వేల సంవత్సరములు గడచిపోయాయి. అతని దృష్టి ఎక్కడెక్కడో సంచరిస్తోంది కదా! చాలా కాలమైన తరువాత అతని భౌతిక దేహం 'వాయువు, ధూళి, కీటకములు' మొదలైన వాటిచే శిథిలం కావించబడి నేలకూలింది. కాని, చంచలమగు అతని మనస్సు మాత్రం వనములోని 'లేడి' లాగా అనేక చిత్ర విచిత్ర దశలను పొందుచూ పరిభ్రమిస్తూనే ఉన్నది. అది భోగముల అనుభవమునకు అఱ్ఱులుచాచుచూ, అనేక ఆకర్షణ వికర్షణలు పొందుచూ, అలసిపోయి ఉన్నది. ఒక చక్రములో చిక్కుకున్న పదార్థంలాగా జనన మరణములు, ఊర్ధ్వ అధోలోకములు మోసి మోసి చివరికి ఒకానొక ఉపాధితో సమంగానదీతీరం చేరి తపోనిష్ఠచే విశ్రాంతి పొందుతోంది.

తపస్సు ఉత్తమమైన మనో విశ్రాంతిని ప్రసాదించగలదు కదా!

ఆహాఁ! ఒక లోభి ధనసంపదల కొరకై పరుగులు తీస్తూ ఉంటాడు చూచావా? మన శుక్రుడు కూడా "మనోసంకల్పమార్గం"లో హుటాహుటిగా ప్రయాణాలు చేస్తూ,... తన శుక్రాచర్య ఉపాధిని విస్మరించాడు. తుచ్ఛము, వివిధ వృత్తాంత సంకలితము అయిన సంసారదశలను పొందాడు. అట్లు పొందినదంతా అత్యంత దృఢమైన దృష్టితో అనుభవించాడు.

❖

శుక్రుని భౌతికదేహం భృగువు యొక్క ఆశ్రమంలో సూర్యతాపమునకు ఎంతగానో శుష్కించింది. చర్మం మాత్రం మిగిలిందా... అని అనిపిస్తోంది. ఆ దేహము యొక్క రంధ్రముల నుండి గాలి ప్రసరించుచున్నప్పుడు 'సీ'...త్కారధ్వని వినిపిస్తూ ఉన్నది. 'అభిమానము దుఃఖము" మొదలైనవి కల్పించుకొని అనుభవిస్తూ ఆ శరీరంలో ఉండే జీవుడు ఇప్పుడు ఆ శరీరమునందు దృష్టి కలిగిలేడు కదా! "అభిమానం, దుఃఖం లేకపోవటం ఎంత ఆహ్లాదమైన విషయం..." అనే అర్థం వచ్చే ఈలపాట ఏదో ఆ శరీరం పాడుచున్నదా – అని వినేవారికి అనిపిస్తోంది. ఆ శరీరపు తెల్లటి దంతములు చూస్తే "ఈ దీనమైన మనసు సంసారారణ్యంలో ఎంతటి మూర్ఖురాలై సంచరిస్తోంది!" అని మనస్సును చూచి ఎగతాళి చేస్తున్నట్లున్నది. జనరహిత ప్రదేశంలో ఉండే నూతులను గుర్తుచేస్తున్న ఆ శరీరము యొక్క ముక్కుపుటములు, లోతు కళ్ళు మానవాళిని ఉద్దేశించి, "ఓ జనులారా! స్వభావపరంగానే శూన్యరూపమగు ఈ జగత్తు యొక్క అసద్రూపమును ఇప్పటికైనా, మమ్ములను చూచైనా...గ్రహించండి. వివేకం పొందండి. మూర్ఖులై మోహపరవశులు కాకండి" అని బోధిస్తున్నట్లు అనిపిస్తోంది.

ఆ శుక్రుని దేహం మొట్టమొదట సూర్యకాంతిచే ఎండిపోయింది. ఆ తరువాత వర్షజలముచే తడుపబడింది. వర్షజల బిందువులచే మిలమిలలాడుచున్న ఆ చర్మమాత్ర శరీరం "బంధు

రూపములగు తన యొక్క అనేక పూర్వ శరీరముల సంబంధములను తలచుకుంటూ అవి వస్తున్నందుకు, పోతున్నందుకూ ఆనందోల్లాసముచేతనో, లేక, దుఃఖాతిశయంచేతనో బాష్పములు రాల్చుచున్నదా?" అని అనిపిస్తోంది. ఆ విధంగా వర్షంలో తడుస్తూ శీతల వాయువులచే స్పృశించ బడుచు, ఎండకు ఎండుచూ పడివున్నది. ఆ దగ్గరలోని కొండల మీద నుంచి గాలికి ఎగిరిన ధూళి ఆ శరీరమును కప్పివేస్తూ ఉంది. మరల వర్షజలం ఆ ధూళిని తొలగించివేస్తూ ఉంది. ఫలితంగా చిత్రమైన ధూళి పొరలు ఆ శరీరంపై ఏర్పడ్డాయి. ఆ పొరలు ఒక పాపదూషితుని హృదయంలో పేరుకొని ఉండే అల్ప, తుచ్ఛ ఆశయపరంపరలను గుర్తు చేస్తున్నాయి. మరొకసారి ఎండగాలి వేగంగా ఆ శరీరమును తాకుతుంటే, ఏదో శబ్దం చేస్తూ అది ఎండు కట్టెవలె ఉండేది. ఇంతలోనే శరీర రంధ్రములు ద్వారా ప్రసరించు ఆ గాలిచేయు శబ్దము 'ఓంకార నినాదం చేయుచున్నది కాబోలు' అని భావింపచేస్తోంది. శుష్కించినట్టి వంకర టింకర ప్రేగులను ఆ శరీరము వీణగా మలచుకొని గానం చేస్తూ, ప్రాణులను భయపెట్టుచున్నట్టున్నది. లేదా, ఆ గానంచే వనలక్ష్మిని సంతోషింపచేసే ప్రయత్నంలో ఉన్నట్లున్నది.

❖

భృగుమహర్షి తపస్సు చేస్తున్న ఆ పుణ్యాశ్రమ ప్రదేశం రాగద్వేషరహితం. అతని తపః ప్రభావం ఆ పరిసరమంతా వ్యాపించియున్నది. ఆ కారణం చేత శుక్రుని దేహమును మృగములు గాని, పక్షులుగాని, సూక్ష్మకీటకములుగాని భక్షించుట జరుగనేలేదు. ఈ శరీరము ఇక్కడ ఇట్లు ఉండగానే శుక్రుడు తన మరొక కల్పిత శరీరంతో యమనియమాదులు ఆశ్రయిస్తూ సమంగానదీ తీరంలో ఏకాగ్రతతో తపస్సు చేస్తున్నాడు.

వాయువుచే శుష్కించిన అతని శుక్రదేహం యథాతథంగా శిలపై చిరకాలంగా పొర్లుతూ ఉండిపోయింది.

❖❖❖

# 4. స్వయంకృతం

ఆ విధంగా శుక్రుని దేహం ఎండకు ఎండుచూ, వానకు తడుస్తూ ఉండగా చాలా కాలం గడచిపోయింది కదా! ఒక రోజు మహాత్ముడగు భృగుమహర్షి పరమాత్మావబోధకమగు నిర్వికల్ప సమాధి నుండి లేచాడు. ఎదురుగా కుమారుని కోసం చూచాడు. అతడు కనిపించలేదు. "ఇది ఏమిటి? వినయముతో, నమ్రతతో సర్వగుణ సంపన్నుడైన నా కుమారుడు ఎప్పుడూ ఇక్కడే ఉండేవాడు కదా! ఇప్పుడు కనబడడేం?" అని కాస్త విచలితుడైనాడు. ఆశ్రమం నుండి బయటకు వచ్చి అటూ ఇటూ చూచాడు. "అభాగ్యమా!" అన్నట్లు, ఒక గండశిలపై కేవలం తన కుమారుని భౌతికదేహం మాత్రం కనిపించింది. ఆ మృతశరీరం మూర్తివంతమైన దారిద్ర్యమువలె శుష్కించి యున్నది. ఆ దేహము యొక్క రంధ్రములందు తిత్తిరిపక్షులు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి.

శుష్కించిన ప్రేగులుగల అతని పొట్టభాగం యొక్క ముడతలలో కప్పపిల్లలు విశ్రాంతి తీసుకుంటున్నాయి. కనురెప్పచుట్టు క్రిమి కీటకాదుల తమ పిల్ల పాపలతో కాపురం చేస్తున్నాయి. వీటి నుండి ఇంకా ఇంకెన్నో కీటకములు ఉత్పన్నమై అభివృద్ధి పొందుతున్నాయి. పార్శ్వమువైపు ఎముకల మధ్య పట్టుపురుగులు గూళ్ళు కట్టుకొని, విస్తరింపజేస్తున్నాయి. జలధారలతో ధూళి యుక్తమైన ప్రేగులు శుష్కించిన ఎముకలను మాలగా ధరించియున్నట్లు అనిపిస్తున్నాయి. ఆ ప్రేగులలోని పొరలు జన్మజన్మలుగా జీవుని యందు పేరుకొని యుండే వాసనలను గుర్తుచేస్తున్నాయి. ముఖం తెల్లగా పాలిపోయింది. ముక్కు గోడకు దిగగొట్టబడిన మేకులా ఉంది. కంఠము ఊర్ధ్వముఖము కలిగి, తన ప్రాణములు ఆకాశంలో ఎక్కడ సంచరిస్తున్నాయో వెతుకుచున్నట్లున్నది. చర్మం మాత్రమే శేషించియున్న అతని పొట్ట అజ్ఞానియొక్క హృదయంలాగా శూన్యంగా కనబడుతోంది.

ఆ మృతదేహాన్ని చూచిన భృగుమహర్షి పుత్రశోకం పొందారు. ఒక్క క్షణంలో పూర్వాపరాలన్నీ మరచిపోయి లేచి నిలుచున్నారు. “ఏమిటిది? నా కుమారుడు మరణించి చాలా కాలమయినదా?” అని పెద్ద గొంతుకతో పలికాడు. ‘నేను నా బిడ్డను కోల్పోయానా...’ అనే భావం అతని హృదయమంతా వ్యాపించింది. మనసంతా వర్ణనాతీతమైన క్షోభకు లోను అయింది. మహాజ్ఞాని అయివుండి కూడా, పూర్వాపరము లను, ముందు వెనుకలను ఒక్కసారి మరచాడు.

ఆహాఁ! పుత్రవ్యామోహం ఎంతటిది! మహర్షి అంతటివాడిని కూడా కొద్ది క్షణాలు ముంచివేసిందే? ఆయన లేచి నిలబడి ఇట్లు ఎలుగెట్టి పలికాడు.

“ఓయీ! కాలపురుషా! యమధర్మరాజా! నా పుత్రుని ఎక్కడికి, ఎప్పుడు, ఎందుకు తీసుకొని పోయావయ్యా? అతడు నా కుమారుడని నీవు ఎరుగవా? సరే. ఈ భృగువు యొక్క తపోశక్తి ఏమిటో రుచి చూచెదవు గాక...” అని పలుకుచు శపించుటకు ఉద్యుక్తుడయ్యాడు.

❖

రూపరహితుడు, ప్రజలందరిని కాలానుగుణంగా మ్రింగివేయువాడు, కాలమే స్వరూపంగా గలవాడు అయిన కాలుడు ఇది గమనించాడు. అతడు స్వతహాగా రూపము లేనివాడే. అయిన ప్పటికీ, భృగుమహర్షి యొక్క సంతాపమును గమనించి భౌతిక రూపం ధరించాడు. ఖడ్గము, ఉరిత్రాడు ధరించి, శోభాయుక్తుడై కవచకుండలములచే ఒప్పుచూ ఆ కొండపై ప్రత్యక్షమైనాడు. పండ్రెండు నెలలు అతని భుజములుగా రూపము పొందాయి. ఆరు ఋతువులు అతని ముఖముగా మారాయి. దినములు అనే సేనతో అతడు సేవించబడుచు ఉన్నాడు.

అతని జ్వాలామయ దేహం ఆ పర్వతమును శోభింపజేసింది. అతని చేతిలోగల త్రిశూలపు అగ్రభాగము నుండి బయలుదేరిన అగ్ని సమూహాలు దిక్కులన్నింటినీ నింపివేస్తున్నాయి. అతని రాకచే గండశిలలు కంపించిపోయాయి. దిక్కులు పిక్కటిల్లాయి. అతని ఖడ్గము యొక్క ప్రకాశంచే సూర్యబింబమే శ్యామల వర్ణమయినది.

కోపంతో ఊగిసలాడుచున్న భృగువును సర్వసమవర్తి అయిన కాలుడు సమీపించాడు. ప్రళయానంతర ప్రశాంతసాగరమువలె గంభీర స్వరంతో శాంతియుతంగా ఇట్లు పలుకసాగాడు.

**కాలుడు :** హే భృగుమహర్షీ! మీరు స్వయముగా మహాజ్ఞానులు. ఈ లోకముల యొక్క యథార్థ స్థితి అంతా ఎరిగినవారు. 'పరము-అపరము'లను సంపూర్ణంగా దర్శించి యున్నారు. మీ సమగ్ర అవగాహనా స్వభావము వల్ల, ఒకవేళ ఇతరులు అజ్ఞానం చేత అపరాధం చేసి యున్నప్పటికీ, మీరు విమోహితులు కారు. ఇక ఏ అపరాధము చెయ్యనివారిపై కోపగించటమా? మహత్తరమైన తపస్సు చేస్తూ బ్రహ్మవర్చస్సుచే వెలుగొందువారు మీరు.

ఇక మేమంటారా 'నియతి'ని పాలించువారము మాత్రమే కదా! అందుచేత మీరు మాకు పూజ్యులు. మీకు నమస్కరించుచున్నాను. నా మనవిని శాంతంగా వినండి!

నిర్వికల్ప సమాధినిష్ఠులగు మీరు మీ ఉత్తమ కర్మాచరణముచే మాకు వందనీయులగు చున్నారు. అంతే గాని, ఈ నా సంభాషణ మీ శాపాదులకు భయపడి కాదు. మీరు ఒక్క క్షణం ఆగండి. కోపము, ఆవేశము, ఉద్వేగములను వదలి శాంతమును ఆశ్రయించండి. నేను చెప్పేది కాస్త వినండి.

మీరు మీ బుద్ధిని అల్పత్వమువైపు ప్రసరింపజేయుచున్నారు. అది ఉచితం కాదు. నిష్కారణంగా శపించి తద్వారా మీ తపస్సును వ్యర్థం చేసుకోకండి. ఎందుకంటారా? కాల స్వరూపుడనగు నన్ను ప్రళయకాల భీషణాగ్నులు కూడా దహించలేవు. ఇక మీ శాపం నన్నేం చేయగలదు చెప్పండి? ఇప్పటికే నేను అనేక జగత్తులను భక్షించాను. కోట్లకొలది రుద్రులను మ్రింగివైచాను. అనేక మంది విష్ణువులు నాచే గ్రసించివేయబడ్డారు. నాకు అవశ్యకమైనదేమి? అక్కర్లేనిదేది? ఓ మహాత్మా! మేము భోక్తలం. సర్వజీవుల అసంఖ్యాక ఉపాధులు మాకు భోజనము.

❖

అయితే ఒక్క విషయం. ఇదంతా స్వభావసిద్ధమగు నియతి మాత్రమే అయివున్నది. అంతే గాని, మేము ఇచ్ఛచేతనో, ద్వేషముచేతనో ఏదీ చేయుట లేదు. 'నియతి'కి వేరుగా ఇంకే నిమిత్తం నాచే ఏదీ చేయబడదు.

**స్వయమూర్ధ్వంప్రయాత్యగ్నిః స్వయంయాంతిపయాంస్యధః ।**
**భోక్తారంభోజనంయాతి సృష్టించాప్యంతకః స్వయమ్ ॥** (సర్గ.10; శ్లో. 29)

అగ్ని సహజంగానే ఊర్ధ్వముఖంగా జ్వలిస్తుంది. నీరు పల్లమువైపు ప్రవహిస్తుంది. భోక్త వద్దకు భోజనం వచ్చిచేరుతోంది. నాశనశీలుడగు ఈ కాలుడు కూడా సృష్టి వద్దకు స్వయముగా వచ్చి చేరుకున్నాడు. నేను సమీపించని వస్తువంటూ ఎక్కడా ఏదీ లేదు. దీనికి ఇది అనుశాసనం. ఎవ్వరిని ఏమనగలం?

అయినా, మీకన్నీ తెలుసును కదా! మాయాకళంక రహితమైన దృష్టితో చూస్తే, దేనికి ఎవడు కర్త? ఎవడు భోక్త? మాయా దోషము నశించనట్టి దృష్టి కలవారికి మాత్రమే అనేకమంది కర్తలు,

అనేకమంది భోక్తలు కనిపిస్తున్నారు. మహాత్మా! "కర్తృత్వము, అకర్తృత్వము" ... ఈరెండూ కూడా కల్పితములే కదా! సమ్యక్ దృష్టి లేనివారికి మాత్రమే అవి స్వయంకల్పితమై ప్రాప్తిస్తున్నాయి.

సమ్యక్ దృష్టి గలవాని దృష్టిలో కర్తృత్వమెక్కడ? భోక్తృత్వమెక్కడ? ఆ రెండిటి నీడ కూడా వారికి కనబడుటలేదు.

చెట్లకు పూలు పూస్తున్నాయి, నశిస్తున్నాయి. అట్లాగే, లోకంలో ప్రాణికోట్లు అసంఖ్యాకంగా ఉత్పత్తి వినాశనములు పొందుచున్నాయి. ప్రతి ఒక్క ఉత్పత్తి వినాశనములు మధ్య ఏవేవో సంఘటనలు, అనుభవములు, మార్పు చేర్పులు ప్రదర్శితమగుచున్నాయి. అయితే ఈ జనులు అజ్ఞానం చేత కాల స్వరూపుడనగు నన్ను తప్పు పట్టుచున్నారు కాని, నిజానికి ఈ జీవుల ఆయా స్వయం కర్మవ్యవహారములే తమ వైచిత్ర్యమును ప్రదర్శిస్తున్నాయి. కర్మగతిని అనుసరించి ఆయా ప్రయోజనములు పర్యవసానంగా ప్రాప్తిస్తున్నాయి, సిద్ధిస్తున్నాయి. ప్రతి పర్యవసానము (Eventuality) వెనుక ఆయా శారీరక, మానసిక ప్రయత్నములే అంతర్లీనంగా దాగి ఉన్నాయి.

ఇప్పుడు చెప్పండి మీ కోపం ఉచితమేనా?

ఒకచోట తటాకం ఉన్నది. ఆ తటాకంలోని జలంలో నక్షత్రాదులతో కూడి 'ఆకాశం' ప్రతిబింబిస్తోంది. అట్టి ప్రతిబింబాకాశంలో చంద్రుడు కదులుచూ కనిపిస్తున్నాడు. నీటిలో కనిపిస్తున్న ఆ చంద్రుని చలనం సత్యమంటామా? అసత్యమంటామా? సత్యమనదలచుకుంటే, జలంలో చంద్రుడెక్కడున్నాడు? అసత్యమనదలచుకుంటే, చంద్రుని కదలికలు కనబడుచున్నాయే? "రెండూ కాదు. అది అనిర్వచనీయమనే చెప్పాలి" అని కూడా చెప్పబడుతోంది. భగవంతుడగు ఈ కాలుని సృష్టియందు, పరమార్థస్థితి దృష్ట్యా ఈ కర్తృత్వ, అకర్తృత్వములనబడే రెండూ కూడా సత్యములు కావు. కాని, వ్యవహార దృష్టిని రచిస్తున్నదెవరు? నేనా?... కానే కాదు. ఇదంతా నిర్వహిస్తున్నది మనస్సే. ఈ మనస్సే మిథ్యాభ్రమయందు తగులుకొని భ్రాంతి కారణంగా కర్తృత్వ, అకర్తృత్వములనబడే అనర్థకల్పనలు తనకు తానుగా నిర్మించుకుంటోంది. ఇదంతా కూడా "ఒక చోట ఒక త్రాడు దారికి అడ్డంగా పడి ఉంటే, ఆ త్రాడునందు పామును దర్శించుట వంటిదే"... అని అనక తప్పదు.

కనుక మహర్షీ! నేను దేనికీ కారణం కాదు. ఈ జీవుని యొక్క మనస్సే అన్నివేళలా, అంతటికీ కారణం. పదార్థ దృష్టిని ఆశ్రయిస్తున్న మనస్సు పదార్థత్వమునే పొందుతోంది. మహతత్త్వమును ఆశ్రయిస్తే మహతత్త్వము అనుభవమగుచున్నది. నేను కాలానుగుణంగా, "కార్య – కారణ వ్యవహారము నడిపించుట, ఇచ్ఛ ప్రయత్నములను అనుసరించి ప్రయోజనములను ప్రసాదించుట" మాత్రం చేస్తూ ఉంటాను. మీరు వ్యాకులమైన చిత్తము పొందినవారై, ఎట్టి అపరాధం చెయ్యనట్టి నాపై ఎందుకు కోపగిస్తారు చెప్పండి? అట్లు కోపగించటం ఉచితమే నంటారా? అట్లు చేయటం ఆపదలకు హేతువే అవుతుంది. అందుచేత, మరికొంత ఓపికపట్టి, విషయమంతా సమగ్రదృష్టితో, సత్యదృష్టితో చక్కగా ఇంకొక్కసారి అవలోకించమని ప్రార్థిస్తున్నాను. అంతేగాని, చెప్పునది పరిశీలించకుండా ఆవేశపూరితులు మాత్రం కావద్దు.

**నియతి, దృష్టి -** పూజ్యుడవగు ఓ మునిసత్తమా! మేము చేస్తున్న ఈ సృష్టి-స్థితి-లయ మొ॥ కార్యములు ప్రతిష్ఠ కొరకో, లేక ఇష్టము అనుసరించో చేస్తున్నామా? లేదు. దురహంకారులమై మేము ఏదీ చేయుటలేదు. ఎట్టి 'అభిమానము' అనునది లేకుండానే, కేవలం నియతిని పాలించుచు, స్వవశముననే ఉండి ఉన్నాము. ఇప్పుడు ఈ భౌతిక – దేహం స్వీకరించటం, మీ వద్దకు ఇట్లు రావటం, ఈ విషయ విచారణ చేయటం... ఇదంతా "తాపసులను సన్మానించుట" అను 'నియతి'ని పాలించటానికే అయివున్నది. అంతేగాని కోప శాపాదులకు భయపడో, లేక కీర్తి మొదలైనవాటి కొరకో మాత్రం కాదు. బుద్ధిమంతులైన వారు జగన్నియామకుడగు ఈశ్వరుని ఇచ్ఛారూపమైనట్టి 'పరమోత్తమ నియతి'ని అనుసరించే వ్యవహరిస్తారు. ఇక అజ్ఞానులగు జనులో, అభిమానగ్రస్థులై మరల మరల తమోగుణములను ఆశ్రయిస్తూ, అట్టి 'నియతి'ని దూషించటానికో, అపరిపక్వ దృష్టిచే దుఃఖాదులు ఆశ్రయించటానికో వృథాప్రయాసపడుచూ ఉంటారు. కాని ఏం లాభం? ఎవరేమి నిరోధించగలరు చెప్పండి!

మహర్షీ! మీరు సర్వజ్ఞులు. ఇప్పుడు జ్ఞానదృష్టితోనే అంతా పరిశీలించండి! మహాత్ములగు వారిచే సర్వవేళల సేవించబడే సుప్రసిద్ధ మార్గమున ఉన్నట్టి మీ అంతటివారు అజ్ఞులవలె ఏల మోహితులగుచున్నారు? కర్మపరిపాకముచే సువ్యక్తమగుచూ కనిపిస్తూ ఉన్న స్థితి గతులను విచారించకుండా మూఢునివలె నన్ను శపించాలని మీకెందుకు అనిపిస్తోందో చెప్పండి.

**ద్వితీయ దేహం -** మీరు ఎరిగియున్న విషయాలే అయినప్పటికీ, సందర్భం వచ్చింది కాబట్టి చెప్పుచున్నాను.

ఈ ప్రాణి కోట్లలోని ప్రతి ఒక్కరికి రెండు దేహాలు ఉన్నాయి–

1. స్థూలదేహము 2. మనోదేహము

ఈ రెండింటిలో స్థూలదేహము జడమైనది. ఇది స్వల్పకారణంచేత కూడా నశించే స్వభావం కలిగి ఉన్నది. ఇక ఈ మనస్సు ప్రాతిభాసిక స్వభావము కలిగియున్నది. ఒక దర్పణము ఆయా దృశ్యములను తనయందు ప్రతిబింబింపజేయు లక్షణము కలిగియున్నట్లే, ఈ మనస్సు కూడా తన యందలి భావనను అనుసరించి విషయములను కలిగి ఉంటోంది. అట్టి ప్రతిబింబ స్వభావ మాత్ర మగు (merely Reflective by nature) ఈ మనస్సు స్థూలదేహ నాశన మాత్రం చేత నశిస్తుందా?... లేదు. ఈ జీవుడు మోక్షము పొందనంతవరకు మనస్సు నశించకయే ఉంటోంది.

ఇప్పుడు చెప్పండి. మీరు కోపగించటానికి కారణం మీ కుమారుని స్థూలదేహం పొందిన మార్పులకా? లేక మనోదేహము పొందిన స్థితిగతులకా? అతని మనోవ్యాపారము ఆశ్రయించిన ఆయా దుష్ట విషయములకు కారకుడను నేనా చెప్పండి? ఓ సాధు పుంగవా! మంచి చతురత గల సారథికి ఒక రథము ఇస్తే ఆ రథమును అతడు తన రకరకాల విన్యాసములతో నడుపుచుండగా, ఆ రథములోని సారథిని చూడని ఒక అమాయక బాలుడు, 'ఈ రథమే ఇట్లు చమత్కారంగా కుడి ఎడమలకు తిరుగుతోంది" అని అనుకొంటాడు... చూచారా? అట్లాగే ఈ జీవునియందు వాక్కుకు

అగోచరమై, అభిమానముతో కూడినదై ఒక అంతరంగ వ్యాపారము (Inner - Activity) ఉండి ఉన్నది. అట్టి అంతరంగ వ్యాపారమే ఈ మనస్సు. ఒక బాలుడు మట్టితో బొమ్మ తయారు చేసి, ఆయా అలంకారాలు అమర్చి ఇంతలోనే దానిని మట్టి ముద్దగా చేసి మరొక బొమ్మను చేస్తూ ఉంటాడు చూచారా? ఈ మనస్సు కూడా భవిష్యత్ శరీరములను సంకల్పించుచు పూర్వ శరీరములను నశింపజేయుచున్నది.

"ఇష్టము-మననము-క్రియ'ల సమన్వయమే "చిత్తము."

చిత్తమే పురుషుడు, అంతేగాని ఈ స్థూలదేహము పురుషుడు కాదు.

చిత్తం చేత ఏది నిర్వర్తించబడుచున్నదో, అది మాత్రమే "కార్యం" అని అనిపించుకుంటోంది. ఈ చిత్తము అవిచారణ కారణంగా అసద్వస్తువులను గూర్చిన సంకల్పముచే బంధించబడుతోంది.

అట్లు సంకల్పించకుండా, 'మౌనం' వహించి యుండుటయే (సంకల్పరాహిత్యమే) 'ముక్తి' యొక్క స్వరూపం.

ఈ జీవునిపట్ల - "ఇది నా దేహము. ఈ దేహమే నేను. ఇందులో ఈ అవయవములు ఇక్కడ ఉన్నాయి. నేను ఈ అవయములచే పరిమితుడను"... ఇలా వికారవంతములైన అనేక కల్పనలను చేస్తూ పోతున్నది ఎవరు? నేనా?... కానేకాదు. ఈ మనస్సే సుమా! మనస్సే ఒక 'జీవ శరీరము' నుండి మరొక 'జీవశరీరము'ను పొందుచున్నది. మనస్సుచే ఏ వస్తువు సంకల్పించ బడితే, దానికి అనుకూలంగా బుద్ధి (Discriminative faculty) ఉదయించుచున్నది. అదే మార్గంలో "నేను చేయుచున్నాను" అను రూపముగల అహంకారము కూడా ఏర్పడుచున్నది. ఇట్లు మనస్సే వివిధ రూపములను ధరించుట జరుగుతోంది.

**"నేను అఖండుడను"** - అంతరంగమున ఏర్పరచుకొనియున్న "దేహమునకు సంబంధించిన వాసనలు" కారణంగా ఈ చిత్తము తన ఇచ్ఛానుసారం అవిద్యాపూర్వకంగా "నేను-నా శరీరం-నీవు-నీ శరీరం-నా వారు-నాకు సంబంధించిన శరీరములు - పరాయివారు, శత్రువులు... వారి వారి శరీరములు" ఈ రీతిగా ఏదేదో స్వప్న సదృశ దృశంగా ఆస్వాదిస్తూపోతోంది. ఇట్లు వేరు వేరైన పార్థివ శరీరములను గాంచుచున్నది చిత్తము (లేక) మనస్సే. ఈ మనస్సే మరొకప్పుడు సత్యవస్తు సాక్షాత్కారంచే అసత్యమగు ఈ దేహభావమును త్యజించి పరమశాంతిని పొందుతోంది. మనస్సు యొక్క ఈ దేహాదులను గురించిన కల్పన" - ఆత్మసాక్షాత్కార ప్రాప్తి పొందనప్పటి సమయంలో మాత్రమే అనుభవమవుతోంది.

ఆత్మసాక్షాత్కారం, ప్రాప్తించిందా.... ఇక "నేను దేహమును, మానవుడను, జీవుడను..." అను రూపము గల తుచ్ఛ మననము ఉండదు.

"నేను ఈ దేహములో స్ఫురించే ప్రజ్ఞాతత్వమునే గాని, దేహమాత్రమును కాదు. బాహ్యమున (by perceiving things and matters) అంతరంగమున (మననము, బుద్ధి మొదలైన వాటి రూపమున) కూడా ప్రసరించియున్నది నేనే. ఈ పంచభూతములకు అతీతమైన రూపము కలవాడనగు నన్ను ఒక దేహము పరిమితము చేయగలదా?... లేదు.

ఈ శరీరము పరిమితమైనది కావచ్చు.... నేను అపరిమితుడను.

ఈ శరీరం ఖండమైనది కావచ్చు.... నేను అఖండుడను.

సర్వ దేహములందు ఒకే రీతిగా ప్రజ్జ్వలించుచు తాను ఏ క్షణమందును "మరొకటి" కాకుండానే ఉండి ఉంటున్నట్టి 'ఆత్మవస్తువు'ను నేను. ఆత్మయే నా నిజస్వరూపం. నిత్యాత్మ స్వరూపడనగు నాకీ బంధమేమి? మోక్షమేమి? ఇవన్నీ ఎప్పుడూ లేవు!" ... ఇట్టి మననము స్వీకరించబడినప్పుడు అతడు మననరహితమగు 'స్వసత్త'గానే శేషించుచున్నాడు.

❖❖❖

# 5. స్వీయ - మనోరథ మార్గం

**కాలుడు:** హే మహర్షీ! ఇప్పుడు మీకుమారుడగు శుక్రుని మనోవినోద సంచారం గురించి వినండి.

మీరు నిర్వికల్ప సమాధి యందు ఉండగా మీ కుమారుడు శుక్రాచార్యుడు మనస్సునందే 'స్వమనోరథ' మార్గంలో అత్యంతదూరం పయనించియున్నాడు. ఈ స్థూల దేహమును ఇక్కడే వదలి, మనోదేహముతో, ఒక గూడు విడచిన పక్షిలాగా దేవతా నివాసమగు స్వర్గమునకు చేరాడు. అక్కడ 'విశ్వాచి' అనే పేరుగల అప్సరసతో కొంతకాలం గడిపాడు. ఆ సమయంలో అతడు విశ్వాచి తో కూడుకొని పర్వతములందు, పూలతలమధ్య ఉద్యానవనములందు, లోకపాలుర నగరము లందు విహరించాడు. చాలా కాలం గడిపోయింది. వాసనలతో కూడుకొనిన తీవ్ర సంకల్పముల ప్రభావంచే, "ఇప్పటికే నా పుణ్యమంతా క్షయించిపోయింది" అను రూపంగల భావనాపటిమ అతని యందు రూపుదిద్దుకొన్నది. పండిన పండు చెట్టు నుండి నేల రాలే విధంగా అతడు కూడా 'అప్సరస'తో సహా ఛిన్నాభిన్నములయిన చేతులు కాళ్ళు కలవాడై భూమిపై పడ్డాడు.

ఆ విధంగా దేవశరీరమును ఆ దేవలోకంలోనే త్యజించి, 'భూతాకాశము' ను పొంది భూమిపై జన్మించాడు. మొట్టమొదట దశార్ణవదేశంలో బ్రాహ్మణుడుగాను, ఆ తరువాత కోసల దేశానికి రాజుగాను, అటుపై ఒక మహారణ్యంలో బోయవాడుగాను, ఆపై, గంగా నదీతటంలో హంసగాను జన్మించాడు. సూర్యవంశంలో జన్మించి పుండ్రదేశానికి రాజు అయ్యాడు. తదనంతరం శాల్వదేశంలో మంత్రోపాసకుడగు 'ఉపదేష్ట'గా జన్మించాడు. అట్టి మంత్రములను ఆశ్రయించుట చేత ఏర్పడిన ఔన్నత్యముచే ఆ తరువాతి జన్మలో విద్యాధరుడైనాడు.

ఆ తరువాత 'మద్ర'దేశమునకు రాజై పుట్టాడు; వానప్రస్తాశ్రమం స్వీకరించాడు. ఆ తరువాత బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి 'వసుదేవుడు' అనే పేరుతో సమంగానదీ తీరంలోగల ఒక ప్రదేశం జేరాడు.

❖

ఇప్పుడు నేను చెప్పినవే కాకుండా నీ పుత్రుడు వాసనావశంచేత అనేక భయదాయకమైన జన్మలలో పరిభ్రమించాడు. ఒకసారి కైకటదేశంలో కిరాతకుడుగాను, తరువాత "సౌవీర" దేశానికి

అధిపతిగాను జన్మించాడు. ఆ రాజజన్మలో అనేక పాపకార్యములు చేసియుండటం చేత త్రిగర్త దేశంలో ఒక గాడిదగాను, కిరాతదేశంలో ఒక లతగా కూడా పుట్టాడు. 'జలగల' అనే పేరుగల మరొక దేశంలో మృగమై జన్మించాడు. ఇంకా, ఒక తాడిచెట్టులో పసిరిక పాముగాను, తామల పాకులతోటలో ఒక ఉడుతగాను జన్మలు పొందాడు.

ఒకసారి మీ కుమారుడు మంత్రవేత్తలలో మహాశ్రేష్ఠుడై జన్మించాడు. 'విద్యాధరనగరం'ను పొందింపజేయగల విద్యను మననం చేసి, తద్వారా విద్యాధరుడు అయ్యాడు. అక్కడ ఒక ఉత్తమ మైన విద్యాధరుడుగా ప్రకాశించుచుండగా, కొంతకాలానికి కల్పాంతమునందు ద్వాదశాదిత్యులు లోకములను తపింపజేయుచుండగా, ఆ ప్రళయాగ్నిలో అతడు భస్మీభూతుడైనాడు. అప్పట్లో మన శుక్రుని యొక్క వాసన గూడు విడచిన పక్షిలాగా 'జగద్రచన' అనునదే లేనట్టి శూన్యమగు విశాలాకాశంలో పరిభ్రమిస్తూ ఉండేది. కొంతకాలానికి ఆ "బ్రాహ్మీరాత్రి" గడచిపోయింది. విచిత్రకార్యారంభంతో జగత్ నిర్మాణం ప్రారంభమైంది. అప్పుడు మీ కొడుకు సూక్ష్మవాసనలచే ప్రేరితుడైనాడు. మరల ఏవేవో జన్మలు పొందాడు. ఇప్పుడిక...,

భూమిపై ఒక బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు. వేదములు మొదలైనవి బాగా అర్థ సమన్వితముగా అధ్యయనం చేసి బుద్ధిమంతులలో ఉత్తముడుగా ప్రసిద్ధి పొందాడు. 'వాసు దేవుడు' అను పేరుతో పిలువబడుచూ, అతడు బంధుమిత్రులను త్యజించి పూర్వ సంస్కారముల ప్రోద్బలం చేత సమంగా నదీతీరం చేరాడు. ఒక ఆశ్రమం నిర్మించుకొని ఏమీ తెలియనట్లే, హాయిగా తపస్సు చేసుకుంటున్నాడు.

చూచారా మునీంద్రా! మీ ప్రియపుత్రుడు శుక్రాచార్యుడు అనేక రకములైన విషయ వాసనలచే ప్రేరితుడై భిన్న లోకాలలో, పర్వత స్థలాలలో, వనాలలో భిన్న ఉపాధులు పొందాడు. అతి భీకరములైన అరణ్యములలో వృక్షము-లత మొదలైన జన్మలు అనుభవించాడు. ఇప్పటికి ప్రశాంతుడై సమంగానది ఒడ్డున తపస్సు చేసుకుంటున్నాడు. జటాధారియై రుద్రాక్షమాలను ధరించి, సర్వ ఇంద్రియములకు సంబంధించి భ్రమలన్నీ త్యజించి వేసి స్థిరచిత్తముతో ధ్యానం చేస్తున్నాడు. అయితే, అతడు ఈ శుక్రాచార్య ఉపాధికి సంబంధించిన 'తండ్రి'యగు మిమ్ములను ఏమాత్రం స్మరించటం లేదు. ఇప్పుడు, మీరు ఆ జీవుని దృష్టిపథం లోనే లేరు.

❖❖❖

# 6. సంసార ప్రవృత్తి చమత్కారం

సర్వలోకములకు ఈశ్వరుడు, సమదృష్టి కలవాడు అయినట్టి కాలభగవానుడు అట్లు పలికి మౌనం వహించాడు. అప్పుడు భృగు మునీంద్రుడు తన జ్ఞాననేత్రంతో పుత్రుని వ్యవహారమంతా పరిశీలన చేయసాగాడు. విశుద్ధమైన తన "బుద్ధి" అను దర్పణమునందు తన యొక్క ధ్యాన ప్రభావం చేత, యోగమహిమ చేత ప్రతిబింబించినట్టి తన పుత్రుని సమాచారమంతా

కొద్దిక్షణములలో ప్రత్యక్షంగా చూచాడు. శరీరదృష్టిని వీడి, సూక్ష్మశరీరంతో సమంగా నదీతీరం వెళ్ళి పుత్రుని స్వయంగా చూచి, తిరిగి కాలుని సమ్ముఖంలోగల స్వశరీరంలో ప్రవేశించారు. క్షణంలో పుత్ర వ్యామోహం అతనిని వీడిపోయింది. అత్యంత ఆశ్చర్యంతో చిరునవ్వు నవ్వుచూ, ఉత్తమ దృష్టితో కూడుకున్నవాడై వీతరాగుడగు కాలునితో ఇట్లు పలుకసాగాడు.

**భృగుమహర్షి :** భూత-భవిష్యత్-వర్తమానములకు ప్రభువగు ఓ మహాత్మా! కాలదేవా! మేము మలినచిత్తులం, బాలురవంటివారం. చూచారా! ఒక్క క్షణంలో అజ్ఞానం నన్ను ఆవరించివేసింది కదా! మీవంటి మహాత్ముల దృష్టి త్రికాలములందలి వృత్తాంతమంతా స్పష్టముగా గాంచుచూ, మౌనము, సమగ్రము అయిన అవగాహన కలిగి ఉంటోంది. ఇక మేమో, తపో ధ్యానాదుల వలన కలిగిన శక్తిచే అంతా గ్రహించగలం. కాని ఏం లాభం? అన్ని వైపులా దృష్టి సారించలేక పోతున్నాం. కించిత్‌కే (కొంచెమునకే) మా దృష్టి చాంచల్యమును పొందుతోంది. ఈ జగత్ స్థితి అంతా మిథ్యారూపమే అయినప్పటికీ ఇదంతా అనేక విధాలైన వికారములతో కూడి "నిజమేనా!" అన్నట్లుగా ప్రాప్తిస్తోంది. మా యందు ఒక్కొక్క సమయంలో అనేక భ్రమలను ఉత్పత్తి చేస్తోంది.

ఓ కాలస్వరూపా! మీ అంతరంగమున ఏమున్నదో మీకే తెలుస్తుంది గాని, మరింకెవ్వరికీ తెలియదు. ఇక మా విషయానికి వస్తే, ఈ మనస్సు అనేక వృత్తిరూపములను పొందుతూ, మాయ చేత విమోహితం అగుచున్నది. నా కుమారుడు శుక్రాచార్యుడు ఈ కల్పాంతము వరకు జీవించ వలసియున్నది. ఈ విషయం నాకు తెలుసు. కాని అతడు మరణించటం గమనించగానే నేను విచలితుడనై భ్రమను పొందాను. "జీవితం పరిసమాప్తి కాకపోయినప్పటికీ ఈ కాలుడు నా కుమారుని తన వెంట తీసుకొనిపోయాడే?" అను అల్పబుద్ధి ఎందుకో నాకు కలిగింది. అనేక మంది గురువులచే బోధించబడి, స్వవిచారణాదుల ప్రభావంచే ఈ ప్రపంచము యొక్క స్థితి గతులను ఎరిగియే ఉన్నప్పటికీ, కించిత్ 'ప్రమత్తత' కారణంగా మేము ఈ సంపద, ఆపదలు కలుగజేసే హర్ష, శోకములకు వశీభూతమై పోతున్నాం.

మీకు తెలియనిదేమున్నది? 'అయుక్తం ఆచరించువాని వల్ల కోపం, 'యుక్తం' ఆచరించు వాని పట్ల ప్రసన్నత్వము కలిగియుండుట" అయినట్టి ఒక స్వభావం, లేక, నియతి లోకంలో ఉండి ఉన్నది కదా!

"ఇది చెయ్యాలి. ఇది చేయకూడదు" అను ఇష్ట - అయిష్ట - నిర్దేశ్య - అనిర్దేశ్యముల పట్ల సత్యత్వబుద్ధి ... ఉన్నంతవరకూ 'స్వభావం' అనబడేది దృఢంగా ఉండియే తీరుతుంది.

హే జగద్గురూ! హేయమగు అట్టి భ్రమను ఇప్పుడు త్యజించి వేయుచున్నాను. మీ అభిప్రాయములన్నీ పరిశీలించిన తరువాత నా కోపం పటాపంచలైంది. ఏది ఏమైనా, భగవత్ స్వరూపులగు మీ పట్ల దురుసుగా ప్రవర్తించటం తప్పే. మీరు చెప్పినదంతా విన్న తరువాత నేను సూక్ష్మదేహంతో నా కుమారుని సమంగానది ఒడ్డున చూచివచ్చాను.

మహాత్మా! ఈ లోకమున సమస్త ప్రాణులకు మనస్సే రెండు శరీరములను ఉత్పన్నము చేయుచున్నది. వాస్తవానికి ఈ మనస్సునందే జగత్తు అంతా ఉత్పన్నమగుచున్నది.

**కాలుడు :** మహర్షీ! మీరు చెప్పినది అక్షరాలా నిజం. మనస్సే జీవునకు ముఖ్యదేహం కాని, ఈ భౌతికమైన రక్త-మాంస నిర్మిత శరీరం ముఖ్యమైన విభాగం కాదు. కుమ్మరివాడు తనలోని ఆలోచనలకు ఒక రూపమును ఇచ్చి అనేక ఆకారములలో కుండలను, మూతలను తయారు చేస్తున్నాడు కదా! ఈ మనస్సు కూడా అట్లే తన సంకల్పముచే ఈ భౌతిక దేహములను నిర్మించుకొనుచున్నది.

అజ్ఞానవశంచేత బాలుడు 'భూతము' అనబడుదానిని కల్పించుకొని, మరల పెద్దల తోడు పొందినప్పుడు ఆ భూతము అను భావనను, భయాదులను నిర్మూలించుకుంటూ ఏడ్చుచూ ఉంటాడు చూచారా?

తనకంటూ ఎట్టి ఆకారమూ లేకపోయినప్పటికీ, ఈ మనస్సు తనయొక్క "సంకల్పించుట" అను వ్యవహారదక్షతచే ఈ భౌతిక దేహములను, లోకములను సంబంధ బాంధవ్యములను, ప్రియాప్రియములను, ఆశ్చర్య-సామాన్యములను నిర్మించుకుంటోంది. మరల ఇంతలోనే నశింప జేయుచున్నది. ఎంత చమత్కారమైన క్రీడ ఇది!

ముందుగా అనుకోకపోయినప్పటికీ, స్వప్నంలో అనేక దృశ్యాలు ప్రాప్తిస్తున్నాయి చూచారా? మిథ్యాజ్ఞానము కలిగియున్నపుడు ఏవేవో అభిప్రాయాలు ఆక్రమించివేయుటచే అసత్యములు సత్యములవలె భ్రమింపజేస్తూ ఉన్నట్లు,! 'సంభ్రమం'లో ఉన్నవాడు ఎదుటివాడు చెప్పే విశ్లేషణను వినిపించుకోనట్లు, ఈ మనస్సు తనయందు "మిథ్యారచన చేయుట" అను ఒక విచిత్రమైన స్వభావము కలిగి ఉంటోంది. అట్టి స్వభావమే సత్యమును మరుగుపరుస్తోంది.

ఓ మునీంద్రా! ఈ జీవుడు "మనస్సు", "భౌతికదేహము" అను రెండు వేరువేరైన విషయములు కలిగి ఉంటున్నాడు. ఈ రెండు తత్త్వములు ఉండి ఉంటున్నాయనే విషయం లౌకిక పరిశీలనా మాత్రం చేత (అనగా, గొప్ప వేద-వేదాంత జ్ఞానం లేకుండా కూడా) గమనించవచ్చు. ఈ విషయం స్థూలదృష్టికి కూడా సుస్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. అయితే అట్టి స్థూలదృష్టిని ప్రక్కకు పెట్టి సూక్ష్మ దృష్టితో కనుక చూస్తే "స్ఫురణరూపమగు మనస్సు మాత్రమే కలదు" అనే విషయం స్పష్టమగుచున్నది. ఏ సమయంలోనైనా సరే, సత్, అసత్‌ల రెండింటికీ విలక్షణమై మహా విశాలమైనట్టి ఈ మనస్సే ఆవిర్భావం చెందుతోంది. అటూ ఇటూ సంచరిస్తూ మరొకప్పటికి తన లోనికి తానే తిరోగమిస్తుంది. ఈ ముల్లోకములు మనస్సు యొక్క రచనా చమత్కారమే. చాలా దూరం ప్రసరించియున్న కొమ్మలు, ఆకులు మొదలైనవన్నీ మట్టి వృక్షముయొక్క అవయవములే కదా! ఈ పలువిధాలుగా కనిపించుచున్న భేదవ్యవహారసరళి అంతా చిత్తం యొక్క అవయవాలే. మనస్సు తనయందు భేదవాసనల ప్రభావంచేతనే ఈ పదార్థముల సమూహమునంతా ఈ విధాలుగా గాంచుచున్నది.

దూదియే వస్త్రము అగుచున్నది. వస్త్రములో దూదికి వేరైనదంటూ ఏమున్నది?

తరంగమునందు నీటికి వేరుగా ఇక ఉన్నదేది?

మట్టి – మట్టి కుండ వేఱు వేఱా? కాదు. అయితే అనేక కుండలను చూస్తూ, చిన్న, పెద్ద కుండలు దర్శించటం మట్టిదృష్టిని వదలి ఆకారదృష్టిని ఆశ్రయించుట చేతనే కదా!

ఈ మనస్సు కూడా సరిఅయిన అవగాహన పొందనంతకాలం భిన్నత్వమునే దర్శిస్తోంది. "ఆహాఁ! నేను దుర్బలుడను, దుఃఖిని, అజ్ఞానిని" అని భావించుచున్నది. తన వికల్పముల వలన ఉదయించి భావనలచే నియమించబడి, ఈ మనస్సు జీవత్వమును పొందుతోంది.

**భృగుమహర్షి :** అవును. ఈ మనస్సు యొక్క భావనలకు, స్వయంకల్పితమైన రుగ్మతలకు అంతూ పొంతూ లేకుండా పోతోంది.

**కాలుడు :** అయితే మహర్షీ! ఈ మనస్సుకు ప్రాప్తించేదంతా 'స్ఫురణ' లేక 'భావన' మాత్రమే కదా!

భావించుట చేత మాత్రమే (లేక, ఊహించుట చేత మాత్రమే) స్ఫురించేది సత్యమెట్లా అవుతుంది? "ఈ మనస్సును త్యజించుట లేక జయించుట ఎట్లా?" అను ప్రశ్నకు ఉపాయం ఏమిటో చెపుతాను. "నేనీ రూపమునే కాదు. మనస్సు యొక్క స్ఫురణ కూడా నేను కాను. సర్వ స్ఫురణలకు ఆవలఉన్న నిత్యోదిత చైతన్యతత్త్వమే నేను" అనునట్టి నిరంతర ఉత్తమభావనచే ఈ తుచ్ఛ మనస్సు జయించివేయబడగలదు. అల్పత్వమును ఆశ్రయించు మనోవిభాగము త్యజించ బడగా, అప్పుడు శేషించు మనన శీలత్వమునకు నియామకమైన 'మహామనస్సు' సనాతనము, శాంతము, అఖండము అని మేము గ్రహించుచున్నాము.

ఈ మనస్సు గురించి దృష్టాంతపూర్వకంగా మరికొన్ని విశేషాలు చెపుతాను. వినండి.

**సముద్రము, తరంగాలు -** ఒక సుప్రసిద్ధమైన మహాసముద్రం ఉన్నది. అది అసంఖ్యాకమైన తరంగములతో శోభాయమానమైయున్నది. ఆ తరంగాలు లేస్తున్నాయి. శమిస్తున్నాయి. అయితే ఏం? ఆ సముద్రం ఎచ్చట నుండి వచ్చుటలేదు. ఎచ్చటికీ పోవుటలేదు.

ఆ మహాసముద్రం అన్నివైపులా ఒకే జలం కలిగియున్నది. సమము, శుద్ధరూపము, స్వచ్ఛము, స్వాదుజలమయము కూడా అయివున్నది.

కల్పాంతము వరకు ఆ సముద్రం అట్లే ఉండి ఉంటోంది. ఆ సముద్రం అక్కడ ఉండి ఉండటానికి ఎవ్వరూ కారణం కాదు. అది "స్వమహిమ" యొక్క అతిశయం చేతనే అచ్చట ప్రతిష్ఠితమైయున్నది.

అట్టి మహాసముద్రంలో అనేక తరంగాలు ఉన్నాయి. అందులో కొన్ని చిన్న తరంగాలు.

ఆ చిన్న తరంగాలు, తమయొక్క స్వభావవశంచేత "నేను చిన్న తరంగమును హ్రస్వమును ఎత్తు పల్లములే నా స్వరూపం," అను భావనచే నిజరూపమును ఏమరచుచున్నాయి.

మరికొన్ని అతి దీర్ఘమైన తరంగాలు. అవి తమ స్వభావాన్ని అనుసరించి "మేము చాలా పొడవైన తరంగాలము" అని వికల్పన చేస్తున్నాయి.

కొన్ని కెరటాలు "అదిగో, ఇక నా వినాశనం దగ్గరపడినట్లే" అని తలంచుచు పతన భయం

వల్ల పతనమునే భావించుచు అట్టి భావనచే తీరప్రదేశంవైపు పోవుచున్నాయి. స్వల్ప కాలమైన తరువాత మరల ఆవిర్భవించి "అవును ఇప్పుడు మేము భోగములు పొందుటకు అనుకూలమైన స్థానములను, స్థితిగతులను పొందుచున్నాము" అని అభిమానించుచున్నాయి.

ఈ వ్యవహారమంతా దైవవశం చేత మహావిశాలమై, దేదీప్యమానమై శోభించటం జరుగుతోంది.

కెరటములతో పోల్చదగిన అనేక ఉపాధులందు కనిపించే అహంభావమే ఈ జగత్తు యొక్క రూపం. అట్టి అహంభావ మహాసముద్రంలోని ఒక కెరటం చంద్ర బింబమున ఉపాధి రూపంలో ఉండి "ఇప్పుడు నేను శీతలముగా ఉన్నాను" అని అభిమానిస్తోంది. మరొక అహంకార కెరటం దావాగ్ని యందు ప్రకాశవంతమగు దేహము కలిగి, ప్రతిబింబముతో కూడినదై, "నేను దహించ బడుచున్నాను" అని తలచుచు భయమును పొందుచున్నది. మరల ఎప్పుడో మౌనము వహించి ఉంటోంది.

ఒక జలకెరటం ఒకచోట తనలో చంద్రుని, నక్షత్రములను ప్రతిబింబింపజేస్తోంది. మరో కెరటం మరొకచోట పర్వతాలను, వృక్షాలను, వాటి ఫలాలను తనలో ప్రతిబింబింపచేస్తోంది.

❖

ఈ అహంకారము ఒక ఉపాధియందు ప్రవేశించి, ఒక సమయంలో "నేను ఇప్పుడు రాజు నయ్యాను. కనుక కృతార్థుడను" అని సంతోషము పొందుతోంది. గాలి వీచగా తరంగం విధ్వంస మగుచున్నట్లు, ఆ భ్రమవంతమైనట్టి ఉపాది, తదితర సంబంధిత విషయములు విధ్వంసమగు చుండగా, ఆ జీవుడు "అయ్యో! నేను ఖండ ఖండములయ్యానే!" అని అరచుచు రోదించుచున్నాడు.

ఓ మహర్షీ! ఈ కెరటములలో ఎంతటి తతంగమంతా జరిగిపోతోంది! ఎక్కడో లేస్తున్నాయి. ఒకదానితో మరొకటి కలిసి ప్రయాణిస్తున్నాయి. ఒకదానితో మరొకటి ఢీకొంటూ ఛిన్నాభిన్నమై పోతున్నాయి. అయితే యథార్థానికి ఈ తరంగములన్నీ జలముకంటే వేరు కాదు కదా! 'తరంగములు' అనబడునవి జలమునకు వేరుగా బాహ్యము నుండి ప్రాప్తించుటలేదే! అందుచేత, ఈ తరంగములు జలసమూహరూపమైనట్టి మహాసముద్రము కంటే వేరైనవని అనటం ఎట్లా?

అందుకే, "తరంగములకు 'సత్' మయమైన, (లేక) 'అసత్' మయమైన ముఖ్యరూపమే లేదు" అని అంటూ ఉంటారు.

కాని, "సముద్రంలో తరంగములనునవి లేవు. జలమే ఉన్నది" అని అనవచ్చునా? మరి తరంగములు లేస్తున్నాయి. కనబడుచున్నాయి కదా!

**భృగుమహర్షి :** హే కాలస్వరూపా! మీరు మహత్తరమైన విషయమునే విశదీకరిస్తున్నారు. "జ్ఞానదృష్టి" యొక్క సువ్యక్తతకొరకు అడుగుచున్నాను. ఇంతకీ జలంలో తరంగాలు ఉన్నాయి అని అంటారా? లేవని అంటారా?

లేక 'బ్రహ్మము–జీవులు' దృష్ట్యా చెప్పాలంటే, బ్రహ్మమునందు కనబడే ఈ 'నీవు–నేను –అతడు" అను రూపములుగా తోచే ఖండితాహంకారలు వేరువేరుగా ఉన్నాయా? లేవా?

**కాలుడు :** బ్రహ్మర్షీ! మీకు సర్వము విదితమై యుండి కూడా అడుగుచున్నారు. అయినప్పటికీ, పునశ్చరణ యొక్క బలం కొరకు చెప్పుచున్నాను.

సముద్రమును "తరంగముల దృష్టి"తో కూడుకుని చూస్తున్నామనుకోండి... అవి ఉండనిదెప్పుడు? లేక జలదృష్టితో చూస్తే తరంగములన్నీ జలమయమే కదా!

"ఈ జగత్తు ఇందలినానాత్వము కూడా అట్టిదే..." అని గ్రహించండి. అయితే ఈ జీవులు వారివారి "స్వభావము–స్థితి–సంకల్పము"ల కారణంగా పరిచ్ఛిన్నములగు ఈ భేద వికల్పములు అన్నీ స్వయంకల్పితానుసారమే గాంచుచున్నారు.

❖

మరల విషయసారమును సమీక్షిస్తున్నాను. వినండి–

ఈ తరంగములు ఉత్పన్నమౌతున్నాయి. నశిస్తున్నాయి. మరొకప్పుడు నశించకుండా దీర్ఘ కాలం ఉండి ఉంటున్నాయి. ఇట్లు మరల మరల ఉత్పన్నమగుచు, నశించుచుండే ఈ తరంగాల పరస్పర సమ్మేళనము కంటే సముద్రము వేరు కాదు. సముద్రము కంటే తరంగములు వేరు కాదు.

ఈ జీవులు కూడా 'పరమాత్మ' కంటే వేరుగా లేరు. పరమాత్మ వీరికంటే వేరు కాదు.

అయితే, జ్ఞానులగు జీవులు... "నేను పరమాత్మనే. వేర్వేరు జీవాత్మలవలె కనిపించే ఈ విశాలదృశ్య జగత్తంతా నాయొక్క చిత్కళయే. కాని వాస్తవానికి నాయందు ఇవేమీ లేవు – అని సర్వదా గమనిస్తూనే ఉంటున్నారు. "జలములో తరంగమున్నది అని అనటం అసమంజసము కదా! తరంగమనునది జలమువలె ఒక పదార్థమే కాదు"... అని గ్రహించుచున్నారు. అట్టి సమగ్ర – సర్వసమత్వ– ఏకీభావన గల జీవుణ్ణి "మోక్ష స్వరూపుడు" అని అంటున్నాం.

దానికి వేరైన భావన కల వానిని "జీవుడు" అంటున్నాం.

**వేరైన భావన:** "నేను ఈ శరీరమును, తదితర శరీరములు నాకంటే వేరుగా బాహ్యమున ఉంటున్నాయి. వారి చిత్తములు వేరు. నా చిత్తము వేరు. అందుచేత వారు వేరు. నేను వేరు. ఇవి నావి. ఈ కొద్ది మంది నా వారు. వీరు తదితరులు" అను మననము చేయు జీవుడు 'బద్ధ స్వరూపుడు' అని చెప్పబడుతోంది. బద్ధ స్వరూప మననముచే అనేక దుఃఖములు అనుభవిస్తున్న ఈ జీవునకు అతని అఖండ స్వరూపము గుర్తుచేసి ప్రశాంతపరచటానికే ఆత్మవిషయమై శాస్త్రములు విచారణ ప్రతిపాదించటం జరుగుతోంది.

ఎందుకంటే, వాస్తవమగు ఆత్మకు బంధ – మోక్షములు ఉంటాయా? ఉండనే ఉండవు.

❖

తరంగములన్నీ అన్ని సమయములందూ ఏకైక రూపమగు జలమయమే అయి

వుంటున్నట్లు, ఈ చిత్ర విచిత్రక్రియలతో కూడి చంచలమైయున్న ఈ జగత్ శక్తులన్నీ బ్రహ్మము కంటే భిన్నముగా కనిపించుచున్నను, అభిన్నములే సుమా!

బ్రహ్మము... తరంగములలోని జలం వలె.. వ్యాపకమై, నిత్యమై, శుద్ధమై, నిరామయమై, చిన్మాత్ర స్వరూపమై, అనాదియై, అనంతమై, సర్వశక్తిమంతమై ఉన్నది. సర్వశక్తిమంతుడగు ఆ పరమాత్మ తన స్వస్వరూపము నుండి చ్యుతి పొందకుండానే ఈ వివిధ రూపములన్నీ పొందుచున్నాడు.

జలము నందు జలమే తరంగరూపముగా అవతరిస్తున్నట్లు, బ్రహ్మము నందు బ్రహ్మమే నానావిధ రూపములుగా విస్తరిస్తోంది.

త్రాడు నందు పాము కనబడుచున్నట్లు, ఆ బ్రహ్మము నందే ఈ స్త్రీ-పురుష-లింగరహిత రూపములన్నీ వివర్తభావము పొందుచున్నాయి.

❖❖❖

# 7. ఈ జగత్తు బ్రహ్మమే

**భృగు మహర్షి :** కాలదేవా! బ్రహ్మము నందు ఈ 'జగత్తు' అను వివర్తవ్యవహారం ఎట్లా, ఎప్పుడు, ఎందుకు ఏర్పడుచున్నదని మీ అభిప్రాయం?

**కాలుడు :** ఓ భృగుమహర్షీ! మీ ప్రశ్నకు సమాధానం వినండి-

'జగత్తు' అనునట్టి కల్పన ఏదీ ఎప్పుడూ ఉండియే ఉండలేదు. ఇప్పుడు కూడా లేదు. ఇకముందు కూడా ఉండబోదు. ఎందుకంటారా? ఈ "జగత్తు-బ్రహ్మము" అనబడు రెండింటిలో కొంచెం కూడా భేదం లేనేలేదు. తరంగమునకు, జలమునకు భేదమేమిటి చెప్పండి.

ఆ బ్రహ్మము నిశ్చయముగా పూర్ణమై, సర్వమైయున్నది. "ఈ జగత్తు కూడా కేవలం బ్రహ్మము మాత్రమే." అను "భావన అనుక్షణం చేయబడుచున్నదనుకోండి... అప్పుడు, అలాంటి ప్రయత్నంతో తదితరములైన ఆడంబరములన్నీ త్యజించబడటమే సర్వదోషములకు ఉపశమనం.

ఆ ఆత్మసత్తయే 'నియతి' రూపము కూడా అయి ఉన్నది. సమస్త పదార్థముల యొక్క అధిష్ఠానము కూడా అదియే. అది అనేక రూపములుగా ఉన్నప్పటికీ, ఏకరూపమై ఉన్నది. అసంఖ్యాకములుగా విరుద్ధ రూపము కలదైవున్నప్పటికీ, సర్వత్రా ఒకే ఆకారము కలిగియున్నది.

అట్టి ఆత్మ తనయందు తానే వేరైన భావనను ఆశ్రయించి మనస్సు. అనే ఉపకరణం ద్వారా ఈ పటాటోపమంతా పొందుచున్నది. అట్టి భావనా స్వరూపమే ఈ చిత్తము. అట్లు, 'ప్రతిబింబత్వము' లేక 'చిదాభాసత్వము' పొందిన తరువాత ఈ చిత్తము ఆయా ఉపాధులందు వ్యాపకమైయున్న అహంకారమును చూస్తూ "ఈ అహంకారములే ఆత్మ యొక్క స్వరూప, స్వభావములు" అని భ్రమ పొందుచున్నది. అనగా ఈ జగత్తు యొక్క దర్శనమంతా సాంసారిక

దృష్టిచేత ఏర్పడిన చిత్తభ్రమ మాత్రమే అని అనక తప్పదు. అయితే ఈ అహంకారము- అహంకారమునకు ఆవల, అహంకారముకంటే వేరైన-సన్మాత్రము (Absolute Self-Existence) ను లేని దానిలాగా గాంచుచున్నది. అనగా ఈ చిత్తము ఉన్న దానిని లేనిదిగా, లేని దానిని ఉండినట్లుగా గాంచుచున్నది.

❖

మనం ఇంతవరకు చెప్పుకున్న జల-తరంగముల దృష్టాంతం సహాయంతో ఆత్మ-జగత్తుల చమత్కారం గురించి మరికొంత వివరిస్తాను-

ఒకద్రష్ట వేరువేరుగా దర్శిస్తున్న నామ, రూపాలన్నీ చిత్తం యొక్క వేరువేరు సందర్శనాలే!

ఈ చిత్తము వేరు వేరైన తరంగములను మాత్రమే గాంచుచున్నది.

అన్ని తరంగములలోనూ ఒకే రీతిగా ఉండియున్న జలమును గాంచుట లేదు.

ఈ విధంగా ఈ చిత్తము "ఆధ్యాత్మికము కానట్టి జడము", "ఆధ్యాత్మికము అయినట్టి చైతన్యము"ల విభేదమును గ్రహించుచున్నది.

అయితే చిత్తం యొక్క ఈ 'భేదవాసనా రూపమగు శక్తి' ఆత్మయొక్క నిజరూపముననే చమత్కారంగా ఉండి ఉంటోందని చెప్పక తప్పదు. "దేని నుండైతే ఎట్టి బాహ్యకారణము లేకుండానే ఒకటి వివర్తిస్తోందో, అది ఆ మూలవస్తువుకంటే వేరైనది కాదు" అనునది సిద్ధాంతమై ఉన్నది.

చిత్తము చేతనే "ఇది జడం - ఇది చైతన్యం" అను భేదకల్పన అంతా చేయబడుతోంది కదా! అయితే... ఈ చిత్తము యొక్క విన్యాసమాత్రం చేత ఆత్మయొక్క ఏకరూపత్వమునకు ఏర్పడే హాని ఏమీ ఉండదు. అనేక తరంగముల యొక్క గతి భేదం ఉండి ఉన్నప్పటికీ, పరిపూర్ణమై ఉన్న సముద్రజలం శోభిస్తూనే ఉన్నది కదా! సముద్రజలం తనయందు తానే ఈ తరంగములు మొదలైన భేదం పొందుతోంది. అట్లాగే... "పరబ్రహ్మమే విశాల జగదాకారముగా వికాసమును పొందుచున్నది." అనునదే సిద్ధిస్తోంది. ఆత్మయే ఆత్మచే ఆత్మయందు నానా ప్రకారములగు వికారములను స్వయముగా గ్రహించుచున్నది. మరల తనకు తానే త్యజించుచున్నది. శాస్త్ర కారులు ఆ రెండింటికీ "బంధము-మోక్షము" అను పేర్లు పెట్టారు.

**అవిచిత్రం నుండి విచిత్రం -** హే మహర్షీ! ఒకే విషయము అనేక కోణములలో వినటం జరిగితే ఉత్తమ భావన దృఢపడుతుంది కదా! అందుచేత మరల చెప్పుచున్నాను... వినండి-

చిత్ర విచిత్రములైన తరంగములు జలముకంటే వేరు కానట్లు, సర్వలోకములకు ఈశుడైనట్టి ఆ పరమాత్మకంటే "నీవు-నేను-జగత్తు" అనబడు ఈ మొత్తం జగత్‌కల్పన వేరు కాదు. ఒకే బీజంలో కాండము, శాఖలు, ఫలములు, పుష్పములు, ఆకులు వగైరా ఉన్నాయి కదా! ఆ పరమాత్మ యందే ఎల్లప్పుడు ఈ "సృష్టి-స్థితి-లయ" పరిణామ శక్తులన్నీ అంతర్లీనంగా దాగి ఉన్నాయి.

**భృగువు :** అసంగుడు, నిష్క్రియుడు అని చెప్పబడుచూ సర్వస్వభావములకు అతీతుడైన ఆ శుద్ధ-పరబ్రహ్మ భగవానుని యందు ఈ వికారాలన్నీ ఉండి ఉన్నాయా?

**కాలుడు :** అక్షరాలా... ఉండవు. "దేవేశుడు, సర్వమునందు సాక్షిస్వభావుడై అంతర్లీనంగా ఉండి ఉన్నవాడు"... అయినట్టి ఆ పరమాత్మయందు ఎట్టి వికారములకు చోటే లేదు. తీవ్రజ్వరంతో బాధపడేవానికి విచిత్ర వర్ణములు కనిపిస్తూ ఉంటాయి చూచారా! అట్లాగే దేవేశుడగు ఆ పరమాత్మ యందు ద్రష్టత్వ విశేషంచేత "సత్-అసత్" మయమగు ఈ 'నేను - నీవు' మొ॥ వాటితో కూడిన జగత్ చమత్కార వ్యవహారమంతా దృగ్గోచరమగుచున్నది. ఒక నల్లని మేఘము నుండి సప్త రంగులతో కూడిన విచిత్రమైన ఇంద్రధనుస్సు ఉద్భవించుచున్నది. అట్లాగే, ఏకరసము మంగళ స్వరూపము, అవిచిత్రము అగు పరమాత్మ నుండి విచిత్రమైనట్టి ఈ 'జగత్‌స్థితి' ఉదయించటం అనుభవమౌతోంది.

సాలెపురుగు నుండి దారం బయల్వెడలి, సాలెగూడుగా అయి, సాలె పురుగును చుట్టి ఉంటోంది కదా! స్వప్నంలో ఆ 'స్వప్నద్రష్ట' యొక్క చైతన్యముకంటే వేరుగా ఉన్నట్లు తోచే వస్తు జాలం కనబడుచున్నది. చేతనమగు పరమాత్మ నుండి "జడభావనను ఆశ్రయించుట" అను రూపము గల జడత్వము ఉత్పన్నమగుచున్నది.

పట్టుపురుగు తన బంధము కొరకు తనకుతానే దారపుగూడును విస్తరింపజేసుకుంటోంది.

ఆత్మ కూడా స్వీయబంధముకొరకే తన యొక్క చిత్త శక్తిని విస్తరింపచేసుకుంటోంది. చిత్త శక్తియే వాసనావైచిత్ర్యము కూడా.

**భృగుమహర్షి :** ఈ వాసనా బంధమంతా నిష్కల్మష స్వరూపమగు ఆత్మకు ఎక్కడి నుండి ప్రాప్తిస్తోంది?

**కాలుడు :** ఓ మహర్షీ! ఈ వాసనా బంధమంతా ఆత్మకు బాహ్యము నుండి మరెవ్వరూ కలిగించుట లేదు సుమా! ఆత్మయే స్వయముగా తన ఇచ్ఛానుసారంగా తనయొక్క 'స్వరూపవిస్తృతి (The extending of its own form) ను భావించుచున్నది. పట్టుపురుగులాగా తన కొరకు తానే కఠినమైన బంధమును నిర్మించుకొనుచున్నది.

ఈ ఆత్మయే మరొక సమయంలో తన ఇచ్ఛచే ఆత్మసాక్షాత్కారం పొందుతోంది. స్వస్వరూపం యొక్క ప్రభావం చేత - ఒక ఏనుగు కట్టుత్రాడు త్రెంచుకొనునట్లు - ఈ ఆత్మ తనకుతానే సంసార బంధము నుండి తొలగి, మోక్షమును పొందుచున్నది. అనగా, బాహ్యమననము త్యజించి, స్వస్థతతో కూడిన "స్వయమాత్మానుభవము" (A sense of experience that 'I' am the all pervading Self) ను సంతరించుకొంటోంది.

ఈ ఆత్మ దేని గురించి ఎట్లు భావించటం జరుగుతుందో, అది నిరంతరం అట్లే అగుచున్నది. చూచారా? ఆత్మ సర్వదా మహద్వస్తువే. సందేహం లేదు. అయితే ఏం? అది తనయొక్క 'చిత్తశక్తి' చే ఏది ఎట్లా భావిస్తే, అట్లే శీఘ్రంగా తద్రూపమగుచున్నది. ఈ చిత్తశక్తి అనంత-అఖండ

స్వరూపమగు ఆత్మాకాశమునే కప్పివేస్తోందే! గొప్ప వర్షాకాలమేఘం అనంతాకాశమును కప్పివేసి ఉంచి... ఇక ఆపై ... ఆకాశమంతా తన రూపమే అయిపోయినట్లు చూపుతుంది చూచారా? చిరకాల భావనచే దృఢీభూతమైయున్న ఈ వాసన అనునది క్షణంలో ఆత్మను తనవంటివాని లాగానే చూపుతున్నది. తనయందు ఏయే భావనలు ఉత్పన్నమగుచున్నాయో, ఆయా రూపము గానే ఆత్మ శీఘ్రముగా ప్రకటించుకొనుచున్నది.

❖

ఆత్మకు బంధముగాని, మోక్షముగాని లేవు, ఇక మనస్సంటారా,... దీనికి స్వకీయమైన అస్థిత్వమే లేదు.

ఆత్మయొక్క మననశీలత్వమే మనస్సు. అదియే చిత్తము కూడా!

ఈ మనస్సు అనబడేది అవాస్తవమైనది. దీనికి స్వయమైన 'సత్త' అంటూ ఏదీ లేదు. స్వయంకృతమైన ఉనికియే లేనట్టి మనస్సుకు బంధమేమిటి? "స్వప్నంలో ఒక పంజరమున్నది. ఆ పంజరంలో ఒక రామచిలుక ఉంది. దానికి బంధ విముక్తి ఎప్పుడు?" అనే ప్రశ్నకు అర్థమేమున్నది? స్వప్నమే ఒక ఊహ. అందులో పంజరము, చిలుక మొదలైన పదార్థజాలమంతా కూడా ఊహయే. ఎప్పుడైతే ఈ 'ఊహ' ఉపసంహరించబడుతుందో,... మరుక్షణం ఆ ఊహ లేక స్వప్నంలోని విశేషములన్నీ లేనివే అగుచున్నాయి.

ఆత్మకు, మనస్సుకు కూడా బంధ మోక్షములు ఉండజాలవు.

మరి ఈ ప్రపంచంలోకి బంధ-మోక్షముల దృష్టి ఎక్కడి నుండి వచ్చింది? ఈ బంధ-మోక్షములు మనం ఆపాదిస్తున్నది ఎవరికి?..... ఈ విషయాలు తరచి తరచి చూచినపుడు "అవిచారణ చేతనే ఈ బంధ-మోక్ష వ్యవహార మంతా ఎదురుగా తాండవిస్తూ ప్రాప్తిస్తోంది" అని చెప్పబడుతోంది.

'బంధ-మోక్షములు' అనబడేవి యథార్థానికి లేవు. కాని, ఆత్మయే బంధ-మోక్ష రూపమై వికారయుక్తంగా భాసించుచున్నది. ఆహాః! చిత్రం చూచారా? నిత్యము, పూర్ణము అయిన ఆత్మయొక్క స్వరూపమును, అత్యంత అనిత్యమైనట్టి 'భోక్త-భోగ్యము-భోగము' మొదలైన వాసనల అధ్యాస కప్పివేయుచున్నదే! చిత్తము సంకల్పములను ఆశ్రయించుట ప్రారంభించిన మరుక్షణం, పట్టు పురుగువలె, ఆత్మ ఈ చిత్తము ద్వారా ఆ బంధమునందు తగుల్కొనుచున్నది. పరస్పర మిళితములు, అత్యంత వికల్పయుక్తములు అయిన కోట్లకొలది మనఃశక్తులు ఈ పరమాత్మ నుండి ఆవిర్భవిస్తున్నాయి. అటూ - ఇటూ సంచారం చేస్తున్నాయి.

సముద్రంలో నుండే తరంగములు ఉద్భవించి, ఆ సముద్రము వలన సముద్రమునందే స్థితిపొందియున్నాయి. ఆ సముద్రమునే సంక్షుభితమయంగా చేసి చూపిస్తున్నాయి కదా!

చంద్రుని కిరణాలు చంద్రుని నుండి బయలుదేరి మనకు ప్రాప్తిస్తున్నాయి. అయితే చంద్ర కిరణాలు చంద్రుని కంటే వేరా?

ఈ మనశ్శక్తులు కూడా పరమాత్మకు భిన్నమైనవి కాకపోయినప్పటికీ, భిన్నముగా ఉన్నట్లు అపరిపక్వ దృష్టిచేత అనిపిస్తోంది.

**ఆత్మయందు చిత్తజల తరంగాలు -** "ఆత్మ" అను మహాసముద్రము 'చిత్తము' అనే జలమును కలిగి యున్నది. 'చిన్మాత్రము' అను తరంగములతో కూడినదై మహావిశాలంగా ఉండియున్నది. అట్టి స్పందనామయమగు ఆత్మమహాసముద్రంలో "బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు" అనబడేవి కూడా కొన్ని పెద్ద కెరటాలు. ఇక మరికొన్ని చిన్నకెరటాలు మనుజరూపంలోను, దేవతల రూపములోను, నాగ-యక్ష మొదలైన అనంతసంఖ్యలో అనేక రూపాలుగా ప్రాప్తిని పొందుచు న్నాయి. ఈ తరంగములన్నీ కూడా "స్వభావము" చేతనే కల్పించబడి, స్ఫురించు చున్నాయి. వీటిలో కొన్ని "యముడు, మహేంద్రుడు, కుబేరుడు" మొదలైన రూపాలతో "అష్టదిక్పాలకులు" గా వ్యవహరించబడుచున్నాయి. కొన్ని పరస్పరం వధించుకుంటున్నాయి. మరికొన్ని ఉపకారం చేసుకుంటున్నాయి. కొన్ని హాస్యం ప్రదర్శిస్తున్నాయి. మరికొన్ని అత్యంత తీవ్రము, చపలము అయిన 'ఇచ్ఛ'తో కూడుకొని ఉన్నాయి.

కొన్ని ఉత్తమ తరంగాలు గర్జిస్తూ పైకి ఎగురుచున్నాయి.(ఊర్ధ్వలోకాలకు పయనిస్తున్నాయి).

మరికొన్ని క్రిందకు వెళ్ళుచున్నాయి.(అధోలోకములకు తిరోగమిస్తున్నాయి).

ఆ తరంగములోని 'బ్రహ్మ' 'ఇంద్రుడు' మొదలైనకొన్ని కొంచెము దీర్ఘకాలము ఒక స్థిరమైన ఆకారం పొంది ఉంటున్నాయి. ఈ 'మనుష్యులు' అనబడు తరంగాలు అత్యంత అస్థిరమైన అతి స్వల్పకాలం స్ఫురించి ఉంటున్నాయి. అతి శీఘ్రంగా నశించుచున్నాయి. ఆత్మమహాసముద్రంలో క్రిమి - కీటక - పతంగ - సర్ప - మశక - జంతు జాతులన్నీ చిన్న కెరటముల, జలబిందువుల రూపంలో ప్రకటితమౌతున్నాయి. మరికొన్ని పర్వతములందు గుహలందు, కారుచీకటులందు పుట్టి, అక్కడే సంచరిస్తూ, అక్కడే నశిస్తున్నాయి.

❖

ఈ మానవులలో కూడా ఒక్కొక్కరు ఒకొక్కక్క విధంగా ఉంటున్నారు. ఒకని జీవితం అతి దీర్ఘంగానూ, మరొకని జీవితం అల్పకాలముగానూ ఉంటోంది. ఒకని దేహం విశాలంగాను, సుందరంగాను; మరొకని దేహం అతితుచ్ఛంగాను ఉంటున్నాయి. ఈ సంసార స్వప్న కార్యక్రమం నందు ఒకరికి ఒక్కొక్కరు చిరకాలం వరకు స్థిరంగా ఉంటున్నట్లు కల్పించబడుచున్నారు. కొందరు దృఢవికల్పములచే ఎంతగానో మోహితులై, "ఈ కనబడే జగత్తు అత్యంత స్థిరమైనది కదా" అని భావించుచున్నారు. అతి తుచ్ఛ భావములుగల కొందరు "నేను పుట్టాను, పెరుగుచున్నాను. ఇంతటితోనే నేను పరిమితుడను. ఈ శరీరమునకు హాని జరిగితే నా పని అయిపోయినట్లే, అయ్యో! ఈ శరీరంతోపాటు నేను కూడా కృశించుచున్నాను. అతి దుఃఖితుడనగు నాకు గతి లేదు. నేను ఎంతటి మూఢుడను!" అని తలపోయుచున్నారు. ఫలితం? 'దీనత్వము' అను దోషమునకు వశీభూతులై, దుఃఖాదుల ప్రకంపనములు నిరంతరం పొందుచున్నారు.

ఆత్మ మహాసముద్రంలో జడ చిత్త తరంగరూపమున ఉన్న మరికొందరు "నేను ఒక జడమగు రాయిని". అను జడ భావము కలిగి ఉంటున్నారు. ఇంకొందరు, "మేము సర్వుల సానుకూల్యము కొరకు ఇవన్నీ ఇట్లు ప్రసాదిస్తూ ఉంటాము" అని దృఢంగా భావించినవారై దేవభావమును పొంది ఉంటున్నారు. తరంగములు ఆకారములు మార్చుకుంటున్నట్లు కొందరు జంతు ఉపాధి నుండి మానవ ఉపాధికి, మానవ ఉపాధుల నుండి ఆయా జంతువుల ఉపాధులకు చిత్తానుసారంగా తరలి వెళ్ళుచున్నారు. ఇంకొందరు 'సుషుప్తి-ప్రళయముల'లో లాగా అవ్యక్తమగు, వాసనా రూపమైనట్టి 'మహాంధకారము' పొందుచున్నారు.

హే మహాత్మా! భృగుమహర్షీ! మీకు కనబడుచున్న ఈ జీవులు, ఈ నీ కుమారుడు, అతని ఇప్పటి జన్మ పరంపరలు, నీవు-నేను ... ఇవన్నీ కూడా 'బ్రహ్మము' అను మహాసముద్రము నుండి ఆవిర్భవించిన తరంగములవంటివి. అట్టి ఈ తరంగములకు "స్ఫురణరూపమగు మనస్సు" అనే పేరు విజ్ఞులు పెట్టారు.

ఇవన్నీ చంచల ఉపాధులతో కూడిన చైతన్యము యొక్క భేదములే.

చైతన్యము దృష్ట్యా వీటన్నియందు భేదం లేదు.

వీటిలో కొన్ని ఈ జగత్తులో అనేక కల్పముల వరకు, స్థిరత్వమును పొంది ఉంటున్నాయి. మరికొన్ని జ్ఞానామృతం చేత "శుద్ధము, పరమపదము" అగు మోక్ష ప్రాప్తిని పొందుచున్నాయి.

ఏది ఏమైతేనేం? ఆత్మయొక్క చిత్కళా చమత్కారమే ఇదంతా.

❖❖❖

# 8. సంసారోత్పత్తి - విస్తారము

**భృగుమహర్షి :** ఓ కాలదేవా! ఈ ముల్లోకముల 'సృష్టి'లో చిత్ర విచిత్ర జీవరాసులన్నీ ప్రభవిస్తున్నాయి కదా! వీటన్నిటిలో ఉత్తమమైన, 'కృతార్థులు' అని చెప్పతగినవారు ఎవరు? ఈ జీవజాతులన్నీ ఎక్కడి నుండి ఎందుకు ఆవిర్భవిస్తున్నాయి?

**కాలుడు** : సముద్రములోని తరంగాలలాగా, వసంత ఋతువులోని లతలలాగా ప్రభవిస్తున్న ఈ అనేక చిత్ర విచిత్రములైన జీవజాతులన్నీ పరమాత్మ నుండే ఆవిర్భవిస్తున్నాయి. అయితే వీరందరిలో కూడా ఎవరైతే మనస్సు యొక్క మోహమును జయించివేసి, ఇహ-పరములను సుస్పష్టముగా ఎరిగి ఉంటారో, వారు మాత్రమే కృతార్థులు. అట్టి కృతార్థులు యక్షులలోను, గంధర్వులలోను, మనుష్యులలోను, జంతువులలోను కూడా ఉండియే ఉన్నారు. 'జీవన్ముక్తులు' అని చెప్పబడే అట్టి జీవులు తమ యొక్క రాక-పోకలచే ఈ ధరాతలమును పునీతం చేస్తూ ఉంటారు. వారు విహరించుచుండగా అట్టి ప్రభావంచేత వర్తమాన-భవిష్యత్తులలో అనేకమంది తదితర సంసారజీవులు కూడా సముద్ధరించబడుతూ ఉంటారు.

ఇక ఈ సాంసారిక భావములకు తమని తాము పరిమితం చేసుకున్నవారి గతి ఏమి టంటావా! వారంతా "కట్టె, గోడ"ల వలె మూఢులై అనేకసార్లు స్థావరత్వమును, జంగమత్వమును పొందుచూనే ఉంటారు. అందుకే... "ఓ సర్వజనులారా! ఈ మానవ ఉపాధి అత్యంత ఉత్కృష్టమైనది, దుర్లభమైనది. ఎందుకంటే ఇక్కడ జ్ఞాన విజ్ఞానములు ఆశ్రయించటానికి కావలసిన సాధన సంపత్తి లభిస్తున్నది. అందుచేత ఈ అవకాశమును వృథాపరచుకోకండి"... అని గురువుల స్థానంలో విధులను నిర్వర్తిసున్నట్టి మహనీయులు ఈ ప్రపంచజనులకు మరల మరల గుర్తు చేస్తున్నారు. ఘోషిస్తున్నారు.

శాస్త్రములచే వచించబడుచున్న తపస్సు, ధ్యానము మొదలైన సర్వప్రయత్నముల అంతిమ గమ్యమేమిటి? మోహమును నశింపజేసుకొనుటయే సుమా! మోహము పూర్తిగా నశించితే... అట్టి తత్వజ్ఞానులకు శాస్త్ర విచారణ మొదలైనవి క్రొత్తగా ప్రసాదించేవి ఏమి ఉంటాయి? ఈ సాధనములు, ఈ విధి నియమములు,... ఈ చర్చలు ఇవన్నీ అజ్ఞానము వీడని వారి కొరకు మాత్రమే జ్ఞానులచే ప్రతిపాదించబడుచున్నాయి. ఈ లోకంలో కొందరు 'ఆత్మజ్ఞానము' పట్ల జాగరూకులై, ప్రయత్నశీలురై ఉంటున్నారు. వారి కొరకే, జ్ఞానులగు మహాత్ములచే శాస్త్రములు రచించబడ్డాయి. అయితే ప్రయత్నము, శ్రద్ధ, ఆసక్తి, ఉత్తమ ఆశయము కలవారి పట్ల మాత్రమే శాస్త్రములు ప్రయోజనవంతమౌతున్నాయి. జ్ఞానులు ఈ విధంగా ప్రయత్నశీలురగు అజ్ఞానులకు తమ సహాయం అందజేస్తున్నారు. పూర్ణ జ్ఞానులు (అవతారపురుషులు) ఈ శరీరధారణను అంగీకరించుటలో ఉద్దేశము, ప్రయోజనము అదే అయి ఉంటోంది.

❖

'హే భృగుమహర్షీ! ఇక్కడ మీరు ఒక చమత్కారం గమనిస్తున్నారా? తమకు ఎదురుగా శాస్త్రములు ఉండి ఉన్నప్పటికీ, అందలి 'ఉత్తమ విచారణ' యందు కొందరి బుద్ధి ఏమాత్రం ప్రవేశించుటలేదు. "ఈ శాస్త్రములు మీవి. అవి మావి" అని మాత్రం అనుకుంటూ సాంసారిక దృష్టులనే అవలంబిస్తున్నారు. ఫలితంగా అట్టివారియందు అభేదదృష్టిగానీ, ఆత్మను గురించిన అవగాహన గానీ ఏ మాత్రం ఏర్పడుట లేదు. పాపదృష్టి నశించనంతకాలం అంతఃకరణము దోష భరితమై ఉంటుంది. పాపములు నశించినప్పుడే అంతఃకరణము శుద్ధమగుచున్నది. పరిశుభ్రమైన దర్పణంలో ప్రతిబింబము స్పష్టముగా కనబడుచున్నట్లు, సజ్జనుల యొక్క నిర్మల బుద్ధియందు మాత్రమే శాస్త్రసారము, ఉత్తమ అవగాహన ప్రవృత్తమౌతున్నాయి.

ఆకాశంలో సూర్యుడు ఉదయించగానే అంధకారమంతా మటుమాయమౌతుంది చూచారా?

సచ్ఛాస్త్రముల యొక్క విచారణచే మనస్సునందలి మోహమంతా నశించిపోగలదు.

అనేకమంది జీవుల మనస్సులలో అజ్ఞానము గూడుకట్టుకుని కాపురం చేస్తోంది. వారు నిష్కారణంగా అవిచారణ, అజ్ఞానములను స్వీకరించి తద్వారా దుర్భర స్థితిగతులను ఆశ్రయించిన వారు అగుచున్నారు. కాల నియామకుడనగు నేను వారి వారి ఆశయము, ప్రయత్నములను

అనుసరించి ఆయా ఉత్తరోత్తర స్థితులను, ఉపాధులను కలుగజేస్తున్నాను. ఇందు నన్ను దూషించి ఏం ప్రయోజనం? మనస్సులో మోహం నశించకపోతే, అట్టి జీవుడు అల్పవస్తువులకై ప్రయత్నాలు చేస్తాడు. ఫలితంగా అల్పవిషయాలే మరల-మరల పొందుతూ ఉంటాడు. హృదయమును అజ్ఞానము కప్పివేస్తున్నంతకాలం "మోక్షసిద్ధి" అనే ఊసు ఉండజాలదు. దీనికి మరొకరిని ఎట్లా దూషిస్తారు చెప్పండి? ఆకాశమును మంచు కప్పివేసినప్పుడు ఆ ఆకాశము యొక్క రూపమే వేరు విధంగా కనబడటం జరుగుతుంది. అట్లాగే, మోహం అంతఃకరణమును కప్పివేసి విజృంభిస్తోంది.

❖

అంతటికీ కారణం మనస్సే. ఈ మనస్సే భౌతికదేహంతో గొప్పస్నేహం చేస్తూ, ఆత్మయొక్క ఉనికి ఏమరుస్తోంది. "నేనీ మాంసమయ దేహమును" అనునట్టి దృఢభావనను మననం చేస్తోంది. ఫలితంగా అనేక సుఖదుఃఖములను అనుక్షణం పొందుతోంది. సుఖదుఃఖాలు కల్పించుకునేదీ, ఆ కల్పనను అనుభవించేదీ ఈ మనస్సే. అంతేకాని, సుఖ-దుఃఖములు అనుభవించేది జడరూపమగు ఈ మాంసమయ దేహం మాత్రం కాదు.

మనస్సుచే ఏది చేయబడితే అది "నిర్వర్తించబడినది" అను శబ్దమునకు తగి ఉంటుంది. మనస్సుచేత నీ పుత్రుడు ఏది చెయ్యాలని భావన చేశాడో, భావనాపటిమచే అవన్నీ అట్లే శీఘ్రంగా పొందాడు. పొందుచున్నాడు. అతని ఒక భౌతిక దేహం ఇక్కడే మీ ఎదురుగా ఉన్నప్పటికీ అతడు మాత్రం తన మనస్సుచే అనేక యోనులందు ఆగమన-నిష్క్రమణములు (రాక-పోకలు) నిర్వహించాడు. ఆహాఁ! ఏమి విచిత్రం! వాసనాయుక్తమగు మనస్సు అనుసంధానమాత్రం చేత క్షణంలో చేసేది ఆ బ్రహ్మదేవుడు దీర్ఘకాలంగా ప్రయత్నించి కూడా ఆ జీవుని పట్ల నిర్వర్తించ గలడా? లేదు.

ఈ సృష్టి - లోకము, జనన-మరణాదుల గూర్చిన ఇచ్ఛ... ఇవన్నీ కూడా మనస్సు యొక్క స్ఫురణచేతనే కలుగుచున్నాయి. హే బ్రహ్మజ్ఞా! ఈ మనస్సు కొంచెము చలనము కలిగి ఉన్నప్పటికీ, అట్టి చలనము మహాదుఃఖ ప్రదమగుచున్నదనే విషయం కాలస్వరూపుడనగు నేను సాక్షీభూతుడనై గాంచుచున్నాను.

ఇక ఈ మనస్సు యొక్క విశేషాలు గొప్ప గొప్ప శబ్దజాలంతో రచించి చెప్పవలసిన పనేమున్నది? కనుక లేవండి. మనం మీ పుత్రుడున్న చోటికి వెళ్దాం. అంతా మీరే స్వయముగా గమనించగలరు.

**భృగుమహర్షి :** నా ప్రియపుత్రుడు శుక్రుడు అనేక ప్రదేశములలో సంచరించి, అలసిపోయి సమంగానదీ తీరం చేరాడు కదా!

**కాలుడు :** అవును. మీ పిల్లవాడు మనోశరీరంలో స్వర్గంలో అనేక భోగాలు అనుభవించాడు. అక్కడి నుండి, చంద్ర కిరణ సంబంధముచే ఓషధులలో ప్రవేశించాడు. ఓషధుల ద్వారా గర్భమున

ప్రవేశించాడు. అనేక జన్మలైన తరువాత ఒక 'తాపసి' అయినాడు. ఏమీ తెలియని అమాయకునివలె ఇప్పుడు సమంగా నదీ తీరంలో మౌనంగా తపస్సు చేస్తున్నాడు.

అనేకసార్లు 'ప్రాణవాయువు' అను చేతన శక్తి నుండి వినిర్ముక్తమైనాడు.

చంద్రుని సంపర్కముచే మంచుద్వారా ధాన్యాదులందు ప్రవేశించాడు. పురుషుని వీర్య రూపమును పొంది అనేక ఉపాధులను పొందాడు.

ఈ భగవత్ విరచితమైన 'నియతి'ని గాని, ఈ విచిత్ర మాయావ్యవహారములనుగాని ఆత్మజ్ఞానులగు మహాత్ములు మాత్రమే తాము తగుల్కొనకుండా, తేలియాడగలుగుచున్నారు.

❖

"ఔను! ఈ దైవ విరచితమగు జన్మ–కర్మల వ్యవస్థ ఎంత విచిత్రమైనది!" అని అనుకుంటూ భృగు మహర్షి తన ఆసనము నుండి లేచి, కాలదేవుని అనుసరించి వెళ్ళసాగాడు.

ఆనాటి సభ చాలించబడింది.

❖❖❖

**(ఎనిమిదవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# తొమ్మిదవ రోజు

## 9. గడిచిన జన్మల స్మరణ

**వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇక మనం తొమ్మిదవ రోజు విచారణలో ప్రవేశిస్తున్నాం. నిన్నటి రోజు కాలుడు భృగుమహర్షికి చెప్పిన తత్త్వబోధ విన్నావు కదా! వినినదానిలోని విషయసారాన్ని చక్కగా విజ్ఞాన దృష్టితో మరల మరల పరిశీలిస్తూ ఉండాలి సుమా! ఇప్పుడు మనం ఆ తరువాతి విశేషాలను పరిశీలించబోతున్నాం. సావధానచిత్తుడవై విను.

❖

ఆ కాలదేవుడు, భృగువు... ఇద్దరూ ఆశ్రమ ప్రదేశం నుంచి బయలుదేరారు. "దేవత - అప్సరస-సిద్ధ-కిన్నర-జన ప్రదేశములను దాటుకుంటూ సమంగా నదీ తీరం చేరారు. అక్కడ గల ఒక ప్రదేశంలోని ఒక వృక్షం క్రింద శుక్రుని చూచారు. అయితే అతడు మరొక శరీరమును ధరించి ఉన్నాడు కదా! అందుచేత ఇతఃపూర్వపు స్థితికంటే విలక్షణమైన రూపం, భావము కలిగి యున్నాడు. అతని ఇంద్రియములన్నీ ప్రశాంతస్థితిని పొందియున్నాయి. మనస్సు సమాధిని అవధరించియుండుటచే తన చంచలత్వమంతా వీడియున్నది. పాపం, ఎంతో కాలంగా అనేక ఉపాధులలో ప్రవేశించటం - ప్రవర్తించటం - నివర్తించటం చేత కాబోలు, బాగా అలసిపోయి, ఇప్పటికి శాంతి కొరకై విశ్రాంతిని ఆశ్రయించుచున్నట్లున్నాడు. తాను చిరకాలం అనుభవించి ఇప్పటికి త్యజించివేసిన 'సంసారసాగరము' యొక్క గతిని గురించి విచారించుటచేత కాబోలు... అతడు మౌనంగా తీవ్రవైరాగ్యం ఆశ్రయించి యున్నాడు. అందుకు ఫలితంగా అనంతమగు ఈ జగత్తు యొక్క వ్యవహారమంతా గ్రహించాడు. కదలకుండా బిగించబడిన చక్రం ఎట్లాగైతే నిశ్చలంగా కనబడుతోందో... ఆ విధంగా అతడు నిశ్చలత్వం పొందియున్నాడు. 'ఏకాంతము'ను 'నిర్విషయత్వము'ను బైట, లోపల కూడా పొంది ఉంటున్నాడు. చిత్తము నశించి, భ్రమరహితుడై, ప్రశాంతంగా ఉండి ఉన్నాడు. చిత్తవృత్తులన్నీ అత్యంత సహజభావంతో నిరశించివేశాడు. 'నిర్వికల్ప సమాధి' యందు ప్రవేశించాడు. అట్టి అనిర్వచనీయ నిశ్శబ్దస్థితియందు నిర్మలబుద్ధితో కూడుకున్నవాడై, ఈ జగత్తు యొక్క గతిని అంతా చూస్తూ నవ్వుకుంటున్నట్లుగా ఉన్నాడు. సర్వ లోక వృత్తాంతమంతా సుస్పష్టంగా గ్రహించిన వాడయ్యాడు. అతనియందు ఇక కర్తృత్వముగాని, భోక్తృత్వముగాని ఏమాత్రం శేషించిలేదు. సమస్త కల్పనా వ్యవహారములను 'ఆత్మాస్మి' అనబడు దానియందు లయం చేసివేసి, ఉత్తమమైన బ్రహ్మపదమును ఆశ్రయించి ఉన్నాడు.

వ్యాపకమగు ఆత్మయందు విశ్రమించుచున్నవాడై, విశ్రాంతిని పొందుచున్నాడు.

ఒక నిర్మలమైన దర్పణంలో ఎదురుగా ఉండే దృశ్యం ప్రతిబింబిస్తుంది. అయితే, ఆ ప్రతిబింబిస్తున్న వస్తువులు అటూ ఇటూ కదులుచున్నంత మాత్రం చేత ఆ అద్దం కదులుతుందా?

లేదు కదా! ప్రతిబింబం గ్రహిస్తున్నపటికీ, ఆ దర్పణము యొక్క 'సుస్థిరత' అనే శోభకు వచ్చే లోటేమున్నది? ఇంద్రియాలకు తారసపడే విశేషలన్నీ కూడా అతని నిశ్చల మనస్సులో ఆ విధంగా ప్రతిబింబిస్తున్నాయి.

ఇప్పుడతనికి హేయమైనదంటూ (త్యజించవలసినదంటూ) ఏదీ లేదు. ఉపాదేయమైన దంటూ కూడా (స్వీకరించవలసినది, కోర తగినది) ఏమాత్రం ఏదీ లేదు. సంకల్ప-వికల్పములన్నీ వదలి, జ్ఞానయుక్తుడై, ధీరుడైయున్నాడు.

భగవానుడగు కాలుడు భృగుమహర్షిని కళ్లతోనే ఆప్యాయంగా సంబోధిస్తూ మరొక జన్మయొక్క అనుభవము నందు తన్మయుడైయున్న శుక్రాచార్యుని చూపాడు.

❖

**కాలుడు :** ఓ భృగుమహర్షీ! 'వాసుదేవుడు' అనబడే ఈ మీ కుమారుణ్ణి చూచారా? ఇప్పటికి ప్రశాంతుడైనాడు. నిర్వికల్పసమాధిని పొందియున్నాడు. బ్రహ్మ ఋషిసత్తములైన మిమ్ములను సంతోషింపజేయుటయే మావంటి నియతి స్వభావులకు కర్తృత్వమైన విషయం కదా! అందుచేత ఇతనిని సమాధి నుండి మేల్కొలుపుటకు ప్రయత్నం చేస్తాను.

ఇట్లు పలికి, కాలుడు శుక్రాచార్యుని సమీపించాడు. "ఓయీ! ప్రియ శుక్రాచార్య! లెమ్ము" అని గంభీరస్వరంతో పలికాడు. ఆ శబ్దం వినగానే శుక్రుడు సమాధి నుండి మేల్కొన్నాడు. నెమ్మదిగా కనులు తెరిచాడు. సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్న కాలభగవానుని, భృగువుని చూచాడు. తటాలున ఆసనము నుండి లేచి, "అయ్యలారా! శివ-కేశవులవలె దర్శనమును ప్రసాదించిన మీ ఇద్దరికి సాష్టాంగదండప్రమాణం చేస్తున్నాను" అని వినమ్రతతో పలికాడు. వారికి స్వాగత సత్కారాలు ముగిసిన తరువాత ఆ ముగ్గురు ఒక శిలపై సుఖాసీనులయ్యారు.

**శుక్రాచార్యుడు :** మహాత్ములారా! మీ ఇరువురిని చూచిన తరువాత నాకు అనిర్వచనీయమైన శాంతి లభిస్తోంది. ఇప్పుడు నేను పొందుచున్న ప్రశాంతతో కూడిన ఆనందమును మాటలలో వర్ణించలేకపోతున్నాను. ఏ మోహమైతే శాస్త్రజ్ఞానముచే గాని, తపస్సుచేగాని, ఆయా విద్యా సముపార్జనలచే గాని నశించదో అట్టి మాయామయత్వమంతా మీ ఇద్దరిని దర్శించినంత మాత్రంచేత తొలగిపోతుంది. నిర్మలమైన అమృతం వర్షించినప్పుడు కూడా మీవంటి మహాత్ముల దృష్టిప్రసరణ వలె సుఖము కలుగుతుందా?... లేదు. తమ పాదపద్మముల దర్శనంచే నన్ను పావనం చేస్తున్న అతి తేజో సంపన్నులగు మీరిద్దరు ఎవరు? నాపై కరుణతో తెలియజేయండి.

**భృగువు :** నాయనా! ఇప్పుడు నీవు జ్ఞానివేగాని అజ్ఞానివి కావు. అందుచేత నిన్ను నీవే స్ఫురణకు తెచ్చుకొనుటకు ప్రయత్నించు. నీ ఉత్తమ తపస్సు యొక్క ప్రభావంచేత అంతా నీకే విదితం కాగలదు.

అట్లు బోధింపబడినవాడై, శుక్రుడు ధ్యానినిష్ఠుడైనాడు. దివ్య దృష్టిచే రెండు గంటల వరకు తన వివిధ జన్మల దశలను స్మరించాడు. ఆశ్చర్యముతో కొంచెము హాస్యయుక్తమగు ముఖము

కలవాడయ్యాడు. ప్రసన్నచిత్తము వీడకుండానే తనలో విషయమంతా తర్కించుకున్నాడు. అటు తరువాత ఇట్లు పలుకసాగాడు.

❖

**శుక్రాచార్యుడు :** ఆహాఁ! పరమాత్మ యొక్క మాయాశక్తి నియతి ఎంతటి ప్రబలమైనది! దాని యొక్క ఆరంభము ఎక్కడో, ఎప్పుడో, ఎవ్వరైనా ఊహించగలరా? చెప్పగలరా? ఆ మాయాశక్తియే కర్మవ్యవస్థకు కూడా కారణభూతమగుచున్నది. అద్దానికి వశమై ఈ విశాలమగు 'జగత్తు' అను చక్రం పరిభ్రమించుచున్నది. ప్రళయకాల సమయంలో "అగ్ని – వాయు– జల" సమ్మేళనం గొప్ప దుఃఖ మోహాలను జీవులకు తెచ్చిపెడతాయి చూచారా? అలాగే, నేను అనేక జన్మల అవసాన సమయాలలో "మరణము–మోహము–మూర్ఛ" యొక్క సమ్మేళనము పొందాను. 'రాజు' గా జన్మించిన సందర్భాలలో ధనోపార్జన, వందిమాగధుల పొగడ్తలు, శత్రుదేశ ప్రజల వినాశనానికై ఎత్తుగడలు వేయటం వంటి ఏవేవో తుచ్ఛమైన భ్రమలన్నీ పొందాను. దేవతారూపము ధరించినప్పుడు సుమేరు పర్వత ప్రాంతంలో సంచరించుచు, అక్కడగల నదులలోని జలం పానం చేశాను. పర్వత శిఖరముపైగల మనోహర ప్రదేశములలో విహరించాను.

అయ్యలారా! ఏమని చెప్పమంటారు? నేను చూడని వస్తువు లేదు. చేయని క్రియ లేదు. ఆయా ఇష్ట అయిష్ట దశలందు ఒకే వస్తువును, వ్యక్తిని, అనుభవమును ప్రేమించటం, ద్వేషించటం కూడా చేశాను. అనేక జంతు – పక్షి జన్మలలో ఆహార – నివాస – మైథునముల కొరకు ఎంతగానో గావుకేకలు వేశాను. అమ్మయ్యా! ఇప్పటికి 'పరమాత్మ స్వరూప జ్ఞానము' పొందాను. ఎరుగ వలసినది ఎరిగాను. అట్టి పరమాత్మ స్వరూపమునే మననం చేస్తూ కాలం వెళ్ళబుచ్చుచున్నాను.

ఏది చూచిన తరువాతైతే ఇక చూడవలసినదంటూ ఏదీ శేషించదో... అట్టి ఆత్మ వస్తువును నాయందు, సర్వులయందు, సర్వమునందు ఒకే తీరుగా గాంచుచున్నాను.

ఈ సంసార వాసనావశంచేత ఎంతో కాలంగా సుదీర్ఘమైన భ్రమ విభ్రమ వృత్తాంతములను పొందాను. ఇప్పటికి విశ్రాంతి లభించింది. నా భ్రమంతా పూర్తిగా నశించుచున్నది. నాయందు భ్రమ శేషించి ఉన్నంతకాలం నేను ఇంద్రపదవి పొందినా లేక విష్ణుపదవి పొందినా ఈ నా మనస్సుకు విశ్రాంతి లభించదని గ్రహించాను.

ఎద్దానితో అయితే నాకు ఏమాత్రం సంబంధం లేదో, అట్టి అవాస్తవమైన వాటి యందు భ్రమ–విభ్రమములను ఆశ్రయించాను. స్వసత్తను మరచి... సత్యస్వరూపుడనగు నేను... అట్లు ఏవేవో భ్రమలలో సంచరించటమేమిటి? ఎంతటి విచిత్రము? ఎంత అర్థరహితము?

ఆ విధంగా నేను ఎందుకు అంత దీర్ఘకాలం పరిభ్రమించానో నాకే అర్థమగుటలేదు. అందుకే కాబోలు, "మాయ అనిర్వచనీయమైనది" అని పెద్దలు అంటూ ఉంటారు.

తండ్రీ! ఇక లేవండి. మందరపర్వతంపై శుష్కించియున్న 'శుక్రుడు' అను పేరుతో పిలువ బడుచున్న ఉపాధిని మనమిప్పుడు సమీపిద్దాం. ఇక ఇప్పుడు ఈ ప్రపంచమునందు నాకు

పొందతగినట్టిదిగాని, త్యజించవలసినది గాని ఎక్కడా ఏదీ కనబడటం లేదు. కేవలం ఆ పరమాత్మ యొక్క మాయాశక్తి రచనను, అందలి చమత్కారమును ఒక లీలావ్యవహారముగా గాంచుచూ, సాక్షీభూతుడనై ఉండుటయే నేను చేయదగినది. ఇక భావనలోగాని, సంచారములో గాని, వేరే సమయంలోగాని ఎక్కడా ఏదీ పొందవలసినది లేదు. ఆత్మ సామీప్యతను పొందిన తరువాత, ఇంకేముంటున్నది? ఉండదు. కానీ, ఏం లాభం? చంకనున్న బిడ్డను మరచి దూరంగా ఎక్కడో ఏదో ఏడుపు వినిపిస్తుంటే, "అయ్యో! అక్కడ నా బిడ్డ ఏ బాధ చేత అట్లు రోదిస్తున్నాడో?" అని పరుగులు తీసే వెర్రి తల్లిలాగా అయినది నా సంచారమంతా!

ఓ భగవత్స్వరూపులారా! ఇతరులను సముద్ధరించుటలో మీరిద్దరు బహుప్రావీణ్యులు. అందుకే నా మనస్సులోని మాట బైట పెట్టుచున్నాను. ఇప్పుడు నాకు ఒకే ఒక్క పని ఎదురుగా ఉన్నది..... పరమాత్మ గురించి దృఢనిశ్చయం కలిగి ఉండటం.

జీవన్ముక్తులగు మీవంటి మహనీయులచే సర్వదా సేవించబడుచున్న 'ఆత్మపదము'ను అనుసరించి, తద్వారా ఈ జన్మ-కర్మలను పవిత్రం చేసుకోవటం ఎప్పటికైనా ఉపాయం కదా! అట్టి శుభదాయకమగు ప్రయత్నమే సర్వకళంకములకు ఏకైక ఔషధం. పూజ్యులైనట్టి మీ యొక్క అభిప్రాయమును అనుసరించి నాకు ఇప్పటి నుండి 'శుక్రాచార్య ఉపాధి' యందే జీవనవృత్తి సంభవించు గాక! వాస్తవానికి నాకిప్పుడు ఆ దేహమందుగాని లేక ఈ దేహమందుగాని ఎట్టి అభినివేశము ఏర్పడుటలేదు. ఎట్టి ఆసక్తి-పట్టుదలలు నేను పొందుటలేదు. కేవలం ప్రారబ్ధకర్మను అనుసరించి, నాపట్ల శేషించియున్న సాంసారిక వ్యవహారమును నిర్వర్తించుటకే ఈ ఇతఃపూర్వపు ఉపాధిని ఆశ్రయిస్తున్నాను.

బాల్యంలో ఆటబొమ్మలు, ఇసుకతో నిర్మించబడిన పిచ్చుక గూళ్ళు గొప్ప గొప్ప విషయాలుగా కనిపించవచ్చు. కాని ప్రౌఢ వయస్సులో... అట్టి వాటిపట్ల ఆసక్తి ఉంటుందా? ఉండదు కదా!

ఇప్పుడు నాకు 'అప్సరస' మొదలైన పదార్థములపట్ల ఆసక్తిగాని, రాగద్వేషములుగాని లేవు. వెలుతురు ప్రసరించేచోట చీకటికి స్థానమెక్కడిది? తత్త్వజ్ఞానదృష్టితో అభ్యసించబడేచోట ఇక 'సంసార వస్తువుల పట్ల ప్రియత్వము పెరుగుట' అనునది స్వయంగా నిరోధించబడుతుంది కదా!

అప్పుడా ముగ్గురు తత్త్వజ్ఞులు తమయొక్క "భావన-ఏకాగ్రత"ల ప్రభావంచేత సూక్ష్మ రూపమును దాల్చారు. ఆ క్షణంలో వారు ప్రాణవాయు సంచార మాత్రంచే ఏర్పడు క్రియా రూపముతో భాసించారు. ఈ జగత్తు యొక్క చిత్ర విచిత్ర గతుల గురించి సంభాషించుకుంటూ సమంగానదీ తీర ప్రదేశం నుంచి బయలుదేరారు. సిద్ధ మార్గం గుండా మందర పర్వతంపై భృగు మహర్షి ఆశ్రమం చేరారు. ఆ ప్రదేశంలో గల ఒక శిలపై శుక్రుడు తన శరీరం ఉండటం గమనించాడు. ఆ దేహము ఎంతో శుష్కించి, తడిసిన ఆకులతో కప్పబడి ఉన్నది.

❖

**శుక్రాచార్యుడు :** నాకు అత్యంత ప్రియులైన తండ్రీ! అనేక సుఖభోగములచే ఒకప్పుడు నేను ఎంతో ప్రేమగా చూచుకున్నది... ఈ రక్త-మాంస-బొమికల సముదాయమునే కదా? ఈ శరీరము ఒక సమయంలో స్నేహభావముగల 'దాది'చే కర్పూర-చందనములతో చాలా కాలం లాలించ బడింది. ఇక్కడ గల కొన్ని ప్రదేశాలలో పూతీగలతోను, పూలతోను ఊయలలు తయారుచేసుకొని, ఆ ఊయలలో పవళించి పిల్లగాలులు ఆస్వాదిస్తూ ఉండేది. వివిధ స్త్రీ-పురుషులచే వివిధ రీతులుగా చూడబడిన ఈ శరీరం ఇప్పుడు పాము లేళ్ళచే ఛిద్రం గావించబడి, నేలపై మూగగా, మౌనంగా నిద్రిస్తోంది. అనేక సుగంధములను ఆస్వాదించి, అనుభవించిన దీనికి ఎట్టి గతి పట్టింది? ఆ శోభలన్నీ ఏమైనాయి? ఇప్పుడు ఇది శుష్కించి మృతప్రాయమై మిగిలి ఉన్నదే! ఒకప్పుడు దేవకాంత పట్ల 'భోగేచ్ఛ'ను కలిగించిన ఈ శరీరం ఇప్పుడు శవావతారం ధరించి, పడి ఉన్నది! ఇప్పటి ఈ దేహము యొక్క నోరు ఒక బిలంలాగా ఉన్నది. సూర్యతాపంచే చర్మం కరడు కట్టి ఉన్నది. ఈ ఎండిన దేహం చూచి వనములోని మృగములు కూడా భయపడి దూరంగా నిలబడి చూస్తున్నాయి గమనించారా? వివేకము కలిగియున్న జీవుని దేహము, వాక్యము ఒక వర్చస్సు కలిగి ఉంటాయి చూచారా! అలాగే ఈ నా పొట్టభాగము సూర్యకిరణములు పడుచు న్నప్పుడు మిలమిల మెరుస్తోంది. శుష్కించిన నా భౌతిక దేహం ధరించియున్న ఈ గండశిల కూడా తుచ్ఛమైన కురూపత్వమునే ప్రదర్శిస్తున్నట్లుగా ఉన్నది. ఎండిన దేహము కలిగియున్న ఈ పర్వత శిఖరం మూగగా మౌనంగా మానవాళిని సంబోధిస్తూ ఏదో ప్రకటన చేస్తున్నట్లున్నది. ఈ దేహం పెద్ద గొంతుకతో "ఓ జనులారా! మీమీ తుచ్ఛ భౌతిక శరీరములు చూచుకుంటూ, 'ఆహాఁ! మేమెంత అందంగా ఉన్నామో!' అని భ్రమిస్తూ మురిసి పోతున్నారా? నన్ను చూడండి. మీ మీ శరీరములన్నీ కూడా నావంటివే కదా! స్వల్పకాలంలో ఎండి దుర్భరమైన అవతారం పొంద బోతున్నాయి"... అని గుర్తు చేస్తున్నట్లున్నది. శరీరము కలిగియున్నందుకు ఉత్తమ వివేకమునకై ప్రయత్నించకుండా కంచరగాడిదలవలె కాలయాపన చేస్తున్నందుకు ఈ జీవునిపై జాలితో తాను క్రుంగుచున్నట్లున్నది.

ఓ నా పాంచభౌతిక శరీరమా! నేను నీయందు కొంతకాలంగా ఉండకపోవుటచే నీవు "శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు" లేనిదానివయ్యావు. నీయందు ఎట్టి లోభము లేకపోవుటచే నిశ్చింతగా నిర్వికల్పసమాధిని అవలంబించి తీవ్రతపస్సు చేస్తున్నట్లుగా కనబడుచున్నావు. మహాత్ములారా! 'చిత్తము' అనే పిశాచం నుండి ముక్తి పొందియుండుటచే ఈ దేహం నిశ్చయంగా సుఖంగా కాలయాపన చేస్తోంది. "అయ్యో! దైవవశాత్తు ఎప్పుడు ఏ విపత్తులు వచ్చి పడ బోతున్నాయో?" అని ఈ జీవుడు సర్వదా అనుభవిస్తూ ఉండే తెలియరాని భయం ఈ దేహానికి లేదు. 'చిత్తము' అనే బేతాళుడు శమించుటచే ఇది 'ఆనందకళ'ను అనుభవిస్తోంది. ఇట్టి ఆనందకళ విశ్వవ్యాపకమైన సామ్రాజ్యం ఏలే చక్రవర్తికి మాత్రం చేకూరబోతోందా? లేనేలేదు. ఈ దేహము యొక్క సంశయాలన్నీ నశించాయి. ఓ మహాజ్ఞానులగు సద్గురువులారా! ఈ దేహమును చూస్తున్నారు కదా! ఇది ఎట్టి కౌతుకము లేకుండా, సర్వ కల్పనాజాలములను రహితం చేసుకొని, ఈ వనమందు ఎంత ప్రశాంతంగా చక్కగా పవళించి ఉన్నదో కదా!

**చిత్త చాంచల్యము -** అనేక కామ క్రోధ మోహములచే చాపల్యము పొంది అత్యంత సంక్షుభితమై ఉన్న 'చిత్తము' అనే కోతి 'శరీరము' అనే వృక్షంలో విచ్చలవిడిగా సంచరిస్తోంది. ఇక ఈ జీవుడికి శాంతి ఎక్కడిది? అట్టి చిత్తము ఇతనిని అనంతసంఖ్యలో స్థావర-జంగమ యోనులలో పడవేస్తోంది కదా! అయితే ఈ శుక్రాచార్యదేహం మాత్రం చిత్తము చేసే పిచ్చిపనుల నుండి తప్పించుకొని ఇక్కడ విశ్రమిస్తోంది. దూరంగా జరుగుచున్న సింహము-ఏనుగుల గుంపుల యేమీ దీనిని భయపెట్టుట లేదు. యువతుల చర్మసౌందర్యం గాని, ధన దాహాదులు గాని, స్వలాభాదులు గాని, స్వాధిక్యతలు గాని ఈ దేహం మననం చేయటం లేదు. అందుచేతనే దుఃఖ రహితంగాను, బ్రహ్మానందము నందు మునిగి తేలుచున్నట్లుగానూ నాకు కనిపిస్తోంది. సమస్త ఆశలకు, హృదయ పరివేదనలకు, జ్వరములకు హేతువు కేవలం అజ్ఞానమే కదా! అట్టి అజ్ఞానాంధకారం పటా పంచలు కావాలంటే 'మనోరహితత్త్వము' అనే చేతి దీపం చక్కగా వెలుగుతూ ఉండాలి. సర్వ సాధనల యొక్క పవిత్ర లక్ష్యం మనోరాహిత్యమేనని జ్ఞానులు అంటూ ఉంటారు. అట్టి అమనస్కం తప్ప, ఈ జీవులకు నిజమైన శ్రేయస్సు కలుగజేసేది ఈ జగత్తులో ఇంకేమున్నది? "గొప్ప తపస్సుల యొక్క అంతిమ ఫలితమా?" అన్నట్లుగా ఈ దేహం గొప్ప అమనస్కం అనుభవిస్తోంది.

అయ్యలారా! మనోరాహిత్యము సంపాదించినట్టి గొప్ప బుద్ధిమంతులు సుఖము యొక్క పరాకాష్ఠను దర్శించుచూ ఉంటారు. సౌభాగ్యవశంచేత కాబోలు... ఈ దేహము ఏ దుఃఖమూ, సంతోషమూ లేకుండా మనస్సును వదిలించుకొని శాంతంగా ఉన్నది.

❖❖❖

# 10. జ్ఞానులు - దేహములు

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠ మహర్షీ! ఇక్కడ నాకు ఒక సందేహం వస్తోంది. ఆ శుక్రాచార్యుడు అంతకుముందే ఎన్నో దేహములను మరల మరల అనుభవించివుంటాడు కదా! మరి ఆయనకి ఈ భృగుమహర్షి కుమారుని దేహం మీద అంతటి స్నేహభావం ఎందుకు ఉన్నది? అతడు చెప్పే మాటలుబట్టి, ఆ దేహమును అతడు కొంత అవిచారణ పూర్వకంగా... మమకారయుక్తంగా చూస్తున్నట్లు నాకు అనిపిస్తోంది. అతడు దేహం కొరకు ఎందుకు విలపిస్తున్నాడు? అతడు జ్ఞాని కదా! జ్ఞానులు కూడా దేహాదులకు సంబంధించిన సుఖ-దుఃఖాలు అనుభవిస్తారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చాలా ఉత్తమమైన ప్రశ్న వేశావు. నీ ప్రశ్నకు సమాధానమును చాలా కోణముల నుండి పరిశీలించవలసి ఉంటుంది.

ఈ శుక్రాచార్యుని చైతన్యము ఇతఃపూర్వపు కల్పమునందే తన యొక్క స్వయం ప్రయత్నముల బలంచేత ఒక మహర్షియొక్క కుమారుడు అవటానికి, ఆశ్రమజీవనం, యోగదీక్ష మొదలైనవి పొందటానికి అర్హత సంపాదించుకొన్నది. ఈ జీవుల సమాగమాలన్నీ సంస్కారములు -ఋణములు-యోగ్యతలను అనుసరించి ఉంటూ ఉంటాయి. ఇతఃపూర్వపు కల్పము ముగిసి

నప్పుడు, అనగా అప్పటి ప్రళయము నందు ఈ శుక్రునకు సంబంధించిన దేహాకార కల్పన సంస్కార రూపమున శేషించియున్నది. అట్టి సంస్కారశేషము ఈ కల్పము యొక్క ఆరంభము నందు ప్రథమ శరీర భావము (The beginning identity of'SELF' with the 'BODY)చే భూతకోటితో సమత్వము పొందింది. అట్టి "దేహాకార - భావరూప చైతన్యము" ప్రాణక్రియా విశేషమును ఆశ్రయించింది. ఆ క్రియా విశేష ప్రభావంచేత 'సంస్కార శేషము', ఆ సంస్కార శేషం అన్నమును గ్రహించునట్టి అపాన వాయువునందు ప్రవేశించింది. అపానవాయు ప్రవాహం ద్వారా భావత్వముగా ఘనీభవించింది. 'హృదయము' అనబడుదానియందు ప్రవేశించి, క్రమంగా వీర్య దశను పొంది, తల్లి గర్భంలో శుక్రాచార్యుని దేహంగా రూపుదిద్దుకున్నది. అతనికి తండ్రియగు భృగువుచే బ్రాహ్మణోచితమగు ఉపనయనము, ధ్యాననిష్ఠ మొదలగు సంస్కారములు నిర్వర్తించ బడ్డాయి. ఆ దేహమే అక్కడ ఇప్పుడు శుష్కించి పడియున్నది.

ఈ కల్పము యొక్క మొట్ట మొదటయే (లేక ప్రథమ కల్పము నందే) మాయచే స్వయముగా 'చిత్స్ఫురణ' నుండి ఈ 'శుక్ర శరీర సంభావన' కలిగింది కదా! అందుచేత అతనికి శుక్రదేహము నందు అధికమైన ప్రీతి-స్నేహం కలిగి ఉండటం, దాని కొరకు అతడు విలపించడం జరుగుతోంది.

మరొక విషయం. ఈ జీవుడు కొన్నిటిపట్ల ఇచ్ఛ-భావనలను కలిగియుండటం, మరికొన్నిటి పట్ల విముఖత-తాత్సారం కలిగియుండటం చేస్తూ ఉంటాడు. చిత్ స్వభావమగు ఈ జీవుడు స్వీయకల్పనాచాతుర్యమును అనుసరించే కొన్నిటిపట్ల రాగదృష్టి ఏర్పడి ఉంటోంది. అట్టి జీవుల యొక్క ఇష్టాయిష్టములను అనుసరించే బ్రహ్మదేవుడు ఈ సృష్టిరచన అంతా సాగిస్తున్నాడు. సమంగానదీ తీరంలో ఒక ముని కుమారుడుగా తపస్సు చేస్తున్న శుక్రుని చిత్-చైతన్యము మాత్రం "నాకు ఏ దేహము పట్ల రాగాదులతో పనిలేదు. నేను ఇచ్ఛా-క్రోధ రహితుడను. నిర్లిప్తుడను" అని భావిస్తూ ఉన్నది. అయితే ఆ చైతన్యము యొక్క అంతరాంతరాలలో, "నేను భృగుమహర్షి యొక్క కుమారుడను. నా తండ్రి నిర్వికల్ప సమాధియందుండగా, నేను ఆయనను సేవించుచున్నాను" అను రూపముగల భావన శేషించియే యున్నది. అందుకే శుక్రాచార్యదేహమును అతనికి గుర్తు చేసినప్పుడు, అద్దానిని అతడు చూచి కొంత విలపించటం జరుగుతోంది. దేహముపై దృష్టి కలిగి యుండటమనేది దేహియొక్క స్వభావం అయివున్నది. ఒకడు జ్ఞాని కావచ్చు. అజ్ఞాని కావచ్చు. ఈ దేహము ఉన్నంతవరకు సదా అతని లోకవ్యవహారం ఈ రూపంలోనే ఉంటూ ఉంటుంది.

వాస్తవానికి, సమంగా నదీతీరంలో ఉన్నట్టి తపస్వి దేహము... శుక్రాచార్య దేహము... ఈ రెండింటి యొక్క భేదము కేవలం 'ఆసక్తి - అనాసక్తి'ల భేదం మాత్రమే.

**జ్ఞానులు, అజ్ఞానులు: వారి వారి లోకవ్యవహారములు -**

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! ఈ జగత్తు యొక్క గతిని ఎరిగిన 'జ్ఞానులు', పశుధర్మము మాత్రమే కలిగి వర్తించుచుండే 'అజ్ఞానులు'... ఈ ఇద్దరూ కూడా ప్రవృత్తి విషయంలో లోకవ్యవహారములలో సమానంగానే ఉంటూ ఉంటారు. జ్ఞాని కూడా అజ్ఞానిలాగానే

ప్రవృత్తి-నివృత్తి ధర్మం కలిగి ఉంటాడు. ఇక వారిద్దరిలో భేదమేమిటంటావా?... జ్ఞానియందు వాసనలు సన్నగిల్లి ఉంటాయి. వాసనయొక్క ఉనికి-లేములే బంధ మోక్షములకు కారణ మౌతోంది. అంతేగాని, శరీర ప్రాప్తాప్రాప్తములను బట్టి బంధమోక్షములు ఉండవు.

"ఆసక్తి" అనునది ఏమాత్రం లేనట్టి గొప్ప బుద్ధి-ధీరత్వముగల మహాత్ములు కూడా ఈ దేహం ఉన్నంతవరకు తదితరులవలెనే దుఃఖ - సమయములందు దుఃఖమును, సుఖ సమయము లందు సుఖమును పొందుచున్నట్లు కనిపిస్తూ ఉంటారు. జలంలో కనిపించే సూర్య ప్రతిబింబము జలకదలికలను అనుసరించి తానే కదులుచున్నట్లు అనిపిస్తూ ఉంటుంది. కాని ఆకాశంలోని వాస్తవ సూర్యుడు ఈ జలతరంగాలతో సంబంధమే లేకుండా, కదలికలు పొందకుండా ఉండియే ఉంటున్నాడు కదా! జలము యొక్క క్షుభితత్వము (Perturbance) ప్రతిబింబ సూర్యుని కదలుచున్నట్లు చూపుచుండవచ్చు. కాని, ఆ విచలత్వము ఆకాశ సూర్యుని స్పర్శించగలదా? లేదు. అదేవిధంగా జ్ఞాని కూడా బాహ్యవృత్తిచే లోక వ్యవహారములందు పాల్గొనుచూ ఉంటాడు. తదితరులవలెనే ఆయా స్పందనలు కలిగియే ఉండవచ్చు.... అయితే, అంతరంగమున మాత్రం, "నేను నిత్యుడను. సర్వమునకు సాక్షిస్వరూపుడను. సర్వదా అచలుడను. ఈ శరీరాదులు, భావాదులు నన్ను బంధించలేవు. స్పృశించలేవు" అను ఎరుక కలిగి ఉంటాడు.

యథార్థ సూర్యుడు స్వస్థుడుగా ఉంటున్నప్పటికీ, జలంలో ప్రతిబింబించే సూర్యుడు అస్తవ్యస్థుడుగా, చంచలుడుగా కనిపిస్తాడు కదా!

జ్ఞాని వాస్తవానికి లోకవ్యవహారములన్నీ విమర్శ-అవగాహన సహాయంతో ఎప్పుడో త్యజించి వేసి ఉంటాడు. అయినప్పటికీ, బాహ్యమునకు మాత్రం తదితరులవలెనే ప్రపంచ వ్యవహారములందు నిమగ్నుడై ఉంటున్నట్లు ఇతరుల దృష్టికి కనిపిస్తాడు.

ఒకడు జ్ఞానేంద్రియముల దృష్ట్యా ఎట్టి ఆసక్తి ఏ మాత్రం కలిగియుండకుండా, కేవలం కర్మేంద్రియములచే ఆయా ప్రవాహపతితమైన కార్యములు నిర్వర్తిస్తున్నాడనుకో... అప్పుడు ఆసక్తి రహితుడగు అట్టివానిని "ముక్తుడు" అని అంటున్నాం. అట్లా కాకుండా, ఒకరి జ్ఞానేంద్రియములు ఆసక్తితో నిండి ఉంటాయనుకో... అప్పుడు కర్మేంద్రియములు కర్మలయందు పాల్గొనక పోయినప్పటికీ, అతడు 'బద్ధుడు' అనియే చెప్పబడుచున్నాడు. జ్ఞాన దృష్టితో ఈ విభాగం గ్రహించటం చాలా అవసరం. ప్రకాశం కలిగించటానికి కారణం అగ్నియే కదా! అట్లాగే ఈ ప్రపంచంలో 'సుఖ-దుఃఖ-బంధ-మోక్షములు' కలుగజేయటానికి కారణం జ్ఞానేంద్రియములే కాని, కర్మేంద్రియములు కానేకావు... అని కూడా గ్రహించు.

అందుచేత రామా! నీవు బాహ్యమునకు "ఎప్పుడు ఎక్కడ ఏది ఎట్లా" ఉచితమో అది అట్లే నిర్వర్తిస్తూ ఉండు. కర్మలను త్యజించటం కంటే, నీకు నియమించబడిన ఆయా కర్మలను నిర్వర్తించటమే ఉచితం. ఎందుకంటే తదితరుల వ్యవహారసరళి నీ ప్రయత్నములపై కార్యక్రమములపై ఆధారపడి ఉంటూ ఉంటుంది కదా! ఇక, అంతరంగమున మాత్రం వ్యవహార

రహితుడవై ఉండు. అనగా కూటస్థమగు ఆత్మయందు, "నేను ఈ శరీర-మనో-బుద్ధి -అహంకారాలను కాదు. వీటన్నిటికి పరమై ఉంటున్న జ్ఞాన-చైతన్య స్వరూపమగు ఆత్మయే నేను. అన్నిటా, అంతా అయి ఉంటున్నది నేనే. అట్టి ఆత్మ స్వరూపము అవధరించి ఉంటూనే ఈ శరీరమున ప్రవర్తనశీలత్వము ప్రకటిస్తూ ఉంటున్నాను." అను అవగాహనతో దృఢభావన కలిగి ఉండు. సర్వ వైషమ్యములు, సర్వకోరికలు, త్యజించివేసి నిశ్చింతుడవై ఉండు. అభిలాష-ఆసక్తి-ప్రియాప్రియ సంకల్ప పరంపరలు... వీటన్నిటినీ విడనాడివేసి, ఆత్మచే ఆత్మయందే స్థితి కలిగి ఉండు. ఇక ఆపై వర్తమాన కర్తవ్యములగు ఆయా కర్మలను ఎట్టి ఫలాసక్తి లేకుండా నిర్వర్తిస్తూ ఉండు. దేహం ఉన్నంతవరకూ ఏవేవి కర్తవ్యములో అట్టి కర్మలు నిర్వర్తించటం నిశ్చయంగా దేహ స్వభావమే అయి ఉన్నది. దేహమున్నంతవరకు దేహస్వభావమును ఎవరు త్యజించగలరు చెప్పు? అట్లు 'త్యజించాలి' అనే పట్టుదలను, "త్యజించలేకపోయానే" అనే నైరాశ్యాన్ని కూడా అధిగమించివేయి.

**ఆధి వ్యాధి -** ఓ రాఘవా! ఈ 'సంసారము' అనే సాగరంలో 'ఆధి-వ్యాధి' (మానసిక- శారీరక రుగ్మతలు) అనే విశాల కెరటాలు ఇష్టం వచ్చినట్లు సంచరిస్తున్నాయి. అయితే వివేకులైన వారు ఈ సంసార మార్గంలో పడుటలేదు. ఈ మార్గము మమత్వము అనే అంధకార కూపము లోనికి తీసుకునిపోయి "దుఃఖము-నిరుత్సాహము-భ్రమ" అనే ఉప్పునీటిలో ముంచి తేల్చగలదని వారు అల్లంత దూరం నుంచే గమనిస్తున్నారు. నీవు కూడా వివేకివై ఉండు. అంతేగాని "నేను-మేము-నాది-మాది" అనే జాడ్యాన్ని ఆశ్రయించకు. 'యథార్థదృష్టి'తో గమనిస్తే నీవు ఈ దేహాదుల ధర్మమునందు లేవు. ఇవేవీ కూడా నీవు కావు. ఇవి నీకు సంబంధించినవి కావు. సదా, సర్వదా, సర్వత్రా వెలుగొందుచున్నట్టి నిత్య-శుద్ధ-బుద్ధ స్వభావముగల ఆత్మయే నీవు. కాబట్టి "అంతర్వృత్తి" యొక్క ప్రభచే అట్టి ఆత్మయొక్క విలక్షణత్వమునందే సుస్థిరుడవై ఉండు.

నిర్మలము, శుద్ధము, సర్వాత్మకము, సర్వకర్త అయినట్టి బ్రహ్మమే నీవు సుమా!

ఇదే అర్థమును "తత్త్వము" (తత్+త్వమ్) అను మహాపదముచే వేదోపనిషత్తులు ప్రపంచమునకు చాటి చెప్పుచున్నాయి.

"సర్వ ప్రశాంతుడను, జన్మ-మృత్యు రహితుడను, విశ్వస్వరూపుడను అగు పరమాత్మను నేనే అయి ఉన్నాను" అను భావన అలవర్చుకోవటం అభ్యాసం చేత తప్పక సుసాధ్యమే.

సర్వ అభిలాషలను విస్తరింపజేసేది, అవిద్యాదోషరహితమూ అయినట్టి నిర్మలమగు "ఆత్మపథము"ను అవధరించు. 'మమత్వము' (నాకు చెందినవి, నాకు సంబంధించినవి) అను ఘోరాంధకారమును "జ్ఞానదృష్టి" అనే దీపపు వెలుగు సహాయం చేత పారద్రోలి వేయి.

చిత్తమును నశింపజేయుటయందు సమర్థుడవై ఉండు. చిత్తము జయించబడిందా, మరు క్షణం అనంతబుద్ధియుక్తము, పరమార్థస్వరూపము అగు బ్రహ్మము నీకంటే వేరైనది కాదని నీవే గ్రహించగలవు.

ఇక ఆపై 'జీవుడు' అనబడే అప్రతిష్ఠ నీయందు ఆపాదించబడజాలదు. ఎందుకంటే, 'అజ్ఞానము' తప్ప, జీవుడు అనబడేవాడు వేరుగా ఎక్కడా లేదు.

ఎప్పుడైతే నిన్ను నీవు సర్వాత్మకమగు నిష్కళంక పరబ్రహ్మముగా దర్శించుచూ ఉంటావో, అప్పుడు అట్టి జ్ఞానయోగమును ప్రదర్శించుచున్న నీకు ఋషులమగు మేము కూడా నమస్కరిస్తూ ఉంటాము.

అట్టి పరబ్రహ్మస్వరూపుడవగు నీవు ఈ జగత్తుకు వందనీయుడవగుచున్నావు.

❖❖❖

# 11. శుక్రుని పునరుజ్జీవనము

ఓ రామచంద్రా! ఇక మనం ప్రస్తుత కథావ్యవహారానికి వద్దాం.

ఆ విధంగా శుక్రాచార్యుడు తన ఇతఃపూర్వపు దేహమును చూచి కొంత వేదన పొందాడు కదా! ఆ ప్రక్కనే ఉన్న కాలభగవానుడు శుక్రుని విలాపమంతా విన్నాడు. అతనికి శుక్రుని వాక్యము లలో కొంత అయోగ్యత కనిపించింది. సుజ్ఞానయుతులగువారు, ఆశ్రితులయందలి అజ్ఞానము తొలగించుటయే కర్తవ్యముగా కలిగియుంటారు కదా! అందుచేత ఆ కాలుడు మేఘ-గంభీర స్వరముతో ఇట్లు పలుకసాగాడు.

**కాలుడు :** ఓ శుక్రుడా! తెలుసుకొనవలసినదంతా తెలుసుకొనినవాడా, ఈ శరీరమును చూచి ఇట్లు పరవశుడగుచున్నావేమిటి? అజ్ఞానముచే జనించుచున్న సర్వవేదనలను నిశ్చింతగా త్యజించివేయి. ఒక రాజు ఒక నగరం త్యజించి మరొక నగరం ప్రవేశిస్తాడు చూచావా? ఆ రీతిగా, నీవు ఈ తాపసుని శరీరం త్యజించు. భృగువు కుమారునిగా ప్రసిద్ధికెక్కిన ఈ శుక్రదేహమున ప్రవేశించు. నాయనా! ఈ సృష్టినంతటినీ పరిపాలించుచున్నట్టి 'నియతి'ని అనుసరించి నీవు ముందుముందు అనేక కార్యక్రమములు నిర్వర్తించవలసియున్నది.

'ప్రారబ్ధము' యొక్క ఉద్బోధను అనుసరించి ఈ శరీరముతో కూడి, ముందుగా గొప్ప తపస్సు ఆచరిస్తావు. ఆ తరువాత దైత్యులకు కులగురుత్వము నిర్వర్తిస్తావు.

మహాకల్పాంతమువరకు రాక్షసులకు గురువుగా స్వధర్మము నిర్వర్తిస్తూ ఉంటావు. ఆ తరువాత 'దేహత్వము' అనబడుదానిని త్యజించివేసి విదేహముక్తుడవు అవుతావు. ఈ శరీరమును ఆ సమయంలో స్వయముగా ఎండిన పూలమాలను త్యజించినట్లు, త్యజించివేయగలవు. ప్రారబ్ధ కర్మ యొక్క ఫలితమైన ఈ దేహముతో బలి, హిరణ్యకశిపుడు మొదలైన గొప్ప రాక్షసరాజులకు గురుత్వము వహించి తద్వారా లోకములకు పూజనీయుడవు అవుతావు.

ఓ భృగు-శుక్రాచార్యులారా! మీ ఇద్దరికి శుభమగు గాక! ఇప్పుడు నేను నా అభిమతమై యున్నట్టి ఆత్మస్థానమునకు పోవుచున్నాను. అట్టి స్వయం నివృత్తి స్వరూపమగు 'ఆత్మస్థితి'యే పరమ ప్రేమ స్వరూపము కదా!

**భృగుమహర్షి :** పరమేశ్వరా! కాలదేవా! ఈ రోజు మాకు సుదినం. సుహృద్భావ ప్రసంగముచే మీరు అనేక విషయములు విశదపరచారు. మీకు మేమిద్దరం కృతజ్ఞులం. చిత్తముచే

పరిమితత్వము పొందుచున్న మేము మాయచే ప్రభావితులమై, సంసారదృష్టి కలిగియుండటం, మిమ్ములను దూషించబోవటం చేసినందుకు క్షమించ ప్రార్థిస్తున్నాను.

**కాలుడు :** చివరగా ఒక ముఖ్యమైన విషయం చెప్పుచున్నాను. వినండి-

పరమాత్మయందు "ఇది అభిమతము", "ఇది అభిమతము కాదు" అను రూపము గల ఒక వికల్పము ఏర్పడుచున్నది. అప్పుడు అభిమతమగుచున్నదానిని గ్రహించటం, అభిమతం కాని దానిని త్యజించటం ఆ పరమాత్మయే స్వయముగా నిర్వర్తిస్తున్నాడు. అట్టి నిర్వహణయే చిత్తము యొక్క రూపము సుమా! అట్టి ప్రియము అనబడు చిత్తత్వమును ఆత్మయందు లయింపజేసి అఖండభావన యందు నిశ్చలత్వము వహించి ఉండువారు ధన్యులు. అందుచేత గురువులు ఆ చిత్త చికిత్సను దృష్టిలో పెట్టుకొని బోధిస్తూ ఉంటారు. మీరు కూడా లోకశుభం కొరకు గురువులై ప్రకాశించెదరు గాక! మీకు సర్వదా శుభమగుగాక!

కాలదేవుడు ఇట్లు పలుకుచుండగా వారిరువురు కాలదేవునితో ఏర్పడిన స్నేహాధిక్యతచేత కంటతడిపెట్టారు. భూమ్యాకాశములు రక్తవర్ణంలో తప్తమై ఉంటూ ఉండగానే సూర్యుడు తన కిరణజాలములతో సహా అస్తమిస్తాడు చూచావా? సముద్రంలో పెద్ద కెరటం లేచి, చూస్తూ ఉండగానే జలంలో లయించుతుంది చూచావా! అదేవిధంగా ఆ కాలభగవానుడు అంతర్ధాన మైనాడు. అప్పుడు శుక్రుడు కించిత్ ఆశ్చర్యపడుతూ, కాలదేవునికి చేతులతోను, హృదయము తోను, కళ్ళతోను నమస్కారం పూర్తి చేసి శుక్రదేహము ఉన్నవైపు తలత్రిప్పాడు. ఆవశ్యం ఆచరించ వలసియున్న భావికర్మలగతిని, 'ఈశ్వరేచ్ఛ' యొక్క అనివార్యత్వమును గమనించి కొన్ని క్షణాలు 'యోచన' గడిపాడు. తాను తపోధ్యానాదులచే సంపాదించియున్న యోగబలం చేత 'వేదన' అను దానిని పూర్తిగా త్యజించి, చిరునవ్వుతో చుట్టూ కలియజూచాడు. తండ్రియొక్క అనుజ్ఞను ఆశీర్వాదమును స్వీకరించి ఒక చోట స్థిరాసనం స్వీకరించాడు.

'వాసుదేవుడు' అనే పేరుతో పిలువబడే 'సమంగానదీతీర-తాపసి'కి సంబంధించిన మననము అధిగమించాడు. మెల్లగా కనులు మూసుకొని యోగ - సమాధులను అవధరించాడు.

వాసుదేవ శరీరం చైతన్యముచే త్యజించబడుటచే నీలవర్ణము పొందింది. క్షణాలలో నిర్జీవమై నేలకూలింది. వనంలో వసంత ఋతువు ప్రవేశించునట్లు శుక్రుని చైతన్యసత్త శుక్రదేహములో ప్రవేశించింది.

తన పుత్రుడు శుక్ర-దేహంలో జీవుడు ప్రవేశించగానే మహామునియగు భృగువు తన కమండలములోని జలమును మంత్రసహితంగా ఆ శరీరముపై సంప్రోక్షం చేశాడు. మరుక్షణం ఆ దేహం వికాసం పొందనారంభించింది. వెంట్రుకలు, గోళ్ళ క్రమంగా చైతన్యవంతం కాసాగాయి. ప్రాణవాయువు శరీరమంతా ప్రవహించసాగింది. జల-వాయుసంయోగంచే సముద్రం పొంగినట్లు శుక్రాచార్యుడు లేచి నిలబడ్డాడు. ఉల్లాసము పొందినవాడై నామ-గోత్ర -కీర్తన పూర్వకంగా పరమపవిత్రుడగు తన జనకునికి సాష్టాంగ నమస్కారము చేశాడు.

ఇతఃపూర్వంలాగానే 'సౌందర్యం' 'అలంకారము'లతో శోభిస్తున్న తన కుమారుని శరీరమును భృగువు ప్రేమగా చూచి, స్నేహపూర్వకంగా ఆలింగనం చేసుకున్నాడు. మరల ఒక్కసారి పుత్రుని చూచి జ్ఞానయోగ దృష్టిచే, తన అంతరంగంలో, "ఆహాఁ! ఇదే కదా, 'నాకు చెందిన దేహము' అను భావనచే భ్రమలో పడ్డాను!" అనుకున్నాడు. తత్త్వదృష్టిచే ఈ భావన ఉచితం కాదని అతనికి తెలిసియుండుటచే అతని పెదవులు చిరునవ్వు వీడలేదు.

**శ్రీరాముడు :** "ఇతడు నా పుత్రుడు" అను స్నేహపూర్వకభావం భృగుని చిత్తము కొంచెము ఆక్రమించుకునే ఉన్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును మరి. శరీరం ఉన్నంత వరకు ప్రారబ్ధవేగము చేత ఆ శరీరం పట్ల మమత్వము ఉదయిస్తూనే ఉంటుంది. ఇది దేహధర్మమే అయి వున్నది. అయితే, జ్ఞానులు అన్ని పరిస్థితులలోనూ సమగ్రమైన అవగాహనను ఏమాత్రం వదలరు. అందుచేత 'మమత్వము' అను దాని యందు తాదాత్మ్యము చెందరు. అనగా, 'నేను ఆత్మయే స్వరూపముగా కలవాడను. ఇదంతా ఆత్మ యొక్క విన్యాసమే...!" అను రూపంలో ఉండే ఆత్మతోటి అనుసంధానము కోల్పోరు. ఇక అజ్ఞానులలో, ఈ సంబంధములే సత్యములని, సర్వస్వమని భావించి వీటితో స్నేహ-ద్వేష భావములను మరల మరల పొందుచూ ఉంటారు. ఫలితం? ఆత్మస్థితికి అత్యంత దూరంలో విన్యాసాలు చేస్తూ, కుంటికులాసాలు ఉంటారు.

ఇప్పుడు ఆ తండ్రీ - కొడుకులిద్దరు ఒకరి వలన మరొకరు శోభను పొందారు. చిరకాలపు వియోగం చేత దంపతులు ఒకరిపట్ల మరొకరు అత్యంత స్నేహబద్ధులై ఉంటారు చూచావా! అట్లా వారి సమాగమము అత్యంత ప్రీతి గొల్పుచుండేది. వారు ఒకరి కోసం మరొకరు ఎంతగానో తపించి ఉన్నారు కదా! అందుచేత కొద్దిసేపు ఆనందప్రవాహంలో జడీభూతులైనారు. అక్కడి నుండి లేచారు. అక్కడి వాసుదేవ శరీరమును భస్మీభూతం చేశారు. మంత్రపూర్వకంగా 'విధి'ని నిర్వర్తించారు. సజ్జనులు వారికి నిర్ణయించబడిన సదాచారములను త్యజించరు సుమా!

ఆ తరువాత వారిద్దరు ఆ మందరపర్వతంపై ప్రశాంతంగా తపస్సు చేసుకుంటూ, ఆకాశంలో సూర్య చంద్రుల వలె ప్రకాశించారు. ఎరుగవలసిన బ్రహ్మవస్తువును "అనుభవము, అనుభూతి" రూపంగా గ్రహించారు. జీవన్ముక్తులు, జగద్గురువులు అయినట్టి ఆ ఇద్దరు మహాత్ములూ అక్కడ చాలా కాలం విహరిస్తూ ఉండేవారు. దేశ-కాలములచే అందించబడే హర్ష-విషాదములు వారిని తాకలేకపోయేవి. ఆత్మ-స్వరూపమున స్థితి పొందినవారికి హర్ష విషాదములు, శుభాశుభములు, కలిమిలేములు స్వల్పవిషయములుగానే కనబడతాయి కదా!

కొంతకాలానికి శుక్రాచార్యునికి అసురగురుత్వము, గ్రహాధికారము లభించాయి. భృగువు తనకు యోగ్యమైనట్టి నిరామయమగు 'ప్రజాపతిదినము' నందు సుస్థిరుడై ఉన్నారు.

❖

చూచావా రామా! ఆ శుక్రాచార్యుడు మొట్టమొదట పరమపదమగు పరమాత్మ యందు సుస్థిరుడై ఉండేవాడు. ప్రశాంతంగా తండ్రి సేవలో కాలం గడుపుతూ ఉండేవాడు. ఆ తరువాత తన "స్మృతి పథము" నందు ఆరూఢమైయున్న అప్సరస కొరకై మనోరాజ్య విభ్రమము పొందాడు. దశదిశల పరిభ్రమించాడు. మరల కాలభగవానుని యొక్క భృగుమహర్షి యొక్క, కటాక్షముచే స్వస్థమగు 'ఆత్మ స్థితి'ని పొంది ప్రకాశించాడు.

❖❖❖❖

# III. భృగు - యమ సంవాదము - తదనంతర చర్చ

## 1. చిత్తము - ప్రాప్తాప్రాప్తములు

**శ్రీరాముడు :** మునీంద్రా! భృగుని కుమారుడైన ఆ శుక్రునికి తన యొక్క మనోరథ ప్రతిభ (force of his own wish) చేతనే స్వర్గలోక సంచారం, దేవకన్యతో సాంగత్యం మొదలైనవి ప్రాప్తించాయి కదా! ఈ విషయంలో నాదొక సందేహం. ఈ జీవులలో ఎందరో ఏవేవో మనోరథములు కలిగి ఉంటున్నారు కదా! మరి, అనేకుల యొక్క "నేను ఇది పొందుతాను. ఇవి చేస్తాను" అను ప్రతిభ సఫలం ఎందుకు అగుటలేదు?" "నేనిప్పుడు స్వర్గము చేరి సర్వ సుఖములు అనుభవించెదను గాక" అని సంకల్పించగానే ఎవ్వరికైనా అట్లే ప్రాప్తించాలి కదా? ప్రాప్తించుటలేదేం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏదైనా ప్రాప్తించాలంటే భావనయొక్క పరిశుద్ధత, ఏకాగ్రత అవసరం. శుక్రాచార్యుడు తాను పొందాలని కోరుకొన్నది తన మనోరాజ్యంలో సఫలమై పొందటానికి కారణం ఇతఃపూర్వపు కల్పమునందలి అతని ప్రయత్నాదుల ఔన్నత్యమే. పూర్వ కల్పమునందలి అతని అంతిమ జన్మయందు గొప్ప ఉపాసనాదులచే ఏకాగ్రతను, లక్ష్యశుద్ధిని, సాధించటంలో ప్రావీణ్యతను అలవరచుకుని ఉన్నాడు. ఉత్తమ సంస్కారములు, ఆత్మతో తాదాత్మ్యము కొరకై ఆశయము పొంది ఉన్నాడు. అందుకు ఫలితంగానే 'బ్రహ్మఋషి'కి పుత్రుడై కళంకరహితమైన జన్మను పొందాడు. ఈ కల్పము యొక్క ప్రారంభంలో సత్యాత్మ యొక్క భావనను పొందుటకు అర్హమైన "మానవ-మునికుమార-విద్య-సమృద్ధి"లతో కూడిన జన్మను సంపాదించాడు.

**శ్రీరాముడు :** తండ్రీ! 'సత్యాత్మ భావన' అనగా ఏమిటో... మరికొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సర్వకోర్కెలు నశించినప్పుడు అట్టి స్థితిలో శేషించే చిత్తము యొక్క స్థితియే 'సత్యాత్మభావన' అను పేరుతో చెప్పబడుతోంది. దానినే "నిర్మల చిత్స్వరూపము" అని కూడా పిలుస్తూ ఉంటారు. ఎప్పుడైతే ఈ చిత్తము నిర్మలము, సత్యాత్మ స్వరూపము అవుతుందో - అట్టి చిత్తము ఎల్లా భావన చేస్తుందో అది ఆ విధంగానే శీఘ్రంగా అవుతూ ఉంటుంది.

శుక్రుని చిత్తములో ఒక చమత్కారమైన విభ్రమము ఏర్పడినట్లు మనం కథలో చెప్పుకున్నాం కదా! ఏ విధంగా స్వయంగానే అతని చిత్తమునందు విభ్రమము ఉత్పన్నమైనదో, అదే విధంగా ప్రతి జీవునియందు చిత్త విభ్రమము ఉత్పన్నమౌతోంది. 'ఆత్మస్వరూపభావన' నుండి చ్యుతి పొంది బాహ్యదృష్టిని ఆశ్రయించి చైతన్య సత్తయే శాస్త్రకారులచే 'జీవుడు' అనే పేరుతో పిలువబడుతోంది. ఒక విత్తనమే - అంకురము, కాండము, ఆకులు, కాయలు, కొమ్మలు - మొదలైన రూపములుగా అగుచున్నది. అలాగే, సమస్త ప్రాణుల యొక్క "స్వయం కల్పిత భ్రాంతి"యే ఈ ద్వైతవిభాగమును ఏర్పరచుచున్నది. అది స్వస్వరూపవిస్తారం అయి, ఇట్లు, తనను తానే ప్రకటించుకొనుచున్నది.

ఈ ఎదురుగా ఉండి, 'ప్రపంచము' అని చెప్పబడుచున్న దృశ్యవ్యవహారమంతా ప్రతి జీవుని చిత్తము నందు మిథ్యారూపముగా ఉదయిస్తోంది. మిథ్యారూపముగా ఉనికిని కొనసాగిస్తూ... ఎప్పుడో మిథ్యారూపముగానే లయం పొందుచున్నది.

కాని, యథార్థానికి ఈ జగత్తు ఉత్పన్నమగుట లేదు, నశించుటలేదు. మాయచే ఉన్మత్త స్త్రీలాగా ఈ జగత్తు రూపంగా తనయొక్క ప్రభావమును ప్రకటించుచున్నది.

**నాస్తమేతినచోదేతి జగత్కించన కస్యచిత్ ।**
**భ్రాంతి మాత్రమిదం మాయా ముగ్ధేవ పరిజృంభతే ॥** (సర్గ 17, శ్లో. 8.)

ఇప్పుడు మన అనుభవములలో వేరువేరు విధములుగా ఈ జగత్తు ప్రత్యక్షమై ఉంటోంది. అనగా, ఒక ముని అయినట్టి నాకు ఒక రీతిగా, ఒక రాజు అయినట్టి నీకు మరొక రీతిగా స్వయంకృతమైన కార్యక్రమాలను అనుసరించి ప్రాప్తిస్తోంది కదా!

అట్లాగే తక్కిన జీవులకు కూడా మిథ్యారూపములైన వేరు వేరు జగత్తులు ప్రత్యక్షముగా కనిపించుచున్నాయి. వేరు వేరు విషయములు వేరు వేరుగా "ఇది దుఃఖకరము, ఇది సుఖకరము, ఇది అవశ్యము, ఇది అసంగతము, ఇది సవ్యము, ఇది అపసవ్యము".... అని నిర్వచించబడి దర్శించబడుచున్నాయి. అయితే ఒకనికి కనబడే 'జగద్భ్రమ' యొక్క రీతి మరొకరికి కనిపించుట లేదు. ఎవరి భ్రమ, సుఖ-దుఃఖములు, భావాభావములు - వారివే అగుచున్నాయి. ఒకడు తన స్వప్నంలోనో, సంకల్పనగరంలోనో చూచుచున్న వ్యవహారం ప్రక్కనేవున్న మరొకనికి కనిపిస్తోందా? లేదు కదా! అదే విధంగా ఒక జీవుని యొక్క భ్రమతో కూడిన "జగద్దర్శనము" మరొక జీవునికి అట్లుగాక వేరొక విధంగా ఉంటోంది. "సంకల్పము" అనబడే బహువిస్తీర్ణమైన ప్రదేశంలో 'జగద్రూపములు' అనే అసంఖ్యాకములైన నగర సమూహములు ఏర్పడుచున్నాయి. "ఇవన్నీ మిథ్యయే" అనే అవగాహన ఒక్క జ్ఞానదృష్టి కలవానికి మాత్రమే నిర్దుష్టముగా ఏర్పడుచున్నది. మాయచే ఆశ్రయించబడిన జీవుడు "ఇదంతా వాస్తవమే" అను రూపం గల భ్రాంతిని పొందుచూ, అనుభవించుచున్నాడు. ఒక్క మానవులే కాదు. దేవత-రాక్షస జీవులు, పిశాచ-యక్ష జీవులు కూడా ఈ విధంగానే ఉంటున్నారు.

అంతే కాదు. మనమందరం కూడా శుక్రుని లాగానే సంకల్పమాత్ర శరీరులమే! 'మిథ్య' అయిన దానిని సత్యముగా తలచుచు ఇట్లు ఉత్పన్నమైనాము.

ఈ వ్యష్టియే కాదు. వ్యష్టి (Individual) కి పరమైనట్టి సమష్టి సృష్టి అహంకారియగు హిరణ్యగర్భ రూపుడు' కూడా 'ఈ జగత్ సృష్టి పరంపరలు' ఈ విధంగానే మిథ్యారూపంగా పొందటం జరుగుతోంది. ఈ అనేక ఉపాధి - వస్తు జాలముల నిర్మాణము వెనుక ఏర్పడి ఉన్న ఇచ్ఛాశక్తియే హిరణ్యగర్భుని ప్రదర్శన.

వాస్తవానికి ఈ వ్యష్టి-సమష్టి జీవులిరువురు ఆత్మస్వరూపులే అయివున్నారు. 'అవస్తువు' అయినట్టి ఆత్మ యందు "జగత్తు-శరీరము" మొదలైన వస్తుత్వమంతా ఎట్లా ఉంటుంది? ఎట్లా

ప్రవేశిస్తుంది? ఎక్కడినుండి ప్రవేశిస్తుంది? లేదు. కనుక శరీరాదుల రూపంలో స్ఫురించేదంతా మిథ్యయే అయివున్నది.

ప్రతి చిత్తము నందు మిథ్యారూపమగు జగత్తు ఉంటూనే ఉన్నది. "ఆత్మచే ఆత్మయందు ప్రథమ సంకల్పము" ఏర్పడుచున్నది. అట్టి ప్రథమ సంకల్పం 'ఆత్మయందు ఈశ్వరత్వము' అని శాస్త్రాలచే (వేదాలచే) చెప్పబడుతోంది. సంకల్పము చేతనే ఈ జగత్తు వ్యవస్థితి పొందియున్నది. తత్త్వజ్ఞానము పొందుటచే ఈ జగద్రూపస్థితి ఏ విధంగా ఏర్పడినదో తప్పక గ్రహించబడగలదు. ఉత్తమ ప్రయత్నము, అవగాహనలను ఆశ్రయించుచున్నవారు, "అనాదియగు అజ్ఞానమునందు స్థితిపొంది యున్న ఈ చిత్తమే అనేక విధములుగా కార్యయుక్తమగుచున్నది" అని జ్ఞానులు ఎఱుగుచున్నారు. అట్లు ఏర్పడు 'ఎఱుక' యొక్క ప్రభావంచే ఈ చిత్తము తనంతట తానే నశించుచున్నది.

❖❖❖

# 2. సత్యవస్తు విచారణ

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీటి కదలికలను అనుసరించి నీటిలో ప్రతిబింబిస్తున్న సూర్య బింబము పైకి-క్రిందికి కదులుచున్నట్లు అనిపిస్తూ ఉంటుంది. నీటిలోని సూర్యుని చూడటం మానేసి, ఆకాశంలోని సూర్యుని చూచామనుకో... అప్పుడు నిశ్చల స్వభావుడగు సూర్యుడు కనబడతాడు. కదులుచున్న మేఘాలతో కలిపి చంద్రబింబమును చూస్తూ ఉంటే, చంద్రబింబం మేఘకదలికలను అనుసరిస్తూ ఉన్నట్లుంటుంది. మేఘాలు మన 'దృష్టి'ని ఆకర్షించకపోతే అప్పుడు నిశ్చల చంద్రుడు అగుపిస్తాడు. అదేవిధంగా 'ప్రతిభాస' (reflective) అనబడు ద్వితీయ విశేషముతో కూడిన అవగాహనాదులు ఉన్నపుడు మాత్రమే 'జగత్తు' అనబడేది అనుభవమవటం జరుగుతోంది. సత్య వస్తువగు బ్రహ్మము సాక్షాత్కరించిన తరువాత ఇక 'జగత్తు' అనేది ఉండదు. ఒక ఏనుగు కట్టుకంబమునకు కట్టివేయబడుతూ ఉంటుంది కదా! అట్లాగే 'చిత్తము' అనబడే ఏనుగుకు ఈ జగత్తే కట్టుకంబము సుమా!

చిత్తము యొక్క ఉనికియే జగత్తు. జగత్తు యొక్క ఉనికియే చిత్తము.

చిత్తమును అనుసరించే జగత్తు ఉంటుంది. చిత్తము లేని చోట జగత్తు కూడా లేదు.

చిత్తము – జగత్తులలో ఒకటి నశిస్తే, రెండవది కూడా తనంతట తానే నశించుచున్నదని గ్రహించు. అయితే అట్టి ఈ "జగత్తు యొక్క లేదా, చిత్తము యొక్క"... నాశనము 'సత్యవస్తువును గురించిన విచారణ" చేత మాత్రమే సాధ్యం.

**చిత్సత్తైవ జగత్సత్తా జగత్సత్తైవ చిత్తకమ్**
**ఏకాభావాద్ద్వయోర్నాశః స చ సత్యవిచారణాత్** (సర్గ 17 శ్లో.19)

మట్టిచే దోషయుక్తంగా ఉన్న మణిని శుభ్రమైన నీటిలో కడిగినప్పుడు ప్రకాశవంతంగా స్వచ్ఛంగా కనబడుతుంది కదా! ఈ చిత్తములోని దోషములు రహితం చేయబడినప్పుడు, అట్టి శుద్ధ చిత్తమే పరమాత్మ యొక్క స్వరూపము! లేక అదియే పరమాత్మ! అదియే సత్యస్వరూపము!

**శుద్ధ చిత్తం, విశేషములు -** శుద్ధ చిత్తం తన యందు దేనిని ప్రతిభాసింప చేసుకుంటుందో, అది 'సత్యమే' అయి ప్రాప్తిస్తుంది. అనగా, శుద్ధచిత్తము దేనిని స్వయముగా ఎట్లా సంకల్పించటం జరుగుతుందో, అది అట్లే సత్యమైన అనుభవంగా రూపము పొందుతోంది. శుద్ధ చిత్తము యొక్క ఏకాగ్రత స్వల్ప సమయంలో సఫలం అవుతుంది.

"చిత్తము శుద్ధ పరచుట" అనునది ఒక్కటే ఈ జన్మల – కర్మల యొక్క ఉత్తమోత్తమమైన ఆశయము. ఇక తదితరములన్నీ తత్సంబంధమైన – తదుచితమైన ఆశయములు మాత్రమే.

అయితే, ఈ చిత్తం శుద్ధం కావాలంటే ఏమి చేయాలి? చిరకాలంగా ఏకాగ్రత అభ్యసించుటే అందుకు మార్గం. నీరు నిశ్చలంగా ఉన్నప్పుడే ఆకాశములోని ఆయా విశేషములు తటాకంలో స్పష్టంగా ప్రతిబింబిస్తాయి కదా! అదే విధంగా, ఈ చిత్తము వివిధ సంకల్పములచే కలుషితం అవకపోతే, అద్దానియందు అత్యంత సులభంగా అద్వైత రూపముతో కూడిన ఆత్మ జ్ఞానము, ఆత్మ విజ్ఞానము ప్రతిభాసిస్తాయి.

**చిరమేక దృఢాభ్యాసా చ్ఛుద్ధిర్భవతి చేతసః ।**
**అనాక్రాన్తస్య సంకల్పైః ప్రతిభోదేత చేతసః ॥** (సర్గ 17, శ్లో. 21)

మలిన వస్త్రమునకు రంగు వేస్తే నిలుస్తుందా? లేదు కదా! అదే విధంగా అనేక జగద్విషయములకు సంబంధించిన భావావేశ వృత్తులు తనయందు చంచలశీలంగా కలిగియున్న చిత్తములో అద్వైతతత్త్వ ప్రతిపాదికమగు ఆత్మజ్ఞానము నిలకడ పొందకుండానే పోతుంది.

ఈ సాంసారిక జీవుడు "ఇప్పుడు నేను స్వర్గం పొందాలి, విష్ణు లోకం పొందాలి", మొదలైన భావనలు చేస్తున్నప్పటికీ అతడు శుక్రాచార్యునివలె వాటిని సత్యమై పొందలేకపోతున్నాడు. దానికి కారణం, అతడు తదితరములైన (వేరైన) అనేక సంకల్పములు కూడా కలిగి ఉండటమే. అందుచేత ఈ జీవుని యందు ఏకాగ్రత కొరవడుతోంది. అసంఖ్యాకములైన అనేక సంకల్పములు ఒక్కసారే చిత్తములో కాపురం ఉండి ఉండటం చేత అతనికి "నేను స్వర్గము చేరెదను" అనే సంకల్పం వాస్తవత్వం పొందకముందే మరొక సంకల్పమేదో వచ్చి మొదటి సంకల్పమును త్రోసివేస్తోంది. శుక్రాచార్యుని చిత్తమునందు "అనేక విశేషములు" లేక "అనేక జగత్తులు" అను రూపముగల వేరు వేరు సంకల్పములు లేవు. ఏకైక సంకల్ప నిష్ఠుడై "నేను ఇప్పుడు స్వర్గము చేరుచున్నాను... ఇంద్ర సభలో ప్రవేశించాను... ఇంద్ర భగవానునితో సంభాషించుచున్నాను..." ఇట్లు భావన చేశాడు. ఏకాగ్రత యొక్క ప్రభావంచేత అవన్నీ సత్యంగానే పొందాడు. అందుచేతనే అతడు స్వర్గము చేరుట, దేవతా స్త్రీతో విహారము చేయుట... ఇవన్నీ వాస్తవత్వము పొందాయి.

ఈ ప్రపంచంలో ఎవరైనా ఏదైనా విశేషము కలిగియున్నారంటే, అట్టి విశేషము వెనుక ఏకాగ్రతయే దాగి ఉండి ఉంటుంది సుమా!

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు చెప్పినదానిని బట్టి ఆ శుక్రుడు తన యొక్క కల్పనా జగత్తులో ప్రవేశించి, అందులో ఇంద్రుడు, దేవతాస్త్రీ, ఆయా ఉపాధులు మొదలైనవి పొందాడని నేను

గ్రహిస్తున్నాను. అయితే, నా సందేహమేమంటే, ఆ శుక్రుని చిత్తములోని కల్పనాత్మకమైన జగత్తులో ఈ సూర్యుడు, చంద్రుడు – ఉదయాస్తమయములు మొదలైన కాలక్రమమంతా ఎట్లా ఏర్పడింది? అతని చిత్తమునందు ప్రతిభాస అనునది ఏర్పడేటప్పుడు ఈ ఉదయాస్తమయములు మొదలైనవి గ్రహించబడవు కదా! అతనికి అనేక విశేషములతో కూడిన జగత్తులు ఎట్లా లభించాయి? ఆ జగత్తులకు కర్తలు ఎవరు? అవన్నీ అట్లా ఎందుకు కల్పించబడ్డాయి? అతనికి కనిపించినదంతా మన ఈ జగత్తు వంటిదేనా?

❖❖❖

## 3. సంస్కారములు - అనుభవములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! శుక్రుడుగాని, నీవు గాని, నేను గాని, మరింకెవరైనా గాని, పురుగు మొదలైన జీవులుగాని... మనమంతా "ఉత్పత్తి, వినాశనము"లతో కూడిన ఈ దృశ్యజగత్తును ఎట్లా చూస్తున్నాం? ఈ ప్రశ్నకు సమాధానం చెపుతాను విను. అది విన్న తరువాత, నీ ప్రశ్నకు సులభంగా సమాధానం వస్తుంది.... ఈ చిత్తం ఏ విధంగా రూపు దిద్దుకుంటోంది?




**1. జ్ఞానేంద్రియశక్తులు -** తల్లితండ్రుల నుండి ఈ జీవుని కొరకై సంక్రమిస్తున్నట్టి ఈ కంటికి కనబడుచున్న 'భౌతికదేహం' నందు "చూచుట–వినుట–ఆఘ్రాణించుట–రుచి–స్పర్శ"... అనబడే 'జ్ఞానేంద్రియశక్తులు' క్రియాశీలకమౌతున్నాయి. ఇవియే ప్రకృతి సంబంధమైన ఉపకరణములు. అట్టి జ్ఞానేంద్రియములతో, ఈ జీవుడు ఆయా విషయములను సమీపిస్తున్నప్పుడు అనుభవములు ఏర్పడుచున్నాయి. అట్టివి కొన్ని ఇష్టమైనవి, మరికొన్ని అయిష్టమైనవి ఇంకొన్ని మిశ్రమమైనవి అగుచున్నాయి. అవి చిత్తము నిర్మించబడు విధమునకు దోహదపడుచున్నాయి.

**2. శ్రేష్ఠులైనట్టి తదితరుల ప్రేరణ -** శ్రేష్ఠులగు ఇతరుల అభిప్రాయములు, అనుభవములు, చింతనలు, పాఠములు, బోధలు, వారి వారి ప్రవర్తన మొ॥నవి ఈ చిత్తము యొక్క రూపమును ప్రభావితం చేస్తూ ఉంటాయి.

**3. శాస్త్రపాఠములు -** గ్రంథాలు, శాస్త్రములు ప్రతిపాదిస్తున్నది పఠిస్తూ ఉన్నప్పుడు, అందలి విశేషములను గ్రహిస్తూ ఉన్నప్పుడు.... అట్టి జీవునియొక్క దృష్టి-అవగాహన-భావన పరిణతి చెందుతూ ఉంటాయి. అవి చిత్తం యొక్క రూపురేఖలలోని మార్పుకు కారణమవుతూ ఉంటాయి.

**4. స్వకీయమైన విశ్లేషణ అవగాహన -** ఈ జీవుని స్వకీయమైన విచారణ, పరిశీలన, అవగాహన, పరిశోధన ఈ చిత్తము యొక్క తదనంతర స్థితి-గతులను నిర్ణయిస్తూ ఉంటాయి.

❖

ఈ నాలుగు విధములైన ప్రయత్నములచేతనే మనమంతా కూడా మన చిత్త సంస్కారాలను సముపార్జిస్తున్నాం. అట్టి మన చిత్తములను అనుసరించి ఈ జగత్తును చూస్తున్నాం. అనుభవిస్తున్నాం, భావిస్తున్నాం. అట్లే శుక్రుని విషయం కూడా. ఒకని చిత్తము అతని యొక్క కర్మ - ఎరుకలను అనుసరించి ఎప్పటికప్పుడు క్రొత్త రూపములను సంతరించుకొంటోంది. ఇక ఆపై అతని యొక్క లౌకిక - పారలౌకిక జగత్తులన్నీ సంస్కార రూపంలో అతని చిత్తము నందే స్థితి పొంది ఉంటున్నాయి.

ఎవరైనా సరే, జీవించియున్నప్పుడు గాని, మరణించినప్పుడు గాని, స్వప్నము నందు గాని, సంకల్పనగరము నందు గాని... తన చిత్తమునందు సంస్కార రూపమున ఉన్నదే అనుభవముగా పొందుచున్నారు. ఎవ్వడూ కూడా, తన చిత్తములో లేనిదేదీ ఏ క్షణంలోనూ ఏమాత్రమూ పొందడు. చిత్తమే అనుభవం.

**బీజము -** దృష్టాంతానికి ఒక బీజాన్ని తీసుకుందాం. గాలి, సూర్యరశ్మి, నేల వంటి సహకారి కారణములు లభించినప్పుడు, ఆ బీజమే 'కాలము-క్రియ'ల క్రమమును అనుసరించి ఒక "మహా వృక్షం"గా పరిణమిస్తోంది. మహావృక్షం యొక్క సంస్కారమంతా ఆ బీజంలో దాగియే ఉంది కదా!

**జీవుడు -** అదే విధంగా, చైతన్యమే తన వాస్తవస్వరూపమైనట్టి ఈ జీవుని యందు "అవిద్య" అనే సంస్కారం ఉన్నది. అట్టి 'అవిద్య' జీవునియందు బీజమువలె ఉంటోంది. ఇక "తల్లిదండ్రుల చేత ప్రసాదించబడిన ఈ పాంచభౌతిక శరీరం, 'శాస్త్ర-పితృ-బోధలు'... ఇవన్నీ ఒనగూడు చున్నప్పుడు ఇవి సహకారి కారణములౌతున్నాయి. "ఈ జగత్తును ఇట్లు దర్శించుట" అనునదే సంసారమహావృక్షముగా పరిణమిస్తోంది. ఓ రాఘవా! ఈ జీవుడు ఇట్లు జగత్తుగా చూస్తున్నదంతా వాస్తవానికి తన చిత్తమునందే, చిత్తము యొక్క మహిమ చేతనేనని గ్రహించు. ఈ జీవుడు ఎట్టి వాసనకు బద్ధుడో, అట్టి వాసనను అనుసరించి తనయందు సర్వమును గాంచుచున్నాడు.

**శ్రీరాముడు :** "నా చిత్తమే ఇట్లు విస్తరించి ఈ జగత్తు యొక్క దర్శనము (perception of this world) గా పరిణమిస్తోంది"... అనే అభిప్రాయం చమత్కారమైన విషయమే.

**శ్రీ వసిష్ఠమహర్షి :** అవును ఇందుకు దృష్టాంతము మనం పొందుచున్న స్వప్నములే. ఒకనికి తన స్వప్నంలో కనబడే శరీరములు భవనములు మొదలైనవన్నీ స్వయం కల్పితములే కదా! మనస్సు యొక్క భావనయే అట్లు పరిణమిస్తోంది. అలాగే, ఈ జగద్దర్శనము కూడా ఒక దీర్ఘమైన స్వప్నము

వంటిది మాత్రమే. మనస్సు యొక్క భావనా పరంపరలే జగద్రూపంగా పరిణమించినవై ఉంటున్నాయి.

**శ్రీరాముడు :** ఈ 'జగత్తు ఎవరికి వారికే వారియొక్క స్వప్నము వంటిది అయినప్పుడు, "ఇది ఈ వస్తువు... ఇది సరియైనది... ఇది సుందరము" **...** వంటి అనేక అనుభవములు అనేకులకు ఒకే తీరుగా ప్రాప్తిస్తున్నాయి కదా! ఇది గోడ అనే విషయం నేనూ, మరొకరు కూడా అనుభవిస్తున్నాం. అదే స్వప్నదృశ్యం విషయానికి వస్తే నేను పొందే స్వప్నము (కల) నా ప్రక్కనే ఉన్నవాడు పొందుట లేదు. అందుచేత "ఇది స్వప్నము వంటిది" అనటం ఎంతవరకూ ఉచితం...?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "అనేకులకు ఒకే తీరుగా కనబడుచున్నది కదా?"... అనునది నీ సందేహమా? సరే, దృష్టాంతము సహాయంతో వివరిస్తాను విను. ఒక చోట కొందరు సైనికులు ఉన్నారు. వారంతా పగలు యుద్ధంలో పాల్గొన్నారు. రాత్రి అయినది. వారంతా నిదురిస్తున్నారు. వారందరు తెల్లవారి తాము యుద్ధము చేయవలసియున్న శత్రు సైన్యము గురించి కలలు కంటున్నారు. ఇప్పుడు చెప్పు.... వారంతా, తమ స్వప్నములో చూచినది ఒకే శత్రుసైన్యం కదా!

వారు ఒక్కొక్కరుగా తలుస్తున్నది ఒకే శత్రుసైన్యం గురించి ఐనప్పటికీ, వారంతా వారి వారి ధైర్య – స్థైర్యములను, భావన, రాజభక్తి, బంధువులకు సంబంధించిన మమకారములు మొదలైన ఆయా విషయాలను అనుసరించి అనేక రీతులుగా ఆయా స్వప్న సంఘటనలు పొందుచున్నారు. ఈ జగత్తు విషయం కూడా అంతే. అవిద్యచేత ప్రతి జీవుడు కూడా "ద్వైతవిభాగం" అను రూపం గల తన స్వప్నంలో ఈ 'జగత్తు' అనబడు దృశ్యమును గాంచుచున్నాడు. ఈ దృశ్యమానం అయ్యేదంతా వాస్తవానికి ఒక్కొక్క జీవునికి, అతని వాసనలను అనుసరించి ఒక్కొక్క రకంగా సంప్రాప్తిస్తోంది. కాని అతడు "నాకిదంతా ఎట్లా కనబడుతుందో అందరికీ అట్లే కనబడుతోంది" అని మాత్రం భావన చేస్తున్నాడు. "నాకు ఏదేది కనబడుటలేదో, మిగతావారికీ అట్లాగే కనబడుట లేదు" అను భ్రమ ఏర్పడటం జరుగుతోంది. ఒకవేళ అందరికీ ఒకే తీరుగా కనబడటం జరుగు తుంటే, అప్పుడు ఇన్ని భావావేశాలు – అభిప్రాయభేదాలు, ఇన్ని రకాల దృష్టులు, అవగాహనలు ఎందుకు ఉంటున్నాయి చెప్పు? జనులలో ఏర్పడే స్పర్థలకు కారణం వేఱు-వేఱు దృష్టులే కదా!

అందుచేత, మనం ఈ "ద్రష్ట-దృశ్యత్వము" అను వ్యవహారమంతా సునిశితంగా పరిశీలించటం జరిగితే మనకు ఇట్లు తెలియవస్తోంది.... "ప్రతిజీవుడు తన చిత్తము నందే ఆ చిత్త సంస్కారములను అనుసరించి, ఒక స్వప్న వ్యవహారంలాగా ఈ జగత్తును తన రీతిలో గాంచుచున్నాడు."

అదియే 'జగత్తు' అనబడు పేరుతో విరాజిల్లుతోంది సుమా! కనుక, "జగత్తు ఎక్కడి నుండి బయల్వెడలుతోంది?" అనునది సముచితమైన సమాధానమే!

❖❖❖

# 4. పరస్పరం

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ 'జగత్తు' అనబడునది ఎవరికి వారికే తమ యొక్క స్వప్నం వలె భావనానుసారం ఏర్పడుట, ప్రాప్తించుట జరగుతోంది కదా! ఈ జగత్తులు ఆయా జీవులు పరస్పరం కలిసియే ఉంటున్నాయా? విడివిడిగా ఉంటున్నాయా? ఈ విషయం నాకు వివరించి చెప్పండి. "నా చిత్తము నందు నేను చూచు జగత్తు - మీ చిత్తమునందు మీరు చూచుచున్న జగత్తు" వేరువేరా? అట్లా అయితే ఒకరి భావాలతో, అనుభవములతో మరొకరికి సమన్వయం ఎట్లా ఏర్పడుతోంది?

శిష్యులను సముద్ధరించాలనే ఉద్దేశంతో గురువులు "దీనిని ఇట్లా ఆచరించండి" అనే రూపం గల 'ప్రవృత్తి'ని సూచించే శాస్త్ర విషయాలు రచిస్తున్నారు కదా! అట్టి శాస్త్ర విషయాలు శిష్యులపై ప్రభావం చూపుతున్నాయి. మరి ఎందుకు చూపుచున్నాయి? మీరు చెప్పుచున్నట్లు " ఈ జగత్తు - దర్శించే ద్రష్ట యొక్క స్వప్నము మాత్రమే"... అనునదే వాస్తవమైతే, మరి ఒక గురువు యొక్క "స్వప్న విషయమాత్రములే" అయినట్టి అతని శాస్త్రావలోకనం, శాస్త్ర ప్రవచనం అతని శిష్యుని (స్వప్నజగత్తు అనదగ్గ) జాగ్రత్‌లో ఎట్లా ప్రవేశించి, ప్రభావితమౌతున్నాయి? జగత్తు స్వచిత్త మందలి ప్రకటనమే అయినప్పుడు గురువు చెప్పటమేమిటి? శిష్యుడు విని ఉద్ధరించబడట మేమిటి? మీరు చెప్పే "స్వప్న దర్శనం" అను సిద్ధాంతం ప్రకారం గురువు-శిష్యుల సమ్మేళనం గాని, 'మోక్షం' అనే స్థితి గాని సిద్ధించవు కదా! ఎందుకంటే, "ఒకరి మనస్సు ఇంకొకరి మనస్సుతో కలియటం" అనేది జరుగదు కదా?

నా స్వప్నం - మీ స్వప్నం ఒకదాని కెదురుగా మరొకటి తారసపడుతున్నాయా? లేదే?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మనస్సు రెండు విధాలుగా ఉంటోంది- 1) 'శుద్ధ మనస్సు' ; 2)దృశ్య వ్యవహారాలతో ఇష్ట అయిష్టాలనే సాంసారిక సంబంధం ఏర్పరచుకొని ప్రవర్తిస్తున్న 'మలిన మనస్సు'.

మలిన మనస్సు శుద్ధ మనస్సుతో కలియటం అశక్యమే.

శుద్ధ చిత్తములు పరస్పరం కలుస్తాయి. అట్లాగే, ఒకే విధమైన సాంసారిక దోషము, ఆర్తి పరామర్శగల దోష మనస్సులు పరస్పరం కలుస్తున్నాయి.

ఒకే విధమైన చిత్త సంస్కారదోషము కలిగినవారి యొక్క 'స్వప్నభావన' కాకతాళీయంగా మరికొన్ని మనస్సులందు కూడా ఉండి ఉంటోంది. అనేక మనస్సులు ఒకేవిధమైన 'దోషదృష్టి'తో ఈ జగత్తును చూస్తున్నాయి (లేక) పొందుచున్నాయి. అంటే కొన్ని విషయాలు అనేక మనస్సులకు ఒకే విధంగా అనుభవమౌతున్నాయి. తత్ఫలితంగా "ఈ జగత్తు బాహ్యమున కలదు" అను భావన చైతన్యం నందు రూఢిపడి ఉంటోంది. ఇదియే మాయ యొక్క చమత్కారం. అవాస్తవాన్ని వాస్తవం వలె చూపించుటయే ఇందులోని గమ్మత్తు.

ఏకరూపము గల జలములే కలుస్తున్నాయి.

ఒక శుద్ధ చిత్తమునకు ఏది కనబడుతోందో మరొక సమానమైన శుద్ధ చిత్తమునకు అదే దర్శనమగుచున్నది. ఒక విధమైన దోషముగల చిత్తము దేనిని ఎట్లు గాంచుచున్నదో, అదే విధమైన దోషము ఉన్నట్టి మరొక చిత్తము దానిని అట్లే గాంచుట జరుగుతోంది.

అయితే ఈ జీవులు ఇదంతా ఇలా చూడటం వాటి వాటి వాసనాప్రభావంచేతనే సుమా! వాసనలు క్షయిస్తే, ఈ భూతప్రపంచమునకు అందజాలని 'ఏకరూపతత్వజ్ఞానం' కలుగుతోంది.

విషయ వాసనలు ఉన్నంతవరకు జగత్తు కనబడుతోంది. వాసనలతో కూడుకొని చూడబడుచున్నదంతా స్వప్నతుల్యమే. ఎందుకంటే, వాసనలు మార్పు చెందినప్పుడు, ఇదే జగత్తు వేరొక రీతిగా అనుభవమౌతోంది కదా!

భ్రమాత్మకమైన దృష్టి ఉన్నంత వరకే "అతని అనుభవం, నా అనుభవం" వంటి కల్పిత భావాలన్నీ ఉంటున్నాయి. వాసనలు తొలగినప్పుడు ఈ "నేను–నీవు–జగత్తు" అనేవన్నీ 'స్వస్వరూప జ్ఞానాగ్ని' యందు భస్మీభూతమైపోతున్నాయి. సర్వవిషయాలకు అతీతత్వం నిర్మల మనస్సునకు మాత్రమే సాధ్యమగుచున్నది. అట్టి శుద్ధ చిత్త స్థితియే "చిన్మాత్ర పరిశేషత్వము" (The ultimate essence of absolute self) అను పేరుతో కూడా పిలువబడుతోంది.

అప్పుడీ జీవుడు 'పరమ కైవల్యపదము' అయినట్టి మోక్షమును పొందుచున్నాడు. అనేకంలో అంతర్లీనంగా సర్వదా ఏర్పడియున్నట్టి 'ఏకము – అద్వితీయము'ను దర్శించుచున్నాడు.

❖❖❖

# 5. జీవుడు - ఖండత్వము, అఖండత్వము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ జీవులందరూ కూడా తమ తమ కల్పిత ప్రపంచములందు "స్థూల–సూక్ష్మ–కారణ" శరీరాలతో సంబంధం కలిగి ఉంటున్నారు. వాటితో తాదాత్మ్యం పొందుచున్నారు. ఫలితం? ఆయా జగత్తులన్నీ అనేక భిన్నత్వములతో వారికి ప్రాప్తిస్తున్నాయి. అట్టి భిన్నత్వమంతా 'శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములు'**...** అను తన్మాత్రల యొక్క 'ప్రతిభాస' (Reflection) చేతనే సంభవిస్తోంది. ఈ ప్రతి దేహములోని ఆత్మ వాస్తవానికి సర్వదా స్వయంప్రకాశ స్వరూపము (self luminious)**,** చిదేకరసము (Indivisible consciousness) అయి వున్నది. అట్టి 'నిర్వివాదాంశము – అఖండము' అగు ఆత్మయే ఆయా విధములుగా, భిన్నములుగా కల్పించబడుచున్నది. అయితే ఈ కల్పనా వ్యవహారమంతా వాస్తవము కాదు.

❖

ఒకే చైతన్యము సర్వవ్యాప్తమైయున్నది. సర్వప్రాణులు గాఢనిద్ర నుంచి మేల్కొనగానే ఈ ద్వైత వ్యవహార ప్రవృత్తి పొందుచున్నారు. అయితే, స్వప్నమునందు, జాగ్రతునందు కూడా ఆయా వస్తు జాలమునందు ఏర్పడుచున్న ప్రవృత్తి – నివృత్తులన్నీ... ఏకరసమైన చైతన్యము యొక్క "సర్వ వ్యాప్తి" చేతనే సిద్ధించుచున్నది. "ఏకైక చైతన్యజ్యోతి" వలననే, ప్రవృత్తియందు వ్యవహరిస్తున్నట్టి ఈ జీవులంతా... "ఇది కుండ, ఇది వస్త్రము" అనునట్టి అనుభవములన్నీ పొందగలుగుచున్నారు.

ప్రవృత్తిర్వా నివృత్తిర్వా తన్మాత్రావృత్త పూర్వకమ్ ।
సర్వస్య జీవజాతస్య సుషుప్త త్వాదనన్తరమ్ ॥ (సర్గ 18 శ్లో.2)

**1. సాక్షిచైతన్యము యొక్క 'సంకుచిత, పరిమిత' భావన -** 'సాక్షి చైతన్యము' ఈ ఉపాధితో తాదాత్మ్యము చెందటం జరుగుతోంది. అనగా 'నేను ఈ పాంచభౌతిక దేహమాత్రుడనే' అనే ఖండభావన కలిగి ఉంటోంది. ఇంద్రియములందు ప్రజ్ఞను ప్రవేశింపజేసుకొని, తత్ఫలితమైన ఆయా అనుభవములందు అధ్యాస (Avocation) కలిగి ఉంటోంది".

**2. ద్వితీయమైనదంటూ లేనట్టి ఏకైక బ్రహ్మము -** "సర్వజీవులందు ఏకైక బ్రహ్మమే ప్రసరించి సర్వదా ఉండి ఉంటోంది. చూచేవాడు, చూడబడేవాడూ బ్రహ్మమే".

ఈ రెండు కారణముల సమన్వయంచేత ఒకరు మరొకరిచే కల్పించబడిన దృష్టులను-సృష్టులను అటువంటి దృష్టితో చూచుచున్నారు. "ఏకత్వము - అల్పదృష్టి" ఈ రెండు ఒకేసారి ఉండియే ఉంటున్నాయి. చిన్మాత్రము... ఏకత్వము... ఈ రెండింటి యొక్క ప్రభావం చేత చిత్రవిచిత్రములైన (సృష్టికి సంబంధించిన) సంకల్ప రచనలు పరస్పరం మిళితం అగుచూ, అనుభవమౌతున్నాయి. ఘనీభూతమై ప్రవర్తిస్తున్నాయి.

మరికొన్ని జగత్తుల కల్పనలు పరస్పరం మిళితం కాకుండానే వేరువేరుగా ఉండి, అట్లే వేరువేరుగా లయం పొందుచున్నాయి. ఇక ఇంకొన్ని జగత్తులు పరస్పరం తారసపడినప్పుడు నాశనం పొందుచున్నాయి. అనగా ఒకడు ఒక జగత్తును పొందుట ద్వారా రెండవ జగత్తును త్యజించివేస్తున్నాడు. అట్లాగే ఒకని ఈ రోజు స్వప్నదృశ్యం - రేపటి స్వప్న దృశ్యం ఒకదానితో మరొకటి కలియటం లేదు కదా! కానీ, స్వప్నద్రష్టమాత్రం? ఒక్కడేకదా!

అయితే ఈ జగత్తులన్నీ కలియటం- లయించటం- విడిపోవడం... ఇదంతా జరుగుచున్నది ఎందులో? ఇవన్నీ జనిస్తున్నదీ, ఉంటున్నదీ, లయిస్తున్నది బ్రహ్మము నందే సుమా! బ్రహ్మం ఏకం, సద్రూపం (One and True) అయివున్నది. ఈ జగద్రూపములన్నీ బ్రహ్మము యొక్క ప్రభావం చేతనే ఒక దానితో మరొకటి కలుస్తున్నాయి. వ్యవహార యోగ్యత్వమును సంతరించుకుంటున్నాయి.

**శ్రీరాముడు :** ఈ 'జీవుడు' అనబడువాడెవ్వడు? అతనికి అనుభవములు, పరిమితులు ఏర్పరచు చున్నది ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చైతన్యము లేక బ్రహ్మము స్వరూపముగా కలిగియున్న ఈ జీవుడు తన యొక్క స్వయంకల్పితము... స్వయంభావన ద్వారానే ఈ పరిమితత్వమంతా పొందుచున్నాడు. ఈ లోకంలో ఏ జీవుని తన భోగానికి అనుకూలమైనట్టి ఏ కర్మలు ఎచట వేడుకచే ఆకర్షిస్తున్నాయో, అతడు అద్దానిని పరిమితదృష్టిచే అందుకు అనుకూలంగా మాత్రమే దర్శిస్తున్నాడు. ఇంతకు మించి అధికంగా అతడు చూచుట లేదు.

**శ్రీరాముడు :** అతడు తన భోగానుకూలమైన భావనను అనుసరించే ఈ జగత్తులోని వస్తువులకు, సంఘటనలకు ఆయా అర్థములు ఇస్తూ, తదనుకూలంగానే అనుభవాన్ని పొందుచున్నాడంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. అందుకు ఫలితంగా అతడు పరిమితమైన దృష్టి – దృక్పథములను ఆశ్రయిస్తూ, తనకు తాను పరిమితత్వాన్ని ఆపాదించుకుంటున్నాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ సర్వజీవులు బ్రహ్మమే అయి వున్నారు కదా! ఈ వేరు వేరు భావనలు, అభిప్రాయాదులు మొదలైనవి ఎట్లా, ఎందుకు, ఎప్పటి నుండి ఏర్పడి ఉంటున్నాయి? వీటి నన్నింటినీ ఎట్లా అవగాహన చేసుకోవాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "బ్రహ్మము–జీవులు"... అనే తతంగమంతా "జలము–తరంగములు"గా అభివర్ణించబడ్డాయి. అంతా జలమే అయినప్పటికీ, ఒక కెరటము యొక్క ఆకారము, సంభ్రమము మరొక కెరటమునకు ... ఏర్పడుచున్నదా? లేదు కదా! ఒక చిత్తము మరొక చిత్తము యొక్క మనో రాజ్యాన్ని కూడా అట్లే పొందుటలేదు. బంగారమంతా ఒక్కటే అయినా, వేరు వేరు ఆభరణాలు వేరు వేరుగా కనబడుట, ఉపయోగపడుట జరుగుతోంది. ఒక చిత్తము ఒక విధంగా, మరొక చిత్తము మరొక విధంగా ఈ జగత్తును దర్శించుచున్నది. ఒక చిత్తమునకు ఏర్పడుచున్న భోగానుభవం మరొక చిత్తమునకు ఏర్పడుట లేదు. కనుకనే, ఇది మనో – జీవభేదములకు కారణమగుచున్నది. ఒక కెరటము యొక్క ఆకారము, వేగము మరొక కెరటముతో పోల్చినప్పుడు "ఇవి రెండూ వేరు వేరు అని అనిపిస్తుంది కదా! అదే రీతిగా 'ఈ జీవులు వేరు' అని తోచుచున్నది. ఇదంతా అజ్ఞాన దృష్టిచేతనే ఏర్పడటం జరుగుతోందని నీవు గ్రహించు. కెరటములన్నింటిలోను ఉన్నది జలమే అయివున్నట్లు... జీవులన్నింటిలో ఉన్నది చైతన్యస్వరూపమగు బ్రహ్మమే. ఆ అద్వితీయ – నిర్మల – నిర్లిప్త – నిత్యోదిత – అఖండ చైతన్యమే జాగృతమై ఈ సర్వఉపాధులందునూ వెలయుచున్నది. వేరు–వేరు గదులలో వెలుగుచున్నట్టి దీపశిఖలు వేరువేరు విశేషములను వస్తుసముదాయమును వెలిగిస్తున్నప్పటికీ, అగ్ని ఒక్కటేకదా!

❖❖❖

## 6. శరీరము - జీవుడు - దృశ్యము - బ్రహ్మము

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ వేరు వేరు శరీరములన్నీ కనబడుతున్నాయి కదా! ఈ శరీరములను, ఈ జీవజాతులను, వీటిలోని భిన్నత్వములను, ఏకత్వములను, వ్యష్టి – సమష్టులను ఎలా అవగాహన చేసుకోవాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** భిన్న మనోరాజ్యరూపములగు సృష్టుల గూర్చిన కర్మవాసనలు... జలములోని తరంగముల వలె.. బ్రహ్మమునందు ఏర్పడుచున్నాయి. ఈ వేరు వేరు కర్మవాసనలు ఒక్కొక్కప్పుడు కొంత సమత్వమును కలిగి ఉంటున్నాయి. ఒకే సమయంలో ఫలోన్ముఖములవటం, ఒక దానితో మరొకటి సంబంధం కలిగి ఉండటం కూడా జరుగుతోంది. అట్టి సమయంలో "ఇది వ్యష్టి (Unit) – ఇది సమష్టి (Collective)", "ఇది వ్యష్టిస్థూలదేహం – ఇది సమష్టి పాంచభౌతిక సృష్టి"... అను రూపము గల సత్త ఎరుగబడుచూ, అనుభవించబడుతోంది. "నేను – నాది – మావి – మేము –

మనము – మనది – నీవు – నీది – వారు – వారిది "... అనునదంతా వాసనలచేత ఏర్పడి అఖండము, అప్రమేయము అగు వాస్తవమును కప్పి ఉంచుతున్నాయి.

అట్టి సమష్టి – వ్యష్టి స్థూలసత్త అధిగమించబడినదనుకో... లేక

"అమనఃస్థితి – అమనస్కస్థితి" దృఢాభ్యాసముచే పొందబడినదనుకో... అప్పుడు...

ఈ దేహం యొక్క అభావం అత్యంత స్వాభావికంగానే సిద్ధిస్తుంది. అనగా, "నేను దేహాన్ని కాదు. ఇందలి అనుభవముల 'కర్త–భోక్త' అయివున్న ప్రజ్ఞాతత్వమే నేను. దేహముల రాక–పోకలకు వేరుగా చైతన్యమూర్తిత్వంతో వెలుగొందుచున్నాను. ఆ ప్రజ్ఞాతత్వమే 'నీవు, అతడు' కూడా–" అను అనిర్వచనీయమైన ఒక ఉత్తమ అవగాహన సిద్ధిస్తోంది.

❖

శుద్ధ బంగారం తన యొక్క సువర్ణత్వమును విస్మరించి ఆభరణత్వమును తనపై ఆపాదించుకుంటున్నట్లు, శుద్ధ ప్రజ్ఞాస్వరూపుడగు జీవుడు తనపట్ల శరీరత్వాన్ని, ఖండత్వంను ఆపాదించుకుంటున్నాడు. అనగా, చిద్రూపము (The absolute form of wisdom) ఒక సమయంలో "నేను నిత్య, నిర్వివాదాంశ అఖండ సత్యమును" అను రూపమున ఉండే తన స్వాభావిక ఆత్మ స్థితిని ఏమరుస్తోంది. "ఈకాళ్ళు, చేతులు, తదితరములైన ఆకారములు గల దేహమే నేను. దీనితో పుట్టుచున్నాను. దీనితోనే వృద్ధి పొందుచున్నాను – శిథిలమగుచున్నాను" అని అత్యంత దృఢంగా భావన చేయుచున్నది.

❖

ఇక ఈ జీవులు యొక్క "తదితర జీవుల ఉపాధులు" అనే అనుభవం ఎట్టిది? విను–

యోగులు 'హఠ యోగాభ్యాసం' చేత తమ యొక్క శుద్ధ ప్రాణవాయువును మరొకరి భౌతిక శరీరంలో ప్రవేశింపజేసి ఆ వేరైన దేహ–ప్రాణములను తమ వశం చేసుకొని ఆ వేరైన శరీరం లోంచి శబ్ద స్పర్శ రూప రస గంధాలను అనుభవించటం గురించి విన్నావు కదా! మంత్రశాస్త్రము లోని పరకాయ ప్రవేశము ఇట్టిదే. అదే విధంగా ఒక శుద్ధ మనస్సు కూడా మరొక సృష్టికి ఆశ్రయ భూతమైన మనోరాజ్యమును ఎరుగుచున్నది. అయితే ఇక్కడ ఒక విషయం గమనించాలి...

**సర్వేషాం జీవ రాశీనా మాత్మా వస్థా త్రయం శ్రితః**
**జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్య మత్ర దేహోన కారణమ్** (సర్గ 18, శ్లో. 12)

ఈ జీవులందరి యొక్క 'జాగ్రత్–స్వప్న–సుషుప్తి" అవస్థలన్నిటికీ ఆశ్రయం 'ఆత్మ'యే అయివున్నది. అంతేగాని, ఈ అవస్థలన్నిటికీ ఆశ్రయం దేహం కాదు సుమా! కాని, ఈ 'జాగ్రత్‌కల్పన' అనునది దేహము లేనిచో సిద్ధించుటలేదు.

జీవాత్మ ఉంటేనే దేహం. దేహం ఉంటేనే జీవాత్మ.

ఈ విధంగా జీవాత్మకు, దేహమునకు 'అన్యోన్యాశ్రయ దోషం' సంభవిస్తోంది. అనగా జీవాత్మయే అవస్థలు.

జీవాత్మ అంటే జాగ్రత్-స్వప్న-సుషుప్తి అవస్థలు.

తరంగము కంటే జలము వేరు కానట్లు ఈ దేహము జీవాత్మకంటే భిన్నమైనది కాజాలదు. జీవాత్మ బ్రహ్మమునకు భిన్నం కాదు.

❖

**శ్రీరాముడు :** తండ్రీ! తత్త్వజ్ఞాని ఇదంతా ఎట్లా దర్శిస్తున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అతడు సుషుప్తికి ఆవల ఉన్నట్టి నిత్యనిర్లిప్త మౌనస్థితిని సర్వదా అన్ని స్థితులందు, అన్ని వేళలందు గాంచుచున్నాడు. అట్టి స్థితికే "తురీయము" అనే శాస్త్రీయనామం ఇవ్వబడింది. అతడు "అవస్థాత్రయం"లో కేవల సాక్షిత్వాన్ని తన స్వరూపంగా వహించి ఉంటున్నాడు. తన యొక్క జ్ఞానముచే చైతన్యకరమగు ఆత్మభావమును పొందుచున్నాడు. "నేను జీవుడను" అను భావన నుండి సంపూర్ణముగా నివృత్తి పొందుచున్నాడు. ఇక అజ్ఞానియో, స్వకల్పనచే దేహములందు, అట్టిదేహమునకు తారసపడే కల్పనా రూప ప్రపంచమునందు ప్రవృత్తుడగుచున్నాడు.

**ద్వయోరేక స్వరూపైవ స్వసౌహార్ద నిదర్శనాత్ ।**
**అజ్ఞః సుషుప్తోఽసంబద్ధో జీవః కశ్చిత్స సర్గ భాక్ ॥** (సర్గ 18, శ్లో 15)

"సుషుప్తస్థితి" అనునది మౌనం, శాంతం, ఆనందం కలిగి ఉంటోంది. మోక్షస్థితి కూడా అట్టిదే. కాని, మోక్షము నందు నిరతిశయానందము ప్రాప్తించుచున్నది. సుషుప్తస్థితి అనేది జ్ఞానికి, అజ్ఞానికి కూడా సమానమే. అయితే జ్ఞానము పొందనట్టి సుషుప్తి సహితుడైన అజ్ఞాని ఆ సుషుప్తి గతించిన తరువాత స్వప్న, జాగ్రత్తు లందు సంసారమును అనుభవిస్తున్నాడు.

ఇక జ్ఞానియో... "ఈ సంసారానుభవమంతా మొదలే అసత్యమైనది" అను ఎరుక కలిగి ఉంటున్నాడు. ఇదంతా ఒక స్వప్నంలాగా అసత్తుల్యమేనని అతనికి సుస్పష్టంగా తెలిసిపోతోంది. "నేను సర్వదా అఖండమగు స్వస్వరూప స్థితిలో ఉండి ఉంటున్నాను" అని అతడు గ్రహిస్తున్నాడు.

జ్ఞాని స్వస్వరూపస్థితి భావనను త్యజించుటలేదు... అజ్ఞాని దృశ్యవ్యవహారంతో ఏకత్వం పొందుతూ స్వస్వరూపస్థితిని ఏమరచుచున్నాడు.

ఈ జ్ఞాని – అజ్ఞానుల భేదం ఇంతవరకే. ఇక మిగతా విషయలన్నీ యథాతథమే.

❖

చిద్వస్తువు (Consciousness) సర్వవ్యాపియు, సర్వరూపము అయి ఉన్నది. ఆ కారణం చేతనే ఒక జీవుడు మరొకని సృష్టిలోకి ప్రవేశించగలుగుతున్నాడు. ఒక్కొక్క సృష్టియందు విభిన్నములైనట్టి అనేక సృష్టులు ఉండగలుచున్నాయి. అనేక సృష్టులలోని ఒక్కొక్కదానిలో ఇంకెన్నో అవాంతర సృష్టి రచనలు... అరటి పువ్వులోని దళములవలె... ఏర్పడి ఉంటున్నాయి. విశాలరూపమగు బ్రహ్మము స్వభావసిద్ధంగానే ఈ సృష్టులన్నిటి యొక్క బాహ్య అభ్యంతరము లందు వ్యాపించియున్నది. ఈ వివిధ సృష్టులలో ప్రవేశించి ఉన్నప్పటికీ, బ్రహ్మమునందు మాత్రం ఏ క్షణమందు

ఎట్టి భేదము ఏర్పడుట లేదు. అద్దాని నిర్మలత్వము, విశుద్ధత్వము, అప్రమేయత్వము సర్వదా నిరాటంకముగానే ఏర్పడి ఉంటున్నాయి.

ఒక బీజము 'జలము – సూర్యరశ్మి – నేలసారము" మొదలైన వాటితో సమన్వయము పొందినప్పుడు గొప్ప వృక్షమగుచున్నది. మరల ఫలాదుల ద్వారా పూర్వకాలపు బీజభావమును పొందుచున్నది. బ్రహ్మము కూడా కామ్యకర్మాదుల యొక్క సంబంధంచే 'మనస్సు' అను రూపము పొందుతోంది. ఫలితంగా ఈ "పుట్టుట–చచ్చుట" అను కల్పనను తనపట్ల తానే కల్పించుకుని, అనుభవించుచున్నది. మరల ఏదో సమయంలో అధికారమైనట్టి దేహము (Body which can be very useful instrument in attaining highest knowledge) పొందుతోంది. 'జ్ఞానార్తి' కారణంగా 'వినుట – మననం చేయుట – గ్రహించుట' అను రూపము గల జ్ఞాన సంస్కారములను ఆశ్రయిస్తోంది. అట్టి ప్రయత్నముల ఉత్కృష్ట ప్రయోజనంగా ఇతఃపూర్వమే సర్వదా సిద్ధించియే ఉన్నట్టి 'బ్రహ్మస్వరూపము' మరల పొందుచున్నది.

❖❖❖

# 7. బ్రహ్మము - జగత్తు రూపంగా ప్రాప్తించటం

**శ్రీ రాముడు :** మహర్షీ! బ్రహ్మమే కారణముగా కలిగినట్టి ఈ జీవుడే జగత్తు రూపముగా విజృంభించుచున్నాడు కదా! అయితే అట్లు బ్రహ్మము ఖండత్వముతో కూడిన 'నేను జీవుడను' అను భావావేశం ఎందుకు ఎప్పుడు ఎట్లా పొందుచున్నది? బ్రహ్మము 'నేను బ్రహ్మమునే... నిత్యమునే... సత్యమునే..." అను స్వస్వభావమును కోల్పోయి ఈ జన్మపరంపరలన్నింటినీ ఎందుకు తెచ్చిపెట్టుకుంటోంది? అందుకు మూలకారణమేదైనా ఒకటి ఉన్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మం ఈ 'జీవుడు' అను భావన ఎందుకు పొందుతోంది? అనే ప్రశ్నకు "స్వయముగా ఆశ్రయించుట' అని కాక ఇంకే సమాధానం చెప్పలేం. 'మూలము అనుదానికి మూలమే లేదు' అని మాత్రం పరిశీలనచే తప్పక తెలియ వచ్చుచున్నది. అందుచేత సర్వమునకు మూలమై, సర్వమునకు కారణమైన 'ఆత్మ' ఎట్లు కారణరహితమో, మాయ అనబడే ఈ స్వస్వరూపం నుండి ఏర్పడిన 'చ్యుతి' కూడా కారణ వర్జితమే. "ఒకడు వినోదం కొరకై నాటకం దర్శిస్తున్నాడు"... అనే విశేషంలో, "వినోదం ఎందుకు జనించింది?" అంటే ఏం చెప్పగలం?

మూలమగు బ్రహ్మమునకు మూలమే లేదు.

**శ్రీరాముడు :** బ్రహ్మమే జగత్తు యొక్క ఉనికికి కారణము, స్థానము కూడా! అందుచేత 'జీవుడు అగుట – జగత్తులను గాంచుట – జ్ఞాన సముపార్జనచే పూర్ణత్వమును తిరిగి అధిరోహించుట" ఇదంతా బ్రహ్మము యొక్క స్వభావమే అయి ఉన్నదని మనం అనుకోవచ్చా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మము నందు కార్యకారణములు, జన్మకర్మలు ఎట్లా ఆపాదిస్తాం?" బ్రహ్మము నందు ఏకారణత్వమునూ సిద్ధింపజేయలేం. అందుచేత 'బ్రహ్మం యొక్క స్వభావం ఇది'

అనునదంతా కొంత సాపేక్షకతను (comparison) దృష్టిలో పెట్టుకుని, గురుశిష్య బోధ కొరకు మాత్రమే కల్పించబడుతోంది. ఎందుకంటావా? శిష్యునియొక్క "స్థితి, గతి"లను బట్టి కదా, గురువు బోధను రచించేది! బ్రహ్మము ఎల్లప్పుడూ కూడా...

**1. నిర్విశేషము -** అందు శేషించినదంటూ ఏదీ ఇక ఉండదు. సర్వము అధిగమించబడగా శేషించేదే బ్రహ్మము.

**2. నిరాకారము -** దానికి ఎట్టి ఆకార, విశేషములు ఆపాదించలేం.

**3. నిర్వికారము -** అద్దానియందు "జీవుడు-నీవు-నేను" మొదలైన వికారములు లేవు.

తరంగమునకో, ఆవర్తమునకో ఆకారము ఉండవచ్చు గాని, జలమునకు ఆకారమెక్కడిది?

అందుచేత "బ్రహ్మం నందు ఈ 'కారణం'చే ఈ 'కార్యం' రూపమగు జగత్తు యొక్క ఉత్పత్తి జరుగుతోంది...." అను అసాధారణ ధర్మరూపంతో కూడిన 'ధర్మము'ను నిర్వచించలేం. ప్రతిపాదించలేం.

బ్రహ్మము నిర్వికారము, అద్వితీయము, అసంగము కదా! అందుచేత యదార్థానికి అది అకారణమే అయివున్నది. అందుచేత "ఈ ప్రపంచమంతా బ్రహ్మమే" అని ప్రతిపాదించినంత మాత్రంచేత "బ్రహ్మము నందు కారణము - నిమిత్తము... సంభవిస్తున్నాయి"... అను ఆరోపణ సరి కాదు. అట్లు "కారణ-నిమిత్తాదులు బ్రహ్మమునందు సంభవించుట" అనేది బ్రహ్మము యొక్క స్వభావమునకే విరుద్ధం.

కాబట్టి ఆ కారణము, వివర్త రూపము అయినట్టి ఈ జగత్తు మిథ్యయే! అకారణమే అయివున్నది సుమా!

**శ్రీరాముడు :** మరిక సారరహితము, జడము, దుఃఖమయము అయిన ఈ జగత్తు గురించి విచారించి ఏం లాభం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. అందుచేతనే మనం సారభూతమగు బ్రహ్మము గురించే విచారించటం ఉచితం.

"బ్రహ్మము నందు ఖండత్వరూపమగు 'నేను జీవుడను' అను భావన ఎందుకు ఏర్పడుతోంది?" అనే ప్రశ్నను ఇప్పుడు పరిశీలిస్తున్నాం కదా! ఒకనికి ఒక వ్యాధి వచ్చింది. ఎంతో బాధను అనుభవిస్తూ, అతడు ఒక వైద్యుని సమీపించాడు. "ఇతనికే ఈ వ్యాధి ఎందుకొచ్చింది? ప్రక్కవానికి రాలేదేం? ఎప్పుడు ఏమేమి ఎంతెంత తిన్నాడు? ఎందుకు తిన్నాడు"... అని ఆ వైద్యుడు తాత్సారం చేస్తూ ఉంటాడా? చికిత్స వెంటనే ప్రారంభించకపోతే ఆ రోగి వ్యాధి అనుభవిస్తూనే ఉంటాడు కదా! ఇక్కడ ముఖ్యమైన విషయం ఏమిటి? సరి అయిన ఔషధం రోగికి ఇవ్వటం... తద్వారా రోగనివారణ, ఉపశమనం కలగటం... ఇవి కదా ముఖ్యం! అదే విధంగా శాస్త్రములు, గురువులు కూడా "బ్రహ్మతత్వమునందు ఈ జగద్భావన ఎప్పుడు వచ్చింది? ఎక్కడ వచ్చింది? ఎట్లా వచ్చింది? ఎందుకు వచ్చింది..." అను తర్జన - భర్జనలకన్నా కూడా..." ఈ

జీవుడు బ్రహ్మమే స్వరూపముగా కలిగియున్నాడు, కాని భ్రమ చేత జగద్భావమును తీవ్రముగా పొంది దుఃఖాదుల అనుభవపరంపరలు పొందుచున్నాడు. బ్రహ్మమే స్వరూపముగాగల ఈ జీవుని యందు 'నేను జనన-మరణ రహితుడను' అను ఎరుక ఏర్పరచుట ఎట్లు? ఇతడు తనను బ్రహ్మముగా గ్రహించుట ఎట్లు?"... అను విషయమునే తరచు పరిశీలించి, ఉపనిషత్తుల వంటి ఉత్కృష్ట శాస్త్రముల ద్వారా ఆయా ఉపాయాదులను ప్రతిపాదించటం జరుగుతోంది. అందుచేత, బ్రహ్మమే సదా విచారించబడు గాక!

**విత్తనం మహావృక్షమవటం, బ్రహ్మము జీవుడుగా అవటం -**

1. బీజము దేశకాలాదుల సహాయంచే మహావృక్షమగుచున్నది.
2. బ్రహ్మము దేశకాలాదులను అంగీకరించి జీవుడుగా భాసిస్తోంది.

ఈ రెండింటినీ ఉపమాన, ఉపమేయాలుగా ఉదహరించేటప్పుడు, ఒక భేదం గమనించాలి. బీజం తన ఆకారాన్ని కోల్పోయి ఆయా 'ఆకులు, కొమ్మలు' మొదలైన రూపములన్నీ పొందుతోంది కదా! కానీ, బ్రహ్మం తన స్వరూపాన్ని త్యజించకుండానే ఈ "జగత్ దృశ్యము"... అను రూపంగా ప్రకటితమౌతుంది. అయితే, బీజమే 'అంకురము" అగుచున్నట్లు బ్రహ్మమే ఈ "ద్రష్ట-దర్శనం -దృశ్యం" అను వ్యవహారంగా రూపుదిద్దుకుంటోంది. కాబట్టి బీజాంకురన్యాయము "బ్రహ్మము-జీవుడు-దృశ్యము"లకు తగియే ఉంటోంది.

**శ్రీరాముడు :** బీజములో ఉన్నదంతా ఆకారసహితమైయున్నది. కాని బ్రహ్మమో, 'ఆకారము' అనబడే వికారమే కలిగియుండలేదు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును, అందుచేత "బ్రహ్మము బీజము వంటిదే" అనే ఉత్ప్రేక్ష సమగ్రం కాదని మనం అనుకున్నాం. బ్రహ్మముతోటి పోల్చతగినదంటూ ఎక్కడా ఏదీ లేనే లేదు.

**బీజస్యాకృతి మత్సర్వం తేనానాకృతిమత్సదమ్ ।**
**నీయుజ్యతే సమాకర్తుం తస్మాన్నాస్త్యుపమాశివే ॥** (సర్గ 18, శ్లో. 25)

బ్రహ్మము తనకు సమానము తానే అగుచున్నది. అది మరింకే వస్తువువంటిది కాదు.

సూక్ష్మదృష్టితో చూచినప్పుడు "ఈ జగత్తు ఉత్పన్నమైనది కాదు" అని తెలియవస్తోంది. అట్లాగే "ఇది ఉత్పన్నము కానేలేదు" అని కూడా అనలేము. అయితే భావన ఏర్పడిన తరువాతనే జగత్తు ఉనికిని సంతరించుకుంటోంది. దృశ్యము అనబడేది అనిర్వచనీయమై, జీవునిచే (లేక) బ్రహ్మముచే స్వయంకల్పితమై ఏర్పడుచున్నదని గ్రహించు.

కల్పన ఉంటే... జగత్తు కూడా ఉంటోంది. కల్పన లేనప్పుడో... జగత్తు కూడా సర్వదా "లేనిదే" అగుచున్నది.

**దృశ్యమ్ పశ్యన్, శ్వమాత్మానం న ద్రష్టా సంప్రపశ్యతి।**
**ప్రపంచాక్రాంత సంవిత్తే, కస్య ఉదేతి నిజాస్థితిః? ॥** (సర్గ 18, శ్లో. 27)

ఒక ద్రష్ట ఈ దృశ్యమును చూడటం జరుగుచున్నప్పుడు తన యొక్క ఆత్మ స్వరూపమును గాంచుటలేదు. ఎందుకంటే, ఆ సమయంలో అతని జ్ఞానము ప్రాపంచిక విషయ వాసనలచే ఆక్రమించబడటం జరుగుతోంది. అందుచేత స్వస్వరూపమునందు 'స్థితి, నిష్ఠలు" ఏర్పడుట లేదు. ఫలితం ఏమిటి? ఏదైతే ఏ క్షణంలో కూడా కాకయే ఉన్నాడో, దేనికైతే ఏ మాత్రం సంబంధించకయే ఉన్నాడో... అట్టి దాని యందు (దృశ్య వ్యవహారము నందు) అతనికి నిమగ్న పూర్వకమైన అనుభవం కలుగుతోంది. ఇక నిజస్థితిలో ఉండగలిగేది ఎట్లు? ఎన్నటికి?

❖

ఒక ప్రశ్న. ఒకడు మృగతృష్ణను చూస్తున్నప్పుడు జలము యొక్క భ్రాంతిని పొందుచున్నాడు కదా! ఆ క్షణాలలో, "ఈ విశాల ప్రదేశంలో అకస్మాత్తుగా ఈ సమయంలో జలం ఎక్కడి నుండి వస్తుంది? సూర్యరశ్మి – గాలివీచికలు – క్రీనీడలు – ఈ మూడిటి సమన్వయమే ఇట్లు జల తరంగముల వలె నాకు కనబడుతోంది"... అనే సత్యజ్ఞానం ఏ మూలకో వెళ్తోంది.

ఎండమావులు గురించి "క్రీనీడే కదా..." అనే పరిజ్ఞానం ఉండి ఉన్నప్పుడు, "ఇది జలం" అనే దృష్టి ఏమౌతోంది? వికర్షితమైపోతోంది కదా! భ్రమలో ఉన్నప్పుడు "ఇది మృగతృష్ణ మాత్రమే. ఇక్కడ తటాకము ఉండజాలదు"... అనే విషయం జ్ఞాపకానికి రావటం లేదు.

ఒకటి రెండవ దానిని కనబడకుండా చేస్తోంది కదా!

మాయాదృష్టిచే "ఆత్మ", సత్యదృష్టిచే జగత్తు... "లేనివే" అగుచున్నాయి.

ద్రష్ట యొక్క కళ్ళే (దృష్టిత్వమే) ఆకాశము వలె విశాలమైన స్వరూపము కలిగినవై ఉంటున్నాయి. సర్వత్రా వ్యాపించినదై సర్వమును ప్రకాశింపజేయుచున్నాయి. ఈ చూపు సర్వ పదార్థములను గాంచగలుగుచున్నది. అయితే ఇన్ని విషయములను చూచుచు, గుర్తించుచున్నట్టి ఆ చూపు తనను తాను మాత్రం దర్శించలేకపోతోంది. ఏమి చమత్కారం? మాయాభ్రమ ఎంతటి ప్రబలమైనదో కదా! చూచేవాని యొక్క చూపుకు ఆ చూచేవాడు కనిపించటంలేదు. కానీ, చూడబడేదంతా కనిపిస్తున్నది చూచే వానిలోనే!

తన యందు తాను ఎట్టి భ్రమను కలిగి యుండనట్టి జీవుణ్ణి మనం "ముక్తపురుషుడు" అని పిలుస్తున్నాం. అట్టి ముక్తపురుషుడు దృశ్యరూపమైనట్టి ఈ ద్వైతమును కాకుండా, సర్వేసర్వత్రా ఆత్మనే గాంచుచున్నాడు. దృశ్యమును స్వస్వరూపాత్మ విశేషంగా సందర్శిస్తున్నాడు. కాని తన యందు మాయను పొందుచున్న ద్రష్టకో, ఈ జగత్తు బాహ్యమున ఇంద్రియ విషయమాత్రమై ఘనీభూతమై ప్రాప్తిస్తోంది.

ఆకాశము వలె సర్వవ్యాపకమైనట్టి ఈ ద్రష్ట తన యొక్క పరమార్థ స్వరూపమును గాని, తన వంటిదే అయి వున్న ఇతరుల పరమార్థ స్వరూపమును గాని గాంచుట లేదు. బ్రహ్మం ఆకాశం వలె అన్నివైపుల, సర్వత్రా వ్యాపించి ఉన్నప్పటికీ ఈ జీవులు ఎంతో ప్రయత్నం చేసిన తరువాత కూడా అట్టి బ్రహ్మమును దర్శించలేకపోతున్నారు. ఎందుచేత? ఈ దృశ్యమును దృశ్యరూపముగా చూచునంతవరకు బ్రహ్మ స్వరూపప్రాప్తి అత్యంత దూరముగా ఉన్నదే అగుచున్నది.

ఇందుకు ఒక లౌకికమైన దృష్టాంతము చెపుతాను, విను. ఒకచోట, 'కుండ' మొదలైన కొన్ని పదార్థాలు ఉన్నాయి... ఒక వ్యక్తి చూపు అటు పడింది. కంటిపాపలో వస్తువులు ప్రతిబింబించి నంత మాత్రం చేత ఆ వ్యక్తి వాటిని చూడగలడా? లేదు. ఆ కనుల వెనుక ద్రష్ట ఉన్నాడు. ద్రష్ట వృత్తిని పొందితేనే దృశ్యము పొందబడుతోంది. అయితే, ఆ ద్రష్ట ఆయా వృత్తులను పొందినంత మాత్రంచేత విచ్ఛిన్నుడు అయ్యేవాడు కాదు. అతడు వాస్తవానికి సాక్షితత్వమై, దృష్టిని కూడా వెలిగించుచున్నవాడై ఉంటున్నాడు. అట్టి ద్రష్ట దృశ్య విషయస్వరూపము పొందినప్పుడు మాత్రమే "కుండ" మొదలైనవి తనయందు ప్రకాశింపజేస్తున్నాడు. ఆ ద్రష్ట విషయరూపత్వమే పొందుట లేదనుకో... అప్పుడేమౌతుంది...? ఆ పదార్థముల అనుభవం ద్రష్టకు సాక్షాత్కారం కాదు. అప్పుడు "ఈ పదార్థము ఇది, ఇట్టిది"... అను అనుభవమే ఉండదు. ఈ దృశ్యము, బ్రహ్మము – ఈ రెండిటి యొక్క అనుభవప్రాప్తి ఇట్టివే!

జీవుని యందు 'వృత్తి' మరల మరల విషయరూపత్వము పొందుతోంది. అట్టి ఆ వృత్తిని విషయత్వము నుండి వేరు చేసి సూక్ష్మమైన బుద్ధి సహాయంతో "కేవల పరమాత్మ స్వరూపము" నందు లయింపజేయాలి. ఇది కష్టతరమైన విషయమైనప్పటికీ అభ్యాసముచే ఈ ప్రపంచములో అన్నీ సులభం అవుతాయి కదా! "ఈ జగత్తులో తారసపడుచున్న 'నేను – నీవు – అది – ఇది'... మొదలైనవన్నీ స్వస్వరూపమే అయివున్న ఆత్మకంటే వేరైనవి కావు..." అని నిరంతర నిశ్చయము కలిగియుండటమనేది క్రమక్రమంగా చేసే అభ్యాసంచేత తప్పక సాధ్యమే. ఎందుకంటే, సత్యము అదియే కదా! సత్యమేవ జయతే!

**శ్రీరాముడు :** అనేక లౌకిక వ్యవహారములు నిర్వర్తించుటలో నిమగ్నమై యున్న మాకు అట్టి అభ్యాసం సాధ్యమేనంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ప్రవాహపతితములగు ఆయా కార్యములను ఆసక్తిరహితంగా (without attachment) నిర్వర్తిస్తూ ఉండే వారికి అట్టి ఆత్మ దృష్టి సులభమే అవుతుంది. ఓ సర్వ సభికులారా! సర్వజనులారా! మీరంతా అట్టి మహత్తరమగు ఆత్మదృష్టి కలిగియుండుటకే ప్రయత్నం చేయండి. "అఖండము, నిత్యము అగు ఆత్మయే నేను" అను భావన కలిగి యుండుటలో ఏమి కష్టమున్నది? అట్టి భావనను మననపూర్వకంగా ధరించి, ఆపై లౌకిక జగత్తులో ఏది ఎట్లు ఉచితమో, అట్లే నిర్వర్తించండి. దీని వలన మీకు శుభమే జరుగుతుంది. అన్ని వేసటలు తొలగిపోతాయి.

❖

ఓ రామచంద్రా! ఈ దృశ్యమైతే కనిపిస్తోంది. కాని ద్రష్ట కనిపిస్తున్నాడా? లేదు కదా! ఈ భౌతిక శరీరము ద్రష్టచే వెలిగించబడుచున్నది మాత్రమే కాని, స్వయముగా ద్రష్ట కాదు.

**దృశ్యంచ దృశ్యతే తేన, ద్రష్టా? రామ! నపశ్యతే ।**
**ద్రష్టైవ సంభవతి ఏకో! నతు దృశ్యమ్ ఇహ అస్తిహి ॥**

యథార్థానికి 'ద్రష్ట' మాత్రమే ఉన్నాడు. దృశ్యము ఏ మాత్రము లేనే లేదు. ద్రష్ట ఈ దృశ్యములో దేనిని ఎట్లు సంభావన చేస్తాడో, అది ఆ రూపముగానే సంప్రాప్తిస్తూ ఉంటోంది.

స్వయముగా "సర్వస్వరూపుడు" అయి ఉండుటచే 'ద్రష్ట'యే దృశ్యరూపముగా ప్రసరించి ఉంటున్నాడు.

**శ్రీరాముడు :** ఈ దృశ్యములో కనబడుచున్న ద్రష్టలు ఇందలి ఏ కారణంగా ఏర్పడుచున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ దృశ్యమంతా స్వస్వరూపానుభూతమే సుమా! అట్టి ఆ దృశ్యంలో ఏదో క్రియలచే ద్రష్ట ఏర్పడటం అనేది అత్యంత అసంగతం.

దృశ్యము స్వతహాగా, నీ కంటే వేరుగా లేనే లేదు. ఇక 'ద్రష్టత్వము' నీ కంటే వేరుగా ఎక్కడుంటుంది.

కాబట్టి దృశ్యము ఎట్లు అవాస్తవమో, ద్రష్టత్వము కూడా అట్లే అవాస్తవము. ఈ దృశ్య – ద్రష్టత్వములకు ఆవల రెండింటికీ అతీతమై నీ యొక్క స్వస్వరూపము నిశ్చలమై ఉన్నది. ఆ స్వస్వరూపమే అఖండమై, అద్వితీయమై, సర్వత్రా వ్యాపించినదైయున్నది. అయితే, పదార్థదృష్టిని (perception of matter), తద్వారా ద్రష్టత్వము (the stance of perceiver) ను విడనాడక పోవుట చేతనే ఈ జీవునకు నిత్యసత్యమగు ఆత్మతత్త్వము అనుభవమగుటలేదు. ద్రష్టత్వము, దృశ్యములను అధిగమించిన అవగాహన పెంపొందించుకొనువారికి "దృశ్యము నా స్వరూపమే" అను భావన సులభమే అగుచున్నది.

❖❖❖

# 8. చిత్తము - జగత్తులు

**శ్రీరాముడు :** అయితే మునీంద్రా! 'సర్వశక్తిమంతుడగు రాజు' లాగా ఈ ఆత్మయే దృశ్యమును సంపాదించి, అట్టి దృశ్యమునకు తనకుతానై ద్రష్టత్వము వహించుచున్నదని అనవచ్చునా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. అంతాకూడా ఆత్మచే తనకొరకు తానే నిర్మించుకొనుచున్నదే అని అనక తప్పదు. ఆత్మ తన యొక్క ఇతరములైన అపేక్షలన్నీ లేకుండా కేవలం ఒక పదార్థమును (విషయమును) ఆశ్రయించినప్పుడు ఆ పదార్థమునే అనుభవించుచు, అట్టి రూపముగానే ఉదయించుచున్నది.

ప్రకృతిలోని 'మాధుర్యము' అను రసము యొక్క ఉల్లాసమే పటికబెల్లం రూపమును పొందుతోంది. అదే మాధుర్యము తనయొక్క రసరూపత్వము త్యజించకుండానే "ఫలములు–పుష్పములు–లతలు" మొదలైనవాటియందు అంతర్లీనమై ఉంటోంది. అదే విధంగా...

"చిత్" (Awareness) అను ఉల్లాసము రూపముగాగల ఈ జీవుడు ఈ 'దేహములు' మొదలైన రూపమును పొందుచున్నాడు. ఈ ద్రష్ట తనయొక్క చిత్స్వరూపమును త్యజించకుండానే, "ద్రష్ట–దర్శనము"లుగా అగుచున్నాడు. తనయందు 'జాగ్రత్తు' అను స్వప్నమును గాంచుచున్నాడు.

"ఈ 'ఉప్పు ఖండములు' ఇతఃపూర్వం ఎక్కడ ఉండి ఉన్నాయి?" అను ప్రశ్నకు సమాధానం "ఇవి 'లవణము' – అను రసము రూపమున జలమునందే ఉండి ఉండేవి" అని చెప్పాలి కదా! అదే విధంగా ఆత్మయందే అహంకారము మొదలైనవి ఉండి ఉన్నాయి.

అనేక మట్టిగడ్డలు ఒకచోట ఉన్నాయనుకో... ఆ మట్టి గోడలన్నిటిలో ఉన్నది ఒకమట్టియే కదా! ఒకే చిద్వస్తువు అనేక ఆకారములుగాను, రూపములుగాను ఉదయిస్తోంది. "చిత్ రస-ఉల్లాసము"చే అనేక దృశ్యములుగా దృశ్యమానమగుచున్నదంతా పూర్ణప్రదమగు స్వస్వరూపమే!

అటువంటివే..... ఈ జగత్ ఖండములు కూడా!

'చైతన్యము' తన యొక్క సంకల్పముల ప్రభావంచేత నిర్మించబడుచున్న దృశ్యములను తానే స్వయంగా గాంచుచు, అనుభవించుచున్నది. జీవశక్తి ఈ దృశ్య ప్రపంచమును ఈ విధంగా పొందుతోంది. అనగా ఆత్మ తన యొక్క విస్తృత స్వరూపమును ఈ రూపముగా భావన చేయు చున్నది... అని విజ్ఞులు అవగాహన చేసుకుంటున్నారు.

ఇక సమానమైన ఆకారములు కలిగినట్టి వాసనలు ఉదయించటం చేత కొన్ని జగత్ ఖండములు పరస్పరం కలియటం జరుగుతోంది. అట్లు వివిధ జగత్తులు ఒకదానితో ఒకటి ప్రవర్తిస్తూ మరల ఎప్పుడో నశించుచున్నాయి. మరికొన్ని జగత్ ఖండములు ఒకదానితో మరొకటి కలియటమే లేదు.

ఓ రామచంద్రా! నీవు 'పరమ సూక్ష్మదృష్టి'తో, 'జ్ఞానముతో కూడిన చిత్తముతో' ఇదంతా గమనించాలి. ఈ వేలాది ప్రపంచములను చూస్తున్నావా? చిత్తమునందు, ఆకాశము నందు, శిలల యందు, అగ్నిజ్వాల లందు, వాయువు నందు, అరణ్యము లందు, సముద్ర గర్భము లందు, ప్రతి పరమాణువు నందు వేలకొలది 'జగత్ సమూహములు" పొందబడుచున్నాయి.

ప్రతి నువ్వు గింజలోనూ నూనె ఉండి ఉన్నది కదా...! ఆరీతిగా, ప్రతి చిత్తమునందు లక్షల కొలది జగత్తులు ఉన్నాయి. ఈ చిత్తమునకు (అనగా ఈ చిత్తములోని జగత్తులకు) సిద్ధి కలిగినప్పుడు ఈ చిత్తమే 'చైతన్యముగా' అగుచున్నది.

**అనుబంధములు, భేదభావనలు -** శుద్ధము, సర్వవ్యాపకము అయిన "చైతన్యము" యొక్క అంతరము నందు పరస్పర సమ్మేళనము సిద్ధిస్తోంది. అట్టి సమ్మేళనమే ఈ జీవుల యొక్క అనుబంధములు - భేదభావములు కూడా. అట్టి అనుబంధత్వము కారణంచేత ఒక భ్రమలాగా బ్రహ్మ మొదలగు సృష్టిదేవతలచే కల్పించబడిన ఈ భౌతిక జగత్తు జీవులందు ప్రతిబింబిస్తోంది.

ఈ ప్రపంచము ఒక దీర్ఘ స్వప్నము వంటిది. కొందరు జీవులు ఒక స్వప్నము నుండి మరొక స్వప్నమును పొందుచున్నారు. ఇట్టి స్వప్న పరంపరల యొక్క పరిభ్రమణమే దృశ్యముగా అనుభవ మవుతోంది. వాసనల దార్ఢ్యము (density) చే అది దృఢరూపమును పొందుతోంది. చైతన్యము తన యొక్క వాసనలని అనుసరించి దేనిని ఎట్లు భావిస్తే అది అట్లే అనుభవరూపం పొందుతోంది. ఆ విధంగా చైతన్యము స్వప్న సదృశంగా అనుభవిస్తున్నదంతా అనుభవసమయంలో సత్యముగానే ఉంటోంది. ఒక బీజమునందు వృక్షతత్వమంతా దాగి ఉంటున్నట్లు, వాసనతో నిండియున్న చిదణువునందు సూక్ష్మ- రూపమున ఈ జగత్తులన్నీ ఉంటున్నాయి.

**చిత్ పరమాణువులు, జగత్ పరమాణువులు –** "చిత్" అంటే 'ఎరుక' కదా! ఈ అనేక మంది జీవులు అనేక చిత్ పరమాణువులు. అట్టి ఈ చిత్ పరమాణువుల భావనా వైచిత్ర్యమే జగత్పరమాణువు లందు ప్రవేశిస్తున్నాయి. ఈ "జగత్తు – చిద్వస్తువు"... ల పరస్పర ప్రవేశము, పరస్పర సమావేశము ఎంతటి ఆశ్చర్యకరమైనది!

ఒక విధంగా ఇక్కడ చిదాకాశమే చిదాకాశమునందు జగత్తుగా ప్రదర్శనమవటం. అనగా, వాస్తవానికి లీనమవటం జరుగుతోంది.

ఈ చిదాకాశమునే భ్రమరూపమగు జగత్తుగా అందరు చూడటం జరుగుతోంది.

కాబట్టి రామా! నీవు "ద్వైతము – ఏకత్వము"... అను రెండు భ్రమలు త్యజించివేయి. ఈ జీవులు 'చిత్' అను అంశమును స్వభావముగా కలిగియున్నారు. అట్టి వీరు, 'చిదంశములే' అయినట్టి దేశ–కాల–క్రియా రూపములైన అణువులను ఏదో అన్యమైన బాహ్య వ్యవహారము వలె గాంచుచున్నారు.

వాస్తవానికి ద్రష్టకు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ సంభవించదు. ద్రష్టయే దృశ్యరూపమున విస్తరిల్లుచూ...., ఆస్వాదిస్తున్నాడు.

బ్రహ్మదేవుని నుండి ఒక కీటకము వరకు ఈ సర్వప్రాణుల జీవన విధానము, భావన చేయు రీతి... అంతాకూడా వారి వారి అంతఃకరణోపాధి (మనస్సు – బుద్ధి – చిత్తము – అహంకారము) చేతనే ప్రాప్తిస్తోంది. అయితే, 'జాగృత్'లోని సర్వవ్యవహారములు గాఢ నిద్రా సమయంలో మరుగునపడి ఉంటున్నట్లు, సంసార వ్యాపకము ఆశ్రయించు సమయంలో ఆత్మదృష్టి మరుగున పడుతోంది. ప్రళయకాలంలో జీవునిలో ఇదంతా 'అప్రకటితం'గా, సృష్టికాలంలో స్వప్నానుభవం లాగా 'ప్రకటితం'గాను, అగుచున్నది. అనగా, ఈ జగత్ వ్యవహారదృష్టి అంతఃకరణంలో ఉండి ఉంటోంది. భావించబడునదంతా అధిగమించి, భావించువాని తత్వమేమిటో పరిశీలించామా... బ్రహ్మ మొదలుకొని పురుగువరకు ఇక్కడ గల ప్రతి జీవుని స్వరూపము (దృశ్యరహిత ద్రష్టగా) నిత్యము, అఖండము, అప్రమేయము అయివున్నాయి.

**ద్వైత భ్రాంతి, వృష్టి -** ఓ రాఘవా! ఈ జగత్తు ఒక అనిర్వచనీయమైన 'స్ఫురణ'గా ప్రాప్తిస్తోంది. యథార్థమైన దృష్టిని పెంపొందించుకున్న మహనీయులకు ఇక్కడ 'అర్థవంతమైనది, సారవంతమైనది' – అనునది ఏదీ లభించకున్నది. తీవ్రమైన జ్వరములో బాధింపబడు మానవుడు పరిసరములన్నీ తిరిగిపోతున్నట్లు భావిస్తూ ఉంటాడు. అట్లాగే ఈ 'జీవుడు' అని చెప్పబడుచున్న 'చిత్' స్వరూపుడు తనకుతానే ద్వైతమైన రూపాదులను అనుభవిస్తున్నాడు. స్వస్వరూపమగు ఆత్మనే అతడు అట్లు వివిధ రీతులుగా (అనేక జగత్ దృశ్యపరంపరల రూపంగా) పొందుచున్నాడు.

చైతన్యమే స్వరూపముగాగల ఈ చిత్ అణువు (జీవుడు) తనయొక్క 'అంతఃకరణము' (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము... అను ఉపాధి)చే ఈ ఇంద్రియములలో ప్రవేశిస్తోంది. వీటి ద్వారా ఇంద్రియజ్ఞానము వెడల గ్రక్కుతోంది. స్వయముగా విశాలమగు దృశ్య–దేహరూపమున స్ఫురించుచున్నది.

ఈ దృశ్యమునకు 'బీజభూతము' అని చెప్పదగ్గ చైతన్యము సర్వవ్యాపకము, నాశరహితము సుమా! ఒక చోట అనేక కుండలున్నాయి. అవి ఆయా సమయాలలో కుమ్మరిచేత నిర్మించ బడుతున్నాయి. కుండలన్నిటిలో ఉన్నది మట్టే కదా! వేరు వేరు సమయములలో తయారు చేయ బడిన వేరు వేరు కుండలు వేరువేరైన మట్టివలె కనిపిస్తాయి. వేరువేరు కుండలలో ఒక కుండ, వంటి ఈ వ్యష్టి జీవుడు స్థూలదేహంలో ప్రవేశించి ఇంద్రియముల ద్వారా తదితర స్థూల దేహములను గాంచుచున్నాడు. అతడు "నేను దేహమును" అను దృష్టి త్యజించినప్పుడు, తన యందు మరియు ఇతర కుండలలో (దేహములలో) కూడా ఘటాకాశము వలె అతి సూక్ష్మమైనట్టి 'ఆత్మాకాశము'ను గాంచగలడు.

"నేను నాశరహితమగు ఆత్మను" అని గ్రహించినప్పుడు అట్టి మహాత్ముడు సర్వుల యందలి నాశరహితత్వమును, అభేదత్వమును గాంచగలుగుచున్నాడు. తన యందు సర్వమును, సర్వము నందు తనను సర్వదా సందర్శించగలడు.

**సమష్టి బ్రహ్మాండాత్మకుడు -** "నేను ఈ సమష్టి – తత్త్వమును' అను సమష్టి అహంకారమును ఆశ్రయించి యున్న మరొక జీవుడు తనయందే అనేక దోషములతో కూడిన ఈ జగత్తును గాంచుచున్నాడు. తాను చూస్తున్న సమష్టి వ్యవహారంలో దీర్ఘకాలంగా అభేదం పొంది, మునిగి తేలుతున్నాడు. అందులోనే "ఉత్పన్న – వినాశములు" అను స్వప్నం పొందుచున్నాడు. అట్టి స్వప్న రూపమగు జగత్తునందు అనేక రూపములైన "స్వప్నములలో స్వప్నములు" వంటివి ఒక పరంపరగా పొందుచున్నాడు. ఊహానిర్మితమైన పర్వతశిఖరం నుండి ఊహానిర్మితమైన జలపాతం వెంట ఊహానిర్మితమైన శరీరములను దొర్లించుచు, బీభత్సమంతా అనుభవిస్తున్నాడు. (సమష్టి సృష్ట్యహంకారి – బ్రహ్మదేవుడు).

**విద్య, అవిద్య -** ఓ రామచంద్రా! అసంఖ్యాకములైన ఉపాధులతో కూడిన ఈ విస్తారమైన ప్రపంచమును గమనిస్తున్నావా? ఇవన్నీ స్వకీయమైన కల్పనాచమత్కారము చేతనే స్ఫురిస్తున్నాయి.

ఈ దేహాలు... చూడు. వీటిలో కొన్ని దేహములు పరస్పరంగా అనేక భ్రమ విభ్రమములు కలిగి ఉంటున్నాయి. మరికొన్ని దేహములు సర్వభ్రమలు త్యజించివేసి ఆత్మయందు స్థితి కలిగి ఉంటున్నాయి. కొన్ని "వ్యాప్తమై, దృశ్యమానమగుచున్న ఈ ప్రపంచం అసత్తు, స్వప్నతుల్యం అయి వున్నది కదా?" అను ఎరుక కలిగియుండి, ఇక ఆపై, తదితర జీవుల వలెనే ఆయా దృశ్య వ్యవహారాలలో క్రీడామాత్రంగా పాల్గొనుచున్నాయి. అట్టి జీవులను 'సుజ్ఞానులు' అని అంటున్నాం.

**శ్రీరాముడు :** తండ్రీ! ఈ దృశ్యములలో విడివిడిగా వేరు వేరు సంస్కారములతో కూడి కనిపిస్తున్న ఈ జీవులంతా సత్యముగా ఉన్నారా? లేరా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ దృశ్యమంతటా ప్రసరించివున్నది ఆత్మయే. ఆత్మయే సర్వముయొక్క అధిష్ఠానము అయివుండుటచేత ఇందులో ప్రతిజీవుడు "సత్యమే" అయివున్నాడు.

అంతేకాదు...

ఎచట సర్వవ్యాప్తియగు ఆత్మ కలదో, అచట సమస్తం వివర్తరూపమున ఉదయిస్తూనే ఉన్నది.

జీవము, ఆ జీవము యొక్క ప్రతిభాస, ఆ ప్రతిభాసలో మరల జీవము... ఇట్లు, ఆత్మయే స్వస్వరూపముగా గల ప్రతి జీవియందు ఏర్పడి ఉంటోంది. జీవుడు... ఆ జీవునిలో మరొక జీవుడు... అందలి ప్రతిజీవునిలో మరికొంతమంది జీవులు... ఈ విధంగా అరటి మట్టలవలె ఒక జీవునిలో అసంఖ్యాకములగు జీవరూపములు ఉంటూనే ఉంటున్నాయి.

'ప్రపంచం' అనుదానితో కూడినవాడైనట్టి ఈ జీవునియందలి 'జీవసత్త'కు కారణం ఏమిటి?

అవిద్యతో కూడుకున్నట్టి చైతన్యమే సుమా!

**శ్రీరాముడు :** అయితే, మహర్షీ! అతి దీర్ఘకాలంగా జన్మ కర్మల మధ్య చిక్కిన ఈ జీవునియందు పొరలుపొరలుగా ఏర్పడియున్న అల్పత్వము తొలిగేది ఎట్లు? ఎన్నటికి? ఇతనిలో ఆత్మకు సంబంధించిన అనుభవం ఏర్పడేది ఏ విధంగా?

**దృశ్యబుద్ధిపరావృత్తౌ సమమే తదన న్తరమ్ ।**
**హేమ్నీవకటకాదిత్వం పరిజ్ఞాతవినశ్యతి ॥** (సర్గ 18, శ్లో 63)

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జీవునియొక్క ఈ బుద్ధి దృశ్యపదార్థములవైపు అభిముఖమై ఉండి ఉంటోంది. ఇప్పుడీబుద్ధి, దృశ్యపదార్థముల నుండి వెనుకకు మరల్చబడి, ప్రత్యగాత్మవైపు అభిముఖం అయితే చాలు. ఆభరణత్వమునకు అతీతమైన దృష్టితో చూచువారికి దానియందు బంగారమే ప్రత్యక్షమై తీరుతుంది కదా! ఈ జీవుడు తనయందలి పదార్థత్వమును అధిగమించివేస్తే, అప్పుడు ప్రత్యగాత్మత్వముతో ప్రకాశించగలడు. అనగా తనయందలి 'ఆత్మలక్షణములు' అయివున్నట్టి అఖండత్వము అప్రమేయత్వము, అశరీరత్వము, అద్వితీయత్వము, అకాలత్వము లను అతడు గ్రహించటం జరుగుతోంది.

అయితే ఆభరణములకు క్రొత్తగా ఏమైనా ప్రయత్నములచే సువర్ణత్వము వచ్చిపడుతోందా?

**శ్రీరాముడు :** లేదు. ఆభరణములు (గాజులు, గొలుసు) మొదటే సువర్ణము, క్రొత్తగా సువర్ణత్వము రావలసిన పనిలేదు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. అదే విధంగా, "నేను స్వయముగా ప్రత్యగాత్మస్వరూపమునే..." అను భావన సుస్థిరమగుచుండగా, ఈ బాహ్య అభ్యంతర ప్రపంచమంతా అట్టి జీవుని దృష్టిలో స్వయముగా రహితమై పోతోంది. నేను స్వతఃగా సదా ప్రత్యగాత్మ స్వరూపుడనే".... అని నిర్మల హృదయుడు గమనించుచూనే ఉన్నాడు.

**విచారోయస్యనోదేతి కోఽ హంకిమిదమిత్యలమ్ ।**
**తస్యాన్తర్నవిముక్తోసౌ దీర్ఘోజీవజ్వరభ్రమః ॥** (సర్గ 18, శ్లో 64)

ఎవనియందైతే, "నెనెవరిని? ఈ ప్రపంచమేమిటి?" అను విచారణ కలుగుతుందో, అట్టి వానికి మాత్రమే, "ప్రత్యగాత్మ అనేది నాయందలి నిత్యసత్యమే" అని తెలియవస్తోంది. అట్టి

దర్శనము పొందినందుకు ప్రయోజనంగా గొప్ప రోగరూపంగా ప్రాప్తిస్తున్న 'సంసారము' అనబడే ఈ దీర్ఘకాల విభ్రమమంతా తొలగిపోతుంది.

అట్లా కాకుండా... ఎవని దృష్టిలో అయితే, "ఇది జగత్తు, ఇది నీవు. ఇది నేను. ఇది నాది. ఇది పొందవలసియున్నది..." అనుబుద్ధి తొలగదో, అట్టివాడు బంధము కలిగియే ఉంటున్నాడు.

**శ్రీరాముడు :** ఈ జీవుడు తనయందలి పూర్ణత్వమును అనుభవపూర్వకంగా గ్రహించాలంటే తత్త్వవిచారణ ఒక్కటే శరణ్యమని నేను అనుకుంటున్నాను.

**విచారఃసఫలస్తస్య విజ్ఞేయోయస్యసన్మతేః ।**
**దినానుదినమాయాతి తానవం భోగగృధ్నుతా ॥** (సర్గ 18, శ్లో 65)

**శ్రీ వసిష్ఠమహర్షి :** అవును నిజమే. అయితే సద్బుద్ధి గలిగినట్టి ఏ మనుజుడైతే ఒకవైపు విశ్లేషణ – అవగాహనలను సంస్కరించుకుంటూనే, మరొకవైపు తనయందలి భోగలాలసత్వమును క్షణక్షణం క్షీణింపజేసుకుంటూ ఉంటాడో... అట్టి వానిచే చేయబడుచున్న విచారణ మాత్రమే సఫలమగుచున్నదని గ్రహించు.

మంచి ఔషధం సేవిస్తే ఆరోగ్యం పొందుతాము కదా! "ఇంద్రియములను జయించుట" అనునది అభ్యసిస్తే వివేకము అనునది ఫలవంతమౌతూ ఉంటుంది.

అట్లా కాకుండా, కొందరి విషయంలో ఒక విచిత్రం జరుగుతోంది. వారిలో వివేకము కేవలం వచనామాత్రంగానే (కబుర్లవరకే) ఉంటోంది. ఆ వివేకం వారి మనస్సునందు ఏర్పడుట లేదు. వారి అవగాహనలలో, కర్మలలో ప్రతిబింబించుటలేదు. చిత్రపటంలోని అగ్నితో నీళ్ళు కాచుకోగలమా? మనస్సునందు వివేకమును ప్రస్ఫుటం చేసుకోలేనివాడు, మాటలు చెప్పగలిగి నప్పటికీ, అవివేకిగానే శేషించుచున్నాడు. అయితే 'వివేకము' అనేది స్వగతమైన అవగాహనకు సంబంధించినదేగాని, బాహ్యగతమైన రూప–నామ–క్రియాదులకు సంబంధించినది కాదు.

"కోరికలు సన్నగిల్లుట" అను మార్గములో ప్రయాణం చేస్తూ ముందుకు పోతున్న మానవునికి మాత్రమే వివేకము వికసించుట జరుగుతోంది.

వాయువు యొక్క సత్త (The existence of air) ఎన్ని మాటలు వింటే ఎరుగగలం? ఆ వాయువు మనను స్పర్శించినప్పుడు క్షణంలో ఎరుగుతాం కదా! అన్నిటికన్నా ముఖ్యం అనుభవం.

ఒక చిత్రపటంలోని అగ్ని నిజమైనా అగ్నా? అందలి అమృతం నిజమైన అమృతమా? అందలి స్త్రీ నిజమైన స్త్రీయా? కాదు కదా! అట్లాగే "వాచావివేకము ఏర్పడినంతమాత్రంచేత నిజమైన వివేకం పొందినట్లు కాకపోవచ్చు" అని శ్రోతలకు జాగరూకత చెప్పుచున్నాను. "వాచా మాత్ర వివేకం (Not true discrimination), 'పరిమిత దృష్టి' ఉన్నచోట అవివేకమే అవుతుంది. అనుభవమే వివేకమునకు తార్కాణం.

❖

వసంతకాలం ప్రవేశించిన వనంలో కొన్ని విశేషాలు ఏర్పడుతాయి కదా! అట్లాగే వివేకము ఉదయిస్తున్నట్టి జీవునియందు కొన్ని విశేషాలు మనకు కనబడుతూ ఉంటాయి. వివేకము యొక్క ఆగమనముచే మొట్టమొదట రాగము సన్నగిల్లుతుంది. ఆ తరువాత వైరము సమూలముగా నశించిపోతుంది. అప్పుడు జ్ఞానము వికసిస్తూ ఉండగా, " ఇష్ట వస్తువు లభించుగాక! అయిష్ట వస్తువు తొలగు గాక"... అను ఆవేశ కావేశాలు కూడా క్రమంగా సన్నగిల్లుతూ ఉంటాయి.

కాబట్టి ఓ సభికులారా! సర్వజనులారా! అనుభవముతో కూడిన వివేకముగల మానవుడు ధన్యుడు. అతడు పరమపావనుడు. మీరంతా మీయొక్క అవివేకమును తొలగించుకోవటానికనే నియుక్తులు అవండి. ఈ ఉత్తమ మానవజన్మ పొందినందుకు గాను 'సార్ధకత'కు ప్రయత్నించండి.

ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ!

❖❖❖

# 9. శుద్ధ చైతన్యము - ప్రాపంచిక క్లేశములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఒక వృక్షమునకు ప్రారంభస్థితి బీజమే అయివున్నది కదా! ఈ జీవునకు బీజము "బ్రహ్మము" అయి వున్నది. అట్టి బ్రహ్మము ఆకాశము వలె సర్వత్రా వెలయుచున్నది. ఈ జీవునిపట్ల మనకు కనిపించే జగత్తులో అనేక జగత్తులు అంతర్లీనమై ఉన్నాయి. అరటి మట్టలవలె, భూమిపైగల పెద్ద సంఖ్యలో ఉన్న కీటకములవలె ఈ జీవుని యందు అనేకమంది జీవులు ఉన్నారు. వేసవిలో చమటలో నుండి ఆయా క్రిమిజాలమంతా ఉత్పన్నమౌతుంది చూచావా? శుద్ధ చైతన్యము బాహ్య అభ్యంతరము లందు అనేక దృశ్య రూపములను ధరించుచు అనుభవించుచున్నది. అది ఎక్కడ దేనిని ఆశ్రయిస్తుందో అక్కడ అద్దానిగా అవశ్యము పరిణమిస్తూనే ఉంటుంది.

ఈ జీవులు అనేక విధములైన ఆరాటములతో ఏమేమి ప్రయత్నములు చేస్తున్నారో, అవన్నీ 'స్వాత్మసిద్ధి' చేత మాత్రమే చివరికి పరిసమాప్తి పొందుచున్నాయి సుమా! అయితే వారు మధ్య మధ్యలో ఏ ఉపాసనాక్రమముచే ఏఏ విధంగా ప్రయత్నిస్తారో ఆయా విధంగా అట్లే ఆయా పరిణామాలు ప్రాప్తిస్తూ వస్తున్నాయి.

దేవతలను పూజించేవారు దేవతలనే పొందుతారు. యక్షులను ఆరాధించేవారు యక్షులనే చేరుచున్నారు. హిరణ్యగర్భుడగు బ్రహ్మను ఆరాధించేవారు బ్రహ్మనే పొందుచున్నారు.

అఖండము, నిత్యము, సర్వము అగు బ్రహ్మమును ఆరాధించేవారు బ్రహ్మానుభవమునే పొందుచున్నారు. కాబట్టి రామా! ఏది ఉత్తమమైనదో అదియే నీచేత ఆరాధించబడుగాక!

❖

మన శుక్రుడు మొట్టమొదట 'అప్సరస రూపము" అను దృశ్యమును చూచాడు. అట్లు చూస్తున్నప్పుడు, "మలిన చిత్తస్వభావము"చే బద్ధుడు అయినాడు. మరొక సమయంలో "నేను

దుష్ట సాంసారిక స్వభావమును ఆశ్రయించానేమిటి?" అనే 'మెళుకువ'ను ఆశ్రయించాడు. మరల తపస్సును, ధ్యానమును నిర్వర్తించుటచే జ్ఞానమును సముపార్జించాడు. చిత్తము శుద్ధము అయింది. అట్టి చిత్తనిర్మలత్వము యొక్క ప్రభావముచే "ముక్తి"ని సంపాదించాడు.

వాస్తవానికి ఈ జీవుడు శుద్ధ చైతన్యస్వరూపుడే.

శుద్ధ తత్వానుభవమునందు ఉండి ఉండియే.... ఈ శుద్ధచైతన్యము ఒకప్పుడు కాకతాళీయంగా ప్రాపంచిక వ్యసన క్లేశములను స్వయముగా ఆశ్రయిస్తోంది. అయితే, ఒకడు ఆదమరచినంత మాత్రం చేత తననుతాను కోల్పోవుచున్నాడా? లేనే లేదు. అట్లాగే ఏ జీవుడూ కూడా ఎప్పుడూ కంటె 'ఆత్మత్వము'ను ఏ మాత్రం కోల్పోవుటయే లేదు.

❖❖❖

# 10. జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయములు

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు జాగ్రత్ - స్వప్న - సుషుప్తులను గురించి కొన్ని విశేషాలు మాకు చెప్పారు. వీటికి ఒకదానితో మరొకదానికి గల సంబంధమేమిటో మరికొంత వివరించండి.

ఈ జాగ్రత్తు సత్యమువలె వ్యవహారహేతువై, కార్య - కారణములతో కూడినదై ఇట్లు ఎందుకు ప్రాప్తిస్తోంది?.... స్వప్నము భ్రమగాను అసత్యముగాను ఎందుకు ఉండి ఉంటోంది?... జాగ్రత్తు స్థిరంగాను, స్వప్నం అస్థిరంగాను ఎందుకు ఏర్పడి ఉంటోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ప్రతిజీవుని యొక్క శుద్ధ చిత్ స్వరూపమునకు ఆకారముగాని, వికారములు గాని లేవు. అది భావముకంటే మునుముందే ఉండుటచే భావాతీతమైనది. అది గుణములకు వేరై ఉండుటచే త్రిగుణరహితమైనది. అనిర్వచనీయమై ఉండి కూడా, "ఉండుట - గ్రహించుట - ఆనందించుట" అను మూడు ప్రకటనలు కలిగి ఉంటోంది. (సత్-చిత్-ఆనందం)



ఓ రాఘవా! జాగ్రత్తు స్థిరప్రత్యయయుక్తమైనది - స్వప్నము అస్థిరమైనది... అనే అభిప్రాయం నీవు వెలిబుచ్చుచున్నావు కదా! అయితే స్వప్నము కూడా ఆ స్వప్నము అనుభవించ బడుచున్నట్టి సమయంలో "ఇది వాస్తవమే" అనే అభిప్రాయము కలుగజేస్తూనే ఉన్నది. అట్టి అభిప్రాయం కలిగించకపోతే 'స్వప్నము' అనే అనుభవమే ఉండేది కాదు. అంటే స్వప్నము కూడా ఆ స్వప్న సమయములో జాగ్రత్తు లక్షణములు కలిగి ఉంటున్నట్లే కదా!

అదే విధంగా ఈ 'జాగ్రత్తు' కూడా అనేక అస్థిరములైన విశేషములు కలిగి ఉండటం చేత ఇదంతా స్వప్నతుల్యమే అగుచున్నది. ఇక "అనుభవ విశేషం" (The process of experiencing) విషయానికి వస్తే.... "ఇది స్థిరము – ఇది అస్థిరము" అను భావన ప్రాప్తించటం తప్పించి, జాగ్రత్ స్వప్నములకు భేదమేమున్నది చెప్పు? ఆ రెండింటిలోని 'అనుభవం' అనునది మాత్రం సమమే అయి ఉన్నది. ఆ రెండూ కూడా ద్రష్ట యొక్క అనుభవములే కదా!

స్వప్నం కూడా స్వప్నకాలంలో కొంత స్థిరత్వమును జీవునకు పొందింపజేస్తూనే ఉన్నది. అందుచేత స్వప్నానుభవం జాగ్రత్ అనుభవమునకు సమానమైనదే.

అట్లాగే ఒకడు తనయొక్క బాల్యపు అనుభవములను, సంబంధములను, భావనలను గుర్తు తెచ్చుకుంటున్నప్పుడు అవన్నీ స్వప్నములాగానే హృదయాకాశంలో చూడబడుచూ ఉంటాయి. అసలు ఈ జాగ్రత్ – స్వప్నములను "అనుభవములు – అనుభవజ్ఞుడు... దృష్ట్యా చూచినప్పుడు ఏ అనుభవం ఎంతసేపు స్థిరంగా ఉంటోందో చెప్పు?

"స్వప్నము కూడా జాగ్రత్తువలెనే అనుభవం కాగలదు?"– అని చెప్పటానికి అనేక దృష్టాంతాలు ఉన్నాయి. "హరిశ్చంద్రుడు" అను రాజుకు ఒక్క రాత్రి యందలి స్వప్నంలో 12 సంవత్సరాల సుదీర్ఘమైన అనుభవం ప్రాప్తించింది. "అసత్యము పలుకకుండుట"... అను అతని జాగ్రత్ సంస్కారం స్వప్నంలో కూడా ప్రతిభాసించింది. ఏ బుద్ధియొక్క "స్థైర్యాంశము" (That which tends to be constant) చే మనం ఈ జాగ్రత్తును చూస్తూ "ఇదంతా సుస్థిరమైనదే"... అని భావన చేయటం జరుగుతోందో, అదే బుద్ధియొక్క స్థైర్యాంశము కారణంగా స్వప్నములో కూడా స్వప్న సమయంలో అట్టి భావనయే మనం కలిగి ఉంటున్నాం. "స్వప్నము కూడా జాగ్రత్తువలెనే అన్ని విధములా అనుభవమునకు రాగలదు" అనే విషయం మనం ఉత్పత్తి ప్రకరణం లోని లవణోపాఖ్యానంలో గమనించాము కదా!

స్వప్నంలో కూడా జాగ్రత్తువలె 'జ్ఞానాంశ' స్థిరమైనదే. అయితే 'స్వప్నబుద్ధి' కలిగి ఉన్నప్పుడు మాత్రమే స్వప్న వ్యవహారం ప్రాప్తించటం జరుగుతోంది.

ఏది ఎంతవరకు స్థిరంగా తోస్తూ ఉంటూఉంటోందో అది అంతవరకు 'జాగ్రత్తు'తో సమానమే కదా!

**జాగ్రత్తు -** ఇక్కడ (జగత్తులో) కనిపిస్తున్న అనేక విశేషాలన్నీ "క్షణభంగురమే" అయి ఉండుటచే ఈ జాగ్రత్తు కూడా స్వప్నము వంటిదే.

దేనిచేతనైతే ఈ శరీరము ఉజ్జీవించబడుతోందో, అట్టి శరీరాంతర్గత తత్త్వమునే, "తేజము, వీర్యము, జీవము, చైతన్యము" మొదలైన పేర్లతో పిలుస్తున్నారు. ఈ 'జీవించుట' అను కార్య క్రమమునకు హేతువు ఆ చైతన్యమే. ఈ శరీరం మనోవాక్కర్మలచే (by, thought, speech of action) వ్యవహారములు నిర్వర్తిసున్నప్పుడు... ప్రాణవాయువులచే ప్రేరితమైన జీవచైతన్యం హృదయం నుండి బయటకు వెడలుచున్నది. బాహ్య ప్రదేశాలలో సంచరిస్తోంది. జీవ చైతన్యం దేహాంతరంలో ఉన్న నాడులో సంచరిస్తున్నప్పుడు, శరీరమంతటా 'జ్ఞానం' లేక 'సంవిత్తు' ఉదయిస్తోంది.

ఆ జీవచైతన్యమే 'దృశ్యము' వైపు ప్రసరించుచున్నప్పుడు "జగత్తును పొందుచున్నాను" అను భావన పొందుచున్నది. ఇట్టి అనుభవమునే 'చిత్తము' అని అంటున్నాం. అనగా జీవచైతన్యమే దృశ్యమునకు సంబంధించిన 'జగత్ భ్రమ'ను తన యందు అంతు లేకుండా దర్శించుచున్నది. అట్టి జగత్భ్రమ అటు జాగ్రత్తులోను, ఇటు స్వప్నంలోను కూడా ఉదయిస్తుంది. విహారం సల్పుతోంది.

జాగ్రత్–స్వప్న దృశ్యాలు రెండూ చిత్తము యొక్క అంతర్గత–అంతరాంతర విశేషాలే!

**శ్రీరాముడు :** అయితే ఈ జగద్దర్శన వ్యవహారమంతా చిత్తము యొక్క అంతర్గతములో ఏర్పడి ఉంటున్న చమత్కారమేనంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఎట్లా అంటావా? ఈ జీవచైతన్యమే 'నేత్రములు' మొదలైన 'ఇంద్రియ ఛిద్రములు' గుండా బాహ్య ప్రదేశములకు వ్యాప్తి చెందుచున్నది కదా! అట్లు వ్యాప్తి చెందుచు, వాయువీచికవలె తాను ప్రసరించిన చోటును ఆక్రమించుచు పలువిధ వికారములచే పూర్ణమగు రూపమును తనయందే తాను గాంచుచున్నది.

జీవచైతన్యము స్వతహాగా స్థిరత్వమును పొంది ఉంటున్నప్పుడు, స్వీయ లక్షణమైన స్థిరత్వమును బాహ్యమున దర్శిస్తోంది. అదేరీతిగా స్వతహాగా అస్థిరత్వము పొందుచున్నప్పుడు, అదే అస్థిరత్వమును అట్లే అంతరమున కూడా దర్శిస్తోంది.

ఈ జీవుని యొక్క 'ఇది స్థిరముగానే ఉన్నది' అను భావన అతని "స్వసత్త" యొక్క స్థిరత్వము నకు సంబంధించినదే కాని, మరింక దేనికో సంబంధించినది కాదు. బాహ్యమున ఏదీ స్థిరత్వం కలిగియుండుటలేదు. అట్లే అంతరమున కూడా!

నీ భావనను అనుసరించే సర్వము నీయందు ప్రవర్తించుచున్నది. చిత్తమును అనుసరించే జగత్తు దృశ్యమానమగుచున్నది. స్వసంకల్పములను అనుసరించే, ఈ కనబడే నిత్యానిత్య అనుభవములు ఏర్పడటం, ఉండటం జరుగుతోంది.

దేనిని ఎట్లు పొందుచున్నావో, అదంతా అట్లు నీ చిత్తము నందే ప్రాప్తించుచున్నది.

స్వప్నం కూడా చిత్తము యొక్క 'జాగ్రత్తుకు వేరైనచోట' నిర్వర్తిస్తున్న స్వీయరచనా చమత్కృతియే!

**సుషుప్తి -** మరొక సమయంలో ఈ శరీరం మనస్సు - వాక్కు - కర్మలచే ఏ మాత్రం క్షోభ చెందకుండా ఉంటోంది. అనగా మనస్సు-వాక్కు-కర్మలు మౌనం లేక నిశ్శబ్దం వహించి ఉంటాయి. అప్పుడిక జీవచైతన్యము శాంతముగాను, స్వస్థతగాను ఉంటోంది. 'సమత్వము' చెందినట్టి ప్రాణవాయువుతో కూడి, అక్షుభితమై ఉంటోంది? గాలి వీచికలు లేనిచోట దీపం సంచలన రహితంగా ఉంటుంది చూచావా? "సుషుప్తి" అనబడు స్థితిని "నిశ్చలమగుచోట వెలిగే దీపం"తో పోల్చవచ్చు. ఈ సమయంలో అవయవములందలి నాడులయందు దృశ్య విషయ సంబంధమైన జీవప్రసారం ఉండదు. అనగా నేత్రములు మొదలైన ఇంద్రియముల ద్వారా బహిః ప్రసరణ (outward flowing) ఉండదు.

నువ్వులందు నూనె ఉన్నట్లు మంచునందు శీతలము ఉంటున్నట్లు, నెయ్యిలో తైలత్వము ఉంటున్నట్లు సుషుప్తిలోని జీవునియందు మనస్సు అంతర్గతమై మరుగునపడి ఉంటోంది. అట్టి సమయంలో, ఇంద్రియ విషయములేవీ ధ్యానింపబడుటలేదు. కనుక జీవ చైతన్యము బ్రహ్మాత్మ యందు సౌమ్యము వహించి ఉంటోంది. ఒకానొక "సౌమ్యప్రాణ సహిత స్థితి" అనుభవమౌతోంది. స్వప్న - జాగ్రత్తులకంటే వేరే ప్రత్యేకత గల మౌన స్థితిని పొంది ఉంటోంది.

అట్టి సుషుప్తదశలో జ్ఞాన అజ్ఞానములకు భేదం ఉండదు. కానీ 'ఎరుక' అనునది ఉండియే ఉంటుంది. ఆ ఎరుక సుషుప్తి సమయంలో 'మౌనము' అను అనుభవము పొందుచున్నది.

**తురీయము -** ఇది జాగ్రత్-స్వప్న-సుషుప్తులకంటే విలక్షణమైనది. అయితే, అట్టి మూడు సమయములందు అది ప్రకాశించుచూనే ఉన్నది. ప్రజ్వరిల్లుతూ ఉంటున్నది. ఇది వేరైనట్టి ఒక అవస్థ కానేకాదు. మూడు అవస్థలయందు కూడా నిశ్చలముగా, మార్పు-చేర్పులు పొందక ఉన్నట్టి నిత్యసాక్షిత్వమే "తురీయము".

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ తురీయావస్థ ఎప్పుడు ఎట్లు ఎట్టి వారిచే పొందబడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకడు అనేక ప్రయత్నముల ప్రయోజనంగా మరియు శాస్త్రసారమును ఎఱుగుటచే చైతన్యము యొక్క నిత్యసమత్వమును గ్రహించుచున్నాడు. తత్ప్రయోజనంగా, సమస్త దృశ్య వ్యవహారములనుండి 'ఉపరతి'ని పొందుచున్నాడు. ఈ రెండింటినీ సునిశితపరచుచున్నట్టి స్వప్రయత్నముల చేతనే బ్రహ్మ సాక్షాత్కారము ప్రాప్తించుచున్నది.

ఏకాగ్రత, విచారణ యోగి "సర్వ సమత్వము' అనెడి దృఢమైన 'బోధ'ను కలిగి ఉంటున్నాడు. అతడు జాగ్రత్తు నందు ఉండవచ్చు... లేదా... స్వప్నావస్థయో లేక సుషుప్తావస్థయో ఆశ్రయించ వచ్చు. వ్యవహారశీలుడై ఈ సంసారిక, లౌకిక కార్యక్రమములందు నిమగ్నుడై ఉండవచ్చు. లేదా, సర్వ కార్యక్రమములను త్యజించి ఏకాంత నిష్ఠుడై ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికీ అతని "నిశ్చల-సర్వసమ-నిత్యోదిత" స్థితికి ఏమాత్రం లోటు ఉండటం లేదు. "ఈ నేను-నీవు-అతడు-జగత్తు అను వ్యవహారమంతా... సర్వపరిశేష్యము, స్వస్వరూపము అయినట్టి ... ఆత్మకంటే వేరే ఏమీ కాదు"... అని గ్రహించియే, అతడు ఈ సర్వమును దర్శించుచున్నాడు.

అట్టి స్థితినే మనం 'తురీయావస్థ' అంటున్నాం. వాస్తవానికి తురీయస్థితి అనిర్వచనీయమైనది. మాటలకు అందనిది. అయితే, అనుభవముచే గ్రహించబడేదే! జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు కేవల సాక్షియై, అతీతమై,.... ఆ మూడు విశేషములను తన యందు కలిగియుండి ఉన్నట్టిది.

**సుషుప్తి నుండి స్వప్న జాగ్రత్తులకు పునఃప్రయాణం -** సుషుప్తి యందు జీవచైతన్యము సౌమ్యత్వమును పొందుచూ, ప్రాణములతో సంచలనరహితమైన ఏకత్వము పొందుతోంది కదా! అట్టి జీవచైతన్యము కొంత సమయమైన తరువాత మరల ప్రాణములచే సంచాలితమగుచున్నది. అప్పుడు అనుభవమునకు సంబంధించిన స్పందన పొందనారంభిస్తోంది. క్రమంగా ఇంద్రియ దృశ్య విశేషముల గురించిన చాంచల్యముచే చలనము పొందుతోంది. అప్పుడు భోగము పొందుటకు అనుకూలమైనట్టి ఇతఃపూర్వపు సంస్కారముల 'ఉద్బోధ' రూపుదిద్దుకుంటోంది. అట్టి ఉద్బోధయే 'చిత్తము' రూపమున ఉదయించుచున్నది.

**సుషుప్తి నుండి స్వప్నములోనికి పునరాగమనం -** స్వప్నస్థితి యొక్క పునఃప్రవేశ సమయంలో జీవచైతన్యము భావాభావముల రూపమున కల్పనా జగత్తును భ్రమగా పొందుతోంది. అట్టి భ్రమల యొక్క ఫలితంగా తన అంతఃకరణము నందే దృశ్యమును శీఘ్రంగా అవలోకించటం, తాను అద్దాని యందు పాల్గొన్నట్టి అనుభవం పొందటం జరుగుతోంది.

ఎప్పుడైతే జీవచైతన్యము ప్రాణవాయువుచే కొంచెము సంక్షుభితం అవుతుందో, అప్పుడు 'భావనచేయుట' అను స్థితిని పొందుచున్నది. ఇక ఎక్కువగా సంక్షుభితం అవటం జరిగితే అప్పుడు విపరీత భావనలను ఆ స్వప్న జగత్తునందే పొందటం జరుగుతోంది.

నాడులు 'శ్లేష్మజలము'చే పూర్ణమై ఉండునప్పుడు, ఆ సమయంలో నిద్రావస్థలో ఉండే జీవుడు తన అంతఃకరణలోనే అనుభవములు, సంఘటనలు, సంభ్రమములు పొందుచున్నాడు. అదంతా "బాహ్యమున ఏర్పడే ఏవేవో సంఘటనలే" అనుకుని అతడు దర్శిస్తూ ఉంటాడు. స్వప్న సమయంలో నాడులు రక్తముచే పూర్ణమై ఉంటాయి. ధాతుమయమైన ప్రదేశమును, కల్పితమైన కాలమును జీవుడు తనయందు భావనాపూర్వకంగా జాగ్రత్తుతో సమానంగానే గాంచుచు, "ఇదంతా బాహ్యమునందే ఏర్పడుతోంది"... అని మాత్రం అనుకుంటూనే పొందుచున్నాడు.

**స్వప్నానుభవం కూడా జాగ్రదనుభవం వంటిదే! -** ఈ జీవుడు స్వప్నములో కూడా "నేత్రాదుల ద్వారా జాగ్రత్తులో బాహ్యము నందలి వస్తు జాలమును అవలోకించుట... అను అనుభవముతో సమానమైన వ్యవహారత్వమునే పొందుచున్నాడు. వాస్తవానికి అతడు భౌతికమైన నేత్రములను ఉపయోగించటమే లేదు. నేత్ర రహిత సందర్శనం కొనసాగుతోంది.

**శ్రీరాముడు :** స్వప్నంలో సంఘటనలు రచించుచున్నది స్వప్నద్రష్టయేనా? మరింకెవ్వరన్నానా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ జీవుడు అనుభవములు అనునది స్వరూపముగా కలవాడే అయివున్నాడు కదా! ఇతడు తనయందు ఏ వాసనలు కలిగివుంటే స్వప్నములో ఆ వాసనలకు సంబంధించిన సంఘటనలనే గాంచుచున్నాడు. అయితే, ఆ స్వప్నము పొందుచున్న సమయంలో జీవచైతన్యము

ఈ నేత్రములు మొదలైన ఇంద్రియములలోకి ప్రసరించకుండానే ఆలోచనా సంక్షుబ్ధమును (Disturbance by coming across series of thoughts) మాత్రం పొందుచున్నది. అది తన అంతః కరణమునందే తన వాసనలను అనుసరించి ఆయా పదార్థములకు సంఘటనలకు సంబంధించిన అనుభవం కల్పించుకొనుచున్నది.

అందుచేత, ఈ జీవునియందు స్వప్నము బాహ్యము నుండి మరెవ్వరో కల్పించుటలేదు.

**అనాక్రాన్తేన్ద్రియచ్ఛిద్రో యతః క్షుబ్ధోఽన్తరేవసః ।**
**సంవిదానుభవత్యాశు సస్వప్న ఇతి కథ్యతే ॥** (సర్గ 19, శ్లో. 33)

స్వప్నం (నిర్వచనం) = జీవచైతన్యము యొక్క మందబుద్ధి వాసనలతో కూడినప్పటి భావ తరంగములు. అంటే భౌతికమైన ఇంద్రియములు నిద్రాణమై ఉండగా, మనస్సుచే లేక ఊహ యందు ఇంద్రియానుభవములు గాంచటం.

బుద్ధి మందముగా ఉండటం, వాసనలు విజృంభించుట, ఆర్తి... ఈ మూడు అటు స్వప్నమునకు, ఇటు జాగ్రత్తుకు కూడా కారణమగుచున్నాయని గ్రహించు.

**జాగ్రత్తులోకి పునఃప్రవేశం -**

**సమాక్రాన్తేద్ధియచ్ఛిద్రో యః క్షుబ్ధోవాయునాయదా ।**
**పరిపశ్యతి తజ్జాగ్రదిత్యాహుర్మని సత్మమాః ॥** (సర్గ 19, శ్లో. 34)

జీవుడు ప్రాణవాయువుచే విక్షుబ్ధమై బాహ్యశబ్దాది విషయములను కాంచుటను మునులు జాగ్రత్తని వచిస్తున్నారు. అంటే ప్రాణవాయువు నాడులందు ఇంద్రియములందు ప్రసరించు చుండగా, 'బాహ్య వస్తువుల విషయములు' సంస్పర్శను వాసనలతో కూడి భావనలతో జోడించి అనుభవమును పొందటం.

అయితే, జ్ఞానవంతుడు, ధీమంతుడు అయిన వాడెవ్వడూ అసత్యమగు ఈ జగత్తు నందు ఎన్నడూ సత్యత్వ బుద్ధి కలిగియుండడు సుమా!

ఈ స్వప్నతుల్యమగు వ్యవహారములందు "ఇవన్నీ సత్యమే" అని భావన చేసేవాని దృష్టియే స్వయంగా.... ఆధ్యాత్మిక –ఆధిభౌతిక –ఆధిదైవిక... తాపాలు పొందటానికి కారణమగుచున్నది.

ఈ 'జాగ్రత్తు' విషయమై సత్యత్వబుద్ధిని ఆశ్రయించే సంసారజీవుల స్థితి ఎన్నెన్ని దోషములకు చోటు ఇస్తోందో చెప్పటం ఎవరితరం? ఈ 'దృశ్య లేక సంసార' వ్యవహారంలో కనిపిస్తున్న ఈ విశేషములు సత్యము, నిత్యము"... అను తాదాత్మ్యమే మృతమనీ....ఇందలి అసత్యమును అనిత్యమును ఎఱిగి, తాదాత్మ్యము చెందకుండుటే అమృతత్వమనీ కవులు చెప్పుచున్నారు.

అందుచేత అట్టి సంసార సత్యత్వదృష్టిని జయించుటను "మృత్యువును జయించుట" అని గ్రహించు.

❖❖❖

# 11. మనస్సు యొక్క రూపము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఇప్పుడు నీకు 'జాగ్రత్-స్వప్నము-సుషుప్తు'ల స్వరూపమేమిటో కొన్ని విశేషాలు చెప్పాను కదా! ఇదంతా ఆత్మవిషయం ప్రకటించటానికి వీలుగా చెప్పాను. అంతకు మించి వాటిచే వేరే ప్రయోజనం లేదు.

ఒక ఇనుపగుండు అగ్నితో సంబంధం పెట్టుకున్నదనుకో... అప్పుడేమౌతుంది? అగ్ని యొక్క రూపమునే పొందుతుంది కదా! అదేవిధంగా ఈ చిత్తము దృఢనిశ్చయముతో ఏ పదార్థములను ఎంతగా భావిస్తుందో అంతవరకు అద్దానిరూపమునే చెందుచున్నది. "భావము-అభావము", "గ్రహించుట-త్యజించుట"... మొదలైన దృష్టులన్నీ చైతన్యం నందే కల్పించబడుచున్నాయి. ఇక్కడ ఏవేవి కనిపిస్తున్నాయో అవన్నీ 'కల్పన'యే రూపముగా కలిగి ఉన్నాయి కాబట్టి అవి సత్యములు ఎట్లా అవుతాయి చెప్పు?

**శ్రీరాముడు :** కాని, అనుభవమవటం జరుగుతోంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఈ జీవుడు "కల్పన" (Projections of the Mind) ను ఆశ్రయించినంత కాలం ఈ దృశ్యవ్యవహారం సంప్రాప్తమై ఎదురుగా ఉండియే ఉంటోంది కూడా! ఏమరువ వీలులేదు. అందుచేత మనోచాపల్యముచే కలుగుచుండిన ఈ భావ అభావాలను, గ్రహణ త్యాగాలను "అనిర్వచనీయం" అని విజ్ఞులు అభివర్ణిస్తున్నారు. అవి మనస్సు యొక్క నిర్వచనాలను అనుసరించి ఉంటాయి. ఈ జగత్తును మనస్సే ఈ కనబడే విధంగా నిర్దేశించటంచేత ఇట్లు అనుభవమౌతోందయ్యా!

ఏది ఆత్మ కంటే తదితరమై తారసపడుతోందో అదంతా ఆ ద్రష్ట యొక్క మనస్సే! స్వప్నసదృశమే! "వ్యష్టి" రూపమున భ్రాంతి ఏర్పడటానికి కర్త ఈ మనస్సే! అనగా, మనస్సే "నేను ఒక వ్యష్టిని" అని మననం చేయుటచే వ్యష్టి ఏర్పడుతోంది. అట్లే సమష్టి రూపమున 'జగత్ స్థితి'కి కారణమగుచున్నది కూడా మనస్సే సుమా! విశ్వమునకు కారణభూతమగు మనస్సే సర్వ కళంకములకు మూలము.

ఓ రామా! మనస్సే పురుషుడు. కాబట్టి ఎట్లాగైనా సరే, ఈ మనస్సును శుభమార్గమున నియోగించాలి. సర్వజనులారా! ఈ మనస్సును, దీని స్వభావమును చక్కగా గ్రహించండి. దీనిని శుభమార్గమునందే ప్రయత్నపూర్వకంగా నియోగించటం ఉచితం. సర్వదా శ్రేయస్కరం కూడా.

శుక్రాచార్యుని అనుభవం ఏమిటో గమనించారు కదా! ఈ భౌతిక దేహమే పురుషుడై ఉంటే అత్యంత బుద్ధిమంతుడైన శుక్రుడు అనేక వికారములతో కూడిన పెక్కు జన్మల గూర్చిన భ్రమ ఎలా పొందాడు? కనుక, పురుషకారము అనేది సర్వదా మనస్సుకు సంబంధించినదే కాని శరీరము నిర్వర్తించేది కాదు. ఆ 'గోడ' ఎట్లాగైతే కేవలం జడమాత్రమై స్వయం నిర్ణయాధికారము లేకయే ఉంటోందో, ఈ శరీరమునకు కూడా స్వయం నిర్ణయాధికారం లేదు. మనస్సు దేనిని మననం

చేస్తుందో అట్లే సర్వము ప్రాప్తిస్తోంది. అందుచేత ప్రయత్న పూర్వకంగా స్వల్పవిషయములన్నీ త్యజించబడుగాక! ఈ మనస్సు ఉత్తమోత్తమమైన దానియందే నియోగించబడుగాక!

**శ్రీరాముడు :** ఈ మనస్సును నియోగించుటకై, ఈ జగత్తు నందు అన్నిటికన్నా ఉత్తమోత్తమమైనదేది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అన్నిటికన్నా ఉత్తమోత్తమమైనది. మహత్తరమైనది "స్వస్వరూపమే".

**శ్రీ రాముడు :** అట్టి స్వస్వరూపమును మనస్సుతో ధ్యానించుటకు ఎప్పుడు ఎక్కడ ఎట్లు ఉపక్రమించాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వస్వరూపమును ధ్యానించుటలో, భావించుటలో మరొక ప్రదేశమునకు వెళ్ళవలసిన పనేమున్నది? సర్వజనులారా! ఆత్మ వస్తువు సర్వదా ఉపాధిరహితం. భ్రమ రహితం, అప్రమేయం, నిత్యం అయివున్నది. అట్టి ఆత్మవస్తువునే సర్వదా ధ్యానించండి. అట్టి ప్రయత్నంలో శ్రమ ఏదీ ఉండదు సుమా! "నేను సర్వదా అఖండము, జన్మరహితము అయిన ఆత్మనే"... అని భావించుటలో కష్టమేముంటుంది? మరికొంత కాలం తరువాతనో, లేక ఏదో కార్యక్రమము ముగించిన తరువాతనో ఆత్మ సంబంధించిన 'ఉపాసన' ఆరంభించాలనుకోవటం అజ్ఞాన పూర్వకమైన అభిప్రాయమని మేము గమనిస్తున్నాం.

ఇప్పుడే, ఇక్కడే, ఏది ఎట్లు ఉంటోందో అదంతా అట్లు ఉండగానే "స్వస్వరూపమును ధ్యానించుట, భావించుట" తప్పక చేయవచ్చని అందరికీ మనవి చేస్తున్నాను. జీవుడు ఏ రూపాన్ని ధ్యానిస్తే అతడు అట్టి రూపముగానే పరిణమిస్తున్నాడు. లేక, పొందుచున్నాడు. ఆత్మ యొక్క అప్రమేయత్వంను, నిర్వికల్పత్వంను ధ్యానించు జీవి ఆత్మత్వమునే అనుభవంగా పొందుచున్నాడు.

**శ్రీరాముడు :** స్వామి! మా పై కరుణతో "ఆత్మను భావించుట" అనగా ఏమిటో మరికొంత విశేషయుక్తంగా చెప్పండి.






**శ్రీ వసిష్ఠ మహర్షి :** "సంకల్పములను రచించుట, లేక నిర్వర్తించుట" అను స్వభావముగల ఈ జీవుడు సంకల్పములు ప్రారంభం కాకముందే, ఉండి ఉన్నాడు. అట్టి సంకల్పములకు 'ఆదిస్థితి' యందు అతడు అనిర్వచనీయుడై, వాక్కు మొదలైన వాటికి అందనివాడై, శుద్ధతత్వస్వరూపుడై ఉండి ఉన్నాడు కదా! ఆ శుద్ధతత్వమే.. 'ఆత్మ' అను శబ్దముచే ఉద్దేశ్యించబడుతోంది. అట్టి ఆత్మ సంకల్పించు సమయము నందు కూడా... ఉండి ఉన్నది. అట్టి శుద్ధతత్వమే స్వస్వరూపము.

స్వస్వరూపభావనచే ఏర్పడు నిశ్చలత్వం, అసంగత్వములే ఆత్మ సాక్షాత్కారముగా చెప్ప బడుతోంది. అట్టి ఆత్మానుభవమునకు సర్వులు అర్హులే. ఓ జనులారా! మీరంతా బలవంతులై అందుకు అర్హత సముపార్జించు కోవాలి. అంతేగాని, "ఈ నా వర్తమానం అందుకు అడ్డు కదా!" అని భావించి ప్రవాహపతితులు కావద్దని హెచ్చరిస్తున్నాను.

❖

**అభిపతతి మనః స్థితః శరీరం నతువపురాచరితం మనః ప్రయాతి।**
**అభిపతతి తవాత్ర తేనసత్యం సుభగమనః ప్రజహాత్వసత్యమన్యత్ ॥** (సర్గ 20, శ్లో. 9)

ఈ మనస్సు ఎక్కడుంటే అక్కడికి 'శరీరము' ఆవశ్యము పోగలదు. కాని, శరీరము ఎక్కడుంటే అక్కడికి మనస్సు పోవలెనను నియమము లేదు. మరింక ఈ శరీరము గురించి భ్రమపొందవలసిన పనేమున్నది?

ఈ శరీరము ఎక్కడ ఉండవలసివస్తోందో అక్కడే ఉండనివ్వండి. మనస్సును మాత్రం స్వస్వరూపము నందు సుస్థిరం చేయండి. ఓ రామచంద్రా! నిత్యసత్యమైయున్నట్టి 'ఆత్మవస్తు ప్రాప్తి' యందు మాత్రమే నీ మనస్సు నియోగించబడుగాక! అందుచేత 'అసత్యములే' అయినట్టి ఈ దేహ, ఇంద్రియాలను, తదితర భేదపూర్వకమైన భ్రమలను నీవు త్యజించివేయి. ఈ దేహ, ఇంద్రియాల పట్ల గూడుకట్టుకొని ఉన్న విశ్వాసం నుండే సర్వసంసార భ్రమలు, బంధములు మరింతగా ఏర్పడు చున్నాయిని గ్రహించు.

చైతన్యతత్వమైయున్న నీ శుద్ధ స్వరూపమునకు జడపదార్థములైనట్టి ఈ శరీరాదులను ఆపాదించి భ్రమ చెందవద్దు. "ఈ శరీరమే నేను. ఆ శరీరము మరొకరు" అను భావనలోని అనర్థమేమిటో ముందు గ్రహించు.

స్వస్వరూపతేజోమయుడవై ప్రకాశించుచూ సర్వలోకములకు శుభప్రదుడవయ్యేదవుగాక!

❖❖❖

# 12. విజ్ఞానవాదము

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! ధర్మజ్ఞా! సముద్రంలో బడబాగ్నిలాగా, నా హృదయంలో ఇప్పుడు ఒక గొప్ప సందేహం పుట్టి కల్లోలం కలిగిస్తోంది. అదేమిటో చెపుతాను. వినండి.

"బ్రహ్మం దేశ-కాలాదులచే పరిచ్ఛిన్నమయ్యేది కాదు. అది సర్వదా వ్యాపకమై, నిరామయమై ఉంది"... అని మనం అనుకున్నాం కదా! అట్టి "నిష్కళంక - నిర్వస్తువు" అగు

బ్రహ్మం నందు విషయాకారముచే కలుషితమైనట్టి ఈ 'మనస్సు' అనబడేది ఎట్లా, ఏ కారణం చేత, ఏ రూపమున, ఎప్పటి నుండి స్థితిపొంది ఉంటోంది? ఆత్మజ్ఞులు శాస్త్రములు.. "బ్రహ్మము నందు అవిద్యా రూపమైన కళంకము ఏ కాలమందును లేదు"... అని చెప్పుచుండటం జరుగుతోంది. మరి ఈ మనస్సు ఎట్లు, ఏ కారణంగా ఉదయిస్తోంది?..., ఈ విషయం ముందు చెప్పండి. అటుపై 'ఈ మనసును నిరోధించుటెట్లా? అనే ప్రశ్నను మరల పరిశీలించవచ్చు. ఈ ప్రశ్నపై కొంత సంవాదము జరిగింది కానీ, ఇంకా కొంత వినాలని నా అభిలాష.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చాలా చక్కగా, మంచి ప్రశ్నకే వచ్చావు. ఇప్పుడు నీ బుద్ధి మోక్షమును పొందుటకు సంపూర్ణమగు అర్హత పొందుచున్నదని నేను భావిస్తున్నాను. పూర్వాపరవిచారణ యందు తత్పరమైయున్న నీ బుద్ధియొక్క ప్రభావంచేత శంకరాదులు పొందిన ఉత్తమస్థితిని నీవు తప్పక పొందగలవు.

అయితే మనం ఇప్పుడు "స్థితి ప్రకరణం"లో ఉన్నాం కదా! వర్తమాన విషయవిచారణ దృష్ట్యా నీ ప్రశ్నకు ఇది తగిన సమయం కాదు. నిర్వాణ ప్రకరణంలో ప్రవేశించినప్పుడు మనం "ఆత్మకు మలినత్వం ఎట్లా వచ్చినది?" అనే ప్రశ్నను కొన్ని కోణముల నుండి పరిశీలిస్తాం. ప్రస్తుతం "ఆత్మ స్వతహాగా శుద్ధమైనది" అనే విషయం అనేక దృక్పథముల నుండి నిరూపిస్తున్నాం. "మనస్సు ఎట్లా ఉదయిస్తోంది" అనుదానిగురించి, "శుద్ధాత్మానుభవం' గురించి మనం నిర్వాణ ప్రకరణంలో పరిశీలిస్తున్నప్పుడు ఈ నీ ప్రశ్న అడుగు. "శుద్ధమైన ఆత్మకు దోషమెట్లా ప్రాప్తించింది?" అనే విషయం నిర్వాణ ప్రకరణంలో సవివరంగా, విస్తారంగా చర్చించబోతున్నాం. ఇప్పటికి మాత్రం "మనస్సును శుద్ధిపరచటమెట్లా?" అనేవిషయం ముఖ్యంగా పరిశీలిస్తున్నాం.

❖

మనం ఏ సిద్ధాంతం గురించి వర్తమానంలో విచారిస్తున్నామో అద్దానిని గురించి ఇప్పటికి చర్చించటం (అవగాహనా సౌలభ్యం దృష్ట్యా) ఉచితం కదా!

❖

ఇప్పుడు మనం "ఉత్తమమైన అవగాహన కలిగియున్న మనస్సు" గురించి విచారిద్దాం. ఈ ప్రాణ సమూహమంతా "జన్మ-కర్మలు" అనే జాలములో చిక్కి ఆయా పాట్లు పొందుచున్నది. ఏ కారణంగా? మనస్సు కారణంగా కదా!

మనస్సే ... ప్రకృతి, కర్మ కూడా!

**మనస్సు -** అజ్ఞాని అవిచారణ కారణంగా "స్వతహాగా అసత్యమే" అయినట్టి అనేక భ్రమలతో కూడిన అనుభవములను పొందుచున్నాడు. అజ్ఞానముతో ఉపసహితమైన చైతన్యమును 'ప్రకృతి' అంటున్నాం. మనన ధర్మము చేత 'ప్రకృతి' అనునది ఏర్పడుచున్నది. కాబట్టి మనస్సు అంటే కూడా అదే సుమా! ఆ స్థితియందు "ప్రియత్వము – ఉద్వేగము"లతో కూడిన కర్మేంద్రియ వ్యాపారములు నిర్వర్తించబడుచూ ఉంటాయి. కాబట్టి దీనినే "కర్మ" అని కూడా నిర్ణయిస్తుంటారు.

ఈ "మనస్సు-కర్మలు-జీవుడు-భగవంతుడు" అను విషయములకు భిన్న మత వాదులు చిత్ర విచిత్రములైన శాస్త్రదృష్టులను, అనేక నామరూపములను కల్పన చేసి తమ అనుయాయుల ముందు ఉంచుచున్నారు. వాటి గురించి క్లుప్తంగా కొన్ని విషయాలు చెపుతాను. అవన్నీ నీ ప్రశ్నకు తగిన సమాధాన సమన్వితమైన యోచనను అందిస్తాయి అనేది నా ఉద్దేశం.

**"వాసనల నుండి అవగాహనలు" -** 'సుగంధం' గల ప్రదేశంలో వర్తించిన వాయువు తాను సుగంధరూపమునే పొందుతుంది కదా! మననశక్తిచే చంచలమై ఉంటున్న ఈ మనస్సు, యే వాసనతో గూడి, ఎట్టి భావమును గ్రహిస్తుందో తాను అట్టి రూపమునే పొందుతూ ఉంటుంది. ఈ కారణం చేత కొందరు తమ వాసనలచే కల్పితములైన ఆయా సిద్ధాంతములను ఆయా యుక్తుల సహాయంతో నిర్ణయిస్తున్నారు.

అట్టి 'అవగాహన' వారు 'అత్యంత వాస్తవమైనది' గానే గాంచటం జరుగుచున్నది.

పదార్థములను భావన చేయు స్వభావము గల ఈ మనస్సు అట్టి పదార్థములతోటి తన్మయ మగుచున్నది. ఆ పదార్థ రూపమునే చెందుతోంది. మనస్సునకు వశమై వర్తించు ఆ శరీరము కూడా అదే రూపమును, అనుభవమును పొందుచున్నది.

జ్ఞానేంద్రియములు ఆయా విషయములందు ప్రవర్తించునప్పుడు ఈ కర్మేంద్రియములు కూడా ఆ విషయములందు ప్రవర్తిస్తున్నాయి. గాలిలో ధూళి ఏర్పడుచున్నట్లు, ఆత్మయందు ఈ కర్మ వ్యవహారమంతా సిద్ధిస్తోంది. కర్మేంద్రియములు నియమించబడుచుండగా, క్రియాశక్తి వ్యక్తమగుచున్నది.

కాబట్టి మనస్సు యొక్క బీజము "కర్మయే"! మరి, కర్మ యొక్క బీజమో? మనస్సే! 'పుష్పము – పరిమళము' ఒకదానితో మరొకటి అభేదమైనట్లు ఈ కర్మ – మనస్సులు వేరు వేరు కాదు.

దృఢమైన భావనావశం చేతనే మనస్సు 'మననము' అనుదానిని స్వీకరిస్తోంది. అట్టి భావన యొక్క ప్రభావం చేత 'స్పందము' లేక 'కర్మ' అనబడు శాఖ ఉత్పన్నమవుతుంది. ఈ మనస్సే క్రియను, ఆ క్రియయొక్క ఫలములను ఆదరభావంతో సిద్ధింపజేయుచున్నది. ఆ తరువాత "ఆయా కర్మల ఫలములను పొందుచున్నాను" అను అనుభవమును స్వీకరిస్తూ వెనువెంటనే బంధమున తగుల్కొనుచున్నది.

**అహమ్ త్వమ్ తత్ -** ఇప్పుడు విజ్ఞానవాదము ననసురించి 'అహమ్-త్వమ్-తత్'లను విశదీకరిస్తాను–

ఈ మనస్సు ఏ భావనను స్వీకరిస్తుందో, ఆ భావనయే నిశ్చయమై పరిణమిస్తోంది. దేనినైతే, "ఇది శ్రేయోదాయకము – ఇది కాదు – ఇప్పుడు నేను అల్పత్వములో ఉన్నాను – ఇట్లు వీరు చెప్పి నట్లు మాత్రమే ఆచరించాలి – అప్పుడు సముద్ధరించబడగలను"... అను రూపము గల భావోద్వేగము ఈ జీవుడు కలిగి ఉంటాడో... అది ఆ జీవునకు ఆ రీతిగానే సంప్రాప్తిస్తోంది.

వాసనాదార్ఢ్యముచే 'అహమ్–త్వమ్–తత్' శబ్దములకు వివిధ భావనలతో కూడిన భిన్నమైన మతనిశ్చయములు జనులచే స్వీకరించబడుచున్నాయి. ఆ నిశ్చయములను అనుసరించే వారు తమ తమ ధర్మార్థ కామమోక్షముల కొరకు ఆయా వేరు వేరు ప్రయత్నముల చేస్తూ ఉంటున్నారు. ఆ శబ్దముల కొన్ని నిర్వచనములను (కొన్ని శాస్త్రముల ప్రవచనములను) విను–

**కపిల సిద్ధాంతం -**

1) అహం = ఇది స్వతహాగా అనేక దోషములు కలిగి ఉంటోంది. అట్టి 'అహం(నేను) లోని దోషాలను శుశ్రూష, తపస్సు, ధ్యానం మొదలైన ప్రయత్నములచే తొలగించుకోవాలి.

2) త్వమ్ (నీవు) = ఈ 'నీవు' అను రూపంలో ప్రాప్తించేదంతా అత్యంత నిర్మలము, అసంగము అయి ఉన్నది.

3) తత్ (అది) = అహం, త్వమ్‌ల కంటే విలక్షణమైనది. అది కోపగించుట, ప్రేమించుట, వరాదులను ఇచ్చుట మొదలైన త్రిగుణములకు సంబంధించిన వ్యవహారములను నిర్వర్తిస్తూ ఉంటుంది. సత్కర్మలను సన్మానించటం, దుష్కర్మలను శిక్షించటం నిర్వర్తిస్తూ ఉంటుంది.

**సగుణ బ్రహ్మవాదులు -** వీరు భగవంతునకు గుణములు ఆపాదిస్తూ మరల మరల అట్టి నిశ్చయమునే ధ్రువీకరించటం జరుగుతోంది. అట్టివారు సగుణ బ్రహ్మమును ప్రవచిస్తున్నారు. తదనుకూలంగానే, శాస్త్రములు రచించబడటం, ప్రవచించబడటం జరుగుతోంది.

అనగా, ఈ జగత్తుకు ఏది ఉపాదాన కారణమో అట్టి 'తత్' (భగవంతుడు) కూడా సుఖ దుఃఖ జడాత్మకమగు జగత్తు వలె గుణాత్మకమని వారిచే ప్రతిపాదించబడుతోంది.

**పరిణామవాదులు -** మరికొన్ని సిద్ధాంతముల ప్రకారం... ఈ జీవుడు చేసే ఆయా సాధనల యొక్క అంతిమ ప్రయోజనంగా ఈ 'అహమ్'... త్వమ్‌లోనూ, త్వమ్ వెళ్ళి 'తత్'లోనూ విలీనమై పోతోంది. చివరికి 'తత్'యే ఆద్యంతములలో శేషించి ఉంటోంది.

ఇట్లా ఇంకా ఎన్నో సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి.

❖

ఇక్కడ మనం ఒక ముఖ్యమైన విషయం గమనించాలి. భిన్న సిద్ధాంతములు ప్రతిపాదించే వారిలో కొందరు, "మేము చెప్పేదే ఉపాయం. ఇది తప్ప మరింకే విధంగాను ఎవ్వరికీ మోక్షము లభించదు"– అనే నిశ్చయమును చెప్పుచున్నారు. అయితే ఆ గురువులు వారి శిష్యులందు కొంత ఏకాగ్రత, ధారణ అలవడుటకు అట్లు "ఇట్లే అనుసరించండి" అని చెప్పటం జరుగుతోంది. వారి శిష్య ప్రశిష్యుల అవగాహనలో కొంత అల్పమైన విజ్ఞాన దృష్టి ఏర్పడటం కూడా జరుగు తోంది. అప్పుడు ఒక అభిమతమును ఆశ్రయించువారు "స్వసంకల్పితమైన నియమములు" అనే భ్రమచే ఇతర ఉపాయములను విచారణలను, అవగాహనలను దూరం నుండే నిరసించటం, విభేదించటం జరుగుతోంది.

వేరు వేరు గురువులు వేరు రీతులలో విధివిధానములు, నియమములు నిర్ణయిస్తూ, జీవిత పరమార్థములు – జ్ఞానవిజ్ఞాన విశేషములు ప్రవచిస్తున్నారు. అయితే, వారి శిష్య, ప్రశిష్యులలో కొందరు పరమార్థం ఏమిటో మరచి కేవలం విధి, విధానాలను మాత్రం అవిచారణ పూర్వకంగా ఆశ్రయిస్తూ తదితర గురువులను, ఇతర గురువులు చెప్పు జ్ఞాన, విజ్ఞాన విశేషములను మొదలే ద్వేషించటం, చేస్తున్నారు. తద్వారా కలహించుకోవటం, హింసించుకోవటం చూస్తున్నాం.

ఇదంతా బాలురు, మూర్ఖులు, రాగద్వేషపూరితులు, జాత్యహంకారులు అగు వారి వలననే అట్లు ప్రాప్తిస్తోంది. గురువులు తమ తపోధ్యానాలచే గ్రహించినది లోకక్షేమం కోరి ప్రవచిస్తుంటే, అందలి జ్ఞానసారాన్ని మానవాళి అంతా గ్రహించవచ్చు. స్వవివేకముచే పరిశీలించవచ్చు.

ఏ ఉత్తమ భావనను అంతరంగమున ఆశయపూర్వకంగా స్వీకరించి, అందుకు గాను ప్రయత్నశీలురమౌతామో అదియే ప్రయత్నముల తీవ్రతను అనుసరించి, ఆ రూపమైన ప్రయోజనమే ప్రాప్తిస్తూ ఉంటుంది.

అందుచేత భావ ఔన్నత్యము చేతనే మనస్సు కుదుట పడగలదు. ఎప్పుడు ఒకని "సర్వము ఆత్మవిన్యాసమే" అను ఆశయమునకు సానుకూలమై ఉంటుందో, అది అతనికి మరింత శోభాయ మానమని మా అభిప్రాయం.

**ఇంకా కొన్ని సిద్ధాంతాలు -**

**వేదాంతవాదులు -** వీరు శ్రుతులను (వేదములును) ప్రమాణంగా తీసుకొని 'అధ్యారోపవాద న్యాయమును' అనుసరించి "ఈ జగత్తంతా బ్రహ్మమే. బ్రహ్మమునకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు"... అనే నిశ్చయమును దృఢపరచుకోవలసినదిగా ప్రవచిస్తున్నారు. "అట్టి దృఢ నిశ్చయము చేతను, శమదమాదులను నిరంతరం ఆశ్రయించుట చేతను సర్వోత్తమమగు 'ముక్తి' లభించ గలదు" అని చెప్పుచున్నారు. అందుకు విరుద్ధమగు మరి దేనిచేత కూడా ముక్తి లభించదని ప్రకటన చేస్తున్నారు. తదనుకూలంగా శాస్త్రములు ప్రవచించుచున్నారు.

అయితే వారిలో కొందరు "మేము నిర్ణయించుకున్న విధి నియమములు" మాత్రమే వాస్తవము, తదితర విషయము లేవీ "మోక్షసాధకములు కావు" అనునది వాదన పూర్వకంగా ప్రకటిస్తున్నారు. కనుకనే, ఇంతలోనే అభేద దృష్టి నుండి చ్యుతి పొందటం జరుగుతోంది.

**విజ్ఞానవాదులు -** "స్వబుద్ధి చేతను, శమ, దమములచేతను మాత్రమే ముక్తి లభించగలదు. మరింకే ఉపాయం లేదు"... అని ప్రతిపాదించుచు, ఈ బుద్ధి సునిశితమగుటకు గాను కొన్ని నియమ, నిష్ఠలు చెప్పుచున్నారు. ఈ సిద్ధాంతమునే గ్రంథాదుల ద్వారా ప్రకటించుచున్నారు.

**అర్హతాదులు -** వీరూ విజ్ఞానవాదమే ప్రకటిస్తున్నారు. అయితే, స్వాభిమతమును అనుసరించి చిత్ర విచిత్రములైన దిగంబరత్వము, భిక్షాటనము మొదలైన ఆచారములను కల్పించి, తదనుగుణంగా గ్రంథములను నిర్మించి ప్రచారం చేస్తున్నారు.

ఇంకను మరికొన్ని సిద్ధాంతముల ప్రకారం "ఈ జీవుడు బాహ్యదృష్టిచే జీవత్వము, స్వస్వరూపముచే శివత్వము వహించియున్నాడు. సర్వజీవులు ఆ శివత్వము నుండి ప్రకటిత మగుచున్న కిరణముల వంటి వారే!"... అను 'తత్త్వమ్' భావనను ప్రకటిస్తున్నాయి.

చూచావా! ఇక్కడ మనం దృష్టాంతము కొరకు రెండు మూడు సిద్ధాంతములను సంగ్రహంగా చెప్పుకున్నాం. వాస్తవానికి అనేక విచిత్రములైన సిద్ధాంతములు, (భగవంతుని గురించిన) అవగాహనలు భగవదన్వేషకులచే ఆశ్రయించబడుతున్నాయి. మరికొందరు అన్వేషకులు తమ యొక్క అవగాహనను, స్వవివేకమును, పరిశీలనను ప్రక్కకుపెట్టి, ఇక కేవలం తదితర సిద్ధాంతములను ఖండించుట యందు, తిరస్కరించుట యందు మాత్రమే నిమగ్నమైయున్నారు.

ఓ రాఘవా! ఏ నిమిత్తం లేకుండానే శాంతజలమునందు అనేక బుద్బుదములు ఉత్పన్న మౌతాయి కదా! అట్లే అకారణంగా అనేక నిశ్చయములను ప్రకటించు వేరు వేరు శాస్త్రరీతులు, వాటిని ఉద్బోధించు గురువులు ఈ ప్రపంచంలో ఏర్పడటం జరిగింది. మరింకెన్నో శాస్త్రరీతులు ఏర్పడబోవుచున్నాయి.

మణులన్నిటికీ సముద్రమే నిలయం కదా! వివిధ శాస్త్రరీతులన్నిటికీ మనస్సే 'ఉనికిపట్టు'.

"మా గురువు చెప్పినదే వినాలి. మరింకెవ్వరు ఏమి చెప్పినా ఎవ్వరూ వినకండి"... అని నిర్దేశించువారు, ఇతర వాదములను, అభిప్రాయములను ద్వేషించువారు కలహించుకొను వారు 'సత్' వస్తువును పొందేదెట్లా?

ఇక్కడ ఒక రహస్యం చెపుతాను విను. వేప చేదు కాదు. చెఱకు తీపి కాదు. అట్లే చంద్రుడు శీతలము కాదు. అగ్ని ఉష్ణము కాదు. ఎవడు ఏ అనుభవమును చిరకాలంగా "ఇది మధురం... ఇది అప్రియం, ఇది సుందరం, ఇది ద్వేషింపతగినది, ఇది స్వీకరించాలి, ఇది తిరస్కరించాలి" అని భావనచేస్తాడో అది అతనికి అట్లే ప్రాప్తించటం జరుగుతూ ఉంటుంది. ఆ వస్తువా, ఇక ఆ రీతిగానే అనుభవమౌతుంది. ఈ కారణంచేతనే చంద్ర-సూర్య-అగ్ని మండలములలో నివసిస్తున్న దేవతలు, యక్షులు మొదలైన జీవులకు 'శీతలము-ఉష్ణము' మొదలైన బాధలు కలగటమే లేదు. ఈ శాస్త్రరీతులు వాటి పట్ల ఏర్పడు రాగద్వేషాదులు అట్టివేనని జనులు గ్రహించెదరు గాక!

❖

ఓ సర్వజనులారా! 'జీవితము' అనునది అత్యంత విలువైనది. అట్టి ఈ అవకాశమును ఏవేవో వాదోపవాదములతో వృథాపరచుకోరాదని మా ఉద్దేశం. సర్వజనుల శ్రేయోభిలాషులమైన మేము మా అభిప్రాయమేమిటో కూడా ప్రకటించుచున్నాము. వినండి-

ఈ మానవుడు స్వతహాగా ఆనందమయస్వరూపుడే. అయితే, అతని స్వస్వరూపమునకు సంబంధించి సమగ్రము, ఉత్తమము అయిన 'అవగాహన' మరుగునపడి ఉంటోంది. అతని ఎరుక ఆయా రాగద్వేషాదులచే కప్పబడి, మేఘావృతమైన ఆకాశమువలె ఉంటోంది. అందుచేత జనులు నిరతిశయ బ్రహ్మానందము కొరకే యత్నించెదరు గాక! మనస్సును బ్రహ్మమయం చేయండి. తద్వారా బ్రహ్మమే ప్రాప్తిస్తోంది.

"నేను సర్వదా అఖండము, నిత్యము, నిర్మలము అయిన బ్రహ్మమునే అయి ఉన్నాను. 'నీవు – అది – జగత్తు'... ఇదంతా బ్రహ్మమే. అట్టి చైతన్య బ్రహ్మమే అందరియందు, అంతట ఏకస్థమై వెలయుచున్నది" అను భావనను ఈ మనస్సు ఆశ్రయించుగాక! అట్లు ఆశ్రయించటమే "మనస్సు బ్రహ్మమయమగుట"... అయి ఉన్నది.

ఒక బాలుడు బాటలో నడుస్తూ ఏవేవో పదార్థాలు చూచి "ఇవి నాకు ప్రియమైనవి... అందుచేత ఇవి నాకు కావాలి..." అని ప్రీతి గొనుటచే అవి అవశ్యం పొందవలసినవిగా కనబడతాయి కదా! అట్లే ఈ మనస్సు కూడా అనుక్షణం అనేక పదార్థముల పట్ల ఆకర్షణ – వికర్షణలను పొందుతోంది. ఫలితం? ఈ జీవునికి అనేక దుఃఖ పరంపరలు వచ్చిపడుచున్నాయి. అంతులే కుండా అసంఖ్యాకమైన 'జన్మలు' ప్రాప్తిస్తున్నాయి. ఎప్పుడైతే మనస్సు బ్రహ్మమయం అవుతుందో, ఇక తుచ్ఛములైన "దృశ్యముయొక్క ప్రాప్తిచే జనించు సుఖ దుఃఖములు" అట్టి జీవుని ఏమాత్రం క్షోభింపజేయలేవు.

**అపవిత్రమసద్రూపం మోహనంభయకారణమ్ ।**
**దృశ్యమాభాసమాభోగి బంధమాభావయానఘ ॥** (సర్గ 21, శ్లో 36)
**మాయైషాసాహ్యావిద్యైషా భావనైషాభయావహా ।**
**సంవిదస్తన్మయత్వం యత్తత్కర్మేతి విదుర్బుధాః ॥** (సర్గ 21, శ్లో 37)

ఓ రాఘవా! ఈ 'దృశ్యము' యొక్క స్వభావమేమిటో సునిశితంగా పరిశీలిస్తున్నావా? ఇదంతా అపవిత్రము, అజ్ఞానదాయకము, అసద్రూపము, భయహేతువు, బంధదాయకము అయి, ఈ జీవునికి ప్రాప్తిస్తోంది. ఎందుచేత?... ఈ జీవుడు విజ్ఞానముతో కూడిన విచారణను అలవరచుకోకపోవటం చేతనే సుమా! అందుచేత, ఈ దృశ్యమును నీవు భావనయే చేయకపోతే, అది ఇంకేమి చేయగలదు చెప్పు? "అసలు ద్రష్ట దృశ్యమయమగుట... అనునదే బంధమునకు హేతువు అయినట్టి కర్మ" అని బుద్ధిమంతులు చెప్పుచూ ఉంటారు. అదియే మాయ, అదియే అవిద్య కూడా! భయప్రదమగు భావనకూడా అదియే.

'మనస్సు' అంటే 'దృశ్యము' అనే అర్థం సుమా!

మనస్సే మోహ, అజ్ఞానములకు హేతువైయున్నది. అనేక ఆసక్తులు, ద్వంద్వములు ఈ మనస్సులో నిరంతరం పరిభ్రమిస్తున్నాయి. అట్టి బురదతో నిండియున్న ఈ మనస్సును శుద్ధం చేయాలి. సంసారపు మత్తు అంటే ఏమిటి? ఏ దృశ్యతన్మయత్వమైతే స్వభావ సిద్ధంగానే ఉదయించి అనుభవమౌతోందో... అద్దానినే 'సంసారం' అని అంటున్నాం. దృశ్యరూపత్వమే అవిద్య మరియు అజ్ఞానం కూడా! మేఘములచే కప్పబడినప్పుడు సూర్యుడు కనిపించడు కదా! ఈ దృశ్యముచే ఆవరించబడిన ఈ జీవులు కూడా పరమశ్రేయమగు స్వస్వరూపమును దర్శించలేకున్నారు.

ఈ 'అవిద్య' ఎట్లా ఉత్పన్నమౌతోంది?.... ఇది సంకల్పమాత్రం చేతనే ఉత్పన్నమగుచున్నది. ఒక బాలుడు ఆకాశంలో మేఘముల ఆకృతులను చూచి "అది చెట్టు. ఆ ప్రక్కన తటాకం, అక్కడ

ఒక మృగం,"... ఈ విధంగా ఆలాపన చేస్తాడు చూచావా? అట్లాగే ఈ దృశ్యం కూడా స్వయం కృతంగా జీవునకు ప్రాప్తిస్తోంది.

**శ్రీరాముడు :** ఈ 'అవిద్య' లేక 'దృశ్యభావన' శమించేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంకల్పముల కారణంగా ఏర్పడి ఉంటున్న అవిద్య... 'నిస్సంకల్పము' (సంకల్పించకుండటం) అని మౌనరూపయత్నముచే శమించగలదు. సంకల్పరాహిత్యముచే భావన నశిస్తుంది. అప్పుడు భావాతీతమగు స్వస్వరూపము యొక్క అనుభవం సుస్థిరమౌతుంది.

పదార్థముల పట్ల, విషయముల పట్ల అసంగమే అందుకు మార్గం.

1) 'సమాధి' (Complete cessation of thought) యొక్క దార్ఢ్యముచే, 2) శ్రవణ, మనన రూపమగు తత్త్వవిచారణచే – పదార్థముల పట్ల అకృత్రిమమైన అసంగము ఏర్పడుతోంది. "సత్య దృష్టి" చేకూరి, 'అసత్యదృష్టి' సన్నగిల్లుచుండగా 'కల్పనా రాహిత్యము' స్వయముగా ఏర్పడుతోంది.

అట్టి నిర్వికల్పమునందు... స్వచ్ఛ స్వభావయుక్తము, పరమార్థము సత్యస్వరూపము అయినట్టి 'ఆత్మభావన' సంప్రాప్తించుచున్నది. ఇక్కడ మనం 'భావన' అని అంటున్నప్పటికీ, అది భావరహితమైన స్థితియే.

అట్టి విషయరహిత పరమాత్మయందు వ్యక్తిత్వముగాని, అవ్యక్తిత్వముగాని ఉండవు. విషయ జనితములైన సుఖ దుఃఖాలు ఉండవు. అట్టి 'పరమాత్మస్థితి' జీవునిచే తన హృదయంలోనే పొంద బడుచున్నది. కేవల శుద్ధ స్వభావరూపమైన హృదయమునందు మాత్రమే ఆత్మతత్త్వము ప్రత్యక్ష మగుచున్నది. ఆత్మవస్తువు స్వయంగా అంతరంగమున అనుభవైకవేద్యమే సుమా!

❖❖❖

## 13. ఆత్మబోధ ఎట్టి వారికి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ జీవుడు నిష్కారణంగా ఈ దేహ, ఇంద్రియములందు "ఇవియే నేను" అనబడు అహంభావము కలిగియుంటున్నాడు. అత్యంత అనర్థహేతువైనట్టి "అహమ్ దేహమస్మి" అను భావన చేతనే ఆత్మభావన పొందబడకపోవటం జరుగుతోంది. ఎవనికైతే ఈ 'దేహ ఇంద్రి యముల'తో ఆత్మయొక్క "అభేదభావన" ఉండదో.... ఎవ్వని యందు సర్వవాసనలు తొలగి పోతాయో... అట్టి పుణ్యచరితునకు మాత్రమే పూర్ణమగు ఆత్మభావన ప్రాప్తిస్తోంది.

ఒకడు చీకటిలో ఒక త్రాడును చూచి, "ఒకవేళ ఇది త్రాడు కాదేమో? పామేమో?" అనే సందేహమును ఆశ్రయించుటచేత క్రమంగా అతనికి ఆ త్రాడుయందు పామే కదలాడుచున్నట్లు కనబడుతుంది. బంధరహితమగు చిదాకాశమే స్వరూపముగాగల ఈ జీవుడు కల్పిత వస్తువును అన్యవిధంగా కల్పన చేస్తూ స్వాత్మయందు బంధము కల్పించుకొనుచున్నాడు. "ఈ సంఘటనలతో, వ్యక్తులతో నాకు సంబంధమున్నది. అందుచేత ఇవి నాకు సుఖ దుఃఖకరములు"... అని భావన చేస్తే అది అట్లే అగుచున్నది. "చిదాకాశమే స్వరూపముగా గల నాకు ఈ భావనలతో, అట్టి

భావనల ప్రయోజనంగా ప్రాప్తిస్తున్న ఈ 'జగత్తు'తో సంబంధమెక్కడిది?" అను భావస్థితిని ఆశ్రయిస్తేనో.. తదనుకూలంగానే అంతా ప్రాప్తిస్తోంది.

ఒకే ఆకాశము పగలు ఒకవిధంగా, రాత్రి మరొక విధంగాను కనబడుతోంది కదా! అలాగే ఆత్మకూడా భిన్న రూపములను ధరిస్తోంది.

❖

ఈ జీవుడు అనేక సంసార దుఃఖ పరంపరలలో పడి కొట్టుమిట్టాడటం నిర్వివాదాంశమే కదా! అయితే, తననుతానే అతడు గమనించుటలేదు.

**యదతుచ్ఛమనాయాసమ్ అనుపాధి గత భ్రమమ్ ।**
**తత్తత్కల్పన యాతీతం తత్సుభాయైవ కల్పతే ॥** (సర్గ. 21, శ్లో.48)

మహత్తరమై, స్వభావసిద్ధమై, ఉపాధిరహితమై, భ్రమవర్జితమై సర్వకల్పనలకు అతీతమైనట్టి ఆత్మను ఎరుగుటచేత మాత్రమే అతడు దుఃఖరహితుడు కాగలడు. ఒకడు శూన్యమగు ఒక 'గుహ'లో ప్రవేశించి "ఇక్కడ సింహము ఉండవచ్చునేమో?" అనే భయమును పొందుతాడు. అయితే, ఆ గుహను చక్కగా పరిశీలించిన తరువాతో, లేక అట్లు పరిశీలించిన వారి వివరణలను విన్న తరువాతో "ఇక్కడ సింహము మొదలైనవేవీ లేవు. ఖాళీ స్థలం మాత్రమే ఉన్నది" అని గ్రహిస్తాడు. అదేవిధంగా ఈ జీవుడు "నేను ఈ దేహమునందు బద్ధుడనై ఉన్నాను కదా" అనే భయమును పొందుచున్నాడు. సాధువాక్యముల శ్రవణం, మననం ఆశ్రయించుచుండగా, ఆత్మను బాగా ఎరుగుట చేతనే సంసారబంధము తొలగిపోతుంది.

ఒక బాలుడు పెద్ద మఱ్ఱిచెట్టు యొక్క కాండమును చూస్తూ దట్టమైన చీకటి కారణంగా "అమ్మబాబోయ్! అదిగో...! అది దయ్యమే" అని తలుస్తూ ఉంటాడు. అట్లే ఈ జీవునకు కూడా "ఈ నా దేహము – ఈ జగత్తు – ఈ సంబంధ బాంధవ్యములు – నాకు సంబంధించిన వారు – నా వారు కాని వారు"... మొదలైన అనేక భ్రమలు కలుగుచున్నాయి. ఆ భ్రమలన్నీ క్షణక్షణం ఒక రూపం పోగొట్టుకొని మరొక రూపం పొందుతూ పోతున్నాయి. ఓ రామా! ఇదంతా 'కల్పన'ను అనుసరించే ఏర్పడి ఉంటున్నది. కల్పనావశంచేత జీవునకు ఈ విభవ దారిద్ర్యములు, దానికి అనుకూలమైన శుభాశుభములు క్షణంలో ప్రాప్తిస్తున్నాయి. మరల అవన్నీ క్షణంలో నశిస్తున్నాయి. భావనానుసారమే పదార్థములు కూడా ఆయా ప్రయోజనములు కలుగజేస్తున్నాయి. జ్ఞానులైన మహనీయులు ఇదంతా గమనించి, 'ఈ సర్వపదార్థములు భావనానుసారమే ఉంటున్నాయి' అను ఎరుకను గ్రహించి ఈ ప్రపంచంలో సంచరిస్తున్నారు. ఇవన్నీ కూడా జీవుల వారి దృష్టిని అనుసరించే భిన్నములుగా గోచరిస్తున్నాయి.

ఈ చిత్తము దృఢభావనచే దేనిని ఎంతకాలము ఏ విధంగా భావిస్తుందో, అది అంతకాలం అట్లే ప్రాప్తిస్తూ ఉంటుంది. ఏది సత్యం? ఏది మిథ్య ?

ఈ ప్రపంచమున సత్యము కానట్టి, మిథ్య కానట్టి వస్తువంటూ ఏదీ లేదు.

**నతదస్తియత్సత్త్వం, నతదస్తి నయన్మృషా ।**
**యద్యథాయేన నిర్ణీతం, తత్తథాతేన లక్ష్యతే ॥**

ఎవడు ఏ ప్రకారంగా దేనిని నిర్ణయిస్తాడో అతనికి ఆ పదార్థములు అట్లే అనుభూత ములౌతూ ఉంటాయి. ఒకడు తన 'మనస్సు'చే ఆ ఎదురుగా కనబడుచున్న ఆకాశంలో ఒక 'స్త్రీ' యొక్క కల్పనను దృఢంగా చేశాడనుకో... అతడు కామాతురుడై ఆకాశంలో ఉన్న వనంలో సంచరిస్తున్న ఆ కల్పిత సుందరస్త్రీ వెంట పరుగెత్తగలడు.

**అద్వైతానంద పారమార్థిక రూపం -** కనుక ఓ రామచంద్రా! ఒక 'సుషుప్తి' యందు ఉన్న వాడు ఏ విధంగా సర్వపదార్థరహితుడై ఉంటాడో, అదే విధంగా నీవు నీ సంకల్పము లందు ఉండి యున్నట్టి సర్వపదార్థములను త్యజించివేయి. సర్వవేళలందు నీ యొక్క "పారమార్థిక అద్వైతానంద రూపము" నందే స్థితి కలిగియుండుము.

ఒక ఎత్తైన ప్రదేశంలో ఒక 'మణి'ని ఉంచామనుకో... ఆ మణియందు ఎదురుగ ఉన్న కొండ ప్రతిబింబిస్తుంటే ఆ మణికి ప్రాప్తించే లాభమేమైనా ఉన్నదా? లేక, అట్లు ప్రతిబింబించక పోతే మణికి వచ్చే నష్టమేమి? ప్రతిబింబించినప్పుడు, ప్రతిబింబించనప్పుడు కూడా ఆ మణి ఒకే తీరుగా ఉంటుంది కదా! నీవు కూడా మనస్సు నుండి 'ఇచ్ఛ' అనుదానిని తొలగించివేయి. నీవు ఇచ్ఛా రహితుడవై ఉండగానే, ఈ జగత్ వ్యవహారములు నీయందు ప్రతిబింబించుగాక! నీకొచ్చే హాని ఏమి? మణి ఒక జడమైన వస్తువు కాబట్టి ఎదురుగా ఉన్న వస్తువులు తనయందు ప్రతిబింబించుట నిరోధించజాలదు. మరి నీవో? నిత్యము నిర్మలము అగు చైతన్యమే స్వరూపముగా కలిగియున్నావు కదా! అందుచేత ఇచ్ఛారహితంగా, అనాసక్తి పూర్వకంగా తప్పక ఉండగలవు. కొంచెము అభ్యాసానికి సిద్ధపడితే చాలు.

వాస్తవానికి 'ఇచ్ఛా సహితంగాను, ఆసక్తిపూర్వకంగాను ఉండుట' అను దానియందు శ్రమ ఏమి ఉన్నది. కనుకనే మోక్షరూపము = సర్వశ్రమలను త్యజించివేయుట అని చెప్పబడుతుంది.

ఓ రఘునందనా! "నాయందు ఏ జగత్తైతే ప్రతిబింబించుచున్నదో అదంతా మిథ్యయే"... అని నిశ్చయించుకొనుము. అట్లు నీయందు ప్రతిబింబిస్తున్న వస్తువుల, విషయముల రూపమును నీవు తాదాత్మ్యముచే పొందకుండెదవు గాక! లేదా...

ఈజగత్తు పరమాత్మకంటే అభిన్నమైనదే కదా! కనుక నాకు జగత్తుగా కనబడేదంతా పరమార్థమున బ్రహ్మమే" అను నిశ్చయమును కలిగియుండు. "అనంతము, అనాది"యగు ఆత్మ యొక్క స్వరూపమును ఆత్మసహాయం చేతనే సునిశ్చితం చేసుకొనగలం.

ఇక నీ చిత్తమునందు ప్రతిబింబించు అన్య జగత్పదార్థములు, తదితర దేహాత్మదృష్టి గల ప్రాపంచిక జీవుల అర్థవాద పలుకులు... నిన్ను రాగయుక్తం చేయకుండా జాగరూకుడవై ఉండు. ఆత్మదృష్టిని సర్వదా అలవరచుకో.

ఒక చోట కొన్ని చిత్ర విచిత్రములైన రంగులుగల పదార్థములు ఉన్నాయి. అవన్నీ ఒక శుద్ధ మైన స్ఫటికంలో ప్రతిబింబిస్తున్నాయి. అయినప్పటికీ ఆ స్ఫటికంలో ఆ రంగులు ఉండి ఉన్నాయని అనలేం కదా! అదేవిధంగా, ఈ ద్వైతపదార్థాలకు సంబంధించిన రాగం మొదలైన ఎట్టి దోషాలు లేనట్టి శుద్ధ స్వరూపుడవే నీవు సుమా! అట్టి నీ యొక్క శుద్ధ స్వరూపం నందు ప్రారబ్ధ కర్మ భోగాలకు ఉచితమైనట్టి జగత్ వ్యవహారేచ్ఛ ప్రవేశిస్తే, ప్రవేశించనీ... అందుకు నీకు అభినివేశం పొందవలసిన పనేమున్నది? అయితే నీవు మాత్రం దానితో 'తాదాత్మ్యం' చెందనే వద్దు.

నీ శుద్ధ స్వస్వరూపతత్వములో మార్పు చేర్పులు ఏర్పరచగలిగినదంటూ ఈ సృష్టిలో ఏదీ లేదు. అట్లే ప్రతి జీవి విషయంలో కూడా!...

❖❖❖

# 14. సాక్షి చైతన్యము - జగద్వ్యవహారము

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! సమాధిని అభ్యసించుచు, "ఈ బాహ్యాభ్యంతర జగత్తుల గురించి ఏర్పడి ఉంటున్న మననమంతా మిథ్యా వ్యవహారమే" అని ఎరుగుము. అట్లు ఎరుగుటచేత క్రమంగా నీవు జగద్భ్రమలను, మిథ్యామననమును త్యజించివేయగలుగుతావు. అప్పుడు నీ బుద్ధి విశుద్ధరూపముగా పరిణమించుతుంది.

ఈ కనిపించే ప్రతి ఒక్క జీవుడు చైతన్యము యొక్క ప్రకటనయే అయి ఉన్నాడు కదా! చైతన్యము కాకుండా ఇక ఏదేది అనిపిస్తోందో అదంతా 'భ్రమయే' అయివున్నది. ఎప్పుడైతే చైతన్యము తప్ప వేరైన ద్రష్టల వ్యవహారమంతా త్యజించబడుచున్నదో, అట్టి విచారవంతుడగు జీవుని స్వభావం స్వయంగా నిర్మలమగుచున్నది సుమా! కనుక నీవు 'అజ్ఞాన భూమికా భేద రూపము' అయినట్టి ఈ దృశ్యంను త్యజించివేసి జ్ఞానభూమికలందు ప్రవేశించాలి. 'సాక్షి చైతన్యం' నందే అనుభవమగుచున్న దృశ్యమును, ద్రష్టను కూడా వేరు వేరు చేసివేయుము. సర్వదా సాక్షి చైతన్యమే నీవు అగు. నీవై ఉండు, నీ యందలి సాక్షిచైతన్యముచే పిపీలికాది బ్రహ్మపర్యంతం (చీమ నుండి బ్రహ్మదేవుని వరకు) కూడా సాక్షిచైతన్యంగా గాంచుచుండుటచే 'ఆత్మదృష్టి' దృఢపడగలదు.

బాహ్యమునకు ప్రపంచానుకూలంగానే వర్తించు. ఏదైతే శాస్త్ర నిర్ణయములచే మరియు స్వబుద్ధిచే చేయబడటం స్వధర్మమైయున్నదో అది నిర్వర్తిస్తూ ఉండు. అజ్ఞాన దృష్టియందు ఉన్నట్టి తదితరుల సానుకూల్యతలను పరిగణిస్తూ కర్మలు చేయి. అయితే, "సర్వుల యందలి సత్యము సాక్షీ తత్వమే అయివున్నది"... అను భావనను అంతర్లీనంగా సుస్థిరపరచుకో.

ఇక "నీవు–నేను–నీ వారు–నా వారు–నీవి–నావి–కాలము–దూరము–స్థలము–ప్రియము–అప్రియము"... ఇవన్నీ ప్రతిబింబమాత్రంగా... అజ్ఞాన దృష్టియొక్క అనుభవములుగా గుర్తించి, వీటిని వేరుపరచివేయి. ఈ ప్రతిబింబమాత్ర ఆయా విషయములలో తాదాత్మ్యము చెందవద్దు.

'సాక్షితత్వము' నందే నిశ్చలుడవై సర్వదా ఉండుము. అప్పుడు ఆత్మ నిర్మలం కాగలదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఆత్మ నిర్మలత్వము పొందటానికి మరి కొన్ని ఉపాయాలు చెప్పమని ప్రార్థిస్తున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఈ జీవుని యొక్క ఆత్మ నిర్మలానుభవము కొరకు శాస్త్రములచే, గురువులచే ప్రతిపాదించబడిన కొన్ని ఉపాయములు, లేక మార్గములను ఇక్కడ చెపుతాను విను.

**1. అజాగరూకత నుండి జాగరూకత వైపు -**

**జాగర్తవ్యే పరేతత్త్వే జాగరూకస్యజీవతః ।**
**సుప్తస్య ఘన సంమోహమయే సంసారవర్త్మని ॥** (సర్గ 21, శ్లో. 3)

ఆత్మతత్వ విషయమునందు సర్వదా జాగరూకుడవై ఉండాలి. అంతేకాని, మహామోహమయ మగు ఈ సంసారమార్గంలో నిదురిస్తూ ఉండరాదు. ఆత్మరూపము విషయమై జాగరూకులై ఉండుట, ఏమరుపును జయించుటలను 'యోగము' అని అంటున్నాము. "సర్వము ఆత్మయే... ఆత్మ కానిది, ఆత్మకు చెందనిది అంటూ ఎక్కడా ఏదీ ఉండజాలదు..." అను పూర్ణార్థము గ్రహిస్తూ తద్వారా నిర్మలత్వము, శుద్ధత్వమును పెంపొందించుకో..

**2. అనురక్తి నుండి, విరక్తి వైపు -** స్వల్ప సుఖము నుండి బ్రహ్మదేవుని సుఖపర్యంతము విరక్తి కలిగి ఉండు. సర్వదృశ్య పదార్థములపట్ల, విషయముల పట్ల 'అనురక్తి' సన్నగిల్లుచుండగా "ఒకానొక పరిపుష్టితో కూడిన అతీతత్వము-క్రమముక్తి" పరిఢవిల్లుతూ ఉంటుంది.

**3. ఇచ్ఛా ద్వేష త్యాజ్యం -** భోగకాలమునందు అనుభవమునకు వచ్చుచున్న ఆయా రసవంతమగు పదార్థములు, విషయములు, నామ రూపములు పైకి రమణీయంగా ఉంటున్నాయి. కాని, క్రమేణా తుచ్ఛమై పరిఢవించబోతున్నాయి. "ఇవన్నీ ఉంటే ఉండనీ... లేక తొలగనీ... ఇవి నావి కావు. నేను వీటిలో లేను... ఇవి నాలో లేవు. యాదృచ్ఛికంగా ఇవి ఏర్పడి, మరొకప్పటికి విడిపోతున్నాయి" అని జ్ఞానదృష్టికలవారు గ్రహిస్తున్నారు. ఇచ్ఛా ద్వేషరహితమైన "అవగాహన - అనుభవము - దృష్టి"లను ఆశ్రయించువారి ఆత్మ వినిర్మలమౌతోంది.

**4. విషయములతో అసంగము -** విషయములతో ఏర్పడు సంగమే విషయభావన. అట్టి భావనయే ఈ దృశ్య జగత్తు యొక్క ప్రాప్తి అయి ఉన్నది. 'విషయ భావన' అనే మంచు కరిగి పోయిందా, ఇక ఈ జీవుని ఆత్మ సునిర్మలం కాకేమౌతుంది?

**సంగము -** సంగము జీవుని మలినపరచుచున్నది. సంగము నుండే తక్కిన మనోరోగముల నబడు 'కామ-క్రోధ-లోభ-మోహములు' బయల్వెడలుచున్నాయి.

ఆకాశమున సూర్యరశ్మి ప్రసరించగానే మంచు కాస్తా కరిగిపోతుంది కదా! అజ్ఞానాకాశము నందు "ఆత్మతో ఏకత్వము" అనే సూర్యుడు ఉదయించాడా, అట్టి విజ్ఞాన సూర్యుని కిరణ ప్రభావంచే విషయములతో ఏర్పడు సంగము... అనే చీకటి తప్పక తొలగిపోతుంది. అది 'సుజ్ఞానాకాశం' గా ప్రకాశిస్తోంది.

**5. తృష్ణారాహిత్యము -** తృష్ణయే లేకుంటే ఈ జీవునికి, ఆత్మభగవానునికి అంతరమే లేదు. 'తృష్ణ' అనే తటాకంలో అసంఖ్యాకములైన "మనోరథములు" అనే తరంగములు వృద్ధి చెందు చున్నాయి. ఆ తటాకంలో 'మూఢత్వము' అనే ఏనుగు ప్రవేశించి అల్లకల్లోలం సృష్టిస్తోంది. 'తృష్ణ యొక్క మరొక రూపమే మనో చాంచల్యము. తృష్ణను త్యజించుటచే, మనోచాంచల్యము జయించబడగా, అప్పుడు మనస్సు స్వయముగా శాంతించుచున్నది. అప్పుడు మాత్రమే ఆత్మ లక్షణమైనట్టి 'నిర్మలత్వము' ప్రకాశించుచున్నది.

**6. వాసనాజాలమును త్రెంచివేయటం -** అనేక ఇతఃపూర్వపు ఆసక్తి, క్రియా విశేషములచే ఈ జీవుడు తన యొక్క వాసనాజాలము (maze of tendencies) ను నిర్మించుకొని అందులో చిక్కిన పక్షిలాగా కొట్టుకొంటున్నాడు. పెద్ద ఎండుకట్టెల ప్రోగును ఒక అగ్నికణిక సహాయంతో భస్మం చేసి వేయవచ్చు కదా! ఒక నావ గలవాడు గొప్ప లోతైన నదీ ప్రవాహమును దాటివేయగలుగుతాడు కదా! అట్లాగే "వైరాగ్యము"... అనే ఆయుధమును దగ్గర ఉంచుకొన్నవానిని ఈ సాంసారిక వాసనాజలం ఏ మాత్రం బాధించలేకపోతుంది.

"సంసారము" అనబడే వాసనాజాలము ప్రజ్ఞతో కూడిన వైరాగ్యముచే త్రెంచి వేయబడుగాక!

విషయగ్రంథి విచ్ఛిన్నమొనర్చబడగా, ఆత్మ యొక్క నిర్మలత్వము, అఖండత్వము, అప్రమేయత్వము అనుక్షణికమై అనుభూతమగుచున్నది.

**7. మనస్సు ఉపశమనము -** చిల్లగింజలు వేస్తే నీరు నిర్మలం అవుతుంది కదా! ఈ మనస్సు నందు 'ఆత్మజ్ఞానం' అనే చిల్లగింజను ప్రవేశింపచేయాలి. 1) శాస్త్రాదులను పరిశీలనాత్మకమైన దృష్టితో విచారించటం చేత, 2) గురువులు బోధించే విషయాలను అవగాహన పూర్వకంగా గ్రహించుటచేత, 3) స్వయముగా చేయు ఆత్మానాత్మ పరిశీలన చేత 'జ్ఞానం' మనస్సులోకి ప్రవేశిస్తోంది. ప్రకాశమానం అవుతోంది.

ఈ 'మనస్సు'ను కామవర్జితం (Desirelessness) చెయ్యాలి. దీనిని విషయ గుణ అనుసంధాన రహితం చెయ్యాలి. సంసార పదార్థములైనట్టి "పుత్ర-కళత్ర-గృహ-ప్రతిష్ఠాదు" లను దూరము నుంచే త్యజించి వేస్తూ "ఈ సర్వము ఆత్మయే" అను అంతరంగమందలి బోధను సుస్థిరపరచుకోవాలి. భోగ,- లాభముల అభినివేశము నుండి దృష్టిని మరల్చాలి.

అప్పుడు ఈ 'మనస్సు' అనే పంజరములోంచి 'అజ్ఞానము' అనే పక్షి ఎగిరిపోతుంది.

**8. సందేహ ప్రవృత్తిని జయించివేయటం -**

**శాన్తే సందేహ దౌరాత్మ్యే గతకౌతక విభ్రమమ్ ।**
**పరిపూర్ణాన్తరం చేతః పూర్ణేందురివరాజతే ॥** (సర్గ 22, శ్లో. 10)

నాయనా! రామా! సందేహించుట అను దుష్ట సంస్కారమే "సంసారనివృత్తి" అను ఉత్తమ స్థితిని తాత్సారం చేయిస్తోంది. ఇట్టి "సందేహించుట" అను దోషము శమించుగాక! ఈ చిత్తమును

'భ్రమ–కౌతుక' రహితం చేశామా, ఇక అంతరమున, ఇది పరిపూర్ణమైన పూర్ణచంద్రుని వలె శోభించగలదు.

విచారణను ఆశ్రయించనివాడు, శ్రద్ధలేనివాడు, అనుమానాలతో కాలయాపన చేసేవాడు వినాశనము వైపే పయనిస్తున్నాడు. సంశయాత్మునకు ఇహంలోను, పరంలోను సుఖంలేదు.

**9. భేదదృష్టిని శమింపజేయటం -** వాయువు శమిస్తే సముద్రము ప్రశాంతమగుచున్నది కదా! "ఇది వేరు, అది వేరు, నేను, నాది, వీరు ఇట్టి వారు, వారు అట్టి వారు"... అను భేదదృష్టులు దోషరహితమగు 'సమమ్ బ్రహ్మమ్' దృష్టిచే శమించగలదు. ఉత్తమదృష్టిని అభ్యసించుటే అందుకు ఉపాయం. "ఎవరిలోనైతే నేను ఏవేవో దోషములను చూస్తున్నానో, వారంతా నావలెనే ఆత్మయే స్వరూపముగా కలిగియున్నారు" అని మరలమరల మనస్సుకు గుర్తుచేయాలి. ఎట్లాగైనా సరే, ఏ ఉపాయం చేతనైనా సరే, "సమదృష్టి"ని సుస్థిరం చేసుకోవాలి. సమదృష్టి... అల్పత్వము నుండి ఔన్నత్యము వైపు మార్గం చూపుతుంది. ఉత్తమ సౌందర్య పూర్వకమైన అవగాహనను అట్టివాడు పుణికి పుచ్చుకుంటాడు.

సమత్వము మృగ్యమగుటచేతనే వాసనలు విజృంభిస్తున్నాయి. ఫలితంగా అంతఃకరణం అజ్ఞానాంధకారమయమగు జడత్వముచే నిండిపోయి ఉంటోంది. అట్టి మనస్సు జర్జరితమగుచు ఎక్కడెక్కడో దూరదూర ప్రదేశాలలో సంచరిస్తూ, ఏవేవో భావావేశకాలను పుణికిపుచ్చుకుంటూ,... ఆయాసమంతా తెచ్చిపెట్టుకుంటోంది.

"చీకటి – సూర్యోదము" లాగా "భేదదృష్టి – జ్ఞానము" ఏర్పడుచున్నాయి. జ్ఞానదృష్టి వికసిస్తూ ఉంటే, భేదదృష్టి స్వయముగా అంతరించుటకు సంసిద్ధపడుతూ ఉంటుంది.

**10. అభ్యాసము -** ఓ రామా! శాస్త్రములు వల్లెవేస్తూ కూడా కొందరు 'ఆత్మదృష్టి' వైపుగా దృష్టి సారించలేకపోతున్నారు. సాంసారిక ద్రష్టత్వమునే సర్వదా ఆశ్రయిస్తున్నారు. ఫలితంగా దుఃఖాలు తొలగకపోగా, ఇంకా అధికమగుచున్నాయి. ఇట్లు ఎందుకు జరుగుతోంది? ఈ మనస్సును ఇంద్రియములను సరియైన అభ్యాసము నందు నియమించకపోవుట చేతనే సుమా! జ్ఞానంచే అభ్యాసమును పరిశుద్ధపరచాలి, ఉత్తేజపరచాలి. లేకుంటే జ్ఞానము సముపార్జించి ఏం ప్రయోజనం?

ఉత్తమ అభ్యాసములను ఆశ్రయించే జీవునియందు మాత్రమే హృదయసరోవరంలో వివేకము అనే కమలం వికసిస్తోంది. అట్టి 'వివేకకమలం' చైతన్య భాస్కరుని చూచి పులకిస్తోంది.

వివేకి అయినవాడు ఉత్తమ లక్ష్యముల నుండి ఏ పరిస్థితుల యందు చ్యుతి పొందడు. అతడు తన అభ్యాసములను దీపమువలె కాపాడుకుంటాడు. అభ్యాసమే సత్వగుణమును పెంపొందింపజేస్తుంది. చంద్రకిరణములు ఈ జగత్తును ఆహ్లాదపరుస్తున్నట్లు, సత్వగుణము ఈ బుద్ధిని సువిశాలం చేసి, ఉత్తమ అవగాహనను ప్రసరింపజేసి ఆహ్లాదపరచగలదు.

మా ఉద్దేశంలో అభ్యాసం అనగా, "గురుసేవ, ప్రేమ, దయ, దాక్షిణ్యము, శ్రవణము, మననము, నిధిధ్యాస"... మొదలైనవాటిని ఆశ్రయించటం అయి ఉన్నది.

ఓ రామచంద్రా! ఇక పెద్దగా, వివరంగా చెప్పేదేమున్నది? వాయువు, భూమి, జలము, అగ్ని లేనట్టి ఆకాశకోశము ఏ విధంగా ఉంటుంది? ఎంతో నిర్మలంగాను, విశాలంగాను, ఉదయ అస్తమయములు లేనిదిగాను ఉంటుంది కదా! అదే విధంగా జ్ఞేయుడు (ఎరుగవలసినది ఎరిగిన వాడు) అయినట్టి ధీమంతుడు నిర్మలాకాశస్వరూపుడై, "నాకు ఉదయాస్తమయములు లేవు" అను ఎరుక కలిగి ఉంటున్నాడు. "ఖండము-అఖండము, జీవుడు-బ్రహ్మము, పరిచ్ఛిన్నము-అపరిచ్ఛిన్నము"... ఈ బేధములన్నీ అజ్ఞానము ఉన్నచోట మాత్రమే ఉంటున్నాయి.

'తత్త్వవిచారము'చే 'ఆత్మస్వరూప సాక్షాత్కారం' పొందినవానికి బ్రహ్మ-విష్ణు-మహేశ్వర పదవులు కూడా స్వల్పమైనవిగానే కనిపిస్తున్నాయి. ఎందుకంటావా? 'సృష్టించుట' మొదలైన అధికారము లందు కూడా క్లేశము ఉండి ఉన్నది సుమా!

❖❖❖

# 15. జ్ఞానుల - అజ్ఞానుల అనుభవాలు

ఎవని చిత్తమైతే, ఈ ఆకారాదులతో కూడి ఉండినప్పటికీ, "అహంకారరహితం" అయి ఉంటుందో అట్టివానికి ఈ సంసారకల్పన ప్రాప్తించుటలేదు.

'మృగతృష్ణ' యందు ఒక మూఢమృగమునకు జలము ఉన్నట్లు కనిపిస్తుంది. జ్ఞానికి జలం కనిపిస్తుందా? లేదు. అతడు కెరటముల పరంపరలు చూస్తూ కూడా, ఇదంతా భ్రమయే, క్రీనీడ మాత్రమే కనుక ఇక్కడ జలం "ఉండజాలదు" అని గ్రహిస్తున్నాడు.

**తరంగవదిమే లోకాః ప్రయాన్త్యాయాన్తిచేతసః ।**
**క్రోడీకుర్వన్తిచాజ్ఞంతే నజ్ఞం మరణజన్మనీ ॥** (సర్గ 22, శ్లో. 18)

వాసనావశం చేతనే ఈ జీవులందురూ తరంగముల వలె ఉత్పన్నమగుచున్నారు. నశించు చున్నారు. ఈ జనన మరణములు, సుఖదుఃఖములు, సమృద్ధి-అసమృద్ధిలు మొదలైనవన్నీ అజ్ఞానిని తమ వశం చేసుకుంటున్నాయి. జ్ఞానినో, ఏమీ చేయలేకపోతున్నాయి. అనేక ఆవిర్భావ-తిరోభావము (రాక పోక) లతో కూడిన ఈ ప్రపంచమంతా అజ్ఞాని కొరకే, అజ్ఞానము చేతనే, అజ్ఞాన విషయంగానే - ఉదయిస్తోంది, లయిస్తోంది.

జ్ఞానికి ఈ 'జగత్తు' అనునదే ఉండి ఉండుట లేదు. మొదలే ఉదయించనట్టి దానికి నాశనమేమిటి? "ఊహలో కల్పించబడిన ఒక అరణ్యంలో ప్రవేశించి మృగములను అతి లాఘవంగా వేటాడటం" అను కార్యక్రమంలాగా, తత్త్వజ్ఞాని లీలా మాత్రంగా ఈ జగత్తు నందు సంచరిస్తున్నాడు. రమిస్తున్నాడు. ఇక అజ్ఞాని అంటావా, అతడు తనయొక్క స్వయంకల్పిత కౌతుకము" చే ఈ జగత్తు నందు "ఇదంతా వాస్తవమే" అనే బుద్ధిని పొందుచున్నాడు. అట్లు 'వాస్తవము' గా భావించబడుదానిచే బంధింపబడుచున్నాడు.

❖

ఒకచోట ఒక 'కుండ' ఉన్నది. అది ఉన్నా, లేక పగిలినా ఆ 'స్థలము' (Space that is occupied by the pot) కు వచ్చే లాభం గాని, నష్టం గాని ఏమైనా ఉన్నదా? ఘటమునకు ఉత్పత్తి వినాశనం ఉండవచ్చు గాక. కానీ, ఘటాకాశమునకు ఉత్పన్నమేమిటి? నాశనమేమిటి? అట్లాగే ఈ శరీరము భూషించబడు గాక, లేక దూషించబడు గాక! ఆత్మకు ఎట్టి వికారములు ఉండవు. ఆత్మజ్ఞుడు ఈ ఉత్పత్తి నాశనము లేవీ తనయందు కలిగియుండుటలేదు. "నేను ఈ శరీరమునే!" అను అల్పజ్ఞతను ఆశ్రయించువాడు మాత్రమే,... ఈ జన్మ మృత్యువులను అనుభవించుచున్నాడు సుమా! సాయంకాల సమయంలో సూర్యకిరణములు ప్రసరించుటచే విశాల భూమి యందు మృగతృష్ణ ఎటకో మటుమాయమైపోతోంది కదా! ఉత్తమ వివేకము ఉదయించగానే మిథ్యా భూత మగు ఈ దృశ్యము, వాసనలు, సంకల్పవ్యవహారములు... ఇవన్నీ తమంతటతామే నశిస్తాయి.

ఓ జనులారా! "నేనెవరు? ఈ ప్రపంచము ఎట్లు ఉత్పన్నమైనది...?" అనే విషయాలు విచారణ చేయనంత వరకు 'కారుచీకటి' వంటి మిథ్యారూపం అయివున్న ఈ "జగదాడం బరము"... అంతా ఇట్లు ప్రాప్తిస్తూనే ఉంటుంది.

ఈ దృశ్యప్రపంచము మిథ్యాభ్రమ సమూహములచేతనే ఆవిర్భవిస్తోంది. అనేక ఆపదలకు స్థానభూతమై ఉంటోంది. ఎవడైతే 'ఆత్మభావన'చే ఈ దృశ్య వ్యవహారమును నిస్సారమైనదానిగా చూస్తాడో, అతడే దీని నిజ స్వరూపమును గాంచుచున్నవాడు అవుతాడు. సత్యదృష్టికి ఇదంతా లేనిది గానే తెలియవచ్చుచున్నది. కాబట్టి "ఈ దేశ కాలాదుల వశంచేత ఉత్పన్నమయ్యే 'ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – అధిదైవిక.' తాపత్రయములు, అట్లే, ఈ సమస్త దుఃఖములు శరీరమునకు సంబంధించినవి మాత్రమే. అంతేకాని ఇవన్నీ పూర్ణానంద స్వరూపుడు, ఆత్మస్వరూపుడు అగు నాకు సంబంధించినవి కావు"... అను నిశ్చయమును మీరంతా కలిగి ఉండండి. ఈ విధంగా భ్రమ రహితమైన నిశ్చయము కలవాడు మాత్రమే సత్యమును గాంచగలుగుచున్నాడు.

ఈ ప్రపంచము అంతులేనట్టి 'దిక్కులు–కాలములు' మొదలైన వాటితోను, అనేక పరిచ్ఛిన్నములతోను, 'ఉత్పత్తి – చలనము' ఆదిగా అనేక క్రియా వ్యవహారములతోను కూడి ఉన్నది. అట్టి ఈ ప్రపంచమునందు 'అంతటా నేనే వ్యాపించి ఉన్నాను'... అను అనుభవము కలవాడే నిజమైన జ్ఞాని.

**వాలగ్ర లక్షభాగాత్తు కోటిశః పరికల్పితాత్ ।**
**అహంసూక్ష్మఇతవ్యాపీ యంపశ్యతసపశ్యతి ॥** (సర్గ 22, శ్లో. 26)

"సర్వవ్యాపకుడనై, సర్వదా ఉన్నట్టి నేను ఒక రోమము యొక్క అగ్రభాగమందలి ఒక కోటి వంతు భాగము యొక్క ఒక లక్షవ భాగము కంటే కూడా ఇంకనూ ఎంతో ఎంతో సూక్ష్మమైన వాడను"... అని ఎరుగబడే సత్యమును చూచుచున్నాడు.

**ఆత్మజ్ఞుడు -** ఆత్మజ్ఞుడు ఈ జీవాత్మను అసదతీతుడుగాను, భిన్నమైన దానివలె కనిపిస్తున్న ఈ జగత్తును "చైతన్యజ్యోతిమాత్రము" గాను ఎరుగుచున్నాడు.

జగత్తును పరమాత్మకు అభిన్నంగా గాంచువాడే ఆత్మజ్ఞుడు. సర్వశక్తిమంతుడు, అసరేతుడు, అద్వితీయుడు అగు చిదాత్మ సమస్తమునందు ఉన్నట్లు చూచు దృష్టే వాస్తవ దృష్టి.

"ఆధి–వ్యాధి–భయాదులచే ఉద్విగ్నమగుచు, జనన–మరణయుక్తమై యున్న ఈ దేహము నేను కాదు"... అని ఏ బుద్ధిమంతుడు ఎరిగి ఉంటాడో, అతడే యథార్థజ్ఞానము కలవాడు.

"నా యొక్క మహిమయే పైన, క్రింద, ప్రక్కలందు అంతటా వ్యాపించియున్నది. నాకిక రెండవవాడే లేడు" అని తెలుసుకొనువాడే సమ్యక్‌జ్ఞాని.

"దారంలో మణులు గ్రుచ్చబడినట్లు, నాయందే ఈ ప్రపంచమంతా గ్రుచ్చబడి ఉన్నది. ఈ అంతఃకరణము అనుదానికి కూడా కర్తను నేనే... అంతే గాని అంతఃకరణము 'నేను' కాదు.. అను అనుభవము కలవాడే పరమార్థమును ఎరిగినవాడు.

"అహంకారముగాని, దృశ్యముగాని కించిత్ కూడా ఏ క్షణంలోనూ లేనేలేవు. ఇదంతా కూడా నిరామయమగు బ్రహ్మమే అయి ఉన్నది. ఇక సర్వరూపములకు అతీతుడనగు నేను భూత–భవిష్యత్–వర్తమాన కాలములందు వ్యక్తావ్యక్తముల మధ్య స్థితి కలిగి యున్నాను. సముద్రమునకు తరంగములు ఎట్లాగో, అదే విధంగా ఈ త్రిలోకములు నా యొక్క అవయవములే అయి ఉన్నాయి"... అని నిజాంతఃకరణము నందు అనుభూత మొనర్చుకొన్నవాడే సమ్యక్‌దర్శి అని, పూర్ణజ్ఞాని అని చెప్పబడుచున్నాడు.

❖

చైతన్యము యొక్క సమక్షమే లేకపోతే ఈ త్రిలోకముల వ్యవహారమంతా మృతప్రాయమే అయి ఉండేది. ఇవన్నీ చైతన్యసత్తాస్ఫూర్తి చేతనే ఉనికిని పొంది, పరిపాలించబడుచున్నాయి. ఆత్మ తత్వము దృష్ట్యా తదితరములైనవన్నీ ఏక్షణము నందూ లేనే లేవు. ఈ విషయం ఉత్తమ విచారణ సహాయంతో సత్యస్వరూపుడగు జ్ఞాని ఎరుగుచునే ఉన్నాడు సుమా! మహాత్ముల యొక్క 'దృష్టి' ఈ సాంసారిక దేహాదుల నుండి మొదలే మరల్చబడి ఉంటోంది. వారి అవగాహనలో ఈ 'నీవు–నేను' అనునవన్నీ ఆత్మపరమే అయి చెన్నొందుచున్నాయి. అట్టి ఉత్తమ నేత్రములు కలవారే 'సంసార తాడనము'ను నిరోధించగలుగుచున్నారు. సత్యమును చూడగలుగుచున్నారు.

'చైతన్యము' సర్వదా విషయములకు సంబంధించనది. అది 'స్వసత్తా ప్రకాశమున' జగత్ సమూహము లందు అంతటా వ్యాపించి ఉన్నది. ఆద్యంత రహితము, భైరవము అగు శరీరము గల చైతన్యమును (లేక ఆత్మను) సర్వులయందు, సర్వదా, సర్వముగా గాంచువాడే యదార్థ తత్వవేత్త. "ఈ సుఖ దుఃఖములు, ఈ శాస్త్ర – గురు – దేవతలందు ఏర్పడుచున్న శ్రద్ధ, వివేకమును నిదురలేపి ఆత్మతత్వమేమిటో పరిచయం చేసే శ్రవణ – మనన క్రమములు ... ఇవన్నీ కూడా నిర్వచించేది, ప్రవచించేది, పరిరక్షించేది దేనిని? నా యొక్క వాస్తవ స్వరూపము గురించే! ఇవన్నీ నేనే అయి ఉన్నాను"... అను అనుభవమునందు సుస్థిరుడై ఉండువాడే యథార్థ తత్త్వదర్శి.

ఇంకా ఆ సుజ్ఞాని యొక్క అవగాహనను వర్ణించి చెపుతాను... విను.

"ఈ జగత్తంతా నిరతిశయానందముచే పరిపూర్ణమైయున్నది. బ్రహ్మానందము అనుదాని యొక్క స్వల్ప విభాగముచే పరితప్తమైయున్నది. అట్టి ఆ సువిస్తార జగత్తు నందు ఒక అత్యంత స్వల్పమైన ప్రదేశంలో ఆ 'ఐహిక–పారలౌకిక' వస్తుజాలమంతా ఉండి ఉన్నది. అందుచేత, ఇవి ఎంత స్వల్పమైనవి! ఈ భోగ్యవస్తు సముదాయం ఉంటే ఎంత, లేకుంటే ఎంత? ఇందు దుఃఖ భూయిష్టమై, త్యజించదగినది ఏది? సుఖవంతమై గ్రహించదగినది ఏది?"

అప్పుడు అట్టి వివేకము యొక్క ప్రభావంచే 'భ్రాంతి' తొలగిపోయి, ఆనందము ఉదయిస్తోంది.

"ఈ జగత్తును 'ఇది' అని నిర్వచించలేము. ఎవడు దేనిని ఎట్లు భావిస్తే అది అతనికి అట్లే ప్రాప్తిస్తుంది. ఇది అగమ్యమైనది. ఇట్టి దృశ్యజగత్తులో సుఖమెక్కడ? శాంతమెక్కడ? ఎందుకంటే ఇందులో సుఖశాంతులు వెతకటం నేతి బీరకాయలో నెయ్యి కొరకు వెతకటం వంటిది. నాయందు విక్షేపము ఏర్పడినప్పుడు ఈ జగత్తులో విషయాలన్నీ విక్షేప పూరితంగా ప్రాప్తిస్తున్నాయి. నేను విక్షేపరహితుడనై ఉంటే ఇది కూడా విక్షేపరహితంగానే ఉంటుంది. అందుచేత ఇదంతా స్వయంగా విక్షేపరహితంగాను, నా యొక్క ప్రకంపనముచే విక్షేప సహితంగాను ఉంటోంది"... అని తార్కిక జ్ఞానము, సమ్యక్ భావన కలిగియున్నప్పుడు, ఇక ఈ జగత్తులోని "ఇది త్యజించాలి, ఇది పొందాలి" అను రూపముగల త్యాజ్య గ్రాహ్యకల్పన అంతా నశించక ఏం చేస్తుంది చెప్పు? అట్లు ఎవరి దృష్టిలో జగత్ చంచలత్వం నశిస్తుందో, అట్టివాడే ఉత్తమ పురుషుడు.

ఏ మహాత్ముడైతే 'ఆకాశము' వలె ఏకాత్మ స్వరూపుడై ఉంటాడో, పదార్థములందు పూర్ణ భావనగా వ్యాపించి ఉంటూ కూడా, ఆయా పదార్థములను పొందకయే ఉంటాడో, (వాటి యందు అనుక్తుడు కాకయే ఉంటాడో).... అట్టి వాడు 'నిరతిశయానందము'నకు అర్హుడు అగుచున్నాడు. అతడే మహేశ్వర స్వరూపుడు.

ఓ రామచంద్రా! అట్టి మహాపురుషులు ఉన్నారు. వారు ఈ భూమిపై నిశ్చింతగా సంచరించు చున్నారు. వారు ఈ జాగ్రత్ –స్వప్న –సుషుప్తులనబడే మూడు అవస్థల నుండి విముక్తులై, తమను తాము ఈ మూడింటికి వేరైన తత్త్వముగా గాంచుచున్నారు. మృత్యువునకు కూడా ప్రేమాస్పదులై, మృత్యువును కూడా ఒక దినచర్యవంటిదిగా గాంచుచున్నారు. సౌమ్యులై సర్వత్రా సమబుద్ధి కలవారై 'తురీయావస్థ' అనబడే ఉత్తమ పదమునందు ఉపస్థితులై ఉంటున్నారు.

అట్టి మహాత్ములు తారసపడినప్పుడు నావంటి మునులు కూడా శిరస్సు వంచి నమస్కరించుచున్నారు. మేము అట్టివారికి సాష్టాంగదండ ప్రణామములు సమర్పిస్తున్నాం.

ఓ రాఘవా! ఈ బ్రహ్మాండములందు అంతటా ఒకే బ్రహ్మము వ్యాపించియున్నది. నిస్సంశయముగా నీవు ఇట్టి దృఢనిశ్చయము కలిగియుండుము. అనేక విచిత్రములు, రమణీయములు అయిన పదార్థములతో కూడిన ఈ జగత్తు యొక్క సృష్టి – స్థితి – లయములందు అపరిచ్ఛిన్నమగు 'బ్రహ్మావృత్తి'నే సర్వదా కలిగియుండుము.

సాక్షాత్ శివ స్వరూపుడవై, జ్ఞానవంతుడవై, జీవన్ముక్తుడవగుము. అప్పుడు అట్టి ఆత్మారాముడవగు నీకే నేను నమస్కారం చేస్తున్నాను.

❖❖❖

# 16. శరీరము - నగరము - శరీరి - రాజు

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా ! ముక్తుడు ఈ శరీరమును, తదితర దృశ్యవిశేషములను ఎట్లు ఏ దృష్టిచే చూస్తూ ఉంటాడో చాలా విశేషాలు చెప్పారు. ముముక్షువులకు మార్గదర్శకమగు అతని దృక్పథము – అవగాహన – పరివర్తనల గురించి ఇంకనూ మరికొంత తెలియజేయండి. ముక్తి పొందిన జీవుడు శరీరమును కలిగి ఉంటాడా? లేక త్యజించివేస్తున్నాడా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మమునే ఆశ్రయించి ఉంటున్న జీవుని మనం 'జీవన్ముక్తుడు' అని పిలుస్తున్నాం. అట్టి వాడు ప్రారబ్ధము (వర్తమానము కొరకు ప్రాప్తించే సంచితకర్మ వ్యవహారము) క్షయం అయ్యేవరకు వ్యవహారములను అనుసరిస్తూనే ఉంటున్నాడు. ఈ శరీరమును పాలించుచూ కూడా, దీని పుణ్యపాపములచే అంటకయే ఉంటున్నాడు. నీవు ఎప్పుడైనా కుండలు తయారుచేసే చక్రమును చూచావా? ఆ చక్రము కుండ తయారయిన తరువాత కూడా మరికొంతసేపు పరిభ్రమిస్తూ ఉంటుంది కదా! అట్లే జీవన్ముక్తుడగు పురుషుడు 'శరీరత్వము'(I am this body) ను వదలి 'శరీరిత్వము'ను (I am the one who utilises this body) స్వీకరించినప్పటికీ, ఈ శరీరము లను ధరించియే ప్రవర్తిస్తున్నాడు. అయితే జీవన్ముక్తునకు 'శరీరము కలిగియుండుట' అనేది బంధము అగుట లేదు సుమా! ఇది భోగమోక్షములను కలుగజేయటానికే ఉపయోగ పడుతుంది. ఈ శరీరము అతనికి సుఖము కొరకే ప్రవర్తిస్తోంది. అంతేకాని దుఃఖము కొరకు కాదు. మరొక విధంగా చూస్తే, అతనికి దేహమువలన సుఖమూలేదు. లేకపోవుటచే కష్టమూ లేదు.

జ్ఞానదృష్టిని అలవరచుకొనుచున్న యోగి దుఃఖాదులచే ఏమాత్రం స్పృశించబడుటలేదు.

ఈ దేహము గురించి విజ్ఞులు చెప్పు కొన్ని వివేషములను చెపుతాను... విను.

❖

ఈ 'దేహము' అనే నగరం అనేక గుణ విశేషములు కలదై ఎంతో రమణీయంగా ఒప్పుచున్నది. అంతులేని విలాపములతో సంచరిస్తోంది. 'ఆత్మదర్శనము' చే మాత్రమే దీని సత్యాసత్యములు గ్రహించబడుచున్నాయి.

నేత్రములే దీని కిటికీలు. ఇంద్రియములే ఇందలి దీపములు. 'చేతులు' అనే విస్తృతమైన మార్గం ద్వారా ఆయా పదార్థముల ప్రాప్తిని పొందుతోంది. రోమములు' అనే లతలతో, 'తొడలు' అనే స్థంభములతో ఒప్పుచున్నది. ఎముకల సంధులే దీని హద్దులు. కపాలము ఈ దేహనగరంలోని విశాలప్రదేశం. వక్షస్థలము ఇందలి తటాకం వంటిది. భుజములే క్రీడాప్రదేశములు. చెవులు – నోరు ఈ నగరములోని ద్వారములు. కంఠమే ఇందలి బిలము.

'నవరంధ్రంలు' అనే నవద్వారంల నుండి ప్రాణవాయువులు ప్రవేశించటం, నిష్క్రమించటం అనుక్షణం జరుగుతోంది. ముఖంలో నివసిస్తున్న 'నాలుక' పలువిధములైన భోజనం ఆరగిస్తోంది.

ఈ శరీరము అనే నగరం యొక్క అధోమార్గం గుండా 'మలము-మూత్రము' అనే బురద దూరంగా తొలగించబడుతోంది. 'చిత్తము' అనే ప్రదేశంలో 'అనేక చింతలు' అనే జనులు సంచరిస్తున్నారు. ఇంద్రియాలు అనే పశువులు విచ్చలవిడిగా ఈ నగరాన్ని దుర్గంధమయం చేస్తున్నాయి.

ముఖము నుండి వెలువడుచున్న చిరునవ్వులే ఇందలి పూలతోటలోని పూలు. తత్త్వజ్ఞులగు వారు తమ 'దేహము, మనస్సు'ల గురించి సుస్పష్టముగా ఎరుగుచున్నారు. అందుచేత వారి పట్ల ఈ శరీరం శుభప్రదంగానే పరిణమిస్తోంది. ఇది వారికి మోక్షరూపమైనట్టి హితమును, శుభమును, సుఖమును కలుగజేస్తోంది.

కాని అజ్ఞానికి మాత్రం ఈ శరీరం అనేక దుఃఖాల-అశుభాల నిలయంగా ప్రాప్తిస్తోంది.

❖

ఈ శరీరము నశిస్తున్నప్పుడు జ్ఞాని అత్యంత స్వల్పమైన విషయముగా దర్శించుచున్నాడు. అతని దృష్టిలో ఈ శరీరనాశన మాత్రంచే సత్యవస్తువు ఏదీ పోవుట లేదు. లేక ఇది నిలచి ఉంటుందా, అదీ మంచిదే! జ్ఞాని దీనిని ఉపయోగించి భోగ మోక్షములను అనాయాసంగా పొందుచున్నాడు.

ఈ శరీరము జీవునకు ఒక రథము వంటిది. దీనిని ధరించిన జీవుడు ఈ ప్రపంచంలో చమత్కారంగా కొంచెం సేపు సంచరించి ఎప్పుడో దీనిని త్యజించివేస్తున్నాడు. అట్టి కొద్ది కాలంలోనే "శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు"... అనే విషయములను, "స్వజనులు-పరులు -బంధువులు-మిత్రులు-అసంబంధులు-శత్రువులు"...మొదలైన పరస్పర వ్యతిరిక్తమైన సంబంధ బాంధవ్యములను పొందుచున్నాడు. అయితే అతడు జ్ఞానలక్ష్యమును, దృష్టిని కలిగియుంటేనో, ఈ శరీరము నుండి అతనికి 'మోక్షము' అనబడు 'ఉత్తమమైన సుస్థిరమైన అవగాహనతో కూడిన మనస్సుకు పరమైన..." స్థితి లభిస్తోంది. కనుక జ్ఞానికి ఈ శరీరరథము లాభదాయకమే.

❖

ఈ శరీరనగరం 'సుఖ-దుఃఖములు' అనే క్రియలను స్వయముగా ధరిస్తోంది.

జ్ఞానికి ఉత్తమ విషయములను నేర్చుకొనుటకు, చేకూర్చుకొనుటకు ఈ శరీరం ఉపయోగిస్తోంది. ఈ శరీరంచే నిర్వర్తించబడు శాస్త్రయుక్తమైన క్రియల ద్వారా తనలో దుష్ట స్వభావాలకు అతడు చికిత్స పొందుచున్నాడు. అందుచేత 'ప్రశాంతము అనబడు నిర్లిప్త అంతరంగస్థితి, సమగ్రమగు అవగాహన"... లను లక్ష్యములను కలిగియుండి, ఈ శరీరంను ఒక ఉపకరణంగా, చేతి కఱ్ఱ వలె ఉపయోగించుకుంటున్నాడు.

ఇంద్రుడు అమరావతిలో సుఖంగా ఉన్నట్లు దుఃఖరహితుడు స్వస్థ చిత్తుడు అగు జ్ఞాని ఈ శరీరనగరమును పాలిస్తూ ఇందులో సుఖంగా ఉంటున్నాడు.

అతని మనస్సు "నేను పుట్టాను. చచ్చుచున్నాను... ఇవన్నీ నావి... ఇవి నాకు ఉండాలి... నేను వారికంటే ప్రత్యేకత కలిగినవాడిని..." అను లోభపూరితమైన ఆవేశమును పొందుటలేదు. వివేకయుక్తమైన బుద్ధి పొందుచు, 'మోహము, అధర్మము'.. అను దుశ్చర్యలను దూరమునుండే త్యజిస్తున్నాడు. అజ్ఞానయుక్తములైన లోభ కోప మాత్సర్యాదులు అతనిపై దండెత్తలేకపోతున్నాయి. అవి అతని జ్ఞానతీక్షణతకు వెరచి బిక్కుబిక్కుమంటూ బలహీనులగు శత్రురాజువలె దూరంగా ఉండిపోతున్నాయి. సర్వ సంసార దుఃఖములకు మూలము 'ఆసక్తి'యే కదా! అట్టి ఆసక్తిని అతడు జయించివేసి ఉంటున్నాడు. కామభోగములు, సర్వ సుఖ దుఃఖవిలాపరూపమగు 'తృష్ణ'లను గుర్తించి అతడు వాటియందు తగుల్కొనుట లేదు. సర్వవేళలందు బాహ్య – అభ్యంతరములందు పరమాత్మనే దర్శించుచు "ఆధ్యాత్మిక – ఆదిభౌతికములు" అనే రెండు నదుల సంగమములందు* ప్రశాంతంగా స్నానమాచరిస్తున్నాడు. ఈ ఇంద్రియములపట్ల, పైకి రమణీయంగా కనబడే విషయములపట్ల అతడు సర్వవేళల పరాన్ముఖుడై ఉంటున్నాడు. అందుచేత, అవి అతనిని నిరోధించటం గాని, కట్టడి చేయటం గాని చేయలేకపోతున్నాయి. ఏది ఎట్లా జరుగుచున్నప్పటికీ అతడు మాత్రం 'ధ్యానము' అనే అంతఃపురమునందు నిత్యము సుఖపూర్వకంగా వసిస్తూ ఉంటాడు.

ఆత్మ తత్వము ఎరిగినవానికి ఈ శరీరము సుఖప్రదమే అగుచున్నది. ఎందుకంటావా?
1. భోగమోక్షములను ప్రసాదిస్తోంది కనుక 2. ఈ శరీరం ఉంటే దృశ్యం ఉంటోంది. అయితే ఈ శరీరం పోతేనో? ఏదీ కొంచెం కూడా నశించుట లేదు.

ఒక కుండ ఉన్నప్పుడుగాని లేక పగిలిననప్పుడుగాని ఘటాకాశము గాని, మహాకాశము గాని ఏమైనా ఖండించబడుచున్నాయా?... లేదే! ఈ శరీరము నశిస్తే ఇందు ప్రవేశించి అనుభవములను పొందుచున్న ఆత్మ వస్తువుకు పొందునది గాని, కోల్పోవునది గాని ఏమీ ఉండదు. జ్ఞాని ఈ దేహము కలిగియున్నప్పుడే దీని విషయమంతా గ్రహిస్తున్నాడు. వాయువు ప్రసరిస్తూ ఉండగా ఒక గోడ తారసపడితే ఆ గోడను తాకుతుంది. అక్కడ గోడలేకుంటే? తన ప్రసరణను ఇంకా కొనసాగిస్తుంది. అంతే గాని "అయ్యో! ఇక్కడ గోడ పడిపోయింది కదా..." అని తలచి వాయువు కూడా నశిస్తుందా? లేదే! అదే విధంగా శరీరం నేల కూలినా ఇందలి జీవాత్మ ఏమీ కోల్పోదు. శరీరం ఏర్పడుచున్నప్పుడు క్రొత్తగా ఏదీ పొందదు.

❖

జ్ఞాని యొక్క ఆత్మ తాను అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ, ఈ శరీరమునకూడా ఉండి ప్రారబ్ధ భోగము (Fruits of actions done in the past lives) లను అనుభవిస్తూ ఉంటోంది. అంతకంతకు మును ముందే తనయందు సాక్షాత్కరించినట్టి పూర్ణానందమయమగు 'ఆత్మస్వరూపము' అను పురుషార్థమును పొందియే ఆయా సంఘటనలయందు మౌనంగా పాల్గొనుచూ ఉన్నది. అనుభవమునకు అతీతమైన ప్రజ్ఞను అవధరించి సర్వమునకు సాక్షియగుచున్నది.

---

* రెండు నదుల సంగమము = ఆత్మ, శరీరముల సంబంధములను విజ్ఞాన దృష్టితో ఎరిగి ఉండుటయే "సంగమమందు స్నానం" గా ఇక్కడ చెప్పబడింది.

**శ్రీరాముడు :** అంటే అతడు అన్నియు నిర్వర్తిస్తూ ఏమీ నిర్వర్తించనివాడే అగుచున్నాడా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. జ్ఞాని ఆయా అర్థక్రియాదులపట్ల ఉన్ముఖుడై ప్రారబ్ధ కర్మానుసారంగా ప్రాప్తిస్తున్న కర్తృత్వమును, కర్మత్వమును నెరవేర్చుచున్నాడు. ఈ విధంగా వ్యవహారదృష్టితో చూస్తే అతడు అంతా చేస్తూనే ఉంటాడు. అయితే, యథార్థానికి ఏమీ చెయ్యనివాడే అగుచున్నాడు. "నేను సర్వత్రా సర్వదా వ్యాపించియే ఉన్నాను" అను ఎరుకను కలిగి ఉంటూనే లీలామాత్రంగా ఈ దృశ్య కార్యక్రమాలను వినోదపూర్వకంగా పొందుచున్నాడు. 'త్యాజ్యం'అనే విమానం అధిరోహిస్తున్నాడు. చమత్కారంగా, అతి సుందరంగా, పరమశాంతియుతంగా ఈ జగత్తునందు సంచారము సలుపుచున్నాడు. 'మైత్రి' అనే ప్రియురాలితో కూడుకొనినవాడై ఉంటున్నాడు. అతనికి ఇటు అటు 'సత్యత్వము', 'ఏకత్వము' అనబడే ఇద్దరు ప్రియాతిప్రియమైన మిత్రులు వెంటనంటి ఉంటున్నారు. ఆకాశంలో ఆ సూర్యుని చూడు... అతడు వనములోని లతలను నిర్లిప్తంగా చూస్తూ "తన కిరణజాలమును ప్రసరింపజేయుట' అను ధర్మమును నిర్వర్తిస్తున్నాడు కదా! జ్ఞాని కూడా అతి దూరస్థుడై నశ్వరము, దుఃఖగ్రస్తము అగు ఈ లోకములన్నీ చూస్తున్నాడు. సర్వదిక్కులను తన యొక్క "సత్–చిత్"ల ప్రసరణముచే పూర్ణమొనర్చుచున్నాడు. సమస్త సంపదలతో కూడిన పూర్ణచంద్రునివలె అఖండ శోభాయుక్తుడై ప్రకాశిస్తూ ఉన్నాడు. శంకరభగవానుడు కాలకూట విషం మ్రింగితే, ఆ విషం ఆయన కంఠమునకు ఆభరణమే అయి, ఆయనకు 'నీలకంఠుడు' అను ప్రశంసను తెచ్చిపెట్టింది కదా! జ్ఞానిచే సేవించబడు కార్యక్రమములు, భోగసముదాయములు కూడా దుఃఖమును గాక సుఖమునే కలుగజేస్తున్నాయి.

"ఇతడు నిజమైన యముడు కాదు... కేవలం వేషం వేసినవాడు".. అని తెలిసిన తరువాత ఆ వ్యక్తితో సంభాషణ వినోదమునే కలుగజేస్తుంది కాని విషాదమును కాదుకదా! అట్లాగే, "ఈ భోగములన్నీ మిథ్యారూపములే" అని తెలిసిపోయిన తరువాత ఇవి అట్టి జీవునికి దోషరహితమైన సంతోషమును చేకూర్చగలుగుతాయి.

నటులు సామూహిక నృత్యం చేస్తూ దూరంగా పోతూ ఉంటే ప్రేక్షకులు చమత్కార దృష్టితో చూస్తూ ఉంటారు కదా! జ్ఞాని కూడా ఈ స్త్రీ ధన రాజ్య పూజ్యాది వ్యవహారములన్నీ ఒక నాటకములోని సంఘటనలను చూస్తున్నట్లు, తనకు ఏమాత్రం సంబంధమే లేనట్లు అవగాహన కలిగి ఉంటాడు. బహుదూరం పోవలసిన బాటసారి మార్గమధ్యంలో తారసపడే గ్రామ సమూహములను నిర్లిప్తంగా చూస్తూ ఉంటాడు కదా! జ్ఞాని కూడా ఈ సర్వలోక వ్యవహారములను ఆసక్తిరహితంగా ఉద్వేగాదులు లేనివాడై చూస్తున్నాడు.

ఎక్కడో కొండయొక్క ఎత్తైన శిఖరమును, అక్కడి వృక్షముల వృద్ధి క్షయములను జనులు రాగరహిత దృష్టితో చూస్తూ ఉంటారు. అట్లాగే మమత్వము లేనట్టి జ్ఞాని యొక్క దృష్టి కూడా సర్వ కార్యములందు, విషయములందు సంఘటనలయందు రాగరహితమై ఒప్పుతూ ఉంటుంది.

❖

జ్ఞాని ప్రారబ్ధకర్మానుసారంగా ఈ ఇంద్రియములకు ప్రాప్తించే విషయములను అనుభవించ వలసివస్తే... అప్పుడు వాటిపట్ల ఏ విధమైన స్వీకార, తిరస్కార రూపమైన పట్టుదలా వహించదు. అట్లాగే, "ఇవి నేను పొందలేకపోయానే....? ఏమైనా సరే, ఇవి నేను పొందవలసిందే!" అను యత్నపూర్వక 'గ్రాహ్యాభావన' ఆశ్రయించదు. "ఏదో పొందాలి"... అని చెప్పనలవి కాని తపన, ఆతృత అతనియందు ఉండదు. సదా పరిపూర్ణరూపుడై, పరిపూర్ణకాముడై దర్శనమిస్తూ ఉంటాడు. నెమలిపింఛంతో కొండను కొడితే కొండకేమైనా అవుతుందా? ఇక్కడ వచ్చి – పోయే మహర్దశలు, దుర్దశలు జ్ఞానిని ఏమాత్రం చలింపజేయజాలవు.

ఈ స్థూలశరీరము – సూక్ష్మశరీరములకు మూల కారణమైన అజ్ఞానము అతనియందు నశించిపోతుంది.

**సంశాన్త సర్వసందేహో గలితాఖిల కౌతుకః ।**
**సంక్షీణ కల్పనాదేహో జ్ఞః సమ్రాఽ వరాజతే ॥** (సర్గ 23, శ్లో. 49)

అతడిక సంశయరహితుడై ఉంటాడు. ఈ సర్వభోగములందు అతనికి మిథ్యాత్వమే దర్శన మిస్తూ ఉంటుంది. అందుచేత సర్వకౌతుకములను వర్జించినవాడై ఉంటాడు. 'నాయందు ఈ స్థూల సూక్ష్మ దేహముల కల్పనకు చోటే లేదు... జనన మరణాదులు లేవు" అను బోధను ఆశ్రయించి ఉంటున్నాడు. రాజసూయ యజ్ఞఫలం పొందిన చక్రవర్తివలె శోభిస్తూ ఉంటాడు.

అయితే ఇక్కడ 'చక్రవర్తి' అనే దృష్టాంతమును జ్ఞానియొక్క "అవగాహన – పరిమోత్కృష్ట భావన"లను వివరించటానికి మాత్రమే వాడాను. యథార్థానికి, "అపారము పూర్ణము" అయివున్న మహాసముద్రంలాగా జ్ఞాని పూర్ణ స్వరూపమగు తన ఆత్మచే ఆత్మయందే శోభించుచున్నాడు.

జనులు ఒక పిచ్చివాడిని, అతని చేష్టలను చూచి నవ్వుకుంటూ ఉంటారు కదా! అనేక భోగేచ్ఛలచే క్షణక్షణం వ్యాకులచిత్తులగుచు, స్వస్వరూప సమాచారము విషయమై అసావధానత్వం వహించువారిని చూచి జ్ఞాని నవ్వుకుంటూ ఉంటాడు.

ఎవరో త్యజించి, దూరంగా విసరిన వస్తువులను ఆశ్రయించి భద్రముగా దాచుకునే వ్యక్తిని చూచి అందరం పరిహసిస్తూ ఉంటాం కదా! తుచ్ఛమైన ఆసక్తులను కలిగియుండే అజ్ఞానుల ఇంద్రియ ప్రవృత్తులను, మూర్ఖపు కౌతుకాలను చూచి జ్ఞాన దృష్టి గల యోగులు నవ్వుకోవటంలో ఆశ్చర్యమేమున్నది?

❖❖❖

# 17. మనోనిగ్రహం - ఇంద్రియ నిగ్రహం

ఓ రామచంద్రా! మనం ఒక ఏనుగును అంకుశంతో నిగ్రహిస్తాం. ఈ 'మనస్సు' అనే మదపుటేనుగు "ఆత్మసుఖము" అను దానిని త్యజించి 'ఇంద్రియవిషయములు' అనే దుష్టమార్గంలో ఎటకో పరుగులు తీస్తోంది. అట్టి ఈ మనస్సును ఏం చేయాలి? నిరోధించాలి. ఎట్లా? అందుకు చిన్న చిన్న విజ్ఞాపనలు సరిపోవు. విచారణ – సుజ్ఞానములను నిరంతరం ఆశ్రయించాలి.

ఈ మనస్సు అతి చంచలమైనది కదా! అందుచేత, ఇది భోగముల వైపుగా రాగ లోభపూరిత వృత్తులను పొందుతూ ఉంటోంది. అట్టి వృత్తి రూపము పొందకుండా నీవు నీ మనస్సు విషయంలో జాగరూకుడవై ఉండాలి సుమా! విషాన్ని వెడలగ్రక్కుచున్న ఒక లతనో లేక పామునో ఎట్లా దూరంగా ఉంచుతావో, అట్లాగే భోగములపట్ల ఏర్పడుచున్న వృత్తులు నిన్ను సమీపించ కుండా చూచుకోవాలి. అట్టి దుష్ట దుర్బల వృత్తులను మొదలే నిరోధిస్తూ ఉండటం మంచిది.

ఎప్పుడైతే మనస్సు చిరకాలం నిగ్రహించబడి, వృత్తులను పొందక ఉంటుందో, అప్పుడు అట్టి మనస్సులో మా బోధ కొంచెం ప్రవేశించినా చాలు, అమోఘమైన ప్రయోజనం పొందుతోంది. ఎవరి మనస్సైతే ఎల్లప్పుడూ ఆయా భోగ, రాగవృత్తులను ఆశ్రయిస్తోందో, అట్టి వారి ముందు మేము ఎంత విస్తారమైన, సవివరమైన బోధను ప్రతిపాదించినా, అదంతా చెవిటివాని ముందు శంఖము ఊదినట్లే అవుతోంది.

మహాసముద్రం తనయందు భూమినంతా నింపివేయగలగినంత జలం ఉన్నప్పటికీ, నదుల నుండి వచ్చే జలమును స్వీకరిస్తూ ఉంటుంది కదా! నిగ్రహించబడిన మనస్సుగలవారు అనేక రూపములుగా అనేక ప్రదేశముల నుండి వారి వద్దకు చేరుకున్న జ్ఞాన విషయములన్నీ సులభంగా స్వీకరించగలగుచున్నారు. అట్లు స్వీకరించి, వాటిని తమ ఉత్తమ బుద్ధిచే విచారించి మరింత సమున్నతులు కాగలుగుచున్నారు. మనస్సు నిలకడలేనిచోటికి వచ్చి చేరే జ్ఞాన సమాచారం నిష్ప్రయోజనమే అవుతోంది.

నిగ్రహించబడిన మనస్సు అత్యంత సులభంగా తృప్తిని, ఆనందమును, సంతోషమును పొందగలుగుతోంది.

ఓ రాఘవా! ఉత్తమమైన ఆత్మజ్ఞానము ఈ జీవుని యందు వికసించకుండా నిరోధిస్తున్నది ఏది? ఇంద్రియములతో ఏర్పడుచున్న తాదాత్మ్యమే సుమా! ఇంద్రియానుభవముల పట్ల స్వయముగా కల్పించుకొనిన మోహమే ఈ జీవుని అనేక యోనులందు త్రిప్పుచున్నది. లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా భ్రమలను పొందింపచేస్తోంది. ఇక ఈ జీవుడు ఒక ఉపాధి నుండి ఇంకొకదానికి పరుగులు తీస్తూనే ఉన్నాడు.

అందుచేత చేతిని చేతితో నలిపి, దంతములను దంతములతో కొరికి, అవయవములను అవయవములతో ఆక్రమించి... ఎట్లాగైనా సరే, సర్వప్రయత్నములతో ఈ ఇంద్రియములను మాత్రం జయించాలి.

చమత్కారమైన విషయమేమంటే, ఈ ప్రపంచంలో కొందరు అనేక విషయములందు పండితులై ఉండి కూడా, అనేక విజయోత్సాహములతో ప్రపంచమును ఆశ్చర్యపరుస్తూ కూడా, చివరికి ఈ 'ఇంద్రియములు' అనే శత్రువులకు క్షణంలో దాసానుదాసులగుచున్నారే!

ఈ ఇంద్రియములే మొట్టమొదటగా జయించబడవలసిన శత్రువులు.

**ఏతావతి ధరణీతలే సుభగాస్తే సాధుచేతనాః పురుషాః ।**
**పురుషకలాసు చ గణ్యా నజితాయే చేతసా స్వేన ॥** (సర్గ 23, శ్లో. 60)

ఈ భూమి మొత్తం మీద ఇంద్రియములను జయించినవారే భాగ్యవంతులు. అట్టి వారు మాత్రమే సావధానముతో కూడిన చిత్తమును సంపాదించగలుగుచున్నారు. అట్టి 'చిత్తము' యొక్క ప్రభావముచే అతి కుశలముగా ఈ సంసారమును జయించి వేసి, స్వస్థచిత్తులగుచున్నారు.

❖

ఓ సర్వజనులారా! "మా దృష్టిలో వీరు మంచివారు కాదు... వారు గొప్పవారు కాదు... ఈ వ్యక్తిలో ఇట్టి దోషాలు ఉన్నాయి..." మొదలైన పరుల దోషములను ఎంచు ప్రవృత్తులను కాస్త కట్టిపెట్టండి. "వారు మా శత్రువులు... వీరిని మా కండబలంతో, బుద్ధిబలంతో నిర్జించ గలం...ఇకపై వీళ్ళ వీళ్ళ సంగతి చూడాలి! ఇక చూస్తాం...." అని మననం చేస్తూ మీరు పరుగులు తీస్తున్నది ఎటు వైపు? మీ హృదయ కుహరంలోనే "దుష్టసంకల్పములు, విషయ వాసనలు" అనే రెండు కాలకూట విషసర్పాలు సంచరిస్తూ ఈ జన్మ కర్మలను విషపూరితం చేస్తున్నాయి. ఇంటిలోనే శత్రువులను పెట్టుకొని ఎక్కడో ఉన్న ఎవరో శత్రువుల గురించి ఎందుకో వేగిరపాటు? ఎవని హృదయంలో అయితే 'దుష్టమనస్సు' అనే సర్పం వినాశనం పొందుతుందో, అట్టి వాడు స్వస్వరూప సాక్షాత్కారమును అతి సులభంగా పొందుచున్నాడు. నిర్మలాంతఃకరణుడు అగుచున్నాడు.

అందుచేత మీరంతా "ఈ ఇంద్రియముల వేగమును నిరోధించటం ఎట్లా? ఈ మనస్సును ఏ సన్మార్గపు ఆచరణచే పరిశుద్ధ పరచుకోవాలి?" అనే విషయాలు మరలమరల పరిశీలించండి. శాస్త్రాదులు అందుకు ఉపకరించాలనే ఉద్దేశంతోనే మీ ముందు ప్రతిపాదించబడుచున్నాయని గ్రహించండి.

❖❖❖

## 18. ఉపేక్ష పనికి రాదు

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ ఇంద్రియములను చూస్తున్నావా! ఇవి 'తృష్ణ'చే నిండియున్నవై, మహానరకప్రదములు అగుచున్నాయి.

ఈ 'ఇంద్రియములు' అనే శత్రువులను జయించాలంటే ఓర్పు-నేర్పు-శ్రద్ధ- ఈ మూడూ అవసరం.

కృతఘ్నుడు తాను ఎవరి యొక్క సహాయం పొందాడో వారినే బాధిస్తాడు కదా! ఈ ఇంద్రియాలు కూడా తమకు ఆశ్రయమైనట్టి దేహమునే శిథిలపరచుటకు, నశింపజేయుటకు సిగ్గు లేకుండా సిద్ధపడుచున్నాయి. పాపధనం కూడబెట్టడంలో 'మహాదిట్ట' అయి ఉంటున్నాయి.

ఇంటి ప్రక్కనే బలవంతుడైన శత్రువు ఉంటే ఎవరికి శాంతి ఉంటుంది? ఈ ఇంద్రియములు జీవుని ప్రశాంతతకు ముప్పు తెచ్చిపెడుతున్నాయి. అయ్యో! ఈ ఇంద్రియములు జీవుని ఎంతగా క్షోభపెడుతున్నాయో చెప్పలేం. ఇవి విషయములను ఆపేక్షించుచు 'పొందవలసినవి, చేయ వలసినవి' అనే రెక్కలు కలిగి 'దేహం' అనే గూటిలో ప్రవేశించి మరల మరల విజృంభిస్తున్నాయే!

'వివేకము' అనే వలపన్ని ఈ ఇంద్రియ పక్షులను పట్టి వశం చేసుకోవాలి. అట్టివాడు మాత్రమే అచ్ఛేద్యమగు శాంతస్వరూపుడు అగుచున్నాడు. వివేకులు సమగ్రమగు 'అవగాహన' అనే నిలకడ కలవారై పైపైకి మాత్రమే రమణీయంగా ఉండే ఈ ఇంద్రియ విషయము లందు ఏ మాత్రం ప్రీతిని గాని, కౌతుకమును గాని పొందకుండా ఉంటున్నారు. ఇంద్రియములను ఓడించి వేసి, తమ చిత్తమును స్వాధీనము చేసుకున్నవారై 'మట్టి' మొదలైన పంచభూత సమ్మేళనముచే నిర్మించబడిన ఈ స్వశరీరమును ఒక ఉపకరణమాత్రమైనదిగా చూస్తున్నారు. అందుకు ఫలితంగా ఆ వివేకులు పరమసుఖమునే పొందుచున్నారు. అట్టి సుఖమును గొప్ప సామ్రాజ్యమును ఏలుతున్న చక్రవర్తులు కూడా పొందలేకపోతున్నారు.

ఎవడైతే ఈ ఇంద్రియములను తన భృత్యులుగా చేసుకుంటాడో (తాను వాటికి భృత్యుడు కాడో...) 'దుష్ట మనస్సు' అనే శత్రువును జయించివేస్తాడో... అట్టి వాని పరిశుద్ధమగు బుద్ధి 'వసంతకాలంలోని లతలు' వలె వృద్ధి చెందుతోంది. మేము చేయు బోధలు అతని పట్ల రసమయమై అతి పవిత్రతను సంతరించుకుంటున్నాయి.

**శ్రీరాముడు :** స్వామి! ఈ భోగవాసనలు నశించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఎవరినైనా ఉద్ధరించగలిగేది వారి యొక్క 'అభ్యాసము' మరియు వారి 'వైరాగ్యపూరితమైన విచారణ' అని గ్రహించు.

సర్వప్రయత్నములచే ఈ చిత్తము యొక్క గర్వమును నశింపజేయాలి.

ఇంద్రియ శత్రువులను జయించటానికి అభ్యాసము, దైవీగుణములను ఆశ్రయించుట ఉపాయమైయున్నది. ఉత్తమ అభ్యాసం ఆశ్రయించేవారు తమ భోగవాసనలను స్వయంగా నశింప జేసుకోగలగుచున్నారు. ఇందులో సందేహము లేదు. అభ్యాసమును ఆశ్రయించకుండా, "మేము ఉద్ధరించబడటం ఎలా?" అని ఖాళీచేతులతో గురువును ఎంతగా ప్రశ్నిస్తే ఏం ప్రయోజనం?

❖

ఓ రామచంద్రా! 'ఏకం' అయినట్టి "బ్రహ్మతత్త్వం"ను అభ్యసించుట చేత మనస్సు క్రమంగా జయింపబడగలదు. మనస్సు జయింపబడనంత కాలం 'అజ్ఞానం' అనే గాఢాంధకారం ఉండనే ఉంటుంది. ఆ చీకటి ఉన్నంతసేపు వాసనలు జుట్టు విరగబోసుకున్న పిశాచాలలా విజృంభిస్తూనే ఉంటాయి.

"నేను స్వల్పుడను... శరీరమాత్రుడను... చావుపుట్టుకల మధ్య మాత్రమే ఉన్నవాడను"... అను స్వల్పత్వమును నీవు త్యజించు. మనస్సునందు ఆత్మకు సంబంధించిన సమాచారము చేతను, వివేకపూరితమైన పరిశీలనాదులచేతను నింపివేయి. వివేకవంతుడవై ఉండు. అవివేకివి కావద్దు. "నా గతి ఇంతే... నే బాగుపడటమేమిటి?... నేను ఉద్ధరింపబడజాలను... ఎందుకంటే నేను అల్పుడను కదా"... ఇట్టి అవివేకమును, ఆ అవివేకమునకు సహకరించు వాక్యక్రమములను, భావనలను దూరంగా నెట్టివేయి.

వివేకి యొక్క మనస్సు. తాను గ్రహించిన లక్ష్యం వైపుగా కార్యక్రమాలుగా నిర్వర్తించడానికి సిద్ధంగా ఉంటుంది. కాబట్టి అది అతనికి గొప్ప సేవకుడు.

అది అతనిని సత్కార్యములవైపు ప్రేరణ కలిగిస్తుంది. కనుక మంచి మిత్రుడు.

'ఇంద్రియములు' అనే శత్రువులపై దాడిచేసి అణచివేస్తుంది. కనుక గొప్ప సామంత రాజు.

ప్రేమభావము కలిగి ఉంటుంది. అందుచేత అత్యంత ప్రియురాలగు స్త్రీ.

పాలించి, ఆ జీవుని అనేక దుఃఖములు, ప్రమాదాల నుండి రక్షిస్తూంటుంది. కాబట్టి తండ్రి.

ఈ విధంగా వివేకి విషయంలో అతని మనస్సు అతనికి క్షేమమునే కలుగజేస్తోంది.

❖

'ఈ మనస్సు అనుల్లంఘ్యనీయమైన శాసనము కలిగి ఉంటోంది. అయితే దాని యొక్క వాస్తవరూపము చైతన్యము. అది చైతన్యము కంటే వేరైనది కాదు. 'స్నేహము – వివేకము – ఉత్తమ బుద్ధి'లచే దానిని వశం చేసుకోవాలి..." అని మనకు శాస్త్రములు బోధిస్తున్నాయి. చైతన్యము యొక్క స్వయంకల్పనయే ఈ మనస్సుకు మూలము. సాధన–ఉపాసనలు కొనసాగు చుండగా, ఈ మనస్సు తన యొక్క మనోరూపమును త్యజించి "చైతన్య మాత్రము"గా శేషించు చున్నది. తత్త్వజ్ఞానసిద్ధిని ప్రసాదించి, మరుక్షణం తాను అదృశ్యమగుచున్నది.

శాస్త్రదృష్టిచే ఈ జీవితము అనే గని పరిశీలించబడగా, సౌభాగ్యవశంచేత, "మనస్సు యొక్క స్వభావమునకు సంబంధించిన సమాచారము" అనే మణి ఈ జీవునికి లభిస్తోంది. అట్టి ఈ మనస్సు 'ఆచార్యుల పాఠములు – సహపాఠకులతో కూడి చేయబడిన విచారణ' అను వాటి సహాయం చేత స్వానుభవ పర్యంతము (upto one's own absolute sense of experience) విచారించబడగా 'నిధిధ్యాస' అనే ఉత్తమ కార్యక్రమం ప్రాప్తిస్తోంది. అప్పుడు ఈ మనస్సు జ్ఞానంచే సుప్రబోధం అగుచు సప్తభూమికలను అనుశ్రుతం చేసుకుంటోంది. అప్పుడు మిక్కిలి ప్రశాంతతో శోభించుచు లోక కళ్యాణకారకమే అవుతోంది.

**సరిదిద్దబడుచున్న మనస్సు -** ఈ మనస్సును మనం సరిదిద్దుకున్నామా, ఇక ఇది 'సాధన చతుష్టయం' మొదలుకొని తత్త్వసాక్షాత్కారము వరకు ఉత్తమ కర్మలను మనచేత నిర్వర్తింపజేస్తుంది. 'జన్మలు' అనే అత్యంత ప్రాచీనమైన వృక్షాన్ని మొదలంట ఖండింపజేస్తూ, నిరతిశయానందమును ప్రసాదించుచున్నది. ఇది తనకు తానే సమర్పించుకొని ఈ జీవునకు 'ఆత్మభావన' అనే ఒక గొప్ప ప్రయోజనమును ప్రసాదించుచున్నది.

కనుక ఓ సర్వజనులారా! మహత్తరమై ఈ మనస్సును చక్కగా నియోగించండి. అప్పుడు 'ఆత్మోద్ధరణ' ప్రసాదించుటలో ఇంతకు మించిన శ్రేయోదాయకమైన దంటూ ఇంకేదీ ఉండదు. బురదతో నిండిన కాళ్ళతో ఎవరైనా ఇంటిలోకి ప్రవేశిస్తారా? మీ మనస్సులను 'వివేకం' అనే జలంతో పరిశుద్ధపరచుకోకుండా ఈ దృశ్యం నుండి ఆంతరంగంలోకి ప్రవేశిస్తే, దుఃఖాదులే తారసపడతాయి సుమా!

**మనస్సే బంధము.... మనస్సే మోక్షము -** ఓ రామచంద్రా! వివేకరహితులగువారు, మూర్ఖులు మాత్రమే అనేక ఉత్పాతములతో కూడి ఉన్న ఈ సంసారభూములందు సంచరిస్తూ సుదీర్ఘమైన ప్రయాణాలు చేయటానికి ఉద్యుక్తులౌతున్నారు. నీవు మాత్రం వివేకయుక్తుడవు అయి, ఈ సంసారమునందు చిక్కకుండేందుకే యోచించు. భయంకరమైన వ్యాధి వచ్చి పడుతుంటే, దానికి చికిత్స గురించి యోచించకుండా ఎవరైనా ఉంటారా? ఓ రామా! అనేక అనర్థములు

**సంసార మాయాముదితామ్ అనర్థశతసంకులామ్ ।**

**మా మహామోహమిహికామ్ ఇమాం త్వమవధీరయ ॥** (సర్గ 24, శ్లో. 17)

తనయందు ఉంచుకొని, నీ ముందు కపటంగా వ్యక్తమగుచున్న ఈ సాంసారికమాయను ఉపేక్షించవద్దు.

"దామ-వ్యాళ-కటన్యాయము" అనే మూర్ఖత్వం పొందవద్దు.

"భీమ-భాస-దృఢన్యాయము" ను స్వీకరించి వివేకివి కమ్ము.

అప్పుడు 'దుఃఖరాహిత్యము' అనునది నీ చేతిలోని విషయమే అవుతుంది. 'ఈ దృశ్య భూతమగు శరీరమే నేను' అను రూపముగల మిథ్యానిశ్చయమును పూర్తిగా త్యజించు. ఈ మిథ్యా వస్తువులన్నింటికీ భిన్నమైనట్టి 'సత్యము' అగు ఆత్మవస్తువు ఆశ్రయించు. నీవు రావచ్చు... పోవచ్చు... తినవచ్చు... తిరుగవచ్చు... అయితే సర్వదా అమనస్కుడవై ఉండు. ఎట్టి బంధమున తగుల్కొనవద్దు.

అప్పుడు నీవు ముక్తుడవే అవుతావు.

❖❖❖

# IV. దామ - వ్యాళ - కటన్యాయం

## 1. శంబరాసుర సృష్టి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఈ ప్రపంచమునందు విహరిస్తున్న అనేకమంది జనులకు శాంతిని ప్రసాదించేది ఎట్లా?"... అను లోకపిత భావమును నీవు కలిగియున్నావు. శమదమములు నీయందు ఉన్నాయి. మోక్షము లక్ష్యముగా కలిగియున్న మహాశయుడవు. అట్టి నీకు దామ-వ్యాళ-కటన్యాయము ఉచితము కాదు సుమా! కనుక భీమ భాస దృఢ న్యాయము నందు సుస్థితుడవై, శోకరహితుడవై ఉండాలి. అదియే ఉచితం.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ సంసారమును విస్తరింపజేసుకుంటూ అనేక దుఃఖములను ఆహ్వానించుకుంటున్న మమ్ములను మీ వాక్యములు సముద్ధరిస్తున్నాయి.

"దామ-వ్యాళ-కట న్యాయము" అనుసరించవద్దని మీరు మరల మరల హెచ్చరిస్తున్నారు కదా! మీరు చెప్పిన రెండు న్యాయములు ఏమిటో వివరించండి. 'భీమ భాస దృఢ న్యాయం' మమ్ములను ఎట్లా శోకరహితులుగా చేస్తుంది? రెండు న్యాయముల గురించి సవిస్తరంగా చెప్పటం చేత మేము ప్రబోధితులం కాగలం. సక్రమమైన మార్గమును ఎన్నుకుంటాం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే ముందుగా "దామ వ్యాళ కట న్యాయం" అనే పదప్రయోగం వెనుక గల ఇతిహాసం చెపుతాను. విను.

**దామ వ్యాళ కటులు -** ఒకప్పుడు పాతాళలోకమును 'శంబరాసురుడు' అను పేరుగల దైత్యరాజు పాలిస్తూ ఉండేవాడు. మాయను కల్పించుటలో అతనితో సమానమైన మాంత్రికుడు మరొకడు లేడు. తన మాయచే ఆకాశమునందు నగరములను, సుందరమైన ఉద్యానవనములను నిర్మించి, తన జాతి వారికి ఇస్తూ ఉండేవాడు. కృత్రిమంగా సూర్యచంద్రులను నిర్మించి, తద్వారా ఋతువులను నియమించి స్వజనులకు ఆహ్లాదం కలిగిస్తూ ఉండేవాడు. అతని పాలనలో దానవకులం అనేక ఐశ్వర్యములతో తులతూగుతూ ఉండేది.

అతని అంతఃపురంలో అప్సరసలను మించిన అందంగల స్త్రీలు మధురంగా గానములు చేస్తూ ఉండేవారు. అతని క్రీడావనంలో సృష్టిలో మరెక్కడా లభ్యంకాని చిత్రవిచిత్రములైన వృక్షములు, పూతీగలు ఉండేవి. అతడు "కర్తని" అనే యంత్రము కలిగి ఉండి, ఇంద్రుడిని కూడా అత్యంత భయపెట్టుతూ ఉండేవాడు. క్రీడ కొరకు రచించిన మట్టి శివుని విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ చేసి ఆ శివుని సహాయంతో చక్రధరుడగు విష్ణుభగవానుని కూడా ఓడిస్తూ ఉండేవాడు. ఒక సమయంలో అతడు ఆకాశమునందు తన లోకవాసుల కొరకు నూరు చంద్రులను సృష్టించి పరవశింపచేశాడు.

మాయతో ఐరావతం సృష్టించుకున్నాడు. అది ఇంద్రలోక ఐరావతం కంటే వేలరెట్ల తేజస్సుతో వెలుగొందేది. సమస్త సంపదలచే, సర్వైశ్వర్యాలతో, ఎవ్వరినైనా సరే జయింప గలిగిన వాడై విరాజిల్లుతూ ఉండేవాడు. కఠినమైన శాసనములతో సామంత రాజులను పాలిస్తూ ఉండే వాడు. భయంకర ఆకృతిగల శంబరాసురునికి దేవతలను కూడా నిర్జించివేయగల గొప్ప సైన్యం ఉండేది.

అయితే ఆ రాక్షసుడు ఎటైన వెళ్ళి ఉండటం జరిగినప్పుడో, లేక అతడు ఆదమరచి దీర్ఘకాలంగా నిదురిస్తున్నప్పుడో ఆ ఏమరపాటు సమయమును ఉపయోగించుకొని దేవతలు తమ మాయాప్రయోగంతో అనేకమంది శంబరుని అనుచరులను దునుమాడుతూ ఉండేవారు.

శంబరుడు దేవతల కపటయుద్ధ ప్రయోగాన్ని గమనించాడు. అతడు గొప్ప మాయావి కదా! "ఇప్పుడేం చేయాలి?"... అని బహుతీవ్రంగా యోచించి ఒక ఉపాయం పన్నాడు. సముద్రము తరంగమును ఉత్పన్నం చేస్తుంది చూచావా? అట్లా అతడు చపలబుద్ధి గలవారు, వీరులు అయిన కొందరు రాక్షస సైనికులను సృష్టించాడు. వారిపై అజమాయిషీకి ముగ్గురు సేనాపతులను సృష్టించాడు. కాని దేవతలు మంచి సమయం చూచి, శంబరాసురుడు ఏమరుపాటుగా ఉన్న సమయంలో ఆ సేనాపతులను సైన్యమును కూడా సంహరించారు.

ఈ మాటు శంబరునకు చాలా కోపం వచ్చింది. "ఈ దేవతలను అంత తేలికగా వదలి పెట్టకూడదు. వీరిని, వీరు నివసించే స్వర్గమును సర్వనాశనం చేయవలసిందే" – అని నిశ్చయించు కున్నాడు. తన బలగంతో అమరావతిపై దండెత్తటానికి బయలుదేరాడు. ఈ వార్త ఎట్లాగో దేవతల చెవుల వరకు వెళ్ళింది. శంబరాసురుడు అమరావతి ప్రవేశించకముందే దేవతలు స్వర్గమును వదలి ఎక్కడో దూరప్రదేశానికి పారిపోయి తలదాచుకున్నారు. స్వర్గలక్ష్మి క్షుద్రదేవతా సమూహం చేత ఆక్రమించబడి రోదన చేయసాగింది. అక్కడి అప్సరసలు కన్నీరు కార్చారు. శంబరుడు స్వర్గం లోని సుందరమైన వస్తువులన్నీ తన వెంట ఎత్తుకుపోతూ అమరావతిని శూన్య ప్రదేశంగా మార్చాడు. పట్టణమంతా తన సైనికులచే తగులబెట్టించాడు. భీకరంగా నినాదాలు చేసుకుంటూ స్వస్థానం అయినట్టి పాతాళలోకం చేరాడు.

ఈ విధంగా దేవ–దానవుల మధ్య వైరం అధికం కాసాగింది. దేవతలు స్వర్గమును వీడి ఎక్కడెక్కడో రహస్య ప్రదేశాలలో దాగుకొనవలసివచ్చింది. ఆ తరువాత దేవతలంతా ఒక రహస్య ప్రదేశంలో సమావేశమై గొప్ప వ్యూహమును రచించి, ప్రయత్నపరులు అయ్యారు.

అప్పుడు శంబరాసురుడు "మొండి–క్రోధ–ధృముడు" అనే ముగ్గురు సేనాపతులను సృష్టించాడు. శంబరుడు తపస్సుకు వెళ్ళిన సమయం చూచి, మొండి–క్రోధ–ధృముడు అను పేర్లు గల ముగ్గురు సేనాపతులను దేవతలు హతమార్చివేశారు. శంబరుడు వచ్చేసరికి అక్కడ కనబడ కుండా, అదృశ్యమైపోయారు. అప్పుడు శంబరాసురునికి భలే కోపం వచ్చింది...!

**శంబరాసురుడు:** ఓ కీటకామాత్ర జీవులగు దేవతలారా! నేను ఏమరుపాటుగా ఉండటం చూచి నా సేనాపతులను సంహరిస్తారా? నేను వచ్చేసరికి పిరికివాళ్ళై పారిపోయి, నాకు తెలియని చోట

దాగారు కదూ? సరే! ఈ మాటు నా మహత్తరమగు మాయా శక్తిచే గొప్ప సేనాపతులను ముగ్గురిని సృష్టిస్తాను.

ఇట్లు పలికి, అప్పటికప్పుడే రాక్షసజన సృష్టికి సంబంధించిన మంత్రం ఉచ్చరించ నారంభించాడు. తత్ సంబంధించిన తంత్రం నిర్వర్తిస్తూ ఇట్లు పలికాడు.

**శంబరాసురుడు :** నాచే సృష్టించబడుచున్న ముగ్గురు సేనాపతులారా! మీరు గొప్ప తెలివి తేటలు గలవారు, గొప్ప యుద్ధ విశారదులు అగుదురు గాక! రూపరహితుడగు కాలుడు మూర్తిమంతుడైతే ఎంత భయంకరంగా ఉంటాడో, మీరు అంత బీభత్స స్వరూపులై ఉండెదరు గాక! అతి బలశాలురు, మాయా శక్తి సంపన్నులు అయి ఉండెదరు గాక! ఒక్కొక్కరు ఒక పర్వతం వలె గొప్ప శరీరములు కలిగి ఉంటారు. మీ స్వభావములను అనుసరించి మీకు ఈ పేర్లు పెడుతున్నాను–

1. దాముడు = ఎంతటి శత్రువులనైనా సరే, అణచివేయగలిగినవాడు.
2. వ్యాళుడు = సర్పమువలె ఆక్రమించువాడు.
3. కటుడు: శత్రువుల సర్వశస్త్రాస్త్రముల నుండి స్వసైన్యమును రక్షింపగలిగినవాడు.

❖

ఆ ముగ్గురికి ఇతఃపూర్వపు జన్మలు గాని, కర్మలు గాని లేవు. ఇదే వారి యొక్క మొదటి జన్మ. అందుచేత వారి యందు 'రాగము–ద్వేషము–అహంకారము–మమకారము' – అనేవి లేనే లేవు. వారు 'చేతనము' అను ధర్మము మాత్రము కలిగి ఉండేవారు. భయం గాని, అభిమానం గాని లేవు. "మరణిస్తామేమో! పారిపోదాం" అను వికల్పము వారియందు లేనేలేదు. "చిన్మాత్రము యొక్క సన్నిధానం మాత్రంచేత దేహము ప్రవర్తించుట" అను రాగ – కౌతుక రహితమైన ప్రతిస్పందన మాత్రం వాళ్ళు కలిగియున్నారు. చూచావా రామా! 'కర్మజీవుడే' అయివున్నట్టి ఆ శంబరాసురుడు తన కౌశల్యం చేత 'సంకల్పవృత్తి'ని హస్తలాఘవంగా ఉపయోగించాడు. అంతర్యామియగు శుద్ధ చైతన్యమును 'భావన'చే ఆరాధించుటచే ఆ దామ – వ్యాళ–కటులు ఉత్పన్నమైనారు.

**శ్రీరాముడు :** అతనిచే వాళ్ళు ఎలా కల్పించబడ్డారు. అది అతనికి ఎలా సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వివరంగా చెప్పాలంటే, అతడు తపస్సుచే సాధించియున్న ఏకాగ్రత చేతనే సుసాధ్యమగుచున్నది. అతడు దృఢమైన చిత్తంతో ఈ విధంగా 'సంకల్పం' చేయటం జరిగింది.

"అంతర్యామి, చైతన్యస్వరూపడను అగు నేను చైతన్యమే స్వరూపముగా కలిగియున్న విలక్షణ మైన రూప, స్వభావాలు గల ముగ్గురు రాక్షసయోధులను సంకల్పిస్తున్నాను. అట్లు నాచే సృష్టించ బడుచున్న ఈ ముగ్గురు గొప్ప లక్షణములు, శక్తి యుక్తులు కలిగియుండెదరు గాక! సాక్షి చైతన్యం చేత ఉత్తేజితులై రాక్షస విజయం, దేవతల అపజయం అనే లక్ష్యం కలిగి ప్రవర్తించెదరు గాక!"

ఇట్టి ఆ రాక్షసుని సంకల్పశక్తియే ఆ ముగ్గురు సేనాపతుల జన్మలకు కారణమైనది.

ఆ దామవ్యాళకటులకు "మేము భోగములు పొందాలి" అనే ఆశయాలు లేవు. ఉత్పన్నమైన ఆ ముగ్గురు కాకతాళీయన్యాయంచేత రాక్షస సేనాపతులుగా తమకు ప్రాప్తించిన ఆయా క్రియలను

అంధపారంపర్యముగా అనుసరించసాగారు. గాఢనిద్ర పట్టేముందు బాలుడు ప్రక్కలో పడుకొని అసంకల్పితంగానే తన అంగములు కదలుస్తూ ఉంటాడు. చూచావా! వారు ముగ్గురు అట్లే వాసనారహితులై, ఆత్మాభిమానవర్జితులై ఆయాచేష్టలను ప్రకటిస్తూ ఉండేవారు.

**దేవతలతో యుద్ధం -** ఇంతలోనే దేవతలతో యుద్ధం చేయవలసివచ్చింది. ఆ ముగ్గురు యుద్ధభూమిలో ఉండగా " ఈ శత్రువులను మేమే చంపాం... మేము బలవంతులం... ఇది మా వలననే ఇట్లు జరుగుతోంది"... అను భావనయే పొందేవారు కాదు. వాళ్ళకి యుద్ధం చేయటమే తెలుసు. అంతేగాని, "అరే, ఈ శత్రువులు ఇంత అకస్మాత్తుగా మా పై వచ్చిపడ్డారే! ఇప్పుడు ఏమి గతి? మేము చస్తామేమో?"... అనే శంక వారిలో లేదు. అందుచేత యుద్ధభూమి నుండి ఎప్పుడు ఎందుకు పారిపోవాలో వారికి తెలియదు. జీవనము-మరణము, గెలుపు-ఓటమి, సంగ్రామం-విశ్రాంతి, ప్రతిష్ఠ-అప్రతిష్ఠ అనువాటి భేదమునకు సంబంధించిన మననము వారిలో ఏర్పడ లేదు. తమ పిడికిలి దెబ్బతో పెద్దకొండనైనా పిప్పిచేయగలమని వాళ్ళ నమ్మిక. పిరికితనమనునదే లేకుండా శత్రువులను ఎదుర్కొని నేలకూల్చారు. దేవతలు వారి ధాటికి ఆగలేకపోయారు. వెనుకకు తిరిగి పారిపోవటం ప్రారంభించారు. అది తెలిసి, శంబరాసురుడు పెద్దగా నవ్వుతూ "ఆహాఁ! నాచే రచించబడిన ఈ ముగ్గురు అసురుల రక్షణలో దానవజాతి కీర్తి ఇనుమడిస్తోంది కదా...!" అని గర్వం పొందాడు. "ఓ సేనానాయకులారా! నికృష్టజీవులు, మోసగాళ్ళు అయిన ఆ దేవతలను వదలకండి. వారిని అందినవారిని అందినట్లే మట్టుపెట్టండి" అని ఉసిగొలిపాడు.

దామ వ్యాళ కటులతో కూడిన దానవసైన్యం దేవతల వెంటబడింది. అప్పుడు దేవతల - రాక్షసుల సంగ్రామం ఆకాశంలోను భూమి మీదా ప్రళయంలాగా దుస్సహంగా జరిగింది. పర్వతాలు చూర్ణం కాసాగాయి. పరస్పరం ప్రయోగించిన శస్త్రాస్త్రముల ధాటికి దిక్కులు పిక్కటిల్లాయి. 'ఘుర-ఝుర-భర' శబ్దములచే ఆకాశం నిండిపోయింది. మాయారచితమైనట్టి అగ్నివృష్టి, మేఘవృష్టి, పర్వతవృష్టి యుద్ధభూమిలో ప్రయోగించబడ్డాయి. మహాయోధులగు అనేకమంది ఆ యుద్ధంలో మరణించటం జరిగింది. కాని ఏం లాభం? అగ్నికి ఆజ్యం తోడైనట్లు, నేల కూలిన రాక్షస సైనికులు శుక్రాచార్యుని 'సంజీవని మహావిద్య'చే ఉజ్జీవితులయ్యారు. ఇంకేముంది? 'సిద్ధులు-సాధ్యులు' మొదలైనవారితో కూడిన సురగణం అసుర భయానికి చెల్లాచెదరైపోయింది.

❖❖❖

## 2. మమకారావిష్కరణ

ఆ విధంగా పారిపోయిన దేవతలంతా దానవుల దృష్టిలోంచి తప్పించుకొని ఎక్కడో ఒక రహస్య ప్రదేశంలో సమావేశమయ్యారు.

**ఇంద్రుడు :** ఓ దేవతలారా! మనం ఎంతటి ఘోరసంగ్రామమం చూచాము! మనలో అనేక మంది వీరులు మట్టికరిచారు. దాముడు మన పలాయనం చూచి సింహనాదాలు చేశాడు. వ్యాళుడు తన

కబంధహస్తాలతో దేవతాస్థానములను ధ్వంసం చేస్తున్నాడు. ఇక కటుడి భయంకరమైన యుద్ధ విన్యాసం వర్ణనాతీతం. వీరికి ఇంతటి శక్తియుక్తులు ఎట్లా వచ్చాయి? మనం వీరి ముందు నిలువ లేకపోతున్నామే! ఇక మన గతి ఏమిటి?

❖

దామ – వ్యాళ – కటులు విజయోత్సాహంతో సింహనాదాలు చేస్తూ దేవతల కొరకై ఎంత గానో వెతికి వేసారి 'పిరికిపందలు! ఎక్కడికి పారిపోయారో?' అని తలచారు. వారి జాడ కనుగొన లేకపోయారు. విజయోత్సాహంతో తమ ప్రభువు శంబరాసురుని వద్దరు వెళ్ళి తమ విజయ పరంపరలను విన్నవించుకున్నారు. పాతాళమంతటా ఆనందోత్సాహాలు మిన్నుముట్టాయి.

❖

రహస్య స్థావరంలో సమావేశమైన దేవతలు మిక్కిలి, ఖిన్నులయ్యారు. 'శంబరుని నిరోధించుటకు ఉపాయం ఏమిటి?" అని ఎంతో యోచించారు. ఉపాయమేదీ తట్టలేదు. "దిక్కు లేని వారికా భగవంతుడే కదా, గతి! అందుచేత మన పితామహుడగు బ్రహ్మదేవుని ప్రార్థిద్దాం" అని నిర్ణయించుకొని వారంతా భక్తితో పితామహునికి ప్రణామం చేశారు. క్షణంలో వారందరి మధ్యలో బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు. అప్పుడా దేవతలు బ్రహ్మదేవునితో దామ–వ్యాళ–కటుల ఉత్పత్తి క్రమం గురించి, వాళ్ళు చేస్తున్న అనర్థముల గురించి పూసగ్రుచ్చినట్లు విన్నవించుకున్నారు. భగవంతుడగు బ్రహ్మదేవుడు సావధానంగా అంతా విన్నాడు. కొంచెము సేపు మౌనం వహించాడు. చిరునవ్వుతో దేవతా సైన్యమునకు ధైర్యం చెప్పుచూ ఇట్లు పలికాడు.

**బ్రహ్మదేవుడు :** ఓ దేవతలారా! కొంతకాలం తరువాత సర్వాత్మకుడగు విష్ణుదేవుని చేతులలో ఈ శంబరాసురుడు హతం కాగలడు. అంతవరకు మీరు వేచి ఉండక తప్పదు. అయితే ఈ లోగా ఈ దామ వ్యాళ కటులను నిరోధించటం ఎంతైనా అవసరం. అందుకు ఒకే ఒక మార్గం నాకు కనబడుతోంది. వారికి తమ దేహము పట్ల అభిమానము కలిగేటట్లు చేయాలి.

ఇప్పుడు మీరు వారితో యుద్ధం చేయటానికి రంగంలో ప్రవేశించండి. యుద్ధం చేస్తూ పారి పోతూ ఉండండి. ఆ విధంగా పదే పదే చేయండి. వారు అనేకసార్లు 'గెలుచుట' అను అభ్యాసానికి వశమవుతారు. క్రమంగా దురభిమానానికి, లోభానికి లోనవుతారు. ఒక అద్దంలో ముఖం ప్రతిబింబిస్తున్నట్లు వారి అంతఃకరణములో అహంకారం ప్రతిబింబించగలదు. ఎందుకంటే...

ఇప్పుడు మాత్రం వారియందు 'వాసన' అనునది కించిత్ కూడా లేదు.

"సుఖము, గౌరవము, ఆశ" అనునవి ఇప్పుడు వారియందు ఏర్పడుట లేదు. అందుచేత మీ బలపరాక్రమములు వారి ముందు కొరగాకుండా పోతున్నాయి. అహంకారము, మమకారము అనేవి లేని వారిని జయింప గలిగినది ఈ లోకంలో ఏదీ లేదు. వారిలో అహంకారము యొక్క ఛాయ ప్రవేశించిందా,.. ఇక వారిని మీరు సులభంగా జయించి వేయగలరు. నేలపైనగల గింజలను తినటానికి వెళ్ళిన పక్షులు వలయొక్క దారమునకు చిక్కుకుంటాయి చూచారా! ఈ

జీవులు 'వాసన' అను సూత్రపుతాడునందు చిక్కుకుంటున్నారు. 'ఆశలు' అను పాశములందు తగుల్కొని, క్షణంలో వశీభూతులగుచున్నారు. ఎవరియందైతే వాసనలు సంపూర్ణంగా నశించు చున్నాయో... ఇక వారిని నిరోధించగలిగేదేది? దేనిపట్లా కూడా అనురక్తి లేనివారిని కార్య విముఖులుగా చెయ్యలేము. సుఖముచే 'ప్రసన్నము' పొందక, దుఃఖముచే కృశించక ఉండేవారిని జయించుట దుస్సాధ్యమైన విషయమే. 'వాసన' అనే త్రాడుచే కట్టబడిన జీవుడు... అతడు మహానుభావుడైనా, శక్తిమంతుడైనా, అనేక విషయములు తెలిసినవాడు అయినా... చివరికి అతడు ఒక బాలునిచే కూడా జయింపవేయబడగలడు.

కాబట్టి బిడ్డలారా! "ఈ దేహేంద్రియాలే నేను. ఈ జనులు, ధనం... ఇవన్నీ నావి" మొదలైన కల్పనలు చేయువాడే సమస్త ఆపదలకు పాత్రుడు అగుచున్నాడు. ఈ దామ – వ్యాళ – కటులలో అట్టి కల్పనలు లేవు.

సర్వజ్ఞుడు, సర్వవ్యాపియు అయినట్టి ఆత్మతత్త్వమును గ్రహించకుండా "నేను పరిమితము – పరిచ్ఛిన్నము అయినట్టి ఈ దేహాదులకు, దేహముచే ఏర్పడుచున్న సంబంధములకు చెందిన వాడనే కదా! ఈ తదితరులు కూడా అట్టివారే" అని తలచువాడు మోహమును పొందుచున్నాడు. మూర్ఖత్వమును ఆశ్రయించు వాడగుచున్నాడు.

దేహాత్మ బుద్ధి కలిగి వర్తించువాడు 'జననము మరణము–బాల్యము–వార్ధక్యము' అనునవన్నీ తన స్వరూపముపై ఆపాదించుకుంటున్నాడు. అనంతము, అప్రమేయము అగు ఆత్మను "శరీర మాత్రం"గా కల్పన చేసేవాడు తనయొక్క ఆత్మను తానే అల్పమైనదిగా చూస్తున్నాడు.

ఓ దేవతలారా! ఈ మూడు లోకములలో కూడా 'ఆత్మ' కంటే వేరైన వస్తువేమున్నది? లేదు. కనుక 'ఆసక్తి' అను బంధాన్ని పొందుట అనుచితమే అవుతుంది. "అసలు ఈ సర్వదుఃఖాలకు మూలకారణమేమిటి?" అను ప్రశ్నను జ్ఞానదృష్టితో తర్కించినపుడు, అసద్వస్తువునందు సత్యత్వ బుద్ధి కలిగియుండి, అసత్ విషయములపై నమ్మకంతో వ్యవహరించుటయే" అని విజ్ఞులు గ్రహిస్తున్నారు.

ఈ దామ – వ్యాళ – కటులకు ప్రపంచము యొక్క స్థితి పట్ల "ఇది సత్యమే" అను బుద్ధి ఏ మాత్రం లేదు. అందుచేత వారిని మీ మామూలు బలపరాక్రమములతో జయించుట దుర్లభమే.

**దేవతలు :** పితామహా! మరి మా గతి ఏమిటి?

**శ్రీ బ్రహ్మదేవుడు :** మీరంతా ఒక పని చేయండి... మీరు ఓడిపోయినట్లుగా వారిముందు మరల మరల నటించండి. వారికి జయ – అపజయముల పట్ల, శరీర – మమత – అహంకారముల పట్ల అభిమానం, అభిజాత్యం ఏర్పడేటట్లు చేస్తూ పోండి.

**ఇంద్రుడు :** హే మహామతీ! అమరావతిని కోల్పోయి మేమంతా దీనులమయ్యాం. ఈ దీనత్వం తొలగేది ఎట్లా?

**శ్రీ బ్రహ్మదేవుడు :** సకల దుఃఖములకు కారణం దేహాత్మ బుద్ధియే. "ఈ నా దేహమునకు ఏమైనా అయినదా, అంతే... ఇక నా పని అయిపోయినట్లే"... అనునదే దేహాత్మబుద్ధి, మరియు దేహాభిమానం. అట్టి "అసత్య" మగు వాసన ఎవని అంతఃకరణమునందు ఉంటుందో, అతడు ఆ జనన-మరణ రూపమగు దీనత్వమునకు లోనగుచున్నాడని గ్రహించండి. అట్టి వాడు 'నేను జయించబడుచున్నాను" అను భావోద్రేకం పొందుచున్నాడు. "ఈ దేహమునకు విలక్షణమైన అప్రమేయమగు ఆత్మనే నేను" అను భావన ఒక దోమకు ఉన్నా సరే, ఆ దోమ సుమేరు పర్వతంవలె అచలంగా, అచంచలంగా ఉండగలదనుటలో ఏమాత్రం సందేహం లేదు.

ఏ వాసన ఎచట ఉంటుందో అది అచట స్థూలత్వం పొందుతూ ఉంటుంది.

'ధర్మి' ఉన్న చోటే ధర్మము, 'భావించువాడు' ఉన్నచోటే భావన ఏర్పడుచున్నాయి.

అందుచేత ఎవరెవరికి ఏదేది సంభవిస్తున్నా అదంతా భావన, వాసన, ధర్మము అను మూడింటినీ అనుసరించే ఉంటున్నాయి. నాయనా ఇంద్రా! కనుక, నీ దీనత్వమునకు కారణమేమో నీవే సూక్ష్మబుద్ధితో గ్రహించు.

ఇంద్రదేవా! ఈ దామ వ్యాళ కటులకు సంబంధించిన వర్తమాన విషయానికి వద్దాం. ఎట్లాగైనా సరే, వీరి యొక్క అంతఃకరణములలో "ఈ జయాపజయములన్నీ మావి. ఈ ప్రసిద్ధమై కనబడుచున్న దేహాదులే మేము" అను వాసన కలిగేటట్లు చేయాలి.

ఓ బిడ్డలారా! ఈ జీవుని యొక్క సమస్త విపత్తులు, సమస్త భావాభావదశలు 'తృష్ణ' అనే కంటకవృక్షము నుండి బయలుదేరుచున్నాయి. వాసనాతంతువులచే బద్ధులైన వారికి మాత్రమే "మేము దీనికి సొంతదారులము" అనే విపరీత జ్ఞానం ఉదయిస్తోంది.

వాసనలు వృద్ధి చెందుచున్న కొలదీ దుఃఖములు ప్రాప్తిస్తూనే ఉంటాయి.

వాసనలు సన్నగిల్లితే అది పరమసుఖమును ప్రసాదిస్తూ ఉంటుంది.

**ధీరోఽప్యతి బహుజ్ఞోఽపి కులజోఽపి మహానపి ।**
**తృష్ణయా బధ్యతే జన్తుః సింహః శృంఖల యాయథా ॥ (సర్గ 27, శ్లో. 32)**

ఒకడు గొప్ప ధీరుడు కావచ్చు... అనేక శాస్త్ర విషయాలు తెలుసుకొని ఉండవచ్చు, అనర్గళముగా అనేక శాస్త్రవాక్కులు ఉటంకిస్తూ ఉపన్యసించవచ్చు. గొప్ప కులములో జన్మించి ఉండవచ్చు, మహామహుడు కావచ్చు.... కాని ఏం లాభం? అతడు తృష్ణ, వాసనలకు వశమైనాడా - అల్పత్వము ఉండియే తీరుతోంది. "దేహం"అనే వృక్షంపైగల "హృదయకమలం" అనే గూటిలో ఈ "జీవుడు" అనే పక్షి ప్రవేశించి కిలకిలారవాలు చేస్తూ ప్రశాంతంగా ఉండగా, 'తృష్ణ' అనే వల క్రింద "ఇంద్రియ విషయాలు" అనే ధాన్యపు గింజలను చల్లి 'మాయ' అనే బోయవాడు చాటుగా నక్కి ఎదురుచూస్తున్నాడు. ఈ జీవులు అమాయకంగా ఆ వలపై వ్రాలుచున్నారు. ఇంకేముంది? మాయ అనే వేటగాడు మెడవంచి ఈ జీవులలో అనేకమందిని "దుఃఖ పరంపరలు" అనే బుట్టలో

కుక్కి ఉంచుచున్నాడు. ఒక పక్షి దారముచే బంధింపబడి వివశ అయినప్పుడు ఒక అజ్ఞానబాలుడు కూడా దానిని పట్టి అటు ఇటు ఈడవగలడు కదా! 'తృష్ణ' అనే త్రాడుచే బంధింపబడిన ఈ జీవుడు స్వల్ప సంఘటనలచే, చిన్న చిన్న మాటలచే కూడా ఎంతగానో వేసట చెందుచున్నాడే!

ఈ దామ - వ్యాళ - కటులలో అట్టి తృష్ణను తట్టి నిదురలేపారో, ఇక వారిని మీరు తప్పక జయించగలరు.

ఇప్పుడు ఈ శస్త్రాస్త్రములను ఉపయోగించి ఆ దామ-వ్యాళ -కటులపై ఎంతగా యుద్ధం చేయటానికి ఉపక్రమించినా, అదంతా వ్యర్థమే అవుతుంది. కాబట్టి ఏవైనా ఉపాయాలతో వీరి యందు వాసనావృత్తిని, అభిమానమును అధికం చేయండి. ఎందుకంటే మీ ఈ శత్రువులకు వర్తమానంలో 'స్త్రీ-ధన-ప్రియవస్తు-ప్రఖ్యాతి' వంటి శుక్రనీతి విశేషముల పట్ల ఆకాంక్ష లేదు. కేవలం యుద్ధము యొక్క అభ్యాసవశం చేత ప్రమత్తులై సంకల్పంచే. వారిని అహంకారమయ మగు వాసనలను ఆశ్రయించేటట్లు చేసి, తద్వారా వారి జయించడానికి ప్రయత్నించండి. ఎందుకంటే వాసనాబీజమే లేకుంటే, తదితరములైన ఉపాయాలు వారిపై ఫలించవు. పనిచేయవు.

**ఇంద్రుడు :** 'అహంకారవాసన' అంటే మీ ఉద్దేశమేమిటి?

**బ్రహ్మదేవుడు :** "ఆహాఁ! మేము ఎంతటి పరాక్రమము గలవారము! ఎంత తెలివిగలవారము! ఇతరుల కంటే మేమే గొప్పవారం! ఇంతటి గొప్పవారమయినట్టి మా కీర్తి - ప్రతిష్ఠలు ఇంకా ఎంతో ప్రకాశించుగాక! ఈ శరీరము, ఈ తదితరులు మా పట్ల చేయు స్తోత్రములు ఇట్లే మాకు ఉండు గాక!.... అనే మమకారం వారిలో వృద్ధి కావాలి. 'నాది' అనునది లేనిచోట అహంకారమే ఉండ జాలదని నిశ్శంకగా చెప్పవచ్చు. ఎప్పుడైతే, "మేము గొప్పవారము కదా!" అనే అభిమానం వృద్ధి చెందుతుందో, అప్పుడు మరుక్షణం "ఇట్టి గౌరవమన్ననలు మేము కోల్పోతామేమో!" అనే అధైర్యము, నిస్సత్తువ వెంటనంటి ఉంటాయి. అప్పుడు మీరు వారిని ఇతఃపూర్వపు రాక్షస సైనికులవలెనే నిర్జించివేయగలుగుతారు. వారు ముగ్గురు వాసనలను ఆశ్రయించిన మరుక్షణం వారి పరాజయమునకు, పతనమునకు నాంది పలికినట్లే.

అందుచేతనే సుజ్ఞానులగు ఉత్తములు వాసనలను త్యజించు ప్రయత్నంలో శాస్త్రాదులను ఆశ్రయిస్తున్నారు. విధి - విధానాదులను నిర్వర్తిస్తున్నారు.

కాబట్టి, దేవతలారా! అభ్యాసవశంచేత ఆ ముగ్గురు వాసనాసహితులైయ్యేంత వరకు యుక్తి పూర్వకంగా యుద్ధం చేయండి. "ఓడి పోవడం - పొగడటం"... అను ఉపాయాలతో సంసారదోష వ్యవహారనియుక్తులు అయ్యేట్లు చేయండి. వాసనాబద్ధులైన తరువాత వారే మీకు వశులు అవుతారు. వాసనలచే బద్ధులు అయినవారెవ్వరూ అజేయులై ఉండగలరా? లేనేలేదు. పరిస్థితులు - అతిత్వరలో వాసనాబద్ధులకు - అపజయము రుచి చూపటానికి సంసిద్ధమౌతూనే ఉంటాయి.

స్వవాసనా బలంచేతనే క్షణిక, విపరీతార్థ రూపమగు ఈ జగత్తు ఇంతటి ప్రభావము, దీర్ఘానుభవత్వమును పొందుతోంది సుమా!

ఈ జగత్తు వాసనారూపమే అయివున్నది! ఓ బిడ్డలారా! దేవతలారా! సర్వజనులారా! మీరంతా మీ వాసనలకు వర్తమానమునందే సరిఅయిన చికిత్సను ఆశ్రయించండి... అని హెచ్చరిస్తున్నాను. వాసనా బీజములను తొలగించుకొని, నిత్యవిజయులు కండి.

ఇట్లు పలికి భగవంతుడగు బ్రహ్మదేవుడు అంతర్ధానమయ్యాడు. దేవతలు ఆ చోటు వదలి తమ తమ స్థానములకు చేరారు.

❖❖❖

## 3. పునః యుద్ధం

బ్రహ్మదేవుని వాక్యములు మరల మరల పునశ్చరణ చేసుకుంటూ, దేవతలు తమ తమ రహస్య స్థానములలో కొంతకాలం విశ్రాంతి తీసుకున్నారు. ఒక శుభముహూర్తంలో యుద్ధ సన్నిద్ధులై దుందుభులు మ్రోగించారు. మరల దేవ-దానవ యుద్ధం ప్రారంభం అయింది.

మిక్కిలి భయంకరమైన ఆ యుద్ధం "ఆత్మ చైతన్యమున జగత్తురూపంలో వికారము ఇట్టి సంఘర్షణగానే ప్రారంభమవుతోంది కాబోలు" అన్నట్లుగా దుస్తరమై సాగింది. కొంతసేపు దేవతలు తమ మాయను ప్రయోగిస్తూ యుద్ధం చేస్తూ వచ్చారు. ఇంతలోనే పలాయనం చిత్తగించసాగారు. మరొకప్పుడు దానవులతో సంధి చేసుకుంటున్నారు.

ధైర్యంగా యుద్ధం చేయటం. అంతర్ధానం కావటం. శరణాగతి కోరటం.

ఈ విధంగా అనేక యుద్ధాలు జరిగాయి. మొదటి యుద్ధం 30 సంవత్సరములు జరిగింది. రెండవది ఐదు సంవత్సరములు, మూడవది పంద్రెండు రోజులు.

ఇంతలో ఆ దామ - వ్యాళ - కటులు, తదితర సైనికులు ఇట్లు యోచించసాగారు.

"ఆహాఁ! ఈ లోకప్రసిద్ధులైన దేవతా వీరులు కూడా మమ్ము "శరణు-శరణు" అంటూ వేడుకొనుచున్నారే! మంచిది. అవునులే... మా ముందు ఎవ్వరైనా సరే, ఎంతటివారు? వీరంతా ఎంత స్వల్పమైన వారు! మేము మహాపరాక్రమవంతులం. మాకు ఏవేవో వస్తువులను దానం చేస్తూ మా నుండి 'క్షమ'ను అర్థిస్తున్నారు కదా!"

❖

ఈ రీతిగా ఏదో మాత్సర్యముతో కూడిన అహంకారం అంతరంగమున ఎక్కడి నుండో బయలుదేరింది. అట్టి అహంకారము యొక్క దృఢాభ్యాసంచేత వారు క్రమంగా వాసనాగ్రస్థులయ్యారు. అనేక యుక్తులచే దేవతలు చేసిన ప్రయత్నములు వారిలో దంభమును, దర్పమును, అభిమానమును పెంపొందించసాగాయి.

అహంకారం నందు వారికి ఆత్మబుద్ధి ('నేను అహంకారమును' అను భావన) కలిగింది... "మేము గొప్పవారము." "ఈ గొప్పతనము మాకు ఎప్పటికీ ఉండుగాక!" "ఇదంతా అనుభవించుటకు మేము జీవించి ఉండలేకపోతే ఎట్లా...?" "మేము జీవించినంత కాలం ధనప్రాప్తి కలుగుగాక! ఈ దేవతలను ఇట్లాగే ఓడించుచు, వీరివద్ద అనేక వస్తుజాలములను

దానముగా పొందెదము గాక!" అని తలచసాగారు. క్రమంగా ఏదో తెలియరాని లోభము, అభిజాత్యము పునాదిగాగల దైన్యము, దీనత్వము వారియందు చోటు చేసుకున్నాయి.

మొట్టమొదట 'ఇది అవస్య ప్రవృత్తి' – 'ఇది నిషిద్ధ ప్రవృత్తి' (ఇది ఇట్లు ఉండుగాక – అది అట్లు ఉండకూడదు... అను ప్రవృత్తి)కి సంబంధించి కించిత్ వాసన ఏర్పడింది. "మా దేహము రోగరహితము, భోగసమర్థము అయితేనే కదా మేము కలకాలం లోక ప్రసిద్ధులమై ఉండగలిగేది!" అను మోహముతో గూడిన వాసనచే వారు గ్రస్థులయ్యారు. 'ఆశ' అను పాశమున బంధింపబడి క్రమంగా ఒళ్ళు దాచుకోవటం అలవాటు చేసుకోసాగారు.

ఒకప్పుడు అహంకారరహితులై భాసించిన ఆ దామ-వ్యాళ-కటులు ఇప్పుడు త్రాడును చూచి 'పాము' అని భ్రమించేవారి వలె, 'చావు వద్దు, బ్రతకాలి' అను రూపముగల ఒకానొక రాగమును, తత్సంబంధమైన అనేక కల్పనలను పెంపొందించుకున్నారు.

క్రొత్తక్రొత్త ఆశలు, తృష్ణలు చిగుర్చాయి. "ఆపాదమస్తకము మా ఈ దేహము సుస్థిరంగా ఉండేది ఎట్లా?" అనే నూతన వేదన వారిలో ప్రారంభమైంది. మా శరీరాలు బాగా ఉండాలి... ఈ ధనాదులన్నీ మా సుఖము కొరకే కదా..." అని అనుకుంటూ, అనుకుంటూ క్రమక్రమంగా బద్ధచిత్తులు అయినారు. వారి మునుపటి ధైర్యం కాస్తా కొంచంకొంచంగా క్షయించసాగింది. వాసనాసహితులవటం చేత శరీరబలం తగ్గటం ఆరంభించింది. ఇంతకు ముందు ఉండి ఉన్న పరాక్రమం, శత్రువులను సంహరించాలనే దీక్ష లోపించాయి. 'సమర్థత' సన్నగిల్లింది. 'దీక్ష' కొనసాగేచోట మాత్రమే 'దక్షత' కొనసాగుతుంది కదా!

అహంకారముతో కూడినయున్నట్టి వారికి, అప్పుడు, భయంకర సంసారము'ను ప్రాప్తింప జేసే స్త్రీ-అన్న-పాన-భోగములందు రాగము కౌతుకము లోభము హెచ్చింది. ఇక ముగ్గురిలో ప్రతి ఒక్కరు "వీడు ఎంతగా శ్రమిస్తాడు? కొంచెమే కదా! మరి నేను ఎందుకు శ్రమించాలి?" అను లోభమునకు సంబంధించిన సాపేక్షతను పొందసాగారు. మహోత్సాహమంతా నశించి "ఒకవేళ ఈ యుద్ధంలో చస్తామేమో?" అని మరల మరల అనుమానించసాగారు. కేవలం దేహరక్షణ మాత్రమే వాంఛించుచూ, మరణము పట్ల భయభీతులై ఉన్నారు. అప్పటి నుండి, ఇంధనము క్షీణించినప్పటి అగ్నివలె వారి బలం సన్నగిల్లింది. శత్రువులగు దేవతల ముందర నిలువలేక పోయారు. శరీరమునందు అక్కడక్కడ గాయాలు అవటం చూచి బెంబేలెత్తిపోయారు. వారు కూడా సామాన్య సైనికులవలెనే ప్రవర్తించేవారు.

కొంతకాలానికి దేవతల విజృంభణను తట్టుకోలేక దైత్యులంతా భయంతో ఆకాశము నుండి క్రిందకు పడ్డారు. అనేకమంది దానవుల శరీరాలు విచ్ఛిన్నం కాసాగాయి.

❖

ఇట్లు సైన్యమంతా నేలకూలటం, నశించటం, శంబరాసురుని దృష్టికి వచ్చింది. ప్రళయాగ్నివలె మండిపడుతూ 'ఆ దామ-వ్యాళ-కటులు ఎక్కడ...?" అని ఘీంకరించాడు. అయితే ఆ ముగ్గురు శంబరుని ఎదుటపడటానికి భయపడ్డారు. పాతాళంలోని 'నరకము'ను

పాలించు కొందరు సామంతులను వారు శరణువేడారు. అక్కడ! శరణాగతులై, అభయం పొంది, అక్కడి రాజకన్యలను వివాహం ఆడి రోజులు గడపసాగారు. అనేక దుష్టవాసనలను గ్రహించి దీర్ఘకాలం గడిపారు. "ఈమె నా ప్రియురాలు – ఇది నా ప్రభుత్వము"... అని తలచుచు, దృఢ బంధమున తగుల్కొనినవారై రోజులు గడపసాగారు.

నరకలోకమునకు అధిపతి యమధర్మరాజు. ఒకానొకరోజు ఆయన ఏవో మహానరక కార్యముల గురించి విచారించటానికి నిజేచ్ఛను అనుసరించి ఆ ప్రదేశానికి వచ్చాడు. అతడు నరక లోక చక్రవర్తి అని తెలియక సామాన్య సైనికుడని తలచి ఆ ముగ్గురు వినమ్రులు అవక పోగా... తిరస్కారభావంతో దూషించటం, ఎగతాళి చేయటం, గేలిచేయటం జరిగింది. అప్పుడా యముడు వారిని కనుసైగమాత్రంతో "మహారౌరవం" మొదలగు నరక భూములలో పడద్రోయించాడు.

అక్కడి రేరవ-వాయువులచే వారు దగ్ధం కావించబడ్డారు. ఈ జీవుడు శరీరము త్యజించినా అతని వాసనలు అతనిని విడువవుకదా! అంతరంగమునందలి క్రూరవాసనల ప్రభావం చేత ఒక కిరాతరాజు సేవకులుగా జన్మించారు. ఆ జన్మలోవారు "వధించుట-బంధించుట" అను హింసా పూరిత క్రియలు నిర్వర్తిస్తూ ఉండేవారు. ఆ తరువాత జన్మలో వాళ్ళు కాకులు అయ్యారు. అక్కడి నుండి గ్రద్ధలై పుట్టారు. ఆ తరువాత చిలక, కుక్క, మేక, కీటకము మొదలైన అనేక జన్మలెత్తారు. ప్రస్తుతం వారు కాశ్మీరదేవాలయంలో గల ఒక చిన్న చెరువులో చేపలరూపంలో నివసించు చున్నారు. బురదలో చిక్కి దీర్ఘకాలంగా ఉంటూ వారు మరణించుటలేదు. జీవించుటలేదు.

చూచావా? వారు అనేక జన్మపరంపరలను మరల మరల అనుభవించారు. వారి భవిష్యత్తులోకి తొంగిచూచినప్పుడు వారు ఇంకా ఏవేవో అనుభవించబోవుచున్నారని తెలుస్తోంది. సముద్రంలో తరంగాలవలె వాళ్ళు ఉత్పన్నమగుచున్నారు, నశించుచున్నారు. ఆ విధంగా సంసార తరంగమున చిక్కుకుని, వాసనాతంతువులచే ప్రేరితులు అగుచు ఆ ముగ్గురు ఏ మాత్రం శాంతిని పొందలేకపోవుచున్నారు. అందుచేత, రామా! "నీవు దామ – వ్యాళ – కట న్యాయం ఆశ్రయించ వద్దు" అని హెచ్చరించటం జరిగింది. వాసనల యొక్క దారుణమైన అనర్థమును అందరు గ్రహించటానికే ఈ దృష్టాంతమంతా నీకు చెప్పాను.

❖❖❖

## 4. 'అహమ్' కారము దేనికి సంబంధించినది?

**శ్రీరాముడు :** ఆహాఁ! అవివేకం చేత, అనంతమైన సంసార దుఃఖములను అనుభవించటానికే ఈ చిత్తము పరవళ్ళు త్రొక్కుతూ, 'నేను – నాది' అను ఆపదను గ్రహిస్తోంది కదా! ఆ దామ – వ్యాళ – కటుల గతి ఎంత చిత్రంగా పరిణమించింది! 'దేవతలు' అంతటి వారిని కూడా భయపెట్ట గలిగినట్టి శంబరాసురుని సైన్యమునకు సేనాధిపతులై ఉండటం ఎక్కడ?... బురద నీటిలో చిక్కి సూర్యతాపమునకు తపించే చేపల జన్మ ఎక్కడ...? అహంకార రహితమగు 'చైతన్య సత్వము'

యొక్క ఉత్తమ మహిమాతిశయము ఎచ్చట...? ఒక అడవిలోని ఆటవిక రాజుకు సేవచేస్తూ స్వల్పకార్యములను నిర్వర్తించు సేవకజనులవట మెచ్చుట? ఇచ్ఛ, వాంఛ, ఉద్వేగంలోని 'యుద్ధం చేయుట' అను ధర్మమును పాలించుట ఎక్కడ...? మిథ్యావాసనల ఆవేశముచే పరిగ్రహింపబడి దుష్టమగు అనేక సంకుచిత వ్యాపకములందు చిక్కుకొనుట ఎంతటి ఘోరమైన విషయం!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నిజమే! అనేక, శాఖోపశాఖలుగా విస్తరించియున్న ఈ 'సంసారవిషలత' అనేది 'అహంకారము' అను అంకురము నుండే విస్తరించి వ్యాపించుచున్నది. కనుక రామా! ఈ అహంకారమును హృదయము నుండి తుడిచివేయాలి.

అసలు ఈ అహంకారమును మిథ్యయే అయివున్నది. ఎందుకంటావా?

'యిదం' అను ప్రత్యయముచే శాస్త్రములు సూచిస్తున్నట్టి ఈ కనబడే 'దృశ్యము' జడమే కదా! దీనికి స్వయంప్రతిపత్తి ఎక్కడున్నది? ఇది 'అహంకారము' అను పదార్థమునకు సూచకం కాజాలదు కదా! కాబట్టి 'అహంకారము' దృశ్యమునకు సంబంధించినది... దృశ్యముచే ఏర్పాటు చేయబడుచున్నది.... అని అనటానికి వీలులేదు.

'చైతన్యము' ఇది సర్వమునకు సాక్షిరూపము అయివున్నది కదా! సర్వసాక్షిమాత్రము నందు అహంకారము ఘటిల్లుటకు అవకాశమెక్కడిది? కాబట్టి 'అహంకారము' అనబడేది అటు దృక్ (The perceiver) కు, సంబంధించినది కాదు.

కనుక 'అహంకారం' అనబడేది దృక్ (ఆత్మ) దృశ్యములకు (Object) కూడా సంబంధించినది కాదు. ఆరెండింటికీ భిన్నమే అయివున్నది. ఆ రెండు తప్పితే ఇక్కడ మరింకేమీ వాస్తవానికి లేదు. అందుకే... "అహంకారము అనేది ఉండటానికి స్థానమే లేదు..." అను నిశ్చయమును జ్ఞానులు ప్రవచిస్తున్నారు. అందుచేత, "అహంకారము అనబడేదేది ఎక్కడా లేదు... అను జ్ఞేయమును ఆశ్రయించి, సుఖస్వరూపడవు కమ్ము. లేనివస్తువగు అహంకారమును తొలగించుట ఏమిటి? అందుచేత, "నేను ఇంకా అహంకారమును తొలగించుకోవలసియున్నది" అనునది భ్రమచేతనే "అసంగతము - అనవసరము" అగు శ్రమగా ప్రాప్తించుచున్నదని గ్రహించు.

'పరమార్థము' (The highest essence of Self) యొక్క రూపము వాస్తవానికి ఆనంద మయము, త్రివిధ తాపరహితము అయివున్నది. అయినప్పటికీ, అహంకారము అనబడు భ్రమ యొక్క కల్పనచే ఆచ్ఛాదితమగుటచే 'లేదేమో' అను చమత్కారము కలిగించి, అదృశ్యరూపముగా కనబడుచున్నది. అనగా, ఈ జీవుని దృష్టికి .... "దోషరహితము, సర్వత్రా సర్వము నందు ప్రసరించియున్నది"... అగు స్వస్వరూపము దృశ్యమానమగుటలేదు. ఇంతకన్నా ఆశ్చర్యకరమైన విషయం ఇంకేముంటుంది చెప్పు? జన్మరహితము, నామరూపరహితము అగు తనను తానే అతడు గ్రహించుటలేదు. గురువులమగు మేము వచ్చి "ఓయీ! జీవుడా! నీ రూపము ఇట్టిది" అని గుర్తు చేయవలసివచ్చుచున్నది. అయినా ఇతడు వినీ-వినకుండా పచార్లు చేస్తున్నాడు.

❖

ఆ ముగ్గురు దానవసేనానాయకులు 'అహంకారం' అనే పిశాచంచే పీడింపబడిన వారగుచున్నారు. కదా! వాస్తవానికి వారు దర్పణములోని ప్రతిబింబిత వస్తువులలాగా అసద్రూపులే అయివున్నారు. అయితే మాయ యొక్క మహత్త్యముచే సత్తాను పొందారు. ఏవేవో ఉపాధులలో ప్రవేశించారు. ఇప్పుడు చేపల ఉపాధులు పొంది ఒక మురికి గుంటలో తచ్చాడుతూ ఆకలికి అలమటిస్తున్నారు. వారి యాతనలు వర్ణనాతీతం.

**శ్రీ రాముడు :** మహాత్మా! ఆ ముగ్గురు దామ–వ్యాళ–కటులు శంబరాసురుని మనోకల్పనా రూపులే కదా! అసద్వస్తునకు 'ఉనికి'గాని, సద్వస్తువుకు 'లేమి' గాని సంభవించవు కదా!* మరి అసద్రూపులగు ఆ దామ – వ్యాళ – కటుల ఉనికి ఎట్లా ఏర్పడింది? ఎట్లా జన్మపరంపరాదులకు దారి తీసిందో నేను గ్రహించలేకున్నాను. ఇందలి చమత్కారమేమైయున్నదో వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు చెప్పింది నిజమే. అసద్వస్తువుకు ఉనికి ఎక్కడా సంభవించదు. కాని అల్పము, అసత్యము అయినది ఒకానొక బృహత్ వస్తువుగా కనబడటం జరుగుతోంది.

ఇక అసలైన బృహత్ వస్తువు అత్యంత సూక్ష్మమై, దృష్టికి లభించనిదై ఉంటోంది. 'లేనిది' ఉన్నదానివలె, 'ఉన్నది' లేనిదానివలె అగుపడుచున్నాయి!

అసలు ఎప్పుడైనా ఎక్కడైనా ఏ అసద్వస్తువు సద్వస్తువుగా అగుచున్నదో చెప్పు? సద్వస్తువు సద్వస్తువుగానే ఉంటోంది. అసద్వస్తువు అసత్తే.

ఎటొచ్చీ వాటిని విడదీయుదృష్టిని అనుసరించి చీకటి – వెలుగులవలె జ్ఞాన – అజ్ఞానములు ఏర్పడుచున్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మరల నా సంశయమును చెపుతాను వినండి. మీరు, నేను, తదితర సభ్యులు ఇక్కడ ఉండి, ఈ సభలో ఒకానొక విషయం గురించి సంభాషించుకుంటున్నాం కదా! మనందరియొక్క 'సత్త' (Existence)ప్రత్యక్షముగా సిద్ధించుచున్నది.

ఇక ఆ దామ – వ్యాళ – కటులనే ముగ్గురు దానవసేనానాయకులు మాయచే కల్పించబడిన వారే కదా! కనుక వారు స్వప్నములో కనిపించే జనులవలె అసద్రూపులే మరి! అట్టి అసద్రూపులు అహంకారములను, జన్మపరంపరలను, స్వకీయమైన ఇచ్ఛను పొందటమేమిటో వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మాయామయులగు ఆ ముగ్గురు దానవ సేనానాయకులు 'అసద్రూపులు' అనే మాట నేను ఒప్పుకుంటాను. అయితే ఇక్కడ ఒక చమత్కారం ఉన్నది. ఒకడు మృగతృష్ణలో "ఇది జలమే కదా" అను అనుభూతి పొందుచున్నాడనుకో... అతనికి అక్కడ జలము ఉన్నట్లే కనిపిస్తోంది కదా! ఆ రీతిగానే వాళ్ళు అసద్రూపులు అయినప్పటికీ సత్యంవలె భాసించుచున్నారు.

---

* **నాఽసతో విద్యతేభావో నాఽభావో విద్యతేసతః ।**

'సత్త'కు 'ఉండకపోవడం' అనేది లేదు. 'అసత్తు'కు ఉనికి లేదు. మాయ = యామా = ఏదైతే లేకయే ఉన్నదో ...

అదే విధంగా సురులు, అసురులు, దానవులు – వీరంతా మిథ్యా రూపముగానే భాసిస్తున్నారు. వారంతాయే కాదు, నీవు, నేను, తదితర సభ్యులు... మనమంతా కూడా ఈ జీవరూపము దృష్ట్యా మిథ్యారూపముగానే విజృంభిస్తున్నాము, పోవుచున్నాము, వచ్చుచున్నాము. 'నేను రాముడను' అను వ్యష్టిత్వమునకు సంబంధించిన భావన, 'నేను వసిష్ఠుడను' అనబడు శరీరభావన కూడా మిథ్యారూపములే అయివున్నాయి.

**శ్రీరాముడు :** ఈ "నేను – మీరు – తదితరులైన ఇక్కడి సభికులు"... అవన్నీ వివిధ రీతులుగా అనుభూతములై ప్రాప్తిస్తున్నాయి కదా! మరి ' ఇవి లేవు' అనునది ఎట్లు సమంజసము?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "స్వప్నమునందలి స్వమరణము" అను దృష్టాంతమును మరల ఇక్కడ ఉపయోగించి చెప్పుచున్నాను, విను. ఒకడు అప్పుడే నిదురలేచి ప్రక్కవానితో, "మిత్రమా! నాకు ఇప్పుడు ఒక దీర్ఘమైన కలవచ్చిందోయ్! అందులో నేను చనిపోయాను. ఒక నలుగురు వ్యక్తులు నన్ను మోసుకుపోతున్నారు...." అంటూ ఉన్నాడు. వెంటనే ఆ ప్రక్కవాడు "అట్లాగా! బాగున్నది. అయితే, స్నేహితుడా, ఆ స్వప్నం ఎవరికి? అదంతా ఎవరి కల్పన?" అని ప్రశ్నించాడు. అప్పుడు మొదటివాడు, "భలేవాడివేనయ్యా! అది నా స్వప్నమే... అందుచేత నా కల్పనయే" అన్నాడు. ఇక రెండవాడు, "నీ యొక్క కల్పనలో, నీవే చనిపోతే ఇక స్వప్నం ఎవరికి? స్వప్నమే ఉండజాలనప్పుడు ఆ నలుగురు మనుష్యులు ఎవరు?" అని విశ్లేషణము చేయ ప్రారంభించాడట!

అట్లాగే, ఈ కనబడే అనేకమంది జీవులు, అనేక శరీరములు అను రూపమున ఉండి ఉంటున్నదంతా మిథ్య, అసద్రూపము అయి ఉన్నాయి.

స్వప్నమునకు సంబంధించినదే మరొక దృష్టాంతము చెపుతాను. విను. ఒకడు తన కలలో ఎప్పుడో చనిపోయిన తన బంధువును చూచాడనుకో... ఆ బంధువును 'చూచుట' అను అనుభూతి అతనికి సత్యముగానే ప్రాప్తిస్తోంది కదా! అయినాకూడా అతడు చూచినది అసద్రూపమునే కదా! అట్లాగే, 'అతడు మరణించాడు' అను జ్ఞానము కూడా అసద్రూపమే అయివున్నదని ప్రజ్ఞా వంతులగు జ్ఞానులు గ్రహించుచున్నారు. ఎందుకంటావా? ఈ కనబడే జగత్తు ఇందలి సంబంధ – బాంధవ్యములచే ఏర్పడు ప్రియాప్రియములు 'మిత్ర అమిత్రములు ఇవన్నీ స్వప్నమాత్రము, మాయామాత్రమే అయివున్నాయి.

"ఈ జగత్తు సత్యమే" అను దృఢనిశ్చయంగల జీవుడు మాత్రం ఇందులోని నిత్యానిత్యముల చమత్కారమును గ్రహించలేకపోతున్నాడు. కళ్లు మూసుకున్న వారు ఎదురుగా ఉన్నదేదీ చూడనట్లు, పరమ మూఢత్వం వహించినవాడు "మార్పు చెందుచున్నది; మార్పుచెందనిది" అను రెండింటినీ విడదీయలేకపోతున్నాడు.

'పరమార్థ విచారణ' అనే అభ్యాసం లేకపోతే ఈ జగత్తుకు సంబంధించిన... "ఇదంతా వాస్తవమే"... అను అనుభవం అంత తేలికగా తొలగదు. తత్త్వవిచారణ లేనివాడెవ్వడూ వాస్తవ మేమిటో గ్రహించలేకపోతున్నాడు. అట్లు నిత్యానిత్యవివేకము పొందుటచే లభించు ప్రయోజన

మేమిటో గుర్తించలేకపోతున్నాడు. అందుచేతనే..."బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్యయే" అనేది ప్రతిపాదించ బడుచున్నప్పుడు అజ్ఞాని అపహాస్యంగానే గాంచుచున్నాడు.

ఒకడు మత్తుగా కల్లు తాగి ఉన్నాడు. మరొకడు ఎట్టి మత్తుపానీయం సేవించలేదు. ఈ ఇద్దరి యొక్క ప్రపంచ దర్శనంలో మేళవం లభిస్తోందా? లేదు. అంధకారం – ప్రకాశాలకు, ఛాయ – ఎండతాపములకు ఐక్యత సిద్ధించదు కదా! అట్లాగే జ్ఞాని – అజ్ఞాని ఒకే ప్రదేశమున ఉన్నప్పటికీ, వారి దృష్టి ఏమాత్రం ఏకత్వము పొందుటలేదు. ఒక శవమును చూచి, "ఓ శవమా! కాసేపు అటూ ఇటూ నడువవచ్చును కదా!" అంటే నడుస్తుందా? పిలిస్తే పలుకుతుందా? లేదు. అజ్ఞాని ముందు ఆత్మ – అనాత్మ విశ్లేషణ అనేకసార్లు "చెవిటివాని ముందు శంఖానాదమే" అగుచున్నది. అతడు సత్యమగు సాక్షి స్వరూపమునందు నిలకడ పొందలేకపోవుచున్నాడు. మనస్సు, బుద్ధి మొదలైన వాటి రూపములో బాహ్యాభ్యంతరములందు ద్వైత ప్రపంచము యొక్క అనుభూతినే అవిచారణపరుడగు జీవుడు పొందుచున్నాడు. ఎంత బోధించినప్పటికీ అతడు తన అంతరంగంలో ద్వైత ప్రపంచాన్ని నిషేధించలేక పోవుచున్నాడు.

"ఈ జగత్తంతా బ్రహ్మమే" అనే కథనం అజ్ఞానిపట్ల ఏమాత్రం యోగ్యం అగుట లేదు. ఒకడు తపస్సు, బ్రహ్మవిద్య యొక్క అభ్యాసం, ఉదార గుణములు... మొదలైనవి ఆశ్రయించక పోతే సంసారదృష్టి ఉండనే ఉంటుంది. "జగత్తుసత్యమే"... అనునది అనుభూతమొనర్చుకొనువాని ముందు బ్రహ్మం గురించిన వాక్యాలు ఎట్లా వికసిస్తాయి చెప్పు? కనుక, కొంచమైనను జ్ఞానం గల వానికి మాత్రమే "ఈ జగత్తు మిథ్య, ఇదంతా బ్రహ్మమే అయివుంది" అనే కథనం శోభిస్తోంది.

అదే విధంగా ఒక పూర్ణజ్ఞానికి అనేక చర్చలతో కూడినట్టి ఈ విధమైన బోధ అసంగతమే అవుతోంది. "అహంకారమే అసత్యమైనది" అని ఎరిగిన తరువాత అట్టివానికి ఇక దృష్టాంతములతో కూడిన 'బోధ' ఎందుకు? అందుచేత, మార్గమధ్యంలోని ముముక్షువు యొక్క ఉపయోగము కొరకే ఈ సంవాదములు, ఈ శాస్త్రప్రవచనములు ఉద్దేశించబడి ఉంటోంది.

**శ్రీరాముడు :** జ్ఞాని ఈ దృశ్యమును చూస్తున్నప్పుడు దీనినంతటినీ అతడు ఎట్లా, ఏవిధంగా, ఏరూపంగా అవగాహన చేసుకుంటున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జ్ఞాని యొక్క అనుభవంలో ఈ సర్వము ద్రష్టయగు తనతో సహా... బ్రహ్మమే అయి ఉంటున్నది. ఇక అతని స్వానుభవము నందు "ఇది పరిహసింపతగ్గది, పరిత్యజించ తగ్గది.... అనునది ఏదీ ఉండుటలేదు సర్వము బ్రహ్మము నందు స్వభావసిద్ధముగానే ఏర్పడి ఉంటున్నప్పటికీ, తరంగములన్నీ జలమే అయినట్లు ఇక్కడ బ్రహ్మముకంటే వేరుగా ఎక్కడా ఏదీ ఉండదని ఎరుక కలిగి ఉంటున్నాడు. అతడు ఏదీ గ్రహించడు. త్యజించడు.

"పరమాత్మ కంటే వేరుగా నేను ఏమియు కాను. 'బంగారము'నకు 'ఉంగరత్వము' అనేది ఒక ప్రతీతి (Something popular but not true) మాత్రమే! సాక్షిస్వరూపుడనగు నా యందు అహంకారము యొక్క ఉనికి కూడా మిథ్యే"... అని జ్ఞాని సుస్పష్టముగా గ్రహిస్తున్నాడు. జల

తరంగమును చూస్తూ, "ఇది సువర్ణమై ఉండవచ్చు" అని ఎవడైనా భావిస్తాడా? అట్లే జ్ఞానికి ఈ జగత్తుపట్ల సత్యత్వబుద్ధి కలుగుటలేదు. అజ్ఞానికో... పరమార్థవస్తువగు బ్రహ్మము నందు 'అట్టిది ఏదీ లేదేమో' అను అభావము సంభవిస్తోంది. ఫలితమేమిటి? అజ్ఞాని 'మిథ్యయే' అగు అహంకారముతో తనను తాను.. మేఘములు ఆకాశమును కప్పుతున్నట్లుగా... కప్పివేసు కుంటున్నాడు. మిథ్యాహంకారమయుడు అగుచున్నాడు. జ్ఞానియో, 'సత్య-నిత్య-ఏకాత్మమయుడు' అగుచున్నాడు. వీరిద్దరి స్వభావం మరొక రీతిగా మరొకరెవరూ చేయలేరు.

❖

ఏ వస్తువు ఎద్దానియొక్క 'మయమై' ఉంటుందో అది ఆ రూపమునే చెందుతుంది గాని, మరొక రూపము కాదు.

ఇంతకీ 'రాముడు' అనగా ఎవరు? వసిష్ఠుడు అనగా ఎవరు? 'నేను ఈ శరీరమును' అనేది పిచ్చిమాట అని అనవలసిందే. అందుచేత, మనం ఈ శరీరములచే ఒకరికి మరొకరం ప్రత్యక్షంగా ఉన్నప్పటికీ ఒకరి వాస్తవమగు ఆత్మరూపం మరొకరి భౌతికమైన కళ్ళకు కనిపించేది కాదు. బాహ్యమునకు కనుపించే ఈ మన రూపాలు తత్త్వదృష్టికి సత్యమయినవి కావు. 'యుక్తి'ని అనుసరించి చూచినపుడు ప్రజ్ఞయే స్వరూపముగాగల మనము శరీరముగా మారినామా? లేదు. శరీరము మనకు ఉపకరణము మాత్రమే! మనము శరీరిగా శరీరమునకు వేరై ఉన్నాము. శాస్త్ర కారులు, జ్ఞానులు ఈ విషయం ధృవీకరించుచూ, "నాయనా! నీవు జన్మరహితుడవు... అఖండుడవు.. నిత్యుడవు... శాశ్వతుడవు..." అని ఎలుగెత్తి ప్రకటిస్తున్నారు.

❖

చిదాకాశము ఒక్కటే..."నిరంజనము (దోషరహితము), జ్ఞానస్వరూపము వేదాంత శాస్త్ర దృష్టిచే సత్యము"... అయి ఉన్నది. అది సర్వవ్యాపకము. మేము దానిని అనేక విచారణల ద్వారా పరిశీలించిన తరువాత "అది ఉత్పత్తి, వినాశరహితమగు సద్వస్తువు, సర్వజీవులయొక్క వాస్తవ రూపము"... అని గ్రహిస్తున్నాం.

ఈ జగత్తంతా శాంతము, శూన్యత్వ రహితము అగు ఆ సద్వస్తువుచేతనే పూర్ణమైయున్నది.

అట్టి ఆ చిదాకాశమునందే... అసత్యము, విరుద్ధరూపము అయినట్టి... ఈ సృష్టి అంతా భాసించుచున్నది. కంటి దోషముచే బాధపడుచున్న వానికి సహజంగానే ఆకాశంలో వెంట్రుకల వంటి ఆకారములు కనిపిస్తూ ఉంటాయి కదా! అజ్ఞానదృష్టి కలిగియున్నపుడు ఈ 'సృష్టి' అనేది పరమాత్మ యందు అనుభవమగుచున్నది. సత్యాత్మ ఏ భావపరంపరలు పొందుతుందో... అట్టి భావనను అనుసరించే 'అనుభవము' ఉంటోంది. అనుభవం ఎట్లా ఉంటే చిదాకాశము కూడా అట్లే శీఘ్రముగా సారూప్యమగుచున్నది. సత్యాత్మ యొక్క దృష్టి బలంచేతనే ఏదైనా ఎట్లైనా ఏర్పడు తుంది. "ఇదంతా అసత్యము' అనునది కూడా సత్యాత్మ దృష్టిచే క్షణములో ఏర్పడగలదు.

**శ్రీరాముడు :** స్వామీ! ఇందులో ఏది సత్యం? ఏది అసత్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**న సత్యమస్తి నాసత్యమితి తస్మాజగత్త్రయే ।**
**యద్యథా వేత్తి చిద్రూపం తత్తథోదేత్య సంశయమ్ ॥** (సర్గ 31, శ్లో 36)

ఈ మూడు లోకములలో "సత్యమైనది' గాని 'అసత్యమైనది' గాని ఏదీ లేదు. అయితే చిద్రూపము లేక సత్యాత్మ దేనిని ఎట్లు ఏ దృష్టిచే గాంచునో, అది అట్లే ఉదయించుచున్నది.

❖

ఆ దాముడు-కటుడు-వ్యాళుడు అనువారు ఎట్లా వ్యక్తమయ్యారో, ఈ జీవము-శరీరముల దృష్ట్యా జీవులందరూ అట్లే వ్యక్తం అయ్యారు. కేవలం వారి గురించే వికల్పములు ఎందుకు? ఈ కనబడే మన ప్రదర్శన కూడా అట్టిదే. కనుక ఇందు సత్యాసత్యములేమి ఉంటాయి? "నిరాకారము, సర్వవ్యాపకము, అనంతము" అగు చిదాకాశమున చైతన్యము ఏ రూపమున ఉదయిస్తుందో ఆ రూపముగానే అక్కడ ప్రకాశిస్తూ ఉంటుంది. చైతన్యమే ఎచ్చట దాముడు మొ॥వారి రూపమున స్వయముగా స్ఫురించిందో, అచట అట్లే, నాయొక్క - నీ యొక్క రూపమున స్ఫురించటం, రూపానుభవం పొందటం, సుసంపన్నం కావటం జరుగుతోంది.

ఎడారిలో మనం చూస్తున్నది కిరణములనే అయినప్పటికీ, "ఇది (మృగతృష్ణా) జలం" అంటున్నాం కదా! నిరాకారమగు చిదాకాశము తనయొక్క 'స్వప్న ప్రతిభాస'కు 'జగత్తు' అనే పేరు పెట్టిపిలుస్తోంది. చిదాకాశము బాహ్యపదార్థములను పొందుచూ 'పరిగ్రహణము' అను వృత్తిని కలిగియుండగా అప్పుడు ఫలిస్తున్నదానినే 'దృశ్యము' అనే పేరుతో పిలుస్తున్నాం. అదే చిదాకాశం తన స్వయం ప్రతిపత్తిని భావించుచు, 'బాహ్యపదార్థరాహిత్యము'ను, 'సర్వ విషయాతీతము'ను గాంచుచున్నప్పుడో,... అప్పటి ప్రయోజనమును 'మోక్షము' అని అంటున్నాం.

'ఇది దృశ్యము - ఇది మోక్షము' అను సంజ్ఞలు నిర్వచిస్తోంది, ప్రసాదిస్తున్నది కూడా ఎవ్వరో తెలుసా? అద్వితీయ చైతన్యమే. యథార్థానికి చిదాకాశము ఏ సమయమందును ప్రబుద్ధమగుట లేదు... అప్రబుద్ధమగుటలేదు. చిదాకాశము ఒకప్పుడు ఎట్లా ఉండి ఉండేదో... ఇప్పుడూ అట్లే ఉన్నది. ఇక ఎప్పటికీ అట్లే ఉంటున్నది.

ఈ దృశ్యమంతా చిదాకాశమే అయి, సృష్టి వైభవమంతా మోక్షరూపమే అయి ఉండగా, ఇక పర్యాయ శబ్దములవంటి జగత్ - బ్రహ్మములకు భేదమెక్కడ చెప్పు?

❖

ఆత్మయే ఒకప్పుడు అవిద్యతో కూడుకుని ఉంటున్నది. అప్పుడు అప్పటి తన పరమార్థ స్వరూపమునే జగత్తుగా ఎరుగుచున్నది. ఆకాశములో వెంట్రుకాకారములు లేకుండానే, తిమిర రోగము ఉన్న కళ్ళు గలవానికి ఏవేవో వెంట్రుకాకారములు కనబడటం జరుగుచున్నది కదా!

పరమార్థమున ఈ దృశ్యప్రపంచం గాని, శరీరాదులు గాని లేవు.

చిదాకాశమే ఆయారూపములుగా స్థితి కలిగియున్నది.

**1. ఆధ్యారోపదృష్టి (ఇది ఉన్నది అను దృష్టి)చే -** ఈ సర్వము యొక్క వాస్తవరూపము బ్రహ్మమే! చిదాకాశమునందు అంతయు సర్వదా సంభవమే! కనుక "ఈ సర్వము ఉండియే ఉన్నది" అని చెప్పబడుచున్నది.

**2. ఆరోపదృష్టి (ఇది లేదు అను దృష్టి) చే -** ఈ "నేను-నీవు-జగత్పదార్థములు' మొదలైన వాటికి బ్రహ్మము కానట్టి ఉనికియే ఉండి ఉండుటలేదు. 'జగత్తు-బ్రహ్మము'... అనబడు రెండింటి యందు కూడా శాంతము, భేదరహితము అగు ఒకే పూర్ణరూపము ఉండి యున్నది. కనుక 'నేను-నీవు' అనునవన్నీ అవాస్తవమై, అవాస్తవిక దృష్టికి మాత్రమే తారసపడుతున్నాయి.

కాబట్టి రామా! నీవు సర్వశోక భయములను త్యజించివేయుము. సర్వదా పరిపూర్ణ స్వరూపుడవై ఉండు. నీయొక్క పరిపూర్ణ చైతన్యతత్త్వం ఒక స్ఫటికశిల యొక్క మధ్యభాగంలాగా చిద్ఘనము, ప్రశాంతము, అత్యంత స్వచ్ఛము అయి ఉన్నది. కలలో నదులు-పర్వతాలు జనులు ప్రతిబింబిస్తున్నప్పుడు, అట్లు ప్రతిబింబితములై కనబడే వేరు వేరు వస్తువులలో "ఒక గోడ – మేకు – మనిషి" లకు గల భేదమేమున్నది.

"ఇది ఉన్నది – ఇది లేదు" అనే భేదదృష్టి చైతన్యమునందు లేనేలేదు. నీకు ఎక్కడైనా వేరు వేరైన ప్రతీతి కనిపిస్తే "చైతన్యము ఇట్లు వేరు వేరు ప్రతీతులచే ఇచ్చట ఇట్లు ప్రకాశించుచున్నది" అని గ్రహించి, అటుపై, సర్వదా నిశ్చింతుడవై ఏది ఎట్లు ఉచితమో అట్లే నిర్వర్తించుము.

❖❖❖

# 5. సదాచారము - ప్రయోజనము

**శ్రీరాముడు :** ఒక బాలుడు అటు చీకట్లోకి చూచి, "ఇక్కడ ఏదో భూతపిశాచాలు ఉన్నాయి" అని తలచి, భయముతో పిశాచుల పరిభ్రమణమును అనుభవించటం జరుగుతుంది చూడండి! ఆరీతిగా, అజ్ఞుల దృష్టికి మాత్రమే "దాముడు – కటుడు – వ్యాళుడు – నేను – నీవు"... ఇవన్నీ తోచుచున్నాయన్నమాట! ఇవన్నీ స్వసత్తాస్వరూపమే అయివున్నాయి కదా! ఇదంతా ఎంత చమత్కారంగా ఉన్నది! సరే, మునీంద్రా! "యథార్థానికి మిథ్యాస్వరూపములే"... అయినట్టి ఆ ముగ్గురి దుఃఖములు ఎప్పటికి శమిస్తాయి? బురదగుంటలో చేపల రూపంలో ఆ ముగ్గురికి ముందుముందు ఏమి కానున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** 'ఓహో! ఆ దామ-కట-వ్యాళుల భవిష్యత్తు కథ ఏమిటో చెప్పమంటావా? అయితే విను. ఆ ముగ్గురి కుటుంబమునకు చెందినట్టి కొందరు యముని వద్ద కింకరులై ఉన్నారు. వారు దామ – కట – వ్యాళుల ముక్తి కొరకు యముని ప్రార్థన చేస్తారు. అప్పుడాముగ్గురు తగిన సమయంలో తమ చరిత్రలను ఇతరుల నుండి వినటం జరుగుతుంది. వారి సర్వసందేహములు అప్పటికి తొలగుతాయి. ఫలితంగా ముక్తులు కాగలరు.

**శ్రీరాముడు :** మీరు చెప్పే విశేషాలు మరికొంత వివరంగా వినాలని ఉన్నది. వారు తమ తమ వృత్తాంతములను ఎప్పుడు, ఎక్కడ, ఎవరివద్ద వినటం జరుగుతుంది? వారు మరల ఎట్లా దుఃఖ

రహితులు కాగలుగుతారు. మీరు భూత-భవిష్యత్-వర్తమానములు ఎరిగినవారు కదా! ఆ ముగ్గురి గురించి భవిష్యత్తులో కానున్నదేమిటో చెప్పండి! ప్రస్తుతం వారు చేపల ఉపాధులు కలిగియున్నారు కదా! ముందుముందు ఏమి కాబోవుచున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే. ఆ వివరాలు చెపుతాను. విను-

వారు ప్రస్తుతం కాశ్మీరదేశంలో గల బురదతో కూడిన ఒక చిన్న తటాకంలో చేపలుగా జీవిస్తున్నారు. అదే ప్రదేశంలో అనేకసార్లు అట్లే చేపలుగా జన్మలు ఎత్తుతారు. ఒక సమయంలో మండు వేసవిలో కొన్ని దున్నపోతులు ఆ తటాకంలోకి ప్రవేశిస్తాయి. ఆ తటాకమును ధ్వంసం చేస్తాయి. దున్నపోతుల తాడనమునకు ఆ ముగ్గురి ఉపాధులు వినాశనమౌతాయి. పద్మ సరోవరంలో వారు మూడు సారస పక్షులై జన్మిస్తారు. ఆ మూడు పక్షులు అనేక చోట్ల భోగములను అనుభవిస్తూ సంచరిస్తూ ఉంటాయి.

ఆ ఉపాధులలో వారికి కొంత ప్రశాంతత దొరుకుతుంది. క్రమంగా వివేచన చేస్తూ శుద్ధత్వమును పొందుతారు. ఒకడు వివేక దృష్టిచే ఈ సర్వమును గాంచుచున్నాడనుకో... అప్పుడు త్రిగుణములు (సత్వగుణము, రజోగుణం, తమోగుణం) భిన్నభిన్నంగా తెలియవస్తాయి కదా!

అట్లే వారు ముగ్గురియందు వేరువేరు కారణాలచే వివేక బుద్ధి ఉదయిస్తుంది.

**వ్యాళుడు -** కాశ్మీర దేశంలో 'అధిష్ఠానము' అను పేరుగల ఒక నగరం ఉన్నది. ఆ అధిష్ఠాన నగరం మధ్యప్రదేశంలో 'ప్రద్యుమ్న' అనే పేరుతో పిలువబడే ఒక శిఖరం ఉన్నది. ఆ కొండ శిఖరంపైగల ఒక ఇంటిలోని గోడపగులులో వ్యాళుడు పిచ్చుక అయి నివసిస్తాడు. ఒక గూడు కట్టుకుని అర్థరహితమైన శబ్దాలు చేస్తూ ఉంటాడు.

**దాముడు -** ఆ అధిష్ఠాన నగరమును 'యశస్కరదేవుడు' అనే పేరుగల రాజు పరిపాలిస్తూ ఉండగలడు. ఆ రాజు యొక్క అంతఃపురములో అనేక స్తంభాలు ఉండి ఉన్నాయి. వాటిలోని ఒక స్తంబము యొక్క వెనుక భాగంలోగల ఒక రంధ్రంలో ఒక దోమ అయి 'ఝుయ్'మని శబ్దం చేస్తూ దాముడు కాలం గడుపుతూ ఉంటాడు.

**కటుడు -** ఆ అధిష్ఠాన రాజ్యపు మహామంత్రి పేరు నరసింహుడు. అతడు బంధ-మోక్షములు రెండు గ్రహించియున్నవాడు. ఆ మంత్రియొక్క గృహంలోని పంజరంలో చిలక అయి 'సారిక' అనే పేరుతో పిలువబడుతూ ఉంటాడు.

ఆ నృసింహమంత్రి తాను కొన్ని శ్లోకములుగా రచించియున్న దామ-వ్యాళ-కటుల చరిత్ర పఠిస్తూ ఉంటాడు. సారిక అనే పేరుతో చిలక రూపమున ఉన్న కటుడు నృసింహమంత్రి యొక్క ఆ గానమును అనేకసార్లు వింటాడు. సర్వమును అవగాహన చేసుకుంటాడు. విజ్ఞానదృష్టిని పొందుతాడు. అంతరంగమున ఏర్పడు బుద్ధి పరిపక్వత యొక్క ప్రభావం చేత శంబరాసురునిచే కల్పించబడినట్టి తన జీవరూపమును త్యజించటం జరుగుతుంది. 'సంసారము' అను దానిని సమూలంగా నశింపజేసే ఉత్తమోత్తమమగు 'మోక్షము'ను పొందుతాడు. అట్లే రాజమందిరములో

ఉన్న దోమ(దాముడు), 'ప్రద్యుమ్న' అను కొండపై ఉన్న పిచ్చుక (వ్యాళుడు) ఆయా జనులు దామ-వ్యాళ-కటోపాఖ్యానం గానం చేస్తున్నప్పుడు, తమ పూర్వ చరిత్రను విని పరమోత్తమమగు నిర్వాణపదమును పొందుతారు.

❖

ఓ రామా! ఈ విధంగా దామ - వ్యాళ - కటుల యొక్క వృత్తాంతమంతా విన్నావు కదా! దీనిని బట్టి నీవు గ్రహిస్తున్నదేమిటి?... "నామ రూపములతో కూడిన ఈ ప్రపంచమంతా శూన్య రూపము, మాయామాత్రము అయివున్నది'... అనునది గమనించు. ఒక్కొక్క బాటసారి మృగతృష్ణను చూచి "అవి జలములోని తరంగములే... కనుక అక్కడ పుష్కలంగా జలం ఉన్నది..." అను భావమును పొందుతూ ఉంటాడు కదా! అజ్ఞానము చేతనే ఈ జీవులు అనేకమైన భ్రమలను పొందుచున్నారు. అజ్ఞానము ఈ జీవుని 'అత్యున్నత స్థితి' నుండి 'అధఃపాతాళము'నకు క్రుంగునట్లు చేస్తోంది. అతడు అల్పత్వములో పడద్రోయబడుచున్నాడనునది గమనించబడుగాక!

అజ్ఞానులగు మూఢులు దామ-వ్యాళ-కటులవలె పతనము పొందుచున్నారు.

**శ్రీరాముడు :** అవును మహర్షీ! లేకపోతే, తమ కనుసైగలచే పర్వతములైనను నుగ్గునుగ్గు చేయగలవారి పరాక్రమములెక్కడ? రాజస్తంభముపైన వ్రాలే ఒక దోమ బ్రతుకు ఎక్కడ? సూర్య చంద్రులను కూడా నిరోధించగల మేధస్సు ఎక్కడ? ఒక ఇంటి చూరులో మ్రగ్గి ఉండే పిచ్చుక ఎక్కడ? చూడగానే దేవతలు భయపడి పరుగెత్తే బలపరాక్రమములెక్కడ? ఒక పంజరంలో ఇరుక్కున్న చిలుక ఎక్కడ?

❖❖❖

# 6. శ్రద్ధ - ప్రయత్నములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ ప్రియజనులారా! శాస్త్రాదులచే, మహాత్ములచే ప్రవచించబడుచున్న ఉత్తమ సాధనలను ఆశ్రయించండి. ఏదైనా నియమపూర్వకంగా నిర్వహించబడినప్పుడే తప్పక సఫలం అవటం జరుగుతుంది. ఈ లౌకికములైన "ధనసంపాదన" మొదలైన ప్రాపంచిక సాధన విషయములలో గాని, పారలౌకిక విషయాలైనట్టి "శుభలక్ష్యములతో గూడిన ప్రయత్నములు, మోక్షమార్గ సేవనము"... మొదలైన విషయములందు గాని సర్వత్రాగాని తదనుకూలమైన ప్రయత్నమే ఫలప్రదమగుచున్నది.

అందుచేత రామా! మోక్షఫలము కొరకై శుభప్రయత్నములను మాత్రం నీవు ఏ క్షణమందును విడువనే వద్దు.

"శుభప్రయత్నమే ఉత్తమ ప్రయోజనములను ప్రసాదిస్తుంది" అని అనటానికి అనేక పౌరాణికమైన (పురాణములలో చెప్పబడిన) దృష్టాంతాలు ఉన్నాయి. 'శిలాదుడు' అనే ముని ఉన్నాడు. ఆయనకు ఎంతకాలానికీ సంతానం కలుగకపోవడం చేత, ఆయన శివుని కటాక్షము

కొరకు గొప్ప తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై గొప్ప భక్తి గల ఒక కుమారుని ప్రసాదించాడు. పేరు నందికేశ్వరుడు. కాని ఆ నందికేశ్వరుడు అల్పమైన ఆయుష్షు కలవాడు. అప్పుడు సద్గురువుల ఆజ్ఞను అనుసరించి నందికేశ్వరుడు ఒక సరోవరంలో శివలింగమును ప్రతిక్షేపించి ఏకాగ్రతతో, భక్తితో అర్చించాడు. శివుని అనుగ్రహానికి పాత్రుడై, మృత్యువును కూడా జయించాడు చూచావా! ఆ నందికేశ్వరుడు తన యొక్క శుభప్రయత్నములచేతనే పరమ శివుని కరచరణాలను ఆశ్రయించి, మృత్యువును జయించి, తన తల్లిదండ్రులకు అంతులేని ఆనందాన్ని కలిగించాడు. (లింగపురాణమ్)

బలి మొదలైన దానవులు గొప్ప స్వప్రయత్నముచేతనే సర్వైశ్వర్యసంపన్నులగు దేవతలను మర్దించగలిగారు. (వామన పురాణం). మరుత్తరాజు మొదలైన మహాత్ములంతా స్వప్రయత్నము చేతనే ఆయా ఔన్నత్యములను సాధించారు. 'సంవర్తుడు' అనే మహర్షి తన యొక్క శుభ ప్రయత్నముల ప్రభావం చేత బ్రహ్మదేవునిగా ప్రభవించి, మరో సురాసురులను సృష్టించగలిగాడు.

ఓ రాఘవా మరింకెవరెవరివో దృష్టాంతాలు మనకు దేనికి...? ఈ సభలో మనందరి కనుల ముందు కోటి సూర్యుల తేజముతో వెలుగొందుచున్న ఈ విశ్వామిత్ర మహర్షిని చూచావా? ఇతడు జన్మతః ఒక మామూలు రాజు. ఆ తరువాత ఆ రాజ్యమును తృణప్రాయంగా త్యజించి మహా ప్రయత్నశీలుడై గొప్ప తపస్సును ఆచరించాడు. మహా కష్ట సాధ్యమైనట్టి "బ్రాహ్మణత్వము'ను కూడా సముపార్జించాడు. రాజర్షి అయి, నాతో కలహించి, మరింత ప్రయత్న శీలుడై ఇప్పుడు బ్రహ్మర్షిగా వెలుగొందుచున్నారు.

అట్లాగే, 'ఉపమన్యుడు' గురించి విన్నావు కదా? అతడు ఒకప్పుడు అత్యంత మంద భాగ్య స్థితిని పొందియున్నాడు. నిరుపేద అయి పిండి కలిపిన నీరు కూడా లభించక, ఏదో దొరికింది తిని ఆకలి తీర్చుకునేవాడు. అట్టి ఉపమన్యుడు తన యొక్క శుభప్రయత్నములచే క్షీరసముద్రమునే పొందగలిగాడు.

'శ్వేతుడు' అను మరొకడు తన యొక్క 'భక్తి' ప్రభావంచేత ముల్లోకములను సంహరించు స్వభావముగల యముని సంతసింపజేసి మృత్యువును జయించగలిగాడు.

'సావిత్రి' అనే పేరుగల రాజకన్య 'మంగళగౌరీవ్రతము' మొదలగు తన శుభప్రయత్నముల ప్రభావం చేత గొప్ప వాక్చతురతను ప్రదర్శించి తన భర్త సత్యవంతుని ప్రాణములను యమ ధర్మరాజు హస్తములనుండి తిరిగి పొందగలిగింది.

సశాస్త్రీయంగా నిర్వర్తించబడిన శుభప్రయత్నముల ఫలములు సుస్పష్టములు, అమోఘాలు అయి ఉన్నాయి. కాబట్టి రామా! నీవు సర్వోత్తమమగు మోక్షము గురించే సర్వదా ప్రయత్నశీలుడవై ఉండటం ఉచితం సుమా!

❖

నాయనా! రామా! ఈ జీవుడు అనుక్షణం "జననము-మరణము, సుఖము-దుఃఖము"... మొదలైన అనేక అసంఖ్యాకములగు భ్రాంతులన్నీ పొందుచున్నాడు. అట్టి భ్రాంతులన్నీ

సమూలంగా పెకలించబడాలంటే, అందుకు ఒక్క ఆత్మజ్ఞానము మాత్రమే దివ్యమైన ఔషధం. అట్టి ఆత్మజ్ఞానం కొరకు అన్వేషణా పూరితమైన ప్రయత్నము నిరంతరం జరుగుచూ ఉండాలి.

అసలు, ఈ 'బుద్ధి' చేయుచున్నదేమిటో గమనిస్తున్నావా? ఇది సమగ్రత్వము, పూర్ణత్వము, ప్రశాంతత్వము ప్రసాదించగలిగినట్టి ఆత్మ సమాచారమును ఉపేక్షిస్తోంది. 'క్షుధ, అసంతృప్తి, తృష్ణ, కామం' మొదలైన ఆపదలను పరిగ్రహించే స్వభావాన్ని ప్రయత్న పూర్వకంగా ఆశ్రయిస్తోంది. ఎంతో ప్రయాసపడి, చివరికి రోగకారకము కాగల పదార్థములన్నీ సంపాదించి దాచిపెట్టు కుంటోంది. ఇట్టి ప్రమాదభరితమగు సందర్భంలో విజ్ఞుడైన వాడు చూస్తూ ఊరుకుంటాడా? లేదు.

**శ్రీరాముడు :** అట్టి ఈ దుష్టబుద్ధిని నిరోధించటం, నియమించటం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ విషయములలో గల దోషమేమిటో పరిశీలించగల ఉత్తమ దృష్టి కొరకై ప్రయత్నం, అన్వేషణ సాగించాలి. శుభప్రయత్నములు మరల మరల పట్టుదలతో ఆశ్రయించాలి. "ఆఁ! ఈ శుభప్రయత్నములు శ్రమతో కూడుకొనియున్నట్టి వ్యవహారం కదా! ఇప్పుడెట్లా సాధ్యం? ఈ వస్తుజనితమైన ఆనందములను కోల్పోయి మేము ఏం సాధిస్తాం? ముందు ముందు ఇంతకు మించినదేదో పొందుతామని నమ్మకమేమిటి?"... అనునట్టి అల్పదృష్టితో కూడుకొని, ప్రయత్న మాంద్యమును ఆశ్రయించేవారిని ఎవరు కాపాడగలరు? ఈ జీవుడు ఏవేవో జడభావనలకు ఆశ్రయమిస్తూ ఆత్మ విషయమై తాత్సారం చేస్తున్నాడు. నాయనలారా! "వైరాగ్యమును అభ్యసించుట" అను శ్రమకు మీరు సిద్ధంగా లేకపోతే... బాధారహితము, మహత్తరము అగు 'సచ్చిదానందము' యొక్క లేశము కూడా ఎట్లా లభిస్తుంది చెప్పండి? శ్రమించకుండా ఈ జగత్తులో ఎవరు ఏది పొందగలరు?

**శమము, పరబ్రహ్మము -** 'బ్రహ్మము' అనగా ఏమిటి? అది ఎప్పుడో ఎక్కడో ఎట్లో తారసపడే విషయమా? కానే కాదు. ఇంద్రియనిగ్రహముచే పరిపూర్ణమైన చిదాత్మ స్వరూపమగు బ్రహ్మమే పరబ్రహ్మము సుమా! అట్టి ఇంద్రియ నిగ్రహమునే 'శమము' (Withdrawal from sensory avocations) అనే పేరుతో పిలుస్తున్నాం. ఈ 'సంసారం' అనే అనర్థము దీని మూలకారణ సహితంగా నివర్తింపబడాలంటే "శమం" ను ఆశ్రయించాలి. గొప్ప అనర్థముల నుండి కాపాడ గలదు కాబట్టి "శమమే పరమ పురుషార్థం. సర్వ ఉత్తమ ప్రయత్నముల ప్రయోజనం శమం"అని మహనీయులు చెప్పుచున్నారు. 'శమము', 'బ్రహ్మము' అనబడు రెండూ ఒక్కటే సుమా! ఇందులో శమము అనునది శంకరునిగా (శం+కరుడు=బ్రహ్మానందమును కలుగజేయు వాడు) ఎరుగు. ఓ రామా! అభిమానమును త్యజించినవాడవై, నిత్యము శమమునే ఆశ్రయిస్తూ ఉండు. శాశ్వతమగు మోక్షప్రాప్తికి యోగ్యమైన ఉత్తమ జన్మ కర్మల గురించే ఈ జీవుడు ప్రయత్నశీలుడు కావాలి.

**సత్పురుషుల సేవ -** 'నేను సర్వాత్మ స్వరూపుడను' అను ధ్యాననిష్ఠతో కూడిన ఎరుకను సుస్థిరీ కరించుకున్నట్టి మహనీయులు ఈ భూమిపై అక్కడక్కడ ఉన్నారు. అట్టి సజ్జనులను సేవించాలి. "సత్పురుషులను సేవించుట" అను అభ్యాసము గలవారు ఈ సంసార సాగరమును అవలీలగా దాటివేయుచున్నారు.

**న తపాంసి న తీర్థాని నశాస్త్రాణి జయన్తి చ ।**
**సంసార సాగరోత్తారే సజ్జనాసేవనం వినా ॥** (సర్గ 33, శ్లో. 14)

సత్పురుష సేవనము లేనిచో తప, తీర్థ, శాస్త్రాదులేవియు సంసారసాగరమును దాటింప శక్యములుగావు.

ఎవని యందైతే లోభ–మోహ–క్రోధములు రోజు–రోజుకూ తగ్గుతూ ఉంటాయో, ఎవడు తనకు విధించిన కార్యములందు శాస్త్రానుకూలంగా వర్తిస్తూ, అకర్తృత్వము వహిస్తూ ఉంటాడో, అతడే సజ్జనుడు.

❖❖❖

# 7. దృశ్యము యొక్క అత్యంత - అభావము

సజ్జన సాంగత్యము చేయుచూ రాగా, ఆత్మవేత్తలగు వారి సంపర్గముచే, ఈ జీవునకు ఈ దృశ్యము యొక్క అభావము లభిస్తుంది. దృశ్యముకంటే అతీతమై దృశ్యము చేరజాలనట్టి స్వస్థితి అనుభవమౌతుంది. అట్టి వానియందు పరమాత్మయే శేషిస్తుంది. అతనికి ఇక ఏ అన్యభావమూ, దేని పట్ల కూడా కలుగదు. అతడు పరమాత్మయందే ఏకమై, లీనమై ఉంటాడు.

యథార్థానికి ఈ దృశ్యము ఏ సమయమునందును ఉత్పన్నము కానేలేదు. ఇక ముందు కూడా ఇది ఉండబోవుట లేదు. మరి వర్తమానంలో మాత్రం ఇది 'ఉన్నది' ఎట్లా అవుతుంది? అందుచేత బ్రహ్మమును ఎరిగినప్పుడు ఏదీ, దేనిచేత కూడా బాధింపబడుట లేదు. "బ్రహ్మమును ఎరిగినవాడు జగత్తును త్యజిస్తాడు..." అను వాక్యమును సునిశిత బుద్ధితో "అతడు ఈ సర్వము బ్రహ్మముగానే దర్శిస్తాడు..." అని అర్థం చేసుకోవాలి. ఇక బ్రహ్మాభావమును కలిగియుండుటచేత నష్టమేమున్నది? "నేను బ్రహ్మమునే" అను అవగాహనను "భవిష్యత్తులో సాధించవలసిన విషయం"గా దర్శించవలసిన పనేమున్నది?

ఈ జగత్తు ఉత్పత్తియే అయి ఉండలేదు... అను సత్యమును ఉత్పత్తి ప్రకరణంలో అనేక యుక్తుల సహాయంతో నిరూపించాము కదా! ఇప్పుడు కూడా అదే ప్రతిపాదిస్తున్నాను.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ త్రిలోక సంబంధమైన 'చిదాకాశము' గురించి సుస్పష్టమొనర్చమని వేడుకొనుచున్నాను. 'చిదాకాశము' అనుదానిపట్ల విజ్ఞుల అనుభవం, దృష్టి ఎట్లా ఉంటోందో మరి కొంత చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ త్రిలోక సంబంధమగు చిదాకాశము శాంతము, నిర్మలము పరమార్థ రూపము అయివున్నది. అఖండమగు నా యొక్క నీ యొక్క సర్వులయొక్క వాస్తవతత్త్వమే కదా! ఇక "నేను శాంతుడను–నిర్మలుడను–పరమార్థరూపమును, అఖండుడను–వాస్తవతత్త్వమును"... అను భావనను అభ్యసించటానికి వెనుతీయవలసిన పనేమున్నది? "నా యొక్క స్వస్వరూపము ఈ త్రిలోకములకు సంబంధించక, సంబంధించీ కూడా ఉంటున్న చిదాకాశమే" అని నిరభ్యంతరంగా గ్రహించబడవచ్చును. విజ్ఞులు అట్టి అనుభవమునే సర్వదా, సర్వత్రా పొందుచున్నారు.

**శ్రీరాముడు :** అయితే మునీంద్రా! ఈ ఆకాశము మొదలైన దృశ్యపదార్థములు, అవి అనుభవమగుచున్న ఈ ఇంద్రియాలు... ఇవన్నీ మాయాజనితము అయి ఉన్నాయంటారా? ఇవన్నీ ఎక్కడి నుండి ఏ విధంగా జనించాయి? సత్తు నుండా? అసత్తు నుండా? లేక మాయ నుండా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సత్తు అగు ఆత్మ వికారరహితము. అందుచేత ఆత్మ నుండి 'ఆకాశము' మొదలైనవి ఉద్భవించటం అసంగతమైన విషయం.

'అసత్తు అనునది స్వయముగా లేనిదే కదా! లేనిదానిలో నుంచి ఆకాశము, భూమి మొదలైనవి ఎట్లా ఉద్భవిస్తాయి?.... అందుచేత రెండు పక్షములు యుక్తములు కావు.

ఇక ఇవి 'మాయ' నుండి కలిగాయని అనుకుంటే... మాయ అనగా 'మిథ్య' అనియే కదా! మిథ్య నుండి మిథ్య అయినవే సంభవించగలవు. ఇట్లు ఈ ఆకాశాదుల ఉత్పత్తియే సంభవించుట కుదురునది కాదు.

కాబట్టి, "కల్పితం, చంచలం అగు జీవాత్మ యొక్క సంకల్ప దర్పణము నందు ప్రతిబింబించే చైతన్యమే ఇదంతా" అని అనక తప్పదు.... ప్రతిబింబిత చైతన్యమే ఈ జగత్తును కల్పించుచున్నది. చైతన్యము దేనిని ఎట్లు కల్పన చేయుచున్నదో అట్లు ఆ కల్పననే 'జగత్తు' రూపముగా అనుభవించుచున్నది.

ఈ ముల్లోకముల కల్పన అంతా కూడా "చైతన్యము" అను సూర్యుని కిరణముల సమూహమే అయివున్నది. కిరణములకు, సూర్యునికి భేదమేమున్నది? లేదు కదా!

❖❖❖

## 8. అహంకారము యొక్క రూపము

ఈ సర్వవికల్పములు మిథ్యయే కాబట్టి "ఈ ముల్లోకములందలి అనుభవం నిర్వికల్పమగు పరబ్రహ్మస్వరూపమే"... అని చెప్పబడుతోంది. చైతన్యము స్వతహాగా "నిర్వికల్పమే" అయినప్పటికీ సవికల్పత్వమును చమత్కారముగా కలిగి ఉంటోంది. అట్టి సవికల్పమగు చైతన్యవృత్తి యొక్క "కనులు తెరచుట, మూయుట" అను బాహ్యచమత్కృతులే ఈ 'జగత్తు' అను అనుభవము యొక్క ఉత్పత్తి – వినాశనములు అయి ఉన్నాయి సుమా!

పరమార్థమగు చిదాకాశమున "అపరిజ్ఞాతమగు అహంకారము" అనే మాలిన్యము, లేక అవిద్య ఒక "గారడి సంఘటన" వలె ఉండి ఉంటోంది.

పరిజ్ఞాతమగు అహంకారము (సర్వము గ్రహించి, సత్యదృష్టిని అంతర్లీనంగా దర్శించు జీవుడు) స్వయముగా చిదాకాశమే అయివున్నది. కాబట్టి అహంకారమును పరిజ్ఞాతం (జ్ఞానమయం) చేస్తే ఈ దృశ్యసత్త బ్రహ్మముగానే గ్రహించబడుతోంది.

అపరిజ్ఞాతం చేస్తున్నప్పుడో, బ్రహ్మసత్తకంటే వేరే ఉన్నదానివలె భ్రమను కలిగించుచున్నది.

ఇట్టి సంసారవ్యాధికి (అహంకారమును బ్రహ్మము కంటే వేరైన దానివలె పొందుట అను వ్యాధికి) ఔషధం ఒక్కటే. అది, ఈ అహంకారము యొక్క యథార్థస్వరూపం ఎరుగుటయే.

**హృదియావదహంభావో వారిదః ప్రవిజృంభతే ।**
**తానద్వికాసమాయాలి తృష్ణాకుటజమఞ్జరీ ॥** (శ్లో. 30, సర్గ 33)

దీనిని యథార్థ స్వరూపమేమిటో తెలుసుకున్నామా... ఇంకేమున్నది? ఇది ఏ విధంగానూ ఉండజాలదని తెలిసిపోతుంది. జలము జలములో కలిసిపోతున్నట్లు, పరిజ్ఞాతము అయినట్టి అహంకారం చిదాకాశముతో ఏకత్వము పొందుతోంది.

**అహంకారం, దృశ్యము -** ఓ రామచంద్రా! "అహంకారం అనగా ఏమిటి?" అనే విషయం మేము ఎంతగానో పరిశీలించాము. నేను-నీవు-అతడు-ఇతడు మొదలైన వాటితో కూడుకున్న ఈ దృశ్య వ్యవహారమంతా పరిశీలించి చూస్తే, "ఈ దృశ్యము స్వతహాగా లేదు. కానీ, 'భావన'ను లేక, 'ద్రష్ట'ను ఆశ్రయించుకొని అట్టి భావనానుసారంగా ఉన్నట్లు మాత్రం ప్రాప్తి స్తోంది" అని సిద్ధాంతీ కరించాం. ఇక్కడ సర్వేసర్వత్రా చిదాకాశమే ఉన్నది కాని, 'దృశ్యము' అనబడేదేదీ ఎక్కడా లేదు. 'అహంకారము' అనబడేదేదీ చిదాకాశము నుండి వేరైనదిగా లేదు. వివేకులు, అభయస్వరూపులు అగు జ్ఞానుల దృష్టిలో అహంకారమే 'లేనిది' అగుచున్నప్పుడు, ఇక అది ఒకరిని బాధించుట ఏమి? పిశాచమే ఉండజాలదని గ్రహించిన తరువాత, అట్టి పిశాచం యొక్క చర్యలకు ఉవ్విళ్ళూరు వారెవరు? భయపడువారెవరు? అయితే అల్పజ్ఞులగు బాలురకు "పిశాచం లేదు" అని ఎన్నిమార్లు చెప్పినా వారిలో కొందరికి పిశాచబుద్ధి తొలగకయేపోవచ్చు కదా! ఎంతగా బోధించినప్పటికీ ఆత్మ యందు ఇంకను నిలకడ ఏర్పడని జీవునకు 'అహంకారము లేదు' అనునది అవగత మగుటలేదు. ఇంకను సంశయబుద్ధి శేషించుచునే ఉంటోంది.

ఎంత వరకైతే ఈ చైతన్యము 'అహంకారము' చే కప్పబడి ఉంటోందో అంతవరకు స్వయం స్వరూపమగు అద్వితీయ ఆత్మతత్త్వము అనుభవమున ప్రకాశించదు. ఎప్పుడైతే ఈ జీవునికి అహంకారము యొక్క అసలు రూపం అవగతమౌతుందో, అట్టి అహంకారము యొక్క విజ్ఞాన దృష్టికి ఇక ఈ 'స్వర్గము-నరకము-మోక్షము' మొదలైన కల్పనలు ఉంటాయా? ఉండవు.

**అహంకార మేఘం, హృదయాకాశం -** అహంకార మేఘం హృదయాకాశంలో సంచరించు చున్నంత సేపు "ఇంకా ఏదో పొందవలసి ఉన్నది..." అను రూపముగల తృష్ణ అనే కొండమల్లె వృద్ధి చెందుతూనే ఉంటుంది. చైతన్య సూర్యుని అహంకార మేఘం కప్పి ఉంచుట చేత, ఇక అజ్ఞాన అంధకారమే వ్యాపిస్తూ ఉంటుంది. సుజ్ఞానము యొక్క ప్రకాశము మరుగునపడి ఉంటుంది. ఫలితమేమిటి?" రోదన - ద్వేషం - నిర్దాక్షిణ్యం - నిస్పృహ - అభినివేశం - మదమాత్సర్యాలు"... ఇవన్నీ తాండవిస్తూ ఉండటం. చీకటి ఉన్నచోటే గబ్బిలములు మొదలైనవి కాపురములు చేస్తూ ఉంటాయి కదా! బాలుడు తన భ్రమచే "పిశాచము" అనబడు, అసలు లేనట్టి, ఒకానొక దానిని కల్పించుకొని, పొందుతూ దుఃఖాలు అనుభవిస్తూ ఉంటాడు. "నన్ను ఆ భూతం నుండి కాపాడండి. నాకు 'తోడు' ఉండండి" అంటూ తదితరులను అర్థిస్తాడు. అట్లాగే, ఈ అహంకారము అనబడునది

స్వతహాగా అసత్తే అయినప్పటికీ, కల్పించబడి మరీ పొందబడుతోంది. అట్టి కల్పన దుఃఖం కొరకే ఏర్పడుచున్నది. ఎందుకంటే, అహంకారము యొక్క కల్పనచే సుఖించువారు ఎవ్వరూ ఉండరు.

**అహంకారము, సంసార భ్రమలు! -** చీకట్లో పడివున్న ఒక వంకర టింకర త్రాడును చూచి "అమ్మబాబోయ్! ఇది పామే!" అను బుద్ధి ఏర్పడుతోంది చూచావా? అభిమానం చేత కలుషితమైన అంతఃకరణము నందు ఈ "అహంకారం" అనబడేది కల్పించబడుతోంది. ఇక అట్టి అహంకారం సర్వసంసార భ్రమలు కలుగజేస్తోంది.

"ఈ దేహమే నేను; ఈ ఇంద్రియములు నావి, నేను ఈ దేహపరిమితుడను, ఈ దేహము ముగించబడితే, అది నా ముగింపే అగుచున్నది..." ఇటువంటి మనోమోహముల కంటే వేరుగా అనర్థములు ఈ ప్రపంచంలో ఇతఃపూర్వం లేవు. ఇక ముందు ఉండబోవు. "ఈ ప్రపంచంలో జీవునికి అనేక రూపములైన దుఃఖములన్నీ ఎక్కడి నుండి ప్రాప్తిస్తున్నాయి?" అనే విషయమును మేము ఎంతగానో పరిశీలించాం. "ఇదంతా అహంకార చక్రం యొక్క విజృంభణం, పరిణామం అయివున్నది"... అని ప్రకటిస్తున్నాం. 'అహంకారము' అనే విషవృక్షమును 'శుద్ధమైన మనస్సు' అనే గొప్ప యంత్రము సహాయంతో కూకటి వ్రేళ్ళతో సహా పెకలించివేయాలి. అప్పుడు 'ఆత్మ' అనే సుక్షేత్రంలో సంసారనాశకరమగు 'జ్ఞానబీజము' అంకురిస్తుంది. అది మహావృక్షమై... "నేను అఖండుడను, నిత్యుడను" అను ఎరుక రూపంలో ఉండే మహాఫలమును ప్రసాదిస్తుంది.

**నాది, నేను -** 'అహంకారము' అనే వృక్షమునకు "నాది నేను" అనునవే రెండు శాఖలు. అట్టి నేను, నాది అనునవి ఇంద్రియవిషయముల పట్ల 'ప్రియ, అప్రియములు' అను వాటిని మూలంగా కలిగి ఉంటున్నాయి. అవియే వాసనలు. ఈ వాసనలు జీవుని యందు తత్త్వవిచారణను సన్నగిల్ల చేస్తున్నాయి. అత్యంత శ్రమతో కూడుకొనిన అనేక జన్మపరంపరలను ఈ జీవుడు పొందేట్లు చేస్తున్నాయి. జలంలో తరంగాల వలె ఈ జన్మ కర్మలు అతి చంచలములై, చివరికి అతి తుచ్ఛముగా పరిణమిస్తున్నాయి.

❖

కాబట్టి రామచంద్రా! నీవు యథార్థానికి ఆత్మయే స్వరూపముగా కలిగి ఉన్నావు. అట్టి నీకు అహంభావమేమిటి? అది నిన్ను సంకోచింపజేయటమో, బంధించటమో ఏమిటి? నీవు అహం భావ రహితుడవే సుమా! అట్లే ప్రతిజీవుని విషయం కూడా. అయినప్పటికీ అహంభావము ఆత్మను కప్పివేయుచున్నది. ఫలితంగా ఈ జీవుడు స్వయంగా ఈ సంసారచక్ర పరిభ్రమణమును తనకు ఆపాదించుకొనుచు, దుఃఖములతో కూడిన అనుభవములన్నీ పొందుచున్నాడు. "ఆత్మ స్వరూపుడ నగు నాకు ఏ సమయమందునూ జన్మ కర్మలు లేవు" అను ఎరుకను ఏమరచుచున్నాడు.

'జన్మ' అనే అరణ్యంలో 'అహంకారం' అనే అంధకారం వ్యాపించి ఉన్నంతవరకు 'దుఃఖము' అనే మదించిన పిశాచము విజృంభిస్తూనే ఉంటుంది. ఈ అహంకారపిశాచము మామూలు 'పిండి-పిడక' మంత్రములచే వదిలేది కాదని అందరిని హెచ్చరిస్తున్నాను.

❖❖❖

# 9. అహంకారము - నివారణోపాయం

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ అహంకారం వృద్ధి పొందకుండా ఉండే ఉపాయమేమిటి? ఈ సంసారము భయమును కలుగజేస్తోంది. ఇట్టి భయనివృత్తి కొరకు వివిధ జనులను దృష్టిలో పెట్టుకొని కొన్ని ఉపాయాలను సవివరంగా చెప్పవలసినదని ప్రార్థిస్తున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సర్వజనుల పట్ల నీకు గల అవ్యాజమైన ప్రేమను మేము గమనిస్తున్నాము. అందుచేతనే, ఈ జీవుని యొక్క భయము, దుఃఖముల నివృత్తికొరకే ఈ ఆత్మ శాస్త్రమును మా యొక్క అనుభవసారంగా ప్రతిపాదిస్తున్నాం. ఈ సందర్భములో నీ ప్రశ్న అత్యంత సముచితం. అందుచేత నీ ప్రశ్నకు సమయోచితమైన కొన్ని విశేషాలు ఇక్కడ సమాధానంగా చెప్పుతాను. విను–

**ఆత్మధ్యానం -** ఆత్మ ఒక నిర్మలమైన అద్దము వంటిది. చిన్మాత్రమే స్వరూపముగా కలిగియున్నది. అట్టి శుద్ధ చిన్మాత్రమగు ఆత్మయొక్క స్వభావమును నిరంతరం ధ్యానిస్తూ ఉండాలి. అప్పుడు అహంకారం వృద్ధి పొందకుండా ఉండగలదు.

**విరాగం -** "దృశ్యరూపంగా ప్రాప్తిస్తున్న ఈ ఇంద్రజాల సదృశ్యమైనదంతా మిథ్యయే కదా! వీటి పట్ల నాకు రాగమెందుకు? ద్వేషమెందుకు?"

ఇట్టి 'మననము' లేక 'చింతన' నిరంతరం ఒనర్చుట చేత అహంకారం వృద్ధి కాకుండా ఉంటుంది. ఎవనియందైతే "ఈ దృశ్యం వాస్తవం" అను అనుభవం గాని, "నాది... నాకే ఉండాలి" అనునట్టి వేదనగాని ఉండదో, ఎవడైతే సర్వస్థితి గతులందు ప్రశాంతచిత్తుడై వ్యవహరిస్తాడో... అట్టి వాని యందు అహంకారము తప్పక రూపుమాయగలదు.

**దృశ్య వ్యవహారం నుండి స్వస్వరూపాన్ని వేరు చేసి ఉంచటం -**

| | | | | |
|---|---|---|---|---|
| ద్రష్ట | – | దర్శనము | – | దృశ్యము |
| Perceiver | - | Perception | - | Object |
| నేను | – | చిత్తు | – | జగత్తు |
| Knower | - | Knowing | - | The known |

పై త్రిపుటి సర్వదా ఎదరుగా ఏర్పడి ఉంటున్నది కదా! అయితే, ఒకని యందు ప్రజ్ఞ, ప్రయత్నముల ప్రభావం చేత, "ఇది గ్రహించాలి. ఇది త్యజించాలి" అను త్యాజ్య గ్రాహ్య దృష్టులు నశించుచున్నాయి. అప్పుడు అట్టివాని యందు "సమత్వము" అనబడు మధుర స్వభావం ప్రవృద్ధమౌతోంది. అహంకారము స్వయముగానే క్షీణించుచున్నది. "నాఽహం, ఇదంతా నేను కాదు. నేను దేనికీ కర్తను కాదు. నా వాస్తవతత్త్వము దేనికీ కర్తగానీ, భోక్తగాని అయ్యేది కాదు..." అను భావనచేతనే అహంకారము నిర్జించబడుతోంది.

ఎచ్చటైతే అంతఃకరణము నందు భేదదృష్టి లేక భేదభావన సన్నగిల్లుతూ వస్తుందో, అక్కడ అహంకారము తన తావును కోల్పోతూ ఉంటుంది.

**శ్రీరాముడు :** తండ్రీ! ఇతఃపూర్వం మీరు సమాధానం ఇచ్చి ఉన్నప్పటికీ, మరల అట్టి ప్రశ్ననే అడుగుచున్నాను. ప్రశ్న ఒక్కటే అయినప్పటికీ, మీరు అనేక కోణముల నుండి సమాధానం ఇస్తున్నారు. కనుక మాకు మీ వాక్యములు అత్యంత ప్రయోజనకరంగానే ఉంటున్నాయి.

అసలీ అహంకారము యొక్క స్వరూపమేమిటి? ఈ 'అహంకారము' అనబడునది ఈ జగత్తునందు, స్వప్నమునందు, మనోరథములందు ఏ రూపము కలిగి ఉంటోంది?

1) దేహమునకు సంబంధించిన అహంకారము.

2) దేహమునకు విలక్షణమైన 'బుద్ధి' యందు ఏర్పడి ఉంటున్న అహంకారము.

ఈ రెండు అహంకారముల గురించి వివరించండి.

వివిధ రూపములైన ఈ అహంకారములు త్యజించబడేది ఎట్లా? అట్లు త్యజించుటచే కలుగు ప్రయోజనమేమిటి? ఈ అహంకారములను ఎన్ని తీరులుగా విభజించవచ్చు? ఈ విషయాలు ప్రవచించమని ప్రార్థిస్తున్నాను.

❖❖❖

# 10. త్రివిధ అహంకారములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ లోకంలో మూడు రకములైన అహంకారాలు ఉన్నాయి– 1) "ఈ సర్వము నేనే" 2) "ఇందులోని ఏదీ నేను కాదు" 3) " ఈ దేహమే నేను".

**1. అహమేవ ఇదమ్ సర్వమ్... ఈ సర్వము "నేనే" -**

**అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహమచ్యుతః ।**
**నాన్యదస్తీతి పరమా విజ్ఞేయా సా హ్యహంకృతః ।**
**మోక్షాయైషా న బన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే ॥** (సర్గ 33, శ్లో. 50)

"ఈ జగత్తంతా నిండియున్నట్టి కార్యరూపుము, కారణరూపము, నాశరహితము అగు ఆ పరమాత్మను నేనే. నాకు అన్యముగా 'జగత్తు' అనబడునది వేరే ఎక్కడా లేదు. నేను భావించుట చేతనే జగత్తు ఉంటోంది. భావనను, భావాతీతుడను కూడా నేనే. నాచే ఎదురుగా చూడబడుచున్న వారంతా నా యొక్క "సత్–చిత్" కిరణపుంజములే...!"

ఈ అహంకారము సర్వోత్తమమైనది. ఇది మోక్షమునే కలుగజేస్తోంది. ఇట్టి భావన బంధము అవదు. ఇట్టి అహంకారము జీవన్ముక్తులయందు పరిపూర్ణత సంతరించుకుని ఉంటుంది.

**2. కేవల పరిశుద్ధ సాక్షీస్వరూపమహమ్ -** ఈ సర్వమునకు విలక్షణమైనట్టి పరిశుద్ధమగు 'కేవలసాక్షీ' స్వరూపమును నేను.

"ఈ జగత్తులో కనబడే సర్వ దృశ్యవస్తువులకంటే కూడా విలక్షణమైనవాడను. సర్వమునకు సాక్షితత్వమును, శుద్ధుడను. అప్రమేయమును అయివున్నాను. కనుక ఇందు నేను ఏదీ కాదు...!

ఈ కనబడేది, తారసపడేది – అంతా స్వప్నసదృశ్యకము కాగా, నేను మాత్రము సత్యమును, నిత్యమును...!". స్వప్నద్రష్ట స్వప్నముకంటే వేరేకదా! ఈ జగత్తు నాకు అట్టిదే!

ఇది కూడా శుభాహంకారమే అవుతుంది. జీవన్ముక్తులచే ఆశ్రయించబడుచూ, మోక్ష భావనయందు సుస్థీకరింపజేస్తుంది. అయితే "సప్తమ భూమిక" యందు ప్రవేశించినట్టివానికి పై రెండు అహంకారములూ కూడా కేవలం "క్రిందిమెట్లు"గానే తెలియవస్తూ ఉంటాయి.

**3. ఇదమ్ దేహ-మే వాహమ్ -** ఈ కళ్లకు కనబడే పాంచభౌతిక దేహము మాత్రమే నేను, "ఈ చేతులు, కాళ్లతో కూడుకున్న దేహమే నా స్వరూపము – ఈ దేహమును అనుసరించి మాత్రమే నేను ఉండటం జరుగుతోంది. దేహమునకు వేరుగాగాని, అతీతముగాగాని నేను లేను...!"

ఇట్టి లౌకికమైన నిశ్చయము తుచ్ఛమైనది. నీచమైనది కూడా. ఇది ప్రబల శత్రువు కాబట్టి సర్వదా త్యజింపతగినదే!

'నేను ఈ దేహమును' అను రూపముగల అహంకారము అనేక రకములుగా విపత్కరమైనది. బలవత్తరమైన శత్రువు వంటిది కూడా! ఈ "దేహమేవాఽహమ్" భావరూపమగు అహంకారము ఆత్మయందు స్వభావంగానే అనాది కాలం నుండి సంసక్తమై యున్నది. హస్తము నందు 'హస్తలాఘవము' దాగియ్యున్నట్లు ఆత్మయందు "జగత్తు యొక్క కల్పన చేయుట, పొందుట" అను చమత్కారం నిక్షిప్తమై ఉంటోంది. అయితే అది అపసవ్యము, అవాస్తవము అవటం చేత, "నేను శరీరమును" అను భావన పొందుచున్న ఈ జీవుడు ఎక్కడా ఒకచోట నిలువలేక పోవుచున్నాడు.

❖

అయ్యో! అనేక దుర్వాసనలందు సర్వదా ప్రవృత్తమగుచున్నట్టి 'బుద్ధి'గల ఈ జీవుడు నిరంతరము అనేక విపత్తులలో కూలుచున్నాడే! మహాత్ములగువారు పరిశుద్ధము, అఖండము, అప్రమేయము అగు 'అహమ్'ను ఆశ్రయించి, అటుపై ఈ జగత్తులో సంచారం చేస్తున్నారు.

"ఈ సర్వము నేనే అయినప్పటికీ, నేను ఈ దృశ్యమునకు సంబంధించినట్టి ఏదీ కాను"... అను రెండువైపుల పదునుగల కత్తితో 'నేను దేహమాత్రుడను – దేహపరిమితుడను" అను భావ రూపమున ఉంటున్న 'లౌకికాహంకార దోషమును' ఆ సుజ్ఞానులు విచ్ఛిన్నం చేసివేయగలుగు చున్నారు. "దేహమేవాహమ్" అను దానిని "సర్వాత్మాఽహమ్" అనుదానిలో లయం చేస్తూ ఈ దేహ భావము నుండి నిస్సంశయపూర్వకంగా విముక్తిని పొందుచున్నారు.

"నేను దేహమును" – అను భావనచే మూడవ అహంకారము దృఢపడుచున్నది. అదియే బంధమగుచున్నది. "సర్వులలో సమానంగా ఉండి ఉన్న ఆత్మ చక్రవర్తిని నేనే" అను అహంకారం చేత తుచ్ఛత్వము జయించబడాలి. 'నేను దేహమును కాను"... అను నిశ్చయముచే మొదటి రెండు మహాహంకారాలు సుసాధ్యమౌతాయి.

ఆ తరువాత క్రమంగా మొదటి రెండు అహంకారములకు సంబంధించిన శ్రమను కూడా మహాత్ములు త్యజించివేస్తున్నారు.

'మౌనము–ప్రశాంతము–నిర్మలము' అగు స్వస్వరూపము మాత్రం శుద్ధమై శేషించుచున్నది.

ఏ విధంగా అయితే లౌకికంగా కనిపిస్తున్న "దేహమే నేను" అనే భావన స్థిరపడిందో, తదితర అహంకారములు కూడా అట్టి ఏదో ఒక లేక, కొన్ని మార్గముల ద్వారా అలవరచుకోవాలి.

ఏదైనా, అభ్యాసము చేతనే సుస్థిరత పొందుచున్నది. దుష్టమగు దేహాహంకారమును తలచుకొంటే చాలు... దుఃఖములన్నీ వచ్చిపడుచున్నాయి.

దామ–వ్యాళ–కటులకు కలిగిన దుర్దశలను గమనించావు కదా!

దేహాహంకారమును త్యజించినవాడు తనకు తానే హితము చేసుకుంటున్నాడు.

**శ్రీరాముడు :** లౌకికమైన 'దేహాహంకారము'ను పరిత్యజించిన మానవుడు ఎట్లా వర్తిస్తున్నాడు? అతడు తనకు తానే ఎట్లా హితం చేసుకుంటున్నాడు? మరి కొంత వివరించండి.

**శ్రీ వసిష్ఠమహర్షి :** 'ఈ సర్వము నేనే అయి వున్నాను... నేను మరొకటేదీ ఏ క్షణంలోనూ అగుట లేదు" అను భావములను స్వీకరించుటయే దేహాహంకారవ్యాధికి ఔషధమైయున్నది. "శ్రద్ధ–అభ్యాసము–గురుసేవ'లచే తమ తమ ప్రయత్నములను తీవ్రతరం చేస్తున్నవారికి అది సుసాధ్యమే అవుతుంది. అట్టి ఉత్తమ భావన వృద్ధిపొందుచుండగా, అది ఆ జీవుని పరబ్రహ్మ ప్రాప్తికి సంసిద్ధునిగా చేయుచున్నది.

మొదటి రెండు అహంకారములు ఉత్తమదృష్టితో ఆశ్రయించటమనేది ఇప్పుడే ఇక్కడ నిర్వర్తించవచ్చు సుమా! అయితే... సర్వ అహంకారముల రాహిత్యముచేతనే సర్వోత్తమమగు బ్రహ్మపదము అధిరోహించబడుతోంది.

❖

ఓ సర్వజనులారా! మీరు పరబ్రహ్మము గురించిన బోధకు తగిన వారు కావాలంటే ముందుగా 'నేనీ పాంచభౌతిక దేహమును' అను భావరూపమగు దుష్ట ఆశ్రయమును త్యజించాలి. "నేను ఈ దేహపరిమితుడను' అనునది ఒక పరిమితమైన, సంకుచితమైన, అపరిపక్వమైన, అసమగ్రమైన అవగాహన – అని, దానిని అధిగమించుటే సుఖము, శ్రేయస్కరము, ఉత్తమము అని మేము సర్వులకు గుర్తు చేస్తున్నాం. ఒకడు ఈ ప్రపంచమున వ్యవహరిస్తూ ఉండవచ్చు. లేదా ఇదంతా త్యజించి ఒకచోట ఒంటరితనమును ఆశ్రయించి కాలము గడుపుతూ ఉండవచ్చు. ఏది ఏమైనా అతడు స్థూలముగా ప్రాప్తిస్తున్న ఈ లౌకిక దేహాహంకారమును తత్త్వవిచారణ సహాయంచే జయించాడా... ఇక అతనికి 'పతనము' అనబడు ఊసు కూడా ఉండదు. అట్టి అహంకారము శమించుచుండగా పూర్ణతృప్తుడగుచున్న మానవుడు ఈ భోగములన్నిటినీ నిర్లిప్తంగా (వాటితో అనురాగ విరాగాది భావనలు చేయకుండానే) చూస్తూ ఉంటాడు. భోగములు

రుచించకపోవుటచే ఇక 'మోక్షము' అను శ్రేయస్సు వచ్చి ఎదురుగా నిలచి ఉంటుంది. మనస్సులోని అంధకారమువంటి ఈ 'అహంకారము' తొలగిన తరువాత ఇక పూర్ణానందమగు మోక్షస్థితికి వేరే ప్రతిబంధకాలు ఏమి ఉంటాయి?

**అహంకార అనుసంధాన వర్జనాదేవ రాఘవ ।**
**పౌరుషేణ ప్రయత్నాశ్చ తీర్యతే భవసాగరః ॥** (సర్గ 33, శ్లో. 70.)

అహంకారము వర్జించుటచేతను, ధైర్యమును అవలంబించి శాస్త్రశ్రవణము మొదలైన పురుష ప్రయత్నమును ఆశ్రయించుట చేతను ఈ సంసారము తప్పక దాటివేయబడగలదు.

కనుక, మొట్టమొదట... "ఈ జగత్తంతా నేనే. కాబట్టి అంతయు నా స్వరూపమే".... అను నిశ్చయము కలిగి యుండుము. ఆ తరువాత... "దేహాదులు నేను కాదు. ఒక దేహము కలిగి ఉన్నప్పుడు ఆ దేహమునకు మాత్రమే సంబంధించిన ధన-పుత్ర-మిత్రాది వ్యవహారములు కూడా నావి కావు... నాకు అనేక దేహములు ఏర్పడవచ్చు గాక... నేను ఏ ఒక్క దేహమును కాదు" అని భావించుటచే ప్రతిబంధకములన్నీ తొలగిపోతాయి.

అప్పుడు అట్టి ఉత్తముడు "పరిశుద్ధాత్మ"ను పొందు త్రోవలో ఉంటాడు. క్రమంగా సప్తమ భూమిక యందు స్థితి కలిగి ఉంటాడు. ఇక అతడు స్వయంగా అపరిచ్ఛిన్నమగు పరిపూర్ణాత్మ స్వరూపుడై "విదేహకైవల్యప్రాప్తి"ని కూడా పొందుచున్నాడు.

❖❖❖

# 11. భీమ - భాస - దృఢ న్యాయం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇక మనం ఆ శంబరాసురుని కథకు వద్దాం. దామ వ్యాళ కటులు ఆ విధంగా నశించారు కదా! వారితోపాటే గొప్ప దైత్య సైన్యమంతా నశించింది. కొన్ని సంవత్సరములు అట్లాగే గడిచాయి. ఒక రోజు శంబరాసురుడు ఒక చోట సుఖాసీనుడై ఇట్లు యోచించసాగాడు.

"ఈ దామవ్యాళకటులను నా మాయాశక్తిని ఉపయోగించి సృష్టించాను. కాని, ఏం లాభం? వారు తమ మూర్ఖత్వముచే మిథ్యయగు అల్పాహంకారమును, దురహంకారమును ఆశ్రయించారే! ఆ మిథ్యా కల్పనయే వారి వినాశనమునకు దారి తీసింది. ఇప్పుడు నేను ఏం చేయాలి? ఈ దేవతాధములను నేను లేని సమయంలో నిరోధించుట ఎట్లా? సరే, ఇంత కన్నా విలక్షణమైన ముగ్గురు సైన్యాధిపతులను ఈ మాటు సృష్టిస్తాను.

...వారు గొప్ప వివేకవంతులై ఉంటారు గాక! ... మిథ్యా విషయములైన అభిమానము, స్వోత్కర్ష (self praise), సన్మానాదులపట్ల కోరిక, గౌరవ మర్యాదల పట్ల లోభం వారికి ఏ మాత్రం ఉంచకుండు గాక! ...వారిలో తత్త్వజ్ఞానం వెల్లివిరియుటచే మిథ్యాభావరహితులై ఉంటారు!"...

ఈ విధమైన విశేషణములకూడిన భావతరంగం సృజియించాడు.

సముద్రంలో బుద్బుదములు ఏర్పడుతూ ఉంటాయి చూచావా? ఆ రీతిగా, అతని యొక్క బుద్ధి, మాయాకౌశలము... రెండూ ఏకమై భీముడు, భాసుడు, దృఢుడు అనే ముగ్గురు రాక్షసులను సృష్టించాయి. ఆ ముగ్గురు సర్వజ్ఞులు. తెలుసుకొనవలసిన పరబ్రహ్మము గురించి ఎరిగి ఉన్నారు. దేని పట్లా కూడా వారికి రాగము గాని, ద్వేషములుగాని లేవు. ప్రాప్తించిన కార్యమును నిర్వర్తించాలనే శుభ బుద్ధి మాత్రం వారియందు ఉన్నది. పవిత్రమైన, పాపరహితమైన అంతఃకరణముతో ఈ జగత్తు నంతా తృణప్రాయంగా చూస్తూ ఉండేవారు.

వారు దేవతలతో అనేక సంవత్సరములు పోరాడారు.

❖

ఆ ముగ్గురు ఏ మాత్రం అహంకారమును పొందుటలేదు. "నాది ఇది"... మొదలైన భావనలతో కూడిన వాసనలు వారి అంతఃకరణమున ఉదయించి మరుక్షణం... "ఈ ప్రపంచం మిటి? మా స్వరూపమేమిటి?" – అను విచారణను ఆశ్రయించేవారు. అట్టి విచారణచే అసత్తుల్యమైన "నేను," – "నాది" అను భావనలను వెడలగొట్టేవారు. దేవతల స్వోత్కర్షకారక వాక్యాలు, వస్తుజాల సంబంధమైన ప్రలోభాలు ఆ భీమ–భాస–దృఢులను సమీపించలేకపోయాయి.

"ఈ దేహము అసత్యమే కదా!... మరి ఈ దేవతలు? ... వీరు అసత్యరూపులే...! మేము ఎవరము? ఈ జగత్తు యొక్క స్థితి ఏమిటి? ఇదంతా స్వప్నసదృశమే కదా! ఇందులో నిత్యమైన దేది? మార్పు చెందబోతున్నదేది? ఈ జీవుల సంబంధములు ఎట్టివి...?"

ఇట్టి విచారణ చేస్తూ ఉండేవారు. ఇక వారి హృదయంలో ఏమాత్రం భయాదులు ఉత్పన్నమయ్యేవి కావు.

ఈ శరీరము మిథ్యయే. కనుక ఇది లేనిదే. శుద్ధ చైతన్యము మాత్రమే సత్యము. అదియే ఆత్మ యొక్క స్థితి. మేముగాని, ఈ దేవతలుగాని, తదితరులుగాని యథార్థానికి లేము. ఇదంతా ఆత్మమయం! ....అని సుదృఢంగా నిశ్చయించుకొని, అప్పుడు యుద్ధానికి బయలుదేరేవారు.

**శ్రీరాముడు :** ఆ భీమ భాస దృఢులు అవగాహన చమత్కారంగా ఉంది. వారి తత్పరత, బుద్ధి ఎట్టిది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. వారు అహంకార వర్జితులు.

**శ్రీరాముడు :** అనగా...?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వారికి "మేము ముసలితనమును, మృత్యువును పొందుతామేమో? ఈ దేహం, దేహ సంబంధాల గతి ఏమిటి?... అను వేసట లేదు. జడమగు దేహానికి, చైతన్యమే స్వరూపంగా గల తమకు... గల వాస్తవ అవాస్తవ సంబంధములేమిటో వారు గ్రహించి యున్నారు. భూత భవిష్యత్తుల గురించిన సర్వ ఆశ, ఆర్తులను ప్రక్కకునెట్టి, కేవలం ఎప్పటికప్పుడు ప్రాప్తించే వర్తమానము నందు చేయవలసియున్నట్టి కార్యముల గురించి మాత్రం శక్తిని, బుద్ధిని, యుక్తిని

వినియోగించేవారు. మహాధీరతతో వర్తమానమును మాత్రం అనుసరించి వర్తించుచుండేవారు. నిత్యమూ ఆసక్తిరహితమైన బుద్ధి కలిగి ఉండేవారు. "మేము వీరిని వధిస్తున్నాము..." అనే అభిమానము గాని, అహంకారము గాని వారియందు లేదు. అందుచేత వారు వధింపని వారే అగుచున్నారు. 'వాసనలు' అనే జాలములో వారు చిక్కుకొనుటలేదు. 'సర్వదా నేను కృతకృత్యుడనే... అకర్తనే"... అను ఎరుక కలిగి ఉంటున్నారు. "ఇది ప్రభువుకు సంబంధించిన కార్యము కనుక నిర్ణయానిర్ణయములు మాకు సంబంధించినవి కావు. నియమము యొక్క పాలన కొరకై మేము ఇది తప్పక నిర్వర్తించవలసియున్నది. కనుక అట్లే ఆచరించెదము గాక"... అను అప్రమేయత్వముతో కూడిన భావనమాత్రం కలిగి ఉంటున్నారు. వీతరాగులై, ద్వేషరహితులై, నిరంతరం సమదృష్టి కలిగియుండి, 'యుద్ధము' అను కార్యక్రమములో తత్పరులై యున్నారు.

వారు దేవతా సైన్యమును అతి సులభంగా హరించివేశారు. భోక్త భోగ్యవస్తువును అనుభవించినట్లు వారు యుద్ధమును ప్రదర్శించారు. అప్పుడు దేవతా సైన్యం నిస్సహాయులై పరుగెత్తి క్షీరసాగరంలో శయనించియున్న శ్రీ మన్నారాయణుని శరణువేడారు. విష్ణువు వారికి శరణాగతి ప్రసాదించి, "బిడ్డలారా! ఆ భీమ-భాస-దృఢులు జయింపబడలేరు. అయితే మీరు వెళ్ళి శ్వేత ద్వీపంలో ప్రవేశించి సుఖంగా ఉంటూ ఉండండి. మరి కొంతకాలము అయిన తరువాత ఆ శంబారాసురుని విషయం నేను చూచుకుంటాను" అని చెప్పి వారిని పంపించివేశాడు. తగిన సమయంలో విష్ణుభగవానుడు శంబరాసురునిపై దండెత్తి తన చక్రాయుధంతో అతనిని సైన్య సమేతంగా మట్టుపెట్టాడు. సృష్టిలో నిర్వర్తిస్తున్న సానుకూల్యమగు పాత్రను దృష్టిలో పెట్టుకొని దేవతలను కాపాడాడు. నారాయణునిచే హతులైన శంబరాసురుడు విష్ణులోకం చేరాడు.

అప్పుడు జరిగిన ఘోర సంగ్రామంలో, ఆ భగవానుడు భీమ-భాస-దృఢులకు విదేహ కైవల్యం ప్రసాదించాడు. ఆ ముగ్గురు రాక్షసులు వాసనారహితులు కదా! అందుచేత వారికి "పునర్జన్మలు" అనే గతి లభించనేలేదు. శాంతమనస్కులై, కేవలం స్వస్వరూపమగు ఆత్మయందు పరిఢవిల్లారు.

❖❖❖

# 12. వాసనారాహిత్యము

**తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః ।**
**రామ నిర్వాసనీభావ మాహరస్వ వివేకతః** (సర్గ 34 శ్లో. 27)

చూచావా, రామచంద్రా! వాసనాసహితమగు మనస్సు "బద్ధము" అగుచున్నది. వాసనా రహితమగు మనస్సో,... ముక్తినే పొందుచున్నది. కనుక నీవు అవశ్యం 'వాసనారాహిత్యము'ను సంపాదించుకో.

సత్యవస్తువును బాగుగా విచారించుటచే వాసనలను నివర్తించగలవు.

చమురు హరించిన తరువాత దీపం ప్రశమనం పొందుతుంది కదా! వాసనలు నశించాయా, ఇక, చిత్తమే ఉండదు. చిత్తములేని చోట సుఖం ఎక్కడ? దుఃఖం ఎక్కడ? ఆశ ఎక్కడ? మోహం ఎక్కడ?

**సమ్యక్ దర్శనం, అవాస్తవ దర్శనం -** ఇప్పుడిక్కడ దృశ్యకల్పన చేస్తున్నది ఎవరు?... పరిపూర్ణ మగు 'ఆత్మ' దృశ్యకల్పన చేస్తోందా?.... ఈ మాట కొంచెము కూడా సత్యము కాదు.

తాను పరిపూర్ణమై యుండి, దోషరహితమగు శుద్ధ చైతన్యం అయివుండి ఆయా కల్పనాదులు చేయుటచే వచ్చే ప్రయోజనమేమున్నది?

లేక మనస్సు చేస్తోందా? మనస్సు జడమైనదే కదా! దానిచే పనిచేయించాలంటే అందుకు మరొకటేదో ఉండి ఉండాలి. దానికి స్వతంత్రం ఎక్కడ ఉన్నది? లేదు.

కాబట్టి "దృశ్యాకారమగు భావన భ్రమచేతను, స్వస్వరూపము యొక్క విస్మరణ చేతను ఏర్పడుచున్నది"... అను సిద్ధాంతీకరింపబడుచున్నది. ఒకడు దీపపు కాంతికి ఎదురుగా నిలుచున్నాడనుకో.. కాంతి ప్రసరణమునకు తానే అడ్డుగా ఉండుటచే 'నీడ' అనునది ఏర్పడుతోంది కదా! స్వస్వరూపము యొక్క విస్మరణము చేతనే దృశ్యము ఘనీభూతమై ప్రాప్తించుచున్నది.

అందుచేత – "నేను భావాతీతుడను" అను గ్రాహ్యమును కలిగియుండుము.

చిన్మాత్ర స్వరూపమగు పరమాత్మయే అంతటా గాంచుచుండుము. అప్పుడు... ఆ పరమాత్మ స్వరూపమే సర్వత్రా ఉన్నది. ఆ పరమాత్మ యొక్క కళయే నాయందు కూడా సర్వదా జ్వాజ్వాల్య మానంగా వెలుగుచున్నది"... అని గ్రహిస్తావు. అప్పుడు 'సమ్యక్ దర్శనము' ప్రాప్తిస్తుంది. అదియే ముక్తి. అసమ్యక్ దర్శనమే బంధము.

**వస్తుశూన్యమైన చిత్తము -** ఈ జగత్తంతా ఆత్మయే అయి ఉండగా, ఇక ఎవడు ఎచట దేనిని భావిస్తాడు చెప్పు? అందుచేత సత్యవస్తువు విచారించు. అప్పుడు 'చిత్తము–వాసన'... అనబడు రెండూ కూడా వాటి శబ్దార్థములతో సహా విలీనమైపోతాయి. వాటి విలీనమే 'పరమపదము' అయి ఉన్నది. కనుక, త్రిపుటి,* అద్దాని భావనాసంస్కారము కూడా భ్రమపూర్వకమైన 'అవస్థ' నుండే ఏర్పడుచున్నాయని గ్రహించు.

వాసనతో కూడిన చిత్తమే ఈ జగత్తునందు స్థితి కలిగియుండి, సంచారం చేస్తోంది. లేదా, వాసనాగ్రస్థమగు చిత్తమునందు మాత్రమే ఈ జగత్తు అనబడునది ఉండిఉంటోంది. అట్టి చిత్తము మాత్రమే బద్ధమగుచున్నది. చిత్తము వాసనారహితమయినప్పుడు 'ఇతడు జీవన్ముక్తుడు" అని అంటున్నాం.

చిత్తమే కుండ–గుడ్డ–నీవు–నేను మొదలైన సర్వ జగత్ పదార్థరూపాలుగా స్థితి పొందివుంది. ఒక బాలుడు చీకటిలో ఏదో ఆకారము చూచి... "ఇది దయ్యము కాదు కదా? అవును..

---

* త్రిపుటి = చూచువాడు – చూడబడునది – చూచుట
ద్రష్ట – దృశ్యము – దర్శనము

అనుమానం లేదు... ఇది దయ్యమే!" అని భయమును పొందటం వంటిదే ఈ జగత్తును పొందుట కూడా! "ఓయీ, బాలుడా, అది దయ్యం కాదు. ఈ రోజు ఉదయం నీవు ఆడుకుంటున్నప్పుడు చూచిన స్తంభము మాత్రమే అది. ఇక వెత చెందవలసిన పనేమున్నది?"... అని అతని తండ్రి బోధించినప్పుడు ఆ బాలుని యందు బేతాళభావము శమించిపోతోంది కదా! సద్గురువులగు పూర్ణాత్మజ్ఞానులు, "బిడ్డలారా! ఈ జగత్తు, ఇందలి సంఘటనలు, పదార్థములు ఇవన్నీ వాస్తవం కావు. సత్యస్వరూపులగు మిమ్ములను బంధింపగలిగేది ఇక్కడ ఏమి ఉన్నది? ఏదీ లేదు" అని ప్రకటిస్తున్నారు. అనేక దృష్టాంతముల సహాయంచే బోధిస్తున్నారు. అప్పుడీ జీవులలో కొందరు శ్రద్ధ, ఆసక్తులతో విని, మననము చేసి, పరీక్షించి సత్యమేమిటో అవగతం చేసుకుంటున్నారు. ఈ జగత్తును పదార్థరహిత దృష్టితో చూస్తున్నారు. అనగా, తమ చిత్తమును వస్తు శూన్యం చేస్తున్నారు. శేషించిన పదమపదమగు ఆత్మయందు నిశ్చలమై ఉంటున్నారు.

**"దామ వ్యాళ కట న్యాయం"..... "భీమ భాస దృఢ న్యాయము" -**

దేహాత్మభావముగా పరిణమించిన ఈ చిత్తమునకు ఇప్పుడే ఇక్కడే సరి అయిన చికిత్స చేయాలి. భీమ-భాస-దృఢులవలె దానిని ఆత్మాకారముగా పరిణమింపజేయాలి. ఆపై నీవు నిశ్చలుడవై, ఎట్టి వికారములు పొందక, చేయవలసి వచ్చుచున్న దానిని నిస్సంగబుద్ధితో, కర్తృత్వాభిమానరహితుడవై చేస్తూ ఉండు. నిర్లిప్తుడవై "ఇచ్చట కనిపిస్తున్న దేహములు సత్యము కాదు... ఈ దృశ్యము కూడా సత్యము కాదు... సర్వదా సర్వత్రా సర్వము నందు సర్వులయందు ఆత్మమాత్రమే సత్యము" అని భావించి నిశ్చింతుడవగుము. ఒకప్పుడు నా తండ్రి బ్రహ్మదేవుడు ఈ ఉభయన్యాయముల గురించి హెచ్చరిక చేసియున్నారు. అదంతా ఇప్పుడు నీ ముందు ఉంచాను.

"మీరంతా భీమ-భాస-దృఢ న్యాయమే అనుసరించండి" అని ప్రియ శిష్యుడవగు నిన్ను నిమిత్తంగా చేసుకుని... అమృతానందమే వాస్తవ స్వరూపముగా గల సర్వజనులకు... ప్రతిపాది స్తున్నాను. ఓ ప్రియజనులారా! మీరంతా మహాబుద్ధిమంతులు కావాలి సుమా! సర్వత్రా అసంసక్త బుద్ధి కలిగి వర్తించుటచే "దృఢశోభ" అనే ఐశ్వర్యం లభించగలదు. ఈ సంసారం సుఖ దుఃఖాలచే పరిపూర్ణమై, అనేక జన్మ-కర్మలను నిర్మించి జీవునికి ప్రసాదిస్తోంది. త్రివిధమైన తాపములు అనుభవింపజేస్తోంది.

ఇది సమూలంగా విచ్ఛిన్నం కావాలంటే 'నేను ఆత్మ స్వరూపుడను' అను అవిచ్ఛిన్నమగు సమరసభావన ఒక్కటే ఉపాయం.

❖❖❖

# V. దామవ్యాళకటోపాఖ్యానం : విషయ విచారణ

## (మనస్సు)

### 1. మనస్సు - ఉపశమనము

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఈ మనస్సును గమనిస్తున్నావా? ఇది అత్యంత ఉత్సాహంగా ఉరకలు వేస్తూ విషయములవైపుకే పరుగులు తీయుచున్నది. ఈ సంసారము జీవుని పట్ల విజృంభించటానికి కారణం మనస్సే సుమా! ఫలితమేమిటి? ఈ జీవుడు సమస్త దుఃఖములను, ఆపదలను నిరంతరం పొందుచున్నాడు.

ఇందుకు ఉపాయం మనోనిగ్రహమే అయివున్నది. ఇప్పుడు జ్ఞానము యొక్క సర్వస్వమును ఒక వాక్యంలో చెపుతాను... ఇది విని ధారణను ఆశ్రయించెదవు గాక!

**"భోగేచ్ఛా మాత్రకోబంధః। తత్యాగో మోక్ష ఉచ్యతే"**

విషయభోగములందు ఇచ్ఛ ఏర్పడి ఉండుటయే బంధము. అట్టి ఇచ్ఛను పరిత్యజించుటయే మోక్షము.

అనేక పాఠములచే పని ఏమున్నది? ఈ ఒక్క విషయం ఆచరించు, చాలు. అది ఏమంటే... "ఈ ప్రపంచమున ఏ వస్తువు ప్రీతివంతముగా తోచుచూ ఉంటుందో, అట్టి విషయమును లేక వస్తువును విషమువలె, అగ్ని వలె చూడటం."

మరల మరల విచారణ చేస్తే " ఈ విషయ భోగములు ప్రమాదమునకే, అనగా, దుఃఖము అను అంతిమ ప్రయోజనమునకే దారి తీస్తాయి" అనే విషయం తెలిసిరాగలదు. అందుచేత ముందుగానే అట్టి నిశ్చయమును కలిగియుండుము. భోగవాసనలు త్యజించివేయి. భోగవాసనా త్యాగపూర్వకంగా విషయములు సేవిస్తే, అప్పుడు అవి సుఖప్రదములే అవుతాయి.

ముళ్ళ తీగవిత్తు నుండి ముళ్ళ తీగపొద పుట్టుచున్నది కదా! వాసనాగ్రస్థమగు బుద్ధి నుండి 'రాగము' మొదలైన అనేక దోషములు ఉత్పన్నం అవుతున్నాయి.

ఎవరి బుద్ధి అయితే అట్టి వాసనాజాలంతో తగులుకోకుండా, రాగ, ద్వేష రహితంగా, అచంచలంగా ఉంటున్నదో, అట్టి బుద్ధి మాత్రమే పరమశాంతిని పొందుతోంది. శాంతి మొదలైన శుభగుణసమన్వితము, దుఃఖ ఉద్రేక రహితము, శుభప్రదము అగు బుద్ధి జ్ఞానము వైపు, సమాధివైపు పయనించుచున్నది. ఫలితంగా 'మోక్షము' అనే ఫలమును ఉత్పన్నం చేస్తోంది.

❖

ఓ రామా! ఈ సర్వము 'భావము' నందే ఉదయించటం జరుగుతోంది సుమా! కనుక ఉత్తమ భావనానుసంధానం చేతనే మనస్సు ప్రశాంతత పొందుచున్నది. ఉత్తమ భావములు ఉన్న చోట 'అజ్ఞానం' అనే దట్టమైన మేఘము క్రమంగా నశించగలదు. సౌజన్యము శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధి చెందగలదు. వివేకము సూర్యతేజమువలె ప్రకాశించగలదు. అట్టివాడు ఆత్మవస్తువును పొందుతాడు. ఆత్మ లాభముచే హృదయము నందు ధైర్యము, ప్రశాంతత, పరమానందము వృద్ధి పొందుచున్నాయి. ఆ జీవుడు కృతార్థుడగుచున్నాడు.

ఇట్టి మార్గంలో అత్యంత శోభను కలుగజేయగలిగేది సత్సాంగత్యము. వివేకము వృద్ధి అగుచుండగా ఏకాగ్రత అనుదాని నుండి 'సచ్చిదానందము' అనే శ్రేష్ఠరసము ప్రవహిస్తూ ఉంటుంది. ఆత్మను గురించిన అవగాహన ధృడపడుచుండగా, ఇక అట్టి వాని మనస్సు నిర్ద్వంద్వం, నిష్కామం, ఉపద్రవరహితం అగుచున్నది. క్రమంగా తన చపలత్వమును త్యజిస్తోంది. శోక మోహ భయ వర్జితము అవుతోంది. సంశయరహితమగుచున్నది.

**ఇచ్ఛా దోషరాహిత్యము -** ఓ రాఘవా! "నేను విషయాలను, వైచిత్ర్యములను దర్శించాలి... పొందాలి"... అను ఇచ్ఛను ఈ మనస్సు ఎల్లప్పుడూ కలిగి ఉంటోంది. "నేను ఏదో పొందాలి..." అను భావోద్వేగమును నీ మనస్సు నుండి తొలగించివేయి. అప్పుడు ఈ మోహ కల్పనాజాలమంతా దానంతట అదే తొలగిపోతుంది. ఈ మనస్సు నిర్లిప్తము, ఆశావర్జితముగా చేయాలి. 'ప్రవృత్తి' అనుదాని పట్ల ప్రమేయరాహిత్యము, సంసర్గరాహిత్యము అలవాటు చేయాలి. మానసిక చింతలను "పూర్ణాత్మాऽ హమ్" భావనచే క్రమక్రమంగా జయించివేయాలి. ఈ మనస్సు శోకరహితమై, స్వచ్ఛమై విషయములపట్ల ఆసక్తులను వదలినదై ప్రకాశించునుగాక!

ఎప్పుడైతే ఈ 'మనస్సు' అనునది పలువిధాలైన మనోరథములతో, తృష్ణతో, సంశయాలతో నిండి ఉండటం జరుగుతుందో, ఇక ఆ జీవుని "నేను ఈ దేహమునకు సంబంధించినవాడను" అను రూపమున ఉండే "స్థూలదేహభావము" అనే దయ్యము పట్టుకుంటుంది.

ఈ మనస్సు నుండి స్థూలత్వమును పారద్రోలగలిగావా... ఇక అది ఈశ్వర స్వరూపము అగుచున్నది. అప్పుడు "ప్రత్యగాత్మత్వము" అనబడు జీవన్ముక్తిని సాధించిపెట్టగలదు. అందుచేత ఈ మనస్సును స్వసామర్థ్యము – నిగ్రహము నందు నియమించు. అప్పుడది తనకు ఏ మార్గము దుఃఖభరితమో, ఏ మార్గము అనుసరణీయమో, ఏది 'స్వస్వరూపానందము'ను ప్రసాదించగలదో గ్రహిస్తుంది. క్రమంగా "సాధ్యాసాధ్యములు, స్వపరములు" మొదలగు వికల్పములను త్యజించు చున్నది. అంటే ఆ తరువాత కల్పితమైనట్టి తన రూపాన్ని కూడా తృణప్రాయంగా త్యజించివేస్తుంది.

ఈ మనస్సు నశించేది ఎట్లా? అసలు, మనోనాశనము–అనగా ఏమి?

**మనసోऽభ్యుదయో నాశో మనోనాశోమహోదయః ।**
**జ్ఞ మనోనాశమభ్యేతి మనోऽజ్ఞస్య వివర్ధతీ ॥** (సర్గ 35, శ్లో 18)

మనస్సు విషయాదులందు ప్రవర్తించకుండా ఉన్నదా, వినాశనము పొందుచున్నట్లే. మనో

నాశనమే (మనస్సు యొక్క దృశ్య విషయ రాహిత్యమే) ఆత్మలాభము యొక్క ఉదయము సుమా!

బ్రహ్మజ్ఞాని యొక్క మనస్సు క్రమంగా, పూర్తిగా వినాశనము పొందుచున్నది. (లేక, దృశ్య విషయములన్నిటినీ ఆత్మచమత్కారంగా దర్శిస్తోంది).

అజ్ఞాని యొక్క మనస్సో, సర్వదా వృద్ధియే చెందుతోంది. నాయనా! రామా! ఈ జగచ్చక్రమంతా మనోమాత్రమే అయివున్నది. ఈ పర్వతములు – ఆకాశం – దేవతలు – శత్రువులు – మిత్రులు – ఇదంతా మనస్సే అయివున్నది.

వికల్పములచే దృష్టి-అవగాహన మలినము కాగా, అప్పుడు ఆ చిద్వస్తువుకు సంభవిస్తున్న స్వస్వరూపమునకు సంబంధించిన విస్మరణమే మనస్సు.

ఈ జీవుని సంసారములోకి నెట్టివేయుచున్నట్టి మనస్సే వాసన. వాసనావశం చేత మనస్సులోకి విషయములు ప్రవేశిస్తున్నాయి. అప్పుడు ఆ సమయంలో చిద్వస్తువు పరిచ్ఛిన్నము వలె తోచుచున్నది. వ్యవహారయోగ్యత – సంసర్గము వికల్పములచే మాలిన్యము పొందుచున్నది. అట్టి దోషముతో కూడుకున్న భావన పొందుచున్న బ్రహ్మమే ఈ జీవుడు. ఈ జీవుడు విషయము లందు పడి, వాటిని చిరకాలము అభ్యసించుటచే అభిమానము పొందుచున్నాడు. అజ్ఞత్వము (లేక) స్వస్వరూపవిస్మరణను పొందుచున్నాడు. వికల్పములచే మోహితుడై, సారభూతమగు ఆత్మ సుఖమును పోగొట్టుకొని నిస్సారభూతుడగుచున్నాడు. అప్పుడాతని బాహ్యావిషయాను సంధాన రూపమైనట్టి వ్యతిరిక్త చింతనలే మనస్సు రూపమున కల్పన గావించబడుచున్నాయి.

**ఆత్మ యొక్క రూపమేమిటి? -** శుద్ధమగు ఆత్మ జీవ రూపము కాదు. ఈ శరీర రూపము కూడా కాదు. రక్తమాంసాది రూపము కానే కాదు.

ఈ శరీరాదులన్నీ పరిచ్ఛిన్నములై, జడములై ఉన్నాయి కదా! ఆత్మ సర్వదా ఆకాశము వలె నిర్లిప్తమై, అనిర్వచనీయమై ఉంటోంది. అరటి బోదెను ఛేదించిన అక్కడ దళములు గాక ఇంకేమి ఉంటాయి? ఈ దేహమును విచ్ఛిత్తి చేసినప్పుడు కూడా ఇందు 'రక్తము-మాంసము-బొమికలు" తప్పితే వేరే ఏమీ లభించవు. అట్లాగే, వాస్తవానికి... ఈ భౌతిక దేహము 'జీవుడు' కాదు.

**మనస్సే జీవుడు...! -**

**మనో జీవో నరం విద్ధి తదేవాకారమాగతమ్ ।**
**ఆత్మనాత్మానమాదత్తే స్వవికల్పాత్మకల్పితమ్ ॥** (శ్లో 25, సర్గ 35)

మనస్సే ఆకారం పొందుతోంది. అదే వికల్పములన్నింటినీ పొందుతోంది. అదే మరొకప్పుడు మరల తన యొక్క ఆత్మను తానే గ్రహిస్తోంది. ఆత్మార్పణ యజ్ఞకార్యం నిర్వర్తిస్తోంది.

❖

పట్టుపురుగు తన జాలమును తానే నిర్మించుకుంటూ ఉంటుంది చూచావా? స్వవాసనావశం చేత ఈ జీవుడు తన వికల్పములచే స్వీయబంధము కొరకై జాలమును నిర్మించు

కుంటున్నాడు. భ్రమమయమగు ఈ మనస్సు ఒక దేహమును త్యజించిన తరువాత మరల వేరైన దేశకాలములందు వేరైన దేహమును ధరించుచున్నది. మనస్సు ఏఏ వాసనలు కలిగి ఉంటుందో... వాటిని అనుసరించే, తదనురూపంగానే శరీరములు ఉత్పన్నములగుచున్నాయి. ఒకడు నిదురిస్తున్నాడనుకో... అతడు తన చిత్తములో ఏమేమి కలిగి ఉంటాడో దానిని అనుసరించే స్వప్నమును పొందటం జరుగుతుంది కదా! ఏ విత్తునాటితే, అట్టి చెట్టే వస్తుంది. ముందుముందు వచ్చే దేహములు కూడా అట్లే ప్రాప్తిస్తున్నాయి. ఈ వర్తమాన శరీరము కూడా అట్టిదే.

ఉత్తమ వాసనలు గల చిత్తము ఉత్తరోత్తర మహత్తరరూపమునే పొందబోవుచున్నది. నీచ వాసనలు గల చిత్తము ముందు ముందు నీచ జన్మల యొక్క అనుభవమును పొందబోవుచున్నది.

అందుచేత జీవుడు ఎప్పటికప్పుడు తన సంకల్పాలను, ఆసక్తులను పరిశుద్ధపరచుకుంటూ ఉండాలి. తన మనస్సు యొక్క దోషములేమిటో గమనించుకుంటూ ఉండాలి. శరీరము యొక్క ఆరోగ్యం ఎంతగా అవసరమో, అంతకన్నా ఎక్కువగా ముందుగా ఈ మనస్సుకు సరిఅయిన చికిత్స చేసుకోవాలి. అయ్యో! సృష్టిలో ప్రవేశించియున్న అనేకమంది జీవులు తమ మనస్సుకొరకై చికిత్సను ఆశ్రయించుటలేదు. పైగా ప్రలోభాదులకే ఆశ్రయం ఇస్తున్నారు!

అతి స్వల్పవిషయములైనట్టి స్త్రీ–ధనం–ఇంద్రియానుభవాలు, పేరు ప్రతిష్ఠలు మొదలైన స్వల్పకాల పరిమిత వ్యవహారములకే ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఆత్మ జ్ఞాన విషయంలో అజాగరూకులై ఉంటున్నారు.

"నేను దేనికి సంబంధించినవాడను? దేనికి సంబంధించని వాడను? ఏది అయి ఉన్నాను? ఏది కాకయే ఉన్నాను?..." అని వారు సద్విమర్శ చేయరేం? పిశాచముల గురించి వాసన గల వాడు రాత్రి స్వప్నంలో పిశాచములను చూస్తాడు కదా! క్షుద్రవాసనాయుక్తమగు ఈ చిత్తము నీచత్వమునే పొందుచున్నది. ఒక సరోవరంలోని అతి కాలుష్యముగల జలంలో దుర్వాసనలు ఉండకుండా ఉంటాయా? అతి నిర్మలమగు జలంలో అరుచి ఉంటుందా? మనస్సు మిక్కిలి మలిన మైతే... అది చేసే పనులు వాటి ప్రయోజనాలు దోషపూరితంగానూ, దుఃఖకరంగానూ ఉంటాయి. మనస్సు నైష్కర్మ్యముచే, వాసనారాహిత్యముచే, సమగ్రమగు సమరసభావనచే నిర్మలంగా ఉన్నదనుకో... అప్పుడు దాని కార్యములు, ప్రయోజనములు శుభకరంగానే ఉంటాయి.

**శ్రీరాముడు:** తండ్రీ! ఈ జీవుడు దోషమును గ్రహించి కూడా పూర్వ సంస్కార బలంచేత వాసన, దుఃఖాదులు బలవత్తరముగా పొందటం జరుగుతోంది. మరటువంటప్పుడు అతని గతి ఏమిటి? మీరు చెప్పిన ఔన్నత్యము సుస్థీరీకరించుకోవటం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** చంద్రుడు క్షయిస్తున్నా "నేను మరల పూర్ణుడను కాగలను" అనే ఆశ త్యజించడు కదా! నిర్మల చిత్తుడైనవాడు దారిద్ర్యము మొదలైనవాటిచే పీడింపబడుచున్నప్పటికీ శాంతి, మనః సమాధానరూపకమగు ఉత్తమగతిని విడచిపెట్టడు.

బంధమెవరికి? ముక్తి ఎవరికి?

యథార్థానికి ఇక్కడ బంధముగాని, మోక్షముగాని, లేవు. బంధ, అబంధములయొక్క భావము లేదు. ఇంద్రజాలంలో జరుగుతుంది చూచావా? అట్లాగే మాయయే మిథ్యారూపమున ఉదయించి, లయించుచున్నది.

**సర్వైవ బ్రహ్మసత్తేయ మిత్యేషా పరమార్థతా**
**పరిస్ఫురతి నిఃసారః సంసారోఽ యమసన్మయః** (శ్లో 37, సర్గ 35)

"అంతయు బ్రహ్మము"... అనునదే పరమార్థ సత్యము. ఇక ఈ జగత్తంటావా, ఇది నిస్సారము, అసన్మయము అయి స్ఫురిస్తుంది.

"నేను అంతము (లేక) నాశనము కలవాడను, అల్పుడను" అనే దుష్టభావముచే కలుగు చున్న వికల్పములను ఈ జీవుడు త్యజించాలి. అట్టి స్వల్పత్వము తొలగిపోవాలంటే ఆత్మ భావించ బడాలి. "నేను అనంతుడను. శాశ్వతుడను, అఖండుడను, సర్వకల్పనలు నావే.. అంతే కానీ అవి నేను కాదు" అను రూపముగల నిశ్చయముచే స్వల్పత్వము తనంతటతానే నశించుచున్నది.

ఓయి! జీవుడా! సర్వవ్యాపకము, నిర్మలము, ఆత్మ స్వరూపము అయి ఉన్న నీవు "నేను దేహ మాత్రుడను" అని అనుకొనుటచేతనే అన్ని దుఃఖములు వచ్చి పడుచున్నాయి. ఈ ప్రపంచమంతా స్వవికల్పకల్పితము మాత్రమే సుమా! నీ స్వరూపమునకు నీవే స్వల్పత్వము ఆపాదించుటచే, అట్టి భావనయే సర్వవిధ బంధముగా పరిణమించుచున్నదని గ్రహించు.

వాస్తవానికి "నీవు-నేను-జగత్తు"... మొదలైనదంతా కూడా బంధ మోక్ష రహితము, ద్వైత అద్వైతా వర్జితము అగు బ్రహ్మసత్తయే అయివున్నది. ఇది ఏమాత్రం సందేహింప అవసరం లేని పరమార్థసత్యము. అయితే ఈ జీవుడు ఆ పరమార్థసత్యమును దర్శించుటలేదు. కొందరు ధీరులు, నిర్మలహృదయులు మాత్రం ఈ దృశ్య రూపంతో కూడిన తమ యొక్క మనోబుద్ధి అహంకారాలను పరిశుద్ధం చేసుకుంటున్నారు. ఆయా ప్రయత్నములచే ఆసక్తిరహితులు, అమనస్కులు అగుచున్నారు. అట్టివారు ఈ అధికారదేహముతోనే బ్రహ్మమును దర్శించగలుగు చున్నారు.

తెల్లటి గుడ్డ ఏ రంగునైనా సహజంగా, చక్కగా స్వీకరించగలుగుతుంది కదా!

సమత్వము, సమాధి అభ్యసించుచూరాగా, అప్పుడు 'ధర్మవృద్ధి' అనే నిర్మలజలంలో పరిశుభ్రం కావించబడిన మనస్సు బ్రహ్మసంబంధమగు దృష్టిని అతిశీఘ్రంగా గ్రహించుచున్నది.

**ఆత్మను భావించుచూ బుద్ధిని అధిగమించాలి -** "అంతా ఆత్మయే అయివున్నది"... అను సర్వాత్మకమగు భావనచే "ఇది త్యజించాలి... అది గ్రహించాలి..." అను పట్టుదలతో కూడిన బుద్ధి శమిస్తోంది. ఆపై నీవు ఈ బంధ మోక్షముల దృష్టి కూడా పూర్తిగా పరిత్యజించవచ్చు. అట్టి స్థితిలో ఒక స్వచ్ఛమైన స్ఫటికములో ప్రతిబింబించే దృశ్యములాగా, నీయందు ఈ జగత్తు ప్రతిభాసమాత్రంగా (Merely like a refraction) అనుభవమవుతూ ఉంటుంది. శాస్త్రశ్రవణాదులచే, వైరాగ్యపూర్వకమగు అభ్యాసముచే శుద్ధమొనర్చబడిన బుద్ధిగలవాడు ఈ శరీరమును, శరీరముతో

ఏర్పడుచున్న సంబంధ బాంధవ్యములను, ఈ జగత్తును ఆ విధంగా ప్రతిభాసమాత్రంగా దర్శించగలుగున్నాడు.

చమత్కారం ఏమిటంటే... ఈ మనస్సు పదార్థములతో తదాత్మ్యము పొంది ఏకరూపము పొందుచున్నప్పుడు అట్టి సమయంలో ఆత్మతో సారూప్యము (Oneness) పొందలేకపోతోంది.

**శ్రీరాముడు:** మీరు చెప్పునది వాస్తవమే. మరి మేము ఎప్పటికైనా ఆత్మతో ఏకరూపత్వము పొందగలమంటారా? మేము ఈ సాంసారిక దృష్టులను వదిలించుకునేది ఎట్లా చెప్పండి? స్ఫటికంలో దృశ్యంవలె, ఈ దృశ్యమును స్వస్వరూపాంతర్గతంగా సందర్శించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నాయనా! రామా! ఆధ్యాత్మ క్షేత్రంలో నిరాశ నిస్పృహలకు స్థానం లేదు. "అసత్యదృష్టిని నేను ప్రయత్నబలంచే తప్పక జయించగలను"... అను ఆత్మవిశ్వాసం కలిగి ఉండాలి. ఈ మనస్సు బాహ్యాభ్యంతర దృష్టులన్నింటినీ జయించి, ఆత్మయందు లీనమైనదా... ఇక సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందినట్లే సుమా! అట్లు పొందినవారు అనేకులు ఉన్నారు. కొంచెం వివేకముతో ప్రయత్నం చేస్తూ ఉంటే అది ప్రతి ఒక్కరికి తప్పక సుసాధ్యమే.

❖❖❖

## 2. మనస్సు యొక్క రూప విశ్లేషణము

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ప్రత్యక్షంగా కనిపిస్తున్న ఈ దృశ్యమంతా మిథ్యయే అయివున్నది. అట్టి దృశ్య మయమవటమే మనస్సు యొక్క రూపం. అంతేగాని, మనస్సుకు వేరుగా రూపమంటూ ఏదీ లేదు.

తర్క శాస్త్రమును అనుసరించి... ఏదైనా మొట్టమొదట చిట్టచివరా 'అసత్తే' అయి ఉంటుందనుకో... అది మధ్యలోకూడా అసత్తే. ఈ సిద్ధాంతము ననుసరించి మనస్సు ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకుండా పోవుచున్నది. కనుక, మనస్సు అసద్రూపమే అయివున్నది. మనస్సును అసద్రూపంగా ఎరుగనివానికి తనయందే దుఃఖములన్నీ ప్రాప్తిస్తూ ఉంటాయి సుమా!

మనస్సు ఒకప్పుడు ఉండటం, మరొకప్పుడు లేకపోవటం.... అనుదాని దృష్టాంతం! నిద్రా సమయంలో, పరమోత్కృష్ట మోక్షస్థితిలో ఈ జీవుడు మనోరాహిత్యమును పొందుచున్నాడు కదా! కనుక మనస్సు ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు ఉండనిదే అగుచున్నది.

**అసద్రూపం -** స్వతహాగా అవాస్తవమై, భ్రమ ఉన్నప్పుడు ప్రాప్తించేదేదైతే ఉన్నదో, అది "అసద్రూపము" అను శబ్దముచే చెప్పబడుతోంది.

❖

"ఈ జగత్తంతా ఆత్మస్వరూపమే" అనే ఎరుక (లేక) భావన కలిగియుండకపోతే ఈ దృశ్యము దుఃఖప్రదమే అవుతుంది.

"అంతయు ఆత్మయే"... అను జ్ఞానముచే భోగ మోక్షములు రెండూ పొందబడగలవు.

"జలము వేరు... ఈ తరంగములు వేరు" అనునట్టి వాసనతో కూడిన బుద్ధితో అజ్ఞానము "జలతరంగములు రెండూ కూడా ఒక్కటే"... అనునట్టి ఏకత్వబుద్ధియే జ్ఞానము. ఒక నీటి బొట్టు – నీరు వేరువేరు ఎట్లా అవుతాయి? నీరు...నీటి బొట్లలో, నీటిబొట్టు...నీటిలో ఉండియే ఉన్నాయి.

**శ్రీ రాముడు:** మరి ఈ హేయము (త్యజించవలసినది) ఏమిటి? ఉపాదేయము (స్వీకరించవలసినది) ఏమిటి? ఈ నానాత్వమంతా ఎట్లా ఏర్పడుచున్నది.

**శ్రీ వసిష్ఠమహర్షి:** స్వగతమైన అవగాహన దృష్టిదోషముచే ప్రాప్తిస్తున్న ఈ నానాత్వమంతా స్వతహాగా అసద్రూపమే. అనగా స్వయముగా లేదు. కాని ఉన్నట్లు కనబడుచున్నది. జననమరణ రూపమున గల దుఃఖమంతా భావనను అనుసరించే ప్రాప్తిస్తున్నాయి. ఈ హేయ ఉపాధేయములు అభావించబడినాయనుకో... అప్పుడు శేషించునది ఏమిటి?.... అనంతరూపమగు ఆత్మయే.

'మనస్సు' అనబడునది సంకల్పములచే కల్పించబడినది మాత్రమే. కాబట్టి అసత్తుగాక మరింకేమి? 'అసత్తు' అయిన వస్తువు నశించుటచే ఎవరికి ఏమి నష్టం చెప్పు? స్వప్నంలో కనబడుచున్న పదిమంది మరణిస్తే ఎవరు దేనిని కోల్పోవుచున్నారు?

నీకు ఇప్పుడే పరిచయం అయిన ఒకడు ఉన్నాడనుకో... అతడు నిన్ను, నీవు అతనిని ఉదాసీనంగా, రాగద్వేషరహితంగా చూచుకుంటూ ఉంటారు కదా! అట్లాగే పదార్థ రూపం ఎరిగిన వాడు ఈ పాంచభౌతిక దేహమును అట్టి దేహంతో కల్పించబడుచున్న సంబంధ బాంధవ్యములను అత్యంత ఉదాసీనంగా చూస్తూ ఉంటాడు. ఇక అది ఎరుగనివాడో ఎదురుగా ఉన్నదానిని సత్యము గాను, నిత్యము గాను, ప్రియమైనదాని గాను... మొదలైన ఆయా కల్పనలతో చూస్తూ, తాదాత్మ్యం చెందుచున్నాడు.




**శ్రీరాముడు:** స్వామీ! నా యొక్క ( ఈ జీవుని యొక్క) వాస్తవస్వరూపం అవగతమగుటకు దృష్టాంతపూర్వకమైన విశేషములు చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:**

**తదనేది శివం జ్ఞానం యన్మధ్యం ద్రష్టృదృశ్యయోః**

**తస్మిన్నస్తే మనః శాన్తం పాంసుర్వాయుక్షయే యథా॥** (సర్గ 35, శ్లో 55)

"దృష్ట...దృశ్యము"ల మధ్యగల 'దృక్' రూపమే నీ స్వరూపము అయివున్నది... అని గ్రహించు. ఆ దృక్‌రూపము అనాది, అనంతమగు శివస్వరూపము. అదియే నిరతిశయానంద

కరమగు ఆత్మయొక్క జ్ఞాన స్వరూపం కూడా. వాయువు శమిస్తే ధూళి కూడా శమించినట్లు, ప్రయత్నశీలుడు అగుచున్న వాని యొక్క మనస్సు అధిష్ఠానమగు ఆత్మయందే శమించుచున్నది.

మనస్సు శమించుటచే శరీరాలు కూడా శాంతించుచున్నాయి. అప్పుడు అవిద్యావరణం (లేక) సంసారం అనే మంచు కురియదు. వాసనలు శమించగానే స్వస్వరూపమునందు మనస్సు యొక్క నిలకడ ప్రాప్తిస్తోంది.

అజ్ఞానమే హృదయమునందు 'భయము' అనే మకిలిని పుట్టిస్తోంది. అజ్ఞానము తొలగితే తృష్ణ కూడా తొలగుచున్నది. రాగం మొదలైనవన్నీ సన్నగిల్లుచున్నాయి. ఇంద్రియభావన వెనుకకు మరలుతోంది. మోహం త్యజించబడగా నీవు జాజ్వల్యమానుడవై వెలుగుతూ ఉంటావు. అప్పుడు, దేహమునకు సంబంధించిన క్షుద్రభావముల ఊసుకూడా ఉండదు. సంకల్పములు ఉండవు. నీ యందే నీకు 'ఆత్మస్వరూపము' అను ఆకాశము ప్రత్యక్షముగా స్ఫురించగలదు. "అట్టి మహోదయ సంపన్నుడవగు నీ యొక్క స్వచ్ఛ ప్రకాశమును వర్ణించుటకు వాక్యములు చాలవు".

తృష్ణ త్యజించినట్టివాని హృదయము విమోహమై, వివేకయుక్తమై, పాశ వర్జితమై, తమోగుణ రజోగుణ రహితమై శోభిస్తోంది. చిత్తము పూర్ణవిమలత్వము పొందుతోంది. "ఆత్మజ్ఞానము" అను ఫలమును పొందినట్టి ఆ వివేకి తన సంచారమనే ఈ పృథ్విని పవిత్రం చేస్తున్నాడు. అహంకార రహితమగు అట్టి వానికి ఈ బ్రహ్మాండమంతా ఆత్మప్రకాశయుక్తంగాను, స్వచ్ఛ శీతల ఛాయా సహితంగాను కనబడుతోంది. కనుక నీ యొక్క బుద్ధి విస్తరిల్లుటకొరకు, మనోనిర్మలత్వము కొరకు "కర్మలు నిర్వర్తించుట" అను యజ్ఞమును నిర్వర్తించు.

ఓ రామా! మలినము, చంచలము అయిన 'అహంకారము'ను హృదయము నుండి పార ద్రోలివేయి. మరుక్షణం అపరిచ్ఛిన్నుడు, సర్వవ్యాపకుడు, సర్వేశుడు, వాసనారహితుడు, శాంత చిత్తుడు అగు ఆ ఆత్మదేవుడు నీ హృదయమున స్వయముగా ప్రభువై విరాజిల్లుతాడు.

'తత్త్వవిచారణ'చే 'ఆత్మ' అను జ్యోతి ప్రాప్తించగా, సమస్తదోషములు తొలగిపోతాయి. అట్టి ఆత్మ స్వరూపడగు జీవుడు ఈ జననమరణములలో, ఐహిక పారలౌకిక స్థితులలో ఉద్వేగరహితుడై ఉంటున్నాడు. అతడు స్వదేహనగరంలో తాపత్రయరహితుడై విలాసంగా విహరిస్తున్నాడు.

❖❖❖

## 3. 'చిత్' ఆదిత్యుడు - స్వరూప స్వభావములు

**శ్రీరాముడు:** మహాత్మా! విశ్వమునకు అతీతమైనట్టి ఆ చిదాత్మయందు ఈ ప్రపంచమంతా ఎట్లు స్థితిని పొందియున్నది? నా జ్ఞానాభివృద్ధి కొరకై, ఈ విషయములో, "జ్ఞానుల అవగాహన" ఏమిటో విశదపరచండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ప్రశాంతముగా ఉన్న సముద్రజలంలోనే, తరువాత, తరువాత.... ఉత్పన్నం కాబోయే తరంగాలు, వాటివాటి ఆకారాదులు అభేదపూర్వకంగా ఉన్నాయి కదా! అదే విధంగా ఈ సృష్టి కూడా ఇట్టి సృష్టికి పూర్వము చిదాత్మయందే ఉండి ఉన్నది.

ఆకాశము అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ, తన యొక్క 'సూక్ష్మత్వము' కారణంగా అది కంటికి కనబడకయే ఉంటోంది. అతి సూక్ష్మమగు ఆత్మ కూడా 'సర్వవ్యాపి' అయినప్పటికీ మనస్సుకు అగోచరంగా ఉంటోంది.

నిర్మానుష్యమైన ఒక ప్రదేశంలో ఒక స్ఫటికశిల ఉన్నదనుకో... ఆ శిలయందు ఎదురుగా దూరంగా ఉన్నట్టి దృశ్యము ప్రతిబింబిస్తోంది... అందులో ప్రతిబింబించేదంతా సత్తుగాని అసత్తు గాని (ఉన్నది లేక లేనిది) కాకుండానే అనిర్వచనీయమైయున్నది కదా! ఆ స్ఫటికంలో దృశ్యం లాగానే ఆత్మయందు ఈ సృష్టి ఉన్నది.

ఆకాశమునందు ఆ మేఘములను చూడు... మేఘములు ఉన్నదెక్కడ? ఆకాశమునందే కదా! అట్లు మేఘములకు ఆకాశమే ఆధారభూతమైనప్పటికీ, ఆకాశము మేఘములచే స్పృశించ బడుతోందా? లేదు. ఆ పరాచైతన్యం తనయందున్న ఈ సృష్టులన్నిటికీ ఆధారభూతమై ఉంటోంది. కాని ఈ సృష్టులచే అది ఏమాత్రం స్పృశించబడుటలేదు.

చంద్రుడు, నక్షత్రాలు మొదలైనవి తటాకజలంలో ప్రతిబింబరూపంగా అగుపిస్తూంటాయి కదా! ఈ శరీరమునందు ఉన్నట్టి ఆత్మ ప్రతిబింబరూపమున ఈ రీతిగా వ్యక్తమగుచూ ఉంటుంది.

చిదాత్మ సర్వసంజ్ఞలకు, సంకల్పములకు సంబంధించినది. నాశరహితమైనది. "జీవించుట, విషయాలు" మొదలైన సంజ్ఞలన్నీ చిదాత్మయందే కల్పించబడుచున్నాయి. వేదాలు, ఉపనిషత్తులు, వేదజ్ఞులు ఈ ఆత్మ గురించి చెప్పేటప్పుడు – అది ఆకాశముకంటే అత్యంత స్వచ్ఛమైనది.. నిష్కళంకమైనది... కళాసహితము, కళారహితము కూడా"... అని చెప్పుచున్నారు. అయినా కూడా, వారు ఆత్మను జగత్తుకు అభిన్నమైనదానిగా వర్ణించటం జరుగుతోంది.

❖

సముద్రంలో తరంగాలను చూడు. వేరు వేరు తరంగాలు వేరువేరుగా గోచరిస్తూ ఉంటాయి. కాని అవన్నీ జలమే కదా! జలము కంటే అధికంగా తరంగములలో ఇంకేమున్నది? 'చైతన్యము అనే మహాసముద్రంలో 'నీది, నాది' అను రూపమున అనేకత్వము స్ఫురించవచ్చు గాక! అయిన ప్పటికీ చైతన్యమునకు భిన్నంగా ఈ ప్రపంచమున ఏదీ ప్రకాశించుటలేదు. ఏదీ లేదు కూడా...! ఈ చైతన్యము ఏదైనా విషయమును అనుభవించుచున్నప్పుడు, అది వాస్తవానికి తన యందే, తన రూపమునే అట్లు అనుభవించుట జరుగుచున్నది.

చైతన్యము సర్వదా ఆత్మ స్వరూపముననే స్థితి కలిగి ఉంటున్నది. అజ్ఞులు మాత్రమే "ఈ జగత్తు ఆత్మకంటే వేరు" అను అభిప్రాయమును కలిగి ఉంటున్నారు.

జ్ఞానుల దృష్టికి... మిథ్యా స్వభావముగల ప్రపంచము ద్రష్టయొక్క కల్పనయే అయి వున్నది. "కల్పన" అనునది ఆ కల్పనచేయువాని చమత్కార వ్యవహారమే అయినట్లు, ఈజగత్తు ఆత్మకు అభిన్నమై, ఆత్మయొక్క చమత్కార వ్యవహారమై వెలయుచున్నది.

– చైతన్యము సర్వదా కేవల ప్రకాశస్వరూపమైనది.
– చైతన్యము స్వభావానుసారమే సూర్య, చంద్రులను ప్రకాశింపజేస్తోంది. స్వభావంగానే ఈ జీవుల జన్మ మరణాది కర్మలకు కారణమై ఒప్పుచున్నది.
– ఇది ఎప్పుడూ నశించదు. ఉత్పన్నమవదు.
– లేవదు. కూర్చోదు. వచ్చుట లేదు. పోవుటలేదు.
– దానికి 'ఈ స్థానము, ఆ స్థానము' అనునది ఉండదు.
– అది సర్వత్రా వ్యాపించి, ఏకరూపమై యున్నది.

❖

నిత్యనిర్మలమగు చైతన్యము (లేక ఆత్మ, లేక బ్రహ్మము) సర్వదా తన స్వరూపముననే వ్యవస్థితమైయున్నది...! ఉదాహరణకు జీవుడు ఎట్టి భావాదులను పొందుచున్నప్పటికీ తనను తాను త్యజిస్తున్నాడా? లేదు కదా! ఈ చైతన్యము తన సత్యస్వరూపము దృష్ట్యా మార్పు చేర్పులు లేకయే ఉంటోంది. కాని, ఒకడు త్రాడునందు పామును చూస్తున్నట్లు ఈ ప్రపంచరూపమున వివర్తభాగము మాత్రం పొందుచున్నది. అగ్ని 'తేజస్సు' రూపమున జలం 'ప్రవాహం' రూపమున స్ఫురిస్తోంది చూచావా? అట్లే, చైతన్యము సృష్టి విలాసరూపమున స్ఫురిస్తోంది.

చిదాత్మ 'సృష్టి రచన' అను స్వభావముతో కూడుకొనినదై ఉంటోంది. అదే సమయంలో, సర్వవ్యాపి కూడా అయి ఉంటోంది. స్వప్నద్రష్ట 'స్వప్నమును రచించుట' అను చమత్కారమును కలిగియుండి, స్వప్నంలో "సర్వవ్యాపి" అయి ఉన్నాడు కదా! ఇదికూడా అట్లే!

యథార్థానికి చిదాత్మ ప్రకాశమయమే... కాని వ్యవహారదృష్ట్యా అప్రకాశమయంగా తోచుచున్నది. అది నిత్య నిర్మలము, సంశయరహితమూ అయినప్పటికీ.. దృశ్యములో తారసపడే కార్య కారణముల దృష్ట్యా సంశయసహితము అగుచున్నది. అవిద్యాకారణం చేత అవిద్య యందు కృత్రిమ రూపముగా ప్రతిబింబించుచున్నది. అట్లు ప్రతిబింబించుచున్నప్పుడు తన యొక్క అనంత రూపమును ఏమరచుచున్నది. అంత మాత్రమే గాని, అది తన అనంతత్వమును ఏ మాత్రం కోల్పోవుట లేదు. 'అహంభావము' అను స్వల్పత్వమును మననరూపముగా పరిగ్రహించి, క్రమంగా 'జీవత్వప్రాప్తి'ని పొందుచున్నది. పదార్థముల పట్ల అనేకత్వము దృఢపడగా ఈ ప్రపంచ కల్పన మంతా అనుభవించుచున్నది. 'ఇది కలదు, ఇది లేదు, ఇది కావలెను, ఇది తొలగవలెను, ఇది ఇట్లు ఉండవలెను, అది అట్లా ఎందుకుండాలి...." అనునట్టి ఇష్ట, అనిష్టములను, స్వీకార – తిరస్కారమును పొందుచున్నది. దీనినే 'దేహాత్మభావము' అని అంటున్నాం. ఈ చిదాత్మ అనేకాలైన విహితకర్మలు, నిషిద్ధకర్మలు అనేక శారీరక మానసిక క్రియలు మొదలైనవాటి ద్వారా ఈ ప్రపంచ మంతటినీ తన యొక్క 'భోగ్యవస్తువు'గా పొందుచున్నది. కాని, చిదాత్మ ఏదీ ఒనర్చుట లేదు.

ఆహాఁ! చైతన్యము యొక్క మహిమ చూచావా? అదియే తనయందు స్వయముగా 'జగత్తు' అను అంకురరూపముగా ఉన్నతిని పొందుచూ కూడా, స్వస్వరూపస్థితి త్యజించకయే ఉంటోంది.

అదియే ఈ రూపవంతములైన పదార్థములు ఏర్పడి ఉండటానికి వీలుగా రూపరహితము, అమూర్తివంతము అగు ఆకాశము యొక్క కల్పనను అంగీకరిస్తోంది.

అది 'ఇచ్ఛ' భావనలు పొందకపోతే ఈ 'జగత్తు' అనబడేదే వృద్ధి పొంది ఉండేది కాదు. జగత్తు అనే అంకురమును చైతన్యమే తనయొక్క ప్రకాశముచే, స్పందనచే పెంచి పరిపోషించు చున్నది. చైతన్యమే వాస్తవస్వరూపముగా గల ఓ రామా! చైతన్యమే సర్వదా సర్వమునకు కారణమని గ్రహించు.

❖

ఈ 'జగత్తు' అనుదానిని పృథ్వీధర్మం చేతను, అగ్నిధర్మం చేతను, వాయుధర్మం చేతను, జల ధర్మం చేతను పరిపోషించుచున్నది చైతన్య రూపమగు చిదాత్మయే. "కాలము యొక్క కల్పన, సూర్యకిరణతత్వము, ధాన్యముల ఉత్పత్తి"... ఇవన్నీ కూడా చైతన్యము యొక్క ప్రభావమే. అదే పుష్పాలలో 'గంధం' గాను, మట్టిలో రసరూపంగాను, వృక్షంలో ఫలత్వం గాను ప్రవర్తిస్తోంది.

ఈ జగత్తులో సర్వవస్తువుల రూపమున చైతన్యము సుప్రకటితమగుచున్నది.

వసంతకాలంలో పుష్పములందలి పుప్పొడి, గ్రీష్మకాలమునందలి సూర్యతేజోవిభవము, వర్షాకాలంలో నీలమేఘ ప్రదర్శనము, శరదృతువులో ఫలదీకరణము, హేమంతంలో మంచు, శిశిర ఋతువులో శీతలవాయువులు... అంతా కూడా చైతన్యము యొక్క విభవములే సుమా!

ఓ రామచంద్రా! కాలం ఎప్పుడైనా "దినం–సంవత్సరం–యుగం" అను రూపమున గల తన యొక్క నియతిని త్యజిస్తోందా? లేదు కదా! నదులలో తరంగముల రూపమున జలం నిరంతరం ప్రవహిస్తూనే ఉన్నది కదా! అదే విధంగా సృష్టి సమూహములన్నీ గమనశీలము కలిగి ఉంటున్నాయి. ఈ "బ్రహ్మాండముల ఆవిర్భావం – తిరోభావం" అనే నియతి ఇట్లే వర్తించుచున్నది. అనంత సంఖ్యలో జీవరాసులు వచ్చి, ఉండి, పోవుచున్న ఈ పృథివి ఇట్లే నియతిని అనుసరించి 'ప్రళయము' వరకు స్థితి కలిగి ఉంటోంది. పదునాలుగు భువనములందూ పదునాలుగు జీవ జాతులు, అనేకములైన ఆచార విచారములు, వివిధ వేష భాషలు ఉంటున్నాయి... వ్యష్టి జీవుల దృష్ట్యా అనుక్షణం ఉత్పత్తి విలయములు ఏర్పడుచూనే ఉన్నాయి.

ఇదంతా చైతన్యము యొక్క విలాసమే. అయితే తత్త్వజ్ఞానికి ఈ జనన మరణ ప్రవాహమంతా లేనిదిగానే కానవచ్చుచున్నది.

❖

ఇక్కడ దీనులగు అనేకమంది జనులు పూర్వజన్మలకు సంబంధించిన సంకల్ప వాసనాదు లచే వివిధములైన మనోరథములను చేపట్టుచున్నారు. అంతేగాని, వారు స్వస్వరూపమును విచారించుటలేదు. స్వస్వరూపము పట్ల దట్టముగా ఏర్పడిన అజ్ఞానవశంచేత మోహముతో కూడి ఏర్పడిన 'ఉన్మత్తత' కలవారై ఈ లోకమున జన్మిస్తున్నారు, మరణిస్తున్నారు. మరల పర లోకములకు వెళ్లుచున్నారు. ఇంతలో 'స్థావరము' మొదలైన మహానిద్రాపరవశములగు స్థితులను

పొందుచున్నారు. భోగముల పట్ల గల అభిలాష కారణంగా ఐహిక పారలౌకికములైన శ్రమతో కూడిన అనేక ధర్మ అధర్మములను స్వీకరిస్తున్నారు. ఏవేవో పురుషార్థములు వారిని స్పృశిస్తున్నాయి పోతున్నాయి. ఈ జనన మరణాల ద్వారా అవిశ్రాంతంగా సంసారంలో పరిభ్రమిస్తున్నారు.

❖❖❖

# 4. విముక్తి

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామా! ఈ విధంగా స్థిరాకృతిగా కనిపిస్తున్న ఈ బ్రహ్మాండ సమూహములన్నీ బ్రహ్మమునందే మరల మరల ఉద్భవించి, లయిస్తున్నాయి. పరస్పర కారణ భావము (ఒకదానికి మరొకటి కారణం అయినట్లు భావము పొందుట) కలిగి ఉంటున్న ఈ జగత్తులన్నీ తమ అధిష్ఠానమైనట్టి చైతన్యమునందే ప్రకటితమగుచున్నాయి. పూర్ణభావన యొక్క ప్రభావంచే లయించుచున్నాయి.

లోతైన తటాకంలో అడుగున ప్రవహిస్తున్న జలము యొక్క చలనము బాహ్యమునకు కనబడదు కదా! "సత్-అసత్" రూపమున చైతన్యమే అన్నివైపులా, అంతటా ప్రకాశించు చున్నప్పటికీ, అది వ్యక్తము కాకుండానే ఉంటోంది. 'ఎండవేడిమి' కారణంగా మృగతృష్ణ ఏర్పడుతోంది. అందులో జలము ఉన్నట్లు దాహముతో ఉన్న మృగములకు తోచుచూ ఉంటోంది. అట్లే చిదాత్మయందు ఈ సృష్టులన్నీ గోచరిస్తున్నాయి. చిత్‌సారము అయినట్టి చిదాత్మయే 'ఇచ్ఛ-భ్రమ'ల వశంచేత తనను తాను అన్యవిధంగాను, అచిత్తుగాను గాంచుచున్నది.

**జగత్తు ఉన్నదా? లేదా? -** ఈ జగత్తు సత్తు కాదు. అసత్తు కూడా కాదు. ఇది చైతన్యము నందు స్థితి కలిగియుండలేదు. చైతన్యమునకు వేరుగా ఈ జగత్తు లేదు. ఒక దృష్టాంతము చెపుతాను. బంగారపు ఆభరణము ఉన్నది... అందులో ఆభరణము బంగారము కంటే వేరుగా ఉన్నదా? ఆభరణమంతా నిండియున్నది బంగారమే కదా! మరి "ఇది గొలుసు - ఇది ఉంగరము" అను వేరు వేరు ఆకారములు, నామరూపముల మాట ఏమిటి? ఉంగరము - గొలుసు ఒక్కటేనా? వేరువేరా? 1."రెండింటిలోను ఉన్నది బంగారమే కనుక రెండూ ఒక్కటే"; 2. "వేరు వేరు నామములు, ఉపయోగములు ఉన్నాయి కనుక రెండూ వేరువేరు"... అను రెండు అభిప్రాయముల వేరు వేరు దృష్టులచే అంగీకారమే అవుతాయి. బంగారమునందు ఆభరణములు అనునది భిన్న, అభిన్నముగా ఉంటున్నట్లే, బ్రహ్మమునందు 'నేను, నీవు' మొదలైన వ్యవహారమంతా మాయా దృష్టికి ప్రదర్శితం అవుతోంది. అందుచేత ఈ జగత్స్వరూపమంతా అనిర్వచనీయమై ఒప్పుచున్నది.

దేనిచే నీవు శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములను ఎరుగుచున్నావో అట్టి ఆత్మయే సర్వత్రా వ్యాపించియున్నది.

సర్వవ్యాప్తి, నిర్మలము అగు ఆత్మయందు ఏకత్వమేమిటి? అనేకత్వమేమిటి? రెండూ లేవు. ఉన్నట్లు ఉంటే, 'అది అవిద్యచేతనే' అని గ్రహించబడుగాక! యథార్థానికి ఆ పరమాత్మయందు

'మరొక కల్పన' అంటూ ఏదీ లేదు. ఇక ఈ పదార్థముల పట్ల ఏర్పడుచున్న భావాభావములు, శుభాశుభములు విషయమేమిటంటావా?... ఇవన్నీ వాసనావశంచేతనే కల్పించబడుచున్నాయి.

తత్త్వ దృష్టిచే సర్వము ఆత్మయే. కనుక ఆత్మయందే అంతా కల్పించబడుతోంది. అట్టి కల్పనయే జగదనుభవంగా ఆత్మచే పొందబడుతోంది.

**ఆత్మకు అన్యమైనదేది? -** ఓ సర్వజనులారా! ఆత్మకంటే వేరుగా ఎక్కడైనా, ఎప్పుడైనా ఏదైనా పదార్థము ఉంటే, దానియందు కోర్కె ఉండటం సహజమే అవుతుంది. తనకు అన్యముగా ఏ పదార్థం సంభవించుటకే వీలులేనప్పుడు ఆత్మదేనిని ఇచ్ఛగిస్తుంది? దేనిని ద్వేషిస్తుంది? ఆత్మకు ఇచ్ఛా ద్వేషములు కృత్రిమము, అజ్ఞాతకల్పితము మాత్రమే గాని, సహజం మాత్రం కాదు. సర్వం 'తానే' అయి ఉండగా అది దేనిని స్మరిస్తుంది? దేనిని విస్మరిస్తుంది? దేనిని నిర్మిస్తుంది? దేనిని త్యజిస్తుంది? ఏ భవిష్యత్తు ఫలం కొరకు ప్రవృత్తమౌతుంది? కనుక "ఈ సృష్టి మొదలైనదంతా ఆత్మ యందు అవిద్యచేతనే కల్పించబడుచున్నది" అని గ్రహించండి. "ఇష్టము, అనిష్టము"... మొదలైన వికల్పములన్నీ ఆత్మను స్పృశించవు. 'ఇచ్ఛ' యొక్క అవాస్తవికత గ్రహించబడగా, కర్త-క్రియ -కర్మముల ఏకత్వము సంభవించుచున్నది. అప్పుడు "ఆత్మ ఏమీ చేయునది కాదు"... అని గ్రహించబడుచున్నది.

ఆత్మ దేనికీ ఆధారము కాదు. అది దేనిపైనా ఆధారపడి ఉండదు. కనుక "దానికి ఆధారం గాని ఆధేయము గాని లేవు" అని ప్రకటించబడుచున్నది. దానికి ఆశ్రయమంటూ ఏదీ లేదు. ద్వితీయ కల్పనయే ఆత్మయందు అసంభవం కనుక, అది దేనికీ ఆశ్రయం కూడా కాదు. ఇచ్ఛా రహితమగు ఆత్మయందు సకర్మత్వం (A sense of being a DOER) గాని, నైష్కర్మ్యత్వం (A sense of being a NON-DOER) గాని లేవు. ఆత్మకు భిన్నముగా సాఫల్యము ఒనగూర్చు కల్పనయే మరొకటి లేదు. అట్టి కల్పనను చూస్తున్న ఇంకెవరో మరొకరు లేరు. కనుక నీవు సమస్త సంతాప జ్వరముల నుండి విముక్తుడవు కమ్ము. విముక్తుడవై, ఆపై ఏది ఎట్లు చేయవలయునో ఇప్పటి వలెనే యథాతథముగా నిర్వర్తిస్తూ ఉండు. ద్వంద్వాతీతుడవై కర్తృత్వములోని అకర్తృత్వమును దర్శించు.

ఓ రామచంద్రా! "ఇది నేను చేయుచున్నాను" అను కర్తృత్వాభిమానముచే నీవు పొందునదేమిటో చెప్పు? ఈ దృశ్యమంతా భౌతిక పదార్థమయము కాకుండా మరింకేదీ ఎక్కడా లేదు కదా! కాబట్టి కర్తృత్వాభిమానమంతా త్యజించి నిశ్చింతుడవై ఉండవచ్చు సుమా! స్వస్వరూపమగు వాస్తవతత్త్వానకు అకర్తృత్వమే సహజమగుచున్నది. కాని కర్తృత్వాభిమానం కాదు.

అందుచేత, సర్వమునకు 'అకర్త'వు అగుము. వాయువుచే చలింపబడని సముద్రంలాగా, మేఘరహితమగు ఆకాశంలాగా, కడుపునిండుగా ఆహారం తిని సరోవర జలం త్రాగి తిరిగివస్తున్న సింహంలాగా స్వస్థుడవు, నిర్మలుడవు, గంభీరస్వభావుడగు, మౌనశీలుడవు అయివుండుము. హృదయమును పదార్థరహితం చేయి. "ఇది నేను చేశానే...? ఇది చేయలేకపోయానే...?" అను తలపులన్నీ ఆత్మత్వము నందు లయింపజేసి వేయుము.

ఆత్మయే అయివున్న నీవు... ఆత్మ స్వభావుడవై.. ఆత్మలో నిలకడ కలిగియుండుటలో కష్టమేమున్నది?

**శ్రీరాముడు:** మహర్షీ! ఏ సాధనములచే అపరిచ్ఛిన్నమగు సుఖము, పూర్ణకామత్వము సిద్ధిస్తాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అందుకు సాధనం, మార్గం, లక్ష్యం కూడా "ఆత్మయందు సుస్థిరుడవగుట"... అయి ఉన్నది. అట్టి స్వస్వరూపమునందలి "సుస్థిరము"లోని సుఖప్రాప్తి... ఇక అనేక ప్రయత్నములచేత గాని, అనేక లోకములలో పరిభ్రమించుటచేత గాని ఈ జీవునకు లభించేది కాదు. అందుకు మార్గం ఇప్పటికిప్పుడు స్వస్వరూపము గురించి విచారణ చేయటమే.

కనుక నీ స్వస్వరూపమును స్వబుద్ధితో విచారించుము. బాహ్య పదార్థములవైపు పరుగులు తీయు నీ దృష్టిని నిరోధించి, ఆత్మవైపు మళ్ళించు. "అంతయు ఆత్మయే కదా!" అను పరిగ్రహణము కలిగియుండుము.

యథార్థానికి నీవు సర్వప్రపంచ మిత్రుడవు. పరమార్థదృష్టిచే సర్వదా పూర్ణుడవే అయి ఉన్నావు. సుఖస్వరూపమగు చిదాత్మవే నీవు. అంతే గాని తుచ్ఛమగు ఈ శరీరమనోబుద్ధులు నీవు కావు.

ఓ సర్వజనులారా! మీలోని ప్రతి ఒక్కరియొక్క వాస్తవ స్వరూపము అట్టిదే సుమా!

❖❖❖

# 5. అనాసక్తబుద్ధి

**శ్రీరాముడు:** హే మహాత్మా! జ్ఞానులకు కూడా కర్తృత్వములు, స్వీకరించవలసినవి, త్యజించ వలసినవి మొదలైనవి ఉంటాయంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఏదో ఒక కర్మ నిర్వర్తించనివారంటూ ఎక్కడైనా ఉంటారా? ఉండరు. జ్ఞానులు లౌకికమైన కర్మ చేయవచ్చు లేక చేయకుండవచ్చు. ఏది ఏమైనా "ఇది నేను చూస్తున్నాను... లేక... ఇది నేను త్యజించుచున్నాను.... చేయుటలేదు" అను కర్తృత్వాభిమానం ఏ మాత్రం ఉండదు. వారిలో కొందరు సుఖభోగఫలములను పొందవలసి ఉండవచ్చు..., లేక సాధన భూతములగు ఆయా కర్మలందు నియమితులై ఉండవచ్చు..., లేదా, సమాధి యొక్క వేరు వేరు భూమికలలోని ఒకదాని యందు ఉండి ఉండవచ్చు. ఏది ఏమైనా "దీనికి నేను కర్తను... ఇది నాకు సంబంధించినది"... అను ఉద్వేగం ఏమాత్రం వారియందు ఉండదు. వ్యవహారరీత్యా ప్రవర్తించినప్పటికీ వారు ప్రకటించు కర్తృత్వము వ్యవహార సానుకూల్యమునకు సంబంధించినదే గాని, అభిమానమునకు సంబంధించినది కాదు. కాని అజ్ఞానుల వ్యవహారం మాత్రం అందుకు వేరుగా ఉంటుంది.

**శ్రీరాముడు:** జ్ఞానులకు కర్తృత్వమే ఉండదని అంటున్నాం కదా. కానీ వారు కూడా తదితరులవలెనే కర్మలు నిర్వర్తిస్తూనే ఉంటారు కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** జ్ఞానులలో గోచరించే అకర్తృత్వము గురించి అజ్ఞానులలో ఉంటున్న కర్మబంధము గురించి కొన్ని విశేషాలు తెలియజేస్తాను. విను.

ఏ క్రియ అయితే ఈ జీవుని అంతకరణంలో "నేను చేయుచున్నాను... దీని కర్త (లేక) కర్మ నాకు సంబంధించినవే" అను మనోవృత్తి 'నిశ్చయము'తో కూడినదై జీవునియందు ఉంటుందో, అట్టి కర్మకు మాత్రమే అతడు కర్తృత్వము పొంది ఉంటున్నాడు. అనగా "నేను దీనికి కారణమగుచున్నాను"... అను రూపముగల ఉపాదేయబుద్ధి ఉంటేనే కర్మ ఉన్నట్లు. దీనినే 'వాసన' అని కూడా అంటున్నాం.

ఈ మనుజుడు వాసనలను అనుసరించే ఆయా క్రియలను ఒనర్చుచున్నాడు. క్రియలను అనుసరించే 'ఫలభోగానుభవం' సంభవమగుచున్నది.




క్రియలను అనుసరించే అందు ఇచ్ఛ తోడగుచుండగా ఫలభోక్తృత్వము (నేను ఈ కర్మఫలమును అనుభవించెదను గాక... అను భావన) ఏర్పడుచున్నది.

వాసనలను అనుసరించే మనుజుడు క్రియలను ఒనర్చుచున్నాడు.

**వాసనల ప్రభావం -** ఒకడు ఈ స్థూల ఇంద్రియములచే కర్మలు చేయవచ్చు... చేయకపోవచ్చు. అతడు ఎట్టి వాసనలు కలిగి ఉంటాడో... అట్టి వాసనలను అనుసరించే అతని మనస్సు స్వర్గ-నరకములందు సుఖ - దుఃఖములను అనుభవించటం జరుగుతోంది.

ఒకడు కర్మలు చేసినా, చేయకపోయినా... అతడు 'ఆసక్తి' కలిగి ఉంటే మాత్రం అతనికి కర్తృత్వము కలుగుచూనే ఉంటుంది.

**తత్వజ్ఞానికో...? -** తత్వజ్ఞానికి వాసనలు ఉండుటలేదు. కనుక కర్మలపట్ల ఆసక్తి ఉండుటలేదు. ఆసక్తి లేనిచోట కర్తృత్వము కూడా ఉండదు.

ఆసక్తి, వాసనలు, కర్తృత్వము, ఈ మూడూ అవినాభావ సంబంధం కలిగి ఉంటున్నాయి.

తత్వజ్ఞాని కర్మలు చేస్తున్నప్పటికీ... ఫలానుసంధానం చేయడు. ఆసక్తిని హృదయంలో ప్రవేశింపనీయకుండా, కేవలం శరీరచేష్టామాత్రంగా ఆయా కర్మలు గావించుచున్నాడు. ఏవైనా ఫలములు ప్రాప్తిస్తున్నప్పుడు "ఇవి నాకు సుఖకరములు... లేక దుఃఖకరములు"... అను

కల్పనను అతడు ఆశ్రయించుటలేదు. 'అంతయు ఆత్మయే కదా...." అను ఎరుకను అతడు కలిగి ఉంటున్నాడు. కర్మలు ఆచరిస్తూ కూడా అతడు వాటియందు నిమగ్నచిత్తుడు అగుటలేదు.

**మనోయత్కరోతి... తత్కృతంభవతి, యున్న కరోతి...**
**తన్నకృతంభవతి అతో మనయేవకర్తృ... న దేహః ॥**

ఓ రామచంద్రా! మరల చెప్పుచున్నాను. ఈ జగత్తులో ఎవడైనా మనస్సుతో చేసినది మాత్రమే 'చేయబడినది' అగుచున్నది. మనస్సుతో చేయబడనిది... "చేయబడనిది" గానే ఉంటోంది.

కాబట్టి మనస్సే సర్వకర్మల యొక్క 'కర్త'. అంతేగాని, ఈ దేహము దేనికీ కర్త కాదు.

**చిత్తాదేవాయం సంసార ఆగతశ్చిత్తమయ ఏవ ।**
**చిత్తమాత్రం చిత్త ఏవ స్థిత ఇతీ విజ్ఞాతమ్ ॥** (సర్గ 38, శ్లో 8)

ఈ ప్రపంచమంతా మనస్సునందే ఆవిర్భవిస్తోంది. మనోమయం, మనోమాత్రం ఈ ప్రపంచమంతా. మనస్సునందే స్థితి కలిగి ఉంటోంది. కనుక ఈ కనబడేదంతా నీయొక్క చిత్తమే కాని మరింకేమీ కాదు. ఈ విషయం మనం ఇంతకుముందు నిర్ధారించుకున్నాం కదా!

❖

సర్వవిషయములు, సర్వవిషయ వృత్తులు శమించాయనుకో... లేక, సర్వవృత్తులు సద్వాసనలతో ('సత్' కు సంబంధించిన భావనలతో) నిండియున్నాయనుకో... అప్పుడు అనుభవ మగుచూ ఉండేది ఏది? సర్వవిధ వృత్తులకు స్థానభూతమైయున్న జీవచైతన్యమే కదా! 'ఎండలు' తీవ్రంగా ఉన్నప్పుడు మృగతృష్ణ యొక్క భ్రమ ఏర్పడుతోంది. మేఘాలు వచ్చి, వర్షించాయనుకో... ఇక మృగతృష్ణా జలమెక్కడ? ఆ జలము పట్ల ఆసక్తి ఏమి ఉంటుంది?

ఆత్మ జ్ఞానము పొందిన మనస్సు పరమశాంతినే పొందుతోంది.

**శ్రీరాముడు:** అప్పటి వారి మనస్సు యొక్క రూపం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ప్రచండ సూర్యతేజస్సులో మంచుగడ్డ కరిగిపోవుచుండగా, ఆ మంచుగడ్డ యొక్క దృశ్యాకారం ఏమౌతుంది? హరించుకుపోతుంది కదా! మనస్సు కూడా 'తురీయస్థితి" యొక్క ప్రాప్తిచే బ్రహ్మరూపమే అగుచున్నది.

**మూర్ఖుని మనస్సు** - మూర్ఖమగు దున్నపోతు బురదలో ప్రవేశించి, అందులో ఇరుక్కుంటుంది. మూర్ఖుడగు అజ్ఞానియొక్క మనస్సు కూడా స్వల్ప అశాశ్వత విషయములందు తగుల్కొంటోంది. విషయ భోగభూములనే అవలోకించుచున్నది గాని, తత్స్వరూపమగు ఆత్మను గాంచుటనే లేదు. జ్ఞానియొక్క మనస్సో... వాసనామయమగు క్రియలందు తగుల్కొనుటలేదు.

**ఏది మనస్సుచే పొందబడిందో... అది మాత్రమే పొందబడినట్లు -** ఒకడు మనస్సుతో పొందినదే 'పొందబడినది' అగుచున్నది. మనస్సుచే స్వీకరించబడనప్పుడు, అతడు అద్దానిని పొందనట్లే

అగుచున్నది. శరీరముచే పొంది, మనస్సుచే పొందబడనప్పుడు "అది ఆ జీవుడు పొందుట లేదు"... అని సిద్ధాంతీకరించబడుచున్నది.

ఇందుకు ఒక దృష్టాంతము చెపుతాను, విను.

**ఒకడు -** ఒక సుఖప్రదమైన 'శయ్య'పై చక్కగా నిదురించుచున్నాడు. ఒక గోతిలో పడిపోతున్నట్లు స్వప్నము పొందుచున్నాడు. అతడు "నేను గోతిలో పడిపోతున్నాను... నన్ను రక్షించండి" అని కేకలు వేస్తున్నాడు. ముచ్చెమటలు పోస్తున్నాయి. పెదవులు వణుకుచున్నాయి. చూచావా, రామా! అతడు సుఖంగా పరుపుపై ప్రశాంతమైన ముద్రలో భౌతికంగా ఉండి ఉన్నప్పటికీ, అతని మనస్సు మాత్రం బీభత్సములగు అనుభవములను పొందుతోంది. కనుక, అతడు గోతిలో పడుచున్నవాడే అగుచున్నాడు.

**మరొకని విషయానికి వద్దాం -** అతడు పరమశాంతచిత్తుడు. "ఆత్మా౽హమ్" అను ఎరుక గలవాడు. అనేక స్వప్రయత్నముల ఔన్నత్యముచే, జ్ఞానవిషయమై సద్గురువుల వద్ద వినియున్న విశేషముల ప్రభావంచేత పూర్ణమగు 'శాంతి' అను శమస్థితిని పొందియున్నాడు... ఒకరోజు అతడు ఒక పెద్ద గుంటలోకి జారిపడుచున్నాడు. అయినప్పటికీ "నేను అఖండము, శరీరాదులకు అతీతము అగు ఆత్మనే కదా! నాకు శరీరముల రాకపోకలు బాహ్యస్థమైన వ్యవహారమే. కనుక నేను ఏ మార్పు చేర్పులు లేనట్టి నిత్యోదితమగు పరబ్రహ్మమును"... అను దృఢ భావనను ఆశ్రయించి ఉన్నాడు...

అతడు 'నేను సుస్థిరుడనే' అను భావనయే పొందుచున్నాడు. అందుచేత శరీరం యొక్క పతనం ఆతడు పొందకయే ఉన్నాడు. చూచావా! అతడి మనస్సు పతనంతో ఏకత్వం పొందకుండుటచేత అతనికి అనుభవము లేకయే ఉంటోంది. దీనిని బట్టి మనకు తెలియున దేమిటి?

మొదటివాడు గోతిలో పడనప్పటికీ, పడుచున్నట్లు అనుభవాన్ని మాత్రం పొందుచున్నాడు కనుక, కర్తృత్వము, భోకృత్వము తెచ్చిపెట్టుకొని అనుభవిస్తున్నాడు. రెండవవాడు పడుచున్నప్పటికీ అకర్తయే అగుచున్నాడు. ఈ చిత్తము ఏ విధంగా ఉంటే, పురుషుడు అట్లాగే ఉంటాడు సుమా!

❖

**ప్రియ, అప్రియములు ... సుఖ దుఃఖములు -** ఓ రాఘవా! నీవు కర్మలు చేస్తూ ఉండవచ్చు... లేక, చేయకుండా ఉండవచ్చు గాక! నీ చిత్తం మాత్రం ఆ కర్మలలో ప్రియం, అప్రియం, కర్తృత్వం, భోక్తృత్వముల రూపమున మగ్నంకాకుండా చూచుకో! ఎందుచేతనంటావా? ఈ జగత్తులో ఆత్మతత్వం ఒక్కటి తప్ప మరింకేపదార్థము సత్యము కాదు. మరి ఈ చిత్తము ఎందులోనైనా ఆసక్తిగొనవలసిన పనేమున్నది? తద్వారా లభించేదేమున్నది? ఈ జగత్తు, దీనియందు అంతర్గతమై యున్న సర్వ పదార్థములు... ఇవన్నీ కూడా శుద్ధ చైతన్యము యొక్క 'అభాస' (illusion) మాత్రమే సుమా!

జ్ఞేయమగు ఆత్మను అనుభవపూర్వకంగా ఎరుగని వానికే "సుఖదుఃఖములు' అనే భ్రమలు ఉంటాయి. ఆత్మకంటే వేరుగా ఆధార, ఆధేయములు లేవు సుమా! "నా స్వరూపము ఈ కర్త, భోక్త

మొదలైన సర్వ పదార్థములకంటే కూడా అత్యంత సూక్ష్మమైనది. ఆకాశమువలె సర్వవ్యాపక మైనది"... అని జ్ఞాని ఎరుగుచున్నాడు. అట్టి నిశ్చయమును సడలించగలిగినదేదీ ఈ జగత్తు నందు అతడు గాంచుట లేదు. క్రమంగా 'ఈ జగత్తంతా నా స్వరూపమే' అనే భావనను కూడా పొందుచున్నాడు. ఇట్టి నిశ్చయ భావములు సుదృఢపడగా "సర్వ భూతములను ప్రకాశింప జేయునట్టి సర్వవ్యాపమగు ఆత్మయే నేను" అను అనుభవం ఉత్పన్నమౌతోంది. "నేను సుఖ దుఃఖాలకు స్థానభూతుడను గాను"... అను దుఃఖరహిత స్థితి అతి సహజంగా అవలంబించ బడుతోంది. ఇక అతడు ప్రారబ్ధకర్మలను అనుసరించి లీలామాత్రంగా సర్వ వ్యవహారములందు పాల్గొనుచున్నాడు. వర్తించుచున్నాడు. వాటిచే కలుగు ప్రత్యేకత ఏదీ అతనికుండదు. తన ఆత్మ యందే ఈ సర్వమును, ఈ సర్వమునందు తన ఆత్మనే దర్శించేవానికి ఇక ప్రియ–అప్రియము లేమి? సుఖ–దుఃఖములేమి?

**జ్ఞాని యొక్క మనస్సు -** జ్ఞానియొక్క మనస్సు ఆపదలు ప్రాప్తిస్తున్న సమయంలో కూడా ఈ ప్రపంచమును శోభాయమానం చేస్తూ ఉన్నది. మనస్సు కంటే వేరుగా సుఖదుఃఖములు ఎక్కడ ఉన్నాయి? వాసనారహితమగు చిత్తము కలిగియుండుటచే జ్ఞాని సర్వదా 'అకర్త'గానే తనను తాను దర్శించుచున్నాడు. అనుభవములు అతని పట్ల అప్రభావితముగానే ఉంటున్నాయి. ఈ కాళ్ళూ చేతుల కదలికల వ్యవహారమంతా అతనియందు ప్రవేశించకయే, బాహ్యముననే ఉంటోంది.

సర్వకర్మలకు, సర్వచేష్టలకు, సర్వభావములకు, సర్వలోకములకు, సర్వగతులకు బీజము ఈ మనస్సే. అట్టి మనస్సు అనే బీజం త్యజించబడితే, కర్మలు కూడా స్వయముగా లయించగలవు.

మనస్సు ఆత్మజ్ఞానముచే మ్రింగివేయబడినప్పుడు మాత్రమే దుఃఖములు తొలగగలవు. పుణ్యపాపములు కూడా అప్పుడు విలయం పొందుతాయి. "ఆత్మకంటే వేరైనదంటూ ఎక్కడా లేదు" అని గ్రహించియున్న జ్ఞాని... ఈ శారీరక–వాచక–మానసిక కర్మలచే ఆక్రమించ బడినప్పటికీ... వాటికి తాను మాత్రం వశీభూతుడు కాదు.

**లీలా వినోదం -** ఒక బాలుడు ఒక చోట కూర్చుని ఉండి తన మనస్సు నందు ఒక గొప్ప నగరమును,ఆ నగరములోని వీథులను, ఆ వీథులలోని ఆట వస్తువుల ప్రదర్శనమును ఊహా మాత్రంగా పొందుచూ ఉంటాడు. ఇంతలో అమ్మ పిలుపు విని అక్కడి నుండి లేస్తూ ఆ సంకల్ప మహానగరమును క్షణంలో త్యజించివేస్తాడు. "మనోనగరంగా పొందబడినదంతా వాస్తవంగా లేదు" అను ఎరుకచేతనే కదా, అతనియందు దానిని త్యజించు సమయంలో ఎట్టి క్షోభ యేర్పడుట లేదు! నగరము, నగర వినాశనము కూడా అతడు ఊహామాత్రంగానే పొందుచున్నాడు. అట్లాగే ఆత్మ కూడా కర్మలు చేస్తున్నపటికీ పరమార్థదృష్టిలో ఏమియూ చేయకయే ఉంటోంది. లీలా మాత్రంగా ఒక సమయంలో దుఃఖములను అనుభవించుచు, మరొకప్పుడు "ఇదేదీ నాకు దుఃఖం కాజాలదు"... అని గమనించుచున్నది.

ఆత్మ దేనిని దుఃఖమని తనకు తానే నిర్వచించుకుంటోందో... అది దుఃఖకరమే అగుచున్నది.

'ఇవేవీ నాకు దుఃఖకరములు కావు" అని అది భావించుకొనుప్పుడో, (లేక నిర్వచించునప్పుడో) దానికి దుఃఖము కలుగజేయగలిగేది ఈ జగత్తులో ఏదీ లేదు.

అయితే ఒకడు వస్త్రములు ధరించుచున్నంత మాత్రంచేత అతడు వస్త్రములు అగుచున్నాడా? దుఃఖములు పొందుట జరిగినను, ఆత్మ దుఃఖ రూపముగా పరిణమించుటలేదు సుమా!

**హేయ - ఉపాదేయములు (త్యజించటం - స్వీకరించటం) -** వ్యవహారయోగ్యములుగా అగుచున్న ఈ ఎదురుగా ఉండే సర్వపదార్థముల యందు వాస్తవానికి హేయత్వము గాని, ఉపాధేయత్వము గాని లేవు (Nothing is repulsive or attractive by itself). అట్టి చమత్కారమంతా చోటు చేసుకుని ఉంటున్నది బుద్ధిలోనే.

**హేయత్వము -** త్యజింపవలసియున్నది.

**ఉపాదేయత్వము -** స్వీకరింపవలసియున్నది.

"నేను త్యజించాలి" అనుకున్న వస్తువు "స్వతహాగా దుఃఖకారకము" – అని అనటానికి వీలు లేదు. ఎందుకంటే, అది ఒకప్పుడు స్వీకరించబడినదే కదా!

ఏదైనా సరే, స్వీకరించుటచేతనే దుఃఖము సంభవిస్తోంది. స్వీకరించని వానికి ఆ విషయముతో సంబంధమే ఉండదు. ఇక దుఃఖమేముంటుంది?

ఎప్పటికైనాసరే, ఉపాదేయరాహిత్యము చేతనే (లేక 'గ్రహించుట' అనునది నిరోధించ బడుటచేతనే) దుఃఖము జయించవేయబడుతోంది. అయినా, ఆత్మకంటే వేరుగా ఏదీ లేనప్పుడు స్వీకరించబడేది (ఉపాదేయము) మాత్రం ఎందుకు దుఃఖింపజేయాలి? కనుక 'అవిజ్ఞాన పూర్వకమైన దృష్టిచేతనే దుఃఖాదులు వచ్చిపడుచున్నాయి... అంతేగాని హేయ – ఉపాధేయములు (త్యాజ్య గ్రాహ్యములు) స్వయముగా దుఃఖకరములు కావు"... అని గ్రహించు.

❖

ఆత్మ అకర్త, అభోక్త అయి ఉన్నదని మనం అనుకున్నాం. అవిద్య కారణంగానే అద్దాని యందు కర్తృత్వ – భోక్తృత్వములు ఆరోపించబడుచున్నాయి. అట్టి అధ్యారోపమే అనుభవమునకు కూడా కారణమగుచున్నది. అకర్తా భావనచే క్రమంగా ఆత్మ యొక్క వాస్తవ స్వభావం అనుభూతమౌతోంది.

**శ్రీరాముడు:** ఈ కర్మలు త్యజించటం, అకర్తగా అవటం సాధ్యమేనా?

**శ్రీ వసిష్ఠమహర్షి:** నిజమే, శరీరధారి కర్మలను ఎట్లా త్యజించటం? శరీర నిర్వహణకు అవశ్యకర్మలు ఉండనే ఉంటాయి. అయితే 'సమ్యక్ దర్శనము' అనే బలంచేత 'కర్మలు చేయువాడను" అను భావన అధిగమించబడుతోంది. కర్మలు త్యజించుట అంటే తనను తాను సర్వకర్మలకు అతీతమైన 'ఆత్మ'గా ఎరుగుటయే. ఓ రామా! నీవు మొట్టమొదటగా సత్యవస్తువు గురించి విచారించు. అట్లు విచారించినప్పుడు "శుద్ధమగు ఆత్మయందు కర్తృత్వ భోక్తృత్వములు లేవు"... అని నీవే గ్రహిస్తావు.

**ఇంద్రియ దృష్టి -** కొందరు ఇంద్రియార్థములగు విషయము లందు (శబ్ద స్పర్శ రూప రస గంధము లందు) రాగ ద్వేషాదులు కలిగి ఉంటున్నారు. వాటి కొరకై పుణ్యపాపములు ఆచరించు చున్నారు. అదృష్టములు (దృష్టము కానిది) అగు పుణ్యపాపములచే వివశులై ఆత్మోన్నత్యమును గ్రహించలేక పోవుచున్నారు. అట్టి "వివశత్వబుద్ధి" గలవారి దృష్టియందు మాత్రమే ఈ కర్తృత్వ భోక్తృత్వముల ప్రతీతి అంతా సంభవించుచున్నది. ఆత్మజ్ఞానులలో అట్టి వివశత్వబుద్ధికి చోటు లభించుటయే లేదు.

ఎవరి చిత్తమైతే సంసారమునందు సక్తము కాకుండా, ఆత్మవిచారణయందు మాత్రమే మగ్నమై ఉంటుందో, అట్టి తత్త్వవేత్తలకు మోక్షము అనుదాని ప్రస్తావన యొక్క అవసరమే ఉండదు. "ఇది బంధము, ఇది మోక్షము" అను ప్రహసనమంతా సంసారము నందు ఆసక్తిగల అజ్ఞానుల కొరకు, అజ్ఞానము తొలగించుకోవటానికి సాధనంగా మాత్రమే అయి వున్నది. జ్ఞానియందు శుద్ధాత్మతత్త్వము అత్యంత సహజంగా, కేవలంగా ప్రకాశిస్తూ ఉంటుంది. వాస్తవానికి అజ్ఞాని యందు కూడా అట్లే ప్రకాశిస్తోంది.

జ్ఞాని సర్వదా ఏమియు చేయనివాడై ఉంటున్నాడు. అజ్ఞాని ఇంద్రియ వ్యవహారములను ఆత్మకు ప్రతిపాదించి "నేను చేయువాడను" అను భావమునకు లోనగుచున్నాడు.

ద్రష్టకు అభిన్నమైన ఆత్మతత్త్వము తన యొక్క సర్వస్వరూపత్వమును తనకు తానే "ప్రకటించుకొనుట, ప్రకటించుకోకపోవుట" రెండూ నిర్వహిస్తోంది.

❖

**న బంధోఽస్తి న మోక్షోఽస్తి నాబందోఽస్తి న బంధనమ్ ।**

**అప్రబోధాదిదం దుఃఖం ప్రబోధాత్ప్రవిలీయతే ॥** (శ్లో. 22, సర్గ 38)

యథార్థానికి బంధముగాని మోక్షముగాని లేవు. బంధమును కల్పించగల కారణమూ లేదు. మరి దుఃఖము ఎందు కలుగుతోంది? అజ్ఞానము, అవిచారణల కారణంగానే సుమా!

అట్లు కలుగుచున్న దుఃఖం జ్ఞానంచే నశించగలదు. బంధ-మోక్షాలు మిథ్యారూపంగానే కల్పించబడుచున్నాయి. కాబట్టి రామా! సర్వమును సర్వదా త్యజించగలిగినవాడవై ఉండుము. ధీరుడవగుము. అహంకారం పారద్రోలివేయి. అనాసక్తబుద్ధిచే సర్వసాక్షిత్వం అవధరించియుండు!

❖❖❖

## 6. మోక్షసన్న్యాసం

**శ్రీరాముడు:** ఓ మహాత్మా! మీరు చెప్పుచున్నదానిని బట్టి "బంధ-మోక్షములు అనబడేవి అసంభవం. కేవలం పరబ్రహ్మము మాత్రమే సత్యము" అని అర్థమగుచున్నది. అయితే గోడ లేకుండానే ఎక్కడైనా లిఖించబడిన చిత్రం ఉంటుందా? ఈ సృష్టి అంతా ఏర్పడుతున్నది ఎక్కడ? బంధమే లేనప్పుడు మాకు కలుగుచున్న దుఃఖాదుల సంగతి ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** బ్రహ్మమే ఈ 'సర్వజగత్తు' రూపమున వివర్తభావము పొందుచున్నది. అది సర్వశక్తిమంతమైనది. కార్యశక్తులన్నీ బ్రహ్మము యొక్క సంకల్పం చేత బ్రహ్మమునందే ఏర్పడి ఉంటున్నాయి. అద్దాని ఊహాశక్తి మాత్రం చేత జగత్ ప్రవృత్తి అంతా ఏర్పడి భాసించుచున్నది. దానియందు ఉనికి, అసత్తు, ఉనికిరహితం. ద్విత్వఏకత్వములు, ఏకత్వ–అనేకత్వములు, ఆది అంతములు... ఇట్టి వివిధ కల్పనలన్నీ స్వయంకల్పితానుసారమే రూపమును దిద్దుకుంటున్నాయి. శక్తిహీనమైన దానియందు ఇవన్నీ ఏర్పడగలవా...? లేదు. అయితే ఈ ఉనికి మొదలైనవన్నీ కూడా ఆత్మ కంటే అన్యమైనవి కావు. సముద్రజలంలో తరంగములు, బుడగలు, సుడులు, ఆవృత్తములు మొదలైనవన్నీ ఏర్పడుచున్నాయి కదా! అట్లు వ్యక్తమగుచున్నవన్నీ జలముకంటే వేరైనవా? కావే!

చిదాత్మ మొట్టమొదట చిత్తముతో కూడిన జీవరూపమును చెందుచున్నది. అప్పుడు వాసనామయ... మనోమయశక్తులన్నీ తనయందే ప్రకాశమొనర్చుచున్నది. ఆ శక్తులన్నిటినీ అనేక రీతులలో ప్రకటితం చేస్తోంది. ఆ ప్రకటనలే నామరూపములతో కూడిన ఆ సృష్టియొక్క అనుభవమైయున్నది. ఉపభోగం (Diversed experiencing)చే వాటినన్నిటినీ (ఈ అనేకంగా కనిపిస్తున్న సృష్టిశక్తులన్నిటినీ) ధరిస్తూ మరల ఎప్పటికో తిరోభావముచే సర్వం త్యజించి వేయుచున్నది.

**బ్రహ్మము నుండే...! -**

**లోకాః పరాద్ ఉపయాన్తి తస్మిం స్థిత్వా విశన్తి అలమ్ ।**
**తన్మయా ఏవ సతతం తరంగా ఇవ సాగరే ॥** (శ్లో 7, సర్గ 39)

ఈ జీవులందరి వివిధ దృష్టుల ఉత్పత్తి బ్రహ్మము నుండే ఏర్పడుచున్నది. బయలు దేరుచున్నది. అట్లాగే సమస్త పదార్థముల ఉత్పత్తి కూడా నిరంతరం బ్రహ్మమునుండే కలుగు చున్నాయి. ఆ పరమాత్మ నుండే సమస్తము ఉద్భవిస్తోంది. పరమాత్మయందే ప్రవర్తిస్తోంది మరల పరమాత్మ యందే లయమగుచున్నది. సముద్రములో ఉత్పత్తి అగుచున్న తరంగములు మరల ఎప్పటికైనా సముద్రమందే లయమగుచున్నాయి కదా!

ఈ సర్వము నిరంతరము ఆ పరమాత్మయందే తన్మయమై ఒప్పుచున్నాయి. మట్టిచే తయారు చేయబడిన అనేక బొమ్మలు మట్టిచేతనే తన్మయమై ఉంటున్నాయి కదా!

❖❖❖

# 7. నిత్యము నందు అనిత్యం

**శ్రీరాముడు:** హే మహాత్మా! మీ వాక్యములు గ్రహించుట మాకు కొంచెము కష్టమైనదిగా ఇక్కడ అనిపిస్తుంది. ఎందుకంటారా?.... అగ్నిలో శీతలత్వం (చల్లదనం) ఉంటుందా, ఉండదు. జలంలో దహనశక్తి ఎక్కడన్నా సంభవిస్తుందా? సంభవించదే!

చైతన్యములో జడత్వం ఉంటుందా? ఎట్లా ఉంటుంది?

అదృశ్యమగు బ్రహ్మమునందు దృశ్యము ఉండుట ఏమిటి? నిత్యమగు పరమాత్మయందు ఈ అనిత్యత్వమంతా ఏర్పడటం సమంజసమెట్లా అవుతుంది? కనుక, మీరు చెప్పిన వాక్యము, "సమస్త పదార్థముల యొక్క ఉత్పత్తి -స్థితి-లయములు బ్రహ్మము నందే చోటు చేసుకుని ఉంటున్నాయి..." అను దానికి తాత్పర్యమేమిటో నేను గ్రహించలేకపోతున్నాను.

ఇంద్రియములకు, మనస్సుకు కూడా వేరై, అతీతమై ఉంటున్న బ్రహ్మమెక్కడ?... క్షణ భంగురమగు ఈ పదార్థజాలమెచట? ఇది బ్రహ్మము నందు ఏర్పడుట ఏమిటి?

సరే, మీరు చెప్పినట్లు ఈ జగత్తు యొక్క నామరూపములు కాసేపు బ్రహ్మము నందే ఉత్పన్నమైనాయని అనుకొందాం. అట్లా అయితే ఈ జగత్తులో తారసపడుచున్న ప్రతి ఒక్క పదార్థము బ్రహ్మము యొక్క లక్షణము కలిగి ఉండాలి! ఈ పదార్థములన్నీ సత్-చిత్ ఆనంద మయము, శాశ్వతము, అఖండము అయి ఉండాలి కదా! దీపంలోంచి పుట్టినది దీపము వలెనే ఉంటోంది. మనుజుని నుండి మనుజుడు, గోధుమల నుండి గోధుమలు కలుగుచున్నాయికదా!

ఇదంతా బ్రహ్మము నుండి పుట్టుచున్నప్పుడు, బ్రహ్మమువలెనే ఉండాలి. కాని ఇక్కడి పరిస్థితి ఏమిటి? ఇక్కడి పదార్థములన్నీ నాశసహితమై, పరిమితమై, దుఃఖజనకమై ఎందుకు ఉంటున్నాయి? ఈ జగత్తు నిర్వికారమగు బ్రహ్మం నుండి కలిగితే, ఇవన్నీ నిర్వికారంగానే ఉండాలి.

"లేదు... ఈ జగత్తు ఆత్మకంటే భిన్నంగా వికారవంతమై యున్నది. కాని ఇది బ్రహ్మమునుండే పుట్టింది"... అని అంటారా? అనగా, బ్రహ్మము 'జగద్భావము' కలిగి ఉండాలి కదా? మరి అది 'భావాతీతము త్రిగుణరహితము' అని ఎందుకు చెప్పబడినట్లు?

మీరు చెప్పినట్లు "ఈ జీవులు... వారి వింత దృష్టులు... ఈ పదార్థజాలము"... ఇవన్నీ బ్రహ్మం నుండే, లేక పరమాత్మనుండే ఉత్పన్నమైనాయని అనుకుందాం... అప్పుడు "పరమేశ్వరుడు వస్తుదృష్టిని జీవులలో కలిగిస్తూ ఉంటాడు"... అను కళంకం ఆపాదించబడినట్లే కదా!

ఇంత విచారణ విన్న తరువాత నా ప్రశ్నలలో ఏదైనా లోపము ఉంటే నన్ను క్షమించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓహో! చాలా మంచి ప్రశ్ననే వేశావు. నీ సందేహములన్నిటికీ మేము ఇస్తున్న సమాధానం విను-

జలమునకు ఆకారమున్నదా? లేదు. కాని మనకు సముద్రములోని తరంగమునకు ఆకారము కనిపించుచున్నది కదా! ఆ ఆకారము వాస్తవమైనదేనా? కాదు.

అట్లే ఈ సమస్తము బ్రహ్మమునందు స్ఫురించుచున్నది. సముద్రజలంలో తరంగరూపమున కనిపిస్తున్నప్పుడు, 'తరంగము' అను రూపంగా అక్కడ ఎట్టి ఘనత్వము లేదు కదా! బ్రహ్మమునందు జగత్తుకు సంబంధించిన మాలిన్యము లేశమాత్రం కూడా లేదు.

అగ్నియందు ఉష్ణత్వము తప్ప మరింకేమి ఉంటుంది?

ఈ ప్రపంచమునందు బ్రహ్మముకంటే భిన్నమైన, ఏ కల్పనా ఎక్కడా లేదు.

**శ్రీరాముడు:** మహర్షీ! బ్రహ్మము దుఃఖరహితము, నిర్ద్వందము కూడా! మరి దాని నుండి కలిగిన ఈ జగత్తు దుఃఖమయముగా, ద్వంద్వసహితంగా ఎందుకు ఉన్నది? తండ్రీ! మీ వాక్యార్థము లేమిటో నాకు ఇప్పటికీ బోధపడుటలేదు. మీ ఉద్దేశమేమిటో నేను గ్రహించలేకపోవుచున్నాను.

భగవంతుడు వసిష్ఠ మహర్షి రామునియొక్క ఈ ప్రశ్నను మౌనంగా విన్నారు. ప్రశాంత మైన చిత్తముతో ఆతని రెండు ప్రశ్నల పూర్వాపరములను పరిశీలిస్తూనే తనయందు ఇట్లు యోచించసాగారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** (తన అంతరంగంలో) "ఈ రామచంద్రుని బుద్ధి ఇంకను పూర్ణ ప్రకాశము పొందినట్లు లేదే? కొంచెము నైర్మల్యము ఇంకను మిగిలియే ఉన్నట్లున్నది. ఇప్పుడు ఇతని బుద్ధిని ఆత్మవస్తువునందు సూటిగా ప్రవేశింపజేయాలి. అప్పుడు ఇతనిలో ఇంకా ఏర్పడి ఉంటున్న సంశయములకు చికిత్స జరుగగలదు. ఎవరి బుద్ధి అయితే పరిపక్వత కలిగియుండదో అట్టి వాడు... "ఈ జగత్తు బ్రహ్మమే'... అను వాక్యమునకు అర్థమును గ్రహించలేదు.

ఎవరైతే పరిపక్వమైన బుద్ధితో జగద్భావము త్యజిస్తాడో, చిదేకరసమగు ఆత్మతత్త్వమును మాత్రమే దర్శించగల సమర్థత కలిగి ఉంటాడో... అట్టివాడు మాత్రమే "జ్ఞాతజ్ఞేయుడు'.* అట్టి ధీమంతుడు మాత్రమే "సర్వం బ్రహ్మమే" అను మోక్షప్రవచనము యొక్క పరాకాష్ఠకు తగినవాడ గుచున్నాడు. అట్టి మహాత్ములు ఆ పదార్థాదులందు దోషబుద్ధి పొందుటలేదు. వారు సర్వపరిమిత దృష్టులు అధిగమించి ఉంటున్నారు. అందుచేత ఇందలి సర్వాత్మకత్వము వారికి తప్పక అవగతమ గుచున్నది.

ఈ జగత్పదార్థముల ఉనికి, వినాశనములకు, అప్రమేయమగు ఆ ఆత్మతత్త్వమునకు.... ఈ రెండింటికీ కూడా ఆత్మజ్ఞానికి విరోధమేమీ కనిపించుటలేదు. అందుచేత ఈ రామచంద్రునికి నేను ఈ జగత్తులో కనబడే వస్తువులయొక్క దృశ్యము యొక్క వాస్తవతత్త్వమేమిటో బోధిస్తాను. అప్పుడు గాని ఇతనికి ఉత్తమ విశ్రాంతి లభించదు.

దృశ్య ప్రపంచమును ప్రాప్తింపజేయగల 'భోగదృష్టి' కలిగి ఉన్నంతకాలం ఈ జీవుడు దృశ్యంలోని ఏవేవో విషయములను భావిస్తూనే ఉంటాడు గాని, మహావాక్యముల యొక్క అర్థమును గ్రహించగలుగుతాడా? లేదు. పైగా, అనుక్షణం తత్త్వజ్ఞానము నుండి 'చ్యుతి' పొందుతూనే ఉంటాడు.

బుద్ధి పరిపక్వత పొందనప్పుడు "నాయనా! నీతోనూ, నాతోసహా ఈ సర్వము బ్రహ్మమే"... అని చెప్పితే మాత్రం ఏం లాభం? విషయభోగేచ్ఛ ఉన్నంతవరకు బ్రహ్మమును ప్రతిపాదించు వాక్యములు చిలుకపలుకులవలెనే ఉంటూ ఉంటాయి. భోగేచ్ఛ నశించిందా, అప్పుడు క్రమంగా అజ్ఞానం తొలగటం, "ఈ సర్వము ఆత్మ స్వరూపుడనగు నా మహిమయే" అను ఎరుక ఏర్పడటం ఒక్కసారే జరుగుతూ ఉంటాయి.

---

* జ్ఞాతజ్ఞేయుడు = ఏదైతే తెలుసుకొనవలసియున్నదో అది తెలుసుకొనినవాడు.

అందుచేత 'అప్రబుద్ధుడు', అర్ధప్రబుద్ధుడు అయిన శిష్యునకు మొట్టమొదట శమము, దమము (Discipline of one's own internal and external Avocations) అభ్యసించేటట్లు చేయాలి. అప్పుడు అతని దృష్టి, అవగాహన, ఆర్తి, పరిలక్ష్యములు... ఇవన్నీ పరిశుద్ధత పొందుతాయి. అటుపై 'తత్ త్వమ్' 'జీవోబ్రహ్మేతినాపరః" మొదలైన ఆత్మతత్త్వప్రతిపాదకమగు వాక్యాలు సోదాహరణ పూర్వకంగా విశ్లేషించి చెప్పాలి. అర్ధప్రబుద్ధుడగు శిష్యునికి 'ఈ జగత్తు లేదు... అందుచేత దీనిని నీ హృదయమునందు రహితం చేయి... అందుకుగాను ఉత్తమ ఆచరణ పరుడవు. స్వధర్మపరుడవు కావాలి"... అని చెప్పుచూపోతే, అతనిని తికమకపరచినట్లే అవుతుంది. అపరిపక్వ దృష్టిగల శిష్యుడు గురువు చెప్పినదానికి పెడార్థం ఇచ్చి, చివరకు మహాజాలంలో చిక్కుకునే ప్రమాదం ఉంటుంది. శిష్యులలో కొందరు ప్రబుద్ధులై ఉంటారు. ఉత్తమమైన అర్థమును అనుద్వేగపూర్వకంగా గ్రహించి ఆకళింపు చేసుకునే సామర్థ్యము కలిగి ఉంటారు. 'భోగేచ్ఛ – లోభ మోహములు'... మొదలైన దుష్ప్రవృత్తిని త్యజించి ఉంటారు. అతడి ముందు ప్రతిపాదించబడిన 'పరమసత్యము' గురించిన సమాధానం పవిత్రత పొందుతోంది. "నాయనా! ఈ నేను–నీవు–ఈ జగత్తు, ఇందలి జన్మ కర్మలు ఇదంతా బ్రహ్మము కంటే వేరైనవి కాదు. దీనంతటికి బ్రహ్మమే మూలము. ఇకముందు కూడా పరమేశ్వర తత్త్వమునకు వేరుగా ఏదీ ఎక్కడా ఉండజాలదు"... అని అర్హుడగు శిష్యునికి మాత్రమే బోధించటం సాధ్యపడుతుంది. అనింద్యమైన అవగాహన గల శిష్యుడు అది వింటున్నప్పుడు "నేను ఇది కాదు.. నేను ఇది"... అను సత్యమునకు సంబంధించిన అనుభవమును పొందుతాడు. మిక్కిలి మూఢబుద్ధిగల శిష్యుని సరిగ్గా పరీక్షించకుండానే "జగత్తు మిథ్య... సర్వము కల్పనయే.. బంధ మోక్షములు లేవు"... అని చెప్పటం చేత అల్పమేధస్సుగల శిష్యుడు అప్రతిష్ఠాకరమగు మార్గమును ఎంచుకొనుటకు, కొంచెం అవకాశం ఉండవచ్చు. "నీ ఇష్టం వచ్చినట్లు సంచరించవచ్చు" అని బోధసారమైనట్లు అనుకోవటానికి అది దోహదం చేయవచ్చు. ఎందుకంటే అట్టి శిష్యుడు తన ఉత్తమ అభ్యాసం నుండి విరమించు అవకాశం ఉన్నది.

సరే, ఉత్తముడగు ఈ నా శిష్యుడు రామచంద్రునికి అజ్ఞానాంధకారం నశింపజేసే పరమోత్కృష్ట సత్యము బోధిస్తాను.

❖

ఇట్లు యోచించి శ్రీ వసిష్ఠ మహర్షి రామచంద్రుని సంబోధించటం మరల కొనసాగించారు.

❖❖❖

# 8. ఆత్మయొక్క ఔన్నత్యం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ జగత్తు దోషభూయిష్ఠమైనది. ... ఈ జగత్తే బ్రహ్మము.

ఈ విధంగా సిద్ధాంతాలు వేరు వేరు కోణాల నుండి ప్రవచించబడుచున్నాయి కదా! ఇదంతా కూడా, గురువు శిష్యునికి, భగవంతుని నిర్వచనము బోధించేటప్పుడు ప్రతిపాదించబడుచున్నది. ఈ అనేక విశేషములతో కూడిన రెండు రకములైన సిద్ధాంతములను విమర్శిస్తూ పోగా... ఈ జగత్తు వాస్తవానికి ఏది అయివున్నదో... శిష్యుడు దోషరహితమైన 'స్వబుద్ధి'తో గ్రహించ గలుగుతాడు. లోకంలో గురు-శిష్యవ్యవహారమంతా ఇట్లే ఒనగూడుతోంది.

బ్రహ్మము... "సర్వశక్తిమంతము, సర్వవ్యాపకము, సర్వవస్తువులందు ప్రత్యక్షము"... అయి ఉన్నది. నీవు ఐంద్రజాలికులను చూచే ఉంటావు. వారు మాయచే అనేక క్రియల ద్వారా ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు చూపిస్తూ ఉంటారు. ఆత్మ వాస్తవానికి మాయారహితము అయిఉన్నది. కానీ, మాయామయముగా అగుచున్నది. గొప్ప ఐంద్రజాలికుని వలె మట్టిని కుండగా, ప్రత్తిని వస్త్రముగా చేసి చూపుతున్నది. ఆకాశమునందు పూలతోటను, కొండపై జలాశయమును కల్పించగల ఈ ఆత్మయొక్క అపూర్వశక్తిని నిర్వచించి నిర్దేశించేదెవ్వరు?

కల్పనావిశేషం చేత తాను ఉన్నచోటే భవిష్యత్ ఆకాశంలోని నగర నిర్మాణం చేస్తోంది. ఆకాశంలో నీలత్వం తొలగించి అక్కడ పృథ్వీతలమును నిర్మిస్తోంది. భూతలములో ఆకాశమును స్థాపిస్తోంది.

❖

ఎఱ్ఱటి పద్మరాగమణిలో ప్రతిబింబించే ఆకాశం ఎఱుపురంగుతోనే ప్రకాశిస్తూ ఉంటుంది కదా! అట్లే ఈ జగత్తులో "ఉత్పన్నం అయినది, ... ఉత్పన్నం కానున్నది" అంతా కూడా స్వతహాగా అసత్తే అయి ఉన్నది. బ్రహ్మము యొక్క సత్తచేతనే ఈ జగత్తు సత్తువలె అనుభూత మగుచున్నది.

ఈశ్వరుడు (లేక, ఈశ్వరస్వరూపుడగు జీవుడు) స్వతహాగా అవ్యక్తరూపుడే అయినప్పటికీ విచిత్ర రూపమున తనను తాను ప్రదర్శించుచున్నాడు. ఎట్లా అంటావా?... స్వప్నంలో వస్తుజాలం అనుభవమవడం మనం చూస్తున్నాము కదా! స్వప్నద్రష్ట స్వయంకల్పితము, ఊహాజనితము అగు వస్తువులను, మనుష్యులను కల్పన చేసుకొని "ఇదంతా వాస్తవమే" అని తలచి, ఆ స్వప్నంలో సుఖ దుఃఖాదులన్నీ అనుభవిస్తున్నాడు.

అసలు ఈ జీవుడెవడు? "నేను...ఇది...శరీరము" మొదలైనవన్నీ తెలుసుకుంటున్నట్టి అవ్యక్తమగు ప్రజ్ఞారూపమే ఇతడు కదా! అయినప్పటికీ, ఇతడు కాళ్ళు - చేతులు - కన్నులు మొదలైనవాటితో కనబడుచున్నాడు.

ఇదే రీతిగా సర్వాత్మకమగు ఆత్మవస్తువు సర్వకాలములందు, సర్వత్రా, సర్వరూపమున సంభవత్వము పొందుతోంది. ఒకే ఆత్మ వస్తువు ఇంతకు ముందు జన్మించిన సర్వుల రూపమున,

ఇప్పుడు నీవు, నేను, ఈ సభికులు, తదితరులు రూపమున, ఇకముందు ఇట్లే అనేక భవిష్యత్ జీవుల రూపమున ప్రకటితమగుచున్నది.

ఇక హర్షామర్షములకు తావెక్కడిది? ఎవరికి?.... సమత్వమును అధిరోహించిన జ్ఞాని ఎన్నటికీ విస్మయమునుగాని, గర్వముగాని, సమ్మోహమును గాని, హర్ష-శోక-వికారములను గాని పొందదు. ధీరుడైనవాడు సర్వదా సమరూపమును ఆశ్రయించి ఉంటున్నాడు.

❖

అనంత దేశ, కాల యుక్తమగు ఆత్మయందు విచిత్రమగు దృశ్యరచనాశక్తి కనిపిస్తోంది. ఆత్మయే యత్నపూర్వకంగా అనేక ఫలితములతో, ప్రయోజనములతో కూడిన రచన యొక్క కల్పన సాగిస్తోంది. సముద్రము తనయందలి తరంగములను తిరస్కరిస్తోందా...? లేదు కదా! ఆత్మ కూడా తన ఈ అద్భుతమైన సృష్టి రచనను తిరస్కరించుటలేదు.

ఆత్మయందు ఈ జగశ్శక్తులు ఎట్లా ఉండి ఉంటున్నాయి?...పాలలో నేయిలాగా...మట్టిలో భవిష్యత్‌లో ఏర్పడగల కుండలాగా...దారమునందు వస్త్రములాగా...ఒక చిన్న మఱ్ఱివిత్తనంలో మహావృక్షంలాగా... ఆత్మయందు సర్వశక్తులు వ్యక్తావ్యక్తంగా స్థితి కలిగి ఉంటూ, ఒకప్పుడు వ్యవహారవంతము అగుచున్నాయి. వ్యక్తమగుచున్నాయి.

నీరు ఒకప్పుడు నిశ్చలంగా ఉంటోంది. ఎప్పుడో ఆ నీటిలో తరంగాలు ఏర్పడుచున్నాయి. మరొకప్పుడు అదే నీరు తిరిగి నిశ్చలత్వం పొందుతోంది. అయితే అనేక ఆకారాలతో కనిపిస్తున్న తరంగాలు జలం కంటే వేరైనది ఎప్పుడు? ఎప్పుడూ లేదు. అట్లాగే, బ్రహ్మం కంటే ఈ 'నేను-నీవు -ఆకాశం-పృథివి-కాలం-దూరం'... మొదలైన వాటితో కూడిన ఈ జగత్ రచన వేరైనది కానేకాదు.

**"నాత్ర కశ్చిత్ కర్తా, నభోక్తా, నవినాశమేతి"**

ఈ ప్రపంచమునకు కర్త గాని, భోక్త గాని ఎవ్వడూ లేదు. ఎవ్వడూ ఏమాత్రం వినాశనము పొందుటయే లేదు. కేవలం సాక్షిస్వరూపము, నిరామయము, సమరూపము, నిత్యము, సంక్షోభ రహితము అయినట్టి 'ఆత్మతత్వము' నందే ఈ విధంగా అంతా సిద్ధించుచున్నది.

దీపం ఉంటే చాలు, ప్రకాశం ఉంటుంది. సూర్యుడు ఉంటే చాలు, పగలు ఏర్పడుతోంది. పుష్పం ఉంటే చాలు, సుగంధం ఉంటోంది. అధిష్ఠానమగు చైతన్యము ఉండుటచేతనే ఈ జగత్తు స్వయంగా ఉత్పన్నమగుచున్నది.

వాయువు నందు స్పందన ఉన్నది. అయితే ఆ స్పందనకు వాయువు కంటే వేరైన ఉనికి ఉన్నదా? లేదు. అట్లాగే నీకు ఎదురుగా కనబడుచున్న "ఈ జగత్తు బ్రహ్మము యొక్క అభాస మాత్రమే"... అని గ్రహించు. అనగా, బ్రహ్మమే స్వకీయకల్పనచే ఇంద్రియాత్మకమైన తాదాత్మ్యం యొక్క ప్రయోజనంగా ఇట్లు, జగత్తు లేక దృశ్యముగా ప్రాప్తిస్తున్నది. ఇంద్రియ మాత్ర భావన యందు ఆరూఢుమైవున్నవాడు ఇక్కడ అనేక వస్తు సమూహములను జన సమూహములను

గాంచుచున్నాడు. "ప్రియము-అప్రియము"లతో కూడిన భావనయే "సత్యం-అసత్యం"ల మధ్య సుఖ దుఃఖానుభవాలుగా ప్రకటితం అగుచున్నది. ఇక్కడ కనబడుచున్నదంతా సత్తు కాదు. అసత్తు కూడా కాదు.

❖

ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా గ్రహించు. ఈ అనేక జగద్భావనలు వాయువీచికల వలె వచ్చి పోతూ ఉండవచ్చు గాక! అయితే, ఆత్మయొక్క సన్నిధాన ప్రభావంచేతనే ఈ జగద్దోషములు కూడా ఉనికిని కలిగి ఉంటున్నాయి. ఏది ఏమైనా, ఆత్మను ఇవేవీ స్పృశించుట లేదు. భగవానుడగు ఆ పరమాత్మ ఎల్లప్పుడూ సర్వమునకు వేరుగా, సర్వమునకు సాక్షీభూతుడై పరమాత్మస్థితి యందే శాశ్వతతత్త్వమై ఉండి ఉంటున్నాడు. అతనికి ఏ కర్తవ్యాకర్తవ్యములు లేవు. "నా స్వరూపము అట్టి సాక్షీభూతమగు పరమాత్మతత్త్వము కాదు. మరింకేదో అయివున్నది"... అని భావించుట చేతనే సర్వ రకములైన దోషములు వచ్చి పడుచున్నాయి.

లయమైన దానిని సృష్టించేది, సృష్టించినదానిని లయం చేసేది ఆ పరమాత్మయే. ఆ పరమాత్మ యందు ఈ జగత్‌శక్తి ఒకప్పుడు పరిపూర్ణముగా, మరొకప్పుడు అల్పముగా వ్యక్తం అగుచూ ఉంటోంది. ఇంకొకప్పుడు అసలు వ్యక్తమే అగుటలేదు.

**శ్రీరాముడు:** హే మహర్షీ! ఇక్కడ నశించుచున్నదేది? స్థితి కలిగి వుంటున్నదేది? ఈ వస్తుజాల మంతా ఆత్మనుండే ఉత్పన్నము అగుచున్నదా? లేక, మరెక్కడి నుంచోనా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఆత్మస్వరూపము కాని వస్తువే నశిస్తుంది... ఆత్మస్వరూపము అయినది ఎట్లా నశిస్తుంది?... ఆత్మ స్వరూపమైనది మాత్రమే స్థితి కలిగి ఉంటుంది... ఆత్మ స్వరూపము కానిది స్థితి ఎట్లా కలిగి ఉంటుంది?

జీవుడు స్వకీయమైన అజ్ఞానముచే (బుద్ధి యొక్క అకుశలత్వం కారణంగా) ఆ తత్వమును అనేక వస్తుజాలము వలె దర్శించుచున్నాడు. ఈ వస్తుజాలమంతా ఆత్మ యొక్క స్వరూపమే అయి ఉండగా, ఇక "ఆత్మ నుండి ఇవి ఎట్లా ఉత్పన్నమైనాయి?" - అనే ప్రశ్నయే ఉదయించదుకదా!

ఓ రామా! "సమ్యక్ జ్ఞానము" అనే శక్తిని ముందుగా సంపాదించు. అప్పుడు "బ్రహ్మము నుండే ఈ సర్వము ఉత్పన్నమౌతున్నాయి" అని గ్రహిస్తావు. సూర్యకిరణములు అనేకమైనప్పటికీ, అవి సూర్యుని నుండి వేరు కాదు కదా! ఒక కిరణము ఒక వస్తువుపై, మరొక కిరణము కొండపై, వేరొక కిరణము జంతువుపై, ఇంకొక కిరణము గోడపై... ఇట్లు వేరు వేరు కిరణములు వేరు వేరు చోట్ల ప్రసరిస్తూ ఉండవచ్చు గాక! సర్వకిరణములకు సూర్యుడే ఉత్పత్తి స్థానమైనట్లు, ఈ 'సర్వము, సర్వులు' బ్రహ్మమునే ఉత్పత్తి స్థానంగా కలిగి ఉంటున్నారు.

పరామర్థ సత్యమగు "చిత్స్వరూపబలం - ఎరుక యొక్క అభినివేశము (The dynamics of knowing)" చేతనే ఈ జగత్తు దృశ్యమానమౌతోంది.

అవిద్య, పదార్థములు... ఈ రెండూ ఒకే క్షణంలో బ్రహ్మమునందు ఉదయిస్తున్నాయి. అట్లు ఉదయించి ఆ రెండూ కూడా వేలాది శాఖలతో విచిత్రములైన శుభ, అశుభ ఫలములచే ఒప్పుచున్నాయి.

చూచావా రాఘవా! సంసారం అనేక ఆశలతో, భయంకర దుఃఖకరాలైన ప్రయోజనాలతో, భోగ, వృద్ధ అవస్థలతో కూడి ఉంటోంది. ఫలితంగా ఇది ఆత్మకు బంధస్థానమగుచున్నది.

ఈ సంసార వృక్షమును 'వివేకము' అనే ఖడ్గముతో ఖండించివేయాలి. "సంసారముగా అనుభవమయ్యేదంతా స్వస్వరూప విన్యాస చమత్కారమే!".... అను అవగాహనచే సందర్శించటమే ఇప్పుడు ఉపాయం. ఎందుకంటే, ఉన్న సత్యం అదే కాబట్టి!

తాళ్ళు తెంచుకున్న గజరాజు ఏంచేస్తాడు? హాయిగా సువిశాలమగు వనం వైపు పరుగులు తీస్తాడు కదా! నీవు కూడా ఈ సంసారము నుండి 'వివేకము' యొక్క సహాయం చేత విడువడుము. ప్రశాంతముగా, గంభీరముగా సర్వము గ్రహించినవాడవై నిశ్చింతుడవగుము.

❖❖❖

# 9. ఇదంతా కూడా బ్రహ్మమే

**శ్రీరాముడు:** మునీంద్రా! "బ్రహ్మపదమే" ఈ సర్వజీవుల యొక్క వాస్తవ స్థితి కదా! అసలు "జీవత్వము", "విచిత్రజీవుల ఉత్పత్తి" అనునవి బ్రహ్మపదమునందు ఎట్లు, ఏ ప్రకారంగా, ఎన్ని విధములుగా ఎందుకు సంభవిస్తోందో సవిస్తరంగా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** బ్రహ్మము నుండి ఈ చిత్ర విచిత్రములైన జీవజాతులన్నీ... ఎట్లు ఉత్పన్నమౌతున్నాయో, స్థితి కలిగి ఉంటున్నాయో, నశిస్తున్నాయో, ముక్తిని పొందుచున్నాయో సంక్షిప్తంగా చెపుతాను... విను–

బ్రహ్మం స్వతహాగా విషయరహితమైనది. అయ్యది సర్వశక్తి స్వరూపం, నిర్మలం కూడా! అట్టి బ్రహ్మం నందు జలంలో ఆవర్తం వలె 'చిత్‌శక్తి' రూపం పొందుతోంది. ఆవర్తంచే ఏర్పడిన ఆకారాదులు జలం కంటే వేరు కానట్లు, ఈ 'చిత్‌శక్తి' బ్రహ్మం కంటే వేరు కాదు. బ్రహ్మమునకు చెందినదే అయివున్నది.

అట్టి 'చిత్‌శక్తి' తన యొక్క 'సంకల్పించుట' అను స్వభావముచే మొట్టమొదట కించిత్ స్ఫురణను ఆశ్రయించి బ్రహ్మమొదలగు ప్రారంభ సృష్టికర్తల దేహరూపమును పొందుచున్నది. అనగా, స్వల్పముగా విషయాకారము పొందుచున్నది. అట్టి 'సంకల్పముల సమూహము' యొక్క బలముచే చైతన్యము ఘనత్వము చెందుచున్నది. అట్టి ఘనత్వముచే..."జీవము – మనస్సు" అను ఉపాధిరూపములుగా భావన చెందుచున్నది.

ఈ విధంగా బ్రహ్మము మనస్సు యొక్క సంకల్పమాత్రం చేత తన యొక్క బ్రహ్మస్వరూపమగు "దృక్' రూపమును త్యజించి 'ద్రష్ట" అను కర్తృత్వముతో కూడిన స్థితిని ఆశ్రయిస్తోంది.

"నేను ద్రష్టను"... "ఇది దృశ్యం"... "ఇది నాకు చెందినది"... వంటి భావాలు బ్రహ్మం పొందుతోంది. అయితే అది సంకల్పములు పొందుతూ ఉన్నప్పటికీ అంతమాత్రం చేత సంకల్పము లకు ఆవల ఉన్న తన స్వరూపమగు ఆత్మను పోగొట్టుకొనుచున్నదా? లేనేలేదు. అది తనను తాను ఏ క్షణమందు త్యజించుటలేదు. కాని త్యజించినదానివలె, "అసత్తే".... అయినట్టి ఈ జగత్తును విస్తరింపజేస్తోంది.

చిత్స్వరూపము అంతటా ప్రకాశిస్తూనే ఉన్నది. కాని బాహ్యదృష్టి కలిగియున్నప్పుడు శూన్యం వలె అగుచున్నది. యథార్థానికి కనబడే దృశ్యమంతా చిన్మయ రూపమే సుమా! కాని సాంసారిక దృష్టి గలవారికి మాత్రం ఇది భూతాకాశ మాత్రంగా (పంచ భూతాల సమ్మేళనం మాత్రమేగా) కనబడుతోంది.

చైతన్యము దేనిని ఎట్లు సంకల్పిస్తే అట్లే పరిణమించటం, ప్రాప్తించటం జరుగుతోంది. అది బ్రహ్మదేవుని స్వభావ – స్వరూపములను సంకల్పించిందనుకో... అప్పుడు అది తనను బ్రహ్మ దేవుని రూపముగానే గాంచుచున్నది. అనగా, "ఈ త్రిలోకముల రూపమున అనేక జీవరాసులతో కూడి ప్రకాశించుచున్నది నేనే... నా యొక్క స్వరూపమే" అను భావన ఎక్కడ ఆశ్రయిస్తుందో, అది అట్టి అనుభవమునే అక్కడ పొందుచున్నది. అట్టి భావనకు ఉపక్రమించిన జీవునే 'హిరణ్యగర్భుడు' అను పేరుతో కూడా చెప్పుకుంటున్నాం. ఆ హిరణ్యగర్భుడే తదితర పదిమంది ప్రజాపతులతో కూడిన ఈ జగత్కల్పన కంతటికీ కారణమగుచున్నాడు.

**చతుర్దశ విధానన్త భూతజాత నఘుంఘుమా ।**
**సృష్టిరేవమియం రామ చిత్తనిర్మితమాగతా ॥** (సర్గ 40, శ్లో 9)

పదునాలుగు లోకములందలి అనంతప్రాణికోట్ల రూపమున ఉన్న ఈ 'సృష్టి' అంతా చిత్తము నుండే ఏర్పడుతుంది. అందుచేత "చిత్తమే సృష్టి. చిత్తమునకు వేరుగా సృష్టిలేదు"... అని చెప్పబడుతోంది.




స్వతఃగా చూస్తే మాత్రం, ఈ సృష్టి ఆకాశమువలె శూన్యమైనది. ఇదంతా సంకల్పములోని నగరము వంటిది. కేవలము భ్రాంతి చేత మాత్రమే ఏర్పడి ఉంటోంది.

**శ్రీరాముడు:** బ్రహ్మము, జగత్తు వేరువేరైన లక్షణములు కలిగి ఉంటున్నాయి కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** బ్రహ్మము మహాశక్తియుతము. సర్వ లక్షణ విలక్షణము. బ్రహ్మములోనే ఈ బ్రహ్మాండాలున్నాయి. ఈ బ్రహ్మాండములో కొన్ని జీవరాసులు కేవలం అజ్ఞానము నందు ఉండి ఉంటున్నాయి. మరికొన్ని జ్ఞానయుక్తమై ఉంటున్నాయి. ఇంకొన్ని విఘ్నములు కారణంగా మధ్యమధ్యలో 'చ్యుతి' పొందుచున్నాయి.

ప్రపంచముతోటి సంబంధం ఉన్న జీవులలో కొందరు మాత్రమే ఉత్తమ వైరాగ్యము ఆశ్రయించి ఉండుటచే, వారు తదితరులకు ఉపదేశించటానికి అర్హులై ఉంటున్నారు. విషయ వాసనలచే జీవులలో అనేకులు ఎన్నో మానసిక వ్యాధులకు గురౌతున్నారు. ఫలితంగా దుఃఖం, పిరికితనం, భయం, ఉద్వేగం మొదలైనవాటిని పదే పదే స్వల్ప కారణాల వలన కూడా పొందుచున్నారు. క్షణంలో రాగ-ద్వేష-భయ-మోహాదులచే వ్యాకులపడుచున్నారు. ఈ జీవుల లోని రాజసిక-తామసిక-సాత్విక జాతులు గురించి ముందు ముందు సవివరంగా చెప్పుకోబోవు చున్నాము. ఇప్పటికి మాత్రం... నాశరహితము, సర్వవ్యాపితము, నిరామయము, చిదాభాస స్వరూపము, భ్రమరహితము, అనాది అనంతము... అయి ఉన్న బ్రహ్మము గురించే వివరిస్తాను.

నిశ్చల సముద్రంలో తరంగముల చంచలత్వం కానవస్తోంది కదా! అట్లాగే స్పంద రహితమగు ఆ పరమాత్మ యందు క్రియావిశేషము ప్రస్ఫుటమౌతోంది. ఆ క్రియావిశేషమే ఈ విధంగా జీవభావముగా ఘనత్వం పొందుతోంది. అట్టి క్రియావిశేషము యొక్క ప్రయోజనమే 'జగత్తు' అనబడు అనుభవం.

**శ్రీరాముడు:** మహాత్మా! అనంతమగు 'ఆత్మతత్త్వం' నందు 'ప్రదేశం' అనునది ఎట్లు ఏర్పడుతోంది? అందు "క్రియావిశేషము' ఉత్పన్నమవటమేమిటి? అవి ఎట్లు సంభవిస్తున్నాయి? ఆత్మయందు అసలు ఈ వికారములు ఎట్లు ఏర్పడుచున్నాయి? అద్వితీయమగు ఆత్మ యందు స్పంద ఎట్లా కలుగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ "జీవుడు - బ్రహ్మం - మనస్సు - బుద్ధి - అహంకారం - దృశ్యం మొదలై నవన్నీ పరమాత్మచేతనే, లేక, పరమాత్మయందే ఏర్పడుచున్నాయని గ్రహించు. అయితే ఈ వాక్ రచనలన్నీ శాస్త్రవ్యవహారం కొరకే కల్పించబడుచున్నాయి. వాస్తవానికి ఇవేవీ ఎక్కడా లేవు. అనగా పరమార్థమున ఇవి ఆత్మకు వేరుగా ఉండుటలేదు. ఈ వికారములు, ఈ అవయవత్వము, ఈ దిక్కు, కాలముల సత్త, ఈ ప్రదేశభేదముల అనుభవం... ఇవన్నీ ప్రత్యక్షంగా కనిపిస్తున్నపటికీ, ఇవి పరమాత్మ యందు ఏ మాత్రం సంభవించునవి కావు.

ఆ చిత్ ప్రకాశానికి, లేక, పరమాత్మకు వేరుగా ఎక్కడా ఏదీ లేదు. అందులో అన్యమైన ఎట్టి కల్పన లేదు, ఉండబోదు, ఉండజాలదు కూడా! ఇక శబ్ద, అర్థక్రమాలు ఎచట? కార్య, కారణత్వ మెచట? వ్యవహారదృష్ట్యా ఉత్పన్నమయ్యే వాక్యరచనకు ఆత్మయందు నిజమైన స్థానం లేనేలేదు.

అయితే, ఈ ప్రపంచమున ఏ ఏ కల్పనలు, శబ్దార్థములు, వాక్యసమూహములు ఉన్నాయో, అవన్నీ పరమాత్మ నుండే ఉత్పన్నమౌతున్నాయి. మట్టి బొమ్మలన్నీ మట్టియే అయినట్లు అవన్నీ

ఆత్మమయం, సద్వస్తురూపం అయి వున్నాయి. ఓ సూక్ష్మగ్రాహీ! రామచంద్రా! అగ్ని నుండి ఉత్పన్న మయ్యేవన్నీ అగ్నికాక మరింకేమౌతాయి చెప్పు? నిప్పురవ్వలన్నీ నిప్పే కదా! పరమాత్మ నుండి ఉత్పన్నమయ్యేవన్నీ పరమాత్మ స్వరూపమే అవుతాయి. ఇక ఈ 'జనించునది, జనింపజేయునది'... అను 'భేదకల్పన' అంతా మిథ్యయే అయివున్నది. ఈ జగత్తు యొక్క స్థితి అంతా మాయచేతనే సంభవిస్తోంది. ఇక పదార్థముల ఉత్పత్తి, వినాశనములు..." అనునదంతా ఒక కల్పన నుండి వేరొక కల్పనను ఉద్భవింపజేయుట మాత్రమే అయి ఉంటున్నది.

❖

నీటి యందు కదలికలాగా ఆత్మయందు క్రియాశక్తి యొక్క ఆధిక్యతచేతనే "జనించునది – జనింపజేయునది'... అను రూపముగల వేరు వేరు విషయాలు (జగత్తు–పరమాత్మ అనునవి) దర్శించబడుచున్నాయి.

ఒక పెద్ద రాయి నుండి ఖండింపబడిన మరొక చిన్న రాయి ఆ పెద్దరాయికంటే వేరైనది కాదు కదా! పెద్దరాయిలో, చిన్నరాయిలో పదార్థమొక్కటే. కానీ, ఆకారాదుల దృష్ట్యా వేరుగా కనబడుచున్నవి. అట్లే ఆత్మయందు కనబడే వేరు జీవులనబడే చమత్కారములన్నీ ఆత్మ ప్రసరణమే అయి వున్నది. "ఇది వేరు, అది వేరు. ఇతడు వేరు, అతడు వేరు.. నేను వేరు, నీవు వేరు" అనునట్టి ఈ శబ్దార్థవ్యవహార క్రమమంతా నామ మాత్రమే అయివున్నది. "వేరైనది–వేరుకానిది" అనేదంతా పరమాత్మ యందు లేదు.

ఎందుకంటావా? 'పరిచ్ఛేదము' అనేది ఉంటే కదా, భిన్నత్వము సంభవించేది! బ్రహ్మము నుండి ఉత్పన్నమైన 'మనస్సు' యొక్క శక్తి ద్వారా స్వభావపూర్వకంగానే ఈ నామ రూప కల్పన అంతా ప్రవృత్తమగుచున్నది. అంతే కాదు, మనస్సు యొక్క దృఢభావనచేతనే జగద్వ్యవహార మంతా సంభవిస్తోంది.

**శ్రీరాముడు:** అయితే "పరమాత్మ నుండి ఈ జగత్తు ఏర్పడుచున్నది" – అను వాక్యం అసమగ్రమైన అర్థమేనని అంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "ఒక అగ్ని శిఖ నుండి ఇంకొక అగ్ని శిఖ ఉత్పన్నమగుచున్నది"... అనునదంతా 'వాక్కు' యొక్క వైచిత్ర్యమేగాని, యథార్థం కాదు. ఎందుకంటే, ఆ రెండు అగ్నిశిఖలు ఒకే అగ్ని యొక్క రూపములే. పరమాత్మయందు 'జనింపజేయునది – జనించునది' ఎట్లా సంభవిస్తాయి చెప్పు? సర్వదా ఏకమై ఉంటున్న పరమాత్మ ఎట్లు, దేనిని, ఎందుకొరకు ఉత్పన్నం చేస్తున్నాడు?

ఒక మాట ఉన్నప్పుడు, దానికి విరుద్ధమైనది, భిన్నమైనది, రెండవది అయిన మరొకమాట ఉండటం ఆ మాట (లేక వాక్యము) యొక్క స్వభావం.

అయితే బ్రహ్మమునందు వచనాదులే ఉండవు కదా! ఇక ఈ శబ్ద అర్థ కల్పముల రూప మంటావా... ఇదంతా సముద్రములోని తరంగములకు ఒకదానికి మరొకదానికి ఉన్న భేదము వంటిదే. చిన్న పెద్ద తరంగములన్నీ జలమయమే కదా! తరంగదృష్టిని ఆశ్రయించి తద్వారా సముద్రమును, సముద్ర జలమును నిర్వచించగలమా? లేదు.

ఈ సర్వజగత్తు బ్రహ్మమే అయి వున్నది. ఇది మేము గాంచుచున్న శాస్త్రముల సారం. 'ప్రత్యగాత్మ' కూడా బ్రహ్మమే అయివున్నది. 'మనస్సు-బుద్ధి' అనునవి కూడా బ్రహ్మమే. ఈశ్వరుడు అనుదాని శబ్ద-అర్థములు బ్రహ్మమే. సర్వ వస్తువులందలి సారము బ్రహ్మమే.

**బ్రహ్మసర్వమిదం విశ్వం విశ్వాతీతం చ తత్పదమ్।**
**వస్తుతస్తు జగన్నాస్తి సర్వం బ్రహ్మైవ కేవలమ్ ॥** (సర్గ 40, శ్లో 30)

ఈ విశ్వమంతా బ్రహ్మము యొక్క స్వరూపమే. అయితే బ్రహ్మం ఈ విశ్వమునకు పరమైనది కూడా. ఈ జగత్తు వాస్తవానికి లేనేలేదు. అంతయు కేవల బ్రహ్మస్వరూపమే అయివున్నది.

❖

కొద్ది క్షణముల మౌనం తరువాత -

**శ్రీరాముడు:** మరి ఈ విలక్షణములతో కూడిన వస్తుతత్వము మాటేమిటి? వివిధ జీవులు వివిధములైన లక్ష్యములను, ఆర్తులను కలిగి ఉంటున్నారే?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** తరంగములు, సుడులు, బుడగలు, ఆవర్తములు - అంతా జలమే అయినట్లు... ఉంగరము, వడ్డాణం, గాజులు, గొలుసు - అంతా బంగారమే అయినట్లు... నీవు-నేను-అది-ఇది-లోకములు-పదార్థములు .... సర్వము బ్రహ్మమే. ఈ జగత్తు సంకల్పము ఉన్నచోట అనేకముగా, శుద్ధస్వరూపము ఆశ్రయించబడినప్పుడు బ్రహ్మముగా ద్యోతకమగుచున్నది.

ఓ రాఘవా! అటు ఆకాశం వైపు చూడు. తూర్పు వైపు ఆకాశం, పడమర వైపు ఆకాశం ఒక్కటా? వేరు వేరా? "ఈ ఆకాశ విభాగము వేరు... ఆ ఆకాశ విభాగము వేరు" - అనునది ఆకాశమునకు ఉంటుందా? విశాలమగు పరమాత్మయందు కూడా ఈ విభాగకల్పన లేనేలేదు. ఇక ఇది తూర్పు ఆకాశం, ఇది పడమర ఆకాశం అనునదంతా వికల్పోక్తితో కూడిన వాక్కు మాత్రమే."నీవు-నేను-వాడు-వీడు-జన్మలు-మృత్యువు-దేవతలు-రాక్షసులు-మానవులు"....ఇవి కూడా అట్టివే. ఇవన్నీ సాపేక్షదృష్టి (Relative perception) ని ఆశ్రయించి మాత్రమే ఉంటున్నాయి. వీటి యందు అర్థవిచారణ చేసినప్పుడు 'సత్యము'నకు లభించునదేదీ ఉండుటలేదు.

ఒకచోట ఉన్నవానికి మాత్రమే "దిక్కులు, కాలము"... అను సాపేక్షతో కూడిన అనుభవం ఏర్పడి ఉంటోంది. ఆత్మయో, సర్వత్రా వ్యవస్థితమై ఉండగా, "ఆత్మయే సర్వదా నేనై ఉన్నాను" అను ఉత్తమార్థం గ్రహించినవానికి ఈ సాపేక్షత (Relativity) ఎక్కడ ఉంటుంది? ఉండదు.

**శ్రీరాముడు:** హే మహాత్మా! ఈ మనస్సు బ్రహ్మము నుండే ఉత్పన్నమగుచున్నది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "బ్రహ్మము నుండి మనస్సు ఉత్పత్తి అగుచున్నది"... అనబడు వికల్పోక్తి అసత్యమైనదే సుమా! ఉదాహరణగా ఒక ప్రశ్న అడుగుతాను.

నీవు, నీ మనోరథములు వేరువేరా? నీ నుండి నీ భావనలు వేరైనవిగా చెప్పగలమా? వాటికి నీకన్నా వేరైన అస్థిత్వమున్నదా? 'గుణి' కంటే గుణములు వేరుగా ఎక్కడైనా ఉంటాయా?

లేదు.... లేనప్పుడు "ఆ గుణములు, భావములు, మనోరథములు నీ నుండి ఉత్పన్న మగుచున్నాయి"... అని అనటం ఎట్లా? "అదిగో రెండవ చంద్రుడు" – అని ఒక పిల్లవాడు అంటు న్నాడనుకో... ఆ రెండవ చంద్రుడు ఆతనికి ఆకాశంలో కనిపించటానికి కారణమేమిటి? ఆ చూచు వాని దృష్టిదోషమే కదా! సత్యమునకు సంబంధించిన జ్ఞానము అల్పమగుచున్నప్పుడే బ్రహ్మము నందు ఈ వికల్పములన్నీ అగుపిస్తూ ఉంటున్నాయి. "ఈ వికల్పమంతా 'మనో చాపల్యము' చేతనే ఉత్పన్నమగుచున్నది" అనుటలో సందేహమే లేదు. ఆత్మ యొక్క సాన్నిధ్యము చేతనే మనస్సు స్థితి – స్పందనలు పొందగలుగుతోంది. అయినప్పటికీ, "ఆత్మ ఇట్లు మనస్సుగా పరిణమిస్తోంది"... అని అనవీలులేదు. ఎందుకంటావా? ఏ క్షణ మందు కూడా ఆత్మ తన శుద్ధత్వం, నిర్మలత్వం, సాక్షిత్వం, అఖండత్వములను త్యజింపకయే ఉంటోంది. అజ్ఞానదృష్టికి మాత్రం – స్వయంకృతమైన సంకల్పములు ఘనీభూతమగుచున్నాయి. ఆ కారణంగా ఆత్మయే, 'ఇది జీవము, ఇది జగత్తు' అనునట్లుగా తోచుచున్నది.

సర్వస్వరూపము, సర్వవ్యాపియగు ఆ "అనంత బ్రహ్మపదము" నుండి మరింకేదీ ఎన్నడైనా సంభవించటానికే వీలులేదు. దాని నుండి ఆవిర్భవిస్తున్నట్లు తోచుచున్నదంతా బ్రహ్మమే అయి వుంది. బ్రహ్మతత్త్వము లేనిచోట ఏదీ అగుపించదు, ఉత్పన్నము కాదు. బ్రహ్మము వలననే బ్రహ్మమునకు ఇదంతా తెలియవచ్చుట జరుగుతోంది.

ఒకే వ్యక్తిని చూస్తున్న మరి కొందరు "ఇతడు నా తండ్రి... నా కుమారుడు... నా అల్లుడు... నా మనుమడు... నా మిత్రుడు..." ఇట్లా అనేక రీతులుగా అతనితో తమకు గల స్థితి, సంబంధా లను బట్టి భావిస్తున్నారు కదా! అందరూ చూస్తున్నది ఆ ఒకడినే కదా! అట్లాగే, ఒకే బ్రహ్మము అనేక నామరూపములతో ద్రష్టయొక్క స్థితిగతులను అనుసరించి కనబడుచున్నది. "ఇదంతా బ్రహ్మమే (సర్వంఖిల్విదమ్ బ్రహ్మ)" అనునది వేదవాక్యసారమే అయివున్నది. ఈ విషయమునే మనం ఈ గ్రంథంలో అనేక కోణముల నుండి సుస్థీకరణ పూర్వకంగా నిరూపిస్తున్నాం.

"పరమార్థతత్త్వము" అయి వున్న ఆ పరబ్రహ్మము నందు 'అవిద్యాదులు' అనబడే సంసార దోషం ఈషన్మాత్రం కూడా లేదు.

**శ్రీరాముడు:** స్వామీ! మరి జీవునికి కనిపిస్తున్న ఈ విషయ వ్యవహారముల మాట ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఇవన్నీ జీవునకు అసమగ్రదృష్టి, అజ్ఞానములచే దోషముల చేతనే అనుభవ మగుచున్నాయి. కనుక, అజ్ఞానం నశించిందా... ఇక ఆపై ఈ కనబడే సర్వమందలి "శుద్ధ పరమాత్మ బ్రహ్మతత్వము"... నీవు దర్శించగలవు సుమా! ఒక పాత్ర బాగా మాలిన్యముతో కప్ప బడి ఉన్నదనుకో... ఆ మాలిన్యమును శుభ్రం చేసి తొలగిస్తే పాత్ర యొక్క వాస్తవమైన మెరుపు గోచరిస్తుంది కదా! అట్లే, అజ్ఞానము నశించగానే బ్రహ్మపదము ప్రత్యక్షము కాగలదు.

దీపం వెలిగించటంచేత గదిలోని చీకటి తొలగితే, అప్పుడు గదిలోగల వస్తువులన్నీ చక్కగా కనబడతాయి కదా!

ముందుగా అజ్ఞానముచే కలుషితమైయున్న ఈ దృష్టిని పరిశుద్ధపరచుకోవాలి. అప్పుడు ఈ విశాలదృశ్య జగత్తు సర్వ వికల్పములతో సహా దృష్టి నుండి ఉపశమించగలదు. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబము ఎంతో స్పష్టంగా చూడగలం. సత్యస్వరూపమగు బ్రహ్మము నిర్మలమైన బుద్ధి యందు నిశ్చయత్వము, స్థిరత్వము పొందగలుగుచున్నది. అప్పుడు ఆ ద్రష్ట తన యొక్క పరిశుద్ధ స్వస్వరూపమునే సర్వేసర్వత్రా, సర్వదా, సర్వముగా గాంచుచున్నాడు.

ఇదే జ్ఞానానుభవం యొక్క పరాకాష్ఠ.

❖❖❖

## 10. అవిద్య - ఆత్మజ్ఞానానుభవం

**శ్రీరాముడు:** అహో మహర్షీ! మీ వాక్యములు అత్యంత శీతలములు, నిర్మలములు, ప్రకాశ యుక్తములై, మాపై అమృతవర్షం కురిపిస్తున్నాయి. ఎన్ని సుకృతముల ఫలితంగానో "మీ ఈ ప్రవచనమును వినగలుగుట, పొందుట" అను వరం మీ నుండి పొందుచున్నాం!

హే ప్రభో! మీ వాక్యములు మహాప్రభావములు కలిగి ఉంటున్నాయి. మహోత్కృష్టమగు సత్యమునే ప్రతిపాదిస్తున్నాయని మేము గ్రహిస్తున్నాం. అయితే మా యందు అనేక జన్మలుగా పేరుకొని యున్న అజ్ఞాన దోషము చేత కాబోలు... గంభీరార్థం సంతరించుకొని యున్న మీ వాక్యములు వినుచుండగా క్షణకాలం జ్ఞానప్రకాశం బయల్వెడలుతోంది. ఇంతలోనే మరొక క్షణంలో ఎక్కడి నుండో అజ్ఞానం వచ్చిపడుతోంది. ఈ విధంగా జ్ఞాన – అజ్ఞానముల మధ్య కొట్టు మిట్టాడుచున్నాం. ఆకాశంలో మేఘముల రాకపోకలచే ఎండ – నీడలు ఏర్పడుచున్నట్లు మేము క్షణకాల జ్ఞానం, మరల ఏదో అనిర్వచనీయ అసమగ్రత్వం పొందుచున్నాం.

ఓ దేవా! ఆ పరమాత్మ అనంతము, అప్రమేయము, పరిపూర్ణము, సదా ప్రకాశవంతము, ఏక రసము, నిత్యోదితము పరమార్థస్వరూపము కదా..! అట్టి పరమాత్మయందు జన్మ కర్మలతో కూడిన ఈ వికారకల్పనంతా ఎందుకు సంభవిస్తోంది? "ఈ సృష్టి బ్రహ్మము నందు లేదు.. ఇది అయోగ్యమైయున్నది... ఈ సృష్టిబ్రహ్మమే"... మొదలైన విరోధవాక్యముల ఉద్దేశమేమిటి? ఈ విషయాలపట్ల ఆత్మ ఉన్ముఖమగుట ఏమిటి? ఈ మోహాదులు ఎక్కడి నుండి వచ్చి పడుచున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామా! నేను చెప్పు సత్యార్థము ఒక్కటే. దీనిలో అయోగ్యత గాని, పూర్వాపర విరోధముగాని లేవు. వేదములచే ప్రపంచమునకు చాటబడిన మహావాక్యమలనే (అహం బ్రహ్మోస్మి, జీవోబ్రహ్మేతి నాపరః మొదలైనవి) ఇక్కడ అర్థయుక్తంగా మనం చెప్పుకుంటున్నాం. అంతే. అయితే నీవు బోధ యొక్క మధ్యలో "తితిక్ష–ప్రసన్నత–ఉత్తమ అవగాహన" ఈ మూడిటిని విడువవద్దు. ఈ మన సంభాషణ అనేక కోణముల నుండి పరిశీలిస్తూ ఉండగా నీ యందు పూర్వార్థరూ 'జ్ఞానదృష్టి' తప్పక ఉదయించగలదు. పూర్ణార్థప్రబోధము పొందగలవు. స్వస్థ చిత్తుడవు కాగలవు. అప్పుడు ఇతఃపూర్వం వింటూ వస్తున్న వ్యవహార వాక్యముల కంటే ఉత్తమమైన సత్యపదోన్నతిని నీ అంతరంగమునందే దర్శిస్తావు.

❖

పూజ్యులు, ఆత్మద్రష్టలు, సద్గురువరేణ్యులు అగు మహనీయులు తాము గ్రహించిన "వాక్ అతీత... అనుభవమాత్ర"... సత్యమును సర్వజనులను ఉద్ధరించే నిమిత్తం వేదాంత సిద్ధాంతముల రూపంలో ప్రతిపాదిస్తున్నారు. అట్టి ప్రయత్నములో కొంత శబ్దార్థయుక్తమగు వాక్యరచన అవసర మగుచున్నది.

ఉత్తమార్థము దృష్ట్యా చూస్తే, ఆ శబ్దములు (Jargons) కొంత భ్రమ సమన్వితములైన మాట వాస్తవమే కాని, ముల్లును ముల్లుతోనే తొలగిస్తున్నట్లు "మాయ" యొక్క దుర్వ్యసనమును మాయతో కూడిన శబ్దార్థములచేతనే తొలగించటం జరుగుతోంది. "జీవుడు – బ్రహ్మము – ఆత్మ – పరమాత్మ – మనస్సు – బుద్ధి – జగత్తు – అహంకారము"... అను శబ్దములు అట్టివే. అయితే ఈ పదజాలము సత్యార్థజ్ఞానమునకు (బోధకు) తప్పక హేతువు అగుచున్నది. కాబట్టి "ఉపదేశ్య వస్తువగు ఆత్మజ్ఞానము బోధించటానికే ఇదంతా ఇట్లు రచించబడుచున్నది" అని గ్రహించు. "వాగ్జాలము సద్గురువులు" ఈ రెండిటి సమన్వయమును వివేకముతో గ్రహించాలి.

"వివేకదృష్టి – మహత్తర ఆశయము – అసలు ఉద్దేశం గ్రహించటం"... ఈ మూడూ ఏ సమయంలోనూ ఏమరచరాదు. మిథ్యా భ్రమలందు పడకూడదు సుమా! మన ఈ సంభాషణ శ్రద్ధగా వింటూ ఉండగా, వాచ్య – వాచక శబ్దార్థమును నీవే గ్రహిస్తావు.

❖

అజ్ఞానుల కొరకు 'బ్రహ్మము'ను ఉపదేశించటానికి లేక "సత్యశాస్త్రార్థబోధ" నిమిత్తం జ్ఞానులచే వాక్ప్రపంచమంతా కల్పించబడినది. అయితే ఎవ్వరైతే ఇప్పటికే పరమార్థస్థితియందు ఉంటారో, అట్టివారి అనుభవమే ఉపదేశ్యవస్తువు అగుచున్నది. కనుక ఇక ఆపై ఈ వాక్ప్రపంచంతో పనేమున్నది?

ఆత్మ వాస్తవానికి పరమశుద్ధమైనది. అందు విషయోన్ముఖత్వం గాని, కర్మగాని, మోహాదులు గాని, రాగద్వేషములు గాని లేనే లేవు. అట్టి పరమార్థమగు ఆత్మయందే ఈ జగత్తు అంతా స్థితి కలిగియున్నది. ఆత్మయొక్క భావనా ప్రభవమే ఈ సర్వం యొక్క ఉనికి స్థానం అయి ఉన్నది. ఇదే విషయం అనేక యుక్తులతో అనేక కోణముల నుండి ఈ గ్రంథము నిరూపించి, వివరించి చెప్పుచున్నది.

**శ్రీరాముడు:** స్వామి! మరి ఈ జీవులలో అనేకమంది యొక్క అనుభవం అందుకు వ్యతిరిక్తంగా ఉంటోంది. "ఆత్మయే స్వరూపముగా గల నేను సర్వదా పరిశుద్ధుడను... విషయరహితుడను"... అను అనుభవం చాటున పడిపోతోంది. "నేను అల్పుడను, దీనుడను, పరిమితుడను, బాధితుడను, స్వల్పుడను".... అను భావనయే అధికమైన ప్రచారం కలిగి ఉంటోంది. కారణమేమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి:** నిజమే, ఈ జీవుడు తగినంత సాధనను ఆశ్రయించకపోవుటచేతనే, ఎన్ని రోజులు గడచిపోతున్నప్పటికీ ఆత్మయొక్క శుద్ధత్వము గాంచలేకపోవుచున్నాడు. "మూల అజ్ఞాన రూపము" (Causal Ignorance) అయినట్టి తమస్సు, అప్రయత్నశీలత్వము... ఈ రెండు పరస్పరం సహకరించుకుంటూ మోహమును అనేక శాఖోపశాఖలుగా విస్తరింపజేస్తున్నాయి.

వాక్ప్రపంచం లేకపోతే అట్టి "మూల అజ్ఞానము" గుర్తించబడజాలదు, తొలగించ బడజాలదు.

**అవిద్యయైవోత్తమయా స్వాత్మనాశోద్యమేచ్ఛయా ।**
**విద్యా సా ప్రార్థ్యతే రామ సర్వదోషాపహారిణీ ॥** (సర్గ 41, శ్లో 13)

అనేక జన్మలలోని 'సుకృతము' ఫలిస్తూ ఉండగా అంతఃకరణం శుద్ధత్వము పొందుచున్నది. అనేక జన్మలుగా స్వీకరించడిన ఉపదేశములకు సంబంధించిన వాక్ప్రపంచం జీవుని జ్ఞాన మార్గంలో ప్రవేశింపజేసి ఆత్మయొక్క సామీప్యత ప్రసాదిస్తోంది. "ఉపదేశక్రమము, వాక్ప్రపంచము"... అను అవిద్య ద్వారా సర్వదోషనివారిణియగు విద్య ప్రకాశించుచున్నది.

అస్త్రము అస్త్రముచేతనే జయింపబడుతుంది కదా! పాత్రకు మాలిన్యము అంటినప్పుడు, మాలిన్యముతోనే ఆ పాత్రను తోమి, ఆపై నీటితో కడిగి రెండు మాలిన్యములను తొలగించి వేస్తున్నాం. విషము విషముతోనే శమిస్తుంది. శత్రువును శత్రువే నశింపజేస్తున్నాడు. అట్లే అవిద్య చేతనే అవిద్య నశిస్తోంది. "శాస్త్రపదజాలం" అను మాయసహాయంతో "దృశ్యం" అను మాయను ఎదుర్కొనుచుండగా, సర్వము అవగతం అవుతూ వస్తోంది. అట్టి స్థితిలో ఉభయమాయలు తమంతట తామే తొలగుచున్నాయి. అనగా శాస్త్రరచనారూపమైన మాయ స్వవినాశనము నందే ఆనందము పొందుచున్నది. మాయ యొక్క స్వభావం అత్యంత దుర్లభమైనదే... కాని, అది క్షణంలో మటుమాయ మగుచున్నది.

**మాయ, విచారణ** (Illussion & Enquiry) – మాయయొక్క స్వరూపము, స్వభావము అనిర్వచనీయములు. అది వివేకమును ఆచ్ఛాదించి ఉంటోంది. అనేక జగత్తులను ఉత్పత్తి చేస్తోంది. మాయ వాస్తవానికి లేనిదే కదా! అయినా కూడా ఈ దృశ్యము యొక్క ప్రాప్తికి, ఖండితమైన భావనాపరంపరలకు కారణము మాయయొక్క రూపమే.

ఈ మాయయొక్క రూపమేమిటి? ఇది ఎంతకాలంగా కలుగుతోంది? ఈ రెండు ప్రశ్నలు సమాధానరహితంగానే ఉంటున్నాయి. కాని, ఈ మాయ ఎట్లు తొలగించబడగలదో శాస్త్రములు, గురువులు మనకు విశదపరచుచున్నారు. ఆహాఁ! మాయయొక్క కార్యమే అయినట్టి ఈ దృశ్య జగత్తు ఏ విధంగా ప్రత్యక్షమై తాండవిస్తోందో చూస్తూనే ఉన్నావు కదా! ఎంత ఆశ్చర్యం!

"అవలోకించకపోవటచేతనే... (లేక, విచారించకపోవటం చేతనే) ఈ మాయ స్ఫురించు చున్నది"... అని విజ్ఞులు ప్రవచించుచున్నారు. అవలోకించి చూచామా... తప్పక క్షణంలో నశించిపోతోంది. అపరిజ్ఞాత రూపముననే (because of not verifying the reality / fact) అది స్ఫురించటం, విజృంభించటం జరుగుతోంది. ఈ విచిత్ర సంసార బంధమును కలుగజేస్తున్నట్టి మాయ ఎంతటి ఆశ్చర్యకరం? 'అసత్యమే' అయినప్పటికీ ఇది సత్యమువలెనే భాసిస్తున్నదే! ఇది ఎంతటి మిథ్యా వ్యవహారంగా రచించబడుచున్నదో... ఏమని చెప్పగలం! "అభిన్నము, పరమ పదము" అగు పరమాత్మ యందు ఈ మాయ సుదీర్ఘమైన ఒక స్రవంతిగా ఏర్పడి ఉంటోంది.

క్షరము, విశాలము అయిన ఈ భేదమంతా నిరంతరం విస్తరింపజేస్తోంది. అందుచేత "ఈ మాయ క్షర అక్షర స్వరూపమగు పురుషునికంటే అతీతుడైన పురుషోత్తముని ఆశ్రయించి ఉన్నది"... అని చెప్పబడుతోంది.

❖

ఓ ప్రియ రామా! నీవు మాత్రం "పరమార్థ స్థితియందు ఈ మాయకు స్థానమే లేదు".... అను నిశ్చయమునే సర్వదా కలిగియుండుము. నీవు జ్ఞానివి కావాలంటే నీ యొక్క అవగాహన – భావనలను 1) సత్యనిష్ఠుల వాక్యములు 2) వేదవేదాంత పాఠాల సారం 3) స్వకీయమైన తర్కం 4) స్వానుభవం... ఈ నాలుగిటిచేత ఉద్దీప్తం చేసుకుంటూ ఉండాలి.

ఎప్పుడైతే జ్ఞేయమగు మాయను తెలుసుకుంటావో, అప్పుడు నా ఈ వాక్యములోని అంతర్లీనమైయున్న మహత్తర ఆశయమును చక్కగా దర్శించగలవు.

ఇప్పటికీ మాత్రం నీవు పూర్ణంగా ప్రబుద్ధడవు కావలసియున్నది కదా! అందుచేత, నా వాక్యములపై విశ్వాసముంచు. గురు, శాస్త్ర వాక్యానుసారం విశ్వాసముతో "అవిద్య లేదు"... అను కొండంత బలము కలిగి యుండు. అట్టి నిశ్చయముతో సునిశితమైన బుద్ధి కలవాడవై, పరిశీలనాత్మకము, వివేచనాపూర్వకము అయిన దృష్టితో నా ఈ వాక్యాలు వింటూ వింటూ ఉండు. క్రమంగా అంతా నీకే విశదం కాగలదు.

"ఇప్పుడు మాకు ఈ దృశ్యము ప్రాప్తిస్తోంది. కాని ఈయన 'లేదు' అని సిద్ధాంతీకరించు చున్నారు. మరి విశ్వసించటం ఎట్లా?"... అని భావించి ఈ మన ప్రస్తుతం విచారణ వినుట విరమించావా... ఇక నీవు నీ సందేహ ప్రపంచమునందే జన్మలు, అనుభవములు, అజ్ఞాన భూమికలు పొందుతూనే ఉంటావు.

ఓ సర్వజనులారా! ఈ జీవుడు అనేక జన్మలుగా 'అవగాహనారాహిత్యము' తో కూడిన బుద్ధితో ఈ దృశ్యవ్యవహారంలోకి మరల మరల ప్రవేశిస్తున్నాడు. అట్టి అనేక సాంసారిక దుఃఖా లను పొందుచున్నట్టి ఈ మాయబద్ధ జీవుని దృష్టిలో పెట్టుకుని మా అనేక సంవత్సరముల పరిశ్రమను, శాస్త్రజ్ఞానమును, అనుభవమును రంగరించి ఈ యోగ వాసిష్ఠరామాయణ శాస్త్రమును ప్రతిపాదించుచున్నాము.

ఇప్పటి జీవుని స్థితిగతులు ఏమిటి? బ్రహ్మజ్ఞులచే ప్రవచించబడిన శాస్త్రములలోని అంతర్గత సారము ఎట్టిది?.... ఇవన్నీ గ్రహించిన తరువాతే ఈ విచారణను మీ ముందు ఉంచుటకు యత్నిస్తున్నాం. ఈ సంసార జీవునకు దుఃఖవిముక్తి కలగాలంటే జ్ఞానమొక్కటే సరి అయిన ఔషధం. అట్టి జ్ఞానం భక్తి, విచారణ, సత్ప్రవర్తన మొదలైన వాటిచే మాత్రమే దృఢపడుతోంది. ఈ మాచే చెప్పబడుచున్న వాక్యములు ఓర్పుతో, ఋషులపై విశ్వాసంతో, నిర్మల మైన బుద్ధితో, సూక్ష్మగ్రాహ్యపూర్వకమైన అవగాహనతో విచక్షణాసహితంగా వినండి. దీని ప్రయోజనమేమిటో క్రమంగా మీరే గ్రహించటం జరుగగలదు.

❖

**యదిదం దృశ్యతాం యాతం మానసం మననం మహత్।**
**అసన్మాత్రమిదం యస్మాన్మనోమాత్ర విజృంభితమ్॥** (సర్గ 41, శ్లో 22)

ఈ కనబడే విశాల దృశ్యమంతా మనఃసంబంధమైనది మాత్రమే. అనగా, ఇదంతా మనస్సు యొక్క మననముచే విశాలరూపమున ఉదయించుచున్నది. మనో విలాసమాత్రమే అగుటచే ఇదంతా అసద్రూపమే అయి వున్నది. ఎవరి అంతఃకరణమునందైతే " ఈ జగత్తంతా మాయామయము... మిథ్య"... అను నిశ్చయం కలుగుతుందో, అట్టివాడు మాత్రమే మోక్ష భావమునకు అర్హుడగుచున్నాడు.

దృష్టియొక్క చంచలత్వమే సర్వ అనర్థములకు మూలము. "బాహ్యార్థభావన... ఇంద్రియ లోలత్వము.. భ్రమపూర్వకమైన సంబంధముపట్ల నమ్మిక"... అనువాటి వలననే జీవుడు ఈ సంసార బంధములందు మరల మరల చిక్కుకుంటున్నాడు. అయితే కొందరు మహనీయులు ఈ భూత వర్తమాన భవిష్యత్తు జగద్విషయములపట్ల వివేకపూర్వకమైన అవగాహనను ముందుగా సంపాదించుకుంటున్నారు. తద్వారా ఈ దృశ్యమును అనాసక్తబుద్ధిచే, "ఎప్పుడో, ఎక్కడో, ఎవరి పట్లనో జరిగిన ఏదో సంఘటన" వలె చూడటాన్ని అభ్యసిస్తున్నారు. ఈ దృశ్యము సద్రూపము కావచ్చు. లేక అసద్రూపము కావచ్చు... దృశ్యమంతటి పట్లా 'అనాసక్త బుద్ధి' కలిగియుండేవానిని ఇందలి సుఖదుఃఖములు, తదితర సంఘటనలు ఏమి చేయగలవు చెప్పు?

**కిం అహమ్ దేహమస్మి? -** నేను ఈ దేహ మాత్రుడనా?... ఎవడైతే 'ఈ దేహాదులే నేను" అను భావనచే ఈ దేహేంద్రియాదులను చూస్తూ ఉంటాడో.... అతడు తన యొక్క "శుద్ధ – ఏక – అఖండ".... భావనను గాంచలేకపోవుచున్నాడు. అందుచేతనే అతడు 'అవిద్యావంతుడు' అగుచున్నాడు. ఫలితంగా దుఃఖములన్నీ వచ్చిపడుచున్నాయి. పరమ పదమగు ఆత్మయందు "నేను జీవుడను, దేహిని, మనుజుడను, స్త్రీని, అధికారిని, రాజును"... మొదలైన వికారములు ఉండగలవా? ఉండలేవు. ఒక స్ఫటికంలో ఎదురుగా ఉన్న దృశ్యం ప్రతిబింబిస్తోందనుకో... "ఈ స్ఫటికంలో వృక్షములు, జంతువులు, తదితరరూపములు ఉన్నాయి. అవి కదులుచున్నాయి... ప్రవర్తిస్తున్నాయి" అని అనగలమా? లేదు కదా! కాని అవన్నీ ప్రతిబింబ మాత్రంగా స్ఫటికంలో కనిపిస్తున్నాయి. చిద్రూపమునందు ఈ నామరూపముల వ్యవహారమంతా స్ఫటికంలో ప్రతిబింబించే దృశ్యం వంటిది మాత్రమే.

ఓ రామా! వాస్తవమేమిటో చెప్పుచున్నాను, విను. ఈ నామ రూపములతో కూడిన దృశ్య జగత్తునందు నీవు లేవు. నీయందు అవి కూడా లేవు. ఏదైతే దోషభూయిష్టమైన దృశ్యరూపమున ఎదురుగా కనబడుతోందో అదంతా 'ఆత్మకు' వేరైనది కాదు.

శాస్త్రములు మాయ యొక్క సహాయం తీసుకొని మాయను తొలగించటానికి సహకరిస్తు న్నాయి. అవి మాయకు సంబంధించిన కార్యక్రమములతో కూడుకొని, ఉన్నప్పటికీ, ఆత్మజ్ఞానము సముపార్జించుటలో తప్పక సహకరిస్తున్నాయి.

అవిద్యాప్రవాహంలో కొట్టుకుపోతున్న ఈ జీవుడు శాస్త్రములచే ప్రసాదింపబడుచున్న ఆత్మజ్ఞానం లేకపోతే స్వాత్మానుభవం పొందజాలకున్నాడు.

ఆత్మజ్ఞానానుభవం శాస్త్రార్థములు గ్రహించుటచే తప్పక లభించగలదు. ఆత్మజ్ఞానం లేకపోతే 'సంసారము' లేక 'అవిద్య'ను ఎవ్వరూ దాటలేరు. ఆత్మలాభమే అక్షయమైన పదము.

❖

**శ్రీరాముడు:** మహాత్మా! తదితర విషయములన్నిటికన్నా కూడా "ఈ అవిద్య ఎక్కడి నుండి వచ్చి పడింది?"... అనే ప్రశ్న నన్ను ఆశ్చర్యచకితునిగా, సమాధానరహితునిగా చేస్తోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "ఈ అవిద్య ఎక్కడి నుండి వచ్చింది".... అనే ప్రశ్న ప్రక్కకు పెట్టు. ఎందుకంటే మాయ అనిర్వచనీయం. "ఈ రోగము సంభవించటానికి ఏ ఏ కారణములు ఉండి ఉండవచ్చు?" అను ప్రశ్నను సుదీర్ఘంగా తర్కించటంకన్నా కూడా, "ఇప్పుడు ఈ రోగం తొలిగేది ఎట్లా?" అనునది ఉచితమైన ప్రశ్న అని విజ్ఞుల ఉద్దేశం. అసత్యమైన ఒక భావనను మనం అసత్యమైనదానిగా గుర్తించటమే అన్నిటికన్నా ముఖ్యం కదా! అవిద్య వలననే హృదయ మాలిన్యమంతా వచ్చిపడుతోంది. అది హృదయస్థానమంతా ఆక్రమించి ఉంటోంది. అట్లు హృదయంలోనే తిష్ట వేసుకొని యున్న ఈ సాంసారికదృష్టిని తొలగించుకొనుట ఎట్లో జనులు శ్రద్ధతో పరిశీలించెదరుగాక!

ఇప్పటికి "అవిద్య ఎందుచేత ఉంటోంది?" అనే ప్రసంగం వదలి "ఇది తొలగేదెట్లా" అను విషయం గురించే ప్రయత్నించవలసినదిగా శాస్త్రకారులు కూడా ప్రబోధిస్తున్నారు. "తాడు యందు పాము యొక్క 'స్ఫురణ' ఏర్పడటం ఎంతకాలంగా, ఎందుచేత, ఎట్లా ఏర్పడింది?" అనునది వీక్షించుచు కాలయాపన చేసే బదులు, "ఇది త్రాడు... నిష్కారణంగా ఇది పాము యొక్క భ్రమ కలిగిస్తోంది... కనుక త్రాడును త్రాడుగా మాత్రమే గ్రహించుట ఎట్లు?" అనునది సముచితమైన ప్రయత్నం.

కాబట్టి రామా! " ఈ అవిద్యను నేను ఎట్లా నశింపజేస్తాను?"... అనే విషయం పరిశీలించు. యోచించు. ప్రయత్నించు. అవిద్య నశించునప్పుడే యథార్థతత్వమంతా నీకు బోధపడగలదు. అవిద్య నశించిందా... ఇక "ఇదెక్కడి నుండి వచ్చింది? ఏ రూపమున ఉన్నది? ఎట్లువంటి ప్రవర్తన కలిగి ఉంటోంది?"... అనే విషయాలు వాటంతట అవే విశదమౌతాయి.

"శాస్త్ర పరిశీలన, ఉత్తమ ఆచరణ"... ఇప్పటికి ఈ రెండూ అవసరం సుమా! ఇంద్రియాల పట్ల ఏర్పడుచున్న వ్యామోహాన్ని ఆ రెండింటితో నిరోధించు. దృశ్యం పట్ల ఏర్పడుచున్న ఆకర్షణను 'అసంగము' అను ఆయుధముతో ఎదుర్కో! అప్పుడు అంతా క్రమంగా నీకే తెలిసిపోతుంది.

❖

పరమోత్కృష్టములగు సత్యము, భ్రమల దృష్ట్యా చూచినప్పుడు ఈ "అవిద్య" అనునది "లేనిదే" అని తెలియవస్తోంది. జ్ఞానము యొక్క అభావమే అవిద్య. లేక, చక్కటి పరిశీలనాత్మక బుద్ధిని వినియోగించనప్పుడే అవిద్య ప్రభవిస్తోంది. అట్లు ప్రభవించి, ఆపై అది ఈ జీవుని తన ఇచ్ఛ వచ్చినట్లు శాసిస్తోంది.

అయినా రామా! నాదొక ప్రశ్న. "ఇది అసత్య వస్తువు... ఇందు నేను పదే పదే భ్రాంతిని పొందుచున్నాను. అట్టి భ్రాంతియే నన్ను సత్యమైనదాని నుండి దూరంగా ఉంచుతోంది..." అని ఒకడు గ్రహించాడనుకో.... అప్పుడు అసత్యవస్తువులందలి భ్రాంతిత్వము, సత్యవస్తువు నందలి వాస్తవత్వములను అనుభవానికి తెచ్చుకోవటం ఎట్లా చెప్పు?

**శ్రీరాముడు:** నిత్యానిత్యములను క్షుణ్ణముగా పరిశీలించుటచేతనే.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవును కదా! ఈ అవిద్య ఉత్పన్నమై, అనేక దోషములు కలిగియున్నదై, విశాలమైన ఆకృతిని ప్రదర్శించుచున్నది. ఈ జీవుని క్షణంలో అజ్ఞానాంధకారంలోకి త్రోసి వేస్తుంది. అట్టి 'అవిద్య' ను నిరోధించటానికి ప్రయత్నించకుండా వర్తమానమును వ్యర్థ కాలయాపనతో వెళ్ళబుచ్చు మానవులకు ఏం చెప్పాలి? ఎట్లా చెప్పాలి?

అందుచేత రామా! నీవు ఈ అవిద్యను బలవంతంగా, ధీరత్వంతో నశింపజేయాలి సుమా! అప్పుడు సత్యమును నీవే ఎరుగగలవు. ఒకడు గొప్ప శూరుడో ధీమంతుడో అయితే అయి ఉండ వచ్చు గాక... కాని అతడు అవిద్యకు లోబడినాడా, ఇక అతనిని కాపాడగలిగిన వారు ఎవరు?

అందుచేతనే మరల మరల హెచ్చరిస్తున్నాను. రోగరూపములో దాపురిస్తున్న అవిద్యను నశింపజేయటానికై నీవు యత్నశీలుడవు కావాల్సిందే! అట్లు చేసితివా, ఇక నీవు ఈ సంసారదుః ఖములన్నీ క్రమంగా తప్పక జయిస్తావు. అవిద్యయే సర్వ ఆపదలకు మూలం. అనర్థములన్నిటికీ అవిద్యయే తల్లి. అవిచారణ, అవిశ్లేషణ, అశ్రద్ధలచే జ్ఞానవిజ్ఞానములు కప్పబడియుండుటవలన ఏర్పడే అల్పమైన అవగాహనలే ఈ అవిద్య యొక్క రూపము, విన్యాసము కూడా.

ఇంకా, ఆ అవిద్య ఏమేమి చేస్తోందో చెప్పమంటావా? అది భయమును, విషాదమును దుష్టమానసిక చింతలను, విపత్తులను, ఇతరులపట్ల క్రూరము, నింద్యము అగు ప్రవర్తనలను తెచ్చిపెడుతోంది.

హృదయములో ఏర్పడగల మాయామోహములన్నిటికీ అది అంకురము వంటిదే. అట్టి 'కుదృష్టి' రూపమగు అవిద్య 'హృదయం' అనే స్వగృహంలోకి ప్రవేశించి ఇష్టం వచ్చినట్లు తిరుగాడుతుంటే, వివేకి అయిన మానవుడు చూస్తూ ఊరుకుంటాడా? లేదు... ఊరుకోకూడదు. "నేను ఈ సంసార సముద్రమును దాటుటకు ఉపాయాలేమిటి?"... అనునదే చింతిస్తూ ఉండాలి.

❖❖❖

# 11. క్షేత్రము - క్షేత్రజ్ఞుడు

**శ్రీరాముడు:** హే మహర్షీ! ఈ "అవిద్య" అనే జాడ్యము అనేక అనర్థములను కలుగజేస్తూ పోతోంది కదా! ఎట్లు మేము దానిని మొదలంట తొలగించుకోగలుగుతాం చెప్పండి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నిజమే, ఒక క్రూరుడు బలవంతుడూ అయిన శత్రువుగా ఈ అవిద్య వచ్చి ముంగిట వ్రాలియున్నది. అయితే ఈ అవిద్య విచారణ చేసినంత మాత్రంచేత తప్పక

తొలగిపోగలదు. అతి విస్తృతంగా ప్రసరించి ఉంటున్న అవిద్యారోగమునకు ఔషధరూపంగా కొన్ని విషయాలు ఇక్కడ ప్రస్తావిస్తాను... విను–

బ్రహ్మము స్వతహాగా అమృతస్వరూపము, సర్వవ్యాపి, నిరామయము, అనాది, అనంతము, భ్రమరహితము అయివున్నది. అట్టి బ్రహ్మమునందు "నేను శరీరము ధరించి ఉండువాడను".. అను స్పందన లేక చలనాత్మకమైన క్రియా విశేషము ఏర్పడుతోంది. సముద్రంలో జలం ఉన్నది కదా! ఆ జలము తరంగరూపమును పొంది సముద్రమునందే ఒకచోటి నుండి మరొకచోటికి పోవుచున్నది. అట్లే ఉపాధులతో కూడుకొని యున్న బ్రహ్మము కూడా బ్రహ్మమునకు బాహ్యము కానట్టి ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు పోవుచున్నట్లుగుచున్నది. చంచలత్వమంతా తనయందు తానే పొందుచున్నది.

సముద్రంలోని జలంపైకి స్పందనసహితంగానూ, లోపల స్పందనరహితంగా ఉంటోంది కదా! సర్వశక్తిమంతమగు బ్రహ్మము తనకు వేరే కానట్టి ఒకానొక చోట క్రియాశీలత్వము పొంది ఉంటోంది. అంతర్గతంగానో, సర్వదా యథాతథంగానే ఉంటోంది.

ఆకాశంలోని వాయువును చూడు. అది తనయందు తానే చలనము పొందుచున్నది కదా! దాని చలనమునకు మరొకటేదీ కారణమగుట లేదు. అదేవిధంగా స్వతహాగా కూటస్థ స్వరూప మైన ఆత్మ తనయందు తానే బాహ్యధ్యాసను పొందుచున్నది. దీపం ఎల్లప్పుడూ పైకే ప్రసరిస్తుంది కదా! ఆత్మ కూడా స్వశక్తిచే స్వస్వరూపమునందే ఈ "జగత్తు–జీవులు" అను రూపమున ప్రకాశించుచున్నది. విశాలమైన తటాకంలో ఒక ప్రదేశమందు మాత్రమే సుడిగుండములు కనిపిస్తూ ఉంటాయి. అట్టి సుడులు ఏర్పడుచోటనే జలం అతివేగంగా వృత్తాకారంగా ప్రవృత్తమౌతూ ఉంటుంది. సర్వతత్వ స్వరూపము, మహాశక్తివంతము అగు ఆత్మ కూడా తన స్వరూపము నందు కల్పించబడిన ఒకానొక ప్రదేశంలో క్రియాశక్తివిలాసయుక్తమై ఒప్పుచున్నది. జలమధ్యంలో అగ్నిశిఖలు (బడబాగ్ని) కనబడునట్లు చిద్రూప మహాసముద్రంలో ఇంద్రియ ప్రకాశమంతా స్ఫురిస్తోంది.

❖

**నిర్మల చిత్ శక్తి-** చిద్రూపము స్వతహాగా నిర్మల స్వరూపము. అది ఇంద్రియములకు అతీతమైనది. కాని ఈ ఇంద్రియాలను వెలిగిస్తున్నది, పొందుచున్నది, ఉపయోగిస్తున్నది కూడా అదియే సుమా!

**కించిత్ క్షుభితరూపా సా చిచ్ఛక్తిశ్చిన్మహార్ణవే ।**
**తన్మయీచిత్స్ఫురత్యచ్ఛా తత్రైవోర్మిరివార్ణవే ॥** (సర్గ 42, శ్లో 11)

అట్టి నిర్మల చిద్రూప మహాసముద్రంలో 'జగత్‌భావన' అనబడు స్వల్పవిక్షోభము ఏర్పడు తోంది. అప్పుడు అది సముద్రమందు తరంగంవలె, ఆ స్పందనతో తన్మయమగుచున్నది. ఫలితమే ఇంద్రియ సంబంధమగు చిత్–శక్తి యొక్క ప్రకటన. అయితే ఇంద్రియ సంబంధమగు చిత్‌శక్తి, ఆత్మచిత్–శక్తికంటే వేరైనది కాదు. కాని, వేరైన దానివలె కనిపిస్తోంది. కాల్చబడి, అగ్నిప్రకాశము వెదజల్లుచున్న ఒక ఇనుపతీగను అతి వేగంగా గాలిలో ఒక ఆకారంగా త్రిప్పుచున్నామనుకో...

అప్పుడు ఆ స్థానంలో ఒక స్థిరమైన ఆకారం గోచరిస్తుంది. అట్లే చిత్-శక్తి ఉపాధి పారవశ్యంచేత "దృశ్యము వాస్తవము, స్థిరము" అను అనుభవం పొందుతోంది. ఆ చిత్-శక్తియే తనయొక్క సర్వశక్తిత్వ కారణం చేత 'కాలము' అను రూపమున కూడా స్ఫురించుతోంది. అనగా, స్వయముగా తన కాలశక్తిని ప్రదర్శించుచున్నది. దేశము, కాలము ఆ చిత్‌శక్తి నుండి బహిర్గతములగు నిప్పురవ్వలవంటివే.

**భావన ఎట్లా ఉంటే ఈ జగత్తు కూడా అట్లే -** ఆ చిత్ శక్తి తనయొక్క స్వస్వభావమును ఒక సమయంలో ఎరుగుచున్నది. అప్పుడు ఆద్యంతరహితమైనట్టి పరమాత్మ పదమున స్థితి పొంది ఉంటోంది. అయినా కూడా, మరొకప్పుడు విచారణను వదలియుంటున్న కారణంగా భ్రాంతి వశంచేత కల్పితరూపమే తన స్వభావముగా ఎంచుచు, "నేను పరిచ్ఛిన్నుడను"... అను భావన తన యందు దృఢపరచుకొనుచున్నది. ఆ పరమసత్త "నేను పరిచ్ఛిన్నమైనట్టి విషయమును" అను నిశ్చయమును ఆశ్రయించిన మరుక్షణం ఇక ప్రాణేంద్రియములను, నామరూపములను తన రూపములైనట్లు గాంచుచున్నది. అందుచేత "చిద్వస్తువునందు ఈ సర్వము కల్పించబడుచున్నది. అట్లు కల్పించబడుచున్న సర్వపదార్థములు చైతన్యమాత్రమే అయివున్నాయి" అని గ్రహించు. "సద్రూపమగు ఆత్మకంటే వేరైనది" అని స్ఫురించుచున్నదంతా అవస్తువేగాని, సత్యము కాదు. గాజులు, ఉంగరము మొదలగు పేర్లతో చెప్పబడుచున్న ఆభరణమునకు, బంగారమునకు గల బేధమేమున్నది చెప్పు? ఆభరణమంతా బంగారమే అయి వున్నది కదా!

చిదంశమగు ఆత్మ "భావన" చేయుచున్న సమయంలో ఈ జగత్తు యొక్క ఉనికి ఏర్పడటం జరుగుతోంది. అయితే, ఈ జగత్తు, చైతన్యము... 1) ఒక్కటే 2) వేరు వేరు... అను రెండింటి కన్నా కూడా విలక్షణమైన ఒక అవినాభావ సంబంధం కలిగి ఉన్నాయి.

**దీపములు, అగ్ని : జగత్పదార్థములు, చైతన్యము -** ఒక దీపంతో అనేక దీపములు వెలిగించ బడ్డాయనుకో... అప్పుడు వేరు వేరు దీపపు వత్తులను దృష్టిలో పెట్టుకుంటే ప్రతి ఒక్క దీపము తదితర దీపములకంటే వేరైనదే కదా! కాని దీపాగ్ని దృష్ట్యా చూస్తేనో? వేరు వేరు దేశ కాలములలో ఉన్న దీపములన్నిటిలోని దీపాగ్ని ఒక్కటే అయివున్నదికదా! అట్లే దేశ-కాల-ఉపాధుల దృష్ట్యా అనేక చైతన్యములు ఉన్నాయి. అనేక స్వరూప స్వభావములు ఉన్నాయి. కాని భూతభవిష్యత్తు వర్తమానములందలి సర్వ ఉపాధులలోని చైతన్యమంతా ఒక్కటే అయివున్నది. అయితే, దేశము, కాలము మొదలైన స్పందనశక్తితో కూడుకొని యున్న చైతన్యము "సంకల్పము" వైపునకు పరుగులు తీస్తూ, మలిన రూపమును పొందుచున్నది.

ఈ దేశ కాలాదులన్నీ ఉండి ఉన్నది ఆ చిద్రూపము నందే.

❖

**క్షేత్రజ్ఞుడు -** ఈ సర్వ ఉపాధులను ఆశ్రయించి ఉంటూ సర్వ అనుభవములకు స్థానభూతమైనదేదో, అదే 'క్షేత్రజ్ఞుడు'. ఈ శరీరము యొక్క బాహ్యాభ్యంతరములను తెలుసుకొనుచూ, తన పూర్ణరూపమును ఎరుగువాడు కనుక "క్షేత్రజ్ఞుడు" అని అంటున్నాం. రైతు యొక్క పొలము రైతు కంటే వేరుగా ఊరికి

బయటగా ఉంటుంది కదా! క్షేత్రజ్ఞుడు ఈ శరీరాదులకు, విలక్షణమైయున్నాడు. సర్వదీపములలోను ఒకే అగ్నివలె నాలోను, నీలోను ఇంద్రునిలోను, త్రిమూర్తులలోను క్షేత్రజ్ఞుని దృష్ట్యా భేదమేమీ లేదు. అతడే శరీరి అంటే కూడా. క్షేత్రజ్ఞుడే జీవుడు.

**క్షేత్రము -** ఈ శరీరమే క్షేత్రము. ఈ క్షేత్రమునకు బాహ్యంగా ఇంద్రియార్థములు, దృశ్యము మొదలైనవి ఉన్నాయి అంతరమున మనస్సు బుద్ధి మొదలైనవన్నీ ఉన్నాయి. అట్టి బాహ్యా, అంతరములన్నీ ఆ క్షేత్రజ్ఞుడి చేతనే ప్రవర్తింపబడుచున్నాయి.

జ్ఞానము = క్షేత్రజ్ఞునితో 'ఏకత్వము' లేక 'తాదాత్మ్యము'. 'నేను క్షేత్రజ్ఞుడను' అను దృఢమైన అనుభవముతో కూడిన ఎరుక.

అజ్ఞానము = క్షేత్రము (శరీరము) తోటి ఏకత్వము పొందుట. "నేను ఈ శరీరమును" అను భావన కలిగి ఉండుట.

'క్షేత్రజ్ఞుడు' వాసనల గురించి కల్పనలను ఒనర్చుచూ, 'అహంకారము' అను రూపమును పొందుచున్నాడు. ఆ అహంకారమే పదార్థాదులను నిశ్చయించుటచేతను, తదితర కల్పనలకు హేతువు అగుట చేతను "బుద్ధి" అని చెప్పబడుతోంది. చైతన్యము కంటే జీవుడు వేరు కాదు. జీవుని కంటే అహంకారము వేరు కాదు. అహంకారము కంటే బుద్ధి వేరు కాదు... అని గ్రహించబడు గాక! సంకల్పములచే కలుషితమై నప్పుడు బుద్ధియే మననం చేయు స్వభావంచే, మనోరూపాన్ని పొందుచున్నది. ఘన వికల్పాలను ఆశ్రయించుటచే ఈ మనస్సు ఇంద్రియాల రూపాన్ని పొందు చున్నది. ఈ దేహం ప్రపంచంన ఉత్పన్నమౌతోంది. జీవధారణ చేస్తోంది. ప్రత్యక్షమై తెలియ వస్తోంది. తదితరమైన దృశ్యమంతా అనుభవంగా దేహధారుడగు జీవునిచే పొందబడుతోంది.

❖




**అహంకారము ⟶ నిశ్చయమునకు సంబంధించిన కల్పన ⟶ బుద్ధి**

**బుద్ధి ⟶ ఇంద్రియ విషయములను మననము చేయు స్వభావము (భావనాపరంపర) ⟶ మనస్సు**

**మనస్సు ⟶ తీవ్రమైన వికల్పనలు ఘనీభూతమైన శబ్ద స్పర్శాది భావనలు ⟶ ఇంద్రియాలు**

**ఇంద్రియాలు ⟶ కాళ్ళు చేతులు మొ॥ అవయవాలతో సంబంధము ⟶ దేహము**

**దేహము ⟶ దృశ్యం తెలియవచ్చుట ⟶ దృశ్య జగత్తు**

ఇలా జీవుడు 'సంకల్పములు' అనే పాశములచే బంధింపబడుచున్నాడు. 'దుఃఖమయాలే' అయిన బాహ్యాభ్యంతరములందలి పదార్థజాలములందు తనకు తానే చిక్కుకొనుచున్నాడు.

అయితే ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. ఈ క్షేత్రజ్ఞుడు లేక జీవాత్మ అవిద్యా పరిణామవశం చేతనే 'శరీరము, దృశ్యము' మొదలైన విలక్షణత్వమంతా పొందుచున్నాడు. వాస్తవానికి అతని చిత్స్వభావము పరిణామరహితమైనది.

రేగు కాయ పక్వమై రేగు పండుగా పరిణమించినంత మాత్రం చేత, అద్దాని సజాతిత్వము మార్పుపొందుట లేదు కదా!

❖

ఈ విధంగా చైతన్యము జీవరూపమును, జీవుడు అహంకారరూపమును, అహంకారము బుద్ధి రూపమును, బుద్ధి సంకల్పపరంపరలచే కలుషితమై మనోరూపమును పొందుచున్నాయి. అప్పుడు ఈ మనస్సు సఫలవిఫల (satisfied-unsatisfied) మనోరథాలతో కూడుకుని ఉంటోంది. "ఈమె నా స్త్రీ, వీరు నా పుత్రులు,. వీరు నా వారు, వారు తదితరులు"... మొదలైన శరీరాకార వృత్తులను స్వీకరించుచు, తన యందు ఆ వృత్తుల దృష్టిని పొందుతోంది. పరిచ్ఛిన్నములు, తుచ్ఛములు అయిన అనేక విషయములందు ఆసక్తి పొంది ఉంటోంది.

సముద్రము వైపు నదులు వెళ్లుచూ ఉంటాయి. మదించిన ఎద్దు ఉన్నవైపుగా ఆవు పరుగులు తీస్తూ ఉంటుంది. చిత్తమునందలి 'ఇచ్ఛ' అను దోషమే ఈ జీవుణ్ణి విషయములవైపు పరుగులు తీయించుటకు కారణము అగుచున్నది. ఈ చిత్తము తన యందలి ఘనాహంకారముచే చమత్కారముగా ప్రవృద్ధమగుచున్నది. పట్టుపురుగులాగా తన కోర్కెలచే తానే 'బంధితురాలు' అగుచున్నది. చేపలు ఎఱ కోసం స్వయముగా గాలమునకు చిక్కుకుని మృత్యువాతపడతాయి చూచావా? ఈ మనస్సు కూడా "స్వసంకల్ప అనుసంధానము"చే స్వయముగా బంధమునందు తగుల్కొనుచున్నది. ఆహాఁ! ఇది ఎంతటి హాస్యాస్పదం! ఎంతటి విచారకరమైన విషయం!

"నేను బద్ధుడను"... ??? చైతన్యము తన పారమార్థిక శుద్ధరూపమును క్రమముగా త్యజించుచు "నేను బద్ధుడను" అని భావించుచున్నది. "ఆశ, సంబంధము"... ఈ రెండే అద్దానిని బద్ధునిగా చేస్తున్నాయి.

**శ్రీరాముడు:** జన్మ–జరా–మరణముల రూపమును మరల మరల సంతరించుకుంటున్న ఈ 'అవిద్య' అనే జగజ్జాలం ఎక్కడ నుండి ఉత్పన్నమౌతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అది ఆ జీవుని యొక్క అంతఃకరణమునందే ఉత్పన్నమౌతోంది. ఈ మనస్సే తన యొక్క సంకల్పముచే శబ్దము, స్పర్శ మొదలైన విషయములకు రచయిత. విషయములే మనస్సుకు 'అగ్నిజ్వాల' అగుచున్నది.

అవిద్యాయుక్తమైన మనస్సు "బోనులో బంధింపబడిన సింహం"లాగా మిక్కిలి అవ్యవస్థ పొందుతోంది. క్రమంగా ఈ మనస్సు అనేక విహిత, నిషిద్ధ కార్యములకు కర్తృత్వము వహించు

చున్నది. తన ఇచ్ఛా మాత్రంచేత కల్పించబడిన బహువిధములైన కర్మలందు, జన్మలందు ఇరుకు కొనుచున్నది. ఇంకేముంది? సకల దుర్దశలను ఒకటి తరువాత మరొకటిగా పొందుతూనే ఉన్నది.

**మనస్సు... మనో నిగ్రహం -** ఈ మనస్సు ఒకప్పుడు మనన శక్తిచే మనోరూపమును, మరొకప్పుడు నిర్ణయాత్మక శక్తిచే బుద్ధిరూపమును సంతరించుకుంటోంది. అదియే ఇంకొకప్పుడు జ్ఞానరూపమును, క్రియారూపమును, అహంకారరూపమును, శరీరరూపమును పొందుచున్నది. ఒకే నటుడు వేరు నాటకములలో వేరు పాత్రలలో నటిస్తున్నాడు కదా! అట్లాగే మనస్సు ఒకచోట 'మాయ' అను రూపము వహించి ఈ జీవుని భావములను సంకుచితపరుస్తోంది. ఒకచోట మూర్ఖరూపమున, మరొకచోట త్యాగరూపమున స్థితి కలిగి ఉంటోంది. ఒక సమయంలో 'చిత్తము' రూపమున, 'అవిద్య' రూపమున ఇచ్ఛ రూపమున... ఈ విధంగా ఆ మనస్సు ఎత్తుతున్న అవతారములకు అంతు ఎక్కడ? ఈ ప్రపంచమంతా సంచరిస్తున్నది మనస్సే. అదియే పలువైపులా బంధించబడి, తృష్ణ, శోకములచే పరిపూర్ణమై, రాగద్వేషములకు విశాలస్థానమై ఒప్పుచున్నది.

ఈ మనస్సు యొక్క గతి గురించి ఇంకేం చెప్పమంటావు? ఇది జరామరణమూర్ఛలకు సంబంధించిన అనేక భవభావనలచేత మరల మరల క్షోభను పొందుతోంది. ఇష్టానిష్టములైన విషయములచే తరుమబడుతోంది. తదితరులపట్ల ఏర్పడు దుష్టమైన అభిప్రాయాదులచే దూషిత మగుచున్నది. దాని ఆకృతి ఇచ్ఛయే. సంక్షోభమే దాని ప్రతాపము. ఈ అనేక రకములైన కర్మలన్నీ చిగురిస్తున్నది మనస్సు నుండే. అది అనేక అనర్థములను కల్పన చేసుకుంటూ తన యొక్క ఉత్పత్తి స్థానము, నిలయస్థానము అగు పరమాత్మ పదమునే విస్మరించి వేస్తోంది. నాలుగు వైపుల నుండి బంధింపబడుచు, అనేక దుఃఖములను అనుభవిస్తోంది.

❖

"ఎందుచేత"... అనునది మనకు ఇక్కడ ముఖ్యమైన ప్రశ్న. దీనికి మా సమాధానం విను. "ఆత్మకంటే భిన్నమైన దాని వలె ప్రాప్తిస్తున్న దృశ్యరూపము గూర్చిన యథార్థ జ్ఞానం సముపార్జిం చకపోవుట చేతనే. తన భారముచే తనకు తానే భయోత్పాతములు, జరామరణభావములు పొందుచున్న ఈ దుష్ట మనస్సు సంసారారణ్యంలో సంచరిస్తూ ఉండటానికి కారణం, విచారణ చేయక పోవటమే అయి వున్నది".

సంసారము అనబడునది ఎక్కడో లేదు. ఈ మనస్సు ఆశాపాశములను తన చుట్టూ నిర్మించుకొని, పురుషార్థహీనమై ఉంటోంది చూచావా...? అదియే సంసారము యొక్క స్వరూపము. అది చింతల చేత, క్రోధము చేత, కామము చేత అత్యంత బంధనము పొందుతోంది. ఆత్మ స్వరూపమును పొందలేకపోతోంది.

అట్టి దుర్భరమైన మనస్సును పొందిన ఈ మానవుడు చూస్తూ ఊరుకోవటం ఉచితమా? కానే కాదు. అద్దానికి వర్తమానంలోనే ఉత్తమ పురుషప్రయత్నం, అధ్యయనము, విచారణ మొదలైన ఔషధములను అందించాలి. అదియే జీవుని కర్తవ్యం.

❖

చూచావా రామచంద్రా! జింకల గుంపును వీడిన జింకలాగా ఈ మనస్సు ఎంతో దుఃఖా క్రాంతమగుచున్నది. ఇది, పాపం, విషజ్వాలలచే దహించబడుతోంది. "ఈ జన్మ మృత్యువులు సత్యమైనవే" అని అనుకొని 'తెగిన కమలం' లాగా ఎంతో బాధపడుతోంది. ఇతఃపూర్వపు అనేక దేహముల పట్ల గల అభిమానముచే ఎంతగానో వియోగము అనుభవించి... అనుభవించి అలసి పోయివున్నది. ఇప్పటి ఈ దేహపతనమును ఒక 'పీడకల' వలె దర్శిస్తోంది. "అయ్యో! ఈ నా ప్రియమైన దేహము కొద్దిరోజులలో అకస్మాత్తుగా నేలకూలనున్నది కదా! ఇక నా గతి ఏమిటి?" అని వాపోవుచు ఖిన్నరాలై ఉన్నది. "ఓయీ! జీవుడా! నీ యొక్క ఉత్తమ ప్రయత్నముచే నన్ను సముద్ధరించవచ్చును కదా?" అని ఈ మనస్సు అభ్యర్థన చేస్తోంది. ఓ రామా! ఇట్లు అనేక దుఃఖ ములు పొంది యుండుటచే తన 'ధృతి-ఉత్సాహము'లను కోల్పోయి సంచరించుచున్న ఈ మనస్సును నీవు, ఎట్లైనా సరే, కాపాడి జ్ఞానమయం చేయాలి. సముద్రంలో కూలిపోయి విలవిల లాడుచున్న పక్షిలాగా, బురదలో ఇరుక్కుని ఉన్న దున్నపోతులాగా ఈ మనస్సు 'జగజ్జాలము' అనే శూన్యనగరంలో పడికొట్టుకొంటోంది.

ఓ జనులారా! బంధ హేతువులు, బంధసాధనాలు అయిన ఈ దేహం, గృహం, స్వజనం మొదలైనవాటి యందు అత్యంత ప్రీతిని కలిగియుండి తేనెలో ఇరుక్కున్న గండుచీమలాగా బాధ పడుచున్న ఈ మీ మనస్సును మీరే ఉద్ధరించాలి సుమా! లేకుంటే ఎవరు ఉద్ధరిస్తారు చెప్పండి!

ఓ సర్వజనులారా! మీకు తత్త్వజ్ఞానములందు, తత్సాధనములందు తగినంత ఆదరణ ఉండటం ఎంతైనా అవసరం. "ఆత్మజ్ఞానవిషయమై అనాదరణ" అనే సముద్రంలో మీ మనస్సులు కొట్టుకుపోవుచున్నాయే! విషయములందు నిమగ్నమగుటచే అది కుంచించుకుపోతోందే! చైతన్య రూపులగు మీరు ఈ మనస్సు యొక్క రోదనను వినండి. విని ఆదుకోండి. 'అవిచారణ'చే ఇంకా ఇంకా దానిని బాధించకండి. అప్రయత్నశీలురై ఉండకండి.

'విషయములు' అనే బురదలో ఇరుక్కున్న..."మనస్సు" అనే ముసలి దున్నపోతును... 'ఉత్తమ కర్మలు' అనే త్రాళ్ళ సహాయంచే... 'అనాసక్తి' అనే ప్రయత్నముచే... 'విచారణ' అనే శక్తిచే బయటకు లాగండి! "శుద్ధజ్ఞానము" అనే నీటితో కడగండి! "సాత్విక-స్వస్థతలు" అనే వస్త్రముచే పరిశుభ్రం చేయండి! "మోక్షము" అనే ఉత్తమ స్థలంలో విశ్రాంతి పొందనివ్వండి.

నాయనలారా! అల్ప జలము, అధికమైన బురద గల ఒక దుర్వాసనపూరితమైన తటాకం ఉన్నది. ఆ తటాకమే కామము, రాగములతో కూడిన ఆపేక్ష. అందులో ఛిన్నాభిన్నములైన అంగములతో కూడిన ఈ మనస్సు చిక్కుకున్నది. శుభ, అశుభ క్రియలతో బహుమలినమై ఆ మనస్సు సంచరిస్తోంది.

అట్టి ఆ మనస్సుకు "అకర్తృత్వం' నేర్పాలి. ఎవడైతే జరామరణములవంటి అనేక విపత్తులతో కూడిన దృశ్యజగత్తు నుండి తన మనస్సును కాపాడుకొనుటకు యత్నించడో... ఆతడు'నరుడు' అనిపించుకోడు; నరుని రూపంలోగల మూఢమృగమే అతడు.

❖❖❖

# 12. వివిధ జీవోత్పత్తులు

**శ్రీరాముడు:** దేవా! ఈ అనేకులగు జీవులయొక్క ఉత్పత్తి స్వభావమేమిటో.. బహువిచిత్రంగాను, భయమును గొలిపేటట్లుగాను ఉన్నదే! ఆహా! ఏమి భ్రమాత్మకమైన వ్యవహారం!

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవును, నిజమే. ఈ అసంఖ్యాకములగు కల్పితాకారముగల జీవులు ఉపాధిచేత మాత్రమే 'వేరువేరు' రూపములుగా విభాగములుగా తోచుచున్నారు. వీరంతా ఈ విధంగా సంసార వాసనా ప్రవాహంలో తగుల్కొని చేతలను, మాటలు ప్రదర్శిస్తున్నారు. అయితే, జల కణములన్నీ సెలయేరు నుండే ఉత్పన్నములగుచున్నట్లు, వీరంతా బ్రహ్మము నుండే ఉత్పన్నమై ఉన్నారు... ఇప్పుడు ఉత్పన్నమగుచున్నారు... ఇకముందు కూడా ఇట్లే ఉత్పన్నం కాబోవుచున్నారు. ఇట్టి జగత్తు గురించి నీవు భ్రమించవలసిన పనేమున్నదో చెప్పు?

**శ్రీరాముడు:** ఆత్మస్వరూపులే అయి ఉండి కూడా వీరంతా ఇట్లు ఎందుకు, ఎవరి కారణంగా వివశత్వం పొందుచున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వీరంతా స్వవాసనావశం చేతనే వివశత్వం పొందటం జరుగుతోంది. వీరి అంతఃకరణములు సుఖ-దుఃఖములగు అనేకమైన విచిత్ర దశలందు 'నిబద్ధం' అగుచున్నాయి.

అట్టి ఈ జీవులు వివిధ భూప్రదేశములందు, జలములందు, స్థలములందు, కాలము లందు... నీటిలో బుద్బుదములు వలె.... ఉత్పన్నమగుచున్నారు... నశిస్తున్నారు. అట్టివారిలో కొందరు ఈ వర్తమాన కల్పమునందే అసంఖ్యాకంగా అనేక జన్మలు పొందినవారు ఉన్నారు.

మరికొందరు ఈ కల్పంలో కొద్ది జన్మలు మాత్రమే ఎత్తియున్నారు. ఇంకొందరు రెండు, మూడు జన్మలు మాత్రమే ఎత్తారు. కొందరు కొందరైతే, ఇంకా ఈ కల్పమునందు జన్మించియే ఉండలేదు. క్రిందటి 'కల్పము'లోని ఒక జన్మ నుండి ఇంకా తేరుకొనలేదు.

మరికొందరు జీవన్ముక్తులకు ఇదే ఆఖరి జన్మ అగుచున్నది. కొందరికి ఈ జన్మపరంపరల పరిసమాప్తి అగుటచేత, వారు 'కైవల్యప్రాప్తి' పొందియున్నారు.

కొందరు వేలకొలది జన్మల వరకు మరల మరల ఉద్భవిస్తూ, ఒకే 'దేహజాతి' యందు స్థితి పొందియున్నారు. ఇంకా కొందరు రెండు, మూడు దేహజాతులందు మాత్రమే మరల మరల జన్మలు పొందుచున్నారు.

కొందరు భిన్న భిన్న దేహములను 'ఒక క్రమము' అంటూ ఏదీ లేకుండా లెక్కింపలేనంతగా పొందుచున్నారు. కొందరు జీవులు నరకము నందు దీర్ఘకాలంగా గొప్ప యాతనలు పొందుచున్నారు. కొందరు అల్పసుఖము కొరకు ఎంతో ప్రయాసలు పడుతూ మనోవ్యసన రూపముతో సంచరిస్తున్నారు.

మరికొందరు దైవస్వరూపులై, మిక్కిలి ప్రసన్నులై ఉన్నారు. కొంతమంది జీవులు 'కిన్నర-గంధర్వ-విద్యాధరుల' వంటి మనోహరమైన రూపమును పొందియున్నారు.

కొందరు సత్యలోకనివాసులై దివ్యశరీరములతో, ఆత్మజ్ఞాన శబ్దార్థములతో విరాజిల్లు చున్నారు. కొంతమంది "సూర్య, ఇంద్ర, వరుణ, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు"గా ఉన్నారు.

కొందరు కూష్మాండ (దేవతలలో ఒక తెగ), బేతాళ, యక్ష, రాక్షస, పిశాచాదుల రూపమున ఉండి ఉన్నారు. మరికొందరు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర రూపమున స్థితి పొందియున్నారు.

ఇందులో కొందరు తుచ్ఛ విషయములపట్ల ఆసక్తి పూరితులై స్వభావరీత్యా చంఢాల, కిరాత జన్మలు పొందుచూ, ఒకప్పుడు దుఃఖమును, మరొకప్పుడు క్రూరత్వమును ప్రదర్శించుచున్నారు.

కొందరు పక్షి రూపమును పొందియున్నారు. అట్లే తృణము, ఓషధుల, ఫలముల, ఆకుల రూపమున కూడా కొందరు జీవులు ఉంటున్నారు.

ఇట్లా ఎంతైనా వర్ణించవచ్చు సుమా! కొందరు సంసారవైభవమును పొందుచున్నారు. "నేను రాజును కావాలి... మంత్రిని కావాలి... సంఘనాయకుడను కావాలి... ఫలానా చోట ఇళ్ళు కట్టి, వాటికి యజమానిని కావాలి... అందరూ నా అధికారం అంగీకరించాలి..." ఈ విధంగా ఉంటున్నాయి, వారి వారి సాంసారిక భావనలు!

కొందరు నారబట్టలు కట్టుకుని మునులవలె మౌనము వహించి అంతా చూస్తూ కూడా, ఏమీ పట్టనట్లు ఉంటున్నారు.

కొందరు రాగముతో మమకారముతో వేటివేటినో ప్రోగు చేసి దాచుకుంటున్నారు.

కొందరు సర్పము, కొండచిలువ, క్రిమి, కీటకములు, పురుగులు మొదలైన ఉపాధులను ఆశ్రయించి స్వల్పము, తుచ్ఛము అగు పదార్థములను మహత్తరమైన వాటివలె దర్శిస్తున్నారు.

కొందరు సింహము, మేక, ఎద్దు మొదలైన మృగరూపములు ధరించి ఆహారము పొందుట, నిద్ర, మైథునము అను రెండు మూడు కార్యక్రమములందే నిమగ్నమై ఉంటున్నారు. కొందరు ఆపదలకు వశము అగుచున్నారు. మరికొందరు సంపదలను పొందుచున్నారు.

కొందరు స్వర్గపురములలో, నరకములో, నక్షత్రమండలంలో వృక్షము యొక్క ఛిద్రంలో, వాయువులో, ఆకాశంలో స్థానములు పొంది ఉంటున్నారు.

కొందరు సూర్యకిరణములలోని రసమును గ్రహించుటకు అధికారం పొంది ఉంటున్నారు. మరి కొందరు చంద్ర కిరణములలోని ఓషధత్వము యొక్క పరిపక్వత కొరకై తమ తమ ఉపాధులను నియోగించుచున్నారు.

అన్యజనుల పట్ల శ్రేయోభిలాష కలిగియున్నట్టి కొందరు, తత్సంబంధమైన ప్రయత్నము లందే మనోవాక్కులను నియమించి సంచారం సలుపుచున్నారు. మరికొందరు చిరకాలంగా జీవన్ముక్తత్వము అనుభవించి ఇక విదేహముక్తిని సమీపించు అభిలాషతో ఉంటున్నారు.

మరి కొందరు "మాకు ముక్తి కంటే తదితర జనుల సుఖశాంతులందే మక్కువ" అను భావన కలిగియుండి, తదనుకూలంగా ఏవేవో కార్యక్రమములు ఏర్పరచుకొని వర్తిస్తున్నారు. సద్గురువులు అవతారములను ధారణచేస్తూ శిష్యులను సువిజ్ఞానులుగా తీర్చిదిద్దే ప్రయత్నంలో ఉంటున్నారు.

భోగ లంపటంలో పడిన మరికొందరు "విదేహముక్తి" "ఆత్మ సమాచారం" మొదలైన వాటిని పరమద్వేషభావంతో పరికిస్తున్నారు.

కొందరు తీవ్రవేగంతో ప్రవహించే నదులయొక్క అధిష్ఠాన దేవతారూపులై ఉంటున్నారు. కొందరు ఉత్తమ స్త్రీ రూపమున, పురుషరూపమున, నపుంసకరూపమున ఉంటున్నారు.

కొందరు ప్రబుద్ధమైన 'మతి'ని కలిగి ఉంటున్నారు. మరికొందరు మిక్కిలి జడమైన అంతః కరణము కలిగి ఉంటున్నారు.

కొందరు తదితరజనులకు జ్ఞానం ఉపదేశించే 'నిష్ఠ' కలిగి ఉంటున్నారు. ఇక కొందరు మరెవ్వరితోనూ సంభాషించటానికి ఇష్టపడక, సమాధినే ఆశ్రయించి దీర్ఘకాలం గడిపివేస్తున్నారు.

ఇదంతా ఏమిటంటావా? ఈ జనులు తమ తమ వాసనలకు వివశులై, అవిద్యాబుద్ధులై అనేక భావావేశములను ఆశ్రయించి, ఇదంతా ఇట్లు పొందుచున్నారు. ఇదంతా ఆయా భావ దశలందు స్థితి పొందియుండుటే అయివున్నది. ఇంకా...

**విహరన్తి జగత్కేచిన్నిపతన్త్యుత్పతన్తి చ ।**
**కన్దుకా ఇవ హస్తేన మృత్యునాఽవిరతం హతాః ॥** (సర్గ 43, శ్లో 25)

ఇంకొందరు ఈ భూమిపై ఉన్నారు. కొందరు నరకంలో పడుచున్నారు. ఇంకొందరు స్వర్గమునకు ఎగురుచున్నారు. విసరబడుచున్న బంతిలాగా కొందరు ఒక శరీరము నుండి మరొక శరీరమునకు వెళ్ళుచున్నారు.

**ఆశాపాశశతాబద్ధా వాసనాభావ ధారిణః ।**
**కాయాత్కాయముపాయాన్తి వృక్షాద్వృక్షమివాండజాః ॥** (సర్గ 43, శ్లో 26)

పక్షి ఒక చెట్టు నుండి లేచి మరొక చెట్టుపై వ్రాలుచున్నట్లు ఈ జీవులలో అనేకులు అనేక ఆశాపాశములకు బద్ధులై అనేక భవిష్యత్ దేహములను ధరించుటకు ఇప్పటికిప్పటి నుండే సిద్ధము అగుచున్నారు.

❖

ఈ జీవుడు అత్యుత్తమమగు తన ఆత్మను దర్శించనంతవరకు ఇట్లే అనేక ఉపాధి పరంపరలను అనుభవిస్తూనే ఉంటాడు. అసంఖ్యాకములగు విషయములకు, సంకల్పములకు బద్ధులై 'మాయ' లేక 'అవిద్య' ను ఆశ్రయిస్తూ, ఈ విస్తారమైన విశ్వంలో సంచారం చేస్తూ ఉంటారు. జలంలో కెరటంలాగా, ఆవృత్తములులాగా ఇట్లే తిరుగాడుతూ ఉంటారు.

ఓ రాఘవా! ఈ జనులలో కొందరు అసద్వస్తువును త్యజించి సత్యజ్ఞానమును పొంది ఉంటున్నారు. జ్ఞాన భూమికాక్రమమున ఆత్మపదమునందు స్థిరత్వము బడయుచున్నారు. అట్టి జీవులు మరల ఈ ప్రపంచమున జన్మించుట లేదు.

ఇక మరికొందరు జీవుల విషయానికి వద్దాం. వారు వివేకమును పొంది కూడా, విషయ లంపటులై ఉంటున్నారు. అందుచేత వేలకొలది జన్మలు అనుభవించి ప్రశ్నార్థకంగా మరల మరల సంసార సంకటమున పడుచున్నారు.

ఉత్తమ సంస్కారములను ఆశ్రయించుచున్న ఇంకొందరు ఉత్తమ ప్రదేశములందు, ఉత్తమ కాలములందు జన్మలు పొందుచున్నారు. సత్సమాగమమును పొందుచున్నారు. అట్టి వారు "దేవత -గంధర్వ -ఋషి" మొదలైన విభవమంతా పొందుచున్నారు. వారిలో కొందరు గర్వితులై, సాంసారిక దృష్టిని మరల ఆశ్రయించుటచే తమ మార్గముల నుండి మరల వెనుకకు మరలు చున్నారు. కొంత వెనుకకు, మరల ముందుకు చనుచున్నారు. వారిలో కొందరైతే పక్షి, మృగము మొదలైన స్థితిగతులను కూడా కొని తెచ్చుకుంటున్నారు. తుచ్ఛమగు విషయములపట్ల గల ఆశచే మరల జంతువుల యోనులను పొంది నరకమునకు పోవుచున్నారు.

కొందరు మహాబుద్ధిశాలురు బ్రహ్మదేవుని మనస్సు నుండి ఉత్పన్నమగుచున్నారు. (బ్రహ్మ మానస పుత్రులగు నారదుడు, వసిష్ఠుడు, సనత్కుమారుడు మొ॥ అందుకు ఉదాహరణ). అట్టి మొదటి జన్మ యందే "బ్రహ్మము" అను మోక్షపదమున ప్రకాశించుచున్నారు. మరికొందరు తమ ఉత్పత్తి స్థానమున బ్రహ్మాండమునందో, లేక వేరొక బ్రహ్మాండమునందో... బ్రహ్మదేవునిగానో, విష్ణువు గానో, మహేశ్వరుడు గానో అగుచున్నారు. కొందరు ఉత్తమ జన్మల నుండి చ్యుతి పొంది, ధర్మవ్యతిరేకులవటం చేత స్వల్ప వ్యవధిలో పశు, పక్షి, మృగ, సర్ప ఉపాధులను పొందుచున్నారు.

❖

ఓ రామా! ఈ ఉత్పత్తి క్రమమంతా ఈ బ్రహ్మాండములో ఏ విధంగా ఉన్నదో, తక్కిన బ్రహ్మాండములలో కూడా అట్లే ఉన్నది. అవన్నీ కూడా ఇట్లే విస్తారంగాను, సువిశాలంగాను ఉండి ఉంటున్నాయి. ఇతఃపూర్వం అసంఖ్యాకంగా బ్రహ్మాండములు నిర్మించబడ్డాయి. వాటిలో కొన్ని నశించిపోయాయి. కొన్ని ఇంకా ఉన్నాయి. ఇక ముందు కూడా ఇట్లే అనేక బ్రహ్మాండములు రచించబడబోతున్నాయి. ఇవి కాక, ఏవో కొన్ని కారణాల వలన కొన్ని సందర్భములలో ఆయా జీవుల నిమిత్తం అనేక చిత్ర విచిత్రమైన అవాంతర జగత్తులు ఆవిర్భవించుతున్నాయి. ఇంతలోనే విలయం పొందుచున్నాయి. వాటిలో కొందరు గంధర్వత్వము, కొందరు యక్షత్వము, కొందరు దేవత్వము, కొందరు దైత్యత్వము పొందుచున్నారు.

ఈ బ్రహ్మాండములో మనుష్యులు, వారి వారికి యోగ్యములైన వ్యవహారములు నిర్వర్తిస్తూ సంచరిస్తున్నారు కదా! అట్లే తక్కిన బ్రహ్మాండములలో కూడా ఉన్నారు. ఒక్కొక్క సృష్టి ఒక్కొక్క విలక్షణముతో కూడి ఉంటోంది. ఈ జీవసృష్టులన్నీ వారి వారి స్వభావమును అనుసరించి నదిలో తరంగాలవలె పరివర్తనం చెందుచున్నాయి.

ఉత్పత్తి, వినాశనము అను రెండు చుక్కల మధ్య ఈ సృష్టులన్నీ అనుక్షణం పరివర్తనం చెందుతూనే ఉన్నాయి. ఇందులోని జీవులు తమ తమ గుణములకు అధీనులై అనిర్వచనీయులై, అనిర్దేశ్యులై ఉంటున్నారు. స్వయంసంబంధమైన ఎరుక అంతఃకరణములు కలిగి ఉండి ఉత్పత్తి వినాశనముల మధ్య అనేక భావాభావములను ప్రకటించుచున్నారు.

❖

అయితే రామా! వీరంతా ఉత్పన్నమగుచున్నది పరమపదమగు బ్రహ్మమునుండే సుమా! బ్రహ్మము నందే వీరు ప్రత్యక్షముగా వ్యవహరించుచున్నారు. స్వస్వరూపమగు పరబ్రహ్మత్వమును ఏఒక్కరూ ఏక్షణమందూ ఏమాత్రం త్యజించుటయే లేదు.

ప్రకాశము దీపములోనుంచే వస్తోంది. కిరణాలన్నీ సూర్యుడి నుండే వస్తున్నాయి. కాల్చబడిన ఇనుము నుండే అగ్ని కణాలు వెదజల్లబడుచున్నాయి. పువ్వు నుండే వాసన వస్తోంది. వర్షము నుండే జల బిందువుల బయల్వెడలుచున్నాయి. సముద్రం నుండే తరంగాలు వస్తున్నాయి.

అదే విధంగా ఈ జీవరాశి అంతా కాలానుగతంగా బ్రహ్మము నుండే ఉత్పన్నమౌతున్నది. అనేక దేహపరంపరలు ధరించి భోగానుభవం పొందుచున్నది. ఆ తరువాత మరొక సమయంలో (ప్రళయకాలంలో) బ్రహ్మము నందే స్వయముగా విలీనమగుచున్నది.

**అవిరతమియమాతతా తథోచ్చై ర్భవత వినశ్యతి వర్ధతే ముధైవ ।**
**త్రిభువన రచనాది మోహమాయా పరమపదే లహరీవ వారిరాశౌ ॥** (సర్గ 43, శ్లో 45)

ఈ మాయ 'త్రిలోకములు' అను రచనారూపమున భ్రాంతిగా ప్రాప్తిస్తోంది కదా...! ఇదంతా ఇట్లు 'మిథ్య' రూపమున విస్తరిస్తున్నది ఎక్కడ? ఎక్కడో కాదు... ఆత్మయందే.

సముద్రంలోని జలంలో తరంగాలు అనేకం లేచి, కొంత సంచారం చేసిన తరువాత మరల సముద్రజలంలోనే లయిస్తున్నాయి కదా! ఇది కూడా అట్టిదే.

అయితే రాఘవా! నీవు సర్వదా ఆత్మస్వరూపుడవే అయి ఉన్నావు. "మిథ్యావ్యవహారం మాత్రమే' అయివున్న ఈ 'సృష్టి–స్థితి–లయ'లు శుద్ధ చైతన్య స్వరూపుడవగు నీయందు లేవు. నీవు వాటి యందు లేవు. కనుక నిశ్చింతుడవై 'శాంతి' వహించి ఉండుము.

❖❖❖

# 13. పునఃశరీర ప్రాప్తులు - పుర్యష్టకము

## (సంసారావతరణము)

**శ్రీరాముడు:** మునీంద్రా! ప్రళయకాలంలో ఈ జీవుడు ఆత్మయందు లయించుచున్నాడని మీరు చెప్పుచున్నారు కదా! మరి అట్లా అయితే, అతడు మరల 'ఆస్థి పంజరం' రూపంలో గల ఈ భౌతిక దేహమును ఎట్లా ఎందుకు ఎప్పుడు ధరించుచున్నాడు?

**శ్రీ వసిష్ఠమహర్షి:** మనం ఈ విషయం ఇతఃపూర్వమే విచారించాం. మరి నీవు ఇంకా గ్రహించుట లేదేమిటి? పూర్వాపరములను అత్యంత సునిశితంగా విచారించగల నీ బుద్ధి ఇప్పుడు ఏమి చేయుచున్నది?

ఓ రామయ్యా! ఈ దేహములతో సహా... స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తు అంతా కూడా... 'అసత్తే' అయి వున్నదయ్యా. ఇదంతా స్వప్నంలో లాగా అభాసమాత్రంగా ఉదయిస్తోంది.

దీర్ఘకాలంగా స్థిరంగా ఉన్నట్లు కనిపిస్తున్న ఈ లోకములు, ఈ బ్రహ్మాండములు మొదలైనవన్నీ ఒక దీర్ఘ స్వప్నంలోలాగా మిథ్యారూపముగానే కనపడుచున్నాయి. ఈ జగత్తులో అనుభవమగుచున్న ఆకృతి అంతా... "ఒకతనికి తన కంటి దోషం చేత ఆకాశంలో రెండవ చంద్రుడు కనిపించడం" వంటిది మాత్రమే.

అజ్ఞానికి ఈ దృశ్యం, ఈ ప్రపంచం వస్తుమయంగానూ, ప్రాప్త–అప్రాప్తములతోనూ, రకరకాల పరిస్థితులతో నిండినదిగా కనిపిస్తోంది. సాంసారిక వాసనలు నశించినట్టి జ్ఞానికో...? అతడు ఈ సంసారస్వప్నమును చూస్తున్నప్పటికీ, పరమార్థదృష్టిచే ఏమాత్రం మార్పు చేర్పులూ చూడకయే ఉంటున్నాడు. అందుకని, అతనికి ఇంకొక విధంగా కనిపిస్తోంది.

ఈ సంసారము అజ్ఞానాత్మయందే ఆయా జీవుల స్వభావమును అనుసరించి పరికల్పించ బడి, దర్శింపబడుచూ... మోక్షపర్యంతము ఇట్లే ఉంటోంది. జలంలో ఆవర్తం పొందు స్వభావం ఉన్నట్లు, బీజము నందు అంకురించు స్వభావం దాగి ఉన్నట్లు జీవుని యందు చంచలమైన ఈ 'శరీరములు పొందుట' అను స్వభావం ఉండి ఉంటోంది.

కల్పనయే... వాస్తవరూపముగాగల ఈ దేహము, దేహభావము మనస్సునందే ఉండి ఉన్నది. మనసు అనేక రూపములు కలిగియున్నది. 'వాసనారూపము'చే దాని యందు అనేక దేహములు దాగి ఉన్నాయి. అట్టి అనేక దేహములలో 'కర్మపరిపాకము'చే ఏ శరీరము అభివ్యక్త మవుతుందో... ఆ శరీరపు 'ప్రతిభాస'యే ఈ జీవునకు కాలక్రమంగా సంభవిస్తోంది. అంతేగాని అన్నిటి యొక్క ప్రతిభాస ఒక్కసారే జరుగదు. మట్టియే కుండయొక్క ఆకారముగా అగుచున్నట్లు కర్మలు, భావనలు... ఇవే శరీరముల రూపమున ప్రదర్శితం అగుచున్నాయి.

ఈ సమష్టి దేహముల కర్తయే బ్రహ్మదేవుడు. బ్రహ్మదేవత్వము కూడా ఈ జీవుని స్వభావము యొక్క ప్రవాహానుగుణమైన ఒక సంప్రాప్తియేనని గ్రహించు. ఎందుకంటే అది కూడా అతని వాస్తవతత్త్వమైయుండలేదు. అయితే సర్వక్రియా సమర్థుడు, సమష్టి సృష్టిభావకుడూ అగు బ్రహ్మదేవునియొక్క సంకల్పమాత్రముచే ఈ అపారదృష్టి అంతా స్థితి పొంది ఉంటోంది. ఆయన తన సంకల్పనా సామర్థ్యముచే వస్తు ధర్మచమత్కారమంతా రచిస్తున్నారుకదా!

**శ్రీరాముడు:** మహాత్మా! మొట్టమొదట జీవచైతన్యము ఉండి ఉన్నది... అది మనోరూపమును పొందుతోంది. ఆ తరువాత అది సమష్టి సృష్టి స్వరూపుడగు 'హిరణ్యగర్భుడు' అను 'స్థితి' లేక 'పదము' పొందుచున్నది కదా! అసలు శుద్ధ చైతన్యమునకు హిరణ్యగర్భుని రూపము పొందవలసిన అగత్యమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అట్టి పరిణతి యొక్క క్రమమేమిటో వివరిస్తాను. శ్రద్ధగా విను–

ఆత్మతత్త్వమునకు వాస్తవానికి దేశకాలపరిచ్ఛిన్నత్వమనేదే లేదు. అయితే అది స్వశక్తిచే లీలామాత్రంగా 'భావనచేయటం' అను వ్యవహారమును ఎందుకో పొందుతోంది. ప్రశాంత జలంలో తరంగమునకు సంబంధించిన స్పందన వలె ఆ భావనయే ఈ పరిచ్ఛిన్న దేహ అనుభవమునకు, కలుషితమైన దేశకాలముల అనుభవమునకు ప్రారంభస్థానం.

వాసనావేశమే మనస్సు యొక్క రూపం. భావనయే వాసనలకు బీజం. అట్టి మనస్సు కల్పన – అకల్పనలతో చంచలమై ఉంటోంది. 'జీవుడు' అనగా మనస్సే అయి ఉన్నది. పుష్పము నందు గంధం వలే బ్రహ్మము నందు 'మనఃశ్శక్తి' అంతర్లీనమైయున్నది. అట్టి మననశక్తి యొక్క ఆవిర్భావమే 'సృష్ట్యాది".

**పుర్యష్టకము -** ఈ దేహమే పుర్యష్టకము అంటున్నాం. ఒక పురమునకు ఎనిమిది దిక్కులు ఉన్నట్లు, ఈ దేహమునందు ఎనిమిది తత్త్వములు నిర్వచించబడుచున్నాయి.

1. **జ్ఞానేంద్రియ పంచకము :** చెవులు – చర్మము – కళ్ళు – నాలుక – ముక్కు (+) వాటి కార్యక్రమములగు... శబ్దము – స్పర్శ – రూపము – రసము – గంధములు.
2. **కర్మేంద్రియ పంచకము:** వాక్కు – కాళ్ళు – చేతులు – పాయువు – ఉపస్థ.
3. **వాయు పంచకము :** ప్రాణవాయువు – అపానవాయువు – వ్యానవాయువు – ఉదానవాయువు – సమానవాయువు.
4. **భూత పంచకము :** భూమి – వాయువు – అగ్ని – జలము – ఆకాశము.
5. **అంతఃకరణ చతుష్టయం :** మనస్సు – బుద్ధి – చిత్తము – అహంకారము.
6. **అవిద్య :** "ఆత్మదృష్టి" లేక "ఆత్మ స్వభావము" నుండి విక్షేపము. బాహ్యాపాదార్థికదృష్టి యొక్క ఆశ్రయము.
7. **కామము :** "మరింకేదో కావాలి"... అను కోరుకొను ప్రవృత్తి.
8. **కర్మము :** క్రియావ్యాసంగము.

ఈ "పుర్యష్టకము" సర్వప్రాణుల హృదయమునందు ఒక తుమ్మెదనుబోలి ఉంటున్నది.

❖

ఆత్మయందలి మనఃశక్తి యొక్క అత్యంత ప్రారంభస్థితియే సృష్ట్యాది. అట్టి సృష్ట్యాది యందు ఇట్లు భావనాక్రమము జరుగుచున్నది:

**1. శబ్ద తన్మాత్ర -** సర్వశబ్దములకు బీజభూతము శబ్దతన్మాత్ర. ఇట్టి శబ్దతన్మాత్రము, ఆ శబ్దము యొక్క అనుభవమునకు స్థానమగు శ్రోత్రింద్రియము (చెవులు)ను భావన చేయుచున్నది. ఆత్మ అట్టి శబ్దస్థానమగు నిర్మలాకాశమును పొందుచున్నది.

**2. స్పర్శ తన్మాత్ర -** తరువాత క్రమంగా 'స్పందన'ను అనుసరించి మనస్సు ఘనత్వం పొందుతోంది. అప్పుడు ఆ మనస్సు స్పర్శకు బీజభూతమైన 'స్పర్శతన్మాత్ర' వైపుకు ఉన్ముఖ మగుచున్నది. అనగా 'స్పర్శ' వైపు చలించు వాయువు యొక్క భావనను ఆత్మయే ఆశ్రయిస్తోంది. అట్టి స్పర్శ పొందు స్థానము లేక ఆకాశమే చర్మము.

**3. రూపతన్మాత్ర -** శబ్ధ, స్పర్శ తత్త్వములైన ఆకాశ–వాయువు సంఘాతముచే 'రూపము' యొక్క భావన ఏర్పడుతోంది. అదియే 'కన్ను' స్థానమునకు కారణమై 'చూచుట' అను ప్రక్రియగా కార్యసిద్ధి పొందుతోంది.

**4. రస తన్మాత్ర -** ఇట్లు శబ్ద, స్పర్శ, రూపముల పరిణామంచేత మనస్సు మరికొంత ఘనత్వం పొందుతోంది. అప్పుడామనస్సు క్షణంలో నిర్మలప్రకాశం యొక్క భావన పొందుతోంది. ఆకాశ–వాయు–అగ్ని గుణాలచే వృద్ధి చెందిన మనస్సు రసమునకు బీజమైనట్టి "రసతన్మాత్ర"ను పొందుతోంది. రసేంద్రియమును భావించి వెంటనే రసతన్మాత్ర దశను ఆ మనస్సు పొందుతోంది.

**5. గంధ తన్మాత్ర -** అట్లే ఆ రసతన్మాత్ర గంధయుక్తమగు స్థూలరూపమును పొంది గంధతన్మాత్రగా ప్రకటించుకొనుచున్నది.

ఆ తరువాత ఆత్మయే స్వయం నిర్మితమైన మనస్సు సహాయంచేత ఈ దేహము నుండి దృశ్యజగత్తును వీక్షిస్తోంది. పంచభూతములు తమతమ సూక్ష్మదశలను త్యజించుచు, ఆకృతిని కలిగినవిగా అగుచున్నాయి. అనగా స్థూలత్వమును పొందుచున్నాయి. అనుభవము యొక్క స్థూల స్వరూపమే ఈ మనోబుద్ధుల సంచయమైయున్నది.

తీవ్రమైన వాసనలతో కూడిన మనస్సు, పుర్యష్టకముతో ప్రకటితమగుచున్న ఈ దేహమును భావనచేయుచున్నది. "నా యొక్క స్వరూపము పుర్యష్టకముతో కూడిన ఈ దేహమే కదా..." అని భావించుచు, తదనుకూలంగానే ఆయా క్రియావ్యవహారమునకు ఉద్యుక్తురాలగుచున్నది.

కర్మపరిపాకముచే మనస్సు స్థూలత్వం పొందుతోంది. అప్పుడు బాహ్యమున, అంతరమున 'స్థూల, సూక్ష్మ' దేహములతో ప్రకాశించుచున్నది.

పుర్యష్టక రూపమైన భావనాతత్వమునే 'లింగదేహము' అని అంటున్నాం. అట్టి ఆ లింగదేహము అనేక విచిత్రములైన రచనలతో కూడిన ఈ స్థూలదేహమును స్వభావసిద్ధంగానే స్వీకరించుచున్నది.

❖

ఈ మనస్సు తన యొక్క వాసనల వలన పొందిన దేహమును ఆకాశమున వ్యాప్తమై ఉన్నదానివలె గాంచుచున్నది. "ఇది నా దేహము". "ఇది విశాలమై వ్యాపించి యున్నది." "నేను ఈ శరీరంలో ప్రసరించియున్నాను." "ఊర్ధ్వభాగంలో శిరస్సుగాను, అధోభాగంలో పాదములుగాను, ఇటు అటు చేతులుగాను, మధ్యభాగంలో పొట్టగాను రూపం కలిగి ఉన్నాను" అని ఈ జీవుడు భావిస్తున్నాడు. "జ్వాలాసమూహం" వంటి ఆకృతి గల ఈ జీవుడు వ్రేళ్ళు మొదలైన అవయవములతో ప్రకటితమగుచున్న ఈ దేహమును ఎందుకు గ్రహించుచున్నాడు? తనయందలి 'మనోరథము' అనుదానికి వశమగుటచేతనే. మననశీలమగు ఈ మనస్సు స్వవాసనావశం అగుచూ కల్పితమగు శరీరము కలిగి వర్తిస్తోంది.

❖

మనుజునకు ఈ దేహము కాలము యొక్క 'గతి', లేక, పరిపాకము చేత ప్రత్యక్షరూపమున ఉదయిస్తోంది కదా! అదే విధంగా ఈ మనస్సు కూడా "స్వశరీరవృద్ధి" పొందుతోంది. అనగా విస్తారత్వమును ఆశ్రయించుచున్నది. అట్టి విస్తారత్వ ప్రభావంచేత "నేనే ఈ సర్వమునందు

విస్తరించి విరాజిల్లుతున్నాను. నా సంకల్పమే ఇదంతా. ఇక్కడ నాది కానిది, నేను కానిది లేదు" అను భావనాదార్ఢ్యంచే ఈ జీవుడే బ్రహ్మదేవుని పదమును పొందుచున్నాడు.

సర్వలోక పితామహుడు, బ్రహ్మదేవుడు మొదలైన పేర్లతో పిలువబడుచున్న ఆ సమష్టిజీవుడు బుద్ధి-సత్వము-బలము-విజ్ఞానము-ఐశ్వర్యములను ధరించినవాడై విరాజిల్లుచున్నాడు.

(సమష్టి తత్వాహంకారి = A 'will' that is operating the cosmic aspect of creation.

వ్యష్టి తత్వాహంకారి = A will that is operating the individual.)

నిర్మల మనస్సుతో కూడిన ఈ సమష్టి తత్త్వస్వరూపుడు కూడా చిదాకాశము నుండి సంభవించినవాడే...! అట్టి 'సత్త'చే, అతడు ఈ అజ్ఞానరూపములను, ఈ పంచీకృత వ్యవహారములను సృష్టించుచున్నాడు. తన మనస్సు యొక్క నిర్మలత్వముచే అతడు సత్యసంకల్పుడై ఉంటున్నాడు. అతడు దేనిని ఎట్లు సంకల్పిస్తాడో, అది అట్లే పంచీకృత సమన్వితమై ప్రభవిస్తోంది.

ఈ ఆకాశము – భూమి మొదలైన పంచీకృతములు, ఆయా అనుభవములు కూడా.. ఆత్మ యందే స్థితి కలిగినవి అయివున్నాయి. ఇవన్నీ అతడు లీలా మాత్రంగా సృష్టిస్తున్నాడు. రచిస్తున్నాడు. అతడు ఒకప్పుడు ఆద్యంత రహితమైన విశాలాకాశమును సృష్టిస్తున్నాడు. మరొకప్పుడు నిర్మల జలమును ఉత్పన్నం చేస్తున్నాడు. ఇంకొకప్పుడు ప్రళయాగ్ని జ్వాలలచే ప్రకాశమయమగు మండలమును రచించుచున్నాడు.

అట్లే భూమి, వృక్షములు, దేహములు కూడా అతని సంకల్పానుసారమే రూపము పొందుచున్నాయి. ఆ ప్రభువు జన్మ పొందిన క్షణం నుండి లోకములను సృష్టించుచు పోతున్నాడు. అతడు విష్ణువు (సృష్టించిన దాని యొక్క ఉనికి – స్థితులకు సంబంధించిన ప్రజ్ఞ) మొదలైన అనేక రూపములను ధరించి తాను సృష్టించినది తానే 'పాలన' చేస్తూ ఉంటాడు. అతని దేహం కూడా బ్రహ్మపదము నుండే సంకల్పబలంచేత ఉత్పన్నమగుచున్నది.

❖

ఇట్లు 'మనస్సు' అనేది బ్రహ్మము నుండే ఉత్పన్నమౌతోంది. ఒక సమయంలో అజాన ఆవృతమైనట్టి ఆ మనస్సు విష్ణుభగవానుని కుక్షియందు ఉంటోంది. అప్పుడు పూర్వ సంస్కారములన్నీ మరచి, ఆదమరచి సుషుప్తి దశను పొంది ఉంటోంది. నిద్రలేచిన తరువాత అప్పుడు ప్రకాశమయమగు తన దేహమును అవలోకించుచున్నది.

**దేహము -** ఈ కనబడే దేహం పంచభూతముల (భూమి, జలం, వాయువు, అగ్ని, ఆకాశం) యొక్క శుద్ధ విభాగములచే రచించబడుచున్నది. కోట్ల కొలది రోమములచే వ్యాప్తమై ఉంటోంది. నవద్వారములు కలిగినదై, చర్మముచే సుందరముగా అలంకరించబడి ఉంటోంది.

ఆ భగవానుడగు బ్రహ్మదేవుడు తన ఇచ్ఛానుసారమే ఈ శరీరములను, తృష్ణలను, జీవులను, చిత్తములను తన చిత్త – శరీరమునందు కలిగి ఉంటున్నాడు.

❖

ఇట్లు సమష్టి – సంకల్పుని ఇచ్ఛాలీలయే ఈ సర్వము అయి ఉంటోంది. నిర్మల దృష్టి గల అతడే "ఆకాశమును రచించెదనుగాక" అని చింతించినపుడు ఆకాశము ఏర్పడి ఉంటోంది.

బ్రహ్మదేవుడను పేరుగల అతడే భూత–భవిష్యత్తు–వర్తమానములన్నీ ఎరుగుచున్నాడు. ఇప్పటికే అతడు ఎన్నో సృష్టి సమూహములను దర్శించాడు. "నాయందు అస్థిత్వము కలిగియున్న ఈఈ జీవుల ధర్మాధర్మములు ఇట్టివి" అని క్రమముగా అతడు స్మరించుచున్నాడు.

అట్లే వేదములను, జీవోత్పత్తిని, తదితరములను చిత్ర విచిత్రములగు సంకల్పములచే రచించుచున్నాడు. ఈ ప్రాణులకు స్వర్గమోక్షములు, ధర్మకామములు సిద్ధించటానికి అనేక విధము లైన ఆచారములను, శాస్త్రములను రచించింది ఆయనే.

ఆ సమష్టి సంకల్పుని లేక హిరణ్యగర్భుని లేక బ్రహ్మదేవుని స్వరూపము, స్వభావము కూడా మనస్సే. దృశ్యమానమైయున్న ఈ 'సృష్టిశోభ' అంతా మనస్సు నుండే స్థితి పొందియున్నది. హిరణ్యగర్భుని పదము పొందిన మనస్సే వివిధ రచనలచేత, క్రియావిలాసములచేత, శోభాయ మంతములగు ఈ జగత్తులను కల్పన చేయుచున్నది.

❖❖❖

# 14. జగత్తులు - దేశకాలములు

**శ్రీరామచంద్రుడు:** ఈ జగత్తు దేశకాలములు... ఎప్పుడు ఏర్పడి, ఎప్పుడు అంతమౌతున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "ఈ జగత్తు ద్రష్ట సిద్ధించుకొన్నదే. అంతేగాని, నిర్మితమైనది కాదు"... అని విజ్ఞులచే గ్రహించబడుచున్నది. అనగా ఇదంతా మనోవిలాసము, ప్రతిభాసమాత్రము అయి వున్నది. ప్రతిభాసకంటే వేరుగా ఇక్కడెక్కడా ఏదీ లేనే లేదు.

**'దేశ కాలములు' -** దేశకాలనబడేవి ఈ బ్రహ్మాండం, ఒక్కదానిలోనే వ్యాప్తమై ఉన్నాయి... అని అనుకోకూడదు సుమా! కోట్లకొలది బ్రహ్మాండాలు వర్తమానంలో ఉన్నాయి. ఒక్కొక్క బ్రహ్మాండము ఒక్కొక్క రీతిగా స్థితిగతులు కలిగిఉన్నది. కోట్లకొలది బ్రహ్మాండాలు భూతకాలంలో లయించిపోయాయి. కోట్లకొలది బ్రహ్మాండాలు భవిష్యత్తులో ఉద్భవించబోవుచున్నాయి. ప్రతి జీవుని హృదయము నందు అద్దంలో ప్రతిబింబిస్తున్న వస్తువుల వలె కోట్ల కొలది బ్రహ్మాండాలు ప్రతిభాసమాత్రంగా స్ఫురించుచున్నాయి. ఇంతలోనే అదృశ్యమగుచున్నాయి.

వెయ్యి మాటలెందుకు? ఒక్కసారి పైకి చూడు. అనంతపరిమాణంగల ఆకాశం కనబడు చున్నది కదా! ఇదంతా కలిసికూడా 'దేశకాలములు' అనబడుదానిలో ఒక్క స్వల్ప భాగమును కూడా పూరించలేకపోతున్నాయని గ్రహించు.

**జగత్తు -** స్వప్నద్రష్ట తన స్వప్నంలో చూచే నగరంవలె ఈ జగత్తు సంకల్పమాత్రమే అయివున్నది. "గోడ గాని, తెరగాని లేకుండానే రంగులచే లిఖించబడిన గొప్ప కళాఖండం కనబడు తోంది..." అను వాక్యములోని విచిత్రార్థంలాగా ఈ 'అసత్తే' అయిన జగత్తు ద్రష్టకు ప్రాప్తిస్తోంది.

అయితే ఏ దేశ– కాలములలో ఈ జగత్తు ప్రతిభాసమౌతోందో, అదంతా చైతన్యమే అట్లు దర్శింప బడుచున్నదని సూక్ష్మబుద్ధితో గ్రహించు. "ఈ కనబడే సర్వమునకు అధిష్ఠానము అయినట్టి, ద్రష్టస్వరూపమునకు ద్వితీయము కానట్టి"... ఆ చైతన్యమే అంతా కూడా!

వాస్తవానికి ఈ జగత్తు శూన్యాకాశమాత్రమే. ఇదంతా నిర్మితమైన దానివలె కనిపిస్తున్నది. కానీ, అంతా కూడా అకృతమే. అనగా ఇది ఎవ్వరిచేతనూ నిర్మించబడలేదు. ఆకాశంలోని మేఘ నిర్మిత ఉద్యానవన దృశ్యం వంటిదే ఈ జగత్తు. యాదృచ్ఛికంగా ఏర్పడే సంయోగ వియోగము లచే ఆయా ఆకార వికారములు ఏర్పడుచున్నాయి. ఆపై ఇక తదితరమైనదంతా ద్రష్ట యొక్క భావనచే చోటు చేసుకుంటోంది.

ఈ దేహాదులు, ఈ త్రిలోకములు... ఇవన్నీ కూడా మనస్సు చేతనే కల్పించబడ్డాయి. 'చూచుట' అనే క్రియలో నేత్రముల కర్తృత్వము ఎట్టిదో, ఆ రీతిగా, ఇదంతా మనస్సు యొక్క కేవలం 'ఊహాదృశ్యము'తో సమానమైనది గాని, సత్యము కాదు.

పదార్థయుక్తమగు ఈ జగత్తు భ్రమచేతనే గాంచబడుచున్నది. ఎందుకంటావా? "సత్తు"నకు వేరుగా ఈ పదార్థములు ఎక్కడ ఉన్నాయి?

పట్టుపురుగు తన కొరకు గూటిని నిర్మించుకొనుచున్నట్లు, ఈ మనస్సు కూడా తన నివాసము కొరకు శరీరమును కల్పించుకొనుచున్నది. సత్యదృష్టితో పరిశీలనాత్మకంగా చూస్తే ఈ మనస్సు అర్థశూన్యము, సంకల్పమాత్రమే సుమా! అయితే ఏం...? మనస్సు రచించలేనిది లేదు. ఇది ప్రాప్తించజేసుకోలేని దుష్కరవస్తువంటూ ఎక్కడా ఏదీ ఉండజాలదు. ఆశ్రయించికూడా, అది పొందజాలనట్టి శక్తులు ఆ ఫాలాక్షుని వద్ద కూడా లేవు. సర్వశక్తులు మనస్సులోనే ఉన్నాయి. ఈ సత్–అసత్ స్వరూపములగు సమస్తపదార్థములు సర్వశక్తిమంతమగు మనస్సు చేతనే సదా స్థితివంతములు అగుచున్నాయి. ఈ శరీరము కూడా మనోభావమును అనుసరించే ప్రాప్తిస్తోంది. ఈ మనస్సుకు ఏ మనఃకల్పన, వర్ణనలకూ ఏమాత్రం అందనంతటి శక్తి ఉండి ఉన్నది.

**దీర్ఘస్వప్నము -** "ఈ దేవతలు, అసురులు, మనుష్యులు, జంతువులు – వీరంతా ఎవరు?" అను ప్రశ్న వచ్చినప్పుడు "వీరంతా మనస్సు యొక్క సంకల్ప శక్తిచేతనే రచించబడుచున్నారు." అను సమాధానము లభించుచున్నది. మనస్సు యొక్క సంకల్పరూప సంచలనమే నశించిం దనుకో... అప్పుడు నూనె క్షీణించుచున్న దీపంలాగా ఈ అనేక విధములైన సృష్టి దర్శనమంతా శమించి పోతోంది. కాబట్టి రామా! ఈ జగత్తు అంతటినీ ఒక దీర్ఘ స్వప్నమును చూస్తున్నట్లే, గమనిస్తూ ఉండు. "ఆకాశము" అను శబ్దమునకు గల అర్థమువలెనే ఇదంతా కల్పనా మాత్రంగా మనోవిలాసమాత్రంగా ఎరుగుము.

**న జాయతే న మ్రియతే ఇహాకించిత్కదాచన ।**
**పరమార్థేన సుమతే మిథ్యాసర్వం తు విద్యతే ॥** (సర్గ 45, శ్లో 14)

అల్ప అర్థములను త్యజించి పరమార్థమును ఆశ్రయించినప్పుడు “ఈ జగత్తునందు ఏదీ ఉత్పన్నమగుటలేదు, నశించలేదు”... అనియే గ్రహించబడుతోంది. వాస్తవానికి ఇదంతా మిథ్యయే అయివున్నది. ఎందుకంటావా? ఆత్మ ఏ కాలమందు గాని వృద్ధి క్షయములు పొందుతోందా? అప్రమేయమగు ఆత్మ మనో-బుద్ధి-చిత్త అహంకారాలుగా పరిణమించటం జరుగుతుందా? ఆత్మ స్వతహాగా వస్తురహితమైయుండగా అందు సూక్ష్మ శరీరాదులు ఎట్లా ఏర్పడతాయి చెప్పు? అఖండమగు ఆత్మ వస్తువునందు ‘జీవుడు’ తదితరులు వంటి ఖండత్వమంతా ఎట్లా సంభవించ గలదు? సంభవించదు.

అసలు ఒక మాట చెప్పు? నీవు సర్వదా ఈ దేహమునకు విలక్షణమైనయున్న అపరిచ్ఛిన్న మగు అనంతాత్మను వీక్షించాలి. అట్టి అపరిచ్ఛిన్న అనంతాత్మను వీక్షించకుండా ఈ అహంకార రూపమగు పరిచ్ఛిన్నమును పొందవలసిన అవసరమేముంది? అందుకు ప్రయోజనంగా ఎంతగానో విమోహితుడవే అగుచున్నావు కదా! అట్లు ఎందుకు అల్పత్వము ఆశ్రయించాలి? ఎడారిలో తరంగములకు సంబంధించిన భావన, దాహము – ఈ రెండూ కలసి మృగములకు మృగతృష్ణలో నీరు కనబడేటట్లు చేస్తాయి. అట్లే ఈ బ్రహ్మ మొదలైన సృష్టికర్తలు, తదితరములు మిథ్యగానే గోచరిస్తున్నాయి. పదార్థదృష్టిచే ఆకాశం ఏదీ కాకున్నప్పటికీ ఏదో లేత నీలిరంగు పదార్థం అయివున్నట్లు కనిపిస్తుంది. ఈ జగత్తులోని సర్వవస్తువులు ‘మిథ్యారూపమే’ అయి వుండి, ‘ఘనమగు అజ్ఞానము’ చేతనే ఆవృతమై ఉంటున్నాయి. నౌకలో ప్రయాణం చేస్తున్న యాత్రికునకి ఒడ్డున ఉన్న చెట్లు కదలుచున్నట్లు కనిపిస్తూ ఉంటుంది కదా! అందుచేతనే, “ఈ సమస్తం మనః కల్పితము మాత్రమే. ఇదంతా ‘ఉంది, లేదు’ అను రెండింటి కంటే విలక్షణమై, అనిర్వచనీయమై ఉన్నది”... అని శాస్త్రకారులు మనకు మరల మరల గుర్తు చేస్తున్నారు.

**“ప్రపంచరహితమగు ఆత్మ” యొక్క భావన -** ఓ రాఘవా! ఇదంతా బ్రహ్మమే అయి ఉన్నది కదా! ఇక దీని యందు ‘భిన్నత్వము’నకు సంబంధించిన ప్రసంగం ఎందుకు చెప్పు? అనేక తరంగములలో జలము యొక్క అధిష్ఠానముచే అభేదమే సిద్ధిస్తుంది కదా! “ఇది పర్వతము -స్థాణువు. ఇది నగరము-సంచలనయుక్తము”... ఇటువంటి ఆడంబరమంతా అసద్రూపము, స్వప్నతుల్యమే అయినప్పటికీ, మనస్సు యొక్క భావనాబలంచేత “ఇదంతా స్వరూపమే” (ఏర్పడి ఉన్నదే) అను విధంగా పరిలక్షితమై ప్రాప్తిస్తోంది. తత్త్వవిచారణ లేనివానికి ఈ జగత్తంతా కామ వాసనాసహితము, తృష్ణారూపము, స్వర్గనరకములవంటి అనేక విషయములతో కూడినదిగా కనబడుతోంది. అతనికి ఇందులో అనేక జన్మపరంపరలు మరల మరల ప్రాప్తిస్తున్నాయి.

అందుచేత రామా! నీవు ప్రపంచరహితమగు ఆత్మవస్తువునే సర్వదా భావిస్తూ ఉండాలి. ఆత్మనే చూడాలి.

**స్వప్నతుల్య జగత్తు -**

**యథా స్వప్నో మహారంభో భ్రాంతిరేవ నవస్తుతః।**
**దీర్ఘ స్వప్నం తథైవేదం విద్ధి చిత్తోపపాదితమ్ ॥** (సర్గ 45, శ్లో 20)

స్వప్నంలోని పదార్థజాతమంతా భ్రాంతి మాత్రమే గాని వాస్తవం కాదు కదా! చిత్తముచే నిర్మించబడిన ఈ దృశ్యానుభవం అట్టిదే. ఈ సంసారము అనేక భోగములకు ఆటపట్టై, విశాలం గాను, రమణీయముగాను తోచుచున్నది. కొందరికి అత్యంత దుఃఖభరితంగానూ, మరికొందరికి మోదభరితంగానూ అనుభవమౌతోంది. కాని సత్యదృష్టిచే పరిశీలిస్తే... ఇదంతా తుచ్ఛము, క్షణ భంగురము అని తెలిసిపోతోంది. ఆహాఁ! ఇదంతా ఎన్నో ఆశలకు నిలయమై ఈ జీవుని భ్రమింప జేయటానికి అనుక్షణం సిద్ధపడుచున్నది కదా...! అందుచేత రామా! ఈ దృశ్యం నిన్ను ఆక్రమించ కుండా నీవు నిరోధించాలి. అందుకు గాను ముందుగా అంతరంగమునందు దీనిని త్యజించి ఉండు. అట్లు గాక 'ఇది అసత్తు' అని తెలిసికూడా దీనియందు అనురాగమో లేక ఆశ నిరాశలో కలిగియుండే వారికి ఇక నేను ఏం చెప్పగలను?" "మృగతృష్ణలో నీరు ఉండదు" అని తెలిసి కూడా "పోనీలే... అయినా చూద్దాం, ఈ తరంగాలు చూచి ఆనందిద్దాం"... అని మృగతృష్ణ వైపుకు పరుగులు తీయుటలో అర్థమేమున్నది?

కనుక నీవు దేనిపట్లా ఆసక్తిగాని, అనురాగముగాని కలిగిఉండవలసిన పనేమీ లేదు. సంకల్పముల స్వరూపము, మనోరథమయము అయినట్టి ఈ 'మాయావైభవము' వెంట పరుగులు తీస్తున్న మూఢుని తిప్పలు వర్ణనాతీతం. అతడు అనంతకాలంగా దుఃఖమునే పొందుచున్నాడు.

❖

'ఆత్మ' అనబడు మహత్తరమైన వస్తువు స్వస్వరూపమునకు అద్వితీయమై ఏర్పడి ఉండనే ఉన్నది. అట్టి ఆత్మ వస్తువు సర్వదా వేంచేసి ఉండగా, అసత్తే అయినట్టి ఈ దృశ్యప్రపంచముచే ఆకర్షణ-వికర్షణలు పొందుతూ పరుగులు తీయవలసిన పనేమున్నదో చెప్పు? ఆత్మవస్తువును వదలి మరింకేదో పొందాలని తాపత్రయపడుతూ వచ్చుచున్నవాడు పరమ పురుషార్థమును పొందలేకయే పోతున్నాడు. అనేక నీచమార్గములలో అనేకసార్లు ప్రయాణించి శ్రమచే దారిగానక దుఃఖితుడగుచున్నాడు. 'త్రాడు'ను చూచి 'పాము' అని అనుకొని భయపడునట్లు, ఈ జగత్తు వ్యామోహమాత్రమే అయివున్నది. భావనావైచిత్ర్యము గొలిపేదిగా తోచుచున్నది. చంచలమగు తటాకజలంలో చంద్రప్రతిబింబం "చూచారా! చంద్రబింబము ఎంతగా నీళ్ళలో ఇరికిపోయి, వంకరటింకరగా ఉన్నదో?"... అని కలవరించేది బాలుడే గాని విచక్షణాజ్ఞాని కాదు. మిథ్యా భూతములగు అసత్ పదార్థములచే అజ్ఞాని మోసగించబడవచ్చుగాక! తత్త్వజ్ఞాని దేనిస్థానము ఏమిటో, ఎట్టిదో గ్రహించియే ఇందు క్రీడా మాత్రంగా సంచారం సలుపుచున్నాడు.

ఓ సర్వజనులారా! "శబ్దము-స్పర్శ-రూపము" మొదలైన గుణ సంఘాతమునకు చోటు అగుచున్న ఈ దేహమును చూచుకొని, "ఈ దేహమే నేను"...అను అహంభావమును ఆశ్రయించి, ఈ దృశ్యమునందు "సుఖం" అను స్థానం కొరకు వెతకుచుండెడివాడు జ్ఞానుల దృష్టిలో 'మూర్ఖుడు' అని అనిపించుకుంటున్నాడని మీ అందరికీ గుర్తు చేస్తున్నాను. ఎవడైనా ఊహచే కల్పించబడిన అగ్నిచే చలికాచుకోగలడా? లేదు. మనస్సు యొక్క మననశక్తిచే ఒకడు తన ఊహలోనే గొప్ప

నగరం, ఆ నగరంలో విశాలమైన వీధులు, ఆ వీధులలో ఒక ముఖ్యమైన ప్రదేశంలో తన మూడంతస్తుల మేడ, ఆ మేడలో అనేక గదులు, పరిచారికలను చూడగలడు కదా! అదే రీతిగా విశాలము, జడము, పంచభూతాత్మికము అగు ఈ దేహాదులు ఎదురుగా అనుభవమగు చున్నాయి. ఈ జగత్తు చిత్తము యొక్క ఇచ్ఛచేతనే ఉదయించుచున్నది. ఇచ్ఛ లేనప్పుడు అదృశ్యమై పోవుచున్నది. సంకల్పంలోచూడబడు ఒక ప్రియవస్తువులాగా ఈ నిర్మల దృశ్యమంతా మిథ్యా రూపముననే దృశ్యమానమగుచున్నది.

ఓ రామచంద్రా! ఈ జగత్తు నశించినంత మాత్రం చేత ఇక్కడ నశించేదంటూ ఏదీ లేదు. లేక ఇది వృద్ధి పొందినప్పటికీ అధికమయ్యేదేదీ లేదు. హృదయంలో మనస్సుచే నిర్మించ బడి ఏది నశిస్తోంది? ఏది వృద్ధి చెందుతోంది? స్వప్నంలో కనబడిన ఒక చెట్టు ఖండింపబడితే నశించేదేమి ఉంటుంది? చిన్నపిల్లలు తమ ఆటలలో అనేక కల్పనలు చేసుకుంటూ ఉంటారు చూచావా? ఆటలలో పిల్లలు పొందే కేరింత ఖేదముల వంటివే అజ్ఞానజీవుల సాంసారిక అనుభవాలు.

ఈ జగత్తు నిరంతరం మనస్సుచే కల్పించబడుచున్నది. ఇంద్రజాలంలో కనిపించే వస్తువులు నశించినా ఏదీ నశించనట్లు, ఇంద్రజాల తుల్యమగు ఈ జగత్తు యొక్క ఆవిర్భావ తిరోభావాలచే ఏవరికి ఏమి హాని ఉంటుంది చెప్పు? ఏదైతే యథార్థానికి లేదో, అట్టిది ప్రకటితమైతే ఏమున్నది? కాకపోతే ఏమున్నది?

కనుక ఇప్పుడు చెప్పు...! ఈ ప్రపంచమున "హర్షము-శోకము"లకు తావు ఎచట?

**అసదేవ యదత్యన్తం తస్మాత్కిం నామ నశ్యతి ।**
**నాశాభావే హి దుఃఖస్య కః ప్రసంగో మహామతే ॥** (సర్గ 45, శ్లో 39)

ఎల్లప్పుడు అసత్తైనట్టి దానికి నాశనమేమిటి? 'నాశనము' అనేదే లేకపోతే ఇక అసలు దేని గురించైనా ఎందుకు దుఃఖించాలి? సర్వదా సద్వస్తువై ఉన్న దానికి నాశనమే లేదు కదా! అవినాశియగు సద్వస్తువే నీవై ఉండగా, ఇక నీవు దుఃఖించేది దేని కొరకు? ఈ జగత్తంతా బ్రహ్మమే అయివుండగా, ఇక సుఖ దుఃఖములు కలుగవలసిన పనేమున్నది?

**విజ్ఞానదృష్టి -** ఇప్పుడు విజ్ఞులయొక్క అవగాహనను క్రోడీకరించి చెపుతాను, విను-

'అసత్తే' అయి ఉన్నదానికి హాని వృద్ధులు ఆపాదించి హర్షశోకములు పొందటం బాలురు క్రీడలలో గెలుపు-ఓటముల, ఉత్సాహ-నిరుత్సాహాల అనుభవం పొందటం వంటిది మాత్రమే. అసత్యము, నిరంతర జనన మరణ స్థానము అయివున్న ఈ దృశ్యజగత్తులో విజ్ఞులైనవారికి అభిలషించవలసినదేదీ ఉండజాలదు. లేదా "ఇదంతా బ్రహ్మమే కదా!" అను అవగాహన పొందుటచే వారు దేనినీ త్యజించవలయునను సంఘర్షణ కూడా పొందకయే ఉంటున్నారు.

"ఇది గ్రహించాలి... ఇది త్యజించాలి" అనుటకు తగినదేదీ వారికి ఇక్కడ లభించుటలేదు. "ఈ నామరూపాత్మకమగు విశ్వము అసత్తు. ఇద్దాని అధిష్ఠానమగు బ్రహ్మము సత్తు" అని గ్రహించిన ప్రాజ్ఞుడు ఇదంతా చూస్తూ కూడా ఎట్టి సుఖ దుఃఖములకు లోను అగుటలేదు. ఒక్క

అజ్ఞానియే ఈ జగత్తునందు "ఇది వాస్తవమే" అను బుద్ధికలిగియుండుటచే, ఇందలి పదార్థముల వినాశనములను చూచి అంతులేకుండా దుఃఖములను పొందుచున్నాడు.

❖

సునిశితమైన బుద్ధితో ఈ చెప్పే విషయం గురించి యోచించు! ఏ వస్తువైతే మొదటగాని, చివరగాని ఉండుటలేదో, అది ఈ వర్తమానమునందు కూడా 'లేనిదే' అగుచున్నది.

అసత్తును ఇష్టపడేవానికి సర్వత్రా అసత్తే కనిపిస్తుంది. సత్తు మరుగునపడి ఉంటోంది. జలంలో ప్రతిబింబించే ఆకాశమును, నక్షత్రములను, చంద్రమండలమును చూచి, "ఈ ఆకాశము, చంద్రుడు మొదలైనవన్నీ జలంలోనే ఉండి ఉన్నాయి"... అని తలచి, వాటిని పట్టుకొనుటకు గజ ఈతగాళ్ళను పిలిపిస్తారా.... ఎవరైనా...? ఒక్క అమాయక బాలుడు తప్ప! ప్రాజ్ఞులకు జలంలో ఏది ఉన్నదో ఏది లేదో తెలుసు. విజ్ఞులు ఆత్మయందు ఉన్నదానిని, లేనిదానిని వేరు చేయగలుగుచున్నారు.

ఈ ప్రాపంచిక వస్తువులు, 'అర్థశూన్యం'. ఇవి సుఖము అను అభాస మాత్రం కలిగి వున్నాయి. అట్టి వస్తువులచే సంతుష్టిపొందుచూ, ఆయుస్సును గడిపివేయు మానవుడు చివరకు దుఃఖములనే పొందుచున్నాడుగాని, సుఖములను కాదు.

కనుక, రామా! నీవు సత్యమును మాయను విడదీసి ఉంచాలి. విడదీసి దర్శించాలి. విడదీసి ఆస్వాదించాలి. సుస్థిరపదమునే నిరంతరం ఆశ్రయించి ఉండు.

అజ్ఞానదృష్టిచే ప్రాప్తించుదానికి కలత చెందవలదు. దానియందు అనురాగముగాని, నైరాశ్యముగాని కలిగియుండవద్దు.

అజ్ఞానరహితంగా స్వస్వరూపాధిక్యత వహించియుండు. "ఇదంతా సత్యమగు బ్రహ్మమే" అని ఎరిగిన తరువాత, మౌనమును ప్రశాంతతను వీడకుండెదవు గాక!

❖❖❖

## దామ వ్యాళ కటోపాఖ్యానం - విషయ విచారణ సమాప్తం

## (తొమ్మిదవ రోజు విచారణ పూర్తి అయింది)

❖❖❖

# పదవ రోజు

# VI. దాశూరోపాఖ్యానము

### (ప్రారంభ విచారణ)

## 1. జీవన్ముక్తుడు - స్థితి, గుణములు, గతులు

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ పదవ రోజు విచారణ ప్రారంభంలో, దాశూరోపాఖ్యానంలో ప్రవేశించే ముందు ఈ 'స్థితిప్రకరణము'లో ఇప్పటివరకు మనం చర్చించిన విషయము ఒక్కసారి ఇంకొక కోణం నుంచి సమీక్షిద్దాం.

❖

ఓ రామచంద్రా! పైకి ఎంతో రమణీయంగాను, అత్యంత వాస్తవంగాను కనిపించే ఈ 'నాకు చెందినవి' అని చెప్పబడు "ధనము, వస్తుజాలము, పుత్రులు, స్వజనులు" మొదలైనవన్నీ 'సంకల్ప నగరము'* నందలి పదార్థములవంటివి. ఊహలు వచ్చిపోతున్నట్లే అవి కూడా వచ్చిపోతూ ఉంటున్నాయి. క్షణకాలంలో కనిపించే ఇంద్రజాలంలాగా, 'మృగతృష్ణ'లోని తరంగములలోని విభేదవ్యవహారంలాగా ఈ ధన-పుత్ర-స్వజన-గృహ-వస్తుజాలాదులపట్ల సంబంధములన్నీ ఏర్పడుచున్నాయి. అట్టి స్వప్న సదృశ విషయాలు ఉంటే ఏముంది? లేకుంటే ఏముంది? స్వప్నం లోని సంఘటనలను బాలురు మాత్రమే మననం చేసుకుంటూ దుఃఖము పొందుతారేమో గాని, విజ్ఞులు మాత్రం కాదు. "మాయామోహం" చేత ఏవేవో చమత్కార విషయాలు అతిశయించుటచే ఎవరు సుఖించగలరు చెప్పు? 'విషయభోగముల పట్ల, 'నాది' అను రూపం గల మమకారాదుల పట్ల – అనురాగము కలిగి ఉండుట'... అనునది చివరకు మూఢత్వము వైపుకే దారితీస్తోంది.

ఈ భోగములను, వీటి పర్యవసానములను గమనిస్తున్నప్పుడు జ్ఞానికి వైరాగ్యమే కలుగు చున్నది. అజ్ఞానిని అవన్నీ క్షణంలో వశం చేసుకొని, అతిత్వరలో దుఃఖితునిగా చేసివేస్తున్నాయి.

ఓ జనులారా! ధనాదులు మొదలైనవి నశించుచున్న సమయంలో సుఖదుఃఖాలను పొంద వలసిన పనిలేదని గుర్తుచేస్తున్నాను. ఇవన్నీ ఈ రోజు కాకపోయినా, ఏదో ఒక రోజు 'నాశనం' అను స్థితిని తప్పక పొందబోవుచున్నాయి. భ్రమ కలిగియున్న వారికి అవి నరక హేతువులే అగు చున్నాయి. కాబట్టే సాధుపుంగవులగు మహాత్ములు వాటిపట్ల సర్వదా విరక్తి కలిగి వర్తిస్తున్నారు.

---

* **సంకల్ప నగరము :** ఒకడు తన ఊహయందు ఒక నగరమును కల్పించి, అందు వస్తుజాలమును, జనులను తన సంచారమును ఊహిస్తూ అనుభవమును పొందుట.

కనుక మీరంతా 'తత్త్వజ్ఞులు' కావాలి. అందుకు ప్రయత్నమును ఆశ్రయించి ఉండండి. ఈ ప్రపంచంలో ఏ పదార్థములు వినష్టములగుచున్నాయో, వాటిపట్ల 'ఉపేక్ష' కలిగి ఉండండి. అంతేగాని 'అపేక్ష' కాదు.

**కామము -** ప్రాప్తించినవాటిని మాత్రం సేవిస్తూ ఉండండి. జ్ఞానులు స్వభావసిద్ధంగానే "అప్రాప్తములైన వాటిపట్ల ఇచ్ఛలేకుండుట – ప్రాప్తించిన వాటిపట్ల అనురాగ – విద్వేషములు కలిగి యుండకుండుట"... అనునది సాధన చేస్తూ ఉంటారు. అప్రాప్తములపట్ల ఏర్పడుచున్న ఇచ్ఛయే 'కామము' – అదే గొప్ప శత్రువు. అది ఈ ప్రపంచమున జీవులను తన ఇచ్ఛ వచ్చినట్లు భ్రమింపజేస్తోంది. ప్రచ్ఛన్నరూపమున "నిర్దయగా వధించే శత్రువు" వలె తారసపడుతోంది. మీరంతా ఈ 'కామము' విషయంలో అత్యంత జాగరూకులై ఉండాలి సుమా!

జ్ఞానవంతులు కావాలి. అజ్ఞానమునకు చోటు ఇవ్వకూడదు.

ఈ జనులలో కొందరు "ప్రపంచరహితమగు బ్రహ్మము" గూర్చి సమాచారం కలిగి ఉంటున్నప్పటికీ, పాపం, అప్రమత్తులై ఉండకపోవటం చేత ఈ 'సంసారాడంబరము' యొక్క వంచనను గుర్తెరుగుటలేదు. అట్టి ప్రమత్తతచే వారు దుర్భర భావనలను, దీనదశలను, వినాశనమును పొందుచున్నారు. అందుచేత ముందుగా ముముక్షువు అయినవాడు ఈ దృశ్య ప్రపంచములోని సంఘటనల పట్ల, పదార్థముల పట్ల 'ప్రీతి'ని నివర్తింపజేసుకోవాలి. అందుకు యుక్తి ఏదైనా ఫరవాలేదు. "పరమార్థతత్వము'తో కూడియున్న నిర్మలబుద్ధి"ని సంపాదించుకున్న వాడు మాత్రమే ఇక్కడ మోహసముద్రంలో క్రుంగకుండా తనను తాను రక్షించుకుంటున్నాడు. ఎవడైతే "ఈ జగత్తంతా అసత్యము" అని ఎరిగినవాడై సమస్త పదార్థముల నుండి "ఉపరతి" (withdrawal) పొందుతాడో, అట్టి వివేకిని మిథ్యయే అయివున్న ఈ అవిద్య ఏమీ చెయ్యదు, చెయ్యలేదు కూడా. "ఈ సమస్తమైన జగత్తూ, చివరికి నేను కూడా ఒకే పరబ్రహ్మమును స్వరూపముగా కలిగియున్నాము"... అని నిశ్చయించుకొనువాని బుద్ధి, ఇక ఇచ్ఛ–అనిచ్ఛలను స్వయంగానూ, స్వభావసిద్ధంగానూ, అప్రయత్నంగానూ త్యజించి వేస్తోంది. అట్టి బుద్ధిని సంపాదించుకున్నవాడు ఈ సంసార సముద్రమున మునుగడు.

❖

ఓ రాఘవా! 'వ్యక్తము–అవ్యక్తము'ల రెండింటి మధ్య వ్యాపించియున్న శుద్ధ బ్రహ్మ పదమును ముందుగా ఎరుగుము. అట్టి ప్రత్యగాత్మస్వరూపమునే సర్వదా ఆశ్రయించి ఉండు. ఇక ఈ బాహ్య– అభ్యంతర జగత్తులంటావా... వీటిని గ్రహించవద్దు, త్యజించవద్దు. శుద్ధ పరబ్రహ్మ స్వరూపమే నీవు... నేను... ఈ జగత్తు కూడా. అట్లయి ఉండగా, ఈ 'గ్రహించుట–త్యజించుట' అను వేదనలతో పని ఏమున్నది?

పూర్ణవిరక్తి, సంతుష్టి, అభిమానరాహిత్యము కలిగియుండుము. 'ఆకాశము' వలె దేని యందునూ 'ఆసక్తి' లేకయే ఉండు. అటుపై ఈ ప్రపంచంలో యథాతథంగా వ్యవహరిస్తూ ఉండు.

'ఇచ్ఛ, అనిచ్ఛ' ఈ రెండూ కూడా లేనట్టి తత్త్వజ్ఞాని వ్యవహారములు సలుపుచూ ఉన్నప్పటికీ, అతని బుద్ధి ఏ మాత్రం 'లిప్తము' అవటం లేదు. కమలము నీళ్ళలో ఉన్నప్పటికీ ఆ నీరు కమలమును అంటుతోందా? పడవ నీళ్ళలో ఉన్నా కూడా, నీటిని పడవలోకి రానిస్తున్నామా? లేదు కదా!

ఆసక్తి రహితమైన నీ మనస్సు ఇంద్రియసహితముగా "దర్శించుట-వినుట-స్పృశించుట" మొదలైన క్రియలందు పాల్గొనుచున్నదా? అయితే కానీ. నీవు మాత్రం ఎల్లప్పుడూ ఆత్మనిష్ఠుడవై ఉండు. అంతరంగమున, ఇచ్ఛారహితుడవై వెలుగొందుచుండుము. "ఇది నాది"... అను భావన ఏర్పడుచున్నప్పుడు "ఇది అసత్తే కదా" అను అవగాహనతో ఈ సర్వమును దర్శిస్తూ ఉండు. ఒకవేళ ఏ సమయందైనా 'శబ్దము-స్పర్శ' మొదలైన ఇంద్రియార్థములపట్ల అభిముఖం కావలసిన అవసరం ఏర్పడినదనుకో... వాటియందు నీ మనస్సు తగుల్కొనకూడదు. నీవు వాటియందు నిమగ్నుడవు కాకుండెదవు గాక!

ఇచ్ఛ-అభిమానము-భావావేశము మొదలైనవి లేకుండా ఉండటమే వాస్తవమైన అభ్యాసం. ఇంద్రియవ్యాపారములను నిర్వర్తిస్తూ ఉండు... లేదా చేయకయే ఉండు. ఏది ఏమైనా..."ఇదంతా జీవుని స్వకీయ కల్పనయే. అట్టి కల్పనకు కర్త - భోక్త అగుచున్న ఈ జీవుడు సర్వదా నిష్క్రియుడు, శుద్ధుడు అగు పరబ్రహ్మమే అయివున్నాడు" అను దృష్టిని సుస్థిరపరచుకోవాలి! ఎప్పుడైతే 'ఇంద్రియార్థములు' అయినట్టి ఈ శబ్ద - స్పర్శ-రూప - రస - గంధములు నీకు రుచికరములు కాకయే ఉంటాయో, అప్పుడు నీవిక జ్ఞాన - విజ్ఞానసంపన్నుడవై ఈ సంసార సముద్రమును దాటి వేస్తున్నట్లే అవుతుంది. అట్టి స్థితిలో నీవు ఈ జగత్తులో తదితరులవలె సంచరిస్తున్నా..., లేక సర్వం త్యజించి సమాధినిష్ఠుడవైయున్నా... ఫరవాలేదు. అట్టి అవగాహన పొందిన తరువాత ఇక ఆపై నీవు నీవుగా కోరుకొనకపోయినప్పటికీ, 'ముక్తి' అనునది అనాయాసంగా నిన్ను సమీపించగలదు.

కాబట్టి రామా! "సర్వోత్తమ పదప్రాప్తి" కొరకు జ్ఞానవైరాగ్యములను ఆశ్రయించు. ఉత్తమ ప్రజ్ఞచే వాసనాసమూహముల నుండి నీ చిత్తమును వేరు చేయి.

ఒక నదిని దాటాలంటే 'నావ' కావాలి కదా! అట్లాగే 'ప్రజ్ఞ' అనే నౌకను ఎక్కి 'వాసనలు' అను జలముతో నిండియున్న ఈ సంసారసాగరమును దాటివేయవచ్చు. అట్లు ప్రజ్ఞను ఆశ్రయించనివారు సంసారసాగరంలో మునిగిపోతున్నారు.

ముందుగా నీ బుద్ధిని వివేక-వైరాగ్యయుక్తం చేయి. తీక్ష్ణవంతం చేయి. పరమ ధైర్యోపేతము, ఉత్సాహవంతము అయిన బుద్ధితో ఆత్మతత్త్వమును విచారించు. ఆ తరువాత 'స్వాత్మపదము' నందు ప్రవేశించు. జ్ఞానముచే 'పరివర్ధితము' అయిన చిత్తము కలవాడవగుము. బుద్ధిమంతులు, తత్వవేత్తలు అగు మహాత్ములు ఎట్లు విహరిస్తున్నారో అట్టి అవగాహనతో కూడుకొని నీవు కూడా విహరించాలి గాని, ఒక మూర్ఖునివలె కాదు సుమా! నిత్యతృప్తులు, మహాధీశాలురు, జీవన్ముక్తులు ఎట్లు పలుకుచున్నారో, ఏ ఉద్దేశము కలిగి ఉంటున్నారో, ఏ అర్థములను గ్రహిస్తున్నారో నీవు పరిశీలించు, గమనించు.

అంతేగాని, స్వ-పర వంచకులగు (Those who are deceptive towards themselves as well as towards others) అల్పదృష్టిగలవారి ఆచరణ నీకు తగదు.

❖

ఈ ప్రపంచంలో 'జగత్తు-బ్రహ్మము'ల యథార్థమేమిటో ఎరిగినట్టి మహాత్ములు ఉన్నారు. వారు విద్య, తపస్సు మొదలైన ఉత్కర్షలతో కూడిన ప్రభవములను గాని, అభిమానముగాని, కుల-శీలాదులతో కూడిన కీర్తి ప్రతిష్ఠలను గాని వాంఛించరు, ఇచ్ఛగించరు, త్యజించరు. ప్రాప్తాలైన వాటిని మాత్రం అనుసరిస్తూ ఉంటారు. "ఇవన్నీ మిథ్యారూపాలే"... అని సుస్పష్టంగా ఎరిగియే ఉంటున్నారు. మిథ్యారూపమైనవి పరమపురుషార్థమును ఎక్కడైనా తెచ్చి పెట్టగలవా?... లేదు. అట్టి మహాత్ములు సర్వము నశించినప్పుడు కూడా ఖిన్నులు కాకయే ఉంటున్నారు. ఇంద్రుని ఉద్యానవనమునకు కూడా వారిని ఆకర్షించగల శక్తి లేదు. సూర్యభగవానునివలె వారు శాస్త్ర ప్రసిద్ధమై ఉన్నట్టి తమ నియతిని త్యజింపకయే ఉంటున్నారు. అనగా తమకు విధించినది అంగీక రిస్తూ నిర్వరిస్తున్నారు. "విజ్ఞానము' అను మంచి సారథిని నియమిం చుకున్నవారై స్వస్థచిత్తులై, దేహము అను రథమును అధిరోహించి లీలామాత్రంగా ప్రపంచమంతటా విహరిస్తునారు.

ఓ రామచంద్రా! అట్టి మహత్తర విజ్ఞానము నీకు ఇప్పటికే ప్రాప్తించియున్నది సుమా! కనుక చక్కటి నిశ్చయముతో బుద్ధిబలముచే 'జ్ఞానము'నందు సుస్థితుడవై యుండుము. ప్రత్యక్షమగు 'ఆత్మదృష్టి'ని అవలంబించియుండుము. అభిమాన మాత్సర్యములు లేనివాడవై ఈ భూమిపై విహరించు. అదియే సర్వోత్తమమగు 'సిద్ధి' అని చెప్పబడుతోంది. స్వస్థచిత్తుడవై సర్వక్రియలకు అతీతుడవగుము. "విషయకౌతుకముచే వీక్షించాలి" అను కోరిక లేనివాడవై ఉండు. అంతఃకరణం నందు పరమశాంతిని పొందినవాడవై, లోకానుకూలంగా, శాస్త్రానుకూలంగా వ్యవహరించు.

❖

ఈ వాక్యములు శ్రీరాముని అంతఃకరణమును నిర్మలతచే శోభిరపజేశాయి. అతని హృదయము అతి మధురమగు 'జ్ఞానము' అను అమృతముచే నిండిపోయింది. అతడు పూర్ణ చంద్రునివలె శాంతమును పొందాడు.

❖❖❖

## 2. బ్రహ్మాండముల చమత్కారం

**శ్రీరాముడు:** మహాత్మా! సర్వధర్మజ్ఞా! వేదవేదాంగముల సారమైనట్టి తమయొక్క నిర్మల వచనములచే ప్రభావితుడనగుచున్న నేను ఇప్పుడు పూర్ణరూపమున స్వస్థుడనైయున్నాను. అనేక ఉపమానములు - యుక్తుల సహాయంతో మీరు మా హృదయములందు పరమార్థ యుక్తమగు 'ఆత్మతత్త్వము'ను ప్రకాశింపజేస్తున్నారు. తమ శ్రేష్ఠవాక్యములు ఎంతగా విన్నప్పటికీ నాకు తనివి తీరటం లేదు.

మీరు ఇతఃపూర్వము రాజస–సాత్విక–తామసిక జీవజాతుల ప్రసంగంలో "బ్రహ్మాండముల ఉత్పత్తి" గురించి కొన్ని విశేషాలు చెప్పారు. వేద, పురాణములను ప్రమాణంగా తీసుకొని మీరు చెప్పిన విషయాలు కాక, మరికొన్ని విషయాలు మరికొంత సుస్పష్టత కొరకై చెప్పండి.

ఈ బ్రహ్మాండాలన్నీ ఎవరు ఎవరి కొరకు ఏ ఉద్దేశంతో నిర్మిస్తున్నారు? వీటిపై సర్వ అధికారాలు కలిగి ఉంటున్నది ఎవరు? ఇవన్నీ ఉన్నదెక్కడ? ఎందులో? ఈ బ్రహ్మాండాలకు ఆవల ఉన్నది ఏమిటి? ఈ కాలగతి అంతా నడుపుచున్నది, ఈ సర్వక్రియలను శాసిస్తున్నది ఎవరు? ఇదంతా ఎప్పటికి వినాశనము కానున్నది? ఇక్కడి సృష్టి, ప్రళయములకు మూలకారణమేమిటి? అసలు ఈ జగత్తులో సత్యమైనదేది? అసత్యమైనదేది?

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని ఈ బ్రహ్మాండముల రచనా చమత్కృతి గురించి సంక్షిప్తంగా చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

**శ్రీ వసిష్ఠమహర్షి:** అనేక బ్రహ్మాండములు ఉద్భవించాయి... గతించాయి. నేటికి అనేక లక్షల మంది బ్రహ్మలు, వేలకొలది నారాయణులు, శంకరులు గతించారు. ఇప్పుడీ బ్రహ్మాండమునందు అనేక విధములైన ఆచార–విచారాదులు కలిగిన దేవ–రాక్షసాదులు విహరిస్తున్నారు. అట్లే ప్రతి ఒక్క బ్రహ్మాండములో అనేక రీతులుగా వ్యవహారసరళి జరుగుచున్నది. ఒకే కాలమునందు మరియు వివిధకాలము లందు ఏర్పడుచున్నట్టి అనేక బ్రహ్మాండములలో అనేక జీవులు జన్మించారు. బ్రహ్మ మొదలగు సమష్టి సృష్టికర్తలచే నిర్మించబడిన బ్రహ్మాండములలో ఈ జీవుల ఉత్పత్తి ఒక విచిత్రమైన ఇంద్రజాలములవలె ఒప్పుచున్నది.

ఈ సృష్టులన్నీ ఒకప్పుడు మహేశ్వరునిచే నిర్మించబడుచున్నాయి. మరొకప్పుడు బ్రహ్మదేవుడే వీటిని రచించుకుంటూ పోతున్నాడు. వేరొకప్పుడు మునుల చేతను, విష్ణువు చేతను ఇవన్నీ రచించబడుచున్నాయి.

కొన్ని బ్రహ్మాండములలో బ్రహ్మదేవుడు కమలమునుండి ఉద్భవిస్తున్నారు. మరొకప్పుడు జలములోంచి బయల్వెడలుచున్నారు. అట్లాగే అండము నుండి, ఆకాశము నుండి కూడా కొన్ని బ్రహ్మాండములు ఉద్భవించటం జరుగుతోంది. ఒక బ్రహ్మాండములో మహేశ్వరుడు, మరొక దానిలో సూర్యుడు, ఇంకొక దానిలో ఇంద్రుడు అట్లే విష్ణువు మరియు తదితరులు ఆ బ్రహ్మాండము లోని తదితర దేవతలపై ఆధిపత్యం వహించి ఉండటం జరుగుతోంది.

❖

ఒక 'సృష్టి' యందు ఈ భూమి అంతా మొట్టమొదటగా వృక్షములచే వ్యాప్తమై ఉంటోంది. మరొకప్పుడు మనుష్యులచేత, పర్వతములచేత ఆక్రమించబడుతోంది. ఒక భూమండలము మట్టిమయం, మరొకటి శిలామయం, ఇంకొకటి రాగిమయం, అట్లే స్వర్ణమయంగాను ఉంటున్నాయి. ఓ రామా! అంతదాకా దేనికి...? మన ఈ బ్రహ్మాండమే తీసుకో... ఇందులో ఎన్నో ఆశ్చర్యకరమైన జగత్తులు ఉన్నాయి. అట్లే తదితర బ్రహ్మాండముల విషయం కూడా. కొన్ని జగత్తులలో ఒక్క సూర్యుని ప్రకాశము మాత్రమే కలదు, మరింకేదీ ఏ మాత్రం లేదు. కొన్నిటిలో

అసలు 'ప్రకాశము' అనునదే లేదు. ఆహాఁ! బ్రహ్మమే రూపముగా గల ఈ మహాకాశంలో సముద్రజలంలోని తరంగాలలాగా ఎన్ని బ్రహ్మాండములు ఉత్పన్నమౌతున్నాయి! ఎన్ని లయిస్తు న్నాయి! సముద్రంలోని కెరటాలకు అంతు ఎక్కడ? ఎడారిలో ఎన్ని మృగతృష్ణలు ఉన్నాయో లెక్కించి చెప్పేదెవరు? తంగేడు చెట్టుకు కాచే పూలు ఎన్నని, ఎన్నిసార్లని చెప్పమంటావు? పరమాత్మయందు ఈ ప్రపంచముల శోభ అనంతసంఖ్యలో ప్రకటితమౌతున్నాయి. ఇంకా... సూర్యకిరణములలోని త్రసరేణువులను (ధూళిరేణువులను) లెక్కపెట్టవచ్చునేమో! పరబ్రహ్మమున గల ఈ చంచల జగత్ సమూహములను మాత్రం ఎవరు లెక్కబెట్టగలరు? వర్షాకాలంలో అనంత సంఖ్యలో దోమలు, రెక్కపురుగులు పుట్టి, సంచరించి, నశిస్తాయి చూచావా? నిరంతరం ఉత్పన్నం అవుతూ, నశించుచున్నట్టి ఈ సృష్టి సమూహములు ఎప్పటినుండి కొనసాగుచున్నాయో చెప్పటం ఎవరి తరం? అయితే, "ఈ అనంత జగత్ – ప్రవాహరూప వ్యవహారమంతా అనాది, ఈ సర్వము పరబ్రహ్మమే"... అని గ్రహించు. శాస్త్రాదులచే మనకు అందజేయబడుచున్న వివరణ అదే. ఆద్యంతరహితమైన ఈ సృష్టి నిరంతరం తరంగమువలె స్ఫురిస్తూనే ఉన్నది.

ఈ సృష్టికి ముందు పూర్వసృష్టి ఉన్నది... ఆ పూర్వసృష్టికన్నా ముందు ఇంకొక సృష్టి ఉన్నది... ఆ ఇంకొక సృష్టికన్నా ముందు వేరొక సృష్టి ఉన్నది... ఆ వేరొక సృష్టి కంటే ముందు మరొకటి ఉండనే ఉన్నది...

ఇట్లు ఈ వ్యవహారమునకు అంతులేదు, ఉండబోదు, నదిలో తరంగాల లాగానే ఈ సుర–అసుర–మనుష్యాది ప్రాణికోట్ల వివిధజాతులన్నీ పుడుతున్నాయి, నశిస్తున్నాయి. బ్రహ్మదేవుని యొక్క ఈ బ్రహ్మాండం వంటివే, ఒక సంవత్సరములోని క్షణములవలె, వేలాది బ్రహ్మాండాలు పుట్టి ఇతఃపూర్వమే కాలగర్భంలో కలిసిపోయాయి. ఈ బ్రహ్మాండాలన్నీ స్థితి కలిగియున్నది ఎక్కడ?

**అన్యాః సంప్రతి విద్యన్తే వర్తమానశరీరకాః**
**ప్రాన్తే బ్రహ్మపురస్యాస్య వితతే బ్రహ్మణఃపదే.** (శ్లో 22, సర్గ 47)

ఓ రామచంద్రా! సర్వుల అంతరంగమున అతి సూక్ష్మంగా 'బ్రహ్మపదము' అనునది వ్యాపించియున్నది. అట్టి ఆత్మపదము లేక బ్రహ్మమునందే ఇవన్నీ స్థితి పొందియున్నాయి. అట్టి హృదయాంతరంగమే... "హృదయపుండరీకము, బ్రహ్మపురము, బ్రహ్మపట్టణము'... అని కూడా శాస్త్రకారులు పిలుస్తున్నారు.

అనగా, 'హృదయమే బ్రహ్మాండముల స్థితి స్థానము' అని గ్రహిస్తున్నావు కదా! ఇవన్నీ బ్రహ్మపురంలో దృశ్యమానమై ఉంటున్న శోభలే సుమా! ఆకాశమందు శబ్దం పుట్టి, నశించు చున్నట్లు, ఈ బ్రహ్మాండములు కూడా ఉత్పన్నమై, స్థితిపొంది, నశించి పోవటం జరుగుతోంది.

మట్టిలోనే 'కుండ' అనునది ఉన్నది కదా...! విత్తు యొక్క అంకురమునందే చిగురు దాగి ఉన్నది కదా...! అదే విధంగా బ్రహ్మమునందే భూత–వర్తమాన–భవిష్యత్ కాల సృష్టి పరంపర లన్నీ ఉన్నాయి.

❖

అయితే ఒక చమత్కారం. విశాలాకారయుక్తాలైన ఈ సృష్టి పరంపరలు, ఈ త్రిలోకాలు... ఇవన్నీ తత్త్వజ్ఞానం పొందనంతవరకు మాత్రమే బ్రహ్మమునందు ఇట్లు దృశ్యమానమౌతూ ఉంటున్నాయి. అసలు 'బ్రహ్మాండము' అనగా ఏమిటి?

'అజ్ఞులచే, బ్రహ్మమునందు 'అధ్యాస' చేయబడి, దర్శించబడుచున్నది. అనిర్వచనీయము, మిథ్యా రూపము అయినదే ఈ బ్రహ్మాండ వ్యవహారము"... అని చెప్పబడుతోంది. అజ్ఞానము శేషించి ఉన్నంతవరకు ఆ అజ్ఞానమును అనుసరించియే ఈ జగత్తులన్నీ పెంచబడుతూ, పోషింప బడుచూ త్యజించబడుచున్నాయి. తత్త్వజ్ఞానుల దృష్టిలో ఇవి ఏ కాలమందునూ లేనే లేవు. 'ఊహ'లో కనిపించే మహాసౌధాలకు స్థితి ఎక్కడ? అంతు ఎక్కడ?

❖❖❖

## 3. జ్ఞాని ఇదంతా ఎట్లా చూస్తున్నాడు?

ఆహాఁ! ఏమి విచిత్రం! తరంగాలు లాగానే క్షణభంగురమైన ఆకృతి గల ఈ సృష్టి సమూహాలు చిత్ర-విచిత్రములైన రూపములతో, ప్రాణుల విచిత్రమైన చేష్టలతో కూడి ఉన్నాయి కదా! అయితే జ్ఞాని వీటన్నిటినీ మరొక విశిష్టమైన దృష్టితో చూస్తున్నాడు. ఆతని అవగాహనను అనుసరించి ఇవన్నీ పరమాత్మ కంటే వేరైనవి కావు. పరమాత్మయే ఇదంతా!

'పరమాత్మ నుండే ఈ సృష్టి పరంపరలు ప్రాదుర్భవిస్తున్నాయి"... అనే వాక్యం అజ్ఞానులచే తమ అసంపూర్ణ అవగాహన కారణంగా మాత్రమే ఏర్పడుతోంది. ఎందుకంటే ఇక్కడ ద్వితీయ మైనది ఏదైనా ఉంటే కదా, ఒకదాని నుండి మరొకటి ఉద్భవించటం!

జలముకంటే వర్షధారలు వేరా? ఆలోచించే వానికంటే 'ఆలోచన' వేరైనదా? మేఘములు జలముకంటే వేరైనవా? భావించేవానికంటే భావన వేరా? వృక్షము కంటే దాని కొమ్మలు, ఆకులు, పుష్పములు, కాండము మొదలైనవన్నీ వేరు అని అనటం ఎట్లా?

యథార్థానికి జ్ఞానికిగాని, అజ్ఞానికి గాని... ఈ సృష్టి బ్రహ్మము కంటే వేరుగా ఇంకెక్కడా, మరింకే విధంగానూ లభించేది కాదు.

అవ్యాకృత ఆకాశము నుండే ఈ స్థూలభూత నిర్మితములైన "శరీరము" మొదలైనవి, మరియు సూక్ష్మభూత నిర్మితములైన 'ఇంద్రియములు' మొదలైనవి, తక్కిన సమస్త పదార్థములు ఉత్పన్నములౌతున్నాయి. ఇవన్నీ కూడా సూక్ష్మతత్త్వములతో (శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం – తన్మాత్రలు) అవినాభావ సంబంధం కలిగినవై ఉంటున్నాయి. ఆ అవినాభావ సంబంధమే సృష్టి.

❖

ఇక్కడ సృష్టికి సంబంధించి చెప్పబడిన కొన్ని శాస్త్ర, పురాణ ప్రవచనములు ఉదహరిస్తాను. విను. అన్నిటికన్నా ముందుగా ఒక సమయంలో ఆకాశము స్థూలభావం పొందుతోంది. అందు లోంచి 'సమష్టిసృష్టి' అను స్వభావము గల 'బ్రహ్మదేవుడు' అను తత్త్వము ఉదయిస్తోంది. "అనేక

పదార్థాలతో కూడిన ఈ సృష్టి అను స్వరూపం కలవాడను నేనే” అను అహంభావమే బ్రహ్మదేవుని యొక్క నిజస్వరూపం. అతడే ‘ప్రజాపతి’ అని, ‘ఆకాశజుడు’ అని కూడా పిలువబడుచున్నాడు.

ఒకప్పుడు వాయువునందు ఏర్పడుచున్న స్థూలభావముచే సమష్టి సృష్టి అహంకారియగు ప్రజాపతి ఆవిర్భవించుచున్నాడు. అందుచేత, అతడు ‘వాయుజుడు’ అని చెప్పబడుచున్నాడు. అట్లాగే అగ్ని నుండి స్థూలభావం పొందుటచే ఆ ప్రజాపతిని ‘తేజసుడు’ అని, పృథివి నుండి స్థూలభావం పొదు ప్రజాపతికి ‘పార్థివుడు’ అని, జలము నుండి స్థూలభావము పొందిన ప్రజాపతికి ‘వారిజుడు’ అని పౌరాణికంగా చెప్పబడుచున్నారు. ఈ ఆకాశము – వాయువు – జలము – అగ్ని – పృథివి అనబడు ఐదు భూతములు రెండేసిగా విభజించబడి, మరల వాటిలో ఒకొక్కటి నాలుగు విభాగములుగా చేయబడింది. అట్లు విభక్తములైన ఒక్కొక్క భాగము (5×2×4=40 లో ఒక్కొక్కటి) అర్థభాగం నాలుగు భాగములందు చేర్చబడగా అప్పటి మిగతా అర్థభాగము నుండి బ్రహ్మదేవుడు ఉత్పన్నమగుచున్నాడు అతడే సమష్టి – సృష్టి ఇచ్ఛాస్వరూపుడు (The form of universal will). అతడే భవిష్యత్తు కాలంలోని జగత్క్రియలన్నీ ఒనర్చుచున్నాడు.

**నారాయణుడు -** ఇతడు స్వయంభువు. ఇతని జన్మకు మరింకేదీ కారణం కాదు. వాస్తవానికి జన్మరహితుడగు ఈతడు జలంలో ప్రథమ తరంగంలాగా ఆవిర్భవిస్తున్నాడు. స్వకీయ మాయచే ఇతడే సర్వ తదితర వ్యవహారములకు కారణము. కాబట్టి, ఇతడు ‘ఆదికారణుడు’గా వేద వేదాంగాలచే స్తుతింపబడుచున్నాడు. ఈ జీవుని యొక్క ఆది స్వరూపమే అతడని గ్రహించు. అతడి హృదయమే “ఆకాశజుడు, వాయుజుడు, తైజసుడు, వారిజుడు, పార్థివుడు”... అను ప్రజాపతు లకు జన్మస్థానమైయున్నది. నారాయణుని ముఖము నుండో, పాదముల నుండో, వెనుక భాగం నుండో, పృష్టముల నుండో, నేత్రముల నుండో, హస్తాదుల నుండో...ఇట్లా ఏదో ఒక భాగము నుండి ఈ నామ–రూప–శబ్దాదులన్నీ ఉదయిస్తున్నాయి.

ఆ నాయణుడు అనబడు ఆది పురుషుని యొక్క నాభిప్రదేశం నుండి ఒక కమలము ఉత్పన్నమగుచున్నది. ఆ కమలము నుండి బ్రహ్మదేవుడు ఉద్భవిస్తున్నాడు. అందుచేత అతడు ‘పద్మజుడు’ అను పేరుతో శ్లాఘించబడుచున్నాడు.

❖

**శ్రీరాముడు:** స్వామీ “జీవుని యొక్క శుద్ధ స్వరూపమే” అయి ఉన్నట్టి ఆ నారాయణుని యొక్క నాభికమలము నుండి ‘సమష్టి సృష్టి’... అను స్వరూపంగల బ్రహ్మదేవుడు ఆవిర్భవిస్తున్నాడు కదా! అట్లు ఆవిర్భవించేది ఎవరు? నారాయణుడేనా? లేక మరింకొకరా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** (పకాలున నవ్వుతూ...) ఓ రాఘవా! “నారాయణుడు బ్రహ్మదేవునిగా పరిణతి చెందుచున్నాడు”... అని తలచకూడదు సుమా! ఎందుచేతనంటావా? ఒక్క ప్రథమ తత్త్వమగు స్వస్వరూపము తప్ప తక్కినదంతా స్వప్నభ్రాంతి వంటిదే. ఇది మిథ్యారచనాచక్రము, మనోకల్పిత రాజ్యములవలె ‘మాయ’యే అయివున్నది.

నారాయణుడు= జీవుని సర్వసంకల్పములకు ముందే ఉన్నట్టి శుద్ధ స్వస్వరూపము.

బ్రహ్మదేవుడు = అనేక ఉపాధులను సంకల్పిస్తున్నట్టి ఆ నారాయణుని (లేక ఈ జీవుని) సమష్టి సృష్టి సంకల్పము.

వాస్తవానికి పరమాత్మ దేనితోనూ ఎట్టి సంగమమూ ఏ సమయమందునూ లేనివాడు. అతడు అద్వితీయుడు (ఈ జీవుని శుద్ధస్వరూపమునకు అతడు వేరుగా మరెక్కడా లేదు). మరి, అట్టి ఆ శుద్ధతత్వము (నారాయణుడు) నందు ఆశ్చర్యజనకమూ, ద్వితీయమూ అయినట్టి ఈ సృష్టి జనించుట ఏమిటి? లేదు. 'మాయ' యొక్క కార్యము మాత్రమే కనుక 'పురుషుని నాభికమలము నుండి పురుషుడు ఉద్భవించెను" అను వ్యవహారమంతా బాలుని మనోరాజ్యము వంటిదే. ఈ విషయము గ్రహించి, ఆపై నాచే చెప్పబడు సృష్టి విశేషాలు విను–

మరొకప్పుడు నిర్మలాకాశంలో మనస్సు యొక్క శక్తిచే ఏదో విభాగము (ఉదా: బంగారు రంగులు విరజిమ్ము వనములు మొ॥) సంకల్పించబడగా, అందులోంచి సృష్టికర్తయగు బ్రహ్మ దేవుడు ఆవిర్భవిస్తున్నాడు. ఇంకొకప్పుడు మహాపురుషులగువారు జలమునందు వీర్యము ఉంచగా ఆ వీర్యము నుండి భూమి అను పద్మమో లేక విశాలమగు బ్రహ్మాండమో బహిర్గతమౌతున్నది. అట్టి 'భూపద్మము' నుండి బ్రహ్మదేవుడు ఆవిర్భవించినప్పుడు 'పద్మజుడు' అని చెప్పబడుచున్నాడు.

ఒకప్పుడు పూర్వకల్పములోని ఒక భక్తుడు ఈ కల్పంలో 'బ్రహ్మ' అగుచున్నాడు. మరొక సారి పూర్వకల్పములోని వరుణుడు గాని, వాయువుగాని ఈ కల్పంలో సృష్టికర్తయగు 'బ్రహ్మ' గా అగుచున్నారు.

❖

ఇదంతా అట్లు ఉండనిమ్ము, మరొకకోణం నుంచి అసలు ప్రశ్నకు వస్తే, అనగా, పరమార్థంగా చూస్తే, బ్రహ్మము నందు "బ్రహ్మలు" ఎక్కడ? బ్రహ్మము బ్రహ్మముగానే ఉంటోంది గాని మరింకేదీ ఎన్నడూ బ్రహ్మమునందు ఉత్పన్నమగుటలేదు.

ఈ విధంగా శాస్త్రకారులచే వివిధ రీతులుగా బ్రహ్మదేవుని విచిత్రమైన ఉత్పత్తుల గురించి చెప్పబడినది వర్ణించి చెప్పాను. అంతా విన్నావు కదా! అయితే వారల ఉత్పత్తి యందు 'నియమము" అనునదేదీ లేనేలేదు. బ్రహ్మదేవుని సృష్టిలాగానే తదితరమగు సర్వము యొక్క సృష్టి కూడా 'నియమము' అనునది లేకుండానే ఏర్పడుతోంది.

**మనోవిలాసమాత్రము -** అంతా విన్న తరువాత ముఖ్యంగా ఒక్క విషయం గ్రహించు :

**మనోవిజృంభణమిదం యాశ్చ జాతయశ్చేత్థమాగతాః ।**
**సంబోధనాయ భవతః సృష్టిక్రమ ఉదాహృతః ॥** (శ్లో 48, సర్గ 47)

ఈ "ప్రపంచము" అనబడేది మనస్సు యొక్క విలాసము మాత్రమే. ఇదియే ఇక్కడ ముఖ్యమైన సిద్ధాంతము. ఈ విషయం నీవు చక్కగా గ్రహించటానికే వివిధ సృష్టుల క్రమమంతా చెప్పాను. ఈ సాత్విక, రాజసిక, తామసిక జీవజాతులు కూడా మనోవిలాస మాత్రం చేతనే

సంభవిస్తున్నాయని గ్రహించు. ఎంతవరకైతే ఈ మనస్సు సమూలంగా నశించకుండా ఉంటోందో, అంతవరకు ఈ సృష్టి-వినాశనములు, సుఖ-దుఃఖములు, జ్ఞాన-అజ్ఞానములు, బంధ-మోక్షాలు సంభవిస్తూనే ఉంటాయి. ఈ సృష్టికర్తలు, భూత-భవిష్యత్-వర్తమాన కాలాలలో ప్రియ-అప్రియ వస్తువులు, వాటి పట్ల స్నేహ-శత్రుభావనలు మరల మరల ఉత్పన్నవటం, శమించటం జరుగుతూనే ఉంటుంది.

మనస్సే అన్నిటికీ మూలం. దీపం వెలగటం ప్రారంభించి, అస్థిరమగు ఆకారము కలిగి యుండి మరల ఎప్పుడో శమిస్తుంది చూచావా? అట్లే బ్రహ్మదేవుడు మొదలగు చతుర్ముఖ ఆకారములు ఏర్పడటం, శమించటం... ఇదంతా కాలము యొక్క ప్రవాహగతిత స్వభావమే కాని మరింకేమీ కాదు.

దీపం స్వల్ప కాలంలోనే లయిస్తోంది. ఇక బ్రహ్మదేవుడో... ద్విపదార్ధంతమున అంతర్ధాన మగుచున్నాడు. అనగా "ద్వైతప్రకృతి" లయించగా ఆతడు కూడా శమించుచున్నాడు. ఈ ఇద్దరి భేదం కాలహరణమే గాని మరింకేమీ కాదు.

**కాలన్యాయము -** "కృత-త్రేత-ద్వాపర-కలి" యుగాలు మరలమరల సంభవిస్తున్నాయి. అట్లాగే చక్రభ్రమణంలాగా ఈ జగత్తులు వస్తున్నాయి... పోతున్నాయి... రోజులు యుగములు కల్పములు... మన్వంతరములు - వీటి పరంపరలు ఒకదాని వెనుక మరొకటిగా మరల మరల ఏర్పడుచున్నాయి. రోజులు దొర్లుచున్నట్లే కార్యసమూహమంతా మరల మరల సంభవిస్తోంది. ఈ జగత్తంతా పరిచ్ఛిన్నములగు అనేక పదార్థములతో కూడి ఉంటోంది. జీవులు 'ఆయువు' అను గాలివాలుకు మరల మరల ఈ జగత్తులోకి వచ్చిపోవుచున్నారు.

బాగుగా కాల్చబడగా కణకణలాడే 'ఇనుపముద్ద'లో స్వభావ సిద్ధంగానే అగ్నికణములు ఉండి ఉంటాయి కదా! చిదాకాశమున ఈ సమస్త పదార్థములు స్వభావంగానే స్థితి కలిగియున్నాయి. ఒక వృక్షములో "ఫలములు కాయుట, పూలు పూయుట" అను స్వభావం రసరూపమున అవ్యక్తంగా ఉండి, ఆయా ఋతువుల సమయంలో ప్రకటితమౌతూ ఉంటున్నట్లే ఈ జగత్తంతా పరమాత్మయందు స్వతహాగా ఉండి ఉంటోంది.

❖❖❖

# 4. ఈ ప్రపంచము ఎక్కడి నుండి వచ్చింది?

**చిత్స్వర్ధ ఏవ సర్వాత్మా నర్వదై వేదృశాకృతిః ।**

**యదస్మాజ్జాయతే సర్గో ద్వీన్దుత్వమివ లోచనాత్ ॥** (శ్లో 58, సర్గ 47)

సర్వాత్మకమగు చైతన్యం నుండి ఏదేది వివర్తమగుచున్నదో (బయల్వెడలుచున్నదో) అదంతా చిద్రూపమే అవుతుంది కాని, మరింకేమీ కాదు. "పరమాత్మ నుండి సృష్టులు ఏర్పడుచున్నాయి"... అనునదంతా "కంటిదోషముచే వినీలాకాశంలో రెండవ చంద్రుని చూడటం" వంటిది మాత్రమే.

ఈ సృష్టి అంతా చైతన్యము నుండే ఆవిర్భవిస్తోంది. అట్టి చైతన్యమునందే అది 'స్థితి' కలిగి ఉంటోంది. చంద్రకిరణములు చంద్రునికంటే వేరుగా కనిపించినంత మాత్రంచేత "చంద్రుడు వేరు, చంద్రకిరణములు వేరు" అని అనగలమా? లేదు. ఈ కనబడే సృష్టి కూడా చైతన్యము కంటే వేరైనది కాదు. అయితే సర్వశక్తిమంతుడగు పరమాత్మ స్వభావం 'అసంగము, అద్వితీయము అయి ఉన్నది కదా! అట్టి పరమాత్మ యందు కనబడుచున్న ఈ ప్రపంచము వాస్తవము కాదు. స్వకీయ భ్రమచే ద్రష్టయే ఇదంతా ఇట్లు దర్శించుచున్నాడు.

అందుచేత, "ఈ ప్రపంచము ఎక్కడి నుండి వచ్చినది?"... అను ప్రశ్న ముఖ్యం కాదు. "ఇట్లు భేద దృష్టిచే బ్రహ్మమునకు బదులుగా ద్వితముతో కూడిన జగదనుభవమునకు మాత్రమే నేను ఎందుకు పరిమితుడనగుచున్నాను?" అనునది ముఖ్యమైన ప్రశ్న.

"జగత్తు" అనబడేది చిత్స్వభావమునకు భిన్నమైనది కానేకాదు. అనేక జన్మల దురభ్యాసము యొక్క ప్రభావముచేతనే ఈ జీవుడు దోషసహితమగు "జగత్తు వేరు, నేను వేరు, బ్రహ్మము వేరు" అను దృష్టితో గాంచటం జరుగుతోంది.

సర్వశక్తిమంతుడగు పరమాత్మ తనయందుతానే ఇట్లు మాయాసమేతుడై "జగత్ద్రష్ట" అను కర్తృత్వమునకు స్వయముగా ఒడిగట్టుచున్నాడు. అతడు అట్లు గాంచటం బహుచమత్కారమైన విషయమే. అది చిద్విలాసము, అనిర్వచనీయము అని చెప్పబడుతోంది. అయితే ఈ జగత్తు, ఇందలి చిత్రవిచిత్రములైన వస్తుజాలానుభవం – ఇవన్నీ కూడా ప్రళయము అనబడు స్థితికి ఈవల మాత్రమే ఉంటాయి. ఆవల ఉండవు. ఏ జీవుని దృష్టిలో ప్రపంచభావమంతా లయించి పోతున్నదో అతనికి 'ప్రపంచము' అనునదే లేని విషయమగుచున్నది.

ఎవ్వరి దృష్టిలో ఈ జగత్తు లేదో, అతనికి బంధమెక్కడిది? బంధం లేనిచోట, ఇక 'మోక్షము' యొక్క ప్రసక్తి కూడా ఉండదు కదా!

❖

ఓ మహామతీ! రామచంద్రా! జ్ఞాని యొక్క దృష్టిలో ఈ జగత్తంతా బ్రహ్మమే అయి ఉన్నది. ఏ విధంగా చూచినా సరే 'ప్రపంచం లేనిదే' అని సుస్పష్టపడుతూనే ఉన్నది. అయితే అజ్ఞాని యొక్క దృష్టికి మాత్రం ఈ ప్రపంచం 'ప్రవాహము' రూపములో నిరంతరం ఉండియే ఉంటోంది. 'మిథ్యయే' అయినప్పటికీ ఈ సాంసారికమాయ నిత్యమైనదానివలె అజ్ఞానులకు అనుభూత మౌతోంది. ఇక్కడ ఆత్మయే దృష్టితోకూడినదై ఉంటోంది. 'దృష్టి' ఉన్నంతకాలం మాయ ఉంటోంది. జగత్తు ఉంటోంది. కనుక ఒక రకంగా ఇదంతా నిత్యమైనదే కదా! నిత్యమైన దానికి సృష్టి ఏమిటి? స్థితి ఏమిటి? లయమేమిటి?

**జగత్తు యొక్క ఉత్పత్తి-వినాశనముల గురించి కొన్ని అభిప్రాయాలు :**

**1. మీమాంసకుల యొక్క అభిప్రాయం (పునరుత్పత్తి వాదం) -** 'ఈ జగత్తు ఉదయిస్తోంది. కొంతకాలం తరువాత నశిస్తోంది. మరల పుడుతోంది. కనుక ఇదంతా ఉత్పత్తి – వినాశనము –

పునరుత్పత్తి కలిగి ఉంటోంది. ప్రవాహంలో ముందుకుపోతున్న జలం స్థానంలో వెనుకటి నీరు క్షణంలో ప్రవేశిస్తోంది."

ఆ విధంగా తరంగతత్వంగా శాశ్వతంగా కనబడుచున్నట్లు ఈ ప్రపంచం కూడా, ఒక విషయం తొలగిన క్షణమే మరొక విషయం 'దృష్టి' యందు ప్రవేశించుచుండుటచే, 'ఉత్పత్తి – వినాశన సహితం' అనునదీ వాస్తవమే. దృశ్యము యొక్క ఉనికి' దృష్ట్యా చూస్తేనేమో, 'జగత్తు' ఏదో రూపమున ద్రష్టపట్ల ఉండనే ఉంటూ, 'నిత్యము' అనునది కూడా వాస్తవమే అగుచున్నది.

**2. క్షణికవాదుల అభిప్రాయం (క్షణికం) -** "ఈ జగత్తు అనుక్షణం నశించిపోతోంది. క్షణక్షణం మార్పుచెందని వస్తువంటూ ఇక్కడ ఏదీ లేదు. నశ్వరములై, క్షణంలో విధ్వంసమొందే 'విద్యుత్' వంటి పదార్థములే ఇవన్నీ."– ఇట్లు తమ తదితర ప్రవచనములు నిర్వాహణార్థం అనేక వాదోపవాదములతో ప్రతిపాదించబడు క్షణిక సిద్ధాంతం కూడా ఉచితమే.

ప్రవహించు నీటిలో జలబిందువులు క్షణకాల మాత్రమే 'ద్రష్ట' కు ఎదురుగా ఉంటాయి కదా! ఒకానొక జలబిందువేమో క్షణికం. జలతరంగం అనుక్షణికం. అట్లాగే ఒకానొకదృశ్యంగా క్షణికమే అయినప్పటికీ దృశ్యపరంపరగా అనుక్షణికమే!

**3. సాంఖ్యులు మొదలైన వారి అభిప్రాయం ("స్థిరవాదం") -** "ఇక్కడ చంద్రుడు – సూర్యుడు – కొండలు మొదలగునవి స్థిరంగానే ఉంటున్నాయి కదా! కాబట్టి ఇదంతా స్థిరమే. ఈ జీవుడు సుస్థిరస్వరూపుడే గాని, ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు ఉండనివాడు కాదు."

'స్వసత్త' దృష్ట్యా చూచామనుకో, ఇక్కడ ఎవరైనా ఏదైనా మార్పుగాని, చేర్పుగాని పొందుచున్నారా? లేదే! ఒకడు బాల్యంలో ఏ 'సత్త' అయి ఉన్నాడో, ఇక, నలుబది ఏండ్ల తరువాత, ఏబది ఏండ్ల తరువాత కూడా అదే 'సత్త' అయి ఉంటున్నాడు కదా! కనుక 'స్థిరవాదము' కూడా మరొక కోణము నుండి ఉచితమే అగుచున్నది.

'స్వసత్త' స్థిరమే అయినట్లు, అద్దాని దృశ్యసందర్శనా చమత్కారమూ స్థిరమే!

❖

**స్థిరము, కల్పితము -** ఇక మరొక విశ్లేషణ విను.

యథార్థానికి పరమాత్మ ఏకము, అనంతము, అనిర్వచనీయము అయి ఉన్నది. అట్టి సమున్నతమగు పరమాత్మయందు సంకల్పితమగు వస్తు జాలమంతా ఎట్లా ఉంటుంది చెప్పు? ఎక్కడ ఉంటుంది? కనుక బ్రహ్మం నందు పదార్థజాలము ఉండజాలదు. అట్టి శుద్ధ పరబ్రహ్మమే నీ యొక్క నా యొక్క ఈ సర్వుల యొక్క వాస్తవ స్వరూపమైయున్నది.

ఇక ఈ దృశ్యవ్యవహారమంటావా... ఈ సమస్తము మరల మరల సంభవిస్తూనే ఉంటుంది. ఈ జనన–మరణములు, సుఖ–దుఃఖములు, కరణ–కర్మములు, ఇవన్నీ ఆత్మ దృష్ట్యా లేవు. కాని శరీరము–మనస్సుల దృష్ట్యా ఇవి ఉంటూనే ఉంటున్నాయి. మరల మరల కలుగుచున్నాయి. ఆకాశంలో సూర్యుడు మరల మరల ఉదయిస్తున్నట్లే ఈ జీవుని హృదయంలో ఆశలు మరల

మరల చిగురిస్తున్నాయి. ఈ ఆకాశం, పర్వతములు, సముద్రములు, తదితర సృష్టి... ఇవన్నీ గతిస్తూ మరల మరల ఉత్పన్నమౌతూనే ఉన్నాయి. అదే రీతిగా దేవతలు, దైత్యులు, ఇంద్రుడు, వరుణ–వాయువులు మొదలైనవారంతా మరల మరల ఉత్పన్నమౌతూనే ఉన్నారు. లోకములు, లోకాంతరములు, సంగముమోక్షము మొదలగు క్రియలు మరల మరల సంభవిస్తూనే ఉన్నాయి. ఈ పృథివి కూడా అనేకసార్లు నశిస్తూ మరల ఉత్పన్నమగుచున్నది. సూర్య చంద్రులు మరల మరల ఉద్భవిస్తున్నారు. కొందరు జీవులు స్వర్గము నుండి తమ యొక్క పుణ్యం క్షయమగుటచే మరల భూమిపై పడుచున్నారు. భూమిపై నివసించే కొందరు జీవులు పుణ్యఫలంగా స్వర్గాదులు చేరుచున్నారు. ఈ సృష్టి వ్యవహారమంతా మరల మరల వస్తోంది, పోతోంది. అనేకమంది ఇంద్రుల అధికారం పూర్తి అగుటచే క్రొత్త వారు ఎందరో వచ్చి ఇంద్రసింహాసనం అధిష్ఠిస్తున్నారు. అనేకసార్లు కృతయుగపు స్థితిగతులు కలియుగంచే కలుషితం చేయబడుచున్నాయి. అనేక కల్పములు దొర్లిపోతున్నాయి.

❖❖❖

## 5. ప్రాప్తించేదంతా ఇతఃపూర్వపు అభ్యాసానుగతమే!

ఎవనికి ఏ ఇతఃపూర్వపు అభ్యాసం ఏర్పడి ఉన్నదో ఆ అభ్యాసము ననుసరించే అతని సంకల్పములు ఉంటున్నాయి. సంకల్పములను అనుసరించే అనుభవములు పదే పదే ఏర్పడు చున్నాయి. ఒక సమయంలో ఇదంతా రసవిహీనంగాను, అత్యంత భారంగాను, త్యజించుటకు అర్హమైనదిగాను ఉంటోంది. మరొకప్పుడు ఇదే జగత్తు అనేక ఆశలతో, సుందరమైన విషయము లతో ఉన్నట్లు దర్శించబడుతోంది. విషయపరంపరారూపమగు ఈ మనస్సు ఒకానొకప్పుడు శిథిలమైన ఆకృతిని ధరించి తన యొక్క జన్మస్థానమగు సాక్షితత్వమునందు విలీనమగుచున్నది. మరల మనస్సే జగత్ సమూహములను విస్తరింపజేస్తోంది.

ప్రళయం అయిన తరువాత మరల సృష్టి ప్రారంభం అవుతోంది. అప్పుడు మరల సమస్త పదార్థములు ఉత్పన్నమౌతున్నాయి. మరల ఈ జగత్తు చక్రము వలె పరిభ్రమించటం ప్రారంబి స్తోంది. దీర్ఘభ్రమరూపమైనట్టి ఈ'మహామాయ' యొక్క ఆడంబరంలో 'ఇది ఇట్లు నిర్ణయించ వచ్చును...' అనదగిన సత్యవస్తువుగాని, అసత్యవస్తువుగాని ఏది ఎక్కడ ఉన్నది? కల్పనచే రచింప బడినట్టి ఆకారం కలిగిన ఈ సంసార చక్రం భ్రమ వంటిదే సుమా! యథార్థానికి ఇదంతా 'లేనిదే' అగుచున్నది.

ఓ రాఘవా! ఈ జగత్తంతా అజ్ఞానము చేతనే అవిర్భూతమగుచున్నది. నేత్రదోషం చేత ఆకాశంలో ఎందరో చంద్రులు కనిపిస్తున్నట్లు ఈ జగత్తు ఇందలి సంఘటనలు, జనులు అనేక రీతులుగా ద్రష్టకు ప్రాప్తిస్తున్నారు.

అనేక వికల్పములచే ఈ జగత్తు నిరంతరం వ్యాప్తమైయున్నది.

అవిద్యామానమగు కర్తృత్వముచే నిర్మించబడిన ఇదంతా అధిష్ఠానమగు బ్రహ్మము కంటే వేరే కాదు. కాబట్టి నీవు 'జగత్తు' రూపంగా చూస్తే ఇదంతా అసత్యమే.

ఓ రామచంద్రా! అసలు 'ఈ జగత్తు సత్యము' అనే మూఢబుద్ధి నీకు ఎందుకు కలిగిందో చెప్పు? శ్మశాన సదృశమై, రుద్రునిచే ఏదో ఒకప్పటికి సర్వము మ్రింగబడబోవుచున్నదే కదా! అట్టి ఈ జగద్విన్యాసము చూచి భ్రమ పొందవలసిన పనేమీ లేదు.

❖❖❖

# VII. దాశూర కథనం

## 1. దాశూరుడు - చిత్త సువిశాలత్వం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఈ జనులలో కొందరు అనేక క్రియావ్యవహారములలో తలమునకలై ఉంటున్నారు. భోగైశ్వర్యములచే వారి బుద్ధి నశించి ఉంటోంది. ఫలితమేమిటి? వారు తమను తామే వంచన చేసుకొంటున్నారు. అంతేకాదు ఇతరులను కూడా 'వంచనదృష్టి'తోనే గాంచుచున్నారు. మరి, అట్టి వారు సత్యవస్తువగు పరమాత్మను దర్శించుట ఎట్లో చెప్పు? వారికి ప్రశాంతత - ఆనందములు అనుక్షణం సుదూరమే అగుచున్నాయే!

**యే తు పారంగతాబుద్ధేరింద్రియైర్న వశీకృతాః ।**
**త ఏనాం జాగతీం మాయాం పశ్యన్తి కరబిల్వవత్ ॥** (శ్లో 2, సర్గ 48)

ఎవరైతే ఈ బుద్ధిని కూడా అతిక్రమించివేస్తున్నారో, ఈ ఇంద్రియములకు వశీభూతులు కాకుండా ఉంటున్నారో... అట్టి మహాత్ములు ఈ జగన్మాయను అరచేతిలోని పండువలె స్పష్టంగా గాంచుచున్నారు. ఎవరు శ్రద్ధగా, సమగ్రంగా, మహాపరాక్రమవంతులై విచారణను ఆశ్రయించి ఉంటున్నారో, అట్టి వారు ఈ జగన్మాయను, బాగుగా ఎరుగగలుగుచున్నారు. పాము కుబుసాన్ని వదలి వేస్తున్నట్లు, వారు ఈ సర్వమును సర్వదా త్యజించియే ఉంటున్నారు. వారికి ఈ జగత్తు పట్ల ఏమాత్రం ఆసక్తి లేదు. ప్రాపంచిక క్షేత్రంలో వ్యవహరిస్తున్నప్పటికీ వారు ఏమాత్రం బంధమున తగుల్కొనరు. అగ్ని చేత దగ్ధమైన బీజము మరల మొలకెత్తుతుందా? వారి యొక్క 'మనస్సు-బుద్ధి -చిత్తము-అహంకారములు' (అంతరంగ చతుష్టయం) అంతా జ్ఞానముచే దగ్ధమై ఉంటున్నాయి.

ఇక అజ్ఞాని ఏం చేస్తున్నాడు?... శారీరక, మానసిక వ్యధలతో పూర్ణమై, నేడో రేపో నశించ బోయే ఈ దేహం కోసం మాత్రమే అతడు ప్రయత్నాలు సలుపుచున్నాడు. అంతేగాని, ఆత్మోద్ధరణ కొరకు ప్రయత్నమే చేయడాయె? అతడది గ్రహించి ఆత్మోద్ధరణ కొరకై యత్నించు గాక!

ఈ సంసార చక్రము విషయముల పట్ల ప్రీతిగొనియున్న వారిని సంతోషింపజేయటానికే కల్పింపబడుచున్నది. "దాశూర కథనం' లోలాగా వాస్తవానికి ఇదంతా శూన్యమే.

**శ్రీరాముడు:** స్వామీ! "ఇదంతా దాశూర కథనంలాగా" అని శలవిచ్చారు కదా! అనగా? దాశూరుని కథనమంటే ఏమిటో దయచేసి వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** సరే, నీ కిప్పుడు 'దాశూరోఖ్యాయిక' సవివరంగా చెపుతాను. విను-

మగధ దేశంలోని ఒక ఏకాంత పర్వత ప్రదేశంలో 'శరలోముడు' అనే పేరుగల ఒక మహాత్ముడున్నాడు. ఆయన తన భార్యపుత్రులతో ఒక ఆశ్రమంలో ఉంటూ నిరంతరం తపో ధ్యానాదులను నిర్వర్తిస్తూ ఉండేవారు.

అతని ఏకైక కుమారుడు దాశూరుడు. ఆ కుటుంబంలోనివారు వాళ్ళంతా ఎంతోకాలం అన్యోన్యంగా కలిసి ఉన్నారు. పక్షులు గూటిని వదలి వెళ్ళునట్లు శరలోముడు, ఆతని భార్య కాలక్రమంగా తమ శరీరాలను త్యజించి ఎటో వెళ్ళారు. ఇక దాశూరుడు తల్లిదండ్రుల వియోగం చేత పరమదుఃఖక్రాంతుడై, దిక్కుతోచక ఆ పర్వతముపై గల వనము లందు, గుహ లందు పిచ్చిపిచ్చిగా సంచరించసాగాడు. చాలా రోజులు ఆ విధంగా గడచిపోయాయి. అదృశ్య శరీరులగు అక్కడి వనదేవతలు ఆ యువకుని దీన చిత్తమును గమనించారు. "ఏమిటబ్బా! ఈ పిల్లవాడు దుఃఖిస్తూ ఎన్నో రోజులుగా పిచ్చివాడై తిరుగుచూనే ఉన్నాడు!...' అనుకుని, జాలి పడసాగారు. తమ మధ్య రాత్రిబగళ్ళు నిస్తేజంగా, వెఱ్ఱిచూపులతో వగరుస్తూ తిరుగుచున్న ఆ బాలుని మనస్సు మార్చాలని అనుకున్నారు. పరుల దుఃఖం తమదిగా భావించే వారికి సర్వేశ్వరుడు సర్వదా అభ్యున్నతిని ప్రసాదిస్తూ ఉంటాడు కదా!

ఒక ఉత్తమ క్షణంలో వనదేవతలు ఆ కుఱ్ఱవానితో అదృశ్య శరీరులై యిట్లు సంబోధించారు.

**వనదేవతలు:** ఓ మహా ప్రాజ్ఞుడవగు మునికుమారా! దాశూరా! ఇదేమిటయ్యా? అజ్ఞానివలె నీవు ఎందుకు దుఃఖిస్తున్నావో చెప్పు? ఈ ప్రపంచము యొక్క చంచలస్వభావమేమిటో నీవు ఇంకా గుర్తించలేదా ఏమిటి? ఇక్కడికి అనేకమంది జీవులు వచ్చి జన్మలు పొంది, కొంతకాలము అటు ఇటూ సంచరించి, మరల ఎటో వెళ్ళిపోవుచున్నారు. ఇది అనుదినం, అనుక్షణం జరుగుతున్న తతంగమే కదా! ఇక్కడి ప్రతిపదార్థం 'నశించుట' అను స్వభావంతోనే పుట్టుచున్నది. ఇక్కడ జరుగు చున్న వ్యవహారమంతా సూక్ష్మదృష్టితో, వివేకదృష్టితో పరిశీలించాలి గాని, మూర్ఖదృష్టితో కాదే!

ముందుగా నీ యొక్క వ్యవహారబుద్ధిని పరిశుద్ధపరచుకో. ఆ తరువాత ఆయా బాహ్య సంఘటనల గురించి నిర్ణయాలు తీసుకోవచ్చు. ఇక్కడ మహాప్రసిద్ధులగు 'బ్రహ్మ' మొదలైన లోక పాలకులే వినాశనమొందుచున్నారే? ఏదైతే పుట్టుచున్నదో అది ఒకనాటికి నశించక తప్పదు'... అనుటలో నీకైమనా సందేహం ఉన్నదా? అక్కరలేదు. నీ తండ్రి మరణ విషయమై నీవు వ్యర్థంగా ఎందుకు శోకిస్తున్నావో చెప్పు? అసలు, జన్మిస్తున్నదెవరు? మరణిస్తున్నదెవరు? ఈ శరీరములు, తత్సంబంధములు స్వప్నతుల్యం కాక మరింకేమిటి? సూర్యుని లాగా ఉదయించిన ప్రతీది అస్తమించవలసినదే! అయితే,

... విజ్ఞులు ఈ ప్రాప్తించిన ఆయుఃకాలమును ఎట్లు సద్వినియోగపరచుకొనుచున్నారు? ... అజ్ఞానులు దీనిని "పిల్లవాని చేతిలోని సూది" వలె ఎట్లు అపవిత్ర పరచుకొని వేసట చెందుచున్నారు? ఈ విషయాలు, గమనించు. మొట్టమొదట నీ దృష్టిని పరిశుద్ధపరచుకో...! 'వివేక దృష్టి, ఉత్తమాశయా'లతో కూడిన సత్ప్రయత్నములతో దైవప్రసాదితమైన ఈ ఆయుష్షుని సద్వినియోగపరచుకో.

❖

దాశూరుడు ఆ వనదేవతల స్నేహవాక్యములు విని ఊరట చెందాడు. ఇకప్పుడు లేచి, పితృ మరణానంతరం నిర్వర్తించవలసిన క్రియలన్నిటినీ పూర్తి చేశాడు. ఆ తరువాత బ్రాహ్మణ ధర్మమగు

తపస్సు చేయటం ప్రారంభించాడు. వేదములను అధ్యయనం చెయ్యటం, వాటి యొక్క అర్థ విచారణ చేయటం, నిష్ఠతో అందలి ఉత్తమ ప్రవచనములను సదవగాహనతో ఆకళింపు చేసుకోవటం – మొదలైన ప్రయత్నములచే అతనియందు క్రమక్రమంగా పవిత్రమగు 'శ్రోత్రియత్వం' సిద్ధించింది.

అయితే అతడు ఇంకను జ్ఞేయమగు బ్రహ్మమును విశ్రాంతి, అనుభవముల పూర్వకంగా ఎరిగియుండకపోవటచే అతని చిత్తము 'శుద్ధ – అశుద్ధ' వికల్పములను కలిగి ఉండేది. పరమ పవిత్రమగు 'విశ్రాంతి' అతనికి అల్లంత దూరంగానే ఉండేది. ఈ దృశ్యము స్వతహాగా 'శుద్ధమే' అయినప్పటికీ అతనికి మాత్రం 'అశుద్ధము' గా తోచుచూ ఉండేది.

ఉత్తముడు తన ఉత్తమ ప్రయత్నముల నుండి విరమిస్తాడా? లేదు. ఆ దాశూరుడు కూడా స్వసంకల్పముచే ఒక చెట్టుపైన ఒక మూల చేరాడు. ఒక పక్షిలాగా ఆసీనుడై మరల తపస్సు చేయటం ప్రారంభించాడు. కొంతకాలం గడచింది. ఆ తపస్సు కూడా అతనికి 'పరిశుద్ధధర్మము'* అను పవిత్ర స్థితిని ప్రసాదించనే లేదు.

అయితే అతడు ఎంతగానో మనస్సును 'తపస్సు' నందు నియమిస్తున్నప్పటికీ ప్రాపంచికమైన విషయాలు, సంఘటనలు, వ్యక్తులు అతని బుద్ధిని ఆక్రమించియే ఉండటం జరుగుతోంది.

"ఇప్పుడు నేను ఏం చేయాలి? నా మనస్సు నందు ఆక్రమించియున్న ఈ దృశ్యముతో ఏర్పడిన సంబంధము... అనే దోషం సన్నగిల్లేదెట్లా? సరే. సర్వత్యాగము చేతనే పవిత్రత్వము సముపార్జించబడగలదని వేదవాక్యసారం కదా! అందుచేత ఈ నా శరీరమునే అగ్నికి తర్పణం చేస్తాను. అప్పుడు అగ్నిదేవుడు కనికరించి నా మనస్సు యొక్క క్షోభను, దోషమును తొలగించ వచ్చు. ఈ భూపదార్థములపై నాయందు ఏర్పడుచున్న 'ఆకర్షణ'కు అగ్నిదేవుడే వైద్యుడై నన్ను రక్షించగలడు"... అని యోచించాడు. చెట్టు నుండి క్రిందకు దిగి ఒకచోట అగ్నిని ప్రజ్వలింప జేసాడు. తన భుజముల నుండి మాంసమును కోసి హోమం చేయటం ప్రారంభించాడు.

అప్పుడు అగ్నిదేవుడు 'ఇదేమిటి? ఈ బాలకుడు ఇంతకు తెగించాడేమి? సరే, దేవతల కంఠప్రదేశమైనట్టి అగ్నిరూపమగు నాయందు పడుచున్న ఈతని శరీర ఖండములు భస్మము కాకుండు గాక! ఇతడు మునపటి వలె పూర్ణశరీరుడై యుండుగాక!" అని సంకల్పించాడు. బృహస్పతి ముందు సూర్యభగవానుడు ప్రత్యక్షమయినట్లు అగ్నిదేవుడు ఆ దాశూరుని ముందు కల్పిత శరీరములో ప్రత్యక్షమైనారు.

**అగ్నిదేవుడు :** ఓ సాధూ! దాశూరా! నీ త్యాగనిరతికి, పట్టుదలకు మెచ్చుకుంటున్నానయ్యా! ఏమి కోరి ఇంతటి సాహసం చేస్తున్నావో చెప్పు, నీకు అభిమతమైన వరం కోరుకో.

---

* ఏదేది మనం చేయవలసివస్తోందో అవన్నీ భగవదర్పిత బుద్ధితో 'ఇది ధర్మమైయున్నది' అను భావనతో రాగ–కౌతుక రహితంగా నిర్వర్తించుటయే "పరిశుద్ధ ధర్మభావన' అగుచున్నది.

**దాశూరుడు:** తండ్రీ! పరమపవిత్ర స్వరూపులగు తమ యొక్క కనికరము చేతనే లోకములు మనగలుగుచున్నాయి. మావంటి అల్పజీవులకు దేవతల కటాక్షవీక్షణలను ప్రసాదింపజేసే మహనీయులు మీరు. మీ పాదములు అంటి మ్రొక్కుచున్నాను. సాష్టాంగదండ ప్రణామం చేస్తున్నాను. స్వీకరించండి.

మహానుభావా! ప్రాణులతోను, అనేక పదార్థములతోను నిండియున్న ఈ 'పృథివి' నన్ను ఆకర్షితుణ్ణి చేస్తోంది. నా బుద్ధి క్షణకాలంలో కలుషితమౌతోంది. అట్టి ఈ ఎదురుగా కనబడుచున్నట్టి పృథివిని త్యజించివేయగలుగు బుద్ధిని, శక్తిని వరంగా ప్రసాదించండి. ఈ సర్వము త్యజించి వృక్షము పైననే స్థితి పొందగలిగేటట్లు అనుగ్రహించండి.

**అగ్నిదేవుడు:** (చిరునవ్వుతో) పుత్రకా! సరే, అట్లే అగు గాక! నీ మనోరథము సిద్ధించు గాక! అందుకుగాను, నీ వర్తమాన తపస్సుయజ్ఞం మొదలైన ప్రయత్నాలను కొనసాగించు. నియమిత కాలంలో నీ మనస్సు పరిశుద్ధమౌతుంది.

ఇట్లు ఆశీర్వదించి అంతర్ధానమైనాడు. అప్పుడు దాశూరుడు ఒకచోట అశీనుడై 'నేను పృథివిని త్యజించిన వాడనయ్యాను. ఇందలి ఏ పదార్థము నాకు సంబంధించి లేదు. నేను ఇందలి ఏ పదార్థమునకు సంబంధించినవాడను కాను..." అని మననం చేయసాగాడు. అయినా కూడా తృప్తి లభించలేదు.

అప్పుడు ఎత్తైన ఒక కదంబవృక్షమును ఎన్నుకున్నాడు. ఆ వృక్షము ఆకాశమును అంటుచు, ఫలయుక్తమై తన కొమ్మలచే 'ఛాయ'చే అనేక ప్రాణులకు ఆహ్లాదం కలుగజేస్తూ ఉండేది. భూమిపై అపవిత్రమైన బుద్ధిగల అతడు మఱ్ఱిచెట్టుపై విష్ణుభగవానుని వలె ఏకాగ్ర చిత్తంతో ఆ కదంబ వృక్షపు కొమ్మపై ఆత్మశుద్ధి కొరకు మరల తపస్సు చేయటానికి ఆసీనుడైనాడు. మరల ఒక్క క్షణం తన చుట్టు పట్ల పరికించి చూచాడు. ఆ క్షణంలో అతని దృష్టి మరల చంచలత్వం పొందింది. కౌతుకంతో చుట్టూ పరికిస్తున్న అతని దృష్టికి అక్కడ నదులు, పర్వతములు, నిర్మలాకాశం, నీలి మేఘములు, పల్లవములు, పుష్పసమూహములు, పక్షుల కలకలారావములు, సెలయేళ్ళ శబ్దములు, అరణ్యము, స్వర్గము, భూమి మొదలైన వాటితో కూడిన వ్యవహారమంతా దిక్కులన్నీ నిండి కనిపించాయి. వాటిచే ఆతని బుద్ధి దృష్టి ఆకర్షించబడటం కొనసాగనారంభించింది.

ఒక్క క్షణం అదంతా పరికించి చూస్తూ 'ఆహాఁ! మాయ ఎంత చమత్కారమైనది! నా దృష్టి పరిశుద్ధమవనంతవరకు ఏ మూల వెళ్ళి కూర్చుంటే ఏం ప్రయోజనం? ఈ విషయమే వనదేవతలు నాకు గుర్తు చేశారు కదా...!" అని ఆలోచించి కొంత ప్రశాంత చిత్తముతో నవ్వుకొన్నాడు. ఆ దిక్కుల నుండి తన దృష్టిని వెనుకకు మరల్చి మరల ఘోరతపస్సు ప్రారంభించాడు.

కాని ఏం లాభం? కేవలం కర్మకాండ యందు మాత్రమే తత్పరుడయ్యాడు. పరమార్థజ్ఞాని కాలేకపోయాడు. 'స్వర్గమును పొందుట' వంటి స్వల్ప ఫలములకు మాత్రమే అర్హుడు కాగలిగాడు.

**మానసిక యజ్ఞం -** అప్పుడు దాశూరుడు ఇట్లు యోచించాడు– "ఎంత కాలం తపస్సు చేస్తే ఏం ప్రయోజనం? బాహ్య కార్యక్రమముల వలన ఉత్తమ ప్రయోజనమేదీ నాకు కనిపించుట

లేదు. ఇంకేమి ఉపాయం? అన్నిటికీ కారణం మనస్సే కదా! కనుక ఇక నుండి మానసిక యజ్ఞం ప్రారంభిస్తాను" అని అనుకున్నాడు. మనస్సుతోనే అగ్ని యొక్క ఉపాసన ప్రారంభించాడు. 'అశ్వమేధయాగం' వరకు గల అనేక యజ్ఞక్రియలన్నిటినీ క్రమంగా ఆచరించాడు. ఆ వృక్షపు కొమ్మ మీదనే ఆసీనుడై పది సంవత్సరాల కాలం దేవతా ప్రీత్యర్థం ఒక దాని తరువాత మరొకటిగా అనేక మానసిక యజ్ఞములను నిర్వర్తించాడు. అప్పటికి అతని చిత్తము క్రమంగా రాగద్వేషరహితం కాసాగింది. సువిశాలత్వం పొందింది. ప్రతిబంధకములన్నీ క్షయిం చాయి. సంస్కారములు పవిత్రత పొందాయి. చిత్తము నిర్మలం కాగా, అతనికి జ్ఞానోదయమ యింది. జ్ఞానముచే అజ్ఞానావరణమంతా ఛిన్నమైపోయింది. వాసనామలమంతా నశించింది.

❖❖❖

## 2. వనదేవత - పుత్రాభిలాష

ప్రశాంతచిత్తుడగు ఆ దాశూరుడు ఆ కదంబ వృక్షపు కొమ్మపై మౌనం వహించియున్నాడు. ఒక రోజు ఒక వనదేవత గొప్ప సౌందర్యముతో కూడిన శరీరము ధరించి అతని ఎదురుగా నిలచినది. మనోహరమగు వచనములతో తన అభ్యర్థనను ఇట్లు తెలిపింది.

**వనదేవత:** పరిశుద్ధుడవు, మోక్షస్వరూపడవు అగు ఓ మునికుమారా! మీకు జయమగుగాక!

**దాశూరుడు:** ఓ కమలాక్షీ! నీ యొక్క శోభాతిశయం చేత మన్మథుని కూడా విచలితుని చేయ గలిగినట్లు ఉన్నావు. అంతటి సౌందర్యరాశివగు నీ వెవరవు? ఈ లతపై కూర్చుని నా ఎదుట ఎందుకు సాక్షాత్కరించావు?

**వనదేవత:** హే మునీ! "ప్రాప్తించనిదంటూ ఏదైనా ఉంటే, అదంతా మహాత్ములను సమీపించి అర్థించితే చాలు, తప్పక ప్రాప్తిస్తుంది"... అని పెద్దలు అంటూ ఉంటారు. ముందుగా నేనెవరో చెపుతాను, వినండి. అనేక కదంబవృక్షములతోను, అందమైన పూతీగలతోను శోభిస్తున్న ఈ వనంలోని వనదేవతను నేను. లతల సమూహమే నా నివాసస్థానం. ఈ మధ్య కొద్దిరోజుల క్రితం జరిగిన ఒక సంఘటన కారణంగా ఈ రోజు మీ ముందుకు వచ్చి యాచిస్తున్నాను.

**శ్రీ దాశూరుడు:** ఏమా సంఘటన? నీ అభిలాష ఏమిటి?

**వనదేవత:** మొన్నటి చైత్రశుక్ల త్రయోదశినాడు దేవలోకంలోని నందనవనంలో ఒక ఉత్సవం జరిగింది. ఆ ఉత్సవంలో పాల్గొనటానికి అనేక ప్రదేశముల నుండి వనదేవతలు వచ్చి సమావేశ మయ్యారు. ముల్లోకములందలి వనదేవతలను పరామర్శించుచు, వేడుకలలో పాల్గొనుటకు గాను నేను కూడా వెళ్ళాను. ఆ 'కామోత్సవం'లో అనేకమంది వనదేవతలు తమ పుత్రులను కూడా వెంటబెట్టుకొని అటూ ఇటూ తిరగటం చూచాను. వారు తమ బిడ్డలను ముద్దు ముద్దు మాటలతో లాలించటం నాకెంతో ముచ్చట గొలిపింది. నేను పుత్రహీనను. అందుచేత నా మనస్సు ఎంతగా క్షోభించిందో మాటలతో చెప్పలేను. వాళ్ళు తమ పుత్రుల అల్లరి చిలిపి మాటలను వింటూ కళ్ళలో

ఆనందం ప్రకటించటం చూచాను. "ఏనాటికైనా నేను అట్లు పుత్రులను పొందగలనా?' అను ఆలోచన నన్ను వేధించసాగింది. "ఏమి చేయాలి?" అని తీవ్రంగా యోచిస్తూ ఉండగా, మీరు గుర్తుకు వచ్చారు. "ఆ ముని సమస్త పురుషార్థములకు కల్పవృక్షము వంటివారు... ఇక నీకేం లోటు... పోయి అభ్యర్థించు"... అని తోటి వనదేవతలు నన్ను ఉత్సాహపరిచారు. ఇక నేను పుత్రహీననని దుఃఖించవలసిన పనేమున్నది?

ఓ మహాత్మా! నాకు ఒక కుమారుని ప్రసాదించండి. ఒకవేళ మీరు నా విన్నపమును తిరస్కరిస్తారా? అందుకు నేను తగిన నిర్ణయమే చేసుకుని వచ్చాను. ఇప్పటికిప్పుడు ఇక్కడ 'అగ్ని' ని సృష్టించి అందులో ఈ నా దేహమును ఆహుతి చేయుటకు సిద్ధంగా ఉన్నాను. ఎందుకంటే, "నాకు ఇతర దేవతల వలె పుత్రులు లేరే?" అనే దుఃఖం భరించలేను. ఇంతకన్నా మరణించటమే ఉచితమని నేను నిశ్చయించుకున్నాను.

ఆ ముని ప్రశాంతంగా అంతా విన్నారు. మహాత్ముల హృదయం నవనీతంలా సుతిమెత్తగా ఉంటుంది కదా! ఆయన జాలి పొంది ఇట్లు పలికారు.

**శ్రీ దాశూరుడు:** ఓ వనదేవతా! పుత్రుని కొరకై నీవు స్వశరీర త్యాగానికి కూడా సిద్ధపడ్డావు కదా! సంతోషం. ఇదిగో, ఈ పుష్పమును స్వీకరించు. నెల రోజులలో నీకు ఒక చక్కటి కుమారుడు కలుగుతాడు. నీ త్యాగనిరతికి తార్కాణంగా అతడు మహాసౌందర్యవంతుడు జగత్పూజ్యుడు అయి ఉంటాడు. మహాజ్ఞాన సంపన్నుడగు అతనిని పొందినందుకు నీ జన్మసార్థకమౌతుంది.

వనదేవత ఆ మాటలు విని ఎంతో సంతోషించింది. ఆ ఋషి పాదాలు స్పృషించి నిజస్థానమునకు మరలింది. క్రమంగా మాసాలు, ఋతువులు, సంవత్సరములు గడచిపోసాగాయి. ఒక నాడు ఆ వనదేవత పండ్రెండేళ్ళ వయసుగల కుమారుని వెంటబెట్టుకుని ఆ మునిని సమీపించింది.

**వనదేవత:** హే మహాత్మా! ఈ పిల్లవాడే మన కుమారుడు. నేను ఇతనిని సర్వవిద్యాసంపన్నునిగా తీర్చిదిద్దాను.

**దాశూరుడు:** చాలా సంతోషం. విద్యలన్నీ చక్కగా నేర్చినాడు కదా?

**వనదేవత:** నేర్చాడు. కాని 'ఆత్మజ్ఞానం' మాత్రం ఇతడింకా పొందనేలేదు. ఏది గ్రహించిన తరువాత ఇక జీవుడు ఈ సంసారచక్రంలో తగుల్కొనడో... అట్టి దివ్యము, నిత్యోదిత అమృతానందమయము అగు 'ఆత్మస్వరూపానుభవం' ఇతనికి బోధించ వలసియున్నది. 'ఇతడు జ్ఞాని అవుతాడు' అను మీ ఒకప్పటి ఆశీర్వాదవాక్యం సిద్ధింపజేయ ప్రార్ధన. ఇతనికి మీరే దయతో జ్ఞానోపదేశం చెయ్యండి. మీ అంశయే అయిన ఇతడు జ్ఞాని కావటం మీకు కూడా సంతోషకరమైన విషయమే కదా!

**దాశూరుడు:** అట్లాగే అగుగాక! ఇతడు ఇక్కడే ఉంటాడు. ఇక నీవు యథాస్థానికి వెళ్ళవచ్చు. నీకు శుభమగుగాక!

❖

తన తండ్రి, గురువు అగు ఆ మహామునిని సేవించుకుంటూ ఆ బాలుడు రోజులు గడుప సాగాడు. అనేక క్లేశములను భరిస్తూ తండ్రి వద్ద అనేక జ్ఞాన విషయాలు వినేవాడు. అనేక యుక్తులను ఉపయోగించి దాశూరుడు ఆత్మవస్తుతత్త్వాన్ని విశదపరుస్తూ ఉండేవాడు. 'ప్రత్యగాత్మ యందు నిరంతరస్థితి కలిగియుండుటకు ఉపాయములేమిటి...' అను విషయము అనేక కథల, యుక్తుల సహాయంతో కూలంకషంగా చర్చిస్తూ ఉండేవాడు.

కల్పితములైన అనేక దృష్టాంతములు... లోకప్రసిద్ధమైన ఇతిహాసములు... పూజ్యులగు మహనీయుల ప్రవచనాలు, అభిప్రాయాలు... వేద-వేదాంతాలలోని ఆయా సిద్ధాంతములు.., వ్యాఖ్యానాలు... అనేక అర్థములను సూచించు కథలు... స్వానుభవాలు, అవగాహనలు... ఈ విధంగా అనేక చమత్కృతులను క్రోడీకరించి ఉత్తమవచనముల ద్వారా ఆత్మగురించిన సమాచారం ప్రసాదించసాగారు.

ఒకరోజు నేను అయోధ్య నుండి కైలాసములోని మందాకినీ నదిలో స్నానం చేయటానికి బయలుదేరాను. అదృశ్యరూపంలో ఆకాశమార్గంలో పయనిస్తున్నాను. సప్త ఋషి మండలము లోని 'స్వర్గలోకాకాశం' దాటి, వెళ్ళుచున్నాను. కాకతాళీయంగా ఆ దాశూరుడు, అతని కుమారుడు ఉన్న భూగోళంలో ప్రవేశించాను. రాత్రి అగుటచే కొంచము విశ్రమించాలని ఆ వృక్షమధ్య భాగంలో ప్రవేశించాను. ప్రశాంతమౌన చిత్తుడనగు నాకు వారిద్దరి సంభాషణ వినిపించింది. ఆ సంభాషణను నీకు వివరించి చెపుతాను, విను.

❖❖❖

## 3. ఖోత్థుడు - మూడు శరీరాలు

**దాశూరుడు:** ఓ కుమారా...! ఇట్టిదే అయినట్టి మరొక విశ్వం ఉన్నది. అక్కడ ఒక ప్రదేశంలో ఒక ఆశ్చర్యజనకమైన సంఘటన జరిగింది. అది చెపుతాను, విను...

ఆ విశ్వంలో ఒక భూపాలుడు ఉన్నాడు. అతని పేరు ఖోత్థుడు* అతడు ముల్లోకాలలోను సుప్రసిద్ధుడు. గొప్ప శ్రీమంతుడు. జగత్తులన్నీ జయించగలిగినంతటి సామర్థ్యం కలవాడు. అతడు మహాజ్ఞాని కూడా. కాబట్టి అతని ఆజ్ఞలు బ్రహ్మ, ఇంద్రుడు మొదలగువారికి కూడా శిరోధార్య మగుచున్నాయి. అతడు మహాసాహసి అని, గొప్ప పరాక్రమవంతుడని అందరూ అనుకుంటూ ఉంటారు. ఈ ముల్లోకాలలో ఎవరికీ అతనిని వశం చేసుకోవటం అంత తేలికైన పని కాదు. అయితే అతనిలోనే అసంఖ్యాకంగా 'ప్రవృత్తులు' ఉన్నాయి. అవన్నీ సుఖప్రదాలై ఉంటున్నాయి.

ఎవరైనా తమ పిడికిలితో ఆకాశమును జయించగలరా? ఉత్తమ పరాక్రమశీలుడగు అతనిని తమ శస్త్రాస్త్రబలంచే ఎవ్వరూ జయించలేరు. దివ్యమగు అతని లీలలు మహాగంభీరముగా

---

*ఖః = ఆకాశము ; ఖోత్థుడు = అవ్యాకృతాకాశం నుండి జనించినవాడు.

ఉంటున్నాయి. అతడు తనకు తానే "స్వప్నము - మనోరథము' లకు సంబంధించిన స్వీయరచనలు చేస్తూ ఉన్నాడు. "అతని ఊహా కల్పిత రచనా చమత్కృతులు ఆ ఇంద్ర-విష్ణు-శంకరులు కూడా ఊహించలేరా"...? - అన్నట్లు ఉంటున్నాయి.

అతడు సర్వవేళల మూడు శరీరములు కలిగి ఉంటున్నాడు. అందులో ఒక్కటి ఉత్తమమైనది, ఒకటి మధ్యమము, ఒకటి అధమమైనది. ఆ శరీరములు సర్వవ్యవహారములు నిర్వర్తించగల సామర్థ్యము కలిగి ఉన్నవి. వింటున్నావా కుమారా?

**దాశూరుని పుత్రుడు:** తండ్రీ! వింటున్నాను. ఇంతకీ అతడు ఉన్నది ఎక్కడ? ఈ జగత్తు లోనా? లేక, బైట ఇంకెక్కడన్నానా?

**శ్రీ దాశూరుడు :** విశాలమగు 'అవ్యాకృతాకాశం'లోనే అతడు త్రిశరీరధారి అయి ఉద్భవించాడు. అతడు ఉన్నది, అతని సంచనలము అవ్యాకృతాకాశంలోనే. అయితే ఏం? అతడు తుచ్ఛ విషయము లందు ఆసక్తి కలిగి ఉంటున్నాడు. ఏవేవో విధి-నిషేధములను ఆశ్రయించి అనేక స్థితిగతులను దర్శించుచున్నాడు.

అతడు 'అవ్యాకృతాకాశం'లోనే "బ్రహ్మాండము" అనే నగరం స్వయంగా మనోకల్పితంగా నిర్మించాడు. ఆ బ్రహ్మాండనగరం 14 భువనములచేత, 3 లోకముల రూపంగా, 3 వేదములతో కూడినదై శోభిస్తోంది. అందులో చంద్రసూర్యులు తరగని దీపాలవలె వెలుగుచున్నారు. ఆ బ్రహ్మాండంలో అనేక రకరకాలైన శాస్త్రీయ-అశాస్త్రీయ ప్రవర్తనామార్గాలు ఉండి ఉన్నాయి. అవన్నీ ఊర్ధ్వ-అధోగతి రూపములతో విలసిల్లి ఉంటున్నాయి. అతి విశాలమైనట్టి ఆ బ్రహ్మాండనగరంలో అనేకమంది దేవతలను, మనుష్యులను, తదితర జీవులను అతడు సృష్టించాడు. వారంతా జంగమాత్మకమై (జన్మించు స్వభావం గల) స్వరూపం కలిగి ఉన్నారు. విషయముల పట్ల ధ్యాస కలిగియుండుటచే వారు విమూఢులు, ఆత్మాకాశపరిచ్ఛేదకులు అయి ఉన్నారు. వారిలో కొందరు ఊర్ధ్వ భాగమున నియమించబడ్డారు. కొందరు మధ్యభాగమున, మరికొందరు అధోభాగమున నియోగించబడ్డారు.

అందులో కొందరు చాలా శీఘ్రంగా నశించిపోతున్నారు. ఇక మరికొందరో, చాలా కాలానికి గాని నాశనం పొందుటలేదు. ఆ జీవులంతా నల్లటికేశములతో, నవ ద్వారములతో, ప్రాణ-అపాన వాయు చలనములతో, పంచ జ్ఞానేంద్రియములతో, రక్త-మాంస-బొమికలతో నిర్మించబడే ఈ భౌతిక ఉపాధులతో కనిపిస్తున్నారు.

❖

మహాత్ముడగు ఆ రాజు తన యొక్క మహత్తర మాయాశక్తిచే 'యక్షసమూహము'ను కూడా రచించాడు. ఆ యక్షులు ఆత్మాకాశమున 'ఆఛాదన' రూపంలో ఉన్నారు. వారు 'ఆత్మజ్ఞాన ప్రకాశము' పట్ల నిత్యము భయభీతులై ఉంటున్నారు. అట్టి ఆత్మాఛాదకులు కార్యప్రవృత్తులగు చున్నారు. వారు కార్య ప్రవృత్తులైనందుకు ప్రయోజనంగా అనేక విధములైన క్రీడా విషయములు ఉత్పన్నమగుచున్నాయి.

తానే బ్రహ్మాండనగరమునకు 'సృష్టికర్త' అయినప్పటికీ ఆ రాజు సంకల్పములచే నడిపించ బడి అనేక స్థూల-సూక్ష్మ-కారణ శరీరములందు యక్షులతో కూడి విహరిస్తున్నాడు. ఒక శరీరంలో ప్రవేశించి కొంచెము సేపు విహరించి, ఇంతలోనే ఆ శరీరమును విడచి వేస్తున్నాడు. అక్కడి నుండి బయలుదేరి మరల ఇంకొక దేహమును ఆశ్రయిస్తున్నాడు.

అతని చిత్తము ఎంతో చంచలమైనది. అది ఒక్కొక్కప్పుడు 'భవిష్యత్తు నగరము'ను తన యందు సృష్టించుకొని అందులో ప్రవేశించి, అక్కడ అటూ-ఇటూ పచార్లు చేస్తూ ఉంటోంది. అతని చిత్తము జాగ్రత్తు, సుషుప్తులను త్యజించి స్వవిరచితమైన స్వప్నలోకంలో ప్రవేశించుచు విహారం చేయుచుండెడిది. ఇంతలోనే అతని ఆ చపల చిత్తము ఇంకొక సమయంలో క్షణంలో సర్వ జాగ్రత్-స్వప్న సంకల్పములన్నీ త్యజించి వేసి సర్వభావనలు విలయించునట్టి సుషుప్తిలో ప్రవేశించాలనే కోర్కె పొందేది.

అప్పుడు ఆ ఖోత్థునిచిత్తంలో కర్మ బీజములు సంస్కార రూపంలో ఉండేవి. అవన్నీ 'మూఢత్వము' అను అవిద్యయందు దాగి ఉండేవి. ఇంతలోనే, మరల అతనిపట్ల చిత్తము ఉత్పన్నమైనదై, సుషుప్తి నుండి లేచి కూర్చుని క్రమంగా మరల జాగ్రత్-స్వప్న దశలను పొందుతూ ఉండేది. ఆ సమయంలో మరల అనేక విస్థార కార్యక్రమములను నిర్వర్తిస్తూ ఉండేది.

ఆ ఖోత్థుని ఓడించగలిగిన వారెవ్వరూ లేరు. అయితే ఏం? అతని చిత్తము ఒక్కొక్కసారి తన చేతులలో తానే ఓడిపోతూ ఉండేది. 'అయ్యో! నేనొక అజ్ఞానిని. నాకేమీ తెలియదు. భృత్యుడను. పరమ దుఃఖితుడను' అను భావనలు స్వీకరించి అతడు ఎంతగానో దుఃఖిస్తూ, వాపోతూ ఉంటాడు. మరొకప్పుడు ఇతఃపూర్వం అనుభూతమైన సుఖములను స్మరిస్తూ 'ఇప్పుడవన్నీ నాకు లేవే?' అను దీనత్వము సంతరించుకొంటాడు. 'ఇతడే ప్రపంచంలోని దుఃఖాలన్నీ కాపురం ఉండే వృక్ష రాజమా...!' అన్నట్లు కనబడతాడు. నవరసాలు పోషించే నటునిలాగా ఆ వ్యవహారమంతా ఆ ఖోత్థుని చిత్తము వేస్తున్న వేషములే.

❖

మహాత్ముడగు ఆ ఖోత్థుడు తక్కువవాడేమీ కాదు. తలచుకుంటే, వాయువు సముద్రమును కదలించుచున్నట్లు, అతడు దేనినైనా జయించివేయగలడు. అందుచేత కొన్ని సమయములలో అతడు జాగ్రత్-స్వప్న-సుషుప్తులలోని శత్రువులందరినీ ఆక్రమించివేస్తున్నాడు. ఆ సమయంలో ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులు అతనికి సంపదలుగానూ, సామంత రాజ్యములుగానూ ప్రకాశి స్తున్నాయి గాని భారంగా కాదు. దుఃఖపూరితంగా కాదు. అంతయు జయించి, అంతయు గ్రహించి అతడు ఒక సమయంలో అత్యంత ప్రసన్నుడై సుఖిస్తూ ఉంటున్నాడు.

అతడు అంతరంగమందలి జ్యోతి చేతనే ప్రకాశితుడగుచున్నాడు. అయినప్పటికీ వ్యవహార దృష్టిలో అనేక మౌఢ్యతలచే పరివేష్టింపబడుచున్నాడు. ఎందుకో అనంత సంఖ్యలో అతనిని అనేక వేదనలు సమీపిస్తున్నాయి.

❖❖❖

# 4. సంసార సాగరము - వికల్ప వ్యవహారము

**దాశూరుని కుమారుడు:** హే తండ్రీ! పవిత్రాంతఃకరణమూర్తీ ! మీరు పరోక్షంగా, ఏదో సత్యమును ప్రతిపాదిస్తున్నట్లు నా కనిపిస్తోంది. ఖోత్థుడు అనే పేరుతో మీరు చెప్పుచున్న ఆ రాజు ఎవరు? యథార్థానికి మీరు ఏమి చెప్పదలచారు? భవిష్యత్ నగర నిర్మాణం అనే పదప్రయోగానికి అర్థమేమిటి? ఈ వర్తమానకాలంలో కూడా అతడు ఉన్నాడా? ఉంటే ఎక్కడున్నాడు? అతని బ్రహ్మాండము ఎటువైపు ఉన్నది?

'వర్తమాన-భవిష్యత్ నగరములు'... అని మీరు అనటం కొంత పరస్పర విరుద్ధంగాను, వ్యామోహజనితంగాను ఉన్నదని నాకనిపిస్తోంది.

**దాశూరుడు:** కుమారా! ఆ విషయాలన్నీ యథార్థరూపంగా చెపుతాను. శ్రద్ధగా వింటే, ఈ సంసారము యొక్క తత్త్వమేమిటో నీవే గ్రహిస్తావు. ఈ ప్రపంచము అసత్యమని, 'పరమార్థ సత్త'చే పరిశీలిస్తే ఈ జగత్తు లేనేలేదనీ తెలియజేయటానికే నిగూడార్థ రూపంలో ఉన్న ఖోత్థుడి గురించి విశేషములు వర్ణించి చెప్పాను. ఇక అసలు విషయం విను-

❖

**ఖోత్థుడు:** అవ్యాకృతాకాశము (A space where there tends to be no matter) నుండి ఉత్పన్నమైన సంకల్పాత్మకమగు మనస్సే ఆ పేరుతో మనం చెప్పుకున్నాం. అతడు (అనగా మనస్సు) స్వసంకల్పములచే జనించిన వాసనల చేతనే రూపము పొందుచున్నాడు. వాసనలే మనస్సు, వాసనారాహిత్యమే మనోరాహిత్యం.

**తత్స్వరూపమిదం సర్వం జగదాభోగి విద్యతే ।**
**జాయతే తత్ర జాతే తు తస్మిన్నష్టే వినశ్యతి ॥** (సర్గ 53, శ్లో 7)

ఈ కనబడే విశాల జగత్తు అంతా సంకల్పమయమగు మనస్సేగాని, మరింకేమీ కాదు. మనస్సు యొక్క స్వరూపమే సంసారము - జగత్తు - ఈ శరీరాదులు కూడా. మనస్సు ఉత్పన్నమైనప్పుడే జగత్తు ఉత్పన్నమౌతోంది. మనస్సు నశిస్తే జగత్తు కూడా నశిస్తోంది.

వృక్షమునకు శాఖలు ఉంటాయి కదా! పర్వతమునకు శిఖరములు ఉంటాయి!... అలాగే 'బ్రహ్మ-విష్ణువు-రుద్రుడు-ఇంద్రుడు' మొదలైనవారంతా మనస్సు యొక్క అవయవములే అయి ఉన్నారు.

వాస్తవానికి బ్రహ్మము సర్వకాలసర్వావస్థలయందు జగత్ సత్తరహితమే అయి ఉన్నది. అనగా బ్రహ్మము (అవ్యాకృత, ఆకాశము)నందు జగత్తులు, పదార్థములు, అహమ్, త్వమ్ సుఖ-దుఃఖ సంఘటనలు మొదలైనవేవీ లేవు. అత్యుత్తమమైన దృష్టిచే మనస్సు అనబడేది కూడా లేదు. అయితే, అట్టి బ్రహ్మము నందు 'చైతన్యప్రతిభాస' చేత 'సమష్టి సృష్టి' అను ఒకానొక స్వభావము ఉదయిస్తోంది. అది నీటియందు కెరటములు ఉదయించుట వంటిది. నేను 'సమష్టి

సృష్టికి కర్తను' అనే తత్త్వమే సమష్టిజీవుడు, విరించి, బ్రహ్మదేవుడు, హిరణ్యగర్భుడు... ఇత్యాది పేర్లతో చెప్పబడుతోంది.

ఇట్లు సంకల్పమయమగు మనస్సు ఈ త్రిలోకములను రచించుచున్నది. ఈ సూర్య చంద్రులు, 14 లోకములు, సుందరపర్వతములు, సముద్రములు, అందలి తరంగములు, భూమి, ఆకాశం మొదలైనవన్నీ సంకల్పము చేతనే రచించబడి విరాజిల్లుచున్నాయి. ఊర్ధ్వ-అధో లోకాలు, పుణ్య-పాపములు ఇవన్నీ ఉంటున్నది 'మనస్సు' అనే నగరంలోనే. ఈ దేవమనుజ-కిరాతక -పిపిలీకాది జీవులన్నీ పచార్లు చేస్తున్నది మనస్సు అనే మైదానంలోనే.

సంకల్పత్మాకమగు 'మనస్సు' అనే రాజు యొక్క క్రీడ కొరకే ఈ 'జగత్తు' అను రూపంగల నగరంలో 'అహంకారము - దేహము - దేహమును రక్షించు శక్తులు '... ఇవన్నీ నిర్మించబడు చున్నాయి. అహంకారము చేత అనేక దేహములు నిర్మించబడగా, అందులో కొందరు ఊర్ధ్వమున దేవతలుగాను, మరికొందరు మధ్యగా మానవులుగాను, ఇంకొందరు పాతాళమున నాగులు మొదలైనవారు గాను నెలకొలుపబడుచున్నారు. వారంతా చెవులు-కళ్ళు-ముక్కు మొదలైన నవద్వారములతో, మాంసం-అస్థులు తదితర సరంజామాతో, వేరు వేరు ప్రాణవాయు సంచనలములతో సుఖ-దుఃఖసహితులై ఉంటున్నారు. పంచేంద్రియదేహులగు వీరందరు సంకల్పముచే నిర్మించబడిన నగరంలో నివసించేవారే సుమా! మనస్సే యక్షుని ప్రదర్శన వలె ఇట్లు అనేక రూపములను ధరిస్తోంది.

❖

ధాన్యం కొట్టులో పిల్లి దాగి ఉన్నట్లు, కొలిమి తిత్తిలో పాముపిల్ల దాగినట్లు, ముత్యపు చిప్పలో ముత్యము ఉంటున్నట్లు ఈ శరీరములలో అహంకారము దాగి ఉంటోంది. దీపం క్షణంలో విజృంభించి క్షణంలో నశించునట్లు ఈ అహంకారం కూడా ఆయా ఉపాధులలో క్షణ కాలం విజృంభిస్తోంది. క్షణంలో ఆ ఉపాధులను త్యజిస్తోంది.

సముద్రములో తరంగాలు ఏర్పడుచున్నట్లు మనస్సులో అనేక సంకల్పాలు ఏర్పడు చున్నాయి. ఈ సంకల్పమయాత్మకమగు మనస్సు నిజసంకల్పిత వస్తువులను గాంచటం, అట్లు గాంచినవి భవిష్యత్తులో పొందటం జరుగుతోంది. అది సంకల్పించనిదేదీ పొందదు. ఆయా బాహ్య వస్తుజాలముతోను, తదితర ఉపాధులతోను సంబంధము వహించి, 'ఇవి నాకు చెందినవి... వీటిని నేను పొందుటచే మాత్రమే సంతోషించగలను... ఇవి నేను ఎప్పటికీ కలిగి ఉండాలి.... వీరు నా వారు... వీరు పరాయి వారు...' అను రీతిగా అది స్వప్నత్వము పొందుచున్నది. 'భవిష్యత్‌లో పొందవలసినవి... త్యజించవలసినవి'... అను రూపము గల ఉద్వేగము ఈ మనస్సు ఊహ-అపోహలను పొందుటచేతనే, మనం కథలో 'భవిష్యత్ నూతన నగరమును పొందుచున్నాడు' అని చెప్పుకున్నాం. ఈ మనస్సు ఇట్లు మొదట మాయాచక్రంలో తగుల్కొనుచున్నది. ఇక ఆపై జాగ్రత్ - స్వప్నములు పొందుచున్నది. ఎప్పుడో ఒకప్పుడు మౌన

సుఖమును అపేక్షించి, సుషుప్తి యందు ప్రవేశిస్తోంది. అనగా ఈ మనస్సు 'అసంకల్పస్థితి' వహించి భావరాహిత్యము అవధరిస్తోంది. కాని అది జడమగు స్థితే గాని మనోరాహిత్యస్థితి కాదు కదా! ఎందుకంటే జాగ్రత్-స్వప్నములలోని సంస్కారములు సుషుప్తి దశలో అప్రకటితంగా, అవ్యక్తంగా ఉండనే ఉంటున్నాయి. జాగ్రత్‌లో వ్యక్తం కావటానికి సంబంధించిన తహతహ అంతర్లీనంగా ఉండే ఉంటోంది.

ఒకదానివెనుక ఒకటిగా అనేక ఉపాధులందు తిరుగాడుచున్న ఈ మనస్సు ఒక సమయంలో సుఖవిశ్రాంతి కొరకు సమాధిని అపేక్షిస్తోంది. అట్లు సమాధిని ఆశ్రయిస్తూ, ఈ జన్మ పరంపరా వ్యవహారమును త్యజిస్తోంది. అప్పుడు మనస్సు యొక్క పరిభ్రమణమునకు ఆట విడుపు కలుగుచున్నది.

❖❖❖

# 5. సంకల్పరాహిత్యం-ఆత్మాశ్రయం

**దాశూరుడు:** ప్రియకుమారా! బాలుడు క్షణంలో సంకల్పించి భ్రమాత్మకమైన పిశాచాదులను ఎదురుగా చూస్తూ కెవ్వున ఏడుస్తాడు చూచావా? ఈ మనస్సు కూడా స్వకల్పనామాత్రం చేత అనంతంగా దుఃఖములను ఏర్పాటు చేసుకుంటోంది. సంకల్పమయాత్మకమగు 'మనస్సు' అనే రాజు ఈ 'విశాల ప్రపంచం' రూపంగా తన దుఃఖమును విస్తరింప జేసుకుంటున్నాడు. సూర్యుడు ఉదయించగానే చీకట్లు తొలగుతాయి కదా! ఎప్పుడైతే ఈ మనస్సు 'ఖండితమగుసత్త' యొక్క అభావన ఆశ్రయిస్తుందో, అప్పుడు అది క్రమంగా తన 'జగత్తు రూపవిస్తరణ'ను కూడా నశింప జేసుకొంటుంది, లేక ఉపసంహరించుకుంటుంది.

ప్రాపంచిక సుఖ విశేషాలు ఎట్లాంటివి? మనస్సు యొక్క కోతి చేష్ట మాత్రమే!

**కోతి చేష్ట -** ఈ మనస్సు యొక్క పరితాపములకు అంతు ఎక్కడ? ఇందుకు పెద్దలు ఒక దృష్టాంతం చెపుతూ ఉంటారు. ఒక వడ్రంగి పెద్ద దుంగను అంపముతో మధ్యకు చీలుస్తూ ఉన్నాడు. ఇంతలో భోజనమునకు సమయం అయింది. అందుచేత రెండుగా విభాగించబడుచున్న దూలం మధ్యలో ఒక పుల్లను ఇరికించి భోజనానికి వెళ్ళాడు. ఇంతలో ఒక కోతి అక్కడికి వచ్చింది. స్వకీయమైన చపలచిత్తంతో, ఆకతాయితనంగా నిరర్థకమైన కుప్పిగంతులు, పరుగులు, లాగడం, పీకడం చేస్తూ, చేస్తూ ఆ దుంగ మధ్య తన కాలుపెట్టి పుల్లను పెరకనారంభించింది. ఇంకేముంది? కొద్ది క్షణాలలో పుల్ల జారిపోయింది. ఆ కోతి యొక్క కాలు దుంగ యొక్క చీలికలో ఇరుకుకొన్నది. ఇక ఆ కోతి బాధచే పెద్దగా కేకలు వేయనారంభించింది.... ఈ మనస్సు యొక్క చర్యలు కూడా అట్టివే. ఇది తన చపలచిత్తముచే స్వకల్పనలయందు చిక్కుకుని మహాపరితాపం పొందుతోంది.

**కుక్క, బొమిక (ఇంకొక దృష్టాంతం) -** ఒక కుక్కకు ఒక బొమిక ఎక్కడో దొరికింది. ఆకలితో నకనకలాడుచున్న ఆ కుక్కకు ఆ బొమికను చూడగానే రుచికరమైన మాంసము లభించి నట్లు

భావన ఏర్పడింది. ఆవురావురమంటూ బొమికను నమలసాగింది. పాపం, ఆ నములుచున్న వేగానికి పంటి నుండి రక్తం కారసాగింది. అప్పుడు ఆ కుక్క ఇట్లా అనుకుంటోంది... "ఈ బొమిక నిస్సారమైనదని మూర్ఖులు అనుకుంటున్నారు. నాకు ఇందులోంచి రక్తం లభిస్తోంది. నేను తెలివి గలదానను కాబట్టి ఇందులోంచి రక్తం పొందుచున్నాను కదా...!" ఇక ఆ రక్తమును చప్పరించ సాగింది. ఈ మనస్సు యొక్క సుఖవేదన కూడా అట్లే ఉంటోంది.

**గాడిద, తేనెతుట్టె (ఇంకొక దృష్టాంతం) -** ఒక గాడిద నిస్సత్తువగా నడుస్తోంది. ఒక చోట నేలపై పడ్డ తేనెతుట్ట కనబడింది. అందులో తేనె చుక్క కూడా లేదు. అయినా ఆ గాడిద నిస్సార మగు తుట్టెను నములుతూనే ఉన్నది. దానికి మిగులుచున్నది పంటిబాధ మాత్రమే. ఆ తుట్టెను వదిలితే తేనె లభించలేదని దుఃఖం. నములుతూ ఉంటే, కళ్ళవెంట నీరు కారేంత శ్రమ.

అట్లాగే ఈ మనస్సు కూడా విషయభోగములందు తగుల్కొని ఉంటోంది. ఈ మనస్సు యొక్క చేష్టలు గురించి ఏమని చెప్పాలి? క్షణంలో ఆసక్తి. మరుక్షణం విరక్తి. బాలుని చేతలు లాగా క్షణక్షణం ఏవేవో వికారములను పొందుతోంది. విషయాలు లేకపోతే లేనందుకు దుఃఖం విషయాలు ఉంటే, విషయాల వలన దుఃఖం.

**దాశూరుని కుమారుడు:** తండ్రీ! మీరు చెప్పుచున్నది అక్షరాలా నిజం. 'ఖోత్థుడు' అను శబ్దార్థంతో మీరు వర్ణించి చెబుతూన్న ఈ మనస్సు నన్ను క్షోభింపజేస్తోంది. నేనిప్పుడు ఏం చేయాలి?

**దాశూరుడు:** ఈ మనస్సు ఏ ఏ విషయములలో, వస్తువులలో తగుల్కొనుచున్నదో సుతీక్ష్ణమైన దృష్టితో పరిశీలించు- ఇది దేనిని 'ప్రియము' అని భావిస్తోంది?... దేనిని ద్వేషిస్తోంది?... వేటి వల్ల కామం, క్రోధం, మాత్సర్యం కలిగి ఉంటోంది?... దేనిని మమకార దృష్టితో చూస్తోంది?... కాస్త గమనించు, క్రోడీకరించి, పర్యవేక్షించు.

ఇప్పుడు, సంకల్పాత్మకమగు ఈ మనస్సును అట్టి బాహ్యా విషయముల నుండి వెనుకకు మరల్చు. అనగా, క్రమంగా వాటి గురించి సంకల్పించటం సన్నగిల్లాలి. అందుకు సమాధిని, మౌనమును అవలంబించు. 'ఆత్మజ్ఞానం' అనే తరుణోపాయంచే ఈ మననం చేయు స్వభావమును యుక్తియుక్తంగా నిర్మూలించు. బ్రహ్మము యొక్క స్వభావమును ఆశ్రయించు. నీచే ఆత్మ విశ్రాంతి స్వీకరించబడుగాక!

అందుకుగాను మన ఈ వర్తమాన చర్చవంటి ప్రయత్నములు తప్పక ఉపకరించగలవు.

**దాశూరుని కుమారుడు:** పితృదేవా! మీరు జీవుని యొక్క మూడు శరీరముల గురించి ప్రస్తావనకు తెచ్చారు. ఆ మూడు శరీరముల యొక్క విశేషములేమిటో వివరించండి.

**దాశూరుడు:** 'సంకల్పించుట' అనునదే తన యొక్క రూపముగా గల ఈ మనస్సుకు మూడు స్వభావములు ఉన్నాయి. ఆ మూడు స్వభావములు ఉత్తమ-మధ్యమ-అధమ రూపములు కలిగి యున్నవై, ఈ జగత్ స్థితికి కారణమగుచున్నాయి. ఈ మూడు శరీరములే 'సత్వ-రజ-తమో గుణములు' గా సంజ్ఞాపూర్వకంగా చెప్పబడ్డాయి.

**మనస్సు యొక్క తమోరూపం -** ఈ ప్రకృతికి సంబంధించిన స్వాభావిక క్రియలచే నిత్యం అజాగ్రత్త, సోమరితనం, నిద్ర, బద్ధకం, ఆలస్యం వంటి సంకల్పాలు ఉదయిస్తూ ఉంటున్నాయి. అట్టి సంకల్పముల కారణంగా ఈ జీవుడు ఎంతో దీనత్వం పొందుచున్నాడు. ఫలితంగా 'క్రిములు, కీటకములు, స్థావరములు' మొదలైన యోనులు ప్రాప్తించటం జరుగుతోంది.

**మనస్సు యొక్క రజోరూపం -** ఈ స్వభావంచేత రాగము, తృష్ణ, కర్మలతో వస్తువుతో సంగము, లోభము, ఆలోచనల నుండి క్రియల నుండి విరమించలేకపోవటం వంటి సంకల్ప స్థితులు కలుగుతూ ఉంటాయి. రజోగుణ రూపమైన సంకల్పములచే ఈ జీవుడు 'మానవజన్మ' కు యోగ్యమైన వ్యవహారములు ఆచరించటం జరుగుతోంది. అయితే, కార్యసాధకమగు మానవ ఉపాధి పొందిన తరువాత ఉత్తమ కార్యక్రమంతో సమున్నతి కొరకై సమయాన్ని, అవకాశాలను సద్వినియోగపరచుకొనే బదులుగా, ఈ మానవ ఉపాధి ధరించియున్న సమయమంతా ఈ జీవులలో కొందరు ఈ లోకంలో 'పుత్రులు-ధనం-గృహాలు' మొదలైనవి పొందుటకు మాత్రమే యత్నిస్తున్నారు. వాటి యందు సంతోషమును వెతకటం చేస్తున్నారు. ఈ విధంగా అజాగ్రత్తపరులు అథమ స్థితులవైపు ఆకర్షితులగుచున్నారు.

**మనస్సు యొక్క సత్వరూపం -** ఈ స్వభావం చేత మనస్సు 'జ్ఞానం-శాశ్వతసుఖం -అప్రమేయత్వము' వంటి సంకల్పములను ఆశ్రయిస్తోంది. ఆ జీవుడు సత్వరూప సంకల్పములచే 'ధర్మము-జ్ఞానము' మొదలైన వాటి యందు ప్రియమును పొందుచున్నాడు. ఆ మనస్సు అట్టి ధర్మ-జ్ఞానములను ఆశ్రయిస్తూ క్రమంగా అచిరకాలంలో 'కేవలీభావము'ను ఆశ్రయిస్తున్నది. శాస్త్రములచే వర్ణించి చెప్పబడుచున్న 'స్వారాజ్యస్థితి'ని పొందుచున్నది. సత్వగుణానుకరణం కారణంగా ఈ దృశ్యమునకు సంబంధించిన సర్వ ప్రతిబంధకములను క్రమంగా త్యజిస్తోంది. 'దృశ్యపారతంత్ర్యము' (దృశ్యానికి వశం అగుట) అనుదాని నుండి స్వాతంత్ర్యం పొందుచున్నది.

'బ్రహ్మపదము' లేక 'మోక్షము'... అనగా సర్వసంకల్పముల రహితత్వమని గ్రహించు.

**సర్వాదృష్టీః పరిత్యజ్య నియమ్య మనసా మనః ।**
**సబాహ్యాభ్యన్తరార్థస్య సంకల్పస్య క్షయం కురు ॥** (సర్గ 53, శ్లో 38)

కాబట్టి కుమారా! బాహ్యదృష్టులన్నీ త్యజించు. మనస్సు నందు ఈ బాహ్య - అభ్యంతరములలోని సర్వపదార్థముల గురించిన సంకల్పములను రహితం చేయి.

మనస్సు చేతనే మనస్సును నిగ్రహించాలి. సంకల్పరాహిత్యమే బంధవిముక్తి.

ఒకడు వేలకొలది సంవత్సరముల తపస్సు చేయవచ్చు గాక! లేక, ఈ దేహమును నేలపై ఘర్షింపజేస్తూ చూర్ణం చేయవచ్చు..., అగ్నిలోనో, బడబాగ్నిలోనో ప్రవేశించవచ్చు..., భయంకర మైన గుంటలలోనో, కత్తుల సమూహంపైననో దూకి ఈ శరీరమును ఖండఖండములుగా చేసుకొనవచ్చు...! ఏ త్రిమూర్తులనో, లేక కరుణా సముద్రులగు దుర్వాస-దత్తాత్రేయ-బుద్ధుడు మొదలైనవారిని 'ఉపదేష్ట'లుగా కలిగియుండవచ్చు...! స్వర్గ-మర్త్య-పాతాళ-భూలోకములలోని

ఏవైనా ప్రత్యేకతలు గల ప్రదేశాలలో వసించవచ్చు గాక...! కాని ఏం ప్రయోజనం? ఏం లాభం? జరుగునదేమిటి? చివరికి 'సంకల్పానాశనం' ఆశ్రయించి, తద్వారా మాత్రమే సంకల్పములను జయించగలడు గానీ, వేరే త్రోవ లేదు. సంకల్పరాహిత్యం చేతనే మోక్షం లభించగలదని మాత్రం గ్రహించు. 'పరిశుద్ధ స్థితి' అయినట్టి మోక్షము లేక 'బంధవిముక్తి'కి సంకల్పరాహిత్యమే ఆత్యంతిక మైన ఉపాయం.

తదితరములైన అనేక చోట్లకు పోవుచున్న మనస్సును వెనుకకు మరల్చి ఆత్మభగవానుని కరచరణముల వద్దకు చేర్చాలి. ఆ తరువాత ఆత్మవస్తువుకు వేరైన సంకల్పపరంపరలు త్యజించాలి. సర్వము ఆత్మస్వరూపంగా సందర్శించాలి.

"ఇక్కడ ఆత్మకు వేరైనదేదీ లేనేలేదు" అను అఖండానుభవము దృఢీకరణమగుగాక!

అందుచేత చిరంజీవీ! నీకు నీవే సంకల్పనాశనమునకై ప్రయత్నించు. నీ సంకల్పములు నీస్వస్వరూప-స్వస్వభావమునందు విలయించుచుండగా, అప్పటి సంకల్పించు సంస్కారమునకు ఆవల ఉన్నట్టి నీయొక్క అనిర్వచనీయస్థితి-బాధారహితమైనదీ, పరమపవిత్రమైనదీ, సుఖమయ మైనదీ అని నీవే గ్రహించగలవు. అయితే అట్టి సంకల్పానాశనము అప్రయత్నశీలునికి ఎలా లభిస్తుంది చెప్పు? అందుచేత సంకల్పముల అతీతత్వము కొరకై అందుకు 'శ్రవణ-మనన -నిధిధ్యాస' రూపములతో కూడిన ఉత్తమ ప్రయత్నములను నీవు ఆశ్రయించాల్సిందే.

❖

ఓ పాపరహితుడా! కుమారా! నీచే అనుక్షణికంగా 'సంకల్పములు' అను సూత్రపు దారానికి ఈ సమస్త పదార్థములు గ్రుచ్చబడి ఉన్నాయి. అట్టి సంకల్పదారం త్రెంచబడిందా... క్షణ భంగురమగు ఈ ప్రాపంచిక పదార్థములన్నీ నీ సమక్షమునుండి మటుమాయం అవుతాయి.

సత్-అసత్ మయమైనట్టి వికల్పములన్నీ నీయొక్క సంకల్పమునుండే ఉత్పన్నమౌతున్నాయి గాని, మరింకెక్కడినుండీ కాదు. అన్నిటికీ కారణం 'నీవు సంకల్పించుట'యే! సర్వమునకు కారణమైయున్న సంకల్పము ద్వారా 'ఇది సత్తా? అసత్తా?' అనే చర్చలు ఆశ్రయించినంత మాత్రం చేత ఉత్తమ ప్రయోజనం లభించుటలేదని విజ్ఞుల యొక్క అనుభవం. వికల్పములగు ఈ పదార్థములు... సత్యవస్తువు... సర్వసంకల్పములకు అతీతము, పరిశుద్ధము... పరమార్థము... అయిఉన్న బ్రహ్మమును స్పృశించగలవా? లేదు.

అందుచేత, "నీ సర్వ సంకల్పములు లయించగా అప్పుడు "నీ సమక్షంలో శేషించునదే బ్రహ్మము' అని గ్రహించు. నీవు ఇక బ్రహ్మవేత్త మాత్రుడవు కాదు. బ్రహ్మమే అవుతావు. కార్య రూపమున ఉన్న ఈ దృశ్యవ్యవహారమంతా కూడా కారణరూపమగు 'స్వసంగము, (one's own attachment) లేక 'స్వసంకల్పములు'. (one's own perceptions...) అను వాటియందే ప్రవర్తించు చున్నది సుమా! స్వసంకల్పరాహిత్యము చేతనే ఈ 'జగత్తు లేకుండా పోవుట' జరుగగలదు. సంకల్పరహిత శుద్ధ స్వస్వరూపమే పరబ్రహ్మము.

❖

పుత్రా! నీకు మరల గుర్తు చేస్తున్నాను. నీ మనస్సు దేనిని ఏ విధంగా స్థితిపూర్వకంగా (As a form of) చింతిస్తుందో అది అట్లే పరిణమించటం, ప్రాప్తించటం జరుగుతోంది. అందుచేత నీవు సర్వవేళల సంకల్పములకు ఆవల ప్రశాంతుడవై ఉండుటను అభ్యాసం చేయి. "నేను సంకల్పించుట – అను ప్రక్రియ కంటే ముందే శుద్ధుడనై ఉన్నాను... కనుక వాస్తవానికి సంకల్పరహితుడనే" అను ఎఱుకను గ్రహించి ఉండు. అటుపై ప్రాప్తించిన వ్యవహారములను ఆచరిస్తూ ఉండు. సంకల్పాలు త్యజించుచుండుటచే క్రమంగా అభ్యాసవశంచేత చిదాత్మ ఈ విషయముల నుండి (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాదుల నుండి) స్వయముగా వెనుకకు మరల గలదు.

ఆహాఁ! చమత్కారం గమనించావా! కేవలం సత్యస్వరూపము, బ్రహ్మమయము అగు ఆత్మ అసత్యమగు 'మాయ'కు వశమై ఈ దేవ–మనుష్య–జంతు ఆదిగా గల భిన్న యోనులలో జన్మిస్తోంది. వ్యర్థంగా ఈ జగత్తు రూపంలో గల దుఃఖములన్నీ అనుభవిస్తోంది. ఇదంతా శుద్ధమగు ఆత్మకు యోగ్యమైనదేనా? ...కానే కాదు. అనేక యోనులలో, ఉపాధులలో ప్రవేశిస్తూ మృతి చెందుతూ... ఈ విధంగా దుఃఖములన్నీ అనుభవిస్తూ ఉండటం వలన ఏం ప్రయోజనం చెప్పు? అందుచేతనే బుద్ధిమంతులగు వారు అన్నిటిని ప్రక్కకు పెట్టి దుఃఖరహితమగు ఆత్మనే ఆశ్రయిస్తున్నారు. ఇక బుద్ధిహీనుల వ్యవహార మంటావా... అది మనకు అనుసరణీయం కాదు కాబట్టి అప్రస్తుతమే అవుతుంది. దాని వలన కలిగే ఉత్తమ ప్రయోజనం ఏమున్నది? బుద్ధి హీనత్వం అనేక దుఃఖములకే దారితీస్తోందని గుర్తు చేస్తున్నాను. అందుచేత నీవు తత్త్వజ్ఞానం కొరకే ప్రయత్నించు. ఈ వికల్పజాలమంతా బలత్కారంగా దూరీకరింపజేయి.

నిరతిశయానంద ప్రాప్తి కొరకు అద్వితీయమగు మోక్షపదము కొరకు యత్నించు. అట్లా కాకుండా, స్వల్ప లక్ష్యాలతో దృశ్యవ్యవహారం నందు బద్ధుడవు అయితివా... నిబిడాంధకార రూపములగు అనేక దుఃఖపరంపరలు నీ కొరకు వేచి ఉంటాయి. ఇప్పుడు నీ ఎదురుగా రెండు మార్గములు ఉన్నాయి– 1) సంకల్పించుట అను స్వభావము ఆశ్రయించి ఉండుట 2) సంకల్ప రాహిత్యమును అభ్యసించుట. ఈ రెండింటినీ క్షుణ్ణంగా అర్థం చేసుకో. సమన్వయం చేయి. ఆపై నీ ప్రయత్నములను తదనుకూలంగా తీర్చిదిద్దుకో.

❖❖❖

## 6. సంకల్ప విచికిత్స

**దాశూర పుత్రుడు:** తండ్రీ! ఈ సంకల్పము అనేది ఏ విధంగా ఉంటోంది? అసలు అది ఎట్లా ఉత్పన్నమౌతోంది? ఎట్లా వృద్ధి చెందుతోంది? ఎట్లా నశిస్తోంది? ఎలా, ఎక్కడి నుండి, ఎప్పటి నుండి, ఎవరి ప్రోద్బలంచేత ఎవరి కొరకు బయల్వెడలుతోంది?

**దాశూరుడు:** అనంతము – సత్తాసామాన్యము – ఆత్మస్వరూపము అగు చైతన్యము నిర్వచించబడ లేనట్టి కారణంగా ఒకానొకప్పుడు విషయములవైపు ఉన్ముఖమగుచున్నది. అట్లు విషయములవైపు

ఉన్ముఖం అగుటయే సంకల్పము యొక్క అంకురము. ఆ అంకురం అల్పమాత్రమే అయినప్పటికీ, అది సత్తను పొందినదై చిదాకాశము యొక్క నలువైపుల వ్యాపించుచున్నది. ఆ సంకల్పాంకురము తన అధిష్ఠానమగు 'చిత్ స్వరూపము' నే మరుగుపరచుచున్నది. అటుపై జడమగు ప్రపంచాకారం పొందుటకు గాను క్రమంగా ఘనత్వం పొందుతోంది. అట్లు ప్రాప్తిస్తున్న విషయ రూప జగత్తును 'ఇదంతా నాకంటే వేరుగా బాహ్యమున ఏర్పడి ఉన్నది'.. అను భావన చేస్తోంది. ఒక బీజము 'మొలుచుట' అను క్రమమును పొందుచున్నది చూచావా? అట్లాగే, ఆ చిత్ శక్తి సంకల్పత్వము పొందుతోంది. అటుపై ఒక సంకల్పము నుండి మరొక సంకల్పము ఉదయిస్తోంది. ఇక ఆపై ఈ సుదీర్ఘమైన సంకల్ప వ్యవహారమంతా విస్తరిస్తోంది. సంకల్పముల వెంట నిష్కారణంగా దుఃఖ పరంపరలు వచ్చి పడుచున్నాయి. అయితే సముద్రములో ఎన్ని తరంగాలు ఉదయిస్తే ఏమున్నది? అవన్నీ జలమే అయి ఉన్నాయి కదా! ఈ జగత్తంతా సంకల్పమాత్రమే. సంకల్పము తప్ప వేరుగా ఈ ప్రపంచంలో దుఃఖ-సుఖములంటూ ఎవరికీ ఏవీ లేవు.

ఈ మనస్సు కాకతాళీయన్యాయం చేత వివర్తభావము ఆశ్రయిస్తోంది. ఇది మిథ్యా రూపముననే ఉత్పన్నమౌతోంది. మృగతృష్ణవలె, రెండవ చంద్రుని భ్రాంతివలె ఇది అసత్యమైనదే! కాని దీని వృద్ధిని మాత్రం మనం చూస్తున్నాం. ప్రకృతి శాస్త్రంలో 'మాతులుంగము' అను పేరుగల చెట్టు గురించి చెబుతారు. ఆ చెట్టు పళ్ళు తిన్నవారికి అంతఃకరణంలో తెల్లటి పదార్థముల పట్ల భ్రాంతిపూర్వకమైన ప్రీతి ఏర్పడుతుంది. ఫలితంగా తెల్లటి పదార్థములు అత్యంత రుచికరమైనవిగా అనుభవమౌతుంది. ఆ ప్రీతి అసత్యమే అయినప్పటికీ తెల్లటి పదార్థములు తింటున్నప్పుడు అతనికి ప్రశస్తమైన రుచి మాత్రం అనుభవమౌతుంది. అదే విధంగా, మత్తు పదార్థములు సేవించువారికి చుట్టూ ఉన్న వస్తువులన్నీ గాలిలో తేలియాడుచున్నట్లు అనుభవమౌతాయి. ఈ వస్తువులు ఎగిరి పడటం అవాస్తమే అయినప్పటికీ అతనికి సత్యముగానే అగుచున్నది. ఈ జీవునియందు 'సంకల్పించుట' అను ప్రవృత్తి ఉద్భవించి, ఈ పదార్థములతోటి... వ్యక్తులతోటి సంబంధము వాస్తవమైన అనుభవముగా అతనికి ప్రాప్తించుచున్నది. కానీ అవన్నీ ఈ జీవుని యొక్క ఇష్ట-అయిష్టములను ఆశ్రయించే ఉంటున్నాయి.

**దాశూరుని కుమారుడు:** పితృదేవా! ఈ జన్మ-కర్మలకు, ఈ సంబంధాదుల భ్రమలకు కారణం అంతరమైనదా? బాహ్యమైనదా? నేను-తదితరులు ఎట్లా ఉత్పన్నమగుచున్నాము?

**దాశూరుడు:** నీవు మిథ్యారూపముననే ఉత్పన్నమైనావు. అట్లే నేను కూడా. 'ఈ శరీరము-దృశ్యము తదితర సంబంధ బాంధవ్యములు'... దృష్ట్యా చూచినప్పుడు మనమందరం మిథ్యారూపులమే. ఇక నిత్య-సత్య-శుద్ధమగు మన స్వస్వరూపము దృష్ట్యా మనం సర్వదా సత్స్వరూపులమే. మన యొక్క 'సత్' స్వరూపమున ఏ క్షణమందు ఎట్టి మిథ్యాత్వము లేనేలేదు. నేను బోధిస్తున్న ఈ మన ఆధ్యాత్మ శాస్త్రాన్ని తెలుసుకున్నావా - ఇక మిథ్యాత్వము నీ దృష్టి నుండి పూర్తిగా తొలగిపోగలదు.

ఈ దుఃఖజాలమంతా నీకు ఎందుకు ప్రాప్తిస్తోంది...? చెప్పమంటావా! 'వేద-వేదాంతాలచే సుస్పష్టపరచబడుచున్నట్టి పూర్ణాత్మ అనగా... నేనే! అట్టి ఆత్మకు గాని, ఆత్మయే స్వరూపముగా గల

నాకు గాని, 'నేను' 'నాది' అనునదంతా ఉండజాలదు. తదితర పదార్థములగు వస్తువులు – సుఖము–దుఃఖము–జన్మలు–మొదలైనవన్నీ మిథ్యారూపమే అయి ఉన్నాయి...' అనునట్టి ఎరుకకు సంబంధించిన విశ్వాసం ఏర్పడకపోవుట చేతనే.

ఇదే 'ఆత్మ విశ్వాసం' సుమా! అట్టి ఆత్మ విశ్వాసము దృఢపడిన తరువాత ఇక అజ్ఞానమునకు కారణం ఏం ఉంటుంది? 'నేను ఆత్మను... శరీరమును కాను'... అను విశ్వాసం లేకపోవటచేతనే ఈతడు అజ్ఞానమునకు చోటిచ్చుచున్నాడు. క్షణంలో స్వల్పవిషయాలు కూడా అతనిని విచలితుణ్ణి చేస్తున్నాయి. ఎక్కడ విచారణ చేసిన తరువాత ఇక దుఃఖము ఉండదో, అక్కడ విచారణ చేయటం మానివేసి ఈ జీవుడు దుఃఖితుడై చతికిలపడుచున్నాడు.

కుమారా! వాస్తవానికి ఈ జన్మాదులతో గాని, ఈ దృశ్యములోని ఆయా పదార్థములతో గాని నీకు ఏ సమయమందు కూడా సంబంధం లేదు. అయినప్పటికీ భ్రాంతిచే నీకు నీవే అట్టి సంబంధమును కల్పించుకొనుచున్నావు. కాస్త యథార్థ దృష్టితో చూచి, ఈ ఆత్మకు జన్మలు ఎక్కడ ఉన్నాయో చెప్పు? శరీరము కంటే ముందు కూడా నీవు ఉన్నావు. అనగా, ఈ శరీరముతో నీవు పుట్టుట లేదు – ఇతఃపూర్వమే ఉన్నావు. శరీరము నేలకూలిన తరువాత కూడా నీవు ఉంటున్నావు. అనగా శరీరపతనంతో బాటు నీవు రహితం అగుటలేదు. ఈ శరీరము ఉన్నప్పుడో, నీ ఉనికి గురించి వేరే చెప్పేదేమున్నది? మనో–బుద్ధి–అహంకారములతో కూడిన సూక్ష్మశరీరముతో ఈ శరీరమును ఉపయోగించుకుంటూ సంచారము సలుపుచూ ఉండనే ఉన్నావు కదా! సూక్ష్మశరీరం యొక్క చావు పుట్టుకలను ఎవరైనా గాంచుచున్నారా? లేదే. లేనప్పుడు 'నేను చచ్చాను... ఆతడు చచ్చాడు'... అనునదంతా భ్రమ కాక మరేమిటి?

వాస్తవానికి నీవు ఒక్కడివే సత్యము. సూక్ష్మశరీరము కూడా అసత్యము మాత్రమే. జలమే సర్వదా సత్యము. జలము కంటే వేరైనది – జలము కానిది– అగు 'తరంగములు' అనబడేది ఎక్కడైనా లభిస్తుందా? అందుచేత, 'నేను జ్ఞానం పొందియున్న – పొందియుండని సమయాలలో కూడా శుద్ధ చైతన్యస్వరూపుడనే అయి ఉంటున్నాను'... అని గ్రహించు. దోషపూరితమైన సంకల్పములకు వశీభూతుడవగుటచేతనే ఇట్లు మూఢుడివి, సంసారివి అగుచున్నావు.

పుత్రా! ఇప్పుడు చెప్పేది విను. ఇతఃపూర్వం అనుభూతములైన సుఖ–దుఃఖాది పదార్థముల గురించి 'సంస్మరించుట–సంకల్పించుట–సమాశ్రయించుట'లను క్రమంగా సన్నగిల్లచేయి. ఎట్లా? కేవలం అఖండము, నిర్మలము, నిత్యము అగు ఆత్మను భావన చేయుట చేతనే. అట్టి భావనామాత్రంచేత 'ఆత్మసిద్ధి' అనే ఐశ్వర్యం పొంది ఈ జీవుడు భవ్యజీవుడు కాగలడు. "నేను జన్మ మృత్యు రహితుడను... శుద్ధుడను... శాశ్వతమగు అమృతస్వరూపుడను"... అని భావన చేయుటలో ఏమి కష్టమున్నదో నాకు చెప్పు? మరి జనులు 'మోక్షము దుర్లభము' అని ఎందుకు అంటున్నారో నేను గ్రహించలేకపోవుచున్నాను. 'మోక్షమనేది చాలా కష్టమైన విషయం' అని బాలురు మాత్రమే అంటున్నారు.

'ఎందుకని అట్లు అనిపిస్తోంది?'... అనేది మేము పరిశీలించాం. కారణం...? 'వారి స్వస్వరూపమునందు వారికి తగినంత విశ్వాసం ఏర్పడకపోవుట చేతనే'... అని అనక తప్పదు.

స్వస్వరూపము పట్ల అట్టి విశ్వాసము కలిగించి, తదితర పదార్థముల పట్ల, విషయముల పట్ల అనాసక్తి-దుఃఖరాహిత్యం కలుగజేయటానికే ఈ వేద-వేదాంత క్రియా-జ్ఞాన వ్యవహారాలన్నీ ఉన్నాయి. "దృశ్యఅనాసక్తి-ఆత్మవస్తువును ఎఱుగుటలో ఆసక్తి" కలిగించునంతవరకే ఈ విధి నియమాదుల పాత్ర. ఎప్పుడైతే స్వస్వరూపమగు ఆత్మయందు పూర్ణవిశ్వాసము సుస్థిరమౌతుందో, అట్టి అప్పటి ఉత్తమస్థితి 'మోక్షస్థితి' కంటే వేరైనదేదీ కాదు సుమా!

**అభావించటం -** ఎప్పుడైతే నీవు సంకల్పనాశనము కొరకు యత్నిస్తావో, ఇకప్పుడు ఈ జనన-మరణాది భయమును పొందవు. 'భావన' చేయకున్నంత మాత్రంచేత సంకల్ప ప్రవాహం క్రమంగా క్షీణించగలదు.

ఒక పువ్వు యొక్క దళములు మర్ధించాలంటే కొంత శ్రముంటుందేమో, చేతులు మర్దించాలి. 'భావించక పోవుట' యందు క్రియకు సంబంధించిన శ్రమయే ఉండదు కదా! ఇక ఇందులో కష్టమేమి ఉంటుంది? కల్పనావినాశనము... అను మోక్షస్థితి కష్టమైనదనుట భావ్యం కాదు. చేతుల మర్దన అనే శ్రమ కూడా ఉండనట్టిది మోక్షభావన.

కేవలం భావనా విస్మరణ మాత్రం చేత అరక్షణంలో సంకల్పవినాశనం సిద్ధిస్తుంది. అయితే, ఎటొచ్చీ అట్టి 'సంకల్పరాహిత్యస్థితి' లో సుస్థిరుడవై ఉంటే చాలు. భావాతీతమైనదే తత్‌పదం.

నిరంతరం ఆత్మ యొక్క పూర్ణానందరూపమును చింతనచేస్తూ ఉండు. ఆత్మయందే స్థితి కలిగియుండు. అప్పుడు అసాధ్యమగు వస్తువు కూడా సిద్ధించగలదు. ఇందులో సందేహం లేదు. ఆత్మ దేనిచేతను హరింపబడుటగాని, నశింపజేయబడుట గాని, సంభవింపజాలదు. అందుచేత ఉత్తమ సంకల్పంచే అధమ సంకల్పాన్ని త్యజించివేయి. "ఈ కనబడే ఈతడు మమాత్మ స్వరూపుడే కదా!" అను భావనతో వ్యవహరిస్తూ ఉండు. 'నేను పూర్ణమగు ఆత్మనే' అనేదే ఆ ఉత్తమ సంకల్పం.

మనస్సుతో మనస్సును విచ్ఛిన్నం చేయి. స్వాత్మయందు సుస్థిరుడవై ఉండు. 'నిస్సంకల్ప మాత్రము, సులభసాధ్యము'... అయినట్టి ఈ మాత్రం ప్రశాంతబుద్ధిచే గ్రహించటంలో, ఆచరించటంలో ఏమి కష్టమున్నదో చెప్పు?

❖

'అట్లా ఎట్లా? మోక్షము అంత సులభమా? అంత తేలికగా నాకు లభించుటయా? లేదు... అది మాకు ఎన్ని జన్మలకో గాని లభించదు...' అని నీవు సంకల్పించటం జరిగితే, ఇక ఆ తరువాత ఆ తదనంతర ప్రాప్తి కూడా అట్లే అయి ఉంటున్నది.

'నేను ఇప్పటికే పూర్ణుడను, మోక్షస్వరూపుడను, ఈ మనో-బుద్ధి-చిత్త-అహంకారాదులకు సంబంధించనట్టి శుద్ధస్వరూపడను'... అని భావన చేశావనుకో.. నీ అనుభవం తదనుకూలంగానే ఉంటోంది. భావన యొక్క అనుసంధాన తీవ్రతను అనుసరించి అది అట్లే సత్యమై నీవు ఈ క్షణమందే మోక్షస్వరూపుడవు, పూర్ణుడవు కాగలవు.

సంకల్పము మొత్తముగా శమించిందా... ఈ జగత్తంతా శమించగలదు. ఓ మహామతీ! సంకల్పము యొక్క అభావమాత్రం చేత సంసారదుఃఖమంతా సమూలంగా తొలగిపోతుంది.

**సంకల్పో హి మనోజీవచ్చిత్తం బుద్ధిః నవాసనా ।**
**నామ్నైవాన్యత్వమేతేషాం నార్థేనార్థవిదాంవర ॥** (సర్గ 54, శ్లో 20)

సంకల్పమే మనస్సు. అదియే "జీవుడు, చిత్తము, వాసనాసహితమగు బుద్ధి" కూడా. ఈ మనస్సు–బుద్ధి–అహంకారము–చిత్తము మొదలైన వాటియందలి భేదమంతా నామమాత్రమే గాని వాస్తవం కాదు. సంకల్పమునకు అన్యముగా ప్రపంచమున ఏదీ కించిత్ కూడా లేదు.

అట్టి సంకల్పము అనబడుదానిని నీ హృదయంలోనే, "నీ చేతిలో ఓడిపోయిన నీ సామంత రాజు" వలె స్వవశం చేసుకోవాలి. అట్లు చేయకుండా ఊరకే ఎందుకు పరితపిస్తున్నావో నాకు అర్థం కావటం లేదు.

❖❖❖

# 7. ఆరోపితం

**దాశూరుడు:** ఈ జగత్తు "ఆకాశము" వలె శూన్యమైనది మాత్రమే.

**దాశూరపుత్రుడు:** ఈ జగత్తు శూన్యమైనప్పుడు ద్రష్ట కూడా శూన్యుడే అవుతాడా? "జగత్తు లేదు" అనుకుంటే, జగద్వ్యవహారములే కుదరవు కదా? అప్పుడు అట్టి అవగాహనగల జీవులతో నిండిన జగత్తు జడమే అయిపోతుందేమో?

**దాశూరుడు:** విశాలమైన ఎడారిలో ఒకడు 'మృగతృష్ణ'ను చూచాడనుకో... విశ్లేషణచే "మృగ తృష్ణలో జలము ఉండదు" అని గ్రహించబడినప్పుడు ఆ ఎడారి పొందే నష్టమేమిటో చెప్పు? ఈ జగత్తు, జీవుడు మొదలైనవన్నీ నీ పట్ల తొలగిపోయినప్పటికీ "దృక్" రూపుడవగు నీకు, (లేక ఆత్మకు) ఏ మాత్రం లోటు ఉండదు. అది ఏ మాత్రం శూన్యత్వం పొందదు. యథారీతిగా పూర్ణమయ్యే ఉంటుంది.

మృగతృష్ణతో సమానమైన ఈ జగత్తు 'అసత్' స్వరూపములగు వికల్పముల చేతనే ఆవిర్భూతమగుచున్నది. ఈ "జగత్తు" అనునది ఆరోపిత వ్యవహారం మాత్రమే. ఆరోపించబడింది తొలగిస్తే పోయేదేమున్నది?

మిథ్యాభూతమగు సంకల్పమే స్వయంగా మిథ్యాభూతమగు ఈ మొత్తం జగత్ వ్యవహారాన్ని ప్రకటితమొనర్చుచున్నది. అట్టి సంకల్ప వ్యవహారం నిరోధించబడగా, నీవు సంకల్ప రహితుడవ గుచున్నావు. నీ దృష్టిలో 'లేనివే' అని తెలియవచ్చిన పదార్థములచే నీవు బాధింప బడవు. జగత్తు పట్ల "ఇది సత్యమైనదే" అనే బుద్ధి తొలగుచుండగా, ఇక నీయందు వాసనలు సంభవించవు.

భావనాక్షయమే వాసనాక్షయం కూడా. సర్వభావనలూ తొలగినప్పటికీ, ఇక తొలగింప జాలనిదేదో... అదే నీవు. వాసనాక్షయమే మోక్షస్థితి యొక్క సంప్రాప్తము.

కాబట్టి నాయనా! దృఢమైన అభ్యాసముచే 'ఈ దృశ్యము లేదు... ఈ జగత్తంతా అసత్యము' ... అని గ్రహించు! ఎప్పుడైతే నీవు 'దృశ్యరాహిత్యం' అవధరిస్తావో, ఈ దేహాదులందు ఆత్మ భావము లేకుండా ఉంటావో – అప్పుడు నీవు ఈ సుఖ–దుఃఖములలో తగుల్కొనే ప్రసక్తే ఉండదు. 'ఈ దేహం, ఈ బంధువులు, ఈ మిత్రులు, ఈ వస్తుసముదాయము మిథ్యారూపములే కదా..." అని నిశ్చయించుటచే వానియందు నీకు ఆసక్తి–అభినివేశములు జనించవు. ఆసక్తి నశించిందా, ఇక 'హర్షం–దుఃఖం', 'జననం–మరణం' మొదలైనవన్నీ నీపట్ల అసంభవములే అవుతాయి. కాబట్టి సుఖ దుఃఖాది విభ్రమమలు నీకెప్పుడైనా ప్రాప్తిస్తుంటే 'ఇదంతా అసత్తుయే" అను నిశ్చయమును కలిగియే ఉండు. ఆపై ఎట్లు ఉచితమో అట్లే వ్యవహరించు.

**విషయ విస్మరణం -** ఈ మనస్సే చిద్వస్తువు యొక్క ప్రతిబింబమువంటి 'జీవుడు' అను రూపమును ధరిస్తోంది. ఈ జగత్తు రూపమైనట్టి భూత–భవిష్యత్తు–వర్తమాన జగత్తునంతటినీ మనస్సే నిర్మించుకుంటూపోతోంది. అదే సర్వమును ఉద్భవింపజేస్తోంది. పరివర్తింపజేస్తోంది. నశింపజేస్తోంది. అది ఒక సమయంలో విషయములతో సంబంధమును పొందినదై వాసనలచే ఆచ్ఛాదితమగుచున్నది.

అయితే ఒక ప్రశ్న. ఇంతటి వ్యవహారమును నిర్వర్తిస్తున్న ఈ మనస్సు స్వయంశక్తి కలిగి యున్నదా? లేదు. అది వాస్తవానికి జడమైనది. అది అధిష్ఠానమగు 'శుద్ధ చైతన్యం' యొక్క సంబంధం చేతనే స్ఫురణ శక్తియుతమై యున్నది. అట్టి శుద్ధ చైతన్యమే నీ వాస్తవ స్వరూపం గాని, ఈ శరీర మనస్సులు నీవు కావు. అయితే మలినము–చంచలము అగు 'ఇచ్ఛ'చే ప్రేరేపించబడుట చేతనే మనస్సు ఈ 'జగత్తు రచన' అను వ్యవస్థను నిర్వర్తించుచున్నది. 'హృదయం' అనే వనంలో 'కోతి' వంటి ఈ జీవుని మనస్సు స్వ–ఇచ్ఛానుసారంగా, స్వయంకల్పిత కార్యక్రమానుసారంగా ఈ జగత్తులో లీలలు నిర్వరిస్తోంది.

ఈ జీవుడు (లేక మనస్సు) ఒకప్పుడు విశాలాకారయుతుడగుచున్నాడు. మరొకప్పుడు అత్యంత సంకుచితరూపం పొందుచున్నాడు.

ఒకప్పుడు జాగ్రత్–స్వప్న సంసక్తతచే "నేను పరాధీనుడను" అను భావం పొందుచున్నాడు. మరొకప్పుడు "నేను సర్వమునకు అసంబంధితుడను" అను రీతిగా భావనను ఆశ్రయిస్తున్నాడు. సంబంధమే లేని చోట, యిక బంధమంటూ ఎక్కడిది?

ఈ 'సంకల్పములు' అను తరంగాలు ఎప్పటి నుండి పుడుచున్నాయో దేశకాలముల దృష్ట్యా గ్రహింప శక్యము కాకయే ఉన్నాయి. అయితే, "సంకల్పములు విషయముల పట్ల ఏర్పడు 'ధ్యాస' చేతనే ఉద్భోధితమై, వృద్ధి చెందుచున్నాయి"... అని మాత్రం తప్పక చెప్పవచ్చు. దేశ–కాలములు సలకల్పార్గతములే! 'విషయవిస్మరణం' అను ఒక వజ్రాయుధంచేత మాత్రమే ఈ సంకల్ప వ్యవహారమంతా సమూలంగా నశించగలదు.

❖❖❖

## 8. ఉన్నది ఎల్లప్పుడూ ఉంటోంది - లేనిది ఏనాడు లేదు.

ఈ జీవునియందలి సంకల్పించు స్వభావం అల్పవిషయం చేత కూడా ప్రజ్జ్వరిల్లుతోంది. క్షణభంగురములు, జడత్వమును ఆశ్రయించి ఉన్నట్టివి, అప్రకటితరూపములు అయినట్టి సంకల్పములే ఈ జగత్తులో విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నాయి.

ఓ ప్రియకుమారా! ఈ ప్రపంచంలో ఏదైతే అసత్యమైయున్నదో, అదంతా శీఘ్రంగా నివారించబడుటయే ఉచితం కదా!

అసత్ వస్తువు సత్ అవుతుందా? ఎన్నటికీ కాదు. ఇందులో సందేహం లేదు.

'సత్' అను వివేచనను 'సంకల్పాలు' అను వాటికి అన్వయించి చూద్దాం. ఒకవేళ 'సంకల్పం' అనునది సత్స్వరూపమే అయి ఉంటే ఇక దానిని నిగ్రహించటం ఎవరి తరం చెప్పు? అది స్వతహాగా అట్లే ఉండగలదు. అది "సత్‌స్వరూపము" కాదు కాబట్టే, కొందరు మహనీయులు దివ్య మగు ఆత్మజ్ఞానంచే సంకల్పరహితులై, స్వసత్తచే స్వయంప్రకాశంగా వెలుగొందుచున్నారు.

'సంకల్పము' అనునది అసత్తే కనుక దానిని దమింపజేయడం తప్పక సుసాధ్యమే. ఈ 'ప్రపంచము' రూపములో నీకు సంప్రాప్తించుచున్న మాలిన్యము సత్యమే అయితే ఇక దానిని తొలగించుట ఎట్లు? బొగ్గుకు ఉన్న నలుపును ఎంత శుభ్రపరచినా తొలగించగలమా? దాని నలుపును తొలగించుటకు యత్నించువాడు మూర్ఖుడే అవుతాడు కదా!

ఈ జగత్తు, ఇందు జీవునకు స్ఫురించుచున్న సంకల్ప వ్యవహారంతో సహా సత్యం కానే కాదు.

❖❖❖

## 9. ప్రయత్నించినవాడే గ్రహిస్తున్నాడు.

ప్రియపుత్రకా! ఈ ప్రపంచము యొక్క స్థితి అనిర్వచనీయము. ఇది అనాదికాలంగా సిద్ధించి ఉంటోంది. 'జ్ఞానము' అనే పరమార్థం చేత ఇది తప్పక సంపూర్ణముగా తొలగగలదు. జ్ఞాని మాత్రమే అతి విస్తారమగు ఈ సంసారమాలిన్యమును విచ్ఛిన్నం చేయగలుగుతున్నాడు. ధాన్యము యొక్క పొట్టు ఎట్లా పోతుంది? దంచుట చేతనే కదా! రాగిపై చిలుము తొలగుతుందా? 'తోముట' అను క్రియచే తప్పక తొలగుతుంది కదా! ఈ సంసారమాలిన్యము కూడా 'జ్ఞాన భూమికల అభ్యాసం' అనే ప్రయత్నముచే తప్పక తొలగుతుంది. పురుష ప్రయత్నము తప్పక ఫలదాయకమవుతుంది. ఇందులో సందేహం లేదు. అందుచేత అభ్యాసక్రమముచే నీవు 'శుద్ధము-అఖండము-నిష్కళంకము-నిత్యము' అగు నీయొక్క స్వస్వరూపాత్మను గాంచగలవు. అట్లు గాంచుట జరుగుచుండగా సర్వవ్యధలు, వేదనలు, ఖేదభావనలు వాటంతట అవే తొలగుతాయి. ఓ బిడ్డా! నీవు సరి అయిన ఉపాయములను ఆశ్రయించకపోవుట చేతనే మిథ్యా వికల్పయుక్తమగు ఈ సంసారమంతా ఇంతవరకు జయించబడక పోవటం జరుగుతోంది. అట్లే

తదితరులగు సర్వజీవుల విషయం కూడా, 'అసంకల్పము' అను యత్నముచే ఇది శీఘ్రముగా విలయమొందుచున్నది. ఈ విషయంలో ఎవ్వరికీ సందేహాలు అక్కర్లేదు.

అసద్వస్తువు ఎక్కడైనా చిరకాలం స్థిరంగా ఉంటోందా?... లేదు. చీకట్లో ఉన్నవాడు దీపం వెలిగించుకుంటే ఇక ఆ చీకటి ఎక్కడ ఉంటుంది? అది ఎక్కడికి పోతోందని చెప్పాలి? దృఢమైన దృష్టితో చూస్తే ఆకాశంలో ఇద్దరు చంద్రులు ఇక కనిపిస్తారా? ఈ సంసారము కూడా తత్త్వ విచారముచే మిథ్యాత్వము పొందుతోంది. ఓ ప్రియకుమారా! సర్వదా ఒక్క విషయం గుర్తుంచుకో. నీవు ఈ సంసారమునకు చెందినవాడవు కావు. అట్లాగే ఈ సంసారము కూడా నీకు చెందినది కాదు. కనుక నిశ్చింతగా ఈ సంసార భ్రాంతిని విడిచిపెట్టు. "ఈ సంసారము మిథ్యయే" అని తెలిసిన తరువాత కూడా ఇక నీకీ చింతనలు ఎందుకు చెప్పు? కనుక సర్వ విషాదపూరిత చింతలు క్రమక్రమంగానో, ఒక్కసారిగానో త్యజించివేయి.

"నేనొక జీవుడను. అనేక విభవములతో కూడిన ఈ భోగవిలాసాలు యుక్తమే. ఇందులో కొన్ని వస్తువులు, వ్యవహారములు పొందుటచే నేను ఆనందించగలను. కొన్నిటిని నేను వదల్చుకో వలసియున్నది." – ఇవన్నీ సాంసారిక వీచికలేనని గ్రహించు.

నీ రూపమున, మరియు ఈ దృశ్యము రూపమున ప్రకటితమగుచున్నదేది? సర్వ విధములా ప్రకాశించుచున్నది ఆత్మయే కదా! సర్వము ఆత్మయే అయి ఉండగా నీకు దిగుళ్ళు, రంధులు ఎందుకు కలగాలి? వాటి ప్రమేయమును నీవు ఎందుకు ఆశ్రయించాలి?... అందుచేత సర్వదా నిశ్చింతుడవై ఉండు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వింటున్నావా రామచంద్రా! వారి సంభాషణ అట్లు ముగిసింది. ఆపై నేను వారి ముందు భౌతిక రూపుడనై ప్రదర్శించుకున్నాను. వారిద్దరు వినమ్రతతో నన్ను ఆహ్వానించి, పూజించారు. దాశూరుడు చెప్పిన ఆప్తవాక్యములను అభినందించాను. అందలి సారవిశేషాలను పునఃసమీక్షిస్తూ ప్రసంగించాను. సంసారము నుండి ఈ జీవుని తరింపజేయగల అనేక గాథలు వినిపించాను. మేం ముగ్గురం ఆత్మవిషయమై అనేక దృక్పథముల నుండి అనేక విషయాలు చెప్పుకున్నాం.

ఆ రాత్రి ఉల్లాసంగా గడచిపోయింది. ఆ మరునాడు ఆ తండ్రీకొడుకులు నన్ను భక్తి పూర్వకంగా సాగనంపారు. నేను నా కార్యక్రమము ననుసరించి ఆకాశంలో ప్రవేశించి మునులు వేచియున్నచోటికి పయనించాను.

ఇప్పుడీ 'దాశూరాఖ్యాక' విన్నావు కదా! దీనిని అనుసరించి "ఈ జగత్తు ప్రతిబింబము వలె అసత్యమైనది" అని గ్రహించు. ఈ సంభాషణను అనుసరించి ప్రజలలో "ఇది దాశూరాఖ్యాయిక వంటిది" అనునది ప్రచారంలోకి వచ్చింది.

❖❖❖

# 10. దాశూరాఖ్యాయిక: విజ్ఞాన సారాంశము

ఈ 'నేను–నీవు' అనునదంతా ఆత్మయే. కనుక 'అధిష్ఠాన చైతన్యం' దృష్ట్యా చూచినప్పుడు ఇవి వాస్తవమే. ఆరోపితం దృష్ట్యా ఇవి అవాస్తములేనని కూడా గ్రహించు.

"నేను–నాది" ఇత్యాది అధ్యాసలను త్యజించివేయి. దాశూరమహాముని తన కుమారునికి చెప్పిన సిద్ధాంతాలలోని అంతర్లీనగానాన్ని గమనించు. ఉదారచిత్తుడవు, ఆత్మనిష్ఠుడవు అగుము. వికల్పాత్మకమగు 'మనస్సు'కు హేతువు అగుచున్న అజ్ఞాన మాలిన్యమును 'నేను ఆత్మ తేజమునే" అను ప్రస్తావనచే కడిగివేయి.

ఆత్మతత్త్వమును అవలోకించుచూ ఉన్నావా... ఇక నీవు అతి శీఘ్రముగా మోక్షపదమును పొందగలవు. ఈ పదునాలుగు లోకములలో పూజ్యుడవు కాగలవు.

ఇట్టి పరిశుద్ధ "స్వస్వరూపాత్మదర్శనము"చే మావంటి ఋషులకు కూడా నీవు నమస్కరింప తగిన వాడవగుచున్నావు.

❖❖❖

# VIII. కచోపాఖ్యానము - ఉపోద్ఘాత చర్చ

## 1. ఈ సృష్టికి కర్త ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! జడాత్మకమగు ఈ ప్రపంచం 'లేదు' అనే నిశ్చయం కలిగి ఉండటమే ఉచితం. ఈ 'నేను-నాది' మొదలైన భేద అధ్యాసల పట్ల విశ్వాసం త్యజించివేయి. వివేకులకు ఎక్కడైనా లేనిదానియందు విశ్వాసముంటుందా? అవివేకులకు మాత్రమే అసత్యమైన దాని యందు ఉద్వేగము, రాగము, సంరంభము ఉంటాయి.

నీవు వివేకివి కావాలి. అంతేగాని అవివేకమును ఆశ్రయించి దుఃఖించటమేమిటి చెప్పు? ఈ 'దేహాలు' మొదలైన వాటితో కూడియున్న దృశ్యజగత్తు ఆత్మ కంటే వేరుగా సత్తను పొందివుందా?.. లేదు కదా! ...అందుచేత నీవు అపేక్షా రహితుడవు అవ్వాలి. అసంగం, ఉదాసీనం, చిద్రూపం అయినట్టి 'స్వాత్మ' యందే సుస్థిరుడవై ఉండు. అజ్ఞాని 'అధ్యాస' అను స్వభావం కలిగి ఉంటున్నాడు. ఫలితమేమిటి? ఆత్మకంటే వేరుగా ఈ దేహాదులందు ఆత్మతత్త్వమును ఆపాదించుకొంటున్నాడు. పరితపిస్తున్నాడు."నేను ఈ దేహమునే, నేను చచ్చుచున్నాను, పుట్టుచున్నాను' అని అనుకుంటు న్నాడు. ఈ శరీరము-దృశ్యము మొదలైనవాటిపట్ల సత్యత్వబుద్ధి సమంజసము కాదు సుమా!

ఈ జగత్తే సదసత్తు (Truely as well as falsely exists) అని, దీనికి ఒక నియతి అంటూ ఏదీ లేదని నీవు ఎరుగుదువు కదా! మరి దేహము మొదలుగా అనేక పదార్థములతో కూడుకొని ప్రాప్తిస్తున్న ఇక్కడి సంబంధ-బాంధవ్యములపై మాత్రం విశ్వాసం ఎందుకు? ఈ జగత్తే "లేదు"... అని నిశ్చయించిన తరువాత ఇక సంబంధమేమిటి? బంధమేమిటి? ఎవరికి? ఎక్కడ? కేవలం ఆత్మ ఒక్కటే సర్వదా సిద్ధించి ఉన్నది, ఉంటున్నది. అది సర్వదా, నిర్మలము, వ్యాపకము, అనంతము, సర్వప్రమాణములు అందుకోలేనిది అయి ఉన్నది.

**శ్రీరాముడు:** బాగున్నది స్వామీ! అయితే, ఒక సందేహం. మీ ఉద్దేశము ననుసరించి ఈ జగత్తుకు కర్త ఎవరు? కారకులు, ప్రేరకులు ఎవరైనా ఉన్నారా? ఉంటే వారు ఎక్కడ ఉన్నారు? ఎక్కడ నుండి దీనినంతటినీ నడుపుచున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ జగత్తు విషయంలో ఇప్పటికే అనేక విశేషాలు చెప్పుకున్నాం. నీ ప్రశ్నకు సమాధానంగా ఈ జగత్తు విషయంలో మా అభిప్రాయములు మరికొన్ని విశేషాలు చెప్పుచున్నాను విను-

ఓ రామచంద్రా! ఈ జగత్తు ఎవ్వరిచేతనూ నిర్మించబడి ఉండలేదు. అనగా దీనికి 'కర్త' అంటూ ఎవ్వరూ లేరు. అట్లే "ఈ విధమైన క్రమము"... అంటూ ఏదీ లేదు. "కర్త ఇట్టి విధానము

నకు బద్ధుడు"-అనునది చెప్పుటకు వీలుగా కూడా లేదు. విజ్ఞుల అవగాహనను అనుసరించి ఏర్పడియున్న భిన్నాభిప్రాయములు ఇక్కడ ఉదహరిస్తారు.

**1. దృశ్యముచే ద్రష్ట ఏర్పడుచున్నాడు! (దృశ్యము కర్త - ద్రష్ట అకర్త) -** "దృశ్యమును బట్టే ద్రష్టయొక్క అనుభవం ఉంటోంది. కనుక 'అనుభవము' అనబడుదానికి జగత్తే కర్త. ఆ అనుభవం ఏర్పడు ప్రదేశమే ద్రష్ట యొక్క బాహ్యము. కనుక దృశ్యమును అనుసరించి ద్రష్ట ఉంటున్నాడు."

**2. ద్రష్టచే దృశ్యము కల్పించబడుచున్నది! (దృశ్యము అకర్త-ద్రష్ట కర్త) -** ద్రష్ట యొక్క భావనయే దృశ్యానుభవం కనుక జగత్తు అకర్త. ద్రష్టయే కర్త. ద్రష్ట యొక్క అంతరంగమే అనుభవములకు స్థానం. ఆత్మసన్నిధానం చేతనే జగత్తు భాసిస్తోంది కనుక, ద్రష్టను అనుసరించే దృశ్యము ఉంటోంది.

❖

ఈ 'జగత్తు' అనే జాలం కర్తృసహితం కావచ్చు గాక! లేక కర్తృరహితం కావచ్చు గాక! మరింకేదన్నా కానీ! నీవు మాత్రం 'ద్రష్ట-దృశ్యము పరస్పరం అభేదమైనవే" అను అధ్యాస కలిగి ఉండు. పరస్పర 'భేదధ్యాస' చేతనే ఈ దేహములపట్ల "ఈ దేహమే నేను" అను దేహాత్మభావన సంభవించటం జరుగుతోంది. అట్టి భావనను జీవుడు మొదటగా త్యజించాలి.

కనుక రామా! నీ బుద్ధిని సునిశితం చేసుకో. పరిచ్ఛిన్నములగు ఈ దేహాదులందు స్థితి కలిగి ఉండవద్దు. అట్లు స్థితి పొందకుండానే యథారీతిగా వర్తిస్తూ ఉండు.

'ఈ జగత్తుకు కర్త ఆత్మయే'... అని అనవచ్చా? ఈ ప్రశ్నకు మా సమాధానం విను.

ఆత్మ సర్వదా సర్వేంద్రియ రహితమైనట్టిది. అది ఏ క్షణమందు ఎట్టి మార్పు చేర్పులు పొందుటయే లేదు. కనుక 'అది జడమువంటిది' అని కూడా చెప్పబడుతోంది. ఆత్మ తన స్వసత్త మాత్రంచేత ఈ జగత్తు ఉనికిని పొందుతోంది. అందుచేత అజ్ఞాన దృష్టికి "ఆత్మ ఈ జగత్తుకు కర్త" అయినట్లు కనిపిస్తోంది.

'కాకతాళీయ న్యాయం'చే 'ఈ జగత్తుకు కర్త అనువాడే లేదు" అని మేము ఎంచుచున్నాం.

**కాకతాళీయ న్యాయం అనగా -** ఒకచోట ఒక ఎత్తైన తాటి చెట్టు ఉన్నది. అప్పుడే వసంత కాలం ప్రవేశించుటచే ఆ చెట్టుకు తాటిపళ్ళు చక్కగా మ్రగ్గి, ఘుమఘుమలాడుతూ వ్రేలాడు చున్నాయి. ఒక కాకి ఎక్కడి నుండో ఎందుకో వచ్చి ఆ చెట్టు యొక్క తాటిపళ్ళ గుత్తిపై వ్రాలింది. అప్పుడు, ఆ గుత్తిలోని ఒక పండు బాగా మగ్గి ఉండి, గుత్తి నుండి విడివడి నేలపై పడింది. అప్పుడే నీడలో సేదతీర్చుకుందామని ఒక నక్క ఆ చెట్టు క్రిందకు వచ్చి నిలిచింది. నీడను, గాలి వీచికలను పొందుతూ ఉన్న ఆ నక్కపై తాటిపండు జారిపడింది. ఫలితంగా, ఆ నక్కకు గాయం అయింది.

ఇప్పుడు చెప్పు. ఆ నక్కకు గాయము అగుటకు కారణమేమిటి? తాటిచెట్టా? కాకియా? వసంతకాలమా? తాటిపండా? నక్క చెట్టు క్రిందకు వచ్చుట చేతనా? చెట్టు నీడకు కారణమైన సూర్యుడా? గాలియొక్క వేగముతో కూడిన వీచికలా?

ఎవ్వరు ఏదైనా అనవచ్చు. కాని "కాకతాళీయ న్యాయముచే ఉత్పన్నమైనదానికి కర్త లేదు" అనునది ఈ దృష్టాంతము యొక్క పాఠం.

ఈ జగత్తు ఏదై ఉన్నది – అనే విషయానికి వస్తే, ' ఈ జగత్తు అనిర్వచనీయం' అని అనేక మంది ఆత్మజ్ఞానులగు వారిచే చెప్పబడుతోంది. "ఈ జగత్తు ఇందలి పదార్థ వ్యవహారములు గురించి అజ్ఞులే మరల మరల వితర్కించటం, విచారించటం చేస్తున్నారు. వివేకులు అట్లు చేయరు." అనునదే మా అభిప్రాయం కూడా. ఎందుకంటే తర్కవితర్కములు ఒక పరిధిని, పరిమితత్వమును కలిగియుండి, అనంతమగు ఆత్మతత్వమును నిర్వచించలేకపోతున్నాయి. ఇట్లు ఆత్మ అనుభవైకవేద్యము మాత్రమే అగుచున్నది.

❖

ఈ జగత్తు 'భావనారూపము' అని కొందరంటున్నారు. "ఇది క్షణక్షణం నశించుచూ, శూన్యమే అయి ఉన్నది" అని మరికొందరు చెప్పుచున్నారు. "ఇది ప్రవాహరూపమున కనిపిస్తూ మరల మరల ఉత్పన్నమగుచున్నది"... అని ఇంకొందరి అభిప్రాయం.

ఏది ఏమైనా చమత్కారమేమంటే దీనిని నీవు ఏ ఏ సంకల్పముల ధారణ చేత మరల మరల దర్శిస్తావో, ఆ ధారణలను అనుసరించే ప్రయోజన సిద్ధిని పొందుచున్నది.

**శ్రీరాముడు:** "ఇది నిత్య సత్తా స్వభావం కలది" అని చెప్పవచ్చుని? అందామా? అంటే, ఇది ఎప్పటికీ ఏర్పడి ఉండియే ఉంటుందని" అని అనవచ్చునా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఇక్కడ ప్రతిదీ ఒకప్పుడు ఒక విధంగా మరొకప్పుడు మరొకవిధంగా ఉంటోంది. ఇక్కడ పరిణామం చెందనిదేది చెప్పు? అందుచేత ఇక్కడ ఇప్పుడు కనబడుచున్నదంతా 'అసత్' స్వభావయుతమని చెప్పబడుతోంది. అంటే, అది ఇప్పటికే స్వతహాగా 'ఉనికి' ని కలిగి ఉండలేదు.

పోనీ... 'ఇది క్షణిక సత్త శీలమైనది' అందామా? ఈ శరీరములోని సంకల్పించువాడు, లేక దర్శించువాడు ఉన్నాడు చూచావ్! అతడు ఆయా పదార్థముల, భావముల మార్పుచే స్పృశించ బడకయే ఉంటున్నాడు. భావనను అనుసరించే జగత్తు ఉంటోంది.

ఆత్మ వాస్తవానికి సర్వ ఇంద్రియములకు అతీతము, ఆధిభౌతిక–ఆధిదైవిక–ఆధ్యాత్మిక తాపములచే తాకబడనిది. అది ఈ జగత్కార్యమును నిరంతరం చేయుచున్నప్పటికీ అది ఏమాత్రం ఖేదముగాని, మోదము గాని పొందదు.

❖

ఒక గదిలో దీపం ఉన్నది. ఆ దీపపు వెలుగు సహాయంచేత ఆ గదిలో "వంట చేయుట–సంభాషించుట–చదువుట" మొదలగు కార్యక్రమాలన్నీ జరిగిపోతున్నాయి. దీపపు వెలుగు లేకుంటే అవన్నీ ఆ విధంగా జరుగజాలవు. కాని దీపపు వెలుగే అవన్నీ చేయిస్తోందని అనలేము. దీపపు వెలుగు దేనికీ కారణం కాదు.

ఇక్కడ మనకు రెండు వాక్యాలు సిద్ధిస్తున్నాయి-

**1. ఆత్మయొక్క 'సమక్షం' చేతనే జగత్తు ఉంటోంది -** ఆత్మ యొక్క సన్నిధానం మాత్రం చేత ఈ జగత్తు వ్యవహార ప్రకటనలు కలిగి ఉండగలుగుతోంది. కనుక జగత్తుకు కారణం ఆత్మయే.

**2. ఆత్మ సర్వదా నిర్వికారం, నిర్విశేషం -** ఆత్మ స్వతహాగా నిరవయవము, పదార్థరహితము కదా! కనుక ఆత్మ జగత్తుకు కారణమగుట లేదు.

అందుచేతనే... "ఈ జగత్తు సత్-అసత్ రూపము, అనిర్వచనీయము అయి ఉన్నది"... అని చెప్పబడటం జరిగింది. ఆత్మ కాకుండా వేరుగా ఈ జగత్తు యొక్క ఉనికికి మరింకేదీ కారణ మగుట లేదు. నిరంతరం ఈ దృశ్యము భావనానుసారం ఇట్టి స్థితే కలిగి ఉంటోంది. ఇది మిథ్యా రూపమున ఇంద్రజాలంలో లాగా ఆవిర్భవించినట్లు దృశ్యమానమై ఉంటోంది. దృశ్యానికి అతీత మగు ఆత్మత్వము వహించువారికి, ఈ దృశ్యము ఎదురుగా ఉండి కూడా 'లేనిదే' అగుచున్నది.

❖❖❖

# 2. నిరపేక్ష-నిస్సంగము

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఈ జనుల వ్యవహారముల సంరంభము గమనిస్తున్నావా?

**అవర్యన్తస్య కాలస్య కశ్చిదంశః శరచ్ఛతమ్ ।**
**తావన్మాత్రమహోశ్చర్యః కిమర్థం సోఽనుధావతి ॥** (సర్గ 56, శ్లో 13)

ఈ శరీరంతో కూడినప్పటి జీవితం అనంత దేశకాలముల దృష్ట్యా అత్యంత పరిమితమైనది కదా! ఇది అనంత కాలప్రవాహంలో ఎంతటి స్వల్పాంశమైనది! ఈ స్వల్పకాలం, సదవకాశంలా లభించిన ఈ మానవ ఉపాధి ఏర్పడియున్న సమయమంతా కూడా అతడు దేహాత్మ బుద్ధినే ఆశ్రయి స్తున్నాడే! సర్వేంద్రియములకు అతీతమైయున్న ఆత్మవైపు అభిముఖుడవటమే లేదే! ఎంత ఆశ్చర్యం!

ఈ జగత్తుకు స్వకీయమైన కర్తృత్వమే లేదు. అట్టి ఈ జగత్తునందలి ఈ దేహములతో సహా సమస్త పదార్థములు 'ఇవి స్థిరములు'... అనిపించటం మూర్ఖత్వమే అవుతుంది. ఇక్కడి స్వల్ప వస్తువులను ఆపేక్షించుచు, దూరదృష్టి లేకుండా దినములు గడపటం ఉచితమెట్లాగా?

ఓయీ జీవుడా! ఎక్కడైనా 'అసంగము' అగు చైతన్యమునకు, జడమగు పదార్థములకు సంబంధం ఉంటుందా చెప్పు? నీవు శుద్ధమగు చైతన్యమువే గానీ, జడమగు శరీరములు కావు, ఇంద్రియాలు కావు. ఇంద్రియానుభవాలు కావు. అట్టి ఆత్మస్వరూపుడవగు నీకు ఈ శరీరాదులతో సంయోగం ఏర్పడటమేమిటి?

కనుక; "నేను శరీరరూపుడను గాను. నా యందు శరీరాదులు లేవు. నేను ఈ శరీరపరిమితుడను కాను. శరీరం కంటే ముందే ఉన్నట్టి నేను శరీరానికి మాత్రమే పరిమితుడనై ఉండేదెట్లా?"...అని ఎందుకు భావించరాదు? అట్లు భావించినపుడే నీవు ఇంద్రియాతీతమగు

స్వస్వరూపమును గాంచగలుగుతావు. అట్లా కాకుండా, ఇంద్రియానుభవ మాత్రమైనట్టి ఈ దృశ్యములోని పదార్థములు, ఇవి కలుగజేయగల సుఖదుఃఖములు... వీటన్నిటిపై నమ్మకం కలిగి ఉంటే "అసంబంధితము - దివ్యము - పరిశుద్ధము - నిత్యోదితము"... అగు నీ వాస్తవ స్వరూపమును నీవు ఎట్లు గాంచగలవో మాకు అర్థమగుటలేదు. ఈ శరీరాదులు, తదితర దృశ్య పదార్థములు స్థిరములయినా, కాకున్నా నీవు వీటి పట్ల 'అపేక్ష' పొందవలసిన పనేముంది?

నీవు ఒక జడవస్తువు కాదే! సంకల్పములను కూడా రచించగల చైతన్యమూర్తివి కదా!

బుద్బుదము వలె చంచలములైన ఈ దేహములు నశించిపోయేవే కనుక, వాటి యందు ఆసక్తి దుఃఖములనే కలుగజేస్తున్నాయి.

1) "ఉత్పత్తి-వినాశనము" అను రెండిటితో కూడుకొన్న ఈ దృశ్యజగత్తునందు "ఇవియే నేను, లేక ఇవి నావి" అను దోషముతో భావావేశము పొందటం;

2) ఆత్మను జగత్ స్వభావయుక్తంగా చూడటం... (లేక, ఆత్మయే వాస్తవ స్వరూపంగా గల సహజీవుని భౌతిక పరిమిత దృష్టితో చూడటం)...

... ఈ రెండూ కూడా బంధము కలిగించుటకే కారణమగుచున్నాయని సర్వజనులకు గుర్తు చేస్తున్నాను. స్థిర-అస్థిర స్వభావయుక్తములైనట్టి ఆత్మ-జగత్తులకు "కొండ-నురుగు"ల వంటి సంబంధము మాత్రమే కలదు.

సమస్తమునకు కర్తయగు ఆత్మ అకర్తయే అయి ఉన్నది. అది ఏమీ చేయుట లేదు. నాటక రంగంలోని దీపంలాగ అన్నిటినీ ప్రకాశింపజేస్తూ కూడా ఉదాసీనంగా ఉంటోంది. సూర్యుడు ఉదయించిన తరువాత, ఇక ప్రాణులు నిదురలేచి, తమ దినచర్యలు ప్రారంభించు చున్నారు కదా! కాని దినచర్యలకూ సూర్యునికి సంబంధం ఏమి ఉన్నది? ఉదయం నుండి సాయంకాలం దాకా జరిగిపోతున్న ఆయా రోజువారీ కార్యక్రమముల దృష్ట్యా సూర్యుడు సర్వదా అకర్తయే కదా! ఆత్మ కూడా ఏమీ ఒనర్చుట లేదు. అది అన్నిటికీ కారణమగుచూ కూడా, సర్వదా 'స్వయంప్రతిభ' యందు ప్రతిష్ఠితమై ఉండి ఉంటోంది. అది చలింపకయే ఉంటూ సర్వమును చలింపజేస్తోంది.

❖❖❖

# 3. భ్రమచేతనే జగదుత్పత్తి

నదీతీరం స్వభావయుక్తంగానే ఇసుకతో ఉంటుంది కదా! ఈ జగత్తు కూడా స్వభావంగానే జీవుని పట్ల ప్రకటితమగుచున్నది. ఎటు పల్లం ఉంటే నీరు అటు ప్రవహించటం సహజం. అట్లాగే జడ-చేతనముల సంయోగమాత్రం చేత ఈ జగత్తు ఆకస్మికంగా ఉత్పన్నమైనది అగుచున్నది. అంతేగాని, దీనికి కర్త అంటూ ఎవరూ లేరు.

ఆత్మయొక్క సన్నిధానం చేతనే దీనికి ఉనికి ప్రాప్తిస్తోంది. లేదా సర్వప్రమాణములకు అతీత మగు శుద్ధచిత్తము దృష్ట్యా ఇది లేదని కూడా గ్రహించబడగలదు.

ఓ రామచంద్రా! ఏది ఏమైనప్పటికీ ఈ 'దేహము' మొదలైన పదార్థములందు "ఇదియే ఆత్మ" అని తలచటం ఎవ్వరికీ ఏమాత్రం తగదు. వేగంగా గాలిలో వృత్తాకారంగా త్రిప్పునప్పుడు ఏర్పడు వృత్తముపై లేక, స్వప్నములోని కొండ, మనిషి మొదలైన వాటిపై అపేక్ష కలిగి ఉన్నామనుకో, చీకట్లో ఏదో ఆకారం చూచి "అది దయ్యము యొక్క కదలికలే" అని తలచామనుకో... అవన్నీ అర్థంలేని పనులే కదా! ఆకస్మికంగా ఎక్కడో దూరదేశంలో కొద్దిక్షణములు నీ ప్రక్కన నిలబడి, అటుపై ఎటో వెళ్ళిపోవుచున్న నూతన వ్యక్తితో నీకు స్నేహం ఎట్లా కుదురుతుంది? భ్రమచే ఉత్పన్నమైన ఈ జగత్తు విశ్వాసపాత్రం కాదు. ...అట్లే ఈ శరీర విషయం కూడా.

**శ్రీ రాముడు:** స్వామీ! ఈ జగత్తు యొక్క అభావన జీవమాత్రులమగు మాకు సాధ్యమే నంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "చంద్రునిలో ఉష్ణత్వము, సూర్యునిలోని శీతలత్వము, మృగతృష్ణలో జలత్వము వాస్తవము కావు" అను భావన ఎంత సహజమో, ఈ జగత్తునందు భావనారహితుడై ఉండటం కూడా అట్లే సహజం. భావనలు కలిగియుండుటయే 'శ్రమ' కాని, కలిగి యుండకుండుట శ్రమ కాదు. కనుక భావనారహితుడవై ఉండటం అభ్యాసపరుడవగు నీకు తప్పక సుసాధ్యమే!

ఇక ఈ జగత్తులోని పదార్థజాలమంటావా?... దీనిని 'ఊహ'లోని కట్టడములవలె, స్వప్నములోని జనసమూహమువలె, ఇంద్రజాలములోని సంఘటనలవలె ఉద్వేగరహితుడవై, అంతయు తెలిసియే ఉన్నవాడై ప్రశాంతచిత్తముతో వీక్షిస్తూ ఉండు. అంతేగాని భావనామయమగు ఈ ప్రాపంచిక విషయములందు విశ్వాసము కలిగియుండవద్దు. ఏదైతే నీయొక్క 'పరమార్థ స్వస్వరూపము' అయి ఉన్నదో... అద్దానినే సర్వదా భావించుచు, ఈ జగత్తునందు లీలామాత్రంగా విహరిస్తూ ఉండు.

❖❖❖

## 4. సన్నిధాన మాత్రం (Mere presence)

సమస్త పదార్థముల అభ్యంతరమయిన ఆత్మవస్తువే నిత్యసత్యమై యున్నది. సర్వ కర్తృత్వ–అకర్తృత్వ భావనలను, సర్వ ఇచ్ఛలను తొలగించుకో! అప్పుడు శేషించు పారమార్థిక రూపమును గ్రహించు. అటుపై యథారీతిగా ఈ జగత్తులో విహరించు. ఉదాసీనుడవై, ఇచ్ఛారహితుడవై, వ్యథారహితుడవై వ్యవహరించు.

**ఇదం సన్నిధిమాత్రేణ నియతిః పరిజృంభతే ।**
**దీపసన్నిమాత్రేణ నిరిచ్ఛైవ ప్రకాశతే ॥** (సర్గ 56, శ్లో 27)

"ఆత్మచైతన్యమే" అయి ఉన్న నీ యొక్క 'సన్నిధానం' మాత్రం చేత నియతి ఈ జగద్వ్యవహార రూపంలో ప్రవర్తిస్తోంది. దీపము యొక్క ప్రభావము చేత ప్రకాశము దశదిశల విస్తరిస్తోంది! ఆకాశంలో మేఘమును చూచినంత మాత్రం చేత కొండమల్లెపూవు వర్షధారల భావనచే స్వయంగా వికసిస్తోంది. ఆత్మసన్నిధానమాత్రం చేతనే ముల్లోకములు ఉత్పన్నమౌతున్నాయి.

**సర్వేచ్ఛారహితే భానౌ యథా వ్యోమని తిష్ఠతి ।**
**జాయతే వ్యవహారశ్చ సతిదేవేతథాక్రియా ॥**

అదిగో, సూర్యభగవానుని చూడు. అతడు ఏ 'ఇచ్ఛ' లేకుండానే ఆకాశంలో ప్రకాశిస్తున్నంత మాత్రం చేత ఈ జగత్తులో పూలు-చెట్లు-జీవులు అనేక ప్రయోజనములు పొందుతూ జీవిస్తు న్నారు కదా! పరమాత్మ నిష్క్రియుడై ఉండి ఉండగా, అతని సత్తామాత్రం చేత ఈ జగత్తు, ఇందలి వ్యవహారములు సంభవిస్తున్నాయి.

ఓ రామా! నీవు పరమాత్మయే స్వరూపముగా కలిగి ఉన్నావు. ఈ శరీరాదులు, పదార్థముల నీవు కావు. రత్నం ప్రకాశిస్తూ ఇచ్ఛారహితంగా తన కిరణపుంజములను తదితర వస్తువులవైపు ప్రసరింపజేస్తోంది. అయితే, "నేను ఈ వస్తువులను మాత్రమే ప్రకాశింపజేస్తాను... ఈ ప్రక్క వస్తువులపై కిరణములు పంపను"... అని అనుకుంటోందా? లేదు, నిర్లిప్తుడు, నిత్యుడు అగు పరమాత్మ యొక్క సత్తచేతనే జగత్సమూహములు ఉత్పన్నమౌతున్నాయి.

ఆత్మయందు కర్తృత్వ, అకర్తృత్వములు రెండూ ఉన్నాయి. ఇది ఇచ్ఛారహితం కాబట్టి "అకర్తయే". ఆత్మ సన్నిధానంలో మాత్రమే ఇదంతా జరుగుతోంది కాబట్టి "కర్తయే" కూడా!

❖❖❖

# 5. ఆత్మ అన్నివేళల అకర్తయే

ఇంద్రియములకు విషయము గానందువలన సత్యస్వరూపమగు పరమాత్మ దేనికీ కూడా కర్తగాని, భోక్తగాని కానేరదు. అయితే, ఇంద్రియములందు అంతర్గతంగా 'సత్త' కలిగియున్నదేది? అదియే కదా! అందుచేతనే "కర్త-భోక్త కూడా ఆ పరమాత్మయే"... అని శాస్త్రకారులు కొన్నిచోట్ల నిర్ద్వంద్వంగా నిర్ణయించి చెప్పుచున్నారు. ఇది దృష్టిలో పెట్టుకొని సాధనకొరకు రెండు మార్గాలు ఏర్పడి ఉంటున్నాయి.

**1. మహాకర్త -** "సర్వమునకు కర్త ఆత్మయే. అట్టి ఆత్మయే నేను"

**2. మహాఅకర్త -** "ఆత్మకు ఏ క్షణమందును కర్తృత్వ-భోక్తృత్వములు లేవు. అట్టి పరిశుద్ధ స్వరూపమగు ఆత్మచైతన్యమునే నేను."

ఈ రెండిటిలో నీకు ఏది శ్రేయమని, అనుకూలమని బాగున్నదనీ అనిపిస్తే అట్టి భావనను దృఢంగా ఆశ్రయించు. "సమస్త పదార్థములందు వ్యాపించి ఉన్నట్టి చిత్స్వరూపుడనగు నేను సర్వదా అకర్తనే"... అను భావన కలిగి, ప్రాప్తించిన కార్యములను నిర్వర్తిస్తూ ఉండు. అప్పుడిక కర్మలు చేస్తున్నప్పటికీ నిర్మలుడవై, కర్మలచే దోషము పొందక ఉంటావు. "శుద్ధ స్వరూపుడనగు నేను ఏమియు ఒనర్చుటలేదు" అనే నిశ్చయము కలవాని చిత్తము ప్రవృత్తిరహితం అవుతుంది. ప్రవృత్తి రాహిత్యము కారణంగా చిత్తము వైరాగ్యం పొందుతుంది. భోగముల పట్ల అపేక్ష లేనప్పుడు అట్టి జీవుడు అకర్మపరుడే అవుతాడు.

"నేనెప్పుడూ అకర్తనే కదా..." అను దృఢభావనచే పరమ అమృతమువంటి సర్వసమత్వమే శేషించగలదు. లేక "అంతయు నేనే ఒనర్చుచున్నాను" అను మహాకర్తృత్వాభిమానమునందు స్థితి పొంది ఉంటావా...! అది కూడా మంచిదే.

**శ్రీరాముడు:** ఈ లోకంలో జ్ఞానులగు ఉత్తముల భావన మరియు అవగాహన ఏ రూపంలో ఉంటున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** "శుద్ధ స్వరూపుడనగు నేను ఈ జగద్భ్రమను పొందవలసిన పనేమున్నది? నాకంటే వేరైనదేదీ ఎక్కడా సంభవించటమే లేదు కదా! ఇక నాకు రాగమేమిటి? ద్వేషము దేని మీద?" అను భావనయందు వారు ఉంటున్నారు. ఇక "ఈ సర్వమునకు కారకుడు ఎవరు?"... అను ప్రశ్నకు వచ్చినప్పుడు, "తదితర జనులచే దగ్ధం కావించబడిన నా పూర్వశరీరములకు, ఈ జనులచే లాలించబడుచున్న ఈ వర్తమాన శరీరమునకు కూడా నేను మునుముందుగానే ఉన్నాను. సంకల్పములకు ముందే ఉండియుండి, సర్వసంకల్పములను అంగీకరించువాడను, ఆశ్రయించువాడను నేనే!"... అని గ్రహిస్తున్నాడు. అప్పుడు సర్వదుఃఖములు శమించుచున్నాయి. "నా ఈ సుఖదుఃఖముల విస్తారమునకు హేతువగుచున్న ఈ జగత్తు యొక్క ఉత్పత్తి - వినాశనములకు కర్తను నేనే" అని నిశ్చయించుకొనుటచే అతడి సుఖ-దుఃఖములు శమించుచున్నాయి. "నా ఈ సుఖదుఃఖముల విస్తారమునకు హేతువగుచున్న ఈ జగత్తు యొక్క ఉత్పత్తి - వినాశములకు కర్తను నేను" అని నిశ్చయించుకొనుటచే అతడు సుఖ-దుఃఖములను రహితం చేసుకోగలుగుచున్నాడు.

భావనయొక్క ఆరంభమే జగత్తు యొక్క ఉత్పత్తి. భావనను అధిగమించినప్పుడు జగత్తు రహితమగుచున్నది.

❖❖❖

# 6. ఆత్మ సమష్టిరూప కర్తృత్వము

**వసిష్ఠ మహర్షి:**

**అయం కర్తేతి మత్వాన్తః కః ఖేదోల్లాసయోః క్రమః ।**
**ఖేదోల్లాసవిలాసేషు స్వాత్మకర్తృతయైతయా ॥** (శ్లో 41, సర్గ 56)

**స్వయమేవ లయం యాతే సమతైవావశిష్యతే ।**
**సమతా సర్వభూతేషు యాసౌ సత్యావరాస్థితిః ॥** (శ్లో 42, సర్గ 57)

ఓ రామచంద్రా! నీవు ఎల్లప్పుడూ సమష్టి రూప కర్తృత్వము స్వీకరించుట చేతనే పవిత్రుడవు కాగలవు. అట్టి కర్తృత్వముచే సుఖదుఃఖములు స్వయముగా విలీనమైపోతాయి. ఆపై సమత్వమే శేషిస్తుంది. సర్వభూతములపట్ల సమభావమే సర్వోత్తమ స్థితి అయి ఉన్నది.

అట్టి సమత్వము నందు స్థితి పొందువాడు ఇక మరల ఎన్నటికీ జన్మలు పొందడు. అనగా అతని యందు "నేను జన్మించాను, మరణించుచున్నాను" వంటి భావాలు ఉండవు. 'పుడుతున్నాను – పెరుగుచున్నాను – చచ్చుచున్నాను'... అను భావాలన్నీ శరీరముతో తాదాత్మ్యం పొందువారికి మాత్రమే ఉంటోందని గుర్తు చేస్తున్నాను.

కాబట్టి రామచంద్రా! క్రమంగా కర్తృత్వ–అకర్తృత్వములన్నిటినీ త్యజించివేయి. మనస్సును కూడా నశింపజేయి. ఇకప్పుడు ఏ శుద్ధతత్వముంటుందో అద్దాని యందు సుస్థిరుడవుకమ్ము.

అహంకారం, దేహం, ఇంద్రియాలు నేను కాదు. వీటి వేటికీ నేను సంబంధించిన వాడను కాను. వాటి క్రియలు నాకు సంబంధించినవి కావు. అందుచేత నేను సర్వదా నిష్క్రియుడనే"... అని గ్రహిస్తూ "ఆత్మ" కు ఆపాదించబడుచున్న కర్తృత్వములను నిషేధించు.

❖

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ దృశ్యపదార్థము త్యజించబడగా అప్పుడిక ఆత్మలాభము స్వయముగానే చేకూరుతుంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉన్నది. ఈ దృశ్యవస్తువులను నిరసించిన మాత్రం చేత సరిపోదు. అదే తరుణంలో ఆత్మను భావనచేస్తూ ఉండాలి. అప్పుడే తృప్తికరమగు పూర్ణత్వము లభిస్తుంది.

**"తత్వమసి" భావన చేయటం -** 'త్వమ్'(you)ను "ఇది లేదు, ఆత్మ మాత్రమే ఉన్నది" అను నిషేధంతో బాటుగా..., 'తత్' అను శబ్దమును లక్ష్యమై ఉన్నట్టి 'ఆత్మ' భావించబడుతూ ఉండాలి.

**ఆత్మను భావించటమంటే ఏమిటి? -** "నేను ఆత్మనే అయి ఉన్నాను... కనుక స్వతహాగానే నిత్యుడను, పూర్ణుడను, అఖండుడను, శుద్ధుడను" ...అను భావనను క్రమంగా ఆశ్రయించుటయే ఆత్మను భావన చేయటం సుమా! అంతేకాదు. ఎదురుగా కనిపించే ప్రతిజీవిని చూస్తూ ఉండగానే, "నీవు పరమాత్మ స్వరూపుడవే–తత్వమసి" ...అను భావనను అనుక్షణికంగా అభ్యసిస్తూ రావటం.

ఆకాశం మేఘాలచే కప్పబడినప్పటికీ, స్వతహాగా శుద్ధమైనదైనట్లుగానే... ఈ సంకల్పాలు ఏర్పడినంత మాత్రంచేత అతడు అశుద్ధుడగుట లేదు. 'నేను–నీవు–జగత్తు అనునదంతా ఆత్మయే. ఇట్లు ఈ జగత్తుగా ప్రాప్తిస్తున్నదంతా నేనే' అనునట్టి సర్వాత్మకభావము కలిగి ఉండాలి.

**దేహాత్మబుద్ధి, దేహభావా-స్పృశ్యం -** "నేను ఈ శరీరమును... శరీరపరిమితుడను... శరీరముతో ప్రారంభమగుచున్నాను... శరీరం నశించుటచే నేను నశించుచున్నాను"... అను ఈ జీవుని యొక్క బుద్ధియే దేహాత్మ బుద్ధి. ఈ దేహాత్మబుద్ధియే సర్వనరకముల స్వరూపమైయున్నది.

---

✺ నిత్యుడు = ఎల్లప్పుడూ ఉండేవాడు; పూర్ణుడు = ఇక క్రొత్తగా పొందవలసినదేదీ లేనివాడు.
అఖండుడు = వేరువేరు జీవులుగా విభాగించబడనివాడు; శుద్ధుడు = స్వతహాగానే దోషరహితుడు.

అందుచేత, ఏ ప్రయత్నంచేసి అయినా సరే, "నేను ఈ పాంచభౌతికదేహమును"... అను భావనను త్యజించివేయాలి. ఉత్తముడు, పవిత్రుడు అగు ఒక గృహస్థుడు ఏవో తళుకు బెళుకులను చూచి, ఆ మాత్రానికి ఒక పరాయిస్త్రీతో సాన్నిహిత్యం కోరుకుంటాడా? లేదు కదా! అట్లు కోరుకోక పోవుటయే అతనికి సహజమైన విషయం. అట్లాగే, సర్వనాశనం చేకూరనీ; మృత్యువు వాటిల్లనీ... ఈ దేహాత్మ బుద్ధిని ఎన్నడూ, ఎట్టి పరిస్థితులలోనూ స్పృశించరాదు. దేహాత్మభావనయే (లేక) దేహాత్మదృష్టియే విశుద్ధాత్మను కప్పిపెట్టి ఉంచుచున్నదని గ్రహించు.

**ఉదేతి పరమాదృష్టిర్జ్యోత్స్నేవ విగతాంబుదా ।**
**యయాభ్యుదితయా రామ తీర్యతే భవసాగరః ॥** (శ్లో 48, సర్గ 56)

దేహాత్మబుద్ధిని త్యజించివేసిన మరుక్షణం మేఘరహితమగు చంద్రుని చంద్రికవలె సర్వోత్తమ మగు ఆత్మదృష్టి ఉదయిస్తోంది. అప్పుడీ జీవుడు సంసారసాగరము నుండి తరించగలుగుచున్నాడు.

**ఆత్మయందు స్థితి -** ఓ రఘురామా! ఇప్పుడే, ఇక్కడే రెండు విషయాలు సుస్పష్టంగా, నిర్దుష్టంగా, ఎట్టి అనుమానాలకు తావివ్వకుండా ఎరుగుము.

1) ఈ దేహాదులు నేను కాదు; .2) జడము భావానుసరణము అగు దృశ్యము నేను కాదు. తద్ద్వారా, పరిచ్ఛిన్నములగు సుఖదుఃఖములను ఆశ్రయించనివాడవు అవుతావు. అదే సమయంలో ఇట్లు నిర్ణయం చేసుకొని ఉండు:

1) ఈ దృశ్యముకంటే విలక్షణమై, లోకసిద్ధమై, స్వస్వరూపమునకు వేరు కానట్టిదయిన "శుద్ధచైతన్యము" నే నేను. నేనైన వస్తువంటూ ఈ దృశ్యజగత్తులో ఎక్కడా లేదు.

2) ఈ బ్రహ్మాండమంతా నేనే. దృశ్యముగా కనిపిస్తున్న సమస్తమునకు కర్తను నేనే.

ఇట్లు తిరస్కరించవలసిన 'దేహాత్మభావన'ను తిరస్కరిస్తూ అభ్యసించాలి. స్వీకరించవలసిన 'అహమాత్మా' భావనను స్వీకరిస్తూ అభ్యసించాలి. ఈ రెండింటినీ మేళవించుకుంటూ ఈ భూమిపై సంచరించు. లేదా, ఈ జగత్‌వ్యాహ్యాళి త్యజించి ఒక ప్రదేశంలో సమాధి నిష్ఠుడవై యుండు. అది నీ ఇష్టం. ఎందుకంటే, ఉత్తమ భావన అవధరించిన తరువాత ఆ రెండిటియందు భేదముండదు.

ఉత్తమ నిశ్చయము కలవాడవై బ్రహ్మపదమున సర్వదా స్థితి కలిగియుండుము. ఉత్తమ సాధువులగు బ్రహ్మవేత్తలు ఆ విధంగా 'ఆత్మస్థితి'ని ఆశ్రయించి, ఆపై తమ సంచారముచే ఈ ముల్లోకములను పావనం చేస్తున్నారు. అట్టివారు వందనీయులు అగుచున్నారు.

❖❖❖

## 7. పూర్ణాశయస్స్వరూపము

**శ్రీరాముడు:** మహాత్మా! ఉత్తమ యుక్తులచే మీరు చెప్పుచున్నదంతా సత్యమైనదని, అత్యుత్తమోత్తమ మైనదనీ అనటంలో ఏ మాత్రం సందేహం లేదు. మీరు చెప్పినట్లు "పరమాత్మ కర్త అయినప్పటికీ అకర్త, భోక్త అయినప్పటికీ అభోక్త"... అయి ఉన్నాడు. అతడు సర్వేశ్వరుడు, సర్వవ్యాపి, చిన్మాత్రమే స్వరూపముగా కలవాడు కూడా.

అతడే నిర్మలపదము! సర్వలక్షణముల సారము కూడా అతడే! ఈ భూమి మీద చతుర్విధ ప్రాణులు నివసించుచున్నట్లే ఆ దేవదేవుడు సర్వభూతముల అంతరంగమున నెలకొనియున్న వాడై సమస్తము అగుచున్నాడు. నాయందు, మీయందు, సర్వులయందు ఉన్నది అతడే. అతడు నాకంటే వేరుగా లేడు. లేదా, నేను ఆయనకంటే వేరుగా లేను. కనుక, నేనే సర్వదా అన్నిజీవరాసులందును సమముగా ఉండియున్నాను.

హే మహాత్మా! మీ వాక్యామృత ప్రభావం చేత నా హృదయమందు ఇప్పుడు బ్రహ్మము ప్రకాశించుచున్నది. తమ వచనములచే నేను దుఃఖరహితుడనయ్యాను. దేవదేవుడగు ఆ పరమాత్మ ఇచ్ఛారహితుడు. ఉదాసీనుడు కదా! ఆయన దేనికైనా కర్తగాని, భోక్తగాని ఎట్లా అవుతాడు? కాదు. కాని తనయొక్క సత్తామాత్రం చేత సర్వలోకాలకు అస్థిత్వము ప్రసాదిస్తున్నాడు. అతని సంకల్పమే ఈ సృష్టి. కనుక, దీనికి కారకుడు, కర్త, భోక్త కూడా అతడే. ఇక ఈ దృశ్యమో, ఇచ్ఛారహితుడు, ఉదాసీనుడు అగు పరమాత్మ యొక్క చమత్కారమే!

❖

హే మహర్షీ! గురువర్యా! నాకు ఎందుకో ఇంకా ఒక్క గొప్ప సందేహం తొలగుటయే లేదు. అత్యంత వినమ్రుడనై ఆ సంశయమును మీ ముందు ఉంచుచున్నాను.

1. ఈ జగత్తు సత్-అసత్ రూపమైనది.
2. సమిష్టిరూపమగు జగత్తే నేను. అంతేగానీ, ఒక వ్యష్టిరూపమాత్రుడను కాను.

ఈ రెండూ మనకు నిర్వివాదాంశమే. ఇక ఈ ప్రపంచం విషయానికి వస్తే ఇది 'సమదృష్టిచే ఏకం – వ్యష్టిదృష్టిచే అనేకం'... అయి ఉన్నది. ఇటువంటి 'వ్యష్టి-సమష్టి'... అనబడు 'అనియతం, కల్పనామయం' అగు సృష్టి పరమాత్మయందు ఎట్లా ఉన్నది? ఎందుచేత ఉన్నది? ఎవరి కొరకు ఉన్నది?

పరమాత్మ అద్వితీయము, స్వయంప్రకాశకము, మోహాంధకారరహితము, నిర్మలము కదా! సూర్యుని యందు అంధకారం ఎట్లా ఉంటుంది?... పరిశుద్ధతత్వమగు పరమాత్మ యందు ఈ జగత్తు ఉండుట ఏమిటి? ఏ రూపంగా ఉంటోంది?

"మాయతో కూడిన బ్రహ్మము నందు మొట్టమొదట అవ్యక్తరూపమున ఈ జగత్తు ఉండి ఉన్నది. ఆ తరువాత వ్యక్తరూపమున కనపడుచున్నది"... అని అంటారా? అట్లా అయితే 'అద్వితీయం'గా నిర్వచించబడుచున్న పరమాత్మయందు అప్రకటన స్థితిమయంగా ఈ జగత్తు ఏ రూపంలో ఎట్లు దాగి ఉన్నది?

ఈ విషయం ఎంత ఆలోచించినా నాకు అర్థమగుటలేదు. దయచేసి వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రాఘవా! నీ ప్రశ్నకు సరి అయిన సమాధానం ముందు ముందు నిర్వాణ ప్రకరణంలో విశ్లేషణ పూర్వకంగా వివరించబడబోవుచున్నది. నిర్వాణ ప్రకరణ సమాచారం వినుచున్నప్పుడు ఈ జగత్తు యొక్క యథార్థ రూపమేమిటో నీవే తప్పక గ్రహిస్తావు. అప్పుడు

"మోక్షోపదేశం" మనకు విషయము అవుతుంది. అఖండాకారమగు ఆత్మ గురించిన విశేషములన్నీ గ్రహిస్తే గాని, మోక్షము గురించిన సిద్ధాంతాలు శిష్యుని ముందు ఉంచటానికి కుదరదు. అతడు సిద్ధాంతాలు స్వీకరించాలంటే మనస్సులోని సంకుచితత్త్వమునకు సంబంధించిన అనేక పరిమిత దృష్టులు తొలగాలి. ప్రస్తుతం మనం పరిమిత దృష్టులను తొలగించగల విశేషాలన్నీ చెప్పుకుంటూ వస్తున్నాం.

వయసులో ఉన్నవాడు మాత్రమే స్త్రీల విరహమయ గీతములను విని అర్థం చేసుకో గలడు గాని, ఒక ఆరేళ్ళ బాలుడు ఏం అర్థం చేసుకోగలడు? అందుచేత, మరికొంత అవగాహన తరువాత గాని నేను నీకా విషయం ప్రతిపాదించి చెప్పకూడదు. "ఉత్తమ ఆత్మ సాక్షాత్కార జ్ఞానము"నకు సంబంధించిన నిర్దుష్టప్రవచనాలు అల్పబోధనగలవారికి ముందు గానే చెప్ప కూడదు"... అను నియమమును గురువులం మేము పాటిస్తూ ఉంటాం. ఎందుకంటే అపరిపక్వ దృష్టి, సమాచారము గలవారి పట్ల మా సిద్ధాంత ప్రవచనాలు వ్యర్థం కావటమో, లేక విపరీతార్థములకు దారి తీయటమో జరుగవచ్చు కదా!

సరైన ఋతుకాలంలో ఫల-పుష్పాలు శోభిస్తున్నట్లు, సరైన కాలంలో సరైన బోధ చేయుటమే ఉచితం. శుభ్రమైన వస్త్రమునకు రంగు వేస్తే ఆ రంగు చక్కగా హత్తుకుంటుంది. వివేకము, వైరాగ్యము... ఉత్తమ వస్తువుపట్ల లక్ష్యశుద్ధి, విచారణ ఉన్నవారి విషయంలోనే 'ఆత్మజ్ఞానము' యొక్క పరాకాష్ఠ వాక్యాలు సఫలీకృతం అవుతాయి.

❖

అయినా కొంచెము చూచాయగా ఆయాచోట్ల నీ ప్రశ్నకు సమాధానం చెప్పుచూనే వస్తున్నాను. ఉదాహరణకు "భార్గవోపాఖ్యానం'లో కొంతవరకు 'బ్రహ్మమునందు ఈ జగత్తు ప్రకటన, అప్రకటన సమయములందు ఎట్లు ఉన్నది... అన్నది వివరించాను. అయితే సర్వ సంశయములు తొలగునంతటి విస్తారంగా చెప్పియుండలేదు. అందుచేతనే కాబోలు, ఈ విషయమై తగినంత స్పష్టంగా నీవు ఎరుగలేదు.

ఇక్కడ మరొక ముఖ్యమైన విషయం. నీవు నీ ఆత్మ యొక్క పరిశుద్ధత్వమును, అప్రమేయత్వమును, తదితర లక్షణములను గ్రహించిన తరువాత నీయందు అఖండాత్మబోధ స్వయంగా కలుగుతుంది. ఆ తరువాత నేను చెప్పకపోయినా కూడా నీ ప్రశ్నకు సమాధానం నీవే ఎఱుగగలిగి ఉంటావు. ఇందు సంశయమేమీ లేదు.

ఒకటి అజ్ఞాన విషయం గాని, లేక సుజ్ఞాన విషయం గాని... ఆ విషయమును ఎరుగు చున్నది ఎవరు? ఆత్మయే కదా! అందుచేత జ్ఞానస్థితి యందు ఆత్మబోధచే ఆత్మయే సుప్రసన్నమై ఆత్మ గురించి ఎరుగుచున్నది.

❖

నీకు ఇంతవరకు 'కర్తృత్వం-అకర్తృత్వం' ల గురించి 'భోక్తృత్వం-అభోక్తృత్వం' ల గురించి కూడా చెప్పియున్నాను కదా! నీ ప్రశ్నకు సమాధానం ఆ చర్చలోనే కొంత చూచాయగా అయినా

గ్రహించవలసియున్నది. అయినప్పటికీ ఎందుకో నీవు అఖండాత్మస్వరూపాన్ని ఎరుగకయే ఉన్నావు. ఎందుచేత?... దీనిని బట్టి ఇంకా దృశ్యవాసన శమించవలసి ఉన్నదనియే తెలుస్తోంది.

ఒక్క విషయం మనం గుర్తు పెట్టుకోవాలి. వాసనలచే ఆక్రమించబడువాడే 'బద్ధుడు'. వాసనాక్షయమే 'మోక్షము'. "నేను మరొకటి పొందవలసి యున్నది..." అని భావన చేయటయే వాసన యొక్క వృత్తిరూపం. అందుచేత నీవు "మోక్షేచ్ఛ"ను కూడా విడిచిపెట్టు. బంధం ఉన్నప్పుడే 'మోక్షము' అనే ప్రసక్తి ఉంటుంది. "నాకు బంధము లేదు" అని ఎవరు గ్రహిస్తారో వారికి ఇక 'మోక్షము' యొక్క ప్రసక్తి ఎక్కడిది?

❖

అందుకుగాను మొట్టమొదటగా ఈ దృశ్య విషయములచే పరిపూర్ణమైనట్టి రాజసిక తామసిక వాసనలను క్రమక్రమంగా వదలుకొంటూ రావాలి. ఆ సమయంలోనే 'మైత్రి' మొదలైన శుభవాసనలు గ్రహించు. శుభవాసనలు ప్రయత్నపూర్వకంగా ఆశ్రయిస్తూనే, కాలక్రమంగా వాసనారాహిత్యము వైపు దృష్టి సారించు. అంతఃకరణంలో ఏ విధమైన 'ఇచ్ఛ' లేనివాడవై క్రమ క్రమంగా 'సమ్యక్‌జ్ఞానయుక్తము' అయినట్టి స్థితిని అభ్యసించుచూ రమ్ము. దృశ్యవాసనా స్థానంలో "చిన్మాత్రము" అనే వాసనచే పూరించు. "అంతఃశాంతము"తో కూడిన పరిపూర్ణభావముచే "నేను ఈ దేహమంతా ఆత్మరూపుడనై నిండి ఉన్నాను... అదేరీతిగా, ఎవరెవరితో సంభాషించుచున్నానో, అట్టి ఈ సర్వజీవులందు నేనే మమాత్మ స్వరూపముచే పరిపూర్ణుడనై ఉన్నాను"... అను మాధుర్యమును ఆస్వాదిస్తూ ఉండు. 'మనస్సు-బుద్ధి' ల సంచలనరూపమగు వాసనల పట్ల ఉపేక్ష, మౌనములను అభ్యాసం చేస్తూ ఉండు. క్రమంగా మనోబుద్ధులు పరిత్యజించబడగా అప్పుడు శేషించు ఆత్మ స్వరూపం నందు సుస్థిర సమాధానం కలిగియుండు. ఆ తరువాత ఏ అహంకారం చేత... "నేను వాసనలు పరిత్యజిస్తున్నాను" అను నిమగ్నం కలిగియున్నావో... అట్టి ఆ అహం కారాన్ని కూడా పరిత్యజించు. ఎందుకంటే అది కూడా ద్వైత కల్పన నుండే ఏర్పడుతుంది కదా!

❖❖❖

## 8. తాత్సారం చేయవద్దు

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ మహామతీ! రామచంద్రా! ఓ సర్వశ్రోతలారా! తాత్సారం మాత్రం చేయవద్దు. ఈ మానవజన్మ అత్యంత ఉత్కృష్టమైనదని, ఇది అత్యంత దుర్లభంగా మాత్రమే లభిస్తుందని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. ఈ అవకాశమును తగురీతి ఉపయోగించుకోవటమే ఉచితం.

జీవుని యొక్క ఈ అంతరంగంలో ఒక నిబిడాంధకారము చోటు చేసుకుని ఉంటోంది. అందులో "ప్రాణస్పందన - కాలకల్పన - వాసనలు - విషయములు, వాటికి ద్వారము వంటి అహంకారము" మొదలైన దుష్టపిశాచాలు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయి. వాటిని నిరోధించాలి, నాశనం చేయాలి. అందుకుగాను "అఖండబ్రహ్మాకారము" అయిన బుద్ధిని పొందాలి.

ఎప్పుడైతే నీవు.. 'విశ్వమునకు అతీతము, కేవల చిన్మయము"... అయినట్టి నీ యొక్క పారమార్థిక స్వరూపమునందు సుస్థిరుడవై ఉంటావో, మరుక్షణం నీయొక్క 'అద్వితీయ బ్రహ్మానంద స్వరూపము' చే ఈ వర్తమాన భవిష్యత్తు లోకములను సర్వదా పావనమే చేయగలవు. అట్టి ముక్త స్వరూపుడవగు నీకు ఈ లోకములు అత్యంత సహజంగానే నీరాజనం పట్టగలవు.

❖❖❖

# 9. 'ముక్తుడు' అంటే?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వాసనలన్నీ హృదయము నుండి పారద్రోలి, ఎవడైతే సర్వస్థితులందు చింతారహితుడై ఉంటాడో, అతడే ముక్తుడు. అతడే 'పరమేశ్వరుడు' అని కూడా చెప్పబడుచున్నాడు. సమస్త ఆశలు అంతఃకరణం నుండి పారద్రోలబడగా, అట్టి 'శుద్ధాతఃకరణం'తో కూడిన మనుజుడే విముక్తుడు. అట్టివాడు సర్వలౌకిక వ్యవహారములు త్యజించి 'సమాధి'ని అభ్యసించు చుండు గాక! లేక ఈ ప్రపంచమున వ్యవహరించుచుండు గాక! అతని ముక్తిత్వమునకు వచ్చే లోటేమీ లేదు.

**నైష్కర్మ్యేణ న తస్యార్థో, న తస్యార్థో ఽ స్థి కర్మభిః ।**
**న సమాధాన జప్యాభ్యాం, యస్య నిర్వాసనం మనః ॥**

ఈ చిత్తము వాసనారహితమైన తరువాత ఆపై ఇక నైష్యర్మ్యములచేగాని, సమాధిచేగాని, జపముచేగాని క్రొత్తగా సంపాదించవలసినదేదీ ఉండదు.

ఓ లోకకళ్యాణస్వరూపా! రామచంద్రా! మేము సమస్త శాస్త్రములను అతి నిపుణతతో విచారించాం... చాలాకాలం ఒకరితో మరొకరం ఆధ్మాత్యశాస్త్రం గురించి పదే పదే సంభాషించుకున్నాం... ఇట్లా ఎన్నోసార్లు శాస్త్రసారములను, పూజ్యుల ప్రవచనములను, స్వానుభవములను బాగుగా వితర్కించి, ఈ ఉత్తమ నిర్ణయానికి వచ్చాం – "వాసనాత్యాగం అవలంబించి ఆత్మస్థితి యందు సుస్థిరులం కావటం... అను పదము కంటే ఉత్తమమైన పదము మరెక్కడా ఏదీ లేదు."

అనేకసార్లు మేము దశదిశలా సంచరిస్తూ అనేకుల తరగతుల వ్యక్తులతో సంభాషించాం. యథార్థ వస్తువగు బ్రహ్మంను ఎరిగినవారు కొందరు మాత్రమే తారసపడుచున్నారు.వారు వాసనా రహితులై ప్రశాంతతతో–సంతోషంతో పరిసరాలను ఆనందపరుస్తూ సంచరిస్తున్నారు. వాసనా రాహిత్యమే ముక్తి.

❖❖❖

# 10. ఇక్కడ అభిలషింపతగినదేది?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అసలు ఈ ప్రపంచమునందు 'ఇష్టము– అయిష్టము' అయిన దానికంటే వేరుగా ఏమున్నది? ఇష్ట–అనిష్టముల కొరకే ఈ సర్వజీవులు యత్నించుచున్నారు. చిత్రమేమిటంటే ఈ ఇష్టానిష్టములకంటే భిన్నమైనట్టి 'ఆత్మతత్త్వము' కొరకు అనేకులు యత్నించుటయే లేదు.

ఈ లౌకిక-వైదిక క్రియలు కూడా అనాత్మభూతమగు దేహాదుల కొరకే చేస్తున్నారు కాని, ఆత్మ కొరకై అనేకమంది యోచించుటయే లేదు.

**పాతాలే బ్రహ్మలోకే చ స్వర్గే చ వసుధాతలే ।**
**వ్యోమ్ని కతివయా ఏవ దృశ్యన్తే దృష్టదృష్టయః ॥** (శ్లో 32, సర్గ 57)

చిదేకరసమగు బ్రహ్మమును సాక్షాత్కరించుకొనిన మహాత్ములు... ఈ బ్రహ్మ-స్వర్గ-భూ-పాతాళలోకములలో... ఎక్కడో గాని తారసపపడుట లేదు.

ఈ జనులలో అనేకులు "ఇది త్యజించాలి... ఇది గ్రహించాలి"... అను వ్యసనముతో కూడుకొనిన త్యాజ్య గ్రాహ్య బుద్ధినే కలిగి ఉంటున్నారే? త్యాజ్య-గ్రాహ్య బుద్ధి శమించినట్టి జ్ఞానులగు మహాత్ముల సంఖ్య అల్పంగానే ఉంటోందే! ఒకడు చక్రవర్తి అయి, ఈ భూమండల మంతా ఏలవచ్చు గాక! లేదా ఇంద్రపదము పొంది 'వృష్టి'కి అధికారి అయి, మేఘములందు ప్రవేశించ వచ్చు గాక! లేక వరుణపదమును పొంది జలమును ఆక్రమించి ఉండవచ్చు గాక! కాదా, యోగసిద్ధులన్నీ పొంది హాయిగా అటూ ఇటూ విహరిస్తూ ఉండవచ్చు గాక...! అయితే మాత్రం ఏం? ఆ జీవునికి శాంతి కరువే అగుచున్నది. ఆత్మప్రాప్తిచే తప్ప మరింక దేనిచేతా కూడా ఈ జీవుడు విశ్రాంతి పొందజాలడు. ఆత్మానుభవం ఇంద్రియధ్యాసను నిశ్శబ్దపరచినవారికే లభిస్తోంది. ఇంద్రియములు అనే శత్రువులను జయించినవారే శూరులు. వారే మహాధీమంతులు.

ఓ జనులారా! ఈ జనన-మరణ రూప జ్వరమును ఉపశమింపజేయ దలచుకున్నారా? అయితే మీరు ఆత్మజ్ఞానులగు మహాత్ములను సమీపించండి. సేవించండి. ఆత్మ సమాచారం సేకరించండి. తరించండి. అంతే గాని ఈ పదార్థముల పట్ల ఏర్పడు ఇష్టాయిష్టములను నెమఱు వేస్తూ చతికిలపడి కూర్చుని ఉండవద్దు. నాయనలారా! ఈ పాతాళ-భూ-స్వర్గ లోకములన్నిటి లోనూ ఉన్నది పంచభూతములే కదా! ఇందలి పదార్థములన్నీ పంచభూతముల సమ్మేళనం మాత్రమే. ఇంక ఆరవ వస్తువు ఏది ఉన్నది? మరి బుద్ధిమంతుడు, ధీరుడు అయినవానికి ఎక్కడకు వెళ్ళినా క్రొత్తగా పొందేదేముంటుంది?

అభిలషింప తగినదంటూ ఇక్కడెక్కడా ఏదీ లేదు. ఏది ఎట్లో - అది అట్లే జరుగుచుండగా, ఇక త్యజించవలసినది మాత్రం ఎక్కడ ఏమున్నది?

ఆత్మజ్ఞానమే మహాశయముగా గలిగినట్టి మహనీయులు ఇక్కడ ఊరకే కాలం వ్యర్థ పరచుకోరు. వారు వేదములందు ప్రవచించబడిన 'బ్రహ్మము' యొక్క స్వభావాదులు ఏమిటో గ్రహిస్తున్నారు. క్రమక్రమంగా బ్రహ్మముతో 'అభేదము' సాక్షాత్కరించుకుంటున్నారు. అందుచేత వారికి ఈ ప్రపంచమంతా గోష్పాదజలం (ఆవు కాలిగిట్ట నేలను తాకుతుంటే ఏర్పడిన స్వల్ప గుంటలోని జలం) వలె అత్యంత సులభంగా తోచుచున్నది. ఎవరైతే బ్రహ్మజ్ఞులచే, శాస్త్రములచే చెప్పబడుచున్న యుక్తులను దూరంగా విడనాడి, విషయానుకూలంగా మాత్రమే వర్తిస్తున్నారో, అట్టివారికి ఈ సంసారము ప్రళయకాల మహాసముద్రము వలె అతి విస్తారంగా కనపడుచున్నది.

విశాలచిత్తులై కొందరు సర్వభేదాభేదభావములను ప్రక్కకు నెట్టి ఆత్మానందమునే అనుభవిస్తూ ఉంటున్నారు. అట్టివారికి ఈ బ్రహ్మాండమంతా చేతికందించినా సరే, ఇందులో ప్రత్యేకత ఏదీ వారికి కనిపించుటలేదు. నూతనమైన ప్రయోజనములేవీ వారికి ఉండుటలేదు. "భావనానుసారంగానే అనుభవం ఉంటోంది... ఇక ఈ వస్తుజాలంలో ఏర్పడే క్రొత్తతన మేమున్నది?"... అని వారు మనలను ప్రశ్నిస్తున్నారు. మరి, మూఢులో... ఇట్టి ఈ అల్ప జగత్తులో రాజ్యము మొదలైన సుఖముల కొరకై లక్షలాది జనుల వినాశనమునకు హేతుభూతములగు "యుద్ధము, మోసము" మొదలైన క్రియలందు ప్రీతిగొని ఉంటున్నారు. మానవజన్మ యొక్క అర్థ, తాత్పర్యాలు ఇవా? కాదు. తత్త్వజ్ఞాని సహజంగానే 'దయాళువు' అగుచున్నాడు. దురహంకారం, దురాశ మొదలైనవి అతనికి తుచ్ఛములుగా, అతి నింద్యములుగా తోచుచున్నాయి.

జ్ఞానుల దృష్టిలో ఈ దృశ్యము లోపల మహత్తర పదార్థమంటూ ఏదీ లేదు. అత్యంత ఉత్కృష్టమైనదిగా భావించబడే బ్రహ్మదేవుని పదమే తీసుకో... అది కూడా మహాకల్పాంతమున నశించబోతోంది, కనుక అల్పమైనదే కదా! "సమస్త ప్రాణులు విలయం కావటానికి, ఉత్పత్తి కావటానికి హేతుభూతమగుచున్న బ్రహ్మపదము కూడా మానసిక వ్యథతో కూడుకొనినదే" అని చెప్పబడుతోంది. అట్టి పదవి అజ్ఞానుల దృష్టిలో గొప్పది కావచ్చునేమో గాని, జ్ఞానుల దృష్టిలో కాదు. జ్ఞానుల దృష్టిలో, "నిత్య-శుద్ధ-ముక్త- అఖండము, అతిసులభము అగు స్వస్వరూపమున సుస్థిరులై ఉండటం" అనేదే అన్నిటికీ మించియున్న పదము. అందుచేత జ్ఞానికి బ్రహ్మదేవుని పదమునందు కూడా 'ఆకాంక్ష' ఉండదు.

తత్వవేత్తల దృష్టిలో ఈ సృష్ట్యాదులచే ఏమీ ఉత్పన్నము కాకయే ఉంటోంది. కనుక, ఈ ముల్లోకములు సంప్రాప్తిస్తే మాత్రం ఆత్మకు క్రొత్తగా వచ్చి చేరేది ఏమి ఉంటుంది? కోల్పోయేదేమి ఉంటుంది? ఇదిగో... ఈ భూభాగం చూచావా? ఇది ఒక వైపు పర్వతములతోను, మరొక వైపు జలముతోను నిండి ఉన్నది కదా! మధ్యలో ఉన్న ఈ భూభాగములోని 'రాజ్యము' అను ఒక స్వల్పస్థలము క్రొత్తగా చేరి జ్ఞానిని పూర్ణునిగా చేస్తుందా? సర్వము ఎరిగిన తరువాత రాజ్యములు ఎంతటివి? భూభాగములు ఎంతటివి? అసలు ఈ శరీరము ఎంతటిది? శుద్ధము, నిత్యము అగు చైతన్యమునకు, అజ్ఞానజనితములైన "నా రాజ్యం - నా భూభాగం - నా వారు"... అనువాటికి సంబంధమెక్కడ? అందుచేత ఆత్మజ్ఞానికి ఈ పాతాళ-భూ-స్వర్గ విభాగములలో ఎక్కడా కూడా అవశ్యం కర్తవ్యమైనదీ - అవశ్యం పొందవలసినదీ ఏదీ లేనేలేదు. సర్వదా సర్వత్రా ఏకత్వమే అతనికి కనబడుచున్నది. అతడు తనకుతానే ఆకాశం వలె విశాలమైన రూపం కలిగి ఉంటున్నాడు. ఎల్లప్పుడు స్వస్థచిత్తుడై ఉంటున్నాడు. దేహసమూహములచే, అనేక పరస్పర వ్యతిరిక్త విషయాలచే నిండియున్న ఈ త్రిలోకములు అతనికి మృగతృష్ణా జలంలాగా, నిర్మలాకాశంలాగా శూన్య రూపంగా ఉంటున్నాయి. అతనికి వీటియందు శాంతము, రమణీయతలు మాత్రమే గోచరిస్తు న్నాయి. అతడు వాటికన్నిటికీ అతీతుడై, ఆపై వాటిని చూస్తున్నాడు. 'ఈ జగత్తులోని పదార్థ జాల మంతా తుచ్ఛము, స్వల్పకాలికము'... అని గ్రహించి అతడు వర్తించుచున్నాడు. సూర్యుని దృష్టి ఏ

పదార్థమునందూ 'సంకుచితము-పరిమితము' అవదు కదా! జ్ఞాని దృష్టి ఏ మాత్రం ఆకర్షణ వికర్షణలు పొందుట లేదు.

'బ్రహ్మం' అనే నిర్మల సముద్రంలో ఈ 'దృశ్యవ్యవస్థ' అంతా నురుగు-బుడగలు-కెరటాలు వంటిది మాత్రమే. బ్రహ్మము ఆకాశంలోని సూర్యుడై యుండగా, ఈ జగత్తు 'మృగతృష్ణ'లోని జలము వంటిది.

**ఆత్మతత్త్వమహాంభోధివీచయః సర్గరాజయః ।**
**అనుత్తమపదాంభోద వృష్టయః శాస్త్రదృష్టయః ॥** (శ్లో 47, సర్గ 57)

ఈ కనబడే సృష్టులన్నీ ఆత్మమహాసముద్రంలోని తరంగాల వంటివి. ఇక్కడ కనబడే వివిధ శాస్త్రసారములు సర్వోత్తమమగు 'పరబ్రహ్మం' అను మేఘం నుండి వర్షించు వర్షధారుల వంటివే.

❖

ఇక్కడ ఏవేవి కనబడుచున్నాయో, అవన్నీ కూడా 'ఆత్మ' చేతనే ప్రకాశితములగుచున్నాయి. చమత్కారం చూచావా? ఆత్మయే వాస్తవస్వరూపంగా కలిగియుండి కూడా ఈ జీవులలో అనేకులు పరిచ్ఛిన్న దేహభావమును కలిగి ఉంటున్నారు. హింసాస్వభావయుతులై, 'కామభోగాలు' అనే గడ్డి పరకలను సేవిస్తూన్నారు. జ్ఞానసముపార్జనకు అర్హమైన ఉపాధులు సంపాదించుకొని కూడా మృగతుల్యంగా రాత్రి-పగలు గడుపుచున్నారు. ఇది ఉత్తమమా? సార్థకమనిపించుకుంటుందా?

**శ్రీరాముడు:** స్వామీ! ఈ దేహములన్నిటియొక్క ప్రయోజనమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ దేవ-మనుష్య తదితర అస్థి-మాంససహిత దేహములన్నీ అజ్ఞానమును ఆశ్రయించిన అభాగ్యజీవుల వ్యాహ్యాళి కొరకే నిర్మించబడుచున్నాయి. ఈ అనేక జీవుల అస్థిపంజరాలన్నీ అల్పజ్ఞాన జీవులను బంధించటానికి అమర్చబడిన ఎలుకల బోను వంటివే. బంధనము కొరకే సంసారారణ్యంలో ఇవి ఏర్పడి ఉంటున్నాయి. చర్మముచే కప్పబడిన తోలు బొమ్మలవంటి ఈ రక్తమాంస దేహములను భోగభూములందు ఏర్పరచి ఉంచినది అజ్ఞాన బాలురవంటి జీవుల వినోదార్థమే సుమా!

ఇక్కడి విషయాలు బహుదుఃఖపూరితమే అగుచున్నాయి. అయితే మందమైన వాయు వీచికలు పర్వతాన్ని కదల్చగలవా? సర్వత్యాగియగు వివేకిని ఈ సంసారాడంబరమంతా తాకనైనా తాకలేదు. ఇక్కడి విషయాలు, విశేషాలు అతనిని ఏ మాత్రం కదల్చలేవు.

జ్ఞాని సర్వదా సర్వోత్తమమగు బ్రహ్మపదమునందే స్థితి కలిగి ఉంటున్నాడు. అతడు దీని నంతా క్రీడామాత్రంగా సందర్శిస్తూ, సరదాగా ఆస్వాదిస్తున్నాడు. తత్త్వజ్ఞానము యొక్క చిత్ప్రకాశం చేతనే 'బ్రహ్మ' మొదలగు లోకపాలకులు ఈ జగత్తునంతటినీ ప్రకాశింప జేయుచున్నారు. చిత్ప్రకాశము యొక్క ప్రభావంచేతనే ఈ నేత్రములు మొ॥ ఇంద్రియములు, ఈ బుద్ధీ, ఈ బాహ్యప్రదేశములు ఇవన్నీ కూడా ప్రవర్తించగలుగుచున్నాయి. లోకపాలకులగు బ్రహ్మ మొదలైన వారు ఒకవైపు దేహరహితమగు ఆత్మను వివేచించి చూస్తున్నారు. మరొకవైపు దేహాత్మభావముచే ఈ దేహాదులను రక్షించు ధర్మమును నిర్వర్తిస్తున్నారు.

జ్ఞాని ఈ దేహములు పొందినందుకు ప్రయోజనంగా తనయందలి భోగవాసనలను సంక్షయింప జేసుకోవటానికి ప్రయత్నములు చేస్తున్నాడు. విశాలమైన హృదయం, శుద్ధము పవిత్రము అయినట్టి అంతఃకరణములను పొందుచూ, ఈ సర్వపదార్థములందు ఆసక్తిని త్యజించి వేస్తున్నాడు.

పరమశివుడు పార్వతీదేవి నృత్యమునే అభిలషిస్తాడు గాని, కోతుల నృత్యమును కాదు కదా! పవిత్రాతఃకరణుడికి దేనిపట్లా అభిలాష ఉండదు. ఇక్కడి నృత్య గీతాదులన్నీ అతనికి చిలుక పలుకుల వలె అర్థరహితమై ఉంటాయి. ఒక రత్నము తన యందు ప్రతిబింబించే వాటిపట్ల 'వీటిని నేను సర్వదా కలిగి ఉండాలి" అని భావన చేస్తుందా? తనయందు ప్రతిబింబిత వస్తువుల పొందుటచే తనకు లాభమేమున్నది? నష్టమేమున్నది? అనురక్తి ఏమున్నది? విరక్తి ఏమున్నది? జ్ఞాని ఈ జగత్పదార్థములను, సంఘటనలను అపరిచిత గ్రామంలోని అపరిచితుల ఇంట్లో జరిగే పెళ్ళి సందడిలాగా దూరంగా తాను ఉండి చూస్తూ ఉంటాడు.

అజ్ఞాని దృష్టిలో ఇక్కడ ఒక గడ్డిపరక నుండి బ్రహ్మలోకము వరకు ఈ పదార్థములన్నీ సుస్థిరంగాను, దుర్భేద్యంగాను ఉన్నాయి. జ్ఞానికో... ఇవి, నీటియందు ప్రతిబింబించే 'ఆకాశము-చంద్రుడు-నక్షత్రములు" లాగా... అస్థిరములు, అసత్యములు, అతి చంచలములు అయి ఉన్నాయి. ఎందుకంటే, అతడు తత్త్వదృష్టిచే ఇదంతా మిథ్యారూపంగా దర్శించుచున్నాడు.

ఇక్కడి అల్ప తుచ్ఛ విషయసుఖములు, తదితర వ్యవహారములు అతనికి ప్రీతిని కలిగించుట లేదు. బంధము కలిగించుట లేదు. స్వీకార తిరస్కార భావాలకు అతీతంగా వీటిని అతడు మౌనస్వరూపుడై చూస్తున్నాడు.

అతడు దేనినీ కలిగియుండుట లేదు, త్యజించుట లేదు. అతడు అంగీకరించడు, తిరస్కరించడు. తదితర అజ్ఞానులతో తాను కూడా ఉంటున్నప్పటికీ వారి అవగాహనలు, ఆర్తులు, ఆశలు మొదలైనవి అతనికి అలవోకతో కూడిన చిరునవ్వు మాత్రమే పుట్టిస్తున్నాయి.

❖

ఓ రామచంద్రా! ఈ విషయమై ఒకప్పుడు బృహస్పతి కుమారుడగు కచుడు చెప్పిన ఒక పవిత్రమైన వృత్తాంతమును వినిపిస్తాను.

❖❖❖

# IX. కచుని గానం

## 1. కచుని స్వవిచారణ

**శ్రీ వసిష్ఠ మహర్షి:** దేవతల గురువు బృహస్పతి. ఆయనకు ఒక కుమారుడు ఉన్నాడు. అతని పేరే కచుడు. ఆ కచుడు 'బ్రహ్మవిద్య'ను ఒకప్పుడు 'మననము' చేత, నిధిధ్యాసచేత బాగా అభ్యసించి ఉన్నాడు. అట్టి అభ్యాసం యొక్క పరిపాకం చేత ఆత్మయందు విశ్రాంతి పొందాడు. 'సమ్యక్‌జ్ఞానం' (Equality towards everything everywhere, all times) అనే అమృతం పానం చేశాడు. ఇక అతని బుద్ధిలో... పంచభూతములచే తయారు చేయబడిన – అతి నికృష్టము... అగు ఈ దృశ్యము నందు ఏమాత్రం అనురాగముగాని, విరాగముగాని లేకుండా పోయింది. ఉదాసీనుడయ్యాడు. ఆత్మ కంటే వేరుగా పొందవలసినదేదీ అతనికి కనిపించుటలేదు. అప్పుడు ఆతడు ఈ విధంగా ఆత్మతత్వాన్ని గానం చేయనారంభించాడు.

❖

**కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామికిం ।**
**ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా ॥** (శ్లో 5, సర్గ 58)

**శ్రీ కచుడు:** ఆహాఁ! ఇప్పుడు నేనేమి చేయాలి? ఎక్కడికి వెళ్ళాలి? దేనిని గ్రహించాలి? మహా ప్రళయంలో ఈ బ్రహ్మాండమంతా జలంతో నిండిపోవుచున్నట్లు, ఈ విశ్వమంతా ఆత్మచే పరిపూర్ణమై ఒప్పుచున్నది కదా!

సమస్తము ఆత్మమయమేనని నేను తెలుసుకున్నాను. తత్త్వజ్ఞానోదయం కానంతవరకే దుఃఖములు నన్ను సమీపించాయి. జ్ఞానం ఉదయించిందా, దుఃఖములు... ఆ దుఃఖములను అనుభవించే జీవులు... ఆ జీవులకు ఇష్టమగుచున్న సుఖము... అంతా కూడా కేవలం 'శూన్యము మాత్రమే' అని తోచుచున్నది. "సమస్తము ఆత్మమయమే"... అని గ్రహించుచుండగా ఇక కోల్పోయేది ఏముంది? పొందేదేముంది? ఆత్మచేతనే సర్వదుఃఖరహితుడనగుచున్నాను. ఆత్మకు వేరైన వస్తువు ఎక్కడా ఏదీ లేదు కాబట్టి, ఇక నాకు దేనివలనకూడా ఏ ప్రత్యేకమైన ప్రాప్తి ఉండదు.

స్వర్గమా? మర్త్యలోకమా? పాతాళలోకమా? అవన్నీ కూడా ఆత్మతోనే నిండి ఉన్నాయి. ఇక వాటిలో భేదమెక్కడ? ఆత్మయే అయిఉండుటచే, – భేదమెక్కడ? ఈ శరీరము యొక్క బైట, లోపల, సర్వ దిక్కులందు, పైన, క్రింద... అంతటా సర్వత్రా ఆత్మయే వ్యాపించియున్నది. ఆత్మ లేనిది, ఆత్మ కానిది అయిన చోటు ఏది? ఏదీ లేనే లేదు.

❖

'కుండ' యొక్క ఆకారము ఉన్నదెందులో? మట్టిలోనే కదా! ఈ జగత్తు అంతా సర్వదా అట్లే ఆత్మయందే ఉన్నది. మట్టి, "అయ్యో! నేను కుండనయ్యానే?" అని వేదన చెందుతుందా? లేదు కదా! మట్టి సర్వదా మట్టియేకదా!

**సర్వత్రైవస్థితోహ్యాత్మా సర్వమాత్మమయంస్థితమ్ ।**
**సర్వమేవేదమాత్మైవ మాత్మన్యేవభవామ్యహమ్ ॥** (శ్లో 8, సర్గ 58)

అనగా ఈ జగత్తుకు అధిష్ఠానం ఆత్మయే. ఇక వివర్తభావంగా చూస్తే... ఆత్మయే ఈ జగత్తు రూపమున ప్రకాశిస్తోంది. తత్త్వదృష్టిచే ఇదంతా ఆత్మయే అయి ఉన్నది. ఈ విధంగా నేను ఎల్లవేళల పరమాత్మ స్వరూపమగు ఆత్మయందే నెలకొనియున్నాను. కాబట్టి పరిశుద్ధమగు పరమాత్మయే నేను. బ్రహ్మము-బ్రహ్మదేవుడు అనబడేదంతా నేనే.

"పరమాత్మకంటే వేరుగా 'జీవుడు' అనబడేవాడు ఒకడు ఉన్నాడు" అని అంటే... అది మిథ్యతో కూడిన ప్రతిపాదన మాత్రమే. పరమాత్మకంటే అన్యంగా ఖండరూపమున నేను లేను. అందుచేత నేను ఈ చేతన-అచేతన రూపములందు అంతటా కూడా ఆత్మస్వరూపుడనై వ్యాపించి ఉంటున్నాను.

"సన్మయము" (Absolute Existence) అయినట్టి ఆత్మయే ఆకాశమండలమును కూడా పూర్ణం చేసివేస్తూ సర్వత్రా వెలయుచున్నది. నిర్మలము, నిత్యోదితము, అఖండము అయినట్టి ఆత్మయే స్వరూపముగా గల నేను ఆ విశేషణములన్నింటికీ సర్వదా, సర్వస్థితులలోనూ తగియే ఉన్నాను కదా...!

కనుక మంచిది! ఇప్పుడు... "నేను పరిపూర్ణుడనై ఆనందస్వరూపుడనై, సుఖమయుడనై ఏకమగు ఆత్మ మహాసముద్రమునందు అంతటా సర్వదా సుస్థితుడనైయున్నాను"... అని నాచే గ్రహించబడుచున్నది.

❖

ఈ విధంగా ఆ కచుడు గానం చేస్తూ ఉన్నాడు. ఇట్టి భావనకు 'సంజ్ఞ' అయినట్టి 'ఓం' కారమును ఉచ్చరించ ఆరంభించాడు. ఓంకారము యొక్క 'అర్థమాత్రము" నందు సమస్తము లయం చేసివేశాడు. ఇప్పుడు అతడు అభ్యంతరమగు 'కారణము' నందులేడు. బాహ్యము అయినట్టి 'కార్యము' నందు కూడా స్థితి కలిగియుండలేదు. కేవలం పరమాత్మ స్వరూపము మాత్రం భావన చేస్తున్నాడు. సమస్త కల్పనాకళంకములు రహితం చేసుకున్నాడు. శుద్ధుడయ్యాడు. 'ప్రాణగతి'ని కూడా హృదయమునందు విలయం చేశాడు. మేఘరహితమగు నిర్మలాకాశంలాగా "నిర్మలాంతఃకరుణుడు"... అయ్యాడు.

❖❖❖

# 2. ఆత్మాశ్రయం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! "సర్వము ఆత్మయే" అను దర్శనము పొందిన తరువాత, అట్టి జీవుని యొక్క అవగాహనను నీకు తెలియజేయటానికే ఈ కచుని సమాలోచనను వర్ణించి చెప్పాను. భోగములను నమ్మి ఉండరాదు. ఆత్మనే ఆశ్రయించి ఉండటం ఉచితం.

ఈ ప్రపంచములో కనబడుచున్నవన్నీ సమీక్షిస్తే ఇవి... "అన్నము-పానము-స్త్రీ సంగమము' ... ఇంత మాత్రమే కదా! ఇంతకు మించి ఇక్కడి ఆయా పదార్థములలో ఏమి పురుషార్థం ఉన్నది? వివేకి అయినవాడు ఈ విషయాన్ని శ్రుతి-స్మృతుల సహాయంతో, సద్గురువులు చెప్పుచున్న ఉపదేశములచేత, స్వానుభవంచేత నిశ్చయించుకుంటున్నాడు. ఇక ఆతడు భోగములను ఏమాత్రం ఆశించుట లేదు.

ఓ జనులారా! మీరు పశు, పక్ష్యాదులలాగా మూఢులై, "నీచము, నశించే స్వభావము కలిగినవి"... అయినట్టి విషయభోగముల పట్ల విశ్వాసం కలిగి ఉండటం ఉచితమా? అయ్యో! గాడిదల వలె నివసిస్తూ ఉత్తమమగు ఈ మానవజన్మను వృథాపరచుకోవటం మంచిదా? "రక్తమాంసములు మాత్రమే" అయిన ఈ తుచ్ఛ శరీరాదులపై మీకు అహంకార మమకారములు (నేను, నాది-అను భావములు) ఎందుకు ఏర్పడుచున్నాయి? వీటిలో 'కేశములు, బొమికలు' తప్ప ఇంకేమీ ఉత్తమ విషయాలు లభిస్తున్నాయి చెప్పండి? ఆహారనిద్రామైథునాలకే పరిమితులు కాదలచుకొన్నవారు జంతు ఉపాధులను మించి ఏం గొప్ప ప్రయోజనం పొందుచున్నారు?

ఈ భూమి అంతా మట్టిమయమే...! వృక్షములన్నీ కొయ్యతోనే నిండి ఉన్నాయి...! "పైన ఆకాశం క్రింద భూమి" గల ఈ ప్రపంచంలో సుఖప్రదమగు అపూర్వ వస్తువు ఏమి ఉన్నది? ఈ ఇంద్రియములను గమనిస్తే, ఇవి ఎప్పటికప్పుడు అల్పమైన విషయాలు పొందటానికే ఆరాట పడుచున్నాయి. అవి ఎంత చూచినా, వినినా, పొందినా వివేకము పొందటానికి ఏమాత్రం సమాయత్తమగుటయే లేదు.

నాయనా! రామా! ఈ 'సంసారారణ్యం'లో సంచరించే జనులయొక్క వ్యవహారములన్నీ విచారించబడనంతసేపు మాత్రమే రమణీయంగా ఉంటున్నాయి. కాని అవన్నీ చివరకు మోహ హేతువులుగానే పరిణమిస్తున్నాయి. పాపం, ఈ మానవుడు సుఖమును గూర్చిన అనేక ఆశలు కలిగి ఉంటున్నాడు. వేటి వేటి కొరకై 'ముందు ముందు సుఖించగలను' అని అనుకుంటూ ప్రయాసతో ప్రయత్నములు చేస్తున్నాడో, అవన్నీ దుఃఖప్రదములే అవుతున్నాయి. ఇక్కడ గల పాప భావములకు పాప విషయకాలుష్యమునకు, వియోగ విషాదాదులకు అంతు ఉండుట లేదు కదా!

ఈ పంచేంద్రియములు, ఈ మనస్సు ప్రతి క్షణం ఏవేవో వస్తువులను పొందటం, కోల్పోవటం చేస్తున్నాయి. ఈ విషయసంపదలను చూచుకొని మురిసినంతసేపు పట్టదు. మన ఈ గొప్ప గొప్ప శరీరములు ఏ క్షణమైనా పతనం కావటానికి సిద్ధపడియే ఉంటున్నాయి.

ఎంతటి చిత్రమైన విషయం! ఈ జీవుడు, రక్తం, మాంసం, చర్మముల సంఘాతములచే ఏర్పడుచున్న బొమ్మవంటి స్త్రీ దేహమును చూచి "ఆహాఁ! ఈమె నా ప్రియురాలు... ఈమె ఎంత అందంగా ఉన్నది...!" అని తలచుచు మురిసిపోవుచున్నాడు. అట్టి మాంస బొమికల అమరికను ఆలింగనం చేసుకొని 'ఇంతకుమించి ఇంకేమి కావాలి?' అని తలచి విజ్ఞాన, వివేకముల మార్గము నుండి వైదొలగుచున్నాడే...! ఓ రామా! ఇదంతా అజ్ఞానికి సంతోషప్రదమైతే అగుగాక! జ్ఞానికి ఇదంతా అత్యంత చోద్యం, అస్థిరం, అసత్యము కూడా. సరైన అవగాహన లేకుంటే ఇది దుఃఖ ప్రదమే. ఈ విషయభోగములను అల్లంత దూరంలోనే చూచిన వివేకి వాటిలోని విషత్వమును గమనిస్తున్నాడు. విషయములు పొందినంత మాత్రంచేత 'భోగతృష్ణ' క్షీణించగలదా? లేదు.

**తాంపరిత్యజ్యభోగాస్థాం స్వామైకత్వగతింభజ ।**
**అనాత్మమయభావేన చిత్తంస్థితిముపాగతమ్ ॥** (శ్లో. 11, సర్గ 59)

ఇట్టి భోగములందు విశ్వాసము త్యజించుటయే మంచిది. నీవు కేవలం ఆత్మనే ఆశ్రయించు. శరణువేడు, భావించు. అంతే గాని భోగవాసనలను అధికం చేసుకుంటూ అనాత్మ స్వరూపమగు దేహాదులు గురించి భావనను చేయనేవద్దు. అట్టి నీచభావనలయందు నీ చిత్తము స్థితి పొందిందా... మరుక్షణము నుండి అసన్మయమగు ఈ జగజ్జాలమంతా వచ్చి ఎదురుగా నిలచి ఉంటోంది.

❖❖❖

## 3. బ్రహ్మము : బ్రహ్మదేవుడు - చైతన్యము : సృష్టి

**శ్రీ రాముడు:** మహర్షీ! బ్రహ్మము నుండి "బ్రహ్మదేవుడు" అను సమష్టిజీవుడు ఎట్లు ప్రకటితమగుచున్నాడో వివరించండి. అతని యొక్క మనస్సుచే ఈ జగత్తు ఎట్లా ఉత్పత్తి చేయబడుతోందో కూడా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** బ్రహ్మము నుండి మొట్టమొదట 'సంకల్పించుట" అను విశేషముతో కూడుకొన్న మనస్సు రూపంలో ఒక భావకెరటం ఉత్పన్నమగుచున్నది. 'ఎఱుగుట' అను తత్వము నుండి బయల్వెడలిన ఆ ప్రథమక్రియాచైతన్యమే ప్రథమ జీవుడు. ఆతడే హిరణ్యగర్భుడు, బ్రహ్మదేవుడు కూడా. అట్టి "సంకల్పాత్మక మనోరూపము, కల్పితము అయిన ఆకృతి గల చైతన్య స్రవంతి" యే భావిసృష్టికి సంబంధించిన యత్నము ఒనర్చుచున్నది.

అతని అట్టి సంకల్పమే మహాప్రకాశయుక్తమైన తేజమును రచించుచున్నది. ఆ సంకల్ప పరంపరావ్యవహారం తన తేజస్సుచే దిక్కులన్నీ వ్యాపించుచున్నది. అపరిచ్ఛిన్నమై, ఆవరణ రహితమై ఒప్పుచున్నది.

అట్టి బ్రహ్మదేవుడు చతుర్ముఖుడై వెలుగొందుచున్నాడు. ఈ మనో–బుద్ధి–చిత్త–అహంకారములే అతని చతుర్ముఖములు. అట్టి చతుర్ముఖముల ప్రసరణచే (తన మనో తేజముచే)

"స్వసదృశమే" (Not different from his own self) అయినట్టి ఈ కనబడే దృశ్యజగత్తును నిర్మించుచున్నాడు. అనగా... మనస్సే హిరణ్యగర్భుడు. ఆ మనస్సుచే గాంచబడేదే దృశ్యజగత్తు.

నేను, నీవు తదితరులు కూడా మనస్సునందే మనస్సుచే మనస్సు కొరకు ఈ జగత్తును ఇట్లు పొందుచున్నాం. అట్లు "స్వకల్పనాసామర్థ్యము" చే సృష్టించబడ్డ తేజోమండలము నందలి తేజము నుండి సూర్యమండలం ఉద్భవించింది. ఆ సూర్యమండలం అగ్నిజ్వాలల వంటి తన కిరణములచే ఆకాశమును నింపివేస్తోంది.

అట్లు సూర్యుడు నిర్మించబడిన తరువాత శేషించిన కళారూపమును తొమ్మిది విధాలుగా విభజించబడ్డాయి. అట్లు తొమ్మిదిమంది ప్రజాపతులు ఏర్పడ్డారు. వారు బ్రహ్మదేవుని సంకల్పంచే సమస్త సిద్ధులు పొందినవారై స్వసంకల్పములను అనుసరించారు. తదనుసారంగా తమ ఎదుట మాయా పదార్థములను చూడసాగారు. "మరీచి" మొదలైన ఈ ప్రజాపతులచేతనే దేవతలు, దానవులు మొదలైన వివిధములైన జీవరాశులు ఏర్పడినాయి. వారింకా అనేక స్వభావములతో, తత్త్వములతో, శక్తులతో కూడిన జనులను, వస్తువులను సృష్టించారు. కాలక్రమంగా పుత్రులు, పౌత్రులు మొదలైన పరంపరచే ఈ సృష్టి అంతా పరివర్ధమానమగుచున్నది.

ఆ తరువాత సమష్టి సృష్టి అహంకారియగు బ్రహ్మదేవుడు వేదసంస్మరణం చేయుట ద్వారా ఈ జగతియందు 'నియతి' ని కల్పించుచున్నాడు.

ఇక్కడ నీవు గ్రహించవలసినదేమిటి? మనస్సే ఆ విధంగా విశాలమగు బ్రహ్మదేవుని రూపం ధరిస్తోంది. అట్లు ధరించి "భూతసంతతిచే పరివ్యాప్తమైయున్న ఈ సంకల్పమయ సృష్టి"ని విస్తరింపజేస్తోంది, ఇక ఈ సృష్టి 'సముద్రం-పర్వతాలు-వృక్షాలు-దిక్కులు' మొదలైన అనేక పదార్థములచే పూర్ణమై ఉంటోంది. అన్ని దిక్కులను ఆక్రమించిన ఉదరభాగం కలిగి ఉంటోంది.

❖

క్రమంగా ఈ 'సృష్టి' అనబడు జగద్దృశ్యము అనేక శారీరక సుఖదుఃఖములతోను, మానసిక వ్యధలతోను, జరా, జన్మమరణములతోను కూడినదై ఉంటోంది. అందుచేతనే "ఈ దృశ్యమును త్యజించినవారై ఉండండి" అని ఆత్మతత్త్వము ప్రవచించే శాస్త్రములు మనకు చెప్పు చున్నాయి. "మనస్సుచే కల్పించబడినది మాత్రమే"... అయినట్టి ఈ సృష్టి వ్యవహారమంతా రాగ ద్వేష మయమగు దృష్టిచే గాంచబడిందా... ఇదంతా 'ఉద్విగ్నత'కు కారణమగుచున్నది. అట్టి మనో కల్పన యందు సాత్త్విక రాజసిక తామసాలనే త్రిగుణాలు నిండుగా ఆక్రమించుకొని ఉంటున్నాయి.

ఇప్పుడు ఒక ముఖ్యమైన విషయం ప్రతిపాదిస్తున్నాను. హిరణ్యగర్భుడు అదిగా ప్రారంభ మైన ఈ మనోమయ సృష్టి అంతా ఆత్మదృష్ట్యా 'లేనిదే' అగుచున్నది. అందుచేత 'స్వస్వరూపాత్మ' యొక్క ఆత్యంతికానుభవము కొరకై ఆ మనోమయసృష్టి మొదలంటా త్యజించబడాల్సిందే.

❖

బ్రహ్మదేవుని నుండీ ఈ మనస్సు ఆవిర్భవిస్తోంది కదా! ఈ మనస్సు ఇతఃపూర్వపు కల్పంలో ఏ వస్తువును ఎట్లు దృశ్యమానంగా పొందిందో, ఈ కల్పమునందు నేటి వరకు అట్లే పొందుచున్నది.

ఈ మనస్సు, దీని యొక్క 'సమష్టిత్వము' దృష్ట్యా సర్వభూతములందు ఉన్నది. వ్యష్టి దృష్ట్యా ఇది కొన్ని భూతములందు మాత్రమే మననము కలిగియుంటోంది.

ఈ ప్రపంచమును సంకల్పించుచు, తదనుసారంగా తనకు తానే వీక్షించుచున్నది ఈ మనస్సే కదా! ఇక్కడ లభిస్తున్న 'జగన్మోహము' అంతా మనస్సుచే అకస్మాత్తుగా కల్పించబడి స్థిరత్వం పొందుతోంది.

**అంతా సంకల్పబలమే -** సంకల్పబలం చేతనే జగత్క్రియలన్నీ ఉత్పన్నములౌతున్నాయి. సంకల్పబలం చేతనే దేవతలు నియతికి వశులై వెలువడుచున్నారు. సంకల్పముచే జనించిన సృష్టిలో దేవ దానవాది చక్రవర్తులు తమ తమ స్వభావములైనట్టి సాత్విక–రాజసిక–తామసిక వృత్తులను ప్రకటిస్తూ ప్రేరేపణ పొందుచున్నారు. ఇక్కడి జన్మ–జరా–బంధ–మరణాదులన్నీ సంకల్పమాత్రములే.

❖❖❖

# 4. సృష్టి - ఉపసంహారం

ఒక్కొక్కప్పుడు సాత్విక–రాజసిక–తామసిక వృత్తులచే ఈ సృష్టి మరల మరల బాగుగా పీడించబడుచున్నది. అప్పుడు మనోమయజనితుడు అగు బ్రహ్మదేవుడు పద్మాసనము వైచుకుని ఉండి, ఇట్లు సంకల్పిస్తున్నాడు...

"ఆహాఁ! ఈ పాతాళము, భూమి, ఆకాశము, దిక్కులు, స్వర్గమార్గములు, రుద్రులు, ఉపేంద్రుడు, మహేంద్రుడు, పర్వతములు, సాగరములు మొదలైన ఆయా పదార్థములతో కూడిన వృష్టి జగత్తంతా మనస్సు యొక్క స్పందనచేతనే ఏర్పరచబడుచున్నాయి కదా!

మనస్సు యొక్క క్రియాశీలత్వమే ఇదంతా. మనస్సు నా నుండే ప్రభవిస్తోంది. కనుక, ఈ వ్యవహారమయ సృష్టి అంతా నా నుండే ఉద్భవించుచున్నది. ఇదంతా నా సంకల్పమే. దీనిని నలువైపులా వెదజల్లింది నేనే. అట్టి ఈ సంకల్పములను ఇప్పుడు విరమించెదనుగాక!" –ఇట్లు నిశ్చయం చేసుకుంటున్నాడు. శాంతుడగుచున్నాడు. 'కల్పనలు' అను అనర్థసంకటముల నుండి విరతి (withdrawl) చెందుచున్నాడు.

అట్టి సమయంలో అనాదిగా సర్వదా సిద్ధించియే ఉన్న బ్రహ్మమును మనస్సుచే స్మరించ ప్రారంభించుచున్నాడు. అంతే... ఇకపై స్మరణ మాత్రం చేతనే అతడు పరమాత్మను పొందుచు న్నాడు. వ్యవహారములలో పాల్గొనుచున్న ఒక వ్యక్తి ఎంతో అలసిపోవుటచే, ఆ వ్యవహారములు ముగిసిన తరువాత ఒంటరిగా ఉన్నప్పుడు సుఖవిశ్రాంతిని పొందుచున్నాడు చూచావా? ఆ బ్రహ్మ

దేవుడు కూడా అట్టి విశ్రాంతినే ఆశ్రయించుచున్నాడు. 'ఆత్మ' యొక్క ఆకారముగానే ప్రకాశించుచున్న 'బ్రహ్మపదము' నందు విలీనచిత్తుడు అగుచున్నాడు. అహంకార మమకారాలు త్యజించి పరబ్రహ్మమున శాంతిని పొందుచున్నాడు. అలలు లేని సముద్రంలాగా ఆత్మయందు సుస్థితుడగుచున్నాడు. "మౌనము అవధరించినవాడు, భావాతీతుడు"... అగుచున్నాడు.

అట్టి ఉపసంహరణ సమయంలోని తతంగం ఏమిటో వర్ణించి చెపుతాను, విను-

సముద్రము అలలు నుండి విడివడునట్లు, బ్రహ్మదేవుడు జగత్ నిర్మాణానికి మూల కారకమగు విషయముల ధ్యానము (సృష్టి పట్ల అధ్యాస) నుండి విడివడుచున్నాడు. ఇట్లు తలచుచున్నాడు-

**విచారయతిసంసారం సుఖదుఃఖసమన్వితమ్ ।**
**ఆశాపాశశతైర్బద్ధం రాగద్వేషభయాతురమ్ ॥** (శ్లో 41, సర్గ 59)

"ఆహాఁ! ఈ సంసారమంతా దుఃఖసమన్వితమే కదా! ఇదంతా జీవునికి ఆశాపాశ రూపములు గానే ప్రాప్తిస్తోంది. ఇది రాగ ద్వేష భయములతో నిండి ఉంటోంది. నా పుత్రులగు ఈ జీవులు అజ్ఞానముచే దృశ్యమునకు బద్ధులైపోతున్నారు. పదే పదే జనన-మరణ దుఃఖాలను పొందుచున్నారు. వీరంతా ఉద్ధరించబడేది ఎట్లా?"

క్రమంగా దయార్ద్ర చిత్తుడగుచున్నాడు. జీవరాశుల సుఖం కొరకు మోక్షాన్ని ప్రసాదించ గల "ఆధ్యాత్మశాస్త్రము" ను రచించుచున్నాడు. వేద వేదాంత సంగ్రహములను, పురాణములను రచింపజేయుచున్నాడు. అట్టి 'ప్రక్రియ' యందు నేను, వ్యాసుడు, వాల్మీకి మొదలైనవారమంతా నియమించబడ్డవారమే సుమా!

అట్లు ఆ బ్రహ్మదేవుడు 'సృష్టి' అను ఈ పరిశ్రమ నుండి వెలువడి తన పూర్వపదమును (past glory) పొందుచున్నాడు. బ్రహ్మముతో ఐక్యము, అభేదములే అతని పూర్వపదము. అట్టి పూర్వపదాన్ని అవలంబించి, గాలులు వీచనట్టి సమయంలో సముద్రుని వలె... పరమ ప్రశాంతుడగుచున్నాడు. ఈ రీతిగా స్వస్వరూపమున వెలయుచున్నాడు. అనగా, అతడు ఈ జగత్తును కల్పిస్తున్నాడు. వీక్షిస్తున్నాడు. శాస్త్ర రచనలచే నియమాదులు కల్పించుకొని మరల ఆత్మస్థుడగుచున్నాడు.

**శ్రీరాముడు:** ఇట్లు 'సృష్టి' లేక 'దృశ్యము' యొక్క కల్పన ఉనికి - ఉపశమనములకు కారణమగుచున్న మనోరూపుడగు బ్రహ్మయొక్క ఉనికి ఎచ్చట?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వాస్తవానికి బ్రహ్మదేవుడు చిత్స్వరూపుడే. అతడు సంకల్పరహితుడే. సంకల్పించుటకు మునుముందే ఉండి ఉన్నాడు. అయినప్పటికీ తనయొక్క 'ఇచ్ఛ' చే లోకములను అనుగ్రహించుట కొరకు లోకవ్యవహార పారాయణుడగుచున్నాడు.

వాస్తవానికి అతనికి ఆర్జన లేదు. అనాదరణ కూడా లేదు. శరీరగ్రహణము లేదు... నానాత్వము లేదు. అతనికి చేతనము-స్థితి-వినాశనములు కూడా లేవు.

అతనికి అన్ని భావములు, చిత్తవృత్తులు కూడా సమానమే. సర్వదా పరిపూర్ణస్వరూపుడై 'మహాసముద్రము' వలె వెలయుచున్నాడు. కాని, ఒక్కొక్కప్పుడు తన అప్రమేయత్వము పట్ల నిదురించి, జగత్తుపట్ల జాగరిల్లుచున్నాడు. ఆ సమష్టి సంకల్పస్వరూపుడు అగు బ్రహ్మదేవుడు బ్రహ్మము కంటే వేరైనవాడు కాదు.

ఇదంతా ఇట్లా ఉండగా 'బ్రహ్మముతో ఏకము' అను అత్యంత సాత్విక స్థితి ఒకటి ఉన్నది. అది నిష్కల్మష హృదయులు, పదార్థరాహిత్యం పొందినవారు మాత్రమే దర్శిస్తున్నారు. వారు "మనస్సే బ్రహ్మము" అను అనుభవమునకు అర్హులగుచున్నారు.

❖❖❖

# 5. "సృష్టి-జీవుడు" - పరిణామ చమత్కారం

సృష్టి ఏర్పడి ఉన్నట్టి చైతన్యమునే 'జీవుడు' అంటున్నాం. అయితే, ఈ జీవత్వము ఏర్పడక ముందే ఆత్మయొక్క ఔన్నత్యము స్థితి కలిగియే ఉన్నది. ఈ సృష్టికి పరముగా చిదాకాశము ఉన్నది. మనస్సునందు రూపములు ఏర్పడి, గాంచబడతాయి చూచావా! ఆ విధంగానే చిదాకాశము నందు ఈ సృష్టి ఏర్పడుచున్నది. నిర్మల ప్రశాంతజలంలో ఆవృత్తములు ఏర్పడుచున్నప్పుడు, ఆవృత్తములు జలం కంటే వేరుకాదా కదా! అట్లాగే, జగత్తు – దృశ్యములకు సంబంధించిన చిత్తవృత్తులు "చిదాకాశము కంటే వేరు" అని అనటానికే వీలులేదు.

అట్టి సృష్టిలోని ప్రథమరూపములే 'ప్రజాపతులు' అని చెప్పబడుచున్నారు. ఆ ప్రజాపతుల సంకల్పములను అనుసరించే 'నియతి' మొదలైనవి ఏర్పడుచున్నాయి.

**చిదాకాశము -** → సృష్టి సంస్కారములు : → ప్రజాపతులు – ఓషధులు– చంద్రకళ –కల్పన– సంకల్పములు: దేవతలు – కర్మలయందు ఆసక్తి–మానవులు : తదితర జీవోపాధులు.

**ప్రజాపతులు -** వీరు ప్రథమ సృష్టిలోని వారు. వీరియందు బ్రహ్మజ్ఞానము స్వతఃసిద్ధమై ఉంటోంది. అయితే "మేము తదితర జీవుల సమున్నతి కొరకు ఉపాసన మొదలైనవాటిని కల్పించాలి"... అనే సంస్కారం కలిగి ఉంటున్నారు.

**దేవతలు -** ప్రజాపతులు ఏర్పడిన తరువాత అదే కల్పన దేవతల రూపమున ఉదయిస్తోంది. వీరు సుసంస్కారము స్వభావముగా కలిగి ఉంటున్నారు. వీరు ఉపదేశ మాత్రం చేతనే బ్రహ్మజ్ఞానం పొందుచున్నారు.

**మనుష్యులు -** వీరికి పురుష ప్రయత్నం చేత మాత్రమే బ్రహ్మజ్ఞానం లభిస్తోంది. సాధు సంగము, శాస్త్రాభ్యాసము, ఇంద్రియ జయము మొదలైన ఉపాయములను అభ్యసిస్తేనే బంధమును త్యజించగలుగుచున్నారు. "ఉత్తమఫలము' అయినట్టి 'బ్రహ్మజ్ఞానము' సుస్థిరమయ్యే వరకు వారు శ్రవణమననములను ఆశ్రయించవలసి వస్తోంది.

❖

ఈ విధంగా ఈ సృష్టి 'సృష్టము లేక సంకల్పితము" అయినట్టి అనేక ఉపాసనలతోను, 'యజ్ఞము' మొదలైన ఉచితకర్మలతోను, "ద్వేషము, రాగము, ప్రేమ, పరిమితదృష్టి"... మొదలైన నిషిద్ధ మిశ్రమ కర్మలతోను ప్రకాశిస్తోంది. ఇందులో ప్రవేశించుచున్న జీవుల వాస్తవ స్వరూపము శుద్ధతత్త్వమగు ఆత్మయే అయినప్పటికీ, వారు 'పొందుట-కోల్పోవుట' మొదలైన క్రీడాకౌతుకం అవలంబించి ఉంటున్నారు. గర్విస్తున్నారు... హింసిస్తున్నారు... దుఃఖిస్తున్నారు.... ఒకరితో మరొకరు కీచులాడుకుంటున్నారు. వారిలో వారు వాదులాడుకుంటున్నారు. ఈ విధంగా ఉచిత, అనుచిత ప్రారబ్ధకర్మల వేగముతో సృష్టిలోని ఆయా వ్యవహారమంతా వర్ధిల్లుతోంది. అనేక జీవుల, జీవజాతుల క్రోధ-లోభ వ్యవహారములతో ప్రవర్తించు ఈ సృష్టులు "బ్రహ్మదేవుని సంకల్పము" యొక్క బలంచేతనే 'సత్తు' ను పొందుచున్నాయి.

ఈ త్రివిధ సృష్టులు ఇట్లు ఉండగానే ఈ జీవుడు సర్వదా బ్రహ్మమేనని గ్రహించి ఉండు.

❖❖❖

## 6. సృష్టికి మూలం ఇచ్ఛయే!

**శ్రీరాముడు:** తండ్రీ వసిష్ఠ మహర్షీ! అనంతసంఖ్యలో దీపితమౌతున్న ఈ జీవగణమంతా ఎక్కడి నుండి, ఎందుకు ఎట్లా వచ్చి సృష్టిలో ప్రవేశిస్తున్నాయి?

**శ్రీవసిష్ఠమహర్షి:** భగవంతుడగు బ్రహ్మదేవుడు ఒక సమయంలో "ఆత్మసమాధి (ఆత్మను మాత్రమే దర్శించుచుండుట) – మౌనము" అను రూపంలో ఉండే తన స్వస్వభావమును విడిచి, లేచి, ఈ సృష్టి పరంపరావ్యవస్థను ఏర్పరచుచున్నాడు. అతని ఇచ్ఛయే ఇదంతా. అందుచేత "సృష్టికి మూలం ఇచ్ఛ" అని చెప్పబడుతోంది.

అట్లు ఏర్పరచబడిన ఈ సృష్టి లేక జగత్తులో అనేకమంది మృతతుల్యులగు జీవులు లేచి పడుచున్నారు. వారు 'జీవనతృష్ణ' అనే గాలికి కొట్టుకువచ్చి ఇందు పాల్గొనుచున్నారు. దృష్టిభేదము ననుసరించే ఇదంతా ఏర్పడి ఉంటోంది.

ఈ భూతజాలమంతా (లేక, ఇక్కడి జీవులన్నీ) బ్రహ్మమునుండే లేచుచున్నాయి... జగద్దృశ్యమును అంగీకరించి సంసారపంజరములో ప్రవేశిస్తున్నాయి. 'ఏదో పొందాలి, చూడాలి, కావాలి' మొదలగు రూపంగల 'తృష్ణ' యే జగద్వ్యహారములంతటికీ మూలకారణమై ఉంటోంది.

ఈ పంచభూతమయ శరీరాదులన్నీ ఆకాశం నుండి ధూళికణాల వలె బయల్వెడలు చున్నాయి. ఇక్కడి పంచభౌతిక నిర్మితములన్నీ ఆకాశంలోంచి బయలుదేరి, మరల ఆకాశంలోనే లయమౌతున్నాయి. 'ఆకాశమే ఈశ్వరుని ప్రథమపుత్రుడు' అని అందుకే శాస్త్రకారులు చెప్పారు.

❖

జలం నుండే తరంగాలు లేస్తున్నాయి కదా! ఈ జీవగణములన్నీ అనాది యగు 'బ్రహ్మపదము' నుండే ఉత్పన్నం అగుచున్నాయి. బ్రహ్మము చేతనే బ్రహ్మము నందు కల్పనాదృష్టిచే

పొందబడుచున్నాయి. పొగ మేఘాలలో ప్రవేశించుచున్నట్లు ఈ జీవగణం ఆకాశంలో జేరుచున్నాయి.

**అంతా సంకల్పమాత్రమే -** జీవులు పరబ్రహ్మమునందే ఆకాశ వాయువులతో కూడి సంచారం కొనసాగిస్తున్నారు. ఈ జీవులు, ఈ ఆకాశ వాయువులు పరబ్రహ్మము నుండి సంకల్పప్రభావం చేతనే ఏర్పడుచున్నాయి.

తేజస్సు (అగ్ని) - జలము - పృథివి - ఇవన్నీ సృష్టించబడిన తరువాత జీవులు ప్రాణవాయువులచే ఆక్రమించబడుచున్నారు. అన్నిటికీ మూలం సంకల్పమే. మనో-బుద్ధి-చిత్త-అహంకారముల సమన్వయమే లింగదేహము.

పరమాత్మ మహాసముద్రంలో లింగదేహ తరంగాలు అనంతంగా ఏర్పడుచున్నాయి. "ప్రాణవాయువులు-భూతతన్మాత్రలు-అన్నము-జలము" అవన్నీ కలసి పంచవిధ వాయువులుగా మారుచున్నాయి. ఆ పంచవిధ వాయువులు స్థూలదేహంలో ప్రవేశిస్తున్నాయి. అట్లు ప్రవేశించి 'తేజస్సు' యొక్క భావం పొందుచున్నాయి. అట్లు తేజస్సు భావన పొందిన జీవులు ప్రాణ రూపమును దాల్చి ఈ జగత్తునందు ఉత్పన్నులగుచున్నారు. అయితే ఎందుకో వారి జ్ఞానం అపరిపక్వంగా, అస్ఫుటంగా ఉంటోంది.

❖❖❖

# 7. జీవోత్పత్తి - జీవపతనము

శక్తి స్వరూపాలు, భావనామాత్రులు, సూక్ష్మశరీరరూపులు అగు జీవాభిమానులు సృష్టి యందు ఏర్పడి ఉంటున్నారు. వారు భావనోద్రేకానుసారం 'ధూమమార్గం' లో ప్రవేశిస్తున్నారు. పూర్ణచంద్రోదయం అయ్యేవరకు క్షీరసముద్రమునకు కూడా ఆశ్రయమైనట్టి ఆకాశ కోటరంలో ఉంటున్నారు.

పూర్ణచంద్రుడు ఉదయించగానే 'ఆకాశకోటరం' లేక లింగశరీరయుతమగు సృష్టి స్వభావంలో ప్రవేశించుచున్నారు. తరువాత, వారు చంద్రకిరణములలో ప్రవేశిస్తున్నారు. అప్పుడు చంద్రకిరణముల సహాయంచే పుష్టిని సంపాదించుకొని, ఆ కిరణముల ద్వారా రస పూర్ణమైన ఫలములను ఆశ్రయిస్తున్నారు. అట్లు చంద్రకిరణముల నుండి వేరువడి, బిడ్డ తల్లి పాలిండ్లను ఆశ్రయించినట్లు ఫలములలో ప్రవేశించి మాతృగర్భంలో కొద్ది సమయం ఉండి ఉంటున్నారు.

ఆ ఫలములు సూర్యకిరణముల వలన పక్వం పొందుచున్నాయి. వాటిని ప్రజాపతులు, జనులు భుజించటం జరుగుతోంది. అప్పుడు ఆ ఫలాలలోని జీవులు 'వీర్యము' యొక్క రూపాన్ని గ్రహించుచున్నారు. వీర్యరూపము నందు మూర్ఛితులై ఉండి ఉంటున్నారు. ఆ తరువాత వారు యోనులందు ప్రవేశించి మాతృగర్భంలో ఉంటున్నారు.

**శ్రీరాముడు:** ఆ స్థితిలో వాసనలు ఉంటాయా? ఉంటే ఎక్కడ ఉంటాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** జీవులు ఆకాశంలో ఉన్నప్పుడు, గర్భంలో ఉన్నప్పుడు, గాఢనిదురలో ఉన్నప్పుడు కూడా వారి వాసనలు అణిగి, లీనమై ఉంటున్నాయి. మట్టియందు కుండ, కొయ్య యందు అగ్ని మూగగా ఉన్నట్లు వాసనలు కూడా గర్భస్థశిశువునందు అణిగి ఉంటున్నాయి. ఆ తరువాత ఆయా ఉపాధులను పొంది యోగమార్గంలోనో, భోగమార్గంలోనో పయనిస్తున్నారు.

ఈ యోగులందరినీ ముఖ్యంగా రెండు విధాలుగా విభజిస్తూ ఉంటారు. అవి–

1. జీవన్ముక్తుడు; 2. మిశ్రమగుణి

**జీవన్ముక్తుడు -** ఈతడు పూర్వజన్మలో పరమ వైరాగ్య జీవితము గడిపినట్టినాడు. అనగా భోగముల కొరకు కాకుండా, భక్తి–జ్ఞానముల కొరకు, నిర్మల హృదయం కొరకు కర్మలను ఒనర్చినవాడు. భోగాసక్తి రహితమవటం చేత, అట్టివాడు దైవాంశసంభూతుడై, సాత్వికవృత్తిని స్వీకరించి జీవన్ముక్తుడై వ్యవహరించుచున్నాడు.

**మిశ్రమగుణి -** ఈతడు దేవయోనిని పొంది కూడా, జన్మమరణ పరంపరలను త్రెంచుకొనుటలేదు. భోగాసక్తుడై ఉంటున్నాడు.

యోగుల మరొక విధమైన విభాగం విను–

**ప్రథమ ప్రజాపతి -** ఈతడు ఆత్మనుండి ప్రప్రథమముగా ఏర్పడియున్నాడు. ఈతని నుండే తదితర సృష్టి ఏర్పడి ఉంటోంది. ఈ ప్రప్రథమ ప్రజాపతితత్వమునకు సంబంధించినవానికి మరల జన్మించటం అనేదే ఉండదు.

**రాజస సాత్వికులు -** వీరు కేవల సాత్వికులయ్యేంతవరకూ పదే పదే జన్మిస్తూనే ఉన్నారు.

**కేవల సాత్వికులు -** వీరు సర్వదా ఆత్మతత్త్వము విచారించి ఉంటున్నారు. అట్టివారు అతి స్వల్పసంఖ్యలో ఉంటారు. అందుచేత దుర్లభులు. వీరు జ్ఞానానందమయ స్వరూపులై ఉంటున్నారు.

ఈ జీవులలో మరికొందరు క్రమక్రమంగా సాత్వికత వదలి తామసులగుచున్నారు. వారు తామసులై, మూఢులై స్థావరస్థితుల వరకు రాలుచున్నారు. వారి గురించి మనం తరువాత తరువాత చెప్పుకుందాం. వారంతా "నేను ఎవరు? ఈ దృశ్యమేమిటి?" అనే ప్రశ్నకే రాకుండా కేవలం దృశ్యముతో సంబంధములను కల్పించుకొని అనేక స్థితిగతులందు దొర్లుచున్నారు. అనేక సుఖదుఃఖములను పొందుతూ ఈ జన్మ కర్మల చక్రములో పరిభ్రమిస్తున్నారు.

❖

జన్మలు పొందుతూ కూడా 'సంసారభావము' ను ఈషన్మాత్రంగా కూడా పొందని జీవులు కూడా ఉన్నారు. వారు నరులలోను ఉన్నారు. సురులలో ఉన్నారు... జంతువులలోను ఉన్నారు.

**శ్రీరాముడు:** హే మహర్షీ! తాము కేవలసాత్వికులా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నేను ఉత్తమ ఆత్మ విచారణపరుడను మాత్రమే. కేవల సాత్వికుడను కాదు. ఎందుకంటే, కేవలసాత్వికునియందు సమాధినుండి విఘ్నము కలుగజేయ గలిగేదేదీ ఉండదు.

అతనికి ప్రారబ్ధము అనేదే ఉండదు. కాని నా విషయమంలో ఈ "రాజస పౌరోహిత్యము" అనే విఘ్నము, లేక ప్రారబ్ధము ఉండనే ఉన్నది. అందుచేత నేను ఇంకొంచెం రాజససాత్వికుడనే గాని పరిపూర్ణమగు కేవల సాత్వికుడను గాదు.

❖❖❖

# 8. తత్‌పదము

**శ్రీరాముడు:** మరి నా విషయము స్వామీ?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నీవు నా వలే శమ దమాది గుణాలు పొందియున్నావు. కాని ఇంకా ఆత్మపదమునందు విశ్రాంతి లభించలేదు. సంసారభ్రాంతి ఇంకా స్వల్పంగా తొలగవలసి ఉంది. అందుచేత 'తత్' పదం గురించి మరికొంత తీవ్రంగా విచారణ, పరిశీలన అవసరం. అయితే, మన ఈ విచారణాసమయములోనే పూర్ణభావమును పొందగల విభవమును కలిగియే ఉన్నావు.

"బాగుగా విచారణచేయాలి" అను పురుషకారము ఆశ్రయించువారు లక్ష్యము ఎందుకు జేరరు? అట్టి ఆత్మతో ఏకత్వము, ఆత్మ లక్షణములన్నీ పొందటం"... అను రూపము గల 'తత్' పదమే పరమోత్తమమైనది. అట్టి ఉత్తమోత్తమ పదము పొందటానికి ప్రతిజీవునకు హక్కు ఉన్నది.

అందుచే ఓ సర్వజనులారా! మీరంతా ఉత్తమవిచారణదాయకమగు గురువులను, శాస్త్రములను ఆశ్రయించండి. నిష్కామభావముతో సాత్వికకర్మలు ఆచరించండి. నిష్కామత్వమే మోక్షము అని చెప్పబడుతోంది. ఆత్మను మీరు సర్వదా కలిగియే ఉన్నారు. "నేను సర్వదా మోక్షరూపుడనే"... అను రూపముగల "బ్రహ్మోఽహమ్" భావనను పొందియే ఉండండి. అట్టి అవగాహన సముపార్జించుటకు ఈ మానవజన్మ ఉత్తమమైన అవకాశం. ఈ అవకాశమును వృథాపరచుకోకండి.

అట్టి పూర్ణానుభవం పొందిన, పొందుచున్న మహనీయులు మన మధ్యలోనే కొందరు తప్పక ఉన్నారు. వారి కొరకై వెతకండి. "మీరంతా 'పూర్ణత్వము' యొక్క అనుభవము వెతుక్కుంటూ ఈ ఈ యోనులందు ప్రవేశిస్తున్నారు"... అని గుర్తుచేస్తున్నాను. అట్టి అనుభవం పదార్థములను, విషయములను పొందినంత మాత్రం చేత ప్రాప్తించగలదా? లేదు. అందుచేత పుల్లలను ప్రోగు చేయు పిట్టలవలె ధన-జన-యౌవనాలను మాత్రం చూస్తూ, ఉత్తమలక్ష్యమును ఏమఱువకండి. నిదురలేచి మీ ఆత్మయొక్క ఔన్నత్యమును గ్రహించండి.

❖❖❖

# X. స్థితి ప్రకరణము - విషయ సమీక్ష

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! మనం ఈ ప్రకరణంలో చర్చించుకొన్నట్టి అన్ని విషయముల సారమును క్రోడీకరించి సంక్షిప్తంగా ఇప్పుడు కొన్ని విశేషాలు చెపుతాను. అటు తరువాత మనం ఈ పదవ రోజు చర్చను ముగించబోతున్నాం.

❖

మహాగుణులగు కొందరు ఈ భూమిపై జన్మిస్తున్నారు. వారు తత్త్వవిచారణాసమర్థమగు రాజసిక సాత్త్విక వృత్తులతో ఆనందమయంగా సంచరిస్తూ ఈ భూమిని పావనం చేస్తున్నారు. ఆకాశంలో పూర్ణచంద్రునిలాగా నలువైపులా ఆహ్లాదమును ప్రసరింపజేస్తున్నారు. గాలి వేగానికి దుమారం లేచినంత మాత్రంచేత ఆకాశము కలుషితం అవుతుందా? వారి మనస్సులు కూడా దుఃఖములందు పడుటలేదు. బంగారముతో తయారుచేయబడిన పద్మము చీకటిపడినప్పటికీ వాడదు కదా! వారు గొప్ప ఆపదలలో కూడా మ్లానమనస్కులు అగుటలేదు. యాదృచ్ఛికంగా లభించిన నీటితో అడవిలోని వృక్షములు సంతోషించుచున్నట్లు, ఆ మహనీయులు లభించనిదేదీ కోరుకోరు. వృక్షములు ఇతరులకు నీడను, ఫలములను ఇవ్వటమే స్వభావంగా కలిగి ఉంటాయి గాని, "వీరు నాకు నీరు కూడా పోయలేదే? మరి నీడను ఎందుకివ్వాలి?" అని అనుకుంటున్నాయా? లేదే! వారు కూడా ఈ సంసార జనులకు ఆహ్లాదమును, ఆనందమును, జ్ఞానదృష్టిని ప్రసాదిస్తూంటారు. అది వారి స్వభావమే కాని, మరేదో ఉద్దేశించి వారు అట్లు చేయుటలేదు. నిర్మలమైనట్టి వారి బుద్ధి 'మోక్షము' అను ఒకే ఒక్క ఉపయోగము కొరకై 'శాంతి' మొదలైన అమృత గుణము లందు నిమగ్నమై పుష్టిని పొందుతూ ఉంటుంది.

చంద్రుడు ఎప్పుడైనా తన శీతలత్వమును వదలి ఉంటున్నాడా? లేదు. ఆ మహనీయుల సౌమ్యమైన బుద్ధి అపత్కాలంలో కూడా అంతరంగంలో సమగ్రమైన సమాధానం కలిగే ఉంటుంది. అంతే గాని, "దైన్యం-క్రోధం-ద్వేషం-అసూయ" మొదలైన దుర్వ్యసనాలకు లోను కాదు.

వారి ప్రకృతి 'మైత్రి' మొదలైన కళ్యాణగుణములతో గూడి ఒప్పుతూ ఉంటుంది. ఆత్మను ఎఱిగినట్టి సాధుపురుషులు సౌమ్యభావులై, సమరసులై సుందరగుణములతో సర్వదా ఒప్పుతూ ఉంటారు. అట్టి ఆపదలకు అతీతమగు ఆత్మస్థితిని పొందుటయే కర్తవ్యముగా భావించబడు గాక!

ఓ ప్రియజనులారా! దుఃఖములను వీడండి. ఈ జీవితముల పట్ల, జన్మల పట్ల, దృశ్యాల పట్ల... "ఇవి ఏమి అయియున్నాయి? నేనెవరు? నాకు వీటికి ఉన్న సంబంధమెట్టిది? ఏది భావన? ఏది భావించునది?"... మొదలైన విషయములలో ఉత్తమ విచారణ పెంపొందించుకోండి. 'ఆత్మతత్త్వము' యొక్క ఔన్నత్యం గ్రహించిన ఉత్తములు, దాన్ని సముపార్జించటానికే జ్ఞాన

విజ్ఞానాలను అభ్యసిస్తున్నారు. తమ యొక్క "సత్వగుణాధిక్యత"చే రజోగుణమును క్షయింప జేసుకొంటూ, ఆత్మసాన్నిధ్యమును పొందుచున్నారు. ఆత్మానందము, ఆత్మసామీప్యము ఎట్టిదో గ్రహించి ఉంటున్నారు. సచ్ఛాస్త్రముల, పెద్దల ప్రవచనముల, స్వవిచారణల సమృద్ధిచే వారు "ఈ ప్రపంచంలో పొందబడుచున్నవి, గాంచబడుచున్నవి...ఇవన్నీ అనిత్యము" అని గ్రహించి 'నేను చిత్తశుద్ధిని పొందేది ఎట్లా?' అను ఏకైక లక్ష్యముతో కర్మిష్టులగుచున్నారు. ఈ ఐహిక, ఆముష్మిక క్రియలన్నిటినీ ఆపదలుగా భావించి అల్లంతదూరంలోనే ఉంచుచున్నారు. అంతే గాని, వారు అజ్ఞాన ప్రవాహమున పడుట లేదు. వాటి పట్ల ఇచ్ఛ-ద్వేషములు గాని, గ్రాహ్య-త్యాజ్య బుద్ధి గాని వారికి ఉండుట లేదు.

**విచారణ చేస్తూ ఉండాలి -** నాయనలారా! మీరు అసమ్యక్ దర్శనం (perception of inequality) ను తగ్గించుకుంటూ రావాలి సుమా! "నెనెవడను? ఈ సంసారాడంబరమంతా ఎట్లా ఉత్పన్నమగుచున్నది?"... అను జ్ఞానబోధకమగు విచారణ చేస్తూ ఉండాలి. తెలివిగల వాడెవడైనా అత్యంత యత్నంతో సాధువులను సమీపిస్తూ, వారితో చేయు సంభాషణ సహాయంతో వివేకమును పెంచుకుని, అప్పుడు ఈ జన్మ కర్మాది సాంసారిక విషయాల పట్ల సదవగాహనను ఆశ్రయిస్తాడు. పైన చెప్పినట్లు విచారణ చేస్తూనే ఉంటాడు. అంతేగాని, తన జీవితమును వృథా చేసుకోడు.

మీరు కర్మసూత్రములచే బంధింపబడి చతికిలపడి ఉండకండి. అనర్థములైన వ్యవహారము లనే రోజురోజుకూ పునశ్చరణ చేస్తూ రోజులు వెళ్ళబుచ్చకండి. ఈసంసారంలో ఇక్కడ అక్కడ కొన్ని ప్రియమైన వస్తువులు కనబడుచున్నమాట నిజమే. అయితే అవన్నీ ఒకనాటికి నశించబోవు చున్నాయి కదా? వాటిచే ఎందుకు మోసగించబడాలి?

ఈ భూమిపైకి ఎంత మంది రాలేదు? ఎంతమంది పోలేదు? ఇక్కడ వినూత్నమైన వస్తువు అంటూ ఏమి ఉన్నది? కనుక సర్వ పటోటాపాలు వదలివేయండి. చాతక పక్షి మేఘ జలాల కొరకే 'అన్వేషణ-నిరీక్షణ'లను పాటిస్తుంది గాని, మురికిగుంటలలోని నీరు కొరకు కాదు. మీరు కూడా ఉత్తమ జ్ఞానమును, అట్టి సంజ్ఞలను ప్రసాదించు సాధువులను ఆశ్రయించండి.

ఈ అంతర్గతమైన అహంకారం గురించి... బహిర్గతములైన 'శరీరములు' మొదలైనవాటి గురించి... ఈ బంధుమిత్ర సమాగమముల గురించి... కొంచెం సత్యదృష్టితో యోచన చేయండి. "వీటిని పెంపొందించుటకు ప్రయత్నించుటచే, ఇవి మమ్ములను సంసార సాగరం నుండి తరింప జేయగలవా?" అని ప్రశ్నించుకోండి. మరల మరల మీకు మీరే యోచించుకోండి.

గడచినదాని గురించి వగచటం అనవసరం. ఇక తాత్సారం చేయవద్దు. ఇప్పుడిక సంసార తారకమగు ఆత్మవిచారణ చేపట్టండి. విచారణచే సత్యము మీ మీ హృదయము లందే సుప్రకటితం కాగలదు. స్వశరీరములోని సాక్షిని దర్శించండి.

అస్థిరములైన ఈ శరీర-అహంకారముల పరిమితదృష్టిని పరిత్యజించండి. ముత్యాల హారంలో అంతర్లీనంగా ఉన్న తీగవలె ఉన్నట్టి సాక్షిస్వరూపమగు ఆత్మను వీక్షించండి. సర్వవ్యాప్తం,

నిత్యము, సర్వమును భావించునది అయినట్టి ఆ పరమవస్తువునందే ఇదంతా ప్రకటితమగు చున్నట్లుగా గ్రహించండి. ఈ సువిశాలమైన భూప్రదేశమునందు, ఆ ఆకాశంలోనూ, సూర్యుని యందూ, భూరంధ్రములలోనూ, నివసించే ఒక చిన్నపురుగులోనూ, ఆ పురుగులోని ఒక అణువులోను... అన్నిటా చిత్స్వరూపమే వెలయుచున్నది.

ఒక ఉపమానం. ఒకచోట అనేక కుండలు ఉన్నాయనుకో... ఆ అన్ని కుండలలోని ఆకాశము ఒక్కటే కదా! వివిధ శరీరములలోని 'చిత్తు'కు భేదమేమీలేదు.

'కారం–తీపి–చేదు" మొదలైన రుచులు వేరువేరైనప్పటికీ, ఆ రుచిని గ్రహిస్తున్న తత్త్వము ఒక్కటే అయున్నది కదా! అంతేకాని కారము రుచికి ఒక తత్త్వము, తీపిరుచికి మరొకతత్త్వము ఏర్పడి ఉండుటలేదే! అనేక చోట్ల ప్రకాశించుచున్నప్పటికీ చిద్వస్తువు ఒక్కటే. అనేక గ్రామాలలో ప్రసరించు సూర్యరశ్మి ఒకే సూర్యతత్వం. అంతేగాని "ఆయా కిరణములు వేరు వేరు వస్తువులపై ప్రసరించుచున్నాయి కాబట్టి అవన్నీ వేరు వేరు"... అనటం ఉచితం కాదు కదా!

ఉన్నది సర్వదా ఒక్కటే! ఒకే వస్తువు సర్వదా వెలయుచుండగా "ఈతడు పుట్టినాడు... చచ్చినాడు..." అనునదంతా అసంగతమే అవుతుంది. ఉత్పన్నమైయ్యేది, నశించేది సత్యవస్తువు ఎట్లా అవుతుంది?

ఓ రాఘవా! దేనినైతే "ఇది జగత్తు" అని నీవు గాంచుచున్నావో అదంతా కూడా 'చిత్' యొక్క ప్రతిబింబము మాత్రమే. ఈ జగత్తు సత్తు కాదు. అసత్తు కూడా కాదు. ఇది ఆ రెండింటికీ విలక్షణమైనది.

ఇతడి చిత్తం అశుద్ధమై(దోషపూరితమై), విషయాల పట్ల ప్రేలాపన కలిగి ఉన్నదైనప్పుడు – అట్టి సమయంలో ఈ జగత్తు సత్తుగానే అతనికి తోచుచున్నది.

ఏ మహాత్ముడు మోహనివృత్తుడై ఉంటున్నాడో అతనికి ఇది 'అసత్తే' అని తెలియవస్తోంది. అందుచేతనే 'ఈ దృశ్యం అనిర్వచనీయం. అధ్యాసరూపమునైతే మోహకారణమే అగుచున్నది"... అని చెప్పబడుతోంది.

ఈ జగత్తే మిథ్య అయి ఉన్నది. ఇక మోహమేమిటి? ఆ మోహమునకు ఒక కారణం ఉండుట ఏమిటి? మిథ్య అయినదానికి కార్య–కారణములు కూడా మిథ్యయే కదా!

కాబట్టి రామా! నీవు 'జన్మ–స్థితి–మరణము'ల గురించి దుఃఖించవలసిన అవసరమే లేదు. ఆకాశం వలె సర్వత్రా సముడవై నిర్మలభావమునందు వెలసియుండుము. సత్యమై, నిత్యమై, ఆనందమయమైన నీ స్వస్వరూపమునే అవధరించి ఉండుము. "నేను జీవుడను... స్వల్పుడను... పుట్టుచున్నాను... చచ్చుచున్నాను..." మొదలైన బలహీనమైన భావములను త్యజించివేయి.

"నేను అఖండము, నిర్వికారము అగు ఆత్మ వస్తువునే అయి ఉన్నాను..." అని భావించు చుండగానే ఇప్పుడే ఇక్కడే మోక్షస్వరూపుడవు కాగలవు. అంతేగాని, మోక్షం ఎప్పుడో ఎక్కడో పొందవలసినది అయి ఉండలేదు.

**ఉత్తమ గుణ సముపార్జన -**

**శ్రీ వసిష్ఠ మహర్షి:** భవిష్యత్తును నిర్ణయించేది వర్తమాన ప్రయత్నములే!

నాయనా! రామా! నీవు లభించిన అవకాశములను వృథాపరచుకోకుండా ఉత్తమ గుణములను సముపార్జిస్తూ ఉండాలి. ఎప్పటికప్పుడు నీచ ప్రవృత్తులను త్యజించుట యందు, ఉత్తమ కర్మలను ఆశ్రయించుటయందు జాగరూకుడవై ఉంటూ ఉండాలి.

బాహ్యాభ్యంతరము లందు "సహించుట" అను శక్తిని కలిగి ఉండాలి. ధీరుడవు, విచారణ పరుడవు అయి ఉండు. సూక్ష్మమైన బుద్ధిని సంపాదించుకో. సర్వవిఘ్నములకన్నా, సర్వ ప్రతిబంధకముల కన్నా కూడా బలవంతుడవగుచూ ఉండాలి.

సద్గురువులను ఆశ్రయించి, వారితో శాస్త్రవిచారణ చేయి. విషయములకు సంబంధించిన తృష్ణను నీ మనస్సు నుండి ఎప్పటికప్పుడు తొలగించివేస్తూ ఉండు. ఆత్మవేత్తలు కనబడినప్పుడు వారిని ఆశ్రయించు, శరణువేడు. వారు విజ్ఞానదాయకమగు ఉత్తమ విషయాలు బోధిస్తారు.

మనోనాశనము సాధించు. అప్పుడు సమాధి స్వయముగా లభించగలదు. శాస్త్రములచే చెప్పబడుచున్న అర్థములను వివేకముతో అభ్యసించుచు, ఎవడైతే 'సుసంగి' అగుచున్నాడో... అట్టి శుద్ధపురుషుడు ఆత్మస్వరూపమును ఎఱుగుటకు అర్హుడగుచున్నాడు.

❖

ఓ రాఘవా! నీవు ధీరుడవు. పవిత్ర ఆచరణము గలవాడవు. ఉత్తమ గుణములు నిన్ను ఆశ్రయించుకుని ఉన్నాయి. "సృష్టి" అనబడే మనోమలం నీ నుండి దూరంగా తొలగుతోంది. అట్టి నిర్మల స్వరూపుడవగు నీవు దుఃఖ రహితమగు ఆత్మ యందు వెలయుచుండుటకు అడ్డేమి ఉంటుంది?

శరత్కాలంలోని మేఘరహిత ఆకాశంలాగా 'జగత్తును' తనయందు రహితం చేసుకొను ఆత్మజ్ఞుడు స్వచ్ఛత-నిర్మలత-ప్రశాంతత్వము-అఖండత్వము స్వయంగా పొందుచున్నాడు. అట్టి వానికి ఇక సంసార భయమెక్కడ? ఓ ఉత్తమ జ్ఞానీ! (వైరాగ్య ప్రకరణంలో) నీవు ప్రకటించిన విశ్లేషణా చాతుర్యం మమ్ము ముగ్ధులను చేసింది. మనం ఈ పదిరోజులుగా చేస్తున్న సంభాషణ ప్రభావంచేత నీ మనస్సు బాహ్యవస్తుచింతన క్రమక్రమంగా త్యజిస్తున్నట్లు నేను గమనిస్తున్నాను. మహాశక్తివంతమగుచున్న నీ బుద్ధి పరమాత్మతో ఏకీభావం పొందుతోంది. అందుచేత మా ఉద్దేశములో నీవు ముక్తుడవే అయి ఉన్నావు. ఈ విషయంలో సందేహమే లేదు.

ఓ సభికులారా! రాగద్వేషములంటూ ఏ మాత్రం లేని వాడైన ఈ రాముడు తదితరులకు ఆదర్శప్రాయుడే అగుచున్నాడు.

**బహిః లోకోచితాచారా విహరిష్యన్తి యే జనాః ।**
**భవార్ణవం తరిష్యన్తి ధీమన్తః పోతకాన్వితాః ॥**

'జ్ఞానము' అనే నౌకను పొందినట్టి బుద్ధిమంతులు బాహ్యలోకము కొరకు ఉచితంగా

వ్యవహరిస్తూ ఉంటూనే ఈ సంసార సాగరమును ఇట్టే దాటివేస్తున్నారు. నేను ప్రతిపాదిస్తున్న అనేక సత్యవాక్యాలు అవిచారణపరులకు ఉదాసీనంగానే కనిపిస్తున్నాయేమో గాని, బుద్ధిమంతులు, సుజనులు, సమదర్శులు, ఉత్తమదృష్టి సంపన్నులు తమ జ్ఞానదృష్టిని మరింత బలోపేతం, పరిపుష్టం చేసుకుంటున్నారు.

ఓ రామా! నీవు సర్వదా జ్ఞానివే అయి ఉండాలి. ఈ శరీరం ఉన్నంతవరకూ విషయముల పట్ల ఏమాత్రం ఆసక్తిలేనివాడవై, ద్వేషములను, వాసనలను వీడి, లౌకికమైన ఆచారములను ఆచరిస్తూ వ్యవహరిస్తూ ఉండు.

ఉత్తమజ్ఞానులు, సాత్వికగుణసంపన్నులు అగు జీవులు ఈ ప్రపంచములోకి వచ్చి "పరిశుద్ధత్వం–పరమశాంతిత్వం" సముపార్జిస్తున్నారు. లోకకళ్యాణ కారకులగుచున్నారు. ఉత్తమ కర్మల యందు ఆచరణపరులై పరమశాంతిని పొందుచున్నారు.

ఇక, మరికొందరు జీవుల విషయం చూస్తే... వారు ఎద్దులాగా, నక్కలాగా పరవంచకులై ఉంటున్నారు. శిశువుల వలె మూఢులే అయ్యి, వారు మానవజన్మ అను ఉత్తమ అవకాశాన్ని వృథా చేసుకుంటున్నారు. అట్టి వారిని చూస్తున్నప్పుడు లోకకళ్యాణమే ప్రవృత్తిగా కలిగిన మా వంటి మునులకు జాలియే వేస్తోంది. అట్టివారిని గురించి విచారిస్తే మాత్రం ఏం ప్రయోజనం?

**కర్మసిద్ధాంతము -** "నీవు మనస్సును ఎప్పటికప్పుడు పరిశుద్ధం చేసుకొనుట"... అను మహత్తరమైన ఆశయం కలిగి ఉండు. అట్టి మనోనిర్మలత కొరకు సర్వాత్మకుడగు ఆ పరమేశ్వరుని 'స్వధర్మము' అను పుష్పములతో పూజించుము. అట్టి అవగాహన కలిగియున్నప్పుడు నీవు లోక కళ్యాణ కారకుడవే అవుతావు. ఈ ప్రపంచమును కొంచెము పరిశీలినగా చూస్తూ ఉంటే నీకు ఇందులో సాత్త్వికులైన ఉత్తమ పురుషులు* తప్పకుండా తారసపడతారు. వారియందలి ఉత్తమ గుణములను గమనించు. ఆ గుణములను నీవు కూడా అలవరచుకో. అట్లు, ఉత్తమ ఆదర్శాలను స్వీకరించేవాడు, శాంతి, శమము మొదలైన ఉత్తమ లక్ష్యములను కలిగి ఉండేవాడు, శాస్త్రము, స్వధర్మములకు అనుచితంగా నిష్కామబుద్ధితో కర్మలను నిర్వర్తించేవాడు... అట్టి వాడు క్రమంగా 'జ్ఞానోపయోగము' అయినట్టి శుద్ధశరీరమును పొందుచున్నాడు.

ఈ జన్మయందు నీవు అనుసరించు గుణములే ముందు ముందు ఆయా ఉత్తరోతర కర్మ జ్ఞాన స్థితులందు నిన్ను నియమిస్తున్నాయి... అనునదే కర్మ యొక్క సిద్ధాంతము. కాబట్టి, కర్మ బద్ధుడగు జీవుడు ఇతఃపూర్వపు కర్మలచే నియమించబడినవాడై ప్రవర్తించుచున్న మాట నిజమే. కాని వర్తమాన పురుషకారముచే పూర్వజన్మ సంస్కారములు తప్పక జయించివేయబడగలవు.

(ఇతఃపూర్వపు కర్మ సంస్కారాలు + వర్తమాన ప్రయత్నాలు) = (ఈ జీవుని వర్తమాన భవిష్యత్తులు)

---

* పురుషుడు అంటే పురుషకారము ప్రదర్శించువారు, ప్రయత్నశీలురు. అంతేగాని, 'మగవారు' అని అర్థం చేసుకోరాదు.

"అయ్యో! నేను ఈ ఈ తప్పులు చేసియున్నాను కదా? నా గతి ఏమగును? ఇంతే, ఇక నేను బాగుపడను... ఎవ్వరో మహానుభావులే సరికాగలరు.... నేను సరి అయ్యే ప్రసక్తి ఎప్పటి విషయమో గాని, ఇప్పటి విషయం కాదు..." ఈ విధంగా స్వల్పమగు భావములకు తావిచ్చి వర్తమాన కర్తృగతిని బలహీనపరచుకోవద్దు.

ఇప్పుడు చేయవలసినట్టి శారీరక మానసిక ప్రయత్నములు నీ చేతిలోనే నీ నిర్ణయమును అనుసరించే ఉంటున్నాయి. మరిక తాత్సారం దేనికి చెప్పు?

కొందరు తమ భూత భవిష్యత్తులపై... అపరిపూర్ణమైన, బలహీనతలతో కూడిన... అభిప్రాయాలను కల్పించుకొని సాలెపురుగు వలె అందులోనే చిక్కుకొని ఉంటున్నారు. తమ నరకములను తామే నిర్మించుకొని పరితపించుచున్నారు. అయిన దాని గురించి వగచటం ఆపు. భూతకాలం అట్లుండనీ. "ఇప్పుడు నేను ఏది చేయాలి?.... ఏది చేయకూడదు"... అను విషయమునకు రమ్ము. ఉత్తములగు సాధుపురుషులను, శాస్త్రములను ఆశ్రయించు. వర్తమాన కార్యక్రమమును పూర్ణమైన సదవగాహనతో నిర్ణయించుకో. ఆలోచన-శ్రద్ధ-అవగాహనలను ఉత్తేజపరుచుకో. ప్రశాంతముగా, గంభీరంగా, సాలోచనగా 'ఆత్మప్రాప్తి' కొరకు ప్రయత్నములను చేయుచుండుము.

❖

శత్రురాజులు తమ బలపరాక్రమములతో బాధించుచున్నప్పుడు, అప్పుడు వారు పౌరుష బలముచేతనే జయించబడుచున్నారు కదా! ఈ బుద్ధి అనే రాజ్యం 'తామస-రాజస' గుణములు... అనే శత్రురాజులచే వేధింపబడుచున్నది. అట్టి ఈ 'బుద్ధి సామ్రాజ్యము' ను రక్షించుకోవాలి. లేదా, రాక్షస-పిశాచాది యోనులలో ఈ బుద్ధి ప్రవేశించే ప్రమాదం ముంచుకురాగలదు. బురదలో ఇరుకుకున్న దున్నపోతును బయటకు తెచ్చునట్లు ఈ బుద్ధిని ఉద్ధరించే ప్రయత్నాలు సర్వదా చేస్తూ ఉండాలి.

**చిత్తము, పురుషకారము -** సాధుపుంగవులు తమ 'వివేకము' యొక్క ఫలితంగానే సాత్వికగుణ సంపన్నులగుచున్నారు. స్వచ్ఛమైన మణిని ఏ ద్రావణంలో ముంచితే ఆ రంగునే కలగి ఉంటుంది కదా! ఈ 'చిత్తము' అనే మణి కూడా అంతే. దీనిని ఎందులో నియమిస్తామో అది అద్దానియందే తన్మయమై ఉంటూ ఉంటుంది.

చిత్తమునుండే 'పురుషకారము' కూడా ఉత్పన్నమగుచున్నది. ముముక్షువులంతా తమ యొక్క పౌరుషబలముచేతనే అమూల్యమైన గుణములను ఆర్జిస్తున్నారు. అంతేగాని ఎవ్వరి గుణములను మరెవరూ ప్రసాదించుట ఇక్కడ ఉండదు. అట్టి పౌరుషబలము చేతనే వారు శుభజన్మలను పొందుచున్నారు. 'గుణి' అయినవాడు తన పురుషకారముచే పొందలేనిది... ఈ స్వర్గ, మర్త్య పాతాళములలో ఎక్కడా ఏదీ లేదు. బ్రహ్మచర్యము, వీర్యము, వైరాగ్యము, ఇవి

ఉన్నప్పుడే ఒకడు ఉత్తమ వస్తువును సాధిస్తాడు. ఈ ఆధ్యాత్మక్షేత్రంలో కూడా అది అట్లే అగుచున్నది. "అఖండ, అద్వితీయ, స్వస్వరూపాత్మ సంస్థానము"... విషయం కూడా అట్టిదే.

**గుణి (గుణములు కలిగియున్నవాడు) -** ఓ రఘురామా! ఇప్పుడు నీకు ఉపదేశించిన, ఉపదేశించబోవుచున్న ఆత్మతత్త్వము అత్యంత దుఃఖనివృత్తికరము సుమా! ఇది జీవునికి నిరతిశయ మైన శాంతిని ప్రసాదించగలదు. సకల జనులకు హితం చేకూరుస్తుంది. అందుకని ఇది శ్రద్ధగా వినాలి. అశ్రద్ధ బద్ధకములచే తిరస్కరించకూడదు. సకల జనులలో విశుద్ధములగు సత్వ గుణములు వృద్ధికావాలనునదే మా ఆశయం.

"బుద్ధి బలముచే ఆత్మభావనయందు ఈ జీవుడు సుస్థిరుడు అగుట" అనునదే ఈ ప్రయత్నము ఉద్దేశించుచున్న అంతిమ ప్రయోజనం. ఆత్మభావన సుస్థిరమగుచుండగా ఇక మనస్సు తన చంచలత్వమును వదలి శాంతిని పొందగలదు. అట్టి ఆత్మావలోకనము ఎవ్వరికైనా ఎప్పుడైనా ఎక్కడైనా సాధ్యమే.

కాబట్టి ఓ సభికులారా! మీరంతా ప్రయత్నశీలురై ఉండవలసినదిగా మీ శ్రేయోభిలాషుల మగు మేము మరల మరల హెచ్చరించుచున్నాము. మీలో ప్రతి ఒక్కరికీ 'ముక్తస్వరూపులు' కాగల అవకాశము, అధికారము తప్పక ఉన్నది.

ఓ రామచంద్రా! నీవు మహామహిమాన్వితుడవు. శాంత్యాది మహత్తర గుణాలు నీ యందు ప్రస్ఫుటమౌతున్నాయి. పరమసాత్వికుడవుగా నిన్ను మేము గుర్తిస్తున్నాము. తదుచితంగానే ప్రవాహపతితములగు కార్యములను నిర్వర్తించెదవు గాక. నిన్ను నిమిత్తం చేసుకొని ప్రతి మానవునకు నేను ఈ విషయం గుర్తు చేస్తున్నాను.

నాయనలారా! 'సంసారాసక్తి' అనే మోహమునకు మీ హృదయంలో చోటివ్వకండి. స్వతహా గానే మోక్షస్వరూపులగు మీరు మీ మీ ముక్తస్వరూపమును ఏమఱువకండి. స్వస్వరూపము గురించి ఎఱుకయే జన్మ ఎత్తినందుకు ఉత్తమ ప్రయోజనమైయున్నది.

❖

సభలోని వాతావరణం అలౌకిక ప్రశాంత గంభీరతలతో నిండిపోయింది. సభికులంతా వసిష్ఠమహర్షి చెప్పు ఒక్కొక్క వాక్యములోని ఔన్నత్యమును గమనించుచు "ఆహాఁ! ఈ ఋషులు మాపై ఎంతటి అవ్యాజమైన ప్రేమ కలిగియున్నారు!" అను భావన పొందారు. రామచంద్రునితో సహా అనేకమంది వదనములలో వికాసము ప్రస్ఫుటమైనది. ఆ సభలోని రాజులు, పండితులు, తదితరులు దీర్ఘాలోచనామగ్నులై కనబడ్డారు.

సభలోని అనేకుల 'మనస్సు' అనే చపల వానరం భోగపదార్థములకు సంబంధించిన మననమును త్యజించి, మౌనభావంతో ఆత్మవస్తువు వైపు సాలోచన కొనసాగించసాగింది.

దశరథుడు మొదలైన రాజులు ప్రశాంతచిత్తులై ఉన్నారు.

ఆధ్యాత్మిక శిక్షణాబలంచే లక్ష్మణుడు మొదలైన వారి హృదయాలు 'బ్రహ్మస్వరూపం' అనే లక్ష్యమును సుస్థిరీకరించుకున్నాయి.

మునుల హృదయాలు వికసించి, 'ముఖములు' అనే పద్మములు 'ప్రశాంతత' అను సువాసన వెదజల్లాయి.

సూర్యభగవానుడు అస్తమాద్రిని సమీపిస్తున్నాడు. సభ ముగిసింది. సభికులు క్రమంగా తమ సాయం సంధ్యాది కార్యక్రమాల కొరకు గృహోన్ముఖులయ్యారు.

❖❖❖

**(పదవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# స్థితి ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు – లోక కళ్యాణమస్తు

ఓం తత్సత్

# ఉపశమన ప్రకరణము

# I. ప్రకరణ పరిచయం

## 1. పదవ రోజు రాత్రి.......... పునశ్చరణ

పదవ రోజు రాత్రి వాతావరణం ప్రశాంతంగా ఆహ్లాదకరంగా ఉన్నది. అయోధ్యానగరమంతా సౌమ్యము, సుందరము, రమణీయము అగు ప్రకృతిచే అలంకారయుక్తమై ఉన్నది. ఒక్క రామచంద్రుడు తప్ప తక్కినవారంతా ఆ రాత్రి క్షణంలాగా నిదురలో గడిపివేశారు. రాముడు మాత్రం ఆ రాత్రంతా వసిష్ఠమునీంద్రులచే ఉపదేశించబడిన వాక్యములను చింతన చేయసాగాడు.

**శ్రీరాముడు (తనలో) :** ఆహా! ఏమి ఈ సంసార సంభ్రమణం! ఈ మనుజులంతా ఎవ్వరు? ఈ విచిత్ర ప్రాణిసమూహమంతా వస్తున్నది ఎక్కడినుండి? వీరంతా ఎటు పోతున్నారు? అసలీ మనస్సు యొక్క స్వరూపమేమిటి? ఇది శమించేది ఎట్లా? ఈ చమత్కారమైన మాయావ్యవహారమంతా ఎవరు, ఎవరి కొరకు, ఎక్కడ, ఎందుకు, కల్పిస్తున్నారు? ఈ మాయకు ఇంతటి నైపుణ్యము ఎక్కడి నుండి వస్తోంది? ఇది అసలు నివారించబడగలదా? జీవునికి ఈ గుణదోషములన్నీ ఎక్కడి నుండి వచ్చిపడుతున్నాయి?

....ఆకాశం కంటే కూడా అతిసూక్ష్మము, అతి విశాలము... అయినట్టి ఆత్మ ఈ విధంగా, జీవుడుగా ఎందుకు పరిణమిస్తోంది...?

ఈ సంకుచితత్వము ఎంతగా ఘనీభవించి ఉన్నది! ఈ పది రోజులుగా వసిష్ఠ మునీంద్రులు ఆత్మ గురించి, మనోనాశనం గురించి, ఇంద్రియజయం గురించి అనేక విశేషాలు వివిధ కోణముల నుండి చెప్పియున్నారు. అయినాకూడా వెలుగునీడలవలె జ్ఞాన, అజ్ఞానములు ఏర్పడుచూనే ఉన్నాయే? నా వివేకము ఇంకనూ పూర్ణముగా వికసించదేమి?

అవును. ఆత్మయే స్వయముగా ఈ "జీవుడు – చిత్తము – మనస్సు" మొదలైన రూపములలో ఈ అసన్మయమైనట్టి సంసారమును విస్తరింపజేస్తోంది. ఈ అహంకారము మొదలైనవన్నీ 'మనస్సు' అనే త్రాడుచే చుట్టబడి ఉంటున్నాయి. అట్టి మనస్సు సంక్షయించిందా.... అప్పుడు 'నేను జీవుడను' అను స్వల్పాభిప్రాయం కూడా తొలగిపోతుంది. దుఃఖోపశమనం సిద్ధిస్తుంది. మరి అహంకారమును, మనస్సును, "నాది– మాది– నేను– మేము" అను మోహమును రూపుమాపాలంటే ఉపాయాలేమిటి? హంస నీటిని విడచి, పాలను పీల్చునట్లు, విషయ భోగములతో కూడిన అల్పధ్యాసల నుండి ఆత్మను వేరుచేయటం ఎట్లా?

భోగములన్నీ త్యంజించివేద్దామా? .... "నాకీ రాజ్యము వద్దు, పదార్థములతోటి తదితర సర్వజనులతోటి అసలు ఎట్టి సంబంధమూ వద్దు" అను నిర్ణయమునకు వద్దామా? మంచిదే.... కానీ, వాటిని నేను వదలినా, అవి నన్ను వదులుతాయా? వాటిని దూరంగా త్యజించితే ఈ శరీర ధారణం సాధ్యమేనా? కాదేమో? త్యజించకపోతే విపత్తులు వచ్చిపడుతూనే ఉంటాయే? అరెరే! .... భలే సంకటం వచ్చిందే!

ఆత్మ అనునది సర్వదా సిద్ధించియే ఉన్నది. స్వతహాగా అన్నివేళల సిద్ధించి ఉన్న దానిని పొందటమేమిటి? కోల్పోవటమేమిటి? ఇక ఆత్మకు ఏ అఖండత్వము, అప్రమేయత్వము, నిత్యత్వము మొదలైనవన్నీ వర్ణించబడ్డాయో అవి ఆత్మయే స్వరూపముగాగల నాకుకూడా వర్తిస్తాయి కదా! 'ఆత్మ తత్త్వప్రాప్తి' అనునది మనోమాత్ర విషయమే అవుతుంది.... అంతే గాని అది ఈ ఇంద్రియములకు విషయమే అయి ఉండలేదు.

పైగా, బాహ్యవిషయములు తెలుసుకోవటానికికూడా ఈ మనస్సే పరికరమగుచున్నది. ఈ ఇంద్రియములను వెలిగిస్తున్నది, ఉపయోగించుచున్నదికూడా మనస్సే. అట్టి మనస్సును కూడా నియమిస్తున్నది, అధిరోహిస్తున్నది ఎవరు? నిర్విషయుడనగు నేనే కదా!

ఆహా! బాలుడు తనయొక్క అజ్ఞాన కారణంగా చీకటిలో దయ్యమును చూస్తూ ఉంటాడే.... అట్లాగే మనస్సుకు కూడా గుదిబండలాగా ఈ దృశ్యముతో బంధము ఏర్పడుతోంది. మరి మనస్సును సన్మార్గంలో ఎట్లా నడిపించాలి? ఇక నాకు ఒక్కటే ఉపాయం కనబడుతోంది. తన ప్రియుడు లభించిన తరువాత స్త్రీ మరిక అన్యుని స్మరిస్తుందా? లేదు కదా...! నా ఈ బుద్ధి కూడా సంసార భ్రమలను ఆశ్రయించ కుండా పరమశాంతి పూర్వకమగు ఆత్మత్వమునే అవధరించు గాక! ఆపై ఇక అన్యపదార్థముల గురించి చింత ఏముంటుంది? నా మనస్సు క్రోధరహితమై, కామవర్జితమై, పవిత్రవంతమై పాపరహితమై ఉండు గాక! అప్పుడది స్వయముగానే ఆత్మ పదమునందు విశ్రాంతి పొందగలుగుతుంది. ఆహా! సద్గురువులగు వసిష్ఠులవారు బోధించియున్న ఏడవ భూమికయందు ఎప్పటికి సంస్థితుడనై సుస్థిరుడనై ఉంటానో! ఎప్పటికి 'జీవన్ముక్తి' సుఖమునందు దృఢపూర్వకంగా విశ్రాంతి పొంది, ఈ జగత్తునందు యథావిధిగా విహరిస్తూ ఉంటానో కదా!

ఈ నామనస్సు ఎప్పటికప్పుడు కొత్త కొత్త కల్పనలను రచించుకుని అందులోనే మునిగి తేలుతోంది కాని, వాటిని త్యజించదేం? అది ఎప్పటికి తన వికల్పత్వము త్యజించుటచే నీటిలో ప్రవేశించిన ఉప్పుచే తయారు చేయబడ్డ బొమ్మ లాగా ఆత్మయందు లయించిపోతుందో కదా! అది తన తుచ్ఛరూపమును త్యజిస్తేగాని ఉద్వేగము, దుఃఖము నశించవు.

ఈ 'సంసారము' అనే సముద్రము 'తృష్ణ' అనే తరంగాలతో వ్యాపించి ఉన్నది. ఆశ అనే మొసళ్ళు ఇందులో యథేచ్ఛగా సంచారం చేస్తున్నాయి. ఈ సంసారసముద్రం దాటేది ఎప్పుడు? దుఃఖము, దిగుళ్ళు మొదలైనవి లేకుండేవి ఎన్నటికి?

ఈ ప్రపంచములో ప్రవేశించిన కొందరు శమదమాది ఉత్తమగుణములను ఆశ్రయించి తత్ఫలితంగా పరిశుద్ధులగుచున్నారు. ఉత్తమమగు ఆత్మపదమును పొందుటకు అర్హులగుచున్నారు. నేను కూడా అట్టి అర్హత పొందాలి? శోకరహితుణ్ణి కావాలి? అది ఎట్లా, ఎన్నటికి ఒనగూడుతుందో?

ఓ చిత్తమిత్రమా...! ఓ సంసారజ్వరమా! ఏమిటి నీవు చేస్తున్నది? ఈ స్త్రీ, పుత్రశరీరాది సంభ్రమములన్నీ కలుగజేస్తున్నావా? ఫలితమేమిటి? మేము సత్యవస్తువగు ఆత్మను పొందకయే పోవుచున్నాము కదా? కట్టుకొయ్యకు త్రాడుచే దున్నపోతు కట్టివేయబడినట్లు మేము నీయొక్క దుష్ట, అల్ప, అధమ దృష్టులచే బంధింపబడుచున్నామే? ఓ ప్రియచిత్తమా! అయినా, నిన్నని ఏం లాభం? ఇదంతా మా స్వయం కల్పితం మాత్రమే. ఏది ఏమై ఉన్నప్పటికీ మాయందు అజ్ఞానం మాత్రం తొలగుటలేదు. అందుకే నీవు దుష్టవై దశదిశలవైపు విజృంభిస్తున్నావు. ఇక చాలు. నీవు దూరదృష్టి, నిర్మలదృష్టి ఆశ్రయించదలుచుకోకపోతే నిన్ను నేను ఉపేక్షించను. నీవు నా సేవకుడివేగాని, యజమానివి కాదు సుమా! అందుచేత ఇక ఉపశమించు.

మనం ఉచితమైన విషయములను ఉచితమైన రీతిగా స్వస్వరూపజ్ఞాన లక్ష్యముతో విచారించాలి. ఎంతకాలం మమ్ములను అల్పప్రలోభములతో బాధిస్తావు చెప్పు? అయినా నీ రూపమేమిటి? ఎక్కడ ఉంటావు? నీవు ఏ పదార్థంతో తయారుచేయబడ్డావు?

మా అజ్ఞానమే నీయొక్క స్వరూపం. అంతకు మించి నీకు రూపురేఖలే లేవు. అయితే సర్వులలో ఏకస్థమైయున్న ఆత్మతత్త్వమొక్కటే నీకు విషయము, లక్ష్యము, మననము, దిక్కు అగుగాక!

ఓ బుద్ధీ! మనం తెచ్చిపెట్టుకున్న ఈ 'చిత్తము' అను జాడ్యమును చూచావా? ఇది మనిద్దరినీ కూడా రాగద్వేషముల వైపుగా త్రోసి వేయుచున్నదే! ఈ చిత్తము ఎప్పుడైతే గాలివీచికలు లేని స్థలంలో దీపం లాగా ప్రశాంతమై, ప్రకాశవంతమై, బాధారహితమై ఉంటుందో, అప్పుడు నీకు, నాకు కూడా ఇంతటి నీచత్వము, మూర్ఖత్వము, జాడ్యత్వము ఉండవుకదా!

మిత్రమా! బుద్ధీ! జీవుడు అను రూపము పొందియున్న నేను నీకు ఒక విన్నపం చేస్తున్నాను. నా మాట కాదనకపోతే నేను, నీవు కూడా మోక్షస్వరూపులం కాగలం. మనం ఈ పది రోజులుగా వసిష్ఠ మునీంద్రుని వచనాలు విన్నాం. మరి కొద్ది రోజులు వినబోతున్నాం. ఆ వాక్యముల సారాన్ని, అందు ప్రకటితమగుచున్న నాయొక్క , నీయొక్క వాస్తవమగు స్వరూప స్వభావములను గ్రహిద్దాం. ఓ మతీ! నీకు సాష్టాంగ దండప్రణామం చేసి మరీ వేడుకొంటున్నాను...... నా మాట విను. ఈ సంసారమును త్యజించివేయుటలో నాకు సహకరించు, అప్పుడు నీవు భవ్యమగు పూర్ణపదప్రాప్తిని పొందగలవు.

ఓ ఇంద్రియములారా! విషయముల పట్ల గల అభిలాషచే మీరు పొందుచున్నదేమిటి? అతి త్వరగా శిథిలమే అగుచున్నారు. మీరు సహకరించాలే గాని, మనం ఆత్మపదమును ఎందుకు పొందలేము? అందుచేత మనం ఈ సంసారమును అనాదరిద్దాం. ఈ వస్తు సముదాయము నుండి ప్రాప్తించే ఇంద్రియసుఖము తుచ్ఛము, తృణప్రాయము, దుఃఖ పరిణామయుతము అయి

ఉంటోంది. "నేను ఆత్మత్వము పొందేదెట్లా?" అను మార్గములో పయనిస్తున్న నాకు ఉచితరీతిగా మీరు సహకారం అందించెదరుగాక! ఇప్పుడు నియమనిష్ఠాదులచే కొంచెం బాధింపబడుచున్నప్పటికీ, మీకు 'స్పర్థ' తొలగి నిరవధికమగు సుఖమునే పొందగలరు సుమా!

ఓ మనస్సా! ఎన్నో ఉపాధులలో ప్రవేశించటం, నిష్క్రమించటం ఇప్పటికే మనం ఎంతగా నిర్వర్తించామో ఎవరు చెప్పగలరు? ఇప్పటికి ఈ వసిష్ఠ మునీంద్రుల ఆప్తవాక్యములు వినే భాగ్యం పొందాము. ఎంతోకాలంగా "ఈ శరీర –ధన –బంధు వియోగములచే ఏర్పడుచున్న దుఃఖాలు తొలగేది ఎట్లా?" అని మనం యోచిస్తూ ఉండేవారము కదా! ఇప్పుడు నిర్మల జ్ఞాన దృష్టితో ఈ బోధ విందాం. తద్వారా నీవు సంకుచితత్వం వదలి సువిశాలత్వం పొందగలవు.

మనస్సుతో ఏది పొందుతామో అదే పొందబడినదగుచున్నది. అయితే, మనస్సుచే ఒక విషయం అనేకసార్లు ఆలోచింపబడినప్పటికీ, అద్దానిని నిశ్చయ స్వరూపమగు బుద్ధి కూడా గ్రహించాలి. బుద్ధి గ్రహించకపోతే ఆ ప్రయత్నం నిష్ఫలం అవగలదు సుమా! నా మనస్సు శాశ్వతాత్మనే అన్నిటా అంతటా మననం చేస్తూ ఉండునుగాక! నా ఈ చిత్తము ఆత్మజ్ఞాన విషయముల కొరకై ఉరకలు వేస్తూ ఉండునుగాక!

అందుచేత ఈ నా బుద్ధి అర్థమును గ్రహించుటలో సర్వదా సమాయత్తమై అతితీక్షణము, సునిశితము అయివుండు గాక!

శ్రీ వసిష్ఠ మహర్షి ఇప్పటి వరకు వైరాగ్యము, దైవము, ముముక్షుత్వము మొదలైన అనేక విషయాలు చెప్పారు. వైరాగ్య ప్రకరణం, ముముక్ష వ్యవహార ప్రకరణం, ఉత్పత్తి ప్రకరణం, స్థితి ప్రకరణం పూర్తి అయ్యాయి. అనేక దృష్టాంతాలతో ఈ జీవుని వాస్తవ స్వభావము, ఆరోపితమైన ప్రమేయత్వముల గురించి విశదపర్చారు. ఉత్పత్తి, స్థితి ప్రకరణాల అవగాహన అర్హుడగు జీవునికి వివేక దృష్టిని, పరమోత్తమమగు అవగాహనను ప్రసాదించగలవు.

శ్రవణం అవసరమే. శ్రవణమే లేకపోతే ఉత్తమ విచారణము యొక్క సమాచారం లభించదు. అయితే శ్రవణమొక్కటే సరిపోతుందా? ...లేదు.

ఆత్మతత్త్వము గురించిన మననం అత్యంతావశ్యకం. మననముచే నిశ్చయాత్మకమైన బుద్ధి, బుద్ధికి కూడా ఆవలనున్న స్వస్వరూపానుభవం – ఈ రెండు ఒనగూడగలవు. అందుచేత నా "మనో–బుద్ధి–చిత్త–అహంకారాలు" ఆత్మతోటి అద్వితీయమైన అనుభవంతో పరితప్తమగు గాక! పరిభూషిత మగుగాక!

❖❖❖

# పదకొండవ రోజు

## 2. ఎఱుగబడటమే ప్రాప్తించటం

ఆ విధమైన ఆలోచనలతో రామచంద్రుడు ఆ రాత్రంతా గడిపాడు. ఇంతలో భళ్ళున తెల్లవారింది. శ్రీరాముడు సోదర సమేతంగా వసిష్ఠాశ్రమములో ప్రవేశించాడు. మహర్షికి సోదరులు సాష్టాంగ నమస్కారములతో ప్రియవచనములతో సంతోషం కలిగించారు. ఆయనను రథమునందు కూర్చుండబెట్టి, సేవించుచూ సభకు కొనివచ్చారు. దశరథ మహారాజు సింహాసనం దిగి ఎదురేగి మహర్షికి సుస్వాగతం పలికాడు. ఇతర రాజులు, సామంతరాజులు, ఋషులు, మునులు, ప్రజలు మొదలైన వారంతా సభలో తమ తమ స్థానములు అలంకరించారు. ఆహాఁ! ఆ సభలోని వారందరూ పూర్వ పుణ్యవశాత్తు "వసిష్ఠుని ముఖమండలమునుండి వెలువడే ఆప్త వాక్యాలు వినుట" అను ఉత్కృష్టమగు అవకాశమును పొందివున్నారు. మొదటగా దశరథ మహారాజు ఇట్లు పలికాడు.

దశరథ మహారాజు: సభలోని వారందరికి సుస్వాగతం. మనందరికి అనేక జన్మల సుకృతఫలంగా ఋషులు ఈ సభకు వేంచేయడం, మహత్తరమగు ఆత్మ గురించి ప్రవచనముచే మమ్ములను, మా ప్రజలందరినీ, మనందరినీ పునీతులను చేయడం జరుగుతోంది. శ్రీ వసిష్ఠ మహర్షి – రామచంద్రుల మధ్య జరుగుతున్న సంవాదము పది రోజులుగా వింటున్నాం. ఈ రోజు పదకొండవ రోజు "ఉపశమనం" అను విషయం గురించి విచారణ ప్రారంభమగుచున్నది.

హే వసిష్ఠ మహర్షీ! మా పాదాభివందనం స్వీకరించండి. నిన్నటి రోజు సుదీర్ఘంగా సంభాషించుట చేత ఏర్పడిన శ్రమ నివారణమయినదని భావిస్తున్నాను. ఆనందదాయకమగు మీ 'వచనములు' అను అమృతవృష్టిచే మేమందరము పరితృప్తులమగుచున్నాము. మా అంతఃకరణములు శీతలమొనర్చ బడుచున్నాయి. అవివేక పూర్వకమైన, అజ్ఞానపూర్వకమైన, అవిచారణాపూర్వకమైన అనేక అల్ప దృష్టులు మీ ప్రవచన స్రవంతి ప్రసాదిస్తున్న 'ఆత్మదృష్టి'చే మ్రింగివేయబడుచున్నాయి.

మేము అపూర్వమగు ఆనందం పొందుచున్నాము. సర్వోత్తమమగు బ్రహ్మపదమే ఆశయముగా గలిగినట్టి మీ వాక్యాలు మాలోని రాగము, మోహము మొదలైన వికారములకు అమోఘమైన ఔషధంగా పరిణమిస్తున్నాయి. "సజ్జన సాంగత్యమే ఆత్మావలోకమునకు సుఖమైన బాట" అను వాక్యమును నిరూపిస్తున్నాయి.

మా స్వరూపము గురించి ప్రవచిస్తూ, మాకు మా యొక్క అఖండ, అప్రమేయత్వములను సుస్పష్టపరచుచున్నందుకు మీకు మరల మరల నమస్కరిస్తున్నాం.

చంద్రకిరణములు అంధకారమును తొలగించునట్లుగా, మీ బోధ మా శారీరక మానసిక దోషములను దూరీకరిస్తున్నాయి. మీ మాటలు వింటున్నంత మాత్రంచేతనే 'తృష్ణ – లోభము'

మొదలైన తీవ్ర జాడ్యాలు సన్నగిల్లుచున్నాయి. పుట్టుగుడ్డి సిద్ధాంజనము (మంత్ర సిద్ధమైన కాటుక)ను కళ్ళకు పెట్టుకుంటే చీకట్లో కూడా వస్తువులను చూడగలుగుతారు కదా! అట్లే మీ వాక్యములు వింటూ ఉండగా స్వస్వరూపమగు శుద్ధాత్మను మేము ఇప్పుడు చూడగలుగుచున్నాము. మీరు అనేక యుక్తులచే, దృష్టాంతములచే మా హృదయములందలి సంసారవాసనలు క్షీణింపజేస్తున్నారు. ఉదారమైన చిత్తము గల మీవంటి మహాత్ముల వచనములవలె ఆనందం కలుగజేసేవి ఈ సృష్టిలో ఇంకేం ఉన్నాయి? ఏమీ లేవు.

కుమారా! రామచంద్రా! బ్రహ్మవేత్తలతో సంభాషించని దినములన్ని అంధకారయుక్తములేనని గ్రహిస్తున్నావు కదా! ఇప్పుడు ఈ మునీంద్రులు మనందరిపట్ల అతి ప్రసన్నంగా వున్నారు. ప్రస్తుత విషయం గురించి నీవు ఉచితమైన రీతిగా ప్రశ్నిస్తూ ఉండు. ఏమాత్రం సంశయించకు. నిన్ను నిమిత్తంగా చేసుకొని ఈ మహర్షి అనేక ఆధ్యాత్మ విశేషాలు ప్రపంచానికి ప్రతిపాదిస్తున్నారు. వారు చెప్పేదంతా నీకు, మాకు ఈ సభికులందరికి భవిష్యత్తులో అనేకమంది ముముక్షువులకు శుభప్రదం కాగలదు.

హే మహర్షీ! మీ తదుపరి వాక్యామృతం గ్రోలటానికి మేమంతా వేచి ఉన్నాం. మీ కరుణ రూపమగు ఆత్మతత్త్వజ్ఞానం కొనసాగించి లోకములను పావనం చేయ ప్రార్థన.

**శ్రీరాముడు:** స్వామీ! మహర్షీ! ఎంతో ఉదారబుద్ధితో మీరు చెప్పుచున్న వచనామృతం నేను స్వీకరించగలగడం, గ్రహించగలగడం – మీ ప్రవచనాశక్తి విశేషం చేతనే. ఇదంతా మీరు మాపై ప్రసరించు కరుణామృతం. తమ ఆదేశమును అనుసరించి, మీరు చెప్పినది ఈ సంవాద సమయంలో విన్న తరువాత మరల ఆ విషయములను రాత్రి నిద్రించే ముందు పునశ్చరణ చేసుకుంటున్నాను. ముఖ్య విషయాలు నెమఱవేస్తున్నాను. అట్లు చింతన చేస్తున్నంతమాత్రంచేత నా హృదయంలో ఎప్పటినుంచో తిష్ట వేసియున్న నిద్ర, మౌఢ్యము, జడత్వము సన్నగిల్లుచున్నాయి. హృదయమును ఎంతగానో విస్తరింపజేస్తున్నాయి. మీరు చెప్పు బోధ మనోహరంగాను, పరమ పురుషార్థసాధకంగాను, బ్రహ్మానందప్రదంగాను, పరమ పవిత్రంగాను ఉన్నది. పది రోజులుగా మీరు చెప్పుచున్నదానిని ముందు వెనుకలు విచారణపూర్వకంగా గత రాత్రంతా పునఃపఠనం చేశాను.

మీ ఉత్తమోత్తమ ప్రవచనము సనక సనందనాదులకు కూడా శిరోధార్యమే. కరువు కాటకాల చేత మోడువారిన ప్రదేశంలో కారుమబ్బులు, చల్లటి గాలులు, కుండపోత వర్షం ఎంతటి ఆహ్లాద జనకంగా ఉంటాయో, మీ వాక్యాలు అంతటి ఆనందప్రదంగా ఉన్నాయి. వాటిని మననం చేసుకున్నప్పుడు బుద్ధి సౌభాగ్యప్రదమౌతోంది. స్వల్పజ్ఞులము, పుణ్య పాప భావములచే దొర్లింప బడుచున్నవారము, స్వయంకృత, అల్ప భావములకు బద్ధులము అగు మమ్ములను, వికాసవంతము, స్వచ్ఛము అగు మీ ప్రవచనాలు పరమశోభాయుక్తంగా ప్రభావితం చేస్తున్నాయి, తీర్చి దిద్దుచున్నాయి. ఆ సర్వాత్మస్వరూపుడగు పరమేశ్వరుడే మీ రూపంగా మాపై కరుణాప్రవాహం వర్షింపజేస్తున్నాడు. మమ్ము పరిశుద్ధులుగా తీర్చిదిద్దడానికి మాపై కరుణతో మీరు, తమ ఉపదేశములను కొనసాగించ వలసిందిగా ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ప్రియ రామచంద్రా! ఇప్పుడు మనం ఉపశమన ప్రకరణములో ప్రవేశిస్తున్నాం. "ఇది హితకరము, ఉత్తమ సిద్ధాంతయుక్తము" – అని విజ్ఞుల అభిప్రాయం. సావధానచిత్తుడవై విను–

ఒక మండపము కొన్ని స్తంభములచే అవధరింపబడుచున్నట్లుగా ఈ సుదీర్ఘ సంసారము రాజస–తామస జీవులచే నిత్యము అవధరించబడుతోంది. ఇక సత్వగుణమునందు స్థితి కలిగియున్న ధీరులు ఈ సంసారమాయను నీలాగానే నిరాదరించివేస్తున్నారు. పాము కుబుసమును విడుచునట్లు వారు "నేను జీవుడను" అను భావమునే విడిచివేస్తున్నారు. సత్వ జాతిలోని బుద్ధిమంతులు, రాజససాత్వికులు కూడా "ఈ జగత్తుకు మూల కారణమేమిటి?" అను ప్రశ్నను మథించి, విచారించడం జరిగినప్పుడు తప్పక బ్రహ్మమును ఎఱుగుచున్నారు.

**శ్రీరాముడు :** సారవస్తువగు బ్రహ్మమును ఎట్టివారు ఎఱుగుచున్నారు? ఎట్టివారు ఎఱుగలేక పోవుచున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎవరి బుద్ధి అయితే శాస్త్ర, సజ్జన సాంగత్యములచే, యజ్ఞ, దాన, తపాల వంటి సత్కార్యముల అభ్యాసములచే సర్వవిధములైన పాపభావములను త్యజించివేస్తుందో, "ప్రజ్వలించు దీపము" వలె ప్రకాశవంతంగాను, నిర్దోషంగాను ఉంటుందో, అట్టి వారికి మేము చెప్పు 'బ్రహ్మము' అనబడునది తప్పక అనుభవమగుచున్నది. ఓ రామా! ఆత్మయే నిత్యము, స్థిరము, సత్యము, సర్వశేష్యము (సర్వదా మిగిలి ఉండేది) కదా! ఇక దిగుళ్ళు అనుమానములు ఎందుకు? అది మనందరి నిజ స్వరూపమే! అయితే, ...ఆత్మచే ఆత్మ గురించి విచారించి ఎఱుగనంత వరకు అది ఎవరికీ ప్రాప్తించుటలేదు.

అది అనుభవపూర్వకంగా ఎఱుగబడుటయే, "ప్రాప్తించుట" సుమా! నాయనా! నీవు ప్రాజ్ఞులలో ప్రమాణశీలుడవు. ధీరుడవు ఉత్తమ సాత్విక రాజసిక భావములు కలవాడవు. నీవు మేము చెప్పునది తప్పక గ్రహించగలవు. మరొక విషయం. ఈ జీవులలో అనేకులు నివురుగప్పిన నిప్పువలె నిర్మల స్వభావులై, బ్రహ్మమును ఎఱుగగలుగుటకు అర్హులై, తగినవారై ఉన్నారు. అయితే వారిలో కొందరు అనేక అల్పజ్ఞాన వాక్యములు విని, అంతటితో వేదోపనిషత్ సారవస్తువగు ఆత్మ శాస్త్రము విషయమై కొన్ని దురభిప్రాయములు కలిగి ఉంటున్నారు. అట్టివారిని ఉద్దేశించి మేము "నాయనలారా! మీరు స్వయముగా పరిశీలించి ఆత్మశాస్త్రముచే జీవులు – సంఘములు పొందు ప్రయోజనమేమిటో గ్రహించండి. కొన్ని అభిప్రాయాలకు కట్టుబడి పరిశీలనారాహిత్యం వహించి ఉండటంచేత జన్మ కర్మలు వృథా అగుచున్నాయి. అపవిత్రంగానే ఉండిపోతున్నాయి" అని హెచ్చరిస్తున్నాం.

ఓ సర్వజనులారా! మీరంతా ఈ 'సంసారసంరంభము'ను అంతటినీ వివేచనా బుద్ధితో పరిశీలించి చూడండి. 'ఇది నిత్యం, సత్యం. ఇది అనిత్యం, కనుక అసత్యం' అని విభాగం చేయండి. సత్యము నందే పరాయణులు కండి. అన్ని తరగతులలోని జనుల యోగ క్షేమములు దృష్టిలో పెట్టుకొని మేము ఈ అధ్యాత్మశాస్త్రమును ప్రతిపాదించుచున్నాము. లోక కళ్యాణమే మా ధ్యేయం.

దయచేసి నికృష్టమగు భేద భావ ప్రవాహంలో కొట్టుకుపోకండి. మానవజన్మ ఎంతటి ఉత్తమ అవకాశమో గ్రహించండి. ఇక్కడ మిమ్ములను ఉద్ధరించడానికి శాస్త్రములు, గురువులు సర్వదా సిద్ధంగా ఉన్నారు. మీరు కూడా సర్వసన్నిద్ధులు కండి.

**శ్రీరాముడు :** తండ్రీ! ఏది సత్యమో, ఏది కాదో నిర్ణయించడం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** దీనికి శాస్త్రములు ప్రమాణము చెప్పుచున్నాయి.

1) ఏ వస్తువైతే 'ఆది'లోను, 'అంతము'లోను లేదో, అది మధ్యలోకూడా 'లేనిదే' అగుచున్నది.

2) ఏది ఆద్యంతములలో ఉండియే ఉన్నదో, అది మధ్యలో కూడా తప్పక ఉండియే ఉన్నది.

3) ఆద్యంతాలలో లేని పదార్థం గురించి "ఇది సత్యమే" అను బుద్ధిచే ఎవడు నిమగ్నుడౌతాడో... అట్టి మూర్ఖునకు వివేకము జనించేది ఎట్లా?

❖

ఇక్కడ ముక్తి ఎవరికి? బంధమెవరికి? అను ప్రశ్నలను మేము తరచితరచి చూచాం. పరిశీలించాం. పరీక్షించాం. గమనించాం.

**జాయతేమనఏవేహ మనఏవవివర్ధతే ।**
**సమ్యగ్దర్శనదృష్ట్యాతు మనఏవహిముచ్యతే ॥** (సర్గ 5, శ్లో 11)

"ఈ ప్రపంచమున మనస్సే ఉత్పన్నమగుచున్నది. మనస్సే వృద్ధి చెందుతోంది. సమ్యక్ దృష్టి పొందినప్పుడు మనస్సే ముక్తిని పొందుతోంది."

❖

ఓ రామచంద్రా! ఈ పది రోజులుగా మనం చేసియున్న విచారణలోని విశేషములను ఎప్పటికప్పుడు 'పూర్వపర' మననము చేస్తూ, మరల మరల మనోబుద్ధులచే పరిశీలించి, హృదయంలో పదిలపరచుకుంటున్నావు కదా! అది అత్యావస్యకం సుమా!

ఇతఃపూర్వం 'సత్వ –రజ –తమో గుణభేదం'చే తయారుకాబడిన ఈ జీవజాతులన్నిటి విచిత్ర – ఉత్పత్తుల గురించి కొంతవరకు మనం చెప్పుకున్నాం. పరబ్రహ్మము గురించి అనేక విషయాలు చర్చించుకున్నాం.

పరబ్రహ్మమే మాయాశక్తిచే 'జగత్తు' రూపముగా అజ్ఞాన దృష్టికి కనబడుచున్నది. అదియే పరమార్థమున పరిశీలిస్తే 'నిష్ప్రపంచకము' అయి ఉన్నది. ఈ స్థూల–సూక్ష్మ–సత్–అసత్ దృశ్యజగత్తుకంటే విలక్షణమైనది అది.

జగదీశుడు, సర్వశక్తిమంతుడు అగు పరమాత్మనుండి ఈ జగత్తు మనోకల్పిత చమత్కారంచేత ఎట్లు కల్పితమైనదిగా ఉత్పన్నమగుచున్నదో,.... ఇప్పటిదాకా చూచాం.

**మాయ –** ఈ 'మాయ'అనేది కాలవశంగా చూస్తే ఎప్పటికప్పుడు జలతరంగంలాగా అనుక్షణం మార్పులు చెందుతూ నాశనమయ్యేదిగానే ఉంటోంది. అనగా, దేశ కాలముల దృష్ట్యా అంతము

కలిగియే ఉంటోంది. ప్రవాహరూపంగా చూస్తేనో..... ఇదంతా అనంతమైనది. చిత్తమే మనుజుడు. చిత్తమే మాయ.

అనేకమంది మహనీయుల అభిప్రాయములను పరిశీలించి, ఆ తరువాత ఈ అధ్యాత్మ, శాస్త్ర విషయములను నీముందు ఉంచుచున్నాను. ఈ విషయములను (ఈ సంవాదములోని విశేషాలను) మననపూర్వకంగా హృదయంలో పదిలపరుచుకోవాలి. వివేకముతో హృదయమును విస్తారపరచుకోవాలి. అప్పుడు మోక్ష స్వరూపడవు కాగలవు. మాయ స్వయముగా స్వస్థానమగు ఆత్మయందు లయించగలదు. దృశ్యము – దేహములు – సంబంధములు – అనుబంధములు – బాంధవ్యములు – జన్మ – జీవనము – మృత్యువు మొదలైనవి ఎవరి దృష్టిలో బంధములు కావో.... వారిని "మోక్ష స్వరూపులు" అని పిలుస్తున్నారు.

ఆత్మవేత్తలు అవ్యాజమైన ప్రేమతో అందిస్తున్న ఆత్మజ్ఞాన సమాచారం అనాదరించటం ఉచితము కాదు. శ్రేయము కాదు! అనేక సత్కర్మల ప్రయోజనంగానే "ఆత్మ యొక్క స్వభావమై చెప్పబడు సమాచారము పరిశీలించాలి...." అనే ఉత్సుకత ఈ జీవునిలో బయలుదేరుచున్నది.

మమ్ము ఆశ్రయించుచున్న శిష్యులు, తదితర ప్రియజనులు 'శరీరాత్మభావము'ను త్యజించెదరు గాక! ఆత్మతో ఏకత్వము పొంది, 'అఖండము, అద్వితీయము, శుద్ధము, శాశ్వతము అగు ఆత్మయే నేను' అను ఎఱుకను, భావనను సుస్థిర పరచుకొనెదరుగాక! ఇదియే మా ఉద్దేశము, లక్ష్యము కూడా.

❖❖❖

## 3. ఇప్పటికి లేనిది? ఇంకనూ పొందవలసియున్నది?

**శ్రీరాముడు :** మహాత్మా! మనస్సే ఈ ముల్లోకములందు సంసారియగు జీవుడుగా అగుచున్నది కదా! ...అది ఎట్లా 'జీవుడు' రూపం పొందుతోంది? ఎట్లా జరామరణములకు పాత్రమగుచున్నది? ...అనే విషయమై మీరు అనేక విశేషాలు బోధించారు. ఇంతవరకు బాగానే ఉన్నది. ఇప్పుడు... ఈ సంసారము నుండి తరించుటకు నిశ్చలమైన, సులభమైన మార్గమేమిటో ...అది బోధించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మొట్టమొదట మనుజుడు శాస్త్రాభ్యాసం చేత, తీవ్రవైరాగ్యం చేత సజ్జన సాంగత్యం చేత మనస్సును శుద్ధపరచుకోవాలి. ఈ మనస్సును జ్ఞానమునకు యోగ్యమైనదానిగా తయారుచేయాలి. ఆ విధంగా సౌజన్యయుక్తం అగుచున్న మనస్సుకు వైరాగ్యం ప్రాప్తిస్తుంది. అప్పుడు ఆతడు "నేను–ఆత్మ–జన్మ–దృశ్యము" మొదలైన వాటి వాస్తవతత్వం అభ్యసించటానికి ఉపక్రమించాలి. శాస్త్రజ్ఞులు, బ్రహ్మవిష్ఠులు అయిన సద్గురువులను విధిపూర్వకంగా సమీపించాలి. వారు ఉపదేశించే మార్గంలో ధ్యాసను నిలపాలి, గ్రహించాలి. నిష్కామకర్మ, సాత్వికమైన భావాలు, సుతీక్ష్ణము, విస్తారము అగు అవగాహనల సహాయంతో క్రమంగా పరమపవిత్రమగు ఆత్మపదమును పొందగలడు. పరిశుద్ధమగు 'విచారణ' చేతనే ఈ జీవుడు చివరికి ఆత్మను దర్శించగలుగుతాడు.

**తావద్భవమహాంభోధౌ జనస్తృణవదుహ్యతే ।**
**విచారతటవిశ్రాన్తిమేతి యావన్నచేతసా ॥** (సర్గ 5, శ్లో 18)

బుద్ధి సహాయంతో 'ఆత్మవిచారణ' అనే ఆవలి ఒడ్డు జేరుటయే ఈ జీవునికి విశ్రాంతి. అప్పటి వరకు ఈ జీవుడు కెరటాలపై తేలియాడే గడ్డిపరకలాగా ఈ సంసారసాగరంలో కొట్టుమిట్టాడుతూనే ఉంటాడు.

విచారణచే ఆత్మతత్త్వము ఎరిగినవాని బుద్ధి సమస్త మానసిక రుగ్మతలను తొలగించివేస్తోంది. ఒక స్వర్ణకారుడు "ఇది బంగారము, ఇది భస్మము" అని చిటికలో గ్రహిస్తాడు కదా! తత్త్వజ్ఞునకు స్వయముగా నిత్య-అనిత్య వివేకం కలుగుతోంది. అజ్ఞానముచే ఈ దృశ్యమును ఒక పరిచ్ఛిన్న వ్యవహారముగా గాంచుచున్న జీవులారా! మీరంతా నిరుత్సాహపడకండి! ఓపికతో తత్త్వవిచారణ చేయండి. అప్పుడు మీరు తప్పకుండా వివేకము పొందగలరు. తద్వారా మీ స్వస్వరూపమేమిటో, ఎంతటిదో మీరే గ్రహించగలరు. "నేను దేశ కాలాలచే అపరిచ్ఛిన్నుడను, అక్షయుడను, శాశ్వతుడను" అని తెలుసుకుంటారు. ఈ భయ, దుఃఖాదులు ప్రాప్తించటానికి మూలకారణమేమిటి?

సారవంతమగు ఆత్మను ఎఱుగనివానికే చిత్తసమ్మోహం అనబడేదంతా ఉంటుంది. ఆత్మను ఎఱుగటం జరిగిందా, అది సుఖదాయకం అవుతుంది. భ్రమలన్నీ తొలగుతాయి. అది ఎఱుగబడక పోతే దుఃఖమునకే హేతువగుచున్నది. అనంత సుఖమును, శాంతమును సముపార్జించాలంటే ఆత్మను ఎఱుగవలసిందే! అందుకు వేరే మార్గం లేదు. నాశనమే పర్యవసానముగాగల ఈ దేహముతో మిశ్రమమైయున్న ఆత్మను పంచకోశముల* నుండి వేరుచేసి చూడాలి సుమా! అప్పుడే ఈ జీవునకు స్వస్థత లభిస్తుంది. అందుకు వివేకము అత్యంత ఆవశ్యకం.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఆత్మ ఈ శరీరమునందు (పంజరములో) పిట్ట వలె చిక్కుకున్నది కదా! ఈ శరీరము ఏర్పడి ఉన్నంతకాలం విశ్రాంతి ఎక్కడిది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** బురదలో ఒక మణి పడిందనుకో... ఆ మణికి, బురదకు సంబంధం ఎక్కడన్నా ఉంటుందా? నిర్మలమగు ఆత్మకు ఈ దేహంతో ఏమాత్రం సంబంధం లేదు.

మరొక దృష్టాంతము విను. పద్మము జలంలో ఉంటుంది కదా......! అట్టి ఒక పద్మము యొక్క దళములపై కొన్ని జలబిందువులు ఉండవచ్చు. కానీ ఆ జలబిందువులు పద్మదళంలో ప్రవేశించవు కదా! అట్లాగే, పంచకోశములు ఆత్మను స్పృశించలేవు. ఆత్మలో ప్రవేశించలేవు.

❖

ఈ బ్రహ్మం - జీవుడు ఉపాధిచే భిన్నం కావచ్చు. అధిష్ఠానం దృష్ట్యా వేరువేరు కానేకాదు....! ఈ జీవుడే సత్యదృష్టిచే 'బ్రహ్మము' అయి ఉన్నాడని గ్రహించవలసినదిగా చేతులెత్తి ప్రకటించుచున్నాను.

---

* పంచకోశములు : 1) శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము
2) అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములు.

'జడమే' అయినట్టి ఈ మనస్సు 'మురికి గుంటలో తాబేలు' లాగా పడి ఉన్నది. ఆత్మ విచారణను వదలి భోగద్వారములైనట్టి ఇంద్రియ విషయముల వెంట పరుగులు తీస్తూ బహు కలుషితమై ఉంటోంది. మనస్సు ఈ విధంగా ఎంతకాలం నిమగ్నమౌతుందో అంతకాలం ఈ సంసారాంధకారమును ద్వాదశాదిత్యులు వచ్చికూడా పటాపంచలు చేయలేరు. అటువంటి ఈ మనస్సు ప్రబుద్ధమైనదా, మరుక్షణం యథార్థవిషయం తప్పక ఆకళింపు చేసుకుంటోంది.

మనస్సు దేహముతో తాదాత్మ్యము చెందుతూ ఉంటే.... ప్రాజ్ఞుడైనవాడు అది పట్టించుకోకుండా వృథాకాలయాపన చేస్తాడా? లేనేలేదు. "నా హృదయము నుండి అజ్ఞానం తొలగిపోవాలి" అని నిర్ణయం చేసుకుంటాడు. గురువులను ఆశ్రయించి ఉపదేశం పొందుతాడు. ఆత్మజ్ఞులచే ప్రబోధించబడినవాడై తపోయజ్ఞ దానాదులతో మనస్సును పరిశుభ్రపరచుకుంటాడు. ఎందుకంటే, ఈ సంసారం అత్యంత దుఃఖప్రదమైనది కదా!

ధూళిచే ఆకాశము అపరిశుభ్రమౌతుందా? లిప్తమౌతుందా? అసలు ధూళికి, ఆకాశమునకు సంబంధమెక్కడిది? ఈ దేహాదులు ఉండనీ... లేకుండనీ! ...ఆత్మ ఈ దేహాదులచే, ఈ పంచకోశాలచే లిప్తమయ్యే ప్రసక్తే లేదు. బురదలో బంగారు ఉంగరం ఉంటే బురద బంగారమౌతుందా? బంగారము తన స్వతత్వమును కోల్పోయి బురదగా సంతరించుకుంటుందా! ఈ జడదేహంలో ఆత్మతో కలిసి ఉన్నప్పటికీ ఇది ఆత్మరూపం ఎలా చెందుతుంది? చెందదు. ఆత్మ జడదేహ విభాగి అవుతుందా? అవదు.

**శ్రీరాముడు :** సుఖదుఃఖాదులు ఎక్కడి నుండి వచ్చి పడుచున్నాయి? ఇవి శరీరానివా? ఆత్మవా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అదిగో ఆ ఆకాశమును చూడు! దానిలో మాలిన్యము గాని, బిందుత్వము గాని ఉన్నాయా? ఉండవు కదా! ఆత్మ యందు ప్రతీతమై అగుపిస్తున్న ఈ సుఖదుఃఖాదుల అనుభవం అసత్యమైనదే! ఆత్మకు సుఖదుఃఖాదులు లేవు.

పోనీ, "ఈ సుఖ దుఃఖాదులు శరీరమునకు సంబంధించినవే" అని అందామా? ఈ శరీరము స్వతహాగా జడమే కదా! జడమైన వస్తువునకు అనుభవమనేదే ఉండదు. 'ఒక కలం అనుభూతిని పొంది కవిత్వం రాస్తోంది' అని అనం కదా! అనుభవమే ఉండనట్టి వస్తువుకు సుఖమేమిటి? దుఃఖం ఏమిటి? లేక 'ఇవి ఆత్మకు సంబంధించినవి' అందామా? ఆత్మ సర్వానికి అతీతమైనది కదా!

అందుచేత "ఆత్మయే స్వయముగా సుఖదుఃఖముల భావన చేసి తద్వారా వివర్తము పొందుతోంది. తనయొక్క భావనాపరిధిలో బాలురక్రీడవలె, భావనావిన్యాసంగా సుఖదుఃఖాదులన్నీ పొందుతుంది – అని అనక తప్పదు.

అందుచేత "అంతాకూడా నిత్యము, ప్రశాంతము అయినట్టి ఆత్మయొక్క రూపమే...." అను భావనతో ఇక్కడి పదార్థములను, సంఘటనలను గాంచుచుండుము. ఆత్మయందు కనిపించే ఈ విశాల సృష్టి సమూహమంతా జలంలో కనిపించే తరంగముల వంటిదే. ఒక మణి అకారణంగానే సమీపవస్తువులపై ప్రకాశమును ప్రసరింపజేయుచున్నట్లు, ఆత్మ స్వసత్తామాత్రంచేత అకారణంగానే ఈ సృష్టిని విస్తరింపజేస్తూ ఉన్నది.

అజ్ఞాన దృష్టి యందలి 'జగత్తే'... జ్ఞానదృష్టిచే ఆత్మ!... ఈ జగత్తు, ఆత్మ ఒకే రూపములు కావు. అట్లాగే వేరువేరు రూపములైనవి కూడా కావు. జలమే తరంగరూపం కదా! తరంగము జలమే కదా!

ఈ జగత్తు మిథ్యయే. అయినప్పటికీ అజ్ఞానకారణంగా ఇట్లు భ్రాంతిరూపంగా విస్తరిస్తోంది.

**సమ స్తంఖల్విదంబ్రహ్మ సర్వమాత్మైవమాతతమ్**
**అహమన్యదిదంచాన్యదితి భ్రాన్తింత్యజానఘ.** (సర్గ 5, శ్లో 39)

ఈ జగత్తంతా బ్రహ్మమే కనుక "నేను వేరు...... బ్రహ్మము వేరు" అను భ్రాంతిని త్యజించివేయుము. ఎందుకంటావా? బ్రహ్మము దేశ కాలములచే పరిచ్ఛేదమగునది కాదు.

అట్టి బ్రహ్మము నందు "నేను - నీవు - జగత్తు" అనబడు విచ్ఛేదం ఎట్లా సంభవం చెప్పు? అగ్నిలో మంచుకణం ఉంటుందా? ఎలా ఉంటుంది? అగ్నిలోని ఒక అగ్నిశిఖకు సంబంధించినవి, సంబంధించనివి, ఆ అగ్నిలో ఏమి ఉంటాయి? ఏకము, సర్వరూపము అయిన పరమాత్మ యందు ఇక రెండవ కల్పనయే సంభవించదు.

'చిత్' రూపమగు ఆత్మయే "స్వస్వరూప అభావం" అనబడు ఒకానొక సమయంలో ఇట్లు 'జగత్తు' అనబడు క్షణక్షణ పరిణామయుతమగు అనుభవప్రాప్తిని పొందటం జరుగుతోంది. ఈ పొందబడుచున్నదంతా స్వయంకల్పితమగు భావనను అనుసరించే ఉంటోంది. భావనయే సుఖము, భావనయే దుఃఖము. ఇక, ఆత్మయో? భావనలకు ఉత్పత్తి-స్థితి-లయస్థానం.

**నశోకోస్తినమోహోస్తి న జన్మాస్తినజన్మవాన్ ।**
**యదస్తీహతదేవాస్తి విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 43, సర్గ 5)

**నిర్ద్వంద్వోనిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమాత్మవాన్ ।**
**అద్వితీయోవిశోకాత్మా విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 44, సర్గ 5)

**సమఃస్వస్థఃస్థిరమతిః శాన్తకోకమనామునిః ।**
**మౌనీవరమణిస్వచ్ఛో విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 45, సర్గ 5)

**వివిక్తఃశాన్తసంకల్పో ధీరధీర్విజితాశయః ।**
**యథాప్రాప్తానువర్తీచ విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 46, సర్గ 5)

**వీతరాగోనిరాయసో విమలోవీతకల్మషః ।**
**నాదాతా నపరిత్యాగీ విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 47, సర్గ 5)

**విశ్వాతీతపదంప్రాప్తః ప్రాప్తప్రాప్తవ్యపూరితః ।**
**పూర్ణార్ణవవదక్షుబ్ధో విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 48, సర్గ 5)

**వికల్పజాలనిర్ముక్తో మాయాంజనవివర్జితః ।**
**ఆత్మనాత్మనితృప్తాత్మా విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 49, సర్గ 5)

**అనన్తాపారపర్యన్త వపురాత్మవిదాంవర ।**
**ధరాధరశిరోధీరో విజ్వరోభవరాఘవ ॥** (శ్లో 50, సర్గ 5)

వాస్తవానికి ఇక్కడ దుఃఖముగాని, మోహముగాని, జన్మగాని, జన్మను పొందునట్టిదిగాని లేదు. ఏదైతే కలదో అది సర్వదా ఉండియేవున్నది. దానినే 'ఆత్మ' అని అంటున్నాం. కనుక నీవిక దుఃఖరహితుడవు, నిశ్చింతుడవై ఉండుము. శీతోష్ణములు, మొదలైన ద్వంద్వములకు అతీతుడవై, నిత్యసత్యమగు స్వస్వరూపమునందు స్థితి కలిగియుండుము.

"లేనిదేదో పొందవలెను... ఉన్నదేదో విడువవలెను... ఇది ప్రాప్తించాలి... అది ప్రాప్తించ కూడదు... వీరు మా వారు... వారు కాదు..." – అనునట్టి యోగక్షేమభావములకు కట్టుపడవద్దు. ఆత్మవంతుడవై, అద్వితీయుడవై శోకరహితుడవై, సంతాపవర్జితుడవై ఉండుము. సముడవు, స్వస్థ చిత్తుడవు, స్థిరమైన బుద్ధి కలవాడవు అయి ఉండుము. మౌనివై, ఒక ఉత్తమమైన మణిలాగా స్వచ్ఛతతో ప్రకాశించెదవుగాక!

"అవిద్య" గాని, దానియొక్క కార్యక్రమవ్యవహారములుగాని స్వతఃసిద్ధమైనవి కావు. కల్పితమైనవి మాత్రమే. సంకల్పరహితుడవై, ధీరబుద్ధితో స్వాధీనచిత్తము కలిగియుండుము.

ప్రాప్తించిన వ్యవహారములను నిర్వర్తిస్తూనే, దుఃఖరహితుడవై ఉండుము. దుఃఖాదులను నీవు గ్రహించవద్దు. 'గ్రహించటం' అనే స్వభావం చేతనే దుఃఖములు సంభవిస్తున్నాయి. వీతరాగుడవు, చింతారహితుడవు, నిర్మల చిత్తుడవు పాపవర్జితుడవు అగుము. ఏ పదార్థమునూ గ్రహించనూ వద్దు... త్యజించనూ వద్దు.

సర్వదా ప్రపంచమునకు అతీతమైయున్న (ఆవల ఉన్న) బ్రహ్మపదమును పొందియే ఉండుము. ఆత్మవస్తువు వాస్తవానికి సర్వదా ప్రాప్తించియే ఉన్నది. "ఇప్పటికి లేనిది ఒకటి ఉన్నది..... అది నేను పొందాలి" అను యోచన సాంసారికమైనదేనని, జ్ఞానాగ్నిచే అది దగ్ధం కాగలదని గ్రహించు.

పూర్ణుడవై పూర్ణసముద్రంలాగా విక్షోపరహితుడవు కమ్ము. విజ్ఞానివై ఎట్టి శోకమును పొందనే వద్దు. వికల్ప జాలం నుండి విముక్తుడవు కమ్ము. వికల్పజాలమంతా నీ నుండే, నీ చేతనే కల్పితమై బహిర్గతమౌతోంది. నీయొక్క విజ్ఞానముతోకూడిన దృష్టి అవగాహనలు మాత్రమే అద్దానిని నిరోధించగలవు.

గురువులుగా మేము మీ స్వరూప విషయమై విశ్లేషణము చేసిచూపుతున్నాం. అయితే దర్శించవలసినది, గ్రహించవలసినది మీరే! 'మాయ' అనే పొర మీపట్ల తొలగిపోవు గాక!

ఓ రామా! ఆత్మయందు, ఆత్మచే పరితృప్తుడవై, సంతాపములు లేనివాడవై ఉండుము. "నేను ఆత్మస్వరూపుడను" అను ఎఱుకతో చైతన్యస్వరూపము సంతరించుకో. మేరుపర్వతం లాగా ధీరుడవై సహనశీలుడవై, పరితాపరహితుడవగుము.

ప్రాప్తించిన దానిని అనుభవించుచు, ఏ వాంఛలు లేక, గ్రహణ, త్యాగరహితుడై ఉన్నవాడు స్వల్ప ప్రయత్నాల చేతనే ఆత్మ యొక్క ఔన్నత్యాన్ని స్వయంగా గాంచుచున్నాడు. మహాసముద్రము

లాగా 'ఆత్మ'చే ఆత్మయందు పరిపూర్ణుడవై, పూర్ణకాముడవై శాంతి సుఖములను ఆశ్రయించుము. అమాయకులగు కొందరు జీవులు "ఈ ఎదురుగా కనబడు సంఘటనలు, పదార్థాలు, వస్తు జాలం అన్నీ వాస్తవమే" అని భావన చేయుట చేతనే ఇక్కడ దుఃఖం, రాగం, కౌతుకం, ఆవేశం, హింసాప్రవృత్తి భయం, క్రోధం మొదలగునవి ఏర్పడుచున్నాయి. "ఈ ప్రపంచం మిథ్యా రూపం" అని ఎరుగువాడు అసత్‌స్వరూపం అయినట్టి ఇద్దాని కొరకు పరుగులు తీస్తాడా? లేదు.

ఓ రామా! నీవు తత్త్వజ్ఞుడవు. కల్పనారహితుడవు. ఇక నీకు పెద్దగా చెప్పవలసింది ఏముంటుంది? చిలుక, పంజరము'లో చిక్కుకున్నట్లు ఆత్మ శరీరమునందు చిక్కుకున్నదని భావించ కూడదు. మౌనము – ప్రశాంతము – నిర్మలము – అఖండము – సత్యము – నిత్యము అగు ఆత్మ ఎక్కడ? జడము, భ్రమాత్మక, స్వప్నతుల్యము అగు ఈ దేహమెక్కడ? అభాండమగు ఆకాశము ఘటాకాశరూపంగా (కుండలోని ఆకాశరూపంగా) ఘటంలో (కుండలో) చిక్కుకున్నదని అనటం సమంజసం కాదుకదా!

కనుక, ఆధి వ్యాధి వర్జితుడవై నిరంతరం ఆత్మజ్ఞానం కలిగి సుఖవంతుడవు కమ్ము. నీ ఉత్తమ, ప్రశాంత గుణములయొక్క భావీకరణముచే సమస్త జనులను ప్రసన్నులుగా చేస్తూవుండు. సమదృష్టి కలిగివుండి, చిరకాలంగా రాజ్యమును చక్కగా పాలించు.

"ప్రారబ్ధవశంచేత అనుభవించతగిన, నిర్వర్తించవలసిన కర్మలందు, వాటి ఫలములందు త్యాగముగాని, రాగముగాని యుక్తము కాదు" అని గ్రహించి ఉండు.

❖❖❖

# 4. కర్మబద్ధులు - విముక్తులు

ఓ రామా! "నాకు అద్వితీయమైనట్టి 'ఆత్మ' యొక్క సన్నిధానమాత్రం చేత ఈ జగద్వ్యవహారమంతా నేనే ఒనర్చుచున్నాను" – అను నిశ్చయమును జ్ఞానసిద్ధులగు యోగులు కలిగివుంటున్నారు. అట్టి నిశ్చయము కలిగియుండి, ఆపై కార్యములందు ప్రవృత్తుడగువాడు 'ముక్తుడే' అని మా అభిప్రాయం. ముక్త స్థితికి కర్మానుష్ఠానం విరోధము కాదు. కావలసిన పనిలేదు!

**కర్మబద్ధులు -** ఈ జీవుడు అనేక ప్రయాసల తరువాత మనుష్యదేహం పొందుచున్నాడు. అట్లు మనుష్యదేహం పొందిన తరువాత కూడా 'నిష్కామ కర్మానుష్ఠానము'నందు తత్పరులు కానివారు దుఃఖముల వైపుకే పయనించుచున్నారు. నిందిత కర్మలచే ఈ జీవుడు నరకమునకు వెళ్ళుచున్నాడు. మరల అక్కడి నుండి కామ్య – కర్మానుభవం కొరకు స్వర్గం వెళ్ళుచున్నాడు. కొందరు విహిత కర్మ లందు బద్ధకముచే అశ్రద్ధపరులై ఉంటున్నారే! అట్టివారు ఒక నరకమునుండి మరొక నరకమునకు, ఒక దుఃఖము నుండి మరొక దుఃఖమునకు, ఒక భయమునుండి మరొక భయమునకు అనుక్షణం ప్రయాణాలు చేస్తున్నారు. స్వవాసనలను దట్టంగా కల్పించుకొంటూ వాటికి తామే బద్ధులగుచున్నారు. దుష్కర్మ ఫలముల ఆధిక్యత చేత జంతు జన్మలు, అక్కడి నుండి స్థావర రూపములు పొందుచున్నారు.

**శుద్ధ సాత్వికులు -** కొందరు ధన్యులగు జీవులు తమయొక్క మనస్సుచే ఈ మనస్సుకే సాక్షీభూతమైయున్న 'ఆత్మ'ను గురించి విచారణ చేస్తున్నారు. తమయందలి తృష్ణను రహితం చేసి వేస్తున్నారు. కర్మయందు అకర్మ, జన్మయందు జన్మరాహిత్యం వారికి సుస్పష్టముగా సర్వదా సర్వత్రా అనుభవమగుచున్నాయి. అట్టి జీవులే శుద్ధ సాత్వికులు, వారు ఉత్తమ కైవల్యమును పొందుచున్నారు.

**నిషిద్ధకర్మలు -** హింసించుట, ద్వేషించుట, క్రోధము, పారుష్యము, లోభము మొదలైనవి "ఆశ్రయించకూడదు" అని శాస్త్రములు గుర్తుచేస్తున్నాయి.

**రాజస సాత్వికులు -** ఈ జీవులు సాత్వికము, లోక కళ్యాణ కారకములగు కర్మలకు సంబంధించిన ప్రవృత్తి – సంస్కారములను కలిగియుంటున్నారు. "స్వధర్మభావనతో భగవదర్పిత భావనతో ఈ కర్మలు నేను చేయాలి. తద్వారా సర్వాత్మకుడగు ఆ భగవంతుని సంతోషింపజేయాలి" అను మననము కలిగి, ఆయాకర్మలందు ప్రవృత్తములగుచున్నారు. వీరు క్రమంగా ఒక శ్రేష్ఠమైన జన్మ నుండి మరికొంత శ్రేష్ఠమైన జన్మను అనుభవించుచూ, ఒకానొక పవిత్రసమయములో (ఒకానొక జన్మలో) ముక్తులగుచున్నారు. అట్టివారు తమయొక్క చివరిజన్మలో, పుట్టినవెంటనే పూర్ణచంద్రునివలె వృద్ధిని గాంచుచున్నారు. వారి ఆయా జన్మలలో "సాధన చతుష్టయం" బలపడుచూ వెంటనంటి వస్తూ ఉంటాయి. బ్రహ్మవిద్యకు ఉపాయభూతములైన సమస్త విద్యలు వచ్చి చేరుచున్నాయి. శ్రేష్ఠత్వము, మనోహరత్వము, మైత్రి, సౌజన్యము, కరుణ, జ్ఞానము మొదలైన గుణములన్నీ ఆతనిని వచ్చి ఆశ్రయిస్తున్నాయి.

ఓ రాఘవా! ఎవడైతే సమస్త కార్యములు చేస్తున్నప్పటికీ, ఫల, అఫలములందు సమరూపుడై వర్తిస్తాడో, హర్ష శోకములు పొందకయే ఉంటాడో, అతని పట్ల ఈ సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములన్నీ నిర్లిప్తం అయిపోతాయి. తెల్లతెల్లవారినప్పటి చీకటిలాగా నశించిపోతాయి. చిత్తము సమస్త సద్గుణములచే పరిశుద్ధమౌతూవుంటుంది. అట్టి సదాచారసంపన్నుణ్ణి జనులు "ఈతనిని మేము కలిగి ఉండాలి" అని తలుస్తారు. ఎందుకంటే, ఆతని యందు సద్గుణ సంపద స్వయముగా, అసంకల్పితముగా ప్రవర్తిస్తూ ఉంటుంది.

**సాధన చతుష్టయం -** సాధు సాంగత్యం, శ్రవణం, మననం, నిధిధ్యాస మొదలైన ఉత్తమ గుణములచే పరిపూర్ణుడై ఉంటున్న ఆతనిని చూచి సంతోషించినవారై సద్గురువులగు జ్ఞానులు జ్ఞానసంపదను ప్రసాదిస్తున్నారు. "ఇది ఆత్మ – ఇది అనాత్మ" అను వివేకము వారియందు స్వయంగా ప్రకాశిస్తుంది. అట్టి విచారయోగము సహాయంచే ఆ జీవుడు ఆనందైకరసమగు ఆత్మస్వరూపమును వీక్షించగలుగుతాడు. అంతఃకరణమునందు ఆత్మకు లక్షణములైన అఖండత్వము, నిత్యత్వము, శుద్ధత్వము, ప్రకాశమయత్వము మొదలైనవి రూపము దిద్దుకుంటాయి. ఆత్మయే ఆతని మననము, స్వభావము అగుచున్నది. ఉత్తమ శాంతియే ఆతని ధారణ. మనస్సు సర్వదా నిర్గుణ (గుణములకు అతీతమైన) బ్రహ్మము రూపమందు ఐక్యమై ఉంటోంది. 'ఆత్మ' అనబడు అనుభవమునందు నిత్యము ప్రబోధితుడై అతడు ఉంటున్నాడు.

చూచావా రామా! ఉత్తమ లక్ష్యంతో, దృష్టితో, భావనతో ఉపాధిని పొందిన జీవుడు జీవితం అను ఈ అవకాశమును వృథా పరుచుకోడు. మహాత్ములు, ఆత్మద్రష్టలు అగు సద్గురువులను సేవించి, వారు బోధించు యుక్తులచే నిర్మల బుద్ధిని సంపాదించుకుంటాడు. అట్టి బుద్ధిచే చిత్తమునందలి ఆత్మవస్తువును ప్రకాశింపజేసుకుంటాడు.

అంతఃకరణమున ప్రకాశించుచున్న బ్రహ్మమును అనునిత్యంగా ఆస్వాదిస్తున్నాడు. పరమ పురుషార్థ రూపమగు ఉత్తమగతిని తన యొక్క స్వస్థానమునందే పొందుచున్నాడు.

❖❖❖

# II. జనకోపాఖ్యానము

## 1.సిద్ధగీతాగానం

'మిథిల - విదేహ' అనే పేరుగల రాజ్యమును జనకమహారాజు పాలిస్తున్నాడు. ఆయనకు దేనిపట్లా ఎట్టి వ్యధ ఉండేది కాదు. 'ఇది ఆపద, 'ఇది సంపద' అనబడు స్పర్ధ అంతరంగమున లేకుండానే మహావిష్ణువులాగా సౌజన్యపూర్వకంగా రాజ్యం పాలిస్తూఉన్నారు. అయితే ఆయనకు కొన్ని సందేహాలు ఎక్కడో అంతరంగంలో చూచాయగా మినుకుమినుకుమంటూ ఉండేవి.

ఈ జీవుడెవడు? ఈ సంసారము ఏమై ఉన్నది? భ్రమలను కల్పిస్తున్నది ఎవరు? భ్రమలను కల్పించుచున్నవానికి, ఆ భ్రమలు అనుభవించుచున్నవానికి గల సంబంధమేమిటి?

నేనెవరు? ఈ రాజ్యాదులు నావేనా? కాదా! అహంకారము భ్రమయా? వాస్తవమా? అందరి యందు భగవానుడు ఉన్నాడని వేదములు ఘోషిస్తున్నాయి, అయితే నాయందు కూడా ఉండాలి కదా! ఉంటే ఏ రూపములో ఉన్నాడు?

జ్ఞానం అంటే ఏమిటి? అజ్ఞానం అనగా ఎట్టిది? ఎవరిచే కల్పితం? ఈ మనస్సు పొందే అల్పత్వాన్ని, చంచలత్వాన్ని నిరోధించటం సాధ్యమేనా? ఇక్కడ ఏది త్యజించాలి? ఏది గ్రహించాలి?

ఇట్లు అనేక ఆలోచనలు పొందుతూ ఉండేవాడు. ఒక రోజు ఆయన వనవిహారం చేసే ఉద్దేశంతో సపరివారంగా ఒక పర్వతప్రాంతం చేరారు. పరివారము నంతటినీ వదలి పర్వతగుహలలో ఒంటరిగా సంచరించసాగాడు. ఒక చోట ఆయనకు కొన్ని శబ్దములేవో అలవోకగా వినిపించ సాగాయి. అనేక సాధనలచే సముపార్జించియున్న యోగబలంతో మనస్సును ఏకాగ్రం చేసి ఆ శబ్దములను వినసాగాడు.

ఆ శబ్దములు అదృశ్యరూపులగు సిద్ధుల పరస్పర సంభాషణ అయి ఉన్నట్లు యోగబలం చేత, తార్కిక బలంచేత గ్రహించాడు. "ఆహాఁ! ఇక్కడ ఏదో సంభాషణ వినవస్తోంది. ఇవి సిద్ధులు మాట్లాడుకొనే మాటలు! అయితే సిద్ధులు ఏకాంతవాసులు కదా! మహానుభావులతో సమీప్యత అంత తేలికగా లభించదు. ఈ రోజు నా పుణ్యం ఫలప్రదమౌతోంది కాబోలు. వీరు పవిత్రాత్మ స్వభావులు. వీరి మాటలు వింటుంటే, ఉత్తమోత్తమమగు ఆత్మవస్తువు గురించే సంభాషించు కుంటున్నట్లు నాకు అనిపిస్తోంది. సరే, పూజ్యులగు వీరి వాక్యములను వినమ్రతతో శిష్యభావనా సమన్వితుడనై వినెదను గాక" - అని తనలో అనుకున్నాడు. మనస్సును తదితర విషయముల నుండి వెనుకకు మరల్చి ఏకాగ్రతతో ఆ శబ్దమును వినుటకు, అర్థమును గ్రహించుటకు ఉద్యుక్తుడయ్యాడు.

**ఒకానొక సిద్ధుడు :** మిత్రులారా, ఇప్పుడు ఆత్మజ్ఞాన విషయమై కొన్ని విశేషాలు చెప్పుకుందాం. కొంత సమాచారం చర్చించుకొందాం. మనమన అవగాహనలకు సంబంధించిన అనుభవాలను విశ్లేషించుకుందాం.

❖

**ఒకటవ సిద్ధుడు :**

**ద్రష్ట దర్శనముల సంయోగ స్థానం -** ఒకటి చూస్తున్నది. మరొకటి చూడబడుచున్నది. అవియే – ద్రష్ట – దృశ్యములు కదా! పరిమిత, అపరిపక్వ దృష్టికి, ఈ ద్రష్ట – దృశ్యములు వేరు వేరైనవిగా అనిపించటం, ప్రాప్తించటం జరుగుతోంది. అయితే ఈ ద్రష్ట –దృష్టి –దర్శనం –దృశ్యం కూడా ఒకానొకచోట సంయోగము పొందుచున్నాయి. ఏకైక రూపమై ప్రదర్శనమగుచున్నాయి. అట్టి నిరుపమానందన స్వరూపం అయిన సంయోగ స్థానం ఏదై ఉన్నది?

ఒకానొక అనిర్వచనీయమగు తత్త్వము ఈ 'నేత్రములు' మొదలైన ఇంద్రియముల ద్వారా విషయములతో సంయోగమును ఆశ్రయిస్తోంది. ఆ తత్త్వమే 'ఇంద్రియ విషయములు' అను ఆకారముగల బుద్ధివృత్తులను పొందినదగుచున్నది. సర్వమును 'ఇది సుఖము', 'ఇది దుఃఖము' 'ఇది కావాలి' 'ఇది వద్దు' అని నిర్ణయించేది, భావనచేసేది, అనుభవమును పొందేది అదే.

అట్టి నిరతిశయ భూమానంద స్వరూపమైన ఆత్మనే...... నేను ఆరాధిస్తున్నాను. 'భగవంతుడు' అని చెప్పబడుచున్నది అదే. సవికల్ప – నిర్వికల్ప సమాధులచేత, బాహ్య – అభ్యంతర ఇంద్రియ నిగ్రహములచేత నాచే నిరంతరం ఉపాసించబడుచున్నది అదే.

ఎవరు ఎక్కడ ఉంటే, అది వారికి అక్కడే, అప్పుడే లభించియే ఉన్నది. ఇక దాని కొరకు మరొక స్థానం వెళ్ళాలా? మరి కొంత సమయం వేచి ఉండాలా? ఎందుకు?

అయ్యది "నా యొక్క, సర్వుల యొక్క, సర్వము యొక్క" స్వస్వరూపమునకు వేరైయున్నది కాదు. అట్టి అద్వితీయమైనది (వేరుకానట్టిది), అఖండమైనట్టిది (అనేక జీవులుగా మారు స్వభావము లేనట్టిది), స్వస్వరూపమైనట్టిదియగు ఆత్మ భగవంతునకు ఇదే నా నమస్కారం. దృశ్యరూపము, నా స్వరూపముకూడా సర్వదా అయి ఉన్న 'ఆత్మ'కు ప్రణామములు. సర్వజీవులు తానై, సర్వసాక్షిగా వేరై ప్రదర్శనమగుచున్న అస్మదాత్మదేవా! నీకు నమస్కారం!

❖

**రెండవ సిద్ధుడు :**

**భావనకు మునుముందే ఉన్న సాక్షిసత్త -** ఈ "నేత్రములు" మొదలైన ఇంద్రియములందు 'అనుభవము' స్వరూపముగా ప్రత్యక్షమై "జ్ఞానము" ఉండి ఉన్నది. – ఆ జ్ఞానం ఈ ఇంద్రియములు రూపుదిద్దుకొనుటకు ముందే ఉండి ఉన్నది.

'నేను చూచుచున్నాను' అను రూపముగల అనుభవమునకు ముందే ఆ అనుభవమును ఆశ్రయించు 'నేను' ఉండియే ఉన్నది. అదే విధంగా 'నేను' అనబడునది భావించబడుటకు ముందే, ఆ 'నేను'ను భావించుటకు సిద్ధమగుచున్న సత్త ఉండియే ఉండాలి కదా?

భావించువాడు భావనకంటే ముందే ఉండి ఉన్నాడు. అట్టి 'సాక్షి రూపసత్త' విషయమై కొందరు "అది ఉన్నది.... అదియే ఉన్నది" – అని అంటున్నారు. మరి కొందరు "అది కళ్ళకు కనబడటం లేదుగా!... కనుక లేదు" – అని వాదిస్తున్నారు.

"అసత్తన్నా సదుచ్యతే" – అది 'ఉన్నది', 'లేదు', అని కూడా చెప్పబడుతోంది. అట్లు 'ఉన్నది', 'లేదు' అను విషయమై ఆ రెండింటిని దర్శిస్తూ, అనుభవం పొందే ఒకానొక సాక్షిత్వము ఉండాలి కదా! ఈ అస్థిత్వ – నాస్థిత్వము (ఉన్నది – లేదు) పక్షముల రెండిటియందును మధ్యగతమై, సాక్షిస్వరూపమున వెలుగొందుచూ ఉన్నదేది?

ఔను.....! అది మనస్సుకు, వాక్కుకు అలభ్యముగానే ఉంటోంది. అనుభవమాత్రమే అగుచున్నది. అదియే 'ఆత్మ' అను సంజ్ఞతో మనం చెప్పుకుంటున్నాం.

ఆ ఆత్మ తాను ప్రకాశిస్తూ, తదితరములైన సర్వ వస్తువులను, సమస్త దృశ్యములను ప్రకాశింపజేస్తోంది. అది 'అస్థిత్వము'ను ఆశ్రయించిందా....... 'జగత్తు' అనే కార్యము ఏర్పడుచున్నది. అది 'నాస్థిత్వము'ను ఆశ్రయించినప్పుడో.... 'జగత్తు' తిరోభావరూపము పొందుచున్నది. అట్టి ఆత్మవస్తువునే అనేకులు అనేక నామ – రూపములతో ఉపాసిస్తున్నారు. అందరి ఆరాధన, తపన అదియే. అట్టి 'ఆత్మతత్త్వము'ను నేను నిత్యము ఉపాసిస్తున్నాను.

❖

**మూడవ సిద్ధుడు :**

**ఆధారుడు, నియామకుడు -** "నేను, నీవు, అతడు, ఆమె, వారు, వీరు" అనునవన్నీ ఉన్నది ఎక్కడ? ఎందులో? ఈ సర్వమునకు ఆధారం ఎవరు? ఈ సమస్తము ఎవనికి చెందినది? వీటన్నింటిని నియమించుచూ ప్రభువై పాలించుచున్నవాడు ఎవరు?

ఎవనియొక్క సంకల్ప బలముచేత సర్వము ఉత్పన్నమై ఒకానొక నియమానుసారం ప్రవర్తిస్తోంది? ఈ సర్వమునకు 'కారణ భూతుడు' ఎవడు? ఎవడు ఉంటే మాత్రమే ఇవన్నీ ఉండ గలుగుచున్నాయి? అసలు ఈ సమస్తము ఎవడై యున్నాడు? మాయచే జగద్వ్యవహారములన్నింటినీ నిర్వహిస్తూ సర్వరూపములు తానే అయి ఉన్నాడు.... నామరూపములకు సంబంధించనివాడు ఎవడు? అట్టి సత్యము, నిత్యము, సమము, సర్వము అగు పరమాత్మనే నేను ఆరాధిస్తున్నాను.

❖

**నాలుగవ సిద్ధుడు :**

**సర్వనిర్వచనములకూ ఆలవాలము, సూచకము** (Zone of/indicative of - all definitions)–

"అహమ్..... (నేను)" అను భావన సర్వులయందు సర్వదా సర్వమునకు కారణమై వెలుగొందుచున్నది కదా...! ఈ 'అ'కారము ఆదిగా, 'హ' కారము అంతముగా గల 'అహమ్' అను శబ్దము సూచిస్తున్నది దేనిని?... అదియే 'ఆత్మ' అనబడు మరొక శబ్దముతో కూడా ప్రతిపాదించబడుతోంది. అదియే తదితర వస్తువులన్నిటినీ ప్రకాశింపజేస్తోంది.

అంతేకాదు! సర్వవేదాలలో, తదితరమైన శాస్త్రాలలో అనుగతమైనది అదే. బహు విధాలుగా నామ రూపాదులతో కూడినదై అనేక చమత్కారాలచే ప్రవచింపబడుచున్నది కూడా అదే!

అన్ని అక్షరముల సముదాయ రూపమగు శబ్దజాలమునందు అతడు అంతర్గతుడై ఉన్నాడు. "ఇది సుందరమైనది.... ప్రియమైనది... స్వీకరింపతగినది..... ఆశ్చర్యకరమైనది... పవిత్రమైనది" మొదలైన నిర్వచనములన్నీ ఎవరివి? అహంభావనకే ఆది అయినట్టి 'శుద్ధచిత్' తత్వము యొక్క చమత్కారమే. ఆ ఆత్మభగవానుడే సర్వాకారుడు అయి ఉన్నాడు.

అనగా, అతడే సర్వులుగా ఆకారము గ్రహించుచున్నాడు కదా! కాబట్టి సర్వ నియామకుడు, సర్వవ్యాపకుడు అయి ఉన్నాడు. ఆ సర్వవ్యాపకుడు అనవధ్యుడు. ఆతనిని వధింపగలిగినది, నిరోధింప గలిగినది ఎక్కడా ఏదీ ఉండజాలదు. ఆతడు విభాగములుగా అగుటయే లేదు.

ఆతడు వాస్తవానికి ఏనాడూ మరొకటేదీ అగుట లేదు. కనుక 'జీవుడు', 'మనస్సు' మొదలైన వన్నీ ఆతనిపట్ల భ్రమచే ఆపాదించబడుచున్నవి మాత్రమే. ఆతడు సర్వదా నిర్గుణ బ్రహ్మము నందే స్థితి కలిగివుంటున్నాడు. జలం తరంగమగుచున్నప్పటికీ జలము జలముగానే ఉంటోంది కదా!

**"సోఽ హమ్... సోఽ హమ్... సోఽ హమ్"** - ఆతడే నేను .. నేను ఈ నామ రూపములు కాదు. మనోబుద్ధులు నేను కాదు. చిత్తాహంకారములు నేను కాదు. ఆతడే నేను..... నేనే ఆతడు.

శ్వాసఉచ్ఛ్వాసలచే 'సోహమ్' మంత్రం అసంకల్పితంగానే నాచే నిరంతరం జపించబడుచున్నది కదా! అట్టి ఆత్మ పరమేశ్వరుని ఆరాధిస్తున్నాను... ఉపాసిస్తున్నాను. శరణు వేడుతున్నాను. ఆతడు నిరామయుడు (తీశిజీశీజిలిరీరీ) అని తెలిసికూడా, నామరూపములను ఉపకరణములుగా తీసికొని ఆ ఆత్మానంద తత్త్వమువైపుగా ప్రయాణిస్తున్నాను.

❖

**ఐదవ సిద్ధుడు :**

**న అన్యమ్, న బాహ్యమ్ -** ప్రతి ఒక్క జీవుని 'హృదయ గుహ'లోను ఒకానొక 'సత్త' స్వరూపుడగు భగవానుడు కాపురము ఉండివున్నాడు. సాక్షి స్వరూపుడై వెలుగొందుచూ, సర్వమునూ అతడు వెలిగించుటకు మూలకారకుడు అగుచున్నాడు. అతడెవరు? అతి చమత్కారంగా, 'న అన్యమ్', 'న బాహ్యమ్' (Not different from one's own self. Not anything outside).

అంతరాత్మ స్వరూపుడగు ఆ భగవంతుని ఏమరచి, ప్రక్కకు పెట్టి .... ఈ జీవుడు ఎక్కడో ఉన్నట్లుగా భావించబడు అన్యదేవతలను ఆశ్రయిస్తున్నాడేమిటి? ఎంత ఆశ్చర్యం?

ఓయీ, జీవుడా! నీ హృదయంలో సర్వదా వేంచేసియుండి, సర్వ స్థితిగతులందు, నిశ్చలుడు, నిర్మలుడు అయివుంటున్న ఆ అంతరాత్మయే నీవు. మరేదీ నీవు అయి ఉండలేదు.... ఉండబోవు! చేతిలోని 'మణి'ని పూర్తిగా మరచి, ఎక్కడో దూరముగాగల ఒక్క గాజుముక్కను చూచి "అహో! అది నన్ను సమీపించకూడదా...! ఏంచేస్తే అది పొందగలను?" అని నీవు ఎందుకు కలవరిస్తున్నావు? గుప్పిట విప్పి మణిని చూచినట్లు స్వహృదయమునకు స్థానమైయున్న ఆ స్వస్వరూపాత్మను దర్శించవేం?

ఆ భగవంతుడు అంగుష్ఠమాత్రుడై సర్వుల హృదయములందు సుఖాసీనుడై అంతరాత్మ స్వరూపుడైయుండియే ఉన్నాడు. అందుచేత, ప్రతి ఒక్కరికి మేము చెప్పుచున్నది ఒక్కటే... సర్వ జీవులారా! మీలో ఏ ఒక్కరూ పరితపించవలసిన పనేమీ లేదు. ఆ పరమాత్మ మీ హృదయమునందే సర్వదా వేంచేసియున్నారు. అది గ్రహించండి... ఆరాధించి తరించండి. పరమాత్మ స్వరూపులై సంతృప్తులు అవండి. నా ఆరాధన, ఆరాధ్యము సర్వాంతర్యామి అగు నా అంతరాత్మయే!

❖

**ఆరవ సిద్ధుడు :**

**ఆశ రహితంకాగా అప్పడు శేషించి ఉండేది! -** ఈ జీవుని యందు క్షణక్షణం అసంఖ్యాకంగా, అంతులేకుండా ఏవేవో క్రొత్త క్రొత్త ఆశలు ఏర్పడుచున్నాయి. ఈ 'ఆశ' అనుదానికి అంతు ఉండటంలేదు. ఆశలు ఎందుకు ఏర్పడుచున్నాయి? 'ఆశించుట' అను ప్రకృతి సంబంధమైన స్వభావము చేతనే కదా! ఒకానొక జీవుడు సమస్త ఆశలు పరిత్యజించాడనుకో... అప్పటికీ ఆతనియందు శేషించి ఉండునదేమిటి?

ఆ శేషశయనుడు (అట్లు శేషించు దాని యందు శయనించువాడు) 'చిద్రూప పరబ్రహ్మము' అను సంజ్ఞతో చెప్పబడుచున్నాడు. అదియే బ్రహ్మము. అదియే మర్మము. అది సర్వదా ప్రాప్తించియే ఉన్నది. అట్టి బ్రహ్మముయొక్క జ్ఞానానుభవము ప్రాప్తించిన తరువాత ఇక 'ఆశ' అను విషలతకు స్థానమెక్కడిది? వెలుతురు ఉన్నచోట చీకటికి ఉనికి ఎక్కడ?

హృదయమును ఆశారహితము చేసి అప్పుడు శేషించి ఉండే ఆత్మయే నాచే ఆరాధించబడు పరమోత్కృష్టతత్త్వము. అదియే నా ఆరాధ్య దైవము. అదే సర్వస్వము. నా ప్రయత్నములన్నీ అటు వైపుకే!

❖

**ఏడవ సిద్ధుడు :**

**క్షుద్రాశయం, మహాశయం -** ఈ జగత్తులో 'భోగము' అను అనుభవమును పొందదానికి అనేక వస్తువులు ఎదురుగా కనిపిస్తున్నాయి. ఇవన్నీ వాస్తవానికి సారరహితం. ఇవి అనుక్షణం ఒక స్థితి నుండి మరొక స్థితికి పయనిస్తున్నాయి.

శాస్త్ర వాక్యములు, గురుబోధలు "ఈ జగత్ పదార్థములు నిస్సారములే" అని పదే పదే జీవులకు గుర్తు చేస్తున్నాయి. ఈ జీవులు అవన్నీ వింటూకూడా ఎందుకో 'దుర్బుద్ధి'నే ఆశ్రయిస్తున్నారు. "ఈ వస్తుజాలం సుఖప్రదములు. ఇవి మమ్ములను తదితరుల కన్నా గొప్పగా చేస్తాయి.... కనుక కలిగి ఉంటాం గాక" .. అను యోచనయే జీవన విధానమును శాసించటం జరుగుతోంది. వీరు స్వల్ప వస్తువులకొరకై ద్వేషించుకొనుచున్నారు... దుఃఖించుచున్నారు... శ్రమించు చున్నారు.... పరుగులు తీస్తున్నారు. ఫలితంగా, అజ్ఞానంచే ఆవరించబడిన మనస్సు గలవారై మరల మరల అనేక నీచ ఉపాధులు పొందుచున్నారు. దుర్బలమైన స్థితి గతులు తెచ్చి పెట్టు కుంటున్నారు.

అట్టి భోగ్యవస్తువులను జీవిత లక్ష్యముగా అంగీకరించు మానవులు – వారిని మానవులు అని అనకూడదు. మానవరూపంలో ఉన్న గాడిదల వంటి వారే! ఎందుకంటే వారు తమ మనస్సులందు ఎన్నో 'నిష్ప్రయోజనకరము, త్యాజ్యార్థము' అగు వేదనలు, రోదనలు మోస్తున్నారు కదా!

'ఆత్మ జ్ఞానము', 'ఆత్మానుభవము' – అనునవి లక్ష్యముగా కలిగి జీవించువారి జీవితములు మాత్రమే అర్థయుక్తము, శుభకరము, పవిత్రము కూడా! వారి కర్మలు, వారి శబ్దములు, భావములు క్రమంగా సుఖ శాంతులు సంతరించుకోగలవు.

కనుక ఆత్మతత్త్వజ్ఞానులు, ఆత్మస్వభావులు అగుటకు యత్నించుటచే మహాశయులు (మహత్తరమైన ఆశయములు కలవారు) అగుట ఎంత ఉత్తమం! అట్టి మహాశయమే నా మార్గం.

❖

**ఎనిమిదవ సిద్ధుడు :**

**ఇంద్రియ సద్వినియోగం -** పర్వతాలు రెక్కలతో లేస్తూ ఊళ్ళమీద పడుతుంటే, ఇంద్రుడు తన వజ్రాయుధంతో ఆ పర్వతముల రెక్కలను ఖండిస్తున్నాడు కదా...! అట్లాగే 'ఇంద్రియములు' తమ ఇష్టం వచ్చినట్లు ఆయా విషయములపై వ్రాలుచుండగా ఈ మానవుడు చూస్తూ ఊరుకోవటం ఉచితం కాదు. 'వివేకము' అనే దండముతో వాటిని పదేపదే అణచివేయాలి.

ఇంద్రియసర్పాలు యథేచ్ఛగా ప్రవర్తిస్తూ ఉండే సమయంలో ఆజీవుని హృదయంలో సుఖశాంతులు ఉండే అవకాశమెక్కడిది? ఈ ఇంద్రియాలను నియమించటం ఎఱుగనప్పుడు ఇవి అనంత దుఃఖములలోకి ఈ జీవుని త్రోసివేస్తున్నాయి. దుర్భర జన్మపరంపరలను ప్రాప్తింప జేస్తున్నాయి.

అరేఁ! ఎంతో శ్రమించిన తరువాత, ఆశ్రమకు ఫలితంగా 'మానవుడు' మొదలైన ఉత్తమమైన ఉపాధులు పొంది కూడా, ఈ జీవులలో అనేకులు వాటిని సద్వినియోగపరుచుకోవటం లేదే? శాస్త్రములు, "ఇంద్రియములను ఎట్లు నియమించటం ఉచితం?" – అనే విషయమై అనేక మార్గములు చూపుచున్నాయి.

ఇంద్రియాలు దుర్వినియోగబడకుండు గాక! ఎందుకంటే, అందుకు అంతిమ ప్రయోజనం దుఃఖం, అవివేకం, సంకుచితత్వమే అగుచున్నది. "ఇది సన్మార్గం, ఇది దుర్మార్గం" అని విచక్షణ చేయబడి, అప్పుడు సరియగు మార్గములో, అనగా శాశ్వతము, అఖండము అగు ఆత్మావగాహన పెంపొందించు మార్గంలో – ఈ ఇంద్రియములు వినియోగించబడుగాక! సర్వ అవకాశములు సద్వినియోగ పరచుకుని ఆత్మావగాహన పెంపొందించుకోవటమే సన్మార్గం. అదియే నా సాధన.

❖

**తొమ్మిదవ సిద్ధుడు :**

**ఇంద్రియాతీతత్వం -** ఈ విషయములన్నీ కూడా దుఃఖప్రదములుగానే పరిణమిస్తున్నాయి. ఈ ప్రపంచంలో కనిపించేవన్నీ ఇంద్రియ సంబంధితములే కదా!

మరిప్పుడు ఉపాయమేమిటి? విషయముల వెంటే పరుగులు తీయాలా? ...లేదు.

మానవుడు ఈ బాహ్య, అభ్యంతర వ్యాపారములను నిరోధిస్తూ ఉండాలి. అప్పుడు క్రమంగా ఈ విషయములచే ఏర్పడుచున్న దుఃఖము రహితం అవుతుంది. అట్లు నిరోధించటంలో కొంత శ్రమ ఉన్నమాట నిజమే.

అయినాసరే! బాహ్య – అభ్యంతర వ్యాపారములు క్రమపరచాలి. "అల్పసుఖమును త్యాగం చేసి ఉత్తమ సుఖమును సముపార్జించటం" – అనేది లోకంలో అందరికీ తెలిసిన విషయమేకదా! విషయ సుఖము అధిగమించబడిందా..... అప్పుడు ఆత్మసుఖమే లభించగలదు కదా! అట్టి 'ఉపశమనము'చే ఇంద్రియ వ్యాపారం నిరోధిస్తే, చిత్తము శమిస్తుంది.

చిత్తము ఇంద్రియములనుండి రక్షితమయిన చోట 'జడత్వము' లేనట్టి శుద్ధ పరబ్రహ్మానుభవం లభించగలదు. ఉత్తమ స్థితి లభించగలదు. అప్పుడు ప్రాప్తించుచున్న నిత్యోదిత 'ఆత్మ' లేక పరబ్రహ్మమునకు ఇవే నా నమస్కారములు. ఆనిత్యోదిత పరబ్రహ్మమే నా దృష్టి, నిష్ఠ కూడా!

❖

**ఒకానొక సిద్ధుడు :** మంచిది... ఈ సమయంలో మనం చక్కటి విషయాలు గుర్తు చేసుకున్నాం. ఇక ఈ విషయములు మనం మరికొంత యోచించుకుంటూ ఉండెదముగాక! ఇక మనం మన స్వస్థానములకు వెళ్లుదాం!

❖❖❖

# 2. విచిత్ర ప్రపంచం స్థితిగతులు - ముందువెనుకలు

ఆ విధంగా సిద్ధులు గానం చేసిన గీతములలో అర్థమును తరచి తరచి యోచిస్తూ జనకమహారాజు ఇక ఇంటిముఖం పట్టాడు. కొంతయోచన తరువాత ఆతనియందు ఒక భీరువు వలె విషాదం ఏర్పడింది. క్రమంగా అంతఃపురం జేరాడు. పరివారమునంతటినీ వారి వారి స్థానములకు పంపివేశాడు. కోట యొక్క ఒక ప్రసాదభాగం అధిరోహించాడు. ఒకచోట ఒంటరిగా అటూఇటూ పచార్లు చేస్తూ అతి చంచలముతో కూడినట్టి ఈ విచిత్రమైన ప్రాపంచిక గతుల గురించి తీవ్రమైన పరిశీలన చేయసాగాడు.

**జనక మహారాజు (స్వగతంగా) :** అంతులేకుండా ఆశలు...! అల్పమైన జీవితకాలం...! ఆహా! ఎంతటి ఖేదకరమైన విషయం! ఏమి విపత్తు వచ్చిపడింది! ఈ జన్మమృత్యుజరాభయాదులలో ఎప్పుడో ఎందుకో చిక్కుకున్నాను. ఇంకేమున్నది? మిక్కిలి కష్టప్రదమైన చంచల జీవిత దశలందు బలాత్కారంగా దొర్లించబడుచున్నానే!

ఈ స్వల్ప జీవితాన్ని, రాజ్యాదులను చూచి ఎందుకు అప్పుడప్పుడు నాకు తెలియకుండానే నేను మురిసిపోతున్నాను? ఈ అనంత కాల వ్యవస్థలో నా జీవితం ఎంత స్వల్పమైనది?

అట్టి స్వల్పకాలిక జీవితంలో ఎన్ని స్థితిగతులు!... ఎన్ని ఒడుదుడుకులు...! ఇంతలోనే ధనం, రాజ్యం, జాతి,అధికారం, ప్రతిష్ఠ... మొదలైన మాయా వస్తువుల పట్ల అంతులేనన్ని ఆశలు కల్పించుకొని, ఆ ఆశాపాశముల బంధంలో ఇరుక్కొని ఉన్నానే! "విమర్శ– విశ్లేషణ – అవగాహన"లను ఆశ్రయించని నాకు కాలమును దుర్వినియోగ పరుచుకుంటున్నందుకు ధిక్కార మగుగాక!

ఈ రాజ్యము, రాజరికము మొదలైన పైపై పటాటోపాలు మహా అయితే కొన్ని సంవత్సరాలు ఉంటాయి. ఆపై ఇవన్నీ తొలగవలసినదేకదా! నాకున్న బుద్ధి, శక్తి, యుక్తి ఇవన్నీ కూడా వీటిని కొద్దికాలం కలిగి ఉండటానికి మాత్రమే వెచ్చిస్తే, అది ఎంతటి మూర్ఖత్వం! ఎంతమంది ఇతః పూర్వం ఈ రాజ్యం ఏలారు? కాలక్రమేణా ఎంతమంది వచ్చి ఈ మిథిలా నగరం ఏలబోవుచున్నారు. అయ్యో! ఈ తుచ్ఛమైన 'బుద్ధి' నన్ను "దుర్గతులు, నీచ భావము, తుచ్ఛమైన ఉపాధులు" వైపుగా నడిపిస్తోందేమిటి? ముందు ముందు ప్రాప్తించబోవు దుఃఖముల శమనము కొరకు ఇప్పుడు నేనేమైనా చేస్తున్నానా? అసలు ఈ విషయం గుర్తించి, చింతిస్తున్నానా? లేదు. ఇట్లా అయితే ఇక ఒక కంచరగాడిదకు నాకు తేడా ఏమి ఉంటుంది?

నేను వాస్తవానికి అనాది అయిన, అనంతమైన స్వరూపముగల ఆత్మ చైతన్యమునేకదా! మధ్యలో ఈ అల్పమైన 'జీవితము' అనబడునది నా స్వకీయమైన "శరీరముతో ఏర్పరుకొనిన సంబంధము" చేతనే ప్రాప్తించుచున్నది. ఇదంతా అవివేకముయొక్క ప్రభావమే. ఒక చిత్రపటంలోని చంద్రుని చూచి అమాయకబాలుడు, "ఈ చంద్రుని చల్లటి అమృతతుల్యమైన కిరణాలు నన్ను ఆహ్లాద పరుస్తున్నాయి" అని చెప్పుకొంటుంటే ఏమనాలి? "ఈ దేహమే నేను" అని భావించుచు, అనాత్మభూతమగు ఈ దేహాదులను ఆత్మరూపంగా తలచుచు వ్యర్థంగా కాలము గడపివేస్తున్నాను. ఇంతకు మించి నా విషయమై విశేషమేమీ లేనట్లు భ్రమతో కూడిన ధైర్యము కలిగి ఉంటున్నాను. ఏమి మూర్ఖత్వం!

**ఎంత కష్టకాలం! -**

**ప్రపంచరహితేనాహ మింద్రజాలేనజాలినా ।**
**హాకష్టమతిముహ్యామి కేనాస్మిపరిమోహితః ॥** (శ్లో 9, సర్గ 9)

ఏ ఇంద్రజాలకుని ఇంద్రజాలముచే పరమమోహితుడనై నేను ఈ 'రాజ్యము, రాజసింహాసనం, బంధువులు, స్వజనులు మొదలైనవాటిచే మోహం పొందుచున్నాను? ఈ ఎదురుగా కళ్ళకు కనబడేవి సత్యమని, నిత్యమని నేను ఎందుకు భావన చేస్తున్నట్లు?

**జగత్పదార్థముల భావన -** ఈ దృశ్య జగత్తును ఎంతగా పరిశీలించి చూస్తే ఏమి లాభం? ఇందులో సత్యమైన, అపరిచ్ఛిన్నమైన వస్తువంటూ ఏదైనా ఉన్నదా? ఈ ప్రపంచమంతా వెతికి చూచినప్పటికీ అట్టి వస్తువు లేదు కదా! ఈ నా శరీరమే కొంతకాలానికి నేలకూలిపోబోవుచుండగా ఇక ఎదురుగా నిలచియున్న జగత్పదార్థముల విషయం వేరే చెప్పేదేమున్నది? అసత్యము, అనిత్యము అయినవాటిచే నాకు చిత్త విశ్రాంతి ఎట్లా లభిస్తుంది?

అజ్ఞానదృష్టికి స్వల్పమైన విషయములు, పదార్థములు మహత్తరమైనవాటివలె అగుపిస్తున్నాయి. తత్ఫలితంగా సత్య వస్తువుయొక్క అనుభవం అత్యంత దూరంగానే ఉండిపోతుంది. నేను ఏ సత్యవస్తువుకై అన్వేషిస్తున్నానో, అది నా మనస్సుకు కూడా సాక్షి అయి, ఈ సర్వమునకు నియామకమై వెలుగుచున్నది.

ఎక్కడికి వెళ్ళాలి? ఏమి చూడాలి? – ఆ సత్యవస్తువు నాకు ఎంత సమీపంలో ఉన్నదో తరచి చూస్తే 'ఆ సత్యమే నేను' అని తెలియ వస్తోంది. అట్టి 'నిత్య–శుద్ధ–అఖండ–అప్రమేయ' పరమాత్మ యొక్క దర్శనం ఎక్కడికి వెళ్ళితే లభిస్తుంది? అతడు నా హృదయమునందే హృదయమునకు సాక్షీభూతుడై ఉన్నాడు కదా! కనుక ఆతని కొరకు హృదయమునందే వెతకాలిగాని, ఎక్కడో బయట వెతికితే ఏం లాభం? నా దివ్య చైతన్య – స్వభావం నాయందే వెతికి దర్శించాలికాని, మరెక్కడెక్కడో కాదే!

హృదయములోనే ఉంటూ కూడా ఆతడు ఎందుకు లభించుట లేదు? బాహ్య పదార్థముల పట్ల నిరంతరం ఏర్పడుచున్న ప్రియాప్రియములతో కూడిన భావనయే అందుకు అడ్డగుచున్నది కదా! ...కనుక, సర్వ బాహ్యపదార్థములను త్యజించివేసెదనుగాక! అసలు అపేక్ష ఎందుకు ఉండాలి?

ఈ జీవులలో అనేకులు "మేము భోగములను పొందవలసియున్నది" అను లక్ష్యముతో అల్ప ఆశ్రయములగు ధనార్జన, పంచేంద్రియములను సంబంధించిన రాగముతో కూడిన విషయములు – మొదలైన వాటియందు తీవ్రముగా ప్రవృత్తులగుచున్నారు. కాని ఏం లాభం? అవి లభించినా, అవన్నీ క్షణభంగురములే కదా!

నీటిలో 'ఆవృత్తములు' ఎంత కాలం నిలిచి ఉంటాయి? ఇవన్నీ కూడా అంతమాత్రమే! చిటికెలో మాయం అయ్యేవే! ఈ ధనాదులు సంపాదించే కాలంలో, కలిగియుండే కాలంలో కూడా జీవునకు అనేక దుఃఖములను కలుగజేస్తున్నాయి కదా! ఇట్టి తుచ్ఛము, నిస్సారము అయినట్టి పదార్థముల కొరకు ప్రయత్నించుచూ, వర్తమానపు శక్తి యుక్తులనన్నిటినీ నేను ఎందుకు నేలపాలు చేసుకోవాలి?

'పరబ్రహ్మం' అను శబ్దంచే చెప్పబడుచున్న ఆత్మవస్తువు సర్వదా తాను వెలుగుచూ సర్వమునూ వెలిగించుచూ ఉండియే ఉన్నది. అది ఈ నా శరీర ధారణకు ముందే ఉంది. ఇప్పుడు కూడా ఉంది ఈ శరీరం త్యజించబడవచ్చు, అయినప్పటికీ అది అట్లే ఉండి ఉంటోంది. దాని యందు ఏ సమయం లోనూ ఎట్టి మార్పుచేర్పులు ఉండవు. ఆ పరబ్రహ్మము నా కంటే వేరైనది కాదు. బ్రహ్మానంద స్వరూపం, ఏకైక సత్యం అదియే. అట్టి ఆత్మ వస్తువును ఎఱుగుట కొరకు, అట్టి ఎఱుక 'అనుభవం'గా పరిణమించుటకు ఈ వర్తమానపు శక్తియుక్తులను నేను ఎందుకు వినియోగించ రాదు? ఏ విషయసుఖాలైతే, ఉపేక్షించినంత మాత్రం చేత నిత్య సత్యమగు 'ఆత్మ'యే లభిస్తుందో, అట్టి 'ఆత్మ స్వభావం'ను వదలి.... గడ్డిపరకల వంటి విషయ సుఖాల కొరకు, ఈ రాజ్యం, అధికారం మొదలైన తుచ్ఛ వ్యవహారాల కొరకు నేను ఎందుకు అఱ్ఱులు చాచాలి? ఎవరి కొరకు అపేక్షించాలి? అవి ఉంటే ఉండనీ, లేదా తొలగనీ! అందులో ఏం విశేషం ఉన్నది? ఈ రాజ్యాదులు ఎదురుగా ఏర్పడి ఉన్నంత మాత్రం చేత అవి నావి అవుతాయా? అవన్నీ బాహ్యమైనవే కదా! నాది విదేహరాజ్యం.

**'నాది' అనతగినదిక్కడ ఏమి ఉన్నది -** ప్రతిక్షణం, ప్రతిరోజు, ప్రతి మాసం, ప్రతి సంవత్సరం వస్తోంది, పోతోంది. "అనేక సుఖాలు పొందవలెనను లక్ష్యంతో ఆయా ప్రయత్నాలన్నీ నిర్వర్తించటం" – అనునదంతా చివరకు దుఃఖరూపముగానే పరిణమిస్తోంది. అసలు ఈ ప్రపంచంలో వినాశనం కానిదంటూ ఎక్కడా ఏదీ లేనేలేదు. అతి త్వరలో కాలగర్భంలో కలిసిపోయే ఏ వస్తువునైనా 'ఉత్తమ వస్తువు' అని అనటం ఎట్లా?

కాబట్టి 'నేను కలిగియున్నాను' అని ఏదేది నాచే భావించబడుచున్నదో – అట్టి రాజ్యములు, తదితర జనులతోటి సంబంధ బాంధవ్యములు, ఈ శరీరాదులు ...ఇవన్నీ భ్రమ కారణంగానే అట్లు భావించబడుచున్నాయి.

అనంతమగు మహాకాల దృష్టిచే, లేక... తత్త్వదృష్టిచే చూచినప్పుడు 'ఇంద్రుడు – బ్రహ్మ' మొదలైన వారి పదములు కూడా అత్యంత స్వల్పమైనవిగాను, కాలముచే నశించిపోయేవి గాను, దుఃఖ ప్రయాసలతో కూడుకొన్నవి గాను తెలిసిపోవుచుండగా ఇక ఈ అత్యంత స్వల్పకాలికమగు ఈ మిథిలా రాజ్య సింహాసనం ఎంతటిది?

ఈ దృశ్య జగత్తును వివేచనాదృష్టితో పరిశీలిస్తూ ఉంటే నాకు ఒక్కటే అనిపిస్తోంది.... జీవులకు నిరంతర చిత్త విశ్రాంతి పొందింపజేయగల పదార్థమేదీ ఇక్కడ లేనేలేదు.

ఈ రోజు సుందర స్త్రీలు, మహారాణులు తమ జడలకు అలంకరించిన సుకుమార సుగంధ పుష్పాలు రేపటికి వాడి, శల్యమై ఒక మూలకు నెట్టివేయబడుచున్నాయి. నేడు ఈ శరీరం అనేక కిరీటాలను, భుజకీర్తులను ధరించి, అనేకులను శాసిస్తూ ఇటూ – అటూ తిరుగుచుండ వచ్చుగాక! ఇదే శరీరం కొద్ది రోజులకు మూల్గుతూ మట్టి యందు కూలబోవుచున్నదే....!

మరి మూర్ఖురాలగు నా చిత్తం ఇదంతా గమనించదేం? ఇది ఆయా తుచ్ఛ విభవము లందు, సంబంధము లందు, జాత్యహంకారము లందు ఎందుకు విశ్వాసం కలిగి ఉండి, రోజులు గడుపుచున్నదో నాకు అర్థం కాదు!

ఆకాశంలో పిల్లగాలులు ఆస్వాదిస్తున్న ఒక పక్షి ఆ ఆకాశాన్ని వదిలి "ఈ అడవిలో నేలపై బియ్యపు గింజలు ఎలా వచ్చిపడ్డాయి?" అనే ఆలోచనే చేయకుండా, నేల వ్రాలి వలలో చిక్కుకుని వేటగాని చేతులలో హింసించబడుచున్నది కదా! ...ఆ పిట్ట వేటగాని బుట్టలోకి త్రోసివేయబడు చున్నట్లు, నా ఈ చిత్తము తుచ్ఛము, నశ్వరము, ప్రమాదకరము" అగు విషయ సుఖముల వైపుకే ఆకర్షించబడుతోంది!

**ఆశాపాశములు -**

**అరజ్జురేవబద్ధోఽహ మపంకోఽస్మికలంకితః ।**
**పతితోస్మ్యుపరిస్థోపి హా మమాత్మన్హతాస్థితిః ॥** (శ్లో 16, సర్గ 9)

హాఁ ! హతవిధీ! ఇక్కడ త్రాడువంటిదేమీ ఎదురుగా లేకున్నప్పటికీ నేను మాత్రం ఇక్కడి విషయములకు కట్టివేయబడి ఉన్నానే? ఆశాపాశములు వివేచనా శక్తిని కట్టివేసి ఉంచుతున్నాయి.

బురద లేకుండానే నేను కళంకితుడనగుచున్నాను. జన్మ జన్మలుగా ఆర్జించిన దుర్వాసనలు, కుసంస్కారములు నన్ను దోషపూరితునిగా చేస్తున్నాయి.

"నీవు ఆత్మవే సుమా"– అని పెద్దలు పలుకుచున్నారు. ఆ వాక్యం విని కూడా ఏం లాభం? సర్వమునకు ఆవల ఉన్నట్టి నేను ఇప్పుడు ఇక్కడ జడత్వముచే కూలబడి ఉన్నాను. నా ఆత్మ యొక్క వాస్తవతత్త్వాన్ని ఇక్కడ "అజ్ఞానం, దురాశలు, రాగద్వేషములు, జాతి మొదలైన అహంకారాలు" – కప్పివేస్తున్నాయి. కారుమేఘం సూర్య ప్రకాశాన్ని అచ్ఛాదించునట్లు, నేను స్వతఃగా మహాధీమంతుడును, శుద్ధుడను, అఖండుడను అయినప్పటికీ మోహం వచ్చిపడి నన్నెందుకో ఆవరించి వేస్తోంది.

**ఏది నేను? ఏది నాది? -**

**క ఇ మే మహాభోగాః? క ఇమే మమబాంధవాః?**
**బాలో భూతమయేనేవ సంకేతేన అహమాకులః ॥**

ఈ మహాభోగము లేమి? ఈ నా బంధువులంతా ఎవరు? ఆహా! ఒక బాలుని లాగా వ్యర్థంగా "నేను, నాది" అను కల్పనచే నిష్కారణంగా వ్యాకులపడుచున్నానే? ఈ 'భోగం', 'దృశ్యం' లందు నేను ఎందుకు స్వయంగా విశ్వాసం కల్పించుకొనుచున్నాను? నా యొక్క తుచ్ఛ విశ్వాసమే నాకు జరా–మరణాల కల్పనను ఆపాదింపజేయుచు, అత్యంత భయదాయకం అగుచున్నదే? ఈ ధన, బాంధవాదులు ఉంటే ఉండనీ, ...లేదా పోతే పోనీ! వీటితో నాకేమిపని? నీటిలో ఏర్పడే 'బుడగలు' లాగా ఇవన్నీ మిథ్యా రూపంగానే సంప్రాప్తిస్తున్నాయి. వీటితో సంబంధాలు దర్పణంలోని ప్రతిబింబాల వంటివే కదా!

మనం అనేకమంది చక్రవర్తుల గురించి విన్నాం. వారు మహా భోగములు అనుభవించారు. ఉత్తమగుణ సంపన్నులగు బంధువులను కలిగియున్నారు. ....అవన్నీ ఏమైనాయి? కేవలం నామ మాత్రంగానే మిగిలాయే? ఇప్పటి నాకు సంబంధించిన వస్తువిశేషములన్నీ భవిష్యత్‌లో అంతే కాబోతున్నాయి. మరి ఈ వర్తమానము నందు నేనెందుకు విశ్వాసం వహించి ఉండాలి? గొప్ప రాజుల విభవాలకు ఏం గతి పట్టింది? అంతే కాదు... ఇతఃపూర్వపు బ్రహ్మదేవునిచే రచించబడిన అనేక బ్రహ్మాండాలన్నీ ఇప్పుడేమైయ్యాయి? మటుమాయమై పోయాయే! అనేక మంది బ్రహ్మలే గతించారు. ఈ బ్రహ్మాండం యొక్క గతి కూడా అంతే కాబోవుచున్నది. ఇక నాకు 'నాది' అనబడు భావం గాని, అపేక్ష కాని ఎందుకు ఉండాలి?

జలం బుద్బుదములను తన యందే లయం చేసుకుంటూ ఉంటుంది. 'కాలుడు' అనబడువాడు లక్షల కొలది ఇంద్రులనే మ్రింగివేశాడు. మరి స్వల్ప విశేషముల యందు విశ్వాసము కలిగి ఉండే నా వంటి మూర్ఖులను చూచి విజ్ఞులు నవ్వుకొనుటలో తప్పేమున్నది?

అనంతకోటి బ్రహ్మదేవులు గతించారు. అనేక సృష్టిపరంపరలు గడిచిపోయాయి. ఎందరో రాజులు కోట్ల సంఖ్యలలో ధూళికణములవలె వినష్టమైపోయారు. ఇక నేనెంత? ఈ రాజ్యమెంత? ఈ నా బంధుజనమెంత? ఈ స్వల్ప ఇంద్రియ సుఖములు ఎంతటివి? ఈనా స్వల్ప జీవితమునందు

ఏవేవో పొందాలని ఆశలు కలిగి వుండడం ఎంతటి మూర్ఖత్వం! ఎంతటి నీచమైన స్థితి! ఎంతటి అల్పాశ్రయం!

**దేహాత్మ బుద్ధి -** ఈ ప్రపంచమంతా 'సంసారము' అనే రాత్రి యందు పొందబడుచున్న ఒకానొక దుష్టస్వప్నం వంటిది మాత్రమే. 'ఈ నా దేహం, తదితర దేహంలు, పదార్థజాలం' మొదలైన వాటి యందు ఇంతకాలంగా ఎంతో నమ్మికతో వ్యవహరిస్తున్న నాకు ధిక్కారమగు గాక! పుత్రులు, పేరు ప్రతిష్ఠలు మొదలైన కల్పనలన్నీ కూడా వ్యర్థములు, అసత్య స్వరూపాలు కూడా! ఈ 'అహంకారం' అనే పేరు గల పిశాచంతో కూడి ఉండాలని నాకు చెప్పినదెవరు? ఇట్లా అజ్ఞాని వలె నేను ఎందుకు ఉంటున్నాను? ఒకవైపు క్షణములు, నిమిషాలు, రోజులు, సంవత్సరాల రూపమున ఉన్న సూక్ష్మ కాలం చేత ఆయువు క్షణక్షణం విచ్ఛిన్నమైపోతోందే. మరొకవైపు ఏవేవో ఆశలు, ఆర్తులు, అసంతృప్తులు ఇంతకింతకు ప్రవృద్ధమగుచూ ఎదురుగా ఉన్న సమయమంతా ఆక్రమించి వేస్తున్నాయే!.

ఇదంతా చూస్తూ కూడా నేను ఎందుచేత విచారణ చేయుటలేదు?

ఓ ఆశా సమూహములారా! మీరంతా నా ముందు ఎందుకు విజృంభిస్తున్నారో చెప్పండి? కాలం యొక్క గతి ఎట్లున్నదో గమనిస్తున్నారా? ఏమి కాలమహిమ! బ్రహ్మ మొదలైన దిక్పాలకులే వారి వారి ఆసనములలో ప్రతిమలుగా కాలం చేత శాసించబడి ఆటాడింపబడుచున్నారే? మరి ఏమి ఆశించి ఏం లాభం? కాలం యొక్క క్రీడా వ్యసనము కారణముగా క్షీరసాగరంలో ప్రశాంతంగా నిదురించే విష్ణుదేవుడంతటి వాడు కూడా ఆకాశాన రాక్షసులతో యుద్ధంలో పాల్గొనవలసివస్తోంది.

ఈ కాలము మహా రుద్రులను ఎందరినో భక్షించివేసింది. ఓ నా ఆశలారా! అట్టి కాలము నందు మీరు, నేను ఒక లెక్కా? మరి ఇదంతా గమనించకుండా మీ ఇష్టం వచ్చినట్లు పెత్తనం చెలాయిస్తున్నారేం?

**అనురక్తి, విరక్తి -** తెల్లవారుతోంది, ప్రొద్దుగ్రుంకుతోంది. ...రోజులు గడిచిపోతున్నాయి. కాని, దోషరహితం, ఆనంద స్వరూపం అయిన వస్తువు లభించిన రోజు ఒక్కటైనా ఉన్నదా? లేదు. చెరువు ఒడ్డున కాకులు, కొంగలు వచ్చి వ్రాలునట్లు ఈ ప్రాణుల యొక్క చిత్తము లందు భోగముల పట్ల 'ఆశ' స్ఫురిస్తోంది. వారు ఆ ఆశల వెంటనే పరుగులు తీస్తున్నారు. అంతేకాని ఆత్మ సాక్షాత్కారం కొరకు ప్రయత్నించుట లేదు... పొందుట లేదు. మరి ప్రయోజనమేమిటి? అనేక కష్ట సుఖములు వస్తున్నాయి.... పోతున్నాయి.

**కష్టాత్కష్టతరంప్రాప్తో దుఃఖాద్దుఃఖతరంగతః ।**
**అద్యాపినవిరక్తోస్మి హాధిఙ్మామధమాశయమ్ ॥** (శ్లో 31, సర్గ 9)

అల్పమైన కష్టం నుండి అధికమైన కష్టం, చిన్న దుఃఖం నుండి పెద్ద దుఃఖం, ...ఇట్లా దుర్భర అనుభవాలన్నీ వచ్చి పడుతున్నప్పటికీ నాకు ఈ సంసారం పట్ల విరక్తి ఏర్పడటం లేదు. నేను ఎంతటి అధమ చిత్తుడను! ఏ రమణీయ పదార్థాలపై నేను దృఢమైన ప్రతిష్ఠ కలిగి ఉన్నానో – అవన్నీ నశించిపోయేవే కదా! ఈ ప్రపంచంలో 'చిరస్థాయి'గా వుండే వస్తువు ఏదైనా ఒక్కటన్నా ఉన్నదా?

ఈ సంఘటన–దుర్ఘటనలు, ఈ సంబంధ బాంధవ్యములు, ఈ సుఖదుఃఖములు, ఈ ప్రియ, అప్రియములు, ఈ శరీరపు ఆకర్షణ–వికర్షణలు ...ఇవన్నీ కూడా కొంతకాలం క్రితం లేవు. మరి కొంతకాలం తరువాత ఉండవు. మధ్యలో ఉన్నట్లు తోచుచున్నాయి. ఇవి సత్యము ఎలా అవుతాయి?

ఈ 'వయస్సు' అనబడేది మధ్య కాలంలో మాత్రమే రమణీయంగా ఉంటోంది. ఈ 'యాగం' మొదలైనవి తదనంతరంగా కొద్దికాలం మాత్రమే రమణీయంగా ఉంటున్నాయి. ఇంద్రియ అనుభవములు విచారణ చేయకపోవుటచేతనే ప్రియంగా ఉంటున్నాయి. ఏది ఏమైతేనేం? ఏవేవి రమణీయముగా ఉంటున్నాయో, అవన్నీ కూడా 'వినాశనము' అను ఒక అగమ్య ప్రదేశము వైపుకు ఎక్కుపెట్టబడి ఉన్నాయి. మరివన్నీ అపవిత్రము కాక ఇంకేమిటి?

మనుజుడు ఏయే పదార్థములయందు తనయొక్క విశ్వాసమును బంధించుకొని ఉంటున్నాడో, ఆయా పదార్థములన్నీ తరచూ దుఃఖమునే కలిగించడం మనం చూస్తూనేవున్నాం.

జీవులు ఎందరో ఈ ప్రపంచంలోకి వస్తున్నారు. ఇక్కడకు వచ్చి ఇక్కడ జడస్వభావమును ఆశ్రయిస్తున్నారు. ఇక్కడ నాది, నీది అను లోభమును కలిగియుంటున్నారు. అట్టి లోభ స్వభావము యొక్క ఫలితమేమిటి? అధికమైన పాపపు క్రియలతో కూడినది, అధికమైన క్రూరత్వముతో కూడినది, అధికమైన దుఃఖములను జనింపజేసేది అయినట్టి భవిష్యత్ స్థితిని పొందటమే కదా!

మానవ జన్మ ప్రాప్తించింది ఇందుకా? అయ్యో! బాల్యమంతా అజ్ఞానముతో గడిచిపోతోంది. యౌవనమందామా... మన్మథుడు అను వానిచే పచ్చిగా మోసగించబడుతోంది. వార్ధక్యం కుటుంబ చింతలు, ఒడలుచున్న భౌతికదేహములచే బాధింపబడుచున్నది.

ఇక ఈ జీవులు తమను తాము ఎప్పటికి ఎట్లు ఉద్ధరించుకోగలరో? చర్విత చరణంగా జన్మలు వస్తున్నాయి, పోతున్నాయి. ఈ జీవుడు తన యొక్క శాశ్వతత్వమును మాత్రం గమనించ లేకపోతున్నాడు.

**నిస్సార సంసారం -**

**ఆగమాపాయివిరసం దశావైషమ్యదూషితమ్ ।**
**అసారసారంసంసారం కింతత్పశ్యతిదుర్మతి ॥** (శ్లో 37, సర్గ 9)

ఈ సంసారం అపారమైనది. నిస్సారమైనది. అయినప్పటికీ ఎంతో సారవంతమైనదిగా ఎంచ బడుతోంది. ఇది ఆద్యంతములలో అసద్రూపమైనది(Unreal from the beginning to the end). భోగకాలములో విరసమైనదై ప్రాప్తిస్తోంది (Distasteful at the time of experiencing). దారిద్ర్యము, రోగము, వార్ధక్యము, భయము, ఉద్వేగము – మొదలైన వాటిచే పరమదూషితమైనది. అట్టి ఈ నిస్సార సంసారమును దుర్బుద్ధి చేతనే నేను ఆశ్రయిస్తున్నాను. అపరిపక్వమైన అవగాహన చేతనే ఇందు ఏదో పొందవలెనని దేవులాడుచున్నాను.

ఒకడు రాజసూయము, అశ్వమేధము మొదలైన అనేక యాగములను ఎంతో ప్రయాసతో నిర్వర్తించి, చివరకు బ్రహ్మ దేవత్వం పొందుతాడు. కాని మహాకాలము యొక్క సమక్షములో ఆ

బ్రహ్మదేవత్వము కూడా క్షణికమే కదా! ఎక్కడ ఏ గొప్ప విశేషమున్నది? ఆపదలచే పీడించబడని ప్రదేశమంటూ ఈ ముల్లోకములలో ఎక్కడ ఉన్నది? "అనేక సుఖములకు ఆలవాలము, అనేక పుణ్య కార్యముల యొక్క అంతిమ ప్రయోజనము" అని చెప్పబడే స్వర్గలోకమే అసురులు చేసే దండయాత్రలచే బాధింపబడుచున్నదే! ఇక భూ, పాతాళాల గురించి వేరే చెప్పేదేముంది?

బాహ్యమే ఈ విధంగా ఉన్నది. ఇక అంతఃకరణం అగు 'చిత్తం' గురించి ఏం చెప్పాలి? ఈ చిత్తము నిండా అనేక శారీరక మానసిక వ్యాధులు, వ్యధలు నిక్షిప్తమై ఉన్నాయి. చెదలు కొయ్యను బాధిస్తున్నట్లు ఎన్నో దురవగాహనలు చిత్తములో తాండవం చేస్తున్నాయి. ఇవన్నీ విచారించబడేది ఎట్లా? ఎప్పటికి?

**ఏదో ఆర్తి...! -** ఈ ఎదురుగా ఉన్న వర్తమాన జగత్తు విషయానికి వస్తే దీనినెత్తిపై 'నాశనము' అనునది అవశ్యం నెలకొనియున్నది. రమణీయమని అనుకొనబడే వస్తువులన్నిటిలో అరమణీయతే దాగి ఉంటోంది కదా! "ఇవి సుఖప్రదములు" అని అనుకొనబడేవాటియందు అనేక దుఃఖపరంపరలు వ్యవస్థితములై ఉంటున్నాయి.

మరి నేను దేనిని చూచి 'ఇది నిర్దుఃఖము' అని నిర్ణయించి ఆశ్రయించాలో అర్థమవటం లేదు. ఈ జగత్తు, ఇందలి పదార్థాలు చివరికొచ్చే సరికి దుఃఖములే ప్రయోజనంగా కలిగి ఉండగా, మరి నా మనస్సునందు "ఇది పొందాలి..... అది పొందాలి" అనే ఆరాటం ఎందుకు?

**ఎప్పటికప్పుడు దేనికి దానికే క్షణికం -**

**జాయన్తేచమ్రియన్తేచ ప్రాకృతాఃక్షుద్రజంతవః ।**
**ధరాతైరేవనీరన్ధ్రా దుర్లభాఃసాధుసాధవః ॥** (శ్లో 42, సర్గ )

ప్రాకృతస్వభావులగు క్షుద్రజీవులు అనేకులు జన్మిస్తున్నారు. చచ్చుచున్నారు. ఇట్టి అనేక జీవులచే ఈ జగత్తు పరిపూర్ణమైయున్నది. కాని, ఉత్తములగు మహాత్ములు అతి దుర్లభంగా ఎక్కడోగాని తారసపడుట లేదు. ఈ విలాసినుల అందమైన కళ్ళు వీరి ప్రేమాధిక్యత మొదలైనవన్నీ క్షణభంగురమే కాబట్టి, వీరిని ఆశ్రయించినవారు నవ్వులపాలు అగుచున్నారు. ఎవరికైతే 'కన్ను తెరిస్తే సృష్టి – కన్ను మూస్తే ప్రళయము' అయి ఉన్నదో, అట్టి జగత్పాలకులే కాలముచే మ్రింగబడుచున్నారు.

ఇక ఈ వర్తమానం, ఇందు ఏర్పడియున్న స్థితిగతులు క్షణికంగాక మరింకేమిటి?

**సంపదలకంటే ఆపదలే నయమే! -** ఈ ప్రపంచంలో 'దీర్ఘకాలంగా ఉండేవి, రమణీయము లైనవి' అయిన కొన్ని పదార్థములు ఉన్నాయనే అందాం! ...కాని, వాటన్నిటియొక్క పర్యవసాన మేమిటి? వాటిని ఆర్జించటం, రక్షించుకోవటం, వినియోగించటం – ఇవన్నీ శ్రమతో కూడుకున్నవే కదా! ఓ నా చిత్తమా! అట్టివాటిని ఆశించటంలో ఏం ప్రయోజనం పొందగోరుచున్నావు చెప్పు? ఈ విచిత్రమైన సంపదలన్నీ 'నశించుట' అను స్వభావం తప్పక కలిగియే ఉన్నాయి. కనుక అవి నా దృష్టిలో గొప్ప ఆపదలే అగుచున్నాయి. ఏది ప్రియమో, అది కోల్పోవుచున్నప్పుడు బాధగానే ఉంటుంది కదా! 'కోల్పోవుట' అనేది ఏనాటికైనా తప్పేది కాదు మరి!

అందుచేత, ఓ సంపదలారా! మీకన్నా ఆపదలే నయం. ఎందుకంటారా? "దారిద్ర్యము, బంధు వినాశనము" మొదలైన ఆపదలు "సాధువులను దర్శించుట, తీర్థ యాత్రలను సేవించుట, వ్రతాలు, పూజలు ఆచరించుట" మొదలైన వాటియందు నన్ను నియోగిస్తున్నాయి. ఆ ప్రయత్నాలు వివేక, వైరాగ్యాల వైపుగా నన్ను నడిపిస్తున్నాయి. అందుచేత, నేను సంపదల కంటే ఆపదలే ఉత్తమ మైనవిగా అభిప్రాయబడుచున్నాను.

**వ్యర్థ కల్పనలు -** సముద్రజలంలో ప్రతిబింబించే చంద్రుడు నిజచంద్రుడు కాకపోయినప్పటికీ ఉపరితలపు నీటియొక్క కదలిక "చంద్రుని కదలిక" అని అనిపిస్తూ భ్రమింపజేస్తుంది కదా! ఈ 'జగత్తు' అనునది మనస్సు యొక్క వివర్తము మాత్రమే. పైగా, ఇది క్షణభంగురం. అట్టి ఈ జగత్తు లోనికి 'నేను' 'నాది' అనబడునవి ఎక్కడినుండో వచ్చిపడుచున్నాయి. అట్టి వ్యవహారసరళి అంతా నిరర్థకమే అయి ఉన్నది. 'భోగములు పొందవలెను' – అను ఆశతో కూడిన ఈ మనస్సు కాకతాళీయ న్యాయముచే జగత్ స్థితిని పొందుచున్నది. ముందుగా మనస్సు, ఫలితంగా ఈ జగత్తు. "ఇది కావాలి, ఇది తొలగాలి" – అను కల్పనలను వ్యర్థంగా చేస్తోంది. ఫలితంగా, ఈ 'జగత్తు' అనబడేదంతా నా చుట్టూ అలుముకోనారంభిస్తోంది.

ఈ సాంసారిక దశలన్నీ దేశ–కాల వస్తువులచే పరిమితము, సంకుచితము, నిరోధము పొంది ఉంటున్నాయి. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక తాపములచే సంతప్తమై ఉంటున్నాయి. అగ్ని శిఖ వంటి ఈ సాంసారిక దశలందు ఒక దోమవలె నేను ఎందుకు అనురక్తుడనై ఉంటున్నానో.... ఎంత తరచినా కూడా అర్థమగుటలేదు.

ఇక్కడ ఆవేశపూరితమైన అనురక్తి కలిగిఉండటం ఎంతటి ప్రమాదం. ఇంతకన్నా అగ్ని యందు భస్మం అవటం మేలు. లేక, రౌరవాది నరకములలో దొర్లటం మంచిది. అంతే గాని, సుఖదుఃఖ రూపములగు ఈ సాంసారిక దశలను ఏవేవో కల్పనలు చేసుకుంటూ ప్రవర్తించటం మాత్రం ఉచితం కాదు. ఈ సంసారమే సర్వ దుఃఖములకు మూలస్థానం. దీని యందు పడిన జీవులకు ఇక సుఖమెక్కడిది? అల్పమైన దుఃఖమును అధికమైన దుఃఖ సంఘటనతో పోల్చుకొనుచూ, 'ఇది సుఖరూపము' అను భావన మాత్రమే ఇక్కడ సుఖముగా చెప్పబడుచున్నది. "ముందు ముందు దుఃఖముగా పరిణమించగలదు" అని తెలిసి కూడా ఈ జీవుడు కొన్నిటిని సుఖప్రదములుగా గాంచుచున్నాడు. ఇంకేమని చెప్పాలి?

**మనస్సును రహితం చేసేది ఎట్లా -** ఆహా! నేను కూడా అధముడనై, కట్టై, రాయి వలె మూగ వాడినై, అజ్ఞానినై ఇంతకాలం విచారణాహీనుడుగానే ఉండిపోయానే? ఈ విశాల సంసార వృక్షానికి మూలం మనస్సే కదా! 'సంసారము' అనబడే వ్యవహారం అసంఖ్యాకములగు సంకల్పములతో బ్రహ్మాండములతో, విరాట్ పురుషులతో, సుఖదుఃఖ ఫలములతో, రాగ, లోభాలతో కూడియున్నది.

ఇంతటి వ్యవహారములు రుచిచూస్తూవున్న చిత్రకారుడు ఎవరు? మనస్సే కదా!

**ఈ మనస్సు యొక్క రూపమేమిటి? -** మననముచేయు స్వభావమే మనస్సు. మననమే సంకల్పము కూడా! అట్టి సంకల్పము ఉపశమించిందా.... సంసారమే ఉపశమించగలదు. 'సంకల్పించ కుండుట' అనునది అభ్యసించామా ...అప్పుడు ఈ సంసార వృక్షము నీరు లేని చెట్టు లాగే శోషించిపోతోంది.

'అవిచారణ' అను అశ్రద్ధచే ఏర్పడిన "ఆశించుట, ప్రియముగా భావించుట, లాభము, అసూయ, ఇంద్రియ విషయ లోలత్వము" మొదలైనవి ఈ సంసార వృక్షమును మరల చిగురింప చేస్తున్నాయి. "వివేకముతో కూడిన అవగాహన, అమనస్కముతో కూడిన అభ్యాసము" ఈ ఇద్దరూ అంగరక్షకులై, ఈ జీవుని 'సంసారము' అను ప్రమాదము నుండి కాపాడగలరు.

ఈ సంసార వృత్తులు పైకి మాత్రమే రమణీయంగా ఉంటున్నాయి. 'మనస్సు' అనే వానరం యొక్క ఉనికిచేతనే చపలత్వము పొందుచున్నాయి. ఇందలి పదార్థజాలమంతా నాశవంతమైనదే.

ఇట్టి సంసారవృత్తులలో నేనెందుకు పడి కొట్టుకోవాలి? అనేక ఆశాపాశములతో కూడి, ఉచ్ఛ, నీచ స్థితులతో కూడినదై మహా దుఃఖప్రదములైన ఈ సంసార వృత్తులలో నేను ఎంతకాలంగా, ఎంతగా రమించానో! ...అదంతా గతం మాత్రమే. "హా! చచ్చాను! చంపుతున్నాయి! ఇక గతేమిటి! నేను పాపిని! దుఃఖితుడను! బలహీనుడను!" – అనుకొనే రోజులు గతించిపోయాయి.

గతం గతః! ఇప్పుడు నేను 'పరితాపము' అను స్వభావమును తొలగించుకొంటున్నాను. ఇక విశ్రాంతి పొందెదను గాక! ఇప్పుడిక ఎటువంటి సాంసారిక వస్తువుల గురించిగాని, వ్యక్తుల గురించి గాని, సంబంధముల గురించి గాని, సంఘటనల గురించిగాని నేను దుఃఖించవలసిన పనియే లేదు.

నేను ఎందుకు దేని గురించి వేసట చెందాలి? చాలు... నేను ఇప్పుడు ప్రబుద్ధుడనైనాను, ప్రసన్నుడనైనాను. నా 'పారమార్థిక ధనము'ను దొంగిలించుచున్న దొంగను కనిపెట్టాను. ఆ దొంగ ఎవ్వరో కాదు... నా మనస్సే! అతను దొంగయే కాదు, ప్రమాదకరమైన శత్రువు కూడా. అతనిచేత నేను చాలా కాలంగా మోసగించబడుచున్నాను. పీడించబడుచున్నాను.

సరే... ఇక నేనే ఆ మనస్సును పీడించటం ప్రారంభిస్తాను. ఇంతకాలం ఈ మనస్సును పరిశీలించ లేదు, సరియైన చికిత్సను ఆశ్రయించ లేదు. ఇప్పుడు "ఉత్తమ కార్యాచరణము, శాస్త్రోక్తమైన అభ్యాసము, గురువులు చూపు లక్ష్యమువైపు దృష్టి సారించటం" మొదలగు శుభ ప్రయత్నములు ఈ మనస్సును ఉద్ధరించవలసిందే!

ఈ మనస్సు వివేక ప్రభావముచే 'అనాది' యగు 'బ్రహ్మతత్త్వము'నందు ప్రతిష్ఠింపబడుగాక! అట్టి బ్రహ్మజ్ఞానానుభవమునందు ఇది ప్రశమనము పొందుగాక.

**వివేకోదయం -** ఆ సిద్ధుల వాక్యములు వినుచుండగా నాయందు 'అజ్ఞానము'ను పరిశీలించ గల సత్యదృష్టి బలపడుచున్నది. వారి ఉపదేశములు నన్ను మహా బలవంతునిగా తీర్చిదిద్దుచున్నాయి.

ఇక నేను "నిరతి శయానందమునకు సాధనము" అని చెప్పబడుచున్న 'పరబ్రహ్మము'ను శరణు వేడుటకు ఉపక్రమిస్తున్నాను.

ఇప్పటి నుండి ఆత్మస్థితుడనై వుంటాను. తదితర వ్యసనములన్నీ త్యజించి వేస్తాను. ఏకాంతముగా, సుఖముగా ఉంటాను. "ఈ దేహమే నేను, ఈ రాజ్యాదులు నావి" మొదలైన అసత్య స్ఫురణలను పారద్రోలివేస్తాను. ఇక్కడి సుఖము నాది కాదు. దుఃఖము నాదికాదు. ఈ రెండింటినీ చూపిస్తూ భ్రమింపజేసే మనస్సు కూడా నాదికాదు. ఈ విధంగా ఈ 'మనస్సు' అనే శత్రువును వధించి వివేకము ద్వారా సప్తమ భూమికారూపమైనట్టి 'పరమ శాంత స్థితి'ని పొందుతాను.

అట్టి త్రోవను చూపించగల ఓ వివేకమా! నీకు నమస్కారం! రమ్ము. మనం ఈ జన్మకర్మల మనోజాడ్యమును తొలగించివేద్దాం. నీవు నాకు సేనానాయకుడివై తోడుగా ఉంటేనే నేనీ సంసార జాడ్యముపై యుద్ధం ప్రకటించి, జయించగలుగుతాను.

❖❖❖

# 3. సునిశ్చయం

ఆ విధంగా జనక మహారాజు కోటలో ఒక ఏకాంత ప్రదేశంలో చింతన చేస్తూ ఉన్నాడు. ఇంతలో ఆంతరంగికుడైన ఒక ద్వారపాలకుడు రాజును సమీపించి ఇలా విన్నవించసాగాడు–

**ఆంతరంగికుడు :** హే మహారాజా! తమకు సదా సర్వదా దిగ్విజయమగు గాక! ఇప్పటికే కాలాతీత మైనది. అదిగో బ్రాహ్మీముహూర్తం ప్రారంభం కానున్నది. నేటి ఉదయానికి మీ కొరకై ఎన్నో ముఖ్య రాచకార్యములు వేచి ఉన్నాయి. లేచి, మంగళస్నానం కొరకు సిద్ధంకండి. వేదపారాయణులగు బ్రాహ్మణులు కొద్దిసేపటి క్రితమే వచ్చి 'అఘమర్షణం' జపిస్తున్నారు. వారంతా తమ వేదోచ్ఛరణలతోను, వేదార్థ ప్రసంగములతోను మిమ్ములను మెప్పించి, మీ వద్ద దక్షిణతాంబూలములు స్వీకరించ వేడుక కలిగియున్నారు. మీ సంధ్యావందనాది కార్యక్రమముల కొరకు అంతా సిద్ధం చేయబడి ఉంది. మీ వంటి మహనీయులు తమ కార్యక్రమముల విషయంలో నియమమును అతిక్రమించి వర్తించరు కదా! నా ఈ అధికప్రసంగమునకు క్షమార్హుడను. తమ ఆజ్ఞావాక్యములకై వేచియున్నాను.

ద్వారపాలకుడు చెప్పుచున్న విషయములను గంభీరంగా వింటూనే, ప్రశాంత, మౌన చిత్తుడగు ఆ మహారాజు విచిత్ర జగత్‌స్థితి గురించి ఇట్లు పర్యాలోచించసాగాడు.....!

**జనకమహారాజు (తన అంతరంగమున) :** "ఈ రాజ్యమేమిటి? ఈ సుఖమేమిటి? క్షణభంగురమైన రాజ్యసుఖములతో నాకిప్పుడు కొంచెమైనా ప్రయోజనం లేదుకదా! 'మృగతృష్ణ' అంటే ఏమిటో తెలిసిన తరువాత అట్టి మృగతృష్ణలో నీరు త్రాగి దాహం తీర్చుకోవటానికి మూర్ఖుడు మాత్రమే పరుగులు తీస్తాడు. కనుక నేను 'మిథ్య' యగు ఈ సంసారమంతా పరిత్యజించివేస్తాను. 'శాంత సముద్రం'లాగా ఏకాంతమును ఆశ్రయించి ఉంటాను. అసద్రూపములైన ఈ భోగములతో నా కేమిటి పని?

సర్వ కర్మలను త్యజించి కేవలం బ్రహ్మమును శరణువేడి సుఖశాంతి సమన్వితుడనౌతాను. ఓ చిత్తమా! కొంచెం నా మాట విను. ఈ "జన్మ, జరా, మరణ, జడత్వ" రూపమగు సాంసారిక అల్ప అనుభవము అనే బంధం మనం తొలగించుకోవాలి సుమా! మనకు సంబంధించినది అసంబంధితమైన దాని నుండి వేరు చేసి అవగాహనతో దర్శించాలి. ఉపశమనం కొరకు ప్రయత్నిద్దాం. విషయ సుఖ లేశములను ఆస్వాదించుటలో అత్యంత చాతుర్యంగల నీ అభ్యాసమును త్యజించు. భ్రాంతి చేత మాత్రమే నీవు ఈ ప్రాపంచిక స్థితులందు సుఖమును అవలోకిస్తున్నావు. కాని, అవన్నీ అత్యంత స్వల్ప సుఖములు మాత్రమే. వాటి వలన ఏర్పడే దుఃఖము మాత్రం అపారం.

ఓ ప్రియాచిత్తమా! శక్తియుక్తులు ఉన్న కాలమంతా భోగాశక్తియందు నిమగ్నమగుచున్నావు. భోగించు శక్తి క్షీణించినప్పుడు అశక్తురాలవై అల్పత్వమును అనుభవించుచున్నావు. నిజం చెప్పు... ఇంతవరకూ నీకు నిజమైన తృప్తి అంటూ ఎప్పుడైనా లభించిందా? ప్రయోజనము లేని శ్రమ ఎందుకో చెప్పు?

బ్రహ్మమును విచారించుటచేతమాత్రమే అకృత్రిమమగు తృప్తి లభిస్తోంది. అందుచేత నీవు సద్వస్తువు వైపు మరలుటయే ఉచితం."

ఆ మహారాజు ఇట్లు విచారణ చేస్తూ ఉండగా ఆతని చపలచిత్తము శమించింది. ఆయన ఒక చిత్రములోని పురుషుని వలె మౌనస్థుడయ్యారు. ఆంతరంగిక ద్వారపాలకుడు రాజు యొక్క స్వభావౌన్నత్యమేమిటో కొంతవరకు ఎరిగినవాడే. అందుచేత భయ, గౌరవాదులతో ఏమీ మాట్లాడ కుండా, నిలుచునియున్నాడు. ఆ తరువాత జనకమహారాజు ఒక్క క్షణంలో సర్వమును తూష్ణీభావంతో త్యజించినవాడయ్యారు. శాంతచిత్తుడై ప్రాణికోట్ల జీవన విధానమును తలచుకొంటూ ఇట్లు మరల చింతనచేయసాగాడు.

**నేను ఆత్మను కాని దెప్పుడు? -** ఈ ప్రపంచంలో గ్రహించదగ్గ వస్తువేది? దేనిని నేను ప్రయత్నించి సాధించాలి? ఇక్కడ 'నాశరహితము, ఉత్తమము, ఆనందకరము, దోషరహితము' అయిన ఏదైనా పదార్థము ఉంటేకదా, అందుకు విశ్వాసముతో ప్రయత్నించగలిగేది? అట్టి పదార్థము లేనప్పుడు నేను ఈ ఎదురుగా కనబడే వస్తువులచే ఎందుకు బంధించబడాలి? ఆకర్షించబడాలి? వికర్షించ బడాలి?

ఆయా క్రియాదులందు తత్పరుడనై ఉండుటచేతగాని, లేక నిష్క్రియత్వముచే గాని నాకు ఏం ప్రయోజనం? ఎందుకంటే ఉత్పన్నమైన ప్రతి వస్తువు నశించిపోవుచున్నది. ఈ శరీరమే తీసుకుందాం. ఇది అసద్రూపంగానే ఆవిర్భవించింది. ఇక ఇది ఉండుట చేత గాని, లేక, లేకుండకపోవుట చేత గాని నేను పొందే మార్పు – చేర్పులు ఏమి ఉంటాయి?

నేను క్రియలందు ఆసక్తుడనై ఉండవచ్చు, లేదా క్రియారహితుడనై ఉండవచ్చు. అట్టి ఉభయ అవస్థలలోకూడా సమరూపముగా స్థితి పొందియున్నట్టి పరిశుద్ధ చైతన్య స్వరూపుడనే నేను. ఈ వర్తమాన క్షణంలో కనబడుచున్న శరీరము వంటి అనేక శరీరములు రావచ్చుగాక! పోవచ్చుగాక!

అవేవీ కూడా నేను కాదు. నాకు సంబంధించినవి కూడా కాదు. నేను వాటికి సంబంధించినవాడను కూడా కాదు. వాటికి అతీతమై, కాని, వాటి ఉనికికి కారణమగుచున్న శాశ్వతతత్వము, అనిర్దేశము, అప్రమేయమునై ఉన్నాను. ఎందుకంటే చైతన్యం చైతన్యంగానే ఉంటుందికాని అది 'జడం' అవుతుందా? లేదు. 'శుద్ధ చైతన్యమే' అయి ఉన్న నాకు ఈ శరీరాదులచే కలిగే హాని ఏమి? వృద్ధి ఏమి?

**నాభివాంఛామ్యసంప్రాప్తం సంప్రాప్తంనత్యజామ్యహమ్ ।**
**స్వస్థఆత్మనితిష్ఠామి యన్మమాస్తితదస్తుమే ॥** (శ్లో 24, సర్గ 10)

కాబట్టి నేను ప్రాప్తించని దానిగురించి కోరవలసిన పనిలేదు. ప్రాప్తించిన దానిని వదలవలసిన పనికూడా లేదు. అందుకని, సర్వదా స్వస్థరూపమున ఆత్మయందే నెలకొని ఉంటాను.

❖

అసలు ఆత్మ నన్ను విడచి వెళ్ళినది ఎప్పుడు? అది సర్వదా నాయందే నిరతిశయానంద రూపంలో సాక్షిస్వభావంతో, నా కన్నా వేరు కానట్టిదై వేంచేసియే ఉన్న –అదే నేను. నేను అఖండం, అప్రమేయం, అద్వితీయం, నిత్యోదితం, నిత్యనిర్మలం, జగదతీతం, జగదాత్మకం అగు ఆత్మస్వరూపుడనే!

ఏ ఆత్మ స్వరూపము నాదై ఉన్నదో, అది నేను సర్వదశలందు సర్వదా కలిగియే ఉన్నాను. ఇక భ్రమ ఎందుకు? క్రొత్తగా పొందవలసినది ఏమి ఉంటుంది?

నా యొక్క అజ్ఞానకాలంలో కూడా నేను అఖండం, శుద్ధం, నిత్యం, నిర్మలం, సర్వం అయిన ఆత్మనే అయి ఉన్నాను. 'ఆత్మ' అనబడునది నా కంటే వేరుగా లేనేలేదు. నేను దానికి వేరుగా లేను.

**కార్యాకార్యములు -**

**నమమేహకృతేనార్థో నాకృతేనేహకశ్చన ।**
**క్రియయాఽక్రియయావాపి యత్ప్రాప్తంతదసన్మయమ్ ॥** (శ్లో 25, సర్గ 10)

ఆయా కార్యాలు చేయుట చేత గాని, లేక చేయకుండుట చేత గాని నాకిక ఎట్టి ప్రయోజనమూ లేనేలేదు. క్రియాక్రియలచే ప్రాప్తించినదంతా 'మిథ్యా రూపములే' అయి ఉన్నాయి. "నేను అది పొందలేకపోయానే? ఎలా పొందాలి?"...అనే ఉద్వేగం గాని, చంచలం గాని నే నెందుకు, ఎవరి నిర్ణయం ప్రకారం పొందాలి? శాస్త్రములచే చెప్పబడినవి, లౌకికంగా నిర్ణయించ బడుచున్నవి అనేక కార్యక్రమములు నా సమ్ముఖమునకు వచ్చుచున్నాయి. మంచిదే. వాస్తవానికి వాటి నుండి నేను కర్తగా పొందవలసినది గాని, పొందదగినవి గాని లేవు. అయినప్పటికీ క్రమానుసారం ప్రాప్తించే ఆయా క్రియలు నా ఈ చేతులు, కాళ్ళచే నిర్వర్తించబడు గాక! ఎందుకంటే చేష్టారహితుడనైతే ఈ శరీరం శుష్కిస్తుంది కదా! దీనిని నేనుగా ఎందుకు శుష్కింపజేయాలి?

**ఆసక్తిరాహిత్యం -** ఆసక్తి రహితుడనై సమరూపమున నెలకొని ఉంటాను. ఇకపుడు అట్టి సమరసభావనను భావించు భావనారాయణుడగుచుండగా... ఈ దేహము యొక్క ఉత్పన్నమునకు కారణమగుచున్న క్రియ, అక్రియలు, ఆ క్రియాక్రియల ఫలితములగు పుణ్య పాపములు, పుణ్య పాపములకు స్థానభూతమైన ప్రారబ్ధములు... ఇవన్నీ 'లేనివే' అవుతాయి. సర్వప్రయోజనములు

నన్ను తాకకుండా నాకు వేరై ఉంటాయి. నేను ఆయా స్థితులందు జ్ఞాన మహిమచే నిర్లిప్తుడనై ఉంటాను. అదియే నా నిర్వికల్పసమాధి!

చైతన్యమే అయినట్టి నాకు 'సశరీరము, అశరీరము' అనబడు వ్యక్తావ్యక్తములచే ప్రయోజనము గాని, హాని గాని ఏముంటుంది? నేను ఆసక్తిరహితుడనవటమే నా సర్వ ప్రయత్నముల ప్రయోజనం. ఆపై ఏది ఎట్లా ఉంటే ఏం? ఏది ఎట్లా ఉండకపోతే ఏం?

"కర్మ" అనుదాని యందు రెండు తత్త్వాలు ఇమిడి ఉన్నాయి–

1. కర్తృత్వము (I am the doer); 2. భోక్తృత్వము (I am the enjoyer of fruits of action).

ఈ రెండూకూడా మనస్సుచే కల్పించబడినవి మాత్రమే. ఈ రెండు ఉపశమించటం జరిగిందా, ఇక సర్వకార్యములు కూడా "నాచే చేయబడనివే" అవుతాయి. ఈ కర్తృత్వము, భోక్తృత్వము విషయములలో మనుజుడు తన అంతఃకరణంలో ఎటువంటి నిశ్చయం రూఢిగా కలిగి ఉంటాడో ఆతడు ఈ దేహము, భావము మొదలైనవన్నీ ఆ తీరుగానే పొందుతూ ఉంటాడు.

**ఆత్మ నిశ్చయము -** నేను ఈ శరీరముతో పుట్టలేదు. దీనితో నశించువాడను కాను. నేను దేనికీ కర్తను కాను. భోక్తను కాను. ఎందుకంటే ఇవన్నీ స్వతఃసిద్ధమగు నిర్ణయము కలిగిలేవు. కనుక జడమై ఉన్నాయి.

నేను 'జ్ఞానము' యొక్క ముందు, వెనుకల కూడా ఉన్నట్టి జ్ఞేయమే స్వరూపముగా కలవాడను. శుద్ధ చైతన్యమే అయి ఉన్న నాకు కర్తృత్వము లేదు. భోక్తృత్వము కూడా లేదు. ఈ కర్తృత్వ, భోక్తృత్వములు దృశ్యమునకు సంబంధించినవి మాత్రమే. ఇక నేనో... అనుభవమే స్వరూపముగా గల జ్ఞాన (knower) తత్త్వమును.

❖

అమ్మయ్య! ఇప్పుడు నా బుద్ధి "కర్తృత్వము, భోక్తృత్వము" అనే జాడ్యమును దూరీకరించినదై శుభ్రము చేయబడిన దర్పణము వలె ప్రకాశిస్తోంది. ఒక గొప్ప వ్యాధి నుండి నివారణ పొందినదై 'ఆత్మ పదము' అనబడు దానియందు దృఢనిశ్చయము సంతరించుకుంటోంది.

ఇప్పటివరకు నాకు ఏర్పడి ఉండిన ఇష్ట అనిష్టముల ప్రాప్తికి కారణం ఎవరు? మరెవ్వరూ కాదు... నా అవిచారణయే! నా అధీరత్వమే! నా అల్పమైన ఎరుకయే! అట్టి అధీరత్వమును నేను ఈ క్షణమే త్యజించివేస్తున్నాను.

❖❖❖

## 4. చిత్తమును శాసించటం

ఆ జనకమహారాజు తన అంతరంగంలో ఈ విధమైన చింతన చేస్తూ మౌనం వహించి ఉన్నాడు. "ఆ సూర్య భగవానుడు కాంతిని ప్రసాదించుట, (కిరణజన్య సంయోగముచే) వృక్షములు, పశువులు, మనుష్యులు మొదలైన వాటిని జీవింపజేయుట, తటాక జలమును ఎండింప జేయుట

– మొదలైన క్రియలను మౌనముగా నిర్లిప్తముగా, అసంగముగా నిర్వర్తిస్తున్నాడు కదా! నేను కూడా ఆయా ప్రాప్తించిన క్రియలను నిర్వర్తించెదను గాక" అను స్వకీయమైన సునిశ్చయమును పొందాడు. గాంభీర్యము, ప్రశాంతత, ఆనందము ఆయన ముఖము నందు తొనికిసలాడాయి. అప్పుడు ప్రక్కనే నిలచియున్న ద్వారపాలకుని వైపు దృష్టి సారించారు.

**జనకుడు :** ఓయీ! ద్వారపాలకా! నీ "విద్యుక్త ధర్మ నిర్వహణ" నాకు సంతోషం కలుగజేస్తోంది. నేడు నిర్ణీతమైన రాజకార్యములకు అంతా సిద్ధం చేయించండి. దేవ, బ్రాహ్మణులు యథారీతిగా పూజించెదము గాక!

ఆ రోజు పగలంతా సభాకార్యక్రమములు, న్యాయనిర్ణయ కార్యక్రమములు, విద్యావినోదములు యథారీతిగా జరిగాయి. ఆ రాత్రి చాలాసేపు రాజు ఏకాంతంలో ధ్యానమగ్నుడై గడిపాడు. కాని, చిత్తము పరిపరివిధాలుగా పోతూనే ఉండటం గమనించాడు. "అరె! ఈ మనస్సు ఈ విధముగా అనేకత్వమును, దుష్టత్వమును, విషాదత్వమును, బలహీనత్వమును మాత్రమే ఆశ్రయిస్తోందేమిటి? ఇంత విన్నాను... ఇంత విచారణ చేశాను... కాని ఏం లాభం?" అని ఆశ్చర్యపోయాడు.

❖

**జనక మహారాజు :** ఓ 'చిత్తము' అను పేరుగల మిత్రమా! నీతో ఈ సమయంలో కొన్ని విషయాలు ముచ్చటించాలని ఉన్నది. ఇటు వచ్చి నాకు ఎదురుగా కూర్చో...!

ఓ ప్రియ చిత్తమా! ఈ చపల సంసారము ఆత్మకు నిజమైన సుఖము ప్రసాదించగలుగుచున్నదా చెప్పు? కనుక నీవు శాంతమును పొందుము. శాంతముచే మాత్రమే ఉత్తమ ఆత్మసుఖము లభించగలదు.

**చిత్తము :** ఔనూ... ఈ సంసారము అనబడేది ఎక్కడి నుండి వచ్చిపడింది?

**జనకుడు :** చెపుతాను, విను! నీవు ఏ విధంగా సంకల్పములు చేస్తూన్నావో, ఆ విధంగానే... ఆయా రూపముననే ఈ సంసారము విశాలత్వము చెందుతోంది. ఒకడు ఒక విత్తును తెచ్చి, దానిని మహావృక్షముగా పెంచి పోషించిన తరువాత "అయ్యో! ఈ విశాల శాఖలుగల మహావృక్షము ఎక్కడి నుండి దాపురించింది? దీని వలన ఇంటిగోడలు పగులుచున్నాయి; పురుగులు, ముళ్ళు, చెత్తచెదను ఆవరిస్తున్నాయి" అని వగచునట్లు నీవు కూడా ఈ సంసారము గురించి వగచుచున్నావు.

**చిత్తము :** నేను పొందుచున్న ఈ వ్యధలకు కారణమేమిటి?

**జనకుడు :** ఓ దుష్టచిత్తమా! నీయందు భోగముల పట్ల ఇచ్ఛ ఉన్నది. అదియే సకల దుస్థితులకు కారణమగుచున్నది. ఫలితంగా శారీరక మానసిక వ్యాధులు నిన్ను వదలి పెట్టకున్నాయి.

**విషయ చింతన, విషయములు -** ఈ ఇంద్రియములకు సంబంధించిన శబ్ద–స్పర్శ–రూప–రస–గంధానుభవములు చేతనే జనన మరణ రూపమగు ఈ సంసారమంతా ఆవిర్భవిస్తోంది. కనుక ఈ ఇంద్రియ విషయముల పట్ల, దృశ్యవస్తువుల తోటి సంబంధ బాంధవ్యముల పట్ల ఏర్పడు 'చింతన' లేక 'మననము'ను త్యజించు. అప్పుడు శాంతి లభించకపోతే నన్నడుగు.

ఇక్కడ కొంచెం పరిశీలనగా చూడటం జరిగితే, సారవంతమైనది, దీర్ఘ సుఖమును, లేదా, దుఃఖ మిళితం కాని సుఖమును ఇవ్వగలిగేది ఏమున్నది? మన వద్ద 'బుద్ధి' అను పేరుతో చెప్పబడే విశ్లేషణ శక్తి ఉన్నది. అట్టి బుద్ధితో పరిశీలించి ఏది శ్రేష్ఠమో దానినే స్వీకరించాలి గాని, ఏది అలవాటో దానిని మాత్రమే గ్రహించటం ఉచితం కాదు కదా! కనుక నీవు 'గ్రుడ్డి'గా ముందుకు అడుగులు వేయవద్దని నా మనవి.

ఓ సాధూ! ప్రియచిత్తమా! ఈ సంసారము అపారమైనది. ఒకదానికి ప్రయోజనంగా మరొకటి ప్రాప్తిస్తూనే ఉంటుంది. "ఇది పొందిన తరువాత నాకింక ఆశించవలసినది ఏదీ ఉండదు" అని జీవుడు అనుకుంటూనే, ఏవేవో ఆశిస్తూ ఉంటాడు. సరే... పొందుతాడు, లేక, పొందడు... ఏది ఏమైనా ఆశించటం మాత్రం ఆగదు. అది ఆతడు గమనించుట లేదు. ఆశించినంతకాలం దుఃఖం, శ్రమ, ఉద్వేగం తప్పవు.

కాబట్టి ఉపాయమేమిటి? 'ఆశ' అనుదానిని లేక, 'ఆశించుట' అను స్వభావమును త్యజించటయే ఉపాయం. ఈ దృశ్యమును ఆసక్తిచే గ్రహించనూ వద్దు... ద్వేషముచే త్యజించనూ వద్దు... 'ఆశించకపోవటం' అనుదానిని అభ్యసిస్తూనే ఆత్మకాముడవగుము. సాక్షి రూపమున స్థితి కలిగియుండుము. అటు తరువాత ఏది ఎట్లు ఉచితమో అట్లే ఆచరించుము.

ఏవీ కూడా నిన్ను స్వయముగా స్పృశించుటలేదు. నీవు ఆసక్తితో ఆశించినప్పుడు, ఆశ్రయించినప్పుడు మాత్రమే అవి నిన్ను లోబరుచుకుంటున్నాయి. తత్ఫలితంగా సుఖదుఃఖములు నిన్ను ప్రభావితం చేస్తున్నాయి. కనుక ఓ చిత్తమా! నీ దోషములన్నీ నీయొక్క స్వయంకృతములే!

❖

అయినా, ఈ దృశ్యము సత్యమైతే మనకెందుకు? లేక 'మిథ్య' అయితే ఏమున్నది? దీని యొక్క గుణ అగుణములచే మనం ఎందుకు హర్ష విషాదములు పొందాలి?

ప్రియమైన మనస్సు గారూ! ఈ దృశ్యముతో మనకేమీ సంబంధం లేదు. అది నీ యొక్క భావనను అనుసరించి మాత్రమే ఉంటోంది. "ఏదైతే స్వయముగా లేదో... అట్టి వస్తువుతో నీకు సంబంధం ఎట్లా పొసుగుతోంది?" అని ప్రశ్నిస్తే నాకొక సమాధానం లభిస్తోంది. ఈ మనస్సు కూడా లేని వస్తువే కదా! అసలు నీవే లేవు. మరొక లేని వస్తువగు దృశ్యముతో నీకు సంబంధం... ఆ సంబంధము యొక్క ప్రభావంచే నేను సుఖదుఃఖములు, మానావమానములు, ప్రియాప్రియములు పొందటమా? ఇదంతా ఎంతటి చమత్కారమైన విషయం!

"ఒక గొడ్రాలు ఉన్నది. ఆమె యొక్క రెండవ కుమారుడు ఆకాశంలోని ఒక చదునైన ప్రాంతంలో కొన్ని విత్తులు నాటాడు. అదొక పెద్ద పూదోటగా పరిణమించింది. ఆ పూదోటలో అనేక రకాల పూల తీగలు, మొక్కలు వేరువేరు వరుసలలో కనబడుచున్నాయి. అందులోని రెండవ వరుసలోని మూడవ మొక్కకు పూచే ఆ పెద్ద పువ్వు చూచారా! అది ఎంత అందంగా ఉన్నది?"

ఈ దృశ్య పదార్థములతో ఏర్పడు సంబంధము ఆ పూవుపట్ల ఏర్పడు ప్రియత్వము వంటిది. ఈ పదార్థములు అసద్రూపములే (అసద్రూపము = ఒక వస్తువు కొద్ది క్షణముల క్రితం ఒక

రూపంగాను మరికొన్ని క్షణముల తరువాత మరొక రూపంగాను ఉంటోందనుకోండి... అప్పుడు అది వర్తమానంలో 'అసద్రూపం' అని చెప్పబడుతోంది.) అయి ఉన్నాయి.

పోనీ ఓ మనసా! "నాఽన్యత్ కించిదస్తి" (ఆత్మతప్పితే మరింకేదీ లేదు) అను సిద్ధాంతము ప్రకారం నీవు స్వతఃగా ఆత్మవే కదా! 'జగత్తు' అనబడునది అసత్తే అయి ఉన్నది కదా! ఆత్మ యొక్క మననమే మనస్సు. కనుక స్వతఃగా చైతన్యమే అయి ఉన్న మనస్సుకు క్షణకాలికము, భావనామాత్రము, అసత్తు అగు ఈ జగత్తుతో సంబంధం ఉండటమేమిటి? ఎక్కడన్నా చచ్చిన వానికి బ్రతికియున్నవానికి 'స్పర్శ' మొదలైన సంబంధాలు పొసగుతాయా?

లేదా, "మననము" అను నా స్వభావము (మనస్సు), మననము చేయబడుటచే ఏర్పడియున్న దృశ్యము – ఈ రెండూ సత్తే అని అనుకుందాం. రెండూ స్థితికలిగియే ఉన్నప్పుడు 'సత్తా' దృష్ట్యా రెండిటిలోను సత్తా – అనబడు ఏకత్వము ఉన్నట్లే కదా! ద్రష్ట ఉన్న చోటే దృశ్యముంటుంది. భావకుడు ఉన్న చోటే భావన ఉంటుంది. కనుక ఉభయములు ఒకే తత్త్వం యొక్క రెండు వైపులు.

ఈ అభిప్రాయం మనం ఒప్పుకుంటే 'మనస్సు – దృశ్యము' సర్వదా కలిసియే ఉంటున్నాయి కదా! ఇక సంయోగ వియోగ భావములచే హర్ష విషాదములు ఎక్కడి నుండి వచ్చి పడుచున్నాయి?... కారణం, నీ దగ్గర ఆత్మ విషయమై తగినంత సమాచారం లేకపోవటమే సుమా! మరి సమాచారం కొరకు ప్రయత్నించాలి కదా! అందుకేం చేయాలి? శాస్త్రములను, గురువులను సమీపించి సమాచారం సేకరించాలి. స్వయముగా విచారణ చేయాలి. అంతేగాని "నేను దుఃఖితుడను.... అల్పుడను" అని అనుకుంటూ కూర్చుంటే ఏమిటిలాభం?

కనుక ఓ మనస్సా! ఈ 'సంసారము' అనేది మానసిక వ్యాధి యొక్క రూపమే. ఇది కలుషితమైనది. క్షణక్షణం విక్షేపముతో కూడినట్టిది.

అట్టి ఈ సంసారమును దయచేసి త్యజించు. సమాధిని అభ్యసించు. శాంతరూపమగు ఆత్మ యందు నిలకడ పొందటానికే ఉత్సాహం కలిగియుండు. అంతేగాని స్వయంగా భ్రమను స్వీకరించటం, మోహము – మందత్వము కలిగియుండటం నీకు ఉచితమా? ఎందుకు? ఎంతకాలంగా ఈ పదార్థములను ఆశ్రయించుటచే ఏమి ప్రయోజనం చెప్పు?

**నతదిహాస్తి సమున్నతముత్తమం వ్రజసియేనపరాం పరిపూర్ణతామ్**
**తదవలంబ్య బలాదతిధీరతాం జహిహిచంచలతాం శఠరేమనః.** (శ్లో 18, సర్గ 12)

ఈ దృశ్యంలో పూర్ణత్వము లేదు. ఇందులో ఏమైనా అనుమానమున్నదా? అందుచేత అభ్యాస, వైరాగ్యములచే ధీరత్వము నవలంబించి చంచలత్వమును విడచివేయవలసినదిగా నిన్ను శాసిస్తున్నాను!

❖❖❖

# 5. భూత భవిష్యత్‌లను జయించడం - వర్తమానంలో ఏర్పడి ఉండడం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శ్రీరామచంద్రా ! ఆ జనకుడు ఆ విధముగా విచారణ చేస్తూనే యథాప్రాప్తంగా రాచకార్యములు నెరవేరుస్తూ ఉండేవాడు. ధీరత్వముతో కూడిన తన సునిశిత బుద్ధిని ఉపయోగిస్తూ "నేను" "నాది" అనబడు అహంకార మమకారములను అధిగమించాడు. ఆయనకు విషయముల పట్ల ఏమాత్రం ఉత్సుకత, ఉద్వేగములు ఏర్పడుట లేదు. ఈ ఎదురుగా ఉన్న దృశ్యములు అతడు త్యజించుట లేదు. గ్రహించుట కూడా లేదు. దేని పట్లా ప్రియత్వము గాని, ద్వేష బుద్ధిగాని ఏర్పడ కుండానే వర్తమాన కాలములో ప్రాప్తించుచున్నదానిని శోకరహితుడై నిర్వర్తిస్తూ ఉంటున్నాడు. అన్ని సమయముల యందు వివేకమును విడుచుట లేదు. అందుచేత 'సమ్యక్ జ్ఞానం' ఏ మాత్రం కళంకితం అగుటలేదు. మేఘాలు లేనట్టి నిర్మలమైన ఆకాశములో సూర్యుడు నిర్విరామంగా ప్రకాశి స్తున్నట్లు అతని హృదయములో నిష్కళంకమగు చిదాత్మత్వము సర్వదా ప్రకాశించసాగింది. "ఔను! నేను బ్రహ్మమయుడను. సర్వభూతజాలములందు సదృశ్యమైయున్న ఆత్మ భగవానుడను. అందుచేత నేను సర్వభూతాత్మ కోవిదుడను అగుచున్నాను. సర్వులూ, సర్వమూ నాయందే, నా సర్వ రూపం గానే నిత్యము ఉండి ఉండటం జరుగుతోంది," – అను ఎఱుక, భావన, అనుభవం అతని యందు సుదృఢత్వం పొందాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ ! అట్టి ఆత్మానుభవం పొంది యుండి కూడా క్లిష్టత, స్పర్ధలతో కూడిన లౌకికమగు రాజ్యపాలన నిర్వర్తించగలిగారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ లోక వ్యవహారములన్నీ మాయ చేతనే సంభవిస్తున్నాయి. అయితే అసంగము అయినట్టి ఆత్మ ఏ ఒక్క వ్యవహారముచేతనూ ఏ ఒక్క క్షణములో కూడా స్పృశించబడుటలేదు. ఈ విషయము జనకుడు సుస్పష్టంగా గ్రహించాడు. సమచిత్తుడగు అతడు ఈ రాజ్యాదుల విషయములో ప్రసన్నత్వము పొందుటలేదు. దుఃఖము పొందుట లేదు. సర్వదా 'విముక్తుడు' అగుటచే ఆతడు పూజ్యుడు, జ్ఞానవృద్ధుడు, ఇహపరముల పట్ల నిశ్చలానుభవుడుగా మనఃస్థితి పొందాడు. అందుచేత 'రాజ్యాన్ని పాలించుట' అను ప్రవాహపతితత్వమగు ధర్మమును ప్రశాంత చిత్తముతో నిర్వర్తించు చున్నాడు. యథావిధిగా రాజ్యం ఏలుచూకూడా శోకము, పరితాపము, వివశత్వము మొదలైనవి ఆతడు పొందుటలేదు.

"మానసిక దోషములచే స్వస్వరూపము నుండి తిరోభావం పొందటం .... మరలా ఆవిర్భావం పొందటం" – ఈ రెండూ ఆతని పట్ల ఏర్పడుట లేదు. దైనందికంగా వచ్చిపోయే హర్షవిషాదములు, అర్థ అనర్థములు ఇవన్నీ అకర్తృత్వాభిమానం యొక్క ప్రభావం చేత, ఆత్మ చైతన్యమునందు, తరంగములు సముద్రములోలాగా, లయించి ఉంటున్నాయి.

సుషుప్తియందు ఉన్నవానివలె ఆతడు మెలగుచూ ఉన్నాడు. రాగద్వేషములు, భూతభవిష్యత్తుల గురించిన చింతలు ఆత్మ సామీప్యతచే తడిపివేయబడ్డాయి. వాసనాభావంబున మనస్సు భూత

భవిష్యత్తులను జయించి, వర్తమానంలో ఏర్పడి మాత్రమే ఉంటోంది. అనగా దానిలో భూత – భవిష్యత్తుల చింతలు తొలగిపోయాయి. కేవలం వర్తమానంలో మిక్కిలి 'సంతుష్టి'తో అనువర్తిస్తోంది.

చూచావా రామా! ఒకడు తన మెడలో ధరించిన గొలుసు కనిపించక, ఇల్లంతా వెతకి చిందులు వేసి చివరికి మెడలోనే ఉన్నట్లు గమనించి ప్రశాంతపడునట్లు, ఈ జీవుడు సర్వదా ప్రాప్తించియే ఉన్నట్టి ఆత్మ యొక్క సమాచారము, లేక, జ్ఞానముచే మాత్రమే ప్రశాంతత పొందగలడు. అట్టి ఆత్మజ్ఞానం లభించేంతవరకూ ఈ చిత్తముచే తత్త్వ విచారణ చేయిస్తూనే ఉండాలి. 'ఆత్మతత్త్వ విచారణ' అనేది సజ్జన సాంగత్యముచే అభ్యుదయం పొందుతూ ఉంటుంది. "సర్వ సమత్వ దృష్టి" అలవడుతూ ఉంటే ఈ మనస్సు విశాలత్వం పొందుతుంది.

1 స్వవిచారణ, 2 సజ్జన సాంగత్యము ...ఈ రెండింటితో సమానమైనవి ఇంకెక్కడుంటాయి? అందుచేత రామా! నీ యొక్క "ఊహ, అపోహ"లను సచ్ఛాస్త్రము, వివేకములచే శోధన చేయి. లక్ష్యశుద్ధితో శాస్త్రానుసారం ప్రయత్నిస్తూవుండగా, క్రమముగా నీ బుద్ధి నిర్మలమవుతుంది. అప్పుడు అఖండమగు ఆత్మను, లేక ఆత్మతత్త్వమును నీకు మరింకెవ్వరూ గుర్తు చేయనక్కర్లేదు. అప్పుడు నీవు అజ్ఞానాంధకారముచే బాధించబడవు సుమా!

**ప్రజ్ఞ -** ఓ మహామతీ! రామచంద్రా! ఈ సంసారము అనేక దుఃఖ కల్లోలములతో అనేక విపత్తులతో నిండివుంటోంది. "అధిగమించడానికిక సాధ్యమా?" – అను రీతిలో అనేక విషయ పరంపరలు ప్రాప్తిస్తున్నాయి. అయితే, ఈ సంసార నదీ జలమును "ప్రజ్ఞ" అనే నావ సహాయముతో దాటివేయవచ్చు. కోమలమైన పూతీగను అల్పమైన గాలి కూడా అటు ఇటూ కదిలిస్తూ బాధిస్తుంది. ప్రజ్ఞా విహీనుడైన ఒక మూఢుని అతి స్వల్పమైన విషయములు కూడా బాధించగలుగుతాయి.

ఒకానొకడు నిస్సహాయుడుకావచ్చు. శాస్త్రములలోని ఆయా వివరణాదులు అతనికి తెలియకపోవచ్చు. కాని అతడు కనుక శ్రద్ధ, ప్రజ్ఞలతో కూడిన పరిశీలకుడై, క్రమంగా విజ్ఞానశీలుడు అయినాడా.... ఇక ఆతడు ఈ సంసార సముద్రమును అవలీలగా దాటివేస్తున్నాడు, కార్యసిద్ధిని పొందుచున్నాడు. అజ్ఞుడో.... అతడు ఎంతో బలవంతుడైతే మాత్రం ఏమి లాభం? చివరకు అధో గతే శరణ్యమగుచున్నది. అందుకే మానవుడైనవాడు తన ప్రజ్ఞను 'శాస్త్రము' 'సత్సాంగత్యము' అను రెండింటి సహాయముతో కాపాడుకోవాలి. తోటమాలి అందమైన పూల మొక్కలను అతి జాగ్రత్తగా రక్షించుకొనుచున్నట్లు, ఈ జీవుడు కూడా ప్రజ్ఞను, అవగాహనను దృఢపరచగల ఆయా కార్యక్రమాలను కాపాడుకోవాలి. అనేక సత్కర్మల రూపమున ప్రజ్ఞ (Wisdom) తప్పకుండా, ఉత్తమమైన, అమృత తుల్యమైన ఫలములను ప్రసాదించగలదు.

ఈ జనులందరూ ధన – వస్తు – అధికారాలను సంపాదించడానికి అనేక ప్రయత్నములను చేస్తున్నారు కదా! అదే విధముగా ఈ ప్రజ్ఞను వృద్ధి చేసుకోవడానికి కూడా సర్వ ప్రయత్నములు చేయాలి కదా!

"అసలు ఈ సంసారము అనబడేది ఎక్కడినుండి, ఎట్లా విజృంభిస్తోంది?"

**సీమాన్తంసర్వదుఃఖానా మాపదాంకోశముత్తమమ్ ।**
**బీజంసంసారవృక్షాణాం ప్రజ్ఞామాన్ద్యంవినాశయేత్ ॥** (శ్లో 27, సర్గ 12)

ప్రజ్ఞామాంద్యముచేతనే సర్వ దుఃఖములకు, ఆపదలకు అలవాలమైన ఈ సంసారము స్వీయ హృదయము నుండి ఉద్భవిస్తోంది సుమా! అందుచేత మీరంతా ఏమాత్రం బద్ధకించకండి. ప్రయత్న శీలురై ప్రజ్ఞామాంద్యమును తొలగించుకొండి? స్వర్గ, పాతాళ, బ్రహ్మ లోకములలో ఏయే సుఖములు ప్రాప్తించగలవని జనులు అనుకుంటూ ఉంటారో, అవన్నీ కూడా ఇప్పుడే, ఇక్కడే ఉత్తమ ప్రజ్ఞచే, ఇదంతా అర్థం చేసుకున్నవాడు పొందుచున్నాడు. నాయనలారా! మహానుభావులంతా ఉత్తమోత్తమమైన తమ యొక్క 'ప్రజ్ఞ' చేతనే ఈ ఎదురుగా తారసపడుచున్న భయంకర సంసారాన్ని దాటి వేస్తున్నారు. అంతేగాని వారు ఎచ్చటకో వెళ్ళుట చేతనో, ఏదో చూచుట చేతనో కాదు సుమా! దానము, తీర్థము, తపస్సు – వీటన్నిటి యొక్క అంతిమ లక్ష్యము ఉత్తమ ప్రజ్ఞ సముపార్జించుటయే!

పారమార్థిక జీవితం విషయం అటుంచి ఈ లౌకిక జీవితం విషయం కూడా అంతేకదా! ఈ భూమిపై చరించుచున్న ఈ జీవులు ఏవేవైతే సంపత్తులు పొందుచున్నారో.... అవన్నీ 'ప్రజ్ఞ' అనే పండ్ల చెట్టు నుండి రసభరితమై పడిరాలిన ఫలములే కదా! అంతే కాదు. భయంకరమైన పంజా గల ఒక సింహమును రెండు మూడు నక్కలు తమ తెలివితేటలతో, 'ప్రజ్ఞ'తో జయించి వేస్తున్నాయి. ప్రజ్ఞ కారణంగానే సామాన్యుడై పుట్టిన ఒకానొకడు మహానాయకుడు కావడం, రాజు కావడం చూస్తున్నాం. అట్లాగే స్వర్గ – మోక్షములు మొదలైనవి కూడా ప్రజ్ఞావంతులకే లభిస్తున్నాయి.

ప్రజ్ఞ = తెలివి + ప్రయత్నము + సాహసము.

గొప్ప విషయాలు కూడా ప్రజ్ఞానవంతుడు స్వల్పకాలంలో గ్రహించి అనేక మందిని అధిగమించి వేయటం ప్రపంచంలో మనం చూస్తున్న విషయమే.

❖

వివేకుల హృదయంలో ఉండేది ఈ 'ప్రజ్ఞ' అనే మణియే. అది వారికి కల్ప వృక్షములాగా కోరుకొన్న ఫలములు సిద్ధింపజేస్తూ ఉంటుంది. నావను నడపటం చేతనైనవాడు తుపానును ఎదుర్కోగలుగుతాడు. ఈత నేర్చినవాడే మునిగిపోకుండా గట్టుజేరుతాడు. అశిక్షితుడు, అప్రజ్ఞావంతుడు సంసార సాగరాన్ని దాటగలడా? లేదు. ప్రజ్ఞను సునిశితం చేయని వాని బుద్ధి స్వల్ప విషయములచే ఆకర్షణ వికర్షణలకు లోను అవుతోంది. వివేక వైరాగ్యములతో కూడిన బుద్ధి సన్మార్గములో నియమించ బడినప్పుడు ఆ బుద్ధే నావలాగా సంసారమును దాటింపజేస్తోంది. అసన్మార్గమును ఎన్నుకొన్నందుకు పర్యవాసనం ఆపదలు, దుఃఖాలు వచ్చిపడటంలో ఆశ్చర్యం ఏమున్నది? కవచం ధరించిన వానిని బాణాలు తాకినా ఏమీ చేయలేవు కదా! ప్రజ్ఞ లేక తెలివి మరుగున పడిన క్షణాలలో 'తృష్ణ' వచ్చి చేరుతుంది. కామ, క్రోధ, లోభ, మోహాదులు ఆ తృష్ణ యొక్క సైనికులై వాటి నుండి రాగము, ద్వేషము, చింత మొదలైనవన్నీ వచ్చి పడుచున్నాయి. ప్రజ్ఞావంతుని అవన్నీ ఏమాత్రం సమీపించలేవని గ్రహించు.

ఓ రామచంద్రా! నీవు సమ్యక్ దృష్టిని సంపాదించి, అట్టి దృష్టిచే ఈ ప్రపంచమును గాంచుచూ మోక్ష స్వరూపుడవు కావాలని అనుకుంటున్నావా! అయితే వెంటనే ప్రజ్ఞను ఆశ్రయించు. గుణదోషతత్త్వ వివేకము ద్వారా 'సమదర్శి'వి అగుము. ఇక సంపదలు గాని, ఆపదలు గాని నిన్నేమీ చేయలేవు.

**పిధానంపరమార్కస్య జడాత్మావితతోసితః ।**
**అహంకారాంబుదోమత్తః ప్రజ్ఞావాతేనబాధ్యతే ॥** (శ్లో 39, సర్గ 13)

ప్రజ్ఞ కొరవడిన తరుణంలో ఏర్పడిన 'అహంకారము' అనబడే దట్టమైన మేఘము 'పరమాత్మ' అనే సూర్య భగవానుని కనబడకుండా కప్పివేస్తుంది. ఆ మేఘము "ప్రజ్ఞ" అనబడే వాయువీచికచే త్రోసివేయబడుతుంది!

మొక్కలు నాటే ముందు రైతు భూమిని దున్ని సిద్ధము చేయునట్లు నీవు హృదయమును "స్వవిచారణ, గురువాక్య విశ్లేషణ, ఉత్తమ కార్యక్రమములు" అను భాగాలు గల నాగలితో హృదయ క్షేత్రమును సిద్ధము చేసి 'వివేకము – ప్రజ్ఞ' అను పంటను సంపాదించు. అప్పుడు ఈ విచారించ బడుచున్నదంతా నీకు స్వయముగా సుస్పష్టం కాగలదు.

❖❖❖

# 6. మనోవిచారణ

ఓ రామచంద్రా ! "ఆత్మానుభవ ప్రాప్తి" అనే మార్గములో ముఖ్యముగా మూడు ప్రతిబంధకాలు తారసపడుచున్నాయి–

1. **అసత్‌భావన -** "అసత్" లేక "అసత్యము" అయిన విషయములను పదే పదే సత్యమైనట్లు భావన చేయుట.
2. **అహంకార మమకారములు -** "నేను మరియు నాది" అను భావనను ఆశ్రయించడం. తనను తాను తదితరులకు వేరైనట్లుగా దర్శించటం.
3. **దేహాత్మభావన -** "ఈ దేహమే నేను. దేహ పరిమితుడనైన నేను దీనితో వృద్ధి క్షయములు పొందువాడనై ఉంటున్నాను" అను రూపముగల సంకుచితత్వమును భావన చేయడం.

ఆ జనకమహారాజులాగా నీవు కూడా పరిశుద్ధ చిత్తముచే ఆత్మ విచారణ చేయి. పై విఘ్నములను ప్రయత్నపూర్వకముగా తొలగించుకో. అప్పుడు జ్ఞానులు పొందినట్టి బ్రహ్మపదమును నీవు కూడా పొందగలవు. ప్రాజ్ఞులైనట్టి కొందరు సాత్వికులు, మరియు రాజస సాత్వికజాతీయులు ప్రాప్తములన్నింటిలోకి అత్యంత ఔన్నత్యము అయినట్టి ఆత్మతత్త్వమును స్వయముగా తమయొక్క వివేక బలముచేత గ్రహిస్తున్నారు.

❖

ఆత్మశాంతి పొందనంతవరకూ ఈ 'ఇంద్రియములు' అనే శత్రువులను సరియైన రీతిలో నియమించి, ఆత్మానుసంధానం చేస్తూనే ఉండాలి.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ ఇంద్రియములను అనేక దుఃఖములతో కూడిన సంఘటనలు ఆశ్రయించి ఉంటున్నాయి. ఇక మేము ఈ దుఃఖములను ఎట్లా జయించడం?

> **ప్రసన్నేసర్వగేదేవే దేవేశేపరమాత్మని ।**
> **స్వయమాలోకితేసర్వాః క్షీయన్తేదుఃఖదృష్టయః ॥** (శ్లో 4, సర్గ 13)

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సర్వమునందు వ్యాపించియున్నవాడు, సర్వ ఇంద్రియ నియామకుడు ద్రష్ట యొక్క వాస్తవ స్వరూపమే తానైయున్న, ఆ పరమాత్మ ప్రసన్నుడై సాక్షాత్కరించగానే సమస్త దుఃఖాలు వాటంతటఅవే క్షయిస్తాయి. ఈ మనుష్యానందం మొదలుకొని బ్రహ్మానందం (సృష్టికర్తకు లభించే ఆనందం) వరకు "ఆ పరమాత్మ యొక్క అనుభవము" అనే ఆనందము ముందు 'సూర్యుని ముందు దివిటీ' లాగా అత్యంత స్వల్పమైనవే. 'పర అపర' స్వరూపుడైన ఆ పరమాత్మ సాక్షాత్కరించిన తరువాత ఇక మోహములు, వాటికి బీజము వంటివైన దుర్వాసనలు, అహంకారము, సర్వ విధమైన ఆపదలకు సంబంధించిన భయోద్వేగములు స్వయముగా శమించిపోతాయి.

ఓ రామా! వివేకముతో కూడిన బుద్ధితో "ఈ సమస్తము బ్రహ్మమే కదా....!" అన్న దృష్టిని కలిగియుండుటే పరమ పురుషార్థమగు ఐశ్వర్యమని మా అభిప్రాయం. ఎవ్వడైతే నిరంతర ఆత్మవిచారణ గావించుచు, "ఈ జగత్తు అనిత్యమే కదా!" అను నిర్ణయముచే సర్వాతీతత్వము అలవరచుకుంటాడో అట్టివాడు కాలక్రమేణా జనకమహారాజులాగా ఉత్తమ శాంతిని తప్పక పొందుతాడు.

**శ్రీరాముడు :** ప్రారబ్ధము చేతనే వివేకము ప్రాప్తిస్తుందా? లేక అది స్వయముగా తనంతట తానే ఏదో ఒక ఆకస్మికమైన సమయములో ఉదయిస్తుందా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏ జీవుడైతే ఈ సంసారం పట్ల భయభీతుడై "ఉత్తమమైన అవగాహనయే ఇందుకు మార్గము" అని గ్రహించి ఆత్మ జ్ఞానము కొరకు స్వప్రయత్నమును ఆశ్రయిస్తాడో, అట్టివానికి మాత్రమే వివేకంతో కూడిన దృష్టి రూపుదిద్దుకుంటుంది. 'ఆత్మజ్ఞానము' అనబడేది ధనము వలన గాని, బంధువుల వలన గాని, 'దైవం' అనుదాని చేతగాని అనేక కర్మల చేత గాని ప్రాప్తించేది కాదు. అందుకొరకై చేసే పురుష ప్రయత్నము చేతనే అది సాధించబడుతోంది. వివేకము, వైరాగ్యము – ఈ రెండింటి విషయంలో "ప్రారబ్ధం ఉంటేనే అవి లభిస్తాయి"... లేదా "స్వయంగా, కాకతాళీయంగా లభిస్తాయి" అని తలచి, తెలియని ఏదో శక్తిపై ఆధారపడేవారు, మా దృష్టిలో, మూర్ఖులు మాత్రమే.

"ఆఁ! ప్రారబ్ధం ప్రతికూలంగా ఉంటే మేమేమి చేస్తాం? అందుకే వివేకం మాకు లభించడం లేదు" అని తలచే వారు జ్ఞానుల దృష్టిలో, ఆయా వికల్పాలకు దాసోఽహమ్ అంటున్న మందభాగ్యులు మాత్రమే! కనుక, ఓ సభికులారా! మీ అందరికీ నేను విన్నపం చేస్తున్నాను. మీరంతా అట్టి మాటలు కట్టిపెట్టండి. చక్కగా వివేకముతో కూడిన దృష్టిని అలవర్చుకోండి. ఆత్మ చేతనే ఆత్మను దర్శించండి. ఉత్తమ బుద్ధి ద్వారా సంసారసాగరమును దాటివేయండి. మనమిప్పుడు చెప్పుకున్న ఈ జనకుని వృత్తాంతము అజ్ఞాన వృక్షమును ఛేదించగలదని, జ్ఞాన సుఖమును కలిగించగలదని పెద్దలు అంటూ ఉంటారు. సుబుద్ధి ఒక్కడే తన యందు పరమాత్మ సాక్షాత్కారమును గాంచగలడని చెప్పుటే దీని ఉద్దేశము.

ఎండ వేడిమి చేత మంచు కరిగిపోతుంది. అట్లాగే ఆత్మతత్త్వ విచారణచే ఈ సంసార పటాటోపము, లేక, వికల్పము క్షణాలలో నశించిపోతోంది. "ఈ దేహమే నేను" అనునదే అజ్ఞానము యొక్క పరాకాష్ఠ. అట్టి సంకుచిత స్వభావం నశించిందా, ఇకప్పుడు మహత్తరమైన, సర్వ వ్యాప్తమైన నిజాత్మప్రకాశము స్వయముగానే ఆవిర్భవిస్తోంది. అనగా, ఆత్మ యొక్క విస్తారము ఉదయించగలదు.

❖❖❖

## 7. స్వయం విచారణ

**శ్రీరాముడు :** మహర్షీ! జనక చక్రవర్తి మహారాజుగా ఉంటూనే పాము కుబుసమును విడుచునట్లు... అహంకారాన్ని త్యజించివేశారు కదా! అది అట్లు ఎలా సాధ్యపడింది? ఏ పరికరాలు, కార్యక్రమాలు ఆయన ఉపయోగించారు? లేక, సిద్ధులు చెప్పిన అభిప్రాయములు విన్నంతమాత్రం చేతనే ఆయన సంసారమును జయించి వేశారా? లేక, అందుకు మరేమైనా కారణాలు ఉన్నాయా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సిద్ధుల వాక్యములను మననం చేస్తూ స్వయంగా విచారణ చేయుట చేత 'అహంకారము' అనబడే మూలవాసనను ఆయన జయించారు (లేక) త్యజించారు (లేక) అతీతత్వము వహించారు. అయితే, ఏదైనా ఎవ్వరికైనా లభించాలంటే సుదీర్ఘమైన అభ్యాసం, విచారణ అవసరం కదా! అట్లాగే, చిరకాలమిత్రుడైన 'స్వవిచారణ'యే ఆతనికి అందుకు తోడైనది. అహంకారము క్షయించగా విశాలచిదాకాశము నిర్మలం అవుతుంది. 'అజ్ఞానాంధకారము' అనగా, "ఈ దేహము మొదలైనవే నేను" అని తలచుటయే కదా! అట్టి అజ్ఞానం నశిస్తే ఇక ఎట్టి బాహ్యామైన పరికరములు అవసరం లేకుండానే ఆత్మ ప్రకాశము స్వయంగా ఆవిర్భవిస్తోంది. అందుచేతనే, ఉత్తముల దృష్టిలో:

1. ఈ జగత్తు స్వయంగా లేదు ... భావనను, అనుసరించి ఏర్పడి ఉంటోంది.

2. 'అహం' అను పదవాచ్యము కూడా లేదు. 3. నేను పూర్ణ స్వరూపుడనేగాని శూన్యముకాను.

– అను మూడు అవగాహనలు ఏకసమయంలో ఏర్పడి ఉంటున్నాయి. అట్లాగే నీ మనస్సు కూడా సర్వదా ప్రశమనం పొందిఉండుగాక! ఎదురుగా ఉండే వస్తువులందు నిమగ్నము కాకయే ఉండుగాక!

**అసలు 'బంధము' అంటే ఏమిటి? -**

**ఉపాదేయానుపతనం హేయైకాన్తవివర్జనమ్ ।**

**యదేతన్మనసోరామ తద్బన్ధంవిద్ధినేతరత్ ॥** (శ్లో 20, సర్గ 13)

ఆయాప్రాప్తించియున్న వస్తువులందు, స్థితి గతులందు కొన్నిటిపట్ల "వీటిని ఎల్లప్పుడూ నేను కలిగి యుండాలి" అని, మరికొన్నిటిపట్ల "ఇవి తొలగాలి" అని బుద్ధిని కలిగియుండుటే రాగ ద్వేషముల యొక్క రూపము. రాగద్వేషములు కలిగియుండుటే బంధము. అవి లేకుండుటే బంధరాహిత్యము లేక 'ముక్తి' లేక 'మోక్షము'.

తొలగాలి = హేయదృష్టి లేక త్యాజ్య బుద్ధి;

పొందాలి = ఉపాదేయ దృష్టి లేక గ్రాహ్య బుద్ధి.

ఈ రెండు దృష్టులను త్యజించి ఇక ఇప్పుడు శేషించే 'సాక్షి రూపం' నందు 'నిలకడ' కలవాడవై స్వచ్ఛతను పొంది ఉండు. గ్రాహ్య – త్యాజ్య బుద్ధిని నశింపజేసుకొన్నవారు ఇక దేనినీ ఇచ్ఛగించరు. దేనినీ ద్వేషించరు. వారి హృదయమునందు "బ్రహ్మాత్మత్వము" అనబడే సమరసభావన అకృత్రిమంగా వెల్లివిరిసి ఉంటుంది. ఆకాశం మేఘములచే ఆవరించబడి ఉన్నప్పుడు చంద్రుడు కనబడతాడా? "ఏదో పొందాలి... ఏదో తొలగాలి" అను రూపముగల తృష్ణ హృదయములో ఏర్పడి ఉన్నంత వరకు అట్టి వికల్పము యొక్క ప్రభావం చేత ఈ జీవుని పట్ల సంసారము ఉండియే తీరుతోంది. సంసారం ఉన్నంతవరకు భేద భావం, జీవ భావం అనే జాడ్యం వదలదు.

అనుకూలమైన పదార్థములందు "ఇచ్ఛ" ప్రతికూలమైన పదార్థముల పట్ల "అయిష్టత", లాభాలాభముల పట్ల రాగద్వేషములు – ఇవి ఏర్పడుచున్నచోట బుద్ధి మందగిస్తూనే ఉంటుంది. ఆతనిలో వైరాగ్యం ప్రదీప్తం కాదు. అట్టి తరుణంలో బ్రహ్మాత్మ రూపమైన సమత్వము, నిర్మలత్వము ఎట్లు ఉండగలుగుతాయి?

❖

వాస్తవానికి నిరామయము, ఏకము అగు పరబ్రహ్మమే సదా వెలుగుచుండగా ఇక ఈ భేద కల్పనలన్నీ భ్రమ కాక ఏమిటి చెప్పు? ఇష్టము–అయిష్టము, పొందబడినవి–పొందవలసినవి మొదలైనవన్నీ చపల వానరం వంటి ఈ చిత్తము యొక్క నృత్య భంగిమలే. చిత్తము గంతులు వేస్తుంటే 'సౌమ్యత్వము, నిష్కామత్వము' లకు చోటులేకుండా పోతోంది. కొందరు మహనీయులు తమ యొక్క ఉత్తమ ప్రయత్నముచే త్యాజ్యగ్రాహ్య దృష్టిని జయించి వాసనారహితులై ఉంటున్నారు. అట్టి జ్ఞానులందు ఆశా రాహిత్యం, నిర్భయం, నిత్యత్వం, సమత్వం, జ్ఞానం, నిరపేక్ష, నిష్క్రియత్వం (నేను అకర్తను అను ఎఱుక) నిర్వికల్పత్వం, ధైర్యం, మైత్రి, సమబుద్ధి, తుష్టి, శాంతి, మృదుభాషణ – మొదలైనవి స్వయంగా రూపము పొందుచున్నాయి.

**శ్రీరాముడు :** తండ్రీ! ఈ చిత్తము అల్పత్వమును ఆశ్రయిస్తూ ఆత్మత్వమునకు దూరమగుచున్నది కదా! ఏమిటి ఉపాయం? మేమేం చేయాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నీరు పల్లపు ప్రాంతాలకు పోతుంటే ఏం చేస్తున్నాం? వంతెనకట్టి ఆ ప్రవాహాన్ని నిరోధించి ఎత్తు ప్రాంతాలకు తరలిస్తున్నాము కదా! అట్లాగే, ఈ చిత్తము అధోగతికి వెళుచున్నప్పుడు చూస్తూ ఊరుకుంటామా? లేదు. 'ధ్యానము' 'భగవన్నామ స్మరణ' మొదలైన ప్రత్యాహారముల చేత చిత్తమును ఆయా విషయముల నుండి వెనుకకు మరల్చాలి

**బాహ్యా అనర్థాన్ ఇమాం త్యక్త్వా ; తిష్ఠన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్ ।**
**సర్వథా సర్వదా సర్వాన్ అన్తరాంశ్చ విచారయ ॥**

ఒక చోటకూర్చుని ఉన్నప్పుడు లేక నడుచుచున్నప్పుడు, నిదురిస్తున్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు – సర్వావస్థలలోనూ, సర్వ విధములా, సర్వ సమయములందు... అంతరంగంలో ఆత్మ విషయమే విచారణ చేస్తూ ఉండాలి.

ఈ మనస్సు బుద్ధి, ఆత్మ ఏమై ఉన్నాయి? నేను ఎవడను? ఎంతటి వాడను? నేను వేటికి 'సంబంధించని'వాడను? దేనికి 'సంబంధించిన' వాడను? దేని కొరకు ఏ రూపంగా ప్రయత్నించాలి? వేటి పట్ల ఉదాసీనంగా ఉండాలి?

...ఈ విషయాలు విశ్లేషణపూర్వకంగా గ్రహించి ఉండు. అందుకు శాస్త్రములు, జ్ఞానుల ప్రవచనములు నీకు సహకరించ గలవు. అట్టి "విచారణ, అవగాహన ఆశ్రయించబడని సమయంలో 'మోహం' అనే దారపుప్రోగులతో 'చింతా సమూహాలు' అనే ముళ్ళతో కూడిన (వాసనలు) అనే వల నేయబడుతోంది. "తృష్ణ, కోరికలు తీర్చుకొనుట" అను ప్రయోజనమే రూపంగా గల చేపలు పట్టటానికి 'సంసారం' అనే తటాకంలోకి ఆ వల పదే పదే విసరబడుతోంది...ఫలితం? అనేక జన్మ పరంపరలు! ఈ వాసనలు అనే వలను 'బుద్ధి' అనే పదునైన కత్తితో త్రెంచుకుంటూపోవాలి. మహా వాయువు మేఘాలను ఖండఖండం చేయునట్లు బుద్ధిచే వాసనలను మొదలంట పెరికివేయాలి.

❖

ఓ రామచంద్రా! అందుచేత చిరకాలాభ్యాసం ఆశ్రయించుట ద్వారా నీ బుద్ధిని దృఢతరం చేయి. 'ఆత్మను భావించుట' అను ప్రయత్నముచే అది స్థైర్యము పొందేటట్లు చేయి. చిత్తము ధీరత్వముతో కూడుకొని ఉండాలి సుమా! మనస్సు ఈ సంసారము, లేక, అవిద్య యందు అనాదిగా తగుల్కొని యున్నది. అట్టి మనస్సును సముద్ధరించటానికి అత్యంత నిర్మలమైన, సునిశితమైన బుద్ధిని సముపార్జించాలి.

నీ మనస్సు అఖండమగు బ్రహ్మాకార వృత్తిచే ప్రకాశించు గాక! ఈ సంసార వృక్షమును అట్టి బ్రహ్మాకార వృత్తి అనే గొడ్డలిచే నరకటం అత్యంత సులభం. మనస్సు వృత్తుల యొక్క సముదాయమే కదా! బ్రహ్మాకార వృత్తిచే తదితర వృత్తులన్నీ మ్రింగివేయబడు గాక! అప్పుడు ఇక్కడే, ఇప్పుడే బ్రహ్మపద ప్రాప్తి పొందుటచే సుస్థిరుడవు, సౌమ్యరూపుడవు, అనంత, అఖండానంద స్వరూపుడవు పరమేశ్వరుడవు అవుతావు. ఆత్మదృష్టిని స్థిరం చేసుకొన్నావా, నీవు పరమేశ్వరుడవై మా అందరిచే నమస్కరించతగినవాడవే అవుతావు.

ఎవడైతే అంతటా ఆత్మరూపమునే చూస్తూ, ఈ దృశ్యము పట్ల "సన్మాత్ర భావన" చేస్తూ అన్య పదార్థ భావనను త్యజించి వేసి ఉంటాడో, అట్టి వానిని ఈ'హర్షశోకవిషాదములు' అనే దోషాలు అంటజాలవు. తాక జాలవు.

**రాగద్వేషవినిర్ముక్తః సమలోష్టాశ్మకాంచనః ।**
**యుక్తఇత్యుచ్యతేయోగీ త్యక్తసంసారవాసనః ॥** (శ్లో 43, సర్గ 13)

ఎవడైతే రాగ ద్వేషముల పరిధి నుండి తనను తాను తొలగించివేసుకొని మట్టిని, రాయిని, బంగారాన్ని సమబుద్ధితో చూస్తాడో, అట్టివాడు ముక్తుడే.

అట్టివాడు ఏది చేస్తున్నా, ఏది భుజిస్తున్నా, ఏది దానం చేస్తున్నా, ఏది వధిస్తున్నా – దేని పట్లా కూడా ఏమాత్రం "ఆసక్తి" అనేది కలిగి ఉండడు. ఆసక్తి లేదు కాబట్టి వాటిచే కలుగుచుండే

సుఖదుఃఖము లందు సమభావము కలిగియుండగలుగుతాడు. "ఇది ఇప్పుడు ఇట్లు చేయుట మాత్రమే నా వంతు" – అని భావించుచూ, ఇష్ట అయిష్టములను పరిత్యజించేవానిని బంధించగలిగే కర్మలు ఎక్కడా ఏమీ ఉండవు."

❖❖❖

# 8. మనస్సు - ప్రశాంతత

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ మహామతీ! రామా! ఈ జగత్తు అంతా చైతన్యమయమే కదా! ఇక, భోగాశ కలిగి ఉండాల్సిన పనేముంది? భోగాశను వీడినట్టి మనస్సు అకృత్రిమమైన ప్రశాంతతను పొందుతోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ మనస్సు జడమైనదా? చేతనమైనదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వాస్తవానికి ఈ మనస్సు జడమైనదే. అందుచేత, అది స్వయంగా దేనిని సాధించలేదు. తనను తాను ఉద్ధరించుకోలేదు.

ఒక వనంలో ఒక సింహం ఉన్నది. అది జంతువులను వేటాడటానికి బయలుదేరుతోంది. ఆ ప్రక్కనే ఉన్న ఒక పిల్లి మాంసం మీద గల అపేక్ష వల్ల ఆ సింహమును అనుసరించి వెళ్ళుచున్నది. అట్లాగే, ఈ మనస్సు అనే పిల్లి స్వయంగా దేనినీ సాధించలేదు గాని, తనకు సాక్షిగా తనను ప్రకాశింపజేయుచున్న ఆత్మ నుండి చైతన్యము పొందినదై ఆత్మయొక్క ఇచ్ఛాదులను ఆశ్రయించి ప్రవర్తించుచున్నది. చిత్త శక్తి యొక్క ప్రభావం చేత ప్రాప్తించుచున్నది. దృశ్యము నందు ప్రవేశించి ఆయా అనుభవములకు 'భోక్త' అగుచున్నది. "అసద్రూపము" అయినట్టి ఈ మనస్సు అద్వితీయమైనట్టి ఆత్మను ఏమరచి, కేవలం జగదాకారమును భావించటం జరుగుతోంది. కాని, చైతన్యము యొక్క ప్రభావం చేతనే అది జీవించటం జరుగుతోంది. అదే మనస్సు మరొక సమయంలో ఆత్మను సంస్మరించుటచే తన మనోరూపమును – జడత్వమును వదలినదై మరల చైతన్యముగా అగుచున్నది. స్వయముగా జడము, చైతన్యముచే ప్రకాశింపబడునది అగు ఈ మనస్సు మృతప్రాయమే అవుతుంది గాని, కార్య సమర్థము కాగలదా? లేదు.

**'చిత్తము' అంటే ఏమిటి? -** "చిత్‌స్వభావం' నుండి స్వయంగా అభివ్యక్తమైన కల్పన అసత్ మయమైన విషయములను ఆశ్రయించియుండటం. లేక, నిత్య అనిత్యములను విశ్లేషించక పోవటం."

**కలన** (illution)– చిత్తము 'చిత్' నుండే బయల్వెడలుచున్నది. ఈ చిత్తము "ద్రష్ట, దర్శనము, దృశ్యము" అను రూపమున క్రియారూపంగా ఆవిష్కరించ బడుచున్నప్పుడు, అట్టి 'చిత్' యొక్క త్రిపుటీ చమత్కారమే "కలన", "కల్పన" అను శబ్దములచే చెప్పబడుతోంది.

ఆ కల్పనయే మరొకప్పుడు "నేను చిద్రూపాన్నే గాని ఈ ద్రష్ట, దృశ్యం మొదలైన సంకుచితుడను, లేక, పరిమితుడను కాదు" అని ఎఱుగుచున్నది. సముద్రం నుండి బయలుదేరిన ఉప్పు బొమ్మ ఏ కారణంగానో మరల సముద్రంలో పడితే ఏమౌతుంది? నామరూపాలు పోగొట్టుకొంటుంది. అట్లే ఈ చిత్తము స్వస్వరూపమును ఎఱిగినప్పుడు తిరిగి చిద్రూపమే అగుచున్నది.

విషయరహితమైన చైతన్యమే "సనాతన బ్రహ్మము" అని అంటున్నాం. ఆ చైతన్యం విషయ సహితమైనప్పుడు 'జీవుడు – కలన – కల్పన' మొదలైన శబ్దములుగా చెప్పుకొంటున్నాం. అనగా బ్రహ్మమే కించిత్ 'విషయాసక్తి' పొందినప్పుడు కల్పనారూపమై హృదయంలో సద్వస్తువును బోలి ఉంటోంది. ఆ 'ఆసక్తి'యే సంకల్ప వికల్ప రూపములతోకూడి 'మనస్సు' అగుచున్నది.

ఈ మనస్సు నిత్యానుభవ రూపమైనట్టి తన ఆత్మను విస్మరించి 'స్మృతి' రూపమును చెందుచున్నప్పుడు, జడరూపమును బోలి, "చిత్తము" అని అనిపించుకుంటోంది.

**చిత్తము యొక్క ధర్మములు -**

1. జరిగిపోయిన విషయముల గురించి 'మననం' చేయటం లేక 'విషయాకార కల్పన' కలిగి ఉండటం.

2. భవిష్యత్తు విషయము గురించి సంకల్పములు ఆశ్రయించటం.

3. "ఇది పొందాలి ఇది తొలగాలి" అను రూపమునగల హేయ – ఉపా దేయములతోగూడిన పరిచ్ఛిన్నత్వము.

ఈ చిత్తమే బ్రహ్మాండాకారమును (macrocosm) స్వమాయావశంచేత పొందుచున్నది. మరొకప్పుడు తనను తాను మరచి "నేను ఒక జీవుడను (microcosm)... నేను ఈ శరీరమును... ఇవి నావి..... ఇవి కావు....ఇవి నాకే ఉండాలి......" మొదలుగా గల అనేక జీవ భ్రాంతులకు లోను అగుచున్నది. మరల అర్హత పొంది, గురువుల చేత, శాస్త్రములచేత బోధింపబడేంతవరకు తనయొక్క అద్వితీయ పూర్ణానంద స్వరూపమును గుర్తెరుగుట లేదు.

❖❖❖

# 9. ప్రమత్తత - పరిభ్రమణం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఉత్తమమైన బుద్ధి పొందటమనేది అనేక జన్మలలోని పరిశ్రమకు ప్రయోజనంగా సిద్ధించుచున్నది. ఈ మానవ జన్మ బుద్ధిని సునిశిత పరుచుకొనుటకు ఒక మహత్తరమైన అవకాశము. శాస్త్రములను విచారణ చేయుటచేత, ఉత్తమమైన వైరాగ్యమును ఆశ్రయించుటచేత, ఇంద్రియ నిగ్రహమును అవలంబించుట చేత తనను తాను ఉద్ధరించుకోవాలి. జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల నుండి అతడు తన చిద్రూపమును వేరుపరుచుకోవాలి.

చైతన్యమే స్వరూపముగా గల ఈ జీవుడు "సంసార మోహము" అనే కల్లు త్రాగి ప్రమత్తతో వుంటున్నాడు. "విషయములు" అనే మృగములు సంచరించే అరణ్యంలో పచార్లు చేస్తూ అనేక ఒడుదుడుకులు అనుభవిస్తున్నాడు. "అజ్ఞానము" అనే మత్తుతో అల్ప దృష్టులచే వేసట పొందుచున్నాడు. దీనికి కారణమేమిటి?

**శ్రీరాముడు :** "జ్ఞానము" యొక్క అభావనయే. అజ్ఞానముయొక్క ఆశ్రయమే కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "శాస్త్రం – శ్రవణం – ప్రభోదం" అనువాటి సహాయంతో బ్రహ్మ రూపత్వం పొందబడాలి. లేకపోతే ఈ దృశ్యజగత్తు నందు అవిశ్రాంతమైన పరిభ్రమణం తప్పించుకోలేనిది. చిత్తం ప్రబుద్ధం కానంత వరకూ ఆత్మ అనుభూతము కాదు.

ఎదురుగా కనిపిస్తున్నప్పటికీ, ఈ జగత్తు యొక్క స్థితి "ఊహలోని రూపములు" లాగా మిధ్యాభూతమే అయి వున్నది. చిత్తము యొక్క వృత్తి రూపమే ఈ "జగత్తు" అనబడే కల్పన.

**శ్రీరాముడు :** 'కల్పితమాత్రం' అగు ఈ జగత్తును కల్పిస్తున్నది ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అంతఃకరణము నందున్న "సర్వసాక్షి" రూపమగు పరమ చైతన్యమే ఈ 'కలన' లేక 'కల్పన' లేక 'చిత్తము'ను ప్రకాశింపచేస్తోంది. ఎంతటి చమత్కారమో చూచావా!

చైతన్యము వాస్తవానికి జ్ఞానమే ధర్మముగా కలిగియున్నది. 'నిత్యబోధ' స్వరూపమైయున్నది. 'సర్వసాక్షి' అయి వున్నది. కాని, చిత్రంగా అంతఃకరణ వృత్తిచే అల్పత్వము చెందుతోంది. అయితే, ఆ అంతఃకరణ వృత్తి 'సాక్షి చైతన్యము' యొక్క 'నిరంతర ప్రబోధ' చేతనే ప్రవర్తించగలుగుతోంది.

ఒకచోట శిలచే మలచబడిన ఒక నర్తకి శిల్పమున్నదనుకో.... ఆ శిలాకన్య స్వయముగా నృత్యము చేయగలదా? లేదు కదా! అట్లే, సాక్షి చైతన్యము లేకపోతే ఈ మనస్సు గాని, 'కలన'గాని ఎక్కడా దేనిని ఎరుగజాలవు. చిత్రంలోని రాజు శంఖం పూరించు శబ్దం వినిపించలేనట్లు, మృగతృష్ణా సదృశమైన ఈ మనస్సు కూడా చైతన్యము యొక్క సహకారం లేకపోతే క్రియావంతం కాలేదు. ఆత్మ యొక్క శక్తి చేతనే మనస్సు ఉంటోంది. వాస్తవానికి ఆత్మకు వేరుగా 'మనస్సు' అనేదే లేదని మనం ఇతఃపూర్వమే కొన్నిసార్లు చెప్పుకున్నాం.

రాముని కంటే వేరుగా రాముని గుణములు వుంటాయా? జలమునకు వేరుగా తరంగాలు వుంటాయా? ...మనస్సు గాని, సంకల్పము గాని ఆత్మకు వేరుగా లేవు. అవి శుద్ధ చైతన్యము కంటే వేరు కాదు.

అయితే అజ్ఞానుల స్ఫురణశక్తి యొక్క బాహ్య ప్రసరణచే 'మనస్సు' అనే పేరుతో అధ్యాత్మశాస్త్ర బోధ కొరకు చెప్పుకుంటున్నాం. సంకల్పము గాని, విషయ వృత్తులు గాని ఏర్పడనప్పటి 'జీవసంవిత్తు' పరమాత్మయే అగుచున్నది.

**జీవుడు -** ఈ 'జీవుడు' అనబడువాడు... స్పందాత్మకమగు ప్రాణం మరియు చిదాత్మకమగు ఆత్మతత్వం – ఈ రెండింటి యొక్క అజ్ఞానపూరితమైన "అధ్యాస" చేతనే ఉత్పన్నమగుచున్నాడు. చిద్రూపము చమత్కారములైన 'కల్పనలు" చేయుచున్నవి.

"ఈ దేహమే నేను, ఇది నా స్వభావము"... "ఈ పుత్రుడు – భార్య – ధనము – ఇవన్నీ నావి"... "ఇవి సుఖకరములు – ఇవి దుఃఖకరములు"... "ఇవి ప్రియములు – గ్రాహ్యములు – ఇవి త్యాజ్యములు"... "ఇవి మాజాతి – అది కాదు"... ఇత్యాది జడభావములను ఆశ్రయిస్తోంది. అట్లు ఆశ్రయిస్తున్న సందర్భములో మనం ఆ చిద్రూపమును "జీవుడు' అని అంటున్నాం.

**శ్రీరాముడు :** అట్టి జీవునికి బుద్ధి చిత్తము మొదలైనవన్నీ ఎక్కడినుండి వచ్చి చేరుతున్నాయి? ఈ జగత్తు ఎక్కడినుండి ఏర్పడుచున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సంకల్పం నుంచి ఏర్పడుతోంది. సంకల్పమే జగత్తు. ...కాని సంకల్పమునకు స్వకీయమైన ఉనికి ఎక్కడ? అట్టి "అసత్తు" అయినట్టి సంకల్పమునకే "బుద్ధి – చిత్తము – జీవుడు." మొదలైన పేర్లను శాస్త్రవేత్తలు కల్పించడం జరిగింది. కాని, పరమార్థానికి అవేవీ లేవు.

కేవలం ఆత్మయే ఏకరసమై సర్వదా అన్నివైపులా, అన్ని వేళలా వెలుగొందుచున్నది.

అందుచేత, ఈ జగత్తు అంతా ఆత్మయే. ఈ కాలము యొక్క క్రమము కూడా ఆత్మయే. ఆత్మ ఆకాశము కంటే కూడా అత్యంత సూక్ష్మమై, స్వచ్ఛమై వెలుగుచూ వున్నది. అది అత్యంత నిర్మలమైనది. అది అల్ప బుద్ధికి "లేదేమో!" అని అనిపిస్తోంది. కాని సర్వదా సర్వము నందు శుద్ధ చిద్రూపమై వెలయుచునే ఉంది. ఈ కళ్ళు, చెవులు మొదలైన ఇంద్రియాలకు లభించదు కాబట్టి "అది అసత్తు"గా కొందరు అవగాహన చేసుకుంటున్నారు. ఇంద్రియములకు అవిషయమైనది, కేవలము అనుభవమునకు మాత్రం ప్రాప్తించేది అయినట్టి ఆత్మ సర్వదా సద్వస్తువేనయ్యా!

**శ్రీరాముడు :** అట్టి ఆత్మ సాక్షాత్కారం దూరస్థమగుటకు కారణం ఈ మనస్సే కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను. విషయములు అనే వాసనలను కలిగియున్నంత వరకు ఈ మనస్సు ప్రతిబంధకమే అయి ఉంటోంది. అయితే, ఎక్కడైతే చిత్‌స్వరూప సాక్షాత్కారం కలిగి ఉంటుందో అక్కడ అజ్ఞాన కారణమైన ఈ మనస్సు తనంతట తానే శమిస్తోంది. వెలుతురు వుండే చోట చీకటి ఎట్లా వుంటుంది?

1. "ఆత్మ దృష్టి" ఉన్న చోట ఈ దృశ్యము అదృశ్యమై వుంటోంది.

2. "దృశ్య దృష్టి" అవలింబించే చోట 'ఆత్మ' అనుభవమునకు లభించడం లేదు. అనగా, చిత్తముచే కల్పించబడిన మిథ్యావస్తువు, మిథ్యా సంబంధములు మననము చేస్తూ వుంటే, ఆత్మ విస్మరించబడుతోంది.

దృష్టియే సృష్టి. దృష్టియే జగత్తు. ఏది ఏ దృష్టితో చూస్తే ఇది ఆ విధముగానే ప్రాప్తిస్తోంది. మరొకరకముగా చెప్పాలంటే అతి స్వచ్ఛమైన "ఆత్మ సంవిత్తు" యొక్క సంకల్ప పరంపరల చేతనే ఈ దృశ్యములన్నీ ఆవిర్భూతములగుచున్నాయి. అందుచేత రామా! నీవు ఈ 'దృశ్యదృష్టి'ని త్యజించు. 'ఆత్మదృష్టి'నే ఆశ్రయించు. "నాకు ఇష్టమైన వారు, నాకు ఇష్టము లేని వారు కూడా ఆత్మస్వరూపులే కాని, మరింకేమీ కారు" అనే అవగాహన కలిగి ఉండి, ఇక ఆపై విధివిధానముల ప్రకారం నీ కార్యక్రమములను నిర్వర్తించు.

**శ్రీరాముడు :** ఆత్మ యొక్క దర్శనం అవడం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సంకల్పమే చిత్తము. పరమాత్మని సంకల్పమే 'జగత్తు' అనబడు దృశ్యము. సంకల్పము యొక్క అభావమే.... చిత్తము యొక్క నాశనము కూడా. చిత్తము అభావించబడితే.... ఇక ఆపై మోక్షము స్వతహాగానే ఎదురు వచ్చి నిలబడగలదు.

సంకల్పము ఉంటే మనస్సు ఉంటుంది. మనస్సు అడ్డుగా ఉన్నంతవరకూ ఆత్మ దర్శనము కాదు. సర్వ సంకల్పములు త్యజించబడ్డాయనుకో... ఇకప్పుడు శేషించేది సత్తా సామన్యమే.

**ఆత్మసందర్శనం -** కాబట్టి నీవు ఈ "నేను – నాది" అను మూలవృత్తులతో సహా సర్వ సంకల్పములకు ఆవలకు చేరుకో. అప్పుడిక మిగిలి ఉండే 'సత్తాస్థితి' యందు స్వస్థుడవై ఉండు.

**శ్రీరాముడు :** ఈ 'నేను – నాది' అనబడే మూలవృత్తులు ఎందు నిమిత్తం, ఎందులో నుంచి, ఎప్పుడు, ఎట్లా బయల్వెడలుచున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవి బయల్వెడుచున్నది చిత్తము నుండే. చిత్తమో.... ఆత్మ సత్తా నుండే.

ఆత్మ ఒకానొకప్పుడు అనిర్వచనీయముగా 'సంకల్పము' అనబడు క్రియా విశేషము వైపుగా ఉన్ముఖమగుచున్నది. అప్పుడది తన యొక్క "చిత్స్వరూపము"నందు కించిత్ 'అన్యథా' భావము పొందుచున్నది. ఆ 'అన్యథా' యొక్క రూపమే – "అహము... త్వమ్... సః" (నేను–నీవు–అతడు) అనునవి. అట్టి అన్యథా భావమే ఈ సంసారోత్పత్తికి హేతువు. ఆ సమయంలో ఏర్పడుచున్న 'ధ్యాస' కు 'చిత్తము' అను పేరు పెట్టబడింది. "కనుక 'అన్యథా' అను ధ్యాస యొక్క ప్రసరణయే చిత్తమునకు బీజము" – అని శాస్త్రములు ప్రవచిస్తున్నాయి.

**కలన** (Illusion): కలన లేక కల్పన అను మరొక పేరు కూడా ఉపయోగించబడింది. ఆత్మ తన యొక్క నిత్య నూతనమగు "నిర్వికల్ప చిత్స్వభావము" నుండి ఒకానొకప్పుడు 'చ్యుతి' పొందినదగుచున్నది. అట్లు 'సంకల్ప వ్యవహారము' కళంకితమైన సత్తయే 'కలన'అను శబ్దముచే ఉద్దేశించబడుతోంది. అట్టి 'కలన' యొక్క ప్రతిభ చేత ఈ జగత్తు యొక్క ఉత్పత్తి నిమిత్తం 'మనస్సు' ఆవిర్భవిస్తోంది. సంకల్పములే మనస్సు యొక్క రూపం.

కలనయే ప్రాణశక్తి కూడా. ప్రాణశక్తి నిరోధించబడినప్పుడు మనస్సు కూడా విలయమగు చున్నది. ఒక అద్దం పగిలిపోతే, ఆ అద్దంతో పాటే అందలి ప్రతిబింబం కూడా నశించడం జరుగుతుంది కదా! ప్రతిబింబము దర్పణము యొక్క కల్పిత రూపమే అయినట్లుగా, ఈ మనస్సు కూడా ప్రాణము యొక్క రూపమే అయి వున్నది.

స్పందనము + అనుభవము = మనస్సు, ప్రాణము.

ఒక్కడు ఎక్కడో దూరముగా ఉన్న ఒకానొక పదార్థముయొక్క మానసికానుభవం తన యందు పొందుచున్నాడనుకో... అట్టి మనోకల్పిత పదార్థముతో ఏర్పడిన అట్టి సంబంధము ఒకా నొక 'గతిశక్తి' చేతనే సంభవిస్తోంది కదా! ఆ గతి శక్తినే 'స్పందనము' అని కూడా అంటున్నాం. అట్టి గతి శక్తి చిత్తముతో కూడుకొని ఉన్నప్పుడు 'అనుభవము' అనునది సిద్ధిస్తోంది. చిత్తము మరెక్కడో వుంటే... ఆ సమయములో 'చూపు' ఒక వస్తువుపై ప్రసరించినప్పటికి ఆ అనుభవము' అనునది ఏర్పడదు. కనుక చిత్తమే ఒక వస్తువుతోనో లేక విషయముతోనో ఏర్పడే 'సంబంధము'ను నిర్వచించడం, శాసించడం జరుగుతోంది. అందుచేత చిత్తమే జగత్తు. చిత్తమే సంసారము.

"స్ఫందము – అనుభవము" ఈ ఉభయ శక్తుల సమ్మేళనమే భావాభావములకు కారణం. వాటి సమ్మేళనమే 'ప్రాణము'. ఆ ప్రాణమే మనస్సు. 'ప్రాణవాయుశక్తి'ని చలింపచేసేది చైతన్యమే!

ప్రాణవాయువు సర్వ రాగములు త్యజించుట చేతను, (వైరాగ్యము చేతను), ప్రాణాయామ అభ్యాసము చేతను, సమాధిని ఆశ్రయించుట చేతను అసద్వ్యసనములు క్షయించుట చేతను, పరమార్థమైనట్టి 'బ్రహ్మజ్ఞానము' చేతను నిరోధింపబడగలదు. ఈ ప్రాణవాయు శక్తి చలనరూపమే అయి ఉన్నది కదా! అది తన యందు చలన శక్తి కలిగియున్నప్పటికీ అది స్వయముగా తనకు తాను చలించలేదు. అనగా అది స్వతహాగా జడమైనదే. దానిని చలింపచేయునది ఎవరు?... ఆత్మ చైతన్యమే సుమా! ...అట్లాగే మనస్సు కూడా. మనస్సు స్వతహాగా జడమే అయివుండి, ఆత్మ చైతన్యము చేత ప్రవర్తింపచేయబడుచున్నది. ఆ ఆత్మయే స్వయం ప్రతిభచే 'చిత్‌శక్తి' లేక జ్ఞానశక్తి స్వరూపమై, అతి స్వచ్ఛమైన, స్వయంవ్యాపకమై ఉన్నది.

సంకల్పించకపోవడమే మనో నాశనం – సంసారోపశమనం.

ఈ వర్తమానపు ఉపశమన ప్రకరణము యొక్క సారాంశము సంక్షిప్తముగా రెండు మూడు వాక్యాలలో చెప్పుకోవాలంటే...

"చిత్+స్ఫందశక్తి" ఈ రెండింటి యొక్క సంబంధమే మనస్సు. అట్టి సంబంధము మిథ్యారూపమున ఉత్పన్నమగుచున్నది. కనుక మనస్సు మిధ్యయే అయి ఉన్నది. అందుకే ఈ మనస్సును 'అవిద్య – మాయ' అని కూడా అంటున్నాం. అదియే ఈ 'సంసారము' అను దానిని కలుగజేస్తున్న అజ్ఞానం. చిత్ – స్ఫందములకు 'సంకల్పించుట' అను ప్రక్రియ చేత సంబంధము ఏర్పడుచున్నది. కనుక సంకల్పించుటయే మనస్సు యొక్క రూపము.

అందుచేత – 'సంకల్పించకుండుట' అను విశ్రాంతిచే ఈ 'సంసారము' అనబడేది తృటిలో జయించివేయబడగలదు. ఈ జగత్తు యొక్క ఉపశమనము సంకల్ప రాహిత్యము చేతనే జరుగగలదు.

❖❖❖

# 10. 'జలము' ఉపమానం – చైతన్యము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జలమును – తరంగములను ఉపమానంగా తీసుకొని చైతన్య తత్త్వమును విశదీకరిస్తాను. విను–

జలమును భేదదృష్టితో దర్శిస్తున్నప్పుడు ...జలము యొక్క కదలిక, తరంగ దృష్టి, తరంగాలు" ...అనే వివర్తము ఏర్పడుతోంది. అదే విధంగా చైతన్యమే ...స్పందనశక్తి, అంతఃకరణము యొక్క సంకల్పము, చిత్తము" ...అయి ఉంది.

వాయువు నందలి చలనముతో పోల్చతగు స్పందనశక్తి (Vibration) ఒకప్పుడు చైతన్యము చేత ప్రబోధితం అవుతోంది. విషయములతో కూడిన చైతన్యమే సంకల్ప పరంపరల ఫలితంగా చిత్తముగా పరిణమిస్తోంది.

ఈ చిత్తము (మనస్సు) అనబడేది ఒక బాలునికి కనిపించే దయ్యం లాగా మిథ్యారూపంగా కల్పించబడుచున్నది. తరంగము వాస్తవానికి జలమే కదా! ఈ చిత్తము యొక్క వాస్తవ స్వరూపం కూడా అఖండ మండలాకారమగు ఆ చిద్వస్తువే సుమా!

ఎక్కడైనా తరంగములు ఏ ప్రయత్నమైనా చేసి జలాన్ని ఖండించగలవా? జలాన్ని తరంగం ఖండించటం ఏమిటి? అది మొదలే హాస్యాస్పదం. అట్లాగే, ఆ "చిత్‌స్వభావము" (చిత్ యొక్క నిర్మలత్వము – పూర్ణత్వము – అఖండత్వములను) ఏ అన్యమైన దాని చేతను ఖండింపబడజాలదు. జలము .. ఒకానొక ద్రవపదార్థము. తరంగమో... ఆ జలము యొక్క కదలికచే ఏర్పడే ఒకానొక ఆకారము. ఈ రెండూ అభేదమే కనుక అవి ఒకదానిని మరొకటి ఎదుర్కొనటమనేది ఉండదు. అట్లాగే 'చిత్'కు 'అచిత్'కు అసలు అభేదమే ఘటిల్లదు. మరి అచిత్ (దృశ్య పదార్థము – నీవు – నేను మొదలైనవి) బయలుదేరి చిత్‌ను మరొకటిగా ఎట్లా చేస్తుంది? చిత్‌ను ఖండించటమేమిటి? తరంగముల భేదం చేత జలం వేరువేరు కానట్లే 'జీవులు – జగములు' మొదలైన వాటి చేత చిత్ ఖండం కాదు కాబట్టి అది "అఖండము".

మనస్సు అనునది ఎక్కడ? జలములో 'తరంగము' అని చెప్పబడే వేఱైన పదార్థమున్నదా? కనుక, "చిత్ మనస్సు అను స్పందన కలిగి ఉన్నది! ఆ మనస్సు ఆత్మను ఆవరించి ఉంటోంది" – అనునవన్నీ అల్పమైన ప్రవచనములు మాత్రమే.

అభేదము దర్శిస్తున్నప్పుడో...! ఒక వేళ ఈ 'చిత్' స్పందరహితమై అమనస్కంగా ప్రకాశిస్తోంది అనుకో.. అట్టి స్థితిలో కేవలము చిద్రూపమే శేషించి ఉంటుంది కదా! ఇకప్పుడు మనస్సుకు చోటు గాని, రూపము గాని ఉండదు. 'నేను కేవల స్వరూపుడను' అను అచింత్యమైన ఎఱుక మాత్రం ప్రవర్తిస్తూ ఉంటుంది.

ఈ విధంగా భేద – అభేదములు అనబడే రెండు పక్షము లందు "చిత్తము అనబడే పదార్థమే లేదు." అని విశ్లేషించబడుతోంది. అయితే "మరి మాకు మనస్సు అనుభవమౌతోంది కదా...!" అని ఎవరైనా అంటారేమో!

నాయనలారా! ఆ మనస్సుగాని, చిత్తముగాని మీ స్వస్వరూపము కంటే వేరైనవి కావు, కానేరవు. వేరుగా తోచుట భ్రమ మాత్రమే. ఇక మీరో? ... చిత్ యే స్వరూపముగా కలిగి ఉన్నవారు. భ్రమ చేత మాత్రమే అనుభవమగుచున్న ఈ చిత్తము అనబడు దానిని "సమ్యక్" యొక్క అభ్యాసముచే జయించి వేయండి. అట్టి అభ్యాసము యొక్క ప్రయోజనమే "బ్రహ్మజ్ఞానము".

❖

అందుచేత ఓ రామచంద్రా! నీవు "మనస్సు అనబడేది ఒకటి ఉన్నది. ఏదేదో చేసి దానిని తొలగిస్తాను" ... అనే దుర్బల మనఃసంకల్పములను దరికి రానీయకు. అట్లు మొండిగా భావించుటచే కొందరు శ్రమ – క్లేశములకు లోనగుచున్నారు. ఉన్న వస్తువునైతే మనం తొలగించుటకు ప్రయత్నించ వచ్చు. లేని వస్తువును ఎట్లా తొలగిస్తాం? 'సంకల్పించుట' అను క్రియను మాని వేసి చూడు. ఇక 'మనస్సు' అనేది ఎక్కడున్నది? అభ్యాసమే సంకల్పరాహిత్య స్థితిని ధ్రువీకరించటానికి ఉపాయం.

**శ్రీరాముడు :** తండ్రీ! సంకల్పాత్మకమైన మనస్సు అనబడేది అసలు ఉందా? లేక లేదా? ..."మనస్సుచే ఈ జీవుడు బద్ధుడగుచున్నాడు" అని కొన్ని శాస్త్రములు చెప్పుచున్నాయి కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "సంకల్పాత్మకమగు మనస్సు" అనునది ఎక్కడా లేదు. సంకల్పము చేయుటయే మనస్సుగా చెప్పబడుతోంది. అది మిథ్యా జ్ఞానముచే ఉత్పన్నమగుచున్నది. కల్పనయే దాని రూపము. హృదయమందు ఉన్నట్టి సాక్షి చైతన్యమునకు జ్ఞానోదయమైన మరుక్షణం అది శమించిపోవుచున్నది.

ఈ మనస్సు జడమైనది మాత్రమే. దానిని తొలగిస్తున్నది సాక్షి చైతన్య స్వరూపుడవగు నీవే. "నేను ఆత్మస్వరూపుడనే" అను భావనను ఆశ్రయించావా... ఇక అది మృతప్రాయమే అగుచున్నది. ఎఱిగినంత మాత్రం చేత మృతప్రాయంగా మిగిలిపోయే ఈ మనస్సుచే ఈ ప్రపంచము సృష్టించబడట మేమిటి? పొందబడుట ఏమిటి? రూపము గాని, ఆధారము గాని లేని మనస్సుచే సాక్షి చైతన్యుడవగు నీవు బాధింపబడటం ఏమిటి?... ఇవన్నీ మూర్ఖ వాక్యములు కావా చెప్పు?... నెమలి ఈకచే కొండ పిండి చేయబడటమంటే ఎట్లాంటిదో.... చంద్ర కిరణము తాకుటచే బుగ్గలు కందటమంటే ఎటువంటిదో... స్వతః సిద్ధమగు ఉనికియే లేని మనస్సుచే ఆత్మ స్వరూపుడగు జీవుడు హింసించబడటం కూడా అట్టిదే!

"ఒకడు మనస్సుచే అనేకచోట్లకు ఈడ్వబడుచున్నాడు"... "మరొకడు ఈ మనస్సును జయించడానికి తీర్థయాత్రల నిమిత్తమై దట్టమైన అడవులలోకి ప్రయాణములు చేస్తున్నాడు"... ఇటువంటి కథనమంతా మా దృష్టిలో చిన్నపిల్లల చేష్టలే. పరమార్థ దృష్టిచే మనస్సు మొదలైనవి లేవు. "ఏకమ్ సత్" అని శాస్త్రాలు అనటంలో ఉద్దేశ్యం అదే! ఎందుకంటే మనస్సు ఒక మిథ్యా రచనయే కదా! ఎంత అన్వేషించినా "ఇదిగో, మనస్సు అనబడునది ఇక్కడ ఈ రూపంలో ఉంది" ....అన్నట్లుగా మనకేమన్నా లభించుచున్నదా? ...లేనే లేదు. ఒక మిథ్యా వస్తువు చైతన్య మూర్తిని జయించుటయా? స్వప్నంలో కనిపించిన ఒక చెఱువులో ఆ స్వప్న ద్రష్ట మునిగి మరణించుటయా?

ఆహా! మహామాయావి అగు ఆ మయునిచే సృష్టించబడిన ఇక్కడి 'దృశ్యము' అను మాయ ఎంతటి చమత్కారమైనదో చూస్తున్నావా రామా? తనకు స్వరూపమే లేదు.... ఊరుకున్నంత మాత్రం చేతనే, అది లేకయే పోగలదు... అటువంటి 'మనస్సు" అనబడు మిథ్యా వస్తువుచే ఈ జనులందరు ఆడించబడుచున్నారు. కనుక మనస్సు స్వయంకల్పితం మాత్రమే కాని, ఎవరో కల్పించి మనకు అంటకట్టింది కాదు.

❖❖❖

## 11. అజ్ఞానవశం చేత....

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఎప్పుడైతే అజ్ఞానం కలిగిందో, అప్పుడు ఈ జీవుడు సర్వ ఆపదలకు అర్హుడగు చున్నాడు. ఆతడు పొందని క్లేశం ఏమున్నది...? అసలు ఈ 'సృష్టి' అంతా కూడా అజ్ఞాన కారణంగానే ఉత్పన్నమగుచున్నది. అయ్యో! ఎంతటి విషాదకరమైన విషయం! ఈ జీవుడు అజ్ఞాన వశం చేతనే 'మనస్సు' దేహం మొదలైనవిగా గల జడవస్తువులచే బాధింపబడుచున్నాడు. పోనీ ఆతడు సరిగ్గా

పరిశీలన చేస్తున్నాడా? లేదు. మరల మరల 'అసన్మార్గము'నే అవలంబిస్తున్నాడు. తన దుఃఖము కొరకే ఈ సృష్టిని సమాశ్రయించి ఉంటున్నాడు.

**శ్రీ రాముడు :** మరి ఈ జాడ్యమునకు ఉపాయం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు, ఈ సృష్టి – ఇవన్నీ ఎట్లా ఉత్పన్నమైనాయి? 'అవిచారణ' చేతనే కదా! అందుచేత అజ్ఞానమయమైన ఈ సృష్టి 'సువిచారణ' మాత్రం చేత పేలవమైపోతోంది. ఇక దీనిని గురించి దుఃఖించటం ఎందుకు?

ఈ సృష్టి మనుజుని స్వయం కల్పితమైనట్టి 'భ్రాంతి' యొక్క రూపమే అయి ఉన్నది. "సాయంకాలం ఆకాశంలో పక్షులు అటూ ఇటూ ఎగురుతుంటే అది నాకు నా ప్రియురాలి విరహం గుర్తు చేస్తోంది" అనే వ్యాఖ్యానం ఎంతగా భ్రమ స్వయం కల్పితమో, ఈ సృష్టిని కూడా ఈ జీవుడు అట్టి స్వయంకల్పిత కథనముల చేతనే పొందుచున్నాడు. అట్టి కథనములను మొదలంట్లా త్యజించాడా... ఇక ఇదంతా ఆ జీవుడు తన స్వస్వరూపంగానే ఆస్వాదించగలడు.

❖

ఏది ఏమైతేనేం? "మిధ్యారూపము, కల్పితము, ఎచ్చటా కూడా ఉనికి లేనిది, అల్పము" అయినట్టి ఈ మనస్సు చేత లోకమంతా హతం కావటం మనం చూస్తున్నాం. అయితే, మానవుడన్న వాడు కల్పితమయమగు ఈ సృష్టిని, 'అసద్రూపము' అయి ఉన్న ఈ మనస్సును తన వశం చేసుకోవటానికి సిద్ధపడాలి. అట్లా సిద్ధపడని వాడు అధ్యాత్మ జ్ఞానప్రవేశమునకు ఏ విధంగా అర్హుడు కాగలడు చెప్పు? అల్పదృష్టి, స్వల్పములనైన వాటి కొరకు ఆశ, బలహీనమైన అవగాహనలు గల జీవుల యొక్క దుష్టబుద్ధి బాహ్యపదార్థము లందే స్థిరపడిపోయి ఉంటుంది. "వీటిని పొందితే నేను పూర్ణత్వమును పొందుతాను" అని భ్రమను చెందుతోంది. అట్టి బుద్ధి తన అంతరంగము యొక్క స్వరూపమును గ్రహించలేకపోతోంది. సూక్ష్మమైన విశేషములను గుర్తించలేకపోతోంది. సూక్ష్మ బుద్ధి లేని సమయములో ఈ సంసారము యొక్క అల్ప శబ్దములకు కూడా ఈ మనస్సు భీతిల్లుచున్నదే! అల్పమైన విషయముల పట్ల అహంకార – మమకారములు ఏర్పడుచున్నవే!

జ్ఞాన శూన్యుడైనవాడు తన యొక్క మనస్సు చేతనే అతి క్రూరముగా దీర్ఘకాలము నుండి హింసించబడుచున్నాడు. స్వల్ప సుఖములచే పరిపరి విధములుగా మోసగించబడుచున్నాడు.

అనేకమైన అపనమ్మకములతో, స్వల్పములయిన విషయముల మధ్య ఉన్మత్తుడై వ్యవహరించే అట్టి వాని ముందు ఉత్కృష్టమైన సత్య విషయములను ప్రతిపాదించుట ఎట్లాగో మేము గ్రహించ లేకపోతున్నాము.

❖❖❖

# 12. ఉపదేశములకు అర్హులు - అనర్హులు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇప్పుడు శాస్త్రములచే చెప్పబడు ఉపదేశముల సారమును గ్రహించనట్టి వారి విషయమై కొన్ని విషయములు సర్వజనులకు మనవి చేస్తున్నాను.

కొందరు జనులు ఈ సంసార సాగరములో "విషయ – సుఖాభిలాషలు" అనే తరంగములచే కొట్టుకొని పోబడుచున్నారు. 'పరమార్థ విషయము'లో వారు అత్యంత చెవిటితనం, మూగతనం వహించి ఉంటున్నారు. ఆత్మ తత్వ విచారణ చేయడం, యుక్తి సహాయంతో ఉత్తమ సత్యమును పరిశీలించటం – ఇవన్నీ వారిని సమీపించుట లేదు. అట్టివారు అధ్యాత్మ విద్యను గ్రహించడానికి అనర్హులే అగుచున్నారు.

"కళ్లు మూసుకొనే నడుస్తాం! అది అంతే!" అని చెప్పుకుంటూ కళ్లు తెరవని బాటసారికి బాట ప్రక్కన గల పూతోటను ఎవరు చూపించగలరు? వాసన చూడలేని వారికి సుగంధం వెదజల్లే అత్తరులు, రసాయనాలు అందిస్తే ఏం ప్రయోజనం? మత్తుగా త్రాగినవాడికి 'వాదము – చర్చ' ద్వారా నిజము నిరూపించడానికి ప్రయత్నించగలమా? ఆతడు న్యాయ నిర్ణయమును అర్థం చేసుకోగలడా? విచక్షణ – సద్విమర్శలను ఆకళింపు చేసుకోగలడా?

ఒకడు తన సందేహములను తీర్చుకోవడానికని శ్మశానానికి వెళ్ళి పెద్ద గొంతుకుతో శవ పేటికలతో అరిచి చెప్పితే ఏదైనా ప్రయోజనముంటుందా? మూర్ఖునికి నీతి వాక్యములు వినిపించ గలమా? మనస్సు మొండికేస్తూ ఉండగా దురభ్యాసములకు దాసోహమగుచున్న వానికి సన్మార్గము యొక్క ఔన్నత్యము గురించి చెప్పే సుందరమైన భాషాప్రయోగాలు ఎందుకు పనికి వస్తాయి?

అనర్హుల ముందు ఆధ్యాత్మ విద్యను ప్రతిపాదించడం అట్టిదే అగుచున్నది.

❖

ఓ సర్వజనులారా! నాదొక విన్నపము. ఏ మనస్సైతే 'యదార్థానికి లేదు' అని క్రిందటి సర్గలో మనం నిరూపించామో... "అట్టి మనస్సు నా ఇచ్ఛ యొక్క రూపమే. ఇచ్ఛ, అభ్యాసములను బట్టి మనస్సు ఉంటోంది. కనుక "ఇచ్ఛ, అభ్యాసములు సరి అయిన మార్గములో నియమిస్తూ ఉంటే ఇక మనస్సు జయించబడినట్లే" – అని ఎందుకు సంభావించరాదు?

మరొక విషయం. ఒకానొక బాటలో "ఆ దూరంగా ఎత్తుగా కన్పిస్తున్నది ఒక పెద్ద బండ రాయేమో?" అని సందేహము, భయము ఏర్పడి ఉన్నాయనుకో... అది దూరముగా చూచిన రథ సారథి "అయ్యో! ఎట్లా ప్రయాణించడం ... అని భయపడుతున్నాడనుకుందాం. ఇంతలో "అది బండరాయి కాదు, ఏదో క్రీనీడ మాత్రమే... అక్కడ బండరాయి లేదు" అని ఎదురుగా వస్తున్న బాటసారులు చెప్పారు. ఇప్పుడు "ఆ బండరాయి తొలగించబడినట్లే" అని ఎందుకు భావించరాదు.

**శ్రీరాముడు :** అవును. రథసారథి నిరభ్యంతరంగా అట్లు భావించవచ్చు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అదే రీతిగా "మనస్సు – అనేదే లేదు" అని శాస్త్రములు, మేము కూడా

స్వానుభవ పూర్వకంగా ప్రకటిస్తున్నాం కదా! కాబట్టి "ఈ మనస్సు సర్వదా తొలగించబడినట్లే" అని ఎందుకు భావించరాదు.

యదార్థానికి 'లేనిదే' అయినట్టి మనస్సుకు "ఈ మనస్సును జయించడం మా వల్ల కాదు" అనుకుంటూ తిరుగాడే వారు ఎక్కడో దూరముగా కనిపించిన త్రాడును చూచి పామనుకుని ఇక్కడ నుఱుగులు కక్కేవారే అవుతారు.

**జ్ఞానదృష్టి -** జ్ఞాని ఎల్ల వేళల తన ఆత్మనే సర్వత్ర దర్శిస్తూ ఉంటాడు. ఆయా తదితర శరీరములను చూచుచున్నప్పుడు "ఓహో! ఇక్కడ ప్రాణ శక్తులు ప్రకటనమగుచున్నాయి కదా!" అని మాత్రమే తలచుచున్నాడు. ఆ శరీరములలో ఆత్మయే చైతన్యమూర్తిగా వ్యవహరిస్తూ జడమగు ప్రాణాదులను చలింపజేయుచున్నదని గ్రహిస్తున్నాడు. రెండు పాత్రలలోని ఒకే ద్రవము వలే, రెండు గృహముల స్థానంలో ఒకే ఆకాశము వలే, ఈ నానా విధ దేహాలలో ఒకే ఆత్మ అధిష్ఠించి ఉంటోందని ఆతడు ఎరుగుచున్నాడు.

జ్ఞాని తన ఇంద్రియములను చూచి "ఓహో! మీరంతా మీ మీ ధర్మములను నియుక్తులగుచున్నారు కదా! మంచిది" అను విధముగా దర్శిస్తున్నాడు. ఇక అతనికి మనస్సు అనేదేదీ, ఎక్కడా వేరే అగుపించదు.

ఆత్మ... జ్ఞానశక్తి కలిగి ఉంటుంది. ప్రాణములు ... స్పందనశక్తి కలిగి ఉంటున్నాయి. ఇంద్రియములు... రూపము, రసము మొదలైన వాటిని సాక్షాత్కరించుకొను శక్తి కలిగి ఉంటున్నాయి.

"ఈ ఆత్మ – ప్రాణ – ఇంద్రియములు వాటి ధర్మములను అనుసరించి ప్రవర్తన కలిగి ఉంటున్నాయి. మరిక బంధం ఎవరికి?... ఎక్కడ?..." అని జ్ఞాని ప్రపంచమును ప్రశ్నిస్తున్నాడు.

ఈ కనబడే జీవులందరిలో ప్రస్ఫుటమగుచున్న వ్యవహార శక్తంతా సర్వ శక్తిమంతుడు, సర్వ నిర్మాత అగు ఆ పరమాత్మ యొక్క కిరణముల ప్రసరణయే అయి ఉన్నది. అదిగో! ఆకాశములో సూర్యుని చూడు. అనంత సంఖ్యలో సూర్య బింబము నుండి కిరణాలు బయలు దేరుచున్నాయి. ఆ కిరణములన్నీ సూర్యుని స్వభావమును వేరైనవి కావు. ఒక్కొక్క కిరణం ఒక్కొక్క వస్తువును ప్రకాశింపజేస్తోంది. కాబట్టి "తటాకంపై ప్రసరించే కిరణం వేరు... ఇంటిపై ప్రసరిస్తున్న కిరణం వేరు"... అని అనగలమా? లేదు కదా! "ఈ వేరువేరు జీవరాసుల ద్వారా ప్రకటితమగుచున్న దంతా ఒకే ఆత్మ శక్తియే" అను అనుభవం ఉత్తమ జ్ఞానులు పొందుచున్నారు. ఏ జీవి దేనిని అవగాహన చేసుకుంటున్నప్పటికీ "ఎఱుగుట" అను స్వభావము ఒకే తీరై ఉన్నది కదా!

**జగత్తు లేదు... ఆత్మయే ఉన్నది -** ఈ జగత్తును విజ్ఞాన దృష్టితోను, భ్రాంతి రహితమైన దృష్టితోను చూస్తున్నప్పుడు "ఇది అంధప్రాయమే, లేక, లేనిదే" అని తెలియవస్తోంది. అట్టి ఉత్తమ దృష్టిచే ఈ జీవుడు అనబడువానికి ఆత్మ కంటే వేరైన సత్తా లేనేలేదు. ఈ శృతి వాక్యములు చూడు:

"నాన్యోస్తి దృష్టమ్" = ఈ కనబడుచున్నదేదీ బ్రహ్మము కన్నా వేరుగా ఉండుట లేదు.

"నాన్యోస్తి విజ్ఞాతమ్" = బ్రహ్మము కంటే వేరుగా ఏదీ తెలియబడుట లేదు.

"జీవో బ్రహ్మేతి నాపరః" = ఈ జీవుడు బ్రహ్మమే గాని, వేరే ఏమీ కాదు.

...ఈ వాక్యములన్నీ జగత్తు యొక్క మిధ్యత్వమునకు, ఆత్మ యొక్క సత్యత్వ – నిత్యత్వములకు ప్రమాణములగుచున్నాయి.

**శ్రీరాముడు :** అయితే స్వామీ! "బ్రహ్మము చేతనము – ఈ జీవుడు అచేతనము" – అని అనవచ్చా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లా అయితే ఈ జీవుని యందు శక్తి ఉండేది కాదు. స్వకీయమైన ప్రయత్నము – అవగాహన – బంధము – మోక్షము" మొదలగునవి కూడా ఉండేవి కావు. అందుచేత జ్ఞానులు సిద్ధాంతీకరించునది విను–

'ఆత్మ' కంటే వేరుగా ఈ చిత్త జీవులు లేరు. ఉన్నట్లు తోచటమంతా స్వకీయమైన భ్రమచేతనే. అందుచేత నీకు పైపై కనిపిస్తున్న ఈ 'జీవుడు – చిత్తము' అనునవి ప్రతిబింబ మాత్రములు, అసద్రూపములు మాత్రమే. కనుక "ఈ జీవుల వాస్తవస్వరూపము "నిత్యము–నిర్మలము–అఖండము అయిన ఆత్మయే" – అను దృష్టిని కలిగి ఉండు.

❖

ఓ జనులారా! మీ చేత మీరే కల్పించుకుంటున్న "మనస్సు" అనబడు దాని కారణంగా మీ యొక్క 'పరమార్థ దృష్టి'ని కోల్పోవుచున్నారే! అందుకు ఫలితంగా మీరు పొందుచున్న దుఃఖ పరంపరలను చూస్తుంటే – మానసిక రోగపీడితుడగు కుమారుని బాధలు చూస్తున్న తండ్రిలాగా – మాకు ఎంతో పరితాపం కలుగుతోంది.

**మూర్ఖత్వము -** పరిమిత దృష్టిని ఆశ్రయించి "సూక్ష్మము, మంద్రము" అయిన ఆత్మ విశ్లేషణా సమాచారం మొదలంట్లా తిరస్కరిస్తున్న మూర్ఖులు అనేకులు ఈ భూమిపై సంచారం చేస్తున్నారు. ఈ ఇంద్రియ విషయములే మహత్తరమైనవని తలచే అట్టివారు తాము పయనిస్తున్న మార్గము ఎట్టిదో ఎరుగలేకున్నారు.

'గాడిద, మూర్ఖుడు' – ఈ ఇద్దరు అనేక దుఃఖభారములను అనుభవించుటకే జనించు చున్నారు. అల్పమైన అవగాహనయే కారణం అవటం చేత, ముమ్మందుగా "అసంతృప్తి" పొంది, అటు తరువాత "మాకు అవి లేవు, మేము ఇవి పొందలేదు" – అని ఇక ఈ మానవుడు అసంతృప్తికి కారణాలు వెతకడం జరుగుతోంది. నిందించటం, ద్వేషించటం, దూషించటం మొదలైన నరక మార్గ పతితులుగా పరిణమించటం జరుగుతోంది.

సముద్రంలో ఎన్నో బుద్బుదములు లేస్తున్నాయి. లయిస్తున్నాయి. అదేవిధంగా ఈ "దేహం నందు ఆత్మాభిమానం, ఇంద్రియ విషయముల పట్ల ఆకర్షణ, పాప కర్మల పట్ల బుద్ధి" కలిగినట్టి అనేక మంది జీవులు జనిస్తున్నారు. మరణిస్తున్నారు. ఎన్నో కోళ్ళు, పశువులు ప్రతిరోజు కసాయివారి చేతులలో విగత జీవులగుచున్నాయి. ఈ భూమిపై జనించే ప్రాణులలో ఎన్నో కోట్ల ఈగలు, దోమలు ప్రతి రోజూ వాయువు చేత నసింపజేయబడుచున్నాయి. జాలరి వల వేసి వేలాది చేపలను పట్టి కాల్వగట్టు ప్రక్కన పరచి అమ్ముచున్నాడు. విచారణ, పరిశీలన లేనట్టి మూర్ఖ మానవుల జన్మలు కూడా అట్టివే అగుచున్నాయి.

అట్టి మూర్ఖుల గురించి దుఃఖించి ఏం ప్రయోజనం? నీటిలో ఒక పెద్ద చేప అనేక చిన్న చేపలను, కీటకములను మ్రింగుచున్నది. ఆ పెద్ద చేప ఒకనాడు ఒక జాలరి చేతికి చిక్కి శల్యమగు చున్నది. పేను వంటి స్వల్పమగు పురుగులను పెద్ద జాతి పురుగులు మ్రింగుతున్నాయి. ఆ పెద్ద జాతి పురుగులు సాలె పురుగు నిర్మించిన గూటిలో చిక్కి ప్రాణాలు విడుస్తున్నాయి. ఆ సాలెపురుగును పెద్ద జాతి బొద్దింక వచ్చి భోంచేస్తోంది. ఆ బొద్దింకను కప్ప భుజిస్తోంది. కప్పను పాము ఆరగిస్తోంది. పామును ముంగిస – ముంగిసను పిల్లి – పిల్లిని కుక్క – కుక్కను ఎలుగుబంటి – ఎలుగుబంటిని చిరుత పులి – చిరుత పులిని సింహం – సింహమును శరభం – ఈ విధంగా ఒక దానిని ఒకటి చంపుకుంటున్నాయి. శరభం పెద్ద కొండను ఎక్కి మేఘమును ఢీకొనబోయి చచ్చుచున్నది.

ఆ మేఘము వాయువుచే తొలగించివేయబడుతోంది. వాయువు పెద్ద పెద్ద పర్వతములచే తన దిశను కోల్పోతోంది. ఆ పర్వతములను వజ్రాయుధం క్షణంలో చూర్ణంగా చేసివేయగలుగుతోంది. వజ్రాయుధం ఇంద్రునిచేతికి దాసోऽహం అవుతోంది. ఆ ఇంద్రుడు విష్ణుదేవునిచే ఒక్కక్షణ కాలంలో నియమించబడుచున్నాడు. మరొక క్షణంలో తొలగించబడుచున్నాడు. అంతటి విష్ణువు వంటివాడు కూడా కాలమహిమ చేత అనేక దుఃఖములతో కూడుకున్న చేప, తాబేలు, పంది వంటి ఉపాధులలో ప్రవేశించవలసి పస్తోంది.

అనేక విషయములు తెలిసిన మహా పండితులు, శరీర సౌష్టవము కలవారు కూడా తమ దేహములలో ప్రవేశించిన సూక్ష్మజీవులచే భక్షించబడుచున్నారు.

❖

చూచావా రామా! ఈ విధంగా ఈ కనబడే ప్రాణి కోట్లన్నీ ఆయా తదితర ఆదిభౌతిక జీవుల పాలబడి విచ్ఛిన్న మగుచున్నాయి. అవి ఈ భూమిపై సంచరిస్తున్న కొద్దికాలం అజ్ఞాన విషయములను ఆశ్రయించి, వాటినే అంటి పెట్టుకొని వుంటున్నాయి. అజ్ఞానం చేతనే ఈ జీవులు పరస్పరం హింసించుకోవడం – భక్షించుకోవడం చేస్తున్నాయి. ....అయితే జ్ఞానికి ఇక్కడ కోరుకొనవలసిన విషయం గాని, ద్వేషించ వలసిన విషయం గాని ఉండుట లేదు.

ఒక పురుగు దగ్గర నుండి అనేక జీవజాతులు ఈ భూమిపై నిరంతరం ఉత్పత్తి, వినాశనములు పొందుచున్నాయి. జలాశయాలలో పెద్ద ఆకారములు గల మొసళ్ళు తిమింగలములు ఉత్పన్నమగు చున్నాయి. భూమి లోపల తేళ్ళు – పాములు – రకరకాల ఆకారములుగల పురుగులు – ఇవన్నీ ఉత్పన్నమవుతున్నాయి. ఒక ప్రాణి దేహము నందే అనేక సూక్ష్మ ప్రాణులు, విచిత్ర క్రిమిజాలం ఉత్పత్తి పొంది, నివసించి ఇంతలోనే నశిస్తున్నాయి. స్థావరములగు వృక్షములలోను, పొదలలోను, రంగు రంగుల క్రిమి కీటకములు పుట్టుచున్నాయి. మంచుకొండలలో కూడా కొన్ని ప్రాణులు నివాసం కలిగిఉన్నాయి. ఇంకా మలములందు కొన్ని కీటకములు జనించి, చరిస్తున్నాయి. ఇట్టి అసంఖ్యాకములైన రకరకములగు ప్రాణులన్నీ జ్ఞానముతో కూడిన ఆశ్రయము, అవగాహనలు లోపించిన కారణంగానే ఏర్పడుచున్నాయి. అయితే ఇట్టి ఈ సృష్టి వ్యవహారముల పట్ల "అపేక్ష –

దుఃఖము – రాగము – ద్వేషము" మొదలైనవి ఉండవలసిన అగత్యమే లేదు. నిరంతర ఉత్పత్తి – వినాశనములతో కూడిన సంసార భ్రమలను 'సుఖ దుఃఖ' భావములు రెండూ ఉచితములు కావు.

**శ్రీరాముడు :** ఈ విధంగా మహా వృక్షము యొక్క ఆకుల వలె పలువిధములైన జీవకోట్లు ఉత్పత్తి అగుచున్నాయి. మరల వినాశనం పొందుచున్నాయి. వీరి దుఃఖములన్నీ తొలగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** తన బుద్ధిని 'సునిశితము – నిర్మలము' చేసుకొన్న వారికే సత్య దృష్టిచే శాంతి ప్రాప్తించుచున్నది. అల్ప విషయములపై ధ్యాస కలిగి వ్యవహరిస్తున్న కుబుద్ధులను దుఃఖ రహితులను చేయటం ఎలాగో మాకు కూడా తెలియడం లేదు. మా విచారణ వినకుండానే తిరస్కరించే వారి దౌర్బల్యము మేమెట్లా తొలగించగలం చెప్పు? అందుకే శ్రీరామావతారం ఈ జగత్తుకు అత్యావస్యకమై... నీవు అవతరించావు.

ఈ మనుజులలో కూడా కీటక–ఈగ–తేనెటీగ–జంతువు–వృక్ష ధర్మాలు ఆశ్రయించే వారు ఉన్నారు. అట్టివారు ఉపదేశములకు అర్హులు కాలేక పోవుచున్నారు. దృశ్య విషయము లందు సంలగ్నమైన మనస్సు గల మనుజునకు, పశువులకు భేదమేమీ ఉండదు. పశువులు త్రాటితో ఈడ్వబడుతూ ఉంటే, మూఢచిత్తులగు మనుజులు తమ మనస్సుల చేతనే ఈడ్వబడుచున్నారు. 'స్వచిత్తము' అనే బురదలో ఇరుక్కొని "సర్వనాశనము" అను పర్యవసానము కొరకై అనేక కార్యారంభములను రచించుకొంటున్న వారిని చూచినప్పుడు – గోడలు, శిలలు కూడా – "అయ్యో! పాపం" అని రోదిస్తున్నాయి.

**శ్రీరాముడు :** జీవునికి ఇన్ని దుఃఖములు ప్రాప్తించటానికి కారణమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎవరైతే తమ చిత్తములను జయించరో ...వారికి అంతటా దుఃఖములే సంప్రాప్తమౌతూ ఉంటాయి. అప్రయత్నశీలురను, పిడివాదములు చేసే వారిని, ఇంద్రియ విషయములే ఉత్తమ ప్రాప్తములుగా భావించే వారిని, దుఃఖ పర్యవసానము గల కార్యక్రమములను పరమ ఉత్సాహహముతో ప్రారంభించే వారిని, వాటిపై గొప్ప నమ్మకము గలవారిని ఆయా పర్యవసానములే ఆలోచింపచేయగలగాలి. లేదా, అవతార మూర్తివగు నీ వర్తనమే మార్గం చూపాలి. వారు వర్తమానములో మాత్రం ఈ బోధకు తగినంతగా అర్హులు అగుటలేదు. ఎవరైతే తమ చిత్తములను జయించి ఉంటారో అట్టివారి పట్ల మా బోధ తెల్లటి వస్త్రముపై రంగు వలె "సుస్థిరము, మహా ప్రభావ సమన్వితము" అగుచున్నది. అర్హులగువారి కొరకై గురువులు వెతుకుతూ ఉంటారు.

❖❖❖

# 13. మనోనాశనం

**శ్రీరాముడు :** 'మనస్సు' అనబడేది లేదని మీరు చెబుతున్నది అంగీకార యోగ్యమే అయినప్పటికీ, మమ్ములను ఈ ఇష్టాయిష్టాలు, సుఖదుఃఖములు, భయగర్వములు, విడచిపెట్టనంత వరకు ప్రయోజన మేముంటుంది చెప్పండి! అందుచేత మనస్సును అతీత స్థితిలో సుస్థిరపరుచుకోవడం ఎట్లా?

**శ్రీ వసిష్ఠమహర్షి :** నాయనా! పదే పదే చెప్పినదే మరలా చెప్పుచున్నాను. 'మిధ్యయే' అయి ఉన్న మనస్సు అనబడేదాని గురించి వ్యర్థమైన కల్పనలు చేయవద్దు. అమ్మచే వర్ణించబడే "ఆ బారెడు జడలతో పిల్లికళ్ళు గల దయ్యం" గురించి విని బాలుడు నిజంగానే "దయ్యము" అనే దానిని చూస్తున్నట్లు భ్రమించి కెవ్వున అరుస్తాడు చూచావా? ఆ విధముగా మనస్సుచే జనులు క్షణంలో బద్ధులు, దుఃఖితులు అగుచున్నారు. ఆత్మ తత్త్వమును ఏ మరిచి మూఢునిలా అనంతకాలం ఈ మనస్సు నలువైపులా విజృంభిస్తూనే ఉంటోంది. అయినా రామా! నీవిప్పుడు ఈ మన సంవాదముచే పరమార్థ సత్యమగు 'ఆత్మ'ను చక్కగా ఎఱుగుచున్నావు కదా! 'చిత్తము' అనేది సంకల్ప పరంపరలు కారణంగానే వృద్ధి చెందుతోంది. అందుచేత నీవు ఈ దృశ్య సంకల్పములను వెనువెంటనే త్యజించి వేయి. ఈ దృశ్యమును గనుక నీవు ఆశ్రయించావా... ఇక అంతే .. నీవు చిత్తసహితుడవు, బద్ధుడవు అవుతావు. "ఈ దృశ్యము అసత్యము, అసంభవము కూడా" – అని ఎఱిగిన వాడవై దీనిని త్యజించావా – ఇక నీవు చిత్త రహితుడవు ముక్తుడవు అగుచున్నావు.

ఈ దృశ్యము త్రిగుణముల స్వైరవిహారము కారణముగా మాయతో కూడినదై వుంటోంది. దీనిని ఆశ్రయించావా ...బంధము. పూర్తిగా త్యజించావా ...మోక్షము.

ఈ సత్యమును గ్రహించి అట్టి ఎఱుకను అంతరంగమున పదిలపరుచుకొని, ఇక ఆపై ఏది ఎట్లు ఉచితమో, అది అట్లే నిర్వర్తించు. "ఆ బాహ్య – అభ్యంతర దృశ్యములు రెండూ నేను కాను" అని భావించుచూ ఒక పర్వతములాగా స్థిరముగా వుండు.

1. హృదయేశ్వరుడగు ఆ పరమాత్మ యొక్క ఉనికి ఆకాశంలా అతి విశాలమైనదని ఎఱిగి ఉండు. ఆయనే నీకు కనబడే ఆయా నామరూపాలు అగుచున్నాడని సమాధానము పొంది ఉండు.

2. "ఇది జగత్తు – ఇది ఆత్మ" అను భ్రాంతి రూపమై ద్వైతకల్పనను పూర్ణముగా వదిలివేయి. అప్పుడు శేషించి ఉండే సాక్షి చైతన్యమునందు సిద్ధుడవై ఉండు. లేదా అట్టి అభ్యాసాన్నైనా ఆశ్రయించు.

3. "దృశ్యము – దృష్టి"ల మధ్య 'దర్శనము' అనే గల అనుభవం ఉంటోది కదా!... అట్టి అనుభవమునకు కర్తయగు ఆత్మయే దృష్టి – దర్శన – దృశ్యము లందు అనుస్యూతమై ఉంటోంది. అట్టి విషయరహిత సాక్షితత్వమును సర్వదా భావన చేస్తూ ఉండు. అట్టి భావనలో జగత్తు ఉండదు కనుక అది 'భావరహిత స్థితి' యే అవుతుంది.

4. ఆస్వాదించునది – ఆస్వాదించబడునది అను రెండిటికీ మధ్య ఉండే విషయరాహిత్యాన్ని ఆరాధించు, ఉపాసించు.

5. అనుభవి – అనుభవనీయము (The Experiencer - Experiences) అను రెండిటి మధ్య నిరాలంబమై, ఆ రెండిటి కన్నా వేరుగా ఉనట్టి శుద్ధతత్త్వమును సమాశ్రయించి ఉండు.

6. జాగ్రత్ – స్వప్న – సుషుప్తిల మూడిటి కంటే విలక్షణమైన స్వరూపము నందు మనోబుద్ధులను ప్రతిక్షేపించి ఉండు.

అట్టి "శుద్ధ చిన్మాత్ర స్వభావనము" అని పిలువబడే ఆత్మసత్తను ఏమరచి, విషయములను

భావించటం, దృశ్యముచే ఆకర్షించబడటం దౌర్భాగ్యం అనిపించుకోదా? అట్లు దృశ్యమును ఆశ్రయిం చుటే "చిత్త దశను పొందటం" అని గ్రహించు.

ఓ మహాబాహో! రామా! "ఆత్మ జ్ఞాన స్వరూపము" అనే యుక్తి చేత చిత్తము అనే సంకెళ్ళను త్రెంచివేయి. చిత్తము అనే పంజరము నుండి ఆత్మ అనే సింహమును విడిపించు.

❖

శుద్ధమగు స్వాత్మస్థితిని వదలి విషయోన్ముఖుడవు నీవు ఎందుకు కావాలి? విషయముల పట్ల ధ్యాసచే విషయాకారుడవై బంధమును పొందుతున్నావు. ఇతఃపూర్వపు అనుభవము, దృశ్య సంస్కారముల కారణం గానే ఆత్మకు అన్యమైన 'చిత్తము – స్థూలము' అను రూపములు ప్రాప్తించటం జరుగుతోంది. మరల అభ్యసిస్తూ రాగా, "నిరంతరము మననము" మొదలగువాటిచే ఈ చిత్తము ఆత్మత్వము దృఢనిశ్చయంతో స్వీకరించటం జరిగితే, అప్పుడా చిత్తము 'శుద్ధాత్మ'తో స్వయముగా ఏకమగుచున్నది. అప్పుడు "ఇది ఆత్మ – ఇది చిత్తము" అని చెప్పటానికి కూడా "ద్వైతము" అనేది మిగలదు. "జగత్తంతా ఆత్మయే" అనే జ్ఞానం అంతఃకరణంలో వికసించిన తరువాత ఇక విషయ సహితమగు చేతనమెక్కడ? ఉపాధి సహితమగు చిత్త మెక్కడ? చేతనమగు మృతులెక్కడ? ....'కేవల పరమార్థ స్థితి' యందు వీటన్నిటికీ చోటే వుండదు.

**చిత్తము అంటే అసలు ఏమిటి? -** "ఈ దేహము – ఈ ఇంద్రియములు – వీటి వ్యవహారములు – ఇవే నా రూపము" అను పరిమిత దృష్టి – అనుభవస్థితియే 'చిత్తము' అను శబ్దముచే చెప్పబడుతోంది. అట్టి చిత్తమే, ఆద్యంతాలు లేనట్టి దుఃఖాలను విస్తరింపజేస్తోంది. "నేను ఈ భౌతిక శరీర పరిమితుడను" అన్న కీలక స్థితిని పరిశీలించి పరమార్థంగా చూచినప్పుడు "బ్రహ్మమునకు అన్యంగా 'జీవసత్త' అనబడేదే లేదు" అని తెలియవస్తోంది. కనుక "నేను బ్రహ్మమునే!" అనునట్టి అనుభవమును, అనుభూతిని పొందుటయే చిత్తము యొక్క ఉపశమనము సుమా! అదే పరమ సుఖము.

"ఈ చిత్తము కూడా జగత్తులోని భాగమే కదా! ఈ జగత్తంతా ఆత్మయే" అను నిశ్చయం చేత 'చిత్తము లేకపోవటం' అనేది సిద్ధించగలదు. దానినే చిత్తము యొక్క నాశనం, ఉపశమనం అని కూడా పిలుస్తున్నాం.

ఇట్టి సత్యజ్ఞానోదయమైనప్పుడు "స్వాత్మయే – అంటే నేనే ఈ జగత్తు" అను అనుభవస్థితి కలుగుతోంది. ఇకప్పుడు సూర్యోదయముచే చీకటి పటాపంచలైనట్లు, మనస్సు స్వయంగానే నశించి పోతోంది. మనస్సు అనే సర్పం శరీరంలో ఉండి యథేచ్ఛగా సంచరిస్తున్నంత వరకు భయము – ఉత్కర్షలు ఉండేతీరుతాయి. అట్టి సర్పమును "బ్రహ్మాత్మైక్య విజ్ఞానము" చేత, 'సమాధి' చేత పట్టి, ఆశ, తృష్ణ అనే కోరలు పీకి "సర్వసమత్వము" అనే బుట్టలో వేయాలి. ఇక దాని వల్ల భయముండదు.

చిత్తమే ఇష్టము. మనస్సే మననము. చిత్తములో నుండి పుట్టుకొస్తున్న భ్రాంతి అనే దయ్యమున "సమైక్యజ్ఞానము" అన్న మంత్రముచే బలాత్క్రమంగా వినాశనం చేయాలి. ఎందుకంటే, ఎంతో బలము గలది, మొండిది అయిన ఈ చిత్తపిశాచము అనేక జన్మలుగా శరీరంలో ప్రవేశించి

ఆక్రమించుకొని ఉంటోంది. "నేను – నీవు – తదితరులు – సర్వము... పరిశుద్ధమగు ఆత్మయే" అను ఉత్తమ భావనచే ఇక చిత్తపిశాచము ఈ దేహంలో నిలవలేదు. అప్పుడు ఉద్వేగము – వ్యధ తొలగుతాయి. భయములు – వేసటలు – భ్రమలు ఉండవు.

"ఆత్మ సర్వదా లభించియే ఉన్నది కదా! ఇక నాకు రాగమెందుకు? ద్వేషమెందుకు? కోర్కెలతో పనేమున్నది? ఇక నాకు బాహ్యమున గాని, అంతరంగమున గాని అపేక్షించవలసినదేదీ ఉండ జాలదు. ఏదీ నాకు సుఖముగాని, దుఃఖముగాని కాజాలదు" – అనే నిశ్చయముతో ఆత్మజ్ఞులు ఈ జగత్తులో వ్యవహరిస్తున్నారు. అందుచేత వారు చిత్తరహితులే అగుచున్నారు. అంతఃకరణములో ఎట్టి కోర్కెలు జేరకుండా, దుఃఖరహితమైన ఉత్తమపదమును సొంతం చేసుకుంటున్నారు.

❖❖❖

# 14. తృష్ణ

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఈ జీవుడు ఒకానొక అతిగట్టిదైన త్రాడుచే చేతులు కట్టబడి ఈ సృష్టిలోకి మరల మరల ఈడ్చుకురాబడుచున్నాడయ్యా! ఆ త్రాడు పేరే "తృష్ణ". ఇప్పుడు ఈ తృష్ణ గురించి కొన్ని విశేషాలు చెపుతాను. విను–

ఆత్మ ఒకానొకప్పుడు తన బ్రహ్మస్వభావమును ఏమరచి, చిత్తము అను దానిని ఆశ్రయిస్తోంది. అట్టి చిత్తము అపవిత్రమగు ఈ సంసారము అనబడు దానికి బీజమగుచున్నది. అట్టి చిత్తము జీవుని బంధించు జాలము వంటిది సుమా! అంటే ఏమిటి? ఆత్మ ఇంద్రియ వృత్తులకు సంబంధించిన అనుభవములను ఆశ్రయించినదై, చిత్తముచే కల్పించబడిన "ఈ దేహాదులే నేను" అను నిశ్చయమును పొందుతోంది. ఆ చిత్తము రాగ ద్వేషములు, వాసనలు ఏర్పడటానికి దోహదమగుచున్నది.

అంతకంతకు పెరిగిపోతున్న ఈ తృష్ణ మహామోహప్రదమగుచున్నది. మహాభయ దాయకమగు చున్నది. అది ఆత్మనే మూర్ఛిల్ల జేస్తోందే? అది ఉదయించినప్పుడల్లా అనంతాత్మ యందు జగత్తులు అను వికారములు ఏర్పడుచూనే ఉన్నాయి.

ఓ రఘురామా! 'ప్రళయాగ్ని' వేడిమినైనా సహించవచ్చునేమో గాని ఈ తృష్ణ యొక్క దాహకత్వం సహించటం బ్రహ్మ రుద్రాదులకు కూడా అంత తేలిక కాదు. ఆహా! అతి తీక్ష్ణమై కృష్ణవర్ణము (నలుపు)తో కూడినదై, అతి దీర్ఘమై, అనేక దుఃఖములే ప్రయోజనముగా కలిగినదై, శీతలము – భయంకరము కూడా అయినట్టి ఈ తృష్ణ అనే ఖడ్గము ఉపాధిపరంపరలను అత్యంత క్రూరంగా పరపర నఱకివేయుచున్నదే! "వారించుటకు అలవి కాదేమో" అని అనిపించే "న్యూనత, అవమానము, స్వల్పత్వము, అసూయ, దుఃఖము, జాడ్యము" ఇవన్నీ ఎక్కడి నుండి బయలుదేరుతున్నాయి? ఈ విషయం మేము బాగా పరిశోధించాం."ఇవన్నీ ఈ జీవుని యొక్క 'ఇది–అది కావాలి' అను రూపం గల తృష్ణ నుండే బయలుదేరుచున్నాయి" అని మేము కనుగొన్నాం.

ఈ తృష్ణ అనే పెద్దపులి మనస్సు అనే బిలంలో ప్రవేశించి 'ఇంద్రియములు' అనే రక్తమాంసాలను

ఆకలిగా పీక్కుతింటున్నది. ఈ ప్రాణులను కొండరాళ్ళ మీదికి, ముళ్ళ పొదలలోకి ఈడ్చుకుపోయి ముక్కలు – ముక్కలుగా చేసి నములుచున్నది.

**తృష్ణాపీడుతుడైన జీవుడు -** అది ఎప్పుడు, ఎట్లా పుడుతోందో, ఏ రూపంగా మనస్సును ఆక్రమిస్తోందో, ఈ జీవుడు గమనించలేకపోవుచున్నాడు. దాని చేత పీడించబడుచున్న ఈతడు అతి దీనమైన అంతః కరణం కలిగి ఉంటున్నాడు. శక్తిహీనుడై, విమోహితుడై ఆక్రందనములు చేస్తున్నాడు. ఒకదాని తరువాత మరొకటి చొప్పున అనేక విషయములు, వ్యవహారములచే పదే పదే ప్రతిహతుడగుచున్నాడు.

తృష్ణ అనే త్రాచుపాము ఎక్కడ ఉండదో, అక్కడ మాత్రమే ప్రాణవాయువులు స్వస్థత పొందుతాయి. అక్కడ అసంకల్పితంగా పుణ్యం వర్ధిల్లుతూ ఉంటుంది. కందిరీగల చేతను, తదితర కీటకముల చేతను స్పృశించబడని పూతీగ మరింత అందమైన పుష్పాలను ప్రసాదించగలదు కదా!

తృష్ణారహితుడు ప్రారంభించే ప్రతి కార్యక్రమము అద్భుతమైన ప్రయోజనం కలిగి ఉంటుంది. లోకమునకు అనిర్వచనీయమైన శుభమును, ఆహ్లాదమును చేకూర్చగలుగుతుంది. అతని ప్రతిపలుకు సుఖ శాంతిప్రదములు అవుతాయి.

"అసలు తృష్ణ నివసించే చోటెక్కడండీ?" అని ప్రశ్నిస్తే... "అది గూడు కట్టుకుని ఉండేది వివేక రహితుని హృదయంలోనే! అది అక్కడ అత్యంత వ్యాకులత్వంచే భ్రమరూపంగా ఉరకలు వేస్తోంది" అనునదే మా సమాధానం. అయ్యో! కాలికి కట్టిన యంత్రపు త్రాడుచే అంత పెద్ద పక్షి కూడా ఈడ్వబడుచున్నట్లు ఈ జీవులు అనేక బంధనములు, సంకుచిత స్వభావముల వైపు నెట్టుకుపోబడుచున్నారే! తృష్ణను ఆశ్రయించినందుకు ఫలితంగా చివరికి మిగిలేది క్షయము, చింత, శోకములు, కూలబడటములే అగుచున్నది. తృష్ణచే ఉద్భవించిన చింతలచే గొప్ప ప్రజ్ఞాపాటవములు కలవారు, అనేక విషయములు తెలిసివారు కూడా చివరికి విచ్ఛిన్నులై హతమొనర్పబడుచున్నారు కదా! దయాశూన్యము, కర్కశము అయిన వేట కత్తి యొక్క పదునైన అంచుచే సాధు జంతువులు ఖండించబడుచున్నట్లు "దయ, వివేకము, ఉత్తమ ఆశయము, భగవధ్యానము" మొదలైన సాధు గుణాలు తృష్ణచే తెగకొట్టబడుచున్నాయి. నూతిపై మొలచిన పచ్చటి తృణములను (గడ్డిపరకలను) భక్షించడానికి వెళ్ళి, లేడి నూతిలో పడిపోయినట్లు, ఈ తృష్ణను వెన్నంటి వెళ్తే మూఢుడు 'నరకం' అనే అంధకూపంలో పడిపోతున్నాడు. లోకంలో "ముసలితనం చాలా దుర్భరం. చివరకు కళ్ళు కూడా కనబడవు కదా!" అంటూ ఉంటారు. కాని అతి సూక్ష్మమైన ఈ తృష్ణా పిశాచం వార్ధక్యం కంటే కూడా అధికంగా ఈ జీవుని గ్రుడ్డివానిగా, దీనునిగా చేసివస్తోంది.

అమంగళకరమగు 'తృష్ణ' అనే పిశాచం హృదయంలో కిచిత్ ప్రవేశించుట చేతనే అంతటి తృష్ణచే బంధితుడైన ఆ సూర్యభగవానుడు కూడా ఒక గుంజకు త్రాటిచే కట్టబడినట్లు ఆకాశంలో అటూ ఇటూ త్రిప్పబడుచున్నాడు. అందుచేత ఓ రామా! ఈ ప్రాణి కోట్ల ప్రశాంతతను విచ్ఛిన్నం చేస్తూ దుఃఖమే ప్రయోజనంగా కలిగిన ఈ 'తృష్ణ' అనబడే భూతము నీచే అల్లంత దూరంలోనే త్యజించివేయబడు గాక!

తృష్ణచేతనే వాయువు వీచుచున్నది, పర్వతములు నిలబడుచున్నాయి, ఈ భూమి జీవరాసులను ధరిస్తోంది. ఈ మూడు లోకములు కూడా తృష్ణచేతనే ధరింపబడుచున్నాయి. ఒకడు ఒకచోట ఒక త్రాడు చేత కట్టబడితే, ఆ బంధం నుండి విడిపించుకోవటం తేలికే నేమో గాని, 'తృష్ణ' అనే బంధం నుండి మాత్రం ఈ జీవుడు అంత తేలికగా విడివడలేడు. అందుకు "మహా ప్రయత్నం" కావాలి. అందుచేత, రామా! నీవు "సంకల్పములను విడుచుట" అను ఉపాయంతో తృష్ణను పరిత్యజించు.

సంకల్పములే మనస్సు. మనస్సే తృష్ణకు ఉనికి స్థానం. అజ్ఞానముతో కూడి బలవత్తరమగు సంకల్పముల పరంపరయే తృష్ణ అయి ఉన్నది. మరొక రహస్యం. "ఈ దేహమే నేను" అనబడు దేహాభిమానమును ఈ జీవుడు ఎందుకో ఆశ్రయించుచున్నాడు. అజ్ఞానమయము, సర్వ దురాశలకు నిమిత్తము అయినట్టి అట్టి అభిమానమే తృష్ణకు నివాస స్థానం కల్పించుచున్నది. అనాత్మభూతములైన ఈ దేహము మొదలైనవాటి యందు ఆత్మాభిమానం త్యజించిన మరుక్షణం దుఃఖములన్నీ తమంతట తామే సమసిపోతాయి. అప్పుడు నీవు జ్ఞానిగా పరిగణింపదగిన వాడవౌతావు.

అందుచేత "నేను సర్వపదార్థములకు అతీతముగా నిత్యమై, సత్యమై, భవ్యుడనై ఉన్నాను" అను రూపము గల "అనహమ్" భావనచే ఈ తృష్ణ అనబడు దానిని కత్తిరించివేయి. ఈ జగత్తులో కనిపించే విభూతులన్ని తిరస్కరించి వేయి. ప్రపంచాతీతమగు 'పరబ్రహ్మము' నందే సుస్థిర చిత్తుడవు, స్వస్థుడవు కమ్ము.

❖❖❖

# 15. చికిత్స

**శ్రీరాముడు :** హే మహాత్మా! సద్గురూ! "ఈ తృష్ణ, అహంకారములను త్యజించండి" అని మీరు చెప్పిన వాక్యాలు అత్యంత ఆప్తవాక్యాలు గానూ, గంభీరంగానూ ఉన్నాయి. కాని, నాదొక సందేహం. 'అహంకారం'ను త్యజించ వలసివస్తే ఈ దేహమును కూడా పరిత్యజించ వలసివస్తుందేమో కదా! ఎందుకంటే, అహంకారమునకు ప్రాణమునకు ఒకానొక ఐక్యత ఉన్నది. మరి ఒక వైపు ప్రాణములను రక్షించుకుంటూ కూడా మరొక వైపు అహంకారమును వినాశనం చేయటం సంభవమేనంటారా? పెద్ద పాకను ఒక తాటి స్తంభము ధరించి ఉంటున్నట్లు అహంకారమే ఈ దేహమును ధరించుచున్నది. అట్టి అహంకారమే నశిస్తే, ఇక ఈ దేహమును ధరించే దెవరు? ఇది నేలకూలక తప్పదు. కాబట్టి హే మహావక్తా! నేను ఈ అహంకారమును ఎట్లా పరిత్యజించాలి చెప్పండి? ఈ "అహంకారము – ప్రాణము – శరీరము"ల సంబంధం విషయంలో నన్నేం చేయమంటారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ లోకంలో జనులు మూడు రీతులైన అహంకారమును కలిగి ఉంటున్నారు–

**1. "ధ్యేయ-జ్ఞేయ" వాసనతో కూడిన అహంకారము (దేహాహంకారము) -**

ధ్యేయము = ఇంద్రియములచే పొందబడవలసినవిగా భావించబడుచున్నవి.

జ్ఞేయము= ఇంద్రియములచే తెలుసుకొనవలసినవిగా భావించబడుచున్నవి.

ఇట్టి అహంకారము కలిగి ఉన్న జీవుల భావన లేక, అంతఃకరణము నందలి నిశ్చయము విను! దేహేంద్రియములు, అన్న పానాలు, తదితర బాహ్య పదార్థముల సంఘాతమే నేను. ఈ దేహం, ఈ అన్నపానాదులు నా జీవితము నిమిత్తమే ఉన్నాయి. ఇవి ఉన్నచోటే నేను ఉన్నాను. ఇవి లేనప్పుడు నేను కూడా లేను.... – ఇది 'పరిమితావగాహన', మరియు, 'ప్రథమాహాంకారము' అని కూడా శాస్త్రములు పిలుస్తున్నాయి.

**2. 'ధ్యేయ వాసనాత్యాగము'తో కూడిన అహంకారము (చిద్రూపాహంకారము) -** ఇట్టి త్యాగ మార్గమును అవలంబించిన జీవులు తత్త్వవిచారణను ఆశ్రయించుటచే ఈ దేహ – ఇంద్రియ సంఘాతమును, మనస్సును వేరు చేసి పరిశీలిస్తున్నారు. క్రమంగా, "ఈ మనస్సు, దేహం, ఇంద్రియాలు అసత్తే అయి ఉన్నాయి" అను నిశ్చయము దృఢపరుచుకొనుచున్నారు. అట్టి విచారణ–నిశ్చయముల యొక్క బలముచే "నేను 'సద్వస్తువు' అగు చిద్రూపాహంకారమును" అను రెండవ అహంకారమును హృదయములో ప్రవేశపెట్టుచున్నారు. "ఈ దృశ్యములో కనిపిస్తున్న, వినిపిస్తున్న ఏ ఒక్క వస్తువుతో కూడా నాకు సంబంధమే లేదు. అవి నా యందు లేవు. నేను వాటి యందు కూడా లేను" అను ఎఱుకను, బుద్ధిని, పరిపక్వపరుచుకొనుచున్నారు. ఆ అవగాహనను అంతర్లీనంగా కలిగి ఉంటూనే లీలామాత్రంగా ఆయా నియమితమైన క్రియలను నిర్వర్తించుచున్నారు. అట్టి ప్రశాంత బుద్ధితో కూడిన నిశ్చయము యొక్క ప్రభావంచే సర్వ బాహ్య విషయములపై ప్రియ – అప్రియములను తొలగించుకొనుచున్నారు. ఉపసంహరింప జేసుకొనుచున్నారు. లోకానుకూలంగా లోకోపకార దృష్టితో నిర్వికారంగా వర్తమానము నందు చేయవలసనవి మాత్రం నిర్వర్తిస్తున్నారు.

అతడు "ధ్యేయ త్యాగాహంకారి" అగుచున్నాడు. అట్టివాడు అట్టి ఉత్కృష్టతచే ముక్తుడే సుమా!

**3. జ్ఞేయ వాసనాత్యాగముతో కూడిన అహంకారము -** ఇట్టి అహంకారము ఆశ్రయించే మహనీయుడు "నాతో సహా ఈ జగత్తు అంతా బ్రహ్మమే కదా! ఇక వాసన లెవరికి? ఎందుకు? ఎక్కడ?" అను రూపము గల సాక్షాత్కారం పొందుచున్నాడు. వాసనలన్నింటిని క్షయింప జేసి, నిర్మాల్యుడగుచున్నాడు. అహంకారమునకు ఆవల సాక్షిస్వరూపమును అభ్యసించుచున్నాడు. సర్వ మానసిక వికల్పములను త్యజించివేస్తున్నాడు. "తను, తదితరులతో సహా సర్వము దివ్యము అగు ఆత్మ ప్రదర్శనా చమత్కారమే!" అను దృష్టిని, అవగాహనను పెంపొందించుకుంటున్నాడు.

అట్టివాడు సదా నిర్వికల్పుడగుచున్నాడు. సర్వదా దేహరాహిత్యాభిమాని అగుచున్నాడు. ఈ విధమైన వాసనాత్యాగముచే దృశ్య కల్పనంతా సమసిపోగా, ప్రశాంత స్థితిని పొంది 'ఎరుగుట' అను దానిని ఉపసంహరించి 'నిర్వికల్ప సమాధి'యందు ప్రవేశించుచున్నాడు. అతడు 'జ్ఞేయత్యాగి' అనుపేరుతో చెప్పబడుచున్నాడు.

❖

ధ్యేయ వాసనాత్యాగం అవలంబించి, లోకమునకు ఉచితమైన కార్యములను ఒనర్చు జీవన్ముక్తు లైన వారిలో జనకమహారాజు వృత్తాంతం ఒక దృష్టాంతం. జ్ఞేయ వాసనాత్యాగం చేసి శాంతిని

పొందినట్టి విదేహముక్తులగు మహాత్ములు ఉన్నారు. అట్టివారు సర్వోత్తమమగు బ్రహ్మము నందే స్థితి కలిగియున్నారు. శుకమహర్షి అట్టివారే. ఓ రామచంద్రా! ఈ ధ్యేయ – జ్ఞేయ వాసనా త్యాగులిద్దరూ సమానులే సుమా! రెండు మార్గములు ముక్తిదాయకములే అవుతాయి. ఈ జీవునకు సంతాపము లేకుండా చేసి, క్రమముగా ఆత్మతత్వమును ప్రాప్తింపజేస్తాయి.

జ్ఞేయ వాసనాత్యాగి = సమాధి యందు అర్హుడైనవాడు

విదేహముక్తుడు = దేహరహితుడు.

ధ్యేయవాసనాత్యాగి = సమాధి నుంచి లేచి వ్యుత్థానకాలంలో వ్యవహరించే వాడు; జీవిస్తూ ఉంటూనే ముక్తత్వము కలిగి ఉన్నవాడు. దేహవాసహితుడు, దేహము ఉండి కూడా దేహవాసనలు లేనివాడు.

వీరిద్దరూ కూడా 'అవిద్య'ను అధిగమించుటచే కేవల బ్రహ్మ పదంలో సుస్థితులై ఉంటున్నారు. ఈ దేహ–విదేహముక్తుల గురించి (ధ్యేయ – జ్ఞేయవాసనా త్యాగుల గురించి) పదకొండు రోజులుగా కొన్ని విషయాలు చర్చించాం. ఇక ముందు కూడా మరికొన్ని విషయాలు చెప్పుకో బోతున్నాం.

❖❖❖

# 16. జీవన్ముక్తుడు

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు తృష్ణ నుండి విడివడినట్టి జీవన్ముక్తుల గురించి, విదేహముక్తుల గురించి విశదీకరించటం జరిగింది. "ధ్యేయ వాసనాత్యాగి – జ్ఞేయ వాసనాత్యాగి" అనబడుచున్న వారిద్దరి గురించి మరి కొన్ని విశేషాలతో నిర్వచించి ముందుగా చెప్పమని నా ప్రార్థన. అటు తరువాత యదావిధిగా తదితర విషయాలు ప్రస్తావన కొనసాగించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! నీవు కోరిన విధంగానే జీవన్ముక్త – విదేహముక్తులను నిర్వచిస్తాను విను. వారు ఏ ఉపాయములచే తృష్ణ నుండి విడివడుచున్నారో నీవే గ్రహిస్తావు.

❖

ఎవడైతే కాలానుగతంగా నిరంతరం ఏర్పడుచుండుటే, స్వభావంగా కలిగి ఉండే ఆయా సుఖ దుఃఖాలను, హర్ష శోకాలను తన అంతరంగంలో పొందకుండానే ఉంటాడో అట్టివాడే 'జీవన్ముక్తుడు' అని పిలవబడుచున్నాడు. అతనికి ఇష్ట–అయిష్టములు గాని రాగ–ద్వేషములు గాని ఉండవు. ఇక, ఆయా ప్రాప్తించే వ్యవహారములను మాత్రం, సుషుప్తుని వలే మమకార – కర్తృత్వములు లేకుండానే నిర్వర్తిస్తూ వుంటాడు.

అతనికి "ఈ దేహమే నేను, దేహ సంబంధములైన ఈ ధన–గృహ–బంధుజనుల వ్యవహారం నాది" అనే అహం – మమత్వములు ఉండవు. హర్ష శోకములు గాని, కామ క్రోధములు గాని, దర్పము దీనత్వములు గాని అతని అంతరంగ ప్రజ్ఞను ఏమాత్రం స్పృశించవు. ఇక ఇక్కడ తారసబడే ఇంద్రియ విషయములను దూర ప్రదేశములోని ఎవరికో సంబంధించినవిగా చూస్తాడు. తన

అంతరంగంలో (నిదుర లేచి స్వప్నములను చూస్తున్నట్లు) ఆతడు 'ఆత్మజ్ఞానము' అను స్థానంలో నిదుర లేచి ఉంటాడు. ఈ సర్వమును 'ఆట, ఆటవిడుపు'ల వలె చూస్తూ ఉంటాడు. సర్వకళా పరిపూర్ణుడైన పూర్ణచంద్రుడు ఏ తీరుగా, తన ఉనికిచే తాను ఆహ్లాద భరితుడై, తదితరులను ఆహ్లాద పరుస్తూ ఉంటాడో, మన ఈ జీవన్ముక్తుడు కూడా స్వాభావికంగానే సంతోషము, ఉల్లాసములచే పరిసేవితుడై వ్యవహరిస్తూ ఉంటాడు. ఇక 'విదేహముక్తులు' విషయానికి వస్తే వారు ఇంద్రియ గోచరమైన ఈ దృశ్య ప్రపంచానికి సంబంధించినవారు కారు. వారి గురించి వచనముల చేత చెప్పటమంటే చిన్న పాత్రతో "పెద్దధాన్యపు గుట్ట"ను కొలవటం వంటిది. ఇప్పటికి మాత్రం ముక్తుని స్థితి గతులు ఏ తీరుగా ఉంటాయో మరి కొన్ని విశేషాలు చెపుతాను. విను–

**విషయ రహితము (సర్వ ఆశలు అధిగమించినట్టిది) -** ఒక్క వాక్యంలో చెప్పాలంటే 'ముక్తి' అనగా ఈ ఇంద్రియ విషయముల పట్ల సర్వ ఆశలు వర్జితమైనప్పటి 'ఇచ్ఛ'చే, ప్రవాహపతితంగా ప్రాప్తించిన కర్మలను ఆచరించుచుండటమే. ఎప్పుడైతే, ఈ జీవుని యొక్క బుద్ధి – దృశ్య విషయములో "ఇది సత్యమే" అను భావన, భోగముల పట్ల ఆశ కలిగియున్నదై; బాహ్య పదార్థము లందు స్థితి కలిగి ఉంటుందో – అదియే దృఢమగు సంసారబంధము!

జీవన్ముక్తులు తమ హృదయమును సంకల్పరహితం చేసుకుంటున్నారు. బాహ్యపదార్థము లందు లీలామాత్రంగా పాల్గొనుచున్నారు. వారు విషయ ఆశావర్జితమైన ఇచ్ఛచే ఆయా పరిస్థితులకు అనుకూలంగా ప్రశాంతమైన అంతరంగముతో వ్యవహరిస్తున్నారు.

బాహ్య పదార్థముల పట్ల గల ఆసక్తి చేత తృష్ణ వృద్ధి పొందినప్పుడు ఈ జీవుడు 'బద్ధుడు' అగుచున్నాడు. విషయములన్నిటి యందు వాసనారహితమైన చిత్తము కలిగి ఉన్నప్పుడు, ఈ జీవుడే 'ముక్తుడు' – ఈ ఇద్దరి మధ్యలో వ్యత్యాసం ఇంత మాత్రమే.

**క్షోభరహితం -** ముక్తుని యందు మనకు కనిపించే ఒక విశేషమేమంటే – విషయములు ప్రాప్తించటానికి ముందు గాని, ఆ విషయములు తొలగుచున్నప్పుడు గాని ఆతని యందు ఆ రాగ విరహాదులచే కలిగే దుఃఖం ఉండదు. ఎల్లప్పుడు ఆతడు వర్తమానకాలము నందు స్థిరమైన బుద్ధి కలిగి ఉండి, ఉచితానుచితములను అనుసరించి "ఇది నాకర్తవ్యమై ఉన్నది, అందుచేత చేస్తున్నాను" ...అని నిర్ణయించుకుని ఉంటాడు.

"ఈ వస్తువో, విషయమో నాకు ప్రాప్తించాలి" – అను ఇచ్ఛయే బంధం. అనగా, ఇంద్రియాలను స్వీకరించిన జీవుడు, ఇంద్రియ విషయాలకు దాసుడవటం జరుగుతోంది. ఈ పదార్థముల గతి, పరిణామములు ఎటిగావా... ఇక వాటి పట్ల తృష్ణ ఏర్పడదు. ఈ 'సత్–అసత్' రూపములైన పదార్థములచే ఆకర్షణ–వికర్షణలను చెందకుండా ఉండే పరమోదార చిత్తము గల మహాత్ముడు జీవన్ముక్తిని పొందినట్లే. అందుచేత ప్రియరాఘువా! నీవు బంధ–మోక్షములను, సుఖ–దుఃఖాలను, ఆశ–నిరాశలను, సత్–అసత్‌లను మొదలంట్ల త్యజించి ఉండు. ప్రశాంతమగు ఆకాశము వలె క్షోభరహితుడవై ఉండు. మహా సముద్రము వలె ప్రాప్తాప్రాప్తము లందు గాంభీర్యం వహించి

ఉండు. "జన్మ-మృత్యు రహితమగు ఆత్మ స్వరూపుడను" అని ఎఱిగి ఉండు. ఇక ఈ జనన-మరణ చింతలచే మనస్సును మరెన్నటికీ కళంకితం చేసుకోకు.

**గొప్ప నిశ్చయం కలిగి ఉండటం -** ఓ రామచంద్రా! వాస్తవానికి ఈ దృశ్యపదార్థము లేవీ నీవు కావు. నావి కావు. ఇవేవీ నీ యందు ఏక్షణమందు కూడా లేవు. నీవు కూడా వాటి యందు లేవు. ఈ దృశ్య పదార్థములన్నీ 'వాస్తవ పదార్థము' కంటే అన్యంగానే ఉంటున్నాయి. అతి తుచ్ఛమైన పర్యవసానము కలిగినవి అగుచున్నాయి. అయితే, నీవు మాత్రం వీటన్నిటికీ అన్యమైనట్టి నీ శుద్ధ స్వస్వరూపమును ఆశ్రయించి ఉండు.

ఈ ప్రపంచమంతా 'అసత్తే' అయినట్టి అజ్ఞానముచే ఆవిర్భవించి 'సత్-అసత్' రూపమున స్థితి కలిగి ఉంటోంది. ఇక నీవో... దీనికంతటికీ పరమై వెలయుచున్నావు. అట్టి సర్వమునకు అతీతమగు చైతన్యమూర్తివగు నీవు పదార్థముల పట్ల 'తృష్ణ' కలిగి ఉండటమేమిటి? ఎంత అసమంజస మైన విషయమది! అదిఎట్లా సంభవమో చెప్పు?

ఒక్కసారి ఈ 'దేహము - దృశ్యము'లను కాస్త పరిశీలించి చూచినప్పుడు నాలుగు విధములైన నిశ్చయములు కలుగుచున్నాయి-

1. **దేహాత్మ భావన -** తల్లి తండ్రులచే నిర్మించబడినట్టి "కాళ్ళు, చేతులు, పొట్ట, తల"గల ఈ దేహమే నేను" అనే భావన. ఇది అజ్ఞాన దృష్టి చేతనే కలుగుచున్నది. నిశ్చయంగా ఇది మహాబంధముగా పరిణమించబోవుచున్నది.
2. **శుద్ధ చైతన్యభావన -** ఈ దేహేంద్రియము లకన్నిటి కంటే వేఱైనట్టి, అత్యంత సూక్ష్మమైనట్టి శుద్ధ చైతన్యమునే 'నేను - అను నిశ్చయం. ఇది మోక్షమునకు దారి తీస్తోంది.
3. **"సర్వాత్మాహమ్" భావన -** ఈ జగత్తునందలి సర్వజీవుల యొక్క ఆత్మస్వరూపమును నేను! నేను అక్షయడను - అను నిశ్చయము. ఇది కూడా మోక్షదాయకం అగుచున్నది.
4. **"జగదహమ్" భావన -** ఆకాశము వలె శూన్యమే అయినట్టి ఈ ఆధ్యాత్మిక, ఆధి దైవిక, ఆధి భౌతికాత్మకమైన ఈ జగత్తంతా 'నేను' - అను అవగాహన. ఇది కూడా మోక్షమునకు దారి తీస్తోంది.

ఈ నాలుగింటిలో మొట్టమొదటిది మలిన వాసనలచే ఏర్పడుతోంది. బంధమగుచున్నది. తక్కిన మూడు శుద్ధ సాత్త్విక వాసనల ప్రయోజనంగా లభిస్తోంది. కనుక, సత్వరం అనుసరణీయమగు చున్నాయి. "ఈ జగత్తంతా ఆత్మస్వరూపుడనగు నేను అయి ఉన్నాను" - అను నిశ్చయం అవలంబించి ఉన్న తరువాత, ఇక అట్టివాని చిత్తము ఖేదము ఎట్లా పొందుతుంది? వాస్తవానికి అంతా కూడా ఆత్మ యొక్క మహిమచే వ్యాపించి ఉంటోంది. అందుచేత 'సర్వము ఆత్మయే' అనే నిర్ణయం చేసుకొన్న జీవుడు ఇక బంధంలో తగుల్కోడు.

**అవగాహన -** సర్వమునకు అధిష్ఠానమైఉన్నట్టి ఆత్మ వివిధమైన వాదములచే వివిధమైన పేర్లతో పిలువబడుతోంది. "శూన్యం, బ్రహ్మం, పురుషుడు, ప్రకృతి, విజ్ఞానము, ఈశానుడు, మాయ, శివము" అను పేర్లన్నీ ఆత్మకు చెందినవే.

వాస్తవానికి ఈ జగత్తంతా సదా సన్మాత్ర స్వరూపం అయి ఉన్నది. ఇందులో ద్వైతము గాని, భిన్నత్వం గాని ఎచ్చటా ఏ మాత్రం లేవు. పరమార్ధ సత్య జ్ఞానం చేత ఈ ప్రపంచమంతా వ్యాపించ బడి ఉన్నది. అయితే భ్రాంతి గల బుద్ధికి అసత్యమైనదంతా సత్యము వలె గోచరించటం జరుగుతోంది. అనంతమైన ఆకృతి గల సముద్రమంతా జలము చేతనే పూర్ణమై ఉన్నది కదా! బ్రహ్మ నుండి ఒక స్థంభం వరకు ఈ జగత్తంతా ఆత్మ చేతనే పరిపూర్ణమై ఉన్నది. అందుచేత ప్రమాణములచే అసలు విషయం గ్రహించబడినప్పుడు "బ్రహ్మమొక్కటే సత్యము" అను వాక్యముచే సమీక్షించ బడుతోంది. సముద్ర జలము కంటే తరంగాలు వేరా? మట్టి కంటే మట్టిబొమ్మ వేరా? శిల కంటే శిల్పం వేరా? కాదు. బ్రహ్మము కంటే భిన్నంగా 'జగత్తు' అనబడునది ఏ నాడూ, ఏ క్షణం నందు వేరు కాదు.

**ద్వైతాద్వైత తత్పరం -** 'జీవుడు' అని మనం పిలుస్తున్నది 'స్వసత్త'నే. ఆ బ్రహ్మసత్తయే "అద్వైత – పరమాత్మమయ శక్తి" అని కూడా గ్రహించు. అట్టి బ్రహ్మసత్త 'జగత్ రచన' అనే లీలచే ఈ జగత్తుగా విజృంభిస్తోంది. ద్వైతరూపం గాను, అద్వైతరూపం గాను, ఇంకా ఏవేవో భేదములచే కనబడే ఈ జగత్తంతా బ్రహ్మమే. ఆ బ్రహ్మమే "నా వారు, నీ వారు, భార్య, భర్త, సోదరులు" – మొదలైన అనేకానైకమైన భావానుగతములైన రూపములతో కూడి కనిపిస్తోంది. అజ్ఞానము చేత రచించబడుచున్న ఇట్టి జగత్తు వృద్ధి చెందితే ఏమున్నది? నశిస్తే ఏమున్నది? నీ స్వరూపము జ్ఞానమే అయి ఉండగా నీవు ఈ అనేక నామరూపముల పట్ల సుఖ దుఃఖములు పొందవలసిన పనేముంటుంది? అందుచేత, నీవు ఆయా క్రియలందు వ్యవహరిస్తున్నప్పుడు కూడా, అద్వైతమును ఆశ్రయించియే ఉండు. అద్వైత సత్తామయుడవై ఉండు. ఆయా కర్మలను ఆచరిస్తున్న క్షణాలలో మాత్రం ద్వైతమును ఆశ్రయించిన వాని వలె వ్యవహరించు. ఈ విధంగా ద్వైతాద్వైతముల రెండిటి యందు తత్పరుడవై ఉండు. అంతేగాని అనేక అశుభనిమిత్తములచే నిండి ఉన్న ఈ భయంకర సంసారభూములందు అజ్ఞానముచే ద్వైత వ్యవహారములను నమ్ముకొని, అందు తన్మయుడవై వెఱ్ఱిగా, మొండిగా కూలిపోవద్దు. నీ అద్వైత–నిత్యానంద–అఖండత్వమును ఏమరువవద్దు.

"ఈ జగత్తు బ్రహ్మమే" అను ఎఱుక మరియు జ్ఞప్తి పరమార్థంగా పరిశీలిస్తే ఈ 'ద్వైతము' అనునది సంభవమే కాదు. ఈ దృశ్య వ్యవహారమంతా కల్పన చేస్తున్నది చిత్తమే కదా! అట్టి కల్పన వాస్తవ మెట్లా అవుతుంది?

**శ్రీరాముడు :** అయితే ఈ జగత్తు ద్వైతమా? అద్వైతమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచమున ద్వైతమూ లేదు. ఏకమూ లేదు. సంఖ్యా సహితమైన దానిలో మాత్రమే "ద్వైతము, అద్వైతము" – అనబడేవి సంభవించవచ్చునేమో! మహాత్ములు ఈ జగత్తును సంఖ్యా రహితమైనదానికిగా గాంచుచున్నారు. సత్ నుండి భావనా రూపంగా ఉదయించటం చేత, ఇది 'సన్మాత్రమే' లేక 'బ్రహ్మమే' అయి ఉన్నది.

యదార్ధానికి దేహముల సంఘాతరూపములై కనిపించుచ్చు ఈ "నేను – నీవు" అనునవి గాని, ఈ జగత్తు అనబడునదిగాని లేనేలేవు.

'నేను' అనునది బ్రహ్మమే. బ్రహ్మము జన్మరహితమైనది. కనుక 'నేను' అనబడేది కూడా జన్మరహితమైనదే!

'నేను – నీవు – ఈ జగత్తు' అనునవన్నీ బ్రహ్మమే అయి ఉన్నాయని అనుకున్నాం కదా! బ్రహ్మము సర్వోత్తమమైయున్నది. అది అనాది. ప్రకాశములన్నిటికీ ప్రకాశము. దానిని విశద పరచటానికే వేరు వేరు శాస్త్రములు అనేక ప్రమాణాలను ఉపయోగిస్తున్నాయి. ఆ బ్రహ్మమునకు 'జన్మించుట' మొదలైన వికారములు లేవు. అది సర్వ చింతనల కంటే అతీతమైనది. నిర్వికారమైనది. దాని యందు ఇంద్రియ సమూహమంతా లేదు.

ప్రాణశక్తి అంతటికీ ఆధారం కూడా బ్రహ్మమే. అది సర్వ కల్పనా రహితమై సర్వకారణములకు కారణమై, నిత్యోదితమైన స్వరూపమై, సర్వవ్యాపకమై యున్నది. ఈ కళ్ళు మొదలైన సర్వ ఇంద్రియము లలో చిత్ప్రకాశమై ఉన్నది అదే! మనం ఎన్ని వాక్యాలు ఉపయోగించినప్పటికీ దానిని విశదీకరించ లేమనే చెప్పక తప్పదు. ఎందుకంటే, అది అనుభవమాత్రమే కదా! ఈ చర్చలన్నీ చేసిన తరువాత చివరికి అది లభిస్తున్నది స్వస్వరూపము నందే. స్వస్వరూపముగానే !

ఓ రామచంద్రా! మరల ఎలుగెత్తి ప్రకటిస్తున్నాను. విను ఈ జగత్తు, ఇందులో తారసపడుచున్న నేను – నీవు – వాడు – వీడు మొదలైనవన్నీ... ఆ ఆనందైక బ్రహ్మమే అయి ఉన్నాయి. ఉన్న నిజం అదే. అందుచేత 'ఇదంతా బ్రహ్మమే' అనే నిశ్చయం నీవు నిరభ్యంతరంగా కలిగియుండు.

శాంతి ప్రవచనములతో ఆ నాటి సభ చాలించబడింది.

❖❖❖

## (పదకొండవ రోజు విచారణ పూర్తి అయింది)

❖❖❖

# పన్నెండవ రోజు

# III. పుణ్యుడు - పావనుడు సంవాదం

## 1. మహాత్ముల అవగాహన-సంచారం-స్వభావం

**శ్రీరాముడు :** హే మహాత్మా! తమరు నిన్నటి రోజున 'ముక్తులు - వారి లక్షణములు' విషయమై అనేక విశేషాలు చెప్పారు. జీవన్ముక్తులైన మహాత్ములు ఈ జగత్తులో తదితర జీవులు లాగానే ఆయా 'ఉపాధి, స్థితిగతి, జీవన వ్యాపారము' మొదలైనవి కలిగి చరిస్తున్నారని అన్నారు కదా! అట్టివారి అవగాహన, సంచారం, స్వభావం ఏ రీతిగా ఉంటాయో మరికొంత వినాలని ఉన్నది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను ! జీవన్ముక్తులైన మహానుభావులు అనేకులు సమాహితమైన చిత్తంతో, కామము, లోభము, మోహము మొదలైన దుర్గుణములను అధిగమించినవారై ఈ ప్రపంచంలో లీలామాత్రంగా పాల్గొనుచున్నారు. వారి గురించి సవివరమైన వ్యాఖ్యానం మరల మరల చేయటం అవసరమే. కనుక చెపుతాను విను.

❖

జీవన్ముక్తుడు ఈ ప్రపంచమునందు సంచరిస్తున్నప్పటికీ, ఆతడు మొదట్లో , మధ్యలో, చివర కూడా రసహీనమే అయినట్టి ఈ సంసారము యొక్క గతులను చూస్తున్నప్పుడు దుఃఖించడు. హసించడు. ప్రాప్తించిన కార్యములను మాత్రం ప్రియాప్రియాతీతుడై చేస్తూ ఉంటాడు. శత్రుమిత్రులందు సమదృష్టి కలిగి ఉంటాడు. ధ్యేయవాసనలను (Outgoing tendency of the senses) త్యజించివేసి ఉంటాడు. అతని దృష్టిలో "అది పొందలేదు ... కనుక పొందాలి; ఇది ఇట్లు కాదు...వీరు హితులు... వారు అహితులు" అనునవన్నీ సారహీనమైన పిల్లల ప్రేలాపనలు మాత్రమే. ఆతడు ఉద్వేగరహితుడై, సజ్జనులకు హితకరుడై ఉంటాడు. ఆతని అంతఃకరణము సర్వదా 'వివేకము' అనే వెలుగుచే ప్రకాశిస్తూ ఉంటుంది. 'జ్ఞానము' అనే ఉపవనంలో ప్రవేశించి, ఎప్పుడూ వాహ్యాళి సలుపుతూ ఉంటాడు. సర్వమునకు అతీతమైయున్న 'బ్రహ్మపదము'ను ఆశ్రయించినవాడై, పూర్ణ చంద్రుని లాగా శీతలాంతఃకరణానుభవం పొందుతూ ఉంటాడు. ఆ మహాత్మునికి ఇక్కడ మిక్కిలి అప్రసన్నత్వమునూ - మిగుల సంతుష్టుడుగనూ చేయగల్గునదేదీ ఉండదు..

ఇక, ఈ ఇంద్రియములను ఆకర్షిస్తున్న విషయములు తటస్థపడినప్పుడు వాటితో శత్రువుల మధ్య ఉన్నట్లే ఉంటాడు. అయితే తన దయ, దాక్షిణ్య భావములను మాత్రం వీడడు. గురుసేవ, సంఘసేవ వంటి సమయోచితములైన కార్యములను లోకానుకూలంగా నిర్వర్తిస్తూ ఉంటాడు. అట్టి పుణ్యాత్మునకు ఇక దుఃఖముల ఊసెక్కడ?

ఆతడు "దీనిని నేను కోరుకొన్నాను... పొందాను" అనే ఇష్టము దరిజేయనీయడు. "అయ్యో! ఇది ఇప్పుడు ఎందుకు పొందాను?" అనే అయిష్టము కలిగి యుండడు. సర్వమును మొదలంట సన్న్యసించియే ఉంటాడు.

**నాభినన్దతినద్వేష్టి న శోచతినాకాఙ్క్షతి ।**
**మౌనస్థః ప్రకృతారంభీ సంసారేనావసీదతి ॥** (శ్లో 7, సర్గ 18)

దేనినీ వాంఛించడు, ద్వేషించడు. కనుక ఆతనికి అసంతృప్తి ఉండదు. దుఃఖించవలసిన పని ఉండదు. 'మితభాషి' అయి, ప్రాప్తించిన కార్యక్రమాలందు ఆసక్తిరహితంగా ప్రతిస్పందిస్తూ ఉంటాడు. అడిగితే ఉపయోగకరమైన వాక్యములనే పలుకుతాడు. అడగకపోతే, ఒక రాయిలాగా మెదలకుండా ఉంటాడు. సర్వుల పట్ల ప్రియమును వహించి ఉంటాడు. అయినా కూడా, ఎవ్వరి పట్ల ఉద్రేక పూరితములైన ప్రేమద్వేషములు కలిగి ఉండడు. మృదుభాషి అయి, ప్రాణికోట్ల హృదయమును ఎఱిగినవాడై ఉంటాడు. తదితరులనందరిని తనకంటే వేఱుకానివారిగా దర్శిస్తూ ఉంటాడు. అనేక యుక్తాయుక్తమైన విషయములతోను, దృష్టులతోను ఆశలతోను, క్రియలతోను కూడియున్న ఈ లోక వృత్తాంతమంతా అరచేతిలో ఉసిరిగపండు వలె సుస్పష్టం గాను, పక్షపాతరహితం గాను చూస్తూ ఉంటాడు.

ముక్తిపదమును అలంకరించిన మహాత్ములు తమ అంతరమున శీతల బుద్ధికలిగి ఉన్నవారై నాశవంతమగు ఈ జగత్తు యొక్క గతినంతటినీ చూచి, నవ్వుకుంటూ ఉంటారు.

చూచావా రామా! ఎవ్వరైతే తమ చిత్తమును జయించి వేస్తారో, ఈ ఇహ పరములు రెండిటినీ ఎఱిగి ఉంటారో అట్టి మహాత్ముల స్వభావమేమిటో నీకు తెలియజేశాను.

**మూర్ఖత్వము -** ఇక మరి కొందరు తమ చిత్తమును జయించకుండా, విషయ భోగములు అనే బురదలో ఇరుకుకొని ఉంటున్నారు. మూర్ఖత్వము వహించి ఉంటున్నారు. అట్టివారి గురించి కూడా, ఒకటి రెండు విషయాలు ఇక్కడ ప్రస్తావిస్తాను. విను–

అట్టివారికి అగ్నిజ్వాలల వంటి నారీసమూహమే గొప్ప విషయంగా తోచుచున్నది. ధనము, గృహము మొదలైన వాటి పట్ల గల అభిలాషచే కలహము, క్లేశము, దుఃఖము, దురవగాహన మొదలైన ఆపదలనన్నిటినీ తెచ్చిపెట్టు కుంటున్నారు. అట్టి వారు యజ్ఞము, యాగము వంటి ఆయా కర్మలను ఫలాపేక్షతో చేస్తున్నారు... ఫలితమేమిటి? నిరంతరంగా అనేక సుఖదుఃఖ దశలకు లోను కావటమే అగుచున్నది.

**ఇప్పుడు చేయవలసిన దేమిటి? -** ఓ ప్రియరామచంద్రా! నీవు 'ధ్యేయవాసన' తొలగించబడగా, అప్పటి పూర్ణదృష్టినే అవలంబించాలి సుమా! 'జీవన్ముక్తత'ను ఆశ్రయించు. స్వస్థచిత్తుడవై ఈ లోకమునందు హాయిగా విహరించు.

అంతరంగమున సమస్త ఆశలు త్యజించివేయి. రాగములు, వాసనలు లేనివాడవై ఉండు. బాహ్యమునమాత్రం వర్ణాశ్రమ ధర్మములను నెరవేర్చుచు, ఈ లోకమున వ్యవహరిస్తూ ఉండు.

చక్కగా, ఉత్తమ ఆచారసంపన్నుడవై ఉంటూనే, అంతరమున క్రియారహితుడవై ఉండు. ఈ సాంసారికమైన, పారమార్థికమైన దశల నన్నిటినీ చక్కగా విచారణ చేయి. మహత్తరమగు 'బ్రహ్మపదము'ను భావన చేస్తూ యథాతథంగా ఉండు.

అంతరంగమున ఆశావర్జితుడవై, బాహ్యానికి శుభాశుభయుక్తుడవై క్రియలను ఆచరిస్తూ ఉండు. ఈ ధన బంధు జనాదులన్నీ తొలగుచున్నప్పుడు లోకమర్యాద కొరకు ప్రతిస్పందిస్తున్నప్పటికీ, అంతరమున మాత్రం ప్రశాంత స్థితిని విడువవద్దు, .. విడువవలసిన పనిలేదు. గాలికి కొండపైగల చెట్లు కదలుతాయేమోగాని, కొండ కదలుచున్నదా?

బయటకు అవసరమైన చోట కోపం చూపిస్తూన్నప్పటికీ, అంతరమున మాత్రం కోపమనునదేదీ లేనివాడవై ఉండు. బాహ్యానికి సర్వకార్యములు నిర్వర్తిస్తూ, అంతఃకరణమునందు మాత్రం సర్వమునకు అకర్తవై, క్రియారహితుడవై ఈ లోకమున మెలగుచూ ఉండు.

❖

ఓ రఘురామా! ఈ కనబడే సర్వపదార్థముల సారాసారమేమిటో నీకు తెలుసు. ఈ మన సంవాద ప్రారంభంలో నీవు సుస్పష్టంగా ప్రకటించావు. కాబట్టి, ఏది ఎట్లు 'ధర్మనిరతి'చే ఉచితమో, అది అట్లే నిర్వర్తించు. అయితే ఈ క్రింది విషయం గుర్తుంచుకో.

**కృత్రిమోల్లాస హర్షస్థ, కృత్రిమోద్వేగ గర్హణః ।**
**కృత్రిమారంభ సంరంభో, లోకే విహర, రాఘవ ॥**

ఓ రాఘవా! కృత్రిమమైన ఉత్సాహం, కృత్రిమమైన హర్షం, కృత్రిమమైన ఉద్వేగం, కృత్రిమ నింద, కృత్రిమమైన కార్యారంభం, కృత్రిమ క్రోధం కలిగి ఈ లోకంలో విహరించు. అయితే, అహంకారాన్ని పారద్రోలివేసి స్వస్థ చిత్తుడవై సర్వదా ఆకాశం వలె శోభిస్తూ ఉండు. కళంకరహితుడవై, మేఘరహిత వినీలాకాశంలాగా విస్తరించియుండు. ఇక్కడ రూపం పొందే రకరకాల ఆశాపాశముల నుండి విముక్తుడవై, సర్వవృత్తులందు అతీతత్వము, మహామహిమత్వము వహించి యుండు. పైకి మాత్రం ఈ రీతిగానే ఈ వర్ణాశ్రమ స్వభావ యోగ్యములైన, లేక, ప్రజాహితములైన కార్యములను చేస్తూ ఆనందమయంగా ఈ లోకమున విహరించు.

❖

**నబంధోస్తినమోక్షోస్తి దేహినఃపరమార్థతః ।**
**మిథ్యైయమింద్రజాలశ్రీః సంసారపరివర్తినీ ॥** (శ్లో 27, సర్గ 18)

ఓ రామచంద్రా! యథార్థానికి బంధం గాని, మోక్షం గాని లేనే లేవు. ఈ కనబడేదంతా 'మిథ్యయే' అయినట్టి ఇంద్రజాల వైభవం మాత్రమే. ఇంద్రజాలమే ఈ సంసార చక్రము నంతటినీ త్రిప్పుతోంది. ఈ ప్రపంచమంతా భ్రాంతిమాత్రమే. ఇది అజ్ఞానం చేతనే ఏర్పడటం, కనబడటం జరుగుతోంది. బాగా దాహంతో ఉన్నవాడికి మృగతృష్ణలో తియ్యటి నీళ్ళు కనిపిస్తాయి చూచావా? అజ్ఞానంతో కూడిన ఆర్తి కలవాడు జగత్తు పట్ల "ఇదంతా నిజమే" అను బుద్ధిని కల్పించుకొనుచున్నాడు.

నాయనా! నీవు ఆత్మస్వరూపుడవేకదా! అసంగము, ఏకరూపము, సర్వవ్యాపకము అయినట్టి ఆత్మకు అస్సలు బంధమెట్లా కలుగుతుందో చెప్పు? బంధమే లేకపోతే, ఇక మోక్షమెక్కడిది? ఎవరికి? ఈ బంధ, మోక్ష, ఆర్తులు సాక్షాత్‌జ్ఞానము లేనంత వరకే ఏర్పడుచున్నాయి.

❖

తత్త్వ జ్ఞానం యొక్క అభావం చేతనే ఈ విశాల సంసార భ్రాంతి ఉత్పన్నమవుతోంది. ఒకడు త్రాడును చూచి, 'పాము' అని భయపడ్డాడనుకో, ఆ భయం పోయేది ఎట్లా? 'అది త్రాడు మాత్రమే' అని ఎరుగుట చేతనే కదా! తత్త్వ జ్ఞానం చేత మాత్రమే ఈ సంసారభ్రాంతి ఉపశమనం పొందుతోంది.

రాఘవా! నీవు ఇప్పటికే నీ సూక్ష్మబుద్ధిచేత ఆత్మతత్త్వమును గ్రహించావు. అహంకారరహితుడ వయ్యావు. ఇక, ఆకాశము వలె నిర్మలుడవై చెన్నొందుము. సర్వదా సర్వమునకు కేవల సాక్షిరూపుడవై ఉండుము. బంధుమిత్రుల గురించిన సర్వవాసనలనూ నిశ్చింతగా త్యజించివేయి. ఎందుకంటావా? అసత్ స్వభావులైన బంధుమిత్రాదుల గురించి చింత వ్యర్థమే అవుతుంది 'సత్' స్వభావుడవు అగు నీవు అసత్తుకంటే, అవిద్యకంటే, వాటి సర్వ కార్యముల కంటే విలక్షణమైనవాడవు సుమా!

అవిద్యాకారణం చేత నిన్ను సమీపిస్తున్న "నేను బంధము కలవాడను .. బద్ధుడను" అనునట్టి వాసనలను క్రమక్రమంగా త్యజించివేయి. ఈ భోగములతోను, భోగసాధకులైనట్టి బంధుమిత్రాదుల తోను, ఈ కనబడే జగత్ పదార్థములతోను, శుభాశుభకర్మలతోను ఆత్మకు ఏమాత్రం సంబంధం లేదు. నీవు ఆత్మవే అయి ఉన్నావు. ఇక దేనికోసం ఎందుకు పరితపించాలి?

ఆత్మతత్త్వమొక్కటే సారమైనది. 'అట్టిసార వస్తువునే నేను" అను దృఢ బుద్ధి కలిగిన తరువాత నీకిక భయమెందుకుంటుంది? జగద్భ్రమలచే నీవు భీతి ఎందుకు చెందాలో చెప్పు? చైతన్యదృష్టితో పరిశీలించి చూస్తే ఈ బంధు జనులు అసలు ఉత్పన్నమే అయి ఉండలేదు. ఇక సుఖ దుఃఖము లేమిటి? పరితాపమెందుకు?

❖

ఒకవేళ – "ఆత్మ నిత్యమే అయి ఉండవచ్చు గాక! కాని, సంగము పొందుతోంది. తద్వారా దుఃఖం పొందుచున్నది కదా!" అని అంటావేమో? ఇక్కడ ఒక్క విషయం నీవు ముఖ్యంగా గమనించు.

నీవు ఇతఃపూర్వం ఉండియే ఉన్నావు. భావికాలంలో కూడా ఉండబోవుచున్నావు. ...సరే, ఇప్పుడు ఉండనే ఉన్నావు. నీ బంధువులు కూడా అంతే కదా!... అట్టి నిత్య స్వభావముగల ఆత్మను ఎఱిగిన తరువాత ఇక సుఖదుఃఖ, "న్యూన – అధిక" భావములకు చోటెక్కడిది?

**మరొక విషయం -** ఇప్పుడు ఈ వర్తమానకాలంలో నీకు సమీపంగా కనిపించే బంధువులను ప్రాణసమానంగా భావించి, వారి కొరకు దుఃఖిస్తున్నావు, బాగానే ఉన్నది! మరి, నీ గడచిపోయిన జన్మల మాటేమిటి? ఆయా జన్మలకు సంబంధించిన బంధువుల గురించి కూడా దుఃఖిస్తూ కూర్చుంటున్నావా? ఇప్పటి ఈ బంధువులు కూడా భవిష్యత్తులో అట్టివారేకదా! కాబట్టి అట్టివారి కొరకు పరితాపం పొందటం ఉచితమెట్లా అవుతుంది?

❖

ఇక మనం ఈ జీవుల యొక్క ఒకరితో మరొకరికి ఏర్పడుచున్న మనస్సు యొక్క సంబంధములను చూస్తామనుకో... మనోదృష్టితో చూస్తే నీవు, నీ బంధువులు పూర్వం వేఱువేఱుగా ఉన్నారు. ఇప్పుడో? ఇప్పుడు కూడా వేఱువేఱుగానే ఉన్నారు. ఇకపై కూడా ఆ విధంగానే ఉంటారు. ఈ మార్గంగా అంతా పరిశీలిస్తే ఈ 'బంధుత్వం' అనబడేది స్వల్పకాలికమని, మొదలే భ్రమ అని తెలియ వచ్చుచున్నది. అట్టి వీరల గురించి సత్యమని నమ్మి ఎందుకు శోకించాలి?

పోనీ, ఈ భౌతిక శరీరం దృష్ట్యా చూద్దామా? పూర్వం ఉన్నవారు ఇప్పుడు లేరు. ఇప్పుడున్నవారు ముందు ముందు ఉండబోరు. అసలు, సంసారమే నీపట్ల క్షీణించుచుండగా, మధ్యలో ఈ బాంధవ్యాల గురించి దుఃఖించటమేమిటి? ఈ విధంగా "ఆత్మ సంగము ఏర్పరుచుకుంటోంది" – అని అనుకు న్నప్పుడు కూడా నీవు ఎవరి గురించీ శోకించవలసిన పనిలేదు. ఇక అసంగమగు 'కూటస్థ ఆత్మ' గురించి గ్రహించావా... ఇక నీకు "దుఃఖించవలసిన పనిలేదు" – అని వేరే చెప్పనే అక్కర్లేదు.

❖

కాబట్టి ఈ మాయామయ జగత్తు విషయంలో అసలు శోకించటం ఏమాత్రమూ యుక్తం కాదు. 'సహజ సంతోష వృత్తి'ని అవలంబించటమే ఉచితం. ఏది చేయవలసి వచ్చుచున్నప్పటికీ, అవన్నీ నిర్లిప్తంగా నిర్వర్తించు. కాని, సహజంగానే ఆనంద స్వరూపుడవగు నీవు ఎల్లప్పుడూ సహజ సంతోషవృత్తిని అలవాటుచేసుకో.

**మాగచ్ఛదుఃఖితాయుక్తా ప్రాకృతేజాగతేక్రమే ।**
**తథైవముదితాయుక్తా యుక్తంకార్యానువర్తనమ్ ॥** (శ్లో 42, సర్గ 18)

ఈ ప్రాపంచక పదార్థములచే నీవు సుఖదుఃఖములకు లోను కావలసిన పనేమీ లేదు. సర్వత్రా సమరూపము అభ్యసించుటచే మహనీయులు ఈ సుఖదుఃఖాలను అధిగమించివేస్తున్నారు. పరమాత్మ సర్వవ్యాపి, సమరూపుడు కదా! నీయందు కూడా ఆతడే సమరూపుడై వ్యాపించి ఉన్నాడని గ్రహించు.

ఓ రామచంద్రా! నీవు అనంతుడవు. 'సత్' స్వరూపుడవు. ఆకాశము వలె సర్వ వ్యాపకుడవు. సర్వత్రా ప్రకాశమయమైన జ్యోతిస్వరూపుడవై వెలుగుచుండగా ఇక, అంధకారమునకు చోటెక్కడిది? శుద్ధ స్వరూపుడవగు నీయందు సుఖదుఃఖాదులు బంధుత్వ, అబంధుత్వాదులు ఉండటమేమిటి? నీవే సర్వహృదయము లందు ఉన్నవాడవై ఒక పూలదండలోని ధారంలాగా సూక్ష్మరూపమున అంతటా వ్యాపించి ఉన్నావు. అయితే, అతిసూక్ష్మమగు నీ రూపము ఈ సర్వ జగత్పదార్థము లందు వ్యాపించి ఉన్నప్పటికీ, అది స్థూలదృష్టికి మాత్రం గోచరించుటలేదు.

❖

అజ్ఞానియే మరల మరల జన్మలను పొందుచున్నాడు. జ్ఞాని, వీటిని వేటినీ పొందుటయే లేదు. జ్ఞాని ఈ శరీరాదులచే జన్మించడు. ఇవి నశించినప్పుడు తాను నశించడు. ఆతడు ఈ ప్రపంచ స్థితిని చూచి మోహించడు. జ్ఞానబలముచే సర్వదా సుఖరూపుడుగానే ఉంటాడు. ఆహా!

ఈ సంసారమంతా నిరంతరం దుఃఖపూర్ణమై అజ్ఞానముచేతనే విస్తారమగుచున్నది కదా! కాని రామా! నీవు మాత్రం 'జ్ఞాని'గానే అయి ఉండాలి సుమా! "నాకు జన్మాదులు ఉండవు" అని గ్రహించటమే జన్మరాహిత్యం.

ఈ కనబడేదంతా భ్రమ మాత్రమే... భ్రమకు భ్రమ కాక మరొక రూపమెక్కడున్నది?... స్వప్నంలో కనిపించే వాటికి స్వప్నత్వమే స్వరూపం గాని, ఇక మరే పదార్థంతో అవి తయారవుతాయి చెప్పు?... మిక్కిలి ప్రకాశవంతమై స్ఫుటరూపం కలిగి భాసిస్తూ, భ్రమ మాత్రమే అయిన ఈ జగత్తు సర్వశక్తిమంతుడగు ఆ పరమాత్మ యొక్క శక్తియే అయి ఉన్నది.

వాస్తవానికి ఈ ప్రపంచంలో ఒకనికి మరొకడు బంధువుగాని, శత్రువుగాని కానేరడు. ఈ శత్రు, మిత్ర ఉదాసీనులంతా కాలానుగతంగా 'ఈశ్వరేచ్ఛ' చేతనే సంభవించుచున్నారు. ఈ జగత్తులో తారసపడే వ్యవహారమంతా జలములోని తరంగాలలాగా ఒకదానికి మరొకటి కారణమగు అనేక సంఘటనలతో ఎప్పటికప్పుడు ఛిన్నాభిన్నమగుచున్నది. ఇట్టి ఈ జగత్తును మననం చేస్తూ, దుఃఖించేవారు మా దృష్టిలో అమాయక బాలురవంటివారు మాత్రమే.

చలనశీలమగు సంసార చక్రం నిరంతరం పై నుండి క్రిందకు, క్రింద నుండి పైకి తిరుగాడుతూనే ఉన్నది. స్వర్గంలోని జీవులు ఒకానొకప్పటికి నరకం చేరుచున్నారు. నరకంలోని జీవులు స్వర్గానికి వెళ్ళుచున్నారు. ఒకడు ఒక ద్వీపం వదలి మరొక ద్వీపం ప్రవేశించునట్లే ఈ జీవులంతా ఒక ఉపాధిని వదలి మరొక ఉపాధిని ఆశ్రయించుచున్నారు. ఇట్టి స్వప్నకల్పితమైన అవాస్తవ జగత్ వ్యవహారముల కొరకు కొందరు మాయాబద్ధులగు జీవులు తెంపులేని శోకం అనుభవిస్తున్నారు. మరి వారికి నేనేమి, ఎట్లా చెప్పాలి?

ఒకప్పుడు మహాధీరులై అటూ ఇటూ సంచరిస్తున్న వారు మరొకప్పుడు అతి దీనత్వం పొందు చున్నారు. దీనులు మహాధీరులగుచున్నారు. పతనము ఉత్పత్తిలచే ఈ జీవులు తమకు తామే విభ్రమములను కల్పించుకొనుచు, సంచలనము పొందుచున్నారు. దీపశిఖకు స్థిరాకారం ఉంటుందా? ఈ సంసారచక్రము నందు కూడా ఏదీ ఎన్నటికీ 'ఒక రూపము' కలిగి ఉండుటలేదు. ఈ సంసార దృష్టి ఏర్పడి ఉన్నంతవరకు స్వచ్ఛత్వము గాని, దుఃఖరాహిత్యము గాని ఏ జీవునకు కూడా సాధ్యపడేది కాదు. అనుక్షణం 'మార్పు' చెందుచుండే స్వభావంగల ఈ విషయముల పట్ల ఇది మాకు ఇట్లు ఉండాలి... అని అనుకొని ఎవడు సుఖం పొందగలడు చెప్పు? అందుచేత, రామా! ఈ ప్రపంచంలో తారసపడే "నాది, నాకు చెందినది, నీది, నీకు చెందినది, వారిది, వారికి చెందినది" – మొదలైనవన్నీ మెల్లకన్నువాడు రెండవ చంద్రుని చూచునట్లు, కేవలం భ్రమ చేత మాత్రమే అట్లు అనిపిస్తున్నాయి. ఇందులో ఏమాత్రమూ సందేహంలేదు. అందుచేత ఈ "నేను", "నీవు", ఈతడు నా వాడు, ఆతడు శత్రువు" – అనునట్టి మిథ్యాదృష్టులన్నీ నీ పట్ల నశించు గాక. అయితే ఆయా అనుకూలములైన వ్యవహార సరళి లోకమునకు అవసరమైయున్నది కనుక, ఇక్కడి వ్యవహారతత్పరతను లీలామాత్రంగా బాహ్యమునకు మాత్రమే అవలంబించు. నీకు బంధువులుగా ఉన్నవారి పట్ల ....

ఆత్మదృష్టిచే చైతన్యమాత్ర స్వరూపులుగాను, లౌకిక దృష్టిచే నీ ఆయా కర్తవ్యములు గాను భావించు... అంతేగాని, ఒక గాడిదలాగా లేనిపోని భారములన్నీ కల్పించుకొని భ్రమాత్మికమైన నమ్మికతో, ఈ సంసార లంపటములయందు కాలయాపన తాత్సారములతో కూడిన బుద్ధిని పొందవద్దు. నిష్కారణముగా దుఃఖములను, వాసనాభారములను తెచ్చిపెట్టుకోవద్దు. వాసనలను క్షీయింపజేయ గల క్రియలను విచారణలను శ్రద్ధగా ఆశ్రయిస్తూరాగా, ఈ సంసారభారం స్వయంగా రహితమైపోగలదు.

**అయం బంధుః అయంనేఽ_తి గణనా లఘుచేతసాన్ ।**
**ఉదారచరితానాంతు విగతావరణైవధీః ॥**

"ఈతడు బంధువు, ఈతడు శత్రువు" అనే భేదదృష్టంతా అల్పబుద్ధి కలవారికే ఉంటుంది. ఉదారచరితులకు అట్టి పరిచ్ఛిన్నదృష్టిగాని, ఆవరణయుక్తమైన బుద్ధిగాని ఉండదు. వారు, "ఈ సర్వము నందు నేను ఉండనే ఉన్నాను.. ఈ సర్వము సర్వదా నా యందే ఉన్నది" అను నిశ్చయము గల ధీరబుద్ధి కలిగి ఉంటారు. కనుకనే వారిపట్ల సర్వ ఆవరణలు (All Limited perceptions) తొలగిపోతున్నాయి.

**నాస్తమేతినచోదేతి యశ్చిదాకాశవన్మహాన్ ।**
**సర్వంసంపశ్యతిస్వస్థః స్వస్థోభూమితలంయథా ॥** (శ్లో 63, సర్గ 18)

అట్టి ప్రాజ్ఞునకు ఇక ఉత్పత్తి వినాశనములు ఉండవు. ఆతడు 'ఆకాశము' వలె మహత్తరమైన రూపము కలిగి, సర్వ విక్షేపములు నశించినవాడై స్వస్థచిత్తుడై ఉంటాడు. ఆకాశమున ఎక్కడో ఉండి ఈ భూతలమును వీక్షించుచున్నట్లు ఆతడు ఈ జగత్పదార్థములను, జనులను, సంఘటనలను చిద్విలాసంగా, భావాభావములకు అతీతంగా చూస్తూ ఉంటాడు.

ఓ రామచంద్రా! ఈ ప్రపంచమునగల జీవ జాతులన్నీ ఈ జీవునకు బంధువులే. ఎందు కంటావా? ఆతడు అనేక వేలాది జన్మలు ఎత్తియే ఉంటాడు. ప్రతి జీవజాతిలోను అతడు అనేక మార్లు జన్మించియే ఉంటాడు. ఇక ఆతని జాతి ఏది? ఆతని జాతి కానిదేది? కనుక 'నేను ఈ జాతికి చెందిన జీవుడను' అని తలచుట భ్రమ కాదా చెప్పు? పలువిధములైన విచిత్ర జన్మభ్రమలతో గూడిన ఈ జగత్తునందు, "ఈతడు నా బంధువు – ఈతడు నా శత్రువు" అనునదంతా మిథ్యా దృష్టి రూపముననే భ్రాంతిగా విజృంభిస్తోంది. వాస్తవానికి చూస్తే ఈ ముల్లోకములందలి జీవులు జీవభావదృష్టిచే నీ బంధువులే అయి ఉన్నారు. వారూ జీవులే.... నీవు జీవివేకదా! అంతేకాదు. ప్రతిజీవుడు అనేక జీవజాతులలో జన్మలు పొందుచూనే ఉన్నాడు. ఇక బ్రహ్మాభావ దృష్టితో చూచావా.... నీవే వారందరి స్వరూపముగా అగుచున్నావు. కాబట్టి నీ వారు కాని వారెవ్వరు?

ఈ విషయంలో ప్రాచీనమైన కథ ఒకటున్నది. ఇద్దరు అన్నదమ్ముల సంవాదముచే "బంధుత్వము అనబడునది స్వయం కల్పితమైన చమత్కారమే" అని నిర్ణయింపబడింది.

❖❖❖

# 2. సదుఃఖార్త్వం

జంబూద్వీపంలో గల ఒక పర్వతంపై 'దీర్ఘతపుడు' అనే మునీశ్వరుడు ఉండేవాడు. ఆతడు ఉదార మనస్కుడు. బ్రహ్మజ్ఞాన సంపన్నుడు, మహాతపశ్శాలి కూడా. ఆతనికి ఇద్దరు కుమారులు ఉండేవారు. వారి పేర్లు పుణ్యుడు, పావనుడు. గంగానది ఒడ్డున ఒక ఆశ్రమం నిర్మించుకొని, ఆతడు తన ఇద్దరు కొడుకులతోను, భార్యతోను ప్రశాంతంగా రోజులు గడుపుతూ ఉండేవాడు.

కొంతకాలం గడచిన తరువాత ఆతని ఇద్దరు కుమారులలో పెద్దవాడైన పుణ్యుడు అభ్యాసవశం చేత 'బ్రహ్మజ్ఞాని' అయ్యాడు. కాని, రెండవవాడగు పావనుడు మాత్రం కొంత గ్రహించి, మరికొంత గ్రహించక మిగిలి ఉన్నాడు. ఆతడు 'పూర్ణ బ్రహ్మపదము' పొందకపోవటం చేత మార్గమధ్యంలోనే వ్రేలాడుతూ ఉండేవాడు.

ఆ విధంగా అనేక సంవత్సరాలు దొర్లాయి. అదృశ్యమైన రూపంతో జీవుల ఆయువును క్షణ క్షణం మ్రింగివేసే స్వభావం గల కాలం గడచిపోసాగింది. దీర్ఘతపునకు వందేళ్ళు నిండాయి. ఒక నాటికి ఆతనికి ఈ సంసారముపై తిరస్కారపూర్వకమైన బుద్ధి పుట్టింది. నశ్వరమైన జీవుల చేతను పుట్టుక, రోగము, అకస్మాత్ సంఘటనలు, వార్ధక్యము, మృత్యువు, మొదలుగాగల వివిధ దుస్సవహమైన, నిస్సారమైన వృత్తాంతముల చేతను నిండి ఉండి, భయంకర ఆకారము కలిగిన ఈ సంసారముపై ప్రీతిని త్యజించాడు. యోగబలంతో వార్ధక్యముచే జర్జితమైన తన భౌతికదేహం త్యజించాడు. కల్పనా రహితము, విషయములు లేనట్టిది, నిత్యోదిత చేతనా స్వరూపము, రాగద్వేష రహితము అయినట్టి 'బ్రహ్మపదము' నందు ప్రవేశించాడు. ఎంతో కాలం, భర్తను సేవిస్తూ వస్తున్న ఆతని భార్య కూడా బ్రహ్మభావము పొందినదై తన భర్తను అనుసరించింది. సామాన్యమైన భౌతిక దృష్టికి వారిద్దరు అలభ్యులు, అగోచరులు అయ్యారు.

చనిపోయిన తల్లితండ్రుల భౌతికదేహాలకు పుణ్యుడు దహనము మొదలైన అంత్యక్రియలు పూర్తి చేశాడు. ప్రజ్ఞచే నిత్యానిత్యములు ఎఱిగియుండుటచే ఆతడు యథాతథంగా తన సాధన పఠనాదులను కొనసాగించసాగాడు. కాని పావనుడు మాత్రం తల్లితండ్రులను పోగొట్టుకొన్న దుఃఖం నుండి బహుకాలం విడివడలేక పోయాడు. అత్యంత దుఃఖాక్రాంతమైన మనస్సుతో ఆ ఆశ్రమం చుట్టుప్రక్కల గల అరణ్యంలో పిచ్చిపిచ్చిగా సంచరిస్తూ విలపించసాగాడు. ఇది గమనించిన పుణ్యుడు ఒకరోజు పావనుని తన ప్రక్కన కూర్చోబెట్టుకొని ఈ విధంగా సంభాషించసాగాడు.

**పుణ్యుడు :** తమ్ముడూ! అజ్ఞానివై ఈ విధంగా ఎందుకు పరితాపం పొందుచున్నావు? నీవు, నేను, నాన్నగారు, అమ్మ ఒకచోట కూర్చుని అనేకసార్లు చర్చించిన ఆత్మ విశేషాలన్నీ మరచిపోయావా? నీవు గొప్ప తెలివిగలవాడివే కదా! మన అమ్మ నాన్న ఎక్కడికి వెళ్ళారు చెప్పు? వాళ్ళు 'బ్రహ్మపదము'ను పొందారు. ఆ బ్రహ్మమే సర్వ జీవులకు నిలయం కదా! బ్రహ్మవేత్తల స్వరూపం కూడా అదే. స్వస్వరూపం పొందిన వాళ్ళ గురించి ఎందుకు రోదిస్తున్నావో చెప్పు?

**పావనుడు :** అన్నా! మనలను కని, పెంచి, పెద్దచేసిన అమ్మ నాన్నలు మన కళ్ళముందు నుంచి మాయమై, ఎటో వెళ్ళిపోయారే? ఆ భగవంతుడికి మనం ఏం అన్యాయం చేశామని ఈ పిచ్చిపని చేశాడు చెప్పు?

**పుణ్యుడు :** "ఈతడు నా తండ్రి, ఈమె నా తల్లి" అను రూపము గల భావనలన్నీ ఉత్తమ సత్యము పట్ల ఉదాసీనత, విచారణ కొరవడటం, అజ్ఞానం... కారణంగానే ఉదయిస్తున్నాయి. శోకించతగని వాటి గురించి నీవు శోకిస్తున్నావు. "గతించిపోయిన, గతించిబోయే" విషయాల గురించి శోకించి లాభమేమున్నది చెప్పు?

తమ్ముడూ! "దీర్ఘతపుడు నా తండ్రి, ఆతని భార్య నా తల్లి" అని భావిస్తున్నావు... బాగానే ఉంది. కాని, వాస్తవానికి వారు మాత్రమే నీకు తల్లితండ్రులా? కాదు. ఎందుకంటే నీవు ఇంతకు ముందు వేలాది జన్మలలో అనేక మంది తల్లితండ్రులను పొందియున్నావు. అదేవిధంగా వారు కూడా తమ ఇతఃపూర్వపు జన్మలలో వేలాదిమందిని తమకు బిడ్డలుగా పొందియున్నారు. కనుక, "నీవు, నేను" మాత్రమే వారికి పుత్రులం" అనటం మూర్ఖమే అవుతుంది. ఇట్టిదే ప్రతిఒక్క జీవుని యొక్క ప్రతిఒక్క సంబంధం కూడా !

**మిత్రబాంధవవృన్దాని జన్తోర్జన్మనిజన్మని ।**
**ఋతావృతావతీతాని ఫలానివమహాతరోః ॥** (శ్లో 34, సర్గ 19)

ప్రతిజన్మలోను ఈ జీవునకు ఎందరో బంధువులు, మిత్రులు, పరిచయస్తులు కలుగుచున్నారు. "ప్రేమవశం చేతనే నేను నా తల్లితండ్రుల గురించి శోకిస్తున్నాను" అని నీవు అనదలచుకొంటే, మరి, నీవు నీ గతించిపోయిన జన్మలలోని తల్లి తండ్రుల గురించి, బంధువుల గురించి ఎందుకు శోకించుటలేదో నేను తెలుసుకోవచ్చా?

**పావనుడు :** నిజమే, నీవు చెప్పేదానిలో వాస్తవముంది. అయితే ఈ దృశ్యం మరల మరల వస్తోంది, పోతోంది. ఇదంతా ఎక్కడి నుండి వచ్చి పడుతోంది?

**పుణ్యుడు :** ముక్కుకు సూటిగా నీ ప్రశ్నకు బదులివ్వాలంటే – 'జగత్ కల్పన'కు అజ్ఞానమే కారణం. 'అజ్ఞానము' చేతనే ఈ దృశ్యమంతా ప్రకటితమవటం, ఎదురుగా నిలిచి ఉండటం, భ్రమింపచేయటం జరుగుతోంది.

యథార్థానికి నీకు మిత్రులుగాని, సోదరులు గాని, తదితర బంధువులు గాని లేరు. ఎట్టిటి ఎండకు కాలిపోతున్న ఎడారిలోని ఇసుక దిబ్బపై నీళ్ళు ఉంటాయా? బ్రహ్మస్వభావమగు ఆత్మయందు జన్మము లేదు. మరణము లేదు. ఇక, నీకు కనిపిస్తున ధన–ధాన్య–రాజ్య విభవములు, ఐనవాళ్ళు, కానివాళ్ళు, అనుబంధములు... ఇవన్నీ భ్రమతో కూడిన సాంసారిక దృష్టికి మాత్రమే తారస పడుచున్నాయి. పైగా, ఇవన్నీకూడా, మూడు నాళ్ళముచ్చట్లే కదా! "ఇవి నాకు కలవు" అని విఱ్ఱవీగేంత సేపు పట్టదు... వీటి రాకపోకలు! అందుచేత, సోదరా! కాస్త పరమార్థదృష్టిచే సత్యాన్ని విచారించు. ఈ "నేను – నాది – నీది" అను వ్యవహారమంతా కేవలం కల్పనయే అయి ఉన్నది.

అంతేకాని, వాస్తవం మాత్రం కాదు. ఇప్పుడు మన ఇరువురి మధ్య ఏర్పడివున్న అనుబంధమును విజ్ఞాన దృష్టిచే పరిశోధించామనుకో, "నీకు నేను గాని, నాకు నీవు గాని ఏ ఒక్కక్షణమందు కూడా లేము" – అనియే తెలియవస్తోంది. అందుచేత, "స్వప్నంలోని వస్తుజాలం వంటిది, భ్రమ చేత మాత్రమే అనుభవమగునది" – అయినట్టి ఈ "నీవు, నేను" మొదలైన భ్రమలన్నీ నీ హృదయంలోంచి ముందుగా పారత్రోలివేయి.

**పావనుడు :** మరి ఈ జీవుల జన్మ మృత్యువుల సంగతేమిటి?

**పుణ్యుడు :** "ఇది నశించుచున్నది, ఇది జన్మించుచున్నది" – ఇటువంటి దృష్టులన్నీ స్వసంకల్పములతో రూపం పొందిన భ్రమచేత మాత్రమే నీముందుకు వస్తున్నాయి. మరల మరల విజృంభిస్తున్నాయి. అంతేకాని అదంతా వాస్తవమైనది కాదు.

'ద్రష్టత్వము' అను క్రియావిశేషమునకు కూడా కర్తయగు ఆత్మ ఒకానొక తరుణంలో అజ్ఞాన తాపముచే ఆచ్ఛాదితమై ఉంటోంది. ఎడారిలో మృగతృష్ణాజలం కనబడుతోందిచూడు. అట్లాగే "శుభ, అశుభ కర్మలు" అనే చంచల, స్వవాసనపూర్వకమైన తరంగాలు ఈ అనంత సంసార సాగరంగా స్ఫురిస్తున్నాయి. మేఘాలు ఆకాశాన్ని కప్పి వేస్తున్నట్లు, సాంసారిక భావనలు ఆత్మాకాశాన్ని కప్పివేస్తున్నాయి. అయితే మేఘములు కమ్మినంత మాత్రం చేత ఆకాశం లేకుండా పోతుందా?... లేదు. ఈ భ్రమలన్నీ ఏర్పడవచ్చు, లేక మరొకప్పుడు తొలగిపోవచ్చు. నిర్మలమైన చిదాకాశము ఎప్పటియట్లే అప్రమేయముగా, అఖండముగా సర్వదా ఉండి ఉంటోంది.

చిదాకాశమే నీయొక్క, నాయొక్క, మన అమ్మా, నాన్నల యొక్క వాస్తవ స్వరూపం.

❖❖❖

## 3. సంబంధబాంధవ్యముల అతీతత్వము

**కఃపితాకించవామిత్రం కామాతాకేచబాన్ధవాః ।**

**స్వబుద్ధ్యైవావధూయన్తే వాత్యయా జనపాంసవః ॥ (శ్లో 1, సర్గ 20)**

**పుణ్యుడు :** తమ్ముడూ! పావనుడా! తల్లి ఎవరు? తండ్రి ఎవరు? మిత్రులెవరు? బంధువులు ఎవరు? గొప్ప గాలి వీస్తుంటే ధూళి లేస్తుంది చూచావా! ఈ అనేక జీవుల సంబంధములు ఆ ధూళి లోని వేరు వేరు రేణువుల యొక్క సామీప్య సంబంధములవంటివి మాత్రమే.

ప్రతి జీవునకు తదితర జీవులంతా ఆ జీవుని యొక్క 'స్వబుద్ధి, భ్రాంతి'లచే కల్పించబడినవారై ఉన్నారు. ఆత్మయే రాగ, ద్వేష, మోహములను ఆశ్రయించుచున్నప్పుడు – "వీరు బంధువులు, వీరు మిత్రులు, వీరు హితులు" – అనువాటితో కూడిన ఈ ప్రపంచం విస్తరింప జేయుచున్నది.

ఒకనిని చూచి నేను "ఇతడు నాకు సంబంధించినవాడు" – అని సంకల్పించినప్పుడు మాత్రమే అతడు నాకు బంధువు అగుచున్నాడు. అట్లా కాకుండా, "ఆతడు అప్రియమైనవాడు, వ్యతిరేకి, ద్వేషింపదగినవాడు" – అను రూపం గల వ్యతిరేకభావనచే శత్రువు అగుచున్నాడు. భావనామాత్రం

చేతనే విషము అమృతము గాను, అమృతము విషము గాను అగుచున్నది. ఈ సంసారము యొక్క ప్రాప్తి, స్థితి, గతి కూడా కేవలం 'భావించుట' అను క్రియావిశేషము చేతనే సంభవిస్తోంది.

సర్వదేహములందు ఏకరూపమున వెలుగుచున్నట్టి 'సర్వవ్యాపి'యగు ఆత్మకు "ఇతడు నా బంధువు, ఇతడు నా మిత్రుడు" అను కల్పన ఎట్లా ఉంటుంది? ఎక్కడ ఉంటుంది? నీవైనా, నేనైనా ఈ రక్త మాంస బొమికలతో కూడిన అస్తిపంజర శరీరములమా? కాదు. ఈ దేహగృహం మనం ఆశ్రయించాం గాని మనం ఈ దేహములం కాము సుమా! అందుచేత కొంచెం ఏకాంతంలో కూర్చుని "చేతనా స్వభావుడైన నాయొక్క యదార్థ స్వరూపము ఏమై ఉన్నది...?" అని నీ చిత్తములోనే విచారణ చేయడం ప్రారంభించు.

పరమార్థమగు "శుద్ధ చైతన్య దృష్టి"తో ఈ దృశ్యమును ఆమూలాగ్రం పరిశీలన చేయడం జరిగితే, అప్పుడు, " 'పావనుడు' అనబడే నీవు గాని, 'పుణ్యుడు' అని పిలువబడుచున్న నేను గాని ఈ దేహపరంగా లేనే లేము" అని తెలిసి వస్తుంది. దేహము పట్ల 'ఇది నేను' అను రూపము గల అభిమానం, మిథ్యా జ్ఞానం ఏర్పడియుండుట చేతనే ఈ మన రూపాలన్నీ ఈ విధంగా విజృంభించి, లయిస్తున్నాయి. ఈ కనబడే వేలాది వేర్వేరు శరీరములన్నీ 'కల్పన' చేతనే కన్పిస్తున్నాయి కాని, ఇవన్నీ స్వతహాగా ఉన్నవి కావు.

మనం భౌతిక దృష్టిచే, లేక, "దేహ దృష్టి" చే పరిశీలిస్తే – ఇక్కడ నశ్వరమైనది కానిదేమున్నది? ఇక్కడ తల్లి ఎవరు? అయినవాడెవ్వడు? కానివాడెవ్వడు? మిత్రుడెవ్వడు? శత్రువెవడు? ఈ ఎదురుగా కనబడుచున్న 'దేహములు' అను ఉపాధులకు అతీతమై, సాక్షిమాత్రమై ఉన్నట్టి 'చైతన్య దృష్టి' అలవరుచుకున్నావనుకో... అప్పుడు అనంతరూపమగు 'చిదాత్మ' మాత్రమే ఉనికి కలిగి అగుపిస్తుంది. అట్టి చిదాత్మ యందు "ఇది నాది, అది నీది" అనే భేదం ఉంటుందా? ఉండదు. ఒక సముద్ర తరంగానికి ఏ తరంగం ఏ తరంగానికి శత్రువు? ఏ తరంగం ఏ తరంగానికి మిత్రుడు? ఉన్నదంతా జలమే కదా!

**పావనుడు :** అయితే అన్నా!. ఈ ప్రశ్నకు బదులు ఇవ్వు. మనోబుద్ధి అహంకారములు అనబడే సూక్ష్మ తత్వమే నేను కదా! అట్టి మనోబుద్ధులకు "ఈతడు నా అన్న" – అని నీవు లభించుచున్నావే? మరి "శత్రు మిత్రులు, బంధువులు కానివారు" లేరని నీవు ఎట్లా అనగలవు? జన్మ పొందినప్పటి నుండీ ఏర్పడియున్న బంధువులను "వీరు నా వారు" అని అనుకోవటం లోకధర్మమే కదా! వారిని యథారీతిగా బంధుత్వపూర్వకంగా కలిగియుండటం ఎందుకు సముచితం కాదు?

**పుణ్యుడు :** నీవు చెప్పేది బాగానే ఉన్నది. అయితే, నాది మరొక ప్రశ్న. కొన్ని సంవత్సరాల క్రితం మాత్రమే జన్మచే ఏర్పడుచున్న ఈ సంబంధబాంధవ్యములు శిరోధార్యమేనని అనుకుందాం.... మరి, ఇతఃపూర్వం గడచిన అనేక జన్మలలో బంధు మిత్ర ధనాదుల మాటేమిటి? అవన్నీ అక్కడక్కడ వదలి వచ్చినందుకు ఇప్పుడు దుఃఖిస్తూ కూర్చుంటున్నావా? ఈ వర్తమాన జన్మలో కూడా ఎన్నెన్నో అనుబంధాలు ఏర్పడటం, మరల కాలముచే మ్రింగివేయబడటం జరుగుతోంది కదా!

ఏది ఏమైనా, ఇవన్నీ కూడా కొన్ని సంవత్సరముల తరువాత క్రితం జన్మలోని విశేషాలు లాగానే రూపరహితం కాబోతున్నాయి కదా! ఈ విషయం నీవుగాని మరొకరుగాని ఒప్పుకోక తప్పదు. అయితే, ఎప్పటికప్పుడు, ఆ వర్తమాన సమయంలోని బంధు మిత్ర శత్రుత్వాదులు నిన్ను మోహింపజేస్తున్నాయి. ఇది గమనిస్తున్నావా?

ఎప్పటికప్పుడు వచ్చి పోతూ ఉండే ఈ సంబంధముల పరంపరలో దేనికొరకు హర్షించాలి? దేని కొరకు దుఃఖించాలి? అందువలన వచ్చే ప్రయోజనం ఏమి ఉంటుంది? ఈ అత్యంత కల్పితమైనట్టి అనేక బంధుమిత్రాదులలో కొందరు మరణాదులు పొందినందుకు దుఃఖించటం, మరికొందరి వృద్ధిని చూచి సంతసించటం – ఇదేనా, మన పని? మనం ఇందుకే జన్మిస్తున్నామా? మనం ఈ దేహంతో పుట్టటానికి మునుముందు ఇవన్నీ లేనేలేవు కదా!

తమ్ముడూ! మరొక మాట నీవు ఇంతక్రితం మృగజాతులలో జన్మించి ఉన్నావు. అనగా, వాటందరిలో నీకు బంధువులు ఉన్నారు. మరి ఆ మృగములు వేటాడబడుచున్నప్పుడు నీవు దుఃఖించుట లేదేమి?

**పావనుడు :** అయి ఉండవచ్చునేమో! అయితే అవన్నీ ఇప్పటి నా దృష్టిపథంలో లేవు కదా!

**పుణ్యుడు :** అవును! ఆ రీతిగానే ఈ వర్తమానపు సంబంధాదులన్నీ ఒకప్పటికి నీ దృష్టిపథంలోంచి తొలగిపోబోతున్నాయి. ప్రతిజీవుడు 'వృక్షము, సింహము, పులి, చేప' మొదలైన అనేక రూపములను ఎత్తుచు, ఎన్నో బంధుత్వములను పొందటం, త్యజించటం చేస్తూనే ఉన్నాడు. అయితే ఏం? ఎప్పటి కప్పుడు వర్తమాన కల్పన యందు నిమగ్నమగుచు, 'అయ్యో నేనొక అల్ప దుఃఖ పేద జీవిని" అని దుఃఖములు తెచ్చిపెట్టుకుంటున్నాడు. అంతరంగమునందు ఆత్మదృష్టి ఏర్పడనంత వరకు ఈ వ్యవహార స్రవంతికి అంతు లేదు.

**అనేక జన్మల చమత్కారం -** "తపస్సు – ధ్యానము – భగవత్కటాక్షము"ల ప్రయోజనంగా నాకు ప్రాప్తించిన సునిశిత దృష్టిచే నేను చూడగలుగుచున్నట్టి నీ పూర్వజన్మల కొన్ని వృత్తాంతాలను చెబుతాను విను–

నీవు పూర్వం ఒకానొకప్పుడు "దశార్ణవ" అను పేరుగల దేశంలో ఒక కోతివై పుట్టావు. ఆ తరువాత "తుషార" అనే మరొక దేశంలో రాజకుమారుడవై పుట్టావు.

ఇంకా, మరికొన్ని విశేషాలు చెప్పమన్నావా? అయితే విను–

ఒకప్పుడు కోసలదేశంలో ఒక బ్రాహ్మణుడుగా జీవిస్తూ భిక్షాటన చేస్తూ ఉండేవాడివి. వంగ దేశంలో 'లొట్టిపిట్ట'గా అనేక చెట్లను ఆశ్రయించావు. ఒకచోట గుఱ్ఱంగా పుట్టి అనేక యుద్ధ భూములలో ప్రవేశించి డెక్కలతో అనేక మృతదేహములను స్పృశించావు. మరొకచోట ఒక తాటిచెట్టు తొఱ్ఱలో పురుగుగా జీవించావు. దోమగాను, బాతుగాను పుట్టి ఉన్నావు. మరొకప్పుడు హిమాలయాల లోని ఒక కొండశిఖరప్రాంతంలోని ఒక ఇరుకైన చోట రంగులచారలు గల పురుగుగా పుట్టావు. మరొక చోట నేలలో తేలుగా జన్మించి, ఒకటిన్నర సంవత్సరములు గడిపావు. ఆ తరువాత ఒక

చండాల కన్యకకు పుత్రుడవై జన్మించావు. ఆ తరువాత ఇక్కడి దీర్ఘతపునకు, అంటే మన తండ్రికి – ఈ విధంగా కుమారుడవై జన్మించావు. ఇంకా చెప్పాలంటే ఈ జంబూద్వీపంలోనే అనేక జీవ జాతులలో అనేక మార్లు పుట్టటం, చావటం నిర్వర్తించి ఉన్నావు.

విశుద్ధమైనట్టి "సూక్ష్మబుద్ధి"చే నాకు లభిస్తున్న 'సంయక్‌దర్శనము' అను ప్రభావంచేత నీకు చెప్పినదంతా నేను ఎదురుగా చూడగలుగుచున్నాను. అనేక జన్మలలో చేసిన ఆయా ఉత్తమ ప్రయత్నముల ప్రయోజనంగా నాకు ఈ దివ్య దృష్టి ప్రాప్తించింది. నాకు కూడా అజ్ఞానస్థితిలో అనేక జన్మలు గడచిపోయాయి. జ్ఞానాభివృద్ధి కొరకై ఆ సంగతి కూడా ప్రస్తావిస్తాను.

నేను కూడా కుక్కగాను, కప్పగాను, మృగములను వేటాడే వేటగానిగాను, వంగదేశంలో ఒక చెట్టుగాను, వింధ్య పర్వత ప్రాంతంలో ఒక ఒంటెగాను, కొంగగాను, ఒక రాజుగాను, పులిగాను జన్మించటం జరిగింది. పదియేళ్ళు గ్రద్దగా ఉన్నాను. ఒక వందయేళ్ళు సింహంగా జీవించాను. కొంతకాలం ఒక పిచ్చుకనై గూళ్ళు కట్టుకుని జీవించాను. మరల మరొక ప్రదేశంలో ఒక సమయంలో ఒక మండలాధీశునికి కుమారుడుగా పుట్టి అనేకమందిని హింసిస్తూ పెత్తనం చెలాయించాను. నా దుష్టస్వభావానికి ప్రతిఫలంగా ఆ జన్మలో నేను కొందరిచే సంహరించబడ్డాను కూడా! ఆహా! ఏం చెప్పాలి! భిక్షకుడు ఇంటింటికీ వెళ్లి కబళం కోసం కేకలు వేస్తున్నట్లు నేను అనేక ఉపాధులలో ప్రవేశించాను. మరల ఇంతలోనే నిష్క్రమించాను. ఇటువంటి అసంఖ్యాకమైన భూతకాలపు జన్మలను నేనిపుడు సుస్పష్టంగా సంస్మరించగలుగుచున్నాను.

కాబట్టి తమ్ముడూ! నీకూ నాకు కూడా ఇంతకు ముందు ఎందరో తల్లిదండ్రులు, సోదరులు, స్నేహితులు, బంధువులు వేరువేరుగా ఏర్పడి, తరువాత మరెప్పుడో కాలముచే ఎటకో తీసుకుపోబడ్డారు. ఇక ఈ వర్తమానంలోని మనిద్దరి అన్నదమ్ముల సంబంధము కూడా అటువంటిదే. ఈ గడచిపోయిన అసంఖ్యాకమైన సంబంధాలలో వేటివేటి కొరకు సంతోషించాలి? వేటివేటి కొరకు దుఃఖించాలి?

**పావనుడు :** అన్నా ! ఔను ! నిజమే...!

**పుణ్యుడు :** నీవు ఎవరి కోసం దుఃఖించవలసినపనీ లేదు. ఎందుకంటావా? జగత్తు స్థితే అట్టిది.

**అనన్తాఃపితరోయాన్తి యాన్త్యనన్తాశ్చమాతరః ।**
**ఇహసంసారిణాంపుంసాం వనపాదపపర్ణవత్ ॥** (శ్లో 33, సర్గ 20)

వనమందలి వృక్షపర్ణముల వలె సంసారజీవు లమగు మనకు ఎందరో సంబంధీకులు సంభవించారు, సంభవించ బోవుచున్నారు.

**కింప్రమాణమతఃపుత్ర దుఃఖస్యాత్రసుఖశ్యచ ।**
**తస్మాత్సర్వంపరిత్యజ్య తిష్ఠావఃస్వచ్ఛతాంగతౌ ॥** (శ్లో 34, సర్గ 20)

ఈ తతంగమంతా "ఇది సుఖము, ఇది దుఃఖము" అను భావనతో పరికించదలచుకొన్నావా... ఇక ఈ సుఖదుఃఖములకు అంతు ఎక్కడ? కనుక, నీవు ఈ దృశ్యదృష్టిని, దీని వలన కలుగుచున్న శోకమును పరిత్యజించాలయ్యా! మనం ఇప్పుడు నిర్మలత్వమునే ఆశ్రయించుదాం.

**సావధానం -** ఈ ప్రపంచమంతా మనకు ఎదురుగా ప్రాప్తిస్తున్నది కదా! అయితే "ఇదంతా మనస్సులోనే అహంభావ రూపంగా ఉన్నది" అని ఆత్మజ్ఞులు చెప్పుచున్నారు. ఇది వేరు, అది కావాలి, వారు మావారు కాదు, ఏదో పొందాలి" మొదలైన తుచ్ఛ దృశ్యవ్యథలను విడచి పెట్టి, ఆత్మజ్ఞులు అనుసరించే మార్గం మనం ఎందుకు అనుసరించరాదు? అదే మనకు శ్రేయస్కరం, అంతే గాని, ఆయా స్వల్పవిషయాల గురించి మననం చేస్తూ, దుఃఖిస్తూ కాలయాపన చేయటం ఏం ఉచితం? ఈ ప్రపంచంలో "జన్మ ఉన్నతి పతనం" అను కార్యములు ఒక పెద్ద చక్రము యొక్క పరిభ్రమణం లాగా అనివార్యంగా కొనసాగుచున్నాయి. ఇటువంటి అతి చంచలమైన సంసార స్థితిగతులను పట్టుకుని మనం ఎందుకు వ్రేలాడాలి? వాటిలో ఏదో ఎందుకు దేవులాడాలి?

అందుచేత, భావ అభావములకు అతీతమై, స్థితిగతులచే మలినపరచజాలని విషయమగు "ఆత్మ" గురించే మనం సావధానమనస్కులమై విచారణ చేద్దాం. అంతేగాని, మనం మూఢచిత్తులం కాకూడదు. మూర్ఖంగా దృశ్యమునే ఆశ్రయించ దలచామా – ఇక దీనత్వము, నైరాశ్యము, అజ్ఞానము మాత్రమే లభించే ప్రాంతాలకు జేరవలసివస్తుంది.

**జ్ఞానుల చర్యలు, అజ్ఞానుల చర్యలు -** తమ్ముడూ! యథార్థానికి నీకు తల్లి గాని, తండ్రి గాని లేరు. దుఃఖములూ లేవు. జన్మలూ లేవు. ఎందుకంటే నీవు అన్ని సమయములందూ 'శుద్ధాత్మ'యే స్వస్వరూపముగా కలిగి ఉన్నావు. నీకు వేరుగా ఈ జన్మలు గాని, ఈ దేహములు గాని లేవు. అయితే అజ్ఞానులు ఇక్కడి దృశ్యములోని 'సత్యము, సారము' గమనించటంలేదు. వారు తమ ఈ సంసారయాత్రలో అనేక క్రియావ్యవహారములను నిర్వర్తిస్తూ 'మొదలే అసత్యము' అయిన వ్యవహారము లందు "ఇవి ఎంతో సారవంతమైనవి" అను బుద్ధిని ఏర్పరుచుకొని గుర్తించుచున్నారు.

ఇక తత్త్వజ్ఞానులేంచేస్తున్నారంటావా? వారు ఉదాసీనులై 'స్వస్థత'తో కూడిన చిత్తము కలిగి ఉంటున్నారు. ఆయా ప్రాప్తించిన కార్యములను సంగరహితులై నెరవేర్చుచున్నారు. ఈ సర్వమునకు కేవలం సాక్షీమాత్రులై ఉంటున్నారు.

రాత్రిపూట గదిలో దీపం వెలిగిస్తాంకదా! ఆ వెలుగులో గదిలో వస్తువులు కనిపిస్తున్నాయి. ఆ దీపమునకు "వీటికి వెలుగు ఇవ్వటం నాకు ఇష్టం. ఇవంటే నాకు ఇష్టం ఉండదు. అందుచేత, వీనికి నేనెందుకు వెలుగు ఇవ్వాలి?" అను రాగముతో కూడిన కర్తృత్వాభిమానము ఉన్నదా? లేదు. నీవు కూడా ఆయా క్రియలకు కర్తవగుచున్నప్పుడు అభిమానరహితుడవై, అకర్తవై ఉండు. తత్వజ్ఞులు ఆ విధంగానే ఈ ప్రపంచంలో విహరిస్తున్నారు. ఒక దర్పణంలో ఆయా ఎదురుగా ఉన్న వస్తువులు ప్రతిబింబిస్తున్నప్పటికీ, ఆ ప్రతిబింబిత వస్తుజాలము యొక్క ధర్మములను దర్పణము పొందుతోందా? లేదే! అట్లాగే, తమ యందు అధ్యస్తమై ఉంటున్న ఆయా కార్యములను, వ్యవహారసంబంధములను గమనిస్తూ, నిర్వర్తిస్తూ కూడా, జ్ఞానులు, తమయొక్క ఆత్మత్వమును, ఆత్మ ధర్మములను త్యజించరు. "అఖండమగు ఆత్మయే నా స్వరూపము" అను సుదృఢమైన ధ్యాసచే 'దృశ్యతాదాత్మ్యము' అను దోషమును సుదూరంగా విడచివేస్తున్నారు.

అందుచేత తమ్ముడూ! 'ఇచ్ఛ' అనేరూపంతో ఏర్పడుచున్న కళంకమును ముందుగా త్యజించివేయి. నీ హృదయంలో స్వయంగా వివేకబలంచే ఆత్మభావన సాక్షాత్కరింపజేసుకో. 'ఆత్మ స్థితి'ని సర్వదా ఆశ్రయించు. ఈ సంసారభ్రమను మొదలంట త్యజించివేయి. ఈ దృశ్యవ్యవహారమంతా త్యజించ బడగా, ఇక అప్పటికి కూడా శేషించబడి ఉండే స్వస్వరూపస్వభావముచే సంతుష్టుడవై ఉండు.

❖

ఆ విధంగా పుణ్యునిచే బోధింపబడిన పావనుడు సూర్యోదయసమయంలో భూమి ప్రకాశించ నారంభించునట్లుగా వికసిత హృదయుడయ్యాడు. బహుకాలం అన్నదమ్ములిద్దరు పరస్పర సహ జీవనంతో జ్ఞానవిజ్ఞాన పారంగతులైనారు. కాలక్రమంగా అఖండము, అద్వితీయము అయినట్టి నిర్వాణము అధిష్ఠించారు. నూనె తరిగి పోయినట్టి దీపంలాగా వాళ్ళిద్దరు మనోప్రశమనమును పొందారు.

❖❖❖

# 4. ధ్యేయవాసన - చికిత్స

**శ్రీవసిష్ఠమహర్షి :** చూచావా! పుణ్యుడు చెప్పినట్టుగానే, ప్రతి జీవునికి ఇతఃపూర్వమే అనేక దేహాలు, అట్టి ప్రతి దేహమునకు సంబంధించి అనేక మంది బంధుమిత్ర, అమిత్రాదులు ఉండి ఉంటారు. వారిలో ఎవరిని త్యజించాలి? ఎవరిని గ్రహించాలి? "అసలు ఈ జీవునకు శోకము, మోహము ఎక్కడి నుండి దిగుమతి అగుచున్నాయి?" అనే విషయం మేము పరిశోధించాం. "అంతరంగములోని తృష్ణయే" అని సమీక్షిస్తున్నాం. అందుచేత శాంతి పొందాలంటే తృష్ణను జయించాలి.

అట్లా కాకుండా ఎప్పటికప్పుడు ఆయా విషయములను కల్పిత వ్యవహారములను ఆశతో కూడుకొని ఆశ్రయిస్తూపోతే, ఆ పయనానికి అంతెక్కడ? శాంతి ఎప్పటికి చెప్పు? కట్టెపుల్లలు వేస్తున్న కొద్దీ అగ్ని జ్వలిస్తూనే ఉంటుందికదా! విషయ చింతన చేతనే ఈ సాంసారిక దుస్థితులు వృద్ధి చెందుతున్నాయి. విషయ చింతన లేకపోతే దుఃఖాదులు కూడా ఉండవు.

**ధ్యేయ వాసన -** "ఏదో పొందాలి, ఇంకేదో కావాలి, ఏవేవో ఇంద్రియ విషయముల ప్రాప్తిచే మాత్రమే ఉపశమనము, లేదా, అంతా అశాంతియే, తదితరులకు లభించే వన్నీ నాకు లభించాలి, నాకు చెందినవి తదితరులకు లభించకూడదు" – ఇట్టి అనేక ధ్యేయవాసనలను ఈ జీవుడు కలిగి ఉంటున్నాడు. ఆ మార్గంలో ఎన్నటికి శాంతి? కనుక నీవు "ధ్యేయ వాసనా త్యాగము" అనే రథం అధిరోహించు. కరుణాదృష్టితో, ఉదార చిత్తముతో తదితర జీవరాసులన్నిటినీ దర్శించి సర్వభూతదయ కలిగియున్న వాడవై ఈ ప్రాకృత వ్యవహారములను ఆచరిస్తూవుండు. అంతేగాని, ఇక్కడ భేద దృష్టి యందు తాదాత్మ్యం చెందవద్దు. "ధ్యేయ వాసనారాహిత్యం" ఆశ్రయించినవాని స్థితి 'స్వస్థితి' అవుతుంది. అట్టి స్థితియే నిర్మల నిష్కామ ఉపాధిరహిత బ్రాహ్మీస్థితి. వివేకము, పరమార్థబోధలను తన వెంట నిడుకుని, ఈ జగత్తునందు విహరించేవాడు ఇక్కడ మోహితుడు కాదు. ఆతనిని సంపదలన్నీ వదలి

వెళ్ళవచ్చు గాక! బంధువులు బహిష్కరించవచ్చుగాక! అతడు దైన్యము పొందడు. సుస్థిరమైన స్వతత్వమును అవధరించగలడు. జ్ఞాని యొక్క దృష్టి, అవగాహనలచే ఏర్పడే స్వధైర్యమును మించిన సంపద గాని, స్వజనము గాని లేరు. ఆపదల సమయంలో ప్రతికూల స్థితిగతులలో నిస్సహాయ వాతావరణంలో మనలను రక్షించేది అదే. అందుచేత నీవు జ్ఞానివై ఉండు.

ఓ రామా! ఈ "విషయములు" అనే ఆపదల నుండి నిన్ను నీవే లేవనెత్తుకోవాలి. వైరాగ్యము చేతనూ, శాస్త్రాధ్యయనము చేతనూ, మహత్తరమైన ఉదారము మొదలగు గుణముల చేతను ఆత్మోద్ధరణకై ఉద్యుక్తుడవు కావాలి. విషయ త్యాగము చేసేవారి చిత్తము స్వల్పసమయంలో మహత్తర రూపం పొందుతుంది. అట్టి చిత్తము ప్రసాదించే ఫలితమేమిటంటావా? ఈ ముల్లోకములలోని రత్నరాసులు గాని, తదితర ఐశ్వర్యములన్నీ గాని లభించినప్పటికీ, ఆ నిర్మల చిత్తము ముందు దిగదుడుపే. "శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, సంఘటనల పట్ల ఏర్పరచుకొన్న ఆశానిరాశలు" – వీటినే 'విషయములు' అని అంటున్నాం. విషయ త్యాగములు చేయక పోవుటచేతనే ఈ సంసార కుక్షిలోని జీవులు మరల మరల ఊర్ధ్వ, అధోగతులను, జననమరణములను పొందుచున్నారు. ఫలితంగా వారి మనస్సులు దుఃఖమయములుగా ఉంటున్నాయి.

అదే మనస్సు బ్రహ్మజ్ఞానముచే పరిపూర్ణమైనప్పుడు ఇక ఈ లోకమంతా అమృతమయముగా కనపడుచున్నది. పాదరక్షలు ధరించి నడిచేవానికి బాటలన్నీ చర్మం పరచినట్లు ఉంటాయి కదా!

అయితే ఒక్క విషయం; ఆశకు వశం గాని మనస్సు మాత్రమే వైరాగ్యము యొక్క సహాయము చేత 'పూర్ణత్వం' పొందుతోంది. ఆశ ఎక్కడ ఉంటుందో అక్కడ "దుఃఖం మోహం" అనే మాలిన్యాలు ఉండనే ఉంటాయి. ఆశ – అనే వాసనాత్యాగం చేసిన వారి హృదయంలో 'లోభం, దైన్యం' ఉండవు. అగస్త్య మహాముని జలం పానం చేయగా మిగిలియున్న శూన్యసముద్రంలాగా అది ప్రశాంతము పొందుచున్నది. తృష్ణను జయించి 'శాంతము, వైరాగ్యము'లతో కూడుకొని ఉన్నప్పుడే, ఈ హృదయం శోభిస్తుంది. ఇచ్ఛారహితులు, బ్రహ్మజ్ఞానముచే పూర్ణులగువారు ఈ ముల్లోకములను తృణప్రాయంగా చూస్తున్నారు. ఈ జనసమూహము, తత్సంబంధములు గోష్పాదజలంలాగానూ, ఒక 'మహాకల్పము' కూడా అర్ధ నిముషములాగానూ కన్పట్టగలదు. ఇచ్ఛారహితునియందు మనకు కనిపించే శీతల సౌమ్యత్వము మనకు హిమాలయ పర్వతాలలోగాని, పూర్ణ చంద్రునియందుగాని, చందన వృక్షమందుగాని, అరటి తోటలోగాని లభించదు సుమా! అతని యందుగల ప్రశాంతతను క్షీరసాగరంతోనో, జగన్మాత లక్ష్మీదేవి ప్రసన్న వదనంతోనో పోల్చవచ్చునేమో!

ఈ అంతఃకరణమును కలుషితం చేస్తున్నదేది?... "ఆశ" అను పిశాచమే! ఈ చిత్తం యొక్క ఆశలే, దశదిశలా ప్రసరించి ఉన్నాయని గ్రహించు. ఆశ తొలిగించబడినప్పుడు ఇదే చిత్తము బ్రహ్మమై వెలుగొందుచున్నది. ఎప్పుడైతే ఆశలు లయిస్తాయో, రహితమౌతాయో – మరుక్షణం అంతకు ముందటి అల్ప ధైర్యం కూడా బహువిస్తారమైన ఒక మహా వృక్షంలాగా శతశతాధిక శాఖలుగా విస్తరిస్తుంది. వైరాగ్యయుక్తుడు, ఇంద్రియములను జయించివేసినవాడు, ఆశ నశించగా

ధైర్యము వహించినవాడు, అగు జీవుడు ఉత్తమోత్తమమైన పదమును తనకు తానే అధిరోహిస్తాడు. ఆతనికి మరొకరెవరో వచ్చి ప్రసాదించవలసిందేమీ ఉండదు.

**అభయం! -** ఓ రాఘవా! ఈ జీవుడు కనుక పవిత్రాంతఃకరణుడై, చిత్తవృత్తులకు చోటు ఇవ్వకుండా ఉన్నాడనుకో ... ఇక ఈ జన్మకర్మ మొదలగు వాటి గురించి భయాదులు ఉండవు. ఈ చిత్తము వృత్తిరహితమై "అచిత్తత్వము" పొందిందా, ఇక ఈ జీవుడు పూర్ణమగు మోక్ష స్థితిని పొందినవాడే అవుతాడు.

చింతన చేయటమునే 'వృత్తి' అని అంటున్నాం. అట్టి చిత్త వృత్తి 'ఆశ' చేతనే ప్రవృత్త మౌతోంది. కదలించబడుతోంది. 'ఆశ' అనే చిత్త వృత్తిని జయిస్తే, ఈ జీవుడు తప్పక "చిత్తరాహిత్య స్థితి"కి అర్హత పొందుతాడు.

ఏది ఏ వృత్తితో కూడుకొని ఉంటుందో – అది ఆ వృత్తి యొక్క "అభావము" చేతనే నివృత్తి అవుతుంది. కనుక చిత్తమును ఉపశమింపజేయడానికి "భావరాహిత్యం" లేక "భావాతీతమైన కేవల సాక్షిమాత్రం" అభ్యసిస్తూ రావాలి. ఈ "పుత్ర, విత్త, లోక" విషయముల గురించి సర్వకోర్కెలను వదలి వేయాలి. ఇక విధి–ధర్మములు అంటావా.... అవన్నీ ఆశ, నిరాశ, వేదన, దోష దర్శనం వంటి దోషభావములచే స్పృశించబడని బుద్ధితో ఉపాసనాభావంతో నిర్వర్తించబడు గాక!

ఓ సభికులారా! ఆశ అనబడే సంసార బంధమును విడనాడి, చిత్తమును ముక్తత్వము వైపు నడిపే ఉపాయాలను గురించి యోచించండి. మనసులో ఉండే దుష్ట ఆశలే ఆత్మకు బంధనమును కల్పించుచున్నాయి. అట్టి దుష్ట ఆశలు ఉపశమించిన తరువాత ఇక ముక్తుడు కానివాడు ఎవడుంటాడు? కనుక క్రమక్రమముగా ఆశలు త్యజించివేస్తూ ఉండండి. లేదంటే బలి చక్రవర్తిలాగా అకస్మాత్తుగా ప్రబోధం పొందండి. పరిపూర్ణమైన జ్ఞానవృత్తిని అవలంబించండి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! "ఆత్మ తత్త్వ ప్రవచనము" అను తమ యొక్క కృపారస స్రవంతిచే మేమంతా ధన్యులమౌతున్నాం. నిర్మలమగు ఆత్మ పథంనందు విశ్రాంతి పొందుచున్నాం. హృదయంలో 'తృష్ణ' అనే నిబిడాంధకారం ఉపశమిస్తోంది.

మీ దివ్యమైన వచనములు వింటున్నకొద్దీ ఇంకా వినాలనిపిస్తోంది. మీరు బలి చక్రవర్తి అకస్మాత్తుగా ప్రబోధితుడైనాడని అన్నారు కదా! ఆ వృత్తాంతము తెలియజేయమని ప్రార్థిస్తున్నాను. తమ వంటి మహాత్ములు 'బోధ' అనే అమృతం వర్షింప జేయటంలో అలసటయే ఎరుగరు కదా!

❖❖❖

# IV. బలి చక్రవర్తి

## 1. చర్విత చర్వణం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రఘురామా! బలి చక్రవర్తి వృత్తాంతమొకటి చెప్పుచున్నాను. ఇది వింటే శాశ్వతమైన 'తత్త్వానుభవం' అవగాహనకు రాగలదు.

ఈ బ్రహ్మాండమునకు ఒకానొక దిక్కు నందు భూమికి అధోభాగంలో పాతాల లోకం ఉన్నది. అది కొండంత ఆకారంగల దానవులచే తదితర పాతాళజీవులచే వ్యాప్తమై ఉన్నది. ఒకానొక సమయంలో ఆ పాతాళ లోకమున విరోచనుడు అను వాని కుమారుడు, బలి చక్రవర్తి, పాతాళ-భూ లోకములను ఆక్రమించి రాజ్యమేలుతూ ఉండేవాడు. అతడు తన భక్తి, త్యాగ నిరతులచే విష్ణు భగవానుని రక్షణ పొందియున్నాడు. అందుచేత, ఆతని పేరు వింటేనే దేవతాదులు కూడా భయ పడేవారు. ఆతడు దేవతలపై దండెత్తి వారిని జయించి, వారి విభవములను సొంతం చేసుకున్నాడు. వారిని అల్పప్రదేశ పరిమితులుగా చేసివేశాడు.

చాలా కాలం గడిచిపోయింది. ఒక సమయంలో ఆ బలి చక్రవర్తి హృదయంలో వైరాగ్య పూర్వకమైన పరిశీలన జనించింది. ఇది ఇట్లా ఉండగా, ఆతడు ఒక రోజు వాహ్యాళికై బయలుదేరాడు. పరివారాన్ని, రాజ్యాన్ని వదలి ఒంటరిగా అటునుంచి మేరుపర్వత శిఖర ప్రాంతంలోని ఒక నిర్మానుష్య ప్రదేశం చేరాడు. ఒకానొక అనుకూల ప్రదేశంలో సుఖాసీనుడై ఇక యోచించసాగాడు –

**బలిచక్రవర్తి (తనలో) :** రాక్షసకులంలో పుట్టాను. తపస్సు చేసి కష్టపడి ఎంతో శక్తి సంపాదించాను. దేవతలను కూడా గజగజలాడించాను. సద్గురువులగు శుక్రాచార్యులవారి సమక్షంలో ఎన్నో యజ్ఞ, యాగాదులు నిర్వర్తించాను. ఇప్పుడు ఈ పాతాళ లోకంలో రాజ్య మేలుచున్నాను. ఎంత కాలం ఈ ముల్లోక విహారం? అనేకమైన అద్భుత కర్మలు నిర్వర్తించాను. అంతా బాగానే ఉన్నది కానీ, ఈ విశాల రాజ్యము వలన నాకు ఏమి ప్రయోజనం? ఆజ్ఞాపించటాలు – దుస్తులు – స్తోత్రములు – దేవతలపై దండెత్తటాలు, – వారి విభవములను మూటకట్టుకుని పాతాళలోకం చేర్చటాలు – తదితర రాచకార్యములు ఇవన్నీ కూడా చిన్న పిల్లల ఆటలోని కల్పిత విశేషములులాగా ఉన్నాయి. ఎన్ని భోగములు ఎంత అనుభవిస్తే మాత్రం వాటిలో ఏమున్నది ప్రత్యేకత? ఇవన్నీ నిజముగా సుఖ ప్రదములా? కానే కావు. ఈ భోగములు 'అవిచారణ' చేతనే రమణీయంగా తోచుచున్నాయి.

నిజానికి ఇక్కడ నాశనశీలము కానిదేది? అదే పగలు... అదే రాత్రి... అవే అన్నపానములు. ఆహా! ఈ విధంగా చర్వితచర్వణముగా చేసిందే అనేకసార్లు మరలామరలా చేసుకుంటూపోతున్నాం. అనుభవించిందే మరలా అనుభవిస్తున్నాం. ఆత్మ జ్ఞానులగు మహాత్ములు ఈ ఆశలను, ఆలోచనలను, ప్రవర్తనలను చూచి నవ్వుకుంటున్నారే! ఈ భౌతికమైన వస్తువులు, రాజ్యములు, మొదలగు వాటిని

చూచుకొని "అహో! మేము ఎంతటి వారం!" అని మురియటమేమిటి? స్వల్పకాలంలో వేరొక గతిని పొందబోయే "ఈ భోగాలు - బంధుమిత్ర సమాగమాలు - ఈ కాంతాలింగనాలు" ఇవన్నీ పిల్లలు ఆడుకొనే ఆటల వంటివే కదా! రసహీనమైన ఈ క్రియాకలాపములందు ఎన్ని రోజులు నిష్ప్రయోజనంగా గడచిపోతున్నాయి? ఎంత ఆయుష్షు వృథా అవుతోంది! బుద్ధిమంతుడైనవానికి ఇదంతా చూస్తుంటే 'సిగ్గు' అనిపించదా? ఇదంతా వ్యర్థవ్యవహారమే కదా!

జలం తరంగ రూపం పొంది, మరల ఆ తరంగం జలరూపం అగుచున్నట్లు ఇతఃపూర్వపు క్రియలనే ఈ జనులు పదేపదే పొందుచున్నారు. ఇందులో క్రొత్తది, అద్భుతమైనది అంటూ ఏమున్నది?

పిచ్చివాడు "ఏమిటి ప్రయోజనం?" అని యోచించకుండానే ప్రతిరోజూ ఏవేవో క్రియలు చేస్తున్నట్లే, నేను కూడా ఈ రాజ్య, సుఖ, భోగ క్రియాదులను ఆశ్రయిస్తున్నాను. ఎందుకు? వీటిలో కర్మ రాహిత్యముగానీ, కృతకృత్యముగానీ ఏమైనా ఉన్నదా? లేనప్పుడు, శాంతి లభించనప్పుడు వీటి వల్ల ఏం ప్రయోజనం? కనపడీ కనపడకుండా ఈ కర్మలు నేను ఎంతకాలం ఆచరించాలి? దీనికి అంతు ఎక్కడ?

యథార్థానికి ఈ కనపడేదంతా వస్తు శూన్యమే కదా! వాస్తవమైనదీ, శాశ్వతమైనదీ ఉపశమన సహకారికమైనదీ ఈ ముల్లోక వస్తువులలో ఏదైనా ఉన్నదా? లేదే! ఈ అతి విస్తారమగు బాల క్రీడను ఈ జీవులు మాటిమాటికీ దుఃఖము కొరకే వ్యర్థముగా ఆశ్రయించుచున్నారే!

దేనిని పొందిన తరువాత, ఇక కర్తవ్యమంటూ ఏమీ ఉండదో అట్టి ఉత్తమ పురుషార్థం ఇక్కడేదీ కనిపించుట లేదు. ఈ తుచ్ఛమగు విషయసుఖములకంటే ఉత్తమమైనదేదీ ఇక్కడ లేదా? సరే... ఈ విషయం గురించి విచారిద్దాం...!

❖

ఇట్లా యోచన చేస్తూనే బలి చక్రవర్తి ధ్యాననిష్ఠుడయ్యాడు. ఆ తరువాత మరల కనుబొమ్మలు విశాలం చేసి యోచించసాగాడు. ఆతనిలో ఏవో ఆలోచనలు తళుక్కున మెరిశాయి. ఇతఃపూర్వపు సంస్కారములు, తాను విని ఉన్నట్టి శాస్త్రార్థాలు స్మృతిపథంలో వెలిశాయి. అయితే వాటిని ఆతడు సమన్వయించుకోలేకపోయాడు. ఇతర ఆలోచనలన్నీ కట్టిపెట్టి ఒకప్పుడు తనకు, తన తండ్రి విరోచనునికి జరిగిన ఒక సంభాషణను స్మృతి పథంలోకి తెచ్చుకుని పరిశీలించసాగాడు.

❖❖❖

## 2. ఒకప్పటి బలి - విరోచనుల సంవాదం

**బలి:** తండ్రీ! ఈ ఇహపర లోక విషయాలన్నీ ఆమూలాగ్రం తెలిసి ఉన్నవారు, మహాత్ములు, తత్త్వవేత్త, గొప్పమేధస్సు గలవారైన మిమ్ములను కొన్ని విషయాలు అడిగి తెలుసుకోవాలనుకుంటున్నాను. దయచేసి అనుగ్రహించండి.

ఈ జగత్తులో అనేక దృశ్యవ్యవహారములు, కార్యక్రమములు తారసపడుచున్నాయి. "సుఖప్రాప్తి" అను మృగతృష్ణలోని వ్యవహారంలాగా, ఇక్కడ తారసపడే అనేక సంఘటనలు, వ్యవహారములు

భ్రమ మాత్రమే కదా! ఇవన్నీ దుఃఖకరములేనని నాకు అనిపిస్తోంది. ఈ భ్రమలన్నీ చాకచక్యంగా పుట్టుకొస్తున్నాయి. ఈ సంసారమునకు అంతు ఉన్నదా? ఇదంతా ఉపశమించటమెట్లా?

**కోపశాన్తోమనోమోహః క్వాతీతాఃసక లైషణాః ।**
**విరామరహితంకుత్ర తాత విశ్రమణంచిరమ్ ॥** (శ్లో 45, సర్గ 22)

**కింప్రాప్తేహ సమస్తేభ్యః ప్రాప్యేస్మింస్తృప్తిమాన్పుమాన్ ।**
**కిందృష్ట్వాదర్శవంభూయో నతాతోపకరోత్యలమ్ ॥** (శ్లో 46, సర్గ 22)

ఈ మనస్సు దుఃఖరహితమైన పూర్ణశాంతిని పొందే సమయం గాని, చోటు గాని ఎన్నటికైనా, ఎక్కడైనా ఉన్నదా? దేనిని పొందిన తరువాత ఈ జీవునకు మరల పొందవలసినదంటా ఏమీ ఉండదు?... ఏ మార్గం లేక ఉపాయంచే బ్రహ్మ లోకపర్యంతము ఇక ఆశించవలసినదేమీ ఉండదు? ...దేనిని దర్శించిన తరువాత ఇక దర్శించవలసినదేమీ ఉండదు...?

హే తండ్రీ! ఒక్క విషయం మాత్రం అత్యంతసుస్పష్టమౌతోంది. ఈ సాంసారిక భోగములు అనేకం ఉండవచ్చుగాక! ఇవన్ని కూడా వాస్తవమైన, శాశ్వతమైన సుఖమును ప్రసాదించగలిగేవి ఏమాత్రం కాదు. పైగా.... ఇక్కడి భోగములు చూచారా? ఇవి చాలా మంచివారి మనస్సులను కూడా క్షోభింపజేయగలుగుచున్నాయే! కుసంస్కారములకు మార్గమగుచున్నాయే!

సరే, నా మాటలు అటు ఉంచండి. ఇప్పుడు నాదొక ప్రశ్న. ఇక్కడ "స్వాభావికంగానే ఆనందదాయకము, ఉత్తమము, ఎప్పటికీ ప్రశాంతదాయకము" అయిన వస్తువుగాని, విషయముగానీ ఏదైనా ఉన్నదా? ఉంటే, అద్దానిస్థితిని పొంది, నేను విశ్రాంతిని అనుభవించగలను! అప్పటిదాకా నన్ను ఆవరించియున్న విచారము, అగమ్యత్వము, అవివేకము, క్షోభ వదిలేట్లు లేవు. మిమ్ము శరణువేడుచున్నాను. బోధచే నన్ను సముద్ధరించండి.

❖❖❖

## 3. మంత్రి వశం అయిపోతున్న రాజుగారు

**విరోచనుడు :** చాలా సంతోషం. ఇప్పటికి నీవు ఉత్తమవిచారణకు వచ్చావు. ఔను! సర్వ మనోవ్యథలు, సంతాపాలు, ఆర్తులు, కర్మవ్యవహారాలు రహితం కాగల ఒకానొక ఉత్తమ స్థానం ఉన్నది. ఆ స్థానం గురించి తెలుసుకుంటే నీకు గాని, మరెవ్వరికైనా గాని, సర్వ నిరుత్సాహాలు, ఉద్వేగాలు, దుఃఖాలు ఉపశమిస్తాయి. అయితే ఆ స్థానం గురించి, అక్కడి 'రాజాధిరాజు' గురించి, ఆ రాజుగారిని సేవించే ఆతని మంత్రి గురించి కొన్ని అతి చమత్కారమైన విశేషాలు ఉన్నాయి. అవి ఏమిటో చెపుతా విను–

అంతటా అన్నివేళలా ఆక్రమించియున్న ఒక మహాసామ్రాజ్యం ఉన్నది. ఒక రాజాధిరాజు ఆ రాజ్యం ఏలుచున్నాడు. ఆ రాజ్యంలో, లేక, ఆ రాజాధిరాజుగారి సమక్షంలో ఇక్కడ కనబడే స్వర్గ–మర్త్య–పాతాళ లోకములు, సముద్రాలు, పర్వతాలు, వనములు, తీర్థములు, నదులు, చెఱువులు,

భూమి, ఆకాశం మొదలగునవి లేవు. అక్కడ అంతరిక్షం లేదు, వాయువులేదు, ఈ సూర్యచంద్రులు లేరు. లోకేశులగు విష్ణు-బ్రహ్మ-ఇంద్ర-మహేశ్వరులు కూడా అక్కడ లేరు. దేవ-దానవులు గాని, భూత-యక్ష-రాక్షసాది భిన్న స్వభావజీవులు అక్కడ లేరు. పంచభూతములకు ఊర్ధ్వ-అధో దిశలకు, స్వర్గ-నరకాదులకు, హిమాలయము వంటి పర్వతాదులకు ఆ స్థానంలో చోటే లేదు.

ఆ రాజ్యాన్ని (లేక) స్థానాన్ని ఏలే ఆ రాజు మహామహనీయుడు. అద్వితీయుడు. నిత్యుడు అఖండుడు. ఆనందమయస్వరూపుడు. ఆతడు ఆనిర్వచనీయ ప్రకాశశీలుడు. రాజాధిరాజగు ఆతడు సర్వవ్యాపి. సర్వస్వరూపుడు. అంతేకాదు.... మహత్తరమైన శక్తి సంపన్నుడగు ఆ రాజు సంకల్ప మాత్రం చేతనే దేనినైనా సరే సృష్టించగలడు, స్థితింపజేయగలడు, లయకారుడై లయింపజేయగలడు.

ఆ రాజుగారు ఒకానొకప్పుడు సర్వ రాచకార్యములు నిర్వర్తించటానికి గాను తన యొక్క 'సంకల్పము' అను ప్రభావముచే - "సర్వలక్షణ సమన్వితుడు, సర్వలక్షణ విలక్షణుడు" అగు - ఒక గొప్ప మంత్రిని, నియమించుకున్నారు. అన్నిటినీ నిర్ణయించి, సమాలోచనలు చేసి, సర్వ వ్యవహారాలు నడిపేదీ మంత్రిగారే! ఇష్టం, అయిష్టం, వాటిని ఆశ్రయించి ఉన్న నవరసాలు - ఇవన్నీ కూడా మంత్రి గారి మంత్రాంగమే. ఆ అధికారమంతా ఆ మంత్రికి ప్రసాదించింది ఆ రాజు గారే!

**ఇక రాజుగారు ఏం చేస్తూ ఉంటారు? -** ఆయన ఏమీ చేయరు. కేవలం సాక్షీభూతుడై సర్వమును తిలకిస్తూ ఉంటారు. రాజుగారు అక్కడ ఉంటే చాలు.... ఆయన సమక్షంలో మంత్రి చేత సమాలోచించబడి సర్వము జరిగిపోతోంది. రాజు యొక్క ఉద్దేశమును అనుసరించే, కనుసైగ మాత్రంగా మంత్రి సర్వ వ్యవహారములు నడిపిస్తున్నారు.

ఆ మంత్రి కూడా తక్కువ వాడేం కాదు. "ఇది అసంభవం... ఇట్లా ఘటిల్లదు"- అనునవి కూడా సంభవింపజేయగల సామర్థ్యం ఆ మంత్రికి ఉన్నది. అతడు ఎంతటి వాడంటే.... తన శక్తి యుక్తులు, వ్యూహాలు ప్రయోగించి మహారాజంతటి వాడిని తన మాట తూ.చ. తప్పకుండా వినేట్లు చేసుకుంటున్నాడు. ఇక రాజుగారు తన స్వభావం - అధికారం ఏమరచి మంత్రి చేస్తున్న దాని కంతటికీ వశుడి వలె ఉంటున్నాడు. మంత్రి చేస్తూన్న కొన్ని పిచ్చిపనులు తనను బాధించేవి, తన అధికారాన్ని ప్రశ్నించేవి అని తెలిసి కూడా ఎందుకో అట్లా ఊరకుని ఉండిపోయి చూస్తున్నాడు.

ఏది ఏమైతేనేం! ఆ మంత్రి మాత్రం దేనిని స్వయంగా, అంటే, రాజుగారిచే ప్రసాదించబడిన అధికారం లేకుంటే ఏదీ నిర్ణయించనూ లేదు, నిర్వర్తించనూ లేదు. అనుభవించనూ లేదు. రాజును వేరుగా చూస్తే ఆ మంత్రి కేవలం జడం మాత్రమే. ఆతనికి ఆ అధికారం ప్రసాదించింది మహారాజే కదా! అజ్ఞుడై - జడుడై ఉండి కూడా, రాజుగారి కొరకు రాజు ప్రసాదించిన అధికారముల చేతనే కార్యములు నిర్వర్తిస్తూ ఉంటాడు. మంత్రి పనులు చేస్తూ ఉంటే, ఇక రాజు ఏదీ చేయకుండా సింహాసనం అధిష్ఠించి కూర్చుని సాక్షి మాత్రంగా అంతా చూస్తూ ఉంటాడు.

కుమారా! బలీ! నీవు గొప్ప బలపరాక్రమములు కలవాడివే. దేవతలను కూడా అలవోకగా అల్లల్లాడించావు. కాని ఏం లాభం? 'ఆ రాజ్యం' నీవు సంపాదించుకోనేలేదు. అందుకే నీకీ దుఃఖం

సంప్రాప్తిస్తోంది. నీ బలపరాక్రమములు 'ఆ మంత్రి' ముందర ఎందుకూ పనికిరావటంలేదు. అది గమనించు. ఇక రాజు అంటావా.... ఆయనను జయించగల వారంటూ ఎవరూ ఉండరు. ఆయనను ప్రసన్నం చేసుకుంటే చాలు. ఆ రాజ్యం నీకు ప్రాప్తించినట్లే!

**బలి:** తండ్రీ! శారీరకమైన, మానసికమైన బాధలంటూ ఉండనట్టి ఓ మహాత్మా! మీరు చెప్పే ఆ రాజ్య స్థానం ఎక్కడున్నది? అది మనకు ప్రాప్తించేది ఎట్లా? దానిని పొందినవారెవరైనా ఉన్నారా? మీరు చెప్పే ఆ రాజాధిరాజు సమాచారం ఎప్పుడూ వినలేదే? మనం ఒక ఆటలాగా జగత్తులన్నీ మన భుజబలంతో జయించాం కదా! మనచేత కూడా జయింపబడజాలని ఆ రాజెవ్వడు? మీరు దేవతలనే భయపెట్టారు కదా! మీరు కూడా ఆతనిని జయించలేరా? ఆ మంత్రి మనందరి కంటే బలవంతుడా?

**విరోచనుడు :** అవును. ఈ దేవతలు – రాక్షసులు, వీరంతా ఒక్కసారి గుమిగూడి దండెత్తినా సరే – బలిష్టుడగు ఆ మంత్రిని జయించలేరు. యముడు, కుబేరుడు, ఇంద్రుడు, తదితర దేవ దానవ వీరులు – అంతా కలిసి కూడా ఆ మంత్రిని భయపెట్టలేరు. మన వద్ద ఉండే గదలు, చక్రాలు, శస్త్రాలు, రథాలు, అస్త్రాలు – ఇవన్నీ ఆ మంత్రి ముందు సూర్యుని ఎదురుగా ఉంచిన దివిటీ వంటివి మాత్రమే. మనస్సే రూపముగా గల ఆ మంత్రి శస్త్రాస్త్రములకు, ముష్టిఘాతములకు అసలు విషయమే కాదు. ఈ దేవాసురులనందరినీ, నీతో–నాతో కూడా, తన వశం చేసుకుని నడిపిస్తున్నాడు.

ఆ మంత్రి విష్ణువు కాదు. కాని, నీ ప్రపితామహుడగు హిరణ్యాక్షుడు మొదలైన మహాపరాక్రమ వంతులను ఆక్రమించి వినాశన మొనర్చుచున్నాడే! విష్ణువును నిమిత్తంగా చేసుకుని వాళ్ళందరినీ కడతేర్చింది ఆతడే. ఆతడు సర్వులకు జ్ఞానోపదేశం చేసే నారాయణుడు మొదలగు దేవతలను కూడా తన వశం చేసుకొని అనేక యోనులందు పడవేయుచు, ఆయా ఉపాధులలో ప్రవేశింప జేసి తోలుబొమ్మలాట ఆడిస్తున్నాడు! ఆతని ప్రతాపం చేతనే సామాన్యుడగు మన్మథుడు కూడా అత్యంత శక్తిమంతుడై తన పంచబాణములతో త్రిలోకములను ఆక్రమించి, సామ్రాట్టు వలె విజృంభించ గలుగుచున్నాడు. అది సరే. మనకు దేవతలకు అనేక సార్లు అనేక యుద్ధాలు కల్పించినది 'క్రోధము' కదా! ఈ క్రోధము అనబడేది దుష్టాకారయుతమై, గుణహీనమై, దుర్మతియుతమై సురాసుర సమూహమును వినాశనం చేస్తోందికదా! ఈ క్రోధము యొక్క ఉనికి ఆ మంత్రి యొక్క కళాప్రదర్శనా విభాగము లోనిదే!

**బలి:** నేను అతి చమత్కార స్వరూపుడగు ఆ మంత్రిని వశం చేసుకోగలనా?

**విరోచనుడు :** నీ ప్రయత్నం ఉచితం, ఆవశ్యకం కూడా! అది ఉత్తమోత్తమమైన విషయం. నీవు తప్పక సాధించగలవు. అయితే నీవు ఆ రాజాధిరాజును ఆశ్రయించి మంచి చేసుకుంటే గాని, మంత్రిని ఏమీ చేయలేవు.

మంత్రిని జయించనంత వరకు నీకు శాంతి – సౌఖ్యాలు లేవు. ఆ రాజును ఆశ్రయించే వారికి మంత్రి సులభసాధ్యుడు. లేదా, పెద్ద పర్వతమును ప్రక్కకు నెట్టటం అసాధ్యమయినట్లే

ఘనీభూతమై ఎదురుగా ఉన్న ఆ మంత్రిని కదల్చలేము. ఆతనికి వశులము, బందీలము కావలసిందే గాని, ఇంకేమీ చేయలేము.

ఒకానొకప్పుడు సుకృత పరిపాకం చేత ఆ రాజుగారిలో వివేకదృష్టి జనిస్తోంది. కాలక్రమంగా రాజుగారికి, "ఏమైనా సరే, ఈ మంత్రిని నా వశంలో ఉంచుకోవలసిందే" – అను కోరిక వృద్ధి అగుచున్నది. అటుపై స్వల్పయత్నముతోనే మంత్రి నిరోధింపబడుచున్నాడు కూడా.

పుత్రా! బలీ! నీవు అనేకమంది దిక్పాలకులను, ఇంద్రుడినీ కూడా జయించావు. కానీ ఏం లాభం? నీ 'మనస్సు' అనే ఈ మంత్రి ఈ మూడు లోకములందలి బలిష్ఠులైన వారందరి కంటే మిక్కిలి బలిష్ఠుడు. ఆతడు తలచుకొంటే క్షణంలో మూడు లోకములను మృతప్రాయం చేసివేయగలడు. ఆతని ముందు నీ కండ బలం ఎంతటిది? అట్టి మనస్సు అనే మంత్రిని జయించగలిగితే పరాక్రమ వంతుడ వనిపించుకుంటావు.

ఆ మంత్రివర్యుడే ఈ మూడు లోకములకు ఉనికిని, ఔన్నత్యమును ప్రసాదిస్తున్నాడు. ఆతడు అస్తమిస్తే, ఈ మూడు లోకాలుకూడా అస్తమిస్తాయి.

కనుక కుమారా! మనం ఊరికే దుఃఖిస్తూ నిర్లిప్తతను, నిరుత్సాహాన్ని, నిస్తేజాన్ని అవలంబిస్తూ కూర్చుని ఉంటే వచ్చే లాభం ఏమిటి చెప్పు? మనం అజ్ఞానమును పారద్రోలాలి. ఏకాగ్రచిత్తులమై 'మనస్సు' అనే మంత్రిని జయించాలి. మనస్సును జయించామా, ఇక ఇప్పటివరకు మనచే జయించ బడని లోకములన్నీ జయించబడినట్లే! లేక, మంత్రిగారు వచ్చి ఇచ్చవచ్చినట్లు మనలను ఆడిస్తున్నారా... మనం జయించిన లోకములన్నీ జయించబడనట్లే!

అందుచేత "నిత్యసుఖస్వరూపము, అనంత సిద్ధి" అయిన ఆత్మ భగవానుని, సమక్షము కొరకు మనం 'మనస్సు' అనే మంత్రిని జయించాలి. మనస్సును జయించటానికి ఎంతటి త్యాగానికైనా సిద్ధం కావాలి. అన్నిటికీ సిద్ధపడి, అందుకు ప్రయత్నించాలి.

ఈ మనస్సు అనే మాంత్రికుడు నిన్ను, నన్ను, ఈ లోకములను బొమ్మలాట ఆడిస్తూ ఉన్నాడు. మనకు ఈ బాహ్య జీవులగు దేవతలు మొదలగువారు నిజమైన శత్రువులు కాదు. వారు 'మహా'అయితే ఒక ఉపాధిని ఖండించగలరు. మన నిజమైన శత్రువు మన మనస్సే.

అసలైన శత్రువును కొంపలోనే పెట్టుకొని, ఆ శత్రువును గెలిచి, లోబరుచుకోకుండా, ఇక ఈ లోకములన్నీ మనం గెలిచి వశంచేసుకుంటే మాత్రం ఏం ప్రయోజనం?

❖❖❖

# 4. ఆ మంత్రి మనవశమయ్యేదెట్లా?

**బలి:** గొప్పబలశాలి, స్వయంకృతము అయిన ఆ మంత్రి గారిని మేమెక్కడ జయించగలం చెప్పండి? అది ఏదో కొద్ది మందికే సాధ్యం. మేము నియతిని, ప్రారబ్ధము (law of causation & tendencies born of past actions)లను అనుసరించి "రాజ్యాలు – యుద్ధాలు" మొదలైన అనేక లౌకిక క్రియా

విశేషములలో చిక్కుకున్నాం. ఆ మంత్రి మహాబలశాలి అని మీరే అంటున్నారు కదా! అయినా, ఆతనిని జయించటానికి ఉపాయాలేమన్నా ఉన్నాయా? శాస్త్రాదులు చదవాలా? మంత్ర-తంత్రాలేమైనా నేర్వాలా? లేక ఇంకా ఏం చేస్తే మనం మంత్రిని తిరిగి వశపరచుకోగలం? ఈ విషయాలు సత్వరం చెప్పండి.

**విరోచనుడు :** కుమారా! ఆ మంత్రి మహాబలశాలి, అజేయుడు అయినమాట నిజమే. అయినప్పటికీ ఆతనిని జయించే మార్గం ఉంది చెపుతాను విను –

**పుత్రయుక్త్యాగృహేతోసౌ క్షణాదాయాతివిశ్వతామ్ ।**
**యుక్తింవినాదహత్యేష ఆశీవిషివోద్ధతః ॥** (శ్లో 3, సర్గ 24)

'యుక్తి'(ఉపాయం) చేత ఆతడు క్షణంలో వశీకృతుడౌతాడు. యుక్తిలేకపోయిందా, ఒక 'కోడెత్రాచు' లాగా ఎంతటివారినైనా సరే, భస్మీ భూతంచేసి వేయగలడు.

ఒక బాలుని లాలించినట్లుగా యుక్తి చేతనే ఆతనిని లాలిస్తూ, వశం చేసుకోవాలి. అట్లా వశం చేసుకున్నామా... రాజుగారిని దర్శించి దివ్యపదమును పొందుతాం కదా! రాజు యొక్క దర్శనమైతే మంత్రి కూడా మన వశం అవుతాడు. మంత్రి మన వశం అయ్యాడా రాజు దర్శనం అవుతుంది.

**యావన్నదృష్టోరాజాసౌ తావన్మన్త్రీనజీయతే ।**
**మన్త్రీచయావన్న జితస్తావద్రాజానదృశ్యతే ॥** (శ్లో 7, సర్గ 24)

రాజు దర్శనం కానంతవరకు మంత్రిని జయించలేం. మంత్రిని జయించనంతవరకు రాజుగారు మనకు కనిపించరు.

చిత్రం చూచావా! రాజదర్శనం కాకపోయినంతకాలం ఆ దుష్ట మంత్రి నిన్ను నానాతిప్పలు పెడుతూనే ఉంటాడు. "రాగములు, ద్వేషములు, హర్షము, ఉద్రేకము, మానము, అవమానము, క్రోధము, లోభము, దిగులు, దుఃఖము", ఈ విధంగా అనేక తళుకుబెళుకులతో తన యజమానికే భ్రమగొలుపుతాడు. ...ఏదోవిధంగా ఆమంత్రిని వశం చేసుకోవాలి.

అనేక శాస్త్రార్థాలు తెలిసినవారు కూడా ఆ మంత్రిని జయించలేక పోవుటచే వారికి రాజదర్శనం కావటంలేదు. అందుచేత కుమారా! బుద్ధిమంతుడైనవాడు ఈ రెండిటి కొరకు అభ్యాసపూర్వకంగా నిరంతరం ప్రయత్నిస్తూ ఉండాలి– 1. రాజ దర్శనం చేయటానికి, 2. మంత్రిని ఓడించటానికి.

పురుష ప్రయత్న పూర్వకమైన అభ్యాసం చేత ఆ రెండిటిని ఒక్కసారిగా నిర్వర్తించటమే శుభ ప్రదం. అభ్యాసం సఫలీకృతం అవుతూ ఉంటే ఇక దుఃఖాదులు లవలేశమైనా ఉండనట్టి 'ఆత్మ పదము' అను ఉత్తమ స్థానం మనం పొందగలుగుతాం. మహాత్ములగు అనేకులు ఆ స్థానం పొంది సంసార శ్రమనంతా నశింపజేసుకున్నవారై, నిత్యవికసిత హృదయులై ఉంటున్నారు. సర్వ సంశయాలూ నశించుటచే ప్రశాంత స్వరూపులగుచున్నారు.

ఆ మహారాజుండే స్థానం ఏర్పడిఉన్న దెక్కడ? సర్వ దుఃఖములు వినాశనం పొందే మోక్షమే ఆ స్థానం. అక్కడి రాజు ఆత్మ దేవుడే కదా! అట్టి ఆత్మయే ...మనుష్యానందము మొదలుకుని బ్రహ్మ దేవుని ఆనందము వరకు ఆనందము లన్నిటికన్నా పరమైయున్నది. అద్దానిని 'నిరతిశయానందము' అని అంటారు. అంతకుమించి కోరతగినది, పొందవలసినది ఉండదు. కాబట్టి అది ఇంద్రియానందం వంటిది కానే కాదు. ఇంద్రియములకు పరమై ఉన్న ఆ ఆత్మదేవుడే మిక్కిలి ప్రజ్ఞానవంతుడగు మనస్సును తనకు మంత్రిగా నియమించుకొనినాడు.

ఈ జగత్తు ఎక్కడి నుండి వచ్చింది?... మట్టి కుండగా అగునట్లు, పొగ మేఘ రూపంగా పరిణమించినట్లు, మనస్సు నందు గల సూక్ష్మ వాసనలే ఈ జగత్తు ఆకారంగా పరిణమించుచున్నాయి.

**బలి:** "మనస్సును జయించితే సర్వము జయించబడినట్లే" అని అన్నారు కదా! ఈ మనస్సును జయించటానికి ఏమైనా యుక్తులు, ఉపాయాలు, మార్గాలు చెప్పమని ప్రార్థన.

**విరోచనుడు :** యుక్తిచే ఏదైనా సాధిస్తున్నాం కదా! ఈ మనస్సు విషయంకూడా అంతే. ఒక ఉపాయం చెపుతాను... విను–

**విషయాన్ప్రతిభోః పుత్ర సర్వానేవహిసర్వథా ।**
**అనాస్థాపరమాహ్యేషా సాయుక్తిర్మనసోజయే ॥** (శ్లో 17, సర్గ 24)

"విషయభోగములన్నిటి యందూ కోర్కెను సంపూర్ణంగా త్యజించివేస్తే చాలు" ఇదే మనో జయమునకు ఉపాయం.

విషయములపట్ల కోర్కె లేకపోవటమే ఉత్తమమైన యుక్తి. మదించిన ఏనుగు వంటి ఈ మనస్సును "విషయ రాహిత్యము" చేత మాత్రమే వశం చేసుకోగలం. అయితే, ఒక్క విషయం.

**ఏషాహ్యత్యన్తదుష్ప్రాపా సుప్రాపాచమహామతే ।**
**అనభ్యస్తాతిదుష్ప్రాపా స్వభ్యస్తా ప్రాప్యతేసుఖమ్ ॥** (శ్లో 19, సర్గ 24)

ఒక విధంగా చూస్తే విషయ రాహిత్యమనేది ఇంచుమించు అసాధ్యం. మరొక విధంగా చూస్తే అది సాధించటం తేలిక కూడా! అభ్యాసం చేసే వానికి సులభసాధ్యమే. అభ్యాసం లేకపోతే మాత్రం అసాధ్యం.

ఈ విషయవిరక్తి అనేది క్రమక్రమంగా అభ్యసిస్తూవస్తే పారిజాత పుష్పపు సుగంధం లాగా అంతటా వ్యాపించి విస్తృతం పొందగలదు. అయితే, విత్తనం నాటకపోతే ధాన్యం ఫలిస్తుందా? భోగము లందు ఆసక్తి కలిగియే ఉండి "విషయములు రహితం కావేం?" అనుకుని ఏం ప్రయోజనం? అభ్యాసం కొరవడితే అనుకున్నది ఎవరైనా ఎట్లా సాధిస్తారు?

అందుచేత అభ్యాసం చేతనే ఆ మంత్రిగారు నీ వశం అవుతారు. సాంసారిక విషయములందు విరక్తి చెందనంతవరకు జీవులు ఈ 'సంసారము' అనే మురికి గుంటలో వసిస్తూ దుఃఖాదులను పొందుచూనే ఉన్నారు. మనుజుడు ఎంతటి బలవంతుడైనా, తాను స్వయంగా నడవకపోతే, ఒక

చోటునుండి మరోచోటికి అప్రయత్నంగా వెళ్ళిపోగలడా? అభ్యాసం లేకపోతే విషయములను ఎవ్వరూ జయించలేరు. అందుచేత దేహమును ధరించినందుకుగాను, ఈ జీవుడు 'ధ్యేయవాసన'ను త్యజించటం అభ్యసించాలి. ఏదో పొందాలి... అనేదే ధ్యేయవాసన!

కుమారా! నీవు "సుఖదుఃఖలకు"లకు అతీతమైనట్టి అప్రమేయ స్థితిని పొందాలనుకుంటే, ఎట్లాగైనా భోగముల పట్ల ఏర్పడే నమ్మకమును తగ్గించుకోవాలి. 'విషయత్యాగము' అనే రూపం గల పురుష ప్రయత్నమును మించిన శుభసాధనం మరేదీ లేదు.

**బలి:** తండ్రీ! ఇతఃపూర్వపు అనేక జన్మలలోను, ఈ వర్తమాన జన్మలోను మేము ఆర్జించియున్న 'ప్రారబ్ధము' మమ్ములను అల్పమైన దృశ్య విషయముల వైపు నెట్టుకుపోతుంటే మేము ఏం చేయాలి? ధ్యేయ వాసనా త్యాగం ఎట్లా సాధ్యం?

**విరోచడు :** "మేము నియతి లేక ప్రారబ్ధముచే ప్రేరేపించబడి మాత్రమే, శుభాశుభకర్మలు నిర్వర్తించ గలం. మాకు మేముగా ఏమీ చేయలేము" – అని బద్ధకస్థులగు వారు మాత్రమే పలుకుచున్నారు. శాస్త్రదృష్టి కలవారు ఆ విధంగా అనరు. అన్నిటికన్నా ఉత్తమమైనది వర్తమాన – ప్రయత్నమే.

ఎందుకంటే వర్తమానంలో శ్రద్ధతో నిర్వర్తించవలసియున్న ప్రయత్నం నీ చేతిలో ఉన్నది. వర్తమాన సుదృఢ ప్రయత్నములచే పూర్వ సంస్కారములను, వ్యసనములను, దౌర్బల్యములను జయించి వేయాలి.

**బలి:** తండ్రీ! వర్తమానపు పురుష ప్రయత్నం గురించి మీరు నొక్కి వక్కాణిస్తున్నారు... బాగానే ఉన్నది. అయితే నాదొక సందేహం. తాతగారైన ప్రహ్లాద చక్రవర్తి ఎట్టి వర్తమాన ప్రయత్నాలు లేకుండానే, బాల్యంలోనే ఈ సంసార చిటపటలైన హర్ష– దుఃఖాలను ఉపశమింప జేయగలిగారే? అది వారికి ఎలా సాధ్యపడింది?

**విరోచనుడు :** అట్టి మహనీయులు ఈ ఉపాధి ప్రాప్తించటానికి మును ముందే ఇతఃపూర్వపు స్వప్రయత్నాలచే హర్షామర్షములకు నిమిత్తభూతములైన పూర్వ కర్మలను క్షయింపజేసుకుని ఉన్నారు.

"అంతరంగంలో గూడుకట్టుకొని ఉన్న సుఖదుఃఖములకు సంబంధించిన 'అవగాహన – ఆశల ప్రకటనమే ప్రారబ్ధము' – అని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే, ఎండమావులలో కనబడేదాని పట్ల 'అది జలము' – అను భావం యథార్థమైన జ్ఞానముచే నశిస్తుంది కదా! పురుష ప్రయత్నబలముచే ఏర్పడిన నియతి రూపమగు ప్రారబ్ధమును కూడా తప్పకుండా భావౌన్నత్యముచే జయించివేయవచ్చు.

సర్వమునకు కర్త అగు ఈ "జీవుడు" అనబడు వాడు మనస్సుకంటే వేరుకాదని మా అభిప్రాయం. ఈ మనస్సు దేనిని ఏ విధంగా కల్పన చేస్తుందో దానిని ఆ విధంగానే పొందటం జరుగుతోంది. మనస్సు "ఇదియే నియతి" అని కల్పన చేస్తూ ఉంటుంది. అట్టి స్వయంకల్పితమైన నియతిని అనుసరించే "ఇది నియతి – ఇది అనియతి" అనునట్లుగా ఆయా పదార్థములను గాంచుచూ ఉంటుంది. నియతి (Destiny)ని కూడా చిత్తమే స్వసంకల్పానుసారంగా ఉత్పత్తి చేయటం జరుగుతోంది. చిత్తమే (లేక మనస్సే) స్వరూపముగా గల ఈ జీవుడు ఒకానొక అర్థవంతమైన జన్మయందు 'సాక్షి

చైతన్యసాక్షాత్కారం' పొందుచున్నాడు. అనగా చిత్తము "అనియతము, నిత్యము, ఏకస్వభావము" – అగు పరమాత్మ యందు ఉపశమనం పొందుతోంది. "నేను సర్వదా సాక్షిమాత్రమగు శుద్ధ చైతన్యమే" – అనే భావన పొందుచున్నది. అప్పుడు అట్టి మనస్సు గల జీవుడు సమాధి రూపమగు "నిర్విషయము"ను స్వీకరించుచున్నాడు. ఆకాశము నందు చలన రహితమైన వాయువులాగా చిత్రుభావము నందు సంగరహితుడై, సమాధి వహించి, మౌనస్వరూపుడై ఉంటున్నాడు. సమాధి నుండి లేచుచున్నప్పుడు శాస్త్రములు చెప్పు నియమావళిని ఆచరించుచున్నాడు. తాను గ్రహించిన ఉత్తమ సత్యమును తదితరులకు తెలియజేయుటకు ఆయా శిష్టాచారములందు ప్రవర్తించుచున్నాడు.

పుత్రా! వాయువు వీచుచున్నప్పుడు కొండపై చెట్లు కదులుతూ ఉంటాయి. కొండకాదు కదా! మోక్ష స్వరూపుడగు జ్ఞానికూడా అటు సమాధి నిష్ఠుడైయున్నప్పుడు ఇటు ఆయా వర్ణాశ్రమ ధర్మములు నిర్వర్తిస్తున్నప్పుడు సర్వవిషయములు గ్రహించి ఉండుటచే ఏర్పడిన స్థిరమైన మనస్సు కలిగి ఉంటాడు. తాను మాత్రం విక్షేపరహితుడై ఉంటాడు. అయితే ఈ మనస్సు జయింపబడనంత వరకు నియతి గాని, ప్రారబ్ధము గాని జయింప బడజాలదు.

మానవ జన్మ పొందుటచే ఈ జీవుడు ఉత్తమమైన 'కర్మ – జ్ఞానము'లను ఆశ్రయించుటకు అర్హత, అవకాశము పొందినవాడగుచున్నాడు. ఇప్పటి సంకల్పములు – కార్యక్రమములను అనుసరించే ఉత్తరోత్తర పరిణామములు ఉండబోవుచున్నాయి. అందుచేత కుమారా! నీ సంకల్పములు నీ అధీనంలోనే ఉన్నాయి కనుక, చక్కగా ఉత్తమ సంకల్పములనే ఆశ్రయించు. వైరాగ్యము – పురుష ప్రయత్నముల ద్వారా బ్రహ్మ భావము గూర్చి చింతన చేయి. ఎవరికి ఏది ప్రాప్తిస్తున్నదో, లేక, ప్రాప్తించుట లేదో – అదంతా పురుషార్థము (effort) యొక్క పర్యవసానమే అయివున్నది సుమా! అందుచేత ప్రయత్నించి భోగములందు విరక్తిని సమకూర్చుకో. "అగమ్యము – సుదీర్ఘము" అగు సంసారమును అధిగమించాలంటే 'విషయములపట్ల విరక్తి' అను ఔషధం అత్యంతావశ్యకం. భవము (సంసారము) అధిగమించబడనంతవరకు దివ్యమగు పరమశాంతి లభించదు. మోహహేతువులైన ఈ దృశ్యవిషయములపట్ల అనురాగమున్నంతవరకు అశాంతి తొలగదు.

ఈ సంసారంలో కనబడే భోగములన్నీ అతి చంచలములు, దుఃఖప్రదములు అయి ఉన్నాయి. అయినప్పటికీ, అజ్ఞానముచే మోహితుడగుచున్న ఈ జీవుడు వాటిచే ఆకర్షించబడుచున్నాడు. అట్టి ఆకర్షణ నుండి విడివడాలంటే "శ్రవణము – మననము – నిధిధ్యాస"లను అభ్యసించాలి. మనస్సును ఆత్మానుసంధానం చేయాలి. అభ్యాసం లేకపోతే భ్రమ తొలగదు. భ్రమ తొలగకపోతే నీ స్వస్వరూపమే అయి ఉన్న ఆత్మదేవుని దర్శించ లేవు. ఆ రాజాధిరాజును దర్శించనంత కాలం అత్యంత వ్యాకులతో కూడిన "విషయములను ఆశ్రయించటం, విడవటం, ఇంతలోనే మరి కొన్ని విషయములను సమీపించటం" – అనే శ్రమ తప్పదు.

ఈ నీకు పూర్ణమగు శాంతి–సంతృప్తులు లభించకపోవటానికి కారణం అల్ప దృష్టిచే విషయములను "ఇవే సర్వస్వం" అను బుద్ధితో సుదీర్ఘకాలం ఆశ్రయించటమే!

**బలి :** దానవేశ్వరా! ఏ విషయవిరక్తిచే నిరంతరం ఆత్మ యందు 'స్థితి' కలిగి యుంటామో – అది కలిగే దెట్లా?

**విరోచనుడు :** గొప్పవస్తువును చూచినప్పుడు అల్పవస్తువును కోరుకోవటం స్వయంగానే సన్నగిల్లుచున్నది కదా! ఆత్మ సందర్శనముచే, లేక ఆత్మను ఎరుగుటచే విషయములపట్ల విరక్తి తప్పక పొందగలవు. అందుచేత, 'ప్రజ్ఞ' అనే ఒరిపిడిరాతితో 'ఉత్తమవిచారణ' అనే ప్రయత్నముచే ఆత్మ విచారణ చేయాలి ఆత్మచే ఆత్మదర్శనం చేస్తూ ఉండాలి.

**మొదటి దశ :** ఒక రోజుకు 'పగలు, రాత్రి' అనే రెండు విభాగములున్నట్లు, ఈ మనస్సును కూడా రెండుగా విభజించాలి–

మొదటి భాగమును : ఈ శరీర నిర్వహణకు కావలసిన ఉపభోగాలకు వినియోగించు.

రెండవ భాగవము : శాస్త్రముల, గురువుల బోధలను గ్రహించటానికి, ఆకళింపు చేసుకోవటానికి వినియోగించు. (లేదా) విషయములవైపు పరుగిడుచూ అపరిశుద్ధమగుచున్న ఈ మనస్సు యొక్క కొంత భాగాన్ని "గురువులను సేవించుట, బుద్ధి మంతులతో సంభాషించుట, స్వానుభవాలను శాస్త్రప్రవచనాలతో సరిపోల్చుకొనుట" – మొదలైన సన్మార్గాలలో వినియోగిస్తూ ఉండు.

**రెండవ దశ :** కొంతకాలమైన తరువాత నీ మనస్సు కొంత పరిపక్వమౌతుంది కదా! అప్పుడు నీ మనస్సును నాలుగు భాగాలుగా చేయి–

మొదటి భాగమును : దేహయాత్రకు సంబంధించిన వాటితో పూరించు.

రెండవ భాగమును : ఉత్తమ కర్మలకు వినియోగించు.

మూడవ భాగమును : గురు శుశ్రూషచే పూరించు.

నాలుగవ భాగమును : శాస్త్రశ్రవణం, మననం చేయి.

అప్పుడు క్రమంగా నీ చిత్తము తత్త్వనిశ్చయముతో కూడిన 'పరిపక్వత' పొందగలదు.

**మూడవ దశ :** క్రమంగా పరిపక్వత ప్రాప్తిస్తూ ఉంటుంది కదా! ఇక రెండు భాగములను శాస్త్ర – వైరాగ్యము లందు వినియోగిస్తూ ఉండు. తక్కిన రెండు భాగములను కూడా క్రమక్రమంగా 'ధ్యాన – గురుపూజ – ధర్మనిరతి'లతో పూరించు.

శుభ్రమైన వస్త్రం మాత్రమే రంగును చక్కగా స్వీకరించుచున్నది కదా! ఏ చిత్తములో అయితే విషయాభిలాష సన్నగిల్లుతూ వస్తుందో, అట్టి శుద్ధ చిత్తము మాత్రమే జ్ఞానప్రాప్తికి యోగ్యమగుచున్నది.

**శనైః శనైః లాలనీయం యుక్తిభిః పావనోక్తిభిః ।**
**శాస్త్రార్థ పరిణామేన పాలయేత్ చిత్తబాలకమ్ ॥**

ఈ చిత్తము అనే బాలుడిని యుక్తి (ఉపాయము)చేతను, పవిత్రములైన శాస్త్ర – గురు వాక్యముల చేతను లాలించుచు, చిదేకరసమును పొందింపజేయాలి. అప్పుడది స్వయముగా ఆహ్లాదకరమై, సుందర–శీతలమై విరాజిల్ల గలదు. నాయనా! బలీ! ఎట్టి 'కృత్రిమము' గాని, 'కుటిలభావన' గాని ఏమాత్రం లేకుండా, ఉత్తమ 'బ్రహ్మాకారవృత్తి'ని బుద్ధిచే ఆశ్రయిస్తూ ఉండు.

ఈ ఇంద్రియములు, ఈ విషయములు, ఈ వృత్తులు, వీటిని అనుభవిస్తున్న ఈ జీవుడు – ఇవన్నీ కూడా "సచ్చిదానంద రూపమైనట్టి అధిష్ఠాన బ్రహ్మమే అయి ఉన్నాయి" ... అను దృష్టిని బలపరచుకో. చక్కటి ప్రజ్ఞా, విచారణద్వారా "ఆత్మ దర్శనముచే తృష్ణారాహిత్యము, తృష్ణారాహిత్యముచే ఆత్మ దర్శనము" – ఈ రెండూ పరస్పరం వృద్ధి పొందింప జేసుకుంటున్నాయి.

భోగములందు 'అప్రీతి' జనించుటచేతనూ, సర్వోత్తమమగు ఆత్మయొక్క సందర్శనము అగుట చేతనూ పరబ్రహ్మమునందు నీకు శాశ్వతమైన విశ్రాంతి సమకూరగలదు.

ఎందుకో తెలియదుగాని ఈ జీవుడు విషయానందమునే గొప్ప విషయంగా ఎంచుచున్నాడు. వాటి కొరకు ఆశ్రయిస్తూ ఆ ప్రయత్నంలో విశ్రాంతిని కోల్పోవుచున్నాడు. వాస్తవానికి, పూర్ణమైన శాంతికి ఈ జీవుడు అర్హుడే. ఇందులో అనుమానం ఏమాత్రం లేదు. ఎందుకంటే ఈ జీవుడు పరమశాంతమగు ఆత్మయేకదా!

మరల చెప్పుచున్నాను! ఈ జీవుని స్వస్వరూపము పరమానందము, పరమశాంతము కదా!

1. విషయముల పట్ల విరక్తి లేకపోయిందా .. ఇక ఎన్ని యుక్తులుంటే ఏం ప్రయోజనం? ఆత్మను దర్శించటానికి బుద్ధి ప్రవృత్తిని పొందనే పొందదు.

2. ఆత్మ దర్శనము కానంతవరకూ ఈ ఇంద్రియ విషయములు – బాహ్య విషయములు జీవుని ప్రలోభింపజేస్తూనే ఉంటాయి.

కనుక నీవు ఇటు విషయవిరక్తి, అటు సమాధి ఒకేసారి అభ్యసిస్తూ రావాలని మరల గుర్తు చేస్తున్నాను. పురుష ప్రయత్నము ఉన్నప్పుడే ఈ బుద్ధి ఆత్మవైపు ప్రసరించటం జరుగుతోంది. 'భోగత్యాగం' అనే పురుషప్రయత్నంచే శ్రేయము అయినట్టి పరమాత్మ యందు విశ్రాంతి సులభ మగుచున్నది. పురుష ప్రయత్నంచే మాత్రమే ప్రారబ్ధమును దూరీకరించవచ్చు. భోగముల పట్ల ధ్యాసయే మోక్షమార్గంలో ప్రబలమైన ప్రతిబంధకం. విరక్తిచే వివేకం, వివేకంచే విరక్తి జనించుచు, క్రమక్రమంగా బలపడుచున్నాయి. సముద్రం– మేఘముల వలె ఒకదాని ఉనికికి మరొకటి కారణ మగుచున్నాయి. (Discrimination through dispassion and dispassion through discrimination--both should be cultivated simultaneously).

❖❖❖

## 5. ముగ్గురు మిత్రులు - అప్రీతి, వివేకము, అభ్యాసము

ఒక చోట ఒక ముగ్గురు మిత్రులున్నారు. ఆ ముగ్గురూ పరస్పర అనురాగంతో ఒకరికొకరు తోడై సంచరిస్తూ ఉంటారు. వారు :

1. భోగముల పట్ల అప్రీతి / విరాగము
2. 'ఇది సత్తు, ఇది అసత్తు' – అను వివేకము
3. నిత్యమూ ఆత్మనే సందర్శించు అభ్యాసం

నాయనా ! బలీ! ఎంతటి ప్రయత్నం చేసైనా, పళ్ళతో పళ్ళుకొరికి అయినా సరే... భోగముల పట్ల వైరాగ్యం సంపాదించు. ప్రారబ్ధము అనబడు ఇతఃపూర్వపు కుసంస్కారాలను, దురవగాహనలను జయించటానికి ప్రయత్నం చేయి. అందుకు వర్తమాన పురుష ప్రయత్నములే నీకు తోడు సుమా!

జీవుడు ధనం ఆర్జించినంత మాత్రంచేతనే తప్పేమీ లేదు. అయితే పురుషప్రయత్న పూర్వకంగా, జనసమ్మతమైన మార్గం అవలంబించి ఆర్జించు. అట్టి ధనాదులను మోక్షమార్గం ఉపదేశించే మహాత్ముల పాదములు ఆశ్రయించటానికి వినియోగించు. సజ్జనులు, గుణశీలురు, ఆత్మతత్త్వముతో ఏకీభావము అనుభవించువారు – అగు మహాత్ములు ఉన్నారు. వారితో సంసర్గము పొంది, వారిని ఆశ్రయించావా, విరక్తి జనించగలదు. విషయములపట్ల విరక్తిచే అంతరంగంలో 'విచారణ' అను దానికి తగినంత చోటు లభిస్తుంది. విచారణచే వేదోపనిషత్తులు మనకు ప్రతిపాదిస్తున్నట్టి 'అద్వైత బ్రహ్మము'నందు నిశ్చయ జ్ఞానం ఉదయిస్తుంది. ఇక ఆ తరువాత 'మననము – నిధిధ్యాస'లచే క్రమంగా అత్యుత్తమమగు ఆత్మపదము తప్పక ప్రాప్తించగలదు.

కనుక ఈ విషయములపట్ల విరక్తియే ఆత్మయందు విశ్రాంతికి బీజము, మార్గము, ఉపాయము అయి ఉన్నది. 'కల్పన' అను బురదయందు చిక్కుకుని, నానాక్లేశములు అనుభవిస్తున్న ఈ జీవునికి 'దృశ్య విషయములపట్ల సదవగాహన' ఇప్పుడు అత్యంత ఆవశ్యకం. పుత్రా! ఇక నీ విషయానికి వస్తే నీకు పూర్ణమగు విషయ విరక్తి ఇంకా కలుగలేదు. అయినా కూడా నిర్మల చిత్తుడవగు నీకు నీ ఉత్తమ అభ్యాసముల వశంచే త్వరలో భ్రాంతి అంతా తొలగగలదు. అట్టి శుద్ధ సదాశివ బ్రహ్మ స్వరూపుడవగు నీ స్వస్వరూపమునకు ఇదే నా నమస్కారము.

నీ వర్తమాన పురుషకారమును దష్టిలో పెట్టుకొని కొన్ని ముఖ్యమైన సూచనలు ఇస్తున్నాను–

1. దేశాచారములకు, ధర్మనిరతికి విరుద్ధంకాని విధంగా ధనం సంపాదించు.

2. అట్టి ధనమును భోగముల కొరకే వ్యర్థపరుచుకోవడం శ్రేయస్సు కాదు. బ్రహ్మవేత్తలగు సాధువులు ఏమి చూచి సంతోషిస్తారో, ఆ మార్గంలో నీ ధనం వెచ్చించు. మహాత్ములతో సంసర్గమునకు అర్హుడవు అవుతూ ఉండు.

3. నీ సాధన సంపత్తి, మహాత్ముల ప్రవచనములు తోడు అగుచుండగా, అధ్యాత్మ శాస్త్ర విచారణను ఆశ్రయించు.

4. అట్టి స్వప్రయత్నము యొక్క ప్రయోజనముగా నీ కంఠము నుండి ఊడిపడ్డ హారములాగా ఆత్మలాభం పొందు.

❖❖❖

## 6. మనోరచన - మనోవ్యాధి

**బలిచక్రవర్తి (తనలో) :** అవును. గొప్ప విచారణ శీలురలో ఒకరుగా శ్లాఘించబడే నా తండ్రి విరోచన చక్రవర్తి నాకు అంతా చెప్పే ఉన్నారు కదా! దైవవశాత్తు అదంతా ఇప్పుడు స్పష్టంగా గుర్తుకు వస్తోంది. సద్గురువుల స్పర్శచే కాబోలు, ఇప్పుడు నాకు ప్రత్యక్షంగా భోగముల పట్ల

అరుచి, అతీతమైన స్వభావం ఏర్పడుచున్నాయి. ఫలితంగా "స్వచ్ఛము – అమృత శీలము" అయినట్టి శాంతి యొక్క సామీప్యత లభిస్తోంది.

ఆహా! ఇంత వరకు అనేకమైన ఆశాపరంపరలను అనుసరిస్తూ గడ్డిపోచలవంటి ధనం, స్త్రీలు మొదలైన విషయములే మహత్తరమైనవి అనుకుంటూ వచ్చాను కదా! చివరికి ఏమైనది? స్పర్థ, అశాంతి, ఆవేశ – కావేశములు నన్ను కప్పి వేశాయి! ఎంత పరితాపం పొందాను! కలలోని దుస్సంఘటన వలె అవన్నీ తుచ్ఛమని, అసత్యమని తేలిపోయింది.

అమ్మయ్య! ఇప్పుడు ఈ భూమి ఎంత ప్రశాంతంగా కనబడుతోంది! శమము ఉన్నచోట ఇక సుఖ దుఃఖ దశలన్నీ తొలగిపోతాయి. నా అంతఃకరణం పూర్ణచంద్ర బింబంలాగా నిరతిశయానందాన్ని పొందుతోంది. ఇంతవరకు మనోవేగముచే వేలాది భ్రాంతులలో సంచరించాను. అనేక క్షోభలతో కూడికొని ఉన్న ఈ విభవములు సంపాదించడానికి ఎన్నో దుఃఖపరిణామములు గల కార్యక్రమాలను నిర్మించుకున్నాను. అజ్ఞానం యొక్క విలాసముచే రక్త మాంస మాత్రములగు తుచ్ఛ శరీరములు నన్ను ఆకర్షించి వివశుణ్ణి చేశాయి.

ఎన్నో ఐశ్వర్యములను చవి చూశాను. గొప్పగొప్ప రాజ్య విభవములను అనుభవించాను. అనేక ప్రాణికోట్లను వశం చేసుకొని పరిపాలించాను. ఏం ప్రయోజనం? నా ఆశలు క్షయించాయా? లేదు. ఆశ ఉన్నంతకాలం తృప్తి ఏది?

ఈ ప్రపంచంలో నాలాగే అనేకమంది జనులు ఒకసారి అనుభవించినవే అనేకసార్లు అనుభవిస్తూ దీనులు అగుచున్నారు. ఇప్పుడు నేను సర్వము పరిత్యజించుచున్నాను. స్వబుద్ధిచే అంతా కూడా విడచిపెట్టి తత్త్వబోధచే పూర్ణస్వరూపమును సంతరించుకోదలిచాను. 'స్వాత్మ' యందే పరిపూర్ణుడనై ఉండి ఉండెదను గాక! ఎందుకంటే 'మృత్యువు' అనబడు గొప్ప విపత్తు వాటిల్లినప్పుడు ఈ స్త్రీ, రత్న, రాజ్యాది భోగములన్నీ నన్ను విడచిపెడతాయి. ఒక్క స్వాత్మ మాత్రమే నన్ను వెంటనంటి ఉంటుంది కదా! ఇంతకాలం అవివేకినై వీటిని నేను ఎందుకు నమ్ముతూ ఉన్నాను? నేను దేవతలతో విరోధం కల్పించుకున్నది ఈ తుచ్ఛ జగత్తుపై ఆధిపత్యం కోసమా?

"మనోరచన మాత్రమే" అయినట్టి ఈ దృశ్య జగత్తును నేను కలిగి యుండుటయే ఓ గొప్ప 'మానసిక వ్యాధి' అయివున్నది. ఇట్టి వ్యాధికి ఇప్పుడు, ఇక్కడ చికిత్స చేసుకోకపోతే ఇక ఇక్కడ జీవించినందుకు ఏం గొప్ప ఫలితం పొందినట్లు? ఆత్మ విషయం ఎఱిగియున్న మహాత్ములకు ఈ జగత్తునందు ప్రీతి జనిస్తుందా? ...లేదు.

ఒక గొప్ప దుఃఖకరమైన విషయం ఏమిటంటే.... పిచ్చి వాడినై నేను ఇంతకాలంగా అల్పము – అల్పకాలికము అయినట్టి ఏవేవో ప్రాపంచిక విషయాలను ఆశ్రయించాను. అనర్థములైనవాటిని కూడా అర్థవంతములని భావిస్తూ వస్తున్నాను. నా కోరికలు ఒక అంతూ పొంతూ లేకుండా క్షణానికో విధంగా ఉంటున్నాయి. అజ్ఞానపూర్వకమైన లక్ష్యములతో, హేవ భావములతో నేను చేయని చండాలపుపనులేమైనా ఉన్నాయా! ఒక్కొక్క సమయంలో నేను చేస్తున్న తప్పుడు పనులన్నీ

మరొకప్పుడు దుఃఖకరముగానే పరిణమించబోవుచున్నాయి కదా! అయినా కూడా, ఈ తుచ్ఛమైన ఇంద్రియ విషయములను అంటిపెట్టుకొని వివేచన చేయకుండా కాలాన్ని వృథా చేసుకుంటున్నానే!

అయినదేమో అయినది. ఇంకా పాత విషయాలే గుర్తుకు తెచ్చుకొని మరి కొంత కాలయాపన చేయడం అనవసరం. "ఈ వర్తమాన కాలంలో నేను కలిగి ఉంటున్న అజ్ఞానం తొలగేది ఎట్లా? ఏఏ ప్రయత్నములు చేసి ఈ వర్తమానాన్ని సఫలీకృతం చేసుకోగలను?" – అనే విషయాలు ఇప్పుడు నాకు ముఖ్యం.

ఆ "పరబ్రహ్మము" అనగా ఎవరు? ఎక్కడుంటాడు? ఆతడు "అనంతమైన ఆకారము కలవాడు, .. కారణములకే కారణము" కదా! అట్టి పరబ్రహ్మము తోటి 'ఐక్యము' పొందినప్పుడుమాత్రమే ఆత్మయందు పూర్ణ సుఖము ఆవిర్భవించగలదు. అజ్ఞానము నశించినప్పుడు ఐక్యము సుసాధ్యం అవుతుంది. అందుచేత ఇప్పుడు నాకు అజ్ఞానం తొలగాలి. అందుకుగాను గురువులగు శుక్రాచార్యుల వారిని శరణు వేడుతాను.

"ఈ దృశ్య ప్రపంచం ఏమై ఉన్నది? 'అహం' అను ప్రత్యయమే రూపంగా గల ఈ జీవుడెవడు?" ఈ రెండింటి గురించి క్షుణ్ణంగా చూసి తెలుసుకోవడానికి ఆచార్యులవారే నాకు ఇప్పుడు దిక్కు.

❖

హే! శుక్రాచార్యా! పరమేశ్వరా! ఎవరు మిమ్ములను ఆశ్రయిస్తే, వారిని మీరు ప్రసన్నులై అనుగ్రహిస్తూ ఉంటారు కదా! అట్టి మిమ్ములను శరణాగతుడనై మనస్సుచే ధ్యానం చేస్తున్నాను. మీరు ఉపదేశిస్తేనే నేను సాంసారిక విషయములు అనే బురద నుండి బయట పడగలుగుతాను. స్వామి! ఎటో తెలియని నిస్సారమైన దూర తీరాలకు కొట్టుకుపోతున్న నాకు, మీరే ఆలంబనము. పరమాత్మ స్వరూపంలో స్వయంగా స్థితి పొందివుండడం ఎట్లాగో తెలియజేసి నన్ను ఆదుకోండి...!

❖

ఈ విధంగా ఆ బలి కనులు మూసుకొని ఏకాగ్రతతో, భక్తిపూర్వకంగా గురువైన శుక్రాచార్యుల గురించి ధ్యానించడం ప్రారంభించాడు. బ్రహ్మజ్ఞాన తత్పరులై, నిత్యము స్వస్వరూపమందే నిశ్చలులై ఉండే శుక్రాచార్యులు తన శిష్యుని ప్రార్థన విన్నారు. "ఆహా! నా శిష్యుడు జ్ఞానము అభిలషించి నన్ను ఆశ్రయిస్తున్నాడు కదా! సంతోషం! ఇతని సందేహములను నివర్తింప జేస్తాను" – అని తలచారు. వెంటనే శిష్యుడు బలి చక్రవర్తి ముందు ప్రత్యక్షమైనారు. ఆయన శిష్యవాత్సల్యం అట్టిది మరి!

గురుదర్శనంచే పులకాంకితుడై బలి ప్రేమగా కాళ్ళు కడిగి శిరస్సుపై జల్లుకుని, ఉచితాసనంపై కూర్చుండబెట్టి, తాను ఆయన పాదాల దగ్గిర ఆసీనుడైనాడు.

❖❖❖

# 7. నీ - నా స్వరూపం చిత్‌యే

**బలిచక్రవర్తి :** హే మహాత్మా! తమకు ఎంతో శ్రమ కలిగించాను, క్షమించండి. మీరు ఇతఃపూర్వమే నాపై అనుగ్రహంతో చెప్పియున్న కొన్ని తాత్త్విక విషయాలు నా బుద్ధి యందు వికసించుచున్నాయి. తమతో మరికొన్ని విషయాలు సంభాషించాలని, సంప్రతించాలని నా బుద్ధి నన్ను ప్రేరేపిస్తోంది.

ఓ దేవా! ఇక్కడ ఎదురుగా కనిపిస్తున్న ఈ విషయ భోగములన్నీ అత్యంత మోహకరములే కదా! వీటిపట్ల నాకు విరక్తి ఏర్పడుతోంది. "పరమార్థ తత్త్వము గ్రహించటమే అత్యంత అవశ్యకం" – అను నిశ్చయం నాయందు ఏర్పడింది. అయితే నాలో కొన్ని ప్రశ్నలు పుట్టుకొస్తున్నాయి.

ఈ జీవుడు సుఖమును కోరుకుంటున్నాడు కదా! సుఖములన్నిటిలోకి ఉత్తమోత్తమమైన విషయం ఏది? అట్టి అవధి యొక్క స్వరూపం ఎట్టిది? వాస్తవానికి నేనెవడను? మీరెవరు? ఈ జగత్తు ఏమైయున్నది? – ఈ తత్త్వమంతా నాకు త్వరగా తెలియజేయమని వేడుకొంటున్నాను.

**శుక్రాచార్యులు :** నాయనా! ఇప్పుడు ఆకాశమార్గంలో ప్రయాణమునకు సన్నిద్ధుడనై ఉన్నాను. సప్తఋషులు నా వెంట వేంచేసి ఉన్నారు. ఒక దైవకార్యం నిమిత్తం అవశ్యం వెళ్ళవలసియున్నది.

**బలి :** తమ వంటి జీవన్ముక్తులకు కూడా అవశ్యం నిర్వర్తించవలసిన కార్యక్రమములు ఉంటాయా స్వామీ?

**శుక్రాచార్యులు :** జీవన్ముక్తులు కూడా "ప్రాప్తించిన కార్యములను ఉపేక్షించటం" అనే స్వభావం కలిగియుండరు. నీవు అడిగిన ప్రశ్నకు సమాధానం విస్తారంగా చెప్పటానికి సమయం చాలదు. అయినా కూడా సంగ్రహంగా చెపుతాను. విను.

**చిదిహాస్తిహిచిన్మాత్ర మిదంచిన్మయమేవచ ।**
**చిత్త్వంచిదహమేతేచ లోకాశ్చిదితిసంగ్రహః ॥** (శ్లో 11, సర్గ 26)

నీవు – నేను – తదితరములనేకమైన వాటితో కూడి ఎదురుగా కనిపిస్తున్న ఈ జగత్తు కూడా చైతన్యము యొక్క స్వరూపమే. ఈ దృశ్యమంతా "చిత్తు (ఎఱుగుచున్నట్టిది)" యొక్క అధీనంలోనే ఉన్నది; 'ఎఱుక' యందే అధ్యసించబడి యున్నది. 'ఆరోపించబడుట' అను చిత్తుయొక్క ప్రక్రియయే ఈ జగత్తు.

అందుచే, నీవు–నేను–అంతా చిన్మాత్రమే! ఈ సమస్త లోకములు చిన్మయములే. తత్త్వమంతటికి సారము ఇదే. నీవు కనుక శ్రద్ధావంతుడవు, వివేకివి అయ్యావా – "ప్రశాంతమగు చిత్ చైతన్యమే ఇదంతా" అను నిశ్చయముచే సర్వము పొందగలవు. అట్లా కాకుండా, శ్రద్ధ వివేకాలు లేకపోయినాయా ...అధికంగా చెప్పిమాత్రం ఏం ప్రయోజనం? ఎంత చెప్పినా బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది.

1. చిత్ 'విషయాకార కల్పన' కలిగియుండుట.
2. చిత్ విషయరహితమై ఉండుట.

విషయాకార కల్పనయే బంధము. అట్టి కల్పన లేకపోవటమే ముక్తి. విషయాకారకల్పన లేనట్టి చిత్ 'పూర్ణాత్మ స్వరూపమే' అయి ఉంటుంది. సమస్త సిద్ధాంతముల అంతిమ సారం ఇంతే!

ఇప్పుడు ఇట్టి నిశ్చయము అవలంబించి ఈ జగత్తునంతా అవలోకించు. అఖండాకార వృత్తిని ఆశ్రయించి సర్వము పరిశీలించు. అప్పుడు నిశ్చయముగా బ్రహ్మమును పొందుతావు.

నిత్యమైన, సత్యమైన సుఖం అదొక్కటే. ప్రియశిష్యా! పెద్దలు నాకోసం ఆకాశమార్గంలో వేచియున్నారు. ఇక సెలవు. ఇట్లు పలికి శుక్రాచార్యులు గాలియొక్క అలవలె అంతర్ధానమైనారు.

❖❖❖

## 8. నేనెవడను? ఎంతటి వాడను?

అప్పుడు ధీమంతులలో శ్రేష్ఠుడైన బలిచక్రవర్తి ఇట్లు చింతన చేయసాగాడు.

**యుక్తముక్తంభగవతా చిదేవేదంజగత్త్రయమ్ ।**
**చిదహంచిదిమేలోకా శ్చిదాశాశ్చిదయంక్రియా ॥** (శ్లో 2, సర్గ 26)

**సబాహ్యాభ్యన్తరేసర్వం చిదేవంపరమార్థతః ।**
**అస్తిచిద్వ్యతిరేకేణ నేహకించనకుత్రచిత్ ॥** (శ్లో 3, సర్గ 26)

మహాత్ములగు శుక్రాచార్యులు చెప్పినది వాస్తవమే కదా! ఈ మూడు లోకములు చిన్మాత్రము (All pervading consciousness- The Knower) అను స్వరూపమే! నేను కూడా "చిత్" (ఎఱుగుట) అనేదే స్వరూపముగా కలిగి ఉన్నాను. ఈ సప్తలోకములు, సర్వ దిక్కులు, సర్వక్రియలు చిన్మయములే. ఈ బాహ్య అభ్యంతర దృశ్య సమూహమంతా చిద్రూపమే. 'చిత్తు'కు భిన్నంగా ఈ బ్రహ్మాండము నందు ఏ వస్తువునూ లేదు? ఆ చైతన్యమే సూర్యుని రూపంగా ప్రకాశింపజేయకపోతే, సూర్యునకు అంధకారమునకు భేదమెక్కడ ఉండేది?

ఈ భూమిని కూడా "ఇది భూమి" అని ఎఱుగుచున్నదేది? చైతన్యమే కదా! చైతన్యము తన మాయారూపములుగా ఈ దిక్కులను, పర్వతములను, జగత్తును, ఆకాశమును, శరీరమును ప్రకాశింపజేస్తోంది. కాబట్టి వాటన్నిటికీ ఉనికి ఏర్పడుతోంది. లేకపోతే అవే ఉండవు.

**ఈ సమస్తము చిద్రూపమే! -** ఈ ఇంద్రియములు, దేహము, మనస్సు, ఇచ్ఛ, శూన్యాకాశం, వీటన్నిటికీ వేరైన భావసముదాయమూ, ఈ సర్వజగద్విషయాలూ – ఇవన్నీ చిత్ యొక్క రూపములే!

మరొక విషయం! ఈ శరీరం ద్వారా 'శబ్దము, స్పర్శ, రూపము' మొదలైనవన్నీ అనుభవ మవుతున్నాయి. అయితే వాటినన్నీటినీ ఎఱుగుచున్నది చిద్రూపుడనైన నేనే కాని, ఈ శరీరము స్వయంగా దేనినీ ఎఱుగజాలదు కదా! ఒక కొయ్య, ఒక మంచు గడ్డవలె అచేతనమే ఈ శరీరము. శరీరినగు నేను చేతనమును. స్వయంగా ఏదీ ఎఱుగలేనట్టి ఈ శరీరముతో నాకేం పని? "శరీర" స్వరూపుడనగు నేను ఈ శరీరమునకు ఆవల సర్వదా చైతన్య స్వభావంతో ప్రసరించియే ఉన్నాను.

నేనెవరు? ఉపాధిచే నిర్వచింపబడనిది, సర్వజగత్తుకు ఆత్మ, చేతన స్వరూపము అగు చిద్వస్తువును నేను. ఆకాశము నందు సూర్య–చంద్ర–నక్షత్రాది ప్రకాశించు సర్వ వస్తువులందు, ఈ భూత సముదాయము నందు, సర్వ దేవతలందు, సర్వ రాక్షసులందు, సర్వ స్థావర, జంగమ జీవులందు ఉండి ఉన్నదీ ఈ చైతన్యమే!

అట్టి నిత్యోదిత చైతన్యమే నేను. ఈ బ్రహ్మాండములందంతటా కేవలం చైతన్యమే కలదు. అనగా నేను సర్వదిక్కులందు నిండియున్నాను. నాకు శత్రువెవడు? మిత్రుడెవడు?

'బలి' అని పిలువబడుచున్న ఈ భౌతిక శరీరం ఒకవేళ నేల కూలుతుందనుకో.... అందువలన దేహినగు నాకేమి? నేను దేహిగా, ఎఱుగువాడిగా సర్వమునకు అతీతుడనై, అసంగమై, ఈ ఎఱుగ బడుచున్న దానికంతటి కంటే ప్రత్యేకమై యథాతథంగా ఉంటాను! తమచే కదల్చబడే మేఘఖండాలు నేల కూలినా కూడా వాయుతరంగాలు యథాతథంగా ఆకాశంలో ఉంటాయి కదా!

నాచే ఎఱుగబడుచు, ఉనికిని పొందుచున్న, ఈ శరీరములచే, లోకములచే నేను ఛేదించ బడటమేమిటి? అసంభవం. 'ద్వేషము' అనునది కూడా చిత్ చేత ప్రకాశించబడినప్పుడు మాత్రమే ద్వేషరూపమున భాసిస్తోంది. అందుచేత 'రాగము – ద్వేషము' అను రెండు భావనలూ చైతన్యము యొక్క అధీనంలోనే ఉన్నాయి. అనగా, అవి కూడా చిద్రూపములే.

బలి కొంతసేపు మౌనము, ధ్యానములలో గడిపాడు.

❖

**బలి (తనలో) :** ఔను! ఎంత పరిశీలించి చూచినా చైతన్యమునకు వేఱైనదేదీ ఎక్కడా కించిత్ కూడా కనిపించటం లేదు. నేను సర్వదా శుద్ధ – చిన్మాత్ర స్వరూపుడను. అట్టి నాయందు రాగము గాని, ద్వేషము గాని, మనస్సు గాని, మనోవృత్తులు గాని ఎట్లా ఉంటాయి? అవి లేనప్పుడు ఇక వికల్పమగు కల్పనయే నా యందు సంభవించదు కదా!

కనుక, సర్వవ్యాప్తమై, సర్వ వికల్పములకు అతీతమై, అద్వితీయమై, నిత్యమై, ఆనంద మయాత్మకమగు చిద్రూపమే నేను. నాచే ఎఱుగబడునదేదీ నన్ను మరొకటిగా చేయజాలదు. నాకు వేఱుగా ఉండజాలదు. ఈ ప్రపంచము నామరూపాలతో కూడి ఉన్నది. ఇది నామరూప రహితమగు చైతన్యమునకు 'సంజ్ఞ' కాగలదా? లేదు. ఏ చిత్‌శక్తి అయితే సర్వత్రా వ్యాప్తమై నామ రూప కల్పనకు అధిష్ఠానమై వెలయుచున్నచో – అదియే ఓం–తత్ శబ్దాత్మక రూపమున స్ఫురిస్తోంది.

దృశ్య – దర్శనములకు అతీతమై, నిర్మలమై, నిత్యమై సర్వమునకు ద్రష్టయగు పరమేశ్వరుడను నేను! అట్టి నన్ను ప్రకాశింపజేయగలిగేది మరెక్కడా ఏదీ లేదు. నేను స్వయంప్రకాశ రూపుడను.

బాగానే ఉన్నది! అయితే నిత్య ప్రకాశమాత్రుడనగు నాయందు "నేను ఈ శరీరమును, జీవుడను" అను పరిమిత భావం ఎందుకు ఏర్పడింది?... ఆత్మస్వరూపుడనగు నేను నా ఔన్నత్యమును ఏమరచి, దృశ్యమునకు ద్రష్టత్వము ఆపాదించుకొనునపుడు ఆ కల్పనచే – నీళ్ళలో ప్రతిబింబించే చంద్రబింబంలాగా – పరిచ్ఛిన్న భావన ఉద్భవిస్తోంది.

అనగా 'నేను జీవుడను' అను భావన భ్రాంతియే కాని, యథార్థము మాత్రం కాదు. 'అంతిమ సాక్షాత్కార వృత్తి' చే ఉద్భూతమగు శుద్ధ స్వరూపమే నేను కదా! మరి, అట్టి రూపమును స్వీకరించి, తద్వారా, ఈ 'భ్రాంతి' రూపమగు జీవభావమును త్యజించివేస్తే పోతుంది.

❖

ఓ నా ఆత్మస్వరూపమా! జీవ భావ రహితమై, 'విషయములు' అను కళంకమే లేనట్టి 'ముక్త స్వరూపము – మహత్తరము' అయినట్టి 'సాక్షి చైతన్యమే' నీవు సుమా! అట్టి నీకు ఇదే నా నమస్కారం. నీవే చిద్రూపమువు.

"శ్రవణ–మనన – నిధిధ్యాస – సమాధి" రూపమగు ఆ నా సాక్షి చైతన్యమునకు నేను పదే పదే నమస్కారం చేస్తున్నాను. సర్వాన్ని ప్రకాశింపజేయుచు, "జ్యోతి రూపము" అయి ఉన్న నాకు నేను నమస్కరించుచున్నాను. ఆహా! నిర్విషయమై, చిద్రూపమాత్రుడనై, బ్రహ్మాండమంతా పరిపూర్ణం చేస్తున్నది నేనే కదా! శాంతస్వరూపుడను; సర్వమును ఎఱుగువాడను; సత్–చిత్ మాత్రము అగు మహస్స్వరూపుడను. ఆకాశం కంటే కూడా అనంతుడను, సర్వవ్యాపకుడను; అణువు కంటే కూడా అత్యంత సూక్ష్ముడను; స్వతఃగానే చిత్ స్వరూపుడను, శుద్ధ బ్రహ్మన్ని అగు నన్ను సుఖము, దుఃఖము మొదలైనవి ఎట్లా స్పృశిస్తాయి?

అన్నిటినీ ఎఱుగుచూ – దేనిచేతా కూడా ఎఱుగబడనివాడను ...వర్తమానంలో ఉండిఉంటూనే, 'భూత – భవిష్యత్తు'లందు కూడా ప్రసరించి ఉన్నవాడను; సర్వ వ్యాపకుడను, విషయ శూన్యుడను. ఇక్కడ ఉన్నదంతా నా తోనే నిండిపోయి ఉన్నది. నేను శుద్ధ–అనంత–అద్వితీయ–స్వరూపుడను. నన్ను ఈ జగత్తు గాని, ఇందులోని భావ, అభావములు గాని, ఆయా పదార్థములు గాని, దేశ – కాలాదులు గాని 'పరిచ్ఛిన్నం' చేయగలవా?... లేదు.

**నాకు పరిచ్ఛేదమే లేదు -** కొందరు తత్త్వశాస్త్ర పరిచయం కొరకు "ఇది శరీరము, ఇది మనస్సు, ఇది బుద్ధి, ఇది అహంకారము" అని నా గురించి చెప్పుకుంటూ పోతున్నారు. అట్లు పరిచ్ఛేదం చేయటం చేత ఇబ్బందేమీ లేదు. ఎందుకంటే, నా స్వమాయచే నేనే ఈ శరీర–మనో–బుద్ధి –అహంకారములుగా అయి వ్యవహరిస్తున్నాను కదా! "నా రూపములే" అయివున్న అవన్నీ నాకంటే వేరు ఎట్లా అవుతాయి? "నా బుద్ధి వేరు – నేను వేరు" – ఎట్లా అవుతాం? ఒక వస్తువు యొక్క ఒక వైపు రూపం అదే వస్తువు యొక్క మరొక వైపు రూపంచే నిర్మితమైనట్లు గానూ, ఆధారభూతం గానూ అనిపిస్తున్నంత మాత్రం చేత ఆ వస్తువునకు వచ్చే లోటేమిటి?

❖

వాస్తవానికి నేను సర్వకాలములందును, సర్వత్రా వ్యాప్తమై, సర్వ కర్తనై, సర్వ స్వరూపమై వెలుగొందుచున్నాను. అద్వితీయ చైతన్య స్వరూపుడను, సర్వ విషయ స్వరూపుడను అగు నేనే, ఈ జగత్తుకు కారకుడను అగుచున్నాను.

ఇదంతా వాస్తవానికి నా సంకల్ప వికల్పములే. అయితే పరమార్థంగా చూస్తే, ఇక్కడ ఏదీ ఉత్పన్నమవ్వటం లేదు, నశించడం లేదు. ...మరి, చిద్రూపుడనగు నాకు ఇక్కడగల సంకల్ప

వికల్పములచే పనేమున్నది? బంధమేమున్నది? దేని వల్ల ఎక్కడ ఏది వృద్ధి? ఏది నాశనం? నేను ఒకప్పుడు అజ్ఞానమును ఆశ్రయించి ఉన్న సమయంలో కూడా, సర్వదా సర్వమునకు ఆవల రాజాధిరాజునై ఉండుట కొనసాగుచునే ఉన్నది. నా స్వస్వరూపమును నేను గ్రహిస్తున్నప్పుడు, నా గురించి పలుకుటకు ప్రయత్నిస్తున్న వేదాంత శాస్త్రం నన్ను 'జ్ఞాని'గా శ్లాఘించుచున్నది. అస్మదాత్మ స్వరూపాన్ని ఏమరచినప్పుడు నన్ను "అజ్ఞాని" ...అని పిలుస్తోంది.

జ్ఞానం - అజ్ఞానముల భేదము అంతవరకే! జ్ఞాన-అజ్ఞానములు నాక్రీడలు; నాలీలలు; నాచమత్కారములు; అస్మత్ జగద్రచనాకళాకళలు మాత్రమే!

కథారచయిత కథారచనను, పాత్రల గుణ-ప్రవర్తనాదులను కల్పిస్తూ, కొనసాగిస్తూ ఉండగా,.... తత్సమయంలో తనను తాను పోగొట్టుకుంటున్నాడా? లేదే? అట్లాగే నేను అజ్ఞానిగా చరిస్తూ ఉన్నప్పుడు కూడా ఆత్మస్వరూపుడనే!

అందుచేత ఇంతఃపూర్వపు అజ్ఞానమును చూచి ఇప్పుడు వేదన చెందవలసినది ఏదీ లేదు. నన్ను నేను ఆశ్రయించి, ప్రశాంత చిత్తుడనగుదునుగాక.

❖

మహాప్రజ్ఞావంతుడగు ఆ బలిచక్రవర్తి ఆ విధంగా చింతన చేస్తూ, క్రమంగా ప్రశాంత చిత్తుడయ్యాడు. సర్వ సంకల్ప - కల్పనలను రహితం చేశాడు. అ-ఉ-మ అనబడు ఓంకారము యొక్క మూడు మాత్రలకు పరమై ఉన్నట్టి అర్ధమాత్రను భావించుచు మౌనం వహించాడు.

అ = సత్ (Existence); ఉ = చిత్ (Knowledge); మ = ఆనందము (Bliss); అర్ధమాత్ర = విశుద్ధాత్మ స్వరూపము (లేక) తురీయాత్మకమగు బ్రహ్మము.

చేత్యము, చేతనము - ఈ రెండిటికీ అతీతుడైనాడు. అనగా, ధ్యానము చేయువాడు - ధ్యానము - ధ్యేయ వస్తువు ...ఈ మూడు విషయాలు లేని వాడైనాడు. నిర్మలుడై, వాసనలన్నీ వర్జించినవాడై, గాలివీచని చోట దీపంలాగా నిశ్చలత పొందాడు. శాంతచిత్తుడై, బ్రహ్మపదమును ఆశ్రయించాడు. ఒక శిలయందు చెక్కబడిన శిల్పములాగా చాలాకాలం స్థిరంగా ఉన్నాడు.

ఇక ఆతనియందు విషయదోషములు లేవు. "నిర్మల బ్రహ్మ భావప్రాప్తి" అను 'సత్త' కలిగి నిర్మలాకాశంలా శోభించాడు.

❖

బలి చక్రవర్తి నిశ్చేష్టుడై, అఖండమగు ఆత్మయొక్క అనుభవమునందు నిమగ్నుడై ఉన్నాడు. సేవకులు ఆతనిని సేవించటానికి సమీపించి ఏమీ పాలు పోక, చూస్తూ నిలబడ్డారు. ఇంద్రుడు, సిద్ధులు, తదితరులగు దేవతలు ఆతనిని సేవించటానికి సమీపించి, ఆతనిని ఆదరణతో చూడసాగారు. ఉదాసీనులు ఆశ్చర్యచకితులైనారు. తత్త్వజ్ఞులు "తత్వజ్ఞానం సంపాదించినందుకు ప్రయోజనం ఇదికదా!" అని ఆనందం పొందారు.

అజ్ఞానులగు అనేకమంది రాక్షస ప్రజలు విషయమేమిటో తెలియక "ఇది శత్రువుల మంత్ర – తంత్ర ప్రమేయం కాదు కదా?" అని భయము – విస్మయము పొందసాగారు. అక్కడి మంత్రులంతా ఒక చోట గూడి "ఇప్పుడు మన కర్తవ్యమేమిటి? మన రాజును మనం దక్కించుకోవాలి. అందుకు మరి ఏమిటి ఉపాయం?" అని సమాలోచన చేశారు. మనం ఇప్పుడు ఉపాయం కోసం శుక్రాచార్యుల వారిని ఆశ్రయించవలసిందే!" అని నిర్ణయించుకున్నారు. వారంతా శుక్రాచార్యులవారికి గురుస్తోత్రం సమర్పించారు.

గురువగు శుక్రాచార్యులు దేదీప్యమానమైన దేహముతో వ్యక్తమై, అక్కడ ప్రత్యక్షమైనారు. సమాధిలో ఉన్న బలిచక్రవర్తిని చూచి సంతోషంగా తల పంకించారు. ఆర్తులై, తనను సమీపించే రాక్షస జనసమును సంబోధిస్తూ ఇట్లు పలికారు.

**శుక్రాచార్యులు :** నాయనలారా! మన ఈ బలి చక్రవర్తి ఆత్మలో విశ్రమించి సంసార భ్రమరహితుడు అయినాడు. స్వయముగా విచారణ చేయుటచే సర్వమునకూ అధిష్ఠానమైన బ్రహ్మపదము ఈతనికి సంప్రాప్తించింది. ఉత్తమోత్తమమైన సిద్ధిని పొందాడు. ఇది ఆశ్చర్యకరమైన విషయమే!

సరే! సమాహిత చిత్తుడగు ఈతనిని ఇట్లే ఆత్మ యందు సుస్థితుడై కొంతకాలం ఉండనివ్వండి. శాంతమగు ఆత్మధర్మపదమును వీక్షించనివ్వండి. ఎందుకంటే, ఇంతకాలంగా ఎన్నెన్నో విషయాలు ఆశ్రయించుటచే ఇతని మనస్సు ఎంతగానే అలసి పోయింది. ఇప్పుడితనియందు సంసార భ్రమలన్నీ తొలగిపోయాయి. అందుచేతనే ఇప్పటికి ఆత్మయందు విశ్రాంతి లభిస్తోంది. మీరు మాత్రం ఇతనిని పలుకరించ వద్దు. కాలక్రమముగా ఇతడు సమాధి నుండి స్వయంగానే జాగ్రత్తును పొందగలడు. అప్పటి వరకు మీరంతా మీమీ ధర్మములు నిర్వర్తిస్తూ రాచకార్యములు శ్రద్ధా భక్తులతో నెరవేరుస్తూ ఉండండి. మీ అందరికీ శుభమగుగాక!

శుక్రాచార్యులు ఇట్లు పలికి అంతర్ధానమైనారు. దైత్యులు గురు ఆజ్ఞను శిరసావహించారు.

❖❖❖

# 9. కేవల సమరూపం

చాలా కాలమయినది. ఒక రోజు బలి చక్రవర్తి సమాధి నుంచి జాగృతి పొందినవాడై, కనులు తెరిచాడు. ఆతనికి, సపర్యలు చేస్తున్న సేవకులు ఈ విషయం మంత్రులకు, తదితర నగర ప్రముఖులకు తెలియజేయాలని బయలుదేరారు.

బలి చక్రవర్తి లేచి కూర్చున్నాడు. సంతృప్తి, ప్రశాంతతలతో కూడినవాడై, ఈ విధంగా ఆలోచన చేయసాగాడు.

**బలి చక్రవర్తి (తనలో) :**

**అహోనురమ్యాపదవీ శీతలాపారమార్థికీ ।**
**అహమస్యాంక్షణం స్థిత్వా పరాంవిశ్రాన్తిమాగతః ॥** (శ్లో 4, సర్గ 29)

“ఆహా! ఈ ‘పరమార్థసంపద’ ఎంతటి రమణీయమైనది! క్షణకాలం ఇందు విశ్రమించిన మాత్రంచేత ఎంతటి విశ్రాంతి, ప్రశాంతతలను పొందాను!

ఈ సమాధి ముందు బాహ్యవిభవములైనట్టి ఈ రాజ్యాధిపత్యము, ధన, జన, నారీజనాది విభవములు ఎందుకు పనికొస్తాయి? వాస్తవానికి బాహ్యజగత్తులో శాంతి ఎక్కడ? సమాధి యొక్క పరిపాకముచే లభించే ఆనందం మరెక్కడా ఏ విధంగానూ లభించదనుటలో సందేహం లేదు. అయితే పాప కార్యక్రమముల పట్ల, విషయసముదాయముల పట్ల ధ్యాస, ఆశలు గల జనులు తమ అంతరంగమున సర్వదా ప్రసరించియున్న సమాధి యొక్క ఔన్నత్యమును గుర్తించలేకపోతున్నారు కదా! సమాధినిష్ఠులైన వారి సరమానందం గురించి తెలిసిఉండి ఉంటే, నా ఈ సహజనులలో అనేకులు బాహ్యజగత్తులలో ఇట్లా వృధా సంచారాలు చేసేవారా? శాంతి, సుఖముల కొరకై ఎక్కడెక్కడో బాహ్యంగా తచ్చాడేవారా? లేదు.

❖

దూరంగా జనులు హడావిడిగా అటూ ఇటూ పరుగులు తీయటం గమనిస్తూనే, ఆతడు తన ఆలోనలు కొనసాగించసాగాడు.

“నేను ‘చిత్ – ఎఱుక’ అనునదే రూపముగా కలవాడను కదా! చిద్రూపము (ఎఱుగుట అను తత్త్వము) నందు “ఇది ఇష్టము – ఇది అయిష్టము; ఇది నాది – ఇది కాదు” – మొదలుగాగల వికల్పములు ఎక్కడ ఉంటాయి? కనుక ఇక్కడ నాకు గ్రహించవలసినదేది? త్యజించవలసినదేది?

కాని, ఎందుకో ఈ మనస్సు అనాది కాలం నుండి విషయము లందు ప్రవర్తించుచూ, వాటితో శీఘ్రంగా ఏకత్వం పొందుతోంది. వాస్తవానికి చైతన్యరూపుడనగు నేను దేనిచేత బంధింప బడగలను?... ఈ కనబడే పదార్థములచేతనా? ...ఇవన్నీ నా సంకల్పమును అనుసరించే అనుభవ మగుచున్నాయి కదా! నాచే కల్పించబడిన కల్పనలు నన్ను బంధించటమేమిటి? చిత్ స్వభావుడనగు నన్ను బంధించునదేదీ ఎక్కడా ఉండటానికే వీలులేదు. కనుక నాకు బంధమనునదేలేదు. బంధమే లేనప్పుడు, ఇక మోక్షము యొక్క ప్రసంగమెక్కడిది?

“నాకు మోక్షము కలుగుగాక!” అనబడు సుప్రసిద్ధమగు లోక ప్రసిద్ధమగు వాక్యమునే తీసుకుందాం! మోక్షము శరీరమునకా? కాదు. అది జడమైనది. స్వతంత్రమైన యోచన, భావన లేని శరీరమునకు మోక్షమేమిటి?... పోనీ, మనస్సుకా? – అది కూడా జడమే. నాచే నిర్వర్తించ బడేదంతా నా మననము యొక్క రూపమే కదా! మనస్సు అంటే నా యొక్క మననము చేయు క్రియయే కదా! మననము స్వయంగా ఉన్నదికాదు. స్వతంత్ర పతిపత్తికాదు. అద్దానికి మోక్షమేమిటి?

ఇక, నాకా? ‘ఎఱుగుచుండుట’ – అనబడు చిద్రూపుడనగు నేను ఇతఃపూర్వం దేనిచేత బంధించబడ్డాను? బంధరహితుడనగు నేను ‘మోక్షము కావాలి’ అని దిక్కుల వెంట చూడటమేమిటి? మూఢత్వం కాదా? అన్నిటికీ సర్వదా వేత్తై (అప్రమేయుడనై) ఉన్నాను కదా! ఇక నాకు బంధమేమిటి? మోక్షమేమిటి?

యథార్థానికి నాకు బంధముగాని, మోక్షముగాని లేవు... అమ్మయ్య! ఇప్పటికి నా అజ్ఞానం ఉపశమించింది. ఇక నాకు 'ధ్యానము'చే గాని, లేక 'ధ్యానము చేయకపోవుట' చేత గాని ప్రయోజనం ఏమున్నది? 'ధ్యానాధ్యానములు' అను రెండు భ్రమలను వదలివేసి, 'స్వాత్మ' రూపమునే ఉభయ సమయము లందు అవలోకిస్తూ ఉంటాను. ఇక ఏది వస్తుందో, రానీ.... పోతుందో, పోనీ...! ఈ వచ్చిపోవు వాటితో నా ఆత్మ స్వరూపమునకు ఏర్పడగల వృద్ధ – క్షయములు ఏమి ఉంటాయి? ఈ దృశ్యమంతా సర్వదా మమాత్మ స్వరూపమే కదా!

భోగములు గాని భోగముల యొక్క అభావము గాని నేనిప్పుడు కోరుకొనుట లేదు. దుఃఖ రహితమగు 'కేవల–సమరూపము' నందే స్థితి కలిగి ఉంటాను. ఇక ఈ జగత్తును పొందనవసరం లేదు. త్యజించవలసిన పని లేదు. అట్లే, "బ్రహ్మభావము అనబడు మరొక భావమును పొందాలి. ఈ జగద్భావమును వదలాలి", "కర్మ, ప్రయోజనములు" – మొదలుగా గల తతంగం కూడా నాకు అక్కర్లేదు.

అవన్నీ 'అసత్యములు, భ్రమాత్మకములు' ... కదా! అసత్యములైనవాటి కొరకు ఇచ్ఛాపూర్వక మైన 'త్యజించాలి' అను ప్రయాస మాత్రం దేనికి? ...నేను మృతుడను కాదు. జీవితుడను కాదు. సత్తును కాదు. అసత్తును కాదు. ఈ దేహము గాని, ఈ రాజ్యాదులు గాని కాను. తదితర దేహములు, రాజ్యాదులు కాను.

మరి నేనెవరు? ...మహత్తరమైన 'శుద్ధ చిదాత్మ' యే నేను. అట్టి నాకు నా నమస్కారం. ఈ రాజ్యములు, ఈ శరీరము ఉంటే ఉండవచ్చు... లేకపోవచ్చు. నేను మాత్రం ఆత్మ యందు శాంతి రూపమున సుస్థితుడనై ఉన్నాను. ఉంటాను.

ఆత్మ కాక, తదితరములైన విషయములన్నీ ఉన్నా ఒక్కటే! లేకున్నా ఒక్కటే! నాకు సంబంధించిన వస్తువుగాని, విషయంగాని, ఎక్కడా ఏమాత్రం లేవు. కర్తృత్వముతోకూడిన కార్యమంటూ నాకు ఎక్కడా లేనే లేదు. ఈ ప్రాకృత వ్యవహారములైన 'రాజ్యపాలన' నాచే నిర్వర్తించబడినప్పటికీ, నా తత్త్వమునకు ఇబ్బంది ఏమీ ఉండజాలదు.

❖

జ్ఞానులలో ఉత్తముడగు ఆ బలి చక్రవర్తి అట్లు నిర్ణయించుకొన్నాడు. పరిపూర్ణాత్మ స్వరూపుడు అయ్యాడు. 'ఆత్మవేత్త' అని ఆత్మజ్ఞులచే శ్లాఘించబడ్డాడు. తనను సమీపిస్తున్న దానవ జనులను – సూర్యుడు ఉదయిస్తూ ఆయాలోకములను చూస్తున్నట్లు – చూడసాగాడు. వారి వారి నమస్కారములకు చిరునవ్వుతో ప్రతినమస్కారం చేసి, లేచాడు.

రాచకార్యములను, 'ధ్యేయవాసనాత్యాగము'తో కూడుకున్నవాడై యథావిధిగా నిర్వర్తించ సాగాడు. అర్ఘ్యపాద్యములతో దేవతలను, బ్రాహ్మణులను, గురువులను పూజించటం, అర్థించటానికి వచ్చినవారిని సత్కరించటం, ఎప్పటిలాగానే చేస్తూ ఉండేవాడు.

❖

కొంతకాలం గడిచింది. ఒకానొక సమయంలో బలిచక్రవర్తి ఒక గొప్ప యజ్ఞం ప్రారంభించాడు. ఎన్నో భూతకోట్లకు సంపదలు ఇచ్చి తృప్తిపరచాడు. శుక్రాచార్యులు మొదలగు పెద్దల శుభాశీస్సులు పొందాడు. అయితే, ఇంద్రుడు ఆ యజ్ఞమును చూచి, "ఈ బలి ఇంత గొప్పయజ్ఞం చేస్తున్నాడు. కొంపతీసి, ఆతడు ఇంద్రపదవికోసం ఇదంతా చేయటం లేదు కదా ఇతడు మహాబలోపేతుడైతే రాక్షసజాతి వారు అదిచూచుకొని మరింత లోకకంటకులౌతారు కదా!" అని భయం పొందాడు. తన జ్యేష్ఠ సోదరుడైన విష్ణు భగవానుని ఆశ్రయించాడు. అయితే బలి, ఈ భౌతికమైన స్వర్గాదుల కోసం యజ్ఞం చేస్తున్నాడా? ...లేదు. జ్ఞాని అయి, స్వధర్మమునను సరించి చేస్తున్నాడు.

ఇంద్రుని కోరికను అనుసరించి, బలి చక్రవర్తిని నిరోధించే నిమిత్తం విష్ణుమూర్తి వామనావతారుడై యజ్ఞశాలను సమీపించాడు. కార్యచతురుడగు వామనుడు "అయ్యా! నాకు మూడు అడుగుల నేల ఇప్పించండి. అంతే చాలు" అని అర్థించాడు. గురువగు శుక్రాచార్యుల హెచ్చరికను కూడా పాటించ కుండా, అంతా తెలిసి కూడా, బలిచక్రవర్తి మూడు అడుగుల నేల ధారపోశాడు. "అపరిమితము, శాశ్వతము అగు చైతన్యము ముందు పరిమిత వస్తువులగు ఈ రాజ్యాదులు ఎంతటివి?" – అని ఎఱిగి ఉండుట చేతనే ఆ విధంగా దానం చేసివేశాడు. ఇక విష్ణుభగవానుడు మాయాజాలం చేత త్రివిక్రమాకారుడై తన పాదములచే త్రిలోకములను ఆక్రమించి 'మూడవ అడుగు' బలిచక్రవర్తి శిరస్సుపై ఉంచి, ఆతనిని పాతాళలోకమునకు పంపి, అచ్చట పరిమితునిగా చేసి, తానే బలిచక్రవర్తికి రక్షకభటుత్వం వహించాడు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇప్పటికి కూడా బలిచక్రవర్తి పాతాళలోక రాజై ఉన్నాడు. జీవన్ముక్తుడగు ఆతడు స్వస్థచిత్తుడై, నిరంతర పరమాత్మ ధ్యాన పరాయణుడై వెలుగొందుచున్నాడు. ఈ ప్రపంచముపట్ల ఇందు అనుదినం తారసపడే ప్రియా ప్రియ సంఘటనల పట్ల ఉదాసీనుడై, "నేను సర్వదా అఖండమగు ఆత్మ తత్త్వమునే కదా!" అను ఎఱుకను ఆశ్రయించి చరిస్తున్నాడు. ప్రారబ్ధ వశంచేత తనకు కాలానుగుణంగా ప్రాప్తించబోయే ఇంద్రత్వమునకై వేచియున్నాడు. సంపద అయినా, ఆపద అయినా రావచ్చు. పోవచ్చు. ఆతని సమత్వము విఘ్నము పొందుట లేదు. చిత్ర పటంలో కనిపించే భయంకరమైన దావాగ్నికి ఉష్ణత్వం ఉంటుందా? బలియొక్క బుద్ధికూడా సుఖ దుఃఖ సమయములందు చంచలము పొందుటలేదు. ఈ భోగములు, ఈ అనేక విభవములు –ఇవన్నీ ఆత్మ స్వరూపుడనగు నా సమక్షంలో జరిగే వినోదములే కదా! – అని భావనచేస్తున్నాడు. ఆతని మనస్సు వైరాగ్య ప్రభావంచే శాంతిని పొందింది. సుఖ దుఃఖములు, భావ, అభావములు – ఇవన్నీ ఎట్లా వస్తున్నాయో అట్లాగే పోతున్నాయని గ్రహించాడు. వాటియందు ఉపశాంతి ఉండ జాలదని గమనించి, వాటికి "అతీతత్వము" ఆశ్రయించాడు. అతడిప్పుడు రసాతలంలో, పాతాళ లోకంలో, పూర్ణచిత్తుడై, నిరంతర ఆత్మారాముడై విహరిస్తున్నాడు.

త్వరలో ఆ బలి చక్రవర్తి ఇంద్ర పదవిని పొంది, ముల్లోకములను పాలించుచు ఈ బ్రహ్మాండమున చిరకాలం వసించగలడు.

అయితే అట్టి పదవి ప్రాప్తించినప్పుడు మోదముగాని, అది తొలగుటచే ఖేదముగాని పొందడు. సర్వ స్థితి గతులందు సమరూపము కలిగి సదా సంతుష్ట చిత్తుడై ఉంటున్నాడు.... ఉండగలడు. ప్రారబ్ధానుసారం ఏది ప్రాప్తిస్తే అది పొందుచూ స్వస్థచిత్తుడై, ఆకాశమువలె నిర్మలుడై విరాజిల్లుచున్నాడు. ఆ విధంగా ఆతడు పారబ్ధమును జయించివేసి, ప్రజ్ఞచే కేవలసాక్షి అయిచెన్నొందుచున్నాడు సుమా!

❖❖❖

# 10. సన్మార్గావిష్కరణ

**శ్రీవసిష్ట మహర్షి :** ఓ రాఘవా! బలిచక్రవర్తి ఏ మార్గంలో జ్ఞాని అయ్యాడో వివరించాను. నీవు కూడా అట్టి దృష్టిని అవలంబించి జీవన్ముక్తుడవగుము. "నేను నిత్యాత్మస్వరూపుడనే!" అని నిశ్చయించి, స్వపౌరుష వశం చేత అద్వైత పదమును ఆశ్రయించు.

ఓ జనులారా! తుచ్ఛమగు వస్తు సముదాయములపట్ల దృష్టినంతా నిలిపి, తృప్తికై వృథాగా వెతకకండి. బలిచక్రవర్తి అన్ని వేలాది సంవత్సరాలు సువిశాల రాజ్యాదులను అనుభవించి, తృప్తిని పొందనే లేదు. చివరికి వైరాగ్యమునే ఆశ్రయించాడు. ఇక్కడ భోగములుగా కనిపించుచున్నవన్నీ కాలక్రమేణా దుఃఖ కారకములుగానే పరిణమిస్తున్నాయి. భోగ సమూహమునంతా బుద్ధిచే త్యజించి, నిత్య-సత్య-సచ్చిదానంద-దుఃఖరహితము అయిన ఉత్తమపదమేదో అదే లక్ష్యముగా కలిగి ఉండండి.

ఈ దృశ్య పదార్థములు వివేచనాదృష్టిలేని వారికి అనేక వికారములు కలుగ జేస్తున్నాయి. "దూరపు కొండలు నునుపు".... అన్నట్లుగా, వీటి యందు అవాస్తవం పేరుకుని ఉన్నదని గమనించండి. నిష్ప్రయోజనంగా - నిష్కారణంగా ప్రాపంచిక వృత్తుల వెంట పరుగులు తీసే ఈ మనస్సును హృదయ కుహరంలో వేంచేసి - బాహ్యఅభ్యంతరములను ఆక్రమించి సర్వమునకు సాక్షి అయి వెలుగొందే ఆత్మవైపుగా ప్రయాణింపజేయటమే ఉచితం.

నాయనా! నీవు ఎట్టి వాడవో ఎఱుగుము. సర్వమును ప్రకాశింపజేయు "చిదాదిత్యుడవు" అయి, ఈ ప్రపంచమంతటా నీవే వ్యాపించియున్నావు. మరి నీకు శత్రువు ఎవరు? మిత్రుడెవడు? ఈ దృశ్యములోని ఏవో కొన్ని సంఘటనలనుచూచి, అంతమాత్రం చేత వ్యర్థంగా ఆత్మపదము నుండి ఎందుకు చ్యుతి పొందటం? ఓ మహాబాహో! నీవు వాస్తవానికి అనంతుడవు. ఆది పురుషుడవు. పురుషోత్తముడవు. చిన్మాత్ర శరీరుడవు. అట్టి నీవు స్వమాయచే ఈ వివిధ పదార్థముల రూపమును ధరించి, విజృంభిస్తున్నావు.

**త్వయిసర్వమిదంప్రోత్రం జగత్స్థావరజఙ్గమమ్ ।**
**బోధేనిత్యోది తేశుద్ధే సూత్రేమణిగణా యథా ॥** (శ్లో 47, సర్గ 29)

"నిత్య బోధ స్వరూపుడవు, శుద్ధుడవు" అగు నీ యందు - దారము నందు మణుల వలే - స్థావరజంగమాత్మకమగు ఈ ప్రపంచమంతా గ్రుచ్చబడియున్నది.

నీవు జన్మించుట లేదు. మరణించుట లేదు. జనన మరణ భ్రాంతి ఎందుకు చెప్పు?

**శ్రీరాముడు :** హేమహర్షీ! జీవునికి ఈ జనన మరణాదులు ఎందుకు ప్రాప్తిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** తృష్ణ వృద్ధి చెందుటచేతనే "జన్మాదులు" అనే భవరోగం ప్రబలుతోంది. తృష్ణ సన్నగిలితే అవి కూడా సన్నగిలుతాయి. "తృష్ణ – తృష్ణా రాహిత్యము" ...ఈ రెండిటిలో ఏది ఉచితమో, ఏది అనుచితమో నీవే పరీక్షించుకో. భోగములపట్ల తృష్ణను విడనాడు. కేవలం సాక్షీ మాత్రుడవై ఉండు. జగదీశ్వరుడవు – చిదాదిత్యుడవు అగు నీ ఉనికిచేతనే, నీవు స్వీకరించుటచేతనే, స్వప్నతుల్యమైనట్టి ఈ జగద్విలాసమంతా ప్రతిభాసిస్తోంది.

ఓ సర్వజనులారా! మీరంతా వ్యర్థంగా శోకించకండి. యథార్థానికి 'సుఖ దుఃఖములు' అనునవేవీ మీకు లేవు. మీరంతా స్వతఃగా పరిశుద్ధ చిత్తులే అయి ఉన్నారు. మీలో ప్రతి ఒక్కరు "సర్వాత్మ స్వరూపులు, సర్వవస్తు ప్రకాశకులు" అయి ఉన్నారని మరువవద్దు.

బంధము నుండి విడివడుటకై ఇప్పటికిప్పుడే ప్రయత్నశీలురు కండి. దీపమున్నప్పుడే ఇల్లు చక్క బెట్టుకోవాలి కదా! ఒక చమత్కారమైన విషయం గమనిస్తున్నారా? ఈ మనస్సుకు మొదట ప్రియంగా తోస్తున్న విషయములు, పదార్థములు చివరకు చూస్తే దుఃఖదాయకములుగానే క్రమ క్రమంగా పరిణమిస్తున్నాయి. మొట్టమొదట కొంత అప్రియంగాను, కష్టంగానూ అనిపించే తపస్సు ఇంద్రియ సంయమము మొ॥నవి జీవునకు కాలక్రమేణా అత్యంతికమైన సుఖం ప్రసాదిస్తున్నాయి.

అందుచేత రామా! సప్త భూమికలలో ఉన్నంతవరకు అభ్యాసం వదలవద్దు. ఆపై అభ్యాసమునకు సంబంధించి కల్పన కూడా పరిత్యజించు.

**శ్రీరాముడు :** స్వామీ! శాశ్వతమైన సమత్వము లభించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఇష్ట, అయిష్టములు" అనే కల్పన త్యజించుటచేతనే శాశ్వతమైన సమత్వం లభిస్తోంది. అట్టి సమత్వం హృదయంలో సుస్థిరపడితే జీవుడు మరల ఈ సంసారము నందు జన్మించడు. ఒక అల్లరి పిల్లవాడిలాగా ఈ మనస్సు తన ఇచ్ఛ వచ్చిన పదార్థము లందు సంలగ్నమౌతోంది. దానిని వాటి నుండి తొలగించి అధిష్ఠానమగు చిన్మాత్రమునందే నెలకొల్పాలి. అభ్యాసం చేత, 'సర్వాత్మ భావన" అను అంకుశంతో ఈ మనస్సు అనే మదపుటేనుగును నిగ్రహించాలి. అప్పుడు మోక్షము అనబడేది దానంతట అదే ముంగిటకు వచ్చి వాలుతుంది.

ఈ జీవులలో అనేకులు "ఈ దేహము నిత్యము" అని నమ్ముకొని ఉంటున్నారు. మిథ్యా దృష్టిచే కలుషితమైన 'చిత్తము' కలిగి ఉంటున్నారు. భోగసంకల్పములకు వశీభూతులగుచున్నారు. మూర్ఖత్వం, అవివేకములను ఆశ్రయించటం కంటే దుఃఖప్రదమైన విషయం ఇంకెక్కడా ఏదీ ఉండదు. వారంతా వివేకులు కావాలనే మా శుభాకాంక్ష.

ఆత్మతత్త్వనిర్ణయం విషయంలో వివేక, వైరాగ్యాలు చాలా ముఖ్యం. హృదయాకాశంలో ఉదయించే 'అవివేకము' అను మేఘమును "విచారణతో కూడిన వివేకము" అనే వాయువు యొక్క

వేగంతో తొలగించి వేయాలి. స్వయంగా ప్రయత్నించాలి. సచ్ఛాస్త్రములు పరిశీలించటం, ఆత్మజ్ఞులు చెప్పే ఉపదేశాదులు వినటం నిర్వర్తించాలి. లేకపోతే ఆత్మవిచారణ ఎట్లా ఉదయిస్తుంది చెప్పు? ఊరకే తర్కిస్తూ కూర్చుంటే ఏం ప్రయోజనం? గురూపదేశముల ద్వారా అంతర్ముఖ దృష్టిచే స్వయంగా ఆత్మను అవలోకించాలి. లేకుంటే ఆత్మ వ్యక్తం కాదు.

ఓ రామా! నీవు గురూపదేశాలచే ఆత్మ స్థితిని పొందినవాడవయ్యావు. నీకు విస్తృతమైనట్టి ఆత్మ బోధ ప్రాప్తించుచున్నది. "వికల్పములంటూ లేనట్టి చిన్మాత్రయే (లేక పరమాత్మయే) దేశ కాలములన్నిటా వ్యాపించి యున్నది" – అను విజ్ఞానమును సుస్థిర పరచుకో. సర్వసంకల్పములకు అతీతుడవై, సంశయవిభ్రమములన్నీ పాముకుబుసంలాగా విసర్జించివేయి. బాహ్యప్రపంచ కౌతుకములను దరిజేరనీయ వద్దు. దుఃఖం నశించాలంటే అధిరోహణముయొక్క క్రమం చెబుతాను, విను–

1. జ్ఞానము కొరకై సిద్ధపడటం.
2. అందుకు సాధనభూతమైన "విచారణ (Enquiry)"ను చేకూర్చుకోవటం.
3. విచారణచే జనిస్తున్న అవగాహనలను వివేక వైరాగ్యములచే కాపాడుకోవటం.
4. ప్రమాదము, ఆలస్యము – ఈ రెండింటిని దగ్గిరకు రానీయకపోవటం.
5. 'సమాధి సుఖము' అను అమృతమును పానం చేయటం.
6. ఉత్తరోత్తర భూమికలను అధిరోహించటం.
7. ఏడవ భూమికయందు విశ్రాంతి, సుఖాభివృద్ధి.

ఎప్పటి వరకైతే 'ఆత్మ దోషముతో కూడినది' అని నీకు అనిపిస్తోందో – అప్పటి వరకు ప్రయత్నం చేస్తూ ఉండవలసిందే! ఆవరణములు తొలగగానే సర్వ కళంకములు తొలగిపోతాయి. నీ యొక్క 'శుద్ధ బ్రహ్మైక్యము' ప్రకటితమౌతుంది. అప్పుడు అన్నీ తొలగి, 'కేవల బ్రహ్మానంద స్వరూపుడవు' అయి ఉంటావు.

❖❖❖

# V. ప్రహ్లాద - నారాయణ సంవాదం

## 1. హిరణ్యకశిప సంహారం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రఘురామా! దానవేశ్వరుడు, హరిభక్తులలో శ్రేష్ఠుడూ అయిన ప్రహ్లాదుడు ఒకప్పుడు విచారణ చేసిన విధమేమిటో చెబుతాను. ఈ విచారణ పరిశీలించుటచేత సర్వోత్తమమైన జ్ఞానం లభించగలదని అనుభవజ్ఞులగు మహనీయుల అభిప్రాయం.

❖

పాతాళలోకంలో 'హిరణ్యకశిపుడు' అనే పేరు గల ఒక దైత్యుడు ఉండేవాడు. ఆతని ముందు సురలు గాని, అసురులు గాని యుద్ధంలో నిలబడలేకపోయేవారు. ఆతడు నారాయణుడంతటి యుద్ధ నైపుణ్యం కలవాడని లోకప్రసిద్ధి. తన బలపరాక్రమములతో ఇంద్రుని జయించి, ఆతని వద్ద ముల్లోకముల ఐశ్వర్యములను లాగివేసికొని అనుభవిస్తూ ఉండేవాడు.

హిరణ్యకశిపుడు పెట్టే బాధలు భరించలేక దేవతలు శ్రీహరిని శరణువేడారు. "సరే! సరి అయిన సమయం రానీయండి" అని చెప్పి వారికి ఆయన అభయమిచ్చి పంపారు. కొంతకాలానికి హిరణ్యకశిపునకు "ప్రహ్లాదుడు" అనే కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడు శ్రీమన్నారాయణుని పట్ల అనన్యమైన భక్తి కలిగి ఉండేవాడు. హరిద్వేషి అయిన హిరణ్యకశిపుడు వరగర్వంతో క్రిందా మీదా చూడకుండా "హరిభక్తి" కలిగి ఉన్న ప్రహ్లాదుని అనేక రకాలుగా హింసించాడు. ఆశ్రితవత్సలుడగు హరి తనను దూషించినా, ఏమనడు గాని.... తన భక్తుని బాధిస్తే ఊరుకుంటాడా?

ఒకరోజు ప్రహ్లాదుని పిలిచి హిరణ్యకశిపుడు, "ఏమిరా, అబ్బాయీ! నీవు చెప్పే హరి ఎక్కడ ఉన్నాడురా? నాకు భయపడి ఎప్పుడో పారిపోయాడు. ఇప్పటికిప్పుడు నీ హరిని చూపించు... ఎక్కడున్నాడో! లేదా, హరిభక్తి మరచిపో. ఈ రెండూ కాదంటావా, ఈ రోజు ఈ గదాదండంతో నిన్ను సంహరిస్తాను... అప్పుడు ఏ హరి వచ్చి అడ్డుకుంటాడో చూస్తాను" అని హూంకరిస్తూ పలికాడు. అప్పుడు అనన్యమైన భక్తి గల ప్రహ్లాదుడు "నాన్నా! హరి సర్వాంతర్యామి. అతడు లేని చోటే లేదు. నీవు కోరుకోవాలే గాని, ఆయన నీకు అంతటా దర్శనమిస్తాడు. నీ అంతః శత్రువులైన కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యాలను జయించి, నిర్మల హృదయంతో ఒక్కసారి ఈ సర్వమును పరిశీలించు. అంతా నీకే స్పష్టమౌతుంది" అని వినమ్రతతో పలికాడు.

అంతే... హిరణ్యకశిపునకు భలే కోపం వచ్చింది. "ఓరీ దుష్టుడా! అంతటా వ్యాపించి ఉన్నాడని పిచ్చిపిచ్చి మాటలు పలుకుతున్నావు, అయితే నీ హరిని ఈ స్తంభంలో చూపించగలవా....?" అని పలికాడు. అప్పుడు ప్రహ్లాదుడు "ఓ! తప్పకుండా! సర్వమునకు అంతర్యామి, శాశ్వతమైన ఆధారము అయిన నారాయణుడు ఈ స్తంభములో మాత్రం ఎందుకు ఉండడు?" అని చేతులు

జోడించి నమస్కరించాడు. హిరణ్యకశిపుడు తనలో, "ఈ రోజు ఈ సంగతేదో తేల్చుకోవాలి...." అని అనుకున్నాడు. గద చేతపట్టుకుని వీరావేశంతో ఆ ప్రక్కనే ఉన్న స్తంభమును గదతో మోదాడు. "పెటపెటా" ధ్వనులతో స్తంభం చీలిపోయింది. చిత్రమైన "సింహం తల – మానవుని మొండెం" రూపంలో భయంకర శబ్దాలు చేస్తూ ఒక ఆకారం బయల్వెడలింది. కొద్దిక్షణాల్లోనే ఆ రాక్షసుడిని అదుపులోనికి తీసుకొని పగలు–రాత్రి కాని సంధ్యా సమయంలో, ఇంట్లో బయట, లోపల కానట్టి గుమ్మం మీద, 'ఆయుధములు' అని చెప్పబడనట్టి తన గోళ్ళతో ఆ హిరణ్యకశిపుని పొట్ట చీల్చి చంపివేసింది.

దుష్ట శిక్షకుడు, శిష్టరక్షకుడు అగు ఆ శ్రీహరి ఆ విధంగా లోకకంటకుడగు హిరణ్యకశిపుని, అతని పరివారాన్ని దునుమాడి భక్తుడగు ప్రహ్లాదునికి, దేవతలకు, ఎల్లలోకములకు అభయమిచ్చి లక్ష్మీ సమేతుడై అంతర్థానమైనాడు. భక్తులకు లక్ష్మీ నరసింహ స్వరూపమును ఉపాసనకై ప్రసాదించి, తన ఆశ్రిత వాత్సల్యాన్ని లోకమునకు చాటాడు.

క్రమంగా అంతా సద్దుమణిగింది. ప్రహ్లాదుడు అంతఃపురం జేరాడు. ప్రహ్లాదుడు పట్టాభిషిక్తుడై తండ్రి స్థానములో రాజ్యం ఏల వలసియున్నది. నరసింహస్వామి కొద్ది గంటలలో సృష్టించిన కల్లోలాల గురించి యోచిస్తూ, ఆ రోజు రాత్రి ప్రహ్లాదుడు ఏకాంతంగా తనలో ఈ విధంగా చింతించసాగాడు.

❖❖❖

# 2. నారాయణీకరణం

**ప్రహ్లాదుడు (తనలో) :** ఆహా! ఈ మా కుటుంబ సభ్యులగు రాక్షసులలో కొందరు కొందరు "మేం గొప్పవాళ్ళం! గొప్ప సంపదలు గలవాళ్ళం! మమ్ములను ఎవరేం చేస్తారు?" అని ఎప్పుడూ విఱ్ఱవీగుతూ సంచరించేవారు. వాళ్ళందరినీ శ్రీమన్నారాయణుడు కొద్ది నిమిషాల సమయంలో నల్లులను నలిపినట్లు సంహరించివేశాడే! 'మేం గొప్ప పరాక్రమాలు కలవాళ్ళం!' అనుకున్నవాళ్ళు చివరకు, ఆ సామర్థ్యంతో ఏం స్థిరత్వం పొందారు? అందరూ కూడా చంచల సముద్రంలో తరంగాలులాగా కొంతకాలం క్రితం ఈ భౌతిక ప్రపంచంలో ఉద్భవించి, మాన–మద–గర్వాలతో నినాదాలు చేస్తూ, ఆయా శరీరాలతో కొద్దికాలం ఈ భూమిపై సంచరించి, చివరకు ఆ శరీరాలను ఇక్కడే వదలి ఎటో వెళ్ళిపోయేవారే కదా! ఆ రాజ్య సంపదలు, దేవతల పట్ల ఉపయోగించే దూషణ శబ్దజాలాలు ఇప్పుడేమైనాయి? ఎందుకు పనికివచ్చాయి? హరి నృశింహరూపుడై వచ్చి క్షణాలలో అనేకమంది రాక్షసవీరుల మాన–మద–గర్వాలు హరించివేశారే! అంతా హరించుకుపోగా, వారికి ఈ లోకంలో ఏమైనా మిగిలిందా?

ఇదంతా పరిశీలిస్తుంటే ఇవి ఎంత కష్టతరమైన విషయాలు! "మమ్మల్ని చూచి దేవతలే పారిపోతున్నారు, చూచారా!" ... అని గర్విస్తూ చేసియున్న సంచారం ఈ రోజు రాక్షసజాతికి ఏం

సుఖం తెచ్చిపెట్టింది? ఈ సంపదలు అల్పమైన మిత్రులు కాబట్టే ఇవి మమ్ములను దుఃఖపూరితులుగా చేసివేస్తున్నాయి. దేవతలచేత ఊడిగం చేయించుకున్నట్టి ఉద్యమపరులగు రాక్షస వీరుల ఇళ్ళు ఇప్పుడు దైన్య – నిరుత్సాహాలతో పొగచూరుచున్నాయి. మొన్నమొన్నటివరకూ దేవతలు నా తండ్రికి భయపడి దీనులై ఉండేవారు. ఇప్పుడో – నా బంధువులు ఆ దైన్యత్వాన్ని తాము అనుభవిస్తున్నారు. విధిగతిని ప్రవచించటం ఎవరి తరం! నిన్నటిదాకా మా నగరం వనములతో, భవనములతో ఈ సృష్టికే ప్రత్యేకమైన ఆభరణములాగా వెలుగొందేది. ఇప్పుడేమైనది? ఆ నరసింహస్వామి వచ్చి రెండు గడియల కాలంలో తన తాండవంతో అంతా నేలమట్టం చేశాడు. పేరు పేరునా బయటకు పిలిచి అనేకమంది రాక్షస వీరులను మట్టుపెట్టాడు.

ఏ వింజామరములైతే మా తండ్రి సేవలో నిరంతరం పరిశ్రమిస్తూ ఉండేవో – అవన్నీ ఇప్పుడు ఆ ఇంద్రుని సేవించటానికి వెళ్ళాయి. ఆ నారాయణుని శరణు వేడినందుకు దేవతల కష్టాలు కడతేరి, వారు సంతోషముగా ఉంటున్నారు. 'విపత్తు' అనే సముద్రంలో మునిగిపోతున్న దేవతలను విష్ణు భగవానుడు రక్షించాడు. అన్నిటికీ ఆయనే సమర్థుడు. ఆయన అండచూచుకొనే... ఈ రోజు దేవతలది పైచేయి అయి, వారు దైత్యులను వేధింప గలుగుతున్నారు. బాణాలు, కండబలం, లౌకికమైన తెలివితేటలు ఉపయోగించి నరసింహరూపుడగు విష్ణుదేవుని ఎవరు వశం చేసుకోగలరు?

❖

ఈ లోకములోని శరణార్థులందరికీ శరణు వేడుటకు అత్యంత శ్రేయోదాయకమైన స్థానమే ఆ శ్రీమన్నారాయణుడు. అందుచేత సర్వభావములచేతను, సర్వప్రయత్నములచేతను ఆ హరిని శరణు వేడటమే ఉపాయం. జీవులందరికీ ఆతడేగదా, గతి! ఆ విష్ణువును వశపరచుకోవాలంటే ఆయనను ప్రేమించాలి. అల్పమైనవాటిని ప్రేమించి అల్పమైన గతిని నేను ఎందుకు పొందాలి? సృష్టి – స్థితి – లయములకు కారణభూతుడగు ఓ పరమేశ్వరా! నారాయణమూర్తీ! సర్వమునకూ మూలకారణము, అచింత్యము అగు నీ మహిమకు నమస్కారం!

**అస్మాన్నిమేషాత్ ఆరభ్య నారాయణమజం సదా ।**
**సంప్రపన్నోఽస్మి సర్వత్ర నారాయణమయోఽస్మ్యహమ్ ॥**

'జన్మ' అనబడునదేదీ లేనివాడా! జన్మకర్మలకు ఆవల ఉన్నవాడా! హే నారాయణా! ఈ క్షణం నుండి నిన్ను మాత్రమే శరణు వేడుచున్నానయ్యా! ఈ సర్వ దేశ – కాల – వస్తువులందు అంతటా నేను నారాయణమయముగా గాంచుచున్నాను.

**ఓం నమోనారాయణాయేతి మంత్రః సర్వార్థ సాధకః ।**
**నాఽపైతి మమ హృత్కోశాత్ ఆకాశాదివ మారుతః ॥**

ఆకాశము నుండి వాయువు తొలగి, మరింకెక్కడికైనా వెళ్ళి పోగలుగుతుందా? లేదు. అట్లాగే "ఓం నమోనారాయణాయ" అనే మంత్రం ఏమాత్రం నా హృదయకోశము నుండి తొలగకుండుగాక! సర్వార్థ సాధకమై సర్వదా వెలుగొందుగాక!

తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం ...ఇంకా తదితర దిక్కులన్నీ కూడా విష్ణు స్వరూపములే. ఆకాశము కూడా విష్ణు స్వరూపమే. ఈ జగత్ అంతా విష్ణు స్వరూపమే అయినప్పుడు, ఇక నేనో! అప్రమేయుడగు ఆ విష్ణువునే కదా! అహో! ఇప్పుడు నేను విష్ణుమయుడను అయ్యాను. "నేను విష్ణు రూపుడనే" అను ఐక్యము పొందకుండా, "విష్ణువునకు వేరైనదేదీ ఎక్కడా ఉండజాలదు..." అను అవగాహన కలిగి ఉండకుండా విష్ణుపూజ చేస్తే స్వల్పప్రయోజనమే – అని నాకు అనిపిస్తోంది.

**హరిః ప్రహ్లాదనామాయో మత్తో నాఽన్యోహరిః పృథక్ ।**
**ఇతి నిశ్చయవానన్తర్వ్యాపకోఽహంచ సర్వతః ॥**

విష్ణువే ప్రతిఒక్కని రూపంగా ప్రదర్శితమౌతున్నాడు. నేను విష్ణురూపుడనే. నా రూపం మరొకటేదో అయి ఉండదు. ఉండజాలదు. అట్లాగే సర్వ జీవులు కూడా! ఆ విష్ణువే ఈ ఉపాధిలో 'ప్రహ్లాదుడు' అను పేరు కలిగి ఉంటున్నాడు!

మరొక ఉపాధిలో మరొక పేరు! విష్ణువుకు వేరుగా ఎక్కడ ఏమి ఉన్నది? ...అందుచేత నేనే అంతటా వ్యాపించి ఉన్నాను. నేనే విష్ణువును. నేనే ఈ సర్వరూపాలలో సర్వదా వ్యాపకుడనై ఉన్నాను. ఈ అనంత ఆకాశమును తన రెక్కలతో నింపి వేయగల గరుడుడు నాకు వాహనమె ఉన్నాడు. పక్షులు చెట్ల కొమ్మలపై విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయే...! ఆ విధంగా చక్రము, శంఖము, గద, అస్త్రములు మొదలైనవన్నీ ఈ నా చేతులలో అరూపంగా, ప్రేమాస్పదంగా విశ్రాంతి తీసుకుంటూ ఉంటున్నాయి.

నా ఈ చేతిగోళ్ళు మణి మాణిక్యాల వలె కాంతులు వెదజల్లుచున్నాయి. క్షీరసాగరం మథిస్తు న్నప్పుడు, ఆ ఒరిపిడికి నొప్పి పొందినది ఈ నడుమే. ఆ విష్ణువు కీర్తి అనేక శోభలతో, అనేకమంది మూర్తుల రూపమున నాకు కనిపిస్తోంది. అహో! విష్ణుమాయయే క్రొత్త జగత్ సమూహములను ఎప్పటికప్పుడు ప్రకటించుచూ "ఒక గొప్ప ఇంద్రజాలంలోని విలాసం" లాగా నాకు ఎదురవుతున్నది. అనేక నామ రూపాలతో జయ జయ నినాదాలు ఈ జనులు పలికేది ఆ ఏకోనారాయణునే కదా!

విష్ణు స్వరూపుడనగు నా ముఖమునందు ఈ సూర్యచంద్రులు రెండు కళ్ళలాగా వెలుగొందు చున్నారు. నా నీలమేఘ శరీరమే అంతటా అన్నివేళలా అఖండమై వెలుగొందుచున్నది. ధవళ ఛాయలతో శబ్దరూపమై ఆకాశమువలె మూర్తీభవించు 'పాంచజన్యము' అనే శంఖము ఈ నా కుడిచేతిని అలంకరించి ఉంటోంది. బ్రహ్మదేవునికి జన్మస్థానమైయున్న కమలము నా నాభి యందు జన్మించి నా చేతిని అలంకరించి ఉంటోంది. దేవ దానవులను కూడా మర్దించగల గద, దిక్కులను రక్తవర్ణముతో నింపివేయగల సువర్ణచక్రం నన్ను అంటిపెట్టుకొని ఉంటున్నాయి. చెడును ఖండించి, దేవతలకు, భక్తులకు ఆనందాన్ని ఇచ్చే ఖడ్గమిదే. ధనుష్టంకారాలతో దుర్మార్గుల గుండెలు 'దడేలు' మనిపించగల శారఙ్గము అను పేరుగల ధనుస్సు నా హస్తమును అలంకరించియున్నది.

అసంఖ్యాకములగు ఈ బ్రహ్మాండములన్నిటినీ నా యందు అనంతకాలంగా ధరించి ఉంటున్నాను. ఈ భూమి నా రెండు పాదములు. ఆకాశం నా శిరస్సు. ఈ 'స్వర్గ–భూ–పాతాళములు'

అనబడే మూడు లోకములు నా భౌతిక శరీరం. దిక్కులు నా పొట్ట. గరుడుని మూపును అధిరోహించి నేను వస్తుంటే లోకకంటకులు, అధర్మ నిరతులు అయిన దుష్టజీవులు వెనక్కు తిరిగి పారిపోతున్నారు. ఆ నీలవర్ణుడు, పీతాంబరధారి, గదాధరి, లక్ష్మీసమేతుడు అచ్యుతుడు అయిన మహావిష్ణువును నేనే అయి ఉన్నాను. సంకల్ప మాత్రం చేత ఈ ముల్లోకములను క్షణంలో దహించివేయగలను కదా! ఇక నన్ను ఎదుర్కొనగలవారు ఎవరు? కాలాగ్నిలో ప్రవేశించే మిడతలాగా నన్ను ఎదుర్కొనువాడు స్వవినాశనము గావించుకొనుచున్నాడు. మంద దృష్టి కలవారు వెలుతురును సహించలేనట్లు దేవతలు, రాక్షసులు నా తేజోమయ రూపమును చూచి సహించలేరు. బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని, రుద్రుడు మొదలగు మహనీయులంతా వేనోళ్ళ ఎల్లప్పుడూ పొగడుచున్నది నన్నే! నేను పరమైశ్వర్యయుక్తుడను.

సర్వ ద్వంద్వములకు అతీతుడను. సర్వోత్తమమైన మహిమతో కూడుకున్న వాడను. సముద్రంలో సుడిగుండం ఉన్నట్లు, ఈ మూడులోకములు నాయందే ఉన్నాయి.

ఒక వైపు నుండి దుష్టులగువారిని బలాత్కారంగా వినాశనమొనర్చటం, మరొక వైపుగా మేఘాలకు, పర్వతాలకు, సర్వ జీవులకు నివాసస్థానమై ఉండటం – ఈ రెండూ నా కార్యక్రమములే!

సర్వ సృష్టులు తన యందు ధరిస్తున్న నా విశ్వ – విశ్వంభర – విశ్వాంతరాళ – విశ్వాంతర్గత – విశ్వరహిత రూపం క్షణకాలం సాక్షాత్కరించినంతమాత్రం చేత ఈ జీవుల సర్వ దుఃఖములు తొలగిపోతాయి! అట్టి విష్ణుస్వరూపుడనగు నాకు నేను సాష్టాంగ దండ ప్రణామములు చేస్తున్నాను.

❖

## 3. విష్ణు స్తవనం

ఆ విధంగా ప్రహ్లాదుడు తన తనువును, మనస్సును విష్ణుమయంగా చేస్తూ, ఇంతలోనే "నేను ఇప్పుడు అట్టి మహిమాన్వితుడగు మహావిష్ణువును పూజించి సంతసింపజేస్తాను"... అని తలచాడు.

**ప్రహ్లాదుడు :** శంఖ చక్ర గదాధారివగు ఓ మహాప్రభో! విష్ణుమూర్తీ! నా పూజ యొక్క అనుకూలత కొరకు కల్పించుకున్న ఈ రూప నామములు ఒక వ్యష్టి కాదు! సమష్టి కూడా కాదు. మరి ఇంకెవరు? నా వాస్తవస్వరూపమే! ఇందులో ఏమీ సందేహమునకు ఆస్కారం లేదు.

నాయొక్క "వాస్తవరూపమే" అయిఉన్న ఆ విష్ణు భగవానుని హృదయంలోనే ఉండి – నాకు నేనే, నా గురించి నేనే ఈఈ పలుకులన్నీ పలుకుచున్నాను. హృదయంలో నుండి, ప్రాణవేగంచే భావన ద్వారా కల్పించబడుచున్న ఈ పుష్పాంజలిని, ఆ విష్ణుభగవానుని పాదాలకు సమర్పిస్తూ... ఇదే నా స్తోత్రం!

**వైనతేయ సమారూఢః స్ఫురచ్ఛక్తి చతుష్టయః**
**శంఖ చక్ర గదా పాణిః శ్యామలాంగ చతుర్భుజః**
**చంద్రార్క నయనః శ్రీమాన్ కాన్త నన్దకనందనః**
**పద్మపాణిః విశాలాక్షః శారఙ్గధన్వా మహాద్యుతిః ॥**

**తదేనం పూజయామ్యాశు పరివార సమన్వితమ్**
**సపర్యయా మనోమయ్యా సర్వసంభార రమ్యయా**
**తతఏనం మహాదేవం పూజయిష్యామ్యహమ్ పునః**
**పూజయా బాహ్యసంభోగమహత్యా బహురత్నయా ॥**

గరుడుని తన వాహనంగా కలవాడు, "ఇచ్ఛ, జ్ఞానము, క్రియ, అనుగ్రహము" అనే నాలుగు దివ్యమైన శక్తులు కలవాడు, శంఖము, చక్రము, గద చేతులందు ధరించినవాడు, చంద్ర సూర్యులే తన రెండు కళ్ళుగా కలవాడు, అయిన ఆ విష్ణువు సర్వే సర్వత్రా వెలుగొందుచున్నాడు. 'నందకము' అను పేరు గల ఖడ్గం చేత ధరించి సుజనులకు సంతోషం కలుగజేస్తూ ఉంటాడు. విశాలమైన నేత్రములు కలవారై, చేతిలో కమలము కలిగియుంటాడు. భుజము 'శారఙ్గము' అను పేరు గల ధనుస్సు ధరించి భక్తులకు ఉత్సాహం కలుగజేస్తూ ఉంటాడు. అట్టి సాంగ – సపరివార – సమేతుడగు విష్ణుదేవుని పూజ మనస్సుతో ప్రారంభిస్తున్నాను.

మనస్సుతో పూజ అయిన తరువాత రత్నములు పుష్పాదులతో బాహ్యమైన పూజ కూడా చేస్తాను. ఉభయ రీతులలో అర్చించెదను గాక!

❖

ఇట్లా తలచి, ఆ ప్రహ్లాదుడు సర్వసామాగ్రి సహితంగా లక్ష్మీపతియగు విష్ణుదేవుని పూజించాడు. అభిషేకములతోనూ, పూలతోనూ, ధూప దీప నైవేద్యములతోనూ, ప్రదక్షిణ–నమస్కార–ఆత్మ సమర్పణ లతోనూ ఆయనను అర్చించాడు. ఆ అంతఃపురంలోనే ఉచితాసనం సమర్పించాడు. ఉత్తమ, నిష్కల్మష భక్తితో నిండిన మనస్సుతో మానసిక పూజ ఆచరించాడు.

కొంతసేపు బాహ్యపూజ. మరికొంత సేపు మానసికమైన పూజ. ఈ విధంగా ఆతని సాధన కొనసాగింది. కొన్ని రోజులు అర్చనాదులను చేస్తూనే ఉన్నాడు. "యథా రాజా, తథా ప్రజా" అన్నట్లుగానే అక్కడి దైత్యులు కూడా విష్ణుభక్తిని అలవరచుకోసాగారు. ప్రజలు ఆచారములకు కారణభూతుడు రాజే కదా!

❖❖❖

## 4. దేవతలలో కలకలం - ఊరట

రాక్షసులందరూ విష్ణుద్వేషం త్యజిస్తున్నారనీ, విష్ణుభక్తిని సమాశ్రయిస్తున్నారని వార్తలు స్వర్గలోకం వరకు వ్యాపించాయి. ఇంద్రాది దేవతలు ఈ విషయం విని ఆశ్చర్యపోయారు. "ఈ దైత్యు లేమిటి? విష్ణుభక్తిని స్వీకరించటమేమిటి? ఎందుకిట్లా జరుగుతోంది?" అని ఆశ్చర్యపోసాగారు. గబగబా క్షీరసాగరం జేరి, నారాయణునితో ఇట్లు నివేదించారు.

**దేవతలు :** హే దేవాధిదేవా! ఆదినారాయణా! ఎంత ఆశ్చర్యమో చూచారా? మీ పట్ల ఎల్లప్పుడూ విరోధభావాలు కలిగి ఉండే రాక్షసులు ఈ రోజు మీ పట్ల భక్తితో తన్మయులై ఉంటున్నారు. మరి,

కారణమేమిటో తెలియదు. ఇదంతా ఏదైనా మాయయొక్క చర్య కాదు కదా! నిన్న మొన్నటిదాకా ప్రశాంతచిత్తులగు మునుల ఆశ్రమాలకు వచ్చి విధ్వంసం చేస్తూ ఉండటమేమిటి? ఈనాడేమో ... పవిత్రమైన జన్మ – స్థితి – గతులకు కారణం కాగల విష్ణుభక్తిని అలవరచుకోవటమేమిటి? ఎంతో ఉత్తమ కర్మల ప్రయోజనంగా విష్ణుభక్తి అలవడుతుంది. దుష్కర్మలను నిర్వర్తించేవారు మాయలోనే కొట్టుమిట్టాడుతారు తప్ప... విష్ణు భక్తికి అర్హత పొందకూడదే? పరహింసాపారాయణుడై ఉండే ఒక నీచుడు నీతి శాస్త్రకోవిదుడైనాడంటే అది ఎంత అసమంజసం? ఈ రాక్షసులు విష్ణు భక్తులౌతున్నారంటే, ఈ వార్త మమ్ములను ఎందుకో, భయపెట్టుతోంది. అమూల్యమైన ఒక మణి చెత్త కుండీలోనో, గాజు పెంకుల మధ్యో ఉండటం ఏం ఉచితం చెప్పండి! అకాలంగా పుష్పాలు పూస్తే... అది సుఖ ప్రదమంటారా? ఎక్కడన్నా మేక, కుక్క కలిసి జీవిస్తాయా? ఏ పదార్థం ఎక్కడుండటం శోభ కాదో ... అది అక్కడుండటం శుభమెట్లా అవుతుంది? పులి శాకాహారం తీసుకుంటుంటే ... అది అపసవ్యమే కదా! ఏ జీవికి ఏఏ గుణాలు ఉంటాయో... ఆ జీవి అందుకు తగినట్టి స్థితి గతులకే యోగ్యుడౌతాడని వేదనిర్ణయం కదా! అనుచితమైన రెండు వస్తువులు ఒకే చోట ఉండకూడదు కదా! కమలములు నీళ్ళలో ఉన్నప్పుడే శోభిస్తాయిగాని.... నేలపై శోభించవే! ఈ దానవులు ఎంతో కాలంగా క్రూరము – విచారణరహితము – అపవిత్రము అయిన ఏవేవో ఆచార వ్యవహారాలలో నిమగ్నమౌతూంటారు. మరొకరిని హింసించటంలో తప్పు లేదని సముదాయించుకుంటారు. మరి... అధమమైన నీచప్రవృత్తి గల రాక్షసులెచట? సృష్టి మొత్తంలో అత్యంత పవిత్రము, అనేక జన్మలలో ఆర్జించుకున్న పుణ్య ఫలితం అయినట్టి విష్ణుభక్తి ఎక్కడ? కమలాలు ఉండే సరస్సులో దుష్టమొక్కల పెరుగుదల దుఃఖ ప్రదమే అయినట్లు ...మీ పట్ల దానవుల భక్తి కూడా మాకు శుభ సూచక మనిపించటం లేదు.

**శ్రీమన్నారాయణుడు :** ఓ దేవతలారా! ప్రహ్లాదుడు నా భక్తుడు. మీరు అతని గురించి చింతించవలసిన పనే లేదు. ఆతనికి ఇదే ఆఖరు జన్మ. ఈ జన్మలోనే తన యొక్క భక్తి ప్రభావం చేత మోక్షమునకు అర్హుడు అగుచున్నాడు. ఇంతకీ మీరు ఎందుకు దుఃఖిస్తున్నారో చెప్పండి?

**గుణవాన్ నిర్గుణోజాత ఇతి అనర్థక్రమం విదుః ।**
**నిర్గుణో గుణవాన్ జాత ఇత్యాహుః సిద్ధిదంక్రమమ్ ॥**

గుణవంతుడు గుణహీనుడైతే అనర్థమౌతుంది గాని, గుణహీనుడు ఎందుచేతనైనా గుణవంతుడు అవుతూంటే ...అది మంచిదే కదా! అది అందరికీ సంతోషమైన విషయమే. ప్రహ్లాదుని సుగుణములు, మరొకరిని దుఃఖపెట్టేవి కానేకావు. సర్వసహజీవులకు విష్ణుతత్త్వానందం కలుగజేయ గలిగేది. అందుచేత మీరు నిశ్చింతగా మీమీ స్వస్థానములకు వెళ్ళండి. విష్ణుతత్త్వం అందరి సొత్తు సుమా!

ఇట్లు పలికి విష్ణుభగవానుడు క్షీరసాగర కెరటములలో అంతర్ధానమైనాడు. అప్పటి నుండి దేవతలు ఊరటజెందారు. తాము కూడా ఆతని పట్ల స్నేహ, సౌహార్ద్రభావాలు కలిగి ఉండటం ప్రారంభించారు. మహాత్ములు ఎవరి పట్ల సంతుష్టి కలిగి ఉంటే, తదితరులకు కూడా వారి పట్ల గురి కుదురుతుంది కదా!

❖❖❖

# 5. తరుణోపాయం

ప్రహ్లాదుడు ఈ శరీరంతోను, వాక్కుతోను, మనస్సుతోను వివిధ సమయాలలో వివిధరీతులుగా విష్ణు పూజ చేస్తూ కొన్ని రోజులు గడిపాడు. కొంతకాలానికి, ఆతని అంతరంగంలో వివేకము, సంతుష్టి, వైరాగ్యాది ఉత్తమ గుణాలు పెంపొందాయి. ఈ దృశ్య ప్రపంచంలో ఇంద్రియాలకు తారసపడే భోగసముదాయాలు – 'పెద్దల దృష్టిలో పిల్లల ఆటలు'లాగా అర్థరహితంగా తోచ సాగాయి. మనుష్యులు సంచరించే చోట తేళ్లు, పాములు సంచరిస్తాయా? శాస్త్రార్థములను మననం చేస్తూ ఉండే ఆ ప్రహ్లాదుని మనస్సులో లౌకికమైన ధన, నారీ జనాది విషయాలకు చోటు లభించటం లేదు. ఆతనికి ఈ సకల దృశ్యపదార్థములలో ఏ ఒక్కటీ ప్రీతి గొలుపటం లేదు. "ఈ దృశ్య భోగాలన్నీ రోగ రూపములే కదా! వీటిలో ఏం ప్రత్యేకత ఉన్నది?" అను నిస్సంశయమైన అవగాహన ఆతని యందు రూపుదిద్దుకొన్నది.

ఆతడు భోగాల పట్ల సర్వ ఆశలను విడనాడాడు. అయినప్పటికీ, ఎందుకో... ఆతని మనస్సు పూర్ణ విశ్రాంతి పొందనే లేదు. ఆతని చిత్తము ఇటు భోగములను ఆశ్రయించుటలేదు... అటు శుద్ధ బ్రహ్మమునందు విశ్రాంతి పొందుట లేదు. ఆతనికి ఏమి చేయాలో పాలుపోవటం లేదు.

❖

విష్ణు భగవానుడు తన యొక్క "శుద్ధసాత్వికము – సర్వత్రా వ్యాప్తము" ... అయినట్టి జ్ఞాన శక్తిచే తన భక్తుడగు ప్రహ్లాదుని మానసిక స్థితిని గమనించాడు. భక్తులకు సంతోషం, ఉత్సాహం కలిగించటం ఆయన యొక్క స్వభావం కదా! అందుచేత పాతాళమార్గంగుండా ప్రహ్లాదుని పూజా మందిరంలో ప్రవేశించాడు. ప్రహ్లాదుడు తన ఎదుట మూర్తివంతుడై ప్రత్యక్షమైన విష్ణుభగవానుని చూచాడు. పులకిత శరీరుడై హర్షాతిరేకంతో పెద్ద గొంతుకతో ఇలా గానం చేశాడు.

**ప్రహ్లాదుడు :**

> **త్రిభువన భవనాభిరామకోశం, సకల కలంకహరం పరం ప్రకాశమ్**
> **అశరణశరణం శరణ్యం, ఈశం, హరిమ్, అజమ్, అచ్యుతమ్, ఈశ్వరం ప్రపద్యే ॥**
>
> **కువలయదలనీల సంనికాశం, శరదమలాంబర కోటరూపమానమ్**
> **భ్రమర – తిమిర–కజ్జల–అంజనాభం, సరసిజ చక్ర–గదాధరం ప్రపద్యే॥**
>
> **విమల మలికలాప కోమలాంగం, సితజల పంకజ కుడ్మలాభ శంఖమ్ ।**
> **శ్రుతిరణిత విరన్చి చంచరీకం, స్వహృదయ పద్మదలాశ్రయం ప్రపద్యే ॥**
>
> **సితనఖగణ తారకావికీర్ణం, స్మితధవలానన పీవరేన్దు బింబమ్**
> **హృదయమణి మరీచిజాలగంగం, హరిశరదంబరమ్ ఆతతమ్ ప్రపద్యే ॥**
>
> **అవిరలకృతసృష్టి సర్వలీనం, సతతమ్ అజాతమ్, అవర్ధనమ్, విశాలమ్**
> **గుణశతజరఠాభిజాత దేహమ్, తరుదలశాయినమ్ అర్భకం ప్రపద్యే ॥**

**నవ వికసిత పద్మరేణుగౌరం, స్ఫుటకమలా వపుషా విభూషితాంగమ్**
**దినశమ సమయా అరుణాంగరాగం, కనకనిభాంబర సుందరం ప్రపద్యే॥**

**దితసుత నలినీ తుషారపాతం, సురనలినీ సతత ఉదిత అర్కబింబమ్**
**కమలజ నలినీ జలావపూరం, హృదినలినీ నిలయం విభుం ప్రపద్యే ॥**

**త్రిభువన నలినీ సితారవిందం, తిమిర సమాన విమోహా దీపమగ్ర్యమ్**
**స్ఫుటతరమ్ అజడం చిదాత్మతత్త్వం, జగదఖిలార్తిహరం హరింప్రపద్యే ॥**

ప్రభో ! శ్రీమన్నారాయణా! వాసుదేవా! త్రిలోకరక్షకా! హృదయం లోపల, బయట కూడా ఉన్న అంధకారం నశింపజేయు మహానుభావా! ఈ జగత్తులు, సూర్యచంద్రులు ఏర్పడుటకు కారణ మైనవాడా! నమస్కారమయ్యా! దిక్కులేనివారికి దిక్కునీవేకదయ్యా! సర్వ శరణ్యుడవు, ఈశ్వరుడవు, అజుడవు, సర్వ దుఃఖహారుడవు అగు ఓ విష్ణుభగవాన్ ! నేను నిన్ను శరణువేడుచున్నాను. హృదయ కమలంలో వేదమే స్వరూపముగా గలిగినట్టి బ్రహ్మదేవుని ధరించినట్టి నీవే మమ్ములను రక్షించాలి! అనంత, ఆకాశస్వరూపుడవు. ఆదిమధ్యాంత రహితుడవు, ఈ విశాలసృష్టినంతా నీ యందు లీన మొనర్చుకున్నవాడవు, ఉత్పత్తి – వినాశ రహితుడవు అగు ఓ తండ్రీ! ప్రళయ కాలసమయంలో నీవు “సత్యము” మొదలైన మాయాగుణములచే ప్రేరేపితులై, సనాతనులై, సుందర దేహులై ఒక పసిబిడ్డ రూపంలో మఱ్ఱిచెట్టు ఆకుపై శయనిస్తారట కదా! అట్టి మీకు సాష్టాంగదండ ప్రణామములు. లక్ష్మీదేవిచే అలంకరించబడిన వక్షస్థలం గల మిమ్ములను సేవిస్తున్నాను. సర్వవ్యాపకులై, దుష్ట క్రియలను నిర్వర్తించే రాక్షసులను మట్టుబెట్టి, మీ భక్తులగు దేవతలను, తదితరులను సర్వదా రక్షిస్తూ ఉంటారు కదా! నాకు మార్గము – ఆశ్రయము – లక్ష్యము మీ పాదములు మాత్రమే! మిమ్ములను శరణువేడుచున్నాను. కిరణములన్నిటికీ సూర్యుడు ఉత్పత్తిస్థానమైనట్లు... ఈ జగత్తులోని ప్రతిజీవికి ఉత్పత్తి స్థానం మీరే! ‘అజ్ఞానం’ అనే కారుచీకటిలో తారట్లాడుతుంటే, మాకు లభిస్తున్న కాంతి దీపమే మీరు. మీరు నిత్యులు! స్వయం ప్రకాశకులు! జడత్వముకంటే విలక్షణమైనట్టి చిదాత్మస్వరూపులు! స్మరణ మాత్రంచేత సర్వజీవుల దుఃఖమును హరించివేసేవారు! హే శ్రీహరీ! నారాయణా! సర్వేశ్వరా! దీనబంధూ! మిమ్ములను నేను మరలమరల ఆశ్రయిస్తున్నాను. శరణు వేడుచున్నాను. ప్రియురాలు ప్రియుని పొందగోరునట్లు, బెంగపడిన బిడ్డ తల్లియొక్క స్పర్శను కోరు కున్నట్లు, నేను మీ ఆగమనాన్ని కోరుకొంటున్నాను. మీ దర్శనమైనది, ఇక నాకేం కావాలి!

❖

ప్రహ్లాదుడు చేసిన స్తుతులను విని విష్ణుభగవానుడు సంతోషించి, ఎంతో వాత్సల్యంతో ఇట్లు పలికాడు–

**శ్రీమన్నారాయణుడు :** పుత్రా! ప్రహ్లాదా! నీ భక్తిపూర్వకమైన స్తోత్రానికి నేను సంతసించాను. నీలో ఉన్న కొంచెం నిరుత్సాహం తొలగించాలనే ఉద్దేశంతో వచ్చాను. నీకు ఏమి కావాలో కోరుకో! అది నేను నీకు సంతోషంగా ఇచ్చి నిన్ను ఆనందపరుస్తాను.

❖

ప్రహ్లాదుడు అది విని, కాస్త యోచనలో పడ్డాడు. ఆహా! ఏమి సుదినం! సర్వలోక నియామకుడగు పరంధాముడు నా ముందుకు వచ్చి ఏమి కావాలో కోరుకోమంటున్నారే! ఏదో సామాన్యులైతే, మనం సామాన్యమైన విషయాలు అడుగుతాం! సర్వకర్త, సర్వభోక్త అగు ఈ సర్వేశ్వరుని ఏం అడగాలి? ఏవో కొన్ని వస్తువులు అడగవచ్చు! ...కాని, ఏది పొందినా, అదంతా కొంత కాలానికి విసుగు కలిగిస్తుంది. ...చివరికి దుఃఖంగా పరిణమిస్తుంది కదా!

**ప్రహ్లాదుడు :** స్వామీ! నేను ఏదీ కోరి ధ్యానించటం లేదు. మీపట్ల స్వభావసిద్ధంగా ప్రేమ జనించింది. నాకు ఇంకేం కావాలి. అహంతు అ కామః!

**శ్రీమన్నారాయణుడు :** నాయనా! నీ అప్రకృత్రిమ భక్తి ప్రేమలకు మరింతగా సంతోషించాను. ఏది కావాలన్నా ఇచ్చి సంతోషింపజేయటానికి నేను సంసిద్ధం.

**ప్రహ్లాదుడు (తనలో) :** అయినా... ఈ సర్వలోకములలో ఉత్తమోత్తమమైనదేది? సర్వసంసార దుఃఖములను తొలగించగలిగేది ఏదైనా ఉన్నదా? అట్టిదేదైనా ఉండి ఉండవచ్చునేమో! అయితే, స్వల్పబుద్ధిగల నాకు అదియేమో తెలియటం లేదే!

అయినా, నా ఎదురుగా ఉన్నది సామాన్యుడా! సర్వజ్ఞుడగు నారాయణుడు కదా! నా బుద్ధిని ఉపయోగించి ఏదో ఒకటి అడిగే బదులు, ఆయననే సంప్రతించి, ఆ తరువాత అడిగితే పోలేదా?

**ప్రహ్లాదుడు (శ్రీమన్నారాయణునితో):** హే ప్రభో! మీరు సర్వసంకల్పముల ప్రదాత కదా! సర్వ లోకాలలో అంతఃస్థితులై ఉంటారు. ఇక మిమ్ములను నేనేం కోరాలి! దర్శనం ప్రసాదించారు. నాకు అంతే చాలు! అయితే, అంతటి మీరు నాపై దయతో ఏదైనా కోరుకోమంటే... ఏదోకటి కోరుకోవాలి కదా..! నా అల్పబుద్ధిని ఉపయోగించి ఏమైనా కోరితే... ఆ కోరిన దాని ప్రయోజనం కూడా అల్పంగానే ఉంటుంది. మీరు భక్తులకు తండ్రి, సోదరుడు, మిత్రుడు, సర్వస్వము కదా!

అందుచేత మీకు ఒక చిన్న విన్నపం చేస్తున్నాను. మీరు ఏది సర్వోత్తమమని, దుఃఖసంసార దోషరహితమని అనుకుంటారో ...అట్టి దానిని, నా అర్హతను అనుసరించి మీరే ప్రసాదించండి. మీరు ఏది ఇస్తే, దానిని మహాప్రసాదంగా స్వీకరిస్తాను.

**శ్రీమన్నారాయణుడు :** నాయనా! ప్రహ్లాదా! సర్వోత్తమమైనది సర్వదోషరహితమైనదై ఉండాలి. సర్వవస్తువులకు, దృశ్యమంతటికీ అతీతమైనదై ఉండాలి కదా! అందుచేత, పరమానందదాయకమైనది వస్తుజాలంలో లేదు. 'ముక్తి'యే అన్నిటికీ మించినది. అయితే, సంసార భ్రమరహితమైనట్టి ముక్తస్థితి సమగ్రమైనట్టి నీయొక్క అవగాహనముండే ప్రాప్తిస్తుంది. అందుకు నీకు నీవుగా తత్త్వవిచారణను ఆశ్రయించటమే ఉపాయం.

పరమోత్తమమైన ఆశయంగల నీవు బ్రహ్మమునందు ప్రశాంతపూర్వకమైన విశ్రాంతి లభించే వరకూ 'తత్త్వవిచారణ'ను చేయి. ఆత్మయొక్క స్వరూప స్వభావాల గురించి "విచారణ"కు ఉపక్రమించు. శుభమస్తు!

❖

ఇట్లు పలికి, చిరునవ్వు కురిపిస్తూ నారాయణుడు అంతర్ధానమైనాడు. ప్రహ్లాదుడు స్వామికి భక్తి పారవశ్యంతో హృదయకుసుమాంజలి సమర్పించటం పూర్తి చేసి, అప్పటికప్పుడే ఏకాంతంగా ఒక చోట పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు. కొంతసేపు అత్యంత ప్రీతిపూర్వకంగా శ్రీమన్నారాయణుని స్తోత్రం గానం చేశాడు. ఇక ఆ పై విచారణకు ఉపక్రమించాడు.

❖❖❖

## 6. తత్త్వ విచారణ

**ప్రహ్లాదుడు (అంతరంగంలో) :** సర్వసంసార దుఃఖాలను సంహరించ గల ఆ విష్ణుమూర్తి ఇప్పుడు నాకు చెప్పినదేమిటి? 'విచారణ చేయి' అని కదా! సరే, ఇప్పుడు నేను విచారణ ప్రారంభిస్తున్నాను. నేను విచారణ చేయవలసింది దేని గురించి? 'నేను' గురించే! అదియే ఆత్మవిచారణ కూడా కదా!

**నేను అనగా ఎవడను? -** ఈ మాట్లాడుచూ, నడుచుచూ, కూర్చుంటూ, ఆయా ప్రయత్నములు చేస్తూ, విషయములను స్వీకరిస్తూ ఇప్పుడు ఈ విచారణకు ఉపక్రమిస్తున్నట్టి నేను ఎవరు?... దృశ్యంలోని ఒక వస్తువునా?

"కొయ్య-రాయి-మట్టి" వంటి ఒక పదార్థమునా? దేహములో ఉంటూ సర్వమును చూస్తున్నట్టి నేను ఒక బాహ్యమైన వస్తువును ఎట్లా అవుతాను? ఒక వస్తురూపంగా చూస్తే ఈ దేహమునకు బాహ్యమైనదేదీ నేను కాదు.

**ఈ దేహమే నేనా? -** (ఒక్కసారి తన దేహం వైపు చూచాడు). ఈ కనబడే నా దేహమును ఒక్క సారి పరిశీలనగా చూస్తే, ఇది కొద్దికాలం క్రితం రూపందిద్దుకొని మరికొద్ది కాలంలో నశించబోతోంది. ఇది స్వయంగా ఏమీ చేయలేదు. దీనిని ఆయా క్రియలకు వినియోగిస్తున్నది నేను. మరి నేను ఈ దేహమును అవుతానా? రక్త - మాంస - బొమికలచే రూపంకలిగియున్న ఈ దేహం ప్రాణవాయువుచే ఉనికి - చలనములను పొందుతోంది. ఈ దేహనాశనమునకు కూడా సాక్షినైన నేను ఇందులోని కాళ్ళు, చేతులు, చర్మము అవటానికే వీలులేదు.

**నేను శబ్దమునా? -** "ప్రహ్లాదా" అని జనులచే పిలువబడుచున్న నేను ఒక శబ్దమునా? శబ్దం ఈ నా చెవులచే కల్పించబడినదై శూన్యాకాశంలో ఉత్పన్నమౌతూ, ఇంతలోనే శూన్యమును పొందు తోంది. పైగా, అది బాహ్యమునందే ఉంటోంది. స్వయంగా ప్రవర్తించేదికాదు కనుక అది జడమైనది మాత్రమే. జడమైనది నేనెట్లా అవుతాను?

**స్పర్శానుభవమే నేనా? -** ఈ చర్మమును ఏదైనా తాకినప్పుడు ఒకక్షణ కాలంలో 'స్పర్శ' అనే అనుభవం పుట్టి, ఇంతలోనే నశించిపోతోంది. ఒకప్పుడు ఏర్పడి, మరొకప్పుడు లేకుండా పోవుచున్న అచేతనమగు 'స్పర్శ'ను నేనెట్లా అవుతాను. అది నాచే పొందబడే 'అనుభవం' మాత్రమే. 'అనుభవజ్ఞుడు' అయిన నేను వేరు... అనుభవం వేరు. స్పర్శజ్ఞానం-స్పర్శాభవం నాకు కొన్ని సమయాలలో ఉండవచ్చు గాక! మరికొన్ని సమయాలలో ఉండకపోవచ్చు. అయ్యది నేనెట్లా అవుతాను?

**నా స్వరూపము రుచియా? -** ఈ శరీరంలో ఒక భాగమై ఈ శరీరంలాగానే అనిత్యమైన ఈ నాలుక నేను తింటున్నప్పుడు 'రుచి' అను అనుభూతిని కలుగజేస్తోంది. పైగా, ఈ నాలుక నా ముక్కు క్రింద నుండి కంఠభాగం వరకు మాత్రమే విస్తరించియున్నది. 'ఆస్వాదన' అనేది కూడా ఒక బాహ్యమైన అనుభవం మాత్రమే. అటు పదార్థము – ఇటు నాలుక ఒక చోట జేరినప్పటి నా అనుసంధానమే అది. అనగా అది నా సమక్షంలో నాచే, ప్రభావితమై ఉంటోంది. అట్టి జడానుభవం మరి నేనెట్లా అవుతాను? కాను.

**కనబడే రూపము నేనా? -** ఒకానొక రూపంతో నేను చూడబడుచున్నాను. అయితే ఇక్కడ చమత్కారం ఏమంటే – ఈ రూపము అనబడేది కనుల యొక్క అధీనంలో ఉంటూ, ద్రష్ట యందు పరికల్పన పొందుచున్నది. ద్రష్ట యొక్క దృష్టిని అనుసరించి నా ఈ దేహము "ప్రియ–అప్రియ, శత్రు–మిత్ర" ఇత్యాది భావాలతో దర్శించబడుతోంది. నేను ఈ దేహంలో ద్రష్టత్వము' అనే నా 'కళ' ను ప్రదర్శిస్తున్నాను. కనుక ద్రష్ట ఈ నా భౌతిక రూపము కంటే వేరు అయి ఉన్నాడు. రూపం ఏర్పడటానికి ముందే ద్రష్ట ఉన్నాడు. ఎట్లా అంటే, చూచేవాడు మునుముందుగా ఉంటే కదా, 'చూడటం' అనే ప్రక్రియ ఏర్పడగలిగేది?

అందుచేత దృష్టి యొక్క స్వభావమగు 'రూపము'ను నేను కాదు. ఆ రూపమును గుర్తిస్తున్న 'ద్రష్ట' యొక్క స్వభావమును స్వీకరిస్తున్న వాడనే నేను. కనుక 'రూపం' యొక్క అనుభవ పరిమితుడను నేను కాదని తేలిపోతోంది.

**సువాసన (ఆఘ్రాణం) నేను అవుతానా! -** రూపములాగానే గంధము కూడా అనుభవం మాత్రమే. అది కూడా స్వయంగా ప్రవర్తించేది కాదు. కాబట్టి అది నేను కాదు.

మరి ఇంతకీ ఈ ప్రపంచంలో సంచారం చేస్తున్నట్టి నేను ఎవరు?

**ఈ మనస్సు - బుద్ధి - అహంకారములు నేనా? -** నా యొక్క మననము చేయు స్వభావమే మనస్సు కదా! అనగా, నేను ఈ దృశ్యము మొదలైన వాటిని మననం చేస్తూ ఉండగా, అట్టి ప్రక్రియను విజ్ఞులు 'మనస్సు' అనే పేరు పెట్టారు. నేను చేస్తున్న పని వేరు... నేను వేరు కదా! అందుచేత మనస్సు అనబడేది కూడా నేను కాదు.

అదే కారణంగా నిర్ణయాత్మకస్వభావం అయినట్టి ఈ 'బుద్ధి' కూడా నేను కాదు. 'నేను చేయు నిర్ణయము – నేను' .... వేఱువేఱై ఉన్నాము కదా!

ఇక 'అహంకారము' అనబడేదానికి నేను వస్తే... 'నేను' అను భావనయే అహంకారము కదా! ఆ భావనను భావనచేస్తున్న నేను "అట్టి భావనకంటే ముందే ... అట్టి భావన ఏర్పడుటకు స్థానమై" ఉండనే ఉన్నాను కదా! కనుక "నేను ఒక జీవుడను ... ప్రహ్లాదుడను... ఈ జాతి వాడను" వంటి పరిమిత అహంకారభావన ఏదీ నేను కాదు.

**మరినా వాస్తవ స్వరూపమేమిటి? నేనెవడను? -** (ఒక్కసారి ఆనందంగా కేకవేసి, మరల ఇట్లు అనుకోసాగాడు.) ...ఓహో! ఇప్పుడు తెలిసిపోతోంది. ఆత్మకు మమత్వమనేదేదీ లేదు

మనస్సు లేదు. ఆత్మ మనస్సు కంటే మునుముందే ఉన్నది. ...ఈ పంచేంద్రియములకు సంబంధించిన ఏ అనుభవమూ ఆత్మ కాదు. ...సర్వ సంకల్పములకు ఆవల ఆత్మ ఉన్నది. ...శుద్ధ చైతన్యరూపము అద్దానిది ...అట్టి ఆత్మయే ఎల్ల వేళలా నేను.

చిన్మయరూపుడనగు నా యందు విషయము లనేవే ఉండవు. సర్వమును ప్రకాశింపజేయునది నేనే. శాశ్వతమూ, అఖండమూ అగు నా యొక్క స్వస్వరూపము చేతనే గదిలోని దీపం వలె, – ఒక రాయి మొదలుకొని, సూర్యుని వరకూ సర్వమూ ప్రకాశింప జేయబడుతోంది.

ఈ జగత్తంతా ఏ నిర్వికల్ప చిదాభాసం అయి ఉన్నదో ...అట్టి సర్వ వ్యాపకమగు సర్వాత్మయే నేను!

❖

అగ్ని చేతనే అగ్నికణములు ప్రజ్వరిల్లుచున్నాయి కదా! చైతన్య స్వరూపుడనగు నావలెనే ఈ ఇంద్రియ వృత్తులన్నీ స్ఫురిస్తున్నాయి. అన్నిటినీ వెలిగిస్తూ సర్వకార్యములందు ప్రసరించి ఉన్నది ఆత్మయే. దాని సమక్షమునందు సర్వపదార్థముల సత్త ప్రతిపాదించబడుతోంది. ప్రతిబింబములకు ఆశ్రయం అద్దమే కదా! ఈ దేహ – ఇంద్రియ – మనో – బుద్ధులకు ఆత్మయే ఆశ్రయమైవున్నది. చంద్రుడు శీతలంగా, పర్వతం ఘనంగా, పాలు ద్రవంగా ఉండేది ఆ చిద్రూపప్రభావం చేతనే.

"ఈ ఎదురుగా ఉండే పదార్థాలు (Matter) ఎక్కడ నుండి వచ్చాయి?" అని మనం పరిశీలించు కుంటూ పోయామనుకో. అప్పుడు కూడా "ఆకాశం ...ఆకాశం నుండి వాయువు ...వాయువు నుండి అగ్ని, ...అగ్ని నుండి జలం ...జలం నుండి ఘనం" అను పరిశీలనలన్నీ ఆత్మ దగ్గిర నుండే బయలుదేరి, ఆత్మ వద్దకు వచ్చి ఆగుచున్నాయి. ఎందుకంటే... ఆకాశం ఆత్మ యొక్క ధ్యానం నుండే బయల్వెడలుతోంది.

ప్రతిదానికీ మరొక కారణం ఉండి తీరుతోంది ...ఒక్క ఆత్మకు తప్ప! ఆత్మకు మాత్రం మరొక కారణమంటూ ఏదీ లేదు. 'సత్' రూపమైనట్టి అదే, సర్వ కారణములందూ వ్యాపించి ఉంటోంది.

ఆత్మచేతనే సర్వమూ కలుగుచున్నాయి. "శీతలం" నుండి అనేక ఆకారములైన మంచు గుట్టలులాగా ఆత్మ భగవానుని నుండే సృష్టికి కారణ భూతులగు బ్రహ్మ – విష్ణు – మహేంద్రాదులు ఆవిర్భవిస్తున్నారు. వారంతా సృష్టికి కారణమగుచూ, ఆత్మయే తమ ఉత్పత్తి – ఉనికి – ఔన్నత్యములకు కారణముగా కలిగి ఉంటున్నారు. అట్టి ఆత్మకు, ఆపై, మరొక కారణమంటూ ఏదీ లేదు. దానిని మనమెవ్వరమైనా "చిత్తము – విషయము – ద్రష్ట – దర్శనము – దృశ్యము" అని పిలువదలచుకొంటే, అదంతా "పరిమితమైన అవగాహన వల్లనే" అని అనకతప్పదు.

అట్టి నిత్య స్వయంప్రకాశరూపము, నా రూపము, సర్వుల స్వస్వరూపము అగు ఆత్మకు పలుమార్లు వందన సమర్పణ చేస్తున్నాను.

ఇప్పుడు నాకు తెలియవస్తున్నదేమంటే.... నిర్వికల్పమగు "చిదాత్మ" యందే గుణ భూతములైన పదార్థములన్నీ స్థితి కలిగి ఉండి, భావావేశముచే ప్రకాశిస్తున్నాయి.

**ఇదంతా సంకల్పమాత్రమే! -** సూక్ష్మమగు ఈశ్వరరూపమే కారణములన్నిటికీ కారణమై ఉన్నది కదా! అయితే ఆ చైతన్యము ఏ పదార్థము గురించి ఎట్లు సంకల్పిస్తుందో, అది అట్లే అంతటా సంభవించుచున్నది. మరింకేది కాదు. "ఇది కుండ" అని అనుకుంటే అట్టిది "మట్టి కంటే వేరైన కుండ" అనునట్లుగానే అనుభవమౌతోంది. అది దేనినైతే భావించదో అట్టిది స్థూల సూక్ష్మ రూపమున ఉన్నప్పటికీ కూడా అది నశించినదిగానే అగుచున్నది. ఆ విశాల చిదాకాశము ఒక దర్పణము వంటిది. ఈ జగత్సంబంధమైన భూతాకాశాది విశేషములు, పదార్థములు, అన్నీ అందులో ప్రతిబింబిస్తున్నాయి.

అట్టి చిదాకాశమే నేను. ఆత్మయందే ఈ పదార్థములన్నిటి యొక్క – మనోబుద్ధిచిత్తాహంకారాల యొక్క – ఉత్పత్తి, వృద్ధి, క్షయాలు అధ్యస్థమై ఉన్నాయి.

**స్వస్వరూపమగు ఆత్మను పొందటానికి అర్హతలేమిటి? –** అట్టి ఆత్మ అజ్ఞులచే గాంచబడుటలేదు. ఇక చిత్తరహితులగు నిర్మల జీవుల చేతనో – అది సర్వదా పొందబడియే అనుభవమౌతోంది. అతి నిర్మలమగు చిదాకాశము సజ్జనులగు జ్ఞానులకు మాత్రమే గోచరిస్తోంది. సమస్తమునకూ కారణ భూతమగు చిద్రూపము నుండే వివిధమగు ఆచారములతో కూడిన దృశ్యలత విజృంభిస్తోంది. కొండపై నుండి చెట్లు లేస్తున్నట్లుగానే, చేతనరూపుడగు పరమాత్మ నుండి ఈ సువిశాల ప్రపంచమంతా ఆవిర్భవిస్తుంది.

బ్రహ్మ నుండి గడ్డిపరకవరకూ సర్వాన్ని ప్రకాశింపజేసేది పరమాత్మే. తాను ఆకార రహితము, ఆద్యంత రహితము, ఏకము, సర్వవ్యాపకము అయి ఉండికూడా, అదే తరుణంలో ఈ చరాచర ప్రాణికోట్ల హృదయాంతరములలో 'అనుభవం' రూపమున ఉన్నది నేనే. ఆ పరమాత్మయే సర్వరూపుడై, ప్రహ్లాద రూపుడై కూడా చెన్నొందుచున్నాడు. అనగా, ఈ ప్రహ్లాదనామ ధేయజీవుని సద్గుణ దుర్గుణాలన్నీ ఆ పరమాత్మవే!

**ఈ ఎదురుగా కనబడేదంతా ఉన్నది నాలోనే...! -** ఈ స్థావర జంగమాత్మకమగు ప్రాణికోట్ల శరీరాలన్నీ అపరిచ్ఛిన్న రూపంగా పరమాత్మ స్వరూపుడనగు నాయందే ఉన్నాయి. అనుభవ స్వరూపము, ఏకమూ అగు నేనే సర్వమునకు దృక్కును కూడా.

నేనే ద్రష్టను ...చూడబడుచున్నది కూడా నేనే! ...దృక్, ద్రష్ట, దర్శనము – ఇవన్నీనా చిత్కళలే! ఈ అసంఖ్యాకములగు కాళ్ళు చేతులు కలిగినవాడను నేనే.

నేను సూర్యుని రూపమును ధరించి ... అదిగో.. ఆకాశంలో విహారం చేస్తున్నాను. వాయు దేహముతో అన్ని వైపులా సంచారం చేస్తున్నాను. శంఖ – చక్ర – గదా సహితమగు నా రూపమే జగత్తుగా వ్యవహరించబడుచున్నది.

నేనే ఈ జగత్తునందు ఆవిర్భవించి కూడా, సర్వదా పద్మాసనముపై విరాజమానుడనై నిర్వికల్పసమాధియందు మిక్కిలి శాంతిని పొందుచున్నాను ...చతుర్ముఖుడగు బ్రహ్మను నేనే.

తాబేలు తన శరీర భాగములన్నీ తన యందు దాచుకుంటుందే! ఆ రీతిగా నేను త్రినేత్రుడనై ప్రళయకాలంలో ఈ జగత్తునంతా సంహారమొనర్చున్నాను. ఒక సమయంలో ఇంద్రరూపమును పొంది ఈ మూడు లోకములను నేనే పాలన చేస్తున్నాను.

కుమారస్వామినై దేవతల సేనానాయకుడనైనది నేనే. ఈ అనేక స్త్రీ పురుష రూపములు కూడా నావే! నేనే!

ఒక వైపు అనంత ముఖుడనై ఒప్పుచున్నాను. మరొక వైపు దేహదారుడను అగుటచే దేహత్వమును పొందుచున్నాను ...నేనే జీవాత్మను. నేనే పరస్వరూపుడను. పరమాత్మను!

నేనే రసరూపుడనై భూమి యందు మొక్కలను ఉత్పన్నం చేస్తున్నాను.

**స్వలీలార్థమిదం చారు జగదాడమ్బరం తతమ్ ।**
**మయాభిజాత బాలేన పఙ్కక్రీడనకం యథా ॥** (శ్లో 49, సర్గ 34)

ఆడుకోవటానికి బాలుడు మట్టిబొమ్మను నిర్మించుకొనునట్లు, నాయొక్క విలాసము కొరకే ఈ జగదాడంబరమంతా విస్తరింపజేశాను. ఈ లోకక్షేమాభిలాషులగు దేవతల, లోకకంటగులగు రాక్షసుల రూపంగా చెన్నొందుచున్నది నేనే!

**ఇదంతా నన్నే ఆశ్రయించి ఉంటోంది -** నేనే అంతటా కార్యరూపమున వ్యాపించి ఉన్నాను కదా! అయితే, నా స్వస్వరూపం నాకు సాక్షాత్కారమైన మరుక్షణం ఈ కార్యరూపసత్తా అంతా నశించగలదు. అంటే ఏమిటి...? తత్త్వదర్శనముచే జీవన్ముక్తుడనైనానా,.. పరివ్యక్తమగుచున్న ఈ జగత్తంతా అప్పుడు "లేనిదే" అయిపోతోంది. నా "చిద్రూపము" అనే దర్పణము వంటి స్వరూపంలో ఏది ప్రతిబింబిస్తుంటే అది మాత్రమే ఉనికిని కలిగి ఉంటోంది. తదితరమైన దానికి ఉనికియే లేదు. అందుకే నాకంటే వేరుగా ఈ ప్రపంచంలో ఏదీ లేనే లేదు.

పుష్పములోని శోభ, సుగంధము, కాంతి కూడా నేనే! ఏదైతే సంకల్పరహితమై ఉన్నదో అది నేనే!... రసతన్మాత్ర (The factor of taste) మొట్టమొదట జలంలో వ్యాపించి ఉండి, అదే వృక్షములోకి ప్రసరిస్తోంది కదా! ఆ విధంగానే అన్నిటికీ నిమిత్తకారణాన్ని(That which is causing all else) నేనే.

సర్వోత్తముడనై, సర్వపదార్థములందూ అంతర్యామినై నా ఇచ్ఛచే ఈ పలు విధములైన 'జీవ సంవిత్తు' లను ఉత్పన్నం చేస్తున్నాను. పాల యందు నేయి, జలమునందు రుచి ఉన్నట్లు, అన్నింటా – అందరి యందూ మూడు కాలములందూ చిత్‌శక్తిరూపంగా ఉంటున్నాను. దిక్కులన్నీ పూరించుచూ భ్రమగాని, సంకోచముగానీ లేనివాడనై ఉన్నాను. సర్వపదార్థములకు అస్థిత్వము ప్రసాదించుటచే 'సర్వకర్త' ను నేనే. విరాట్ సామ్రాట్టుగాను (సమష్టి – వ్యష్టిగానూ) వ్యవహరిస్తున్నది నేనే.

**నేనెంతటి విశాల రూపుడను! -** ఈ 'విశాల జగత్తు' అనే రాజ్యం నేను కోరకుండానే లభిస్తోంది. ఆహా! నేనెంతటి విస్తార స్వరూపుడనో కదా! నాయందు నేనే ఇమిడి ఉండుట లేదే! నిరతిశయానందరూపమున స్వయంగా అనుభూతమగుచున్న నా ఆత్మయొక్క అంతమును నేను

చూడలేకపోతున్నానే! రాజవీధితో నడచిపోతున్న ఒక ఏనుగును ఉసిరికాయలో పట్టి ఉంచగలమా? బ్రహ్మచే నిర్మించబడిన 'జగత్తు' అను చిన్నిఇంట్లో అనంత విస్తారస్వరూపమగు నా చిత్స్వరూపము పట్టేదెట్లా? ఈ లోకాలు ఈ బ్రహ్మాండాలు దాటిపోయి, "24 లేక, 36 తత్త్వాలు" దాటి పోయి వెళ్ళుచున్నప్పటికీ నా స్వస్వరూపమునకు అంతుదొరకటమే లేదు.

నాకు, ఈ పరిమిత కల్పనలా? ఎట్లా కుదురుతుంది?

ఇదంతా బాగానే ఉన్నది ...ఇప్పుడు నాదొక సందేహం-

"అనంతుడను, ఆశ్రయరహితుడను" అగు నాకు ఈ దేహాదుల కల్పనంతా ఎట్లా కలిగింది? ఆది - అంతము లేని చిత్ స్వరూపుడనగు నేనెక్కడ? రక్త మాంస నిర్మితమైన 'శరీరము' అనబడే ఈ పరిమితత్వము - న్యూనత ఎక్కడ? ఇది నాకు సంభవించటమేమిటి? ఈ 'నీవు - నేను' అను కల్పనలన్నీ మిథ్యా రూపములు, భ్రమమాత్రమే కదా!

దేహము ఉండుట ఏమిటి? లేకుండుట ఏమిటి? మృతుడెవడు? జీవితుడెవడు?

ఆహా ! 'ఆత్మజ్ఞానము' ను వదలిపెట్టి, ఈ ప్రాపంచిక ఐశ్వర్యములందు, "ఇవి ఎంత బాగున్నాయి!" అని ప్రీతిగొన్నట్టి నా పూర్వీకులంతా ఎంతటి మూర్ఖులు!

**క్వేయం కిల మహాదృష్టిర్భరితా బ్రహ్మబృంహితా ।**
**క్వసరీసృపభీమాశా భీమా రాజ్యవిభూతిభిః ॥** (శ్లో 67, సర్గ 34)

బ్రహ్మజ్ఞానమును ప్రవృద్ధం చేయగల ఇప్పటి నా పూర్ణ దృష్టి ఎచట...? త్రాచు పాములులాగా భయంకర ఆపదలతో కూడిన ఈ రాజ్యాలు, సంపదలు ఎక్కడ?

అవును. శుద్ధ చిన్మయ దృష్టే అన్ని దృష్టులకన్నా ఉత్తమోత్తమైనది.

**చిన్మయ దృష్టి -** నేను విషయవర్జితుడనై, సర్వపదార్థములందూ సాక్షి రూపమున ఉన్నాను. అట్టి చిదాత్మస్వరూపుడనగు నాకు నేనే మరల మరల నమస్కరించుచున్నాను. చిరకాలంగా "తుచ్ఛ సంసార ప్రవాహము" న పడి ఉన్న నేనిపుడు "జన్మరాహిత్యము" అనే ఒడ్డుకు చేరుతున్నాను.

ఇప్పటికి నేను సర్వ అనర్థములు నివృత్తి అవగల స్వస్థానం వైపు తిలకిస్తున్నాను. ఏ సుఖం పొందాలో, అది పొందటం చేత ఇప్పుడు నేను సఫలుడను. సర్వోత్తముడను.

ఇట్టి శాశ్వతమగు ఆత్మజ్ఞానసామ్రాజ్య సుఖమును వదలుకోవటమేమిటి? దుఃఖములగు ఈ భౌతిక రాజ్యసంపదలను పట్టుకుని వ్రేలాడటమేమిటి? ఎంతటి తుచ్ఛము? ఈ రాజ్యాది సంపదలన్నీ కొయ్య - మట్టి - శిలా మయమే కదా! వీటియందు ప్రీతి గొనటమంటే ఒక కీటకంలా ఈ ఉపాధిని మెచ్చించటమే అవుతుంది.

నా తండ్రి హిరణ్యకశిపుడు తక్కువవాడేం కాదు. మహాతపశ్శాలియే. కాని, ఆయన చేసినదేమిటి? "అవిద్యామయములే" అయినట్టి ఈ రాజ్యాలు ఏలటం, తినటం, త్రాగటం యందు మాత్రమే దృష్టి ఉంచి, ఆయన ఈ అవయవాలను తృప్తి పరచటానికే అవకాశాలన్నీ వినియోగించారు. కాని,

ఏం సాధించినట్లు? ఏం పురుషార్థం పొందినట్లు? హృదయంలోని అజ్ఞానం తొలగనేలేదే? ఈ బ్రహ్మానంద సాగరం ముందు రాజ్యాలు పొందటం, వాళ్ళనీ, వీళ్ళనీ ఓడించటం ఎంత చిన్న విషయాలు? బ్రహ్మానందం పొందితే, ఇక తక్కినవన్నీ పొందినట్లే. అంతేకానీ, రాజ్యాలు పొందితే బ్రహ్మానందం లభిస్తుందా? లేదే. పరిపూర్ణమగు బ్రహ్మానందం పొందేవానికి ఈ తుచ్ఛ విషయములలో వెతకవలసిన సుఖం ఏమైనా ఉంటుందా? ఏ మాత్రం ఉండదు.

❖

అనంతమగు 'దివ్యపదము'ను వదలిపెట్టుకొని, పరిచ్ఛిన్నమగు ఇంద్రియ వ్యవహారములను వాంఛించే వాడు ఏదో తెలివితక్కువచేతనే అట్లు చేస్తున్నాడు కాని, నిజంగా తెలిసికాదు. తియ్యటి తెల్లద్రాక్షపళ్ళను ఇంట్లో పెట్టుకొని, "తెల్లటి వేపపళ్ళు తెల్లటి ద్రాక్షపళ్ళకంటే మరింతరుచిగా, సొగసుగా ఉంటాయి".... అని తలచుచు వేపపళ్ళు తిందామని వేపచెట్టు ఎక్కేవాడిని ఏమనాలి? పూర్ణమగు ఆత్మదృష్టిని వదలి, దృశ్యము పట్ల ఆసక్తి కలిగి ఉండటం అట్టిది. చెఱకురసం ప్రక్కన పెట్టి, కుంకుడు రసంకోసం కష్టించి తెచ్చుకోవటమే అది! అది మూర్ఖత్వమే మరి.

నా పూర్వీకులు తెలివితక్కువచేత గొప్ప గొప్ప రాజ్యాలు ఏలాలని కోరుకున్నారు. నేను మాత్రం ఆ తప్పు చేయను. భోగములను ఆశ్రయించటానికి ఉపయోగపడే ఈ శరీరమును చూచుకొని "ఈ శరీరముతోటివాడినే నేను" అనే బుద్ధిని జయిస్తాను. "ఈ శరీరము కంటే విలక్షణమైన నిత్యమగు ఆత్మవస్తువునే నేను" అను రూపంలో ఉండే 'ఆత్మబోధ దృష్టి' ని ఆశ్రయించటం కోసమే సర్వదా ప్రయత్నిస్తూ ఉంటాను.

**ఆరాటమంతా మటుమాయం -** ఆత్మతత్త్వమును ఆశ్రయిస్తున్నప్పుడు "ఈ మూడు లోకములలో ఇక పొందవలసినదేమీ లేదు" అను అవగాహన కలుగుతోంది. ఇక రాజ్యాలు పొందినవాడో, ఇంకా ఏదో కావాలనీ, పొందాలనీ ఆరాటపడుచూనే ఉన్నాడు కదా? "చిద్వస్తువు"నందే సమస్తమైన అనుభవములూ ఉన్నాయి. అట్టి చిద్వస్తువునే ఎందుకు అనుభవించరాదు?

ఎందుకంటే... సర్వవ్యాపకమై, స్వస్థమై, నిర్వికారమై, స్వస్వరూపమై, సర్వదా వెలుగొందుచున్నట్టి ఆ చైతన్యమునందే సమస్త సుఖములు, అందుకు సాధనలు ప్రతిబింబిస్తున్నాయి.

తేజములోని ప్రకాశశక్తి... చంద్రునిలోని శీతలము... త్రిమూర్తులలోని జ్ఞాన – ఐశ్వర్య – విజయములు... ఇంద్రునిలోని త్రిలోకాధిపత్యము... ఇవన్నీ కూడా అఖండ చైతన్యము లోనివే. మనస్సు యొక్క శీఘ్రగతి, వాయువులోని బలము, అగ్నిలోని దాహకత్వము, జలములోని రుచి, తపస్సిద్ధులు ఇవన్నీ కూడా అనిర్దేశము, అప్రమేయము అగు చైతన్యమునందే ఒనగూడుచున్నాయి.

❖

సూర్య ప్రకాశము అనేకచోట్లకు ఒకేసారి ప్రసరిస్తోంది కదా! వికల్పరహితమైనట్టి చిత్‌శక్తి వివిధ పదార్థములలో ఒకేసారి ప్రసరించి ఉండి, సర్వ అనుభవములకూ తానే కర్త – భోక్త అయి ఉంటోంది. తానే ఆయా పదార్థముల రూపములను పొందినదై తద్వారా ఈ సువిశాల ప్రపంచమును రచించుకొంటూ పోతోంది.

అఖండమగు శుద్ధచైతన్యము త్రికాలములందలి అనేక పదార్థములతో కూడి అనేక కల్పనలను అనుభవిస్తోంది. కానీ, స్వస్వరూపమున అది పరిపూర్ణముగానే సర్వదా ఉండి ఉంటోంది. అనేకమైన అనుభవాలు ఉన్నాకూడా, సమత్వముచే పూర్ణరూపమున విరాజిల్లుతోంది.

పదార్థము లందు భేదముండవచ్చు గాక, అనుభవం ఒక్కటే కదా! ఒకే అనుభవం చేదు, తీపి, ప్రియము, ఆశ్చర్యము, అవసరము, అనవసరమూ వంటి అనేక కోణములను ప్రకటిస్తోంది. తేనెను, వేపరసమును రుచి చూస్తున్న అనుభవం ఒక్కటే. అదేవిధంగా... అద్వయమై, సత్తారూపమై ఉన్న 'చిత్' శక్తిచే జీవుల భావములు, పదార్థ జాలములు ఇదంతా ఏకకాలమున సమరూపమున అనుభవించబడుచున్నాయి. అనగా... సంకల్పవర్జితమైన, సూక్ష్మాతిసూక్ష్మమైన ఆ చిత్‌శక్తి సర్వ పదార్థము లందూ ఒకేసారి వ్యాపించియున్నది.

❖❖❖

# 7. వర్తమాన - భూత - భవిష్యత్తులను నిషేధించటం : దృశ్యము యొక్క అభావ స్థితి

**ప్రహ్లాదుడు (అంతరంగంలో) :** ఒకప్పుడు ఈ చిత్తము వేదవచనములు, ఆచార్యుల ఉపదేశములు విని బాగుగా విచారణ చేయటం చేత 'దృశ్య సమూహం యొక్క అభావన' అనుదానిని గుర్తెరుగుతోంది. అనగా దృశ్యం యొక్క 'భావించకుండుట' ను ఆశ్రయిస్తోంది. అందుకు ఫలితంగా శోక – మోహ జనితమైన దుఃఖమును పరిత్యజిస్తోంది. ఆ స్థితిలో ఈ సమస్తపదార్థములను చూస్తున్నప్పుడు, 'ఇవన్నీ లేనివే కదా!' అనబడు నిషేధము చేయుచున్నది. అప్పుడిక పరమార్థ – అద్వైత భావము కలిగి ఉంటోంది. అప్పటి చిత్తము "వస్తువులపైననో, విషయములపైననో, జీవులపైననో రాగము కలిగి యుండుట" అను దుష్టస్వభావమును విడచిపెట్టేస్తోంది.

అట్టి విషయరహిత చిత్తము గురించి చెప్పుకోవాలంటే... అది గడచిపోయిన కాలానికి చెందిన సర్వవిషయాలతో సంబంధము లేనిదగుచున్నది. అదియే వాసనారాహిత్యము కదా! ...ఈ వర్తమాన కాలంలో ప్రాప్తిస్తూ, ఎదురుగా నిలచియున్న దృశ్యమును కూడా ఉపేక్షిస్తూ త్యజించి వేస్తోంది. "ఇది పొందాలి, ఇది ఇట్లా ఉండాలి, ఇది తొలగాలి" అను విధంగా రూపం కలిగి వుండే 'భవిష్యత్తుతో సంబంధాలు' కూడా వదలివేస్తోంది.

ఎక్కడ దృశ్యవ్యవహారం ఉంటుందో, అక్కడ మాత్రమే 'భూత–వర్తమాన–భవిష్యత్తులు' అనబడేవి ఉంటాయి. చిత్తంలో నుండి దృశ్యవ్యవహారమే తొలగితే, అట్టి చిత్తము కాలమును అధిగమించినది అగుచున్నది. అప్పుడు ఆ చిత్తమే సమత్వము తన స్వభావముగా గల 'చిత్‌శక్తి' అగుచున్నది.

చిత్ శక్తికి అన్యమైనదంటూ ఏదైనా ఉంటే, అదంతా భ్రమ యొక్క ప్రభావమే. అట్టి త్రికాలాలకూ అతీతమైన 'సమత్వము'చే నా చిత్తము నింపివేయబడి, అది శుద్ధచైతన్యమై అలరారు గాక!

ఏదైతే అన్ని వేళలా ఉండి ఉండటం చేత నిత్యమై యున్నదో, అట్టిది భూతకాలమని, గాని, భవిష్యత్ కాలమని గాని, వర్తమాన కాలమని గాని చెప్పలేం కదా!

అనిత్యమైన విశేషాల కంటే సూక్ష్మమైనట్టి చిత్‌శక్తియే ఆదరణీయం. అయితే అట్టి నిత్యమగు చిత్‌శక్తి వాక్కునకు అవిషయమే అయినట్లున్నదే! "అవును. ఆత్మ అనబడేది ఎక్కడున్నది?" అను కొందరి "'ఆత్మ – అభావ సిద్ధాంతము' కూడా, ఇంద్రియానుభవముల దృష్ట్యా జగత్ పదార్థముల దృష్ట్యా "ఔను కదా!" అను రీతిగా సార్థకమే అగుచున్నది.

త్రికాల విషయములన్నీ త్యజించిన చిత్తమే వేద వేదాంతాలచే ప్రతిపాదించబడే అత్యుత్తమ మైన విషయం

**ఆత్మ :** నాయొక్క – తదితరులందరి యొక్క స్వస్వరూపమునకు ఏమాత్రం వేరు కానట్టి విషయరహిత చిత్తమే, లేక చిత్‌శక్తియే 'ఆత్మ' అని కూడా చెప్పబడుతోంది.

**బ్రహ్మము :** మహత్తరమైనదగుటచే అదియే బ్రహ్మము అని కూడా పిలువబడుతోంది.

**నాస్తి :** ఇంద్రియములకు విషయమే కాదు గనుక "అది ఎక్కడున్నది?"...అని ప్రశ్నించ బడుతోంది. 'లేదు' అని వాదించబడుతోంది.

**సర్వము :** శబ్ద ప్రకృతి కంతటికీ అదే నిమిత్తము. కనుక, 'అది సర్వము' అని ప్రతిపాదించ బడుతోంది.

**మోక్షము :** మరి సర్వము "తానే" అయి ఉన్నది కదా! ఆ పరమ చైతన్యమునందు దృశ్యమంతా శమించి పోవుచున్నది. కనుక "మోక్షము" అని కూడా అనబడుచున్నది. బంధరహితమగు ఆత్మను అంతటా – అన్నిటా – అంతాగా సందర్శించటమే 'మోక్షము'.

**సంకల్పజాలము -** కంట్లో పొరవంటి దోషము ఉన్నప్పుడు ఎదురుగా ఉన్న వస్తువులు కనిపించవు కదా! చైతన్యము కూడా 'విషయముల గురించి సంకల్పించుట' అను దోషము కలిగి ఉన్నప్పుడు జగత్తును సమ్యక్‌దృష్టితో వీక్షించజాలదు. ఒక పక్షి యొక్క ఒక కాలును తాడుతో కట్టి ఉంచితే ఆ పక్షి ఆకాశంలో ఎగురగలదా? "ఇది ఇష్టం, అది అయిష్టం" అనే మాలిన్యమును అడ్డు పెట్టుకున్న ఆ చిద్వస్తువు ఆకాశమును వ్యాప్తం చేయలేకపోతోంది.

అనగా... "నేను కాళ్ళు – చేతులు గల ఒక జీవుడను" అనే మరల మరల తలచుచున్నదిగాని, "నేను చిత్ చైతన్యమును" అని అనుకొని చిదాకాశములో విహరించలేకపోతోంది.

బోయవాని వలలోకి పక్షులు వచ్చి పడుచున్నట్లు, ఈ జీవులంతా తమయొక్క సంకల్పపరంపరల చేతనే మోహం అనే జాలంలో పడుచున్నారు. నా తండ్రి హిరణ్యకశిపుడు, నా తాతలు మొదలగు వారంతా తెలిసి తెలిసీ సంకల్ప జాలముచే పరివేష్టితులై చివరికి "అసంఖ్యాక విషయ సమూహాలు" అను వాటి యందే కూలిపోయారు. ఫలితం? దుఃఖరహితమగు ఆత్మపదవిని వారు గుర్తించనేలేదు. పాపం! దీనులగు నా పూర్వీకులనేకులు ఈ భూమిపై శరీరం పొంది, గర్వితులై కొద్దికాలం అటూ

ఇటూ సంచరించి, చివరికి పొగలో పడ్డ పురుగులాగా వినాశనం పొందారే! ఏవేవో భోగములకొరకై ఆరాటపడి, అందుచేత కలిగే సుఖ దుఃఖములవెంట పరుగులు తీసే బదులు, వాళ్ళుకూడా తమకున్న ఓపికను, అవకాశములను ఆత్మతత్త్వము తెలుసుకోవడానికి ఉపయోగించి ఉంటే ఎంత బాగుండేది! దుర్బుద్ధితో, 'దృశ్య' లేక 'సాంసారిక' భావాభావములనే చీకటి పొరలలో చిక్కుకునేవారు కాదు కదా! చివరికి జరుగుచున్నదేమిటి? ఎన్నో చక్కటి ఉపాయాలు ఉండి, తెలివితేటలు ఉండి కూడా క్రిమికీటకముల వలె అన్న - పాన - మైథునముల కొరకై బ్రతికి దీనంగానే గతించిపోతున్నారే! తెలిసికూడా తెలియని వారై చరిస్తున్నారే!

ఎవనియందైతే సత్య - జ్ఞాన ప్రభావం చేత 'ఇష్టములు - అయిష్టములు' అనే ప్రోద్బలము శమిస్తోందో, అట్టివాని జీవితమే సార్థకం.

స్వస్వరూపం సర్వదా కళంకరహితమే! ఎక్కడన్నా చంద్రునిలో ఉష్ణత్వముంటుందా? ఉండదు. శుద్ధమై, నిర్మలాకృతిచే వెలుగు స్వస్వరూపమగు చిద్వస్తువునందు కళంకము ఉండటం ఎట్లా సాధ్యం? అందుచేత, "నేను కళంకితుడను... స్వల్పుడను... పాపిని" అను మాటలు సరికాదు. అట్లు, "నేను అజ్ఞానిని - బద్ధుడను - అల్పుడను"... అని మనోధర్మాలను ఆత్మపై ఆపాదించటం ఏఒక్కరికీ సరికానేకాదు.

**ఓనా ఆత్మదేవా! నమస్కారం! -** నిర్మలము, నిత్యము, నిఖిలము, నిరుపమానము అగు ఓ నా ఆత్మదేవా! స్వస్వరూపమా! నీవు అవిచ్ఛిన్నమగు చిదాత్మస్వరూపమవు. అట్టి నీకు నమస్కారం. అనగా, నాకే నా ఈ నమస్కారం.

హే ఆత్మ భగవాన్! ఒక మణి తానున్న చోట అన్ని వైపులా కాంతిని ప్రసరిస్తుంది కదా! నీవు ఉన్న చోట నలువైపులా జ్ఞానమును ప్రసరింపజేస్తావు. నీ గురించి ఇంతకాలానికి తెలుసుకున్నాను. ఎంత ఆశ్చర్యము! ఎంతో, ఎక్కడెక్కడో వెతికి వేసారి, చివరికి నిన్ను నా యందే సర్వదా ఉండి ఉన్నట్లుగా కనుగొన్నాను. నేనూ నీవు ఒక్కటే!

"నేను నిన్ను పొందాను" అనునది సరి అయిన వాక్యమే కాదు. "నిష్కళంక తేజోమయుడవైన నీవు నేనే అయి ఉన్నావు" అనునది ఇప్పుడు గ్రహిస్తున్నాను. మహామహిమాన్వితాశయముతో కూడిన నీ నిత్యోదయమును నేను గాంచుచున్నాను. ఓ ఆత్మదేవా! నిన్ను ఏదో ఏదోగా, ఎక్కడోగా, ఎప్పటికోగా అనుకోవటం చేత ఏర్పడిన సర్వ వికల్పజాలములనుండి విడివడి, ఇప్పటికి నాకు వాస్తవస్వరూపంగా లభిస్తున్నావు.

ఓ ఆత్మ భగవాన్! పరమార్థమున ఏదేదైతే నీ రూపమై ఉన్నదో అది అట్లే, యథాతథంగానే ఉండుగాక! "నేను అల్పుడను... స్వల్పుడను... జీవుడను" అని అనుకుంటూ, తద్వారా నిన్ను కించపరచినందుకు కాస్త క్షమించవయ్యా! 'నేను' అనునది లేదు. అంతటా తానే ఉన్నది. ఆ తానే నేను. "ప్రహ్లాదుడు" అను నామధేయముతో పిలువబడుచున్న హే ఆత్మనారాయణా! నీకు నేను నమస్కరిస్తున్నానయ్యా! 'జీవుడు' అని దేనినైతే అంటున్నామో, అందుకు అభిన్నుడవు నీవు.

నీవే, లేక, నేనే బ్రహ్మము కూడా! ఓ ప్రహ్లాదా! ఓ అనంతుడా! ఓ అంతర్యామీ! "నేను.... నేను" అను శబ్దమునకు నిత్యార్థమై ఉన్నవాడా! నీవే శివమూ, శాంతమూ, అద్వైతమూ, ఆనందమూ కూడా. "సర్వాంతర్యామియగు నారాయణుడే సర్వదా సర్వరూపాలుగా వేంచేసి ఉన్నాడు" అని వేద-పురాణ-ఉపనిషత్తులు ఎలుగెత్తి గానం చేస్తున్నాయి కదా? అనగా? "ఈ ప్రహ్లాదుడు' - అను జీవాత్మ రూపంగా వేంచేసి ఉన్నది నారాయణుడే - అనియే కదా! కనుక నేను నారాయణుడనే!

బ్రహ్మ మొదలైన వేదజ్ఞులు "వేదాంతవేద్యా!" అని ఎప్పుడూ సంబోధన చేస్తున్నది నా స్వరూపమునే! 'వేదము' అనగా తెలియబడేది. 'వేదాంతుడు' అనగా తెలియబడేదంతా తెలుసు కుంటున్న ఆయన. 'వేదాంత వేద్యుడు' అనగా తెలుసుకుంటూ ఉంటున్నట్టి ఆయనను తెలుసుకుంటున్న వాడు. ఆ తెలుసుకునే ఆయనే నారాయణుడు. ఆయనే నేను.

ఏమీ తెలియని అజ్ఞానులు కూడా సర్వదా సర్వప్రదేశములందూ సంబోధించేది నన్నే కదా! సమస్త ఇంద్రియములకూ అధిష్ఠాన దేవతవై భాసించు ఓ పరమాత్మా! నీ కన్నా వేరుగా 'నేను' అనేదే లెనప్పుడు "ఏదో ప్రయత్నించి ఈ నేనుకు మోక్షం కల్పించాలి" అనునది ఎంతటి హాస్యజనిత వాక్యం! "నేను వేరు, ఆ నారాయణుడు వేరు" అని నీ కొరకై (నాతండ్రి వలె) ఎక్కడో వైకుంఠంలోనో, తదితర లోకాలలోనో వెతకటం ఎంతటి హాస్యాస్పదం? ఎంతటి మూర్ఖత్వం? ఎంతటి దురహంకారం?

నా రూపంగా నీకు నీవే, ...ప్రహ్లాద రూపంతో నారాయణమూర్తి రూపానికి నమస్కరించు కోవటం నీ చమత్కార విశేషం, లేక నీ ప్రతీతి యొక్క ప్రభావం. 'ప్రహ్లాదుడు' అను పేరుతో చెప్ప బడుచున్న నేనే పరమాత్మను. నారాయణుడే ఈ ప్రహ్లాద నామధేయ జీవుడు. (శివోజీవః)

నేనే భక్తుడను... నేనే భక్తిని... నేనే భక్తి లభ్యుడను. (జీవోశివః। శివోజీవః)

పూర్ణ చంద్రుని లాగా అమృతతుల్యుడను. నిర్మలుడను. ఆనందైక రసమూర్తిని. నారాయణుడను. ఎందుకంటే.... ఓ శ్రీమన్నారాయణా! నీది కానిదేమున్నది?

నా సన్నిధానంలో నీవు, అతడు మొదలైనవి కల్పిత దృష్టిచే మాత్రమే ఉన్నాయి. హే ప్రకాశ స్వరూపా! ఆత్మ చైతన్య భగవాన్! నాకు అన్యమైనదంటూ ఏది ఎక్కడున్నది చెప్పండి? నా సొంతము, వాస్తవము, అఖండము అగు మీకిదే చేతులెత్తి మరల మరల మ్రొక్కుచున్నాను. జగద్రూపుడనై, సర్వ దృశ్యరూపుడనై మొక్కుచున్నాను.

❖❖❖

# 8. సుఖ విశ్రాంతి

**పహ్లాదుడు (అంతరంగంలో) :** ఇక్కడ ఎవరెవరైతే, ఏమేమైతే కనబడుచున్నాయో - ఇవన్నీ కూడా బ్రహ్మస్వరూప బోధకమూ, ఏకమూ, వికారరహితమూ, అనుభవస్వరూపమూ, ఓంకార సంజ్ఞచే ఉద్దేశించబడినదీ అగు ఆత్మయేకాని, మరి వేరొకటేదీ కాదు. వీరు-వీరంతా ఆత్మస్వరూపులే! నేనూ ఆత్మస్వరూపుడనే! కనుక వీరంతా మమాత్మస్వరూపులే! అట్టి చైతన్యాత్మ యొక్క ప్రభావము ఈ

బొమికలు – మాంసము – క్రొవ్వు – రక్తము లందు వ్యాపించి ఉన్నప్పటికీ, వీటన్నిటి కంటే అది పరము అయి ఉన్నది. అంతరమున ఉంటూనే సూర్యుడు మొదలైన మహాప్రభావవంతములగు పదార్థ జాలమునంతా ప్రకాశింపజేస్తోంది. అది తలచుకొని స్వసత్తచే అగ్నిని ఉష్ణముగానూ, అమృతమును రసవంతముగానూ చేసివేసేస్తోంది.

**నారాయణత్వం -** ఒక రాజుగారు సర్వభోగాలను అనుభవిస్తున్నట్లు, ఆత్మయే ఈ 'శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ' భావములన్నీ పొందుతోంది.

అది నిష్క్రియం... కానీ గతివంతమంతా అదే. శాంతం... కానీ, సర్వవ్యవహారాలు నిర్వర్తిస్తోంది. నిర్లిప్తం... కానీ, కర్మలన్నీ ఆచరించేదీ అదే.

ఈ ఆత్మ ఇతఃపూర్వం ఎట్లా ఉన్నదో ఇప్పుడూ అట్లే ఉన్నది. ఇక ఎప్పటికీ అట్లాగే ఉండ బోతోంది. నేను ఆత్మనే అయిఉండి, అప్పుడప్పుడు ఏమఱచినంత మాత్రం చేత... నేను ఆత్మను కానిదెప్పుడు?

అజ్ఞాన ప్రహ్లాద రూపుడనై మమనారాయణ స్వరూపం ఏమరచి ఎన్నో జన్మపరంపర లందు సంచరించియున్నప్పటికీ, నారాయణత్వం నన్ను ఏమాత్రం ఏ క్షణంలోనూ ఏమరచనేలేదు. అది నన్ను వదలలేదు. వదలదు కూడా. అది ఇక్కడ ఎలా ఉన్నదో, ఇంకొకచోట కూడా అట్లే ఉన్నది. 'జీవుడు' అనబడు వేషధారణచే ఈ విహిత – నిషిద్ధ కర్మలను, కర్మఫలములను అనుభవిస్తూనే తాను మాత్రం సర్వవృత్తులకూ ఆవల, సమరూపమున సర్వదా సర్వమై వెలయుచున్నది. పరమార్థంగా చూస్తే దానికి రాక పోకలు లేవు. కానీ, కర్మానురూపంగా స్వయంగా ఆవిర్భవిస్తున్నది అదే. తన యొక్క సన్నిధాన మాత్రంచేత, బ్రహ్మదేవుని నుండి ఒక గడ్డిపురుగు వరకు (పిపీలికాది బ్రహ్మ పర్యంతం) గల భోక్త – భోగ్యములకు తానే ఆధారమై ఉంటూ, పదనాలుగు భువనములను క్రియావంతం చేస్తోంది. తాను ఎప్పుడూ నిష్క్రియమై ఉంటూనే, స్వసత్తచే వాయువుకంటే కూడా వేగంగా పయనిస్తూ ఉంటోంది. తనయందు తానే ఉండి ఒక రాయి కంటే ఎన్నో రెట్లు నిష్క్రియత్వము, ఆకాశము కంటే ఎన్నెన్నో రెట్లు నిర్లిప్తత్వము కలిగి ఉంటోంది.

**జరామరణములను దాటి వేయుటమెట్లా? -** వాయువు ఆకులను కదల్చుచున్నట్లే ఆత్మ సర్వ ప్రాణికోట్ల మనస్సులను చలింపచేస్తూ ఉంటోంది. సారథి గుఱ్ఱములను అదలించి నడిపిస్తున్నట్లు, నారాయణ స్వరూపమగు మమాత్మ ఈ ఇంద్రియ సమూహములన్నిటినీ నడిపిస్తోంది. అనేక దుర్దశలను తన యందు దాచుకొని ఉన్న ఈ 'దేహము' అనే గృహంలో అది ఏవేవో కార్యక్రమములను రచించుకుని ఉంటోంది. ఆత్మ సామ్రాట్టు ఈ శరీరాలలోని శబ్ద స్పర్శాది ఇంద్రియార్థములన్నీ చవిచూస్తున్నాడు.

మనం అట్టి పరమాత్మను కనుగొనటానికే సర్వదా అన్వేషణ సాగించాలి. పరితపించాలి! ధ్యానించాలి!... ఎందుకా?... ఆ ఆత్మ దేవుని ధ్యానించినప్పుడు మాత్రమే మనుజుడు జరా మరణములను దాటివేయగలడు.

**అత్యంత సులభం -** ఓ సహజీవులారా! అట్టి ఆత్మదేవుని పొందటం చాలా దుర్లభమని అనుకుంటున్నారా? కానేకాదు సుమా! మీ జ్ఞాన చక్షువులు తెరవండి. ఆతడు అతిసులభంగా మీ ఎదురుగా లభిస్తాడు. స్మరణ మాత్రం చేత ఉత్తమ బంధువుగా మీకు వశుడు కాగలడు. సర్వప్రాణుల హృదయాంతరంగుడే నారాయణుడు. సర్వప్రాణికోట్ల హృదయకమలంలో సంచరించే ఆయన కంటే దగ్గరివాడెవ్వడూ లేడు. మీకు మీ సుగుణ దుర్గుణములు కూడా ఆయన కంటే దగ్గిరైనవి కావు. ఉచ్ఛ స్వరంతో కేవలం ప్రణవోచ్చారణతో స్మరించినంత మాత్రం చేతనే ఆ ఆత్మ స్వరూపము మీకు అభేదమై ప్రత్యక్షమగుచున్నది.

**ఆత్మానారాయణో గతిః -** ఒక డబ్బు ఉన్నవాడిని సేవించారనుకోండి... ఏమౌతోంది? అభిమానము, గర్వము కలిగించ గల కొంత ధనం లభించవచ్చేమో! అదే, ఆ ఆత్మభగవానునే సేవిస్తే....? మీలో ఉన్న అభిమాన గర్వాదులు తొలగిపోతాయి. ఆ ఆత్మదేవుడే మీరై ప్రకాశిస్తారు.

ఆయనని సేవించటమెట్లా? ఆయన సర్వసంపద సహితుడు కాబట్టి, మీ సంపదలు ఆయనకెందుకు? ...అందుచేత మీ భావనచే ఆయనను సేవించండి.

ఆయన ఎక్కడున్నాడు?... పుష్పాలలో సుగంధం, నువ్వులలో నూనె, రసమయ పదార్థాలలో రుచి ఉన్నట్లు ఆత్మభగవానుడు సర్వదేహము లందు వ్యాపించి ఉన్నాడు. మనందరి హృదయాలలోనూ ఆయన ఎల్లప్పుడూ ఉండి ఉన్నప్పటికీ, మనం అవిచారణవశంచేత చేతనారూపమగు ఆత్మ భగవానుని తెలుసుకోలేకపోతున్నాము. చాలా కాలం క్రితం ఎప్పుడో ఎక్కడో చూచి మరచిన బంధువు వలె మనం ఆయనను పలకరించకుండా ఈ ప్రాపంచిక కల్పనలలో మునిగితేలుతున్నాం. ఇక చాలు. ఇక నుండి ఆత్మానారాయణుని అనుక్షణ సందర్శనమునకై మనమంతా ఉపక్రమించెదము గాక!

**ప్రయోజనం? -** తత్త్వవిచారణచే పరమేశ్వరుడగు ఆ ఆత్మ ఎరుగబడిందా, అప్పుడు ఎంతో ఇష్టమైనవాడు కనిపించినట్లుగా జీవునకు పరమానందం ఉదయించగలదు. ఆత్మదృష్టిచే శరీర సంబంధమాత్రములైన జరామరణముల వ్యవహారం విచ్ఛిన్నమై పోతుంది. జీవుడు తనకు తానే తెచ్చిపెట్టుకొన్న 'ఆశలు' అనే త్రాళ్లు ముక్కలు ముక్కలుగా త్రెంచివేయబడతాయి. కామ-క్రోధ-మోహాది శత్రుభటులు వెనక్కు చూడకుండా తుఘ్ఘుమని పారిపోతారు. వారి తిరోగమనం చూచి మనం చిరునవ్వు చిందిస్తాం. ఇక తృష్ణ, అసంతృప్తులు మనస్సు ముందు నిలువలేక మటుమాయ మవుతాయి.

**అస్మిన్దృష్టే జగద్దృష్టం శ్రుతేస్మిన్సకలం శ్రుతమ్ ।**
**స్పృష్టే చాస్మిఞ్జ గత్స్పృష్టం స్థితేఽస్మిన్సంస్థితం జగత్ ॥** (శ్లో 19, సర్గ 35)

పరమాత్మను దర్శిస్తే బ్రహ్మాండమంతా దర్శించినట్లే. పరమాత్మ కథనం వింటే సమస్తమూ శ్రవణం చేసినట్లే. పరమాత్మను స్పృశిస్తే జగత్తంతా స్పృశించినట్లే. ఆతని ఉనికియే జగత్తుకు ఉనికి. దృక్స్వరూపుడగు ద్రష్ట ఉండి ఉండటమే ఆతని ఉనికికి సాక్ష్యం, దృష్టాంతం కూడా!

❖❖❖

# 9. ఇంద్రియాతీతజాగృత్

**పహ్లోదుడు (అంతరంగంలో) :** ఇంద్రియాలన్నీ నిదురిస్తున్నప్పుడు కూడా మేల్కొని ఉండేదేది? ఆత్మయే. ఈ ఇంద్రియములు అవివేకులపై ప్రహారాలు సలుపుచుండగా, ఆత్మదేవుడు జీవులకు రక్షకుడై ప్రశాంతనిర్వైషమ్యాలను అందించుచున్నాడు.

**అంతటా విహరిస్తున్నది ఆత్మయే! -** జీవరూపమున అటూ – ఇటూ, పైనా – క్రిందా సంచరిస్తున్నది ఆత్మయే. ఈ భోగములన్నీ అనుభవిస్తున్నది అదే. శరీరమునకు వస్త్రము అలంకరణ మగుచున్నట్లే, ఈ దృశ్యవ్యవహారమంతా ఆయనకు అలంకారప్రాయం. అది శాంతంగా స్వవశంగా ఉంటూనే చెఱుకుగడలో రసంలాగా అనేక విషయాలను స్వీకరిస్తూ, త్యజిస్తూ తాను సర్వదేహములందు వ్యాపించి ఉన్నది. రాత్రింబగళ్ళు లాగా అనేక విషయాలను స్వీకరిస్తూ త్యజిస్తూ తాను మాత్రం ఎప్పటిలాగే అధిష్ఠానసత్తగా ఉంటోంది.

**సర్వవ్యాపకము -** ఆకాశమునందలి శూన్యము, వాయువునందలి నిరంతర చలనము, అగ్ని యందు ప్రకాశము, పదార్థములందలి రసము (లేక రుచి), అగ్నిలోని ఉష్ణము, చంద్రునిలోని శీతలము, బ్రహ్మాండములందలి సత్తారూపము ఆ ఆత్మయే! ఆత్మానారాయణుడే!

మసి యందు నలుపు, మంచు నందు చల్లదనము, పుష్పములో సువాసన ఉన్నట్లే సర్వదేహము లందు దేహి వ్యాపించి ఉన్నాడు. ఏ విధంగా అయితే కాలము, సత్త సర్వత్రా వ్యాపించి ఉన్నాయో, ఏ విధంగా ఈ భూమి అన్ని వైపులా అనుగతమై ఉన్నదో – అదే రీతిగా ఆత్మ ఈ కళ్ళు మొదలైన అన్ని ఇంద్రియాలలో వ్యాపించి ఉండి, అన్నిటినీ ప్రకాశింపజేయుచున్నది. దేవాదిదేవుడగు ఆత్మ బ్రహ్మాది దేవతలకు కూడా ఉనికి స్థానమైయున్నది.

**నేను ఆ ఆత్మను : ఆత్మానారాయణుడను! -** కేవలశుద్ధ స్వరూపుడను. ఆకాశమునకు ధూళి కణములతో ఏం సంబంధం? కమలము, జలము ఒక దానితో మరొకటి కలువవు కదా! ఆత్మయే స్వరూపముగా గల నాతో కలువగలిగింది ఏదీ లేదు.

ఈ జగత్తులో ఏర్పడే కల్పనలతో నాకేం పని? జీవుని భయకంపనలతో ఒక శిలకేం సంబంధం?

నాకు ఎట్టి అన్యపదార్థములతో ఏమాత్రం సంబంధమే లేదు. సుఖ దుఃఖములు ఈ దేహమునకు కలుగవచ్చు. కలుగకపోవచ్చు. సొరకాయ నీటిలో పడినంత మాత్రం చేత ఆ సొరకాయలోని ఆకాశమునకు వచ్చే హాని ఏముంటుంది.

సుఖ దుఃఖముల వలన నాకు వచ్చే హాని ఏమీ లేదు. ఎవ్వడైనా ఒకదారం తీసుకొని దీపము యొక్క ప్రకాశమును బంధించగలడా? సర్వపదార్థములకు అతీతుడను, ఆత్మయే స్వరూప స్వభావములుగా గలవాడను అగు నన్ను భావాభావములు గాని, ఇంద్రియములు గాని, కామ క్రోధాదులు గాని బంధించలేవు. వాటితోనాకు సంబంధమే లేదు.

బంధము, ముక్తి మొదలైనవి మనస్సుకు మాత్రమే. నాకు కాదు.

ఆకాశమును ఎవరు బంధించగలరు? మనస్సును హత్య ఎవరు చేయగలరు? ఈ దేహం వంద ముక్కలైనప్పటికీ దేహరహితమైన ఆత్మ ఖండితం ఎట్లా అవుతుంది? కుండ పగలవచ్చు, లేక కుండకు చిల్లి పడవచ్చు, కుండకు, ఆ కుండలోని ఆకాశమునకు సంబంధమే లేదు కదా! ఆకాశమునకు ఏమి హాని?

"అదృశ్య పిశాచము" అన దగ్గ ఈ మనస్సే వ్యర్థంగా సర్వరూపములను గ్రహిస్తోంది. మనస్సు ఉంది కనుకనే, మనస్సును అనుసరించే దృశ్యజాలమంతా ఏర్పడి ఉంటోంది.

అయితే మనస్సు స్వయంగా ఏదీ చెయ్యలేదు. దానిచేత అన్నీ చేయిస్తున్నది నేనే. అయితే, జడ మాత్రమైన మనస్సు యొక్క కోతిగంతులు ఉపశమించాలంటే 'ఆత్మజ్ఞానం' ఒక్కటే మందు. అనేక సుఖ దుఃఖకరములగు వాసనలతో ఆజ్ఞాన దశలను కష్టపడి మరీ ఆశ్రయిస్తున్న మనస్సుకు ఆత్మజ్ఞానం చేత అపరిమితమగు సుఖవిశ్రాంతులు లభిస్తున్నాయి.

ఏమి విచిత్రం! ఇంతకాలం చూచిందీ, అనుభవించిందీ, గ్రహించిందీ, సంకటములన్నీ పొందిందీ మరొకటైనట్టిది. అది మనస్సే గాని, నేను కాదు. "నేను దీనికి భోక్తను అనగా 'మనస్సు' అనబడేది ఉపయోగబడే ఒక ఉపకరణము. నేను ఆ ఉపకరణమును ఉపయోగించువాడనై ప్రత్యేకంగా ఉన్నాను" – అను అధ్యాస అజ్ఞానముచేతనే కలుగుతోంది.

ఇతఃపూర్వపు 'అజ్ఞానం' అనే ఇంద్రజాలమునకు రచయిత ఎవరు?... నేనే సుమా! చైతన్యము నందు ప్రతిబింబిస్తున్న ప్రకృతిని, చైతన్యమును వేఱుచేసి చూచిన మరుక్షణం ఈ మనస్సు, దేహము – ఇవన్నీ నా భావనలుగానే తెలియవస్తున్నాయి.

ఓ సమస్త సహజీవులారా! మీరంతా మమాత్మస్వరూపులే! నేను మీ ఆత్మస్వరూపుడనే!

**సంబంధమేమీ లేనట్టిది -** దోషదృష్టిచేతనే అజ్ఞానమనే తెర ఉండి ఉంటోంది. శుద్ధాత్మకు ఏ క్షణంలోనూ ఎట్టి హాని లేదు. అందుచేత భోగములు పొందాలని గాని, వదలాలని గాని నాకు కోర్కె ఉండ వలసిన అవసరమేదీ లేదు. జీవించాలి, మరణించాలి – అనే వాంఛలతో కూడా నాకు పని లేదు. ఏది ఎట్లైనా రానీ... పోనీ, నాకు అపేక్ష అక్కర్లేదు. ఉపేక్ష కూడా అఖ్ఖర్లేదు. ఈ దేహంలో వివిధ వాసనలు ఉండవచ్చు... తొలగవచ్చు. నాకు వాటితో గాని, వాటికి నాతో గాని సంబంధమే లేదు.

ఓయీ! అజ్ఞానమా! – కేవలం పరిశీలించక పోవటం చేత ఇంతకాలం నీ చేతిలో ఓడిపోతూ వచ్చాను. అనేకసార్లు నాలోని జ్ఞానరత్నాలను అపహరించి నన్ను అపహాస్యం పాలుచేశావు. అనేక మార్లు పెత్తనం చెలాయించావు. అయితే ఏం? సర్వాంతర్యామియగు నారాయణునిచే "ఆత్మ గురించి విచారణకు ఉపక్రమించు" అని బోధించబడ్డాను కదా! ఒకసారి నేను విచారణకు పూనుకోగానే, ఎక్కడికో పారిపోవుచున్నావే! ఏదీ! నీ వాదోపవాదములేమిటో చెప్పు! ఆత్మానుభూతితో సరితూగే బ్రహ్మానందాన్ని నీవు ఇంద్రియార్థాలలో చూపగలవా?

పరమాత్మయగు విష్ణు భగవానుని అనుగ్రహంచేత కలిగిన విచారణజ్ఞానముచే "అజ్ఞానము" అనే ఇంటి దొంగను కనిపెట్టేశాను. 'పరబ్రహ్మజ్ఞానము' అనే మంత్ర సహాయంతో అహంకారపిశాచాన్ని పారద్రోలివేశాను. వివేకధనం సంపాదించి 'దురాశ' అనే అజ్ఞాన దారిద్ర్యాన్ని వదలించుకున్నాను. అందుచేత నేనిపుడు పరమేశ్వరుడనై వెలయుచున్నాను.

❖❖❖

## 10. ఆత్మ సూర్యోదయం - అహంకార, మమకార అస్తమయం

**ప్రహ్లాదుడు (అంతరంగంలో) :** నేనిపుడు తెలుసుకోవలసిందంతా తెలుసుకున్నాను. చూడవలసినదంతా చూచాను. దేనిని పొందిన తరువాత ఇక పొందవలసినదేమీ ఉండదో – అట్టి ఉత్తమ పదార్థమగు ఆత్మజ్ఞానాన్ని పొందాను. ఇది ఒక పరమార్థమైన ప్రదేశం. ఇక్కడ అనర్థములు గాని, విషయసర్పములు గాని, మోహపూర్వకమైన ఆశలు గాని లేవు. తృష్ణ రజోగుణం అనే ధూళి, బూజు ఇక్కడ కనిపించవు. 'ఉపశాంతి' అనే దిశగా వీస్తున్న ఆనందవీచికలచే ఆహ్లాదం వెల్లివిరిస్తోంది. ఈ పారమార్థిక ప్రదేశం ఎంతటి మహత్తరమైనది! స్తుతి, ప్రణామం, ప్రార్థన, నియమము, శ్రవణముల చేత విష్ణు భగవానుని సేవించుట చేతనే ఈ ఆత్మదేవుడు నాకు ప్రత్యక్షమై లభించాడు. ఇంతా అయిన తరువాత, నేను గాంచినది మరెవ్వరినో కాదు.

నా ఆత్మ స్వరూపమే నా కోరికపై ఇట్లా విష్ణురూపముగా ప్రాప్తించింది.

అహంకారమునకు ఆవల ఉన్నట్టి అట్టి విష్ణు భగవానుని ఆత్మ చైతన్యము నా స్మృతిపథంలోనే లభించింది. ఆయన అనుగ్రహంచేత అహంకారమునకు స్థానమే లేనట్టి సనాతన బ్రహ్మము (లేక) ఆత్మ నాచే దర్శించబడుచున్నది.

ఓనా అహంకారమా! – సంచిత, ప్రారబ్ధ, ఆగామి కర్మలచే నడిపించబడే నిన్ను ఇప్పుడు దాటి వేస్తున్నాను. ఇంతకాలం నీవు చేస్తున్నదేమిటి? ఇంద్రియములను ఎఱగావేసి నన్ను వశం చేసుకున్నావు. "తృష్ణ, కామము, దుఃఖములు, వాసనా సమూహములు, ఉత్పత్తి–పతనములు, ఊర్ధ్వ–అధోలోకములు, రకరకాల ఉపాధులు, ఆశాపాశములు ...ఇవన్నీ కల్పించి, వీటికి సంబంధించిన అనేక కార్యక్రమములలోకి ప్రేరేపించింది నీవు కాదా?

నాకు శత్రువువై నా ఆత్మనే నీవు ఆక్రమించావే? అల్పసామర్థ్యము, పిరికితనము కలవాడు పిశాచములచే బాధించబడినట్లు నేను ఈ సంసారమున చిక్కి నీకు ఎంతోకాలం బందీనయ్యాను. నేను ఆత్మ గురించి సంప్రదిస్తున్న మరుక్షణం నీవు నీ ఉనికినే కోల్పోతున్నావు.

విజ్ఞానదృష్టిని పొందినట్టి నేనిప్పుడు నిన్నొక చిన్న ప్రశ్న వేస్తున్నాను... నీవు అసలు ఉన్నావా? ఉంటే, ఎక్కడున్నావు?...

చీకట్లో దయ్యంలా స్ఫురించే నీవు వివేకోదయంచే ఆత్మ ప్రబుద్ధం కాగా, ఎటో అదృశ్యమై పోయావు. దీపం వెలిగించగానే చీకటి ఎక్కడికి పారిపోతుందో, నీవుకూడా అక్కడికే పారిపోయావు.

ప్రకాశమానమగు దీపం వెలిగినట్లు ఇప్పుడు నా హృదయంలో వివేకము వెలగగానే అహంకారము యొక్క ఛాయ కూడా లేకుండా పోతోంది.

ఓ ఆత్మ భగవానుడా! స్వస్వరూపుడా! సూర్యోదయం కాగానే దొంగలు వెనక్కి చూడకుండా పారిపోతారు కదా! ఆత్మజ్ఞానోదయం (లేక) ఆత్మసాక్షాత్కారం అయిందా – అహంకారం మొదలైనవన్నీ పలాయనం చిత్తగించవలసిందే. చూచారా! మీ దర్శనం కానంతవరకూ కఠోరుడగు అహంకార యక్షుడు ఎంతగా భ్రమింపజేశాడో... మాటలతో చెప్పలేను. పిశాచాలులాగా మిథ్యారూపంగా ఆవిర్భవించిన అహంకార – మమకారాలు తొలగిపోగా కొండచిలువ తొలగించబడిన వృక్షంలాగా నేను స్వస్థుడనయ్యాను. ఆశలన్నీ శమించటం చేత, గొప్ప వర్షం పడిన తరువాత దావాగ్నిలాగా, అంతఃకరణం ప్రశాంతపడుతోంది. సుఖంగా ఇదే జగత్తులో ఉంటున్నాను.

ఇక అహంకారం లేదు. మోహం లేదు. దుఃఖం లేదు. దురాశ లేదు. మనోవ్యథ లేదు.

ఎక్కడైనా ఆకాశంలో పూతోటలు ఉంటాయా? లేదు. ఆత్మ యందు ద్వితీయమైనదేదీ ఉండటానికే వీలు లేదు. చిత్తము నందు అహంకారము అనే పిచ్చి ఉండటం చేతనే ఇంతకాలం జ్ఞానం శోభించలేదు. దుమ్ముకొట్టి ఉన్న గుడ్డకు ఎంత రంగు వేస్తే మాత్రం ఏమి అంటుతుంది? అహంకారం, తృష్ణ నిండి ఉన్న మనస్సు జ్ఞాన సమాచారం వినసే వినలేదు. ఒకవేళ వినినా ప్రయోజనం లభించదు.

హే ఆత్మ భగవాన్! మీ సమక్షము అతిప్రసన్నము, అహంకారరహితము, ఆనందసాగరము, సాక్షీమాత్ర స్వరూపము అని సుజ్ఞానులు ప్రవచిస్తూ ఉన్నారు. తమకు వందనములు. ఎండిన తటాకంలో మొసళ్ళు చచ్చిపోతున్నట్లు, భ్రమలు తొలగిన మనస్సుతో అహంకార – మమకారాలు నిస్తేజమైపోతాయి. ఆత్మజ్ఞానము యొక్క ప్రభావంచేత చిత్తము స్వయంగా శమిస్తోంది.

అహంకారరహిత సువిశాల ఆత్మతత్త్వమా! ఏమి నీ మహిమ! ఆశ – చింతలు లేని దానవై సర్వమునకు సాక్షీమాత్రంగా, ఆనందమే స్వభావముగా కలిగి యున్నావు. బుద్ధిలో ప్రతిబింబించే చైతన్యము నీవే. ఈ "నేను–నీవు, అతడు–ఆమె–ఇది–అది" అనబడే సర్వ జీవుల హృదయము లందు, మనస్సు లందు సర్వదా ప్రకాశిస్తున్నట్టి నిన్ను ఏమని వర్ణించాలి? వేద వేదాంగాలే నిన్ను వర్ణించాలంటే, వాటికి మాటలు చాలకపోతున్నాయి. నా పంచ ప్రాణాలు, పది ఇంద్రియాలు, మనస్సు బుద్ధి నాతో సహా ఈ సర్వజీవులు – ఈ కళలన్నీ నీ యొక్క కల్పితరూపములు. ఎందుకంటే నీవు అన్నివేళలా "నిరవయవము, నిత్యోదితము, అమృత రూపము" అయి ఉన్నావు. నీకు నీవే పరిపూర్ణమై ఉంటూ సత్–శాంత ప్రభావముచే హృదయాంధకారమునకు దీపపు కాంతివగుచున్నావు. సర్వవ్యాపివైనప్పటికీ, అదృశ్యరూపమున ఉన్నదానివై ఒప్పుచున్నావు. (లేక)

ఈ పంచ ప్రాణములు, దశ ఇంద్రియములు, ఈ మనస్సు, బుద్ధి, ఈ కనబడే ప్రహ్లాదాదిగా సర్వజీవులు నా యొక్క కల్పిత రూపములు.

పరమాత్మ (ఆవల ఉన్న ఆత్మస్వరూపం = పరమ్ + ఆత్మః) నా నిజస్వరూపం.

నేను నిజరూపంగా నిరవయవమును. నిత్యోదితుడను. అమృత స్వరూపుడను.

ఓ చిద్రూప భగవాన్! ఓం నమోనారాయణాయ! సర్వవృత్తులకు అతీతులై, ఏతత్‌సమయంలోనే మీరు పరమప్రేమను ప్రకటించుచున్నారు. సర్వపదార్థముల స్వభావమునకు ఆధారభూతులై ఉన్నారు. బుద్ధికి ఆవల ప్రకాశిస్తూ ఉండే మిమ్ములనే అందరూ అనేక పేర్లతో ఆరాధిస్తున్నారు.... అర్చిస్తున్నారు. అట్టి మీకు ఇప్పుడు నమస్కరిస్తున్నాను. మీపట్ల నా నమస్కారం తెంపు లేని జలధారవలె సదా, సర్వదా కొనసాగుగాక! నేనే మీరు! మీరే నేను!

❖❖❖

# 11. మనస్సుతో మనోజయం

**ప్రహ్లాదుడు (అంతరంగంలో) :** అమ్మయ్యా! ఇప్పటికి కదా, నేను కామాగ్నిచే తప్తమై, మీదకు వస్తున్న మనస్సు అనే ఖడ్గమును – శమాది గుణములతో కూడినదైన మరొక ఖడ్గముతో ఛేదించి వేయగలుగుచున్నాను!

సహజీవులను నారాయణునికి అన్యంగా దర్శించటమే ఈ ఇంద్రియముల బహిర్ముఖత్వం. సర్వే సర్వత్రా నారాయణ సందర్శనమే (అనన్యదర్శనమే) అంతర్ముఖత్వం.

అట్లు, బహిర్ముఖంగా పోతున్న ఇంద్రియాలను ఇంద్రియములతోనే నిగ్రహించి ఆత్మోన్ముఖం చేస్తున్నాను. శుద్ధ మనస్సుచే మలినమనస్సును జయించి ఆత్మాహంకారముచే, ఈ శరీరాహంకారాన్ని మర్దించి నిశ్చింతగా ఆత్మోన్ముఖుడనగుచున్నాను. త్యజించ వలసినదంతా త్యజించగా ఇక త్యజించుటకు అశక్యమై శేషించే 'చిత్' మాత్రమునందు స్థితి పొంది సర్వోత్తముడనై భాసించుచున్నాను.

శ్రద్ధచే అశ్రద్ధను అడగింపజేస్తున్నాను. విచారణచే అవిచారణను ప్రక్కకు నెట్టుచున్నాను. 'నేను ఎఱుగుచున్నవాడను' అనబడే జ్ఞాతృత్వాభిమానమును రహితంచేస్తూ కేవల జ్ఞప్తి మాత్రుడనై వెలుగొందుచున్నాను. సత్యాత్మ స్వరూపమగు నా స్వస్వరూపమా! ఆత్మదేవా! తమకు నమస్కారమయ్యా! అంతటా సర్వదా వేంచేసి ఉన్న స్వామీ! ఓం నమో భగవతే వాసుదేవాయ!

**మనసామనసి చ్ఛిన్నే నిరహంకారతాం గతే ।**
**భావేన గలితే భావే స్వచ్ఛస్తిష్ఠామి కేవలః ॥** (శ్లో 77, సర్గ 35)

మనస్సు మనస్సుచే ఛేదించబడగా అప్పుడు అహంకారం 'నిర్మూలమై. 'దేహో–హమ్' భావం ప్రక్కకు నెట్టబడి 'బ్రహ్మో–హమ్' భావము అధిరోహింపబడ, 'నేనే' కేవల చిద్రూపుడనై ఉన్నాను. ఇక ఈ శరీరం విషయానికి వస్తే, ఇది భావన, అహంకారం, మనస్సు అనునవేవీ లేకుండా, తాను కోరునదంటూ ఏమీ లేకుండా, కేవలం ప్రాణక్రియామాత్రంచే శుద్ధాత్మయందు నెలకొనియున్నది.

సర్వులందు ఒకేరీతిగా ఉండే ఓ ఆత్మదేవా! (సమం సర్వేషు బూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్!). నీవు నిన్ను ప్రేమించే భక్తులను భోగైశ్వర్యముల సంప్రదానముచే అనుగ్రహిస్తూ ఉంటావు. విశ్వేశ్వరులగు బ్రహ్మ – విష్ణు – మహేశ్వరుల నిజస్వరూపము నీవే. పరమశాంతియుతమగు మీ

యందు నాకు ఇప్పటికి నిరతిశయానందము, పరమ విశ్రాంతి లభించుచున్నది. మోహబేతాళుడు, అహంకార రాక్షసుడు, దురాశాపిశాచం నీ ఊసుఎత్తగానే ఇక నాకు కనబడకుండా అదృశ్యమైనారు. దురహంకారం, తృష్ణ తోకముడుచుటచే నేను సంతాపరహితుడనైనాను. "నేను కొందరికంటే అధికుడను కదా" – అను రూపంగల స్వాభిమానం నడ్డి విరగగొట్టబడింది. దురాశలకు మూలమైన అసంఖ్యాకమైన వాసనలు సౌభాగ్యవశంచేత క్షయించాయి. ఏం ఆశ్చర్యం! మిథ్యారూపమైన దురహంకారమును ఆశ్రయించినప్పటి నేను ఎవడను? ఎవడైననూ, ఇప్పుడు మాత్రం ఆత్మగానే శేషించుచున్నాను. ప్రత్యక్షముగా నిరతిశయానంద రూపుడనైనాను. అపరిచ్ఛిన్న బ్రహ్మాకార వృత్తియుతుడనగు నేను హాయిగా దృశ్యమునందు ఉంటూనే విముక్తుడనైనాను.

ఈ స్వాత్మానుభవం శాస్త్రముల, జ్ఞానుల వాక్యముల ప్రమాణమునకు సరిపోవుచూ, మననమాత్రముచే స్వతఃసిద్ధంగా పొందబడినదగుచున్నది. మనస్సు సర్వమును వదలివేసి, కేవలం అఖండము, అప్రమేయమునందు సమాధినిష్ఠ పొందుగాక. భగవంతుడగు ఆత్మయందే సర్వము నియోగించుచున్నాను.

**ఇప్పటి నా మనస్సు -** మనస్సు విషయ శూన్యమౌతోంది. మనన వివర్జితమూ, ఈషణా రహితము అగుచున్నది. అహంకారమమకార భ్రమలన్నీ పరిత్యజించింది. రాగరహితమై భోగేచ్ఛను విసర్జించింది. కట్టెలన్నీ బయటకు లాగబడగా శేషించే అగ్నిగుండంలాగా శమించింది. అహో! ఒకప్పుడు ఈ మనస్సు ఏవేవో సంఘటనలకు ఎంతగా ఆక్రోశించేది... ఎంతగా పరితపించేది! ఒకే సమయంలో అనేక రకాలుగా, అనేక సమయాలలో ఒక రకంగా ఉంటూ, అనేక ఉపాధుల రాక పోకలకు వశమైపోయి సహింపనలవికాకుండా ఉండేది. అట్టి ఆపదలన్నీ ఇప్పుడు తొలగి పోయాయి.

అద్వయ చిద్రూపము – పూర్ణాత్మ ఇప్పుడు అనుభవమగుచున్నది. కేవల సాక్షి చైతన్య స్వరూపమగు నాపట్ల జడత్వము గాని, జనన మరణాదులుగాని ఉండటానికి అవకాశమే లేదని ఇప్పుడు గ్రహించాను.

❖❖❖

## 12. ఆత్మ స్తవనం

ప్రహ్లాదుడు ఏకాంతముగా ఆత్మతత్త్వమును ఉద్దేశించి, మరల ఇట్లు స్తవనం చేయసాగాడు.

**ప్రహ్లాదుడు :** చాలా రోజుల గడచిపోయిన తరువాత ఇప్పటికి నిరతిశయానందమగు ఆత్మ స్మృతికి వచ్చింది. హే ఆత్మదేవా! అదృష్టవశంచేత మీ పునఃదర్శనమయింది. మహాత్ముడవగు మీకు నమస్కారం. మిమ్ములను చూస్తూ, నమస్కరిస్తూ, చిరాలింగనమొనర్చుచున్నాను. కడివెడు పాలలో చిన్న పాత్రతో నీరు పోసినప్పుడు ఆ నీరు తన రూపమును పోగొట్టుకొని పాలతో ఏకమగుచున్నదే! నా మనస్సు కూడా మిమ్ములను సమీపించి మీతో ఏకత్వము పొందుచున్నది. నేను – మీరు

ఒక్కటే అగుచున్నాము. హే ఆత్మ భగవాన్! మీరు కాకుండా ఈ ముల్లోకాలలో పరమప్రియమైనవాడు ఇంకెవ్వడూ ఎవ్వరికీ ఎక్కడా లేనే లేడు. మిమ్ములను పొందనంతకాలం రక్షణ – ధ్వంసన – ఆగమన – నిష్క్రమణ – మొదలైన క్రియా వ్యవహారములు జరుగుచున్నాయి. మిమ్ములను పొందిన మాహాత్మ్యముచే నేను ఇంద్రియములు లేనివాడనైనాను. ఈ ఇంద్రియములు, ఇవి చూస్తున్న విషయములు ఎక్కడ ఉంటున్నాయో, ఎక్కడికి పోవుచున్నాయో ఏమోగాని, నేను మాత్రం ఇంద్రియాతీతుడను, నిష్క్రియుడను అగుచున్నాను.

ఓ ఆత్మదేవా! మీరు మీ సత్త వలన ఈ విశ్వమంతా వ్యాపించి, సర్వత్రా అగుపించుచున్నారు. ఇక్కడి నుండి మీరు మరెక్కడికి పోగలుగుతారు! అసలు మీరు లేనిచోటెక్కడ? అందుచేత, "వెళ్ళుట – వచ్చుట" – అనునదంతా మీకు సంబంధించినది కాదగును.

ఒకప్పుడు నీవు జన్మరహితులని, నేను జన్మసహితుడనని భ్రమచేత అనుకుంటూ ఉండేవాడను. ఇప్పుడు మనిద్దరి మధ్య ఆ భేదంకూడా లేనేలేదని తెలిసిపోతోంది.

ఇప్పుడు నాకు నీవు సమీపస్థుడ వయ్యావు. ఎంతటి సమీపస్థుడవంటే ... నాకు నీవుగాని, నీకు నేను గానీ వేరుగా లేనేలేము. ఓ హితుడా! అదృష్టవశంచేత నేడు నీ సాక్షాత్కారం పొందాను.

స్వామీ! అఖండమగు ఆత్మదేవాదిదేవా! నీవు కృతకృత్యుడవు ! జగత్‌కర్త, భర్త నీవే! స్వామీ! నీకు నమస్కారం! నీ యందున్న నాకు, నా యందున్న నీకు నమస్కారం. ఈ ప్రహ్లాదోపాధి యందు నీవే ఉండి సర్వాత్మకమగు నీకు నీవే నమస్కరించుకోవటం ఈ చమత్కారం. ఈ సంసారంలో ఆకు లోని ఈనెలాగా అంతర్లీనంగా ప్రసరించి ఉన్నది నీవే.

ఓ నిత్యనిర్మలాత్మా! చక్రహస్తా! అర్ధచంద్రధరా! విబుధనాథా! పద్మజా! బ్రహ్మదేవా! విష్ణూ! శంకరా! ఇంద్రుడా! పదేపదే ప్రణామములు స్వామీ!

వ్యవహార దృష్టికి మన ఇద్దరి మధ్య కనబడే భేదమంతా నీటికి అలలకు గల భేదమే! అది అసత్య కల్పనయే. అనంత విచిత్ర రూపిణి, సదసద్రూపిణియగు మాయ వలన మనిద్దరి మధ్య అసత్యం కల్పనగా విజృంభిస్తోంది. నీవు లీలావినోది కదా! మాయ అనబడేది నీ కల్పనయే. ద్రష్ట – స్రష్ట – సృష్టి కూడా నీవే! నాయందు, సర్వులయందు, సర్వముయందు వ్యాపించియున్నది నీవే! నా యందు నేనుగా ఉండి కామాది దోషాలచే అసత్పథంతో తన పూర్ణభావాన్ని కోల్పోయి ఇంతకాలంగా నీవే సంచరిస్తున్నావు. జన్మ జన్మాంతరాలుగా బహువిధ దుఃఖములను, వ్యవహారములను చవి చూచావు. ఇంతలోనే క్రమక్రమముగా వివేకానుకూలమగు అనేక దృష్టాంతములను చూచావు.

❖

వ్యవహారదృష్టి ఉన్నంత వరకు నిన్ను ఎవరు పొందగలరు? హే పరాత్పరా! నీవు, ఈ మట్టి – కొయ్య – పాషాణాలతో కూడిన తక్కిన జగత్తంతా మిథ్యయే. నిన్ను పొందితే సర్వమూ పొందినట్లే. పొందకపోతే ఏమీ పొందనట్లే! నిన్ను పొందినవారికి ఇక కోర్కెలుండవు. కోర్కెలు ఈడేరటమనగా అదియే! ప్రభూ! నేను నిన్ను సర్వదా పొందియే ఉన్నాననీ, నీకూ నాకూ అంతరమే లేదనీ గ్రహించాను.

అట్లు గ్రహించుటచే నిన్ను "పొందినవాడను, కనుగొనినవాడను" – అయ్యాను. నీ యథార్థ రూపం ఏమిటో ఇప్పుడు నాకు తెలిసిపోయింది. మోహము తొలగించి నిన్ను నేను సర్వత్రా చూచుచుండగా ఇక కళ్ళతోనో, స్పర్శతోనో ఒకటి రెండు చోట్ల మాత్రమే చూడటమేమిటి? ఇంద్రియము లందు, అంతరంగ వృత్తులందు వ్యాపించి అన్నిటినీ ప్రకాశింపజేస్తున్నట్టి నీవు అనుభూతికి గోచరం కానిదెప్పుడు! నిన్ను కొత్తగా పొందవలసినదిగా ఎట్లా అనడం?

నీవు నాలోనే ఉన్నావు. నిన్ను మరెక్కడో వెతకవలసిన పనిలేదు. ఒక శబ్దమును విన్నంత మాత్రం చేత, ఆ శబ్దశక్తిని ప్రకాశింపజేస్తున్నట్టి నీవు నాకు దూరస్థుడవు అవుతావు? తీపి – చేదు – కారములను ఆస్వాదిస్తూ నీవు ఏ క్షణంలోను అప్రత్యక్షమైనవాడవు కాదు. నేను ఒక పుష్పసువాసన ఆఘ్రాణిస్తున్నప్పుడు ఈ చేతిలోను, ముక్కులోను ఉండి, ప్రీతిచే అనుభవ రూపంగా తారసపడే నీవు ఎల్లప్పుడు చేతిలోని పండు వలె (కరతలామలకం వలె) తారసపడియే ఉన్నావు.

❖

వేద వేదాంతములచే, తర్కము, మీమాంస మొదలైన శాస్త్రములచే, పురాణములచే వర్ణించి చెప్పబడుచున్న సనాతనమగు ఆత్మను ఒక్కసారి తెలుసుకున్నామా – ఇక మరుచుట అనేది ఉండదు. హే ఆత్మదేవా! నిర్మల స్వరూపులగు నిన్ను గాంచిన తరువాత ఇక ఇంతఃపూర్వపు రుచికరములైన భోగములు ఇప్పుడు లెక్కకు వచ్చుటయే లేదు. నీ యొక్క నిర్మల ప్రభావము చేతనే సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారు. ఈ పర్వతములను భారవంతముగా చేసినది మీరే. ఆకాశమును ఆక్రమించి వాయువును సంచరింప జేస్తున్నది మీరే! నమస్తే వాయుః! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి! భూమి సర్వమునకు ఆధారమగుచుండగా, ఆ భూమికి మీరే ఆధారం.

అమ్మయ్య! నేడు నాకు, గల భేదం అదృష్టవశం చేతనే తొలగినది. నీవే నేను... నేనే నీవు. మనిద్దరిలో కొంచెం కూడా భేదం లేదు. జలమునకు, తరంగమునకు భేదమేమున్నది? కొండకు – కొండరాయికి భేదమెక్కడిది? కుండలో నింపిన తటాక జలానికి – తటాకంలోని జలానికి భేదం ఏముంటుంది? ఈ 'నేను – నీవు' మొదలైన శబ్దములన్నీ నీ మాహాత్మ్యముచే ప్రకటనమగుచూ, నిన్నే తెలియపరుచుచున్నాయి. సమానాధికములు ఏమాత్రము లేనట్టి కార్యకారణ ఉపాధికారకములైన 'నేను – నీవు' అను శబ్ద ద్వయమునకు ఇదే నమస్కారం. ఇక ఉపశమించమని ఆ శబ్ద ద్వయమునకు నా విన్నపం. నిత్యసత్యమగు అభేదమే పరిఢవిల్లును గాక!

❖❖❖

## 13. నాకు ... నేనే నమస్కారం!

అనంతుడు, నిరహంకారుడు, రూపహీనుడు, అత్యంత సమస్వరూపుడు అగు నాకు నేనే నమస్కరించుచున్నాను. సత్యము, సాక్షీభూతము, నిరాకారము, అపరిచ్ఛిన్నము అగు ఆత్మ దేవుడు నా యొక్క నిర్మల స్వరూప, స్వభావములై వెలయుచున్నాడు. కొత్తగా ఇంకేం కావాలి?

ఈ మనస్సు ఏవేవో కారణాలు కల్పించుకొని ఎందుకోసమో క్షోభించుచుండవచ్చు గాక! ఇంద్రియ వృత్తులు స్ఫురించుచున్నాయా? అయితే కాని! ప్రాణ – ఆపానములు ప్రవహింపజేయు ఏదో శక్తి విజృంభిస్తోందా? విజృంభించనీ. చర్మ – మాంస – బొమికలతో కూడిన ఈ భౌతిక శరీరము మనస్సు అనే సారథిచే ఆశాపాశములనే త్రాళ్ళ సహాయంతో సంచరింపజేయబడుచున్నదా! ఏది ఏమైనా కానీ! కాకపోనీ! వీటితో నాకు సంబంధమే లేదు. ఈ శరీరం ఇట్లాగే అనేక రోజులు ఉండనీ. లేక, ఎప్పుడో ఒకప్పుడు నేలకూలనీ! ఈ సర్వ, కార్యక్రమములకు మూలము, కారణభూతము అగు ఆత్మను గ్రహించాను. ఇంక నాకు ఏమి భయం? ఇంకేమి కావాలి? వచ్చేదేమున్నది? పోయేదేమున్నది?

చాలాకాలం తరువాత నేను నాయందుగల ఆత్మదేవుని చూస్తున్నాను. ఈ జగత్తు ఎట్లాగైతే కల్పాంత సమయంలో లయమైపోతోందో, అట్లాగే నా భ్రాంతి కూడా ఇప్పుడే అంతమొందింది. ఈ సంసారములో తిరిగి తిరిగి అలసి, సొలసిపోయి ఉన్న నాకు ఇప్పుడు పరమ విశ్రాంతి అయిన ఆత్మభగవానుడుండే స్థానములో ఆతిథ్యం లభించింది. ఓ ఆత్మదేవా! నీవు సర్వమునకు అతీతుడవు. సర్వుల స్వస్వరూపము నీవే. అట్టి నీ యొక్క స్వరూపమును చేతులెత్తి చూపించుచున్న వేదాది శాస్త్రములకు, గురువులకు నమస్కారం. భోగ్యవస్తువులన్నీ ప్రకాశింపజేస్తూకూడా, నీవు వాటి దోషములచే ఏమాత్రం స్పృశించబడవు కదా! అభినివేశ శూన్యము, ఉదాసీనము, సర్వసమము అగు సాక్షీభావంగా నీవు వెలుగొందుచున్నారని గుర్తిస్తున్నాను.

హే పరమాత్మా! పువ్వులందు సువాసన ఉన్నట్లు, తోలుతిత్తిలో గాలి ఉన్నట్లు నువ్వులలో నూనె ఉన్నట్లు నీవు సర్వజీవులలో వెలుగొందుచున్నావు. నీవు నిరహంకారుడవై కూడా రక్షిస్తున్నావు – శిక్షిస్తున్నావు – దానమొనర్చుచున్నావు – స్వీకరిస్తున్నావు – పోరాడుచున్నావు – పరిగెడుచున్నావు. మరి, నీ మాయ అంతటిది. నీ "ప్రోద్బలం – సంకల్పం – సహకారం – పాల్గొనడం" చేతనే సృష్టికాలంలో నేను జీవ స్వరూపంతో అనేక ఉపాధులలో ప్రవేశించడం, వాటిని పాలించడం జరిగింది. ఇంతలోనే నీ సంకల్పమును అనుసరించి ప్రళయ కాలంలో ఈ జగత్తును, ఉపాధులను ఉపసంహరించి ఉపరతిని పొందటం జరుగుతోంది.

❖

ఒక చిన్న మఱ్ఱివిత్తనంలో ఒక పెద్ద మఱ్ఱివృక్షము యొక్క స్వభావమంతా దాగి ఉన్నది కదా! అత్యంత సూక్ష్మరూపుడవగు నీయందు ఈ సంసారమండలమంతా త్రికాలములందూ ఇమిడి ఉన్నది. నీవే భ్రాంతి కల్పితములగు వివిధ పదార్థముల ఆకృతిని వహించి ప్రకటించుకొనుచున్నావు. అనేక భావ పరంపరలన్నీ బయల్వెడలుచున్నది నీనుండే కదా! చివరికి, అఖండానందమయ స్వరూపము ఆవిర్భవిస్తున్నది నీ నుండే.

❖❖❖

# 14. ఓ స్వస్వరూపాత్మ దేవా!

ప్రహ్లాద నామధేయా! ఓ నా స్వస్వరూపాత్మదేవా! "నేనెవ్వడను? ఎక్కడున్నాను?" – అనే విషయాలు నీవు మరలమరల యోచించవలసినదిగా నా మనవి. పూర్వమోహదశలను చూచి నీవు నవ్వటమే జరుగుతుంది. స్వచ్ఛంగా నవ్వుకుంటూనే ఈ క్రోధ, మాన, కాపురుష , క్రూరత్వములను సర్వదా పరిత్యజించుము. నీచ జనులకు మాత్రమే ఉచితమైన మాన, మద, గర్వములను మహనీయులు దగ్గరకు రానిస్తారా? ఒకప్పుడు 'చింతలు' అనే అగ్నిలో దగ్ధమగుచూ కార్యములందూ, పీడలందూ, ఆరంభములందూ సంక్షుభితమయ్యే అజ్ఞానదశలు తొలగిపోయినాయి సుమా! ఆ దుర్దశలన్నీ కూడా విజ్ఞాన వికాసముచే భస్మం చేయబడ్డాయి. ఇప్పుడు నీవు దేహనగరమునకు రాజై 'పూర్ణమనోరథులు' అయ్యావు.

ఓ స్వస్వరూపస్వామీ! ఆకాశమును ఎవడైనా తన పిడికిలిలో బంధించగలడా? అట్లాగే ఈ ప్రపంచంలో కనిపించే ఆయా సుఖదుఃఖ సంఘటనలచే నీవు బంధింపబడలేరు. అవి నిన్ను తాకనైనా లేవు. ఈ ఇంద్రియములు, చిత్తము, భోగములు – వీటన్నిటికంటే సమున్నతులగు నీవు నీకే సర్వదా చెందియున్నట్టి ఆత్మసామ్రాజ్యాన్ని అధిరోహించావు.

**అపారామ్బరపాన్థస్త్వ మజస్రా స్తమయోదయః ।**
**అవభాసకరో నిత్యం బహిరన్తశ్చ భాస్కరః ॥** (శ్లో 46, సర్గ 36)

అనంత ఆకాశంలో బాటసారియగు ఆ సూర్య భగవానుని వలె మీరు స్వయంప్రకాశ స్వరూపుడవై, జ్ఞానదృష్టికి "నిత్యోదిత ఆత్మ ప్రకాశము"గానూ, అజ్ఞాన దృష్టికి "ప్రహ్లాదుడు అనబడే ఒక వ్యక్తి" గానూ తెలియవస్తున్నావు.

స్వతహాగా నిష్క్రియుడవు, పరమశాంత, నిర్లిప్త అప్రమేయ స్వరూపుడనగు నీముందు నీ సేవ కొరకై ఈ ఇంద్రియములు, ఇంద్రియార్థములు నిలచి ఉన్నాయి. కాముకునికై కామిని తళుకు బెళుకులు చూపునట్లు ఈ ఎదురుగా ఉన్న రూపాదులన్నీ 'దృష్టి' అను సేవకురాలిచే కనులలో ఉండే దర్శనశక్తికి ఉపాహారంగా కొనిరాబడుచున్నాయి. సర్వదా ప్రశాంతంగా అచ్యుతులై ఉంటూనే ఈ 'దృశ్యము'ను స్వీకరించండిగాని, తాదాత్మ్యము చెందటమా? కానేకాదు. అవసరం లేదు.

ఓ ప్రహ్లాదాత్మదేవా! నీవు మహనీయుడవు. ఎందుకంటే, ఒకవైపు – ఈ శరీరమధ్యంలో ఉండి సాక్షిస్వరూపులై ప్రాణవాయువుల సంచారము వీక్షిస్తూ ఈ ఇంద్రియములద్వారా ఈ జగత్తును పొందుచున్నావు. మరొకవైపు మార్పు చేర్పులు ఉండనట్టి బ్రాహ్మీతత్త్వమునకు నిత్యసాక్షులై వెలుగొందు చున్నారు. ఈ 'దేహము'అనే పుష్పము యొక్క సౌరభము నీవే. ఇందలి అమృతరసము నీవే. నీవు ఈ దేహమును విడచినారా – ఇక ఆపై ఇది ఎవరికి ప్రేమాస్పదమౌతుంది? ఈ ప్రహ్లాద ఉపాధిలోనే కాదు. సర్వప్రాణులందు, అణువణువునా నిండియున్న స్నేహరసం నీవే. 'శరీరము' అనే కట్టెయందు అణిగియున్న నిప్పువలె నీవు ఉండనే ఉన్నావు. సర్వోత్తమాస్వాదమగు అమృత రూపుడవు నీవు. సమస్త తేజములను ప్రకాశింపజేసేది నీవే.

ఈ పదార్థములన్నిటి ఉనికినీ గ్రహించేది నీవు. అంతర్–హృదయస్థులగు ఆత్మదేవా! ఈ దృశ్యమంతా నీ సంప్రదర్శనమే! నీయొక్క ప్రభావంచేతనే ఈ కళ్ళు మొదలైన ఇంద్రియములు తమ పనులను తాము చేయగలుగుచున్నాయి. వాయువు యొక్క చలనమునకు, చిత్తము యొక్క చాంచల్యమునకు, బుద్ధి యొక్క ప్రకాశ, అప్రకాశములకు మూలకారణం నీవే.

నీవు ఉపసంహరించుటచేతనే ఈ వాక్కు 'మరణము – మూర్ఛ – నిద్ర' లందు విలీనమై పోవుచున్నది. ఇంతఃపూర్వపు శరీరములను, ఇప్పటి ఈ శరీరమును, ఇక ముందు ఏర్పడబోయే శరీరమును దీపమువలె ప్రజ్జ్వరిలింపజేసేది నీవే. ఒకే బంగారము నుండి అనేక ఆభరణములు ఉత్పన్నమగుచున్నట్లు, నీ నుండియే ఈ వివిధ సంసారపదార్థములు, సంబంధములు, సంఘటనలు ఉత్పన్నమగుచున్నాయి. నీకు నీవే, స్వవిలాసముగా 'నేను – నీవు – అతడు' అను మాయతో గూడిన శబ్దములన్నీ వ్యవహారింపజేయుచూ, స్పందించుచున్నావు. నీవే, ఈ ప్రహ్లాద నామధేయ వ్యష్టిగా ఉంటూనే, ఇంతలోనే ఏతత్‌సమయంలోనే అసంఖ్యాక ప్రాణుల ఆకార, ఆచారాదుల రూపంగా పరిలక్షింపబడుచున్నారు. వేరువేరు అగ్ని శిఖలు వేరువేరు అగ్ని ఖండములని అజ్ఞాన దృష్టికి అనిపించవచ్చునేమోగాని, అగ్ని సర్వదా ఒక్కటే కదా! నీ సృష్టియందు నీవే నీకంటే వేరైన ఆకారము వలె అగుపడుచున్నావు. సర్వాకారములూ నీకు అభిన్నమైనవే.

ఈ బ్రహ్మాండమంతా నిండియున్న అవిచ్ఛిన్న స్వరూపుడవు నీవే. చెట్టుకు వేలాది పూలు పూస్తున్నట్లు ఈ భూతజాలమంతా నీయందే ఉత్పత్తి అయి పరిభ్రమిస్తోంది. నీ వలననే ఈ విధంగా అభివ్యక్తమయ్యే సర్వ పదార్థములూ సృష్టి రూపమున ప్రకాశమొందుచున్నాయి.

**చూస్తున్నది మీరే .... చూడబడుచున్నది మీరే! -** ఓ నా స్వస్వరూపాత్మ స్వరూపా! ప్రహ్లాద నామధేయా! ఒక గుడ్డివాడు ఒక అందమైన యువతి రూపలావణ్యములను చూడగలడా? లేదు. నీవే లేకపోతే, ఇక ఈ అందమైన వస్తుసంపద ఉండి కూడా లేనట్టే. ఎందుకంటే, వస్తువులకు కార్య – కారణ శక్తిని ప్రసాదించేది నీవే కదా! నీవే లేకపోతే ఈ శరీరము, ఈ జగద్విశేషములు నిస్తేజము, అనుభవరహితము అగు కొయ్య, మట్టితో సమానమే. వెలుగు ఉండుట చేతనే ఒక గొప్పకొండ యొక్క ఔన్నత్యాన్ని చూడగలుగుతాం. వెలుగు లేకపోతే, అంతా చీకటిమయమే కదా!

ఓ ఆత్మేశ్వరా! నిన్ను పొందిన తరువాత ఇక సర్వ సుఖ దుఃఖాలు నశించిపోతాయి. సూర్యుడు ఉదయించగానే చీకటి, మినుకుమినుకుమనే నక్షత్రాలు, మంచు – అన్నీ లీనమైపోతాయి కదా! నిజానికి నీ అంగీకారం చేతనే సుఖ దుఃఖములు ఏర్పడి ఉండగలుగుచున్నాయి. ఎంతటి చిత్రమో చూచారా?

1. నీవు దర్శించుచుండుటచేతనే సుఖ దుఃఖములు స్థితిని పొంది ఉంటున్నాయి.
2. నీవు కాదంటే, అవి ఇక ఉండవు.
3. దీపం తొలగించగానే దీపపు కాంతి చీకట్లో విలీనమై పోవునట్లు, నిన్ను దర్శించగానే సుఖ దుఃఖములన్నీ, స్వయంగా సంపూర్ణముగా లయించగలవు.

ఏవి నీ సత్తచే ఏర్పడి ఉంటున్నాయో, అవి నీ అద్వితీయ దర్శనముచే 'లేనివి' అగుచున్నాయి. నిన్ను ఆశ్రయించి ఉన్నవి నిన్ను ఆశ్రయించుటచే మాత్రమే జయింప బడుచున్నాయి.

❖

అయినా ఒక్కమాట! వాస్తవానికి పరమానంద స్వరూపుడవగు నీ యందు అత్యంత భంగురమైన సుఖ దుఃఖము లెక్కడ! ఒక నిమిషములో ఒక లక్షవభాగము ఎప్పుడు పుడుతోందో, ఎప్పుడు నశిస్తోందో ఎవ్వరమైనా గమనిస్తున్నామా? అట్లాగే నిన్ను ఎరిగినట్టి జ్ఞాని దృష్టిలో ఆ సుఖదుఃఖాలు ఎప్పుడు ఏర్పడుచున్నాయో ఎప్పుడు తొలగుచున్నాయో గమనించుటకు అర్థమే అగుటలేదు. అయినా, ఈ సుఖదుఃఖములు నీ అనుగ్రహం చేత పుడుతూ, నశిస్తూండటమేమిటి? ...అవి నిన్నే భ్రమింప జేయమేమిటి?

**జగత్తు, ఉత్పత్తి, లయములు -** ఈ జగత్తు నీవు గాంచుటచే ఉత్పన్నమగుచు, నిన్ను గాంచుటచే విలీనమై పోవుచున్నది. దృష్టాంతానికి ఒక స్వప్న ద్రష్ట తన స్వప్నంలో చూచే వస్తుజాల మంతా స్వప్నం అంతమైనప్పుడు ఎటు పోతున్నాయి? అట్లాగే ఆత్మజ్ఞానము ప్రాప్తించగానే ఈ జగత్తు ఎటు పోవుచున్నది? "లేనిదే" అగుచున్నది. "ఈ జగత్తు ఏ క్షణమందూ లేదు" – అని తెలిసిపోతోంది. ఏ క్షణంలోనూ ఏమాత్రం లేనట్టి ఒక వస్తువు ఒక కార్యమెట్లా నిర్వర్తిస్తుంది? ఎవరైనా కొన్ని జల తరంగములను ఒక మాలగా చుట్టి తన మెడలో ధరించగలరా? "సుఖ – దుఃఖములు లేవు..." అను ఆత్మజ్ఞాన సంబంధమైన ఎఱుకచే, ఇవి పుట్టిన మరుక్షణం చచ్చుచున్నాయి. వివేకులు మిమ్ములను దర్శించుటచే సర్వస్థితులందూ ఏకరీతిగా ఉండగలుగుచున్నారు.

ఓ అనంతరూపా! అవివేకులకు మీరు ఎన్ని రకములుగా తోచుచున్నారో చెప్పనలవికాదు. వాస్తవానికి మీకు ఇహ పరములనేవి లేవు. మీరు అవయవరహితులు! నిరహంకారీ! నిరాకారీ! సర్వకర్తా! ఓ ఈశ్వరా! సర్వేశ్వరా! ప్రహ్లాదనామధేయుడగు నా స్వరూపమా! సర్వస్వరూపా! ఆత్మభగవాన్! నీ ఆకారము బ్రహ్మాండము కంటే ఎంతో ఎంతో విస్తృతమైనది! పరమశాంతిపరాయణా! నీకు దిగ్విజయమగు గాక! నిఖిల ఆగమములకు నీవు అతీతము! ఆగమములకు (వేదములకు) ఆధారుడవు! జయ జయ! పరమాత్మా! జాతా! (పుట్టుచున్నది మీరే!) అజాతా! (పుట్టుక లేని) క్షతా! (నశించుచున్నది) అక్షతా! (నాశనము లేని) భావా! అభావా! జయా! అజయా!... నీకు సర్వదా జయమగుగాక!

ఇప్పుడు నేను శాంతుడనైనాను. యదార్థమేమిటో తెలుసుకున్నాను. జయించాను. ఇందులకే ఇంతకాలం జీవించాను. నాకూ – నీకూ కూడా నానమస్కారం!

నా వాస్తవ స్వరూపము తత్ స్వరూపము, – నిరామయమూ, స్వతఃసిద్ధమూ, స్వసంసిద్ధమూ రాగరంజనా రహిత స్వరూపమూ అయిఉన్నది. ఇక నాకు బంధమేమిటి? విపత్తెక్కడ? సంపద ఎక్కడ? నాకు జననమరణము లెక్కడివి? నేను క్రొత్తగా నిరామయమగు నిత్యశాంతి పొందటమేమిటి? ...నేను సర్వదా శాంతి స్వరూపుడనే అయి ఉన్నాను.

❖❖❖

# 15. దానవులు - దీనత్వము

ఈ విధంగా చింతనచేస్తున్న ప్రహ్లాదుడు క్రమంగా నిర్దోషము – నిర్ద్వంద్వము – నిర్వికల్పము అగు స్వస్వరూప సామ్రాజ్యములో ప్రవేశించాడు. సమాధిని అవధరించాడు. ఒక చిత్రపటంలోని బొమ్మలాగా, శిల్పిచే మలచబడిన శిలావిగ్రహంలాగా ఉండిపోయాడు. అట్టి నిర్వికల్ప సమాధిలో సుస్థిరుడైనాడు.

అక్కడి అసుర మంత్రివరేణ్యులు, తదితరులు ప్రహ్లాదుని సమాధి నుండి ప్రబోధింపజేయాలని ఎంతగానో ప్రయత్నించారు. కాని ఏమి లాభం? అతడు మాత్రం రాతియందు చెక్కబడిన సూర్యుని వలె ప్రశాంతభావంతో ఏకదృష్టితో ఉండిపోయాడు. ఏ పిలుపు కాని, ఏ దృష్టి కాని అతని దరి చేరటమేలేదు. ...ఆ విధంగా కొన్నిరోజులు గడచిపోయాయి.

అంతరంగంలో ఆతడు ఏకము – అఖండము – అప్రమేయం – నిర్విషయము – నిరవధికము అగు బ్రహ్మానందం అనుభవిస్తున్నాడు. ఆతని అనుభవస్థితి వాక్యాలకు అందేది కాదు ఒక చెంబు సహాయంతో సముద్రజలం ఎంతటిదో ఏమని విశదపరచగలం? అయితే, బయటకు మాత్రం చూచేవారికి "ఈతడు నిరానంద స్వరూపమగు మృత్యువును పొందినాడా ఏమి?" – అన్నట్లుగా ఉన్నది. ఇక పాతాళ సామ్రాజ్యములో అసుర జాతి యొక్క జీవనవిధానం కొన్ని మార్పులు చెందసాగింది. ఎందుకంటే వాళ్ళను పాలించే నాయకుడు లేడు. మొన్నమొన్నటిదాకా దేవతలకు సింహస్వప్నమై, విష్ణుద్వేషి అయి, బలపరాక్రమవంతుడై పరిపాలించిన హిరణ్యకశిపుడు నృసింహస్వామి చేతిలో హతమైపోయాడు. నేడు ఈ ప్రహ్లాదుడు సమాధిని అవధరించి రాక్షసనాయకత్వానికి సుదూరముగా, అంతరంగ వ్యవస్థితుడై స్వస్వరూప ఏకాంత పారవస్యము నందు ఉండిపోయాడు. ఎవరెంత ప్రబోధం చేసినా ఆతని పట్ల అది చెవిటివాడి ముందు శంఖారావమగుచున్నది.

❖

రాజు లేకపోతే అల్పయోచనలుగలవారి కార్యక్రమం ఉద్ధృతమై అంతా అరాచకమే అవుతుందిగదా! పాతాళపురంలో అరాచకం ప్రారంభమైంది. "పెద్ద చేప చిన్నచేపను మ్రింగటం" – అనే మత్స్యన్యాయం తాండవించింది. బలవంతులు బలహీనులను పీడించసాగారు. ప్రజలు నిస్సహాయులై అనేక పీడలు ఎదుర్కొనవలసి వచ్చేది. సామాన్య ప్రజలు దిక్కులేక నిస్సహాయులు కాసాగారు.

ఏకరసస్వరూపము పొందియున్న ప్రహ్లాదునకు ఈ వివరాలన్నీ తెలియనే తెలియవు. ఆతడు సుషుప్తిలోని వ్యక్తిలాగా సమాధి తత్పరుడయ్యే ఉన్నాడుకదా! ఇక బలవంతులగు దైత్యులు విచక్షణా శూన్యులై ఆవేశ కావేశాదులతో తమలోతామే కలహించుకోసాగారు. గుణవంతులు గుణహీనులచే హింసించ బడసాగారు. బలహీనుల సొత్తు బలవంతులు లాక్కోవటం, జనులు మాన మర్యాదలు వదలి ప్రవర్తించటం, అధర్మం, అబలల, పీడితుల గొంతుకలు వినిపించుకోకపోవటం – ఇవన్నీ

అంగీకార యోగ్యం కాసాగాయి. అంతఃపురంలో కట్టుబాట్లు భ్రష్టమైనాయి. అనేకులు అధర్మపరుల దుశ్చర్యలకు తమ ధన, జనములను పోగొట్టుకొని, చెప్పుకొనుటకు దారిలేక, ఇక చేసేది లేక, చింతామగ్నులై, బిచ్చగాండ్రై చరించసాగారు.

❖

ఎప్పుడూ లేనిది, హఠాత్తుగా ఆంతరంగికంగా రాక్షస జాతిలో ఇట్టి పరిణామాలు రావడం చూచి అక్కడి పెద్దలకు ఏమి చేయాలో తెలియని పరిస్థితి వచ్చింది. మరొక వైపు దేవతాబాలకులు వచ్చి అసురులను పరాభవిస్తుంటే, వాళ్ళలో వాళ్ళకు ఐకమత్యం లేక, అవమానాలు దిగమింగుకోవలసి వచ్చింది. వాళ్ళలో వాళ్ళు పోట్లాడుకొనుచూ, ఉద్విగ్నతతో దీనులు కాసాగారు.

❖❖❖

# 16. సృష్టికే ఎసరు

ఆ విధంగా అనేక రోజులు గడచిపోయాయి. నిఖిలజగత్కళ్యాణకారకుడు, క్షీరసముద్ర నివాసి, శత్రుమర్దనుడు అగు విష్ణుమూర్తి ఒక రోజు తన నిద్రాముద్రను విడిచారు. నెమ్మదిగా కళ్ళు తెరిచారు. పాతాళం, తద్వారా దేవలోకం, తదితర లోకాలూ అస్తవ్యస్తంగా ఉండటం గమనించారు. తన జ్ఞాననేత్రములచే సర్వజగత్తు యొక్క గతి – దుర్గతులను పరిశీలిస్తూ ఇట్లు తనలో యోచించ సాగారు.

**శ్రీమహా విష్ణువు (మనస్సులో) :** ఆహా! పరమభక్తుడగు ప్రహ్లాదుడు బ్రహ్మపదమున విశ్రమించియున్న ఈ సమయంలో పాతాళ లోకంలో నాయకుడు లేకుండాపోయాడు. ఇక దానవులు తమను తామే హింసించుకొంటూ క్రమంగా తమకు తామే బలహీనులగుచున్నారు. రాక్షసులు లేకపోతే, అప్పుడు పర్యవసానమేమిటి? దేవతలలో "మేము విజయము పొందాలి" అనే పట్టుదల ఉండదు. పట్టుదల ఉండని చోట ఉత్తమ శక్తి, యుక్తులు బలహీనపడిపోతాయి. క్రమంగా దేవతల ఉనికికే ఎసరు వస్తుంది. దేవతలు శాంతించి, వారంతా ద్వంద్వరహితమైన బ్రహ్మమును పొందుతారు. అభిమాన రహితులై స్వర్గసుఖములను త్యజించివేస్తారు.

దేవతలు ఆ విధంగా నాశనమవటం జరిగితే అప్పుడేమౌతుంది? క్రమంగా భూలోకంలో యజ్ఞ యాగాది క్రియలు కూడా నశిస్తాయి. ఇష్ట భోగములనూ, తదితర ప్రయోజనములను ప్రసాదించే దేవతలు లేకపోతే ఇక కర్మలకు ప్రయోజనములు ఏం ఉంటాయి? అందుచేత "కర్మ ఉత్కృష్టత" అను కార్యక్రమముతో కూడిన మానవులు బద్ధకస్థులౌతారు. క్రియలు నశిస్తే కర్మభూమి అగు భూలోకం నశించిపోతుంది. భూలోకమే నశిస్తే ఇక ఏమున్నది? ఈ సంసారమే నశించ బోవుచున్నదే!

❖

అరే! భలేచిక్కు వచ్చిపడిందే. ప్రళయం తరువాత నేను చేసిన ఈ సృష్టి అకాలంగా, అర్ధంతరంగా లుప్తమైపోతోందికదా! నాచే కల్పితమైన ఈ విశాలజగత్తు నశిస్తే నా ఈ లీలయే భంగమై పోగలదు.

అప్పుడు నేను కూడా "చంద్ర – నక్షత్ర – ఆకాశ" శూన్యమగు నా ఈ శరీరమును విలీనమొనర్చుకొని తత్ పదమున వెలయవలసివస్తుందే! అది అకాలమగు విపరీతపరిణామం అవటం చేత ఉచితం కాదు, శ్రేయము కాదు. ఎందుకంటే, ఈ జీవులు ప్రకృతిలో లయం పొందినప్పటికీ, మూలాజ్ఞానం ఉండనే ఉంటుంది. కాబట్టి 'మరల జన్మించాలి' అనే తపన మిగిలియే ఉంటుంది. ఈ సృష్టి ఏర్పడియే ఉండవలసిన అగత్యమున్నది. అందుచేత ఈ దానవులు తమతమ పరాక్రమములతో జీవించి ఉండటం అవసరమే. రాక్షసులు ఉంటే, దేవతలు కూడా ఉంటారు. అప్పుడు తపస్సు, యజ్ఞము మొదలైన క్రియావ్యవహారాలకు కూడా చోటు ఉంటుంది. సంసారము అనబడునది ఉంటుంది. అప్పుడు సృష్టికి సంబంధించిన అసందర్భపూర్వకమైన రసాభాస ఉండదు. కనుక నేనిప్పుడు పాతాళలోకం వెళ్లి ప్రహ్లాదుని 'రాజ్యపాలన' అను కర్తవ్యంలో నియమించటమే సముచితం. ఒకవేళ ప్రహ్లాదుని బదులుగా మరొకరిని రాజ్యపాలనయందు నియమిద్దామంటే, అది సమంజసం కాదు. ఎందుకంటే ఈ ప్రహ్లాదదేహము అత్యంత పవిత్రమైనది. ఈతడు ఇక మరల జన్మించడు. వర్తమానానికి ఈతడు కొంతకాలం రాజ్యపాలన నిర్వర్తించవలసిన 'యోగం' ఉన్నది. అటుతరువాత కూడా కల్పాంతమువరకు ఈతడు ఈ సృష్టికే ఒక ఆభరణమై జీవించటమే ఈశ్వరనియతి.

నియతికి ఏమాత్రం భంగం కాకూడదు కదా! అందుచేత నేనిప్పుడు ప్రహ్లాదుని ప్రబోధింప జేస్తాను. ఈతడు తనయొక్క జీవన్ముక్త స్థితిలో నిర్విఘ్నంగా ఉంటూనే, రాజ్యపాలన చేయుచుండును గాక! అప్పుడే దేవతలూ ఉంటారు... అసురులూ ఉంటారు. ద్వంద్వము ఉంటుంది. అప్పుడు మాత్రమే నా లీల చెక్కు చెదరకుండా ఉంటుంది. వాస్తవానికి ఈ జగత్తు యొక్క ఉదయము – క్షయమూ, ఈ రెండూ నాకు ఒక్కటే అయినప్పటికీ నేను యథారీతిగానే సర్వమూ ఏర్పాటు చేసి ఉంచటం ఇప్పటినా స్వభావము అయి ఉన్నది.

ఇప్పుడు ఈ క్షీరసాగరశయనము ఈ రీతిగా ఒక ప్రక్క కొనసాగిస్తూనే, యోగనిద్రలో ఉండి ఉంటూనే, ఇక్కడ నిద్రాముద్రకు భంగం లేకుండానే నేను పాతాళానికి వెళ్ళటం, ప్రహ్లాదునితో సంభాషణ, జగత్తును సుస్థిరీకరించటం మొదలైనదంతా జరుగుచుండును గాక.

❖❖❖

# 17. నారాయణోపన్యాసము

ఆ విధంగా యోచించిన శ్రీహరి సర్వాత్మకుడైయుండినట్టి తనయొక్క ప్రభావంచేత క్షీరసాగరంలో శయనసముద్రంలో ఉంటూనే, నీరు కూడా చొరజాలనట్టి పాతాళబిలం ప్రవేశించారు. ప్రహ్లాదుని అంతఃపురం ప్రవేశించి అక్కడ బ్రహ్మదేవునివలె సమాధి యందు నిమగ్నమైయున్న ప్రహ్లాదుని చూచారు. ఆ దగ్గిరలో పచార్లు చేస్తున్న రాక్షసులు నారాయణాగమనముచే ప్రవేశించిన వైష్ణవ తేజమునకు తాళలేక దూరంగా వెళ్ళసాగారు. వాళ్ళంతా విషయమేమిటో అర్థంగాక తమ మంత్రి వర్యులకు ఆ విశేషమును నివేదించటానికి పరుగులు తీశారు.

ఆకాశంలో అప్పుడే చంద్రుడు ఉదయిస్తున్నాడు. విష్ణు భగవానుడు వేంచేసి ప్రహ్లాదుడు సమాధిలో ఉండియున్న విశాల మందిరంలో ఒక ఉన్నతాసనంపై ఆసీనులైనాడు. శంఖ, చక్రాది ఆయుధములను ధరించి పరివార సమేతుడైయున్నారు. లక్ష్మీదేవి పూతీగ వంటి హస్తములతో స్వామికి వింజామరలు వీచుచున్నది. దేవ – ఋషులు, మహర్షులు ఆయనకు నమస్కరిస్తూ స్తోత్రములు సమర్పిస్తున్నారు. నవ్వుతో కూడిన నునులేత పెదవులతో స్వామి, "నాయనా! ప్రహ్లాదా! లే! ప్రబుద్ధుడవు కమ్ము" అని పలుకుతూనే పాంచజన్యం పూరించారు. విష్ణుదేవుని ప్రాణవాయువుల నుండి జనించిన ఆ ధ్వని రాక్షసులను మూర్ఛిల్లేటట్లు చేసింది. ఆ ధ్వని విని విష్ణుదేవుని అనుచరులు బ్రహ్మానందం పొందారు.

రాక్షసుల చక్రవర్తి అయినట్టి ప్రహ్లాదుడు విష్ణుదేవుని శంఖానాదం ఎక్కడో హృదయాంతరాళలోని లోతుల నుండి విన్నాడు. నాదస్వరం విన్న ఆడత్రాచుపాములాగా బోధను పొందసాగాడు. ఆతని ప్రాణశక్తి క్రమంగా బ్రహ్మరంధ్రమునుండి లేచి శరీరమంతా వ్యాపించింది. ప్రాణవాయువులు నెమ్మదిగా అంగ ప్రత్యంగములలోనికి ప్రవేశించాయి. ఇంద్రియ నవ ద్వారములు ఉత్తేజితము లైనాయి. "లింగ శరీరము" అనే దర్పణమునందు చైతన్యము ప్రతిబింబించింది. అది క్రమంగా విషయోన్ముఖమై చిత్‌జడరూపమున మనోభావంగా పొందింది. ఆ విధంగా చిత్తము సంచలనమును ఆశ్రయించుచుండగా ఆతని నేత్రములు అర్ధనిమీలితములు అయి విచ్చుకున్నాయి. నాడీ రంధ్రములలో దాగి ఉన్న జ్ఞానశక్తి ప్రాణాపానవాయువుల వలన సముత్సాహపూరితమైనది. ఇక, ప్రహ్లాదుడు నెమ్మదిగా కదలసాగాడు.

ప్రాణములు పూరితం అయిన తరువాత ఆతని మనస్సు పరిపూర్తి పొందసాగింది. తెల్లవారిన తరువాత సరోవరంలాగా ఆతని ప్రాణములు, మనస్సు, కళ్ళు వికసించాయి. "నాయనా! ప్రహ్లాదా! ప్రబుద్ధుడవు కమ్ము" అను శబ్దతరంగాలు ఆతని చెవులను, మనస్సును మరల మరల తాకాయి. మననశక్తి, స్మృతిశక్తి అభివృద్ధి అగుచుండగా ఆతడు తటాలున లేచి శ్రీవిష్ణుమూర్తికి నమస్కరించాడు.

❖

**శ్రీమన్నారాయణుడు :** నాయనా! ప్రహ్లాదా! నీవు నీ నిజస్వరూపమును స్మరించుటచే ధన్యుడ వైనావయ్యా! నాకు సంతోషం. అయితే ఒక్క విషయం. నీకు ఈ నీ దేహాన్ని తిరస్కరించి, త్యజించ వలసిన అవసరం ఇప్పుడేమున్నది? ఇటు ప్రారబ్ధముయొక్క ప్రభావముచే ఏర్పడి ఉన్న దానవ రాజ్యాన్నీ, అటు అప్రమేయము, నిర్మలము, నిత్యము అగు ఆత్మస్వరూపమును ఒక్కసారే అవధరించి ఉండవచ్చును కదా! ఇప్పటికే నీవు సంకల్పరహితుడవయ్యావు. కనుక నీకు కొత్తగా త్యజించ వలసినదేమున్నది? గ్రహించవలసిన దేమున్నది? ఆత్మతో ఏకత్వము పొందిన తరువాత ఇక నీకు ఈ శారీరక సుఖదుఃఖముల వలన వచ్చే కీడు, మేలు ఏమున్నాయి?

కనుక, లేఁ! ఈ నీ భౌతిక దేహము ఈ కల్పాంతమువరకు అనేక జీవులకు మార్గదర్శకమై ఉండబోవుచున్నది. అవశ్యం జరగబోయే నియతి అది. అందుచేత, నీవు చక్కగా లేచి రాజ్యపాలన

చేయి. ప్రవాహపతితంగా ఏదైతే తప్పక నిర్వర్తించవలసి వస్తుందో అద్దానిని జ్ఞానులు త్యజించరు. తప్పక నిర్వర్తిస్తారు. కనుక నీవు ఉద్వేగరహితమైన భావములతో ఒనగూడినవాడవై, కల్పాంతము వరకు ఈ ఉపాధితో నిలచి ఉండు. కుండ పగిలినప్పుడు ఆ కుండలోని ఆకాశం మహాకాశంలో విలీనమైపోతుంది కదా! నీవు కూడా ఈ ఉపాధి కల్పాంతమునందు నేలకూలగానే ఆపై ఇక బ్రహ్మపదమున వెలయగలవు. ఇప్పటికి మాత్రం ఈ శరీరంతో జీవన్ముక్తుడవై ప్రకాశించెదవు గాక!

❖

పుత్రా! ఇప్పుడే "ఇది కల్పాంతము" అని ఒకవేళ పొరబడ్డావా ఏమిటి? ద్వాదశ ఆదిత్యులు ఒక్కసారే ప్రేరేపితులై ఒకేచోట ఉదయించటం, ఎక్కడికక్కడ జగత్తు ప్రజ్జ్వలించటం మొదలైన కల్పాంతము యొక్క సంజ్ఞలేమీ లేవు కదా! ఈ జీవులు, ఆ పర్వతములు, నీవు, నేను, ఆకాశము, తదితర జగత్తు – ఇవన్నీ ఏమీ చెక్కు చెదరనేలేదే! మరి, "ఈ శరీరము త్యజించబడాలి" అనే అభినివేశము దేనికి? ఇది కల్పాంతము కానేకాదు. అందుచేత నీకు నీవుగా ఈ దేహమును పరిత్యజించనే వద్దు. కేవలం దేహం అట్టి బెట్టుకున్నంత మాత్రంచేత, అది అజ్ఞానమనిపించుకోదు. ఎవనిమ నస్సైతే తన యందు అజ్ఞానము, అల్పవిశేషముల ఆశ్రయం కలిగి ఉంటుందో, తన యందు దుఃఖ మోహములను పేర్చుకుని ఉంటుందో ...అట్టివానికి మాత్రమే ఈ శరీరధారణమనేది బాధాకరమై ఉంటుంది.

"నేను ఎందుకూ పనికిరానివాడను. ఎందుకు తగుతాను? ఇక నా గతి, నేను చేయగలిగినది ఇంత మాత్రమే.

**కృశోఽతిదుఃఖీ మూఢోఽహమేతాశ్చాన్యాశ్చభావనాః ।**
**మతిం యస్యావలుమ్పన్తి మరణం తస్య రాజతే ॥** (శ్లో 38, సర్గ 39)

నేనొక మూఢుడను, దుఃఖితుడను, శరీరమాత్రుడను, అల్పకాలికుడను ...అని భావించే వానికే 'మృత్యువు' అనే అనుభవం ఆవశ్యకమగుచున్నది.

**బద్ధ జీవులు -** ఈ జగత్తులో కొందరు జీవుల అంతఃకరణములు అనేక ఆశాపరంపరలు కలిగిఉంటున్నారు. అనేక చంచల వృత్తులు వచ్చిచేరి, ఆ అంతః కరణములను అనేక దుర్మార్గములలోకి ఈడ్చుకునిపోతున్నాయి. ఎందుచేత? ఆత్మవ్యతిరిక్తమైన అవివేకమును స్వీకరించుటచేతనే! అవివేకము తృష్ణ రూపమున తాండవించుటచేతనే! అందుకు ఫలితంగా వారు అనేక సాంసారిక విషయములను గాడిదలవలె మోస్తున్నారు. వారి చిత్తములలో అనేక వృత్తులు అనుక్షణం ఏర్పడి, అవన్నీ అనేక సుఖదుఃఖ ఫలములను అవిశ్రాంతపూర్వకంగా ఇచ్చుకుంటూ పోతున్నాయే! 'కామము' మొదలైన అనర్థములచే ఆ మనస్సులు క్షణక్షణం అటూఇటూ ఈడ్వబడుచున్నాయే! అట్టివారు తమయందు 'కామము' అనే సర్పమును కలిగియుండి అనేక ఆధివ్యాధులకు అర్హమగుచున్నారు. అట్టివారికే 'మరణము' అనే ఔషధము ఆవశ్యకమగుచున్నది... అంతేగానీ, నీవంటి వారికి కాదు.

**మరణము అంటే ఏమిటి?...** ఓ ప్రహ్లాదా! ఈ శరీరము పరిత్యజించబడుటయే లోకములో 'మరణము' అనే పేరుతో వ్యవహరించబడుతోంది. ఆత్మకు మరణమెక్కడిది? అది సర్వదా నిష్క్రియము కదా! ఇక ఈ శరీరము అసత్తే కదా! అసత్యము, భ్రమమాత్రము అయిన ఈ శరీరానికి మాత్రం "ఈ శరీరము చచ్చుచున్నది" ... అనే పదప్రయోగం ఎంతవరకు సమంజసం? కనుక 'మృత్యువు' అనే ప్రక్రియను ఈ శరీరమునకు కూడా మనం ఆపాదించటం కుదరదు.

ఆత్మజ్ఞానం కలుగనంతవరకు శరీర భ్రమ ఉండియే తీరుతుంది. "అన్ని వైపులా ఆత్మతత్త్వమును దర్శించుట" అను విరామం లేని యథార్థదర్శియొక్క జీవితమే నిజమైన జీవనం. అదిమాత్రమే సర్వవిధములా శోభించుచున్నది.

ఎవడైతే అహంభావరహితుడై, నిర్లిప్తుడై, సమదృష్టిని పొందిఉంటాడో – అట్టివాడు ధన్యుడే! కనుక రాగద్వేషరహితమగు బుద్ధితో ఈ జగత్తును సాక్షివలె దర్శిస్తూ ఉండాలి. ఈ జగత్తు యొక్క అసారత్వమును సంపూర్ణముగా గ్రహించి, అటుపై "గ్రహించటం – త్యజించటం" అనబడే రెండిటినీ వదలివేయాలి. ఈ చిత్తమును సాక్షిస్వరూపమునకు సమర్పించివేయాలి. తుచ్ఛమగు వ్యవహార రూపంగా ప్రకాశిస్తున్న ఈ బాహ్యవస్తువులందు మనస్సు సక్తము కాకూడదు. ఈ మనస్సును బ్రహ్మము నందు మాత్రమే లీనం చేయాలి. సత్యదృష్టిని అవలంబించి, ఆపై లీలగా లౌకిక వ్యవహారములు ఆచరించుచున్నప్పటికీ, అన్నివేళలా వాసనాశూన్యుడై ఉండాలి.

ఇష్ట, అయిష్టములు సంఘటిల్లుచున్నప్పుడు ఎవడైతే ఎట్టి రాగ ద్వేషాలు ఏమాత్రం పొందడో ...అట్టి వాని జీవితమే ధన్యము. మానససరోవరంలో ఉత్తమ జాతి హంసలు సంచరిస్తున్నట్లు హృదయసరోవరంలో కూడా శాంతి, క్షమ, భక్తి, వైరాగ్యము, ఉత్తమ ఆశయము – మొదలైన ఉత్తమ గుణములు వెల్లివిరియు గాక! ఎవనిని చూస్తే... లేక... ఎవని పేరు చెప్పుకుంటే తదితర జీవులు ఆనందమును పొందగలుగుతారో, అట్టివారి జీవితము ధన్యము.

నీవు అంతటి మహామాన్యుడవు –ప్రహ్లాదుడవు! సార్థకనామధేయుడవు! కనుక ప్రియ ప్రహ్లాదా! నీ యొక్క చరిత్ర వినటంచేత, నీ జ్ఞాన భక్తివాక్యాలు అనుసరించటంచేత ఈ సర్వజనులు శుభమును పొందగలుగుతారు. అటువంటి నీకు ఈ జీవితముపట్ల అయిచ్ఛ ఉదయించవలసిన పనేమున్నది? నీవు ఇచ్ఛాయిచ్ఛలకు అతీతుడవు కదా!

❖❖❖

# 18. దేహము - జీవము - జీవుడు

**శ్రీమన్నారాయణుడు :** బిడ్డా! ప్రహ్లాదా! నీయొక్క సమాచారవిశేషములు అధికం చేసే ఉద్దేశంతో నీకు ఈ దేహము, జీవనము, మరణము, జీవుల గురించి మరికొన్ని వాక్యాలు చెపుతాను, విను–

> **స్థైర్యం దేహస్య దృష్టస్య జీవితం ప్రోచ్యతేజనైః ।**
> **దేహాన్తరార్థం దేహస్య సంత్యాగో మరణం స్మృతమ్ ॥** (శ్లో 1, సర్గ 40)

'జీవము' అనగా ఏమిటి? ప్రత్యక్షంగా ఎదురై కనిపిస్తున్న ఈ రక్తమాంసమయ దేహము యొక్క ఉనికినే జనులలో అనేకులు 'జీవనము' అని పిలుస్తున్నారు. ఈ జీవుడు మరొక దేహము కొరకై దీనిని విసర్జించినప్పుడు, ఆ ప్రక్రియయే 'మరణము' అని చెప్పబడుతోంది. నీవు మహామతివి అవటంచేత ఈ రెండు అవస్థలనుండి విడివడ్డావు. "ఈ దేహముతోటిదే మా జీవనము" అని అనేక మంది జీవులు మరలమరల మననం చేస్తున్నారు. అది నిజమా? కాదు!

నీ విషయానికివస్తే నీకు అట్టి దేహాత్మకమైన బుద్ధి లేనేలేదు. అందుచేత నీ ప్రాణములకు 'ఇంకొక చోటికి పోవటం' – అనేదే ఉండదు. ఇక నీకు జీవితమూలేదు, మరణమూలేదు. "నీకు జీవితమే తగుతుంది... మరణము తగదు" – అని నేను ఇంతవరకు చెప్పినదంతా కేవలం దృష్టాంత ప్రదర్శనము కొరకే. సర్వజ్ఞుడవైన నీకు మరణమేమిటి? జీవితమేమిటి? ఆకాశము స్వతహాగా శూన్యమైనది. అందులో వాయువు ఉన్నది. వాయువు ఆక్రమించుకొని ఉన్నంతమాత్రం చేత ఆకాశము తన శూన్యత్వమును త్యజిస్తోందా? లేదుకదా! కనుక దేహబుద్ధి ఏ మాత్రం లేనట్టి నీవు సర్వదా దేహశూన్యుడవే అయి ఉన్నావు.

**వ్యవహారం -** అయితే వ్యవహారం కొరకు, దేహధర్మములైనట్టి శీత–ఉష్ణ–స్పర్శ జ్ఞానాదులు నీకు ఉన్నాయి కనుక, 'నీవు ఈ దేహమున ఉన్నావు' అని వ్యవహరించబడుతోంది. వృక్షము ఎత్తుగా పెరగటానికి ఆకాశము కారణము కాకపోయినప్పటికీ, "ఆచోట (ఆకాశం)లో ఒక పెద్ద వృక్షము ఉన్నది" అని జనులు చెప్పుకుంటూ ఉంటారు కదా! ఇది కూడా అట్టిదే. ఆకాశం సదా నిరాకారంగానే ఉంటుంది గాని, వృక్షాదుల ఆకారం సంతరించుకోదు కదా!

ఇక్కడ స్పర్శ – జ్ఞానముల విషయంలో 'ఆత్మయే దీనికి కారణం' – అని చెప్పబడుతోంది. అది లోకరీతి. నీవు మాత్రం ఆత్మప్రబోధం పొందుటచే నీపట్ల ద్వైతమంతా ఉపశమించింది. పరిచ్ఛిన్నమగు దేహాత్మ బుద్ధి అజ్ఞులకు మాత్రమే ఉంటుంది గాని, నీ వంటి విజ్ఞులకు కాదు. నీ బుద్ధి ఒక్క పరబ్రహ్మము నందు మాత్రమే పరినిష్ఠమై ఉండుటచే, నిన్ను శాస్త్రాదులు "చిత్ప్రకాశం ..." అని వర్ణిస్తున్నాయి. సర్వదా సర్వరూపుడవగు నీపట్ల దేహ – అదేహములు, పరిగ్రాహ్య – పరిత్యాజ్యములు అపాదింపబడజాలవు. జలమునకు ఆకారమెక్కడున్నది? ..."స్వయమ్ ఆత్మా!"

ప్రియప్రహ్లాదా! అత్యంత ఆహ్లాదకరమైన వసంతకాలం రానిమ్ము... లేదా, సర్వమును దిగమ్రింగి వేయగల ప్రళయకాలం వచ్చిపడనీ ...కొండలు నేల కూలనీ ...ఉత్పాతగాలులు వీచనీ ...ఈ జగత్తంతా భస్మం కానీ ...వచ్చేదేమున్నది? పోయేదేమున్నది? ఆత్మ యందే సర్వదా వెలయుచున్న నీకు వచ్చే కీడేమిటి? మేలేమిటి? ఈ పదార్థములన్నీ ఎంతగానో ఉండు గాక, లేదా ఊడు గాక! ఇంతకు అంత అగుగాక, లేక వినష్టమైపోవు గాక! ఈ శరీరమే ఖండఖండములగు గాక! ఆత్మ నశించదు. వర్ధిల్లదు. ఈ శరీరస్పందనము ఆత్మస్పందనమెట్లా అవుతుంది? అవదు.

❖

ఆత్మతో ఏకత్వము పొందినవారికి "నాకు దేహముతో ఉనికి, సంబంధములు ఉన్నాయి. నేను దేహము కలవాడను" – అను చిత్తవిభ్రమమంతా నశించుచున్నది. అప్పుడిక "త్యజించుచున్నాను

– త్యజించుటలేదు" – అను కల్పన అంతా ఉండదు. "దీనిని పూర్తి చేసిన తరువాత అది నిర్వర్తించవలసి ఉన్నది... అది ప్రారంభిస్తాను ... ఇది పరిత్యజిస్తాను" – అనే సంకల్పములన్నీ క్షయించిపోతాయి. ముక్త పురుషులు అన్నీ చేస్తూనే ఏదీ చేయనివారే అయి ఉంటున్నారు. "అవయవములే కర్మలు చేస్తాయి. నిరవయవియగు ఆత్మ దేనికీ కర్త కాదు. అట్టి నిష్క్రియమగు ఆత్మయే నేను" – అని భావించువానికి కర్తృత్వమెక్కడుంది? ఎక్కడ అకర్తృత్వము ఉంటుందో, అక్కడ అభోక్తృత్వము కూడా సిద్ధించుచున్నది.

అభోక్తృత్వం ప్రాప్తించాలంటే 'నేను దేనికీ కర్తను కాదు' అను అకర్తృత్వము ఆశ్రయించటమే సర్వోత్కృష్టమైన ఉపాయం.

**ముక్తి, పరమ శాంతి -** కర్తృత్వము, భోక్తృత్వము నశించాయా ... ఇక శేషించేది పరమ శాంతియే సుమా! అట్టి శాంతి సుస్థిరమైనప్పుడు దానిని శాస్త్రములు ముక్తి అని పిలుస్తున్నాయి.

ప్రబుద్ధులు, చిన్మయులు, విశుద్ధులు అగువారు సమస్తము అతిక్రమించి వెలయుచున్నారు. గ్రహించుట కొరకై త్యజించునది గాని, త్యజించుటకై గ్రహించునది గాని ఇక్కడ వారికేదీ ఉండుటలేదు. గ్రహించబడుచున్నది – అట్లు గ్రహించుటకు కర్త, అవయవములు, అవయవి, వాటికి సంబంధించిన ప్రమాణ–ప్రమేయములు ఇట్టి వివిధ వికారములన్నీ అజ్ఞాన సమయంలో తారసపడతాయేమోగాని, ఆత్మను ఎరిగిన జ్ఞానులందు వాటికి చోటుండదు. "గ్రహించువాడు, గ్రహించబడునది" – అను వ్యవహారసరళి సన్నగిల్లగా అప్పుడు ఉదయించే శాంతికే 'మోక్షము' అను మరొక పేరు.

నీ వంటి పురుషశ్రేష్ఠులు సర్వదా అట్టి ముక్తియందు వెలయుచూ, శాంతులై ఉంటున్నారు. సుషుప్తి సమయంలో అవయవముల కదలికలవలె ఈ జగత్తులో సంచారం చేస్తున్నారు. నాయనా! పరబ్రహ్మబోధ పొందియుండుటచే నీకు సర్వవాసనలు తొలగిపోయినాయి.

**పరావబోధవిశ్రాన్తవాసనో జగతి స్థితిమ్ ।**
**అర్ధసుప్త ఇవేహేమాం త్వం పశ్యాత్మస్థయా ధియా ॥** (శ్లో 21, సర్గ 40)

కాబట్టి, ఈ జగత్ స్థితినంతా అవలోకిస్తున్నప్పుడు ఆత్మయందు సంస్థితమైన బుద్ధి కలవాడవై, సగం నిద్రిస్తున్న వానివలె ఉండు. పరబ్రహ్మమునందు లీనమైన చిత్తము కలవారు, "ఇవి చాలా బాగున్నాయే!" అని తలచి, ఏ బాహ్యవస్తువు లందూ ఏమాత్రం ఆసక్తి గొనరు. ఇక్కడి దుఃఖాలచే ఉద్విగ్నులు కారు. ఒక అద్దము తనకెదురుగా ఏముంటే అద్దానినే తన యందు ప్రతిబింబిస్తూ ఉంటుంది కదా! నిత్యముక్తులగు వారు అనాసక్తులై, అనిచ్ఛాపూర్వకంగా ఆయా ప్రాప్తములైన కార్యాలను నిర్వర్తిస్తూ ఉంటారు.

**జాగ్రతి స్వాత్మని స్వస్థాః సుప్తాః సంసారసంస్థితౌ ।**
**బాలవత్ప్రవివేపన్తే సుషుప్తసదృశాశయాః ॥** (శ్లో 24, సర్గ 40)

ఉత్తమ ఆత్మదర్శనము చేయుచున్న మహనీయులు నిర్మలహృదయులై ఈ సంసార విశేషములన్నీ చూస్తున్నప్పుడు మౌనము, నిర్లిప్తత, అతీతత్వము వహించి ఉంటున్నారు. నిద్రలో బాలుడు

అసంకల్పితంగా నడచివెళ్ళుచూ ఉంటాడు. చూచావా?... అట్లా ఉంటుంది, ఈ సంసారంలో జ్ఞానుల సంచారం!

❖

ప్రియభక్తా! ప్రహ్లాదా! నీవు అంతరమున బ్రహ్మపదమును పొందియే ఉన్నావు. అందుచేత విధివశాత్తూ తారసపడి, నీ విధ్యుక్తధర్మమై ఎదురుగా నిలిచిన ఈ పాతాళలోక చక్రవర్తిత్వమును యథారీతిగా పొంది ఉండు. అనంతరం చ్యుతిరహితమగు పరబ్రహ్మమును యథారీతిగా పొంది ఉండు. తదనంతరం చ్యుతిరహితమగు పరబ్రహ్మతత్త్వమును అవధరించగలవు.

అయితే అవన్నీ కూడా సర్వదా నీయొక్క నిర్విషయానంద స్వరూపమున నిర్విషయతత్త్వమై ప్రదర్శనమగు గాక! నీవు సర్వదా అచ్యుతుడవే సుమా!

❖❖❖

# 19. ప్రహ్లాద పట్టాభిషేకము

ఆ విధంగా 'జగదద్భుత వస్తుదర్శకుడు' అగు ఆ శ్రీమన్నారాయణుడు వెన్నెలవంటి సుమధుర వాక్కులు పలికాడు. ఉత్తమజ్ఞానోదయమగు మాటలచే ప్రహ్లాదుని కనులు వికసింపజేశాడు. భగవానుని మాటలన్నీ శ్రద్ధగా విన్న ప్రహ్లాదుడు మననవ్యాపారమును అవలంబించినవాడై, వినమ్రుడై ఇట్లు పలికాడు.

**ప్రహ్లాదుడు :** తండ్రీ! నారాయణా! దీర్ఘకాలంగా, అసంఖ్యాక జన్మలుగా ఏవేవో మానసిక వ్యాపారాలచే డస్సియున్న నేను తమ అనుగ్రహం చేత సర్వ విశేషములను అధిగమించి నిర్విషయమునందు కొద్ది క్షణాలు విశ్రాంతిని పొందాను. స్వస్వరూపమున సుస్థిరుడనై తత్ఫలితంగా "సమాధి – అసమాధి" స్థితులలోని సమస్థితిని, సమబుద్ధిని అవధరించాను. స్వామీ! నిర్మల బుద్ధితో నా అంతరంగమున మీ దర్శనం చేసుకున్నాను. ఈ రోజు ఈ సమయంలో మీరు నా బాహ్యమునందు కూడా దర్శనం ప్రసాదించారు.

హే మహానుభావా! ఆదివిష్ణూ! ఇప్పుడు నేను ఏమై ఉన్నానో చెపుతాను... వినండి.

అనంత నిర్మలాకాశమున ఒకానొక ఆకాశవిభాగము ఎలా వెలయుచున్నదో... అట్లే సర్వవిధ సంకల్పముల నుండి విడివడినట్టి నేను స్వతఃసిద్ధము (That which is Present by Itself) నందు సర్వదా నిత్యవిముక్తుడనై వెలయుచున్నాను. మీ యొక్క ఆజ్ఞ తీసుకొని ఆత్మచింతన యందు ప్రవేశించాను. ఎందుకొరకు? ఏదో శోకమోహముల చేతనో, బీభత్సవిషయములచే ఏర్పడిన వైరాగ్యం చేతనో, సంసారభయం చేతనో, ఈ శరీరం త్యజించాలనో, సమాధిని ఆశ్రయించ లేదు. స్వస్వరూపం యొక్క దర్శనభాగ్యం కొరకే ఆ చింతనయందు నిమగ్నుడనైనాను. మనస్సు నిర్మల మగుచున్నది. అనేకత్వమంతా తొలగుతూ, క్రమంగా ఏకత్వము నాపట్ల తాండవించుచున్నది. ఒకే వస్తువు వెలయుచున్న చోట శోకమెచ్చట? జన్మలేమిటి? సర్వదా సర్వముగా ఉన్న నాకు స్థితి గాని, విలయము గాని, భయాభయములు గాని ఎక్కడి నుండి వస్తాయి?

హే మహేశ్వరా! సర్వేశ్వరా! ఇప్పుడు నాకు 'ఈ దేహము త్యజించాలి' అనే ఇచ్ఛ కూడా లేదు. ఎందుకంటే, స్వతఃసిద్ధముగా ప్రాప్తించిన పవిత్రేచ్ఛతో వర్తమానంలో ఎందుకంటే, దృశ్య మంతటినీ త్యజించి దీనికి అతీతమైన స్వయంప్రకాశమున సుప్రసిద్ధంగా అవస్థితుడనై ఉన్నాను. "ఇది సంసారము. దీనిని వదిలించుకోవాలి" .. అను పరితాపము అజ్ఞానదశలోనే ఉంటుందిగాని, సుజ్ఞాన దృష్టిని అవధరించిన తరువాత కాదు.

**దేహభ్రాంతి -** "దేహము ఉంటే దుఃఖం ఉంటుంది. దేహము లేకుంటే గొడవే ఉండదు" అని భావిస్తే అది మూర్ఖత్వమేనని నా ఉద్దేశం. ఎందుకంటే, "ఇది ఉండాలి... ఇది ఉండకూడదు... ఇది సుఖము.. ఇది దుఃఖము" అనురూపంగా కనిపించే ఊగిసలాటంతా చిత్తము యొక్క చాంచల్యమే. ఆ చిత్తము అల్పవిషయములను ఆశ్రయించి ఉండుట చేతనే అట్లు ప్రవర్తిస్తోంది. 'నేను వేరు... తదితరులు లేరు' అనునది ఆత్మబుద్ధి లేనిచోట మాత్రమే ప్రబలుచున్నది. దుర్బలులను సాంసారిక మిథ్యాభ్రాంతులు సమీపిస్తున్నాయి గాని, ప్రాజ్ఞులను అవి సమీపించలేవు.

తండ్రీ! కమలలోచనా! నారాయణా! నేను ఇప్పుడే "నా అంతరంగమున ఉన్న నిత్య సత్యము. వాస్తవము ఏమి?" అని తీవ్రపరిశీలన చేశాను. ఒక చమత్కారమైన విషయం నిస్సందేహమై తెలియవచ్చింది. నీవే నాయందు సర్వదా సత్యమై, నిత్యమై, అఖండమై, అప్రమేయమై వెలయుచున్నావు.

నీవు కాక మరేమీ లేనట్టి నాయందు హేయ – ఉపాధేయములు, త్యాజ్య – గ్రాహ్యములు (కలిగి ఉండవలసినవి – త్యజించవలసినవి) అంటూ నాకేమీ కనిపించటంలేదు. ఇక 'సత్ – అసత్' రూపమున ఉత్పన్నమైన ఈ జగత్తు అంటారా? ఇది ఆత్మ చైతన్యము యొక్క అభాస లేక ప్రతిబింబ భావన మాత్రమే. స్వామీ! నేను ఇప్పుడే స్వస్వరూపము యొక్క సర్వవ్యాప్తిని గ్రహించాను. స్వభావవశం చేతనే దృక్–దృశ్య విచారణ చేసి, అందుకు ఫలితంగా స్వయంగా పరమాత్మ స్వరూపుడ నయ్యాను. భావ, అభావ విముక్తుడనై సమాధిని ఆశ్రయించాను. ఇప్పుడు మీ ఆజ్ఞానుసారం ఈ స్థితిని పొందాను.

స్వస్వరూపమున విశ్రమిస్తూనే, మీరు ఆజ్ఞాపిస్తున్నది నిర్వర్తించటానికి ఇప్పుడు నేను సిద్ధంగా ఉన్నాను. హే పుండరీకాక్షా! శాస్త్రములు చెప్పియున్న విధి, విధానములతో మిమ్ములను ఇప్పుడు పూజిస్తాను. నా పూజ దయచేసి స్వీకరించండి.

❖

ఎవ్వని బాహ్యాభ్యంతరములందైతే అసంఖ్యాక జగత్తులు ఉన్నాయో అట్టి భువనేశ్వరుడగు నారాయణుని ప్రహ్లాదుడు మంత్ర – క్రియ – స్తోత్రాదులచే పూజించాడు. అప్పటికప్పుడు శ్రీమన్నారాయణుని సమక్షంలో ప్రహ్లాదుడు సింహాసనాన్ని అధిరోహించాడు. దేవతలు ఆ పట్టాభిషేక మహోత్సవానికి విచ్చేసి ప్రహ్లాదుని భక్తి విశేషాలు శ్లాఘించారు. మహోత్సవానంతరం నారాయణుడు ప్రహ్లాదుని ఉద్దేశించి ఇట్లు పలికారు.

**శ్రీమన్నారాయణుడు :** ప్రియ ప్రహ్లాదా! సమదర్శనము చేయు బుద్ధితో, ఇష్ట – అనిష్ట ఫలములను త్యజించి, విషయానురాగములు గానీ, భయక్రోధములు గానీ లేనివాడవై రాజ్యపాలన చేసెదవు

గాక! సర్వోత్తమము, ఆనందమయము అగు అద్వితీయ దివ్యపదమును పొందినప్పటికీ నీకు విధించబడిన ఈ రాజ్యపాలన నిర్లక్ష్యము చేయకుండెదవు గాక! నీ తండ్రి, పినతండ్రుల వలె స్వర్గమర్త్య లోకాలలో ఉద్వేగములు కలిగించకుండెదవు గాక! ప్రజానుగ్రహము, శత్రునిగ్రహము మొదలైన అవశ్య కర్తవ్యములు ప్రాప్తించినప్పుడు దేశ – కాల – క్రియల ఔచిత్యమును దృష్టిలో పెట్టుకొని, సేవాభావంతో భగవత్ భక్తి, సమర్పణ భావములతో నిర్వర్తించు. రాగ రహితమైన బుద్ధి నిన్ను సర్వదా ఆశ్రయించి ఉండును గాక!

**ప్రహ్లాదుడు :** స్వామీ! నాకు దిక్కు, మార్గదర్శకులు, సద్గురువులు మీరే. మీ కరుణ చేతనే నేను మహత్తరమైన ఆత్మతత్త్వమును దర్శించి పునీతుడనైనాను. తమ వాక్యములు నాకు మరల మరల ప్రసాదించవలసినదిగా నా విన్నపము. ఈ సంసారము సర్వదా నన్ను ఆక్రమించకుండేది ఎట్లా?

**శ్రీమన్నారాయణుడు :** మమత్వమును పరిత్యజించి సమభావముతో నీ విధ్యుక్తమైనది నిర్వర్తించావా ... ఇక ఈ విషయములు నిన్ను ఏమాత్రం స్పృశించలేవు.

అయినా నీకు పెద్దగా ఏం చెప్పాలి? ఈ సంసారము యొక్క గతినంతా చక్కగా గ్రహించియే ఉన్నావు కదా! అత్యుత్తమమైన బ్రహ్మపదమును పొందియే ఉన్నావు. ఇక నీకు క్రొత్తగా చేయవలసిన ఉపదేశమేమీ లేదు. విషయాసక్తి గాని, భయక్రోధములుగాని లేనట్టి నిన్ను, నీ పాలనలోని ప్రజలను దుఃఖ దుర్గంధములు వేధించలేవు. ఇకనుండి అసుర స్త్రీలు నిరంతరం తమ మంగళ సూత్రముల గురించి భయపడుతూ ఉండవలసిన పనేమీ లేదు. దేవదానవుల సఖ్యతచే జగత్తులు ప్రశాంతమయంగా ఉండగలవు. నీ ఉనికిచే సర్వజనులూ ఆనందముగా జీవించగలరు. గాఢమగు అజ్ఞానాంధకారాన్ని నిరసించిన నీవు ఇట్లే సర్వదా స్వప్రకాశమానమగు బ్రహ్మాత్మభావమున వెలుగొందుము. శత్రువులగు కామ, క్రోధాదులను దగ్గిరకు రానీయకుండా, బాహ్యమున రాజ్యలక్ష్మిని, అంతరమున శాంతి మొదలైన గుణములతోకూడిన "ఆత్మ – స్వారాజ్యలక్ష్మి" ని ఏలుకో! విజయోస్తు... దిగ్విజయోస్తు!

ఇట్లు పలికి, సర్వేశ్వరుడగు నారాయణుడు యథాస్థానమగు క్షీరసాగరం ప్రవేశించాడు. ప్రహ్లాదుడు భక్తిపూర్వకంగా వీడ్కోలు పలికాడు.

❖❖❖

## 20. సమీక్ష

**శ్రీ రామచంద్రుడు :** హే భగవాన్! సర్వధర్మజ్ఞా! శ్రీ వసిష్ఠ మహర్షీ! అత్యంత శుద్ధములగు ప్రహ్లాద కథనమునకు సంబంధించిన వివరణచే నేను ఎంతో తృప్తి పొందాను. చంద్రునిలోని ఓషధులవలె మీ ప్రవచనమంతా నన్ను ఎంతో ఆహ్లాదపరిచింది. పరమ పవిత్రములగు మీ వాక్యములు వినినంత మాత్రం చేతనే గొప్పసుఖమును పొందాను.

అయితే నాదొక చిన్న సందేహం. మీరు ఇంతఃపూర్వం "పురుష ప్రయత్నము వలననే సర్వము ప్రాప్తమై, సుసంపన్నమౌతాయి" అని చెప్పియున్నారు కదా!

మరి ప్రహ్లాదుడు విష్ణుభగవానుని సహాయం లేకుండానే తన స్వకీయ ప్రయత్నమాత్రం చేతనే ఎందుకు ప్రబోధం పొందలేదు? విష్ణువే ప్రత్యక్షమై మార్గం చూపుతూ ప్రబోధం ప్రసాదించారు కదా? అట్టి అగత్యం ఎందుకు ఏర్పడింది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామా! మహాత్ముడగు ఆ ప్రహ్లాదుడు ఏదైతే పొందాడో అదంతా 'స్వీయపౌరుషబలం' చేతనే పొందాడుగానీ, మరింక దేనిచేతనో కాదు.

మరొక విషయం! 'నారాయణుడు' అనగా ఎవరు? ...ఒక వ్యక్తియా? ...కానే కాదు. నువ్వులు – నూనె వలె, పూలు – వాసన వలె, రంగులు – చిత్ర పటమువలె, ఆత్మయు – నారాయణుడు అభిన్నులు. తటాకము – జలములాగా జనార్ధనుడు – ఆత్మ ఈ రెండూ పర్యాయ పదములే నని గ్రహించు. విష్ణువే ఆత్మ. సర్వజీవుల యొక్క , ఈ జగత్తు యొక్క ఆత్మయే విష్ణువు.

ఆ ఆత్మయే తన పరమశక్తి వలన 'ప్రహ్లాదుడు' అను ఆత్మను విష్ణుభక్తునిగా ఒనర్చింది. అనగా, ప్రహ్లాదుడు ఆత్మ వలననే ప్రబోధం పొందాడు. అంతరంగ నిత్య స్వస్వరూపమగు ఆతడు స్వయముగా విచారణపరుడై, క్రమంగా పరమోత్కృష్టమైన స్వస్వరూప జ్ఞానం పొందాడు.

ఒక సమయంలో ఆత్మ స్వయంగా ప్రబోధమొందుచున్నది. మరొకప్పుడు భగవంతుడు, భక్తసులభుడు అగు విష్ణుని ప్రబోధము పొందుతోంది.

అయితే ఒక్క మాట. ఒకడు సుదీర్ఘకాలం పూజ – ధ్యానాది అనేక కార్యక్రమములు నిర్వర్తించవచ్చు గాక! విచారణహీనుడైతే మాత్రం ఆ బ్రహ్మదేవుడైనా సరే, జ్ఞానమును కలిగించజాలడు. కనుక 'పురుష ప్రయత్నముచే కలుగు ఆత్మవిచారణ'యే స్వస్వరూప సాక్షాత్కారమునకు ముఖ్యమైన ఉపాయమని అందరూ గమనించెదరుగాక!

**పురుష ప్రయత్నము -**

**శ్రీరాముడు :** మరి వరము ప్రసాదించటం మొదలైన వాటి మాట ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవన్నీ మధ్యేమార్గ ఉపాయములు మాత్రమే. అందుచేత నీవు ముఖ్య ఉపాయమైనట్టి 'ఆత్మవిచారణను అవలంబించుట'ను తప్పక ఆశ్రయించు. కొంచెము శ్రమించి అయినా సరే, పంచేంద్రియములను వశపరచుకో. సర్వవిధములా 'ఆత్మవిచారణ' అనేది అభ్యాసం చేయి. ఒక్కటి సర్వదా గుర్తు పెట్టుకో ... ఎవరెచ్చట ఏది పొందుచున్నప్పటికీ, అదంతా వారియొక్క పురుష ప్రయత్నఫలమేగానీ, మరింకెవ్వరో ఎక్కడినుండో ఇచ్చింది కాదు.

అందుచేత నీవు పురుష ప్రయత్నమును ఎప్పటికప్పుడు అవలంబించి, ఈ ఇంద్రియములను దాటివేయి. ఈ ఇంద్రియములకు ఎదురుగా ఉండి కనబడుచున్న దృశ్యరూప సంసార సముద్రమును దాటి, దాని కావల ఉన్న పరమపదమును పొందుము.

**శ్రీరాముడు :** అయితే జనార్ధనుడు ప్రహ్లాదునకు ప్రత్యక్షమై మార్గదర్శకము ప్రసాదించారు కదా! ఆయన దయచేతనే ప్రహ్లాదుడు ఆత్మదర్శనం చేయగలిగాడు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** పురుష ప్రయత్నం లేకుండానే జనార్ధనుడు కనిపించగలిగితే, యిక పశు పక్షాదులకు కూడా ఆత్మదర్శనము లభిస్తూ ఉండేదే.

ఎంతటి ఉత్తమ గురువైనా ప్రయత్నహీనుడైన శిష్యునకు తత్త్వబోధ చేయగలుగుతాడా? స్వస్వరూపాత్మానుభవం కలుగజేయగలడా? లేదు. ఏ పురుషప్రయత్నము చేయని అజ్ఞానిని కూడా గురువే కనుక ఉద్ధరించగలిగితే, దాని అర్థం ఆ గురువు తనకు ఇష్టమైతే ఒక ఎద్దుకో, ఒక లొట్టి పిట్టకో, మరొక తన ఇష్టమైన జీవునకో ఆత్మోద్ధరణ గావించేవాడే. కానీ అది అట్లా సంభవించదు. ముఖ్యంగా, ఒకటి గమనించాలి. ఆత్మ సామ్రాజ్యంలో తదితరుల వలన గాని, గురువు వలన గాని, ధనము వలన గాని మహత్పదము లభించదు. మరింక?

ఏ విధమైన ప్రయత్నం చేసైనా సరే... ఈ మనస్సును వశపరచుకొనగలిగితే చాలు. తనంతట తానే ఈ జీవుడు మహత్పదమును పొందవచ్చు. ఒకడు వైరాగ్యమును అవలంబించి, అభ్యాసవశంగా ఈ ఇంద్రియ సర్పములను స్వాధీన మొనర్చుకున్నాడా, ఇక ఆపై ఆతనికి ఈ మూడు లోకములలో పొందవలసినదేమీ ఉండదు. అందుకు శాస్త్రములు, గురువులు సహకారం అందించటానికి సర్వదా సిద్ధంగా ఉన్నాయి.

అందుచేత రామా! నీవు ఆత్మ ద్వారా ఆత్మను ఆరాధించుము, దర్శించుము. ఆ తరువాత ఇక ఆత్మయందే వెలయుము. అందుకు చేసే ప్రయత్నంలో శాస్త్రములు, గురువుల అనుభవం, మహనీయుల చరిత్రలు నీకు చక్కగా ఉపకరించగలవు.

**భక్తి నుండి జ్ఞానము -** అయితే, కొందరు శాస్త్రములచే అందింపబడుచున్న స్వస్వరూపమునకు సంబంధించిన సమాచారాన్ని వింటున్నా కూడా, 'అవగాహన – దృష్టి – కర్మ' ల దృష్ట్యా, తమ బుద్ధిచే అప్పటికప్పుడే స్వీకరించలేకపోతున్నారు. ఎందుచేత? సానపెట్టవలసియున్న కత్తిలాగా వారి బుద్ధి కొంత సునిశితం కావలసి ఉన్నది. అట్టివారు గాలిచే ఎగురకొట్టబడిన ఎండుగడ్డిపరక లాగా ఈ సంసారఎడారిలో పచార్లు చేస్తున్నారు. అట్టి వారి సంసారాక్రందనలు వినిన సత్యద్రష్టలగు జ్ఞానులు అట్టి సంసార జీవులను సత్పథమున పెట్టి సముద్ధరించటానికి, నిష్కల్మష హృదయులుగా జేయటానికి 'విష్ణుభక్తి' ని కల్పించారు. అట్టి భక్తిని ఆశ్రయించువారు క్రమంగా చిత్తశుద్ధిని పొంది, ఈ సంసారాసక్తతనుండి విడిపడినవారగుచున్నారు. భక్తిచే విశుద్ధమైన మనస్సు లభిస్తోంది. విశుద్ధమైన మనస్సుచే ఆత్మవస్తు సందర్శనం ప్రాప్తించుచున్నది.

అందుకే భక్తి యొక్క అభ్యాసము (ప్రయత్నము) – వైరాగ్యము (రాగరాహిత్యము) – ఈ రెండూ ఎల్లప్పుడూ కాపాడుకోవాలి – అని చెప్పబడుతోంది.

సర్వతత్త్వ స్వరూపుడు, సర్వజీవస్వరూపుడు అగు సర్వేశ్వరుని ప్రేమించుటయే భక్తి కదా! భక్తిచే జ్ఞానము ప్రజ్జ్వరిల్లుతోంది. కాని కొందరు భగవంతుని పట్ల భక్తిని నిలుపుకోలేకపోతున్నారు. అనగా, అనేక విషయవాసనలు, దృశ్య సంపర్కములు, కలిగియుండుటచే బుద్ధి యందు ఏకాగ్రత, నిర్మలత్వము కొరవడి ఉంటోంది. అట్టి జీవుల కొరకు "పూజించుట – పూజింపబడుచున్నది (పూజ్య – పూజకములు)" అనునవి గౌణముగా (at lower stage) కల్పించబడ్డాయి.

అయితే ఇంద్రియములు వశం కాకపోయినంత కాలం ఈ జీవునకు 'ఉత్తమదృష్టి' లభించదు. పూజలు మొదలైనవి 'ఇంద్రియాలను వశపరచుకొనుట' అను మార్గంలో ఏర్పరచబడిన ఉపాయాలు మాత్రమే. సర్వపూజలయొక్క అంతిమ ప్రయోజనము ఈ జీవుడు ఇంద్రియ లోలత్వమును జయించి, తానే వాటిని వశం చేసుకోవటం. ఏ జీవుడైతే ఈ ఇంద్రియములకు వశమగుచున్నాడో, అట్టివాడు ఈ సంసారారణ్యంలో అవిశ్రాంతంగా సుఖదుఃఖ బద్ధుడగుచున్నాడు. ఒకటి తరువాత మరొకటిగా ఉచ్ఛ – నీచ జన్మ పరంపరలను పొందుతూనే ఉన్నాడు. అందుచేత 'పూజల యొక్క ప్రయోజనము ఇంద్రియములను వశం చేసుకోవటమే' అని మరొకసారి సర్వజనులకూ గుర్తు చేస్తున్నాను. 'విచారణ – ఇంద్రియముల ఉపశమము' ల కొరకై ఒక్కసారే ఉపక్రమించాలి. ఈ రెండూ లేకపోతే హరి లభించడు. ఆ రెండూ లేనివాడిని హరి కూడా కాపాడలేడు.

అందుచే రామా! నీవు నీ చిత్తము 'విచారణ – ఉపశమనము' లను బాగా ఆశ్రయించునట్లు, ఇక అప్పటి నూతన చిత్తముతో ఆత్మను ఆరాధించు. అప్పుడు తప్పక ఆత్మజ్ఞానము, ఆత్మ స్థితి సిద్ధించ గలవు. ఆ రెండూ లేనప్పుడు మానవుని చిత్తమునకూ, గాడిద చిత్తమునకూ భేదమేమున్నది? ఇంకొక విషయం. నీవు కేశవాదులను ఎంతగా ప్రార్థిస్తావో, అంతకన్నా ఎక్కువగా ముందు నీ చిత్తమును ప్రార్థించు.

"ఓ చిత్తమా! నీవు తుచ్ఛమైన ఈగలవలె క్రుళ్ళిన పదార్థముల వంటి ఈ నశ్వర ఇంద్రియ అనుభవమునే ఎందుకు ఆశ్రయించుచున్నావమ్మా? ఆ ప్రక్కనే అమృత కలశం ఉంటే, అది వదలిపెట్టి ఈ ఇంద్రియ మార్గములో ఉన్న దుర్వాసనలతోకూడిన మాంసము వంటి విషయాలను ఆశ్రయించి 'చాలు ... చాలు' అనుకుంటున్నావా? ఎదురుగా 'ఆత్మ' అనే ఉత్తమ పదార్థం ఉండగా అనర్థములను, సంసార బంధములను, దృశ్యపదార్థజాలమును ఎందుకు ఆశ్రయించాలి చెప్పు?" అని క్రమక్రమంగా ఈ నీ చిత్తమునకు బోధ చేయి. ఆత్మను ప్రాప్తింపజేయగల ఉత్తమ ప్రయత్నములందు నియమించు.

❖

**సర్వస్యైవ జనస్యాస్య విష్ణురభ్యన్తరే స్థితః**
**తం పరిత్యజ్య యే యాన్తి బహిర్విష్ణుం నరాధమాః.** (శ్లో 26, సర్గ 43)

ఓ రామచంద్రా! అసలు 'విష్ణువు' ఎక్కడున్నాడు? ఆతడు సర్వజనుల అభ్యంతరమున (అంతరంగమున) వెలయుచున్నాడు. అట్టి అంతరంగ విష్ణువును త్యజించి బహిర్ విష్ణువును సేవించే విషయం అత్యంతికము (Finest) కాదు సుమా!

హృదయ గుహయందు వెలయుచున్న సనాతన చైతన్యతత్త్వమే ఆత్మయొక్క ముఖ్య శరీరం. అదే నారాయణుని ముఖ్య స్వరూపం, నివాస స్థానం కూడా. ఇక, ఈ శంఖ–చక్ర–గదాధర రూపం అంటావా, ఇది మాయచే కల్పించబడినదే! ముఖ్య విషయం విడచి, గౌణము (అముఖ్యము, అప్రధానము, తత్‌లక్షణ మాత్రము, గుణసంబంధమైనది)ను మాత్రమే ఆశ్రయించేవాడు స్వల్పాహారం కోసం అమృతమును ఏమరచుచున్నవాడే అవుతాడు. ఆతడు మహత్తరమును విడచి స్వల్పమునకై

అఖ్ఖులు చాచుచున్నట్లే అవుతుంది. అందుచేత రఘునందనా! ఆత్మ వివేకమే అన్నిటికన్నా ఉత్తమమైనది. అదియే పరమ లక్ష్యమైయున్నది. అన్ని ప్రయత్నములయొక్క ఉత్తమ ప్రయోజనం అదే. ఆత్మోపాసనయే విష్ణుభక్తియొక్క అర్థము-విధి-విధానము కూడా! "ఈ కనబడే సర్వ దేహులు-నాతోసహా-ఆత్మ స్వరూపులే" – అనునదే విష్ణుభక్తి యొక్క పూర్ణ లేఖ్యాంశము.

**బాహ్య మూర్తిపూజ -** అయితే కొందరు 'ఆత్మ వివేకము' విషయమై సరిగా పట్టించుకోవటం లేదు. మోహమగ్నమగు చిత్తమునకు వశులై, సుందరమగు ఆత్మతత్త్వమువైపుగా దృష్టి సారించలేక పోవుచున్నారు. కారణం? వారి వారి చంచల చిత్తమే. అట్టి చంచలచిత్తుడు అభ్యాసబలం కొరకై శంఖ-చక్ర-గదాధారియగు విష్ణుమూర్తిని అర్చించటం సాధకులసౌకర్యము కొరకై విజ్ఞులు, శాస్త్రములు పరికల్పిస్తున్నాయి. అది వృథా అని నా ఉద్దేశం కాదు సుమా! అట్లు బాహ్యమూర్తిని అర్చించుచూరాగా, తపస్సు – వైరాగ్యములు బలపడుచుండగా... క్రమంగా చిత్తము నిర్మలమగుచున్నది. అట్టి నిత్య పూజ యొక్క ప్రయోజనంగా ఉత్తమమైన వివేకం ఉదయిస్తుంది. వివేకము క్రమంగా చిత్తమును దోషరహితం, పవిత్రం చేస్తుంది. బీజమే కొన్నాళ్లకి పుష్పలత అయి, ఆ తరువాత పుష్ప – ఫలాదుల సౌరభాన్ని వెదజల్లుతుంది కదా! శాస్త్రములు ప్రతిపాదిస్తున్న హరిపూజాఫలముగా ఆత్మ తనంతట తాను తనను పొందుచున్నది.

**అభ్యాసవశం, ఆకస్మికం -** ఓ రఘువీరా! ఒకానొక ప్రతిభావంతుడు విష్ణువు నుండి (అనగా సాకార బ్రహ్మం నుండి) ఒక వరం పొందాడనుకో... ఆ ఫలించిన వరం కూడా అభ్యాస ప్రయోజనమే కదా! అంతేగాని ఆకస్మికంగా... ప్రయత్నమనేదే ఏమీ లేకుండా (అప్రయత్నంగా) ఎవరికీ ఏదీ లభించదు. అయితే, కొన్ని కొన్ని ప్రయత్నముల యొక్క ఒకానొక ప్రయోజనం మనకు అప్పటికప్పుడే ఎదురుగా కనపడకపోవచ్చు. మరొక సమయంలో ఏర్పడుచున్న ప్రయోజనములను చూస్తున్నప్పుడు, అల్ప దృష్టిగల జనులు ఏదో తెలియని 'అదృష్టము' అనబడు దానికి ఆపాదిస్తున్నారు. "సమగ్ర దృష్టితో ఇదంతా పరిశీలించినప్పుడు "ఏదైనా సరే, పురుషకారము చేతనే పొందబడుచున్నది" అని తప్పక తెలియవచ్చుచున్నది.

**మనస్సు, నియామకం -** సుఖము – దుఃఖము – మానము – అవమానము, గ్రాహ్యము – త్యాజ్యము, అల్పము – అధికము ఈ విశేషాలన్నీ ఉన్నది మనస్సులోనే. భూమియే సర్వ సంపదలకు ఆకరమై (Abode) ఉన్నట్లు మనస్సు యొక్క నియామకమే (The conditioning of mind) సర్వవ్యవహారములకు ఆధారం. భూమి త్రవ్వే వానికి, కట్టెలు కొట్టేవానికి, సుతీక్ష్ణమైన శాస్త్ర ప్రతిపాదిత విషయాలు పరిశీలించేవానికి – అందరికీ కార్యసిద్ధి కావాలంటే నిగ్రహమే (disciplining the mind) ఉపాయం అవుతోంది. మరింకేదీ ఉపాయమై ఉండలేదు.

**మనస్సు, ఉపశమనం -**

**తావజ్జన్మసహస్రాణి భ్రమన్తి భువి మానవాః ।**
**యావన్నోపశమం యాతి మనోమత్తమహార్ణవః ॥** (శ్లో 37, సర్గ 43)

"మనస్సు" అనే మహాసముద్రం ఉపశమించనంతవరకు జీవుడు వేలకొలదీ జన్మలు ఎత్తుతూ ఈ భూమండలమున పరిభ్రమిస్తూనే ఉంటాడు. ఒకానొకడు బ్రహ్మవిష్ణు రుద్రాదులను చిరకాలం పూజించవచ్చు! వారికి ఆతని పట్ల ఎంతో వాత్సల్యం కలుగవచ్చు గాక! అయినా కూడా, వారు ఆతని సత్ ప్రయత్నం, సదవగాహన లేకుండా "మనోవ్యాధి" అనే ఉపద్రవం నుండి ఆతనిని రక్షించగలరా? లేదు.

దేహవ్యాధికి ఔషధం – చికిత్స ఎవరికి వారే స్వీకరించాలి కదా! అట్లాగే మనోవ్యాధికి చికిత్స ఎవరికి వారే స్వీకరించాలి. ఒకరికొరకై మరొకరు చికిత్స తీసుకోవటం ఎలా కుదురుతుంది? అందుచేత నీకు నీవే విచారణ చేయాలి. అయితే, అట్టి విచారణకు కావలసిన సమాచారం, సందేహ నివృత్తి మొదలైనవి గురువులు, త్రిమూర్త్యాది దేవతలు, శాస్త్రములు తప్పక అందించటం జరుగుతుంది. వస్తువుపై వెలుతురు పడినా, ఆ వస్తువును నీవు కనులు తెరచి చూచినప్పుడు కదా, నీకు తెలియవచ్చేది!

అందుచేత, రాఘవా! నీవు ఇంద్రియములకు, అంతఃకరణమునకు ఎదురుగా (విశేషములుగా) తారసపడే ఈ బాహ్యవిషయములను వదలివేయి. అంతర్స్థితుడవు అగుము. చైతన్య స్వరూపం ఒక్కదానినే చింతించుము. అప్పుడు నీకిక జన్మ–పునర్జన్మల ప్రహసనమంతా మొదలే ఉండదు. సంవేద్యములగుచున్న (ఈ తెలియవచ్చుచున్న) సర్వ బాహ్య అభ్యంతర విషయములనుండి విడివడి "నిరామయము, పరమానందమయము, అనంతము, సన్మాత్రము" అగు చైతన్యాన్నే ఆస్వాదించు.

"నేను సర్వదా శుద్ధ చైతన్యమునే కదా!" అని భావించుచు నిన్ను నీవు గాంచు. నిన్నే సర్వత్రా సర్వముగా దర్శించుచుండుము. సర్వము నీ స్వరూపంగా అభ్యసిస్తూ ఉండు. (మమత్మా సర్వభూతాత్మా – మమసాధర్మ్య మాగతః) అప్పుడు అట్టి చైతన్య తత్త్వమును ఆస్వాదిస్తున్న నీవు, పునరావృత్తి రహితమగు స్థానమును పొందగలవు. అప్పుడు ఈ పునర్జన్మాదులు నీకు ఆపాదించబడవు.

నీ దృష్టిలో నీవు పునర్జన్మరహితుడవై ఉంటావు. సర్వాత్మకుడవై ఆత్మారాముడవై అనుక్షణికంగా ఆత్మసాక్షాత్కారం ఆస్వాదిస్తూ ఉంటావు.

❖❖❖

**(పన్నెండవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# పదమూడవ రోజు

# VI. మనోదర్పణం

# గాధి వృతాంతం

## 1. మాయాదర్శన కుతూహలం

**శ్రీవసిష్ఠమహర్షి** : ఓ రామచంద్రా! "ఈ సంసారమాయ అంతమయేది ఎట్లా?" – అను ప్రశ్నకు సమాధానం "చిత్తమును జయించుటే" అయి ఉన్నదయ్యా! మరి ఉపాయమంటూ, వేరే ఏమీ లేదు. ఇక మిగతా (తదితర శాస్త్ర–నిర్దేసిత) ఉపాయాలన్నీ చిత్తమును జయించుట కొరకే రచించబడి ఉన్నాయి.

**శ్రీరాముడు** : హే మహర్షీ! అసలు 'జగత్తు' అనబడే ఈ మాయ ఎట్లా విస్తరిస్తోంది? ఆ వైచిత్ర్యమేమిటి? ఈ జీవునిపట్ల గుదిబండవలె సంప్రాప్తిస్తున్న ఈ 'చిత్తము' అనునది ఎట్లా రూపుదిద్దుకుంటోంది?

**శ్రీ వసిష్ఠమహర్షి** : చిత్తము అనబడేది ఆత్మస్వరూపుడగు ఈ జీవుని స్వయంకృత చమత్కారమే! నీ ప్రశ్నకు సమాధానంగా 'గాధి' అనే ఒక బ్రాహ్మణ బాలకుని వృత్తాంతం చెపుతాను. శ్రద్ధగా విను.

❖

కోసల దేశంలో ఒకానొకప్పుడు 'గాధి' అనేపేరు గల ఒక బ్రాహ్మణబాలకుడు ఉండేవాడు. ఆ పిల్లవాడు గొప్పగుణశాలి, వేదవేత్త, బుద్ధిమంతుడు, ధర్మమూర్తి కూడా. ఆతని చిత్తము చిన్నప్పటి నుండి విషయములపట్ల విరక్తి కలిగి, ఎంతో శోభిస్తూ ఉండేది. ఉత్తమ భావాలు గల ఆ గాధి ఒక రోజు తన బంధుజనమునందరినీ క్షణంలో త్యజించివేసి, అరణ్యం చేరాడు. అక్కడ 'గిరి' అను పేరు గల ఒక ప్రదేశంలోని ఒక సరోవరం సమీపంగా ఆశ్రమం నిర్మించుకొని ప్రశాంతంగా తపస్సు ప్రారంభించాడు. "పరంధాముడగు విష్ణుమూర్తి యొక్క మహత్తర దర్శనం నాకు లభించును గాక" అను ఏకైక ధ్యేయముతో శ్రద్ధగా తపస్సు కొనసాగించసాగాడు.

ఎనిమిది మాసాలు గడిచాయి. ఆ పిల్లవాడి పట్టుదల, ఏకాగ్రత, భక్తిశ్రద్ధలు చూచి విష్ణుమూర్తి చాలా సంతోషించారు. ఒక సుదినం ఆయన శంఖ చక్ర గదాధారి అయి గాధి ముందు ప్రత్యక్షమైనాడు.

**శ్రీవిష్ణుమూర్తి** : ఓ ప్రియబాలకా! నీ ఏకాగ్రత, నిర్మలహృదయం చూచి సంతోషించానయ్యా. నీ తపస్సు ఫలించింది. ఇకలే బిడ్డా! ఏమి కావాలో ... కోరుకో.

**గాధి** : హే మహావిష్ణో! నారాయణా! మీరు అసంఖ్యాక జగత్తులలోని ప్రాణుల హృదయములలో సాక్షిస్వరూపులై ఉంటారు కదా! అట్టి మహత్తర స్వరూపులగు మీకు ఇవే సాష్టాంగ దండప్రణామాలు,

మూడు జగత్తులకు – (స్వర్గ, మర్త్య, పాతాళ జగత్తులకు; జాగ్రత్, స్వప్న, సుషుప్త జగత్తులకు) – సర్వదా ఆధారభూతులగు మీకు పదే పదే నమస్కారం.

హే భగవాన్! నాకొక చిన్నకోరిక ఉన్నది. చిదాకాశము నందు మీ వలన కల్పించబడే ఈ సంసారమాయ యొక్క పూర్వాపరాలు దర్శించాలని నా అభిలాష.

**శ్రీవిష్ణుమూర్తి** : ఓం! తప్పకుండా, ప్రియగాధీ! నీవు నా మాయను దర్శిస్తావు!... తదనంతరం నా భక్తుడవవటం చేత త్యజిస్తావు కూడా!

❖

ఇట్లు పలికి శ్రీమహావిష్ణువు అంతర్ధానమయ్యాడు. ఆ బాలకుడు జగత్పతిని దర్శించటం చేత పరమప్రీతిని పొందాడు. మనస్సులో శ్రీవారిని దర్శించిన మధురానుభవం నిండియుండగా, క్రమంగా రోజులు గడుపసాగాడు. ఎప్పటి లాగానే తపస్సు, ధ్యానము, స్వాధ్యాయము, అతిథిపూజ నిర్వర్తిస్తూ అదే ఆశ్రమంలో చాలా రోజులు గడిపాడు.

ఒకరోజు ఉషఃకాలం సరోవరంలో స్నానం ఆచరించి ఒడ్డున ఒక చక్కటి చోట పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. ఆతని మనస్సు విష్ణుభగవానునితో కలిగిన సమాగమం, మాయ యొక్క చమత్కారముల గురించి యోచన చేస్తూ ఉన్నది. కొంతసేపైన తరువాత యథాసమయమైన తరువాత మరల స్నానాదులు చేయాలని లేచి సరోవరంలో ప్రవేశించాడు. స్నానమైన తరువాత ఆచమనం చేసి, సంకల్పం చెప్పి "అఘమర్షణ సూక్తం" పఠించసాగాడు.

...అప్పుడు హఠాత్తుగా ఒక చోట యథాలాపంగా ఉచ్చారణ ఆగిపోయింది. తరువాత శ్లోకం గుర్తుకు రాలేదు. గుర్తుచేసుకోనే ప్రయత్నంలో మరొక మంత్రమేదో స్మృతికి వచ్చి, స్ఫురించ సాగింది. ధ్యాస – పరధ్యాసలను సమన్వయించుకుంటూ ఉండగా నీటి మధ్యలో ఏదో దృష్టిని ఆకర్షించింది. అక్కడ అతనికి ఏదో విశేషపరంపరలు కనిపించసాగాయి. అన్నిటినీ మరచి ఇక అటే దృష్టి, శ్రద్ధలను సారించసాగాడు. తన ధ్యాస నీటిమధ్యలో ఉండి ఉండగానే ప్రాణాలు దేహం నుండి బహిష్కరించబడుచున్నట్లు నవ్యానుభూతి పొందసాగాడు. అతని ధ్యాస ఏదో నూతన మార్గంలో ప్రసరించసాగింది. ఆ గాధియొక్క తదనంతరానుభవం ఇట్లా కొనసాగింది.

❖

నిలుచున్నపాటునే గాధి యొక్క ప్రాణాలు శరీరంలోంచి బహిర్గతమైనాయి. శరీరం నేల కూలింది. "అయ్యో! నేను ఎంత ప్రయత్నించినా ఈ దేహం ఉపయోగానికి రావటంలేదే?" – అని ఆ జీవుడు కొద్దిసేపు తచ్చాడుతూ విచారించాడు. పాలిపోయిన ఆ శరీరం యొక్క ముఖం ఎండిపోయిన ఆకులాగా శుష్కమైపోయింది. కళ్ళుమూతలుబడి, బిగదీసుకుపోయాయి. ఎవరో బంధువులు ఆ నిర్జీవ శరీరం అక్కడుండటం గమనించారు. కొద్దిసేపట్లో ఈ వార్త అటూ–ఇటూ పొక్కింది. దగ్గర బంధువులంతా ఎక్కడెక్కడి నుండో వచ్చి అక్కడకు చేరారు. ధూళితో నిండిన ఆ శరీరాన్ని దీనంగా చూస్తూ ఆతని తల్లి నెత్తి – నోరూ బాదుకుంటూ రోదించసాగింది. సోదరీసోదరులు కాళ్ళ దగ్గర

ప్రక్కప్రక్కన కూర్చుని ఏడుస్తూ కళ్ళనీళ్ళు కార్చసాగారు. వారి రోదనధ్వని కొద్దిసేపు బిగ్గరగా, మరికొంతసేపు ఏవేవో అస్పష్ట శబ్దాలతో వినిపించసాగింది. అవయవములు ఒకదానితో మరొకటి ఇంతకాలం కలిసి ఉండి, ఇక చాలునని, వియోగం కొరకు మౌనంగా వేచి ఉన్నట్లు ఉన్నాయి. ప్రాణాలు నోటి నుండి నిష్క్రమించాయి కాబోలు... నోరు తెరచి ఉన్నది. పళ్ళు మిలమిల మెరుస్తూ చూచేవారికి కొంచం భయం కలిగిస్తున్నాయి. చెవులు మౌనంగా రోదనలను వింటూ, "నా పట్ల ఎవరికి ఎంత ప్రేమ ఉన్నదో?" అని గమనిస్తున్నట్లుగా ఉన్నాయి. కాస్త దూరం నుండి చూస్తుంటే, ఏదో నిశ్చలమైన తపస్సులో నిమగ్నమైనట్లుగా ఆ దేహం మౌనంగా, శాంతంగా కనబడుతోంది. "నాయనా, బాబూ! ఎంతపని చేశావు... చెప్పినా వినలేదుకదా! అంతటివాడివి, ఇంతటివాడివి, అట్లా అనేవాడివి, ఇట్లా ఉండేవాడివి, మేం పాపిష్టివాళ్ళం... నిన్ను దక్కించుకోలేకపోయాం" అని చాలాసేపు అరుస్తూ ఉండుటచేత అక్కడి చాలామంది బంధువుల గొంతుకలు జీరబోయాయి. కానీ ఏం లాభం? వాళ్ళు ఏడ్చి ఏం సాధించగలరు? అశుభమగు ఆ 'శవము'ను అక్కడి నుండి తొలగించి దూరంగా నిర్జన ప్రదేశంలో పారవేసిరావలసిందే కదా.

❖

'గాధి' అని ఇంతకాలం సంబోధింపబడుతూ వస్తున్న ఆ దేహి తన భౌతిక దేహము యొక్క గతినంతా గమనిస్తూ ఇక చేసేది లేక మరొక చోటు వెతుక్కుంటూ అక్కడి నుండి బయలుదేరాడు. ఆ మృతాత్మ అరణ్యప్రాంతంలో గల ఒక ఆటవిక కుగ్రామంలో ఒక స్త్రీ గర్భంలో ప్రవేశించింది. అక్కడి గర్భవాసనా వ్యథలచే వ్యాకులపడింది. క్రమంగా నియమితకాలంలో శిశువై జన్మించింది. ఆటవిక జాతి నివసించే ఒక వాటికలో జన్మించిన ఆ బాలుడు 'కటంజుడు' అనే పేరుతో పిలువబడుచూ క్రమంగా 14 ఏళ్ళ బాలుడైనాడు. ఆ పిల్లవాడు అక్కడి పెద్దల మాటలు పెడచెవిని పెట్టుచూ అల్లరి చిల్లరగా తిరుగ ప్రారంభించాడు. కొన్ని వేటకుక్కలను వెంటబెట్టుకుని చుట్టు ప్రక్కల గల అడవులలో సంచరిస్తూ వందలాది మృగములను చంపుతూ కాలం గడుపసాగాడు. మృగముల పచ్చి మాంసమే అక్కడి జనులకు ముఖ్యాహారం.

కొంతకాలం తరువాత అక్కడి శ్వపచ (కుక్క మాంసం తినే ఒకానొక జాతివారి) కన్యను వివాహం చేసుకొన్నాడు. వాళ్ళిద్దరూ అక్కడ చిలక-గోరింకల వలె విహరించసాగారు. వారికి చాలా మంది సంతానం కలిగారు. కొంతకాలానికి దొంగతనం వంటి దుష్ప్రవర్తనల కారణంగా అక్కడివారిచే ఊరి నుండి వెడలగొట్టబడుటచే, ఊరికి దూరంగా ఒక గుడిసె కట్టుకొని ఉండవలసివచ్చింది. ఆతని బుద్ధి పరమ కాఠిన్యంగా, చేతలు బహుక్రూరంగా ఉంటూ ఉండేవి.

❖

కొంత కాలానికి అక్కడ ప్రబలిన ఒక భయంకరవ్యాధి సోకి ఆతని భార్య, పిల్లలు ఒకరొకరుగా మరణించారు. పాపం ఆతడు ఒంటరివాడైపోయాడు. గుంపులోంచి తప్పిపోయిన లేడి లాగా విలవిల్లాడి పోయాడు. ఆతని ఇతఃపూర్వపు హింసాప్రవృత్తిని దృష్టిలో పెట్టుకుని ఊరివారు గాని, తదితర బంధువులు గాని ఊళ్ళోకి రానీయలేదు. ఆతనికి సంసారము పట్ల విశ్వాసం సన్నగిల్లింది.

ఒక మారుమూల ప్రదేశంలో ఒక చోట కూర్చుని చాలా రోజులు రోదించాడు. ఏం చేయాలి మరి? అక్కడి శ్వపచజాతి వారు ఆతనిని దరిజేరనీయరాయె! తన దుష్ట, నీచ చర్యలకు బహిష్కరించారు మరి! కొద్ది రోజుల తరువాత కటంజుడు అక్కడి నుండి లేచాడు. దీర్ఘప్రయాణాలు చేస్తూ, చుట్టుప్రక్కల దేశాలు సందర్శిస్తూ భిక్షాటనంతో కడుపు నింపుకుంటూ కొంతకాలానికి "కీర" అనే దేశం చేరాడు. ఆ దేశానికి ముఖ్య పట్టణమైన కీరనగరం ప్రవేశించాడు.

ఆతడు ఆ విధంగా కీర పట్టణంలో ప్రవేశిస్తూ అక్కడంతా ఎంతో సందడిగా ఉండటం చూచాడు. అక్కడి విశేషాలు తెలిశాయి. ఆ దేశపురాజు ఆ క్రితం రోజే అకస్మాత్తుగా మరణించాడు. దురదృష్టవశాత్తూ చనిపోయిన ఆ రాజుకు సంతానంలేదు. ఆ దేశపు రాజ్యాంగం ప్రకారం ఆ పరిస్థితులలో పట్టపుటేనుగు ఆ దేశపు ఏ పౌరుడి మెడలో పూలదండ అలంకరిస్తే ఆతడే రాజు అవుతాడు. ఆరాజ్యంలోని వివిధ ప్రదేశాల నుండి ప్రజలు తమతమ అదృష్టములను పరీక్షించు కోవటానికి కీర పట్టణానికి తరలివచ్చారు. ఆ రోజు తదితర రాజ్యప్రజలకు (వేరే దేశపు పౌరులకు) పట్టణప్రవేశం నిషేధం. అయితే భిక్షకుడగు కటంజుని విషయం అక్కడి సైనికుల దృష్టికి రానేలేదు. వచ్చి ఉంటే, ఆతనిని అక్కడ ఉండనిచ్చేవారు కాదు.

❖

రాజవీథులన్నీ జన సందోహంతో నిండిపోయాయి. ఎవరికి వారే మెడలను సవరించుకుంటూ దేవుళ్ళకు మొక్కుకోవటం, ఊహలలో విహరించటం చేస్తున్నారు. భిక్షకులంతా ఒక వైపుగా నిలబడి ఈ తతంగమంతా కుతూహలంగా చూస్తూ ఆనందిస్తున్నారు. ఆ భిక్షకులలో ఒక చివరగా బిక్కుబిక్కు మంటూ, అక్కడి తదితర భిక్షకుల అదరింపులు, ఛీదరింపులూ పొందుతూ ఆకలి, విసుగులను దిగమ్రింగుకుంటూ కటంజుడు ఒక మూల నిలబడి చూస్తున్నాడు.

ఇంతలో సర్వాంగసుందరంగా అలంకరించిన పట్టపుటేనుగు ఆ వీధిలోకి రానే వచ్చింది. తమని దాటి ముందుకు పోతున్న పట్టపు ఏనుగును చూస్తూ, జనులు ఉస్సురనుకుంటూ, అక్కడి సైనికులకు వెరచి, మాట పైకి రాకుండా, నిరుత్సాహంగా చూస్తున్నారు.

ఇంతలో ఆ ఏనుగు భిక్షకులు నిలుచున్నచోటికి వచ్చింది. సరాసరి కటంజుని మెడలో పూల మాల వేసింది. కటంజుడు ఆ హటాత్సంఘటనకు విస్తుపోయాడు. ఇంకా ఆశ్చర్యం నుండి తేరు కోకుండానే, ఒక్కసారి దుందుభులు మ్రోగాయి. సైనికులు ఆ భిక్షకుని పేరు అడిగి తెలుసుకున్నారు. "మన క్రొత్త మహారాజు కటంజులవారికి విజయోస్తు, దిగ్విజయమస్తు!" – అని బిగ్గరగా కేకలు మిన్నుముట్టాయి. పరిచారికలు చేతిలో పూదండతో ఆతనిని సమీపించారు. వారు వివిధ గంధ లేపనములతో, ఆభరణములతో ఆతనిని అలంకరించారు. ప్రజలు చుట్టుముట్టి జేజేలు పలుకు చుండగా కటంజుని రాజసభకు తీసుకొనిపోయి, రాజసింహాసనంపై కూర్చోబెట్టారు. బ్రహ్మాండంగా ఐదు రోజులు పట్టాభిషేకమహోత్సవం జరిగింది. క్రొత్తగా వచ్చిన రాజుకు "గవలమహారాజు" అని నూతన నామధేయం ప్రతిక్షేపించారు.

ఇకప్పటి నుండి ఆతడు కీరపుర స్త్రీలతో విరాజిల్లుతూ, చింతావిషాదరహితుడై మంత్రులతో కూడి రాజ్యపాలన చేయసాగాడు. కొద్ది నెలలో ఆతని ఇచ్ఛను అనుసరించి అనేక రాజశాసనాలు అమలుకు వచ్చాయి. కార్యదక్షులగు ప్రతినిధులు రాజ్యంలోని వివిధ ప్రదేశముల నుండి రాజ శాసనములు అమలుపరుస్తుండగా, ఆతడు దక్షతతో రాజ్యం ఏలుచూ రోజులు, నెలలు, సంవత్సరాలు గడపసాగాడు. ఆతడు "గవలమహారాజు" అనే నూతన నామధేయంతో అక్కడ ప్రసిద్ధికెక్కాడు. ప్రజలందరూ ఆ మహారాజును ఎంతగానో ప్రస్తుతించుచూ ఉండేవారు.

❖❖❖

## 2. శాస్త్ర విరుద్ధం

గవలమహారాజు (కటంజుడు) యొక్క పరిపాలనాదక్షతచే ప్రజలు శోక – భయ – క్లేశ రహితులై సుఖంగా కాలంగడుపుచుండేవారు. ఆ సమయంలో ఆతడు తన ఇంతఃపూర్వపు ఆటవిక జీవితమంతా పూర్తిగా విస్మరించాడు. నిరంతరం స్తవనములతో, మంగళగీతములతో ఆనందిస్తూ, మత్తులో ఉన్నవానివలె రోజులు గడపసాగాడు. ఆ విధంగా ఎనిమిదేండ్లు గడచిపోయాయి. అతని సంస్కారమే మారిపోయింది. దయ – దాక్షిణ్యము – దానము – న్యాయము వంటి ఆర్యగుణములతో ఆతడు ప్రజలకు ప్రియుడైనాడు.

ఒకరోజు గవలునకు ఎందుకో తన మునుపటి రోజులు గుర్తుకు వచ్చాయి. "ఈ రాజ్యపాలన, ఈ సంరంభములు బాగానే ఉన్నాయి గాని, నా మునుపటి ఏకాంత జీవితం ఇప్పుడు లభించుటయే లేదే? పూర్వం ఆటవిక – శ్వపచజాతిలో ఉన్నప్పుడు గోచిపెట్టుకొని వేటాడుతూ ఉంటే ఎంత బాగుండేది! ...రహస్యంగానైనా సరే, ఒక్కరోజు ఈ రాజ్యపాలన ప్రక్కకు పెట్టి, నా ఇంతఃపూర్వపు రూపంలో దగ్గిరగా ఉన్న అడవిలో సంచరించి రావాలి" అని అనుకున్నాడు. ఆలోచన వచ్చినదే తడువుగా, ఆ సాయంకాలం అంతఃపురం త్వరగా చేరాడు. ఏకాంత మందిరంలో ప్రవేశించాడు. తన అలంకరణములన్నీ ఊడదీసి ఆటవిక రూపంలో గోచిపెట్టుకొన్నాడు. "అమ్మయ్యా! హాయిగా ఉన్నది. ఈ కృత్రిమమైన అలంకారాలు మనిషికి ఎందుకు?" – అని అనుకుంటూ, ఒకరిద్దరు మంత్రులకు – రాజుకు మాత్రమే తెలిసి ఉండే రహస్యమార్గం గుండా అంతఃపురం నుండి బైటపడ్డాడు. ఆతడు ఇప్పుడు అచ్చం ఇతః పూర్వపు కటంజునిలాగానే ఉన్నాడు. అయితే, ఆతని చిత్తము ఇప్పుడు తన ప్రాచీన క్రౌర్యమును త్యజించి ఔదార్యముతో నిండి ఉన్నది.

క్రమంగా కీరపట్టణం వదలి, అడవుల వైపుగా వెళ్ళే మార్గంలో అడుగులు వేస్తూ బయలు దేరాడు. కొద్దిసేపు నడచిన తరువాత ఆతనికి ఒకచోట అత్యంత సుపరిచితమైన ఆటవికుల డప్పుల – బూరల శబ్దం వినిపించింది. "ఇదేమిటి, మా శ్వపచులు ఉపయోగించే బూరలశబ్దాలు వినబడు తున్నాయి?" అని అనుకుంటూ అటువైపుగా నడిచాడు. ఆశ్చర్యం! వాళ్ళు ఎవరో కాదు! తన శ్వపచ జాతి బంధువులే. వాళ్ళ డప్పుల శబ్దాలకు పూర్వసంస్కార ప్రభావం చేత ఒక్కసారి పైకి ఎగిరిగంతులు

వేయసాగాడు. వాళ్ళతో బాటే లయగా నృత్యం చేయ ప్రారంభించాడు. ఆ శ్వపచుల నాయకుడు కటంజుని గుర్తుపట్టేశాడు.

**శ్వపచులనాయకుడు** : ఓరి కటంజుడా! నువ్వట్రా! ఈ కీరదేశం ఎప్పుడొచ్చావు? ఇంతకాలం ఏమైనావు! చాలా రోజులకు కనిపించావే! ఇప్పుడు నాజూకుగా తయ్యారయ్యావు! ఇదివరకు మొరటుగా అందరిని హింసిస్తూ హంగామా చేసేవాడివి కదా! ఇంతకాలం ఎక్కడో ఏ అడవిలోనో నీవు ఏ మృగానికో ఆహారమైపోయావని అనుకున్నాం. ఇక్కడేం చేస్తున్నావు? ఇక్కడి రాజు కళలను ఆదరిస్తాడని, మన తప్పెట నృత్యం చూచి బట్టలు, డబ్బు ఇస్తాడని విని మేము వచ్చాం. ఇక్కడ ఏంచేస్తున్నావు? ఇక్కడి వాళ్ళు ఎవరైనా తెలుసా?

ఆ శ్వపచులనాయకుడు మాట్లాడుతూనే ఉన్నాడు. కటంజునకు నోట మాట రాలేదు. ఇంకేం మాట్లాడకుండా వెనుకకు తిరిగి కీరపట్టణం వైపు పరుగు లంకించుకున్నాడు. అక్కడి శ్వపచజాతివాళ్ళు "వీడికి ఇంకా బుద్ధిరాలా?" అని అనుకుంటూ తమ తప్పెట తాళనృత్యం కొనసాగించారు.

కటంజుడు ఎవ్వరికంటా పడకుండా అంతఃపురం చేరి మరల రాజవస్త్రాలు ధరించాడు. "ఇంకా నయం! కీరరాజ్య ప్రజలకి నేను వేరే దేశపు ఆటవికులలోని శ్వపచజాతివాడినని తెలియలేదు. బ్రతికిపోయా" – అని అనుకున్నాడు. అక్కడి రాజ్యాంగ విధానం అతడు ఎఱిగియే ఉన్నాడు.

❖

మరొకరెండు రోజులు గడిచాయి. రెండో రోజు సాయంకాలం రాజసభాప్రాంగణంలోని వినోద భవనానికి రాజు ఏనుగుపై తరలి వచ్చాడు. ప్రజల వినోదం కొరకు మంత్రులు ఆ రోజు శ్వపచుల తప్పెటనృత్యం ఏర్పరచారు. రాజు ఎప్పటిలాగానే ఆ సభకు వచ్చి సింహాసనం వైపుగా అడుగులు వేస్తూ ఉన్నాడు. శ్వపచజాతి నాయకుడు, తదితర శ్వపచజాతి వారు కటంజుని గుర్తుపట్టారు. "అయ్య బాబోయ్! మన కటంజుడే ఇక్కడి రాజు!" అని ఆశ్చర్యపోయారు. తమలో తాము గుసగుసలాడటం ప్రారంభించారు. ఇదంతా ఏమాత్రం తెలియని రాజు ఎప్పటిలాగానే పోయి రాజ సింహాసనంపై ఆసీనుడైనాడు. శ్వపచజాతినాయకుడు ఒక మంత్రిదగ్గిరకు వెళ్ళి "అయ్యా! ఆ రాజు ఎవరో కాదు. మా ఆటవిక శ్వపచజాతి వాడే. మా ఊరి నుండి ఎనిమిదేళ్ళ క్రితం వెళ్ళిపోయాడు. ఇక్కడ రాజయ్యాడని మాకు తెలియనే తెలియదు" అని చెప్పుకుంటూపోతున్నాడు. అది వింటున్న కీరరాజ్యపు మంత్రి అవాక్కయ్యాడు.

ఏమిటీ? మా గవలమహారాజు మా దేశపు పౌరుడు కాదా? పైగా ఆతడు ఒక ఆటవికుడా? అందులోనూ, కుక్కమాంసం తినే ఆచారంగల శ్వపచజాతి వాడా? ఎంత ఘోరం, అరిష్టం జరిగి పోయింది! కీరదేశపు రాజ్యాంగం ప్రకారం ఇది చాలా అరిష్టముతో కూడిన దోషమైన విషయమే? ఇప్పుడేంచేయాలి?

తప్పెట నృత్యం జరుగుతుండగానే ఈ విషయం తదితర మంత్రులకు తెలిసిపోయింది. క్రమంగా గుసగుసలు బయలుదేరాయి. వినోదసమయం అయిపోయేసరికి విషయమంతా చాలా

మందికి తెలిసిపోయింది. రాజు అంతఃపురానికి వెళుతూ జనులలో అనేకులు విషణ్ణంగా ఉండటం గమనించాడు కూడా. అయితే, అప్పటికీ ఆతనికి కారణం తెలియదు. కనుక పట్టించుకోలేదు. కానీ ఆ తరువాత ఆతనికి జరిగిందేమిటో తెలిసింది. క్రమంగా 'ఒక దూరదేశపు శ్వపచజాతివాడు ఇంతకాలం రాజ్యం ఏలాడు' అనే వార్త కీరదేశమంతా పాకింది. పురవాసులలో అనేకమంది దేశభక్తికలవారు దుఃఖితులైయ్యారు. సేవకులు ఆతని ఆజ్ఞలను తృణీకరించసాగారు. ఆతనిని "క్రూరకర్మలు చేసే ఒక అమంగళుడు" గా ప్రజలు చూడసాగారు. రాజసభకు ప్రజలు రావటం మానివేశారు. సేవకజనులలో చాలామంది అంతఃపురానికి రావటంలేదు. ఆతడు చాలాసార్లు పలకరించినా మంత్రులు తిరిగి పలుకుటయేలేదు. "ఏమిటిది? క్రమంగా నేను చిల్లిగవ్వ కూడా లేని దూరదేశపు బాటసారిగా అయిపోతున్నానా?" – అని వ్యధ చెందసాగాడు.

❖

నాలుగురోజులు గడిచాయి. రాజ్యాంగసంరక్షకులగు మంత్రులందరూ ఒకచోట సమావేశమైనారు. అయ్యో! ఈ పొరపాటు ఎట్లా జరిగినా మంత్రులమైన మనమే కదా, బాధ్యులం! మనం చాలాకాలం ఈ విదేశీ శ్వపచుని పాలనలో ఉన్నాం! రాజ్యాంగాన్ని సరిగ్గా అమలు పరచలేకపోవటం మనది ఎంత తప్పు! – అని చర్చించుకోసాగారు.

కొద్దిమంది మంత్రులు "దేశానికి మేము చేసిన ఈ తప్పుకు ఆత్మాహుతియే శరణ్యం" – అని నిర్ణయించుకున్నారు. అప్పటికప్పుడు అక్కడ పెద్ద అగ్నిగుండం తయారుచేసి "కీరరాజ్యమునకు మా వలన అంటిన దోషము తొలగుగాక! కీరప్రజలకు మంచి జరుగుగాక" అని కేకలు వేస్తూ అగ్నిగుండంలో ప్రవేశించి ఆత్మాహుతి చేసుకున్నారు. పట్టణమధ్యంలో జరిగిన ఈ సంఘటనను చూస్తూ స్త్రీలు పెద్దగా కరుణారసస్వరముతో ఏడవసాగారు. అనేకమంది ప్రజలు ఆ అగ్నిగుండం చుట్టూ నిలుచుని చూస్తూ తమ బుద్ధిని కోల్పోయారు. నిప్పులో ఉడుకుచున్న శరీరముల దుర్గంధం పట్టణమంతా వ్యాపించింది.

ఇది ఇట్లా ఉండగా, రాజు నిర్వీర్యుడు – అధికారహితుడు అయ్యాడని సంఘవిద్రోహులకు తెలిసిపోయింది. దొంగలముఠాలు దేశంలోని అనేకచోట్ల ఇళ్ళపై బడి ఇష్టం వచ్చినట్లు దోచుకోసాగారు. అనేక జరగరాని సంఘటనలు చోటు చేసుకోవటం చేత ప్రజలు తమ మాన – ధనాదులకు రక్షణ కోల్పోయారు.

❖

కాకతాళీయంగా రాజయి, సద్గుణములతో సజ్జనసహవాసము, ఎనిమిదేళ్ళు రాజ్యాధికారం అనుభవించిన కటంజుడు ఒక్క నాలుగు రోజులలో ఏర్పడిన కకావికలాలన్నీ గమనించాడు. "అయ్యో! నా వల్లనే కదా, ఈ జరగరానిదంతా జరిగిపోతోంది! ఇంతగొప్ప దేశానికి నా కారణంగా ఇంతటి అనర్థం జరిగిపోతుంటే, నేను ఇప్పుడేం చేయాలి? అయినా ఇకనేను ఎవరికోసం, ఎందుకు జీవించాలి? మరి కొంతమంది మంచివారు ఆత్మాహుతి చేసుకోక ముందు నేనే తొలగితే, వీరు

మరొక రాజును శాస్త్రానుసారం ఎన్నుకుంటారు. అందుచేత ఈ ప్రజల ఇప్పటి దుర్దశ తొలగటానికి నాకు నేనే ప్రాణత్యాగం చేస్తాను!"

ఇట్లు తలచి కటంజుడు వీథిలోకి వచ్చాడు. ఒక ప్రదేశంలో చితిపేర్చాడు. "ఓ కీరదేశ ప్రజలారా! మీరు ఆవేశపడి మరికొన్ని అనర్ధములు తెచ్చిపెట్టుకోకండి. కీరదేశ సంక్షేమం కోరి ఈ గవలుడు భౌతికదేహం అగ్నిపాలు చేస్తున్నాడు" అని మూడుసార్లు పెద్దగా ప్రకటిస్తూ మరిక ఎవ్వరేమంటున్నదీ ఏమాత్రం వినకుండా అగ్నిప్రవేశం చేశాడు.

❖

సరోవరంలో అఘమర్షణ సూక్తం గానం చేస్తూ యథాలాపంగా ఉన్న గాధి కంఠంలో మంటగా ఉన్నట్లు అనిపించి, ఒక్కసారి నలువైపులా చూచి, తాను ఎక్కడున్నదీ గుర్తుతెచ్చుకున్నాడు.

❖❖❖

# 3. సుదీర్ఘ మనో పరిభ్రమణం

**శ్రీవసిష్ఠ మహర్షి** : ఒడ్డుకు చేరిన సముద్ర తరంగం క్షణ కాలంలో శాంతిస్తుంది చూచావా! అట్లా గాధి పొందిన దృశ్యమంతా క్షణంలో మటుమాయమైపోయింది. మనోసంకల్ప రూపమగు సమ్మోహనము నుండి ఆతడు విరతి (withdrawl) పొందాడు. కల్లుత్రాగుటచే మత్తెక్కినవాడు కైపు తగ్గగానే, ఆ మత్తు నుండి విడివడునట్లు ఆతడు కీరరాజ్య పాలన – దేశ వ్యవహారాలు మొదలైన వాటి నుండి విడివడ్డాడు. "ఆహా! నేను గాధి అను పేరుతో పిలువబడే మునిని కదా" అని నిజ రూపం తలచుకుంటూ, జల మధ్యం లోంచి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఒడ్డుకు చేరాడు. ఆకాశం, నేల, దిక్కులు ఎప్పటి వలెనే ఉన్నట్లు గమనించి ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

గాధి తనలో తాను "ఆహా! నేనెవడను? ఏమి చూచాను? ఇప్పుడు నాకు అనుభవమైనదంతా ఏమిటి?" అని జరిగినదంతా తర్కించుకున్నాడు. ఓహో! అదీ సంగతి. కొంచం అలసిపోయి ఉండటం చేత, డస్సి ఉన్న నేను కొద్దిక్షణాలు ఏదో భ్రమను స్వప్న సదృశంగా చూచాను కాబోలు." అని అనుకుంటూ బాటలో నడవసాగాడు. ఆశ్రమం వైపు పోతూ ఇంకా ఇట్లు తలపోయసాగాడు.

**గాధి (తనలో తాను)** : నేను రాజ్యపాలన చేస్తూ చేస్తూ నా వలన తదితరులకు జరిగిన దోషమును పరిహరించుకోవటం కోసం అగ్నిలో ప్రవేశించాను కదా! ఆ అనుభవమునకు సంబంధించిన స్త్రీలు, మంత్రులు, శ్వపచజాతి ఆటవికులు, సభికులు మొదలైన వారంతా ఎవరు? ఎక్కడున్నారు? నేనా, అవివాహితుడను, స్త్రీ యొక్క కరస్పర్శను కూడా ఎరుగను. ఇక నా బంధువులా, వాళ్ళంతా దూరంగా ఉండే నా స్వగ్రామంలో ఉన్నారాయె! మరి నేను అగ్ని ప్రవేశం చేసింది ఎవరి సమక్షంలో? స్వప్న నగరం వంటి ఈ సంఘటనలను అసలు ఎందుకు పొందినట్లు?

అవును! అదంతా స్వప్నం వలె భ్రమయే అయి ఉంటుంది. నేను మృతి చెందటం నా బంధువులు రావటం, ఈ భౌతిక దేహమును చూచి ఏడవటం, నేను మరొక తల్లి గర్భంలో ప్రవేశించటం,

ఆటవిక శ్వపచులలో పుట్టి పెరగటం, పెళ్ళి, పిల్లలు, మా జాతివారి గ్రామ బహిష్కరణ, పరరాజ్య ప్రయాణం, రాజవటం, నా తోటి గ్రామస్థులు నన్ను గుర్తించటం, మంత్రులకు ఆ రహస్యం తెలిసిపోవటం, వారిలో కొందరి ఆత్మాహుతి, చివరికి నేనే ఆత్మాహుతి చేసుకోవటం, ఇదంతా సుదీర్ఘంగా అనుభవించినాను గాని, అంతా ఒక స్వప్నమే అయి ఉంటుంది. ఇప్పటికి అది కలే గాని, అబ్బా! అప్పటికి మాత్రం ఎంతగా సత్యమైన అనుభవం! ఏడ్చాను, నవ్వాను, హింసించాను, భంగపడ్డాను, భయపడ్డాను, రాజ్యాధికారం చెలాయించాను! ...నేను పొందనిది లేదు. అరె! "నేను గాధిని" అనే విషయమే ఆ సుదీర్ఘ సమయంలో జ్ఞాపకం రాలేదే? అవునులే. స్వప్న సమయంలో జాగృత్ స్థితి విశేషం జ్ఞాపకం రావటం లేదుగా! ఇదీ అంతే.

అయినా, అంత సుస్పష్టంగా అనేక విషయాలు అనుభవించాను కదా! ఊళ్ళో వాళ్ళని హింసించటం చేత వాళ్ళు నన్ను నా పెళ్లాం బిడ్డలను బహిష్కరించారు. నా పెళ్ళాం బిడ్డలు నా కళ్ళ ఎదురుగా మరణించారు. నేను దేశ దేశాలు నడుచుకుంటూ కీరదేశం ప్రవేశించాను. భిక్షకుల మధ్యలో భయంభయంగా నిలబడి ఉన్న నన్ను పట్టపు ఏనుగు వచ్చి పూలమాలతో అలంకరించింది. రాజయ్యాను. న్యాయనిర్ణయాలు చేస్తూ, రాజ్యపాలన చేశాను. మా గ్రామంవారైన శ్వపచులు నన్ను ఊరి బయట చూచి గుర్తించారు. ఆ రోజు నేను గోచీ పెట్టుకుని రాజాంతఃపురం నుండి రహస్య మార్గం గుండా బయటకు వెళ్ళకపోతే నేను ఇంకా రాజుగానే ఉండే వాడినేమో! అరెరేఁ! నేనట్లా చేయవలసింది కాదు.

కనుక అదంతా అసత్యమో, స్వప్నమో ఎలా అవుతుంది? కాదు. ఏది నిజం! ఏది అసత్యం! చండాల-రాజ జీవితములలో ఒక్కటైనా సత్యమా! రెండూ స్వప్నమేనా? ఇదే విష్ణుమాయ కాబోలు. అవును! పిచ్చెక్కిన పులి పిచ్చి పిచ్చిగా అడవులలో సంచరిస్తున్నట్లు ఈ చిత్తము కూడా భ్రాంతి దృష్టులతో పరిభ్రమించటం జరిగిందా? అయి ఉండవచ్చు.

❖

ఈ విధంగా ఆయా సంఘటనను గురించి చిత్తము యొక్క మోహము గురించి ఆలోచిస్తూ గాధి అక్కడి తన ఆశ్రమం చేరాడు. కొద్దిరోజులు గడచిపోయాయి. ఆతడు యథాప్రకారంగా తన ధ్యాన, తప, అధ్యయనాదులు కొనసాగించసాగాడు.

ఒక రోజు ఒక బాటసారి ఆ ఆశ్రమానికి వచ్చాడు. ఆతడు, దీర్ఘమైన ప్రయాణాలు చేసి ఉండటం చేత కాబోలు, ఎంతో అలసిపోయి, నీరసంగా కనిపించాడు. గాధి ఆ అతిథిని ఆహ్వానించి, ఉపచారాదులతో సేవించాడు. కొంతసేపైన తరువాత ఆ బాటసారి కాస్త ఓపిక, ఉత్సాహము పుంజుకున్నాడు.

**గాధి** : అయ్యా! మీ అలసట తొలగిందా? మధ్యాహ్నం మీరు వచ్చే సమయంలో ఎంతో అలిసిపోయి, డస్సి ఉన్నారు. ఏమైనా అనారోగ్యం కారణమా?

**బాటసారి** : లేదు నాయనా! నేను ఇంతగా కృశించి ఉండటానికి ఒక ముఖ్య కారణమున్నది.

ప్రయాగలో ఆలయం చుట్టూ రోజుకు వేయి అంగప్రదక్షిణాలు 100 రోజులుగా చేశాను. అందుచేతనే నీరసంగా కనిపిస్తున్నాను. నీ అతిథి సేవలచే నా అలసట కొంచం తగ్గింది. చాలా సంతోషం.

**గాధి** : అంత శారీరక శ్రమ పొందవలసిన అగత్యం మీకేమున్నది?

**బాటసారి** : అదంతా ప్రాయశ్చిత్తంగా చేయవలసి వచ్చింది.

**గాధి** : మీరేమి తప్పు చేశారని ప్రాయశ్చిత్తం అవసరమైనది?

**బాటసారి** : ఇక్కడికి ఉత్తరంగా చాలా దూరంగా 'కీర' అనే ప్రసిద్ధ దేశం ఉన్నది. ఆ దేశానికి గల సరిహద్దులలో ఒక నిర్జన ప్రదేశంలో ఒక ఆశ్రమంలో తపస్సు చేసుకుంటూ రోజులు వెళ్ళబుచ్చుకునే వాడను. ఒకసారి ప్రజల ఆహ్వానం మీద అక్కడి ముఖ్య పట్టణమైన కీరనగరం వెళ్ళాను. పురాణాలు చెప్పుతూ అక్కడివారి ఆతిథ్యంలో చాలా రోజులు గడిపాను. అయితే అక్కడ అకస్మాత్తుగా రాజ్యాంగ విరుద్ధమైన ఒక అపశ్రుతి బయటకు పొక్కింది. ఆ దేశాన్ని ఎనిమిదేళ్ళుగా ఒక పరాయిదేశీయుడు పాలించాడు. అంతే గాదు... ఆ రాజు ఇతఃపూర్వం ఒక ఆటవిక – కుక్క మాంసంతినే ఆచారం గల శ్వపచజాతి వాడట. ఆతడు విజాతీయుడని తెలియగానే ఆతనిని అక్కడి ప్రజలు తిరస్కరించారు. ఆతని పాలనలో ఉన్నందుకుగాను వాళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకోవటం ప్రారంభించారు. నేను చూస్తూ ఉండగానే అక్కడి కొందరు రాజ్య శ్రేయోభిలాషులు, ఆ రాజు కూడా అగ్నిలో ప్రవేశించారు. ఆ విధంగా నిండు ప్రాణాలు కళ్ళకెదురుగా హాహాకారాలు చేస్తూ మసికావటం చూచి నా మనస్సు కకావికలు అయినది. ఇక అక్కడ ఉండలేకపోయాను. ఎన్నో మైళ్ళు కాలినడకన ప్రయాణించి 'ప్రయాగ' వెళ్ళాను. అక్కడ నా మనస్సుకు ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి 100రోజులు ఉపవాసం ఉంటూ దైవార్చన సాగించాను. ప్రతిరోజూ దేవాలయంలో వేయి ప్రదక్షిణలు, అంగప్రదక్షిణలు, ధ్యాన పూజాదులు నిర్వర్తించాను. కొన్ని రోజులయిన తరువాత నా మనస్సు కుదుటపడింది. ఇక కొన్నాళ్లకి అక్కడి నుండి బయలుదేరి దేశాటనం చేస్తూ ఈ రోజుకు నీకు అతిథినయ్యాను. నియమ నిష్ఠలతో నిర్వర్తించిన ధ్యాన పూజాదుల వలన కలిగిన శారీరక శ్రమ వల్ల నేను కొంచం కృశించినట్లున్నాను.

❖

ఆ బాటసారి చెప్పుచున్నదంతా విన్న తరువాత గాధిమునికి ఆశ్చర్యం వేసింది. ఏవేవో ప్రశ్నలు వేసి కీరపట్టణం గురించి ఏవేవో విశేషాలన్నీ విన్నాడు. ఆ రాత్రి వాళ్ళు మాటలు చెప్పుకుంటూ ఉండగా వాళ్ళకు తెలియకుండానే గడచిపోయింది. తెల్లవారిన తరువాత ఉపాహారం తీసుకొని బాటసారి గాధి వద్ద సెలవు తీసుకొని ఎటో వెళ్ళిపోయాడు. అతిథి మర్యాదలతో ఆ బాటసారిని సాగనంపిన తరువాత ఇక గాధి ఆలోచనలో పడ్డాడు.

**గాధి** : అరె! ఎంత ఆశ్చర్యం! ఈ బాటసారి చెప్పిన దానికీ, నేను తటాకంలో అఘమర్షణ మంత్ర పఠనం చేస్తూ భ్రాంతి వశం చేత పొందిన అనుభవ పరంపరలకూ ఎంతో పొంతన కుదురుతోందే! నేను ఏది దర్శనం చేశానో అదంతా ఇతనికి పూసగ్రుచ్చినట్లుగా ఎవరైనా చెప్పారా? ఎవరు చెపుతారు? నేను మరెవ్వరితోనూ చెప్పనే లేదు కదా! ఏది మాయ? ఏది భ్రాంతి? చూస్తుంటే ఈ

ఆశ్రమం, ఇక్కడి మా స్వగ్రామంలోని నా బంధువులు, ఈ బాటసారి... ఇవన్నీ మాయలోనివేనా! లేక, కీర రాజ్యం మాయలోనిదా? నేనెవరిని? ఈ మాయ ఏమిటి? గాధి అనగా నేనేనా? మరెవ్వరన్నానా?

నేను ఆ బంధుజనం మధ్యలో అగ్నిప్రవేశం చేయటం 'మాయలోనిదే' అనటంలో ఏమాత్రం సందేహం లేదు కదా! 'కీర నగరం' అనబడేది ఉన్నదా? లాభం లేదు. ఏది ఏమైనప్పటికీ ఈ సర్వ అనుభవ పరంపరలోని సత్యాసత్యములేమిటో కనిపెట్టవలసిందే. కనిపెట్టేది ఎట్లా! ఆ! ఏమున్నది ఈ బాటసారి 'ఉత్తరం వైపు కీరదేశం' గురించి సూచించాడు కదా!

❖

ప్రయత్నశీలుడు పొందలేనిదంటూ ఏముంటుంది? గాధి జగన్మాయను సంపూర్ణంగా దర్శించాలనే ఉద్దేశంతో తన ఆశ్రమం నుండి బయలుదేరాడు. చాలా రోజులు ప్రయాణించి ముందుగా ఆటవిక శ్వపచులు ఉండే జనారణ్య ప్రాంతం చేరుకున్నాడు. తాను పుట్టి, కటంజుడు అను పేరుతో పెరిగి సంచరించిన ఆ గ్రామంలో తన జ్ఞాపకాలకు సంబంధించిన ఎన్నో చిహ్నాలు చూచాడు. పుట్టి ఎన్నో ఏళ్ళు పెరిగిన ఆ ప్రాంతమంతా ఎంతో సుపరిచితంగా కనిపించింది. అది చూచిన ఆతని మనస్సంతా వైరాగ్యంతో నిండిపోయింది. అక్కడి ఆతని ఇతఃపూర్వపు గృహం గోడలు కూలి ఉన్నాయి. తాను ప్రతిరోజూ పరుండే చాప శిథిలమై ఓ మూల కనిపించింది. ఊరికి చివరిగా ఉన్న ఆ గుడిసెలో భోజన పానములకు ఉపయోగించిన చిప్పలు, బొచ్చెలు, కుండలు అస్తవ్యస్తంగా పడి ఉన్నాయి. ఆ ప్రాంతమంతా బొమికలు పుట్టెలతో నిండి ఉన్నది. అంతా పరిశీలిస్తూ ఆతడు శ్వపచుల గ్రామమంతా చుట్టి వచ్చాడు. అక్కడి వారిలో తనకు పూర్వపరిచయస్థులు కొందరు తారసపడ్డారు. వారిలో తనకు సుపరిచయమైన ఒక వ్యక్తితో వారి భాషలో సంభాషణ ప్రారంభించాడు.

**గాధి** : బాబూ ! నీ పేరు సుబ్బడు కదా!

**ఆ మనిషి** : ఆ! నేనే నయ్యా సుబ్బడు. నాపేరు నీకెలా తెలిసింది?

**గాధి** : అదిగో, ఆ చివర ఊరికి దూరంగా గుడిసె కనిపిస్తోందే! అక్కడ ఎవరుండేవారు?

**ఆ వృద్ధ శ్వపచుడు** : ఓహో! అదా! అక్కడ కటంజుడనే ఒకడు పెళ్ళాంబిడ్డలతో ఉండేవాడు. వాడు మా వాడే. అయితే ఊళ్లో దొంగతనాలు, తిట్టటం, కొట్టటం చేస్తుంటే మా నాయకులు బహిష్కరిస్తే పెళ్లాం బిడ్డలతో సహా వెళ్ళి అక్కడ గుడిసె కట్టుకున్నాడు. చాలాకాలం క్రితం పెళ్లాం బిడ్డలు చచ్చిపోతే వాడు ఏదో దేశానికి వెళ్ళి భిక్షాటనం చేసుకుంటూ రాజు అయ్యాడు. ఆ మధ్య అక్కడేదో గొడవ వచ్చి చచ్చిపోయాడని విన్నాను. ఇక్కడ నుండి వెళ్ళిన తరువాత ఆతను చాలా మంచివాడుగా మారాడట. ఆతని గురించి తమరు ఎందుకు అడుగుచున్నారు? మీరు గాని కీరదేశం వాళ్ళా?

❖

ఈ విధంగా అక్కడి వారి అనేకులతో కటంజుని గురించి సంభాషించాడు. అక్కడి వారికి ఏదో సర్దిచెప్పుచూ అక్కడే ఒక మాసం రోజులు గడిపాడు. తాను ఆటవిక – శ్వపచజాతి సంబంధమైన

భావము చేత పొందిన విశేషాలనే అక్కడివారు కూడా కటంజుని పరంగా చెప్పటం విన్నాడు. అయితే ఆ గాధి యొక్క చిత్తము అప్పటికీ తృప్తి పొందలేదు. అక్కడ ఉన్న అనేక అడవి ప్రదేశాలను గుర్తుపడుతూనే, తనలో ఇట్లు చింతించసాగాడు.

**గాధి (తనలో) :** ఆహా! నేను ఎన్నో ఏనుగులను చంపి, ఆ దంతములను ఈ గోడలలో గ్రుచ్చి మట్టితో తాడించాను. ఈ ఏనుగు దంతములు ఇంకా చెక్కుచెదరలేదు. ఇక్కడ నా భార్యతో, కొడుకులతో సమావేశమై మాంసపు ముక్కలు కాల్చుకు తినటం, సురాపానం చేయటం – అవన్నీ ఇప్పటి సంఘటనలలాగానే ఉన్నాయే! ఎన్నోసార్లు నా భార్యతో కూడి వానరమాంసం తిని, కల్లు తాగి సింహచర్మం పరచుకొని పరుండే వాళ్లం. మాంసం తిని బలిసిన జోడు కుక్కలను ఇక్కడే కట్టేసే వాళ్ళం. అప్పుడు నా చిన్నతనంలో ఇక్కడ అమ్మోరి గుడి దగ్గర ఆడుకుంటూ ఉండేవాళ్ళం. ఇదిగో, ఇక్కడ బండరాయి మీద కూర్చుని జంతువుల రక్తం త్రాగుతూ, పాటలు పాడుకుంటుండే వాళ్ళం కదా! ఈ మూల, పొదల దగ్గిర పిట్టలను పట్టుకోవటానికి వల పన్నే వాళ్ళం. ఆహా! విధాత చేష్టలు ఎంత చిత్రమైనవి! సరే! ఇప్పుడు కీరదేశం వెళ్ళి అక్కడి చమత్కార విషయాలుకూడా చూచి వెళ్తాను.

❖

ఇట్లా అనుకుంటూ, ఇక అక్కడి నుండి కీరదేశంలో ప్రవేశించాడు. తాను గవలమహారాజుగా సంచరించిన అక్కడి ప్రాంతాలు చూస్తూ కీరనగరం ప్రవేశించాడు. అక్కడ ప్రజలతో సంభాషించాడు.

**గాధి** : బాబూ! ఇక్కడ కొంతకాలం క్రితం 'కటంజుడు' అనే ఒక శ్వపచజాతివాడు రాజ్యం ఏలాడట గదా! ఆ విశేషాలు కాస్త చెప్పండి.

**కీరపురవాసి** : ఓ తాపసీ! మీరు విన్నది నిజమే. ఇక్కడి మహారాజు సంతానం లేకుండా మరణించటం చేత, ఇక్కడ 'మంగళహస్తి' అనే పేరు గల ఆచారమును అనుసరించి కటంజుడనే పేరు గల శ్వపచుడు 'గవలరాజు'అనే పేరుతో ఎనిమిదేళ్ళు రాజ్యం ఏలాడు. ఆతడు విదేశీయుడని తెలిసిన తరువాత మేం ప్రజలమంతా ఆతనిని త్యజించాం. అప్పుడాతడు నిప్పులలోకి దూకి ప్రాణాలు విడిచాడు. అదంతా జరిగి ఇప్పటికే ఒక సంవత్సరం అయింది.

❖

గాధి అనేకులతో గవలమహారాజు గురించి అనేక విషయాలు చర్చించగా, అవన్నీ తన జ్ఞప్తిలో అనుభవపేటికలో ఉన్నట్టి విషయాలుగా తెలియవస్తున్నాయి. "సందేహం లేదు ఇక్కడ గవలరాజుగా ఎనిమిదేళ్ళు రాజ్యం ఏలింది నేనే" అని తలచుచూ నగరంలో సంచరించసాగాడు. ఇంతలో ఆ రాజవీధిలో దూరం నుండి ఏదో కోలాహలం వినవచ్చింది. జనం ప్రక్కగా వెళ్ళి నిలబడ్డాడు. ఇప్పటి రాజు విష్ణువు అనే అతను ఆ సమయంలో వాహ్యాళికై గుఱ్ఱాల మీద తన సైనికులతో వెళ్ళటం – అంతా గమనించాడు.

ఏమి ఆశ్చర్యం! ఏమి చమత్కారం! నేనిప్పుడు తటాకంలో నిలుచుని, అఘమర్షణ మంత్రం చదువుచూ, ఒక స్వప్న సదృశంగా కొద్ది నిమిషాలు పరధ్యానంలో ఉండిపోయాను. ఆ కొద్ది

నిమిషాలలో 70 సంవత్సరాల సుదీర్ఘానుభవం పొందటమేమిటి? అప్పటివన్నీ ఇప్పటి నా ఈ జాగ్రత్‌లో ఇక్కడ సరితూగుతూ ప్రాప్తించటమేమిటి? ఇక్కడ నాకు తారసపడినదంతా స్వప్నము వలె అలీకము (భ్రమ) అనునది తథ్యమే కదా! ఈ భ్రమ అంతా ఎక్కడి నుండి ఎట్లా వచ్చి నాకు ప్రాప్తించిందో – నేను గ్రహించలేకపోతున్నాను.

ఆహోఁ! "మనోమోహము" అనే వలలో చిక్కుకుని ఒక పక్షిలాగా నేను ఎంత అలసిపోయాను! ఎన్నెన్ని కష్టాలుపడ్డాను! ఈ నా మనస్సే అనేక వాసనలచే కొట్టబడినదై, తనయొక్క 'బోధ' స్వరూపమును కోల్పోయి ఒక చిన్నపిల్లవాడులాగా నలువైపులా పరుగులుతీసి ఈ మాయనంతా గాంచినదే!... ఎందుకు ఇట్లా జరిగింది?

ఓహో! చక్రధారుడగు విష్ణు భగవానుడు నాకిచ్చిన వరం సఫలం చేయటానికే నాకు ఈ మాయను రుచి చూపించి ఉంటారు. నా కిప్పుడంతా గుర్తుకు వస్తోంది. ఇక నేను నా ఆశ్రమానికి వెళ్ళి అక్కడ ఈ మాయ యొక్క స్థితి గతుల గురించి సమన్వియించుకోటానికి, ఎరుగటానికి ప్రయత్నం చేస్తాను.

❖

గాధి ఇట్లు నిర్ణయించుకుని, తాను నివసిస్తూ ఉండే గిరి ప్రాంత సమీపంలోని ఆశ్రమం చేరాడు. ఇక ఆ రోజు నుండీ కొంచెం నీళ్ళుమాత్రమే పుచ్చుకుంటూ భక్తి, ఏకాగ్రతలతో విష్ణుప్రీతి కొరకు తపస్సు ప్రారంభించాడు. ఒక సంవత్సరకాలం గడిచింది. ప్రసన్నమూర్తి, శ్యామలాకారుడు, పుండరీకాక్షుడు, ఆశ్రితజనవత్సలుడు అగు విష్ణుభగవానుడు ఒక శుభదినం గాధికి ప్రత్యక్షమై దర్శనమిచ్చాడు. ఆ ముని వెంటనే స్వామి పాదాలపై బడి, మ్రొక్కి, అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి, పూలు చల్లి, స్తోత్రం చేసి ఆనందపరిచాడు.

**శ్రీమన్నారాయణుడు** : పుత్రా! మరల ఏమి కోరి నా దర్శనం కొరకు ధ్యానం చేస్తున్నావయ్యా? నీవు నా 'మహామాయ'ను చూచావు కదా! నీవు కోరినట్లే మాయను చూపాను. మరల ఏమి విశేషం?

**గాధి** : హే భగవాన్! మీ అనుగ్రహవశం చేతనే కాబోలు, ఈ భూమి నంతటినీ ప్రకాశింపజేస్తున్న మాయ యొక్క మహిమను సందర్శించాను. అంతా అయిన తరువాత ఇప్పుడు అనేక సందేహాలు నన్ను పుంఖానుపుంఖాలుగా చుట్టుముట్టుచున్నాయి. ప్రభూ! నేను తటాకంలో నిలబడి అఘమర్షణ మంత్రం జపిస్తూ కొద్దినిమిషాలు కాబోలు, పరధ్యానంలో మునిగాను. అంతే! నా మనస్సు నందే 60 సంవత్సరముల సుదీర్ఘానుభవం ఆ కొద్దినిమిషాలలో ఒక స్వప్నంలోలాగా పొందాను. ఇంతలో యథాస్థానంలో జాగృత్ పొంది నిజాశ్రమం చేరాను.

ఇంతవరకూ బాగానే ఉన్నది. అయితే ఇప్పుడొక బహుచమత్కారమైన విషయం చూచాను. అదేమిటంటే – నేను ఏదేదైతే మనస్సులో సందర్శించానో – అదంతా ఈ జాగ్రత్‌లో ఏర్పడియే ఉంది. మనస్సులో ఏదేదో పొందటమేమిటి?... అదంతా 'జాగ్రత్'లో ఏర్పడి ఉండటమేమిటి? నాకు అసలు ఏమీ అర్థమే కావటం లేదు. 'కటంజుడు' అను ఆటవికునిగా, కీరదేశాన్ని ఏలిన గవళమహారాజుగా

నేను గాంచినదంతా వాసనల చేత నా మనస్సులోనే పొంది ఉన్నాను కదా? భ్రమ చేత పొందిన సుదీర్ఘ-అల్పకాలిక అనుభవముల ఉత్పత్తి-వినాశనములు, ఆ ఉపాధి రాక పోకలు, తదితరములు – మనస్సుతో ఏర్పడినవే కదా! మనస్సులో ఏర్పడినవి మనస్సులోనే ఉండాలి. మరి, బయట ఎందుకు వాస్తవమై కనిపిస్తున్నాయి? అట్లా బయట (జాగ్రత్‌లో) కనిపించటానికి కారణమెవ్వరు? స్వప్నంలో లాగా తారసపడిన "ఆ వ్యక్తులు, ఆ ప్రదేశములు" ఇవన్నీ బయటకు ఎవరు తెచ్చారు? ఆ వ్యక్తులంతా ఎవరు? వారికి, నాకు, నా మనస్సుకు ఏమిటి సంబంధం? ఎవరు ఎవరి గురించి ఎందుకు ఎచ్చట స్వప్నంలోలాగా గాంచుచున్నారు? ఆ కీరదేశ జనులకు, ఆటవిక శ్వపచ జాతి జనులకు నేను ఏర్పడియే ఉన్నాను.... అదెట్లా ఒనగూడింది? ఇవన్నీ మీ నుండి తెలుసుకోవాలను కున్నాను. అందుకే మీ సందర్శనం కొరకు నిష్ఠతో ధ్యానించాను. మీరు జగద్గురువులు. మాయకు ఆవలుండి, మాయను రచిస్తున్న పరాత్పర స్వరూపులు. మీరుగాక, నాకు ఇంకెవరు దిక్కు? అందుచేత నేను చూచినదంతా ఏమిటో సవిస్తరంగా చెప్పమని ప్రార్థిస్తున్నాను.

**శ్రీమన్నారాయణుడు** : కుమారా! నీవు చూచినదీ, చూచుచున్నదీ – అంతా ఆత్మయొక్క స్వరూపమే. అయితే, "మాయను చూడాలి" అనే నీ యొక్క వాసనాబీజము నుండే ఈ జగద్రూపభ్రమ అంతా ఏర్పడి, అనుభవమైనది. ఆ దర్శనం చేస్తున్న సమయంలో తత్త్వదృష్టి కొరవడుట చేత నీ చిత్తము దృశ్యముతో తాదాత్మ్యభావన పొందటం జరుగుతోంది. ఈ విషయం మొట్టమొదట గుర్తించు. తదాత్మ్య భావము చెందకపోయావా... నీకీ వర్తమాన దృశ్యమూ లేదు, కీరదేశపు దృశ్యమూ లేదు. ఉభయములు ఆత్మస్వరూపములే!

ఇక, అక్కడి జనులంతా ఎవరంటావా? ...అన్నివైపులా జలంతో నిండిన మహాసముద్రంలో ఒక కెరటం మరొక కెరటమును తాకుతున్నట్లు, ఒక ద్రష్టకు మరొక ద్రష్ట తారసపడుచున్నాడు. ఒక చమత్కారమైన ప్రశ్న. ఈ ఎదురుగా కనబడే ఆకాశం, పర్వతములు, భూమి, దిక్కులు – ఇవన్నీ నీకు ఎక్కడో బయటగా ఉన్నాయని అనుకుంటున్నావా? ...కానే కాదు.

ఒక విత్తనంలో "మహావృక్షం, ఆకులు, కాండము, కాయలు, పూలు, కొమ్మలు, వేళ్ళు.... వాటి వాటి భవిష్యత్ కార్యక్రమములు" అంతర్లీనంగా ఉన్నాయి కదా? అట్లాగే, దేశ కాల వశంచేత చూడబడుచున్న విశేష పరంపరలన్నీ చిత్తములోనే ఉండి ఉంటున్నాయి. విత్తులోంచి ఏదో సమయంలో మహావృక్షపు వివిధ భాగాలన్నీ వెలువడుచున్నట్లు – సర్వ అనుభవములు చిత్తము నుండే బయల్వెడలి ప్రకటితమగుచున్నాయి. వాస్తవానికి 'దృశ్యము' అనబడే వ్యవహారం అంతా మనస్సులోనే ఉన్నది గాని, బయట ఏనాడూ లేదు. విత్తులో ఉన్నదే బయట రూపం దిద్దుకుంటున్నట్లుగానే... మనస్సులో ఉన్నదే ఎదురుగా దర్శించబడటం, అనుభవించబడటం జరుగుతోంది.

ఒక కుమ్మరి ఉన్నాడు. ఆతడు రకరకములైన చిత్రవిచిత్ర ఆకారములలో కుండలు మొదలైన వాటిగా మట్టిని మలచుచున్నాడు. ఆతడు తాను చేస్తున్న ఆకారములన్నీ తన మనస్సులోనే కలిగిఉన్నాడు కదా! ఆ విధంగానే దర్శన స్పర్శనాది క్రియలు, రకరకాలైన చింతనలు, భూత-వర్తమాన-భవిష్యత్

కాలములు, ఈ ఇంద్రియములకు తారసపడుచున్న సూర్య చంద్ర నక్షత్రాది పదార్థజాలములు – ఇవన్నీ మనస్సులో ఉండి, మనస్సుచే నిర్మించబడి, మనస్సుచే పొందబడుచున్నవే! మనస్సే వాటిని నిర్మించి, మరల మనస్సే వాటిని ఉపసంహరిస్తోంది. మనస్సు చేసే నిర్మాణచమత్కారములేమిటో దృష్టాంతంగా నీకు చెప్పాలంటే "పిల్లలు – వారి ఆటలు, వృద్ధులు – వారి భ్రమలు, జనులు – వారి మద ఆవేదన అనురాగ రోగాది సందర్భములలో విషయములను పొందే విధానం" ...ఇవి గమనిస్తుంటే నీకే అంతా తెలియగలదు. ఒకడు తన స్వప్నంలో ఏవేవో ప్రదేశాలను, వ్యక్తులను చూస్తున్నాడనుకో... ఆ ప్రదేశాలు, వ్యక్తులు ఆ స్వప్నద్రష్టయొక్క భావపరంపరలలోని అంతర్లీన విభాగములే కదా! ఒకడు ఏదో భ్రాంతిలో ఉన్నప్పుడు ఎదురుగా ఉన్న వస్తువులను గమనించడు. మదముచే నిండిన మనస్సుతో ఒకడు ఒక సుందర స్త్రీని చూస్తున్నప్పుడు "ఇది రక్త–మాంస–బొమిక లచే తయారు కాబడిన భౌతిక పదార్థమే" అనే విషయం స్ఫురించదు. ఒక గొప్ప చెట్టు యొక్క కాయలు, పూలు, ఆకులు కనబడతాయిగాని, వేళ్ళు కనబడనట్లు, సత్పదార్థమైనట్టి బ్రహ్మము అవలంబిస్తున్న మనస్సు నందే ఈ లక్షలాది సంఘటనల పరంపరలన్నీ నిక్షిప్తమై ఉన్నాయి.

ఒక చెట్టును వ్రేళ్ళతో సహా పెకలించి పడేశామనుకో... ఇక ఆ చెట్టుకు క్రొత్త ఆకులు కాయవు కదా! వాసనల నుండి విముక్తుడైన జీవునకు ఇక జన్మకర్మలు ఉండవు. వాసనల చేతనే మనస్సు తయారు చేయబడింది.

అనంత జగజ్జాలములు ఇమిడి ఉన్న అట్టి "వాసనామయ ప్రపంచము" నందే నీకు అనుభవమైన శ్వపచజాతి జీవుని భావము ప్రకటితమైనది. ఇందులో ఆశ్చర్యమేమున్నదయ్యా? వాసనల ప్రతిభాస వలననే రకరకాల మనోవ్యధలతోనూ, సంరంభములతోనూ కూడిన ఆటవికభావములన్నీ నీవు పొందావు. అంతే కాదు... అట్టి 'వాసనామయ ప్రపంచం' యొక్క చమత్కారం చేతనే "ఆ బాటసారి రావటం, ఆతనితో భుజించటం, సంభాషించటం, ఆయా విశేషాలు విని ఆశ్చర్యపడటం, మాయను తెలుసుకోవాలనుకోవటం, నా కొరకై ధ్యానం చేయటం" – మొదలైనవన్నీ కూడా పొందడం జరిగింది.

**గాధి** : స్వామీ! స్వప్న సదృశంగా కటంజుడు అనే పాత్రధారణచేస్తూ... ఏవేవో మనస్సులో దర్శించటం – భౌతికంగా నా ఆశ్రమానికి వచ్చిన అతిథి – బాటసారితో సంభాషణ... ఈ రెండూ ఒక్కలాంటివే నంటారా?

**శ్రీమన్నారాయణుడు** : అవును. ఆ ఆటవికజనం ఏ విధంగా భ్రమ మాత్రమే అయి ఉన్నదో, ఆ అతిథితో సంభాషణ కూడా ఆ విధంగానే భావనల, వాసనల ప్రకటీకరణమే అయిఉన్నది. ఇంకా విను. "ఇప్పుడు లేచి శ్వపచుల గ్రామం, కీరదేశం వెళ్ళుచున్నాను... ఇక్కడి ఈ జనులతో సంభాషించు చున్నాను... వ్యక్తులను గుర్తిస్తున్నాను... ఆయా సంఘటనలతో సరిచూచుచున్నాను..." మొదలైనవన్నీ కూడా భ్రమలోని అంతర్లీనభాగమే సుమా! "ఇది కటంజుని పురాతన గృహం..." అని అక్కడి వారు చెప్పటం, "ఔను... ఇవన్నీ నేను ఒకప్పుడు పొందియున్నవే" – అని తలపంకించటం కూడా భ్రమ చేతనే జరుగుతోంది. "ఇదిగో... ఇప్పుడు కీరనగరం వచ్చాను... వీరు గవలమహారాజు

అనబడియున్న నా గురించే చెప్పుచున్నారు... నేను వింటున్నాను... ఎంత ఆశ్చర్యం... వీళ్ళు నాకు ఇంతఃపూర్వం తెలిసినవారే" – అని నీవు భావిస్తున్నదంతా మనస్సు యొక్క వికారములే గాని, మరింకేమి కాదు. ఓ మునీ! ఇన్ని మాటలెందుకు? నీవు దేనిని 'ఇది నిజమే' అని అనుకుంటు న్నావో – ఇదంతా మనస్సు యొక్క కల్పన అని, మోహము యొక్క అభ్యున్నతి అని గ్రహించు.

ఈ మనస్సు వాసనతో కూడుకొని ఉన్నప్పుడు ఇది తన అంతరమున ఏది దర్శించాలని అనుకొంటే అద్దానినే దర్శించగలదు. మామూలుగా అసాధ్యమైన విషయాలు కూడా ఒకడు తన స్వప్నంలో దర్శిస్తున్నాడు కదా!

కనుక గాధీ! మనోమోహమే జగత్తుకు బీజం. ఆ ఆటవికులు, ఆ కీరదేశీయులు, వారి ఆచార నమ్మకములు, వారి ప్రాయశ్చిత్త బుద్ధులు, ఆ రాజధాని, అక్కడి జనుల దేహత్యాగములు... వీటినన్నిటినీ నీవు మోహము చేతనే పొందావు. జీవుడు మోహము చేతనే ఈ శరీరమును, 'వీటి వలన – వీటి ద్వారా' ఏర్పడే సంబంధ బాంధవ్యములనూ పొందుచున్నాడు.

**శ్రీగాధి** : పరంధామా! ఇప్పుడు నేను పొందిన కీరరాజ్యాది అనుభవములు భౌతికమా? మానసికమా! ఆ అనుభవములు నన్ను ఎలా సమీపించాయి?

**శ్రీమన్నారాయణుడు** : సుదీర్ఘప్రయాణం చేస్తున్న ఒక బాటసారిలాగా ఈ నీ వర్తమాన శరీరాన్ని ఆశ్రయించి ఉన్నావు. తపోధ్యానాదులచే డస్సి ఉన్న నీవు నిజ వాసనలచే ఆ 'అనుభవములు' అను చోటికి వెళ్ళావు. ఒక అద్దములోని దృశ్యము మరొక అద్దంలో ప్రతిబింబించినట్లు మరొక ద్రష్టత్వము నీయొక్క ద్రష్టత్వములో ప్రతిబింబించింది. ...కానీ అవన్నీ సత్యమైనవే కావు.

స్వప్నంలో ఏదో ఆకస్మికంగా చూస్తూ ఆ స్వప్నద్రష్ట తన్మయుడౌతాడు చూచావా? ఆ రీతిగా నీవు ఆటవికత్వము, రాచరికత్వము మొదలైనవన్నీ పొందావు. నీయందలి ద్రష్టత్వపు అంతరంగ వాసనలే నిన్ను అందుకు పురికొల్పాయి. ఏది ఏమైనా వాటిలో ఏ ఒక్కటీ నీవు కావు. నీవు చూచిన కీర నగరం మాయయే. ఒక పిచ్చివాని వలె మనస్సునందే అంతా పొందుచూ నాలుగు వైపులా పరిభ్రమించి వచ్చావు.

కాబట్టి, ఇకలే! లేచి, శాంతుడవై ఉండు. నిజాశ్రమ ధర్మమునకు ఉచితమైనట్టి స్వాధ్యయనము అగ్ని హోత్రము మొదలైన కార్యములను యథారీతిగా ఆచరించు. ఎందుకంటే ఇహలోకంలో కర్మశూన్యులైన మనుజులు శ్రేయమును పొందజాలరు.

❖

సర్వేశ్వరుడగు నారాయణుడు ఇట్లు ఉపదేశించి, చిరుమోముతో క్షణంలో అంతర్ధానమైనారు.

❖❖❖

# 4. సుజ్ఞానప్రాప్తి

విష్ణుభగవానుడు అంతర్ధానమైన తరువాత గాధి తనకు కలిగిన 'సమ్మోహనము' గురించి మరల విశ్లేషించటం ప్రారంభించాడు.

**గాధి (తనలో) :** ఇదేమిటి? "అంతా మోహము చేతనే గాంచినావు" – అని నారాయణుడు వ్యాఖ్యా నిస్తున్నాడు? అసలు అతిథి, ఈ భూమండపము – ఇవన్నీ ఉన్నాయా? లేవా?

❖

అతడు మరికొన్ని చిన్న – పెద్ద సందేహాలు పొందాడే గాని, సంశయములు తొలగనే లేదు. ఇంకా ఆత్మసాక్షాత్కారం పొందనే లేదు. ఇక అక్కడి నుండి లేచి ఆకాశంలోని మేఘంలాగా అటూ ఇటూ సంచరించసాగాడు. మరల ఒకసారి ఆటవిక గ్రామం, కీరదేశం వెళ్ళి తిరిగి నిజాశ్రమమైన గిరి ప్రాంతానికి వచ్చాడు. ఆశ్రమం చేరిన రోజు నుండి మరల విష్ణుభగవానుని ఆరాధించసాగాడు. అతి స్వల్పకాలంలో జనార్ధనుడు మరల ప్రత్యక్షమైనారు. ఎవరికి ఆ విష్ణుదేవుడు ఒకసారి దర్శనమిస్తారో, అట్టివారికి ఆతడు బంధువు అవుతాడు. స్వామి చిరునవ్వుతో గాధిని సమీపించి ఆతని ప్రక్కనే చేరి కూర్చున్నారు.

**శ్రీమన్నారాయణుడు** : ఏమిటయ్యా? మరల నా దర్శనం కోరుకున్నావు? మళ్ళీ ఏమైంది?

**గాధి** : స్వామీ! సుస్వాగతం! మీకు శ్రమనుకలిగించి నందుకు క్షమించండి. ఏం చేయమంటారు మరి? ఈ మాయ యొక్క చమత్కారం నన్ను అత్యంత ఆశ్చర్యపరుస్తోంది.

హే శ్రీమన్నారాయణా! మీ దర్శనమైన తరువాత నేను కీరదేశం తదితర స్వప్న భావిత ప్రదేశములలో ఒక ఆరు నెలల పాటు తిరిగి వచ్చాను. క్రితంసారి వెళ్ళినప్పటి సమాచారం ఈసారి సమాచారంలో ఏమీ భేదం లేదు. ప్రభూ! "భూమండల ప్రదేశమంతా మాయ చేతనే చూచావు" అని మీరు అన్నారు కదా? మాయావశం చేత నేను గాంచినది "మరొకచోట – మరొక సమయంలో" ఎట్లు ఏర్పడి ఉన్నాయో నాకు బోధ పడుటలేదు.

ఇక రెండవ ప్రశ్న. నేను చూచిన మాయ నాకు సంబంధించినది మాత్రమే కదా! మరి కొందరు జనులు కూడా నేను చూచిన మాయలో భాగస్వాములై ఇప్పటికీ భౌతిక ప్రపంచంలో కొనసాగుతూ ఉన్నారే? ఆ ఆటవికుని వృత్తాంతమంతా ఈ ఇంద్రియములకు లభిస్తూ ఉండటం జరుగుతోందే? మీరు నాకు "ఇది మాయయే" – అని చెప్పారు. సరే, బాగానే ఉన్నది. మాయచే అంతరంగమున చూడబడినవి జగత్తులోనికి ఎలా "ఇతర జీవుల స్వతంత్ర రూపాలు"గా ఉన్నాయో నేను గ్రహించలేకపోతున్నాను. 1. అది మాయయే, 2. అక్కడి జనులు పూర్వాపరాలు ...ఈ రెండు విషయాలు సమన్వయ మగుటయేలేదు. పైగా అక్కడ అంతా చూచిన తరువాత నా మోహము మరింత అధికమైనది.

అయితే, సత్యస్వరూపులగు మీనోటివెంట 'అయథార్థం' అయినదేదీ రాదని నేను ఎఱుగుదును. మహాత్ముల వచనములు మోహమును తొలగిస్తాయేగాని, వృద్ధిచేయవు. అయితే నాలో తెలియరాని

అజ్ఞానం పేరుకొని ఉన్నది. మీ కృపచేత మాత్రమే అది తొలగగలదు. అందుకే మీ ముందు మరల ప్రస్తావిస్తున్నాను.

కీరరాజ్యం మొదలైనవన్నీ అక్కడ ఏర్పడి ఉండగా, "అదంతా భ్రమయే నయ్యా!" – అని చెప్పుచున్నారు. ఎందుచేత?

**శ్రీమన్నారాయణుడు** : ఓహో! అదా? ఆ విషయం కొంత చూచాయగా చెప్పే ఉన్నాను. మరికొంత వివరంగా చెపుతాను విను.

**కీరదేశవాసులు –** భూతమండలమున ఉన్న కీరదేశ వాసుల అందరి చిత్తము నందు కూడా నీ చిత్తమునందు లాగానే – కటంజుని ఆటవిక వృత్తాంతం అంతా కాకతాళీయన్యాయముచే ప్రతి భాసించటం జరుగుతోంది. అయితే ... ఒక వ్యక్తి నందు, లేదా ఒక సమూహమునందు... ఏదైతే మిథ్యారూపంగా ప్రతిభాసిస్తోందో – అట్టి ప్రతిభాస మొదలంట తొలగే వరకు అట్లాగే ప్రతిభాసిస్తుంది. జ్ఞానం వెల్లివిరిసినప్పుడు అదంతా మటుమాయమౌతుంది.

❖

ఆ ఆటవికశ్వపచుల కీకారణ్యగ్రామంలో ఒకానొక శ్వపచజాతివాడు ఒక గుడిసె నిర్మించు కున్నాడు. అక్కడికి ఇప్పుడు వెళ్ళిన నీవు, "ఈ గుడిసె నేను నిర్మించుకున్నదే" అని అనుకుంటున్నావు. "ఈ గుడిసె కటంజునిది" – అని అక్కడివారు తలచుచున్నారు. ఒక తాటిచెట్టుపై కొన్ని కాకులు వ్రాలినప్పుడు దూరంగా ఉన్న ఏదో వస్తువు ఆ చోట నుండి "తినే వస్తువు" లాగా ఆ కాకులన్నిటికీ అనిపించవచ్చు. వాటన్నిటిలోని ఆకలి, దప్పికల సంస్కారం చేత అది అట్లా అనిపిస్తోంది. అంతమాత్రం చేత ఆ చూడబడేది ఆహారపదార్థమే అవవలసిన పని లేదు.

అనేకులు ఒక చోట చేరి కల్లు సేవించారనుకో... వారందరికి పరిసరాలన్నీ తేలియాడుచున్నట్లు కనిపించవచ్చు గాక. అంత మాత్రంచేత అక్కడివన్నీ ఎందులోనో తేలియాడుచున్నట్లా? అట్లే ఒక్కొక్కసారి అనేకులు ఈ స్వప్నమాత్ర జగత్తును ఒకే భ్రాంతితో గాంచుచున్నారు. ఒకడు "నీవు నా తండ్రివి" అను భ్రాంతిని పొందుచుంటే, "అవును, నీవు నా ప్రియమైన కుమారుడివి" అని మరొకరు గాంచు చున్నారు. అంతమాత్రం చేత తండ్రి–కొడుకుల సంబంధంలో భ్రాంతి యొక్క విభాగము, పాత్ర లేదా? ఉన్నది. గడ్డి మొలచిన ప్రాంతంలో అనేక లేళ్ళు విశ్రమిస్తున్నట్లు, ఈ జీవులు ఒకే విధమైన భ్రాంతి విశేషంలో పాల్గొనుచున్నారు. ఒకే ఆటలో అనేకమంది బాలురు క్రీడించుచున్నారు చూచావా? ఒకే యుద్ధంలో అనేకమంది సైనికులు కలిసి "వీరు మన శత్రువులు... మేమంతా ఈ దేశం వాళ్ళం" – అని తలచుచు వధించటం, బంధించటం, జయించటం, పారిపోవటం, ఓడిపోవటం సామూహికంగా పొందుతూ ఉంటారే! ఓ గాధీ! ఈ సంసార జీవులంతా ఆ విధంగా పరస్పరం స్వప్నానుభవం వంటిది పొందుచున్నారు. ఒక కాలదృష్టితో మరొక కాలగమనాన్ని అల్పంగానో, అధికంగానో భావించటంకూడా మాయలోని విభాగమే. అఖండ పరమాత్మరూపమగు 'కాలము' అనబడునది ఆత్మ యందే స్థితి కలిగియున్నది. అయినప్పటికీ కాలము దేనికీ ప్రతిబంధకము

కాదు, ఉత్పాదకమూ కాదు... కాలస్వరూపుడగు భగవంతునికి రూపమంటూ ఏదీ లేనే లేదు. ఆతడు అఖండుడు. ఆతనినే "జన్మ, కర్మ – రహితమగు బ్రహ్మము" అని కూడా పెద్దలు చెప్పుచున్నారు.

**గాధి** : కాలము యొక్క రూపము ఈ సంవత్సర, యుగ కల్పములే కదా!

**శ్రీమన్నారాయణుడు** : నిజమే. అయితే కాలము సూర్య – చంద్ర గమనములచే కల్పితమైనదే. ఒక భావస్థిరత్వము అంగీకరించిన తరువాత కాలము పొందబడుచున్నది. ఉత్పాతరూపమగు కాలముచేత తదితర సర్వ పదార్థములు పరికల్పితమగుచున్నాయి.

❖

"భ్రాంతి చిత్తులగు జీవులు ఒకే విధమైన ప్రతిభాస (లేక) భ్రమచే ఒకే విధమైన సంభ్రమము పొందుతూ ఉంటారు" – అనునది ఇక్కడ సిద్ధాంతం. ఈ సిద్ధాంతమును అనుసరించే కీరదేశవాసులు "ఆటవికుడు రాజగుట" – అనుదానిని గాంచినారు. నీవుకూడా ఆ రీతిగానే అదంతా పొందావు. అందుకే అదంతా 'మాయయే' అని చెప్పాను.

సరే! అయినదేమో అయింది. ఇప్పుడు చిత్తనైర్మల్యము నీవు సంపాదించాలి. మనస్సును అధిగమించి స్వబుద్ధిచే ఆత్మవిచారణ చేయి. అందుకు నీ ఆశ్రమవాసానికి సంబంధించిన తపోధ్యానములను నిర్వర్తిస్తూ ఉండు. మరి ఇక నాకు సెలవా?

❖

ఇట్లు పలికి విష్ణు భగవానుడు అంతర్ధానమైనారు. గాధి మాత్రం మోహముతో కూడిన మనోవ్యాధి నుండి బయటకు రాలేకపోయాడు. ఇంకా అధికమైన స్థూలబుద్ధికలవాడై ఏవేవో అనుమానాలతో సతమతమవసాగాడు. కొద్దిరోజులు గడచిన తరువాత మరల విష్ణు భగవానుని ఆరాధించటం ప్రారంభించాడు. మరల విష్ణుదేవుడు ఆతని యందు ప్రత్యక్షమైనారు. ఆతడు ప్రణామం చేసి, మనోవాక్కాయములచే పూజించి మరల ఇట్లు పలుకసాగాడు.

**గాధి** : దేవాదిదేవా! మీరు 'అదంతా మోహమే' అని చెప్పివెళ్ళారు, బాగానే ఉంది. కానీ, ఆ ఆటవిక జీవితం, చావు, పుట్టుక మొదలైన అనేక అనర్థములతో కూడిన ఆ సాంసారిక వ్యవహారమంతా తలచుకుంటేనే ఇప్పటికీ ఎంతో భయం వేస్తోంది. నా చిత్తము విషాదముతో విమోహితమౌతోంది. ఇప్పుడు ఈ మోహబుద్ధి తొలిగేది ఎట్లా? హే భగవాన్! భక్త సులభుడా! నాలోని మోహం నివృత్తి చేయమని చెప్పి, మీరు వెళ్ళిపోతే చాలదు. నివృత్తి అయ్యే వరకు మీరు ఇక్కడే ఉండండి. నన్ను ఏదైనా పవిత్ర కార్యక్రమము నందు నియమించండి. నన్ను కాపాడండి.

**శ్రీమన్నారాయణుడు** : (పకపకానవ్వుచూ) శంభరాశురుని ఆడంబరంలాగా ఈ జగత్తంతా మాయా మయమైనదే! అట్టి ఆశ్చర్యకరమైన 'కల్పన' అంతా ఆత్మతత్త్వవిస్మరణ చేతనే ఉద్భవించింది. ఆటవిక గ్రామం, ఆ కీరదేశ రాజరికం, తదితర వృత్తాంతములు అజ్ఞానవశంచేత తప్పక సంభవమే. స్వప్నంలో ముందుగా అనుకోని ఏవేవో విషయాలు, ఎప్పుడో చనిపోయిన వ్యక్తులు స్వప్నద్రష్టకు సత్యమువలే అనుభవమగుచున్నాయి కదా?

భూత మండలములోని కీరదేశవాసులు కూడా నీలాగానే భ్రమను పొందుచున్నారు. నీవు వారి దగ్గిరకు పోయి సంభాషించినప్పుడు వారు తమ భ్రమలనే వల్లించిచెప్పారు. అవి విని నీవు నీ భ్రమచే "ఇట్లా ఎట్లా అయినది?" అని వేదన పొందుచున్నావు. నీ సుస్పష్టత కొరకు నీ అనుభవములోని మరికొన్ని విశేషాలు చెప్పుతాను. ఇవి వింటే నీ చింతలు తొలగుతాయి.

❖

కటంజుడు అను ఒకానొక జీవుడు ఇప్పుడు నీచే గాంచబడిన శరీరము, గ్రామము, గృహము కలిగి పూర్వము భూత మండలమున (In the zone of matter) జనించి ఉన్నాడు. ఆతడు అదే విధంగా తన కుటుంబసభ్యులను పోగొట్టుకుని ఆ తరువాత కీర రాజ్యానికి ప్రభువు అయినాడు. ఆ తరువాత జనులకు తన జన్మరహస్యం తెలియుటచే అగ్ని ప్రవేశం చేశాడు.

నీవు తటాకంలో ప్రవేశించి అఘమర్షణ మంత్రం జపిస్తూ ఉండగా, నా సంకల్పవశం చేత ఆ కటంజుని (ఆటవికుని) వృత్తాంతము (లేక) అనుభవమంతా నీ అంతఃకరణంలో ప్రకాశించింది. అట్లా ప్రకాశిస్తున్న దానినంతా పొందుతూ, "నేను కటంజుడను" అని నీవు అందలి అనుభవ పరంపరలన్నీ పొందావు.

ఈ చిత్తము బహుమచత్కారమైనది. అది ఒకప్పుడు తాను చూచినది విన్నది క్షణంలో త్యజిస్తుంది. మరొకప్పుడు, సుదీర్ఘ కాలం కలిగి ఉంటుంది. చూస్తూనే, చూడకుండా ఉండిపోతుంది. అసలు ఏ మాత్రం ఎన్నడూ చూడనివి పొందుతూ పోతుంది. ఒకడు స్వప్నంలోను, మనోరాజ్యంలోను, సన్నిపాత సమయము నందు రకరకాలైన అనేక దృశ్యవ్యవహారములను గాంచటం తెలుసు కదా! ఆ విధంగానే జాగ్రత్తులో కూడా స్వయముగా భ్రమను వీక్షించగలదు.

ఇందుకు దృష్టాంతాలు అనేకం చెప్పుకోవచ్చు. త్రికాలజ్ఞుడైన ఒక యోగి దృష్టి యందు భవిష్యత్ కాలము నందలి సమస్తమూ భూతకాలస్థము వలే తెలియుచున్నది కదా! అట్లాగే గడచి పోయిన కటంజుని చరిత్ర వర్తమాన కాలమైన నీ బుద్ధియందు నా సంకల్పముచే కనిపింపజేయటం జరిగింది. అయితే ఇక్కడొక చిత్రం! అప్పటి ఆయా అనుభవాలలో నిమగ్నమైనది నీవేగాని, అట్లు నిమగ్నమవటానికి నేను చేసింది ఏమీ లేదు. నేనల్లా, నీ మనోదర్పణంలో కొన్ని అనుభవ పరంపరలను ప్రతిబింబింప జేసాను. అంతేᑕ!

"ఈ శరీరాదులు నేను... ఈ కుంటుంబము, ఇల్లు, వాకిలి నావి... వీరు నా వారు... ఇది నా ఊరు... ఇవి నా కులగోత్రములు" – అనునట్టి అనేక భ్రమలందు అజ్ఞాని నిమగ్నుడగుచున్నాడు. వాటిని మహత్తరమైనవిగా గాంచుచు తాదాత్మ్యము చెందుచున్నాడు. కానీ జ్ఞాని అవే సంఘటనలను పొందుచున్నప్పటికీ, గాంచుచున్నప్పటికీ, వాటియందు ఏమాత్రం నిమగ్నుడు అగుటలేదు. ఎవ్వడైతే "సమస్తమూ ఆత్మయే" – అను సర్వాఽహమ్ భావనను కలిగి ఉంటాడో ఆతడు వాటియందు ఏ మాత్రం నిమగ్నుడు కాడు. అందుచేత, ఆతడు ఈ పదార్థవిభాగముచే కలుగు అనర్థభావమును అతడు పొందకుండానే ఉంటాడు. పరిచ్ఛిన్న పదార్థములందు కలుగుచుండే అహంభావనయే

బంధకారణమగుచున్నది. అంతకుమించి ఈ జీవునకు వేరుగా బంధమెక్కడిది? ఈ జీవుడు వాస్తవానికి అమృతతుల్యమగు శుద్ధ చైతన్యస్వరూపమే కదా! ఎండు సొరకాయ బుఱ్ఱ నీటిలో పడినా నీటిలో మునుగదు చూచావా? సత్యాసత్యవివేకి అయినట్టి జ్ఞాని భ్రమలలో, సుఖ దుఃఖాలలో మునుగడు.

నీవు ఇంతకు ముందు వాసనాజాలగ్రస్థుడవు, విచేతసుడవు (one who adopted ignorance and illusion) అయ్యావు. అందుచేతనే నీ అంతరంగము నందు ఆ కటంజుని వృత్తాంతమంతా దోషబుద్ధిచే పొడమినది. అనగా 'అజ్ఞానము' అనే మనోవ్యాధి నీయందు ప్రవర్తించటం జరిగింది. అజ్ఞానము తొలగకపోవుట చేత ఇంకా నీ ఆత్మస్వరూపమును నీవు దర్శించుటలేదు. వర్షం పడుతుంటే ప్రయత్నం చేసి ఇంటిలోకి పరుగులు తీసేవాడే జడివాన నుండి తప్పించుకోగలడు. నిలబడి వర్షం పడే చోటే ఉండేవాడు తడవక ఏంచేస్తాడు? పూర్ణజ్ఞానము లేకపోవుట చేత నీవు చిత్తభ్రమను తొలగించుకో లేకపోయావు. అందుచేతనే నీ చిత్తంలో ఏదేది భాసిస్తుందో – అద్దాని యందలి అభిమాన కారణంగా వెంటనే దానికి వశీభూతుడవగుచున్నావు.

మాయ నాలుగువైపులా విస్తరించి ఉన్నది. అట్టి ఈ మాయ యొక్క నాభిస్థానము (It's Root) చిత్తము నందు ఉన్నది. అట్టి చిత్తము లేక మనస్సును ఎదుర్కొని పోరాడాలి. మనస్సును ఆత్మ యందు లయింప జేసి, దానిని రహితం చేయాలి. అట్టి వారిని మాయాచక్రం ఇక ఏమీ చేయలేదు, ఏమాత్రం బాధించలేదు. కనుక ఓ గాధీ! నీవిక లెమ్ము. మనోనిరోధకమగు తపస్సును ఇక్కడే పది సంవత్సరాలు ఆచరించు. అంతేగాని నిష్ఫలమైన వేదన, అభిలాషలతో కాలం వృథా చేసుకోకు. నిర్మలహృదయం సంపాదించావా... అనంత – అఖండ జ్ఞానం పొందగలవు.

ఇట్లు పలికి విష్ణుభగవానుడు అంతర్ధానమైనాడు.

❖

భగవానుడు చెప్పినదంతా ఆ గాధి మరల మరల విచారణ చేశాడు. ఇతఃపూర్వపు కటంజుని భావపరంపరలను పరిశీలించి విచారణ చేశాడు. భావప్రదర్శనరూపమైనట్టి విచిత్రమైన దైవగతి – జగత్‌గతిని విశ్లేషించి చూచాడు. వివేక వైరాగ్యములు పొందాడు. "అహో! నా చిత్తము నందు ప్రతిబింబించిన కొన్ని క్రియా విశేషములను నేను చేస్తున్నట్లు భావించి భ్రమించాను కదా! ...వాస్తవానికి సర్వవేళలా నేను విజ్ఞానస్వరూపుడనే!" అని గ్రహించాడు. చిత్త నిరోధము కొరకు, జ్ఞానలక్ష్మిని సంపాదించటానికి ఆతడు ఋష్యమూకపర్వతంపైకి వెళ్ళాడు. విష్ణుభగవానుడు ఆజ్ఞాపించినట్లు అక్కడ పదేళ్ళు తపస్సు చేశాడు. క్రమంగా భయ, క్రోధములను విసర్జించి పారమార్థిక సత్త"ను అవధరించాడు. జీవన్ముక్తస్వరూపుడైనాడు.

బ్రహ్మానందనిమగ్నుడై, పరిపూర్ణచిత్తుడై, పూర్ణ చంద్రుని వలె అనంత బ్రహ్మాకాశము నందు విహరించసాగాడు.

❖❖❖

## 5. విచారణ యొక్క ఆవశ్యకత (The need of Analysing)

**శ్రీవసిష్ఠమహర్షి** : చూచావా రఘునందనా? ఈ విధంగా 'మాయ' అతివిశాలము, అచింత్యము, మహా మోహమయము, భయంకరము కూడా అయి ఉన్నది. అది పరమాత్మను ఆశ్రయించుకొనియే ఉన్నది. లేకపోతే 4,5 నిమిషాల పరధ్యానం ఎక్కడ? '60' సంవత్సరాల ఆటవిక జీవుని అనుభవం ఎక్కడ? అసత్యమైనదేది? సందిగ్ధరహితమైన సత్యమేది? అందుకే ఈ 'మాయ' మహామోసకారి అని చెబుతారు. అసావధానచిత్తుని అది క్షణంలో సంకటములందు పడవేయగలదు.

**శ్రీరాముడు** : అవును స్వామి! మీరన్నట్లు మాయ అతిచమత్కారమైనదే! వేగంగా తిరుగుచూ, సర్వాంగాలను ఛేదించ గల ఈ మాయను విజ్ఞులగువారు ఎట్లా నిరోధించగలుగుచున్నారో చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి** : నాయనా! ఈ సంసారరూప మాయాచక్రం నలువైపులా విస్తరించియున్నది. ఇట్టి సంసార చక్రము యొక్క ఇరుసు (Inner - wheel) ఈ మనస్సేనని గ్రహించు. పురుషప్రయత్నం చేత, ధీరబుద్ధి చేత ఈ మనస్సు (లేక) చిత్తమును నిరోధించామా... మాయ యొక్క చక్రభమణం కూడా దానంతట అదే ఆగిపోతుంది. పిల్లలు ఆడుకునే త్రాడుతో చుట్టబడిన చక్రం యొక్క భ్రమణం ఆ త్రాడును పట్టుకుంటే ఆగిపోతుంది కదా? ఈ మనస్సును నిరోధించాలి. ఇక మోహం ఉండదు.

ఓ రామా! నీవు చక్రయుద్ధంలో కుశలుడవే కదా! ఈ మాయాచక్రం నిరోధించటానికి ఎందుకు ప్రయత్నించకూడదు? నాభిస్థానం పట్టుకుంటే, చక్రం ఆగిపోతుంది. కాక ఆ చక్రం యొక్క తదితర భాగములను పట్టుకోబోయామా... చేతికి గాయం కాగలదు. ఈ మనస్సును నిరోధించాలి. ఇక మోహము ఉండదు.

ఈ మనస్సు 'జన్మజరామరణములు' అనే సంసారచక్రంలో ఇరుసులాగా ఉంటోంది. మనస్సును మనస్సుతోనే నిరోధించాలి. ఉద్ధరించాలి, పరిభ్రమణము నుండి ఈ మనస్సును మళ్ళించు. ఆత్మయే తన స్వరూపముగా కలిగియుండి కూడా ఈ జీవుడు ఎందుకు దుఃఖములు పొందుచున్నాడు?

ఎందుకో విను- ఈ జీవుడు తన దేహభృతి కొరకై చాలా ఉపాయములను అందిపుచ్చు కుంటున్నాడు. మరి చిత్తము గురించో? ...చిత్తమును నిరోధించ గల ఉపాయములు ఆశ్రయించక పోవుట చేతనే అనేక దుఃఖపరంపరలను ఒకటి తరువాత మరొకటిగా పొందుతూ పోతున్నాడు. చిత్తము నిరోధించబడితే, ఇక కృత్రిమమగు దీనస్థితులన్నీ తొలగిపోయినట్లే. ఈ సంసార మహారోగం ఉపశమించాలంటే 'చిత్తనిరోధము' తప్ప వేరే ఔషధం లేనే లేదు. మరి, తపో-దాన-తీర్థ క్రియాదులంటావా... అవన్నీ చిత్తనిరోధము కొరకే ఉన్నాయి.

అందుకని, 'పరమశ్రేయమైనట్టి చిత్తమును వశపరచుకొనుట' అనుదాని గురించి యోచించు. ఆ పని వదలి చిన్నపిల్లల ఆటల లాగా ఏవేవో కార్యక్రమాల వల్ల ఏం ప్రయోజనం? కుండ యొక్క ఆకాశం కుండలోనే ఉన్నట్లుగా, చిత్తము నందే ఈ సంసారమంతా ఉన్నదని పదే పదే ప్రకటిస్తున్నాను. కుండపగిలితే 'ఘటాకాశం' (Space belonging to the pot) అనేది ఉంటుందా? ఎక్కడుంటుంది?

చిత్తము నశించిందా – సంసారము కూడా నశిస్తుంది. నీవు 'చిత్తము' అనే కుండను 'ఆత్మ తత్త్వ జ్ఞానము' అనే ఉపకరణముచే పగులగొట్టి బ్రహ్మాకాశములో ప్రవేశించు.

**శ్రీరాముడు** : అచిత్తత్వదశ ఎలా పొందటం?

**శ్రీవసిష్ఠమహర్షి** : అందుకు రెండు ఉపాయాలను చెపుతాను.

1. వర్తమానంలో ప్రాప్తించే విషయములను బాహ్యబుద్ధితో మాత్రమే సేవించటం.
2. భూత – భవిష్యత్తుల గురించి అనుసంధానమే చేయకపోవటం.

ఈ రెండు ఉపాయాలను అనుసరించు. అప్పుడు చిత్తము అచిత్తత్వదశను తప్పక పొందగలదు.

**భవిష్యత్ -** భవిష్యత్తు గురించి సంకల్పములను, సంబంధములను, పదార్థభావములను క్రమంగా త్యజిస్తూ వచ్చావా... అప్పుడు పరమపావనమగు చిత్తరహితస్థితిని తప్పక పొందగలవు. చిత్తము అంటే సంకల్పములే!

సంకల్పములు ఉన్నంతవరకూ సంకల్పవిభూతులు (Effects of Perceptions) ఉండియే ఉంటాయి. అవి ఉంటే చిత్తము కొనసాగుచూనే ఉంటుంది. సంకల్పములు కాకుండా చిత్తమునకు వేరే రూపమెక్కడిది? కనుక రామా! నీవు నీ అంతరంగమునందు సర్వసంకల్పములు త్యజించివేయి. ఆత్మ చిత్తరహితమై ఉంటే, "ఆత్మ తన కూటస్థ రూపమున ఉన్నది" అని అంటాం. అప్పుడు ఈ సంసారమునకు మూలభూతమైన "కామ, కర్మ, వాసనలు" మూలజ్ఞానంతో సహా పటాపంచలవుతాయి. ఇదియే మహాసిద్ధ మంత్రం.

**ప్రత్యక్ చైతన్యము -** చిత్తరహితమగు ఆత్మను "ప్రత్యక్ చైతన్యము" అని అంటూ ఉంటారు. స్వస్వభావయుతము, మనోరహితము అయిన ఆత్మయందు కల్పనారూపమైన మాలిన్యమే ఉండదు. ఆత్మ యొక్క మహత్తర స్థితి ఏమిటో గ్రహిస్తే – అది వాస్తవానికి చిత్తము లేనట్టి పరమార్థ స్థితియే అవుతుంది. మనందరి స్వస్వరూపమగు ఆత్మ స్వతఃగా నిరతిశయానంద స్వరూపము, పరమాత్మ స్వభావము, సర్వజ్ఞము, సమ్యక్‌దృష్టిమయము అయి ఉన్నది.

**ఆశల నుండి దుఃఖం -** శ్మశానంలో కాకులు ఉన్నట్లు ఎక్కడ ధ్యాస – ఆసక్తి ఉంటే, అక్కడ ఆశలు ఉంటాయి. ఎక్కడ ఆశలు ఉంటే అక్కడికి సుఖ, దుఃఖములన్నీ వచ్చి చేరుతాయి. ఆశ నుండే మిగతా సంసారమంతా పరిఢవిల్లుతోంది. స్వస్వరూపాత్మ యొక్క 'ఏమఱుపు' చేతనే బాహ్యత్వ పూర్వకమైన "ధ్యాస" ప్రభవించి ప్రవృద్ధమౌతోంది. వస్తుతత్వమేమిటో గ్రహించిన జ్ఞానుల మనస్సునందు 'ఆశలు' అనేవే ఉండవు. ఇదంతా మిథ్యయేనని వారికి తెలుసు.

**శ్రీరాముడు** : పదార్థములలోని మిథ్యాత్వము జీవుడు గ్రహించేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి** : శాస్త్ర – సజ్జన సాంగత్యముల సహాయంచేత 'మనోనిరోధం' నిరంతరం అభ్యసిస్తూ రాగా, అప్పుడు ఈ వస్తువులందలి అవస్తుతత్వమేమిటో ఎరుగబడుతూ ఉంటుంది. అందుచేత, ఓ సభికులారా! దృఢ ప్రయత్నములచే, సునిశ్చియములచే, శాస్త్ర–సత్సాంగత్యాదులచే క్రమంగా ఈ చిత్తములోని అవివేకమును తొలగించండి. బలవంతంగా అయినా సరే, ఆ మనస్సును ఆత్మ

యందు ప్రవేశపెట్టండి. ముల్లును ముల్లుతోనే తీయగలం. వజ్రమును వజ్రముతోనే సానపెట్టగలం. పరమాత్మ దర్శనమునకు ఆత్మజ్ఞానమే ముఖ్య కారణమగుచున్నది.

**శ్రీరాముడు** : మహర్షీ! ఆత్మజ్ఞానమునకు ముఖ్యకారణమగుచున్నదేది? మరొక్కసారి చెప్పండి.

**శ్రీవసిష్ఠమహర్షి** : స్వానుభూతములగు సుఖ – దుఃఖములను ఆత్మయే త్యజించుటకు ఇచ్ఛగించుచున్నది కదా! కనుక ఆత్మజ్ఞానమునకు ఆత్మయే ముఖ్యకారణం. అందుచేతనే, "బద్ధుడనై ఉన్న నేను ఉద్ధరించ బడేది ఎట్లా?" – అని తలచువానికి మాత్రమే శాస్త్రములు, గురువులు మార్గము చూపగలుగుతాయి.

**మనోరహితం** - ఓ రామచంద్రా! నీవు మాట్లాడుచున్నప్పుడూ, ఇచ్చుచున్నప్పుడూ, పుచ్చుకొను చున్నప్పుడూ, కనులు మూసినప్పుడూ, తెరచినప్పుడూ, అన్ని సమయములలో మనోరహితుడవై ఉండు. లేక, ఆత్మవస్తువును మాత్రమే మననం చేస్తూ ఉండు. కేవలం చైతన్యమును మాత్రమే పారాయణం చేస్తూ ఉండు. నిరంతరం ఆత్మచింతనచే ఆత్మయొక్క నిర్మలత్వం అనుభవం కాగలదు.

నాయనా! నీవు జన్మిస్తున్నప్పుడు, జీవిస్తున్నప్పుడు, మరణిస్తున్నప్పుడు, తదితర మహర్దశ – దుర్దశ లందు, నిష్క్రియుడవైనప్పుడు, క్రియాతత్పరుడవైనప్పుడు, అన్ని వేళలా "నేను శుద్ధమగు ఆత్మ సత్తయే కదా" అనునట్టి కేవల చైతన్యాంశమునందే సుస్థిరుడవై ఉండు. "నాది, నాకు చెందినది, నా దేహము, నాకు సంబంధించినవారు" అను రూపము గల సర్వవాసనలూ త్యజించు. సర్వదా తదేక నిష్ఠతో చైతన్య మాత్ర తత్పరుడవగుము. వర్తమానంలో, భూతకాలపు యోచనలలో, రాబోవు వార్ధక్యాది దశలలో, రాజత్వాది స్థితులలో, దేహం ఉన్నప్పుడు, లేనప్పుడు – అన్ని వేళలా చైతన్య మాత్రము నందే ఏకైక 'నిష్ఠ' కలిగి ఉండు. అద్దానినే భావించు, అనుసంధానం చేయి. సమాధి తత్పరుడవగుము.

సర్వకాల, సర్వావస్థల యందు "నేను ఆత్మ స్వరూపమగు చైతన్యమును. అదియే ఒక పురుగు నుండి బ్రహ్మదేవుని వరకు కూడా" – అను ఎఱుకను వదలనే వద్దు. బాల్య, యౌవన, వార్ధక్యాల లోనూ, జాగ్రత్, స్వప్న, సుషుప్తులలోనూ కేవల చైతన్యమునే ఆశ్రయించు. అద్దాని యందే నీ నిష్ఠ అంతా ప్రతిష్ఠించబడు గాక! 'బాహ్య విషయాలు' అనే మాలిన్యం నీచే త్యజించబడు గాక!

మనస్సును ఆత్మ యందు విలయమొనర్చుచూ, ఆశాపాశములను త్వరత్వరగా విచ్ఛేదన మొనర్చుచుండుము. అప్పుడు కేవలం విజ్ఞాన స్వరూపము నందు సంస్థితుడవగుటలో నీకేమీ కష్టముండదు.

**సంబంధమే లేదు....** నీయందు శుభ, అశుభములు, ఇష్ట అయిష్టములు, ఆశ నిరాశలు శమించు గాక! ప్రతిజీవుడు తాను కోరుకుంటున్న ఉత్తమశాంతి, ఆనందములను ఆత్మ చైతన్యమును ఆశ్రయించినప్పుడే పొందగలడు. కర్మ–కర్తృ–కరణ సహితుడవై ఉన్నప్పటికీ, నీవు మాత్రం వాటన్నిటి కంటే వేరైన వాడివై ఉండుము. విజ్ఞానమయ బుద్ధి కలిగి ఉండు.

ఈ ఇంద్రియములు, ఇంద్రియవిషయములు నిన్ను స్పృశించనట్టి సాక్షిరూపమును వహించు. ఒక అద్దంలో ప్రతిబింబించే వ్యవహారంలాగా ఈ సర్వదృశ్యవ్యవహారములను గాంచుచుండుము.

అద్దమునకు అందులో ప్రతిబింబించే దృశ్యమునకు సంబంధమే ఉండదు కదా! ఆ అద్దం 'ఇవి నా వస్తువులు' అనే మమకారం ఏమైనా కలిగి ఉంటుందా?

నీకు కూడా (దర్పణము – దర్పణాంతర్గత ప్రతిబింబిత వస్తువు వలె) ఈ సంసారముతో ఏమాత్రం సంబంధమే లేదు. ఉండవలసిన పని లేదు. సాక్షిరూపమున సర్వ వ్యవహారములు గాంచు చుండుము. 'నిర్వికల్పము – నిరాలంబము' అయినట్టి కేవల నిజరూపము (one's own absolute form) అగు చిన్మాత్రము నందు స్వరూపస్థితి కలిగి ఉండు.

❖

ఓ రఘువీరా! నీవు ఈ జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు సంబంధించినవాడవే కావు. అట్లాగే, సృష్టి–స్థితి–ప్రళయములు కూడా నీకు లేవు. అందుచేత ముక్తిరూపమున వీటన్నిటికీ ఆవల ఉన్న పరబ్రహ్మమే నీవై ఉండు.

నీవు సర్వ దృశ్యములను కేవలం ప్రకాశింపజేయువాడవు. గదిలో దీపముచే ప్రకాశించబడే వస్తువులకు దీపము యొక్క ప్రకాశమునకు సంబంధమేమున్నది? నీచే ప్రకాశింపజేయబడుచున్న – అనగా గాంచబడుచున్న – వస్తుజాలమునకూ, నీకూ సంబంధము లేదు. అట్టి బుద్ధి వృత్తులకు ఆవల ఉంటూ, "బుద్ధి వృత్తులను కూడా ప్రకాశింపచేయుచున్న చిన్మాత్రమునే నేను" అని గ్రహించి, అచ్చట స్థిరుడవై ఉండు.

**నిజచైతన్యం -** 'స్వ–పర' ధ్యాసలను త్యజించివేయి. ఈ జగత్తు ఉన్నా, లేకున్నా నీవు మాత్రం 'విభాగ రహితమైన వజ్రస్తంభం' లాగా ఆత్మను ఆశ్రయించి స్థిరంగా ఉండు. సంకల్ప మయములే అయినట్టి లౌకిక విషయాల మధ్య ఉండవలసి వస్తున్నప్పుడు 'ధీరత్వ – ధార్మిక' భావాలు కలిగి ఉండి, అదే సమయంలో 'ధర్మాధర్మ రహిత స్థితి' ని పొంది ఉండు.

❖

ఓ రాజీవలోచనా! రఘుపుంగవా! ఎవడైతే జ్ఞానమాత్రము – సాక్షీరూపము అగు తన ఆత్మ తత్త్వమును అనుభూతమొనర్చుకుంటాడో అట్టివానికి హాలహల విషం కూడా అమృతతుల్యమే అవుతుంది. ఈ జీవులలో అనేకులు 'నిర్మలము – నిరవయవము' అగు తమయొక్క శుద్ధచైతన్యమును విస్మరించటం చేతనే అజ్ఞానం ఉదయిస్తోంది. అజ్ఞానం చేత సంసారభయమునకు సంబంధించిన మహామోహము పుట్టుకొస్తోంది. అదంతా సర్వ అనర్థములను ఉత్పత్తి చేస్తోంది.

కనుక నిర్మలమగు నిజచైతన్యమును జపిస్తూ ఆరాధిస్తూ మననం చేస్తూ రాగా, ఈ సంసార భ్రమకు కారణమగుచున్న మహామోహం దానంతట అదే తొలగిపోతుంది. ఇందులో సందేహించ వలసిన పనేమీ లేదు.

**ఆశ క్షీః జ్ఞానం -** ఎవడైతే స్వస్వరూపమును అవధరించి 'ఆశ' అనే మహాసముద్రాన్ని దాటివేస్తాడో, అప్పుడు జ్ఞానభాస్కరుని కిరణాలు ఆతడున్నచోట నలువైపులా ప్రసరిస్తాయి. జ్ఞానమున్న చోట ఆశ ఉండదు. ఆశ ఉన్నచోట జ్ఞానము పెంపొందదు.

స్వాత్మభావమును అవలోకిస్తూ, అద్వైత బ్రహ్మానందమున సంస్థితుడైన మనుజునకు మిక్కిలి రుచికరమైన అమృతం కూడా ఎక్కడబడితే అక్కడ ఉండే నీరులాగా గోచరిస్తుంది. ప్రత్యగాత్మ భావం పొందిన అట్టి జీవన్ముక్తులతో మునులమగు మేము ఎల్లప్పుడూ మైత్రి కలిగి ఉంటాం.

ఇక ఈ విషయం ఎరుగని మనుజుల విషయమంటావా... మా దృష్టిలో వారు మనుజాకారంలో ఉండే జంతుజీవుల వంటివారే. 'స్వజ్ఞానం' కారణంగా 'సర్వోతీత–సర్వ స్వరూప స్థితి – సర్వోన్నత స్థితి' ని పొందిన తత్త్వజ్ఞాని వద్దకు తదితర జ్ఞానార్తులు, యోగులు జ్ఞానం కొరకై సమీపిస్తూంటారు.

**తత్త్వజ్ఞుడు -** 'దివ్యజ్ఞాన నేత్రయుతుడు' అగు తత్వవేత్త ఏది ఎట్లు దర్శిస్తున్నాడో – అది తత్త్వజ్ఞులు కాని వారిచే ఇంతవరకూ దర్శించబడుటలేదు. ఇక ముందు దర్శింపబడజాలదు. ఈ సూర్యప్రకాశం సహాయం లేకుండానే వారు అంతర్లీన సత్యాన్ని సుస్పష్టంగా చూస్తున్నారు.

ఏ జీవుడైనా సరే, స్వజ్ఞాన వశం చేతనే సర్వోన్నత స్థితిని పొంది ఉంటున్నాడు. మిట్టమధ్యాహ్నం దీపపు వెలుగు ఒక అవస్తువే కదా! బ్రహ్మవిద్యచే ఆత్మను ఎఱిగిన వానికి సూర్య, ఇంద్రాది ఆయా మహా లోకములన్నీ అవస్తువులే అవుతాయి. ఓ రామా! మహాతేజస్సు కలవారి లోనూ, యోగ – వశిత్యాది సిద్ధులు పొందిన వారిలోనూ, బలవంతులలోనూ, ఆయురైశ్వర్యములు కలవారి లోనూ, గొప్ప విద్వత్తు, వక్తృత్వములు కలవారి లోనూ – వీరందరిలో తత్త్వజ్ఞానము ఉన్నవాడే అత్యంత ఉన్నతుడై వెలయుచున్నాడు.

**ఆత్మజ్ఞాని ఔన్నత్యం -** పరమేశ్వరుని నిజరూపం ఆత్మయే. ఆత్మరూపుడగు పరమేశ్వరుని ప్రకాశం చేతనే ఈ సూర్య, చంద్ర, అగ్ని, మణి, తారలు ప్రకాశిస్తున్నాయి. జ్ఞేయులగు – జ్ఞాత (తెలిసికొను దానిని తెలిసియున్న వారగు) తత్త్వజ్ఞుల ప్రభావం చేతనే ఈ జగత్తులో ఆనందవీచికలు ప్రభవిస్తున్నాయి.

ఆత్మజ్ఞాన రహితులగు మానవులు నేలలో పురుగుల కంటే, కీటకముల కంటే, జంతువుల కంటే అధికులేమీ కాదు. ఎందుకంటే, ఒకడు ఆత్మజ్ఞుడు అవనంత వరకూ 'మోహము' అనే పిశాచం విజృంభిస్తూనే ఉంటుంది. తత్త్వవేత్తల దృష్టిలో ఆత్మజ్ఞుడు మాత్రమే సచేతనుడు. అతడు మాత్రమే స్వతంత్రాన్ని అనుభవిస్తున్నాడు. ఆత్మజ్ఞుడు కానివాడు దేనికీ స్వతంత్రుడు కాదు. అందుచేత అచేతనుడే. ఆతడు దుఃఖము కొరకే అనేక ఆశలు, ఉద్వేగములు, తాత్సారములు కలిగి ఉంటున్నాడు.

అజ్ఞాని సర్వదా మృతుడే. ఆత్మజ్ఞుడే సజీవుడు.

**ఆత్మానుభవ ప్రభావం -** ఆకాశంలో దట్టంగా మేఘములు అలుముకున్నప్పుడు నాలుగు వైపులా ప్రకాశము సన్నగిల్లుతుంది కదా!... ఈ చిత్తము స్థూలపదార్థములను రాగయుక్తముగా భావిస్తూ ఉన్నప్పుడు స్థూలమగుచున్నది. అట్టి సమయంలో ఆత్మజ్ఞానం పలాయనం చిత్తగించుచున్నది. అయితే జ్ఞాని తన మనస్సులోంచి క్రమంగా విషయభోగాలందలి అభిలాషను తొలగిస్తూ ఉంటాడు. ప్రాప్తించిన వాటి పట్ల లోభము గాని, ప్రాప్తించని వాటి పట్ల ఆశ గాని ఆతనికి ఉండదు. తన మనస్సును ఎండుటాకు వలె కృశింపజేస్తాడు. సర్వకాల, సర్వావస్థల యందును 'ఆత్మజ్ఞానము'

అనే అమృతమును సేవిస్తూ సంతృప్తిగా, ప్రశాంతంగా ఉంటాడు. ఆతనికి ఈ జన్మ, జరా, మృత్యువులు గానీ, వాటి మధ్య సంఘటితమయ్యే ఆయా వ్యవహారములు గానీ ఒక లెఖ్ఖలోనికిరావు. ఆతడు అనాత్మ యందు ఆత్మభావము కలిగి ఉండడు. ప్రతి అనుభవమును ఆత్మభావముచే పునీతం చేసి మహాప్రభావ సంపన్నుడై ఉంటాడు.

**అనాత్మభావం -** ఓ రామచంద్రా! స్వతహాగా సూక్ష్మమే అయిన ఈ చిత్తము చమత్కారంగా స్థూలత్వం పొందుతోంది. ఈ దేహము పట్ల ఆశచేతను, పుత్ర, దార, ధనాది విషయాలపై ఏర్పడే మమకారము చేతనూ చిత్తము స్థూలపడుతోంది. అదంతా భ్రాంతి చేతనే. అహంకారము యొక్క వికారమే మమకారభ్రాంతి! దృశ్యము నందు ఏర్పడుచున్న భ్రాంతి పూర్వకమైన ఆసక్తి 'ఈ శరీరమే నేను' అను ఒకానొక అజ్ఞానవృత్తిని వృద్ధి చేస్తోంది. వ్యర్థమైన పదార్థములను ఇచ్ఛగించుట చేత, దోషభావముల చేత, జరామరణముల పట్ల గల దురవగాహనల చేత బుద్ధి అనారోగ్యమగుచున్నది. "బాహ్య వస్తుజాలం రమణీయమైనది" – అనే వికల్పభావం చేత, "ఇవి స్థిరంగా ఉండగలవు" అనే తుచ్ఛవిశ్వాసం చేత ఈ జీవుడు త్యాజ్యగ్రాహ్య వ్యవహారములన్నీ శ్రమించి మరీ స్వీకరిస్తున్నాడు. ఫలితం? ఆతని ఆ చిత్తమౌఢ్యమే శారీరక మానసిక వ్యధల రూపమున విస్తరిస్తోంది. ఇక ఆపై ఉన్మత్త క్రియా వ్యవహారాలు, అంతు లేని దుఃఖాలూ, అనేక జన్మ పరంపరలు వచ్చి కూర్చుంటున్నాయి.

ఓయీ! జీవుడా! నీవు అవిచారణ చేతనే తుచ్ఛములైన ధన, మణి, స్త్రీ (శృంగారం) వంటి స్వల్ప విషయాలు గొప్పవైనట్లు భావించి తుచ్ఛమైన ప్రలోభంలో పడుచున్నావు. నీ మనస్సు స్థూల మగుచున్నది. అందుచేతనే ఆత్మబోధ తగినంతగా గ్రహించలేకపోతున్నావు.

కనుక, దృశ్యము పట్ల ఏర్పడే ఆశను త్యజించు. అధిష్ఠానమైయున్న స్వస్వరూపమగు ఆత్మ యొక్క విస్తారతను, ప్రసన్నతను, కాలః కాలత్వమును గ్రహించు. ఆనందించు. అంతేగాని, ఉత్పత్తి – వినాశన స్వభావయుతాలైన ఈ పదార్థములు నీకేం ఉత్తమ వస్తువును చేకూరుస్తాయి చెప్పు? అవన్నీ నీకు చివరికి విషయ వైషమ్యత్వమును తెచ్చి పెడుచున్నాయి. భయంకరములైన విషయ భోగములను సేవిస్తూ పుండుపై వ్రాలే ఈగ లాగా తుచ్ఛత్వం కొనితెచ్చుకుంటే ఎట్లా? సునిశిత – సుతీక్ష్ణ దృష్టిని వదలి, స్థూలత్వం పొంది ఏం ప్రయోజనం?

అందుచేత ఈ చిత్తం వికాసవంతమగు చైతన్యాన్ని ఆశ్రయించి స్వతంత్రం పొందు గాక!

❖

ఓ రామచంద్రా! చిత్తము అనే వృక్షం శరీరము అనే ప్రదేశంలో నెలకొని ఉంటోంది. అనేక చింతలు ఈ చిత్తవృక్షమును పర్యవేక్షించి ఉన్నాయి. ఆ వృక్షం నుంచి 'పుట్టటం – పెరగటం – చావటం' అనే పళ్ళు నిరంతరం కాస్తున్నాయి. అది 'ఆశలు' అనే పొడవాటి కొమ్మలతో, వికల్పములు (Misconceptions) అనే ఆకులతో విస్తరించి ఉన్నది. అట్టి చిత్తవృక్షము గురించి తాత్సారం చేయటం ఉచితం కాదు. ఇక ఏమాత్రం శంకించకుండా 'ఆత్మ విచారణ' అనే ఖంపముతో ఆ వృక్షమును మొదలంట వ్రేళ్ళతో సహా నరికి, పెకలించి వేయాలి.

**మనస్సు, సూక్ష్మబుద్ధి -** ఈ మనస్సు అనేక అనుమానాలకు తావు. ఇది సర్వదా బహిర్ముఖం అగుటకే ఉత్సుకత చూపుతోంది. ఎన్ని అనుభవములు పొందుతున్నా, ఎంతకాలం గడచిపోతున్నా కూడా ఇది అంతర్ముఖం అవటమే లేదు. అరె! ఏమాత్రం విశ్రాంతి పొందటానికి ప్రయత్నించదే? ద్వేషములను, అసూయలను ఆశ్రయిస్తుందే గానీ, 'శమ, దమ, తితిక్ష' మొదలైన ఉత్తమ ఉపకరణాల ఊసే ఎత్తదేం? అన్ని వేళలా క్రోధమునూ, సుఖ, దుఃఖాలను మాత్రం పొందుతోంది. తన విశ్రాంతి స్థానమేదో తానే గ్రహించలేకపోతోంది. ఇట్టి మనస్సు అనే ఏనుగును 'అతి సూక్ష్మ బుద్ధి' అనే సింహం యొక్క గోళ్ళు ఉపయోగించి నిరోధించాలి.

ఓ మనస్సా! ఇక నీవు శమించు. ఆత్మజ్ఞాన వివేకం కలుగనంతసేపే నీ ప్రతాపం.

❖

ఓ రాఘవా! చిత్తము - అనే పిశాచం తనకు వీలున్నంత వరకూ తృష్ణ (Passion)నే సేవిస్తోందయ్యా! 'అజ్ఞానం' అనే వటవృక్షం క్రింద విశ్రమిస్తోంది. నిత్యం 'అనంతకోటి జన్మలు' అనే మహారణ్యంలో సంచరిస్తోంది. అజ్ఞానులలోని చాంచల్యమే దాని రూపం. ఏమి దాని విన్యాసం! ఏమి దాని ఎత్తుగడలు! అట్టి చిత్తమును వివేక - వైరాగ్యములతో నిరోధించాలి. స్వాత్మ గృహం నుండి దానిని వెడలగొట్టనంత వరకు ఆత్మకు 'ముక్తి' అనుమాట కల్ల.

ఈ మనస్సును ఒక విషసర్పంతో పెద్దలు పోలుస్తూ ఉంటారు. దీనికి "శుభ-అశుభ కర్మలు" అనే రెండు కోరలున్నాయి. ఇది 'దేహము' అనే కుబుసమును కలిగి ఉండి, విశ్రాంతి లేకుండా ప్రాణవాయువులను భక్షిస్తోంది. 'భయములు' అనే మృత్యువును తెచ్చిపెడుతోంది. అట్టి ఈ మనో - విషసర్పాన్ని 'అభ్యాస, వైరాగ్యములు' అనే గరుడ మంత్రముచే నిర్జించాలి. లేకపోతే, ఇది అనేక దేహరూప శవములను భక్షిస్తూ అమంగళస్వరూపంతో దిక్కులన్నీ సంచరిస్తూనే ఉంటుంది. 'అవమానము, శోకము, భయము' అనే దుర్వ్యసనములను కలుగజేసుకుంటూ ఇట్లు బిగ్గరగా రోదిస్తూనే ఉంటుంది.

❖

ఈ మనస్సు ఒక కోతి వంటిది. ఇది జన సమూహమును, వారితో సంబంధములను గాంచుచూ, పిచ్చిపట్టిన దానివలె గంతులేస్తోంది. దీనిని నాలుగు వైపుల నుండీ బంధించాలి. లేకపోతే ఆత్మసిద్ధి ప్రాప్తించదు.

**అభావము -** నాయనా! రామా! నీవు అభావమును ఆశ్రయించి వాసనలను, సంకల్పములను, తదితర సర్వ కల్పనలను బుద్ధిపూర్వకంగా నిరోధించెదవు గాక! తద్వారా జీవన్ముక్త ఫలమును పరిపూర్ణముగా పొందెదవు గాక!

అసంకల్పముచే సుకృత - దుష్కృత ఉభయవిషయములను పరిత్యజించు. ఈ జన్మ - జాతి భేదములన్నిటినీ మనస్సులో రహితం చేయి. శంకారహితంగా స్వస్వరూపమునందు యథాతథంగా విహరిస్తూ ఉండు.

❖

ఈ మనస్సు కోపము – అసూయ – ఆశ – ఉద్వేగము మొదలైన రూపంతో ఆ పరబ్రహ్మమును కప్పి ఉంచుతోంది. తృష్ణ అనే నోరు తెరచి 'విషయములు' అనే మాంసపు ముక్కలను నములునట్లు చేస్తోంది. మోక్షము విషయంలో నిద్ర – ఆలశ్యములను కలుగజేస్తోంది.

ఇట్టి మనస్సు పట్ల నీవు దయ చూపవద్దు. నిర్దయగా దీనిని నియమించి నీ యొక్క వైరాగ్య మహాప్రయత్నమునకు మనస్సు వల్ల కలుగుచున్న విఘాతములను, అడ్డులను తొలగించుకో!

అప్పుడు నీవు పూర్ణానందైశ్వర్యుడవు కాగలవు. శుద్ధ చిత్తముచే మలిన చిత్తమును పూర్ణముగా శమింపజేసి అఖండ శోభాయమానుడవు కమ్ము.

తత్త్వజ్ఞానం చేత మనస్సును మలినరహితం చేసి ప్రత్యగాత్మ యందు నియమించు.

ఇక ఆపై ఈ స్థూల – సూక్ష్మ – కారణ శరీరసహితమగు సమస్త జగత్తును అనాదరంతో తృణప్రాయంగా చూడు. క్రమంగా ఈ సంసారము నుండి తరించు. శాస్త్రములకు అవిరుద్ధంగా మెలగుచూ ఉండు. లోకములకు శుభం కలుగజేసే దృష్టితో లీలాపూర్వకంగా ఈ ప్రపంచమున వ్యవహరించెదవు గాక!

❖❖❖

# VII. ఉద్దాలకుని అంతరంగాన్వేషణ

## 1. చిత్తవృత్తులు

**శ్రీవసిష్ఠమహర్షి** : ఓ రామచంద్రా! ఈ చిత్తవృత్తులను గమనిస్తున్నావా? ఇవి ఇహ – పరలోకముల పట్ల గల ఆసక్తిచే అతిదీర్ఘమై ఉంటున్నాయి. అవి తమ యందు అనేక వాసనలు కలిగి ఉండి కంటికి (పైకి) కనబడకుండానే, సూక్ష్మమై ప్రవర్తిస్తున్నాయి. ఇవి క్షణక్షణం జీవుని సమాధి నుండి నివర్తింపజేస్తున్నాయి. ఒకవేళ ఈ చిత్తవృత్తులను ఆత్మ యొక్క తత్త్వమును స్వీకరించుట యందు నియమించగలిగామా, అప్పుడిక నిర్మలత్వమును ప్రకటించగలవు. పదునైన కత్తి యొక్క అంచు వంటి ఈ చిత్తవృత్తుల గురించి, ఏమాత్రం, 'పోనీలే' అనే తాత్సారం కూడదు. చక్కటి ఈ మానవజన్మ పొందిన తరువాత ఇక నిదానం పనికిరాదు. శ్రవణము, మననము మొదలైన ఉపాయాలచే ఈ బుద్ధి పరమాత్మపై లగ్నమయ్యేట్లు చేయాలి. వివేకం సహాయంతో బాహ్యావృత్తులను నిరోధిస్తూ క్రమంగా 'అఖండము, అప్రమేయము, నిత్యము, నిర్మలము' అగు ఆత్మవస్తువుతో స్నేహం పెంపొందించుకోవాలి. దీపం ఉన్నప్పుడే ఇల్లు చక్కపెట్టుకోవాలి కదా! ఈ శరీరము పుష్టి, దీప్తి కలిగి ఉన్నప్పుడే గురు శుశ్రూష, వినటం, యోచించటం, ఉపశమనము వంటి ఉత్తమ ప్రయత్నములను స్వీకరించాలి. సద్బుద్ధిని చక్కగా పెంచి, పరిపోషించుకోవాలి. అట్లా కాకుండా, శరీరం వృద్ధాప్యంలో ప్రవేశించిన తరువాత అప్పుడిక ఈ జీవుడు ఏమిచేయగలడో నాకేమీ అర్థం కావటంలేదు.

నా వాక్యాలలోని అంతరార్థం చక్కగా గ్రహించ గలిగినట్టి ఓ రాఘవా! నేను చెప్పు వాక్యార్థమును భావన చేయుటచే ఈ జీవుడు తప్పకుండా ఉత్తమ సుఖమును పొందగలడు. 'ఉద్దాలకుడు' అను మహర్షి ఏ విధంగా అయితే సర్వపదార్థములనూ పరిశోధిస్తూ క్రమంగా పంచ కోశములను, వాటి కారణము లందు లయింప జేసి అధిష్ఠానమగు సన్మాత్రము కొరకై అన్వేషణ సాగించాడో – నీవు కూడా అట్లాగే ధీరబుద్ధిచే అంతఃకరణమును మాటి మాటికీ శోధించు. ఆత్మ కొరకై అంతరంగము నందు అన్వేషణ కొనసాగించు. అప్పుడు అంతా నీకే విదితమౌతుంది.

**శ్రీరాముడు** : హే మహావక్తా! నేను ఉద్దాలక మహర్షి గురించి విని ఉన్నాను. కానీ, ఆయన "అంతరంగ శోధన – అన్వేషణ" గురించి విని ఉండలేదు. ఆ మహానుభావుని కథనమేమిటో వివరించండి.

**శ్రీవసిష్ఠమహర్షి** : పంచభూతముల పరిశోధనచే ఉద్దాలక మహాముని ఏ విధంగా పరమజ్ఞాన దృష్టిని పొందారో – అదంతా వివరించి చెపుతాను విను.

❖❖❖

# ౨. ప్రయత్నము - సంఘర్షణ

గంధమాదన పర్వతంపై గల ఒక వనప్రదేశంలో ఒక తటాకం ఉన్నది. ఆ తటాకం ప్రక్కనే గల ఒక కొండశిఖరం పై 'ఉద్దాలకుడు' అనే పేరుగల ఒక మునిబాలుడు ఉండేవాడు. ఆ పిల్లవాడికి నేను నా పురుషప్రయత్నంచే తప్పకుండా శాస్త్రప్రవచితమైన ఉత్తమ పురుషార్థం సాధించగలను" అనే కొండంత ఆత్మవిశ్వాసం ఉండేది.

మొట్టమొదట ఆతడు తాను విన్న, చదివిన శాస్త్రవిషయ సారమును పరిశీలించసాగాడు. కానీ ఎంత ప్రయత్నించినా ఆతని బుద్ధి తన ప్రకంపనములను వదలనే లేదు. "ఇక ఇట్లా కాదు. నేను మునుముందుగా శుద్ధమైన అంతఃకరణం సంపాదించాలి. ఆ తరువాతే మిగతా విషయాలు" – అని అనుకున్నాడు. ఇక శ్రద్ధగా తపస్సు, అధ్యయనము మొదలైన తీవ్రప్రయత్నములతో కొంత కాలం గడిపాడు. క్రమంగా ఆతనియందు వివేకము ప్రవేశించింది. ఒక్కసారి ఈ సంసార ప్రహసన మంతా గమనించిన తరువాత ఆతనికి ఎంతో భయమనిపించింది.

ఒక రోజు ఒక ప్రదేశంలో ఏకాంతంగా ఆసీనుడై శుద్ధ చిత్తముతో ఇట్లు యోచించసాగాడు.

❖

**ఉద్దాలకుడు (తనలో) :** దేని యందైతే విశ్రాంతి పొందిన తరువాత ఇక మనుజుడు మరల దుఃఖించడో, జన్మతో సంబంధమే ఉండదో అట్టి వస్తువు ఏది? మనస్సు లేని చోట దేనితోనూ సంబంధం ఉండదు కదా! మనోవ్యాపారమంటూ ఉండనట్టి పవిత్రమైన ఉత్తమ పదము నందు నేను విశ్రమించెదను గాక! అయితే అది ఎలా సాధ్యం? అది సాధ్యపడాలంటే, "ఏదో పొందాలి" అనే భోగతృష్ణను జయించివేయాలి. "ఈ పని, తరువాత ఆ పని, ఇవి పొందాలి, ఇందుకు ఏదో చేయాలి" ...అనేదంతా కల్పనతో కూడినదే. ఆత్మ పదమునందు విశ్రాంతి తీసుకుంటూ అట్టి కాల్పిక వ్యవహారములు చూచి ఎప్పటికి పకపకా నవ్వుకుంటానో! కమల పుష్పదళంపై నీటి బిందువులు ఉండవచ్చు గాక.

**కదా వికల్పజాలం మే న లగిష్యతి చేతసి ।**
**స్థితమప్యుజ్ఝితాసఙ్గం పయః పద్మదలే యథా ॥** (శ్లో 21, సర్గ 51)

కమలం ఆ నీటి బిందువులను స్వీకరించదు కదా! ఆ విధంగా అభాసమాత్రమైన ఈ దృశ్య వికల్పములు నన్ను ఎప్పటికి స్పృశించకుండా ఉంటాయో! ఉత్తమబుద్ధితో అతి కల్లోలమైన తృష్ణను ఎప్పటికి అధిగమిస్తానో? ఈ లోకములోని ప్రాణుల సంసార క్రియలను పిల్లవాళ్ళు ఆడుకుంటున్న ఆట లాగా ఎన్నటికి చూస్తానో? నా చిత్తము ఇప్పటికిమాత్రం క్షణక్షణం చంచలమై ఉంటోంది. వికల్పములు కలిగి ఉన్నదై, ఊయలలాగా చంచలత్వం వహిస్తోంది. ఒక పిచ్చిపట్టినవాని వలె భ్రమతో కూడుకుని ఉండే నా మనస్సు ఎన్నటికి శమిస్తుందో?

❖

ఓ నా అంతఃకరణమా! నీవు ఎప్పటికి ఆత్మస్వరూపమును పొందుతావు? ఎప్పటికి ఈ తుచ్ఛ దృశ్య ప్రపంచమును చూచి ఎగతాళి చేయగలవు? పూర్ణబుద్ధిని పొంది ఏనాటికి బ్రహ్మాండ శరీరధారి అగు విరాట్పురుషుని వలె హాయిని, సంతుష్టిని పొందుతావో కాస్త తెలియజేస్తావా? నేను అంతఃకరణము నందు 'సమరూపము' కలిగి ఉన్నవాడనై పరమాత్మతో ఐక్యమవ్వాలి. ప్రశాంత – సౌమ్య–సమగ్ర స్వరూపుడను కావాలి. అమృతము, కౌస్తుభమణి మొదలైనవాటి యందు, ధర్మ–అర్థ–కామ విషయము లందు నిస్పృహుడను కావాలి. వేలాది ఆశలతో నిండి ఉన్న ఈ అతిచంచల దృశ్య శోభను నిద్రపోతున్నవాని వలె పొందాలి, అది ఎట్లా సాధ్యం? కల్పనలన్నీ శమిస్తే, అప్పటి నా బుద్ధి మాత్రమే ఈ బాహ్య–అభ్యంతర జగత్తును "చిన్మాత్రమయం"గా వీక్షించగలదు. అట్టి వీక్షణ యందు సుస్థిరుడనై ఉండాలి. ఇది ఇప్పటి నా కార్యక్రమం.

చిత్తము శాంతించు గాక! గుడ్డివానికి చూపు వచ్చినట్లుగా నేను 'చిదేకరసము' అనబడు పరమ ప్రకాశమును పొందాలి. అభ్యాస వశంచే అట్టి ఉత్తమ ప్రకాశము సమృద్ధమగుచుండగా కాల కళలన్నీ దూరంగా త్యజించి వేయబడాలి!

ఇష్టం–అయిష్టం, హేయం–ఉపాధేయం (something to get rid of - something to get) తొలగి నా అంతఃకరణము శుద్ధం కావాలి. స్వప్రకాశపదము నందు సుస్థితుడనై ఆనందమును సాధించాలి.

**దురాశ -** కానీ, ఇప్పటి నా స్థితి అందుకు అనుకూలంగా లేదే? ఈ వర్తమాన అజ్ఞానాంధకారపు కాళరాత్రి దురాశలతో, అవిద్యతో, జడత్వంతో, అనేక దోషాలతో నిండి ఉన్నది. అన్నిటికీ కారణం మనస్సే కదా!

ఈ మనస్సును ఎందుచేత జయించలేక పోతున్నాను? ఒక పర్వత గుహలోని అంతర్భాగంలోని శిలలాగా మనోవ్యాపార రహితుడనై నిర్వికల్ప సమాధి యందు ఎందుకు ఉండలేక పోతున్నాను?

అహంకారమే నన్ను మోసగిస్తోంది. 'స్వాభిమానము' అనే మహామదం గల ఈ అహంకారమును 'జ్ఞానము' అనే ఆయుధంతో నిర్మూలించాలి.

నిర్వికల్ప ధ్యానము నందు విశ్రాంతి పొందాలి. నా మనస్సు మౌనవ్రతం అవలంబించి ఉండగా తలపై పక్షులు గూడుకట్టుకునే స్థితి నేను ఎందుకు పొందగూడదు? ధ్యానము నందు స్థిర బుద్ధి కలవాడనై స్థాణువువలె నిశ్చలంగా ఉండెదను గాక! "తృష్ణ కామాదులతో కూడి జన్మించటం" అనే అలవాటును త్యజించి సంసార పటాటోపాన్ని చిత్తు చేసెదను గాక!

❖

**విషయైర్నీయమానే తు చిత్తే మర్కట చఞ్చలే ।**
**న స లేభే సమాధానప్రతిష్ఠాం ప్రీతిదాయినీం ॥** (శ్లో 39, సర్గ 51)

ఈ విధంగా యోచన చేసిన ఆ ఉద్దాలకుడు మరల మరల ఆసీనుడై ధ్యానం అభ్యసించసాగాడు. అయితే, ఆతని చిత్తంమాత్రం కోతిలాగా విషయముల వైపుకే ఆకర్షించబడుతూ ఉండేది. ఆతను

కోరుకొన్నట్లు సంతోష దాయకమగు స్థిరప్రతిష్ఠ (సమాధి) పొందనే లేదు. కొద్దిసేపు బాహ్య విషయాలు బాహ్యము నందే త్యజించి సత్వగుణ ప్రధానమగు సమాధి యందు స్థితిని పొందేవాడు. ఇంతలోనే రజోగుణం వచ్చి ఆక్రమించేది. చిత్తము భయమును, ఆలశ్యమును, ఉద్వేగమును పొందేది. కొద్ది నిముషాలలో ఆతని మనోమర్కటం సమాధి సుఖమును త్యజించి కల్లు త్రాగినవాడు వీథిలోనికి వెళ్ళినట్లు ఎక్కడెక్కడికో పరుగులు తీసేది.

కొంతసేపు హృదయాకాశంలో సూర్యుని వంటి జ్యోతిని చూస్తూ ఉండటం.... ఇంతలోనే బహిర్ముఖం కావటం.... మరికొంతసేపటికి "అరే ... ఈ విషయములు నన్ను ఆక్రమిస్తున్నాయే" అని గుర్తుకు రావటం... మరల సంఘర్షణ ... మరల ప్రయత్నించి సమాధి వైపుగా సిద్ధం కావటం... ఇంకొంచెం సేపు ఇటు విషయములను, అటు సమాధిని కూడా త్యజించి అజ్ఞాన ఆత్మజ్యోతుల మధ్యగా ఒకానొక 'సన్నిద్రాస్థితి' యందు చిక్కుకుని ఉండి పోవటం...

ఈ విధంగా ఉద్దాలకుడు ప్రతి రోజూ ధ్యానం కొరకు ప్రయత్నిస్తూ ధ్యానవృత్తు లందు వ్యాకులం పొందుతూ ఉండేవాడు. మొత్తం మీద, తృష్ణ శేషించియే ఉండేది. తృష్ణా తరంగములచే సంకటములు పొందుతూనే ఉండేవాడు. ఎక్కడో దోవతప్పిన బాటసారిలాగా ఏకాకి అయి ఆ పర్వతముపై వ్యాకుల చిత్తంతో అటూ ఇటూ తిరుగుతుండే వాడు.

కొంతకాలం గడచింది. ఇక ఇట్లా కాదని, ఒక రోజు ఒక కొండగుహలో ప్రవేశించాడు. ఆకులతో ఒక ఆసనం తయారుచేసుకొన్నాడు. దాని పైన మృగచర్మం పరచాడు. క్రమంగా చిత్త వృత్తులను సూక్ష్మపరచుకున్నాడు. విషయములు సమీపించకుండా మనస్సును కట్టడి చేశాడు. ఉత్తర దిక్కుగా కూర్చుని కాలిమడమలచే వృషణములను తొక్కిపట్టి, బ్రహ్మ మొదలైన గురుపరంపరా ప్రాప్తమైన 'పద్మాసనం' వేసి కూర్చున్నాడు. ఇక ఏకాగ్రతతో ఇట్లు చింతన చేయసాగాడు.

❖❖❖

## 3. ఓ మనస్సా! ఇక ఆపవయ్యా నీ పరుగులు!

**ఉద్దాలకుడు** : ఇప్పుడు నేను బాహ్య ప్రపంచంలోంచి అంతరంగములోనికి ప్రవేశిస్తున్నాను.

ఓ మూర్ఖమనసా! కొంచెం ఆగు, ఎటు పోతున్నావ్? ఈ సంసారవృత్తుల వలన మనకేం ప్రయోజనం? చివ్వరికి దుఃఖమునే కలిగించబోయే కార్యక్రమములను ఎవరైనా చేబడతారా? దుష్ట స్థితి గతులకు తీసుకుపోయే మార్గంలో ఎవరైనా తెలివి గలవారు ఆసక్తి కలిగి ఉంటారా? మనం 'శాంతి' అనే అమృతం వదలిపెట్టటమేమిటి? కల్పవృక్షం వదలి ముళ్ళకంపలోకి దూరట మేమిటి? అందుకని నా ప్రియాతి ప్రియమైన మనస్సా! కాస్త యోచించు. నీవు బ్రహ్మ లోకానికి వెళ్ళినా, (లేక) పాతాళ లోకానికి వెళ్ళినా, ఏం ప్రయోజనం? మనం నిరతిశయానంద రూపమైన నిర్వాణం సంపాదించాలి గాని ...కాకి లాగా, పిచ్చుక లాగా పీచు వంటి విషయపరంపరలను కాదు. నీవు చెప్పినట్లుగా ఇన్నాళ్ళూ ఆశలవెంట పరుగులు తీశాను. ఏమైంది? ఆశలు తీరనప్పుడల్లా దుఃఖం

వచ్చిపడింది. ఒక ఆశ తీరగానే మరొక ఆశ వచ్చి పడింది. ఆశలు తీరనంతకాలం అపూర్ణత్వము వచ్చి పడుతూనే ఉన్నది కదా!

కనుక, నీవు భోగములందలి ఆశను త్యజించు. నిరతిశయానంద రూపమైనట్టి సుందరమైనట్టి, శ్రేయమైనట్టి మోక్షము కొరకే ప్రయత్నించు. ఈ 'ఇష్టములైనట్టివి చేకూర్చుకోవటం – ఇష్టం లేని వాటిని వదలించుకోవటం" అనే వ్యవహారమంతా నీకు దుఃఖమునే కలుగజేస్తోంది సుమా! ఏమి సుఖం? ఎక్కడి సుఖం? నూతిలో కప్పలాగా ఈ శబ్ద, స్పర్శ, రూపాది ఇంద్రియ విషయములలో నిరర్థకంగా నీవు ఎందుకు చిక్కుకుంటున్నావ్? సరే, ఇంతకాలం తిరిగావు. ఇప్పటి వరకూ ఏమి పొందావో చెప్పు? సర్వ వృత్తుల యొక్క ఉపరమము (Withdrawal) కొరకై మనం ఎందుకు ప్రయత్నించ కూడదు? అదొక్కటే సదేహ – విదేహ కైవల్యములకు మార్గమైయున్నది.

ఓ చెవులారా ! వ్యర్థముగా ఖేదము పొందవద్దు. మరల మరల బహిర్ముఖం అవుతూ, గీతములకై, ఘంటానాదములకై పరుగులు తీసి చివరికి మూర్ఖ మృగముల వలె క్షయం పొందటం భావ్యమా? ఆటవికులు చేసే ఆడ ఏనుగుల ఘీంకార శబ్దానుకరణను విని పరుగులు తీస్తూపోయి వాళ్ళు పన్నిన వలలో పడిపోయే మగ ఏనుగులాగా ఉన్నది మన విన్యాసం!

ఓ రసేంద్రియమా! ఎఱను చూచి లొట్టలు వేస్తూ పరుగులు తీసి గాలమునకు చిక్కుకునే చేపలాగా నాశనమును తెచ్చిపెట్టుకోవద్దు.

ఓ నేత్రములారా! 'నేత్రవృత్తి'తో ఏకత్వము పొంది రూపలోభముచే ఎగిరెగిరి, నిప్పులోనికి పయనించి దగ్ధం అయ్యే మిడతలాగా మీరు రూపాకర్షణలకు లోను కాకండి.

ఓ నాశికమా! సువాసనచే ఆకర్షించబడి పువ్వులో ప్రవేశించి, అక్కడనుండి బయటకు రాలేక శల్యమయ్యే తేనెటీగలాగా కడతేరకు.

❖

**కురఙ్గాలిపతఙ్గేభమీనాస్త్వేకైకశో హతాః ।**
**సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్యాజ్ఞ కుతః సుఖమ్ ॥** (శ్లో 21, సర్గ 51)

ఓ అజ్ఞాన మానసమా! ఏనుగు, చేప, మిడుత, తేనెటీగ – ఇవన్నీ ఒక్కొక్క ఇంద్రియమునకే వశీభూతమై వినాశనము తెచ్చిపెట్టుకుంటున్నాయి. ఇక పంచేంద్రియములు గల ఈ మానవునకు సుఖమెక్కడిది?

ఓ మనస్సా! నీవు పట్టుపురుగును చూచావా? అది తన నుండి సహజంగా వెలువడే 'చొంగ' చేత తన్ను తానే బంధించుకొనుచున్నది. ఆ బంధమును బహుగట్టిగా, సువిశాలంగా నిర్మించుకుని, మధ్యగా తాను విశ్రమించుచున్నది. ఇక ఆపై ఆ బంధనము నుండి బయల్వెడలలేక కృంగిపోతోంది. దిక్కు తోచక అలమటిస్తోంది. నీవు కూడా నిన్ను నీవు బంధించుకోవటానికే ఈ విషయవాసనలను నీ యందు కలిగి ఉంటున్నావు. "ఏదేదో వినాలి, చూడాలి, స్పర్శించాలి, ఆఘ్రాణించాలి, రుచిచూడాలి" అనుకుంటూ బయలుదేరుతున్నావు.

ఎప్పుడు ఎక్కడ ఉంటే అక్కడ ఏవేవో కల్పనలలో ప్రవేశిస్తున్నావు. కళ్ళు మూసినా తెరచినా పరుగులు మాత్రం ఆపవు కదా! కొంచెం సేపు నీ ఇంద్రియ తాదాత్మ్యము ఆపు. నే చెప్పేది శ్రద్ధగా విను.

'పుట్టటం – చావటం' మొదలైన రూపములలో ఉన్న ఈ సంసారరోగమును మనం 'రహితం' చేయాలి. అందుచేత 'కర్మ – ఉపాసన'లచే నీవు శుద్ధిపడు. జ్ఞానవిషయాలు మరలమరల విను. అజ్ఞానం సమూలంగా నశించిందా – ఇక నీకు అనంత విజయం ప్రాప్తించగలదు.

దేనినైనా ఆశ్రయించే ముందు, "ఇది మనకు యోగ్యమా? అయోగ్యమా? యుక్తమా? అయుక్తమా? శ్రేయమా? ప్రేయమా? అర్థమా? అనర్థమా? ఉచితమా? అనుచితమా?" ...అని పరిశీలించాలి. అంతేగాని గుడ్డిగా దుఃఖంలోనో, ఆవేశంలోనో, భయంలోనో, అనుభవంలోనో ప్రవేశించరాదు. ఈ 'జగత్ ప్రవృత్తి' ని కించిత్ పరిశీలించు. ఇదంతా మరణ, దారిద్ర్య, నీరస, యౌవన, వార్ధక్యాలు కలిగి అగమ్యంలోనికి పరిగెత్తుకుపోతున్నది. అశ్రద్ధగా ఉన్నామా మరణానంతర ప్రవృత్తి 'నరక–స్థావర' గతులకు దారి తీస్తున్నది. 'జగత్ ప్రవృత్తి ఇట్టిది' అని మనకు తెలిసి కూడా వాటిని త్యజించకుండా ఎందుకు లీనమై ఉండాలి? మనం అధమత్వాన్ని ఎందుకు ఆశించటం? ఎంత చెప్పినా వినవా? నీవు హితం లేని దానివి కనుకనే నేను చెప్పే హితోపదేశం వ్యర్థమవుతోంది.

❖

సర్వమును విచారించిచూచినవాడు చూస్తూ ఊరుకోడు. చిత్తమును పూర్తిగా నాశనం చేయ వలసిందే. శీతకాలంలో మంచు ఎక్కువగా ఉంటున్నట్లు, అజ్ఞానాధిక్యత ఉన్నంతవరకూ చిత్తము యొక్క ఆధిక్యత ఉండి తీరుతోంది.

వసంతకాలం రాగానే మంచు కరిగిపోతుంది. వివేకము వర్ధిల్లుతుండగా ఈ చిత్తము, ఇది కల్పించే న్యూనత, ఆధిక్యతలు, సుఖ దుఃఖములు తొలగిపోతాయి. వాసనాక్షయం అగుచుండగా చిత్తము తన రూపమునే కోల్పోవుచున్నది.

చిత్తము నందు అవివేకము పేరుకుని ఉన్నప్పుడు ఆ అసద్రూప చిత్తమునకు ఎంత బోధిస్తే మాత్రం ఏం లాభం? వివేకి విషయంలో మాత్రమే శాస్త్రబోధ మహా ప్రభావితమౌతోంది.

అవివేకికి శాస్త్ర శ్రవణం చేసినప్పటికీ చిత్తములో మార్పు ఉండదు. వివేకికి క్రమ క్రమంగా చిత్తమే ఉండదు.

అందుచేత ఓ మనస్సా! నీవు వివేకముచే నశించుటయే స్వభావముగా గలిగి ఉన్నావు. అసద్రూపం అయి ఉన్న నిన్ను ఎందుకు త్యజించరాదు? నీకు బోధించి, క్రమంగా నిన్ను త్యజించటమే మంచిది. లేకుంటే నిన్ను ఊరకే వదిలితే, ఇక నేను కూడా తెలివి తక్కువవాడిని అవవలసి వస్తోందే గాని, ప్రయోజనం ఉండటం లేదే?

❖❖❖

# 4. నేనెవడను? ఈ శరీరమునా? ఒక జీవాత్మనా?

నేనెవడను?... సర్వ వికల్పములకు ఆవల ఉన్నవాడను. నిర్వికల్పుడను. చిత్ రూపము చేత ప్రత్యక్షమై ఉన్నవాడను. అహంకార వాసనా రహితుడను. అహంకారమునకు బీజభూతమైనట్టి చిత్తముతో నాకు ఎట్టి సంబంధం లేదు. అజ్ఞానుల దృష్టికి "ఈ శరీరం నేను. అనేక ఆత్మలలో ఒక ఆత్మను నేను" – అనునట్లుగా తోచుచున్నది. అనేక దుఃఖముల కొరకే మనస్సు అట్టి భావనలను ఆశ్రయిస్తోంది. ఒక మారేడు పిందెలో ఏనుగు ఉన్నదంటే ఎవరు నమ్ముతారు? అనంతమగు ఆత్మ తత్త్వము పరిచ్ఛిన్నత్వమును భావన చేసి, ఆ తదుపరి అధిగమించలేకపోతోంది.

మనస్సు 'దుఃఖ ప్రదములగు వాసనలు" అనే బురదలో ఇరుక్కొనుట చేతనే తదితర యాతనలన్నీ వచ్చి పడుతున్నాయి. వాసనలను ఎల్లప్పుడూ ఆశ్రయించాలనుకొనే ఈ మనస్సును నేను దూరంగా త్యజించివేస్తున్నాను.

"ఈ దేహమే నేను, ఒక ఆత్మను నేను,. వేరువేరు ఆత్మలు తదితరులు" – అనునది మిథ్యాభ్రాంతి నుండి పుడుతోంది. విచారణ శూన్యులగు బాలుర వంటి వారికి అట్టి యోచన వస్తోంది. అదే అహంకారం. అది మహామోహము గాక మరింకేమీ కాదు. విచారణ పరుడగు నాకు అట్టి దుర్వ్యసన పూర్వకమైన అహంకారంతో పని లేదు.

❖

జ్ఞానమే నా స్వరూపం!... కాలు బొటనవేలునుండి శిరస్సు వరకు గల ఈ శరీరము యొక్క అణువణువూ చాలా బాగా విచారించాను. నేను జ్ఞానమాత్రమును. మరింకేదీ కాదు. జ్ఞానమే బాహ్యమున ఈ దిక్కులన్నిటినీ పరిపూర్ణం చేసి ఉంటోంది. అదియే ముల్లోకము లందు ఏకరూపమై వెలయుచున్నది. దాని యందు "దేశ – కాల – దేహ" పరిచ్ఛేదం అంటూ ఏదీ లేనే లేదు. అందు మరొక పదార్థం అంటూ ఏదీ ఉండజాలదు.

దేనికైతే పరిచ్ఛిన్నరూపము గానీ, నామవికల్పముగానీ, ఏకత్వముగానీ, అనేకత్వముగానీ, మహత్వముగానీ, అణుత్వముగానీ ఉండనే ఉండవో... అట్టి జ్ఞానస్వరూపమే నేను.

జ్ఞానస్వరూపుడనగు నేను నా సాక్షిరూపముచే ఈ మనస్సు అనబడుదానిని ఎదురుగా గాంచు చున్నాను. వివేకంచే జనించిన జ్ఞానంచే మనస్సును ఇప్పుడు నా యందు లయం చేసివేస్తున్నాను.

**శరీరం -** ఇక్కడ మాంసము, ఇక్కడ రక్తము, ఇక్కడ బొమికలు, ఇక్కడ ప్రాణవాయువులు – ఇంతేకదా ఈ శరీరం? ఇక ఇందులో 'అహంకారం' అనబడేది ఎక్కడున్నది? ఈ దేహము యొక్క సంచలనాత్మక శక్తి ప్రాణవాయువులకు సంబంధించినది.

ఇందలి జ్ఞానము మహాచైతన్యమునకు సంబంధించినది. 'జన్మ–జర–మరణము' మొదలైనవన్నీ శరీరమునకు సంబంధించినవి. ఇందులో అహంభావముగా ఉన్నదేది?

మాంసము, రక్తము, ఎముకలు, చలనశీలమగు ఇంద్రియములు, ఎఱుగుట (జ్ఞానము) – ఇవన్నీ 'నేను' అను పదమునకు భిన్నమైనవే కదా! కాని ఏమి చమత్కారం! 'నేను' అనునది వాటన్నిటిని 'నావి' అనుచున్నది. ఏది ఏమైనా అవి మాత్రం 'నేను' కాలేవు. మరి ఈ ఉపాధిరూపమున 'నేను' అను అహంభావరూపమున ఉన్నదేది?

చెవులు, ముక్కు, నాలుక, చర్మము, కళ్ళు – వీటన్నిటికీ వేరై, వీటి యందు ఉండి, అనుభవమును పొందుచున్నది ఏది? ఎక్కడిది?

**నేను -** ఈ మనస్సు 'నేను' అను పదముచే ఉద్దేశించబడటానికి వీలులేదు. ఇందు గల వాసనలు కూడా "నేను" అనబడునది అయి ఉండటానికి కుదరదు. కనుక, చిన్మాత్రమగు ఆత్మయే అహంభావరూపమున, లేక 'నేను' అను రూపమున ప్రకాశించుచున్నది.

**ఆరోపిత దృష్టి -** ఇక ఆరోపిత దృష్టితో చూద్దాం. ఈ వినటం, చూడటం, స్పర్శించటం, ఆఘ్రాణించటం, రుచి చూడటం – ఇవన్నీ 'నేను' చేతనే పొందబడుచున్నాయి. అనుభవములన్నీ అనుభవజ్ఞుని ప్రదర్శనలే కనుక అవన్నీ నేనే.

**అపవాద దృష్టి -** "నేను ఏదై ఉన్నాను?" అను ప్రశ్నకు సమాధానం వెతికినప్పుడు, అపవాద దృష్టి (Attributive perception)చే చూస్తే ఇవేమీ నేను కాదు.

'నేను సర్వమును ఎఱుగుచున్నవాడను' అనునదే సత్యము. "ఈ దేహము నేను. దీని తోనే ఉంటాను. దీని తోనే పోతాను" – అనునది మాత్రం సత్యదృష్టి కాదు.

❖

ఆహా! పిచ్చికుక్క వెంటబడినప్పుడు ఒక పిల్లవాడు అనేక వికారములు ప్రదర్శిస్తున్నట్లు, నేను ఇంతకాలం నేను కాని వాటిచేత వికారములు పొందాను. ఎంతో బాధించబడ్డాను. అమ్మయ్యా! సౌభాగ్య వశం చేత ఇంతకాలానికి 'అజ్ఞానము' అనే దొంగను కనిపెట్టాను. పరమార్థమగు 'ఆత్మ జ్ఞానము' అనే సొత్తును అపహరించిన ఆ దొంగ ఆట ఇక సాగనివ్వను.

ఎందుకంటే, నేను స్వతహాగా దుఃఖరహితుడనే. అట్టి నేను దుఃఖములు పొందటమేమిటి? ఆకాశమునకు, మేఘములకు సంబంధముంటుందా? అవి రెండూ ఒక్కటి అవుతాయా? లేదు అట్లాగే ఈ దుఃఖములకూ, నాకూ సంబంధం లేదు.

❖

నవరసాలు పోషించే నటునిలాగా 'అహంకారం' అనే వేషం ధరించి నేను నా మనస్సుకు ఉపదేశాలు చేస్తున్నాను. ఈ శరీరం ధరించి, శరీర సంబంధ మాత్రములైన 'తెలుసుకోవటం, ఉండటం, రావటం, పోవటం' మొదలైనవి నిర్వర్తిస్తున్నాను. అయితే, ఆత్మ సందర్శనం చేత నేను అసలు అహంకారవిషయుడనే కాను. నటుడు తాను వేసే వేషం కంటే వేరైన వాడే కదా!

నేను లేకపోతే ఈ కళ్ళు ఉండవు, చూపు ఉండదు, చూడబడేవీ ఉండవు. నా కంటే వేరుగా చూస్తే వాటికి ఉనికి లేదు. అవన్నీ ఈ దేహము నందో, లేక, మరెక్కడనో ఉంటే ఏమున్నది? లేక పోతే ఏమున్నది? నేను వాటన్నిటికీ సంబంధించినవాడను కాను.

ఏమి చమత్కారం! చెట్టు మీద భూతంలాగా ఈ జగత్తు నందు పచార్లు చేసే ఈ 'అహమ్' అనునది ఎవరు? ఎవనిచే, ఎప్పుడు, ఎట్లు, ఎందుకు కల్పించబడుచున్నది? –ఈ ప్రశ్నకు రాకుండానే నేను ఇంతకాలం గోతిలో చిక్కిన లేడిలాగా పడిఉన్నానేమిటి?

ఈ కన్ను ఏదో 'రూపము' అనే విషయాన్ని చూస్తోంది. అది ఆ రూపమును గాంచుట యందు నిమగ్నమై ఉండగా, ఇక ఆ దృశ్య విషయమును 'ఇది దుఃఖ విషయము' అను అర్థమును ఇచ్చి తదనుభవం పొందుచున్న నేనెవడిని?

ఈ త్వక్ (చర్మము) స్పర్శయందు ఉన్ముఖమగు చుండగా, "ఆహా! బాగుగదా!" అని చెప్పుచూ దుష్ట పిశాచంలాగా పాల్గొనుచున్న అహమ్ ఎవరు?

నాలుక రుచిని స్వీకరిస్తూ ఉండగా "ఇప్పుడు భుజిస్తున్నాను. ఇవి ఎంత రుచిగా ఉన్నాయి!" – అనే దుష్టభ్రమ కలుగుచున్న దెవరికి? చెవుల శబ్దమును పొందుతూ ఉండగా "అయ్యో! ఈ మాటలచే నన్ను ఇంతగా అవమానిస్తున్నారా?" – అనే దుఃఖమును పొందుతూ, అతి దీనంగా స్పందిస్తున్నది ఎవరు? ఈ ముక్కు ఏదో వాసన పొందుచుండగా "అబ్బే! ఏం బాగోలేదు" అనుకుంటూ చెప్పుచున్నదెవరు?

**అహంకార కల్పన! -** ఈ ఇంద్రియములు తమ పనులు చేస్తూ ఉంటే, వాటి యందు, మృగతృష్ణా జలం లాగా అహంకారం వచ్చి తేలియాడుచున్నది. కనుక... "ఈ దేహేంద్రియాదులే నేను" అనే "భావన" భ్రాంతి నుండి, బూటకపు కల్పన నుండి బయలుదేరుతోంది. ఈ దేహేంద్రియాదుల పట్ల గల అహంభావము ఇప్పుడు నాచే పరిత్యజించబడుగాక!

❖

ఈ దేహమును కదల్చుచున్న దెవరు? వాసనలా? ...లేదు. ఎందుకంటే, ఒకడు సదభ్యాసం చేత వాసనా రహితుడైనప్పటికీ ఈ దేహము తన జీవన హేతువగు కర్మయందు ప్రవర్తన కలిగియే ఉంటోంది. 'కనుక శరీరవ్యాపారమునకు వాసనలు కారణం' అనటానికి వీలులేదు. వాసనలు దేనికి సంబంధించినవో ఈ దేహకర్తృత్వం అద్దానిది అవుతుంది.

❖

ఓ మలిన చిత్తమా! నేనిప్పుడు చేస్తున్న విచారణ అంతా నీవు గమనిస్తున్నావు కదా! ఒక్క విషయం గ్రహించు. వాసనారహితంగా జరుగుచున్న కర్మ వ్యవహారము లందు 'నేను దుఃఖిని' అనే అనుభవం ఉండజాలదు. వర్తమాన కర్మలు ఎప్పుడైతే వాసనారహితమౌతాయో, ఇక "భవిష్యత్తులోని సుఖ – దుఃఖానుభవములు" కూడా ఉండజాలవు.

అదియే వాసనాత్యాగం. మూర్ఖులగు ఓ ఇంద్రియములారా! మీరు మీ వాసనలను త్యజించి, అటుపై యథాతథంగా మీ పనులను నిర్వర్తించారా – ఇక మీరూ, నేనూ దుఃఖం పొందము. ఒక బాలుడు మట్టితో బొమ్మ తయారు చేసుకొని, ఆడుకుంటూ, అది పగిలిపోతే పెద్దపెట్టున ఏడుస్తాడు చూచారా? మీరు కూడా విషయ సముపార్జన యందు శ్రమిస్తున్నారు. కోల్పోతున్నప్పుడు దుఃఖం పొందుతున్నారు. ...అందుకు వాసనలు కలిగి ఉండుటే కారణం.

ఓ ప్రియమైన శుద్ధ చిత్తమా! అదిగో, ఆ తటాకంలో తరంగములు అగుపిస్తున్నాయి కదా! ఒక ప్రశ్న వేస్తున్నాను. ఆ తరంగములు జలము కంటే వేరా? కాదు. ఈ వాసనాదృష్టులు కూడా జ్ఞానదృష్టితో చూస్తే "ఆత్మ కంటే వేరు కాదు" – అని గ్రహించు.

ఓ ఇంద్రియములనే పిల్లవాళ్ళల్లారా! పట్టుపురుగు తన దారములో చిక్కుకొని నశించునట్లు మీరు మాయందు బయలుదేరే తృష్ణ యందు చిక్కుకొని వ్యర్థముగా పరితపించకండి.

కొండను ఎక్కుచున్న బాటసారి వడదెబ్బకు క్రిందబడి కొట్టుకొంటున్నట్టు మీరు 'సంసారం' అనే ముళ్ళ ప్రదేశంలో పడి కొట్టుకోకండి. పూలను దారం బంధించి ఉంచుతున్నట్లు మీరు బంధింపబడి ఉండుటకు వాసనలే కారణం.

'వాసనలు' అనబడేవి ఎక్కడి నుండి వచ్చాయి? భ్రాంతి నుండే! భ్రాంతిచే కల్పించబడేవి యథార్థం కాదు. అవి 'సంకల్పించకపోవటం' అనే శస్త్రం చేత సులభంగా ఛేదించబడగలవు. గాలి వాటుకు దీపం ఆరిపోవుచున్నట్లు వాసనలే అజ్ఞానానికి, వినాశనానికి హేతువులు అగుచున్నాయి. చిత్తము అనగా వాసనలే.

❖

**హే చిత్త సర్వేన్ద్రియకోశ తస్మాత్స ర్వేన్ద్రియైరైక్యముపేత్య నూనమ్ ।**
**ఆలోక్య చాత్మానమసత్స్వరూపం నిర్వాణమేవామలబోధమాస్స్వ ॥** (శ్లో 69, సర్గ 52)

సర్వ ఇంద్రియములను ఆయా పనులకు పురమాయిస్తూ క్రింద – మీద చేసే ఓ చిత్తమా! ఇప్పటి దాకా మనం చెప్పుకున్న విచారణలోని ఆయాకారణాల వలన ఒక క్రొత్త విషయం వెలికివస్తోంది.

నీవు కూడా తదితర ఇంద్రియములలాగానే అసత్తువు, ఉపకరణ మాత్రము అయి ఉన్నావు. ఇక నుండి సాక్షిరూపమైన 'ఇంద్రియరూప మాత్రము' అయి ఉండు. వేద శాస్త్రజ్ఞులు మనకేం చెప్పుచున్నారు? "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "ద్వితీయమైనదంటూ మరొక్కటేదీ స్వయం ఉనికి కలిగి ఉండలేదు" – అని కదా! మనం దీనిని చక్కగా గ్రహిద్దాం. అంతేగాని భ్రమను కలిగి ఉండవద్దు. భ్రమ అనే విషూచి అనంత దుఃఖదాయకమైయున్నది. 'అహంకారము కలిగి ఉండుట' అను అలవాటే ఆ భ్రమ, లేక, వాసన యొక్క స్వరూపం. అదే అనేక సార్లు అజ్ఞాన ప్రేరితమైన విషయ అభిలాషలను కలుగజేస్తోంది. ఆత్మతో సంబంధమును, ఏకత్వమును అనుబంధమును దూరం చేస్తోంది.

'ద్వైతము / ద్వితీయము' అనే విషూచిని మనం అతి నిపుణతతో అధిగమిద్దాం... త్యజిద్దాం. ఓ మిత్రమా! చిత్తమా! నీవు సంసారరహితుడవు కమ్ము. ఈ జనన – మరణాది సర్వభయములను త్యజించు. పూర్ణానంద స్వరూపుడవు కమ్ము.

❖❖❖

# 5. నిర్లిప్తుడను - అప్రమేయుడను - అసంగుడను

**ఉద్దాలకుడు** : “అనంతాకారయుతము, అత్యంత సూక్ష్మము, విషయరహితము” అగు నా ఆత్మ స్వరూపమును ఈ వాసనలు కొంచమైనా స్పృశించగలవా? లేదు.

బాలుని దృష్టిలో ‘బేతాళుడు’ అనే లేని ఆకారం కల్పించబడుచున్నదే! అట్లాగే బుద్ధి యందు అహంకారము, సూక్ష్మవాసనలు కల్పించబడుచున్నాయి. అట్టి వాసనల సహాయంతో మనస్సు జడములను ఉపయోగించి తదితర జగత్తును పొందుతోంది. మనస్సు జాగ్రత్తు నందు, ఇంద్రియ విషయము లందు పాల్గొనుచూ అనేక జాగృత్‌దృశ్యానుభవములు సంపాదించుకుంటోంది. అదే మనస్సు స్వప్న సమయంలో భావనచే వాసనామయ విషయములను నాడీ ప్రదేశంలో పొందుతోంది.

మనస్సు యొక్క ‘జాగ్రత్, స్వప్న’ – అనుభవములు నా సమక్షంలో జరుగుచున్నాయి. నేనో... చిత్స్వరూపుడనై, నిర్లిప్తుడనై అంతా వీక్షిస్తూ ఉన్నాను.

నా స్వరూపమైనట్టి ‘చిత్తు’నకు జనన మరణములు లేవు. ‘సర్వవ్యాపి, నిరాకారము’ అయిన చైతన్యము నందు ఉద్భవించేదేది? నశించేదేది?... కాబట్టి, జీవుడు దేని యందు నశిస్తాడు? జీవుని యందు ఏది నశిస్తుంది?... స్వస్వరూపమగు ‘చిత్తు’ నకు ఈ శరీరాదుల యొక్క రాక పోకలచే క్రొత్తగా వచ్చేదేమున్నది? కోల్పోయేదేమున్నది?...

ఎందుకంటే... ‘సర్వాత్మ’ యగు చైతన్యమే అందరి యొక్క జీవనము. అట్టి చైతన్యమే నేను. సమస్త దేశ కాలము లందూ, సర్వ వస్తువులందూ చిత్ స్వరూపమే వ్యాపించియున్నది. మరప్పుడు ‘జీవించు కాలము, జీవించని కాలము’ అనేవి ఎక్కడున్నాయి? అనగా, నా స్వస్వరూపమగు చిత్తునకు జీవన – నిర్జీవనములు లేవు. ఏ కాలంలోనూ ఏదీ అభిలషించ వలసిన పనే మీలేదు.

“ఇది మరణించుచున్నది, ఇది జీవించుచున్నది” – ఇట్టి అనేక వికల్ప కల్పనలన్నీ కేవలం మనస్సుకే గానీ, నిర్మలమగు ఆత్మకు కావు. ఏ అంతరంగమైతే “ఈ దేహాదులే నేను” అను దురహంభావనను తన యందు ఏర్పరుచుకొని ఉంటోందో ...అట్టి అంతరంగము మాత్రమే తన యందు జనన మరణాదులను పొందుతోంది. ఆత్మ యందు మాత్రం ‘అహమ్’ భావన గాని, మరే భావన గానీ ఉండవు. ఇక దానికి జనన మరణాదులు ఎక్కడుంటాయి? మృగతృష్ణ మిథ్యాభ్రమ అయినట్లు; దేహము, మనస్సూ – ఈ రెండూ మిథ్యయే. వాటి యందు ప్రతిబింబించే ‘అహంకారము’ మాత్రం సత్యమైనదెట్లా అవుతుంది? ...జడమే కదా ... అభిమానం దేనికి?

ఈ కనబడే పదార్థముల విషయానికి వస్తే ... ఇవన్నీ కూడా జడమైనవే కదా! ఈ శరీరం కూడా ఒక జడపదార్థం మాత్రమే. ఇది స్వయముగా ఏదీ చేయుటలేదు.

చైతన్యస్వరూపుడనగు నేను ఈ దేహము మొదలైన జడపదార్థములపట్ల అభిమానం ఎందుకు కలిగి ఉండాలి?

❖

ఈ పదార్థములన్నీ ఉన్నప్పుడూ, లేనప్పుడూ కూడా నేను ఉన్నాను. ఈ రక్తమాంసమయ దేహమునందు లీనమగుచూ, 'ఇది నాది' అని తలచుచున్న మనస్సును చూస్తే నాకు జాలివేస్తోంది. అట్టి అభిమానము విచారణ చేసినప్పుడు తప్పక నశించుచున్నది.

మనస్సు – చిత్తము – బుద్ధి అనునవి స్వయంగా చైతన్యములు కావు. జడములు మాత్రమే! అవి మరొక దానిచే ప్రవర్తింపజేయబడుచున్నాయి. అవి కల్పనలోని విభాగములు. కనుక అవి అహంకారము అను దానిని తామే సృష్టించగలవా? ...లేదు. ఇక ఈ దేహంలో ఇంద్రియములున్నాయి కదా!... ఇవి ఉపకరణములు మాత్రమే. ఇవి 'రూపము' మొదలైన విషయములను సాక్షాత్కరింప జేయుటలో నిమగ్నమై ఉన్నాయి.

ఈ బాహ్యపదార్థములు తమ తమ పదార్థత్వమును వ్యక్తపరచుట యందు స్థితి కలిగి ఉన్నాయి. వాటన్నిటి యందూ 'నేను' అనునది ఎక్కడున్నది? ఇవన్నీ నాచే ఉపయోగించబడుచూ, 'తెలుసుకోబడుచున్నవి' అయి ఉన్నాయి.

ఇక 'గుణములు' విషయం!... శాస్త్రకారులు గుణములను సత్వము రజము తమము – అను మూడు విధాలుగా విభజించారు. ఈ సత్వరజోతమస్సులు "ప్రకాశము (తెలివి) పొందుట, ప్రవృత్తిని పొందుట, మోహము పొందుట" – అను మూడు రకాలుగా ఏర్పడి ఉంటున్నాయి. ఈ త్రిగుణముల రకరకాల పాళ్ళకలయికయే ప్రకృతి. మాయ, ప్రధానము అని కూడా దీనిని పిలుస్తారు.

గుణములు ఎవరివి? ...గుణివి (one who is exhibiting qualities). గుణి లేకుంటే గుణాలు ఉండవు. కనుక గుణములు స్వయంగా జడములు మాత్రమే. గుణి గుణములకు ముందే, గుణాల కంటే సూక్ష్ముడై, గుణములకు స్థానమై, కారణమై ఉంటున్నాడు. అతడు గుణములకు అప్రమేయుడు.

గుణి యొక్క స్వరూపము 'సత్ బ్రహ్మము'. అది సర్వదా తన స్వాత్మభావన యందు నెలకొని ఉన్నది. అది అఖండము. "అహంకారము" అనబడేది అఖండమగు సత్ బ్రహ్మము నందు చోటు పొందజాలదు. అనగా 'అహంకారం' అనేది ఎక్కడా, ఏ రూపంలోనూ ఉండజాలదు.

❖

బాగున్నది!... అయితే, ఈ 'జీవుడు' అని తారసపడేవాడెవడు? ఒకే సూర్యుడు అద్దం లోనూ, తటాకం లోనూ, కళ్ళ యందు ప్రతిబింబిస్తున్నాడు కదా! ...అదేవిధంగా ఒకే చిత్తు ఈ దేహము లన్నిటి యందూ ప్రతిబింబిస్తోంది.

అనగా... ఈ దేహమున కనిపించే చిదాభాసుడు పరమానంద చిదాత్మయే. సర్వవ్యాపి, సర్వకాలమయుడు, మహత్తరరూపుడు అగు చిదాత్మ సర్వదేహము లందూ 'దేహి' గా వెలయుచున్నాడు. అట్టి మహత్తర రూపునకు 'ఈ దేహము నాది' అను దేహాభిమానము, అహంకారము ఎట్లా కలుగుతాయి. కనుక అట్టి అల్పభావము ఆపాదితమే గానీ, వాస్తవం కాదు.

**దేహి -** ఈ దేహము నందు దేహిగా అభిమానం కలిగి ఉంటున్నవాడెవడు? వాని ఆకారము ఎట్టిది? ఆతడు ఎట్లా ఏమని నిరూపించబడతాడు? ఆతని రంగేమిటి? రూపేమిటి? ఏ పదార్థముచే ఆతడు తయారగుచున్నాడు?

అహం భావము ప్రదర్శిస్తున్న నేనెవరిని? నేను అహంభావమునా? అందుకు వేరైన వాడినా? అహంభావము నాచే గ్రహించబడుచున్నదా? లేక, నేను అహంభావముచే గ్రహించబడుచున్నావా? అహంభావము నన్ను కల్పిస్తోందా? నేను అహంభావమును కల్పించుకుంటున్నానా?

**భావాతీతం! -** ఇట్లు యోచించినప్పుడు 'నేను అహం భావమునకు మునుముందే ఉండి ఉన్నాను" అని తెలిసిపోతోంది. ఈ భావాభావములు నా యందు గానీ, భావాభావముల యందు నేను గానీ లేము.

అవును. ఈ ప్రపంచమున 'అహంభావాభిమాని' అనువాడెవ్వడూ యథార్థానికి లేదు. కనుక నేను అహంకార రహితమగు చిదాత్మ స్వరూపుడను. అట్టి నాకు ఎద్దానితోనూ ఏ సంబంధమూ లేదు. అహంకారము అసత్తేనని నిరూపించబడుతోంది కదా! ఇక ఎవనికి దేనితో ఏమి సంబంధం? అట్టి సంబంధము యొక్క అభావము సిద్ధిస్తున్నప్పుడు సర్వద్వైతకల్పనలూ వాటంతట అవే నశిస్తున్నాయి. మరి నేను నిర్లిప్తుడను, అప్రమేయుడను, అసంగుడను కదా!

❖❖❖

# 6. ఇక శోకం దేనికి?

ఈ విధంగా ఈ జగత్తంతా బ్రహ్మాత్మకమే అయి ఉన్నది. సత్స్వరూపుడనగు నేను ఎందుకు వ్యర్థంగా శోకించాలి? అన్ని సమయాలలోనూ నేను అద్వైత సామ్రాజ్యమున స్థితుడనై ఉన్నానని నిరూపించబడుతోంది కదా!

ఈ జీవుడు చేరతగ్గ అన్నిటికన్నా ఉత్తమోత్తమ స్థితి ఏది? ...ఏకమై, నిర్మలమై, సర్వవ్యాపకమై శుద్ధమై ఉన్నట్టి ఆత్మపదమే – అన్ని రూపు లందు, అన్ని దిక్కులందూ, అన్ని వేళలందూ వెలయుచున్నది. మరి 'అహంకారము' అనే కళంకమే అసంభవం. అహంకారమనేది లేనే లేనప్పుడు, ఇక దానిని 'తొలగించుకోవాలి' – అనేది ఎక్కడుంది? అట్టి ప్రసక్తి అక్కర్లేదు.

**పదార్థములు లేవు ఆత్మ మాత్రమే ఉన్నది -** యథార్థానికి పదార్థజాలమంటూ ఎక్కడా ఏదీ లేదు. సర్వవ్యాపియగు ఆత్మ మాత్రమే ఉన్నది. ఒకవేళ అభాస మాత్రం చేత ఎప్పుడైనా పదార్థముల ఉనికి సంభవించినా, ఆత్మతోటి వాటికి ఎట్టి సంబంధమూ లేదు. బాహ్యపదార్థములు – ఆత్మదృష్ట్యా చూస్తే – అవన్నీ ఆత్మచే కల్పించబడి, భావించబడుచున్నవే! ఆత్మ నిర్వర్తించే మననమే తన రూపముగా గల ఈ మనస్సు ఇంద్రియములతో గూడి, స్వప్న దృష్టాంతములాగా విజృంభిస్తోంది. అది పొందుచున్న భావన అంతా తనకు తానే కల్పించుకొనుచున్నది. అది తనకు బాహ్యమైన పదార్థములేవీ సాక్షాత్కరించు కోలేదు. బాహ్యపదార్థము లేవీ దానిని స్పృశించజాలవు. కల్పనయే మనస్సును – పదార్థములను ఒక చోటికి తెచ్చుచున్నది. కనుక ఈ జగత్తు యొక్క అసలు రూపం కల్పన మాత్రమే.

ఇక చిత్ ఎల్లప్పుడూ నిర్లిప్తమైనది. అది మనస్సుతో గానీ, ఇంద్రియములతో గాని, బాహ్య పదార్థములతో గానీ సక్తము (Attached / Involved) అగుటలేదు. వాటన్నిటికీ అది అతీతమై, అనిర్వచనీయమై ఉంటోంది. వాస్తవానికి – 1. బాహ్యపదార్థములు, 2. ఇంద్రియములు, 3.

మనస్సు, 4. చిత్ – ఈ నాలుగు ఒక దానితో మరొకటి కలియకుండానే తమ తమ స్థానములలో ఏర్పడి ఉంటున్నాయి. రాయి, మణి, లోహము, త్రాడు (సూత్రము) ఒకచోట ఆభరణ రూపంలో ఉన్నా అవి ఒకదానికి మరొకటి వేరే కదా!

**అజ్ఞానము నుండి అహంకారము -** అజ్ఞానము చేతనే మహాభ్రమ ఉదయిస్తోంది. అట్టి మహాభ్రమ వలన 'ఇది నాది, ఇవి ఇంకా పొందాలి' అనే వ్యవహారం ఏర్పడుతోంది. వాస్తవం ఎరుగక పోవటమే అజ్ఞానం. అది జగద్భ్రాంతిగా పరిణమిస్తోంది.

ఆత్మతత్త్వము ఏమరుస్తున్నప్పుడు 'అహంకారము' అనే చమత్కృతి ఉదయిస్తోంది. వేడి ఉన్నచోట మంచు ఉంటుందా? ఆత్మను దర్శించగానే – అహంకారము, పదార్థభావనా, – రెండూ తొలగిపోతాయి. అనగా అవి లేనివిగా తెలియవస్తాయి.

ఆత్మకు భిన్నమైనదేదీ లేదు. అంతయు బ్రహ్మమే అయి ఉన్నది. కాబట్టి బ్రహ్మమునే భావనచేస్తాను.

**అహంకారభ్రమస్యాస్య జాతస్యాకాశవర్ణవత్ ।**
**అపునః స్మరణం మన్యే నూనం విస్మరణం వరమ్ ॥** (శ్లో 25, సర్గ 53)

ఆకాశంలో కనిపిస్తున్న నీలపు రంగులాగా మిథ్యారూపంగా కనిపిస్తున్న ఈ అహంకారం నా స్మృతి పథంలో పూర్తిగా తొలగేంత వరకు అధిగమించివేస్తాను. అట్లు అధిగమించిన తరువాత, శేషించుచున్న ఆత్మస్వరూపము నందు ఆత్మ స్వరూపుడనై ఉంటాను. శాంతాత్ముడనై, నిర్మలాకాశమువలె అనంతత్వము, అఖండత్వము, శుద్ధత్వము, శాశ్వతత్వము వహిస్తాను. మూల అవిద్య సహితంగా అహంకార భ్రమను సర్వదా త్యజించివేస్తూ ఆ భ్రమకు కూడా సర్వదా సాక్షిమాత్రుడనై ఉంటాను.

❖

**లాభం, నష్టం -** వృద్ధి, క్షయములు తమ స్వభావముగా గల ఈ దేహాదులపట్ల 'ఇది నేను, ఇది నాది' అను అహంభావము ఎన్ని అనర్థాలు కలుగ జేస్తోంది! ఎన్నెన్ని తాప, సంతాపములకు కారణమగుచున్నది! అవును. హృదయాకాశంలో 'అహంకారము' అనే మేఘం స్ఫురించగానే, ఇక దుర్వాసనలతో గూడిన ఈ దేహాదులు మరల మరల ఉత్పన్నం అవుతూనే ఉన్నాయి. దేహములను అనుసరించినంత కాలం ఇహ పరలోకములు, మరణములు, పునర్జన్మలు, దుఃఖములు కలుగుతూనే ఉంటాయి.

అహంకారము అనే గ్రద్దకు కనబడుచున్న భోగ్యపదార్థములన్నీ ఎప్పటికో అప్పటికి నాశన మయ్యేవే కదా! పాపం, అజ్ఞానులగు అనేకమంది జీవులు, "ఇంత వరకూ ఇది పొందాను. ఇహ ఇక్కడి నుండి ఇది పొందబోవుచున్నాను" అను రూపంలో అంతరంగంలో అవిశ్రాంత భావోద్రేకం కలిగి ఉంటున్నారు. అట్టి అంతఃకరణము జ్ఞానాగ్ని చేత దగ్ధమొనర్చబడు గాక! "ఇది ఉన్నది, ఇది లేదు" – అనునట్టి చింతలన్నీ భ్రమకల్పితమగు అహంకారము వైపుగానే సారించబడుచున్నాయనీ, ఆత్మ వైపునకు కాదనీ జనులంతా గుర్తించెదరు గాక!

❖❖❖

# 7. ఈ జీవుడు గమనించడేం?

**అహంభావే పరిక్షీణే శుష్కః సంసారపాదపః ।**
**భూయః ప్రయచ్ఛత్యరసో న పాషాణవదఙ్కురమ్ ॥** (శ్లో 32, సర్గ 53)

**ఉద్దాలకుడు :** ఈ దేహాదులందు ఎప్పుడైతే అహంభావము క్షయిస్తుందో, అప్పుడిక సంసారవృక్షము ఎండి నీరసించగలదు. ఆత్మజ్ఞానం ఉన్నచోట రాగము గాని, ద్వేషము గాని, తృష్ణ గాని ఉండవు. మనస్సు నందు "ఈ ప్రపంచం మిథ్యయే" అను ఉన్నతమైన నిశ్చయం దృఢపడిందా ... ఇక భోగ వాసనలు సన్నగిల్లుతాయి. మనస్సు చిత్ ప్రతిబింబమును నిర్మలస్వభావముతో కూడి గ్రహిస్తూండగా, క్రమంగా సంకల్ప – వికల్పములను త్యజించగలుగుతుంది. రాగరహితమైనప్పుడు శుద్ధమగుచున్నది. ఆత్మను దర్శించినప్పుడు స్వస్థత పొందగలుగుచున్నది.

ఈ చిత్తము తన అవయవరూపములైనట్టి ఈ ఇంద్రియములను బహిర్ముఖము నుండి అంతర్ముఖము వైపుగా తరలించినప్పుడు తత్త్వజ్ఞానం ఉదయిస్తోంది. జ్ఞానాగ్నిలో తనకు తానే దగ్ధమై, ఆత్మ ప్రకాశంచే నిర్మలత్వం పొందుతోంది. "ఆహా! ఈ దేహం నా కంటే భిన్నమైనది కదా!" అని గ్రహించినదై విషయవాసనలను త్యజిస్తోంది. స్వవినాశనమును కూడా అంగీకరించి గొప్ప దేశభక్తి గల యుద్ధవీరుని వలె 'బ్రహ్మతత్త్వము' అనే సామ్రాజ్యమునకు తన సేవలను అందిస్తోంది.

❖

ఈ మనస్సును శుద్ధపరచటంలో అశ్రద్ధగా ఉన్నామా... ఇది దేహానికి సంతాపం కలుగ జేస్తూ ఉంటుంది. అట్లాగే, దేహము మనస్సునకు సంతాపకరము అగుచున్నది. కుండ పగిలితే అందులోని నీళ్ళు తొలగుతాయి కదా! అలాగే ఈ మనో దేహములలో ఒకదాని వాసనలు నశిస్తే, రెండూ నశిస్తాయి. కుండలోని నీరు కుండను ఆశ్రయించుకుని ఉన్నట్లు శరీరము, మనస్సు ఒకదాని కొకటి కాస్త సహకరించుకుంటున్నాయి. అయితే, ఇంతలోనే, పరస్పరం సంతాపకారణమయి, ద్వేషించుకుంటున్నాయి. అవిద్య నశిస్తే, ఆ రెండూ 'లేనివి' అగుచున్నాయి. ఆ రెండూ రహితత్వమును సంతరించుకున్నప్పుడు ఈ జీవునకు పరమసుఖము లభించగలదు. ఆ రెండిటిలో ఏ ఒక్కటి ఉన్నా ఈ జీవునకు దుఃఖము శమించటమనేది కల్ల. విరుద్ధ స్వభావం కలిగిన ఈ మనోదేహములు ఎక్కడ ఉంటే అక్కడ దుఃఖపరంపరలు వచ్చి పడుతూనే ఉంటాయి. ఈ రెండిటి సంబంధము వలననే జీవునకు విషయసుఖము లందు ఆసక్తి జనించుచున్నది. అట్టి దౌర్భాగ్యం తప్పక గమనించ వలసిన విషయం.

బాలుడు పిశాచముల యొక్క కల్పన చేసుకుంటూ ఉంటాడే!... అట్లాగే ఈ మనస్సు తన సంకల్పముల చేతనే ఈ దేహమును కల్పించుకొనుచున్నది. ఈ శరీరమును ఒక వైపు నుండి భోజనము మొదలైన వాటిచే పుష్టిచేస్తూ, మరొకవైపు నుండి తన దుఃఖములన్నీ ఈ దేహమునకు అంటగట్టుచున్నది. మనస్సుచే దుఃఖములను అందుకున్న ఈ శరీరం దుర్వ్యసనములను సేవిస్తూ,

రాగ–ద్వేష–శోక–మోహ–లోభ–పాపాదులను ఉత్పన్నం చేస్తూ, తద్ద్వారా జనించిన కుసంస్కారాలను మనసులోనికి నెట్టుచున్నది. అనగా, మనస్సుకే ద్రోహం తలబెట్టుచున్నది. కన్నకొడుకే తండ్రిని బాధించునట్లు ఈ శరీరము మనస్సు యొక్క భ్రమను అధికం చేస్తోంది.

❖

ఇక ఈ అనేక జీవుల పరస్పర సంబంధం ఇంకా చమత్కారంగా ఉంటోంది. స్వతఃగా చూస్తే ఒకడు మరొకనికి మిత్రుడూ కాదు, శత్రువూ కాదు. కాని సుఖకల్పనచే 'మిత్రుడు', దుఃఖ, భయకల్పనచే 'శత్రువు'లను మనస్సు పొందుచున్నది.

**నాస్తి శత్రుఃప్రకృత్యైవ, నచమిత్రం కదాచన,**
**సుఖదం మిత్రమిత్యుక్తమ్, దుఃఖదా శత్రువత్స్మృతాః ॥**

ఎవరి వలన సుఖం లభిస్తుంటే ఆతడు మిత్రుడని, ఎవరి వలన దుఃఖం సంభవిస్తుందో ఆతడు శత్రువని మనస్సుచే ప్రతీతి ఏర్పరచబడుచున్నది.

ఈ శరీరం దుఃఖములను అనుభవిస్తూ మనస్సును హింసిస్తోంది. ఇక మనస్సు కూడా తన సంకల్పములచే ఈ దేహమును దుఃఖానుభవ స్థానంలో కూల్చివేస్తోందాయె! ఇట్టి పరస్పర దుఃఖ దాయకము, స్వభావ విరుద్ధములైన దేహమనస్సుల పోకడలను ఈ జీవుడు గుర్తించకున్నాడేం?

మనస్సు నశిస్తే శరీరము దుఃఖం పొందదు. అందుచేత "శ్రద్ధ – అసక్తి – అత్యవసరము" లతో కూడిన ప్రయత్నం చేసి జ్ఞానమును, తత్సాధనములను సమకూర్చుకొనెదనుగాక! మనస్సునకు ఆత్మజ్ఞానం కలుగనంతవరకూ ఈ దేహం ఉండి ఏం లాభం? లేకపోయి ఏం లాభం? అనర్థములు తప్పునవి కావు.

ఓ మనోదేహములారా? మీరిద్దరూ పైకి ఒకరికొకరు సహకరించుకున్నట్లు ఉన్నా, లోలోన ఒకరిని మరొకరు హింసించుకుంటున్నారు. అయితే 'అభేదాధ్యాస' (A Sense beyond all differences)చే ఏకరూపులగుచున్నారు. వంట చేసేటప్పుడు అగ్ని, జలము సహకరిస్తున్నట్లు మీరిద్దరూ మోక్షోపాయ సాధనల విషయంలో నాకు సముచితంగా సహకరించండి.

❖

మనస్సు నశిస్తే దేహము వాసనారహితమగుచున్నది. అప్పుడు దేహరాహిత్యము అనుభవమౌతోంది. కానీ, దేహం నశించినా మనస్సు నశించటంలేదు. అందుచేత వివేకముతో ముందుగా మనస్సును నశింపజేస్తాను. 'సంకల్పము – తృష్ణ' అను రెండు చక్రములు గల ఈ మనస్సును త్యజించి, తత్ఫలితంగా ప్రాప్తించే 'పరమాత్మ' అనే విశాలభూమిలో ప్రవేశించి ప్రశాంతంగా, సుఖంగా ఉంచుతాను. క్షయిస్తున్న మనస్సు క్రమంగా తన స్వభావమైన వాసనాపరంపరలను కూడా క్షయింపజేస్తుంది కదా! ఇక నాకు దుఃఖించుటకు విషయములేమి ఉంటాయి?

చర్మ – రక్త – మాంస – బొమికలతో కూడిన ఈ శరీరం అల్పాశయునకు శత్రువు వంటిదే. అయితే, మనస్సు ఉంటే ఇది శత్రువులా ప్రవర్తిస్తుంది. మనస్సు ఉపశమిస్తే ఇది ఉన్నా ఒక్కటే,

లేకున్నా ఒక్కటే. దానితో నాకు సంబంధమే ఉండదు కదా! అజ్ఞానదశలో ఉన్నప్పుడు ఏఏ భోగములను ఆకాంక్షించానో - అట్టి భోగములతో నాకేమి సంబంధం లేదు. ఈ శరీరమునకు సంబంధించిన సుఖావేశములతో నాకేమి పని?

❖

ఓ 'ఉద్దాలకుడు' అను పేరుచే ఆరోపించబడినవాడా! నేను దేహమును గాని, నామమును గాని, మనస్సును గానీ కాదు. నా యందు స్ఫురించే ఈ నామ రూపముల కంటే ఆత్మ అత్యంత విశిష్టమైనది.

ఒక ఉక్తి చెపుతాను... విను. ఈ శరీరం మరణించినప్పుడు, ఇక్కడ కాళ్ళు - చేతులు - తదితర దేహము ఉన్నప్పటికీ అది కదలగలదా? లేదు. కానీ, ఈ దేహంతోబాటే నేను లేకుండాపోయే వాడను కాదు. ఈ దేహమునకు అతీతమైన వాడను. ఇచ్ఛాశక్తిచే ఈ దేహమును కదిలించేవాడను. అదలించేవాడను. నిత్యుడను. నిరంతర ప్రకాశ శీలుడను. వ్యాపక స్వరూపుడను. సూర్యమండలమందలి సూర్యునితో కూడా సాంగత్యం పొంది, అట్టి ఆకాశములోని సూర్యుని ఎరుగుచున్నట్టివాడను. అంతేగాని, కేవలం అజ్ఞుడను, దుఃఖిని కాదు. నాకు దుఃఖము గానీ, దుఃఖత్వము గానీ, అనర్థత్వము గానీ లేవు. దేహం ఉన్నా, పోయినా నేనెప్పుడూ సంతాపరహితుడనే.

**యత్రాత్మ తత్ర న మనో నేన్ద్రియాణి న వాసనాః ।**
**పామరాః పరితిష్ఠన్తి నికటే న మహీభృతః ॥** (శ్లో 74, సర్గ 53)

ఆత్మ ఎప్పుడైతే వికసిస్తుందో - ఆ స్థానం, లేక, స్థితిలో మనస్సు గానీ, ఇంద్రియములు గాని, వాసనలు గాని ఉండజాలవు. రాజుగారు నివసించే అంతఃపురంలో భిక్షగాళ్ళు ఉంటారా?

❖

ఓ శరీర మనస్సులారా! మీ ఇద్దరికంటే విలక్షణమైన నేను బ్రహ్మ పదమును ఎల్లప్పుడూ పొందియే ఉన్నాను. ఇప్పటికీ, ఎప్పటికీ అది పొందబడియే ఉన్నది.

నేను కేవలుడను! ...ఇట్లు సమస్త దృశ్య వ్యవహారముపై విజయము పొందాను. శాంతుడను, నిరవయవుడను అయ్యాను. నాకు ఇచ్ఛలు గానీ, క్రియలు గానీ లేవు. నువ్వుల నుండి నూనె వేరు పడిన తరువాత, ఆ నూనె, నువ్వులు సంబంధం గాని, సమాన లక్షణాలు గానీ కలిగి ఉండవుకదా!

నాకిప్పుడు దేహ - ఇంద్రియ - మనస్సులు మొదలైన వాటితో ఏమాత్రం సంబంధం లేదు. ఇక ఈ దేహేంద్రియ మనస్సులు ఉంటే ఉండనీ. అదీ వినోదమే. ఆత్మ పదము నుండి అభాస మాత్రంగా ప్రకటితమగుచున్న బుద్ధి నా సమక్షంలో ఏదైనా 'శేషించిన ప్రారబ్ధకర్మ' ను పొందవలసి వస్తే, పొందనీ. కర్మలే లేనివానికి ప్రారబ్ధకర్మలు ఎక్కడివి?

సర్వమునకు సాక్షి అయిన నాకు ఈ దేహాదులతో ఈ దేహాదుల అనుభవంగానీ, అభిమానంగానీ ఉండాలనిగానీ, ఉండకుండాలనిగానీ లేదు.

ఓ సహ ఆత్మజ్ఞానులారా! అత్యుత్తమమగు ఏకాత్మ బుద్ధితో సంచరించే మీరే నాకు బంధువులు, స్నేహితులు కూడా. మీరంతా నిరంతర ఆత్మోదయం కలిగి, సములై, స్వస్థులై, సౌభాగ్యయుతులై ఉంటున్నారు కదా! నా మీద దయతో మీ జట్టుతో నన్ను కూడా చేర్చుకోండి.

ఓ 'ఉద్దాలకుడు' అను పేరుతో పిలువబడుచున్న ఆత్మదేవా! నీవు ఏ ప్రమేయం లేకుండానే, స్వతహాగానే అత్యంత స్వచ్ఛులై ప్రకాశిస్తున్నావు. పూర్ణకాములై, ఆత్మసత్త స్వరూపులై రమణీయ ఆనందం, ఉపశమనములచే వెలుగొందుచున్నావు. సదాచారము, మృదుభాషణము, పూర్ణత్వము, అబాధిత్వము మీ భావములలోని అకృత్రిమ లక్షణములై ఉంటాయి. ప్రకాశము, ద్వైతరాహిత్యము, వికల్పరాహిత్యము మీ స్వభావములే అగుచున్నాయి. ఓ ఉద్దాలకనామధేయ ఆత్మదేవా! నీకు నమస్కారం.

సమస్తమూ కల్పన చేతనే ఆవిర్భవిస్తోంది. ఆ సర్వకల్పనలకూ ఆవల, సమస్త కల్పనలకు కారణభూతుడనై, స్థానమై, ఆధారభూతుడనై నేను ఉన్నాను.

❖

ఇప్పుడు అజ్ఞాన మనస్సు రహితమైపోయింది. వికల్పయుక్తమగు చిత్తము మచ్చుకైనా దొరకుటలేదు. ప్రత్యక్షముగా కళ్ళకు కనిపించే ఈ దృశ్యజాలమంతా త్యజించివేయబడింది. నేను బ్రహ్మానందస్వరూపుడనై పరమాత్మయందు అనిర్వచనీయము, ఆద్యంత రహితము అయిన శాంతిని, విశ్రాంతిని పొందుచున్నాను.

❖

ఈ విధంగా విచారణ చేస్తూ ఉద్దాలకుడు నిర్మలమైన, ఉదారమైన బుద్ధితో కనులు సగం మూసుకొన్నారు.

❖❖❖

## 8. శాంతి - విశ్రాంతి

అర్ధ ఉన్మీలిత నేత్రుడు అయి, ఉద్దాలకుడు 'పరబ్రహ్మము' అను పదములో సంస్థితుడగుటకు ఉద్యుక్తుడయ్యాడు. ఓంకారమే పరమపదము యొక్క సంజ్ఞ కదా! ఇక ఘంటానాదం లాగా ఓంకారం ఉచ్చరించ ప్రారంభించాడు. 'ఓం'కారానికి శిరస్సు వంటిదైన 'అర్ధమాత్ర'ను ఆశ్రయించాడు. ఓంకార వృత్తికి శబ్దార్థముల వలె ఉపహితమైన చైతన్యమును అనుసరించుచూ, సుషుమ్నానాడిని సమీపించాడు. "కూటస్థ జీవచైతన్యము ఇక బాహ్యమునకు ఏమాత్రం అభిముఖం కాదు" అను స్థితి వరకూ ఓంకారము ఉచ్చరిస్తూనే ఉన్నాడు. ఆ ప్రణవము 'అ'కారము – 'ఉ' కారము – 'మ' కారము – అర్ధమాత్ర – అను నాలుగు పాదములు కలిగి ఉన్నది.

**'అ'కారం ...రేచకం -** ప్రణవము యొక్క 'ప్రథమాంశ' యగు అకారమును ఉచ్ఛ స్వరముతో ఉచ్చరిస్తూ ఉన్నారు. ఆతని దేహం అప్పుడు సంక్షుబ్ధమై, బాహ్య ప్రదేశములకు వెళ్ళుచుండే

ఉత్సాహం చూపుచుండే వాయువు చేస్తున్న శబ్దంతో నిండిపోయింది. 'రేచకము' అను పేరుతో చెప్పబడే 'ప్రాణ నిష్క్రమణ క్రియ' ఆతని శరీరమును ఖాళీ చేయసాగింది.

అట్లు ఆతని దేహము నుండి వెలువడిన వాయువులు చిత్ రస పూరితమై, గూడును వదిలిన పక్షి లాగా బాహ్యాకాశంలో ప్రవేశించాయి. అప్పుడు ఆతని హృదయంలోని జ్వాజ్వల్యమానమగు అగ్ని దేహాన్నంతటినీ ఆక్రమించింది. ఆతని భౌతికదేహం భస్మమైనది. అయితే రామా! ఉద్దాలకునకు, అట్టి స్థితి ప్రణవముయొక్క ప్రథమక్రమభావన చేతనే అనుద్వేగకరంగా కలిగింది. అంతేగానీ, హఠయోగం చేత కాదు. ఎందుకంటే బలవంతంగా చేసే హఠయోగం శ్రమ, దుఃఖములనే కలుగజేస్తుంది సుమా!

**'ఉ'కారం ...కుంబకం -** క్రమంగా ఉద్దాలకుడు 'అ'కారోచ్చారణ నుండి 'ఉ'కారోచ్చారణ సమారంభించాడు. అప్పుడు 'ఉ'కారోచ్చారణ క్రమంలో ప్రాణముల సమస్థితి ఏర్పడింది. 'నిశ్చల కుంభము' అను పేరుతో ప్రసిద్ధమైన ప్రాణక్రియ జరిగింది. నాసికారంధ్రములలో వాయువు నిరోధించబడింది. ఆ వాయువు పైకిగానీ, క్రిందకుగానీ, బయటకుగానీ, లోపలికిగానీ పోజాలక చలనరహితమైనది. శరీరమును భస్మమొనర్చగల అగ్ని మెరుపువలె క్షణంలో శాంతించింది. అప్పుడు ఎఱ్ఱటి శరీరభస్మము మాత్రమే కనిపించింది. తెల్లటి బొమికలు చేష్టారహితమై కనిపించాయి. మహా వాయువుచే ఊర్ధ్వమునకు కొనిపోబడిన ఆ అస్థిసహిత భస్మము క్షణంలో ఆకాశము నందు వ్యాపించి అదృశ్యమైపోయింది.

ఈ స్థితి కూడా ప్రణవముయొక్క ద్వితీయ క్రమంచే ఏర్పడింది. అంతేగాని, బలవంతంగా చేసే హఠయోగం వలన కాదు.

**'మ' కారం ...పూరకం -** ఆ తరువాత ఉద్దాలకుడు శాంతిదాయకమగు ప్రణవము యొక్క తృతీయ క్రమము నందు వాయువును పూరించాడు. అదియే 'పూరకము' అను ప్రాణక్రియగా అప్పుడు 'జీవ చైతన్యము' అనే అమృతము యొక్క మధ్య గల ప్రాణసమూహం మంచు యొక్క స్పర్శలాగా బాహ్యాకాశంలో శీతలత్వం పొందింది.

క్రమంగా ఆ జీవ చైతన్యము గగన మండలత్వం పొందింది. ఆతని ప్రాణవాయువులు చంద్రుని చల్లటి కిరణములు లాగా అమృత తుల్యములయ్యాయి. వాయువుచే కొనిపోబడగా మిగిలిన దేహభస్మముపై ఆతని ప్రాణవాయువుల యొక్క అమృతధార కురిసింది. అప్పుడు చంద్ర బింబమువలె శోభాయమానమైన ఒక క్రొత్త శరీరం ప్రకటితమైనది. చతుర్భుజములతో విష్ణుభగవానుని ఆకృతి వలె నూతనశరీరం ఉదయించింది.

ఆ ఉద్దాలకుని నూతన శరీరం వికసిత నేత్రములతో, ముఖముతో, అతి దీప్తితో శోభను పొందింది. జలప్రవాహం తటాకమును నింపునట్లు, వసంత కాలం వచ్చి వృక్షములలో రసమును నింపునట్లు అమృతమయమగు ప్రాణములు ఆ శరీరాన్ని నింపాయి. నిర్మలస్వరూపము, దోష రహితమగు ఆతని నూతన శరీరం ప్రస్తుతం చేయబోయే కార్యక్రమములకు తగినట్లుగా ఉన్నది.

❖

అటు తరువాత ఉద్దాలకుడు ఒకచోట పద్మాసనమున శరీరమును 'సుదృఢం' చేశాడు. ఏనుగును కట్టుకంబళమును కట్టినట్లు పంచేంద్రియములనూ బంధించాడు.

'నిర్వికల్ప సమాధి' నిమిత్తం తన మనన స్వభావమును వినిర్మలం చేయటానికి ప్రయత్నించ సాగాడు. "ఆశ – తృష్ణ – విసుగు – ఆలశ్యము" లవైపుగా వెళ్ళుచున్న తన స్వభావము (మనస్సు)ను, ప్రాణయుక్తమైన చిత్తమును శుద్ధ పరచి, మరలించుటకు అనేక విధములుగా ప్రయత్నించాడు. దున్నపోతు త్రాళ్ళచే లాగబడునట్లు ఆతనిని చిత్తము సుదూరంగా 'బంధువులు – గృహములు – సుపరిచితులు" వైపుగా లాగబడుచూ ఉండటం గమనించాడు. అట్లు విషయములవైపుగా పరుగులెత్తే వ్యాకుల చిత్తమును మరల మరల సునిర్మలమొనర్చి బలపూర్వకంగా నిరోధించేవాడు.

క్రమంగా ఆతని ప్రయత్నం ఫలించింది. రెండుకళ్ళు అర్ధనిమీలితం చేశాడు. మౌనవ్రతధారి అయి, ప్రాణాపాన నిశ్చలాభ్యాసంచే ముఖము నందు 'శీతలసుగంధము'తో పోల్చతగిన ఒకానొక ప్రశాంతతను పొందాడు. అట్టి ప్రశాంత స్థితిలో ఇంద్రియములను విషయముల నుండి వేరుచేసి తన ప్రశాంత స్వభావమునందు ఇముడ్చుకున్నాడు. సూర్యభగవానుడు లోకములను త్యజించుచున్నట్లు ఆయన బాహ్య విషయధ్యాసను త్యజించివేశాడు. ఆత్మతత్త్వదర్శనము వృద్ధిపొందుచుండగా మనో వాక్కులు మొదలైన విషయములన్నీ తన యందే లయం చేసివేశాడు.

అప్పుడు కాలిమడముచే 'గుదస్తంభనం' చేసి నవద్వారములందలి వాయువును నిరోధించారు. ఆతని కంఠము ఇప్పుడు ఆత్మరస ప్రపూర్ణమై రజోగుణ, తమోగుణములను అభావించుచు స్వచ్ఛమైనది. మనస్సును ధారణా యుక్తులచే సమాధికి అభిముఖం చేశాడు. ఆ మనస్సును తన హృదయాకాశంలోనే ధరించి ఉన్నాడు. అప్పుడది నిర్మలాకాశంలాగా నిర్మలత్వమును, సౌమ్యత్వమును పొందింది.

❖

మధ్య మధ్యలో మందంగా విచ్ఛేదకరములగు విపరీత భావాలు పొడచూపేవి. వాటిని జాగ్రత్తగా గమనిస్తూ బ్రహ్మాకార వృత్తిచే ఆ వికల్ప సమూహం తనను సమీపించకుండా జాగరూకుడ య్యేవాడు. క్రమంగా వికల్పజాలములన్నీ నశించాయి.

ఆ తరువాత తన హృదయాకాశంలోకి దృష్టినంతా సారించాడు. తమోగుణ ప్రేరితమైన అంధకారముచే ఆచ్ఛాదితమైన వివేకసూర్యుని (అస్పష్ట వివేకానుభవమును) చూచాడు. వెనువెంటనే 'సత్వగుణాభివృద్ధి' ని ఆశ్రయించి, తద్వారా ప్రాప్తించిన ఉత్తమ జ్ఞానము, మనస్సులచే తమోగుణ ప్రేరితమైన అంధకారమును నశింపజేశాడు. అప్పుడు ఒకానొక రమణీయమైన 'తేజః పుంజము' ను దర్శించాడు. అట్టి దర్శనములో పాత్ర వహిస్తున్న రజోగుణమును గమనించి, దానిని మ్రింగివేసి సత్వగుణ సమృద్ధుడైనాడు. క్రమంగా ఆ తేజఃపుంజము ఉపశమించింది.

❖

అప్పుడు ఆ మునీంద్రుని మనస్సు నిద్రా తరంగములచే చంచలమై, భ్రమణశీలమై ఉండసాగింది. మద్యపానముచే మత్తెక్కిన మనిషిలాగా ఆతడు నిద్రను పొందాడు. కానీ వివేక

ప్రబోధచే ఆ నిద్రను వినష్టం చేశాడు. నిద్ర నశించిన తరువాత మనస్సు 'వివిధ వాసనలతో పరికల్పితమైన రూపముగల ఆకాశము' ను భావన చేయసాగింది. ఆతడు ఆ ఆకాశమును కూడా తొలగించి వేశారు. ఆ విధంగా ఆకాశానుభూతికూడా నశించిన తరువాత 'మత్తు దిగుచున్నప్పటి తాగుబోతు' లాగా కొంచం విమోహితుడైనాడు.

ఆ మనోమోహాన్ని కూడా పారద్రోలిన తరువాత ఆతని అప్పటి మనస్సు క్షణకాలం నిర్వికల్ప సమాధిలో విశ్రమించింది. అప్పటి స్థితి 'తేజస్సు, తమము, నిద్ర, మోహము' – అనేవి లేనట్టిది. వాక్కుకు అగోచరమైనది.

ఆతని చిత్తము అట్లు విశ్రమించి, మరల ఇంతలోనే ప్రపంచ వృత్తికి మరలింది. కాసేపు ప్రవృత్తిలోనూ, మరికొంచెం సేపు నివృత్తిలోనూ ప్రవర్తిస్తూ ఆతని చిత్తము త్వరలోనే చిత్తత్వము వదలి చిద్రూపత్వమును పొందింది. అతిశీఘ్రంగా సర్వప్రపంచము కంటే అన్యమైన ఆకారమును పొందింది. వృత్తిగత చైతన్యము తన విషయాకారమును త్యజించి సర్వవృత్తులకూ సాక్షి అయినట్టి కేవల చిద్రూపత్వమును సంతరించుకొని ప్రకాశించింది.

**తత్త్వసాక్షాత్కారం -** క్రమంగా ఉద్దాలకుడు సమాధిద్వారా తత్త్వసాక్షాత్కారం యొక్క ప్రబోధం పొందాడు.

**శ్రీరాముడు :** తత్త్వసాక్షాత్కారం అనగా?

**శ్రీవసిష్ఠమహర్షి** : "సర్వ ప్రపంచమునకు అధిష్ఠానం, ద్వైతరహితము, శుద్ధము, మహత్తరము అగు చిదాకాశమే నేను" అని ఎరుగుటయే – తత్వసాక్షాత్కారము యొక్క ప్రబోధమని అంటాం. "నీవుగా కనిపించేది నేనే" అనబడు స్వభావసిద్ధమైన, అకృత్రిమమైన ఎఱుక ఆస్వాదనయే తత్త్వ సాక్షాత్కార ప్రబోధం.

అట్టి స్థితిలో ఆతడు దృశ్య, దర్శన వర్జితుడైనాడు. ఏదైతే సర్వవిషయ లేశములకు ఆధార భూతమో, సముద్రతుల్యమో, బ్రహ్మాది మహాత్ములచే సర్వదా ఆస్వాదించబడుచున్నదో అట్టి ఆనందాన్ని పొందాడు. ఆనందసాగరం అన దగినట్టి పరమాత్మ యొక్క సత్తాసామాన్య రూపమును అవధరించాడు. ఉద్దాలకుని 'జీవచైతన్యము' అనే హంస ఆనందసరోవరంలో స్థితి కలిగి పూర్ణచంద్రుని వలె గాలి వీచని ప్రదేశంలో దీపంలాగా, గోడపై లిఖించబడిన కళాఖండంలాగా, తరంగాలే లేనట్టి సముద్రం లాగా, శరత్కాలంలోని మేఘములలాగా నిశ్చలత్వం పొందింది.

అట్టి మహాప్రకాశమునందు ఆతడు చిరకాలం ఉన్నాడు. అతడు ఆ స్థితిలో ఉంటూ ఉండగా మనోమార్గంలో అనేక మంది ఆకాశసంచారులను, సిద్ధులను, అనేక మంది దేవతలనూ చూచాడు. 'ఇంద్రుడు, సూర్యుడు' మొదలైన అనేక పదవులను ప్రసాదించగల విచిత్రమైన అనేక సిద్ధులు ఆతనిని సమీపించాయి. ఒక ఉదార చిత్తుడగు యువకుడు తనదారిన పోతూ పిల్లలు ఆడుకొనే ఆటలను పట్టించుకుంటాడా? అలాగే ఉద్దాలకుడు కూడా ఆతడు ఆ సిద్ధులను ఆదరించనేలేదు.

❖❖❖

# 9. పరమపదము

అట్లు సిద్ధులను నిరాకరించిన తరువాత ఆతడు 'సమాధి' అను ఆనందమందిరంలో ఆరు నెలల కాలం ఉన్నాడు. సిద్ధ, సాధ్య, బ్రహ్మాదులకు మాత్రమే సాధ్యం అగుచూ ఉండే సర్వోత్కృష్టమగు 'జీవన్ముక్తము' అను పదము నందు ప్రతిష్ఠితుడైనాడు. అక్కడ పూర్ణమగు ఆత్మానందమును పొందాడు.

ఆతని ఆత్మచైతన్యము క్షుద్రమైన విషయానందము గాని, విషయసుఖము గాని లేనిదై స్వప్రకాశమగు తన పూర్ణస్వరూపము నందే ఉండి శోభించింది.

ఎవ్వడైనా సరే, ఎవరైనా కొంత సమయం మనస్సుచే అట్టి సమాధియందు స్థిమితము పొందితే, ఇక ఆతని మనస్సు స్వర్గసుఖములు గానీ, విషయసుఖములు గానీ చూచి ప్రీతిని పొందే ప్రసక్తియే ఉండదు. అట్టి నిర్వికల్పసమాధిలో ఏర్పడే ఆనందమే బ్రహ్మానందమనీ, ఆత్మైక్యస్థితి అని చెప్పబడుతోంది. అచ్చట ఉండే స్థితియే శాంతి యొక్క ఆత్యంతికము, నిత్య శ్రేయము కూడా. అక్కడ విశ్రమించే వానిని ఇక ఎట్టి భ్రమ బాధించదు. అట్టి అఖండ అప్రమేయ దృష్టి కలవాడు ఇక 'దృశ్యదృష్టి' యందు ప్రవేశం చేయడు.

అనగా... శ్రవణ, మనన, సమాధుల సహాయంతో శుద్ధచిత్తమును పొందినవారు ఆ మహదానంద పదమును పొంది, ఇక ఆపై ఈ దృశ్యప్రపంచమును ఒక విషయంగానే చూడరు. చక్రవర్తి పదవి అధిష్ఠించినవాడు ఒక పెంకుటిల్లును చూచి "ఇట్టి ఇల్లు కలిగి ఉండటం ఎంతో సంతోషం కలుగజేస్తుంది కదా!" అని తలుస్తాడా? లేదు కదా!

**శ్రీరాముడు** : అట్టివాడు ఇక ఈ ప్రపంచమువైపు ఎప్పటికీ దృష్టి సారించడా?

**శ్రీవసిష్ఠమహర్షి** : అట్టి 'ఆత్మ పదము' నందు విశ్రాంతి పొందినవానిని 'ప్రబుద్ధచేతస్కుడు' – అని అంటారు. అట్టి స్థితిలో సమాధిని అవధరించినవాడు ఇతరులు ఎంతో ప్రయత్నిస్తే గానీ మరల 'వ్యుత్థానదశ'కు రాడు. ఆరవ భూమిక దశలో బాహ్యప్రయత్నం చేత వ్యుత్థానదశకు తిరిగిరావచ్చు. – ఇక ఏడవ భూమికలో ప్రవేశించినవాడు తనకు తానుగా వెనుకకు మరల వలసిందే.

❖

మహాత్ముడగు ఉద్దాలకుడు ఆ విధంగా ఆరునెలలు సమాధి స్థితియందుండి, మరల తనకు తానే ఉత్థానదిశగా ప్రబుద్ధుడైనాడు. మధ్యే మార్గంలో మహాతేజఃసంపన్నులను, చామరములను వీస్తూ సేవించే దేవతాస్త్రీలను, పతాకములు అమర్చబడిన దేవతా విమానములను, మునులను, విద్యాధరులను చూచాడు.

అక్కడి కొందరు దేవతలు ఆతనిని పలకరిస్తూ ఇట్లు సంబోధించారు. ఓ మహానుభావా! ఉద్దాలకా! మీకు ప్రణామం చేస్తున్న మమ్ములను అనుగ్రహిస్తూ, గమనించండి. ఈ విమానం ఎక్కి దేవలోకం రండి. ఈ మొత్తం ప్రపంచంలో ఉండే భోగములన్నిటి కన్నా కూడా స్వర్గలోకమే అధికమైనది కదా! మీరు ఏభోగములను కోరుకుంటే అవన్నీ కల్పాంతమువరకు అనుభవించవచ్చు.

ప్రపంచంలో తపస్సు, యజ్ఞము మొదలైన కార్యక్రమములన్నీ స్వర్గభోగములు అనుభవించటం కోసమే నిర్ణయించబడ్డాయి కదా! ఈ విద్యాధరుల వైపు చూస్తున్నారా! వీరంతా మిమ్ములను ఉపాసిస్తున్నారు. ధర్మ, అర్థ, కామములలో ముఖ్యఫలం కామమే కదా! అట్టి కామానందం ప్రసాదించ గల ఉత్తమ స్త్రీలు స్వర్గంలోనే ఉంటారు."

ఆ మాటలు విని, ఉద్దాలకుడు చిరునవ్వుతో వినమ్రంగా వారికి అతిథి సన్మానపూర్వకంగా నమస్కరించాడు. కానీ, భ్రమరహితుడై వారు చెప్పిన మాటలు పట్ల మౌనం వహించాడు. వారి పట్ల అభినందన గానీ, త్యాజ్యము గానీ ప్రకటించలేదు. "ఓ సిద్ధులారా! నా నమస్కారం స్వీకరించి సెలవు ఇప్పించండి" అని పలికి యథాతథంగా సమాధి వ్యాపారం కొనసాగించాడు. విషయభోగ విరక్తుడైన ఆ ఋషీశ్వరుని సేవిస్తూ సిద్ధులు కొద్దిరోజులువేచి ఉండి మరల ఎటో వెళ్ళిపోయారు.

❖

అది మొదలుకొని జీవన్ముక్తిని పొందిన ఉద్దాలకుడు తన ఇచ్ఛాపూర్వకంగా వనములందూ, ఆశ్రమములందూ సంచారం చేస్తూ ఉండేవాడు. మధ్య మధ్యలో ఒక చోట ఆసీనుడై ధ్యాననిష్ఠలో ప్రవేశిస్తూ ఉండేవాడు. ఒక్కొక్కసారి ఒక్క రోజు, కొన్నిరోజులు, సంవత్సరం, కొన్ని సంవత్సరములు సమాధియందు ఉంటూ, మరల మేల్కొంటూ ఉండేవాడు.

క్రమంగా పొందిన జ్ఞాన తేజస్సుచే ఆతడు ఒకవైపు చైతన్యముతో ఐక్యమై ఉంటూనే మరొకవైపు వ్యవహార తత్పరుడై ఉండేవాడు. ఉభయములోని ఏకత్వము పొందేవాడేగాని, అజ్ఞానివలె విక్షేపం పొందేవాడుకాదు. సర్వకాల సర్వావస్థలలోనూ సమాధియొక్క అభ్యాసం వదిలేవాడు కాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! అంటే, ఉద్దాలకుడు ప్రపంచమును పొందుచున్నప్పుడు, ప్రపంచరహితుడు అగుచున్నప్పుడూ సమాధి యొక్క అభ్యాసం కొనసాగిస్తున్నాడని చెప్పుచున్నారు కదా! ఆతని ఇప్పటి సమాధి యొక్క అభ్యాసం నిర్వచించి చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** చెపుతాను విను – 1. అంతఃకరణము, 2. ఆ అంతఃకరణములో ఏర్పడే వృత్తులకు సాక్షియగు చైతన్యము – ఈ రెండిటినీ ఆతడు వేరు పరచి, పరిశీలించే వాడు. అదే ఆతని వర్తమానపు సమాధి యొక్క అభ్యాసము. అట్టి అభ్యాసముచే అపరిచ్ఛిన్నమగు చిద్భావమును పొందేవాడు.

ఇక ఆతని యందు రాగ ద్వేషాదులు లేవు. అహంకార, మమకారాలు; పరిచ్ఛిన్న, అపరిచ్ఛిన్నములు, ఉద్వేగ, ఉదాసీనములు లేవు. సూర్యకాంతి భూమిపై సమరూపమున వ్యాపించు చున్నట్లు ఆతడు సర్వభూతము లందూ సమరూపుడై వర్తిస్తూ ఉండేవాడు. అంతటా బ్రహ్మమునే గాంచుచూ ఉండేవాడు. ఎవరైనా సరే, 'సాక్షిచైతన్యము' అను సమాధి యందు భావన చేయటం చిరకాలం అభ్యసిస్తూ రాగా, అప్పుడు స్వప్రకాశమైనట్టి 'నిరతిశయానంద చిద్రూపము' తప్పక పొందుతారు. ఉద్దాలకుడు సంపాదించిన నిర్ద్వంద్వ, అద్వైత, అప్రమేయ సుస్థితిని అభ్యాసంచే ఎవరైనా తప్పక పొందవచ్చు.

ఒక కళాఖండంలో లిఖించబడిన సూర్యుడు ఉదయించడు అస్తమించడు కదా! ఆతడు ఈ దృశ్యవ్యవస్థలో ఉదయించటం లేదు... అస్తమించటం లేదు. సర్వత్రా శాంతిమయుడై ఉన్నాడు. ఆతని చిత్తము నిరతిశయానంద ప్రాప్తిచే ఉపశమించింది. కర్మ బీజములన్నీ క్షయించుటచే, ఆతనిపట్ల జననమరణ పాశములన్నీ విచ్ఛిత్తి పొందాయి.

"ఈ జన్మ – జరా – మరణాలు దేహపరిమితములే గాని, నన్ను స్పృశించేవి కావు" అనునది అతని వర్తమానానుభవం. ఆతడు అపరిచ్ఛిన్నమగు 'సత్తాస్ఫూర్తి' అనే ఉత్కర్ష (Sense)చే మహాభావయుతుడైనాడు.

ఇక ఆతని వర్తమాన నూతన దేహం ప్రత్యక్షరూపమై, నిర్మలమై, పూర్వదశా విస్మరణచే చిత్త రహితమై, బ్రహ్మస్వభావమై వెలుగొందింది. కనుక, ఇది ఆతని భావ, అనుభవముల దృష్ట్యా ఆతని పూర్వదేహము వంటిది కాదని గ్రహించు. ఆతని స్వభావము 'సత్తాసామాన్యము' ను సంతరించుకుని ఉన్నది.

❖❖❖

## 10. స్వస్వరూప చైతన్యముతో ఏకత్వం - ధారణ

**శ్రీరాముడు :** హే బ్రహ్మర్షీ! 'సత్తా సామాన్యము' అని అన్నారు కదా! అంటే ఏమిటి?

**శ్రీవసిష్ఠమహర్షి :** ఒకనిలో విషయ సంస్కారములన్నీ సంపూర్ణంగా రహితమైనాయనుకో ... అప్పుడు చిత్తము నశించినదే అవుతుంది. అప్పుడు శేషించే దానిని చిత్ సామాన్యస్వరూపము అంటారు.

ఎప్పుడైతే చిత్తు వృత్తిరహితమై ప్రతిబింబత్వము నుండి తన బింబరూపమగు చైతన్యమున లీనమౌతుందో – అప్పటి బింబము యొక్క ఆకాశసదృశమగు నిర్మల సత్తయే 'సత్తా సామాన్యము.'

**శ్రీరాముడు :** అది ఎట్లా, ఎప్పుడు సిద్ధిస్తుంది?

**శ్రీవసిష్ఠమహర్షి :** చిత్తవృత్తి యందు అభివ్యక్తమగుచున్న చైతన్యము ఈ బాహ్య – అభ్యంతర జగత్తు నంతా నిరాకరించి, కేవలం స్వస్వరూపమున ఎప్పుడు ఉంటుందో అప్పుడు సత్తా సామాన్యము సిద్ధించినట్లు. అట్టివాడు సర్వభూతములపట్ల పారమార్థికమైనట్టి 'స్వస్వరూప చిన్మాత్రానుభవం' కలిగి ఉంటాడు. ఒక దృష్టాంతం చెపుతాను. తాబేలు కొంచెం ప్రమాదం గమనించగానే తన అవయవాలను స్వయంగా, అసంకల్పితంగా తనలోకి లీనం చేసుకుంటుంది చూచావా! ఈ సామాన్య సత్త సంపాదించిన యోగి ఈ ఎదురుగా ఉండే సమస్తమును ప్రత్యేకమైన భావనాయత్నం లేకుండానే స్వభావ సిద్ధంగా ఆత్మ యందు లయం చేసుకుంటాడు. సమస్తమును తన ఆత్మగా దర్శిస్తాడు. అదియే సప్తమ భూమికకు సంబంధించిన ప్రరూఢ దృష్టి.

ఈ స్థితిలో 'సదేహముక్తి – విదేహముక్తి' అనే భేదం ఉండదు. ఈ విషయం ఒకటి రెండు సార్లు ముముక్షు వ్యవహారప్రకరణలో, ఆ తరువాత కూడా గుర్తు చేశాను.

అట్టి దృష్టి 4,5 భూమికలలో కూడా కలుగుతుంది. అయితే అది సప్తమభూమికలో రూఢి చెందుతుంది. అట్టివానికి వ్యుత్థాన దశయందు కూడా వెంటనంటే ఉంటుంది. బోధచే అట్టి దృష్టి జ్ఞానికి తప్పక కలుగుతుంది. అజ్ఞానికి ఎంత విన్నా కలుగదు.

జీవన్ముక్తులగు మహాత్ములంతా అట్టి దృష్టి యందే ఉండి, ఈ భూమిపై పాదరసంలాగా, ఆకాశంలో వాయువులాగా నిర్లిప్తంగా ఈ ప్రపంచంలో సంచరిస్తున్నారు. మేమంతా అట్టి దృష్టి అభ్యసిస్తూ ఈ భూతలంపై ఉంటున్నాం. ఆకాశంలో నారదుడు మొదలైనవారు, ఊర్ధ్వలోకాలలో బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు మొదలైనవారు అట్టి దృష్టినే కలిగి ఉంటున్నారు.

ఇక ఉద్దాలకుని విషయం కొనసాగిద్దాం. ఆతడు సర్వభయ వినాశకరమగు 'సత్తా సామాన్యము' లేక 'జీవన్ముక్తము' ను ఆశ్రయించి ప్రారబ్ధక్షయం అయ్యే వరకు ఈ 'జగత్' అను రూపం గల గృహంలో వసించాడు. కొంతకాలం జరిగిపోయింది. ఆ తరువాత ఆతడు 'నేనీ దేహమును త్యజించి విదేహముక్తుడను అగుదును గాక!' అనే దృఢబుద్ధిని పొందాడు. ఆశ్రమం నుండి బయలుదేరి ఒక పర్వతప్రాంతం చేరాడు. అక్కడ గల ఒక సెలయేటి ఒడ్డున పద్మాసనం అవధరించాడు. కళ్ళు సగం మూశాడు. కాలిమడమతో గుదమును నిరోధించి తొమ్మిది ఇంద్రియద్వారములను సంయమనం చేశాడు. చిత్తముచే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను ఏకం చేసి హృదయంలో చేర్చాడు.

హృదయగత వృత్తులను స్వస్వరూప చైతన్యములో ఏకం చేశాడు. క్రమంగా చిద్ఘనరూపుడైనాడు. సమముగా ఉన్న కంఠంతో శోభించాడు. నాలుకను కంఠము యొక్క ఊర్ధ్వ ప్రదేశంలో ప్రవేశపెట్టాడు. నెమ్మదిగా ప్రాణవాయువులను నిరోధించుచూ వచ్చాడు. ఆతడు ఇప్పుడు దంతములతో దంతములను స్పృశించటం లేదు. తన మనోదృష్టిని బాహ్య, అభ్యంతరములందు గానీ, ఊర్ధ్వ, అధోభాగములందు గానీ, రూపము మొదలైన విషయములందుగానీ, శూన్యము నందుగానీ ఉంచుటలేదు. కేవలం చిన్మాత్రము నందే స్థితుడై ఉన్నాడు.

❖❖❖

# 11. ప్రశమనం

ప్రాణప్రవాహ నిరోధం చేత ఆతని దేహము మనస్సు మొదలైనవి తమ చంచలత్వమును వదలిపెట్టాయి. ఇక ఆతడు సమరూపుడై, ప్రసన్నముఖుడై, చిద్రూపుడై బ్రహ్మానందానుభవం పొందాడు. ఆతని శరీరం గగుర్పొడిచింది. రోమములు నిక్కబొడుచుకున్నాయి. క్రమంగా "అంతఃకరణ వృత్తి విలయం" అను అభ్యాసంచేత చిత్ సామాన్యరూపమున ప్రవేశించాడు. ప్రతి బింబమును వదలి, బింబభూతమగు చిన్మాత్రమును అభ్యసించటం చేత హృదయము నందు బ్రహ్మానందమును అనుభవించాడు. అట్టి 'చిత్ సత్త' ను అనుభవించటం చేత, కొంత సమయానికి తన యొక్క ఉద్దాలక రూపమును మరచి, క్రమంగా తన యొక్క స్వానుగతమైన నిత్య ప్రకాశరూపము లేక చిత్ సామాన్య రూపమును పొందాడు. అనగా, ఈ జగత్తు కంతటికీ ఆశ్రయభూతమై సర్వదా అపరిచ్ఛిన్న

మైనట్టి ఆత్మ సత్తాయే నేను. అను ఏకత్వానుభవం పొందాడు. విక్షేపమంతా సంపూర్ణంగా నశించగా, సమరూపుడై సర్వోత్తమానంద ప్రాప్తి పొందాడు. అతి సుందరమగు ముఖకాంతితో పరమ విశ్రాంతి పొందాడు. ప్రారబ్ధముల వినాశనముచే, జీవించి ఉండగానే సర్వోత్కృష్టమగు నిర్మల పదము అవధరించాడు. ఇక ఆతనియందు చిరకాలానుగతమైన సంసారభ్రమ మొదలంటా రహితమైనది.

చిత్రంలో లిఖించబడిన చిత్రంలాగా, పూర్ణచంద్రుని లాగా శోభించాడు. స్వనిర్మల పదమున ప్రశమనం పొందాడు. సర్వవికల్పరహితుడు, నిర్వికారుడు, అతిసౌందర్య స్వభావుడు అయ్యాడు. బ్రహ్మలోక పర్యంతము గల సర్వసుఖములను త్యజించివేసినవాడయ్యాడు. ఏ బాహ్యమైన ఐశ్వర్యమైనా సరే ఎక్కడ ఒక గడ్డిపరక వంటిదౌతుందో – అట్టి వాక్ అగోచరమగు పరమానందమును పొందాడు.

❖

ఆ ఆనందం ఎట్టిది? మనం మాటలలో ఏం చెప్పుకోగలం? ఆ ఉద్దాలకుడు ఇప్పుడు పొందిన బ్రహ్మానందము అవధులు లేనిదని చెప్పవచ్చు. ఓ రామా! సర్వజీవరాసుల యొక్క ఉత్తమోత్తమ లక్ష్యం అదే. ఈ అంతులేని బ్రహ్మాండములన్నీ దాని యందే ఉన్నాయి. అందుచేత అది అపరిమితము. అది ఈ అనంతాకాశమును కూడా తన పొట్టలో వ్యాప్తం చేసుకొని ఉంచుకొనగలదు. అదియే దిక్కులన్నీ ఎల్లప్పుడూ వ్యాపించి ఉన్నది. సర్వమునకు ఆధారభూతమూ, పరిపోషకమూ అదే! ఎంతో భాగ్యం చేత మాత్రమే ఉత్తమ జీవులచే అది సేవించబడుతోంది.

సర్వవాక్–ప్రవృత్తి–నివృత్తి–నిమిత్త–ఉపాదాన ధర్మములకు అది అతీతమైయున్నది. దానినే 'సత్యజ్ఞానానందము' అని వేదజ్ఞులు పిలుస్తున్నారు. ఎప్పుడైనా సరే, 'ఇది సుఖము' అనుటకు కారణము అదే.

ఉద్దాలకుడు అట్టి శుద్ధ బ్రహ్మము లేక బ్రహ్మానందరూపము పొందాడు. ఆతని జీవము ఆ రీతిగా విదేహత్వము నిర్మల, అనాది బ్రహ్మభావము పొంది అక్కడే ఆరు నెలల వరకు ఉన్నది. ఆ తరువాత ఆతనిచే పరిత్యజించబడిన భౌతికదేహము ఆ పర్వత ప్రదేశంలో నాడులు అనే తంతువులు కలిగి వీణవలె ఒప్పుచున్నది.

అనంతరం కొంతకాలానికి పర్వతకన్యలతో కూడిన బ్రాహ్మి మొదలైన మాతృగణం ఒకానొక భక్తుని కోర్కెలు తీర్చటానికి ఆకాశము నుండి ఆ ప్రదేశానికి వచ్చారు. ఆ మాతృగణంలో ఒకరైన ఖింఖిణీదేవి ఆ ఉద్దాలకునిచే పరిత్యజించబడిన భౌతిక దేహాన్ని తనకు కిరీట హారంగా చేసుకొన్నది. మహాభగవతియగు ఖింఖిణీదేవి శిరోమాల యందు ఆ ఉద్దాలకుని దేహం శయనించింది.

❖

ఓ రాఘవా! ఈ దృశ్యమంతటికీ సంబంధించిన వివేకము జనించగా స్ఫురించే ఆత్మానందమే ఇందలి సారం. ఆరంభం నుండి, ఉద్దాలకుని విదేహముక్తి వరకు గల కథనం విన్నావుకదా! ఎవని హృదయంలో అయితే ఇందలి కథనం ఉత్పన్నమై 'ఉత్తరోత్తర భూమికలను అవధరించుట' అను రూపమున విస్తరిస్తుందో – అట్టివాడు ధన్యుడు. అట్టివాడు త్రివిధ తాపములచే తపించడు.

అట్టివాడు ఈ ప్రాపంచిక విషయములందు సంచరిస్తే సంచరించుగాక! అయినప్పటికీ "సత్యము, శాంతము, సహజ సంతోషము" – అనే సుగంధములను వీడడు. సర్వోత్తమమగు మోక్ష ఫలమును తప్పక పొందుతాడు.

❖❖❖

# 12. ధ్యానము - విశ్లేషణ

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామా! మనం 'ఉద్దాలకుని విదేహముక్తి' ప్రసంగంలో చెప్పుకొన్న విధంగా నీవు వివేకము, వైరాగ్యము, సమాధుల అభ్యాసంతో కూడిన వాడవై ఎప్పటియట్లే విహరించు. ఆత్మతో ఆత్మ గురించి చక్కగా విచారణచేసి 'వ్యాపక పరబ్రహ్మము' నందు విశ్రాంతి పొందు. ఈ దృశ్యమంతా ఉపశమించబడి ఆత్మపదము యొక్క అనుభవం సుస్థిరపడే వరకు పదే పదే అనేక కోణముల నుండి విచారణ కొనసాగించాలి.

**శ్రీరాముడు :** మహాత్మా! 'విచారణ' అనగా మీ నిర్వచన మేమిటో సంక్షిప్తంగా చెప్పండి.

**శ్రీవసిష్ఠమహర్షి :** 'విచారణ' అంటే – శాస్త్రములను ఉత్తమ బుద్ధితో వినటం... చిత్త శోధనము, ఆత్మతత్త్వ పరిశీలన... గురువాక్యములందు విశ్వాసం... ఆత్మవస్తువుపై నమ్మకము, సదవగాహనను పెంపొందించుకోవటం... ఇంద్రియములను నిరోధించి ఆత్మానుభవంవైపు తరలించటం

ఎవ్వరికైనా సరే, "వైరాగ్యము, ఆత్మ చింతనాభ్యాసము, వేదాంత శాస్త్ర శ్రవణము, ఆత్మ పరీక్ష, గురువాక్య విశ్వాసము, ఇంద్రియ నిగ్రహము, ప్రజ్ఞ – అను క్రమముచే బ్రహ్మపదము తప్పక చేకూరగలదు.

ఒకడు సర్వమును త్యజించి కేవలం ప్రజ్ఞను మాత్రమే ఆశ్రయిస్తే, ఒక్క ప్రజ్ఞచే కూడా బ్రహ్మపదము లభిస్తుంది.

నీ బుద్ధి జ్ఞానయుక్తమై, అతి తీక్ష్ణమై అవిద్యాకళంకరహితమై ఉండటానికి సర్వవిధ ఉపాయాలు ఆశ్రయించు. ఒకవేళ 'వైరాగ్యము' మొదలైన సామాగ్రి లేకపోవచ్చు గాక – అయినా కూడా సుతీక్ష్ణమైన బుద్ధిని సంపాదిస్తే అందు నిత్యమగు బ్రహ్మము సుస్పష్టముగా ప్రకటన కాగలదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు భూత, భవిష్యత్, వర్తమానములకు ఈశ్వరుడై ఉన్నారు. మీకు నమస్కరిస్తూ రెండు ప్రశ్నలు అడుగుచున్నాను.

1. ఒక వైపు వ్యవహార తత్పరుడై ఉంటూనే, మరొకవైపు సమాధిస్థితుని వలె, విశ్రాంతి పొందుచున్నట్టి జ్ఞాని ఎవరైనా ఉన్నారా?

2. ఒకడు ఒక ఏకాంత స్థలంలో సమాధి నియమమును అనుష్ఠించుచున్నాడనుకోండి. మరొకడు సమాధినిష్ఠుడై కూడా, వ్యవహారతత్పరుడై ఈ జనావళి మధ్య సంచరిస్తున్నాడనుకోండి. ఈ ఇద్దరిలో శ్రేష్ఠుడెవడౌతాడు?

**శ్రీవసిష్ఠమహర్షి :** రామా! అసలు 'సమాధి' అంటే ఏమిటని నీవనుకుంటున్నావో చెప్పు.

**శ్రీరాముడు :** "గుణ సముదాయ రూపమైన ఈ దృశ్యప్రపంచమంతా అనాత్మయే" – అని గ్రహించటం. అట్లు పరికించుట చేత అంతఃకరణం శీతలత్వం పొందుతుంది. అట్టి స్థితియే 'సమాధి' అని చెప్ప బడుతోందని నా అభిప్రాయం.

**శ్రీవసిష్ఠమహర్షి :** ఈ దృశ్యముతో మనకు సంబంధం ఎందుకు ఏర్పడుతోంది? మనస్సు ఉండుట చేతనే కదా! "అట్టి మనోసంబంధమైన దేదీ ఆత్మయగు నాకు లేదు" – అని నిర్ణయించుకొన్న తరువాత, పూర్ణకాముడై కూడా ఒకడు వ్యవహారపరుడగుచున్నాడు. మరొకడు ఏకాంతము నందు సంస్థితుడగుచున్నాడు.

వారిద్దరూ అంతఃకరణంలో పూర్ణకాములే. కనుక ఇద్దరూ సుఖవంతులే! ఎందుకంటే, సర్వ తపోధ్యానాదుల అంతిమ ఫలితం ఏమిటి?... అంతఃకరణ శీతలత్వమే!

ఒకడు ఒక ఏకాంత ప్రదేశంలో సమాధిని ఆశ్రయించాడనుకుందాం!... కానీ ఆతని అంతః కరణం మాత్రం అనేక అంతఃకరణ వృత్తులచే చంచలమగుచున్నదనుకో ... ఆ సమాధి పిచ్చివాని గంతుల వంటిదే కదా! అట్లాకాకుండా మరొకడు అనేక విషయపరంపరల మధ్య తాండవనృత్యం చేస్తూ ఉండగా ఆతని చిత్తము మాత్రం వాసనారహితమై ఉంటూ ఉంటే – ఆతని మనఃస్థితి ఒక ప్రబుద్ధుని ఏకాంత సమాధిస్థితితో సమానమే అవుతుంది.

అందుచేత రామా! వ్యవహారతత్పరుడగు జ్ఞాని, అరణ్యంలో ఏకాంతాన్ని ఆశ్రయించిన జ్ఞాని – ఇద్దరూ ఒక్కటేనయ్యా! వారిరువురు సంశయరహితమగు బ్రహ్మమును పొందినవారే అగుచున్నారు.

❖

ఒకానొకడు ఒక కథ వింటున్నాడనుకో... కానీ, ఆతని అంతరంగ లక్ష్య – ఉద్దేశములకు సంబంధించిన ముఖ్యచిత్త విభాగం మరెక్కడో సంలగ్నమైయున్నదని అనుకుందాం... అప్పుడాతడు ఆ కథకు సంబంధించిన పాత్రల సుఖదుఃఖములను తాను పొందుతాడా? లేదు. అట్లాగే, వాసనలు నశించిన తరువాత ఈ చిత్తము క్రియలు నిర్వర్తిస్తూనే, 'నిర్వర్తించనిది'గా, అనగా, అకర్తగా ఉండిపోగలుగుతుంది.

ఇంకొక దృష్టాంతం విను. ఒకడు తన అంగములను కదల్చకుండా చేష్టారహితుడై శయ్యపై నిదురిస్తున్నాడనుకో... కానీ, అతని చిత్తము గోతిలో పడిపోతున్నట్లుగా కల కంటోందనుకుందాం ... అప్పుడాతని చిత్తము భయాందోళలనతో 'పడిపోవుట' అను కర్తృత్వము అనుభవిస్తూ ఉంటుంది... కాళ్ళూ చేతులు పదిలంగా శయ్యపై విశ్రమిస్తున్నప్పటికి కూడా... ఘన వాసనలతో కూడిన చిత్తము భావనలచే ఏర్పడిన సంసక్తతలకు కర్తయే అగుచున్నది.

చిత్తము యొక్క అకర్తృత్వమే చిత్తము యొక్క సమాధి. అదియే కేవలీభావముకూడా. అదియే పరమసుఖము. విశ్రాంతి.

అయినా ఒక ప్రశ్న. "ధ్యానము-అధ్యానము, సమాధి-అసమాధి" ...అను శబ్దములను దేనిని దృష్టిలో పెట్టుకుని చెప్పుచున్నారు? శరీరమును దృష్టిలో ఉంచుకొనా? కానే కాదు. శరీరము కదల వచ్చు, కదలక పోవచ్చు. చిత్తం యొక్క చంచలత్వ-అచంచలత్వములనే 'అసమాధి-సమాధి' అని పిలుస్తున్నారు. కాబట్టి రాఘవా! నీవు వాసనారాహిత్యముచే అట్టి చిత్తమును అంకురరహితం చేయాలి. వాసనారాహిత్యముతో కూడిన మనస్సునే స్థిరత్వము యొక్క అనుభవంగా గ్రహించు. అదియే ధ్యానము, కేవలీ భావము, సమాధి కూడా. వాసనారహితమగు మనస్సు అత్యున్నతమగు బ్రహ్మ పదమునకు దారి తీయగలదు. ఆ బ్రాహ్మీస్థితియే మోక్షం. ఘనవాసనలతో కూడిన చిత్తము రకరకాల కర్తృత్వములను కలిగియున్నదగుచున్నది. ఆ కర్తృత్వముల ద్వారా దుఃఖములన్నీ వచ్చి ముంగిట వాలుచున్నాయి. ఇది గ్రహించి నీవు వాసనలను సూక్ష్మతరము చేయి.

❖

'సమాధి' అను దానికి మరొక వైపు నుండి నిర్వచనం విను-

జగత్తు దేహము మొదలైనవాటితో సమావేశమైయున్న ఈ దృశ్యము నందు "ఇది నేను, ఇది నాది" అను రూపము గల అహంకార-మమకారములు ఏర్పడుచున్నాయి. వాటి నుండి ఇచ్ఛ, భయము, శోకము ఉత్పత్తి అవుచున్నాయి. "నాది" అనునది చిత్తము నుండి మొదలంట తొలగించ బడితే, అట్టివాని ఆత్మ ప్రశాంతపడుతుంది. అట్టి ప్రశాంతస్థితియే సమాధి.

కనుక రామా! అట్టి సమాధి యొక్క అనుభవము నందు, ఈ కర్మలు చేయటం, చేయకపోవటం ఒక ప్రత్యేకమైన విషయమే కాదని నీవు గ్రహించాలి. సమస్త పదార్థముల పట్ల 'అహమ్ - మమ' అను అభిమానములను త్యజించి, ఆ తరువాత ఇక నీ అభిమతానారం చరించు.

ఒక కొండపై ఏకాంతంగా ఉండు. లేదా... గృహస్థుడవై వ్యవహారములను నిర్వర్తించు. రెండూ నీకు ఒక్కటే అవుతాయి.

ఏ గృహస్థుడైతే అహంకారాది దోషములను నశింపజేసి సమాహిత చిత్తం సంపాదించు కుంటాడో - అట్టి గృహం ఆతనికి నిర్జనప్రదేశంలోని ఆశ్రమంతో సమానమే అవుతుంది. సమాహిత దృష్టి కలిగి, నిత్య - అపరోక్షస్థితి పొందినట్టి నీవంటి మహాత్ములకు గృహమూ ఒక్కటే, అరణ్యమూ ఒక్కటే. ఆకాశము మొదలైన పంచభూతముల దృష్ట్యా 'ఇది గృహము - ఇది అరణ్యము' అన్న తేడా ఎక్కడున్నది? 'చిత్తము' అనే మహాకాశంలో 'శాంతము' అను స్వస్థత సంపాదించుకొని ఉన్నవానికి జన సమూహముచే వ్యాప్తమైన నగరం కూడా నిర్జన వనమే. రాగాది వృత్తులచే విక్షేపము పొందుచున్న చిత్తము గల మూఢునకు నిర్జన వనం కూడా అనేక జన సమ్మర్ధములు - సమాచారములతో నిండిన నగరమగుచున్నది.

❖❖❖

# 13. చిత్త విచికిత్స

ఈ సంసార జీవుని చిత్తము నిండా అనేక రాగ, ద్వేష, భయములతో కూడిన విషయపరంపరలు నిక్షిప్తమై ఉన్నాయి. విషయములన్నీ లయిస్తే, అప్పుడు వాసనాబీజము మాత్రమే మిగిలి, చిత్తము సుషుప్త దశను పొందుతుంది. ఇక వాసనా బీజం కూడా తొలగితే, ఆపై చిత్తము శాంతమయమై ఉంటుంది. ఆ శాంతమయచిత్తమే మోక్షం పొందుతుంది. అంతే గానీ, విషయ సహిత చిత్తము ఎట్లా పొందుతుంది?

ఇది గ్రహించి, రామా! ఆపై ఏది, ఎట్లు ఉచితమనుకుంటావో అట్లాగే ఆచరించు. సమాధి యందున్నట్టి ద్రష్ట ఆత్మను సర్వపదార్థములకు, విషయములకు, సంఘటనలకు అతీతమైనదిగా గాంచుచున్నాడు. తాను వ్యవహారమునందు ఉన్నప్పుడు ఆత్మయే సర్వ పదార్థముల రూపముగా ఉన్నట్లు గాంచుచున్నాడు. ఎవనిపట్ల రాగ – ద్వేషములు నశించిపోతాయో, ఎవనికి సమస్త పదార్థములు బ్రహ్మముగా, సమరూపముగా కనిపిస్తాయో – అట్టి విశాలాకారయుతుడే 'సమాధి స్థితుడు' అనబడతాడు.

వింటున్నావా రామా! మరల ఒకసారి ప్రకటిస్తున్నాను. సమాహిత చిత్తము జాగ్రత్తులోని – స్వప్నములోని ఆయా సమావేశములను, సర్వ దృశ్య వ్యవహారములను బ్రహ్మరూపము గానే వీక్షించుచున్నది. స్వప్న ద్రష్ట స్వప్నంలో చూచేవి స్వప్నద్రష్ట కంటే వేరైనది కానట్లే, జాగ్రత్ ద్రష్ట కూడా జాగ్రత్‌లో చూచేది ఆ జాగ్రత్ ద్రష్టకు వేరైనదేదీ కాదు. జ్ఞాని అంతర్ముఖమైన మనస్సు కలవాడై తాను నిద్రిస్తున్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు, నడుచుచున్నప్పుడు, తెలిసిన తెలియని ప్రదేశాలలో ఉన్నప్పుడు "ఈ తటస్థ బడుచున్నదంతా ఆత్మస్వరూపుడనగు నా స్వరూపమే" – అని గ్రహించి ఉంటున్నాడు. ఎందుకంటావా? ప్రాణికోట్ల చేత, పృథివి మొదలైన పంచభూతముల చేత నింపబడి ఉన్న ఈ దృశ్యజగత్తు అంతర్ముఖదృష్టి గలవానికి విషయమే కాదు. ఇదంతా ఆతనికి ఎందుకూ ఉపకరించక, సదా శూన్యరూపమునే పొందుచున్నది.

❖

దృశ్యమునకు సంబంధించిన సర్వధ్యాసలు, (వాటికి సంబంధించిన కామ, క్రోధ, లోభములు) ఉపశమించినప్పుడు అంతఃకరణంలో శీతలత్వం (Calmness & Tranquility) చోటుచేసుకుంటుంది. అట్టివాడు సర్వేసర్వత్రా ప్రశాంతతను దర్శించగలడు.

**అన్తస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్ ।**
**భవత్యఖిలజన్తూనాం యదన్తస్తద్బహిః స్థితమ్ ॥** (శ్లో 34, సర్గ 56)

ఇక తదితర సంసారజీవుల అంతరంగంలో 'తృష్ణ' అనే అగ్నిజ్వాల ఏర్పడి ఉండటం చేత వారికి ఈ జగత్తంతా దావాగ్నిచే నిండి ఉన్నట్లుగా మరియు, దాహమయమై ప్రాప్తిస్తోంది. అంతః కరణం ఏ విధంగా ఉంటే బాహ్యజగత్తు ఆ రీతిగానే అనుభవమౌతోంది.

చిత్తమే బాహ్యమున జగత్తుగా ప్రాప్తించుచున్నదని జ్ఞానులు ఎరిగియే ఉన్నారు. ఈ అంతరిక్షం, పృథివి, వాయువు, ఆకాశము, పర్వతము, నదులు, దిక్కులు – ఇవన్నీ అంతఃకరణము యొక్క వివిధ రకములైన స్పందన విభాగములే అయిఉండి, బాహ్యమున తోచుచున్నాయి. చిత్తము లేనిదే బాహ్యమే ఉండదు.

మఱ్ఱిచెట్టు నుండే మఱ్ఱి విత్తులు బయలుదేరుచున్నట్లు సత్స్వరూపమగు ఆత్మ యందు గల ఈ జగత్తు బాహ్యముగా గోచరిస్తోంది. యథార్థానికి ఏవీకూడా బాహ్యమున గాని, అంతరమున గానీ లేవు. అంతా పూర్వవాసనలను అనుసరించే జీవునకు అనుభవమవటం జరుగుతోంది. ఒక చిన్న డబ్బీలో ఉంచబడ్డ కస్తూరియొక్క సువాసన ఆ చుట్టుప్రక్కల వ్యాపించి ఉంటున్నట్లు, లోన గల ఆత్మ తత్త్వమే బాహ్యమున జగదాకారముగా భాసించుచున్నది. అనగా ఆత్మయే విశాలత్వముచే బాహ్యమున జగద్రూపముగానూ, అంతరమున అహంకారరూపముగానూ స్ఫురించుచున్నది.

అయితే, ఒక ముఖ్యవిషయం. బాహ్యమున ఈ జగత్తు గాని, అంతరమున అహంకారం గానీ, ఆత్మ కాదు. అది స్థూలమైన ఏ రూపమూ కాదు. ఆ రెండిటి యందూ అనుస్యూతమై ఉన్న విభు స్వరూపమగు సన్మాత్రమే అది. ఆత్మ తన యొక్క ఆంతరికమగు చిత్తము ఏ పూర్వవాసనలతో కలిగి ఉన్నదో – తదనుసారమే బహిర్ముఖంగా తదితర జగత్తును గాంచుచున్నది. ఈ జాగ్రత్ వాసనలచే హృదయంలో స్వప్నమనో రాజ్యములను కూడా గాంచుచున్నది. బాహ్యము నందూ, అంతరం నందు కూడా అనుస్యూతమై ఉన్న సద్రూపమగు ఆత్మ నుండి ఈ జగత్తు అనుదాన్ని మనం వేరు చేశామా, అప్పుడీ జగత్తు అనబడేది మృతప్రాయమే అవుతుంది. అట్లు వేరు చేయనంత కాలం ఈ బాహ్య, అభ్యంతరములు తొలగనే తొలగవు. అహంకార, మమకారముల 'అధ్యాస' చే పదార్థాల అల్ప, అధిక భేదము గురించిన భయము కలుగుతూనే ఉంటుంది. అందుచేత సర్వ భేదాలకు అతీత్వము అభ్యాసం చేస్తూ ఉండాలి.

మనోవ్యాధిచే నిహతుడగుచున్న జీవునకు ఈ ఆకాశం, భూమి, పర్వతము, నదులు, దిశలు ...ఇవన్నీ ఆధిభౌతిక – ఆధిదైవిక – ఆధ్యాత్మిక తాపములను కలుగజేస్తూనే ఉంటున్నాయి. మనో వ్యాధి తొలగేది ఎట్లా?

**యస్త్వాత్మరతిరేవాన్తః కుర్వన్కర్మేన్ద్రియైః క్రియాః ।**
**న వశో హర్షశోకాభ్యాం స సమాహిత ఉచ్యతే ॥** (శ్లో 43, సర్గ 56)

ఎవ్వడైతే అంతరమున ఆత్మయందు మాత్రమే ప్రీతి కలిగి ఉంటాడో, అంతటా సన్మాత్రమగు ఆత్మనే వీక్షిస్తూ ఉంటాడో – అట్టివాడు ఈ దృశ్యమునకు పట్టుబడడు. అట్టివాడు కర్మేంద్రియములచే క్రియలు ఒనర్చుచున్నప్పటికీ హర్ష – శోకములకు వశుడుకాడు. ఇక, అతడు 'సమాధిస్థితుడు' అని అనిపించుకుంటాడు. ప్రశాంతబుద్ధికలిగి, అంతటా ఆత్మను గాంచుచూ, ఇక ప్రాపంచిక పదార్థముల గురించి శోకించక, వాటిని తలచక ఉండేవాడు సమాధిపరుడు. అట్టి సుస్థితికి చేరినట్టి మహనీయుడు ఉత్పత్తి – వినాశనయుక్తమగు ఈ జగత్తుయొక్క గతిని వీక్షిస్తూ, అజ్ఞులందు ప్రసిద్ధమై ఉంటున్న ఈ అహంమమత్వాది దృష్టులను చూచి నవ్వుకుంటూ ఉంటాడు.

**సమాధి బుద్ధి -** "సూర్యకిరణములు కెరటములలో ప్రతిబింబించటం జరుగుచున్నప్పుడు అక్కడ వెండితీగలు ఉన్నట్లు భ్రమ కలుగవచ్చు గాక! అవి మెఱుపులే గానీ వెండితీగలు ఎలా అవుతాయి? ప్రత్యగాత్మయే వాస్తవ స్వరూపముగా గల నా యందు ఈ అహంకార, మమకారములు గానీ, తదితర జనన మరణాది వికారములు గానీ ఉండజాలవు. నేను సర్వదా అసంగుడను. అద్వైత స్వరూపుడను. కూటస్థుడను. సమరూపమగు బ్రహ్మమునే నేను." అనునదే సమాధి బుద్ధి. కాబట్టి ఆతని పట్ల జీవస్థితి, అహంకారము, దృశ్యము, జగత్తు మొదలైన విభాగములు ఉండవు. మనస్సు ఉండదు. ఆ మనస్సు చేసే కల్పనలూ ఉండవు. సర్వాత్మ స్వరూపుడగు అట్టి జ్ఞాని మాత్రమే ఉనికి కలిగినవాడు అగుచున్నాడు. ఇక తక్కినవారు లేనివారే అవుతారు. అట్టి సమదర్శి ఆకాశము వలె స్వచ్ఛుడై ఉంటాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! సమదర్శియొక్క శాస్త్రవిహిత విశేషాలు ఎట్లా ఉంటాయి?

**శ్రీవసిష్ఠమహర్షి :** అట్టి సమదర్శి ఆకాశము వలె స్వచ్ఛుడై ఉంటాడు. సహజం గాను, స్వభావసిద్ధం గాను లోకానుకూలము కొరకై శాస్త్ర, శిష్టాచారములకు అవిరుద్ధమైన బాహ్యక్రియలు ఒనర్చుచూ ఉంటాడు. హర్ష, క్రోధ – వికారములు ఎదురు పడినప్పుడు శిల, కొయ్యల వలె చలించక శాంత స్వభావుడై ఉంటాడు. సర్వజీవులనూ తనవలె చూస్తూ ఉంటాడు. స్వభావంగానే పరుల ద్రవ్యములను మట్టిగడ్డల వలె చూస్తాడు. అట్టివాని దృష్టే సరి అయిన దృష్టి.

**అజ్ఞాని -** అజ్ఞాని దృష్టి ఎలా ఉంటుందో కూడా చెపుతాను. ఇక్కడి సువర్ణము, ఐశ్వర్యము మొదలైన వాటిని ఆతడు మిథ్యారూపములుగా గాంచడు. పోనీ, సద్రూపములుగా గాంచుతాడా... అదీ లేదు. ఆతనికి సద్రూపానుభవమే లేనప్పుడు సద్రూపముగా ఎట్లా గాంచుతాడు? జ్ఞాని మాత్రమే ఈ పదార్థ జాలమును మిథ్యారూపముగానూ, సద్రూపముగానూ కూడా గాంచగలడు.

❖

ఉత్తమాశయము కలిగి, బ్రహ్మపదమును పొందినవాడు ధనహీనుడు కావచ్చు. లేక ఐశ్వర్య వంతుడు కావచ్చు. ఆతనికి పుత్రులు, బంధువులు ఉండవచ్చు ... ఉండకపోవచ్చు. ప్రాపంచికమైన అభ్యుదయ స్థితి పొందవచ్చు ... పొందకపోవచ్చు. ఏది ఏమైనప్పటికీ ఆతడు మాత్రం సమరూపుడై, హర్షశోకములచే, ప్రాప్తాప్రాప్తములచే ఆటంకపరచబడజాలక యథాతథంగా ఏర్పడి ఉంటూ ఉంటాడు. అట్టివాడు అనేక భోగములతో స్వజనులతో నిండి ఉన్న గృహము నందు ఉన్నా... లేక సర్వ భోగవిరతుడై జనరహితమైన కీకారణ్యంలో ఏకాంతంగా ఉన్నా... కాక, మన్మథుని తీవ్రవేగమును పొందుతూ మద్యపానరతుడై ఉన్నా... బహిరంగ ప్రదేశంలో నృత్యం చేస్తూ ఉన్నా... లేదా, సర్వమును పరిత్యజించి జటాధారి అయి పర్వతగుహలో తపస్సు చేస్తూ మౌనవ్రతుడై ఉన్నా... సదా, చందనము మొదలైన సుగంధ ద్రవ్యములు ఒంటికి అలదుకొని స్త్రీలను లాలిస్తూ ఉన్నా... ఆయా లౌకిక కార్యములందు నిమగ్నమై ఉన్నా... తన జ్ఞానము యొక్క బలిమిచే దేని చేతా తాకబడకుండా ఉంటాడు. ఎందుకంటే, ఆతడు మనస్సును వికార రహితంగా ఉంచుకుంటాడు.

మనో–దేహము లందు ఆతడు అహంకారమును ఆశ్రయించకపోవటం చేత, ఆతడు ఏది ఒనర్చు చున్నప్పటికీ ఒనర్చనివాడు అయి ఉంటున్నాడు. బంగారము బురదలో పడినంత మాత్రం చేత అది తన సహజసిద్ధమగు స్వప్రకాశమును వదులుకుంటుందా? లేదేc!

ఇక అజ్ఞానులంటావా? వాళ్ళు విషయములు సేవిస్తున్నప్పుడల్లా వాసనలు పెంపొందించు కుంటున్నారు. అజ్ఞాన వాసనలతో ఇంద్రియములను అజ్ఞాన మార్గంలో ఉపయోగిస్తూ ... ఇంకా ఇంకా సాంసారిక దృష్టులను, సంస్కారాలను అధికం చేసుకుంటున్నారు. భోగ్యములైనట్టి శబ, స్పర్శ, రూప, రస, గంధములు వారి మనస్తత్వములపై పెత్తనం చెలాయిస్తున్నాయి.

కాబట్టి, విజ్ఞుడైనవాడు ఈ కనబడే వస్తువుల గురించి సరి అయిన అవగాహన కలిగి ఉండాలి. అప్పుడు ఆతని పట్ల సర్వవస్తువులు తమంతట తామే కాలక్రమంగా శమిస్తాయి. "అనేక వస్తువుల సత్త" – యొక్క అభావముచే చిత్తము నందలి కళంకములన్నీ స్వయంగా నశిస్తాయి.

**శ్రీరాముడు :** స్వామీ! అసలు వాసనలు ఎలా ఏర్పడుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అహంకార, మమకారముల అధ్యాస చేతనే 'వాసన' అనబడే అనర్థం ఏర్పడుతోంది. ఫలితమేమిటి? ఆనందమే స్వస్వరూపముగా గల ఈ జీవుని జీవితమంతా అనేక రీతులైన దుః ఖములకు ఆలవాలమైపోతోందే! అహంకారం నశించిందా... జ్ఞానం తనంతటతానే స్వయంగా వికసిస్తుంది. అట్టి జ్ఞాన ప్రభావంచేత అంతఃకరణంలో సమత్వం ఉదయిస్తోంది. ఒకడు చీకట్లో మెత్తటి త్రాడును తాకి 'అమ్మబాబోయ్' అని అరచి, గడగడ వణుకుచున్నాడనుకో.... "అది పాము కాదు, త్రాడే" అని తెలిసిపోతే వికారాలన్నీ మటుమాయమౌతాయికదా!

కాబట్టి రామా! జ్ఞానము సంపాదించి, తద్వారా దేనితోనూ సంబంధము లేనివాడవై ఉండు.

**యత్కరోతి యదశ్నాతి యద్దదాతి జుహోతివా ।**
**నతజ్ఞస్య నతత్రజ్ఞో మాఽకరోతు కరోతువా ॥**

ఏది చేస్తున్నా, భుజిస్తున్నా, ఇస్తున్నా, హోమం చేస్తున్నా, జ్ఞానికి వాటితో గాని, వాటికి జ్ఞానితో గాని సంబంధమే ఉండదు. అదీ చమత్కారం! ఆతనికి ఆ కర్మలు చేయటం, చేయక పోవటం ఒక్కటే. పూర్ణజ్ఞానికి కర్మలచే గానీ, కర్మల యొక్క అభావంచే గానీ, ప్రయోజనమేముంటుంది చెప్పు? ఆతడు అన్ని స్థితులందూ ఆత్మ జ్ఞానముచే ఆత్మ యందే సంస్థితుడై ఉంటాడు. గండశిలపై పడిన విత్తు మొలుస్తుందా? జ్ఞాని యొక్క అంతఃకరణము నందు కోర్కెలు జనించవు. ఆతని యందు ఏదేది జనిస్తుందో అదంతా జలమందలి తరంగముల వలె ఆతని రూపమే (ఆత్మ రూపమే) అయి ఉంటుంది? ఇంక స్పర్ధకు చోటెక్కడ? ఓ రాఘవా! ఈ బ్రహ్మాండమంతా జ్ఞాని యొక్క స్వరూపమే. ఆతడూ బ్రహ్మాండస్వరూపమే అవుతాడు. ఎందుకంటే ... యథార్థానికి ఈ జగత్తులో దేశ, కాల, వస్తు కృతమగు విభాగమంటూ ఏదీ లేదు. ఇక్కడ అనుభవము మాటేమిటంటావా? స్వకీయమగు కల్పనయే ఇట్లు ఈ రీతిగా ప్రవర్తిస్తున్నదని గ్రహించు. జ్ఞానియగు ఉత్తమ పురుషుడు అతిపావనము, ఏకరూపము, సర్వాద్వైత బంధరహితము అగు సన్మాత్రరూపుడై ఉంటాడు.

జ్ఞానికి, పరమాత్మకు భేదమేమీ లేదు. అజ్ఞానము అనబడేది భ్రమ మాత్రమే. కనుక అజ్ఞాని "ఎఱుకను ఏమరచిన పరమాత్మ" కాక మరింకేమీ కాదు.

❖❖❖

# 14. అభేద నిర్ణయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రఘురామా! ఆత్మ స్వప్రకాశయుక్తమై అంతటా వెలయుచున్నది. అదియే అజ్ఞాన కారణం చేత "అహంకారము – వస్తుజాలము – దేశకాలములు".. మొదలైన విశేషములతో కూడిన జగత్తుగా విస్తారత సంతరించుకుంటోంది.

'అనుభవం' – అనునది ఆత్మయొక్క విన్యాసమే. లవణము యొక్క లవణత్వానుభవం ... చెఱుకు యొక్క మాధుర్యానుభవం... శిల యొక్క కాఠిన్యానుభవం.... పర్వతము యొక్క గురుత్వానుభవం... జిహ్వము యొక్క రుచిత్వానుభవం... వృక్షము యొక్క శాఖత్వానుభవం... ఆకాశము యొక్క శూన్యత్వానుభవం... అహంకారం, కుండ, గోడ, శరీరము, ఆవర్తము ... మొదలైన రూపత్వానుభవం... అంతా కూడా ఆత్మ యొక్క 'అనుభవము' అనబడు స్వవిస్తారమే సుమా!

జ్ఞాన దృష్టిచే చిద్బ్రహ్మము తోటి సర్వపదార్థముల అభేదమే సిద్ధిస్తోంది. ఆత్మ యొక్క ఘనత్వానుభవం అహంకారం గానూ, ఆ అహంకారముచే సిద్ధిస్తున్న పదార్థజాలం గాను ప్రకటిత మౌతోంది. అజ్ఞాన దృష్టికి మాత్రమే చిత్తము చిత్తు కంటే వేరైన దాని వలె దృశ్యమానమౌతోంది. ఆత్మ యొక్క చైతన్యము ద్వారా కలిగే సత్తా రూపానుభవమే స్వయముగా అహంకారరూపంగా ఏర్పడుతోంది. ఆ కనబడేదానిని మనం 'చిదాభాసుడు' అని అంటున్నాం.

చూచావా! అంతరాత్మ తన స్వప్రకాశము యొక్క అనుభవముచే వృత్తిభేదం చేత భిన్న వస్తు జాలములుగా చిదాభాసము లందు అనుగతమై ఉంటోంది. స్వయముగా తాను విస్తరించి, తనచే ఏర్పడి ఉన్న చోటును తనకు అన్యమైనదాని వలె గాంచుచున్నది. అహంకారముగా ఆవిర్భవిస్తున్నది. అది ఆత్మ యందు ఆత్మ యొక్క చిత్ (Awareness) రూపమే! అదియే 'అంతఃకరణము' అను మరొకటిగా కవులు వర్ణిస్తున్నారు. అంతఃకరణమంతా ఆత్మయే.

❖

యథార్థానికి ఆత్మ పదార్థరూపంగా ఏదీ అగుటలేదు. నీరు తరంగంగానూ, ఆవర్తంగానూ, బుద్బుదం గానూ, ఏమైనా మారిపోతోందా! నీరు సర్వదా నీరుగానే ఉంటోంది కదా! ...అట్లాగే, ఆత్మ కన్నా భిన్నంగా మరొక పదార్థమేదీ సంభవించదు.

ఆత్మ ఆస్వాదించ తగినట్టి మరొక్కటేదీ ఎక్కడా ఏర్పడజాలదు. వికారము పొందటానికై ఆత్మకు భిన్నమై వేరొక్కటేదీ ఎక్కడా లేదు. "ఆత్మచే పొందబడుచున్నది" అనునదంతా గొడ్రాలి రెండవ కుమారుని వలె పొంతనకు దొరకని వాక్యం.

ఆత్మ జన్మించదు. మరణించదు. అది శరీరాంతర్గతమై, శరీరములకు ముందు వెనుక, శరీరసమయంలోను - బయట - లోపలా అంతటా ఒకే తీరుగా సర్వదా వెలయుచున్నది. అసత్తు అగు ఈ జగత్తంతా ఆత్మయందే భాసించుచున్నది. అనంతపరిపూర్ణజ్ఞాన స్వరూపమగు పరమాత్మ ఏకరూపముననే ఉన్నాడు. తనయందు తానే జగత్‌రూపంగాను, తదితర సర్వరూప-నామ-తత్వములుగాను స్థితి కలిగియున్నాడు.

❖

ఓ రాఘవా! ఇప్పటివరకూ నేను చెప్పుచున్న దానిని అనుసరించి "అహంకారమునకు, జగత్తునకూ భేదమేమీ లేదు" - అని నిరూపించబడుతోంది కదా!

ఒక అత్యుత్తమ సత్యం ప్రకటిస్తున్నాను. విను. వాస్తవానికి చిత్తముగానీ, చిత్తము కలవాడుగానీ, జగత్తు అనబడు విభ్రమముగాని లేవు. వస్తూ ఉన్న వర్షం ఒక్కసారి ఆగిపోవునట్లు, శుద్ధ సన్మాత్ర జ్ఞానము చే ఈ జగత్తు ప్రశమనము పొందగలదు. అనగా నీవు జ్ఞానివైనావా.... నీ దృష్టిలో ఈ జగత్తు ఒక్కక్షణంలో లేకుండా పోగలదు. జలంలో తరంగాలు ఎందుకుంటున్నాయి? జలమే తరంగాలుగా అగుపించటం జరుగుతోంది కదా!

ఆ జలము యొక్క ద్రవత్వస్వభావంచేతనే కదా! మాయావియగు ఈశ్వరుడు స్వమాయచే ఆవృతమైన "జ్ఞప్తిరూపనిజాత్మ" యందు ఈ జీవదశలను పొందుచున్నాడు. అనగా ఏమిటి? "నేను జీవుడను ... ఇది జగత్తు" అను రూపముగల భావము ఆ ఈశ్వరుడే తనకుతాను తనయందు కల్పించుకొనిన మాయచే గాంచి, అనుభవించుచున్నాడు. అట్టి అనుభవమును గాంచుచున్నట్టి సమయంలో "నేను ఈ దృశ్యవ్యవహారమునకు స్వయముగా రచయితనైయున్నాను. కనుక ఈ కనబడే సర్వమునకు నేనే ఈశ్వరుడను. సర్వదా పూర్ణుడను" అనే విషయం పూర్తిగా ఏమరుచుచున్నాడు.

ఎంతటి చమత్కారం! ఏ విధంగా అయితే జలమునందు ద్రవత్వమూ, వాయువునందు చంచలత్వమూ ఉన్నాయో, అదేవిధంగా జ్ఞప్తిమాత్రుడగు ఈశ్వరునియందు అహంకారము - దేశము - కాలము మొదలైనవన్నీ ఉన్నాయి. ఈశ్వరస్వరూపుడు అగు ఈ జీవుడు ఒక వైపునుండి 'నేను ఈశ్వరుడను' అను భావముచే ఆవరణము (Limitation)గానీ, పరిచ్ఛేదము (Partition)గానీ లేనట్టి తన నిరతిశయానంద జ్ఞానమును ఎరుగుచునే ఉన్నాడు. అయితే, మరొకచోట మరొకవైపున, అహంకారవశంచేత 'నేను జీవుడను' అను రూపముగల జీవభావము పొందుచున్నాడు. అట్టి జీవభావముచే ఈ పంచభూత, ప్రాణ, ఇంద్రియాదులందు విషయసంబంధమగు 'అధ్యాస' కలిగి ఉంటున్నాడు. అట్టి సమయంలో "ఈ దేహమే నేను. ఈ దేహమునకు అనుభవమగుచున్నవే నా పరిధి"... అని భావించుచున్నాడు. అయితే, ఈ స్వయంకల్పిత పరిమితులు యథార్థమా? కానేకాదు. అగుటకు వీలు లేదు కూడా.

అజ్ఞాని ఆయా కర్మవాసనల చేతనూ, దర్శన, లాభాది భోగ వైచిత్ర్యములచేతనూ ప్రియ - మోద - ప్రమోద వ్యవహారముల చేతనూ అనేక దృష్టిపరంపరలను తనయందు కలిగి ఉంటున్నాడు.

తృప్తి పొందాలని తపిస్తూ ఎచ్చటెచ్చటికో వెళ్ళి వెతుకుచున్నాడు. అయితే ఒకడు జ్ఞాని కావచ్చు... అజ్ఞాని కావచ్చు. ఎరుగబడుచున్న వైచిత్ర్యమంతా అభిన్నమగు ఆత్మచేతనే నిర్వర్తించబడుచున్నదని గ్రహించు. ఈశ్వరుడే ఇచ్ఛాకామములకు అనుగుణంగా తన అంగములను ఆయారూపములుగా పరిణమింపజేస్తున్నాడని గమనించు.

**పరమార్థస్థితి -** ఓ రామచంద్రా! ఈ జగత్తంతటికీ అధిష్ఠానమైయున్న పరమాత్మ యొక్క జ్ఞానమే పరమార్థ స్థితి. సర్వజీవుల జీవనము దేనియొక్క అధీనమైయున్నదో.... అట్టి పరమానంద రూపమే ఈ జీవుని స్వరూపం. సచ్ఛాస్త్రములు, గురూపదేశములు సహకరించుచుండగా ఎప్పుడైతే జీవుడు ఈ సత్యం గ్రహిస్తాడో అప్పుడిక "ఈ భోక్త – భోగ్యముల రెండిటి యొక్క అధిష్ఠానం చిద్రూపమగు ఆత్మయే" ... అని తప్పక గ్రహిస్తున్నాడు. ఇకప్పుడు జీవ, ఈశ్వరులకు భేదమేమున్నది? ఎక్కడున్నది?

"ఈశ్వరుడే సంకల్పముల ఆధిక్యత చేత జీవుడగుచున్నాడు. జీవుడే సంకల్ప, ఆసక్తి క్షయం చేత ఈశ్వరుడగుచున్నాడు. జీవ, ఈశ్వరుల భేదం లేనట్లే, ఈశ్వరుడు, బ్రహ్మమునకు భేదం లేదు. అనగా, శాంతమై... అఖండమై, పరిపూర్ణమై బ్రహ్మము మాత్రమే శేషించుచు.... అది సర్వుల వాస్తవరూపమై ప్రకాశించుచున్నది.

**బోధప్రయోజనం... సాక్షాత్ ప్రయోజనం -** కాబట్టి రామా! ఈ జగత్తంతా బ్రహ్మమే. "అట్టి బ్రహ్మము ప్రశాంతము ... జననరహితము... ఏకము ... అనాది... పూర్ణప్రకాశస్వరూపము ... ఆనందైకరసము... విషయచిహ్నరహితము" అనునది మన ఇప్పటి వరకు జరిగిన చర్చ యొక్క సారాంశము. ఈ జగత్తు యొక్క ప్రశాంతరూపమును బోధించుట కొరకు బోధించువారమగు మేము కొన్ని భేదరూపములగు శబ్దజాలమును ఆశ్రయించటం తప్పటం లేదు.

శాస్త్రకారులచే బోధ యొక్క ప్రయోజనము కొరకు "మనస్సు, బుది, అహంకారము, చిత్తము, జీవుడు, ఈశ్వరుడు"... మొదలైన శబ్దజాలం కల్పించబడుతోందికదా! ఈ శబ్దజాలమంతా బోధ ప్రయోజనము కొరకే గాని, సాక్షాత్ ప్రయోజనముకొరకు కాదని నీవు గ్రహించు. నీవు ఇవన్నీ వింటూనే, భోగత్యాగలక్షణం ద్వారా అఖండార్థరూపమైనట్టి 'ఓం' కారము యొక్క లక్ష్యార్థమును గ్రహించు.

ఆ లక్ష్యార్థం నిత్య, అపరోక్ష చిన్మాత్రమే అయి ఉన్నది. అదియే మనందరి వాస్తవ రూపమని చేతులెత్తి ప్రకటిస్తున్నాను. అదే సమస్తం అయి, ముందు, వెనుక, మధ్యల యందు ఆక్రమించియున్నది.

❖❖❖

# VIII.సురఘు-మాండవ్య-పర్ణాదుల సంవాదం

## 1. సురఘు అంతర్మథనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! శాస్త్రములచే, గురువులచే ఉపయోగించబడుచున్న "జీవుడు – ఈశ్వరుడు – మనస్సు – బుద్ధి – అహంకారము" – మొదలైన శబ్దమయ దృష్టి అంతా శిష్యులకు అద్వితీయము – ఏకము – అఖండము అగు ఆత్మ విషయం బోధించటానికై కల్పించబడుచున్నది. ఈ విషయం విశదీకరించ గల "సురఘురాజు, మాండవ్య మహర్షి, పర్ణాదుడు" – అను ముగ్గురి మధ్య జరిగిన ఒక పురాతనమైన సంవాదము చెపుతాను .....విను.

❖

'కైలాసము' అను ప్రసిద్ధ హిమాలయ శిఖరం శంకరభగవానుని నివాసమై ఒప్పుచున్నది. ఆ పర్వత ప్రాంతంలో ఒక చోట ఒక కిరాత రాజ్యం ఉన్నది. అక్కడి ఆటవికులు అడవులలో సంచరిస్తూ రుద్రాక్షమాలలు, ఇంధనము (కట్టెలు), ఫలములు సంపాదించి, తదితర ప్రదేశములలో విక్రయిస్తూ జీవితాలు గడుపుతూ ఉంటారు. ఆ రాజ్యమును ఒకప్పుడు 'సురఘుడు' అనేవాడు పాలిస్తూ ఉండే వాడు. 'హేమజట' అనునది ఆతని మరొక పేరు. సురఘుడు విభవాలలో కుబేరునితోనూ, జ్ఞానములో బృహస్పతితోనూ, కావ్య సాహిత్యాదులలో శుక్రాచార్యునితోనూ సమానుడని జనులు అనుకుంటూ ఉండేవారు. ఆతడు ప్రజలను కన్నబిడ్డలవలే పాలిస్తూ ఉండేవాడు. దుష్టజనుల విషయంలో మాత్రం కాలయముని వలె సింహస్వప్నంగా ఉండేవాడు. అక్కడి రాజ్యాంగాన్ని అనుసరించి దొంగల విషయంలో, తదితర సంఘవిద్రోహుల విషయంలో అతిక్రూరంగా శిక్షలు అమలు పరుస్తూ ఉండే వాడు. "నిగ్రహ – అనుగ్రహాలకు ఆతనికి అతడే సాటి" అని అందరూ అనుకుంటూ ఉండేవారు.

ఆ సురఘు చాలాకాలం ఆ కిరాతరాజ్యం ఏలాడు. కొంతకాలానికి జ్ఞానసంపన్నుడగు ఆతని హృదయంలో ఒక నూతన వేదన ప్రారంభమైనది. "అయ్యో! నేను నిర్దయగా శిక్షలు అమలుపరుస్తున్నానే! ఇది హింసయే అవుతుంది కదా! శిక్షలు అమలుపరచేటప్పుడు వారి రోదనం కర్ణకఠోరంగా ఉంటున్నదే! సర్వజీవరాశులు ఆ భగవంతుని స్వరూపులే కదా! ఈ బాధించటం ఎంత వరకూ ఉచితం?" అని తనలో తాను మథనపడుతూ ఉండేవాడు. కొన్ని రోజులు అట్లా గడిచాయి. ఒకరోజు రాత్రి విశ్రాంతి గృహంలో పవళించి ఉండగా ఆతని అంతర్ మథనం ఇంకా అధికమైనది.

**సురఘు (తనలో) :** అయ్యో! నేను అధికారం ఉన్నది కదా అని, అనేక మందిని దుఃఖితులనుగా చేస్తున్నానా? సర్వప్రాణుల దుఃఖమూ నావంటిదే కదా! అందుచేత నా దగ్గర ఉన్న ధనమంతా అందరికి పంచివేస్తే – అప్పుడు పేదరికం ఉండదు. అప్పుడు సంఘవిద్రోహులే ఉండక పోవచ్చుకదా! ఉట్టి దండనతో ఏం ప్రయోజనం?

అయ్యో! నిర్దయగా శిక్షలు అమలు పరచకపోతే జనులలో అధర్మప్రవృత్తి నశించదు. అమలు పరిచితే జీవులను హింసించటమే అవుతుంది. ఏం చేయాలి? ఈ రాజ్యం ఏలే పని ఎంత నీచమైనది? రాజుగా ఉన్నంత కాలం వధ – బంధనాది వ్యవహారం తప్పేటట్లులేదు. పోనీ రాజ్యం వదిలేద్దామా! రాజ్యం అరాచకమౌతుందను కారణంగా ఈ మంత్రులు, నా జాతి ఆటవిక ప్రజలు నన్ను వదిలేటట్లు లేరు? వీళ్ళందరినీ తప్పించుకొని నేనెక్కడికి వెళ్ళగలను? నా కుమారులు ఎదిగేవరకు రాజవంశంలో పుట్టటం చేత ఈ ధర్మం అనివార్యం. ధనం పంచటానికి మంత్రులు ఒప్పుకోరు. నా ఆలోచన విని వాళ్ళు పకాలున నవ్వుచున్నారు. ఇప్పుడు నాకు త్రోవ ఏమిటి?... ఇట్లా ఆలోచిస్తూ ఆ రాత్రంతా కునుకు లేకుండా గడిపాడు.

అతని పూర్వజన్మ పుణ్యవశం చేత కాబోలు, ఆ మర్నాడు ఉదయం మాండవ్య మహర్షి ఆ త్రోవలో పయనిస్తూ శిష్యులతోసహా ఆ ప్రాంతానికి రావటం జరిగింది. మహాజ్ఞాని, శాస్త్రకోవిదుడు అగు ఆ మహర్షి గురించి వినటం చేత సురఘురాజు వాళ్ళని ఆహ్వానించి ఆతిథ్యం ఇచ్చాడు. ఆ మహర్షిని, వారి శిష్యులను తన సేవలతో సంతోషపెట్టాడు. మహర్షిని తన మందిరానికి ఆహ్వానించి ఏకాంతంగా ఆయనతో సంభాషించసాగాడు.

**సురఘు రాజు :** హే మహర్షీ! మాండవ్యా! తమ రాకచే నేను అనిర్వచనీయమైన పరమశాంతిని పొందుచున్నాను. పేదవానికి రాజు కనికరంలాగా మీ సాన్నిధ్యం నాకు లభించింది. మీలాంటి మహనీయుల కృపారసవృష్టి ప్రసరించటానికి గాను, నేను ఎప్పుడు ఏం పుణ్యం చేశానో ఏమో!

దేవా! సర్వధర్మజ్ఞా! మీకు శ్రమ అనుకోకపోతే నాకున్న ఒక సంశయమును నివృత్తి చేయమని వేడుకొంటున్నాను. మీవంటి మహనీయులతో సంసర్గం ప్రాప్తించిన తరువాత మావంటి సంసార జీవులకు దుఃఖశమనం తప్పక కలుగగలదని పెద్దల వాక్యం. దుఃఖము యొక్క తత్త్వము ఎరిగిన పండితులు "సంశయమే దుఃఖము యొక్క మూలస్థానం" అని చెప్తుతారు కదా! స్వామీ! నా సంశయమేమిటో వినండి.

నేను రాజుగా దోషులను క్రూరంగా దండించ వలసివస్తోంది. మరికొందరిని అనుగ్రహించ వలసి వస్తోంది. ఈ దండన, అనుగ్రహములను నిర్వర్తించే విధినిర్వహణలో నాకు విషమ దృష్టే సంప్రాప్తిస్తోంది కానీ సమదృష్టి కాదు. సమదృష్టిచే మాత్రమే జీవుడు మోక్షమార్గానికి అర్హుడౌతాడని మోక్షశాస్త్రములు ఘోషిస్తున్నాయి. మరి ఇట్టి పరిస్థితులలో నాయందు సమదృష్టి యొక్క ఛాయలైనా ఎట్లా ఉద్భవించగలవో నాకర్థమవటం లేదు. అనేక రోజుల నుండి ఈ విషయమై నాలో అంతర్ సంఘర్షణ జరుగుతోంది. నాకు దిక్కుతోచటం లేదు. ఈ రాజ్యం వదలి ఎచ్చటకో పారిపోవాలని, సమదృష్టికై ఏవైనా ప్రయత్నాలు చేసుకోవాలని అనేకసార్లు అనుకున్నాను. అయితే ఇక్కడి రాజవంశంలో పెద్ద కొడుకునై పుట్టినందుకు నేను రాజుగా ఉండక తప్పుటలేదు. ఎక్కడికో పారిపోతే, అప్పుడు నేను ధర్మము తప్పినవాడనే అవుతానేమోనని కూడా నా సందేహం!

ఇప్పుడు ఏమిచేయటం ఉచితమో తమరు ఆనతివ్వండి. మీరు ఉచితమని అంటే, ఇప్పటికిప్పుడు మీకు శిష్యుడనై సర్వము పరిత్యజించి వచ్చేయటానికి కూడా నేను సిద్ధమే. ఇప్పుడు

ఏది ఉచితమో, అది మీరు ఆజ్ఞాపించమని వేడుకుంటున్నాను. నాపై దయతో సముచితమైన మార్గం చూపండి. ఈ 'రాజదండన' వంటి క్రూర క్రియలను నేను కొనసాగించలేను. నాపై దయతో నన్ను ఆజ్ఞాపించండి.

**మాండవ్యమహర్షి :** ఓ రాజా! నీ మనస్సు అలసత్వం చేత అల్పత్వం పొందిందయ్యా. ఈ శరీరాన్ని స్నానాదులు ఏ విధంగా ధూళి మొదలైనవాటిని తొలగిస్తాయో, మనస్సును కూడా ఆత్మసమాచారము, నిర్మల పర (ఆత్మ) ధ్యానము వంటి ప్రయత్నములచే ప్రతిరోజు నిర్మలస్నానం చేయించాలి. నీవు త్యజించవలసినది త్యజించవలసినంతగా త్యజించలేదు. ఆశ్రయించి ఉండవలసినది తగినంతగా ఆశ్రయించటం లేదు. అందుచేతనే నీ మనస్సు అల్పభూములలో చిక్కుకొని వేదన చెందుతోంది. నిస్తేజం అనుభవిస్తోంది.

**సురఘు :** స్వామీ! ఈ మనస్సు యొక్క అల్పత్వం తొలగేది ఎట్లా?

**మాండవ్యమహర్షి :** అందుకు ఎల్లప్పుడూ మూడు విధములైన ప్రయత్నములను ఆశ్రయించాలి–

1. మనస్సు ఏర్పరచుకొంటున్న రాగమును తొలగించి ఎప్పటికప్పుడు వైరాగ్యంతో నింపాలి.
2. కర్మల ప్రయోజనముల పట్ల ఏర్పడే 'ఆశ్రయము' ను నిరోధించి, "కర్మఫల త్యాగము" లేక "కర్మఫలములను భగవంతునికి సమర్పణ చేయుట" అను త్యాగమును అభ్యసించాలి.
3. ఆత్మజ్ఞానపర్యంతము 'శ్రవణము, మననము' మొదలైన ఉపాయాలను అనుసరిస్తూండాలి.

మనస్సులో ఏర్పడే సంతాపం 'స్వవిచారణ' చే శీఘ్రంగా ఉపశమించగలదు.

ఈ పుత్ర, స్త్రీ, జన, ధనాదులు ఏమై ఉన్నాయి?... నా శరీరంలో చోటుచేసుకొని ప్రవర్తించుచున్న ఈ ఇంద్రియములతో నాకు ఏర్పడుచున్న సంబంధము ఎట్టిది?... ఈ మనో–బుద్ధి–అహంకారముల స్వరూపం ఎట్టిది?... ఇంతకీ నే నెవరిని?... ఈ జగత్తు ఎక్కడినుంచి ఏ విధంగా నాకు ప్రాప్తిస్తోంది?... ఎట్లా ఉపశమిస్తోంది?... ఈ జనన మరణములు ఎట్లా కలుగుచున్నాయి?

ఓ రాజా! స్వమనస్సుచే పై విషయాలు బాగుగా విచారణ చేయాలి. అట్టి తీవ్ర, దీర్ఘవిచారణ చేత నీవు 'పూర్ణమహత్వము' ను పొందుతావు. నీయొక్క సత్ స్వభావమును ఎఱుగుటచే ఇక ఈ సుఖ, దుఃఖాది దశలు నీ చిత్తమును డోలాయమానం చేయలేవు. అప్పుడు నీ మనస్సు జగత్ స్వరూపమును విడచి "సర్వదా సిద్ధించియే ఉన్న దుఃఖ రహితమగు బ్రహ్మ స్వరూపము" ను సంతరించుకుంటుంది. అప్పుడది జలమందు తరంగంలాగా తనకు తానే శమించగలదు. అది జీవన్ముక్త వ్యవహారమునందు సమర్థత పొందగలిగినప్పుడు మలినరూపము వదలి పూర్వఃపూర్వ తత్పూర్వరూపం పొందగలుగుతుంది.

నీవిప్పుడు దృశ్యమును సందర్శిస్తున్నావు కదా! ఎప్పుడైతే నీవు ఆత్మను సందర్శిస్తావో, ఇకప్పుడు లోకపాలకులగు బ్రహ్మమొదలైనవారు కూడా, బిడ్డలు తండ్రికృప కోరుకొంటున్నట్లు, నీ కృపను కోరుకుంటారు. అందుచేత వివేకజనితమైన జ్ఞానముచే నీవు ఆత్మను అవలోకించు. అప్పుడు 'ఆకాశము

– సముద్రము – మేరుపర్వతము' వంటి మహత్తర పదార్థములకు కూడా అర్థ ప్రదాతవు నీవే అవుతావు. ఎందుకంటే మహత్తంతా ఆత్మసత్త యొక్క ఆధీనమే అయి ఉన్నది. ఆత్మజ్ఞానముచే మహత్వము నొందిన తరువాత ఇక చిత్తము ఈ సంసారము నందు మునుగదు.

గోష్పాదజలం (ఆవు గిట్టచే ఏర్పడిన గుంటలోని జలం)లో ఏనుగు మునుగుతుందా? ఎలా మునుగుతుంది? ...కానీ, ఆ గోష్పాదజలంలో శిథిలమైన అంగములు గల ఒక దోమ లాగా నీ మనస్సు 'దృశ్య సంపర్కము' అనే సంసార గోష్పాదజలంలో చిక్కుకుంటోంది. అది అనేక నీచదృష్టులను, అవగాహనలను, అభిప్రాయములను కలిగి ఉండి దృశ్య వ్యవహారంలో ప్రవేశిస్తోంది.

ఈ మనస్సు తన యందు వాసనలను కలిగి ఉంటోంది. అందుచేతనే దృశ్యము నందు ఆకర్షణ–వికర్షణల తాడనం పొందుతోంది. అందుచేత ఓ రాజా! 'స్వయం జ్యోతిస్వరూపం' అయినట్టి 'ఆత్మమాత్రానుభవం' శేషించే వరకూ నీవు అంతయూ త్యజిస్తూ పోవలసిందే.

బంగారపు గనిలో పనిచేసేవాడు బంగారం లభించే వరకూ గనిని శోధిస్తూనే ఉంటాడు కదా! ఆత్మలాభం కలిగేంత వరకూ ఆధ్యాత్మ శాస్త్రములను విచారణ చేస్తూనే ఉండాలి.

**"వస్తు రూప బుద్ధి... ఆత్మబుద్ధి" -** వస్తురూప బుద్ధియే సర్వ అనర్థములకూ కారణమగు చున్నది. అట్టి వస్తురూప బుద్ధిని ఉత్తమ బుద్ధిచే పరిశుభ్రపరచాలి. నిర్మలమగుచున్న బుద్ధి సాయంతో క్రమంగా ఈ దృశ్యము నంతటినీ పరిత్యజించి వేయాలి. అప్పుడు నీ చేతనే నీకు 'ఆత్మ' అను పూర్ణ లాభం చేకూరుతుంది. అట్లా కాకుండా ఏదో ఒక చోట కొన్ని విషయములు మాత్రం త్యజిస్తే ఆత్మలాభం ఎలా చేకూరుతుంది?

నీవు కొన్ని విషయములను వదులుతూ, మరికొన్ని విషయములను ఆదరిస్తూ ఉండుట చేతనే నీకు ఇప్పటి డోలాయమానస్థితి ఏర్పడుతోంది. నాయనా! మరల చెప్పుచున్నాను –

**యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే ।**
**సర్వావస్థాపరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే ॥** (శ్లో 44, సర్గ 58)

సమస్త పదార్థములు త్యజించబడనంత వరకూ ఆత్మానుభవప్రాప్తి కలుగదు. సర్వావస్థలను పరిత్యజించుటచే, అప్పుడు నీయందు ఏది శేషిస్తుందో – అదే 'ఆత్మ' అని చెప్పబడుతోంది.

ఈ మామూలు లౌకిక జీవితమే చూడు...! ఇక్కడ ఒక ఉత్తమ వస్తువును పొందాలంటే కొన్ని స్వల్పవస్తువులను త్యజించవలసి వస్తోంది. సామాన్య ప్రాపంచిక వస్తువుల విషయమే ఇట్లా ఉంటే, ఇక ఆత్మలాభం గురించి వేరే చెప్పాలా? సర్వ త్యాగం కాకుండా, కొన్ని వదలి మరికొన్నిటిని పట్టుకుని ఉంటే ఆత్మ ఎట్లా లభిస్తుంది? అందుచేత సర్వ, అన్య విషయముల కొరకై కార్యములను నిర్వర్తించటం" – అనేది పరిత్యజించి, "సర్వయత్నములూ ఆత్మలాభము కొరకే" చేయాలి. అప్పుడు మనుజుడు అద్దానిని తప్పక పొందుతాడు. అట్లా కాకపోతే ... పొందడు.

అందుచేత, 'స్వాత్మావలోకనము' కొరకు సర్వస్వము త్యజించాలి. ఉపాయం అదొక్కటే.

**జగత్తు -** (జ...గత్) జనిస్తూ ... గతిస్తూ ఉండేదంతా 'జగత్తు' అను పేరుతో వ్యవహరించ బడుతోంది. ఈ జగత్తులో వర్తమానంగా నీవు పొందుచున్న సర్వమును... అది గతించే లోపల నీవే దానిని త్యజించినవాడవై ఉండు.

నీకున్న సర్వము త్యజించుచూ పో!... సర్వము త్యజించిన తరువాత కూడా ఏదైతే ఇక నీవు త్యజించుటకు వీలు కాదో, అదే పరమపదమని ఇంకొకసారి ప్రకటిస్తున్నాను. అట్టి పరమపదమును అధిరోహించి, అటుపై ఈ జగత్తులో లీలావినోదిగా, క్రీడావిహారిగా వినోదించు.

**సురఘుడు :** మహర్షీ! అసలీ జగత్తు అనబడేది ఏ మూలపదార్థముచే తయారుచేయబడుతోంది?

**శ్రీమాండవ్యమహర్షి :** ఈ జగత్తంతా కార్య – కారణ మయమైయున్నది. ఇదంతా కూడా సన్మాత్రాత్మ యందు స్వకల్పనచే ఏర్పడి ఉంటోంది. 'సత్' నుండి బయల్వెడలి, ఆ సత్తుకు భిన్నమైన దాని వలె రూపం కలిగి ఉంటోంది.

నీవు సత్ స్వరూపుడవు. కనుక, నీచే చూడబడేదంతా నీస్వరూపమే అయి, నీకు భిన్నమైన దాని వలె నీకు సంప్రాప్తిస్తోంది. వాస్తవానికి ఇదంతా నీకు అభిన్నం. అట్టి నీకు భిన్నమై ప్రాప్తించేదంతా (అనిపించేదంతా) నీవు త్యజించు. అందుకు కారణమగుచున్న నీయందలి మూల అజ్ఞానాన్ని కూడా నాశనం చేయి.

నీ మనోరూపమైనదంతా నీచే నీయందే లయించివేయబడు గాక! లయం కాబడుచున్న మనస్సు సత్–చిత్ రూపమును పొందుచున్నది. నీ మనస్సు లయించేది నీ రూపము నందే సుమా! మనస్సు లయించగా శేషించేది ఏది? ఏకరస బ్రహ్మమే.

ఏకరస బ్రహ్మము ఇక అనుభవమాత్రమే కాని, అది ద్రష్టత్వము కాదు. ద్రష్టత్వము లేని చోట ద్రష్ట లేడు, దృశ్యం లేదు. సుఖదుఃఖాలు, కార్య – అకార్యము లనబడేవన్నీ ఉండనే ఉండవు. నీ అశాంతి తొలగిపోవుటకు అది అత్యుత్తమ మార్గం.

నేను చెపుతూ, ఉద్దేశించుచున్నదేమిటో అది స్వవిచారణచే నీవు తప్పక గ్రహించగలవు. యోచన చేయి. విచారణచేయి. ఇక మేము వెళ్ళివస్తాం. శలవా?

❖

ఇట్లు పలికి మాండవ్యమహర్షి సురఘు రాజును, ఆతని ప్రజలను ఆశీర్వదించి, అక్కడి నుండి తమ ప్రయాణాన్ని కొనసాగించారు. సురఘు రాజు వారికి వీడ్కోలు చెప్పి, ఆ తరువాత ఒకానొక ఏకాంత ప్రదేశం చేరాడు.

అక్కడ పద్మాసనాసీనుడై ఏకాగ్రచిత్తంతో స్వవిచారణ ప్రారంభించాడు.

❖❖❖

# 2. ఇంతకీ నే నెవరు?

**సురఘురాజు (అంతరంగంలో) :** త్యజించవలసినది త్యజించవలసినంతగా త్యజించలేదని మహర్షి నాకు గుర్తు చేశారు. విచారణ ఇంకా కొనసాగించమని ఆజ్ఞాపించారు. దేనిని గురించి విచారణ? ఈ గ్రాహ్య - త్యాజ్యములు నిర్వర్తిస్తున్న 'నేను' గురించి కదా!

**ఇంతకీ నేనెవడను? -** కిరాతరాజ్యం ఏర్పడి ఉన్న ఈ పర్వతము, పర్వత ప్రాంతం నేనా? కాదు. ఇవన్నీ బాహ్యమున ఉన్నాయి కదా! ...నేను ఈ పర్వతమును కాదు. ఈ పర్వతము నాది కాదు. అట్లాగే ఈ జగత్తు నేను కాదు. ఈ జగత్తు కూడా నాది కాదు. నేను ఈ నేలను కాదు... ఈ నేల నాది కాదు.

ఈ కిరాత రాజ్యము కూడా నేను కాదు. ఎందరో రాజులు ఈ రాజ్యమును పాలించారు. మరింకెందరో పాలించనున్నారు. కనుక 'ఈ రాజ్యము నాది' అనునది అవాస్తవమే. కేవలం సర్వ జనులు సమ్మతించుటచేత మాత్రమే నేనీ రాజ్యానికి రాజయ్యాను. కల్పనా మాత్రం చేతనే 'రాజుగా ఈ రాజ్యం నాదే' - అనే భ్రమపూర్వకమైన భావన కలుగుతోంది. ఈ 'రాజు' అనే సంకేతం త్యజిస్తే అప్పుడు నేను ఇక్కడ దేనికీ సంబంధించనివాడను అవుతాను. ఇక్కడి రాజుతో ఏర్పడే మంత్రి - ప్రజ - సేవకజన - శత్రు రాజ్యసంబంధములకు కూడా నేను సంబంధించని వాడను అవుతాను.

అమ్మయ్యా! సంకేతముచే ఇంతవరకూ ఏర్పడియున్న, కల్పించుకొనియున్న 'సంకేత సంబంధం' క్రమంగా నా దృష్టి పథం నుండి తొలగుతోంది.

**కుటుంబముచే నేను పరిమితుడైనవాడనా? -** సరే, ఇక ఈ 'భోగజాలము, కుటుంబము' విషయానికి వద్దాం. ఇవన్నీ నావా? కావు. ఇందలి సభ్యులందరికీ వేరువేరు ఆశలు, జీవిత లక్ష్యములు ఉండి ఉండగా, 'వీరు నావారు' అని నేను భ్రమించటమేమిటి? నా కుటుంబసభ్యులు, భృత్యులు నాతో కల్పితసంబంధం కలిగి ఉంటున్నారు. అదంతా వాస్తవమెట్లా అవుతుంది? సందర్భానుచితంగా ఇవన్నీ మార్పు, చేర్పులు చెందుచున్నాయి కదా?

**నేను శరీరమునా? -** చేతులు, కాళ్ళు మొదలైనవాటితో కూడిన ఈ దేహంలో జడములైనట్టి మాంసము, ఎముకలు మొదలైనవి కూడా ఉన్నాయి. కానీ నేను ఈ దేహములోని తదితర విభాగముల వలె ఒక జడవస్తువునా?

'ఇది ఇట్లు' అని గ్రహించగలుగుచున్న నేను జడమెట్లా అవుతాను? నీళ్లలో కమలం ఉన్నప్పటికీ నీళ్లు వేరు, కమలం వేరు కదా! జడమగు రక్త-మాంస-అస్థులతో కూడిన ఈ శరీరమునకు, చైతన్యమగు నాకు సంబంధమెట్లా ఉంటుంది? ఇవి ఎన్నటికీ నావి కావు. ఈ కర్మేంద్రియములు నేను కాదు.

**నేను భోగములకు సంబంధించినవాడినా? -** ఈ భోగములు నేనా? ఎట్లా ? భోగములు బాహ్యములైన అనుభవములే కదా? ఈ భోగములు చవిచూస్తున్న ఇంద్రియములు కూడా నేను

కాను. అవి నావి కావు. అట్లాగే జడమాత్రములై మిథ్యా రూపంగా కనిపించే బుద్ధి మొదలైనవి కూడా నేను కాదు.

**నేను మనోరూపుడనా? -** సర్వ సంసార దోషములకూ మూలమైనట్టి మనస్సును నేనా? అసలు, మనస్సు అంటే ఏమిటి? మననము అను ప్రక్రియయేకదా! మనస్సు అను దానికి స్వకీయమైన ఉనికి ఎక్కడున్నది? కాబట్టి మనస్సు గాని, బుద్ధిగానీ, అహంకారము గానీ, నేను కాదు. ఈ మూడూ అంతఃకరణము యొక్క భౌతికరూపములు.

ఈ విధంగా విచారించగా ఈ దేహము మొదలుకొని ఇంద్రియములు – మనస్సు – బుద్ధివరకూ గల ఏవీ నేను కాదని అతిస్పష్టంగా తేలిపోతోంది.

**నేను ప్రమేయుడనా? -** ఇక మిగిలింది ఈ ప్రమేయము (Relationship)తో కూడుకొని ఉన్న చేతనుడగు ఈ జీవుడే కదా? అయితే 'నేను ఒక జీవుడను' అని అనుకొనుచున్న నేను అట్టి జీవ భావము ప్రారంభం కావటానికి ముందే ఉండివున్నాను.

**త్రిపుటి** (Three - Dimensions) – 1. తెలుసుకొనుచున్నవాడు (Perceiver), 2. తెలియబడు చున్నది (Object), 3. తెలివి / తెలుసుకొనుట (Perceiving) ... త్రిపుటికి సాక్షి అయిన మరొకదానిచే త్రిపుటి ఎరుగబడుచున్నది. అందుచేత వ్యక్తిగత ప్రమాత (The Perceiver or Knower) ఆత్మ యొక్క యథార్థ స్వరూపము కానేరదు.

మాండవ్య మహర్షి "సర్వమును త్యజించవయ్యా!" అని ఆజ్ఞాపించారు కదా! కనుక సాక్షిచే ఎఱుగబడుచున్న ప్రమాత ప్రమేయములను కూడా త్యజించివేస్తున్నాను. అవి నేను కానప్పుడు వాటిని త్యజిస్తే నాకేమి నష్టం? ఏమి కష్టం?... 'ఇవన్నీ నావి కావు, నేను కాదు' అని గమనిస్తే చాలుకదా!

అవును.. ఇప్పుడు శేషించిన వికల్ప, సంకల్ప రహితమగు విశుద్ధచైతన్యమగు ఆత్మనే నేను.

❖

ఆహా! ఎంత ఆశ్చర్యం! నేను ఇతఃపూర్వం కూడా ఆత్మను సర్వదా పొందియే ఉన్నాను! కానీ, నిత్యసాక్షిత్వమును వదిలి నేను జీవుడను... నేను భోక్తను అని అనుకుంటూ దయ్యం పట్టిన వాని వలె ఇంతకాలం ప్రవర్తిస్తున్నాను.

ఎప్పుడైతే సర్వమునకు సాక్షి రూపుడను నేను' అని గుర్తు చేసుకొన్నానో, మరుక్షణం ఉత్తమమగు పురుషార్థలాభుడను అగుచున్నాను. ఇది నాకు ఎంత సుఖప్రదమైన విషయం! అనంతరూపుడగు ఆత్మయే నేనైయున్నాను. అట్టి నా పరమాత్మత్వమునకు అంతమే లేదు.

నా యందు ఏ పరమాత్మ ఉన్నదో అదే పరమాత్మ బ్రహ్మదేవుని యందు ఇంద్రుని యందు, యముని యందు, వాయువు నందు, సర్వభూతజాలము నందూ సమముగా అవతరించినదై ఉన్నది. ముత్యపుమాల యందు దారం లాగా సర్వుల యందూ అనుగతమై ఉన్నది.

నా యొక్క, సర్వుల యొక్క 'స్వానుభవమాత్రం' అగు చిత్‌శక్తి అతి నిర్మలమైనది. అది విషయ వ్యవహార వివర్జితమైనది. అది సర్వ దిక్కులనూ సర్వదా పూర్ణమొనర్చుచున్నది. అత్యంత మధురమైనది.

అయితే అజ్ఞానులకు మాత్రం అది భయంకరాకృతిగానే తోచుచున్నది. సర్వపదార్థము లందూ వ్యాపించి ఉన్న ఆ చిత్‌శక్తి అతిసూక్ష్మమై ఉండుటచే, ప్రజ్ఞానదశ యందు ఏర్పడి ఉన్న స్థూలదృష్టి కారణం చేత నేను గుర్తించలేకపోయాను.

అట్టి ఉత్పత్తి వినాశనరహితమగు చిత్‌శక్తినే నేను. చిత్‌శక్తి స్వరూపుడనగు నేను పాతాళము నుండి బ్రహ్మలోకము వరకూ సమస్త భువనము లందూ స్థితి కలిగి ఉన్నాను. సర్వశక్తి నిలయం ఆ చిత్‌శక్తియే. అయ్యది నిరతిశయానందముచే పరిపూర్ణమైయున్నది. సూర్యుడు మొదలైన ప్రకాశింప జేసే వస్తువులన్నిటినీ ప్రకాశింపజేసేది అదే. 'బ్రహ్మాండములు' అనే ముత్యములను ధరించిన దారం అది.

అది సర్వాకార-వికారయుక్తమై కూడా సర్వాకార-వికార వివర్జితమై ఉన్నది. భూతకోట్ల అన్నిటి రూపమూ అదే. కనుక సర్వ రూపత్వము ఆ చిత్ శక్తికే ఆపాదయోగ్యము. పదునాలుగు లోకములందలి పదునాలుగు విధములైన జీవరాసులను తన ఉదరమున ధరిస్తున్నది అదే.

జగత్తు అనబడు అనుభవరూపమంతా ఆత్మయే కానీ మరింకేమీ కాదు. ఆ ఆత్మయే సమస్తము అయి ఉండుటచే సుఖ దుఃఖ దశలన్నీ మిథ్యారూపములు మాత్రమే!

'పరాచైతన్యము' అను వేద ప్రసాదిత నామధేయమునకు అది ఒప్పుచున్నది. చైతన్య రూపమై ఉన్న నా ఆత్మ జగత్తంతా వ్యాపించియున్నది. మరొక వైపుగా, ఇచ్చట ప్రవేశించి నాట్యం చేస్తోంది.

యథార్థానికి ఈ మనోదేహాదులు లేవు. తుచ్ఛములైనట్టి ఈ దేహము, దాని ద్వారా ప్రాప్తిస్తున్న దృశ్యం నశిస్తున్నప్పటికీ, ఆత్మ ఏమాత్రం నశించుటలేదు... మరి ఈ జగజ్జాల నాటకమంతా ఏమిటి?

అవును.... తెలిసింది. ఇదంతా 'చిత్తము' అను నటుడే తన నటనా చాతుర్యంతో రచిస్తున్నాడు. ఎప్పుడైతే బుద్ధి జగద్విశేషాలతో తన్మయత్వము పొందకుండా సాక్షిత్వము పొందుతుందో, అప్పుడు ఇందలి నాటకీయత్వమంతా తెలిసిపోతోంది. దీపం వెలుగుతుంటేకదా, గదిలోని వస్తువులు ఏమై ఉన్నాయో తెలిసేది!

ఆహా! నేను నిగ్రహ, అనుగ్రహములతో ప్రజలను శిక్షిస్తున్నప్పుడూ, సన్మానిస్తున్నప్పుడూ నా మనస్సు ఎందుకు వ్యాకులత పొందిందో ఇప్పుడు తెలుస్తోంది. నాకు వ్యర్థంగా దేహబుద్ధి కలగటం చేతనే, అట్లు భ్రమ పొందాను. అందుకే దుఃఖించాను. యథార్థానికి అసలు ఈ దేహమే లేని పదార్థం కదా!

అమ్మయ్య! ఇప్పటికి నేను జ్ఞానవంతుడనయ్యాను. శరీరాదు లందు 'ఈ శరీరమే నేను... ఆ శరీరమే ఆతడు' అను రూపంలో ఏర్పడిన 'దేహాత్మదృష్టి' అనే దుర్దశ తొలగింది. మరుక్షణం చూడ వలసినది చూస్తున్నాను. పొందతగినది పొందుచున్నాను.

❖

ఈ కనబడే జగద్గతమైన దృశ్య వ్యవహారమంతా 'మాయ' చే 'చిత్తు' నందు స్వప్నసదృశ్యంగా సంభవించుచున్నది. ఈ జగత్తు నందు 'ఆత్మ' లేక 'చిత్తు'కు అన్యమై ఏర్పడేదంటూ ఎక్కడా ఏదీ

లేదు. ఇక అందులో నిగ్రహమేమిటి? అనుగ్రహమేమిటి? అవన్నీ ఎక్కడున్నాయి? ఎట్లా ఉన్నాయి? సుఖం, దుఃఖం, మానం, అవమానం ...ఇవన్నీ స్వయంకల్పితం, ఊహాజనితం అయిన కథా సన్నివేశాల వంటివి కాక మరింకేమిటి? కాబట్టి 'నేను వీరిని శిక్షిస్తున్నాను, వారిని సంతోష పెడుతున్నాను'... అను భావన కూడా స్వప్న జనితమగు భ్రమ వంటిదే. అంతా కూడా వ్యాపకబ్రహ్మమే అయిఉండగా సుఖమేమిటి? దుఃఖమేమిటి? నేను ఇంతకాలం మూఢుడనై దోషదృష్టితో జగద్దర్శనం చేస్తున్నాను. ఇప్పుడు సౌభాగ్య వశం చేత మాండవ్యమహర్షి గుర్తు చేయటంతో, జ్ఞానిని కావటం జరిగింది.

❖

ఆనంద స్వరూపం, పరిపూర్ణం అగు ఆత్మ యొక్క అనుభవం కలిగిన తరువాత ఇక దేనికై శోకించాలి? దేనికి మోహితుణ్ణి కావాలి? 'ఇంకనూ చూడాలి? ఇంకా పొందాలి' అని ఎందుకు అనుకోవాలి? ఏమి చేయాలి? ఎక్కడికి వెళ్ళాలి? ఆగమ-సంచిత-ప్రారబ్ధ కర్మలు ఎవరికి? ఎందుకంటే 'అలౌకిక చమత్కారం' అగు చిదాకాశ మొక్కటే విద్యమానమై ఉన్నది కదా!

**కిం చిదేవమిదం నామ చిదాకాశం విరాజతే ।**
**నమో నమస్తే నిస్తత్త్వ దిష్ట్యా దృష్టోఽసి సున్దర ॥** (శ్లో 36, సర్గ 50)

భౌతికత్వమే లేనట్టి ఓ స్వస్వరూప పరమాత్మా! నీకు నమస్కరింస్తున్నానయ్యా! మహద్భాగ్యం చేతనే నీవిప్పటికి నాయందు నేనుగా కనిపించావు. కదయ్యా!

ఆహా! ఇప్పటికి నేను ప్రబుద్ధుడనై సర్వము చక్కగా ఎరుగగలిగాను. గురుదేవుడగు మాండవ్య మహామునికి, ఆయన వాక్యములకు నమస్కారం. సమ్యక్‌జ్ఞానం ఉదయించిన కారణంచేత నేను అనంత రూపుడనయ్యాను. అనంతరూపమగు ఓ నా ఆత్మస్వరూపమా! నీకు నేను చేతులెత్తి మ్రొక్కుచున్నాను. అహో! నా స్వస్వరూపమే అయిన ఆత్మ గురించిన జ్ఞానం ఎంత మహత్తరమైనది! అట్టి జ్ఞానముచే అత్యంత సహజంగా, అకృత్రిమంగా రాగ ద్వేషముల అభావం ఏర్పడుతోంది. తద్వారా జాగ్రత్ - స్వప్న - సుషుప్తులలోని విషయ స్థితి నశిస్తోంది. నన్ను నేను ఉపాధిరహితునిగా గాంచుచున్నాను. 'బ్రహ్మమునందు ఏకీభావము' అను ఒకానొక నిశ్శబ్ద పూర్ణానుభవం తారస పడుతోంది. సంసార భ్రమరహితుడునగుచున్నాను. అహమ్, మమ (నేను, నాది) అను వృత్తులు లేనివాడనగుచున్నాను. సర్వమునకు సాక్షీభూతమగు ఆత్మ లేక శుద్ధబ్రహ్మము నందు సమరూపుడనై ప్రకాశించుచున్నాను.

❖

వింటున్నావుకదా, రామచంద్రా! మన ఈ విశ్వామిత్రుడు రాజర్షిత్వమునుండి బ్రహ్మర్షిత్వము పొందారు చూచావా! అట్లాగే ఆ హేమజట (లేక సురఘురాజు) తన వివేకముచే సంపాదించిన సునిశ్చయముచే పరమోత్తమమగు 'బ్రహ్మపదము' ను పొందాడు. రాత్రింబవళ్ళు కలుగజేస్తున్నప్పుడు సూర్యభగవానుడేమన్నా ఖేదముగానీ, మోదముగానీ పొందుచున్నాడా? లేదే! ఆ విధంగానే ఆ

రాజు కూడా తాను అనుష్ఠించుచున్న ధర్మార్థముల వలన ప్రాప్తించే క్రియలచే గానీ, దైవగతిచే అనివార్యంగా ప్రాప్తించే అనర్థములు, దుఃఖప్రదములగు ప్రవాహపతిత వ్యవహారములచే గానీ, ఏమాత్రం ఖేద మోదములు పొందటం లేదు. జల ప్రవాహముచే అనునిత్యంగా తాడనం పొందే పర్వతం యథాతథంగా, నిర్వికారంగా ఉంటున్నట్లు తాను నిర్వర్తించే రాజోచితమైన నిగ్రహ (punishing) – అనుగ్రహ (Awarding) విషయముల పట్ల అచంచలుడై, దుఃఖరహితుడై ఉంటున్నాడు. దైనందినక వ్యవహారములు సలుపుచున్నప్పుడు హర్షామర్షములను (Happiness and unhappiness) పొందనివాడై తన ఉదార, గంభీర స్వభావంతో సముద్రమును కూడా మించిపోయాడు. "సుషుప్తిచే నిశ్చలము, చైతన్యముచే ప్రకాశవంతము" అగు చిత్తవృత్తిచే నిశ్చల ప్రకాశమయమగు అగ్నిశిఖ వలె ప్రకాశించాడు.

ఆతడిప్పుడు నిర్దయుడు కాడు. దయావంతుడు కాడు. ద్వంద్వము, మత్సరము లేవు. అనర్థిగాని, అర్థిగాని, అతిబుద్ధిసహితుడుగానీ కాకుండానే యథారీతిగా ప్రాప్తించిన కార్యములను ఆచరిస్తూ సమదర్శియై ఒప్పుచున్నాడు. ఆతని అంతఃకరణం ఇప్పుడు సమదర్శనశీలమై చపలరహితమై, ధీరత్వ సమన్వితమై, వృత్తిరహితమై, పూర్ణ చంద్రుని వలె సంపూర్ణత్వము సంతరించుకొని ఉన్నది.

❖

ఎవడైతే, ఈ జగత్తంతా చిత్తము యొక్క కల్పన మాత్రమే' ...అని నిశ్చయించుకుని ఉంటాడో, ఆతని బుద్ధి ఇక ఈ భౌతిక సుఖదుఃఖములు లేనిదే అగుచున్నది.

ప్రబుద్ధుడై, నిరంతరం సమాధినిష్ఠుడై ఉన్నవాడు ఈ శరీరాదులను బాహ్యవస్తువుగా చూస్తూ, సర్వదా ఉల్లాసముతో ఉంటాడు. ఆతని చిత్తం ఆతనికి వికాసమును ప్రసాదిస్తూ ఉంటుంది. ఆతడు కూర్చున్నప్పుడు, నిలుచున్నపుడు నిదురిస్తున్నప్పుడు సర్వదా చైతన్యమునందు లయం పొంది ఉంటాడు.

ఆ రాజు కూడా అట్లే చైతన్యము నందు ఐక్యత పొందియున్నాడు. రాజ్యపాలనను నిర్వర్తిస్తూ కూడా, అత్యంతాసక్తి రహితుడై ఉన్నాడు. అఖండాకారయుతుడై ప్రకాశించాడు. నదీజలం పూర్ణ సముద్రంలో కలియునట్లు, మంచుగడ్డ కరుగుటచే తన ఆకృతిని వీడునట్లు అతడు సర్వమును స్వస్వరూపము నందు లయింపజేసుకొని 'నేను సర్వమునకు సాక్షిని' అను సాక్షీరూపంలో ప్రవేశించాడు. బ్రహ్మాండములన్నిటికీ ఉత్పత్తి స్థానము, బ్రహ్మాదులకు కూడా నియంత అయినట్టి పరబ్రహ్మమునందు ప్రవేశించాడు. స్వబుద్ధిచే నిర్మలము దుఃఖరహితము ఆనంద పరిపూర్ణము అగు ఆత్మను పొందాడు. అట్టి ఆత్మప్రాప్తిచే ఈ జన్మ మొదలైన దశలను మనస్సులో అధిగమించివేశాడు.

కుండ పగిలితే కుండలోని ఆకాశం మహాకాశంలో లీనమగుచున్నట్లు ఆతని భావన పూర్ణత్వం పొందగా ఆతడు పరబ్రహ్మస్వరూపుడైనాడు.

ఓ దశరథరామా! నీవు కూడా హర్షశోకాదులకు కారణమగుచున్న 'పాపదృష్టి'ని నశింప జేసుకొని ద్వంద్వరహితుడవై అత్యంత శ్రేయోదాయకమగు మోక్షపదమును ఆశ్రయించు. అప్పుడు

నీవు తప్పక దుఃఖరహితుడవౌతావు. చీకట్లో కదులుతుంటే ఏదైనా తగలటంచేత బాలుడు క్రింద పడవచ్చు. దీపం ఉంటే ఆ ఇబ్బంది ఉండదు కదా! ఆ సురఘు మహారాజు 'జ్ఞానదృష్టి' అనే దీపం చేబూనటం చేతనే ఆతని మనస్సు అజ్ఞానాంధకారంలో పడకుండా కాపాడుకోగలిగాడు.

ఒకడు గోతిలో పడినప్పుడు ఏం చేస్తాడు? ఒడ్డున ఉండే వేటినైనా ఆలంబనంగా పట్టుకుని బయటకు రావటానికి ప్రయత్నిస్తాడు కదా!

వివేకమును, వివేకులను ఆశ్రయించి తద్వారా తన చిత్తమునకు శాంతిని ప్రసాదించాలి. ఆ సురఘు మాటిమాటికీ పవిత్రదృష్టిని అభ్యసించాడు. ఇతరులకు కూడా అద్దానిని ఉపదేశించాడు. క్రమంగా ఏకము అయినట్టి బ్రహ్మమునందు సమాధితత్పరుడైనాడు.

❖

**శ్రీరాముడు :** మునీంద్రా! మీరు "ద్వంద్వరహితం అవాలి" అని ఆజ్ఞాపిస్తున్నారు. అయితే మా మనస్సు గురించి గమనిస్తున్నారా? గాలి వీచే చోట నిలబెట్టబడి ఉన్న నెమలి పింఛంలాగా ఈ మనస్సు స్థిరంగా ఉండటమే లేదే! దీనిని స్థిరీకరించేది ఎట్లా? ఎంతగా మరల మరల విన్నా కూడా ఇది బ్రహ్మపదము నందు ఏకాగ్రనిష్ఠ పొందుట లేదు. దీనిని సుస్థిరీకరించటం ఎట్లాగో చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మనస్సు విషయంలో ఇప్పటికే 13 రోజులుగా మనం చాలా విషయాలు చెప్పుకున్నాం. సరే ...జ్ఞానియగు సురఘు ఆతని చిన్ననాటి స్నేహితుడగు పరిఘుడి మధ్య ఒక అద్భుతమైన సంవాదం జరిగింది. ఆ తరువాత ఆ ఇద్దరూ కూడా 'ఏకరూపసమాధి' యందు తమ తమ చిత్తములను సంలగ్నం చేసియున్నారు. తమ చిత్త, ఇంద్రియముల విషయంలో అత్యంత ప్రబుద్ధులై ఉన్నారు. అందుచేత వారిరువురి పరస్పర సంవాదము ఈ సమయంలో ప్రస్తావించటానికి సముచితంగా ఉంటుంది. వీనులకు విందై, హృదయములను పవిత్ర పరచగలదు. అది నీ ప్రశ్నకు సమాధానంగా చెపుతాను. విను.

❖❖❖

# 3. సురఘు - పరిఘు సంవాదము

**శ్రీవసిష్ఠ మహర్షి :** పారశీక దేశాధిపతి 'పరిఘ' అనునాతడు మన సురఘు రాజుకు చిన్ననాటి స్నేహితుడు. ఒకప్పుడు పారశీక దేశంలో అనావృష్టి సంభవించింది. అక్కడి ప్రజలు అనేకమంది ఆకలి బాధకు తాళలేక మరణించటం జరిగింది. అది చూచి పరిఘురాజు తట్టుకోలేకపోయాడు. 'అయ్యో! నా ప్రజల కష్టమును తొలగించ లేకపోయానే! ఇక నేను రాజుగా అనర్హుడను' అని తలచాడు. బహుదూరపు బాటసారి ఒక చోట మార్గమధ్యంలో తగలబడుచున్న గ్రామం చూచి కూడా తన దీర్ఘ ప్రయాణం కొనసాగించునట్లు ఆతడు ఆ రాజ్యమును త్యజించి అక్కడి నుండి బయలుదేరాడు. విరాగి అయి, అరణ్యంలోని ఒకానొక ఏకాంత ప్రదేశంలోని ఒక గృహంలో ప్రవేశించాడు. అక్కడ తపస్సు చేయటం ప్రారంభించాడు. శాంతిని, ఇంద్రియదమమును ఆశ్రయించి

చాలా కాలం తపస్సును కొనసాగించాడు. ఆ దీర్ఘకాలంలో అక్కడ గల ఒక వృక్షము నుండి తమకు తాముగా వ్రాలిన ఆకులను తింటూ ఉండేవాడు. అక్కడికి కొంతదూరంలో ఉంటున్న ఆటవిక గ్రామ జనులు ఆకులు తింటూ తపస్సు చేసే ఆతనికి 'పర్ణాదుడు' అను పేరు పెట్టి చెప్పుకునేవారు.

అనేక సంవత్సరములు ఏకాగ్రతతో తపస్సు చేయటంచేత, సమాధిని అభ్యసించటం చేత ఈశ్వరానుగ్రహం ఆతనిపై ప్రసరించింది. చిత్తము శుద్ధి పొంది ఆతడు రాజర్షి అయ్యాడు. క్రమ క్రమంగా జ్ఞానయుక్తుడై, సద్బుద్ధియుతుడై, శీతోష్ణాది ద్వంద్వరహితుడై, ఆశావర్జితుడై, శాంతచిత్తుడై, రాగ, ద్వేష, క్రోధరహితుడై జీవన్ముక్తుడుగా ప్రసిద్ధికెక్కాడు.

ఆ విధంగా తపస్సు యొక్క ప్రభావంచే పరమ పవిత్రమైన మనస్సును సంపాదించుకొన్న ఆ పరిఘుడు కొన్నాళ్ళ తరువాత లోకసంచారం చేయటానికి బయలుదేరాడు. ఒకసారి కాకతాళీయంగా సురఘుడు రాజ్యమేలుతున్న కిరాత రాజ్యం ప్రవేశించాడు. చిన్ననాటి పరిచయం చేత సురఘుని కలిశాడు. జీవన్ముక్తులు అయిన ఆ ఇద్దరూ ఏం సంభాషించుకున్నారో శ్రద్ధగా విను.

❖

**సురఘురాజు :** మిత్రమా! బహుకాలం తరువాత కలిశాం. మీరు ఆకులు మాత్రమే తింటూ తపస్సు చేస్తూ ఉంటారని వింటూనే ఉన్నాను. జనులు 'పర్ణాదముని' అను పేరుతో మీ సుదీర్ఘ ఏకాగ్ర తపస్సు గురించి కథలుగా చెప్పుకుంటున్నారు. పరమపవిత్రమగు సుకృతం చేతనే మీరు ఇక్కడికి రావటం, నేను మీ సమక్షమును ఆస్వాదించటం జరుగుతోంది. మీ సందర్శనముచే చిత్తము పరమానందభరితమౌతోంది. మనస్సు శీతలత్వం పొందుతోంది. వియోగం ప్రేమను ద్విగుణీకృతం చేస్తుందని పెద్దలు అంటారు. మన చిన్ననాటి సంభాషణలు లీలలు, చేష్టలు స్మరించు కుంటుంటే గొప్ప వినోదంగా ఉంటుంది.

**పర్ణాదుడు :** మిత్రమా! మాండవ్య మహర్షి కృప చేత మీరు ఆత్మజ్ఞానం పొందారని నేను కూడా విన్నాను. నేను తపస్సుచే ఈశ్వరుని ఆరాధించి ఆయన కృపచే ఆత్మజ్ఞానం పొందాను.

సరే! మీరిప్పుడు దుఃఖరహితుడవై పరమకారణమగు బ్రహ్మము నందు విశ్రాంతిని పొందారు కదా? ఆత్మారాముడవగుటచేత మీ చిత్తముతో ప్రసన్నత్వం ఉదయించిందా? ప్రసన్న గంభీరములతో కూడిన సమదృష్టిచే సర్వజనహితంగా రాజ్యపాలన చేస్తున్నారు కదా? మీ రాజ్యంలో ప్రజలు ధన ధాన్య సంపన్నులై, శారీరక,మానసిక బాధలు లేకుండా సంతాపవర్జితులై జీవిస్తున్నారు కదా? ప్రజలు ఎట్లా కోరుకుంటారో అట్లే పాలన జరుగుతోంది కదా? ధర్మరక్షణలో అధర్మశిక్షణలో మీ యశస్సు అన్ని వైపులా విస్తరిస్తోందా? ధాన్యం కళ్లెంలో పని చేసేవారు మీ యశస్సు గురించి ఆనందంగా పాటల రూపంలో పాడుకుంటున్నారా? మీ ధన-ధాన్య-ఐశ్వర్య-భృత్య-కుటుంబ-పుత్ర -నగరాదులు క్షేమంగా ఉన్నాయి కదా? మీ ఈ భౌతిక శరీరం మానసిక వ్యధారహితమై ఇహ-పర లోకము లందు ఉత్తమ ఫలములను ప్రసాదించ గల పుణ్యకార్యము లందు నియోగించబడుతోంది కదా? ఈ విషయములు అనేవి అమాయక జీవులకు రమణీయంగా తోచుచూ, అజ్ఞాన క్రియలచే

చివరికి శత్రువులుగా పరిణమిస్తున్నాయి. అట్టి విష సర్పములను నిరోధించటానికి మీరు "వైరాగ్యం" అనే గరుడ మంత్రం మననం చేస్తున్నారు కదా?

ఆహా! మిత్రమా! మనిద్దరం చాలాకాలం వియోగం అనుభవించాం. కాలవశం చేత ఈ రోజు కలుసుకున్నాం. ఈ శరీరధారులగు జీవులకు ప్రతిరోజూ ఇష్ట-అనిష్టములు, సంయోగ-వియోగములు, సుఖ-దుఃఖములు కలుగుతూ ఉంటాయి. నా ప్రియ స్నేహితులైన మిమ్ము కలవటం ప్రితికరం అయిన విషయం. ఈ దీర్ఘజీవదశలో ఎన్నడో విడిపోయి ఈ రోజు కలిశాం. ప్రాణుల కర్మానుసారంగా నడచే ఈశ్వరేచ్ఛ యొక్క విలాసం ఎంత చిత్రమైనది!

**సురఘు :** ఔను మిత్రమా! ఈశ్వరేచ్ఛారూపమగు నియతియొక్క ఆశ్చర్యకరమైన'గతి'ని ఎవరు ఎరుగగలరు? మనిద్దరం ఎంతోకాలం ఎక్కడెక్కడో ఉండి ఇప్పుడు కలుసుకున్నాం. ఈశ్వరేచ్ఛే ఈ రోజు మనిద్దరినీ కలిపింది. నాకైతే ఇప్పుడెంతో సంతోషంగా ఉన్నదయ్యా! మిమ్ము చూచుట చేత పాపము క్షయించగా పుణ్య వృక్షం ఫలిస్తోంది. నేను వ్యాకులరహితుడను కృతకృత్యుడను అయ్యాను. మీ రాకచే మా నగరం, మా ప్రజలు పరమ పవిత్రమగుచున్నాము.

"మహాత్ములతో సమాగమం మోక్షముతో సమానం" అని పెద్దలు అంటారు కదా! ఇప్పుడు ఆత్మానుభవం విషయంలో మీ నుంచి కొన్ని విశేషాలు వినాలనుకుంటున్నాను.

❖❖❖

# 4. సమాధి - సమాహిత చిత్తము

**పరిఘముని :** నాకూ మీ నుంచి వినాలని ఉన్నది. ఈ సంసారజాలము నందు ఏఏ క్రియలు నిర్వర్తించబడుచున్నాయో... అవన్నీ కూడా సమాహిత చిత్తునకు మాత్రమే సుఖప్రదమౌతున్నాయి. తదితరులంతా అనుక్షణికమైన సుఖదుఃఖ భావపరంపరలచే తాడనం పొందుచున్నారు. సాంసారిక విషయములలో ఎక్కడో ఏదో సుఖం ఉన్నట్లు మినుకుమినుకుమంటూ భ్రమ కలుగజేస్తోంది. అసలు సంకల్పములే లేకపోయాయా .. సమాధి సుఖం లభిస్తుంది. అట్టి పరమ శాంతిమయమగు సమాధి సుఖం ముందు ఈ సాంసారిక సుఖములు ఎంతటి అల్పమైనవి! జ్ఞాని అయినవానికి సమాహిత చిత్తం అవసరం. సమాహితచిత్తం సంపాదించటానికి సమాధి అనుష్ఠానం తప్పితే వేరే మార్గమేముంటుంది? కనుక ఈ సాంసారిక విశేషములను త్యజించి మనస్సుతో వ్యవహార రహిత సమాధిని మీరు దినచర్యలో కొంత సమయం కేటాయించి అనుష్ఠించుచున్నారు కదా!

**సురఘురాజు :** అదేమిటి మిత్రమా... అట్లా అడుగుచున్నారు? "సంకల్పవర్జితము - శాంతియుతము - శ్రేష్ఠము - శ్రేయోదాయకము - అయినట్టి పరమానందమును అనుభవిస్తున్నావా?" అని అడగకుండా, "మనస్సుతో మధ్యమధ్యలో వ్యవహారరహిత సమాధిని అనుష్ఠిస్తున్నావా?" అని అడుగు చున్నారే! ఎందుకంటే జ్ఞాని వ్యవహారములలో ఉండవచ్చు. ఉండకపోవచ్చు. ఏది ఏమైనా కూడా అసమాహిత చిత్తుడై ఉంటాడా? ఉండడు కదా! అసమాహిత చిత్తుడైనవాడు జ్ఞానియే కాదు కదా!

జ్ఞాన సహితులైనవారు నిత్య ప్రబుద్ధ చిత్తులై ఉంటారు. వారు ఈ ప్రాపంచిక క్రియలు నిర్వర్తిస్తూ ఉండవలసి వచ్చినప్పటికీ సదా ఏకత్వనిష్ఠులై ఉంటారు. అనగా, ఆత్మనిష్ఠులై ఉంటారు. అట్టి ఏకత్వ నిష్ఠయే వారి సమాధి. వారు వేరుగా అవశ్యమైన భౌతికసమాధిని ఆశ్రయించవలసిన పనేముంటుంది?

**పరిఘుమని :** జ్ఞానమంటే ఏమిటి? సమాధి ఎప్పుడవసరం?

**సురఘు :** జ్ఞానము – సమాధి యొక్క అభ్యాసము గురించి నా మరికొన్ని అభిప్రాయములు వివరిస్తాను. వినండి. ఒకడు ప్రపంచమునంతా త్యజించి ఒక ఏకాంత ప్రదేశమునకు వెళ్ళి, అక్కడ పద్మాసనం వేసుకుని "బ్రహ్మాంజలి" ని సమర్పిస్తున్నాడనుకోండి. ఆతని చిత్తం ఆత్మ స్వభావమునందు విశ్రాంతి పొందకపోతే, ఇక, ఆతని సమాధి ఎట్టిది? ఆతని స్థితి సమాధి అని ఎట్లా అనిపించు కుంటుంది చెప్పండి?

అందుచేత 'ఆత్మతత్త్వబోధ' అనే అగ్నిచే సమస్త ఆశలు అనే గడ్డిపరకలు ఆహుతి అవటమే సమాధికాని, ప్రపంచం పట్ల తూష్ణీభావం కలిగి, ఇంద్రియములకు పని చెప్పనంతమాత్రం చేత అది సమాధి అని అనిపించుకుంటుందా? ఏకాగ్రము నిత్యతృప్తము, అబాధితము అయిన ఆత్మ వస్తువును దర్శించటమే సమాధి. అట్టి సత్యవస్తు అవలోకనమే పరాప్రజ్ఞ. అట్టి ప్రజ్ఞయే పరాకాష్ఠ.

ఎవ్వడైతే క్షోభ, అహంకార రహితుడై ద్వంద్వములలో తగులుకోకుండా ఒక కొండలాగా స్థిరమైన ఆకృతి కలిగి ఉంటాడో అట్టివాడే సమాధి స్థితుడు. అట్టివాడు నిశ్చింతను స్వభావపూర్వకంగా కలిగి ఉంటాడు. ఆతడు పొందవలసినది పొందినట్లే. ఆతనికిక త్యజించవలసినది గాని, స్వీకరించ వలసినదిగాని, ప్రాప్తించినదిగాని, ప్రాప్తించనిదిగాని ఉండవు. పరిపూర్ణ మనోగతుడై ఉంటాడు.

అట్టి జ్ఞానయుక్త మనస్కునకు నిరంతర సమాధి సిద్ధించినట్లే! పిల్లలు వ్రేళ్ళతో పట్టుకున్న దారం కొంచం గట్టిగా లాగగానే తెగుతుంది. సమగ్రము జ్ఞానయుతము అగు అవగాహన లేకుండా కేవలం మనస్సును బలవంతంగా భౌతికమైన సమాధిలో కూర్చోబెడితే, అది ఎప్పుడో విచ్ఛిన్నం అవుతుంది. జ్ఞాని యొక్క సమాధి విచ్ఛిన్నం కాదు. ప్రాపంచిక విషయములతో వ్యవహరించ వలసి వచ్చినప్పటికీ ఆతని సమాధి (లేక) సమాహిత చిత్తము యథాతథంగానే ఉంటుంది.

సూర్యుడు రోజంతా లోకములను ప్రకాశింపజేస్తున్నాడు. ఆ సమయంలో ఏమైనా విరామం కోరుకుంటున్నాడా? లేదు. దృఢ సంస్కారబలంచేత జ్ఞాని యొక్క బుద్ధి కూడా ఆత్మతత్త్వావలోకనంలో ప్రవేశించి, ఇక మరింకెక్కడో విశ్రాంతి విరామములను కోరుకోదు. జలం ప్రవహిస్తూ ఉండగా ఒక్కక్షణమైనా ఆగుతుందా? ఆవరణ నాశనముచే విజ్ఞాన దృష్టి (లేక, బోధ స్థితి లేక ఆత్మజ్ఞానం) ఏర్పడే వరకు జ్ఞానమార్గంలో పయనించేవాడు ఆగడు.

**న విస్మరత్యవిరతం యథా కాలః కలాగతిమ్ ।**
**న విస్మరత్యవిరతం స్వాత్మానం ప్రాజ్ఞధీస్తథా ॥** (శ్లో 16, సర్గ 62)

కాలము తనయొక్క 'గతి' అను కళను వీడనట్లు, జ్ఞాని యొక్క బుద్ధి ప్రేమాస్పదమగు ఆత్మను ఎన్నటికినీ మరువదు. నడిచేటప్పుడు కాళ్ళకదలిక ఆపనట్లు ఆతని బుద్ధి నిశ్చయస్వరూపమగు

చిన్మాత్రమును ఏమరువదు. మిత్రమా! ఆవరణము నశించగానే చైతన్యస్ఫూర్తి విషయరహితమౌతుంది. ఆ చైతన్యస్ఫూర్తి ఇక ఎల్లప్పుడూ ఆత్మాకారవృత్తి కలిగి ఉంటుంది.

ఏ పదార్థమైనా 'సత్త' లేకుండా ఉంటుందా? జ్ఞానికి "ఆత్మాకార వర్జితమగు సమయం" అంటూ ఏదీ ఉండదు. "నేను లేను. కానీ ఈ పదార్థములు ఉన్నాయి" అన్న ప్రసక్తి ఎక్కడన్నా ఉంటుందా? "సద్గుణవంతుని నీచపనులు" అనునది ఉండదు కదా! నీచపనులు చేసేవాడు సద్గుణ వంతుడెలా అవుతాడు?

ఆత్మజ్ఞానికి ఆత్మను ఉపాసించని సమయమంటూ ఏదీ ఉండదు. ఆతని ఆత్మోపాసన అనుక్షణికం. పరిస్థితులు ఎల్లా ఉన్నా అవి ఆత్మజ్ఞానిని స్పృశించలేవు.

సర్వదా స్వస్వరూపముచే నేను ఆత్మనే. కనుక నిర్మలుడనై శాంతాత్ముడనై ఉన్నాను. అనగా సమాధి నిష్ఠుడనై ఉన్నట్లే. ఎద్దానితోనూ ఏ భేదమూ నాకు కనిపించుటలేదు. నా సత్త ఎల్లప్పుడూ ఆత్మయందే, అఖండమగు ఆత్మగానే సిద్ధిస్తోంది. నాసత్త యొక్క ఒక కళమాత్రమే ఈ మనస్సు.

మనస్సు ఉన్నదంటే సమాధిరాహిత్యం ఉన్నట్లే. అందుచేత 'మనస్సుతో సమాధిని అభ్యసించటం' అనేది ఎక్కడుంటుంది? మనస్సుకు స్వకీయమైన ఉనికి-రూప-గుణములు ఎక్కడున్నాయి.

మనస్సుకు సమాధినిష్ఠ కలగటమనేదే ఉండదు... సర్వదా నిత్యమగు ఆత్మతత్త్వమొక్కటే ఉన్నది... ఆత్మ ఒక్కటే సర్వవ్యాపకమై సర్వరూపములుగా ప్రసరించుచున్నది... ఆ అఖండ, అప్రమేయ ఆత్మయే నేను... ఆత్మకు వేరుగా 'మనస్సు' అనబడేదేదీ లేదు.

ఇక నాకు సమాధి ఏమిటి? అసమాధి ఏమిటి? మనస్సు ఏమిటి? దానిని నియోగించట మేమిటి? నియోగించలేకపోవటమేమిటి?... నా దృష్టిలో మనోబుద్ధులనబడేవి ఉండుటయే లేదు.

కార్య కారణ పరిణామ విభాగరహితులగు మహాత్ములు నిత్యం సర్వస్థితు లందు సమాహితత్వం కలిగి ఉండగలుగుచున్నారు. ఇక అక్కడ సమాధి, అసమాధి భేదములను కల్పించే వాక్యములకు చోటు ఉండటం లేదు.

నిర్మోహమాటమైన నా అభిప్రాయం మరొక్కసారి వినండి. సర్వభేదములు చేరలేని ఆత్మయే నా స్వరూపం, స్వభావం, స్వస్థానం కూడా! నేను ఇప్పుడూ, అప్పుడూ, ఎప్పుడూ ఉపాధి రహితుడనే, ఇక, నేను-నీవు-మనస్సు మొదలైనదంతా నా చిత్కళయే.

❖❖❖

## 5. సునిశ్చయం

**పరిఘ మునీంద్రుడు :** ఓ నేస్తం! మీరు నిజంగా జ్ఞానవంతులే! పరమమగు బ్రహ్మపదమును పొందారు. తత్ఫలితంగా పూర్ణచంద్రుని వలె శీతలాంతఃకరణము కలిగి వెలుగొందుచున్నారు. మధుర రసపూర్ణులై 'ఆనందము' అనే సంపదచే సేవించబడుచున్నారు. శీతల, లేత, సుందర కమలము

వలె విరాజిల్లుచున్నారు. మీ పలుకులు నిర్మలంగా, విశాలంగా, పూర్ణంగా గంభీరప్రకటాశయ యుక్తంగా ప్రభవిస్తున్నాయి.

ఆహా! స్నేహితుడా! మీరిప్పుడు స్వచ్ఛంగా ఆనందపూర్ణంగా, అహంకారమేఘరహితంగా, ప్రత్యక్షంగా, విశాలంగా, గంభీరంగా, ఉండే శరత్కాల ఆకాశంలాగా విరాజిల్లుచున్నారు. ఇష్ట, అనిష్ట సర్వవిషయములందు సమరూపులై కన్పట్టుచున్నారు.

**సారాసార పరిచ్ఛేద పారగస్త్వం మహాధియా ।**
**జానాసి సర్వమేవేదం యథాస్థిత మఖణ్డితమ్ ॥** (శ్లో 6, సర్గ 63)

ఉత్తమ బుద్ధిచే సార, అసారములను నిర్ణయించి పారంగతులయ్యారు. "ఈ దృశ్య జగత్తంతా అఖండపూరమై బ్రహ్మముగానే, యథారీతిగా ఉన్నది" – అనునట్టి ఉత్తమోత్తమజ్ఞానం పొందారు.

ఇక్కడ కనబడే ఉత్పత్తి. నాశనముల రహస్యమేమిటో గ్రహించారు.

ఇక్కడి ఆరోహ, అవరోహములచే (ups & downs) ప్రేరితమగుచున్న 'చంచలరాగ దశలు' మీ యందు చోటు చేసుకోలేక పోతున్నాయి. దేని కంటే ఇక ఉత్తమమైన వస్తువు ఈ ప్రపంచం మొత్తంలో ఇంకొకటేదీ లేదో, ఉండబోదో, అట్టి నిజాత్మ వస్తువు పొందినవారై స్వమహిమ యందు పరితృప్తులై ఉన్నారు.

ఆత్మ – పరమాత్మయగు మీ కిదే నమస్కరిస్తున్నాను. మీ అవగాహన విషయమై మరికొంత వినాలని నా అభిలాష.

**సురఘురాజు :** మునీంద్రా! ఈ దృశ్యప్రపంచ మంతా మిథ్యయే కదా! కనుక మనకిక్కడ గ్రహించ దగ్గ పదార్థ మంటూ ఏదీ లేదు. గ్రహించ వలసినదే లేనప్పుడు, త్యజించ వలసినది మాత్రం ఏముంటుంది?

గ్రహిస్తే కదా... త్యజించేది! "ఇది ఉత్తమము... ఇది తుచ్ఛము" – అను వ్యవహారమంతా కేవలం దేశ కాలముల వలననే సంభవిస్తోంది. విజ్ఞుల అభిప్రాయం ప్రకారం, తుచ్ఛాతుచ్ఛములకు సంబంధించిన నిందా–స్తుతులను త్యజించివేయాలని కదా! దేశ కాలవశం చేత ఇప్పుడు ప్రాముఖ్య మైనది మరొకప్పటికి, ఒక నాటికి తుచ్ఛంగా కనిపిస్తోంది. ఈ విషయం ప్రతి ఒక్క జీవునికి అనుభవమగుచున్న విషయమే.

"అసలు నిందాస్తుతులు ఎందుకు కలుగుచున్నాయి?" అని మనం విచారణ చేస్తే "రాగము చేతనే" అని సమాధానం లభిస్తోంది. రాగము ఎట్లు ఉద్భవిస్తోంది?... ఇచ్ఛ వలననే.

ఇచ్ఛయో? ...అజ్ఞానంలోంచి, అజ్ఞానంచేత బయలుదేరుతోంది. కనుక బుద్ధిమంతుడైనవాడు మహోదారమగు బ్రహ్మపదార్థముచే ఇచ్ఛగించుతాడు. ఇంకదేనినీ కాదు.

ఈ ముల్లోకములందూ గల స్త్రీ–పర్వత–సముద్ర–వనములు, సమస్త ప్రాణులు, పృథివి, పంచ భూతములు – ఇవన్నీ వాస్తవరహితములే. వీటన్నిటి యందు సారమంటూ ఏదీ లేదు.

ఈ పురాతన శూన్యజగత్తునందు ఉన్నదంతా మాంస – అస్థి – కాష్ఠ – మట్టి – శిలామయమైనది మాత్రమే. ఇందులో మనం ఇచ్ఛగించవలసిందీ, వాంఛించవలసిందీ ఏముంటుంది? ఇచ్ఛ నివృత్తి కాగా, రాగద్వేషములు సంక్షయిస్తాయి. ఇంక అనేక మాటలెందుకు? ఎప్పుడైతే ఈ మనస్సు సర్వత్రా రాగద్వేషరహితమై శాంతమై, ఆత్మైకరసమై తన ఆత్మయందు కేవలం పరితృప్తి పొందుతుందో – అదియే ఉత్తమ ప్రతిష్ఠ. అదియే విశ్రాంతి. అదియే సమాధి. అదియే యోగము, జ్ఞానముకూడా.

❖

వారిద్దరు ఒకరినొకరు ఆత్మదృష్టితో సందర్శించుకుంటూ తెల్లవార్లూ సంభాషించుకున్నారు. మరునాడు వారు ఒకరి వద్ద మరొకరు సెలవు తీసుకుని, తమ తమ నియతిని అనుసరించి మార్గ పరాయణులయ్యారు.

❖❖❖

# 6. కేవలీ తత్త్వధ్యానం

**శ్రీవసిష్ఠ మహర్షి :** రాఘవా! మాండవ్యుల బోధ, సురఘు, పరిఘు (పర్ణాదముని)ల సంభాషణ విన్నావు కదా! వారి సంభాషణలోని అంతర్లీనగానమును విను. నీవు కూడా అట్టి జ్ఞానముచే ఇక్కడే పరమపదలాభమును సంపాదించు. అందుకొరకై ధీరులగు విజ్ఞులతో కలిసి చక్కగా విచారణ చేయి. ఉత్తమమైన 'సుతీక్ష్ణబుద్ధి'చే హృదయాకాశంనుండి 'అహంకారము' అనే కాలమేఘమును నశింపజేయి. సకలలోకాతీత ప్రాప్తము, ఆనందకరము, నిర్మలము అయిన చిత్తము నీయందు ప్రవేశించుగాక!

సర్వులలో అంతర్హితుడై ఉంటున్న ఆ పరమాత్మ ఒక్కడే ధ్యానయోగ్యుడు! ...అతడే శరణువేడ తగినవాడు! ...ఆతడే మన స్వస్వరూపుడవటంచేత ఆతనిని ఆరాధించటం అత్యంతతేలికైన విషయమే! ...అదే సర్వానంద సంపత్తి స్వరూపం! ...సుప్రసన్నం. చిదాకాశస్వరూపం!

అట్టి పరమాత్మ యందే స్థితి కలిగియుండు. నిత్యము ఆత్మవిచారణ తత్పరుడవై ఉండు. అంతర్ముఖుడవై, సుఖరూపుడవై చిదాస్వాదనపరుడవై ఉండు. అప్పుడిక నీ చిత్తము దుఃఖములచే పీడించబడే ప్రసక్తే ఉండదు. బాహ్యంలో కనబడే వ్యవహారతత్పరత, రాగద్వేషములు, జలము పద్మమును తాకనట్లు నీ అంతఃకరణమును కలుషితం చేయలేవు. నీవు వాటన్నిటికంటే మహత్తర స్వరూపుడవని గ్రహించు. ఏనుగు సింహమును బాధించగలదా? ఉత్తమ జ్ఞానంతో శాంతచిత్తుడవై ఉంటే, ఈ మనస్సు నిన్నేం చేస్తుంది? ఎట్లా బాధిస్తుంది.

నందనవనంలో ముళ్ళ చెట్లు ఉంటాయా? జ్ఞానియొక్క చిత్తములో భోగలంపటం ఉండదు. ఆతడు అనేక దీనదశలను పొందవచ్చుగాక! ఆతని చిత్తం మాత్రం తన విశాలరూపమును త్యజించదు. క్షుద్రమగు విషయ సుఖములను కాంక్షించక, కేవలం ఆత్మ వైపునకే అభిముఖమై ఉంటుంది. ఇక్కడి ఇంద్రియవిషయములకు ఎవడైతే అనురక్తుడై ఉంటాడో, ఆతడే ఇక్కడి జనన–మరణాదులను

చూచి దుఃఖములను పొందుతాడు. ఏ చిత్తమైతే సమస్తమును విచారించి, "ఈ ఇంద్రియాలు, విషయాలు, శరీరాలు, తదితర దృశ్యములు అవిద్యయే! మిథ్యాభ్రాంతియే" – అని ఎరుగుచున్నదో, అద్దానికి ఇక దుఃఖం ఎక్కడినుండి వస్తుంది?

**శ్రీరాముడు :** మహర్షీ! మనస్సుకు 'కర్తృత్వం (నేను కర్తను)' అనుదోషం తొలగాలంటే ఏం చేయాలి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామా! ముందుగా ఈ మనస్సు పొందుచున్న మోహం, భ్రమల గురించి గమనించు. క్రమక్రమంగా అప్రమేయత్వమును అలవరచుకో. చక్కగా ఈ మనస్సు పొందుచున్న భావాభావములను గమనించావా... కర్తృత్వాభిమానం తనంతటతానే తొలగుతుంది. అది నిన్ను స్పృశించనైనా లేదు.

'అవిద్య' అనే చీకటిలో దీపం ఒక్కటే....! అది, "ఈ జగత్తు అవిద్య చేతనే అనుభవమగు చున్నది." అనే ఉత్తమ జ్ఞానం ఉదయించటమే! స్వప్నంలో పులులు, గండు పిల్లులు నిన్ను భయపెడు చున్నాయి అనుకో!... ఆ భయం పోయేదెట్లా? "ఇది స్వప్నం" అని గ్రహించుట చేతనే కదా! అవిద్య కూడా అంతే. 'ఇది అవిద్య' అని గ్రహిస్తే చాలు... అది తొలగిపోతుంది, తొలగిపోయినట్లే!

చేపలు నీళ్ళల్లో ఉన్నప్పటికీ ఆ నీళ్ళు చేపల కళ్ళను స్పృశించలేవు చూచావా! నీవు వ్యవహార పరుడవై ఉన్నప్పటికీ అంతరమున సంసారాసక్తుడవు కావద్దు. కేవలం బ్రహ్మమునందే నిమగ్నమైన బుద్ధిని కలిగి ఉండు. అప్పుడు కర్తృత్వ దోషములు, దుఃఖములు నిన్ను స్పృశించలేవు. ప్రదీప్తమగు చైతన్యమయ ప్రకాశం ప్రసరించుచుండగా అజ్ఞానాంధకారం క్షయించక ఏం చేస్తుంది?

తత్వజ్ఞాని యొక్క బుద్ధి స్వతహాగా పరమానందమును పొంది ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ జీవుడు జ్ఞాన సూర్యునిచే ప్రబోధితుడైనాడా, ఇక మరెప్పుడూ మోహము పొందడు. ఏ రోజులలో హృదయాకాశంలో ఆత్మచిత్భావన విస్తరిస్తుందో ఆ రోజులే జీవసహితములు. అట్టి క్రియలే ఆనంద యుక్తములు. నిరంతరాత్మచింతనచే మోహము తొలగి అంతఃకరణము శీతలత్వం పొందుచున్నది.

**తాని మిత్రాణి శాస్త్రాణితాని తాని దినాని చ ।**
**విరాగోల్లాసవాన్యేభ్య ఆత్మచిత్తోదయః స్ఫుటమ్ ॥** (శ్లో 19, సర్గ 63)

ఎవరివల్లనైతే ఈ చిత్తము వైరాగ్యోల్లాసయుతమై ఆత్మాకారవృత్తిచే అభ్యుదయం పొందుతుందో, అట్టి వారే ఈ జీవునకు నిజమైన మిత్రులు. అట్టి శాస్త్రములే ఆప్తశాస్త్రములు. ఆ రోజులే రోజులు.

ఆత్మ దర్శనము నందు అనాదరణ కలిగి ఉన్న జీవులు దీనులు. ఎందుకంటే వారు ఈ జనన–మరణ చక్రము నందు అనేక దుఃఖములను పొందుచున్నారు.

ఈ జీవుడు అనేక విధములైన ఆశాపాశములచే నిరంతరం బంధింపబడుచున్నాడు. భోగ తృణములను అపేక్షిస్తూ అనేకసార్లు వార్ధక్యముచే కురూపుడగుచున్నాడు. శోకములు, దుఃఖములు పొందుచున్నాడు. దుష్కర్మలచేత, మోహంచేత, రాగం చేత, తృష్ణలచేత ఈడ్వబడుచూ, 'మనస్సు' అనే గృహంలో బంధితుడగుచున్నాడు. పుత్ర, స్త్రీ, బంధువులతో ఏర్పడే 'నావి, నావి' అను దురవగాహన లన్నీ చివరికి అతనికి బంధనములు అవుచున్నాయి. వార్ధక్యము – దుష్కర్మలు ఆతని విశ్రాంతిని

అనుక్షణం దూరం చేస్తున్నాయి. అతడు ఇహ - పరలోకములకు రాకపోకలు సాగిస్తూ అలసిపోయి తీవ్ర మనఃతాపముచే తప్తమగుచున్నాడు. పైకి పచ్చగా కనబడుచున్నాకూడా, అంతఃకరణంలో మాత్రం అతిదీనుడై ఉంటున్నాడు. భూత-భవిష్యత్తుల గురించి అనేక చింతనలతో సతమతమగు చున్నాడు. తన ఇంద్రియములచే తానే పరాజితుడగుచున్నాడు. నిత్యం కామ్యకర్మలచే ఆకర్షితుడ గుచున్నాడు. ఆవిర్భావ - తిరోభావములను మోస్తూ అజ్ఞానమహారణ్యంలో సొమ్మసిల్లి నేల కూలుచు న్నాడు. అనర్థములు - దుఃఖములు - దారిద్ర్యములు మరలమరల పొందుచున్నాడు. కర్మభారములచే శిథిలశరీరములతో ఆక్రందనం చేస్తున్నాడు.

ఎద్దువంటి ఈ జీవుని మనస్సు 'సంసారము' అనే బురదలో కుతిక్కాయ వరకు లేవలేనంతగా చిక్కుకుని ఉన్నది. ఉత్తమ ప్రయత్నముచే జ్ఞానబలం సంపాదించి ఆ మనస్సును బురద నుండి బహిర్గతం చేసినప్పుడు మాత్రమే మానవజన్మకు ప్రయోజనమున్నట్లు.

ఆత్మను దర్శించినప్పుడు మాత్రమే చిత్తము క్షయిస్తుంది. అప్పుడు భ్రమలన్నీ పోతాయి. జ్ఞానముచే ఆత్మ దర్శించబడగలదు. అయితే జ్ఞానం ఎలా లభిస్తుంది? నావికుని వలన నౌకాయానం లభించునట్లు మహానుభావుడగు జ్ఞాని యొక్క సాంగత్యముచే ఈ సంసారసాగరాన్ని దాటటానికి యుక్తి లభిస్తుంది. ఎక్కడ జ్ఞానిలేడో... ఆ ప్రదేశం నివాసయోగ్యమే కాదు. జ్ఞాని యొక్క వచనముల చేత, అభిప్రాయములచేత, భావతరంగాలచేత ఆతడు ఉన్నచోటు పరమ పవిత్రం అవుతుంది. సజ్జనులగు జ్ఞానులవలన ప్రపంచమునకు ప్రశాంతత, జీవులకు విశ్రాంతి లభించగలదు.

❖

కొంచెము వివేకము ఆవిర్భవించినట్టి ధీమంతుడు ఇక నిదురపోకూడదు. ఏది ఏమైనా సరే, మహామోహదాయకము, సంతాపదాయకము అయినట్టి ఈ ప్రపంచము నందు ఆదమరచి ఉండరాదు. ఆత్మలాభం ప్రాప్తించేవరకూ నిరంతరం యత్నశీలుడై ఉండాలి. అంతేకాని, దేహాభి మానంతో మాన-మద-గర్వాదులతో 'జన్మలు' అను బురదలోకి తనను తాను త్రోసివేసుకోరాదు.

**కిమిదం కథమాయాతం కింమూలమితి కింక్షయమ్ ।**
**దేహదుఃఖమితి ప్రాజ్ఞైః ప్రేక్షణీయం ప్రయత్నతః ॥** (శ్లో 36, సర్గ 64)

ఈ దేహమేమిటి? దేహ సంబంధములగు దుఃఖాదులేమిటి? ఇవన్నీ ఎట్లా కలుగుచున్నాయి? వీటికి మూలమేమిటి? ఇవి ఎట్లా తొలగుతాయి? ...బుద్ధిమంతులు ఈ విధమైన ప్రశ్నలకు రావాలి. వచ్చి ప్రయత్నపూర్వకంగా విచారణ చేయాలి.

ఆత్మజ్ఞానులను సమీపించి సమాచారం సేకరించాలి. ఓ మిత్రులారా! శ్రోతలారా! ధనము గాని, మిత్రులుగాని, ఆత్మజ్ఞానమునకు వేరైన శాస్త్రములుగాని అజ్ఞాన సాగరమున నిమగ్నమైన జీవుని ఉద్ధరించగలవని అనుకుంటున్నారా? లేదు.

నిరంతర సహవాసంతో శుద్ధమనస్సును ఆశ్రయించండి. అట్టి శుద్ధమనస్సుతో కొంచెం పరామర్శించి చూడండి. ఈ మాత్రం చేత ఆత్మోద్ధరణ సంభవమగుచుండగా అట్టి ప్రయత్నం

చేయరెందుచేత? అరె! ఉత్తమమగు మానవజన్మచే లభిస్తున్న అనేక అవకాశములను బూడిద చేసుకుంటున్నారే! అది సరికాదు. అభ్యాస, వైరాగ్యములతో యత్నం చేయండి. తత్త్వజ్ఞానం సంపాదించటంలో తాత్సారం చేయవద్దని అందరికీ మనవి చేస్తున్నాను. దురాశచే ఏర్పడే శోక మోహముల విన్యాసమేమిటో గమనిస్తూ కూడా, ఉపేక్షిస్తూ ఉంటే ఎట్లా? అందుచేత ఆదరణపూర్వకంగా ఆత్మోద్ధరణకు నడుం కట్టండి. సన్మార్గంలో అహంకారం నశించేవరకూ విచారణను ఆశ్రయించండి. ఈ దేహమును "మట్టి – కొయ్య – శిల వంటిది"గా చూడటం అభ్యసిస్తూ ఉంటే చాలు... క్రమంగా సర్వదేవేశుడగు ఆ పరమాత్మ గూర్చిన జ్ఞానం లభ్యం కాగలదు. అహంకారం నశిస్తూ ఉండగా, చిద్రూపము ప్రకటితమగుచూ రాగలదు. వెలుగు రాగానే చీకటి ఎక్కడికో వెళ్ళిపోవుచున్నట్లు, అహంకారం నశిస్తూ ఉంటే ఆత్మదర్శనం స్వయంగా సిద్ధించగలదు. అప్పటి నిరతిశయానందంచే ఏర్పడే విశ్రాంత, నిర్వికల్పస్థితియే పరిపూర్ణస్థితి. అందుకు మనం అందరం అర్హులమే. అయ్యది మన స్వస్వరూపస్థితియే అయిఉన్నది కదా! ఇక అనర్హత ఎందుకుంటుంది? ...అందుకు ప్రయత్నించనప్పుడు మానవునికి ఇక జంతువుకు భేదమేమున్నట్లు?

విషయరహితమగు మనస్సుతో సాటివచ్చేదేదీ ఈ మూడు లోకాలలోనూ లేదు. అందు దృశ్యం కొరకై రాగం ఉండటానికి చోటే ఉండదు. కేవలం చిత్ప్రకాశం మాత్రమే అంతటా ఆక్రమించు కొని ఉంటుంది. ఇక నిర్వికల్పసమాధి అయినట్టి తురీయదృష్టి పొందావా... దానితో పోల్చతగినది మరేదీ ఉండదు. దానికదే సాటి. ఆ స్థితిలో విక్షేపములేవీ ఉండవు కనుక సుషుప్తితో పోల్చవచ్చు. అయితే సుషుప్తిలో జడత్వం (ఎరుక లేకపోవటం) ఉంటుంది. అదిమాత్రమే భేదం. ఆ అవస్థ ఆకాశమువలె సర్వవ్యాపకమైనది.

ఒక చోట ఒక కుండ ఉన్నదనుకో! ఆ కుండ పగిలితే కుండలోని ఆకాశం ఏమౌతుంది? మహాకాశంతో ఏకత్వం పొందుతుంది. అయితే, కుండలోని ఆకాశము మహాకాశము నుండి వేరు పడినదెప్పుడు? ఎప్పుడూ లేదు. అట్లాగే ఏ జీవునియందు మనోహంకారాలు తొలగుతాయో, ఆతనికి సర్వపదార్థములలోని అంతరమున ఉన్న పరమసత్యము గోచరించగలదు. ఆ పరమసత్యమే 'తత్'. ఆ తత్‌యే 'త్వమ్'. అదియే నీవు. రామా! అట్టి స్థితి స్వయముగా యోగముచే సిద్ధించగలదు. అది సుషుప్తికి దూరాతి దూరమేమీ కాదు. కానీ సుషుప్తి కానే కాదు. అయితే అది వాక్కుకు అతీతమైనది. అది ఈ జీవునికి హృదయములోనే అనుభూతమగుచున్నది సుమా!

❖

**అనుభూతిం వినా తత్త్వం ఖణ్డాదేర్నానుభూయతే ।**
**అనుభూతిం వినా రూపం నాత్మనశానుభూయతే ॥** (శ్లో 53, సర్గ 64)

అనుభవం అనేది లేకపోతే సామాన్యములైన చక్కెర, పటికబెల్లం మొదలైనవాటి తత్త్వమే గోచరించదు. ఇక ఆత్మానుభవం గురించి వేరుగా చెప్పాలా? 'అనుభవం' అనేది లేకపోతే ఆత్మస్వరూపం కూడా గోచరించదు.

ఈ జగత్తంతా అనంతాత్మ స్వరూపమే. ఇక చిత్తముయొక్క బాహ్యవిషయములంటావా, ఇవన్నీ పరిణామయుతములు. కొంతకాలం గడచిన తరువాత ఇవి ఇట్లా ఉండవు. ఇట్టి దృశ్యమును పట్టుకుని వ్రేళ్ళాడవలసిన పనేమున్నది? అందుచేత రామా! ఈ బాహ్యవిషయములు నీచే శమించి వేయబడుగాక! సర్వత్రా దీప్తమై, బ్రహ్మాది దేవతలకు దేవదేవుడై వెలయుచున్న ఆత్మ నీపట్ల అనుభూతమగుచు, ప్రకటితమగుగాక!

పంచమ భూమికయందు విషయవాసన నశిస్తుంది. ఆరవ భూమికయందు పరమపురుషార్థమగు ఆత్మప్రకాశము ఉదయిస్తుంది.

ఏడవ భూమికలో సమాధి, అసమాధులు ఏకత్వాన్ని సంతరించుకుంటాయి. అట్టి సమత్వ కారణంచేత బ్రహ్మాదులకుకూడా అచింత్యమైనట్టి 'కేవలానందైక స్వరూపం' అను ఆత్మానుభవం శేషిస్తోంది.

❖❖❖

# IX. భాస - విలాస సంవాదం

## 1. అభిమాన త్యాజ్యం

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఆధ్యాత్మికయానం సుమార్గం కావాలంటే అభిమానత్యాజ్యం ఎంతో ఆవశ్యకం సుమా!

**శ్రీరాముడు :** 'అభిమానం' అంటే తమ ఉద్దేశం?

**శ్రీవసిష్ఠమహర్షి :** "ఈ ధనము, గృహము, బంధు జనము మొదలైనవి నావి. ఈ శరీరమే నేను" – అని అనుకోవటమే అభిమానం. మనస్సుతో అభిమానమనే మనో విభాగమును జయించి, ఆ మనస్సుతో ఆత్మదర్శనం చేయాలి. అభిమానమును జయించకుండా, దానిని కలిగియుండి ఎంతగా శాస్త్రాలు చదివినా, ఏమి విన్నా... ఏం ప్రయోజనం? చిత్రపటంలోని సూర్యుడు కిరణములను ప్రసరింపజేయగలడా? లేదు కదా! అహమ్, మమ అను భ్రమాత్మకమగు అభిమానం త్యజించకపోతే ఈ జగత్ దుఃఖం అస్తమించదు. అది ఉన్నంత వరకు ఆపత్తులు, వ్యాకులతలు, అజ్ఞాన బీజాంధకారాలు ప్రాప్తిస్తూనే ఉంటాయి. ఈ విషయమే నిరూపిస్తూ ' భాస – విలాస సంవాదం' అనే ఒక ప్రాచీన ఇతిహాసం ఉన్నది. అది వింటే అభిమాన త్యాజ్యము యొక్క ఆవశ్యకత ఏమిటో మరికొంత సుస్పష్టమౌతుంది. చెపుతాను. విను.

❖

సహ్యాపర్వత ప్రాంతం అతి సుందరమై ఒప్పుతూ ఉంటుంది. ఆ పర్వత ప్రాంతంలో మానవ – కిన్నెర – సిద్ధ – విద్యాధర – సాధువులకు నివాసయోగ్యమై, అనేక ప్రదేశాలు ఉన్నాయి. ఆ పర్వత ప్రాంతంలో ఒక చోట అత్రిమహాముని ఆశ్రమమున్నది. ఆ ఆశ్రమానికి కొంచెం దగ్గరలో శుక్రుడు, బృహస్పతి అను పేరు గల ఇద్దరు తాపసులు నివసిస్తూ ఉండేవారు. పేరుచే మాత్రమే గాని, వీరివురు దేవ, దానవ గురువులు కారు. ఆ ఇద్దరూ ఆప్తమిత్రులు. ఇద్దరూ శాస్త్ర విషయాలలోను, తపస్సు, ధ్యాననిష్ఠలందు గొప్పనిష్ణాతులు. వాళ్ళిద్దరికి విలాసుడు, భాసుడు అనే పేరుగల కుమారులు ఉండేవారు. ఆ భాస, విలాసులిద్దరూ చిన్నప్పటి నుండి కలిసి పెరుగుతూ ఏకమనస్కులై, ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. చిన్నప్పటినుండి అక్కడి ఆశ్రమధర్మములైన తపోధ్యానములు కలిసి నిర్వర్తిస్తూ ధ్యానవిషయములు వింటూ తమ తండ్రులకు అత్యంత ప్రీతిపాత్రులై ఉంటూ ఉండేవారు.

కొంతకాలం గడిచింది. భాస, విలాసులు యౌవనంలో ప్రవేశించారు. అంతా కాలముయొక్క మహిమయే కదా! కాలగతిని ఎవరు నిరోధించగలరు? అనుక్షణిక గమనశీలం అగుకాలం మౌనంగా, ఏది ఎట్లున్నా, తాను మాత్రం గతిస్తూ, స్థితి గతులను తన రీతిలో మార్చివేసుకుంటూ పోతుంది కదా! ఆ శుక్ర బృహస్పతులు కొంతకాలానికి వార్ధక్యము పొంది గూటిని విడిచిన పక్షుల వలె

భౌతిక దేహములను త్యజించి స్వర్గస్థులైనారు. తండ్రులు మరణించడంచేత భాస, విలాసులు జలము నుండి పెరికి వేయబడిన కమలద్వయమువలె దీనులు, ఉత్సాహరహితులు, సంతప్త హృదయులు అయ్యారు. తండ్రులకు దహనక్రియలు యథారీతిగా నిర్వర్తించారు. మహాత్ములు లోకరీతిని ఉల్లంఘించరు కదా!

వారిద్దరూ చింతాగ్రస్థులై పెద్ద పెట్టున దుఃఖిస్తూ చేష్టారహితంగా అక్కడక్కడే కొద్దిరోజులు గడిపారు. తమ తండ్రులతో ఏర్పడిన అనుబంధం చేత, వారు విరక్తి, అనురక్తి, వేదనల నుండి ముక్తులు కాలేకపోయారు. ఒక రోజు వారిట్లు సంభాషించుకున్నారు–

**భాసుడు :** మిత్రమా! చూచావా! మనం తండ్రులను కోల్పోయాము. అయితే శరీరధారులందరికీ ఎప్పటికో అప్పటికి మృత్యువు అనివార్యమే కదా! అయినా వారినుండి వియోగం మనం భరించలేక పోతున్నామే! ఇప్పుడు మనం ఏం చేయాలి? ఆలోచించు.

**విలాసుడు :** ఔను. తేనెటీగ ఒక పుష్పము వదిలి మరొక పుష్పమును ఆస్వాదించునట్లు ఈ జీవుడు ఆత్మజ్ఞాని కానంతవరకూ, ఒక శరీరమును వదలి మరొక శరీరమును గ్రహిస్తూ ఉంటాడు. కనుక మృత్యువు అనునది అత్యంత సామాన్యమైన దినచర్య వంటిది. ఈ విషయం మన తండ్రుల నుండి మనం అనేకసార్లు విన్నాం. అయినా, మన తండ్రుల నుండి మనకు కలిగిన ఈ వియోగం అత్యంత దుర్భరంగా ఉన్నది. ఎందుచేతనో మరి?

**భాసుడు :** ఎందుచేతనంటే, మనం ఎన్నో జ్ఞానవిషయాలు విన్నాం కాని, మనకు అనుభవజ్ఞానం లేదు. ఇక్కడ ఎంతకాలంవున్నా, మన మనస్సులు కుదుటపడవేమో!

**విలాసుడు :** అవును నీవు చెప్పింది నిజం. ఇక ఇక్కడ మనం ఉండటం ఉచితం కాదు. ఉండి చేసేదేమీ లేదు. మనం దేశాటన చేసి లోకాన్ని చూసి అనుభవజ్ఞానం సంపాదిద్దాం.

**భాసుడు :** మనం వేర్వేరుగా రెండు దిక్కులుగా పోదాం. పదేళ్ళ తర్వాత ఇద్దరం మరల ఇక్కడే కలుద్దాం.

ఇట్లు నిర్ణయించుకొని ఇద్దరూ ఎవరి త్రోవలో వారు అక్కడ నుండి బయలుదేరారు. రోజులు, మాసములు, సంవత్సరములు గడిచిపోయాయి. అనుకున్నట్లుగానే పదేళ్ళ తర్వాత అదే రోజు ఆ ఆశ్రమ ప్రాంతంలో ఒకరినొకరు కలిశారు. ఇట్లు సంభాషించుకున్నారు.

❖❖❖

## 2. ఏమి క్షేమ సమాచారం?

**విలాసుడు :** నా ఉత్తమ బంధువగు భాసుడా! స్వాగతం. మన వియోగం తరువాత నీవు ఇంతకాలం ఎక్కడెక్కడ సంచరించావు? నీ తపస్సు ఫలించిందా? బుద్ధి సంతాపరహితం అయినదా? విద్య సఫలీకృతమైనదా? ఆత్మజ్ఞానివైనావా? సర్వదా క్షేమమే కదా?

**భాసుడు :** మాననీయుడగు విలాసుడా! నీకు నేను కూడా సుస్వాగతం పలుకుచున్నాను. అమ్మయ్య! సౌభాగ్యవశం చేత నిన్ను మరల కలుసుకోగలిగాను. ఇక నా క్షేమ సమాచారాలు ప్రశ్నిస్తున్నావా? ఈ సంసారము ఏర్పడి ఉన్నంతకాలం నాకు క్షేమం కూడానా? అయ్యో నా రాత!

**యావన్నాధిగతం జ్ఞేయం యావతీక్ష్ణా న చిత్తభూః ।**
**యావతీర్ణో న సంసారస్తావన్మే కుశలం కుతః ॥** (శ్లో 10, సర్గ 66)

జ్ఞేయమగు బ్రహ్మమును ఎరుగనంతవరకూ, కామసంకల్పములు నశించనంతవరకూ, సంసార సముద్రం దాటనంతవరకూ ఈ జీవునకు క్షేమమనే మాటెక్కడిది చెప్పు?

గొడ్డలితో వృక్షమును నఱుకునట్లు చిత్తమునుండి పుట్టే ఆశావృక్షమును మరల చిగురించకుండా మొదలంటా నరికినప్పుడే సౌఖ్యమనే మాట. జ్ఞానము కలుగనంతకాలం సమత్వం ఉదయించదు. సమత్వం లేనంతవరకు ఆత్మబోధ హృదయంలో ప్రవేశించదు. ఆత్మబోధ అనే ఔషధం సేవించకపోతే ఈ సంసారము అనే మహమ్మారి మరలమరల రకరకాల రూపాలలో పుట్టుకొస్తూనే ఉంటుంది. ఇక, ఈ శరీరములు పుట్టటం, బాల్యయౌవనవార్ధక్యమరణములు పొందటం, మధ్యేమార్గంలో ఏర్పడి ఉండే బంధు, సంపదల కొరకై రోదన – వేదనలు ఈ విధంగా చర్వితచరణంగా జరిగిపోతూనే ఉంటుంది.

జీవించి ఉన్నంతకాలం ఈ విధంగా అనేక మనోవ్యాకులతలతో కాలం గడచిపోతోంది. ఇక మరణించిన తరువాతనో, పశువు మొదలైన యోనులందు జన్మించి పాపకర్మల ఫలితం అనుభవించ వలసిందే కదా! కాదంటావా, స్వర్గాదులను చేరి పూర్వసంచితమైన పుణ్యకర్మల ఫలితం అనుభవించాలి. నా దృష్టిలో ఈ రెండూకూడా విరసములూ, నీరసప్రాయములే అయి ఉన్నాయి. అదంతా దీర్ఘకాలంగా ఏర్పడి ఉండగల వ్యర్థ ప్రయాసయేనని నా కనిపిస్తోంది. ఒక అనుభవం తరువాత మరొక అనుభవం.... ఈ ప్రయాసకు అంతు ఎక్కడ? విశ్రాంతి ఎక్కడ? శాంతి ఎక్కడ?

❖

అయ్యో! ఈ జీవులు అజ్ఞానభావములు, తృష్ణ అనే సర్పములను ప్రక్కనే ఉంచుకొని విషయ భోగక్రియలందు మరల మరల పొరలుచున్నారే! శుభాశుభముల చేత, న్యూనాధిక దుఃఖముల చేత, అల్పసుఖములచేత అనేక రాత్రింబవళ్ళు గడచిపోతున్నాయి! మిథ్యాక్రియాకారకులగు ఈ జీవులు మిథ్య అయిన క్రియలను, వాటి ఫలములను, దురాశలను, తదనుగుణమైన కర్మలను మరల మరల ఆశ్రయిస్తూ తమ ఆయువును నశింపజేసుకుంటున్నారు. ఈ మనస్సు తన ఉత్పత్తి స్థానమైన పరమాత్మను త్యజించి, వివేకం పోగొట్టుకుని 'ఆసక్తి' తృష్ణ' అనే మత్తు పదార్థములను సేవించి, తూలుతూ ఎటో పరుగులు తీయుచున్నది. పిచ్చి అరుపులు అరుస్తోంది. 'అభిలాష' అనే ఒక దుష్టవ్యాధి పొందిన ఈ జీవుడు వ్యర్థంగా పరమ పురుషార్థమును పోగొట్టుకొనుచున్నాడే! మనోచాపల్యం చేత కాబోలు అల్పము, నీరసము అగు విశేషముల వెంట తాను చేసే పరుగులు ఆపలేకపోతున్నాడు.

మిత్రమా! ఇక ఈ దేహం గురించి ఏం చెప్పమంటావు? ఇది నిష్ఫలమగు క్రియలచే నీరసం పొందుతోంది. అల్పత్వము, శ్రమ, రోగము, దౌర్బల్యము ఇందులో దాగిఉన్నాయి. ఎండుటాకులాగా ఎప్పుడు నేలకూలుదామా అని ఎదురుచూస్తోంది. ఈ దేహము యొక్క ముఖము రజో గుణముచే కొట్టబడుచున్నదై, పుత్రకళత్రాదుల దురుసువచనములచే అవమానించబడుచున్నదై, కాంతిని పోగొట్టుకొని ధూసరమగుచున్నది. యౌవనకాలంలో మిసమిసలాడుచున్నప్పటికీ ఆ యౌవనం గడచిపోగానే రసవిహీనమై ఎండుటాకువలె మిగులుతోంది. కాలక్రమేణా శుష్కిస్తోంది. వయసు చెల్లుతున్నకొద్దీ ఈ దేహవృక్షం నుండి ఒక్కొక్క భోగశక్తి నేల రాలుతోంది. ఆ యౌవనపు శోభలూ, ఆ పటాటోపాలూ వార్థక్యం వచ్చేసరికి ఎక్కడికి పోతాయో?... రోజులు గడుస్తున్న కొద్దీ బ్రతుకు దీనమగుచున్నదే!

ఒక్కసారి ఈ మనస్సును గమనించండి మిత్రమా! ఇది 'భోగములు' అనే విషసర్పములచే పూర్ణమై పైకి పెదవి విప్పలేనట్టి అనేక అంతర్ దుఃఖములను కలిగి ఉంటోంది. ఎందుకో... కారణాలు ఏమిటో ఈ మనస్సుకే తెలియదాయె! చివరికి ఇది 'మోహాంధకారము' అనే నూతిలో బావురు కప్పలాగా మిగిలిపోతోంది. నీచ వస్తువులను, తుచ్ఛవిషయక్రమములను ఆశ్రయించటంలో దీనిని కుక్కలతోను గ్రద్దలతోనూ, పందులతోనూ కూడా పోల్చటానికి వీలులేదు. 'తృష్ణ – అనురాగము' అను వాయువీచికలు ఈ మనస్సు అనే పతాకమును క్షణకాలం కూడా స్థిరత్వం లేకుండా రెపరెపలాడేట్లు చేస్తున్నాయి.

ఈ జీవుడు ఎన్నెన్నో ఆశాపరంపరలు కలిగిఉంటున్నాడు. ఆ ఆశల వెనుక ఏవో ఆశయములు ...ఆ ఆశయములన్నీ దుఃఖములవైపు, అజ్ఞాన భూముల వైపు అనుసంధానం చేయబడి ఉంటున్నాయి. కర్మలు, వాటిచే ప్రయోజనములు, వాటి నుండి ఏవేవో దుఃఖములు, అవి తొలగటానికి మరల కర్మలు... ఈలోగా పాపము, అల్పము అయిన దృష్టులు... ఏమిటిదంతా? అవిశ్రాంతంగా శరీరం తోనూ మనస్సుతోనూ అనేక కర్మవ్యవహారములలో చిక్కుకున్న ఈ జీవునికి శాంతి కరువు అవుతోంది. "ఇవి నేను చేయవలసినవి... ఇది సంపాదించవలసినవి... ఇవి దాచవలసినవి" అనుకుంటూ ఈతడు రోజులు గడుపుచున్నాడు. ఇంతలో శరీరం వార్ధక్యమునకు, రోగములకు గురి అవుతోంది. ఒక అనుకోని క్షణంలో మృత్యువు అనే గ్రద్ద వచ్చి వాలుతోంది. గ్రద్ద కోడిపిల్లను నోటకరుచుకొని పోవునట్లు ఈ శరీరమును నోట కరచుకొని వెళ్ళిపోతోంది. ఈ జీవుని తెలియని లోకాలలో త్రోసివేస్తోంది.

జీవితము అనే దుష్టనది యౌవనోత్సాహాలు అనే తరంగములతో, కామక్రోధములు అనే సుడులతో ఎటువైపుకో ప్రవహిస్తోంది. అట్టి జీవితము అను దానికి కర్త, భోక్త కూడా అయినట్టి ఈ జీవుడు ఆశ నిరాశల మధ్య మీనమేషాలు లెక్కపెట్టుకుంటూ తనకు తెలియకుండానే ఎచ్చటెచ్చటికో దొర్లింపబడుచున్నాడు. 'ధనము, జనము, బాంధవ్యము, ఇళ్ళు, వాకిళ్ళు' మొదలైన వాటిని చూపించి ఈ జీవితము జీవుని తన వశం చేసుకొని, క్షణకాలం అలరించి చివరికి ఏది ఏమిటో తెలిసే లోపలే దుఃఖమహాసముద్రంలోకి తీసుకొని వెళ్ళి పడవేస్తోంది. ఈ అనంత బంధు మిత్ర సమాగమం,

ఆశాపరంపరలు, కాలక్షేపాలూ ఇవన్నీ జీవునిలో సత్యదృష్టిని కకావికలు చేస్తున్నాయి. కాల సాగరంలోకి పోయి కలిగియున్నవన్నీ కలిసిపోతున్నాయి. ఎక్కడా ఏదీ మిగలటంలేదు. అసలీ తతంగమంతా ఏమిటో, ఎక్కడికో, ఎందుకో, ఎప్పటివరకో, ఎవరు ఎవరికొరకు ఎంతకాలంగా కల్పిస్తున్నారో ఏమాత్రం అర్థం కావటం లేదు. అర్థవంతమైనవనుకున్నవన్నీ అనర్థంగా అయిపోతు న్నాయి. అర్ధంతరంగా ఆగిపోతున్నాయి. ఇక ఏమి శాంతి? ఎక్కడి శాంతి? అంతా కూడా అగమ్యగోచరంగా ఉన్నది. "అహా! ఇవన్నీ నా సంపదలు" అనుకున్నవన్నీ క్షణంలో విడచి వెళ్ళు చున్నాయి. లేదా కొద్ది క్షణాల తరువాత ఈ జీవుడే వాటిని విడచి ఎటకో వెళ్ళిపోతున్నాడు.

ఈ జన్మ మృత్యువులు, ఈ చింతలు, ఈ దుష్ట క్రియాచారములు జీవుణ్ణి మలయమారుతంలోని ఎండుగడ్డి పరకలాగా దొర్లించుకుపోతున్నాయే! ఇక్కడి కార్యసముదాయములు చింతలను, ఆర్తులను, ఆందోళనలను కలుగజేయటంచేత ఈ జీవునికి ఒక్కక్షణమైనా విశ్రాంతి ఉన్నదా? లేదు. "ఇది చేశాను, ఇది చేస్తున్నాను, ఇది చేయబోతున్నాను" అను ఒకానొక మానసిక వ్యసనముచే, చింతలచే బంధింపబడిన ఈ జీవుడు 'నావారు – కానివారు' అని తలచుచూ తద్వారా పొందుచున్న రోదన – ఖేదములకు ఎక్కడైనా అంతు ఉన్నదా? అతిచంచలమగు ఈ మనస్సు క్షణంలో వృద్ధి చెందుతోంది. మరొక క్షణంలో ఏవేవో దీనాలాపనలు ప్రారంభిస్తోంది.

చూచావా సోదరా! ఈ విధంగా ఈ జీవుడు దేహాదులందు ఆత్మబుద్ధి కలిగి ఉంటున్నాడు. అనాత్మరూపములగు అనేక దుఃఖములను తనకుతానే సేకరిస్తున్నాడు. దీనత్వం పొందుచున్నాడు. అనేకసార్లు సుఖదుఃఖములచే జరామరణములచే కొట్టబడుచున్నాడు. ఈ జగత్తు నందు పొరలుచున్న ఈ జనులు రసశూన్యులై, ఎండిన ఆకులవలె చివరికి శైథిల్యమును పొందుచున్నారు. అయినా కూడా కుక్క దాలిగుంటలో కునుకులు తీస్తూ ఏమీ తెలియక ఏదీ గమనించనట్లు వారు ముందూ వెనకా చూచుకోకుండా బ్రతికివేస్తూ అనేక దుర్గతులకు ఎర అగుచున్నారు. అట్టి అసంఖ్యాక అమాయక సంసార జీవులలో ఈ నీ బాల్యస్నేహితుడగు ఈ భాసుడు అనబడే నేను కూడా ఒకడిని. ఇంకేం సుఖం? ఏమి శాంతి?

❖❖❖

## 3. అయితే, ఇప్పుడేం చేయాలి?

**విలాసుడు :** స్నేహితుడా! ఈ జీవుడు – జీవనములను చాలా చక్కగా విశ్లేషించావు. ఈ సంసార దుఃఖములకు అంతులేని మాట నిజమే. నీవు చెప్పిన విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుని మనం కొంచెం విచారణ ప్రారంభిద్దాం.

మనకు కలుగుచున్న బంధములకు హేతువేమిటి? ...చిత్తమే కదా! ఒక పాశము వలె బంధ హేతువగుచున్న ఈ చిత్తమును ఖండింపగలిగామా మరింకేమీ అవసరం లేదు. ఒక చిన్న పిట్ట సముద్రమును దాటలేకపోవచ్చు. కాని గరుడపక్షి సప్తసముద్రాలను కూడా దాటివేయగలదు

కదా! 'వివేకం' అనే బలం సంపాదిస్తే మనకీ సంసారసాగరం చాలా తేలికగా దాటివేసే గోష్పదజలం కాగలదు. ఇదే జగత్తులో దేహాతీతులు, చిన్మాత్రమునందు స్థితిని సంపాదించినవారు కూడా ఉన్నారు. వారు ఒకబాటసారి జనసమూహమును చూస్తున్నట్లు – ఈ శరీరమును తదితర జగత్తును గాంచగలుగుచున్నారు. మనం ఆ మార్గంలో ఎందుకు ప్రయత్నించకూడదు?

ఈ శరీరం అభివృద్ధి చెందవచ్చు. లేదా, సంక్షోభం పొందవచ్చు. శిథిలం కావచ్చు. అయితే ఏం? చిన్మాత్రస్వరూపులం అయినట్టి మనకు వచ్చే లోటేముంటుంది చెప్పు? రథం చెడినంత మాత్రం చేత రథసారథి చెడతాడా? మనస్సు బాగుండవచ్చు. చెడవచ్చు. చైతన్యమునకు ఏమి నష్టం? సముద్ర జలం తరంగముల రూపంలో విస్తరిస్తుందనుకో... ఆ మాత్రానికి సముద్రము యొక్క పూర్ణత్వానికి ఏమి హానియో చెప్పు?

కమలం, జలం కలిసి ఉండవచ్చు. వృక్షం (కొయ్య), జలం కలిసి ఉండవచ్చు. అయినా కూడా కమలము – జలములకు, వృక్షము – జలము ఏమాత్రం సంబంధం లేదు కదా! అట్లాగే మనలోని పరమాత్మ స్వరూపమునకు, ఈ భోగములకూ ఏ మాత్రమైనా సంబంధం ఉన్నదా? లేదు. సముద్రానికి, అందులోని పర్వతానికి సంబంధం లేనట్లే చైతన్యమునకు బంధహేతువగు సంసారమునకు సంబంధమెక్కడిది?

కనుక నేస్తం! ఆత్మకు ఈ దేహమునకు ఏమాత్రం సంబంధం లేదు. నేను, నీవు ఆత్మస్వరూపులం కాని దేహమాత్రులం కాదే! "నా స్వరూపం ఈ దేహమే" అను దేహాత్మ బుద్ధియే నీవు చెప్పిన అనర్థాలన్నిటికీ కారణం. ఆత్మ, దేహముల పట్ల అజ్ఞానం చేత ఏర్పడుచున్న అభేద బుద్ధి కారణంగా సుఖ దుఃఖాది చిత్తవృత్తులు వృద్ధి చెందుచున్నాయి. ఒక దృష్టాంతం విను. ఒక నది ఉన్నది. ఆ నది యొక్క ఒడ్డున ఒక పెద్ద మఱ్ఱి వృక్షం ఉన్నది. ఆ పెద్ద చెట్టు నదీ జలంలో ప్రతిబింబిస్తోంది. అంత మాత్రంచే ఆ వృక్షానికి నదీజలానికి ఏమైనా సంబంధం ఉన్నదా? అవి రెండూ ఒక్కటే అవుతాయా? లేదు కదా! అట్లాగే ఆత్మ యందు ఈ దేహాదుల ఉనికి ప్రతిబింబిస్తోంది. అయినా కూడా ఆత్మకు దేహమునకు సంబంధం లేదు. ఆత్మయే మనిద్దరి స్వరూపంగానీ ఈ దేహాదులు కాదు కదా! ఈ దేహము, బుది, ఆలోచన, దృశ్యము మొదలైనవి ఆత్మదేహులగు మనం ఉపయోగించే 'ఉపకరణాలు' మాత్రమే కదా!

ఒక దర్పణములో కనబడే, ప్రతిబింబములు సత్యములా? కాదు దర్పణంలో వస్తువు లేదు కదా! పోని అసత్యములా! వస్తువు యొక్క కదలిక ఆ దర్పణంలో కనిపిస్తోంది కదా! "కనబడుతోంది. కాబట్టి అసత్యము" అని అనలేం. అందుచేత "దర్పణంలో కనబడే వస్తుజాలం సత్యం కాదు. అసత్యం కాదు. అనిర్వచనీయం. ఆత్మయందు ప్రతిబింబిస్తున్న ఈ శరీరము, దృశ్యము, అనుభవము, మనస్సు – మొదలైనవన్నీ అనిర్వచనీయం" అని ఆత్మజ్ఞుల అభిప్రాయం. దృశ్యములో ఏది మారినా, మారకున్నా కూడా అది ప్రతిబింబిస్తున్న దర్పణం ఏ మార్పు చేర్పులూ పొందదు కదా! దృశ్యము యొక్క కలిమిలేములచే ద్రష్టలేక, ఆత్మ ఏమీ పొందదు, కోల్పోదు. కొయ్య, శిల, జలము ఛేదించబడి నప్పటికీ దుఃఖములు పొందుచున్నాయా? లేదు. ఈ దేహము కూడా పృథివి మొదలైన పంచభూత

పరిణతియే కదా! దాని సంయోగ వియోగములచే గానీ, అది పునాదిగా కలిగి ఉన్న పుత్ర మిత్రాదులతో ఏర్పడే సంబంధ, బాంధవ్యములచేగానీ హాని, ఆహ్లాదం ఎందుకు ఏర్పడాలి?

**భాసుడు :** ఔను. ఏర్పడవలసిన పనిలేదు. కానీ మిత్రమా! ఈ సుఖ దుఃఖాలు పరిగెత్తుకుని వచ్చి మీద పడుచున్నాయి కదా!

**విలాసుడు :** ఒక కట్టెతో సంయోగం (తాడనం) పొందినప్పుడు జలంలో చలనం, శబ్దము మొదలైనవి కలుగుచున్నాయి. అట్లాగే చేతనముతో ఏర్పడిన సామీప్యత చేత జడమగు ఈ దేహము నుండి శబ్దము, చలనము మొదలైన క్రియలు సంభవిస్తున్నాయి. సుఖ దుఃఖాది వృత్తులు, అనుభవములు ఏర్పడుచున్నాయి. అయితే సుఖ-దుఃఖానుభవములు జడశరీరమునకు సంబంధించినవా? జడమైన దానికి అనుభవమే ఉండదు కదా! కనుక అవి శరీరానివి కావు. పోనీ ఆత్మకు సంబంధించినవా? ఆత్మ సర్వదా నిత్యము, నిర్మలము, శుద్ధము, అప్రమేయము కదా! మరి సుఖ దుఃఖములు ఎవరికి, ఎట్లు ఎందుకు కలుగుచున్నాయి?... అజ్ఞానము చేతనే, అజ్ఞానము కలిగియున్న జనులకు కలుగు చున్నాయి. అజ్ఞానం తొలగిన మరుక్షణం సుఖ దుఃఖాదులు ఉండవు. సర్వము చిన్మాత్రము నందు లయించగా, చిన్మాత్రానుభవమే సర్వత్రా గోచరిస్తుంది. అనగా ఈ "దేహం, దేహాన్ని అభిమానించు వాడు" ఇద్దరూ సంయోగముచే ఒకచోట ఒనగూడినా ఇద్దరూ సుఖ-దుఃఖములకు అనర్హులే. మధ్యలో అజ్ఞానం వచ్చి, సుఖ దుఃఖములను ఏర్పరచి ఉంచుతోంది. అజ్ఞానము అనగా? సత్యాసత్యము లను, నిత్యానిత్యములను వివేకదృష్టితో చూడకపోవటమే.

అజ్ఞాని యొక్క దృష్టికి ఈ ప్రపంచము సత్యమైనదానివలె గోచరిస్తోంది. జ్ఞాని యొక్క దృష్టికో, ఇది స్వప్నతుల్యంగా అసత్యంగానే ఉంటోంది. ఇద్దరూ ఇదే ప్రపంచంలో సంచరిస్తూ ఒకే విధంగా కార్యక్రమములు నిర్వర్తిస్తూ, ప్రక్కప్రక్కనే ఉంటున్నా కూడా ... వారిద్దరూ వేరువేరు దృష్టి అవగాహనలు కలిగి ఉంటున్నారు. ఎంత చమత్కారం!

గొడ్డలిలో కాష్ఠము (Wood), లోహము బాహ్య సంయోగంచే కలిసియే ఉంటున్నాయి. ఆ రెండిటికీ అభ్యంతర సంయోగం జరుగుతోందా? ...లేదే! జ్ఞాని ఈ జగత్తులో సంచరిస్తున్నప్పుడు అభిమానశూన్యుడై, ఆసక్తిరహితుడై ఉంటున్నాడు. మనోవృత్తి దృష్ట్యా చూస్తే ఆతనికి సుఖ దుఃఖా దులు కలిగి ఉండవచ్చు గాక! అభ్యంతరంలో (In the inner Recess) తాను ఆయా అనుభవము లన్నిటికీ వేరై ఉంటున్నాడు. మిత్రమా! భాసుడా! మరల ఒకసారి ఒక ప్రకటన చేస్తున్నాను.

జలం జలంలోని ప్రతిబింబమువలె ఆత్మకు, దేహమునకు ఏమాత్రం సంబంధం లేదు.

❖

విషయ రహితమగు శుద్ధ జ్ఞానం అంతటా, అన్నిటా సర్వదా వ్యాపించియున్నది. ఇక ద్వైత భావముచే కళంకితమైన తదితర జ్ఞానం అంటావా? అదంతా సత్యమే కాదు.

**భాసుడు :** కాకపోవచ్చు. కాని మనకు తదితరజ్ఞానం అనుక్షణికమై సత్యం వలె సంప్రాప్తిస్తోంది కదా!

**విలాసుడు :** ఎందుచేతనో మనం గ్రహించాలి. బాలుడు "అదిగో! ఆ చీకట్లో పెద్ద దయ్యం ఉన్నది.

నాకు కనిపిస్తోంది" అని తండ్రితో పలికాడనుకో. ఎంతో భయపడుచున్న ఆ బాలునికి ఆ తండ్రి ఏం చెపుతాడు? "బిడ్డా! నీవు పగలు ఆడుకునేటప్పుడు మట్టిచెట్టు చూచావే! అదే ఆ ఆకారం. అక్కడ దయ్యం లేదు, గియ్యం లేదు. నీకేం భయం అక్కర్లేదు" అని చెపుతాడు కదా! ఆ బాలుడు దయ్యం గురించి భావన చేసినట్లు, దుఃఖరహితమగు ఆత్మ తనయందు దుఃఖములకు సంబంధించి భావన చేస్తోంది. ఒకడికి స్వప్నంలో ఎక్కడో ఉన్న, లేదా, ఎప్పుడో గతించిన బంధువులు కనిపిస్తారు. వారితో ఆ స్వప్నంలో ఏర్పడే సమాగమం వాస్తవమా? ...కాదు కదా! ఆత్మకు, దృశ్యమునకు గల సంబంధం కూడా అట్టిదే!

స్థాణువును చూచి 'భూతం' అని అనుకుంటే స్థాణువు భూతం అవుతుందా? కాదు. కానీ ఆ దుష్టభూతము యొక్క అనుభూతిని అమాయక బాలుడు పొందుచున్నాడు. ఆత్మకు విషయములతో సంబంధం లేనప్పటికీ అంతఃకరణము యొక్క నిశ్చయముచే సంబంధం ఏర్పడుతోంది.

❖

కనుక, దేహములకు ఆత్మకు ఏ సంబంధం మనకు తోచుచున్నదో... అదంతా మిథ్యయే. ఒక కొయ్యబొమ్మ నీళ్ళలో పడినంత మాత్రం చేత నీరు ఆ బొమ్మలో ప్రవేశిస్తుందా? అట్లాగే దేహ ధ్యాస లేనట్టి ఆత్మ కూడా దుఃఖములచే బాధించబడదు.

**భాసుడు :** అంటే అర్థం ఏమిటి? దేహధ్యాస చేతనే దుఃఖము ఉండటం జరుగుతోందనా?

**విలాసుడు :** అక్షరాలా అంతే. దేహభావన చేతనే ఆత్మ దుఃఖం పొందుతోంది. కాబట్టి దేహాత్మ భావన త్యజించుటచే ఆత్మ ముక్తి నొందగలదని విజ్ఞుల స్పష్టమైన అభిప్రాయం. అదే అనుసరణీయం కూడా!

❖

ఒక తటాకంలో ఉన్నట్టి నాచు, ఆకులు, కాష్ఠము, జలము – పరస్పరం ఒకచోట ఉన్నప్పటికీ, వాటిలో ఒకదానితో మరొక దానికి అంతరంగ సంబంధం లేదు. కనుక అవి ఒకదాని పట్ల మరొకటి దుఃఖరహితంగానే ఉంటాయి. ఈ దేహ–ఇంద్రియ–మనస్సు–ఆత్మలు ఒక్కచోటే ఉన్నప్పటికీ అంతరంగ సంబంధం లేకపోతే దుఃఖరాహిత్యమును పొందగలం.

❖

వృక్షమునకు కారణం బీజమే అయినట్లు, ప్రపంచంలోని సర్వప్రాణులకూ "అంతరంగంలో గల సంగము" ఈ జరా మరణ మోహములకు కారణమగుచున్నది. ఏ జీవుని యందు అంతః సంగము (Attachement inwardly) ఉంటుందో ఆతడు మాత్రమే ఈ సంసార సాగరమున మగ్నుడు అగుచున్నాడు. అంతఃసంగ రహితుడో... సంసార సాగరమును దాటిన వాడగుచున్నాడు. అంతః సంగము గల చిత్తము అనంతశాఖాయుతమై ప్రకటితమౌతోంది. అంతఃసంగము లేని చిత్తము సంగరహితమై తనకు తానే వినష్టమగుచూ అచిత్తముగా, చిత్స్వరూపంగా పరిణమిస్తోంది.

విషయాసక్తము కాని చిత్తము సంసారమున ఉన్నప్పటికీ ఇబ్బందేం లేదు. అట్టి చిత్తము స్ఫటికమణిలింగమువలె అతి పవిత్రమైనది. అది విముక్తమే అవుతుంది. అట్లా కాకుండా చిత్తము విషయాసక్తమై ఉన్నదా ... అది గొప్పతపస్సు చేస్తున్నదైనా దృఢబంధము కలదిగానే ఉంటుంది.

**అన్తఃసక్తం మనో బద్ధం ముక్తం సక్తివివర్జితమ్ ।**
**అన్తఃసంసక్తిరేవైకం కారణం బన్ధమోక్షయోః ॥** (శ్లో 34, సర్గ 67)

అంతఃసంసక్తియుతమైన మనస్సు బద్ధము. అంతఃసంసక్తిరహితమైన మనస్సు ముక్తము. కనుక, అంతఃసంగమే బంధ మోక్షములకు కారణం.

ఒక నౌక కొన్ని పదార్థములను తీసుకుపోతున్నదనుకో... అందులోని పదార్థములు దోషములు, ఆ నౌక పయనిస్తున్న జలంలోని తత్వాదులు వేరు వేరు కదా! ...అంతఃసంగము లేనివానికి కార్యములు ఆచరిస్తున్నప్పటికీ, కర్తృత్వము ఉండదు.

ఒకడు సుఖంగా పట్టు పరుపులపై పరుండికూడా స్వప్నంలో పులి, అరణ్యము మొదలైనవి చూచినప్పుడు అవన్నీ అనుభవించుచున్నవాడే అవుతాడు. కొండమీదనుంచి దూకటం, పులి మీద బడటం వాస్తవం కాకపోయినా, అనుభవంమాత్రం సిద్ధిస్తోంది. అనగా, ఇక్కడ జరుగుచున్నదేమిటి? చిత్తము తాను ఒక అనుభవమునకు కర్త అయినప్పుడు ఇంద్రియములు పని చేయకపోయినా, కర్తృత్వము, భోక్తృత్వము సిద్ధిస్తోందా!

కనుక మనం చిత్తమును అకర్తృత్వమునకు అలవాటు చేయాలి. చిత్తముయొక్క అకర్తృత్వముచే అభిమానరాహిత్యము సిద్ధించగలదు. చిత్తమును సర్వకార్యక్రమములకు అతీతస్థితిలో ప్రస్థానం చేయాలి. అప్పుడు జడపదార్థమాత్రమైన ఈ దేహం మననేం చేయగలదో చెప్పు?

**అకర్తయగు మనస్సు -** మనం ఈ మనస్సును సక్తత (Attachment) లేనిదానిగా సిద్ధింపజేద్దాం. అది క్రమంగా సర్వక్రియలకు 'నాఽహమ్ కర్తా! (నేను కర్తను కాదు)' అను అభ్యాసం ఆశ్రయిస్తూ ఉండుగాక! అప్పుడు మన మనస్సు అకర్తయే అవుతుంది. కర్తగాని మనస్సు కర్మఫలభోక్తకూడా కాదు. కర్తృత్వ, భోక్తృత్వములు తొలగినప్పుడు 'సంచిత-ప్రారబ్ధ-ఆగామి' కర్మలు స్పృశించజాలవు. అప్పుడది తన యొక్క అధిష్ఠానమగు శుద్ధ చైతన్యముగా శేషించగలదు. తరంగములు శమిస్తే ప్రశాంతజలమే శేషిస్తుంది కదా!

**భాసుడు :** నీవు చెప్పేదంతా బాగానే ఉన్నది. కానీ, మనస్సు ఎదురుగా ఉన్న వస్తువులను పొందకుండా ఎట్లా ఉంటుంది? ఎదురుగా జగత్తు ఉండగా అకర్తృత్వం, అసంగం ఎట్లా సాధ్యం?

**విలాసుడు :** ఒకానొకని మనస్సు దూరంగా ఉన్న ఏదో ఉత్సాహభరితమైన దృశ్యమును చూడటంలో లగ్నమై ఉన్నదనుకో... అప్పుడతడు సమీపంలోని శబ్ద, స్పర్శలు గుర్తించలేకపోవటం మనకు అనుభవ మగుచున్న విషయమే కదా! అనగా, దీని అర్థం ఏమిటి? మనస్సు ఎక్కడ లగ్నమైతే అక్కడ అనుభవం ప్రాప్తిస్తోందిగాని, శరీరం ఉన్నచోట కాదు – అని కదా! ఈ చిన్న అనుభవాన్ని ఆసరాగా తీసుకుంటే, "అసంసక్తుడు (Non - Attached) అయినట్టివాడు ఈ ప్రపంచంలో ఏకార్యంచేసినా, లేక జనులను సంహరించినా లిప్తుడు కాడు" – అనే మహత్తరమైన సిద్ధాంతం మనం గ్రహించగలుగుతాం.

సంసక్తి లేని మనుజుడు విక్షేపరహితమైన సుఖమును పొందుతాడు. ఇందులో నాకేం సందేహం లేదు. ఆతడు బాహ్యమున క్రియలు ఆచరించ వచ్చు. లేదా ఆచరించక పోవచ్చు. అట్టి వానికి

కర్తృత్వ, భోక్తృత్వములు ఉండవు. అంతఃసంగము లేని మనస్సు అకర్త. అదియే ముక్తము, శాంతము, ఉక్తము, నిర్లిప్తము కూడా.

❖

ప్రియనేస్తం! సర్వపదార్థముల అంతరమున ఆత్మ ఉన్నది. అట్టి ఆత్మకు బాహ్యంగా పరస్పర సమ్మిళితమైనట్టి పంచకోశములు (అన్నమయ-ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ-ఆనందమయ కోశాలు) ఇంద్రియార్థాలు (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు), భోగ్య పదార్థాలు గోచరిస్తున్నాయి.

జీవుడు పంచకోశముల సమ్మేళణముచే బాహ్యపదార్థములను ఆశ్రయించటమే సంసారము. ఈ జీవుని స్వరూపం, స్వభావం, ఆనందమయమే అయినప్పటికీ, సంసారమును ఆశ్రయించుటచే ఆత్మానందము నుండి విడివడుచున్నాడు. పూర్ణుడై కూడా అసంపూర్ణానుభవం తెచ్చిపెట్టుకుంటున్నాడు. అట్టి బాహ్యపదార్థ ధ్యానం నిరసించాలంటే ఒక్కటే ఉపాయం, అది "సర్వదుఃఖప్రదమగు అంతరంగ విభాగమును మొదలంటా జయించటమే".

అందుకొరకై మనం ప్రయత్నిద్దాం. నదీజలం సముద్రజలంలో ప్రవేశించినప్పుడు ఆ సముద్ర జలంతో ఏకత్వం పొందుచున్నట్లు ఈ చిత్తము కూడా తనలోని అంతర్‌సంగదోషం త్యజించినప్పుడు ఇప్పటి సంసారదశనుండి విడివడినదై ఇతఃపూర్వపు శాంతరూపమును పొందుచున్నది. ఆకాశమువలె సునిర్మలమైనదా ....ఇక అప్పుడు ముక్తరూపమగు ఆత్మతో ఐక్యమొందుచున్నది.

❖❖❖

## 4. సంసక్తత - అసంసక్తత

(Attachment - Non Attachment)

**భాసుడు :** అత్యుత్తమ శ్రేయోభిలాషియగు ఓ సచివుడా! "సంగమే అంతటికీ కారణం" - అనే నీ వాక్యం నా కళ్ళు తెరిపిస్తున్నాయి. అయితే జీవునకు అసలు 'సంగము' అనే బంధం ఎట్లా కలుగుతోంది? మరల, మోక్షం ఎట్లా ఏర్పడగలదు? సంగమును నివారించటమెట్లా?

**విలాసుడు :** ఈ జీవుడు విచారణ చేయకపోవుటచేతనే అనర్థములన్నీ వచ్చిపడుతున్నాయి. ఆతడు ఎందుకో "ఇది దేహము,ఇది దేహి" - అను విభాగం చేసి విచారణ చేయటానికి ఉపక్రమించటమే లేదు. పైగా, ఇక్కడ ఏర్పడి ఉండే పరస్పరధర్మములు గురించి కొన్ని విపరీత భావాలను పొందుచూ, "ఈ దేహమే నేను, ఆ దేహమే ఆతడు" అను దృష్టిని, విశ్వాసాన్ని కలిగి ఉంటున్నాడు. అదే సంసక్తి. ఆ సంసక్తియే జీవుని బద్ధునిగా చేస్తోంది. మనం దానిని తొలగించుకోవటానికి ఉపక్రమించాలి.

ఇందు తారసపడే ప్రతి శరీరధారీ అనంతాత్మస్వరూపుడే. అట్టి అనంతాత్మ తత్త్వమును దురభ్యాసవశం చేత దేశ-కాల-వస్తు పరిచ్ఛేదమగు సంకుచిత దృష్టితో గాంచుచున్నాం.

**భాసుడు :** అట్టి దురభ్యాసం ఎట్లా మనకు అలవడింది? దాని యొక్క రూపమేమిటి?

**విలాసుడు :** అపరిచ్ఛిన్న సుఖస్వరూపమగు ఆత్మను విస్మరించి మనం విషయసుఖము కొరకై ఏర్పడి ఉండే అభ్యంతర సంసక్తి వైపుగా అభిముఖమవుతున్నాం. అట్టి అభిముఖత్వమే బంధానికి కారణమ గుచున్నది. ఇక జీవన్ముక్తుడో, "ఇదంతా కూడా ఆత్మయే కదా! ఇక నేను దేనిని కోరాలి? దేనిని త్యజించాలి? అట్టి శ్రమ నాకు అనవసరం" ...అను అసందిగ్ధమైన (Beyond doubt) అసంగ స్థితిని కలిగి ఉంటున్నాడు.

**అసంసక్తుడు -**

**భాసుడు :** అసంసక్తుని మనఃస్థితి, కార్యక్రమములు ఎట్లా ఉంటాయో చెప్పు.

**విలాసుడు :** ఆతని అవగాహన ఇట్లా ఉంటుంది–

"పరిచ్ఛిన్నమగు అహంకారానికి నేను విషయమే కాదు. నాకు భిన్నంగా ఎక్కడా ఏదీ లేదు. కాబట్టి, మిథ్యారూపములు మాత్రమే అయిన ఈ దేహాదులు ఉండు గాక! ఉండకుండు గాక! నేను మాత్రం వీటన్నిటికీ వేరైన వాడను. సర్వదా అసంగుడను."

అట్టి దృఢ నిశ్చయము కలిగిన అంతఃకరణము గలవాడు ముక్తభాజుడే అవుతాడు. ఆతనికి "అయ్యో! ఈ కర్మలు చేయవలసి వస్తోందే! వీటిని త్యజించాలి కదా" అను కర్మత్యాజ్యాసక్తి ఉండదు. ఫలేచ్ఛ లేకపోవడం చేత కర్మలందు ప్రవేశించడు. కర్మలు సిద్ధించినా, సిద్ధించకపోయినా సమభావము కలిగి ఉంటాడు. హర్షశోకములకు వశుడు కాకుండా ఆత్మ తత్త్వము నందు మాత్రమే నిష్ఠ కలిగి ఉంటాడు.

**సర్వకర్మఫలాదీనాం మనసైవ న కర్మణా ।**
**నిపుణం యః పరిత్యాగీ సోఽసంసక్త ఇతి స్మృతః ॥** (శ్లో 8, సర్గ 68)

నేర్పుతో సర్వకర్మలను ఆయా క్రియలతో కాక మనస్సుతో త్యజించివేసి ఉంటాడు. ఆతని యొక్క ఆత్మజ్ఞాన ప్రభావం చేత సర్వ దుశ్చేష్టలు స్వయంగా, అకృత్రిమంగా అడగి పోతాయి. ఆత్మ శ్రేయస్సు కొరకై శ్రవణ–మననాది సత్క్రియలందు మాత్రమే శ్రద్ధాసక్తులు కలిగి ఉంటాడు.

**సంసక్తి -** మిత్రమా! భాసా! సంసక్తి వలననే దుఃఖరాశి అంతా విస్తరించి, వేలాది శాఖలుగా ప్రకటితమౌతోంది.

"ఒక గాడిద పెద్ద బరువు మోస్తూ త్రాడుచే ఈడ్వబడటం... ఒక వృక్షం శీత–వాత–తాపాలను మౌనంగా అనుభవిస్తూ కదలక మెదలక ఉండటం... ఒక పురుగు అనేక శరీరబాధలకు లోనగుచున్న ప్పటికీ కూడా భూరంధ్రంలో కాలం గడపటం... ఒక పక్షి బాణ, శిలాదుల ప్రహారమునకు భయ పడుతూ చెట్టుపై ఉండి ఆకలితో అలమటించటం... ఒక లేడి గడ్డి పరకలు కొరుక్కు తింటూ ఎప్పుడు ఏ కిరాతకుడు బాణం వేస్తాడోనని భయంతో వెనుకకు, ముందుకు బెదురుచూపులు చూడటం... పుణ్య పాపాధికారులగు జనులు పదే పదే అంగములను పోగొట్టుకుంటూ మృగ–క్రిమి–కీటక ఉపాధులను పొందటం, తృణములుగా స్థావరముగా పుట్టి జరామరణ పరంపరలను రుచి చూడటం."

...ఇవన్నీ కూడా సంసక్తి యొక్క ప్రభావం చేత ఏర్పడుచున్న ఫలవిస్తారమే. అది అనేక అనర్థములతో కూడి ఉన్నదై, బయట, లోపల కూడా అనేక పదార్థములవైపుగా విస్తరించి ప్రవర్ధమాన మగుచున్నది. 'సంసారము' అనునది సంసక్తి యొక్క రూపమే.

అయితే ఈ సంసక్తి రెండు రకాలుగా ఉంటూ రెండు వ్యతిరిక్త దిశలలో నియమించబడి ఉంటోంది.

**1. వంద్య (ప్రశంసింపతగిన) సంసక్తి -** ఇది వందనీయులగు తత్వవేత్తలలో ఉండే సంసక్తి. సంసారవర్జితమై, వివేకము చేత, ఆత్మతత్త్వబోధ చేత జనిస్తుంది. దీని ప్రభావం చేతనే శంఖ-చక్ర -గదాధారుడగు విష్ణువు వివిధ క్రియలచే ముల్లోకములనూ పాలిస్తున్నారు. నిరాలంబుడగు సూర్య భగవానుడు ప్రతిరోజూ గగనమార్గంలో యాత్ర సలుపునది ఈ వంద్యసంసక్తి చేతనే. అట్లాగే బ్రహ్మదేవుడు సృష్టికల్పన చేస్తున్నది, మహాకల్పాంతము తరువాత విదేహముక్తి వైపుగా పయనిస్తున్నది ఈ వంద్యసంసక్తి ప్రాభవం చేతనే. దీనిచేతనే విభూతిభూషితుడగు శివుడు 'గౌరి'అను బంధమున ఆసక్తుడై స్వశరీరమున స్థితి కలిగి ఉండి భక్తుల పాలిటి కొంగుబంగారం అగుచున్నారు. దీని ప్రభావం చేతనే బ్రహ్మాండమున సిద్ధలోకములు, తదితర పాతాళలోకములు జరామరణ వర్జితములైన మహర్లోకం, జనోలోకం, తపోలోకం, చరాచర ప్రకృతి రచన, స్థితి కలిగి ఉన్నాయి.

**2. వంధ్య (సంకుచితమైన ప్రయోజనం కలిగి ఉండే) సంసక్తి -** ఇది అజ్ఞానులలో ఉంటుంది. పరమపురుషార్థ రహితమైనది. ఆత్మతత్త్వ జ్ఞానరహితము. దేహధారులు దేహధారణ వైపుగా ఆకర్షించబడుటకు ఇది కారణం. దీని యొక్క రూపం సంసార దృఢాసక్తియే. గ్రద్ద ఎక్కడో ఆకాశంలో విహరిస్తూ క్రింద ఉన్న మాంసపు ముక్కపై ధ్యాస కలిగి ఉన్నట్లు వంధ్యసంసక్తి వశం చేత మనస్సు నందు వ్యర్థసౌందర్యాభిలాష కలిగి జీవుడు 'భోగములు' అనే లంపటంలో పడుచున్నాడు.

❖

మిత్రమా! భాసుడా! "సంసక్తి" యొక్క ప్రాభవం ఏమని చెప్పమంటావయ్యా! సంసక్తి వశం చేతనే గాలి వీస్తోంది. పంచభూతాలూ స్థితి పొంది ఉంటున్నాయి. ఈ చరాచర జగత్తంతా ప్రవృత్త మౌతోంది. స్వర్గంలో దేవతలు, భూమిపై మనుజులు, పాతాళంలో సర్పములు, అసురులు, మేడి పండులో పురుగులు సంసక్తి చేతనే స్థితి కలిగి ఉండటం జరుగుతోంది. దాని వశం చేతనే జలాశయ తరంగాలలో అసంఖ్యాకమైన ప్రాణికోట్లు ఉత్పన్నమగుచున్నాయి, చస్తున్నాయి ... లేస్తున్నాయి, పడుచున్నాయి. సంసక్తత చేతనే దేశసంచారం తరువాత కూడా నీకు సందేహాలు కలిగి ఉండటం జరుగుతోంది. మత్స్యన్యాయానుసారం బలవంతుడు బలహీనుని బాధించటం, శుష్కప్రతాపాలు జనులు ప్రకటించటం, నక్షత్ర మండలముల ఉదయాస్తమయాలు, చంద్రుని శీతల ప్రకాశం, ఇంద్రాది దేవతల సాంసారిక చర్యలు - అన్నిటికీ మూలం ఆయా జీవుల సంసక్తత వలననే.

నేస్తమా! అంతేకాదు. చిత్ర విచిత్ర వస్తుజాలముతో కూడిన ఈ ఎదురుగా ఉండే దృశ్య జగత్తును చూస్తున్నావు కదా! ఇదంతా వాసనా వశం చేత ఎవ్వరో చిదాకాశమున లిఖించారు. వాసనకి గల మరో పేరు సంసక్తత.

**భాసుడు :** అవును. ఈ జగత్తు బహుచమత్కారములైన విశేషాలతో కూడుకుని ఉన్నది. ఆసక్తి గల ఎవ్వరో దీనిని రచించారు.

**మనఃసజ్జైకరజ్జేణ శూన్యే వ్యోమ్ని జగన్మయమ్ ।**
**యదిదం రచితం చిత్రం తత్సత్యం న కదాచన ॥** (శ్లో 40, సర్గ 68)

**విలాసుడు :** శూన్యాకాశంలో మనఃసంసక్తి అనే రంగుతో లిఖించబడిన ఈ జగత్‌చిత్రము సత్యమైనది ఎన్నటికీ కాదు.

**భాసుడు :** కాదా?

**విలాసుడు :** కానే కాదు. ఎందుకంటే ఇదంతా సంసక్తత గల జీవునిచే కల్పించబడి, సంసక్తత గల జీవగణముచే పొందబడుచున్నది. తృష్ణయే సంసక్తతకు నాంది.

సంసక్తత బహు ప్రమాదభరితమైనది కూడా అని గ్రహించు. అగ్నిశిఖచే తృణములుగా భక్షింపబడుచున్నట్లు ఆసక్త చిత్తుడు దుఃఖములచే శుష్కించుచు జ్వలించుచున్న నరకాగ్నులకు ఎండుకట్టె వలె అగుచున్నాడు. అనగా నరకాగ్నులన్నీ అట్టి ఆసక్తిసహిత జీవుల చేత, వారి కొరకే జ్వలిస్తున్నాయి. ఆతడు పొందని దుఃఖమంటూ ఎక్కడా ఉండదు. ఈ ప్రపంచంలోని దుఃఖజాలమంతా సక్తచిత్తుని కొరకు విస్తరిస్తూ రారమ్మని ఆహ్వానిస్తోంది. అవిద్య అంటే మరేమో కాదు. మనఃసంగమే అవిద్య. అదియే ఈ భారభూతములగు జరామరణములను కలుగజేసి కాలువ నీళ్ళులాగా విస్తరింపజేస్తోంది.

మనం ఇంతసేపూ చెప్పుకున్నది ఒక్క వాక్యంలో చెప్పాలంటే... అంతర సంసక్తియే అసలైన బంధం. దాని పరిత్యాగమే విమోచనం.

ఆసక్తి రహితమైన మనస్సు అనంతాకాశం వలె ప్రశాంతంగా ఉంటుంది. అట్టి మనస్సు ఉన్నట్లు కనబడుచున్నప్పటికీ లేనిదే కనుక, మనం జ్ఞానదృష్టిని సంపాదించాలి. జ్ఞానముచే విషయ వినాశనం సిద్ధిస్తుంది. విషయ రాహిత్యముచే మనస్సు సంసక్తి రహితంగా ఉంటుంది. సంసక్త రహితమైన మనస్సును సంపాదిస్తే... అదియే ముక్తి. అట్టివాడే ముక్తుడు.

❖❖❖

## 5. ఆత్మదృష్టి - ఆసక్తి రాహిత్యం

**విలాసుడు :** కనుక స్నేహితుడా! మనం సర్వదా సర్వ వ్యవహారములు ఆచరించుచున్నప్పటికీ, సర్వులతో కూడి ఉంటున్నప్పటికీ, నిషిద్ధములైన, అనిషిద్ధములైన లౌకిక, శాస్త్రీయ కర్మలను నిర్వర్తించ వలసి వస్తున్నప్పటికీ వివేకవంతులమై ఉండాలి. మనస్సును అసంసక్తమైన దానిగా ఉంచటం అభ్యసించాలి.

**భాసుడు :** అనగా మనస్సును ఏం చేయాలి?

**విలాసుడు :** మనం మనస్సును ...సాధ్య-అసాధ్యముల గూర్చిన క్రియలందు గాని, గతించిన సంఘటన (లేక) అనుభవములందు గాని ఉంచవద్దు. అట్లాగే దానిని వర్తమాన పదార్థములందు

గాని, ఆకాశమునందు గాని, దిక్కులందు గాని, వృక్ష జంతు జీవులందు గాని, తదితర ఆధిభౌతిక పదార్థము లందు గాని నిలుపవద్దు. అదే విధంగా, స్త్రీ పుత్రాదులందు గాని, ఇంద్రియవిషయ వృత్తులందు గాని, ఆధ్యాత్మిక వస్తుసముదాయమునందు గాని, భ్రూమధ్యమున గాని, నాశికాగ్రశమునందు గాని, ముఖమునందు గాని, కంటియందు గాని... నియమించవద్దు.

అంతేకాదు. మన మనస్సును అంధకారమునందు గాని, ప్రకాశమునందు గాని, హృదయాకాశమున గాని, జాగ్రత్-స్వప్న-సుషుప్తులందు గాని, సత్వ-రజః-తమో గుణములందు గాని, గుణసమ్మేళనములందు గాని, కార్యవర్గమునందు గాని, కారణమగు అవ్యక్తమునందు గాని, సృష్టి యొక్క ఆదిమధ్యాంతములందు గాని, దగ్గిరలో గాని, దూరంగా గాని, నామరూపాత్మకమగు పదార్థ సమూహములందు గాని, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములందు గాని, భూతభవిష్యత్ జ్ఞానమునందు గాని, చిరంజీవాది సిద్ధులందు గాని మనం ఆసక్తం చేయరాదని నా సూచన, ప్రతిపాదన కూడా. 'సర్వాసక్తి రాహిత్యం' అంటే అదే.

**భాసుడు :** బాగానే ఉన్నది కాని, మరి ఈ మనస్సును ఎక్కడ ఉంచాలి. అనుక్షణం ప్రాప్తిస్తున్న క్రియా వ్యవహారముల మాటేమిటి? మనం వీటిని నిర్వర్తించుదామా! వద్దా?

**విలాసుడు :** మనం బ్రహ్మమున మాత్రమే స్థితికలిగి ఉందాం. సంగరహితులమై బ్రహ్మాభావమును పొందిన తరువాత ఇక ఈ ప్రాప్తించే వ్యవహారములు నిర్వహించవలసి వచ్చినా ఒక్కటే? అక్కర్లేక పోయినా ఒక్కటే. మేఘములకు ఆకాశమునకు సంబంధం లేనట్లు ఆత్మరతులమగు మనకు "ఈ కర్మలు - వాటిని నిర్వర్తించుటచే ఏర్పడే ఫలితములు" మొదలైన విశేషములతో ఏమాత్రము సంబంధం ఉండదు... ఏర్పడదు.

**భాసుడు :** అంటే మనం బుద్ధికి కూడా సాక్షిత్వం వహించి ఉంటామా?

**విలాసుడు :** "నేను బుద్ధికి సాక్షిత్వం వహిస్తున్నాను" అను రూపమున ఉండే ప్రయత్నపూర్వక ప్రయాసను కూడా వదలివేద్దాం. శాంతులమై, చిద్ఘనరూపులమై దేదీప్యమానమగు మణి వలె స్వాత్మ యందు స్థితికలిగి ఉందాం. క్రియాఫలేచ్ఛా రహితులమై ఉందాం. నిరంతరాత్మోదయం కలవారల మగుదాం.

సంసక్తి కారణమగు అవిద్యాకామవాసనలకు మనయందు ప్రవేశార్హత ఉండకుండు గాక! ఇక క్రియలంటావా, అవి మనం ఒనర్చుచున్నప్పటికీ వాటి ఫలితములను మనం పొందవద్దు. ప్రారబ్ధం క్షయం అయ్యేవరకూ ఈ దేహం ఉంటే ఉండనీ. దీని యొక్క ఉనికి గాని, లేమి గాని మనకు సంబంధించని విషయాలై ఉండు గాక! ఈ దేహమును, దీనితో ఏర్పడే విశేషాలను ఆత్మదృష్టితోనే చూస్తూ ఉందాం.

❖❖❖

# 6. ఆత్మారామం

**విలాసుడు :** మిత్రమా! భాసా! నేను అనేక ప్రదేశాలు సంచరించాను. నాకు విశాలాంతఃకరణులగు కొందరు మహనీయులు తారసపడ్డారు. వారంతా అసంసక్తి సుఖము (The pleasantness of non - attachment or non - relatedness)ను పొందుచూ, ఇదే ప్రపంచమున వ్యవహరిస్తూ కూడా భయ శోక వర్జితులై ఉంటున్నారు. మహాప్రక్షోభం కలిగించగల "ధనం నశించటం, దుర్బలత్వం, అవమానాలు వచ్చి పడటం" మొదలైన సందర్భాలలో కూడా ఏమాత్రం క్షోభను కలిగి ఉండకుండా ఉంటున్నారు. పరమార్థ సుఖముచే అంతఃకరణమునందు పూర్ణులై, ముఖంలో పూర్ణచంద్రశోభ వీడకుండా ప్రశాంతచిత్తులై ఇదంతా దర్శిస్తున్నారు. చిల్లగింజలు నీళ్ళలో వేస్తే నీరు నిర్మలం అయి ప్రకాశిస్తున్నట్లు, ఈ ఉపాధిని ఉపయోగించి సునిర్మలత్వాన్ని సంపాదించి సంచరిస్తున్నారు. విషయాసక్త రహితులు, సంతాపరహితులు, ఉత్తమమనస్సు గలవారు అగు మహనీయులు ఎక్కడుంటారో ఆ పరిసరాలు కూడా పరమ పవిత్రమౌతాయి.

జ్ఞాని నిత్యమూ ఆత్మయందే లీనమై ఉంటాడు. కనుక తదితర సర్వవిషయములూ చలిస్తున్నప్పటికీ తాను మాత్రము సర్వసమయము లందూ స్వస్థుడై ఉంటాడు. బాహ్యంలో కనిపించే సంచలనములు, క్షుభితమైన స్థితి – గతుల విన్యాసములు ఇక అతనిలోనికి ప్రవేశించలేవు.

**భాసుడు :** అంటే, ఇక్కడ ఉండే ఆయా పరిస్థితులకు ఆతడు స్పందించడంటావా?

**విలాసుడు :** జలంలో ప్రతిబింబించే సూర్యుడు తరంగముల అస్త వ్యస్తములకు సంక్షుభితమగుచున్నట్లు కనిపించినా కూడా, బింబ స్వరూపుడగు ఆకాశ సూర్యుడు ఆ ప్రతిబింబ సంబంధమైన అస్తవ్యస్తములచే స్పర్శించబడతాడా?

**భాసుడు :** లేదు. ఎట్లా స్పర్శించబడతాడు? ఆకాశంలో వెలుగుచున్న సూర్యునకు, జలంలో ప్రతి బింబించే ప్రతిబింబమునకు స్పర్శసంబంధం ఏమి ఉంటుంది?

**విలాసుడు :** బాగా చెప్పావు. తరంగములలోని సూర్య ప్రతిబింబము పొందే చిందరవందరలకు వాస్తవ సూర్యునికి ఏమాత్రం చెందనట్లు, వ్యవహారతత్పరుడు కావలసివచ్చిన జ్ఞానికి ఆ వ్యవహారా లలోని ప్రియాప్రియములు, సఫల విఫలములు, కార్య కారణములు – తనకు సంబంధించనివై ఉంటాయి. వ్యవహార తత్పరుడై ఉంటూనే "నేను నిత్యము, సత్యము, నిష్కళంకము అగు ఆత్మను. ఈ కర్మలు, తత్ఫలములు, సంబంధములు నన్నెట్లా అంటుతాయి?" అనే ప్రజ్ఞను కలిగి ఉంటాడు. ఆతనిని స్పృశించ గలిగేదీ, ఆశ్చర్యపరచ గలిగేదీ, మృత్యువుతో సహా... ఈ భూనభోంతరాళాలలో ఏదీ ఉండదు... ఉండజాలదు. మనం జ్ఞానులం కావటానికి ప్రయత్నించడమే ఉచితం కదా! మనం ప్రబుద్ధులం కావాలి.

**భాసుడు :** ప్రబుద్ధులు అనగా ఎవరు? ఎట్లా ఉంటారు? సంసారంలో చరించేటప్పుడు వాళ్ళ ప్రవర్తన ఎట్లా ఉంటుంది?

**విలాసుడు :** జ్ఞానభరితము, నిర్మలము అగు బుద్ధిని సంపాదించినవారిని ప్రబుద్ధులు అనే పేరుతో చెప్పుకుంటున్నాం. అట్టి "ప్రబుద్ధులు ఆత్మోదయ సమన్వితులు" అగు మహనీయులు ఎల్లప్పుడూ ఆత్మ యందే రమిస్తూ ఉంటారు. వారు బాహ్యానికి నెమలి పింఛము యొక్క చివరి భాగంలాగా చంచలంగా ఉండవచ్చు గాక! అంతరమున మాత్రం మేరు పర్వతంలాగా అచంచలంగా ఉంటారు. తెల్లగా ప్రకాశిస్తున్న మణిలో ఎదురుగావున్న ఎఱ్ఱటి వస్తువులు ప్రతిబింబిస్తుంటే, అంతమాత్రం చేత, ఆ ఎఱుపు మణికి అంటుతుందా?

ఆత్మదశ పొందిన చిత్తము సుఖ దుఃఖములచే రంజితం కాదు. కమలం జలంలో ఉన్నప్పటికీ జలం కమలమును అంటదు కదా! ఏ జీవుడైతే జీవేశ్వర తత్త్వమును ఎఱిగి, సచ్చిదానందమగు ఆ పరమాత్మ యందు సంలగ్నమైన చిత్తము కలవాడై ఉంటాడో అట్టివానిని ఈ సంసార విషయాలు, విశేషాలు ఏమాత్రం కలుషితం చెయ్యలేవు. పరమాత్మ జ్ఞానం పొంది, సర్వకల్పనా వర్జితుడై ధ్యానం యొక్క భావ-అభావము లందు కూడా ఆత్మానుభవమగ్నుడై ఉండే వానిని 'ఆత్మారాముడు, స్వసక్తుడు' అని కూడా పిలుస్తూ ఉంటారు. అట్టి వాడు భగవంతుడే అవుతాడు.

**భాసుడు :** మనం అసంగత్వం పొందేదెట్లా?

**విలాసుడు :** ఆత్మారాములము (ఆత్మ యందు రమించువారు) అయినప్పుడే ఈ ప్రపంచంతో మనం అసంగత్వం పొందగలుగుతాం. "ఆత్మజ్ఞానోత్కర్ష" చేత మాత్రమే సంసక్తి నశిస్తుంది. దానికి వేరే మరింకో మార్గమేదీ లేదు.

మనం ఈ జాగ్రత్ స్వప్నములలో తోచుచున్న ద్రష్టత్వమునకు కూడా అతీత భావులమవుదాం. భావాతీతమై ఉన్నట్టి మన యొక్క రూపం ద్వంద్వరహితం, నిత్యం, ఆత్మోదయాన్వితం అని శాస్త్రములచే అభివర్ణింపబడింది కదా! మనం శాస్త్రములు సూచిస్తున్న ఆత్మ యొక్క విశేషణముల పట్ల దృఢమైన భావనను ఆశ్రయించి ఉంటే ఆత్మ ప్రకాశరూపులమై వెలుగొందగలం. చంద్రబింబం క్రమంగా తన కళలను త్యజిస్తూ అమావాస్య వచ్చేసరికి తన యొక్క బింబ భూతమగు సూర్యుని యందు ఐక్య మవుతుంది చూచావా? (ఇక్కడ సూర్యుడు బింబంగాను చంద్రునియందు కనబడే ప్రకాశము ప్రతిబింబ వశంగా ఉద్దేశించబడింది).

మనం "నేను నిత్యుడను. ద్వంద్వరహితుడను. ఆత్మయోగాన్వితుడను. జన్మ మృత్యువులకు కూడా సాక్షి మాత్రుడను. ఇవి నా సమక్షంలో జరిగేవి. నేను వీటికి సంబంధించినవాడను కాను. అఖండుడనగు నాకు ఆద్యంతాలు లేవు" అనునట్టి బ్రహ్మభావమును పొందుదాం.

మన చిత్తము తన చిత్త దశను వదలగా, మనం చిత్తరహితులమౌదాం. సర్వకల్పనా రహితమైనట్టి ప్రశాంత స్థితిని పొందుదాం. "జాగ్రత్ నందు సుషుప్తి" అంటే అదే. అప్పుడు మనం ఎక్కడున్నా ఏం చేస్తున్నా సుఖదుఃఖములు అనే త్రాటిచే బంధించబడం. ఆ విధంగా సర్వాతీతులమైన మనను వేధించ గల, ఆశ్చర్యపరచ గలదేదీ పదునాలుగు లోకాలలో ఉండజాలనప్పుడే మనిద్దరి జన్మలు సార్థకత పొందినట్లు.

**భాసుడు :** మిత్రమా! ఇంతకీ చిత్తమునకు సంతాపం కలుగజేస్తున్నట్టి అసలైన కారణమేమిటి?

**విలాసుడు :** ఇష్ట-అనిష్టములు, లాభ-అలాభములకు సంబంధించిన ఆశ-నిరాశలు అనునవి జీవాహంకారమునకు కారణమగుచున్నాయి. జీవాహంకారమే చిత్తమునకు సంతాపం కలుగజేస్తోంది.

**భాసుడు :** నిజమే! ఐతే ఇప్పుడీ జీవాహంకారం తొలగాలంటే మనం ఏం చేస్తే ఉపాయం?

**విలాసుడు :** "నేను బ్రహ్మమును. సర్వమును. పూర్ణమును" అనునట్టి ఆత్మదశను మన చిత్తము పొందేట్లు మనం చేయాలి. ఎందుకంటే, అట్లు పొందిన చిత్తమును మరింకేదీ ఏ విధంగానూ బాధించలేదు. ఆత్మశాస్త్రజ్ఞులు అట్టి చిత్తము యొక్క స్థితిని "జాగ్రత్‌సుషుప్తి" అని పిలుస్తూ ఉంటారు. అది నిరహంకృతమైన స్థితి. విజ్ఞుడు అట్టి చిత్తముతో హృదయ నిర్మల లక్ష్యముతో ఆయా కర్మలు (కర్తవ్యములను) నిర్వర్తిస్తూ ఉంటాడు. అయితే, ఆ కర్తవ్యములచే కూడా ఆతడు బంధించబడడు.

మనం కూడా అట్టి జాగ్రత్ సుషుప్త వృత్తిని అవలంబించి, ఆపై ప్రారబ్ధ పరిపాకముచే సంప్రాప్తించే మన వర్ణాశ్రమోచితమైన కర్మలు ఆచరిద్దాం. కానీ దేనినీ ఆచరించని వారుగానే ఉందాం. జ్ఞానులు కర్మగ్రహణం కానీ, కర్మత్యాజ్యం గానీ కోరరు. ప్రారబ్ధానుసారంగా ఏది ఎట్లు ఉచితమో, సందర్భమో అది అంతవరకు ఆచరించుచూ అకర్తవ్య భావమును అవధరిస్తూ ఉంటారు. మన మార్గం కూడా అదియే అగుగాక!

ఇష్టానిష్టముల విషయంలో సుషుప్తబుద్ధి కలిగియుండి మనం కార్యములు ఆచరిద్దాం. అప్పుడు మనం దేనికీ కర్తలం కాము. "అకర్తృత్వ స్వభావం" గ్రహించి ఆపై యథాతథంగా చేయవలసినవి చేద్దాం. చేయగూడనివి మానుదాం. సంకల్ప వికల్పరహితులమై ఉందాం.

మూడు నెలల పసిబిడ్డ ఊయలలో ఊగుతూ ఏ సంకల్పం లేకుండానే నవ్వటం, కేరింతలు కొట్టటం, కాళ్ళు చేతులు విదల్చటం చేస్తుంది చూచావా? మనం కూడా ఫలములను చింతించకుండానే క్రియలు ఆచరిద్దాం. విషయవర్జితులమై, విషయాతీతులమై, చైతన్యపదము నందు సంస్థితులమై ఉండటం అభ్యసిద్దాం.

❖

ఆత్మజ్ఞానం పొందిన తరువాత జీవుడు ఏ కర్మలు నిర్వర్తిస్తాడో... వాటి యందు ఆతడు 'నేను కర్తను' అనే భావం పొందడు. అకర్తృత్వం ఆతనికి స్వభావమే అవుతుంది. చిత్తము నందు వాసనలు లేకపోవటం చేత ఆతని అంతఃకరణము శీతలత్వం పొంది ఉంటుంది. సర్వ అవస్థలందూ సమరూపుడై, పరిపూర్ణుడై మహాతేజస్వి అయి ఉంటాడు. అన్ని ఋతువులలోనూ కొండ ఒకే తీరుగా ఉంటుంది కదా!

వృక్షములు, పచ్చిగరిక మొక్కలు గల పర్వతం గాలి వీస్తున్నప్పుడు ఆకుల కదలికచే కదలుచున్నట్లు కనబడుతుంది. ఆకులు కదలవచ్చునేమో గాని, పర్వతం కదులుతుందా? ధీరాత్ముడు బాహ్యము నందు లౌకికక్రియలచే చంచలము పొందినప్పటికీ అంతరమున అచంచలుడై ఉంటున్నాడు. అట్టి చంచల రహితమైన అంతరంగస్థితి మనం సంపాదించాలి. ఆపై ఈ శరీరములు ఉన్నా, లేకున్నా లేక, మరి ఏదైనా ఎట్లా ఉన్నా మన కేమి నష్టం?

జగత్తు యొక్క రాహిత్యము అనునది మనుజునకు అభ్యాసవశం చేతనే దృఢపడుతుంది. మొట్టమొదట జగత్ రహితమైనట్టి ఒకకానొక సుషుప్తస్థితిని అభ్యసించాలి. అట్టి స్థితి అభ్యాసయోగంచే దృఢపడినప్పుడు దానినే తత్త్వజ్ఞులైన మహాత్ములు 'తురీయ స్థితి' అని పిలుస్తారు. మనం అందుకు ప్రయత్నిద్దాం. సర్వ విఘ్నములనూ దూరీకరించి మహాభ్యుదయం పొందుచూ, జ్ఞానానందమయులమై ఆపై ఈ జగద్రచనను ఒక లీలవలె దర్శించటం అభ్యాసం చేద్దాం. భయ-శోక-ఆయాసములు లేని వారమై, సంసార భ్రమరహితులం అగుచూ, అట్టి తురీయావస్థలో సంస్థితులమై ఇక ఈ సంసారమున మనం పడవద్దు.

**భాసుడు :** పవిత్రమన 'స్వాత్మ పదవి' ని పొందినవాడు ఇక ఈ జగత్తులో ఏం చేస్తూంటాడు?

**విలాసుడు :** అట్టి ధీరబుద్ధి కలవాడు ఈ ప్రపంచమును చూచి, అజ్ఞానకారణం చేత ప్రకటిత మగుచున్న ఇందలి జీవుల ఉద్వేగాదులను గమనిస్తూ నవ్వుకుంటున్నాడు. ఒక ఎత్తైన మేడపై చివరి భాగంలో నిలబడి ఉన్నప్పుడు క్రింద రహదారిలో చరించు జనులను, రథాలను చూస్తున్నట్లు ... మనం కూడా దూరంగా ఉంటూ, ఈ సంసార విన్యాసమును దర్శిద్దాం. క్రొత్త ప్రదేశంలోని జన సమూహం లాగా అసంబంధీకులమై గాంచుదాం. బ్రాహ్మీస్థితిని ఆశ్రయించి జాగృత్-స్వప్న-సుషుప్తుల కంటేకూడా అతీతమైన మహదానందమైన స్థితిని పొందుదాం. యోగులు ఆశ్రయించే తురీయమును కూడా అధిగమించి అనిర్వచనీయము, శబ్దములకు అందనిది అగు అఖండ, అప్రమేయ స్వభావులం అవుదాం. తురీయాతీతు లమవుదాం.

❖

**పరిగలితసమస్త జన్మపాశః సకల లీనతమోమయాభిమానః ।**
**పరమరసమయీం ప్రయాతి సత్తాం జలగతసైన్ధవఖణ్డవన్మహాత్మా ॥** (శ్లో 33, సర్గ 70)

అలా తురీయాతీతుడైన వ్యక్తికి తమోగుణాత్మకమగు అభిమానమంతా రహితమవుతుంది. లెక్క లేనన్ని జన్మలకు హేతుభూతములగు వాసనలు సన్నగిల్లు తాయి! కర్మపాశములు తొలగిపోతాయి. నీళ్ళలో పడ్డ ఉప్పులాగా మనస్సు స్వస్వరూపమునందు లయమయి, పరమానందమగు ఆత్మ సత్తను అవధరిస్తుంది! ...అందువలన మనం ఉత్తమ ప్రయత్నం వదలకుందుము గాక!

❖❖❖

# 7. ఆత్మ అప్రమేయమైనది

**శ్రీవసిష్ఠ మహర్షి :** చూచావా, రామా! ఆ విధంగా వారిద్దరూ మొట్టమొదట కుశల ప్రశ్నలతో ప్రారంభించి పరమోత్తమగు సన్మార్గమును విచారణ చేశారు. కాలక్రమంగా నిర్మల జ్ఞానం పొంది నిర్మలులయ్యారు. ముక్త స్వరూపులయ్యారు.

కనుక, జీవుడు ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తులనబడే అవస్థాత్రయం యొక్క వాస్తవ స్వరూపం చక్కగా విచారిస్తూ ఉండాలి సుమా! వాటిని సాక్షిస్వరూపమగు 'చిన్మాత్రము' నందు సర్వ భావాభావములను లయం చేయాలి. అప్పుడు శేషించేది 'తురీయము' లేక కేవలీపదము.

**శ్రీ రాముడు :** భాస – విలాసుల సంవాదం వినిపించేటప్పుడు మీరు 'తురీయాతీత స్థితి' అనే పదం వాడారు. అది విదేహమైనదా? సదేహమైనదా? ఆతడు జీవన్ముక్తుడా? ఏ వేద వాక్యం ఆతనికి అన్వయిస్తుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** తురీయమునకు ఆవల ఉన్న తురీయాతీత పదం, ఈ విదేహ, సదేహముక్తులకు, వేదవాక్యాలకు విషయమే కాదు. మనుజులకు ఆకాశము విషయమే కాదు కదా! అయితే అన్నీ కూడా ఉపశమించేది అందులోనే. వాయువునకు ఆకాశమే గమ్యస్థానమైనట్లు, విదేహముక్తులకు కూడా ఆ తురీయాతీతమే గమ్యస్థానం. పూర్ణమగు జ్ఞానమును పొందిన జీవుడు ఈ జాగ్రత్–స్వప్న –సుషుప్తులలోని జగత్తును కొంతకాలం క్రీడాపూర్వకంగా గాంచుచూ, ఒకానొకప్పుడు ద్వంద్వాతీతుడై పరమానంద భరితుడై తుర్యాతీతత్త్వము అవధరిస్తున్నాడు.

**శ్రీరాముడు :** ఈ శరీరం ఆ స్థితిలో ఉంటుందా? ఉండదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇట్టి ప్రశ్నకు మనం కొన్నిసార్లు సమాధానం చెప్పుకున్నాం. అయినా మరల సమాధానమిస్తున్నాను. విను.

ఈ దేహం క్షయం పొందినప్పుడు, లేక వృద్ధి పొందినప్పుడు... తదనుగుణంగా జ్ఞానం క్షయం పొందుతుందని గాని, వృద్ధి పొందుతుందని గాని అనుకుంటున్నావా? లేదు. అది భ్రమ మాత్రమే. వృద్ధి క్షయాలు అనేవి శరీరమువే గాని, అవి జ్ఞానమునకు లేదా మనస్సుకు సంబంధించిన ధర్మాలు కావు. మరి ఈ భౌతికదేహం యొక్క వృద్ధి క్షయాల విషయం నీకెందుకు? అందువల్ల ఏం ప్రయోజనం? దేహం ఏ అవస్థలో ఉన్నప్పటికీ నీవు మాత్రం కేవలం ఆత్మబోధ యొక్క స్థిరత్వం గురించే యోచించు, ప్రయత్నించు. ఈ ప్రకృతికి మునుముందుగా నీవు ఎట్లున్నావో.... అట్లే ఉండు.

ఓ రాఘవా! నీవు జ్ఞానివేనయ్యా! ఈ జాగ్రత్–స్వప్న–సుషుప్త అవస్థల గురించి, వీటిచే స్పర్శింపబడజాలని సత్య స్వరూపమగు బ్రహ్మము గురించి నీవు ఎరిగియే ఉన్నావు సుమా!

**శ్రీరాముడు :** ఎరిగి ఉన్నదానిని పొందవలసి ఉన్నది కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** "సోఽహం – తత్వమ్ – అహమ్ బ్రహ్మాస్మి – జీవోబ్రహ్మేతి నాపరః – సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ – ఆత్మ సత్యం జగత్ మిథ్యా – ఏకమేవా ద్వితీయమ్ బ్రహ్మ" మొదలగు అఖండ వాక్యార్థముల స్వరూపమగు ఆత్మను నీవు పొందియే ఉన్నావు. 'క్రొత్తగా ఆత్మను పొందాలి' అనే మోహమును దూరంగా ఉంచు. ఈ వాక్యములు నేను సర్వ దేహధారులను ఉద్దేశించి చెప్పుచున్నాను. "భౌతిక ధర్మములగు జన్మ, జరా, మృత్యువులను నేను పొందుచున్నాను" అను పేలవమైన భావనను మీరంతా వదలివేయండి. "నేను పూర్ణుడను, అఖండుడను, శాశ్వతుడను, ముక్తుడను" అను రూపము గల దుఃఖరహితమగు మహదైశ్వర్యమును సంపాదించండి. అంధకారం గానీ, మేఘములు గానీ లేనట్టి నిర్మలాకాశంలా శోభించండి. ఇష్టానిష్టములను త్యజించి, శీతలాత్మ ప్రకాశముచే పరిఢవిల్లండి.

❖

**శ్రీరాముడు :** మనస్సులో నుండి దృశ్యమునకు సంబంధించిన భ్రమలు ఎట్లా తొలగించుకోవటం? అది అంత తేలికైన విషయమా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మంత్ర ప్రభావం చేత ఆకాశగమన సిద్ధిని పొందిన ఒక యోగి నేలపై నిలబడి ఒక చోటి నుండి ఇంకో చోటికి దూర సుదూర ప్రాంతాలకు నడచి వెళ్ళే శ్రమను కోరుకుంటాడా? లేదు కదా! ఆత్మభావనచే సుసంపన్నమైన నీ మనస్సు నీచ వస్తువులను ఆశ్రయించ వలసిన పనేముంది? ఈ బ్రహ్మాండమంతా దేశ కాల వస్తుపరిచ్ఛేద రహితమగు 'శుద్ధ చిన్మాత్రము'చే పరిపూర్ణమై ఉండగా, "ఈ శరీరాదులు నేను. ఈ ధనము రాజ్యము మొదలైనవి నావి, నా వారు, కాని వారు" అనుకుంటూ భ్రమలకు చోటివ్వవలసిన పనేమున్నదో చెప్పు?

వ్యాపకమగు పరమాత్మకు 'ఆత్మ' అనే పేరు కల్పించుకున్నాం. యథార్థానికి ఆతడు నామ-రూప భేదములకు అతీతము, అత్యంత దూరము అయినవాడు. ఆతనిని మనస్సే సమీపించలేదు. ఇక గుణ, నిర్గుణములు ఎట్లా ఆతనికి వర్తిస్తాయి చెప్పు? నాటకంలో ఒకడు నిర్వర్తిస్తున్న పాత్ర యొక్క లక్షణములు మొదలైనవి ఆ పాత్ర ధరిస్తున్న వ్యక్తి యొక్క వ్యక్తిగత విశేషాలు నిర్వచించి చెప్పగలవా?

ఇక నీకు కనబడుచున్న వేర్వేరు భేదముల మాటేమిటంటావా? సముద్రము అనగా జలమే కదా! జలమునకు 'పెద్ద తరంగాలు చిన్న తరంగాలు' అనే భేదమెక్కడిదయ్యా! అద్దంలో ప్రతిబింబం కనబడుచున్నంత మాత్రం చేత అద్దంలో అద్దమునకు వేరైనదేదో పదార్థం ప్రవేశించిందంటావా? ఇక్కడి వేరువేరు లక్షణ విలక్షణములన్నీ జగన్నాటకాంతర్గత కల్పిత విశేషాలే!

సముద్రమంతా జలమే అయినట్లు, దర్పణంలో కనిపించేదంతా దర్పణమే అయినట్లు ఈ జగదాకారంగా విస్తరించి కనబడేదంతా పరమాత్మకు ఒక్క క్షణం కూడా భిన్నమైనది కాదు. పరమాత్మకు భిన్నమైన జగత్తునందు "దేహములు, అనుబంధములు, నావి, నీవి" అను భావనలకు చోటెక్కడ? అట్లాగే "నేను జీవుడను, అజ్ఞుడను, పాపిని, కర్మబద్ధుడను" అనునదంతా స్వస్వరూపజ్ఞానం లేనప్పుడు ఏర్పడే ప్రేలాపనలు మాత్రమే.

ఈ దేహాదులందు కనిపిస్తున్న నీ వెవడవు? వాటియందు నీకు చెందినదేది? చెందనిదేది? ఈ చెందిన చెందని విషయాల యొక్క తత్త్వమేమిటి? కొంచం యోచిస్తే భ్రమలు వాటంతట అవే తొలగుతాయి.

❖

యథార్థానికి ద్వైతం గాని, దేహాలు గాని లేవు. సూర్యుడున్న చోట అంధకారం పొసగదు కదా! ఆత్మతో "నీవు, నేను, ఆతడు, నీది, నాది, జన్మించుట, చచ్చుట, వృది, క్షయము" అను వ్యవహారమంతా ఏమాత్రం పొసగదు. ఒకవేళ 'ద్వైతము కలదు' అని ఎవ్వరైనా ప్రతిపాదించినా, ఆ ద్వైతముతో ఆత్మకు సంబంధం లేదు. శీతోష్ణములవలె, చీకటి వెలుగుల వలె అవి రెండూ పరస్పర విరుద్ధములైన విషయాలు. ఒకటి దర్శించుచున్నవానికి రెండవది అగుపించదు. అయితే 'ఉనికి' అనునది స్ఫురించే ప్రతిచోటా జడ చేతనాలు కలసి ఏర్పడి ఉంటాయి. ఆ రెండిటికీ ఒకానొక అవినాభావం ఉంటోంది.

అంతమాత్రం చేత "చిన్మాత్రమగు ఆత్మకు దేహముతోటి తాదాత్మ్యము కలదు" అని ఎవరైనా వాదిస్తారేమో. అటువంటి అభిప్రాయం "దావాగ్నిలో మంచు ముక్క రూపుదిద్దుకుంటోంది" అని అనుకోవడం లాంటిది సుమా! ఒకానొకడు మృగతృష్ణను దూరంగా ఉండి చూస్తున్నాడనుకో... "సూర్యుని తేజస్సు గాలివీచికలపై ప్రసరించినప్పుడు నాకు అట్లు జలతరంగములవలె భ్రమచేత అనిపిస్తోంది" అను జ్ఞానము యొక్క ప్రభావం చేత "అక్కడ తటాకం ఉన్నది" అను భావము నశిస్తుంది కదా! ఒక్క సత్య వస్తువు దర్శనముచే మాత్రమే మిథ్యా దృష్టి నశిస్తుంది.

❖

ఓ రామా! ఒక్క విషయం మాత్రం నీ "జ్ఞప్తి – ఎఱుక" పథం నుండి ఏ మాత్రం కోల్పోవద్దు. అదేమిటంటే... చిత్స్వరూపమగు ఆత్మ నిర్మలమై, నిత్యమై, స్వయంప్రకాశకమై, వికారరహితమై, అఖండమై, అప్రమేయమై సర్వదా వెలుగొందుచున్నది. అదియే నీయొక్క నా యొక్క వాస్తవ స్వరూపం.

నా ఈ వాక్యాలు వినటం జరుగుచున్న ఈ సభలోని, ఈ సభకు బాహ్యములోని అందరి స్వరూపం అదే! ప్రతి ఒక్కని వాస్తవ స్వరూపం అదే! నీవు గాని, నేను గాని, ఇక్కడి ప్రియ సభికులు గాని, భూత–భవిష్యత్–వర్తమానములలో తదితరులు గాని... ఆత్మకు వేరుగా మరేదీ అయి ఉండలేదు. అయి ఉండబోము. మనమందరమూ ఆత్మస్వరూపులమే అయి ఉన్నాము.

ఇక ఈ దేహానికి వస్తే ఇది అనిత్యము, మలయుతము. ఈ దేహం స్వయం ప్రకాశకం కాదు. ఇది మరొకదానిచే ప్రకాశింపబడుచున్నది. ఆత్మయగు నేను వికారరహితుడను. ఈ శరీరమో... వికారసహితమైనది. అట్టి ఈ శరీరంతో ఆత్మకు సంబంధమెట్లా కలుగుతుంది చెప్పు?

ఈ దేహము ప్రాణవాయువుచే చేష్టితమగుచున్నది. అన్నము, జలము మొదలైన వాటిచే వర్ధితమగుచున్నది... ఇంతలోనే ఎప్పుడో కృశించుచున్నది. దీనితో నేను వర్ధిల్లను, కృశించను... కనుక ఈ విధంగా దేహముతోటి జీవునకు సంబంధం పొసగనే పొసగదు.

పోనీ, ద్వైత దృష్టితో ఈ శరీర, ఆత్మలను పరిశీలించామనుకో... "ద్వైత సిద్ధి" అనగా "జీవునకు వేరైన మరొక సత్త కలదు" అని కదా? మరి ఆ రెండవ సత్త ఏమిటి? ...అది కూడా చైతన్యమే కదా! చైతన్యము, జీవునకు గాని; చైతన్యము, ఆ రెండవ సత్తకు గాని భేదం ఉండదు.

❖

**పంజరంలో సింహం -** చూచావా రామయ్యా! ఈ శరీరము, ఆత్మలను విచారణ దృష్టితో చూడకపోవడం చేతనే సర్వ అనర్థములు వచ్చి పడుతున్నాయి.

**శ్రీరాముడు :** జగత్‌దృష్టి అంతటికీ సారభూతమైనట్టి ఈ అంతఃకరణమునకు కారణమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ ప్రశ్నకు సమాధానం పెద్దలు "అజ్ఞానమే, మూఢత్వమే, అవిచారణయే" అని చెప్పుచున్నారు. ఆత్మయే "విపరీత సంస్కారములను గ్రహించుట" అను మోహముచే తన స్వసత్త యొక్క జ్ఞానమును త్యజించి భ్రమ బీజసహితమగు చిత్తాకార పరిణామమును ధరిస్తోంది.

స్వయం ప్రకాశమానుడు, స్వయం జ్యోతి స్వరూపుడు అగు సూర్యభగవానుని చూడు. గ్రహణసమయంలో ఆతని పట్ల 'రాహువు' అను తమస్సు ఏర్పడుతోంది చూచావా? వాస్తవానికి

సూర్యునిలో తమస్సు (Darkness) ఎట్లా ఉంటుందయ్యా? "సూర్యగ్రహణము" అనునది భూమిపై చరించే జీవుల యొక్క దృశ్యచమత్కారమే కదా!

అట్లాగే, మిక్కిలి అసంభవమైనప్పటికీ ఆత్మను జనన-మరణాదులు అనే అజ్ఞానం కప్పి ఉంచుతోంది. అనర్థహేతువులైన ఈ చిత్తం సత్యమగు ఆత్మతత్త్వం యొక్క ఎరుకచే, లేక, జ్ఞానముచే... గదిలో దీపం వెలిగించిన తరువాత చీకటి లాగా... క్షణంలో నశించగలదు. చిత్తమును పరిశుద్ధ పరచనంత కాలం అజ్ఞానం జనిస్తూనే ఉంటుంది.

ఓ జనులారా! మీరంతా ఈ చిత్తము గురించి, ఇందులో ఏర్పడివున్న దోషదృష్టుల గురించి బాగా విచారణ చేయండి. ఈ చిత్తమునకే 'జీవుడు, మనస్సు, అంతఃకరణము' మొదలైన పేర్లు కూడా ఉంటున్నాయని గ్రహించండి.

**శ్రీరాముడు :** ప్రభూ! మనం కొనసాగిస్తున్న ఈ విచారణ యొక్క ఆరూఢత కొరకు ఒక విషయం ముందుగా చెప్పండి. ఈ చిత్తమునకు 'జీవుడు - అంతఃకరణము' మొదలైన సంజ్ఞలన్నీ ఎట్లా ఏర్పడుచున్నాయి. ఎట్లా రూఢి పొందుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అనేక తరంగాలు ఎక్కడినుండి వచ్చాయి? జలం నుంచే కదా! అట్లాగే సమస్త పదార్థములు సమష్ఠిచిత్తము నుండే ప్రాదుర్భవిస్తున్నాయి. ఆత్మతత్త్వముతోటి ఏకత్వధ్యాస' చే ఇది నీవు తప్పక గ్రహిస్తావు.

ఒక్కసారి సముద్రమును చూడు. అందు జలం ఒకచోట చంచలములైన అసంఖ్యాక తరంగాలు కలిగి ఉంటోంది. ఇంకొకచోట స్పందనరహితంగా, తరంగాలు లేకుండా ప్రశాంతంగా ఉంటోంది. స్పందనరూపమగు ఆత్మ ఒకచోట నిర్మలంగా, శుద్ధంగా, మరొక చోట ప్రతిబింబరూపంగా ఉంటోంది. శిల మొదలైనవి చలన రహితంగా తమ యందు తామే స్థితి కలిగిఉన్నాయి. కాని మానవుడు, తదితర జంతువులు చేష్టాయుతులై చలనము కలిగి ఉన్నారు. శరీరములన్నిటి యందూ ఆయా వివిధ రూపములలో పరమాత్మయొక్క శక్తి ఉండియున్నది. అయితే ఆ శక్తి కొన్ని దేహములలో కల్పితరూపమైన అజ్ఞానం కలిగి ఉంటోంది. ఆ పరమాత్మయే కల్పితమగు అజ్ఞానమును ఆశ్రయించి, ప్రసిద్ధుడై అట్లు ఉంటున్నాడని గ్రహించు.

ప్రతిబింబ దశను పొందిన పరమాత్మయే ఆజ్ఞానావరణను కలిగి ఉన్నప్పుడు "జీవుడు" అను పేరుతో మనం పిలుస్తున్నాం. వాస్తవానికి ఈ జీవుడు 'సంసారము' అను మాయాత్మకమైన పంజరంలోని సింహమని గ్రహించు.

❖❖❖

## 8. ఆత్మయే అంతా.... అన్నిటా

ఆత్మ ఒకచోట తన ప్రతిబింబిత మోహకళచే జీవధారణ చేస్తోంది. ప్రాణములను ప్రీతిగా భావించి వాటిని పొంది 'జీవుడు' - అని అనిపించుకుంటోంది. ఆత్మయే 'జీవుడు' గా అగుపిస్తోంది.

"నేను, నేను" అని అనుకొనుచు అహంకారముగా అగుచున్నది. అహంకారము ఆత్మయే.

'నిశ్చయించెదను గాక' అను వ్యవహారములో ప్రవేశించి 'బుద్ధి'గా అగుచున్నది. బుద్ధి ఆత్మస్వరూపమే! సంకల్ప, వికల్పములను ఒనర్చుటనే 'మనస్సు' అనుపేరుకు అర్హమగుచున్నది. మనస్సు ఆత్మ చమత్కారమే! ఆత్మయే!

మనోదేహములకు కారణమగుటచే 'ప్రకృతి' అగుచున్నది. ప్రకృతి ఆత్మయొక్క ఐశ్వర్యమే! ఆత్మయే! వర్ధిల్లుటచే 'దేహము'గా అగుచున్నది. దేహతత్త్వంకూడా ఆత్మయే!

అజ్ఞానాధిక్యతచే 'జడము' అని, చైతన్య ప్రాధాన్యము ప్రకటించినప్పుడు 'చేతనము' అని వచించబడుతోంది. జడ, చేతనములు ఆత్మవిన్యాసములే! ఆత్మయే!

**శ్రీరాముడు :** అసలు మనసు అనగా ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామయ్యా! మనం అనేక కోణాల నుండి ఇప్పటివరకు చెప్పుకున్న తరువాత మరల "మనస్సు అంటే ఏమిటి?" అని ప్రశ్నిస్తుంటే నాకు కొంచం నవ్వు వస్తోంది. అయినా నీవు అడగటం సముచితమే. విను. మరొక కోణం నుండి చెపుతాను.

"అజ్ఞానము – దానికి సాక్షి" ...మధ్య గల స్థితే పరమాత్మాభాసితమగు మనస్సు. ఆ మనస్సు అనేకత్వము పొంది "జీవుడు, బుది, చిత్తము, అహంకారము"... మొదలైన వేషములను, సంజ్ఞలను ధరిస్తోంది. నవరసాలు పోషించే నటుడు ఒక్కొక్క నాటకంలో ఒక్కొక్కరస సమన్వితమైన వేషం వేస్తున్నట్లు, మనస్సు అనేక ధర్మములను అవధరించి ప్రవర్తిస్తోంది.

మనస్సు యొక్క స్వరూపం ఆత్మయే. అయితే రామా! నీవిక్కడ ఒక విషయం అత్యంత సూక్ష్మ బుద్ధితో గ్రహించాలని మనవి చేస్తున్నాను. హెచ్చరిస్తున్నాను. అజ్ఞానులు, దుర్బుద్ధులు, మూఢులు అగు కొందరు తార్కికులు "ఇది మనస్సు, ఇది బుద్ధి, ఇది చిత్తము, ఇది జీవుడు, ఇది దేవుడు" అని అనేక నిర్వచనములలో ప్రవేశించి ఆయా సంజ్ఞలలో వ్యర్థంగా అభినివేశం కలిగి ఉంటున్నారు. విజ్ఞులు వాటిని సాధనములులాగా, ఉపకరణములుగా, సోపానములుగా చూస్తారేగాని, సాధ్యముగా కాదు. సాధకుడు సాధనములు ఎక్కడ పరిమితమౌతాయో గ్రహిస్తు ఉండాలని నా మనవి.

**శ్రీరాముడు :** మీ హెచ్చరికలో నాకు అత్యున్నతమైన పరమార్ధమే గోచరిస్తోంది. అయితే మరొక సందేహం. శరీరం ఉన్నంత వరకు సంసారము ఉండియే తీరుతుంది కదా! సంసారం ఉన్నంత వరకు అజ్ఞానం ఉంటుందికనుక, సంజ్ఞల అవసరం ఉండియే ఉంటుంది కాదా? కాబట్టి సంసారమునకు కారణం ఈ దేహమేనని అనవచ్చా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** జీవుడే సంసారమునకు కారణమగుచున్నాడుగాని, మూగము, దీనము అయిన ఈ దేహం సంసారమునకు ఏమాత్రం కారణం కాదు. కవిత్వం పెల్లుబికేది కవిలోంచిగాని, కలంలోంచి కాదే!

ఒక కుండలో నీళ్ళు ఉన్నాయనుకో... కుండపగిలితే నీళ్ళు నశిస్తాయా? ఆధారము, ఆధేయము – ఈ రెండిటిలో ఒకటి నశించినంత మాత్రం చేత రెండవది నశించదు. ఒక ఆకు ఎండిపోయిందనుకో

...అప్పుడు అందులోని రసం ఏమయింది? నశించిందా?... లేదు! అది సూర్యకిరణములలో ప్రవేశించింది. మరొక రూపుదిద్దుకున్నది. అంతే.

శరీరం నశించినా ఆత్మ నశించదు. ఆత్మను ఆశ్రయించి, ఆత్మేచ్ఛచే నిర్మితమై ఈ శరీరాదులు ఏర్పడి ఉంటున్నాయి.

అందుచేత... ఆత్మ వాసనా సహితమైతే ఈ శరీరం వాసన యందే ఉంటుంది. ఆత్మ యందు వాసనలు రహితమైతే ఈ శరీరం చిదాకాశంలో ఉంటుంది.

ఏ దుర్బుద్ధి అయితే "ఈ శరీరం నశించిందా ... నా పని అయిపోయినట్లే. నేను నశించినట్లే" అని అనుకుంటాడో, అట్టివానికి తల్లి స్తనంలో బేతాళం అనుభవమౌతుందని నా అభిప్రాయం.

❖

మననముచే బంధం ఏర్పడుతోంది. ఎప్పుడైతే ఉపాధులకు, సంస్కారములకు సంబంధించిన మననము తొలగుతుందో ...అప్పుడు అట్టి జీవుడు స్వతఃసిద్ధంగా తనయొక్క బ్రహ్మస్వభావమును సంస్మరిస్తాడు. నిరతిశయానందమును పొందుతాడు.

అయితే... శరీరం నశించినా చిత్తం ఉంటుంది. చిత్తమే జీవుని సూక్ష్మదేహం. చిత్తములో వేటి వేటి గురించి ధ్యాసలు, మననములు ఆధిక్యత కలిగి ఉంటాయో... ఆ అనుభవములకు అనుకూలంగా తరువాతి ఉపాధులు ఏర్పడుచున్నాయి.

**శ్రీరాముడు :** ఒకవేళ చిత్తమే నశించిందనుకోండి....? అప్పుడే మౌతుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అప్పుడింకేమున్నది? స్వస్వరూపమగు ఆత్మయే శేషించటమే పరమానంద దాయకమగు 'మోక్షము' అయి ఉన్నది.

కనుక... దేహము నశించుటచే ఏదీ నశించుటయే లేదు! ...ఇక చిత్తము నశించినప్పుడు స్వస్థానమే లభించగలదు. మరింక చింత దేనికో చెప్పు.

"ఈతడు మరణించాడు, నశించాడు" – అను కథనమంతా మిథ్యా కథనమే. అదంతా కూడా అసత్ కల్పన మాత్రమే.

ఈ జీవుడు స్వస్వరూపము విషయమై అజ్ఞానము ఏర్పడి ఉన్నంతవరకూ వేర్వేరు ఉపాధులను, దేశ కాలములను, స్థితి గతులను గ్రహించుచూనే ఉన్నాడు. ఒకానొకప్పుడు శాస్త్రపరిశీలనచే, స్వప్రయత్నముచే తన స్వరూపమేమిటో గ్రహించి ఈ జన్మ, కర్మల, చక్రమును నిరోధిస్తున్నాడు... లేక త్యజిస్తున్నాడు. లేనివిగా చూస్తున్నాడు. మోక్షము అనగా అదే!

'మరణము' అనే నదిలోని తరంగములచే కొట్టుకుని పోవుచున్న గడ్డిపరకలవలె కొందరు జీవులు దేశకాలముల కల్పనాపరంపరలలో అనేకసార్లు ప్రవేశ – నిష్క్రమణములను నిర్వర్తించుకుంటూ పోతున్నారు. ఒక దేశ కాలములలో ప్రవేశమే తన జన్మ అని, దాని నుండి నిష్క్రమణమే తన మరణమని భ్రమలను స్వీకరిస్తూ అనేకసార్లు "నేను దుఃఖిని, సుఖిని, నీచుణ్ణి, గొప్పవాడిని" ఇత్యాది యోచనా లంపటంలో మ్రగ్గుచున్నాడు. కొండముచ్చు ఒక చెట్టు వదలి మరొక చెట్టును ఎక్కుచున్నట్లు ఆతడు ఒక శరీరం వదలి మరొక శరీరంలో ప్రవేశిస్తున్నాడు. కొంతకాలానికి అది వదలి ఇంకొకటి...

చర్వితచరణంగా బహుదూరపు బాటసారిలాగా పయనం సాగిస్తూనే ఉన్నాడు. విస్తృతమైన వేరొక దేశ కాలములలో ప్రవేశించి "నేను ఇప్పుడే పుట్టాను" అని తలచుచూ ఉన్నాడు. పిల్లి తన కూనలను ఒక ఇంటిలోంచి మరొక ఇంటిలోకి చేరుస్తున్నట్లు అతడు తన వాసనలు ఒకచోట నుండి మరొక దేశకాలములకు గొనిపోవుచున్నాడు.

**శ్రీరాముడు :** ఈ జీవునికి ప్రయాసతో కూడిన ఈ ప్రయాణం ఎంత కాలం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అది జన్మ, మృత్యు, వార్ధక్య, వ్యాధుల ప్రయాసతో కూడిన ప్రయాణమే. వాసనలతో కూడి ఉన్నంతవరకు ఆప్రయాస కొనసాగుతూనే ఉంటుంది. దున్నపోతుకు ముక్కు త్రాడు వలె వాసనలచే కట్టుబడిన ఈ జీవుడు "ఉపాధి-దేశము-కాలము" ...అను మూడు పదార్థములు గల అనేక స్థానాలకు ఈడ్వబడి అనేకసార్లు దుఃఖాలను, శిథిలత్వాన్ని పొందుచున్నాడు. వారి వాసనలే వారినట్లా బాధిస్తున్నాయి. అంతేగాని వారిని మరింకెవరో బాధించుట లేదు.

అజ్ఞాన ధోరణులు, కుమార్గములు ఆశ్రయించుటచే ఆతడు అనేక జీవితములను వృథా చేసుకుంటున్నాడు. వెట్టివాడు చేత సంచిని భుజాన వేసుకొని చెత్త చెదారమును నింపుకుంటూ భారంగా అడుగులు వేస్తూ దుఃఖితుడగుచున్నట్లు, ఈ జీవుడు తెలివిగా వాసనలు తొలగించుకో వలసింది పోయి, మరింకా పెంచుకుంటున్నాడు.

చూచావా! ఆతడు తన హృదయంలో జనిస్తున్న వాసనలచే పట్టుపురుగులాగా బంధితుడై దారిద్ర, వియోగాది దుఃఖముల భారం వహిస్తూ, వివిధ యోనులలో అవిశ్రాంతగా సంచారం చేస్తున్నాడు. అనేక దుర్దశలచే జర్జరితుడగుచున్నాడు. చిరకాలం నరక సమూహములలో పడి లేస్తున్నాడు.

❖

సభ ముగించబడింది. శాంతి మంత్రాలు ప్రవచించబడ్డాయి.

ఆ సభలో ప్రతి ఒక్కరు "ఆహా! మూఢులమై మూర్ఖులమై మేము సంసారారణ్యంలో ఎంతటి సుదీర్ఘ ప్రయాణాలు కొనసాగిస్తున్నాం! మహర్షి గుర్తుచేయకపోతే మా గతి ఏమిటి? ఇది ఎంతటి సుదినం! ఇక్కడి సంయోగ - వియోగాలలో ధ్యాసంతా కలిగియుండి ఉత్తరోత్తర విషయాలే యోచించటం లేదే! ధ్యాసను స్వస్వరూపం వైపు మరలించకపోతే ప్రయాస తప్పదుకదా! ఓ మహర్షులారా! ఓ రామచంద్రా! మీకు ధన్యవాదాలు. మాకు గుర్తుచేయవలసింది గుర్తుచేశారు! సర్వదా కృతజ్ఞులం" అని తమలో తాము చెప్పుకుంటూ గృహోన్ముఖులైయ్యారు.

❖❖❖

**(పదమూడవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# పదునాల్గవ రోజు

# X. వివేక దృష్టి

## 1. ఆత్మ - దేహముల సంబంధం

పదునాల్గవ రోజు యథావిధిగా సభ ప్రారంభమైనది.

**శ్రీరాముడు :** తండ్రీ! మహర్షీ! నిన్నటి రోజు చివరిలో "ఈ జీవుడు దేహముతో కూడి అనేక దేశ - కాలములలో ప్రవేశ - నిష్క్రమణములను నిర్వర్తించటం" గురించి మీరు ప్రసంగిస్తున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మంచిది. మనం ఈ దేహం విషయమై మరికొన్ని విశేషాలు విచారణ చేద్దాం.

❖

ఓ రామచంద్రా! ఒక్క విషయం మరొక్కసారి గుర్తు చేస్తున్నాను.

**దేహేజాతే న జాతోఽసి! దేహనష్టే న నశ్యసి ।**
**త్వమాత్మన్యకలంకాత్మా! దేహస్తవ నకశ్చన ॥**

1. ఈ దేహం జనించుటచే నీవు జనించుట లేదు. దేహం కంటే ముందుగానే నీవు ఉన్నావు.
2. దేహము ఉన్నంతకాలం దేహాశ్రయుడిగా ఉండనే ఉన్నావు.
3. దేహం నశించినంత మాత్రం చేత నీవు నశించవు. దేహత్యాగిగా నీవు ఉండనే ఉంటావు.

నీ విషయం, నా విషయం, ఈ సభలోని ప్రతి ఒక్కరి విషయం, భవిష్యత్‌లోని సర్వజీవుల విషయం ఇట్టిదే.

నీవు వాస్తవానికి స్వాత్మ యందు అకళంకరూపుడవై వెలయుచున్నావు. ఈ దేహంతో నీకేమీ సంబంధమే లేదు. మనందరిలోని ప్రతిఒక్కరి విషయం ఇట్టిదే!. కుండ పగిలినా కుండలోని రేగు పండుకు ఏమీ కానట్లు (కుండ-బదర న్యాయం) ఈ శరీరం నశిస్తే జీవుడు నశిస్తాడనుకోవటం కేవలం కల్పన, భ్రమ మాత్రమే. నశ్వరమగు ఈ దేహం నశిస్తే అది ఎక్కడి నుండి వచ్చిందో అక్కడికే పోతోంది. "నేను ఈ శరీరంతో నశించుచున్నాను" అని తలచే మూఢ చిత్తునకు ధిక్కారమగు గాక!

దృష్టాంతంగా ఒక రథం తీసుకుని చెప్పుకుందాం. రథచోదకుడు, వెళ్ళవలసిన ప్రదేశం గురించి ఇష్ట, అనిష్టములు లేనట్టి గుఱ్ఱములు, రథము, త్రాళ్లు - ఒకదాని వంటిది మరొకటి కాకపోయినప్పటికీ - అన్నీ ఒక చోటికి చేరి ప్రవర్తిస్తున్నాయి కదా! అట్లాగే దేహి, ఇంద్రియములు, దేహము, మనస్సు ...ఇవన్నీ ఒక చోటికి వచ్చి ఆయా కార్యక్రమములను నిర్వర్తిస్తున్నాయి. తటాకంలోని స్వచ్ఛమైన నీటికి, బురదకూ ఉన్న సంబంధమే ఆత్మకు, ఈ దేహేంద్రియములకూ

గల సంబంధమని గ్రహించు. సుదీర్ఘమైన ప్రయాణం చేస్తున్న ఒక బాటసారి మార్గమధ్యంలో ఒక సత్రంలో బస చేస్తున్నాడనుకో... ఆతనికి ఆ రాత్రి శయనించే గదిలోని వస్తుజాలముతో ఏర్పడే 'నావి' అను మమత్వాభిమానం వంటిదే ఈ శరీరమునకు సంబంధించిన మమకారములు సుమా! ఆ గదిలోని వస్తువులతో ఏర్పడే "సంయోగముచే సుఖము, వియోగముచే దుఃఖము"లకు ఏమి అర్థమున్నది చెప్పు? ఆ బాటసారి అజ్ఞుడైతే సత్రంలో ప్రవేశించి, "ఆహా! ఇవి నావి, ఆ గది ఆతనిది, వీటిపై నాకే హక్కు? అయ్యో! ఇక తెల్లవారబోతోంది. వెళ్ళి పోవలసి వస్తుందేమోగదా! ఎట్లా? నే వెళ్ళిన తరువాత ఇవన్నీ ఏమౌతాయి? ఏమో మరి!"...అని భ్రమించి అనేక దుఃఖాలు పొందుతాడు. ఆ బాటసారి కనుక జ్ఞాని అయితే "ఈ సత్రంలోని గది గాని, ఇందులోని సామగ్రి గాని ఈ సత్రం యజమానివి గాని, నావి కావు. నేను ఇక్కడ బస చేస్తూ, ఇక్కడి వాతావరణమునకు అనుకూలుడనై ఉంటాను. వీటిని సొంతమనుకొని మమకారం నే నెందుకు కలిగి ఉండాలి? ఇవి నావి కానప్పుడు వీటిని త్యజించటమేమిటి? కోల్పోవటమేమిటి?" అని గ్రహించి ఉంటాడు. వాటిని ఉపయోగిస్తూనే తాను వాటికి వేరై ఉంటాడు. ఆతనికి, అక్కడి వస్తువులకు గల సంబంధమే ఆత్మకు ఈ దేహాదులతో గల సంబంధం సుమా!

ఒక బాలుడు బాగా అల్లరిచేస్తున్నాడనుకో... ఆతని దాది ఆతనిని సమీపించి "ఓయీ! బాలుడా! నీవు ఇట్లాగే అల్లరి కొనసాగించావా... ఆ చీకటిలో నుంచి ఒక బేతాళుడొచ్చి నిన్ను పట్టుకుపోతాడు. ఆతనికి పెద్ద పెద్ద దంతములు, చింతనిప్పుల్లాటి ఎఱ్ఱటి కళ్ళు ఉంటాయి. తలపై రెండు కొమ్ములు కూడా ఉంటాయి. మరి ఆతనిని పిలవమంటావా?" అని భయపెట్టుచున్నదనుకో. ఆ బాలుడు చీకటి వైపు చూచి అక్కడి ఆ విశేషణములు గల ఒక ఆకారమును ఊహించుకుని "వద్దులే! నేను అల్లరి చేయను" అని ఊరుకుంటాడు చూచావా? ఆ బాలుని కళ్ళకు కల్పిత బేతాళుడు అగుపించినట్లు జీవునకు "ప్రీతి, అందము, సుఖము, దుఃఖము, గ్రాహ్యము, త్యాజ్యము" మొదలైనవన్నీ మిథ్యారూపంగా ఏర్పడుచున్నాయి. అయితే, వాటికి, ఆత్మకు సంబంధమే లేదు. ఆ కలుగుచున్నదంతా కల్పిత బంధమే.

❖

ఒక మహావృక్షము నుండి లభించిన కొయ్య నుండి వేరు వేరు విగ్రహములు తయారు చేయబడుచున్నట్లు, సమ్మిళితములైన పంచ భూతముల నుండి ఈ జనసమూహమంతా వేర్వేరుగా నిర్మించబడుచున్నారు. అందుచేత ఈ అనేక శరీరములను చూచి నీవు భ్రమ పొందవద్దు. ఒక పెద్దకట్టెల మోపులో ఉన్నవన్నీ కట్టెయే (కొయ్యయే) కాని, మరింకేమీ కాదు కదా! ఈ దేహం కూడా మనం పరిశీలించి చూస్తే ఇందు పంచభూతములు తప్పించి మరింకేమీ లేదు.

ఓ జనులారా! ఈ పంచభూతములు 'ఉత్పత్తి-క్షోభ-వినాశనము' లందు మీరు ఎందుచేత హర్ష శోకవశులగుచున్నారో కాస్త చెపుతారా?... అగ్ని యందు పడి, మిడత భస్మమౌతున్నట్లు మీరు కూడా పాంచభౌతిక సంఘాతమైన 'కామము' అను పేరు గల విషయాగ్నియందు ఎందుకు పడుచున్నారు? అందు ఏ గొప్ప, శాశ్వత విశేషం మీకు కనబడుతోంది?

ఇవన్నీ అజ్ఞానుల యందు మాత్రమే ప్రీతి జనింపజేస్తున్నాయి, కాని జ్ఞానులకు పంచభూత రూపములుగానే కనిపిస్తున్నాయి.

పరస్పర సంబంధం లేని రెండు వేర్వేరు వస్తువులను ఒకచోటికి తీసుకువచ్చి ఉంచామనుకో... ఆ రెండు వస్తువులకు ఒకదానిపై మరొక దానికి "రాగము" ఏర్పడుతోందా? లేదే! అలాగే 'చిత్తము – శరీరము' లకు ఒక చోట ఉన్నా ఒకదాని పట్ల మరొకదానికి రాగము ఏర్పడవలసిన పనేమున్నది? పనిలేదు. అయినా కల్పనచే ఏర్పడుచున్నది. అట్లాగే మట్టితో చేసిన అనేక సైనికుల బొమ్మలతో ఒక యుద్ధరంగమును నిర్మించి ఆట బొమ్మలలో ఉంచామనుకో... ఆ సైనికుల బొమ్మలన్నీ ఒకే మట్టితో తయారు చేయబడినప్పటికీ "ఇటు సైన్యం మన రాజ్యానిది...అటు సైన్యం శత్రు రాజులది"... అనే విశేషణము ఆపాదించబడుచున్నది కల్పన చేతనే కదా! ఈ బుద్ధి, ఇంద్రియములు, మనస్సు, ఆత్మల సంసర్గము మమత్వరహితంగా గాంచబడు గాక! శిలా విగ్రహములకు పరస్పరానుబంధం ఉండనట్లు ఆత్మకు ఈ దేహ, ఇంద్రియాల పట్ల రాగం ఉండకుండు గాక! వాటి కొరకు విలపించటం అత్యంత అసంగతమైన విషయమని ఆత్మ స్వరూపుడవగు నీవు గ్రహించు. తరంగం ఎక్కడెక్కడివో కొన్ని గడ్డిపరకలను ఒక చోటికి జేర్చునట్లు ఆత్మ పంచభూతములను ఒక చోటికి జేర్చి, తద్వారా ఈ జగత్తును గాంచుచున్నది. కెరటముల ప్రభావం చేత కొట్టుకురాబడుచున్న కొన్ని గడ్డిపరకలు కలుస్తున్నప్పుడూ, విడిపోతున్నప్పుడూ రాగ–ద్వేషాలు, హర్ష–శోకాలూ పొందుతాయా? లేదు కదా! ఈ పుత్రులు, పశువులు, అయినవాళ్ళు, కానివాళ్ళు అన్నరూపంలో ఏర్పడివున్న ప్రాణులన్నీ పంచభూత మాత్రములై ఆత్మ మహాసముద్రంలో కలవటం, విడిపోవటం చేస్తున్నాయి. ఇందులో శోకించటానికి గాని, సంతోషించటానికి గాని, ఏ విశేషమున్నది? జలంలో ఆవర్తములవలెనే 'చిత్తములు' అనురూపం పొందిన ఆత్మ పంచభూతములను ఒక చోటికి చేర్చి వినోదిస్తోంది.

సంచలనముచే మాలిన్యము పొందిన జలం క్రమంగా సంచలన రహితమగుచున్నప్పుడు ఆ మాలిన్యమును వదిలి శుద్ధరూపం పొందుతుంది చూచావా? జ్ఞానము యొక్క సహాయంచే విషయ రూపమును త్యజించుచున్న జీవుడు స్వయముగా బ్రహ్మరూపమును పొందుచున్నాడు. ఆకాశమున సంచరించే సిద్ధపురుషులు, దేవతలు వాయుమండలము నుండి భూమండలమును చూస్తూ ఉంటారు చూచావా! జ్ఞానము పొందిన జీవులు ఈ పంచభూతసముదాయమునుండి విడివడినవారై, తమ దేహముతో సహా సర్వబాహ్యవస్తు సముదాయమును తమ స్వస్వరూపముకంటే వేరైనదిగా గాంచు చున్నారు. దేహాతీతులైన జ్ఞానులు పంచభూతములను తమకు వేరైనదిగా, అసంబంధమైనదిగా గాంచుచుండుటచే తమయొక్క జన్మరాహిత్యమును ప్రత్యక్షముగా గాంచగలుగుచున్నారు. లేదా, "ఇదంతా మమాత్మవిన్యాసమే" అనురూపంగా ఆస్వాదిస్తున్నారు. సూర్యకాంతి మణి వలె స్వయం ప్రకాశమును అవధరిస్తున్నారు.

మద్యము త్రాగి మత్తులో ఉన్నవాడు తన యొక్క పూర్వస్థితులను, తదితర పరిచయములను, తన ఎదురుగా ఉన్న వస్తుజాలమును అస్పష్టంగా గాంచుతూ ఉంటాడు. ఆ మత్తు దిగిపోయిన తరువాత

మరల ఇతఃపూర్వజ్ఞానమును సుస్పష్టంగా తిరిగి పొందుతాడు. అట్లాగే దేహాతీతత్వము అవధరించిన మహనీయుడు ప్రమాణ, ప్రమేయముల నుండి విడివడి వికారరహితుడై తన ఆత్మను గాంచుచున్నాడు.

ఓ రామా! వివిధ సముద్రజలములు తరంగముల కల్లోలంచేత తేలియాడే గడ్డి పరకలతో సంయోగ – వియోగములు చేస్తున్నట్లుగానే... ఆత్మయే సమస్త వస్తు సంయోగ – వియోగాది క్రియా విశేషములను స్వయంకల్పితంగా నిర్వర్తిస్తోంది.

❖❖❖

## 2. ప్రపంచాతీతులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచంలో కొందరు నేను వర్ణిస్తూవస్తున్న విశేషాలతో శరీరాతీతులై, ఆత్మతో ఏకత్వం పొందినవారై ఉన్నారు. వారు వీతరాగులై, పాపరహితులై బ్రహ్మపదమున వెలుగొందు చున్నారు. అట్టి వారిలో కొందరు బోధకులై బ్రహ్మతత్త్వ ప్రవచనం చేస్తున్నారు. అట్టి మహనీయులకు దిగ్విజయమగు గాక!

సముద్రంలోని మహాతరంగములు తమ యందు అమూల్యమైన రత్నములు కలిగి ఉండి కూడా, వాటి యందు ఆశ లేకుండానే యథాతథసంచలనంతో సంచరిస్తూ ఉంటాయి కదా! ఆ మహాత్ములు కూడా జ్ఞానులై, వాసనారహితులై అనాసక్త చిత్తముతో వ్యవహారములు ఆచరిస్తున్నారు.

తీరమున ఉన్న భవనం చూచి సముద్రం క్షోభ చెందుతుందా? మోదం పొందుతుందా?... గాలికి దుమారం లేచినంత మాత్రం చేత ఆకాశం మలినమై పోతుందా?... ఈ ప్రపంచ వ్యవహారములచే ఆత్మజ్ఞాని మలినం పొందదు, మార్పు పొందదు. చేర్పు పొందదు.

**శ్రీరాముడు :** అట్టి మహనీయులు అందరిలాగానే ఈ ప్రాపంచిక రాగ ద్వేషముల మధ్య మనగలుగుతారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వచ్ఛమైనట్టి, మలినమైనట్టి చంచల జలతరంగములచే సముద్రము రాగము గానీ, ద్వేషము గాని పొందుతోందా? లేదు. ఆత్మజ్ఞాని కూడా భోగములచే రాగము గాని, ధన, జనాదుల రాకపోకలచే ద్వేషము గాని పొందుట లేదు.

**యన్మనో మననం కించిత్సమగ్రం జగతి స్థితమ్ ।**
**తచ్చేత్యోన్ముఖచిత్తత్వవిలాసోల్లసనం విదుః ॥** (శ్లో 28, సర్గ 72)

"ఈ జగత్తులో ఉన్నది. ఉండబోయేది మనస్సు యొక్క సంకల్ప – వికల్పములు మాత్రమే" – అని అతనికి తెలుసు. "ఇదంతా విషయోన్ముఖమైన చైతన్యము యొక్క విలాసము మాత్రమే" అని ఆత్మజ్ఞాని ఎరిగియే ఉంటాడు.

❖

ఈ అహంకారము, ఈ త్రికాలస్థమగు విషయములు, ఈ దృశ్య, దర్శన సంబంధములు – సర్వమూ మనోవిజృంభణము మాత్రమే!

దృశ్య – దర్శనముల మధ్య దృక్ (That which is seeing) ఉన్నది. దృశ్యము దృక్ యొక్క ఆధీనంలో ఉన్నది. దృక్ ఈ దృశ్యమును ఎట్లు చూస్తే అట్లే ప్రాప్తిస్తూ ఉంటుంది. దృక్ యొక్క అధీనంలో ఉండే ఈ దృశ్యము సత్తయా?... కాదు! అసత్తయా?... కాదు!

ఇట్లు సత్త అని గాని, అసత్త అని గాని నిర్ణయించబడజాలనిది, హర్షశోకములకు అర్థమెట్లా అవుతుందో చెప్పు? కనుక ఈ దృశ్యము స్వయంసిద్ధము కానే కాదు. స్వయంసిద్ధమైనది 'దృక్' మాత్రమే. అదియే ఆత్మ! ఆత్మ సర్వదా అసంగమైనది.

**శ్రీరాముడు :** అయితే ఈ జీవులకు హర్ష శోకములు ఎందుచేత కలుగుచున్నాయి?

**శ్రీవసిష్ఠమహర్షి :** రామా! ఇప్పుడు నీకు కొన్ని కొన్ని సందర్భములలో హర్ష శోకములు కలుగుచున్నాయి. కదా! నిన్నొక చిన్న ప్రశ్నవేస్తాను– అట్లా ఏర్పడే హర్ష శోకములు సత్యమైనదాని గురించా? లేక... అసత్యమైనదాని గురించా? కాక సత్యాసత్యమైన దాని గురించా?

అసత్యమైనది మిథ్యయే కదా! మిథ్య, అవాస్తవం అయినదాని గురించి హర్షమెందుకు? శోకమెందుకు?

**శ్రీరాముడు :** ...!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇక సత్యమైనదాని గురించి అంటావా? అది ఎల్లప్పుడూ సత్యమై నిత్యమై లభించియే ఉన్నది కదా! ...మరి హర్షమెందుకు? శోకమెందుకు? ...ఎందుకంటే నిత్యమైనది మాత్రమే సత్యము కదా!

ఇక "సత్యా సత్యమైనదాని గురించి" అని అంటావా?... ఎక్కడైనా విరుద్ధ ధర్మములు ఒక చోట ఒనగూడుతాయా?ఒకే చోట, ఒకేసారి వెలుగు చీకటి ఏర్పడినవై ఉంటాయా? అందుచేత 'సత్యాసత్యమైనది' అనే మాటయే మిథ్య. మరి నీవు దేనికైనా సరే, ఎందుకు విమోహితుడవు కావాలి చెప్పు?

❖

ఉత్తమ నేత్రములు గల ఓ రామచంద్రా! నీవు మొట్టమొదట మిథ్య అయినట్టి అసమ్యక్ దర్శనం (The illusion of seeing the variety and missing the unity) త్యజించు. సమ్యక్ దర్శనమును అవలంబించు. సమ్యక్ దర్శనమునందు సుస్థిరుడైనవాడు ఇక్కడెక్కడా ఏ స్థితిగతులలోనూ మోహం చెందడు.

ఆత్మ తన యొక్క దృశ్య–దర్శన సంబంధమైన విస్తారముచే తనకు తానే మనస్సు అను రూపంగా ప్రకటించుకొనుచున్నది. అందుకే విజ్ఞులు "దృశ్య–దర్శనములకు సంబంధించిన అనుభవ రూపమగు సుఖవృత్తి కూడా బ్రహ్మము యొక్క రూపమే" అని చమత్కారంగా విశ్లేషిస్తూ ఉంటారు. అలాగే, ఈ ఉపాధి కృతమైన భేద దృష్టి తొలగిపోయినప్పుడు... అప్పుడు ఏర్పడే సుఖము శివము, లేక, అఖండ బ్రహ్మమే. ...కాబట్టి 'బ్రహ్మము' అంటే ఏదో, ఎక్కడో ఉన్నట్టిది కాదు.

**శ్రీరాముడు :** సంసారము అనగా ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** దృశ్య-దర్శనముల మధ్య గల ఒకానొక అజ్ఞానపూరితమైన సంబంధమునే మనం 'సంసారము' అనే శబ్దంతో ఉద్దేశిస్తున్నాం. దృశ్య-దర్శనముల మధ్య గల అనుభవం అజ్ఞానులకు సంసారముగా ప్రాప్తిస్తోంది.

అదే అనుభవం ద్రష్ట-దర్శనముల సంబంధమేమిటో ఎరిగిన ప్రపంచాతీతులకు మహాభ్యుదయ యుక్తమగు "మోక్షము" అను అనుభవం చేతికందిస్తోంది.

అనుభవం దృశ్యవృత్తితో కూడి ఉంటే బంధము. వృత్తి రహితమైనప్పుడు, అప్పుడు శేషించే అనుభవమే ముక్తి.

**శ్రీరాముడు :** ముక్త స్థితిలో 'అనుభవం' అనేది ఉంటుందా? ఉండదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అనుభవమే ఆత్మయొక్క ముఖ్యదేహం. అయితే దేహి దేహము కంటే అత్యంత సూక్ష్ముడు. అనుభవం యొక్క ఉనికి-లేములు ఆత్మను స్పర్శించవు.




జ్ఞానము యొక్క బలిమిచే ఈ జీవుని సుఖసంవిత్తు వికారరహితమౌతుంది. అనగా, వృద్ధి క్షయ రహితమౌతుంది. వృద్ధి, క్షయ రహితమగు సుఖానుభవం పూర్ణానందస్వరూపమగు బ్రహ్మమే అయి ఉన్నది.

❖

కనుక రఘు రామా! నీవు దృశ్య-దర్శన వర్జితమైనట్టి సుఖమును ఆశ్రయించు. దానినే 'కేవలానుభవ దృష్టి' అని కూడా శాస్త్రములు చెప్పుచున్నాయి. అట్టి దృష్టిచే అప్పుడు ఉచిత సమయంలో సంసారబంధ రహితుడవౌతావు.

అట్లు జీవుడు కేవలమగు (That which is Absolute) తన సుఖస్వరూపమును ఆశ్రయిస్తూ ఉండటం చేత ఆతని యందు స్వస్వరూప దృష్టి ప్రకాశించగలదు. దృశ్యం రహితమైనప్పుడు, అప్పటి అనుభవమునకు, ద్రష్టకు భేదమేమీ ఉండదు. ఆ మార్గంలో లభిస్తున్న స్థితియే తురీయావస్థ. అదియే ముక్తి. ఏ జీవుడైనా సరే... దృశ్యదర్శన వర్జితుడై పరమాత్మ బుద్ధిని సంపాదించుకొంటే అది ముక్తస్థితి అవుతుంది.

ముక్తరూపమగు తురీయస్థితి యందు ఆత్మ ఏ తీరుగా ఉంటుంది? అది స్థూలమా? ...కాదు. సూక్ష్మము కూడా కాదు. ప్రత్యక్షముగాని, అప్రత్యక్షముగాని కాదు.

అద్దానిని చైతన్యము, జడము, సత్తు, అసత్తు మొదలైన పేర్లచే నిర్వచించలేం. దాని రూపం అహంకారం గాని, మరింకేదో గాని కాదు. "ఏకము, అనేకము, సమీపము, దూరము, ప్రాప్యము,

అప్రాప్యము" – మొదలైన వాచ్య వాచక శబ్దములు అద్దానికి ఆపాదించలేం. అది స్వరూపమని, సర్వవ్యాపకమని, పదార్థమని, అపదార్థమని, పంచభూతాత్మకమని, అపంచభూత రూపమని చెప్పలేం. అద్దాని గురించి చెప్పటానికి మాటలు లేవు... చాలవు. కానీ అన్ని శబ్ద-అర్థముల సమగ్ర ఆత్యంతిక సమన్వయం అదే!

**శ్రీరాముడు :** నామ – రూపాలు లేనట్టిది ఉన్నట్లా? లేనట్లా?

**శ్రీవసిష్ఠమహర్షి :** ఒక్క విషయం మాత్రం నిస్సంకోచంగా ప్రకటిస్తున్నాను. ఈ జీవునికి ఆరవ ఇంద్రియం మనస్సు. మనస్సుకు రూపమేమున్నది. అయితే, ఈ దృశ్యరూపమున సంతరించుకుని ఉన్నదంతా మనస్సు మాత్రమే. మనస్సుకు పరమై, ఆ మనస్సుకు కారణము, స్థానము, ఆధారము ఆత్మయే కదా! అట్టి ఆత్మతత్త్వమును, "అది ఏదీ కాదు" – అనటం కూడా సత్యవాక్కు కాదు. ఈ జగత్తును యథారూపమున గాంచగలుగుచున్న ప్రపంచాతీతులకు "ఇదంతా ఆత్మయే" అని అనుభవ మగుచున్నది. సర్వం ఆత్మయే!

ఈ జగత్తంతా ఆత్మమయమే అయి ఉన్నది. ఆత్మకు భిన్నంగా ఏదీ ఎక్కడా లేదు. ఆత్మయే పృథివిలో కాఠిన్యంగా, జలంలో ద్రవత్వంగా, తేజస్సులోని ప్రకాశంగా, ఆకాశంలో అవకాశంగా ప్రకాశిస్తోంది. ఒక నటుడు అనేక చోట్ల అనేక వేషాలు వేస్తున్నట్లు, ఆత్మ సర్వరూపములూ తానే అయి, తాను మాత్రం అవేవీ కాకయే ఉంటోంది.

చైతన్యమే లేకపోతే వస్తువుల సత్తా ఏమాత్రం సిద్ధించేది కాదు. అంతేకాదు... "ఆత్మకు భిన్నంగా నేను ఉన్నాను" అనే మాట ఉన్మత్త ప్రేలాపన మాత్రమే.

ఓ మహాత్మా! రామచంద్రా! సమస్త దేశ కాలములు, అందలి అనంత కోటి కల్పములు, ఆ కల్పముల మధ్య కనిపిస్తున్న అనేక బ్రహ్మాండములు, ఆ బ్రహ్మాండములలోని వివిధ జీవుల గమనాగమనములు -- ఇవన్నీ ఆత్మయే అయి ఉన్నాయి. ఆత్మకు వేరుగా మరొక కల్పన ఏదీ ఉండ జాలదు. కాబట్టి ఆత్మకు సంబంధించిన నిశ్చయబుద్ధి కలిగి ఉండు. ఆ బుద్ధికి కూడా పరుడవై ఉండు. బిడ్డా! సర్వదా ప్రపంచాతీతుడవై ఉండు. ప్రపంచస్వరూపుడవై ఆస్వాదించు.

❖❖❖

# 3. ఎవరీ రచయిత?

**శ్రీరాముడు :** హే మహర్షీ! మేము వస్తుదృష్టి నుంచి వైతొలగి ఆత్మ దృష్టికి చేరినప్పుడుకదా ముక్తి! అది సుసాధ్యమేనంటారా? దృష్టిని జ్ఞానమయం చేయటమెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! "ఇది ఉత్తమోత్తమమైన వజ్రం" – అని తెలిసిన తరువాత ఏదైనా త్యజించి అద్దానిని పొందాలని జనులు అనుకోవటం సహజమే కదా! విచారణదృష్టితో ఈ జగత్తును గమనిస్తున్న ఉత్తమ పరిశీలనపరులు ఇందలి సత్యాసత్యమేమిటో గ్రహిస్తున్నారు. ద్వైతత్యాగం చేసి ఆత్మ స్వరూపమగు ముక్తిని స్వభావంగా ఆకాంక్షిస్తున్నారు. పొందుచున్నారు.

నేనే ఆకాశమును. నేనే సూర్యుడను. దైత్యులు, దేవతలు, ఆ దేవతలు ఉండే స్వర్గలోకం నేనే! మేఘమండలం, పృథివి, సముద్రం, ధూళి, అగ్ని కూడా నేనే. వెయ్యి మాటలు అనవసరం. ఈ జగత్తంతా నేనే... ఈ ముల్లోకములందు ఆత్మ అయినట్టి నేను మాత్రమే సత్యమై ఉన్నాను... ఆత్మయే అయి ఉన్న నేను పరిచ్ఛిన్నుడను ఎట్లా అవుతాను నాకు అన్యమైనదంటూ, ఈ దేహంతో సహా ఈ మూడులోకాలలో ఏదీ లేదు...

ఇట్లు విచారణ చేసి నిశ్చింతుడవై ఉండు. జగత్తంతా ఆత్మమయమై ఉండగా... అట్లు గాంచటంలో ఏం కష్టం? అట్టి సంభావనను కించిత్ అలవరచుకుంటే ఇక నీవు హర్షశోకములకు వశుడవు గావు. అవి నిన్ను ఏమాత్రం ఓడించలేవు. కనీసం స్పర్శించనైనా లేవు.

**తన్మయేఽస్మిన్కిల జగత్యఖిలే సంస్థితేఽనఘ ।**
**కిమాత్మయం పరం కిం స్యాత్కమలేక్షణ కథ్యతామ్ ॥** (శ్లో 7, సర్గ 73)

ఈ జగత్తులో ఏదేది ఎట్లు తారసపడినా సరే, ఆత్మజ్ఞానికి అదంతా తనకు అన్యమైనదిగా అనిపించదు. అందుచేతనే అతడు హర్షశోకాలు పొందడు. అజ్ఞుడు మాత్రమే వాటిని పొందుచున్నాడు.

❖

ఇంతకు ముందే మనం చెప్పుకొనియున్నట్టి మూడురకాల అహంకారదృష్టుల గురించి ... ఈ సందర్భంలో ఉచితం కనుక, మరల ప్రస్తావిస్తున్నాను విను–

**1. 'నకించిదహమ్' దృష్టి -** "నేను ఆకాశము కంటే కూడా అత్యంత సూక్ష్మమైనవాడను. ఈ సర్వలోకములలోని ప్రతి ఒక్క పదార్థమునకు పరమైనట్టి చిత్ స్వరూపమగు ఆత్మయే నేను" – అను దృష్టిని 'న కించిదహమ్ దృష్టి' అని పిలుస్తున్నారు. అట్టి దృష్టిని పెంపొందించుకున్న సాధకుడు "నేను ఒక పదార్థమునే కాదు కదా! ఇక నన్ను ఏది ఎట్లా బంధించగలుగుతుంది?" – అను వివేకమును సముపార్జించుకుంటున్నాడు. "పదార్థమునకు పరిమితులుంటాయి. పదార్థము లన్నిటికీ పరము, అప్రమేయము అయినట్టి నేను స్వభావసిద్ధంగానే అపరిమితుడను" – అను ఔన్నత్యదృష్టిని తత్త్వజ్ఞాని సంతరించుకుంటున్నాడు.

**2. సర్వత్ర సర్వమహమ్ దృష్టి -** "ఆత్మయే సర్వమై అంతటా వ్యాపించి, అన్నీ తానే అయి ఉంటోంది. నేను ఆత్మను కాబట్టి ...అన్నిటా వ్యాపించి, అంతయూ అయి ఉన్నది నేనే. నేలపై ఆహారం కొరకై అటూ ఇటూ తిరుగుచున్న ఒక పురుగు దగ్గర నుండి, ఈ మూడు లోకములనూ పరిపాలించి శాసిస్తున్న త్రిమూర్తుల వరకు ప్రసరించియున్నది నేనే." ఇక ఈ దృష్టిని అవలంబిస్తున్న సాధనపరులకు దుఃఖం ఎక్కడి నుండి రాగలదు చెప్పు?

**3. "ఇదమ్ దేహమహమ్" దృష్టి -** ఈ మూడవది అతి తుచ్ఛమైన దృష్టి. "ఈ దేహమే నేను" – అను భావన (లేక) దృష్టి (లేక) అహంకారము సర్వదుఃఖములకు, అశాంతులకు కారణమగుచున్నది.

❖

ప్రియమైన రామచంద్రా! నీవు ఈ మూడవ అహంకారమును మొదటి రెండిటితో, లేక ఆ రెండిటిని ఒక దాని సహాయంతో మొదలంట్ల త్యజించి వేయాలి. అప్పుడు నీయందు నిరహంభావ రూపమైనట్టి చిన్మాత్రము శేషిస్తుంది. అద్దానినే అవలంబించు. అద్దాని యందు తత్పరుడవై ఉండు.

ఆత్మ సర్వదా సర్వమునకు అతీతమైనదైనప్పటికీ, సర్వసత్తలకు పరమైనప్పటికీ, అయ్యది తనయొక్క మాయా శక్తిచే ఈ జగత్తును స్వీకరించి పొందుచున్నది. దీనిని పరిపూర్ణమొనర్చుచూ, స్వయంప్రకాశరూపమై వెలుగొందుచున్నది. అందుచేత నాయనా! ఇక నీకు సందేహాలు అనవసరం. తాత్సారం చేయవలసిన పనిలేదు. ఇప్పటికిప్పుడే "నిత్యోదితమగు ఆత్మయే నేను" అనే నిత్యానుభవాన్ని ఇప్పుడే గ్రహించు. అట్టి ఎరుక – దృఢనిశ్చయములచే 'దేహము, దేహసంబంధములు' మొదలైన వాసనలతో కూడుకునియున్న నీ హృదయగ్రంథిని త్యజించు.

**అనుభవం -** అయితే ఒక్క విషయం. మనం ఎంతో వివరంగా ఈ 14 రోజులుగా అనేక విషయాలు చెప్పుకుంటున్నాం ఈ మన సంవాదం మరికొన్ని రోజులు కొనసాగబోతోంది. మంచిదే. అయితే, ఆత్మ అనుమాన శబ్దప్రమాణములచే పొందబడేది కాదు మరి! సర్వదా, సర్వవిధములా సర్వరూపమైనట్టి ఆత్మ స్వానుభవము చేతనే ప్రత్యక్షం కాగలదని గ్రహించు. అందుకుగాను ఈ జీవుడు ఈ ఉపాధిచే ఏర్పడే సర్వ సంబంధములను, సర్వసందర్భములను అధిగమించ గల ఒకానొక సమగ్రమైన దృష్టిని సముపార్జించాలి. అదియే ఉపాధిని జయించటం, లేక త్యజించటం కూడా. ఉపాధికి సంబంధించిన కర్తృత్వ వృత్తితో కూడిన అంతఃకరణమును పరిశుద్ధపరచుకోవాలి. అందుకు మార్గం ఉత్తమమైన పరిశీలనయే. అనుమాన, ఉపమాన, శబ్ద ప్రమాణముల సహాయంతో ఉదయించగల జ్ఞానం నిన్ను భగవంతుడగు ఆత్మగా శేషింపజేయగలుగుతుంది. ఆ జ్ఞానం అణువణువునా ప్రవేశించి నిరంతరానుభవంగా రూపుదిద్దుకోవాలి సుమా!

❖

దేవదేవుడగు ఆత్మ సత్తు కాదు... అసత్తు కూడా కాదు. అణురూపం కాదు... బృహద్రూపం కూడా కాదు. సదసత్తుల మధ్య గల సత్యాసత్య స్వరూపం కూడా కాదు. కానీ... "సర్వం అదియే."

అదెట్లా అంటావా? ఒక జీవుడు ఒకనికి తండ్రి మరొకరికి కుమారుడు, ఇంకొకరికి భర్త, వేరొకరికి మిత్రుడు... అన్నీ అతనే గాని, వాటిలో ఏ ఒక్కటీ అతనిని నిర్వచించలేవు కదా! ఇది కూడా అట్టిదే.

ఆత్మ గురించి అనేక మాటలలో చెప్పుకుంటున్నాం. కాని యథార్థానికి అది వచించటానికి అలవి అయ్యేది కాదు. దానికి అన్యమైనదేదీ లేదు. కాబట్టి, ఇది గమనిస్తూనే, అత్యంత శ్రద్ధతో కూడిన శ్రోతవై నీవు సర్వత్రా నిర్వికారమగు ఆత్మనే దర్శిస్తూ ఉండు.

**శ్రీరాముడు :** స్వామీ! ఇంతకీ ఈ ఎదురుగా కనబడే అనాత్మ రచయిత ఎవరు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'ఇది ఆత్మ – ఇది ఆత్మ కాదు' అనునట్టి ఈ నామరూప విభాగమంతా ఆత్మయే సర్వవ్యాపకమగు తన అజ్ఞానశక్తిచే తనయందు కల్పించుకొనుచున్నది.

**సంస్థితః స హి సర్వత్ర త్రిషు కాలేషు భాస్కరః ।**
**సూక్షత్వాత్సుమహత్వాచ్చ కేవలం న విభావ్యతే ॥** (శ్లో 20, సర్గ 73)

ప్రకాశవంతమగు ఆ ఆత్మ త్రికాలములందు ఎల్లెడలా స్థితి కలిగియే ఉన్నది. అయితే అది అతి సూక్ష్మము, మహత్తరము కదా! అందుచేత స్థూలములగు ఈ దేహాదులందు ఆసక్తబుద్ధి గల మనుజులకు అది భావించటానికి అశక్యమై ఉంటోంది. ప్రయత్నించనివారికి అది అసంగతం గాను, అయోమయం గాను ఉండిపోతోంది. ప్రయత్నించేవానికో... అతిసులభం!

స్వప్న ద్రష్ట స్వప్నాంతర్గత సర్వపదార్థములలోను నిండి ఉన్నాడు కదా! అట్లాగే ఆత్మ సృష్టి అంతా – సర్వపదార్థములందూ నిండియున్నది. కాని స్వభావ వశంచేత 'బుద్ధి' (లేక) 'లింగశరీరము' నందు మాత్రమే ప్రతిబింబితమగుచున్నది. నీవు నిట్టనిలువుగా నిలబడ్డావనుకో... ఎదురుగా మరొక చోట చూచేవారికి కనిపించవు. కానీ ఆ ఎదురుగా ఒక నిలువుటద్దం అమర్చినప్పుడు అందులో ప్రతిబింబించుతావు. అనగా, అద్దం అక్కడ లేనప్పుడు కూడా నీ బింబం ప్రసరిస్తున్నప్పటికీ, నిలువుటద్దం లేనప్పుడు నీ రూపం అక్కడ చూడలేం కదా! ఆత్మ కూడా అంతటా ప్రసరించుతూ కూడా పుర్యష్టకము లేక లింగశరీరము (Subtle body) ఉన్న చోటే ప్రతిబింబిస్తోంది. గాలి అంతటా నిండి ఉన్నప్పటికీ, దాని ఉనికి తెలిసిరాదు. కాని వింజామరలు వీచినప్పుడు గాలి యొక్క ఉనికి స్పర్శకు లభ్యమగుచున్నది.

ఆత్మ అంతటా ఉన్నప్పటికి లింగదేహం ఉన్నచోట అహంకార రూపమున వ్యక్తమై అనుభూత మగుచున్నది. చిత్స్వరూపమై, సర్వవ్యాపకమైనట్టి ఆత్మ దేహము లందు మాత్రమే ఉన్నదను మాట సమగ్రం కాదు. అయితే వాయువు వీస్తున్నప్పుడు ధూళి ఎగురుచున్నట్లు, లింగదేహము ఉన్నచోట జీవుడుగా స్ఫురించుచున్నది. ఆకాశంలో సూర్యుడు ఉదయించినంత మాత్రం చేత జనులు నిదురలేచి తమ దైనందిన కార్యక్రమములు ప్రారంభించుకుంటున్నారు. పరమప్రేమాస్పదమై, నిరతిశయానంద రూపమైనట్టి ఆత్మ స్ఫురించినప్పుడే లింగ శరీరమున విషయభోగేచ్ఛ సంభవమగుచున్నది.

సర్వమూ ఉన్నది ఆత్మ యొక్క ప్రీతి కొరకే!

సూర్యోదయానంతరం జనులు ఆయా కార్యక్రమములు ప్రారంభిస్తున్నప్పుడు, ఆ కార్యములు ఫలించటం, విఫలం కావటం సూర్యునికి హాని వృద్ధులు కలిగించవు కదా! ఆత్మ దేవుని సత్తచే స్థితి పొంది ఉంటున్నట్టి ఈ దేహము ప్రవృద్ధమగుచున్నప్పటికీ (లేక) నశించినప్పటికీ ఆత్మకు ఏ హాని వృద్ధులూ ఉండవు.

ప్రాణికోట్లన్నిటి యొక్క ఆత్మ ఏ కాలమందూ కూడా జనించుటలేదు, మరణించుట లేదు. అది దేనినీ గ్రహించదు, వాంఛించదు. దానికి బంధము గాని, ముక్తి గాని లేవు. అది స్వయముగా అవధరించి అనాత్మయందు ఆత్మత్వము దర్శించుచూ, రజ్జు–సర్ప భ్రాంతిలాగా "ఈ దేహం మాత్రమే నేను. ఈ దేహము నా ఉనికి" అనే భ్రాంతి పొందుతోంది. అట్టి భ్రాంతి పొందుచున్నప్పుడు అది దుఃఖ భాజకము అవుతోంది.

ఏది ఏమైనా అనాదియగు ఆత్మ ఎన్నడూ ఉత్పన్నము కాలేదు. కాబట్టి నశించుట కూడా లేదు. అది తనకు భిన్నమైనదేదీ వాంఛించటం లేదు. దానికి భిన్నంగా ఏదైనా ఉంటే కదా... వాంఛించటానికి? అది దేశ కాలములచే అపరిచ్ఛిన్నము. కనుక బంధింపబడజాలదు. బంధమే లేని దానికి ముక్తి ఎక్కడిది? అది స్వస్థానము నుండి చ్యుతి పొందుటయే లేదు. కానీ, అవిచారణవశం చేత మూఢులగు జనులు, పాపం, నిష్కారణంగా దుఃఖం పొందుచున్నారు. ఆత్మ కొరకై ఎక్కడెక్కడో వెతుకుచున్నారు.

ఓ రామా! నీవు చక్కగా ఈ జగత్ క్రమము యొక్క పూర్వాపరములను విచారణచేయి. అంతే గాని, మూఢునిలాగా వ్యర్థంగా దుఃఖం పొందవద్దు.

❖

విజ్ఞుడైనవాడు బంధమోక్షములు అనే రెండుకల్పనలనూ త్యజించివేస్తున్నాడు. ఆత్మస్థుడై అంతరంగంలో ఒక యంత్రంలాగా మౌనముతో వ్యవహరిస్తున్నాడు.

**న మోక్షో నభసః పృష్ఠే న పాతాలే న భూతలే ।**
**మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్ ॥** (శ్లో 35, సర్గ 73)

ఓ జనులారా! మోక్షము అనబడేది ఎక్కడో ఆకాశంలో గాని, పాతాళంలో గాని, భూతలమందు గాని లేదు. ఉత్తమ ఆత్మ జ్ఞానముతో బోధితమగుచున్న నిర్మల చిత్తమే మోక్షం. ఒకానొకడు సర్వవాంఛిత పదార్థముల పట్ల ఆసక్తి త్యజించాడనుకో... అట్లు ఆసక్తి మొదలంట తొలగుటచే సంభవించే చిత్తము యొక్క 'స్వవినాశనం' లేక చిత్తరాహిత్యం 'మోక్షము' అనే శబ్దంతో ఆత్మజ్ఞులు ఉద్దేశిస్తున్నారు.

నిర్మల ఆత్మజ్ఞానం కలుగనంతవరకూ ఈ జీవుడు దీనుడుగానే ఉంటాడు. లేక "నాకు మోక్షము కలుగు గాక!" అను అభిలాషాసక్తుడై ఉంటాడు. చిత్తము బ్రహ్మత్వదశను పొందినప్పుడు, ఇక, ఆతనికి వేరే మోక్షమనబడేదేదీ అవసరమై ఉండదు.

ఓ సంసారాతీతమైన స్వరూపము కలవాడా! రామచంద్రా! 'ఇది బంధము, ఇది మోక్షము' అనే తుచ్ఛకల్పనను నీవు త్యజించు. మహాత్యాగము అవధరించియుండుటచే నీవు మోక్షరూపుడవై ఉంటావు. సర్వ వికల్పములు నశించిపోగా అంతఃసంగరాహిత్యముచే నిత్యోదితమైన శోభ కలిగి ఉండు. యథారీతిగా ఈ భూమండలమున దీప్తించే మణివై వెలుగొందుము.

❖❖❖

# 4. ఆశా రాహిత్యం

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ స్థూల-సూక్ష్మ శరీరములన్నీ ఎందుకు, ఎప్పటి నుంచి, ఎట్లు ఉత్పన్న మవుతున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** (చిరునవ్వుతో) నీ ప్రశ్నకు ఒకవిధంగా సమాధానం చెప్పాలంటే... "కామ్య కర్మ వాసనలే!"

ఆత్మ తన ప్రేమాస్పదమగు స్వరూపమును ఏమరచినప్పుడు ఈ కామ్య కర్మ వాసనల క్రమముతో కూడిన సృష్టి అంతా పెంపొందుతోంది. తత్ఫలితంగా ఈ స్థూల-సూక్ష్మ-వ్యష్టి-సమష్టి శరీరములన్నీ ఉత్పన్నం అవుతున్నాయి. కొంచెం కల్లు సేవిస్తే గొప్పమత్తు వచ్చిపడుతుంది చూచావా? ఈ స్థూల-సూక్ష్మ-వ్యష్టి సమష్టి శరీరాలతో కొంచం అహంభావం ఏర్పడితే చాలు... అతి విశాలమగు మాయ తనంతట తానే జనిస్తోంది. ఆత్మ యొక్క 'అన్యథా' భావం చేత మాయ వచ్చిపడుతోంది. ఇక ఆపై పుణ్య, పాపవాసనలతో కూడిన అనర్థ పరంపర ప్రకటితమౌతోంది. ఆ అనర్థము నుండి వికారయుక్తమైన ఈ జగత్తంతా ఉత్పన్నమై ఎదురుగా నిలుస్తోంది. మహాసముద్రంలో కెరటములు, బుడగలు, సుడులు ఏర్పడుచున్నట్లు ఆత్మ మహాసముద్రంలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, వాసన, ఇంద్రియములు మొదలైనవి కల్పిత నామధేయములతో స్ఫురిస్తున్నాయి.

**మనస్సు :** పదార్థముల గురించి మననం చేయటం.

**చిత్తము :** పదార్థములయొక్క స్ఫురణ కలిగిఉండటం.

**బుద్ధి :** పదార్థములను నిర్వచించటం, నిశ్చయించటం.

**అహంకారం :** పదార్థములను అభిమానించటం.

**చిత్తాహంకార యోర్ద్విత్వం వచస్యస్తి న వస్తుతః ।**
**యచ్చిత్తం సహ్యహంకారో యోఽహంకారో మనోహితత్ ॥** (శ్లో 5, సర్గ 74)

ఇవన్నీ ఒకే అంతఃకరణము యొక్క వివిధ పేర్లే కదా! అయితే, చిత్తము - అహంకారములకు మాటలోనే గాని భేదమేమీ లేదు. ఏది చిత్తమో, అదే అహంకారం కూడా! మంచు, తెలుపుదనం వేరు వేరైనవా? ఆ రెండిటిని విడదీసి చూడగలమా? అట్లాగే ... మిగతావి కూడా!

వస్త్రం నశిస్తే, దాని రంగు కూడా నశిస్తుంది కదా! ...మనస్సు, అహంకారములలో ఒకటి నశిస్తే రెండవది కూడా నాశనం పొందుతోంది.

**శ్రీరాముడు :** మనస్సు, అహంకారం నశిస్తేనే మోక్షం కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మనస్సు ఉండటం, దానిని వదలటం - అవన్నీ చిన్న పిల్లల ముద్దు మాటల వంటివి మాత్రమే. బిడ్డా! నీ స్వరూపం దేనిచేతా ఎన్నడూ బంధింపబడని ఆత్మయే అయి ఉండగా, మనస్సు అనబడేదేదో నిన్ను బంధించటమేమిటి? నీవు దానినుండి విముక్తికై దేవులాడటమేమిటి? కాబట్టి, నీవు తుచ్ఛమగు "నేను ఈ మనస్సును కట్టేసి ఆపై ఇప్పుడు మోక్షం పొందవలసియున్నది" అను పట్టుదల రూపంలో ఏర్పడుచున్న మోక్షబుద్ధినికూడా నిస్సంకోచంగా వదిలి వేయవయ్యా! 'నాకు బంధం కలదు' అనే బంధబుద్ధిని, "ధన-ధార పుత్రాదులగురించి ఏర్పడే ఆశ నిరాశలచే బంధించబడే నిస్సహాయ పదార్థమును" అనే నిస్తేజకల్పనలను సుదూరంగా అట్టేబెట్టు. "నాకు మోక్షం కలుగ వలసియున్నది" అనే భవిష్యత్ ప్రాప్తబుద్ధి మనస్సులో ఉన్నంత కాలం సంసారమునకు సంబంధించిన ఛాయలు ఏర్పడి ఉన్నట్లేనని గ్రహించు.

ఉన్న రహస్యమంతా మనస్సులోనే ఉన్నది. మనస్సు ఉత్కంఠితము (Inquisitively emotional) అగుచూ ఉండగా, క్రమంగా అది ఈ దేహాకారమును ధరించుచున్నది. ఫలితంగా... సర్వ దోషములూ వచ్చిపడుచున్నాయి.

**శ్రీరాముడు :** అయితే బంధమోక్షములనబడేవి లేవంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మహత్తరము అద్వితీయమూ అగు ఆత్మ సర్వమునకు అతీతమై ఉండి సర్వమునందు సర్వదా వ్యాపించి ఉండగా, ఇక బంధమెవరికి? మోక్షమెవరికి? అందుచేత మోక్షం విషయం అట్లా ఉంచి, ముందు నీ మనస్సును ఇంద్రియ విషయ మననరహితం, అఖండాత్మమననసహితం చేయి.

❖

ప్రాణవాయువు చలనధర్మం కలిగి ఉన్నది కదా! అది ఈ శరీరమున చలింపజేస్తూ ఉండగా ఈ హస్తపాద నాలుకలు తదితర అంగములు రసభరితమై చలిస్తున్నాయి. అవయవములను ప్రాణవాయువులే చలింపజేస్తున్నాయి. అయితే... సర్వవ్యాపియగు చైతన్యము తాను చలించదు. దేని చేతా చలింపబడదు.

దీపం సర్వపదార్థములను ప్రకాశింపజేస్తూ తాను యథారీతిగానే వుంటున్నట్లు, చైతన్యము సర్వ పదార్థములందు ప్రతిబింబించుచూ తాను స్వస్వరూపమునందే నెలకొని ఉంటోంది. అది జ్ఞానము ద్వారా సర్వమును ప్రకాశింపజేస్తోంది.

ఒకవైపు చైతన్యము అప్రమేయమై, నిత్యమై, జ్ఞానస్వరూపమై, శుద్ధమై వెలుగొందుచుండగా ... అల్పబుద్ధులగు సంసార జీవులు 'ఈ దేహములే మేము.. ఇవి మా అంగములు. అవి మా ధనములు' ధనములు మొదలైన దుఃఖదాయకమగు మిథ్యామోహం ఆశ్రయిస్తున్నారు. మా ప్రకటన, నినాదములపట్ల ఏమీ విననట్లే ఉంటున్నారు. ఎందుకోమరి?

కేవలాత్మ (The Absolute self)కు విరుద్ధమైన ధర్మములు గల ఈ దేహము నందు, జలంతో తరంగముల లాగా, రాగము మొదలైనవి ఏర్పడి ఉంటున్నాయి. అట్టి రాగాదులచే ఆవరించబడిన అనిత్యదృష్టిచే క్రమంగా ఎరుగబడేవి, పొందబడేవి, పరిణమించేవి.. మొదలైన క్రియాక్రమములన్నీ సంప్రాప్తిస్తున్నాయి.

మృగతృష్ణ ఎందుకు కనబడుతోంది. ఎండ, వేడిమి, గాలి వీచికల ప్రతిబింబముల కలయిక ధర్మములు తెలియకపోవటం చేతనే కదా! ఆత్మయొక్క ధర్మము తెలియక పోవటం చేతనే 'నేను పుట్టాను, పుట్టేవాడను, కర్తను,. భోక్తను' మొదలైన మిథ్యావాసనలు కలుగుచున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! మనస్సు ఎందుకు మిథ్యావాసన వైపు ఈడ్వబడుతోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవిద్యను మిథ్యగాగాక, సత్యముగా తలచటం చేతనే ఆ మార్గంలో మనస్సు ఈడ్వబడుతోంది. మనస్సు ప్రమత్త (Passive & Dull) అయినప్పుడు శబ్ద స్పర్శాది విషయముల వైపు పయనిస్తోంది. విషయాభిలాషితమైన మనస్సు అవిద్యను ఆశ్రయిస్తోంది. ఆ అవిద్యను తనకు అనుభవప్రదాత (Source of experience)గా స్వయముగా తీర్చిదిద్దుకుంటోంది. కాబట్టి స్వయం

కల్పితమే అవిద్య. అంతేగాని దానిని మరెవరో ఈ మనస్సుకు అందిస్తున్నది కాదు. ఈ అవిద్య మిథ్యా రూపములుగా ఎరుగబడు గాక! అట్లు ఎరుగబడిన మరుక్షణం అది స్వయంగా నశించి ఎటకో చిత్తగిస్తుంది. "అది మృగతృష్ణయే" అని తెలిసిపోయిన తరువాత అక్కడకు వెళ్ళి "ఇక్కడ జలం ఉండాలే? ఏమైపోయింది?" అనే వాక్యం ఉత్పన్నం కాదు కదా! తెలుసుకొనబడిన తరువాత అవిద్య మనస్సును ఈడ్వజాలదు.

❖

చీకటి పోవటానికి దీపం వెలిగిస్తే చీకటి స్వయంగానే తొలగుతుంది చూచావా? ఆత్మజ్ఞానం ఉదయించిన మరుక్షణం వాసనలన్నీ వాటంతట అవే తొలగుతాయి.

**శ్రీరాముడు :** అవిద్య మొదలంటా తొలగాలంటే ఉపాయమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** నీవు ఆయా అధ్యాత్మ శాస్త్రములందిస్తున్న యుక్తులచే "అవిద్య లేదు" అను నిశ్చయం పొందావనుకో, అప్పుడు అవిద్యను నశింపజేయగలుగుతావు. అందుచేత రామా! సింహము బోనును పగలగొట్టి బయల్వెడలునట్లు – నీవు అవిద్యా నిర్మూలనం చేయాలి. "జడమగు ఈ దేహం కొరకై ఏర్పడి ఉన్న భోగాలతో నాకేమి పని?" – అనే నిశ్చయమును పెంపొందించుకోవాలి. అట్టి నిశ్చయం యొక్క బలంతో దృశ్యమునందు నీకు ఏర్పడే ఆశ అను దానిని నశింపజేయాలి.

**ఆశాపరికరే రామ నూనం పరిహృతే హృదా ।**
**పుమానాగతసౌన్దర్యో హ్లాదమాయాతి చన్ద్రవత్ ॥** (శ్లో 24, సర్గ 74)

అప్పుడు ఆశ యొక్క పరివారమైన దేహాభిమానం, కామక్రోధాదులు తొలగుతాయి. తన ప్రయత్నముచే సుందరగుణములు సంపాదించుకున్న మనుజుడు తాను ప్రసన్నుడగుచూ, తదితర పరిసరములను కూడా ప్రసన్నం చేయగలుగుతాడు. అట్టి జ్ఞాని అధిక శోభాన్వితుడై మహద్రూపముచే తన యందు తానే ఇముడక... అపరిచ్ఛిన్నుడై ఉంటాడు. స్వాత్మయందు ప్రశాంతుడై, క్షోభావర్జితుడై, సుస్థిరుడై అత్యంత ధైర్యపూర్వకమైన మోక్షలక్ష్మితో శోభిల్లుతూ ఉంటాడు. అమృతము త్రాగిన వాని వలె, కుండలో వెలిగేదీపంలాగా దేదీప్యమానమైన మణిలాగా ఆత్మ జ్ఞాన ప్రకాశంతో శోభిల్లుతాడు. సర్వాత్మకుడై, సర్వవ్యాపకుడై, సర్వేశుడై, సర్వాకారుడై, నిర్వికారుడై ఎల్లప్పుడూ ఆత్మనే వీక్షిస్తూంటాడు.

ఆ స్థితిలో ఆతడు ఒక్కసారి తన గడచిపోయిన రోజులలోని చంచల చిత్తమును చూచి నవ్వుకుంటూ ఉంటాడు.

విషయసంగమును వీడుటచే, అభిమాన – సంతాపములను అధిగమించుటచే ఆతడు పవిత్ర చిత్తుడౌతాడు. ఆత్మయందు మాత్రమే ప్రీతి కలిగి ఉంటాడు. 'కామము' అనే బురదను కడిగివేసుకొని ఉంటాడు. 'బంధము' అనే భ్రమను మొదలంట్ల నరికి వేస్తాడు. శీతోష్ణ, సుఖ దుఃఖాది ద్వంద్వముల నుండి విడివడినవాడై, ఈ సంసార సముద్రమును దాటివేస్తాడు. సర్వోత్తమమగు విశ్రాంతిని, సర్వాతీతము, అలభ్యము అగు స్థానమును పొందుతాడు. పునరాగమనరహితుడై మోక్షసామ్రాజ్యమును అలంకరిస్తాడు. మనోవాక్కాయములచే సర్వజనులూ అభిలషించే చరిత్ర కలిగి ఉంటున్నాడు.

అట్టి ఆత్మజ్ఞాని దేనినీ ద్వేషించడు. వాంఛించడు. ఆతనికి సుఖ దుఃఖాదులు ఉండవు. దేనినీ గ్రహించడు, తిరస్కరించడు. నిందించడు. స్తుతించడు. స్వస్వరూపము యొక్క ఆవిర్భావము గాని, తిరోభావముగాని పొందడు. ప్రసన్నుడుగాడు. దుఃఖితుడు కాదు. సర్వకార్యములను త్యజించినవాడై, సర్వోపాధివర్జితుడై, సర్వాశలనుండి వినిర్ముక్తుడై ఉంటాడు. అందుకే మనం ఆతనిని 'జీవన్ముక్తుడు' అని పిలుస్తున్నాం.

❖

ఓ రామచంద్రా! సర్వ ఈషణములను (All urges, desire) పరిత్యజించివేయి. జలధారను సంపూర్ణంగా విడచివైచిన మేఘంలాగా నీ చిత్తము మౌనం వహించి ఉండుగాక! ఆశారాహిత్యమును ఆశ్రయించి ఉండు.

ఆశారాహిత్యం గల అంతఃకరణంవలన కలిగే సుఖం ఈ స్వర్గ – మర్త్య – పాతాళములలో మరెక్కడా దొరికేది కాదయ్యా! నీయొక్క నైరాశ్యము (ఆశారాహిత్యం)చే ఈ జగత్తునంతటినీ ప్రశాంతమయం, శీతలం చేసివేయి. 'ఆశించుట' అను దురభ్యాసము నుండి విడివడిన మనస్సు కలిగినవాడవై ఉదారచిత్తుడవై, మౌనివై, జ్ఞానివై శోభించు. ఏదీ కోరనట్టి మనస్సు కలవాడవై, ఉదార – జ్ఞాన – మౌన శోభితుడవై ప్రకాశిస్తూ ఉండగా... అట్టి శోభకు వసంత సౌకుమార్యము కూడా దీటు రాదు సుమా!

ఆశయే లేని మనస్సు ఇచ్చే సుఖం త్రిలోకాధిపత్యంలో కూడా ఉండదు.

❖

ఓ సాధూ! నీకు రెండవరోజు సంవాదంలో చెప్పాను. కోరిక శమించటమే 'శమము' అని అంటాం. అట్టి శమము సంపాదించినవాని అంతఃకరణం శాంతమయమౌతుంది. అప్పుడు నీ పట్ల ఆపదలన్నీ క్షయిస్తాయి. అట్టి శమం, శాంతం, నైరాశ్యం అను పర్యాయపదాలచే అలంకృతుడవై అటుపై ఈ భూమినంతటినీ గోష్పద తుల్యంగా చూడు. లోకముల ఆధిపత్యమును కూడా తృణ ప్రాయంగా దర్శించు.

ఈ మనుజులలో అనేకులు ధన సంచయం, పుత్ర కళత్రాదులతో సమాగమం వస్త్రాలంకరణం, వస్తు సముదాయం, అన్నపానాది క్రియా పరంపరలు – గొప్పగొప్ప విషయాలుగా గాంచుచున్నారు. ఆశలన్నిటినీ అధిగమించియున్న మహనీయులు ఆ వ్యవహారములన్నీ చూచి పకపకా నవ్వుకుంటు న్నారు. ఎవరి హృదయంలో 'ఆశ' అనే ఛాయ ఏర్పడటానికే జంకుతుందో... అట్టి మహనీయులతో మనం పోల్చగలిగినది ఈ ముల్లోకాలలో ఏదీ లేదు. "ఇది నాకు కావాలి,. అది నాకు వద్దు" అను రాగద్వేషములకు ఎవని చిత్తంలో చోటు దొరకదో... అట్టి స్వాధీన చిత్తుని గురించి చెప్పటానికి నా దగ్గిరున్న ఉపమాన–ఉపమేయాలన్నీ ఏమాత్రం సరిపోవు సుమా! అట్టివారు మా మహర్షులకు కూడా ప్రాతఃస్మరణీయులగుచున్నారు.

❖

అందుచేత రామా! నీకు మరల మరల గుర్తుచేస్తున్నాను. నీవు ఆశారాహిత్యమును అభ్యసించు. ఆశ్రయించు. అది సర్వసంకటవర్జితమని, పూర్ణసుఖస్వరూపమని బుద్ధియొక్క పరమసౌభాగ్యమని మహనీయులు ప్రవచిస్తున్నారు.

ఓ రాఘవా! అసలు ఇక్కడ తారసపడుచున్న ఆశతోగాని, నిరాశతోగాని నీకు (లేక, ఈ జీవునికి) ఏమాత్రం సంబంధం లేదు. ఎందుకంటే ఇక్కడ ఏర్పడివుండి ...నీకు ఆకర్షణ వికర్షణ కలుగజేస్తున్న ఈ జగత్తంతా స్వతఃగా మిథ్య మాత్రమే. ఇక నీవు వీటి పట్ల నాకు ఉండు గాక... లేకుండు గాక అను ప్రియాప్రియములకు సంబంధించిన కల్పనలతో ఎందుకు శ్రమించాలి చెప్పు?

ఓ సర్వజనులారా! నేను ఇంతగా బోధించిన తరువాత కూడా "ఈ దేహం, ఈ పదార్థాలు నావి. ఈ దేహము ఏర్పడుచున్న తరువాత సిద్ధిస్తున్న వాటిచే నేను పరిమితుడను" అను దృష్టిని వదలటానికి ప్రయత్నించక పోవటం ఉచితమేనా చెప్పండి? సద్వివేచన చేయమని నా ప్రార్థన.

❖

**ఆత్మైవేదం జగత్సర్వం నానాతేహ న విద్యతే ।**
**ఏకరూపం జగజ్ఞాత్వా ధీరైర్నామ న ఖద్యతే ॥** (శ్లో 54, సర్గ 74)

ఓ రామా!ఈ ప్రపంచమంతా ఆత్మయే. ఇక్కడ అనేకత్వమనునదే లేదు. మీరు ఏకమైన ఆత్మ రూపంగా ఈ జగత్తును ఎరిగి ఈ జగత్తును ధీరస్వభావులైన వారు ఎలాంటి ఖేదమొందక ఉన్నారు.

ఓ రాఘవా! "ఈ పదార్థములన్నీ యథార్థదర్శనముచే ఆత్మ రూపంగానే తెలియవస్తున్నాయి" అని నీవు నీ బుద్ధికి మరల మరల గుర్తు చేయి. అప్పుడది అకృత్రిమమైన పరమ ధైర్యం పొందుతుంది. నిజమైన ఆశారాహిత్యం ఉదయిస్తుంది. ఇక ఆపై భావాభావకల్పితరహితుడవై... సర్వ వస్తువుల ఆద్యంతములందు ఉన్నట్టి 'సత్ చిన్మాత్రము' ను మాత్రమే అవలంబించి వుండు. ఇదీ నీవు ఈ జగత్తును గాంచవలసిన విధానం సుమా!

సింహమును చూడగానే లేడి ఏం చేస్తుంది? ఎక్కడికో దూరంగా పారిపోతుంది కదా! వైరాగ్యంచే ధీరమైనట్టి మనస్సు గలవానిని చూచి "రాగ-ద్వేష-ఆవేశ-భ్రమ-ఉద్వేగ-ఆశ-నిరాశాది భావనోద్రేక" - భరితమైన ఈ సంసారం తోక ముడిచి ఎక్కడికో పారిపోతోంది. ధీరబుద్ధి గల ఆత్మ జ్ఞాని ఒక కామోన్మత్త అయిన అతి సుకుమార స్త్రీని, శిథిలమైన శిలా విగ్రహమును ఒకేరకంగా చూస్తాడు. అందుచేత విషయభోగాలు ఆనందింపజేయటం గాని, ఆపదలు ఖిన్నపరచటం గాని జరుగదు. ఈ దృశ్య వైభవమంతా కలసి ఏకమై దండయాత్ర చేసినా సరే ....ఆతనిని స్వాత్మ నుండి తొలగించలేవు. ఆతని ఉదార బుద్ధి ఇక్కడి మోహాలను క్షణంలో చూర్ణం చేసివేస్తుంది. రాగ ద్వేషా దులు ఆతనిని ఆక్రమించలేవు. చలింపజేయలేవు, తానే వాటిని ఆక్రమించి అధిగమించి ఉంటాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు మాకు విడమర్చి చెప్పుచున్న ఆత్మజ్ఞుల దృష్టి మాకు ఎంతోసంతోషమును, ఉత్సాహమును కలుగుజేస్తోంది. మేమంతా పూర్ణ జ్ఞానులుగా తీర్చిదిద్దబడటమే ఈ సంసారమును

అధిగమించటానికి తరుణోపాయం కదా! అందుచేత జ్ఞానుల దృష్టి అవగాహన, కార్యక్రమముల గురించి మీ నుంచి ఎంతైనా మేము వినవలసిందే. అందుచేత, ఆత్మజ్ఞానుల జగత్ సందర్శనం గురించి మరికొంత వివరించండి.

❖❖❖

# 5. జ్ఞాన సందర్శనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** జ్ఞాని యొక్క జగత్ సందర్శనం గురించి మనం అనేక మార్లు చెప్పుకుంటూనే ఉన్నాం. అయినా కూడా మరల మరల విశదీకరించుకోవటం అవసరమే.

ఆతడు దేనిపట్లా ప్రీతి గొనడు. విజ్ఞాన దృష్టిని వదలడు. క్షోభను దరిజేరనీయడు. అనాసక్తతను బలపరుచుకుంటూ ఉంటాడు. దేహాతీతత్వం అవధరిస్తూ ఉంటాడు. వికారరహితుడు, నిరంతర ఆత్మసంలగ్నధ్యానమయుడు అయి ఉంటాడు. సర్వముచే అస్పృశ్యుడై ఉంటాడు.

**శ్రీరాముడు :** మీరు ఉపయోగించిన విశేషణములు – 1. అప్రీతి 2. విజ్ఞాన దృష్టి 3. అనాసక్తత 4. దేహాతీతత్వం 5. వికారరాహిత్యం 6. అస్పృశ్యత్వం – గురించి కొంచెం వివరించి చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** సరే. నీవు కోరినట్లు కొంచం వివరించి చెపుతాను విను –

**ప్రీతి గొనకపోవటం –** జ్ఞాని ఒక లతను–సుందర స్త్రీని, మట్టిని–బంగారాన్ని, నచ్చేవాటిని–నచ్చనివాటిని ఒకే రీతిగా చూస్తాడు. ఉభయ సమయములలోనూ నిర్వికారుడై, నిర్లిప్తుడై ఒక పర్వతంలాగా స్థిరాకృతితో ఉంటాడు. పవిత్రమైన ఆశయం, కార్యక్రమంతో ప్రయాణం చేస్తున్న ఒక బాటసారి రహదారి ప్రక్కన కనబడిన శ్మశానమును చూచినప్పుడు ఆతనికి దానిపట్ల ప్రీతి కలుగుతుందా? జ్ఞాని ఇక్కడ కనబడే సందర్భముల పట్ల, భోగములపట్ల ఏమాత్రం ప్రీతి గొనడు.

**విజ్ఞాన దృష్టి కలిగి ఉండటం! -** కళ్ళు తెరిచినంత మాత్రం చేత మరే విశేషప్రయత్నం లేకుండానే ఎదురుగా ఉన్న వెలుతురు కనబడుతుంది కదా! ఆత్మజ్ఞాని ప్రవాహపతితంగా వచ్చిపోతున్న ఆయా సంఘనలను, సందర్భములను, భోగసముదాయమును సక్తత లేని చిత్తంతో లీలామాత్రంగా అనుభవిస్తాడు. కాకతాళీయంగా తారస పడే ఈ వనిత, ధనము మొదలైన భోగములు అనుభవించ వలసి వస్తున్నప్పటికీ, ధీరునకు అవి సంతోషమునుగాని, దుఃఖమునుగాని కలిగించలేవు. సముద్ర మధ్యంలో స్థిరంగా ఉన్న పర్వతాన్ని ఓ రెండు కెరటాలువచ్చి తాకినంత మాత్రం చేత అవి పర్వతమును కదిలించగలవా? ఆత్మ యొక్క ప్రత్యక్షమును ఏకాగ్రతతో దర్శించుచున్నట్టి తత్త్వజ్ఞానిని ఈ దృశ్య ప్రపంచములో ఏర్పడుచున్న సుఖ దుఃఖములు తాకజాలవు. తాకినప్పటికీ, ఆతని ఆత్మ సందర్శనాన్ని ఏమాత్రం భంగపరచలేవు. ఆతడు ఎప్పటికి ఏది ప్రస్తుతమో... అదే నిర్వర్తించుచూ... ఆపై ఇక తన దృష్టినంతా ఆత్మజ్ఞాన మార్గంలో నియమించి ఉంచుతాడు.

**క్షోభ పొందకపోవటం! -** అనేక లోకములు నిర్మించవలసివచ్చుచున్నప్పటికీ ఆత్మ పరాయణుడగు బ్రహ్మదేవుడు వ్యగ్రుడగుచున్నాడా? ఆయా ఋతువులు వచ్చిపోతున్నప్పుడు పర్వతాలు ఏమైనా

క్షోభ పొందుచున్నాయా? లేదే! సర్వభూతస్థమై ఉన్న తన ఆత్మస్వరూపమును ఆశ్రయించి ఉన్నట్టి జ్ఞాని కూడా సమయోచితమైన క్రియాదులలో ఏర్పడే సంయోగ – వియోగములు చూచి వ్యగ్రుడుకాడు, క్షోభ చెందడు.

అందరిలాగానే ఆతడు కూడా నవ్వవలసినచోట నవ్వుతాడు, ఏడవవలసినచోట ఏడుస్తాడు. కాని, సర్వ విషయముల పట్ల 'ఇది మిథ్యయే కదా' అను అవగాహన, దృష్టులను వదలకుండా ఉంటాడు. అంతేకాదు. తదితరజనులకు అది గుర్తుచేస్తూ ఎంతో స్థైర్యం కలుగజేస్తాడు. భోగములను మిథ్యారూపంగా గాంచుచూ, కాఠిన్యం లేకుండా ... జితేంద్రియుడై సంతాప వర్జితుడై ఉంటాడు. దేశ కాల క్రమానుసారంగా సుఖము, దుఃఖము, సంపద, ఆపద – మొదలైన వాటి పట్ల నిర్లిప్తుడై, సాక్షీభూతుడై, అతీతుడై ఉంటాడు.

**అనాసక్తుడై ఉండటం! -** ఓ ప్రియ దశరథ రామా! ఈ శబ్దస్పర్శాది కర్మేంద్రియ వ్యాపార విషయాలలో పాల్గొనవలసి వచ్చినప్పటికీ, నీవు నిత్యమూ అనాసక్తుడవై ఉండు. వాటి యందు నీ చిత్తము అనాకర్షితమై ఉండు గాక! సంలగ్నం కాకుండు గాక!

అయితే... "ఈ బంగారం మలినమైనది" అని ఎప్పుడంటాం? బైట ధూళివంటివి ఉన్నప్పుడా? ...కాదు. లోపల రాగి వంటి అల్పలోహాలు ఉన్నప్పుడు మాత్రమే కదా!... అంతఃకరణంలో ఆసక్తి ఉన్నప్పుడు మాత్రమే "ఈ జీవుడు సక్తుడు" అని అనిపించుకుంటాడుగాని, బాహ్య కార్యక్రమములచే కాదని నీవు గ్రహించు.

**దేహముతో అప్రమేయత్వం వహించి ఉండటం! -** ఎప్పుడైతే ఈ దేహమును తనకు భిన్నమైనది గానూ, ఆత్మను వివేకదృష్టితోనూ మననపూర్వకంగా సందర్శిస్తూ ఉంటాడో, ఆతడు ఈ అవయవములు ఛేదించబడుచున్నప్పుడు కూడా అంతరంగంలో విక్షేపరహితుడై ఉంటున్నాడు. ఒక్కసారి నిర్మలజ్ఞానం సంపాదించావా.... ఇక ఆ ఆనందమయ వివేక దృష్టి నిన్ను విడచి ఎక్కడికీ పోదు.

**తిరోగమనం స్వీకరించకపోవటం!** (Non deviation - Non distraction) **–** 'నా స్వరూప స్వభావాలు సర్వదా ఆత్మయే. ఆత్మ ఇట్టిది" అని ఆత్మను ఎరిగినవాడు మరింకెప్పుడూ, ఎన్నటికీ అజ్ఞత్వం పొందడు. వర్షాకాలంలో పర్వతం మీద నుంచి జారి ప్రవహించిన జలం మరల వెనుకకు మరలుతుందా? త్రాడు పట్ల ఏర్పడిన 'ఇది పామేమో?" అనే భ్రాంతి తొలగిన తరువాత, ఆ త్రాడును చూచినప్పుడు భయం మొదలైన వికారములు ఏర్పడతాయా? అగ్ని యందు స్ఫుటం ఒనర్చబడిన బంగారం తన శుద్ధసహజ ఛాయ పొందిన తరువాత, దానిని నీళ్ళలో ముంచినంత మాత్రం చేత తన బంగారు కాంతులు పోగొట్టుకొంటుందా? చెట్టు నుండి తెగిజారిన పండును మరొకసారి కొమ్మకు అతికించినా కూడా, అతికి ఉండదు కదా? అట్లాగే "ఈ దృశ్యం స్వతఃగా అవాస్తవం" అనే సుజ్ఞానం నిశ్చలమైన తరువాత ఇక గుణములతో బంధం ఏర్పడదు. రాళ్ళగుట్టలోంచి మణిని వేరుచేసి మెడలో ధరించిన తరువాత, మరల ఆ మణిని రాళ్ళగుట్టలోకి విసరివేసే మూర్ఖుడెవడైనా ఉంటాడా? అవిద్య నుండి విద్యను ఎరిగిన తరువాత ఈ దృశ్యమునందు మరల ఎవడు మగ్నుడౌతాడు? సశాస్త్రీయమైన శివ తాండవం చూచిన తరువాత ఒక కోతి కుప్పిగంతులను చూచి ఆనందించేవాడెవ్వడో చెప్పు?

**దృశ్య వికార రాహిత్యం! -** "ఇది పాలు కాదు. సున్నపునీరు మాత్రమే" అని ఉత్తమ విచారణచే గ్రహించిన తరువాత "అయ్యో! నేను త్రాగలేకపోయానే?" అనే వేదన చెందే మూర్ఖుడెవడు? అట్లాగే ఉత్తమ విచారణచే వాసన నివృత్తి అవుతుంది. ఇక దిగులు పడటానికి, వేదన చెందటానికి ఇక్కడ ఏదీ మిగలదు. ఉత్తములగువారు "ఇది మజ్జిగ" అని భ్రమించుటచే త్రాగాలని కోరుకుంటారేమో గాని "కాదు... తెలిసిపోయింది... ఇది కల్లు" అని గ్రహించిన తరువాత త్రాగాలని అనుకుంటారా? తత్త్వజ్ఞుడు "సర్వము ఆత్మయే" అను ఎరుకను అవధరించిన తరువాత అందమైన స్త్రీ శరీరమును ఒకానొక లిఖిత చిత్రమువలె చూస్తాడుగాని, వికారాదులు పొందడు.

చిత్రంలో లిఖించబడిన స్త్రీ అంగములన్నీ ఆయా రంగుల సమ్మేళనము మాత్రమే కదా! అట్లాగే స్త్రీ పురుషుల జుట్టు – గోళ్ళు మొదలైన అవయవములన్నీ పంచభూతముల సముదాయమేనని గ్రహించి ఉంటాడు.

పటికబెల్లం తీపిని ఆస్వాదించిన తరువాత, ఆ తదుపరి త్రాగే నీళ్ళు పటికబెల్లపు తీపిని మరిపింపజాలదు కదా! ఆత్మానందం పొందినవాడు తదితర విషయ సుఖములను చూచినంత మాత్రం చేత ఆత్మను ఏమరువడు.

**నిరంతరమైన నిమగ్నం -** ఒకానొక ముగ్ధస్త్రీ దూరప్రాంతం వెళ్ళి ఇంకా రావలసియున్న తన భర్తయందు... ఆసక్తి కలిగియున్నదనుకో...ఆమె గృహకృత్యములందు తలమునకలై ఉన్నప్పటికీ తన అంతఃకరణమునందు తన భర్త యొక్క రాకచే ఏర్పడే స్నేహానుభవమునే మననం చేస్తూ ఉంటుంది కదా! శుద్ధ బ్రహ్మముతో సమాగమం, విశ్రాంతి పొందు ప్రయత్నశీలుడగు జీవుడు ఆ బ్రహ్మానందమును అనుభవిస్తూనే ఈ ప్రాపంచిక క్రియలందు పాల్గొంటూ ఉంటాడు. ఇవేవీ ఆతని ఆత్మానుభవమును నిరోధించలేవు. ఇంద్రాది దేవతలంతా కలిసికట్టుగా వచ్చి కూడా ఆతని బ్రహ్మానందానికి ఖేదము కలిగించలేరు. మనస్సును అధిగమించిన ఆత్మజ్ఞానికి 'చ్యుతి' కలిగించగలిగే శక్తి ఈ ప్రపంచములోని ఏ పదార్థమునకూ ఉండదు.

**విషయములచే స్పర్శించబడకపోవటం! -** వివిధ పుష్పరసములన్నీ తేనె యందు ఏకమై పోతున్నాయి. ప్రపంచములోని ఆనందములన్నీ బ్రహ్మానందమునందు సమరసమై పోతున్నాయి. తత్త్వజ్ఞుడగు మనుజుని బుద్ధిని ఎవరు దేనిని చూపించి ఏమరిపించగలరు? తన ప్రియుని పట్ల ఆసక్తమైన బుద్ధిగలస్త్రీ ఎన్ని విఘ్నములు, నిరోధములు కల్పించబడుచున్నాకూడా, అవన్నీ లెక్కచేయక ప్రియునియందే మనస్సు కలిగి ఉంటుంది చూచావా? అవిద్యారహితుడగు జ్ఞాని ఆత్మానందమును అనుభవిస్తూనే ఉంటాడు. కష్టములన్నీ వచ్చి పడుగాక! అవయవములు ఛేదించబడుగాక! విషాద సంఘటనలు తారసపడుగాక! సిరులు వచ్చుగాక....పోవుగాక! ఆతని ఆత్మానుభవం చెక్కుచెదరదు. "నిష్కళంకము, అత్యున్నతము, అంతర్గతము అగు ఆత్మను నేను" – అనునది ఏమరువడు.

ఆత్మజ్ఞాని ఈ చిత్తమును ఒక బాహ్యమగు ఉపకరణమువలె చూస్తాడు. కనుక ప్రారబ్ధకర్మలందు, దారిద్ర్యాది దశలందు, సంకటములందు ఆతని ఆత్మానుభవ స్రవంతికి అడ్డు ఉండదు. నగరంలో

ఉన్నా, అరణ్యంలో ఉన్నా, పర్వతములపై ఉన్నా, తపోవనంలో ఉన్నా, ఊపిరిసలపనన్ని పనులలో ఉన్నా... అవేవీ ఆతనికి హర్షశోకములుగా పరిణమించవు. ఆతడు సర్వదా ఈ సర్వముచే అస్పృశ్యుడై ఉంటాడు.

❖❖❖

# 6. సోదాహరణములు

**శ్రీరాముడు :** ఆత్మజ్ఞాని గురించి మీరు చెప్పే విశేషాలన్నీ ఆమోదయోగ్యమేనని ఒప్పుకుంటున్నాను. అయినా కూడా, ఈ రాజ్యాదులు, ఈ ధన జనాది విషయసంపర్కములు ఎదురుగా ఏర్పడి ఉండగా మనస్సు విజ్ఞతను, ఆత్మదృష్టిని ఎట్లా అలవరచుకోగలుగుతుందోనని... నాకు కొంచం అనుమానంగానే ఉన్నది. అనేకులు సంసారదృష్టిని వదలలేకపోవటం మనకు కనబడుతూనే ఉన్నది కదా!

**శ్రీవసిష్ఠమహర్షి :** ఉత్తమ ఉదాహరణలు కొద్దియే కావచ్చు. మనం ఆత్మజ్ఞానుల ప్రేరణాదులనే అనుసరణీయంగా స్వీకరించాలి గాని... సంఖ్యాపరంగా ఎక్కువ మంది కాబట్టి, అజ్ఞానుల సాంసారిక దృష్టిచే ఎందుకు సంక్షోభం పొందాలి?

ఆత్మ జ్ఞానం సంపాదించి కూడా యథాతథంగా ఈ ప్రాపంచిక కార్యక్రమములు నిర్వర్తిస్తున్న మహనీయులు ఎందరో ఉన్నారు. నీకు కొన్ని దృష్టాంతాలు చెపుతాను విను– జనక మహారాజు గురించి మనం చెప్పుకున్నాం. ఆతడు అందరు రాజులు లాగానే రాజ్యకార్యములందు నిమగ్నమై ఉన్నారు. అయినప్పటికీ సదా దుఃఖరహితుడై దేనికీ ఏమాత్రం వ్యాకులత పొందక ఉన్నాడు కదా!

మీ పితామహుడు దిలీపుని గురించి తెలుసు కదా! సర్వ కార్యములు నిర్వర్తిస్తూనే అంతః కరణంలో వీతరాగుడై చిరకాలం అయోధ్యను పాలించలేదా? మనువు రాగకళంకం లేని మనసుతో జీవన్ముక్తుడై ప్రజలను ఏలారు. మాంధాత చక్రవర్తి అనేక యుద్ధాలలో పాల్గొనుచూ బ్రహ్మజ్ఞానియై వెలుగొందారే! అట్లాగే, పాతాళంలో బలిచక్రవర్తి "ఇదంతా సమయోచితమే" ...అను అవగాహనతో ఏవేవో క్రియావ్యవహారములు నిర్వర్తిస్తూనే తాను మాత్రం సదా త్యాగి అయి, ఆసక్తిరహితుడై, జీవన్ముక్తుడై ప్రకాశించుచున్నాడు. దానవుల ప్రభువైన 'సముచి' అనేకసార్లు దేవతలతో యుద్ధం చేస్తూ వివిధములైన ఆచార–విచార తత్పరుడై కూడా ...దేనికీ ఏ మాత్రం ఖిన్నుడగుట లేదు. 'వృత్రాసురుడు' అనే రాక్షసుడు అత్యంత ఉదారచిత్తుడై, మాననీయుడై, తన దేహంతో అనేకసార్లు దేవతలతో యుద్ధం చేసి చివరికి పిల్లవాడు ఆట బొమ్మను వదిలినట్లు శరీరమును ఇంద్రుని చేతిలో త్యజించాడు. పాతాళాధీసుడైన ప్రహ్లాదుడు వాక్కు అగోచరమైన అక్షయసిద్ధి పొంది కూడా సాంసారిక మాయలో నిశ్చింతగా పాల్గొన్నాడు.

అట్లాగే శంబరాసురుడు కూడా! ఆతడు ఒక వైపు అనేక మాయలను సృష్టిస్తూ దానవుల కొరకు విష్ణువుతో యుద్ధం చేస్తూ ఉండేవాడు. మరొక వైపు అనాసక్తుడై కుశల బుద్ధితో ఉత్తమజ్ఞానాన్ని ఆశ్రయించి ఉండేవాడు. పరమ చిదాకాశమున ఏకత్వరూపుడై ఉంటూనే ....సంక్లిష్టమైన యుద్ధసన్నివేశాలు రచిస్తూ ఉండేవాడు.

సర్వదేవతాముఖ రూపుడైన అగ్నిదేవుడు ఒక్కసారే అనేక యజ్ఞ, యాగాలలో హవిస్సు స్వీకరిస్తూనే, ముక్తుడై... అప్రమేయుడై ఈ చరాచర సృష్టిని ఆక్రమించియున్నారు. ఆ చంద్రుడు తన యందు అమృతమును ధరించి ఈ భూమిపై ఓషధ రచనకు కారకుడగుచూ తాను నిర్వికారుడై పరమజ్ఞానముతో ప్రకాశిస్తున్నాడు. దేవతల పౌరోహిత్యం, గురుత్వం, భార్య కొరకు చంద్రునితో యుద్ధం... మొదలైనవి నిర్వర్తిస్తున్న బృహస్పతి తాను మాత్రం సర్వదా ముక్తస్వరూపముతో తేజరిల్లు చున్నారు. అట్లాగే శుక్రాచార్యుల విషయం తెలుసుకదా! ఆయన సర్వుల అభీష్టమును పాలించుచూ, తదనుకూలంగా నీతిశాస్త్రరచన చేశారు. అసురులకు గురువై, వారినందరినీ ఒక త్రాటిపై నడిపిస్తు న్నారు. వాళ్ళకు దిక్కు - శ్రేయోభిలాషి ఆతడే. అయితే ఏం? నిర్వికారబుద్ధితో సాక్షిమాత్ర పూర్వకంగా కాలగమనం కొనసాగిస్తున్నారు. వాయుదేవుడు ఊర్ధ్వ అధోలోకాలను, ప్రాణములందలి అవయవాలను చలింపజేస్తూ ఉంటారు. సదా సర్వ ప్రదేశములందూ సంచరిస్తూ, ముక్తుడే అయి ఉంటున్నారు. ఆయనకు ప్రియుడెవ్వరు? అప్రియుడెవ్వరు?

నాయనా! రామా! బ్రహ్మజ్ఞులై కూడా తమకు నియమితములైన కార్యములను ప్రశాంత బుద్ధితో నిస్సంగులై నిర్వర్తించే మహనీయులెందరో ఉన్నారు. పరబ్రహ్మమూర్తియగు బ్రహ్మదేవుని చూడు. ఆయన ఈ లోకములన్నిటి యొక్క ఊర్ధ్వ-అధో-మధ్య గతి పరివర్తనములను రచించి ఉన్నవారే కదా! అయినప్పటికీ సమచిత్తము కలిగి తన సుదీర్ఘమగు ఆయువును గడుపుచున్నారు.

ముక్తుడగు విష్ణుభగవానుడు దేవతల సుఖం కొరకై అనేక యుద్ధములు చేస్తున్నారు. భక్తుల కొరకై మానవ - జంతు ఉపాధులను పొందుచూ బాల్య - యౌవన - వార్ధక్యాలు అనుభవిస్తున్నారు. శిలాకారంగాను, శిల్పాకారంగాను (జడంగా కూడా), స్త్రీ - చేప - తాబేలు - వరాహం వంటి జంతు, నర అవతారాలు స్వీకరిస్తూ అనేక కల్పములు భక్తుల హృదయాలలో సంచరిస్తున్నారు. ఇంత వ్యాసంగం నిర్వర్తిస్తూ కూడా తాను అప్రమేయుడై, అఖండుడై వైకుంఠమున వెలయుచున్నారు! ఆయన ఏ క్షణమైనా తన ముక్త స్వరూపమును వదలుచున్నారా? లేనే లేదు.

త్రినేత్రుడగు మహేశ్వరుడు ఒక సామాన్యకాముకుని వలె జగజ్జననియగు పార్వతీదేవితో తాండవ నృత్యం చేస్తున్నారు. గణపతి, కుమారస్వామి, నంది, భృంగి మొదలైన ప్రమథగణం అందుకు లయపూర్వకంగా తాళం వేస్తూ గానాదులు చేస్తున్నారు. అంతటి తన్మయంతో ఆనంద వైభవంగా నృత్యం చేస్తూనే ఆయన భక్తుల పిలుపు వినగానే వారి ముందు పార్వతీసమేతంగా ప్రశాంతమంగళ స్వరూపంతో ప్రత్యక్షమగుచున్నారు. ఉపయుక్తమైన ఉపాధులు కల్పించుకొని భక్తులు పొందే బెత్తపు దెబ్బలు తాము పొందుచున్నారు. ఆదిశక్తి స్వరూపిణియగు అమ్మవారు పార్వతీదేవి నిత్యముక్త అయి కూడా పరమశివుని శరీరార్ధభాగం స్వీకరించి, తన బిడ్డలు భక్తితో ఆక్రందన చేస్తున్నప్పుడు ఆ పరమశివుని ప్రేరేపించి వారికి సకల శుభములు కలుగజేస్తున్నారు కదా! ఇంత తతంగం జరుగుచున్నా, పార్వతీపరమేశ్వరులు ఆత్మతత్త్వమును అవధరించే ఉంటున్నారే!

మహాధీశాలి, వీరుడు, పరమ జ్ఞానసముపేతుడు, జ్ఞానరత్నములకు సముద్రము వంటివాడు అగు ఆ కార్తికేయుడు (కుమారస్వామి) నిత్యముక్తుడైయుండి లోక కళ్యాణార్థం తారకేశ్వరునితో

యుద్ధం నిర్వర్తించారే! మహాధైర్యయుక్తుడై, ధ్యానముచే విశుద్ధమైన బుద్ధిని సముపార్జించియున్న భృంగీశ్వరుడు ముక్తత్వము వహిస్తూనే ఒకసారి తన తల్లి పార్వతీదేవి పాదాలకు తన రక్తమాంసములను సమర్పించివేశారే.

అదిగో... అక్కడ చూడు. అక్కడ కోటి సూర్యుల ప్రకాశంతో ఈ సభలో ఆసీనులైన ఆ నారద మహర్షిని చూచావా? ఆయన తన తంబురను మీటుతూ 'నారాయణ, నారాయణ' అని ఉచ్చరిస్తు త్రిలోక సంచారం చేస్తున్నారు. తాను ఎక్కడికి వెళ్ళితే అక్కడ సర్వమూ పవిత్రం చేస్తున్నారు. ఆయన సర్వదా ముక్తుడే! ఆయనకు పొందవలసినదీ, పొందబడనిదీ అంటూ ఏదీ లేదు. ఆయన లోక కళ్యాణార్థం పరమేశ్వర నిర్ణయం అవధరిస్తూ అనేకమంది జనులతో సంభాషిస్తూ ఏవేవో ఉపాయాలు, చెపుతూ ఉంటారు. పురాణద్రష్టలు ఆయనకు 'కలహాభోజనుడు' అని బిరుదు ఆపాదించారు. ఆయన ఆయా క్రియాదులు నిర్వర్తించినంతమాత్రంచేత ఏ క్షణంలోనైనా తన జ్ఞాన, ముక్త స్వరూపం ఏమాత్రం ఏమరుచుట లేదుసుమా!

ఇక్కడ చూడు! దీప్యమానతేజస్సుతో వెలుగొందుచూ, ఈ మన సంవాదనకు ప్రారంభకులై, ప్రోత్సాహకులై ఈ సభను పావనం చేస్తున్న బ్రహ్మర్షి విశ్వామిత్రుని చూస్తున్నాం కదా! ఈయన తన తపోశక్తిచే జ్ఞాన-విజ్ఞాన పరివేష్టితులైనారు. సర్వమునూ ఎరిగిన సర్వమాన్యుడగు ముక్తపురుషుడు ఈయన. అయితే కూడా.... ఇప్పుడు లోకకళ్యాణం కొరకు యాగసంరంభమంతా చేస్తూ యాగరక్షణ కొరకై నీ ఆగమనాన్ని యాచించటానికి అయోధ్యకు వచ్చారు. తానింకా పొందవలసినదంటూ ఏదీ లేక పోయినా కూడా, లోకాలకు 'రామతత్త్వం' ప్రకటితం కావాలనే గొప్ప ఆశయంతో దశరథ మహారాజును ఆశ్రయిస్తున్నారు. ఆయన ముక్తపురుషుడై ఉండి కూడా కర్మలను ఏమైనా తిరస్కరిస్తున్నారా?... లేదే!

జీవన్ముక్తుడగు ఆదిశేషుడు ఈ భూమినంతా ధరిస్తున్నారు. నిర్విషయుడై ఉండి, సూర్య భగవానుడు ఆకాశంలో సంచారం చేస్తూ ఈ భూమిపైగల సకల జీవరాసులకొరకై దివారాత్రములు కల్పిస్తున్నారు. మహాజ్ఞానియగు పరశురాముడు తన ఆత్మస్వరూపమును ఆస్వాదిస్తూనే దుష్టశిక్షణ చేస్తున్నారు.

❖

చూచావా రామా! ఇంకా ఈ ముల్లోకములలో ఎందరో శతాధికసంఖ్యలలో యక్షులు అసురులు, మనుష్యులు, దేవతలు తాము ముక్తులై ఉండి కూడా ఈ జగద్రచనలో వారివారికి నియామకమైన ఆయాకర్మలను ముక్త బుద్ధితో నిర్వర్తిస్తున్నారు. అట్టి మహాత్ములు ఈ భూమిపై ఈ వర్తమానంలో ఎందరో ఉన్నారు.

అట్టి జీవన్ముక్తులలో కొందరు శోక, మోహదాయకములైన దార - పుత్ర - ధనాది ఐశ్వర్యముల మధ్య ఉన్నారు. యుద్ధము, జాతి సంరక్షణము, వ్యాపారము మొదలైన లౌకిక వ్యాసంగములలో నియమితులైయున్నారు. కానీ, వారి అంతఃకరణం మాత్రం ప్రశాంతతతో నిండిపోయి ఉంటోంది.

మరికొందరైతే జడస్వభావులై ఏదీ పట్టించుకోకుండా లౌకిక దృష్టితో చూస్తే పిచ్చివారిలాగా సంచరిస్తున్నారు. వారి దృష్టిలో వారికి దేనివల్లా ఏలోటూ ఉండదు. అట్టివారిలో కొందరి పేర్లు కూడా ఎవ్వరూ విని ఉండకపోవచ్చు.

భృగు, భరద్వాజాది మరికొందరు ఉత్తమజ్ఞానమును ఆశ్రయించి కూడా ఎక్కడో అడవులలో ఆశ్రమం నిర్మించుకొని తమను ఆశ్రయించిన శిష్యులను తీర్చిదిద్దుచున్నారు. మరికొందరు రాజ్యాలు ఏలుతూ వెసులుబాటులేని క్రియా సంరంభములో ఉంటున్నారు. సప్తర్షులు, తదితర మహనీయులు అగు మరికొందరు ఆకాశంలో జ్యోతిశ్చక్రమున నెలకొని ఉన్నారు. అగ్ని, వాయు, తుంబుర, యమ, వరుణాది ఇంకొందరు దేవతా కార్యములను నిర్వర్తిస్తూ బ్రహ్మజ్ఞాన సమన్వితులై ఉన్నారు. బలి, సుహోత్ర, అంధక, ప్రహ్లాదాది మరికొందరు పాతాళంలో వసించుచూ ఆత్మజ్ఞానమును పదిల పరచుకొనియే ఉన్నారు.

❖

అయితే ఒక్క విషయం నీవు ఇక్కడ గమనించాలి.

**తిర్యగ్యోనిష్వపి సదా విద్యన్తే కృతబుద్ధయః ।**
**దేవయోనిష్వపి ప్రాజ్ఞా విద్యన్తే మూర్ఖబుద్ధయః ॥**

జంతు ఉపాధులు పొందినప్పటికీ కొందరు మహాజ్ఞానులై వెలయుచున్నారు. తెలివితేటలతో కూడిన దేవయోనులలో జన్మించికూడా మరి కొందరు సంసారాసక్తతతో కూడిన తమ మూర్ఖబుద్ధిని వదలటమే లేదు.

సర్వరూపమై... సర్వవ్యాపకమైన ఆత్మయందు సర్వమూ, సర్వవిధములా సర్వత్రా సంభవమే అగుచున్నది. ఆహో! అనంత కార్య తత్పరుడగు ఆ పరమాత్మ యందు నీడవలె ఏర్పడుచున్న నియతి ఎంత చిత్ర విచిత్రమైనది! ఇదంతా ఆ పరమాత్మ యొక్క రచనా వైచిత్ర్యమే కాక, మరింకేమిటి?

❖

ఏది ఏమైనప్పటికీ ఆత్మ భగవానుని విన్యాసం సదా యథాతథంగానే ఏర్పడి ఉంటోంది.

**విధిర్దైవం విధిర్ధాతా సర్వేశః శివ ఈశ్వరః ।**
**ఇతి నామభిరాత్మానః ప్రత్యక్చేతన ఉచ్యతే ॥**

మనందరి 'ఆత్మ' అయినట్టి ఆ ప్రత్యక్ చైతన్యమే "బ్రహ్మ – దైవము – విష్ణువు – ధాత – ఈశ్వరుడు – శివుడు" – మొదలైన అనేక పేర్లతో చెప్పబడుతోంది.

❖

ఈ జగత్తులో అసంఖ్యాకంగా పదార్థాలున్నాయి. ప్రతి పదార్థంలోనూ అనేక తదితర పదార్థాలు ఇమిడి ఉన్నాయి. ఇసుకలో బంగారు రేణువులుంటున్నాయి. ఆ బంగారు రేణువులోని ప్రతిఒక్కదానిలో తదితరమైన సూక్ష్మపదార్థముల అమరిక ఉంటోంది. అనేక పదార్థముల సంయోగ వియోగములచే దృశ్యపాంచ భౌతికజగత్తు ఏర్పడి ఉంటోంది. యుక్తమైన దానిలో అయుక్తత (Wrong aspect in

right things) దాగి ఉంటున్నది. అయుక్తమనుకున్నదానిలో కూడా యుక్తితో చూస్తే యుక్తత కనిపిస్తోంది. పాపం అయుక్త మనుకుంటాం. కానీ పాపభీతి చేతనే లోకము ధర్మమున ప్రవృత్తమై ఉంటోంది. అసత్యమైనది ఎదురుగా ఎంతో కాలం కనబడుచుండుటచే, "ఇది సత్యమే కదా!" అని భ్రమ కలుగజేస్తోంది.

'శూన్యధ్యాన యోగం' చేత కూడా ఆ "శూన్య సాక్షి" అయిన నిత్యాత్మ పదం ప్రాప్తిస్తోంది. ఇంద్రజాలంలో కుందేటికి కొమ్ములు మొలిపించబడునట్లు... ఇప్పుడు లేని వస్తువులు దేశకాల విలాసములచే ఉత్పన్నమగుచున్నాయి. వజ్రం వలె అత్యంత దృఢంగా కనిపిస్తూ ఉంటున్న వస్తువులు కూడా అకారణంగా నశించుటచే అందలి వివిధ పదార్థములన్నీ రూపాంతరం పొందుచున్నాయి.

ఈ నాశోత్పత్తి సమన్వితమైన అనేక పదార్థములతో కూడిన ఈ జగత్తును చూస్తున్నంత మాత్రంచేత ద్రష్టస్వరూపుడగు ఈ జీవుడు హర్షామర్ష, వినోదవిషాదాది వికారములు ఎందుకు పొందాలి? ఇక్కడ ఎట్టి ఇచ్ఛలేకుండానే ఉండటం ఉచితం సుమా!

ఈ ప్రపంచంలో అసత్తు సత్తువలె ఉంటోంది. ద్రష్టస్వరూపమగు సత్తు అసత్తువలె తోచుతోంది. ఇది గమనిస్తున్న విదిత వేద్యుడు (తెలియవలసినది తెలుసుకున్నవాడు) ఇంత మాత్రం చేత తన శాంతస్థితి నుండి చ్యుతి పొందడు. కనుక రామా! నీవు ఇక్కడ ఏర్పడే ఇచ్ఛ, అనిచ్ఛలను ఎంత శీఘ్రంగా త్యజిస్తే అంతమంచిది.

వివేకం లేకపోతే ఈ ప్రపంచంలో ఎవ్వరికీ ఏమాత్రం ముక్తి లభించదు. ఇక్కడ కోట్ల కొలది జనులు వివేకము కొరకై ప్రయత్నమైనా చేయకుండా "మాకాపని ఉన్నది... ఈ పని ఉన్నది" అని ఇక్కడి పంచేంద్రియ విషయ సమూహాలలో మునగటానికే ఇచ్ఛగించుచున్నారు. ఇక్కడ వివేకము కొరకై ప్రయత్నించే వారికి ముక్తి తప్పకుండా సుసాధ్యమే. ఇదే జగత్తులో ఇవే కార్యక్రమములు నిర్వర్తిస్తూనే మరొక వైపుగా వివేక, విజ్ఞానాదులను ఆశ్రయించి మోక్షస్వరూపులై విరాజిల్లారు... విరాజిల్లుచున్నారు... విరాజిల్లగలరు.

ఓ ప్రియ సహజీవులారా! సర్వశ్రోతలారా! వివేకముచే ముక్తి సుసాధ్యం... సులభం కూడా. అవివేకముచే అది అసాధ్యం... అలభ్యం. ఆ తరువాత మీ ఇష్టం. మీరు సన్మార్గం ఎన్నుకుని నిష్ఠతో ప్రయత్నిస్తూ ఉంటే సర్వాత్మస్వరూపుడగు ఆ భగవానుడు మీకు తప్పక మార్గదర్శకుడు కాగలడు.

❖

అందుచేత ఓ రామచంద్రా! మనస్సును జయించటం ద్వారా నీవు వివేకమును అభివృద్ధి చేసుకోవటం ఉచితం, శుభప్రదం కూడా.

మోక్షమును ఇచ్ఛగించేవారు ఆత్మదర్శనం కొరకు 'వివేకము'అనే ప్రయత్నం ఆచరించాలి. ఆత్మదర్శనము చేత మాత్రమే సర్వ దుఃఖములు సమూలంగా నశించగలుగుతాయి. రాగవర్జితులు, సంగరహితులు, మహాధీమంతులు, అయినట్టి సుహోత్రుడు, జనకుడు మొదలైనవారు ఇప్పుడు ఈ భూమిపై సంచరిస్తున్నారు. అట్లాగే అన్ని కాలములందూ అట్టి సుజ్ఞానవంతులగు వివేకులు ఈ

భూమిపై ఉంటూనే ఉంటారు. వారు ఏ సంఖ్యలో ఉన్నప్పటికీ, ఈ భూమిని పరమపవిత్రం చేస్తున్నారు.

**తస్మాత్త్వమపి వైరాగ్యవివేకోదితధీరధీః ।**
**జీవన్ముక్తో విహర భో సమలోష్టాశ్మకాఞ్చనః ॥** (శ్లో 48, సర్గ 75)

కనుక రామా! నీవుకూడా వివేక, వైరాగ్యములను ఆశ్రయించు. ధీరబుద్ధిచే సువర్ణమును, మట్టిని సమబుద్ధితో చూడగల మహత్తర దృష్టిని అలవరచుకో. "ఆతడు అధికుడు, ఈతడు అధముడు, నేను కొరగాను, నేను గొప్పవాడను, అవి పొందాలి, ఇవి తొలగాలి"... ఈ రూపంలో ఉంటున్న సంసారజాడ్యమును త్యజించు. వివేక సూర్యస్వరూపుడవై సర్వస్థితులందు వర్తించెదవుగాక!

**ముక్తి -** ఓ నిష్కళంక స్వరూపా! రాఘవా! పదార్థములందలి 'అసంగము' చే కలుగు మనశ్శాంతి యొక్క రూపమే ముక్తి. అట్టి ముక్తి దేహము ఉన్నప్పుడూ లేనప్పుడు కూడా సంభవమే. "ఈ దేహము నేను... ఈ దేహ సంబంధముచే కలుగు గృహములు, బంధువులు మొదలైనవన్నీ నావి"... అను రూపముగా ఉండే భ్రాంతితో కూడిన ప్రీతిని నివారించటమే ముక్తి. ఈ దేహాదులందు ఏమాత్రం ప్రీతి, ఆసక్తి లేకుండానే జీవితం సాగిస్తున్నవానిని 'జీవన్ముక్తుడు'... అని అంటున్నాం. అట్లాగాకుండా, ఈ దేహాదులందు ఆసక్తి కలిగి జీవించేవాడు బద్ధుడు.

**రాగద్వేషములు... ఈ రెండూ లేనివాడు ముక్తుడే -** మోక్షము కొరకై "వినటం, మననం చేయటం, నిధిధ్యాస (అనన్యత్వం – ఏకాగ్రత్వం)... ఆత్మాఽహమ్‌భావన అనే సాధన చతుష్టయంతో ప్రయత్నించాలి. 'బ్రహ్మతత్త్వ నిశ్చయం' అనే ప్రయత్నం ఎల్లప్పుడూ చేస్తూ ఉండాలి. బుద్ధి శుద్ధత్వం పొందేవరకూ అట్టి ప్రయత్నమునుండి విరమించకూడదు.

"దుఃఖము ఉన్నది" ...అనునది రాగము ఉన్నది అనటానికి గుర్తే సుమా! రాగద్వేషములు తెలివిగా ఈ మనుజుని తమ వశం చేసుకుంటున్నాయి. అది గమనిస్తూ కూడా ఊరుకొని ఉంటే ఎట్లా? "ఈతడు మభ్యపెట్టి, మోసంచేసి, అంతా దోచుకుంటాడు" – అని తెలిసికూడా, ఒక దొంగకు తాను దాచుకున్న గుప్తధనం చూపిస్తూ వెంటబడతాడా, ఎవడైనా?

జడస్వభావపూర్వకమైన వాదోపవాదములను, మందబుద్ధిని.... ఎట్లాగైనా సరే... వదలిపెట్టి పరమాత్మను ఆశ్రయించాలి. 'యుక్తి, యత్నము'... ఈ రెండూ కూడా ఎంతో అవసరం. ఈ రెండూ లేకపోతే ఈ లోకంలో ఒక చిన్న పని కూడా చేయలేమని అందరికీ తెలుసు కదా! ఇక, మోక్షం విషయం మాత్రం వేరే చెప్పేదేమున్నది? సన్మార్గపూర్వకమైన ప్రయత్నములను వదలిపెట్టి, కేవలం 'పిచ్చా పాటి'తో 'మానవ జీవితము' అనే అవకాశం వృథా చేసుకుంటే ఎట్లాగయ్యా...?

కనుక ఓ సర్వజనులారా! మీరంతా ప్రయత్నశీలురయ్యెదరుగాక! ఈ విషయం నేను ఎంతో శ్రమించి మరల మరల గుర్తు చేస్తున్నాను. నాయనలారా! మహాధైర్యమును అవలంబించండి. అవరోధములను చూచి వెనుకాడవద్దు. ఉత్తమ ఫలితం లభించేవరకు ఆత్మ విచారణ చేయండి. దృఢ ప్రయత్నం ఉండాలేగాని... ఈ ప్రపంచంలోని అన్ని సంఘటనలు కలిసి కూడా ... అట్టివానిని

ఆ ప్రయత్నము నుండి విరమింపజేయలేవు. అంతేగాని... పరిమిత అవగాహనలతో కూడిన ఏవేవో వాదోపవాదములతో ఆత్మప్రకాశము వైపుగా గల మార్గము నుండి చ్యుతి పొందకూడదు. మీరంతా అచ్యుతలయ్యెదరు గాక! వేదరహస్యము ఎరిగిన మహాత్ములు సత్యజ్ఞానానంద స్వరూపమగు ఆత్మ పదమును పొంది, అద్దానిని మనకు విశదీకరించి చెప్పుచున్నారు.

"ప్రయత్నిస్తేనే ఆత్మ పదము లభిస్తుంది గాని, అది ఏదో గాలి వాటుగా లభించేది కాదు" అని నా విన్నపం.

❖❖❖

# 7. పరమ పురుషత్వం

**శ్రీరాముడు :** స్వామీ! ఈ జీవుడు ఏ హేతువు చేత జగత్తులలో ప్రవేశిస్తున్నాడు? ఆతడు ఒక జగత్తును వదలి ఇంతలోనే మరొక జగత్తులోకి ప్రవేశిస్తున్నాడు కదా! ఈ సుదీర్ఘ ప్రయాణానికి అంతెక్కడ?

**శ్రీవసిష్ఠ మహర్షి:** మనం కొంతసేపటి నుండి వివేకోదయం గురించి చెప్పుకుంటున్నాం కదా! జీవునికి ఎదురుగా నిలిచి ఉన్న ఈ జగత్తులన్నీ బ్రహ్మము నుండే అవివేక ప్రభావం చేత ఉద్భవిస్తున్నాయి. అవివేకముచేతనే స్థితి పొంది ఉంటున్నాయి. మరల వివేకముచే నశిస్తున్నాయి. 'బ్రహ్మము' అనే సముద్రంలో ఏర్పడే 'జగత్ సమూహములు' అనే తరంగపరంపరలను ఎవరు లెక్కించగలరు? సూర్యకిరణములలో ఉండే త్రసరేణువులను ఎవరు లెక్కించగలుగుతారు?

అసమ్యక్ దర్శనం (Perception of Duality) జగత్‌స్థితికి హేతువు. సమ్యక్ దర్శనముచే ఈ సంసారజలమంతా వినాశనం పొందగలదు. మిక్కిలి దుష్కరము, అత్యంత భయంకరము అయినట్టి ఈ సంసారసాగరాన్ని అధిగమించాలంటే అందుకు 'ప్రయత్నం – యుక్తి' రెండూ ఉండాలని అనుకున్నాం గదా!

'సంసారము' అనగా ఏమిటో ఎరిగిన విజ్ఞులు 'జీవితము' అనే సదవకాశమును దుర్వినియోగ పరచుకోరు. ఎందుకంటే, ఈ సంసారము... 'మోహము' అను జలంతో, 'మరణము' అనే సుడులతో 'పుణ్యాపాపములు' అనే తరంగములతో, 'నరకము' అనే బడబాగ్నితో, 'తృష్ణ' అను ప్రకంపనములతో, 'మనస్సు' అనే సుడిగుండముతో, 'జీవితము' అనే నదీసంగమ స్థానముతో, 'భోగములు' అనే ఎఱలతో, 'రోగములు' అనే క్రూర సర్పాలతో, 'ఇంద్రియములు' అనే మొసళ్ళ ఘర్ఘరనాదంతో, 'ఆశలు' అనే ఉప్పురసంతో ...ప్రాప్తిస్తోంది.

ఆహా! ఏమి దీని ప్రభావం! ఇందు స్త్రీలు తమ క్రీగంటి చూపులతో బుద్ధిమంతులైన వారిని కూడా కొద్ది క్షణాలలో తమ పాదాక్రాంతం చేసుకుంటున్నారే! ఇందులో ప్రవేశించిన జీవులు క్షణంలో తమ ఉపాధికి ముందే గల స్వస్వరూపం ఏమరుచుచున్నారే! మనస్సులోంచి ఆశలు పుడుతున్నాయి. ఆ ఆశలు ఆ మనస్సునే భ్రమింపజేస్తున్నాయి.

ఈ చంచల సంసారం దాటివేయటమే పౌరుషం. అంతేగాని, ఏదో రాజ్యంపై దండయాత్ర చేసి గెలవటం పౌరుషం కాదు. ఉత్తమ బుద్ధి, ఉపాధి, అవకాశములు లభించి కూడా సంసార సముద్రం దాటటానికి పయనించని వారిని ఏమని పిలవాలి?... కొద్దిమంది మాత్రం తమ యొక్క బ్రహ్మజ్ఞాన బలం చేత ఈ సంసార సముద్రమును ఆపోశన పట్టివేస్తున్నారు. ఈ జగత్తునంతటినీ బ్రహ్మమయం చేసి సాక్షీస్వరూపులగుచున్నారు.

ఓ రామా! నీవు అట్టి శ్రేష్ఠులగు బ్రహ్మజ్ఞానులతో కూడి విచారణచేయి. బుద్ధిచే 'ఇదంతా బ్రహ్మమే' అని గ్రహించు. ఆ తరువాత ఇందు క్రీడించు. అట్లు శోభించటమే ఉచితంగాని, ఇందు బద్ధుడవై ఉండటం ప్రజ్ఞ – అని అనిపించుకోదు. ఓ రఘుకులతిలకమా! రామచంద్రా! ఈ చిన్న వయస్సులోనే నీవు విచారతత్పరుడవైనావు. ఈ సంసారము గురించి చక్కగా చింతన చేస్తున్నావు. ఈ విషయం నీ గురువైన నాకు ఎంతో ఆనందాన్ని కలుగజేస్తోంది. నీవు ధన్యుడవు. నీలాగే, ఎవ్వడైనా సరే... ఈ సంసారమును అత్యుత్తమ బుద్ధితో విచారణ చేస్తే ఆతనిని ఇక మోహము సమీపిస్తుందా? దాని వల్ల కాదు.

మొట్టమొదట చక్కగా విచారణ చేయాలి. సర్పమువలె భయమును గొలిపే విషయభోగములను ప్రక్కకు నెట్టివేయాలి. వివేక దృష్టిని అలవరచుకోవాలి. ఆత్మ విషయమై సమాచారం సంపాదించాలి. ఆ తరువాత గరుత్మంతుడు సర్పములను భక్షిస్తున్నట్లు ఈ శబ్ద – స్పర్శాది విషయములపై ఆధీనత్వమును చెలాయించాలి. శబ్ద స్పర్శాది విషయములు నీకు దాస్యం చేయాలేగాని, నీవు వాటికి దాసుడవు, బద్ధుడవు అవటం పురుషకారం ఎట్లా అవుతుంది.

ఏదైనా ఒక వస్తువును, పొందాలనుకోవటానికి ముందు ఆ వస్తువు యొక్క తత్వం, ప్రయోజనం పరిశీలించి మాత్రమే స్వీకరిస్తాం. ఎందుకు? దాని ఉత్తరోత్తర ప్రయోజనం ఫలయుక్తంగా ఉండాలని ఉద్దేశ్యం కదా! అట్లా కాకుండా, 'పైకి బాగున్నది', అని అవిచారణ పూర్వకంగా వస్తువును తెచ్చుకున్నా మనుకో! ఏమౌతుంది?

**శ్రీరాముడు :** చిన్న పిల్లవాడు పెద్దలు చెప్పినా, వినకుండా తిను బండారాలు కావాలని ఏడ్చి తింటే... తెల్లవారే సరికి కడుపు నొప్పితో బాధపడినట్లంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అట్లా అల్పజ్ఞానియగు జీవుడు ఆత్మ విషయం ప్రక్కకు పెట్టి ఇంద్రియ విషయాలను అంటిపెట్టుకొని ఉంటున్నాడు. అందుకే దుఃఖాలు, దిగుళ్ళు ఆతనిని వదలటం లేదు.

వసంతకాలంలో వృక్షములన్నీ రససమృద్ధమై ప్రకాశించునట్లు, ఆత్మతత్వ దర్శనం చేసేవాని బలము, బుద్ధి, తేజము వృద్ధిచెందుతాయి.

రఘునందనా! తెలుసుకోవలసిన ఆత్మ వస్తువును నీవు చక్కగా తెలుసుకున్నావు సుమా! కనుకనే.... నీవు ఆనందామృత పూర్ణుడవై అతి శీతల స్వభావుడవై, తాపత్రయరహితుడవై, స్వచ్ఛుడవై పూర్ణచంద్రునివలె విరాజిల్లుతున్నావు. అందుచేతనే పురుషోత్తముడవగు నిన్ను చూచి ఈ సభకు వేంచేసిన మహనీయులెందరో మహదానందపడుచున్నారయ్యా!

❖❖❖

# 8.జీవన్ముక్తుల పవిత్ర దృష్టి

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జీవుడు తన ఆనంద స్వభావం ఆస్వాదించగలుగుటకు ముక్తి ఒక్కటే ఉపాయం కదా! అట్టి ముక్త పురుషులగు మహనీయులెందరో ఈ సభకు వేంచేసియుండటం ఈ అయోధ్యలోని మా అందరి అనేక పూర్వజన్మల పుణ్యఫలం. దృశ్యం నుండి మొదలంట విడివడియుండి జీవన్ముక్తులై ప్రకాశించే మహనీయులందరికీ శిరసు వంచి పాదాభివందనం చేస్తున్నాను. జీవన్ముక్తులగు నారదుడు, విశ్వామిత్ర మహర్షి మొదలైనవారి 'దృష్టి – అవగాహనలు' మేము ఎంతగానో మరల మరల తెలుసుకుని ఉండటం మాకు ఎంతో అవసరమని నేను అనుకుంటున్నాను. అందుచేత జీవన్ముక్తుల పవిత్ర దృష్టి గురించి ఇంకా మరికొన్ని విశేషాలు వివరించమని మిమ్ములను వేడుకుంటున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామా! మనం జీవన్ముక్తుల లక్షణములు, దృష్టులు, అవగాహనల గురించి వేరు వేరు సందర్భాలలో చెప్పుకున్నాం. ఇంకా ముందు ముందు అనేక కోణాల నుండి చెప్పుకోబోతున్నాం. జీవన్ముక్తత్వమే ఈ మన సంవాదం యొక్క అత్యుత్తమ లక్ష్యం. కనుక పదే పదే పునశ్చరణ అవసరమే. పునరావృత్తి దోషంగా సభికులు భావించరనే నా అభిప్రాయం. అందుచేత మరల పునశ్చరణ పూర్వకంగా జీవన్ముక్త స్వరూపం గురించి కొన్ని విశేషాలు సమీక్షిస్తూ ఉదహరిస్తాను, విను.

❖

సర్వేచ్ఛారహితుడగు ఆత్మజ్ఞాని ఈ ప్రపంచమును వ్యవహార దృష్టితో చూస్తున్నప్పుడు ఒక సుషుప్తుని వలె (గాఢనిద్ర పోయే వానివలె) అసంబంధపూర్వకంగా ఉంటాడు. పరమార్థ దృష్టిచే "ఇదంతా అసద్రూపమే కదా" అని గ్రహించి ఉంటాడు. లయించిపోయినట్టి మనస్సు కలవాడై ఆనందోన్మత్తుడై మెలగుచూ ఉంటాడు. ఆతని బుద్ధి అంతర్ముఖమగుటచే ఉదారత్వం వహించి ఉంటుంది. తాను అందరిలాగానే ఇంద్రియములను, వస్త్రములను, ధనాదులను కలిగి ఉన్నప్పటికీ తన అంతర్ముఖ దృష్టిచే ఒక స్తంభంలాగా తదితరుల వ్యవహారములను చూస్తూ ఉంటాడు. ప్రశాంత బుద్ధితో అంతా గమనిస్తూ... జనులు పొందే సంరంభమును చూచినప్పుడు నవ్వుకుంటూ ఉంటాడు.

భావిపదార్థములను అభిలషించడు. వర్తమాన పదార్థములపట్ల ప్రీతి కలిగి ఉండడు. గడచిన వస్తువుల గురించి చింతించడు. కానీ... సర్వము ఆచరిస్తూనే ఉంటాడు.

దృశ్య – (లౌకిక) వ్యవహారములందు తనను తాను సుదూరంగా అట్టేబెట్టుకొని సుప్తప్రాయుడై ఉంటాడు. ఆత్మ విషయంలో మాత్రం అత్యంత జాగరూకుడై ఉంటాడు. వ్యవహారములందు కుశలుడై ఉన్నప్పటికీ అంతర్గతంగా మాత్రం.... అంతఃపురంలో బాలకుణ్ణి బుజ్జగిస్తున్న దాది తన సొంత ఇంటిలోని బిడ్డ గురించే అదంతా చేస్తున్నట్లు.... ఆత్మ కొరకై వ్యవహారనిరతుడై ఉంటాడు.

**అన్తః సర్వపరిత్యాగీ నిత్యమన్తరనేషణః ।**
**కుర్వన్నపి బహిః కార్యం సమమేవావతిష్ఠతే ॥** (శ్లో 9, సర్గ 76)

బాహ్యమున అన్ని కర్మలు చేస్తున్నప్పటికీ అంతరంగంలో ఏమీ చేయనివాడుగా ఉంటాడు. సర్వమూ మొదలే పరిత్యజించి, కోర్కెలేమీ లేనివాడై, సమరూపుడై ఉంటాడు.

యథా ప్రాప్తములైన క్రియల విషయంలోనూ, వర్ణాశ్రమ ధర్మముల విషయంలోనూ, పితృ పితామహాది క్రమం చేత ప్రాప్తించే ఆస్థి-రాజ్యాధికారాల విషయంలోనూ, బంధు మిత్ర సమాగమాది ఆయా సందర్భములలోనూ తాను నిర్వర్తించవలసినది తదనుకూలంగానే నిర్వర్తిస్తూ ఉంటాడు. అయితే ఏం? సర్వ విషయములలోనూ ఆతడు వర్తిస్తున్నప్పటికీ "అహమ్ కర్తాస్మి... నేను దీనికి కర్తను"... అనే కర్తృత్వాభినం రహితం చేసుకొని, ఆయా కార్యములు నిర్వర్తిస్తూ ఉంటాడు. సుఖ దుఃఖములు సమీపిస్తున్నప్పుడు వాటిని ఆత్మ రూపంగా ఎరిగి ఉంటాడు. అందుచేత ఇష్ట-అయిష్ట ఫలముల పట్ల సమరూపుడై, ఉదాసీనుడై ఉంటాడు.

దేని కొరకూ వాంఛించడు... ద్వేషించడు. శోకించడు... హర్షించడు. అనుకూల, ప్రతికూల కర్మాచరణ సమయములలో అనాసక్త చిత్తంతో వ్యవహరిస్తూ ఉంటాడు.

భక్తులందు భక్తుని వలె, ధీరులందు ధీరుని వలె, దుఃఖితులందు దుఃఖితుని వలె, యౌవన వృత్తాంతములందు యువకుని వలె ఉంటూనే... తాను సర్వదా తన అఖండ, అప్రమేయ స్వస్వరూపమును ఏమరువడు.

❖

ఆతని నోటివెంట పుణ్యప్రదమైన, శుభప్రదమైన మాటలే వస్తాయి. ఆతని వాక్యాలు సమగ్రత్వం, సుదీర్ఘ దృష్టి, సర్వహితము, లోక కళ్యాణము స్వభావసిద్ధంగా సంతరించుకుని ఉంటాయి. అభిమాన రహితంగా ఉంటాయి. కనుక, "ఈతడు ఏపాటివాడు?" అని చూపరులకు అనిపించవచ్చు. అయితే సూక్ష్మబుద్ధికి మాత్రం ఆతడు ధీరబుద్ధి సహితుడని, ఆందోళనారహితుడని, ఆనందోదయ సమన్వితుడని, కోమలస్వభావుడని తెలిసిపోతుంది. పుణ్యస్వభావుడై, ప్రసన్నముఖుడై పూర్ణప్రజ్ఞాసహితుడై, ఖేద - దుర్దశలు లేనివాడై ఆతడు ఉంటాడు.

సర్వ ప్రాణులను తన స్వరూపముగా గాంచుటచే ఆతడు సర్వులపట్ల అకృత్రిమమైన స్నేహము కలిగియుండి.... లోకబాంధవుడై ఉంటాడు. ఉదారచరితుడై, సర్వావస్థలయందునూ సమరూపుడై, సౌమ్యుడై, సుఖ సాగరుడై, తన సాంగత్యముచే అందరి దుఃఖములనూ హరింపజేసేవాడై ఉంటాడు. తాను ఎక్కడుంటే అక్కడ పూర్ణచంద్రునివలె అమృత కిరణములను, సమగ్రజ్ఞానభావములను ప్రసరిస్తూ ఉంటాడు.

ఆతనికి సుకృతముల చేతగాని, దుష్కృతములచేతగాని, భోగ త్యాగములచేతగాని, బంధు మిత్ర సమాగమములచేతగాని, కర్మ, నైష్కర్మ్యములచేతగాని, స్వర్గ పాతాళాదిలోకముల ప్రాప్తిచేతగాని, బంధ మోక్షములచేతగాని ప్రత్యేకించి క్రొత్తగా వచ్చిపడే ప్రయోజనమంటూ ఏదీ ఉండదు.

ఈ జగత్తంతా ఏకమగు బ్రహ్మముగా, తనకు సర్వదా అనుభవమగుచున్నట్టి, తాను ఇదంతా ఆత్మతత్త్వముగా గాంచుచున్నట్టి ఆ జీవన్ముక్తునికి ఇక బంధమేమిటి? మోక్షమేమిటి? ఈ బంధ

మోక్షముల భావనలచే ఆతని మనస్సు ఎన్నటికీ దీనత్వం పొందదు. 'సమ్యక్ జ్ఞానము' అను అగ్నిచే ఆతని సంశయములన్నీ భస్మీభూతం కాగా ఆతని చిత్తము సర్వత్రా ప్రియత్వము, ఆనందత్వము, నిర్మలత్వము, అప్రమేయత్వము, అఖండత్వము అన్ని వైపులా అనుభవిస్తూ ఉంటుంది. ఆతని మనస్సు భ్రమ – విభ్రమ వినిర్ముక్తమై (Having been relieved of all Illusions and fantacies), బ్రహ్మరూపమై, నశించక... ఉదయించక ఉంటుంది.

ఆతడు సర్వావస్థలయందునూ ఆకాశమువలె సమరూపుడై వెలయుచూ ఉంటాడు. ఊయలలో పడుకుని ఉన్న పసిబాలుడు ఎట్టి ఇచ్ఛ – సంకల్పములు లేకుండానే కాళ్ళు – చేతులు కదులుస్తాడు... నవ్వుతాడు చూచావా? ఆత్మజ్ఞాని ఎట్టి రాగాదులు లేకుండానే తన ఈ కాళ్ళు – చేతులను ఆయా చేష్టలలో నియమిస్తాడు. అట్లు నియమిస్తూనే తాను మదిరోన్మత్తుని వలె బ్రహ్మానందంలో ఓలలాడుచూ, పునర్జన్మ భయరహితుడై ఉంటాడు. ఇతఃపూర్వం తాను రాగసహితంగా నిర్వర్తించియున్న కర్మలు గుర్తుకు వస్తున్నప్పుడు, అదంతా చూచి నవ్వుకుంటాడు. వాటి ఊసులన్నీ అధిగమించి ఉంటాడు. ఇతఃపూర్వపు సంఘటనలను స్మరించడు... విస్మరించడు.

**సర్వం సర్వప్రకారేణ గృహ్ణాతిచ, జహాతిచ ।**
**అనుపాదేయ సర్వార్థో బాలవచ్చ విచేష్టతే ॥**

అన్నీ గ్రహిస్తాడు... త్యజిస్తాడు. ఏదీ గ్రహించకయే బాలునివలె చేష్టలు సల్పుచూ ఉంటాడు.

**జ్ఞాని... అజ్ఞాని -** జ్ఞానికి, అజ్ఞానికి ఉండే ముఖ్యమైన తేడా ఏమిటో చెపుతాను, విను–ఇద్దరు కూడా దేశకాల క్రియాక్రమానుసారం కార్యములందు ప్రవృత్తులగుచున్నారు. అయితే, జ్ఞాని ఆయా క్రియాజనితమైన సుఖదుఃఖములకు వశీభూతుడు కాడు. బాహ్యమందు మనస్సుచే ప్రాప్తించిన కార్యాలను మాత్రం శ్రద్ధగా చేస్తూ ఉంటాడు. అంతరంగంలో క్రియా వర్జితుడై ఉంటాడు. ఎందుకంటే బాహ్య పదార్థములన్నీ అసత్తేనని ఆతనికి తెలుసు. అందుకే వాటి ఫలముల కొరకై ఆతడు పరుగెత్తడు. ఆ ఫలములన్నీ అల్పము, సంకుచితము, స్వల్పకాలికము అగు ప్రయోజనములే కలిగి ఉంటాయని తెలుసు. దుఃఖదశలను గాంచడు. సుఖ స్థితిని అపేక్షించడు. కార్యసాఫల్యమునకు సంతోషించడు. కార్యవిఫలత్వముచే దుఃఖించడు. సూర్యగోళము చల్లబడు గాక! చంద్రమండలం అకస్మాత్తుగా అగ్నిజ్వాలలు వెదజల్లు గాక! అగ్ని అధోముఖంగా జ్వలించుగాక! అవన్నీ కూడా ఆత్మ జ్ఞానికి ఆశ్చర్యం కలిగించలేవు. "ఆత్మయందే అవన్నీ స్ఫురిస్తున్నాయి"... అను నిశ్చయము కలవాడై విస్మయ జాలమునందు కూడా ఆశ్చర్యచకితుడు కాడు.

దయచే ఆతడు దీనము వహించడు. అట్లని క్రౌర్యము నాశ్రయించడు. అవమానములందు లజ్జితుడు కాడు. దుష్కార్యములచే నిర్లజ్జ కలిగియుండడు. గర్వి, ప్రమత్తుడు, ఖిన్నుడు, హర్షి, ద్వేషి, భయ శోకయుతుడు అవడు. విశాలాకాశము వంటి జ్ఞానము గల ఆతనికి ఎవరిపైనా కోపం ఉండదు. ఆకాశంలో విత్తనం మొలకెత్తుతుందా?

❖

ఓ రఘురామా! నిరంతరం జనన మరణములతో కూడియున్న ఈ "జగత్ స్థితి" యందు సుఖంగాని, దుఃఖంగాని ఎట్లా ఉంటాయి? ఇక ఎదురుగా ఇక్కడుండేదంతా, ఈ దేహముతో సహా, పంచభూత సమన్వయమే కదా! స్వయముగా చపలము ప్రవర్తించే చోట సుఖ దుఃఖముల ప్రసక్తి ఏమిటో చెప్పు? ఎట్లా ఉండగలవో నాకర్థం కాదు. ఇక్కడ నిరంతరం ప్రాణికోట్లు జన్మిస్తున్నాయి. మరణిస్తున్నాయి. ఈ ఉత్పత్తి వినాశములను చూచి జగద్దృష్టిగల అజ్ఞానులు మాత్రమే హర్ష శోకములు పొందుచున్నారు. జగత్ రహస్యం తెలిసినట్టి సమర్థులగు జీవన్ముక్తులు ఇక్కడి ఉత్పత్తి వినాశనములను చూచి ఏమాత్రం స్పర్థ చెందరు.

రాత్రియందు కొద్దిక్షణాల నిద్రలో సుదీర్ఘకాలపు స్వప్నములు సంభవమౌతున్నాయి చూచావా? ఉత్పత్తి వినాశనాలతో కూడిన ఈ జగత్ సృష్టులలో ఏది సంభవం? ఏది అసంభవం? క్షణికమైన ఈ తుచ్ఛ ప్రపంచంలో "దీని గురించి సంతోషం... దాని గురించి దుఃఖం" అని ప్రసంగించుకోవటంలో అర్థమేముంది? అప్పుడాతనికి సుఖం యొక్క అభావమే సిద్ధిస్తుంది. తత్ప్రయోజనంగా సుఖం యొక్క వ్యతిరేకానుభవమైన 'దుఃఖము' అనుదానికి రూపం ఏర్పడ జాలదు. అనగా శోక మోహాదులను విస్తరింపజేసే దుఃఖానుభవమే జీవన్ముక్తునకు ఉండదు. సుఖ దుఃఖ సంక్షయము యొక్క ప్రభావంచే 'ఇది త్యాజ్యము – ఇది గ్రాహ్యము" అనునది కూడా ఆతనికుండవు. త్యాజ్యగ్రాహ్యములు లేవు కనుక, ఇష్ట, అనిష్టములు ఇంకెక్కడుంటాయి? శుభాశుభ దృష్టి నశించటంచేత భోగేచ్ఛ తొలగి ఆశారాహిత్యం బలంపుంజుకుంటుంది. అప్పుడు మనస్సే విలయమౌతోంది. మనోనాశనకారణంగా సంకల్పముల కల్పన ఉండదు. నువ్వులు బాగుగా వేగిపోయిన తరువాత ఇక నూనె గురించిన ప్రసంగమెక్కడిది?

❖

"నా స్వస్వరూపమగు ఆత్మకు వేరుగా ఎక్కడా ఏదీ ఉండజాలదు" అను దృఢ జ్ఞానముచే సంకల్ప, వికల్పములు నశిస్తాయి. ఇక ఈ సర్వ దృశ్య పదార్థములు ఆకాశమువలె స్థితి పొందుతాయి. అప్పుడు 'పరిచ్ఛిన్నము' అనునదేదీ ఉండదు. అట్టి మహాత్ముడగు ఆత్మజ్ఞాని ఎట్టి పదార్థప్రాప్తికీ సంబంధించనట్టి అకృత్రిమమగు ఆనందప్రాప్తిచే ప్రమోదితుడై ఉంటాడు. ఈ స్వప్నతుల్య జగత్తునందు యథా ప్రాప్తములైన పదార్థములను చిత్తముతో అవలోకించుచూ నిశ్శబ్దత్వము వహించి ఉంటాడు. ఈ ప్రపంచము పట్ల ప్రశాంత, మౌన రూపమగు నిద్ర వంటి స్థితి పొంది ఉంటాడు. అట్లు ప్రారబ్ధక్షయము అయ్యే వరకూ జీవితమును గడుపుచూ నిత్యతృప్తుడై ఉంటాడు. నిర్హేతుక ఆనందమును, అనిర్వచనీయ సంతృప్తిని పొంది ఉంటాడు.

ఏ జీవుడైనా సరే... జ్ఞాన నిర్మలహృదయ సముపార్జనచే 'జీవన్ముక్తుడు' అగుటకు తప్పక అవకాశమున్నదని సర్వజనులకు మనవిచేస్తున్నాను.

❖❖❖

# 9.యోగమార్గం

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఒక మండుచున్న కొరివిని చేతిలోకి తీసుకొని వర్తులాకారంగా త్రిప్పుచున్నావనుకో... అక్కడ ఒక వర్తులాకారపు వస్తువేదో ఉన్నట్లు భ్రమగొలుపుతుంది కదా!

**శ్రీరాముడు :** అవును మహర్షీ! అట్లా అనిపిస్తుంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాస్తవానికి అక్కడ వర్తులాకారపు వస్తువేమీ లేదుకదా! కొరివియే భ్రమచే అట్లా అనిపిస్తోంది. అట్లాగే మనస్సు యొక్క సంచలనము లేక చాంచల్యముచే మిథ్యా రూపమగు ఈ జగత్తు భాసిస్తోంది.

తటాకపునీటిలోకి మట్టి బెడ్డను విసిరితే జలంలో ఆవర్తాలు ఏర్పడతాయి. ఆవర్తాలు జలం కంటే వేరైనవి కావు కదా! ఆత్మయందు ఏర్పడే చిత్తస్పందనము చేతనే ఈ జగత్తు కన్పించటం జరుగుతోంది. ఇది మిథ్య అయి ఉండి కూడా 'సత్యము – నిత్యము' వలే తోచుచున్నది. అవిచారణ కారణంగా ఈ జీవుడు భ్రమపూర్వకమైన ఈ జగత్తును గాంచుచూ ఇందులో సుఖ–దుఃఖ–ఉద్వేగ భావ పరంపరలకు లోను అగుచున్నాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠమహర్షీ! ఈ చిత్తము దేనిచే చలిస్తోంది? ఏ విధంగా దీని చలనం మనం నిరోధించవచ్చు? ఈ మనస్సును దహింపజేయటం చాలా ఆవశ్యకం కనుక... ఈ రెండు ప్రశ్నలకు సమాధానం విశదీకరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** "మంచు – తెల్లదనం" ... ఈ రెండూ వేరు వేరు కాదు కదా! 'అగ్ని – ఉష్ణము' వేరు వేరా? నువ్వులు – నూనె, పుష్పంలోని పుప్పొడి కణాలు – పుష్పసుగంధం ...ఈ ద్వంద్వాలు ఒకదాని కన్నా మరొకటి ఎట్లా వేరు, వేరైనవి అవుతాయి?

అట్లాగే చిత్తము, దాని స్పందనము ఒక దాని కంటే మరొకటి వేరు వేరు కానే కాదు. వాటి యందు గల "చిత్తం – స్పందనం" అనే భేద శబ్దములు కేవలం భ్రమ చేతనే కల్పించబడుతున్నాయి. గుణి – గుణములు (The possesser of attributes & Attributes)– ఈ రెండిటిలో ఒకటి లేదంటే రెండవది కూడా లేనట్లే కదా! చిత్తము – స్పందనములలో ఒకటి నశిస్తే రెండవది కూడా నశించి పోతుంది. అట్టి చిత్తము యొక్క నాశనము కొరకు రెండు విధములైన ఉపాయాలు ఉన్నాయి– 1.యోగము, 2.జ్ఞానము. ...అందు 'యోగము' అనేది చిత్తవృత్తి నిరోధకరూపమైనది.

**శ్రీరాముడు :** 'యోగము' అనగా ఏమిటో, దాని వలన జీవునకు సుఖము, శాంతి ఎట్లా లభిస్తాయో చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రాణాపాన నిరోధకమగు యోగయుక్తి గురించి మనం ముందు ముందు నిర్వాణప్రకరణ ప్రారంభంలో "భుశుండోపాఖ్యానం"లో కొన్ని, కొన్ని విశేషాలు సంభాషించు కోబోతున్నాం. అయితే ఇక్కడ నీవు అడిగావు కనుక కొన్ని విషయాలు ప్రస్తావిస్తాను.

❖

ఈ దేహమును మనం చూస్తున్నాం కదా! దీనిలోని ప్రతి శాఖ యందు అనేక నాడీ సమూహాలు ఉన్నాయి. అట్టి 72000 దాకా ఉండే నాడీ సమూహాలలో నిరంతరం వాయువు ప్రసరిస్తూ ఉంటుంది. అట్లు శరీరమంతా నిరంతరం ప్రసరిస్తూ ఉండే వాయువునే 'ప్రాణము' అని అంటాం.

ఈ ప్రాణము శరీరంలో అధో – ఊర్ధ్వ గమనములు చేస్తూ ఉంటోంది. తన సంచలనముచే వివిధ రకములైన క్రియలను నిర్వర్తించు ప్రాణమును ఆయా చోట్ల నిర్వర్తించే వేరు వేరు క్రియలను అనుసరించి ఐదు పేర్లను శాస్త్రజ్ఞులు కల్పించారు.

సుగంధమునకు ఆధారం పుష్పమే కదా! చిత్తమునకు ప్రాణమే ఆధారం.

**అన్తఃప్రాణ పరిస్పన్దాత్సంకల్పకలనోన్ముఖీ ।**
**సంవిత్సంజాయతే యైషా తచ్చిత్తం విద్ధి రాఘవ ॥** (శ్లో 13, సర్గ 78)

లోన ప్రాణచలనము అగుచుండుటచే, సంకల్పోన్ముఖమై జనించునట్టి, జ్ఞానవృత్తే "చిత్తము". అట్టి జ్ఞానవృత్తిని 'సంవిత్తు' అని కూడా అంటారు.

ప్రాణములు స్పందించుట చేతనే జ్ఞాన వృత్తుల (ఎఱుగుచుండుట అను రూపం గల వృత్తుల) స్పందనము కూడా కలుగుచున్నది. జ్ఞానవృత్తులు చిదాభాసుని (Reflection of Absolute Self) ఉనికితో నిండి ఉంటున్నాయి. జలము యొక్క స్పందనముచే తరంగములు ఉత్పత్తి అగుచున్నట్లు జ్ఞానవృత్తుల స్పందము చేత విషయానుభవం కలుగుతోంది. దృశ్యజగత్తు యొక్క వాస్తవరూపం విషయానుభవమే!

ప్రాణ స్పందనమే చిత్తం అని చెప్పుకున్నాం కదా! కనుక ప్రాణములు గనుక నిరోధించబడితే... అప్పుడు చిత్తము కూడా తప్పక ఉపశమించగలదు. అట్లు చిత్తము, లేక, మనస్సు ఉపశమిస్తే 'జగత్తు' అనే అనుభవం కూడా విలయ మొందుచున్నది.

**శ్రీరాముడు :** మునీంద్రా! ఈ దేహంలో 72000 నాడులున్నాయి కదా! వాటన్నిటి యందు నిరంతరం గమనాగమనములు సలుపుచున్న ప్రాణవాయువులు మొట్టమొదట నాసిక ద్వారా ప్రవేశిస్తున్నాయి కదా! అట్టి నాసిక మొదలైన రంధ్రములందు గల ఆకాశంలో వాయువును నిరోధించటమే ప్రాణాయామమని వినియున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అట్టి 'నిరోధము' అనే యోగములోగల వివిధ మార్గములను విశదీకరిస్తాను... విను.

**1. అనేకాగ్రత నుండి ఏకాగ్రతకు -** ఆశ్రయించబడుచున్న సాంసారిక వృత్తులందు అవిశ్వాసం దృఢపడాలి. "నేనిప్పుడు ఆశ్రయిస్తూవస్తున్న ఈ పదార్థజాలమంతా వాస్తవం కాదు. ఇదంతా నన్ను భ్రమింపజేసి... దుఃఖమును, మోహమును కలుగ జేస్తోంది. కాబట్టి ఇందుకు తగిన ఉపాయం కొరకై అన్వేషించాలి" అనే ప్రయత్నం దృఢపరచుకోవాలి. శాస్త్ర సజ్జన సాంగత్యంతోనూ, వైరాగ్యాభ్యాసం చేతను ఆ అవగాహన బలపడగలదు. అప్పుడు శ్రద్ధ, ఏకాగ్రతలు రూపుదిద్దుకుంటాయి. ప్రియాప్రియ

భావములు త్యజించబడతాయి. అట్టి ధ్యానముచేతనూ, అనేకత్వపుజాడ్యము తొలగుచున్నప్పటి 'ఏకత్వము' యొక్క దృఢాభ్యాసంచేతనూ ప్రాణచలనము నియమించబడగలదు.

**2. ప్రాణాయామం -** సుఖ పూర్వకంగా క్రమక్రమంగా నివర్తించబడే 'పూరకము – కుంభకము – రేచకము' అను విభాగములు గల ప్రాణాయామము యొక్క దృఢమైన అభ్యాసంచేతా, ఏకాంత ధ్యానయోగంచేతా ప్రాణచలనము నిరోధించబడగలదు.

**3. ప్రణవోచ్చారణ -** 'ఓం' కారమును సుదీర్ఘంగా ఉచ్చరిస్తూ... అద్దాని యందలి 'అ–ఉ–మ' లకు అంతర్లీనమై ఉండే 'చతుర్థమాత్ర'ను అవలంబించి ...అద్దాని శబ్దార్థము(That which is intended by Om)ను భావన చేయటం మరొక మార్గం. అట్టి పవిత్ర భావనచేస్తుండటంచేత క్రమంగా బాహ్య విషయములకు సంబంధించిన అజ్ఞానం పూర్తిగా తొలగిపోతుంది. సాంసారిక దృష్టులన్నీ శమిస్తాయి. అప్పుడు ప్రాణస్పందనము నిరుద్ధమౌతుంది.

**వివిధ యోగాభ్యాసములు –** ఇప్పుడు వివిధ యోగాభ్యాసముల గురించి, తద్వారా చిత్తము నిరోధించటం గురించి చెప్పుచున్నాను విను–

**1. పూరకము -** వాయువును నాసికాపుటముల ద్వారా సుదీర్ఘంగా స్వీకరించటం, మరల క్రమపూర్వకంగా త్యజించటమును 'పూరకము' అని అంటున్నాం. పూరకమును పదే పదే అభ్యసిస్తూ వస్తే ...క్రమంగా అట్టి అభ్యంతర పూరకముచే ప్రాణసంచలనము 'పర్వతంపై నిలచే నిశ్చల మేఘం లాగా' ఉపశమిస్తుంది. క్రమంగా మనస్సు నిశ్చలమౌతుంది.

**2. కుంభము -** పూరకముచే నాసికాపుటముల ద్వారా స్వీకరించిన వాయువును నిండు కుండలాగా దీర్ఘకాలం శరీరంలో స్థంభింపజేయటం... అట్లు స్థంభించిన తరువాత పూరకంలోలాగానే వాయువును తిరిగి వదలటం. ఈ అభ్యాసం చేత కూడా ప్రాణము స్తంభితమౌతుంది.

**3. రేచకము -** వాయువును నాసికారంధ్రముల ద్వారా బహిర్గతం చేసి, మరల వాయువు ప్రవేశించ కుండా కొద్ది క్షణములు నిలువరించటం. అట్టి దృఢాభ్యాసం చేత విశాలమగు ప్రాణము ఆకాశరూపమును పొందుతుంది. అభ్యాససమయంలో, వాయువు నాసపుటములను స్పృశించక పోవుటచే ప్రాణ చలనము, తద్వారా క్రమంగా మనోచంచలత్వము నిరోధించబడతాయి.

**4. తాలువు-ఘంటికల యోగముద్ర -** నోటిలోపలి దవడ యొక్క మొదటి భాగంలో వ్రేలాడుచుండే ఘంటిక (కొండ నాలుక)ను నాలుక చివరికొనతో అణిచిపెట్టి ప్రాణమును బ్రహ్మ రంధ్రమున ప్రవేశింప జేసి ధారణ ఒనర్చటం చేత ప్రాణస్పందన నిలువరించబడుతోంది. తీవ్ర యోగాభ్యాసులగు కొందరు దీనిని అభ్యాసం చేస్తున్నారు.

**5. పరధ్యానం -** "ఈ జగత్తుకు సంబంధించిన ఏవేవో విశేషాలు తెలుసుకోవాలి, గ్రహించాలి" అను రూపం గల ఒకానొక వృత్తి ఈ జీవునిలో అనుక్షణం బయల్వెడలుతోంది. అట్టి వృత్తినే 'సంవేదన వృత్తి' అని అంటారు. ఈ జీవుని ఆ సంవేదనా వృత్తి తన స్వకల్పనా వికారమును త్యజించి నిర్వికల్ప సమాధి యొక్క అభ్యాసం చేత సూక్ష్మ హృదయాకాశంలో లయం చేయబడిందనుకో... అప్పుడు కూడా ఈ ప్రాణస్పందన నిలపివేయబడుతుంది.

**6. ఖేచరీ ముద్ర -** నాసికాగ్రం వద్ద గల పం[డెండు అంగుళముల వరకు గల నిర్మలాకాశంలో మనోదృష్టులన్నిటిని తరలించి తెచ్చి నిలిపామనుకో... అప్పుడు కూడా ప్రాణస్పందము నిరోధించ బడుతోంది.

**7. బ్రహ్మరంధ్ర లయ ముద్ర -** పం[డెం[డు అంగుళముల మేర ఉన్న శిరస్సు యొక్క ఉపరి భాగపు ప్రాంతమందు గల బ్రహ్మ రంధ్రమునందు అభ్యాసవశం చేత ప్రాణ వృత్తులను లయింప జేయుటచే ప్రాణస్పందమును నిశ్చలం చేయటం.

**8. భ్రూ ముద్ర -** ఈ నేత్రేంద్రియము అభ్యాస వశంచేత భ్రూమధ్య భాగంలో (Space between two eye - brows) చిరకాలం నిరోధించబడినప్పుడు సైతము ప్రాణము ఉపశాంతి పొందగలదు. అట్లు శాంతికి ఉపక్రమించిన ప్రాణము బ్రహ్మ రంధ్రమునందు ప్రవేశపెట్టుటచే ప్రాణము పూర్తిగా నిరోధించబడుతుంది.

**9. గురు అనుగ్రహం - ఈశ్వరానుగ్రహం -** అనేక జన్మలలో చేసిన, పుణ్యం త్యాగకర్మల ప్రభావంచే పరిశుద్ధుడు సంసిద్ధుడు అయినట్టి జీవుడు ఒకానొక జన్మలో గురువు యొక్క కరస్పర్శాది అనుగ్రహము చేతనో, ఈశ్వరానుగ్రహము చేతనో 'ఆత్మజ్ఞానం' కాకతాళీయంగా పొందుతుంటాడు. లేదా, ఒక్కసారిగా తీవ్ర ప్రయత్నమును స్వీకరించి కొద్దికాలంలో ఆత్మజ్ఞానం పొందటం జరగవచ్చు. అట్టి ఆత్మజ్ఞానం క్రమంగా సమస్త కల్పనలూ, సర్వ ఆశలు అధిగమించినదై ప్రకాశించగలదు. అట్టి స్థితిలో ప్రాణచలనము స్వయముగా నిశ్చలమగుచున్నది.

**10. ధ్యానము -** ఈ చిత్తమును తన హృదయాకాశంలో చిరకాలం లగ్నంచేస్తూ ఉంటే అట్టి అభ్యాసియగు యోగసాధకుడు స్వయముగా వాసనారహితుడే అవుతాడు. చిత్తమును భగవన్నామ స్మరణం వంటి అభ్యాసాలలో నియమించుటచే కూడా, అదేవిధంగా, క్రమంగా హృదయాకాశంలో ఆచిత్తము సుస్థిరమవగలడు. అట్టి ఆత్మ ధ్యానము చేయుటచే ప్రాణస్పందనము నిరోధించబడుతోంది.

ఇట్టి ఆయా ఉపాయములచే, అభ్యాసములచే ప్రాణము నియమించబడగా, "చిన్మాత్ర స్వభావుడగు ఆ పరమాత్మ నా యొక్క స్వాత్మరూపమే"... అని ఎరుగబడగలదు.

❖

**శ్రీరాముడు :** హే మహాత్మా! నాదొక చిన్న సందేహం. ఈ విశాల దృశ్యమంతా కూడా 'హృదయము' అనే దర్పణంలో ప్రతిబింబించటం జరుగుతోంది కదా! అట్టి ఈ ప్రాణుల హృదయం ఎట్లు తయారు చేయబడింది? దీని రూపము ఎట్టిది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ సమస్త ప్రాణుల హృదయము రెండు విభాగములు కలిగి ఉంటున్నది–

**1. త్యాజ్య (భౌతిక) హృదయం -** పరిచ్ఛిన్నమగు ఈ భౌతిక రూపమునందు గల వక్షస్థల ప్రదేశంలో మాంస పిండ రూపంలో ఉన్నది చూచావా? ఇది త్యాజ్య హృదయం. హృదయం యొక్క ఈ విభాగం వాస్తవానికి హృదయమునకు ఉపకరణము వంటిది. ఇది జడమైన శరీరము యొక్క ఒక అవయవమై ఉన్నది.

**2. గ్రాహ్య (అభౌతిక) హృదయం -** ఇది జ్ఞాన మాత్రమగు హృదయ విభాగం. ఇది సర్వుల అంతరమున, బాహ్యమున కూడా ఉన్నది. కానీ రామా! ఇది వాస్తవానికి బయటగాని లోపలగాని లేదని కూడా చెప్పవచ్చు. ఎందుకంటే అది ఒక భౌతిక పదార్థం కాదు కదా! భౌతికం కానిది దేనికి లోపల? దేనికి బయట? ఇదే ప్రధానమగు హృదయం. దీనియందే జగత్తంతా స్థితి నొంది ఉన్నది. ఇది సర్వ పదార్థములకు ఆధారం... సర్వ సంపదలకూ నిలయం కూడా.

ఈ హృదయం యొక్క రూపము ఏమిటంటావా?... దాని రూపము ఎఱుక (Awareness) (లేక) జ్ఞానము (Knowledge Absolute) (లేక) సంవిత్తు. నేను మన సంవాదము యొక్క సౌలభ్యము కొరకు హృదయమును రెండు విభాగములు చేసి చెప్పాను. అయితే, జడము... శిలాసదృశము... మాంసపిండము అయిన త్యాజ్య (భౌతిక) హృదయం వాస్తవమైన హృదయం కాదని, గ్రాహ్య హృదయం అసలైన హృదయమనీ గ్రహించు.

వాసనాత్యాగపూర్వకంగా ఈ చిత్తమును సంవిత్ రూపమగు శుద్ధ – గ్రాహ్య హృదయంలోనికి ప్రవేశింపచేయాలి. అంతేగాని, దానిని శబ్దస్పర్శాది ఇంద్రియ విషయాలలో అట్టేబెట్టి రోజులు జడపూర్వకంగా గడపరాదు. చిత్తం ప్రబలంగా హృదయాకాశంలో... ఏ మార్గము (లేక) ఉపాయం చేతనైనా సరే... నియోగించబడినప్పుడు ప్రాణ చలనం నిరుద్ధమవుతుంది. వివిధ ఆచార్యులు, లోకమునకు వివిధమార్గాలు, తదితర క్రమములు ప్రసాదించారు. శ్రద్ధగా, లక్ష్యమును ఎరిగి ఆచరించినప్పుడు ప్రాణ స్పందనము నిరోధించబడుతోంది.

మనం పైన చెప్పుకున్న ఆయా యోగయుక్తులన్నీ అభ్యాసవశం చేత.... ఈ సంసారం త్యజించి మోక్షం సముపార్జించాలనుకున్న సాధకులకు ...తప్పకుండా ఉత్తమ ఉపాయములై సహకరిస్తున్నాయి. ప్రాణాయామము మొదలైనవి అభ్యాసముచే దృఢపడుతూ వైరాగ్యమునకు సహకరించి, తద్వారా, వాసనలు నిరోధించబడతాయి. అట్టి వాసనానిరోధము యొక్క సాఫల్యముచే ఈ జీవుడు ఔన్నత్యము సంపాదించి 'ఆత్మతత్త్వము'ను గ్రహించగలడు.

❖

కాలువలో ప్రవహిస్తున్న నీరు గట్టు కట్టినపుడు తన ప్రవాహ వేగమును ఉపసంహరించుకొని వెనుకకు మరలక తప్పదుకదా! మనం ఇంతవరకు చెప్పుకున్నట్టి "భ్రూమధ్యం నుండి, నాసికా ప్రదేశము నుండి, కంఠప్రదేశము నుండి 12 అంగుళముల వరకు గల ప్రదేశంలో చిత్తమును సుస్థిరం చేయటం" (ఖేచరీముద్ర) అనే అభ్యాసం చేత మనస్సు యొక్క పరిపరివిధత్వం ఉపశమిస్తుంది. ప్రాణముల నిరంతర సంచలనము శమిస్తుంది. అట్లాగే నాలుక యొక్క చివరిభాగంతో తాలువు (దవడ) నందు వ్రేలాడి ఉండే కొండనాలుకను పలుమార్లు స్పృశించటం అభ్యసించడం చేత కూడా త్వరితగతిలో ప్రాణసంచలనంపై ఆ సాధకునకు అధీనత్వం లభిస్తోంది.

అయితే ఒక ముఖ్యమైన విషయం అందరికీ గుర్తు చేస్తున్నాను. ఆయా యోగాభ్యాసాలన్నీ అంతిమ ప్రయోజనమగు "అఖండ – అప్రమేయానుభూతి" అను రూపంగల మోక్ష స్థితిని

ప్రసాదించుటకు ముందు కొన్ని వికల్పములు ఏర్పడే అవకాశం ఉన్నది. సాధకుడు నిష్కాముడై ఉంటే వికల్పములన్నీ వాటంతటవే తొలగుతాయి. "పరమ ఉపశమనము" అనే ఫలమును దృశ్య విషయఫలాసక్తి లేని సాధకునకు త్వరితగతిని కలుగచేస్తాయి. అయితే ప్రాణయోగాభ్యాస విధివిధానములను గురుముఖతః ఎరిగి అభ్యసించవలసినదని నా విన్నపం.

❖

అభ్యాసము చేతనే మానవుడు శోకరహితుడై ఆత్మారాముడుగా విరాజిల్లగలడు. కొంచెం శ్రద్ధ, పట్టుదల కలిగియుండి సాధన చేస్తే అంతఃకరణమునందు సుఖి కాగలడు.

అభ్యాసమునకు మించిన గురువు, మిత్రుడు, ఉపాయం, మార్గం వేరే ఉండవు. అభ్యాసముచే క్రమక్రమంగా ప్రాణస్పందనము సన్నగిల్లుతుంది. మనస్సు శాంతి పొందుతుంది. మనస్సు శాంతిస్తే నిర్వాణపదము లేక బ్రహ్మపదము, లేక మోక్షము శేషించగలదు.

ప్రాణస్పందనమే మనస్సు. మనస్సు వల్లనే ఈ సంసారభ్రమ అంతా కలుగుతోంది. కాబట్టి ప్రాణస్పందనము ఉపశమిస్తే సంసార దుఃఖము తనకు తానుగా నశించుచున్నది. అప్పుడు బ్రహ్మము నందు కల్పనాయుక్తమై ఉంటున్న మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, దేహం, ప్రారబ్ధం, బంధం, మోక్షం' మొదలుగా వాక్సముదాయమంతా నివృత్తి చెందుతుంది. బ్రహ్మపదమే శేషిస్తుంది.

**యత్రసర్వమ్, యతఃసర్వమ్, యత్‌సర్వమ్, సర్వతశ్చయత్ ।**
**యత్ర నేఽదమ్, యతో నేఽదమ్, యన్నేఽదమ్, నేదృశం జగత్ ॥**

ఈ జగత్తుగా గోచరించేదంతా ఎందులో ఉండి ఉన్నది? దేని నుండి ఇదంతా ఆవిర్భవిస్తోంది? ఏది అంతటా వ్యాపించియున్నది? ఈ సర్వము స్వతఃగా ఏదై ఉన్నది? కానీ...

ఎందులో జగత్తు అనబడేదేదీ ఉండజాలదు? దేనినుండి మరొకటేదీ ఆవిర్భవించజాలదు? దేని రూపమైతే ఈ కనబడే జగత్తు, ఇందలి ఏ వస్తువూ కాదు? ఏ అంశంలోనూ దేనికి ఇది సామ్యము (comparison)కాదు?

అట్టి నిత్యనూతన అకళంక అప్రమేయ బ్రహ్మము, సాధకునికి ఒకానొకదశలో అనుభవమ వుతుంది. ఈ కనబడే జగత్తు నాశవంతమూ, వికల్పమయమూ కదా! ఇక్కడ నిర్గుణపరమాత్మకు సదృశమైనదేది లభిస్తుంది? అందుకే... ఏ దృష్టాంతమైనా బ్రహ్మమును సమగ్రంగా తెలియజెప్ప గలదా?... లేదు. సాధన యొక్క పరిపక్వస్థితిలో ఈ జీవుడు అనబడే చిద్రూపము... "గాంచువాడు, గాంచబడుచున్నది, గాంచుట" అను త్రిపుటితో సహా సర్వరూపరసాది బాహ్యావృత్తులకూ సాక్షిరూపత్వము అనుభవించ గలదు. నాటకము చూస్తున్న రాజుగారు రంగస్థలంపై ప్రవేశించి పాత్రధారుల రసావేశంలో జోక్యం కలిగించుకొనటం ఎంత రసాభాసయే గదా! యోగి తన సాక్షి స్వరూపము ఎరిగిన తరువాత ఈ జగత్తు అనే కల్పనతో తాదాత్మ్యం చెంది రసాభాస పొందడు. అతడు సర్వదా సాక్షి రూపమునే ఉంటాడు.

అట్టి చిద్రూపమే తేజోవంతములైన అన్ని పదార్థముల కంటేకూడా ప్రకాశవంతమైనది.

ఈ కామము మొదలైన సర్వ అభ్యంతర వృత్తులనూ ప్రకాశింపజేస్తున్నది అదే! 'చైతన్యము' అనే మహావృక్షము నుండి వివిధ రసయుక్తములగు ఈ జగద్రూపఫలములు నిరంతరం ఉత్పన్నమై నశిస్తున్నాయి. ఏ మహామతి అయితే ఈ సర్వసీమములకు ఆవల ఉన్నట్టి ఆ బ్రహ్మపదమును ఆవలంబించి ఉంటాడో... ధీరుడు, బ్రహ్మజ్ఞుడు అగు ఆతనిని 'జీవన్ముక్తుడు' అని మనం పిలుస్తున్నాం. అట్టి జీవన్ముక్తునకు సర్వభోగాభిలాషలు నశించిపోతాయి. హిత – అహిత కల్పనంతా ఉపశమించి పోతుంది. ఆతడిక ఎట్టి వ్యవహారమునందునూ హర్షముగాని, శోకముగాని పొందడు.

ఆతడే ముక్త మానసుడు. ఆతడే పురుషోత్తముడు.

❖❖❖

# 10. జ్ఞాన మార్గం

**శ్రీరాముడు :** మహాత్మా! "యోగయుక్తస్థితి" పొందటానికిగాను చిత్తమును నశింపజేయాలి కదా! అట్టి చిత్తనాశనమునకై ఉపాయమగు 'ప్రాణనిరోధం' గురించి చెప్పారు. అట్లాగే మరొక ఉపాయమైనట్టి 'సమ్యక్‌జ్ఞాన సముపార్జనం' గురించి కూడా చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** "ఆద్యంత రహితుడు, అసాధారణుడు అగు పరమాత్మ ఒక్కడే ఈ జగత్తునందు కలడు. ఆతనికి అన్యంగా ఎక్కడా ఏదీ లేదు" ....అను ఏ మహత్తర నిశ్చయం ఉన్నదో... అద్దానినే విజ్ఞులు 'సమ్యక్ జ్ఞానం' అని పిలుస్తున్నారు. అట్టి సమ్యక్ జ్ఞాని, "కుండలన్నీ మట్టియే. వస్త్రములన్నీ దూదియే. జీవులన్నీ ఆత్మయే" అను భావన కలిగి ఉంటాడు.

మిథ్యాజ్ఞానముచే జన్మాదులన్నీ కలుగుచున్నాయి. మిథ్యా జ్ఞానము చేతనే కదా, బాటయందు మెలికలు తిరిగిపడియున్న త్రాడును చూచి 'ఇది పాము' అని భ్రమకలగటం! సమ్యక్ జ్ఞానం – అనగా, "పాము అన్నది నా భ్రమ. ఇక్కడ ఉన్నది త్రాడే" అని తెలియవచ్చుట వంటిదే!

సంకల్పాంశ వినిర్ముక్తమైనది, విషయవర్జితమైనది అగు తత్త్వమునకు 'సంవిత్తు' (Absolute Existence & Knowledge)అని పేరు పెట్టారు. అట్టి సంవిత్తు తన యొక్క స్వప్రకాశ స్వభావం చేత సర్వే సర్వత్రా నిండియున్నది. దానికి అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేదు. అదే మోక్ష స్థానమూ... బ్రహ్మమూ కూడా. ఆ సంవిత్తు ఒక చోట శుద్ధరూపంగా ఎరుగబడినప్పుడు ఆ స్థానమును 'పరమాత్మ' అని అంటున్నాం. అది సర్వ పదార్థరూపమయినప్పటికీ... అశుద్ధ రూపకల్పనచే అదే 'అవిద్య'గా అగుచున్నది. దృశ్యపరిమిత దృష్టి కలిగిఉన్నప్పుడు పరమాత్మయే జీవాత్మగా పిలువ బడుతోంది.

"లేక అది అవిద్యను గాంచుచున్నది!" అని కూడా అనవచ్చు... ఓ రామచంద్రా! ఏదైతే తెలుసుకొనుచున్నదో అదే తెలియబడవలసినది. ఈ అభిప్రాయాన్నే వేదాంత పరిభాషలో – జ్ఞానమే జ్ఞేయమై ఉన్నది ...సంవిత్తే సంవేద్యము" – అని చెప్పబడుతోంది.

నీవు ఆ పరమాత్మగా ఆరాధించు లక్ష్యార్థము ఏమై ఉన్నది?... నీ వాస్తవ శుద్ధరూపమే! అదియే సర్వదేహుల యొక్క శుద్ధ రూపము కూడా! అనగా... నీవే సర్వమై, శుద్ధమై, శాశ్వతమై, అఖండమై, అప్రమేయమై... స్వతఃగా పరమాత్మవే అయి ఉన్నావు.

"నేను దేహముచే, ప్రదేశముచే, కాలముచే బద్ధుడను" అను భావన కలిగి ఉన్న సంవిత్తును "జీవుడు" అను పేరుతో పిలుస్తున్నాం. సంవిత్తు వాటికి అతీతమైన భావమును స్వీకరించియున్నప్పుడు, అట్టి సంవిత్తు యొక్క స్థితిని "శివము, మోక్షము" మొదలైన శాస్త్రీయ నామములతో చెప్పుకుంటున్నాం. జీవుడు వ్యక్తిగతమైన విశేషముల దృష్ట్యా చూస్తే, భ్రమయుతుడేగాని, "వాస్తవస్వరూపుడు" (నిజం) కాదు. ఈ జీవుని యొక్క శివస్వరూపం సర్వదా వాస్తవమై వెలుగొందుతోంది.

❖

కనుక రామా! సంవిత్తు... సంవేద్యము; జ్ఞానము... జ్ఞేయము; తెలుసుకుంటున్నవాడు... తెలియబడుచున్నది – ఇవన్నీ ఒకే అర్థం కలిగియున్నాయి.

ఈ అన్ని ద్వంద్వములమధ్యా ద్వైత కల్పనయే లేదు. అజ్ఞానవశం చేతనే ఆత్మ తనను తాను జగద్రూపంగా సంచయమొనర్చుకొనుచున్నది. ఏది ఏమైనా కావచ్చు.... ఆత్మకు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేదు.

ఈ ముల్లోకములలో కనబడేదంతా సత్యమగు ఆత్మయే అయిఉన్నది. "ఈ జగత్తంతా ఆత్మయే"... అనే నిశ్చయం నీ యందు స్థిరపడిందా, ఇక నీకు పూర్ణ కామత్వము సిద్ధిస్తుంది. సర్వమూ ఆత్మగా దర్శించ బడుచున్నప్పుడు ఇక భావాభావములు ఎక్కడుంటాయి? బంధమోక్షముల ప్రసక్తి ఎక్కడ?... ఎవరికి?

**శ్రీరాముడు :** మరి శాస్త్రములు బంధమోక్షముల గురించి ప్రస్తావిస్తున్నాయి కదా....?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ముముక్షు విజ్ఞానం విస్తారింపజేయటానికి మాత్రమే శాస్త్రములు 'బంధమోక్షములు' అనే కథనమును ప్రతిపాదిస్తున్నాయి. ఇంతకీ ఈ జీవులు ఆత్మ అను ఏ వేరైన దానికై వేచివుండాలో చెప్పు?... కనుక ఇప్పటికి లభించనిదేదో అప్పుడు లభించాలి – అను ఉద్వేగం అనుచితమే అవుతుంది.

ఆత్మ లభించి ఉండనిదెప్పుడు? ఆత్మస్వరూపం కానిదేది.

❖

'చిత్తము' అనబడేది ఆత్మకు అన్యంగా ఏదీ ఎక్కడా ఉండజాలదు. బ్రహ్మమే సర్వదా ఈ దృశ్యము రూపమున శోభిస్తోంది. ఈ జగత్తంతా చిదాకాశమే. బంధమోక్షముల ప్రేలాపన వ్యర్థమైనదే సుమా! మహత్తుకు కూడా మహత్తు అయినట్టి బ్రహ్మమే 'విశాలము... విస్తారము' అయిన ఈ దృశ్యము రూపమున ఉన్నది.

అందుచేత ఓ ప్రియజనులారా! మీ రంతా 'ద్వైతము' అనే భావనను మీయందు రహితం చేయండి. యత్నశీలురై, అట్టి యత్నపూర్వక శ్రద్ధచే "ఆత్మ అనగా నేనే" అను ఎరుకను సుస్థిర పరచుకోండి. ఆత్మ స్వరూపులు కండి.

❖

ఓ రామా! కట్టె, శిల, వస్త్రము, దేహము మొదలైన పదార్థాలన్నీ వాస్తవానికి 'శక్తి' యొక్క వివిధ తత్త్వములే కదా! "అధిష్ఠానమగు సన్మాత్ర దృష్టి"తో చక్కగా విచారిస్తే వాటియందు లేశమైన భేదం కనిపించదు. వాస్తవం ఇది అయి ఉండగా, ఇక నీవు దేని కొరకు సంకల్పోన్ముఖుడవు అవుచున్నావో చెప్పు? నీవు దేనిని 'వస్తువు'గా చూస్తున్నావో... అది తన యొక్క ఆద్యంతములందు నాశనము లేనిదే అయి ఉన్నది.

వస్తువు యొక్క వాస్తవ తత్త్వమునకు ఉత్పత్తి, వినాశనములు లేవు. వాటి ఆద్యంతముల స్వరూపం ఆత్మయే. కనుక నీవు నిశ్చింతగా ఆత్మమయుడవై ఉండుము.

స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తంతా పరబ్రహ్మరూపమగు చిదాకాశమే అయి ఉండగా ఇక ఇందు సుఖ దుఃఖములెచట? కాబట్టి రామా! నీవు సంతాపం పొందవలసిన పనిలేదు. ఒకే జలం చిత్ర విచిత్ర తరంగముల రూపమున స్ఫురిస్తోంది కదా! ఆత్మయే ఈ ద్వైతాద్వైతములుగా ఉత్పన్నమగుచూ సమూహంగా స్ఫురిస్తోంది. తత్త్వము తెలిసినవానిని ఈ విషయభోగములు ఏమాత్రం తాకనైనాలేవు. బంధించలేవు. పిల్లగాలులు పర్వతమును చలింపజేయగలవా? మహత్తరమగు ఆత్మను గురించిన విచారణ సల్పుచున్నట్టి జ్ఞానియొక్క మనస్సును ఈ తుచ్ఛప్రాపంచిక ఇంద్రియ వ్యవహారములు ఏమాత్రం ఖిన్నం చేయలేవు. అయితే, అల్పజలం గల తటాకంలో కొంగలు చేపలను పుటుక్కున మ్రింగివేస్తున్నట్లు, అల్పవిచారణతో కూడిన ఆశలతో నిండిన మనస్సు గల మూఢజీవుని దుఃఖములు వచ్చి నిరంతరం మ్రింగివేస్తున్నాయి.

❖

అందుచేత రామా! "ఇదంతా ఆత్మయే! అవిద్య అనబడేదానికి స్వయం ప్రభావం (Independent Existence) లేదు" అను దృష్టిని అభ్యాసం చేయి. అప్పుడు పరిశుద్ధమగు పరమాత్మగా శేషిస్తావు. ఆత్మారాముడవై విరాజిల్లుతావు. వివిధ జలాశయములలోని తరంగములు, ఫేనము (నురుగు) బుద్బుదములు (బుడగలు) జలమునకు వేరు వేరు కానట్లే... వివిధ కల్పనలన్నిటిలో ఆత్మ కాక మరేదీ ఎక్కడా లేదు. సర్వ ప్రయత్నములచే, ఉత్తమోత్తమ విచారణ చేసి ఈ విషయం చక్కగా గ్రహించు. ఈ సర్వ ఉపాధులందు స్ఫురించుచున్న 'నేను... నేను' అను సంవిత్తుతో సహా... ఇక్కడా – అక్కడా – ఎక్కడా అన్ని వేళలా ఆత్మయే ఉన్నది.

ఆత్మకు అన్యంగా "నేను" అనేది లేదు. కనుక... నేను ఆత్మనే.

ఈ మాత్రం గ్రహించటంలో కష్టమేమున్నది చెప్పు? "ఆ భగవంతునికి వేరుగా మరెక్కడో నేను ఉన్నాను" – అను భావన చేతనే సర్వ అనర్థములూ వచ్చి పడుతున్నాయి. "ఆత్మ తప్పితే మరింకెక్కడా ఏదీ ఉండదు" ...అను దృఢనిశ్చయముచే సర్వ అనర్థములూ తొలగిపోతున్నాయి. అందుచేత... సమ్యక్ ఆత్మదర్శివి కమ్ము. అప్పుడు... మనస్సుకు తారసపడుచున్న సర్వబంధముల నుండీ విముక్తుడవౌతావు.

విముక్తుడవై ఇక ఆ తరువాత ముందులాగానే ఏది ఎట్లు ఉచితమో, విధి విధానమో అట్లే వ్యవహరిస్తూ ఉండు. ఇక నీచే చేయబడేదేదీ నిన్ను స్పృశించజాలదు. నీ మనస్సు హానివృద్ధులను

అధిగమించగలదు. అట్టి నిత్య – సత్య – అఖండ – అప్రమేయ – సర్వగత ఆత్మ స్వరూపుడవై చెన్నొందుచున్నప్పుడు నీవు సర్వులకూ నమస్కారయోగ్యుడవౌతావు.

ఇట్టి అవగాహనాపూర్వకమైన అనుభవస్థితిని పెంపొందించుకొనుటయే 'జ్ఞానమార్గము' అను పేరుతో శాస్త్రజ్ఞులు మనకు ప్రతిపాదిస్తున్నారు.

❖❖❖

# 11. దృశ్య - దర్శన సంబంధాతీతత్వం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! నీ యొక్క "సమ్యక్ జ్ఞానమార్గం" సుగమం కావటానికి ఉపకరించ గల ఒకానొక విచారణను అందిస్తాను. దీని సహాయంతో ఈ భోగములు ఎదురుగా ఉన్నప్పుడు కూడా వాటి కొరకై ప్రీతి గొనవలసిన అగత్యం లేనేలేదని శ్రోతలు గమనించగలరు.

❖

ఎడ్లు బండిని లాగుతూ ఉంటాయి. అయితే ఆ బండిలోని పదార్థములను అనుభవించేది ఎడ్లా?... కాదు. ఆ బండి యజమాని కదా! అట్లాగే... ఈ నేత్రములు కేవలం రూపాన్ని చూస్తాయి. కానీ ఆ రూపము వలన కలిగే సుఖం, దుఃఖం, ఆశ్చర్యం మొదలైనవి అనుభవించేది నేత్రములు కావు. నేత్రములందు ప్రవేశించిన సంవిత్స్వరూపుడగు ఈ జీవుడే సర్వం అనుభవించువాడు సుమా!

ఇక్కడ మనం ఒక ముఖ్యమైన ప్రశ్నను విచారించాలి. నేత్రేంద్రియములు రూపమునందు లగ్నమయినప్పుడు ఆత్మకు ఎందుకు క్షోభకలుగుతోంది? తన గాడిద గుంటలో పడినంత మాత్రాన చాకలి దిగులుగా చతికిలపడి కూర్చుంటాడా? బాటలోని బురద పాదాలకు అంటినప్పుడు "ఏమిరా దేముడా!" అనుకుని మనం ఊరుకుంటున్నామా? కాళ్ళు శుభ్రంగా కడుక్కుంటున్నాం. నేత్రం ఒక ఉపకరణము. ఇక దృశ్యము అట్టి ఉపయోగములలోని ఒకానొక 'సందర్భము'. అందుచేత ఈ జీవులు నేత్రములు సదవగాహనతో, సరిఅయిన మార్గంలో నియమించి ఉపయోగించుకోవటమే వినియోగం. అదియే 'యోగం'. అందుచేత ఈ నేత్రాది ఇంద్రియములను సరి అయిన సమాచారం జోడించి ఆపై ఆయా క్రమములందు ఉపయోగించడం అత్యవసరం. అట్టి సంబోధనను జ్ఞానులు ఎట్లు ఆశ్రయిస్తున్నారో చెపుతాను.... విను.

❖

ఓ నా నేత్రములారా! మీరు 'ఎంత బాగు!' – అని అనుకుంటూ ఈ స్త్రీ మొదలైన ఆయా అందంగా కనిపించే విషయాలలో బురదలో చిక్కుకున్నట్లు  చిక్కుకోకండి. ఎందుకంటారా? ఏవేవి 'అందంగా కనిపిస్తున్నాయి' అని భావించి, శ్రమించి మీరు బయలుదేరుతున్నారో... అవన్నీ కూడా కొద్ది క్షణాలలో తీవ్రమైన మార్పులు చెందబోతున్నాయి. పైగా మిమ్ములనే నశింపజేస్తున్నాయి.

అంతఃస్థితమైయున్న చిదాత్మయే బయట కూడా ఆయా సర్వ పదార్థములందూ ప్రకాశించు చున్నది. అంతఃస్థితమై యుండే "అన్నమయ–ప్రాణమయ–మనోమయ–విజ్ఞానమయ–

ఆనందమయములు" అనబడే పంచకోశములు ఆత్మయొక్క ప్రకాశముచే స్థితి పొంది ఉంటున్నాయి. అందుచేత అవి "ఆత్మకు అభిన్నములు" అయి, అనుగమించబడుచున్నాయి. తీక్ష్ణ బుద్ధిగల ప్రాజ్ఞుడు తన కార్యక్రమములలో అధిక భాగం ఆత్మ సంబంధములగు కార్యక్రమములలో ఇంద్రియ, మనస్సులను నియమించి ఉంచుతాడు. ఇక యథాప్రాప్తములైన పదార్థానుభవమునకు సంబంధించిన క్రియలయందు "ఉదాసీనత్వము" వహించి నిర్వర్తిస్తూ ఉంటాడు. అంతేగాని, మూఢుని వలె ఈ రూప నామముల బురదలో తాదత్మ్యం పొందడు. ఈ దృశ్య పదార్థములన్నీ ఉత్పత్తి, వినాశనం కలిగి ఉన్నవేకదా! పైగా, ఇవన్నీ కూడా అవిచారణ చేతనే పైకి రమణీయంగా కనబడి ఆకర్షిస్తున్నాయి. మిథ్యయగు రూపములను ఆశ్రయించి మృత్యుముఖంలో ప్రవేశించవలసిన అగత్యం ఏమిపట్టింది?

ఓ ఇంద్రియములారా! ఆ పరమాత్మ సర్వ పదార్థములనూ ప్రకాశింపజేయుట యందు అతి సమర్థుడై ఉంటున్నాడు. అయినా కూడా, ఈ రూపాది విషయములందు ఉదాసీనుడై సాక్షి స్వరూపుడై ఉంటున్నాడు. కాబట్టి మీరు కూడా ఈ దృశ్యముపట్ల సాక్షివలె ఉండండి. సదసద్రూపమగు ఆత్మనే వీక్షిస్తూ ఉండండి. అంతేగాని ఆత్మకు వేరైనట్లు భావనచేసి నిరుపయోగమైన సంతాపమంతా పోగుచేసుకోండి. ఇక్కడ తారసపడుచున్న "భార్య, భర్త, కుమారులు, మిత్రులు, అమిత్రులు, ఐనవారు, కానివారు" – మొదలైనవారంతా 'ఇదంతా ఆత్మయే' అను దృష్టిని దృఢంగా కలిగి ఉండండి. ఆపై ఇక ఏమి చూడాలనుకుంటే అది చూడండి. భ్రమమాత్రం పొందకండి.

నేత్రాదులు సేకరించే దృశ్యము గ్రహిస్తున్న ఓ చిత్తమా! నదీజలంలోని తరంగము యొక్క ఆకారం ఎంత అనిత్యం? ఈ "జాతి – వస్తు – ప్రదేశ – సందర్భముల"... సంబంధాలన్నీ అంతే అనిత్యం. ఆకాశంలో కనిపించే మేఘము యొక్క ఆకారం లాగా మిథ్యయే అయినట్టి ఈ వస్తు సముదాయముల ఆగమన, నిష్క్రమణములలో లాభాలాభములేమి ఉంటాయి? కనుక నీవు ప్రశాంతంగా శమించి ఉండు.

అద్దంలో ప్రతిబింబంలాగా, ప్రళయకాలజలంలో నశించబోయే చేపలాగా చిత్తమునందు ఈ జగత్తు స్ఫురిస్తోంది. మధ్యలో భ్రమలాగా ఏర్పడి, భావోద్వేగాలను ఉత్పత్తి చేస్తోంది.

ఈ పదార్థములన్నీ సూర్య ప్రకాశం ఆశ్రయించుటచేతనూ, పదార్థములను ఆశ్రయించుట చేత సూర్యప్రకాశమూ వ్యక్తమగుచున్నాయి. ఈ విధంగా ఆధార ఆధేయములు జడమై స్ఫురిస్తున్నాయి. ఇక అట్టి సమావేశము చూచి జీవుడు "అంత అందంగా ఉన్నది!" అని అనుకుంటూ భ్రాంతికి లోనై నిష్కారణంగా కామాదులు ఎందుకు పొందాలి? ఈ జీవునకు వాస్తవానికి ఏ పదార్థంతోనూ ఎట్టి సంబంధం లేనే లేదు. ఇక వ్యథ దేనికి?

❖

1. రూపము, 2. నేత్రాదులచే కలుగుచున్న బాహ్య పదార్థముల 'దర్శనం' (ప్రకాశము), 3. మనస్సు యొక్క సంకల్పం ...ఈ మూడూ కూడా ఒక దానితో మరొకదానికి సంబంధము లేని మూడు తత్త్వములు, కాని, చిత్రం! 'ముఖము, దర్పణము'వలె ఈ మూడు కలిసిఉంటున్నాయి. అయితే... అజ్ఞానముచే మాత్రమే అవి మూడూ కలిసి ఉన్నట్లు కనిపిస్తున్నాయి.

జ్ఞానముచే అజ్ఞానము తొలగినప్పుడు ఆ మూడు వేరువేరుగానే కనిపిస్తాయి. అప్పుడా మూడూ శుద్ధ స్వరూపంగా, అధిష్ఠానమాత్రం (Made up of Absolute Self)గా శేషిస్తాయి. కొయ్య, లక్క కలిసి ఉన్నప్పటికీ వాటికి ఒక దానితో మరొకదానికి సారూప్యత –– ఏకత్వం ఉండదు కదా! "రూపము – ప్రకాశము – సంకల్పము" – ఈ మూడూ కూడా మనస్సు యొక్క ఉనికి చేత, చర్య చేత ఒకచోటికి వచ్చి ఒనగూడుచున్నాయి. అజ్ఞానము సంక్షయించుటచే మనస్సు లయించిందనుకో... అప్పుడు ఆ మూడూ కలియజాలవు.

❖

శరీరంలో కళ్లు, చెవులు, ముక్కు నోరు, చర్మము, కాళ్ళు, చేతులు వివిధ ధర్మములను నెరవేరుస్తున్నాయి కదా! అయితే మనస్సే ఇన్ని ఇంద్రియములను ఆయాధర్మములకై ప్రేరేపిస్తోంది. అట్టి మనస్సు ఇంద్రియ ధర్మములవైపుకే ప్రీతిరూపంగా ప్రసరిస్తోందిగాని, ఆత్మను ఎరుగుటలేదు. ఇంటికి అసౌకర్యం కలుగజేసే వస్తువును ఇంటిలోంచి తీసివేస్తాము చూచావా? పిశాచమువలె అల్ప, స్వల్పకాలిక వస్తువులవైపుగా ప్రసరిస్తున్న ఈ మనస్సును సర్వప్రయత్నములచే తన దుష్ట మార్గము నుండి విరమించేటట్లు చేయాలి.

ఓ మనస్సా! నీవు మిథ్యారూపంగానే విజృంభిస్తున్నావు! కానీ "ఆత్మ ఇంద్రియవిషయములను మననము చేయుట"యే నీ యొక్క స్వరూపమని నాకు తెలిసిపోయింది. అనగా, నేను మననము చేయుచుండటమే నీ స్వరూపమూ, ఉనికి కూడా! ఇప్పుడిప్పుడే నీ ఆనుపానులు తెలిసిపోతున్నాయి. ఆద్యంతమూ నీవు అసద్రూపమే కనుక నీవు భూత – వర్తమానములందు కూడా మృత ప్రాయుడవే. పంచేంద్రియముల ద్వారా శబ్ద –స్పర్శ – రూప – రస – గంధాలు ఏర్పడుచుండగా, నాకు వాటికి మధ్య నీవు ఎక్కడినుంచి వచ్చావు? ఈ జీవుడు నిన్ను తనవానిగా, తనంతటివానిగా ఎంచుటచేతనే అతని ఉపకరణార్థం నీవు బయల్వెడలుచున్నావు. అంతేగాని, వాస్తవానికి సర్వదా అసంగమగు చైతన్యమునకు నీవు సంబంధించిన దానవు ఏమాత్రం కానేకావు.

ఓ మనస్సా! నీయొక్క విజృంభణం నాకు కొంచంకూడా సంతోషం చేకూర్చటం లేదు. ఒక ఐంద్రజాలకుని మాయచే ప్రేరితమైన దానివలే నీవు క్షణకాలంలో ఉద్భవించి వివిధములైన విషయాకృతులను అవధరిస్తున్నావు. వ్యర్థంగా ఎక్కడెక్కడో తగుల్కొనుచున్నావు ఎందుకు?...

సరే! ఇంతవరకు ఏదైనా జరిగి ఉండనీ. ఇకపై ఏం చేయాలి అనే విషయానికివద్దాం. ఇక నీవు ఉంటే ఉండు. లేదా, తొలగిపో. నాకుమాత్రం నీతో ఏమీ సంబంధంలేదు. మిథ్యారూపుడవగుటచే నీవు ఎప్పుడూ గతించినదానివే అవుతావు. విచారణ దృష్టితో చూస్తే నీకు ఉనికియే లేదు.

ఓ మనస్సా! నిత్యమృతుడా! నీవు తత్త్వరహితుడవు. జడుడవు. భ్రాంతి మయుడవు. శఠుడవు అజ్ఞానసహితుడవు. అజ్ఞానికి మాత్రమే నీవు దుఃఖం కలిగించగలవు. విచారవంతుని నీవు ఏమీ చేయలేవు. అజ్ఞానకారణం చేతనే ఇంతకాలం 'ఈ మనస్సును తొలగించేది ఎట్లా?' ...అని నేను మథనపడ్డాను. ఇప్పుడో... నేను ఆత్మను దర్శించాను. ఆత్మకు వేరైనదేదీ ఎక్కడా ఉండజాలదు. కనుక నీవు లేవు.

మసక చీకట్లో కనబడిన ఏవేవో ఆకృతులన్నీ దీపం వెలగగానే మటుమాయ మౌతాయి చూచావా? జ్ఞానదీపం మాయందు వెలగనంత కాలం రాగ-ద్వేష-మోహ-క్రోధ-మద-మాత్సర్యాదుల క్రీనీడలతో భ్రమింపజేశావు. నిన్ను చాలాకాలం నిరోధించలేకపోయాను. మా దేహములలోనే ఉన్న ఆత్మవస్తువును ఎంతో కాలం కనుమరుగు చేశావు.

ఇక చాలించు నీ నాటకం. అజ్ఞాన పిశాచం తొలగగా ఈ దేహం శమ, దమాది ఉత్తమ గుణములకు ఆలవాలమై సజ్జనుల సద్వచనములు వినుటకు అర్హమగుచున్నది. ఎంత సంతోషించ వలసిన విషయం!

ఓ 'మనస్సు' అనే బేతాళమా! నీవు ఇతఃపూర్వమూ లేవు. ఇప్పుడూ ఉండజాలవు. ఇకముందూ ఏర్పడజాలవు. 'అసత్' స్వరూపమగు నీవు ఇంకా సిగ్గు పడక ...నవ్వుచున్నావా? నా ఈ గృహ దేహం నుండి "తృష్ణ-క్రోధము-మోహము" మొదలైన నీ పరివారాన్ని తీసుకొని ఇక బయలుదేరు.

❖

అమ్మయ్యా! 'వివేకము' అనే మంత్రమును ఆశ్రయించుటచే 'మనస్సు' అనే బేతాళుడు బయటకు పంపబడ్డాడు. గుహలోంచి తోడేలును వెడలగొట్టినపుడు ఆ గుహ ఎంత ప్రశాంతంగా ఉంటుంది! మనస్సు సంయమిస్తే అంతటి ప్రశాంతత లభిస్తుంది. ఏ ప్రాణికైతే "నేను ఈ దేహమాత్ర స్వరూపుడను" ...అనే బుద్ధి ఉంటుందో, ఆ ప్రాణిని 'క్షణభంగురము, జడము, శఠరూపము' అయినట్టి ఈ మనస్సు తన వశం చేసుకోగలుగుతోంది. ఆతనిని బంధించి తన ఇష్టం వచ్చినట్లు ఆట ఆడిస్తోంది. అయితే ఆ ప్రతాపము, ఆ ఆశ్రయశక్తి మనస్సుది కాదు. అదంతా అజ్ఞానము యొక్క ప్రతాపం మాత్రమే. "ఈ శరీరమునకు పరము, అద్వితీయము అగు ఆత్మశక్తినే నేను" అను ఎరుక గలవాని ముందు ఈ మనస్సు ఒక ఉపకరణం మాత్రంగా ఉండి పోతుంది. అట్టి వానిని అది బాధించజాలదు. ఆత్మసందర్శిని ఈ జగత్తు యొక్క ఉనికి లేములు తన సర్వ సమ స్వరూపం నుండి విఘ్నము కలిగించ లేవు. దీనమగు చిత్తము పూర్ణమగు ఆత్మను వశం చేసుకోవటమేమిటి?

కనుక నేను చిత్తము (మనస్సు)ను అంగీకరించనక్కర్లేదు... తిరస్కరించనక్కర్లేదు. ఆత్మ సందర్శన ప్రభావం చేత అది మృతప్రాయమై నా పూర్ణ స్వభావము నందు ఒక మూల ఒదిగి ఉండు గాక.

❖

"మనస్సు కలదు... నేను దానిని తొలగించుకోవాలి" అనే దుర్వ్యసనం, భ్రమ, ప్రయాస... అన్నీకూడా "స్వయం స్వరూపమగు ఆత్మ ఒక్కటే ఉన్నది" అను అవగాహన సహాయంతో తొలగిపోతున్నాయి. ఇప్పుడు దయ్యం వదలినవానివలె వ్యర్థత్వమంతా వదలి జీవన్ముక్తుడవై ఆత్మయందు ఆత్మచే ప్రశాంతుడనగుచున్నాను.

చిత్తముతో కూడి ఇంతకాలం నేను ప్రదర్శించిన హావభావములు చూచి ఇప్పుడు నవ్వువస్తోంది. నైర్మల్యం తొలగుటచే పరిశుద్ధుడను, సుఖుడను అగుచున్నాను. 'విచారణ' అనే మంత్రస్తవంచే చింతలన్నీ ఉడిగి, విషయవైషమ్యాలు తొలగి శాంతుడనైనాను. అహంకార దుష్టరాక్షసుడు మరణించాడు.

❖

అయినా... నాకు మనస్సు ఏమిటి? ఆశ ఏమిటి? తుచ్ఛమైన అహంకార మేమిటి? ఈ స్త్రీ పుత్రాదులు నావా? ...కావు. కానప్పుడు వాటి కొరకై నేను రోదించటమేమిటి? నాకు మనస్సు అక్కర్లేదు... ఆశ అక్కర్లేదు. నేను సర్వదా అద్వితీయుడను... కృతార్థుడను, చిత్స్వరూపుడను, నిర్మలుడను, నిర్వికల్పుడను, నిత్యుడను. అట్టి నా ఆత్మకు నేనే పలుమార్లు జేజేలు పలుకుతూ నుతిస్తున్నాను... నమస్కరిస్తున్నాను.

నాయందు శోకముగాని, మోహముగాని లేవు. అహంకారము, అభిమానము మొదలైనవి ఉండవు. అవన్నీ నాకు బాల్య చాపల్యము వంటివి. సర్వమునకు సర్వదా నేను సాక్షిని. నా సాక్షి స్వరూపమునందు ఆశ, కర్మ, సంసారము, కర్తృత్వము, భోక్తృత్వము, దేహములు - మొదలైనవి ఏర్పడజాలవు. సాక్షియగు నన్ను చేరగలిగినది, నాతో సమానమైనది ఏదీ లేదు. 'నేను' అను కల్పనకు ముందే ఉన్నదేదో అదే నా వాస్తవరూపం.

నేను 'ఆత్మ' అనే శబ్దమునకు వాచ్యుడను కాదు. ఏ శబ్దమునకూ నన్ను సంపూర్ణముగా ప్రవచించగల, ప్రకటించగల, నిర్వచించగల సామర్థ్యం లేదు.

అయితే 'అహం' అను ప్రత్యయమునకు అన్యమైనదంటూ ఏదీ లేకపోవటం చేత... అంతయూ నేనే. సర్వలోకములకూ ఆదికారణం, ఈ లోకములను వహించేది, ఈ లోకములు స్వరూపంగా కలిగి ఉన్నది, అంతరమున ఈ లోకములేవీ లేనివాడను నేను. అందుచేత 'ఇది తొలగాలి... ఇది ఉండాలి' అనేదేదీ నాకు ఆపాదించబడజాలదు. ఏ దేశ-కాల-వస్తువులూ నన్ను పరిచ్ఛిన్నం చేయజాలవు.

**నిర్వికారాయ నిత్యాయ నిరంశాయ మహాత్మనే ।**
**సర్వస్మై సర్వకాలాయ మహ్యమేవ నమోనమః ॥** (శ్లో 45, సర్గ 80)

నిర్వికారమై, నిత్యమై, అంశరహితమై, సర్వరూపమై, సర్వకాలస్వరూపమై, రూపరహితమై, నామవర్జితమై, ప్రకాశస్వరూపమై, మహత్తరమై, ఏకమైనట్టి పరమాత్మను నేను.

సమరూపమై, సర్వవ్యాపకమై, సూక్ష్మమై, ఏకమై ఈ జగత్తు నంతటినీ ప్రకాశింపజేయుచున్నట్టి ఓ నా చైతన్య సాక్షి పరతత్త్వమా! నీవూ నేనూ ఒక్కటే కదా! మరి నీకు నేను నమస్కరించటమెట్లా?

నేల, పర్వతము, నది మొదలైన వాటితో కూడిన ఈ పదార్థ సంచయజగత్తు గాని; కాళ్ళు, చేతులు, కళ్ళు మొదలైన అమరికతో కూడిన ఈ దేహం గాని నేను కాదు. ఇవి ఉన్నా లేకున్నా ఫరవాలేదు.

ఇవి నాకు సంబంధించినవి కావు. నేను వీటికి సంబంధించను. లేదా... స్వయంప్రకటనచే అవన్నీ నేనే. ఉన్న చోట ఉంటూనే అంతటా ఉన్నాను. మనోవికల్పరహితుడను... సమత్వముచే శోభించువాడను. విశ్వమును లీలామాత్రంగా ప్రకటించువాడను. జగద్రహితుడను... శరీరములు లేనివాడను. జరాజన్మ రహితుడను. అచ్యుతుడను... చిత్స్వరూపుడను. గుణాతీతుడను.... ఈశ్వరుడను. నమస్కరించువాడిని, ఆ నమస్కారం స్వీకరించువాడను...నేనే!

❖❖❖

# 12. తత్త్వవేత్త

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే మహాబాహో! రామచంద్రా! తత్వవేత్తయొక్క నిశ్చయం ఎట్లా ఉంటుందో మనం ఇంతవరకు చెప్పుకున్నాం.

ఎప్పుడైతే జీవుడు "ఈ ప్రపంచమంతా ఆత్మయే. ఆత్మకు ద్వితీయంగా దృశ్యంలేదు" అనే నిశ్చయం సంపాదిస్తాడో ...అప్పుడు ఆతనిని శాస్త్రజ్ఞులు 'తత్త్వవేత్త', 'అద్వితీయుడు' అని పిలుస్తున్నారు. అట్టివానికి తన చిత్తము కూడా ఈ దృశ్యములో అంతర్భూతమై తదితర దృశ్యముల లాగానే మిథ్యగా ఎరుగబడుచున్నది. ఆతనికిక దృశ్యంలో ఉద్భవం సంభవించదు.

ఈ జగత్తంతా అవిద్యయొక్క (లేక) మాయ యొక్క కార్యమే. అన్య చిత్తదృష్టిచే ఇది లేనిదే అవుతుంది. ఎవరికి వారికే వారివారి చిత్తమును అనుసరించి ఈ జగత్తు పరిపరివిధములుగా తోచుచున్నది. 'ఆకాశవృక్షం' అనే ప్రతీతి నీవు విన్నావుకదా! ఆకాశంలో వృక్షం ఎలా ఉంటుంది! ఈ జగదనుభవం కూడా అట్టిదే. వాస్తవానికి ఇదంతా శుద్ధ చిన్మాత్ర స్వరూపమే.

నౌకలో ఉన్న బాలునికి ఒడ్డున ఉన్న వృక్షాలు కదులుతున్నట్లు అనిపిస్తాయి. అవి నిజంగా వర్తులాకారంగా కదులుచున్నాయా?

కదులుచున్న యంత్రం (Giant Wheel)పై కూర్చున్నవానికి ఎదురుగా ఉన్నకొండ గిఱ్ఱున తిరుగుచున్నట్లు అనిపిస్తుంది. క్రింద నిలబడ్డవానికో... ఆ కొండ స్థిరంగానే కనబడుతోంది కదా!

అజ్ఞానికి ఈ చిత్తము వాస్తవమైనదానివలె అనిపిస్తోంది. ఈ బాహ్యాభ్యంతర పదార్థములన్నీ చిత్తము నుండే అసద్రూపంగా ఆవిర్భవిస్తున్నాయి. అందుచేత తత్వవేత్త వాటిని అతిసహజంగా మొదలంట త్యజించి ఉంటాడు. సంశయరహితుడై సంతాపవర్జితుడై తనకు రావలసినది, పోవలసినది ఏదీ లేనివాడై ఉంటాడు. ఈషణారహితుడై స్వానుభవముచే తన పారమార్థిక స్వరూపమునందు శుద్ధ చైతన్య చక్రవర్తి అయి విరాజిల్లుతూ ఉంటాడు.

ఈ ఎదురుగా కనులకు కనబడే దృశ్యమును అభావించినప్పుడు నేత్రముల కార్యక్రమం అజ్ఞానరహితమై, అప్పుడు తృష్ణాచాపల్యం కూడా నశించగలదు. మోహపంజరం విచ్ఛిన్నం కాగా, నిరహంకారం రూపుదిద్దుకొని దృశ్యాసక్తి తొలగుతుంది. అప్పుడిక కర్మలెవరికి? ఆ కర్మల ఫలితములు ఎవరికి సంబంధించినవి? సంచిత-ప్రారబ్ధ-ఆగామి కర్మల స్వభావంతోసహా చిత్తము ఉపశమించ గలదు. అజ్ఞాన నిద్ర పటాపంచలౌతుంది. అప్పుడీ జీవుడు ప్రబుద్ధుడు కాగలడు.

ఈ జగత్తంతా కూడా 'శాంతము, ఏకము' అగు బ్రహ్మమే. ఇక్కడ అనేకత్వముగాని, ఆత్మ కంటే భిన్నమైనదిగాని సంభవించజాలదు. ఇక తత్త్వవేత్తకు అంతఃకరణంలో విచారించటానికి ఏముంటుంది? ఆతనికి ఎక్కడ చూచినా ఆత్మయే అనుభవవిశేషమగుచున్నది. ఆతనికి అసత్ విషయమైన దేనితోనూ పనే ఉండదు. ఈ జీవదశలన్నీ ఆతనికి అసంగతమే అవుతాయి.

"ఆద్యంతరహితమగు పరమపదమును నేను" అను అనుభవముతో సౌమ్యుడై, సూక్ష్ముడై సర్వవ్యాపకుడై ఆత్మనే ఆస్వాదిస్తూ ఉంటాడు. చిత్తము ఉన్నా లేకున్నా చిత్తముచే తారసపడే సర్వ విషయములకు అతీతుడై, విరక్తుడై ఉంటాడు. ఆతనియందు ఆత్మ యొక్క సర్వసమౌన్నత్యము సర్వదా ఉదయించియే ఉంటుంది. పరిచ్ఛిన్నత్వమును గడచిన కలవలె త్యజించి అపరిచ్ఛిన్నుడై ఉంటాడు. అవిచారణా సమయంలో అడ్డుగోడవలె ఏర్పడియున్న ఇతఃపూర్వపు అహంకారం ఇప్పుడు ఏమైపోయిందో కూడా ఆతనికి తెలియదు. దీపం వెలిగించగానే చీకటి, ఆ చీకటిలో స్ఫురించే క్రీనీడాకారాలూ ఎటు పోతాయో ఎవరు చెప్పగలరు?

చిత్తము నశించిన తరువాత ఇక 'విచారణ చేస్తున్నవాడు ఉన్నవాడా? ఉండనివాడా?' అను మీమాంస అంతా అనవసరమగుచున్నది. అట్టి వికల్పము ఆశ్రయించవలసిన ఆగత్యం ఆతనికుండదు. అట్టి తర్జన భర్జనతో మనస్సును పునరుజ్జీవింపజేయవలసిన ఆవశ్యకత ఆతనికేముంటుంది? అందుచేత అంతఃకరణమునుండి సంకల్పములన్నీ పారద్రోలి, 'ఓం' కారమునకు లక్ష్యమైయున్న తురీయావస్థయందు సంస్థితుడై ఉంటున్నాడు.

❖

వింటున్నావా, రామా! జ్ఞాని ఇట్టి విచారణచే ఉత్తమౌన్నత్యమును అవధరిస్తున్నాడు.

**అశ్నన్గచ్ఛన్స్వపం స్తిష్ఠన్నితి రాఘవ చేతసా ।**

**సర్వత్ర ప్రజ్ఞయా తజ్ఞః ప్రత్యహం ప్రవిచారయేత్ ॥** (శ్లో 17, సర్గ 81)

కాబట్టి నీవు నడుచుచున్నప్పుడు, కదులుచున్నప్పుడు, తినుచున్నప్పుడు, త్రాగుచున్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడు 'ఆత్మ ప్రజ్ఞ'తో కూడి ఉండుము. స్వచిత్తముతో ప్రతిరోజూ ఆత్మ విచారణ కావిస్తూ ఉండు. సాధు చిత్తులగు ఎందరో మహనీయులు ఒక వైపు తమతమ వర్ణాశ్రమ ధర్మములను నిర్వర్తిస్తూ... వేటి చేతా స్పృశించబడక, తమ ఆత్మప్రజ్ఞను కాపాడుకుంటూనే వర్తిస్తున్నారు.

మాన మదరహితులై శరత్కాలంలోని పూర్ణచంద్రునిలాగా ప్రసన్నతతో వెలుగొందుచున్నారు. ప్రవాహపతితములైనట్టి తమకు నియమించిన కార్యముల మధ్య నీటిలోని తామరాకు వలె వ్యవహరిస్తున్నారు. మహా ధీమంతులై, మహా వివేకులై ఈ ప్రపంచమున వెలయుచున్నారు. వారే నీకు సోదాహరణులగు గాక!

❖

'వివేకదృష్టి' అను పేరుగల ఈ విభాగంలోని విశేషమంతా ఒకప్పుడు వింధ్య పర్వతంపై బృహస్పతి సోదరుడగు సంవర్తుడు చేసియున్న సంవాదముయొక్క సారాంశమై ఉన్నది. ఆతనిలాగానే విచారణతో కూడిన బుద్ధితో ఆత్మదృష్టిని అవలంబించు. ఆతనిలాగానే ఉత్తరోత్తర భూమికాక్రమంచేత ఈ సంసార సాగరమును అవశ్యం దాటగలుగుతావు.

❖❖❖

# XI. వీతహవ్యుడు - అంతర్మథన యోగము

## 1. సంబోధన

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ సంసారమును యుక్తియుక్తంగా అధిగమించివేసిన మహనీయు లెందరో ఈ భూమిపై ఉన్నారు. 'వీతహవ్యుడు' అనే ఒక ముని తీవ్రమైన విశ్లేషణ విచారణల ద్వారా ఆత్మ పదమునందు దృఢమైన ఆరూఢత సంపాదించారు. ఆయనకూడా ఇంద్రియ ప్రబోధ రూపంగా ఉత్తమ సమాలోచన నాశ్రయించి ఆత్మోన్నతి పొందియున్నారు. నీ యొక్క ఉత్తమ దృష్టి సముపార్జన కొరకై ఆయన సంబోధన, సమాలోచన వివరిస్తాను. అధ్యాత్మ వాఙ్మయంలో ఇది మహత్తరమైనదిగా శ్లాఘించబడుతూ ఉంటుంది.

❖

వీతహవ్యుడు ఒకప్పుడు అనేకమంది మునులుండే ఒక ప్రదేశంలో ఒక ఆశ్రమం నిర్మించుకొని ఎంతో సాధన చేశాడు. అట్లా కొంతకాలమైన తరువాత సమాధిని సముపార్జించాలని అక్కడినుండి బయలుదేరాడు. చాలాకాలం సరైన ఏకాంత ప్రశాంత ప్రదేశం కొరకై అడవులలోనూ, కొండలలోనూ సంచరించాడు. ఎంతగానో వెతకి వెతకి సొలసి, విరక్తుడయ్యాడు. కాలక్రమంగా అతనిలో వివేకముతో కూడిన పరిజ్ఞానం రూపుదిద్దుకొన్నది.

అరెరే! శారీరక, మానసిక వ్యధాపూర్వకమైన ఈ సంసారము ఎంత భ్రమదాయకమైనది! ఇందులోని ఆయా క్రియా కార్యక్రమాలన్నీ చివరకు 'భయం' అనే ఒడ్డుకు చేరుస్తున్నాయే!"

అని తలచి చకితుడైనాడు. "ఇక నేను అసారమగు ఈ సంచార వ్యాసంగం త్యజిస్తాను. ఏదో ఒకచోట ఆసీనుణ్ణై స్వకీయమైన విచారణ ప్రారంభిస్తాను" అని తలచాడు ఆ మునీంద్రుడు. తిరిగి పూర్వ ప్రాంతంలో గల తన పర్ణశాల జేరాడు. కాస్త సేద తీర్చుకున్న తరువాత ఆ పర్ణశాలలోనే ఒకచోట శుద్ధమగు మృగ చర్మమును పరచాడు. పద్మాసనం వేసుకున్నాడు. పాదములపై వ్రేళ్ళుంచి స్థిరాసనం స్వీకరించాడు. ఇంద్రియములలోకి మరల మరల ప్రవేశిస్తున్న మనస్సును మెల్లమెల్లగా వెనుకకు మరలుస్తూ ఉపాయములచే నిరోధించి, క్రమంగా మనస్సును ఇట్లు సంబోధించారు.

❖

ఓ మనస్సా! నీవు ఎంత చంచలమైనదానివి! ఎంత నిగ్రహించినా కూడా... మహత్తరంగాలచే కొట్టుకుపోబడుచున్న ఆకులాగా క్షణంలో అస్థిరత్వం పొందుచున్నావే!

ఈ నా నేత్రములు మొదలైన ఇంద్రియములు బహు భ్రమణయుక్తమై ఎన్నెన్నో విషయాలవైపు మరలుచున్నాయే? వాటివెంట ఈ మనస్సు, బుద్ధి కూడా 'తగుదునమ్మా' అని బయలుదేరుతున్నాయి. కాలితో తన్నబడుచున్న బంతిలాగా ఉరుకులు పరుగులు పెడుతున్నాయి. ఈ మనస్సు ఇంద్రియముల

నుండి బలం పుంజుకుంటోంది. ఇంద్రియములో?... మనస్సు నుండి బలం పుంజుకుంటున్నాయి. మనస్సు కొన్ని వృత్తులను ఆశ్రయిస్తోంది. ఇంతలోనే ఆ వృత్తులను త్యజించి, మరల నూతన వృత్తులలో ప్రవేశిస్తోంది. నేను దేనిని నిగ్రహించాలని అనుకుంటానో, దాని వైపుకే పరుగులు తీస్తోంది. చెట్ల కొమ్మలపై గంతులు వేసే కోతిలాగా అనేక పదార్థముల పరంపరను ఆశ్రయిస్తోంది. ఈ మనస్సును నియమించాలంటే ముందుగా దీనిని ఇంద్రియములనుండి వెనుకకు మరల్చాలి. ఎట్లా?

ఓ ఇంద్రియములారా! సముద్ర తరంగములవలె అతి చంచలముగా ప్రవర్తిస్తున్నారు కదా! ఆత్మ దర్శనము చేయటానికి మీకు ఇంకా సమయం కుదురుట లేదా? ఆశలతో, అల్ప ఆశయాలతో ఇంకా ఎంతకాలం సంచరిస్తారు? అనర్థదాయకమైన మీ చపలత్వం కొంచెంసేపు ఆపండి! ఒక్కసారి నేను చెప్పేది వినండి! మీరు చేస్తున్న కర్మలను, వాటి పర్యవసానమును కొద్దిసేపు పరిశీలించండి. మీరంతా మనస్సుకు ద్వారములు వంటి వారే కదా! కనుక, మీరు జడరూపము మాత్రమే. జడ స్వరూపులై, జడమాత్రమగు దృశ్యమును ఆశ్రయిస్తున్నారు. జలతరంగాలలో జలం పోస్తున్నట్లు మీరు నాచే దృశ్యముపై ప్రసరింపజేయబడుచున్నారు. మృగతృష్ణలో జలం కోసం వెతికే మృగాల వలె, మీరు దృశ్యము వైపు విజృంభిస్తున్నారు. జ్ఞానరహితులై, దుర్వినయులై కుమార్గము లందు ప్రవృత్తులవుచున్నారు. గుడ్డివాడు ముళ్ళపొదలవైపు వెళ్ళుచున్నట్లు, మీరు నన్ను పతనము వైపుకు నడిపించుచున్నారు.

ఏమి మీ చమత్కారం! చిదాత్మస్వరూపుడనగు నేను సాక్షీమాత్రుడనై సమస్తమును నెఱవేర్చుచున్నాను కదా! మధ్యలో మీరెందుకు వ్యర్థంగా భ్రమింపజేస్తున్నారు?

రజ్జు, సర్పభ్రాంతిలాగా (త్రాడును చూచి పాము అనుకొనునట్లుగా) అసద్రూపములగు ఈ ఇంద్రియములు విజృంభిస్తున్నాయి. "ఇవి నా నేత్రములు" అని ఎఱుగుచున్నది ఎవరు? నేను కదా! సర్వప్రకాశకుడు, సర్వసాక్షియగు ఆత్మయే నేను. నాచే ఎఱుగబడుచున్నదానితో నాకేమి సంబంధం? ...కనుక, మీరున్నప్పుడు, లేనప్పుడు నేనున్నాను. మీరు ఏర్పడనప్పుడు, నిర్వికారుడనై, నిర్విషయుడనై, పరమాత్మస్వరూపుడనై, నేనుండియున్నాను. మీరు ఏర్పడినంతమాత్రంచేత, లేక, శిథిలమైనంతమాత్రంచేత నాయొక్క 'ఉనికి' కుంటుబడుతుందా? అసాధ్యం!

సూర్యుడు ఆకాశంలో నిజేచ్ఛచే ఉదయించి ప్రకాశిస్తూ ఉంటే, జనులు తమతమ దైనందిన కార్యక్రమములు నిర్వర్తించుకుంటుంటారు. ఆ కార్యక్రమములతో సూర్యునకు ఏమి సంబంధం ఉంటుంది? అట్లాగే, నా చైతన్య సత్తయొక్క ఉదయముచే మీరు, మీమీ చేష్టలు నిర్వర్తిస్తున్నారు. మీ చేష్టలతో నాకేమి సంబంధం? వాటి పట్ల ఇష్టముగాని, అయిష్టముగాని ఎట్లా ఏర్పడగలవు? చైతన్య స్వరూపుడనైన నేను మీ చర్యలకు దుఃఖించటమేమిటి? సుఖించటమేమిటి?

ఓ చిత్తమా! నీవు ఇంద్రియములను మోసగించి దుఃఖభాజకములగు విషయములలో ప్రవేశింపజేస్తున్నావు. అయితే చమత్కారం చూచావా? ఆ ఇంద్రియ విషయములచే నిజానికి నీవే మోసగించబడుచున్నావు సుమా! 'దేహాభిమానము' అనే జాడ్యమును నీయందు కలిగియుండి....

తత్ప్రభావంచేత ఈ జగత్తులో ఇక్కడా, అక్కడా సంచరిస్తూ, అనర్థములన్నీ మూటగట్టుకుంటున్నావు. కుక్కలాగా నీచపదార్థముల వైపు మూతి సారిస్తున్నావు. భిక్షకుడులాగా క్షణక్షణం ఏదో ఒకటి అర్థిస్తూనే ఉన్నావు.

"నేను చేతనుడను... నేను జీవించువాడను... నేను ప్రత్యేకమైన వాడను... అను రూపంలో ఉంటున్న నీయందలి వాసన అత్యంత అసత్యమైనది. అట్టి భావన మిథ్యారూపమున ఉదయించి, దుఃఖమును కలుగ జేస్తోంది. స్వతఃసిద్ధమైన ఉనికి నీకు లేదు. ఇక చపలత్వమెందుకు? నీవు నా స్వరూపము కాదు. ఎందుకంటే, నా స్వరూపము సంవిత్తుకు అన్యమై ఏదీ ఎక్కడా ఉండదు. కనుక 'చిత్తము' అను పేరుతో చెప్పబడే నీవు దేనికైనా కర్తవా? భోక్తవా? లేక, కర్తృత్వ, భోక్తృత్వముల మధ్య ఉండే ఆశయే నీ స్వరూపమా? మొట్టమొదట తియ్యగా కనిపించి చివరకు చేదును చవి చూపటమేమిటి? దుఃఖాలు ఉండటమేమిటి? యథార్థానికి నీకు స్వరూపమే లేదు. మరి నీకు బంధుమిత్రులు ఎక్కడి నుండి వస్తారు? స్ఫటికానికి ఎదురుగా ఏ రంగు కాగితం ఉంటే ఆస్ఫటికంలో ఆ రంగు ప్రవేశిస్తున్నట్లు... నీవు శుద్ధస్వస్వరూపానికి గుణములను ఆపాదించి చూపుచున్నావు. పోనీ, ఆత్మ నిన్ను కల్పన చేసుకున్నదా? ఆత్మకు కర్తృత్వ – భోక్తృత్వ – అన్యత్వములు ఏ క్షణంలోనూ ఉండవు కదా! నీవు ఆత్మవే అయి ఉంటే నీయందు వికల్పములు ఉండకూడదే? ఆత్మ తనకు తానే పూర్ణమై ఉండగా, ఈ 'భావాభావములు, సుఖ దుఃఖములు' సంభవించటమెలా సాధ్యం? కనుక నీయందు కనిపించే కర్తృత్వ, భోక్తృత్వములు మిథ్యాభ్రమ మాత్రమే!

ఇప్పుడు ఒక యుక్తి నాకు తెలియవస్తోంది. ఆకాశంలో సూర్యబింబం ఉంటేనే క్రింద నీళ్ళలో సూర్యప్రతిబింబం లభ్యమౌతోంది. కనుక చైతన్యబింబం ఉన్నప్పుడే 'మనస్సు' అనే ప్రతిబింబం ఏర్పడగలుగుతోంది. శిలాప్రతిమ స్వయంగా నాట్యం చేయజాలనట్లు, కత్తిస్వయంగా కూరగాయలను కోయజాలనట్లు... మనస్సు స్వయంగా ఏదీ చేయజాలదు. బింబం కదలకపోయినా, తరంగ విన్యాసముచే ప్రతిబింబం కదలగలదు కదా! కనుక ఓ మనో ప్రతిబింబమా! నీవు నీ బింబమగు ఆత్మను ఆశ్రయించు. అప్పుడు "బింబస్వరూపుడనగు నాకు రాక, పోకలు, చావు, బ్రతుకులు ఉండజాలవు" అని సుగ్రాహ్యం కాగలదు.

ఒక మనుజునిచే ఒక వస్తువు నరకబడిందనుకో... ఇప్పుడా వస్తువును నరికిందెవ్వరు? మనుజుడు నరికాడా? కత్తి నరికిందా? మనుజుని ఇచ్ఛ చేతనే కదా, కత్తి నరికింది! పాత్ర నుండి పాలు గొంతులో ప్రవేశించినాకూడా... త్రాగుచున్నది ఆ వ్యక్తియేగాని... కర్తృత్వం పాలకు, పాత్రకు ఆపాదించం కదా! చిత్తము కూడా ఆత్మయొక్క ఒక ఉపకరణంవంటిదే! చిత్తముచే చేయబడేది ఆత్మకు ఆపాదించవలసిందేగాని... చిత్తమునకు కర్తృత్వం ఆపాదించటం కుదరదు.

కనుక ఓ చిత్తమా! సర్వజ్ఞుడగు పరమాత్మచే నీవు ప్రబోధితుడవై ఆయా యోచనలు నిర్వర్తిస్తున్నావు. యోచనలు ఆత్మవే గాని ...నీవి కావు. ఆత్మయే తన కర్తృత్వ, భోక్తృత్వ, కరణ ఉపకరణాదులచే ఈ జగత్తునంతా సంచయం చేసివేస్తోంది. ఆత్మయగు పరమేశ్వరుడే సర్వమునూ

ప్రబోధితం చేస్తున్నాడు. మూఢులైనవారు మాత్రమే మనస్సు – చిత్తములకు కర్తృత్వం ఆపాదిస్తున్నారు. ఆత్మసత్తచే జగత్తు యొక్క సత్త ఏర్పడి ఉంటోంది. "మనస్సు అనబడేది ఏదీ లేదు" అని తీక్ష్ణమైన జ్ఞానమున్న చోట ప్రస్ఫుటమౌతోంది.

నేను ఆత్మను. భ్రమమాత్రమగు చిత్తమునకే జన్మ, జరా, మరణాది కర్మలు గాని... వాస్తవ రూపుడునగు నాకు అవన్నీ ఉండవు. అందుచేత ఈ చిత్తము యొక్క జాడ్యములగు జన్మ, జరా, మరణాది భావానుభవములు నేను పొందకుండెదనుగాక! ఇంద్రజాలంలో వస్తువుల భ్రమలాగా భ్రమించబడుచున్న తరుణంలో చిత్తమనేది ఏర్పడుతోంది.

విజ్ఞానమాత్రమగు బ్రహ్మముయొక్క సమక్షమున చేత ఈ జగత్తంతా వికాసము పొందుతోంది. ఈ వికాసము చిత్తముది కాదు. సముద్రంలో జలమే అనేక తరంగములగుచున్నట్లు బ్రహ్మము యొక్క చిత్ శక్తియే ఈ దేవ – మనుష్య – జంతు ఆదిగాగల జగద్రూపంగా విజృంభిస్తోంది.

ఓ చిత్తమా! నీవే గనుక చిన్మయుడవైతే నీవు మరొక దానికొరకై దేబరించేదానవు కాదు. భూత –భవిష్యత్తులందు ఏకమై, అనేకమై, సర్వ వ్యాపకమై, సర్వదా ఏర్పడి ఉండే ఆత్మని ఎందుకు దర్శించలేకపోతున్నావు? 'నీవు, నేను' –అను అభాస అంతా స్ఫురిస్తున్నది ఆత్మయందే. ఇక దుఃఖం ఎవరికి? నీడకు ఆకారం కనబడుచున్నా కూడా, దానికి స్వయంభూతమైన ఉనికి లేనట్లు. ఆత్మకు అన్యమైనట్టి దేనికీ ఉనికి లేదు.

కనుక చిత్తము కేవలం జడము, అసద్రూపము, కల్పితము, అభ్యాసవశము మాత్రమే.

❖

సర్వమూ ఆత్మయే అయి ఉండగా... "ఈ బాల శరీరం నాది... ఈ వృద్ధ శరీరం నాది... ఈ పుత్ర, కళత్ర, పౌత్రులు, ఈ గృహ, ఆరామాలు నావి" అనుకుంటూ నేను చిత్తమును పెంపొందించు కున్నాను. ఆహా! అదంతా వ్యర్థమైన చింతనగాక మరేమిటి? ఈ దేహమే లేని వస్తువై క్రీడలో ఉపయోగించే క్రీడోపకరణము వంటిదై ఉండగా... అట్టి దేహముతో ఏర్పడే సంబంధాలు వాస్తవమైనవి ఎట్లా అవుతాయి?

ఆత్మకు దేహమే లేదు. కుందేటి కొమ్ముచే ఎవ్వరైనా పొడవబడతారా? ఛాయ వెళ్ళి ఒక గోడను కూల్చగలదా? ఈ దేహము తత్సంబంధములచే ఆత్మ నిరోధింపబడజాలదు. దుఃఖింప బడజాలదు.

చేతనము, జడము (ఆత్మ – దృశ్యము)ల మధ్య 'చిత్తము' అనబడే మూడవ వస్తువు ఏర్పడుటకే వీలులేదు. ఆత్మ యొక్క దృశ్యమునకు సంబంధించిన అభ్యాసవ్యసనమే చిత్తము.

కనుక ఇప్పుడు మార్గమేమిటి?... నేను సత్యవస్తుజ్ఞానమును ఆశ్రయించాలి. అప్పుడు చిత్త, జడ దృశ్య దృష్టులన్నీ ఉపశమిస్తాయి. అట్టి ఉపశమన స్థితి యొక్క "సాక్షాత్కార వృత్తి" నాకు అలవడు గాక!

అప్పుడిక చిన్మాత్రరూపమే స్వానుభవముగా శేషించగలదు.

"అట్టి స్వానుభవము యొక్క ఒకానొక చమత్కారమే ఈ చిత్తము" – అని అప్పుడు అనుభవం అవక ఏం చేస్తుంది?

❖

ఇట్లు తలచుచు వీతహవ్యముని అంతరంగములో మౌనము, నిశ్చలత్వములను వహించియున్నారు.

❖❖❖

## 2. స్వాత్మ - చిత్తముల సంవాదము

**శ్రీవసిష్ఠ మహర్షి :** వింటున్నావా రామా! ఆ విధంగా అంతరంగ మౌనం వహించి వీతహవ్యముని కొన్ని గంటలు గడిపారు. ఇతఃపూర్వపు దృశ్యాభ్యాసము యొక్క సంస్కార ప్రభావం చేత కాబోలు... ఆతని యందు కించిత్ ద్వితీయ వాదం పొడచూపింది. ఆ ద్వితీయమైనదే చిత్తము కదా! అప్పుడు ఆతని అంతరంగంలో కొంత వాదోపములు పొడచూపాయి. అట్టి క్రమమేమిటో వివరిస్తాను. విను–

**వీతహవ్యుని చిత్తము:** మిత్రమా! వీతహవ్యా! "చిత్తము చేతనే ఆత్మను దర్శించగలం" అని శ్రుతులు చెప్పటం విన్నావు కదా!

**వీతహవ్యుడు :** అవును... విన్నాను.

**చిత్తము :** "అన్ని ఉపకరణములలో కెల్లా చిత్తమే (మనస్సే) గొప్పది" ...అని కూడా శాస్త్రములచే చెప్పబడింది కదా!

**వీతహవ్యుడు :** అవును. అట్లా కూడా చెప్పబడింది.

**చిత్తము :** మరి నీవు ... "చిత్తమనునదే లేదు" ...అని నా ఉనికినే ఖండిస్తున్నావే?

**వీతహవ్యుడు :** ఓ... అదా నీ వాదన! ఒకడు తన ముఖమును చూచుకోవటానికి అద్దం ఉపయోగిస్తాడు చూచావా! అంతమాత్రం చేత దర్పణం చైతన్య జీవ సమన్వితమా?

ఆత్మ స్వరూపుడనగు నేను నా స్వరూపమును ఏమరచి అజ్ఞానదశను ఆశ్రయించుకొని ఉన్నప్పుడు... నా స్వరూపమును నాకు గుర్తుచేయటానికి శాస్త్రములచే, శ్రుతులచే, గురువులచే 'చిత్తము' అనబడే నీవు కల్పించబడుచున్నావు. నీకొక ప్రత్యేకమైన ... ఆత్మకు వేరైన... ఉనికి ఉన్నదని వారి ఉద్దేశం కాదమ్మా!

తత్త్వమసి (నీవు అదియే అయి ఉన్నావు...) అనే వాక్యార్థ సిద్ధికొరకు శిష్యుడిని తయారు చేయటానికి "ఇది దృశ్యము, ఇది కల్పన, ఇది సంబంధము, ఇది చిత్తము"... మొదలైన మొట్టమొదటి పాఠములలో నీకు చోటు కల్పిస్తున్నారు. అంతమాత్రం చేత నీయొక్క ఆత్మకు అన్యమైన ఉనికి అంగీకరిస్తున్నట్లు కాదు. ఆత్మసాక్షాత్కారమైన తరువాత, ఇక నీకు పాత్రగాని, ఉనికిగాని ఉండదు.

మధ్యే మార్గ పాత్యవిశేషంగా మాత్రమే కనబడి, విషయం రూఢి అవగానే నీవు ఆ జ్ఞానంలో లయం అవుతావు.

ఓ చిత్తమా! పంచేంద్రియాలు ఉపయోగిస్తున్న జీవుడు ఏ సమాచారంతో వాటిని ఉపయోగిస్తు న్నాడో... ఆ సమాచారమే నీ స్వరూపం. సర్వసమాచారములకు ముందున్న ఆత్మస్వరూపం గ్రహించ బడుచుండగా... ఇక నీకు చోటు కనబడదు. అనగా చైతన్యప్రకాశము యొక్క ఒకానొక దృక్పథమే నీ స్వరూపం కదా! చైతన్య ప్రకాశమును ఎరిగిన తరువాత ఇక నీకేం పాత్ర ఉంటుంది? నీవు దేనిచే... దేని వలన ఏర్పడుచున్నావో... అది ఎరిగిన తరువాత ఇక నీ గురించి తర్జన భర్జనలు ఎవరికి కావాలి?

కాబట్టి నేస్తం! ఓ చిత్తమా! నీవు దేనికీ కర్తకాదు. అందుచేత దేనికీ దుఃఖ భాజుడవు కావద్దు. "ఈతడు నా వాడు... ఇవి నావి" అని క్లేశములు ఆశ్రయించవద్దు. జడమగు నీవు జడములగువాటిని ఆశ్రయిస్తే జడంగానే ఉండిపోతావు. అట్లాకాకుండా, నీ ఉత్పత్తి స్థానమైన చైతన్యమును ఆశ్రయిస్తే చైతన్యముగా రూపుదిద్దుకోగలవు. నీ నియామకుడగు ఈశ్వరునికి ఈ జగత్తునందు చేయబడిన – చేయబడబోవుచున్న – చేయబడియుండిన దేనితోనూ ఏమీ సంబంధం ఉండదు. నీవు కూడా అట్టి అసంబంధమును ఆశ్రయించు.

**చిత్తము :** నేను భావాభావ స్వరూపుడనే. ఒప్పుకుంటాను. అయితే నన్ను ఉపయోగించి ఉత్తమజీవులు ఆత్మజ్ఞానం సంపాదిస్తున్నారు కనుక. "నేను ఆత్మకు ఉపకారినే" అని ఎందుకు అనుకోరాదు?

**వీతహవ్యుడు :** నీవు ఆత్మకు ఉపకారం చేసేంతవాడివా? కార్య – కారణ సంఘాతమునందు ఏర్పడే అభిమానముచే నీవు అప్పుడప్పుడు "నేను ఆత్మకు ఉపకారం చేస్తున్నాను" ...అనే భ్రాంతిని పొందుచు న్నావు. పంచప్రాణములు, మనోబుద్ధులు, దశేంద్రియములు... అన్నీ జడాలే కదా! ఇక ఇంద్రియాలచే ఏర్పడే భోగ, యోగములచే ఆత్మకు ఒరిగే నూతన ప్రయోజనమేమున్నది?

**చిత్తము :** అదేమిటి? ఈశ్వరునకు భోగానుభవం పొందించుట యందు నేను వర్తించుచున్నానని ఎందుకనుకోకూడదు?

**వీతహవ్యుడు :** అట్లాగా? ఈశ్వరుడు నిత్యతృప్తుడు కదా! ఆయన భోగానుభవం కొరకు నీవు బయలుదేరటమేమిటి?

స్వాభావిక ప్రకాశయుక్తుడు, సర్వవ్యాపి, ఏకరూపుడు అగు చిదాత్మయే ఈ జగత్తంతా సర్వరూపములుగా వ్యాపించి ఉన్నాడు. వానికి అన్యముగా ఏ కల్పనా ఉండదు. ఏకమూ, అనేకమూ కూడా ప్రకాశింపజేయుచున్నట్టి ఆత్మ తన యందు ఈ జగత్తును క్రీడావినోదంగా రచించుకొనుచున్నది. సమస్తము దానియందు సిద్ధించుచుండగా... ఇక దానికి అలభ్యమైనదేమి ఉంటుంది? ఆతడు ఒక దానిని ఇచ్ఛగించటమేమిటి? ఆ ఇచ్ఛను నీవు నెరవేర్చటమేమిటి?

పట్టపురాణి రాజమార్గంలో రథం ఎక్కిపోతుంటే ఒక మూర్ఖయువకునకు మన్మథవికారం జనించినట్లు... సర్వమూ ఈశ్వరస్వరూపమైన ఈ ప్రపంచమును చూస్తున్నప్పుడు నీకు ఇచ్ఛ, క్షోభ జనిస్తున్నాయి.

**చిత్తము :** సరేనయ్యా! నీ మాటలు ఒప్పుకుంటున్నాను. అయితే ఆత్మతో సంబంధం కలిగి నేను ఇట్లాగే ఉంటాను. నన్ను తిరస్కరించటం దేనికి?

**వీతహవ్యుడు :** అది కూడా సరికాదు...కుదరదు. ఎక్కడైనా ఫలం ప్రాప్తించేటప్పుడు పుష్పం మిగిలి ఉంటుందా? పుష్పము, ఆ పుష్పము యొక్క ఫలం ప్రక్కప్రక్కన ఉండటం ఎలా సాధ్యం? నీవు ఆత్మకు ప్రక్కన ఉండటమనేది అయోగ్యమైనదే.

"ఒక రెండిటి యొక్క సంబంధం".... అంటే ఏమిటి?

1. ఒకదాని యొక్క క్రియతో రెండవదాని క్రియ కలవటం. లేక,
2. ఒకదాని నుండి రెండవది ఆవిర్భావం పొందటం. లేక,
3. రెండిటి యొక్క ఏకత్వం. లేక,
4. సంబంధం ఏర్పడక ముందు ఆ రెండూ వేరు వేరుగా ఉండి. ఇప్పుడు ఏకమగుటకు సంసిద్ధపడుతూ ఉండాలి.

ఈ నాలుగు ప్రక్రియలూ చిత్తమునకు - ఆత్మకు కుదిరేవి కావు.

**చిత్తము :** కార్యవ్యవహారం దృష్ట్యా నాకు ఆత్మకు సంబంధం కనబడుతోంది కదా?

**వీతహవ్యుడు :** ఎట్లా కుదురుతుంది? ఆత్మ సర్వదా స్వయంప్రతిపత్తి కలిగినట్టి నిష్క్రియచైతన్యము.

నీవేమో స్వయంప్రతిపత్తి లేని జడమువు. మరొకదానిచే నియమించబడితేగానీ, నీవు దేనినీ నిర్వర్తించలేవు.

ఆత్మ నిర్వికారము... స్వయంభువము... ఆనందస్వరూపమూ...!

నీవేమో సుఖదుఃఖ భరితమూ... క్రియోన్ముఖము... ఉపకరణమాత్రము...!

మీ ఇద్దరికీ ఏకాకారత్వం ఎట్లా పొసగటం?

**చిత్తము :** పోనీ... పాలు నీరు వేరు వేరైనవై కూడా కలుస్తున్నట్లు, నేను ఆత్మ వేరు వేరై ఉండి కలుస్తున్నామని అనుకోవచ్చు కదా?

**వీతహవ్యుడు :** నీకు-ఆత్మకు, పాలు-నీరు వలె అర్థసంబంధం కుదరదు. మీ ఇద్దరివీ విరుద్ధ సంబంధములనీ ఇంతకు ముందే అనుకున్నాం కదా!

**చిత్తము :** లేకపోతే... అగ్ని - జలముల వలె మా ఇద్దరివీ విరుద్ధ సంబంధమని అనుకుందామా?

**వీతహవ్యుడు :** అగ్ని - జలముల వలె ఒకదానిచే మరొకటి నశింపజేయబడటం నీకు, ఆత్మకు ఏర్పడటం లేదు. కనుక ఆ ఉపమానం కూడా కుదరదు.

ఓ చిత్తమా! నీవు సంవిత్తు (ఆత్మ) యొక్క ఛాయవే కదా! ఈ ప్రపంచంలో ఆయా పదార్థాలు ఒకే గుణములు కలిగియున్నప్పుడు కలిసి ఉంటాయి. విరుద్ధగుణములు కలిగినప్పుడు విడిపోతాయి. నీవు ఆత్మనే ఆశ్రయించు. ఆత్మనుండి చ్యుతి పొందనప్పుడు నీవు కూడా ఆత్మవే అవుతావు.

**చిత్తము :** నాకు దృశ్యపదార్థముల ఉనికి కనిపిస్తోంది కదా!

**వీతహవ్యుడు :** అంతర్దృష్టి జ్ఞానంచే దృశ్య పదార్థమంతా లేనిదే అగుచున్నది. దృశ్యం రహితమైతే దుఃఖరహితమగు ఆత్మయే శేషిస్తోంది. అట్టి ఆత్మచే సంతుష్టిపొందు. నిరంతర ధ్యానముచే సమాధి నిష్టుడవై.. ఆత్మదర్శివై ఉండు.

**చిత్తము :** నేను కూడా సుఖము కొరకే దృశ్యమునందు వెతకుచున్నాను.

**వీతహవ్యుడు :** ... కదా? నీవు కనుక జడమాత్రములగు దేహ–ఇంద్రియ–దృశ్యము లందు 'సంకల్పము' అను రజోగుణమును ఆశ్రయించుటచే 'చ్యుతి' పొందటం ప్రారంభించావా... ఇక అది నీకు, నాకూ కూడా దుఃఖప్రదమే కాగలదు. మిత్రమా! చిత్తమా! ఈ విషయం మనం మరువకూడదు.

**చిత్తము :** కర్తృత్వమంతా ఆత్మదేనని అంటున్నావుకదా! ఇక నాకు బోధించటమెందుకు? నీవు చెప్పదలచుకొన్నది ఆత్మతోనే విన్నవించుకో!...

**వీతహవ్యుడు :** సంకల్ప – వికల్పములకు చోటు ఉండనట్టి, "కల్పన" అనే ధూళి ఏర్పడజాలనట్టి ఆత్మయందు కర్తృత్వం సంభవిస్తుందా? "ఆకాశమునకు కాళ్ళు – చేతులు ఉంటాయి" అని ఎవ్వరైనా అంటే, దానికి అర్థమేమన్నా ఉన్నదా? అట్లాగే ఆత్మకు కర్తృత్వం సంభవించదు. అయితే... ఆత్మయే తనయందు ఏకరూపముగానూ, అనేక రూపముగానూ సంభవిస్తోంది.

**చిత్తము :** అదెట్లా సంభవం?

**వీతహవ్యుడు :** నీకొక చిన్న దృష్టాంతం చెపుతాను. నీరే బుడగలుగా, తరంగములుగా, నురుగుగా, ఆవర్తములుగా, సుడులుగా సంభవిస్తోంది. "బుడగ గుండ్రంగా ఉన్నది. కనుక, జలం గుండ్రంగా ఉంటుంది"... అని ఎవరైనా అంటే మనం ఒప్పుకుంటామా? ఆవర్తమునకో, లేక తరంగానికో లేక బుద్బుదమునకో ఆకారం ఉండవచ్చు. జలానికి ఆకారం ఉన్నదా? లేదు. కనుక... ఆత్మయే ఆత్మ యందు ఆభాస మాత్రంగా జగద్రూపమై వెలయుచున్నది. జలం మధ్యలో మండుచున్న బొగ్గు ఉండజాలదు. ఆత్మ యందు రెండవ కల్పనయే సాధ్యం కాదు.

**చిత్తము :** 'ఆత్మ యొక్క కల్పనయే చిత్తము' అని అనవచ్చునేమో?

**వీతహవ్యుడు :** ఆత్మదేవుడు కల్పనారహితుడు. ఇక మనస్సో.... జడమైనది.

**చిత్తము :** ఇక ఆత్మ – మనస్సుల మధ్యగా "ఇది వేరు... అది వేరు. ఇది శుభము, అది అశుభము"... అనే కల్పన ఎక్కడుంటుంది?

**వీతహవ్యుడు :** ఉండదు. "కల్పన చేసే మనస్సే లేదు" ...అని అనుకుంటున్నప్పుడు. ఇక కల్పన ఎక్కడుంటుంది?... కాబట్టి ఈ సమస్తమూ విషయవర్జితమై, నిత్యనిర్మలమైనట్టి చైతన్యమే అవుతుందిగాని... మరింకేమీ కాదు.

ఇక్కడ కల్పన లేదు.... బంధములేదు. ఆత్మ సంవిత్తు మాత్రమే సర్వదా అన్ని వైపులా వ్యాపించియున్నది.

**చిత్తము :** అయితే 'నేను వేరు – ఇది వేరు' అనే కల్పన ఎక్కడుంటుంది? ఎక్కడి నుండి వస్తోంది?

**వీతహవ్యుడు :** ఎక్కడా ఉండజాలదు. అనాదియై, రూపరహితమై, సర్వవ్యాపకమైనట్టి ఆత్మయందు 'నేను – నీవు' మొదలైనవి ఎవరు ఆరోపించగలరు? ఆకాశంలో ఎవ్వరైనా అక్షరాలు వ్రాయగలుగుతారా? కనుక, నేస్తం! చిత్తమా! నీవు ఆత్మదృష్టిని అలవరచుకో.

ఆత్మ నిత్యోదయమైనట్టిది. సర్వవస్తువుల సారభూతమైనది. అది దిక్కులన్నీ వ్యాపించి పరిపూర్ణ మొనర్చుచున్నది. అట్టి ఆత్మను ప్రత్యక్షముగా గ్రహించనంతకాలం మిథ్యారూపమగు మృగ తృష్ణాజలం లాగా 'చిత్తము – జగత్తు' మొదలైనవి అనుభవం కాగలవు.

ఆత్మను మనం గ్రహించినామా.... దుఃఖములన్ని ఉపశమించిపోతాయి. కనుక, ఓ చిత్తమా! నీవు సుఖ దుఃఖ భ్రాంతిని, మోక్షము పొందాలనే సంచలనమును వదలిపెట్టు.

మనస్సుచే బద్ధులం కావటం... చిత్తముచే నిరోధించబడటం... ఇవన్నీ భ్రాంతియేగానీ యథార్థంకాదు. సత్స్వరూపమగు ఆత్మ ఒక్కటే వాస్తవం.

❖

అంతా విని వీతహవ్యుని చిత్తం కొంత కుదుటపడింది. ప్రశాంతత పొందింది.

❖❖❖

## 3. వీతహవ్యుడు - ఇంద్రియముల సంవాదం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ధీరుడు, ముని శ్రేష్ఠుడు అగు ఆ వీతహవ్యుడు తన చిత్తమునకు ఏకాంతంలో బోధించి ప్రశాంతపరచారు. అప్పుడు ఆతని ఇంద్రియములు కొంత సమయం తరువాత కొంత ప్రకోపించటం ప్రారంభించాయి. వాటిని కూడా ఇట్లు సంబోధించారు.

❖

**వీతహవ్యుని ఇంద్రియములు :** ఓ మునీ! ఈ జీవుని ఉనికికి మాపాత్ర ఎంతోఉన్నది. కనులు లేనివాడు చూడలేడు. చెవులు లేనివాడు వినలేడు. ఇంద్రియాలు లేకపోతే జగత్తే ఉండదు. జగత్తు లేకపోతే జీవుడు ఉండడు. కనుక ఈ జీవుడు మా వలననే మనగలుగుచున్నాడు.

**వీతహవ్యుడు :** ఓ ఇంద్రియములారా! అవిద్యాకారణంగా ఆత్మకు వేరుగా మీ యొక్క 'సత్త' అనుభవమౌతోంది. మీరు మీ విషయములను ఆశ్రయిస్తున్నంత కాలం నాకు దుఃఖ పరంపరలే వచ్చిపడుచున్నాయి. కాలక్రమేణా మృత్యువు అనివార్యమే కదా! మిమ్ములను గుడ్డిగా ఉపయోగించి నందుకు ప్రయోజనంగా ఈ జీవునకు ఎన్నో నరకములు వచ్చిపడుచున్నాయి.

అందుచేత మీరు "మేము ఆత్మ కంటే వేరైన 'సత్త' గల వారము"... అనే మిథ్యావాదనను కాస్త వదలిపెట్టండి. నేను ఇంతక్రితం చిత్తముతో జరిపిన సంవాదమును మీరు కూడా విన్నారు కదా! జ్ఞానవశం చేతనే ఆత్మోపదేశం లభిస్తుంది.

**ఇంద్రియములు :** మేమంతా ఎక్కడినుండి ఉత్పత్తి అయ్యాం?

**వీతహవ్యుడు :** మనం నిజం చెప్పుకోవాలంటే మీ ఉత్పత్తి అజ్ఞానవశం చేతనే ఏర్పడుతోంది. అజ్ఞానం క్షయించినప్పుడు మీకు 'సత్త'యే ఉండదు. అనగా మీరు స్వతఃగా లేనివారై, ఉపకరణ మాత్రులై ఉండిపోగలరు.

**ఇంద్రియములు :** మా వలన జీవునికి సంతోషం కలుగుతోంది కదా! అట్లాగే జీవుని వలన మాకు సంతోషం కలుగుతోంది?...

**వీతహవ్యుడు :** మీరు కాలంచే ఏర్పడి, కాలంచే బలహీనులై, కాలంచే నశించుచున్నారు కదా! అందుచేత... ఇరువైపులా దహించబడే అగ్నిలాగా మీయొక్క రాకపోకలు జీవునకు వాస్తవమైన సుఖం కలిగించుట లేదు చూడండి!

మీరు ఉంటున్నంత కాలం 'భ్రాంత జీవులు' అనే తరంగాలతో కూడిన ఈ సంసార నదీ జలం కాలసాగరంలోకి నిరంతరం 'ఉరుకులు, పరుగులు' ఎత్తుతూ ప్రవేశిస్తోంది. మీ వలననే పరస్పరాహంకారం ఉత్పన్నమౌతోంది. ఫలితమేమిటి? రాగము, ద్వేషము, క్షయము, వధ, పరాజయం, చింత – మొదలైన అపశబ్దాలు వినబడుచున్నాయి. ఇక దుఃఖ పరంపరల వర్షధార గురించి చెప్ప నవసరమే లేదు. "భావాభావములు, హృదయవేదనలు, సంపదలచే, ఆపదలచే ఏర్పడే దుఃఖ వియోగాలు" అనే దుర్భరవాసనలన్నీ ఆ కాలసాగర జలంలోంచి నలువైపులా ప్రసరిస్తున్నాయి.

మిమ్ములను ధరించి అటూ ఇటూ సంచరించే ఈ దేహము యొక్క గతులను చూస్తుంటే ఇంకా జాలి వేస్తోంది. అనేక మనోంతర్గతమైన చపల చింతలు మీ మధ్య తిరుగాడుచున్నాయి. లోభము మీ కణ కణములనిండా నిండి ఉంటోంది.

ఇంకేమున్నది....? లోభమున్నచోట శమదమాది ఉత్తమగుణములకు చోటు దొరుకుతుందా? ఒక వేళ, కొంచెం శమం ఏర్పడినా కూడా 'ఉద్వేగం' వచ్చి, దానిని తుడిచిపెట్టి పోతోంది.

**ఇంద్రియములు :** మా వలన జీవునికి క్రియా వ్యవహారములు సుసాధ్యమౌతున్నాయి కదా?

**వీతహవ్యుడు :** నిజమే. కానీ, మిమ్ములను దుర్వినియోగపరచుకొనే జీవుల హృదయాలు దుర్వ్యసనాలు హృదయమంతా విస్తరిస్తున్నాయి. 'మహామోహం' అనే చీకట్లో 'అజ్ఞాన సమాచారములు' అనే గుడ్లగూబలు కాపురాలు చేస్తూ, నివాసాలు కట్టుకొని ఉంటున్నాయి.

ఓ ఇంద్రియములారా! మీ వలన జీవునకు లాభాలు వచ్చిపడుతున్నాయంటారా? ఆహా, ఎంతమాట? మీకు తెలియుట లేదో ఏమో? మీరు వచ్చి చేరటం చేత లెక్కలేనన్ని అనర్థాలు కూడా వచ్చిపడుచున్నాయి. మిమ్ములను అడ్డంపెట్టుకుని పిశాచములవలె అనేక పాపకార్యములు విజృంభిస్తున్నాయి. మీరు గనక పరిశుద్ధులై ఉంటే వివేకము, ఉత్తమగుణములు ఎక్కడో చాటు మాటుగా దాక్కొని ఉండేవా? మోహమనే మంచు ఇట్లా కురుస్తూ ఉండేదా? 'రజోగుణము' అనే ధూళితో హృదయం కప్పబడి ఉండేదా? ఈ విక్షేపములు కలిగించే వికల్ప సమూహములు నాపై

దాడి చేసేవా? మీరు మంచి మిత్రులై ఉంటే, హృదయంలో తదితరులపట్ల 'మైత్రి' జనించి, ఆత్మానుభవమునకు విత్తుగా అయ్యేదే! ఈ విధంగా చింతాపరంపరలు నన్ను ఉద్వేగ పరచేవా? అహో! ఇదంతా మీ ప్రభావం కాదా?

**ఇంద్రియములు :** మా మూలంగా మా సొంతదారగు జీవునికి అనర్థములు కలగటానికి కారణం ఆతడు అజ్ఞానముచే మమ్ములను అజ్ఞాన విషయాలవైపుగా వినియోగించటమే కదా!

**వీతహవ్యుడు :** అవును. ఒప్పుకుంటున్నాను. మేఘములు శమించగా... ఆకాశంలో సూర్యుని వెలుగు ప్రస్ఫుటమగునట్లు, హృదయంలోని అజ్ఞానం తొలగితే అంతః కరణంలో జ్ఞాన ప్రకాశం ప్రత్యక్షమౌతుంది. అప్పుడు హృదయం ప్రసన్నమై, విశాలమై, గంభీరమై, క్షోభావర్జితమై ప్రశాంతత పొందగలదు. వైషమ్యాలచే పరాజితం కాని హృదయం దానంతట అదే ఉపశమించగలదు.

**అమృతాపూరపూర్ణేన నిత్యానన్దమయేన చ ।**
**స్థీయతే పురుషేణాన్తః శీతేన శశినా యథా ॥** (శ్లో 22, సర్గ 83)

అప్పుడు... మనుజుడు ఆత్మానందముచే నిత్యానందమయుడై పరిపూర్ణుడై శీతల చంద్రుని వలె విరాజిల్లగలడు! కనుక.... అజ్ఞానం నశించాలి.

ఓ ఇంద్రియములారా! జ్ఞానసముపార్జనకై మీరు నాచే చక్కగా నియోగించబడిన వారై స్నేహితులవలె ఉభయ శ్రేయస్సుకు కారణమయ్యెదరుగాక!

**ఇంద్రియములు :** అజ్ఞానముచే వినియోగించబడుచున్నప్పుడు మేము జీవునకు మరింత అజ్ఞానమును మూటకట్టుకొని తెస్తున్నాం. సరే! అజ్ఞాన నాశనమునకై మా యొక్క పాత్ర, ప్రయోజనము, ప్రాముఖ్యము ఎట్టిది?

**వీతహవ్యుడు :** చాలా గొప్పది. మనం కలిసి ఉన్న 'జీవితము' అనబడే ఈ కొద్ది సమయం సద్వినియోగపరచుకొని మన ఈ కలయికను శుభప్రదం చేసుకొనెదముగాక!

అజ్ఞానం నశిస్తే, అంతఃకరణంలో 'ఆత్మాకారవృత్తి' సుస్పష్టమౌతుంది. అప్పుడు ఈ చరాచర దృశ్య ప్రపంచమంతా మటుమాయమై దీని స్థానంలో 'సంవిత్ చైతన్యము' మాత్రమే మనకు అనుభవమౌతుంది. తత్ఫలితంగా ఆనందముచే పరివ్యాప్తమైన ఆత్మయొక్క పూర్ణ స్వరూపము అనుభూతమౌతుంది. అట్టి అనుభవం, అవగాహన, ఆశాజాలమున బంధించబడి, కేవలం దేహ సంగులై ఇంద్రియసంగులై చరించే వారికి లభించదు. మీ సహకారంతో తప్పకుండా జ్ఞానం ప్రవృద్ధం కాగలదు. మిమ్ములను సముపార్జించుకున్నదే అందుకు కదా! జ్ఞానాగ్నిచే "జర (ముసలి తనం), జన్మ" మొదలైనవి తారసబడే సంసారమార్గం సంక్షయించగలదు. జ్ఞానం ఉన్నచోట తుష్టి, పుష్టి, కాంతి మొదలైనవి వచ్చి చేరుతాయి. వివేకి అయినవాడు అవివేకమున పడకుండా సంసృతి (సంసారం) యందు చిక్కకుండా ఆత్మ యందే విశ్రాంతి పొందుతూ ఉంటాడు. కనుక ఓ ఇంద్రియములారా! మీరు చిత్తచాంచల్యముచే ప్రేరితులు కాకండి.

దృశ్యము పట్ల మౌనం వహించి ఉండండి. ఆత్మ భగవానునివైపుగా దృష్టిని, ప్రయత్నమును సారించండి. అప్పుడు ఆత్మాకారవృత్తిచే ఏర్పడే ప్రయోజనములన్నీ మనకు కలుగుతాయి. ప్రశాంత దాయకమగు గుణసంపదలు వచ్చి పడతాయి.

**ఇంద్రియములు :** కానీ– ఇక్కడ అభిరుచులు, అవి నెరవేరినప్పుడు సంతోషం ఏర్పడుచున్నాయి కదా?

**వీతహవ్యుడు :** 'ఆశించుట' అను చిత్తముయొక్క వృత్తిచేత అభిరుచులు ఏర్పడుచున్నాయి. ఆశలకు అడ్డుగోడ పెట్టినప్పుడు మాత్రమే ఉత్తమ గుణసంపదలకు చోటు దొరుకుతోంది. అయితే, ఏదైనా ఆశించేటప్పుడు దాని గుణదోషములను, తదనంతర దుష్ప్రభావములనూ చక్కగా పరిశీలించటమే విజ్ఞత కదా? "ఆత్మ యొక్క సత్త, దృశ్యం యొక్క పరిణామాలు" – ఈ రెండిటిలో ఏది శ్రేయస్సును కలుగజేస్తుందో... దానినే ఎన్నుకోవాలి. అంతేగాని, ఏది ప్రియమో, దానిని కాదు. నాకు మాత్రం అవస్తువగు ఈ ప్రపంచంలోని వస్తుజాలానుభవం, ఈ భూత భవిష్యత్తుల పట్ల ఏర్పడే ఆవేదనల కన్నా 'ఆత్మ సత్త'యే సుఖదాయకమను అభిప్రాయం కలుగుతోంది. దేనిలో అయితే... ఎట్టి అన్య పదార్థముల 'సత్త' ఉండదో... అట్టి ఆత్మనే మనం ఆశ్రయిద్దాం. ఉత్తమ సుఖమగు ఆత్మ మనకు ఎదురుగానే ఉండగా... మనం ఎక్కడెక్కడో ఏదేదో ఆశించి ఎందుకు వెతుక్కుంటూ పోవాలి? "నా యందు సత్యమై, ప్రసిద్ధమై ఉన్నట్టి ఆత్మయే మన స్వరూపం" అని ఎరిగి ఆపై ఉభయ శ్రేయస్సు పొందుతూ కలిసి ఉందాం. అప్పుడు చైతన్యమే మన రూపం అవుతుంది. చిత్తచాంచల్యమును తిరస్కరిద్దాం. అంతేగాని, అసద్రూపములను మనం ఆశించవద్దు. భావించవద్దు.

ఓ ప్రియ ఇంద్రియములారా! మనం సద్గురువుల ప్రవచనాలు విన్నాం. వేద – వేదాంగాలు అంతిమసారంగా ప్రతిపాదిస్తున్నదేమిటో గమనించాం. వాటి సారమేమిటి? అసారం ఏమిటి?

"దృశ్యము పరిత్యజించబడుగాక. పరిశుద్ధము – అఖండము – అద్వితీయము అగు ఆత్మయే మనచే మననము చేయబడు గాక!" అని కదా!

మిత్రులారా! ఇంద్రియములారా! ఈ నా నిర్ణయమును మీరు శిరసావహించెదరుగాక!

**ఇంద్రియములు :** ఓ వీతహవ్యా! నీవు చెప్పుమార్గంలో మేము జీవించి ఉండమేమో?

**వీతహవ్యుడు :** "మేము జీవనము సాగించువారము... లేక ఈ జీవుని జీవింపజేయువారము" అనే మిథ్యయగు యోచనను, సుఖ భ్రాంతిని మీరు వదలిపెట్టండి. మీరు నా యొక్క సాధనవస్తువులు మాత్రమే. సాధనలు లేనంత మాత్రం చేత సాధకుడు – సాధ్యము లేకుండా పోతాయా? అది అట్లుండగా... మీ అస్థిత్వము నాకు వేరైనవి కావు. మయావినా (నేను లేకుండా) మీకు అస్థిత్వం అనేది భ్రాంతి మాత్రమే. అట్టి భ్రాంతి ఈ మన విచారణచే పూర్తిగా తొలగిపోగలదు.

మీకంటూ ఏ స్వరూపం లేదు. భావనలేదు. కార్యక్రమం లేదు. మిమ్ములను ఉపయోగిస్తున్న నా వలనే మీకు 'ఉనికి' అనే గౌరవం కలుగుతోంది. మీకంటూ ఏదైనా స్వరూపం అనుభవమౌతుంటే, అదంతా ఆత్మ యొక్క అవిచారణా ఫలితమే అయిఉన్నది. విచారణచే మీ స్వరూపం కూడా వైషమ్య రహితమగు సన్మాత్రముగానే తెలిసిపోతోంది. వెలుతురు లేకపోవటమే చీకటి అయినట్లు...

విచారణ లేకపోవుటచేతనే 1. మీరు 2. మీ వలన విషయములు... అనుభవమౌతున్నాయి. ప్రకాశముచే అంధకారం తొలగునట్లు సమగ్రవిచారణచే మీరు స్వతఃగా లేనివారే అగుచున్నారు.

**ఇంద్రియములు :** ఇంతకాలం నీవు మాపైనే ఆధారపడి జీవించావే?

**వీతహవ్యుడు :** ఇంతకాలం నేను అల్పవివేకమును మాత్రమే కలిగి ఉన్నాను. సంకల్ప మాత్రంచే ఊహలో దయ్యం ఉద్భవమగున్నట్లు, అల్పవివేకంచే మీరంతా స్వల్పాకృతి పొంది చివరికి దుఃఖ కారకులగుచున్నారు. సృష్టికర్తనగు నాయొక్క 'ఆద్యంత సంకల్పము' చే సంకల్పకాలంలోనే మీరు సంక్షయించగలరు...లేక అధిగమించబడగలరు.

**ఇదానీముదితం నిత్యం స్వప్రాగ్రూపే క్షయం గతే ।**
**వివేకస్య ప్రసాదేన వివేకాయ నమోనయః ॥** (శ్లో 36, సర్గ 83)

వివేకోదయంచే పూర్వపు అవిద్య నశించి మీ యందు, నా యందు, ఈ దృశ్యము నందు ఆత్మ స్వరూపమే ఉదయించగలదు. అట్టి వివేకమునకు ఇదే నమస్కారం.

ఓ ఇంద్రియములారా! మీరు ప్రబుద్ధము పొందితే పరమేశ్వర స్వరూపమే పొందుతారు. చిత్తత్వము నశించితే పరమేశ్వరత్వము ప్రకాశిస్తుంది. ఇతఃపూర్వంకూడా మీ స్వరూపం పరమేశ్వర ప్రకాశమే. ఇప్పుడు దృశ్యమును అధిగమించి, ఆత్మవస్తువును ఆశ్రయించుటకు ఉపకరించుటచే పరమ పవిత్రులౌతున్నారు. దీపం వెలిగిన తరువాత చీకటిలాగా మీలో దోషములు తొలగిపోతు న్నాయి. నిద్ర లేచినవాడు మౌఢ్యమునుండి ప్రబుద్ధుడగుచున్నట్లు, జ్ఞాన – విజ్ఞాన ప్రభావంచే మీయందు పరమేశ్వరత్వం ప్రకాశిస్తుంది. ఏదైతే మీవెంట అవివేకముచే జనించిందో అది వివేకముచే నశిస్తోంది... ప్రకాశముచే చిమ్మచీకటి నశిస్తున్నట్లు...!

'ఆత్మ విచారణ' ఉంటే చాలు, మీరు కోరకున్నాకూడా మీకు సుఖ సిద్ధిలభిస్తుంది. అందుచేత శాస్త్ర సిద్ధాంతయుక్తులచే 'ఇంద్రియములు – ఇంద్రియ విషయములు ఆత్మకు అన్యంగా లేవు" అని నాచే మరల మరల నిర్ణయింపబడుగాక!

ఓ ఇంద్రియములారా! ఇప్పుడు మీరు సంసారమును దాటివేసినవారయ్యారు. మీరు పూర్వం ఆత్మకంటే అన్యంగా ఉండి ఉండలేదు. ఇప్పుడు అన్యంగా లేరు. ఇకముందు అన్యంగా ఉండబోరు. మీకు శుభమగు గాక! మీస్వరూపమేమిటో ఎరిగిన తరువాత నేనిప్పుడు దుఃఖరహితుడనగుచున్నాను. పూర్ణతృప్తుడను, శాంతుడను అగుచున్నాను. "స్వాత్మయందు స్థితి కలిగి యుండుట" అనే తురీయపదమునందు విశ్రాంతి పొందుచున్నాను. చిత్తమునకు, ఇంద్రియములకు స్థితియే లేదు.

ఆత్మ ఒక్కటే అవశ్యం కలదు! ఆ ఆత్మయే నేను. దానికి అన్యంగా ఎచ్చటా ఏదీ లేదు. బోధ స్వరూపుడనై నేనే సర్వదా అంతటా, అన్నిటా వెలయుచున్నాను.

శుద్ధ చిద్రూపమగు ఆత్మయందు "ఈ ఆత్మయే నేను. అది నేను కాదు" అనే కల్పన కూడా ఉండదు. ఇక మరింకే కల్పనలు అసలే ఉండవని వేరే చెప్పాలా?

ఏకమై, అద్వితీయమైనట్టి ఆత్మ యందు 'ఆత్మకు వేరుగా ఏదీ లేదు" అనే కల్పనమాత్రం ఎట్లా సంభవం?

అందుచేత 'ఆత్మను నేను' అనే కల్పనకూడా ఇప్పటికిప్పుడు త్యజిస్తున్నాను. ఏమరొక చింతనకూ చోటివ్వకుండా జల తరంగముల అవినాభావంలాగా మౌనం వహించి ఉంటున్నాను. వాసనారహితుడనై, ప్రాణసంచారమునకు సంబంధించనివాడనై, సర్వదోష వినిర్ముక్తుడనై ఉండెదనుగాక! 'చిదాభాసము' అను ప్రతిబింబాశ్రయం లేనివాడనై, స్వయముగా అఖండము, అప్రమేయము అగు ఆత్మనై ఉంటాను. తటాకంలోని జలంలోను, కుండలోని జలంలోను, సముద్రజలంలోను ప్రతిబింబించే సూర్య ప్రతిబింబములకు సూర్యునితో ఏం సంబంధమున్నది? అన్నిటిలోనూ ప్రకాశిస్తున్నప్పటికీ ఆ ప్రకాశముయొక్క కర్తృత్వము లేనివాడను. ఆకాశంలో ప్రకాశించే సూర్యునిలాగా స్వయం ప్రకాశకుడను. అన్ని ఉపాధులలోని జ్ఞానతత్త్వమును, చిదాత్మస్వరూపుడను.

మనశ్చేష్టలకు, ఇంద్రియచేష్టలకు సంబంధించని వాడనగు నేను ఇప్పుడు మౌనమును, విశ్రాంతిని పొందుచున్నాను.

❖❖❖

# 4. మనోజగత్

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ వీతహవ్యుడు వింధ్యపర్వత ప్రాంతంలోని తన పర్ణశాలలో సుఖాసీనుడై సమాధియందు నిశ్చలుడయ్యారు. సర్వ శారీరక, మానసిక చేష్టలు త్యజించారు. సుందరమగు ఆత్మానందమొక్కటే ఇప్పటి ఆతని అనుభవం. సముద్రజలం తరంగత్వం త్యజిస్తే ఆ జలం ఎట్లా నిశ్చలంగా ఉంటుందో ఆతని మనస్సు ఆ రీతిగా అయింది. కట్టెలన్నీ కాలిపోయిన తరువాత అగ్ని ఉపశమించినట్లు, ఆతని దేహంలో ప్రాణసంచారం ఉడిగిపోయింది. నేత్రములు బాహ్యసంచలనం త్యజించి అర్ధనిమీలిత మయ్యాయి. ఆ కన్నుల మిగతా అర్ధభాగం పూర్తిగా అంతర్ముఖమయ్యాయి. నాసాగ్రం ఉత్తేజమై ఊర్ధ్వస్థితి పొందింది. శిరస్సు, శరీరము, కంఠము సమంగా స్థితి పొందాయి. ఆతడు ఒక కొండపై మలచబడిన శిల్పంలాగా కన్పట్టసాగాడు.

అట్టి మౌన-ప్రశాంత-క్షోభారహిత-చ్యుతిరహిత... ఆనందస్థితిలో ఉండగా 300 సంవత్సరాలు గడచిపోయాయి. అంతదీర్ఘకాలం ఆతనికి అర్ధముహూర్తంలాగా గడిచిపోయింది.

ఆతడు తన జీవన్ముక్త బలం చేత జ్ఞాని, ధ్యాని అయ్యారు. అంతకాలం ఆతడు సమాధి నుండి లేవనే లేదు, దేహమును త్యజించలేదు. అంతటి దీర్ఘకాలంలో ఆ పర్ణశాలకు బయట ఏర్పడే మేఘ గర్జనలు గానీ, సమీపంలోని సామంతరాజుల వేట కోలాహలాలు గాని, కోతుల కిచకిచలు, ఏనుగుల ఘీంకారాలు, సింహముల నాదాలుగాని, పిడుగులశబ్దాలు, భూకంపములచే ఏర్పడిన శిలాపాత శబ్దాలు, దావాగ్ని చిటపటలుగాని ఆతని సమాధికి విఘాతం కల్పించలేకపోయాయి.

ఆ సమయంలో కాలం కేవలం స్వతంత్రంగా, నిష్కారణంగా, మౌనంగా గడిచిపోయింది.

జలతరంగాల లాగా అనేక వర్ష, వేసవి కాలాలు వచ్చాయి...పోయాయి. నీళ్ళు అనేకసార్లు పర్ణశాలలో ప్రవేశించాయి. కొద్దికాలంలోనే ఆ వీతహవ్యుని భౌతిక దేహం బురదలో కూరుకు పోయింది. అయినా ఆతనికి ఏమాత్రం వ్యధగాని, ఆతని సమాధి స్థితికి విఘాతంగాని కలుగలేదు.

ఆతని పట్ల 300 సంవత్సరాలు కొద్ది క్షణాలులాగా గతించిపోయాయి. ఆ తరువాత ఆతని ఆత్మప్రభువు స్వయంగా సమాధి నుండి మేలుకొన్నారు.

**శ్రీరాముడు :** స్వామి! ఆ వీతహవ్యుని దేహం 300 వందల సంవత్సరాల భూమిలో కూరుకుపోయినా, అది చెడకుండా ఎట్లా ఉన్నది? ప్రాణాలు ఎట్లా నిలిచాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** భూమిలో కూరుకుపోయినప్పుడు ఆతని దేహమును రక్షించింది చైతన్యముగాని, ప్రాణములు కాదు. ఎందుకంటే సమాధిని స్వీకరించిన మరుక్షణం ఆతని దేహంలో ప్రాణములు తమ సంచలనము నుండి ఉపశమించి అవి సూక్ష్మత్వం పొందాయి.

**శ్రీరాముడు :** 300 సంవత్సరముల వరకు శరీరమునందు ప్రసరించకుండా సూక్ష్మత్వం పొందిన ఆతని ప్రాణములు మరల ఎందుకు ఉత్తేజం పొంది పునఃప్రసరణకు ఉపక్రమించాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆతని హృదయాంతరంగంలో ఎక్కడో ఒక మూల ఇంకా ప్రారబ్ధం శేషించియున్నది. అనగా కార్య – కారణములకు సంబంధించిన దేహసంబంధ కర్తృత్వ సంస్కారం ఎక్కడో రవ్వంత మిగిలియున్నది. అందుకే ఆతని చైతన్యం ప్రబలంగా హృదయంలో ఆవిర్భవించింది. స్వమనోరూపం ధరించింది. అయినా కూడా, ఆతడు స్వవిచారణచే జీవన్ముక్తత్వము అవధరించాడు కదా! కనుక ఆతని హృదయము నిర్మలత్వం కలిగియే ఉన్నది. సమాధి విఘాతానికి కొంత ముందుగా ఆతని మనస్సు ఆ పర్ణశాల నుండి బయల్వెడలింది.

❖

వింధ్యపర్వత ప్రాంతంలో ప్రశాంతముద్రను అవధరిస్తూనే ఆయన తన స్వసత్తమనస్సులతో హిమాలయముల వైపుగా బయలుదేరాడు. అక్కడ గల కైలాసపర్వతం సమీపించాడు. ఆ పర్వతం దగ్గరగా ఉండే ఒక కదంబవృక్షం (కడిమి చెట్టు) క్రింద గట్టువంటి ఎత్తు ప్రదేశంలో కూర్చుని ధ్యాన చిత్తంతో కొద్ది సంవత్సరములు గడిపాడు. మరల అక్కడి నుండి బయలుదేరి ఆ ప్రాంతంలోనే విద్యాధరత్వం స్వీకరించి సంచరించాడు. ఆ సమయంలో దేవతలచే ఆరాధింపబడుతూ ఇంద్రత్వం అవధరించి ఐదు యుగముల కాలం గడిపివేశాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఆతడు కైలాసపర్వతప్రాంతంలో సంచరిస్తూ ఉండటం, ఇంద్రత్వంతో దేవతలచే ఆరాధింపబడుచూ ఐదు యుగముల కాలం గడపటం – ఇవన్నీ ఆతనికి ఎట్లు తారసపడ్డాయి? ఆతని భౌతిక దేహం వింధ్యపర్వత ప్రాంతంలోనే ఉండిపోయిందిగా? ఆతడు మనస్సుతో కదా, పర్ణశాల నుండి బయల్వెడలింది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవన్నీ ఆతడు తన హృదయ ప్రదేశంలోనే పొందాడు. అనుభవించాడు. దేహం మాత్రం వింధ్యపర్వత ఆశ్రమంలోనే 300 సంవత్సరాలు ఉన్నది.

**శ్రీరాముడు :** ఆ విశాల ప్రదేశములను అల్పకాలంలో, అల్పమగు ఆతని హృదయప్రదేశంలో ఎట్లా అనుభవించారు? ఇదంతా జరిగినదని మీరు చెప్పుచున్నప్పుడు దేశకాలముల యొక్క 'అనియమము' ఏర్పడుచున్నట్లు అనిపిస్తోందే? ఆతని పట్ల ఈ దేశ కాలాలకు ఒకప్పుడు నియమము, మరొకప్పుడు అనియమము ఏర్పడుతోందా ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకప్పుడు శక్తి స్వరూపరహితమై ఉంటుంది. మరొకప్పుడు స్వరూపయుక్తమై ఉంటోంది. అది ఎక్కడ ఏ రూపంలో ఉదయిస్తే ఆ రీతిగా అనుభవమౌతుంది. అట్లాగే చైతన్యము కూడా! అది ఎక్కడ ఏ రూపంగా సంకల్పపూర్వకంగా ఆవిర్భవిస్తే అక్కడ ఆ రూపంగానే అనుభవం కాగలదు. చేతనము తన స్వభావమును అనుసరించి శీఘ్రంగా ఆయా రూపములు పొందుతోందని గ్రహించు. ఇక 'నియమం' విషయం అంటావా? చైతన్యప్రభావంచే బుద్ధియందు ఎప్పుడు ఎచ్చట నియమం (లేక) ఎట్టి అనుభవం స్వీకరించబడుతుందో... అప్పుడు అచ్చట తదనుకూలమైన నియమమే ఉదితమౌతూ ఉంటుంది.

ఒక ప్రశ్న– ఈ దేశ కాల నియమ క్రమములన్నీ వాస్తవానికి ఎక్కడ ఉన్నాయి?

**శ్రీరాముడు :** అవును... ఎక్కడున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇవన్నీ బుద్ధిమయమగు చిదాత్మయందు అధ్యస్తమై ఉన్నాయి. అంతేగాని దేశ కాల వ్యవహారములన్నీ బయట ఎక్కడో లేవు.

చైతన్యము స్వరూపరహితంగా ఎరుగబడునప్పుడు... అట్టి చైతన్యమునందు అల్ప దేశకాలములు గాని, వాటిలో విశాల దేశ కాలములుగాని సంభవించవు.

కానీ... చైతన్యము స్వరూపసహితంగా ఎరుగబడినప్పుడు దేశకాలముల అనుభూతులు సంభవిస్తాయి. చైతన్యము యొక్క బుద్ధిపూర్వకమైన అనుభవమును అనుసరించి అల్పదేశకాలముల పరిధిలో విశాల దేశకాలముల అనుభవం సంభవించవచ్చు. లేదా, విశాల దేశ కాలాల పరిధిలో అల్పదేశకాలముల అనుభవం ప్రాప్తించవచ్చు.

ఈ కారణం చేత వాసనారాహిత్యం విజయపూర్వకంగా సాధించినప్పటికీ ఆ వీతహవ్యుడు కించిత్ ప్రారబ్ధ సంస్కారశేషం చేత తన హృదయస్థమైన 'చిదాకాశము'నందు వివిధ జగత్తులు, ఇంద్రత్వం, దేవతలచే పూజలు గాంచటం జరిగింది.

**శ్రీరాముడు :** జ్ఞానులలో కూడా వాసనలు ఉంటాయా? ఉంటే, ఆ వాసనలకు, ఈ సంసారజీవుల వాసనలకు భేదమేమైనా ఉంటుందా?

**శ్రీవసిష్ఠమహర్షి :** భేదం ఉంటుంది. బాగుగా వేయించిన విత్తనం బయటకు చూడటానికి మామూలు విత్తనంలాగానే ఉంటుంది. కానీ, లోన 'అంకురించుట' మనే స్వభావం కలిగి ఉండదు కదా! జ్ఞానులలో శేషించి ఉండే వాసనలు 'తదనంతర జన్మములు – పరిణామములు' కలిగి ఉండవు. వారి ఆయా కార్యక్రమములు వారియందు ఇచ్ఛ, అభిలాష, అభినివేశము కలిగించవు. సాంసారిక

జీవుడు ప్రతి కర్మచేత అద్దాని ప్రయోజనము వైపు తరలించబడుచున్నాడు. నిత్యానిత్య వివేకియగు జ్ఞానిని కర్మలు తాకలేకపోతున్నాయి.

ఇక మనం వీతహవ్యుని తదనంతర వృత్తాంతంలోకి వద్దాం. అటు తరువాత ఆ వీతహవ్యుడు త్రికాలజ్ఞుడయ్యాడు. అనేక విద్యలందు నిపుణుడైయ్యాడు. ఒక కల్పము కాలం నిర్మల జ్ఞానంతో మహేశ్వరగణమునకు నాయకత్వం వహించాడు. ఎవడు ఎట్టి సంస్కారం కలిగి ఉంటాడో... ఆతడు అట్లే ఈ దృశ్య విషయములు పొందుతూ ఉంటాడని అనుకొన్నాం కదా! ప్రారబ్ధకర్మ యొక్క దృఢ సంస్కారం జీవన్ముక్తుడైన వాని యందు కూడా ఆవిర్భవిస్తూ ఉంటుంది. అందుచేతనే వీతహవ్యుడు మనం చెప్పుకొనే అనుభవాలన్నీ పొందటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** మహాత్మా! సందర్భోచితమనుకుని ప్రశ్నిస్తున్నాను. జీవన్ముక్తుని యందు కూడా బంధమోక్షముల దృష్టి ఉంటుందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** "ఒక జీవుడు ఈ దృశ్యమును ఏ దృష్టితో చూస్తున్నాడు...?" అను దానిని బట్టి గదా, బంధమోక్షములు ఉండేవి! అందరికీ ప్రత్యక్షమైయుండే ఈ జగత్తు అంతాకూడా జీవన్ముక్తుని దృష్టి యందు శాంతమై, నిర్మలమై ప్రశాంతాకాశసదృశమై, కేవలం బ్రహ్మమే, అయి ఉంటోంది. ఇక వారికి 'ఇది ఇంతవరకు బంధం, ఇక్కడ నుండి ఇది మోక్షం' అనే అల్ప సంభావనయే ఉండదు. ప్రారబ్ధానుగతంగా, లేక, సంస్కారానుగతంగా ఏది ఎట్లు ప్రాప్తించినా కూడా... లేక, ప్రాప్తించకున్నా కూడా వారు దేని పట్లా అభ్యంతర – నిరభ్యంతరములు అనుస్వాదించరు. కలిగి ఉండరు.

జీవన్ముక్తత్వము "1. దృష్టికి, 2. అవగాహనకు, 3. ప్రభావితమగుటకు" సంబంధించినది.

అంతేగాని అది కర్మలందు పాల్గొనటానికి, పాల్గొనక పోవటానికి సంబంధించినది కాదు. మరల చెపుతున్నాను...

సంవిద్రూపమగు చిదాకాశము ఎచట ఏ విధంగా భావనా పూర్వకంగా భాసిస్తుందో అచట ఆ విధంగానే అంతటా వ్యాప్తిపొందినదై ఉంటోంది.

ఏ అనుభవములు రాక, పోకలు చేస్తున్నప్పటికీ వీతహవ్యుడు మాత్రం స్వస్వరూపధ్యానం (ధ్యాస) వీడటం లేదు. "నేను అఖండము, అప్రమేయము, నిర్గుణము అగు బ్రహ్మమునే" అనే స్పష్టాతి స్పష్టమైన నిశ్చయమును కలిగి ఉండుటచే... తదితరంగా తారసపడేదంతా ఆతనికి స్వప్న తుల్యంగానే అనిపిస్తోంది. ఆత్మ స్వభావము నుండి ఏమాత్రం చ్యుతి పొందకుండానే ఆతడు అనేక జగత్తులను క్రీడా మాత్రంగా అనుభవించాడు....!

**శ్రీరాముడు :** వీతహవ్యుని జగదనుభవములు మనకు తారసపడుచున్న జగదనుభవము వంటిదేనా? ఆతని బ్రహ్మాండానుభవములకు, మన జగద్దర్శనమునకు ఏదైనా భేదముంటుందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వీతహవ్యుని హృదయమునందలి చైతన్యము నావంటి – నీవంటి – సర్వజీవుల వంటి హృదయ చైతన్యమే. అయితే ఆత్మతో ఏకీభావం పొందినవానికి తదితర జీవులందరి అనుభవం

తనదే కాగలదు. ఓ రామా! అందరి దృశ్యానుభవం వంటిదే ఆతనిది కూడా! ఎటొచ్చీ, ఆయన అభ్యాసవశం చేత ఆత్మతత్త్వమును ఎరిగి ఉన్నారు.

ఆయనకి అనుభవములగుచున్న బ్రహ్మాండములు అసంఖ్యాకములై, రూపరహితములై ఉన్నాయి. ప్రతిభాసాదృష్టిచే అత్యంత సువిశాలములై ఉన్నాయి. ఆతనికి అవన్నీ స్వయం కల్పితంగానే అనుభవమగుచున్నాయి. అట్టి స్వకల్పిత బ్రహ్మాండమునందు ఒక సమయంలో 'నేను ఇంద్రుడను' అను అనుభవం ఆయన పొందారు. ఇంకొక సమయంలో ఇంకొక బ్రహ్మదేవుని కల్పంలో ప్రవేశించి గణపతి అయి, కైలాసమున ఉండేవారు. అవన్నీ కూడా మానసికమైనవే సుమా! అయితే భౌతిక అనుభవములకు – మానసికానుభవములకు నిత్యానిత్య వివేక దృష్టిలో భేదం లేదు.

అజ్ఞానదృష్టి కలవానికి, "నాచే దర్శించబడుచున్న ఈ బ్రహ్మాండములు, ఈ దృశ్యపరంపరలు నాకు ఎదురుగా మరెవ్వరో కల్పించి చూపిస్తున్నారు" అనే స్వయంకల్పితభ్రమ కొనసాగుతూనే ఉంటుంది.

అజ్ఞాన జీవుల ప్రయాణములు కూడా ఇట్టివే. అయితే వారు జన్మలు... వాటి నుండి వాసనలు... ఆ వాసనల నుండి జన్మలు... ఇట్లా పరంపరలుగా సాగుతూ ఉంటోంది. జీవన్ముక్తుని విషయం అట్లా ఉండుట లేదు. ఆతనిపట్ల సంకల్పములు స్వబుద్ధికి అధీనమై ఉంటున్నాయి. అందుకు కారణం, "నేను ఆత్మస్వరూపుడను కదా!"... అను అవగాహనయే!

**శ్రీరాముడు :** వీతహవ్యుని జగత్తులన్నీ మానసికమైనప్పుడు, అవి బాహ్యమున ఇంద్రుడు అవటం మొదలైన రూపాలుగా సంప్రాప్తిస్తున్నాయా? అవి బాహ్యమైనవైతే... ఆతడు విద్యాధరుడు, ఇంద్రుడు మొదలైన ఉపాధులు ఆశ్రయించాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆతని అనుభవాలన్నీ మానసికమైనవే. అయినా ఆతని వివిధ మనోప్రసరణలలో (విద్యాధరుడు – ఇంద్రుడు – గణపతి మొదలైన అనుభవాలలో) తదితర సంబంధిత జీవులు సచేతనులై ప్రాప్తించారు. అట్టి వివిధానుభవముల తరుణంలో 'నేను వీతహవ్యుడను' అను ఎరుకను వదలలేదు. అయితే ఆతని దృష్టి అత్యంత పవిత్రమై ఉండుటచే "నేను దేహాదులకు సంబంధించని ఆత్మ సత్తను" అను బ్రాహ్మీదృష్టిని ఆయన వహించియే ఉన్నారు.

❖

మనకు కనబడే ఈ సచేతన సృష్టికూడా మనకు భ్రాంతి, స్వప్నమాత్రమై ఆ వీతహవ్యునికి ప్రాప్తించినట్లే ప్రాప్తిస్తోంది. మనచే చూడబడుచున్న ఈ జగత్తు మనకు స్వప్నమువంటిదే అయినా, ఇక్కడ మనకు తదితర సచేతన జీవులు తారసపడుచున్నారు. జ్ఞాన దృష్టి దృఢపడితే నేను, నాకు తారసపడే ఈ సచేతనజీవులు – అంతయూ ఆత్మయే – అను అనుభవం స్పష్టపడి ఉంటూనే, తదితరమంతా యథారీతిగా ఉండగలదు.

**బ్రాహ్మీదృష్టి, సాంసారిక దృష్టి -** ఈ రెండిటి చమత్కారమును నీవు గ్రహించు. ఇక్కడ నీకు తారసపడే తండ్రీ, గురువులు, సభికులు, సోదరులు, అయోధ్యా ప్రజలు – అంతా ఆత్మానుభవం దృష్ట్యా – భ్రాంతి మాత్రమే. అనగా అదంతా మనస్సు యొక్క కల్పిత భ్రమ మాత్రమే. అట్లే

వీతహవ్యుని విషయంలో కూడా జరుగుతోంది. అయితే ఆతని జగత్తు దీనికి సదృశమైనది (ఈ జగత్తులో ఒకానొక చోటు) కాదు. అయితే, ఈ జగత్తు – ఆతని జగత్తు ... రెండూ లేనివే. కేవలం బ్రహ్మమే ఇక్కడా, అక్కడా కూడా భాసిస్తోందని మాత్రం గ్రహించు.

❖

భూత – భవిష్యత్ – వర్తమాన కాలములందలి, ఏఏ జీవునికైనా సరే... దృశ్యమానమయ్యే 'జగత్తు' అనబడేదంతా మనోమయమైనదేగాని మరింకేమీ కాదు. ఎంతవరకు దీని వాస్తవరూపం ఎరుగబడదో... ఎంతవరకు వజ్రంలాగా, పంజరంలాగా భావానుభవపరిమితమై ఉంటోందో... అంతవరకు చిదాకాశము ఎరుగబడకయే ఉంటోంది.

**అజ్ఞానాన్మన ఏవేద మిత్థం సంప్రవిజృమ్భతే ।**
**ప్రత్యుల్లాసవిలాసాభ్యాం జలమమ్బునిధానివ ॥** (శ్లో 43, సర్గ 85)

సముద్రంలో జలం తరంగాలరూపంలో విస్తరిస్తోంది చూచావా? మనోమయజగత్తు కూడా ఆత్మయందు 'ఉత్పత్తి–వృద్ధి–క్షయము'ల రూపంలో విస్తరిస్తోంది.

**శ్రీరాముడు :** ఈ మనోమయజగత్తులను ఎవరు కల్పిస్తున్నారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎవరూ కల్పించటం లేదు. నిర్వికారమై నిరాకారమై, చిదాకాశస్వభావమై ఉన్న బ్రహ్మమే స్వయముగా, స్వమాయచే తనయొక్క కించిత్ ప్రదేశంలో మనోమయ జగత్తుల రూపంగా చేష్టితమగుచున్నది. అనగా, తనను తానే చిత్తము రూపమున కల్పించుకొనుచున్నది. అట్టి చిత్తము యొక్క మననశక్తియే మనోరూపం పొందుతోంది. ఆ మనస్సుచే తనయందు ఈ సువిశాల జగత్తును కల్పించుకొనుచున్నది. మనస్సే ఈ దృశ్యమంతా అంతర్లీనంగా వ్యాపించియున్నది. కానీ యథార్థానికి బ్రహ్మము కంటే భిన్నంగా ఇది దేనిచేతా వ్యాపించబడిఉండలేదు.

అనగా రామా! మరొక రీతిగా చెప్పాలంటే... నీకు ఏది జగత్తై కనిపిస్తోందో... అదంతా నీవు నీ స్వకీయ మాయచే అట్లు నిర్మించుకొని అనుభవిస్తున్నావు. నీ స్వరూపవిస్తీర్ణమునే జగత్తుగా గాంచుచున్నావు.

ఆత్మ దృష్టిని గ్రహించినప్పుడు నీవు ఈ నా వాక్యాల సారం గ్రహిస్తావు. ప్రతిజీవుని యొక్క దృశ్యజగత్ చమత్కారమంతా ఇట్టిదే! వీతహవ్యుడు ఆత్మదృష్టిని గ్రహించి, తదితర జగత్తులను గాంచుచున్నాడు.

❖❖❖

## 5. భౌతిక దేహ పునరాశ్రయం

**శ్రీరాముడు :** హే మహర్షీ! వీతహవ్యముని ఇంద్రత్వం, గణపతిత్వం మొదలైనవన్నీ పొందారని చెప్పారు కదా! అవన్నీ తన భౌతిక దేహంతోనే పొందారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** లేదు... అవన్నీ మనస్సుతోనే పొందారు. అయితే, ఆతని మనోదేహం భౌతికదేహ దృశ్యాది కల్పనంతా మనవలెనే గాంచటం జరిగింది.

**శ్రీరాముడు :** ఆతని భౌతికదేహం వింధ్యపర్వత ప్రాంతంలో ఆశ్రమంలోనే ఉండిపోయింది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అక్కడే మట్టిలోనే కూరుకుపోయి ఉన్నది.

**శ్రీరాముడు :** అయితే ఆయన మరల ఆయా అనుభవాల తరువాత ఆ శరీరంలో ప్రవేశించారా? ఎట్లా ప్రవేశించారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ చమత్కార వైనమేమిటో చెపుతాను, విను–

"ఈ సర్వజగత్తు బ్రహ్మమే" అని మరికొంత నిర్ణయించుకున్న తరువాత ఆ వీతహవ్యుని మనస్సు తనకు తాను అనంతాత్మ స్వరూపంగా రూపుదిద్దుకున్నది. ప్రారబ్ధానుసారం ఆ శరీరమును అక్కడే పర్ణశాలలో ఉంచుకొని విద్యాధరత్వం, ఇంద్రత్వం, గణపతిత్వం పొందింది.

ఒక సమయంలో ఆ వీతహవ్యుడు పరమేశ్వరుని గణనాయకుడై ఉన్నారని అనుకున్నాం కదా! ఆ సమయంలో ఒక రోజు ఆయా కార్యవ్యవహారములు నిర్వర్తించిన తరువాత కైలాసంలోని ఒక ఏకాంత ప్రదేశంలో కూర్చుని ఆత్మధ్యానం చేయసాగాడు. ఆ సమయంలో కొంతసేపు తాను ఇతఃపూర్వం పొందియున్న అనేక దేహపరంపరల గురించి చమత్కారపూర్వకంగా పునశ్చరణ చేయసాగాడు. నశించినవి ఇంకా నశించనివి అయిన అనేక దేహాలు పరికించాడు. అట్టి నశించని దేహములలో వింధ్యపర్వత ప్రాంతంలో భౌతికస్థితిలో భూమిలో కీటకంలా పాతుకుపోయి ఉన్న వీతహవ్య నామధేయము గల భౌతిక దేహం దివ్యదృష్టిచే గమనించాడు.

ఆ దేహం వర్షాకాలపు ప్రవాహంచే కొట్టుకుపోబడి కొంత దూరప్రాంతంలోని ఒక కాలవ సమీపంలోని మట్టిలో లోపలగా ఎక్కడో కూరుకుపోయి ఉన్నది. వీపు వెనుక భాగమంతా బురదతో కప్పబడి ఉన్నది. శరీరమంతా నీటి ఆకులతో కప్పబడి ఉన్నది. పైన నీటి మొక్కలు మొలచి ఉన్నాయి. బాహ్యానికి అక్కడొక మురికినీటి గుంట మాత్రమే కనబడుతోంది గాని, మట్టిలో జీవఛాయ ఉన్న దేహమున్నదని ఎవరికీ ఏమాత్రం అనిపించే అవకాశమే లేదు.

తన అపంచీకృత గణపతి సూక్ష్మశరీరంతో ఇదంతా దర్శించిన ఆ మునికి తిరిగి ఆ శరీరంలో ప్రవేశించాలని అభిలాష ఏర్పడింది. ఇట్లు తనలో యోచించాడు.

**వీతహవ్యుడు :** ఇప్పుడు ఈ అపంచీకృత సూక్ష్మశరీరముతో రుద్ర గణమునకు నాయకుడనై ఇన్ని యుగాలు ఇక్కడ ఉండిపోయాను. ఇప్పుడు నేను వీతహవ్య నామధేయమైన స్థూలశరీరంలో ప్రవేశించాలి. అయితే ఆ దేహము యొక్క సర్వాంగాలు భౌతికంగా 300 సంవత్సరాలు ప్రాణసంచారం లేక పోవటంచే బిఱ్ఱుగా బిగదీసుకుని ఉన్నాయి. అందులో ప్రాణసంచలనం ఉద్ధరించటమెట్లా?

ఈ విషయం తన రుద్రగణంలో ఒక మిత్రుడు, పూర్ణజ్ఞాని అయిన ఒక సహచరుని సమీపించి చర్చించసాగాడు.

❖

**వీతహవ్యుడు :** మిత్రమా! నేను మరల శిథిలమై వింధ్య పర్వత ప్రాంతంలోని ఒక ప్రదేశంలో బురదలో ఎక్కడో అంతర్భాగములో నిస్తేజంగా పడి ఉన్న వీతహవ్యభౌతిక దేహంలో ప్రవేశించాలని అనుకుంటున్నాను. నా యొక్క కించిత్ ధ్యాసచే నా ప్రాణశక్తి అప్రసరణరూపంగా ఆ దేహంలో ఇంకా ఏర్పడియే ఉన్నది. ఆ దేహమును ఉత్తేజ పరచటమెట్లా?

**రుద్రగణ సహచరుడు :** స్నేహితుడా! మీరు ఆయా దేహములందు చేసి ఉన్న ఉత్తమజ్ఞాన సముపార్జనచే అత్యంత నిర్మలాత్మస్వభావులైనారని అందరూ అనుకుంటున్నారు కదా! మరల మీకు ఆ దేహలీలచే వచ్చే ప్రయోజనమేమున్నది?

**వీతహవ్యుడు :** నిజమే! నాకు ఆ దేహము గ్రహించుట చేతగాని, త్యజించుట చేతగాని క్రొత్తదైన ప్రయోజనమేమీలేదు. అయితే దేహగ్రహణము ఎట్టిదో... దేహత్యాజ్యము అట్టిదే కదా! కొంతకాలం క్రితం నేను ఆ శరీరంలో ప్రాణమును స్తంభింపజేసి, మనో దేహముతో బయల్వెడలి గణపతిత్వం వంటి ఆయా ప్రారబ్ధనియమాకమైన విధులను నిర్వర్తించాను. ప్రాణములు స్తంభన రూపంగా ఆ వీతహవ్య దేహంలో ఇంకనూ నిలచి ఉన్నాయి. కనుక ఆ దేహము పరమాణు రూపం పొందేంత వరకు ఆ దేహము ధరించి ఆ దేహము యొక్క వినాశనముతో బాటే నేను విదేహముక్తుడనౌతాను. స్వాత్మపదమును పొందుతూ నిర్విఘ్నంగా శాంతిని పొందుతాను.

**రుద్రగణ సహచరుడు :** మంచిది. మీ అభిమతానుసారం అట్లే అగు గాక! ఆ దేహములోని ప్రాణ శక్తిని తిరిగి ఉత్తేజపరచటం మీరు ఎరిగి ఉన్నదే! అయినా, అడిగారు కదా... చెప్పుచున్నాను. సూర్యమండలంలోని సూర్యగణనాయకుడగు పింగళుని ఆశ్రయించండి. ఆతడే దేహముల ప్రాణశక్తికి అధిపతి. మీరు కోరితే ఆయన తప్పక సహకరిస్తారు. దర్పణంలో ప్రతిబింబం ప్రవేశించినట్లు మీరు సూర్యమండలంలో ప్రవేశించండి. మీకు కార్యసిద్ధి కాగలదు.

❖

అపంచీకృతమగు గణపతి స్వరూపుడైన వీతహవ్యుడు అప్పుడు ఆ సహచరునికి కృతజ్ఞతలు చెప్పి సెలవు తీసుకున్నారు. కొలిమితిత్తిలోని అవకాశంలాగా సూక్ష్మమైనట్టి తన లింగదేహముతో సూర్యమండలములోకి ప్రవిష్టుడయ్యారు.

అప్పుడు మననశీలుడు, ఉదారబుద్ధి యగు సూర్యభగవానుడు తన హృదయంలో ప్రవేశించిన వీతహవ్యమునీంద్రుని చూచారు. ఆతని కోరిక ఏమిటో క్షణంలో తెలుసుకొన్నారు. ఆ మునీంద్రుడు తన పూర్వ – పర దేహములన్నీ మననం చేయుచూ... వింధ్య పర్వత ప్రాంతంలో మట్టిలో కూరుకుపోయి ఉన్న వీతహవ్యదేహంలో ప్రవేశించి, దానిని చేష్టాసహితం చేసి, ఆ దేహపతనానంతరం విదేహముక్తిని ఆశ్రయించాలని ఉద్దేశిస్తున్నాడని గమనించారు. ఆకాశమధ్యంలో ఉండే పింగళుడు అనే తన సూర్యగణనాయకుని పిలిచి అర్హమైన రీతిలో ఆజ్ఞాపించారు.

అప్పుడు వాయురూపమగు వీతహవ్యుని సూక్ష్మశరీర సంవిత్తు పూజ్యాతి పూజ్యుడగు సూర్య భగవానునికి సాష్టాంగదండ ప్రణామం ఆచరించింది. సూర్యభగవానునిచే సన్మానపూర్వకంగా

ఆశీర్వదించబడిన వాడై, ఆ వీతహవ్యుడు స్వకార్య నిర్వహణకు సంసిద్ధుడైయ్యారు. తన దేహం ఉన్న చోటికి పయనిస్తున్న పింగళుని హృదయంలో ప్రవేశించారు. పింగళుడు ఆకాశమును వీడి ఆ శరీరము కూరుకుపోయి ఉన్న చోటికి ప్రవేశించారు. సారసపక్షి బురదనుండి కమలమును తీయునట్లు పింగళుడు బురదలోంచి వీతహవ్యుని భౌతిక దేహం బయటకు తీశాడు.

అప్పుడాముని సూక్ష్మశరీరం పింగళుని హృదయంలో నుండి ఆ భౌతిక దేహంలో ప్రవేశించింది. పింగళుడు తన సంకల్పశక్తిచే తిరిగి ప్రాణములను యథాతథంగా ప్రకోపింపజేసి ఆ తరువాత స్వస్థానమునకు తిరిగి వెళ్ళిపోయారు.

వీతహవ్యుడు ఆ శరీరముతో అక్కడి నుండి లేచి సమీపంలో గల సరోవరం ప్రవేశించాడు. స్నానం ఆచరించి కృతజ్ఞతలతో, భక్తితో సూర్యస్తవంచేశారు. మనోభూషితమగు తన మునుపటి శరీరంతో ప్రకాశించాడు. జీవన్ముక్తులందు స్వతఃసిద్ధంగా ఉండే సమత్వము, పరమశాంతి, మైత్రి, ప్రసన్నత్వము, కరుణ మొదలైన గుణములతో శోభించారు.

సర్వ సంగవినిర్ముక్తమైన మనస్సుగల ఆ ముని అక్కడ నది ఒడ్డున ఒక రోజు గడిపాడు.

❖❖❖

# 6. ఇంద్రియవర్గ నిరాకరణం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ ముని అక్కడి నుండి బయలుదేరి వింధ్య పర్వత ప్రాంతంలో తనకు ఇతః పూర్వం బాగా పరిచయమైయున్న ఒక గుహలో ప్రవేశించాడు. అక్కడ గల ఒక ఎత్తైన శిలపై సుఖాసీనులైనాడు.

❖

**వీతహవ్యుడు :** (తన అంతరంగంలో) అమ్మయ్య! ఈ ప్రపంచం యొక్క సారాసారమేమిటో ఎరిగినాను. ఇతఃపూర్వమే ఇంద్రియములను, చిత్తమును సమాధానపరచాను కదా! ఇక దీర్ఘ చింతనలతో నాకేమి పని ఉన్నది? కల్పనలన్నిటినీ మృదువైన తీగ త్రుంచినట్లు త్రుంచివేస్తున్నాను. ఇక ఈ ప్రపంచమును, పదునాలుగు లోకములను నా దృష్టి నుండి త్యజించివేస్తాను. ఏకమగు చిన్మాత్ర స్వరూపుడనౌతాను.

ద్వైతమును స్వీకరించనప్పుడు నాకు ఈ జాగ్రత్ సుషుప్తివంటిదే అవుతుంది కదా! అయితే, జాగ్రత్‌రహితస్థితిలో ఆత్మను దర్శించుటకై మేలుకొని ఉంటాను. కనుక, నా సుషుప్తి జాగ్రత్‌తో సమానమౌతుంది. తురీయపదమును అవలంబించి, ఈ శరీరం పతనం అయ్యే వరకు ఆ పదమును వీడను. మనస్సుకు పూర్తిగా అతీతుడనై, ఆ మనస్సు యొక్క సాక్షీతత్వమునందు ప్రవేశిస్తాను. అంతటా వ్యాపించి ఏకమైయున్నట్టి వికారరహితమగు పరమాత్మయందు స్థాణువువలె స్థితిపొంది ఉంటాను.

❖

ఈ విధంగా వీతహవ్యుడు పూర్ణ నిశ్చయుడయ్యాడు. ఆ గుహలోనే ఆరు రోజులు ధ్యానతత్పరుడయ్యాడు. తదనంతరం ఒక బాటసారి చెట్టు క్రింద కొద్ది క్షణములు విశ్రమించి లేచు విధంగా, మరల ఆ సమాధి నుండి మేల్కాంచాడు. సిద్ధుడై, చాలాకాలం ఈ భూమిపై సంచరించాడు.

అట్టి సంచార సమయంలో ఏ వస్తువునూ ప్రశంసించేవాడు కాదు. దేనినీ నిందించేవాడు కాదు. సదా సర్వదా హర్ష శోక భయ రహితుడై ఉండేవాడు. నడచుచున్నప్పుడు, కదలుచున్నప్పుడు, కూర్చుని ఉన్నప్పుడు అతని హృదయంలో మనస్సు విషయమై మథనం కొనసాగుతూ ఉండేది.

❖

**అంతర్మథనం -**

**వీతహవ్యుడు :** ఓ చపల శ్రేష్ఠా! మనస్సా! ముందు ముందు కూడా నీవు నా వెంటనంటి ఉండదలచుకుంటే... నాకేమీ అభ్యంతరం లేదు. అయితే నీవు నీ చపలత్వం మాత్రం విడిచిపెట్టవలసి ఉంటుంది. సరియే కదా!

ఓ ఆశా పాశములారా! ఓ ఇంద్రియములారా! ఈ ఆత్మ మీది కాదు. మీరు శిథిలమై కాలముచే మ్రింగబడినప్పుడు కూడా ఆత్మ ఉంటుంది కదా? ఇంక అది మీదెట్లా అవుతుంది? ఆత్మకు మీతో సంబంధము లేదని ఎరిగిన మరుక్షణం మీరు నాచే జయింపబడినవారే అగుచున్నారు. మీరు ఈ ప్రపంచంలో ప్రవేశించి ఆశించేవి, ఆశ్రయించేవీ... అన్నీ కూడా అర్థం లేనివి, వ్యర్థమైనవి అవుతున్నాయి.

మీరు ఆత్మకు చెందరు... ఆత్మ మీకు చెందినది కాదు. విఫలస్వరూపులగు మీరు ఆత్మ స్వరూపుడనగు నాపై దండయాత్ర సలపటమా?... ఎట్లా సాధ్యం? “మేమే సత్యం, మేమే ఆత్మ? మేమే లేకపోతే జీవుడి గతి నిర్గతే” అనే ప్రలాపములు నాకు ఆత్మవిస్మరణ సమయంలో మాత్రమే వినబడుచున్నాయి. ‘అనాత్మ యందు ఆత్మత్వం’ అంటే అదే. ‘వస్తువు నందు అవస్తుత్వం’ అంటే కూడా అదే. అవిచారణచే జనించేది విచారణచే నశిస్తోంది.

ఓ ఇంద్రియములారా! కరణ భూతములగు మీరు వేరు. మిమ్ములను అభిమానించు స్వభావముగల జీవులు వేరు. ప్రాణప్రేరితమగు క్రియా కారణత్వము వేరు. భోక్తయగు చిదాభాసుడు వేరు. గ్రహించునట్టి మనస్సు వేరు. అద్వైతమగు బ్రహ్మము వేరు ...ఈ ఆరింటిలో దేనికదే తమ తమ స్వభావము కలిగి ఉండగా, ఎవరి పని వారిదే అయి ఉండగా ఒకదానిని మరొకటి ఎట్లా పరిమితం చేస్తుంది?

❖

అడవిలో పెద్ద పెద్ద వృక్షములు లభిస్తున్నాయి. వాటిని ఛేదించటానికి కంసాలిచే తయారు చేయబడిన గొడ్డలి, బాసిక మొదలైన సాధనములు ఇనుముతో తయారవుతున్నాయి. కొట్టిన చెట్టు కొమ్మలను కట్టి నివాసస్థలానికి తేవటానికి వెదురు చర్మపు త్రాళ్ళు ఉపయోగిస్తున్నాయి. ఇంకా ఏవేవో ఎక్కడెక్కడో లభించే సామాగ్రిని ఉపయోగించగా ‘గృహం’ తయారవుతోంది. ఈ శరీరం విషయం కూడా అట్టిదే!

కార్యకారణ సంఘాతం చేత కళ్ళు చూస్తున్నాయి. చెవులు వింటున్నాయి... నోరు మాట్లాడుతోంది... చేతులు కదులుచున్నాయి... అల్ప దీర్ఘ ఫలప్రదములగు ఆయా ఇంద్రియములు తమతమ జ్ఞానేంద్రియములచే నియమించబడుచున్నాయి.

కాకతాళీయంగా కార్యవ్యవహారమంతా సిద్ధిస్తోంది. ఈ శరీరవ్యవహారమంతా ఇట్లుండగా... దీని ఆగమన నిష్క్రమణములచే ఎవరికి ఏమి లాభం? ఏమి నష్టం?

❖

ఇప్పుడు అవిద్య పూర్తిగా తొలగిపోయింది. ఆత్మవిద్య సుస్పష్టమయింది. సత్తు అనుకున్నది అసత్తుగానూ, అసత్తు అనుకున్నది సత్తుగానూ తెలిసిపోయింది. విఘ్నములన్నీ ఉపశమిస్తున్నాయి.

ఎప్పటికీ ఉండతగినదేదో ...అది అప్రమేయమై, ప్రాప్తాప్రాప్తములచే స్పర్శించబడనిదై ఎప్పటికీ ఉండియే తీరుతోంది.

ఇక, మిగతాదంతా, ఏది ఎట్లుంటోందో... అట్లే ఉండుగాక! నేను సర్వదా ప్రత్యేకమైన స్వరూపం గల వాడినే. ఈ దేహాదులు, తదితర దేహసంబంధములు నాకు సంబంధించినవి కావు.

అంతేకాదు. నాయందు ఏది తేజోరూపమై వెలయుచున్నదో... అదియే అన్ని దేహములందూ అట్లే వెలయుచున్నది. అందుచేత అందరూ, అన్ని జీవులూ, అన్ని లోకాలూ నా వారే! నావే! నేనే!

అయితే, నాయందు నేను కానిదేమి ఉంటుంది?... నేను కానిదంతా లేనిదే! కాబట్టి 'నీవు-ఆతడు' అనునవన్నీ ఒకే సమయంలో 'నేనే' అయి, 'నేనుకానివి' అయిఉంటున్నాయి.

ఇక మౌనమే నా అనుభవం, స్వరూపం, స్వభావం కూడా!

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** మునిశ్రేష్ఠుడు, మహాతపస్వి అగు ఆ వీతహవ్యుడు ఈ ప్రపంచంలో సంచరిస్తూనే పునరాగమనరహితమగు బ్రహ్మ పదమున స్థితి పొందారు. చింతారహితుడు, అజ్ఞాన వర్జితుడు అయ్యాడు. అప్పుడు కూడా ఆయా పదార్థములనుండి కలిగే అనర్థములు నివారించటానికి ధ్యాన యోగం అవలంబిస్తూ ఉండేవాడు. సదా ఆత్మ సుఖమును చవిచూస్తూ ఉండేవాడు. ఆయా పదార్థములు, స్నేహాదులు తారసపడుచున్నప్పటికీ ఆతనికి వాటిపట్ల 'త్యాజ్య-గ్రాహ్య' దృష్టి ఉండేది కాదు. మనస్సునందు జనించే ఇచ్ఛ, అనిచ్ఛాదులకు ఆతడు అతీతుడై ఉంటూ ఉండేవారు. ఎల్లప్పుడూ కేవలీభావము (A sense of Absoluteness) అవధరించి ఉంటూ ఉండేవారు. "నాకు జన్మ కర్మలు ఉండవు" అను ఎరుకచే సంసారపరిత్యాగము కాగా, అప్పుడు శేషించియున్న బ్రహ్మానందమునందు తేలియాడుతూ ఉండేవాడు.

అట్లు చాలా రోజులు గడచిన తరువాత ఆయన పర్వతములోగల ఒక గుహలో ప్రవేశించారు. మహనీయులు తమ అభ్యాసమును విడువరు కదా! ఒక్కసారి మరల ఈ జగజ్జాలమంతా వీక్షించ టానికి ఆ గుహలో ఆసీనులై పద్మాసనమువైచుకుని... తనలో తాను ఇట్లు ప్రసంగించుకోసాగారు.

❖

**వీతహవ్యముని :** ఓ రాగమా! నీ విప్పుడు ఆత్మానురాగత్వము పొందుము. ఓ ద్వేషమా! నీవిక నిర్ద్వేషిత్వం పొందుము. మీ ఇద్దరితో ఇప్పటికే చాలాకాలం క్రీడించాను కదా!... ఇక చాలు.

ఓ భోగములారా! మీ అందరికి ఇదే తుది నమస్కారం. తల్లి తండ్రులచే పిల్లవాడు లాలించ బడినట్లు... మీచే కోట్లాది జన్మలుగా లాలించబడ్డాను. ఇక చాలు, మీతో సమాగమం. ఇక ఉపశమించండి.

**ఓ ఇంద్రియ విషయములారా!** మీ శబ్ద – స్పర్శ – రూప – రస – గంధ స్వరూపములతో పరమ పదమగు ఈ వర్తమాన నిర్వాణ గతిని మరిపించటానికి ప్రయత్నించకండి. మీకో నమస్కారం.

**ఓ ప్రియమిత్రమా! దుఃఖమా!** నీవు నాకు అనేకసార్లు 'రోదన' కలిగింపజేశావు. అయినా నీవు నాకు ప్రియమిత్రుడవే. ఎందుకంటే, నీచే సంతృప్తుడనైన నేను ఆదరముగా ఆత్మను అన్వేషించాను. ఈ ఆత్మమార్గోపదేశంలోకి నన్ను ప్రేరేపించింది నీవే. నీకు మరల మరల నమస్కరిస్తున్నాను. మేడపైకి వెళ్లువాడు మార్గంలోని మెట్లను వదలునట్లు నేను నిన్ను ఇక్కడే త్యజిస్తున్నాను. నీ కృపచే ఆత్మపదం లభించింది. 'దుఃఖము' అనే పేరుతో పిలువబడుచున్నప్పటికీ, చివరకు సుఖమునే ప్రాప్తింపజేసిన ఓ నేస్తం! నీకు జోహార్లు. కృతజ్ఞతలు.

**ఈ ప్రపంచమున అసారమగు జీవితం కలిగియున్న దేహమనే సహచరుడా! -** ధ్యానము, యోగసాధన మొదలైనవాటి యందు నీవు నాకు గొప్ప ఉపకరణమువై సహకరించావు. నీ సహాయంతో నాకు ఆత్మ సామీప్యత లభిస్తోంది. నీవు సాధనపరులకు మంచి మిత్రుడుగాను, దుర్వ్యసనపరులగు సత్‌సాధనరహితులకు చెడ్డ మిత్రుడుగానూ అవుతూ ఉంటావు. నీయొక్క, నాయొక్క, వియోగం అనాదియగు నియతియొక్క స్వభావమే అయిఉన్నది కదా! ఒక జీవుడు 'స్వార్థ గతి'ని ఆశ్రయించినా, లేక, 'పరమార్థగతి'ని అభిలషించినా... ఒకనాటికి నీతో వియోగం తప్పునది కాదు. అనేక జన్మలుగా నీతో సంయోగ, వియోగములు అనుభవిస్తూ వచ్చాను. ఆత్మ జ్ఞానవశంచేత నీతో అవినాభావత్వానికి హాని కలుగుచున్నది.

ఆత్మభావం నాకందించి, తద్వారా, నీకు నీవే సమర్పణ చేసుకుంటున్నావు. నీత్యాగం మరింకెవరికి వస్తుంది? నిన్ను మరింకెవరూ నాశనము చేయుట లేదు. నిన్ను నీవే నాశనమొనర్చు కొనుచున్నావు.

**ఓ తృష్ణగారూ! -** నేను శాంతిని పొందుచుండగా, నీవిక ఒంటరిదానివై శుష్కించుచున్నావా? నీ వలన ఎవరికీ శాంతి ఉంటుంది? అందుచేత నీవు ఉపశాంతి పొందటంలో లోకమునకు శుభకరమే. కనుక సెలవు.

**ఓ కామమా! -** నీ వినాశనము కొరకై నేను అభ్యాస – వైరాగ్యాదులను ఆశ్రయించాను. నీవు ఉన్నంతకాలం తదితర జీవులకు నేను అశాంతిని, ఖేదమును కలిగించాను కదా! నీవు ప్రకోపించుటచే నేను అనేక ఉపాధులు నష్టపరుచుకున్నాను. ఇప్పుడిక మనిద్దరికీ శాశ్వత వియోగం సంభవించబోతోంది. చాలా సంతోషమైన, పవిత్రమైన క్షణములివి. కనుక ఇక శాంతించు.

**ఓ నా సుకృత దేవతలారా! -** మీకు నమస్కారం. మీరు నన్ను అనేక నరకములనుండి లేవనెత్తి 'తపస్సు, ధ్యానము' అను స్వర్గలోకమునకు తీసుకొని వచ్చారు. అందుకు కృతజ్ఞతలు. అయితే, నేను సుకృత, దుష్కృతముల పరిధిని అధిగమించి యోగమార్గంలో ఆత్మావలోకనమును సమీపిస్తున్నాను. తద్వారా కృత్యములన్నీ అధిగమించి కృతకృత్యుడనగుచున్నాను. మీకు నా కృతజ్ఞతలు.

**ఓ పాపవృక్షమా! -** నీవు "దుష్క్రియలు" అనే క్షేత్రంలో పుట్టావు. "ఇంద్రియ పటాటోపములు" అనే వాయువు ఆస్వాదించావు. 'దుష్ట అపకార బుద్ధి' అనే బురదలో పెరిగావు. కోపం – ఆవేశం – ద్వేషం – దురవగాహన – అపరిపక్వదృష్టి – మదం – మాత్సర్యం మొదలైన బురదసారాన్ని స్వీకరించి ఇంతకింత అయ్యావు. నరకయాతనలు, అధమ ఉపాధులు అనే పూలను పూచావు. 'నీచ జన్మలు – అజ్ఞాన దశలు – అల్ప క్రియలు' అనే కాయలుగల నీతో కూడి అనేక జన్మలు గడిపాను. నేనెపుడైతే కళ్ళు తెరచి గురువులను, జ్ఞానులను, శాస్త్రములను శరణువేడానో మరుక్షణం నీవు ఎండిపోవటం ప్రారంభించావు. ఇప్పుడు నీవు చచ్చి మోడుబారి ఎండిపోయిన చెట్టుగా అయిపోవటం ముదావహం. ఆత్మను దర్శించిన తరువాత నీలో ఉండే కొంచెం చావకూడా చచ్చిపోయింది. ఇక కూకటి వ్రేళ్ళతోసహా నీవు నేలకూలినట్లే.

**ఓ మోహమా? -** ఆత్మను దర్శించుచున్న ఈ శుభతరుణంలో నీ నీడకూడా కనిపించటం లేదు. వెలుతురు ఉన్నచోట చీకటి ఉండజాలదు కదా! వెలుతురు లేకపోవటమే చీకటియొక్క నిర్వచనమయినట్లు, అఖండమగు నా ఆత్మయొక్క స్వభావం ఎరుగకపోవటమే నీయొక్క నిర్వచనం. అందుచేత, ఆత్మ సద్విమర్శనామాత్రంచేత నీవు రహితమగుచున్నావు కదా! మంచిది.

**తపస్విని వంటి ఓ పర్వత గుహా ! -** నీవు వీణానాదము వంటి ప్రతి ధ్వనులతో నన్ను మౌనంగా పలకరించేదానివి. నేను సమాధిలో ప్రవేశించియున్నప్పుడు నన్ను సఖిలాగా సేవించావు. ఆకులు నాపై వ్రాలుచున్నప్పుడు నీ పలకరింపుల చిలకరింపులవలె అనిపించేది. పూర్ణానందస్వరూపమగు ఆత్మయందు విశ్రాంతి కలుగజేయుటద్వారా నాకు మహోపకారం చేశావు. నీ సహకారంతో నాలోని లోభమంతా నశించింది. నాకు స్నేహితునివలె సఖివలె ఇంతకాలం ఉన్నావు. అనేక సంకటములచే ఖిన్నుడనై సమాధి విఘ్నములచే ద్రవీభూతుడనై ఉన్న సమయంలో నిన్ను ఆశ్రయించి, సమీపించాను. అర్ధనారీశ్వరుడగు శివుని ఆశ్రయించి భక్తులు ఉత్తమ ఫలితం పొందినట్లు, నేను నిన్ను ఆశ్రయించి మహదానందమగు ఆత్మావలోకనం పొందాను. నీవు చేసిన సహాయం ఏమని వర్ణించగలను? నీకు శుభమగుగాక!

**ఓ దండమా (చేతి కఱ్ఱ)! -** నేను అడవులలోనూ, గోతులలోనూ సంచరించేటప్పుడు నాకు ఆలంబనమయ్యావు. వార్ధక్యంలో పరమ మిత్రుని వంటి నీకు కృతజ్ఞతలు.

**ఓ దేహమా! -** "అస్థి పంజరము – రక్తము – రోమములు – ప్రేగులు" ఇవే కదా, నీ ముఖ్యతత్త్వమంతా? నీవు వాటిని గ్రహించి ఏ క్షణమైనా నీ ప్రకృతిలో ప్రవేశించవచ్చు. నాకేమీ అభ్యంతరం లేదు. నీ నుండి చమట మొదలైన జలప్రకోపములు, మలము మొదలైన దుర్గంధములు

బయల్వెడలుచుండగా... నిన్ను పవిత్రం చేస్తూవస్తున్న జలము మొదలైన వాటికి ఇవే కృతజ్ఞతలు. భోజన, శయన క్రియలకు సహకరించిన పదార్థ, ఉపకరణ సమూహములకు కూడా నా కృతజ్ఞతలు. నీకు అందించిన ఆహార పదార్థములను తయారు చేయటంలో శ్రమించిన సకల సహజీవులకూ ఇవే నా కృతజ్ఞతలు. నీవిప్పుడు ఉండినా, ఊడినా నాకొక్కటే!

**ఓ ప్రాణములారా! -** మీరు నా పూర్వకాలిక సహజమిత్రులు కదా! ఇప్పుడు నేను చేస్తున్న మిత్రుల వందన క్రమమునకు మీరు కూడా అర్హులే. మీతోకూడి నేను అనేక విచిత్రయోనులందు విశ్రమించాను. పర్వత కుంజములలోనూ, లోకాంతరములలోనూ విహరించాను. సిద్ధుల క్షేత్రము లలో ప్రవేశించాను. అనేక కార్యవిలాసములలో పాల్గొన్నాను. వివిధమార్గములలో సంచరించాను. వెయ్యేల? ఈ ప్రపంచంలో మీతో కూడి అనుభవించని పదార్థములేమున్నాయి? ప్రియమిత్రులగు ప్రాణములారా? మిమ్ములను ఎంతో కాలం పట్టి ఉంచాను. ఇప్పుడు మీరు మీ ఇష్టం వచ్చినప్పుడు మీ ప్రకృతిలోకి పోయి లీనమగుటకు స్వతంత్రం ఇస్తున్నాను. నేను బ్రహ్మముతో ఐక్యత పొందుచున్నాను కదా!

సమస్తమూ అయి ఉన్న ఓ ప్రాణములారా! ఏది ఎచ్చోట పుట్టినా, చివరికి నశించి స్వస్థానం పొందవలసిందే కదా! ఇప్పుడు ఉన్నతములైనవి మరొకప్పటికి నిమ్నస్థానం చేరుచున్నాయి.

సంయోగముచే ఏర్పడినవన్నీ ఒకనాటికి వియోగంపొంది తీరవలసిందే. ఇక మన వియోగము కొరకు వగచవలసిన పనేమున్నది?

ఓ నేత్రప్రకాశమా! నీ స్వస్థానమగు సూర్యమండలము ప్రవేశించెదవుగాక!

ఓ ఘ్రాణేంద్రియమా! నీవు నీ నిజాశ్రయమగు భూమిని జొచ్చెదవు గాక!

ఓ కర్ణేంద్రియములారా! మీరు మీ ఆకాశబిలమునందు లయమొందెదరుగాక!

ఓ జిహ్వేంద్రియమా! నీయొక్క రసశక్తి జలమయమగు చంద్రమండలమున ప్రవేశించుగాక!

పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములు వాటివాటి ప్రకృతియందు లీనమగుగాక!

ఆత్మయే అయిఉన్న నేను సూర్యుడులేని వెలుగువలె, తుపాను తాకిడిలేనట్టి సముద్రజలంలాగా, మేఘరహితమగు ఆకాశము చందమున, తైలంలేని దీపం మాదిరి, కల్పాంతమందలి సృష్టినిబోలి, ప్రశాంతమును పొందుచున్నాను. ఓంకారార్ధమాత్ర యొక్క లక్ష్యభూతమైన బ్రహ్మరూపమునందు ఐక్యత సంపాదించుకుంటున్నాను... సర్వకార్యపరంపరా వర్జితుడనగుచున్నాను... సర్వ దృశ్యాతీతుడ నగుచున్నాను.

మనస్సును అధిగమించి ఉచ్చైస్స్వర్యముతో 'ఓంకారము'ను ఉచ్చరిస్తున్నాను. మనస్సుకు అతీతుడ నగుచున్నాను. బ్రహ్మరంధ్రమున సర్వశాంతిని అనుసరించుచూ బ్రహ్మచారిత్వమును పొందుచున్నాను. శాంతుడనై, మోహరహితుడనై ఆత్మయందు పూర్ణరీతిగా స్థితిని సంపాదించు కొనుచున్నాను.

❖❖❖

# 7. నిర్వాణము

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇట్లు మననవర్జితుడై, సర్వ ఇచ్ఛలు త్యజించినవాడై, ఆ వీతహవ్యమునీంద్రుడు పెద్ద స్వరముతో, ఓంకారం సుదీర్ఘంగా ఉచ్చరించసాగారు. క్రమంగా ఆరవ, ఏడవ భూమికను అధిరోహించారు. స్వహృదయమందే సర్వ సమమగు బ్రహ్మముయొక్క ప్రాప్తిని దర్శించసాగాడు. ఆ వీతహవ్యుడు 'అ' కార, 'ఉ'కార, 'మ'కార, 'అర్ధ' మాత్రలకు సంజ్ఞలైనట్టి "స్థూల – సూక్ష్మ – అవ్యాకృత – తురీయ" పాద భేదములచే ప్రణవమును స్మరిస్తూ ఉన్నారు. "విరాట్ – హిరణ్యగర్భ – అవ్యాకృత" లక్షణములు గల తురీయమును భావన చేయసాగాడు.

మొట్టమొదటగా – "జాగరిక స్థానమున బహిర్‌ప్రజ్ఞ కలదు" అను అధ్యారోపణ చేతనూ, "అంతఃప్రజ్ఞగానీ, బహిర్‌ప్రజ్ఞగానీ లేదు" అను అపవాదముచేతనూ ...ఈ ముల్లోకములనూ, వాటి ఉత్పత్తి స్థానములతోసహా త్యజించివేశాడు.

సంకల్పములచే కల్పాంతమువరకూ కల్పించబడిన ఈ స్థూల – సూక్ష్మ – కారణముల యొక్క బాహ్యాభ్యంతరములన్నీ వీక్షించసాగాడు. ఆయన దర్శించుచున్న శుద్ధతత్త్వమగు ఆత్మ అవ్యయమైనది. ప్రకాశ, అంధకారరహితమైనది. సూర్య – చంద్ర – నక్షత్రములు లేనట్టి నిర్మలాకాశమును పోలి ఉన్నది.

ఆయనిప్పుడు స్వయముగా క్షోభరహితుడై చింతామణి వలె, పూర్ణ చంద్రుని వలె, చలనము ఉడిగిన చక్రము వలె ప్రకాశించుచున్నారు. శాంతి, నిర్మల, పూర్ణ సముద్రము వలె తురీయాత్మ యందు స్థితి కలిగియున్నాడు.

వాయువు గంధమును త్యజించునట్లు ఆతడు ఇంద్రియతన్మాత్రజాలమును త్యజించివేశాడు. క్రమంగా 'దీర్ఘ ప్రణవనాదము' అనే సూత్రమును కూడా త్యజించాడు. ఒక ప్రాజ్ఞుడగు బుద్ధిమంతుడు తననుండి రాగమును త్యజించినట్లు, ఆకాశము చీకటిని త్యజించి వెలుగు సంతరించుకుంటున్నట్లు ఆ మహాముని తనయందలి తమోగుణమునంతటినీ త్యజించివేశాడు.

❖

ఆ తరువాత ఆతని హృదయంలో ఒకానొక ప్రకాశం ఆవిర్భవించింది. అరనిముషకాలంలో ఆయన ఆ ప్రకాశమును కూడా త్యజించివేశాడు.

అప్పుడాతని హృదయంలో తమస్సుగానీ, ప్రకాశముగానీ లేవు. తమఃప్రకాశ రహితమైనట్టి స్థితిని పొందిన ఆతనియందు కల్పనాహేతువైనట్టి కించిత్ మనస్సు స్ఫురించింది. ఆ స్వల్ప ఛాయారూప మనస్సును కూడా ఆతడు అర్ధనిమిషంలో ఛేదించివేశాడు.

అటు తరువాత గాలిలేనిచోట దీపంగా స్ఫుటప్రకాశరూపము పొందాడు. అప్పుడాతని యందు కొద్దినెలల వయసుగల పసిబాలునిలో ఉండేటంతటి పరిజ్ఞానము మాత్రమే శేషించియున్నది. ఆ పరిజ్ఞానమును కూడా మరొక అర్ధనిమిషంలో త్యజించివేశాడు.

దీనినే "చైతన్యము విషయదశను పరిత్యజించటం" అనికూడా అంటారు. ఈ విధంగా... సాక్షిమాత్రంగా శేషించు స్థితిని పొందాడు. ఆ పదమునే శాస్త్రములు "పశ్యంతి" అను శబ్దముచే ఏకీస్థితిగా విశ్లేషించారు. ఆ తరువాత సుషుప్త పదమును అవలంబించి పర్వతమువలె నిశ్చలుడయ్యాడు.

❖

మహాసమర్థుడగు ఆ ముని అప్పటినుండి జగత్‌రహితమైన సుషుప్తిపూర్వక జాగ్రత్‌ను పొందుచూ అచ్చటనే స్థిరంగా ఉండిపోయాడు. ఆ తరువాత తురీయ పదమును పొందాడు. ఆ తురీయపదంలో విషయానందరహితుడైనప్పటికీ, స్వస్వరూపానంద సహితుడైనాడు. అన్యసత్తారహితుడైనప్పటికీ ఆత్మ సత్తాసహితుడైనాడు. వాక్‌కు అగోచరమగు స్థితి పొందాడు.

ఆ స్థితిలో ప్రకాశ్యవిషయమే ఉండదు కదా! అది 'చిన్మయము' అని చెపుతారు. ఇది సర్వమునకూ కేవల సాక్షీభూతమైనది. "ఇది కాదు... ఇది కాదు నేతి, నేతి" అనుకుంటూపోగా, చిట్టచివరకు శేషించేది అదే. సమము, విశాలము, పరమపవిత్రము, సర్వజీవులకు అంతర్గతము అదే. ఆయన సర్వ వివర్జితమగు బ్రహ్మరూపుడయ్యాడు.

ఏది శూన్యవాదులకు శూన్యమో, బ్రహ్మవేత్తలకు బ్రహ్మమో, విజ్ఞానవాదులకు విజ్ఞానమో, సాంఖ్యవాదులకు పురుషుడో, యోగవాదులకు ఈశ్వరుడో, శైవులకు శివుడో, వైష్ణవులకు విష్ణువో, ఆత్మవేత్తలకు ఆత్మయో, సౌతాంత్రిక, వైభాషికులకు నైరాత్మ్యమో, మాధ్యమికులకు చిత్ – అచిత్‌ల మధ్యలోగల నిర్విషయస్థితియో, జీవన్ముక్తులకు సర్వ రూపమో – అట్టి సద్రూపము ఆతడే అయి... చెన్నొందుచున్నాడు. షట్‌శాస్త్ర సిద్ధాంతసారమై సర్వహృదయస్థమై, స్వస్వరూపమై, సర్వవ్యాపకమై, సర్వరూపమైనట్టి సద్రూపమే ఇప్పుడాతడు. సర్వథా నిష్క్రియమై, సూర్యుడు మొదలైన స్వప్రకాశక వస్తువులను కూడా ప్రకాశింపజేయునదై, నిజానుభవమైనట్టి సద్రూపమే ఆతడు.

ఉపాధి భేదంచేత అనేక రూపుడు కూడా తానే అయ్యాడు.

మాయా భేదం చేత రాగయుక్తుడై ఉంటున్నది కూడా తానే. సర్వరూపుడు, సర్వమునకు భిన్నమైనవాడు తానే అగుచున్నాడు. "సర్వరూపములు తానై, 'సర్వసాక్షి' అను రూపంగా వేరై".... ఉన్నవాడయ్యాడు.

చూచావా... రామా! ఆ విధంగా ఆ వీతహవ్యమహాముని ముక్తుల దృష్టిలో చూస్తే, మనం చెప్పుకుంటున్నట్లు జన్మ జరావర్జితము, అనాది, ఏకము, విమలము, నిష్కళంకము అయినట్టి ఆత్మ సంస్థితుడే అయ్యాడు.

ఇక బుధుల దృష్టిలో ఈశ్వరుడే ఆతడు. కార్యభేదములచే అనేక రూపులైనదంతా ఆతడే. సర్వకళారహితుడై, సర్వులకు వందనీయుడైనాడు. ఓం నమో వీతహవ్యాయనమః

❖❖❖

# 8. విశ్రాంతి

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ విధంగా సంసారసీమాంతరమును పొంది, సర్వ దుఃఖములూ దాటివేసిన ఆ వీతహవ్యముని పూర్ణమనో నాశనముచే పరబ్రహ్మమున విలీనుడైనాడు. ప్రశాంతిని, పరమ తృప్తిని పొందాడు. సముద్రంలో జలబిందువు ఉన్నట్లు, పరిణామ రహితమగు స్వాత్మ పదమున స్థానం పొందాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఆయన శరీర స్థితి ఎట్లున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చెపుతాను విను. ఆతడు సంపూర్ణముగా ఆత్మానుభవ సమన్వితుడైనాడు కదా! ఇక ఆతనిచే అంతవరకూ ఉపయోగించబడిన భౌతిక దేహం యజమానిలేని ఇల్లులాగా నీరసం పొందింది. చేష్టారహితమై మ్లానత పొందింది. ఆ దేహము నుండి ప్రాణములు బయల్వెడలి ఆకాశంలో లీనమైనాయి. దేహములో గల పంచభూతములన్నీ పంచమహాభూతములందు విలయం చెందాయి. మాంసము, బొమికలతో కూడిన జీర్ణ శరీరశేషము చైతన్య సాగరమున ప్రవేశించింది. రక్త – మాంస – మేధ – మజ్జాది ధాతువులు సప్తధాతువులందు విలీనమయ్యాయి. శరీరమునందలి తత్వములన్నీ వాటివాటి కారణములందు లయించాయి. వీతహవ్యుని స్వస్వరూపము స్వయం ప్రకాశరూపమై పరమవిశ్రాంతిని పొందింది.

❖

ఓ రాఘవా! నీవు కూడా వీతహవ్యమహామునిలాగానే విచారణ చేయి. చక్కగా ప్రదీపితమై ఉన్న ఆత్మతత్త్వమును దర్శించి, అద్దాయనిందు ఆరూఢుడవై విశ్రాంతి పొందుము.

❖

ఇప్పటివరకు ఈ వీతహవ్యుని గాథ ఈ 14 రోజులుగా నీకు చెప్పినదీ, చెప్పుచున్నదీ, చెప్పబడబోయేదీ – ఇదంతా నేను స్వయముగా విచారణ చేసి చూచినది సుమా! త్రికాలదర్శిని, చిరంజీవిని అవటం చేత ఇవన్నీ స్వయంగా సందర్శించి, నీకు చెప్పుచున్నాను. నాకు అనుభవమైనదే నీకు చెప్పటం జరుగుతోంది కాని, ఏవో ఊహ, అపోహలపై ఆధారపడి కాదు. నీవు కూడా ఆయా మహనీయులవలె నిర్మల దృష్టిని అవలంబించి జ్ఞానమును పొందుము. జ్ఞానముచే మాత్రమే ముక్తి లభించగలదు.

**జ్ఞానాన్నిర్దుఃఖతామేతి జ్ఞానాదజ్ఞానసంక్షయః ।**
**జ్ఞానాదేవ పరాసిద్ధిర్నాన్యస్మాద్రామ వస్తుత ॥** (శ్లో 12, సర్గ 88)

అజ్ఞానం నశించాలంటే జ్ఞాన సముపార్జన ఒక్కటే మార్గం. జ్ఞానము చేతనే పరమసిద్ధి లభించగలదు. యథార్థానికి జ్ఞానముకంటే ఉత్తమమైనది ఇంకొకటేదీ ఉండదు.

మునీశ్వరుడగు వీతహవ్యుడు జ్ఞానముచేతనే ఆశలన్నీ తెగత్రెంచివేశాడు. జ్ఞానం చేతనే చిత్తమును చూర్ణం చేయగలిగాడు.

**శ్రీరాముడు :** స్వామి ! ఇప్పుడు వీతహవ్యునకు, జగత్తుకూ గల సంబంధమెట్టిది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆ వీతహవ్యుని సంవిత్తు, లేక, శుద్ధజ్ఞానతత్త్వము స్వహృదయమైనట్టి బ్రహ్మమునందే ఈ జగత్తును గాంచుచున్నది. అనగా "జగత్తు అనునది నాయొక్క సంకల్ప ప్రయోజనమేగాని మరింకేమీ కాదు" అనునట్టి చ్యుతిలేని ఎరుకను కలిగి ఉంటోంది.

**శ్రీరాముడు :** ఇప్పుడాతనికి తనకు మాత్రమే సంబంధించిన ఒక ప్రత్యేక జగత్తు ఏమైనా ఏర్పడి ఉన్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇప్పుడు వీతహవ్యుడు సర్వదా ఏర్పడియున్న నిత్యసత్యమును అనుభవించుచున్నాడు. ఇక్కడ వాస్తవ, నిత్య సత్యమేమిటి!

నేత్రము మొదలైన ఇంద్రియములకు ఇక్కడ తారసపడుచున్నదంతా మనస్సుయొక్క కల్పనయే కదా! ఈ నేను, నీవు, శరీరము, పదార్థములు – అంతా కూడా మనోస్వప్న మాత్రమే. ఈ జగత్తంతా మనో మాత్రమే అయి ఉండగా ఇక దీనియందు స్వకీయమైనదేది? పరకీయమైనదేది? వీతహవ్యునిలో కల్పన అంతా రహితమైపోయింది. పరమార్థమును ఆతడు పొంది ఉన్నాడు. ఇప్పుడు అతని యందు రాగద్వేషముల ఛాయ కూడా లేదు. అభిమానము, కామ్య కర్మలు మొదలైన మాలిన్యంలేదు. వాటివలన కలిగే ఇంద్రియవికారాలు లేవు. స్థూల – సూక్ష్మ – కారణ శరీరాలు కూడా లేవు. తజ్జనితమైన సంగములు లేవు. శోకరహితుడు, వివేకియు అగు ఆతడు స్వస్వరూపభూతమగు నిర్మలాత్మతత్త్వమును సాక్షాత్కరించుకుని మౌనం వహించి ఉన్నాడు. అంతే. ఇక అంతకుమించి చెప్పాలంటే ఆతడు వాక్ అతీతుడని గ్రహించు.

❖❖❖

# XII. ఉపశమన ప్రకరణము – సమీక్ష

## 1. యోగుల దేహ - మనముల వైచిత్ర్యం

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఈ ఉపశమన ప్రకరణంలోనూ, ఇంతకు ముందటి ప్రకరణాలలోనూ మనం చెప్పుకున్న అనేకమంది మహనీయుల అంతిమానుభవమును గమనిస్తున్నావు కదా! నీవు కూడా ఆత్మజ్ఞుడవై, రాగ – ద్వేష – భయ వర్జితుడవై ఈ ప్రపంచమున విహరించు.

మహాధీమంతులగు జ్ఞానులు కొందరు రాజులై రాజ్యభారం నిర్వర్తిస్తున్నారు. మరికొందరు మునులై లోక కళ్యాణార్థం అనేక సంరంభములతో కూడి యజ్ఞ యాగాదులు నిర్వర్తిస్తున్నారు.

ఓ రఘురామా! ఇక్కడ కనబడే సుఖదుఃఖ క్రమములచే ఆత్మ ఎన్నడూ వశీభూతం కాదు. అట్టి సర్వవ్యాపియగు ఆత్మయే నీవై ఉండగా ఇక ఖేదమెందుకు? వ్యర్థంగా దుఃఖములు పొందవలసిన పనేమున్నది? అనేకులగు ఆత్మజ్ఞానులు ఆయాస్థితులందు ఈ ప్రపంచంలో సంచరిస్తున్నారు. కానీ వారు దేనిని చూచీ దుఃఖం పొందటం లేదు. దేనికొరకూ శోకించుట లేదు. నీవు కూడా స్వస్థుడవై ఉండు. సర్వత్యాగివై, సముడవై, సుఖవంతుడవై ఉండు. ఆత్మవంతుడవగు నీకు ఈ జన్మా లేదు. మరొక జన్మా లేదు. సింహాలు నెమళ్ళకు వశం కావటమేమిటి? జీవన్ముక్తులు, సర్వం ఎరిగినవారూ అగు మహాత్ములు ఏది ఎట్లున్నప్పటికీ హర్ష క్రోధాది వికారాలకు వశులు కారు. కాబట్టి ఖండత్వము త్యజించి అఖండత్వము నాశ్రయించు.

**శ్రీరాముడు :** ఈ సందర్భంలో నాదొక చిన్న సందేహం. మనం ఇప్పటివరకు చాలా మంది జీవన్ముక్తుల గురించి చెప్పుకున్నాం. వారిలో కొంత మందిలో ఆకాశగమనము మొదలైన దివ్యశక్తులు కనిపించటం లేదు. మరికొందరిలో కనిపిస్తున్నాయి. జీవన్ముక్తులయందు అతీంద్రియశక్తులు ఉంటాయా? ఉండవా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రఘుకుల తిలకమా! రామచంద్రా! ఆకాశగమనము మొదలైన సిద్ధులు దేనికి సంబంధించినవి? అగ్ని యొక్క ఊర్ధ్వజ్వలనం లాగా అవన్నీ పదార్థములకు సంబంధించిన స్వాభావిక శక్తులే కదా! ఇక్కడ తారసబడే భౌతిక, అతీంద్రియ శక్తుల విచిత్ర వ్యవహారమంతా పదార్థ స్వభావం మాత్రమే! అందుచేత ఆత్మజ్ఞులైనవారికి క్రొత్తవి పొందాలనిగాని, ఉన్నవి తొలగాలని గాని అభినివేశం ఉండదు.

ఒకానొకడు ఆత్మజ్ఞాని కాకపోవచ్చు. ముక్తుడు అవకపోవచ్చు. అయినప్పటికీ మణి, ఔషధము మొదలైన ద్రవ్యశక్తులు కలిగియుండుటచేతనూ, యోగాభ్యాసం మొదలైన ఆయా క్రియాశక్తులచేతనూ "ఆకాశగమనము, మాయమవటం, ప్రత్యక్షం కావటం" మొదలైన సిద్ధులు పొందగలుగుతాడు. అంతమాత్రం చేత ఆతడు ఆత్మజ్ఞుడు అని అనిపించుకోడు.

'ఆత్మజ్ఞుడు' అంటే ఏమిటి?... "స్వయముగా ఆత్మచే ఆత్మను ఎరిగి, ఆ ఆత్మయందు సంతృప్తుడై ఉండువాడు" అని కదా! ఆత్మజ్ఞుడు అవిద్యవైపు పరుగులెందుకు తీస్తాడు? ఈ ప్రపంచంలో పదార్థము లన్నీ అవిద్యామయములే అయిఉన్నాయి. అవిద్యను త్యజించిన ఆత్మజ్ఞాని భౌతిక విషయములగు అతీంద్రియశక్తులలో మునిగి ఉంటాడా! ఊహూ!

**శ్రీరాముడు :** అతీంద్రియశక్తులు ఎట్టి వారికి లభిస్తాయి? ఆత్మజ్ఞాని వాటిపట్ల ఎట్టి ఉద్దేశం, అభిప్రాయం కలిగి ఉంటాడు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకడు ఆత్మజ్ఞాని అయిఉండకపోయినప్పటికీ, ద్రవ్య - కాల - క్రియాదులచే శాస్త్రోక్తంగా ప్రయత్నిస్తే 'ఆకాశగమనము' మొదలైన విద్యలు తప్పక లభిస్తాయి.

ఇక ఆత్మజ్ఞాని విషయమంటావా?... ఆతడు సమస్తమునకు అతీతుడై ఇచ్ఛారహితుడై ఉంటాడు. "ఇది కావాలి... పొందితేనే నేను సంపూర్ణుడనైనట్లు" అని సంభ్రమము కలిగియుండడు. ఆతనికి ఆకాశగమనములచే గాని, సిద్ధులచే గాని, తుచ్ఛమగు భోగములచే గానీ, ప్రభవములచే గాని, గౌరవ, ప్రతిష్ఠ, మాన్యాదులచే గాని, జీవన మరణములచే గాని క్రొత్తగా అభిలషించవలసిన ప్రయోజనమేమీ కనబడదు. ఆత్మజ్ఞుడెప్పుడూ నిత్యసంతోషి అయి, శాంతచిత్తుడై, రాగరహితుడై, వాసనావర్జితుడై, నిత్యసంతృప్తుడై ఉంటాడు. ఒకవేళ ఒక ఆత్మ జ్ఞానిలో అతీంద్రియ శక్తులు ఉండటం సంభవించినప్పటికీ వాటిని ఆతడు ప్రారబ్ధవిశేషములు మాత్రంగానే చూస్తాడు. ఆకాశము వలె ఆతడు ఏ భౌతిక వస్తువుచేత పరిమితుడవకుండా మహదాకారము కలిగి, ఆత్మయందే నెలకొని ఉంటాడు. ఆతనికి జీవన్మరణముల పట్ల కూడా సంగము ఉండదు. సంసారస్వభావ యుక్తంగా ఇక్కడ సంభవిస్తూ ఉండే ఆకస్మిక సుఖ దుఃఖములచే ఆతడు తన స్వాభావికమైన తృప్తిని వీడకయే ఉంటాడు. ప్రతికూల-అనుకూల ప్రారబ్ధములు తారసపడుచున్నప్పుడు, వాటిని ఒక వైపు చూస్తూ కూడా... మరొకవైపు "అఖండాకార వృత్తి" అనే పుష్పాలతో ఆత్మను పూజిస్తూనే ఉంటాడు. నదుల నుండి వచ్చే నీరు సముద్రంలో లయమైపోవునట్లు, సర్వ అనుభవములూ అతనిని సమీపించి లయమైపోతాయి గాని, పునర్వృత్తులకు కారణం కాజాలవు.

**నైవతస్య కృతేనార్థో నాకృతేనేహకశ్చన ।**
**నచాస్య సర్వభూతేషు కశ్చితర్థతవ్యపాశ్రయః ॥**

"ఇది నేను చేశాను. నాకొచ్చిన ప్రయోజనమేమున్నది? ఇది చేయలేదా? ఎట్లా?" - అనునట్టి ప్రయోజన ప్రత్యవాయువులు (Benefit - Eventualities) ఆతని దృష్టిలో ఉండవు. సర్వభూతములందూ ఆశ్రయించవలసినదంటూ ఆతనికేదీ ఉండదు.

ఓ రామా! ఒకడు ఆత్మజ్ఞానరహితుడైనప్పటికీ సిద్ధులను అపేక్షించి సాధకద్రవ్యాదులతో, మంత్ర నియమాదులతో ప్రయత్నిస్తే ఆతనిని ధనం సంపాదించటంలో నిమగ్నమైనవానితో పోల్చ వచ్చు. ధనికుడైనంత మాత్రంచేత ఒకడు ఆత్మజ్ఞాని అగుచున్నాడా? లేదే! అట్లాగే సిద్ధులు సంపాదించి నంత మాత్రంచేత ఒకనిని ఆత్మజ్ఞానిగా నిర్ధారణ చేయలేం. అందుకే శాస్త్రజ్ఞులు 'సిద్ధులు సంపాదించటం - ఆత్మజ్ఞానం' ...ఈ రెండూ వేరు వేరు విజ్ఞాన శాఖలుగా చూస్తూ ఉంటారు.

"మణి, మంత్రము మొదలైన యుక్తుల చేత ఆకాశగమనాది సిద్ధులు లభిస్తాయి" – అనేది ఆయా శాస్త్రములలో ప్రసిద్ధమైయున్న నియతిక్రమం అయి ఉన్నది. అట్టి నియతి క్రమమును దేవతలుగాని, మరింకెవ్వరైనా గాని మరొక విధంగా చేయజాలరు. దేవతలకు, పక్షులకు, తదితర కొన్ని జీవ జంతుజాలమునకు ఆకాశగమనాది సిద్ధులు వస్తు స్వభావంగా స్వతఃసిద్ధంగానే ఏర్పడుచూ ఉన్నాయి. చంద్రుడు తన శీతలత్వము త్యజిస్తాడా? సూర్యుడు తన కిరణాలలోని ఉష్ణమును వదలి ఉంటాడా? అవన్నీ కూడా వాటి వాటి నియతిని వదలకయే ఉంటాయి కదా! సర్వజ్ఞుడైనా, మహాజ్ఞుడైనా, మరెవ్వరైనా నియతిని అనుసరించే చరిస్తూ ఉంటారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లంతటివారు కూడా నియతికి లోబడే లోకములను పరిపాలిస్తూ ఉంటారు.

కనుక రామా! నీవు చెప్పిన ఆకాశగమనాదులన్నీ ద్రవ్య, కాల, క్రియా, మంత్రప్రయోగ అభ్యాసముల స్వాభావిక సిద్ధులని గ్రహించు. అంటే ఏమిటో చెపుతాను ...విను.

విషం ఉన్నదనుకో, అది 'ప్రాణులను చంపుట' అనే పాదార్థికధర్మం కలిగి ఉంటోంది. మద్యము 'మత్తు కలిగించుట' అను ధర్మమును కలిగి ఉంటోంది. తేనె 'పైత్యము మొదలైన రస దోషములను నిగ్రహించుట' అనే ధర్మం కలిగియున్నది. అలాగే ఉమ్మెత్త ఫలములు కొన్ని మానవ శరీర దోషములను నివారిస్తాయి. అవన్నీ ఆయా పదార్థముల ధర్మములు.

అట్లాగే ఆ శరీరంలో కొన్ని గూఢ శక్తులు ప్రకృతిచే పదిలపరచబడిఉన్నాయి. యోగముచే, ద్రవ్య, కాల, క్రియాదుల సహాయంతో ప్రాణములను కేంద్రీకరించుటచే ఆయా సిద్ధులు సాధకునకు లభిస్తాయి. శరీరంలోని కొన్ని కేంద్రస్థానాలలో ప్రాణములను ప్రతిక్షేపించి యోగాభ్యాసం చేయుటచే శరీరం గాలిలో తేలియాడగలదు. దూరశ్రవణము, భవిష్యత్ గ్రహణము, దూరంగా ఉండి ఆశ్రితులకు రోగనివారణం చేయటం మొదలైనవి కూడా అట్టి యోగాభ్యాసకులకు సాధ్యపడగలవు. అయితే...

ఆత్మజ్ఞాని ద్రవ్య, క్రియా, కాల రూపముగల అవిద్యకు పరమైన అభ్యాసం కలిగియుంటాడు. అఖండము. అప్రమేయము, నిత్యము అగు స్వస్వరూపాత్మయే ఆతని సాధనయొక్క సాధ్యము కదా! అందుచేత ఆతడు సిద్ధుల విషయంలో కర్తృత్వాకర్తృత్వములు వహించి ఉండడు. ఎందుకంటే, ఈ ద్రవ్య, దేశ, కాల, క్రియాదులన్నీ కూడా "తత్త్వజ్ఞాన జనితమైనట్టి పరమాత్మ పదము"నకు ఉపయోగ పడేవికావు. అయితే, కొందరికి సమగ్ర సృష్టి చమత్కారమును అనుసరించి ప్రకృతిచే సిద్ధులు ప్రసాదించ బడుతూ పరమాత్మకు సంబంధించినవని గమనించి, తాను ఇచ్ఛారహితుడై ఉంటాడు.

ఇక మరికొందరో... అట్టి సిద్ధుల పట్ల 'పొందాలి' అను రూపముతో కూడిన ఆవేశం కలిగి ఉంటారు. ఎవనికైతే కోర్కెలు ఉంటాయో, ఆతడు మాత్రమే సిద్ధులు సంపాదించటానికి ప్రయత్నపరుడై, ఆవే పరుడై తాపత్రయపడుతూ ఉంటాడు. కోర్కెలే ఆత్మజ్ఞాన సముపార్జనలో విఘ్నకరములు కదా!

ఇక ఆత్మజ్ఞాని ఎల్లప్పుడూ పరిపూర్ణుడై ఉంటాడు. కనుక ఆతనికి ఎట్టి కోర్కెలూ ఉండవు. సర్వ కోర్కెలూ శమించగా, ఆత్మలాభోదయం అయిన తరువాత... ఇక, తద్విరుద్ధమైన అల్పలాభముల పట్ల ఆసక్తిగాని, కోరికగాని ఎవరికుంటుంది? సర్వ సహజీవులను తన ఆత్మ యందు, సర్వ జీవుల యందు తన ఆత్మను సదా సందర్శిస్తూ ఉంటాడు.

జ్ఞాని విషయంలో కావచ్చు, అజ్ఞాని విషయంలో కావచ్చు... ఒక్క మాట మాత్రం నిజం. ఒకడు తనకు ఎట్టి ఇచ్ఛ జనిస్తుందో, అట్లే ప్రయత్నములు చేస్తూ ఉంటాడు. ప్రయత్నం కొనసాగుతుంటే కాలక్రమేణా అద్దానినే పొందుతాడు. ఇప్పుడే మనం వీతహవ్యమహా ముని విదేహముక్తి గురించి చెప్పుకున్నాం కదా! ఆతడు జ్ఞానాభిలాషి అయి, జ్ఞానము కొరకే ప్రయత్నించాడు. జ్ఞానాభ్యాసం కొరకు వింధ్యారణ్యం ప్రవేశించాడు. జ్ఞానమును పొందాడు. మధ్యలో ఎక్కడా విరమించలేదు. కనుక.... పొందవలసినది పొందాడు. అట్లాగే సిద్ధులు (Supernatural powers) కూడా. అవన్నీ ఆయా జీవులు ఇచ్ఛతో దేశ, కాల, క్రియాదియుక్తులచే ప్రయత్నించి సముపార్జించుకునేవే. అవన్నీ ప్రయత్నరూప వృక్ష ఫలములే. అయితే, ఆత్మ సుఖం పొందే మహాత్ముల దృష్టిలో అవన్నీ అల్పకాలిక స్వల్పవిషయములే అయి ఉంటున్నాయి.

**మహతాం నిత్యతృప్తానాం తజ్ఞ్నానాం భావితాత్మనామ్ ।**
**ఈహితం సంప్రతానాం నోపకుర్వన్తి సిద&ధయః ॥** (శ్లో 38, సర్గ 88)

ఓ రామా! నిత్యతృప్తులును, భావితాత్ములును, అభిలషితమగు ఆత్మసుఖమును పొందినవారును అగు ఆత్మజ్ఞాలైన మహాత్ములకు సిద్ధులేమియు ఉపకరింపవు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీ సమాధానంతో నేను ఎంతో తృప్తి పొందాను. మనం 'ఉపశమన ప్రకరణం' సమీక్షించుకుంటున్న సందర్భంలో ఇప్పుడే మీరు చెప్పి ఉన్న 'వీతహవ్య అంతర్ మథనం'లో నాకు కలిగిన రెండు సందేహాలు మీ ముందుంచాలని ఉన్నది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంతోషం. అడుగు.

**శ్రీరాముడు :** 1. వీతహవ్యుని దేహం వింధ్య పర్వత ప్రాంతంలోని ఆతని పర్ణశాల సమీపంలో బురదలో చిక్కుకుని 300 సంవత్సరాలు ఉన్నది కదా! అంతకాలం ఆతని దేహం హింసక జీవులచే ఎందుకు భక్షింపబడలేదు?

2. వీతహవ్యుడు దేహభావం విడచి సమాధిలోకి వెళ్ళి, ఆ సమాధి ఉపసంహరించటానికి ముందే మనస్సుతో ఏవేవో అనుభవాలు పొందాడు. శరీరం తిరిగి పొందటానికి ముందే విదేహముక్తి పొందవచ్చు కదా? మరల సూర్యుని ఆరాధించి భౌతిక దేహం ఆశ్రయించటం దేనికి? అట్లాగే దేహంలో ప్రవేశించిన మరుక్షణమే విదేహముక్తి పొందవచ్చు కదా! మరల ఒక గుహలో ప్రవేశించి ఇంద్రియములు, చిత్తము మొదలైన వాటితో సంభాషించి, ఆ తదుపరియే విదేహముక్తిని ఆశ్రయించ వలసిన పనేమున్నది!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అందుకు కారణము లేమిటో చెపుతాను... విను.

యోగాభ్యాసము లేని జీవునియొక్క సంవిత్తు అనేక రాగద్వేషములతో కూడిన మలిన వాసనలు కలిగిఉంటుంది కదా! తత్ఫలితంగా అట్టి జీవుల దేహములు "దుఃఖించుట, ఆవేశకావేషాదులు పొందుట – నీరసించుట" మొదలైన దీనస్థితి పరంపరలన్నీ పొందవలసివస్తోంది. అయితే, ఉత్తమ జ్ఞాన – యోగములచే అవిద్యాంశము నశిస్తోంది. యోగముచే ప్రాణములను ఏకాగ్రపరచిన సాధకుల భౌతిక శరీరం వారి సంకల్పానుసారం వజ్రంవలె అభేద్యమౌతూ ఉంటుంది.

**శ్రీరాముడు :** ఎట్టి యుక్తిచే యోగి యొక్క శరీరం 'ఛేదన' మొదలైనవి పొందక, వజ్రీభూతమౌతుంది? అట్టి యోగయుక్తి లేక, ప్రాణనిష్ఠ యొక్క రూపమెట్టిది? అది అందరికీ సాధ్యపడుతుందా? లేక, కొందరికి మాత్రమేనా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రాణశక్తికి – మనస్సుకు – భౌతిక దేహమునకు ఒకానొక విచిత్రమైన సంబంధం ఉన్నది. ఆ సంబంధమును అనుసరించే వీతహవ్యుని దేహంలో ప్రాణములు సంచలన రహితమైనప్పుడు సూక్ష్మత్వం పొందటం, దేహం దీర్ఘకాలం శిథిలం కాకపోవటం, మనస్సు ప్రారబ్ధ కర్మలు అనుభవించి తిరిగి శరీరంలో ప్రవేశించటం, మనస్సు శరీరంలోకి అడుగుపెట్టగానే ప్రాణాలు పునఃసంచలనం ప్రారంభించటం, శరీరం ఉత్తేజమవటం – ఇవన్నీ జరిగాయి. ప్రాణశక్తిని ఎరిగిన యోగులకు ఈ విషయాలు సుపరిచయాలే. ఈ విశేషాలు మనం ఉత్పత్తి ప్రకరణంలో కొన్ని సందర్భాలలో ప్రస్తావించుకోవటం జరిగింది. ఇప్పుడు సందర్భోచితమే కనుక, ఈ శరీర – మనో – ప్రాణాలకు ఏర్పడి ఉన్న పరస్పర సంబంధముల విషయమై కొన్ని విశేషాలు చెపుతాను. అప్పుడు నీ మొదటి సందేహం తొలగగలదు.

❖

చిత్తము జీవునిలో ఉండే ప్రియ, అప్రియముల స్వభావం చిత్రీకరిస్తూ ఉంటోంది. మనస్సు మననస్వభావం జీవుని నడిపిస్తూ ఉంటుంది.

చిత్తము ఎప్పుడెప్పుడు ఏ పదార్థములందు సంలగ్నమై ఉంటుందో, అప్పుడప్పుడు అది ఆయా పదార్థముల రూపమే పొందుతూ ఉంటుంది. ఈ చిత్తము, "ఈతడు నాకు అయిష్టుడు" అని భావోద్వేగం పొంది ఒకనిని చూస్తున్నప్పుడు ఆతడి అనేక కదలికలు అట్టి అయిష్ట వికారములను మనస్సుకు కలిగిస్తాయి. "ఇతడు నాకు స్నేహితుడు, ఇష్టుడు" అని అనుకుంటుంటే అతని అవే కదలికలు, చర్యలు సంతోషమును కలుగజేస్తూ ఉంటాయి. ఈ విషయం అందరికీ అనుభవమయ్యే విషయమే.

ఒక రాగద్వేష రహితుడైన బాటసారి త్రోవలో పొలములను, వృక్షములను చూస్తున్నప్పుడు ఎట్టి మనోవృత్తులకూ లోనుకాడు. అట్లుగాక, ఆయా రాగద్వేష మనోవృత్తులతో సంతప్తమైన చిత్తము గలవాడు ఆ బాట నుండి వెళ్ళుచున్నప్పుడు, "ఈ చెట్లు మావి, ఆ పొలం ఒకప్పుడు మాది, ఈ స్థలం మా ఊరివారిది, ఇక్కడి తోటలు మా బంధువులవే, ఆ తోపులు వేరే వర్గం వారికి చెందినవి" – అను మనోవికారములన్నీ పొందుతాడు. ఇది కూడా అందరికీ ప్రతిరోజూ అనుభూతమయ్యే విషయమే.

అట్లాగే తనకు రుచించే పదార్థములను చూచిన మనస్సు చపలం పొందుతుంది. వెంటనే ఆ చంచల మనస్సు దేహంలో కొన్ని వృత్తులను, భౌతిక సంఘటనలను కలిగిస్తుంది. ఆ దేహం అందుకు ప్రతిస్పందిస్తోంది. ఆ విధంగానే అదేవ్యక్తి తాను ద్వేషించే చూచాడనుకో... ఆతని మనస్సు అరుచి, ఏహ్యా వృత్తులు పొందుతుంది. ఆ వృత్తులు ఆతని దేహంలో వికారాదులు

కలిగిస్తూ ఉంటాయి. ఈ విధంగా మనస్సుకు, భౌతిక దేహానికి ఏర్పడే పరస్పర ప్రవృత్తి ప్రభావాలు అందరు ఎరిగినవే.

ఇప్పుడు ఈ చిత్తవృత్తులు తదితరులపై ఎట్టి ప్రభావం కలిగిస్తాయో గమనిద్దాం. ఒక జీవుడు 'దయ, ప్రేమ'వంటి ప్రవృత్తులను మరల మరల ప్రకటించుటచే, ఆతడు కాలక్రమేణా తదితరులపై కూడా ఒకానొక ప్రభావము కలిగి ఉంటాడు. అనగా తదితర జీవులు కూడా ఆతనిని దయ, ప్రేమలకు అర్హుడుగా గాంచుతారు. అట్లాకాకుండా, ఈ జీవుడు ద్వేష – ఆవేశ – క్రోధాదులు మరల మరల ప్రకటించుటచే అట్టి జీవుడు అదే రీతి అయిన ప్రతి స్పందనకు అర్హుడగుచున్నాడు. ఈ విధంగా ఆయా వృత్తులు అదేవిధమైన అసంకల్పిత ప్రతిస్పందనలుగా తదితరులపై ప్రభావిత మవుతూ ఉంటాయి. ఎందుచేత?

ఒక చిత్తము యొక్క అంతర్గత వృత్తులు అదేవిధమైన సంస్కారములతో కూడిన తదితర చిత్తములలో ప్రతిబింబపూర్వక ప్రభావమును కలిగి ఉంటూ ఉంటాయి కాబట్టి!

ఇప్పుడు మనం రాగ – ద్వేష – వైషమ్య రహితుడగు యోగి విషయానికి వద్దాం. సంవిద్విలాసం చేత (Presence of Pure - Self) పూర్ణమానసుడగు యోగి శరీరముపై హింసక జీవుల చిత్తము ప్రసరిస్తున్నదనుకో... అప్పుడు తేలు, కీటకం మొదలైన ఆ హింసక జీవుల చిత్తము నందు యోగి యొక్క సంవిత్తు ప్రతిబింబించగానే అవి 'సమత్వము'అనే అనుభవమును పొందుచున్నాయి. అనగా వాటిలో హింసించు స్వభావము ఉపశమించి, 'సాత్వికము, శాంతము' రూపు దిద్దుకుంటున్నాయి. ఒక యాత్రికుడు మార్గ మధ్యంలోని 'దేవాలయం, యోగుల ఆశ్రమం' మొదలైన పవిత్ర విషయాలను చూస్తున్నప్పుడు తన లోని సాంసారిక ఉద్వేగమును మరచి కించిత్ సాత్వికతతో వినమ్రుడగుచున్నాడు. అట్లాగే హింసించు స్వభావం గల జీవులు ఆ యోగి యొక్క సంవిత్తు ప్రభావం చేత దైవీ గుణముల వైపుగా ప్రభావితమై ఉంటాయి. మహనీయులగు ప్రశాంతపురుషుల ఆశ్రమాలలో (పురాణాలలో వర్ణించిన కణ్వమహర్షి ఆశ్రమం మొదలైనవి) సింహము, పులి, పాము, తేలు మొదలైన స్వాభావిక హింసక జీవులు శాంతి, అహింస, ప్రేమలను వహించటానికి ఇదియే హేతువు. సమదర్శియగు యోగి యొక్క సంసర్గముచే అవన్నీ రాగ ద్వేషములనుండి విడివడుచున్నాయి. అట్టి కారణం చేత వీతహవ్యుని శరీరమును సమీపించిన కీటకాదులు కుట్టటం, హింసించటం, భక్షించటం మొదలైన స్వాభావిక క్రియలందు ప్రవృత్తం కాలేకపోయాయి.

ఆ హింసక జీవులు ఆ స్థానం విడచి దూరం వెళ్ళగానే మరల తమ స్వాభావికమగు హింసించు స్వభావమునందు ప్రవృత్తమౌతూ ఉంటాయి.

గమనిస్తున్నావా, రామచంద్రా! ఉదాహరణకు, ఒకడు తన సహజీవులపట్ల అకృత్రిమమైన – స్వభావసిద్ధమైన ప్రేమ, కరుణ దైనందికంగా అభ్యసిస్తున్నాడనుకో. ఆతని పట్ల సహజీవులు కూడా అదేరకంగా అకృత్రిమమైన, స్వభావసిద్ధమైన ప్రేమతో అసంకల్పితంగా స్పందిస్తూ ఉంటాయి. కోపంగా ఉండే స్వభావం గలవారు, తిరిగి అసంకల్పితంగా కోపగించబడతారు. ఒకని గుణములే

తిరిగి ఆ గుణముల ప్రతిస్పందనకు సహకారికారణములు అగుచూ ఉంటాయి. ఈ రీతిగా ఈ జీవుడు తనకున్నదే తాను పొందుచున్నాడు సుమా!

కారణం?... ఒకే చిత్ శక్తి అన్ని జీవులలోనూ ప్రసరించి ఉన్నది కదా! అందుచేత జీవులన్నీ ఒకదానిచే మరొకటి పరస్పరం స్వస్వభావానుసారం ప్రభావితమవటం సహజమే!

**శ్రీరాముడు :** జీవమున్నచోటే చిత్ శక్తి అజీవుని మనస్సునందు ప్రతిబింబిస్తుందా? లేక, చిత్ శక్తి (ఆత్మతత్త్వం) 'జీవం, మనస్సు' లేని చోటకూడా ఏర్పడియే ఉంటుందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చిత్ శక్తి అంతటా ఆక్రమించియే ఉన్నది. కొయ్య, మట్టి, శిల, లోహం –అన్నిటి యందూ సత్తా సామాన్యరూపమున చిత్ శక్తి ఏర్పడి ఉండనే ఉన్నది. అయితే కాష్ఠ – లోష్ఠ – శిలాదులందు మూగబాలుని వలె మౌనరూపమున ఉంటోంది. సూర్యకాంతి అంతటా ప్రసరించి ఉన్నప్పటికీ సూర్యబింబం జలంలో మాత్రమే ప్రతిబింబిస్తూ ఉంటుంది చూచావా? అట్లాగే ఆ చిత్ శక్తి కేవలం పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనో, బుద్ధి యుక్తము అగు సూక్ష్మ శరీరమునందు మాత్రమే మనోచంచలనసహితమై, పరిచ్ఛిన్నమై కన్పట్టుచున్నది.

❖

పై కారణాల చేత 'నిర్వికారస్థితి, బ్రహ్మభావన' పొందిన ఆ వీతహవ్యుని దేహం సర్వత్రా సమరూపమున ఉన్న భూజలాదులందలి సంవిత్తు యొక్క ప్రతిభచే, వికారములు పొందక నిశ్చలమై భూమిలో ఉండిపోయింది.

ఓ రామచంద్రా! ఈ విషయంలో నీకు మరొక యుక్తి కూడా చెపుతాను విను. అసలు దేహం శిథిలం అవటానికి కారణమేమిటి?... అంతఃకరణము యొక్క 'చేష్ట'లేక 'స్పందన' దేహ శైథిల్యమునకు, నాశనమునకు కూడా కారణమగుచున్నది.

దానినే మనం 'శరీరము యొక్క చేష్ట' అను అభిప్రాయంతో చూస్తూ ఉంటాం. అట్టి స్పందన రూపమగు 'దేహనాశనము' అనే వికారం ప్రాణజనితములగు జగద్వ్యవహారములలో మనకు ప్రసిద్ధమై కనబడుతోంది.

ప్రాణశక్తి యొక్క దేహాంతర్గతమగు స్పందమే (చలనమే) దేహచలనము (జీవనము). ప్రాణశక్తి యొక్క దేహాంతర్గతమగు అస్పందమే దేహనిస్తేజము (మరణము).

అయితే, అట్టి ప్రాణముల చలనము ఉపశమింపబడి, దేహంలో ఒక స్థానంలో యోగుల చేత ఉద్దేశపూర్వకంగా కేంద్రీకరించబడినప్పుడు, సంచలన రాహిత్యం చేత ఆ జీవుని ఆ ప్రాణములు శిల వలె దృఢీభూతమై ఉంటాయి. అట్టి కేంద్రీకృత ప్రాణముల ప్రభావం చేతనే వీతహవ్యుని భౌతిక శరీరం ఎట్టి మార్పు పొందకుండా దీర్ఘకాలం ఉండిపోయింది.

బాహ్యమున హస్తపాదాదులతోనూ, అభ్యంతరమున ప్రాణములతోనూ కూడిన ఈ శరీరం ప్రాణవాయువుల స్పందనచేతనే ప్రవర్తిస్తోంది. ప్రాణవాయువుల స్పందనమే 'చిత్తము యొక్క

బీజము' అని కూడా గ్రహించు. ఎవనియందైతే ప్రాణవాయువుల స్పందన యోగాభ్యాసం చేత నిరోధించబడి, సుస్థిరీకరించబడి ఉంటుందో – అట్టివాని దేహమునకు వృద్ధి క్షయాలు ఉండవు. అట్లు ప్రాణముల బాహ్య, అభ్యంతర స్పందనము ఉపశమించినప్పుడు దేహమున ఉన్న చర్మము, మాంసము మొదలైన ధాతువులు తమ స్థితిని ఎన్నడూ వీడకయే ఉంటాయి. అనగా, యోగముచే స్థంభింపబడిన ధాతువులు ప్రాణసంచలనము నిరోధించినప్పుడు మేరువువలె స్థిరత్వం పొందుతాయి. అట్టి ధీరులగు యోగుల శరీరములు కాష్ఠములాగా (కొయ్యలాగా) స్థిరమై, అచంచలత్వం పొందుతాయి. అప్పుడు తదితర ప్రాపంచిక జీవులకు ఆ శరీరం చంచలత్వం లేని మృతదేహపు అవయవములవలె కన్పట్టుచూ ఉంటుంది. కానీ, ఆ యోగి ప్రాణశక్తి యొక్క ప్రత్యుత్సాహం మౌనసంకల్ప రూపంగా దేహము నందు దాగి ఉంటుంది.

ఈ కారణంచేత యోగుల శరీరములు వందల, వేల సంవత్సరములు కూడా నీటిచేత తడవక, భూమియందు శిలలాగా శిధిలముకాక ఉండగలవు.

❖

ఇప్పుడు నీ రెండవ ప్రశ్నకు వద్దాం. "జ్ఞానశ్రేష్ఠుడగు ఆ వీతహవ్యుడు శరీరంలో తిరిగి ప్రవేశించకుండా కైలాసం నుండే విదేహముక్తిని ఆశ్రయించవచ్చు కదా?" –అని ప్రశ్నించావు కదా?

ఆత్మజ్ఞానులు, వీతరాగులు, మహాధీమంతులు, సర్వసంసారగ్రంథులు ఛిన్నమైనట్టివారు అగు మహాత్ములు తమ దేహం విషయంలో సర్వస్వతంత్రులై ఉంటారు. అట్టి యోగులగు తత్వజ్ఞుల మనస్సు కాకతాళీయ న్యాయముచే ప్రారబ్ధంగా ప్రాప్తించి ఉన్న ఆయా విధులందు భావన కలిగి ఉండటం స్వభావసిద్ధంగా ఏర్పడి ఉంటోంది. ఈశ్వరశక్తి గాని, మరింకే శక్తి గాని ఆ యోగి యొక్క వర్తమాన, పూర్వజన్మల ప్రారబ్ధశేషానుభవమునకు అనుకూలంగానే ప్రవర్తిస్తాయి. దానిని మరింకెవరూ మరొక విధంగా తీర్చిదిద్దలేరు. ఇది ఎట్లా అంటే, సర్వమునకు అతీతత్త్వము సముపార్జించుకున్న జ్ఞాని కూడా ఒక ఉపకారికి ప్రత్యుపకారం చెయ్యాలని అనుకోవటం వంటిది.

ఆ వీతహవ్యుని సంవిత్తు కాకతాళీయంగా "నేను నా పూర్వప్రాణ సహిత వీతహవ్యదేహంలో ప్రవేశించి మరికొంత విచారణ చేస్తాను. ఆ తరువాత విదేహముక్తిని ఆశ్రయిస్తాను" అను సంకల్పమును ప్రారబ్ధానుసారంగా ఆశ్రయించింది. అందుచేతనే రుద్రగణంలోని సహచరుని సంప్రదించి సూర్య భగవానుని శరణువేడింది. ఆ సంవిత్తు "నాకు నేనుగా శరీరంలో ప్రవేశిస్తాను" అని అనుకోకపోవటానికి కారణం కూడా ప్రారబ్ధ శేషమే. సంవిత్తు ఇతఃపూర్వపు స్వయంకల్పితమగు ప్రారబ్ధమును అనుసరించే వర్తించటము ఈ చరాచర సృష్టి నియతి యొక్క చమత్కారమేనని అనుకోవాలి. యోగమును పరాకాష్ఠ వరకు ఆశ్రయించి ఉండుట చేతనే ఆతడు శరీర త్యాజ్యం విషయంలో సర్వస్వతంత్రుడైనాడు. వాసన సంపూర్తిగా రహితమై ఆతడు సర్వబంధముల నుండి వినిర్ముక్తుడై "నేను అఖండము, అప్రమేయము, నిత్య ఆత్మనే" అనునట్టి ఆత్మరూపమున ఆవిర్భవించారు. అట్టి స్థితిలో 'సదేహం, విదేహం' –అన్నీ ఆతని సర్వస్వాతంత్ర్య స్వభావమును అనుసరించే ఉంటాయి.

ఆతడు సర్వ శక్తియుతుడగు పరమేశ్వరుడే అయ్యాడు. అందుచేత ఆతడు దేనిని వాంఛించాడో దానినే శీఘ్రంగా పొందటం జరిగింది. విచారణచే చిత్తము నశించగా "మహామైత్రి, మహాకరుణ" – మొదలైన మహత్తర గుణములు ఆతనికి స్వభావసిద్ధం అగుచున్నాయి. ఓం నమో వీతహవ్య పరమేశ్వరాయనమోనమః

❖❖❖

## 2. చిత్తోపశమనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** చూచావా రామా! మనం ఈ ప్రకరణంలో ముఖ్యంగా గమనించవలసినదేమిటి? చిత్తము ఉపశమిస్తే జీవునకు సర్వ శుభములు కలుగుతాయి. ఎక్కడ చిత్తము నశిస్తే, అక్కడే 'మైత్రి, కరుణ' మొదలైన సద్గుణములన్నీ స్వతఃగా ఉత్పన్నమై ప్రకటితమౌతాయి. అనగా అవి 'స్వాభావ సిద్ధత'ను సంతరించుకుంటూ ఉంటాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఒకనిలో తీవ్రము, సూక్ష్మము అగు ఆత్మవిచారణచే చిత్తము ఆత్మయందు లయించిందనుకోండి. అప్పుడాజీవుడు నిర్వికారుడు, నిర్విషయుడు అవుతాడు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును.

**శ్రీరాముడు :** అప్పుడిక 'మైత్రి, కరుణ' మొదలైన గుణములు ఉత్పన్నమవటానికి చోటు ఉంటుందా? చిత్తమే ఉండనప్పుడు, గుణములెక్కడ ఉంటాయి? మరి అట్టి గుణములు ఉత్పన్నమౌతాయని ఎట్లా చెప్పుచున్నారు?

హే మహావక్తా! మునిశ్రేష్ఠా! ఒకసారి చిత్తము బ్రహ్మమునందు లయమయిన తరువాత ఇక ఆపై మైత్రి కరుణ మొదలైన గుణములు కలిగేది ఎద్దానికి?...

లయించిన చిత్తమునకా? లేక అధిష్ఠానమగు ఆత్మకా? కాక, అధిష్ఠానమగు ఆత్మలోనా? లేదా, బింబరూపమగు చైతన్యమునందా? కాదా, 'చిదాభాసుడు' అనబడే చైతన్య ప్రతిబింబమగు జీవాత్మయందా?...

ఈ విషయం దయచేసి విశదపరచండి. ఎందుకంటే... "మృగతృష్ణలోని జలం గడ్డకట్టి ఉన్నది, మరొక చోట ప్రవాహపతితమై యున్నది" అను వ్యతిరిక్త వాక్యాలులాగా చిత్తమే ఉండనప్పుడు ఇక గుణముల ప్రసక్తి ఎక్కడిది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** పూర్ణము, సుఖ స్వరూపము అగు ఆత్మ సంవిత్తు ఒకానొక సమయంలో ఒక చోట మలిన వాసనాజాలము కలిగి ఉంటోంది. అట్టి మలిన వాసనా జాలము జన్మ సమూహములకు, సుఖదుఃఖ భరిత అధ్యాసలకు కారణమగుచున్నది.

'మలినవాసనలు' – అంటే ఏమిటి?... "నేను ఈ శరీరమును. శరీర పరిమితుడను. ఈ శరీరంలో గల ఇంద్రియములే నా ఉనికి. ఈ ఇంద్రియ విషయములచే నేను బద్ధుడను. ఇంద్రియాలు

లేకుంటే నాకు ఉనికి (సత్) లేదు. ఇంద్రియములు ఉంటే, వాటి విషయములచే నియమితుడ నగుచున్నాను.” ...ఇట్టి దృష్టిని ఆత్మ సంవిత్తు కలిగి ఉంటోంది. అదియే అజ్ఞచిత్తము. అదియే మలినమగు మనస్సు. అదియే సంసారము యొక్క రూపము. ‘జీవుడు’ అనగా అట్టి అజ్ఞాన దృష్టి, మనస్సు గల చిదాత్మయే కదా!

మరల చెప్పుచున్నాను. అజ్ఞాని యగు జీవుని యందు వాసనా జాలముచే ఏదైతే దృఢంగా ప్రతిష్ఠించబడియున్నదో... అద్దానిని మనస్సు అని చెప్పుకుంటున్నాం. అట్టి మనస్సు సమరూపం పొందినప్పుడు అట్టి జీవుని మనం జీవన్ముక్తుడు అని అంటున్నాం. దోషపూరితమగు మనస్సు నశిస్తేనే ఈ జీవుడు బంధభావములనుండి విడివడగలడు.

**శ్రీరాముడు :** మహాత్మా! నశించే మనస్సేది? నశించని మనస్సేది? అసలు మనస్సు అనేది నశిస్తుందా? మనస్సు నశిస్తే ఆ జీవునకు వ్యవహారసామర్థ్యం ఉంటుందా? మనస్సు నశించిన తరువాత మైత్రి, కరుణ మొదలైనవి ఎట్లా ఏర్పడి ఉంటాయి?

**శ్రీవసిష్ఠమహర్షి :** ప్రశ్నించువారిలో ఉత్తముడవగు, ఓ రామచంద్రా! ఇప్పుడు నీకు ‘మనో నాశనము’ లేక, ‘చిత్తోపశమనము’ అంటే ఏమిటో విశదపరుస్తాను. అప్పుడు నీ సందేహాలన్నీ పటాపంచలౌతాయి.

❖

ఒకడు ఒక పెద్ద కొండను సమీపించి నోటితో ఊదుతూ ఉంటే... ఆ కొండ రెపరెప లాడుతుందా? ఏ ధీరుడైతే తనకు తారసపడే ఆయా సుఖదుఃఖ దశలు వచ్చిపోతున్నంత మాత్రం చేత తన యొక్క అఖండ – అప్రమేయ, నిత్య, నిర్మల ఆత్మ భావననుండి చ్యుతుడు కాడో – అట్టివాని చిత్తము, లేక మనస్సు నశించినట్లే. ఏ విజ్ఞాన సమన్వితుడినైతే ‘ఈ అల్ప దేహమే నేను. తదన్యంగా మరింకేమీ గాను’ అను రూపంగల దేహాత్మభావన ప్రభావితమై ఉండజాలదో – ఆతనికి చిత్తము లేనట్లే. పునర్జన్మ కారకమగు సాంసారిక భావన ఉన్నప్పుడే దానిని ‘చిత్తం’ అని పిలుస్తాం. ఎప్పుడైతే చిత్తము ఆత్మ స్వభావమును సంతరించుకుంటుందో ఇక అది ఆత్మస్వరూపమే అవుతుంది.

సంసారమున్న చోటే చిత్తము ఉంటుంది. సంసారము రహితమైతే ఇక అది ‘చిత్’యే అవుతుంది. దానిని మనం చిత్తము అనిపిలువం. కనుక ‘చిత్తం లయించింది’ అన్నంత మాత్రంచేత “ఆలోచనలన్నీ అంతమై ఆతడు నిష్క్రియుడు అవుతాడు” – అని అనుకోవద్దు. “సర్వ ఆలోచనలకు ఉత్పత్తి స్థానమైన స్వాత్మస్థానము నందు ప్రతిష్ఠితుడౌతాడు” అని గ్రహించు.

❖

చిత్తము నశించినవాని యందు “ఆపద, సంపద, విపత్తు, మహోత్సవం’ వంటివన్నీ కొండను తాకే పిల్లగాలుల వలె బాహ్యస్థమైపోతాయి. ఈ ప్రపంచ విషయములన్నీ వాటి రాక పోకలతో సహా అప్రభావితమగునప్పుడే ‘చిత్తము రహితమైనది’ అని శాస్త్రములు అంటున్నాయి.

చిత్తము యొక్క రూపమేమిటి? మూఢత్వం కలిగి ఉండటమే. పరమార్థమును వదలి దృశ్యమును మననం చేస్తూ కార్య కారణములకు అధీనమయి ఉండుటయే దృశ్యతాదాత్మ్యం. మూఢత్వం

తొలగితే మేఘాలు తొలగినప్పటి సూర్యుని వలె సత్త్వభావం పూర్ణంగా ఉదయించగలదు. అట్టి సత్త్వభావము నుండి చ్యుతి పొందనప్పుడు చిత్తము రహితమైనట్లే. జీవన్ముక్తుడు సత్త్వభావమును ఆశ్రయించి ఉంటాడు. ఆతనిలో శేషించే దృశ్యవ్యవహారమును 'శుద్ధ చిత్తము' అని కూడా అంటారు.

❖

**శుద్ధ చిత్ స్వభావుడు -** "శుద్ధ చిత్ స్వభావుడు (లేక) శుద్ధసంవిత్ స్వరూపుడు" అగు జీవన్ముక్తుని యందు అత్యంత అకృత్రిమంగా పరిమిత దృష్టులన్నీ తొలగిపోయి ఉంటాయి. అందుచేతనే ఆతనియందు మైత్రి, కరుణ మొదలైనవి స్వభావసిద్ధంగా ప్రకటితమౌతాయని నేను చెప్పటం జరిగింది. వారు స్వభావసిద్ధంగానూ, అకృత్రిమంగానూ ఉత్తమ గుణాలు కలిగి ఉంటారు. అంతేగాని, పునర్జన్మ కారకమగు ఆశ చేతనో, ప్రతిష్ఠకొరకో కాదు. ఎందుకంటే, 'నేను ఆత్మను' అను అనుభవం గల చిత్స్వభావుడు తన స్వరూపమునే సర్వే సర్వత్రా గాంచుచున్నాడు. అమ్మ ఏ ప్రతిఫలం కోరకుండా పుత్రునియందు అవ్యాజమైన ప్రేమ తన స్వభావంగా కలిగి ఉంటుంది కదా!

జీవన్ముక్తుడు సర్వులను తనవలెనే గాంచుచూ ఉంటాడు. అందుచేత ఆతని అప్పటి 'మైత్రి, కరుణ' అసంకల్పితములు, స్వభావసిద్ధములు. అందుచేత, అవి పునర్జన్మ హేతువులు కాజాలవు.

"అసలు చిత్తము అంటే ఏమిటి?" ...ఈ దేహము కంటే విలక్షణమైనట్టి 'సత్త' స్వరూపుడగు దేహి తన స్వరూప సత్తను ఏమరచి ఈ దేహములో ఏర్పడి ఉన్న ఇంద్రియములకు విషయములు అగుచున్న వాటిలో భావనా పూర్వకంగా ప్రవేశించి, వాటి ప్రభావములగు సుఖ-దుఃఖ భావ పరంపరలను అవిశ్రాంతంగా, అవిచ్ఛిన్నంగా పొందటాన్నే శాస్త్రజ్ఞులు 'చిత్తము' అని పిలుస్తున్నారు. తత్త్వశాస్త్రములు (మోక్ష శాస్త్రములు) జీవునకు విషయముల నుండి వెనుకకు మరలి, స్వస్వరూప సత్త యందు అచ్యుతుడై ఏర్పడి ఉండటం ఉద్బోధిస్తున్నాయి. దానినే 'చిత్త నాశనం' అంటున్నాయి.

ప్రతి జీవుని యందు సర్వదా ఏర్పడి ఉన్నది ఏకైక స్వసత్తయే కదా! అందుచేత విషయములచే ఏర్పడిన 'గుణ - కర్మ' భేద విభాగమంతా స్వసత్తయందు ఉద్బోధితుడైనవానికి ఉపశమించిపోతాయి. సత్వము అనే చంద్రకిరణ స్వరూపమగు సంతుష్టి ప్రకటితమగుచుండగా ఆ జీవన్ముక్తునికి సాత్త్విక గుణములు స్వభావ సిద్ధమైపోతాయి. అంతేగాని అవి ప్రతిఫలాపేక్ష చేతనో, కర్తృత్వాభిమానంతోనో ఏర్పడే గుణ ప్రకటనకాదు. "నా బిడ్డకు స్నానం చేయించాను. తుడిచాను. లాలించాను మరి నాకు ప్రతిఫలం ఏమిటి? ఎవరు ఇస్తారు?" అని తల్లి గొప్పలు చెప్పుకోదు కదా! ఆమె ప్రేమ లాగానే జీవన్ముక్తుని ప్రేమ మొదలైనవి అత్యంత స్వతఃసిద్ధమైనవి అవుతాయి.

**అరూపమనోనాశనం -** ఇది నిష్కళాత్ములగు విదేహముక్తులకు మాత్రమే కలుగుతుంది. అప్పుడు సర్వగుణములు నిర్మలము, పరమపావనము అగు విదేహముక్తపదము నందు లయించి పోతాయి. అనగా... 'అరూపము' అనబడే చిత్తనాశస్థితి విదేహముక్తులకు మాత్రమే విషయమౌతుంది. అది రూపరహితం, దృశ్యరహితం అయినది. దానిని మనం మాటలలో చెప్పుకోలేము.

అట్టి అరూప చిత్తనాశనపదము గుణము కాదు. అగుణము కాదు. సమృద్ధిగాని, అసమృద్ధి గాని కాదు. చంచలముగాని, ఉదయముగాని, అస్తమయంగాని, హర్షముగాని, శోకముగాని,

తేజ – అంధకారములుగాని, పగలు – రాత్రులుగాని కాదు. "దిక్కులు, ఆకాశము, ఊర్ధ్వ అధో విభాగము, రచన, రాగము, విరాగం, సత్త, అసత్త, సత్తఅసత్తల సంధి రూపం" ...ఈ శబ్దాలన్నీ అరూపచిత్త నాశనము గురించి ప్రవచించలేవు.

అది అంధకార, తేజోరహితమైనది. సూర్య, చంద్ర, నక్షత్ర వర్జితమైనది. శరత్ కాల ఆకాశం లాగా అది నిర్మల పదమై అలరుచున్నది. ఆకాశము వాయువునకు స్థానమగుచున్నట్లు... బుద్ధిని, సర్వసంసారాడంబరాన్ని అధిగమించిన మహాత్ములకు ఆ 'అరూపసత్త'యే స్థానభూతమై ఒప్పుచున్నది. అజ్ఞానరజ శూన్యమైనట్టి, ఆకాశంవలె విశాలమైనట్టి, చిత్తలేశమైనా లేనట్టి అరూపసత్త యందు విదేహముక్తులు ఏర్పడి ఉంటున్నారు. ఈ జగత్తులలో కనిపించే సమష్టిబుద్ధి, సమష్టి సంచలనము మొదలైనవి విదేహముక్తుల వినోద విహారమే సుమా!

❖❖❖

# 3. శరీర తదాప్యం - నివారణ

**శ్రీరాముడు :** హే మహాత్మా! మహర్షీ! అనేక సంరంభములచే అలరారుచున్న ఈ జగత్తు ఎదురుగా ఉండి జీవుడు నిర్విశేషమగు బ్రహ్మమును సంతరించుకోకుండా అడ్డగించుచున్నది కదా! అనేక దుఃఖములతో కూడి ఎదురుగా నిలచి ఎంతో భ్రమింపజేస్తున్న 'సంసారము' అనబడే ఈ వృక్షమునకు అసలు బీజమేది? ఆ బీజం ఎక్కడినుండి వచ్చింది? దానికి ఉత్పత్తి స్థానమేది? ఆ స్థానమునకు ఎక్కడి నుండి, ఎట్లా ఉత్పత్తి ఏర్పడింది?

మా బోధ యొక్క అభివృద్ధి కొరకై అసలు ఈ సంసారమంతా ఎక్కడి నుండి వచ్చిపడుతోందో... ఆ మూలము గురించి విశదీకరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** "ఈ దేహమే సంసారమునకు అసలైన బీజం" అని చెప్పబడుతోంది. నీకు బయటగా కనబడే ఈ దేహము యొక్క అసలైన రూపం జీవుని యొక్క అంతరంగంలో ఏర్పడి ఉన్నది. శుభ, అశుభ భావనలే దీని అంకురం. కాండమునుండి కొమ్మలు, ఆకులు, కాయలు, పూలు వృద్ధిచెందుతాయి చూచావా? "సంసారము" అనబడే అంతఃకరణము యొక్క దోషవిభాగము నుండి కార్య, కారణములు, ఆశలు, సుఖ దుఃఖములు, ఉపాధులు అనునవన్నీ ఉత్పన్నమగుచున్నాయి.

సంసారమునకు స్థానం అంతఃకరణమే. శరీరం అనగా "నేను ఈ శరీరమును" అను అంతఃకరణము యొక్క వ్యవహారమేనని విజ్ఞులు గమనిస్తున్నారు. మనస్సే పదార్థముల అభివృద్ధి, వినాశములకు స్థానమని సుతీక్ష్ణమైన అవగాహన గలవారు తప్పక గ్రహిస్తున్నారు. ఆశించేది, ఆ ఆశల వెంట పరుగులు తీసేది, వాటివలన కలిగే సుఖదుఃఖములను నిర్వచించేదీ, వాటిని త్యజించేదీ అంతా మనస్సే. భూత – వర్తమాన – భవిష్యత్ దేహములను, ఆ దేహములచే పొందే దృశ్య పరంపరలనూ, అన్నిటినీ మోస్తున్నది మనస్సే. జాగ్రత్ నుండి స్వప్నంలోకి వెళ్ళిన మనస్సు ఊహానగరమును సృష్టించుకొని, అందులోకి ప్రవేశించి అనేక అనుభవములను పొందుతోంది.

మనస్సు 'సంకల్పించుట' అను ప్రక్రియను తన యొక్క మూలముగా కలిగి ఉన్నది. కుమ్మరి యొక్క ఆలోచనలను అనుసరించి మట్టితో అనేక ఆకారములు గల కుండలన్నీ తయారగుచున్నట్లు, మనస్సుచే దృశ్యత్వము, ఆ దృశ్యమునకు విషయములగు ఈ జగదనుభవములు తయారగుచున్నాయి.

వృత్తి అను రూపముగల మనస్సుకు రెండు మూలాస్థానములు ఉన్నాయి–

1. దృఢవాసనలు (Dense Tendencies), 2. ప్రాణస్పందము.

ప్రాణములు చలించి నాడులను స్పృశించటానికి సిద్ధమగుచున్నాయి. మరుక్షణం చిద్వికారమగు మనస్సు లేక చిత్తము కూడా శీఘ్రంగా ప్రకటితమౌతోంది.

నాడీ మార్గ రంధ్రముల గుండా ప్రాణములు చలించకపోతే అప్పుడు ద్రష్టకు ఇంద్రియములు బాహ్యానుభవమే ఉండేది కాదు. కనుక ప్రాణస్పందమే చిత్తము ద్వారా 'జగత్తు' అను పేరిట ప్రసిద్ధి కెక్కుచున్నది. ప్రాణ స్పందము ద్రష్ట యొక్క ప్రభావమే అయి ఉన్నది.

అంతటికీ కారణం? ఆత్మయే తన స్వరూపముగాగల ద్రష్టయే. కనుక ద్రష్టయే ప్రాణస్వరూపుడై తన చిత్తము ద్వారా ఈ జగత్తును గాంచుచున్నాడు.

**జగత్ ప్రళయం -** ప్రాణ స్పందము యొక్క ఉపశమనము జరిగినప్పుడు చైతన్యము యొక్క నిష్క్రియరూపమగు ప్రశాంత స్థితి ఏర్పడి ఉంటోంది. దానిని వేదజ్ఞులు 'జగత్ప్రళయం'గా వర్ణించి చెప్పుచున్నారు.

**జగత్ సృష్టి -** నిష్క్రియమగు చైతన్యము ఒకప్పుడు ప్రాణ స్పందమును ఆశ్రయిస్తోంది. అప్పుడు నిశ్చలంగా ఉన్న బంతి నెట్టబడుటచే చలనము పొందుచున్నట్లుగా, చిత్తమున వృత్తులు విజృంభిస్తున్నాయి. అట్టి వృత్తిజ్ఞానం దేహములందు స్ఫురిస్తోంది. అదియే 'జగత్ సృష్టి' అని వేదజ్ఞులచే పిలువబడుతోంది.

ఈ విధంగా జగత్ సృష్టి, జగత్ ప్రళయమనేవి ఆత్మ స్వరూపుడగు ఈ దేహి, లేక, ప్రాణి యొక్క స్పందనకు సంబంధించినవే గాని, పంచభూత సమ్మేళనములగు ఈ ఎదురుగా కనబడే వస్తుజాలముల ఉత్పత్తి, వినాశనములకు సంబంధించినది కాదని సూక్ష్మదృష్టితో గ్రహించు.

అతి సూక్ష్మమగు గంధము (Smell) సర్వత్రా వ్యాపించి ఉన్న వాయువుచే సంచలనము పొంది నలువైపులా ప్రసరిస్తోంది చూచావా? సర్వత్రా వ్యాపించియున్న సంవిత్తు ప్రాణముల చలనముచే ప్రబోధితమై దేహములందు ప్రతిబింబిస్తోంది.

**శ్రీరాముడు :** తన స్వరూపమేమిటో ఏమరచిన ఈ జీవుడు చిత్తవృత్తులను ఆశ్రయించి, ఈ జగత్తును పొందుచూ, చమత్కారంగా క్షోభను పొందుచున్నాడు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అందుచేత, చిత్తవృత్తిని నిరోధించటంచేత ఈ జీవునకు పరమ శ్రేయస్సు లభించగలదు. ప్రాణాయామాదుల అభ్యాసంచేత ప్రాణ స్పందనమును నియమించినప్పుడు ఈ జీవునకు క్షోభ తొలగగలదు.

**చిత్తవృతి, చిత్తమౌనము -** చిత్తవృత్తి ఉదయించిన వెంటనే బాహ్యవిషయములందు అనురాగం జనిస్తోంది. ఇక ఆపై అది దేహములను కల్పించుకొని బాహ్యవిషయ భోగములవైపు ఆసక్తిగా వెడలుచున్నది. అందుకు ఫలితమేమిటి? అది అనంత దుఃఖములను తెచ్చిపెట్టుకుంటోంది. చిత్తమే చిత్తమునకు వృత్తుల రూపమున బంధమౌతోంది.

అట్టి చిత్తము బాహ్యవిషయములందు 'మౌనము' వహించి అభ్యంతరస్థమైనట్టి ఆత్మజ్ఞానవిషయంలో మేల్కొనినదనుకో... అప్పుడేమౌతుంది? అప్పుడాద్రష్ట, లేక, జీవుడు పొందతగిన విమల పదమును పొందినట్లే.

అందుచేత ఓ సభికులారా! ప్రాణచలనం కారణంగా ఉత్తేజమగుచున్న వాసనల రూపమున ఏర్పడుచున్న అజ్ఞాన చిత్తము వృద్ధికాకుండా చూచుకోవటం ఎట్లాగో కొంచెం యోచించండి. అప్పుడు మాత్రమే ఈ జన్మాది వికారములనుండి (నేను జన్మిస్తున్నాను మొ॥న భ్రమల నుండి) ముక్తులు కాగలుగుతారు. ఎందుకంటే, మలిన సంవిత్తు యొక్క వృద్ధిచే ఈ జీవులకు అనేక ఉపాధిపరంపరలు జనించి, నశిస్తున్నాయి. అజ్ఞాన చిత్తము యొక్క అనర్థజాలములచే ఈ ప్రపంచమంతా వ్యాప్తమై ఉంటోంది.

ఈ తీరునంతా గ్రహించిన యోగులు ప్రాణాయామముచేతనూ, ధ్యానము చేతనూ, శాస్త్రములచే అందింపబడుచున్న తదితర సాధనములచేతనూ, సద్గురువులచే ప్రసాదింపబడిన ఆయా విధి, విధానములతో కూడిన యుక్తుల చేతనూ, సర్వే-సర్వత్రా స్వస్వరూపాత్మ విన్యాసంగా సందర్శించుట చేతనూ, ఈ చిత్తమును విషయములనుండి ఉపశమింపజేయుటకు యత్నములు చేస్తున్నారు.

చిత్తనిరోధం కొరకు ప్రాణ ప్రసరణముల ప్రాణాయామపరాయణులు నిరోధం అభ్యసిస్తూ ఉంటారు. ప్రాణనిరోధం, చిత్తశాంతిని కలిగించగలదు. అది స్వస్థతకు, సమత్వమునకు, సుఖ స్వస్వరూపానుభవమునకు సహకరిస్తోంది.

❖❖❖

# 4. అభావన ద్వారా అమనస్కం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు అడిగిన చిత్తబీజము విషయమై సమాధానంగా జ్ఞానులచే ప్రవచించబడిన మరికొన్ని విషయాలు ప్రస్తావిస్తాను. నేనిప్పుడు చెప్పే విశేషాలు జీవునకు స్వయంగా అనుభూతం కాగల విషయాలే!

❖

ఈ జీవుడు అనేక జన్మల అభ్యాసవశంచేత ఈ దేహమును 'ఇది నేను... ఇది నాది' అను సంస్కారముతో గాంచుచున్నాడు. అట్లా దర్శించేటప్పుడు – "ఈ దేహమునకు ముందు ఏమైయున్నది? ఈ దేహానంతరం ఉన్న విశేషమేమిటి? ఈ దేహముకంటే విలక్షణమై నాకు సంబంధించి ఏర్పడి ఉన్నదేది" అను పరిశీలనాత్మక దృష్టిని కోల్పోవుచున్నాడు. అనగా...

ఆతడు పూర్వా పరములను వదలి, వర్తమానము నందు ఈ దేహముచే అనుభవమయ్యే విషయములందు మాత్రమే పరిశీలన భావనలను కలిగి ఉంటున్నాడు. అట్టి పరిమిత, సంకుచిత దృష్టినే 'వాసన' అని అంటారు. కొన్ని పరిమిత భావనలను స్వీకరించి అభ్యాసవశంగా ఈ దేహాదులు జీవుడు పొందుచున్నాడు. అంటే, ఆతడు ఎట్టి పరిమిత భావనలను ఆశ్రయిస్తున్నాడో, అట్టి ఆకృతినే పొంది, ఆ పరిమిత భావనలందు తనను తాను ఏర్పరచుకొనుచున్నాడు. అట్లు ఏర్పరచుకొను అభ్యాసమే సంసారమునకు బీజము. అట్టి పరిమిత ఆకృతి ఆశ్రయించి ఉన్నప్పుడు ఆయా వాసనలకు వశీభూతుడై పూర్వాపరములను ఏమరుచుచున్నాడు. తన పరిమిత భావములకు కనబడుదానిని 'ఇదియే సద్వస్తువు' అని తలచుచూ, వివశుడై ఆ సమయంలో తనయొక్క వాస్తవ స్వరూపమును గాంచటం (లేక మననం చేయటం) మానివేస్తున్నాడు. ఇదియే "స్వస్వరూపం నుండి చ్యుతి పొందటం" అని అంటారు. కడుపు నిండా కల్లు త్రాగినవానికి ఈ ఎదురుగా ఉండే పదార్థాలన్నీ మరొకవిధంగా ఆ మత్తులో కనిపిస్తాయి చూచావా? వాసనలందు సంస్థాపితమైన జీవునకు ఈ జగత్తంతా అభినివేశ మయంగా కనిపిస్తోంది. విషం మ్రింగినవాడు ఆ విషమునకు వశీభూతుడై పిచ్చికేకలు వేస్తున్నట్లు, అంతఃకరణంలో ఏర్పడిన వాసనలచే అజ్ఞానయుతుడైన జీవుడు సకల మానసిక వ్యధలచే బాధింప బడుచున్నాడు. విషయములే విషములుగా ప్రాప్తిస్తున్నాయి.

ఎద్దానితో అయితే... ఈ జీవునకు అనాత్మయందు – ఆత్మబుద్ధి; అవస్తువగు దేహాదులందు – వస్తుబుద్ధి ...అనే మిథ్యా జ్ఞానం కలుగుతోందో దానినే 'చిత్తము' అని పిలుస్తున్నాం. అనగా దృఢమైన అభ్యాసం కారణంగా ఈ పదార్థములతో అభేదవాసన పుట్టుకొస్తోంది. అందులోంచే అతి చపలమైన చిత్తము బహిర్గతమౌతోంది. ఆ చిత్తము జీవునకు జన్మ – జరా – మృత్యువులతో కూడిన ఈ ఉపాధి, ఆకార వికారములను సంతరింపజేస్తోంది.

ఎప్పుడైతే జీవుడు 'త్యజించటం – గ్రహించటం' అనే బుద్ధిని అవలంబించక, వాసనారహితుడై ఉంటాడో – అప్పుడిక ఆతని యందు చిత్తమనేదే జనించదు. ఆతడు "భావించకపోవటం, అభావన" అభ్యసిస్తాడనుకో... అప్పుడు ఆతనిలో పదార్థములకు సంబంధించిన మననం సన్నగిల్లుతుంది. ఇక లేశమైనా మననం శేషించనప్పుడు 'అమనస్కం' ఉదయిస్తుంది. ఆకాశంలో కమలం ఉదయించ నట్లు అమనస్కస్థితిలో చైతన్యమునందు చిత్తమే ఉదయించదు.

రాగవశం చేత వస్తువును చూచి "ఇది వాస్తవము" అని అనుకుంటూ ఉండటమే చిత్తము. నాఉద్దేశంలో చిత్తమునకు మరింకే రూపమూ లేదు.

**ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ ।**
**యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ ॥** (శ్లో 40, సర్గ 91)

"వాస్తవము, శాశ్వతము అగు దృష్టితో చూస్తే ఇక్కడి పదార్థాలేవీ భావావేశముచే సమర్థించుటకు యోగ్యమే కాదు" – అను భావన (లేక) అవగాహనకు వచ్చిన జీవుని స్వరూపం నిర్మలాకాశంలాగా స్వచ్ఛమై ఉంటుంది. ఇక అందు చిత్తోదయం ఎట్లా అవుతుంది?

కాబట్టి రామా! నీవు 'బాహ్యవస్తువిస్మరణ' రూపమగు 'నిరోధయోగము' ను అవలంబించు. అప్పుడు సర్వ దృశ్యమార్జవం (Washing off) లేక దృశ్యరహితత్వం ఏర్పడగలదు. ఈ దేహము పొందినందుకుగాను అంతకు మించిన ప్రయోజనం మరింకేదీ ఉండదు. అభావసంపాదకమైనట్టి అచిత్తత్వమే ఆత్మవస్తు దర్శనం కూడా.

❖

అంతఃకరణముచే సర్వమూ త్యజించబడగా అప్పుడు శేషించి ఉండే శీతలాశయవర్తియగు వాసనారహిత చిత్తము ఒకవేళ ఈ ప్రపంచంలో వర్తించవలసిన వచ్చినప్పటికీ దానికి సంసార దోషం అంటదు. ఉడకబెట్టిన చిక్కుడు విత్తనంలాగా అది ఆకారం కలిగియున్నప్పటికీ అచిత్తత్వముతో సరిసమానమే అవుతుంది. వాసనావశంచేతనే విషయములు ధ్యానింపబడుచున్నాయి.

దృశ్యమునందు ఏమాత్రం ఆలాపన, అనురాగములు లేనివాని చిత్తం అచిత్తత్వ దశ పొందినట్లే. అదియే ఉపశమనము. అదియే సత్వము.

ఘన వాసనలు మరల మరల జనన మరణములకు కారణములు అగుచున్నాయి. వాసనా రహితుడగు జీవన్ముక్తుడు ఈ ప్రపంచ కార్యములు నిర్వర్తిస్తూ ఉన్నప్పటికీ, సదా సత్వమునందే సుస్థిరుడై ఉంటాడు. ఈ ప్రపంచంలో రాగరహితులైనట్టి, పునర్జన్మాంకురము లేనట్టి జీవన్ముక్తులు ఎందరో యథావిధిగా సంచరిస్తూ ఉన్నారు. వారు జ్ఞాన సంపన్నులై, సత్యరూపులై ఈ దేహానంతరం చిదాకాశ స్వరూపం సంతరించుకొనుటకు అర్హులై ఉంటున్నారు. వారంతా చిత్తరహితులని, అమనస్కులని మనం తప్పక గ్రహించవచ్చు.

❖❖❖

## 5. తెలియబడేదంతా ఉన్నది తెలుసుకుంటున్నవానియందే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** బీజం మొలకెత్తాలంటే నేల, నీరు రెండూ కావాలిగా!

**ద్వే బీజే రామ చిత్తస్య ప్రాణస్పన్దనవాసనే ।**
**ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥** (శ్లో 48, సర్గ 91)

చిత్తబీజమునకు కూడా రూపం దిద్దుకోవాలంటే –ప్రాణ స్పందనము, వాసన – అనే రెండు ఉండాలి. ఈ రెండిటిలో ఒకటి శమిస్తే రెండవది తనంతట తానే శమిస్తుంది.

నువ్వులలో నూనె దాగి ఉన్నట్లు, వాసనలలోనే భావిపునర్జన్మ పరంపరలన్నీ దాగి ఉన్నాయి. బీజం–వృక్షంలాగా వాసనలవల్ల జన్మలు, జన్మల వల్ల ఇంకొన్ని వాసనలు ఏర్పడుచున్నాయి. ప్రాణం, వాసనలను సమన్వయపరుస్తూ చిత్తం తనకు తానే ఇంద్రియ సుఖదుఃఖానుభవాలు కల్పించుకుంటోంది.



చిత్తంలోంచి "ప్రాణములు, విషయానందం" ఉత్పన్నమౌతున్నాయి. వాటి నుండి మరల చిత్తము మరింత ప్రోద్బలమౌతోంది. అట్లాగే ప్రాణముచే వాసనాస్పందనము, వాసనాస్పందనముచే ప్రాణములు పరస్పరం ప్రవృద్ధం చేసుకుంటున్నాయి. వాసనలు ప్రాణస్పందనమును ఉద్బోధించటాన్ని 'సంవిత్ ప్రక్షోభము' అనే పేరుతో పిలుస్తూ ఉంటారు.

ప్రాణములు హృదయగుణములగు రాగద్వేషాదులను ప్రేరేపించుతూ ఉండటం తమ ధర్మంగా కలిగి ఉంటున్నాయి. సంవిత్తు రాగసహితమైనప్పుడు 'చిత్తము' అనే బాలకుడు పుట్టుకొస్తున్నాడు.

ఈ విధంగా ప్రాణ స్పందనము, వాసనలు – ఈ రెండూ కూడా చిత్త రూపమునకు కారణములై ఉంటున్నాయి.

**శ్రీరాముడు :** మహాప్రభో! చిత్తమే కదా, సర్వ వ్యాపకములకూ మూలం! మరి నిరోధించబడటమెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రాణ స్పందన, వాసనలలో ఒక్కదానిని నీవు నిరోధించగలిగితే రెండవది తనకు తానే పట్టుబడుతుంది.

చిత్తము 'మననము' అనే స్వభావం కలిగి ఉంటోంది. చిత్తమనే వృక్షమునకు కాచిన ఫలమే ఈ శరీరం కూడా. సర్వక్రియలూ చిత్తము చేతనే సంకల్పించబడుచున్నాయి. అది తనయందు తృష్ణ రాగము అనే దోషములను అంతరాంతరంలో పొందుపరచుకుని ఉన్నది. అదే అజ్ఞాన కార్యములకు సాధనములవంటివైన ఇంద్రియములకుకూడా మూలం. అట్టి చిత్తం నశిస్తే క్షణంలో వాసనలూ పోతాయి. ప్రాణ స్పందనా నిరోధించబడుతుంది.

సర్వదిక్కులను మలినపరుచుచున్నది ఈ చిత్తమే. అది సర్వప్రాణుల స్వస్వరూపమగు చిత్ రూపమును ఆవరించుకొని ఉంటోంది. అది ఎట్లా జనించింది? అజ్ఞానకారణం చేతనే! అది వ్యాప్తమై ఉండి, ఈ దేహమునందే నెలకొని ఉంటోంది. అత్యల్పవృత్తులచేకూడా సంక్షుభితమౌతోంది. అన్ని వైపులా కదులుతూ పిచ్చిగంతులు వేయటంలో దానికదే సాటి. ఎంత కాలం గడచిపోతున్నా... ఎన్ని ఉపాధులు మంటగలిసిపోతున్నా... అది తన అంతఃకరణసాక్షి, విషయరహిత స్థానము, ఉపాధిరహితము అగు బ్రహ్మప్రకాశమును గాంచదే?

అట్టి నిత్య సంచలనరూపమగు ఈ చిత్తం ప్రాణ స్పందనిరోధంచే క్షణంలో లయమొందగలదు.

**శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయములు -** ప్రాణస్పందన, వాసనలు... రెండిటికీ కూడా శబ్దస్పర్శాది విషయములు బీజమగుచున్నాయి. శబ్దస్పర్శాది విషయములు పొందవలెనని ఇచ్ఛ, అభినివేశము, పట్టుదల – జీవునియందు ఏర్పడగానే "నాయనా! బయలుదేరు! మేం అందుకు సాయపడతాం" అంటూ ఆ జంట (ప్రాణస్పందము–వాసనలు) ముందుకొస్తున్నది.

**శ్రీరాముడు :** స్వామీ! "ఇచ్ఛ, ప్రాణస్పందన, వాసనలు, చిత్తము, శబ్దస్పర్శాది విషయములు" – వీటిని మీరు ఉదహరిస్తూ... దీనికి అది బీజమని, దానికి ఇది బీజమని చెప్పుకొస్తున్నారు. ఏది బీజం? ఏది వృక్షం? ఏది ముందు? ఏది వెనుక? మీరు చెప్పే విషయాలలో అది నేను గుర్తించలేక పోతున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. ఈ సంవాదం అట్లా ఉన్నమాట నిజమే. అయితే విత్తు ముందా? చెట్టు ముందా? చెట్టులోంచి విత్తు వస్తోంది? విత్తులోంచి చెట్టు వస్తోందా? అక్కడ తేల్చిచెప్పగలదేమీ ఉండదు కదా! అయితే...

ఉపాయమేమిటో నేను సుస్పష్టపరచుచున్నాను కదా! ఇక సమాధానం ఉండని ప్రశ్నలతో గాభరాబడవలసిన పనేమున్నది?... శబ్దస్పర్శాది విషయములనుండి విరమించుటచే వాసనలు సన్నగిల్లుతాయి. ప్రాణస్పందం నిరోధించబడుతుంది.

అట్లాగే... ప్రాణనిరోధాభ్యాసంచే వాసనలు సన్నగిల్లుతాయి. శబ్దస్పర్శాది విషయముల ప్రకోపం శమిస్తుంది. క్రమంగా వాసనలు ఉపశమిస్తాయి. అప్పుడు చిత్తం అచిత్తమౌతుంది.

మరొక విషయం. "ఆత్మ, సంవితు, ద్రష్ట, శరీరి" అను పేర్లతో జీవుని స్వస్వరూపము పిలువబడుచున్నది అట్టి చైతన్యమే అన్నిటికీ స్థానమై ఉంటున్నది.

నువ్వులు లేకుండా నూనె లభిస్తుందా? సంవిత్తు (The Knower) యే లేకపోతే వృత్తి జ్ఞానం ఎవరికి? శబ్దాది విషయములకు అనుభవరూపమగు సంవేద్యము (Object being known) ఎట్లా ఏర్పడుతుంది?

పైగా... ఈ బాహ్య – అభ్యంతర విషయములన్నీ సంవిత్తుకంటే వేరైనవి అనుకుంటున్నావా?... కానేకాదు. సంవిత్తు స్వప్నమున స్ఫురించుచూ ఆ స్వప్నంలో పదార్థములను, ప్రదేశములను, స్వమరణమును కూడా గాంచుచున్నది చూచావా? (ఒక్కొక్కడు తాను చనిపోయినట్లు కూడా కల గంటాడు కదా!) అదే సంవిత్తు జాగ్రత్‌లో కూడా ప్రవేశించి అట్టి స్వసంకల్పవశం చేతనే పదార్థముల అనుభవమును గాంచుచున్నది. అంతే కాదు...

ఏ సంవిత్తైతే వివేకోదయం చేత స్వసంకల్పము ద్వారా పదార్థానుభవములన్నీ త్యజించి తనను తానే ఎరుగుచున్నదో... ఆ ఎరుక కూడా స్వప్న, జాగ్రత్‌లవలెనే స్వప్నతుల్యమేనని సూక్ష్మబుద్ధితో గ్రహించు. ఎందుకంటే అద్వితీయానుభవం దృష్ట్యా 'ఇది నేను, ఇది స్వరూపం' అనునవి మాత్రం ఎక్కడుంటాయి? కనుక కేవలానుభవస్థితిలో,

స్వప్న సంవిత్తు ఉండదు... జాగ్రత్ సంవిత్తు ఉండదు... సంవిత్ యొక్క సంవిత్తు ఉండదు... స్వసంకల్ప భ్రమచే పసిబాలుడికి గాలిలో భూతాలు కనిపిస్తున్నట్లు, సంవిత్తు యొక్క స్వవ్యసన, సంకల్ప భ్రమచే ఈ జగత్తు ఆ సంవిత్తుకు కనిపిస్తోంది. కనుక జగత్తు యొక్క అసలైన బీజం, స్థానం దీనిని ఎరుగుచున్నవానియందే ఉన్నదని గ్రహించు.

తెలియబడుచున్నదంతా తెలుసుకుంటున్నవానినుండే బయలుదేరి, ఆతనియందే ఏర్పడి ఉండి, మరొకప్పటికి ఆతనియందే ఉపశమిస్తోంది. సంసారము యొక్క, జగత్తు యొక్క "ఆదిబీజం" తెలుసుకుంటున్నవాడే.

❖❖❖

# 6. దృశ్య అదర్శనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** మసక చీకట్లో అంతదూరంగా నిలచియున్న ఒక పెద్ద శిలా స్థంభము భ్రమ కారణంగా ఒక పురుషుని రూపంగా అనుభవమౌతుంది చూచావా? అట్లాగే జీవునికి ఈ దృశ్యం ప్రాప్తిస్తోంది. అట్టి దృశ్యసందర్శనంలో పాల్గొనే వివిధ విశేషాలు ఈ విధంగా ఉంటాయి.

1. సంవిత్తు = The Knower or That Which is Knowing (Knower prior to knowing)
2. విషయసంవిత్తు = The Knower while engaged in material world.

(అట్లాగే స్వప్నసంవిత్తు, జాగ్రత్ సంవిత్తు, సుషుప్త సంవిత్తు కూడా)

3. సంవేద్యము = That Which is being Known
4. సంవేదనము = Knowing
5. ఆత్మ సంవిత్తు = Knower Which is engaged in knowing the Knower's Self. (one's own self)

సూర్యకిరణములు కిటికీలోంచి ప్రసరిస్తున్నప్పుడు అందు దండాకారంగా పరిభ్రమిస్తున్నట్లు త్రసరేణువులు అగుపిస్తాయి. నావలో పయనించేవానికి అచంచలమగు పర్వతములు, వృక్షములు వెనక్కు వెళ్ళిపోతున్నట్లు కనబడతాయి. చీకట్లో చూచిన త్రాడు పాములాగా భ్రమింపజేస్తుంది. కంటి దోషం చేత ఆకాశంలో రెండు చంద్రబింబాలు అగుపిస్తాయి. ఈ భ్రమలన్ని సరి అయిన దృష్టితో చూస్తే నశిస్తాయి.

అదేవిధంగా సంవిత్తే తెలియబడుచున్నదానివలె విషయరూపమున, దృశ్యరూపమున భాసిస్తోంది. అట్లా కనిపిస్తున్నదంతా సమ్యక్ దృష్టిచే నశించిపోతాయి. అనగా, దృశ్యము – దృశ్యవిషయములు అనబడే సంవేద్యమునకు సంబంధించిన మిథ్యా జ్ఞానమంతా సమ్యక్ జ్ఞానముచే నశించగలదు. సంవేద్యమంతా సంవిత్తుకు వేరైనది కాదు – అని మరొకసారి ప్రకటిస్తున్నాను.

❖

ఓ రామచంద్రా! ఈ కనబడే మూడు లోకములూ శుద్ధ సంవిత్ మాత్రమే అయి ఉన్నది. అంతకు వేరుగా సంవేద్యము (తెలియబడేది) అంటూ ఎక్కడా ఏదీ లేదు.

**సమ్యక్‌జ్ఞానం -** తెలియబడేవాని రూపమే తెలియబడుచున్న దానియందు స్ఫురిస్తోందనీ, ఆతనికి వేరుగా తెలియబడేదంటూ లేదను నిశ్చయం కలిగి ఉండటం.

అందుచేత రామా! నీవు సంసారమును జయించివేయాలనుకుంటే "ఇతఃపూర్వం గాంచినవి, ఇప్పుడు గాంచుచున్నవి, ఇకముందు గాంచాలని అనుకుంటున్నవి" – వాటినన్నిటినీ నీ చిత్తము నుండి తొలగించివేయాలి. అనగా, "ఇవన్నీ మిథ్యారూపమైనవే కదా!" అను ఎరుకను దృఢపరుచు కోవాలి. అట్లు తొలగించుకోనంతకాలం జీవునకు ఈ జన్మ, కర్మలతోటి సంబంధం ఎప్పటికీ తొలగదు.

శుద్ధవిభాగచిత్తము సహాయంతో మలిన విభాగచిత్తమును తొలగించుటయే మోక్షం.

దృశ్యము సత్యమని భావన చేయటమే అవిశ్రాంతమగు జననమరణ వ్యసనమునకు లేక సంసారమునకు నాంది, బీజమూనూ.

**చిదేకరసం -** విషయముల అదర్శనమును 'చిదేకరసం' అని కూడా అంటారు. అట్టి అదర్శనమునకు సంబంధించిన ప్రయత్నం జడరహితమగు ఆత్మస్వభావంగా పరిణతి చెందుతోంది. కనుక... నీవు 'విషయములను దర్శించుట' అనునది త్యజించివేయుము. విషయ రహిత, స్వయం ప్రబుద్ధమగు ఆత్మయే నీవై ఉన్నావు. కనక పూర్ణానంద స్వరూపుడవై నిశ్చింతగా ఉండుము.

ఓ సభికులారా! ఓ సర్వజనులారా! ఈ మన ప్రియ రామచంద్రునిలాగానే మీలో ప్రతి ఒక్కరూ శుద్ధాత్మ స్వరూపులేగాని, జడమగు ఈ దేహం కాదు. లేక, మరొక వెలుగుచే ప్రకాశింపబడే మనోబుద్ధి అహంకారాదులు కాదు. మీచే దర్శించబడేదంతా మీయొక్క స్వస్వరూప విలాసమే! (ప్రకరణయే! క్రీడయే! ఉల్లాసమే! కుతూహలమే!) ఈ విషయం ప్రపంచమునకు ఘంటాపదంగా ప్రకటించిన ఎందరో మహనీయుల చరిత్రలు మనం చెప్పుకున్నాం. ఇంకా నిర్వాణ ప్రకరణం చిట్టచివరివరకు వారి చరిత్రలు చెప్పుకోబోతున్నాం.

చిత్తమునకు కూడా అతీతులైనట్టి ఓ పరిశుద్ధాత్మ స్వరూపులారా! సర్వజనులారా! మీరంతా అంతటి మహత్తర స్వరూపులై ఉండగా, "అబ్బే! నేనొక సామాన్య జీవుడినండి! స్వల్పుడను. ఆ భగవంతుడు ఎక్కడో చొరరాని చోట ఉన్నాడు. నావంటి స్వల్పునకు అది చాలా కష్టం. ఇక ఎప్పటికో ఏదో చేసి ఆ చోటికి వెళ్ళాలి..." మొదలైన రూపంగల అల్ప, మూర్ఖ భావాలలో కునుకులు తీస్తూ రోజులు గడపవలసిన పనేమున్నది? ఒద్దు. ఇక నిదుర లేవండి. జాడ్యం వదలండి.

"మీ వాస్తవ స్వరూపతత్త్వమేమిటో గ్రహించండి" అని వేడుకుంటున్నాను.

కాబట్టి రామా! నీవు ఈ దృశ్యమును అంతరంగమునందు త్యజించినవాడవై పూర్ణ "బ్రహ్మానంద" రూపముగా శేషించి ఉండుము. అట్లు పరిగ్రహించుచు, ఆపై యథావిధిగా ఈ భూప్రదేశంపై విహరించుచూ దీనిని పవిత్రము చేయి.

❖❖❖

# 7. అజడం - జడం

**శ్రీరాముడు :** ప్రభూ! మా స్వస్వరూపము యొక్క పూర్ణత్వమును చేయి ఎత్తి చూపుచున్న సద్గురు ప్రవచనములకు సాష్టాంగదండ ప్రణామములు సమర్పిస్తున్నాను. మన ఈ ప్రస్తుత విచారణ యొక్క నిస్సంశయము కొరకై ఒక చిన్న ప్రశ్న మీ ముందుంచుచున్నాను.

జడత్వం త్యజించినప్పుడు శుద్ధ జ్ఞానస్వరూపం శేషిస్తుంది కదా! అట్లాగే, శుద్ధ జ్ఞానమును ఏమరచినప్పుడు జడప్రాయములగు ఈ దేహాదులు, వాటి అనుభవములు సంక్రమిస్తున్నాయి.

కనుక ఒక జీవుడు ఈ జడశరీరమును ఇట్లే కలిగియుండగా 'శుద్ధ సంవేద్యము'గా, లేక చైతన్య స్వరూపంగా శేషించటం ఎట్లా కుదురుతుంది? శరీరం ఉన్నంతవరకు జడత్వం ఉంటుంది కనుక శరీరం ఉన్నంతకాలం శుద్ధాత్మతత్త్వానుభవం కష్టసాధ్యమేమోనని అనిపిస్తోంది. ఎందుకంటే

జడము – అజడము ఒకేసారి, ఒకే చోట ఏర్పడజాలవుకదా! వెలుగు – చీకటి ఒకేసారి ఒకే చోట ఏర్పడి ఉండజాలవు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంవిత్తు, విషయ సంవిత్తుగా, ఆత్మ సంవిత్తుగా రెండు రూపములను దాల్చుచున్నది.

బాహ్యపదార్థములను సత్యమని నమ్మటమే 'విషయ – సంవిత్తు' అనబడుతోంది. అయితే, జీవన్ముక్తునికి మాత్రం ఈ భూత–భవిష్యత్–వర్తమానములందు ఎచ్చటా 'ఇది సత్యమే' అను రూపంలో ఉండే సత్యత్వబుద్ధి ఉండదు. అనగా, అతడు తన అంతరంగ ప్రదేశంలో విషయసంవేదరహితుడై కాష్ఠశిలాదుల వలె (కొయ్య – రాయిలాగా) ఉంటాడు. స్వయంప్రకాశకుడై జడత్వరహితుడై ఉంటాడు. తాను సర్వ విషయములకు అర్థము(Meaning)ను ప్రసాదిస్తూ, సర్వ అర్థములకు అతీతమైన స్థానము నందు సంస్థితుడై ఉంటాడు.

'పదార్థములు అసత్యము' అని ఎరుగుటయే 'శుద్ధసంవిత్తు' అని అంటున్నాం కదా! విషయ సంవిత్తుకు అతీతుడై, శుద్ధ సంవిత్తుని ఆశ్రయించినప్పటికీ, సర్వకార్యములు నిర్వర్తిస్తున్నప్పటికీ ఆతడు ఏ విషయములచే పరిమితుడు గాని, విషయములకు ప్రమేయుడు గాని కాదు. విషయము లందు అసత్య బుద్ధి కలిగి ఉండి ఎవని చిత్తము ఈ విషయములందు లేశమైనా తగుల్కొనదో… ఆతడు 'విషయరహితుడు – అజుడు – జీవన్ముక్తుడు' కూడా అవుతాడు.

బుద్ధిమంతుడగు ఉత్తమజ్ఞాని తన చిత్తమును మొదలంట్ల వాసనారహితం చేసుకునేందుకే సర్వప్రయత్నములు చేస్తాడు. క్రమంగా ఆత్మయందు సర్వ పదార్థ భావనలూ మొదలంటా తొలగించి వేస్తాడు. పసిబాలుడు 'అన్నీ నావే' అన్న భావనలో ఉంటున్నట్లు అతడు 'అంతయునాదే, అన్నీ నేనే' అన్న పరమజ్ఞానభావన కలిగి యుంటాడు. అదే సమయంలో 'అనాది, అసంగము' తో కూడిన అవగాహన సంపాదించుకుని ఉంటాడు. విజ్ఞానదృష్టిచే అంతా తెలిసి, ఏమీ చెప్పజాలక మూగవాని వలె తదితర జీవులతో కలిసి ఉంటాడు. ప్రజ్ఞాస్వరూపుడు, శుద్ధ జ్ఞాని, బుద్ధిమంతుడు అయిన ఆ మహాత్ముడు జడత్వరహితము, వ్యాపకము, స్వచ్ఛము – అగు స్థానంలో తనను తాను ప్రతిక్షేపించు కుంటాడు. కనుక విషయములను పొందుతాడేమోగాని, వాటి యందు తగుల్కొనడు. దేహము ఉండీ దేహము లేనివాడై ఉంటాడు. సుఖ–దుఃఖములను గాంచవచ్చునేమోగాని, తన అపరిమిత త్వమును వీడడు. ఆకాశములో అనంతత్వము ఏర్పడి ఉంటుంది చూచావా! సర్వవాసనలూ త్యజించిన వానికి స్వభావసిద్ధమగు అనంతానందము ఏర్పడియే ఉంటుంది. చిత్తరహితులగు అనేకమంది యోగులు ఆ పరమానంద స్వరూపమునందే సంస్థితి కలిగి ఉంటున్నారు. అద్దానియందే ప్రవృత్తులై, తన్మయులై ఉంటున్నారు. వారి సర్వ సంవేదములు (All their Perceptions) బ్రహ్మాకారము, బ్రహ్మ ప్రకాశముల మధ్య విలీనమైపోతున్నాయి. ఓ రామచంద్రా! ఎవ్వడైతే తాను నడుస్తున్నప్పుడు, కూర్చుని ఉన్నప్పుడు, చూస్తున్నప్పుడు, ఈ దృశ్యసంవేదమునకు సంబంధించిన వృత్తి జ్ఞానం త్యజించివేస్తాడో… అట్టివాడు ఈ శరీరం ఉన్నప్పుడు, దీనిని ఉపయోగిస్తున్నప్పుడు, ఇది లేనప్పుడు కూడా సుఖవంతుడై, అజడుడై, పరమానంద స్వరూపుడై ఉంటాడయ్యా!

అపారగుణ సాగరా! రఘురామా! నీవు కూడా అట్టి దృష్టినే అభ్యాసంచే అవలంబించు. కొంచెం శ్రమతో కూడియున్నప్పటికీ ప్రాణాయామాది సాధనలచే ఈ సంసార దుఃఖ సాగరమును దాటివేయి. ఒక చిన్న బీజంనుండి ఆవిర్భవించి మఱ్ఱివృక్షం విశాల ఆకాశాన్ని ఆక్రమించి ఉంటోంది చూచావా! 'స్వసంకల్పము' అనే చిన్న చోటు నుండి ఆవిర్భవించిన ఈ విషయ ప్రపంచము స్వతఃగా మిథ్యయే అయి ఉండి కూడా సువిశాలమగు ఆత్మాకాశాన్ని ఆక్రమించి ఉంటోంది. సంవిత్తు 'మరల మరల సంకల్పించుట' అను గుణమును ఆశ్రయించి, అందుకు ఫలితంగా జన్మ సమూహముల బీజమును తనకు తాను సృష్టించుకుంటోంది.

**జనయిత్వాత్మన్ ఆత్మానమ్, మోహయిత్వా పునఃపునః ।**
**స్వయం మోక్షం నయత్యన్తః సంవిత్స్వం విద్ధి రాఘవ ॥**

ఓ రాఘవా! సంవిత్తును మరింకొకరెవరూ జనింపజేయుట లేదు. అది తనను తానే జనింపజేసుకుంటోంది. మోహింపజేసుకుంటోంది. మరొకప్పుడు హృదయస్థమగు ఆత్మతత్త్వమును గాంచుటచే స్వయంగా తనకు తానే ముక్తిని ప్రసాదించుకొనుచున్నది. అది ఎప్పుడు ఎట్లా భావిస్తే, ఆ క్షణంలో అట్లే అగుచున్నది. అది ఎంతకాలం రాగాదులు కలిగి ఉంటుందో – అంతకాలం తన చిద్రూపమును పొందక, వస్తుతత్వమునందే నిమగ్నమై ఉంటోంది.

ఈ మనకు కనిపించే దేవ, మానవ, అసుర, యక్ష, రాక్షస, కిన్నర, కింపురుష – జీవుల రూపములన్నీ కల్పిత రూపములేగాని, వాస్తవరూపములుగావు. ఆత్మయే అనాదిసిద్ధమై ఉన్న మాయతో కూడుకున్నదై ఈ విధంగా జగన్నాటకమంతా ఆడుచున్నది. పట్టుపురుగు తనలోంచి ఉత్పన్నమయ్యే పట్టుదారంచే కట్టుబడి చిక్కిఉంటుంది చూచావా? సంవిత్తు తననుండి బయల్వెడలిన విషయముల పట్ల గల ఉత్సుకతచే బంధింపబడి, దుఃఖించుచు... మరల చిరకాలమునకు స్వయముగా కేవలత్వము స్వీకరిస్తోంది. 'జగత్తులు' అనే సముద్రమునకు సంవిత్తే జలరూపమై 'కుతూహలం' అను స్వభావంతో అంతటా వ్యాపించి ఉంటోంది. ఈ దిక్కుల రూపంలోను, ఆ పర్వతముల రూపంలోనూ స్ఫురించేది అదే. ఈ ఆకాశం, భూమి, వాయువు, నదులు, దేహములు – ఇవన్నీ సంవిత్ సముద్రములోని అనేక ఆకారములతో కూడిన తరంగములవంటివి మాత్రమే!

❖❖❖

# 8. వేరు వేరు ఉపాయాలు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ ప్రపంచమంతా సంవిన్మాత్రమే! ఇక్కడ రెండవ వేరైన కల్పనయే లేదు. కల్పన చేయుచున్నవాడే కల్పితమైన సర్వముగా ఆవిర్భవిస్తున్నాడని గ్రహించు. అదియే బ్రహ్మజ్ఞానం. అట్టి సత్య జ్ఞానముచే సంవిత్తు అద్వైత బ్రహ్మరూపము పొందుతోంది. అనగా తనయొక్క సర్వ న్యూనాధికములనూ త్యజించి స్వాత్మయందు స్థిరత్వం పొందుతోంది. ఇంక అది దేనియందు తగుల్కొనక సర్వస్థితులందూ స్వస్వరూపముయొక్క సమ్యక్‌జ్ఞానం కలిగి ఉంటుంది.

**శ్రీరాముడు :** సంవిత్తు నుండి 'సన్మాత్రము' అనే బీజం ఎలా వెల్లివిరిసి ఏర్పడి ఉంటోందో వివరించ ప్రార్థన!

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంవిత్తు, లేక, బ్రహ్మము నుండే ప్రతిబింబ సంవిత్తు జలంలోంచి తరంగంలాగా ఆవిర్భవిస్తోంది. సూర్యుని నుండి కిరణంలాగా ప్రకటితమయ్యే అట్టి సంవిత్తు రెండు రూపములు కలిగి ఉంటోంది.

1. పలువిధ ఆకారములుగల సంవిత్తు విభాగం – జలంలోని అనేక తరంగాలులాగా!
2. ఏకమగు సన్మాత్ర విభాగం – అనేక తరంగములలోని ఏకైక జలంలాగా!

ఈ నీవు, నేను, కొండలు, కుండ, వస్త్రం – ఇవన్నీ 'సత్త' యొక్క వివిధ రూపములు మాత్రమే. నీవిక ఈ సర్వవిధ విభాగములూ త్యజించి సర్వదా సర్వుల స్వరూపం అయినట్టి ఏకమాత్రసత్తను ఆశ్రయించు. అదియే ఈ చరాచర సర్వజగత్తుకు అధిష్ఠానమైయున్నది. సర్వ విశేషములు త్యజించబడగా... అప్పుడు సర్వత్రా వ్యాపించి ఉన్నట్టి నిర్లిప్తమగు ఆ 'సన్మాత్ర సత్త' యొక్క ఏకమగు మహద్రూపం అనుభవం కాగలదు. అదియే బ్రహ్మపదము సుమా!

**శ్రీరాముడు :** అరూపమగు ఆత్మయందు రూపసహితమగు ఈ జగత్తు ఎలా ఏర్పడి ఉంటోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కుండకు ఆకారం ఉన్నది. దాని మూల పదార్థమగు మట్టికి ఆకారం ఉన్నదా? లేదే! వస్త్రం యొక్క స్వభావము గాని, స్వరూపముగాని దూదిలో కనబడుతోందా? లేదు. అయితే, వస్త్రమంతా తయారయినది దూదితోనే కదా! సన్మాత్రము ప్రకటితమగుచున్నప్పటికీ, అద్దానియందు 'నేను – నీవు' అనునవేవీ లేవు.

**శ్రీరాముడు :** మరి 'కాలము' మాట ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కాలసత్త కూడా వస్తుసత్తలాగానే ప్రమేయస్వభావముచే కల్పనా పూర్వకమై ఏర్పడి ఉంటోంది. ఆత్మసత్త అప్రమేయమై అవిభక్త రూపమున ఏర్పడి ఉంటూనే వస్తుప్రమేయముచే కాలబద్ధముగా, విభక్తరూపమున కన్పట్టుచున్నది. విభాగము లేనిచోట విభాగము భ్రమచే అనుభవ మగుచున్నదని గ్రహించు.

కనుక రామా! "ఈ దృశ్యమంతా ఏకైక సత్తాయే" అను భావన చేయి. "సర్వ దృశ్యవస్తువులందూ ఏర్పడి ఉన్నది ఆ ఏకైక సత్తయే" అను దృష్టిని బలపరచుకో. అట్టి భావనచే సర్వదిశలను, ఆ దిశ లందుగల సర్వ పదార్థములనూ పరిపూర్ణమొనర్చుము. నీయొక్క సత్తయే నీయందును, నీచేగాంచబడే దృశ్యమునందును వెలుగొందుచున్నదయ్యా! సూర్యుని నుండి అనంత కిరణములు బయలుదేరి అసంఖ్యాక వస్తువులను ప్రకాశింపజేయుచున్నట్లు ఏకైక సత్త ఈ సర్వ శరీరములను, చిత్తములను, తదితర అసంఖ్యాకవస్తు సమన్వితమగు జగత్తును ఎరుకచే ప్రకాశింపజేయుచున్నది.

"ధర్మము – ధర్మిష్టి, సత్ – అద్దాని విషయములు" లయమొందినపుడు, అప్పటికి ఇంకా శేషించియుండేది ఆ ఏకైక సత్తయే. అద్దానియందు ఉపాధులు మొదలైనవి ఉండకపోయినప్పటికీ భూత, భవిష్యత్తులలో ఏర్పడే సర్వ జీవులు అదే!

❖

నిర్వికారమగు అట్టి ఆత్మపదమున స్థిరపడినవాడు అరుచికరమగు ఈ సంసారమునకు తిరిగిరాడు. అదియే 'మోక్షసాధన' అని, 'పురుషోత్తమ ప్రాప్తి' అని చెప్పబడుతోంది.

అట్టి పదమే సర్వకారణములకు కారణమైయున్నది. ఇక దానికి మరో కారణమైనదేదీ ఉండదు. కారణములకు కారణం, సారమునకు సారమగు ఆ శుద్ధ పరబ్రహ్మమే ఈ జీవుని స్వరూపమై ఉండగా... ఈతడు అజ్ఞానదృష్టిచే భేదకల్పనను ఆశ్రయించి "నేను నిస్సారుడను, నిస్సహాయుడను, అల్పమేధస్కుడను"... అని వాపోవుచున్నాడు. దానికంతటికీ కారణం స్వస్వరూపాన్ని ఏమరచి దృశ్యవిషయములందు తాదాత్మ్యమొందటమే సుమా! ఈ జీవుడు జ్ఞానాన్ని పెంపొందించుకో నంతకాలం, అప్రమేయమగు తన బ్రాహ్మీస్వరూపమును ఎరిగి ప్రశాంతుడవనంతకాలం ఈ జన్మ – కర్మల ప్రహసనం తప్పేది కాదు. "నేను భేదాభేదములకు అతీతుడను. ఆద్యంతములు లేనట్టి నేను ఈ జన్మ – జీవన – మృత్యువుల వంటి అల్ప సంఘటనలచే ఎట్లా పరిమితుడనౌతాను?" – అని ఈ జీవుడు గ్రహించుగాక! అట్టి సదవగాహనకు ఉపకరించటానికే ఆత్మజ్ఞులైనవారిచే ఈ యోగావాసిష్ఠాది శాస్త్ర ప్రవచనములు జీవునకు అందించబడుచున్నాయి.

తత్త్వమెరిగిన తరువాత రామా, ఇక నీకు బంధమేమిటి? మోక్షమేమిటి? మేఘములు ఆకాశంలో ప్రయాణిస్తున్నంత మాత్రం చేత ఆకాశముయొక్క అనంతత్వానికి వచ్చే లోటేమిటి? కించిత్ అజ్ఞానం వచ్చి ఒకానొక సమయంలో ఆవరించి యున్నంతమాత్రం చేత ఈ జీవుని అనంతత్వానికి వచ్చే లోటేమీ ఉండదు – అని సర్వజనులు గ్రహించండి. నిశ్చింతులై ఉండండి.

ఒడ్డున ఉన్న చెట్లు తటాకంలో ప్రతిబింబిస్తున్నట్లు నిర్లిప్తము, అసంగము అగు ఆత్మ యందు ఈ జగత్తు ప్రతిబింబిస్తోంది. ఈ పదార్థములన్నీ తమ యందు ప్రత్యక్ చైతన్యము అంతస్థమై ఉండుట చేతనే ప్రీతివంతమౌతున్నాయి. నాలుకకు రుచులు వ్యక్తమగుచున్నట్లు ఆ ఆత్మసముద్రము నందే సర్వానందములు వ్యక్తమగుచున్నాయి. ఈ విషయములో ఇవి స్వయంగా స్వాదురహితం (Tastless) అయినప్పటికీ, అవి ఆత్మ సంయోగముచేతనే స్వాదుత్వం పొందుచున్నాయి. ప్రియమైన వాటన్నిటి కంటే ప్రియాతిప్రియమైనది ఆత్మవస్తువే.

ఆనందమయమగు ఆ పరమాత్మ నుండే సమస్త బ్రహ్మాండ సమూహములన్నీ ఉత్పన్నము లగుచున్నాయి. అవన్నీ వానియందే స్థితికలిగి ఉంటున్నాయి. ఆ పరమాత్మ తత్వము... గురుతరమైన వాటన్నిటికంటే గురుతరమైనది.

సూక్ష్మతరమైన వాటన్నిటి కంటే సూక్ష్మాతిసూక్ష్మమైనది. స్థూలములైన వాటన్నిటి కంటే అత్యంత స్థూలమైనది. సమీపమైనవాటన్నిటి కంటే సమీపమైనది. జ్యేష్ఠతరములైన వాటన్నిటి కంటే జ్యేష్ఠతరమైనది.

ఆ పరమాత్మ స్థానం సర్వప్రయత్నములకు ఆత్యంతికమైనది. అక్కడ సర్వ శ్రమలు రహిత మౌతాయి. కనుక అన్నిటికంటే సులభమైనది అదే! అదియే తేజమును తేజము. అంధకారములన్నిటి కంటే అంధకారం అదే! దిక్కులన్నిటికీ దిక్కు అది. అది లోకములకు సంబంధించినది కాదు. కాని

లోకంలోని సర్వ విషయాలు అదే! భావా భావముల, దృశ్యా దృశ్యముల, చైతన్య అహంకారముల రూపంగా ప్రకాశించేదంతా అదే.

ఓ శుద్ధాంతర్గత స్వరూపుడా! రామచంద్రా! ఏఏ ఉపాయములచే నీవు పరమ పవిత్రమగు ఆ ఆత్మపదమునందు స్థితి పొంది ఉండగలవో, సర్వ ప్రయత్నములచేతనూ అవి ఆచరించు.

**శ్రీరాముడు :** అందుకు వేరు వేరు ఉపాయములు ఉన్నాయి కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. యోగ, జ్ఞానాది వేరు వేరు ఉపాయాలు ఉన్నాయి. అయితే ఓ సర్వ జనులారా! వేరు వేరు ఉపాయములు ఉన్నంత మాత్రంచేత "వారు వేరు.. మేము వేరు" – అను భ్రమలను ఆహ్వానించి, తత్ఫలితంగా ఆత్మ వస్తువును పోగొట్టుకొనకుండెదరు గాక! "ఆ ఆత్మ పదము అతి పవిత్రము, భేదాభేదరహితము, పరమ పదము" – అని గ్రహించి, అటుపై మీకు అనుకూలములైన మార్గములలో మీమీ ప్రయత్నములు కొనసాగించండి. అంతేగాని తదితరులు ఎందుకు ఎంతవరకు తప్పుచేస్తున్నారో లెక్కలు కట్టుకుంటూ మీ పురోభివృద్ధిని ఆటంక పరచుకోకండి. జన్మజరా వర్జితమగు ఆత్మ పదమును వదలి తుచ్ఛ తృణములకై ప్రాకులాడి మహత్తరమైన "మానవ ఉపాధి" అనే అవకాశాన్ని వ్యర్థం చేసుకోవాలనుకునేవారికి ఇక నేను చెప్పేదేమున్నది?

ఓ సర్వ సదేహ మిత్రులారా! ఈ సర్వమూ ఆత్మచే ఆక్రమించబడియున్నది. అద్దాని సాక్షాత్కారము కొరకు ప్రయత్నించి ఈ చిత్తమును ఉపశమింపజేయండి.

ఎప్పుడైతే మీరు మీ యొక్క సర్వవ్యాపక, విషయాతీతస్వరూపమును ఎరుగుతారో అప్పుడు సర్వ పునరావృత్తులు శమించి ఈ సంసార భయము నుండి విముక్తులు కాగలరు.

❖❖❖

# 9. మూడు అభ్యాసాలు ఒకేసారి!

**శ్రీరాముడు :** మహనీయుడగు ఓ వసిష్ఠమహర్షీ! మీ యొక్క ప్రవచనం అమోఘం. ఒక చిన్న ప్రశ్న– "ఈ సంసారమునకు బీజమేమిటి?" అను విషయంలో మీరు అనేక విషయాలు ప్రస్తావించారు. ఒక దానికి మరొకటి ఎట్లు బీజమగుచున్నదో కూడా వర్ణించి చెప్పారు. 1. దృశ్యప్రపంచము 2. శరీరము 3. చిత్తము 4. వాసనలు 5. ప్రతిబింబ చైతన్యము 6. బింబ చైతన్యము... మొదలైనవన్నీ సంసార ప్రాప్తికి బీజమగుచున్న వైనమంతా వివరించారు. అయితే, వీటిలో అసలైన దుఃఖబీజమేది? సాధన దృష్ట్యా వీటిలో దేనిని ఎక్కువగా దృష్టిలో పెట్టుకొని, ప్రవృత్తింపజేయుటచే, లేదా, నివృత్తింప జేయుటచే.... జీవుడు త్వరగా దుఃఖమును జయించి, సంసారమును నివృత్తింపజేసి ఆత్మ పదమును అధిరోహించగలడో – అద్దాని గురించి చెప్పండి.

**శ్రీవసిష్ఠమహర్షి :**

> **ఏతేషాం దుఃఖ బీజానాం ప్రోక్తం యద్యన్మయోత్తరమ్ ।**
> **తస్య తస్య ప్రయోగేణ శ్రీఘ్రమాసాద్యతే పదమ్ ॥**

రామయ్యా! ఏదేది ఎట్లు సంసారమునకు బీజమగుచున్నదో – అద్దాని విషయమై మనం వివరణ – సమాధానాల రూపంలో ఇప్పటిదాకా చెప్పుకున్నాం. ఈ జీవుడు యత్నపూర్వకం లాగా దేని స్థానమేమిటో గ్రహించి, వాటిని సద్వినియోగపరచుకొని క్రమంగా అనేక భేదములతోకూడిన సంసారము నుండి భేదరహితమగు సత్తా సామాన్య స్థితి జేరుకోవాలి. సాధన ఏదైనా, "శ్రద్ధతో, పట్టుదలతో ప్రయత్నం చేస్తున్నామా? లేదా?" – అనేది ముఖ్యం. పురుషప్రయత్నముచే వాసనలను త్యజించి 'సత్తా సామాన్యము' (Sense of equality) యొక్క పరాకాష్ఠ అయినట్టి చిత్ రూపంతో ఐక్యత పొంది, అక్కడ క్షణమైనా నిశ్చలస్థితి కలిగియున్నావనుకో... తక్షణమే నీవా ఉత్తమ పదము పొందినట్లే. భేదములన్నీ ప్రయత్నం చేసి జయించు. ఇక ఆపై బోధరూపమగు ఆత్మానుభవం కొద్ది ప్రయత్నంతోనే ప్రాప్తించగలదు. 'ఏకము'ను వదలి 'అనేకము'ను అంటిబెట్టుకొని ఎంతకాలం ఏ సాధనల ద్వారా ప్రయత్నిస్తూ పోయినా, ఆ తత్పదము దుర్లభంగానే ఉండిపోతుంది.

మనం ఇతఃపూర్వమే రెండు విభాగాలు గురించి చెప్పుకున్నాం– సంవిత్ (తెలుసుకుంటున్నది); సంవేద్యము (తెలియబడుచున్నది).

"తెలుసుకుంటున్నది" అయినట్టి సంవిత్ తత్వమునందు ధ్యాననిష్ఠతో ప్రయత్నశీలుడవై ఉంటే, ఆ ప్రయత్నము ఆత్మ పదమునకు చేరవేయగలదు.

తెలియబడుచున్నదాని కన్నా ముందే, దానికి ఆవల 'తెలుసుకుంటున్నది' ఉండి ఉన్నది కదా! అందుచేత 'తెలియబడేది' సాధనగా తీసుకొని ఎంతకాలం ఎంతగా ప్రయత్నించినా – చివరికి సంవిత్తును, ఆశ్రయించకుండా ఆత్మ పదమును అధిరోహించలేవని గ్రహించు.

లేదా, ఒక పని చేయి. "నేను ఏది చింతన చేస్తున్నానో, ఎక్కడ నడుస్తున్నానో, ఎక్కడ ఉన్నానో, ఎక్కడ ఆయా క్రియలు నిర్వర్తిస్తున్నానో – అచటచట సంవిత్తే ఏర్పడి, ఆక్రమించుకొని ఉన్నది. అనగా సంవేద్యము సంవిత్తును ఆక్రమించుకుని ఉండజాలదు. సంవిత్తే సంవేద్యమును ప్రవర్తింప జేస్తోంది" అని ఆరూఢపరచుకొని, అప్పుడిక నీ సాధన కొనసాగించు. వాసనలను త్యజించడానికి యత్నములుచేయి. అప్పుడు నీ శారీరక, మానసిక దుఃఖములన్నీ తప్పక నశిస్తాయి.

సంవిత్‌ను ఆశ్రయించటం... శోధిత 'తత్' అంటారు.

సంవేద్యమును ఆశ్రయించటం... శోధిత త్వమ్ అంటారు.

ఉత్తమ పురుష ప్రయత్న ప్రాశస్త్యం గురించి నీకు ముముక్షు ప్రకరణాదిగా చెప్పుకుంటూనే వస్తున్నాను. కనుక ప్రయత్నించటం, అది కొనసాగించటం, ఆత్మ పదమును అధిరోహించటం – అనేదే నీ మార్గం.

❖

అయితే అన్ని ప్రయత్నాలకన్నా కష్టమైనదేది?... వాసనలను త్యజించటం. ఒక పెద్ద కొండను మొదలంట లేపి గాలిలోకి విసరటం సుసాధ్యపడవచ్చునేమో గాని, వాసనాత్యాగం అంత తేలిక కాదు.

మనస్సు లయం కానంతవరకూ వాసనలు ఉండనే ఉంటాయి. వాసనలు క్షయించనంతవరకూ

చిత్తము శమించదు. తత్త్వజ్ఞానం కలుగనంతవరకు వాసనలు శమించవు. చిత్తము శమించనంతవరకూ వాసనలు ఉంటూనే ఉంటాయి.

1. మనోనాశనం 2. వాసనాక్షయం 3. తత్త్వజ్ఞానం ఈ మూడూ పరస్పర కారణం కలిగి ఉన్నాయి. అందుచేతనే అందులో ఏ ఒక్కటి మాత్రమే సాధించాలన్నా జీవునకు కష్టసాధ్యమే అవుతోంది. అందుచేత రాఘవా! వివేక యుక్తమగు ఉత్తమ ప్రయత్నంచేసి భోగములతో ఏర్పడే ఇచ్ఛను జయించాలి. వాసనా క్షయం, మనో నాశనం, తత్త్వజ్ఞానం – అనే మూడిటిని ఒక్కసారే చక్కగా ఆశ్రయించాలి. పరమ శివుడు త్రిపురాసురిడిని ఒక్కసారే మూడు పురములలో మట్టుబెట్టినట్లు ఈ మూడిటిని జీవుడు సాధించుకోవాలి.

ఈ మూడిటినీ ఒకేసారి మరల మరల అభ్యసించకపోతే ఆ బ్రహ్మపదం ఎన్ని సంవత్సరములు గడచిపోతున్నా లభించదు. చిరకాలం అట్లా అభ్యసిస్తే ఆ ప్రయత్నం తప్పక ఫలప్రదమౌతుంది.

❖

అట్లా కాకుండా, ఆ మూడిటిలో ఒక్కొక్కదానినే తీసుకొని వాసనాక్షయం అయిన తరువాత మనస్సు సంగతి చూస్తాను... అప్పుడు మనస్సును కూడా నశింపజేసి ఆ తరువాత తత్త్వజ్ఞానం సంపాదిస్తాను... అనుకుని ప్రయత్నాలకు ఉపక్రమించావా – దోషభూయిష్టములతో కూడిన మంత్ర సాధనాకార్యక్రమంలాగా, పథ్యమును వదలి ఔషధం సేవించటంలాగా నిష్ప్రయోజనమౌతాయని హెచ్చరిస్తున్నాను. ముగ్గురు శత్రువులు మీద పడుచున్నప్పుడు అందులో ఒక్కొక్క శత్రువుతో మాత్రమే యుద్ధంచేసి శత్రునిర్మూలనం చెయ్యాలంటే ఎట్లా కుదురుతుంది? ముగ్గురితో ఒక్కసారే యుద్ధంచేయటానికి సంసిద్ధుడవు కావాలి కదా! అట్లాగే... వాసనాక్షయం, మనోనాశనం, తత్త్వజ్ఞాన సముపార్జన – అనే మూడిటిలో ఒక్కొక్కదానిని విడివిడిగా ఆశ్రయిస్తే పరమాత్మను పొందలేమని నా అభిప్రాయం. బుద్ధిమంతుడైనవాడు ఆ మూడిటినీ ఒక్కసారే అభ్యసిస్తే తప్పకుండా సంసార సాగరమును విచ్ఛిన్నం చేయగలడు. ఇది సుసాధ్యమే! ఇందులో సందేహం లేదు. నీవావిధంగా ఆచరించి నిస్సంగభావం పెంపొందించుకుని బ్రహ్మపదమున సంస్థితుడవయ్యేదవుగాక! అప్పుడు హృదయ గ్రంథులన్నీ తమంతట తామే తొలగుతాయి.

❖❖❖

## 10. యుక్తి - ఉపాయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామయ్యా! ఈ జీవుని యొక్క ఇప్పటి సంసార స్థితి ఎక్కడి నుండి వచ్చిపడింది? అనేక జన్మలలో అభ్యసించినదే ఇట్లు ప్రయోజనరూపంలో సంప్రాప్తమౌతోంది. ఇది చిరకాలాభ్యాసం లేనిదే తొలగేది కాదు. అందుచేత ఆతడు నడుస్తున్నప్పుడు, కదులుచున్నప్పుడు, తిరుగుచున్నప్పుడు, తినుచున్నప్పుడు, వినుచున్నప్పుడు, తాకుచున్నప్పుడు, వాసన చూస్తున్నప్పుడు, నిద్రిస్తున్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు – అన్ని సందర్భములలోనూ పరమ శ్రేయమగు మోక్షసాధనకొరకు వాసనాక్షయం,

మనోనాశనం, తత్వజ్ఞానం అనే మూడిటినీ సదా అభ్యసిస్తూనే ఉండాలి. దృశ్యముపట్ల ఏర్పడే ఆకర్షణ, వికర్షణలను తగ్గించుకుంటూ మరొక వైపునుండి "ప్రాణాయామం" వంటి యోగాభ్యాసాలను ఆశ్రయించునుగాక! వాసనాత్యాగ, ప్రాణనిరోధముల సహాయంతో చిత్తము అచిత్తత్వం పొందుతుంది.

ప్రాణాయామాభ్యాసం చేతను, యోగాభ్యాసకుశలురైన గురువులు మనకు ప్రసాదిస్తున్న తదితరయుక్తులచేతను, హిత – మిత – పవిత్ర భోజనముచేతను, యమ నియమాదుల రూపంలో గల విధి, విధానముల చేతను, ఆసనజయముచేతను ప్రాణచలనం నిరుద్ధం కాగలదు.

నిర్వివాదము, సన్మాత్రము అగు ఆత్మయే సర్వ వస్తువుల ఆద్యంతములందూ ఏర్పడి ఉన్నది – అను యథార్థదర్శనం అభ్యసించుచూ వస్తే అప్పుడు వాసనలు ప్రవర్తించటం సన్నగిల్లగలదు. బహిర్ముఖములగుచున్న జనుల దృష్టులతో సాంగత్యం కొనసాగించకపోవటం చేతనూ, సాంసారిక మనోరథములు వదులుకుంటూ రావటం చేతనూ 'ఆత్మదర్శనజ్ఞానం కలుగుతుంది. దాని చేతనే వాసనాక్షయం కూడా కలుగుతుంది. ఈ శరీరం, దీని తీరు, ఇది పుట్టి, పెరిగి, నశించే విధం – పరికిస్తూ ఉండటంచేత కూడా వాసనలు సంక్షయిస్తూ ఉంటాయి. వాసనల విభవము సన్నగిల్లు చుండగా, ఇక చిత్తము ప్రవర్తించటం మానివేస్తుంది. గాలి వీచటం ఆగితే ఆకాశంలోని ధూళి కూడా శమిస్తుంది! ప్రాణ స్పందనమే చిత్త స్పందనమైయున్నదని అనుకున్నాం కదా!

❖

ధూళి గుట్టల నుండి ధూళి లేస్తున్నట్లు ఈ ప్రాణ సంచలనం కారణంగా ప్రపంచమున అనేక అనర్థాలు సంభవిస్తున్నాయి. అందుకనే ఏకాంతంలో కూర్చుని ప్రాణస్పందననిరోధం కొరకై పలుమార్లు మిక్కిలి ప్రయత్నం చేయాలి. ఇష్టపూర్వకంగా అట్టి ప్రయత్నములు చిరకాలం చేస్తూ ఉండగా, ఆత్మ పదము తప్పక పొందుతావు. అంకుశం లేకపోతే దుష్ట ఏనుగు మాట వింటుందా? ఆధ్యాత్మ శాస్త్రములచే ఉదహరించబడుచున్న ఆయా ఉత్తమ ప్రయత్నములు చేయకపోతే చిత్తమును జయించటం అంత తేలికైన విషయం కాదు. ఏ ఉత్తమ ప్రయత్నాన్ని ఆశ్రయించకుండా మీనమేషాలు లెక్కకట్టుకుంటూ కాలం వెళ్ళబుచ్చుకుంటుంటే అట్టి జీవుని బ్రహ్మారుద్రాదులు కూడా కాపాడలేరు. కనుక ఓ జనులారా! లేవండి. లేచి నడుంకట్టండి. నడుంకట్టి సత్ప్రయత్నశీలురవండి. అల్పమార్గాలు ఆశ్రయించి. అల్పప్రయోజనములవైపు తరలి వెళ్ళాలనుకోవటం ఉచితమా? కానే కాదు.

1. అధ్యాత్మ విద్యాప్రాప్తి; 2. సాధు, మహాత్ములతో సాంగత్యం; 3. వాసనా త్యాగం; 4.ప్రాణ స్పంద నిరోధం... ఇవే చిత్తమును జయించటానికి ప్రబలమైన ఉపాయాలు.

ఓ సభికులారా! ఈ చిత్తమునకు మించిన శత్రువు భూనభోంతరాళాలలో మరింకేదీ లేదు. దీనిని సరి అయిన రీతిలో నియమించారా... ఇంతకు మించిన మిత్రుడు మరొకడెవ్వడూ ఉండడు.

గాలికి ఎగిరిన దుమ్ము జలధారలచే అణిగిపోవునట్లు చక్కటి యుక్తులచే చిత్తము శీఘ్రంగా జయింపబడగలదు.

**శ్రీరాముడు :** మహాత్మా! హఠయోగంచే ఈ శరీరమును పరిశ్రమింపజేసి, ఎంతో శ్రమకు ఓర్చి కొందరు చిత్తమును ఉపశమింపజేయటానికి ప్రయత్నిస్తున్నారు కదా! వారు దేహము శుష్కింపజేసి,

కష్టతరమగు హస్తపాదాదుల నియమములచే మనోవాక్ ఇంద్రియములను స్వాధీనపరచుకొని, శోషింపజేసి చిత్తమును తమ వశం చేసుకోవాలని ఉద్దేశిస్తున్నారు. అట్టి ఉద్దేశము ఉచితమేనా? మేము కూడా చిత్తశత్రువును జయించటానికి అట్టి హఠయోగం ఆశ్రయించవలెనని మీ అభిప్రాయమా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సద్గురువులగు మార్గదర్శకులచే ఎన్నో సులభమైన ఉపాయాలు ప్రవచించబడ్డాయి. ధ్యానం, ప్రాణాయామం, నామస్మరణ, కర్మ ఫలసమర్పణ, పూజ, దానాదులు – ఎన్నో సున్నితమైన సరళమైన ఉపాయాలు ఉన్నాయి. అట్టి సుఖకరము, సులభ సాధ్యము అగు ఉపాయాలను వదలి, భగవద్దత్తమగు ఈ ఉపాధిని శుష్కింపజేస్తూ మంత్రతంత్రాదులచే హఠంగా చిత్తమును వశపరచుకోవాలనుకోవటం మా ఉద్దేశంలో ఏమంత ఉచితం కాదు.

ఎవ్వనికైనా, దీపాన్ని వదలి మసితో (కాటుకతో) చీకటిని తుడిచి వేయాలనుకోవటం, పిడికిలి గుద్దులతో మదపుటేనుగును నిలిపి ఉంచాలనుకోవటం తేలికైన పనేనా? చిత్తమును, చిత్తమునకు ఉపకరణమగు ఈ దేహమును స్వస్థపరచి క్రమంగా మనస్సును సుస్థిరీకరించటానికి 'యుక్తి'ని ఆశ్రయించాలి. సర్వ శక్తి సమన్వితమగు చిత్తము ముందు ఏ శక్తి ఎట్లు ఉపయోగిస్తుంది? యుక్తిని వదలి మొండిగా, మూర్ఖంగా హఠం మొదలైన భయమును గొలిపే బలవత్పూర్వక యత్నములు చేయు వారిని ఆత్మ శాస్త్రజ్ఞులు 'శఠులు, మొండివారు' అని పిలుస్తున్నారు. అట్టివారు ఒక భయమునుండి మరొక భయమునకూ, ఒక క్లేశము నుండి మరొక క్లేశమునకూ పయనిస్తున్నారని గ్రహించు. వారికి ధైర్యం, విశ్రాంతులు లభించటంలేదు. తాము భయపడుచు, తదితరులను భయపెట్టుచూ, మూర్ఖము, బుద్ధిహీనము అగు లేళ్ళు పరుగులు తీస్తున్నట్లు హఠం కొనసాగిస్తున్నారు. అల్పము, భేదాశ్రయము అగు వారి బుద్ధి ఎక్కడా విశ్వాసం సంపాదించలేక భీతినే పొందుతోంది. జ్ఞానబలిమి లేక వారి చిత్తము అనేక చింతలందు వ్యాప్తమై ఉంటోంది. నదీ జలంలో తృణములు (గడ్డిపరకలు) లాగా వారి మనస్సు రాగద్వేషాదులందు కొట్టుమిట్టాడటమే జరుగుతోంది.

అందుచేత, హఠంచే "నేను వేరు, ఈ తదితర జనులు వేరు. ఆ పరమాత్మ వేరు. క్రూరమైనట్టి ఏమైనా నియమములచేత గాని నేను దైవమును గాంచలేను" – అని అనుకోవటం వేదవేదాంతాల అంతర్లీన గానం పెడచెవిని పెట్టటమేనని మా అభిప్రాయం. ఓ మిత్రులారా! మీరు ఆవేశకావేషాలతో హఠం ఆశ్రయిస్తే తుచ్ఛ విషయములే ఎదురౌతాయి గాని, సర్వసమదృష్టి పూర్వకమగు ఆత్మానుభవం కాకపోవచ్చునని హెచ్చరిక చేస్తున్నాను.

❖

మరికొందరు ఆత్మ విషయ విచారణను ఆశ్రయించక, కేవలం, యజ్ఞ, తప, తీర్థాదులకే తమ యత్నములను పరిమితం చేసుకుంటున్నారు. ఏది ఎందుకు ఉన్నదో గ్రహించలేకపోతున్నారు. తమలో సర్వదా వేంచేసియున్న ఆత్మ భగవానునివైపు తమ దృష్టిని మరల్చుకోవటం లేదు. ఫలితంగా అసలు విషయమేమిటో గ్రహించకుండానే అరణ్యంలో దారితప్పిన జింకలాగా అనేక మానసిక వ్యధలతో చిరకాలం గడిపివేస్తున్నారు. జ్ఞానముచే ఆత్మజ్ఞానము కొరకై సత్ప్రయత్నము లందు

నియమితులవటం మంచిది గాని, గుడ్డిఎద్దు చేలో పడ్డట్లు సంకుచిత దర్శనమునకు బద్ధులు కాకూడదని అట్టివారికి గుర్తుచేస్తున్నాను. "నా బాహ్య అభ్యంతరములందు సర్వదా ఆత్మయే సమస్తంగా ఏర్పడి ఉన్నది. అది సర్వ శుద్ధము, అఖండము, అప్రమేయము" – అను భావమే ఆత్మీభావన. అట్టి ఆత్మీభావనను ఆశ్రయించకుండా, కేవలం కథలకు, వర్ణనలకు, ఆకారాదులకు పరిమితులైతే ఎట్లా? చిత్రపటంలోని పండు ఆకలి తీర్చగలదా? 'త్వమ్' భావనాపరిమితులవటంచేత బహువిధ దుఃఖాల చేతనూ, రాగాది దోషములచేతనూ వారు పలువైపుల నుండి పీడితులగు చున్నారు. తమ చెంతనే తమ స్వరూపమై వెల్లివిరిసియున్న ఆత్మ యొక్క అభేద తత్త్వమును గ్రహించ లేకపోతున్నారు.

**శ్రీరాముడు :** అట్లా ఎందుకు జరుగుతోంది మహర్షీ? వారికి తరుణోపాయమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వారి ప్రయత్నములు 'వృథా' అని నా ఉద్దేశం కాదు. అయితే దేహాత్మభావన త్యజించ నంతకాలం ఒకప్పుడు స్వర్గమును, మరొకప్పుడు నరకమును పొందవలసిన అగత్యం ఏర్పడుచూనే ఉంటుంది. "అనిత్యము, స్వర్గ – నరక – భవభోగముల నిమిత్తమై పతనోత్పతనములు పొందేది అయినట్టి ఈ దేహం నేను కాదు. నా స్వరూప, స్వభావములు దేహముకంటే విలక్షణమైనవి" – అను ఆత్మజ్ఞానం ఆశ్రయిస్తే అన్ని రుగ్మతలు వాటంతట అవే తొలగుతాయి. అందుచేత దేహాత్మభావన విడచుచూ, జ్ఞాన దృష్టితో వారివారి ప్రయత్నములు నిర్వర్తించెదరుగాక! అట్టివారిపై గల అవ్యాజమైన ప్రేమ చేతనే ఆ పరమేశ్వరుడు మనకు ఈ యోగవాసిష్ఠాది ఆత్మ సమాచారాలు, గ్రంథములు ప్రసాదించుచున్నారు. అందుచేత రామా! తటాక జలంలాగా వృత్తులను పొందుచూ, కొనసాగిస్తూ ఉంటే సరిపోదు. వృత్తిరహితము, సర్వసాక్షి, సర్వ సంకల్ప వికల్పములకు ఆవల ఉన్నది, సంవిత్ అని చెప్పబడుచున్నదియు అగు ఆత్మతత్త్వమును దర్శించాలి. అందుకు సదుద్దేశంతో చేసే ఆయా యజ్ఞ, తప, తీర్థాది, ప్రయత్నములు నిర్మల హృదయ సముపార్జన రూపమున తప్పక సహకరిస్తాయి.

అందుచేత... తెలియబడుదాని నుండి – 'తెలివి' లేక తెలుసుకొనుచున్న దానివైపుగా, సంవేద్యము నుండి – సంవిత్తు వైపుగా, శోధితత్వమ్ (Creation) నుండి–శోధితతత్ (Creator) వైపుగా సాధకులు పురోగమించెదరు గాక!

కాబట్టి రామా! ఆత్మానుభవార్థమై క్రమక్రమంగా సర్వదోష దృష్టులు వదలివేయుము. శుద్ధ సంవిత్తును ఆశ్రయించు. వీతరాగుడవై ఉన్నచోటనే సుస్థితుడవు, స్వస్థుడవు, ఆత్మానుభవ సమన్వితుడవు కమ్ము. ఈ సాంసారిక రుగ్మతలన్నిటికీ రహితస్థానం అదే!

**జ్ఞానవానేవ సుఖవాన్! జ్ఞానవానేవ జీవతి! ।**
**జ్ఞానవానేవ బలవాన్! తస్మాత్ జ్ఞానమయోభవ ॥**

ఈ ప్రపంచంలో జ్ఞానవంతుడే సుఖిస్తున్నాడు. జ్ఞానవంతుని జీవితమే సఫలం పొందుతోంది. జ్ఞానవంతుడే బలసమన్వితుడు కూడా! అందుచేత నీవు జ్ఞానమయుడవు కమ్ము.

మహాత్మా, రామచంద్రా! విషయవర్జితం, సర్వోత్తమం, అనాది, కల్పనా రహితం, నిర్వికారం అయినట్టి 'సంవిత్' పదమును నీవు ఆశ్రయిస్తూ ఉండు. కల్పనావర్జితుడవగుము. హృదయాకాశమున

ప్రశాంతుడవై సుస్థితుడవు కమ్ము. బ్రహ్మమును సమాధియందు సంభావించు. మరల వ్యుత్థాన కాలంలో (సమాధి నుండి బయల్వెడలినప్పుడు) శమముతో లోన - బయట నింపివేసి, ఆపై యథోచితములగు క్రియలను నిర్వర్తిస్తూ ఉండు. మనం ఇప్పటివరకూ చెప్పుకున్నట్టి జీవన్ముక్తుని గుణసంపదను సంతరించుకున్నవాడివై అకర్తృత్వ పదమును పొందియుండుము.

❖❖❖

# 11. జ్ఞానవానేవ బలవాన్

**శ్రీవసిష్ఠమహర్షి :** ఎవ్వరైనాసరే.... కాస్తయినా విచారణ చేసి తన చిత్తమును కొంచమైనా నిగ్రహించగలిగితేనే తమ జీవితమును కొంతైనా సఫలం చేసుకున్నట్లు. విచారణ అనే కోమలమైన కల్పవృక్షాంకురం హృదయంలో స్ఫురించిందా - అది త్వరలో అభ్యాసయోగం చేత క్రమంగా అనంత శాఖాయుతం కాగలదు. నిండు సరస్సును పక్షులు, చేపలు స్వయంగానే వచ్చి ఆశ్రయిస్తాయి చూచావా? కొంచెం ప్రౌఢవిచారణ గల వైరాగ్యయుతుడగు మానవుని శమము, దమము, దయ, దాక్షిణ్యము, స్నేహము, సాత్వికము - మొదలైన శుద్ధగుణములు స్వయంగా వచ్చి ఆశ్రయిస్తాయి.

ఉత్తమ విచారవంతులు, యథార్థమగు ఆత్మతత్త్వమును గాంచువారు అగు బుద్ధిమంతులు, మహనీయులు ఈ భూమిపై ఎందరో ఉన్నారు. అట్టి జ్ఞానులను బ్రహ్మదేవుని వరకు గల మహదైశ్వర్యములు కూడా ఏమాత్రం ప్రలోభింపజేయలేవు. 'ఆత్మసాక్షాత్కారము' అను సమ్యక్ దర్శనమును సంపాదించుకున్న ఆ మహనీయులను ఇక్కడి ప్రాపంచిక సంఘటనలుగాని, మానసిక వృత్తులుగాని, శారీరక - మానసిక వ్యధలుగానీ సమీపించవు. వారు తమను - తదితరులను కూడా సర్వాతీతమైనట్టి ఏకైక ఆత్మవస్తువుగా దర్శిస్తూ ఉంటారు.

❖

వాయువేగముతో కూడిన ప్రళయకాల మేఘమును వీధిలో ఆడుకుంటున్న చిన్న పిల్లలు తమ పిడికిళ్ళతో పట్టుకోగలరా? ముగ్ధస్త్రీలు ఆకాశంలో ప్రశాంతంగా ప్రకాశిస్తున్న చంద్రబింబమును పట్టుకొని తమ పేటికలో బంధించగలరా? ఐదు-ఆరు దోమలు ఒక చోటికిజేరి మదగజమును నిరోధించగలవా? కొన్ని చిరుకప్పలు ఒకటై కొండచిలువను దిగమ్రింగగలవా? జ్ఞేయమగు ఆత్మ వస్తువును గ్రహించిన వివేకి ఈ ప్రపంచమున సంచరిస్తున్నప్పటికీ, ఇక్కడి పదార్థములు, ఇంద్రియాలకు గోచరించే వస్తుజాలాదులు, సంసార జనుల అభిప్రాయాదులు ఆతనిని ఆకర్షించలేవు. చ్యుతుని చేయలేవు. ఆత్మజ్ఞుని ఆకర్షించగల వస్తువిక్కడేమున్నది? ఆత్మానుభవమునకు మించినదేమున్నది? ఓ రామచంద్రా! దుర్బల విచారణయుక్తుని ఈ విషయ శత్రువులు ఇట్టే నిర్జించివేస్తున్నాయి. ఇక వాయువీచికలచే ఎండుటాకులు ఎగురుచున్నట్లు ఆతడు సంసార ప్రదేశంలో అటూ ఇటూ ఈడ్చుకు పోబడుచున్నాడు. కానీ ప్రౌఢవివేకం గలవానిని ఈ రాగాది వృత్తులు లేశంకూడా బాధించలేవు. పిల్లగాలులు వెళ్ళి మేరుపర్వతాన్ని ఏంచేస్తాయి? అదృఢమైన విచారణ గలవానిని క్రిందు - మీదు

చేయటానికి స్వల్ప సంఘటనలు, కొద్దిపాటి చింతలు చాలు. అవే విషయాలు విచారయుక్తుని ముంగిట వ్రాలినప్పుడు, ఆతని జ్ఞానబలాన్ని చూడగానే రాగము-ద్వేషము మొ॥వి తోక ముడుస్తున్నాయి. అవి ఎటకో పలాయనం చిత్తగించవలసిందే!

ఎవ్వడైతే నిద్రిస్తున్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు, కూర్చుని ఉన్నప్పుడు, నడుచుచున్నప్పుడూ ఆత్మ విచారయుతుడై ఉంటున్నాడో... ఆతని చిత్తము అల్లరిపోకడలకు దూరంగా ఉండి, ఈ మాయాజాల జగత్తును ప్రశాంతంగా గమనిస్తోంది. అట్లాగాకుండా మాయాజాలంలో ప్రవేశించి రాగాదులచే ప్రహర్షితుడైయ్యేవాడు మృతునితో సమానమేనని జ్ఞానుల అభిప్రాయం. ఓ రామా! నీవు సర్వదా అమృత స్వరూపుడవై ఉండెదవుగాక!

**"కిమ్ ఇదంస్యాత్ జగత్? కింస్యాత్ దేహమ్?" - ఇత్యనిశం శనైః ।**
**విచారయత్ అధ్యాత్మదృశా, స్వయం వా, సజ్జనైః సహ ॥**

"ఈ ప్రపంచమేమిటి? ఈ దేహమేమిటి?" అని నిరంతరం మరల మరల అధ్యాత్మదృష్టితో తనకు తానుగానో, లేక సజ్జనులతో కూడియో విచారణ చేస్తూ ఉండాలి. దీపం వెలిగించగానే గదిలో ఉన్న వస్తువులన్నీ స్పష్టంగా కనిపిస్తాయి కదా! 'ప్రమోదము' అనే చీకటిని నశింపజేయగల విచారణచే ఉత్తమ వివేకం ప్రాప్తిస్తుంది. అప్పుడీ జగత్తు ఏమిటో, ఏమై ఉన్నదో, ఏమికాబోతున్నదో... అంతా సుస్పష్టమౌతుంది.

**జ్ఞానేన సర్వదుఃఖానాం వినాశ ఉపజాయతే ।**
**కృతాలోకవిలాసేన తమసామివ భానునా ॥**

సూర్యుడు ఉదయించగానే చీకటి పటాపంచలైపోతోంది చూచావా? జ్ఞానంచే సర్వదుఃఖాలు సంక్షయిస్తాయి. చంద్ర ప్రకాశముచే జగత్తంతా ప్రశాంతమయమగుచున్నట్లు, జ్ఞానము ప్రవృత్తమగు చుండగా జ్ఞేయం స్వయంగా, పూర్ణరీతిగా గ్రహించబడుచూ, హృదయాకాశం ఆహ్లాదమయం కాగలదు.

ఓ రాఘవా! శాస్త్రవిచారణచేయి. అట్టి శాస్త్రవిచారణ నీకు బ్రహ్మతత్త్వమును ఎరుగజేయగలదు.

జ్ఞేయము తోటి అభిన్నత్వం ప్రసాదించేదే జ్ఞానం. విచారణచే జనించే పరమోత్తమమగు అవగాహనను విజ్ఞులు 'జ్ఞానం' అని పిలుస్తున్నారు. కల్లుత్రాగినప్పుడల్లా మత్తు వస్తుంది చూచావా? సమ్యక్ జ్ఞానం సంపాదించినప్పుడు స్వయముగా జ్ఞేయుడై ఉంటాడు. 'జ్ఞేయం' అంటే- సమం, నిర్మలం అగు బ్రహ్మమే. సాంసారిక జ్ఞేయం (That which is being Known while in wordly ignorance) జ్ఞానసముపార్జనచే స్వయంగా అవిద్యారహితం అగుచున్నది. జ్ఞానవంతుడు దేని యందునూ సంలగ్నం కాక సంగదోష రహితుడై, జీవన్ముక్తుడై పూర్ణమనోరథుడై సమ్రాడాత్మస్వరూపుడై ఉంటాడు.

❖

రామచంద్రా! జ్ఞాన సమన్వితుడైనవాడు మధురధ్వనులందుగాని, విషయభోగములందుగాని, సుందర వనితాది శబ్దములందుగాని, నృత్య, మధుర గీతాదులందుగాని తన చిత్తం లగ్నంచేయడు.

కర్కశ శబ్దములు తాను పలుకడు. అవి ఆతని చెవిని సోకవు. విషయములందు, వన క్రీడలందు ప్రీతి కలిగి ఉండడు. హంసకు మరుభూమి యందు ఆసక్తి ఉంటుందా? శాకాహారికి మాంస ఖండములను చూచినప్పుడు నోరూరదు కదా! ఆత్మచే పరితృప్తుడైనవానికి ప్రాపంచిక పదార్థములను చూచినంతమాత్రంచేత లోభ, మోహాలు పుట్టవు. ఆతనికి "యమ, సూర్య, చంద్ర, నక్షత్ర, వాయు, రుద్ర" - మొదలైన స్థానములందు గాని, మందర కైలాసాది పర్వత ప్రదేశములందు గాని, లౌకికమైన కళలందు గాని, సువర్ణరత్నమాణిక్యాదు లందుగాని, రంభ ఊర్వశి మొదలైన దేవతా స్త్రీల దేహ సౌందర్యములందు గాని ఆసక్తి ఉండదు. అవి ఎదురుపడినప్పుడు అపేక్షించడు, ద్వేషించడు. తన ఆత్మ దృష్టిని, మౌనధ్యానమును వీడడు. తన శత్రువులను చూచినప్పుడు కూడా అచలుడై, పరిపూర్ణచిత్తుడై, మౌని అయి ఉంటాడు.

వేదవిహితుడగు విప్రునకు మద్యపు వాసనపై ప్రీతి ఉంటుందా? ఉండదు కదా!

ఆత్మ జ్ఞానియగు మహనీయుడు ప్రియాప్రియములందు సమబుద్ధిని కలిగి ఉంటాడు. పుష్పములందు, లతలందు, చందన - అగరు - కర్పూర - కస్తూరి - లవంగాది సుగంధములచే ఆతడు ప్రత్యాకర్షితుడు కాడు. సముద్రపు గుడగుడ శబ్దముల హోరు, ఆకాశంలో జనించే ప్రతిధ్వనులు, సింహగర్జనలు, శత్రువుల భేరీ నినాదములు, డమరుక శబ్దములు, కర్ణకఠోరమగు ధనుష్టంకారాలు ఆత్మజ్ఞానిని కొంచంకూడా భీతిల్లజేయలేవు. ఏనుగుల ఘీంకారాలు, బేతాళ కలహాలు, పిశాచ, రాక్షసాదుల హీహీనాదాలు ఆతనిని చలింపజేయలేవు. పిడుగుల శబ్దములచేగాని, పర్వతముల విస్ఫోటకముచేగాని, బాణ, వజ్రఘాతములచేగాని ఆతని అనుక్షణికమగు స్వస్వరూపానుభవము కలతపడదు. ఉంపపు ఘర్షణలు, తీక్ష్ణఖడ్గ ఛేదనపు మెఱుపులు, తీవ్ర పదజాలములు ఆతని నిశ్చల ఆత్మానుభవం ముందు నిష్ప్రయోజనమే అవుతాయి. వనవాటికయందు గాని, మరుభూమియందు గాని, జన సమూహంలో ఉన్నప్పుడుగాని, అనేకమంది వినమ్రులగు జనుల మధ్య పలుకులు పలుకుచున్నప్పుడు గాని, తిరస్కాం, పురస్కారములు అందించబడుచున్నప్పుడు గాని... ఆతనికి ఆనందము, దుఃఖము - రెండూ ఉండవు.

నిప్పుకణికల వంటి ఇసుక ఎడారులలో అడుగులు వేస్తున్నప్పుడుగాని, మృదువైన పచ్చిక బయళ్ళలో చిరుగాలులు అనుభవిస్తున్నప్పుడు గాని, ఖడ్గ ప్రహారములందు గాని, సుఖ శయ్యలందు గాని, ఎత్తైన పర్వతములపై సంచారం చేస్తున్నప్పుడుగాని, లోతైన బావులందు ఉండవలసి వచ్చినప్పుడు గాని ఆతడు ఒక్క తీరుగానే ఉంటాడు. సంపదలు, ఆపదలు వస్తున్నప్పుడు, పోతున్నప్పుడు ఆతనికి భయము గాని, ఆనందము గాని ఉండదు. తలపై భారము మోస్తున్నవాడు, ఆ భారాన్ని క్రిందకు త్రోసి వస్త్రముచే ముఖం తుడుచుకుంటూ విశ్రాంతి అనుభవిస్తాడు చూచావా? ఆ జ్ఞానసమన్విత హృదయుడు సర్వవేళలా అంతర్ముఖుడై అట్టి విశ్రాంతి, ఆనందములను ఆస్వాదిస్తూ ఉంటాడు. భీతి, వ్యాకులత, గర్వములుగాని, ధైర్య, అధైర్యములు గాని లేనివాడై సముడై, స్వస్థచిత్తుడై అకృత్రిమ మగు పూర్ణ స్వభావము వహించి ఉంటాడు.

❖

ఓ రామచంద్రా! జ్ఞాని యొక్క సర్వ సమత్వమహిమ గురించి మనం ఎంత చెప్పుకున్నా తక్కువే. ఆతడు అపవిత్రములు, అపథ్యములు, గోమయముచే తడిసి రసహీనమయి ఉన్న ఆహారమును కూడా మృష్టాన్నమువలె ఆరగించగలడు. తనయొక్క 'అసక్తత' అను బలంచేత రుచికర, అరుచికర పదార్థములను ఆస్వాదిస్తున్నప్పుడు సమచిత్తుడై ఉండగలడు. తృణములు – కేశములు – ఎముకలు – రక్తము మొదలైనవి చూస్తున్నప్పుడు కూడా ఆతడు సంతుష్టుడు, కృద్ధుడు కాడు. పురుగులో కూడా ఆతనికి బ్రహ్మదేవుడు కనిపిస్తాడు.

**జీవితస్యాపి హర్తారం దాతారంచ ఏకరూపయా ।**
**దృశా ప్రసాద – మాధుర్య శాలిన్యా పరిపశ్యతి ॥**

జీవహర్త, జీవదాత – ఈ ఇద్దరినీ ఆతడు ప్రసన్న మాధుర్యములతో కూడిన ఏకదృష్టితో వీక్షించగలడు. దీర్ఘకాలం ఉండే దేవతల శరీరములందుగాని, అల్పకాలస్థమగు ఈ మానవ శరీరములందు గాని, ఈ రెండిటికీ సంబంధించిన భోగ్య – అభోగ్య, రమణీయ – అరమణీయము లందుగాని ఆతడు సర్వసమత్వం వహించి ఉంటాడు. వాటిచే ఆతనికి సంతోషము గాని, దుఃఖం గాని కలుగవు. ...వేద్యమగు ఆత్మను ఎరిగి ఉండుటచే ఆతని చిత్తము రాగరహితమై ఉంటుంది. ఈ జగత్తు యొక్క స్థితియందు ఆతనికి ఏమాత్రం ఆసక్తి ఉండదు. 'ఇక్కడి విశేషములన్నీ మిథ్యయే కదా?..." అను సునిశ్చయం కలిగి ఉంటాడు. ఇంద్రియములకు విషయస్థితి యొక్క ఆవశ్యకత్వం కలుగజేయక, నిశ్చింత బుద్ధిచే ప్రభవిస్తూ ఉంటాడు.

❖

నాయనా రామా! లేళ్ళు లేచిగుళ్ళను భక్షిస్తాయి చూచావా? తత్త్వజ్ఞుడు కానివానిని... ఆత్మ యందు విశ్రాంతి పొందని వానిని... స్వస్వరూపస్థితి ఎరుగనివానిని ఈ ఇంద్రియములు కబళించి వేస్తున్నాయి. ఇక ఆతడు వాసనాతరంగములచే చుట్టబడి సంసారసముద్రంలో కొట్టుకుపోవుచూ అనేక వేదనలు, రోదనలు ఎదుర్కొంటున్నాడు. ఇంద్రియములనే మొసళ్ళు ఆతనిని గుటుక్కున మ్రింగటానికి సిద్ధపడుచున్నాయి. "అందుకే, మానవుడు విచారణయుతుడు కావాలి" అని ఈ ఉపశమన ప్రకరణ సమీక్షలో మరల మరల గుర్తుచేస్తున్నాను. జల ప్రవాహం పర్వతమును పెకలించ గలదా? విచారయుతుడై, భవ్యపదమున స్థితి కలిగి ఆత్మయందు విశ్రాంతి పొందిన బుద్ధిని సంపాదించుకున్న వానిని ఇక్కడ కనబడే వికల్పములు ఏమీ చేయలేవు. సర్వ సంకల్పములకూ సీమాంతరమగు పరమపదమున విశ్రమించేవారు, ఆత్మ పదప్రాప్తి పొందినవారు ధన్యులు. వారికి రాజాధిరాజత్వం కూడా తృణప్రాయమే అవుతుంది. ఎవరి చిత్తమైతే పూర్ణమై, విస్తృతమై, ఆత్మాకారం పొంది ఉంటుందో – అట్టి వారికి ఈ జగత్తు ఊరికి చివర ఉన్న శిథిల గృహం వంటిది. వారికి క్షణకాలం అనంత కల్పములు కూడా ఒక్కటే అవుతాయి. వారు సర్వదా సమత్వం వహించి ఉంటున్నారు. ఈ ప్రపంచమంతటినీ 'సంవిన్మాత్రము'గా ఎంచుచున్నారు. దీనిని సర్వ సాక్షియగు ఆత్మగానే చూస్తున్నారు. అందుచేత సర్వజగన్మధ్యంలో ఉన్నప్పటికీ ఏదీ పొందటం లేదు. కోల్పోవటం లేదు. జ్ఞానులై విహారం చేస్తున్నారు.

**సంవిన్మాత్రపరిస్పన్దే జగతే వస్తుపఞ్జరే**
**కింహేయం? కిం ఉపాదేయమ్? ఇహ తత్వవిదాం మతమ్॥**

ఈ జగద్వస్తు పంజమరంతా సంవిత్తు యొక్క స్పందనమే కదా! అందుచేత తత్వవేత్తలకు ఇందు గ్రహించతగినదేముంటుంది? త్యజించతగ్గదేమున్నది? ఎరుగబడుచున్నదంతా సంవిన్మాత్రమగు ఎరుగుచున్నదానిలోనే ఉండగా అది వదలటమేమిటి? పట్టుకోవటమేమిటి? కనుక రామా! నీవు సర్వ భ్రమలూ విడచిపెట్టు.

అజ్ఞాన జీవులకు అభిలషితములగుచున్న వర్తమాన – భవిష్యత్ విషయజాతమంతా తత్త్వజ్ఞుని దృష్టిలో శూన్యాకాశమువంటిది మాత్రమే. తాను మాత్రం సర్వదా సంవిత్స్వరూపుడై సర్వదా సర్వత్రా ఏర్పడి ఉంటున్నాడు.

**ఆదావన్తేచ యన్నాస్తి, వర్తమానేఽపి తస్య చ**
**కంచిత్తాలలవం దృష్ట్వా సత్తాసౌ సంవిదో భ్రమః ॥**

ఏదైనా ఒక వస్తువు మొదట్లోనూ – చివరలోనూ లేకుండా వర్తమానంలో మాత్రం కొద్దికాలం గోచరిస్తోందనుకో! దానియొక్క ఉనికి సంవిత్తు యొక్క భ్రమ మాత్రమే అయి ఉన్నది. అద్దానికి స్వతఃసిద్ధమైన సత్త లేనట్లే అగుచున్నది. ఈ జగత్తులోని ఆయావిశేషాలు చూస్తున్నప్పుడు ఇట్టి దృఢ నిశ్చయం కలిగి ఉండు. భావాభావములందు కూలుచున్న బుద్ధియొక్క విభాగమును పరిత్యజించు. నిస్సంగుడవు, ప్రకాశస్వరూపుడవు, సంవిన్మాత్రుడవు అయి ఉండు, భావాతీతుడవగుము.

ఓ రామచంద్రా! ఎదురుగా ఉన్న ఈ శరీరం, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలనే ఉపకరణములను ఉపయోగించి కర్మలు చేయి. లేదూ... సమాధి వహించి కర్మలను త్యజించు. సంగదోషరహితుడవై ఉంటే ఆ ఉభయ స్థితులు నిన్ను అంటజాలవు. అసంగబుద్ధిచే మనస్సు ద్వారా ఉపకరణమాత్రములగు ఈ అవయవములతో వ్యవహరించావా... ఇక మనోరథదశలు, సుఖదుఃఖదశలు నిన్ను సమీపించ నైనా లేవు.

**గత సంగమనా దృష్ట్యా పశ్యన్నపి, న పశ్యతి**
**ఏతదన్యస్థ చిత్తత్వాత్ బాలేనాపి అనుభూయతే ॥**

సంగములేని మనస్సు కలవాడు కంటితో చూస్తున్నప్పటికీ చూడనివాడే అవుతాడు. ఒక చిన్న దృష్టాంతం చెపుతాను. మనస్సు, భావన ధ్యాస మరెక్కడో ఉన్నాయనుకో. అప్పుడు మనం బాటలో పోతున్న ఒక వ్యక్తినో, వాహనమునో కళ్ళతో చూస్తున్నా... చూడని వారమే అవుతాము కదా! చిన్న పిల్లవాడినుండి పెద్ద వాళ్ళవరకు ఇట్టిది అనుభూతమగుచున్న విషయమే! అన్యవస్తువుపై దృష్టి కలిగియున్నప్పుడు ఎదురుగా ఉన్నది చూడనివారమే అగుచున్నట్లు సంగము లేకుండా ఇంద్రియములతో క్రియలు నిర్వర్తించినా కూడా... నిర్వర్తించని వాడవే అవుతావు.

కాబట్టి అసంగ చేతస్కుడు (One who has no attachment) అగు మనుజుడు చూచినా చూడని వాడే! వినినా... వినని వాడే! తాకుచున్నా... తాకని వాడే! వాసన చూస్తున్నా... చూడని

వాడే! కళ్ళుతెరచినా.. తెరవని వాడే! మూసినా.. మూయని వాడే! ఇంట్లో పిల్లలు ఆడుకుంటూ కేరింతలు పెట్టుచున్నప్పటికీ ఇంటాయన ధ్యాస ఎక్కడో ఉంటే, ఆ శబ్దములు చెవిన పడుచున్నప్పటికీ ఆతడవి వినకయేపోవటం సభికులందరికీ సుపరిచయమైన విషయమే కదా! ఆత్మలో ధ్యాస కలిగి ఆ రీతిగా ఇంద్రియములను ఉపయోగించటం, ఇక ఇంద్రియ విషయములలో ఆత్మను ప్రవేశింపజేయకుండటం అభ్యాసంచే సుసాధ్యమే!

'సంగము' అంటే ఏమిటి? అభిలాష – అభినివేశములే కదా!

**సంగఃకారణమ్ అర్థానామ్, సంగః సంసారకారణమ్ ।**
**సంగః కారణమ్ ఆశానామ్, సంగః కారణమ్ ఆపదామ్ ॥**

ఓ రామయ్యా! సంగమే సర్వ పదార్థములకు కారణం. సంసారమునకు కూడా హేతువదే. సమస్త ఆశలకు, ఆపదలకు అదే మూలం. సంగము వదలగలిగితే మోక్షమే లభిస్తుందయ్యా! సంగము త్యజించిన మరుక్షణం "నేను జన్మించువాడను. కర్మిష్ఠుడను. మరణించువాడను" – అను అల్పభావములన్నీ తొలగిపోతాయి. కనుక నీవు సర్వ పదార్థములందూ సంగమును వదలి జీవన్ముక్తుడవు కమ్ము.

**శ్రీరాముడు :** సర్వ సంశయములనూ నివృత్తింపజేయగల హే సద్గురూ! ఈ రోజు మన సంవాదము ముగించేముందుగా ... 'సంగము' అనగా ఏమిటో సంక్షిప్తంగా వివరించ ప్రార్థన.

**శ్రీవసిష్ఠమహర్షి :**

**భావాభావే పదార్థానామ్ హర్షామర్షవికారతా ।**
**మలినా వాసనాయైషా సాసంగ ఇతి కథ్యతే ॥**

పదార్థముల సంయోగ – వియోగములందు (అవి లభిస్తున్నప్పుడూ – తొలగుచున్నప్పుడూ) హర్ష – శోకములు కలుగుచున్నాయి కదా! ఎందుకు కలుగుచున్నాయి? అంతరంగంలో ఉండే – "ఇది నాకు చెందినది. నేను దీనికి చెందినవాడను. అవి నాకు చెందాలి. ఇవి నాకు తొలగాలి" – ఇటువంటి రూపములతో ఏర్పడే మలిన వాసనలే సుమా! అట్టి మలిన వాసనలే 'సంగము' అని నిర్వచించబడింది. జీవన్ముక్తులు సర్వదా ఎట్టి సంగమూ లేకుండానే ఈ భూమిపై సంచరిస్తున్నారు. వారి శరీరములలో ఉండే సంస్కారం లేక వాసన శుద్ధవాసన అని అంటాం. ఎందుకంటే వారి వాసనకి రెండు ముఖ్యమైన లక్షణాలు ఉంటాయి–

1. అది హర్ష – శోక వివర్జితమై ఉంటుంది. 2. దానియందు పునర్జన్మ హేతువులు ఉండవు.

ప్రారబ్ధక్షయ పర్యతం మాత్రమే ఉండే శుద్ధ వాసన 'అసంగము'తో సమానం అవుతుంది. అట్టి అసంగము లేక శుద్ధవాసనచే నిర్వర్తించబడే కర్మ బంధమును కలిగింపజాలదు.

ఇక సంసారాసక్తులగు మూఢచిత్తుల సంగము గురించి చెపుతాను విను. వారి వాసనలు హర్ష – శోకములతో కూడి ఉంటాయి. వాసనలతో జన్మ – జీవించుటచే మరికొన్ని వాసనలు –

ఆ వాసనల నుండి మరల పునర్జన్మ – ఈ విధంగా ఉంటుంది. వారి తతంగం. పునర్జన్మకు కారణము కాగలవాసనలే 'సంగము' – అని చెప్పబడుతోంది. అట్టి వాసనలతో చేయబడే కర్మలన్నీ చివరికి బంధము కొరకే అగుచున్నాయి. అందుచేత రఘురామా! ఆత్మకు వికారము కలుగజేస్తున్న వాసనా రూపమయినట్టి సంగమును నీవు త్యజించివేయి. సర్వదా స్వస్థుడవైయుండుము.

అప్పుడు కర్మలు చేసినప్పటికీ, జలంలో ఉండే కమలంలాగా, వాటిచే నీవు స్పృశింపబడకయే ఉంటావు. కర్మలు నిర్వర్తిస్తున్నప్పుడు, "నేను ఏ దృష్టితో ఈ ఈ కర్మలు చేస్తున్నాను?" – అని నీకు నీవే ప్రశ్నించుకో! దృష్టిని శుద్ధ పరచుకొనుటచే... "నేను కర్మాతీతుడను. అకర్తను. శుద్ధమగు ఆత్మ స్వరూపుడను. నిస్సంగుడను" అని గ్రహించగలవు. అట్లు గ్రహించిన తరువాత నిర్వర్తింపబడే కర్మలన్నీ అసంగమే అవుతాయి. హర్షామర్ష విషాదములచే వైరూప్యము పొందక, రాగ భయ క్రోధములు లేనివాడవై ఉంటే, నీవు ఇప్పటికిప్పుడే అసంగుడవౌతావు. దుఃఖముచేగ్లాని పొందక, సుఖముచే ప్రసన్నత పొందక, ఆశాపాశవశ్యముకాక, సర్వవిషయములను త్యజించినవాడవై ఉంటేనే అసంగుడవయినట్లు సుమా!

లోకవ్యవహారములలో ఉన్నప్పుడు, సుఖ – దుఃఖాది దశలు పొందవలసివస్తున్నప్పుడు నీవు బ్రహ్మము తోటి ఏకత్వము త్యజించకపోవటమే అసంగమునకు గుర్తు.

ఎప్పుడైతే నీ చిత్తము ఆత్మ సంవేద్యముతో కూడి ఉంటుందో, ఎరుగబడిన బ్రహ్మముగానే సర్వదా శేషించి ఉంటుందో – అప్పుడది సర్వ సంగములను అధిగమించినట్లే. అటుపై, యథా ప్రాప్తములైన క్రియలను ఆచరిస్తున్నప్పటికీ అసంగుడవే. ఇందులో సందేహం లేదు.

అనాయాసంగా, అకృత్రిమంగా చేకూరు అసంగత్వమే జీవన్ముక్తుని 'సుస్థిర స్థితి' అయి ఉన్నది. ఓ దాశరథీ! నీవు అద్దానినే ఆశ్రయించు. స్వస్థుడవై, వీతరాగుడవై, మౌనివై, ఇంద్రియపాశములను నిగ్రహించినవాడవై, ఉత్తమ జ్ఞానివై, ఆర్యుడవై, మాన–మద–మాత్సర్యరహితుడవై ఉండుము. మనం పదే పదే చెప్పుకుంటున్న జీవన్ముక్తుల స్వభావమును సంతరించుకో. సంతాపరహితుడవై ఉండు.

భోగ – విక్షేపాదులకు కారణంకాగల వస్తు సముదాయం నీ చుట్టూ చేరవచ్చుగాక! లేక, ఒక్కొక్కటే తొలుగుతూ ఉండుగాక! వాటితో నీకేమి సంబంధం? నీవు జ్ఞానివై, సమచిత్తుడవై ఉంటే, వాటి ప్రాప్తాప్రాప్తములు నిన్నేమీ చేయలేవు. అదీన స్వభావుడవై నీకు నియమించబడిన ఆయా ధర్మములను వాటి సహజ సంక్రమిత ప్రాప్తములను బట్టి ఎప్పటికప్పుడు నిర్వర్తించు. అన్యమేమీ ఆచరించని వాడవు, యోచించని వాడవు కమ్ము. అయినప్పటికీ సర్వమునకు అకర్తవై ఉండు. ఫలాభిలాష, క్రియాభినివేశము లేకుండానే జ్ఞాని ప్రవాహపతితము, ప్రకృత క్రమమును అనుసరించి తన విధులను నిర్వర్తిస్తున్నాడు. అట్లా నిర్వర్తిస్తూనే స్వాత్మయందు క్రీడించుచున్న అనేక ఉదాహరణలు మనం చెప్పుకున్నాం. ఇంకా చెప్పుకోబోతున్నాం.

పెరుగు చిలకబడినప్పటికీ తన తెలుపుదనం కోల్పోతోందా?... మహామతియగు జ్ఞాని తన యొక్క పూర్వసిద్ధ స్వభావమగు శమ – దమ – శాంత – సహకార – సంతోష – సమదర్శనములను

ఎన్నటికీ వీడడు. ఆతనికి చక్రవర్తి పదవి లభించుగాక! క్రిమికీటక ఉపాధులు లభించుగాక! అకస్మాత్తుగా ఇంద్ర పదవి ప్రాప్తించుగాక! బ్రహ్మదేవుని పదవి వచ్చి తలుపుతట్టుగాక! అందులో ఆతనికి సంతోషించవలసినదిగాని, దుఃఖించవలసినదిగాని ఏదీ కనిపించదు. పున్నమినాటి రాత్రంతా చంద్రుడు ఒకే రీతిగా ప్రకాశిస్తాడు చూచావా? ఆతడు కూడా ఆయా అన్ని స్థితులందూ ఏక రూపంగానే భాసిస్తూ ఉంటాడు. ఓ రామా! హృదయంలోంచి సర్వ క్రోధ, భేదములనూ, తదితర భూతాకారములను బయటకు పారద్రోలివేయుము.

అంతిమ పురుషార్థమైనట్టి 'మోక్షము' అను కార్యమునందు మాత్రమే ప్రతిష్ఠితుడవు, తత్పరుడవు అయి ఉండుము. వాసనలన్నీ క్షయించుగాక!

నీ బుద్ధి శుద్ధమై ఆత్మ పదమును అందింపజేయునదై ఉండుగాక! అవిద్యను, తత్కార్యములను దగ్ధమొనర్చుటలో సమర్థమగు గాక! అట్టి బుద్ధిచే నిరతిశయ పరమానందమున సంస్థితుడవయ్యెదవు గాక!

అప్పుడు జనన మరణాది బంధములచే నీవు పరిమితుడవు కావు. సర్వదా అపరిమితుడవై ఉంటావు. అట్టి ఆత్మ తేజోమూర్తివైన నీవు సర్వులకూ వందనీయుడవౌతావు.

❖❖❖

**(14వ రోజు విచారణ పూర్తి అయింది).**

❖❖❖

# ఉపశమన ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు – లోక కళ్యాణమస్తు

ఓం తత్‌సత్

❖❖❖

ఓ రామా! మలినము, చంచలము అయిన 'అహంకారము'ను హృదయము నుండి పారద్రోలివేయి. మరుక్షణం అపరిచ్ఛిన్నుడు, సర్వవ్యాపకుడు, సర్వేశుడు, వాసనారహితుడు, శాంత చిత్తుడు అగు ఆ ఆత్మదేవుడు నీ హృదయమున స్వయముగా ప్రభువై విరాజిల్లుతాడు.

'తత్త్వవిచారణ'చే 'ఆత్మ' అను జ్యోతి ప్రాప్తించగా, సమస్తదోషములు తొలగిపోతాయి. అట్టి ఆత్మ స్వరూపుడగు జీవుడు ఈ జననమరణములలో, ఐహిక పారలౌకిక స్థితులలో ఉద్వేగరహితుడై ఉంటున్నాడు. అతడు స్వదేహనగరంలో తాపత్రయరహితుడై విలాసంగా విహరిస్తున్నాడు.

**వసిష్ఠ మహర్షి**

**పుట:176**

CONQUER YOURSELF
ISBN 93-83972-14-2 (Set)
9789383972142
www.rkmath.org

**రామకృష్ణ మఠం**
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org

Vasishta Rama Samvadam : Vol 2
ISBN 93-83972-11-1 ₹ 1000/- (set)

# వసిష్ఠ రామ సంవాదం

## (యోగ వాసిష్ఠమ్)



మూడవ సంపుటం

నిర్వాణ ప్రకరణము

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## (శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత యోగవాసిష్ఠము)

**మూడవ సంపుటం**

**నిర్వాణ ప్రకరణము**

*అనుసృజన:*

**వై. హెచ్. రామకృష్ణ**

**రామకృష్ణ మఠం**

**దోమలగూడ, హైదరాబాదు-500 029**

# ప్రవేశిక

అఖండ రామాయణంలోని చివరి ప్రకరణం అయిన నిర్వాణ ప్రకరణంలోకి ఇప్పుడు ప్రవేశిస్తున్నాం. ఆరు ప్రకరణాల్లోకీ శ్లోక సంఖ్యాపరంగా ఇది పెద్దదవటమేకాదు; ఇందులో చర్చించిన అంశం కూడా గంభీరమైనది. మొదటి ప్రకరణాల్లో చర్చించిన అంశాలు సూక్ష్మమైనవైతే, ఇందులో చర్చించిన విషయం సూక్ష్మతరం, సూక్ష్మాతి సూక్ష్మం అని పేర్కొనవలసి ఉంటుంది. నిజానికి అన్నింటిలో చర్చించిన విషయం ఒక్కటే ఐనప్పటికీ ఏ స్థాయినుంచి, ఏ భూమికనుంచి, ఏ కోణం నుంచి విషయాన్ని విశ్లేషిస్తున్నాం అన్న దాన్ని బట్టి చర్చించిన అంశం విభిన్నంగా వ్యక్తమవుతుంది.

ఈ ప్రపంచ మంతా ఉదయాస్తమ రహితమై, అఖండప్రకాశ రూపమై, నిర్మలమై, శిలవలె మౌనరూపమై, నిర్వికారమైనట్టి శాంతమగు బ్రహ్మయే అయిఉన్నది అంటుంది ఈ ప్రకరణం. ఇది కేవలం భావన కాదు. పరమ సత్యం. మనకు అనుభవమౌతున్న జగత్తు అవిద్యారూపం. అజ్ఞాన జనితం. బ్రహ్మానికి  వేరైన సత్తాలేనిది. కావున ఈ ప్రకరణం నుంచి మనకు, ద్రష్ట దర్శన దృశ్య త్రిపుటిని భేదించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి, ఏకత్వరూపంగా మిగిలిపోవలసిందని శాస్త్రమాత ఉద్బోధము.

వాయువు, వాయు స్పందన ఏవిధంగా వేరుకావో అదేరీతిన చైతన్యం లేదా చిత్తు మరియు విషయ జగత్తు వేరు కావు. చిత్ స్పందనే జగత్తు.

చైతన్యానికి వేరుగా ఏమీ లేదని, ఇంద్రియాలు, వాటికి అధిష్ఠానమైన మనస్సు, మనోకల్పితమైన విషయ ప్రపంచంతో సహా సర్వం బ్రహ్మమయమని ఈ ప్రకరణం నుంచి జ్ఞాని గ్రహిస్తాడు. దేహం అందులోని చిత్ రెండూ వేరు కావన్న భావం కలిగిన సాధకుడు బ్రహ్మభావాన్ని పొందుతాడు. నిర్వాణ సౌఖ్యాన్ని అనుభవిస్తాడు.  సర్వం చిన్మయమని గ్రహించిన వ్యక్తి శోక మోహరహితుడై, భేదదృష్టి వీడినవాడై ఏకత్వానుభవం పొంది కేవాలానంద స్వరూపుడిగా నిలుస్తాడు.

నిర్వాణ ప్రకరణం లో చెప్పిన విషయాన్ని సులభంగా గ్రహించాలంటే ముందు ప్రకరణాల్లో పేర్కొన్న విషయాన్ని అవగతం చేసుకుని ఉండాలి. ఉత్పత్తి, స్థితి ప్రకరణాలు దృశ్యావిర్భావానికి మరియు దృశ్యానుభూతికి కారణాలు బోధించాయి అని అనుకున్నట్లైతే; నిర్వాణ ప్రకరణం సముద్రం నుండి ఉద్భవించే తరంగాలు ఏవిధంగా సముద్రానికి భిన్నం కావో అదేవిధంగా దృశ్యజగత్తు కూడా చిదభేదం కాదని ఉద్ఘాటిస్తుంది. మనోనిర్మితమైన వస్తు ప్రపంచం మనస్సుతో సహా చిత్ శక్తియే. చిద్విలాసమే. చిదాంతర్గతమే. చిద్రూపమే. చిన్మయమే. చిత్స్ఫురణయే అని తెలుపుతుంది. ఐతే జగత్తు చిదభిన్నం ఐనప్పుడు పురుష ప్రయత్నం చేయటం, మోక్షాన్ని పొందటం అన్నీ అసంగతాలు కావా అంటే మనకు ఇంద్రియగోచర జగత్తుకు సంబంధించిన ఎరుక ఉన్నంత సేపు ఆ ఎరుక తొలగే వరకూ ప్రయత్నం చేయాల్సిందే. అంటే మొదటి ప్రకరణాల్లో చెప్పిన విచారణ అనే పురుష ప్రయత్నాన్ని అనుష్ఠించి మనస్సును పరిశుద్ధ మొనర్చుకున్న జిజ్ఞాసువు మాత్రమే ఈ ప్రకరణం లో పేర్కొన్న కేవలాద్వైతాన్ని అనుభవ మొనర్చుకోగలడు. అలా కాకుండా ఇందులోని ఉత్కృష్ట భావనలను అపరిశుద్ధ మనస్కుడికి బోధిస్తే విరుద్ధంగా, విపరీతంగా అర్థంచేసుకునే ప్రమాదముంది. అందువలన శాస్త్రంలో పేర్కొన్న విషయాన్ని అందులో పేర్కొన్న క్రమంలోనే చదవాలి.

**– ప్రకాశకులు**

# విషయ సూచిక

❖❖❖

రఘునాథాయ నాథాయా సీతాయాః పతయే నమః

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## VI. నిర్వాణ ప్రకరణం

(పూర్వార్థం)

# పదిహేనవ రోజు

# I. ప్రకరణ పరిచయం

## 1. అవ్యక్త ఆత్మ స్వరూపం

సూర్య భగవానుడు తన సహస్ర కిరణ జాలములను లోకములపై ప్రసరింపజేయటంతో ఉదయారంభమైనది. రామలక్ష్మణాదులు మహర్షి వసిష్ఠులవారి ఆశ్రమం ప్రవేశించి మహర్షిని సుస్వాగతపూర్వకంగా ఆశ్రమంనుండి సభాప్రాంగణమునకు రథముపై తోడ్కొని వచ్చారు. సభ యథారీతిగా ప్రారంభమైంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మానంద స్వరూపులగు ప్రియశ్రోతలారా! లోకకళ్యాణ, చిరుదరహాసాలంకారుడ వగు ఓ రామచంద్రా! ఈ రోజు నుండి మనం నిర్వాణము గురించిన సంవాదంలో ప్రవేశిస్తున్నాం.

ఓ రామచంద్రా! ముముక్షు వ్యవహారం మొదలుగా మనం అనేక విషయాలు చెప్పుకోవటం జరిగింది. క్రమంగా నీవు నీ చిత్త విహంగాన్ని హృదయమనే పంజరంలో ఉంచి వశపరచుకుంటు న్నావు కదా? నాయనా! హంస పాలు స్వీకరించేటప్పుడు, అందులోని జలభాగాన్ని వదలి పాలసారమే గ్రహిస్తుంది కదా! అట్లాగే మన ఈ సుదీర్ఘ సంవాదములోని అసంగతమైనది, దుర్బోధ్యమైనది ఏదైనా ఉంటే..అది విడిచి, సారాన్ని జాగ్రత్తగా గ్రహిస్తున్నావని నేననుకుంటున్నాను.

1. వాసనాక్షయం, 2.మనో నాశనం, 3. ప్రాణ నిరోధం, 4. జ్ఞానాభ్యాసం...

ఈ నాలిగిటి గురించి అనేక విశేషాలు మనం ఉపశమన విభాగంలో చెప్పుకున్నాం. వాటినన్నిటినీ నీవు చక్కగా స్వబుద్ధితో పరిశీలించి, అనుగమించాలి. ఈ పథం అనుసరిస్తే నీవు బద్ధుడవు కావు. అట్లా గాకుండా, శ్రద్ధ, పట్టుదల, ప్రయత్నము ఆశ్రయించక, కేవలం దిగులుపడుతూనో ...లేక ఇంద్రియ విషయ సేవనతోనో రోజులు గడిపేస్తూ ఉంటే ...వింధ్యపర్వత శిఖరం నుండి అమాయక ఏనుగు పతనమైనట్లు ఈ జీవుని అధఃపతనం అనివార్యం. మన ఈ సంవాదములోని అంతర్లీనసారాన్ని గ్రహిస్తూ, తమ తమ సాధనలను కొనసాగించుకుంటూ ఉండమని సర్వజనులకు మరొక్కసారి గుర్తు చేస్తున్నాను. శ్రద్ధ, అవగాహన పెంపొందించుకోకపోయాడా, బాటసారి చీకటి పడుటచే ఒక అడవిలో చిక్కుకున్నట్లు, ఈ జీవుడు ఈ సంసారారణ్యంలో చిక్కుకోవలసి వస్తుందని హెచ్చరిస్తున్నాను.

ఓ రామా! సంగరహితుడవై యథాప్రాప్తములైన లోకవ్యవహారములను ఆచరించుటయే శాస్త్ర సిద్ధాంతం. దీనిని నీవు గ్రహించి ఉదారచిత్తుడవగుము.

ఇంతవరకూ ఉపశమనము గురించిన విభాగంలో చిట్ట చివరివరకూ మనం చెప్పుకొన్న విషయాలలోని గంభీరార్థం జ్ఞాపకం ఉంచుకుంటున్నావు కదా!

ఇప్పుడిక శాశ్వత సిద్ధి ప్రసాదించగల మరికొన్ని విశేషాలు చెప్పుకోబోతున్నాం. అయితే, అభ్యాస-వైరాగ్యాలను నిరంతరం అలవర్చుకుంటూ ఉండవలసిందే. తద్వారా తత్త్వచింతన సుస్థిరరూపం పొందుతుంది. తత్త్వం చక్కగా గ్రహించటంచేత దుర్భేధ్యమైన వాసనావేశం బలహీనపడుతుంది. అప్పుడు శోకరహితమైన 'తత్పదం' తప్పక లభిస్తుంది. మన ఈ వర్తమాన సంవాదం అందుకు తప్పక సహకరించగలదు. అందుచేత మీమీ శాస్త్రప్రవచితమైన, ఆశ్రమోచితమైన అభ్యాసాలు చక్కగా నిర్వర్తిస్తూ ఉండండి.

దేశ-కాల-కారణములచే పరిచ్ఛేదమొందజాలని బ్రహ్మమే ఈ జగత్తు రూపంగా వెలయుచున్నది. అయితే, చమత్కారంగా ద్వైత భ్రాంతిని మాత్రం కలుగజేస్తోంది. నిర్విషయమై, సమమై, శాంతమయమైనట్టి బ్రహ్మమొక్కటే ఉన్నది. ఇక్కడ అన్యత్వానికి తావేలేదు. ఈ విషయం పదే పదే నిరూపించుకున్నాం. నిరూపించుకోబోతున్నాం కూడా!

ఇక అహంకారమంటావా... అద్దానిని లేని దానిగానే చూడు. ఈ పిపీలికాది బ్రహ్మ పర్యంతరం (పురుగు నుండి, బ్రహ్మదేవుని వరకూ) ప్రశాంతంగా సర్వశరీరములలోనూ ప్రసరించి ఉన్న ఆత్మను దర్శించగలగటమే "అపరోక్షానుభవం." నిజానికి చిత్తము గాని, అవిద్య గాని మనస్సు గాని, జీవుడు గాని లేనేలేవు. ఇవన్నీ ఆ బ్రహ్మమునందు ఏర్పరచబడుచున్న కల్పనలు మాత్రమే. భోగములు, అద్దాని పట్ల ఏర్పడే వృత్తులు, ఆసక్తి, అనుభవం - ఇవన్నీ కూడా సముద్రంలోని తరంగాలులాగా బ్రహ్మములోనే ఉద్భవిస్తున్నాయి. స్వర్గ-భూ-పాతాళ లోకములలోను, భూత-వర్తమాన-భవిష్యత్తులలోను, బ్రహ్మదేవునిలోనూ, స్తంభములో కూడా... ఆ పరబ్రహ్మమొక్కటే జ్వాజ్వల్యమానంగా ప్రకాశించుచున్నది. దానికి భిన్నమైనదంటూ ఏదీ లేదు. గ్రాహ్య-త్యాజ్యములలోనూ, బంధుమిత్ర వ్యవహారములందు, తదితర సర్వ ఉపాధులలోనూ ఆద్యంతరహితమై విజృంభిస్తోంది ఆత్మయే.

అజ్ఞాన భ్రమ ఉన్నంతవరకు జలంలో తరంగభావనలాగా 'జగత్ కల్పన' అనే చిత్తము యొక్క ద్వితీయ ఆవృత్తి ఉండనే ఉంటోంది.

"నేను దేహమును, ఈ దృశ్యమంతా నిజమే అయి ఉన్నది, ఇది నేను, అవి నావి" ...ఇటువంటి కల్పనలు, భావతమకములు ఉన్నాయంటే మనోచాంచల్యము ఏర్పడుచున్నట్లే! జీవుడు సజ్జన - సద్విషయ - సద్వివేక సాంగత్యం ద్వారా పూర్ణత్వం సంతరించుకోనంత వరకు చిత్తం నీచత్వం పొందుతూనే ఉంటుంది. సర్వసమదర్శనం ద్వారా విశ్వభ్రాంతిని బలహీనపరచుకుంటే గాని తన స్వరూపమేమిటో ఈ జీవునకు అర్థం కాదు, తోచదు కూడా! అజ్ఞానం అనే గుడ్డితనం వలన మోహం, మోహం వలన మూర్ఖత్వం, మూర్ఖత్వం ద్వారా విషయ ఆశలు, విషయవాసనలు వచ్చి పడుతున్నప్పుడు మరి జీవుడు ఉపాయాలను ఆశ్రయించాలి కదా? హృదయవనంలో ఆశల దుర్గంధం నిరంతరం ఉబుకుతుంటే 'ఆత్మవిచారణ' అనే చకోరం ఎట్లా ప్రవేశిస్తుంది? భోగములను ఆశించటం

కాస్త ఆపి, సమచిత్తం పెంపొందించుకోకపోతే ఈ జీవుని పీడించే పాశాలు తెగేదెట్లా? తృష్ణను జయించి శీతల మనస్కుడు కాకపోతే ఈ జీవునికి స్వస్వరూప ప్రబోధం వినబడేదెట్లా? అవునా, కాదా?

**శ్రీ రాముడు:** ఔను మహర్షీ! అయితే, 'చిత్తం' అనబడేది అనే పిశాచి అసలు ఉత్పన్నం కాకుండేదెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ ఎదురుగా కంటికి కనబడే వస్తువులను "లేనివి"గా, అతి దగ్గరగా అనుభవ మయ్యే ఈ దేహమును "బాహ్యమగు ఉపకరణ మాత్రం"గా చూడగలిగిన నాడు జీవునికి చిత్తం ఉత్పన్నమే కాకుండగలదు. 'నేను పుట్టుక – చావుల మధ్య ఇరుక్కున్న ఒక అల్ప జీవుడను' అనే ప్రారంభ భ్రమతో బాటు తదితర అసంఖ్యాక భ్రమలకు కారణమగుచున్న 'జగత్తు' అనబడేది అంతరంగంలో శాంతించటమే అన్నిటి కన్నా అతి ముఖ్యమైన ఉపాయం. అందుకు శ్రవణ–మనన–నిధి–ధ్యాసనల ద్వారా హృదయంలో ఆత్మ సాక్షాత్కరించటమొక్కటే మార్గం. మిథ్యాభ్రమలు కలిగించే అజ్ఞానం శాంతించి 'పరమార్థదర్శనం' అనే సూర్యుడు ఉదయిస్తే చిత్తం దానంతట అదే ఎండుటాకు వలె నేల రాలుతుంది. నిప్పులో పడ్డ నేయి వలె లేకుండాపోతుంది.

**శ్రీరాముడు :** మహాత్మా! మహాత్ములలో కూడా 'చిత్తం' ఉంటుందా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఉంటుంది. అయితే సముద్రం ఒడ్డున నీరు ఎండిన చోట నీటి జాడలు కనిపిస్తాయి చూచావా! అట్లా పేరుకు మాత్రమే ఉంటుంది. ఎందుకంటే మహాత్ముల చిత్తం పరాపరదర్శనంతో కూడుకొని ఉంటుంది. జీవన్ముక్తమై ఉంటుంది. శుద్ధసత్వమయమగుటచే నామకః మాత్రమే అయి ఉంటుంది. వారిలో వాసనలు సత్వమయమై ఉండటం చేత వారిది చిత్తము అని అనిపించుకోదు. 'సమరసము' అను రుచితో కూడిన ఆ తత్త్వజ్ఞులు అమనస్కులే! వారు లోకహితైషులై ఈ ప్రపంచంలో సంచరిస్తూ ఉంటారు. శుద్ధులై, శాంతులై, మహోన్నతులై, సంయతీంద్రియులై తమ లోపల, బైట అద్వైతజ్యోతి సమన్వితులై ఉంటారు. ద్వైత వాసనలు వారిని సమీపించలేవు. ఈ దృశ్యము అనే తృణములు (గడ్డిపరకలు) వారి జ్ఞానము అనే అగ్నికి ఆహుతై అవిషయములగుచున్నాయి. వారి సంచారములు, మనోధర్మములు లోకకళ్యాణోద్దేశ్యం మాత్రమే కలిగి ఉంటాయి. అట్టి చిత్తంలో ఇక భ్రమలేవీ ఉండవు.

దగ్ధమైన బీజం మరల అంకురిస్తుందా? ఆ మహా మహితాత్ముల హృదయాకాశంలో మోహం ఉద్భవించదు.

దేనినైతే మనం 'చిత్తము' అని పిలుస్తున్నామో అది మూఢులకు పదే పదే జన్మజరామరణములు కలిగించటానికి కారణమౌతోంది. జ్ఞానుల చిత్తం ఒక మహాశిల్పి చేతిలోని ఉలిలాగా గొప్ప ఉపయుక్త మగు ఉపకరణమగుచున్నది. అనగా, అదే చిత్తము "జ్ఞానానందమయ దృష్టి"ని సంపాదించుకోవటానికి పరికరమగుచున్నది. అట్టి చిత్తము అజ్ఞాని యొక్క చిత్తంలాగా పదే పదే పునరుత్పత్తి పొందటం లేదు.

**శ్రీరాముడు :** ఏకత్వం తాండవిస్తోందని చెప్పబడే ఈ జగత్తు మాకు పరిపరి విధాలుగా కనబడటానికి కారణమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వస్వరూపము, సర్వ స్వరూపము అగు బ్రహ్మమును ఏమరచుట చేతనే!

**బ్రహ్మబృంహైవ హి జగజ్జగచ్చి బ్రహ్మబృంహణమ్।**
**విద్యతే నానయోర్భేదశ్చిద్ఘన బ్రహ్మగోరివ॥** (శ్లో. 51 సర్గ 95)

అయితే ఈ జగత్తు, బ్రహ్మము, శుద్ధ చిత్తము – ఈ మూడు వేర్వేరు కాదని గ్రహించు. అవి అభేదమైనవే! మిరియములో కారం ఉన్నట్లు... మూడు జగత్తులూ చిత్‌లోనే ఉన్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ జగత్తు ఉత్పత్తి, ప్రళయముల మాటేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జగత్ యొక్క ఉత్పత్తి, ప్రళయములు కేవలం కల్పిత మాత్రములే. ఇక అది ఉండటం ఉండకపోవటం (సత్ – అసత్) అనునదంతా ఖండజ్ఞానముచే ఏర్పడుచున్నదే! భ్రాంతి చేత చైతన్యమునందు జడత్వము ఆపాదించబడి, గాంచబడుతోంది. ఫలితంగా అట్లు జడ భావనచే చూస్తున్న ద్రష్టయగు ఈ జీవుని ఇక సర్వ అప్రతిష్ఠలు, సర్వ అల్పావగాహనలు చుట్టుముట్టుచున్నాయి. అతను దుఃఖితుడౌతున్నాడు. మరి ఆ దుఃఖాలు తొలగక్కర్లేదా?

**శ్రీరాముడు :** ఈ జీవుని అంతరాంతరాలలో దుఃఖం పేరుకుని ఉన్న మాట మాత్రం నిజం. అది తొలగవలసిన అగత్యమున్నదనునది అత్యావస్యకం కూడా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అందుకు విచారణ చేయాలి. కాస్త విచారణ చేస్తే, "ఈ జడ జగత్తు వాస్తవమే కాదు" అని తేలుతోంది. కల్పనలన్నీ కల్పనలను ఆశ్రయించే స్వభావం గల ఈ జీవునియందే ఉన్నాయి గాని... జగత్తునందు కాదు.

ఈ దృశ్యమును చిన్మయముగా భావించగలిగిన చిత్తము శుద్ధమైనట్లే. అద్దానిలో బైట, లోపల ఇక కల్పనలు ఉండవు.

ఆత్మయే స్వరూపముగా గల ఈ జీవుడు స్వస్వరూపమును ఏమరచినప్పుడల్లా అల్పత్వము పొందుతున్నాడు. అందుచేత సర్వ జనులారా! మీ యొక్క సత్యస్వరూపం ఈ నామ రూపాత్మక దేహం కాదు. జగత్తులోని ఒక పదార్థం కాదు. అది ఆద్యంత రహితమై, నిరంశమై, చిదాత్మకమై అఖండమై ఈ కనబడే దాని కంతటికీ అతీతమైయున్నదని గుర్తు చేస్తున్నాను. మరల–మరల ఆ పరిపూర్ణత్వమును స్మరించి, అద్దానిచే శాంతులై అప్పుడు ఈ సర్వమును పరికించండి. అప్పుడు, "జగత్తు – చిత్తము – బ్రహ్మము ఒక్కటే వేర్వేరు కాదు" అను గూడార్థం మీకు తప్పక గోచరించగలదు. స్ఫటికము వలె శుభ్ర స్వరూపుడగు ఈ జీవుడు తనకు తానే కల్పనచే ఈ సంసారరూపంగా క్రీడయందు వలె తాండవమాడుచున్నాడు.

ఓ రామచంద్రా! ఈ కనబడే పదార్థములేవీ నీవు అయి ఉండలేదు. అవి నీ యందు లేవు. నీవు వాటియందు లేవు. ఓ అవ్యక్తరూపా! చిద్ఘనాత్మా! చిదానంద స్వరూపుడా! ఆద్యంతవివర్జితుడా! సర్వవ్యాపీ! శుద్ధ చిత్త సమన్వితుడా! స్వాంత స్థితుడా! లీలామాత్రజగద్ధారీ! మావంటి మునులందరికీ ధ్యేయమైనవాడా! నీ వాస్తవ స్వస్వరూపమునకు వేనవేల నమస్కారాలయ్యా! ప్రతి ఒక్క జీవుడు నీ స్వరూపమే! నీవే ప్రతి ఒక్క జీవుని స్వరూపం కూడా! మేమంతా నీస్వరూపమే! ఆత్మారాములమే!

❖❖❖

# 2. లేనిది లేనిదానిగా చూడాలి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! సముద్రంలో అనంత సంఖ్యలో తరంగాలు లేవటం లయించటం జరుగుచున్నట్లు, ఈ జగత్తులు అనంత సంఖ్యలో ఆత్మయందు ఉత్పన్నమై లయిస్తున్నాయి. ఎవ్వడైతే అద్వైత భావనచే భావాభావ వివర్జితుడై ఉంటాడో, ముక్త స్థితిలో ఉంటాడో అతనియందు ఈ జగద్వాసనలే కానరావు. స్వప్నానికి రూపం లేనట్లే, ఈ జగత్తులకు వాస్తవమైన రూపమేదీ లేదు!

అసలు ఈ 'జగత్తు – జీవుడు' అనునవి చిత్తము యొక్క కల్పనలే సుమా! ఇక మిగతావాటి గురించి వేరుగా చెప్పేదేమున్నది?... అందుచేత జగద్వాసనలు (Worldly tendencies) క్షయించాలి.

వాసనలు క్షీణమొందగానే నీవు చిత్‌సముద్రుడవౌతావు. మహా గంభీరుడవు, సౌమ్యుడవు, ఆత్మారాముడవు కాగలవు.

అగ్ని నుండి వేడి, పుష్పము నుండి సుగంధం, కాటుక నుండి నలుపు, చెఱుకు నుండి తీపి, తేజము నుండి వెలుతురు, జలము నుండి తరంగం వేరుకానట్లు... 'చిత్తము' అనే స్వకీయ సంకల్ప వ్యవహారము కంటే జగత్తు అనబడేది వేరు కాదు.

**చితో న భిన్నో 'అనుభవో', భిన్నో న అనుభవాత్ 'అహం'।**
**న మత్తో భిద్యతే 'జీవో', న జీవాత్ భిద్యతే 'మనః' ॥**
**మనసో న ఇంద్రియం భిన్నం, పృథక్ దేహశ్చ న ఇంద్రియాత్**
**న శరీరాత్ జగత్ భిన్నం, జగతో నాఽన్యదస్థి హి ॥**

చిత్ కంటే అనుభవం వేరు కాదు. అనుభవం 'అహం' (నేను)కు వేరు కాదు. 'అహం' జీవుని కంటే వేరు కాదు. అట్టి జీవుడు మనస్సు కంటే అన్యమైనవాడు కాదు. మనస్సు ఇంద్రియార్థములకు వేరుగా లేదు. ఇంద్రియార్థములు ఇంద్రియాల కంటే వేరు కాదు. ఇంద్రియాలే శరీరం. అట్టి ఇంద్రియ విషయాలే ఈ జగత్తు – ఇంక వేరే ఏమున్నది? ...ఈ విధంగా చూస్తే ఈ జగత్తు చిదాకాశమే అయి ఉంది.

జ్ఞానదృష్టికి ఇదంతా స్వకీయ కల్పనామాత్రమే! జ్ఞాని యొక్క భావనలో ఇదంతా తొందరగా గాని, నెమ్మదిగా గాని, అసలుగా గాని ప్రవర్తించుటయే లేదు.

అఖండమైన ఆత్మజ్ఞానం లభించిన వారికి ఆకాశ స్వరూపమగు పరబ్రహ్మమొక్కటే తనలో – తనతో తానై దృశ్యజగత్తుగా వెలయుట స్ఫురిస్తోంది. తదితరమైనదేదీ వారికి అగుపించుటయే లేదు. అట్టి మహనీయులకు శూన్యం శూన్యంలోను, సత్యం సత్యంలోను, పూర్ణం పూర్ణంలోను తెలియవస్తున్నాయి.

జ్ఞాని అందరి వలే లోక వ్యవహారాలు నిర్వర్తిస్తున్నప్పటికీ... అతనిలో ఒక ప్రత్యేకత ఉంటుంది. అతనికి దేనిపట్లా కూడా ఆసక్తి అనేది ఉండదు. అందుచేత అతనికి కర్తృత్వ భోక్తృత్వాలు కూడా ఉండవు. కనుక ఏది ఎట్లు చేస్తున్నా, ఏదీ చేయనివాడే అవుతాడు. ఆసక్తితో కూడి ఉన్నప్పుడు

మాత్రమే క్రియలు సుఖ దుఃఖములుగా పరిణమించటం జరుగుతోంది. ఆసక్తి లేకపోతే కర్తృత్వం ఉండదు. సుఖ దుఃఖాలూ ఉండవు.

అనంతమగు ఆకాశమే తూర్పు - పడమర - పైన - క్రింద... మొదలైన వాక్య వ్యవహారాలుగా ఏర్పడుచున్నది కదా! బ్రహ్మమే కర్తృత్వాభిమానం చేత జగత్తుగా సంకల్పించబడుతోంది.

ఎవని చిత్తము ఆకాశము వలె శుద్ధమైనదో, ఎవడు సదాచారపరాయణుడో, ఎవడైతే మట్టి - చెక్క లాగా సంతోష దుఃఖములకు అచలితుడో, ఎవడు తనను చంపవచ్చిన శత్రువును కూడా అకృత్రిమ స్నేహంతో పరబ్రహ్మంగా దర్శించగలుగుతాడో... అట్టివాడే పరమసత్యాన్ని దర్శించటానికి అర్హత సంపాదించుకో గలుగుతాడు.

**శ్రీరాముడు:** మహాత్మా! ఈ జీవుడు ఎప్పుడు సుఖ దుఃఖములకు అతీతుడవగలుగుతాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నదిలోని నీరు గట్టుమీద ఉన్న వృక్షమును మొదలంట సమూలంగా పెకలించు నట్లు హృదయంలోంచి మదము, మాత్సర్యము మొదలైన వాసనలు మొదలంటా నిర్మూలించ బడినప్పుడు మాత్రమే ఈ జీవుడు సుఖదుఃఖాతీతుడు కాగలుగుతాడు. రాగ ద్వేషాలకు అసలు కారణములేమిటో విచారించి, హృదయగుహలోంచి ఈ సర్వ వికారములను వెడల గొట్టకపోతే, కాషాయ వస్త్రాలు మాత్రమే ధరించిన అసాధువులాగా ఎంత విన్నా, ఎంత చదివినా ఏం లాభం?... అట్టివాడు తెలుసుకుంటూ కూడా తెలియనివాడే అవుతాడు.

అంతేకాదు. ఎవని యందైతే కర్తృత్వ భోక్తృత్వాభిమానములు సమూలంగా తొలగి ఉంటాయో, బుద్ధి నిర్లిప్తమై ఉంటుందో... అతడు ఈ లోకంలో ఉన్నవారందరినీ చంపినా కూడా చంపనివాడు గానే ఉంటాడు.

**శ్రీరాముడు:** అట్టి నిరంహంకారం ఎట్లా సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వతహాగా లేని దానికి 'ఉన్నది, ఉన్నది' - అని సద్భావనను కల్పించటమే మాయ. ఇంక అహంకారమో... స్వతఃసిద్ధంగా లేనే లేదు.

జ్ఞానాన్ని అవలంబించటం చేత ఈ విషయం సుస్పష్టమౌతోంది. లేనిది లేనట్లుగా గ్రహించటమే జ్ఞానం. జ్ఞాని హృదయంలో దృశ్య ప్రపంచవాసనలకు చోటు లభించదు. అట్టివాడు సామంతులను లోబర్చుకుంటున్నట్లు ఈ సంసార వ్యవహారములను నిర్ద్వంద్వంగా జయించగలుగు చున్నాడు.

ఈ ప్రపంచంలోని పదార్థములు కనిపిస్తున్నప్పుడు, కనిపించనపుడు, వైభవ-దారిద్ర్యములు వచ్చి పోవునపుడు, ఆరోప - అపవాద దశలందు, తదితరజనులతో ఏర్పడే సంయోగవియోగ సందర్భములందు ఎవనికి సంతోషము గాని విషాదముగాని కలుగవో - అట్టి మహనీయుని శాస్త్రములు 'జీవన్ముక్తుడు' అని పిలుస్తున్నాయి. ఓ సర్వసభికులారా! మీరు జీవన్ముక్తులయ్యేందుకు సాధనలు కొనసాగించెదరు గాక!

❖❖❖

# 3. మేలుకొలుపు

**శ్రీరాముడు:** స్వామీ! నిర్మలమగు చిదాత్మ "మనస్సు, బుద్ధి, అహంకారం, ఇంద్రియాలు, తదితర జీవులు" అనువాటిలోకి వెళ్ళి వెళ్ళి చిక్కుకున్నదే? ఎందుచేత? అట్టి బంధం విడివడేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నీవు చెప్పే మనస్సు, బుద్ధి మొదలైనవి చిన్మయసత్తను అతిక్రమించి ఎక్కడో ఉన్నాయనుకుంటున్నావా? బృహత్ స్వరూపమైన ఆత్మయే నానాత్వమంతా భ్రమింపజేస్తోంది. మెల్లకన్నువానికి ఒకే వస్తువు అనేక వస్తువులుగా కనిపిస్తుందే! వరుసలో నిలబెట్టిన దర్పణములలో ఒకే వ్యక్తి యొక్క అనేక ప్రతిబింబములు అనేక కోణములలో అగుపిస్తాయి చూచావా! ఇదీ అంతే!

అంధకారం తొలగితే ఆ చీకటిచే కల్పించబడిన క్రీనీడలు కూడా తొలగుతాయి కదా! మూర్ఖ సమన్వితమగు భోగవాసనలు ఉపశమిస్తే అజ్ఞానం కూడా వినష్టమైపోతుంది. 'తృష్ణ' అనే విశూచివ్యాధి ఉపశమిస్తుంది. చిత్తవాసనలు తమ బంధువులగు అనేక ఆవేశ కావేషాలతో సహా తొలగుతాయి. దారం తెగిపోగానే దానికి గుచ్చబడిన ముత్యములు జారిపోవునట్లు సర్వ సంసార సంస్కారాలు సన్నగిల్లుతాయి.

**అమనస్కం -** ఆ ఓ రామా! సంకల్పములు త్యజించుటచే అనాసక్తిపూర్వకమగు అమనస్కం లభిస్తుంది. శాస్త్రములు చేయిఎత్తి చూపుడువేలుతో చూపుచున్నది 'ఆత్మ' అనుపేరుతో గల ఆ అమనస్కమే! ఈ మర్మాన్ని గ్రహించక ఆత్మ అనగా మరేదో బాహ్య విషయంగా గ్రహించేవారు శాస్త్రహంతకులేనని నా అభిప్రాయం. అట్టివారు శాస్త్రములలోని పైపై మధ్యేమార్గ విషయములను మాత్రమే గ్రహించేవారు సుమా!

అజ్ఞానమే సర్వ జాడ్యములకూ కారణం. గాలి వేగం తగ్గితే పద్మం కదలికలు మాని నిశ్చలత్వం పొందుతుంది. అట్లాగే అజ్ఞానం క్షీణిస్తే ఇక ఈ దృశ్య వ్యవహారాలేవీ మనస్సును వ్యాకులపరచలేవు. నాయనా! రామా! నీవు ఈ వాక్యములను విని ఆసక్తి–అనాసక్తులను విడుస్తూ మనోస్థిరత్వం పొందుచున్నావనే అనుకుంటున్నాను.

ప్రియ శ్రోతలారా! అంతఃపురంలో నిదురిస్తున్న రాజు భేరీనినాదం విని నిదురలేస్తాడు చూచారా? మీరు కూడా నా ఈ ఉపదేశ వాక్యాలు విని అజ్ఞాన నిద్ర నుండి జాగృతమవ్వండి. ఓ రామచంద్రా! సామాన్యుల హృదయాలలో కూడా ఈ మన సంవాద వాక్యాలు హత్తుకుపోతాయి. ఇక అతి ఉదారహృదయుడవైన నీ పట్ల వ్యర్థమెందుకవుతాయి? ఎండచే ఎండి ఉన్న నేల నీరు పడగానే వేగంగా పీల్చున్నట్లు, "అత్యంత ప్రయత్నశీలము, జిజ్ఞాస సమన్వితం" అగు నీ హృదయంలో ఈ ప్రవచనాలు స్థిరత్వం తప్పకపొందుతాయి. మహనీయుల అనుభవాలు నీకు శిరోధార్యమౌతాయని, ఆయా విశేషాలన్నీ హృదయంలో పదిలపరచుకుంటున్నావని నాకు తెలుసు.

❖❖❖

# 4. అయోమయం నుండి స్వస్థానానికి... !

**శ్రీరాముడు :** హే మహర్షీ! పరమ పవిత్రమగు తమ ముఖ కమలం నుండి వెలువడుచున్న గురువాక్యములు నాకు అత్యంత విశ్రాంతిని, ప్రశాంతతను కలుగజేస్తున్నాయి. మీ ప్రవచనం వింటున్నప్పుడు నా యొక్క స్వానుభవమేమిటో చెపుతాను వినండి.

హే ప్రభూ! అమృతతుల్యములగు మీ వాక్యములలోని అంతర్లీన గానామృతం గ్రోలుచున్నాను. బాహ్యాంతరాలలో సంచరించే నా చిత్తం క్రమంగా శాంతమును సంతరించుకుని నా స్వరూపంతో ఐక్యం పొందుతోంది. చాలా సంవత్సరాలు అనావృష్టిచే శుష్కమైన పొలం ఒక రోజు కుండపోత వర్షంచే తడిసి ఆనందం పొందునట్లు... నా మనస్సు మీ వాక్యధారలచే అభిషిక్తమై పరమానందం పొందుతోంది. ఏనుగు మొదలైన జంతువులు ప్రవేశించని సరస్సు నిశ్చలమగునట్లు నేను నిశ్చల ప్రశాంతతను అనుభవిస్తున్నాను. పొగమంచు తొలగితే రహదారిలో దూరం నుండి వస్తున్న వాహనాలు సుస్పష్టంగా కనబడునట్లు... ఈ కనబడే దృశ్యంలో యథాతథమగు బ్రహ్మము సుస్పష్టమౌతోంది. దిక్ మండలమంతా ప్రసన్నంగా దృశ్యమానమౌతోంది. ఆశలు అనే మృగతృష్ణ యొక్క ఆనుపాను లేమిటో తెలిసిపోతున్నాయి. ఆసక్తి అనే వృథా శ్రమ దరిజేరటం లేదు. వసంతకాలంలో చెట్లు చిగురిస్తుంటే కోయిల ఆనందంగా కుహూనాదాలు చేస్తున్నట్లు...నేను విషాదములన్నిటి నుండీ తొలగినవాడనై ఆనందభరితుడనగుచున్నాను. ఎచ్చటైతే అమృతాస్వాదన కూడా స్వల్పాతిస్వల్ప విషయమై ఉంటుందో, అట్టి ఆత్మానందం నాకు తారసపడుతోంది.

ఆత్మయే స్వరూపముగా గల నాకు ఇదే నా నమస్కారం. అట్టి ఆనందం ప్రసాదిస్తున్న మీకు నమస్కారం!

సూర్యుడు ఉదయించగానే పిశాచమునకు సంబంధించిన భ్రమలు ఇంకా మిగులుతాయా? జ్ఞానోదయమగుచుండగా కల్పనలన్నీ నశిస్తున్నాయి. సంశయములన్నీ తొలగుతున్నాయి. శరత్కాలం లోని ఆకాశంలాగా నా హృదయం నిర్మలము, శాంతము, అనంతము – అయిన ఆనందమును పొందుతోంది. 'ఆత్మయందు కళంకం ఎట్లా, ఎప్పుడు, ఎక్కడి నుండి ఎందుకొచ్చింది?' ...ఇటువంటి సంశయాలన్నీ చీకటి రాత్రిలో ఉదయించిన పూర్ణచంద్రుని కిరణాలచే ఏర్పడిన దృశ్యమాన జగత్తులాగా విశదమగుచున్నాయి. సర్వము సర్వదా సర్వత్రా ఆత్మయే ఏర్పడి ఉండగా... ఇక 'ఇది వేరు, అది వేరు' అనే మిథ్యాకల్పనలకు తావెక్కడిది?

హే సద్గురూ! ఏదో తెలియని ఆవేదనకు, అగమ్యమునకు ఆలవాలమైన నా 15 రోజుల క్రితం స్థితినీ, ఇప్పటి నా స్థితినీ పోల్చి చూచినప్పుడు, అప్పటి నా మనోవేదనలను తలచుకోగానే నవ్వు వస్తోంది. 'ఆశలు–అవి తీరుట' మొదలైన దృష్టుల నుండి వైదొలగి తృష్ణారహితమగు స్థానం చేరుకున్నాను. మీ 'వాక్' అను అమృతధారలతో స్నానం చేసిన నేను ఇప్పుడు సర్వాత్మభావనను, సంపూర్ణ స్వభావమును సంతరించుకుంటున్నాను. తమ దయచేత బ్రహ్మభూమికను అధిరోహిస్తున్నాను.

ఇప్పటి నా దృష్టికి సూర్యమండలము కూడా పాతాళము వలె అధోవిషయమగుచున్నది. 'ఆసక్తి – అనాసక్తి' అనే సముద్ర తరంగముల నుండి లేచినవాడనై స్వస్వరూపమునందు సుప్రతిష్ఠితుడ నగుచున్నాను. స్వమహిమ యందు సర్వోత్కృష్ట రూపముతో వెలుగొందుచున్నాను.

ఆత్మయే స్వరూపముగా గల నేను నమస్కరింపతగినవాడనగుచున్నాను. అట్టి నాకు పదేపదే ఇవే నా నమస్కారములు.

ప్రభూ! ఇన్ని మాటలెందుకు? మీ వచనాలు నా హృదయ పద్మకోశంలో ప్రవేశించి అనుభవ జ్ఞానమును ప్రసాదిస్తున్నాయి. తద్వారా నిత్యానంద స్వరూపమగు జీవన్ముక్త స్థితి పొందుచున్నాను.

❖❖❖

# 5. మోహం ఎట్లా తొలగుతుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** శ్రీరామా! చాలా సంతోషం. నీ వాక్యములచే నేను ప్రసన్నుడనై నా ప్రవచనాన్ని కొనసాగించటానికి ఉద్యుక్తుడను, సముత్సాహుడను అగుచున్నాను.

ఇప్పుడు నీకు 'మోహం ఎట్లా తొలగుతుంది?' అనే విషయమై కొన్ని విషయాలు చెపుతాను. నీకు భేద బుద్ధి తొలగిందని నాకు తెలుసు. అయినా కూడా ఎల్లవేళలా జ్ఞానాభివృద్ధి అవసరమే. అందుచేత యథావిధిగా శ్రద్ధతో విను. మనం చెప్పుకోబోయే విశేషాలు ప్రీతికి, మనోసౌమ్యతకు తోడ్పడతాయి. ఈ తత్త్వము గ్రహించినవారి దుఃఖములు వాటంతట అవే తొలగిపోగలవు.

ఏ జీవుడైతే పంచభూతాత్మకమైన ఈ దేహమునందు ఆత్మ భావన సలుపుచున్నాడో, (ఎవడైతే 'నేను ఈ దేహమును మాత్రమే' అని తలచుచున్నాడో)... అతనిని అతని ఇంద్రియములే మరల మరల పరాభవిస్తున్నాయి. 'అనాత్మ భావన' అను దోషము యొక్క ప్రభావం అట్టిది మరి! అట్లా కాకుండా ఏ జీవుడైతే ఆత్మ జ్ఞాన పరాయణుడై, ఆత్మ తృప్తుడై ఉంటాడో... అతని ఇంద్రియములు అతనిని తమ మిత్రునిగా భావించి సేవిస్తాయి. ఆసక్తి–అనాసక్తులు త్యజించిన జీవునకు ఈ దేహము గాని, మరొక దేహం గాని పొందవలసిన అగత్యం గాని, అభినివేశం గాని ఉండదు. వాటి రాక పోకలకు ఆతడు అప్రమేయుడై మౌనంగా, లీలగా, క్రీడగా ఈ సర్వమును ఆస్వాదిస్తున్నాడు.

ఆత్మకు, శరీరమునకు సంబంధమే లేదు. చీకటి –వెలుగుల వలె ఆ రెండూ పరస్పర విరుద్ధాలై ఉన్నాయి. అందుచేత జడము, తుచ్ఛము, వినాశనశీలము, కృతఘ్నుము అగు శరీరము అనబడే ఒక జడ వస్తువుకు ఏమి కావలసివున్నదో అదే అగుగాక! సర్వ శక్తిమంతము, ఉదయాస్తమయ రహితము, నిర్లిప్తము, అప్రమేయము, వికార రహితము అగు ఆత్మకు ఈ శరీరము ఉండటం చేత గాని, (లేక) లేకపోవుట చేత గాని కలిగే హాని లేదు. మేలు లేదు. ఆత్మయొక్క 'నిత్యోదయము (Ever Wakeful)' అనే లక్షణం ఈ భౌతిక శరీరానికి ఎట్లా వర్తిస్తుంది? చిన్మయమగు నీ స్వస్వరూపాన్ని నీవు భావన చేస్తూ ఉంటే 'నేను మృణ్మయమగు ఈ శరీరమును' అనే జడభావన చీకటిలో మటుమాయమౌతుంది.

**శ్రీరాముడు :** అయితే మహర్షీ! ఈ లోక వ్యవహారములు శరీర సహాయంతోనే నిర్వర్తించబడుచున్నాయి కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ లోక వ్యవహారములు ఆత్మ-శరీరముల కలయికచే జరుగుచున్నట్లు అనిపించ వచ్చు గాక! అయినా కూడా వాస్తవానికి అవి రెండూ విరుద్ధ ధర్మాలు గల వస్తువులు. అత్యంత సూక్ష్మ మగు ఆత్మకు, అత్యంత స్థూలమగు శరీరానికి సంయోగమే అసంభవం. ఇక ఒకదానిలో మరొకటి ఐక్యమవటం ఎట్లా సిద్ధిస్తుంది? కనుక శరీర భావన, ఆత్మభావన ఒకచోట ఏర్పడి ఉండజాలవు.

ఆత్మభావన లేనప్పుడు శరీరభావన ఉన్నట్లే!... శరీరభావన లేనప్పుడు ఆత్మభావన ఉంటున్నట్లే!

సద్వస్తువగు బ్రహ్మం జడం కాజాలదు. ఆరోపిత దృష్టిచే బ్రహ్మం దేహంగా అగుచున్నట్లు భ్రమ గొలుపుచుండవచ్చుగాక! అయినప్పటికీ సర్వ వ్యాపియగు ఆత్మకు శరీరముతో సంబంధం లేదు.

శరీరము యొక్క ధర్మములు ఆత్మ యొక్క ధర్మములు వేరు వేరు.

**దేహేన దేహగస్యాపి కమలస్యేవ వారిణా ।**
**మనాగపి న సంశ్లేషో బ్రహ్మణో దేహసత్తయా ॥** (శ్లో॥ 14, సర్గ 60)

నీటిలో తామర పువ్వు ఉన్నంత మాత్రంచేత నీరు, తామరపువ్వు ఒక్కటి అవనట్లు... దేహికి దేహమునకు సంబంధం లేదు. ఏదైనా సంబంధం కనిపిస్తుంటే, అది ఆరోపితం మాత్రమే. దేహము ఉన్నంత మాత్రంచేత బ్రహ్మమునకు ఎట్టి దోషమూ అంటదు.

బ్రహ్మము సర్వదా నిర్దోషము, సమము. ఒక ఇంట్లో ఒక మనిషి ఉన్నాడనుకో. అంతమాత్రం చేత ఆ ఇంటియొక్క లక్షణములు మనిషివౌతాయా? ...లేక, మనిషి యొక్క లక్షణాలు ఇంటివి అవుతాయా? ఇదీ అంతే.

ఒకచోట గాలి వేగంగా వీస్తోందనుకో. ఆ గాలి యొక్క వీచికలు ఆకాశమును అంటుతాయా? శరీరము యొక్క లక్షణములైనట్టి జన్మ-జరా-మరణములు, ఆత్మకు అంటవు. అట్లాగే ఇక్కడి సుఖ-దుఃఖాలు, ఆసక్తి – అనాసక్తులు కూడా ఆత్మకు అంటవు. అందుచేత 'వీటివేటికీ సంబంధించనట్టి ఆత్మ'ను గ్రహించి పరమానందమును నిరభ్యంతరంగా పొందవచ్చు. ఇక ఈ శరీరములు, మనస్సు వగైరా బ్రహ్మ మహాసముద్రజలంలోని తరంగముల వంటివిగా చూడు. నిజానికి జలానికి తరంగాల లాగా, ఆత్మ చైతన్యమునకు అవన్నీ పరికల్పితములు మాత్రమే!

నీళ్ల కదలికచే కనబడే నీళ్లలోని సూర్యప్రతిబింబము యొక్క కదలికలను సూర్యబింబానికి ఆపాదించలేం కదా! శరీరంలో మనకు కనిపించే మార్పుచేర్పులను శరీరికి ఆపాదించటానికి వీలు లేదు. ఆత్మ ఏ క్షణంలోనూ ఎట్టి క్షోభా పొందటానికి ఆస్కారమే లేదు. అందుచేత ఈ జగత్తు ఏమిటో అవగాహన చేసుకోవటానికి ముందుగా కాస్త 'సమదృష్టి' స్థిరపడేటట్లు అభ్యాసం చేయి. అప్పుడు 'సత్యవస్తు జ్ఞానం' ఏర్పడి వాస్తవమేమిటో నీకే గోచరించగలదు. దేహమునకు సంబంధించిన అజ్ఞాన దృష్టులు తొలగాలంటే దేహి గురించిన వాస్తవ జ్ఞానమొక్కటే అసలైన ఔషధం.

'చీకటి' అంటే ఏమిటి? వెలుగు లేకపోవటమే కదా! జ్ఞానం కలిగి ఉండకపోవటమే (అనగా) దేహి యొక్క స్వరూపం ఎరిగి ఉండకపోవటమే 'అజ్ఞానం'. ఈ దేహము యొక్క పరికల్పనకు అట్టి అజ్ఞానమే కారణం. ఆత్మయొక్క స్వభావం గ్రహించని కారణంగా 'మోహము' అనే ఒక విషవృక్షం మొలచి నలువైపులా శాఖలు విస్తరించుకుంటోంది. 'జ్ఞానముయొక్క రీతి ఏమిటి? ఆత్మ యొక్క స్వభావమేమిటి?'... అనే ప్రశ్నలకు వివరణాత్మకమైన సమాధానం గ్రహించకపోవటం చేతనే విపత్తులన్నీ వచ్చిపడుచున్నాయి. బ్రహ్మము యొక్క స్వరూపమేమిటో తెలియకుండా ఊరకే ఇక్కడా అక్కడా సంచరించటం ఏమాత్రం సముచిత విషయం కాదు. గాలి వీస్తున్నప్పుడు తోటలోని మొక్కలు అటూ ఇటూ కదలుచున్నట్లు ఇంద్రియ ద్వారములనుండి ప్రాణవాయువులు ప్రసరిస్తూఉంటే వారు ఆ లోకములలోనూ, ఈ లోకములలోనూ ప్రవేశించి ఊరికే గ్రహించటం, విసర్జించటం, ఆలాపించటం మొదలైన పనులు ఈ జీవులలో అనేకులు చేస్తున్నారు. ఒక్కొక్క ఉపాధి స్వీకరించటం శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ప్రవాహంలో అవయవాలు క్షీణింపజేసుకోవటం, ఉన్మత్తులై ఏవేవో ఆశ – నిరాశలు మూటగట్టుకోవటం... ఇవీ సంసార జీవులు ఇక్కడ చేస్తున్న సుదీర్ఘకార్యక్రమాలు!

నీళ్లలో పడి నానిన చెక్కముక్కలాగా రాగద్వేషములకు వశులై మునిగి తేలుచూ అనేక జన్మలు వారు గడిపివేస్తున్నారే గాని 'ఇంతకీ నేనెవ్వరు?' అనే ప్రశ్నను శోధించటం లేదు. వచ్చి పోతూ ఉండే భావాలలో మాత్రమే కొట్టుమిట్టాడుచున్నారే?

జీవులందరూ జ్ఞాన విషయంలో అత్యంత జాగరూకులై ఉండాలి సుమా! అజ్ఞానం అత్యంత నీచదశలను పొందింపజేయగలదు. కమ్మరి ఉపయోగించే తిత్తిలో గాలి వెలువడునట్లు జ్ఞానరహితు లగు జీవులలో ప్రాణ వాయువులు ప్రయోజనమేమీ లేకుండానే సంచరిస్తున్నాయి. వారు ప్రాణములు కలిగి ఉండి ఉపయోగం లేనివారే అగుచున్నారు. వారి చలనములన్నీ ప్రయోజనం లేనివే. వ్యర్థమైనవే. వింటి యొక్క నారి శబ్దం చేస్తున్నట్లు అజ్ఞానులగు జీవులు ఏవేవో గర్విత–నీరస–జాతి–ప్రాంత కల్పనలతో కూడిన శబ్దాలు పలుకుతూ ఈ భూమిపై సంచరిస్తున్నారు. అడవిలోని దుష్టఫలములు తిని పిట్టలు పిచ్చి ఎక్కి కేకలు వేసివేసి చివరికి చస్తున్నట్లుగా ఆత్మజ్ఞానము లేని ఫలాభిలాషలను ఆశ్రయించి సంసార జీవులు చివరికి ఉన్మత్తస్థితులను, మృత్యువు యొక్క రుచులను తెచ్చి పెట్టుకుంటు న్నారు. అజ్ఞాన కార్యక్రమములతో తృప్తి పొంది లోకవ్యవహారములు సలుపుతూ కాలం గడపటం నా ఉద్దేశంలో కాలుచున్న శిలపై చల్లటి చోటు వెతకటం వంటిది. అజ్ఞానులతో కూడి రోజులు దొర్లించటం మోడువారిన చెట్టుక్రిందకి విశ్రాంతికై పరుగులు తీయటం వంటిది. అజ్ఞాన విషయ సమాచార వినోదములతో కాలం వెళ్లబుచ్చటం ఆకాశమును అట్టలతో మోదటం వంటిది. రుచికరమైన పదార్థములను బురదలో ముంచటం వంటిది. అజ్ఞానవిషయాలు సంభాషించటం ఆకాశములోని మేఘములను చూచి కుక్కలవలె మొరగటం వంటిది.

'అజ్ఞానమాపదాం నిష్ఠా' – అజ్ఞానమే అన్ని ఆపదలకూ పుట్టినిల్లు. దాని వలన కలిగే అనర్థాలకు అంతులేదు.

'సంసారము' అనబడేది అజ్ఞానము చేతనే కదా... ఉత్పన్నమౌతోంది! సుఖ-దుఃఖాలు, నిష్ఠురత్వం. వేదన-రోదనలు, ఆవేశకావేశాలు, ఈ శరీరము, దీనిచే ఏర్పడే సంబంధాలు... ఇవన్నీ అజ్ఞాన వృక్షము యొక్క ఫలములే!

అనాత్మ అయినట్టి ఈ శరీరమే తానుగా తలచు మూర్ఖునికి దుఃఖమెన్నటికీ తొలగదు. సత్యమును వదలి అసత్యం వెంట పరుగులుదీస్తూ 'ఈ మాయ నాపట్ల తొలగదేమి?' – అని కేకలు వేసి ఏం లాభం? అసత్యదర్శనంచే పదే పదే కాలు జారిపడి లేచుచుండటమే సుఖమనుకొనే వారికి నేను సత్యం ఎట్లా తెలియపర్చగలను? తమ చర్మమును చాకుతో కోసుకుంటూ, "మేము కాయనే కోస్తున్నాం... అంతా మాకు తెలుసు" అని పలికే వానికి ఎవ్వరేం బోధించగలరు?

**శ్రీరాముడు:** నిజమే స్వామీ! అయితే, ఆనందమయమగు ఆత్మయే స్వరూపముగా గల ఈ జీవునకు దుఃఖం ఎక్కడి నుండి వచ్చిపడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చక్కటి నేలపై కొంత కాలానికి పిచ్చిచెట్లు లేచునట్లుగా, సుఖ స్పర్శల నుండి దుఃఖాలు పుట్టుకొస్తున్నాయి. దేహమనే బూరుగు నుండి 'వాసనలు' అనే పాములు పడగలెత్తుచున్నాయి. అవి మనస్సను మదగజమును కట్టిపడేస్తున్నాయి. చేనులో కలుపు మొక్కలలాగా అజ్ఞాని (ఆత్మ సమాచారం పరికించనట్టి వాని) హృదయంలో ఆశలు లేస్తున్నాయి. దుష్కృత్యములు నీచ బాటలలో నడిపిస్తూ ఈ జీవుని 'నరక యాతనలు' వేచి ఉన్న చోటికి తీసుకుపోతున్నాయి.

అనేక కల్పితానందములు, కాలక్షేపములు మూర్ఖుని సంతోషింపజేయటానికే కాబోలు, ఈ జగత్తుచే విరచించబడుచున్నాయి. అతని ఆసక్తికి అనుగుణంగా సృష్టి కర్త ఇక్కడి వ్యవహారములను మలచుచున్నాడు. ఈ జీవుడిక పరనింద, ఈర్ష్య, రాగము మొదలైన వ్యతిరిక్త, దుర్వాసనల వైపుగానే ఆకర్షితుడగుచున్నాడు. ఇక సరి అయిన సమయం చూచుకొని చింతలన్నీ అతని హృదయంలో ప్రవేశిస్తున్నాయి. జన్మనుండి ఆశ నిరాశలు, వాటి నుండి భావి ఉపాదులు, ఆ ఉపాధుల నుంచి మరల ఆశ నిరాశలు, జీవుని పట్ల కొనసాగుతూనే పోతున్నాయి. అతడు మరలమరల బాల్య – యౌవన – వార్ధక్య – మృత్యువులను చర్వితచర్వణంగా పొందుచున్నాడు.

**జ్ఞానులు -** ఇక జ్ఞానుల వ్యవహారమంతా వేరొక విధంగా ఉంటోంది. అజ్ఞానులకు సుదీర్ఘం గానూ, దాటనలవికానిదిగానూ ఉంటే, జ్ఞానులు తమ స్వరూపమును సాక్షీభూతమగు చైతన్యమాత్రంగా గాంచుచున్నారు. అందుచేత ఈ సంసారతతంగమంతా గోష్పాదప్రాయం (ఆవు డెక్క ఏర్పరిచే గుంటంత) అగుచున్నది. ఇక్కడ కనబడే అన్నపానాది విశేషములలో అతడు తగుల్కొనుట లేదు.

❖

అజ్ఞానికి ఈ జగత్తు యొక్క విన్యాసాలేమిటో, వీటి అంతు ఎక్కడో తెలియటం లేదు. పంజరంలో చిక్కుకున్న చిలుకలాగా అతడు వాసనాపరంపరలో చిక్కుకుని ఉంటున్నాడు. అతని చిత్తవృత్తులు బాహ్య వస్తు జాలముల వైపుకే ప్రసరిస్తున్నాయి గాని, అంతర్ముఖం కావటం లేదు. బోయవాడు పక్షులను పట్టుకోవటానికి బియ్యపు గింజలు చల్లునట్లు ఈ ప్రపంచం నిండా ఇంద్రియములకు ప్రియాప్రియములు కలిగించగలిగే అనేక వస్తువులు, విషయాలు, విశేషాలు

కల్పించబడ్డాయి. అతడు ఇంద్రియ భోగమత్తుడై 'ఇళ్లు, వాకిళ్లు, ప్రతిష్ఠలు, బంధువులు, ఆనందములు, అనుభవములు, చెట్లు, పూలు, ఆకాశం, నేల' మొదలైన వాటికి తాను సంబంధితుడై పోతున్నాడు. అనేక భేదకల్పనలకు లోను అగుచున్నాడు. కల్పనామాత్రమైన కల్పవృక్షం వివిధ చిత్ర –విచిత్ర పదార్థాలను కల్పించి అభీష్ట సిద్ధిని భ్రమింపజేస్తుంది చూచావా! ఎన్ని అభీష్టములు ఈడేరితే ఏం ప్రయోజనం? ...కొత్త కోరికలు పుట్టుకొస్తూనే ఉంటాయి కదా! ఈ ప్రపంచంలో కూడా పూర్ణానంద కరమగు వస్తువేదీ లభించుటయే లేదు.

ఆహాఁ! ఏమి ఈ మోహము యొక్క మాహాత్మ్యం! కల్పనామాత్రమైన అజ్ఞానవనంలో 'భోగాభిలాషలు' అనే పక్షులు నివసిస్తున్నాయి. 'ఉత్పత్తి' అనే ఆకులతో, 'పుణ్యపాపములు' అనే ఫలాలతో 'భోగములు' అనే పూలగుత్తులతో 'కామ–క్రోధములు' అనే లతలతో ఈ అజ్ఞానవనం విరాజిల్లుతోంది. సూర్యుడు అస్తమించగానే చీకట్లు కమ్ముకుంటున్నట్లు జ్ఞానదృష్టి మరుగున పడగానే సర్వ దోషములు ప్రవేశిస్తున్నాయి. ఓ రామా! అజ్ఞాన వృక్షశాఖలు 'నానావిధ జగత్తులు' అనే ఫలములను ప్రసాదిస్తున్నాయి. అవి పైకి మాత్రమే మధురంగా ఉండి లోన మిథ్యాత్వం, భంగురత్వం, ఆద్యంతత్వము కలిగి ఉంటున్నాయి. అట్టి అజ్ఞానవనమును సమూలంగా నశింప జేస్తే గాని ఈ జీవునకు శాంతి లభించదు సుమా!

❖❖❖

## 6. అజ్ఞానాంధకార విభూతులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! అజ్ఞానాంధకారం యొక్క విభూతులు ఏమని వర్ణించాలి! హృదయంలో మదం ఉద్భవించగా దృష్టి అధోగతిపాలగుచున్నది. స్త్రీల చిలిపి చూపులచే ఆకర్షితుడై ఈ సంసార జీవుడు క్షణంలో తన దృక్పథములన్నీ అధోగతి పాలు చేసుకొని ఆ చిలిపి చూపులకు ఆహారమగుచున్నాడు. అతడు మన్మథునకు ఆంతరంగికదాసుడై ఉన్మత్త వేషధారుడగుచున్నాడే!

అహో! ప్రజలు కొంచెం దూరంగా ఆలోచించటం లేదే! ఏ దేహములైతే అజ్ఞానమోహాన్ని కలిగించి స్వస్వరూపం పట్ల ఏమరుపు కలిగిస్తున్నవో అట్టి స్త్రీ పురుష శరీరములు కొద్ది సంవత్సరముల తరువాత ఏమి కానున్నాయి? కుక్కలకు, గ్రద్దలకు ఆహారం అగుచున్నాయి. కవులు మాత్రం ఈ స్త్రీ–పురుష శరీరములను చంద్రునితోను, మంచి గంధముతోను, పూలలోని సున్నితమగు పుప్పొడితోను పోలికలు కల్పించి జనులకు భ్రమ కల్పిస్తున్నారు. రక్తమాంస భరితమగు ఈ శరీరభాగములను సువర్ణ కలశములతోనూ, పద్మమాలికలతోను, దొండపండ్లతోనూ ఉత్ప్రేక్షలు కల్పించి కవులు భ్రమను ఇనుమడింపజేస్తున్నారయ్యా! అల్పములగు కణపులతోను, ఎముకలతోను కూర్చబడిన ఈ స్త్రీపురుష శరీరములు ఆయా అలంకారములు, పట్టు వస్త్రములు ధరించి చూపులకు విందొనర్చుచుండగా ఈ అజ్ఞాన జీవులు 'ఆహా!ఓహో!' అనుకుంటూ కేరింతలు కొట్టడమా! ఇదంతా భ్రమ, పిచ్చి కాక మరేమిటో చెప్పు?

ప్రారంభంలో కొంచెం ఆనందం చూపి, క్రమంగా దుఃఖముల పాలు జేయగల అతిస్వల్ప, తుచ్ఛమైన మత్తు పదార్థములు ఈ జీవునిచే ఊడిగం చేయించుకుంటున్నాయే! ధనము, నారీజనము, తదితర సంపదలు ఇవన్నీ జీవునికి దుఃఖం తొలగించగలుగుచున్నాయా? ఏమి చిత్రమో గాని, ఎన్నెన్ని పొందినా కూడా, ఎప్పటికప్పుడు దుఃఖములు శతాధికమే అగుచున్నాయే! ఒక సుఖానికి ఒక దుఃఖం ఎదురుచూస్తూనే ఉంటోంది. ఈ సుఖదుఃఖాలు ఒకదానికొకటి కారణమగుచూ వస్తూ, పోతున్నాయి... ఈ జీవుడు ఇది గమనించడేం? ఇక్కడి ప్రయాసలన్నిటికీ అసలు కారణమేమిటో వెతకడేం?

కామ్యకర్మలతో అర్థవాద వాక్యములతో మాయారణ్యం పరిఢవిల్లుతోంది. మోహం అవిశ్రాంతంగా నిరంతరంగా అనేక ప్రవృత్తులను ఉత్పత్తి చేసుకుంటూ పోతోంది.

ప్రతి విషయం మొదట సుఖంగా ఉన్నట్లే ఉంటోంది. ఇంతలోనే అది అనేక రాగద్వేషములను కల్పిస్తోంది. చివరికి విషలత యొక్క రసంలాగా శారీరక మానసిక రుగ్మతలకు కారణమగుచున్నది. ఇక అది హృదయమును దుఃఖింపజేస్తోంది. ఎండింపజేస్తోంది. స్వకీయ కల్పిత కార్యక్రమములే ధూళి వలె లేచి వివేక సూర్యుణ్ణి కప్పివేస్తున్నాయి.

ఈ జీవుడు మొండితనంతో ఇంద్రియ విషయములను నమ్ముకొని కూర్చుంటున్నాడు. ఇక కాలయముడు తన నిష్ఠుర కార్యక్రమములతో శ్రమించి ప్రోగుచేసుకున్న సర్వవస్తు జాలములను కడుపారా మ్రింగి త్రేన్చుచున్నాడు. ఈ జీవుడు అందుకు ఎర అగుచూ, ఒక ఉపాధిని వదిలి మరొక ఉపాధిని ఆశ్రయిస్తూ వక్ర గమనములు చేస్తున్నాడే గాని, వివేక దృష్టిని పెంపొందించుకోవటం లేదు. 'ఆత్మ సమాచార శ్రవణం' అనే చంద్రోదయం కాకుండానే అనేక యౌవన రాత్రులు వ్యర్థంగా గతిస్తున్నాయి. ప్రాపంచిక విషయాలను మరలమరల ఉచ్చరిస్తున్న ఈ నాలుక అలసి అలసి చివరికి ఒకనాటికి శిథిలమైపోతోంది. దుఃఖము, శోకము, దారిద్ర్యములతో కూడిన అనేక పరిస్థితులు ఉవ్వెత్తున ఎగురుచున్నాయి. కట్టుదిట్టము లేని జీవిత ప్రాంగణంలో 'లోభము' అనే గుడ్లగూబ ప్రవేశించి యథేచ్ఛగా సంచరిస్తోంది. 'ముసలితనం' అనే పిల్లి వచ్చి 'యౌవనం' అనే ఎలుకను పట్టుకొని, చెవులు సాగదీసి మరీ చంపుతోంది. పైకి మెరుస్తూ లోన నిస్సారంగా ఉండే అనేక కల్పిత వ్యవహారాలు ఈ జీవుని చుట్టుముట్టి ఉన్నాయి. అనేక ప్రవృత్తములతో కూడిన ఈ జగత్గృహం ఆకాశాన్ని ఆక్రమించుకుని ఉంటోంది.

ఈ విశాల సంసార సముద్రం నిత్యం అనేక శరీరములను చప్పరించి మ్రింగుచున్నది. కృత్రిమమైనట్టి ఈ వినీలాకాశం అనేక సూర్యులను, గ్రహములను ధరించి ఉంటోంది.

ఈ జగత్తు 'ఆశలు' అనే త్రాడుచే కట్టబడి 'వాసనలు' అనే కమ్ములు గల ఇంద్రియ పంజరంలో నియమించబడి ఉన్నది. జీవులు ఈ జగత్ పంజరంలోకి ప్రవేశించి ఇక్కడ చిక్కుకొని కొన్నాళ్ళకు నశిస్తున్నారు. ఇక్కడి జనులు ఏవేవో ఆరోపిత దృష్టులను ఆశ్రయించి స్వస్వరూపమగు ఆత్మను విస్మరించి ఇక్కడ సంచరిస్తున్నారు. 'మేము అంతటివాళ్లం. మా జాతి ఇంతటిది' అని చెప్పుకొని

మురుస్తూ ఈ రక్తమాంస నిర్మితమైన దేహ నరక భూములలో చిక్కుకుంటున్నారు. అయ్యో! దేవతా జన్మలు పొందిన జీవులు కూడా స్వర్గమార్గంలో ఎగిరే పక్షులలాగా సంచరిస్తున్నారే గాని, ఆత్మజ్ఞానం విషయమై వివేకులవటం లేదే? ప్రవృత్తిచే కామ్యకర్మలవైపు ఆకర్షితులై ఈ జీవులలో అనేకులు ఊర్ధ్వ, అధోలోకాలలో పచార్లు చేస్తున్నారే గాని, ఆత్మజ్ఞానులుగా తమను తాము తీర్చిదిద్దుకోవటం లేదు.

ఈ భవసాగరంలో 'సృష్టి' అనే క్షుద్ర చేప 'కాలము' అనే ముసలి కొంగకు ఆహారం అవుతోంది. కామం అనే కుమ్మరి క్షణభంగురమైన అసంఖ్యాక 'శరీరాలు' అనే కుండలను తయారు చేసి, ఈ సృష్టి చక్రమును త్రిప్పుచున్నాడు. కల్ప ప్రారంభం నుండి అనేక యుగములు గడచి పోయాయి. అనేక జగత్తులు పుట్టాయి. నశించాయి. వర్తమాన జగత్తులో ఒక మూల ఒదిగి ఉన్న ఈ జీవుడు అనేక ఆశనిరాశల మధ్య ఆసక్తి, అనాసక్తుల మధ్య చిక్కుకుని సుఖ దుఃఖాలు నిర్వచించు కుంటూ, కొట్టుమిట్టాడుతున్నాడు. ఎడతెరిపి లేకుండా ఏవేవో విపరిణామములన్నీ పొందుతున్నాడు. యుగములు, మన్వంతరములు గడచిపోతున్నాయి. ఇంత జరుగుచున్నా మూర్ఖులబుద్ధి ఏదీ గుర్తించటం లేదు. ఏం ఆశ్చర్యం!

ఆహా! ఈ కనబడే శరీరాలన్నీ 'వాసన' చే ప్రేరితమై సంచరిస్తున్నాయి కదా! శత్రువులను చీల్చిచండాడి, ముల్లోకములూ ఏలుతున్న ఇంద్రుడంతటి వాడు కూడా వాసనల చేతనే ప్రేరేపించబడి, చరిస్తున్నాడే! వాసనల మూలం ఆసక్తియే!

**ఆసక్తియే సృష్టికి మూలం -** ఏదో నియతి ఈ 'సృష్టులు' అనే ధూళి కణములను లేవదీసి కాల సర్పం ముంగిట పడవేయుచున్నది. ఈ కనబడే వస్తుజాలమంతా 'వినాశనము' అనే బడబాగ్నిలో ప్రవేశించి నశించటానికే ఉద్యుక్తమౌతోంది. ఆకస్మికములు, విచిత్రములు, స్వభావసిద్ధములు అగు ఈ వస్తుజాలములను చూచి జీవుడు నమ్మిక కలిగి ఉండటమేమిటి? వీటిలో ఏ ఒక్కదానికైనా నిశ్చలమైన ఉనికి ఉన్నదా? లేదే! సముద్ర తరంగాలు ఎంత నిశ్చలమో....ఈ ద్రవ్య శక్తులు అంతే నిశ్చలం. 'కాలం' అనే ఉన్మత్తసింహం 'జగత్తులు'అనే గున్న ఏనుగులను వేటాడి హింసించి, భక్షించటం మనం స్పష్టంగా చూస్తున్నాం కదా!

ఈ జగత్తులన్నీ వాసనాఫలములను అన్వేషిస్తూ జన్మించి, కొద్దిసేపు కనిపించి మరల ఎటకో మటుమాయమౌతున్నాయి.

'విధి' అనే ఒకానొక చిత్రకారుడు 'చిత్తము' అనే పటము మీద 'పంచేంద్రియములను రంగులతో' సంసార చిత్రములను సృష్టిస్తున్నాడు.

❖

కాలము యొక్క ప్రవాహం ఎంతటి చిత్రమైనది! క్షణాలు, నిమిషాలు, గంటలు, రోజులు, సంవత్సరాలు, యుగాలు, మన్వంతరాలు – రూపంలో ఎంతవేగంగా ముందుకు సాగిపోతోంది! అది అసత్తు నుండే తన ప్రవాహం ప్రారంభించింది. భావాభావసమన్వితులై, రాగద్వేషభరితులై ఈ జీవులు కాలం వెంట దొర్లించబడుచున్నారు. బ్రహ్మదేవుని నుండి క్రిమికీటకముల వరకు గల

జీవులన్నీ తమ యొక్క సుకృత, దుష్కృతములకు సంబంధించిన చింతలచే పీడింపబడుచున్నారు. అదృశ్యంగా ఎక్కడో ఉండి కాల స్వరూపుడు స్థావరజంగమము లన్నిటినీ క్షణభంగురంగా చేసి వేస్తున్నాడు. స్థావరములు ఆ కాలుని కన్ను కాస్త కప్పి తమ శరీరములను నేలలో దాచి శీత వాత తాపములను సహిస్తూ జగత్తుకు స్థావర ఫలములను ఇస్తున్నాయి. ఇక ఈ జంగమ జీవులు ఏమీ తెలియకపోయినా అంతా తెలిసినట్లే ఈ భూమిపై అటూ ఇటూ సంచరిస్తున్నారు. త్రిలోకముల దృశ్యపరంపరలు సృష్టించే అజ్ఞానాంధకారంలో ప్రవేశించి ఘంఘుమధ్వనులు చేస్తున్నారు. 'కాలుడు' అనే భిక్షుకుడు బ్రహ్మాండము అనే భిక్షపాత్రలో అనేక జీవులను పొంది భక్షించి ఆకలితీరక మరల భిక్షకై కేకలు వేస్తూనే ఉన్నాడు. ఈ త్రిలోకములు, ఈ సూర్య చంద్రులు, త్రిమూర్తులు, ఈ భూ పర్వత ప్రాంతాలు, ఈ స్థూలసూక్ష్మకారణ దేహములు, ఆ కాలుని శరీర విభాగములే కాబోలు. బ్రహ్మలు, బ్రహ్మాండములు క్షణికములై కాలుని ముందు ప్రభవించి చటుక్కున మటుమాయ మవుతున్నాయి.

కల్పములు నిమిష కాలంలో గడచిపోతున్నాయి. ఒక్క నిమిషంలో అనేక కల్పములు ఏర్పడు తున్నాయి. త్రిమూర్తులంతటి వారు ఒక్క నిమిషంలో అంతర్హితులగుచున్నారు. విషయరహితం, వస్తురహితం అయిన బ్రహ్మపదమున సంభవం కానిదేమున్నది.

ఓ రామచంద్రా! జగత్ సంబంధములగు నానావిధ కల్పనలన్నీ అజ్ఞానము వలననే కలుగు చున్నాయి. ఈ బాల్య యౌవన వార్ధక్యాలు, ఈ సంపద, లేక ఆపద, ఉపతాపములు – ఇవన్నీ అజ్ఞానాంధకారము యొక్క విభూతులు మాత్రమే.

❖❖❖

# 7. అవిద్యా సంభ్రమం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామా! 'చిత్' అనే పర్వతసమీపాన ఏర్పడి ఉన్న 'సంసారము' అనే అరణ్యంలో 'అవిద్య' అనే లత ఎట్లా పెంపొందుచున్నదో చెబుతాను విను.

'బ్రహ్మాండం, త్రిలోకాలు, జీవులు, జననమరణాలు, సుఖదుఃఖాలు, జ్ఞానాజ్ఞానాలు' అనే విశేషములతో ఈ అవిద్య ఏర్పడి ఉంటోంది. ధ్యాసచే ఇంద్రియ ద్వారాలతో కూడిన ఈ ఉపాధులు ఏర్పడుచున్నాయి. ఉపాధిని ఉపయోగించుటచే సుఖబుద్ధి కలుగుతోంది. అట్టి సుఖబుద్ధి ఆసక్తికి కారణమగుచూ అవిద్యను ఉదయింపజేస్తోంది. యజ్ఞము, దానము మొదలైన సత్క్రియలు సుఖమును ఫలింపజేసి, మధురఫలాలను ఇస్తున్నాయి. దొంగతనం, హింస మొదలైన దుష్క్రియలు దుఃఖాలు అనే చేదుఫలాల నిస్తున్నాయి. దారిద్ర్యము, అవమానము, మొదలైన అనేక దుఃఖకర విషయాలచే ఈ జీవులు అనేక బాధలకు లోను అగుచున్నారు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! అవిద్య ఎట్లా ఉదయిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఏదైతే లేనేలేదో....అద్దానిని 'ఉన్నది'....అని సంకల్పించుటచేతనే అవిద్య ఉదయిస్తోంది. ఆ అవిద్య సృష్టిని కల్పిస్తోంది. భావనల యొక్క దృఢత్వం చేత పదార్థములకు

సంబంధించిన సుఖదుఃఖములు రూపం పొందుతున్నాయి. అజ్ఞానం చేత అవిద్య వృద్ధిచెందుతోంది. అజ్ఞానఫలములను ప్రసాదిస్తోంది. అయితే 'ప్రత్యక్ తత్త్వవిమర్శ'కు సంబంధించిన జ్ఞానం వలన ఉన్నతమగు భూమికలను అధిరోహింపజేయగల బుద్ధి ఉదయిస్తోంది. ఆ బుద్ధి, బుద్ధికే సాక్షియగు సప్తమ భూమికను అధిరోహించటానికి దోహదపడుతోంది. ఏది తెలుసుకోవటానికి బుద్ధి ప్రయత్నిస్తోందో ఆ తెలియబడేదే తానగుచున్నది. (*బ్రహ్మైవ, స బ్రహ్మవిత్, బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి* – అను వేదవాక్యార్థం ఫలిస్తోంది).

కల్పనలతోనూ, వాసనలతోనూ, తీవ్రమగు దృశ్య సంబంధములతోనూ, రాగములతోనూ అవిద్య ప్రవృద్ధమౌతోంది. అవిద్య కొన్ని కార్యములకు, ఆ కార్యములు మరింత అవిద్యకు కారణమగుచున్నాయి. హృదయంలో విద్యను అవిద్య కప్పివేస్తోంది. విషయవాసనలే దాని ఆలంబనం. ఈ జీవుడు అవిద్యచే ఆవరించబడినవాడై పశువులు, ఇళ్లు, పుత్రులు, పౌత్రులు మొదలైనవాటి సమాగమం చేత కాలం గడుపుతున్నాడు. ఋతువులు, మాసాలు, సంవత్సరాలు గడచిపోతున్నాయి. ఈలోగా ముసలితనం వచ్చి మీద పడుతోంది. ఏమీ తెలియకుండానే ముసలితనం వచ్చిపడిన తరువాత ఇక్కడ ఇళ్లు, వాకిళ్లు, పుత్రులు, పౌత్రులు అతనిని రక్షిస్తాయా? ఎందుకు ఇంతకాలం జీవించినట్లు? ఏమి పొందినట్లు? అజ్ఞానంలో మునిగి తేలుతూ జీవితమంతా వెచ్చించినందుకు ఫలితంగా అతని ఉత్తర గతులు నికృష్టంగానే ఉండబోతున్నాయి. విచారణ లేకపోవటం చేత ముసలితనం దుర్భరమే అగుచున్నది. చేతిలోని పండు నేలజారినట్లు ఒకనాడు ఈ దేహం నేలకూలుతోంది. ఇంద్రియములు ఉన్నన్నాళ్లు అజ్ఞాన దిశలకే పరుగులు తీసిన ఆ జీవుడు కళ్ళెదురుగా ఇంద్రియములు బలహీనపడటం అనుభవిస్తున్నాడు. అవి జీవించిన కాలమునకు సంబంధించిన, విషయాస్వాదన సామర్థ్యము కోల్పోగానే ఎంతటి నిస్సారస్థితి అనుభవిస్తున్నాడో... చెప్పనలవికాదు.

ఈ జగత్తంతా అవిద్య చేతనే ప్రవర్తిస్తోంది. సూర్యచంద్రనక్షత్ర గ్రహమండలాలు అవిద్య చేతనే నిర్విరామంగా, ఆకాశంలో శ్రమించి సంచరిస్తున్నాయి. అవిద్య చేతనే మహత్తరమగు ఆత్మ స్వరూపుడగు ఈ జీవుని అల్ప వస్తువులు కూడా ఆకర్షించి విచలితుణ్ణి చేస్తున్నాయి. ఇంద్రియములు, తృష్ణ, సంకల్పములు – ఇవన్నీ అవిద్య చేతనే తైతక్కలాడుచున్నాయి. అవిద్య యొక్క ఊడలు సప్త సముద్రములలోనికి, అఖాతములలోనికి, పాతాళ, దేవలోకాలకు విస్తరించి ఉన్నాయి. రాగ ప్రవృత్తిచే కామ్యకర్మలకు ఉపక్రమిస్తున్న జనులు తమ చుట్టుప్రక్కల గల జనులను కూడా తమవలె అవిద్య కర్మలవైపుగా ప్రోత్సాహపరచుచూ తద్వారా అవిద్యను పెంచి పోషిస్తున్నారు. కుకర్మలతో కృత్రిమ ఉపాయములతో, స్వర్గసుఖ నిర్వచనములతో మూర్ఖజనులచే అవిద్య పరిపోషించబడుతోంది.

❖

అయితే ఇదే జగత్తు వివేకులకు అవిద్యా నిర్మూలనమునకు ఉపయోగిస్తోంది. ఆయా శాస్త్రోచిత విధి విధానాలన్నీ నివృత్తి సంపద పెంపొందించుటకు ఉపకరిస్తున్నాయి. వారికిక్కడ మోక్ష సంపద, బ్రహ్మానందవర్షము లభిస్తున్నాయి.

అందుచేత తప్పు జగత్తులో లేదు. జీవుడు జగత్తును ఉపయోగించే, సమన్వయించుకునే విధానంలోనే జ్ఞానఅజ్ఞాన ప్రవృద్ధములు దాగి ఉన్నాయి.

ఈ జగత్తు అనేక సాంసారిక విషయములకు ఆలవాలమై ఉండవచ్చుగాక! అనేక అల్ప కార్యక్రమములు, ద్వైతవ్యవహారములు తారసపడుగాక! ఇట్టి అవివేక జగత్తులో ఉంటూ వివేకులు ఇక్కడ భిన్నత్వం నుండి సమరసము, అచ్యుతము అగు ఏకత్వానుభూతి సాధిస్తున్నారు. విషంలోంచి అమృతం సాధిస్తున్నారు. ఇదంతా క్షణికం, మార్పు చేర్పుల మయం కావచ్చు గాక. ఇది జ్ఞానవిచారణకు ఉపయోగించగలదు. అయితే వివేకివై జీవించటం నీవు నేర్చుకోవాలి. జ్ఞాన సముపార్జన, నిర్మల హృదయసముపార్జనకై నీ దృష్టిని సారించాలి. వివేచనాపూర్వకంగా ప్రయత్నించే వారికి ఈ జగత్తు ఉద్ధారణోపాయములు ప్రసాదించగల సామర్థ్యం కలిగియున్నదని నీవు గ్రహించు.

ప్రపంచం నిండా అవిద్య ఉండుగాక. నీ యందు అద్దానిని ప్రవేశించనీయకు. పడవ నీళ్లలో ఉన్నా ఆ నీరు పడవలోకి ప్రవేశించగలుగుతుందా? సమగ్ర సూక్ష్మ అవగాహన పెంపొందించుకునే వివేకులను చూసి ఇక్కడి అవిద్య దాసోఽహమనగలదు. అవివేకులకు అనేకత్వముతో కూడిన అనుభవం ప్రసాదిస్తూనే వివేకులకు అభేదమగు అనుభవం ఈ జగత్తు ప్రసాదించగలదు.

వత్సా! రామా! ఒక గడ్డి పరక నుండి హరిహరాదుల వరకు స్ఫురిస్తున్న ఈ దృశ్య ప్రపంచ మంతా అవిద్యా మాత్రమే సుమా! అట్టి ఈ అవిద్యను నశింపజేయవలసి ఉన్నది. దీనిని సమూలంగా దాటివేస్తే ఆత్మానుభవం అనే లాభం కలుగుతుంది. అట్లు దాటివేయటానికి నీవు అనుక్షణం సిద్ధంగా ఉండు.

❖❖❖

# 8. కార్య అవిద్య - కారణ అవిద్య

అప్పుడు వసిష్ఠుని వాక్యములు వింటున్న శ్రీరామచంద్రుని అందమైన రెండు కళ్లూ ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

**శ్రీరాముడు:** హే మహానుభావా! అవిద్య గురించి, వివేకము గురించి, జ్ఞానసముపార్జన గురించి, ఈ జగత్తు జ్ఞానసముపార్జన నిమిత్తం వివేకులకు సాధనంగా అవటం గురించి మీరు చెప్పే విషయాలన్నీ శిరోధార్యాలే. ఒప్పుకోవలసిందే. అవన్నీ ప్రత్యక్ష సత్యాలుగా నాకు అవగతమౌతున్నాయి.

అయితే మీరు చివరిగా చెప్పిన విషయం నాకు కొంచెం తికమకగా ఉంది. 'శుద్ధ సత్త్వ స్వరూపులగు హరిహరాదులు కూడా అవిద్యలోని విభాగమే' అనే వాక్యం యాధృచ్ఛికంగా చెప్పారా? లేక, అదే మీ ఉద్దేశమా? ఎందుకంటే ఆ వాక్యం నాకు విభ్రాంతిని కలిగిస్తోంది. ఈ విషయం నాకు చక్కగా వివరించ ప్రార్థన.

అప్పుడు వసిష్ఠ మహర్షి రాముని ఉద్వేగం చూచి పకపకా నవ్వారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామా! నీ ప్రశ్న నాకు సంతోషం కలుగజేసిందయ్యా! చెబుతాను, శ్రద్ధగా విను.

మనందరి స్వస్వరూపమైనట్టి ఆ సచ్చిదానంద వస్తువు నిజానికి సంవిత్ (knower), సంవేద్యము (That being known), సంవేదము (The act of knowing)– అనే మూడింటిచే స్పర్శించబడేది కాదు. అది శాంతం, సర్వాత్మకం, అనుభవైకవేద్యం. అది చెప్పటానికి గాని, చూడటానికి గాని అలవి కానిది.

సృష్టికి పూర్వం అది అట్లే ఉన్నది. అయితే ఆకారరహితమగు జలంలో ఆకార సహితమగు తరంగాలు ఏర్పడుచున్నాయి కదా! అట్లాగే సృష్టికాలంలో అది నామరూప సహితమై ఒప్పారుచున్నది. 'బ్రహ్మము' అనే సంజ్ఞతో పిలువబడుచున్న అట్టి వస్తువు నుండి 'జగత్తులు' అనబడే కళలు లేచి వేరు వేరు స్వరూప–స్వభావాలు ప్రదర్శిస్తున్నాయి. అట్టి ప్రదర్శన చేతనే గుణములు అనే భేదములకు ఆపాదయోగ్యమగుచున్నది. సూర్యుని తేజము ఒకచోట ముదురు ఎండగా, మరొక చోట లేత ఎండగా, ఇంకొక చోట నీడగా ఏర్పడుచున్నట్లు ఈ స్థూల – సూక్ష్మ– మధ్యమాలుగా ఆ సచ్చిదానంద వస్తువే కల్పన స్వీకరిస్తోంది. ప్రథమంగా మనస్సు, మధ్య స్థితిలో హిరణ్యగర్భుడు, స్థూల స్థితిలో ఈ విరాట్‌గా అగుచున్నది ఆ బ్రహ్మమే.

**అవిద్యాం ప్రకృతిం విద్ధి గుణత్రితయధర్మిణీమ్ ।**
**ఏషైవ సంసృతిర్జన్తోరస్యాః పారం పరం పదమ్ ॥** (శ్లో॥ 6, సర్గ 9)

ఇట్టి గుణత్రయములతో కూడుకునియున్న ప్రకృతియే అవిద్య. అదియే సంసారం. అట్టి త్రిగుణములకు ఆవల పరమపదము వెలయుచున్నది. కార్య కారణ విద్యల అసాధారణత్వమును అనుసరించి త్రిగుణములు త్రైవిధ్యమై (3x3=9) రకములుగా వెలయుచున్నది.

1) తమోతమము ⟶ స్థావరము (రాయి–రప్ప వగైరా)
2) తమోరజము
3) తమోసత్త్వము
4) రజోతమము
5) రజోరజము
6) రజోసత్త్వము
7) సత్త్వతమము
8) సత్త్వరజము
9) సత్త్వసత్త్వము ⟶ (త్రిమూర్తులు)

అవిద్యను అనుసరించి ఈ దృశ్యప్రపంచమంతా పై తొమ్మిది మిశ్రమములను ఆశ్రయించి కనబడుతోంది. దైవీసత్త్వములో పుట్టిన వారి అవిద్య ప్రాకృత గుణరహితం (Sans worldly qualities) అయి ఉంటుంది. అట్టి దైవీసాత్త్వికులై హరిహరాదులు నిర్మలపదమున వెలయుచున్నారు. సాత్త్వికమైన ప్రకృతి యొక్క అంశను ఆశ్రయించి ఎవరైతే సాత్త్విక స్వరూపులగు హరిహరాదులను ఆశ్రయిస్తున్నారో, వారు క్రమేపీ వారి యొక్క శ్రద్ధ, ప్రయత్నముల బలిమిచే శుద్ధ సాత్త్వికులు అవుతారు.

సత్యాంశమునకు చెందిన శివాది దేవతలు ముక్త పురుషులు. ఈ ప్రపంచమున్నంత వరకూ వారు వెలయుచూ ఉంటారు. నీ దృష్టిలో ఈ ప్రపంచమే లేనప్పుడు వారలు కూడా ఉండరు.

ఈ విధంగా శివకేశవాది దేవతలు అవిద్యలోని విభాగమే అయినప్పటికీ వారిని ఆరాధించటం చేత కార్య–అవిద్య నశించగలదు. కారణ అవిద్య శేషిస్తుంది. స్వస్వరూప జ్ఞానముచే ఆ కారణ–అవిద్య కూడా తొలగి అది విద్యకు ఆధారమగుచున్నది. శివకేశవాది దేవతలను ఆరాధ్యంగా గ్రహించి చేసే ఆరాధన ఆ జీవునకు దేహభావాతీతుడగుటకు, శుద్ధ బ్రహ్మస్వభావుడగుటకు ఉపకరిస్తోంది.

**శ్రీరాముడు :** ఈ ప్రపంచం ఎక్కడి నుండి వస్తోంది? ఎప్పుడు లేకుండా పోతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** విత్తులోంచి చెట్టు, మరల చెట్టులోంచి విత్తు, విత్తులోంచి చెట్టు, మరల చెట్టులోంచి విత్తు ఉత్పన్నమగుచున్నట్లు... కార్యం నుండి కారణం, కారణంలోంచి కార్యం ఉత్పత్తి అవుతున్నాయి. కార్య–కారణ సంబంధమే 'ప్రపంచం' అని వ్యవహరించ బడుతోంది. అట్టి కార్య–కారణముల సంబంధమే అవిద్య. కార్య–కారణములకు అంతర్గతంగా శుద్ధ సత్వస్వభావమైన విద్య పరివేష్ఠితమై ఉన్నది. కనుకనే విద్యలోంచి అవిద్య ప్రకటితమౌతోంది. అనగా ఈ ప్రపంచం అనే అవిద్య శుద్ధమగు విద్యలోంచి ఉత్పన్నమై మరల ఒకప్పటికి విద్య యందు విలీనమైపోతోంది.

**శ్రీరాముడు :** సాత్వికము, పూర్ణము అగు విద్య నుండి తద్విరుద్ధ స్వభావము, స్పర్ధయుక్తము, అపూర్ణము అగు అవిద్య ఎట్లా ప్రభవిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాస్తవానికి ఈ విద్య–అవిద్యల భేదం జలము–తరంగములకు ఉన్న భేదంలాగా కల్పిత మాత్రమేనని గ్రహించు. సత్యము, నిత్యము అయిన దానిని ఆశ్రయించి ప్రశాంత మానసుడవై ఉండటమే విద్య. అనిత్యములైన వాటిని అనాలోచితంగా ఆశ్రయిస్తూ ఉంటే అవిద్య అంతకంతకు వృద్ధి అవుతోంది. నిత్యసాత్వికములకు ప్రతీకగా శివకేశవాది నామరూపములను సాధన ద్రవ్యంగా గ్రహించుటచే ఈ జీవుడు విద్య వైపుగా పయనిస్తున్నాడు.

**శ్రీరాముడు :** విద్య–అవిద్యలు ఒకదానికొకటి వ్యతిరిక్తమైనవి కావా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ద్విత్వభావనయే అవిద్య కదా! పరమార్థమగు అద్వైత భావనచే భేదభావన తొలగుతుంది. జల–తరంగములకు భేదం లేనట్లే విద్య–అవిద్యలకు భేదం లేదు. భేదమే లేదు కాబట్టే అవిద్యలోని ఒకానొక విభాగము విద్యను ప్రసాదించగలుగుతోంది.

శ్రీ రామచంద్రా! ఈ విద్య–అవిద్యలను అతిక్రమించినప్పుడు ఏది మిగిలి ఉంటోందో...అది అన్ని సమయాలలోను ఏర్పడియే ఉన్నది. అయ్యది జ్ఞానాజ్ఞానాలకు అతీతం. అది అనుభవైకవేద్యము మాత్రమే. అక్కడ అన్ని శబ్దములూ నిశ్శబ్దమౌతాయి. అది వాద ప్రతివాదముల చేతనూ, నామరూపాల చేతనూ, శబ్దార్థాల చేతనూ అందించబడగలిగేది కాదు. అయితే వాద ప్రతివాదాలు, నామరూపాలు, శబ్దార్థాలు సాధన రూపంలో ఉపకరిస్తున్నాయి. అవన్నీ అనుభవజ్ఞానం యొక్క సమక్షంలో సాధ్యం యొక్క సంప్రాప్తి కాగానే లౌకికవ్యవహార సాధనాలలాగానే ప్రక్కకు తొలగుతాయి. సాధ్యం (లేక) జ్ఞేయమునకు ప్రతిరూపమగు చిహ్నం గాని, సంకేతం గాని, శబ్దం గాని లేదని అనుకున్నాం కదా!

అదియే నా యొక్క, నీ యొక్క సత్యస్వరూపం.

నాయనా! ఈ జ్ఞానజ్ఞేయములు, విద్యావిద్యలు 'లేవు' అనియే గ్రహించు. వివేకముతో సద్వినియోగపరచుకో. చివరికి సర్వ కల్పనలు దాటివేయి. అప్పుడు శేషించే దానిలో ఈ క్షణమందే ఎప్పటికీ సుస్థిరుడవై ఉండు. వాస్తవానికి ఇక్కడ ఏదీ లేదు. ఉన్నట్లు కనబడుచున్నదంతా చిద్వస్తువును ఆశ్రయించే ఉన్నది. ఆ చిద్వస్తువు సర్వ ఉపాధులలోనూ సమంగా ఏర్పడి ఉన్నది.

అయ్యది సామాన్య వస్తువువలె తెలియబడేది కాదు. అయితే, దాని అభాస(Reflection) వల్లే వస్తువులన్నీ తెలియబడుచున్నాయి. అందుచేత అవిద్య కూడా సత్ అనియే పిలువబడుతోంది. సత్ వాచకమైన అవిద్య విద్య వలన తొలగిపోతోంది. కాబట్టి,అట్లా తొలగుచున్న దానిని మిథ్య అంటున్నాం.

అందుచేత రామా! నీయందు విద్య – అవిద్యలలో అవిద్య విభాగకల్పన తొలగాలి. అందుకు ఉపకరించే అవిద్యాంశ నాశ్రయించటమే ఉపాయం. అవిద్యా సంక్షయం చేత విద్యావిభాగం కూడా తొలుగుతుంది. అప్పుడు విద్యా ఫలాభియుక్తమగు ఉపాధిశూన్య, అవ్యాప్త పూర్ణానందత్వం శోభిల్లు తుంది. అట్లు శేషించే విషయరహిత స్థితిచే పరమార్థం దర్శనమౌతుంది. సర్వాత్మక సంబంధితమైన తత్త్వదర్శనానంతరం ఇక మిగిలినదీ, పొందవలసినదీ ఏమీ ఉండదు.

ఆ జ్ఞానాజ్ఞాన అతీత స్థితి ఆకాశము కంటే ఉన్నతము, శూన్యము అయి ఉన్నది. అయితే, అది చిదాత్మకమే గాని శూన్యం కాదు. అది ఉపాధిపరిమితమని అనుకోకూడదు. చిదానందము ఉపాధి వ్యవహారములన్నిటినీ అతిక్రమించినదై ఉన్నది.

పాలలోంచి నేయిలాగా, సూర్యకాంత మగియందు అగ్నిలాగా, అగ్ని నుండి విస్ఫులింగముల లాగా, ఆ ఆత్మచైతన్యము నుండి ఈ దేశ–కాల–నిమిత్తములు వెలువడుతున్నాయి. "సముద్రం నుండి అలలు వేరా? మణినుండి శుభ్రకాంతులు వేరుకాదు కదా? అట్టి సాక్షీమాత్ర చైతన్యం నుండి ఈ చరాచరజగత్తు కూడా ఏదో వేరైనది కాదు"....అని ప్రవచించబడుతోంది.

లోపలా, వెలుపలా బ్రహ్మము కాక వేరొక వస్తువే లేదు. వస్తువుల కదలిక ఆకాశమునకు ఆపాదించబడునట్లు, గుణరహితమగు ఆ చిద్వస్తువునకు గుణములు కల్పించబడుచున్నాయి. శివ కేశవాది తత్త్వములకు గుణకల్పన చేసి ఆరాధన కొరకై ఉపయోగించబడుచున్నాయి. బ్రహ్మము యొక్క సామీప్యతచే ఈ దేహములు స్పందిస్తున్నాయి. నీటిలోని నురుగు మొదలైనవి నీటి కంటే వేరు కానట్లు ఈ దృశ్యమంతా బ్రహ్మము యొక్క వికల్పమే కాబట్టి, బ్రహ్మము కంటే వేరు కాదు. సర్వేశ్వరుడు సాధకుల భక్తి సౌలభ్యము కొరకై ప్రతీకలుగా ప్రసాదిస్తున్నట్లు గ్రహించబడుగాక!

ఆకాశము కంటే సూక్ష్మము, అమూర్తము, రూపశూన్యము అగు ఆ చిద్వస్తువునందు వాస్తవానికి దానికన్యమైనదేదీ ఏనాడూ ఉండియుండ లేదు. ఇక శివకేశవు లంటావా? ఇదంతా కూడా ఉండబోదు.

❖❖❖

# 9. అవిచారణమాంద్యము - చికిత్స

**శ్రీవసిష్ఠ మహర్షి :** అందుచేత రామా! నీకు కనిపిస్తున్న ఈ స్థావరజంగమ జగత్తు, ఇందు సంచరిస్తున్న ఈ శరీరధారులు, ఈ సర్వమూ – వాస్తవానికి బ్రహ్మము కంటే వేరు కాదని గ్రహించు. అట్టి బ్రహ్మమునకు వాస్తవానికి పుట్టటం, పోవటం అనే జాడ్యమే లేదు. దానికి జీవకల్పన లేదు. కనుక 'నేను జీవుడను' అను భావమే వ్యర్థము. ఇట్టి భావము వలన ఈ జీవుడు పొందగలిగేదేమిటో చెప్పు?... 'నేను బ్రహ్మమునే' అని ఎందుకు తలచరాదు?

ఈ జీవుడు మొట్టమొదట దేహముతో సంబంధం కల్పించుకుంటున్నాడు. క్రమంగా బాహ్య భోగాభిలాష అభివృద్ధి చేసుకుంటున్నాడు. 'నేనెవరు? ఈ దృశ్యమేమిటి? దేనితో నాకు ఏ సంబంధం ఉన్నది? నేను దేనికి కర్తను? దేనికి భోక్తను?' అని సద్విమర్శకు ఉపక్రమించకుండానే దేహమున్నంత వరకు కాలం గడిపివేస్తున్నాడు. త్రాడు నందు పాము యొక్క భావనను కల్పించుకొని చూస్తున్నట్లు ఈ వింత వస్తుజాలముల మధ్య, సంఘటనల మధ్య రాత్రింబవళ్లు వెళ్లబుచ్చుచున్నాడు.

వివేక దృష్టితో పరిశీలించినప్పుడే భ్రాంతి తొలగుతుంది. తెలియబడినప్పుడు సర్వమూ ఆత్మయే అగుచున్నది. జ్ఞానము యొక్క పరాకాష్ఠ అదే!

స్వస్వరూప చైతన్యమే స్వసత్తారోపితమైన మలినబీజమును ఆశ్రయించి అవిద్యగా రూపం పొందుతోంది. అవిద్యను దాటి పోయినప్పుడు సర్వ ఉపాధులకూ అతీతమైన ఆత్మతత్త్వం యొక్క ఉనికి ఎరుగబడుతోంది. చిత్తము యొక్క తాదాత్మ్యమే జగత్తు యొక్క రూపం. ఒకచోట ఇల్లు ఉన్నదనుకో. ఆ స్థలాకాశమును ఇల్లు ఆరోపించి చూస్తాం కదా! చిత్తమున్న చోటనే భ్రాంతిమయ జగత్తు ఉంటోంది. చిత్తము నశిస్తే భ్రాంతి తొలగుతుంది. రథంలో ప్రయాణించేవాడు పరిసరాలు పరుగులు తీస్తున్నట్లు భ్రమించుచున్నట్లు, చిత్తం తాను కదలుచూ ఆత్మకు కల్పనలు కల్పించి వ్యాకుల పడుతోంది. పట్టుపురుగు లాగా చిత్తము తనలోంచి స్రవించే వస్తుసంబంధ అభ్యాసమును వస్తువులలోంచి లభిస్తున్నట్లుగా భ్రమించి బంధమును అనుభవిస్తోంది. వాసనాతంతువులచే పరిమితమును ఆచ్ఛాదించుకొని తన అపరిమితత్వమును ఏమరుచుచున్నది. అంతర్బాలకత్వంను (Inner Childishness) అభవించుచూ ఆ విషయం తానే ఎరుగజాలకున్నది.

**శ్రీరాముడు:** స్వామీ! ఇక్కడ గల స్థావరములు "ఘనీభవించిన మూర్ఖత్వమా...?" అన్నట్లుగా పడి ఉన్నాయి. అవివేకము యొక్క పరమావధిని ధరించి వాటియందు చైతన్యము మూగగా ఉన్నది కదా! ఆత్మ చైతన్యం దృష్ట్యా వాటిని ఎట్లా అన్వయించుకోవాలి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ స్థావరములలోని చైతన్యమును – మత్తుగా త్రాగి రహదారి ప్రక్కన గాఢ నిద్ర అనుభవిస్తూ పడి ఉన్న బాటసారిలోని జీవత్వపు 'ఎరుక స్థితితో' – పోల్చవచ్చు. అవి నిద్రా పరవశుని వలె సుఖదుఃఖములను గ్రహించు యోగ్యతను కోల్పోయి ఉన్నాయి. 'ముందు వెనుకల గురించి చింతించుట' అనే మననశక్తి కూడా వాటియందు లేదు. ముగ్ధ – నిర్విషయ రూపము

ఆశ్రయించి వందల వేల సంవత్సరాలు గడుపుతున్నాయి. అయితే దేహియగు ఈ జీవుడు కూడా జీవించి ఉన్న కాలంలో మూడవవంతు అట్టి ముగ్ధ – మౌన – జడ నిష్ప్రపంచక – నిర్విషయ రూపమును అనుభవిస్తూనే ఉన్నాడు కదా!

అట్టి స్థావర జన్మలు ఆత్మజ్ఞానముచే లభించే సాత్వికోన్నత స్థితికి బహుదూరంగా ఉన్నాయని చెప్పబడుతోంది. అంతర్భావములు నిద్రాణమై ఉండి, ఆ భావములకు ప్రతిస్పందనము నిర్వహించ లేని స్థితిలో ఉండుటచే ఆ స్థావర స్థితి అత్యంత దుఃఖకరమగు స్థితి. కర్మేంద్రియిలు, జ్ఞానేంద్రియాలు, మనస్సు కూడా జడ – శూన్య స్థితిలో ఉండటం చేత అవి సత్తామాత్రములై మూగ – జడ స్థితిని అనుభవిస్తున్నాయి.

**శ్రీరాముడు :** వేదవేద్యులగు మహర్షీ! ఒక యోగి మనస్సును నశింపచేసి జ్ఞానకర్మేంద్రియాలను అధిగమించిన వాడై చైతన్యమాత్రుడై ఉండుటయే సర్వోత్కృష్టమగు మోక్షము యొక్క స్వరూపమని అంటారు కదా! మరి, స్థావరములలో నిర్విషయ – మనోరహిత సత్తకు, జ్ఞాని యొక్క మనోరహిత స్థితికి అత్యంత సుదూరమైన 'తేడా' ఉన్నదని అంటున్నారే? స్థావరాలలోని సత్త మనోరహితమైనదే కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి:** స్థావరాలలో బుద్ధి పూర్వకమైన విచారణ అంటూ ఏదీ ఉండదు. అట్టి స్థితి దుష్కృతముల – దుర్వాసనల – దురవగాహనల వలన లభిస్తోంది. దానికి శాస్త్రములు ప్రతిపాదించే ఆత్మజ్ఞానం పొందటానికి యోగ్యత, అర్హత ఉండవు. ఇక మోక్షస్థితి అంటావా? శాస్త్ర విహితమైన కర్మానుష్ఠానం చేత చిత్తము శుద్ధి సంపాదించగా ఏర్పడే అవగాహన కదా! శ్రవణ – మనన– నిధి – ధ్యాసాది అనేక ప్రయత్నముల ప్రభావం చేత వాసనలు సమూలంగా నాశనం కాగా, ఏర్పడే నిత్యోదిత చైతన్య పరిపూర్ణ స్థితి అది.

1. దుర్వాసనల భారంచే స్పందన కోల్పోయినట్టి మనో జడ స్థితి. ⟶ స్థావరములు
2. వాసనారాహిత్యంచే ఏర్పడే పూర్ణ చైతన్య అమనస్కస్థితి ⟶ ఆత్మస్థితి

వాసనారహిత అమనస్కస్థితికి, నిద్రాణమైన జడస్థితికి, అస్థిమశకాంతరం (ఏనుగుకు – ఒక దోమకు ఉన్నంత) తేడా ఉన్నది. ఆత్మతత్త్వమును చక్కగా గ్రహించుట చేత ఏర్పడే వాసనాపరిత్యాగమే 'కైవల్యపదవి' అని పిలువబడుతోంది.

❖

విత్తనంలో అంకురలక్షణాలన్నీ మౌనంగా దాగి ఉన్నట్లు, గాఢనిద్ర పోయేవానిలో సంకల్పములు ఉండి కూడా ప్రస్ఫుటం కాకుండా ఉన్నాయి. అట్లాగే జడములలో వాసనలు సుషుప్తమై వెలయు చున్నాయి. ఆ వాసనలే మరల జాగ్రత్ స్థితికి, పునర్జన్మకు కారణములగుచున్నాయి. మరి స్థావరాలకు మరల జన్మ లేదనటం ఎట్లా సంభవం? సుషుప్తంలో అణిగి ఉన్న వాసనలతో కూడి, మనోధర్మరహితమై,

జడత్వము ఆశ్రయించి ఉన్న స్థావర జన్మలు కూడా దుఃఖసహితములగు అనేక వందల జన్మలు పొందటానికి వేచియే ఉన్నాయి. అనగా, జడ ధర్మమును ఆశ్రయించిన స్థావరములు మరల సుషుప్త ధర్మము వహించి జన్మలు పొందవలసిన అగత్యం ఉన్నది.

ఒకవేళ, జడధర్మమే మోక్షమని అనుకుంటే, ఇక శాస్త్రోక్తమైన ప్రయత్నములను వదలి మత్తు పదార్థములను స్వీకరించి, మత్తుగా పడి ఉండటం మంచిది కదా! కనుక, జడత్వమనేది మోక్షమని అనిపించుకోవటానికి వీలు లేదు.

విత్తనంలో పుష్పలక్షణములు, మట్టియందు కుండధర్మములు అంతఃస్థితమై ఉన్నట్లు స్థావరము లందు పునర్జన్మ సంస్కారవాసనలు దాగి ఉన్నాయి. వాసనాబీజములు నిర్బీజములై సమూలంగా నశించటమే 'తురీయం' అని అనిపించుకుంటుంది. అంతే కానీ, జీవజంతు జాలం సుషుప్తి పొందినంత మాత్రంచేత అది 'సిద్ధి' అని అనిపించుకోదు.

**శ్రీరాముడు:** వాసనలు వృద్ధి చెందటానికి కారణమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అజ్ఞానముతో కూడిన దృశ్యతదాత్మ్య అభాసయే అందుకు కారణం. వాసన, అగ్ని, ఋణం, వ్యాధి, శత్రుత్వము, అనురాగము, వైరము – ఇవన్నీ కొంచెం మిగిలి ఉన్నా మరల ప్రవృద్ధమౌతూ ఉంటాయి. వాసనలు ఇచ్ఛ – ఆశలు సహాయంతో క్రమాభివృద్ధి పొంది మహానర్థాలకు కారణమగుచున్నాయి. వివేకి అయినవాడు వాటిని సమూలంగా నిశ్శేషంగా త్యజించాలి. తీవ్ర ప్రయత్నంలో ఉద్భూతమయ్యే జ్ఞానాగ్నిచే వాసనాబీజాలను దగ్ధం చేయాలి. సత్తా సామాన్య రూపస్థితి పొందినవాడు ఈ శరీరము ఉన్నప్పుడు లేనప్పుడూ కూడా అద్వైత–నిత్య శాంత స్థితి పొందుతాడు. అట్టివాడు ఇక జన్మించడు. దుఃఖములను పొందదు.

❖

స్థావరములు తరగని వాసనా బీజములతో, ఉత్పత్తి పొందబోవు రసభావంతో, (అయితే) అంతర్గతంగా – చిచ్ఛక్తి సమన్వితములై నిద్రించుచున్నాయి.

ఆత్మశక్తియే జడములందు జడరూపంగానూ, రాయియందు కాఠిన్యంగాను, కాష్ఠంలో (చెక్కలో) ధ్వంస రూపంగానూ, కత్తియందు పదును రూపంగానూ, మట్టికుండ యందు జలధారణ సమర్థం గానూ, వస్త్రము నందు చలి నివారణ శక్తిగానూ, బంగారము నందు ఆభరణత్వంగానూ వెలయు చున్నదని సునిశిత బుద్ధితో గ్రహించు. వాసనాబీజశక్తి విత్తనమునందు దాగి ఉండి తగిన వాతావరణం లభించగానే వికాసం పొందే మహావృక్షములాగా, జగదనుభవంగా బయల్వెడలుతోంది. అట్టి వికాసము నుండి అనేక రూపనామ పరంపరలను పొందుతూ మహాప్రయాణం చేస్తోంది.

నిజానికి ఆత్మ చైతన్యమునకు నామరూప ఉపాధిత్వంగాని, స్థావర జంగమత్వం గానీ లేదు. రూపరహితమగు ఆకాశమునందు మేఘముల ఆచ్ఛాదనచే రూపముగా స్ఫురిస్తున్నట్లు, ఆవృతచైతన్యం జడాది దృశ్య దశలను పొంది కనిపించటం జరుగుతోంది. కనుక, రామా! ఈ అజ్ఞానముచే ఆవరించబడిన చిచ్ఛక్తి యొక్క వాస్తవ స్వరూపమేమిటో గమనించు. అంతేగాని అవాస్తవమగు

స్థావర జంగములను చూచి భ్రమించకు. భూతాకాశము రూపరహితమైనట్లే ఆత్మాకాశం సదా, సర్వదా విషయరహితం.

అసన్మయము అగు 'అజ్ఞానము' అనే నిస్సార వస్తువు నలువైపులా వ్యాపించి భ్రాంతిబుద్ధికి రకరకములుగా, స్థావర జంగమాత్మకంగా తోపింప జేయుచున్నదయ్యా! అయితే ఆత్మ దృష్టితో అల్ప దృష్టిని జయిస్తే ఈ సంసారము బ్రహ్మమే అవుతుంది గానీ, భ్రమను కలిగించజాలదు. దీని నంతటినీ ఆత్మదృష్టితో చూస్తున్నపుడు సర్వదుఃఖములు నశించుచున్నాయి. ఆత్మదృష్టికి విరుద్ధంగా 'ఆవరణ' కల్పించుకొనుటయే అవిద్య. అవిద్యలోంచి దృశ్యజగత్తుకు సంబంధించిన జడ-జీవాది స్ఫురణలు కలుగుచున్నాయి.

**శ్రీరాముడు:** ఈ నామరూపాత్మక ఆవరణ కల్పిస్తున్న అవిద్య యొక్క అసలైన రూపమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవిద్యకు రూపమంటూ ఏదీ లేదు.

**అవిద్యారూపరహితా యావదేవావలోక్యతే ।**
**తావదేవ గలత్యాశు తుహినాణుర్యథాతపే ॥** (శ్లో॥ 31, సర్గ 10.)

సర్వరూపశూన్యమైన అవిద్య ఎంతవరకు విచారించబడితే అంతవరకూ ఎండకు మంచులాగా, కరిగి పోవుచున్నది. నిద్రలోంచి లేస్తున్న మనుజుడు ఎంతవరకు జాగ్రత్‌వృత్తులు వచ్చి జేరితే అంతవరకూ నిద్రమత్తు తొలగినట్లే కదా! "ఇది ఏమిటి?"- అని ఎంతవరకు పరిశీలిస్తామో అంత వరకు విషయ పరిజ్ఞానం లభిస్తుంది. ఎంతవరకు వెలుతురు విస్తరిస్తే అంతవరకూ చీకటి దూరమౌతూ ఉంటుంది. అట్లాగే, ప్రయత్నపూర్వకంగా ఎంతవరకూ అవలోకిస్తూఉంటే అంతవరకు అవిద్య క్షీణిస్తూ వస్తుంది.

ఒకడు ఒక చీకటి గదిలో నిలబడి ఉన్నాడనుకో! "ఈ చీకటి యొక్క అసలైన రూపమేమిటి?" అని తెలుసుకుందామని దీపం వెలిగించి వెతికితే, ఆ దీపపు వెలుతరులో చీకటి రూపమేమిటో కనబడుతుందా? దీపం వెలగగానే చీకటి మటుమాయమౌతుంది. ఎందుకంటే, వెలుతురు లేక పోవటమే చీకటి కదా! జ్ఞానం ప్రభవించిందా, అజ్ఞానము యొక్క నామ-రూపములు కూడా లభించవు. నెయ్యి యొక్క ఘనస్వరూపం (పేరు నెయ్యి యొక్క ఘనాకారం) పరిశీలించటానికి వేడి చేశామనుకో, ఆ ఘనాకారం యొక్క పొడవు వెడల్పులు ఏమగుచున్నాయ్? మటుమాయమౌచున్నాయి కదా! అట్లాగే, అవిద్య విచారించబడినప్పుడు, ఆ విచారణ యొక్క తీవ్రత చేత, ఆ అవిద్య 'ఇది' అని నిర్దేశింపబడక పారిపోవుచున్నది.

కొంచెం మాత్రమే విచారిస్తే కొంచెమే తొలగుతోంది. అసలు విచారణయే చేయకపోతే, అసద్రూపమగు భ్రమగా అనుభవమగుచు అది అవస్తువు అయి కూడా జీవుని ఈ నిబిడాంధకార రూపంలో చుట్టుముట్టుతోంది. కనుక రామా! అవిచారణామాంద్యమును వదలి, విచారణ చేసి చూడు అప్పుడు నీకు 'అవిద్య లేనిదే' అని తెలియబడగలదు. విచారణ చేయకుండా, ధ్యాన-భక్తి-యోగాది ప్రయత్నాలు లేకుండా రోజులు గడపుతూ ఉంటే ఈ అవిద్య తనంతట తానే తొలగుతుందా? ...లేనే లేదు.

**శ్రీరాముడు:** కార్యకారణములచే రూపాంతరం చెందుచూ, కనబడుచున్న ఈ అవిద్యాదృశ్యతరంగం విలీనమవటానికి ఉపాయమేమిటి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** "రక్త-మాంస-బొమికలచే పంజర రూపంలో తయారై కనిపిస్తున్న ఈ శరీరంలో చిక్కుకుని ఉన్న నేనెవడను?" అని విచారణ చేయటమే అందుకు ఉపాయం. సర్వ అసద్రూపములను మొదలంట్లా త్యజించివేయటాన్నే 'అవిద్యా క్షయం' అని పిలుస్తున్నాం. అప్పుడు శేషించి ఉన్నదే ఆత్మ కదా! ఒకడు ఒక భుజకీర్తిని ధరించునప్పుడు మరల తొలగించినప్పుడు అతడు యథాతథంగానే ఉంటున్నాడు కదా! ఈ జగత్తులను ధరిస్తున్నప్పుడు, త్యజించునప్పుడు కూడా 'ఆత్మ' ఒకే తీరుగా ఉండి ఉంటోందని గ్రహించు. ఆత్మ ఎప్పుడూ ఏదీ పొందటం లేదు. కోల్పోవటం లేదు. "అది సదా యథాతథం" – అని వేదోపనిషత్తుల గానం కదా!

అవిద్య తొలగినప్పుడు శేషించి ఉండే వస్తువు శాశ్వతము-సద్రూపము అగు బ్రహ్మమే కదా! ఆత్మ సర్వమును ధరిస్తోంది. మరల పాము కుబుసమును విడుచునట్లు విడచివేస్తోంది. ఆత్మ యొక్క సమక్షమునందే అవిద్య ప్రవర్తించటం – నివర్తించటం కూడా జరుగుతోంది.

అట్టి సారభూతమగు ఆత్మయే నీవు కదా! ఆత్మ అనుభవైకవేద్యము. నాలుక ఒక మధురమైన వస్తువును ఆస్వాదిస్తున్నప్పుడు ఆ అనుభూతిని ఏ వర్ణనల చేతనూ మరొకరెవరికీ అందించగలిగేది కాదు. అట్లాగే, ఎవరికి వారే స్వస్వరూప సందర్శనంచే అది ఆస్వాదించవలసిందే! ఆత్మయే ప్రతిఒక్కని శాశ్వత స్వరూపం, వాస్తవ స్వస్వరూపం అయిఉన్నది.

రామా! మరల చెప్పుచున్నాను. 'అవిద్య' అనేది అసలు లేనేలేదు. ఈ కనబడేదంతా అఖండిత మగు బ్రహ్మమే అయి ఉన్నది. బ్రహ్మమే అవిద్యగా భ్రమచే అనిపిస్తోంది. సత్ – అసత్ కల్పనలన్నీ బ్రహ్మము నందే, బ్రహ్మము చేతనే, బ్రహ్మము గానే కలుగుచున్నాయి.

'కుండ' మట్టికాదని, 'వస్త్రము' దూది కాదని, 'శకటం' కొయ్య కాదని, అనిపించటం తెలివి తక్కువతనమే కదా! 'ఇది బ్రహ్మము కాదు' అని అనిపించటమే అవిద్య. 'ఇదంతా బ్రహ్మమే' అను నిశ్చయమే అవిద్యా క్షయం. ఇక్కడున్నదంతా శివం – శాంతం – అద్వైతం తప్పితే ఇక ఇక్కడా, ఎక్కడా, ఇప్పుడూ, మరెప్పుడూ, ఏదీ, మరేదీ లేదు. లేనే లేదు. ఉండజాలదు.

❖❖❖

## 10. కర్తవ్యములు జ్ఞానమునకు అడ్డు కావు

**శ్రీవసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! మరలమరల ఆత్మతత్త్వ విషయమై వినటం మననం చేయడం వంటి అభ్యాసముల వలన మాత్రమే ఈ దృశ్యం ఇక హృదయంలో చిగురించకుండా ఉండగలదు. అనాత్మభావనపోయి ఆత్మభావన సంతరించుకోవాలంటే విషయం ఆరూఢం కావాలి. అందుచేతనే ఒకే విషయం మరల మరల నేను చెప్పటం జరుగుతోంది. కనుక నేను చెప్పేది పరిశీలకుడవై విను.

**అజ్ఞానమేతద్బలవదవిద్యేతరనామకమ్ ।**
**అభ్యాసేన వినా సాధో నాభ్యుదేత్యాత్మభావనా ॥** (శ్లో.2, సర్గ.11.)

ఈ 'అవిద్య' అనబడే అజ్ఞాన-అనాత్మ భావనలు వందల-వేల జన్మలలో మూటకట్టుకున్న ద్వైతవాసనలవలన బలం పుంజుకుని దట్టంగా పెనవేసుకుని ఉన్నది.

ఇది అనేకసార్లు జాగ్రత్‌లో కళ్లు మొదలైన ఇంద్రియములు ఉపయోగిస్తున్నప్పుడు, 'స్వప్నం' అనే ఊహయందు పొందిన అనుభవపరంపరల చేతనూ, అనేకసార్లు చావు-పుట్టుక లందలి భావోద్రేకముల చేతనూ ప్రాబల్యం పొంది ఉంటోంది. అందుచేత శ్రవణ మననాది తీవ్రయత్నములు ఎంతో అవశ్యకమై ఉన్నాయి.

ఇక ఆత్మజ్ఞానం అంటే ఏమిటి? అది పంచేంద్రియాలకు అగోచరమైనది. ఆరవ ఇంద్రియము, సంకల్ప స్వరూపము అయిన మనస్సు కూడా లయించగా, అప్పటికీ సత్తామాత్ర రూపమై వెలయుచున్నది, ఇంద్రియముల వలన కలుగుచున్న వృత్తులకు ఆవల ప్రత్యక్ష, వృత్తిరహిత స్వభావమై ఆత్మ ప్రకాశిస్తోంది. మరి అట్టిది భౌతికమైనదిగా ఎట్లా కనిపిస్తుంది చెప్పు?

కాబట్టి రామా! హృదయ వృక్షమును దట్టముగా పెనవేసుకుని ఉన్న అజ్ఞాన-లతను సంక్షయింపజేయాలి సుమా! "మరల మరల జ్ఞానమును అభ్యసించటం" అనే చురకత్తిని ఉపయోగించి ఆ అజ్ఞాన-లతను త్రెంచి స్వస్వరూపమును సిద్ధింపజేసుకోవాలి.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జీవుని జీవితము రాజ్యపాలన, అన్నపానాదుల సముపార్జన మొదలైన శరీరరక్షణ వ్యవహారములకే అధికభాగం సరిపోతోంది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** నాయనా! రామా! ఈ అన్నపానాది లౌకిక వ్యవహారములు జ్ఞానసముపార్జనకు, అవిద్యా నాశనమునకు, అడ్డుగా ఉన్నాయని అమాయక జీవులు మాత్రమే భ్రమిస్తున్నారు. అది సరికాదు. నీవు అట్టి అల్ప అభిప్రాయములను దరిజేరనీయవద్దు. జనక మహారాజు రాజ్యపాలనాది వ్యవహారములను నిర్వర్తిస్తూనే జ్ఞానాభ్యాసపరుడై, జ్ఞానిఅయి విహరించటం అందరం చూస్తున్న విషయమే. అభ్యాసబలం చేతనే ఆతడు కర్మనిరతుడై కూడా 'నేను సర్వకర్మ వ్యవహారములకూ అతీతుడను' అను నిశ్చయాత్మక బుద్ధిని అభ్యాసఫలంగా సంపాదించుకున్నాడు. పూర్ణజ్ఞాన నిశ్చయము గల విష్ణుమూర్తి అనేక అవతారములతో గర్భవాసం అనుభవించి, జన్మించి ధర్మరక్షణ, భక్తపాలన చేస్తూనే స్థిరచిత్తుడై నిశ్చలుడై, నిర్లిప్తుడై ఉన్నారు. సర్వదా అంబతో కూడుకొనియున్న శివభగవానుడు, సరస్వతీదేవితో కూడుకొనియున్న బ్రహ్మదేవుడు, రాగరహితులై, అఖండజ్ఞాన సమన్వితులై అవిద్యకు ఆవల నిశ్చలులై ఉన్నారు. సృష్టి-లయ కార్యములలో నిమగ్నమై ఉన్నారు. అయినా కూడా వారు భక్తులకు కరుణతో, వరములను, జ్ఞానమును ప్రసాదిస్తున్నారు. గుణ సహితులై వర్తిస్తున్నారు. అట్టి మహనీయుల నిశ్చయమే నీకు కూడా కలుగుగాక!

దేవతల గురువగు బృహస్పతికి, అసురుల గురువగు శుక్రాచార్యులకు, త్రిలోకసంచారియగు నారదమహర్షికి, పులస్త్య- అంగీరస - ప్రచేతస - భృగు - క్రతు - అత్రి - శుకాది ఋషిసత్తములకు,

ఈ సభకు వేంచేసి ఉన్న అనేకమంది మహనీయులకు, జీవన్ముక్తులకు, రాజర్షులకు, బ్రహ్మర్షులకు, నాకు కర్మల వ్యవహారం పట్ల ఎట్టి నిశ్చయం ఉండి...కర్మలు నిర్వర్తించటం జరుగుతోందో, అట్టి నిశ్చల ఆత్మైక్యస్థితి, అపరోక్ష, అద్వైతజ్ఞానానుభూతి పెంపొందించుకుంటూ, నీకు విధించిన కార్యములను నిర్వరిస్తూ ఉండు. కర్మల తదనంతరం జ్ఞానం కాదు. జ్ఞానివై కర్మలు నిర్వర్తించు.

**శ్రీరాముడు:** భగవంతుడా! వసిష్ఠమహర్షీ! మీరు చెప్పిన మహనీయులందరూ ఏ నిశ్చయమును అనుసరించి, అవిద్యాశోకరాహిత్యమగు పదవిని అలంకరించి ఈ దృశ్యజగత్తులో సంచరిస్తున్నారో – అది వివరించమని ప్రార్థిస్తున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** సునిశిత బుద్ధితో నేను చెప్పేది గ్రహిస్తున్నట్టి నీకు వారి సునిశ్చయమేమిటో వివరించి చెబుతాను విను. ఇప్పుడు నేను చెప్పే వివేక భేరీనినాదం సర్వ వేదాంత సిద్ధాంతసారమే అయి ఉన్నది.

❖❖❖

# 11. వివేక భేరీ నినాదం

వివేకుల భేరీ నినాదం ఇట్లా ఉంటుంది. ఈ కనబడే జగత్తుల యొక్క స్థితిగతులన్నీ ఘనీభూతమై ఏర్పడి ఉన్నట్లుగా అనిపిస్తోంది కదా! అయితే వివేకులగు మహనీయుల దృష్టిలో ఇదంతా మాయకమై ఉండి కూడా పవిత్రబ్రహ్మ స్వరూపంగానే వ్యవస్థించియున్నది.

**బ్రహ్మ చిద్బ్రహ్మ భువనం బ్రహ్మ భూతపరమ్పరాః ।**
**బ్రహ్మాహం బ్రహ్మ మచ్ఛత్రుర్బ్రహ్మ సన్మిత్రబాన్ధవాః ॥** (శ్లో 17, సర్గ 11.)

బ్రహ్మమే జీవచైతన్యముగా ప్రకటితమౌతోంది. చైతన్యాభాసకమగు ఈ చతుర్దశభువనములు (14 లోకములు), వాటిలో ఉండే అసంఖ్యాక జీవులు కూడా బ్రహ్మమే! నేను, నా బంధువులు, నా శత్రువులు, నన్ను ఆక్షేపించేవారు–అందరూ బ్రహ్మమే అయి ఉన్నారు.

భూత, భవిష్యద్వర్తమాన కాలములు సముద్రంలోని తరంగముల లాగా బ్రహ్మమునందే విజృంభిస్తున్నాయి. పదార్థ సంపదలు కూడా బ్రహ్మమే. బ్రహ్మము బ్రహ్మముచేతనే పరిలక్షించబడటం (Being aimed at), గ్రహించబడటం, ప్రేరేపించబడటం, అనుభవించబడటం... జరుగుతోంది. బ్రహ్మము తనయందు తానే తన మాయాశక్తిచేత వివర్తము చెందుతూ 'తదితరం" గా వర్ధిల్లుచున్నది. నన్ను అధిక్షేపించుచూ, ఉపేక్షించుచూ, ప్రశ్నించుచూ, వేధించుచూ కనబడేదేదైతే ఉన్నదో– 'అదంతా' బ్రహ్మమే కనుక బ్రహ్మమునకు నేను ప్రియమొనర్చెదను గాక!

ఆకాశంలో మేఘముల సమావేశం ఏదో వనముయొక్క ఆకారంలాగా ఉన్నట్లు భ్రమచే తోచుచున్నది చూచావా? అది పసిపిల్లవాడి అమాయకదృష్టి వంటిదే కదా! అట్లాగే రాగద్వేషాది వ్యవస్థలన్నీ కేవలం ద్రష్టయొక్క కల్పిత దృష్టుల ఫలితం మాత్రమే. బ్రహ్మనిష్ఠని అవేమీ స్పృశించలేవు. అఖండబ్రహ్మైక్యవేద్యులకు సర్వసంకల్పములు మొదలంట్లా నశించి ఉంటాయి. అందుచేత వారిపట్ల

రాగమునకు సంబంధించిన సంకల్ప ప్రసంగం ఉండదు. వారి రాకపోకలు, కాళ్లుచేతుల కదలికలతో సహా సర్వ కార్యక్రమములూ పూర్ణస్వభావమై, బ్రహ్మరససమన్వితములై ఉంటాయి. వారు సర్వేసర్వత్రా స్వస్వరూపమునే దర్శించటం చేత ఇక ఎవరి మీద ద్వేషం? "ఈ జగత్తంతా నా హృదయాకాశ విన్యాసమే"... అని వారు ఆస్వాదిస్తున్నారు.

ఆనందైక రసమగు బ్రహ్మమే అంతటా, అన్నిటా, అన్నివేళలా ప్రకాశించుచుండగా... ఇక సుఖమేమిటి? దుఃఖమేమిటి? అన్ని వైపులా బ్రహ్మమే బ్రహ్మమునందు దీపిల్లుచున్నది. ఇక నేనో? బ్రహ్మము కంటే వేరుగా నేను మరెచ్చటా లేను.

కుండ – మట్టి – దూది – అంతా బ్రహ్మమే. నాతో సహా అంతా బ్రహ్మమే అయి ఉండుట చేత, ఇష్టం అయిష్టం మొదలైన కల్పన అంతా మిథ్యయే. అట్టి కల్పనల యొక్క అవసరంగాని, అనవసరంగాని లేదు. ఈ దేహ బ్రహ్మము మరణ బ్రహ్మమునందు ప్రవేశిస్తోంది. ఉభయ స్థితులూ బ్రహ్మమే అయి ఉన్నాయి. కనుక మరణము గురించి భయపడటం గాని, కోరుకోవటం గాని చేయవలసిన పనేమున్నది?

ఎవరైనా సుఖదుఃఖాలు అనుభవించే వారు ఇక్కడున్నారని అనుకుంటే, అది అజ్ఞానాంధకారంలో త్రాడును చూసి పాము అని అనుకోవటం వంటిదే.

అంతయూ బ్రహ్మమే కాబట్టి 'ఇది నేను చేశాను' అని భావించవలసిన పని లేదు. తరంగముల కదలికలు నీరు నుండి వేరుగా ఉన్నవి కాదు కదా. నీటిలో కదలికలే లేకపోతే ఇక తరంగములకు ఉనికి–నామ–రూపములు ఎక్కడినుండి వస్తాయి? బ్రహ్మమే లేకపోతే సుఖదుఃఖములకు ఉనికియే ఉండేది కాదు.

కెరటములు జలమే కదా! ఇక కెరటములకు 'జలములో లయించుట' అనే వ్యవహారం ఎక్కడున్నది? అట్లాగే ఈ జీవుడు బ్రహ్మమును సంపాదించుటయో, తాను బ్రహ్మము నందు లయించుటయో ఏముంటుంది? ఈ జీవుడు బ్రహ్మమే కదా! ఇక్కడేదీ మరణించుట లేదు. తరగుట లేదు. పెరుగుట లేదు. అయితే, తరంగములు 'చలించుట' అను చలనస్వభావమును వీడకయే నిజస్వభావమున జలముగా వెలయునట్లు 'ఈ పాంచ భౌతిక దేహాన్ని నేను' అను జడస్వభావమును ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా స్వస్వభావమగు తత్త్వరూపమున వెలసి ఉండెదను గాక! తరంగములు నిశ్చలత్వం పొందితే జలంగానే ఉంటాయి కదా! అనిశ్చలంగా ఉన్నప్పుడు కూడా అవి జలమే! బంధము–మోక్షము అను ఉభయ స్థితులలో బ్రహ్మమే ఉన్నది. నేను అజ్ఞానినైనా, సుజ్ఞానినైనా కూడా బ్రహ్మమే అయి ఉన్నాను.

బంధ–మోక్షములు లేనే లేవు. ఒకవేళ ఉంటే... వాటి వాస్తవ స్వరూపం బ్రహ్మమే! శాస్త్రాలు (ఉపనిషత్ మొదలైన గ్రంథాలు) అతాత్త్వికమగు జడ రూపమును పరిత్యజించి... తద్వ్యతిరిక్తమగు 'తత్త్వభావన పొందటం' అనుదాని గురించి ప్రవచిస్తున్నాయి. అదంతా కూడా ఆభరణము నందు బంగారమును, తరంగము లందు జలమును గాంచుట వంటిది మాత్రమే. 'తత్త్వభావన' అనగా

'నీవు'గా 'నేను'గా కనిపించేదంతా బ్రహ్మమే – అను భావన. ఈ క్షణం తరువాత ఎప్పుడో ఎక్కడో పొందవలసిన మరొక స్థితి, స్థానములు కాదు. "ఇది బ్రహ్మం కంటే వేరొకటి"... అను బ్రహ్మవ్యతిరిక్త భావమే ప్రకృతి అని, మాయ అని పిలువబడుతోంది.

ఈ జీవజడాది రూపములన్నీ బ్రహ్మము నందే ఆరోపించబడుచున్నాయి. భేదభావన ఉన్న చోట మాత్రమే మోహం, దుఃఖం ఉంటాయి. వాస్తవము, నిత్యము, అప్రమేయము అగు బ్రహ్మమును ఎరుగుటచే ఇక అవి ఉండవు. తెలియని వారికి ఈ జగత్తు దుఃఖమయం. తెలిసిన వారికి ఇదంతా అఖండానందరసైక పూర్ణము. గ్రుడ్డివానికి ఈ జగత్తంతా అంధకారమయం. జ్ఞానచక్షువులు కలవారికి ఇదంతా ప్రకాశమయం. అజ్ఞానికి ఈ జగజ్జాలం బంధమయం. జగదేక ఆత్మజ్ఞానం చేత ఇదంతా దివ్యానందమయం.

ఓ బిడ్డలారా! సకల జీవులారా! మమాత్మ స్వరూపులారా! రాత్రిపూట శిశువు చీకటి వైపు చూచి భూతములను ఊహించి భయపడునట్లు, మీరు ఈ జగత్తులోకి వచ్చి వ్యామోహితులై ఇక్కడి అల్ప లాభాలాభములను చూచి ఉలిక్కిపడుచున్నారు. ప్రాప్తవయస్కుడు చీకటికి ఏమాత్రం భయపడ నట్లుగానే, జ్ఞానము ప్రాప్తించినవాడు 'బ్రహ్మము' అనే నిండుకుండ అయి తనను తాను దర్శించుకొను చున్నాడు. విశ్వమంతా తన రూపంగా ఆస్వాదిస్తున్నాడు. అందుచేత, అతనికి ఎట్టి భయ దుఃఖాలు అంతరమున కలగటమే లేదు. తరంగములు లేవటం, పడటం మిథ్యయే అయినట్లు ఇక్కడ జీవించటం, మరణించటం అనేవి మిథ్యయే. ఇదంతా భ్రాంతిచేతనే కల్పితంగా ఆత్మయందు దృశ్య సంబంధిత భ్రమగా కలుగుతోంది. బాల్యాజ్ఞానంలాగా 'ఇది ఉన్నది – అది లేదు' అనే పరికల్పన ఆత్మ యందు ఆత్మచే ఏర్పరుపబడుతోంది. ఇక్కడ ఉన్న విశేషం ఇంతకుమించి ఇంకేమీ కాదు.

ఒక దీపం యొక్క కిరణపుంజములు బయలుదేరి నిష్కారణంగానే తదితర పదార్థములను ప్రస్ఫుటింప జేయుచున్నట్లు బ్రహ్మము నుండి బయలుదేరిన చిత్‌పుంజములు జగత్తును ప్రస్ఫుటింప జేయుచున్నాయి. బ్రహ్మము 'జగత్‌నిర్వచనము' అనే ఆత్మశక్తిని ప్రకటించుచున్నప్పటికీ అది సర్వదా తనయందు తానే వెలయుచున్నది.

కెరటముల మధ్య గల జలకణములు కించిత్ ఘనీభవించటం చేత జలంలో నురుగు ఏర్పడుతోంది. ఆ జలకణములు తునిగినప్పుడు, తిరిగి జలముగానే రూపం దిద్దుకుంటోంది కదా! అట్లాగే ఏదో కారణం చేత ఆత్మ కల్పితరూపములను సంతరించుకుంటోంది. ఆ కారణం నిరోధించ బడినప్పుడు తిరిగి బ్రహ్మముగానే శేషిస్తోంది. సముద్రంలో జలం లేకపోతే కెరటములు గాని, బుడగలు గాని ఉండేవా? బ్రహ్మమే లేకుంటే మనోబుధ్యాది అంతఃకరణములుగాని, ఈ శరీరములు గాని ఏర్పడగలిగేవే కాదు. సముద్రం ప్రశాంతమయినప్పుడు కెరటాలు, నురుగు, వీచికలు, జలకణాలు శమించగా, ఇక ప్రశాంతజలత్వం స్వాభావికమే అయినట్లు కల్పనలు త్యజించినప్పుడు ఈ జీవుడు స్వాభావికంగానే స్వతఃసిద్ధము, నిర్మల–సర్వాత్మ స్వభావమగు బ్రహ్మముగానే ప్రకాశిస్తున్నాడు. ఈ శరీరములు, ఈ సంపద–ఆపదలు, ఈ హర్ష–విషాదములు, ఈ ధర్మార్థ కామ పురుషార్థములు

– అన్నీ కూడా తిరిగి బ్రహ్మము నందే ప్రవేశిస్తున్నాయి. 'బ్రహ్మమున జగత్తులు ఉండటం' అనగా 'బంగారమునకు ఆభరణమునకు సంబంధించిన ఆకారము ఉండటం' వంటి కల్పితం మాత్రమే. ఈ విచిత్రం ఇంతవరకే గాని మరింకేమీ కాదు. మూఢులు స్వస్వరూప అజ్ఞానావేశం చేత ద్విత్వం కల్పించుకొని బాధపడుచున్నారు.

ఈ మనస్సు బుద్ధి, శబ్ద స్పర్శ రూప రస గంధము లనబడే పంచతన్మాత్రలు, ఇంద్రియాలు – ఇవన్నీ 'ఏకైక బ్రహ్మమే' అయి ఉన్నాయి. అట్లే అనేక ఆత్మలు ఎక్కడా లేవు. కొండగుహాలో చేయ బడిన 'ఓహో' అను ధ్వని ప్రతిధ్వనించి ఆ గుహాలో అనేక వైపుల నుండి అనేకసార్లుగా 'ఓహో...ఓహో' ధ్వని వినబడుతుంది. అవి మరొకరెవరో పలుకుతున్నట్లు అనిపిస్తుంది. అట్లాగే ఇక్కడ ద్వితీయ భ్రాంతి కలుగుతోంది. 'వాచారంభం... మొదలే అసంభవం 'అనునట్లుగా 'నేను, నీవు, ఇది, అది, చిత్తము, అనుభవము' – మొదలైనదంతా ఆత్మయందు ద్వైతభ్రాంతిని కల్పించుచూ, లేచుచున్నది.

కలలో ఒక జీవుడు తన కల్పితరూపములగు అనేక రూపములను దాల్చి తానే ఆ రూపములతో ప్రతిస్పందిస్తున్నాడు చూచావా? బాగా పరిశీలించిన తరువాత స్వస్వరూప బ్రహ్మమే ఈ జీవ జగత్ భావములను ప్రదర్శించుచున్నట్లు జ్ఞానులు గ్రహిస్తున్నారు. అందుచేత ఆత్మలో 'భ్రమింపజేయుట' అను ద్విత్వమునకు సంబంధించిన చమత్కారం అప్రసిద్ధమైనదేదీ కాదు. అయితే బురదలో పడి ఉన్న మణి బురదయొక్క తాపటం చేత 'అది మణి' అని గ్రహించకపోవటం, ఏదో గులకరాయి ముక్కలాగానే గ్రహించబడటం జరుగుచున్నట్లు, బ్రహ్మమని భావించకపోవటం చేత బ్రహ్మమే అజ్ఞానముగా పరిఢవిల్లుతోంది. ఇది ఎంత చిత్రం!

అయితే మనం చెప్పుకున్న తత్త్వజ్ఞులు సర్వము బ్రహ్మముగా దర్శిస్తున్నారు. తన ఆత్మయే అంతంతరమునందు స్వయం ప్రభువై స్వయం జ్యోతిస్వరూపమై, మహత్తుగా అంతటాఅన్నిటా ఆక్రమించి ఉన్నట్లు గ్రహిస్తున్నారు.

అజ్ఞానులకు మాత్రమే ఖండభావన కలుగుతోంది. అజ్ఞానులే 'అజ్ఞానం...అజ్ఞానం' అని వాపోవుచున్నారు. మణి అని తెలియగానే బురదచే కప్పబడిన రాయి మణిగా గుర్తించబడునట్లు, అంతా బ్రహ్మమే అని తెలియబడగానే నాలుగు దిక్కులందూ బ్రహ్మమే అనుభవమగుచున్నది. బ్రహ్మం సర్వశక్తిమంతము. అందుచేత అన్యకారణమేదీ లేకుండానే స్వశక్తి చేతనే అది ఎట్లు భావన చేస్తే అట్లే అనుభవమగుచున్నది. చివరికి పూర్ణముగా భావించినప్పుడు పూర్ణముగానే అగుచున్నది.

బ్రహ్మము కర్మ–కర్త–కరణ–కారణ రహితం. అది అనామయమైనది. అందుచేత, వేదజ్ఞులు దానిని స్వయంభువం (తనంతటతానే ప్రభవించునది) స్వయం ప్రభువు, స్వయం కారణం అని వర్ణిస్తున్నారు. బ్రహ్మమే అపరిజ్ఞాతమైనప్పుడు 'అజ్ఞానము' అని 'మాయ' అని పిలవబడుతోంది. అది తన అజ్ఞానాన్ని వినాశనమొనర్చుకుని పరిజ్ఞాతమైతేనో? అదే జ్ఞానంగా అగుచున్నది. గ్రహించక, శత్రువుగా భావిస్తాం చూచావా! గ్రహించిన తరువాతనో... శత్రుభ్రమ అనే అజ్ఞానం తొలగి అతడే మిత్రుడిగా తెలియవచ్చుచున్నాడు కదా! విచారణ–వైరాగ్యములు లోపించుట చేతనే జీవ–జగత్తులలోని

బ్రహ్మము అస్పష్టంగా ఉండిపోతోంది. ఈ జీవ జగద్రూపము అయుక్తమని, విచారించినప్పుడు నిలబడజాలదని, అసద్రూపమని గ్రహించిన తరువాత బ్రహ్మభావము తనంతటతానే తక్షణమే సుస్పష్టమై ఉదయించగలదు. 'ముత్యపుచిప్పలో వెండి ఉండజాలదు' అని తెలిసిపోయిన తరువాత ఇంక అందులోంచి వెండిని పొందటానికి ప్రయత్నం ఉండదు కదా! బ్రహ్మమును ఎరిగిన తరువాత ఇక "ఈ జగత్తులో ఏదో పొందటల్లేదే?"... అనే దుఃఖభ్రమ ఉండదు.

ఈ జగత్తు బ్రహ్మమున ఉండటం అసంగతమని తెలిసి రాగానే భోగ్యవస్తువుల పట్ల విరాగం స్వయంసిద్ధమౌతుంది. ఎప్పుడైతే ద్వైతము అసత్యమని, అసంభవమని అసంగతమని గ్రహిస్తామో... మరుక్షణం 'బ్రహ్మభావన' అనే సూర్యుడు స్వయంగా ఉదయిస్తున్నాడు. అటు తరువాత 'ఇది సత్యం, ఇది మిథ్య' అను భావనను కూడా త్యజించి మహనీయులు పరమవైరాగ్యాన్ని అవధరిస్తూ ధన్యులగు చున్నారు.

'నేను-నాది' అను గ్రహణాగ్రహణముల కారణంగా అహంకారము ఆత్మవస్తువును స్ఫురించ కుండా అడ్డుతగులుతోంది. అయితే వివేకులగు మహనీయులు ఆత్మవస్తువును అహంకారము తాక లేదని, హింసించలేదని ఎరిగియే ఉంటున్నారు. "కార్య-కారణ సంఘాతమగు ఈ శరీరమే నేను కాదు. ఇక తదితరం గురించి వేరే చెప్పేదేమున్నది?" అని గ్రహించి జనకాది మహాత్ములు స్వతఃగానే బ్రహ్మభావాన్ని ఆశ్రయించి ఉంటున్నారు. 'నేను బ్రహ్మమును' అనుజ్ఞానం సంపాదించుకొని, పదిల పరచుకొని ఉండటం చేత వారి సర్వభావనలు అనుక్షణం తమ స్వరూపంలోనే తక్షణమే విలీనమగు చున్నాయి. 'ఇదంతా కూడా బ్రహ్మమే' అనుభావనాపటిమచే వారు నీవు-నేను మొదలైన వాటిని నీళ్లలో పడిన ఉప్పుబొమ్మలాగా స్వాహా చేసివేస్తున్నారు. 'అస్తి-భాతి-ప్రియము-నామము-రూపము' అను ఐదు రీతులుగా చెప్పబడే ఈ జగత్తు, ఇందలి వస్తుజాలములు వారు బ్రహ్మమునందు, లయం చేసి గ్రహించటం చేత వారు మోహమును, దుఃఖమును, కర్మత్వమును తొలగించివేస్తున్నారు. సర్వదా పరమ శాంత-నిర్మల-నిర్లిప్త స్వరూపులై వెలయుచున్నారు. అట్టి బ్రహ్మైక్య స్వరూపులగు మహనీయులగానం ఏమిటో చెపుతాను విను.

❖❖❖

## 12 ఆత్మజ్ఞాని యొక్క సింహనాదం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆత్మ స్వరూపము యొక్క మహోన్నత్యం గ్రహించిన ఆత్మానుభవసమన్వితుల 'సుప్రకటన' ఏమిటో చెపుతాను విను.

**ఆత్మజ్ఞాని యొక్క సింహనాదం -** అహో! నేను స్వస్థుడనైనాను. సర్వసమరస స్వభావుడనైనాను. వాస్తవమునకు నేను బ్రహ్మమును. కనుక సర్వదా స్వభావ సిద్ధంగానే శోకరహితుడను. జ్ఞానమును సంపాదించకోవటంచేత 'కల్పనలు' అనే కలనుండి విముక్తుడనయ్యాను. నేను దేనినీ గ్రహించటం లేదు. త్యజించటం లేదు. ఈ శరీరమును నమ్మి ఉండవలసిన అవసరం లేదు. అట్లా అని త్యజించ

వలసిన అగత్యమేమీ లేదు. ఇందలి రక్త – మాంస – అస్థి – ధాతువులు, ఈ మొత్తం శరీరం నా యొక్క ఒకానొక చిత్కళమాత్రమే.

బ్రహ్మము అనబడే నిత్యసత్యమును నేనే. సూర్యునితోను, నక్షత్రములతోను నిండియున్న ఈ సర్వ ఆకాశము కూడా నా చేతనే ఆక్రమించబడియున్నది. చిత్‌చైతన్యము రూపముతో ఈ సృష్టిని, తదితర సృష్టులను పూర్ణం చేసి ఉంటున్నాను.

ఈ భూమి దీనిపైగల జీవరాసులు, మొక్కలు, పొదలు, అడవులు, కొండలు, సముద్రం, సముద్ర ప్రాణులు కూడా నేనే. బ్రహ్మైకత్వం పొందుటచే అవన్నీ నాకన్నా వేరుగా ఉండవు. ఇవ్వటం, పుచ్చుకోవటం, ముడుచుకోవటం, నింపటం, కదలటం, వదలటం, మొదలైన ప్రాణి ధర్మములన్నీ నేనే అయి ఉన్నాను. చిదాత్మరూపుడనై విభిన్న రూపములను ధరించి లతలందు, కాండలందు, విత్తనములందు, అంకురములందు తిష్ఠవేసుకొని ఉంటున్నాను. ఇదంతా చిదాంతర్గతమై నా స్వరూపమే అయి ఉన్నది. శాంతరసాత్మకమగు పరబ్రహ్మమునైన నేను అంతటా అన్నిటా అనవరతమూ జాజ్వల్య మానంగా వెలుగుచున్నాను. 'సర్వమేకాత్మ పరంబ్రహ్మ' అను నిశ్చయము కలిగి ఉండుటచే వేదములు ఉపయోగించే సశబ్దములగు 'చిదాత్మ, బ్రహ్మము, సత్యము, సత్, అమృతము, జ్ఞానము, శివము, శాంతము, అద్వైతము, సర్వము' మొదలైనవి నాపట్ల సముచితములౌచున్నాయి. వేదాలు – ఉపనిషత్తులు నా స్వరూపగానమే చేస్తున్నాయి.

సర్వమేకాత్మ పరంబ్రహ్మజ్ఞాన స్వరూపుడనగు నేను సర్వముగాను, కేవల చిన్మాత్రము గాను, బాహ్యానికి అభాసమాత్రం గాను, అమలం గానూ, సర్వభూతాత్మబోధకం గాను, సర్వత్రా వెలయు తత్త్వము గాను, శాంతము గాను, చైతన్యము గాను, చిద్బ్రహ్మము గాను ఏర్పడి ఉన్నాను.

మనోబుద్ధ్యాది అన్ని ఇంద్రియవ్యాపారములందు అనుశ్రుతంగా స్వప్రకాశస్వరూపంగా, విభేద రహితంగా ప్రవేశించియున్నాను. శబ్ద స్పర్శాదులతో నిర్మించబడిన ఈ జగత్తుకు మూలకారణంగా, అక్షయ స్వరూపుడనై ఉంటూ ఇంద్రియ ద్వారముల నుండి సంకల్ప–వికల్ప రూపములుగా ప్రసరిస్తున్నాను. తెంపులేని తేజోపుంజములతో అనామయమగు చిద్బ్రహ్మముగా లోపల, బయట ప్రసరించుచూ నేను నేనుగానే వెలుగొందుచున్నాను.

యోగిపుంగవులు మౌనవ్యాఖ్యల ద్వారా ప్రకటిస్తున్న పరబ్రహ్మతత్త్వాన్ని నేనే. నిత్యానుభవ స్వరూపుడనగుట చేత నా స్వరూపమును ఎవరూ ఎక్కడా తిరస్కరించజాలరు. సమస్త కర్మచక్రములు నా వలననే ప్రవర్తించుచున్నాయి. నిర్లిప్తము, సుషుప్తి సదృశము, చిద్బ్రహ్మము అగు నా రూపమే వనములలో ప్రశాంత స్వరూపంగా వెల్లివిరియుచున్నది. ఒక పురుగు అనుభవించే ఆనందము నుండి బ్రహ్మదేవుని ఆనందం వరకూ గల అన్ని ఆనందములూ నా అనంతానంద సముద్రంలోని కణలేశము మాత్రమే. నాయొక్క బ్రహ్మానంద సాగరములోని కొన్ని చిన్న కణములు ఈ భూత–భవిష్యత్ –వర్తమాన బ్రహ్మాండములుగా, దేశకాల పరిచ్ఛన్నములగు ఖండ–సుఖములుగా ఒకింత ప్రతిబింబిస్తు న్నాయి. కాముకుడగు జీవుడు చంద్రుని చూచినపుడు, అందమైన స్త్రీ నాసాగ్రం చూచినప్పుడు

ఏర్పడే ఆహ్లాదం నా అవిచ్ఛిన్నసత్తాత్మక నిర్విషయ చిద్రూపానందం యొక్క ఒక అల్పకణము మాత్రమే. రాత్రిపూట పూర్ణచంద్రుని చూస్తున్నప్పుడు ఆ చూచువాని చూడబడే చంద్రుని మధ్య ఏర్పడి ఉన్న నిర్విషయ చిదానందమును నేనే.

నా స్వరూపమునకు సుఖ దుఃఖ – కల వికలనములు లేవు. నిర్మల సత్యానుభవరూపాత్మకమైన చిత్ బ్రహ్మాత్మను కదా! దూరంగా ఉన్న వస్తువులను దర్శింపజేయుచున్న పంచభూతాల సమ్మేళనముల మేళవింపుకు కారణమగుచున్న తత్త్వశక్తిని నేనే. ఖర్జూరము మొదలైన మధుర ఫలాలలోని మాధుర్యం అను రసశక్తిని నేనే. ఏ చిత్‌శక్తి జీవుని రూపంలో అత్యంత సామాన్యములగు సుఖదుఃఖములను పొందుచున్నదో, అది చిత్‌శక్తిస్వరూపుడనగు నన్ను ఎరుగుటచే వినిర్ముక్తమగుచున్నది. జ్ఞాన–అజ్ఞాన ఉభయ స్థితులలోనూ, ఉభయ స్థితుల మధ్య నెలకొనియున్నది నేనే.

నేను లాభాలాభములకు, సుఖదుఃఖములకూ అందువాడను గాను. సమత్వముచే అప్రసంగ వ్యవహారం, నిరాకారం, ఖేదానందాతీతం – అగు చిద్రసబ్రహ్మమునే గాని, మరింకేమీ కాను. భూమి–సూర్యుల మధ్య ఏర్పడి ఉన్న ద్రష్ట యొక్క నిర్విషయ దృష్టిని, శాంతచిత్స్వరూపుడను నేను.

జాగ్రత్–స్వప్న–సుషుప్తులలో అధ్యస్తము, అతీతము (Inside Placed - Placed beyond) అయినట్టి తురీయము అనబడు అనామయ చిత్‌బ్రహ్మాత్మక రూపం నాదే. నేను ఈ అసంఖ్యాక జీవరాశులనబడే క్షేత్రాలలో సమస్థితుడనై ఒప్పారుచున్నాను. జ్ఞాన ప్రకాశవంతమగు నా చిద్రూపము అత్యంతమనోహరము. సంభోగానందలవము, అమృతాస్వాదన మాధుర్యము ఎవరికీ మాటలలో చెప్పనలవి కానట్లు స్వాత్మానుభవైకవేద్యమగు నా బ్రాహ్మీస్వరూపమును ఎవరూ ఎన్ని వాక్యములు ఉపయోగించినా చెప్పజాలరు.

తామరతూడులలో దారం పైకి కనబడకుండా లోపల ఉండి ఆ తూడు నిలచుటకు కారణమగు చున్నది కదా! ఆధారము పరిశీలనాత్మకదృష్టికి మాత్రమే అగపడుచున్నది. అట్లాగే అన్ని శరీరములలో ప్రసరించి ఉండి, ఆ శరీరములు నిలచుటకు కారణమై, విచారించినవారికి మాత్రమే సుస్పష్టమగుచున్న చైతన్య ప్రవంతిని నేనే. సమస్తభువనములూ పూర్ణంగా ఆక్రమించుకొని ఉన్నప్పటికీ ఈ భువనాలలోని వస్తుజాలములకు నేను దుర్లక్ష్యమే అయిఉంటున్నాను.

మేఘమాలను స్పందింపజేస్తున్న చిదానందరూపుణ్ణినేనే! ప్రేమాస్పదంగా కనిపించే అంతటి లోనూ, పాలలోని నేయివలె అంతర్లీనమై, అంతః స్నేహంగా ఉపలక్షితమై అనుభూతియోగ్యమగుచున్న చిచ్ఛక్తి నేనే. పాలలో నేయి అంతటా వ్యాపించి ఉన్నట్లు 'క్షయం' అంటూ లేనట్టి చిత్‌గా ఈ సృష్టి అంతా నేను నిండి ఉన్నాను. పర్వత పదార్థముల లోపలా, వెలుపలా సర్వదా సర్వగతమై వెలయు సత్తా సామాన్యం నా స్వరూపమే. దర్పణంలాగా సర్వమును తనయందు ప్రతిబింబింప జేయగల సర్వగత బ్రహ్మము అనగా నేనే గాని, మరింకొకటేదో కాదు.

❖

ఎట్టి మాలిన్యములకూ చోటు ఉండనట్టి శుద్ధచిత్ స్వరూపుడను కదా! నా స్వరూపము సర్వ తేజస్సులనూ ప్రకాశింపజేయునట్టిది. సర్వ సంకల్పములనూ ఫలింపజేయునట్టిది. ఈ సర్వము

నాదే కనుక సర్వలోభములకూ నేను పరాకాష్ఠ కూడా. అట్టి నా యొక్క నిత్యస్వరూపమును నేను ఆరాధిస్తున్నాను. సాధన సమయంలో బాహ్యంలోని వస్తువును భగవానునిగా ఆరాధించాను. ఇప్పుడు నా ఆరాధ్యం నేనేనని గ్రహిస్తున్నాను. ఆరాధకుడు, ఆరాధన – ఆరాధ్యం కూడా నేనే. నేను, తదితరులు కూడా ఉపాసిస్తున్నది నన్నే.

అట్లు నా ఆరాధ్యమగు స్వస్వరూపమే కుండ, వస్త్రము, తటాకము, గొయ్యిలందు కూడా సద్రూపముగా వెలుగొందుచున్నది. అండజ– స్వేదజ – జరాయుజ – ఉద్భిజ జీవులలోని చైతన్యము అదే! నా సత్వబుద్ధనిత్య స్వరూపము జాగ్రత్ దశలోకూడా సర్వవిశేషాతీత్వకారణంగా నిర్వికారమై ఉండుటచే 'నిత్యనిద్రితం' అనటానికి కూడా అర్థమగుచున్నది. గాఢనిద్రలో ఏ క్షణంలోనైనా జాగ్రత్‌ను స్వీకరించటానికి నిత్యసిద్ధమై ఉండుటచే 'నిత్యజాగ్రత్' అని కూడా చెప్పబడటానికి అర్థమగుచున్నది.

ఈ జగత్తులో అనేక జీవులచే అనేక నామరూపములతో మంత్ర – తంత్రములతో ఉపాసించ బడుచున్నది ఏదైతే ఉన్నదో, అది నా స్వరూపమే అయి ఉన్నది. అగ్నియందు ఉష్ణం గాను, మంచు నందు చల్లదనం గాను, అన్నము నందు మాధుర్యం గాను, కత్తియందు వాడి గాను, చీకటియందు నలుపు గాను– పైకి కనిపించక అనుభవరూపమున స్ఫురించుచున్నాను. అట్టి సర్వాంతర్యామియగు నన్ను నేనే ఉపాసించుకొనుచున్నాను. ఉపాసించబడుచున్నాను.

వెలుపలా, లోపలా వెలుగుచూ అత్యంత సామీప్యమున ఉండిన నా ఆత్మస్వరూపమును ఎరుగకపోవుటచే నేను ఇంతకాలం అజ్ఞానినై ఎక్కడెక్కడో వెతికాను. ఏవేవో మార్గాలలో ఉపాసించాను. సర్వసంకల్పములకు అతీతమై సర్వ సంరంభములకు ఆవల ఉండి, కామ–క్రోధ–భోగ–ాంక్షలకు విరహితమై, కారణరహితమై, నిరహంకారమై... ఏ నా సత్యస్వరూపమైన చిదాత్మ కలదో, అద్దానికి మరల మరల నమస్కారం. నమస్కారం!

నా స్వరూపమే అన్నిటా వెలయుచూ నిర్లిప్తంగా ఆద్యంతరహితంగా ఏకరస స్వరూపంగా ఏర్పడి ప్రకాశిస్తోంది కదా! అద్దానిని సూక్తములచే భజిస్తున్నాను. మూడులోకములలోని ముక్త పురుషులచే గానము చేయబడుచు, అన్నిటా ప్రతిబింబించుచూ, జాగ్రత్‌లో ఇంద్రియములను ఉపయోగిస్తూ, స్వప్నంలో ఊహయందు సంచారం చేస్తూ, సుషుప్తిలో నిశ్శబ్దమగుచు, బహిరంగంలో జగత్తులనూ, అంతరంగంలో సంకల్పములనూ ఉంచుకొని ప్రచ్ఛన్నంగా ఉండి ఉండే ఆ చిదాత్మను నేను సర్వదా పొందియే ఉన్నాను. అది సృష్టికాలంలో సర్వసత్తలు కల్పించుకుంటోంది. ప్రళయ కాలంలో ఆ సర్వసత్తలు తన యొక్క అసత్ యందు లయం చేసుకుంటోంది. అట్లు సర్వసత్తలు తన యందు లయం చేసుకొనే ఆత్మసత్త ఇప్పటికే నేనైయున్నాను. నేను అద్దై ఉన్నాను. అది నేనై ఉన్నది. అదియే నేను. సోఽహమస్మి!

సర్వ రూపములందూ విహరించుచూ, సర్వమునకూ స్నేహధారియై, తన అధోభాగమున భావాభావములను రచించుకొనుచూ, అవి లేనప్పుడూ చలన రహిత నిశ్చల దీపంలాగా ఉంటూ, నిరుపాధిక ప్రేమకు స్థానము, ఆధారమూ అయి ఉంటూ, అవివేక దృష్టిచే జడదేహ ధర్మములు

ఆపాదించబడుతూ, ముక్తులకు ముక్తస్వరూపమున గోచరిస్తూ, 'చిత్' దీపమై ఉన్న నన్నే అందరూ అన్నిటా ఉపాసిస్తున్నారు. అట్లు ఆరాధించేవారు, ఉపాసించేవారు నాకు వేరైనవారు కారు.

'జీవము' అనే తటాకంలో 'హృదయము' అనే పద్మమునందు రహస్యంగా దాగి "కాళ్లు-చేతుల కదలికలు" అనే బాహ్యప్రదర్శనా సదృశమైన 'చిదాత్మ' అనబడే నా పరరూపమునకు నా జీవరూపముచే భక్తితో సాష్టాంగ ప్రణామములు చేస్తున్నాను. ఆ చిదాత్మ ఎక్కడో పుట్టినది కాదు. దాని యందు ఏదీ జనించుటలేదు. ఎవరి చేతా హరింపబడేది గాదు. అది పూర్వమూ ఇప్పుడూ ఎప్పుడూ సత్యతత్త్వమై వెల్లివిరిసియున్నది. అది శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముల రూపమున ఒకచోట కించిత్ అభివ్యక్తమగుచూ...మరొకచోట ఆత్మజ్ఞానుల హృదయ స్థానంలో శాంతి వహించి ఉంటూ నదిలో గల వివిధ స్థానములలోని జలంలాగా అన్ని స్థితులలోనూ ఒక్కటే అయి ఉన్నది. ఆకాశకోశం వలె బట్టబయలే అయి ఉన్నది. సర్వలోకములకూ నామరూపములను ఒసగుచూ, తాను మాత్రం నామరూప రహితమై ఉన్నది. మహామహిమశాలి అయిఉండి కూడా తన యొక్క అజ్ఞాన విభాగముచే ఉపాధులలో ప్రవేశించి తన ముంగిటే తాను 'ఆశ' అను భిక్షం ఎత్తుచూ 'ఆదిభిక్షువు' అని అనిపించు కుంటోంది. సర్వమునకు కర్త అయి ఉండి వాస్తవానికి అకర్తగానే ఉంటోంది. అట్టి సర్వాత్మనే ఇంకా ఇంకా ఉపాసిస్తాను. ఆస్వాదిస్తున్నాను.

అదియే నేను. నేనే అది. నాఉపాసన నా కొరకే! ఉపాస్యము నేనే! సరే, ఉపాసకుడను నేనే నని చెప్పాలా...?

నేను సకల ప్రపంచరూపుడను. ఇదంతా నాదే. ఇన్ని ఉపాధులలోనూ అహంకారముగా ఒప్పుచున్నది నేనే. అయినా కూడా నేను మరేదీ అగుటలేదు. నా తత్త్వమేమిటో తెలిసిన నేను ఇక సర్వరుగ్మతలనుండి విముక్తుడను. ఈ జగత్తు కృత్రిమమగు మాయ అగుగాక. లేక, సత్యమే అగుగాక! రెండు అవగాహనలలోనూ 'అవగాహనాసాక్షినై' నేను ఉండనే ఉన్నాను.

ఇంతకుమించి నా గురించి నేను చెప్పుకోవటానికి మాటలు లేవు. చాలవు.

❖

ఓ రామచంద్రా! చూచావా! శివకేశవులు, జనకాది తదితర మహనీయులు ఇట్టి అవగాహన స్పష్టీకరించుకొని, అటుపై ఈ సృష్టిలో తమతమ విహితమగు కార్యములను నిర్వర్తిస్తున్నారయ్యా! మనం చెప్పుకున్నదంతా ప్రతి ఒక్కరి యొక్క స్వస్వరూపమునకు సంబంధించిన నిర్వివాద సత్యము. ఎవ్వరైనా ఈ స్వస్వరూపస్తోత్రం పఠించుటచే సత్యసంకల్పులగుచున్నారు. ప్రతిఒక్కరు స్వస్వరూప భావము పొందుటకు అర్హులే అయి ఉన్నారు సుమా!

స్వస్వరూపమునకు, తదితరంగా ఉంటున్న వికల్పములన్నీ స్వయంకల్పిత నిరోధములే గాని మరింకేమీ కాదు.

❖❖❖

# 13. ఆత్మానుభూతిపరులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవన్ముక్తులగు జనకుడు మొదలైనవారి ఆత్మావగాహన ఏమిటో నీకిప్పుడు విశదీకరించి చెప్పాను. వాళ్లంతా ఎట్లా విగతజ్వరులై సత్యములలో కెల్లా సత్యం, శాంతం అయిన పదమున వెలయుచున్నారో గమనించావు కదా! ఆ విధంగా వారు పరిపూర్ణాత్మను పొంది, సమబుద్ధులై సర్వాసక్తులనూ త్యజించి, నిర్లిప్తులై నిరహంకారులై జీవన్మరణాలకు నిందాప్రశంసలకు పట్టుబడక ఈ జగత్తులో యథేచ్ఛగా సంచరిస్తున్నారయ్యా! స్వభావ సిద్ధంగానే వినమ్ర స్వభావులై, మేరువు వలె ధీరులై, సర్వ ఉత్ప్రేక్షలను (Sense of Comparisons) త్యజించి, సూక్ష్మలక్ష్యమును భేదించిన వారై ఈ ప్రపంచంలో విహరిస్తున్నారు. అంతరంగము నిండా 'సమ దృష్టి'ని నింపివేసి ద్వీపములందు, దేవతోద్యానములందు, తూగుటుయ్యలలందు, పర్వత స్థాణువు లందు, వీథులందు, గృహములందు నిశ్చింతగా చరిస్తున్నారు. అట్టి మహనీయులలో కొందరు ఛత్ర చామరములు కలిగియుండి ధర్మార్థకామములకు సంబంధించిన ఆయా కార్యక్రమములు నిర్వర్తిస్తూ రాజ్యములు ఏలుచున్నారు. మరికొందరు వేద స్మృతులచే నిర్దేశించబడిన శిష్టాచార క్రియలను తాము నిర్వర్తిస్తూ, తదితరుల చేత నిర్వర్తింపజేస్తూ చరిస్తున్నారు. ఇంకొందరు మౌనము వహించి తమ సమున్నత భావతరంగములచే ఈ జగత్తుపై అవ్యాజమైన ప్రేమ ప్రవింపజేస్తున్నారు. ఇంకొందరు ఈ జగత్తులోని దుష్టస్వభావజీవులను శిక్షిస్తూ, సాత్వికులకు రక్షణ కల్పిస్తూ 'యుద్ధము' మొదలైన అనేక అవిశ్రాంత వ్యవహారములు నిర్వర్తిస్తున్నారు. వారంతా నిర్భయులై శత్రుభావరహితులై, ప్రశాంతచిత్తులై ఉంటున్నారని గ్రహించు. స్త్రీ, హాస్య, ఆహార, విహార, భోగ్య, అభోగ్యాలలో తదితర జీవులలాగానే కనబడుచున్నప్పటికీ వారు సమచిత్తులై, జ్ఞానమునుండి తొలగనివారై ఉంటున్నారు.

అట్టి ఆత్మోత్కృష్టలబ్ధులలో కొందరు ఉద్యానవనములలో విహరిస్తూ అప్సరస గీతములను వింటున్నారు. ఈ విశ్వామిత్రాది మరికొందరు సర్వజనుల క్షేమసుఖములను ఉద్దేశించి వేదనిర్దేశితమైన యజ్ఞ యాగాదులు నిర్వర్తిస్తున్నారు. ఇంకొందరు గృహస్థాశ్రమంలో ఉంటున్నారు. ఇంకా కొందరు భయంకర యుద్ధభూమిలో ఉంటున్నారు. ద్వంద్వయుద్ధంలో పాల్గొనుచున్నారు. వాళ్లు ఎక్కడున్నా ఏమి చేస్తున్నా... తమ మనస్సునందు మాత్రం ఎట్టి ఆసక్తిలేక, ఉపాధి శూన్యులై స్థిర-శాంతి-సత్వ పదమును అధిరోహించి ఉంటున్నారు. కులశైలములు సముద్రంలో మునుగు గాక! ఆ ఆత్మైక్య స్వరూపులు ఈ ప్రపంచంలో తారసపడే సంఘటనలలోనూ, సంకటములలోనూ మునుగరు. ఈ మహదైశ్వర్యములు వారిని తాకవు. నిశ్చలులై సర్వదా చిరునవ్వుతో సంచరిస్తున్నారు. రమణీయము, విలాసపూర్ణము అగు ఆత్మసామ్రాజ్యం పొందిన తరువాత ఈ జగత్తులోని ఆటుపోట్లు ఎంతటివి? వనంలో గ్రీష్మకాలమందు బంతిమొక్కలు వాడినట్లుగా వారు మానము పొందరు. మంచుచే లతలు విస్తరించినట్లు వారు విషయ భోగసమూహములను చూచి ఆనందించరు. నిందించరు.

**శ్రీరాముడు :** వారికి అట్టి పరమోత్కృష్టమగు అవగాహన అలవడుటకు ముఖ్యమైన కారణం ఏది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కర్తృత్వాభిమానం జయించి ఉండటం చేతనే వారికదంతా సాధ్యమగుచున్నది. వారు అంతా గ్రహిస్తూనే ఏదీ పొందటం లేదు. కోల్పోవటం లేదు. కార్యములు ఆచరిస్తున్నప్పుడు శత్రువులను జయిస్తున్నప్పుడు పొంగటం లేదు. శత్రువులచే ఆక్రమించబడుచున్నప్పుడు క్రుంగటం లేదు. సుఖదుఃఖములు రావచ్చుగాక! పోవచ్చు గాక! అవి వారికి హర్షకోశములు కలిగించలేక పోతున్నాయి. ఆత్మైక్యానుభూతిపరులై ఉండటం చేత ఇక్కడి విపత్తులు చూసి మోహించటం లేదు.

అవి తొలగగానే కేరింతలు కొట్టటం లేదు. చిన్నపిల్లలు గంతులేస్తుంటే ఇంటి యజమాని చిరునవ్వుతో చూస్తూ పట్టించుకోకుండా ఉండునట్లు అతడు ఈ జగద్వ్యవహారములను చూస్తున్నాడు. తమ వర్ణాశ్రమధర్మాలను ఆచరిస్తూ నిష్క్రియమగు అపరమేరువువలె ధీరత్వం వహించి ఉంటున్నాడు.

ఓ రామా! నీవు కూడా ఈ క్షణమే సర్వదోష వినాశనమగు ఆత్మైక్యదృష్టిని అవలంబించు. ఈ దృశ్యమునకు సంబంధించిన అల్పాహంభావనమును వదలిపెట్టి 'ఆత్మా–హమ్' కార భావనను పూని ఎప్పటివలె విహరించు. ఈ సర్గ పరంపరలను యథాదృష్టితో అవలోకించుచు, మేరువు వలె స్థిరత్వమును, సముద్రము వలె గాంభీర్యమును వహించి భ్రమరహితుడవై వెలయుము. అంతే గానీ, అట్టి సర్గముల వెంటబడవలసిన అవసరం నీకేమున్నది? ఈ కనబడేదంతా ప్రకాశపూర్వకమగు చైతన్యము మాత్రమే కదా! ఇక్కడ సత్యాసత్యములు అయినవి గాని, కానివిగాని, మరింకొకటేదో గాని లేవు. సంసారద్వైతభావము క్షయింపచేయి. భ్రాంతిబుద్ధిని జయించు. అనాసక్త బుద్ధిని ఆశ్రయించిన వాడవై బ్రహ్మత్వమును అవలంబించు. అంతేగాని, ఈ సంసారమును చూచి ఉద్విగ్నుడవై శోకమోహాలు పొందకు. భ్రాంతిచే లేచుచున్న 'చిత్తభ్రమలు' అనే గడ్డిపరకలచుట్టూ నీ మనస్సు ఎందుకు తిరుగాడాలి?

**శ్రీరాముడు:** హే భగవాన్! వసిష్ఠమహర్షీ! సూర్యకిరణస్పర్శచే వికసించే పద్మంలాగా తమ అనుగ్రహం చేత ఇప్పుడు నేను ప్రబోధితుడనైనాను. ఆహా! ఏమి ఆశ్చర్యం! మీ వాక్య ప్రభావం చేత హృదయంలో ఎక్కడో అట్టడుగున ఉన్న మోహం కూడా తొలగుతోంది. ఎండవేడికి మంచు కరుగునట్లు భ్రాంతి తన నామరూపాలతోసహా తొలగుతోంది. సందేహాలు కనపడటమే లేదు.

ఇక మీరు ఎట్లా సెలవిస్తే అట్లే చేయటానికి సిద్ధంగా ఉన్నాను.

హే సాధూ! ఇన్నాళ్లకు నా మోహ – మాత్సర్యములు తొలగి, శోకరహితుడ నయ్యాను. ఇప్పుడే ఇక్కడే ఆత్మస్వరూపుడనై వెలయుచున్నాను. 'నేను బద్ధుడను, మోక్షమును సంపాదించాలి' అను భ్రమవాక్యాలు తొలిగాయి. ఇప్పుడు ఏకాంతబుద్ధితో జ్ఞానసంపద ప్రవృద్ధం చేసుకోవటానికి, రాజ్యపాలన చేయటానికి కూడా సంసిద్ధుడనై ఉన్నాను. ఆత్మారాముడనై సర్వేసర్వత్రా ఆత్మరూపంగా ఆక్రమించి విరాజిల్లుచున్నాను.

❖❖❖

# II. ప్రాణ నిరోధ యోగోపదేశము

# భుశుండోపాఖ్యానం

## 1. యోగసాధన - జ్ఞానము

**శ్రీరాముడు :** హే సద్గురు బ్రహ్మన్! శ్రీవసిష్ఠ మహర్షీ! ఈ నిర్వాణ ప్రకరణ పరిచయ వాక్యాల రూపంలో మీరు చెప్పిన ప్రారంభ విశేషాలు వినిన తరువాత 'సమ్యక్‌జ్ఞానఫలమగు జీవన్ముక్తిని ఎట్లా సంపాదించవచ్చు?' అనే విషయం తెలియుచున్నది.

ఇంతవరకూ 'జ్ఞానార్జన ద్వారా ముక్తి ఎట్లా సంపాదించవచ్చు?' అన్న విషయం మీరు ప్రవచించారు. అయితే 'ప్రాణస్పందనమును నిరోధించి వాసనావిలయమును, జీవన్ముక్తిని ఎట్లా సంపాదించవచ్చు?' అనే విషయం వినాలని ఉన్నది. ప్రాణనిరోధం ఎట్లు చిత్తశాంతికి ఉపకరిస్తోందో చెప్పమని ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'యోగము' అనేది సంసార విముక్తికి తరుణోపాయమని మనం ప్రతిపాదించు కుంటున్నాం కదా! చిత్తమును ఉపశమింపజేయగల అట్టి యోగము రెండు విధములు–

1. ఆత్మజ్ఞాన విచారణ(జ్ఞాన యోగం), 2.ప్రాణములను నిరోధించటం (ప్రాణాయామ యోగం)

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ రెండింటిలో ఏది సులభం? ఏది తక్కువ క్లేశంతో సుసాధ్యం? ఏది రమ్యమైనది? దేని వల్ల త్వరగా సర్వదుఃఖాలు నశిస్తాయి? 'యోగ' శబ్దానికి అసలైన అర్థమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'యోగము' అను శబ్దాన్ని జ్ఞాన సముపార్జన, ప్రాణ నిరోధం – అను రెండింటికీ శాస్త్రములు ఉపయోగిస్తున్నాయి. చిత్తముయొక్క ఆ వృత్తిని ఏ మార్గంలో నిరోధించగలిగితే అదే 'యోగం' అను శబ్దముచే ఉద్దేశించబడుతోంది. అయితే సాంఖ్యశాస్త్రానుసారం'యోగము' అను శబ్దానికి 'ప్రాణనిరోధం' అను దానికే ముఖ్యంగా ఉపయోగించబడింది. ఈ జ్ఞాన – ప్రాణనిరోధాలు రెండూ వేదజ్ఞులచే రెండు ఉపాయాలుగా ప్రతిపాదించబడుచున్నాయి. ఈ రెండూ చివరికి ఒకే అంతిమ ప్రయోజనానికి దారి తీస్తాయని సాంఖ్యశాస్త్రంతో సహా సకల శాస్త్రాలు ఒప్పుకుంటున్నాయి.

కొందరికి యోగం అసాధ్యంగానూ, కష్టతరంగానూ కన్పట్టుచున్నది. మరికొందరి అనుభవం మరొక రీతిగా ఉంటోంది. వారు జ్ఞాన విచారణ కష్టసాధ్యమని, ప్రాణ నిరోధం లేకపోతే నిశ్చలత్వం అసాధ్యమని అభిప్రాయం ప్రకటిస్తున్నారు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'జ్ఞానవిచారణ' అనేది సకల జనులకూ సుసాధ్యమేనని నేను తలచుచున్నాను.

వివేకముతో కూడిన తీవ్ర విచారణచే అజ్ఞానము ఒకసారి దూరం చేయబడిందా...ఇక అది కలలో కూడా మరల కనిపించదు.

జ్ఞానము సర్వదా ఈ జీవుని యందు వెలయుచునే ఉన్నది. విచారణచే అజ్ఞానము తొలగితే చాలు... ఇక జ్ఞానం స్వయంగా ప్రకాశించగలదు. దానికొరకై ప్రాణనిరోధం, హఠయోగం వంటి ఆర్భాటాలు తప్పక ఆచరించవలసినవి కాదని నా అభిప్రాయం. 'ప్రాణనిరోధం' అను కార్యక్రమంలో ఆసనము, అనుకూలమైన ప్రదేశం, నియమ– నిబంధనములకు సంబంధించిన క్రమక్రమం ఉంటాయి కదా! జ్ఞాన విచారణ ఎక్కడైనా, ఎప్పుడైనా చేయ తగ్గది.

మరొక్క విషయం. ప్రాణ నిరోధయోగ నియతి యొక్క పరాకాష్ఠ, పరిసమాప్తి జ్ఞాన సముపార్జన తోనే సుమా! ఇంకొక్క ముఖ్యవిషయం కూడా విను. తీవ్ర సంవేదన (A Strong wish to reach the sense of self) ఉన్నవారికి 'ఏది సుసాధ్యం? ఏది కష్టతరం'... అనే ప్రశ్న ఉదయించదు. ఎందుకంటే ఈ రెండిటి మేళవింపుచే పోనుపోను కేవలానుభవము శేషించగలదని అనేకమంది సాధకుల నిత్యానుభవం.

నీకు ఇంతవరకూ అంతఃస్థమగు 'నిర్మలజ్ఞానము' యొక్క స్వరూప స్వభావాలేమిటో ఎక్కువగా చెప్పుతూవస్తున్నాను కదా! అయితే ప్రాణాపాననిరోధము జ్ఞానకాముకులకు 'ఆత్మ' సాక్షాత్కారహేతువు కాగలదు. అది ఆకాశగమనము వంటి కొన్ని భౌతికమైన విద్యలకు (అష్టసిద్ధులకు) కూడా కారణం కాగలదు. దేహాన్ని ఆశ్రయించి నిర్వర్తించబడే అట్టి ప్రాణనిరోధయోగం గురించి చెప్పుచున్నాను విను.

అభ్యాసపూర్వకమైన ప్రయత్నం చేత ప్రాణాపానాలు వశం కాగలవు. అవి నిరోధించబడుచున్న కొలదీ చిత్తంలో సమత్వానుభవం అధికమౌతూ ఉంటుంది. ప్రాణచలనం స్థిరత్వం పొందుచుండగా వాసనలు క్షయిస్తున్నాయి. చిత్తవృత్తుల ప్రకోపం సన్నగిల్లుతూ ఉంటుంది. అట్టి అభ్యాసం చేత చిత్తం కొండలా స్థిరబడుతుంది. గాలి చెట్లను కదల్చవచ్చునేమోగాని కొండను కదల్చగలదా?... అట్లాగే దృశ్యములు ఆ సాధకుని చిత్తమును చలింపజేయలేవు. ఇట్టి నిశ్చల చిత్తస్థితిలో వాక్కుకు అగోచరమైన, సర్వనిర్వచనములకూ అతీతమైన పరమానందస్థితి లభిస్తుంది. అతడు అనంతాత్మైక్య స్థితిని అధిరోహించగలడు.

చిత్తవృత్తులే జగత్తు. చిత్తవృత్తిరాహిత్యమే సర్వవేదాంత సిద్ధాంతసారం.

అట్టి ఉత్కృష్ట స్థితి జ్ఞానవిచారణ–ప్రాణనిరోధములనబడే రెండింటివలనా సాధ్యమే. స్థిర సంకల్పము నిస్సంకల్పమునకు దారి తీస్తుంది. నిస్సంకల్పం లభించిన తరువాత ఇక ఏ ప్రయత్నముల అవసరమూ ఉండదు. సర్వత్యాజ్యం వలన నిత్యము – అఖండము – అప్రమేయము అగు ఒకానొక ఉత్కృష్టానుభూతితో కూడిన అనుభవస్థితి లభించగలదు.

❖❖❖

# 2. వసిష్ఠ - భుశుండ సమాగమం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! యోగమార్గము గురించి, తద్వారా సంకల్పశమము గురించి, కాలముయొక్క అతి విచిత్రమైన 'గతి' గురించి, సృష్టిపరంపరల చమత్కారం గురించి విశదీకరించగల ఒక సంవాదమును నీకు వివరిస్తాను. ఈ సంవాదము నాకు 'భుశుండుడు' అను పేరుగల కాకి జాతివాడగు యోగితో జరిగింది. ఆ మహానుభావుని అనుభవములేమిటో చెబుతాను విను.

❖

'పరబ్రహ్మము' అనబడే మహాసాగరంలోని జలకణము వంటి ఒక అల్పవిభాగంలో ఈ జగత్తులన్నీ వెలయుచున్నాయి. ఈ సృష్టికి కారణస్వరూపుడుగా కమల సంభవుడగు బ్రహ్మదేవుడు వెలయుచున్నారు. అట్టి బ్రహ్మదేవుని యొక్క సంకల్ప మానస పుత్రుడను నేను. తపోధ్యానముల బలం చేత సప్తర్షిమండలంలో స్థానం సంపాదించాను. వైవస్వత మన్వంతరం వరకు నేను ఇట్లే ఉండబోవుచున్నాను.

అట్టి నేను ఒకానొకనాడు ఏదో సందర్భంలో స్వర్గంలోని ఇంద్రసభకు వెళ్లాను. అక్కడి సభలో ఈ నారదుడు మొదలైన మహర్షులందరూ ఉన్నారు. అప్పుడు జరిగిన ప్రసంగంలో 'చిరంజీవత్వం' గురించి సంభాషించుకోవటం జరిగింది. అప్పుడు శతతాపుడు అనే పేరుగల ముని లేచి నిల్చున్నారు. ఆయన "మాననీయుడు, ప్రమాణకుశలుడు, అవసర మాత్ర ప్రసంగి" అని ప్రసిద్ధి. సభంతా నిశ్శబ్దమైనది. శతతాపముని ప్రసంగించటం ప్రారంభించారు.

**శతతాపముని :** ఓ సభికులారా! మీరంతా 'చిరంజీవత్వం' గురించి అనేక విశేషాలు చెప్పుకుంటున్నారు. ఈ సందర్భంలో ప్రత్యక్షసాక్షియగు ఒక చిరంజీవుని గురించి చెబుతాను వినండి.

మేరు పర్వతం యొక్క పద్మరాగమయమైన ఒక శిఖరం ఉన్నది. ఆ శిఖరంపై కల్పతరువు ఉంది. దానిలో దక్షిణంగా ఒక ప్రాంతంలో బంగారు లతలతో నిర్మించబడిన ఒక పెద్ద పక్షులగూడు ఉన్నది. ఆ పక్షులగూడులో 'భుశుండుడు' అనే ఒక కాకి ఉన్నది. ఆ కాకి తన హృదయంలో ఎట్టి రాగం లేనిదై ఉన్నది. ఆ వాయసమును పోలిన చిరంజీవులు భూమి మీదగాని, తదితర లోకాలలోగాని మరొకరు ఉండరు... ఉండబోరు. అతడు మహామతి, ఆసక్తిరహితుడు, శ్రీమంతుడూ కూడా! అతడు శాంతుడై, మనస్సును జయించిన వాడై, త్రికాలవేత్త అయి పరమ విశ్రాంతి అనుభవిస్తూ దీర్ఘకాలం గడుపుతున్నాడు. అట్టి వికల్పరహితమగు జీవనము పొందటమే ధన్యం. అతని వంటి పరమ పురుషార్థమగు యోగజీవనము అత్యంత దుర్లభమని నా అభిప్రాయం.

❖

ఆ శతతాపముని భుశుండిని దృష్టాంతంగా తీసుకుని చిరంజీవత్వమునకు సంబంధించిన అనేక విశేషాలు ముచ్చటించారు. అప్పుడు సభ్యులడిగిన అనేక ప్రశ్నలకు వివరణ కూడా ఇచ్చారు.

సభ ముగిసింది. సభలోని వారంతా తమతమ నివాస స్థానములకు జేరుటకు బయలుదేరారు. నాకు మాత్రం శతతాపముని చెప్పిన భుశుండుని దగ్గిరకు స్వయంగా వెళ్లి సంభాషించాలని,

'యోగము' గురించి వివరణాత్మకంగా ఆయన చెప్పే విశేషాలు తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. తిన్నగా మేరు పర్వత శిఖరాగ్రం వైపుగా బయలుదేరాను.

❖

బ్రహ్మ – విష్ణులోకములకు ఆలవాలమైన ఆ మేరుశిఖరం యొక్క అగ్రభాగంలో గల ఒక ప్రదేశంలో కొన్ని కాకులు సభదీర్చి ఉన్నాయి. భుశుండ వాయసము సభా మధ్యంలో ఉంది. వారు తాత్త్విక విషయములు సంభాషించుకుంటున్నారు. నన్ను చూడగానే మహామహుడగు ఆ భుశుండ వాయసము దిగ్గున లేచి నన్ను సమీపించి, తన సంకల్ప జనిత హస్తములతో నాకు పుష్పాంజలి సమర్పించారు. ఆసనం అధిరోహింపజేసి అర్ఘ్యపాద్యములు సమర్పించి కుశల ప్రశ్నల తరువాత మధురాక్షరములతో స్నేహపూర్వకంగా ఇట్లు పలుక ప్రారంభించారు.

**భుశుండుడు :** హే భగవాన్! వసిష్ఠమహర్షీ! మీకు సుస్వాగతం. నా అనేక జన్మజన్మార్జిత పుణ్యఫలంగా ఈ రోజు మహామహిమాన్వితమగు మీ దర్శనం లభించింది. ధన్యుడనైనాను. మీ పవిత్ర హృదయంలో సర్వదా సర్వసమత్వ అఖండభావన వెలయుచూ, మీ పెదవులు ఎల్లప్పుడూ లోకకళ్యాణమునకు కారణమౌతూ ఉంటాయి. ఈ మాయామయజగత్తులో సంచరించే మావంటి అల్పజ్ఞాన జీవులకు మీ దర్శనం అమృతతుల్యం వంటిది. మీ చరణ దర్శనము చేతనే మీ శుభాగమనమునకు కారణ మేమిటో నాకు తెలియవచ్చింది. మీ పవిత్ర పాదస్పర్శ వలన నేను, ఇక్కడి తదితర వాయసములు గొప్ప పుణ్యం సంపాదించుకున్న వారమైనాము. దేవలోకము నందు ఇంద్రసభలో 'చిరంజీవి' ఐన మా ప్రసంగంరాగా... అది మా పట్ల మీ దర్శనభాగ్యంగా పూలజల్లు కురిసింది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే ఉత్తమ విజ్ఞాన సమన్వితుడా! మిత్రమా! భుశుండా! మీ మధురమైన పలుకులు వింటుంటే నాకు ఎంతో సంతోషం కలుగుతోంది. మీరు తత్త్వము ఎరిగినవారు. ఆత్మ దర్శనముచే పునీతులు. భయంకరములగు భవసర్పములు మిమ్ము ఏమాత్రం సమీపించలేక పోతున్నాయి. మీ చిరంజీవత్వం గురించి శతతాపముని దేవసభలో ఎంతో ప్రశంసించి పరోక్షంగా మీ దర్శనం చేసుకోవటానికి అవకాశం కల్పించారు.

ఓ మహానుభావా! మీ చరిత్ర ఏమిటి? ఎచ్చట జన్మించారు? మీ ఆయువు ఎంత? ఎవరిచే నిర్దేశింపబడి ఇక్కడ నివసిస్తున్నారు? ఇంతటి ఆత్మైక్యజ్ఞానం, ప్రశాంత మనఃస్థితి ఎట్లా పొందగలిగారు? ఈ విషయములను నాకు వివరించి చెప్పవలసినదిగా మిమ్ము అర్థిస్తున్నాను. మహాత్ముల చరిత్రలు వినటం మహదానందకరమగు విషయం కదా!

**భుశుండుడు :** త్రిలోక పూజ్యులు, సప్తర్షులలో అగ్రగణ్యులు అగు మీరు వినగోరినది తప్పక చెప్ప వలసిందే! మీ వంటి మహనీయులతో సంభాషిస్తేచాలు... మేఘములు వేంచేయగానే సూర్యతాపం తొలగునట్లు మా వంటివారి పట్ల అశుభాలన్నీ వినష్టమైపోతాయి. సావధానులై, ఉద్వేగరహితులై వినండి.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ తరువాత వర్షమేఘశ్యాముడు, సర్వాంగసుందరుడు, సరళ బుద్ధి సమన్వితుడు, హర్ష–మాత్స ర్యరహితుడు, ఈ జగత్తులన్నిటినీ తన చేతిలోని ఫలం వలె చూడ గలుగువాడు, భోగములన్నీ గడ్డిపరకలలాగా పరిత్యజించినవాడు, పుట్టుక, దృశ్యముల రహస్యం ఎరిగిన వాడు, పరాపరదర్శి, ధీరుడు, స్థిరుడు, జ్ఞాన సముద్రంలో విశ్రమించినవాడు, పరిపూర్ణ మనస్కుడు, శుద్ధుడు, విశ్రాంతి పొందిన బుద్ధి కలవాడు, వేదోపనిషత్ పాఠముల అంతర్లీనగాన మేమిటో ఎరిగినవాడు, ఆత్మజ్ఞానం అవధరించినవాడు, ఎల్లప్పుడూ నవశరీరధారి అగు ఆ భుశుండుడు చిరునవ్వుతో గంభీరములు, శుద్ధములు, అమృతసమానములు అగు మాటలతో యోగ సాధనా విశేషం గురించి చెప్పసాగారు. భ్రమరమునకు తేనె ప్రసాదించే పుష్పంలాగా నాకు తన కథను ఇట్లా వినిపించసాగారు.

❖❖❖

## 3. భుశుండుని జన్మవృత్తాంతం

**భుశుండుడు :** హే వసిష్ఠ మహర్షీ! మొట్టమొదట నా జన్మవృత్తాంతం చెబుతాను వినండి. దేవదేవుడైన ఆ హరుడు కైలాసంలో దేవాభివందితుడై వెలయుచున్నారు కదా! ఒక లత వృక్షమును ఆశ్రయించి ఉండునట్లు జగదంబ, పార్వతీదేవి ఆయన అర్ధ శరీరమును ఆక్రమించుకొని ఉన్నది. ఆ సాంబశివుని జటాజూటంలో, గంగామాత అలంకారమై ప్రకాశిస్తూ ఉంటుంది. క్షీరసాగర మథనమున ఉద్భవించిన వాడు. అమృతమును ప్రవహింపజేయువాడు, దర్పణభూతుడు అగు చంద్రుడు ఆ సాంబశివునికి చూడామణిగా అలరారుచున్నాడు. కాలకూటవిషం ఆయన కంఠాన్ని అలంకరించియున్నది. ఆయన ప్రళయకాల సమయములో తన మూడవకంటి చూపుచే లేవదీయబడిన పరమాణుధూళి నుండి 'మాయ' అనే వీబూదిని నిర్మించి 'జ్ఞానము' అనే జలముతో తడిపి తన నుదుటన అలంకరించి ఉంటాడు. సర్వ శరీరములలోని అస్థులే ఆయన రత్నహారం. ఆకాశమే ఆయన వస్త్రం. సర్వజీవుల భౌతికదేహములు చేరవలసిన శ్మశానమే ఆయన నివాసం. ఎఱ్ఱటి వస్త్రం కపాలమాల ధరించి ఆయన సంచరిస్తూ ఉంటారు. జీవుల భుజములే ఆయన భుజకీర్తులు. దిక్పాలకులంతటి వారిని దహించుట, ఈ జగత్తునంతటినీ ఆహారపు ముద్దగా చేయుట, అసురులకు భయమును గొలుపు భీషణ నృత్యములు చేయుట మొదలైనవన్నీ ఆయన లీలలు. ఆ పరమేశ్వరుడు సత్య సంకల్పుడు కదా! తన కించిత్ యోచనచే ఈ జగత్తులన్నిటినీ శుభప్రదం చేస్తూ ఉంటాడు. ఆయన విలాసంగా చెయ్యి ఊపినంత మాత్రం చేత త్రిపురములను భస్మం చేయగలిగిన వాడు. ఆయన యొక్క ధ్యాన నిష్ఠ స్నేహ–రాగవర్జితమై, సర్వ భావములకు అతీతమై కొండవలె నిశ్చలంగా ఉంటుంది. ఆ శివుని నివాసంలోనే జయ, విజయ, జయంతి, అపరాజిత, సిద్ధ, రక్త, అంబుస, ఉత్పల – అను అష్టమాతృకలు వసిస్తూ ఉంటారు.

ఆ అష్ట మాతృకలలో ఒకరగు అంబుసకు 'చండుడు' అను కాకి వాహనంగా ఉన్నది.

❖

ఒకసారి ఆ అష్టమాతృదేవతలు ఏదో కారణంచేత ఆకాశంలో సమావేశమైనారు. అప్పుడొక గొప్ప ఉత్సవం కల్పించబడింది. ఆ ఉత్సవంలో వారు తుంబుర–భైరవులను పూజించారు. తరువాత మధురపానమత్తులై తమలో తాము ఇట్లు సంభాషించుకున్నారు.

"మన అష్టమాతృ దేవతలను ఆ ఉమాపతి కొంత చులకన చేసి చూస్తున్నట్లు మాకు అనిపిస్తోంది. కనుక మనం మన శక్తులేమిటో పరాక్రమములేమిటో చూపించాలి. వారిని వినోదింపజేయాలి. అప్పుడిక ఆయన మనలను చులకన చేయరు. మన పట్ల ప్రేమాస్పదులౌతారు."

ఇట్లా నిశ్చయించుకున్నారు. ఆలోచన వచ్చిందే తడవుగా వారు రుద్రశక్తియగు ఉమ యొక్క వదనమును ఇతర అంగములను తమ మంత్ర బలంతో వివర్ణం చేసివేశారు. ఆ తరువాత వారు శివుని అర్ధాంగమగు ఉమను అపహరించి తమ మండలానికి తీసుకుని వచ్చారు. వారు ఆమెను అవహేళనం చేయలేదు. ఆమెను తమ మంత్రశక్తిచే బలికి తేబడిన జీవిగా సంకల్పించారు. ఆమె ఒక్కొక్క అవయవమును చేబూని నృత్యగీతికలతో ఆనందధ్వనులు చేస్తూ, అరచుచూ ఉత్సవం చేసుకున్నారు. వారి చప్పట్ల–సింహగర్జనల శబ్దములు ఆకాశమును నింపివేశాయి. కొండగుహలు ప్రతిధ్వనించాయి. వాళ్లు సురాపానం గుటకలు వేస్తూ, హాస్యనృత్య పానములు చేయుచూ ఉన్మత్తవృత్తులై ఉత్సవం చేసుకోసాగారు. ఒకరి నోట్లో ఒకరు ఉపాహారాలు అందించుకుంటూ ఒకరినొకరు త్రోసుకుంటూ, పట్టుకొనుచూ విచ్చలవిడిగా సంచరిస్తూ శిష్టాచారములను తారుమారు చేయసాగారు.

ఇక వారివారి వాహనాలు కూడా రక్తపానం చేసి నృత్యం చేయసాగాయి. బ్రహ్మవాహనమగు హంస, అలంబుని వాహనమగు చండుడు కూడా ఆ వాహనముల సమూహంతో కలిశారు. వారు కూడా పానోన్మత్తులై నృత్యం చేస్తూ సురతేచ్ఛపొందారు. ఆ హంసలు అంబుస యొక్క వాహనమగు కాకితో అన్యయోని సంభోగం పొందాయి. ఆ చండుడు అను కాకి ఏడు హంసలకు భర్త అయి వారి ఇచ్ఛానుసారం క్రీడించగా ఆ హంసలు గర్భమును దాల్చాయి.

❖

ఆ తరువాత నృత్యోత్సవం ముగిసింది. మాయారూపిణులగు ఆ అష్టమాతృకలు యజ్ఞ భోక్తములను శూలి(శివుడు)కి ఆహారంగా సమర్పించారు. అప్పుడు ఆ చంద్రశేఖరుడు తనకు తన ప్రియపత్నినే బలిగా ఇవ్వటం గమనించి కోపగించాడు. అప్పుడా మాతృగణములు తమ అంగముల నుండి తిరిగి ఉమను సృష్టించి ఆ శివునికి ఇచ్చి అదే ఉత్సవంలో శివకళ్యాణం చేశారు. అప్పుడది చూసి శివపార్వతులు సంతోషించారు. ఉత్సవం ముగిసింది. అందరూ తమ తమ నెలవులకు వెళ్లిపోయారు.

గర్భవతులైన హంసలు తమ యజమానియగు బ్రహ్మణిని (సరస్వతీ దేవిని) సమీపించి జరిగినదంతా వివరించి క్షమాభిక్ష వేడుకున్నారు. అప్పుడు హంసవాహినియగు సరస్వతీదేవి ఆ హంసలకు విశ్రాంతి ప్రసాదించి తాను నిర్వికల్ప సమాధినిష్ఠురాలైనది.

ఆ హంసలు ఆ తరువాత విష్ణుభగవానుని నాభి ప్రదేశంలో ఉండే కమలంలో ప్రవేశించి అక్కడ విహరించసాగాయి. అవి కాలక్రమేణా 21 అండములను ప్రసవించాయి. ఆ అండములలోంచి

21 కాకులం ఉద్భవించాం. అట్లు ఉద్భవించినట్టి నేను, నా సహోదరులగు 20 కాకులు సరస్వతీ దేవిని సమీపించాం. మా స్తోత్ర పాఠములచే ఆ మాతను నిర్వికల్ప సమాధి నుండి విరమింపజేశాం. ఆ తల్లి మాకు తత్త్వమును బోధించినది. ఆమె దయ వలన పవిత్రమగు ముక్తిని దర్శించాం.

ఆ తరువాత మేము 21 మందిమి పితృదేవులగు చండుని సమీపించి భక్తి ప్రపత్తులతో సాష్టాంగదండ ప్రణామం చేశాం. వారి పాదపద్మములను భక్తిప్రపత్తులతో పూజించాం అప్పుడాయన మాతో ఇట్లా సంభాషించారు.

**పితృదేవులగు చండుడు :** పుత్రులారా! పుత్రవాత్సల్య యగు ఆ సరస్వతీదేవి దయవలన కల్పిత తంతువులచే నిర్మించబడిన సంసారము నుండి బయటకు వెలువడితిరి కదా?

**మేము :** అవును తండ్రీ! జగజ్జననియగు బ్రాహ్మీమాత దయ వలన మేము తెలుసుకొనవలసినదంతా తెలుసుకున్నాం. ఇక మేము ఏకాంతంగా ఉండవలసిన స్థానమేదో సెలవివ్వలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తున్నాం.

**చండుడు :** కుమారులారా! నేను ఇతఃపూర్వం మేరు పర్వతములోని ఒక శిఖరం సమీపంలో ఒక గొప్ప గూడు నిర్మించి ఉన్నాను. మీరు అక్కడ నిశ్చింతగా నివసించండి. అక్కడ సద్విచారణసమన్వితులైన అనేక వాయసములు (కాకులు) నివసిస్తున్నారు. మీరు కూడా అక్కడే నివసిస్తూ భోగమోక్షములు రెండు పొందండి.

❖

ఇట్లు పలికి ఆయన మమ్ములను ఆశీర్వదించి ఆహార పానీయములతో ముద్దు చేసి పంపారు. మేము అక్కడి నుండి బయలుదేరాం. సూర్యమండలమును, స్వర్గలోకమును దాటి బ్రహ్మలోకమునకు వచ్చాం. లోకమాతాపితరులగు సరస్వతీ-బ్రహ్మదేవులకు కొంతకాలం శుశ్రూష చేసి వారి నుండి బ్రహ్మతత్త్వం విన్నాం. వారి బోధలను, ఆశీర్వచనములను పొంది మరల అక్కడి నుండి బయలుదేరాం. లోకపాలకుల పురములను దాటి ఇక్కడికి వచ్చాం. ఇక్కడ మౌనం అభ్యసిస్తూ అనేక సంవత్సరాలు గడిపాం.

హే మహానుభావా! వసిష్ఠా! మేమెట్లా పుట్టామో, పెరిగామో, ఎట్లా జ్ఞానం పొందామో, ఎట్లా ఉపశాంతి మనస్కులమైనామో.... మీకంతా వివరించి ఉన్నది ఉన్నట్లుగా చెప్పాను. ఇక మిగిలినది చెప్పటానికి ఆజ్ఞాపించ ప్రార్థన...

❖❖❖

## 4. నిర్లిప్తుడను - అప్రమేయుడను

**శ్రీవసిష్ఠ మహర్షి :** మిత్రమా! భుశుండా! మీ నిరహంకారత్వమును, వినమ్రతను చూచి నేను ఎంతో సంతోషిస్తున్నానయ్యా! ఏదీ! తరువాత విశేషాలు చెప్పండి. వందల-వేల-లక్షల సంవత్సరాల పూర్వం మీరు చూచిన జగత్తు ఎట్లా ఉన్నది? ఇప్పటి ఈ జగత్తు ఎట్లా ఉన్నది?

**భుశుండుడు :** మునీంద్రా! ఈ జగత్తు పూర్వ తత్పూర్వకల్పములలో ఎట్లా ఉన్నదో, ఇప్పుడు కూడా అట్లే వెలయుచున్నది. నేను అనేక కల్పవృక్షముల మీద వ్రాలి ఉన్నాను. ఈ వర్తమానకల్పమును కూడా పూర్వ తత్పూర్వ కల్పములను చూచినట్లే దర్శిస్తున్నాను.

మిమ్ములను ఇప్పుడు నిర్విఘ్నంగా చూడగలగటం కూడా నా జన్మజన్మల పుణ్యఫలం అయి ఉన్నది. మరల మరల నాచే, నాతోటి కాకులచే అర్ఘ్యపాద్యములను, ఫలహారములను, చందన తాంబూలాదులను స్వీకరించండి... ఇప్పుడు నా నుండి ఇంకా ఏమి తెలుసుకోవాలనుకుంటున్నారో ఆజ్ఞాపించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** పక్షిరాజా! ఇప్పుడు నాదొక చిన్నసందేహం. మిమ్ము పోలిన శక్తిశాలురు, బుద్ధిమంతులు అగు మీ మిగతా 20 మంది సోదరులు ఏరి? వారు కనబడరేం? మీరొక్కరే కనిపిస్తున్నారేమిటి? వారందరూ ఏమైనారు?

**భుశుండుడు :** మహర్షీ! చెపుతాను, వినండి. మేము ఇక్కడికి వచ్చి చేరిన తరువాత ఒకదాని వెనుక మరొకటిగా అనేక రోజుల సమూహములు గడచిపోయాయి. అనేక యుగములు గతించాయి. ఒకప్పుడు మేం 21 మందిమీ కలిసియే ఉన్నాం. కొంతకాలం తరువాత అనుంగు సోదరులందరూ తమ భౌతిక దేహములను తృణప్రాయంగా త్యజించి శివసాన్నిధ్యం పొందారు.

**దీర్ఘాయుషో మహాన్తోఽపి సన్తోఽపి బలినోఽపి చ ।**
**సర్వ ఏవ నిగీర్యన్తే కాలేనాకలితాత్మనా ॥** (శ్లో॥ 10, సర్గ 20)

అలక్షితస్వరూపమగు కాలము మహాబలవంతులనూ, దీర్ఘాయుష్కులనూ, మహాత్ములను కూడా మ్రింగివేస్తుంది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** భుశుండా! మరి మీ విషయమేమిటి? ద్వాదశాదిత్యులను కూడా తన కంఠమున అలంకరించుకొని చెలరేగు మహాప్రళయ వాయువులు మిమ్మేమీ చేయలేదా? అవి స్పృశించకుండా మీరెట్లా దేహసమేతులై ఏర్పడి ఉన్నారు? ఉదయాస్తమయములను కలుగజేసే కాలము భూమిపై గల అన్ని వస్తువులనూ దహిస్తుంది కదా! మిమ్ములను సమీపించనే లేదా? తీవ్ర శీతోష్ణములను ఎట్లా సహించి ఉన్నారు? ప్రళయకాలమేఘములు మిమ్ము కష్టపెట్టనేలేదా? జగత్తంతా విషమయమగు క్షోభతో దద్దరిల్లుచుండగా నిత్యయౌవనులై మీరీ గూటిలో ఎట్లా మనగలిగారు?

**భుశుండుడు :** బ్రహ్మజ్ఞా! నా ఈ పక్షిజన్మ గురించి మీకు తెలియనిదేమున్నది? ఆకాశంలో సంచరిస్తూ సర్వజనులచే దూషించబడే ఈ పక్షిదేహం అన్ని ఉపాధులలోకి తుచ్ఛమైనది. ఇట్టి తుచ్ఛజీవముల కొరకే ఆ విధాత నిర్జనములైన వనములూ, శూన్యమయమగు ఆకాశమును నిర్మించారు. ఇట్టి పక్షి జాతి యందు ఆశాపాశములచే బద్ధుడైన జీవునికి కలుగు దుఃఖపరంపరలు వర్ణించసాధ్యమా?

అయితే... మేము నిత్యమూ ఆత్మతృప్తిని పొంది ఉన్నాం. స్వాభావికమగు స్వస్వరూపముచే సంతుష్టులమై ఉన్నాము. అనగా "మాస్వస్వరూపము సర్వదా యథాతథం కదా!" అను ఆత్మోపాసనచే సంతృప్తులమై కాలమునకు కేవల సాక్షిత్వం వహించి ఉంటున్నాం.

నిర్విషయ, నిర్విశేష వస్తువునందు కలుగుచున్న ఈ 'జన్మలు పొందుట' అను భ్రమలకు లోను కాకుండా నిజగృహంలో కాలం వెళ్లబుచ్చుచున్నాం. ఏదీ కోరుకోవటం లేదు. ఏదీ త్యజించటం లేదు. అనగా మేము జీవించి ఐహిక, ఆ ముష్మికములను కోరం. మరణించి ఈ దేహమును త్యజించకోరం. నిత్యశుద్ధనిరతిశయానంద స్వరూపులమై ఇప్పుడు ఇక్కడ ఎట్లున్నామో అట్లే స్వస్వరూపమున నివసించుచూ కాలము యొక్క గమనమునకు కూడా కేవల సాక్షీభూతులమై ఉంటున్నాం.

అందుచేతనే మేము కాలమునకు బద్ధులవటం లేదు. మేము లోకము యొక్క జనన మరణములు అనేకం చూచాం. కానీ 'ఈ జగత్తు మిథ్యయే!' అనే నిర్ణయం కలిగి ఉన్నాం. వేద వాక్యములు, గురువాక్యములు మా హృదయంలో ప్రవేశించి సుదృఢత్వం పొందాయి. మనస్సు తన చంచలత్వం వీడి సౌమ్యత్వం పొందింది. ఆత్మసింహాసనం అధిరోహించి, సూక్ష్మమగు కాలగతిని చిరునవ్వుతో చూస్తున్నాం. వాస్తవానికి మా పితృదేవులు చందునిచే నిర్మించబడిన అతిపొడవైన, బంగారు లతానిర్మితమైన ఈ పక్షులగూటిలో దివారాత్రములు తెలియవు. అయినా కూడా స్వబుద్ధితో కాలముయొక్క గతిని, త్రికాలములను గ్రహించగలుగుచున్నాం.

హే మహానుభావా! మా మనస్సు తత్త్వజ్ఞానబలం చేత సారాసారవిభేదమంతా వీడినదై అవాఙ్మానస గోచరమైన స్థానంలో పరమవిశ్రాంతి పొందుతోంది. సుస్థిరతను శాంతిని సర్వదా అనుభవిస్తోంది. సంసారవ్యవహారములచే పుట్టుచూ తుచ్ఛమైన అనేక ఆశాపాశములచే బంధింపబడి అటూ ఇటూ ఎగురుతూ గంతులేసే తదితర భూకాకముల వలె మేము దేనికీ భయమును గాని, ఉద్వేగాన్ని గాని, ఆశగాని, ఇష్టాద్వేషాలుగాని పొందటం లేదు. అందుచేత ఇక్కడ ఎట్టి దుఃఖాలూ పొందటానికి మాపట్ల కారణమేలేదు. అనిష్ట-వినష్టములకు ఏమాత్రం ధైర్యం కోల్పోవక పరమ శాంతితో కూడిన దృక్కులతో అప్రమేయత్వం వహించి ఉన్నాం. భయంకరమైన ఆపదలు ఒనగూడి నప్పుడు కూడా మేము పాషాణమువలె స్థిరత్వం వహించి ఉన్నాం. స్ఫటికమువలె కేవలం సాక్షీ భూతంగా వెలయుచున్నాం. ఆరంభంలో సుఖకరంగాను, క్రమంగా పేలవంగానూ ఉండే ఈ జగత్తు నందలి అనేక పదార్థ సమూహములు వస్తున్నాయి. పోతున్నాయి. అయితే వాటి రాక పోకలు మమ్ము ఏమాత్రమూ బాధించటం లేదు. అవి ఎటునుండి వస్తున్నాయో, ఏమి కానున్నాయో మేము మా వివేకబలం చేత మున్ముందుగానే ఎరిగి ఉంటున్నాం. హే భగవాన్! వసిష్ఠ మహర్షీ! ఈ భూతజాలములు, వాటి సమ్మేళనములు జనించినను, మరణించినను మరణించకున్ననూ మాకు ఏం సంబంధం? 'భూతములు' అనే నదీ ప్రవాహములు మరల మరల ఎటునుండో వచ్చి, కాలం అనే మహాసముద్రంలో ప్రవేశిస్తున్నాయి. ఇక మేమో, ఒడ్డున ఉండే కొండలాగా ఇక్కడ తటస్థంగా ఉన్నాం. వాటివేటినీ లెక్కగొనుచున్నవారము కానేకాము.

మేము ఇక్కడేదీ గ్రహించటం లేదు. త్యజించటం లేదు. మా పాదములు సంసారము నందు జాగ్రత్తగా మసలుచుండటం చేత మృదువుగా ఉన్నాయి. ఈ సంసారము వలన జనించే అజ్ఞాన పరంపరల పట్ల నిర్మోహమాటముతో కూడిన అనాసక్తి కలిగి ఉండటంచేత జడమాత్రంగా,

అర్థరహితంగా ఉన్నాయని కూడా చెప్పవచ్చు. ఈ తీరుగా ఈ కల్పవృక్షముపై గల ఈ గూటిలో ఎట్టి చింతలూ లేకుండా చిరంజీవులమై ఉన్నాము. శోకభయరహితులగు మీ వంటి పుణ్యపురుషుల బోధలచే అనుగ్రహింపబడినవారమై తత్ఫలితంగా మాయారహితులమై ప్రకాశిస్తున్నాం.

ఎప్పుడైనా అనుకోకుండా ఈ మా మనస్సు ఏమైనా సంసార వ్యవహారములను సరిచూడటానికి కాస్త ఇటూ అటూ వెళ్లిందనుకోండి.... వెంటనే తత్త్వమును నెమరువేయుటచే వాటి రాగద్వేషాది లంపటం (బురద)లో మేం వశీభూతులం కావటంలేదు. మొట్టమొదలే మా మనస్సు నిర్వికారము, క్లేశరహితము అగు ఆత్మయందు ఉపశమించి ఉంటోంది. మా చిత్‌తరంగములు సర్వదా సర్వత్రా బ్రహ్మాకారమును పొంది ఉన్నాయి. పున్నమినాటి చంద్రుని చూచిన సముద్ర తరంగముల వలె ఎప్పుడైనా భావతరంగములు లేచుచున్నప్పటికీ మేము సముద్ర స్వరూపులమై ఈ సముద్రతరంగముల వంటి భావములను వీక్షిస్తున్నామేగాని, భావముగా దిగజారటంలేదు. సర్వ భావముల కంటే కూడా ప్రత్యేకమైయున్న మా స్వరూపమును ఆస్వాదించుటే మా యొక్క యోగసాధనం.

హే మహాత్మా! పాల సముద్రం మథించగా అమృతం పుట్టగానే ఎంతటి ఆనందమునకు కారణమైనదో... మీ ఈ రాకచే మేము అంతటి ఆనందం పొందుతున్నాం. ఈషణాత్యాగులగు మీ వంటి మహాత్ముల దర్శనముతో సమానమై ఆత్మ కళ్యాణ విషయం ఇంకేమున్నది? మా భావాతీత యోగసాధనం మరింతగా ఇనుమడిస్తోంది.

**ఆపాతమాత్రరమ్యేభ్యో భోగేభ్యః కిమవాప్యతే ।**
**సత్సఙ్గచిన్తామణితః సర్వసారమవాప్యతే ॥** (శ్లో 39, సర్గ 20.)

ఆపాతరమణీయములగు ఈ ప్రాపంచిక భోగముల వలన ఏం లాభం? తమరి 'దర్శనము' అనబడు 'సత్సంగచింతామణి' నుండి సర్వసారమగు జ్ఞానమే లభిస్తుంది.

హేమహర్షీ! మీ వాక్యములు ధీరగంభీరములు, స్నిగ్ధకోమలములు. సరళమాధుర్యములు అయి ఉన్నాయని అనేకమంది శ్రోతల అభిప్రాయం. మీరు త్రైలోక్యతత్త్వ సారమును ఎరిగినవారు. హే సాధూ! సాధుసంగమం సకలభయములనూ తొలగిస్తుంది. మేము ఆత్మతత్త్వమును గ్రహించి ఉన్నప్పటికీ మీతోటి ఈ సంభాషణచే మరింత పవిత్రులం అయ్యాం. మా దుష్కృతములన్నీ నశించినట్లే. మా జన్మ సార్ధకమైనదని తలచుచున్నాం.

❖❖❖

# 5. ధారణచే మహాప్రళయసాక్షిత్వం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ భుశుండ మహాశయా! కాలవాయువీచికలు ఈ స్థానమును స్పృశించనే లేదా? అయితే మీరు కాలముయొక్క అనేక చమత్కృతులు గాంచి ఉంటారే!

**భుశుండుడు :** ఘోరములగు కల్పాంతవిక్షోభములు అరుదెంచిననూ, విషమగాలులు వీచిననూ పితృ సంకల్ప నిర్మితమైన ఈ గూడు ఉన్నట్టి కల్పవృక్షం మాత్రం కంపించక స్థిరంగానే ఉన్నది.

లోకాంతరములు విహరించే వారికి కూడా ఈ స్థానం అగమ్యమై ఉండటం వలన నేను నిశ్చింతగా ఎట్టి బాధలు లేకుండా ఇక్కడే ఉన్నాను. సప్తద్వీప సమన్వితమైన ధరావలయమును చాపచుట్టినట్టు చుట్టి హిరణ్యాక్షుడు అపహరిస్తూ ఉంటే శ్వేతవరాహమూర్తి ఆకాశం నుండి ఉద్భవించి ఆ హిరణ్యాక్షుని సంహరించి భూమిని యథాస్థానంలో ఉంచినప్పుడు గానీ... దేవరాక్షస గణం క్షీరసముద్రమును మథిస్తుండగా కూర్మమూర్తి మందర పర్వతమును తన భుజములపై ధరించినప్పుడు గానీ... దేవ రాక్షసుల మధ్య భయంకరమగు సంగ్రామం జరుగుచున్నప్పుడు గానీ... సూర్య – చంద్రమండలములు పడిపోగా ఈ జగత్తులు అత్యంత క్షోభ చెందినప్పుడు గానీ... కాలనేమి భుజస్కంధముల మధ్య చిక్కిన మేరు పర్వతం కొంచెం చలించినప్పుడు గాని... అమృతకలశమును గొనివచ్చుచున్న గరుడుని రెక్కలహోరుకు సిద్ధులు పడిపోవుచున్నప్పుడుగాని... గరుడుడు జన్మించి భూమండలమును జలమయం చేస్తున్న వేళ సంకర్షణ రుద్రుడు సహస్రశీర్షములతో భూమిని దాల్చినపుడు గాని... ఆదిశేషుడు తన వేయి తలలనుండి కల్పాగ్ని జ్వాలలను విరజిమ్ముచున్నప్పుడు గాని... ...ఈ కల్పవృక్షం చలించలేదు. మా స్వస్థానంలో యథాతథంగానే ఉన్నాము.

ఓ ఋషిసత్తమా! చెడుచోట్ల ఉండే వారికే ఆపదలు వస్తాయి గాని, అచల స్థానమున ఉండే మాకు ఆపదలెందుకు కలుగుతాయి?

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ మహాబుద్ధీ! కల్పాంతవాయువులు వీచి, ఆ ప్రభావంచే సూర్యచంద్రులే గతితప్పుచుండగా....మీరు ఎట్లు చలించకుండా విజ్వరులై ఉన్నారు?

**భుశుండుడు :** మహర్షీ! ఒక కృతఘ్నుడు కష్టకాలం వచ్చిపడినప్పుడు మిత్రుని త్యజించి ఎచటకో వెళుచున్నాడు చూచారా! ఆ తీరుగా కల్పాంతమున వ్యవహారజగత్తు అదృశ్యమగుచున్నప్పుడు నేను ఈ నీడను త్యజించుచున్నాను. ఆ సమయంలో నేను సర్వకల్పనలూ వీడి, క్రియారహితుడనై ఆకాశంలో ప్రవేశిస్తాను. ద్వాదశాదిత్యులు తమ తాపవేగముచే భూమి యొక్క ఉదరమును ఖండ ఖండితంగా చేస్తున్నప్పుడు 'నేను వరుణడను' అను ధారణ చేసి ధీరుడనై, చలించకుండా ఉంటాను. కొండలను పిండి చేస్తూ ప్రళయవాయువులు వీస్తున్నప్పుడు 'నేను పార్వతీదేవిని' అను ధారణ చేత ఆకాశంలో చంచలరహితుడనై స్థిరత్వం వహించి ఉంటాను. మేరువు మొదలైన పర్వతములు కరిగి పోవుచూ సర్వ జగత్పదార్థములూ ఏకద్రవంగా మారిపోవుచుండగా నేను వాయువువలె ప్రవహిస్తూ ఉంటాను. స్థూల – సూక్ష్మాది తత్త్వములతో కూడిన బ్రహ్మాండమంతా విలీనమై పోవుచుండగా నేను 'పరమపదము'న అచలుడనై సుషుప్తునివలె ధారణ అవలంబించి ఉంటున్నాను.

మరల బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభించేవరకూ అట్లాగే పరమపదమున ధారణను కొనసాగిస్తు న్నాను. తదనంతర సృష్టి ప్రారంభం కాగానే ఈ బ్రహ్మాండమున ఈ కల్పవృక్షంపై గూటిలో ప్రవేశిస్తున్నాను. ఈ విధంగా అనేక కల్పాంతములకు సాక్షినై ఉన్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అంటే.....మీ స్వకీయమైన ధారణశక్తి చేతనే కల్పాంతములకు కూడా పట్టుబడక, కల్పాంతములందు అఖండితంగా ఉన్నారన్న మాట! అత్యంతాశ్చర్యం!

నాదొక చిన్న ప్రశ్న. మీ వంటి ఇతర యోగులు మీ వలెనే ధారణ చేయక, వారు వేరు వేరు అధికార శరీరములను పొందటమో, లేక ముక్తిని ప్రాప్తింపజేసుకోవటమో చేస్తున్నారేమిటి?

**భుశుండుడు :** మీ ఈ ప్రశ్నకు నాకు తెలిసిన సమాధాన మొక్కటే – పరమేశ్వరుని నియతి అట్టిది! అది అనుల్లంఘనీయం. నేను ఈ తీరుగానూ, నావంటి ధారణసమర్థులగు తదితర యోగులు ఆయా తీరులుగానూ ఉండవలెననునది సర్వాత్మకుని సంకల్పమనుకోవాలి. బ్రహ్మజ్ఞాన ప్రతిపాదక మగు ఒక మహత్తర గ్రంథం కొందరికి మీమాంసా మాత్రంగా. మరికొందరికి స్వస్వరూపజ్ఞాన ప్రసాదితంగా ఎందుకుంటోందో ఎవరం ఏమి చెప్పగలం? ఇదంతా 'భగవత్ సంకల్పమాత్రమైన సృష్టి యొక్క నియతి' అని పెద్దలు అంటూ ఉంటారు. ఏది ఎట్లా జరుగవలెనో ఎవరికి నిర్ణయింప శక్యం? ఏది ఎట్లా ఉండవలెనో అది అట్లాగే వెలయుచున్నది. ఇదే 'స్వభావము' అని 'నియతి' అని, 'నిశ్చయం' అని పిలువబడుతోంది. ఇంతకు మించి ఏ సమాధానమూ నాకు తెలియదు.

ఇక నా విషయం చెప్పమంటారా? ప్రతిసారి నా ప్రాణయోగసాధన కారణంగా ఒనగూడిన సంకల్పవశంచే కల్పాంతప్రళయ సమయంలో ఆకాశంలో ప్రవేశిస్తున్నాను. మరల తదనంతర సృష్టిలో ఇచ్చటికే వచ్చి ఉంటున్నాను.

❖❖❖

# 6 సుదీర్ఘ సృష్టి చమత్కారం

**శ్రీవసిష్ఠ మహర్షి :** అత్యంత దీర్ఘాయువు కలిగి, మోక్షమును అధిరోహించినట్టి అనుభూతిని అనుభవిస్తూ, యోగికి యోగ్యమైన మనస్సును జ్ఞాన విజ్ఞానములను పొంది, అంతులేని ధీరత్వంతో మీరు ప్రకాశిస్తు న్నారు. సర్వమూ కాలయమునకు 'ఎర' అగుచుండగా మీరు మాత్రం మీ ధారణా శక్తిచే కాలముచే బంధింపబడకుండా ఉన్నారు. పురాతన విషయములన్నీ ప్రత్యక్షంగా చూచిన మీరు అనేక విషయములు చెప్పుటకు సమర్థులు. ఓ మంగళహృదయా! అనేక విధములగు సృష్టులను, ప్రతిసృష్టులను, సామాన్య ప్రళయములను, అవాంతర ప్రళయములను, మహాప్రళయములను చూచిఉన్నారు కదా! ఆ సృష్టులలో ఏఏ ప్రత్యేక విషయములు సందర్భోచితమో... అవి చెప్పమని నా విన్నపం.

**భుశుండుడు :** మహాత్మా! వినండి – ఈ సుమేరుపర్వతం క్రిందగల భూమి అంతా వృక్షములు గాని, గడ్డిగాని, శైలము (Rock)గాని లేక, కేవలం శూన్యంగా ఉండటం చూచాను. భూమి 11000 సంవత్సరాల కాలం భస్మరాశితో నిండి ఉన్నది. అప్పుడు భూమిపై సూర్యుడు గాని, చంద్రుడు గాని లేకపోవటం చేత పగలు రాత్రి భేదమే ఉండేది కాదు. కాలమునకు కొలతబద్ద లేకపోయినా నేను నా విజ్ఞానదృష్టితో సూర్యచంద్రుల కంటే విశిష్టమైన కాలగమనాన్ని గమనించాను.

భూమి సగం పగలు, సగం రాత్రితో కొంతకాలం ఉండిపోయింది. దేవాసుర సంగ్రామ సమయంలో జనులు భూమిలోని అంతర్భాగంలో దాగి ఉండుటచే ఈ భూమి కొంతకాలం జన శూన్యమైపోయింది.

ఒకప్పుడు భూమి అంతా నాలుగు యుగములవరకూ రాక్షసస్త్రీలకు అంతఃపురమైయున్నది. మరొకప్పుడు ఈ జగత్తంతా సముద్రజలంచే ఆక్రమించబడుటచే ఇక త్రిమూర్తులు, మేరు పర్వతం తప్ప మరింకేమీ లేదు. రెండు యుగముల కాలం భూమిపై ఇతర సృష్టి ఏదీలేక, కేవలం వన వృక్షములచే నిబిడీకృతమైయున్నది.

ఒకసారి నాలుగు యుగముల కాలం సృష్టంతా పర్వతములతోనూ, స్థాణువులతోనూ నిండి పోయింది. ఆ సమయంలో జనులకు సస్యవ్యవసాయాది వృత్తులు లేవు. పదివేల ఏండ్లు భూమి చనిపోయిన రాక్షసుల దేహములతో, భీకర మృగములతో నిండిపోయి ఉన్నది.

ఒకసారి అనంత సృష్టిలోని ఏమూల నుండో ఒక గొప్ప 'కారుచీకటి' బయలుదేరింది. ఆ గాఢాంధకారం ప్రసరించిన చోట నక్షత్రాలు కూడా అంతర్హితమైపోయాయి. నక్షత్రాలు మటుమాయ మవటం చూసిన విమానచారులగు ఆకాశచరులు భయంతో కేకలు వేస్తూ తమ ఉపాధులు కోల్పోవడం నేను చూచాను.

మరొకసారి వింధ్యపర్వతం గాలిలో లేచి దక్షిణదిక్కును రాళ్లమయంగా చేసివేయటం చూచాను. అప్పుడు 'వింధ్యపర్వతాన్ని నిరోధించటానికి అగస్త్యమహర్షి లేకపోయారే' అని నేను అనుకున్నాను.

హే బ్రహ్మజ్ఞా! ఇట్టివేయగు అనేక విషయాలు నాకు గుర్తుకొస్తున్నాయి. అవన్నీ మీకు పెద్దగా చెప్పవలసిన విషయాలు కాదు. కొన్ని ముఖ్యవిషయాలు చెబుతాను. నేను వందకు మించిన మనువులను చూచాను. నానావిధ కార్యక్రమములతో నిండిన వందలాది చాతుర్యుగములు గాంచాను.

ఏది ఏమైతేనేం? 'స్వాత్మతత్త్వము' దృష్ట్యా చూచినప్పుడు విరాట్-బ్రహ్మాండమే కనిపిస్తుంది. సమాహితచిత్తానికి ఈ సర్వమూ 'నరులు- సురులు' అనే భేదం కనిపించదు. 'జీవులు' అనబడు ప్రకాశాత్మకమగు తేజోపుంజములతో కనిపించే విరాట్ పురుషుడు మాత్రమే గోచరిస్తాడు.

అనేక వైవిధ్యములతో కూడిన ఈ విచిత్ర సృష్టిలో మద్యపానాసక్తులు, నిందిత కర్మిష్ఠులు, దృశ్య ప్రసంగాలతో బ్రతుకులు గడిపే జీవులు ఉన్నారు. వారు ఒక దుఃఖం నుండి మరొక దుఃఖం నకు, ఒక భయం నుండి మరొక భయమునకు ప్రయాణించటం చూస్తూ ఉంటే నా హృదయం కించిత్ ద్రవిస్తుంది. మీవంటి బ్రహ్మజ్ఞానుల వాక్యములు వారు వినకపోవటం నాకు చమత్కారం అనిపిస్తూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ప్రియవర్తనులగు జనులు లేకపోవటంచేత ఒక్కొక్క భూవిభాగం సారహీనమై ఉండటం చూస్తూ ఉంటాను. అయితే, “అంతా మాయయే కదా!”... అని తెలిసి ఉండటం చేత సర్వము పట్ల కృతకృత్య మౌనస్వభావంతో చూస్తూ ఉన్నాను.

ఒక్కొక్కప్పుడు స్త్రీ – పురుష సంయోగం లేకుండానే మానసిక సంకల్పంచే జనించిన భృగువు మొదలైన మహనీయుల జననం చూచాను. అవాంతర ప్రళయం తటస్థించినప్పుడు భూమిపై పర్వతములు, వృక్షములు జీవులు నిర్మూలనమయ్యేవి. అప్పుడు భూమియే నిరుపయోగమయ్యేది. అప్పుడు యోగసిద్ధి పొందిన మానవులు, దేవతలు నాలాగానే ఆకాశమును ఆశ్రయించటం గమనిస్తూ ఉండేవాడిని. ఈ సృష్టి ఒక్కొక్కప్పుడు ఇంద్రుడుగాని, రాజుగాని లేక, ఉత్తమ – మధ్యమ

– అధమ తారతమ్యములుగాని కలిగిఉండటం లేదు. అంతా అజ్ఞానమయం అయిపోతోంది. అప్పుడు సర్వేశ్వరుని అంశలు జీవులుగా జన్మించి ధర్మసంస్థాపన చేయటం గమనించాను.

ఇక ఈ సృష్టికి మునుముందటి ఆయా ప్రయత్నములు, భువనత్రయవిభాగం ఏర్పడటం, పర్వతములు రూపు దిద్దుకోవటం, జంబూద్వీప ఆవిర్భావం, వర్ణాశ్రమ ధర్మముల రచన, భూమండల విభాగం, నక్షత్రచక్ర సంస్థాపన, ధ్రువనక్షత్రోదయం, ఈ సూర్యచంద్రుల ఉత్పత్తి....ఇవన్నీ నిన్న మొన్నటి సంగతులు.

అట్లాగే ఇంద్ర – ఉపేంద్రుల వృత్తాంతం, దేవ–దానవ–మనుష్య చక్రవర్తులు నియమించ బడటం, మత్స, కూర్మాది అవతారములు, సముద్ర మథనం, గరుడుని జన్మ, సముద్రాలు ఏర్పడటం – ఇవన్నీ ఈ రోజు జరిగిన సంఘటనలవలె నా కనిపిస్తున్నాయి. ఇవన్నీ నా కన్నా వయస్సులో చిన్నవారు, ఈ కల్పమువారు అగు మీరు చూచినవే కదా!

ఒక కల్పంలో గరుడవాహనుడగు విష్ణువు సృష్టికి యజమాని అయి ఉంటున్నారు. ఇంకొక కల్పంలో హంసవాహనుడగు బ్రహ్మదేవుడు యజమాని. మరొక కల్పంలో వృషభవాహనుడగు ఈశ్వరుడు అంతటికీ యజమాని. ఒక కల్పంలో బ్రహ్మదేవుడైన జీవుడు మరొక కల్పంలో శివుడ గుచున్నాడు. ఏమి ఈ సృష్టి చమత్కారం!

❖❖❖

# 7. చిత్ర విచిత్ర సంఘటనలు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ భుశుండమహాశయా! చిత్రవిచిత్రములైన ఈ సృష్టికి సంబంధించిన మరికొన్ని ప్రత్యేక విశేషాలు, సంఘటనలు వినాలని అనుకుంటున్నాను.

**భుశుండుడు :** ఈ సృష్టిలోని అనేక వస్తుజాలములు కాలగర్భంలో కలిసిపోతున్నట్లే, అనేక చిత్ర విచిత్ర సంఘటనలకు నేను సాక్షినై ఉండటం జరిగింది. వాటిలో అనేక సామాన్య విషయాలు నా స్మృతి పథంలో కూడా లేవు. కొన్ని విశేషాలు గుర్తున్నవి చెపుతాను వినండి.

మహనీయులగు మీరు, భరద్వాజుడు, తదితర అనేక మహర్షులు, గణేశుడు, గౌరి, గాయత్రి మొదలైన వారి జన్మవృత్తాంతాలన్నీ నాకు నిన్న మొన్నటి సంఘటనలు. నేనిట్లా చూస్తుండగానే మీకు ఎనిమిది జన్మలు గతించాయి. ఈ ఎనిమిదవ జన్మలో ఇప్పుడు నా దగ్గరకు వచ్చారు. ఆ జన్మలన్నీ బ్రహ్మపుత్రుడుగా జరిగినవి కావు. ఒకసారి ఆకాశం నుండి, మరొకసారి జలం నుండి, వాయువు నుండి, అగ్నినుండి, పర్వతాల నుండి జన్మించటం జరిగింది. ఇప్పుడీ వర్తమాన 'సర్గ'ను బోలినవే ఇతఃపూర్వం మూడు చూచాను. అంతకుముందు సర్గలు ఇందుకు భిన్నంగా ఉండేవి.

భూమి నీటిలో మునిగిపోవుచుండగా కూర్మమూర్తిచే ఐదుసార్లు కాపాడబడటం చూచాను. కూర్మ – వరహామూర్తులచే కాకుండా, మరికొందరిచే ఈ భూమియొక్క విధ్వంసనా యత్నములు విఫలం చేయబడటం చూచాను. దేవతలు, రాక్షసులు అమృతం కొరకు సముద్రమథనం చేయటం ఐదుసార్లు నాకు గుర్తున్నది. కొన్ని సర్గలలో పరశురాముడు జన్మించి రాజవంశ నిర్మూలనం

చేయగా, మరికొన్ని సర్గలలో అతడు జన్మించటం జరుగలేదు. హరి అనేక కలియుగాలలో బుద్ధుడుగా జన్మించటం నేనెరుగుదును. చంద్రమౌళియగు శివుని యొక్క త్రిపురాసురల సంహారాలు, దక్షయజ్ఞ విధ్వంసములు నా జ్ఞప్తిపథంలో ఉన్నాయి.

ఓ మునీంద్రా! వేరు వేరు యుగములలో వేదములకు సంబంధించిన పఠన – నియమ – నిష్ఠ – బ్రహ్మచర్య – గురుశుశ్రూషాది విధివిధానములు వేరు వేరు రీతులుగా ఉంటున్నాయి. ఒకే కథనం బోధిస్తూ కొన్ని పురాణాలు వివిధ యుగములలో విభిన్న పాఠములు, వ్యాఖ్యలు కలిగి ఉంటున్నాయి. వేదవేత్తలగు వ్యాస వాల్మీకాదులు మరల మరల భారతరామాయణాది ఇతిహాసాలు రచిస్తూ ఉండటం నాకు తెలుసు. ఇప్పుడెక్కడా ఎవ్వరికీ తెలియని 'అఖండ రామాయణము' అను లక్ష శ్లోకములలో రచించబడిన ఇతిహాసం గురించి నాకు తెలుసు. ఆ లక్ష శ్లోకములలో జ్ఞానము కరతలామలకం చేయబడింది. ఆ గ్రంథమే ఇప్పుడు వాల్మీకిచే 32000 శ్లోకములలో బోధించబడి కొద్దిమంది శిష్యుల పఠన విషయమై ఉంటోంది. దీనిని మీరు కాలక్రమేణా ఒక సందర్భంలో అవతారమూర్తియగు శ్రీరామచంద్రునికి బోధిస్తారు. ఇప్పటి రామాయణ కథ ఇతఃపూర్వం 11 సార్లు తిరిగి రాయబడింది. అవన్నీ వాల్మీకియో, మరొకరో తిరిగి రాశారు. పూర్వపు అనేకమంది వ్యాసులు రాసిన మహాభారతములు అనేక మార్లు విస్మరించబడి, మరల విరచించబడ్డాయి. 6 మార్లు వ్యాసులో, మరొకరో రాసిన భారతములు విస్మరించబడ్డాయి. ఇప్పుడు 7వ సారి భారతం వ్రాయబడుచున్నది.

పురాణములు ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క తీరుగా ఉంటున్నాయి. పదార్థ సమూహములు కూడా ఎప్పుడూ ఒక్కతీరుగా ఉండటం లేదు. విష్ణుమూర్తి శ్రీరాముడుగా 11 సార్లు అవతారం ఎత్తడం నాకు తెలుసు. శ్రీ నరసింహస్వామి 3 సార్లు అవతారం ఎత్తి మూడు వేర్వేరు యుగాలలో హిరణ్యకశ్యప వధ చేయడం నాకు గుర్తుంది.

హే మునీశ్వరా! ఇంతదాకా ఏదో మీరు ప్రశ్నించారు కాబట్టి నా జ్ఞాపకపేటికలోంచి కొన్ని విశేషాలు చెప్పాను. ఇంతకూ అసలు సత్యమేమిటో కూడా మనం ఇక్కడ చెప్పుకోవాలి కదా!

భ్రాంతిమయమగు ఈ జగత్తు అస్సలు స్వతఃగా లేనేలేదు. జలముపై బుడగల వలె ఇదంతా క్షణికమే అయి ఉన్నది. సముద్రం ఒడ్డున కూర్చునిఉన్నవానికి సముద్రజలంలో కెరటాలు వచ్చి పోవుచున్నట్లు అంతరమున గల చైతన్యమునందు అనిత్యములగు ఈ సృష్టిపరంపరలు లేస్తున్నాయి, పడిపోతున్నాయి. ఈ సర్వమూ సంకల్పమాత్ర భ్రాంతియే కదా. అనేక సృష్టులు ఒకే తీరుగా ఉండటం, అనేక తీరులుగా ఉండటం, సగం ఒకే తీరుగా ఉండటం, ఈ త్రిలోకములు ఏర్పడటం, అందులో జీవులు వచ్చిపోవటం, వివిధ జీవుల కర్మలు––ఇవన్నీ కూడా ఒకే జలంలోని అనేక తరంగములవంటివేనని మీకూ తెలుసుకదా!

ప్రతి మన్వంతరంలోనూ ఈ జగత్క్రమమంతా విపర్యయం పొందుతోంది. దీని పుట్టుక, ఉనికి, నాశనము తారుమారగుచున్నది. నా బంధువుల, భృత్యుల ఆశ్రమములు వేరు వేరగుచున్నాయి. నా నివాస స్థానం ఒక్కొక్కసారి ఒక్కొక్కచోటికి మారుతూ వస్తోంది. ఒకసారి వింధ్యశృంగముపైన,

మరొకసారి సహ్యాపర్వతంపైన ఇంకొకసారి మేరు పర్వతంపైనా గూడు మారుచున్నది. ఒకసారి ఎందరో బంధుజనులు నా వెంట ఉండి ఉంటున్నారు. మరొకసారి దీర్ఘకాలం ఒంటరిగా ఉంటున్నాను. ఇట్లు యుగయుగాలుగా, కల్పకల్పాంతాలుగా నేనుమాత్రం ఈ తీరుగానే ఉండిపోతున్నాను. దిశలు, అందలి వస్తువులు తారుమారగుచున్నప్పటికీ నేనుమాత్రం 'ప్రత్యభిజ్ఞానబలం' చేత ఎట్టి మార్పులూలేక, ఆ సర్వమునూ సాక్షీమాత్రుడనై గమనిస్తున్నాను. ఈ జగత్తు, జగత్తులూ – అంతా కూడా సత్–అసత్‌మయమని, ఆత్మయందు ఉద్భవించుచున్న భ్రమ మాత్రమేననీ నాకు తెలుసు. అందుచేత నా బుద్ధికి ఏ క్షణంలోనూ ఎటువంటి మోహం కలగటం లేదు. ఆత్మయొక్క మాయాశక్తిచేతనే ఈ పదార్థములన్నీ ఈ విధంగా విజృంభిస్తున్నాయి. దిక్కుల భేదం వలన వ్యవస్థయే మారిపోయినట్లు అనుభవమౌతుంది కదా! అట్లాగే తల్లి–తండ్రి, భార్య–భర్త, అన్న–తమ్ముడు కాలగతి యొక్క మహిమచే మిత్రులు, శత్రువులు కూడా అగుచున్నారు. పురుషులు స్త్రీలుగా అగుచున్నారు. ఆచార వ్యవహారముల నియమ నిబంధనములు మారిపోతున్నాయి.

ఒకొక్కకాలంలో జనులు వేదాలను, వేద నిషేధాలను పూర్తిగా వదిలి చరిస్తున్నారు. ఒక చిన్న రచన, ఒకచిన్న క్రియా విశేషం మొత్తం ఆచార వ్యవహారాలను సమూలంగా మార్చివేసిన సంఘటనలు నా జ్ఞప్తిపథంలో ఉన్నాయి. ఒకప్పుడు బ్రహ్మదేవుడు ధ్యానమగ్నుడై అనేక యుగములు గడుపగా ఈ బ్రహ్మాండమున దేవ రాక్షససమూహములు లేవు. అందుచేత ఇది క్రియారహితమై ఉన్నది.

ఈ నా దీర్ఘజీవితంలో 10కి పైగా మనోమాత్ర నిర్మిత సృష్టులు వేరువేరు నవలల వలె గాంచియున్నాను. ఆ మానసిక సృష్టులలో పంచభూతాత్మికమైన దేహములు లేవు. కేవలం ఊహలే పరస్పరం ప్రవర్తించి సకల అనుభవరూపంగా స్ఫురిస్తూ ఉంటాయి. అనేక దేశ, కాలములతో, ప్రదేశ, – వేషభాషలతో, విచిత్ర కార్యక్రమములతో, పరస్పర విరుద్ధములైన నిర్వచనములతో ఈ సృష్టి అంతా పరిఢవిల్లుతోంది.

❖❖❖

## 8 చాంచల్యరాహిత్యం - అమృతత్వం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ విహంగరాజమా! ఈ బ్రహ్మాండమంతా ఇంత చమత్కారంగా మరల మరల విచలితమగుచున్నది కదా! ఇందలి జీవులు మృత్యువుచే అనేకమార్లు బాధింపబడుచున్నారు. మరి అట్టి మృత్యువు మిమ్ములను మాత్రం సమీపించనేలేదు. ఇది మీకు ఎలా సాధ్యపడింది?

**భుశుండుడు :** సర్వజ్ఞా! మీకు అంతా తెలుసు. అయినా అడుగుచున్నారు. అయితే, ప్రభువు కోరినట్లే భృత్యువు నిర్వర్తిస్తాడు కదా! బ్రహ్మవేత్తలగు మీరు ప్రశ్నించారు గనుక మరల విశదీకరించి చెబుతాను. మీ ఆజ్ఞను పాలించుటయే మిమ్ములను ఆరాధించటం కదా!

ఆభరణములేవీ లేనివానికి దొంగలు వచ్చి దొంగిలించగలిగేదేమి ఉంటుంది? అట్లాగే ఎవని హృదయంలో అయితే 'వాసనా తంతువులు' అనే దోషం ఉండదో అట్టి వానిని మృత్యువు హింసించ

జాలదు. ఎవనికి ఆశాపాశజనితమైన మనోవ్యాధులు ఉండవో, అట్టివానియందు మృత్యువు వచ్చి కలిగించగల మార్పు చేర్పులేమీ ఉండవు. మనస్సు యొక్క చాంచల్యము జయించబడిందా – ఇక 'నేను క్షయించుచున్నాను' అను భావన నిరర్థకమై, నిరోధించబడుతోంది.

ఆశయే అన్ని చింతలకూ కారణం. 'ఆశించుట' అను జీవునియొక్క అవిజ్ఞానజనిత స్వభావమే మృత్యువుకు విషాగ్నిజ్వాలలు వెడలగ్రక్కగల శక్తిని ప్రసాదిస్తోంది. మనస్సులో 'ఇది కష్టం–అది కాదు' అనే తరంగపరంపరలు మొట్టమొదట బయల్వెడలుచున్నాయి. అవి రాగద్వేషములను కల్పన చేస్తున్నాయి. రాగద్వేషములు, లోభగుణమునకు కారణమగుచున్నాయి. లోభం కోపాగ్నులను జనింపజేసి హృదయంలో జ్ఞానజలమును ఆవిరిగా చేసేస్తున్నది. ఎక్కడినుంచో కామము వచ్చి హృదయమును పిప్పి చేసేస్తున్నది.

తత్ఫలితంగా మృత్యువు విలయతాండవం చేయగలుగుతోంది. ఎవరైతే అద్వితీయమును నిర్మలమును, పవిత్రమునగు ఆ పరమపదమును ఆశ్రయిస్తారో... వారియొక్క విశ్రాంతి స్థానమును బాధించగల సమర్థత మృత్యువునకు లేదు. ఈ శరీరం అనే ఉద్యానవనంలో 'మనస్సు' అనే చంచల స్వభావం గల కోతి సంచరించకపోతే 'మృత్యువు' అనే వననాశనం ఎందుకు జరుగుతుంది?

మహాత్మా! ఈ జీవుడు సమాహితచిత్తమును సంపాదిస్తేచాలు, అన్ని రుగ్మతలూ తొలగుతాయి. సంసారదోషమునకు కారణములైన దృశ్య దోషములు సమాహితచిత్తుని ఏమాత్రం బాధించలేవు. ఈ శారీరక మానసిక దోషములు అతని దగ్గరకు వెళ్లలేవు. సమత్వము అనుదానిని అనుభూతిగా చేసుకున్నవానికి ఇక్కడి స్మృతి–విస్మృతులు, జాగ్రత్–స్వప్న–సుషుప్తులు ఉండియూ, లేనివే అగుచున్నాయి.

ఎవని హృదయంలో కామక్రోధవికారములు జనింపజేసి, అంధకారమయం చేయగల చింతలు ఉండవో– అట్టివానినే మనం 'సమాహితచిత్తుడు' అని పిలుస్తాం. ఎవని కర్మలైతే దానం, ప్రతిగ్రహణం, త్యాగం, యాచన – మొదలైన దోషములు లేకుండా ఉంటాయో, అతని చిత్తము సమాహితత్వము అవధరిస్తున్నట్లు. ఈ ధనాది ఆర్జనలు, కృషి, నిర్మాణాది కార్యములు, రాగద్వేషాది గుణము, హృదయ భేదకములగు తదితరుల దూషణవాక్యములు, కఠినములగు ఆయా సామాజిక స్థితిగతులు సమాహితచిత్తునిలో ఏ మార్పుదుఃఖము, ఆవేశము, నీరసము మొదలైనవి కల్పించలేవు సరికదా... నదుల జలాలన్నీ సముద్రం కోరకుండానే సముద్రంలోకి ప్రవేశిస్తున్నట్లు, మహత్తర గుణములను వెంటబెట్టుకుని లాభజనకములగు సుఖములన్నీ వాటంతట అవే ఆ సమాహిత చిత్తుని సమక్షమునకు చేరుకుంటాయి.

కనుక 'మృత్యువు అనునది నాపట్ల నిష్క్రియము, నిర్వీర్యము అయిపోవాలి' అని ఏ జీవుడైనా అనుకుంటే, అతడు తన మనస్సును ముందుగా భోగాభిలాషారహితంగా తీర్చిదిద్దుకోవాలి. భ్రమలన్నీ ఒక్కటొక్కటిగా బయటకు పంపివేయాలి. అప్పుడా మనస్సు తనయందు పారమార్థిక సుఖమునకు చోటు కలిగి ఉంటుంది. క్రమంగా సత్యసంకల్పత్వం సంతరించుకుంటుంది.

'అనేకత్వము' అనేదే అపవిత్ర దృష్టిపిశాచం ఈ జీవుడు సత్యసంకల్పుడు కావాలంటే – అనగా, తాను అనుకున్నది పొందాలంటే, ముందుగా 'ఇక్కడి అనేకత్వము ఉన్నది' అనే అపవిత్రదృష్టి దరిజేరకుండా చూచుకోవాలి. అప్పుడు మనస్సు పవిత్రమై, పరమపదమున స్వస్థి పొందుతుంది. ఇక మృత్యువు నిష్క్రియం అయిపోగలదు.

**మృత్యువుకు అతీతుడు కావాలంటే -**

1. 'పరిపక్వదశ' ప్రసాదించగల ధ్యాన – కర్మ – పఠనాది కార్యక్రమములను శ్రద్ధా–ఆసక్తులతో తీవ్రతరం చేసుకోవాలి.

2. క్రమక్రమంగా హితకరము, సర్వదుఃఖనివర్తకము, నిత్యము అగు జ్ఞానమును సంపాదించే టట్లుగా ఈ మనస్సును నియమించాలి.

భూతవర్తమానభవిష్యత్తులందు ఏదైతే నిత్యమై, అనంతమై సాధుజన సేవితమై సర్వహితకరమై యున్నదో, అట్టి పదము వైపుగా ఈ మనస్సును ప్రవర్తింపజేయాలి. బుద్ధికి కూడా పరమప్రకాశమై, అమృతసారమై, ఎనలేని, తెంపులేని సుఖప్రదమగు మహాస్థానమునందు మనస్సును సంలగ్నం చేయాలి. అట్టివారి మహత్తర దృష్టియందు మృత్యువుతో సహా ఈ ఎదురుగా కనిపించేదంతా లేనిదే అగుచున్నది.

హే మహర్షీ! దేవతాస్త్రీ సాంగత్యాదులలో కూడిన దివియందుగాని, పర్వత, రాజ్య, సముద్ర, వనములతో కూడిన భూలోకమునందు గాని, నాగ, అసుర కన్యలతో కూడిన పాతాళలోకము నందుగాని – నిత్యము, స్థిరము, సుఖము అయినది ఒక్కటి కూడా ఏదీ లేదుకదా! ఈ బ్రహ్మాండ సాగరంలోని మూడు లోకములూ ఆధి వ్యాధులనే తరంగములతో కదులుచూ, దుఃఖములు అనే సుడిగుండములతో, తుచ్ఛములగు అనేక అల్పాశయక్రియావ్యవహారములతో నిండి ఉన్నాయి. ఇందులో ఎక్కడ నిజమైన సుఖము, శాంతి ఉన్నాయి చెప్పండి? కాస్త హృదయమును సరళం చేసి కొంచెం మనస్సును ఆనందపరచే చిత్తవృత్తులు కూడా ఏమాత్రం స్థిరత్వం కలిగి ఉండుటలేదు కదా! ఇక్కడి సంకల్పవికల్పములేమైనా జీవునకు శాశ్వత శుభమును కలుగజేస్తున్నాయా? లేదు. ఇక ఈ ఇంద్రియసుఖములంటారా? ప్రతిదీ కాస్త సుఖం, గంపెడంత దుఃఖం! అవి మూర్ఖజీవుని అల్పాయుష్కులను తమవైపు ఆకర్షించి అతనిని చివరికి దుఃఖిగాను, రిక్తహస్తునిగాను చేసివేస్తున్నాయే! అవి అందించే విషయసుఖములను సమాహితచిత్తుని విశ్రాంతి, ప్రశాంతతలతో సరిపోల్చగలమా? ఏమాత్రం కుదరదు.

**న పరమేకమహీతలరాజతా నచ వరం విబుధామరరూపతా ।**

**నచ వరం ధరణీతలనాగతా స్థితిముపైతి హి యత్ర సతాం మనః ॥** (శ్లో॥ 33, సర్గ 23.)

విశ్రాంతి పొందిన సాధువుల మనస్సుతో ఈ ప్రపంచంలో గొప్ప గొప్ప విషయాలుగా కనిపించే ఏకచ్ఛత్రాధిపత్యముగాని, దేవలోకత్వముగాని, పాతాళరాజ్యాధికారంగాని కించిత్ కూడా తులతూగలేవు.

మనస్సు విశ్రాంతి పొందిందా... ఇక, శాస్త్ర పాండిత్యంతోను, వక్తృత్వాది గుణములతోను, కర్మకాండతోను పనేమున్నది? అనుభవైకవేద్యమైనది కరతలామలకమౌతుంది.

అసలు ఆత్మకుస్వభావసిద్ధమే అయి ఉన్న శాంతి దేనిచే బాధించబడుతోంది?...

ఈ దేహము యొక్క వ్యాధులచే నా పని అయిపోతోంది... నాకు స్వర్గ సుఖములు కావాలి... నాకు పతనం అనివార్యం... ఈ దేహమనోబుద్ధులే నా రూపం... ఇటువంటి అల్పభావ పరంపరలే స్వస్వభావమగు శాంతిని పాడుచేస్తున్నాయి.

మూఢునికి మాత్రమే ఈ జగద్విషయాలు మొట్టమొదట బహురమ్యంగా కనిపిస్తున్నాయి. క్రమేణ అవి అతనిని పట్టుకుని మృత్యువుకు ఉపాహారంగా అందజేస్తున్నాయి. మహాత్ములు మాత్రం ఈ ఎదురుగా కనిపించే సర్వమునూ అవలీలగా ఆవలకు నెట్టివేసి ఉంటున్నారు. 'ఆశ' అను దానిని దగ్గరకు రానీయకుండా, శాశ్వతసుఖ విశ్రాంతిని తమ సొంతం చేసుకుంటున్నారు. "మృత్యువు దైనందికమైన నిద్ర వంటిదే" అని గ్రహించి జన్మ, జీవన్-మృత్యువులను అధిగమించినట్టి "తేజోమయ ఆత్మాఉహందృష్టి" ని అలవరచుకొని ఉంటున్నారు.

❖❖❖

# 9. ప్రాణవాయుగతుల ఉపాసన

**భుశుండుడు :** హే బ్రహ్మవేత్తా! బాగా వింటున్నారు కదా!

**ఏకైవ కేవలా దృష్టిః నిరాపాయా గతభ్రమా**
**విద్యతే సర్వవిత్త్వేషు సర్వశ్రేష్ఠా సమున్నతా॥**

నిజానికి 'భ్రమరహితము-సర్వశ్రేష్ఠము-మహోన్నతము' అగు "అద్వైతదృష్టి" ఒక్కటే సమస్త జ్ఞానమునకు సమున్నత సత్ఫలమైయున్నది.

**ఆత్మచిన్తా సమస్తానాం దుఃఖానాం అన్తకారిణీ**
**చిర సంభృత దుఃస్వప్న సంసారభ్రమహారిణీ॥**

ఈ జీవుడు అనాదికాలం నుండి తనవెంట అవిద్యాకామ్యకర్మలను తెచ్చిపెట్టుకుంటూ ప్రతిజన్మలోనూ పెంచి పోషించుకుంటున్నాడు. ఇప్పుడాతనికి దుఃస్వప్నసంసార భ్రమ నుండి, సర్వ దుఃఖానుభవముల నుండి విముక్తి అత్యంతావశ్యకం. అందుకు సరి అయిన ఔషధం సేవించాలి కదా! ఏమిటా ఔషధం? ఈ సర్వమును, సర్వులనూ 'ఏకాత్మ స్వరూపం'గా దర్శించటమే ఔషధం. అట్టి 'ఆత్మచింతన' అనునది ప్రశస్తమగు పవిత్రమైన మనస్సునందే ఉదయిస్తోందిగాని, మరెక్కడో కాదు. అయితే స్వల్పత్వం ఆశ్రయించే వారికి దుశ్చింతలు, అనర్థాలు, దుఃఖాలు ఉండనే ఉంటున్నాయి. అవి మొదలంటా వినాశనమైనప్పుడు మాత్రమే స్వస్వరూపాత్మజ్ఞానం అబ్బుతోంది. వెన్నెల వస్తే కారుచీకటి మటుమాయం అవుతుంది కదా! సర్వసంకల్పములు వర్జించినప్పటి ఆత్మచింతన మనస్సులోని మాయ, భ్రాంతి, మోహము అనే మకిలిని కడిగివేస్తోంది.

అయితే ఒక్క విషయం! సర్వసంకల్పములకు సమాధానమై, అత్యంత శ్రేష్ఠమైన 'నిరంతరాత్మ చింతన' అనేది మీవంటి జ్ఞానసమన్వితులగు మహాత్ములకు అత్యంత సులభమై ఉంటోంది. మాలాటి మందమతుల విషయానికి వస్తే అది సుదుర్లభమే అవుతోంది. మావంటి వారిని మా చేతనే కల్పించుకొనిన అజ్ఞానం ఆవరించి ఉంటోంది. మా సునిశ్చయాలు క్షణంలో స్వల్ప సంఘటనలచే చంచలమౌతున్నాయి.

అయితే 'నిరంతరాత్మచింతన' అనే రాణిని మీవలె మేము పొందలేకపోయినప్పటికీ, ఆ రాణిగారికి కొందరు ప్రియచెలికత్తెలున్నారు. వారు కూడా ఆమెవలెనే మహాఘనులే. వారు కూడా జ్ఞానచంద్రుని చల్లని కిరణములైయున్నారు. అట్టి ఇష్టసఖులలో ఒక చెలికత్తెను నేను పొందాను. దాని పేరు "ప్రాణచింతన"

ఈ ప్రాణచింతన కూడా సర్వదుఃఖక్షయకారకమే. సౌభాగ్యమును వర్థిల్లింపజేయగలదు. ఒక జీవుడు జీవించుటకే హేతువగుచున్న ప్రాణచింతన-అనుయోగాభ్యాస మూలముననే నేను చిరంజీవుడనయ్యాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** భుశుండమహాశయా! ముందుగా 'ప్రాణచింతన' అంటే ఏమిటో వివరించి చెప్పండి. తద్వారా మీ చిరంజీవత్వము యొక్క రహస్యమును కూడా విశదపరచ ప్రార్థన.

**భుశుండుడు :**

**సర్వ వేదాంత వేత్తాసి! సర్వసంశయనాశకః ।**
**మామ్ ఏతత్ పరిహాసార్థం, మునే! పృచ్ఛసి వాయసమ్ ॥**

స్వామీ! వసిష్ఠమహర్షీ! మీకు వేదాంత శాస్త్రమంతా తెలుసు. ముముక్షువుల అందరి సంశయములనూ మీరు దూరం చేస్తూ ఉంటారు. అయినప్పటికీ ఏదో పరిహాసార్థం ఈ కాకి చేత పలికిస్తున్నారు. అయినప్పటికీ మీవంటి మహనీయులతో ఏర్పడే ఉత్తర-ప్రత్యుత్తర సంవాదముచే ఆ విషయమై మరికొంత చక్కగా పునశ్చరణ చేసుకోవటానికో, ఆలోచించుకోవటానికో మంచి అవకాశంగా నేను భావిస్తున్నాను. వినండి చెపుతాను.

**పశ్య ఇదం, భగవన్! సర్వం దేహగేహం, మనోరమమ్ ।**
**త్రిప్రకారమహాస్థూణం, నవద్వార సమావృతమ్ ॥**
**పుర్యష్టకకలత్రేణ, తన్మాత్ర స్వజనేన చ ।**
**అహంకార గృహస్థేన సర్వతః పరిపాలితమ్ ॥**

ప్రకృతిచే ప్రసాదించబడిన అత్యంత రమణీయమైన ఈ దేహమును చూస్తున్నారు కదా! ఈ దేహమనే ఇంటికి 'వాత-పిత్త- కఫములు' అనే మూడు స్థంభాలు ఉన్నాయి.

వాతము = వాయువు; పిత్తము = ధాతువులు (పైత్యరసాదులు); కఫము = శ్లేష్మము

ఈ దేహమునకు 9 ద్వారాలున్నాయి- 2 కన్నులు, 2 ముక్కు రంధ్రములు, 2 చెవులు, 1 నోరు, 1 గుదస్థానము, 1 మర్మాయవము

ఈ దేహమనే ఇంటికి యజమాని అహంకారం.

ఈ ఇంటికి గృహిణి 'పుర్యష్టకం'. పుర్యష్టకం అనగా –

1. జ్ఞానేంద్రియ పంచకం : చెవులు, చర్మము, కళ్లు, నాలుక, ముక్కు
2. కర్మేంద్రియ పంచకం : వాక్కు, కాళ్లు, చేతులు, పాయువు, ఉపస్థ
3. వాయు పంచకం : ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు. (వాయువు యొక్క వేరు చలన దిశలను అనుసరించి చెప్పబడినవి)
4. భూతపంచకము : భూమి, వాయువు, అగ్ని, జలము, ఆకాశము.
5. అంతఃకరణ చతుష్టయం : మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.
6. అవిద్య : ఆత్మదృష్టి నుండి చ్యుతి
7. కామము : లేనిదేదో ఆశించే స్వభావం. "ఏవో మార్పు చేర్పుల చేత గాని ఆనందం లేదు" అని తలచటం.
8. కర్మము : క్రియావ్యాసంగము.

పంచతన్మాత్రలే ఆ ఇల్లాలికి సహకరించే పనిమనుషులు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములే ఆ పంచతన్మాత్రలు. వాళ్లు ఈ శరీర గృహము యొక్క బాగోగులు చూస్తున్నారు. మన మనో నేత్రాలకు ఈ శరీర గృహం ఎదురుగా కనిపిస్తోంది కదా!

చెంప ప్రక్కగా ఉన్న చెవులే దీని మిద్దెలు (పై మెట్లు). 'వెంట్రుకలు' అనే రెల్లుతో ఈ గృహం కప్పబడి ఉన్నది. ముఖంలోని కళ్లు ద్వారముల వంటివి, రెండు భుజములు శరీర గృహంలోని ఉపమందిరముల వంటివి. బాహ్యమున ఉన్న ఆయావిషయ పరిజ్ఞానాలు, ఈ గృహానికి ద్వార పాలకుల వలె ఉండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల రూపమున వార్తలు లోనికి తేవటం జరుగుతోంది.

ఈ శరీర గృహంలో 'ఆత్మ' అనే ఒకానొక వెలుగు ప్రసరిస్తుండుటచేతనే ఇది వర్తిల్లగలుగు తోంది. ఈ గృహయజమానియగు జీవుడు జాగ్రత్తులో ఉన్నప్పుడు వరండాలో పచార్లు చేస్తున్నట్లుగా ఉన్నది. ఈ శరీరగృహం లోపల రక్త–మాంసములనే పేడ–నీళ్లచే అలుకబడినట్లుగా ఉంటోంది. బొమికలు అనే కొయ్య చేత, నరములు అనే త్రాళ్ల చేత ఈ శరీరగృహం పడిపోకుండా గట్టిగా నిలచి ఉన్నది.

❖

ఓ మునినాయకా!

**ఇడాచ పిఙ్గలాచ అస్య, దేహస్య ముని నాయక ।**
**సుస్థితే కోమలే మధ్యే పార్శ్వకోష్ఠే నిమీలితే ॥**

ఈ దేహము యొక్క మధ్యభాగంలో రెండు కోమలమైన సూక్ష్మనాడులు ఉన్నాయి. శాస్త్రకారులు వీటికి – 1. ఇడ, 2. పింగళ – అని పేర్లు పెట్టారు.

**పద్మయుగ్మత్రయం యన్త్రమ్ అస్థిమాంసమయం మృదు**
**ఊర్ధ్వ-అధోనాలమ్ అన్యోన్యమ్ ఇలత్ కోమల సద్దలమ్**
**సేకేన వికసత్ పత్రం సకలాకాశచారిణా**
**చలన్తి తస్య పత్రాణి మృదువ్యాప్తాని వాయునా**
**చలత్సు తేషు పత్రేషు స మరుత్ పరివర్ధతే ॥**

**వాతాహతే లతా పత్రజాలే బహిరివాభితః**
**వృద్ధిం నీతః సనాడీషు కృత్వా స్థానమనేకథా**
**ఊర్ధ్వ-అధో వర్తమానాసు దేహే అస్మిన్ ప్రసరత్యథ**
**ప్రాణ-అపాన-సమానాద్యైః తతః సహృదయానిలః**
**సంకేతైః ప్రోచ్యతే తజ్ఞైః విచిత్రాచార చేష్టితైః॥**

ఈ రెండు నాడులూ అప్రకాశితభావంతో వెలయుచున్నాయి. ఈ రెండు నాడుల మధ్య ఒక స్థానంలో 'అస్థిమాంస మయము, అతిసున్నితము' అగు హృదయం ఉన్నది. ఆ హృదయపద్మం యొక్క నాళములు పైకి క్రిందకు వ్యాపించి ఉన్నాయి. హృదయము యొక్క దళములు అత్యంత కోమలంగా, పరస్పర మిళితంగా ఉన్నాయి. అట్టి హృదయ స్థానం నుండి శక్తి బహిర్గతంగా, అంతర్గతంగా ప్రయాణిస్తూ ఉన్నది. అదియే ప్రాణశక్తి , ప్రాణతత్వం.

ఇది ఇట్లా ఉండగా, ప్రాణతత్త్వము ముక్కు చివర నుండి పాదముల వరకు దేహాకాశమున విస్తరించి ఉన్నది. ముక్కు నుండి వాయువు పీల్చబడుతోంది కదా! అలా స్వీకరించబడుచున్న వాయువును 'అపానవాయువు' అని అంటారు. అపానవాయువు యొక్క సేచనము (Intake) వలన హృదయ కమలం వికసించటం జరుగుతోంది. (1) స్వీకరించబడుచున్న (2) విడచిపెట్టబడుచున్న వాయువు వలన హృదయ కమలం వికసించటం, ముకుళించటం జరుగుతోంది.

ఈ వాయువులు హృదయముచే ఆకులను కదలించుచుండగా, క్రమంగా వాటి వీచికలు నలుదిక్కులా వ్యాపించి నాడీఛిద్రములందు ప్రవేశించి వృద్ధిపొందుచున్నాయి. అట్లా అభివృద్ధి చెంది దేహమున భిన్నభిన్న స్థానములను కల్పించుకుంటున్నాయి.

**ప్రాణవాయు వ్యాపారములు -**

1. అపానవాయువు : అధోముఖముగా ప్రసరిస్తోంది.
2. వ్యానవాయువు : నాడులు సంకోచింపచేయటం విస్తరింపజేయటానికి పనిచేస్తోంది.
3. ఉదానవాయువు : ఊర్ధ్వముఖంగా చలిస్తూ ఉంటుంది.
4. సమానవాయువు : దేహమందలి వివిధ ప్రదేశాల సమానత్వాన్ని నెలకొలుపుతూంటుంది.
5. సప్రాణవాయువు : మొత్తం చలనమును సుస్థిరీకరిస్తూ ఉంటుంది.

ఈ ఐదు పేర్లు ఒకే ప్రాణవాయువు యొక్క (లేక, ప్రాణశక్తి యొక్క) ఊర్ధ్వ, అధోనాడీ మండలమున ప్రవేశించినప్పటి విభిన్న కృత్యముల పేర్లు సుమా!

చంద్రబింబము నుండి కిరణములు వెలువడుచున్నాయి చూచారా? అట్లాగే ప్రాణశక్తి అంతా హృదయము నుండి వెలువడి దేహమధ్యమునకు, ఊర్ధ్వ-అధోభాగములకు వ్యాపిస్తోంది. అట్లు వ్యాపించుచూ నాడీసమూహములో ప్రకాశిస్తోంది. అట్లా ప్రవేశించి 'గమన (పోవటం), ఆగమన (రావటం), కర్షణ (కదల్చటం), హరణ (విభాగించటం), విహరణ (కలపటం), పతన (పడవేయటం), ఉత్థాన (లేపటం) - మొదలైన క్రియలను చేస్తూ ఉంటోంది.

హృదయపద్మము నందలి వాయువును విజ్ఞులు ప్రాణము అని పిలుస్తున్నారు. అట్టి ప్రాణ వాయువు ఈ శరీరమును ఉద్దీపించగల శక్తులన్నీ కలిగియున్నది. ప్రాణవాయువు యొక్క ఒకానొక శక్తి వల్ల కళ్లు కదలుచున్నాయి. మరొక శక్తి వల్ల స్పర్శ గ్రహించబడుతోంది. ఇంకొక శక్తి ముక్కులో ప్రవేశించి ఆఘ్రాణము (Smell) యొక్క అనుభవం కలిగిస్తోంది. వేరొక శక్తి వల్ల అన్నం జీర్ణమగు చున్నది. అట్టి ఒకానొక శక్తి వలన గొంతులోని నాళములు ప్రవర్తించి మాటలు వెలువడుచున్నాయి. ఇంతెందుకు? యంత్ర నిర్మాత ఇచ్ఛానుసారం యంత్రశక్తి యంత్రమును చలింపజేస్తూ వివిధ కార్యములను నిర్వర్తింపజేస్తోంది చూచారా? వాయుదేవుడు ఈ శరీరమునందు ప్రవేశించి వివిధ కార్యములను ఒనర్చుచున్నాడు.

**తత్ర ఊర్ధ్వ-అధో ద్విసంకేతౌ ప్రసృతావనిలౌ, మునే! ।**
**ప్రాణ-అపానావితిఖ్యాతౌ ప్రకటౌ ద్వావరానిలౌ ।**
**"తయోః అనుసరన్ నిత్యం, మునే! గతిమ్ అహం స్థితః"॥**

ఓ మునీంద్రా! నా హృదయమున ఊర్ధ్వగమనం నిర్వర్తించే ప్రాణవాయువు. అధోగమనం నిర్వర్తించే అపానవాయువు ప్రకాశ్యభావమున వెలయుచున్నాయి కదా! ఇక నేను, నిత్యము-సర్వదా వీటియొక్క గతిని గమనిస్తూ, అనుసరిస్తూ ఉన్నాను.

ఈ ప్రాణాపానములు సదా శీతఉష్ణములై ఆకాశమున తిరుగుచూ ఈ శరీరము అనే యంత్రమును మోయుచుండగా, నేనుమాత్రం నిర్విషయుడనై ఎట్టి శ్రమ పొందక ప్రశాంత స్థితియందు ఏర్పడి ఉంటున్నాను.

ఈ ప్రాణాపానములు హృదయకాశమునకు సూర్యచంద్రుల వంటి అగ్నిసోమ (Hot & Cool) స్వభావయుతమై ఉంటున్నాయి. ఈ శరీరమనే పురమునకు మనస్సు అంగరక్షకుడు. మనస్సు అనే రథమునకు ఈ ప్రాణాపానములు రెండు చక్రములవంటివి. అహంకారమనే రాజుకు రెండు ప్రియమైన గుఱ్ఱములవంటివి.

ఓ బ్రహ్మజ్ఞా! ఇక నేను చేస్తున్నదేమిటో మరికొంత విశదీకరించి చెపుతాను వినండి.

ఈ ప్రాణద్వయం (ప్రాణ - అపానములు) జాగ్రత్ - స్వప్న - సుషుప్తులందు సర్వదా సమభావమున ఈ దేహమునందు వెలయుచున్నాయి కదా! వాటియొక్క 'గతి'ని అనుసరిస్తూ నేను సుషుప్తునివలె కాలమును గడుపుచున్నాను. వీణతంతువులోని వేయవవంతు ఎంతటి సూక్ష్మంగా ఉంటుందో... అంత సూక్ష్మప్రసరణతో వాటిని అనుసరిస్తూ ఉంటున్నాను.

**అవిరతగతయోః "గతిః" విదిత్వా హృదిమరుతోరను సృత్య చోదితాం తామ్ ।**

**న పు నరిహ హి జాయతే మహాత్మన్, ముదితమనాః పురుషః ప్రణష్టపాశః ॥**

ఈ ప్రాణాపానద్వయం సర్వదా హృదయపద్మమున సంచరిస్తున్నాయి. ఇవి అనేక శాస్త్రములచే అనేక పేర్లతో వర్ణించిచెప్పబడినవి.

ఈ వాయుగతులను ఉపాసించే జీవుడు మృత్యుపాశమునుండి వెలువడగలుగుతాడు. పరమానంద లాభమును పొందుతాడు. అతడు మరల జన్మించుట లేదు. అట్టిప్రాణోపాసకు మనస్సు సర్వదా సంతోషముతో నిండినదై సర్వపాశముల నుండి విడివడుచున్నది.

❖❖❖

# 10. రేచక - పూరక - కుంభకములు : ప్రాణాపానముల ఉత్పత్తి - లయస్థానములు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ భుశుండ మహాశయా! మీరు ప్రాణ అపానముల గతిని అనుసరిస్తూ ఉంటున్నానని అన్నారు కదా! మీ సాధన, సాధ్యముల గురించి మరికొంత వివరించండి.

**భుశుండుడు :** ఉపాధ్యాయుడు అన్నీ తెలిసియే విద్యార్థిని ప్రశ్నిస్తూ ఉంటారే! జగద్గురువులగు మీరు అన్నీ ఎఱిగి ఉండి కూడా కేవలం వినోదార్థమై ప్రశ్నిస్తున్నారు. అయినా మీ వాక్కు శిరోధార్యం కదా! వినండి.

**పాణో అయమ్ అనిశం, బ్రహ్మమ్! స్పందశక్తిః సదాగతిః ।**

**స బాహ్య - అభ్యన్తరే దేహే ప్రాణో అయమ్ ఉపరి స్థితః ॥**

**అపానోఽ పి అనిశం, బ్రహ్మన్! స్పందశక్తిః సదాగతిః ।**

**స బాహ్య - అభ్యన్తరే దేహే త్వపానోఽ యమ్ వాక్ స్థితః ॥**

**జాగ్రతః స్వప్నతశ్చైవ ప్రాణాయమో అయమ్ ఉత్తమః ప్రవర్తతే! ॥**

ఓ బ్రహ్మజ్ఞా ! ఈ దేహమునకు లోపల-వెలుపలా కూడా ప్రాణవాయువు తనయొక్క స్పందనశక్తిని ప్రదర్శిస్తూ సంచారం చేస్తోంది. అట్లాగే స్పందన శక్తియుతమైన అపానవాయువు కూడా! జంటగాయకులలో ఒకరు గానం చేస్తూ ఆపుచుండగా మరొకరు అందుకుంటూ ఉంటారు చూచారా? అట్లాగే ఈ ప్రాణ అపానములు జాగ్రత్ - స్వప్న సమయములలో దేహమునకు బాహ్యమున, అంతరమున కూడా ఒకటి నిస్పందనమగుచుండగా రెండవది స్పందన సంతరించు కోవటం జరుగుతోంది. అట్టి ప్రాణ-అపానముల యామమునకు (గతికి) సంబంధించిన జ్ఞానము సంపాదించుకొని ఉండటం జీవునికి పరమశుభప్రదమైయున్నది. ప్రాణాపానముల గతిని అనుసరించి రేచకము - పూరకము - కుంభకము అనే మూడు ప్రాణవాయు స్థితులు ఇటు దేహము యొక్క అంతరమున, అటు దేహమునకు బాహ్యమున నిరంతరం సహజసిద్ధంగా ఏర్పడుచున్నాయి.

**1. రేచకము -** "హృదయంలో నుండి వెలుపలికి ప్రాణవాయువుల ప్రయాణం చేయు స్థితి.

**బాహ్యోన్ముఖత్వం ప్రాణానాం యద్ధృదంబుజకోటరాత్ ।**
**స్వయసేనాస్తయత్నానాం తం ధీరా 'రేచకమ్' విదుః ॥**

'హృదయము' అనే పద్మకోటరం నుండి అప్రయత్నంగానే (స్వాభావికంగా) ప్రాణశక్తి వెలికి వస్తూ ఉంటుంది. అట్టి 'బాహ్యోన్ముఖత్వము' అనే అసంకల్పిత చర్యనే 'రేచకము' అని విజ్ఞులు పిలుస్తున్నారు.

**2. (బాహ్య అభ్యంతర) పూరకము -** "ముక్కు కొన నుండి 12 అంగుళాలు బాహ్యమునకు; 12 అంగుళాలు లోనికి – హృదయము వరకు వాయువు పూరించబడి ఉండు స్థితి."

**ద్వాదశాంజుల పర్యంతం బాహ్యమ్ ఆక్రమతాం అధః ।**
**ప్రాణానాం అంగసంస్పర్శో యః స 'పూరక' ఉచ్యతే ॥**
**బాహ్యాత్ పరాపతత్య అన్తరపానే యత్నవర్జితః ।**
**యోఽయం ప్రపూరణః స్పర్శో విదుస్తమపి 'పూరకమ్' ॥**

బాహ్యమున (నాసికాగ్రం – ముక్కు కొన నుండి) 12 అంగుళముల దూరము నుండి ప్రాణము తన స్పందన ప్రారంభించి దేహమును సంస్పర్శించుచూ... ఆ 12 అంగుళాల ప్రదేశమును అపానవాయు రూపంగా (బాహ్యం నుండి అంతరమునకు విడువబడినదిగా) నిండి ఉంటోంది. ఇది అప్రయత్న పూర్వకంగా జరుగుతోంది. ఇది బాహ్యాపూరకం.

అట్లాగే నాసిక నుండి అపానవాయువు హృదయం వరకు ప్రాణములు అపాన రూపంగా ప్రవేశించి ఉంటోంది. ఇది అంతరపూరకం. అట్లు యత్నరహితంగా బాహ్య –అంతరములందు ప్రాణవాయువు పూరించి ఉండు స్థితియే "బాహ్య – అభ్యంతర పూరకములు" అని సూచింపబడింది.

**3. కుంభకము -** హృదయ మధ్యంలో ప్రాణవాయువు లేనట్టి – అపానవాయువు ఉపశమించి నప్పటి స్థితి :

**అపానే ఽస్తంగతే ప్రాణో యావత్న అభ్యుదితో హృది ।**
**తావత్ సా 'కుంభకావస్థా' యోగిభిర్యానుభూయతే ॥**

అటు తరువాత హృదయంలో ప్రవేశించిన అపానవాయువు ఉపశమనం పొందుతోంది. అట్టి సమయంలో హృదయ మధ్యం (అపానవాయువు ఉపశమించి – ప్రాణవాయువు ఇంకా ఉదయించక) ...ప్రాణవాయు రహితమై ఉంటోంది. అట్లు హృదయంలో ప్రాణవాయువు లేనంత వరకు 'కుంభకము' అని చెప్పబడుతోంది. అట్టి కుంభ స్థితి యోగాభ్యాసము చేత మాత్రమే అనుభూతమౌతోంది.

**రేచకః కుంభకశ్చైవ పూరకశ్చ త్రిధాస్థితః**
**అపానస్య ఉదయస్థానే ద్వాదశాన్తాత్ అధోబహిః**
**స్వభావాః సర్వకాలస్థాః సమ్యక్ యత్నవివర్జితాః**
**యే ప్రోక్తా స్ఫారమతిభిఃతాన్ శృణు త్వం, మహామతే!**

ఈ విధంగా 'ప్రాణాయామము' అనునది రేచక-పూరక-కుంభకములనబడే మూడు విధాలుగా ఒప్పుచున్నది. బాహ్యమున అపాన ప్రారంభ స్థానము నుండి నాసాగ్రము (Nostrils) వరకు గల 12 అంగుళముల ప్రదేశంలో ప్రాణాయామ ప్రక్రియ సాధారణ సమయంలో అసంకల్పితంగా, అప్రయత్నపూర్వకంగా నిరంతరం జరుగుతోంది. అట్లాగే నాసాగ్రం నుండి హృదయప్రదేశం వరకు కూడా నిరంతరం త్రివిధమైన (పూరక-కుంభక-రేచకములు) ప్రాణాయామం జరుగుతోంది.

ఓ మహామతీ! నిర్మల బుద్ధులగు యోగుల తమ సాధనా సారమగు అనుభవం ఎలా ఉంటోందో వినండి.

**కుంభకానుభవం -**

**ద్వాదశాఙ్గులపర్యన్తాత్ బాహ్యాత్ అభ్యుదితః, ప్రభో ।**
**యో వాతఃతస్య తత్రైవ స్వభావాత్ పూరకాదయః ॥**

హే ప్రభో! నాసాగ్రం - బాహ్యమున 12 అంగుళముల దూరంలో గల స్థానం ...ఈ రెండిటి మధ్య గల 12 అంగుళముల ప్రదేశంలో వెలయు వాయువు నందు రేచక, పూరక, కుంభకము లనే త్రివిధ ప్రాణాయామ ప్రక్రియ నిరంతరం జరిగి పోతున్నదని అనుకున్నాం కదా!

**మృత్ అన్తరస్థ అనిష్పన్న ఘటవద్యా స్థితిః బహిః ।**
**ద్వాదశాఙ్గుల పర్యన్తే నాసాగ్రసమసంముఖీ ।**
**వ్యోమ్ని నిత్యమ్ అపానస్య తం విదుః "కుంభకం" బుధాః ॥**

అట్టి ప్రక్రియలో ఆ రెండిటి మధ్య అపానవాయువు ఆకాశము వలె వెలయుచున్నది. బాహ్యమున 12 అం.ల స్థానము వద్ద (At the point at a distance of 12" from Nose) ప్రాణములు అపానవాయువు (Inward Bound air)గా ఇంకనూ రూపుదిద్దుకొనని సమయమొక్కటి ఉన్నది. మట్టి యందు ఇంకను రూపుదిద్దుకొనని కుండయొక్క ఆకారము వలె ప్రాణవాయువునందు అపానత్వము దాగి ఉన్న స్థితి అది. అనగా వాయువు కదులుటకు సిద్ధమై ఇంకా నిశ్చలత్వమును వీడనప్పటి స్థితి. అపానవాయువు యొక్క అప్పటి నిస్పంద స్థితిని 'బాహ్యకుంభకం' అంటున్నారు. అనగా...

**బహిరస్తం గతే ప్రాణే యావన్నాపాన ఉద్గతః ।**
**తావత్ పూర్ణం సమావస్థం బహిష్ఠం కుంభకం విదుః ॥**

...బహిరస్థమైన ప్రాణము తన చలనమును త్యజించి కూడా ఇంకా అపానత్వము (Reverse motion) అవధరించక 'సమావస్థ'లో ఉండి ఉన్నంత సమయం... ఆ స్థితి బాహ్యకుంభకం అనిపించుకుంటోంది.

**పూరకానుభవం -**

**బాహ్యోన్ముఖస్య వాయోర్యా నాసికాగ్రావధిర్గతిః ।**
**తం బాహ్యపూరకం తు ఆద్యం విదుర్ యోగవిదో జనాః ॥**

**నాసాగ్రాదపి నిర్గత్య ద్వాదశాన్త అవధిర్గతిః ।**
**యోవా యోస్తం విదుర్ధీరా అపరం బాహ్య పూరకమ్ ॥**
**ద్వాదశాన్తాద్యదుత్థాయ రూపపీ వరతా పరా ।**
**అపానస్య బహిష్ఠం తమ్ అపరం పూరకం విదుః ॥**

అపానవాయువు చలనము ప్రారంభించి నాసికాగ్రం (ముక్కుపుటలు) చేరుచుండగా ఆ 12 అంగుళముల ప్రదేశంలో బాహ్యపూరకం జరుగుతోంది. ముక్కు పుటల నుండి హృదయ స్థానము వరకు వాయువు ప్రవేశించియున్న సమయంలో అంతరపూరకం జరుగుతోంది.

**రేచకానుభవం -**

**యత్త దన్తర్ముఖత్వంస్యాదపానస్యోదయం వినా ।**
**తం బాహ్య రేచకం విద్యాచిన్త్యమానమ్ విముక్తిదమ్ ॥**

బాహ్యమున నిష్పందమగు ప్రాణవాయువు యొక్క స్పందనమునకు సంబంధించిన ప్రయత్నమే బాహ్య రేచకం. అట్లాగే హృదయమున గల ప్రాణవాయువు బయల్వెడలుటకు ఉపక్రమిస్తున్న ప్రయత్నమే అంతర్‌రేచకం.

బాహ్య-అభ్యంతర కుంభకాదులను-ప్రాణాపానములస్వభావమును గమనించటం :

**బాహ్యానాం, అభ్యంతరాంశ్చ ఏతాన్ కుంభకాదీన్ అనారతమ్ ।**
**ప్రాణాపాన స్వభావాంస్తాన్ బుద్ధ్వా భూయో న జాయతే ।**
**అష్టావేతే మహాబుద్ధే రాత్రిందివమను స్మృతాః ॥**

ఈ బాహ్య-అభ్యంతరీయమునగు ప్రాణ-అపానముల యొక్క కుంభక - రేచక - పూరకముల అనావృత్త (Non-Moving, Non-Avocative) స్థానములను గ్రహిస్తూ ఉండగలిగిన మహనీయునకు ఇక పునర్జన్మకు కారణములుండవు. అనగా అట్టి జీవుడు పునర్జన్మరహితుడగుచున్నాడు.

నాచే ఈ చెప్పబడుచున్న 'బాహ్యపూరక-కుంభక-రేచకములు, అంతర్‌పూరక-కుంభక -రేచకములు, బాహ్య-అంతరంగ అనావృత్త స్థితులు' అనబడే వాయులీయమైన 8 అవస్థలు రాత్రింబవళ్లు బుద్ధిపూర్వకంగా అభ్యసించుచు రాగా, అట్టి జీవునకు తప్పక సులభంగా ముక్తి లభిస్తుంది. అనగా అతడు మనోవృత్తులను క్రమంగా జయించి 'స్థిరత్వము'ను అనుభూతం చేసుకో గలుగుతాడు.

ఈ దేహవాయువులు అతి చంచలములైనవి సుమా! అయితే, అభ్యాసబలంచేత వాటి చంచలత్వం జాగ్రత్తులోను, స్వప్నంలోను, సుషుప్తిలోను, కదులుచున్నప్పుడు, కదలకుండనప్పుడు అన్ని కాలము లందూ, అన్ని వేళలందూ నిరుద్ధం (control) కాగలవు. అనగా, అవి అభ్యాసవశంగా బుద్ధికి లోబడి ఉండగలవు. బుద్ధిపూర్వకంగా ఈ రేచక - పూరక - కుంభకములను అనుష్ఠించు జీవుని మనస్సు ఆయా భోజనాది కార్యములు ఆచరిస్తున్నప్పటికీ కర్తృత్వశూన్యమై వెలయగలదు.

ప్రాణచింతనారతుడగు వాడు అల్పసమయంలోనే దృశ్యవస్తువులను పరిత్యజించి కైవల్యమును పొందుచున్నాడు. ఒక శాకాహారి బాటప్రక్కన పడి ఉన్న చచ్చిన ఎద్దు యొక్క చర్మమాంసములను ఏ విధంగా ఏవగించుకుంటాడో ఆ విధంగా ప్రాణాయామ సాధకుడు విషయాకర్షణలకు స్వభావ సిద్ధంగా దూరంగా ఉంటాడు.

నాచే ఇంతవరకూ వర్ణించబడిన ప్రాణచింతనను అభ్యసించిన అనేకులు కృతబుద్ధులై పొంద వలసిన దానిని పొందారు. సర్వావస్థలందునూ అట్టి ప్రాణదృష్టిని అవలంబించినవారు మరల బంధములను ఆశ్రయించటానికి కారణములుండవు. ప్రాణాపానములను నిరుద్ధం చేసి, తత్త్వజ్ఞానం పొందగలిగినాడు – ఇక అతడు సర్వదా సర్వకార్యములు ఒనర్చుచున్నప్పటికీ తనకు తాను సర్వదా నిర్మల స్వభావముననే వెలయుచున్నాడు. అతడు మోహమును పొందక, సుఖంగా ఉంటున్నాడు.

❖

ప్రాణవాయువు హృత్పద్మదళము నుండి లేచి 12 అంగుళ భాగమువరకు ప్రసరించి నిశ్చలంగా ఉండటమే "ప్రాణము యొక్క అభ్యుదయం."

అట్టి ద్వాదశాంగుళ స్థాన శేషప్రాంతం (Residual space) నుండి హృదయ పద్మమున ప్రవేశించి నిశ్చలంగా ఉండుటయే "అపాన వాయువు యొక్క అభ్యుదయం."

ప్రాణవాయువు ద్వాదశాంగుళ పరిమిత శూన్యస్థానమునకు ప్రవహించుచున్నప్పుడు, అదే సమయంలో అపాన వాయువు అదే మార్గం అవలంబించి లోనికి జొచ్చుచూ ఉంటుంది.

ప్రాణవాయువు బహిరాకాశము వైపుకు ఉన్ముఖమై ఒక అగ్నిశిఖవలె, సూర్యకిరణ కాంతివలె ప్రవహించుచుండగా, అపానవాయువు హృదయాకాశము వైపు నీటి వలె క్రిందికి ప్రవహిస్తోంది. చంద్రరూపమున, చంద్రకాంతుల వలె, శీతల ప్రదేశ జలం వలె చల్లబరుస్తోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మిత్రమా! ఈ ప్రాణా–పానముల గమన లక్షణముల గురించి, వీటికి దేహముతో గల అవినాభావ సంబంధం గురించి మరికొంత వివరించండి.

**భుశుండుడు :** అంతర్గతమైన ప్రాణవాయువు సూర్యుని లేక అగ్ని రూపమున ఈ శరీరమును పరిపక్వమొనర్చుచూ ఉంటుంది. ప్రాణవాయువు హృదయాకాశమును ముందుగా తప్తమొనర్చి, ఆ తరువాత ముఖాగ్రభాగమును (The outerspace of face) కూడా తప్తమొనర్చుచున్నది.

అపానవాయువో... నిమేష మధ్య కాలంలోనే ముందుగా ముఖాగ్రభాగమును తప్తమొనర్చి ఆ తరువాత హృదయాకాశము వైపుగా కూడా ప్రవహించి నైర్మల్యం చేస్తోంది.

ఎక్కడైతే ప్రాణము అపానమును దాని కళలతో సహా గ్రహిస్తోందో అట్టిది బ్రహ్మస్థానము. ఆ బ్రహ్మపదమును పొందువారు ఇక జగత్భ్రమలను పొందరు.

అట్లాగే, అపానము ఎక్కడైతే ప్రాణమును, దాని కళలను గ్రహిస్తుందో అచ్చోటి పరమ పదమును పొందినవారు జన్మరహితులగుచున్నారు.

❖

ఓ మునిసత్తమా! ప్రాణవాయువే బహిరంతరాకాశములందు సూర్యుని రూపమున ప్రకాశి స్తోంది. అట్లా ప్రకాశిస్తూ, ఇంతలోనే ఆహ్లాదకరమగు చంద్రరూపమును పొందుతోంది. తిరిగి, తాపయుక్తమును పొందుతోంది. ప్రాణవాయువులు సూర్యత్వమును త్యజించి, చంద్రత్వమును పొందుటకు ముందు 'ప్రాణాపానములు ఉత్పత్తికి పూర్వసమయం' అని యోగులు గ్రహిస్తున్నారు. అట్టి పూర్వసంధి సమయంలో ఒకానొక 'ప్రాణవాయువు లయత్వం పొందిన స్థితి' ఏర్పడి ఉంటోంది. ఆ స్థితిలో అశరీరత్వము, నిష్క్రియత్వము, నిర్మనస్కము, అప్రమేయత్వము మొదలైన ఆత్మ యొక్క వాస్తవస్వభావములు అనుభూతములౌతున్నాయి. అట్టి అతీతత్వ స్థితిలో ఆ యోగి, లేక సాధకుడు దేశకాలాది సర్వ పరిచ్ఛిన్నములకూ అతీతుడై, అనిర్వచనీయ తేజోరాశి అయి వెలుగొందుచున్నాడు. అనగా, అతడు ఈ మనస్సు-హృదయముల మధ్య 'ప్రాణాపానముల మధ్యస్తము' అను సాధన సహాయంతో స్వాధిష్ఠానమగు తన రూపమును గ్రహిస్తున్నాడు. అట్టి స్వస్వరూపమగు పరమాత్మ యొక్క అనుసంధానమును బడసి పునర్జన్మరహితుడగుచున్నాడు.

యోగి తన హృదయంలోనే మధ్యగా ఉదయాస్తమయములు (ప్రాణా-పానముల ఉత్పత్తి, లయం, ఉభయములూ రహితమైన స్థితి), గమనాగమనములు కలిగి తేజోవంతుడగుచున్నాడు. ఎవడు తన యందు మనఃసహితమగు ఆత్మభగవానుని (లేక, ప్రాణయోగ పరిభాషలో చంద్ర సహితుడగు సూర్యుని) గాంచుచున్నాడో... ఆతడే యథార్థ ద్రష్ట. ఈ బయట ఉన్న చీకటి ఉన్నా ఫరవాలేదు. లేకున్నా ఫర్వాలేదు. ఎవ్వడైతే తన హృదయమున ఉన్న అంధకారాన్ని నిర్మూలించు కుంటాడో, ఆతడే ప్రకృతిసిద్ధమగు సిద్ధిని బడసినవాడు. 'బయట చీకటి తొలగాలి' అని అనుకుంటే, అప్పుడు జగత్తును ఉద్దేశిస్తున్నట్లే కదా! కానీ ఈ ద్రష్ట దృశ్యము కంటే అత్యంత సూక్ష్ముడు. హృదయంలో అంధకారం క్షీణించిందా, ఇక మరుక్షణమే ఆత్మ అవలోకితమగుచున్నది. ఉదయ అస్తమయముల వంటి ఈ ప్రాణాపాన సమన్వితమగు ప్రాణశక్తి యొక్క ఆరాధన హృదయమున గల పెనుచీకటిని తొలగించుటకు సమర్థమగుచున్నది. ప్రాణతత్త్వమును చక్కగా, బుద్ధిపూర్వకంగా గ్రహించి... అనుకరించు వారికి ముక్తి కరతలామలకమగుచున్నది. అందుచేత శ్రద్ధగా ప్రాణ తత్త్వమును ఆశ్రయించి జ్ఞానసూర్యుని దర్శనం పొందవచ్చు.

అపానము ఎక్కడ అస్తమిస్తోందో, ఆ హృదయ విభాగ స్థానమునందు ప్రాణశక్తి ఉదయించి బహిర్ముఖమగుచున్నది.

ఈ ప్రాణ - అపానముల ఉదయాస్తమయములు 'నీడ తొలగిన చోట ఎండ రావటం, ఎండ వచ్చే చోట నీడ తొలగటం' వంటిది. ప్రాణ- అపానాలలో ఒకటి తొలగిన చోట రెండవది ఉత్పన్నమౌతూ ఉంటుంది. మొట్టమొదట ఈ యోగరహస్యాన్ని చక్కగా, సుస్పష్టంగా గ్రహించాలి-

ప్రాణవాయువు అస్తమించగా అపానవాయువు అభ్యుదయస్థితి - బాహ్యకుంభకం

అపానవాయువు అస్తమించి ప్రాణవాయువు ఉదయించు స్థితి - అంతఃకుంభకం

ఈ బాహ్యకుంభకం గాని, అంతఃకుంభకం గాని, రెండూ గాని అవలంబిస్తూ వస్తే, ఇక అట్టి సాధకునకు శోకమునకు స్థానమే ఉండదు.

'ప్రసరించు ప్రాణమునంతటినీ రేచకం ఒనర్చి, ఇక స్వచ్ఛమగు కుంభకం అభ్యసించగలిగితే సకల మానసిక రుగ్మతలూ తొలగటం ఖాయం.

బాహ్యరేచక కారణమగు ప్రాణవాయువు లోపలికి ప్రవేశించుటను గాంచినవాడు జన్మరహితుడే అవుతాడు. ప్రాణ – అపానములు రెండు విలీనం పొందితే ఇక శాంతాత్మపదం లభ్యం అవుతుంది.

❖

బాహ్య అంతర 'కుంభక'రూపమగు అపానము ప్రాణమును గ్రహించటానికి ఉద్యమిస్తున్నప్పుడు, ఆ సమయంలో చేసే విచారణచే ఈ దేశకాలములు చిన్మాత్రరూపములుగా గ్రహించబడతాయి. అనగా, ప్రాణము అపానమును హృదయమునందుగాని, వెలుపలగాని గ్రహించటానికి ఉద్యమిస్తున్నప్పుడు, ఆ సమయంలో చేసే విచారణ దేశకాలముల అపరిచ్ఛిన్నత యొక్క అనుభూతికి దారి తీస్తుంది. అప్పుడు దుఃఖరహితపదము సుస్థిరమౌతుంది.

కనుక మహర్షీ! ప్రాణాపానములు రెండు పరస్పరగ్రస్తములైనప్పుడు ఈ సాంసారిక దృష్టికి తారసపడే దేశకాలములు స్వతఃసిద్ధంగానే విలీనం చెందుతాయి.

ప్రతిజీవుడు....ప్రాణవాయువు అస్తమించిన తరువాత అపానవాయువు ఇంకా ఉదయించని స్థితిని రోజంతా పొందుచూనే ఉన్నాడు. దానిని యోగ పరిభాషలో 'అయత్న సిద్ధమగు బాహ్య కుంభకం' అని అంటారు.

అయితే నిర్యత్న సిద్ధమగు అంతఃకుంభకమే పరమపదము. "అదియే ఆత్మయొక్క నిశ్చలస్థితిని ఉపాసించటం" అని యోగులు గమనిస్తున్నారు. అదియే విశుద్ధము–పరము అగు చైతన్యము.

**ప్రాణాపానముల సూక్ష్మ లయ స్థానం -** మేము అసిధారగా నిరంతరం ఉపాసిస్తున్న ఆత్మ విషయమై చెపుతాను... వినండి.

పుష్పంలో సుగంధం ఉన్నట్లు ప్రాణమునకు ఈవలఆవల చిదాత్మ వెలయుచున్నది. అది ప్రాణము కాదు. అపానము కాదు. జలమునందు దాహము యొక్క ఔషధత్వం అంతర్లీనమై ఉన్నట్లు చిదాత్మ ఈ దేహం నందు ఆక్రమించుకొని ఉన్నది. అది సజీవము కాదు. నిర్జీవం కాదు.

ఆ చిదాత్మ ప్రాణలయమునకు సన్నిహితం. ప్రాణచలనములకు దూరస్థం. ప్రాణాపానములకు మధ్యస్థము.

ఆ చిదాత్మ ప్రాణములకే ప్రాణం. జీవమునకు పరమ జీవనము. ఈ దేహం మొత్తం మీద అగ్రగణ్యుడు అతడే. మనస్సు యొక్క మననం... బుద్ధియొక్క బోధకం... అహంకారమునకు అహంకారోత్పత్తి కారణం... – ఇదంతా కూడా ఆ చిదాత్మయందు వెలయుచున్నది. అతడే అంతా అయి వెలయుచున్నాడు. ప్రాణ–అపాన అంతర్గతుడై ఉన్నాడు.

అతడు 'పరంజ్యోతి' అని, 'శుద్ధబ్రహ్మపవిత్రమూర్తి' అని 'సర్వపాపపావనుడు' అని విద్వత్కవులు వర్ణించి చెప్పుచున్నారు. అతడే ఈ 'మనస్సు, బుద్ధి, అహంకారము' అనే భావనలను పొందుచున్నాడు. అయితే తన యొక్క స్వస్వరూపము నుండి ఏమాత్రం చ్యుతుడు కాకయే వెలుగొందుచున్నాడు.

అట్టి నిష్కళంకచిదాత్మమూర్తి, 'అపానవాయువు అస్తమించక–ప్రాణవాయువు ఉదయించని' అనిర్వచనీయమైన చోట అత్యంత సుస్పష్టంగా వెలుగొందుచున్నాడు.

అతడు సర్వవ్యాపకుడు అయి ఉండి కూడా ప్రాణాపానముల మధ్య నాసాగ్ర– ఆకాశప్రదేశంలో దృఢానుభూతిని ప్రసాదిస్తున్నాడు. ఎక్కడైతే ప్రాణాపానములు అస్తమించి, మరల ఉదయించక ఉంటున్నాయో ఆ తావు ఆ చిదాత్మయే.

బాహ్య – అభ్యంతరీయములగు ప్రాణఅపానముల ఉత్పత్తి స్థానము, యోగము యొక్క ప్రారంభప్రదేశం, యోగి యొక్క అంతిమ లక్ష్యము అదే. జీవుడు ఈ 'ప్రాణ–అపానములు' అనే రథాన్ని అధిరోహించి ఉంటున్నాడు. ప్రాణాపానములకు అతడే శక్తి అయి ఉండి, అల్పమేధస్కులకు పరిఛిన్నుని వలె తోచుచున్నాడు. ప్రాణాపానములవలె తోచుశక్తి ఆతడే. 1. హృదయమున 'ప్రాణవాయుకుంభకం' గాను, 2. బయట 'అపానవాయుకుంభకం'గాను, 3. బయటనుండి లోపలికి 'పూరకం'గాను ఆయా భావములందు ఆతడే వివర్తమొందుచున్నాడు.

అంతేకాదు ఆతడు... ప్రాణాపాన పరిచారకుడై, ...అద్దాని అస్థిత్వబోధకుడై, ...ప్రాణోపాసన అభ్యాసమునకు లభ్యుడై, ...రూపహీనుడై, ...జాజ్వల్యమానంగా వెలుగొందుచున్నాడు.

ప్రాణస్పంద హేతువు అతడే సుమా! ప్రాణములు శక్తిస్వరూపమైతే, ఇక, ఆత్మభగవానుడు... 'ఆ శక్తి ఎవరిదో'...ఆతడు సుమా! ఇంద్రియ విషయ స్పర్శ కారణము, విషయానందములకు కల కారణము అతడే.

హే మహర్షీ! ఎవ్వనియందైతే ఈ విభేదనావిభాగ కళంకం ఏమాత్రం లేదో, నిజానికి ఈ కల్పనా సమూహములన్నీ ఎవని నాశ్రయించుకుని ఉన్నాయో, ఎవని వైభవము స్వానుభవమే అయి ఉన్నదో– ఆ సకల దేవతావందితుడు, సర్వశ్రేష్ఠుడు అగు పరమాత్మను మేము ప్రాణ సశాంతస్థాన సేవనం ద్వారా ఉపాసిస్తున్నాం. నిరంతరం శరణు వేడుతూ తరిస్తున్నాం. జగత్తులోని నా రూపం 'జీవాత్మ' ఈ 'జీవుడు' అనుజగన్నాటకంలోని జగత్తులోని నా పాత్రకు ఆధారమైనదే నా "పరమాత్మ రూపం". జీవాత్మచే ప్రాణోపాసన ద్వారా పరమాత్మను ఉపాసిస్తున్నాం. ఇదే మా 'చిరంజీవము' యొక్క మర్మగర్భ రహస్యం.

❖❖❖

# 11. ప్రాణాపానముల సమాధానం

**భుశుండుడు :**

**ఏషాహి చిత్తవిశ్రాంతిః మయా ప్రాణసమాధినా ।**
**క్రమేణానేన సంప్రాప్తా స్వయమాత్మని నిర్మలే ॥**

నేను ప్రాణములను దిగ్విజయంగా సమాధానపరచాను. చిత్తమున విశ్రాంతి పొంది క్రమముగా నిర్మలాత్మ స్వరూపుడనయ్యాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అనగా, మీరు ఉద్దేశపూర్వకంగా ప్రాణాపానములను అవలంబిస్తూ ఉన్నారా?

**భుశుండుడు :** ప్రాణాపానములకు అంతర్గతమైనయున్న చిదాత్మను అవలంబిస్తున్నాను. అందుచేత... ఒక ప్రక్క ఆ మేరు పర్వతం చలిస్తున్న సమయంలో కూడా నేను కించిత్‌కూడా, ఒక అరనిమిషం కూడా చలించటం లేదు. కూర్చున్నప్పుడు, నిలబడేటప్పుడు, నడుస్తున్నప్పుడు, మేల్కొని ఉన్నప్పుడు, నిదురిస్తున్నప్పుడు ఈ నా 'ఆత్మసమాధి' చెదురుటయే లేదు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జగత్తులో నిత్య–అనిత్యాలైన ఇష్ట–అయిష్టాలైన, సుఖ దుఃఖ కారకాలైన ఆయా విషయాలు వచ్చిపోతూ ఉండటం సహజం కదా! ఆ సమయంలో మీ అభ్యాసమెలా ఉంటోంది?

**భుశుండుడు :** ఆ సమయంలో అంతర్ముఖుడనై స్ఫటిక స్వచ్ఛ భావమగు ఆత్మయందు వెలసి ఉండటం చేత అవన్నీ స్పందింపజాలకున్నాయి.

వాయువు నిరోధింపబడిన నిరోధింపబడుగాక! ప్రబల నదీప్రవాహం అడ్డగించబడిన అడ్డగించ బడుగాక! నేను ఆత్మసమాధి విరుద్ధములగు ఏ విషయములనూ ఏమాత్రం స్మరించటమే లేదు. నాయొక్క దృశ్యవిషయ స్మరణరాహిత్యబలం చేత ఇక్కడ ఏవీ కూడా నా ఆత్మ సమాధికి విఘ్నం కలిగించ లేకున్నాయి.

హే మహర్షీ! ఈ ప్రాణ – అపానగతులను అనుసరిస్తూనే అంతరంగుడు, బహిర్నిలయుడు కూడా అయిన పరమాత్మను దర్శిస్తూ ఉండటంచేత అత్యంత స్వభావసిద్ధంగా సర్వశోకవిషయములకు అతీతుడనై ఉంటున్నాను. ఉత్తమోత్తమ పదమును అలంకరించి ఉన్నాను. ధీరస్వభావుడనై మహా ప్రళయం మొదలుకొని అసంఖ్యాకజీవులు కాలప్రవాహంలో మునగటం, తేలటం సాక్షీభావంగా దర్శిస్తూ వస్తున్నాను. ధీరోదాత్తుడనై, చిరంజీవుడనై ఇక్కడే వెలయుచున్నాను. సర్వఫలేచ్ఛలను జయించివేశాను. దేని పట్లా ఎట్టి అభిమానమూ లేకుండానే ఆయా ప్రాప్తములైన కర్మలు నిర్వర్తిస్తూ ప్రపంచం పట్ల సుషుప్తునిలాగానూ, అనుభవం విషయంలో 'కేవలీస్వభావం"తోనూ ఉండి ఉంటున్నాను. 'ఇది ఇష్టం, ఇది కాదు.....ఇది గ్రహించాలి. ఇది త్యజించాలి' అనే చింతలన్నీ ఆత్మదర్శనదృష్టిచే అత్యంత స్వల్పమైనవిగా గాంచుచున్నాను. కేవలం పరమాత్మయందే వెలయుచుండుటచే రాగము లేదు. మనోరాగ (జాడ్య) రహితమగుటచే చిరంజీవినయ్యాను. ప్రాణాపానసమయోగసమయంలో నిర్వర్తించే 'సమనుస్మరణ' యొక్క ప్రభావముచేతనే నాకు కేవలాత్మానుభవసంతుష్టియందు ప్రవేశం లభించింది. 'ఇది పొందాను; అది పొందలేదు; ఇక ఇది పొందుతానో, లేదో...?' మొదలగు చింతలు దరిజేరనీయకపోవటమే నా చిరంజీవత్వము యొక్క రహస్యం.

నా విషయం గాని, పరుల విషయం గాని, దేనినీ... ఎన్నడూ స్తుతించటం లేదు, నిందించటం లేదు. అందుచేతనే ఇట్టి మహత్ శుభమును పొందగలిగాను. శుభములకు పొంగటం, అశుభములకు క్రుంగటం... ఇదంతా స్వల్పత్వాన్ని తెచ్చిపెట్టుకోవటమే కదా! ఆ రెండిటి విషయంలోనూ సంతోష దుఃఖములను అనుసరించకుండా యథాతథంగా నేను ప్రాణాపానములను ఆశ్రయించటం కొన సాగించటం చేతనే చిరంజీవత్వం నాకు స్వభావసిద్ధమవుతోంది. సర్వ ద్వైతబాధ లక్షణములను

త్యజించిన వాడనై 'పరమ త్యాగము' అవలంబించి సర్వమునూ సర్వదా త్యజించి ఉన్నాను. అందుచేత ఏర్పడిన బుద్ధిబలంచేత జీవితాభినివేశమనతగు మరణమును కూడా త్యజించివేశాను.

ప్రాణానుకరణ బలం చేత నా మనస్సు చాపల్యరహితమై శోకహీనమై క్రమంగా స్వస్థతను, సమాహితస్థితిని పొందింది. ఆకాశమువలె కాష్టమును, స్త్రీని, కొండను, గడ్డిపరకను ఒకే స్పందనతో గాంచుచున్నాను.

"ఈ రోజు ఏంచేశాను? రేపు ఏంచేయాలి?" అనే చింతన నాకు లేదు. ఈ శరీరానికి సంబంధించిన హాని-వృద్ధులతో నేను సంబంధం పెట్టుకోవటం లేదు. "ఇతడు మిత్రుడు, అతను కాదు, ఇతను మాకంటే వేరు, వీళ్లు అయినవాళ్లు, వాళ్లు కాని వారు" - అనే క్రీనీడ దరి జేరకుండా ఎల్లప్పుడూ ఆత్మజ్ఞానాగ్నిని ప్రజ్వరిల్లజేయుచున్నాను. "చైతన్యభగవానుడగు నేనే నానాత్వముగా కూడా ఏర్పడి, తద్వారా నాకు కనిపించేదంతా అయిఉన్నాను. కనుక నాకు వేరైన నానాత్వం ఎక్కడా లేదు. ఉండదు" - అను అచ్యుత భావన సృష్టీకరించుకొని ఉంటున్నాను. ప్రాణ-అపానముల మధ్య నిత్యతృప్త స్వభావంచే వెలసి ఉండటం చేత 'ఈ దేహమే నేను' అనే అభిమానం నాకు కలగటమే లేదు.

గాఢ నిద్రపోయేవాని దృష్టిలో ఈ జగత్తు మొదలంటా 'లేనిది'గా అవుతుంది. చూచారా? అట్లాగే సర్వకర్మల ఆరంభదశనుండి 'ఈ జగత్తు లేదు' అని గ్రహించియే ఉంటున్నాను. ఆయా కాలములందు వచ్చి వెళ్లే అర్థానర్థములను ఈ కుడి-ఎడమ చేతులను చూస్తున్నట్లు సమానభావముతో గాంచుచున్నాను.

'స్వరూపచ్యుతి' లేనట్టి 'స్థైర్యశక్తి'తో ఇతరుల పట్ల సర్వభూతాత్మభావన కలిగినవాడనై చూస్తున్నాను. స్నేహమయమైన మనోదృష్టులతో అంతటినీ ఋజువుగా (Straight forwardly), అకుటిలముగా (Non viciously) దర్శిస్తున్నాను. ఈ శరీరం మీద, తల నుండి క్రింద పాదములవరకు - ఎచ్చటా, దేని మీదా కొంచెం కూడా అభిమానం లేదు. 'అహంకారం' అనే బురదను 'ప్రాణాపానముల సంధి' అనే జలంతో పరిశుభ్రపరిచి స్వస్థుడనై ఉన్నాను. అభిమాన శూన్యుడనై ఉండటం చేత ఏది శారీరకంగా ఈ ఈ కార్యములు నిర్వర్తిస్తున్నప్పటికీ మనస్సు మాత్రం నిత్య నిర్మల నైష్కర్మ్య సిద్ధిని బడసింది. ఎప్పుడైనా ఏదైనా నూతన విషయం కొంచెం తారసపడినప్పుడు నా మనస్సు 'ప్రాణాతీత - అలౌకిక - అనిర్వచనీయ చిదాత్మోపాసన' వలన గర్వదోష రహితమై ప్రవర్తిస్తోంది.

ఇతరులను పరాభవించే సందర్భము, సామర్థ్యము ఏర్పడినప్పుడు కూడా నేను ఇతరులను పరాభవించను. నా బుద్ధి స్థిరత్వం పొంది ఉండటం చేత ఒకవేళ ఇతరులు పరాభవిస్తున్నప్పటికీ నాకు దుఃఖలేశం కూడా కలగటం లేదు. సర్వభూతములందున్న చిదాత్మను సదా దర్శిస్తూ ఉండటం చేత సర్వసమదర్శినై సర్వత్రా ఏర్పడి ఉండగలుగుచున్నాను.

అందుచేతనే నేను చిరామయజీవిని. సర్వదా సమాహితుడనై ఉంటూ, ఇక ఆశాపాశజనితమగు చిత్తవృత్తులను హృదయంలోనికి జొరనివ్వటం లేదు.

బహిర్విషయములందు మౌనం వహించి వాటినన్నిటినీ అసత్తుగా గాంచుచున్నాను. ఆత్మ విషయము నందు అనుక్షణం ప్రబుద్ధుడనై ఈ చేతులను చూస్తున్నట్లుగా దాని సత్తను గాంచుచున్నాను.

❖

పరుల కష్టసుఖముల పట్ల అవి నాకే అబ్బినట్లు దుఃఖించుచు, సుఖించుచున్నాను. అందరికీ నేను ప్రియుడనే.

ఆపదల పట్ల నిర్లిప్తుడనై అచలుడనై, ధీరుడనై ఉన్నాను. 'అయ్యా! భుశుండా! నీవు జగన్మిత్రుడవయ్యా' అని నాకు నేను సర్వదా గుర్తు చేసుకుంటున్నాను. ఈ సంపదల హెచ్చుతగ్గులు నేను పొందటం లేదు. నేను నేను గాను. నాకు 'నా' అనువారు ఎవరూ లేరు. నేను ఎవరికీ చెందను. నాకు ఎవరూ చెందరు. ...అయినా కూడా ఈ దృశ్యమాన జగత్తంతా నేనే!

"నేనే దేశ కాలములను విభజిస్తున్న ఆకాశమును" – అనే సమాధానము సంపాదించుకున్నాను. 'అంతయూ నిండియున్న అద్వితీయుడను' అను ఆత్మాహంకారబుద్ధి నాయందు అణువణువునా ఏర్పడి ఉన్నది. ప్రాణాపానముల లయస్థానంలో నన్ను నేను ప్రతిక్షేపించుకొని ఈ తదితరమంతా దర్శిస్తున్నప్పుడు 'ఇక్కడ కనబడే మట్టి – మట్టికుండ, కొయ్య – శకటము' ఇవన్నీ 'చిత్'గా అత్యంత స్పష్టమై నాకు గోచరిస్తున్నాయి.

అట్టి దృష్టిబలం చేత నేను అనామయ చిరంజీవత్వం పొందాను. ఈ పాంచభౌతిక దేహంతో 'భుశుండవాయసము' అని ఒక ప్రక్క పిలువబడుతూనే, ఇక్కడ ఉండి 'బ్రహ్మసాగరంలో తరంగములు' అనతగ్గ ఈ త్రిలోకముల జన్మ–స్థితి–లయములకు మూలస్థానంగా నన్ను నేను గాంచుచున్నాను.

❖

ఈ జగత్తులన్నీ ఉత్పత్తి అగుచున్నదెక్కడ? ఇవన్నీ భావనయొక్క ఘాత – ప్రతిఘాతములే అని నేను గ్రహించాను. "సర్వసాక్షియగు ఆత్మయందే మనోబుద్ధులను ఆశ్రయించి ఈ జగత్తులు ఉత్పత్తి – పతనములను పొందుచున్నాయి' అని గమనిస్తున్నాను.

❖❖❖

# 12 వీడ్కోలు

**భుశుండుడు :** హే మహర్షీ! ప్రాణాపానముల మధ్యస్థమగు అనుభవయోగముచే నేను ఎట్లా చిరంజీవుడనైనానో చెప్పాను. మీ యొక్క దర్శనముచే ఆత్మజ్ఞానానుభవం పొంగిపొరలుతోంది. అందుకే జ్ఞానసాగరస్వరూపులగు మీముందు స్వతంత్రించి నా ఆత్మానుభవమును వర్ణించాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే భగవంతుడా! భుశుండా! మీరు చెప్పిన వాక్యముల వెనుక దాగిన మహత్తర తత్త్వాన్ని చూచి నేను ఆశ్చర్యపడుచున్నాను. మీరు మహాత్ములు. చిరంజీవులు. ద్వితీయ బ్రహ్మ వలె వెలుగొందే మిమ్ములను దర్శించే మహద్భాగ్యం ఈ రోజు నా కబ్బింది. ధన్యుడను. హే ప్రభూ! పావనమొనర్చ గల అఖండితమగు ఆత్మైక్యవాక్యాలు మీరిప్పుడు పలికారు.

నేను దేవతల ఐశ్వర్యములను, విద్వాంసుల జ్ఞానసంపదను చూచాను. మిమ్ములతో పోల్చగల తత్త్వజ్ఞాన సంపన్నులు చాలా చాలా అరుదుగా మాత్రమే కనిపిస్తారు. మీవంటి పూర్ణతప్తస్వరూపులు తారసబడటం అత్యంత దుర్లభమని నేను ఘంటాపథంగా చెప్పగలను.

అనేక ముత్యపు చిప్పలు వెతికిన తరువాత ఎక్కడో ఒకచోట అత్యంత విలువైన ముత్యం గల ముత్యపుచిప్ప కనుగొనినట్లు మీ దర్శనం ఈ రోజు లభించింది. ముక్తపురుషులు, పుణ్యాత్ములు అగు మీతో సంభాషించటం ఒక మహత్తర యోగసాధనా ఫలంగా నేను భావిస్తున్నాను.

ఇక నాకు సెలవు ఇప్పించ ప్రార్థన. మధ్యాహ్న కృత్యములు ఆచరించటానికై స్వగృహమైన సప్తఋషి మండలం జేరవలసియున్నది.

అప్పుడు భుశుండుడు తాను ఆసీనుడై ఉన్న వృక్షం నుండి నా ముందుకు వచ్చి నిలిచారు. సంకల్ప కల్పితమైన రెండుచేతులతో పువ్వులు కోసి నాకు అర్ఘ్య-పాద్యములు సమర్పించారు. ఆకాశ మున పయనమై వెళ్లుచున్న నన్ను సాగనంపుతూ ఆమడదూరం ఎగురుతూ వచ్చి అనుజ్ఞను పొంది వెనుతిరిగారు. సాగరంలో తరంగం అదృశ్యమైనట్లు నేను అక్కడ నుండి అదృశ్యుడనై నిజాశ్రమం జేరాను. సాధుజన సంగమం ఎంతటి మధురమైనదో, ఆనందప్రదమైనదో చెప్పటానికి నాకు మాటలు చాలవు.

ఓ రాఘవా! ఈ సంఘటన కృతయుగారంభంలో 200 సంవత్సరాలు గడిచిన తరువాత జరిగింది. ఇప్పుడు త్రేతాయుగం వచ్చింది 4000 ఏళ్లు గడచిన తరువాత నీవు జన్మించావు. భుశుండుడు ఆ కొండపైనే అజరారూపంలో ఉండి ఉన్నాడు.

విన్నావు కదా రామా! భుశుండుని కథలోని అంతరంగ కథనాన్ని గ్రహించి నీవు నీ ఉచిత - అనుచితములను నిర్ణయించుకో. ఈ కథనం పఠించినవాడు జరామరణముల పట్ల భ్రాంతి తొలగి అసత్యమగు మాయను సత్వరం దాటివేయ గలడు.

❖❖❖

# 13. దేహభావం భ్రమ మాత్రమే

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! భుశుండుని వృత్తాంతం విన్నావు కదా! ఆతడు ప్రాణాభ్యాస పూర్వకంగా ప్రాణనియామకదృష్టిని అవలంబించి 'జ్ఞానయోగం' నిరంతరం ఆశ్రయించి ఉంటున్నాడు. తత్ఫలితంగా బ్రహ్మపదమును పొంది ఉన్నాడు. నీవు కూడా అభ్యాస - వైరాగ్యములను ఆశ్రయిస్తే ఆతడు పొందిన స్థితి తప్పకుండా పొందగలవు. నిర్లిప్తబుద్ధితో ప్రాణాపానములను అభ్యసించే వారికి చిదాత్మైక్యభావం చాలా సులువుగా లభిస్తోంది.

ఇప్పుడు నీకు రెండు విజ్ఞాన దృష్టుల గురించి చెప్పటం జరిగింది - 1. ప్రాణ నిరోధము, 2. జ్ఞాన విచారణ... ఈ రెండిటిలో నీకు ఏది నచ్చితే ఆ మార్గంలో ప్రయత్నించు. లేదా, రెండింటినీ మేళవిస్తూ నీ సాధన కొనసాగించు. అతి త్వరలో ఆత్మైక్యానుభవం నీ ముంగిట వచ్చి వాలగలదు.

**శ్రీరాముడు :** ఓ భగవంతుడా! వసిష్ఠమహర్షీ! మీరు భూలోకసూర్యులై జ్ఞాన కిరణములను ప్రసరింపజేసి మా ఆత్మ స్వరూపమును కప్పిపెట్టి ఉంచే హృదయాంధకారమును పటాపంచలు చేస్తున్నారు... ఇక మేము ప్రబుద్ధులమై, ప్రవిష్టులమై స్వస్వరూపమున ప్రవేశిస్తున్నాం. అపర వసిష్ఠులవలె వెలయుచున్నాం.

మీరు ఇప్పుడు అలౌకిక ఆనందప్రాప్తికి కారణముగల భుశుండుని విశేషాలు చెప్పారు. ప్రాణాపానముల 'గతి'ని వివరిస్తూ ఈ అస్థి - చర్మ నిర్మితమగు ఈ శరీరం గురించి కొన్ని సూక్ష్మతరమైన విషయాలు చెప్పారు.

అయితే స్వామీ!... అసలు ఈ శరీరం ఎట్లా నిర్మించబడింది? ఇది ఎటు నుండి ఇక్కడకు వస్తోంది? ఇది ఎట్లా స్థితి కలిగి ఉంటోంది? ఇందులో నివసించేవాడు మరెక్కడి నుండి వచ్చి ఇక్కడికి చేరాడు? ఈ శరీరానికి - శరీరికి సంబంధం కలగటానికి కారకులగుచున్నదెవరు?... ఈ విషయాలు విశదీకరించమని నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** నీ ప్రశ్నలకు ఏదైతే సమాధానమైయున్నదో... అయ్యది పరమార్థతత్త్వాన్ని చక్కగా గ్రహించటానికి, దోషములన్నీ దూరీకరించటానికి మనకు ఉపకరించగలదు. నీ ప్రశ్నలకు సమాధానం విను.

❖

అస్థి-చర్మయుతమై, రక్త-మాంస విలేపితమగు ఈ శరీర గృహం ఎవరూ నిర్మించి ఉండలేదు. జీవుని శ్వాస వలె, వాయువు యొక్క చలనములాగా, నది యొక్క ప్రవాహం వంటిదై కన్పట్టు ఈ శరీరం "ప్రవాహపతితంగా, కాకతాళీయంగా" ఏర్పడుతోంది. జలంలో ప్రతిబింబించే చంద్రుని లాగా ఈ దేహచమత్కారం ఒక 'అలీకము (Illusion) లేక "అభాస" మాత్రమే. చంద్రుడు జలంలో ప్రతిబింబించటానికో, లేక దృశ్యము దర్పణంతో ప్రతిబింబించటానికో ఒక కర్త కావాలా? అక్కర్లేదు కదా! మిథ్యామయమగు ఈ శరీరం కూడా ప్రతిబింబిత చంద్రుని లాగా 'సత్-అసత్'రూపమై వెలయుచున్నది. దీని కర్తృత్వం ఎవ్వరికీ ఆపాదించలేం!

వస్తుతః ఆకాశంలో ఒక్క చంద్రుడు మాత్రమే ఉన్నప్పటికీ మెల్లకన్ను గలవానికి భ్రాంతి చేత రెండు-మూడు చంద్రులు ఉన్నట్లు అగుపడుతుంది. చూచావా? ఈ శరీరం కూడా అట్లే అగబడుచున్నది. ఇది స్వతఃగా లేదు. కాని దేహభ్రాంతి ఉన్నవానికి ఇది ఉన్నట్లే అగపడుతోంది. అందుచేతనే 'ఇది సదసదాత్మకం' అని విజ్ఞులు వర్ణించి చెప్పుచున్నారు. ఒక విధంగా ఉన్నది, మరొక విధంగా లేదు.

స్వప్నము వాస్తవానికి మిథ్యయే కదా! నీటి కంటే వేరుగా నీటిబుడగ ఉన్నదా?... అయినప్పటికీ అవి వేరు వేరుగా కనిపిస్తున్నాయి. నీటి బుడగ అనేది ఆకారం దృష్ట్యా మాత్రమే అయినప్పటికీ నీటి దృష్ట్యా అసత్యమే కదా!

అట్లాగే ఆకారాదుల దృష్ట్యా ఈ దేహము సత్యమువలె అనిపిస్తున్నప్పటికీ, ఆత్మదృష్ట్యా ఈ దేహము మిథ్యయే అని గ్రహించు.

ప్రతిభాస కారణంగా ఎడారిలో ఎండమావులు కనిపించి అమాయక జీవులకు జలభ్రాంతిని కల్పిస్తున్నాయి. అదే, అనుభవముగలవానికి, లేదా, దగ్గరకు పోయి చూచినవానికో 'ఇక్కడ జలము ఉండదు. తరంగాలూ ఉండవు' – అని తెలిసిపోతోంది. అట్లాగే అల్పజ్ఞానానుభవం ఆవరించి ఉన్నప్పుడు శరీరము యొక్క ఉనికి ఘనీభూతమై ఉంటోంది. ఆత్మబోధచే, "ఈ శరీరము–దీనిచే ఏర్పడే అనుభవజ్ఞానం అసత్ మాత్రమే' అని తెలియవస్తోంది. 'అభాసమాత్రమే' అగు ఈ శరీరము ప్రముఖమైనట్లు, దీని అనుభవమును గాంచుచున్న ఆత్మవస్తువు శరీరముకంటే ప్రత్యేకము, ఉత్కృష్టము, అసంబంధితము అయికూడా అముఖ్యమైనట్లు భ్రమ ఏర్పడి ఉంటోంది.

**శ్రీరాముడు :** ఈ శరీరము ఆత్మకు ఏర్పడటానికి అసలు కారణం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'నేను ఈ శరీరమును' అను రూపంలో గల ఆత్మయొక్క చమత్కారమైన స్వయంకృత సుదృఢభావనావేగమే శరీరము యొక్క అనివార్య భ్రమకు కారణం. అయితే జ్ఞానదృష్టికి 'ఈ శరీరభావన కేవలం భ్రమ' అని తెలియవస్తోంది.

ఓ రామా! ఈ శరీరభ్రాంతి జీవునకు ఉండవలసిన అవసరమే లేదు. ఈ క్షణమే నిశ్శంకగా నిశ్చింతగా దీనిని విడచివేయవచ్చు... ఎందుకంటావా?... కేవలం సంకల్పమాత్రంచే ఇట్టి వేలాది స్వప్న సదృశంగా శరీరాలు కలుగగలవు. లయించగలవు. ఇట్టి సంకల్ప నిర్మిత శరీరాలలో దేనిని గ్రహిస్తావు?... దేనిని త్యజిస్తావు?

**శ్రీరాముడు :** శరీరం పోయినప్పుడు కూడా ఈ జీవుడు ఉంటాడు కదా! అప్పుడు జీవుడు ఉంటున్నది ఎందులో? శరీరాలు ఏ మూలనుండి వచ్చి పడుతున్నాయి?

**శ్రీవసిష్ఠమహర్షి :** హాయిగా మృదువైన తల్పంపై నిదురిస్తున్న ఒకవ్యక్తి స్వప్నంలో ఏర్పడే దేహములతో దిక్కులన్నీ తిరిగివస్తున్నాడు. ఆ స్వప్న సంబంధిత స్వ–పర దేహాలన్నీ ఎక్కడి నుండి వస్తున్నాయి? ఏ దేహంతో ఈ జీవుడు స్వప్నానుభవం చవిచూస్తున్నాడు?

జాగ్రత్‌లో కూడా మనస్సు అనేక చోట్ల తిరిగి వస్తోంది. ఏ శరీరంతో? అంతా ఊహ చేతనే కల్పించబడుతోంది కదా! ఈ జాగ్రత్‌లో ఏర్పడే 'రాజ్యం ఏలటం, పరస్పర ప్రేమాభివేశాలు, సంబంధ–బాంధవ్యాలు, క్రీడా వినోదాలు'–అన్నీ కూడా 'ఊహ'యే తమయొక్క మూలముగా కలిగి ఉన్నాయి. స్వప్నంలోని దేహాలన్నీ ఊహచే నిర్మించబడుచున్నట్లే, ఈ జాగ్రత్‌లోని వ్యవహారాలకు కూడా ఊహయే మూలం. అందుకే ఇది 'జాగ్రత్‌స్వప్నం' అని, స్వప్న వ్యవహారమును 'స్వప్నజాగ్రత్' అని పిలుస్తూ ఉంటారు.

స్వప్నంలోని బంధువుల వలెనే ఈ జాగ్రత్ దృశ్యానుభవమంతా మనోకల్పితమే. అట్లాగే ఈ మాంస–అస్థిమయ పృథ్వీ–జల–ఉష్ణ–వాయు ఇత్యాది సమావేశరూపమైన పార్థివ శరీరం కూడా మనోకల్పితమే నని గ్రహించు. సంపదలు, శరీరము, దేశము మొదలైనవన్నీ చిత్తము నందలి సంకల్పములచే కల్పించబడే విలాసములు మాత్రమే.

**దీర్ఘస్వప్నమిమం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమమ్ ।**
**దీర్ఘం వాపి మనోరాజ్యం సంసారం రఘునన్దన ॥** (శ్లో. 28, సర్గ 28)

రఘునందనా! నీవీ సంసారమును దీర్ఘస్వప్నం గానో, దీర్ఘచిత్తభ్రాంతి గానో, దీర్ఘ మనోరాజ్యం గానో గ్రహించు. నా ఈ వాక్యములలోని వాస్తవత్వం 'జ్ఞానసూర్యుడు' నీలో ఉదయించిన మరుక్షణం సుస్పష్టంగా అవగతమౌతుంది. జాగ్రత్ సమయంలో స్వప్నం 'లేనిదే' అయినట్లు జ్ఞానలాభసమయంలో ఈ జగత్ మిథ్యయే అయి కనబడుచున్నది.

ఇతఃపూర్వం కమలజన్ముడగు బ్రహ్మదేవుని ఉత్పత్తి గురించి చెప్పేటప్పుడు 'సంకల్పకల్పనామయ మగు మనస్సే ఆడంబరమగు ఈ విచిత్రజగద్రచనకు ఉపక్రమిస్తోంది' అని అనుకున్నాం కదా! అట్లాగే నీకు కనబడుచున్న ఈ శరీరం కూడా మనస్సు యొక్క ప్రతిభాస మాత్రమే. మనస్సు దేనిని ఎట్లా భావిస్తే అది అట్లే అవుతోంది. మనస్సు యొక్క కల్పిత అభాసయే జీవునిచే జగత్తుగా చూడబడుతోంది.

పూర్వదేహం తరువాత ఈ దేహం కల్పించబడినట్లు ఈ దేహం తరువాత కల్పించబడబోయే దేహాలు కూడా కల్పితమాత్రములే. వాసనాధిక్యతను అనుసరించి ఈ శరీరము సంఘటితమౌతోంది. భవిష్యత్ కూడా అట్లాగే సంఘటితమవబోతోంది. అయితే స్వతఃగా పూర్ణుడవైన నీవు ఈ శరీర–జగత్ సంకల్పములన్నిటికీ అతీతమైనవాడవు సుమా! నీ యొక్క పురుషకారమును ఉపయోగించి మనస్సును అంతర్ముఖం చేస్తే వాస్తవ స్వరూపమేమిటో గోచరమౌతుంది. అప్పుడు 'ఇదంతాచిన్మాత్రమే' అని గ్రహించగలుగుతావు.

ఓ రామా! ఈ ఎదురుగా పంచేంద్రియములకు తారసపడుచున్న దృశ్యజగత్తును 'అన్యథా'గా భావించావా, అన్యమే అవుతుంది.' 'ఇది, అది, నేను, నాది, మేము, మాది, వారు, వీరు'– మున్నగు భావనలు ఇతఃపూర్వం అనేకసార్లు మననం చేయటం చేత ఆ భావనాదార్ఢ్యం చేత ఇదంతా ఆత్మ స్వరూపుడగు ఈ జీవునకు నీకు వేరై ఉన్న దానివలె భ్రమింపజేస్తోంది. భావన యొక్క గొప్పతనం ఎంతటిదంటే, ఏ భావన దృఢంగా చేయబడుతుందో అదియే సత్యమై అనుభవమౌతుంది. కాముకునకు తన ప్రియురాలే అన్ని వైపులా కనబడుతుంది. అది భావన యొక్క ప్రభావమే కదా! రాత్రి కల కనే టప్పుడు అప్పటికి అది పరమసత్యంలాగానే అనుభవమౌతోంది. ఎందుచేత? మరి అప్పటి భావన అట్టిది.

భావనాబలం చేతనే ఈ సంసారం సత్యంగా తోచటం జరుగుతోంది. స్వప్నంలో కొద్ది నిమిషాల కాలం అనేక రోజులుగా తోస్తోంది చూచావా! అట్లాగే, సంకల్పమాత్రం, క్షణికం అగు ఈ సంసారం దీర్ఘాతిదీర్ఘంగా తోచుచున్నది. ఎండమావులు తటాకరూపంలో స్ఫురిస్తున్నట్లు అసత్యమైన, భౌతిక పరమైన ప్రియాప్రియ సంబంధ బాంధవ్యాలు సంకల్ప పరంపరల బలం చేతనే నిలచి ఉంటున్నాయి.

ఒక చిత్రమైన కంటిజబ్బు వలన ఆకాశంలో మయూరపింఛాలు కనిపిస్తాయి. దోష రహితమైన చూపు గలవానికి ఆకాశం మాత్రమే కనిపిస్తుంది. సమదృష్టి గలవాడు సంకల్పమాత్రజనితమగు ఈ సంసార సంరంభమును చూచి దూరంగా ఉండి నవ్వుకుంటున్నాడు. సంసార దోషముచే

పరితప్తుడైన జీవుడు ఇక్కడ దుఃఖము, భయము, వేదన, అవమానము, మమకారము, నిరుత్సాహము కలిగించ గల అనేక విషయపరంపరలు గాంచుచున్నాడు. బాలుడు స్వసంకల్పిత మనోరాజ్యంలో పులిని, నక్కను, దయ్యమును ఊహించి ఉలిక్కిపడి బిగ్గరగా ఏడ్చునట్లు సంసారాసక్తుడు అడుగడుగుకు అనేక ఆందోళనలు తెచ్చిపెట్టుకుని మరీ అనుభవిస్తున్నాడు.

**శ్రీరాముడు:** ఆ భయం తొలగేది ఎట్లా, మహర్షీ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆత్మ ఒక్కటే ఇదంతా ప్రసరించి భాసిస్తూ ఉండగా ఇక భయాదులు ఎవరికి, ఎవరి వలన కలగాలి? భయము పొందుచున్న జీవుడు తన అజ్ఞానం తొలగించుకున్నాడా... ఇక ఆతడు నిర్మలుడు, శుద్ధుడు అయి ఈ జగత్ మోహమునకు లోనవడు. కనుక 'సమ్యక్ దర్శనం' అను అభ్యాసమే ఉత్తమమైన ఉపాయం. జ్ఞానం సుస్థిరమైన చోట ఇక సంసారం ఉండదు. సమ్యక్ దర్శనంచే మనోబుద్ధులను విశుద్ధపరుస్తూ తద్వారా జ్ఞానం సుస్థిరపరచాలి.

**శ్రీరాముడు :** సమ్యక్ దర్శనం అంటే ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జగత్తంతా అభాసమాత్రమేనని, ఇది సత్తుగాని, అసత్తుగాని కాదని గ్రహించటం. జీవితం, మరణం, స్వర్గము, జ్ఞానం, అజ్ఞానం, నీవు, నేను, సమస్త సంసారం, దిక్కులు – ఇవన్నీ చిదాభాస అని తెలియటమే సమ్యక్ దృష్టి. ప్రయత్నబలం చేత తప్పకుండా యథార్థదర్శనం ఈ జీవునకు సాధ్యపడుతుంది.

యథార్థదర్శనం లభించిన తరువాత ఇక మనసు సత్యము, నిత్యము అయిన 'సర్వగత స్వస్వరూపం' నుండి చ్యుతి పొందదు. ఈ ప్రపంచం యొక్క సత్ – అసత్ లక్షణాన్ని గ్రహించి క్రమంగా నిష్కామంతో కూడిన పరమశాంతిని పొందుతుంది. మనస్సు దేనినీ నిందించదు. స్తుతించదు. దుఃఖించదు, సంతోషించదు. ఆ జీవుడు తాపత్రయరహితమగు పూర్ణత్వమును ఆశ్రయించి ఉండటం చేత సమాధాన పూర్వకమైన ప్రశాంతానందమును పొందుతాడు.

అందరికీ మరణం అనివార్యమే అయినప్పుడు నా మరణం గురించి గాని, నా బంధువుల మరణం గురించి గాని దుఃఖించవలసిన పనేమున్నది?

జన్మించిన ప్రతివాడు అంతో, ఇంతో సంపదలు, ఆపదలు అనుభవించక తప్పేది కాదు. ఇక ఇందులో సంతోషించవలసినదీ, వేదన చెందవలసినదీ ఏమున్నది?

**బృంహత్యుదేతి స్ఫురతి బుద్బుదౌఘ ఇవార్ణవే ।**
**ఇదం హి జగతాం జాలం కిమత్ర పరిదేవనా ॥** (శ్లో 57, సర్గ 28)

సముద్రంలో అసంఖ్యాకంగా తరంగాలు లేచి పడుచున్నట్లు ఈ సంసార సముద్రంలో జగత్తులు లేచి, పెరిగి, విప్పారి, చివరకు లయించిపోతున్నాయి. ఇందుకు గాభరా ఎందుకు?

ఇట్లా ఉంటుంది... అతని అవగాహన. సద్వస్తువు ఎప్పటికీ సద్వస్తువే. అసత్తు అసత్తే. అసత్ ఎన్నటికీ 'సత్' అవజాలదు. ...మాయ ఆత్మ సమక్షం యొక్క వైచిత్ర్యం మాత్రమే. ఇక ఈ

శరీరమంటావా... ఇది అవిద్యా కామ్యకర్మ యొక్క విచిత్ర దోషముచే ఉదయిస్తోంది. భూత – భవిష్యత్ – వర్తమానకాలాలలో 'నేను' అనబడేది ఆత్మకు వేరై లేనేలేదు. ఇక ఇక్కడ దుఃఖమునకు తావెక్కడిది?

తత్త్వదర్శియందు "ఈ శరీరము కంటే నేను భిన్నుడను. చిదాత్మయే అయి ఉన్నాను. ఇక క్రొత్తగా సంపాదించే సద్భావమేమిటి? ఇప్పుడు అసద్భావం ఉండటమేమిటి? నేను దేని కొరకై క్రొత్తగా ఎందుకు దుఃఖించాలి?" అను రూపంలో ఉండే దృఢనిశ్చయం తొలగదు. అందుచేత, అతని మనస్సు ఈ సంసారంలో ఉదయించనే ఉదయించదు. సకల బాహ్య వస్తువులందు ఉద్వేగము తొలగి కేవలీ బ్రహ్మభావన అఖండశాంతపూర్వకంగా సంతరించుకుంటుంది. తిత్తిరపక్షి తన గూటిని నిర్మించుకోవటానికి కోమలమైన తృణకణములను ఎంచుకుంటున్నట్లు ఆ బ్రహ్మవేత్త సంసారములోని అసారము నంతా వదిలి, దాని విశేషాల పట్ల ఏమాత్రం ఆసక్తి, నమ్మకం లేక, కేవలం బ్రహ్మజ్ఞాన సంబంధిత విషయాలను మాత్రమే దృష్టిలో పెట్టుకుని ఉంటాడు.

గట్టిత్రాటి చేత ఎద్దు కట్టబడినట్లు, ఇష్ట–అయిష్ట–రాగ–ద్వేషాది రూపమైన 'సంసారాసక్తి' చేతనే మనిషి బంధించబడి నీచత్వమునకు, స్వల్పత్వమునకు ఈడ్వబడుచున్నాడు.

అందుచేత రాఘవా! నీవు ఈ సంసారం ఏర్పడుచున్న వైనమంతా జాగ్రత్తగా గమనించు. 'ఆసక్తి, అనాసక్తి' అను రెండిటినీ త్యజించి నిరామయుడవై సంచరించు. కేవలం కర్తవ్యమైనదానిని మాత్రమే ఆచరించు. అకర్తవ్యమును ఎన్నడూ ఆచరించవద్దు. 'ఈ జగత్తు అభాస మాత్రమే' అని గుర్తు పెట్టుకుంటూ ఉంటే, క్రమంగా అట్టివాని హృదయం శీతలమౌతుంది. ఈ సర్వపదార్థముల మీదా భ్రాంతి త్యజించి సర్వమూ బ్రహ్మచైతన్యముయొక్క అభాసమాత్రంగా గ్రహించు. ఆ తరువాత చిత్త కల్పనాకళంకమగు ఆ అభాసభావన కూడా త్యజించి భావాభావరహితుడవై వెలుగొందుము. చిదాకాశమయుడవు కమ్ము. నీ రూపమును సర్వగామి, సర్వవర్ణనలకు అతీతము, సర్వసమము అగు నిత్యనిర్మలాకాశముగా గాంచుము. ఆపై అనుభవమాత్రమే గాని, మనం మాటలు ఉపయోగించి ఏమీ చెప్పుకోలేం.

1.నేను 'అహమ్' అను ప్రత్యయ పరిమితుడను గాను, 2.ఈ భోగజాలమంతా సత్యం కాదు.
...ఈ రెండు భావాలు అంతరంగంలో సుస్థిరమైన మరుక్షణం ఈ ఆడంబర దృశ్యజగత్తు వ్యర్థమగు 'మోహము' అనే అనర్థాన్ని కలిగించజాలదు. (లేదా)

1. నేను సర్వసముడను, సర్వమయుడను, 2. 'ఎరుక' అను చిత్స్వరూపుడను. తెలుసుకొంటున్న నేను తెలియబడేదానిచే బంధించబడటం ఎట్లా సంభవం?... అని అయినా భావించవచ్చు.

పై దృష్టులలో నీకు ఏది రమ్యమని అనిపిస్తే, అది ఆశ్రయించు. లేదా... రెండింటినీ మేళవించి సమాశ్రయిస్తూ, క్రమంగా, అంతరంగంలో ఉండే రాగద్వేషాలను క్షయింపజేసి, అటుపై ఈ జగత్తులో హాయిగా విహరించు. ఓ రామా! స్వర్గ – మర్త్య – పాతాళ లోకములలోని దేని పట్లా రాగద్వేషములు లేనివాడు నిబద్ధింపబడడు. ఇది సత్యం.

❖

మూఢులగు జనులు రాగద్వేషసహితులై అనేక కార్యక్రమములలో నిమగ్నమై ఉపాధియున్న దినములన్నీ అల్ప ఆశయములతో గడిపివేస్తున్నారు. చివరికి ఆ కార్యక్రమములన్నీ వ్యర్థ విపరీత ప్రయోజనములకే దారి తీస్తున్నాయి. తగలబడుతున్న వనంలోంచి సాత్వికజీవులగు జింకలు పరుగులు లంకించుకుంటున్నట్లు, రాగద్వేష దూషితమైన చిత్తములోంచి సాత్వికగుణాలు బయటకు వెళ్ళిపోవుచున్నాయి.

రాగద్వేషములు ప్రవేశించని హృదయం కల్పతరువు. అతని వద్ద లభించనిదేమీ ఉండదు. చమత్కారం చూచావా, రామా? కొందరు శాస్త్రప్రవచనపాటవాలు కలిగిఉండికూడా తమలోని రాగద్వేషములు గుర్తించి, త్యజించలేకపోతున్నారు.

"నేను సంపదలకు అర్హుడను. అనర్హులంతా సంపదలు సంపాదిస్తున్నారు. నేను పొందవలసినవి పొందలేకపోతున్నాను"... ఇట్టి అనేక తుచ్ఛధనేచ్ఛలను, సంసారప్రమత్తతలను ఆశ్రయించి శాశ్వతవస్తువును కోల్పోవుచున్నారు ఈ జనులు...!

ధనము, బంధువులు, మిత్రులు, ప్రతిష్ఠలు - ఇవన్నీ వస్తూ పోతూ ఉంటాయి. ఆ పరమేశ్వరమాయ ప్రియాప్రియములగు భావాభావములు కల్పించి ఈ జగద్వ్యవహారాన్ని తనదైన శైలిలో నడుపుతోంది.

ఈ క్షణిక జగత్తునందు అనురాగమేమిటి? విరాగమేమిటి? దీనిపట్ల ఉపేక్షయే మేలు. భోగ లోలుడగు వ్యక్తిని దృష్టిలో పెట్టుకుని 'మాయ' అనే మాంత్రికుడు ఈ జగత్తులోని వస్తువులను, వ్యవహారములను, సంఘటనలను రచించుకొని పోతున్నాడు. ఇక్కడ కనిపించే ధన, జన, దేహము లన్నీ మిథ్యయే గాని వాస్తవం కాదు. మధ్యలో ఏర్పడి, మధ్యలోనే లేకుండా పోయేవి వాస్తవమెట్లా అవుతాయి? ఆది – మధ్య – అంతములలో ఉండేది కేవలం ఆత్మ ఒక్కటి మాత్రమే. ఆద్యంతములలో సత్యము గానిది మధ్యలో మాత్రం సత్యమెట్లా అవుతుంది?

**శ్రీరాముడు:** మీ ప్రతిపాదన తిరస్కరించటానికి వీలు లేనిదని నేను ఒప్పుకుంటున్నాను. అయితే, జీవులంతా మనోవ్యధచే బాధింపబడుచున్నారు కదా! రంగుటద్దాలవంటి మాయపొరలు తొలగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** త్రికాలముల చేత బాధించబడేది ఏదైనా సరే అట్టి దానిపై ఆసక్తిగొన్నామా, ఇక అట్టి ఆసక్తి యొక్క పరిణామం మనోవ్యధయే అగుచున్నది. 'ఒకడు అభూతకల్పన కల్పిస్తే మరొకడు అందులో ప్రవేశించి పచార్లు చేస్తున్నాడు' అనే వాక్యం ఎట్టిదో ఈ సంసారభ్రమ కూడా ఒక మాయా జీవుడు కల్పిస్తే అనేక మంది మాయాజీవులు ఇందులో ప్రవేశించి గొప్ప ఆసక్తితో గంతులు వేస్తున్నారు.

ఓ రామా! నీవీ సంసారభ్రమయందు పడవద్దు సుమా! ప్రాణివర్గముతో కూడిన ఈ సంసారమును తత్త్వజ్ఞులు ఒక గారడీని చూచినట్లు చూస్తున్నారు. మూఢులను మాత్రం ఇది ఎంతో కలవరపెడుతోంది. ఇదంతా సుదీర్ఘమైన స్వప్నంలో కనిపించే ఒక నగరం వంటిది. 'అజ్ఞానము'

అనే నిద్రకు ఉపపక్రమించేవానికి మాత్రమే ఈ సంసారస్వప్నం వాస్తవానుభవమై ప్రాప్తిస్తోంది. సర్వత్రా అనుశ్రుతమగు ఈ సుదీర్ఘ స్వప్నసదృశ సంసారమును ఖాతరే చేయవద్దు.

**శ్రీరాముడు:** ఈ జీవునికి సంసారమనేది ఎక్కడ నుండి వచ్చిపడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** చెప్పాను కదా! ఇదంతా గాఢమగు అజ్ఞాన నిద్రనుండే వచ్చిపడుతోంది. నిధిని పొందినవాడు దరిద్రమును త్యజించునట్లు, నీవీ సంసారమును త్యజించు, ఓ రామా! ఉత్తిష్ఠ! సూర్యుని చూడగానే పద్మము వికసించునట్లు నీవు అఖండము, అప్రమేయము, నిత్యము, సత్యము స్వస్వరూపము అగు ఆత్మ యందు మెళుకువ తెచ్చుకో. ప్రబుద్ధుడవై లేచి సర్వత్రా నిండియున్న నీ అనామయ ఆత్మ స్వరూపమును గాంచుము. సుశీతలమగు జ్ఞాన వాక్యములను నేను నీపై వర్షింప జేయటం నీవు ప్రబుద్ధుడవై, పరమజ్ఞానమును పొందటానికే కదా! ఈ నా మేలుకొలుపు వాక్యం (ఉత్తిష్ఠవాక్యం) ప్రతిఒక్క శ్రోతకు, ప్రతిఒక్క పాఠకునికి ఉద్దేశ్యించినదే సుమా!

ఓ సర్వసభికులారా! మీరంతా మీ యొక్క సత్యస్వరూపమును దర్శించెదరు గాక! వాస్తవానికి మనలో ఎవ్వరికీ జన్మదుఃఖ దోషభ్రాంతులు తమంతట తాముగా లేవు. అందుచేత భ్రాంతిపూర్వకమగు జగద్విషయములను ప్రక్కన ఉంచి, ఆత్మయందు సుస్థిరులై వెలయుదురు గాక! ఓ రామచంద్రా! నీ యందు వికల్పదోషములకు తావే లేదయ్యా! సారవంతము, విక్షేపరహితము అగు దృష్టిని పొందినవాడవై పరమశుద్ధమగు పరబ్రహ్మమున వెలసియే ఉన్నావయ్యా!

❖❖❖

# 14. సంకల్పము - మాంసమయ దేహం

స్వస్థచిత్తుడైన రాఘవుడు వసిష్ఠమహర్షి వాక్యాలు వింటూనే ఆత్మయందు విశ్రమించి పరమానందం పొందాడు. ఆ సభలోని అనేక మంది సభికులు కూడా ప్రబోధులైనవారై తమ స్వస్వరూపమునందు తాము ఉపశమనం పొందారు. పొలం నీరుతో నిండగానే రైతు ఆ జల ప్రవాహాన్ని కొద్దిసేపు ఆపుతాడు చూచావా! అట్లా వసిష్ఠమహర్షి శ్రీరాముని అంతరంగ ప్రశాంతానుభవమును గమనించి తన వచనామృతాన్ని కొద్ది సేపు ఆపారు.

కొద్ది క్షణాలైన తరువాత శ్రీరాముడు చురుకైన, సుకుమారమైన తన కళ్ళు తెరచి చిరునవ్వుతో తన సంతృప్తిని ప్రకటిస్తూ తిరిగి వినటం కొనసాగిస్తున్నట్లు కళ్ళలో ఉత్సాహం ప్రకటించాడు. అది చూచి మహర్షి ప్రియశిష్యుని హృదయంలో బోధను సుస్థిరం చేసే ఉద్దేశంతో తన వాక్యములను కొనసాగించారు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! నీవు చక్కగా బోధింపబడి ఆత్మతత్త్వమును పొందావు. చాలా సంతోషం. అయితే అద్దాని నుండి చలించి, మరల సంసారంలో ప్రవేశించనేవద్దు సుమా!

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ సంసారచక్రం యొక్క పరిభ్రమణానికి అసలైన నాభిస్థానం ఏది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'సంకల్పించుట' అనునదే సంసారముయొక్క నాభిస్థానం. హృదయం రాగ ద్వేషములతో సంక్షుభితమై ఉన్నంతకాలం ఈ సంసారము యొక్క నాభి ఎంత ఆపటానికి ప్రయత్నించినా ఆగక తీవ్రవేగంగా తిరుగుతూనే ఉంటుంది. కాబట్టి ఈ సంసారచక్ర పరిభ్రమణం నిరోధించా లనుకుంటే ప్రజ్ఞ–సౌజన్య–శాస్త్రయుక్తమైన పురుషప్రయత్నం కావాలి. చిత్తమును మూర్ఖ కార్యక్రమముల నుండి విరమింపజేయాలి. అసదాత్మకమగు ఈ జగత్తు 'అంతానిజమే' అను రీతిగా అనుభవమవటానికి కారణం అజ్ఞానరూపమగు సంకల్ప పరిభ్రమణమేనయ్యా! 'సంకల్పించుట' అను స్వభావం చేత ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు శరీరమును ఆశ్రయించి, విషయవాసనలను కల్పించుకొని జన్మజన్మాంతర పరంపరలను పొందుచున్నాడు.

**శ్రీరాముడు :** చిత్ర పటంలోని రంగుల రేఖనమువలె ఈ దేహం కారణంగా జీవుడు అనేక సుఖదుఃఖములను నిరంతరం పొందుచూనే ఉన్నాడు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** అవును. అయితే, ఈ దేహము గురించి వగచవలసిన పనేమిటి? చిత్రంలోని శరీరంకంటే కూడా ఈ పాంచభౌతికశరీరం తుచ్ఛమైనది.

ఈ మాంసమయదేహం మనం ఎంతగా రక్షించాలని ప్రయత్నించినా కాలక్రమేణా శిథిలం కాక తప్పదు. అందుకనే, ఈ మాంసమయదేహం కంటే చిత్రపటంలోని మానవుడే నయమని చమత్కారంగా అంటూ ఉంటారు. ఇట్టి మాంసమయ దీర్ఘసంకల్ప శరీరములపట్ల విశ్వాసముగాని, అనురాగంగాని, నమ్మకంగాని ఏర్పరుచుకోవలసిన పనేమున్నది?

ఈ మాంసమయదేహం కంటే స్వప్నమయదేహమే కొంతనయం. ఎందుకంటే స్వప్నదేహం చాలా స్వల్పకాలికం కనుక, అది మాంసమయదేహము పొందేంతగా పెద్ద సంఖ్యలో సుఖదుఃఖములు పొందదేమో!

ఈ మాంసమయ శరీరమును జాగ్రత్తగా పరిశీలించి అర్థం చేసుకుంటే ఇది ఆత్మయొక్క సంకల్పబలం చేతనే నిలచి ఉంటోంది. ఇది వాస్తవానికి మిథ్యయే. మూఢులు మాత్రమే దీని గురించి వ్యర్థంగా దుఃఖం పొందుచున్నారు. నిద్ర పోయేవాని కల కరిగిపోతే నష్టం ఏముంటుంది? మెల్లకన్ను వానికి కనిపించే రెండవ చంద్రుడు కనిపించకుండాపోతే అతడు కోల్పేయేదేమున్నది? ఎండమావులలో నీరు తొలగితే అది విచారించవలసిన విషయమా? అట్లాగే రామా! "సంకల్ప మాత్రము, స్వభావ నశ్వరము – అగు ఈ మాంసమయదేహం వృద్ధి చెందినా నశించినా – దేహి లేక శరీరికి వచ్చే నష్టమేమీ లేదు'.. అనే దృఢభావం నీవు ఎల్లప్పుడూ కలిగి ఉండు.

కల చెదిరి మెళుకువ వస్తే, "కలలో మరణించాను. మెళకువలో జన్మించాను"... అని అనము కదా! వాస్తవానికి ఈ దేహసంబంధమైన జన్మ–జీవన్–మృత్యు–పునర్జన్మలు ఇంతమాత్రమే!

❖

**భూషితే దూషితే దేహే న హి కించిచ్చితః క్షతమ్ ।**
**న చిదస్తముపాయాతి నాత్మా చలతి రాఘవ ॥** (శ్లో 27, సర్గ 29)

నిజానికి ఈ శరీరం దూషించబడినా, భూషించబడినా చైతన్యమునకు అవి సంబంధించవు. ఆత్మ దేనికీ విచలితం కాదు.

స్వస్వరూపమగు బ్రహ్మమునకు వికృతి పొందే అవస్థయే ఉండదు. మరి ఈ దేహము క్షీణిస్తున్నప్పుడు ఆ 'క్షతి'దేనికి? గుండ్రంగా తిరిగే చక్రయంత్రాన్ని అధిరోహించినవానికి నాలుగు దిక్కులలోని వస్తువులన్నీ గిఱ్ఱున తిరుగుచున్నట్లు అగుపిస్తాయి చూచావా? ఆత్మస్వరూపుడగు ఈ జీవుడు 'మనస్సు' అనే చంచల స్వభావాన్ని అధిరోహించి "ఈ దేహంతో బాటే పుడుతున్నాను. దీని తోనే జీవిస్తున్నాను. ఇది వినష్టమైతే ఇక నా పని ఆఖరు" – అని భ్రమిస్తున్నాడు. నీవు మాత్రం ధీర బుద్ధి కలవాడవై, ఈ భ్రమలయందు కూలవద్దు.

సంకల్పమే ఈ దేహము యొక్క నిర్మాత. ఒకడు చీకట్లో త్రాడును చూసి 'పాము' అని అనుకుని అనేక భావవికారాలకు లోనయినట్లు, ఈ దేహము జీవునికి సద్వస్తువువలె భ్రమింపజేస్తోంది. ఇక ఈ శరీరంతో గాంచబడేవన్నీ భ్రమకాక మరేమౌతాయి? వీటి కర్తృత్వమే అసత్యమైనప్పుడు ఇక కార్యములుమాత్రం సత్యమెట్లా అవుతాయి? భ్రాంతి సమయంలో ఈ జగత్క్రియలందు పాల్గొనే ఈ దేహము సత్యమైనదానివలె గోచరిస్తోంది. ఏది ఏమైనా దీనికి స్వకీయమైన కర్తృత్వం లేదు. కర్తృత్వమునకు కారణం ఇచ్ఛ కదా! జడమగు ఈ దేహమునకు ఇచ్ఛ–అనిచ్ఛలు ఎక్కడుంటాయి?

అందుచేత 'ఈ జగత్తుకు కర్త అనువారెవ్వరూ లేరు' అని సిద్ధాంతీకరించబడింది. ప్రకంపన రహితమగు దీపము గదిలో జరిగే కార్యములకు సాక్షిమాత్రమే వెలయుచున్నది చూచావా? ఆత్మ సర్వదా "కేవలద్రష్ట" అయి వెలయుచున్నది. ఆకాశమున సూర్యభగవానుడు ఉండి నిర్లిప్తుడై, నిమిత్తమాత్రుడై దినకృత్యములకు కారణభూతుడగుచున్నట్లు నీవు కూడా ఆత్మత్వం సంతరించుకుని ఈ రాజ్యకార్యాదులకు నిమిత్తమాత్ర కారణుడవై ఉండుము. ఓ సర్వజనులారా! మీరంతా మీ కుంటుంబాది సర్వ కర్తవ్యములందు నిమిత్తమాత్రులై ఉండటం అలవర్చుకోండి.

❖❖❖

## 15. అహంకారమును ఎదుర్కొనేది ఎట్లా?

**శ్రీరాముడు :** తండ్రీ! ఈ అహంకారం ఎప్పటి నుండి ఎందుకు ఎక్కడినుండి వచ్చిపడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అసత్యము, శూన్యము అగు ఈ దేహగృహంలోకి ఎప్పుడో వచ్చి అహంకారం ప్రవేశించింది. బాలుడు తన అజ్ఞానంచే కల్పించుకొనిన 'బూచోడు'తో పోల్చతగిన ఈ అహంకార దేహాత్మస్వభావము ఎప్పుడు వచ్చి చేరిందో చెప్పలేం.

అయితే సాధుజనులగు జ్ఞానులు ఈ అహంకారభూతమును దగ్గిరకు రాకుండా చూచుకుంటూ ఉంటారు.

**అస్య మా భృత్యతాం గచ్ఛ త్వమహంకారదుర్మతేః ।**
**అస్య భృత్యతయా రామ నిరయః ప్రాప్యతే ఫలమ్ ॥** (శ్లో 40, సర్గ 29)

ఓ రామా! నీవు ఈ అహంకార భూతమునకు దాసుడవు కావద్దు. దానిని సేవించే వారికి అది మరల మరల నరకలోక దర్శనం చేయించగలదు సుమా!

మహాపురుషులగు జ్ఞానులు ఈ అహంకార మమకారములు అల్లంత దూరంగా ఉండగానే తమను సమీపిస్తున్నట్లు గుర్తిస్తున్నారు. గుర్తించగానే సమాధి-జ్ఞానయోగము మొదలైనవి ఆశ్రయించి తగు జాగ్రత్త పడతారు. ఆ రెండిటినీ పారద్రోలి, ఇక ఆపై ఈ సంసారశూన్యనగరమును చూచి ఏమాత్రం భీతి చెందరు. ఇక తదితర జీవులనేకులు ఈ శరీరగృహములలో నివసిస్తూ అనంతకోటి శరీరములను వినాశన మొనర్చుకొనుచున్నారు. ఎప్పటికప్పుడు 'ఈ శరీరమే నేను' అను బుద్ధిని పదిలపరుచుకుంటున్నారేగాని, అట్టి దోషబుద్ధిని విడవటానికి యత్నించరేం? ఇది ఎంత ఆశ్చర్యం! దీనికి కారణమేమిటో నేను చెప్పలేను. అట్టి మూర్ఖత్వం కొనసాగించుటే అన్ని అనర్థములకు మూల కారణమనుటలో ఏమాత్రం సందేహం లేదు.

**గ్రస్తే చిత్తపిశాచేన దేహసద్మని యే మృతాః ।**
**పిశాచస్యేవ యా బుద్ధిర్నాపిశాచస్య రాఘవ ॥** (శ్లో 45, సర్గ 29)

ఎవరైతే తమ చిత్తమును విడువకయే ఈ శరీరమును కోల్పోతారో వారి పిశాచబుద్ధి యథాతథంగా కొనసాగుతూనే ఉన్నది. ఓ సాధూ! అహంకార పిశాచ నివాసస్థానమగు ఈ దేహం పై విశ్వాసం కలిగి రోజులు గడిపేవాడు పిశాచంతో సమానుడే!

ఈ దేహగృహం శాశ్వతమైనది కాదు. ఈ విషయం ఎవరికి తెలియదు? తెలుసు. అయినా కూడా తగినంతగా పట్టించుకోవటం లేదే! ఏమి ఆశ్చర్యం!

కనుక, ఇంద్రియాల యొక్క, ఇంద్రియ విషయాల యొక్క నశ్వరత్వమును జ్ఞప్తియందు ఉంచుకుని నీవు అహంకారమును సంపూర్ణంగా విడచివేయి. ఆత్మవస్తువును ఆశ్రయించి ఉండు. అహంకారగ్రస్థులై నరకములకు పోదలచుకున్నవారిని కాపాడ గల బంధువు లెవరూ ఉండరు. అహంకారంతో కూడి ఏపని చేసినాసరే, అది విషాన్నంలాగా దుష్ఫలితాలనే ఇస్తుందని సర్వజనులకూ గుర్తు చేస్తున్నాను. ఏ జీవుడైతే వివేకవైరాగ్యములను త్యజించి అహంకారానికే పట్టం కడతాడో, అట్టివాడు అనేక విధముల నష్టం పొందటమే అవగలదని సర్వజీవుల శ్రేయోభిలాషులమగు మేం మునులం హెచ్చరిస్తున్నాం. వారు ఆయా చర్యలచే కాలాగ్నికి ఇంధనమగుచున్నారని వాత్సల్య భావంతో హెచ్చరిక చేస్తున్నాం. వారికి ఇహపరములలో సుఖం లేనేలేదు.

1. దేహతాదాత్మ్యము, 2. మనోచంచలత్వము... ఈ రెండే ఈ దేహ గృహంలో సంచరించే భూత పిశాచాలు సుమా! ఏ దేహకోటరంలో అహంకార సర్పం బుసలుకొడుతూ ఉంటుందో, అయ్యది శీఘ్రంగా దుఃఖమేఘములను ఆహ్వానిస్తోంది. తగు జాగ్రత్త వహించకుంటే వర్తమాన భవిష్యత్తులు ఈ జీవునకు దుర్భరం కానున్నాయని మా హెచ్చరిక.

**శ్రీరాముడు :** మరి మేము ఈ అహంకారమును ఎదుర్కొనేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ అహంకారం ఉంటే ఉండనీ! ఊడితే ఊడనీ. నీవుమాత్రం మనస్సుతో అహంకారం వైపుగా చూడనేవద్దు. అది లేనిదానిగా, నిష్ప్రయోజన మైనదానిగా భావించి

ఉదాసీనుడవగుము. దానిని లోలోన తిరస్కరించి, దానిని అసలు పట్టించుకోకపోతే, ఇక అది నిన్నేమీ చేయలేదు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ శరీరంలో 'చిత్తము' అనే పిశాచం ఉండి ఆత్మను కలుషితం చేస్తోంది కదా? ఎంతవిన్నా మేము ఈ చిత్తమును రహితం చేయలేకపోతున్నాం. ఏం చేయాలి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** శరీరగృహంలో 'చిత్తము' అనే పిశాచం ఉన్నప్పటికీ అనంతవిలాసుడగు ఆత్మకు కలుగగల దోషమేమీ లేదు. ఆకాశము సర్వే సర్వత్రా వ్యాపించి ఉండి భూ–అగ్ని–జల–వాయువులను తనయందు కలిగి ఉండి కూడా, వాటితో ఏమాత్రం సంబంధం లేకయే ఉంటోంది కదా! అట్లాగే ఆత్మయందు ఈ మనోచిత్త అహంకారాలు ఉన్నప్పటికీ ఆత్మకు వాటితో సంబంధం లేదు. చిత్తము యొక్క రూపం ఇష్టమే కదా! ఎవడైతే 'ఈ శరీరమే నేను– ఈ ఇంద్రియ విషయములు నాకు ముఖ్యము' అను చిత్తాహంకారములకు హృదయంలో పెత్తనం ఇచ్చి ఉంటాడో అట్టివాడు పడేపాట్లు నేను మాటలతో చెప్పలేను. 'హాఁ! నేను చచ్చాను. అయ్యో! నేను శరీరం తప్పించి గతిలేని వాడను. శరీరం ద్వారా ఏర్పడే సంబంధాలే వాస్తవం. నేను దుఃఖిని. ఒక జీవుడను. అల్పుడను' అని తలచటమే అహంకార– చిత్తముల విన్యాసం. అది గమనించి హృదయగృహంలో పెత్తనం ఆత్మభగవానునికి ఇవ్వాలి. 'నేను అసంగుడను, అప్రమేయుడను. నిత్యుడను. సర్వాత్మకుడను. శుద్ధుడను' అను ఆత్మస్వభావాన్ని ఆశ్రయించి ఉండాలి. ఆత్మకు మనోచిత్తాహంకారాది మరి దేనితోనూ సంబంధం లేదు. అనగా, 'నా స్వస్వరూపము మనోచిత్తహంకారాలు కావు' అను ధ్యానం కలిగి ఉంటే క్రమంగా ఈ చిత్త పిశాచం ఆటకట్టినట్లే.

శ్రీరామచంద్రా! ఈ జడము, అనివార్య వినాశన సమన్వితము, సర్పరజ్జువు వలె భ్రాంతి భూయిష్ఠము అగు శరీరమును గ్రహించేపని చేస్తున్నది అహంకారమేగాని, ఆత్మకాదు. ఎందుకంటే ఆత్మ సర్వదా నిష్క్రియమైనది. అది పుట్టదు, పెరగదు, ముదుసలి అవదు, చావదు. ఒక పెద్ద వృక్షం పుట్టి, పెరిగి నశించేది ఆకాశంలో అయినప్పటికీ, ఆ జన్మ – వృద్ధి – హాని లతో ఆకాశమునకు సంబంధం లేదుకదా! 'నేను సర్వదా దేనికీ సంబంధం లేని ఆత్మస్వరూపుడను' అని అనునిత్యం అభ్యసించాలి. అంతేగాని 'ఈ చిత్తం, ఈ అహంకారం ఉన్నాయే? ఏం చేయాలి? ఎట్లా తొలగించు కోవాలి?'... అని ఎంతగా పరితపించినా ఎన్ని జన్మలు ఆ విధంగా గడపినా లాభం లేదు. సంబంధం ఉండవలసిన అగత్యం లేనివాటితో సంబంధం పెట్టుకోవటమే చిత్తము యొక్క రూపం. అదే అహంకారం. అదే సంసారం.

దీపము తన యందు ఎట్టి ఇచ్ఛ లేకుండానే గదిలోని ఆయా వస్తువులను కనబడేట్లు ప్రకాశింపజేస్తోంది. అట్లే ఆత్మప్రకాశం చేతనే ఈ 'చిత్తము' అనేది రూపుదిద్దుకుని ప్రకాశమాన మవుతోంది. గదిలోని ప్రకాశమానమయ్యే వస్తువులకు – దీపమునకు సంబంధం లేదు కదా! జడ స్వరూపమగు ఈ చిత్తాహంకారాలకు – ఆత్మకు సంబంధం లేదు. భూమికి – ఆకాశమునకు ఏం సంబంధమయ్యా?

ఓ రఘునందనా! వాస్తవానికి నీవు సర్వజ్ఞమగు ఆత్మయే గాని మరింకేమీ కాదు. మరి నీవు ఈ చిత్తాహంకారాలను చూచి ఎందుకు మోహం చెందాలి? అట్టి మోహమును దగ్గిరకు రానీయకు. శూన్య స్వరూపమగు మనః పిశాచము ఆత్మను తాకనైనా లేదు. అయితే అది 'నేను ఆత్మను స్పృశిస్తున్నాను. సంతోషింపజేస్తున్నాను. దుఃఖింపజేస్తున్నాను'... అని మాత్రం అనుకుంటూ ఉంటుంది. అది 'రాజుగారికి నేను ఎంత చెపితే అంతే' అని సేవకుడు అనుకోవటం వంటిది.

సంసారకారి, ధైర్యమును నాశనం చేసేది, అమంగళకరము అగు ఈ చిత్తవిభాగాన్ని విడచిపెట్టి అప్పుడు శేషించేదేమిటో – అద్దానినే ఆశ్రయించి ఉండు.

ఓ సర్వసభికులారా! మరల మరొక్కసారి మీకందరికి గుర్తుచేస్తున్నాను. చిత్తపిశాచముచే ఆక్రమించబడిన అంతరంగం కలవారిని శాస్త్రములు గాని, గురూపదేశములు గాని, బంధుజనులు గాని, మరెవ్వరైనా గాని రక్షించలేరు.

ఇంద్రియ వ్యాపారముల పట్ల ఏర్పడే సత్యత్వబుద్ధి – ఆకర్షణలే చిత్తము యొక్క రూపం. కొంచెం బురదలో ఉన్న దున్నపోతునైతే బయట పడవేయవచ్చు గాని, లోతైన బురదలో ఇరుక్కుని ఉన్న దున్నపోతును లేవదీయటం తేలికైన పని కాదు కదా! ఇంద్రియ వ్యాపారాలలో లోతుగా మునిగి ఉన్న ధ్యాసగల వానిని సంబోధనల చేత ఎట్లా కాపాడటం? అదే కొంచెం ధ్యాసగల వానికో?... అట్టి ధ్యాస తగ్గుముఖం పట్టుచున్న వానికో?... శాస్త్రార్థములు సులభంగా చిత్తశమనం ప్రసాదించ గలుగుతాయి. అందుచేతనే శాస్త్రములు అనేక అభ్యాసములను ప్రతిపాదిస్తున్నాయి.

❖

చిత్తం జగత్తును కలచివేస్తోంది. ఈ దేహపురమును అజ్ఞానమయం చేసివేస్తోంది. అంతరంగం నందు చిత్తము బీభత్సపూర్వకమైన తాండవం చేస్తుంటే భయపడనివారెవ్వరు?

ఆహా! రామా! ఈ జగన్నగరంలో కొద్ది దేహగృహాలలో మాత్రమే చిత్తపిశాచం యజమానియగు ఆత్మకు అంకితమై ఉంటోంది. అందుచేత ఆ కొద్ది దేహగృహాలు సాధుత్వమునకు నివాస వసతులకు యోగ్యమై ఉంటున్నాయి. మిగతా జగత్తు చిత్త పిశాచమునకు మాత్రమే నివాసయోగ్యమౌతోంది. ఈ జగదరణ్యం అధికభాగం 'మోహము' అనే చెత్త కుప్పలచే నిండి ఉంటోంది.

కేవలం ధృతి పూర్వకమైన పురుష ప్రయత్నంచేతమాత్రమే మమకార – అహంకార భూతపిశాచములను పారద్రోలటం సాధ్యం.

నీవు మాత్రం అజ్ఞాన ఏనుగును సంహరించే సుజ్ఞాన సింహంలా ఈ సంసారారణ్యంలో విహరించు. అంతేగాని గడ్డిపోచలను తింటూ క్షణక్షణం భయముతో రోజులు గడిపే లేళ్ళలాగా విషయములను భక్షిస్తూ ఆయుష్షు వృథా చేసుకోకు. బంధుజనుల పట్ల ఏర్పడే మమకారాదుల వలన, విషయేచ్ఛల వలన ఏర్పడే ఆనందం అత్యంత క్షణికమాత్రమని గ్రహించు. ఇక దాని పరిణామమో, మహాభయ – దుఃఖ – భ్రాంతి. ఇది గమనించి, సాధుజనులమార్గమును అనుసరించు. మహార్థము (The final essence)ను విచారించు. ఆత్మను ఒక్కదానినే ఆశ్రయించు. అంతేగాని,

అపవిత్రము – తుచ్ఛము – దుర్భరము – క్షణభంగురము – దురాకృతిసమన్వితము అగు ఈ శరీరము కొరకై విషయసుఖములందు మునుగవద్దు. ఎందుకంటే అట్టి మార్గంలో 'చింత' అనే క్రూరమగు రాక్షసి పొంచి ఉండి, నీ జ్ఞానధనం మ్రింగి వేయటానికి ఎత్తులు వేస్తూ సిద్ధంగా ఉన్నది.

ఈ శరీరమును 'సంకల్పము' అను పేరుగల ఒకడు నిర్మించాడు... 'అహంకారము' అను మరొకడు వచ్చి దీనిని ఆశ్రయించాడు... 'మనస్సు' అను ఇంకొకడు ఇక్కడి సుఖదుఃఖములను అనుభవిస్తున్నాడు... ఈ మూర్ఖ సంసారచక్రం విచిత్రంగా పరిభ్రమిస్తోంది.

జీవులంతా ఇది ఎంతగానో గమనించవలసిన విషయం సుమా!

❖❖❖

# III. దేవతార్చన

# (శ్రీ సాంబశివ - వసిష్ఠ సంవాదము)

## 1 అర్చన-నిర్వచనం

**శ్రీవసిష్ఠ మహర్షి:** శిలకు ఘనత్వమే రూపమై ఉన్నది. మరింకేదీ (గుండ్రం, చదరం మొదలైనవి) అసలైన రూపం కాదు కదా! అట్లాగే ఆత్మకు చిత్, సత్తా సామాన్యము అనునవే రూపములై ఉంటున్నాయి. దేహములు, సుఖదుఃఖాది భోగములు, జగత్తు మొదలైనవి ఆత్మయొక్క రూపం కాదు.

పాషాణం నుండి పాషాణత్వం వేరు కాదు. ఘటం (కుండ) కంటే ఘటత్వం వేరు కాదు. అట్లాగే మనస్సు ఆత్మకంటే వేరు కాదు.

ఓ రామచంద్రా! ఒకప్పుడు కైలాసనాథుడు, భక్తవత్సలుడు అగు సాంబశివుడు ఈ విషయం గురించి, తత్త్వదర్శనము యొక్క ఉపాయం గురించి నాయొక్క సంసారదోష నివారణార్థం నాకు బోధించటం జరిగింది. 'మనస్సనేది ఆత్మ కంటే వేరుకాదు' అనేది సుస్పష్టపరుస్తూ మనోమార్గమైన దేవతార్చన అనే ఒక మహత్తరవిషయం సుబోధపరచారు. ఆ విషయములు ఇప్పుడు ప్రస్తావిస్తాను.

❖

స్వర్గలోకమునకు ఆవల 'కైలాసం' అనే పేరుగల ఒక పర్వతం ఉన్నది. అక్కడ అర్ధేందుశేఖరుడగు శివుడు జగన్మాత పార్వతితో కూడి ప్రమథగణసమేతుడై ఉంటూ ఉంటారు. నేనొకసారి శిష్యగణంతో ఆయనను పూజించటానికి కైలాసశిఖరం సమీపించాను. అక్కడ గంగానది ఒడ్డున ఒక ఆశ్రమం నిర్మించుకొని శివలింగం ప్రతిక్షేపించి ఇక రోజూ పూజించటం ప్రారంభించాను. తపోనియమములను అవలంబించి కొంతకాలం గడిపాను. ఆ సమయంలో సిద్ధ పురుషులు అక్కడకు వచ్చి నాకు తాత్త్విక విషయాలు విశదపరుస్తూ ఉండేవారు. శివతత్త్వం గురించిన సంభాషణతో ప్రశాంతంగాను, ఆనందంగాను, సువిజ్ఞానసమృద్ధంగాను రోజులు గడచిపోతూ ఉండేవి.

ఒకరోజు నా పూర్వకృతమైన పుణ్యం ఫలించింది. ఆ రోజు శ్రావణమాసం, కృష్ణపక్షం, అష్టమి తిథి. సాయంకాలం ప్రదోషకాలం గడచింది. నేను ఒకచోట ఆసీనుడై హృదయపూర్వకంగా శివభగవానుని స్మరిస్తూ ఉన్నాను.

అది సాయం సమయం దిక్కులన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. చీకటి క్రమంగా పరిసరాలన్నీ ఆక్రమించ వేయసాగింది. క్రమక్రమంగా జంతువులు తమతమ నివాసాలను జేరటం చేత ఏమాత్రం వాటి అలికిడి వినబడటం లేదు. ఆ పరిసర వాతావరణమంతా కాష్టంలాగా స్పందరహితంగా ఉంది.

నిమిషాలు మౌనంగా గడచిపోతున్నాయి. కళ్ళు మూసుకుని ఉన్న నన్ను, ఏదో తెల్లటి కిరణం తాకినట్లు అనిపించి కనులు తెరచాను. దూరంనుండి ఏదో తెల్లటి వెలుగు ఆ ప్రదేశాన్ని సమీపిస్తున్నట్లు గమనించాను. క్రమంగా దిక్కులు తేజఃపుంజములతో నిండి ప్రకాశించసాగాయి. కొంచెం చకితుడనై నిలబడి జ్ఞాన దృష్టితో నలువైపులా పరికించి చూచాను. ఆహా! పరమాశ్చర్యం!

భగవంతుడు, చంద్రకళాధరుడు, దేవాదిదేవుడు అగు మహాదేవుడు అమ్మ పార్వతీదేవి చేయి పట్టుకుని, నందీశ్వరుడు త్రోవ చూపుచుండగా, మేమున్న పర్వతసానువు వైపుగా వస్తున్నారు. నేను శిష్యులను ఉత్సాహపరచి అర్ఘ్యపాద్యములు, పుష్పాంజలులు తీసుకొని ఎదురేగాను. పాదపద్మాలకు సాష్టాంగ దండప్రణామాలు సమర్పించి కళ్ళకు హత్తుకుని జగత్‌మాతాపితరులను ఆశ్రమానికి భక్తిపూర్వకంగా గొనివచ్చాము. పుష్పాసనం సమర్పించాము. మందార పుష్పములతో అభిషేకించాము. బహువిధ స్తోత్ర పాఠములతో శాస్త్ర-భక్తియుక్తంగా పూజించాం. అట్టి స్తోత్రపూజలచే మా అందరి అంతఃకరణం సుశీతలమైంది.

అటు పై సుఖాసీనులై లోకరక్షకుడగు చంద్రశేఖరుడు అమృత వచనాలతో ఇట్లా ప్రశ్నించారు.

**శ్రీశివ భగవానుడు :** పుత్రా! వసిష్ఠా! నీవు, నీ శిష్యులు కుశలమే గదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** దేవేశ్వరా! సర్వలోకాధీశ్వరా! మహేశ్వరా! భవానీపతీ! త్రిలోచనా! మీ 'నామ స్మరణ' అనే మంగళప్రదమగు శుభకార్యమున నిమగ్నమైన వారికి ఇక దుష్ప్రాప్యమనేది ఏముంటుంది? నీ యెడ భక్తి గలవారికి ఇక భయం ఉండదు. సర్వ విధములా, సర్వదిక్కులా అభయమే! నీ అనుస్మరణానందమును గ్రోలు చిత్తము గలవారు అందరికీ పూజ్యాతిపూజ్యులౌతారు.

ఎచ్చట శివస్మరణ జరుగుతుందో – అదియే దేశము, అదియే జనపదము, అదియే పర్వతము. హే ప్రభో! నీ స్మరణయే పూర్వపుణ్యఫలము. వర్తమాన పుణ్యకర్మల అభివర్ధకము. భవిష్యత్ సుఖవృక్ష బీజకము. హే భూతపతీ! మిమ్ములను స్మరించటమంటే ధైర్యము – జ్ఞానము – మోక్షముల ప్రాకారం సమీపించటమే అవుతుంది. మిమ్ములను పూజించటమనే చింతామణి దొరకటానికి నేను ఎంతటి పుణ్యం చేసి ఉంటానో!

**శ్రీశివ భగవానుడు :** చాలా సంతోషం నాయనా! మరి... నీ చిత్తము శాంతిని పొంది పరమపదమున సుస్థిరం మంగళప్రదం అయి ఉంటోంది కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే భగవాన్! మీ దయ వల్ల దిక్కులన్నీ పూర్ణమై శాంతమై శివమై కన్పట్టుచున్నాయి.

**శ్రీశివ భగవానుడు :** మంచిది. ఇప్పుడు నీకేమైనా సంశయాలుగాని, ఏమైనా తెలుసుకోవాలని గాని ఉన్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే పరంధామా! నాకు ఒక్క విషయంలో మీ ప్రవచనం వినాలని ఉన్నది. ఆ విషయం మీ ముందు ప్రస్తావిస్తాను. నాపై దయతో నాకు వివరించమని ప్రార్థిస్తున్నాను–

"ఉద్విగ్నరహితము, పాపక్షయకరము, సర్వకళ్యాణవర్ధకము అనునిత్యాచరణకు సులభాతి సులభం అగు ఒకానొక 'దేవతార్చనావిధానం' గురించి శ్రీశివ భగవానుడే విశదీకరించగల సమర్థులు'

అని మునిలోకంలో ఒకానొక ప్రతీతి ఉన్నది. ఈ సందర్భంలో నా మనస్సులో ఆ విషయం తళుక్కు మని మెరిసింది. ఆ దేవతార్చన (లేక) పూజా విధానం గురించి మీ నుండి తెలుసుకోవాలని ఉన్నది. నాకు, మీ బిడ్డలగు ఈ నా శిష్యులకు ఆ దేవతార్చన గురించి ప్రవచించమని విన్నపం చేస్తున్నాను.

**శ్రీశివ భగవానుడు:** బిడ్డా! చాలా ఉచితమైన విషయమే అడిగావు. జీవునకు ముక్తి ప్రసాదించగల ఒకానొక ఉత్తమమైన అర్చన గురించి చెపుతాను. బుద్ధి కుశలత, భక్తి ప్రపత్తులు గల నీవు, నీ శిష్యులు అందుకు తప్పక అర్హులు.

❖

'దేవతార్చన అంటే ఏమిటి? 'దేవుని అర్చించుట' అని కదా! దేవతార్చనకు ఉపక్రమించే ముందు "దేవుడు అనగా ఎవ్వరు? ఎక్కడున్నాడు?" అనే విషయం తెలుసుకోవాలి. అది తెలుసుకోకపోతే అర్చన యొక్క ఉత్తమప్రయోజనం లభించదు.

'దేవుడు' అనగా ఎవరు? పుండరీకాక్షుడగు విష్ణువా? త్రిలోచనుడగు శివుడా? కమల సంభవుడగు బ్రహ్మయా? వాయువా? సూర్యచంద్రులా? అగ్నియా? నీరా? బ్రాహ్మణ క్షత్రియులా?...

అద్వితీయమగు దేవత వీరెవ్వరూ కారు. మనం ఇద్దరం కూడా కాదు. లక్ష్మి – సరస్వతి – పార్వతి నామ రూపములు కాదు. దేహ–చిత్త రూపము ఒప్పువారెవ్వరూ కాదు.

ఇక సత్యమగు దేవత ఎవరంటావా?... విను.

అకృత్రిమమై, ఆద్యంతరహితమై, నామ–రూప–దేశ–కాలములచే పరిమితము కానిదై, స్వస్వరూపమునకు వేరుగా లేక, కేవల సం–విత్ స్వరూపమైనదేదో ...అదియే 'దేవతార్చన' యందు 'దేవత' అని గ్రహించు.

వత్సా! వసిష్ఠా! ఆకారాదులతో కూడి, పరిచ్ఛిన్నమగు, పరిమితమైన దానియందు అత్యుత్తమమగు దేవతాభావం ఎట్లా కుదురుతుంది? సర్వులయందు, సర్వమునందూ సర్వదా ఏర్పడి ఉన్న చైతన్యమే 'దేవత' అను శబ్దముచే ఉద్దేశించబడి, పూజార్హమవుతోంది. సర్వరూపములు తానై ఉన్న ఆ చైతన్యము మాత్రమే వాస్తవమగు సత్తచే ఒప్పారుచున్నది. ఇక తదితరములన్నీ ఆత్మస్వరూపమునందు విరాజిల్లు చున్నాయి. ఆ మంగళమయ తత్త్వమును గ్రహించలేని బాలుర వంటివారి కొరకై కల్పిత దేవత యొక్క అర్చన విధించబడింది. పదిమైళ్ళు వెళ్ళవలసిన వానికి ఒక మైలు వరకూ నడవటానికి పనికి వచ్చే ఉపాయాలు విభజించి బోధిస్తున్నట్లు... మధ్యే మార్గంగా రుద్రుడు మొదలైన దేవతల ఉపాసన దైవజ్ఞులచే, పురాణములచే అందించబడుచున్నాయి.

**ఇయత్తాది పరిచ్ఛిన్నం రుద్రాదేః ప్రాప్యతే ఫలమ్ ।**
**అకృత్రిమమ్–అనాద్యన్తం ఫలమ్ ఆనంద ఆత్మనః ॥**

రుద్రుడు మొదలైన నామరూపములతో కూడిన దేవతల ఉపాసన వలన లభించే ఫలితం పరిచ్ఛిన్నమైనది. అది కొంతదృష్టివరకే పరిగణకు యోగ్యం. అయితే, అది, "సర్వాంతర్యామి–సర్వతత్వ స్వరూపుడు" అగు పరమాత్మ యొక్క ఉపాసనకు దారితీసినప్పుడే ఉపాసన యొక్క

ఆశయం సిద్ధించినట్లు. (పరమ్+ఆత్మ = ప్రతిజీవుని యొక్క – ఈ జగన్నాటకములోని పాత్రలకు ఆవల ఉన్నట్టి నిజస్వస్వరూపం)

అపరిచ్ఛిన్నమగు ఆత్మదేవోపాసనవలన లభించే ఆనందం అకృత్రిమము, అనాది, అనంతం, శాశ్వతం కూడా. అకృత్రిమమగు స్వస్వరూపానందముగాక ఏదో కృత్రిమఫలితమును పొందగోరి ఉపాసనకు ఉపక్రమించే వాడు ఆహ్లాదకరమగు మందారపూదోటను వదలి ముళ్ళపొదలవైపు దృష్టి సారిస్తున్నట్లే. వారు అనవసర, నిష్కారణ క్లేశములు ఆహ్వానిస్తున్నట్లే.

పూజ్యవిషయం చక్కగా గ్రహించిన బ్రహ్మజ్ఞులు నిర్మలుడు, మంగళమయుడు, చిన్మాత్ర స్వరూపుడు అగు ఆత్మభగవానునే అర్చిస్తున్నారు, వారి ప్రధానమైన పుష్పాలు ఏమిటో తెలుసా?...

1. సర్వసమత్వము... 2. శాంతి... 3. బోధ.

**శమ బోధాదిభిః పుష్పైః దేవ ఆత్మాయదర్చ్యతే ।**
**తత్తు దేవార్చనం విద్ధి, న ఆకారార్చనమర్చనమ్ ॥** (శ్లో 128, సర్గ 29)

వత్సా! ఈ మూడు పుష్పాలతో అన్నిరూపులా అంతయూ నిండి ఉన్న ఆత్మదేవుని అర్చించటమే నిజమైన అర్చనగాని, ఏదో ఒక ఆకారాన్ని తీసుకుని భౌతికమైన పుష్పాలతో పూజించటం నిజమైన పూజ కాదు. పూజారహస్యం ఎరిగినవారు బోధ–శాంతి–సమత్వ పుష్పములచే దేశ–కాల–నిమిత్తములను పట్టించుకోకుండా సర్వదా అనుక్షణ–అకృత్రిమ పూజ కొనసాగిస్తున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** తత్త్వము, ఆమూలాగ్రం గ్రహించిన వారిలో కొందరు సమాధినుండి లేచిన తరువాత సాకారమును అర్చిస్తున్నారు కదా! స్వామీ! దానికి ఏదైనా ప్రత్యేక కారణం ఉన్నదా?

**శ్రీశివ భగవానుడు :** చిన్నపిల్లలు ఆనందం కొరకే ఆటలు ఆడుకుంటారుగాని ఏదో కృత్రిమమైన ప్రయోజనం ఆశించి కాదు కదా! ఆ రీతిగా కొందరు మహనీయులు సమాధి నుండి విడివడినప్పుడు సాకారమును అర్చించటం జరుగుతోంది. అయినా కూడా, ఆ మాత్రానికి 'నిరాకారుడు, మంగళ మయుడు, పరమకారణుడు' అగు ఆత్మయే వారికి పూజ్యవస్తువు కాకుండాపోవుట లేదు. అట్టి నిరాకార పరబ్రహ్మమును ఉద్దేశించి సంజ్ఞగా సాకారమును వారు అర్చిస్తున్నారని నీవు గ్రహించు. అందుచేత పరమకారణమగు ఆత్మయే నిజమైన దేవత.

అట్టి ఆత్మ దేవతను జ్ఞానార్చనతో అనంతరం పూజించాలి. ఆత్మపూజయే ముఖ్యమగు పూజ. ఆయన గాక మరి పూజ్యులెవరూ లేరు.

అవ్యయ చిదాకాశమగు బ్రహ్మమే జీవభావముపొంది ఈ సకల జీవులుగా ప్రకాశిస్తోందని గ్రహించి అటుపై ఆత్మార్చన నిర్వర్తించు. ఆత్మార్చకులకు ఈ కనబడే దృశ్యమంతా ఆత్మదైవమే! సకల ద్రష్టలు ఆత్మసంప్రదర్శనమే!

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**చిద్వ్యోమైవ కిలాస్తీహ పారావారవివర్జితమ్ ।**
**సర్వత్రాసంభవచ్చేత్యం యత్కల్పాన్తేఽవశిష్యతే ॥** (శ్లో 134, సర్గ 29)

ప్రభూ! చిదాకాశరూపియగు ఆత్మభగవానుడు ఈ జగద్భావమును, జీవభావమును ఎట్లా పొందుచున్నాడో, ఆ క్రమమును తెలియజేయ ప్రార్థన.

**శ్రీశివ భగవానుడు :** పారావారవర్జితము (That which does not have limitation) అగు చిదాకాశమొక్కటే వెలయుచున్నది. దానికి పుట్టుకగాని, పరిణామముగాని అసంభవమైయున్నది.

కల్పాదిలో ఉన్నదదే! ఈ ఈ కల్పనా వర్తమానంలో కూడా క్రీడిస్తున్నది అదే! కల్పాంతము నందు మిగిలేది కూడా అది మాత్రమే!

సూర్యకాంతి నలువైపులా ప్రసరిస్తూ ఉండగా 'తీవ్రమైన కాంతి – సగం వెలుగు – క్రీనీడ–నీడ' ఏర్పడుతూ ఉంటాయి చూచావా? అట్లాగే అపరిచ్ఛిన్నమగు చిదాకాశం 'మాయ' అను మార్గమున స్పందించుచుండగా త్రిగుణసమన్వితమగు ఈ జగత్తు రూపమున ప్రకాశిస్తోంది. స్వప్నంలోని నగరంలా భాసించే ఈ జగత్తు చిద్రూపమునందే భ్రాంతి చేత అనుభవమవటం జరుగుతోంది.

విచారించి చూస్తే ఈ జగత్తుకు మూలమే కనిపించదు. నిర్మలమగు ఆత్మ ఒక్కటే సర్వదా ఏర్పడి ఉంటోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే భగవాన్! చైతన్యము జీవరూపమును ధరించి మరల మరొకప్పుడు స్వస్వరూపమును గాంచుచున్నదని అనవచ్చునా?

**శ్రీశివ భగవానుడు :** అట్లా చెప్పటానికి కూడా వీలులేదు. ఎందుకంటే స్వభావసిద్ధంగానే అద్వయము, అపరిణామియగు ఆత్మవస్తువు అస్వభావమగు జీవత్వం పొందటమేమిటి? ఇక ఈ జగత్తు ఎక్కడిది అంటావా? చూచువాడు స్వయంగా సంకల్పించు 'మాయావరణ' వల్లే ఇయ్యది జగత్తుగా తోచటం జరుగుతోంది. ఇంత కన్నా వేరే విశేషం ఇక్కడేదీ లేదు. కనుక ఈ జగత్తు అనబడేది వాస్తవానికి అపరిణామియగు చిదాకాశమే అయి ఉన్నది. ఇందు అన్యభావానికి తావే లేదు. కనుక ఈ పర్వతములు, జీవులు, పంచభూతములు మొదలైన భేదవికారమంతా చిన్మాత్రమేనని గ్రహించు.

సర్గ ప్రారంభం నుండి పర్యవలోకించి చూడు. ఈ స్వర్గ – మర్త్య – పాతాళ లోకాదులలో చైతన్యముగాక మరింకేదైనా కలదా చెప్పు?

ద్వైతజగత్తు స్వప్నము వలె 'మాయ', లేక, 'స్వకీయకల్పనావ్యాసంగము' వలననే అనుభవించ బడుతోంది. తత్త్వదృష్టితో పరికించి చూస్తే, చిదాకాశమే 'జగత్తు– చిత్తము – ఆత్మ – నీవు – నేను' అను రూపములుగా అనుభవమౌతోంది. ఏదైతే ద్వితీయంగా జగత్తురూపమున కనిపిస్తోందో, అదంతా చిదాకాశంకాక మరింకేమీ కాదని గ్రహించు. ఆ చిదాకాశము స్వప్నస్వప్నమున ఎట్లు గోచరిస్తోందో, ఈ జాగ్రత్‌స్వప్నమునకూడా అట్లే గోచరిస్తోంది. చిదాకాశమును తీసివేస్తే కలకనేవాడు లేని కలలా, చూచేవాడు లేని జగత్తులాగా మరింకేమీ మిగలదు. అనగా చిదాకాశమే లేకుంటే ఏదీ ఉండదు. ఏదీ ఏర్పడదు. చూచేవాడు లేకుండా చూడబడేది ఎక్కడైనా ఉంటుందా? ప్రతిజీవుడు చిదాకాశస్వరూపుడే!

ఈ 'జగత్తు' అని పిలువబడేదంతా నిశ్శేషంగా చిదాకాశమే. అదియే చిన్మాత్రము అగు బ్రహ్మము. అదియే నీ యొక్క, నా యొక్క, పురుగు నుంచి బ్రహ్మదేవుని వరకు గల సర్వజీవుల యొక్క వాస్తవ స్వరూపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే అంబాసమేతుడువగు సాంబశివా! ఈ జగత్తులు ఎక్కడి నుండి ఏర్పడుచున్నాయి?

**శ్రీశివ భగవానుడు :** ఆ పరమాకాశము, లేక, చిదాకాశమునుండే సంకల్పబలంచేత ఈ జగత్తులు లేచి, బ్రహ్మమును ద్వైతరూపమున గోచరింపజేస్తున్నాయి. కాబట్టి నీకు ఏదైతే జగద్రూపంగా గోచరించటం జరుగుతోందో – అదంతా 'స్వస్వరూప–చిదాకాశమున భావనామాత్రంగా ఏర్పడుచున్న స్వప్నం' అని గుర్తెరుగుము. ఒకని స్వప్నంలో కనిపించే కుండ, వస్త్రము, వ్యక్తులు–అన్నీ కూడా ఆ స్వప్నద్రష్ట యొక్క స్వరూపం గాక మరింకేమిటి? జాగ్రత్తు కూడా జాగ్రత్ద్రష్టయొక్క స్వరూపం తప్పితే మరింకేమీ కాదయ్యా! ఒకడు తన స్వప్నంలో హావ–భావాలు కల్పించుకొని ప్రేమ–కోప–తాపాలు అస్వాదిస్తున్నట్లుగానే,–జాగ్రత్తులోకూడా, స్వీయకల్పనా పూర్వకంగా ప్రేమ–కోపము–తాపము–ఇత్యాది విశేషాలన్నీ ఆస్వాదిస్తున్నాడు.

కనుక మహర్షీ! మరొక్కసారి చెప్పుచున్నాను. ఇక్కడ అగుపించే సృష్టి విశేషాలు, త్రికాలానుగత మగు భావాభావపదార్థములు, దేశకాలాలు, చిత్తం మొదలైనవన్నీ చైతన్యం మాత్రమే. వేదోపనిషత్తులచే పరమార్థ సత్యముగా నిర్దేశింపబడి, నిరూపించబడిన ఆత్మ చైతన్యమే 'నీవు' రూపియు, 'నేను' రూపియు 'జగత్తు' రూపియు అయి ఉన్నదని గ్రహించు. చిదానందమగు శివతత్త్వమే అంతటా, అన్ని వేళలా వెలయుచున్నది.

అట్టి సర్వాత్మకుడగు చిదాత్మయే పరమ పూజ్యమగు దేవత. అంతేగాని, ఒక్క నామమో, రూపమో పరమపూజ్యమెట్లా అవుతుంది? చెప్పు?

**సర్వస్య వస్తుజాతస్య జగతో అన్యస్య, తే, మమ,**
**దేహోహి చేతనాకాశం, పరమాత్మైవ, నేఽతరమ్ ॥**

ఆ పరమపూజ్యమగు చిదాకాశమే నాయొక్క తదితరుల యొక్క దృష్టికి కనబడే జగత్తులలోని సర్వశరీరముల మూలరూపం. అతడిని విడచి వీటికి వేటికీ స్వరూపమే ఉండదు. వత్సా! స్వప్నము సంకల్పముల రూపమేకదా! కలలో కనిపించిన నగరానికి వేరే రూపం ఎక్కడున్నది? సృష్ట్యాది నుండి ఇప్పటిదాకా, ఇకముందు ఏర్పడే రూపములన్నిటికీ, వచ్చిపోయే సర్వ వస్తుజాలములకు చిదాకాశముకాక, వేరే రూపమే లేదు. ఏ నామ రూపాలు నీకు అగుపిస్తున్నాయో, అవన్నీ కల్పిత మాత్రములు. ఆపాదిత మాత్రములు.

❖❖❖

# 2. సర్వమయ మహాచిత్

**ఏవం సర్వమిదం విశ్వం పమాత్మైవ కేవలమ్ ।**
**బ్రహ్మైవ పరమాకాశమ్ ఏష దేవః పరః స్మృతః ॥**
**తదేతత్ పూజనం శ్రేయన్ తస్మాత్ సర్వమవాప్యతే ॥**

**శ్రీశివ భగవానుడు:** బిడ్డా! వింటున్నావా? ఈ విధంగా ఈ విశ్వమంతా కేవలం పరమాత్మస్వరూపమై వెలయుచున్నది. పరమాకాశమగు ఆ పరబ్రహ్మమే 'దైవము' అని జనులచే సంబోధించబడుచున్నది. ఆ దేవత పూజ ఒక్కటే సర్వ మంగళకరము. ఆ దేవతయే అన్నిటికీ ఆధారభూతమై వెలుగొందుతోంది. అందుచేత అట్టి పూజ వలన లభించనిదంటూ ఏదీ ఉండదు. ఆ దేవతాపూజకు బాహ్య సాధనములేవీ అక్కర్లేదు. అందువల్ల కలిగే తెంపులేని సుఖంతో పోల్చతగ్గది మరేదీ లేదు.

నాయనా! నీవు ప్రబుద్ధుడవైనావు. తత్త్వజ్ఞానం సముపార్జించావు. సప్తఋషులలో ఒకడవు అగు నీవు ఎంతటి జ్ఞానసంపన్నుడవో నాకు తెలుసు. అందుచేత నీకు, నీ ద్వారా అనేకమంది ముముక్షువులకు అతిరహస్యమైన ఆత్మదేవతార్చనను స్పష్టీకరిస్తున్నాను. విను.

ఆ పరదేవతను పూజించటానికి ఈ పుష్ప – దీప – నైవేద్యములతో పనిలేదు.

**అవ్యుత్పన్నధియో యే హి బాలపేలవచేతసః ।**
**కృతిమార్చామయం తేషాం దేవార్చనముదాహృతమ్ ॥** (శ్లో 5, సర్గ 29)

ఈ కృత్రిమ పుష్పపూజ అనేది సత్యబుద్ధి పూర్తిగా వికసించని, బాలురవంటి అమాయక చిత్తము గలవారికి, అంతరంగంలో దృశ్యవిషయాలపై అభినివేశం కొనసాగుచున్నవారికి, తత్త్వమేమిటో పూర్తిగా తెలియనివారి కొరకు ఆత్మజ్ఞులచే-శాస్త్రములచే విధించబడుతోంది. తత్త్వజ్ఞానంచే శమదమాది గుణాలు ఇంకా అలవడవలసి ఉన్నవారిని సన్మార్గపరులుగా చేయటానికి దీప-ధూప-పుష్పాలు సమర్పించటం, మూర్తిని కల్పనచేయటం, భౌతిక వస్తువులతో దేవతార్చన మొదలైనవి ప్రారంభదశలో రచించి శాస్త్రములు అందిస్తున్నాయి. సాధక జనులు మధ్యేమార్గంగా ధూప-పుష్పాదులతో మూర్తిని పూజిస్తున్నారు. అది మంచిదే. అయితే అంతటితో సంతసించి ఊరుకోవడం సరికాదు. అసలు విషయమేమిటో వారు తెలుసుకోవాలి. నిజకల్పిత వస్తువులతో భౌతిక పూజచేసి, ఆపై పరమోన్నతమగు సత్యవస్తువు గురించి విచారణ చేయకుండా... కేవలం స్వప్నతుల్యం, మిథ్యామాత్రం అగు స్వర్గలోకం మొదలైనవి లభిస్తే మాత్రం, ఆ ఫలాలతో తృప్తి చెందితే ఎట్లా? కల్పిత పూజచే కల్పిత ఫలములు పొందినంత మాత్రం చేత అసంతృప్తిరహితమైన స్థానం ప్రాప్తించుటలేదు. అందుకే, పూజ్యితమైనదేదై ఉన్నదో, అద్దాని గురించి సుస్పష్టమైన అవగాహన అత్యావశ్యకం.

❖

**దైవము –** ఓ జ్ఞాన శ్రేష్ఠా! నిన్ను బోలిన తత్త్వజ్ఞులు చేయ తగిన పూజ ఏమిటో చెపుతున్నాను. విను. ఏ దేవుని గురించి నేను చెప్పుచున్నానో, ఆతడు మాకు కూడా 'ఆది'.

అయితే అతడు ఎక్కడో కనబడనిచోట లేదు. ఈ త్రిభువనములకు ఎవదు సర్వదా ఆధారభూతుడై ఉన్నాడో అతడే ఆ పరమాత్మ. అతడు సర్వసంకల్పములకూ ఆవల అప్రమేయుడై సర్వజీవుల యందు, సర్వము నందు ప్రకాశిస్తున్నాడు. అయినా కూడా, సర్వసంకల్పములకూ ప్రారంభమూ, ఆధారమూ, స్థానమూ ఆతడే!

ఆతడు మంగళమయుడు. సర్వమూ శుభప్రదం చేస్తున్నాడు. సర్వమూ అయినా కూడా ఏదీ కాకుండానే ఉంటున్నాడు. సర్వకార్యములనూ ప్రకాశింపజేసేది ఆతడే. ఈ దిక్కులచే, కాలముచే ఆతడు పరిచ్ఛిన్నుడు కాడు. ఆ నిర్మల – చిన్మాత్ర – సర్వరూప – రూపరహితమూర్తియే 'దైవము' అను శబ్దముచే శాస్త్రాదులచే చెప్పబడుచున్నాడని గ్రహించు. ఈ నామ రూపాదులన్నీ అందుకు ప్రతీక మాత్రమేనని మరువకూడదు.

ఆ చైతన్యం సర్వఫలాలకూ అతీతమై, అన్నిటా ప్రకాశించుచున్నది. అన్నిటికీ సృష్టి–స్థితి–లయాలకు కారణమై సర్వదా నిష్క్రియమై వెలుగొందుచున్నది. ఆయనకే 'పరమాత్మ' అనే బిరుదు ఉన్నది. ఆయన భావ–అభావముల మధ్య వెలుగొందుచుండు 'బ్రహ్మము' అని కూడా చెప్పబడుతోంది. 'ఓం' 'తత్' 'సత్' 'మహాసత్' స్వభావముచే సర్వత్రా సముడై వెలయుచున్నాడు. 'మహాచిత్' అను పరమార్థముతో కూడిన శబ్దార్థములచే గూడా చెప్పబడుచున్నాడు. లత యందు రసము సర్వత్రా ఏర్పడి ఉన్నట్లు, ఆతని తత్త్వము సత్తా సామాన్యరూపమున, లేక మహాసత్తరూపమున సర్వేసర్వత్రా అనుశ్రుతమై జాజ్వల్యమానంగా వెలుగొందుచున్నది. ఓ పాపరహితుడగు వసిష్ఠ మహర్షీ! నీయందు, నీ ధర్మపత్నియగు ఈ అరుంధతి యందు, నా యందు, ఈ పార్వతి యందు, ప్రమథగణము నందు, నీ శిష్యులందరి యందు సమముగా వెలుగొందుచున్నది ఆ ఆత్మదేవత యొక్క మహాచిత్ తత్త్వమేనయ్యా! ఉత్తమబుద్ధులగు తత్త్వవేత్తలు 'దేవుదు' అని నిర్దేశించి శ్లాఘించుచున్నది ఆయననే! అంతేగాని, హస్తపాదాదులతో కూడిన ఒక ఆకారము దేవదేవుడెట్లా అవుతాడు? ఆ ఆకారంలో కూడా మహాచిత్ యొక్క ప్రత్యక్షమే ఆరాధించబడుచున్నదని జ్ఞప్తియందుండు గాక! ప్రతీకతో తన్మయులై ముఖ్యోద్దేశమును ఏమరుచుట ఉచితమా? కాదు. ఈ సంసారసారం కూడా ఆ చిత్‌తత్త్వమే. 'అహం' రూపియగు ఆ మహాచిత్ తత్త్వము నుండే అన్నీ కూడా లభిస్తున్నాయి గనుక, అదియే సర్వమయమగు దేవత.

**చిదానందస్వరూపుడు –** ఓ బ్రహ్మజ్ఞా! మహాచిదానంద స్వరూపుడగు ఆ పరమాత్మ ఎక్కడో దూరంగా ఉన్నాడని అనుకోనేవద్దు. అది దుష్ప్రాప్యవస్తువు కాదు. ఎందుకంటే మన సర్వదేహము లందు, ఆకాశమునందు కూడా విరాజిల్లుచున్నది ఆయనే. ఆయన యొక్క 'చిత్' అను మహిమయే ఈ కార్యములన్నీ ఒనర్చుచున్నది. ఆయన ఆయారూపములతో భోజన – పాన – పాలన – గమన – నిశ్వసన – జ్ఞానాది కృత్యములు ఒకవైపు ఒనర్చుచూనే వాస్తవానికి ఏదీ చేయకయే ఉన్నాడు. ఇదిగో, విచిత్ర చేష్టలు చేస్తూ ప్రవర్తిస్తున్న ఈ దేహమును చూచావా? ఈ దేహపురి కూడా అతని ఉనికి చేతనే, అతని ఉద్దేశానుసారమే ప్రవర్తించగలుగుతోంది. అతడు ఇందులో (అన్నమయ –

ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందమయములు అనబడే) పంచకోశ సమన్వితుడై బుద్ధి అనే గుహకు మహేశ్వరుడై, రాజాధిరాజై వెలుగొందుచున్నాడు.

అతడు వాక్–మనస్సులకు అతీతుడు. అయితే, ఆ రెండిటినీ వెలిగించుచున్నది ఆతడే! అతడు మనోవాక్కులకు నామరూపములకు ఆవల ఉన్నవాడు. అయినా కూడా సద్గురువరేణ్యులు తమ శిష్యులకు బోధించటానికి 6వ ఇంద్రియమైన మనస్సుకు కూడా అతీతుడు, నిర్మలుడు అయిన ఆ ఆత్మదేవునకు "చిత్ " అనే సంజ్ఞ ఇస్తున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ ఆత్మభగవానుని గ్రహించటానికి మరికొన్ని విశేషాలు చెప్పండి?

**శ్రీశివ భగవానుడు :** అతడు చిన్మయుడు. అన్నిటి కంటే సూక్ష్ముడు. సర్వవ్యాపి. నిర్లేపుడు. ఈ కనబడే రూపాలన్నింటినీ ప్రకాశింపజేయుచూ, సర్వదీపాలలో వెలుగొందుచున్న అగ్ని వలె వెలుగొందుచున్న వాడు తానే' అయి కూడా, సదా సర్వదా నిష్క్రియుడు. అత్యంత నిర్మల చిద్వస్తువగు ఆతడే జగత్సిద్ధికై జగత్క్రియలన్నీ ఒనర్చుచున్నాడు. ఆయన నుండి 'చైతన్యస్ఫూర్తి' అనే సుందరశక్తి వెలువడి నానావిధ రూప భేదములను ఒనర్చుచూ సర్వవిధ భావ–అర్థములను ప్రకటిస్తోంది. ఆయనచే భావకల్పన చేయబడే అనేక విభేదములలో ఒకదానిపేరు ఆకాశము. మరొకదాని పేరు జీవుడు. అట్లాగే చిత్తు, కల, చిత్తము, క్రియ, ద్రవ్యము – వగైరా కూడా. ఆయన అనుభవ వైచిత్ర్యమును అనుసరించే భావన, వికారము, ప్రకాశము, శైలము, తమస్సు, చంద్రుడు, ఇంద్రుడు, యక్షుడు – మొదలైనవి రూపు దిద్దుకుంటున్నాయి. వసంతకాలం ఇచ్ఛారహితంగానే చెట్లను చిగురింపజేయటం లేదా? ఇదంతా కూడా అట్టిదే.

నిజానికి ఈ మూడు లోకాలలో 'చిత్' తప్పించి ఇంకేమున్నది? చిత్‌యే ఆత్మభగవానుని శరీరం. (చిత్=ఎఱుక, ఉద్దేశము) చిద్రూపియగు ఆ ఈశ్వరుడు 'శరీరములు' అనే బురద ప్రదేశంలో సంచారం చేస్తూ 'చిత్తభ్రమలు' అనే సంకల్పపూర్వకమైన మధువును ఆస్వాదిస్తున్నాడు. నదీజలంలో సుడులు ఉన్నట్లు ఆయన యొక్క చిత్ ప్రపంచంలో ఈ దేవ – మనుష్య – రాక్షస – జంతు ఉపాధులు ఉంటున్నాయి. ఈ జగత్తులన్నీ చిత్‌సత్త నుండే ప్రవహిస్తున్నాయి.

అత్యంతభ్రమలు కలుగజేసే ఈ సంసారమంతా ఆ చిత్ చక్రమున పడి తిరుగాడుతోంది. చిత్తమయములు, బంధహేతువులు అగు కర్తృత్వ – భోక్తృత్వములే సంసార చలనము సుమా!

మేఘములు వచ్చి సూర్య తాపమును పారద్రోలునట్లు ఆ చైతన్యమే చతుర్భుజవిష్ణురూపమును ధరించి శంఖ–చక్ర–గదాధారి అయి అసురులను వధిస్తోంది. వృషభవాహనుడు, త్రినేత్రుడు, చంద్రశేఖరుడు అయి రుద్రరూపమున ఈ గౌరితో కూడి లోకములకు శుభములు చేకూరుస్తోంది. చిద్ధ్యానము రూపంలో విష్ణుమూర్తి నాభికమలంలో జన్మించి వేదములు ధరించి బ్రహ్మగా రూపు దాలుస్తోంది. చెట్టుకు పూలు, కాయలు, ఆకులు కాస్తున్నట్లు అద్దానికే అనంత శరీరములు ఉద్భవిస్తున్నాయి. అదియే సూర్యరూపమై ఈ జీవ–జంతుజాలములకు తన కిరణములచే జీవనము ప్రసాదిస్తోంది. చంద్రుడై ఓషధరూపమున జీవరసమును సంరక్షిస్తోంది.

ఆ చిత్తే దర్పణమున ప్రతిబింబించే దృశ్యంగా ఈ జగత్ ప్రతిబింబమును గ్రహించి, తనపై తానే సుఖ–దుఃఖములను ఆపాదించుకుంటోంది. జలశక్తియే జలరూపమున సముద్రముగా అయి అనేక వస్తువులను తనయందు ధరిస్తున్నట్లు ఆ చైతన్యమే తనయందు ఈ 14 లోకములను కలిగి ఉంటోంది. చిత్తే చిదాకాశమున 'దృశ్యము' అనే పుష్పాలతోను, 'సంకల్పము' లనే పిందెలతోనూ, 'సత్త' అనే ఫలములతోను, సదసత్తులనే ఆకులతోనూ కూడిన సంసారలతగా ఉద్భవిస్తోంది. విచారణ చేసినప్పుడు 'దృశ్యము అనేది లేదు ఉన్నదంతా ఆ చిదానందమే' అని తప్పక తెలియవస్తోంది.

ఈ జీవులందరూ ఆ చిల్లత ఆకులేనయ్యా! వాసనారసమువల్లనే జన్మ కర్మల వ్యవహారమంతా రంజిల్లుతోంది. అనేక సవికల్పములతో, విషయపరంపరలతో, రకరకాల యత్నములతో, త్రిజగత్తులనే రంగస్థలములతో విరాజిల్లుచున్నది చిత్తే. ఋతువులతో కూడిన కాలస్వరూపంగాను, కొండ మొదలైన ఆయా వస్తుజాలముగాను, అండజ – స్వేదజ – బీజజ – గర్భజాది చతుర్విధ ప్రాణులతోను, సర్వాంగ ప్రవృత్తులతోనూ, సూర్య – చంద్ర ప్రభలతోనూ ప్రభవిస్తున్నది ఆ చిత్తే.

ఆహా! వసిష్ఠమహర్షీ! ఎంత ఆశ్చర్యం! ఆ చిత్తే సర్వత్రా వస్తువులను కల్పించి, వాటిపట్ల అభిమానమును చేకూర్చుకొని, వాటికి ప్రసిద్ధిని ప్రసాదిస్తోంది. చైతన్యముయొక్క ప్రభావం చేతనే చైతన్యస్వరూపుడగు ఈ జీవునకు జడమగు దేహముల పట్ల ప్రియాప్రియములు కల్పనాపూర్వకంగా దృశ్యదేహమును ధరించి, తమను తాము చైతన్యము నుండి వేరైనట్లుగా భావించుకుని నృత్యం చేస్తున్నాయి. గదిలో దీపం ప్రకాశిస్తూ ఆయా వస్తువులను ప్రకాశింపజేయుచున్నట్లు 'త్రైలోక్య దీపశిఖ' అగు చైతన్యమే ఈ జగత్తునందలి సర్వకార్యములనూ ప్రకాశింపజేస్తోంది. చైతన్యమే ఈ జాగృతిక పదార్థముల ఆకారమును వహించినదై సర్వసందర్భములలోనూ అందరిచేత పరిలక్షితమై ఉంటోందని గ్రహించు.

కనుక, పుత్రా ! ఈ నామ రూప పదార్థములన్నీ చిత్తే తనయందు ధరిస్తోంది. సూర్యుడు బ్రహ్మాండంగా ప్రకాశిస్తూ ఉంటే, ఇంటిలోని ఒక గదిలో చీకటి ఉన్నట్లుగా ఆ చిత్తు యొక్క నీడయే సకల పదార్థముల జడతను కల్పిస్తోంది. ఈ ముల్లోకాలలో స్థితమై కనబడుచున్న ఈ శరీరజాలాలన్నీ కూడా చిత్‌ఛాయ తొలగగానే స్పర్శకు కూడా యోగ్యత కోల్పోతున్నాయి. చైతన్యము ఈ దేహగృహంలో నివసిస్తూ 'సంకల్పములు' అనే పిల్లవాళ్ళను కని పోషించుకుంటోంది.

చైతన్య సంపర్కం లేకపోతే ఈ నాలుక రుచి చూడలేదు. చైతన్యముకంటే వేరైనదేదీ ఎక్కడా ఎవరిచేతా గాంచబడుట లేదు. చైతన్యము వినా – బొమికలు, చర్మము, వెంట్రుకలు – గల ఈ దేహము ప్రవర్తించగలదా? లేదు.

ఇన్ని మాటలెందుకు? ఓ మునీశ్వరా! ఈ చరాచర సృష్టిలో జన్మ – స్థితి– లయములను పొందుచున్న ప్రతిది చైతన్యమే. అదికాక వేరొకటేదీ లేదు. చైతన్యము యొక్క ఉనికి చేతనే (ఉండటం చేతనే) తదితరమంతా ఏర్పడి ఉండటం జరుగుతోంది.

❖❖❖

# 3. చిత్తు: జడ-చైతన్య విభాగములు

**శ్రీవసిష్ఠ మహర్షి :** తండ్రీ! నాదొక చిన్న సందేహం. ఈ కనబడేదంతా చిద్వ్యాప్తమే అయినప్పటికీ, ఈ శరీరం మరణించినప్పుడు, మూర్ఛిల్లినప్పుడూ ఇది చేష్టావిలీనమై ఒక రాయి-రప్పలాగా అయి ఉంటోంది కదా! అంటే 'ఈ శరీరం మొట్టమొదట చైతన్యవంతమై మరొక్కప్పటికి చిద్రహితమగుచున్నది' అనియే కదా అర్థం? చైతన్యం ఈ విధంగా ఎందుకు ఒకప్పుడు దేహమునందు ప్రత్యక్షమై, మరొకప్పుడు (మరణానంతరం) అంతర్ధానమవుతోంది?

**శ్రీశివ భగవానుడు :** నాయనా! నీవు అడిగింది చాలా పెద్ద ప్రశ్న. అందుకు సమాధానం వివరిస్తున్నాను. విను.

❖

ఈ శరీరమందు ఏ సర్వభూతమయ చిత్ విరాజిల్లుతోందో, అట్టి చిత్ రెండు విధములు-

1. కర్తృత్వ - భోక్తృత్వ స్వభావము. ఇదియే 'విజ్ఞానమయము' అను పేరుతో చెప్పబడుతోంది.
2. కూటస్థమగు 'నిర్వికల్పచైతన్యము' లేక, "నిష్క్రియ కేవల స్వస్వరూపం".

రెండవదగు నిర్వికల్పచైతన్యమే తన యొక్క సంకల్పబలం చేత 'నేనొక జీవుడను' అని భావన చేసి విజ్ఞానమయత్వం పొందుతోంది. ఒకడు స్వప్నంలో వేరొక స్త్రీని చూచి దుశ్శీలుడైనట్లు, ఒక బలాఢ్యుడు తన యొక్క ఊహా లోకంలో ఒక మహాబలవంతుని కల్పించుకొని ఆతనితో కుస్తీ పట్టి ఓడి డీలా పడినట్లు... ఆ నిర్వికల్పచైతన్యం వికారాలను సంకల్పించుకుంటోంది. ఒక శాంతస్వరూపుడు అనుకోకుండా, ఆకస్మికంగా క్షణికావేశం చేత గొప్ప కోపం చూపించినట్లు, ఆ నిర్వికల్పచైతన్యం తనను ఒక జడవస్తువుగా భావించి స్వకల్పనాబలం చేత సవికల్పమగు బుద్ధికి విషయమగుచున్నది.

ఆ చిత్ తనకుతానే స్వయంగా ఇటు పరమాణురూపాన్ని, అటు శబ్దస్పర్శాది భోగ్య రూపాన్ని స్వకల్పన చేసుకుంటోంది. మాయతో కూడిన చైతన్యమునకు తాను విషయమగుచున్నది. తరువాత సమష్ఠి ప్రాణరూపాన్ని పొందుతోంది. అదే "హిరణ్యగర్భరూపం" అని శాస్త్రాలు వర్ణిస్తున్నాయి.

ఆ తరువాత పంచీకృతమగు సూక్ష్మభూతములతో కూడి దేశవిభాగమును, కాల విభాగమును పొందుచున్నది. క్రమంగా ప్రాణమును ధరించి జీవత్వమును పొంది మనోబుద్ధులను ధరిస్తోంది. రత్నములను అన్వేషిస్తూ బయలుదేరిన ఒక సాధకుడు త్రోవలో ఒక ఆటవిక స్త్రీని చూసి, మోహించి, ఆటవికులలో ఒకడై బయలుదేరిన పనినే మరచిపోయినట్లు, అది సంసారభావమును పొందుతోంది. అనగా, ఆ బ్రహ్మచైతన్యము అజ్ఞానమునకు చోటిచ్చి తన స్వరూపం విషయమై శరీర-జీవరూపములను సంకల్పించుకుని, అట్టి సంకల్పములచే తన యొక్క సహజత్వమును కప్పివేసుకొని ఉంటోంది. భోగసంపర్కములచే మరల మరల 'సంసారి' అగుచున్నది. చూచావా?

**అనన్తసంకల్పమయీ జాడ్యసంకల్పపీవరా ।**
**చిజ్జాడ్యాన్మోదమాయాతి పయః పాషాణతామివ ॥** (శ్లో 75, సర్గ 30)

అనంత సంకల్పమయమగు ఆ చిత్తు తన యొక్క జడసంకల్ప విభాగముచే స్థూలభావము ధరించి 'మోహము'ను పొందుతోంది. అతిశీతలత్వం చేత నీరు పాషాణంలాగా గడ్డకట్టి ఆకారాదులను ప్రకటిస్తున్నట్లు, అనంతగుణ గంభీరమగు ఆ చిత్తు పరిమిత విషయములగు జడ సంకల్పములను, స్థూలభావములను ధరించి మోహమును పొందుచున్నది.

మోహగ్రస్తమై 'తృష్ణ' అనే స్వయంకల్పిత త్రాళ్ళతో కట్టబడినదై కామ, క్రోధములకు లోను అగుచు, భయములచే పీడించబడుచు, భావాభావగ్రస్తమగుచున్నది. తన యొక్క అనంతత్వమును, అప్రమేయత్వమును, నిత్యత్వమును బొత్తిగా మరచి పరిచ్ఛిన్నత్వమును భావన చేస్తూ కునికిపాట్లు పడుతోంది. 'దుఃఖం' అనే భయంకర అగ్నిచే దహించబడుచున్నది. అశుభమగు శోకంతో వ్యాకులమై, "అయ్యో! ఇప్పుడీ దుఃఖమోహములే ప్రత్యక్షంగా నా స్వభావమై పోయినాయే? ఇప్పుడింకేం చేయాలి? నన్ను ఎవరు కాపాడుతారు? ఓ దైవమా! ఎక్కడున్నావు?" ...అని వగర్చుచూ, ఈ శరీరాన్ని నమ్మి నానా తిప్పలు తెచ్చుకుంటోంది. 'నాకు అండ, తోడు కావాలి. ఈ శరీరంతో ఏర్పడే బాల్య-యౌవన -వార్ధక్యాలు నాకే చెందినవి' అని అనుకుంటోంది. ఒక గొప్ప అడవి ఏనుగు బురదలో చిక్కుకొనినట్లు మహత్తరమగు చిత్ ఈ 'అపార సంసారవికారములు' విడువలేక కొండరాళ్ళమధ్య చిక్కుకున్న జింకలాగా దిక్కుతోచక, భ్రష్టమై, బాధాపరితప్తమై గావుకేకలు వేస్తోంది. అనేక సుఖదుఃఖములకు, దీనత్వమునకు తన అంతరంగమే ఉత్పత్తిస్థానమని గమనించలేకపోతోంది. చిన్నపిల్లవాడు బాటలో నడుస్తూ ఎదురుగా ఊహాజనితమైన దయ్యమును గాంచి, ఇక, భయవికారములను పొంది వెనుకకు తిరిగి పరుగులు తీస్తూ గావుకేకలు పెడుతున్నట్లు ఈ చిత్తు ఊహచే ఆపదలను కల్పించుకొని భ్రమ పూర్వకము, స్వయంకల్పితము అగు సంసారారణ్యంలో పరుగులు తీస్తోంది. తుచ్ఛ విషయాలలో క్రిందా, మీదా పడుచూ, దోషజాలములో చిక్కుకుని అధఃపతనం పొందుతోంది.

అయితే మహర్షీ! ఇదంతా చిత్తు యొక్క జడవిభాగం చూపుతున్న జగన్నాటకం మాత్రమే. ఎందుకంటే... ఆ చైతన్యము యొక్క కూటస్థవిభాగం నిర్వికల్పమై, నిర్విభాగమై, నిశ్చింతగా ఎక్కడ ఉండాలో, అక్కడే ఉన్నది. అది తన యొక్క జడ విభాగంలో కర్తృత్వ, భోక్తృత్వ సంకల్పములను లీలగా మాయచే స్వప్నసదృశంగా పొందుతోంది.

❖❖❖

# 4. చిత్తుయొక్క విన్యాసం - వివశత్వం

**శ్రీశివ భగవానుడు :** ఇంకా ఈ భావాభావ విభాగమగు జడవిభాగపు చిత్తుయొక్క విన్యాసమేమిటో చెపుతాను విను.

స్వయంగా అనంతగుణసాగర స్వరూపి అయిన చిత్తు ఇక్కడ చేస్తున్నదేమిటి? స్వసంకల్పితమైన సంకల్పమాత్ర సంకటంలో పడి అనేక విపత్తులలోనూ, దుఃఖ పరంపరలలోనూ, అనర్థములలోనూ చిక్కుకున్నది. జడావస్థలో చిక్కుకుని నరకాది లోకములలో ప్రవేశించి విశేషకష్టములను చవిచూస్తోంది.

వృక్ష–జంతు ఉపాధులను కూడా అనుభవిస్తోంది. ఇంతలోనే మనుష్యత్వమును పొంది, కొంత వ్యవహారకౌశలత్వం సంపాదిస్తోంది. కానీ ఏం లాభం? చాలా చతురతతో బంధహేతువులైనట్టి ధనపుత్రాదులతో లేనిపోని కల్పిత సంబంధములను ఆశ్రయించి అనేక ఆశ – నిరాశ – దురాశల మధ్య చిక్కుకుంటోంది. అనేక విపత్పరిణామములలో సంచారం చేస్తూ అందరి సంశయములకూ కారణమౌతోంది. మోక్ష మార్గంగా స్వస్వరూపధ్యానానందమునకు ఉపయోగించే వివేకమును ఆశ్రయించటమే లేదు. పిదప మృత్యుసమయం రాగానే, అల్పజలంలో చిక్కుకున్న పెద్ద చేపలాగా విలవిల్లాడిపోతోంది. ఒక రోజు ఆ ఉపాధిని కోల్పోతోంది. మరల మరొక ఉపాధిని ఆశ్రయిస్తోంది.

ఆహాః! బాల్యము అసమర్థతలోనూ, యౌవనము చింతా దుర్వ్యసనములతోనూ, వార్ధక్యం దుఃఖములతోనూ గడచిపోవుచుండగా చివరికి అవివేకకారణంగా అజ్ఞానవ్యవహారవర్తి అయి నిస్సహాయంగా 'మరణము' అనే దరిజేరుతోంది.

ఆతడు మరణాంతరం కూడా దృశ్యం నుండి అప్పటికీ ముక్తిని బడయటం లేదు. ఆ జీవుడు కర్మ వైచిత్ర్యాన్ని అనుసరించి స్వర్గంలో అప్సరసగానో, పాతాళంలో నాగకన్యగానో, దైత్యుల భవనంలో అసురిగానో, కులపర్వతంలో కిన్నెరగానో, భూమిపై మానవిగానో, రాక్షసుల రాజ్యంలో రాక్షసిగానో, అడవిలో కోతిగానో, కొండప్రాంతంలో సింహంగానో, మేరు పర్వత ప్రాంతంలో విద్యాధరిగానో, అరణ్యంలో 'వృక్షం–లత–జంతువు' గానో జన్మలు ఎత్తుచున్నాడు. ఎంత చిత్రమో కదా! ఇదంతా కూడా సంకల్ప వికల్ప విభాగమునకు సంబంధించిన చిత్తు యొక్క స్వకీయ సంకల్ప ప్రాభవం చేత జరిగే నిష్కారణ సంచలనమే కదా!

అయితే ...ఆ చైతన్యమే నారాయణుడై క్షీరసాగరమున శయనించుచున్నాడు. కైలాసమున త్రిలోచనుడై అర్ధనారీశ్వర స్వరూపంతో విరాజిల్లుచున్నాడు. దేవతలకు పరిపాలకుడై ఇంద్రసింహాసనం అధిరోహించి మూడులోకములు పాలిస్తున్నాడు. మేఘమై వర్షమును కల్పించుచున్నాడు. వాయురూపుడై ఈ భౌతికదేహము లన్నింటినీ స్పందింపజేయుచున్నాడు.

క్షణాలు, నిమిషాలు, సంవత్సరాలు, యుగాలు, మన్వంతరాలు – అయి కాలరూపమున సదా ప్రవహిస్తూనే ఉంటున్నాడు. ఒకచోట రసస్వరూపుడై వృక్షాదుల బీజరూపంగా ఉంటున్నాడు.

ఇంకొకచోట పాషాణ స్వరూపుడై మౌన ముద్ర వహిస్తున్నాడు. మరొకచోట నదీనద స్వరూపం గానూ, ఇంకా వికసిత పుష్పాలుగా ...పక్వఫల సమూహంగా ...కాష్ఠ, అగ్ని స్వరూపంగా ...శీతల జలరూపంగా ...ఆకాశవాణి వంటి శూన్యరూపంగా – ఈ విధంగా ఆ చైతన్యం సర్వమయంగా, సర్వగామిగా, సర్వశక్తిమంతంగా ప్రకాశిస్తోంది.

అది ఆకాశంకంటే కూడా ఎంతో నిర్లిప్తమై, అన్ని వస్తువులకంటే భిన్నమై ఉన్నది.

నీరు స్పందించి తరంగములు మొదలైన రూపములను ధరిస్తోంది చూచావా? అట్లాగే చైతన్యము కూడా వివర్తంపొంది తనను ఎచ్చట ఏ రూపంగా భావిస్తోందో, అక్కడ అట్లే అనుభవమునకు గోచరమౌతోంది. భావాలన్నింటికీ నాందీస్థానం అదే!

ఆ చైతన్యమే తన వాస్తవస్వరూపంగా గల ఈ జీవుడు ఒకానొక జన్మ-జరా-పునర్జన్మల మార్గంలో పయనిస్తూ అనేక యోనులలో పరిభ్రమిస్తున్నాడు. సుడిగుండములలో పడ్డ గడ్డిపరకలాగా ఎక్కడెక్కడికో వెళ్ళుచున్నాడు. గాడిద తన ఓంఢ్రకు తానే భయపడునట్లు ఈతడు తన సంకల్పములకు తానే భీతిల్లుచు ఒక అబల, ముగ్ధ, చంచలమగు బాలికవలె ప్రవర్తిల్లుచున్నాడు.

వత్సా! చైతన్యమే ఈ జగత్తు యొక్క జీవశక్తి. అయితే ఏం? అది వివశ అయి పశుధర్మమును పొందుతోంది. కర్మానుసారంగా దీనికి అట్టి దురవస్థలు, దుఃఖసంకటములు, భ్రాంతులు కలుగు చున్నాయి, ధాన్యపుగింజ నశ్వరమగు ఊకను దాల్చి ఉన్నట్లు, అది కూడా సంకల్ప - వికల్ప - ఇచ్ఛా - జాడ్యములను ధరిస్తోంది.

❖

చైతన్యమే అల్పకాలం అవిద్యారూపంలో కూడా ఉంటోంది. ఆహా! ఆ చైతన్యం భర్తృహీన అగు నాయికలాగా జీవభావం పొంది దురదృష్టసంతప్తము, వైభవవంచితము అయి శోకిస్తోంది!

జడరూపియగు అవిద్య యొక్క సామర్థ్యం ఎంతటిది? పూర్ణబ్రహ్మ స్వభావమగు చైతన్యం అవిద్యావశం చేత తన నిజస్వభావమును విస్మరించి అధః పతనార్థం ఎటకో అరుగుచున్నది. ఎంత కష్టమైన విషయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే మహేశ్వరా ! చైతన్యమే స్వరూపముగా గల ఈ జీవుని జడత్వంవైపు పతనం అతి ఘోరంగా, అత్యంత దుఃఖప్రదంగా ఉంటోంది. నిజమే! దీనికి ఉపాయం ఏమిటి? జీవునికి దుఃఖాలు తొలిగేది ఎట్లా?

❖❖❖

## 5. చైతన్యం సర్వదా సర్వత్రా యథాతథం

**శ్రీశివ భగవానుడు :** నీ ప్రశ్నకు సమాధానమే మన ఈ సంభాషణ యొక్క ముఖ్యోద్దేశం.

ఒకడు కలకంటూ, ఆ కలలో 'నేను పిచ్చివాణ్ణి' అని భావించి ఎలుగెత్తి ఏడవటంలో అర్థం ఏముంది? ఆ స్వప్నద్రష్ట 'నేను దుఃఖయుక్తుడను' అని భావించి వ్యాకులపడుచున్నట్లు, చైతన్యము కూడా తనకు వినష్టమనేదే లేకపోయినప్పటికీ, వినష్టమును సమీపించబోవుచున్నట్లు భయపడుతూ మధ్య మధ్య వెఱ్ఱికేకలు వేస్తోంది.

కుమ్మరి సారె తీవ్రవేగంగా తిరుగుతూ ఉంటే, అది సుస్థిరంగా ఉన్నట్లు చూచేవాడు భ్రమించు చున్నట్లు చైతన్యము 'అహం' ప్రత్యయ భ్రమవశంచేత ఈ జగత్తును సుస్థిరమైనదానిగా గాంచుచున్నది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ! చైతన్యముయొక్క సంసారానుభవమునకు కారణమేమిటి?

**శ్రీశివ భగవానుడు :** చిత్తమే! అయితే చిత్తము అనేది చిత్‌చైతన్యము యొక్క విలాసమేగాని మరింకేమీ కాదు. చిత్ వ్యతిరిక్తమగు వస్తువంటూ వేరే ఎక్కడా ఏదీ లేదు.

'చిత్'కు కారణమే లేదు. కనుక చిత్తమునకు విషయమగుచున్న చిత్ పరికల్పితములగు ఈ దృశ్యము, జగత్తులు కూడా కారణరహితమే. కనుక ఈ జగత్తు అసత్యమే అయి ఉన్నది.

అసత్యమైన దానికి కారణమేముంటుంది? 'కథలో మంత్రి రాజును ఎందుకు చంపినాడు?' అనే ప్రశ్నకు సమాధానం కూడా కథలాగానే కల్పితమే అయి ఉంటుంది కదా!

వత్సా! అసలు విషయమేమిటో విశదీకరిస్తాను విను. పాషాణంలో తైలం ఉంటుందా? చంద్రునిలో నలుపు ఉన్నదా? "సూర్యుడు ఉదయిస్తున్నాడు, అస్తమిస్తున్నాడు" ...అని లోక ప్రతీతి కదా! అయితే సూర్యబింబానికి వాస్తవానికి ఉదయాస్తమయాలు ఉన్నాయా? ఆకాశమునకు అడ్డు, అవధులు ఉంటాయా? ఉండవు. అట్లాగే చైతన్యానికి దృశ్య–దర్శనాలు గాని, కర్త–కర్మ–కారణాలు గాని, ప్రమాత–ప్రమేయ–ప్రమాణములు గాని, చిత్తవృత్తి – చేతనము(క్రియ) – చేత్యము (జగత్తు)లు గాని లేవు.

'ఆకాశము' అనుదానికి 'దిక్కులు' అనునది ఆరోపితం మాత్రమే కాదా? (సూర్యుడు–భూమి యొక్క స్థితిగతులు లేనప్పుడు తూర్పుపడమరలు ఎక్కడుంటాయి?) చైతన్యము నందు 'నేను, నీవు, అతడు' అను భేదములు, నానాత్వ – అనానాత్వములు, నామరూప సంబంధములు అసంభవం. సూర్యమండలంలో 'రాత్రి' అనేది ఎలా సాధ్యం? చైతన్యము నందు దృశ్యవస్తు విశేషం ఉండటానికే అవకాశం లేదు. వస్తు–అవస్తు తత్త్వాలకు కుదిరేది కాదు.

ఒక గుండ్రాయి అంతరంలో పుష్పలత ఉంటుందా? అట్లాగే చైతన్యమునందు శూన్య – అశూన్య భావాలకు కారణమే ఉండజాలదు.

అటు ఆకాశాన్ని చూడు. అది పైన, క్రింద, ఇటువైపు, అటువైపు ప్రసరించి, 'విశాలత, శూన్యత, అశూన్యత, దిక్కు, కాలము' మొదలైన వాటికి సంబంధించక సర్వదా సర్వత్రా విస్తరించి ఉన్నది. అది అట్లుండగా 'అందులో అది ఉన్నది. ఇది ఉన్నది'అని మిగతా నాలుగు భూతములను (అగ్ని, వాయు, భూమి, జలము) గురించి ఆపాదిస్తున్నాం. వాటిచే ఆకాశం ఖండితమౌతోందా? లేదు. ఆకాశం సర్వదా దేనికీ సంబంధించక తనయందు తానే కేవలం తన యొక్క స్వచ్ఛభావమున వెలయుచున్నది. అట్లాగే, చైతన్యం కూడా అందులో కనిపించే శూన్యత, అశూన్యతాభావములకు కట్టుబడక సర్వదా సర్వత్రా నిర్మలంగానే ప్రకాశిస్తోంది. ఒకానొక చిత్తం చేత దర్శించబడే 'సంసార కూపము' అనే అనర్థం చైతన్యము యొక్క విలక్షణత్వమును స్పర్శించుటయే లేదు. ఆ చైతన్యం ఎక్కడ ఉండాలో అక్కడే నిర్వికారమై, జ్వరరహితమై ఉన్నది.

మరిక దోషము ఎట్లు కలుగుతోంది? జలంలో తరంగంలాగా చైతన్యము నందు 'చిత్తత్వము' అనే ఒక చమత్కారం ద్యోతకమౌతోంది. దాని పురాణనామమే హిరణ్యగర్భుడు. ఆ 'చిత్తస్రష్ట' నుండి దేహేంద్రియాదుల పట్ల 'అహంభావం' అను సంసారానర్థమంతా దాపురిస్తోంది. అట్టి అహంభావాన్ని తొలగించి చూడు. ఇక సంసారమనబడేదేదీ అగపడదు. నిత్య – బుద్ధ – స్తబ్ధ – శివచైతన్యము మొట్టమొదట ఎట్లా ఉన్నదో ఒకప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ అంతటా అట్లే ఉన్నది. ఇక వగచటం

దేని కొరకో చెప్పు? ఈ కనబడేదంతా సమిష్టి సృష్టిక్రియలతో సహా చైతన్యము యొక్క క్రీడ లేదా లీల వంటివే!

ఈ జీవుడు తత్త్వమును వింటూ కూడా, ఈ దేహేంద్రియముల పట్ల అహంభావమును తొలగించుకోకపోయాడా – ఇక ఇందులో చిక్కుకోవటంచేత కథ మొదటికి వస్తుంది. కాక, ఆతడు ఈ శరీరంతో సహా ఈ ముల్లోకములు తృణప్రాయం, నిస్సారం అని గ్రహించాడా, తన యొక్క చైతన్యస్వరూపం కరతలామలకం అవుతుంది.

అయితే... ఈ జీవునకు దృశ్యతాదాత్మ్యం తేలికగా తనంతట తానే పోయేది కాదు. ఈ దృశ్య సంసార అనేకత్వభావన జయించటానికి పురుషకారం ఆశ్రయించాలి. అంతేగాని, అది తనంతట తానే తొలగదు. పురుషకారమే లేకపోతే చైతన్య స్వభావమును ఎవ్వరూ సాధించలేరు. పురుషకారబలం చేత దోషదృష్టి తొలగిందా, ఇక ఈ జీవునికి మరెవరో స్వస్వరూపమును వివరించి చెప్పవలసిన అగత్యం ఉండదు. అందుకే శాస్త్రాలు సాధకజీవుల పురషకారము కొరకై 'పూజ' మొదలైన ఆయా విధి–విధానములను అందిస్తున్నాయి.

**నిర్వికల్పాద్వితీయా చిద్యాసౌ సకలగా సతీ ।**
**పరమైకా పరా సాచ్ఛా దీపికా తేజసామపి ॥** (శ్లో 16, సర్గ 31)

అహంభావమును త్యజించి. సంసారానర్థమును దూరం చేయగలిగితే, మరుక్షణం ఆ జీవుడు సర్వవ్యాపకము, నిర్వికల్పము, అద్వయము అగు ఆత్మలక్షణాలను పుణికిపుచ్చుకోగలడు. ఇందులో సందేహం లేదు. ఆ ఆత్మచైతన్యమే తేజోపదార్థములన్నింటినీ ప్రకాశింపజేయు నిర్మలవస్తువు.

అయ్యది నిత్యోదితం, నిర్మనస్కం, నిరంజనం, నిర్వికారం, నిత్యనిర్మలం, సర్వప్రకాశకం కూడా! అదియే చలిచీమనుండి బ్రహ్మదేవుని వరకూ (పిపీలికాది బ్రహ్మపర్యంతం) అన్ని రూపములుగా వెలయుచున్నది. సర్వత్రా సాక్షిగా స్పందనారహితంగా ప్రకాశిస్తోంది. దానిని మరింకేదీ ప్రకాశింప జేయుట లేదు. అదిమాత్రమే స్వయంప్రకాశకం.

ఈ జీవుని వాస్తవ స్వరూపమగు చైతన్యం – నిర్మలం, అప్రమేయం, శాంతం – అయినప్పటికీ, అది ఈ దేహములను భావన చేయటం చేత తన స్వస్వభావమును ఏమరచి వికల్పమగుచున్నది. ధూళిమిళితమైన జలం దోషభూయిష్టంగా కనబడినప్పటికీ నీరు స్వయంగా నిర్మలమైనదే కదా! చైతన్యం అజడమై ఉండి కూడా, జడంగా కనబడుతోంది. సర్వగామి అయి కూడా సంకుచితత్వం కనబరుస్తోంది. నిర్వికల్పమగు సూక్ష్మావస్థలో నుండి ప్రాణమయమగు లింగశరీరమున ప్రతిబింబిత మగుచున్నది. సూక్ష్మమగు దారం యంత్రంలో ప్రవేశించి పెద్ద వస్త్రంగా మారుచున్నట్లు, అది హస్త, పాదాది అవయవములను తన ఉపకరణములుగా ప్రకటిస్తోంది.

ఈ జీవుని యొక్క ఏ వాసనామయచిత్తమైతే స్వప్నమున ప్రవేశించి ఆ స్వప్నమును గాంచు చున్నదో, అదియే జాగ్రత్తు నందు–బయట విషయముల రూపముననూ, అంతరమున బోధ రూపముగానూ వెలయుచున్నది.

అనగా... ఆ చైతన్యమే జాగ్రత్‌సమయమందు మనోరూపంతో వెలయుచునే, విషయాకృతిని దాల్చుచూ జ్ఞాన - అజ్ఞానాత్మికమగుచున్నది. ఒక సద్వర్తనుడు సాంగత్యవశంచేత దుర్విషయములను ఆహ్వానించినట్లు, అతినిర్మలమగు చైతన్యము ఈ దేహాది ఆకారములను అవధరించి ఇక తదనుకూల మైన చింతలను పొందుతోంది. రాగి బంగారంలో కలియటం చేత ఆ బంగారం రాగియొక్క రంగు తదితర లక్షణములను సంతరించుకుంటోంది. ఆ మిశ్రమంలోంచి రాగిని తొలగిస్తే బంగారం తన సహజ సిద్ధ ధవళఛాయలను వెదజల్లుతుంది కదా! చైతన్యము కూడా అశాశ్వతము కల్పితము అగు ఇంద్రియ విషయములతో సంయోగ వియోగానుభవములను పొందుతూ, శుద్ధాశుద్ధ భావనలను తెచ్చిపెట్టుకుంటోంది. అద్దం అపరిశుద్ధంగా ఉన్నప్పుడు ముఖం కనిపించదు చూచావా! ఆ అద్దమును శుభ్రపరిస్తే? ప్రతిబింబం స్వచ్ఛరూపం దాల్చగలదు కదా! అట్లాగే అజ్ఞానము వలన జీవ-జడ భావములను ఒక అనునిత్య ప్రవంతివలె కల్పన చేసుకొని, ఆ కల్పనలలో ప్రవేశించి ఆయా స్థితి గతుల భావనచే బంధమోక్షాది దిగ్భ్రమములను పొందుచున్న ఈ చైతన్యము కూడా తత్వబోధచే మరల స్వకీయమగు నిర్మల - సహజ - నిర్వికల్ప స్వభావమును పుణికిపుచ్చుకోగలుగుతోంది.

ఆ చైతన్యము గురించి తెలుసుకొనకపోవటం చేతనే ఈ సంసారసంరంభమంతా ఉదయించి కలవరపెట్టడం జరుగుతోంది. చైతన్యముయొక్క స్వరూపమేమిటో గ్రహించావా... ఇక ఈ సంసారము తుచ్ఛమై, లయమై 'లేనిది'గా అనుభవమవగలదు. కాదూ... 'అసత్ భావమును ఆశ్రయించటం జరిగితే అప్పుడు స్వతఃగా నిత్యస్వభావి అయికూడా వినాశత్వము ఆపాదించుకోవటం జరుగుతోంది. ఒక పెద్దకొండ చివరగల మహావృక్షం యొక్క పువ్వు అధఃపతనమౌతున్నట్లు, సూక్ష్మమగు చిత్ పదార్థపు అల్పస్పందన ఈ విశాల జీవభావంగా పరిణమిస్తోందని గ్రహించు.

అయితే!... ఈ సర్వము చిత్పదార్థము యొక్క స్పందనయే కదా! కనుక ఈ బాహ్యముగా కనిపిస్తున్న రూపరసాదులసత్త కూడా అద్వితీయమగు చైతన్యమే అయిఉన్నది. ఇక అధ్యస్తములగు భేదాభేదములంటావా? అవి అజ్ఞానదృష్టికి సంభూతములగుచున్నాయి. జ్ఞానబలంచేత అవన్నీ స్వయంగా లయం కాగలవు. అనగా, కల్పితక్రీడలోని అంతర్గతవిశేషములు వంటివి కాగలవు.

ఈ చిత్త - ఇంద్రియములతో అనుభూతమయ్యే ఏ 'సత్త' ఉన్నదో... అది కూడా సాక్షిచైతన్యమే గాని వేరే ఏదో కాదు. సర్వకార్య వ్యవహారములు చైతన్యస్ఫూర్తి చేతనే జరుగుచున్నాయి. ఏ స్థానమైతే చూడటానికి వీలుగా చైతన్యము ప్రకాశిస్తోందో అద్దానిని 'కళ్ళు' అంటున్నాం. అంతర్గత వృత్తియే కన్ను ద్వారా బహిర్గతమై కుండ, వస్త్రము మొదలైన ఆకృతులను దాల్చి, వాటి ఆకృతులను అనుభవించటం జరుగుతోంది.

చర్మము, దానిని స్పృశించే వాయువు - ఈ రెండూ జడములే. అయితే, ఈ రెండిటి యొక్క సంయోగమగు 'స్పర్శ' అనే అనుభవం 'తత్' జ్ఞానమగు చైతన్యము వలననే సంభవమౌతోంది.

అట్లాగే, గంధతన్మాత్ర కూడా! 'గంధము - దానిని స్పందించే ప్రాణవాయువు' ఈ రెండింటికి ఏర్పడే సంయోగము 'గంధజ్ఞానము'చే గ్రహించబడుతోంది. ఆ గంధజ్ఞానము చిత్తవృత్తికి

సంబంధించినది. ఆ చిత్తవృత్తినే 'అంతఃకరణం' అని పిలుస్తున్నాం. అట్టి జ్ఞానమును అంతః కరణమనే పరిచ్ఛిన్న ప్రదేశము నుండి వేరు చేసి, చూస్తే, అది చైతన్యము యొక్క ఉనికి చేతనే ఏర్పడుచున్నదని గ్రహిస్తాం. శబ్దతన్మాత్ర శ్రవణేంద్రియ వాయువుతో కూడటాన్నే 'శబ్ద సంవిత్తు' అంటున్నాం'. అంతఃకరణ వృత్తి రహితంగా చూస్తే అయ్యది కూడా నిర్వికల్పము, సుషుప్తి సదృశము అగు చైతన్యము యొక్క ప్రాశస్త్యమే గాని, మరింకేదో కాదు.

అందుచేత 'చైతన్యరూపమగు చిదాత్మ ఎచ్చటో, ఎన్నడో, ఏదో నిర్వర్తించిన తరువాత లభించేది' అని అనటం సరియే కాదు.

❖

కర్మేంద్రియముల 'ప్రవృత్తి' వలన కలుగుచున్న సంకల్ప కాలుష్యమే, "చిత్తము, మనసు, లేక, చింత" అనబడుతోంది. ఆ ప్రవృత్తియే మనోవృత్తి. ఆ మనోవృత్తులకు సాక్షి అగు వృత్తిరహిత చైతన్యమేదైతే ఉన్నదో - అదియే నిర్మలమగు ఆత్మచైతన్యం. ఆహా! వసిష్ఠ మహర్షీ! చూచావా... కాలః కాలమై, అనంతమై అద్వితీయమైన ఆ చైతన్యమునకు మనమందరం ఎంత సమీపంగా ఉన్నామో...! అసలు, అదియే మనమై ఉన్నాము కదా!

ప్రకాశాత్మకమగు ఆ చైతన్యమే తనయందు తాను వెలయుచూ స్ఫటికమణిలాగా తనయందు ఈ జగత్తులను ధరిస్తోంది.

మరొక్క విషయం...! అద్వితీయమగు ఆ చైతన్యం ఈ జగత్తులను ధరిస్తూ త్యజిస్తూ ఉంటున్న ప్పటికీ అద్దానికి ఉదయాస్తమయాలు గాని, స్థిర-చలనాలు గాని, హాని-వృద్ధులు గాని లేనే లేవు.

ఆ చైతన్యం తన యొక్క సంకల్పబలం చేతనే జీవభావాన్ని దాల్చుచున్నది. అది సంకల్ప రహితమైనప్పుడు - "ఈ జగత్తుగా అనుభూతమయ్యేదంతా తానే - అనే వాస్తవం గ్రహిస్తోంది. అట్లు గ్రహించి, స్వస్వరూపమున (లేక) తన యందు తానే వెలయుచున్నది.

ఈ జీవుని రథం అహంకారం; అహంకారం యొక్క రథం బుద్ధి; బుద్ధియొక్క రథం మనస్సు; మనస్సు యొక్క రథం ప్రాణం; ప్రాణం యొక్క రథం ఇంద్రియాలు; ఇంద్రియముల రథం ఈ శరీరం; శరీరం యొక్క రథం కర్మేంద్రియాలు... ఇన్ని రథాల యొక్క కార్యం 'స్పందన'. ఇదంతా నిశ్చలమగు ఆత్మస్పందనా చమత్కారమే!

జరామృత్యు మయమై కనిపించే ఈ దేహ పంజరంలో ప్రతిబింబించే జీవవిహంగం ఆ ఆత్మేశ్వరుని విభూతియేగాని మరింకేదో కాదు. నాయనా! ఈ ప్రపంచమంతా ఆత్మ యందు ఒక తుచ్ఛమగు స్వప్నంలాగా ప్రతిభాసిస్తోంది. ఇట్టి జగత్తునందు కొంచెం కూడా సత్యం లేదు. శ్మశాన వాటికలోని మురికి గుంటలలోని నీరులాగా, ఇది అత్యంత త్యాజ్యార్హం.

❖

ప్రాణములు ఎటువైపుకు వెళ్తుంటే, కల్పనల రూపమైన సంకల్పం కూడా అటువైపుకే పరుగు లెత్తుతూ ఉంటుంది. వెలుతురు ఎక్కడ పడుతుంటే అక్కడే రూపములు కనిపిస్తున్నట్లు, బలవంతుడగు

ప్రాణములు ఉన్నచోటే సంకల్పసంచలనం అనుభూతమౌతోంది. అరణ్యంలో వాయువు ప్రవేశిస్తేనే చెట్లకదలికలు కలుగుచున్నట్లు మనస్సు ఉన్నచోటే సంసారం. మనస్సు లీనమైనచోట సంసారమునకు తావు ఉండదు.

ప్రకాశము లేకపోతే రూపమే ఉండదు కదా! అట్లాగే ప్రాణవాయువులు లేకపోతే మనస్సనేది బొత్తిగా ఉండదు. గాలి వెంటే దుమారం కూడా వెళ్ళుచున్నట్లు ప్రాణవాయువులు వెళ్ళే వేపుగానే మనస్సు కూడా వెళ్తోంది. రథం ఎటు వెళ్ళితే సారథి కూడా అటే పోతాడు కదా! ప్రాణవాయు చలనస్పర్శ చేత అన్నరసమును వ్యాపింపజేయు నాడులు స్పందిస్తున్నాయి. చక్షురాది ఇంద్రియముల జ్ఞానం కలుగుతోంది. చిత్తము – మనస్సులతో నిర్మంచబడేదే లింగశరీరం కదా! అది 'ప్రాణము' అను దర్పణంలో ప్రతిబింబిస్తోంది.

ఈ విధంగా 'చైతన్యం యొక్క వ్యాపకత్వం ప్రాణవాయువు యొక్క కార్యమే' అని అంటూంటారు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** స్వామీ! చైతన్యము ప్రాణసహిత పదార్థములలో మాత్రమే ఉన్నదని అనవచ్చునా?

**శ్రీశివ భగవానుడు :** ఆకాశమువలె స్వచ్ఛమగు చైతన్యము జడ–అజడ పదార్థములన్నిటా ఉన్నది. ప్రాణవాయుస్పందనచే స్పష్టంగా అభివ్యక్తమై, అద్దాని సంచలనముచే అనుభవమునకు గోచర మౌతోంది. చైతన్యము ప్రాణవాయువులవలన ఉద్బోధితమై ఎదురుగా అధ్యస్తమైయున్న చైతన్యముతో అభేదత్వం పొందుతోంది.

జీవదశ యందు ప్రాణముండుటచే జడమగు దేహం నానావిధ యత్నములు చేస్తోంది. ఈ శరీరము ప్రాణవాయువులు లేనప్పుడు శూన్యము, నిశ్చలము అగుచున్నది.

పరమచైతన్యం పుర్యష్టకంలో (పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం) ప్రతిబింబిత మవుతోంది. ఒక దృశ్యం అద్దంలో ప్రతిబింబించినట్లుగా రాతిలో ప్రతిబింబించదు కదా! కార్యము లన్నిటికీ కారణమగుచున్న మనస్సే పుర్యష్టకం. అంతేగాని నిస్తేజమగు కాళ్ళు, చేతులు పుర్యష్టకం కాదు.

సంకల్పమయములగు ఈ దృశ్యజాలములన్నీ దేని నుండి ఉదయిస్తున్నాయో, ఎందులో వెలయుచున్నాయో, ఎందులో అనుభూతములగుచున్నాయో, దేనిచే మనస్సు తదితర దేహాకారాలుగా భ్రమించబడుచున్నదో – ఆ పరమ వస్తువే విశ్వము. అదియే పరమాత్మ.

❖❖❖

# 6. అజ్ఞానము యొక్క చమత్కారం!

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే పరమేశ్వరా ! ఆ పరమచైతన్యము జీవుల శరీరములలో ప్రవేశించి కార్యములను ఆచరిస్తున్న విధి గురించి కొన్ని విశేషాలు మీ దగ్గర నుండి తెలుసుకోవాలని ఉన్నది. అది చలనయుక్తమై 'స్నాత – భోక్త – బ్రాహ్మణ –క్షత్రియ' మొదలైన సంజ్ఞలను పొందుచున్న విధానమేమిటో చెప్ప ప్రార్థన.

**శ్రీశివ భగవానుడు :** ఆ చైతన్యమునకు ఒక శక్తి ఉన్నది. అదియే... "ఆవరణ శక్తి".

ఆ ఆవరణశక్తి తనకు ఆశ్రయమగు బ్రహ్మమును మరుగున పరిచి, లేదనిపించుచూ పూర్వార్జితం, సంస్కారజనితం – అగు వివిధ యత్నాలతో కూడిన మనోభావాలు పొందుతోంది. మనోవాక్కాయాలకు సంబంధించిన ఆయా క్రియా విశేషాలచే చైతన్యము జడమువలె అగుచున్నది. అట్లు వ్యవహారదశను పొందిన బ్రహ్మశక్తి జ్ఞానేంద్రియాలను, కర్మేంద్రియములను కూడా పొందుతోంది. మాయ యొక్క ప్రభావం చేత ఆ పరమచైతన్యం తనలో తానే 'జగత్తు' అనే గంధర్వనగరం (ఊహాజనిత అనుభవపూర్వకస్థానం) సృష్టించుకుంటోంది.

ఒకవైపు భావనా సమన్వితమగు ఈ సృష్టిని కల్పించుకుంటూ... అదే సమయంలో మరొకవైపుగా ఏదీ సృష్టించక 'యప్పటియట్లే' ఉంటోంది. ఆ సమన్వయం జలం – తరంగాకారముల వంటిది.

జడమగు ఈ దేహంలో 'చిత్తం లేదా మనస్సు' అనేవి లేకపోతే ఇది కట్టె, రాయితో సమానమే. చిత్తము ఉన్నప్పుడు ఆకాశంలో ఎగురవేయబడిన రాయిలాగా చలనము కలిగి ఉంటోంది. అత్యంత జడమగు ఇనుప ముక్క అయస్కాంతము యొక్క సామీప్యతచే చలిస్తున్నట్లు సర్వాంతర్యామియగు ఆత్మదేవుని సామీప్యతవలన ఈ దేహం చలించి ఆయా క్రియలను నిర్వర్తించగలుతోంది.

సర్వవ్యాపియగు ఆ 'చిత్‌శక్తి' బలం చేతనే ఈ జీవులందరూ వికాసం పొందుచున్నారు. కాబట్టి... నీతోను, నాతోను సహా ఈ జీవులందరూ చైతన్యము యొక్క ప్రతిబింబమాత్రులే.

**శ్రీవసిష్ఠ మహర్షి :** పంచభూతములచే నిర్మించబడి, కనబడుచున్న ఈ జీవులందరూ నిష్క్రియమగు ఆత్మయందలి ప్రతిబింబములు ఎట్లా అవుతారు?

**శ్రీశివ భగవానుడు :** నిష్క్రియమగు అద్దంలో వస్తువుల కదలికలు కనబడుచున్నాయి కదా? ఇదీ అట్టిదే. ఈ జీవుడు బ్రహ్మము యొక్క ప్రతిబింబమే అయి కూడా, తన నిజస్వరూప విస్మరణం వల్ల స్వవ్యతిరిక్త భావపరంపరా రూపమగు పంచభూత సంబంధమైన జడానుభవం పొందుచున్నాడు. అదంతా ఒక సాత్వికజీవుడు ఏదో మోహవశం చేత కుకర్మలను ఆచరించి దురభ్యాసాలకు లోనయి నట్లుగా జరుగుతోంది.

చైతన్యము స్వస్వభావం విస్మరించటం చేతనే చిత్తభావం పొందుతోంది. అన్నీ తెలిసి కూడా ఒకడు మోహవశం చేత వికలత్వం పొందటం ఎంతటి ఆశ్చర్యమో, ఇదికూడా ఆ విధంగా ఆశ్చర్యకర విషయమే! కాని ఇది జరుగుట స్ఫురిస్తోంది. తరంగముల వలన నీరు చలిస్తున్నట్లు ప్రాణవాయువులచే అధ్యస్తమైన ఈ శరీరం చైతన్యానికి చలనమును ఆపాదిస్తోంది. వాయువుల వలన నౌక చలిస్తూ ఉండగా అందులోని వస్తుజాలం కూడా చలిస్తున్నట్లు దేహయంత్రాలన్నీ జీవభావం పొందుచున్నాయి. ఈ దేహం ఆత్మ నుండి మనన క్రియను సంపాదించి ఆత్మదేవుని సామీప్యమాధుర్యం చేత కదలుతూ తానే ఆత్మను స్పందింపజేస్తున్నట్లు ప్రదర్శితమౌతోంది. ప్రజ్ఞానం యొక్క చమత్కారం అంతటిది!

హే బ్రహ్మజ్ఞా! పరమాత్మ ఈ శరీర శకటమును నడిపించగోరి, మనస్సు – ప్రాణము అనే రెండు చక్రములు నిర్మించుకుంటున్నారు. చైతన్య పరమాత్మ జడరూపమును గ్రహించి జీవభావము

పొందినవారై ఈ బాహ్య మనో-ప్రాణాలనే గుఱ్ఱములను ఎక్కి, ఎటకో పయనిస్తూ తమ స్వస్వరూపాన్ని ఈషణ్మాత్రంకూడా త్యజించకపోయినప్పటికీ ఈ పంచభూతాత్మిక జగత్తులో సంచారం చేస్తున్నారు. జగత్తులో "నేను జన్మిస్తున్నాను" అను రూపంగానూ, స్వప్నంలో "నేను దర్శిస్తున్నాను" అను రూపంగానూ స్వకీయ మాయచే సంకల్పములు చేసుకుంటున్నారు.

కానీ ఆయన ఏమాత్రం ఎక్కడికీ వెళ్ళుట లేదు. తరంగత్వం జలం నుండి వేరైనదెప్పుడు? ఎప్పుడూ లేదు. చైతన్యము కూడా జగత్తు నుండి భిన్నం కాదు. ఆత్మచైతన్యమును ఆశ్రయించుకొనియే చిత్తవృత్తులు జీవజగత్తులను స్ఫురింపజేయుచున్నాయి. వెలుతురు యొక్క ప్రసరణచే రూపములు ప్రకాశించుచున్న, ఆత్మచైతన్య ప్రకాశము వలననే సర్వము ప్రకాశిస్తోంది.

కనుక పుత్రా! దీపం ఉన్న ఇల్లులాగా నిరామయమగు చైతన్యము ఉండటం చేతనే నీకు కనబడే ఈ జీవులు నీకు ప్రకాశిస్తున్నారు.

ఒకే జలం నుండి అలలు, ఆ అలల నుండి బుడగలు, ఆ బుడగల నుండి నురుగు, ఆ నురుగు నుండి తెల్లటి తెలుపు ప్రకటనమగుచున్నట్లు ఈ జీవుని నుండే ఆధి-వ్యాధులుగా గల దుఃఖాలన్నీ పుట్టి పెరుగుచున్నాయి. 'నేను ఈ శరీరపరిమితుడను' అని సుదీర్ఘంగా అనుకుంటూ ఉండటం చేత ఈ జీవుడు దుఃఖ-దైన్యములతో చివుకుతున్నాడు. చైతన్యమే అన్నిటికీ ఆధారమై కూడా తన సంకల్పపరంపరలతో నిర్మించుకున్న శరీరాలలో ఆ చైతన్యం వివశత్వం పొందుతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇది అత్యంత చిత్రం కదా!

**శ్రీశివ భగవానుడు :** చిత్రమే ! కానీ, ఏం చేయాలి? మత్తుగా కల్లు త్రాగిన మనుజుడు తన శరీరం మురికితో నిండినా గ్రహించలేడు చూచావా? చైతన్యం కూడా వివశత్వం పొంది తన సర్వాధార - స్వప్రకాశక - స్వస్వరూపాన్ని ఏమరిచి బాలునివలె దుఃఖాలను పొందుతోంది. కల్లుతో మత్తెక్కిన వాడు మత్తు దిగిన తరువాత తాను మత్తెక్కి చేసిన పనులను దూరంగా విడచున్నట్లు, చైతన్యము కూడా మోహమును త్యజించినప్పుడు స్వస్వరూపాన్ని గ్రహించి, జగత్తు యొక్క రహితత్వం దర్శిస్తోంది. కుష్ఠురోగియొక్క శరీరంలోని కొన్ని భాగాలు నిర్వీర్యమై స్పర్శరహితమైనట్లు, సర్వవ్యాపకమగు చైతన్య స్వరూపుడగు ఈ జీవుడు ఒకచోట ఒకానొక శరీర పరిమితమై నట్లు సంకుచితత్వం ఆపాదించు కుంటున్నాడు.

❖

ఈ భౌతికదేహం శిథిలమగుచూ ఉండగా హస్తపాదాది అవయవములు ప్రాణవాయువుల ప్రసరణ కోల్పోతాయి. అప్పుడు హృదయమున హృదయకమలదళం చలనరహితంకాగా, విసనికఱ్ఱ వీచటం ఆపినప్పటి గాలిలాగా అంతరమున జరిగే ప్రాణవాయు సంచలనం ఆగుతుంది. ఆ విధంగా ప్రాణవాయువులు లోన అడగినప్పుడు జీవుడు నామరూప ఉపాధిరహితుడై కారణస్వరూపుడై వెలయుచున్నాడు. అతని మనస్సు రజోగుణహీనమై, నిరాధారమై, ప్రాణవాయువులతో లీనమై ఉంటుంది. అనగా 'కారణాత్మకత' పొందుతోంది. మరల విత్తులోంచి చెట్టులాగా మరొక దేహ రూపమున ప్రకాశించటం జరుగుతోంది.

ఈ విధంగా వైకల్యం పొందుచున్న మూలకారణంతో పుర్యష్టకం ఏర్పడటం, ఉపశమించటం, మరల ఏర్పడటం జరుగుతోంది.

'స్వస్వరూపమును మరచుట' అను మోహము వలననే చైతన్యము చేత్యాకారం (The form that all being perceive) పొందటం జరుగుతోంది. ఆ చేత్యాకారమునందు వాసనామోహములు స్పందిస్తున్నాయి. ఇక అందులోంచి అనేక కల్పనలు బయలుదేరుతున్నాయి.

హృదయ కమల దళములు వికసిస్తూ ఉండగా పుర్యష్టకం (పంచేంద్రియ వ్యాపారములు – మనస్సు – బుద్ధి – జీవాహంకారము) మరలమరల పరిస్ఫుటమౌతోంది. హృదయకమలదళం నిశ్చలమైనప్పుడు పుర్యష్టకం కూడా వినష్టమౌతోంది. శరీరమధ్యంలో పుర్యష్టకం ఉన్నంతవరకూ ఆ చైతన్యము జీవదశ పొందుతోంది. పుర్యష్టకం క్షీణించిందా … శరీరం మృతమైనదని చెప్పబడుతోంది.

అట్లాగే కఫ – వాత – పిత్తముల వలనగాని రాగద్వేషాదులనే మలరాసి యొక్క తీవ్రప్రకోపం వల్ల గాని, శస్త్రాదుల చేతగాని ప్రాణవాయు ప్రసరణం నిరోధించబడగా, అప్పుడు కూడా హృత్పద్మ యంత్రం ప్రకోపించదు. అప్పుడు పుర్యష్టకం, వాయుయంత్రం వలన నిరోధించబడి బహిష్కృతమైన గాలివలె, నెమ్మదిగా ఆకాశమున కలిసిపోతోంది.

ఈ జీవుడు కేవలం తన సంకల్పముల వశం చేతనే మరణాది అనేక దుఃఖములను అనుభవించుచున్నాడు. సంస్కారబలంచేతనే శరీరమునందలి పద్మయంత్రం ఎడతెరిపి లేకుండా చరిస్తోంది.

**వాసనా విమలా యేషాం హృదయాన్నావసర్పతి ।**
**స్థిరైకరూపజీవాస్తే జీవన్ముక్తాశ్చిరాయషః ॥** (శ్లో 35, సర్గ 32)

ఎవరిహృదయంలో అయితే సర్వదా పవిత్రమైన ఆత్మతత్వమునకు సంబంధించిన వాసనలు ఉంటాయో …అట్టి జీవులు శాశ్వతము, ఏకరూపము, జీవన్ముక్తములతో కూడిన చిరంజీవత్వమునందు వెలయుచున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ! శరీరం నేలకూలినప్పుడు మనస్సుగతి ఏమౌతోంది?

**శ్రీశివ భగవానుడు :** హృత్పద్మయంత్రం నిరుద్ధమైనప్పుడు ప్రాణవాయువులు సశాంతిస్తాయని అనుకున్నాం కదా! అప్పుడీ భౌతికశరీరం ధృతిశక్తిని వీడి కట్టె, మట్టితో సమానమై భూమి మీద కూలుతుంది. పుర్యష్టకం ఆకాశంలో లీనమైపోతుంది. మనస్సు కూడా ఆకాశంలో తన ఉనికిని గాంచు తుంది. అనాది కాలం నుండి అభ్యాసబలమును కలిగి ఉన్న వాసనతో నిండిన మనస్సు ఎచ్చటెచ్చట పరిభ్రమిస్తుందో అచ్చటచ్చట స్వర్గ–నరకములను గాంచుతూ ఉంటుంది. ఇక ఈ శరీరమంటావా! ఒక గృహస్తు ఇల్లు వదల వెళ్ళినపుడు పాడుపడుచున్నట్లు, ప్రాణములు లేచిపోగానే శరీరం శవరూపం దాల్చి శిథిలమౌతోంది.

సర్వగామియగు బ్రహ్మచైతన్యమే చేత్యభావం పొందుతోంది. అనగా "తెలివి … తెలుసుకొనుట" అను భావం ఆశ్రయిస్తోంది.

| | | |
|---|---|---|
| చేత్యభావం నుండి | → | చేతనాభావన |
| చేతనా భావం నుండి | → | జీవభావం |
| జీవభావం నుండి | → | మనస్సు |
| మనస్సు నుండి | → | సూక్ష్మమగు పుర్యష్టకం |
| పుర్యష్టకం నుండి | → | శబ్ద, స్పర్శ, రూప, రస గంధము లనెడి విషయాలు. |

సూక్ష్మశరీరం (పుర్యష్టకం) సంకల్పములను తన ఒడిలో వేసుకొని భావనాబలం వలన ఒక స్వప్నభ్రమ వలే ఈ స్థూల శరీరములను గాంచుచున్నది. ఆ భావనాదృఢత్వం చేత ఈ శరీరమును సత్యమైన దానిగా తలచి, దీనియందు ఆసక్తిగొన్నదై తన సర్వాంతర్యామిత్వాన్ని, సర్వనియామకత్వాన్ని బొత్తిగా ఏమరుస్తోంది. చైతన్యము సూక్ష్మభూతాత్మకమై, ప్రాణమయమగు ఈ పుర్యష్టక సమన్వితమైన శరీరమును లేవదీయుచుండగ జనులు 'ఈతడు జీవించియే ఉన్నాడురా' అని చెప్పుకుంటున్నారు. ఆ పుర్యష్టకము నశించి చిత్తము ఆకాశమున లీనమైనప్పుడు శరీరము కొయ్య, రాయిలాగా అచేతనమగుచున్నది. అప్పుడు 'ఈ శరీరము మృతమైనది' అని అంటున్నారు. క్రొత్తదగు చిగురుటాకు కాలక్రమంగా ఎండిపోవునట్లు ఈ శరీరం కూడా ఒకనాటికి వాడిపోతోంది.

అయితే ఇక్కడ మరొక చమత్కారం మనం గమనించాలి. చైతన్యము అజ్ఞానవశంచేత చావుగాని, పుట్టుకగాని లేని తన బ్రహ్మస్వరూపమును మరచి వివశత్వం, శక్తిరాహిత్యం అనుభవిస్తోంది. మృత్యు సమయంలో హృత్‌పద్మయంత్రం జీవస్మృతిని కోల్పోయి చలనరహితమై ఉంటోంది. ప్రాణ వాయువు నిరుద్ధమైనప్పుడు మనిషి మృతి చెందాడని అనుకుంటున్నారు. అంతమాత్రానికి ఆతని కాల్పిక జగత్తు అంతమైనట్లు కాదు. నిదురించునప్పుడు కాల్పిక జగదనుభవం కొంచెం విరామం పొందినట్లు వర్తమాన తదనంతర దేహముల మధ్య కాల్పిక జగత్తు కొంచెం విరామం పొందుతుంది.

❖

**యథా జాతాని జాతాని చాన్యాన్యన్యాని కాలతః ।**
**వృక్షాత్పర్ణాని శీర్యన్తే శరీరాణి తథా నృణామ్ ॥** (శ్లో 49, సర్గ 32)
**జాయన్తే చ మ్రియన్తే చ శరీరాణి శరీరిణామ్ ।**
**పాదపానాం చ పర్ణాని కా తత్ర పరిదేవనా ॥** (శ్లో 50, సర్గ 32)

వత్సా! వృక్షం యొక్క ఆకులు యథాసమయంలో పుట్టి, ఎండి రాలిపోతున్నట్లే, ఈ మనుష్యుల శరీరాలు కూడా పుట్టి, పెరిగి నశిస్తున్నాయి. జనన, మరణములు ఈ దేహమునకు స్వాభావికములే కదా! ఇక ఇందుకై దుఃఖం ఎందుకు?

చిత్ సముద్రంలో ఏ ఏ వైపుల నుండి ఎన్నెన్ని శరీరములు బుద్బుదపంక్తుల వలె లేస్తున్నాయో ఎవరు చెప్పగలరు? బుద్ధిమంతులకు వీటి పట్ల శాశ్వతబుద్ధి ఉండదు. ఇక బ్రహ్మచైతన్యం ఆకాశ – అనాకాశములందు ప్రసరించియున్నదై కూడా సర్వదా యథాతథంగా ఉండి ఉన్నది. చిత్తదర్పణంలో

ప్రతిబింబిత చైతన్యమే కనబడుతోంది. చిత్తధారులు చిత్తముచే పరిమితమైన చైతన్యమునే చూస్తూ భ్రాంతిని పొందుచున్నారు. చిత్తమును ఒకవస్త్రమువలె, ఒక ఆభరణమువలె ధరిస్తున్నట్టి చైతన్యమును గమనించలేకపోతున్నారు.

పరిపూర్ణం, నిర్మలం అగు చిదాకాశమున శుభాశుభకర్మలు తత్ సంబంధిత సుఖ దుఃఖాలు వాటికి సంబంధించిన కల్పనాపుంజములు, ఆపాతరమణీయ భోగభావనలు, వివిధ జననమరణ పరంపరలు ఆకాశంలో గాలివీచికలులాగా ప్రసరించి ఆత్మను విముగ్ధం చేసి తపింపజేస్తున్నాయి.

ఏది ఏమైనా కావచ్చు. ఆత్మసర్వదా నిర్వికార – నిత్యోదిత – నిష్కళంక సమన్వితమైనది. అది దేనికీ తగిలి ఉండటం లేదు. అన్నిటికీ సాక్షీభూతమై మొట్టమొదట ఎచ్చట ఎట్లున్నదో, ఇప్పటికీ అచ్చటే, అట్లే ఉన్నదని మరొక్కసారి గుర్తు చేస్తున్నాను.

ఆ ఆత్మ భగవానునికి ఈ శరీర జననమరణాలతో ఎప్పుడూ, ఏ మాత్రం సంబంధం లేదు.

❖❖❖

# 7. అపరిమితంలో పరిమితమా ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే చంద్రశేఖరా! ఇప్పుడు నాకు కలిగే కొన్ని సందేహాలను మీ ముందు ఉంచుతాను.

1. అనంతం, ఏకరసం, అద్వైతం – అగు చిద్వస్తువునందు 'చిత్తం' అనే ద్వితీయ వస్తువు ఎట్లా ఏర్పడింది?
2. అచిత్తంలో ద్వైతం ఎట్లా అరూఢమౌతోంది.
3. చిదాత్మకు దుఃఖజాడ్యం ఎట్లా కలుగుతోంది?
4. జ్ఞానం సంపాదించేది ఎట్లా? ఆ దుఃఖజాడ్యం ఎట్లా తొలిగేది?

... ఈ విషయాలు వివరించవలసినదిగా నా విన్నపం

**శ్రీశివ భగవానుడు :** నాయనా! వసిష్ఠా! 'సర్వశక్తియుతము – ఏకత్వము' అయి ఉన్నదొక్కటే అన్ని వైపులా, అన్ని వేళలా వెలియుచున్నదని ముందే చెప్పాను కదా! నిజానికి పారమార్థిక దృష్టిలో దానియందు ఏ సమయంలోనూ ద్వైతాద్వైత భావాలూ, విషయాలూ లేనేలేవు.

ద్వైతభావం ఉంటే ఏకత్వమనేది మరొకటి ఉంటుంది. ఒకటేదో రెండు అవటమే ద్వైతం కదా! ఈ రెండూ కూడా చిన్మాత్రమగు బ్రహ్మము పట్ల సత్యం కాదు.

'రెండు' అనే భావం 'ఒకటి' అనుదాని లోంచే కలుగుతోంది. వాస్తవానికి బ్రహ్మమును ద్వైతమని గాని, అద్వైతమని గాని వర్ణించలేం. బ్రహ్మ ద్వైతాద్వైత వివర్జితం.

అయితే ...వ్యావహారిక పరమార్థ బోధ అది 'అద్వైతం' అని ప్రతిపాదించబడుతోంది. అదంతా తెలిపేవాడు ఔత్సాహికులగు తెలుసుకునేవారి వర్తమాన సమాచారం, సౌలభ్యములను అనుసరించి

చేస్తున్న మధ్యేమార్గమని గ్రహించు. లోకవ్యవహార సిద్ధికై ఆ విధంగా ద్వివిధ బోధ ఒనర్చబడి నప్పటికీ... పరమార్థ వస్తువు నందు చిత్తము అనబడే ద్వితీయం ఉండటం అసంభవం.

❖

కానీ, భావనచే ద్వితీయమైనదైన చిత్తము, అద్దాని నుండి తదితరమైనదంతా అనుభవమవటం జరుగుతోంది. అదెట్లా అంటావా?... బీజము ఒక్కటే అయినప్పటికీ అది వృక్షశాఖ, ఫల, పత్ర, పుష్ప, పల్లవాది వివిధ నామరూపాత్మకమై వ్యవహరించబడుతోంది కదా! అట్టి వ్యవహారసత్తా అంగీకరించటానికి ఇష్టం లేకపోయినప్పటికీ కీడేమిటి? బీజములోని రస శక్తియే ఆ విధంగా రూపం దిద్దుకొంటోందని ఎందుకు జ్ఞాపకముంచుకోరాదు?

ఎందుకంటే, చిత్‌యే చేత్యాది రూపంగా స్ఫురిస్తోంది. దాని సారమే అన్నిటా నిండి ఉన్నది. ఈ నామరూపాది వికారజాలమంతా ఆ చిద్వస్తువు నుండే లేచి కార్యకారణ భేదములతో వస్తు రూపమున సార్థకమగుచూ వ్యవహరించబడుతోంది.

అనగా... 1. పారమార్థిక, 2. వ్యావహారిక, 3. ప్రాతిభాసిక – ములగు సర్వ పదార్థములు కూడా బ్రహ్మసత్త చేతనే ఆవరించబడి ఉన్నాయని గ్రహించు. కనుక ఈ కనబడే సర్వమూ బ్రహ్మసత్తయే కాబట్టి సత్యమే కదా! కాని ద్రష్ట స్వకీయ సంస్కారానుసారం కొంత భ్రాంతిని జోడించి పరికిస్తున్నాడు. అట్టి అజ్ఞానం తొలగాలి. "పటిక బెల్లం యొక్క రుచి గురించి వర్ణన కన్నా అనుభవం మిన్న" అన్నట్టుగా, "వస్తు పరిశీలనాత్మక సాక్షాత్కారం" ఒక్కటే సర్వమునూ స్పష్టం చేయగలదు. జలకణములు, తరంగములు, బుద్బుదములు మొదలైనవన్నీ జలంనుండి ఏమాత్రం వేరైనవి కానట్లు... సర్వశక్తిత్వము కూడా బ్రహ్మము నుండి వేరుకాదు.

సర్వశక్తిత్వములోనే వస్తుశక్తి ఏర్పడి ఉంటోంది. కనుక ఈ కనబడుచున్నదంతా బ్రహ్మమునకు వేరు కాదు. బ్రహ్మము సత్యమే కదా! తత్త్వదృష్టితో చూస్తే బ్రహ్మమునకు శక్తికి అభేదమే ఉంటుంది. పుష్ప–ఫల–పల్లవాదులు లత నుండి వేరా? లత బీజములో ఉండి ఉన్న బీజశక్తి కంటే వేరా?

ఈ ద్విత్వము, ఏకత్వము, జగత్తు, అహం, త్వం ఆదిగాగల భావములన్నీ కూడా చిద్వస్తువు నుండి ...అనగా, తెలుసుకుంటున్న వానియొక్క 'తెలివి'అను స్వరూపమునుండి బయలుదేరుచున్నాయి. కనుక అవి అద్దాని నుండి వేరైనవి కావు. ఈ విధంగా ఈ దేశ కాలాది భేదములు చిద్వస్తువు నుండి వేరు కాదు.

ఇప్పుడు 'ద్వైతం ఎట్లా వచ్చిపడుతోంది?'అనే విషయానికి వద్దాం. నీ ఈ ప్రశ్న 'చైతన్యము లేక చిద్వస్తువు కంటే అన్యమైనదేదో ఉన్నది' అను ఆశంక నుండి బయలుదేరుతోంది. చిద్వస్తువు గాక వేరొకటేదీ లేనే లేదు. కనుక, నీ ప్రశ్న మొదలే అనుచితం. చిదాత్మ సత్త యొక్క ఉనికి చేతనే సంకల్పమాత్రముగా దేశ–కాల–క్రియ–నియతి మొదలైనవన్నీ ఆ చిదాత్మకే అనుభవమౌతున్నాయి. కనుక అవన్నీ చిదాత్మ యొక్క స్వయంకల్పిత స్వీయానుభవములే! చిదాత్మ స్వరూపములే!

జల తరంగములనే మనం ప్రవాహం – కెరటాలు మొదలైన పేర్లతో కూడా ఉద్దేశిస్తున్నాం

కదా! అట్లాగే చిదాత్మ ఒక్కటే బ్రహ్మమని, జడమని, చైతన్యమని, చిత్తమని, చేత్యమని పేర్కొనబడుచున్నదని జ్ఞానదృష్టికి, నిర్మల దృష్టికి తప్పక తెలియవస్తోంది.

జలం తరంగములు అనబడు మరొకటిగా మారుతోందా? లేదు. బ్రహ్మము స్వయముగా నిర్వికారమే. జలము మరొకటిగా ఉదయించటం అసంభవమే అయినప్పటికీ, తరంగం కనిపిస్తోంది కదా! అట్లాగే బ్రహ్మమునే 'తెలుసుకొనబడుచున్నది' లేక చేద్యము అని కూడా అంటున్నాం. ఆ పరబ్రహ్మమే వివిధ ద్రష్టలచే సత్యము, ఈశ్వరుడు, శివము, శూన్యము – మొదలైన వివిధ నామములచే పేర్కొనబడుతోంది.

అయితే ...ఆ పరమాత్మ నామరూపములకు అతీతమైనది. వాక్కుకు అగోచరమైనది. ఇక ఎదురుగా కనిపిస్తున్న ఈ జగత్తు 'చిత్‌లత యొక్క ఫల పుష్పములు' అని అనవచ్చును.

ఆ చైతన్యము 'అవిద్య' అనబడే ఉపనేత్రములను ధరించి 'జీవుడు' అనబడే రెండవచంద్రుని (రెండవ చంద్రుడు వాస్తవానికి లేడు కదా!) దర్శిస్తోంది. మరొకరకంగా చెప్పాలంటే ...ఆ చైతన్యము తనంతట తానే తనను జడముగాను, బ్రహ్మము నుండి వేరుగాను భావించుకుని వికల్పమయములగు వివిధ భావములను దాల్చుచున్నది.

అయితే, బిడ్డా! ఆ చైతన్యము సర్వదా నిష్కళంక రూపముననే వెలయుచున్నదయ్యా! తత్సమయముననే కల్పితమగు కళంకరూపమున సంసారనదియందు మునిగి ఔపాధిక చైతన్యముతో (ఉపాధితో కనిపించే స్వరూపంతో) ఇటూ అటూ సంచరిస్తోంది. మనస్సు, బుద్ధి, దేహాహంకారములకు నిలయమైన ఈ 'శరీరం' అనే పుర్యష్టకమునందు ఐక్యత కల్పించుకుని జీవరూపములను పొందుతోంది.

ఈ జీవుడు చిత్స్వరూప ప్రకాశం వల్లే చిన్మయుడై జీవిస్తున్నాడు. సూక్ష్మశరీర ధారి అయి, ఇక ఈ జీవుడు 'నేను పంచభూతాత్మక స్థూల దేహమును' అని భావించి, భావించి, అట్టి ద్రవ్యత్వంతో కూడి, వీర్యంగా స్త్రీ గర్భంలో చేరుతున్నాడు. 'చూడు, చూడు... నేను పుట్టాను, నాకు ప్రాణము లున్నాయి' అని తలపోయుచున్నాడు.

ఈ జీవుని ఆది–మధ్య–అంతం కూడా బ్రహ్మమే. అయినా కూడా పైన మనం చెప్పుకున్నట్లుగా భావించుకుంటూ, స్థూలదేహాన్ని అనుభవిస్తూ, స్థావరజంగమాది పదార్థాలను తనకు ఎదురుగా గాంచు చున్నాడు. ఇంకా చెప్పాలంటే, ఆయా వాసనల వలన ఆయా వస్తువుల రూపంగా మారుచున్నాడు.

**సూక్ష్మం నుండి స్థూలానికి -** సూక్ష్మ శరీరమునందు ఉన్నట్టి చైతన్యము నందు మాయచే సూక్ష్మ శరీర భావన యొక్క దార్ఢ్యం తగ్గి స్థూలశరీర వాసనలు ప్రబలటం జరుగుతోంది. అందుకు ఫలితంగా అకస్మాత్తుగా, కాకతాళీయంగా చైతన్యము తన సూక్ష్మశరీరం పరిత్యజించి స్థూలదేహం ఆశ్రయించి ఉంటోంది. ఒక "పిరికివాడు, మందబుద్ధి" – తన ఎదురుగా మసక చీకట్లో ఎఱ్ఱటి కనుగుడ్లు, జుట్టు విరగబోసుకున్న బేతాళుణ్ణి ఊహచే గాంచుతూ ఉంటాడు చూచావా? ఈ చైతన్యము అద్వితీయమై ఉండి కూడా తన యొక్క ద్వితీయ సంకల్పముచేత ద్వైతమును గాంచుచున్నది.

❖❖❖

# 8. సంకల్ప రాహిత్యం

అయితే ...'నేనేమీ చేయుటలేదు' (నాఽహంకర్తా) ...అని భావించినంత మాత్రం చేత పురుషునకు ఆ జరుగుచున్న క్రియా విశేషములపట్ల కర్తృత్వం తొలగుతుంది చూచావా? అట్లాగే, తిరిగి చైతన్యము అద్వైతభావమును ఆశ్రయించగానే ద్వైతభావన స్వభావసిద్ధంగానే ఉపశమిస్తోంది.

**ద్విత్వసంకల్పతో ద్విత్వమేకస్యైవ ప్రవర్తతే ।**
**అద్విత్వసంవిదా ద్విత్వమనేకస్యాపి నశ్యతి ॥** (శ్లో 30, సర్గ 33)

ఈ విధంగా ఆ అద్వితీయవస్తువు ద్విత్వసంకల్పమువలన ద్వైతభావన పొందుతూ, మరల మరొకప్పుడు అద్వైత భావము వలన నానాత్వమును నశింపజేసుకుంటూ ఉంటోంది. నానాత్వమునే మనం 'జగత్తు' అని అంటున్నాం. ఇదంతా ఇంత మాత్రమే అయి ఉన్నది.

అవికారుడు, సర్వగతుడు, నిత్యోదయుడు, వృత్తి జాడ్యము లేనివాడు అగు పరమాత్మయందు రెండవదంటూ ఏదీ లేదు. ఉండజాలదు. ఇక ఈ జగత్తులు, మనోరాజ్యములు, గంధర్వనగరములు అంటావా ...ఇవన్నీ చైతన్యము యొక్క సంకల్పపరంపరలచే రచించబడినవి మాత్రమే. సంకల్పములు ఉన్నప్పుడు అవి ఉంటున్నాయి. సంకల్పములు క్షీణించిన మరుక్షణం అవి లేకుండా పోతున్నాయి. సంకల్పములు లేనప్పుడు మిగులునదేదో... అదియే నీవు, నేను, అంతయు కూడా.

**సంకల్పశ్రమ! -** ఓ మునీశ్వరా! సంకల్పాలు కలిగి ఉండటమే శ్రమతో కూడుకున్న వ్యవహారం. సంకల్పములు లేకపోతే ఎట్టి కష్టమూ ఉండదు. సంకల్పయక్షుడే ఈ సంసారాన్ని రచిస్తున్నాడు. అయితే, సంకల్ప వ్యవహారం తనంత తానుగా క్షయించదు. దానికి సాధన అవసరమౌతోంది. 'సంకల్పించక పోవటం' అనే అభ్యాసం దానికి సరి అయిన మందు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** అయితే ఈ జీవుడు స్వసంకల్పవశం చేతనే దుఃఖితుడౌతున్నా డంటారా?

**శ్రీశివ భగవానుడు:** అవును. ప్రబలమగు సంకల్పవశం చేత వచ్చి చేరుతున్న ఆ దుఃఖం మరల తిరోమార్గంలో సహకరించగల సంకల్పముల వలననే క్షీణించ గలదు. సంకల్పరాహిత్యం చేత జీవుడు దుఃఖరహితుడౌతున్నాడు. 'సంకల్పములు చేయక పోవటం' అనేది అంతతేలిక కాదని జనులు భావిస్తున్నారు కాని సంకల్పములు చేయడంతోనే క్రియాశ్రమ ఉన్నది. ఎంత కొద్దిగా సంకల్పించినా సరే, చివరికి మనుష్యుడు దుఃఖజాలంలోనే పడుతున్నాడని హెచ్చరిస్తున్నాను. అసంకల్పం (సంకల్ప రాహిత్యం) వైపుగా కొంచం ప్రయత్నిస్తూ ఉన్నా... అవి కొంతకొంత తగ్గుతూ రాగలవు. సంకల్పించక పోవటం చేత అట్టి మనుజుడు అక్షయ సుఖమును పొందుచున్నాడు.

కనుక, పుత్రకా! ఈ మనుజుడు 'సంకల్ప సర్పము' నుండి విడివడనంతవరకూ రమణీయమగు నందనవనం కూడా ఈతనికి సుఖం కలిగించలేదు. ఇది గ్రహించి నీవు స్వకీయమైన 'వివేకము'అను వాయువును వేగంగా ప్రవహింపజేయి. ఈ 'సంకల్పములు' అనే మేఘపుంజములను చెదరగొట్టివేయి. శరత్కాల ఆకాశంలాగా పరమోత్తమ నిర్మలత్వం పొందెదవు గాక!

అంతేగాని, సంకల్పోన్మత్తుడవై సంకల్పనదీజలంలో తెలియరానిచోట్లకు కొట్టుకుపోవద్దు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ సంకల్పించు దురభ్యాసమును అధిగమించటం ఎట్లా?

**శ్రీశివ భగవానుడు :** 'శుభకార్యక్రమములు, భగవత్ స్తోత్రములు' మొదలైన వాటిచే ఈ సంకల్పనదీ జలమును శుష్కింపజేయాలి. సంకల్పములతో తేలిపోయే మనస్సును నెమ్మదిగా ఓదార్చి క్రమంగా నిర్మల మనస్కుడవు కమ్ము.

నాయనలారా! నీ చిదాత్మ సంకల్ప సుడిగాలులచే ఎగురగొట్టబడి ఎండిన ఆకులాగా, ధూళి కణంలాగా భూతాకాశంలో నిష్కారణంగా పరిభ్రమిస్తోంది. నీవు నీ చిదాత్మయొక్క యథార్థరూపమును వీక్షించు.

**స్వసంకల్పానకాలుష్యం వినివార్యాత్మనాత్మనః ।**
**పరం ప్రసాదమాసాద్య పరమానన్దవాన్భవ ॥** (శ్లో 40, సర్గ 33)

స్వయంగా నీకు నీవే ఆత్మను ఆవరించి ఉండే సంకల్ప కాలుష్యాన్ని దూరం చేయి. పరమనిర్మల భావమును పొంది పరమానందయుక్తుడవు కమ్ము.

పరమశక్తియుతమగు ఈ ఆత్మ దేనిని ఎట్లు భావించుచున్నదో అద్దానిని అట్లే తన సంకల్పవశం చేత గాంచుచున్నది. కనుక 'ఈ జగత్తులు ఎక్కడినుండి పుడుతున్నాయి?' అన్న నీ ప్రశ్నకు సమాధానం 'ఇదంతా సంకల్ప వశంగానే జనిస్తున్నది' అని చెప్పవలసి వస్తోంది. అంతకుమించి ఇందుకు వేరే కారణమేదీ వాస్తవానికి లేదు.

ఎందుకంటే ఇదంతా 'శివము'అని సంకల్పిస్తే శివమే అగుచున్నది. కాదూ... 'బంధం' అని సంకల్పిస్తే బంధమే అవుతోంది. ఈ జగత్తు ఏదైనా ఒక్కటి అయి ఉంటే మరి అందరికీ అట్లాగే అనిపించాలి కదా! అట్లాలేదే? కొందరికి బంధమని మరికొందరికి శివమని ఎందుకనిపిస్తోంది? అందుచేత బ్రహ్మజ్ఞా! సంకల్పములు క్షీణించాయా ...ఇదంతా ఎచ్చటనో విలీనమైపోతోంది. సంకల్పములచే అనుక్షణం నిర్మించబడుచున్న అనేక జన్మపరంపరలు నిస్సంకల్పబలంచే ఉష్ణము వలన మంచుగడ్డ యొక్క ఆకారాలులాగా – పరమపదమున విలీనమైపోతున్నాయి.

ఈ సంకల్పములకు మూలం తృష్ణ. కర్మోత్సాహము అందుకు ఫలితం.

తృష్ణను మొదలంట పెకలించినవానికి సంకల్పత్యాజ్యం అతి సులభం. సత్యదృష్టి, దూరదృష్టి, ఉత్తమదృష్టి పెంపొందించుకున్నవాడు తృష్ణను విషతుల్యంగా దూరంగా త్యజించగలడు. చూచావా నాయనా! ఈ సంసారబంధ – దుఃఖ వ్యవహారములన్నిటికీ అసలు కీలకం ఈ వస్తు–విషయములను దుష్టబుద్ధితో కూడి సంకల్పించుచుండుటయే.

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంకల్పాలు తొలగినప్పటికీ జగత్తు ఉండియే ఉన్నదనుకోండి? అప్పుడేం చేయాలి?

**శ్రీశివ భగవానుడు :** అప్పుడీ జగత్తును అభాసముగా , ప్రతిభాసగా గ్రహించు. ఇది సంపూర్ణంగా తమ యందు తొలిగేంత వరకు జ్ఞానులు దీనిని గంధర్వనగరంగా స్వప్నభావంతో గాంచుచున్నారు.

ఒకానొక రాజు 'నేను రాజును' అనే విషయం మరచిపోయి నిష్కారణంగా మనోకల్పితమైన

శోక – దారిద్ర్యములను అనుభవిస్తున్నాడు. ఆ దుఃఖం తొలిగేది ఎట్లా? ఆ మనోకల్పన నుండి మెళుకువ తెచ్చుకున్నవాడై – తాను రాజు అనే విషయం జ్ఞాపకానికి రావటంచేతనేకదా! 'స్వస్వరూపస్మృతి' అనే సూర్యుడు ఉదయించగానే సర్వ సంసారాంధకారాలూ ఎచటికో ఎగిరిపోతాయి. స్మృతిభ్రంశమైన రాజుకు ఆప్తులు పూర్వస్మృతి కలుగ జేస్తున్నట్లు తన స్వస్వరూపమును ఎరుగుటకు ఉద్యమించిన జీవునకు గురువులు, శాస్త్రములు ఆప్తవాక్యాలు ప్రసాదిస్తున్నాయి. అవి గ్రహించినప్పుడాతడు ఆత్మారాముడై నిరామయుడై, వెలయగలడు.

1. తన ఇతఃపూర్వపు ఆత్మైక్య స్వభావస్థితి, 2. వర్తమాన సంసార మోహం …ఈ రెండింటిలో ఏ ప్రయత్నం బలవత్తరమైనదైతే అదే రాణిస్తోంది. అందుచేత ఈ వర్తమాన 'దృశ్యతదాత్మ్యం' అనే సంసార మోహం నశించాలంటే, (లేక) దానిచే ఆక్రమితమైన స్మృతి తొలగాలంటే, "శుభేచ్ఛ, శ్రవణ, మనన, నిధిధ్యాస" లనే సాధన చతుష్టయం అత్యావశ్యకం. అట్టి ప్రయత్నం లేకపోతే ఈ నా ఆప్తవాక్యాలు ఒంటబట్టవు. వీణాతంతువులలో ఏది పెద్దధ్వని చేస్తుంటే, అదియే వినబడుతూ ఉంటుంది కదా!

కనుక వసిష్ఠా! నీవు 'నేను అద్వితీయమగు ఆత్మను' అను ఏకత్వ భావనకు ఉపక్రమిస్తూ ఉంటే నా ఈ ఆప్తవాక్యాలు నీకు ఎంతగానో ఉపకరించి, నిన్ను సంసారముయొక్క ఆవలి ఒడ్డుకు జేరుస్తాయి. అట్టి భావనతో యుక్తుడవైతే నీవు బ్రహ్మమే కాగలవు. నిన్ను పోలిన వారు కేవల బాహ్యపూజకు పరిమితులు అవటం ఉచితం కాదు.

నీకు పూజనీయమగు దేవత ఆ 'పరమార్థసత్' ఒక్కటే. ఇది అదిగాక తక్కిన అర్చనాయత్నాలు – అనగా ప్రతిమానిర్మాణం, పూజాద్రవ్యాలు మొదలైనవన్నీ మనోకల్పనామాత్రంగా తెలుసుకున్నవాడవై అనవరతం చిదాత్మ పూజయందు ఉపక్రమించు. ప్రతిమాదులు ఆత్మయొక్క సంజ్ఞలు. అంతేగాని అట్టి కార్యక్రమమంతా ప్రతిమాపరిమితం కాదు. అందుచేత ముఖ్యంగా ప్రతిమపూజ చేస్తున్నప్పుడు అద్వైత నిర్వృత్త భావనలతో పూజ సలుపుతూ ఉండు.

❖❖❖

# 9. చైతన్యము - విశ్వము

**శ్రీశివ భగవానుడు :** హే మహర్షీ ! ఇప్పటి వరకు నాచే వర్ణించి చెప్పబడుచున్న 'ఆత్మదేవపూజ' అనుదానిచే నిజానికి విశ్వమే పూజించబడుతోంది. ఈ విశ్వము–

1. బాధిత దృష్టికి … అసత్తు. 2. అధిష్ఠాన దృష్టికి … సత్తు.
3. వ్యవహారదృష్టికి … ఇందులో ఏకత్వ – ద్విత్వములు ఉన్నాయి.
4. పారమార్థిక దృష్టికి … ఇందులో ఏదీ లేదు. చూచువాడే చూడబడేదాని యందు అణువణువూ ప్రసరించి, ఏర్పడి ఉన్నాడు.

…ఈ 4 విషయాలూ యుక్తియుక్తములే.

చైతన్యము యొక్క మోహచమత్కారమే ఈ సంసారం. తత్త్వ దృష్టికి ... దృక్స్వరూపుడు, ద్రష, దృశ్యముల – సమన్వయమగు చైతన్యము సర్వదా నిష్కళంకము, అసంసారి, అన్నిటి కంటే మునుముందుగానే ఏర్పడి ఉన్నది, భేదరహితము కూడా.

"ఈ దేహాదులే నేను" అనే కళంకం ఆ నిర్మలచైతన్యాన్ని బంధించినట్లు అనుభవాన్ని కల్పిస్తోంది.

"ఈ కనబడేదంతా సర్వకర్తయగు నాకంటే వేరుకాదు' అని గ్రహించబడిందా" ... మరుక్షణం చైతన్యము ఈ సర్వము నుండి విడివడుచున్నది.

ఆహా! సర్వవ్యాపితమైన నిష్కళంకచైతన్యం బాహ్యపదార్థములను భావించి ద్విత్వమును పొంది, తన అఖండసత్తను చిత్రముగా ఏమరుచుచున్నదే! అది ఈ శారీరక సుఖ దుఃఖములతో కూడినదై, కల్పిత అసత్యపదార్థములను సత్యమైనవిగా గ్రహిస్తోంది. వ్యావహారిక దృష్టికి నామరూపాత్మకముగా తోచు ఈ దృశ్యమునకు ఎట్టి ధర్మమూ లేదు. ఇది సత్య – అసత్య సమన్విత వికల్పములు గానీ, స్వతఃసిద్ధ సుఖదుఃఖదాయకము గానీ ఏదీ కాదు. వాస్తవానికి ఇదంతా కూడా నిరవయవము–విశుద్ధము–పూర్ణము–నిర్హేతుకము అగు బ్రహ్మమే అయిఉన్నది. అది ఆకాశము వలె వికాసముపొంది జాగృత–స్వప్న–సుషుప్తులతో కూడి సంసారాన్ని కల్పించుకుంటోంది. "ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము" అను మార్గముల గుండా ఈ జగత్తును తన స్వశక్తిచే వికసింపజేస్తోంది. అయితే తన ఇంద్రియములలో ఒకటైన మనస్సు వలననే మనస్సు నిర్జింపబడగా అప్పుడు సత్యమేమిటో స్వయముగా ప్రకాశిస్తోంది. ఈ జగత్తులన్నీ ఆ సత్యంలో విలీనమైపోతున్నాయి. ఒకప్పటి కల్పనయగు ఈ క్షుద్రసంసారం భంగపడుతోంది.

ఇట్టి స్థితిని సంపాదించు మహనీయుని ఉపనిషత్తు మొదలైన శాస్త్రములు 'ఇతి' అను శబ్దం చేత నిర్వచిస్తున్నాయి. ఆ మహనీయుడు మరల సంసారంలో జన్మించనట్టి కృతనిశ్చయంతో ఉంటు న్నాడు. అతని సత్తాను వేయించబడిన (మరల మొలకెత్తని) విత్తనంతో బుధులు పోలుస్తూ ఉంటారు.

దృశ్య పదార్థములన్నీ అకృత్రిమంగా బాధింపబడటం చేత .. సత్తా అప్పుడు 'దృక్' స్వరూపంగా మారిపోతోంది. కనుక ఆత్మానుభవి 'పశ్యంతి – ద్రష్ట – చూచువాడు' అను పేర్లతో పిలవబడుచున్నాడు. అట్టి మహత్పురుషుడు చిత్త విషయములను ఇక స్మరించడు. 'మనోమోహములు' అనే మేఘముల నుండి విడివడినవాడై, అతీతుడై నిర్మలాకాశము వలె విరాజిల్లుతాడు.

ఇంతకు ముందు అతడు అనేక విషయ వస్తువుల గురించి అనేక చిత్త చాంచల్యములను పొంది ఉండవచ్చు గాక... ఇప్పుడీ జీవన్ముక్తియందు అవన్నీ తొలగిపోతున్నాయి. ఆతడు భౌతికంగా చూస్తే ఈ సంసారసాగరంలో దేహి అయి ఉన్నట్లే ఉంటాడు. అయితే ఏం? అంతరంగము నందు ఈ జీవదశయందు ఉత్తీర్ణుడై నిఖిల పదార్థములందు లేనివాడై ఉంటున్నాడు. ఆతనిని వర్ణించటానికి మాటలు చాలవు. ఆతడు పునర్జన్మ బీజరహితమైన నిరతిశయానంద స్వరూపం అపరిమితంగా పొంది నిశ్చింతగా విశ్రమించియే ఆయా ప్రవాహపతిత కార్యక్రమములందు పాల్గొనుచున్నాడు.

అది మనోక్షయమైనప్పటి నిర్వికల్పచైతన్య స్థితి. చైతన్యముయొక్క ప్రప్రథమ స్థితి.

❖

మనోదశ నుండి విడివడిన చైతన్యమే సూర్యచంద్రాది జ్యోతిష్య పదార్థాల నుండి, అజ్ఞానాది సకల అంధకారముల నుండి వేరై విశాలమగు ఆకాశము వలె స్వచ్ఛ స్వభావమున వెలయుచున్నదని చెప్పుకున్నాం కదా! అనంతరం కాలక్రమంగా సకల బాహ్య విషయ ఔత్సుకతను విడచి, వాయువుచే కదల్చబడని నీరు వలె నిశ్చలభావంలో వెలయుచున్నది. చైతన్యస్థానం స్పందనను త్యజించిన వాయువు వలె ఒకానొక నిర్వికల్ప స్థితికి సంబంధించినది. ఇక ఇందు కనిపించే జ్ఞానశక్తి లేక 'ఎరుక' అను విన్యాసం ఒకానొక నిర్వికల్ప స్థితికి చైతన్యమునకు చెందినది. అట్టి జ్ఞానశక్తి గురించి కొన్ని విశేషాలు చెప్పుకుందాం.

**జ్ఞానశక్తి -** ఈ జ్ఞానశక్తి యొక్క రూపం ఆకాశం కంటే అత్యంత నిర్మలం. సద్వస్తువు యొక్క ఉనికియే జ్ఞానశక్తి యొక్క అస్థిత్వమునకు కారణం. జ్ఞానశక్తి యొక్క రూపం, కారణం, చిదాత్మయే. స్పందన శక్తికి కారణమగు ప్రాణము ఈ శరీరం లేకపోయినప్పటికీ సామాన్య వాయురూపమున ఉంటుంది. అట్టి ప్రాణశక్తి కంటే అత్యంత నిర్మలము, సూక్ష్మము అగు చిదాత్మకు వినాశనమనేది ఉండదు. ఇక జనన మరణములు ఎవరికి? అటువంటి భ్రమయే ఉండవలసిన అవసరం లేదు.

ఈ జీవులంతా ఎవరు? చైతన్య స్వరూపులే! మనో ప్రాణములతో నిండి ఉన్న ఈ శరీరములన్నిటి యందూ చైతన్యం అభివ్యక్తం అవుతోంది. వాస్తవానికి చైతన్యము సర్వదా సర్వము నందూ బాహ్య-అభ్యంతరములలో ఆక్రమించుకొనియే ఉన్నది.

పరమ రహస్యమగు చమత్కారం నీవు గ్రహించటానికి వీలుగా నీకొక చిన్న దృష్టాంతం చెపుతాను విను. ఒకచోట ఒక దర్పణం అమర్చామనుకో. అందులో దృశ్యం ప్రతిబింబిస్తోంది. దర్పణం లేకపోతే కూడా బింబం ఉన్నది గాని, ప్రతిబింబించటం జరుగదు. ఈ చైతన్యం విషయం కూడా అట్టిదే. అది సర్వేసర్వత్రా ఉండి కూడా మనోప్రాణములు ఉన్న చోటే 'జీవుడు'అను రూపంలో ప్రతిబింబిస్తోంది. ఒక దర్పణంపై దట్టంగా ధూళి పేరుకుని ఉంటే, అందులో ప్రతిబింబం కనబడదు కదా! అట్లాగే ప్రాణము లేని చోట చిత్ ప్రతిబింబించటం లేదు. సర్వవ్యాపియగు ఈ చైతన్యం బాహ్యవస్తు ఆకారితమగు చిత్తవృత్తులతో కూడి ఈ శరీరమును స్పందింపజేస్తోంది. అది అచ్చోట ఒక్కొక్కప్పుడు తన గురించి తానే పరిమితత్వమును ఆపాదించుకుంటోంది.

❖

ఆ చైతన్యము తత్త్వబోధను పొందుచున్నప్పుడు పరమ పదకళ్యాణ ప్రదమగు కైవల్య రూపమున విరాజిల్లుతోంది. ఆ చైతన్యము వస్తువులను ప్రకాశింపజేయుచూ, వాటికి 'సత్త'ను ప్రసాదిస్తోంది. చైతన్యం నుండి సత్తను పొందిన ఈ వస్తుజాలం దేశ-శబ్ద-వాచ్యములను సంపాదించుకుంటున్నాయి.

ఇక అది సుఖములన్నిటి యొక్క పరమావధి... శుభములన్నిటిలోకి అత్యంత శుభప్రదము.. వినాశనము లేని ఈ పవిత్ర స్థితియే చైతన్యము యొక్క ఆత్మైక్యావస్థ.

వత్సా! ఈ భూమిక యందు వసించటమే ఇన్నిన్ని జన్మల యొక్క ఏకైక లక్ష్యము. అన్ని మార్గములలోని అందరి పథికులకు అదియే చేరవలసిన గమ్యమై ఉన్నది.

అది నీ స్వస్వరూపమే కదా! అందుచేత అందు ఏర్పడి ఉన్నప్పుడు గాని జీవునిలో అంతర్గతంగా దాగి ఉన్న అసంతృప్తి తొలగదు. లోకములలో కనిపిస్తున్న అన్ని ఆరాటముల యొక్క అంతర్లీన సత్యమైన గమ్యం అదే. ప్రయాణం చేయువాడు ఇల్లు చేరితే గాని మానసిక విశ్రాంతి పొందనట్లు అప్రమేయ స్వస్వరూపం జేరిన జీవుని ఆనందము, విశ్రాంతి వర్ణనాతీతం.

అందుకు మార్గం 'సంకల్ప త్యాగమే'! అది నీ రూపం నీవు పొందటమే! కనుక, అద్దానిని కష్ట సాధ్యం అని ఎవరూ అనటానికి వీలు లేదు.

ఆ స్థితి నా వాక్కుకు కూడా అతీతమై, అభివర్ణించటానికి అశక్యమై, అనుభవముతో కలిగే ఐక్యమై ఉన్నది. మౌనమే అద్దాని గురించిన వ్యాఖ్య. అది నీకు నీవు పొందవలసినదే! కాబట్టి ఏమి చెప్పినా వాక్యములు ఒకచోట ఆగవలసినదే. ఆ తురీయాతీత అకళంక స్థితి జాగ్రత్-స్వప్న-సుషుప్తులకు అతీతమైయున్నది.

అదియే సనాతన దైవము. నీవు పూజించవలసిన దైవము ఆతడే. అందు నీవు నిత్యము అఖండుడవై వెలయుము.

❖

నాయనా! 'ఈ విశ్వము యొక్క ఉపాదాన కారణం ఆ చైతన్యమే'... అని భావన చేస్తూ ఉంటే, నీ పట్ల ఈ విశ్వమంతా చిన్మయమే అగుచున్నది. లేదా, "ఈ విశ్వము దీని ఉపాదానకారణం కంటే వేరు కాదు"... అని భావిస్తే అప్పుడు కూడా ఆ విజ్ఞుడు ఇందులో తన్మయుడు కాడు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ విశ్వమే మీరు ఇప్పుడు నిర్వచిస్తున్నట్టి చైతన్యమా? కాదా?

**శ్రీశివ భగవానుడు :** చైతన్యము 'ఉపాదానకారణము - కార్యము'లకు అతీతమైనది. వాస్తవానికి 'విశ్వము' అనబడేదేదీ లేదు. అది ఉత్పత్తి అవటంలేదు. వినష్టం కావటంలేదు. ఈ బ్రహ్మాండమంతా కూడా ఏకాకారమగు ఆకాశకోశము వలె శూన్యము. కేవలం చైతన్యం ఒక్కటే అద్వైత ఘనచేతన రూపమున వెలయుచున్నది. నిర్వికారమగు ఆ చైతన్యము సమక్షంలో సాపేక్షిక నిత్యములగు ఆకాశ-కాలాదులు కూడా అనిత్యములే, శూన్యములే. పసిబాలుడు ఆట బొమ్మతో కల్పిత దృష్టిచే ఆడుకుంటున్నట్లే ఈ ఆకాశము, శిల, ఇల్లు మొదలైనవి.

భేదభావనలే జగత్తు గాని, అది మరింకేమో కాదు. చైతన్యమే సత్యము అయి ఉండి, అసత్యమువలె భ్రమింపబడుతోంది. ఇదంతా కూడా వాక్కునకు అతీతమగు శాంతి, శివ స్వరూపము, ప్రణవ తురీయ మాత్రము అగు బ్రహ్మమే సుమా!

❖

ఇట్లు పలికి ఆ సాంబశివుడు మౌనం వహించాడు. సర్వసంసార ఉపశమనమగు అనిర్వచనీయ తురీయాతీత పదమున విశ్రాంతి పొందాడు. అప్పుడాయన చిత్తవృత్తి పరమానంద చిదేకరూపమున పరిణతి పొందింది. మనస్సు తన స్వరూపమును వీడి అనంత నిశ్చలత్వము పొందింది.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ సభికులారా! తురీయానంద స్వరూపులారా! మీ మీ స్వస్వరూపం గురించి మూర్ఖత్వమును ఆపాదించుకుని స్వల్పత్వము పొందవలసిన పనేమున్నది? లెండి మీ స్వస్వరూప మాతృగృహమున ప్రవేశించి శాంతమును పొందండి.

❖❖❖

# 10. నిజాత్మ భగవానుడు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా పరమేశ్వరుడు ముహూర్తకాలం నిర్విషయకమైన సర్వాత్మక చిదానందంలో చిద్విలాసులై గడిపాడు. మరల కళ్ళు తెరిచాడు. నాపై వాత్సల్యం కురిపిస్తూ చిరునవ్వు ప్రకటించారు. ఆయన పెదవుల నుండి మరల జ్ఞానవాక్యామృతం ఇట్లు నా పై వర్షించింది.

❖

**శ్రీశివ భగవానుడు :** ఓ మునిసత్తమా! మహర్షి వసిష్ఠ శిష్యజనులారా! మొట్టమొదటగా విచారణ చేసి మీ స్వస్వరూపమేమిటో గ్రహించండి. అంతేగాని గాలి తనకు తానుగా వీచి, ధూళిని లేపి, తెలివి తక్కువగా ఆ ధూళిని తన యందు నింపుకుంటున్నట్లు నీవు అనర్థజాలమును పనిగట్టుకొని ఆశ్రయించి అవి నీ మనస్సును నింపివేయునట్లు చేసుకోవద్దు.

నాయనా! వసిష్ఠా! నీవు చూడతగ్గ బాహ్యవిషయాలన్నీ చూచావు. వినవలసిందంతా విన్నావు. ఇంకనూ భ్రాంతితో పని ఏముంది? తత్త్వవేత్తలగు వారు ఈ సంసారములో వదలవలసినవి గాని, ఆశ్రయించవలసినవి గాని గాంచరు. శాంతి-అశాంతిమయ సంసార విశేషములను నీవు ఇత పూర్వమే 'విజ్ఞానం' అను చురకత్తితో కత్తిరించివేశావు. కాబట్టే ధీరుడవయ్యావు. ఇప్పుడిక నిర్మలాత్మ దర్శనమును కాదనేవారెవరు? సమస్త ప్రపంచమునకూ లోపల వెలుపల వెలయుచూ, ఆత్మదర్శివి అయి ఉంటూనే, ఈ దృశ్యదశలో ప్రవచించబడుచున్న నా ఈ ఉపదేశాలు ప్రస్తుతం విను. అటు తరువాత ఈ దృశ్యజగత్తులో సంచరించేటప్పుడు ఈ బోధ యొక్క సారాన్ని అనుకరిస్తూ ఆచరించు.

నీవంటి నిర్మల హృదయుడు దృశ్యదశలో ఉన్నప్పటికీ వచ్చే లోటేమీ ఉండదు. అఖండం, అప్రమేయం, నిత్యం, నిర్మలం - అగు ఆత్మార్థ లాభం కొరకు శ్రవణ మననాదులచే పదే పదే ప్రయత్నించవలసిందే. ప్రయత్నించని వారికి ఎక్కడైనా ఏదైనా లభిస్తుందా?... లభించదు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే ఆశ్రితవత్సలా! పరమేశ్వరా! బాహ్యదేహాదు లందు ఆత్మబుద్ధిని అనునిత్యం పరిత్యజించాలని చెప్పారు కదా! ఈ దేహాత్మ బుద్ధినుండి విడివడటానికి ఉపాయాలు చెప్పవలసినదిగా నా ప్రార్థన.

**శ్రీశివ భగవానుడు :** ఈ శరీరం ప్రాణవాయువు వలన ఒక యంత్రంలాగా చలిస్తోంది. ఆ ప్రాణవాయువు యొక్క చలనమే లేకపోతే ఇది స్పందనారహితమై మూగదానిలాగా ఉండిపోయేది. ప్రాణాయామ (ప్రాణచలన) ఉపాసకులు ప్రాణచలనమునకు సాక్షిత్వమును 'సాధన' గా ఎన్నుకొను చున్నారు. క్రమంగా వారి బుద్ధి నిర్మలమై ప్రాణముల చలన స్వభావం నుండి విడివడి నిశ్చలత్వం

సముపార్జించుకుంటోంది. నిర్మల, నిశ్చలబుద్ధి స్వభావసిద్ధంగా పరమాత్మ యొక్క ఆస్వాదన యందు ప్రవేశిస్తోంది. దేశకాలములను, సమస్త దృశ్యవస్తు అనుభవమును త్యజించి విడివడుతోంది. జడ భావాల నుండి విముక్తిని పొంది, అపరిచ్ఛిన్నత్వంతో కూడిన ఒకానొక అనిర్వచనీయసత్తను సంతరించు కుంటోంది. ఆ సత్తయందు దిక్కులు, కాలము అనే పరిచ్ఛిన్నత ఉండదు. అట్లాగే, భక్తి-జ్ఞాన-కర్మోపాసకులు కూడా వారి వారి ఆయా శాస్త్రోచిత మార్గములలో బుద్ధిని నిర్మలం చేసుకుంటున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మహాదేవా! ఈ దేహం ఉన్నంత వరకు జీవునకు అట్టి అపరిచ్ఛిన్న సత్త లభించదు కదా! ఎందుకంటే దేహం ఉన్నంతవరకూ దిక్కులు, కాలము ఉండియే తీరుతాయి కనుక!

**శ్రీశివ భగవానుడు :** నాయనా! ఈ దేహం ఉండటం చేతగాని, ఏవో చేయవలసిన పనులు ఉండటం వలన గాని అట్టి అపరిచ్ఛిన్న సత్తా యొక్క అనుభవం ఇబ్బంది పడుతుంది – అని మూర్ఖత్వముచే మాత్రమే జీవులు కొందరు భావిస్తున్నారు. అది సత్యం కాదు. శరీరధారులై అనేక కార్యక్రమములందు నియమితులై కూడా 'తురీయము, అకలంకము, అనామయము'అగు ఆ అఖండ, అప్రమేయానుభవం ఆవరిస్తున్న మహనీయులెందరో ఉన్నారు. ఆ స్థితియందలి ఆనందము అన్ని వస్తువుల నుండి, అన్ని కాలముల నుండి లభించే ఆనందముకంటే కూడా మహత్తరమైనది. అతీతమైనది.

చూచావా! ఎట్టి ప్రయాస లేని సంకల్పత్యాజ్యం ఎట్టి స్థితికి జీవుని తీసుకురాగలుగుతుందో! ఆ ఆనందమును గాంచుచూ జీవన్ముక్తుడు అనంతశాంతిని అనుభవిస్తూ వెలయుచున్నాడు. సంకల్ప స్వరూపమైన మనస్సు 'ఆత్మానంద సంకల్పము' సంధించబడగా ...అప్పుడు మనస్సునందే మనస్సు లయించు 'సర్వప్రయత్న రహిత స్థితి' అది.

❖

చైతన్యము బ్రహ్మాకార అఖండ చిత్తవృత్తిని చేబట్టుచున్నప్పుడు 'బ్రహ్మము అనగా నేనే' అను బ్రహ్మైక్య భావము పొందుతోంది. తత్ఫలితంగా నామ రూపాత్మకమగు 'బ్రహ్మము-ఆత్మ' మొదలైన సంజ్ఞలను అతిక్రమించి కేవల స్వరూపమున వెలయుచున్నది. అప్పుడు అది మనస్సుతో పంచ ఇంద్రియాలతో సహా ఆరు విధములైన భావవికారముల నుండి విడివడి తమస్సుకు పరమున ఉన్న స్వస్వరూపమున వెలుగొందుచున్నది. నిష్కళంకమై, తురీయాది నామములకు కూడా అతీతమై, కాలం కంటే కూడా శాశ్వతమైనట్టి ఏ తన నిజస్వరూపం గలదో, అట్టి 'పురుషార్థరూపం' పొందుతోంది.

హరి – హర – బ్రహ్మ – ఇంద్రులు కూడా ఆ చైతన్యమే. నిఖిలాకృతియు, సర్వగామియు, నిత్యోదితము అగు ఆ చైతన్యం అగ్ని, నీరు, చంద్రుడు, సూర్యుడు మొదలైన రూపములన్నీ దాల్చు చున్నది. ఆ చైతన్యమే ప్రతి జీవుని ఆత్మకూడా. ఆ చైతన్యమును ఎరిగినవారు శోకరహితులగుచున్నారు.

కాల్చబడిన లోహము నుండి అగ్ని రవ్వలు వెలువడుచున్నట్లు, మహాసముద్ర జలం నుండి నీటి తుంపరలు వెదజల్లబడుచున్నట్లు ఆ చైతన్యము నుండి వెలువడుచున్న బ్రహ్మాదులు కూడా భ్రాంతిమయులే. వారు ఈ కల్పనాజాలాన్ని విస్తరింపజేస్తున్నారు. అనగా అవిద్య బ్రహ్మ మొదలుకొని ఈ ప్రపంచము వరకూ శాఖోపశాఖలుగ వ్యాప్తమై విస్తృతమౌతోంది. వేదములు, వేదార్థములు,

క్రియా కలాపములు, జీవులు – ఇవన్నీ అవిద్యా ప్రాంగణంలో చిక్కుబడి ఉంటున్నాయి. ఈ అవిద్య అనంతమై ఎన్ని విధములైన దేశకాలములుగా విస్తరించి ఉంటోందో చెప్పనలవి కాదు.

❖

ఓ మునిసత్తమా ! ఆ చైతన్యమే బ్రహ్మ విష్ణు శివాదులకు కూడా పరమపిత అని గ్రహించు. కాయలన్నిటికీ చెట్టే కారణమై ఉన్నట్లు ఆ నిఖిలాత్మమహాశయుడే మనందరికీ మూలం అగుచున్నాడు. మన స్వరూపమగు ఆ చిదాత్మయే అన్నిటి యొక్క సత్త కూడా. ఆతడే వివిధములగు జ్ఞానములను కూడా కలుగజేయుచున్నాడు. ఆతడు అన్ని వస్తువులందూ, అన్ని జీవులందూ, అన్ని ఇంద్రియము లందూ వ్యక్తమై ఉంటున్నాడు. సర్వతేజోవంతమై సదా సర్వత్రా ఉదయించుచూ, తత్వవేత్తలచే వందనార్చనములు స్వీకరించుచున్నాడు.

**సంవేదనాత్మకతయా గతయా సర్వగోచరమ్ ।**
**న తస్యాహ్వానమన్త్రాది కించిదేవోపయుజ్యతే ॥** (శ్లో 24, సర్గ 35)

ఇప్పుడు చెప్పు. సర్వత్రా వెలయుచున్న ఆ చైతన్య భగవానుని అర్చించటానికి సామాన్యమైన పూలతో చేసే పూజ, ఆవాహనాది మంత్రములు ఎందుకు? అన్నిటా ఉండి ఉన్నవానిని ఎక్కడికి ఆహ్వానిస్తావు?

నాయనా! ఆయన నిత్యాహ్వానమును గ్రహించి జ్ఞాన స్వరూపమున అన్నివైపులా అన్ని వేళలా లభ్యుడగుచున్నాడు. ఆయనయే స్వీకరించబడు వస్తువుల రూపమున, వాటికి మననం చేసే మనస్సు రూపమున, ఆ మనస్సున సంకల్పించే ద్రష్టరూపమున ప్రకాశిస్తున్నారు. ఓ మునీశ్వరా! సురేశ్వరుడగు ఆ చిదాత్మనే అన్నిటికీ ఆర్యునిగా, పూజ్యునిగా, నమస్యునిగా, స్తుతార్హునిగా... గ్రహించు. ఆతడే మహద్వస్తువులన్నిటి యొక్క పరాకాష్ఠ. వాస్తవానికి ప్రతిఒక్కరియొక్క ఇష్టదైవం ఆసర్వాత్మకుడే! సర్వాంతర్యామియే! సర్వతత్వస్వరూపుడే!

జరాశోకభయవినాశకరమగు ఆ ఆత్మతత్త్వమేమిటో తెలుసుకున్న జీవునకు – వేయించిన విత్తు మరల మొలకెత్తని రీతిగా జన్మలు ఉండవు. ఎందుకంటే, “నేను ఇప్పటికీ, మరెప్పటికీ నిత్యోదిత చైతన్యస్వరూపమే! నాకు వర్తమాన జన్మగాని, ఇతఃపూర్వపు జన్మలుగాని, ఇక ముందటి జన్మలు గాని మొదలే లేవు” – అని గ్రహిస్తున్నాడు.

మనందరి యొక్క జ్ఞాన రూపమై వెలయుచున్న సర్వాభయప్రదాతయగు ఆ దేవదేవుని ఉపాసన అత్యంత సులభం. జన్మయే లేని ఆ ఆత్మతత్త్వము నిజానికి నీ సత్యరూపమే అయి ఉన్నది కదా! ఇక వ్యర్థమగు బాహ్య దృష్టులకు ముగ్ధుడవగుచున్నావేమిటి?

❖❖❖

# 11. తస్మై సర్వాత్మనే నమః

**శ్రీశివ భగవానుడు :** కుమారా! వసిష్ఠా! చిద్రూపుడగు ఆ ఆత్మదేవుని సాక్షాత్కారం చేసుకుంటే ఇక పునర్జన్మలకు సంబంధించిన మనోవృత్తులన్నీ స్వయంగా తొలగుతాయి. 'విశుద్ధమై, స్వానుభూతి నుండి వేరొకటి కానట్టి ఆ ఆత్మజ్ఞానమే సంసారరోగ నివారణి' అని బ్రహ్మవేత్తలగు మహనీయులు నిర్దేశిస్తున్నారు. నిర్మలచిత్సారమైన ఆ ఆత్మయే బీజములన్నిటికీ బీజము. కారణములన్నిటికీ కారణము. ఈ సంసారసాగరంలో తారసపడే కర్మలన్నీ అద్దాని ఆరాధనయే. అది అన్నిటికీ తానే కారణమై, తాను సర్వదా అకారణమై ఉంటోంది. అది ఎల్లప్పుడూ నిష్కళంకమైనది. అది నీ స్వరూపమే సుమా! ఇక మోహమెందుకు?

అది భావించబడుచున్న సర్వ పదార్థములందలి భావనా స్వరూపమైయున్నది. అట్లైె కూడా అభావనీయ - జన్మరహితమగు అభావ స్వరూపముననే వెలయుచున్నది.

అదియే అందరి బుద్ధి వృత్తులనూ ప్రకాశింపజేస్తోంది. జీవుల అంతరమున చిత్సారరూపమును వెలయుచున్నది. అది తన ప్రత్యక్ స్వరూపమున ఏర్పడి ఉంటూనే అదే సమయమున ఈ జీవుల బుద్ధివృత్తులందు వ్యాపించి ఆ బుద్ధి యొక్క ప్రసరణముచే బాహ్యవస్తువుల ఎరుకకు కారణమౌతోంది.

ఒకవైపు నిర్విషయమై ఉంటూ, మరొకవైపు సర్వ విషయములకూ తానే స్థానమగుచున్నది. అది ఎట్లా అంటావా? బంగారము వాస్తవానికి ఆకార రహితమై, అదే తరుణంలో తానే గాజులుగా, గొలుసులుగా, ఉంగరంగా అగుచున్నది కదా! ఆ రీతిగా ఆత్మభగవానుడు సర్వవేద్య వస్తుజాతము (తెలియబడే అన్ని వస్తువుల) అంతర్హితస్వరూపమై ఒప్పుచున్నాడు. వాస్తవానికి ఏకరూపుడై ఉండి కూడా మాయ వలన బహురూపములుగా భావించబడుచున్నాడు.

ఆతడు సకల జ్యోతుల జ్యోతి స్వరూపం (జ్యోతిర్జ్యోతిః మహర్జ్యోతిః). అలౌకికం, నిర్మలం - అగు ఆ ఆత్మను ప్రకాశింపజేయగలిగేది మరొక్కటేదీ లేదు. అదొక్కటే ప్రకాశములన్నిటికీ మూల స్థానం. అదియే నానావిధ బీజస్వరూపములుగా వెలయుచున్నది. బ్రహ్మజ్ఞులు ఈ విషయం సుస్పష్టంగా దర్శిస్తున్నారు, ప్రవచిస్తున్నారు.

❖

వత్సా! ఈ భూమి, ఈ ఆకాశము మొదలైన పంచభూతములు ఆత్మయందు వెలయుచున్నాయని అనుకుంటున్నావేమో! లేదు. ఈ వ్యావహారిక విషయములుగాని, ప్రాతిభాసికములగు వ్యష్టి సమష్టి జీవులు గాని ఆత్మ యందు లేవు. ఎందుకంటే ఈ జగత్‌సత్త, అవ్యాకృతమగు కారణసత్త లయించగా, అప్పుడు శేషిస్తున్న చిన్మాత్రసత్తయే అది కదా! అయితే ఆ ఆత్మదేవుడు నిర్విశేషస్వరూపుడు అయికూడా, ఆ 'చిత్తవికృతులు' అనే దోషములకు అవ్యాకృతకారణము బాహ్యకారణము రజోరూపము కూడా అగుచున్నాడు. రూపరహితమగు ఆకాశస్వరూపుడై ఉండి దేహములు మొదలైన రూపాలతో కర్తృత్వ భోక్తృత్వములను వహిస్తున్నాడు. అయినప్పటికీ ఆయన నిష్క్రియుడు, నిర్లిప్తుడు. చిత్తరూపమున

వికాసము పొందిన ఆ మహాచైతన్యమున అసంఖ్యాకములగు 'జగత్తులు' అనే ఎండమావులు తోచుచున్నాయి. అయితే ఆత్మదేవుని పూర్ణత్వమునకు ఇవేమీ లోటు కావు.

❖

నాయనా! చమత్కారం చూచావా? స్వయం ప్రకాశమగు ఆ చిదాత్మయందు ఈ జగత్తు తన సత్తను పొందుపరచుకొని ఉన్నప్పటికీ 'చిదాత్మయందు జగత్తులనేవి ఉండజాలవు' అని అనవలసి వస్తోంది. అగ్ని యందు విస్ఫులింగము, రంగు కాంతి, రవ్వలు, ప్రకాశము – మొదలైన అనేక వైచిత్ర్యములు బయల్పడలుచున్నప్పటికీ అది తన ఉష్ణస్వభావం వీడటం లేదు కదా! ఆత్మయందు సర్వవిరుద్ధ ధర్మములు సమావేశమౌతున్నాయి. ఆయన మహామేరువులను తన గర్భమునందు ధరించి దానిని ఆచ్ఛాదనమొనర్చుచున్నప్పటికీ ఆతడు అణుస్వరూపుడు. కల్పమును ధరిస్తూ కూడా తన నిమేష స్వరూపమును ఏమాత్రం త్యజించటం లేదు. ఆహా! వెంట్రుకయొక్క చివరిభాగంలోని అల్పకణము యొక్క ఒక లక్షవ వంతు వలె అతిసూక్ష్ముడై కూడా భూమ్యాకాశము లందు అంతటా వ్యాపించియున్నాడు. ఈ భూమి, నక్షత్రమండలములు అన్నీ కలసి కూడా ఆయన యొక్క పరాకాష్ఠను ఊహించనైనా లేవు. ఆయన స్వయంగా సంసారమును రచించకపోయినప్పటికీ... కర్తృత్వమంతా ఆయనదే. మహత్కర్మలను ఆచరిస్తున్నప్పటికీ ఆయనకు కర్తృత్వమును ఆపాదించటమే కుదరని పని. ఆయన ద్రవ్యములన్నీ అయి కూడా ఈ ద్రవ్యములేవీ ఆయన కాదు. ప్రాతఃకాలము ఆయన వలననే ఏర్పడుచున్నప్పటికీ ఆయన ఎల్లప్పుడూ ఉషోదయస్వరూపుడే. ఒక దృష్టాంతం. 'సూర్యుడు ఉదయిస్తున్నాడు'... అని జనులు అనవచ్చు గాక! నిత్య ప్రకాశమానుడగు సూర్యునికి ఉదయించటం, అస్తమించటం ఉంటాయా? ఉండవు. (అయినా కూడా ఉదయం, సాయంకాలం సూర్యుని వలననే ఏర్పడుచున్నాయి కదా! "ఉషోదయ సూర్యుడు – మధ్యాహ్న ప్రచండ సూర్యుడు – అస్తమయ పసుపుపచ్చని సూర్యుడు"... అని జనులు వ్యవహరిస్తున్నారు కదా!

❖

ఆ పరమాత్మను అనేకులు అనేక కల్పనలతో ఆరాధిస్తున్నారు. 'భిండి – భిండి – భిడిండి... భిలేమత్త –పుపిచ్ఛాలి ...సాలఘ ...వివిత్ ...చలిత్ ...సదాలో ...కాలాసో ...గులుగులు ...శిలి' ఇట్టి అర్థరహిత, అర్థ ఆపాదిత శబ్దాలు కూడా ఆయన పట్ల వేదమంత్రాలై కూర్చుంటున్నాయి. 'ఆకాశ కుసుమం' వంటి ఊహామాత్ర శబ్దాలుకూడా ఆయనకు సరిపోతున్నాయి. ఆయన కానిది, ఆయనకు ఆపాదించజాలనిది ఏదీ లేదు.

**యస్మిన్ సర్వమ్, యతః సర్వమ్, యః సర్వమ్, సర్వతశ్చ యః ।**
**యశ్చ సర్వమయో నిత్యం, తస్మై సర్వాత్మనే నమః ॥**

ఎవని యందు సర్వము ఉన్నదో ...ఎవ్వని నుండి అంతా ఏర్పడుతుందో, ఎవడు సర్వము అయి ఉన్నాడో ...సర్వము నందు ఎవడు సారమై ఉన్నాడో ...ఎవడు ఎల్లప్పుడూ సర్వమయుడై ఉంటున్నాడో ...అట్టి సర్వాత్మకునకు ఇదే నా నమస్కారం.

ఏ ఆత్మ పురుషుడు సుకుమారములగు తత్త్వాత్మ పుష్పములను ధరించినవాడై, ఈ జగత్తును మోహింపజేయు స్వరూపము కలిగి ఉంటున్నాడో, 'సంకల్పములు' అనే తన పిడికిలిని బిగించి, ఈ మాయానాటకమంతా ఆడిస్తూ, ఆడుతున్నాడో ...ఆయనను ఏమని పిలవాలి? ఎట్లా నిర్వచించాలి? అయితే అతడు అనుభవమునకు లభించడని అనుకోవద్దు సుమా! నిత్యము, అనుక్షణికంగా, అన్ని సందర్భములలోను అంతటా, అన్నిటా, అన్నియుగా, ఇక్కడ, అక్కడ సర్వదా అనుభవమగుచున్నదంతా పరమాత్మయే! ఆయన అద్వితీయుడు కదా! కనుక ఇదంతా పరమాత్మ విన్యాసమే!

❖❖❖

## 12. చిదాత్మ యొక్క దర్శన ప్రదర్శనములు

**శ్రీశివ భగవానుడు :** ఆ సర్వేశ్వరుని యందు అనేక అర్థవిహీన వాక్యములు కూడా సత్యమే అగుచున్నాయని అనుకున్నాం కదా! ఈ 'జగత్‌సత్త' అను మణికి ఆయన పేటిక వంటివాడు. మాయాయుక్తుడగు ఆ చైతన్యభగవానుని యందు వికసింపజాలని శక్తి అంటూ ఏదీ లేదు. ఈ విచిత్ర జగత్తు ప్రకాశించటమే అందుకు నిదర్శనం. ఈశ్వర సంబంధమగు 'చిత్‌సత్త'యే ధాన్యాది బీజములందు దాగుకొని ఉన్నది. తరువాత వివిధ క్రియలు, మట్టి, నీరు, కాలం మొదలైనవాటి సహాయంతో అంకురోత్పాదనం సంతరించుకుంటోంది. క్రమంగా ధాన్యమగుచున్నది. ఆ తరువాత అన్నమగుచున్నది. ఆ అంకురశక్తియే నీటియందు రసస్వరూపంగా, దేహమునందు సంయోగశక్తి స్వరూపంగా దాగి ఉంటోంది. ఆ ఈశ్వరశక్తి నీరు, నాలుక యొక్క సంయోగముచే ఉదరమున ప్రవేశించి శరీరమును ఉత్తేజపరుస్తోంది. ఆ చిత్‌సత్త పుష్పములందలి ఆఘ్రాణంగా వెలయుచు ఘ్రాణేంద్రియాన్ని వికాసమొనర్చి ముక్కురంధ్రములకు ఉల్లాసం కలిగిస్తోంది. అది శిలయందు ప్రవేశించి ఆ శిల యొక్క శూన్యభావమును తొలగించి, అద్దానికి వ్యవహారసత్తా కల్పిస్తోంది. ఆ చిత్ సత్తా తాను తానుగా ఉంటూనే తన స్వరూపాన్ని వీడకుండా సర్వమును కల్పిస్తోంది. అందుకు దృష్టాంతంగా... ఒక యువకుడు, "ఆహాఁ! ఆ స్త్రీ అంత అందంగా ఉన్నది కదా!" అను భావన కల్పన చేస్తూండగా, ఆ సమయంలో ఆతడు తన స్వస్వరూపము కోల్పోవటం లేదు కదా! ఇది కూడా అట్టిదే ! తండ్రి తన కుమారుని స్వకార్యనిర్వహణం కొరకు నియమిస్తాడు చూచావా? అట్లాగే ఆ చిత్‌సత్త సమస్త చలనాలకూ ఆలవాలమగు వాయురూపమును ధరించి, చర్మమును స్పర్శించి స్పర్శజ్ఞానోత్పత్తికి కారణమౌతోంది.

ఒక సమయంలో ఆ చిత్‌సత్త తనను తానే ఏమరచి జగత్తులో ప్రవేశించి శబ, స్పర్శ, రూప, రస, గంధాల అనుభవ కల్పనలలో తేలియాడుతోంది. అది మరొక సమయంలో తన యొక్క వాస్తవ స్వరూపసిద్ధి కొరకు... అనగా మోక్షార్థం ...తన్ను తాను 'నిఖిల జగత్తు యొక్క సమ్మిళిత సత్తారూపం' అగు ఏకాత్మగా గాంచుచున్నది. అప్పుడు ఈ జగత్తునంతటినీ ఆకాశము వలె శూన్యంగా చేసివేస్తోంది.

అదియే కాలతత్త్వంలో కూడా ప్రతిబింబిస్తోంది. సర్వమునకూ మార్పు చేర్పులను కలిగిస్తోంది. బ్రహ్మ, విష్ణు, రుద్ర, సదాశివ, ఈశాది తత్త్వాలతో ఆరంభమైన ఈ జగత్తు అంతా పరివర్తనశీలమే కదా!

కార్యములన్నిటినీ సరిజూస్తూ ఉండే 'నియతి' యే ఆ మూలశక్తి 'అది ఇట్టిది. అట్టిది కాదు' అని చెప్పటానికి కూడా వీలు లేదు. ఆ చైతన్యసత్త తనంతట తానే స్వయంగా సిద్ధించి ఉంటోంది. దానిని మరొకటేదీ సిద్ధింపజేయటం లేదు. చీకటిలో ఉన్న ఇంట్లో దీపం వెలిగించగానే ఆ ఇంట్లోని వస్తువులన్నీ అగుపిస్తాయి కదా! ఆ 'చైతన్యభగవానుడు' అనబడే అపరిచ్ఛిన్నజ్యోతి వలననే జగత్తులు అనే వస్తుపరంపరలు అనుభవమౌతున్నాయి. అదియే 'పరమాకాశము' అనే నాట్యశాలలో స్వశక్తి సంపాదిత మగు 'సంసారము' అనే నాటకమును ఒకవైపు ప్రదర్శించుచూ, మరొకవైపు దర్శించుచూ తాను మాత్రం ఉభయములకూ సాక్షియై వెలయుచున్నది.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ జగన్నాథా! చిదాత్మయగు ఆ సదాశివుని శక్తులు ఎట్టివి? అవి ఎట్లా వెలయు చున్నాయి? 'సాక్షిభావం' అంటే ఏమిటి? ఆయన శక్తి సమూహం ఏ కార్యములు చేస్తూ ఉంటుంది? అవి ఎన్ని? ఈ విశేషాలు చెప్ప ప్రార్థన.

**శ్రీశివ భగవానుడు :** ఓ సౌమ్యా ! ఆ చిదాత్మ భగవానుడు అప్రమేయుడు. దేనితోనూ ప్రమేయం లేని వాడు. దేనికీ సంబంధించనివాడు. పరమశాంతిమయుడు. మంగళమయుడు. పరమసౌమ్యుడు. చిన్మాత్రరూపుడు. అయితే కొన్ని చమత్కారమైన శక్తులు ఆయనను ఆశ్రయించి ఉన్నాయి. అవి ఇచ్ఛాశక్తి... ఆకాశసత్త... కాలసత్త... మహాసత్త... జ్ఞానశక్తి... క్రియాశక్తి... కర్తృత్వశక్తి... మొదలైనవి అవి. ఇట్లా అంటే, ఆ శక్తులకు అంతు లేదని కూడా చెప్పబడుతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ ! అవన్నీ పరమాత్మను వెంటనంటి ఉన్నాయా? పరమాత్మలో ఉన్నాయా? ఆ శక్తులకు ఆ బహుత్వమంతా ఎక్కడి నుండి వచ్చింది? పరమాత్మకు ఆ శక్తులకు భేదం ఏమైనా ఉన్నదా? లేక పరమాత్మ, ఆయన శక్తులు అభేదమా?

**శ్రీశివ భగవానుడు :** నాయనా! అనంతరూపుడు మంగళమయుడు అగు ఆ చిదాత్మయందు ఆయా వికల్పములన్నీ ఆపాదించబడుతున్నాయి. మనం దేనికి ఒకానొక విశేషం ఆపాదిస్తున్నామో... అట్టి ఆపాదిత విశేషానికి ఆ వస్తువుకు భేదమేమున్నది? అట్లాగే పరమాత్మకు ఆయన మాయా విశేషమునకు కొంచెం కూడా భేదం లేదు. ఆ మాయాశక్తి 'తెలుసుకొనువాడు – కర్మలు నిర్వర్తించు వాడు – అనుభవించువాడు – సాక్షీభూతుడు' అగు జ్ఞాతృత్వ – కర్తృత్వ – భోక్తృత్వాది లక్షణములతో గూడి వివిధ ఆకృతులను ధరిస్తోంది. జలం బుద్బుద తరంగాదుల రూపం పొందుచున్నట్లు అది అట్లా జరుగుతోంది.

ఆ చిదాత్మ యొక్క మాయాశక్తి 'కాలము' అను ఆశ్రమంలో శిక్షణ పొందిన 'బ్రహ్మాండము' అనే నృత్యమండపమునందు ఈ జగత్‌నృత్యం సాగిస్తోంది. 'పరము – అపరము'అను సంజ్ఞలతో ఒప్పుచూ ఆ కాలమే 'నియతి' అని పిలువబడుతోంది. 'క్రియ, కృతి, ఇచ్ఛ, కాలము' మొదలైనవి నియతి అనుదానికి పర్యాయపదములే !

**శ్రీవసిష్ఠ మహర్షి :** మహాత్మా ! నియతి అంటే ఏమిటి?

**శ్రీశివ భగవానుడు :** 'నియతి' అనగా నియమించునది అను అర్థాన్ని సూచిస్తుంది. పరమాత్మ యొక్క మాయాశక్తియే గడ్డిపరక నుండి బ్రహ్మదేవుని వరకు కల్పనచే అనుభవజ్ఞానం ప్రతిపాదిస్తోంది. వందలాది కల్పనలే మాయ యొక్క రూపం. తత్త్వబోధ కలుగనంతవరకు ఆ మాయ సత్యాన్వేషణ లేని ఆత్మను ఆవరించుకుని ఉండి, ఈ జగన్నాటకమును నిర్వర్తిస్తోంది. ఈ జగన్నృత్యం వివిధ రసములతో నిండి 'వివర్తము' అను ఆంగిక అభినయంతో చిత్తమును ఆకర్షిస్తోంది. ఆ అభినయం అయిపోయిన తరువాత ప్రళయంలో సర్వం రహితమై ఉంటోంది. మరల, ప్రళయానంతరం ఇతః పూర్వపు మాయానాటకం కొనసాగుతోంది. గాఢనిద్రా సమయంలో జ్ఞాపకాలన్నీ మౌన ముద్ర వహించి మరల నిదుర లేవగానే పేట్రేగుతాయి చూచావా? అట్లాగే ప్రళయకాలంలో జగత్–కాల దృష్టులన్నీ దాగి యుండి, మరల సృష్టి సమయంలో ప్రదర్శించబడుతున్నాయి.

ఈ బ్రహ్మాండమంతా నియతి యొక్క నాట్యశాల అని అనుకున్నాం కదా! ఈ మాయాజీవులే 'నియతి' అను జాణ యొక్క అంగభూషణములు. సుఖ దుఃఖ దశలే ఆ మాయావ్యవహారము యొక్క హావభావములు. ఈ సంసారనాటకాభినయమంతా వివిధ వికారభంగిమలతో నిండి ఉంటోంది. ఒకవైపు ఈ మాయ ఇట్లుండగా, మరొకవైపు ఈ జీవుని వాస్తవస్వరూపమగు ఆ పరమేశ్వరుడు అనునిత్యం ఏకరసస్వరూపమున సర్వమునకు కేవలసాక్షి అయి ఒప్పారుచున్నాడు.

ఆయన వలననే, ఆయనకొరకే, ఆయన చేతనే ఈ తతంగ విన్యాసమంతా జరుగుతోంది. ఒకానొకడు చేసేపని వేరు, ఆ చేయువాడు వేరు కదా! అయినా కూడా చేసే పనిని బట్టే చేయువాడు అనుభవమౌతున్నాడు. పరమాత్మ ఈ జగత్ నటన – నాట్యముల నుండి విభిన్నుడైనప్పటికి, వ్యావహారికంగా మాత్రం ఆతడు ఈ విశ్వమునకు అభిన్నుడనియే చెప్పవలసి వస్తోంది.

బంగారం 'ఉంగరం' అనబడు ఒకానొకటిగా మారినదా?... లేదు. ఉంగరం ఆకార రహిత మగు బంగారం యొక్క ఆకారదృష్టియే. బంగారం కాక, ఉంగరంలో ఇంకేమీ లేదు కదా! కనుక ఉంగరమంతా బంగారమే. ఉంగరానికి వేరుగా బంగారం మరెక్కడో ఉన్నదని అనలేం కదా! ఇదంతా కూడా అట్టిదే. సర్వమూ చూచువానిలో నిబిడీకృతమై ఉన్నది. ఈ విశ్వం చూచుచున్నవాడిచ్చే అర్థం మాత్రమే! ఈ విశ్వం యొక్క పరమార్థం చూచువాడే ! చూచువాడు విశ్వమునకు అర్థము ఇచ్చేవాడు కనుక, ఆతడు విశ్వములో లేడు. విశ్వం కంటే అత్యంత సూక్ష్ముడైయున్నాడు. ఆ చూచువాడు (ద్రష్టయే) ఆ పరమ చైతన్యం యొక్క స్వరూపం. ఎందుకంటే ఆతని వాస్తవతత్త్వం చైతన్యమే కనుక!

❖❖❖

# 13.బాహ్యపూజ - అంతర్పూజ

**శ్రీశివ భగవానుడు :** వత్సా ! వసిష్ఠా ! వింటున్నావుకదా ! సర్వస్వరూపుడగు ఆ చైతన్య భగవానుడే దేవాదిదేవుడు. ఆతడు అనుభూతి స్వరూపుడు. సర్వులకు, సర్వమునకు అంతర్యామి. సర్వమునకు ఆశ్రయమైన ఆ దేవాదిదేవుడే సాధుపురుషులకు పూజ్యాతి పూజ్యుడు సుమా! ఆయనయే కుండ

యందు, వస్త్రమునందు, శకటమందు మనుష్యులయందు దేవతలయందు వెలయుచున్నాడు. ఆయనయే శివుడు, విష్ణువు, బ్రహ్మ కూడా. ఇంద్ర–కుబేర–యమాది ఆయా అనేక రూపము తోనే గాక, నామరూప రహితముగా, శూన్యముగా కూడా ఆతడు ఆరాధించబడుచున్నాడు. సర్వాత్మకుడై స్వస్వరూపమున కూడా వెలయుచున్న ఆ మహాదేవునే సర్వము ఎరిగిన జ్ఞానులు ఆరాధిస్తున్నారు.

ఓ మహామతీ! ఆ మహాదేవునికి ఈ లోకమున బాహ్యమున అంతరమునకూడా పూజలు సమర్పించబడు చున్నాయి.

**1. బాహ్యపూజ -** ఈ దేహంతో చేసే పూజలు జనులు శాస్త్రోక్తములగు స్నానములతో, ఆచమనాది క్రియలతో ఈ బాహ్య పూజలు చేస్తున్నారు. మంచిదే కానీ, నా దొక ప్రశ్న. దేహాత్మ బుద్ధితో చేసే బాహ్యపూజలు నిరాకారము–నిర్మలము–అనంతము అగు ఉత్కృష్ట వస్తువు లభించాలంటే మధ్యే మార్గంగా కొంతవరకే ఉపయోగిస్తాయి. కాబట్టి సాధకుడు అంతటితో తృప్తిపొందితే ఎట్లా?

**2. అంతర పూజ -** పూజింపబడుతున్న వస్తువు ఎటువంటిది? దేహములన్నిటిలో సాక్షీభూతుడై వెలుగు చిద్రూపుడు. ప్రతి జీవునియందు "ఎరుక – అను జ్యోతిస్వరూపమున వెలుగొందుచున్నవాడు. సత్–చిత్–ఆనందం స్వరూపుడగు ఆతనియందే ఈ సర్వం ఉంది. ఆతడే ఈ సర్వమునందు వేంచేసి ఉన్నాడు. ఆ చిద్రూపునికి సంబంధించిన జ్ఞానార్చనే అంతరపూజ. ఆ చిద్రూపమును ప్రయత్న పూర్వకంగా గ్రహించటం, దర్శించటం, సర్వదా ధ్యానిస్తూ ఉండటం ఆ పూజయొక్క విధానం.

నిజానికి ఈ అంతరపూజకు ఒక క్రమం అంటూ లేదు. నియమ నిష్ఠల శ్రమ ఉండదు. కనుక ఓ వసిష్ఠా ! త్రిభువనధారుడగు ఆ సర్వేశ్వరుని నీకు కనబడుచున్న జీవుల వాస్తవ స్వరూపంగా (అట్టి ఎరుకచే) పూజించు. అట్టి 'ధ్యాస' అంతరమున కలిగి ఉండటమే ఆత్మ దేవునికి పూజాపుష్పాలు. ఈ జగత్తులోని సర్వ జీవులకూ ఆతడే ప్రకాశస్వరూపుడై, 'ప్రకాశము'లన్నింటికీ నియామకుడై ఉన్నాడు. అత్యంత సునిశిత విమర్శనా బలంతో "అహం యొక్క సారవంతమైన విభాగం పరమ పరిశుద్ధమగు చిత్ప్రకాశమే" – అని గ్రహించు. ఇక నీ మనస్సును, దృష్టిని సర్వదోష వివర్జితం చేయి. ఎప్పుడు, ఎక్కడ, ఎవ్వరు తారసబడినాసరే ..."ఈ సహజీవి యొక్క స్వరూపం నా యొక్క నిర్మల చిత్స్వరూపమే!" అను ధర్మమును అభ్యసించు.

ఆ పరమేష్ఠి వర్ణనాతీతుడు. అయినా కూడా కేవలం నీ యొక్క లక్ష్యశుద్ధి కొరకు ఆ పరమాత్మను వేదములు ఎట్లా వర్ణనచేస్తున్నాయో చెపుతాను, విను.

❖

అపార పరమాకాశము యొక్క విశాల వైశాల్యము ఆయన కంఠభాగం. క్రిందనున్న అనంత ఆకాశకోశం ఆయన పాదపద్మములు. ఈ దిఙ్మండలములు ఆయన భుజస్కంధములు. ఈ బ్రహ్మాండములన్నీ కలిసినా కూడా ఆయన యొక్క హృదయకోశంలో ఒకానొక మూల మాత్రమే ఒదిగి ఉంటున్నాయి. ఆతడు పరమాకాశములకు ఆవల – ఈవల కూడా విస్తరించి ఉన్నాడు.

ఆయన శరీరముయొక్క నలువైపులా బ్రహ్మ – ఇంద్ర – హరి – హరాదులు కల్పనామాత్రులై వెలయుచూ ఆయనకు శోభ కలుగజేస్తున్నారు.

ఈ చతుర్విధ జీవరాసులూ జలచరములు, భూచరములు, ఆకాశచరములు, వాయు చరములు ఆయన దేహంలోని రోమముల వంటివారు.

ఈ అనేకానేక ఇచ్ఛాదులతో కూడిన త్రిజగత్తులు ఆయన దేహంలోని నాడీ మండలములు. ఆయన ప్రతిఒక్కరికీ సంబంధించినవారే! ప్రతిఒక్కరికి చెందినవారే! ప్రతి ఒక్కరికీ, తమ తమ స్వరూపమే అయి ఉన్న ఆ దేవదేవుడే సర్వులకూ పరమపూజ్యుడై వెలయుచున్నాడు. ఆ చిన్మాత్రుని నిజరూపం అనుభూతియే.

అనుభూతి స్వరూపుడగు ఆయన సర్వవ్యాపియై, సర్వాశ్రయుడై, సర్వమునందు ఎల్లప్పుడూ జాజ్వల్యమానంగా వెలుగుచున్నాడు.

శివ, బ్రహ్మ, హరి, కుబేం, ఇంద్రాది దేవతలు ఆయనే. వివిధ రూపములు ఒకే సమయంలో ధరించుచుండుట చేత విద్వత్కవులు 'అనంతుడు' అను బిరుదును ఆయనకు ఇచ్చారు.

ఎట్టి భేదానికీ ఎప్పుడూ లోను కానట్టి 'అద్వితీయ సత్త'యే ఆయన శరీరం. అంతేగాని ఆయనకు వేరే భౌతికప్రదమైన, ఆకార-వికారములకు సంబంధించిన రూపమేదో ఉన్నదని భ్రమపడ వద్దు.

ఈ జగత్తులను వివర్తింపజేసే కాలము ఆయనకు ద్వారపాలకుడు. ఈ నదీ - సముద్ర - మహాసముద్ర - పర్వతాదులతో నిండిన లోకములతో కూడుకున్న బ్రహ్మాండములన్నీ ఆయన బృహత్ శరీరములోని ఒక చిన్న విభాగం. ఓ మహర్షీ! ఓ తదితర ప్రియ జీవులారా! సహస్ర చక్షుడు, సహస్ర శిరుడు, సహస్ర హస్తుడు, శాంతుడు, స్వస్వరూపుడగు ఆ ఆత్మదేవుడు అత్యంత సామీప్యమున ఉండి ఉండగా, ఇక ఆయనను మీరు ఎట్లా ఏమరుస్తున్నారు? ఆ దేవదేవుని గురించి చింతించటం సర్వదా అలవాటు చేసుకోండి. "సర్వ స్పందనలు, సర్వ వాక్-మనో-బుద్ధి-చిత్త-అహంకారాలు ఆ ఆత్మ భగవానుని చిద్విలాసములే!" ...అని అనుస్మరణ పూర్వకంగా సందర్శిస్తూ, ఈ దృశ్యమును ఆస్వాదించటం అలవరచుకోండి.

ఆయన దర్శన-ఆఘ్రాణ-స్పర్శన-రసన-శ్రవణ-మనన శక్తులు సర్వేసర్వత్రా వ్యాప్తములై వెలయుచుండుటయే ఈ జగత్తుకు నిర్వచనం. వాటన్నిటి యందు ఆయన విస్తరించి ఉన్నాడు కాబట్టి, ఆయన 'సర్వవ్యాపి' అని పిలిపించుకుంటున్నాడు.

మననమునకు కర్త ఆయనే! అందుచేత... 'మననమునకు ముందే ఉన్నవాడు, అతీతుడు' అని ఆయనను అనక తప్పదు. ఆయన సర్వకాలములందూ సర్వమునకూ కర్తయై ఈ సంకల్పిత విషయములన్నీ ఆయనే అనుగ్రహిస్తున్నారు.

సర్వమయుడగు ఆ పరమాత్మ ఎక్కడో ఆకాశంనందో, భూమియందో దాగిలేరు. సర్వదా నిఖిలభూతముల మధ్య నిశ్శబ్దంగాను, సర్వశబ్దమయుడుగాను మహాప్రకాశమానుడై ఉంటున్నారు. పరమమంగళ స్వరూపుడగు ఆతడొక్కడే అన్నిటినీ అనుగ్రహించగల సాధనభూతుడు. ఆయనను అట్లని గ్రహించి శ్రద్ధాసక్తులతో పూజించండి.

**ఆత్మదేవుని పూజ -** ఓ బ్రహ్మవిత్ శ్రేష్ఠా ! ఇక ఆ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని ఆర్చించటం ఎట్లాగో చెపుతాను ...విను.

స్వసంవిద్రూపుడగు ఆ ఆత్మదేవుని పుష్ప, ధూప, దీప, కుంకుమ, నైవేద్యాదులతో పూజించటం ప్రారంభమున మనోనైర్మల్యము కొరకు మాత్రమే అవుతుంది. అంతమాత్రం చేత 'నేను సంపూర్ణమగు పూజ నిర్వర్తించాను' అని అనుకుని ఊరుకోకూడదు. అవి ఉన్నా, లేకున్నా కూడా... 'ఈ ఎదురుగా కనబడే వారంతా ఆత్మస్వరూపులే' అను భావనను అభివృద్ధి పొందింపజేయటమే వాస్తవమైన పూజ. అట్టి ఆత్మబోధ అనాయాస లబ్ధము, శాంతిమయము, నిరంతరసుసాధ్యము, సులభము కూడా. 'నాకు తారసపడే ఈ ప్రతిఒక్క జీవుని వాస్తవ స్వరూపం నిత్యము – అఖండము – అప్రమేయము అగు పరమాత్మయే' అను నిరంతర ధ్యానమే 'పరధ్యాస', 'పరమధ్యాస' అని పిలువబడుతోంది. అదియే పరాపూజ కూడా. అట్టి పరాత్పరతత్త్వము అభ్యసించకుండా చేసే ఈ భౌతిక పుష్పముల పూజ అల్పప్రయోజకారే సుమా!

పూజ చేస్తున్నప్పుడు 'నాచే పూజించబడే ఆ పూజాలక్ష్యం ఏమై ఉన్నది?' అని గ్రహించి ఉండాలి కదా! ఆకారమును పూజిస్తున్నప్పటికీ పూజాలక్ష్యము ఆకారపరిమితమైనది కాదని గుర్తుంచుకోవాలి. అది ఏమరిస్తే మనం పూజించే నామరూప ప్రతీక దేని యొక్క ఉద్దేశమో అది ఏమరిచినట్లే అవుతుంది కదా! మరి అజ్ఞానశిల ద్రవించేది ఎన్నటికి?

పూజాలక్ష్యమగు ఆ పరమాత్మ మన అంతరమున విశుద్ధ చిన్మాత్రస్వరూపంగా ఉన్నారు. 'అంతరహృదయ అభ్యాంతరంగ – హృదయాంతరంగుడు' అయి ఉంటూనే బాహ్యమును వెలిగిస్తున్నారు. బాహ్య ప్రదర్శనరూపంగా ఈ దర్శన – శ్రవణ – స్పర్శన – ఆఘ్రాణ – భోజన – శయన – స్వప్న – నిశ్వాసన – సంభాషణ – త్యాగాదులందు ఆక్రమించుకొని ఉంటున్నాడు. అట్టి వానిని 'ధ్యానము' అనే పుష్పముతో పూజించాలి.

ఆయన తత్త్వమును అంతటా గాంచటమే ధ్యాన విధానం. ధ్యాసయే ధ్యానము. ధ్యానము లేకపోతే ఆత్మదేవుని పొందజాలం. ధ్యానబలం చేత ఆత్మ తప్పక ఎవరికైనా సరే అనుభూతమౌతుంది. ఆత్మ భగవానుడు ధ్యానించే వారిని ప్రసన్నుడై సమీపిస్తున్నాడు.

మూఢుడగువాడు కూడా 13 రెప్పపాట్లకాలం (13 seconds) సర్వాత్మకుని స్వస్వరూప అనుసంధాన పూర్వకంగా అర్చిస్తే గోదానఫలం లభిస్తుంది. 100 రెప్పపాట్ల కాలం అర్చిస్తే అశ్వమేధ యజ్ఞఫలం లభించగలదు. కొన్ని నిమిషాలు సర్వభూతమయుని ఆత్మ సమర్పణ పూర్వకంగా అర్చిస్తే, ఎన్నో రాజసూయ యాగాల ఫలములు లభిస్తాయి.

ఒకరోజంతా అర్పిస్తే పరమకైవల్యము లభించగలదు.

నాయనా! ఈ భౌతిక పరిమిత పూజ కన్నా ఆ ఆత్మదేవుని ధ్యానార్చనం ఎంత సమున్నతమైనదో చెప్పటానికి మాత్రమే ఇది చెప్పాను. ఆ పరమదేవుని ధ్యానమే 'పరమయోగం'. అదియే సులభము, సర్వోత్తమము అగు క్రియ.

సర్వాత్మధ్యాననిరతియే ఆత్మదేవుని బాహ్యాభ్యంతరపూజ. ఏ మనుజుడైతే నిఖిల పాపహరము, పరమపవిత్రము అగు ఆ పూజను శాంతమనస్కుడై నిర్వర్తిస్తూ ఉంటాడో ...అతడు నా వలెనే ముక్తుడై ఆత్మ పదమును పొందుతాడు. ఓ మహర్షీ! సురాసుర శ్రేష్ఠులలో అనేకులు దైనందికంగా, అనుక్షణికంగా నిర్వర్తిస్తున్న ఆ ఆత్మపూజను నీవు కూడా నిర్వర్తించు.

❖❖❖

# 14. ఆత్మాభిషేకం

**శ్రీశివ భగవానుడు :** ఇప్పుడు 'అంతరపూజ' గురించి మరికొన్ని విశేషాలు చెపుతాను. శ్రద్ధగా విను. 'అంతరపూజ' అనేది ధ్యానాత్మకమైనది. అది శయన-సంచార-క్రియాది సర్వ అవస్థలలో తెంపు లేకుండా నిర్వర్తించవచ్చు.

ఈ పూజలో సర్వస్థితుడు సర్వస్వరూపుడు, రూపనామరహితుడు అగు పరమశివ శబ్దము యొక్క అర్థాన్ని ధ్యానించాలి.

పురాణకల్పితమైన పరమశివ రూపం సాధన కొరకై గ్రహించవచ్చు. అయితే ధ్యాసను రూప పరిమితం చేసి ఊరుకోకూడదు సుమా! సకల బోధనలను తన సాన్నిధ్య మాత్రంచేత ప్రసాదిస్తున్న ఆత్మస్థితునిగా ఆ సాధ్యవస్తువును గ్రహించు.

ఇక నీ సాధన అనునిత్యం చేయి. పయనిస్తున్నప్పుడు, లేస్తున్నప్పుడు, నడుస్తున్నప్పుడు, భోగ సమూహములను అనుభవిస్తున్నప్పుడు వాటిని విడుస్తున్నప్పుడు ఆతడే అన్ని వేళలా అన్నివైపులా నిర్వికల్ప శాంతరూపమున వెలయుచున్నాడని గ్రహించు. నీ స్వస్వరూపుడే అగు ఆ ఆత్మస్వామిని యథా ప్రాప్తములగు స్వరూపజ్ఞానములతో అనుక్షణం పూజించు.

ఆత్మ ప్రారబ్ధ కర్మ భోగాల ప్రవాహంలో పడి మాలిన్యం పొందినట్లు అజ్ఞాన దృష్టికి మాత్రమే గోచరిస్తుందని ఎరిగి ఉండు. నీ స్వభావమును 'విశుద్ధాత్మబోధ' అను జలంతో స్నానం చేయించి బోధోపచారములలో బోధలింగమును పూజించి ధన్యుడవు కమ్ము.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అంతటికీ ఆత్మయగు ఆతనిని ఎట్లా పూజించటం? ఎట్లా అభిషేకించటం? 'బోధోపచారములు' అంటే ఏమిటి?

**శ్రీశివ భగవానుడు :** 'బోధోపచారములు' అంటే ఏమిటో, వాటితో ఆత్మ భగవానుని ఎట్లా పూజించాలో చెపుతాను విను.

❖

ఆకాశమండలమును ప్రకాశింపజేయు ప్రచండ కిరణస్వరూపుడగు సూర్యుడు ఆతడే! చల్లని కిరణములు ప్రసరింపజేయు చంద్రుడు కూడా ఆతడే!

ఆ ఆత్మదేవుడు ఈ సర్వ ప్రతిభాసిక పదార్థములందూ సంవిత్స్వరూపుడై వెలయుచున్నాడు. శరీరద్వారములందూ, ముఖములందూ, ప్రాణస్వరూపుడై ప్రవహించుచున్నాడు. ఈ శబ్ద-స్పర్శ-రూప

-రసాది విషయములను తన ఆనందస్వభావంతో కలిపి వాటిని మధురంచేసి ఆస్వాదిస్తున్నాడు. కనుక నీవు శబ్ద స్పర్శాది విషయములను పొందుతున్న సమయంలో ఆత్మమాధుర్యమును జోడించి భావిస్తూ వాటియందు పాల్గొనుము.

ఆయన 'ప్రాణ-అపానములు' అను చక్రాలు గల రథమును అధిరోహించి గూఢుడై నాయందు, నీయందు నీకు తారసపడుచున్న సర్వజీవరాసులయందును హృదయాంతరమున విశ్రమిస్తున్నట్లు గుర్తించి ఆరాధించు. జ్ఞానములన్నీ గ్రహించే "మహాజ్ఞాని", కర్మలన్నిటి యొక్క "మహాకర్త", భోగములన్నిటినీ భోగించు "మహాభోక్త", స్మృతులన్నిటినీ స్మరించు "మహాస్మర్త", భావాభావములన్నీ ధరించు "మహాభావకుడు", ఎట్టి చింతలూ లేనప్పుడు పరిశేషించు "మహానిర్వికల్పస్వరూపుడు", సర్వమునూ తన ఉనికిచే పవిత్రం చేస్తున్న "మహామంగళ స్వరూపుడు" ఆయనయేనని ఆరాధించు. నీవు చేస్తున్న సర్వక్రియలకూ కారణభూతుడు ఆతడేనని భావన, చింతన చేయి.

ఆయన వాస్తవానికి కళారహితుడు. కానీ ఉపాధివశంచేత నీకు ఎదురుగా కళాసహితుడై నీ యొక్క తదితర ఉపాధులయొక్క రూపంలోనూ, పైన ఆకాశంలోనూ, నేలలోనూ ఆయా రూప-రస -భావనా సమన్వితుడై సంచరిస్తున్నాడు. అరంజితుడై కూడా రంజితునివలె కన్పట్టుచున్నాడు.

ఆతడు మరెక్కడో లేడయ్యా! నీ శరీరమునందు అంతటా వ్యాపించియున్న బోధస్వరూపుడు ఆతడే! ఆయన నీ మనస్సు యొక్క మననశక్తి యందు వెలయుచున్నాడు. ప్రాణాపానము లందు సదా ఉదయిస్తున్నాడు. నీ హృదయంలోను, కంఠంలోను నాసాపుటములందు తేజోరాశి అయి ఒప్పారుచున్నాడు.

శైవ శాస్త్రంలో చెప్పబడిన 36 తత్త్వములందు, వాటికి ఆవల ఈవల కూడా ఆక్రమించుకుని ఉన్నాడు.

కల - వికలనము మొదలుగా 'ఉన్మనీ- మనోన్మనీ' అనబడు సవికల్పసమాధి స్థితులందు, వాటినన్నిటినీ దాటినట్టి స్థితులందు కూడా కళాప్రపూర్ణుడై ప్రకాశిస్తున్నాడు. నీ యొక్క శబ్ద స్పర్శాది విషయములన్నీ సృష్టిస్తూ నీ మనస్సు అనే పక్షిని అటూ-ఇటూ ఎగురవేస్తున్నాడు. నీ యొక్క వాక్పథము నందు, వాచ్య, లక్ష్యములందూ యథేచ్ఛగా సంచరిస్తున్నాడు. నువ్వుగింజలన్నిటిలో నూనె ఉన్నట్లు, ఆయన సర్వ శరీరములందూ 'తెలుసుకోవటం' అను రూపముతో ప్రత్యక్షమై ఉంటున్నాడు. తనకు కళంక మనేదేదీ లేకుండానే ఈ పంచభూత సమ్మిళితమైన స్థూలదేహములన్నీ దాల్చుచూ కాఠిన్యమగు మూర్తిత్వము వహిస్తున్నాడు. సకల హృత్పద్మములలోనూ మధుర రసరూపుడై అచింత్యమానుడై ఉంటున్నాడు. ఆయనను ఎక్కడో ఎన్నడో చూడాలని భ్రమించనక్కర్లేదు. అనుభూతి స్వరూపమున నలువైపులా ప్రత్యక్షమయ్యే ఉన్నాడు. ఆహా! ఆయన ఆయా దేహములలో స్వస్వరూపాన్ని మరచి, జీవభావమును ధరించటమేమిటి? భోగ మోక్షముల కొరకై ఆరాటపడటమేమిటి? అనేక చోట్ల అనేక చిత్రవిచిత్ర స్వయంకల్పిత మాయా ప్రతిబంధకములను కల్పించుకొనటమేమిటి? స్వ - అతిరిక్తములగు పదార్థ రూపములను ధరించి క్షణంలో ద్వైతభావములు పొందటమేమిటి?...

ఎంతటి చమత్కారం! మేము ఈ మాయ కావల దాగిన ఆయన అప్రమేయ – నిష్కళంక – నిత్య – నిరుపమ – చిదానంద స్వరూపం సర్వదా గాంచుచున్నాం. నీవు కూడా అయ్యది దర్శనాభ్యాసంచే సర్వత్రా దర్శించటం నిర్వర్తించెదవు గాక!

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** తండ్రీ ! ఆయనను సర్వదా, సర్వత్రా, సదా ధ్యానించటం ఎట్లాగో చెప్పండి.

**శ్రీశివ భగవానుడు :** "ఈ కాళ్ళు, చేతులు మొదలైన అవయములతోనూ, జుట్టు, గోళ్ళతోను ఉన్న ఈ దేహము నందున్న నేనే ఆ పరమశివుడను" అని భావించుకోవటమే చిదానందరూపం : శివోఽహమ్ : శివోఽహమ్ ఆ ధ్యానము యొక్క పరాకాష్ఠ.

"భార్యలు అత్యంతప్రియుడగు భర్తను సేవిస్తున్నట్లు ఈ వివిధ మనఃశక్తులన్నీ సర్వదా శివ స్వరూపుడనగు నన్ను ఉపాసిస్తున్నాయి. ఈ మనస్సనేది నా స్వస్వరూప గృహానికి ద్వారపాలకుడు. ఈతడు జగత్రయములలోని వివరణలను నాకు సర్వదా విన్నవించుకుంటున్నాడు. ఆలోచనయే నా ఆంతరంగిక వార్తా విశ్లేషనుడగు ప్రతిహారి (Messenger). విశుద్ధమగు బుద్ధి నా భుజశక్తి. క్రియాకలాపాలన్నీ నా మెడలో ధరించిన మణిహారం. సర్వజ్ఞాన విశేషములు నా శరీరానికి ఒప్పే ఆభరణములు. కర్మేంద్రియ–జ్ఞానేంద్రియములు నా గృహద్వారములు.

ఇక నేనో...? అనంతుడనగు, ఆత్మను ! శివానంద స్వరూపుడను.

శివోఽహమ్! శివోఽహమ్!

నా ఆకృతికి పరిమితమంటూ లేదు. పూర్ణము, ఏకము, ఆద్యము అగు ఆత్మస్వరూపమున వెలయుచూ వస్తువులన్నీ పరిపూర్ణం చేస్తున్నాను."

❖

ఇట్లు ఆత్మదేవ భావమును చింతన చేస్తూరాగా, అప్పుడు నీ హృదయం ఆత్మదేవత్వంతో పూర్ణమగుచున్నది. అట్టి అంతరపూజచే నీ యందలి దీనత్వమంతా పారద్రోలి వేయగలుగుతావు. అప్పుడిక నీకు ఉదయాస్తమయములు గాని, జనన మరణములుగాని, సంతోష – విరాగములుగాని, వాంఛా – అసంతృప్తులు గాని, గ్రహణ – త్యాగములు గాని ఉండవు. హృదయం సర్వసమ భావముతో నిండిపోతుంది.

నాయనా! వసిష్ఠా! ఆకృతి, ఆచరణలతో నిత్యం నిస్సంకోచంగా జీవన్ముక్తత్వము వహించటం అభ్యాసం చేయి. అంతేగాని, "నేను దుర్బలుడను. పాపిని, స్వల్పుడను. దేనిపైననో ఆధారపడి ఉన్న వాడను" ...మొదలైన వాటికి అంతరంగంలో స్థానాలు కేటాయించ వద్దు. ఆత్మదృష్ట్యా నీవు ఎట్టి వాడవో ఎంతటివాడవో గ్రహించి ఉంటూనే కార్యములను, ఉచితానుచితమును అనుసరించి నిర్వర్తిస్తూ ఉండు. ఆత్మ దృష్ట్యా సహజీవులు ఎట్టివారో ...అది కూడా ఏమరువవద్దు. "అంతా శివమయమే" – అను అనుభూతిని, ఆస్వాదనను, స్వావలంబనమును ఏమాత్రం విడువనే వద్దు.

సమదర్శియగు మహామతి సంపూర్ణంగా సౌమ్యభావం పొంది, సుందరమగు మనస్సుతో శరీరం ఉన్నంతవరకు సమరసపూర్వకమైన ఏకాత్మభావనయందే వెలయుచున్నాడు. అదియే ఆతని

అంతర్దేవ పూజ. నీవు చేయు అట్టి పూజకు అధి దేవత నీవే! నీ ఆత్మ స్వరూపమే! నీ సర్వస్వముతో, సమత్వము పొందిన బుద్ధితో, అనాయాసంగా లభించే క్రియా – కర్మ – వస్తుజాలంతో చిన్మయదేవుడగు స్వస్వరూపమును ఉపాసించు ... ఆరాధించు. ఈ జగత్తంతా నీయందే దర్శించు నిన్నే ఈ జగత్తునంతా సందర్శిస్తూ ఆస్వాదించు.

❖

ఆ ఆత్మదేవుని పూజించటానికి గంధము పుష్పము మొదలైన బాహ్య వస్తువులను సమకూర్చుకో వలసిన అగత్యం కూడా లేదని నీవు ఇప్పటికే గ్రహించి ఉంటావు. ఎట్ట ఎదుట కాకతాళీయంగా లభిస్తున్న ఆయా సర్వవస్తువులతోనూ నీకు అభిన్నమైన ఆ దేవదేవుని పూజించవచ్చు. అట్టి పూజా కార్యక్రమం అకృత్రిమంగా, ప్రయాసరహితంగా జరిగిపోతూ ఉండుగాక! ఏ ఏ జాతివారికి వారి శాస్త్రములందు ఎట్టి విధి విధానములు కర్తవ్యములుగా చెప్పబడ్డాయో... ఆయా రీతులను అనుసరించి తమకిష్టమైన విధానములతో, వస్తువులతో, క్రియలతో సర్వసమభావి అయి ఆ ఆత్మదేవుని పూజించ వచ్చు. నీయందు, నాయందు తదితర సర్వజీవులయందు ఏక–సమ రూపమున వెలయుచున్న ఆ ఆత్మ భగవానుని జనులు తమ తమ ఐశ్వర్యాదులను అనుసరించు భక్ష్య – భోజ్యములను సమర్పిస్తూ కూడా పూజించెదరు గాక! శయన, ఆసన, గమనాది సర్వావస్థలయందు తత్‌క్రియలచే ఆ శుభ స్వరూపుని ఆరాధించవచ్చు.

నాయనా ! కాంతా సంగమ, అన్న పానాది సర్వ విధ భోగములను – ఆ ఆత్మదేవునికి సమర్పిస్తూ ...ఆయన యొక్క తత్త్వమును సంపూర్ణంగా గ్రహించి ఆయన్ను అవిచ్ఛిన్నంగా పూజించండి. ఆత్మ జ్ఞానార్థమై వేటినైనా త్యజిస్తుంటే, ఆ త్యాజ్యము ద్వారా ఆత్మదేవ పూజ చేయి. ఎప్పుడైనా ఆధి వ్యాధులు అనుభవించవలసి వచ్చాయనుకో... తద్వారా జనించే మోహాలను, తదితర ఉపద్రవాలను, దుఃఖ పారవశ్యములను ఆ ఆత్మదేవునికే సమర్పించు. వాటి రాకపోకలకు క్రుంగిపోక, వాటియందు పూజా భావాన్ని జతచేర్చాలి. ఈ జగత్తులో తారసపడుచున్న సర్వప్రయత్నాలను, జాగ్రత్–స్వప్నాలు ఏర్పడుచున్న తీరులను ఆ ఆత్మభగవానునికే అర్పించి అర్చించాలి. ఇందు ఇక ఏ దోషం నీకుండదు.

సంసార ప్రవాహమున పడిన జీవుడు తాను దరిద్రుడైనపుడు ఆ దారిద్ర్యమును ఆయనకు సమర్పించాలి. రాజైనప్పుడు రాజుగా తాను చేయవలసియున్నదంతా ఆయా క్రియా పుష్పముల రూపమున శుద్ధుడు – స్వస్వరూపుడు అగు పరమాత్మను పూజించాలి. సంసారి అయినప్పుడు ఆ సంసారిత్వమును ఆయనకే సమర్పించాలి. నానా విధములగు సందర్భానుచితములైన యుద్ధ సంరంభముల తోడను, సంతోషం యొక్క చాంచల్యము తోడను, రాగద్వేషముల విలాసము తోడను, సౌమ్యుడగు ఆ ఆత్మదేవుని ఆరాధించాలి. ఆ ఆత్మదేవుని సాన్నిధ్యం చేతనే సత్పురుషులు పూజార్హులగు చున్నారు. ఆ సర్వాత్మ చంద్రునివలె చల్లనిది. మాధుర్యమగు మైత్రితో సర్వ హృదయములందూ వెలుగొందే ఆయనను సేవించాలి. మైత్రి, కరుణ, ఉపేక్ష, ముది, క్రోధనిగ్రహ సామర్థ్యములన్నీ తన స్వరూపమైన ఆత్మ దొర పాదాలపై ఉంచే పుష్పాలుగా భావించబడుగాక! ఆకస్మికంగా లభించేవి,

ప్రయత్నం చేసిన తరువాత ప్రాప్తించేవి, అనుభవించేవి, "క్షణిక భోగభాగ్యములు అన్నీ కూడా ఆయనకు వినయముతో సమర్పించబడుగాక. విహిత నిషిద్ధములగు భోగ అనురాగ, త్యాగములతోను, కోరబడిన – కోరబడని యుక్తాయుక్త క్రియల చేతను, త్యజించి – త్యజించని భోగ – స్నేహ, సంబంధముల చేతను, ఆ సర్వాత్మకుని పూజయే నాచే జరుగుచున్నది" – అను భావ, అనుభవములు పొంది ఉండెదవుగాక!

❖

ఆత్మదేవుని పూజలో విజ్ఞులు 3 రకాల పుష్పాలను ఉపయోగిస్తూ ఉంటారు.

1. గతించిపోతున్న విషయాలను ఉపేక్షించటం.
2. లభ్యపడుతున్న విషయాలను ఉద్విగ్నరహితంగా, రాగద్వేషరహితంగా ధర్మాధర్మ విచక్షణతో నిర్వర్తించటం.
3. ఉభయ సమయములలో నిర్వికారులై, సమత్వ సమన్వితులై ఉండటం.

...వీటిని ఆత్మస్వరూపుడగు శివపూజాయత్నములు అని పిలుస్తూ ఉంటారు.

కాబట్టి కుమారా ! ఇష్ట – అనిష్టములగు సర్వ విషయములందునూ సంపూర్ణమగు 'అకృత్రిమ సమత్వం' సంపాదించుకో. సదా ఆత్మార్చనావ్రతం నిర్వర్తించు.

'సర్వం బ్రహ్మమే' అను దృష్టి వలన స్వతఃసిద్ధంగా సర్వశుభాలు ఒనగూడగలవు. "బ్రహ్మం, మాయ"అను రెండు వేరు వేరు విషయములు కలిసి ఉన్నాయను దృష్టి వలననే ఇక్కడ శుభాశుభములు సంభవిస్తున్నాయి. ఆత్మార్చనా వ్రతుడు 'సర్వము ఆత్మయే' అని దృఢంగా గ్రహించి ఉండటం చేత వైషమ్యములు తొలగుతాయి. సర్వసమత్వం స్వభావసిద్ధమౌతుంది. 'ఆపాతరమణీయాలు, ఆపాత దుస్సహాలు – అగు విషయములన్నిటి యందూ సమత్వబుద్ధి కలిగి ఉండేవాడు స్వతఃసిద్ధంగా ఆత్మార్చనావ్రతుడు అయినట్లే!

**నిత్యాత్మవ్రతం -** అందుచేత మహర్షీ ! "అదియే నేను, ఇది నేను కాదు" మొదలైన భేదవిభాగ సంబంధాలగు కల్పనలను కూడా పరిత్యజించు. "సర్వం బ్రహ్మమే"అను అభేద దృష్టి అవలంబించటమే నిత్యాత్మ వ్రతం.

"ఆత్మయే నానావిధ రూపములు గాను, నానా విధములగు వికారములు గాను ఈ నా దేహంగాను ప్రకటితమగుచున్నది. సర్వే సర్వత్రా ఆత్మ ఉపలభ్యమగుచున్నది"అను అభ్యాసమును "నిత్యాత్మ వ్రతము" అని పిలుస్తున్నారు. ఇష్ట–అయిష్టములను, మిథ్యాత్మబుద్ధిని పరిత్యజించి, వీటినన్నిటినీ స్వాత్మ మాత్రంగా గ్రహించటమే ఆత్మదేవుని కొరకు చేసే సర్వకైంకర్యము. సముద్రము నదీ సమూహములను వాంఛించక, త్యజించక, తాను కారణము గాక ప్రవాహపతిత మాత్రంగా స్వీకరిస్తుంది కదా! ఆత్మార్చకుడు సుఖదుఃఖ హేతువులగు జగద్విషయములను యథాతథంగా గాంచుచూ, క్రుంగక – పొంగక ఉంటాడు. అవమానాది దుఃఖకర పరిస్థితులందు, ప్రాణాపాయాది ఘోరసంకటము లందు, రాజ్య – పూజ్యాది పురస్కార సందర్భములందు, ఉద్వేగ – ఉత్సాహ –

నిరుత్సాహాలు పొందక నిర్లిప్తంగా – ఆత్మార్పణ బుద్ధితో గాంచుచూ ఉంటాడు. తన యొక్క ప్రతిక్రియ – ఉదాసీనతలు కూడా ఆత్మదేవుని పాదాలకు సమర్పించే పూజాపుష్పాలుగా దర్శిస్తున్నాడు.

దేశ, కాల, క్రియలవలన సంభవించే శుభాశుభములను నిర్వికారబుద్ధితో గ్రహించటం అనేది ...ప్రత్యేకంగా ఉద్దేశించకపోయినప్పటికీ ... ఆత్మార్చనయే అవుతుంది.

ఆత్మార్చనావిధానం అత్యంత సులభ సాధ్యం. సమతారసమే ఈ బోధ యొక్క సారం.

**సమతా మధురా రస్యా రసశక్తిరతీంద్రియా ।**
**తయా యద్భావితం చేత్యమమృతం తత్క్షణాద్భవేత్ ॥** (శ్లో 56, సర్గ 39)

సమతారసము అత్యంత మధురము, ఇంద్రియా తీతమునునై యున్నది. అట్టి సమతా రస సమన్వితమైన బుద్ధిచే పొందబడే ఇంద్రియ విషయాలు కూడా క్షణంలో అత్యంత సుమధురమౌతాయి. అట్టి బుద్ధి క్రమంగా నిర్వికారంపొంది భూతరహిత (భూ–జల–అగ్ని–వాయు రహిత) ఆకాశంలాగా ప్రశాంతత పొందగలదు. మనస్సు స్వస్వరూపమున విలీనమౌతుంది. అదే అనాయాసమగు దేవార్చన. ఆ ఆత్మార్చన చేయువాడు బహిర్‌ప్రకృతి సంబంధములగు సంసారకార్యములను ఒనర్చుచున్నప్పటికీ, అంతరమున పరిపూర్ణుడై ఉంటాడు. అజ్ఞాన పరిభ్రమణం క్షీణిస్తుంది. అహంకార మేఘం తొలగి శరత్కాలాకాశం లాగా స్వస్వరూపం పరిఢవిల్లుతుంది.

ఓ వసిష్ఠా! జీవద్దర్శనం చేస్తూనే, ఏతత్ క్షణంలో కూడా బ్రహ్మపదమున వెలయుము. అప్పుడే పుట్టిన బిడ్డలాగా వికల్పరహితుడవై ఉండుము. చిత్తమునకు చిదాభాసునకు కూడా మూలకారణమగు సర్వమంగళమయ ఆత్మనే గాంచుచుండు. నీ స్వరూపమునకు మనోవృత్తి రూపమగు స్వల్పత్వమును ఆపాదించవలసిన అవసరం నీకు గాని, మరెవరికి గానీ లేదు. అట్టి ఆరోపణ ఆత్మోపాసనారాహిత్యం వలననే జరుగుతోంది. ప్రపంచ వస్తు ఆకారములను వాటిని ప్రకాశింపజేసే సూర్యతేజస్సుకు ఆపాదించటం ఉచితమెట్లా అవుతుంది? తుచ్ఛ మనోవృత్తులు నీపట్ల ఉపశమించుగాక! "పుట్టువాడను, సంబంధితుడను" మొదలైన భేదభావములన్నీ నీపట్ల అస్తమించి, ఇక నీవు స్వప్రకాశరూపుడవై వెలుగొందెదవు గాక! స్వయంగా నీవే అయి ఉన్న (తత్‌త్వమ్) ఆ ఆత్మదేవునికి ఈ దేశ, కాల, క్రియాదు లన్నీ అప్రయత్నంగా, అనాసక్తి పూర్వకంగా సమర్పించివేయి. అప్రయత్నంగా లభించే సర్వ సంఘటనలను అర్పించి అర్చించు. వాంఛారహితమగు బుద్ధితో ఆత్మారాముడవై వెలుగొందు!

❖❖❖

## 15. అనంత స్వస్వరూపమునకు అల్పత్వం ఆపాదించటమా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ! సాంబశివా! మీరు పూజాసంరంభముగాని, ప్రతిమా నిర్మాణం గాని అవసరం లేని చిదాత్మశివుని పూజ గురించి చెప్పి నన్ను తరింపజేస్తున్నారు. అట్టి పూజ అత్యంత అనాయాసమని, నేను చేసే యథాక్రమములైన కృతాకృతములను ఆత్మదేవుని పరంగా సమర్పించి ఉండటమేనని గ్రహిస్తున్నాను. ప్రతిమాదులు కూడా అవసరం లేని అట్టి పూజ వలన ఆత్మదేవుడు

సంతసించి నా యొక్కరూపానుభూతిగా సాక్షాత్కరించగలరని ఎరుగుచున్నాను. అయితే, అట్టి పూజకు ప్రయోజనము, ఫలితము ఎట్టివో మరికొంత వివరించమని నా విన్నపం. అంతేకాదు, నాది మరొక చిన్న సందేహం. రాగద్వేషము లనేవి సర్వానర్థములకు కారణం కదా! అట్టి రాగ ద్వేషములతో కూడా ఆత్మదేవుని పూజించవచ్చని మీరు ప్రకటిస్తున్నారేమిటి?

**శ్రీశివ భగవానుడు :** నేను వర్ణిస్తున్న ఆత్మశివుని సర్వవిధ సమర్పణతో కూడిన పూజకు ప్రతిఫలం పారమార్థికానందమును, మాయాభంగమును స్వతఃసిద్ధమైన రీతిలో నీ స్వస్వరూపుడైన ఆత్మదేవుడు ప్రసాదిస్తారు. సర్వము ఆత్మభగవానుని చమత్కారంగా దర్శించటమే ఆత్మోపాసన! అదియే ప్రపత్తి అనగా! ఇక రాగద్వేషముల విషయమై విను.

నిప్పురవ్వలు నిప్పు నుండి బహిర్గతమైనంత మాత్రంచేత అవి నిప్పుకంటే వేరైనవి కాదు కదా! అట్లాగే రాగ ద్వేషములని పిలువబడుచున్నవి కూడా వాస్తవానికి ఆత్మకంటే వేరైనవి కావు. నిత్యమగు ఆత్మను నవరసాలతో కూడిన జగత్‌రూపముగా గ్రహించుటే ఆయనయొక్క పూజ. సుఖభోగములను, దారిద్ర్యదీనత్వములను సమముగా చూచుటయే ఆత్మార్చన.

ఆత్మయే ఆకాశము మొదలుకొని ఘటము వరకు, జాగ్రత్ మొదలుకొని స్వప్నసుషుప్తుల వరకు సర్వఅవస్థలను అలంకరించియున్నదయ్యా! ఈ జగత్తు ఆ ఆత్మశివుని వలననే, ఆయన యందే ఇందలి సర్వకళలతో సహా ప్రకాశిస్తోంది. "నా స్వరూపము కూడా మౌన, ప్రశాంత, పరమానంద కళాస్వరూపమగు ఆ ఆత్మ శివుడే!" అని గ్రహించు.

ఆత్మయొక్క 'సత్త' లేకుంటే ఒక పరమాణువు కూడా ప్రకాశించజాలదు. అందుచేత "ఇదంతా ఆత్మరూపమై వెలయుచున్నది" – అనే విషయం నీవు ఒక్క క్షణం కూడా మరువకూడదు. అట్టి పరమసత్యము మాత్రమే ఈ జీవుని సర్వ అజ్ఞానములనుండి – అన్నివేదనలనుండి రక్షించగలదు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవశ్యం స్వామీ! అయితే, ఎంత ఆశ్చర్యం! ఎంత విచిత్రం! నిష్క్రియుడు, వృత్తిరహితుడు అగు ఆత్మశివుడు ఈ నానా విధపదార్థములుగా జీవుడు–బుద్ధి మొదలైన తత్త్వములుగా విస్తరించుచున్నాడు. ఆయా జీవులతో ఉంటూ స్వస్వరూపమును ఏమరచుచున్నాడే? స్వయం కల్పిత మగు స్వమాయచే అసంపూర్ణత్వమును గాంచుచున్నాడే! సర్వాత్మకము, అనంతము, మంగళ మయము అగు ఆత్మయందు పూజ్య – పూజక – పూజాది విభ్రమములన్నీ ఎక్కడ నుండి వచ్చాయో కదా! అవన్నీ పరిచ్ఛిన్నాకారముననే సంకల్పితములగుచున్నాయి కదా!

**శ్రీశివ భగవానుడు :** శాంతుడగు ఆత్మేశ్వరునియందు పరిచ్ఛిన్నములగు ఈ వికల్పములు సంభవించ టానికి వీలే లేదు. నిత్యము, నిర్మలము, సర్వశక్తిమయము, అనంతము అగు ఆ ఈశ్వరతత్త్వము ఈ పరిచ్ఛిన్న రూపనామములతో పూజ్య–పూజకాది భారముతో కుదించుకుపోవటమనేది కుదరనే కుదరదు. అత్యంత నిర్మలమగు ఏ చిద్రూపమునుండి ఈ జగత్తులన్నీ క్షణంలో పుట్టి, పెరిగి, లయ మవుతున్నాయో... అట్టి భగవంతుని ఒకానొక ఆకృతిగాగాని, రూపనామములుగా గాని పరిమితం చేయటం అనుచితమే అవుతుంది. ఇక, రూప – నామములను శ్రద్ధకొరకై సంజ్ఞగా స్వీకరించటం ఉచితమే గాని "అది మాత్రమే దైవం" అని భావించటం ... అనంతునకు అల్పత్వం ఆపాదిస్తున్నట్లే

అవుతుంది కదా! తత్త్వజ్ఞులగు మహనీయులంతా ఈ విషయం ఎరిగియే తమ తమ ఇష్టదైవానికి సంబంధించిన సాధనలు కొనసాగిస్తున్నారు.

ఇక పరమేశ్వరుని దేశకాల పరిచ్ఛిన్నునిగా తలచుచూ అట్టి స్వల్పానుభూతి వీడని వారికి నేను ప్రవచిస్తున్నట్టి ఈ చెప్పబడిన ఆత్మదేవపూజా విధానం ఉచితమార్గంలో ఉపయోగించును గాక!

ఓ వసిష్ఠా! నీవు ఇప్పుడే, ఇక్కడే సర్వపరిచ్ఛిన్న దృష్టులనూ పరిత్యజించు. నీతో సహా కనబడే ఈ సర్వమును ఏకాత్మకుడవై స్పష్టీకరించుకో. తత్త్వభావాన్ని ("ఈ కనబడే 'నీవు' అనబడునది సర్వాత్మకుని కిరణపుంజమే" అను భావం) అవలంబించి సముడవై, శాంతుడవై విషయాసక్త శూన్యుడవై, నిరామయుడవై ఉండుము. "ఆత్మతత్త్వమును విశదపరచుట" అను యథాప్రాప్తమైన ధర్మమును అకర్తృత్వబుద్ధితో నిర్వర్తించు. శుభాశుభములన్నీ ఉపాహారంగా సమర్పించి ఆత్మేశ్వరుని అర్చించు.

మహర్షీ ! ఎప్పుడైతే నీవు ఈ దేహమును – దేహిని వేరుపరచి మర్మగర్భమగు సత్యమును దర్శించటం ప్రారంభిస్తావో ...అప్పుడు నీవు సాధుపురుషులగు వారి గుణములను పొందినట్లే. అప్పటి నుండి "తత్త్వమును వేరుగా సంపాదించటం" అనేది ఉండదు. అతిత్వరలో మాయాకళంకం తనంతట తానే సంపూర్ణంగా తొలగగలదు. ఆపై ఈ బాహ్య జగత్తు నీయందు సంలగ్నం కాజాలదు. ఒక స్ఫటికంలో దృశ్యము ప్రతిబింబించినప్పటికీ, అయ్యది దానికి అంటుతుందా?

ఈ జన్మ – జర – మరణ – పునఃజన్మాదులు నీకు అంటవు.కనుక లే లెమ్ము. ఆత్మదేవుని పట్ల బహిర్పూజ, అంతర్పూజ ప్రారంభించు.

❖❖❖

## 16. అవిద్య నుండి ... విద్యకు !

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే పరమశివా! పరమోత్కృష్టమగు ఆత్మదేవుని పూజ బోధించినందుకు మేమంతా మీకు ఎంతో కృతజ్ఞులం. మీరు కురిపిస్తున్న కరుణారసవీక్షణ భక్తసులబత్వం వర్ణించి చెప్ప గల భాషాసామర్థ్యం నా వద్ద లేదు. స్వామీ ! సర్వసందేహాలు నివర్తించగల మీ వంటి సద్గురువుల దర్శనం లభించటం ఎన్నో జన్మలలో మేం చేసుకున్న పుణ్యఫలమే అవుతుంది.

సవినయుడనై ఒక ప్రశ్నను మీకు నివేదించుకుంటున్నాను. మహాత్మా! బ్రహ్మము సర్వ ధర్మములకు, సర్వ మనోబుద్ధులకు, సర్వవాక్యములకూ అతీతము కదా! అట్టి సర్వాతీతమైనదానికి 'శివుడు' అని గాని, 'పరమాత్మ' అని గాని శబ్దములతో చెప్పుకోవటమెందుకు? ఆయన ఏ వర్ణమునకూ అలభ్యుడుకదా! ఇక "సత్త, శూన్యం, విజ్ఞానం" మొదలైన పిలుపులకు అర్థమెట్లా అవుతోంది ?

**శ్రీశివ భగవానుడు :** నాయనా! ఇచ్చట ఆద్యంతరహితము, స్వయం జ్యోతియు అగు 'సద్వస్తువు' ఒక్కటే ఉన్నది. అది నామ రూప రహితమైనప్పటికీ అద్దాని బోధ కొరకు, సాధన కొరకు అనేక నామరూపములు ఉపయోగించబడుచున్నాయి. అంతేకాదు. అది ఈ ఇంద్రియములకు అలభ్యమవటం చేత 'శూన్యము' వలె కూడా తోచుచున్నది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అది ఇంద్రియములకు, మనస్సు మొదలైన యుక్తులకు కూడా గోచరించనిదై నప్పుడు ఈ ఇంద్రియ మనోబుద్ధులతో చేసే ఏ క్రియలైనా దానిపట్ల నిష్ప్రయోజనమే అవుతాయి కదా? ఇక అద్దానిని ఆయా కార్యక్రమముల సహాయంతో, భౌతికమైన విధులతో చేరగలమను నిశ్చయమేమున్నది?

**శ్రీశివ భగవానుడు :** మనస్సు యొక్క ఎట్టి వృత్తులూ ఆ ఆత్మవస్తువును ప్రకాశింపజేయలేని మాట నిజమే. అయితే సాత్వికము, బ్రహ్మాకారము అగు బుద్ధివృత్తియొక్క బలంచేత అవిద్యయొక్క ఆవరణం తొలగించబడుతోంది. అవిద్యావరణం తొలగిందా – బ్రహ్మము తనంతట తానే ప్రకాశించుచున్నది. అట్టి స్వయంప్రకాశానుభవమును బోధకులు 'ఆత్మసాక్షాత్కారం' అని పిలుస్తున్నారు. అట్టి తన స్వరూప అనుభవ స్థిరత్వమును అనుభవించటానికి ఈ ఇంద్రియ, ఇంద్రియార్థములతో అవసరమే లేదు. ఎందుకంటే అది ఇంద్రియములకు విషయమే కాదు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్టి స్వీయస్వరూప అనుభవ స్థిరత్వమునకు క్రమక్రమమైన మార్గమేదైనా చెప్పి, మమ్ము తరింపజేయ ప్రార్థన.

**శ్రీశివ భగవానుడు :**

1. మొదట "ఇంద్రియాతీతం, అనిర్వచనీయం అగు నా స్వరూపం ఎప్పటి నుంచో 'ఇంద్రియ విషయాలు'అనే బురదలో నిష్కారణంగా ఇరుక్కున్నది. అందుకు ఫలితంగా అజ్ఞాన భావవీచికలు, అల్పలక్ష్యాలు నన్ను కప్పి ఉంచుతున్నాయి. ఇప్పుడు నేను నా స్వరూపాన్ని సముద్ధరించు కోవటం ఆవశ్యకం" – అని జీవుడు గ్రహించాలి. పట్టుదలతో కూడిన కార్యక్రమానికి ఉద్యుక్తుడు కావాలి.

2. అట్టి ముక్తి నొందతలచినవాడు శమదమాదులను (Control of Internal & External Senses) పెంపొందించుకోవాలి. క్రమంగా సాత్విక అవిద్యాంశములు బలపరచుకోవాలి.

3. "సత్సంగము – సద్గురువులు – శాస్త్రవచనములు" అను సాత్విక అవిద్యాంశ సహాయంతో బ్రహ్మాకార చిత్తవృత్తులను అనుసరిస్తూ రావాలి.

4. క్రమంగా తానే పూర్ణ బ్రహ్మస్వరూపంగా వెలయు గాక! అది మాత్రమే విద్యాంశ.

**శ్రీవసిష్ఠ మహర్షి :** సత్సంగము, గురువులు, శాస్త్రము, బ్రహ్మాకారవృత్తి అవలంబించటం – అనేవి కూడా అవిద్యాంశలోనివేనా ఏమిటి?

**శ్రీశివ భగవానుడు :** అవును. అవన్నీ 'సాత్విక అవిద్యాంశ విభాగాలు' అని అంటున్నారు. చాకలి వాడు చవుడుతో వస్త్రములోని మురికిని వదలించి, ఆ తరువాత ఆచవుడును, వస్త్రములోని మురికిని ఉతకటం ద్వారా వదిలిస్తున్నాడు కదా! మంచినీటితో ఆ వస్త్రాన్ని మొత్తంగా పరిశుభ్రపరచి ఆర వేస్తున్నాడు.

జనులు కాలిలో ముల్లు విరిగినపుడు మరొక ముల్లుతో కాలిలోని ముల్లును తొలగించి... ఆ తరువాత రెండు ముళ్లనూ తొక్కరాని చోట పారవేసి వస్తున్నారు. అట్లాగే సాధకుడు సత్సంగమును, తదనుకూలమైన చిత్తవృత్తులను ఆశ్రయిస్తూ... ఆత్మస్వరూప ప్రాప్తి వరకూ కొనసాగిస్తున్నాడు.

కాబట్టి బ్రహ్మము తప్ప తక్కినవన్నీ అవిద్యాంశములేనని గ్రహించు.

బ్రహ్మము అనగా తత్ ప్రయత్నశీలుడగు ద్రష్టయే కదా! నీ స్వరూపానుభవ పర్యంతమే ప్రయత్నమనే దాని యొక్క అవసరం ఉంటుంది. చిరాభ్యాస ఫలంగా సౌభాగ్యవశంగా పూర్ణబ్రహ్మాకార వృత్తి లభిస్తుంది. అవిద్య నశిస్తుంది. అప్పుడాతడు తనను తాను సర్వత్రా అవలోకించగలుగుతాడు. అట్టి ఐక్యతావలోకనమునే శాస్త్రములు 'ఆత్మప్రాప్తి' అని 'మోక్షము' అని, 'మనోవాక్ అగోచర స్వస్థితి' అని, 'శివైక్యము' అని 'శివసాన్నిధ్యము' అని చెప్పుచున్నాయి.

ఒకడు అపరిశుభ్రమగు అరచేతులను పరిశుభ్రపరచడానికి బొగ్గుపొడిని తెచ్చి రుద్ది, ఆపై శుభ్రమగు నీటిలో ఉభయమురుకులను తొలగించి శుభ్రపరుస్తున్నాడు కదా! శాస్త్ర, సత్సాంగత్యాది సాత్విక అవిద్యాంశతో అంతరంగంలోని రాజసిక, తామసిక అవిద్యాంశను తొలగించి, 'విచారణ' అను ప్రయత్నమనే మనస్సును జతచేర్చి ప్రయత్నం కొనసాగిస్తుంటే... ఆ పై క్రమంగా అన్ని విధాల అవిద్యాంశను తొలగించటం జరుగగలదు. అప్పుడు స్వయం ప్రకాశకమగు ఆత్మ ఒక్కటే నిర్మలమై ప్రకాశిస్తుంది. అట్టి నిర్మలమగు ఆత్మయే నీ యొక్క, నా యొక్క, తదితర సర్వజీవులయొక్క వాస్తవ స్వరూపం. చిత్రమేమిటంటే... ఆత్మయే ఆత్మవలన ఆత్మగురించి ఆత్మవిచారణ మొనర్చుచున్నది. చివరకి తాను ఆత్మగానే శేషించుచున్నది. అంతేగాని ఒకటినుండి మరొకటేదో ఎప్పుడో బయల్వెడలటం లేదు, ప్రవేశించుటలేదు. ఇక ఇందు "బుద్ధి-మనస్సు వాటి వృత్తులు" మొదలైన అవిద్యకు ప్రమేయం ఏమున్నది చెప్పు? కనుక "అవిద్యాక్షయమే ఆత్మరూప సుస్థిరత"అని నిత్యానిత్య వివేకులు స్పష్టాతి స్పష్టముగా ఎరిగియే ఉన్నారు.

సంకల్ప పరంపరలు ఉన్నంతవరకూ ఆత్మ తెలియబడజాలకున్నదని చెప్పవలసివస్తోంది. అయితే గురూపదేశములు, శాస్త్ర పఠనం, శాస్త్ర ప్రతిపాదిత నియమాదుల అనుసరణం... ఇవన్నీ దుస్సంకల్పములతో ఆవరించబడినట్టి ఈ జీవుని సత్ సంకల్పములవైపు మరల్చుచున్నాయి. సత్ సంకల్పములు మోహరాహిత్యమునకు, నిశ్చలత్వానికి... ఆపై క్రమంగా ఆత్మానుభవానికి దారి తీస్తున్నాయి. గురూపదేశాదులు స్వయంగా తామే ఆత్మానుభవం అవటం లేదు. ఎందుకంటావా? 'గురూపదేశాదుల ద్వారా ఆత్మజ్ఞానం పొందుదును గాక'... అని సంకల్పించునది ఇంద్రియ సమష్టి ద్వారానే కదా! కానీ పరబ్రహ్మమో, ఈ ఇంద్రియములన్నిటికి కూడా అతీతమై ఆ ప్రయత్నించు వాడే అయి ఉన్నదని ఏమరవకుండబడుగాక! ఈ ఇంద్రియ విషయములన్నీ తిరస్కరించబడగా అప్పటికీ ప్రకాశించుచున్నది అది. కనుక గురూపదేశాదులు సహకారిక కారణాలు మాత్రమే. ఆత్మ పదప్రాప్తికి అసలైన కారణం ఆత్మ వస్తువే. సర్వకారణ కారణం ఆత్మయే.

**యద్వస్తుః యత్క్షయేప్రాప్తం తత్తస్మిన్ సతి నావాప్యతే ॥**

ఏ అవిద్య లేకున్నప్పుడు మాత్రమే సత్యవస్తువు లభిస్తుందో ...అట్టి అవిద్య మిగిలి ఉండగా ఆత్మ ఎట్లు అనుభూతమౌతుంది చెప్పు?

❖

కనుక సాధకభక్తజనులకు నేను గుర్తు చేస్తున్నదేమిటంటే ...వారి సాధనల యొక్క అంతిమ సాధ్యము వారి ఆత్మయే అయియున్నది. ఆత్మ సర్వదా నిత్యము, స్వయం ప్రకాశకము, అఖండము, అప్రమేయము అయి ఉన్నది.

ఒకావిడ పండుగరోజు పెట్టిలోంచి బంగారపు గొలుసు తీసి ధరించింది. కొద్దిసేపైన తరువాత ఆ విషయం మరచి ఏమరు పాటుగా పెట్టె తెరచి ఆ బంగారు గొలుసు వెతకటం ప్రారంభించింది. కనపడలేదు. ఇల్లంతా వెతుకుతూనే ఉన్నది. దుఃఖిస్తోంది. మరల మరల, మూల మూలలా వెతికి వెతికి నీరసంగా చతికిలపడి రోదిస్తోంది. ఇంతలో కాకతాళీయంగా ఆ పక్కింటావిడ వచ్చి 'ఒదినగారూ! మీ మెడలో గొలుసు చాలా బాగున్నదండీ !' అని పలకరించింది. వెంటనే ఆ ఇల్లాలు, "అయ్యో దాని కోసమేనండీ, ఈ ఏడుపు. అది కనబడటం లేదు!" అని గొల్లున ఏడవసాగింది. అప్పుడా పక్కింటామె, "అదేమిటండీ? మీ మెడలోనే ఉన్నది కదా" ...అనగానే ఆ ఇల్లాలు మెడ తడిమి చూచు కుని 'అరె ! ఈ గొలుసు ఇక్కడే ఉన్నదా!' అని మహదానందపడి ఆ ప్రక్కింటామెకు సంతోషంతో కృతజ్ఞతలు చెప్పుకున్నది. శిష్యుడు సద్గురువుకు కృతజ్ఞతలు చెప్పుకోవటం ఇటువంటిదే సుమా!

ఈ సంఘటనలో "ప్రక్కింటావిడ వచ్చి గొలుసు ఇచ్చింది" అని అనటం సమంజసమా! అట్లాగే గురూపదేశాదులు ఆత్మవస్తువును ప్రసాదించుట లేదు. 'ఆత్మ – ఆత్మజ్ఞానం' కూడా ప్రతి జీవుని యందు స్వతఃగా సర్వదా ఉండియే ఉన్నాయి. అయితే గురూపదేశ, శాస్త్రానుకరణాదులు ఆత్మజ్ఞాన ప్రాప్తికి మహత్తరమైన సహకారం అందిస్తున్నాయనుటలో సందేహం లేదు.

శిష్యుని అజ్ఞాన వినాశనము కొరకే గురూపదేశాలు అవసరమగుచున్నాయి. అజ్ఞాన ఆవరణ నశించిందా – అంతవరకూ అనిర్దేశ్యమూ, అదృశ్యమూ అయిున్న ఆత్మ శివుడు ప్రసన్నుడై తన యందు, సర్వమునందూ అనుభవమగుచున్నాడు. శాస్త్రములు, గురుప్రవచనములు ఆత్మను విశదీ కరిస్తున్నాయే గాని, ఆత్మను క్రొత్తగా ప్రతిపాదించుట లేదు. ప్రసాదించుట లేదు. ఆత్మానుభవమనేది శిష్యుని (సాధకుని) అంతరంగ అనుభవస్థితియే గాని అది మరొకరు ఎక్కడి నుండో ప్రసాదించగలిగేది కాదు. గురువే స్వయంగా ఆత్మానుభవం ప్రసాదించగలిగితే ఇక, ఒక ఉత్తమ గురువు యొక్క శిష్యులందరూ ఆత్మానుభవం పొందాలి కదా? పొందుచున్నారా? కొందరు మాత్రమే పరమోన్నతమైన అఖండానుభూతి పొందుచున్నారేం? అది శాస్త్రముల గురువుల లోపం కాదు. సాధకుని లక్ష్యశుద్ధికి అద్దానిని ఆపాదించక తప్పదు. బడిలో ఒకే ఉపాధ్యాయునిచే బోధింపబడే విద్యార్థులలో ఉత్తమ – మధ్యమ – అధములు ఉన్నట్లే, శాస్త్రకారులు ప్రవచిస్తున్న స్వయంప్రకాశిక స్వస్వరూపాత్మ కథనం విషయంలో కూడా! వారివారి శ్రద్ధ హృదయ నైర్మల్యములను అనుసరించి ఉత్తమ – మధ్యమ – అధమ అవగాహనలతో కూడిన శిష్యులు లేక సాధకులు ఉంటూ ఉంటారు.

కాబట్టి ఆత్మ స్వయముగా స్వయంబోధ వలననే గ్రహించబడుతోంది.

అది అట్లుండగా కూడా, గురూపదేశ – శాస్త్రార్థ విచారణలు లేకపోతే ఆత్మబోధ సులభంగా లభించటం లేదు. వాటి సంయోగము వలననే ఆత్మబోధ జీవులకు సుసాధ్యమగుచున్నది. అది

దృష్టిలో పెట్టుకొనే సృష్టికర్తయగు బ్రహ్మ భగవానుడు నిన్ను నియమించి ఉన్నారు. లోక కళ్యాణార్థమై నేనీ సమాచారం నీకు అందించటం అందుకే జరుగుతోంది.

మరొక దృష్టాంతం చెపుతాను ...విను. సూర్యుని కాంతిలో వస్తువులు ప్రకాశిస్తున్నాయి. అయితే ఆ కనబడే వాటిని గుర్తించే వాడెవడు? నీవే కదా! పగటివేళ సూర్యకాంతిలో జనులు వస్తువులు గుర్తిస్తున్నట్లే... 'గురు శాస్త్రార్థ నిరంతర సంయోగం" అను వెలుగులో ఆత్మానుభూతి సంతరించుకోవలసింది సాధకుడే సుమా!

❖❖❖

# 17. గురువులు

ఈ జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, వీటికి సంబంధించిన సుఖ దుఃఖాలు... వీటి నన్నిటినీ దాటి వేయగా, అప్పటి అతీత దృష్టికి ఇంకా శేషించి ఉండేదేమిటో ...అదియే "శివుడు - తత్ - సత్ - ఆత్మ - స్వస్వరూపము" మొదలైన శాస్త్రీయ నామాలతో వ్యవహరించబడుతోంది. ఇక ఈ జాగ్రత్ స్వప్నాదులంటావా? దీనిని మాయగా దర్శిస్తున్నప్పుడు 'ఇది లేనే లేదు' అని తెలియవస్తోంది. ఆత్మగా దర్శించామా ...ఇది 'నిత్యసత్త'గా అనుభవం కాగలదు. ఆత్మ ఆకాశము కంటే నిర్మలం. అంతే కాకుండా "అది అనుభూతిపరునికంటే వేరే ఏదో కాదు"అని గ్రహించు. "అది అనంతము, అనిర్దేశము. అదొక్కటే సత్ ...మిగతాదంతా అసత్" అనునది సునిర్ణయమై ఉన్నది.

❖

శిష్యుల మనో అవగాహన స్థితులను అనుసరించి వారికి మార్గమును చూపటానికి గాను వివిధ తరగతులకు సంబంధించిన గురువులు ఉండటం జరుగుతోంది. వారిని మూడు విధములుగా విభజించవచ్చు-

**1. కేవల తాత్త్విక గురువులు :** వీరు విశుద్ధమగు ఆత్మైక్యమును ప్రతిపాదించుచున్నారు. 'సాక్షాత్ తత్త్వమ్ అసి" అను వాక్యార్థముచే మహత్తరమగు ఉత్కృష్ట సత్యము వీరిచే బోధింప బడుతోంది. వారు స్వయముగా విచిత్రమగు ఈ జగత్తును విశుద్ధమగు తత్త్వమును ఐక్యమొనర్చి ఆత్మస్వరూపముననను సుస్పష్టపరచుచున్నారు. ఆ అనుభవమును శిష్యులకు అందించ ప్రయత్నిస్తున్నారు.

**2. పండిత గురువులు :** వీరు సత్యాసత్య విమర్శకు చెందిన వాఙ్మయమును, సంవిధానములను కల్పనచేసి శిష్యులకు జీవన్ముక్తత్వ మార్గంలో సహకరిస్తున్నారు. వీరు అనేక సిద్ధాంతములను ప్రతిపాదిస్తూ శిష్యులను పరమార్థమునకు కడు దగ్గరగా కొనిపోవుచున్నారు. విధి-విధానములను రచించి సాధన మార్గమును అందిస్తున్నారు. "ఈ జగత్తు అసత్యము, బ్రహ్మమే సత్యము" అను అవగాహనను పెంపొందించ ప్రయత్నిస్తున్నారు.

**3. ప్రతిపాదన గురువులు :** వీరు ఈశ్వరునకు అనేక గుణములను, నామ రూపములను ఆపాదించి, చిత్ర - విచిత్ర కథనములను కల్పించి శిష్యులను ఉపాసకులుగా తీర్చిదిద్దుతున్నారు.

అనేక గుణములను, సంగతులను రచించి ఉపాసకుల దృష్టిని దృశ్యము నుండి మరల్చి ఉత్తమ సాధకులుగా మలుస్తున్నారు. చిన్న పిల్లలకు కథలు కల్పించి చెప్పి వారిని అల్లరి నుండి మరల్చి చదువుకోవటానికి సిద్ధం చేస్తాం చూచావా? వీరు కూడా నామరూపాతీతమగు ఆత్మతత్త్వమునకు నామరూపములు కల్పనచేసి అందిస్తున్నారు. "అవిద్యాంశ" సహాయంతో అవిద్యను తొలగించు యత్నము చేయుచున్నారు.

ఈ ముగ్గురు బోధకులు మహనీయులే. ఎందుకంటే అవిద్యా సముద్రంలో కొట్టుకుపోతున్న జీవులను వీరు ఆదుకుని జ్ఞాన - విచారణ - సన్మార్గము వైపుగా నడిపిస్తున్నారు కదా!.

అయితే సర్వ విద్యల యొక్క అంతిమ ప్రయోజనం ఆత్మతత్త్వమే. ఈ జీవుడు తన్ను తాను ఎరిగినప్పుడు బోధకుల రచనలన్నీ ప్రయోజనం పొందినవై ఇక ఉపశమిస్తాయి. ఆత్మతత్త్వమే అత్యాంతికమైన సారం.

ఇది గ్రహించి జనులు చింతారహితులయ్యెదరు గాక! ఈ లోకంలో తత్త్వవేత్తలు అనేకులు ఉన్నారు. ఎచ్చటైతే మా వంటి దేవతలు కూడా భృత్యులై ఉంటారో ...అట్టి పరమపదమును కూలంకషంగా ఎరిగి అఖండ - అప్రమేయ - నిత్య - సర్వాతీత - సర్వసమన్విత స్వభావమునందు ఆ తత్త్వవేత్తలు ప్రతిష్ఠితులై ఉన్నారు.

❖❖❖

## 18. జగత్తుకు మూలం భావనయే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే భక్తవశంకరా! ఈ జగత్తు అనబడేది ఆత్మయందు వాస్తవానికి లేదు. అయినాకూడా ఉన్నట్లుగా భ్రమింపజేస్తోంది. ఇది ఎట్లా జరుగుతోంది?

**శ్రీశివ భగవానుడు :** బిడ్డా ! "బ్రహ్మము - శివము - దైవము - భగవాన్ - తత్త్వము - విష్ణు"... మొదలైన అనేక శబ్దములచే చెప్పబడుచున్న అర్థమగు వస్తువు ఒక్కటే.

అది చిత్తు (ఎఱుక) అయి ఉన్నది. ఇందులో సంశయం పెట్టుకోవలసిన ఆగత్యం ఏమాత్రమూ లేదు. అట్టి శుద్ధచిత్ గురించి ఏమని చెప్పాలి? ఎట్లా చెప్పాలి? ఆకాశం అనేది పంచభూతాలలోఒకటి కదా! అది ఊహకే అందదు. అంతటి సూక్ష్మభూతమగు ఆకాశం కూడా ఆ ఏకైక చిద్వస్తువు ముందు కొండంత ఘనీభూతమని గ్రహించు. అది నాయందు, నీయందు తదితర సర్వజీవులయందు సర్వదా సమరసభావమున నెలకొని ఉన్నది. "తెలుసుకొనుచున్నవాడు" అను రూపమున వెలయుచున్న ఆ చిత్తు ఒకానొకప్పుడు "తెలియబడుచున్నది ...(చేత్యము)"గా స్వయంగా అగుచున్నది. ఒకడు తన స్వప్నంలో ఎక్కడో ఉన్న గ్రామం ప్రవేశించి అక్కడి జనులతో ఒకడిగా నివసించుచున్నట్లు... చైతన్యము "తెలుసుకొనుచున్నాను" అను భావనద్వారా అహంభావమును అనుసరించుచున్నది. అట్టి 'అహం' కల్పన నుండి క్రమంగా దేశకాల కల్పనలు ఉదయిస్తున్నాయి. శూన్యరూపముగ అట్టి తత్సంబంధిత శతాధిక కల్పనలన్నీ అహంభావమునకు మిత్రులగుచున్నాయి. అహంభావము

స్పంద విజ్ఞానమును సంపాదించుకుని క్రమంగా ప్రాణస్పందనమును పొంది 'జీవశక్తి' అను పేరును పొందుచున్నది. ఆ జీవశక్తి "నేను" అను నిశ్చయం చేసుకొని అజ్ఞాన మార్గమున నిలబడు చున్నది. ఆ జీవశక్తిలో శబ్దశక్తులు, జ్ఞానశక్తులు, క్రియాశక్తులు ఏర్పడి తమతమ రూపములను విస్తరింపజేసుకుని ఈ జగత్తు అనబడు దానిని కల్పించుకుంటున్నాయి. ఈ శక్తులన్నీ సంకల్పము, స్మృతి అను రెండింటితో కూడి "అపంచీకృతమగు మనస్సు" అను సంజ్ఞను పొందుచున్నాయి. పండితులు ఈ మనస్సును ఆత్మరాజుయొక్క బాహ్య కవచముగా చెబుతూ ఉంటారు.

ఈ మనస్సు అంతస్థమగు బ్రహ్మశక్తితో కూడుకుని "జ్ఞాత" అని పిలువబడుతోంది. 'జ్ఞాతృత్వము' అనబడేది ఆత్మయొక్క స్వయంప్రకాశ శక్తివలననే కలుగుతోంది. అట్టి సందర్భంలో చైతన్యము కొన్ని శక్తులు ప్రకటిస్తోంది. ఆ శక్తులు అంతస్థమగు కల్పనావ్యవస్థ నుండి బహిర్గతమై బాహ్యమున ప్రకటనమగుచున్నాయి. కనుక 'జగత్తు' అనునది చిత్ స్వరూపజీవుని స్వయంకల్పిత భావాభావ స్వరూపమే అయున్నది.

**దృశ్య ప్రపంచం**

| | | |
|---|---|---|
| 1. వాయుసత్త | ... | స్పందసత్త |
| 2. స్పర్శసత్త | ... | త్వక్‌సత్త |
| 3. తేజసత్తా | ... | రూపసత్త |
| 4. జలసత్త | ... | స్వాదుసత్త |
| 5. రససత్త | ... | గంధసత్త |
| 6. భూమిసత్త | ... | ఖనిజసత్త |
| 7. జగత్‌సత్త | ... | దేశసత్త |
| 8. కాలసత్త | ... | పరిణామసత్త |

బీజము పుష్ప ఫల శాఖాది అనేక తత్త్వములు తనయందు నిశ్శబ్దంగా దాచుకుని ఉంటుంది చూచావా? మనస్సు కూడా ఆకారవర్జితములగు ఈ సత్తలన్నీ తనకు అభిన్నమైన రూపంలో తన యందు నిక్షిప్తం చేసుకొని దేశ కాలానుగతంగా బాహ్యమున అనుభవరూపంలో పొందుతోంది.

అపరిచ్ఛిన్న బోధ స్వరూపమగు బ్రహ్మమే పై 8 విధముల స్ఫురిస్తూ "పుర్యష్టకం" అని అనిపించుకుంటోంది. అంతమాత్రం చేత ఆ బ్రహ్మం తన యొక్క స్వస్థితిని కోల్పోతోందని మాత్రం భ్రమించవద్దు. ఎందుచేతనంటావా? అజ్ఞానదృష్టికి పరిణామం, పర్యవసానాలు తోచుచుండవచ్చు గాక! తత్త్వదృష్టికి మాత్రం అవన్నీ అసంపన్నములగు విషయములే.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జగత్తు అనబడేది అసలు ఏదై ఉన్నది?

**శ్రీశివ భగవానుడు :** ఇది జ్ఞానరూపము కాదు. జ్ఞేయరూపము కూడా కాదు. ఇది చిదా భాసము నందలి చేతనం అని కూడా అనలేం. శాస్త్రములు ఈ జగత్తుకు 'మాయ' అనే బిరుదును ప్రసాదించాయి ...ఇది స్వతహాగా లేదు. అయితే భావనను ఆశ్రయించి అనుభూతం అవుతోంది. సముద్రమునకు

ఆధారం జలమే కదా! ఆ జలం కెరటములు, మంచు మొదలైన మరెన్నో విలాసములతో తోచుచున్నది. అట్లాగే పరబ్రహ్మమునందు పుర్యష్టకం సత్స్వరూపమున గోచరిస్తోంది. కారణం? భావనాపర్యవసానమే!

ఈ దృశ్యప్రపంచము ఆత్మ చైతన్యదృష్టితో పరికించి చూచినవారికి ఇందు కనబడే సర్వమూ సంవిదాత్మ (సత్ (ఉనికి) + చిత్ (ఎఱుక) + ఆత్మస్వరూపంగా ) స్వరూపముగా కన్పట్టగలదు. ఈ సర్వము సంకల్పనగరం వలె, పరిజ్ఞాతమగుచుండవచ్చుగాక! సత్యము గ్రహించువారికి ఇదంతా శివభావము పొందుతోంది.

గ్రహింపబడినప్పుడే ఇదంతా ఉన్నది. అజ్ఞాతమై తెలియబడనప్పుడు ఇది వస్తువే కాదుకదా! కాబట్టి 'దృశ్యం స్వతహాగా లేదు. కాని సంకల్పించబడుచున్న కారణంగా ఉన్నట్లు తోచుచున్నది' అని సమీక్షించవలసి వస్తోంది. జ్ఞాన దృష్టిచే ఈ జీవుడు "ఈ జగత్తు నా యొక్క చిదానందరూప చమత్కారమే" అని గ్రహిస్తున్నాడు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** చిన్మాత్ర స్వభావమగు ఆత్మ వస్తువు తనంతటతాను తన యందు దృశ్యభావమును పొందుచున్నది' అని ఈ జగత్తును నిర్వచించవచ్చునా?

**శ్రీశివ భగవానుడు :** ఆత్మ యొక్క ఒకానొక విభాగమునందు భావనారూపమైన శబ్ద – స్పర్శాది అనుభవ స్వరూపమైన తన్మాత్రసత్త ఏర్పడి ఉంటోంది. అదియే ఆత్మ యొక్క సూక్ష్మ శరీరము. ఆ సూక్ష్మశరీరముచే ఈ స్థూలమైనదంతా ఆత్మ చేతనే దర్శించబడుచున్నదని శాస్త్ర ప్రవచనం. ఈ సిద్ధాంతం ప్రకారం ఈ జగత్తంతా ఆత్మ యొక్క సంకల్ప–వికల్పముల స్వరూపం మాత్రమే. కనుక మిథ్యయే కదా!

బ్రహ్మము తన యందు సూక్ష్మ – స్థూలభావములను కల్పించుకొని దేనినైతే పొందుతోందో ...అదియే ఈ స్థూలజగత్తుకు మూలకారణం. ఆత్మయందు 'నేను స్థూలమునకు సంబంధించిన వాడను' అను అభిప్రాయం రూపుదిద్దుకున్నప్పుడు మాత్రమే జగత్తు యొక్క అనుభూతి, అనుభవములు రూపం పొందటం జరుగుతోంది. అప్పుడు కళ్ళు మొదలైన ఇంద్రియార్థములు ఆయా కల్పిత విషయాలు గాంచుచున్నాయి. ఆ తరువాత క్రమంగా 'నేను పురుషుడను' అని సంకల్పించుకుని కాకతాళీయంగా జీవరూపం ధరించి 'అమ్మయ్య' అనుకుంటోంది. క్రమంగా కలకంటున్న మనిషి వలె స్థూలదేహము నుండి ఈ దృశ్య స్థూల విషయములలో ప్రవేశించి తన సుఖ దుఃఖములన్నీ తనకు తానే నిర్వచించుకుంటోంది. ఆ సుఖ దుఃఖ, సామాన్య ప్రత్యేక విషయ సమూహమునకే 'జగత్తు' అని పేరు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ! సాంబసదాశివా! మీరు చెప్పినట్లు దృశ్యజగత్తు స్వప్నసదృశమే అయి ఉండవచ్చు గాక! మొత్తం మీద ఇది జీవునకు దుఃఖ భాజకమౌతోందని అనటంలో సందేహం లేదు. దుఃఖ క్షయం అవటానికి ఉపాయాలు అత్యవసరమైయున్నాయి.

**శ్రీశివ భగవానుడు :** అందుచేతనే కదా, మన ఈ సంవాదం ! లోకగురువై నీవు తత్త్వశాస్త్ర ప్రబోధ నిర్వర్తించవలసి ఉన్నదయ్యా!

అనేకసార్లు 'కావలెను, పొందవలెను, చేరవలెను' ...అను రూపములో ఉండే అధ్యాసలచే జీవుడు వర్తమాన స్వస్థితి నుండి చ్యుతుడౌతున్నాడు. సంకల్పపరంపరలకు ఉద్యమిస్తున్న తరుణంలో వాసనలు రూపుదిద్దుకుంటున్నాయి. అట్టి అంతరంగవాసనలే సర్వదుఃఖములకూ మూలం.

ఈ జగత్తు ఒకని దృష్టిలో ఉన్నదా? ...అయితే ఆతని వాసనలే ఆ జగదనుభవానికి మూల కారణం. 'ఎండమావులు' అని ఎరుగబడిన తరువాత ఆ ఎండమావులలోని జలం ఇక భ్రమింప జేయదు కదా! అట్లాగే, ఈ జగత్తు స్వకల్పనా మాత్రంగా, స్వవాసనానుసారంగా ప్రతిఫలించే అనుభూతి, అనుభవ చమత్కారంగా సుస్పష్టమైతే... ఇకపుడు అట్టి ఈ జగత్తు ఎవ్వరిని దుఃఖింప జేయగలదు చెప్పు?

స్వప్నంలో చూచిన పదార్థములు నిదురలేవగానే కనబడటం లేదని ఒక బాలుడు మారాం చేస్తూ ఉంటే ఆ బాలుడికి ఏం చెబుతాం? 'నాయనా అవన్నీ కల్పితమాత్రములు, ఊహా జనితములు. అవి వాస్తవం కాదు' అనునదే వాస్తవమైన సమాధానం కదా! ఈ జగద్విషయములు ఆత్మ యందు అట్టివే! ఈ పదార్థానుభవములలో స్వప్నత్వమే ఉన్నది కాని, సత్యము లేదను ఎరుకయే వీటిని జయించటం సుమా!

'చూచువాడు, మనస్సు, మనన ధర్మము, అహంభావం చేత అనుభవమగుచున్న ఈ జగత్తు' ... ఇవన్నీ లయిస్తే, అప్పుడు, సన్మాత్రయుతమగు పరబ్రహ్మమొక్కటే పరిదృష్టమై అనుభూతమౌతుంది.

**యత్ర నో వాసనా నైవ వాసకో నైవ వాస్యతా ।**
**కేవలం కేవలీభావః సంశాన్తకలనభ్రమః ॥** (శ్లో 55, సర్గ 41)

ఎద్దానిలో అయితే 'వాసనలు, కోరబడునవి, కోరువాడు' అనునవన్నీ మూగబోయి అర్థ రహితత్వమును సంతరించుకుని ఉంటున్నాయో ...అయ్యదియే కేవలీభావం. అట్టి కేవలీభావమును ఆశ్రయించి ఉండటం కైవల్యం. అట్టి కైవల్యమొక్కటే సర్వదుఃఖములు శమించగల చోటు.

కుమారా! ఈ జగత్తు సత్యమవనీ! అసత్యమవనీ! కల్పనను తొలగిస్తే మరుక్షణం ఇక్కడ ఏమీ మిగలదు. జగత్తు తొలగితే ఇక దుఃఖమునకు కారణమేముంటుంది? ఊహామాత్రమగు బేతాళకల్పన వలె ఈ జగత్తు భ్రమింపజేస్తోందేకాని, ఇది ఆత్మవస్తువును ఆక్రమించగలిగినది కాదు, అతిక్రమించ జాలదు. స్వకీయ కల్పనచే ఏర్పడిన భ్రమ తొలగిందా ...ఇక ఈ జీవునకు అక్షయమైన శాంతి లభించ గలదు. ఏ జీవుడైతే ఈ జగత్తుపై, అహంకారంపై 'ఇవి సత్యమైనవే' అను నమ్మిక కలిగి ఉన్నాడో ...ఆతనికి బోధించటమెట్లాగో నాకు తెలియదు.

అందుచేత తత్త్వవేత్తలు వివేకవంతునికి మాత్రమే ఉపదేశం చేయగలుగుతారు. బహువిధములైన భ్రమలందు చిక్కి, మిథ్యయగు దేహములందు అభిమానము కలవారై మూర్ఖత్వము వహించేవారికి ఇక గురూపదేశం ఎట్లా చేయటం? అట్టి వానికి బోధించటం ఒకడు స్వప్నంలో కనిపించిన కుమార్తెకు జాగ్రత్‌లో సంబంధం వెతకటం వంటిది. అట్టి వారి పట్ల తత్త్వబోధ నిష్ప్రయోజనమై, వ్యర్థమై వాదప్రతివాదనలతో ముగుస్తోంది.

❖❖❖

# 19. దృష్టియే సృష్టి

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే భగవాన్ ! ఇంతకుముందు 'ఈ జీవుడు నిష్కారణంగా దేహభ్రమను (ఈ దేహమే నేను. దేహపరిమితుడను - అను రూపంగా ఏర్పడే భ్రాంతిని) గాంచుచున్నాడు'... అని చెప్పారు కదా! సృష్ట్యాదిలో చిదాకాశస్వరూపుడగు ఈ జీవుడు ఈ దేహస్థితిని ఎట్లు కొనితెచ్చు కుంటున్నాడు? దాని మర్మమేమిటి?

**శ్రీశివ భగవానుడు :** ఒకడు స్వప్నం కల్పించుకుని అందులో ప్రవేశించి, ఆ స్వప్నంలో వస్తువులను, దేహములను, సంఘటనలను గాంచుచున్నాడేc! అదేవిధంగా, ఈ జీవుడు 'తానే' అయున్న పరబ్రహ్మం నుండి తనకుతానే భావనాజగత్తును కల్పించుకొని, ఆ కల్పిత భావనాప్రదేశంలో ప్రవేశించి, ఆ తరువాత ఈ అనేక జగత్తులను గాంచుచున్నాడు. చిన్మయబ్రహ్మం సర్వవ్యాపి కదా! స్వప్నంలో దూర ప్రాంతం వెళ్ళి అనేక పనులు చేసివస్తున్నట్లు ఈ జీవుడు దేహధారి అయి అనుక్షణం ఆకాశాదులకు సంబంధించిన అనేక భావపరంపరలను ఆస్వాదిస్తున్నాడు. ఆతడు ఆ మార్గంలో పయనిస్తూ... తన స్వరూపమేమిటో తానే ఏమరుచుచున్నాడు. నామరూపరహితుడై ఉండి కూడా ఇక్కడి నామ రూపములను తనపై ఆపాదించుకొనుచున్నాడు. 'నేను అవ్యక్తము... అనిర్దేశము అగు సనాతనుడను కదా' ...అనే అనుభవం ఏమరచి 'నేను నిన్న-మొన్న ఈ దేహంలో పుట్టాను. దీనితోనే ఏదో అగుచున్నాను. ఎటకో పోతున్నాను' అని సంకుచితభావనను స్వీకరించి ఉంటున్నాడు. ప్రప్రథమమున సమష్ఠికల్పనా స్వరూపుడై, హిరణ్యగర్భుడై ఇక తదితరమైన వ్యవహారమంతటికీ కారణభూతుడగు చున్నాడు. అనగా, "నాలోని ఒకానొక సంకల్పిత స్వస్వరూపమే సృష్టికర్తయగు హిరణ్యగర్భుడు కూడా" - అని గ్రహించు. ఈ సంకల్పమయములైన పదార్థములు, విశేషములు అన్నీ 'బూచి' అను శబ్దంలాగా శూన్యమాత్రములే అయినప్పటికీ అజ్ఞానదృష్టికి సత్యమువలె గోచరిస్తున్నాయి.

ఇట్లు ప్రప్రథమున ఏర్పడిన జలంలోని ప్రథమతరంగం వంటి 'అహం' భావన నుండి తదితర జగత్తు ఏర్పడుతోంది. అదియే సృష్ట్యాది.

ప్రథమ సంకల్పమే ప్రథమ పురుషుడు. ఆతడు తన సృష్టికి తానే ద్రష్టయగుచున్నాడు. క్రీనీడ వంటి తన ద్వితీయ స్వరూపము యొక్క పరిచయంచే చిదాకాశమాత్రమగు స్వస్వరూపము యొక్క విస్మృతిచే అనంత సంసారముగా ఏర్పడుచున్నాడు.

**నిమేష ఏవ కల్పో యో మహాకల్పపరమ్పరామ్ ।**
**ప్రతిభాసవిపర్యాసమాత్రేణానుభవత్యలమ్ ॥** (శ్లో 10, సర్గ 42)

కల్పనాపటుత్వ సమర్థుడగు ఆతడు ప్రతిభాస యొక్క విపర్యయమును అనుసరించి నిమేష కాలంలో మహాకల్ప పరంపరలను అనుభవించుచున్నాడు.

అంతేకాదు ... ప్రతి పరమాణువు నందు, ప్రతి ఆకాశ విభాగమునందు ప్రతిక్షణంలోనూ సృష్టి, మహాసృష్టి, కల్ప, మహాకల్ప, భావ - అభావాలు నిరంతరం ఉదయిస్తూనే ఉన్నాయి. వాసనా

సామాన్యము అనుసరించి ఈ అనేక సృష్టులు కొందరు జీవులకు సమాన రూపములుగా కనబడు చున్నాయి. అట్టి ఈ సృష్టులందు స్వసంస్కార కారణంగా ఎవరెవరైతే అంతర్గతులగుచున్నారో... వారి వారికి ఆ సంస్కారములను అనుసరించి ఇవన్నీ వివిధ రూపములుగా కన్పట్టుచున్నాయి.

ఇక సదాత్మక దృష్టి కలవారికి ఈ సృష్టులన్నీ శూన్యమాత్రంగా తెలియవస్తున్నాయి.

పరమవ్యోమమగు శివము నందు ఇవన్నీ వాస్తవానికి లేనే లేవు. అద్దాని యందు ఇవి స్వస్వరూపాకాశత్వమే పొందుచున్నాయి. కలలో ఒక పెద్ద కొండను చూచి ఎక్కనారంభించావనుకో ...అనేక శ్రమలకు, భయములకు లోనగుచున్నావనుకో ...నిదుర లేవగానే ఆ కొండ, ఆ శ్రమ, ఆ భయం ఏమౌతున్నాయి? మటుమాయమై రహితం (శూన్యం) అవుతున్నాయి కదా! అట్లాగే అజ్ఞానం తొలగిన మరుక్షణం ఈ అసత్ – సత్ రూపములగు సృష్టులన్నీ మటుమాయమై పోతున్నాయి. 'ప్రథమ సృష్టికర్త నుండి పురుగువరకు సృష్టులన్నీ ఎట్టి దేశకాలములను ఆక్రమించుకొని ఉండనే లేదు' ...అనే విషయం అప్పుడే తేటతెల్లమౌతోంది.

ఈ సృష్టి పరంపరలన్నీ స్వతఃగా ఆత్మ స్వరూపములే కదా! కనుక వాటికి 'కల్పించబడిన సత్త' అనునది ఏదీ లేదు. 'క్షణికసత్త' కూడా లేదు. అవన్నీ జనించుట లేదు. నశించుట లేదు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మరిదంతా?

**శ్రీశివ భగవానుడు :** (చిరునవ్వు చిందిస్తూ) చైతన్యమే తనయందు తాను సంకల్పరూపమున ఈ విస్తార ప్రపంచవైచిత్ర్యమును విస్తరింపజేసుకుంటోందని చెప్పాను కదా! స్వప్నంలో కనిపించే ఒక నగరంలాగా ఇవన్నీ పుట్టుచూ గిట్టుచున్నాయి. స్వప్నంలో ఎదురుగా కనిపించే పెద్ద కొండ కదల్చటం అసాధ్యమైనట్లు ఘనీభూతమై అగుపించవచ్చు గాక! కానీ, అది స్వప్న స్వభావమును అధిగమించి ఉండజాలదు కదా! అట్లాగే ఈ జగత్తు కూడా దేశకాలముచే పరిపుష్టమై అగుపించవచ్చు గాక! ఈ జగత్తు ద్రష్ట యొక్క సంస్కారములను అనుసరించి సంస్కార పరిమిత మాత్రమై ఉంటోంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతిగా అనుభూతమౌతోంది. ఒకనికి సుందరముగా తోచువ్యక్తిగాని, వస్తువుగాని మరొకరికి తద్వ్యతిరిక్తంగా ఉంటోంది. ఒకనికి సామాన్యమైనట్లు తోచే ఒక వస్తువో, సంఘటనయో మరొకరికి మహత్తరమైన దానివలె అనుభూతమౌతోంది. ఇక ఇందులో ఏది సత్యం? ఏది కాదు? వస్తువులు, వ్యక్తులు లాగానే దేశకాలములు కూడా భావనామాత్రములై, భావనను ఆశ్రయించి, అనుసరించి ఉంటున్నాయి. జీవభావం ఉత్పన్నమైన క్షణం నుండి ఈ కార్యక్రమములన్నీ జన్మ–జీవన్–మృత్యువు లతో సహా ఇట్లే జరుగుచున్నాయి. కీటకం మొదలైన క్షుద్రజీవుల నుండి సర్వసృష్టికర్త యగు బ్రహ్మదేవుని వరకు సర్వజన్మ–కర్మలూ సంకల్పములను అనుసరించే, సంకల్పం చేతనే ఏర్పడు చున్నాయి. ఈ జగత్తు యొక్క అంతర్గతమైన కారణం సంకల్పమే. ఈ సృష్టిలో కొన్ని విషయములు పరమాణు ప్రమాణములు. మరికొన్ని విషయములు మహాప్రమాణములుగా ఉన్నాయి కదా! ఆ భేదం కూడా సంకల్పము చేతనే ఏర్పరుచబడుచున్నది. గతించిన, గతిస్తున్న, గతించబోవుచున్న సృష్టులన్నీ సంకల్ప మాత్రాలేనయ్యా!

❖

ఏది ఏమైనా పరమార్థసాక్షాత్కారము వలన ఈ సంసార వైచిత్ర్యములన్నీ తప్పక నశించగలవు. ఇందేమీ సందేహం లేదు. దృష్టియే సృష్టి. దృష్టి పరమాత్మమయం అయితే ...సృష్టి పరమాత్మమయమే అవుతుంది. దృష్టి పదార్థమయమైతే సృష్టి కూడా పదార్థమయంగానే తోచుచున్నది. ఇంతకు మించి ఇక్కడ మరే విశేషం లేదు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మహాదేవా! జీవుడు తిరిగి శాంతమయమగు బ్రహ్మమునందు ప్రతిష్ఠ పొందటానికి దగ్గర త్రోవ ఏది?

**శ్రీశివ భగవానుడు :** భేదదృష్టులు ఉపశమించటమే ఉపాయం. అభ్యాసమే అందుకు మార్గం. ఇందులో నిరుత్సాహపడవలసిన అవసరం ఎవరికీ లేదు. శాస్త్రాలు అందుకు అనేక మార్గాలు ప్రబోధిస్తున్నాయి. శ్రద్ధగా లక్ష్యశుద్ధితో సర్వసమత్వం అభ్యసిస్తూ వస్తే అది తప్పక ప్రతి జీవునకు సులభ సాధ్యమౌతుంది. కనుక జనులు దిగులు, బద్ధకము, అశ్రద్ధ, ఆలస్యములను దూరంగా ఉంచి సాధనకు ఉపక్రమించెదరు గాక! బ్రహ్మభావనను అనుక్షణికం చేయాలి. నిమిషంలో నూఅవ భాగం బ్రహ్మవ్యతిరక్తమగు దృష్టి వైపుగా చ్యుతిపొందటం జరిగిందా ...ఇక మరుక్షణం సంసారము ఉదయించగలదు. 'చిద్ఘన రూపమున ప్రతిష్ఠితమగుటయే బ్రహ్మజ్ఞానము' - అని జ్ఞానులు ఎరిగియే ఉన్నారు.

ఓ మునీశ్వరా! 'ఎరుగుట' అను క్రియకు కర్తయగు నీవే వేదములచే 'బ్రహ్మము' అని చెప్పబడుచున్నావు. భావాతీతము, త్రిగుణాతీతము అగు ప్రతిఒక్కరి స్వస్వరూపమే 'బ్రహ్మము' అని, 'పరమాత్మ' అని - శాస్త్రకారులచే, వేదద్రష్టలచే వ్యవహరించబడుతోంది.

నీ దృష్టి యందు దృశ్యస్వభావమగు ఈ సృష్టి సత్యమువలె ఏర్పడి ఉన్నంత వరకు నీవు చిద్వస్తువుగా వికసించజాలకున్నావు. నీవు ఎప్పుడైనా సరే ...దృశ్యమునకు సాక్షిమాత్రుడవే గాని, దృశ్యములోని ఒకానొకటివి కావు. స్వప్నద్రష్ట స్వప్నవస్తువులకంటే సర్వదా విశిష్టమైనవాడే కదా! అంతేగాని, స్వప్నాంతర్గత పరిమితుడు కాదుకదా!

అసత్యాలగు దిక్-దేశ-కాల పరిచ్ఛేదాల వల్ల ఆత్మ తన పట్ల తానే నిష్కారణంగా క్షుద్రత్వాన్ని ఆపాదించుకుంటోంది. శబ్దస్పర్శాది తన్మాత్రలతో తాదాత్మ్యం చేత జీవభావాన్ని పొందుతోంది. ఇక దేవ, దానవ, మానవ, జంతు, కీటక, లత - ఆదిగా అనేక బాహ్యరూపాలను దాల్చుతోంది. ఒక చమత్కార మేమంటే ...నిజానికి ఇదంతా సర్వదా అనంతం, నిత్యం అగు బ్రహ్మానికి పుష్పమాల వలె ఉన్నది.

సత్-అసత్‌లుగా గ్రహించబడుచున్న ఈ విశ్వమంతా విశ్వకర్మయందు ఒదిగి ఉంది. ఇక ఆ విశ్వకర్మ ఎక్కడున్నాడు? ఆయన దూరంగా లేడు. దగ్గిర కాదు. ఊర్ధ్వ-అధో భాగాలలో ఎక్కడో లేడు. ఆయన నా వాడు - నీ వాడు కాదు. ఆయన పూర్వం వాడు కాదు. భవిష్యత్ కాలం వాడు కాదు. ప్రాతఃకాలముననో, మరెప్పుడో లేడు. ఆతడు సత్-అసత్తులు కాదు. ఆ రెండింటి అంతరాళమున లేడు.

అయినా కూడా ...ఈ మిథ్యా పరంపరములన్నిటికీ ప్రమాత (One who is the subject)ఆ బ్రహ్మచైతన్యమే గాని మరింకొకరెవరో కాదు. ఎవరి ఆధిపత్యంలో బహిర్ వ్యవహారాలన్నీ ఫలరూప మగుచున్నాయో ...ఆయన పట్ల సర్వ ప్రమాణములు, సోదాహరణములు, వాక్యపరంపరలు

పూర్తిగా సుస్పష్టీకరించటానికి ప్రయత్నించి కూడా అందుకు అసమర్థములే అగుచున్నాయి. ఆయన ప్రమాణ–ప్రమేయములకు అతీతుడు.

❖

నాయనా! వసిష్ఠా! నీవు అడిగినదానికి సమాధానం చెప్పాను. నీకివే నా ఆశీస్సులు. పార్వతీ! ఇక మనం అభిమత స్థానమునకు పోయెదము గాక!

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! వింటున్నావు కదా! సర్వశుభంకరుడగు ఆ నీలకంఠుడు అట్లా తన ప్రసంగాన్ని ముగించి జలతరంగంలాగా పార్వతీ జగన్మాతాసమేతుడై అంతర్ధానమైనారు. నేను ఆ ఆది మాతాపితలు పాదపద్మములు నేలతాకిన చోట పుష్పాంజలి సమర్పించాను.

త్రిలోకాధిపతియగు ఉమావల్లభుడు అంతర్ధానమైన తరువాత నేనప్పుడు అక్కడే ప్రశాంతంగా ఆసీనుడనై ఆయన చేసిన ఉపదేశములను చింతించసాగాను. క్రమంగా విశుద్ధినొందాను. ఇక అప్పటి నుండి పవిత్ర బుద్ధియందు ఆత్మదేవుని 'బాహ్య – అంతర్‌పూజ' నిర్వర్తించసాగాను.

దాని వలన పరమ శాంతిని పొందినవాడనయ్యాను. ఇక జడోపాసనతో నాకు అగత్యం లేకపోయింది. అయితే ఏం? సర్వాంతర్యామి, సర్వతత్వ స్వరూపుడు, సర్వతత్వ విదూరుడు అగు ఆ పరమాత్మను నామ, రూపసహితంగా కూడా నామనో తృప్తికొరకు పూజిస్తూ, ఆరాధిస్తున్నాను. ఆయన నామరూప పరిమితుడు కాదని గ్రహించియే ఉంటున్నాను.

❖❖❖

## 20. అనుక్షణిక పూజాభావం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, దయాకరుడు అగు సాంబశివుడు జగత్ రహస్యమును, బాహ్యపూజ, అంతర్‌పూజలు గురించి నాకు విశదపరచారు. నేను వారు చెప్పినదానిని అంతరంగంలో మననం చేసుకుని తదనుసారం ఈ జగత్తును దర్శించటం అభ్యసిస్తూ ఉన్నాను. నీవు కూడా అట్లే ఈ జగత్తు యొక్క వాస్తవ–అవాస్తములేమిటో సాంబశివుల ప్రవచనానుసారం గ్రహించి ఆపై యథావిధిగా కార్యాకార్యములను నిర్వర్తించు. భ్రాంతి చేతనూ, స్వయంకల్పితమైన అభిలాషోద్వేగంచేతనూ ఆత్మయందు ప్రతిబింబిస్తున్న ఈ జగత్తునందు సత్యమేమున్నది? ఒక జమీందారుని "అయ్యా! తమది ఏమి అందం! ఏమి గుణం! ఏమి బలం! ...కల్పవృక్షము వంటివారు" ...అని స్తోత్రం చేస్తుంటే ఇక ఆయన తనను అట్లే భావించి ఆ యాచకునకు అవీ ఇవీ దానం చేయునట్లు ఆత్మస్వరూపుడగు ఈ ద్రష్ట కూడా కల్పితములైన వానిని నిజమేనను రీతిగా ప్రవర్తిస్తున్నాడు. తత్ఫలితమే ఈ జీవుడు, జగత్తు మొదలైనవి.

శ్రీ సాంబశివుడు బోధించిన అంతర్ – బహిర్ ఆత్మ దేవార్చనయందు నిరతుడనైన నేను బాహ్యమునందు ఆయా కార్యములను నిర్విర్తించుచూ వ్యథారహితుడనై రోజులు గడుపుచున్నాను.

'యథా ప్రాప్తములగు క్రియలు, ఆచారములు' అను పుష్పములతో అవిచ్ఛిన్నంగా నాయందు, సర్వులయందు ఏకస్థుడై ఉన్న ఆ ఆత్మభగవానునికి అవిచ్ఛిన్నంగా అనుక్షణికంగా పూజ సల్పుచున్నాను. 'సుఖముగా నిద్రించుటకు ఉపక్రమిస్తున్నాను' అను అనుభవపుష్పం కూడా ఆత్మశివునికి అర్పించి నిద్రకు ఉపక్రమించటం చేత గాఢ నిద్రయందు కూడా నా శివపూజ కొనసాగుచున్నట్లే అగుచున్నది.

నేను శివ బోధామృతానుసారం చేసే నిరంతర పూజ సర్వ శరీరధారులూ సర్వదా చేస్తూనే ఉన్నారు. కానీ, వాటియొక్క ఉత్తమలాభం పొందకున్నారు. అజ్ఞానముచేత అనుక్షణికమైన పూజాభావం అలవడడంలేదు. అందుచేత 'నేను ఈ కర్మను ఇందుకొరకై చేస్తున్నాను' అను కర్మరత, కర్మఫలసంగ భావనను అతిక్రమించలేకపోతున్నారు. ఇక జ్ఞాననిష్ఠులగు యోగులో, సావధానచిత్తులై తాము నిర్వర్తించే సర్వకార్యములందూ పూజాబుద్ధిని కలిగి ఉంటున్నారు. కనుక రామా! నీవు సర్వ క్రియ, సర్వభావ, సర్వఅనుభవములతో శివపూజా బుద్ధి సంపన్నుడవై నీ చిత్తమును 'నిస్సంగము' చేసివేయి. అట్టి చిత్తముతో ఈ సంసారారణ్యంలో నిశ్చింతస్వభావుడవై విహరించు. అప్పుడు నీవు ఇక దుఃఖములను పొందే ప్రసక్తే ఉండదు.

**యథాద్రవత్వం పయసి, యథా స్పందో నభస్వతి ।**
**యథా నభసి శూన్యత్వం, తథా సర్గత్వం ఆత్మని ॥**

నీటి యందు ద్రవత్వం, గాలి – ఆకాశములందు వీచికా – శూన్యత్వములు ఎట్లా సహజములే అయి ఉన్నాయో, అట్లా ఆత్మయందు ఈ సృష్టి – స్థితి – లయ కల్పనలు సహజమై ఉంటున్నాయి.

రామా! ఈ ధన–జన–సంయోగ వియోగాదు లప్పుడు కూడా నీవు ఆత్మదృష్టిని అవలంబిస్తూ విచారణ చేయి. అంతేగాని 'లభించినప్పుడు ఉబ్బిపోవటం, కోల్పోయినప్పుడు దుఃఖితుడవు కావటం' నీవెందుకు చేయాలి? సంసారముయొక్క తీరే అది కదా! ఈ జగత్తునందలి వ్యవహారములన్నీ ఇట్లు వచ్చి అట్లుపోవుచు అజ్ఞానులైనవారిని మరల మరల పరాభవిస్తున్నాయి. సరియైన తర్కముతో కూడిన పరిశీలన లేకపోవటంచేతనే ఈ ధన జన సంబంధములన్నీ జడములు, కల్పితములై ఉండి కూడా ఆత్మస్వభావ, స్వరూపుడగు జీవుని దుఃఖితుని చేయగలుగుచున్నాయి.

ఓ నిర్మలమతీ! ఈ జగత్తు నీది కాదు. నీవు ఇందులో లేవు. ఈ జగత్తు అసలు ఏమీ కాదు. ఇక నీవు ఎందుకు, దేనికొరకై పరితపించాలి?

'ఈ జగత్తు తుచ్ఛమైనది' అనే దృష్టి నీకు నచ్చకపోయిందనుకో... అప్పుడు 'ఆత్మ దృష్ట్యా ఈ జగత్తంతా నేనే' అను లక్ష్యార్థమును అనుసరించు. ఈ జగత్తు దృశ్యంగా చూస్తే తప్పక పరిణామయుత మైనదే కదా! ఇక దుఃఖమెందుకు? శోకమెందుకు? నీవో, మార్పు చేర్పులు ఉండనట్టి చిన్మాత్ర రూపుడవు కదా!

ఈ జగత్తు స్వయంప్రతిపత్తి లేని జడస్వభావమైనది. జగత్తు అను రూపం పొందబడేది నీ కంటే భిన్నమైనది కాదు. కనుక ఇందులో ఆశ్రయించవలసినదేది? విసర్జించవలసినదేది? తరంగములు కూడా సముద్రమే కదా! సముద్రం తన తరంగములను వదలటమనేది ఎక్కడా

ఉండదు కదా! ఈ జగత్తు ఆత్మస్పందనమందలి భావనా తరంగములే! ఇక ఇక్కడ హర్ష శోకములకు ఆస్కారమెక్కడిది?

అందుచేత రామచంద్రా! నీవు అనునిత్యం చిదేకత్వమును ఆశ్రయించి ఉండు. జగత్తుకు కారణమై ఏర్పడి ఉంటున్న చిత్తవృత్తులన్నిటినీ గాఢ నిద్రా పరవశునివలే గాంచుచూ ఉండు. ఈ క్షణంలోనే తురీయావస్థ యందు వెలయుము. జగత్తు అను వైషమ్యమునుండి విడివడుము. ఈ జగత్తును కూడా ప్రకాశింపజేయుటకు కారణమగుచున్న బ్రహ్మంతో ఐక్యము స్థాపించుకొని ఉండు. నిత్యము ఉదారబుద్ధితో 'ఆత్మ దేవార్చనము' చేయుచూ పరిపూర్ణమగు సముద్రమువలె వెలయుము.

రఘునందనా! నీవు, ఈ జగత్ స్వభావం గురించి విన్నావు కదా! గ్రహించవలసినదేమిటో గ్రహించి పరిపూర్ణబుద్ధి సమన్వితుడవయ్యావు. వైరాగ్యప్రకరణంలో నీవు ప్రశ్నించినవాటిలో ఇంకనూ దేనికైనా సమాధానాలు కావాలా? చెప్పు.

**శ్రీరాముడు :** బ్రహ్మజ్ఞా! ఇప్పుడు నా అనుమానాలన్నీ సంపూర్ణంగా తొలగినాయి. తెలుసుకోవలసిన దానినంతా తెలుసుకున్నాను. అకృత్రిమమైన ఆనందం లభించింది.

ఇప్పుడు నాకు 'ఏది జీవుడు – ఏది బ్రహ్మం' అనే ప్రశ్నలు లేవు. మనోకల్పితాలైన పదార్థములు కూడా లేవు. అప్పుడు (14 రోజుల క్రితం) అజ్ఞానం చేత ఆత్మయందు కళంకం అగుపించింది. ఆ భ్రాంతి ఇప్పుడు తొలగిపోయింది. ఇదంతా తమ అనుగ్రహం వల్లే సాధ్యపడింది. ఆత్మ స్వరూపుడనైన నేను పుట్టడం లేదు. చావటం లేదు. ఎట్టి కళంకాలూ పొందటం లేదు. సర్వం బ్రహ్మమయమే కదా!

కనుక హే సద్గురూ! నాకిక ఎట్టి సంశయములుగాని, ప్రశ్నలుగాని కోరికలు గాని, నిరుత్సాహ కారణాలు గాని లేవు. విశ్వకర్మ యొక్క యంత్రం చేత త్రిప్పబడుచున్న సూర్యమండలం వలె నా చిత్తం అంధకార రహితమైనది. మహాపర్వతం ఒక చిన్న గులకరాయిని కోరుకుంటుందా? దేశ కాలాదులు క్రొత్తగా ఇవ్వగలిగినదేదీ లేదు. ఎట్టి వాంఛలు లేక, ఆశారహితుడనై వెలయుచున్నాను. 'ఇది విడువవలసినది, ఇది స్వీకరించవలసినది, ఇది ఉన్నది, ఇది లేదు' – అను భ్రమలన్నీ నశించాయి. ఇక నేను స్వర్గమును కోరను, నరకమును ద్వేషించను.

మందర పర్వతంలాగా ధీరుడనై ఆత్మయందే నిశ్చల ప్రతిష్ఠితుడనై ఉన్నాను. 'సంసారము' అనే మహాసముద్రం నుండి 'జగత్తులు' అనే నీటి తుంపరలు – అటూ – ఇటూ వెదజల్లుబడుగాక! నాకు అవి భ్రమను కలిగించలేవు.

ఓ మునిసత్తమా! 'రాముడు' అనే పర్వతం 'సంసారము' అనే పిల్లగాలికి చంచలించడం మానివేసి, భ్రమరహితమై విశ్రాంతిని పొందుచున్నది. ఆత్మారాముడనై చెన్నొందుచున్నాను.

'ఇది వస్తువు, ఇది అవస్తువు' అంటూ కల్పనలు చేసుకుంటూ ఉండేవారి హృదయములు మాత్రమే ఈ సంసారముచే భయంకరంగా పీడింపబడుచున్నాయి. మూఢత్వముచే మహత్తరంగా తోచే ధన, జన, యౌవనాదులు ఇప్పుడు విషయార్థతను కోల్పోయాయి.

హే భగవంతుడా! తమ ప్రవచనాప్రవాహముచే నా యందలి అరిషడ్వర్గములు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు) అనే పిల్ల కెరటాలు అస్మదానందజలంలో ముంచివేయబడి, మ్రింగివేయబడ్డాయి. నేను వృత్తి రహితుడను అవటం చేత జడమైన ఈ సంసారం తల ఒంచుతోంది. సర్వ సంపదలకు పరాకాష్ఠ సర్వ ఆపదలకు పరిసమాప్తి స్వస్వరూపచిదాకాశధ్యానమేనని గ్రహించాను. హే పరమేశ్వరా! 'సంసారసాగరము' అని చెప్పబడుచున్నదానిని నేను జయించబడిన రాజ్యము వంటిదిగా గాంచగలుగుచున్నాను.

భూమానందమును పొంది పూర్ణుడనయ్యాను. సర్వ ఆశలు హరించిపోయాయి. ఈ నా పూర్ణత్వమును ఎవ్వరూ ఛేదించలేరు.

**పరిగలితవికల్పితాముపేతం ప్రగలితవాఞ్ఛమదీనసారసత్త్వమ్ ।**

**త్రిజగతి యదతిప్రసన్నరూపం ప్రముదితమన్తరనుత్తమం మనోమే ॥** (శ్లో 36, సర్గ 43)

నా మనస్సు ఎట్టి ఇంద్రియ విషయములూ, వికల్పములూ లేక సుదృఢమైన స్థిరత్వం పొందింది. సర్వ వస్తువులనూ అధిగమించి నిరతిశయమైన ఆనందం పొందుతూ నా మనస్సు సర్వోత్తమమైన పదమున వెలయుచున్నది.

❖❖❖

# 21. కల్పనాజగత్తు - జీవబాటసారులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఈ ఇంద్రియాలు తమ తమ విషయము లందు ప్రవర్తిల్లుచున్నంత మాత్రం చేత బంధం ఏర్పడదు. సంగం, కర్తృత్వాభిమానం ఉన్న చోట మాత్రమే బంధం ఏర్పడుతుంది. ఈ ఇంద్రియాలకు గోచరించే విషయాలు ప్రాప్తిస్తున్నప్పుడు వాటి యందు ఏర్పడే అభినివేశమే దుఃఖములు కలిగిస్తున్నాయనే విషయం ఎవరికి తెలియదు? బాలురవంటి జీవులు మాత్రమే ఈ దృశ్య విషయములందు సంతోషం కలుగజేసే విశేషాలను వెతకుచూ, వాటి ప్రాప్తాప్రాప్తముల కొరకై తాపత్రయపడుచున్నారు. నిత్యానిత్యమును ఎరుగుచున్న ప్రౌఢులు ఈ దృశ్యవిషయములపై ఏమాత్రం విశ్వాసము, ఆశ పెంపొందించుకోరు. బాలురు మాత్రమే లభిస్తున్న సంతోషం కలుగజేసే మూర్ఖులే తప్ప ...

క్షణికసుఖాభినివేశానికి అసలు కారణమేమిటి?... వాంఛలు.

అవన్నీ దుఃఖదాయకాలుగా పరిణమించునవే సుమా! అఖండానందం కొరకై స్వల్పానందాలను అధిగమించక తప్పదు. ఒకసారి ఆ బ్రహ్మపదం పొందిన వారికి ఇక అహంభావం బాధించదు. అది స్ఫురించదు. ఆత్మజ్ఞాన శైల శిఖరంపై విశ్రాంతి తీసుకుంటున్న ఈ బుద్ధి ఇక 'స్వల్పత్వము' అనే అవరోహణం ఆశ్రయించకుండు గాక!

ఎవరి మనస్సులో 'అనంత బ్రాహ్మీదృష్టి' ఉదయించిందో ...జ్ఞానమేరు శిఖరం అధిరోహించినట్టి అట్టివారు "నేను – నాది" అనే పాతాళ లోకమున పడరు.

ఓ రామచంద్రా! నీ స్వభావము సమత్వము, సత్యములకు ఆలవాలమైనట్లు నాకు అగుపిస్తోంది. ఆత్మ వస్తువు నందు ప్రతిష్ఠితుడవగుట నాకు తెలియవస్తోంది. నీ యందలి ఆశ, భావన, మనస్సులు సర్వదా ఆశారాహిత్యం – అభావన – అమనస్కం పొందు గాక! ఏ ఏ వస్తువులు నీవు పొందుచున్నావో ఆయా వస్తువులన్నీ పరిపూర్ణమగు చిన్మయసత్తగానే గాంచుము.

**అజ్ఞాతాత్మా నిబద్ధోసి, విజ్ఞాతాత్మా న బధ్యసే ।**
**రామ! త్వం స్వాత్మన్ ఆత్మానం బోధయస్వ బలాదతః ॥**

రామా! ఆత్మజ్ఞానం లేకపోయిందా, బద్ధుడవవుతావు. ఆత్మజ్ఞానం సంపాదించుకుంటే ముక్తుడవు కాగలవు. కనుక మననము మొదలైన అభ్యాసములచేత స్వయంగా ఆత్మబోధనను సంపాదించుకో. అవాసనత్వం సంపాదించు. ఏ స్థితియందైతే భోగసుఖములందు ఆశ అనునది ఉండదో... ఎప్పుడు ఆయా వస్తువులు తారసపడుచున్నప్పుడు నిరపేక్షగా ఉండగలుగుతావో ...ఆ స్థితి అవాసనత్వం అనిపించుకుంటుంది. అట్టి స్థితి ఆకాశము వలె నిర్మలమైనది.

వాసనారహితమైన చిత్తముతో సందర్భానుచితకర్మలు ఆచరించు. అనుకూల ప్రతికూలాదులు వందలకొలది వచ్చినా సరే, నిర్వికారుడవై ఉండు. 'తెలుసుకొనువాడు – తెలివి – తెలియబడునది' ఈ మూడిటిని ఆత్మయందు ఒక్కటిగా చేసివేయి. దుఃఖాదులను కూడా ఆత్మ భావనమునందు లయింపజేయి. అప్పుడు మరల సంసారమును పొందటానికి కారణమే ఉండదు.

**చిత్తోన్మేషనిమేషాభ్యాం సంసారప్రలయోదయౌ ।**
**వాసనాప్రాణసంరోధాదనిమేషం మనః కురు ॥** (శ్లో 16, సర్గ 44)

మనస్సు వికసిస్తే జగత్తు ఉంటుంది. మనస్సు లయిస్తే జగత్తు లేకుండా పోతుంది. కాబట్టి మనస్సును ప్రాణాయామాది నిర్దుష్ఠ కార్యక్రమముల సహాయంతో వాసనానిరోధం, విషయశూన్యం చేయి.

అభ్యాస, సంయమనాలతో ప్రాణాలను ఉద్విగ్నరహితం చేయి. ప్రాణం యొక్క ఉదయము వలననే 'సంసారం' అనేది పుట్టి పెరుగుతోంది. ప్రాణశక్తి యొక్క సద్వినియోగ ప్రభావంచే ఈ సంసారము లయింపజేయవచ్చు కూడా!

ఇక కర్మలంటావా! అవి అజ్ఞానము ఉన్నప్పుడు ఉన్నట్లే ఉంటాయి. అజ్ఞాన లయం జరిగిన మరుక్షణం కర్మలు, వాటి ప్రభావములు లేనివే అవుతాయి.

**జగత్తు నిర్వచనం -** గాలిచే లేవబడిన ధూళి వలన ఆకాశము మలినమైనట్లు కనబడుతుంది కదా! చిత్త స్పందనము వలన ఈ సంసారము అనే అనర్థం అనుభవమవటం జరుగుతోంది.

జగత్తు అంటే చూచేవాడు, చూడబడేది అను రెండిటి మధ్యగల సంబంధం మాత్రమే!

అనగా ...ఈ జగత్తు నీకేవిధంగా గోచరిస్తోందో...అట్లా గోచరించటానికి కారణం నీవు అద్దానితో స్వయంగా ఏర్పరచుకొంటున్న సంబంధమే అయి ఉన్నది. కాబట్టి నీ జగత్తుకు పరమకారణం

నీవే గాని మరింకెవ్వరో కాదు. ఒక చిత్రం లోని పురుషుడి హృదయంలో భావాలు అనేవి ఉండవు కదా! అట్లాగే ఒకవేళ నీ అంతరంగంలో దృశ్య-దర్శనములకు సంబంధించిన సంకల్పమే లేకపోతే, నీలో జగత్తుగా అనుభవమౌతున్న దానియొక్క భావనయే ఉండేదికాదు.

కాబట్టి భావనయే జగత్తు. నీవో?... భావమునకు ఆవల ఉన్న వాడవు. భావించువాడవు. భావాతీతుడవు. 'మాయ' అనేది కూడా చిత్తం యొక్క స్పందన నుండే పుడుతోంది. నీటిలో కదలికలు లేకుంటే అలలు ఉంటాయా? చిత్తం స్పందించటం మానివేస్తే మాయ కూడా లేకుండా పోతుంది.

**శ్రీరాముడు :** మాయ లేకపోతే 'జీవుడు' అనబడే వాడు కూడా ఉండడు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అలలు నీరు కానిదెప్పుడు? నీటిలో అలలు లేకపోతే నీరు లేకుండా పోతోందా? మాయ రహితమైనప్పుడు సర్వము - నిత్యము - నిర్లిప్తము - అగు స్వస్వరూపం ఉండనే ఉంటుంది. 'సత్'అని వేదములచే ప్రతిపాదించబడే నినాదము యొక్క అర్థం అదే. జీవుడు శివస్వరూపుడే! కనుక జీవుడు రహితుడై శివస్వరూపుడవటమెక్కడున్నది.

**చిత్తము యొక్క అచిత్తస్థితి -**

**శ్రీరాముడు :** చిత్తము యొక్క స్పందన ఉపశమించేదెట్లా? మరెన్నటికీ చిత్తము ప్రకోపించకుండేదెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జీవుడు తత్త్వమును పొంది వాసనలు త్యజించినాడా ...లేక ప్రాణాభ్యాసముచే చిత్త స్పందన సుస్థీకరించబడినదా ...ఇకప్పుడు ఈ జీవునకు చిత్తము యొక్క నిస్పందము ప్రాప్తిస్తుంది. అట్టి చిత్తము యొక్క అచిత్తస్థితిని 'పరమపదము' అని చెప్పుచున్నారు.

❖

ఓ రామచంద్రా! ఈ విషయేంద్రియములతో ఏర్పడే సంబంధం వలన లభిస్తున్న సుఖం బ్రహ్మానందము యొక్క అత్యంత స్వల్పాంశము మాత్రమే.

'సర్వము బ్రహ్మమే' అనునది బ్రహ్మానందము యొక్క బాహ్యస్వరూపం. అట్టి పూర్ణానుభవం మనోక్షయము వలననే, లేక, చిత్తము యొక్క అస్పందన వలననే సాధ్యం. సంకల్పములన్నీ సంకల్పించువానియందు లయించుటయే బ్రహ్మానందమునకు నాంది. చమత్కారం చూచావా? ఆ బ్రహ్మదేవుని కల్పనలో ప్రవేశించిన ఈ జీవులు అనే బాటసారులు అనేకమంది 'స్వస్వరూపసుఖము' అనేది అసలు గుర్తించటమే లేదే!

చిత్తము ద్వారా లభించే సుఖము కృత్రిమము, దేశ కాల పరిమితము, దుష్ఫలిత సమన్వితము అయి ఉంటుంది. ఇక చిత్త వినాశనంచే అవధరించబడే సుఖం అనంతమైనది. అది మాటలకందనిది. అట్టి సుఖమునకు తరుగు ఉండదు. కనుక అద్దానిని 'నిర్హేతుకసుఖం' అనికూడా అంటారు.

**శ్రీరాముడు :** చిత్తము ఎక్కడి నుండి వచ్చి పడుతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** బాలుడు దయ్యమును ఊహించుకుని ఉలిక్కిపడతాడు చూచావా? భ్రాంతి చేతనే చిత్తం యొక్క అస్థిత్వం ఉపలభ్యమౌతోంది. తత్త్వబోధ వలన భ్రాంతి తప్పక తొలగగలదు.

ఉన్నట్లుగా అగపడుచున్న చిత్తము లేనట్లు తెలియబడుచున్నప్పుడు అది లయం పొందుచున్నది. సత్తుగా తోస్తున్న చిత్తము జ్ఞానముచే అసత్తుగా అగుచున్నది.

ఈ ప్రపంచములోని నామ, అర్థ భేదములన్నీ చిత్తమే కల్పిస్తోంది. చిత్తము 'బోధ'చే 'సత్యము' అగు నిజాత్మరూపం సంతరించుకుంటోంది. అని అనిపించుకొంటోంది. జ్ఞాని వివిధ కార్యములు నిర్వర్తించుచున్నప్పటికీ ఆతని చిత్తము జ్ఞాన సమన్వితమై ఉండడటం చేత దానిని 'సత్వము' అని అంటారు. జ్ఞానము దృఢపడినచోట చిత్తము ఉండనట్లే.

భ్రాంతియే బీజముగా గల చిత్తము జ్ఞానార్జనకు నియమించబడినప్పుడు ఆ చిత్తము తనయందుతానే లయమగుచున్నది. చిత్తముతో బాటు భ్రమకూడా మటుమాయమౌతోంది.

బాహ్య విషయములు అభ్యాసపూర్వకంగా కౌతుకంతో కూడి సంకల్పిస్తున్నప్పుడు అట్టి తతంగమే చిత్తము అను పేరుతో పిలువబడుతోంది. అంతకుమించి చిత్తమనగా మరింకేదో కాదు.

ఈ జీవుడు అపరోక్ష జ్ఞాన మార్గంగా తన సత్స్వరూపమునే (ఉనికినే) తాను స్మరిస్తున్నప్పుడు అట్లు స్మరిస్తూ, అనుభవిస్తూ ఉండగా బాహ్య జగత్తుకు రాహిత్యము ఏర్పడుచున్నది. అప్పటి స్థితిని 'చిత్త రాహిత్యము' అని పిలుస్తున్నాం. చిత్తము ఉన్నా, ఉండకపోయినా సత్తుకు అభావమనేదే లేదు కదా!

1. వికల్పమయమైన చిత్తము, 2. అద్దానిచే కల్పించబడే సర్వ పదార్థానుభవములు ...

ఈ రెండు అవస్తువులేనని ఆత్మబోధాసమన్వితులగు జ్ఞానులు ఎరిగియే ఉన్నారు. ఈ చిత్తము స్వస్వరూపమును ఎరిగినదా ...ఇక ఆ తరువాత కొంతకాలం తురీయమున విహరించి, ఆపై తురీయాతీతమగు పదమునందు ప్రకాశిస్తోంది.

బ్రహ్మమే ఈ విశాలమగు జగద్భ్రమయందు విలాసంగా సంచరిస్తోంది. ఏక–అనేకములందు సర్వదా ప్రసరించి ఉన్నది, సర్వుల నిత్య సత్యస్వరూపము అదియే.

బ్రహ్మమొక్కటే ఉన్నది.

అదియే సర్వులస్వస్వరూపం! సత్స్వరూపం!

తదితరమైనదేదీ లేదు.

❖❖❖

# పదహారవ రోజు

# IV. బిల్వఫలం - శిల - మృగతృష్ణ ఉపమానాలు

## 1. బిల్వఫల ఉపమానం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఆత్మతత్త్వబోధకులు కొందరు బిల్వఫలము (మారేడు పండు) ను ఉపమానంగా చేసుకొని తమ అనుయాయులకు ఆత్మతత్త్వము బోధిస్తూ ఉంటారు. రమణీయము, విస్మయోల్లాసకరము, సంక్షిప్తము అగు ఆ బిల్వోపమానం అనే చమత్కారం చెపుతాను. ఇది జ్ఞానప్రదమని లోకప్రతీతి.

❖

ఒక పెద్ద బిల్వఫలం ఉన్నది. అది విమలము, విపులము, ప్రస్ఫుటము కూడా. ఆ ఫలం యొక్క సత్తా అసంఖ్యాక యోజనాలు విస్తరించి ఉన్నది. వందలవేల మహాయుగాలు గడచిపోతున్నప్పటికీ ఆ ఫలం క్షయం కావటం లేదు. అవదు. దాని రసము అక్షయము. దాని సారయుక్తమగు రసము అమృతము వలె అత్యంత మధురం. ఆ బిల్వఫలం అతి పురాతనమైనది. అది ఎంతటి పురాతనమో ఎవరమూ చెప్పలేం. అయితే ఏం? బాలచంద్రుని కళల వలె అది ఎప్పటికప్పుడు నూతనము, కోమలమూ కూడా! అది అత్యంత శోభతో అచలంగా, దృఢంగా ఉన్నది. మహాప్రళయ వాయువులు కూడా దానినేమీ కదల్చలేకున్నాయి. దాని వైశాల్యము ఇన్ని కోట్ల యోజనములని చెప్పజాలము. ఈ జగత్తు యొక్క స్థితికి అదే కారణం. అయితే దాని మూలమేమిటో కారణమేమిటో ఎవరికీ తెలియదు.

ఈ కనబడే బ్రహ్మాండ సమూహములన్నీ ఒక కొండ మీద వెదజల్లబడిన ఆవగింజల వలె ఆ బిల్వఫలం లోపలే వెదజల్లబడి ఉన్నాయి.

ఈ పంచేంద్రియ-మనస్సులకు విషయమగుచున్నదేదైనా సరే... ఆ ఫల రసమును అతిక్రమించ జాలదు. అది రాలటానికి చోటే లేదు. ఎందుకంటే అది అంతటా, అన్నిటా ఆక్రమించుకొని, అంతయూ తన యందే కలిగి ఉంటోంది. ఆ ఫలరసమును అతిక్రమించినది, అతిక్రమించగలిగినది ఎవరూ, ఏదీ లేదు. లేవు. ఈ జన్మ - జర - మరణము లనేవి దానిని స్పర్శించక, దాని యందే భ్రమాత్మకమై ఒదిగి ఉంటున్నాయి.

బ్రహ్మ - విష్ణు - రుద్ర - ఇంద్రాదులు గాని, మరెవ్వరైనా గాని దాని 'ఉత్పత్తి' అనే మూలం కనుగొన లేకపోతున్నారు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఆ బిల్వఫలం ఏ వృక్షమునకు కాసింది? ఆ వృక్షం ఎక్కడుంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ ఫలమునకు వృక్షముగాని, అంకురముగాని, తత్సంబంధితమైన కొమ్మలు గాని ఏమీ లేవు. అది ఏకపిండ ఘానాకారమై తోచుచున్నది. ఏకరసమై ఉన్న అద్దానికి ఉత్పత్తి – పెరుగుట – తరుగుట అనే పరిణామ లక్షణాలేవి అగుపడుటలేదు. అది సమస్త ఫలాల సారమా... అని అనిపిస్తోంది. మహాకృతి కలిగిన అద్దాని యందు గుజ్జు – గింజలు లేక ...అది నిర్వికారమై, నిరంజనమై ఉన్నది.

అది శిలవలె నిర్లిప్తమై ఉన్నది. చంద్రబింబము వలె అద్దాని నుండి అమృతానందం నిత్యమూ స్రవిస్తోంది. స్వసంవేద్యమగు నిరతిశయానందమున ప్రకాశిస్తోంది. శీతలమగు, వినీలమగు స్వయంప్రకాశముచే వెలుగొందుచూ సకల సౌఖ్యములకు ఆలవాలమై ఉన్నది. అద్దానిని చూచి 'అది పర్వతము వంటి ఒక జడమగు మట్టి ముద్ద' అని కొందరు భ్రమిస్తున్నారు. ఈ జనులంతా అద్దాని యందే ఇమిడి ఉండి కూడా అద్దాని స్వరూప స్వభావములేమిటో గ్రహించలేకపోతున్నారు. అనేకులు అద్దాని ఉనికి గురించి కూడా తెలియకయే వందల, వేల ఉపాధులలో సుఖదుఃఖ భావములు కల్పించుకొని అతిదీర్ఘకాలం గడిపివేస్తున్నారు.

అది అగోచరములగు సర్వ ఆనందముల సారస్వరూపమైయున్నది. అది అనంతమై, త్రివిధ (సృష్టి, స్థితి, లయ – త్రికాల) పరిచ్ఛేదరహితమై ఉన్నది. నిత్యమై, అనునిత్యమై స్వాత్మచమత్కృతి చేత ప్రభవించుచున్నది. ఆత్మచమత్కృతి యొక్క అధ్యాసయే ఆ బిల్వఫలం యొక్క అనుభవం. బుద్ధికి ఆవల ఉన్నదై, ఆ బుద్ధి యొక్క సన్నివేశ వైచిత్ర్యానికి తానే కారణమై ఉంటోంది. అది బుద్ధిని కల్పించు కుంటూనే బుద్ధికి ఆవల, ఈవల కూడా ప్రసరించి ఉంటోంది. తన స్వరూపాన్ని ఒక వైపు ఏమాత్రం వదలకుండానే మరొకవైపు స్థూల – సూక్ష్మ – అణు – కార్య – కారణములను వ్యక్తీకరిస్తోంది.

అది సనాతనము. అయితే ఏం? దానికి వార్ధక్యము మొదలైన దశలు లేవు. అది తన యందు 'స్త్రీ, పురుష, జడ, జంతు' – అనే కల్పనలు నిర్వర్తించుతూ ఆ కాల్పనికాలకు సంబంధించక స్పృశించబడక ఉంటోంది. 'ఇది అన్యము, ఇది భిన్నము' – అనే కల్పనాతరంగం ఆ నిశ్చల ఫల రసము నందే ఏర్పడటం జరుగుతోంది.

ఆ బిల్వఫలం వాస్తవానికి ఏమిటి?

ఏదీ కాదు. స్వప్రకాశకుడగు చిన్మయము దృష్ట్యా అది అవిద్యాదులకు ముందే ఉన్న ఆత్మ చమత్కృతియే. అద్దానికి ద్వైతము అనేది పొసగదు. దానికి బాహ్యము ఉంటే కదా... ద్వితీయం గురించి యోచన?

ఆ బిల్వఫలం స్వశక్తిచే తనయందు కావాలని అహంకారాదులను కల్పించుకుంటోంది. అక్కడి నుండి ఆకాశ కాలములకు సంస్థానమగుచున్నది. అది సంకల్పములను వికసింపజేయటం ద్వారా రాగద్వేష హేయ ఉపాధేయాదులను తనపట్ల ఆపాదించుకుంటోంది. ఆశలు, నిరాశలను తనకు తానే కారణమై రచించుకుంటోంది. 'ఇది, అది, నాది, నీది' మొదలైనవి తనకు అంతర్విభాగ మైనప్పటికీ తనకు ద్వితీయమైనట్లు కల్పన చేసుకుంటోంది.

❖

ఓ రాఘవా! ఆ బిల్వఫలంలోనే బ్రహ్మాండాలన్నీ ఉన్నాయి. అయితే 'బ్రహ్మాండాలు ఉన్నాయి' – అనేది కూడా కల్పన మాత్రమే. అంతేకాదు. 'ఎదుట, వెనుక, దూరం, దగ్గిర, భూతకాలం, వర్తమాన కాలం, భవిష్యత్‌కాలం' – అనునవన్నీ కూడా ఆ బిల్వ ఫలము నందలి అనుభూతిపరమైన కల్పిత విషయాలు మాత్రమే. కల్పనలకు ఆటపట్టైన ఆ ఫలము జీవులతోకూడిన బ్రహ్మాండ మండలములకు క్రీడామండపము వలె గోచరిస్తోంది.

❖

ఆ ఫలము యొక్క చమత్కృతిచే అందు వేలాదిజీవులు వర్షపుంజంలోని బుడగల వలె క్షణ క్షణం శరీర ధారణం, శరీర త్యాగం చేస్తున్నారు. అందులోంచి రుద్రగణం బయలుదేరి, వారు ఈ సృష్టి యందు ఆశగొనిన విషయబద్ధులను 'ప్రళయం' అను ఒకానొక కాలవిభాగంలో కలిపివేసి వినాశనం చేసివేస్తున్నారు. సృష్టిసంహారాలు, స్వర్గ వైభవాలు, నరక దుఃఖాగ్నులు, జగత్‌భావ, అభావాలు ...అన్నీ కూడా తెరపై క్రీనీడలలాగా ఆ ఫలమునందే కల్పిత ఆరోపిత దృష్టులచే దర్శించబడుతున్నాయి.

❖

ఆ బిల్వఫలములోని ఒకానొక చిన్నమూల గల ఒక బిందువులో ఈ అసంఖ్యాక పాలపుంతలతో కూడిన నక్షత్రాల సమూహమంతా విరాజిల్లుతోంది. అది బ్రహ్మము అనే మహాసముద్రపు ఒడ్డున అంతు లేకుండా వెలయుచున్నది. ఆకాశమే దానికి ఆశ్రయం. కానీ ఆకాశమంతా ఉన్నది అందులోనే!

ఆ ఫల మధ్యంలోగల మహాసముద్రాలలో జలం బదులుగా 'క్రియలు, వాటి నుండి ఫలితములు, ఆ ఫలితముల నుండి మరికొన్ని క్రియలు" అనే భీకర తరంగాలు అవిశ్రాంతంగా ఘోషణ శబ్దములతో ప్రవహిస్తున్నాయి. ఆ తరంగాలలో 'జీవులు' అనే నీటిచుక్కలు చిందరవందరగా ప్రతిబింబిస్తున్నారు.

ఆ జలంతో 'కాలము' అనే ఉపరితలవాయువీచికల ప్రభావంచే ప్రళయము, మహాప్రళయము అనే సుడిగుండాలు ఏర్పడి ఉంటున్నాయి.

**కాలము -** గాలి ఆకాశంలో అటూ ఇటూ వీస్తున్నట్లు ఆ నిశ్చల బిల్వఫలంలో కాల వీచికలు వీస్తున్నాయి. ఈ చంద్రుడు మొదలైన జోతిష్పదార్థాలన్నీ ఆ కాల ప్రవాహంలోని చిన్న చిన్న చారలు. అది బయటకు క్షణ, విఘడియ, ఘడియ, దిన, మాస, సంవత్సర, యుగ, చాతుర్యుగ, మన్వంతర, అయనముల – రూపంలో ఉంటోంది. దాని యొక్క మరొక విశిష్టమైన వైపు 'కాలాతీతమైనది'. ఈ జరా, మృత్యు, విద్య, అవిద్య, సమృద్ధ, అసమృద్ధాది – విశేషములన్నీ కాలబద్ధం మాత్రమే. ఆ బిల్వఫలమో... కాలమునకు అతీతమైనది.

❖

అయితే... ఆ బిల్వఫలం సంకల్పమాత్రం చేతనే ఇన్ని విశేషములతో, వర్ణింపశక్యం గాని మరెన్నో రీతులుగా వెలయుచున్నది. అది ఏకమే అయి ఉండి ద్వైతమును ధరిస్తోంది. మరి, దానిని ఏకం అనాలో, ద్వైతం అనాలో, మరింకేమనాలో తెలియని అద్దాని పరిశీలకులు అద్దాని గురించి అనేక సిద్ధాంతపరమైన వాగ్వివాదములు చేసుకుంటున్నారు.

'అది వివిధాత్మికము కాదు .... సర్వదా ఏకాత్మికమే' ... అనేది వేదాంత శాస్త్ర పరిశోధన యొక్క సమాధానం. ఎందుకంటావా? అద్దానిలో స్వజాతి విజాతీయములు, స్వపరములు లేనే లేవు. ఉన్నట్లు అనిపించేదంతా వాస్తవం కాదు.

దానికి ఉనికి ఉన్నది. కానీ స్వరూపం లేదు. అది అంతా తెలుసుకొనుచున్నది... కానీ, అది తెలియబడుట లేదు. అది స్వయంగా ఆనందస్వరూపం... కానీ సుఖదుఃఖాల కల్పనలన్నీ దానివే. అది సకల ద్వైత వికల్పములకూ 'ఉపశాంతి'యగు ఏకైక సమరూపము.

అదియే 'చిచ్ఛక్తి' అనబడే ఆదిశక్తి. అది సర్వాత్మకమైన 'మహద్బ్రహ్మ బిల్వఫలం'.

❖

**శ్రీరాముడు :** భగవంతుడా! సర్వసారజ్ఞా! ఆత్మానుభవులు ఉపయోగించే బిల్వఫల ఉపమేయం (Metaphor) 'చిద్ఘనబ్రహ్మసత్త' గురించేనని నాకు అర్థమయింది. ఈ 'నీవు – నేను' అహంకారాలన్నీ ఆ చిత్ యొక్క రూపాలేనని, ఇక ఇందు ద్వైత–ఐక్య కల్పనా భేదాలు లేవని గ్రహిస్తున్నాను. అయితే ...ఒక బిల్వఫలం ఎప్పటికైనా వాడిపోతుంది కదా...?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఏ ఉపమానమైనా బ్రహ్మతత్త్వాన్ని సంపూర్ణంగా విశదీకరించలేదు. విజ్ఞులు ఒక్కొక్క ఉపమానాన్ని ఒక్కొక్క విషయ పరిజ్ఞానం కొరకై వాడుతూ మనకు అందిస్తూ ఉంటారు. ఉపమానాలనేవి ఆశ్రితుడగు శిష్యుని సామాన్య, దైనందికానుభవాలను దృష్టిలో పెట్టుకొని ఉంటాయి సుమా!

కనుక "బిల్వఫలంలోని గుజ్జు నాశనమైతే బిల్వఫలం కూడా నశిస్తుంది కదా! అట్లాగే బ్రహ్మాండాలు (జగత్తులు) నశిస్తే బ్రహ్మము కూడా నశిస్తుంది"...అని అనుకోకు. బ్రహ్మమునకు పెరుగు–తరుగులు ఉండవు. అది ఏ క్షణంలోనూ మరొకటిగా అగుటలేదు ...అవదు. మిరియపు గింజలో కారం అంతర్లీనమై ఉన్నట్లు జగత్తులలో బ్రహ్మము సారం–రసం అయి, అంతర్లీనంగా అనునిత్యమై ఉంది.

❖❖❖

## 2. శిల - శిల్పి - శిల్పము

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆధ్యాత్మ వాఙ్మయంలో ఆత్మతత్వమును ప్రవచించే బహు ప్రచారమై ఉన్న మరొక ఉపమానం కూడా చెప్తాను ...విను.

ఒకచోట ఒక గొప్ప శిల ఉన్నది. అది అతి నునుపుగాను, స్పష్టంగాను, ప్రకాశవంతం గాను, మృదువైన స్పర్శతో కూడి మహావిస్తారమై ఉన్నది. ఆ మహావిశాల శిలపై అనేక పద్మాలు నగిషీ చేయబడి ఉన్నాయి. ఆ పద్మముల దళాలు ఒకదానినొకటి తాకుతూ ఉన్నాయి. ఆ శిల్పి ఎవరో కానీ... అందులో కొన్ని పద్మములు బాగా వికసించి ఉన్నాయి. మరికొన్ని కొంత వికసించి ఉన్నాయి. కొన్ని పైకి లేచి ఉన్నాయి. ఇంకొన్ని ముడుచుకుని ఉన్నాయి. కొన్ని క్రిందకు వ్రేలాడుతూ కనిపిస్తున్నాయి. ఇంకొన్ని పడుకొనిన భంగిమలో కనిపిస్తున్నాయి. అయితే అన్ని పద్మముల మొదళ్ళు కలిసియే ఉన్నాయి. వాటిలో కొన్ని పద్మముఖములు పరస్పర సంలగ్నములై ఉన్నాయి.

కొన్ని ఊర్ధ్వ, అధో మూలములు కలిగి ఉన్నాయి. కొన్నిటికి మూలములే కనిపించటం లేదు.

**శ్రీరాముడు :** గురువర్యా ! నేను తీర్థయాత్రలకు వెళ్ళినప్పుడు సాలగ్రామ క్షేత్రంలో (ఒక విష్ణుక్షేత్రం) ఒక పెద్ద కొండరాయిని చూచాను. ఆ శిల మీరు వర్ణించినట్లు పద్మములచే అలంకారితమైన వనం సుదీర్ఘంగా చిత్రీకరించబడి ఉంది. మీరు చెప్పేది వింటుంటే ఆ గండశిల గుర్తుకు వచ్చింది. ఒక ఘడియకాలం ఆ శిల్పచాతుర్యం గమనిస్తూ ఉన్నాను కూడా ...ఇంక చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ...మంచిది. నేను దృష్టాంతంగా తీసుకుని వర్ణించి చెప్పే పెద్ద శిల–శిల్పచాతుర్యం తీర్థయాత్రలు చేస్తూ చూచావు కదా! పద్మవన చిత్రీకరణను, శిలను ఒకే చూపుతో చూడటం జరిగింది కదా!

**శ్రీరాముడు :** అవును. చూడకేం! శిల – శిల్పములు ఒక్కచోటే ఒక్కటిగానే ఉన్నాయి కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అదే రీతిగా ...'దృష్టమయమైన బ్రహ్మము'ను నీవు అనుక్షణం చూస్తూనే ఉన్నావు.

శిల్పరచనలో కనిపించేదానికంతటికీ శిలయే స్థానము, మూలము, వాస్తవరూపము, ఆలంబనము, అధిష్ఠానము కదా! బ్రహ్మమే ఈ సర్వజీవులకు అట్టి ఆలంబనము అయి ఉన్నది. బ్రహ్మము ప్రాణమునకే ప్రాణమగు "చిద్ఘన ఆనందం" అయి ఉన్నది.

**శ్రీరాముడు :** ఈ "శిల – దానిపై చెక్కబడిన పద్మవనం" అనే దృష్టాంతం చెప్పుటలో మీ ఆంతర్య మేమిటో వివరంగా చెప్పమని నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రఘుకుల తిలకమా! నేను ఉదహరిస్తున్న ఆ అపూర్వమగు శిల బ్రహ్మమే అయి ఉన్నది. ఆ బ్రహ్మ శిలపై ఈ జగద్విశేషములన్నీ కనిపిస్తున్నాయి. అయితే ఏం? శిల్పముపై కనిపించేవన్నీ శిలయే అయినట్లు, ఇక్కడ పరిపరి విశేషములతో కూడిన జగత్తు అనబడేది లేదు. బ్రహ్మము మాత్రమే ఉన్నది. బ్రహ్మమునందు బ్రహ్మమునకు వేరైనదేదీ లేదు... ఉండదు.

శిలలో ప్రతి అణువూ శిలాతత్త్వమే కదా! "ఘనత్వము, ఏకాత్మకము" అనునవి 'చిత్' నందు ఉన్నాయి గదా! అందుచేత ఆ చిత్‌ను శిలతో పోలుస్తున్నారు.

❖

అత్యంత విశాలము, సూక్ష్మము అగు ఆకాశమునందు వాయువు ఉన్నట్లు ఆ చిత్ శిలయందు దృశ్యము ఉన్నది. ఈ ఆకాశము, భూమి, వాయువు, పర్వతములు, దిక్కులు ... ఇక్కడ జగత్తులో వెలయుచున్నాయి. ఇక్కడ చిన్న రంధ్రంలో కూడా ఖాళీ లేదు. అయితే, ఈ జగత్తు వేరే ఏదో వస్తువై ఉన్నట్లు అనిపిస్తోంది. శిలపై పద్మవనం చూస్తున్న వానికి రకరకాల భంగిమలలో పద్మములు కనిపిస్తూ ఉన్నాయి. "సరోవరం... అందులో పద్మములు" అనే పరిశీలనతో చూచేవారి దృష్టిపథంలో శిల గురించిన దృష్టి ఏమరువబడుతుంది కదా!

'చిత్' నుండి ఈ జగత్తు వేరు కాదు. సర్వమూ శుద్ధ చిదాత్మకమే! వేరుగా అనిపించేదంతా కల్పన... లేక... మాయ మాత్రమే.

**శ్రీరాముడు :** అయితే, మహర్షీ! చిత్ శిలయందు చెక్కబడే ఈ జగత్ శిల్పానికి తన ఊహ – తెలివి – కల్పనచే కర్తృత్వం వహించే శిల్పి ఎవరు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇంకెవరు? ద్రష్టయే (చూచువాడే!) ద్రష్ట తన సంకల్పస్వరూపమైన మనస్సుచే ఈ చిత్ శిలయందు భూత – వర్తమాన – భవిష్యత్ 'అనుభవములు' అను చిత్రములను చిత్రిస్తున్నాడు.

❖

ఇక ఈ కాల భంజకములు (Compartments of Time) వాస్తవములుగా తోచుచున్నప్పటికీ, వాస్తవములు కాదు. బ్రహ్మశిలయందు విభిన్నములగు పదార్థములు స్ఫురిస్తున్నప్పటికీ వాస్తవానికి బ్రహ్మము ఏకమగు ఘనపిండమే.

ఈ నీకు కనబడే సృష్టి చిత్ శిలయే అయి ఉన్నది. ఇప్పటి ఒక శిల్పము ఆ రూపము పొందక ముందు అంతవరకూ ఎక్కడ దాగి ఉన్నది?

**శ్రీరాముడు :** అంతకు ముందు ఆ శిల్పం శిలలోనే మౌనంగా దాగి ఉండి ఉంటుంది కదా? శిలా విభాగంలో శిల్పం చెక్కబడింది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్లాగే సుషుప్తి దశలో ఈ జగత్తుకు సంబంధించిన అనుభవ సంస్కారం ద్రష్ట యందే నిశ్శబ్దమై ఇమిడి ఉంటోంది. శిలయందు చిత్రించబడిన పద్మమునకు (ఆ శిలకు వేరుగా) ఉత్పత్తి ఏముంటుంది? వినాశనమేమి? ఆ రీతిగానే చిత్‌నందు చిత్రించబడే ఈ జగత్తులకు కూడా ఉత్పత్తీ లేదు... వినాశనమూ లేదు. శిలయందు శిల్పంలాగా ఆ ఆత్మయందు జగద్దృశ్యం సందర్శించ బడుతోంది.

సాధ్వియగు ఒక స్త్రీ హృదయంలో సుదీర్ఘ కాలం దూర ప్రాంతంలో ఉండిపోయిన ఆమె భర్త యొక్క రూపము, సంభాషణా చమత్కారాలు, కరస్పర్శాది అనుభవాలు, హాస్య–లాస్యాలు ఉన్నట్లు, అనంత వికారములు కలిగిఉన్న ఈ ఈ బ్రహ్మాండములు కూడా ద్రష్టలోనే రూపము కలిగిఉన్నాయి కాని, బాహ్యమున కాదు.

❖

**శ్రీరాముడు :** మహర్షీ ! 'వికారములతో కూడిన ఈ బ్రహ్మాండములు, వీటి భేదములన్నీ దర్శిస్తున్న ద్రష్ట... ఉభయములు చిన్మాత్రమే' అను యుక్తి యుక్తియుక్తమే కదా? ఉచితమే కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** బ్రహ్మమే ఉన్నది. బ్రహ్మాండములు మనోకల్పనా వైచిత్ర్యము మాత్రమే! నీటియందు నీటి బొట్టు విలీనమైనట్లు ఈ జగత్తుకు సంబంధించిన వర్తమానానుభవ వికారములన్నీ చిన్మాత్ర దర్శనము (Perceiving Absolute self) నందు విలీనమైపోగలవు.

చిత్ అనంతం కదా! దాని వికారాలు కూడా అనంతమే. అయితే, నామరూపాలుగా ఆవిర్భవించే వన్నీ కాలానుగతంగా ఆ రూపనామాలు కోల్పోతాయి కదా! ఈ జగత్తులో ప్రతిదీ రూపాదులు పొంది, కొంత సమయం తరువాత కోల్పోతున్నది. వాటి అనుభవం ద్రష్ట యొక్క అవగాహనను అనుసరించి మాత్రమే ఉంటున్నది.

కవులచే వర్ణించబడే గంధర్వనగరం నామమాత్రమే అయినట్లు, ఈ జగత్సృష్టులు కూడా నామ మాత్రములే! ఒక కవి యొక్క రచనలో తారసపడే పాత్రల మధ్య తీవ్రము, సంచలనయుక్తము,

భాషా ప్రయుక్తము అయినట్టి భావావేశాలు ఏమౌతున్నాయి. కథతోనే ముగుస్తున్నాయి కదా! సృష్టి అనబడే ఒకానొక దృష్టిని మొట్టమొదట చైతన్యమే గ్రహిస్తోంది. ఆ గ్రహించబడేదంతా కాలానుగతంగా చైతన్యమునందే లయం అగుచున్నది. జలం అనేక తరంగాకారాలు ధరించి, ఆ తరువాత ఆ తరంగాకారాలను తనయందు లీనం చేసుకోవటం లేదా!

దృశ్యజగత్తు నందు స్ఫురించుచున్న ఈ వస్తు వికారములన్నీ వాస్తవానికి అర్థశూన్యములు. అన్నీ చైతన్యమునందు ప్రతిభాసించి ఆ ప్రతిభాసక చైతన్యమునందే లయిస్తున్నాయి.

**శ్రీరాముడు :** ఈ వస్తు వికారాలు జీవుని ఆశ్రయించటానికి ఏదైనా ప్రత్యేకమైన కారణం ఉంటుందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇక్కడి వస్తువికారాదులకు స్వతంత్రమైన ఉనికిలేదు. వాటిని దర్శిస్తున్న చైతన్యము అట్లు సంకల్పించుట చేతనే అవి ఆ విధంగా తారసపడుచూ, అనుభవమౌతున్నాయి. కనుక ఈ సర్వం సంకల్ప మాత్రమే. ఆత్మ విచారణా సమన్వితమగు అత్యుత్తమ సంకల్పం నందు అనగా స్వస్వరూపం యొక్క అఖండ అప్రమేయ నిత్యత్వములు సంకల్పించుచున్న సమయంలో తదితరమైన సంకల్పములు తమ రూపము కోల్పోతాయి. అప్పుడు “నిర్విషయ – నిర్విశేష – అనిర్వచనీయ” స్వస్వరూపానందానుభవం సంభవించగలదు. అదియే ఈ సంసారమునకు సముచిత సమాధానం.

❖

బ్రహ్మము అనంతము. నిరర్థకమైన క్రియలు – వర్జన, గ్రహణములు కూడా బ్రహ్మమే! ఈ వికారాదులన్నీ బ్రహ్మమునందే ఉదయిస్తున్నాయి. బ్రహ్మమునందే అస్తమిస్తున్నాయి. కనుక సర్వదా, సర్వము పట్ల నిశ్చింతుడవై, అనంత స్వభావుడవై ఉండుము.

**మృగతృష్ణ -** ఈ సృష్టిని మృగతృష్ణతో పోల్చవచ్చు. మృగతృష్ణలో గల చిన్నతరంగం, పెద్దతరంగం –అన్నీ భ్రమాత్మకములైనవే కదా? పెద్దతరంగం పెద్దగా, భ్రమాత్మకమనీ, చిన్నతరంగం చిన్నగా భ్రమాత్మకమనీ అనం కదా? ఈ జగత్తు భ్రమచే దర్శించబడుచూ, స్వస్వరూప జ్ఞానముచే 'రాహిత్యము' వహిస్తోంది.

పుష్పం, ఫలం మొదలైన వృక్ష విభాగములన్నీ బీజము యొక్క అనువృత్తములే కదా! అట్లాగే ఈ సమస్తం చిత్ సత్త యొక్క అనువృత్తియే. అనగా...విత్తనంలోని సత్త 'అంకురం, శాఖ, పల్లవం– మొదలైన రూపములుగా క్రమంగా వికృతిని పొంది వాటికి తానే కారణమౌతోంది కదా!

చిత్ నందలి సత్తయే ఈ తదితర జగత్తుగా ప్రభవిస్తోంది. కనుకనే 'ఈ జగత్తుకు కారణం చిత్ సత్తయే'... అని సిద్ధాంతీకరించ బడుతోంది. చిత్ సత్తా సర్వదా ఏకమే అయి ఉండి కూడా, ద్వైత భావమునకు కారణమయి ఉంటోంది.

ఈ జగత్తు ఎక్కడినుండి కలిగింది? ఆత్మవిషయమై ఏమఋపుకు సంబంధించిన జాడ్యకల్పన నుండే కలిగింది.

అయితే... చిత్తు జడముగా మారుతోందా? ...లేనేలేదు. అది అట్లు మారదు. మారజాలదు.

తెలుసుకొనుచున్న వాని ఉనికి, విస్తారముల చేతనే 'తెలియబడుచున్నది' అనేది మనగలుగుతోంది.

అయితే, తెలుసుకొనుచున్నదేదో, అది తెలియబడుచున్నదానిగా, ఘనీభవించటం లేదు. 'చిత్ – అచిత్' అనబడే రెండు వస్తువుల ఉనికియే లేదు. ఏకో సత్...! ఉన్నది ఒక్కటే. రెండవదగు దానికి స్వయం సంబంధమైన ఉనికి లేదు.

మహాశిలయందు చెక్కబడిన అనేక రూపములు శిలయే అయినట్లు, ఈ జగత్తు బ్రహ్మమునకు వేరుగా లేదు. రేఖలు, ఉపరేఖలతో గూడిన మహాశిలవలె బ్రహ్మమే ఈ మూడు లోకములకు ఆలవాలమైయున్నది.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ నేను – నీవు అనునవన్నీ ఎప్పుడు, ఎక్కడ ఆరంభమౌతున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** శిలయందు పద్మవనం శిల్పిచే చెక్కబడింది కదా! శిల్పి తన కల్పనాచాతుర్యం అనుసరించి శిల్పం తయారు చేస్తున్నాడు. కల్పన యోచన నుండి, యోచన వాసనల నుండి ఉద్భవిస్తున్నాయి. జనుల అభిరుచిని అనుసరించియే శిల్పి శిల్పములో దృశ్యవిశేషాలను చిత్రీకరించుచున్నాడు కదా! అట్లాగే, ఈ దృశ్యజగత్తు కూడా జనుల సంస్కారాలను అభిరుచులను అనుసరించే కల్పించబడుతోంది.

శిల్పి యందలి కల్పనా సమూహములకు పుట్టుక ఏమి? చావు ఏమి? అట్లాగే చిత్ నుండి కల్పనచే బహిర్గతమగుచున్న 'నేను' 'నీవు' అనునవన్నిటికి జన్మలేదు. క్షయమూ లేదు.

అజ్ఞానముచే 'నేను', 'నీవు'తో సహా ఈ తదితర జగత్తులు ఉన్నట్లు తోచుచున్నది. జ్ఞానముచే ఈ 'నేను' 'నీవు', త్రివిధ కర్మలు – ఇంద్రియగోచర జగత్తులు భావనామాత్రమని తెలియవస్తోంది. కనుక, 'నేను', 'నీవు' మొదలైనవాటికి ఉత్పత్తికి కారణం స్వస్వరూపము యొక్క వాస్తవ స్వభావము ఏమరుచుటయే. ఆ ఏమరుచుటనే 'అజ్ఞానం' అని పిలుస్తున్నాం. స్వస్వరూపము యొక్క ఏమరుపే 'తెలియక పోవటం' అని విజ్ఞులు పిలుస్తున్నారు. అట్లు తెలియకపోవుటచేతనే కొందరు జీవులు ఈ జగత్తుని వస్తుసమూహములను ఎప్పటికప్పుడు సంకల్పదర్పణము ద్వారా దర్శించుచూ ఇవన్నీ నిత్యమని భావిస్తున్నారు.

శిలలోని శిల్పవిభాగం, శిల్పరహిత విభాగం – అంతా కూడా శిలకు ఏమాత్రం వేరు కాదు కదా?... అట్లాగే ఇక్కడ తోచుచున్న జగత్‌కర్త, ఆయన కర్తృత్వం, తత్కార్యమగు ఈ జగత్తు ...అంతా కూడా చిత్స్వరూపం (ఎరుక స్వరూపం) మాత్రమే! ఆత్మ దర్శనమైనదా... ఈ జగత్తు, దీని ఆవిర్భావ తిరోభావాలు గణనలోకే రావు. దీనినే వేదాంత వాఙ్మయ రచయితలు 'కేవలీస్థితి' అని జగత్ రాహిత్యం అని వర్ణిస్తున్నారు.

ఒక చమత్కారమేమంటే... ఈ జగత్తు గాని, ఆ బ్రహ్మము గాని ఎవరి చేతా సృష్టించబడుట లేదు...! నాశనము చేయబడుట లేదు!

పర్వత శిఖరం పర్వతం నుండి వేరు కాదు కదా. శిఖరం పర్వతం యొక్క వికారం కూడా కాదు. పర్వతము సదా శిలామయము మాత్రమే. బ్రహ్మము, సృష్టి కేవలం ఉల్లాస విలాసాలను (లీల) సూచిస్తున్నాయి.

ఆయా శిల్పుల వివిధములైన – విరుద్ధములైన మనో కల్పనా భేదముల వలన శిలలో వివిధ రీతులుగా శిల్పాలు అనబడే ఆకారాలు గోచరిస్తున్నాయి. అట్లాగే ప్రకృతి సిద్ధంగా కూడా శిలలు అనేక రూపాలను (ఆకారాలను) దాల్చుచూ ఉండటం జరుగుతోంది కదా! అంతమాత్రం చేత ఆయా శిల్పా లన్నీ శిల కంటే వేరుగా ఉంటున్నాయా? ఈ జగత్తు నానావిధ జీవుల విరుద్ధ కల్పనా భేదాలతో కూడి ఉన్నది. ఏది ఏమైనా బ్రహ్మం సర్వదా స్వస్వరూపం నందే స్వస్వరూపం గానే వెలయుచ్నుది.

ఇక్కడి వైచిత్ర్యం ఏమంటే... ఎచ్చట ఏ ఆకృతి కల్పించబడుచున్నదో, అచ్చట ఆ ఆకృతియే వెలయుచున్నది. ఇందు వస్తుగతమైన భేదమేమీ లేదు. కనబడుచున్న వస్తువులన్నిటిలో బ్రహ్మా స్తతయే వెలయుచున్నది. బ్రహ్మ సత్తయే పదార్థముల సత్త. నిద్రించేవాడు స్వప్నంలో చూచే వస్తువులకు, ఆ స్వప్నమునకు సంబంధించిన కల్పనకు భేదమేమైనా ఉన్నదా? లేదు. అయినా కూడా ఆ స్వప్న సమయంలో అభేదాన్ని గుర్తించక అప్పటికి మాత్రం ఆ స్వప్నద్రష్ట వివిధములైన అనేకానుభూతులు పొందుచున్నాడు కదా! అటువంటిదే జాగ్రదవస్థ కూడా! ఈ జాగ్రత్‌ద్రష్ట తాను చూచే పదార్థములకు తన కల్పనలకు అభేదం తెలియక ఇక్కడ అనేకత్వానుభూతి అనుభవిస్తున్నాడు. ఈ జగత్తు వికసించినా ...ఇది నామమాత్రమే! బ్రహ్మసత్త మాత్రమే వాస్తవము. ఇదంతా వాసనామాత్రమే! స్వతహాగా ఇది చిద్ఘనప్రకాశమవటం చేత, నిత్య ప్రశాంతము. ఈ సృష్టి బ్రహ్మమందు తోచుచున్నప్పటికీ ఎక్కడా 'ద్వైతము' అనేది ఉండజాలదు.

❖❖❖

## 3. ఇక భేదమెక్కడిది?

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు చిత్‌ను అచేతనమగు బిల్వఫలంతోను, శిలతోను పోల్చారు కదా! దాని తాత్పర్యమేమిటో కూడా కొంచెం వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'చిత్' తత్త్వము స్వరూపమునకు సంబంధించిన ఉత్సుకతను ఆశ్రయించినప్పుడు మాత్రమే ఈ సృష్టి సంభవిస్తోంది. సృష్టి అంటే స్వసత్త "యుగ – సంవత్సరములు – వస్తు సంబంధ అనుభూతి విశేషాలు" అను స్వప్నమునందు తన ప్రవృత్తిని ప్రవేశింపజేయుటయే.

వాస్తవానికి ఇక్కడ స్వగత భేదములకు తావు లేవు. దేశకాలాదులు బ్రహ్మము యొక్క కల్పనయే కాబట్టి, అవి కూడా చిన్మయములేనని చెప్పటానికి అర్హమగుచున్నాయి. కనుక ఇక్కడ 'ఇది చిత్–ఇది అచిత్' అనే విభేదం చేయజాలము.

'శబ్దములు, శబ్దార్థములు, వాసనలు, సంకల్ప వికల్పములు – వాటినన్నిటినీ అట్లు గ్రహిస్తున్న జ్ఞాత మొదలైనవన్నీ ఏకాత్మకములే' అని సూక్ష్మబుద్ధితో గ్రహించు. ఇక 'అసత్తు' అని దేనిని చెప్పవలె? ఫలం, అందలిగుజ్జు, రసం – ఇవన్నీ ఒకే వస్తువు అయినప్పటికీ 'ఇది రసం, ఇది గుజ్జు' అని వ్యవహరించబడుతోంది కదా! చిత్తు కూడా ఒకే విధమైన సద్ఘనమైనప్పటికీ వివిధ నామరూపాలతో వ్యవహరించబడుచున్నదని స్పష్టీకరించుకో. వాస్తవమైన ఏకైక స్వసత్తను ఏమరచి ఉండటమే అసత్తు!

❖

1. ఈ సృష్టి వైచిత్ర్యములన్నీ పెక్కు కాక పోయినప్పటికీ పెక్కుగానూ, అవికృతము గాకున్నను వికృతముగా కనిపించుచున్నాయి.

2. అయితే రాతితో మలచబడిన పద్మంలాగా, అద్దంలో ప్రతిబింబించే జంతు వృక్షాదులతో కూడిన అరణ్యంలాగా ఈ జగత్తు చిత్‌నందు ప్రతిఫలిస్తోంది.

3. నిజానికి ఈ జగత్తు బాహ్యమున లేదు. మరి ఎక్కడున్నది? ద్రష్టయగు నీయందే... నీ వల్ల... నీ యొక్క సంకల్పప్రతిపాదితంగా ప్రకాశిస్తోంది. చిత్ నందు చిత్‌చే కోరుకోబడే జగత్తులన్నీ ఇచ్ఛానుసారంగా స్ఫురిస్తున్నాయి.

ముత్యపుచిప్పలో ముత్యాలు ఉన్నట్లు 'చిత్‌శక్తి'అనే పేటికలో జగత్తులు అనే ముత్యాలు ఉన్నాయి. సరియైన విచక్షణ, విమర్శన లేకుండా చూడటంచేత ఈ జగత్తులు ద్రష్టయొక్క దృష్టిచే నిర్మించ బడినవైనట్లు కాకుండా ...మరింకెవరి చేతనో ఎన్నడో ఎందుకో నిర్మించబడియున్నట్లు అనిపిస్తోంది. సూర్యభగవానుడు తన ఉదయాస్తమయములచే రాత్రింబవళ్ళు కల్పిస్తున్నట్లు, ఆ చిత్ సూర్యుడు కూడా తన యొక్క సంకల్ప, వికల్పములచే ఈ జగత్తులను తోపింపజేయటం, ఇంతలోనే తనయందు విలీనమొనర్చటం చేస్తున్నాడు.

ద్రష్ట ప్రసరించని దృశ్యము లేదు. దృశ్యము ద్రష్ట యొక్క స్వరూపమే! దృశ్యము 'ద్రష్ట యొక్క కల్పన' అను ముడిపదార్థంతో తయారయి ఉంటోంది.

సముద్రంలో కనిపిస్తున్న తరంగాలకు ఆధారం ఏమిటి? సముద్రజలమే కదా! ఆ తరంగాలు జలం నుండి వేరైనవా? నిరాకారమైన జలం తరంగాల రూపం సంతరించుకుంటున్నప్పటికీ, జలం సర్వదా తన నిరాకారత్వం కోల్పోతుందా? లేదే! అట్లాగే ఈ జగత్తులు చిత్ సత్తనుండి తన అఖండ – అప్రమేయ – నిత్యసాక్షీస్వభావాన్ని కోల్పోవటం లేదు. కోల్పోబోదు. ఓ రామచంద్రా! "ఇప్పుడు ఉన్నవి ఇతఃపూర్వం ఉండి నశించినవి, ఇక ముందు రాబోయేవి అయిన జగత్తులన్నీ కూడా చిత్ శిలయందు చెక్కబడిన శిల్పములు వంటివే. చిత్ జలంలోని తరంగముల వంటివే"... అని ఆత్మసద్విమర్శకులమగు మేమంతా గ్రహించి ఉన్నాము.

భావపదార్థములన్నీ అభావ పదార్థముయొక్క చమత్కారమైన ఒక అంశ మాత్రమే! అట్టి పదార్థసారంతోనే (నేను చెప్పిన దృష్టాంతంలోని) బిల్వఫలం నిండి ఉన్నది. కాబట్టి, సర్వపదార్థములూ 'బిల్వఫలంలోని రససారమే' అని రూఢి చేసుకో. ఈ తెలియబడుచున్నవన్నీ మృణ్మయములు కాదు. చిన్మయములే! భావనలలోంచి ఉదితములగుచున్న అనుభవములే! ఆ చిన్మయములైనవాటి యొక్క తత్త్వము చిత్తేగాని, మరింకేమీ కాదు.

❖

శిలను విడచి 'ఈ శిలయందు అనేక పద్మములు ఉన్నాయే!' అనునది ఏదో మాటవరుసకే అవుతుందిగాని, శిల నుండి బయటగా ...మరొకటిగా పద్మములు ఉన్నట్లు అవదే! చిత్ నుండి వేరు చేసి చూస్తే ఈ జగత్తు 'అసత్తు' అవుతుంది. శిలానిర్మితపద్మంలో శిల లేకుండా చూడు...అక్కడ

పద్మమెక్కడున్నది? ఇక్కడ తారసపడే నానాత్వమంతా ఒకే శిలపై చెక్కబడిన ఆకారములవంటిది మాత్రమే. ఇందులో సందేహించవలసినపనేమీ లేదు.

శిల గురించి పూర్తిగా ఏమరిచినప్పుడు 'ఇది పువ్వు, ఇది కాయ, ఇది మనిషితల, ఇది జంతువు, ఇది మిత్రుడు, ఇది మనసైన్యం, ఇది శత్రుసైన్యం' – అనబడు శిల్పకళా విశేషాలన్నీ ఆకట్టుకుంటూ ఉంటాయి కదా. 'సర్వమూ శిలామయమే' అనే దృష్టితో చూస్తున్నప్పుడు ...ఆ విభేదాలు ఏమౌతాయి? అర్థరహితమౌతాయి కదా! ఈ జగత్తుల ఉత్పత్తి, క్షయాలు అట్టివే! ద్రష్ట యొక్క స్వస్వరూప, స్వస్వభావముల దృష్ట్యా పరిశీలిస్తే ఇక్కడ సర్వదా అవిభక్తమైన (Indivisible) చిద్ఘనజ్ఞానమే లభిస్తుంది.

**శ్రీరాముడు :** అసలు 'అనేకత్వము' అనే భ్రమ ఎందుకు ఏర్పడుతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** దాహముచే పరితపిస్తున్న కొందరు మూర్ఖ, అవిజ్ఞాత జీవులు జలం కొరకై అటూ ఇటూ చూస్తున్నారు. వారిలో ఒకడికి మృగతృష్ణ, అందులో జలం కనిపించాయి. 'అదిగోరోయ్! అక్కడ జలం ఉన్నట్లే ఉన్నది' ...అని పొలికేక వేసి పరుగులు తీస్తున్నాడు. ఇక తదితర అమాయక జీవులు 'అక్కడ జలం లేకపోతే మనవాడు కేక ఎందుకు వేస్తాడులే'– అని అనుకుంటూ పరుగులు తీస్తున్నారు. 'ఈ ఎండలో ఈ ఎడారి ఇసుకమయమే కదా! ఇక్కడ నీరు ఎట్లా ఉంటుంది? మెరుస్తున్నంత మాత్రం చేత అది జలమే అవవలసిన పనిలేదు కదా?'–అని వారు విమర్శించటం లేదు. వారి ఆర్తి అలాంటిది.

అయితే ..."ఆ సువిశాల ఎడారి, ఇసుక ప్రాంతంలో నీరు ఉండటానికి అవకాశం లేదు" అని గ్రహించినవారు, "అది గాలి వీచికలు, సూర్యకిరణముల మేళవింపు మాత్రమే..." అని గ్రహించి తదితర అమాయకజనుల వలె నిష్ఫలమైన శ్రమకు లోనుకాకుండా 'అసలు, నిజమైన జలం ఎక్కడ లభిస్తుంది' అని వెతికి వాస్తవమైన జలం ఉండే స్థానం వైపు పయనిస్తున్నారు.

ఈ జీవుడు తనను సత్ – అసత్‌మయమగు శరీరమాత్రుడుగా తలచుచున్నాడు. కాని ఆతడు వాస్తవానికి చిన్మాత్రుడు. తెలియబడుచున్న సర్వమునకు ఆధారభూతుడు. పరస్వరూపుడు.

**యథా సమ్యక్ పయోరాశిః కోటరే కలనోన్ముఖమ్ ।**
**ద్రవత్వాత్స్పన్దతేఽస్పన్దం తథేదం చిద్ఘనాన్తరమ్ ॥** (శ్లో॥ 16, సర్గ 47)

జలము స్వతహాగా స్పందనరహితమైనప్పటికీ ద్రవత్వస్వభావం చేత పల్ల ప్రదేశములందు కదిలే స్వభావం కలిగి ఉన్నట్లు తోచుచున్నది కదా! అదేవిధంగా చిత్‌ఘనము తనయందు స్వతహాగా చలన – సంచలనములు కలిగి ఉండనప్పటికీ, జగత్తును స్వీకరించుచున్నప్పుడు స్పందనసహితము వలె తోచుచున్నది.

శిలయందు ఉన్న (చిత్రంచబడిన) శంఖము వాస్తవానికి శిలయే అయినట్లు, చిత్ శిలయందు ప్రకటితమగుచున్న ఈ జగత్తు అనబడేది చిన్మయస్వరూపముకాక మరింకేదీ కాదు. అయినప్పటికీ, సాధారణ బుద్ధికి ఇదంతా మరింకేదోగా కానవస్తోంది. ప్రియశిష్యా! రామచంద్రా! నీవు మాత్రం ఈ దృశ్యమునంతటినీ – స్వశరీర – మనో – బుద్ధి – చిత్త – అహంకారములతో సహా, సర్వదా చిన్మాత్రంగానే దర్శించు. దీని యందు ఏ సమయమందూ ఎట్టి వికారములూ లేనే లేవు.

ఈ జగత్తుకు జననమరణాలు లేవు. ఇది స్వభావ శాంత సమన్వితమై కూడా మిథ్యా దృష్టిచే ఉద్వేగముతో కూడిన నవరసములను, అసంఖ్యాక సంభ్రమములను కలుగజేయగలుగుతోంది. బ్రహ్మము తనకు తానుగా ప్రకాశిస్తూ అదే కారణంగా తదితరమైన సర్వమునూ ప్రకాశింపజేస్తోంది.

ఈ జగత్తు వాసనామాత్రమగుట చేత అనిత్యం... ఇది బ్రహ్మం నందే ఉండుట చేత నిత్యం.

నిజమైన పద్మము యొక్క తీవ్రధ్యాస గలవారికి శిలలోని పద్మము, పద్మమునకు సంబంధించిన అనుభూతిని కలుగజేస్తోంది. శిలను ఏమరచేటట్లు చేస్తుంది. శిలాప్రతిమలపై చిత్రించిన శృంగార చిత్రం కాముకుడగు వానికి తదనుగుణమైన స్ఫురణోత్సాహం కలుగజేస్తోంది. అయితే, అది వాస్తవానికి శిలే కదా...! ఈ జగత్తు ద్రష్ట యొక్క భావన, అవగాహన, ఉద్దేశము, అనుభూతులను– అనుసరించి తదనుగుణంగా అనుభవమౌతుంది. అఖండము, నిత్యము, నిర్మలము, అప్రమేయము – అగు బ్రహ్మానుభూతి సమన్వితునికి ఇదంతా స్వచ్ఛం, అద్వితీయం అగు బ్రహ్మముగానే అనుభవమౌతోంది. శిలచే చిత్రించబడిన ఎలుగుబంటి దూరంగా ఉండి చూచే బాలురవంటి వారికి 'అరె! ఆ ఎలుగుబంటి నా వైపే గుఋున చూస్తోందే!" అని అనిపించవచ్చు. దగ్గరకు వెళ్ళి చూస్తేనో... అది నిష్క్రియమగు శిలయేనని తెలిసిపోతోంది కదా! బ్రహ్మభావాభ్యాస ప్రభావంచే ప్రకాశించే ప్రశాంత హృదయులకు ఈ జగత్తు అనుద్వేగకరమగు మౌనతత్త్వముగా తెలియవస్తోంది.

శిల యందు శిలత్వము, శిల్పత్వము, శిల్పాంతర్గత కథనము – ఉన్నట్లు బ్రహ్మమున బ్రహ్మత్వము, ఈ జగత్తు కూడా ఉన్నాయి.

చెట్టు, చెట్టు యొక్క ఆకారము 'ఒక్కటే' అయినట్లు ... బ్రహ్మము, జగత్తు వేరు వేరు కాదు. రెండు చిన్మయములే! ఈ కనబడేదంతా మృణ్మయదృష్టి కలవారికి మృణ్మయంగాను, చిన్మయ దృష్టి కలవారికి చిన్మయంగాను అనుభూతమౌతోంది.

❖

ఓ రాఘవా! మరొకసారి ప్రకటిస్తున్నాను. 'చిత్తు'లాగానే ఈ జగత్తుకు కూడా ఉత్పత్తి వినాశనాలు లేవు. ఎండమావులను ప్రకాశింపజేస్తున్నది ఆకాశంలోని సూర్యుడే కదా! బ్రహ్మమే ఈ జగత్ప్రకాశానికి కారణమగుచున్నది. ఒకే జలం ఎండ వేడిమిచే ఆవిరి, మేఘాలు, వడగళ్ళుగా అగుచున్నది కదా! తత్త్వజ్ఞులకు ఈ సర్వ పదార్థముల మూలం బ్రహ్మమేనని తెలుసు. వారు గొప్ప పర్వతం నుండి ఒక గడ్డిపరక వరకు సర్వమూ బ్రహ్మమయమేనని గ్రహించియే సంచరిస్తున్నారు.

జలపరమాణువునందు ఏ రసశక్తికలదో ...స్థూలమగు జలమునందు కూడా అదే గోచరిస్తుంది కదా! ఆ చిత్‌శక్తియే పంచీకృత అపంచీకృతములగు స్థూలసూక్ష్మ భూతములందు నిండి ఉన్నది. ఒకే విధమైన 'శక్తి' గడ్డిలోను, ఆకులలోను, లతలలోను, ఈ కనబడే నానావిధపదార్థములందూ దాగి ఉన్నది కదా! (సర్వమ్ శక్తిమయమే!) బ్రహ్మమే ఈ నానా విధములుగా తోచుచున్న వివిధ వస్తువులతో పరివ్యాప్తమైయున్నది. నెమలి గుడ్డులో నెమలి పింఛము యొక్క రంగురంగులు దాగి ఉన్నవి కదా! పరమాణువు నందు పదార్థస్వభావమంతా ఒదిగి ఉంటోంది. బ్రహ్మమునందు

గుణములు, ఆ గుణములకు ఆధారమగు ఆవిర్భావ, తిరోభావములు, వాటిని అనూభూతి పొందే గుణి...అన్నీ కూడా రసస్వరూపమై ఒదిగి ఉన్నాయి. అయినప్పటికీ అవన్నీ బ్రహ్మమునందు ఆపాదితములైనవేనని గ్రహించు.

వివేకదృష్టితో పరికించి చూచేవానికి "ఈ నానాత్వమునకు కారణమైన బ్రహ్మము అద్వయము" అని తెలిసిపోతోంది. వాస్తవానికి అది ద్వైత – అద్వైతములకు కూడా అతీతమైనది. సత్ – అసత్తులయందు సమత్వమున ఏదైతే సర్వదా వెలయుచున్నదో...అదియే బ్రహ్మము. అనుభూతములన్నీ బ్రహ్మమునందే, బ్రహ్మముచేతనే ఉదయిస్తున్నాయి. అద్దాని సమక్షమునందు అనుభూతి ఉంటోంది. లయిస్తోంది.

ఈ జగత్తు చిద్రసముతో నిండిఉన్నదై, తనకు తానే ఉనికిని కల్పించుకుంటోంది. జగత్తు అనే రసము బ్రహ్మము నందే ప్రకాశిస్తోంది. బ్రహ్మమునకు వేరుగా జగత్తు లేదు. జగత్తంతా బ్రహ్మరసముచే నింపివేయబడి ఉన్నది. ఇక భేదమెక్కడికి?

❖❖❖

# 4.స్వస్వరూపానంద సుస్థిరత్వం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒక నెమలి గ్రుడ్డులో – నెమలి యొక్క రూపం, పింఛం, ఆ పింఛంలోని రంగుల వలయాలు, జూలు, పెద్ద రెక్కలు, సన్నటి పొడవైన కాళ్ళు, గోళ్ళు– మొదలైనవన్నీ దాగి ఉన్నాయి కదా! అట్లాగే విశుద్ధమగు చిత్ అండముతో అహంకారము–బుద్ధి–చిత్తము మొదలైన వాటితో కూడిన అంతర్ జగత్తు ...దిక్కులు – ఆకాశం మొదలైన వాటితో కూడిన బాహ్యజగత్తు అనభ్యుతములై (As non-Provoked) వెలయుచున్నాయి.

ఆ చిద్ఘనానందమే ఈ సర్వ శరీరావయవాలకు రసమై – "ప్రాణంగాను – విషయసుఖసారాలైన చిత్తవృత్తి భేదాలుగాను, భోగ్య – భోగాది వస్తువులుగాను" – అద్దంలోలాగా ప్రతిబింబిస్తున్నది.

మనం ప్రతిబింబితమైన విషయానందమును చూస్తున్నపుడు ...ఆ ప్రతిబింబమునకు మూలమైన చిద్ఘనరూప నిరతిశయానందము యొక్క ఉనికిని ఒప్పుకోక తప్పదు. ఆ నిరతిశయానందం స్వాత్మానుభవ రూపమే సుమా! స్వాత్మానుభవరూపమునే తురీయమని కూడా అంటున్నారు. అట్టి నిరతిశయానందాన్ని మునులు, దేవతలు, గణములు, సిద్ధులు, మహర్షులు అగు వారిలో అనేకులు అనుభవిస్తూనే ఉన్నారు. నిర్నిమేషులై స్థిరపడిన దృష్టిని అధిరోహించి, దృశ్యదర్శన రహితులై నట్టి మహనీయులెందరో ఆ స్వస్వరూపానందమున తేలియాడుచున్నారు. అట్టి దృశ్యదర్శనరహిత మైనట్టి స్వస్వరూపంలో నిలకడ పొందలేక ప్రాణ చలన చిత్త విక్షేపములకు చోటిచ్చుటచేతనే ఈ జీవులలో అనేకులకు ఆ ఆనందం అనుభవానికి రావటం లేదు. ఇంతకు మించి వేరే కారణమేదీ లేదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ ! మీరు ఉదహరిస్తున్న "స్వస్వరూపానంద సుస్థిరత్వం" మరికొంత విస్తారంగా వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వస్వరూపము యొక్క మహత్తరానుభవమనునది ఎరిగి ఉన్న ఆత్మజ్ఞులు ఈ కర్మలలో నిమగ్నమగుచున్నప్పటికీ ...వారు బాహ్య వస్తువుల చింతనలో ఒక్క నిమిషం కూడా నిమగ్నమవటం లేదు. జ్ఞానజ్ఞేయములను సర్వదా త్యజించివేసి ఉంటున్నారు. అనగా 'తెలుసుకునేది, తెలియబడేది' అను ద్వంద్వమునకు ఆవల తమ స్వరూపమును ప్రతిక్షేపించుకుని ఉంటున్నారు. అట్టి దృష్టి-అవగాహన-భావన-అనుభవములను శాస్త్ర పరిభాషలో 'సమాధి' అని పిలుస్తున్నారు. ఒక చిత్రంలోని మనిషికి స్పందనాస్పందనములు ఉండవు కదా! స్వస్వరూపానుభవి యొక్క అంతరంగం స్పందనాస్పందరహితంగా ఉంటుంది. వారు చిత్తమును, చిత్తమునకు ఆశ్రయమై ఉంటున్న విషయములను సదా త్యజించినవారై ...తత్ఫలితంగా 'భూమానందము' అని చెప్పబడే 'సర్వ సమభావన'ను పొందుచున్నారు.

ఆ పరమేశ్వరుడు అంతరమున స్వస్వరూపానందమయుడై ఉండి కూడా బాహ్యమున 'మాయ' అగు ఈ జగత్తును నడిపిస్తున్నారు కదా! అదే రీతిగా ...జ్ఞానోదయమై, స్థిర స్వభావులైన మహానుభావులు అంతరమున స్వస్వరూపమును ప్రతిక్షేపించుకుని, ఇక బాహ్యమున వ్యవహారములు సలుపుచూ ఉన్నారు. ఓ రామా! నీవు కూడా నిరభ్యంతరంగా ఇప్పటికిప్పుడే అజ్ఞానమయములైన ద్వైత భావములను వదలివేయి.

**శ్రీరాముడు :** అప్పుడు కర్మలు నిర్వర్తించటం సులువు కాదేమో!

**శ్రీవసిష్ఠ మహర్షి :** కాలానుగుణంగా సంప్రాప్తించే కర్మలలో పాల్గొనుచూ భూమానందము, లేక సమాధిని అవధరిస్తున్న వారెందరో ఉన్నారయ్యా! నీ అంతరంగ సునిశ్చితబుద్ధిని బయటనుండి నిన్ను అడ్డుకోగలిగేది ఈ చరాచర సృష్టిలో ఏదీ లేదు.

చంద్రకిరణములు వృక్షములందు, ఆకులందు, చిగుళ్ళయందు ప్రవేశించి వాటిని రసభరితం చేస్తూనే తన ప్రశాంత తత్త్వమును కొనసాగిస్తున్నాయి కదా! చంద్రకిరణములు ఒకానొక చోట అగ్నిగుండముపై ప్రసరించినంత మాత్రం చేత చంద్రమండలం తన చల్లదనం కోల్పోతుందా?... లేదు కదా! మహాత్ముల బుద్ధి - 'చిత్తవృత్తులు, బాహ్యవిషయముల'తో కూడుకుని ఉన్నప్పటికీ సర్వదా నిరతిశయానందమును అభివ్యక్తం చేస్తూనే ఉంటోంది. వారి వాక్కు, యోచన - అన్నీ కూడా 'ఇచ్ఛ, ఆశయ, ద్వేష, ఉద్వేగ, నిరుత్సాహములను' అధిగమించి ఉంటున్నాయి. అందుచేత అన్నివేళల, అన్ని స్థితులందు విక్షేపరహితమైన ఆహ్లాదమును వారు ప్రాప్తించుకుని ఉంటున్నారు.

చంద్రుని వెన్నెలకు రూపమేముంది?... అదేవిధంగా శుద్ధసంవిత్తుకు ఎట్టి రూపమూ లేదు. స్వస్వరూపానుభవజ్ఞులు రూపాతీతమైన అనుభవమునందు వెలయుచున్నారు.

అట్టి స్వస్వరూపానుభవం చూడబడజాలదు. ఉపదేశించబడజాలదు. అది దూరం కాదు. దగ్గర కాదు. అది కేవలం అనుభవయోగ్యం అని చెప్పాలి. దానికి దేహేంద్రియ మనోప్రాణములు లేవు. సంకల్ప-వాసనలు లేవు. అది జీవుడు కాదు. స్పందన కాదు. సంవిత్తు కాదు. జగత్తు కాదు. అత్యంత సన్నిహితం-దూరం-మధ్యం కాదు. శూన్యం-అశూన్యం-శూన్యాశూన్యాలు కూడా కాదు.

**శ్రీరాముడు :** మరి అట్టి స్వస్వరూపమును గుర్తించటం, అధిరోహించటం ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ నా వాక్యములు ఉత్తమవివేకంతో విచక్షించుకో. అది అధిరోహించవలసినది నీవేగాని, నేను గురువుగా ఇంతకు మించి స్పష్టపరచలేను.

ఇక్కడి దేశకాలాదులచే 'స్వస్వరూపానందప్రతిష్ఠ'ను నిర్వచించలేం. ఎందుకంటే అది దేశకాలాదు లందలి పదార్థమేదీ కాదు. అయితే ఏం? దేశకాలాదులుగా పరిచ్ఛిన్న స్వభావం ప్రదర్శిస్తున్నది అదే! అది విషయములన్నింటికీ వేరయి కూడా, తానే అనంతములగు వాసనలతో గూడిన హృదయ కోశమును కలిగి ఉంటోంది. అద్దాని స్వస్వరూపమహిమ వలననే దృశ్యవస్తువులు ఆవిర్భవించి విలయమొందుతున్నాయి. స్వస్వరూపసత్తకు శాస్త్రములు 'ఆత్మ' అను పేరుపెట్టాయి. అది నిష్కారణమై, కారణములన్నిటికీ కారణమై చెన్నొందుచున్నది. ఈ వాయువు, అగ్ని మొదలైనవన్నీ దాని రూపమును మార్చలేవు. ఇహలోక, పరలోకములు ఆ స్వస్వరూప సద్రూపమును మరొక తీరుగా చేయజాలవు. వేలకొలది దేహములు ఉత్పన్నమై, వినాశమగుచుండగా ఆ స్వస్వరూపం మాత్రం స్వస్థానముననే ఉండి వాటన్నిటికీ సాక్షి మాత్రమై వెలుగొందుతోంది. అద్దాని వెలుగుచేత ...అద్దాని సమక్షంలో ఈ వేలాది దేహములు వస్తున్నాయి, పోతున్నాయి.

ఆత్మాకాశము యొక్క బయటగాని, లోపలగాని ఎట్టి వికారములు మార్పు చేర్పులు లేవు. ఈ దేహములకు స్ఫురిస్తున్న వికారములేవీ ఆత్మకు ఉండజాలవు. అట్లని ఈ దేహములు ఆత్మ కాక మరొకటేదో నని అనుకోవద్దు. ఇక్కడ వికారములు స్ఫురించటానికి కారణం 'బోధ' యొక్క వికృతియే గాని మరొకటేదీ కాదు. అందుచేత పరిపక్వమైన స్వబుద్ధిని సంపాదించిన జ్ఞానులు ఈ విశ్వమును 'ఆత్మ'గానే గ్రహిస్తున్నారు.

**శ్రీరాముడు :** అట్టి అఖండమగు స్వస్వరూపసమేతుడనగు నాకు ఇక్కడ కర్తవ్యమేమిటి? అకర్తవ్యమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

> **ప్రజ్వలన్నపి కార్యేషు నిర్వాణో నిర్మమో భవ ।**
> **యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్ ॥** (శ్లో 18, సర్గ 48)
>
> **తత్సర్వం బ్రహ్మ నిర్ధర్మ నిర్గుణం నిర్మలాత్మకమ్ ।**
> **నిర్వికారమనాద్యన్తం నిత్యం శాన్తం సమాత్మకమ్ ॥** (శ్లో 19, సర్గ 49)

ఇక్కడ అవిశ్రాంతంగా కార్యములు ఒనర్చుచున్నప్పటికీ, నీవు నిర్వికారమగు ఆత్మను ఇక్కడ దర్శిస్తూ ఉండు. ముక్తాత్మ స్వరూపుడవై సర్వప్రకాశకమగు స్వీయ కాంతితో ప్రకాశించు.

కనులకు కనబడుచున్న ఈ స్థావరజంగమాత్మక జగత్తు అంతా నిర్గుణము, నిర్మలాత్మకము ఉపాధిధర్మ విరహితము అగు బ్రహ్మమేనయ్యా! అది ఆద్యంతహీనము, నిత్యము, శాంతము, సన్మాత్రము అయి ఉన్నది ఇక నీకు సందేహమెందుకు?... వికారాదులెందుకు?

వత్సా! ఈ కాల-కర్మ-కారణ-కర్మ-క్రియ-నిదాన-సృష్టి-స్థితి-లయ-స్మరణ-విస్మరణాదులన్నీ కూడా బ్రహ్మమేనని గ్రహించు. బ్రహ్మముతో మాత్రమే ఐక్యము సంపాదించుకో. అప్పుడిక ఈ సంసారచక్రములో పడి పరిభ్రమించటం జరగనే జరగదు.

❖❖❖

# 5. ఆత్మ సర్వదా నిర్మలమే!

**శ్రీరాముడు :** హే పరమ బ్రహ్మజ్ఞా! గురుదేవా ! "నిరతిశయము మహోత్తమము"అగు బ్రహ్మవస్తువు నందు దేశ-కాల-నిమిత్తములు అనే పరిచ్ఛేదమే లేదని మనం అనుకుంటున్నాం కదా! అట్టి వికారాలకు తావు లేనపుడు మరి అది భావ-అభావముల రూపంలో ఎట్లు, ఎందుకు ప్రకాశిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆత్మకు భూత-భవిష్యత్తు-వర్తమానములతో పరివర్తనమంటూ లేదు. అది కాలముచే బద్ధమైనది కాదు.

పాలు పెరుగుగా మారుతున్నప్పుడు 'పాలు పెరుగుగా పరివర్తనమౌతోంది' అని అంటున్నాం. ఆ పరివర్తనమునే 'వికారం, పరిణామం' అనే మాటలతో వ్యవహరిస్తున్నాం. ఎందుకంటే ఇక పెరుగు తిరిగి పాలుగా మారే ప్రసక్తి ఉండదు కదా! బ్రహ్మం-జగత్తు అట్టి పాలు-పెరుగు వంటివి కాదు.

బ్రహ్మమునకు పరివర్తనం లేదు. అది జగత్తుగా మొదలే మారటం లేదు.

అయితే ...ఈ జగత్తు యొక్క ఆదిమధ్యాంతము లందు కేవల నిర్మల బ్రహ్మమే వెలయుచున్నది.

పాలకు ఉండే వికృతి బ్రహ్మానికి లేదు. బ్రహ్మం 'అనాది, అనంతం' – అగు వస్తువు. అందుచేత అవయవసంయోగం, అన్యద్రవ్య సంబంధం మొదలైనవి బ్రహ్మమునకు సంబంధించి లేవు. ఇక సర్వసమమగు బ్రహ్మమునందు ఒకనికి కనిపించే ఈ జగత్తు స్వయంకృతభ్రమకు సంబంధించిన వివర్తం మాత్రమే. బ్రహ్మమును భావన చేసేవానికి భావ – అభావ జగత్తు మిథ్యగానే తెలియవస్తోంది. బ్రహ్మము అనగా సంస్పర్శరహితమగు చిదాత్మయే కదా! అద్దానిలో జ్ఞానజ్ఞేయములు లేవు.

బ్రహ్మమునందు జ్ఞానజ్ఞేయములు కూడా లేవు. అది సృష్టికి పూర్వమున, పరమున కూడా ఉన్నది. అద్దాని యందు జగత్తు మొదలైన భ్రమలు లేనేలేవని గ్రహించు. పూర్వమున, పరమున ఒకే తీరుగా ఉన్న బ్రహ్మము మధ్యలో మాత్రం మరొక తీరుగా అగుచున్నదా? లేదు. లేనే లేదు. మధ్యకాలంలో ఇంకొక రీతిగా తోచటం కేవలం భ్రమ మాత్రమే.

"ఆత్మ ఆది-అంతము లందు, మధ్యలోను సర్వత్రా సర్వవైపులా సమస్వరూపమున వెలయు చున్నది." ఇక ఈ దృశ్య-దర్శన వివర్తము ఉంది చూచావు?... ఇది ఆత్మ సంబంధీయమే కాని, 'ఆత్మతత్త్వం మాత్రం కాదు. ఆత్మ సంబంధీయమైన దానితో ఆత్మ వికారం పొందుట లేదు.

సర్వశక్తిమంతమగు బ్రహ్మము లేక ఆత్మ రూపరహితము... ఏకము... నిత్యము కూడా. అందుచేత ఈ భావవికారాలకు అది ఎన్నడూ వశమగుటలేదు.

**శ్రీరాముడు:** మరి పరిపూర్ణము – నిర్మలము – సద్రూపము – ఏకము అగు బ్రహ్మమున 'అజ్ఞానం' అనతగ్గ అవిద్య ఎక్కడ నుండి వస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు 'బ్రహ్మతత్త్వం' ఒక్కటే వెలయుచున్నదని మరొక్కసారి చేతులెత్తి ప్రకటిస్తున్నాను – అది అనాది ...అనంతము!

ఇక అవిద్య ఏమంటావా?... అవిద్య అనునదే లేదు. ఇది నిశ్చయమగు సత్యము.

ఇక బ్రహ్మము యొక్క సద్భావం గురించి, అసత్ విభాగం గురించి వేరువేరుగా చెప్పుకోవటం కేవలం ఉపదేశ సౌలభ్యం కొరకు మాత్రమే. 'ఇది బ్రహ్మతత్త్వము'... అని అనుభవజ్ఞుడగు గురువు శిష్యులకు ప్రతిపాదించి చెప్పుకొస్తున్నప్పుడు, ఆ శిష్యులకు అవగతమవటానికి వీలుగా అనేక వాచ్య-వాచక శబ్దములన్నీ కల్పించబడుచున్నాయి. అంతేకాని, అదంతాకూడా బ్రహ్మమునుండి వేరైన మరొకదానిని వర్ణించడం కానే కాదు. నీవు, నేను, జగత్తు, భూ, దేవలోకములు, మనోబుద్ధి, చిత్తాహంకారాలు – అన్నీ కూడా ఆద్యంతరహితమగు బ్రహ్మము కాక మరింకేమౌతాయి? అవిద్య అనేది ఒకించుక కూడా లేదు. ఇక వివర్తము, అవిద్య, భ్రమ...అనునవన్నీ నామమాత్రమే. అవన్నీ ఆత్మ యొక్క ఏమరుపును ఉద్దేశిస్తున్నాయని గ్రహించు. అవిద్య అనునది సత్యం యొక్క అభావం మాత్రమే నని ఈ సభలోని, తదితర ప్రపంచంలోని అనేకమంది తత్త్వజ్ఞులు ఎరిగియే ఉన్నారు.

ఓ రాఘవా! 'లేనిదే' అగు అవిద్య ఎట్లా ఉదయిస్తుంది? ...అది సత్యమెట్లా అవుతుందయ్యా!

**శ్రీరాముడు :** ప్రభూ ! మరి మీరు ఉపశమన (ప్రకరణ) ప్రవచన సందర్భంలో "అవిద్యను ఎట్లా సంబోధించాలి?" – అను విషయంలో అనేక విశేషాలు చెప్పారు కదా! దాని మాట ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును, చెప్పాను. అప్పుడు కొంత అజ్ఞానదశలో ఉండటం చేత నీకు అలా కల్పించి చెప్పవలసి వచ్చింది. ఇప్పుడు క్రమేపీ సంభాషణలు ఆత్యంతిక జ్ఞాన విషయాన్ని సమీపిస్తున్నాయి. ఇప్పుడు నీవు ప్రబోధితుడవు అయ్యావు. ఇక నీకు అట్లు చెప్పవలసిన పని లేదు.

అవిద్య జీవుడు మొదలైన కల్పనలన్నీ అజ్ఞానదశలో శిష్యులకు ఉపదేశించటానికి పండితులచే కల్పించబడ్డాయని నీకు ముందే చెప్పాను కదా!

మనస్సు అజ్ఞానదశలో ఉన్నప్పుడు శాస్త్రోక్తము అయిన 'అవిద్యా ఉపదేశము' లేకుండా ఎన్ని విధములుగా "తత్త్వమ్, సోఽహమ్" వంటి మహావాక్యాల పరమార్థం ఉపదేశించినప్పటికీ ఆ మనస్సులో ప్రబోధము ఉదయించటం లేదు. ఒక విద్యార్థికి అతని దశను అనుసరించి అతని పరిభాషలో విషయాన్ని బోధించవలసి ఉంటుంది. ఉత్తరోత్తరా ప్రారంభంలో ఉపయోగించే యుక్తులు అవసరం ఉండదు కదా!

శిష్యుడు యుక్తులతో బోధింపబడి ఆత్మతత్త్వం విశదీకరించబడి, ఆ తరువాత 'తత్ త్వమ్ – ఆ అఖండమగు ఆత్మయే నీవు'... నీవు చూస్తున్న నీవు, కూడా – అని సుస్పష్టీకరించబడుతోంది.

నూరురకాలుగా ప్రయత్నించి కూడా సాధించబడని ఒక కార్యం యుక్తిచే సాధించబడుతోంది కదా! అజ్ఞానికి సందేహములు తొలగని వారిని సమీపించి 'అంతయూ ఆత్మయేనయ్యా' అను సిద్ధాంతం చెప్పితే లాభమేమిటి? అది ఒక శిలను–మిత్రునిగా భావించి తన కష్టములు చెప్పుకొని ఉపాయాలకు సంప్రతించటం వంటిదే అవుతుంది.

మూఢుడు యుక్తి వలన, ప్రాజ్ఞుడు తత్త్వము వలన బోధించబడుచున్నారు. యుక్తి సహాయంతో బోధించకపోతే మూర్ఖుడు ప్రాజ్ఞుడు అయ్యేదెట్లా?... నీవు ప్రబోధం పొందే వరకు 'యుక్తి'తో బోధించాను. ఇప్పుడు ప్రబుద్ధుడవటం చేత సూటిగా తత్త్వమునే చెప్పుచున్నాను.

నాయనా! ఇక విను–

**బ్రహ్మాహం త్రిజగద్బ్రహ్మ త్వం బ్రహ్మాఖిలు దృశ్యభూః ।**
**ద్వితీయా కలనా నాస్తి యథేచ్ఛసి తథా కురు ॥** (శ్లో॥ 23, సర్గ 49)

నీవు, నేను, త్రిజగత్తులు, దృశ్యములు –మొదలైనవన్నీ నిశ్చయంగా బ్రహ్మమే! ఇక్కడ ఇంకొక వస్తువన్నది లేదు. ఇది గ్రహించి ఆపై, నీ ఇష్టానుసారం వ్యవహరించు. గ్రహించిన తరువాత యథారీతిగా వ్యవహరిస్తుంటే బ్రహ్మము యొక్క వాస్తవ తత్త్వమునకు వచ్చే హాని ఏమీ ఉండదు.

**అసంవేద్యమహాసంవిత్కోటిమాత్రం జగత్త్రయమ్ ।**
**ఏకప్రత్యయవాన్తః కుర్వన్నపి న లిప్యతే ॥** (శ్లో॥ 24, సర్గ 24)

'సర్వవిధ భ్రాంతులు లేనట్టి – జ్ఞేయము కాజాలనట్టి చైతన్య బ్రహ్మమొక్కటే సర్వే సర్వత్రా అనుశ్రుతమైయున్నది'... అని గ్రహించి కార్యములను నిర్వర్తించే వానిని ఆ కర్మసంగ దోషములుగాని, దుఃఖ దోషములుగాని అంటవు.

ఓ రాఘవా! "కూర్చుని ఉన్నప్పుడు ఊపిరి పీల్చుచున్నప్పుడు, నిద్రించుచున్నప్పుడు, చదువునపుడు, వ్రాయునపుడు కూడా "నేను సర్వదా ప్రకాశరూపుడు, చేతనుడు, సర్వవ్యాపియగు పరమాత్మనే" అనియే భావించు. నీవు కనుక మమకారము కించిత్ కూడా లేక, నిరహంకారుడవై, ప్రాజ్ఞుడవై ఉంటే తక్షణమే సర్వ జీవులూ ఎందులో వెలయుచున్నారో ...అట్టి శాంత చిదేకరసమగు బ్రహ్మము అవుతావు.

సత్యం, ఆద్యంతరహితం, ప్రకాశమయం – అగు ఆ పరమపదమే నీవు. నీవు సర్వదా సర్వ వ్యాపివయి, ఏకాత్మకుడవై, శుద్ధచైతన్య స్వరూపుడవై వెలయుచునే ఉన్నావు. ప్రపంచంలోని కుండలన్నీ కూడా మట్టికి అభిన్నమైనవే కదా! బ్రహ్మ మొదలుగా సర్వమునందు సదాత్మ ఒక్కటే వెలయుచున్నది.

ప్రకృతి ఆత్మ కంటే వేరు కాదు. ఘటం (కుండ) యందు మట్టి యొక్క మృణ్మయతే వెలయు చున్నది కదా! ఆత్మయే ప్రకృతియందు వెలయుచున్నది.

ఒకచోట నిశ్చలమైన నీరే మరొకచోట సుడిగుండాలు ప్రదర్శిస్తోంది కదా! ఆత్మ యొక్క ఒకానొక స్పందనయే ఈ ప్రకృతి. కనుకనే ప్రకృతి ఆత్మయే అవుతుంది. 'వాయువు–వాయువు యొక్క స్పందనం' పేరుకు మాత్రమే వేరు కదా! ఆత్మ – ప్రకృతులు వేరు వేరుగా అగుపిస్తున్నప్పటికీ వాస్తవానికి అవి వేరు వేరు కాదు. అట్టిది రజ్జు–సర్ప భ్రాంతి వలె అజ్ఞానము చేత ఉదయించి, మరల జ్ఞానముచే తొలగిపోతోంది.

చిత్క్షేత్రంలో 'కల్పన' అనే బీజం ఉదయించి 'చిత్తం' అను అంకురమునకు త్రోవతీస్తోంది. అదే సంసారం. అది భూత – భవిష్యత్తుల కల్పనకు కారణమౌతోంది. ఆ కల్పనా బీజం 'ఆత్మ విజ్ఞానం' అనే అగ్నిలో దగ్ధమైతే ఆపై 'వాసనలు'అనే నీరు పోసినాకూడా, కారణరూపమైన చిత్తాంకురం చిగురించదు.

ఓ రామా! నీవు ఆత్మబోధను పొందావు. పొందిన బోధనను ఆకళింపు చేసుకుని అజ్ఞాన ప్రసూతము, భ్రమయుక్తము అగు ద్వైతభావమును పరిత్యజించివేయి.

ఆత్మైక్యభావరూపమైన నిరతిశయానంద వైభవమునందు పరిపూర్ణుడవగుము. అభయాత్ముడవు కమ్ము. త్రికాలములందూ కూడా 'దుఃఖము'అనునది స్వతహాగా లేదు... ఇదియే మేము చెప్పు పరమార్థసారము.

❖❖❖

# 6. శరీరముయొక్క రాకపోకలు

**శ్రీరాముడు :** హే మహర్షీ!

**జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలమ్, దృష్టం ద్రష్టవ్యమక్షతమ్ ।**

**పరేణ పరిపూర్ణాఃఽస్మో బ్రహ్మజ్ఞానామృతేన తే ॥**

తప్పకుండా తెలుసుకోవలసి ఉన్నదానిని నేను తెలుసుకున్నాను. చూడవలసినది చూస్తున్నాను. మీరు ప్రసాదించిన జ్ఞానామృతం గ్రోలి పరిపూర్ణుడనయ్యాను.

**పూర్ణాత్పూర్ణమిదం పూర్ణం పూర్ణాత్పూర్ణం ప్రసూయతే ।**
**పూర్ణేనాపూరితం పూర్ణం స్థితా పూర్ణే చ పూర్ణతా ॥** (శ్లో॥ 2, సర్గ 50)

పూర్ణము నుండి పూర్ణము పూర్ణ స్వరూపమున వెలయుచూ వెలువడుచున్నది. పూర్ణము పూర్ణమున ప్రకాశిస్తోంది.

హే బ్రహ్మజ్ఞా! పిల్లలు తండ్రిని వేడుకతో ప్రశ్నిస్తారు చూచారా! అట్లా మిమ్ములను మరల ప్రశ్నిస్తున్నాను. దయచేసి కోపగించుకోకండి! ఇట్లా పదే పదే ఆయా కోణముల నుండి ప్రశ్నించటం చేత మీ నుండి జాలువారే అమృతవచనములు నా తదితరుల జ్ఞాన విజ్ఞానములను పెంపొందిస్తాయి అనునదే నా సదుద్దేశం. హే మహాత్మా ! ఇప్పుడు నా ప్రశ్న వినండ–

ఒక మృతుని యొక్క కళ్ళు, ముక్కు, నాలుక, చర్మం – మొదలైన ఇంద్రియాలు కనబడు చున్నప్పటికీ అవి ఎందుచేత విషయములను గ్రహించలేకపోతున్నాయి? సజీవుని ఇంద్రియాలు ఎందుచేత విషయాలను గ్రహించగలుగుచున్నాయి? ఈ ఇంద్రియాలు బయటికి వెళ్ళి తెచ్చిన విషయాల సమాచారం హృదయంలో "అనుభవం" అను రూపంలో ఎలా రూపం పొందగలుగు చున్నాయి?... 1. ఇంద్రియం, 2. విషయం – ఇవి రెండూ వేరు వేరైనవి కదా! అవి పరస్పరం ఆకర్షించ గలగటం ఎట్లా జరుగుతోంది? దృశ్యం యొక్క పరిజ్ఞానం హృదయంలో ఎలా ప్రకటితమౌతోంది?

హే పరమేశ్వరా! వసిష్ఠమహర్షీ! ఇప్పటి వరకూ జరిగిన ప్రసంగంలో మీరు ఈ విషయాలు వివరించి ఉండవచ్చు. అయినా, మళ్ళా మీ నుండి ఈ విశ్లేషణా ప్రవచనాలు వినాలని అనిపిస్తోంది. ఒకే విషయం అనేక సోదాహరణాలతో చెప్పటం, వినటం చేత ఈ మీ ప్రవచనం ఆత్మతత్త్వమును మరింతగా విశదపరచగలదని నా ఉద్దేశం! నా అభ్యర్థన!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రత్యక్ష ప్రమాణములైనట్టి 'ఇక్కడి వస్తు సముదాయాలు, ఇంద్రియాలు, ఆ

ఇంద్రియ ద్వారాలలో కాపురముంటున్న చిత్తం' వీటి అసలు రూప – తత్త్వ – స్వభావము లేమిటో విశేషంగా విచారణ చేసిన వారికి 'ఇవన్నీ చైతన్యము కంటే వేరు కానే కాదు' అని తెలియవస్తోంది

ఆకాశము వలె అత్యంత శుద్ధమైన చైతన్యము మాయతో కూడినదై పూర్వ – పరవాసనలను (ఇంద్రియ వ్యవహార పరంపరలను) నిరంతరం భావన చేస్తోంది. అట్టి వాసనల యొక్క ఆవరణను వేదాంత పరిభాషలో 'పుర్యష్టకం' అని పిలుస్తున్నారు.

ఆ బ్రహ్మమే 'ఇంద్రియాల యొక్క విషయాలు, ఇంద్రియాలు, చిత్తం'... అనే ప్రకృతి లేక పుర్యష్టకంగా స్వయంగా... స్వయం కల్పన (లేక) మాయచే... వివర్తము చెందుతోంది. పుర్యష్టకంగా వివర్తం చెందిన చిత్ చిత్తవృత్తులను దాల్చుచు తన యొక్క అజ్ఞానానికి తానే కారణమై ఉంటోంది.

ఇక మృత్యువు విషయానికి వద్దాం. మృత్యు సమయంలో ఏం జరుగుతోంది?... ప్రాణశక్తి ప్రసరణచే చరించే ఈ దేహం కాలానుగతంగా శిథిలత్వం సంతరించుకుంటోంది. అనగా, ఉపకరణ మాత్రమైన కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు, ముక్కు గల ఈ జడదేహం నిర్వీర్యమై నిరుపయోగమై పోతోంది. మృత్యు సమయంలో పుర్యష్టక సమన్వితమైన సూక్ష్మదేహం ఈ స్థూల దేహం నుండి వెలువడటం చేత ఈ ఇంద్రియాలు సామర్థ్యం కోల్పోతున్నాయి. యంత్రశక్తి కోల్పోయిన యంత్రంలాగా ఇది నిస్తేజమై పోతోంది. శరీరం నిరుపయోగమైనప్పటికీ వేలకొలది జగత్తులను ప్రతిఫలించగల 'దర్పణం' వంటిదగు పుర్యష్టకం (5 ఇంద్రియార్థాలు, మనస్సు, బుద్ధి, చిత్తం) ఉండియే ఉంటోంది.

**శ్రీరాముడు:** అట్టి 'పుర్యష్టకం' గురించి మరికొన్ని విశేషాలు చెప్పవలసినదిగా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** బ్రహ్మము ఆద్యంతరహితము, నిరామయము, తేజోమయము కదా! అట్టి బ్రహ్మము తనయొక్క చిద్విలాసంచేత తన కొరకై తాను ఆకాశము మొదలైన సూక్ష్మభూతములను సృష్టించుకుంటోంది. అది స్వయంగా కల్పనారహితమే! అయినప్పటికీ, అది జగత్తుకు బీజమై అపంచీకృత భూతపంచకము కలిగియున్న దగుచున్నది. తద్వారా బ్రహ్మాండమును సృష్టించి, అందు ప్రతిబింబిస్తోంది. సూత్రప్రాణమై శరీరమధ్యమున సూక్ష్మరూపంతో ప్రవేశిస్తోంది. అట్లు ప్రవేశించిన చైతన్యమును 'జీవుడు' అని అంటున్నాం.

ఆ జీవుడు వాసనల వలన అవయవములను కల్పించుకుంటున్నాడు. ఆ అవయవములతో కలిగిన సంబంధం చేత భౌతికమైన పుష్టిని పొంది బాహ్య అభ్యంతరములకు 'స్పందితుడు' అగుచున్నాడు.

| | | |
|---|---|---|
| 'అహం' భావము | వలన | అహంకారమును, |
| మననము | వలన | మనస్సును, |
| నిశ్చయము | వలన | బుద్ధిని |
| ఇంద్రియస్నేహము | వలన | పదార్థజగత్తును, |
| దేహభావము | వలన | దేహమును ... |

... ఇట్లే తదితర విషయములన్నీ పొందుచూ పుర్యష్టకము (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ–మనోబుద్ధి–చిత్తముల సమ్మేళణం) అని పిలువబడుటకు అర్హుడగుచున్నాడు.

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియ వ్యాపారములు | ప్రవర్తిస్తున్నప్పుడు | జ్ఞాతృత్వముగాను, |
| కర్మేంద్రియ వ్యాపారములతో | ప్రవర్తితమైనప్పుడు | కర్తృత్వముగాను |
| వాటి ఫలములను పొందునట్లు | భావిస్తున్నప్పుడు | భోక్తృత్వముగాను |
| వాటన్నిటా ఉదాసీనము | పూనినప్పుడు | సాక్షిత్వముగాను, |
| భోగములందు | అధ్యస్థమౌతున్నప్పుడు | చిత్రప్రధానముగాను |
| విషయములను | పర్యాలోచించినప్పుడు | జీవుడుగాను, |
| జడప్రధానంగా | యోచిస్తున్నప్పుడు | పుర్యష్టకంగాను, |

...చెప్పబడటం, స్వీకరించటం జరుగుతోంది.

❖

ఇట్లు శరీరమున ప్రవేశించిన జీవుడు కాలక్రమంగా తాదాత్మ్యబుద్ధిని పొంది ఆయా కాల సంభవములగు సుఖదుఃఖములను పొందుచున్నాడు. పుర్యష్టకము యొక్క స్వభావమును అనుసరించి అనంతవాసనాకల్పితములగు రూపములను ఆతడు ధరిస్తున్నాడు. నేలపై ఉంచబడిన బీజము ... నీళ్ళు చల్లినప్పుడు... అది చిగురించి ఒక మహావృక్షమవుతోంది చూచావా? ఈ జీవుడు కూడా వాసనా సేవితుడై జగత్ రూపాన్ని ధరిస్తున్నాడు. మిథ్యాజ్ఞాన కారణంగా తన యొక్క ఆద్యరూపాన్ని ఏమరచి తనను ఈ శరీరాదులుగా భావించుకుంటున్నాడు. సముద్ర తరంగాలలో పడిన చెక్క ముక్క పైకి క్రిందికి తేలియాడుచూ ఎక్కడెక్కడికో తీసుకుపోబడుతుంది. అట్లాగే వాసనాక్రాంతుడగు జీవుడు కూడా సంసార సముద్రంలో పడి ఉత్కృష్ట, నికృష్ట జన్మల వైపు బలవంతంగా ఈడ్వబడుచున్నాడు.

అయితే ...సనకుడు, సనందనుడు మొదలైన మహనీయుల వంటి శుద్ధాత్మలు తమ ఇతః పూర్వపు సాధనాబలం చేత ఈ కల్పంలో తమ ప్రథమ జన్మయందే 'బోధ'ను పొందుచున్నాడు. భవబంధ విముక్తుడై పరమపదమున వెలయుచున్నాడు. మరికొందరు జీవులు కొద్దిజన్మల తరువాత, ఇంకా కొందరు జీవులు చాలా జన్మలు ఎత్తి చాలా కాలం శ్రమించిన తరువాత ఆత్మజ్ఞానం సంపాదించుకుంటున్నారు. క్రమక్రమానుసారం పరమపదమును పొందుచున్నారు.

ఇదీ ...శరీరం దాల్చే విధానం.

❖

ఇంద్రియముల సాయంతో వస్తువులను గ్రహించటం, చిత్తము యొక్క శరీరముగా వివర్తమొందిన చైతన్యం 'పంచేంద్రియములు, మనస్సు'తో కూడి ప్రవర్తించటం ఆరంభిస్తోంది. ఆయా వస్తువులతో కూడిన బాహ్యదృశ్యము తన వద్దకు అరుదెంచుచుండగా తాను ఈ చక్షువులు ఆక్రమించియున్న ఆకాశమునందు ప్రవేశించి అందలి చైతన్యముతో ఏకమగుచున్నది.

ఇంకొక రకంగా చెప్పాలంటే ...ఆ జీవుడు 'చైతన్యస్పర్శ' అను అధ్యాసతో వస్తువునకు సంబంధించిన ఒకానొక ఏకత్వము పొందుచున్నాడు. ఆయా విషయములన్నీ అజ్ఞానము చేత అట్లట్లు లభిస్తున్నాయి. అట్టి బాహ్య విషయములతో సంపర్కం జీవచైతన్యముతో కూడిన శరీరములోని

ఇంద్రియములకు మాత్రమే ఏర్పడటం జరుగుతోంది. మృతుని దేహంలో చైతన్యం ప్రసరించక పోవటంచేత కేవల జడ ఇంద్రియములకు 'అనుభవం' అనేది ఉండటం లేదు.




'ధ్యాస' అను ప్రతిబింబం తిరిగి వచ్చి కల్పనలకు కర్త అయిన జీవుని అంతరంగంలో ప్రవేశించి 'అనుభవము' అనబడుదానికి యోగ్యమగుచున్నది. ఇక జీవుడు ఎట్టి కల్పన చేస్తున్నాడో ...అట్టి అనుభవాన్నే పొందుచున్నాడు. అంతేగాని... 'అనుభవం' అనేది బయట ఎచ్చటనో లేదు.

❖

ఈ నేత్రగోళములు నియమించబడినప్పుడు బాహ్యమైన గోడ కుండ మొదలైన చిత్తవృత్తులు అందులో ప్రవేశిస్తున్నాయి. అటు కన్ను గోళాలలో ప్రవేశించిన ప్రతిబింబంతో జీవుడు తన ధ్యాస అను శక్తితో కూడినప్పుడు మాత్రమే ఇది 'కుండ, గోడ' మొదలైన దృశ్యానుభవం ఏర్పడటం జరుగుతోంది. ఇట్టి సంయోగసంజనితానుభవం ఒక బాలునకు, పశువుకు, లతకు కూడా ఏర్పడుతోంది.

జీవుని లోపల ఎక్కడో ఉన్న దివ్యకిరణములు బాహ్యంగా దూరమున ఉన్న విషయములను ఆలింగనం చేసుకుని ఆ విషయమునకు సంబంధించిన జ్ఞానమును జీవునికి అందిస్తోంది. దానికి జీవుడు స్వసంస్కారానుసారంగా అనుభవంగా గ్రహిస్తున్నాడు. అట్లాగే ఆకాశం నుండి శబ్దం చెవి యందు ప్రవేశించుట చేత, గంధము వాయువు నుండి నాశికా పుటములలో ప్రవేశించుట చేత వాటి వాటి జ్ఞానాన్ని జీవుడు 'అనుభవం' అను రూపాన్ని ఇస్తున్నాడు. కనుక దృశ్యం పట్ల ఏర్పడే అనుభవ అభినివేశ, తిరస్కార, నిర్లిప్తాదులకు అసలైన కారణం జీవుడే (ద్రష్టయే).

జీవుని యందు ఏదైతే ప్రతిబింబిస్తోందో ...అద్దానినే 'జగత్తు' అనే పేరుతో పిలుస్తున్నారు. అంతేగాని, 'జగత్తు' అనగా, – ఈ ఎదురుగా కనిపించే చెట్లు – ఇళ్ళు – వాకిళ్లు – ఊళ్ళు కాదు.

**శ్రీరాముడు :** హే జ్ఞానశ్రేష్ఠా! అత్యంత జడమైన అద్దంనందు, నీటియందు, లేత చిగురాకులయందు ప్రతిబింబము వలె కనిపించేదేమిటి? ...ఆ ప్రతిబింబానికీ, ఈ జీవునిలో ప్రతిబింబించు 'జగత్తు' అనుదానికి భేదమేమైనా ఉన్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అత్యంత జడములైన అద్దం–ప్రతిబింబం, చిత్త వృత్తులు–వస్తువు యొక్క అనుభవం ఒక్క తీరైనవే. అయితే ఈ జీవుని ద్రష్టత్వం, ఈ జీవుడు చూస్తున్న జగత్తు ...రెండు భ్రాంతియే.

ఈ జగత్తునందు నీకు విశ్వాసం కలుగకుండు గాక! వాస్తవానికి ఉన్నది చిత్సాగరం ఒక్కటే. ఈ అహంకారములన్నీ అనంత చిత్సాగరంలో చిన్నచిన్న తరంగాల వంటివి మాత్రమే.

అట్టి చిత్సాగరంలో దేశ కాలాదులనేవే లేవు. తరంగములన్నిటిలో జలం అనుశ్రుతమై ఉన్నది

కదా...! అట్లాగే ఆత్మ అహంకారములన్నిటిలో అనుస్రుతమై ఉన్నది. ఉన్న సత్యం ఇది. కాబట్టి ఎల్లవేళలా తదితరములపట్ల అనాసక్తచిత్తుడవై వెలయుము.

'ఈ సుఖదుఃఖములన్నీ మిథ్య' అని నీ బుద్ధి గ్రహించి శాంతియుతమై ఉండుగాక! భవమాయ అను వ్యాధి నుండి సర్వదా విముక్తుడవై ఉండెదవు గాక! ఏకాగ్రచిత్తంతో ఆనందమయమైన సామ్యభావమును అవలంబించు. బ్రహ్మభావమున నివిష్ఠుడవు కమ్ము.

❖❖❖

## 7. భ్రమలు తొలగాలంటే జ్ఞానోదయం కావాలి

**శ్రీరాముడు :** స్వామీ వసిష్ఠ మహర్షీ ! మీ వంటి ఉత్తమోత్తమ భవరోగ వైద్యుని సమీపించినట్టి రోగికి ఇక భయమెక్కడిది? మీరు చెప్పేది పరమసత్యం. మాకు వేరుగా ఏ ఆధారాలు అక్కర్లేదు.

అయినా సవినయంగా ఒక చిన్న ప్రశ్న మీ ముందు ఉంచుతున్నాను – ఆత్మయే స్వరూపంగా గల జీవునకు–కల్పనయే మూలంగా గల పుర్యష్టకమునకు సంబంధం ఎట్లా, ఎందుకు, ఏ కారణంగా, ఏ ప్రయోజనం కొరకు ఏర్పడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** శుద్ధ బ్రహ్మం నందు ఈ చక్షురాది ఇంద్రియాలు గాని వాటికి విషయాలైనవి గాని లేవు. అవన్నీ మొట్టమొదట సమష్ఠి జీవుని యందు (హిరణ్యగర్భుడు, పద్మజుడు, బ్రహ్మదేవుడు మొదలైనవి ఆ సమష్ఠి జీవుని పురాణనామాలు) అనుభూత మగుచున్నాయి. అవే ఈ వ్యష్టిజీవుని యందు కూడా అనుభవమౌతున్నాయి.

ఆ హిరణ్యగర్భుని యందు భావనాబలంచే పుర్యష్టకం, విషయాలను గ్రహించు శక్తి ద్యోతకమౌతున్నట్లే వ్యష్టిజీవుని యందు కూడా అవి ఉదయిస్తున్నాయి.

❖

ఇక్కడ వ్యష్టిజీవుడు, దేహముల గురించి కొన్ని విశేషాలు ప్రస్తావిస్తాను–

మాతృగర్భమున ఉన్న వ్యష్టిజీవుని (పిండానికి) 6వ మాసంలో పుర్యష్టకం, కళ్ళు మొదలైన ఇంద్రియాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇక అప్పటి నుండి ఆ పుర్యష్టకానికి సంబంధించిన మాధ్యమం ద్వారా గాంచుచున్నాడు. సర్వప్రథముడగు సమష్ఠి జీవుని మనస్సులో లాగానే వ్యష్టిలో కూడా సంవేదన (The act of knowing) ఇంద్రియాలు సుసంపన్నమౌతున్నాయి. ఇక సంవిత్తు (The Knower) అంటావా? వ్యష్టిలో సంవిత్తు, సమష్ఠి జీవుని (హిరణ్యగర్భుని) సంవిత్తు ఒక్కటే. అనగా సృష్టికి ముందు సంవిత్తు నందు 'వ్యష్టి – సమష్ఠి' అనే భేదం లేదు.

సంవిత్తు సర్వదా విశుద్ధమే. అద్దాని యందు జలతరంగంలాగా 'అహం' అనే అభిమానం పునాదిగా గల పుర్యష్టకం బయల్వెడలుతోంది.

సంవిత్తు సర్వదా ఏకమాత్రము, అనంతము, విశుద్ధము అఖండము, అనిర్దేశమూ కూడా!

నిర్దోషము, నిర్మలము అగు సంవిత్తు నందు మరొకదాని ఉనికి అసంభవం. అద్దాని యందు గుణదోషములు గాని, మనస్సు గాని, మరింకేమియు గాని లేవు.

సంవిత్తు ఒక్కటే సత్యం. మిగిలినవన్నీ అసత్యములు. ఈ స్థూలములు, ఈ దేశకాలములు, ఈ వ్యష్టి – సమష్టి... ఇవన్ని పరిచ్ఛిన్నములు.

సంవిత్తు మనస్సు యొక్క రూపం, మనస్సుకు ఉద్భవస్థానం. మనస్సు అనగా – మననమునకు గోచరమగు 'బుద్ధి' వృత్తి ... యొక్క అధ్యాసయే కదా!

వాస్తవానికి ఆ సంవిత్తు మనస్సు కాదు. బుద్ధికాదు. జీవుడు కాదు. పుర్యష్టకం కాదు.

జ్ఞానప్రకాశమే సంవిత్ తత్త్వం యొక్క స్వరూపం – అని గ్రహించు. మూఢులు అద్దానిని 'లేదు' అనివచిస్తున్నారు. కాని అదియే మనస్సు, ఇంద్రియాలకు అతీతమై వెలయుచు "పరమాత్మ" అనబడుచున్నది. 'ఆ బ్రహ్మము లేక సంవిత్ నుండి చిన్మూర్తియు, మననాత్మకుడు అగు జీవుడు ఉద్భవిస్తున్నాడు' ...అనుమాట కూడా భ్రమయే అయినప్పటికీ, ఉపదేశ సౌకర్యార్థం అట్లని విజ్ఞులచే శిష్యపాఠంగా చెప్పబడుతోంది.

**శ్రీరాముడు :** స్వామీ! అత్యంత విశుద్ధుడు, సంవిత్ స్వరూపుడు అగు ఈ జీవునికి మరి ఈ ఆవరణ భూతమైన 'సంసారం' అనే వ్యాధి ఎక్కడి నుండి ఎట్లా వచ్చింది? ముందుగా ఈ విషయం చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామా! ఒకనికి వ్యాధి వచ్చి గొప్ప బాధపడుచున్నాడు. ఇప్పుడు 'ఈ వ్యాధి ఇతనికి ఏమి తింటే వచ్చింది? ఏం చేస్తే వచ్చేది కాదు?' అను మీమాంస ముఖ్యమా?... చికిత్స ముఖ్యమా?... చెప్పు!

**శ్రీరాముడు :** చికిత్స చేసి వ్యాధిని రూపుమాపటం ముఖ్యం...!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును కదా! ఇప్పుడీ జీవుని అవిద్య వచ్చి బాధిస్తోంది. "ఎందుకొచ్చింది? ఎప్పుడొచ్చింది? ఏం చేస్తే వచ్చింది?" అను ప్రశ్నలకన్నా, ...ఇప్పుడేం చేయాలి? అవిద్య ఎట్లా తొలగుతుంది? ఏ ఏ విచారణాది ప్రయత్నములకు ఉపక్రమించాలి?"... అనునది ముఖ్యం. ఈ విషయం మన సంవాదంలో మనం చెప్పుకొనియే ఉన్నాం. ఇప్పుడు "అవిద్య అంటే ఏమిటి? విద్య ఏమిటి?" అనునది విచారణ చేయటం అత్యంతావశ్యకం. అట్లా విచారణ చేస్తూరాగా...స్వస్వరూపం పరిశేషించగలదు. తత్సంబంధమైన తదితర విషయాలన్నీ వాటంతట అవే అవగతమౌతాయి.

❖

'సంవిత్'– జ్ఞానస్వరూపం. అట్టి జ్ఞానము ప్రశాంతమైనది. అదియే నిఖిల వస్తువులలో నిండి ఉన్నది. ఒక చిన్న మణిలో పెద్ద పర్వతం ప్రతిబింబిస్తున్నట్లు జ్ఞానమునందే ఈ ఆకాశము మొదలైనవి ప్రతిబింబిస్తున్నాయి. వ్యవహారరీత్యా సత్యములని అనిపిస్తున్నప్పటికీ ఈ పదార్థాలన్నీ వాస్తవం కాదు. అయితే ఇవన్నీ జ్ఞానమునందే వెలయుచున్నాయి. అట్టి సంవిత్జ్ఞానము కొరకు నీవు జగత్ సంబంధ మైన సర్వ విషయములు సమర్పించి వేయి. జీవన్ముక్తమున వెలయుచూ నిర్మలుడవై ప్రకాశించు.

**శ్రీరాముడు :** ఈ దృశ్యజగత్తులో కనిపించే పదార్థముల అసలు రూపం ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** దృశ్య జగత్తులో కనిపించే పదార్థాలన్నీ అవిద్య చేతనే అట్లు పదార్థరూపంలో కనిపిస్తున్నాయి. వాటియొక్క అసలురూపం అవిద్యయే! ఒక్కసారి అవిద్యనే పరికించి చూచావా ... వీటన్నిటి యొక్క అవిద్యారూపం తొలగిపోయి, ఇక మరల ఉదయించదు.

**శ్రీరాముడు :** హే ఆప్తబంధూ ! కనులకు ఎదురుగా కనిపిస్తున్న ఈ వస్తుజాలమును అసత్తుగా అంగీకరించటం ...ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓహో! అదా నీ సందేహం! అట్లా అయితే ఈ కనబడే వస్తువులన్నీ అందరికీ ఒకే తీరుగా కనిపిస్తూ ఉండాలి కదా! అది అట్లా జరుగుతోందా? ఒక గడ్డిపరక ఆవుకు మృష్టాన్న భోజనంలా కనిపిస్తోంది. మరి మనిషికో? అట్లా కనిపిస్తోందా?...లేదు.

వస్తువులన్నీ కూడా ఎండమావులలాగా భ్రమాత్మకములే! అవి అసత్తు అయి ఉండి కూడా అజ్ఞానం వల్ల సత్స్వరూపంగా తోచుచున్నాయి. నాయనా! భ్రమ తొలగాలంటే జ్ఞానోదయం కావాలి. అప్పుడే వాటి వాస్తవ స్వరూపం గోచరిస్తుంది.

'జీవుడు' 'పుర్యష్టకం' మొదలైనవన్నీ అవిద్యా భ్రమలేనయ్యా! అయితే సత్యమగు ఆత్మ యొక్క సాన్నిధ్యంలోనే అవిద్య యొక్క కల్పన కలుగుతోంది. అట్టి కల్పనావిభాగమును మనం అసత్ అని అంటున్నాం. 'అవిద్య చేతనే ఈ జీవుడు తదితరజీవులు' మొదలుగా గల కల్పనలు దర్శించబడు చున్నాయి ...అని శాస్త్రములు ఘోషిస్తున్నాయి.

**శ్రీరాముడు :** అవిద్య అంటే ఏమిటో, దాని ఆనుపానులు ఎట్లు ఉంటాయో మరల ఈ సందర్భమునకు ఉచితమగునట్లు వివరించండి.

❖❖❖

# 8. అవిద్యయొక్క ఆనుపానులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! విషయ రహితం, వ్యాపకరహితమగు చిత్ తత్త్వం ఒకానొకప్పుడు నిశ్చల జలంలోని తరంగంలాగా "అంతరంగ బాహ్యత్వములు" అనే విభాగమునకు సంబంధించిన ఒకానొక ఉత్సుకత పొందుతోంది. 'బాహ్యకళ' అను కళంకముచే పుర్యష్టకాదులుగా ప్రభవిస్తోంది. అనగా చిత్ చిత్తత్వమును స్వీకరించడం జరుగుతోంది. అట్టి చిత్తత్వముతో ఏ వస్తువును ఏ రూపంగా భావిస్తున్నదో ...అది అట్లే ప్రాప్తింపజేసుకుంటోంది. బాలుడు మనస్సులో భూతమును కల్పించుకొని రాత్రిపూట కనబడే మోడువారిన చెట్టును ఒక భూతంలాగా భావించి అనుభూతి పొందుతాడు చూచావా? జీవచైతన్యము కూడా స్వయంగా పంచతన్మాత్ర (శబ, స్పర్శ, రూప, రస, గంధముల) కల్పనను సత్యమైనట్లు భావనను ఆశ్రయించి జీవరూపమును పొందుతోంది. ఆ తరువాత తన యందు ఇంద్రియాలు ఏర్పడుటను కూడా గాంచుచున్నది. అంకురం నుండి వృక్షశాఖలు ఏర్పడి ... ఆ వృక్షశాఖలు అంకురము కంటే వేరైనట్లు తోచుచున్నాయి కదా! అట్లాగే ఈ దృశ్య జగత్తు చిత్ కంటే వేరుగా తోచుచున్నది. చిత్ స్వరూపుడగు ఈ జీవుడు మనస్సు-కుండ మొదలైన బాహ్యా

వస్తువులను తన వాసనానుసారంగా సత్యములే అని భావిస్తున్నాడు. చంద్ర కిరణములుగా గాంచ బడుచున్నది చంద్రప్రకాశమేగాని మరొకటి కాదు కదా! ...విషయేంద్రియ సంబంధం వలన కలుగుచున్న విషయసుఖములు ఆ చైతన్యము యొక్క ఆత్మానందమే!

మిరియం యొక్క కారం మిరియం నుండి వేరు కాదు. శూన్యం అనేది ఆకాశం నుండి వేరు కాదు. విషయ విజ్ఞానాలన్నీ ఆత్మనుండి వేరు కాదు. "సంసార విషయాలు భోగించాలి" అనేది ఆత్మ యొక్క 'సంకల్పం' అను ఆవరణ నుండే బయలుదేరుచున్నాయి. ఆ తరువాత "అట్టి బంధ నియమం నుండి వైతొలగాలి" అను పురుషార్థం ఆశ్రయించబడినప్పుడు ఆ భ్రమేచ్ఛ తొలగి స్వస్వరూపప్రకాశం అనుభవమౌతోంది. ఈ రెండవ పురుషార్థం కొరకు శాస్త్రాలు పారలౌకిక కర్మలు, కార్యక్రమాలు ప్రతిపాదిస్తున్నాయి. ఖండసారి పానకమే పటిక బెల్లం అవుచున్నది చూచావా? ఆత్మయే ప్రవృత్తిని వదలి నివృత్తి మార్గం కొరకై శాస్త్రాలను అనుసరించుట, తద్వారా నివృత్తి ఫలాన్ని పొందటం జరుగు తోంది. ఒకటి మరొకదాని ప్రయత్న దార్ఢ్యం వలన ఓడింపబడుతోంది. ఈ విధంగా ఈ ప్రవృత్తి–నివృత్తి అను రెండు మార్గములు అనంతకాలంగా వెలయుచున్నాయి. కానీ...

**సంనివేశవికారాదిదేశకాలాదిసంభవాత్ ।**
**సంభవత్యత్ర సత్వీశే దేశకాలాద్యసంభవాత్ ॥** (శ్లో॥ 28, సర్గ 51)

ఆత్మ ఆకాశము వలె పరివర్తనను కలిగిఉన్నది కాదు. ఎందుకంటే దేశకాలాది పరిచ్ఛిన్నములు, సంయోగ వియోగాలు, తదితర వికారాలు ఉన్న చోట మాత్రమే పరివర్తనం అనేది సంభవిస్తుంది. ఆత్మ యందు అవన్నీ ఏవీ లేవు. కనుక ఆత్మకు పరివర్తనం అసంభవం.

❖

వసంతకాల–రసం వనంలో ప్రవేశించినప్పుడు అది ఒకచోట పుష్పం గాను, మరోచోట లేచిగురు రెమ్మలుగాను మారుచున్నది. ఏది ఎట్లు ఏర్పడుచున్నా రసం ఒక్కటే! కాని ఆ రసం వివిధమైన ప్రకటన లను కలిగి ఉంటోంది. వాటి నుండి వివిధ కార్యాలు నెరవేర్చబడుచున్నాయి. అట్లే ఆత్మ తనయందు "ఇది కుండ, ఇది గోడ" అను రూపంలో ద్వైతభావం పొందుతోంది. వాస్తవానికి అద్దాని సత్త అద్వితీయ మైనది. మేఘము మొట్టమొదట సూర్యకిరణ రూపముననే ఉండి ఆ తరువాత తన కిరణ ప్రభావంతో జలాన్ని స్వీకరించి మేఘ స్వరూపం సంతరించుకొని ...మరల వర్షించి తరువాత యథారూపంగా సూర్యకిరణ తత్త్వంగా శేషిస్తోంది కదా! సదసద్రూపమగు ఆత్మ కూడా జగత్తుగా మారి ఆ తరువాత వచ్చే జగత్తులకు తానే కారణకారణమై ఉంటోంది. సర్వేశ్వరుడగు ఆత్మయందు "ఇది ఇట్లు అవుతుంది ...అది అట్లు కాదు" అను రూపముగల భావనలన్నీ విస్తరించి ఉన్నాయి. ఈ క్రమమును ఖండించటం ఎవరి వల్ల అవుతుంది?

పరిశీలించి చూస్తే స్వచ్ఛమగు ఆకాశమునకు మార్పు చేర్పులు ఏమి ఉంటాయి? ఆకాశమునందు ఆకాశమే ఏర్పడి ఉన్నట్లు ఆత్మ యందు ఆత్మయే సర్వదా నెలకొని ఉన్నది. ఆత్మ యందు ఆత్మయే ఎల్లప్పుడు ప్రకాశిస్తోంది కాని ...అందు మరొకటేదీ ఏర్పడటం లేదు, ప్రకాశించటం లేదు.

❖❖❖

# 9. జన్మ - జన్మాంతరములు

కానీ... ఏకము, అద్వితీయము అగు చిన్మయము స్వాభావికంగా భావనలు పొందుతోంది. అట్లు భావననుండే ద్వైతము అనుభూతమౌతోంది. అట్లు పొందుచున్నప్పుడు వస్తువులు శక్తిగను, జీవుడుగను ప్రతిబింబిస్తోంది. బంగారం చేత తయారయిన ఆభరణాలు బంగారం యొక్క ఉనికి చేతనే పచ్చటి ఛాయలు వెదజల్లుచున్నాయి కదా! బంగారం, ఆభరణం లాగా మనస్సు నందు చైతన్యము, జడము కలసి ఉంటున్నాయి.

ఈ ఆత్మను ఎవరు ఎట్లు గ్రహిస్తున్నారో ...అది అసత్యమైనప్పటికీ అట్లే జరుగుతోంది. ఇక అద్దానికి తిరుగు లేకుండా పోతోంది. బంగారము అన్ని ఆభరణములలోనూ ఉన్నది కదా!

చిత్తు సర్వవ్యాపకము!... అద్దాని చైతన్యము మనస్సులో కూడా ఉన్నది.

చిత్త-దేహాలకు కారణమైన ఈ చైతన్యం ఎప్పుడు ఎక్కడ ఏ రీతిగా భావించుకుంటోందో ... అప్పుడు అక్కడ ఆ రీతిగా దేవ, నం, స్థావరాది భావాలను పొందుతోంది. ఈ చిత్తం తన యందలి వాసనావికాస వైచిత్ర్యాన్ని అనుసరించి నానావిధ ఆకారాలను, కాలనియమాలను "ఉపాధుల ఆగమన, నిష్క్రమణములను" పొందుతోంది. అదంతా స్వప్నంలాగా భాసిస్తోంది. స్వప్నంలో "నగరం-పూతోట-జనులను" చూస్తున్నట్లే జీవుడు ఒక ఉపాధికి సంబంధించిన శబ్ద, స్పర్శ, రూపాది విషయాలు, తదితర ఉపాధులతో సంబంధ బాంధవ్యాలు పొందుతోంది. ఆ ఉపాధి తరువాత వేరే మరొక ఉపాధి, దానితో వేరే మరికొన్ని సంబంధాలు ... ఈ విధంగా ఈ వ్యవహారం జీవుని పట్ల చర్విత చర్వణంలాగా జరిగిపోతోంది. మెళుకువతో ఉన్నవాడు నిదురపోవటం, ఆ నిదురలో స్వప్నం, ఆ స్వప్నంలో ఏవేవో విశేషాలు గాంచడం, ఆ గాంచుచున్నప్పుడు మెళుకువ (జాగ్రత్) కు సంబంధించి ఏ విషయమూ దృష్టి - జ్ఞప్తులందు ఉండకపోవడం మరల మెళుకువకు వచ్చినప్పుడు యథాతథంగా ఉండి ఉండటం జరుగుతోంది చూచావా? ఈ జీవుడు కూడా ఒక ఉపాధితో ప్రవేశించటం, ఉపాధి సహితుడై చరిస్తూ కొంతకాలం తరువాత ఉపాధిరహిత యథాతథస్థితి పొందటం జరుగుతోంది. ఏ స్వప్నమూ శాశ్వతం కాదు. కాని స్వప్న ద్రష్ట మాత్రం శాశ్వతం కదా! అట్లాగే ఏ ఉపాధీ శాశ్వతం కాదు. ఉపాధులద్రష్టగా తానుమాత్రం శాశ్వతం!

**శ్రీరాముడు :** ఈ జనన మరణాలు జీవుని పట్ల ఎందుకు ఏర్పడుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవిద్య వలన జీవుడు ప్రతిభాసను గాంచుచున్నాడయ్యా! నిజానికి జన్మించటం, మరణించటం కూడా వాస్తవములు కావు.

**శ్రీరాముడు :** మరణానంతర ప్రతిభాస కూడా ఈ జీవించి ఉన్నప్పటి ప్రతిభాస వంటిదేనా?... ఆ రెండిటికీ గల సంబంధమేమిటి? విభేదమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మరణానంతర ప్రతిభాస ఈ దేహం ఉన్నప్పటి వంటి ప్రతిభాస వంటిది కాదు. ఎందుకంటే ... ఈ దేహం ఉన్నప్పుడు జీవుడు బాల్య-యౌవన-వార్ధక్యములు తదనుగుణమైన

సంబంధ బాంధవ్యములు, అనుభవములు పొందుతున్నాడు కదా! అవన్నీ కాలానుగతంగా కాలబద్ధమై ఏర్పడుతున్నాయి.

ఇక మరణాంతర ప్రతిభాసకు వస్తే ...ఆ స్థితి కాలబద్ధమైనది కాదు. కానీ వాసనాబద్ధమైనది. వాసనలు శరీరం ఉన్నప్పుడు లేనప్పుడు ఈ జీవుని ప్రభావితం చేస్తూ తదనంతర స్థితిగతులను నిర్ణయిస్తున్నాయి. అనగా "మరొక శరీరం పొందటం" అనేది కేవలం వాసనలవలననే జరుగుతోంది గాని, కాలం వలన జరగటం లేదు.

అలాగే స్వప్నమునకు – జీవజాగ్రత్ జగత్తుకు మరొక తేడా ఉన్నది. స్వప్నంలో చూడబడుచున్న జగత్తు ఆ సమయమందలి ఊహ – వాసనల సమ్మేళనముచే ఏర్పడుచున్నది. ఆ స్వప్నంలోంచి ఆ స్వప్న ద్రష్ట అటు 'గాఢనిద్ర' అను జడస్థితికో, (లేక) 'మెళుకువ' అను జాగ్రత్‌స్థితికో పయనించి అప్పటి వరకూ గాంచుచున్న స్వప్నాన్ని అంతటితో అక్కడే త్యజిస్తున్నాడు. అది ఊహ యొక్క రాక పోకల వంటిది.

ఇక... జాగ్రత్ విషయానికి వస్తే... ఆ జీవుడు అనంతకాలంనుండి కలిగి ఉంటున్నట్టి వాసనలలో ఏవేవైతే మరణసమయంలో గోచరమౌతాయో... అవి భావి శరీరానికి కారణమౌతున్నాయి.

**శ్రీరాముడు :** మరణ సమయంలో గోచరించే వాసనలకు ఏదైనా ప్రత్యేకమైన కారణమున్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్టి మృత్యు సమయ వాసనాదార్ఢ్యం అనేదానికి కారణం అనేక జన్మ పరంపరల అభ్యాసమేగాని ... దానికి మరొకటేదీ కారణం కాదు. జీవితాంతం ఆశ్రయిస్తూ వస్తున్న వివశత వలన "నేను అస్వాతంత్రుడను" అనే భావన గట్టిపడి అది పునర్జన్మకు మూలకారణమౌతోంది.

**శ్రీరాముడు :** తండ్రీ! మరి అందుకు ఉపాయమేమిటి? ఇక గత్యంతరం లేదా? ఈ జన్మ మృత్యు పునర్జన్మల పంజరంలో జీవుడు కొట్టుకుంటూ ఉండాల్సిందేనా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మార్గాంతరం (గత్యంతరం) ఎందుకు లేదు? ఉండబట్టే మనం ఈ సంవాదమునకు ఉద్యుక్తులమయ్యాం కదా! శాస్త్రాలు ఈ జీవునకు కొన్ని మహావాక్యాలు ప్రసాదిస్తున్నాయి. (అహమ్ బ్రహ్మాఽస్మి ...తత్త్వమ్...సోహమ్... సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ) ఇట్టి మహావాక్యార్థం యొక్క నిరంతర మననం వలన " నేను అఖండ–అప్రమేయమైన బ్రహ్మాన్ని; సర్వతత్త్వ స్వరూపుడను" ...అను సదవగాహన సుస్థిరమౌతుంది. అదే బ్రహ్మభావన. దానిని బ్రహ్మసాక్షాత్కారం అని కూడా పిలుస్తున్నారు.

అట్టి బ్రహ్మభావన మాత్రం వాసనామయస్వప్నం వంటిది కాదు. దానినే వివిధ శాస్త్రాలు "చిత్‌బ్రహ్మము, శివము, అద్వైతము, చతుర్థము" మొదలైన శబ్దములతో ప్రవచిస్తున్నాయి. ఆ చిత్ భగవానుడు "తత్ జాగ్రత్" దృష్టిచే, లేక, "తురీయ దృష్టి" చేత గాంచబడుచున్నాడు.

ఓ రాఘవా! ఇక్కడ ఏ జాగ్రత్–స్వప్న–సుషుప్త్యావస్థలు కనిపిస్తున్నాయో... ఇవన్నీ ఆ బ్రాహ్మీ స్థితి సముపార్జించిన యోగి దృష్టిలో లేవు. అందుచేత ఆ మూడిటిచే ఆతడు లభ్యుడు, అనుభవ గమ్యుడు కాడని గ్రహించు. అట్టి మహనీయుడు వాసనారహితుడవటంచేత ఆతడు వాసనా సహితులగు వారిచే గుర్తించబడుట లేదు.

ఈ కనబడే జీవులంతా కూడా అట్టి నిర్మల, నిరంజన చైతన్యమేగాని మరింకొకటేదీ కాదు. అట్టి అద్వితీయుడగు చిదాత్మయే ఇక్కడ మనకు జీవుడుగా ప్రకటితుడగుచున్నాడు. తన యొక్క చిత్స్వభావం వల్ల ఇక్కడ పూర్వపు "దృష్ట - అదృష్ట" వస్తువులను విషయాలను గుర్తు ఉండి, గుర్తు లేక కూడా స్వప్నమునందు లాగా గాంచుచున్నాడు.

నిరంతర భావనాపరంపరల విశేషం చేత ఈ సంసారజీవునికి ఇంతవరకూ చూడబడిన విషయాలు, అభిప్రాయాలు, అనుభవాలు, అభిరుచులు క్రమంగా సన్నగిల్లి ఆ స్థానంలో కాలక్రమేణా కొత్తవి వచ్చి చేరుతున్నాయి. కొన్ని కొద్దికాలంలో లుప్తమైపోతున్నాయి. మరికొన్ని దీర్ఘకాలం ఉంటున్నాయి. జలంలో తరంగంలాగా పుట్టిన ప్రతిభావన ఒక రోజుకు లయించ వలసిందే! కానీ ఇంతలో నూతన తరంగంలాగా వాసనానుసారంగా నూతన భావనలు వచ్చిపడుతున్నాయి. దీని కంతటికీ ఒక క్రమముగాని, నియమము గాని ఉండవలసిన అవసరం లేదు. ఎందుకంటే, అవన్నీ ఆపాదితాలైనవే కదా! పైగా, పురుష ప్రయత్నం వాసనలను జయించగలుగుతుంది - అని మనం అనుకున్నాం కదా!

**ప్రాక్తనీ వాసనాద్యాపి, పౌరుషేనైవ జీయతే ।**
**హ్యః కుకర్మాద్యయత్నేన ప్రయాతి హి సుకర్మతామ్ ॥**

నిన్న చేయబడిన ఒక అపక్రమమైన కార్యము ఈ రోజు ఆచరించబడే సుకర్మయొక్క ప్రభావంచేత సక్రమమమైపోగలదుగా! ఉత్తమ ప్రయత్నశీలురు వాసనలు తప్పక జయించగలుగుతారు.

❖❖❖

# 10. మోక్ష తత్త్వము

ఈ జీవుడు, దేహము మొదలైనవన్నీ వాసనల యొక్క పరిణామమే సుమా! ఇవన్నీ ఉపశమించాలంటే ఉపాయం ఒక్కటే. ఆ ఉపాయము, లేక లక్ష్య స్థానమునకు శాస్త్రకారులు 'మోక్షము' అను పేరు పెట్టారు. మోక్షము అంటే 'నేను - ఈ జగత్తు కూడా సర్వ వాసనలకు సంబంధం లేనట్టి అప్రమేయమగు శివము లేక ఆత్మతత్త్వమే' అను అచంచల దృఢ నిశ్చయం.

మోక్షము లభించే వరకు ఈ జీవుడు - జన్మ - పునర్జన్మలు తప్పునవి కావు. ఈ ఇంద్రియములు - దేశకాలములు వికసించటం, ముకుళించటం మోక్ష పర్యంతమూ కొనసాగుతూనే ఉంటుంది. వాసనలు శేషించునంతవరకూ దీనిని నిరోధించటం ఎవరితరం కాదు. బాలుని స్వకీయ కల్పనలే భూతములను సృష్టిస్తున్నాయి. అట్లాగా, వాసనయే పంచభూత పరికల్పితమైన ఈ శరీరములను తోపింపజేస్తున్నాయి. శరీరంగా కల్పించబడుచున్న వాసనలు మోక్ష పర్యంతమూ ఉంటూనే ఉంటాయి.

'పుర్యష్టకం' అంటే ఏమిటి? 'మనస్సు, బుది, అహంకారము, పంచతన్మాత్రలు' ...అను వాటితో గూడిన ఆతివాహికమైన సూక్ష్మ శరీరమే కదా! అయితే, చిదాత్మ యొక్క స్వరూపం అమూర్తం (formless) - అపంచీకృతం (భూమి, అగ్ని మొదలైన పంచభూతములచే తయారు కాబడినది కాదు) కూడా!

ఈ భౌతికమైన ఆకాశం పంచీకృతం. చిత్‌యో? అది దేనితోనూ తయారుకాబడినది కాదు. ఈ జీవుని లింగదేహం (సూక్ష్మదేహం, అతివాహిక దేహం) భావనామయం మాత్రమే! అందులో పంచభూతాలు లేవు. కాల, ఆకాశాలు లేవు. కనుక మనో–బుద్ధి–చిత్త–అహంకారములతో కూడిన సూక్ష్మదేహం కూడా అపంచీకృతమే!

**శ్రీరాముడు :** "మోక్షము" అనునది స్థూల దేహానికా? సూక్ష్మదేహానికా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్థూలమైన దానికి ముక్తి లేదు. బంధమూ లేదు. అసలు ముక్తి అంటే ఏమిటని అనుకుంటున్నావ్? వైరాగ్యాదులు అభ్యసిస్తూ రాగా... కల్పనలన్నీ తొలగిపోతాయి. కల్పనలున్నది ఆతివాహిక (లేక, లింగ) దేహంలోనేగాని స్థూల దేహంలోకాదు. కల్పనలన్నీ అతిక్రమించబడగా నీ కల్పనారహిత స్వస్వరూపం నీకు అవగాహన కావటమే, అనుభవ లభ్యమగుచుండుటమే ముక్తి – మోక్షం కూడా! కల్పనలకు ఆది మూలము అయిన నీవే ఆ సద్వస్తువు కదా! జడ కల్పనలన్నీ స్వస్వరూపంలో విలీనమొనర్చబడగా అప్పుడు సుషుప్తినిబోలిన చైతన్యం యొక్క అనుభవమాత్రమైన ముక్తిస్థితి ఈ జీవునకు లభిస్తుంది.

చూచావా? అది లభించటం, లభించకపోవటం ఈ జీవుని చేతిలోనే ఉన్నది. 'అది నాకెట్లా లభిస్తుంది? అది సులభమా?' అనే మీమాంస ఈ జీవుడు ఎంతగా త్యజించవలసియున్నదో నీవు గమనిస్తున్నావు కదా!

స్వప్నంతో పోల్చతగ్గ ఈ సూక్ష్మ శరీరం మోక్షం లభించనంత వరకు స్థావర జంగమాత్మక యోనులలో పరిభ్రమిస్తూనే ఉంటుంది. ఒకే దేహం ఒకప్పుడు జాగ్రత్‌ను, మరొకప్పుడు స్వప్నమును, ఇంకొకప్పుడు సుషుప్తిని పొందటం చూస్తూనే ఉన్నాం కదా! సుషుప్తిలో మనస్సు ఈ జాగ్రత్ – స్వప్నములను విలీనం చేసుకుని బీజభావమున దీపిస్తోంది.

స్థావరాది యోనులలో సుషుప్తి అత్యంత ఘనీభూతమై ఉన్నది. కించిత్ జాగ్రత్‌తో కూడి వృక్షయోనులలో కొంత తక్కువగా, కొంచెం ప్రబోధము ఉన్నది. అట్టి ప్రబోధం మనుష్యులలో మరింత జాగృతంగాను, ఉత్సాహంగాను ఉన్నది. సుషుప్తి కూడా కొంత చోటు చేసుకునియే ఉన్నది. అదియే గాఢనిద్రా పరవశస్థితి.

చిత్తము యొక్క జాడ్యప్రకర్షణయే సుషుప్తి... చిత్త భ్రమణమే సంసృతి... తత్వబోధయే విముక్తి.

ఇక తురీయావస్థ స్వస్వరూపమునందు జాగృత్ వంటిది – అని శాస్త్రములు మనకు బోధిస్తున్నవి. ఆత్మశాస్త్ర ప్రవచనముల ప్రబోధము వలన జీవుడు నిర్మలుడై విశుద్ధుడై 'పరమాత్మ' అగుచున్నాడు. జీవుడు స్వస్వరూపము విషయమై ప్రబోధితుడవటమే ముక్తి అని అనబడుతోంది. అట్టి ముక్తి జీవన్ముక్తి అని, విదేహముక్తి అని రెండు విధములుగా చెప్పబడుతోంది. దేహపరిమితమైన సర్వ స్పృహలు జయించి... అనంత దేహత్వము – సర్వ దేహాతీతత్వములను సంతరించుకున్నప్పటి నిశ్చల స్వస్వరూపానుభవమే విదేహ ముక్తిగా చెప్పుచున్నారు.

ఏదైతే జాగృత్ – స్వప్న – సుషుప్తులలో మార్పు చేర్పులు లేక, నిర్విషయమై నిరాధారమై, అస్పృశ్యమై అనునిత్యం అనుశ్రుతంగా ప్రసరించి ఉన్నదో … అట్టి ఈ జీవుని వాస్తవ స్వరూపమును 'తురీయ' మంటున్నారు. దానినే బోధ అని కూడా పిలుస్తున్నారు. తనను తాను తురీయముగా అవగాహన చేసుకొను అవస్థ తురీయావస్థ. తురీయావస్థ నుండి జీవుడు తురీయాతీతమును సంపాదించు కుంటున్నాడు. అదియే 'చిన్మాత్రము, బ్రహ్మ స్వరూపం పొందటం!'

బుద్ధి యొక్క పురుషకార ప్రయత్నము వలన "బోధ" లేక, "తురీయము" అనునవి లభించటం జరుగుతోంది. అట్టి పురుషకారబలంచేత, తత్త్వజ్ఞానబలం చేత పరమాత్మను గురించిన ప్రమాణములన్నీ ఈ శరీరము కలిగియున్నప్పుడే గ్రహించి తన్మయుడౌతున్నాడు. "ఇంతవరకు సత్యమని నమ్మిన శరీరములు – భయములు – అన్నీ కూడా దీర్ఘమైన స్వప్నవిభ్రమం" – అని గ్రహిస్తాడు.

ఎందుకంటే జీవుని అంతరమున చిత్కళ కాక మరింకేమీ లేదు. ఆ చిత్కళనే అన్యభావంగా గాంచి ఈ జీవుడు నిష్కారణంగా శోకిస్తున్నాడు. ఈ జీవునిలో ఆ పరమాత్మగాక ఇంకేమీ లేదు. ఇక, ఇక్కడ–అక్కడ కనబడే జగత్తు ఏమిటంటావా?

**యత్రయత్ర జగత్ దృష్టమ్, అహో! మాయావిజృంభితమ్!**
**స్థల్యన్తః క్వథత్ అంబూనాం, యథానానా భ్రమోదయః**
**జీవాణూనాం తథైవాంతః మిథ్యా సంసరణోదయః**
**బన్ధోస్య – "వాసనాబన్ధో", మోక్షస్యాతౌ వాసనాలయః" ॥**

ఇక్కడ ఏ ఏ జగత్తు కనబడుచున్నదో … ఇదంతా వాసనావిజృంభణము మాత్రమే. మూకుడులో మరుగుచున్న నీరు రకరకాల రూపవిన్యాసములను దాలుస్తూ కనబడుతుంది చూచావ్? అట్లా చిత్ చైతన్యము సంసారమునందు అనేకానేక జీవుల రూపంలో వారి అంతరంగముల రూపంలో కనబడుతోంది.

వాసనల చేతనే అట్లా కనిపిస్తోంది. జీవునకు వాసనా బంధమే బంధము. ఆ వాసనలు లయించుటయే మోక్షం. జడమగు సుషుప్తి వాసనలకు పరమావధి.

తురీయాతీతమో … వాసనారాహిత్యం …! జీవుని నిజస్వరూపం వాసనారహితమైన తురీయమే అయున్నది. అది మరచి వాసనల ననుసరించటం చేతనే స్వప్నంలోలాగా స్థావరాది వివిధ భావనలు జీవుడు పరిగ్రహిస్తున్నాడు.

వాసనలు తీవ్రంగా ఉన్నప్పుడు స్థావరయోనులు పొందుచున్నాడు. వాసనలు మధ్యస్థాయిలో ఉన్నప్పుడు జంతుయోనులను పొందుచున్నాడు. వాసనలు తక్కువగా ఉంటే మనుష్య, గంధర్వ రూపములు పొందుచున్నాడు.

వాసనల పెరుగు తరుగులే తదనంతర ఉపాధులను నిర్ణయిస్తున్నాయి. సుషుప్తి తొలగి, ఆపాదమస్తకం ప్రాణాహంకారము ప్రసరించినప్పుడు 'నేను ఇట్టి శరీరమును కలిగి ఉన్నాను. ఇది నా బాహ్యమైన జగత్తు' అను భావనకు బద్ధుడగుచున్నాడు.

ఓ రామచంద్రా! ఇదంతా స్వప్నంలో కనిపించిన తటాకంలో జలతరంగం వంటిది మాత్రమే! వృత్తులచే వాస్తవానికి విచ్ఛిన్నుడు కానట్టి ఈ జీవుని అంతఃకరణం నుంచి కళ్ళు మొదలైన ఇంద్రియముల ద్వారా 'ఎరుక' అను స్రవంతి ఈ కుండ – గోడ మొదలైన వస్తువులపై ప్రసరించి వాటిని 'ఎరుగుట' అను రసముతో నింపివేస్తోంది. అప్పుడు 'గ్రహించునది – గ్రహించబడునది' అను రూపంలో వాసనల యొక్క సత్త విచిత్రంగా స్ఫురిస్తోంది.

ఇట్లు అంతఃస్థితమగు ఆత్మచైతన్యమే గ్రాహ్య – గ్రాహక – వాసనా రూపమున 'దృశ్యము' అనబడు మృగతృష్ణగా ప్రకాశిస్తోంది. సకల గ్రాహ్య – గ్రాహక సంబంధములు వాసనాధ్యస్తములైన భ్రమలు మాత్రమే. మరింకేమీ కాదు. ఇక ఈ దృశ్యము వాస్తవమెట్లా అవుతుంది చెప్పు? నిజానికి ఇక్కడ ఆత్మ గ్రహించునది గాని, త్యజించునది గాని ఏదీ లేదు. చిదాత్మ ఒక్కటే బయట – లోపల కూడా ప్రకాశిస్తోంది. ఈ త్రిజగత్తులు చిత్ చమత్కృతియే.

నిజంగా, అవలోకిస్తే సముద్రంలో తరంగాలు, సుడులు, బుడగలు, జలమునకు వేరుగా ఉన్నాయా? లేదు. సముద్రమంతా జలమయమే కదా! ఈ జగత్తునందు వాసనలు అవస్థలు దృష్టి యొక్క అవస్థలు మాత్రమే.

అనాద్యము, ఆద్యము కూడా అయినట్టి అయిన పరమపదమే ఇదంతానయ్యా!

❖❖❖

# V. శ్రీకృష్ణార్జున సంవాదం

## 1 అనాసక్తి యోగం

**శ్రీరాముడు:** హే సద్గురూ! మీరు ఈ జాగ్రత్‌ను స్వప్నం వంటిది మాత్రమేనని సిద్ధాంతీకరిస్తున్నారు కదా! స్వప్నం విషయానికి వస్తే ప్రతి ఒక్క జీవుని స్వప్నం ప్రత్యేకమై, ప్రక్కన ఉన్నవానికి సంబంధించనిదై ఉంటోంది. జాగ్రత్ అట్లా ఉండటం లేదు. ఒక గోడ – కొండలవలెనే ప్రాప్తిస్తోంది. అనేకులందరికీ ఒకే విధంగా ఉంటున్న ఈ జాగ్రదవస్థ స్వప్నం వంటిదని అనటం ఎంతవరకు కుదురుతుంది?

ఈ ప్రశ్నకు మీరు సమాధానం ఇతఃపూర్వపు ప్రకరణంలో ప్రవచించటం జరిగింది. అయితే ఈ నిర్వాణ ప్రకరణం సందర్భంలో ఈ విషయమై మీ విశ్లేషణ, ప్రవచనాలను వినాలని ఉంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'ఈ జాగ్రత్ సమష్టి జీవుని స్వప్నము మాత్రమే' అని వేదాంత వాఙ్మయం ప్రకటిస్తోంది. ఇదంతా కల్పిత సంసారం. ఇది సత్యం కాదు. అసత్యం కాదు. సమష్టిజీవుని స్వప్నం ఈ వ్యష్టి జీవుని స్వప్నం కంటే విశిష్టమైనది. అయితే ప్రతి ఒక్క జీవుని జాగ్రత్ భావాలు ఆ జీవుని 'జాగ్రత్‌స్వప్నం' మాత్రమే! ఒక జీవుని నిద్రా సంబంధమైన స్వప్నం ఊహాసంబంధమై కొన్ని క్షణాలలో పుట్టి, కొద్ది క్షణాలలోనే నశిస్తోంది. సమష్టిజీవుని స్వప్నం కూడా "అసత్యము, అవస్తువు" అయి ఉన్నది. అయితే, కాలమానం దృష్ట్యా కొంత సుదీర్ఘకాలం వెలయుచున్నది. అట్లాగే, ఈ జాగ్రత్ స్వప్నం కంటే మరికొంత అధికంగా సత్యము వలె తోచుచున్నది. అయినా రెండూ సత్యం కాదు.

ఈ జీవుడు ఒక స్వప్నం గాంచిన తరువాత అందుకు భిన్నమైన మరొక స్వప్నం గాంచుచున్నాడు కదా! అట్లాగే సమష్టి జీవుని కల్పనలో ఈ వ్యక్తిగత జీవుడు ప్రవేశించి ఒక్కొక్క ఉపాధితో ఒక్కొక్క విభిన్నమైన స్వప్నకాలిక సుదీర్ఘానుభవం పొందుతున్నాడు. ప్రతి ఒక్కని ప్రతిఒక్క జాగ్రత్ అనుభవంలో స్వప్న సదృశ్యమైన అసత్యం రాజ్యం ఏలుతోంది. సమష్టి జీవుని (హిరణ్యగర్భుని) కల్పనామహిమ ఇట్టిది మరి!

ఈ జీవుని పట్ల, "ఒక దేహం, తదనంతరం మరొక దేహం" – అను రూపంగా కనిపించే ప్రహసనం కూడా, "ఒక స్వప్నం, మరునాడు కనిపించే మరొక స్వప్నం" – అను వ్యవహారం వంటిదే!

అజడమైనట్టి బ్రహ్మవస్తువు... సమష్టి జీవుని 'అంశ' అయినట్టి ఈ వ్యక్తిగత జీవుని మోహవశమై జడంగా గాంచబడుచున్నది. స్వయంజ్యోతి అయిన ఆత్మప్రకాశం ఈ సమష్టి–వ్యష్టి కల్పనల రూపంలో 'స్వప్నభ్రమ' అనే జగన్నాటకం ప్రదర్శిస్తోంది. ఆత్మ ప్రకాశమే లేకపోతే సమష్టి జీవుడు లేడు... వ్యక్తిగత జీవుడు ఉండడు ...జగత్తు ఉండజాలదు. స్వప్న ద్రష్ట లేకపోతే స్వప్నం ఎవరికి?

అయితే, ఆత్మ యథాతథం. ఈ జగత్తు ఆత్మ యొక్క భావనా చమత్కారం మాత్రమే! ఇక దేని గురించైనా దిగులుదేనికి? వేదన ఎందుకు?

సూర్యుని వలన ప్రకాశించే ఈ త్రిజగత్తులలోనికి జీవులు పరస్పర భేదకల్పనలు ఒనర్చుకొని భ్రమిస్తున్నారు. ఈ వ్యక్తిగత భ్రమలకు మూలకారణమైన సమష్టి జీవుడు అనంతుడు. ఆత్మ సర్వగతం అవటం చేత అది ఎక్కడ ఏ కల్పనకు ఉపక్రమిస్తే అక్కడ ఆ కల్పన అట్లే పరిఢవిల్లుతోంది. ఇటువంటి మాయా కల్పితమైన దృశ్యమునందు ఏర్పడి ఉన్న కల్పనపట్ల ఆసక్తి అనవసరం. ఆసక్తియే బంధము. అనాసక్తియే ముక్తి. రాబోయే ద్వాపర యుగంలో మహావిష్ణువు శ్రీ కృష్ణుడుగా అవతరించినప్పుడు ఈ అనాసక్తియోగం గురించి ఆయన అర్జునునకు ఉపదేశించటం జరుగుతుంది. పాండునందనుడగు అర్జునుడు యుద్ధమునకు ఉపక్రమించే ముందు శ్రీకృష్ణభగవానుడు ప్రవచించబోయే "దృశ్య అనాసక్తి, యోగాభ్యాసంచే పెంపొందగల ఆత్మయోగం" విని తరిస్తాడు.

**శ్రీరాముడు:** స్వామి! రాబోయే యుగంలో జరగబోయే మహత్తరమగు ఆ శ్రీకృష్ణార్జున సంవాదంలోని కొన్ని ముఖ్య విశేషాలు విశదీకరించమని ప్రార్థిస్తున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** విను ...చెపుతాను.

❖❖❖

## 2 ఆత్మకు జననమరణాలు లేవు

ఆకాశమును ఆశ్రయించుకొని ఆకాశము వెలయుచున్నట్లు... కేవల ఆత్మను ఆశ్రయించుకుని ఆద్యంతరహితమైన అస్తి – సన్మాత్రము అనునది ఆత్మచే పరికల్పించబడి అనంతమై వెలయుచున్నది.

నిర్వికారమగు ఆత్మయందు వికారరూపమగు ఈ సంసారభ్రమ అంతా గాంచబడుచున్నది. బంగారంలోనే రకరకాల ఆభరణాలు, జలంలోనే రకరకాల తరంగాలు ఉంటున్నాయి కదా! ఆత్మ యందే ఈ 14 విధములైన జీవజాలాలు (చతుర్దశభువనాలు) వలలో చిక్కుకున్న పక్షులలాగా చిక్కి ఉంటున్నాయి. ఇక శ్రుతి, స్మృతులలో వర్ణించబడిన యమ, ఇంద్ర, చంద్ర, సూర్యాది లోక పాలకులు ఈ భూత పంచకంతో కూడిన సంసారానికీ, ఇందలి లోకాలకూ నాయకత్వం వహిస్తూ ఉంటున్నారు. ఆ లోకపాలకులు – ధర్మాధర్మములను, సుకృత దుష్కృతాలను అనుసరించి జీవులకు శుభాశుభప్రదాతలై లోకాలు పాలిస్తున్నారు.

లోకపాలకులలో ఒకడైన యమభగవానుడు సృష్టి ప్రారంభం నుండి ఇప్పటి వరకూ కర్మఫల ప్రదాతగా నిగ్రహ–అనుగ్రహముల రూపంలో ధర్మాధర్మప్రవృత్తులను అనుసరించి జీవులకు అధమ – ఉత్తమ ఉపాధులు ప్రసాదిస్తూ ఉంటున్నారు. తాను మాత్రం స్థిరచిత్తుడై ఆత్మానుభవి అయి, నిశ్చలుడై తన నియమిత విధులను నిర్వర్తిస్తున్నాడు.

ఆ యముడు ప్రాణులను హింసించుట వలన కలిగే వికలములను తొలగించుకొనుటకు ప్రతి ద్వాపర యుగాంతంలోనూ తపస్సు చేస్తూ ఉంటాడు. ఆయన ఒకప్పుడు 8 ఏళ్ళు, మరొకప్పుడు 10 ఏళ్ళు, ఇంకొకప్పుడు 12–14 సంవత్సరాలు ... తపస్సు చేస్తూ ఉంటారు. అట్లా తపోనియమితులై ఔదార్యం వహించి ఉన్నప్పుడు మృత్యువు ఈ జగత్తునందలి ఏ ప్రాణినీ స్వయంగా హింసించదు.

నిదురిస్తున్న మదపుటేనుగును వేలాది దోమలు ఆశ్రయిస్తున్నట్లు ఆ సమయంలో ఈ భూమండలం అనేక విధములైన జీవులతో నిండి ఉంటుంది. అప్పుడు విచిత్రజీవులతో నిండిన ఈ భూదేవత యొక్క భారాన్ని తగ్గించటానికి దేవతలు అనేక ఉపాయాలతో సంహారకార్యం నిర్వర్తిస్తారు. ఈ విధంగా భూభారం తగ్గించటం కొన్ని వేలసార్లు జరిగింది.

రాబోయే ద్వాపరయుగంలో కూడా సూర్యపుత్రుడు, పితృ నాయకుడు అగు యముడు ప్రాణి హింస వలన కలిగిన సంతాపం పోగొట్టుకోవటానికి 12 సంవత్సరాల పాటు తపస్సు చేస్తాడు. అప్పుడీలోకంలో మృత్యువు అనేదే ఉండదు. భూమి అంతా చెట్టు, పుట్టలతో నిండి భారవంతం అవుతుంది. అప్పుడు భూమాత భూభారం సహించలేక డస్సిపోతుంది. పరాభూత అయి, దీన అయి తనపతి అగు శ్రీహరిని శరణువేడుతుంది. అప్పుడు శ్రీహరి దేవతల అంశను పరిగ్రహించి నర - నారాయణులు అను రెండు రూపాలతో అవతరిస్తాడు. ఆ నర-నారాయణులలో నరుడు పాండవ మధ్యముడైన అర్జునుడు గాను, నారాయణుడు దేవకీ వసుదేవుల సుతుడు శ్రీకృష్ణుడుగాను భూమిపై అవతరిస్తారు.

పాండవులు పాండురాజు కుమారులు. అందులో పెద్దవాడైన ధర్మనందనుడు యుధిష్ఠిరుడు అను పేరుతో ప్రసిద్ధికెక్కుతాడు. ఆతడు సముద్రము వంటి రాజ్యమునకు చక్రవర్తి అయి ధర్మవేత్తగా ఖ్యాతి గడిస్తాడు.

'దుర్యోధనుడు' అనునాతడు పాండవుల పెదతండ్రి అయిన దృతరాష్ట్రుని కుమారుడు. ఆ దుర్యోధనుడు పాండవులలో ద్వితీయుడైన భీమసేనునితో బద్ధవైరం కలిగి ఉంటాడు. కాలక్రమేణా దృతరాష్ట్రుని నూర్గురు కుమారులు, అతని తమ్ములు పాండురాజు యొక్క ఐదుగురు కుమారులు భూమండలం కొరకై 18 అక్షౌహిణీల సైన్యం సమకూర్చుకుని యుద్ధానికి సమాయత్తమౌతారు.

యుద్ధం ప్రారంభించే సమయంలో విష్ణు భగవానుని 'అర్జున'శరీరం 'యుద్ధం - జననాశనం' విషయంలో తర్జన భర్జన పడుతుంది. ప్రాకృతభావం పొందటం చేత హర్షామర్షాన్వితమై అజ్ఞాన యుక్తం అవుతుంది. "బంధువులను సంహరించడం ఉచితమా? యుద్ధము చేయకుండా ఊరుకోవడం ఉచితమా?" - అనే ధర్మసందేహం అతని అంతరంగాన్ని కలచివేస్తుంది. ఇక మహావీరుడగు అర్జునుడు ఇరువైపులా ఉన్న రక్త సంబంధీకులగు బంధువులను గాంచి 'అయ్యో! నా బంధువులను నేను వధించట మేమిటి?" అని తలచి అత్యంత విషాదం పొందుతాడు. అతని మనోదౌర్బల్యమును గమనించిన శ్రీకృష్ణ భగవానుడు ఉభయసేనల మధ్య రథంలో ఈ విధంగా అర్జునునకు బోధిస్తారు.

❖

**శ్రీకృష్ణ భగవానుడు:** ఓ అర్జునా! ఏమిటి నీ మీమాంస? నీ బంధుజనులు మరణిస్తారేమోననా? "ఇది ధర్మమా? కాదా?" అనునది నీకు పరిశీలనాయోగ్యం కావాలే తప్ప, జనన-మరణములను, బంధు-అబంధుత్వాలను బట్టి కర్తవ్య-అకర్తవ్యములను నిర్ణయించటం ఉచితమనిపించుకోదు సుమా! ఇక్కడ చంపే వారెవ్వరు? చచ్చే వారెవరు? నీవు గాని, నీ బంధువులు గాని, తదితరులు గాని

ఆత్మయే స్వరూపంగా కలిగి ఉన్నారు. అంతేగాని, ఈ ఎదురుగా కనిపిస్తున్న పాంచభౌతికదేహములు మనందరి అసలు స్వరూపం కాదు.

ప్రతి జీవుడు ఆత్మస్వరూపుడే గాని, భౌతికదేహ పరిమితుడు కానే కాదు. ఆత్మకు జనన మరణాలు లేవు. ఈ దృశ్య-దేహ-మనో-బుద్ధి-చిత్త-అహంకారా లనే ఆరు రకాల భావాలు ఆత్మ యందు లేవు. ఆత్మ అనునది ఇప్పుడు గాని, ఇతఃపూర్వం గాని, ఇకముందు గాని జన్మ పొందటం లేదు. మరణించటం లేదు. అది నిత్యమై, వాస్తవమై, పురాతనమై – సదా వెలుగొందుచున్నది. శరీరాలు రావచ్చు, పోవచ్చు... ఆత్మకు ఏమీ అవదు. ఆత్మను చంపుచున్నామని గాని, తామే చచ్చుచున్నామని గాని తలచేవారు నిర్వికారమగు ఆత్మతత్త్వమేమిటో ఎరుగనివారు మాత్రమే! ఆత్మ ఎవరినీ చంపదు, తాను చావదు. అనంతము, ఏకరూపము, సత్‌స్వరూపము, ఆకాశము కంటే సూక్ష్మము, సర్వదా అప్రమేయము అగు ఆత్మను ఎవరేం చేయగలరు?

కాబట్టి అర్జునా! నీవు ఆత్మను అఖండముగా, అనంతముగా, ఆదిమధ్యాంత రహితముగా గ్రహించు. నీవు ఎవరనుకుంటున్నావ్? అపరిచ్ఛిన్నము, దోషరహితము, చైతన్యస్వరూపము అగు ఆత్మవే నీవు! అందుచేత, ఇక్కడ పాంచభౌతిక విషయమైన బంధు సంయోగ-వియోగములకు సంబంధించిన సుఖదుఃఖములు నిన్ను ఎట్లా అంటగలవు చెప్పు?

❖❖❖

## 3 కర్మ రహస్యం

**శ్రీకృష్ణ భగవానుడు:**

**అర్జున! త్వం నహన్తా! త్వమ్ అభిమానమలం త్యజ ।**
**జరామరణనిర్ముక్తః స్వయమాత్మాసి శాశ్వతః ॥**

ఓ అర్జునా! శాశ్వతము, జరా-మరణములు ఉండనిది అగు ఆత్మవే నీవు. కనుక "నేను చంపబోవువాడను కదా"! మొదలైన స్వల్ప అభిమానములను పరిత్యజించు.

**యస్య నాహంకృతో భావో, బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వాపి స ఇమాంల్లోకాన్ నహన్తి న నిబధ్యతే ॥**

ఎవనికి "నేను దీనికి కర్తను అను" అహంకారం కించిత్ కూడా ఉండదో, ఎవరి బుద్ధి అయితే దోషరహితమై ఉంటుందో... అట్టివాడు ఆయా క్రియలచే బంధింపబడుటలేదు. ఎవడైనా సరే, తన లోపల ఎట్టి జ్ఞానం కలిగి ఉంటాడో, బాహ్యమున అట్టి అనుభవమే పొందుతూ ఉంటాడు. కాబట్టి దేహాభిమానాన్ని త్యజించు. అప్పుడు దేహాలచే స్పర్శించబడనట్టి దేహిని నీవు దర్శించగలుగుతావు.

**అర్జునుడు:** హే కృష్ణా! ఈ బంధువధను తలచుకున్నప్పుడు నేను పరితాపం పొందుచున్నాను. ఇది ఎట్లా తొలిగేది?

**శ్రీకృష్ణ భగవానుడు:** నీ పరితాపమునకు కారణమేమిటి? చెపుతాను... విను. "నేను వీరిని చంపు వాడను" అను హంతకత్వపు అభిమానం నిన్ను ఆవరించింది. ధర్మాధర్మముల విచక్షణను వదలి పాపాదులను స్మరించి సుఖదుఃఖములకు లోను అగుచున్నావు. నిజానికి ఈ ప్రపంచంలో ఆత్మను ఆవరించి ఉన్నట్లు కనిపించే సత్వరజస్తమో గుణములే ఆయా కర్మలను ఆచరిస్తున్నాయి. అది అట్లు జరుగుచుండగా అహంకారముచే విమూఢుడగు ఈ జీవుడు 'ఇదంతా నేనే చేస్తున్నాను' అని అనుకుని భ్రమ పొందుచున్నాడు. అట్టి 'అహంకర్తాస్మి' అనే కర్తృత్వ భావనతో గర్వించుటయో, వాపోవుటయో చేస్తున్నాడు. తాను కర్తృత్వ భోక్తృత్వరహితమగు ఆత్మననే విషయం ఏమరుస్తున్నాడు.

**చక్షుః పశ్యతు కర్ణశ్చ శృణోతు, త్వక్ స్పృత్విశదమ్ ।**
**రసనాచ రసం యాతు కాఽత్ర కోఽహమితి స్థితిః? ॥**

మహాత్ముల దృష్టి ఇంకోరకంగా ఉన్నది. 'కన్నులు చూస్తున్నాయి. చెవులు వింటున్నాయి. చర్మం స్పర్శించుచున్నది. నాలుక రుచి చూస్తోంది. వీటితో నాకేమి సంబంధం?" అని వారు భావన చేస్తున్నారు. అంతఃకరణమునకు బహిర్ ఇంద్రియములకు వేరైన విశిష్టమైన ఆత్మస్వరూపులమని, ఆత్మ దేనికి సంబంధించినది కాదని (అప్రమేయమని) గ్రహించి ఉంటున్నారు. కాబట్టి "వీరు కష్టం పొందుచున్నారే!' అనువారి ఆత్మకు ఆ కష్టాలతో ఏమి సంబంధం? అర్జునా! అనేక విశేషాలు ఒకచోట ఒనగూడుటచే జరిగే ఒకానొక కార్యమును చూచి ఈ జీవుడు 'ఇదంతా నా వలననే జరుగుచున్నది' అని అనుకోవటం ఎంతటి హాస్యాస్పదం? అది దురభిమానం కాక మరేమిటి?

కర్మలు అందరూ చేస్తున్నారు. అయితే...

**కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వా "ఆత్మశుద్ధయే" ॥**

యుక్తాయుక్త వివేకులగు యోగులు కూడా కర్మలు నిర్వర్తిస్తున్నారు. అయితే ఈ మనో–బుద్ధి –ఇంద్రియ–శరీరములను ఆయా కార్యములందు నియమించి 'సంగము' అనేది లేకుండా, కేవలం ఆత్మశుద్ధి కొరకు ఆయా నియమిత శాస్త్ర ప్రవచిత కర్మలు లోక కళ్యాణమును, లోకానుకూలతను దృష్టిలో పెట్టుకొని సేవాభావంగా స్వధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. ఎవరి శరీరమందైతే అహంకారం అనే దుర్గంధం అలముకొని ఉండదో... ఎవ్వరు రాగద్వేష రహితులై ఉంటారో... అట్టివారు ఈ లోక వ్యవహారములు ఆచరిస్తున్నప్పటికీ భోగించని వారే! దుశ్శీలుడైన మానవుడు తెలివి కలవాడైనా, పండితుడైనా శోభించడు కదా! అట్లాగే మమకారం అనేది ఉన్నచోట ఆత్మత్వం భాసించదు.

**నిర్మమో, నిరహంకారః, సమదుఃఖసుఖః క్షమీ,**
**యః స కార్యమకార్యం వా, కుర్వన్నపి న లిప్యతే ॥**

అహంకార, మమకారాలు లేనివాడు, సుఖదుఃఖాలను సమంగా గాంచువాడు, క్షమాశీలుడైన వాడు ఆయా కార్యాలను నెరవేరుస్తున్నప్పటికీ లిప్తుడు కాడు. ఓ పాండుసుతా! ఈ క్షాత్రవ కర్మయే ఇప్పటి నీ స్వధర్మమైయున్నది. స్వకర్మ అనునది ఎటువంటిదైనా సరే... అది తప్పక శుభం చేకూరు స్తుంది. ఈ యుద్ధం చేయుట అనే కర్మ కుత్సితం మొదలైన ఆయా దోషాలతో కూడుకుని ఉండవచ్చు

గాక. అయినప్పటికీ నీ యొక్క ధర్మ నిర్వహణార్థం నీకు నియమించబడినది. నీవు నిర్వర్తించవలసిందే. అయితే, నీ ఈ శాస్త్రవిహిత స్వధర్మమును సర్వాత్మకుడగు పరమాత్మకు సమర్పిస్తూ ఆరాధనాపూర్వకంగా నిర్వర్తించావా... నీ స్వధర్మం నిన్ను అమృతతుల్యునిగా చేస్తుంది. ఈ ప్రపంచంలో ఒక మూర్ఖునకు కూడా స్వధర్మమే శ్రేయోదాయకం అవుతోంది. ఇక ధర్మరక్షణ కంకణధారివైన నీవంటి బుద్ధిమంతునకు వేరే చెప్పేదేమున్నది?... అహంకార రాహిత్యుని జయాపజయములు లిప్తం చేయలేవు.

**యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా ధనంజయా!**

**నిః సంగస్త్వం యథాప్రాప్త కర్మన్న నిబధ్యతే ॥**

ఓ ధనంజయా! నీవు బ్రహ్మ పరిపూర్ణమగు బుద్ధితో ఆసక్తిని పరిత్యజించి కర్మలను నిర్వర్తించు. నిస్సంగివై యథాప్రాప్తములైన కర్మలను నిర్వర్తించు. సంగరహితుడవై స్వధర్మ నిరతిపూర్వకంగా కర్మలను ఆచరిస్తూ ఉంటే, అప్పుడు ఆ కర్మలు నిన్ను బద్ధునిగా చేయజాలవు. కాబట్టి ఆయా సర్వ సందర్భములలో శాంతమగు బ్రహ్మభావముతో కూడుకొని ఉండు. ఉద్వేగరహితుడవై 'ఈ కర్మలన్నీ బ్రహ్మమయములే' అను ఎరుకతో ఆచరించు.

బ్రహ్మపూర్ణమగు ఆచరణ కలవాడు తత్-క్షణంలో బ్రహ్మమే అగుచున్నాడు.

ఒకవేళ 'బ్రహ్మము' అనబడే సత్ చిత్ ను స్వభావసిద్ధంగా ఆశ్రయించి ఉండటం కష్టమనిపిస్తోందా? నీవు చేస్తున్న సర్వ కర్మలు సమర్పణ చేసి ఆ కర్మలు నిర్వర్తించే నీవు మాత్రం ఈశ్వరాత్ముడవై నిరామయుడవై ఉండుము. "ఈశ్వరుడు సర్వజీవులయందు సమస్థితుడై ఒకే రీతిగా వెలయుచున్నాడు" అని గ్రహించి ఉండటమే ఈశ్వరాత్మత్వం. అట్టి అవగాహనచే నీవు ఈ భూమండలమునకే ఒక అలంకారమై ఉంటావు. క్రమంగా సంకల్పములన్నిటినీ సంపూర్ణంగా త్యజించివేయి. శాంతచిత్తుడవు, సమదర్శివి కమ్ము. అట్టి అభ్యాసం చేత ముక్తి లభించగలదు.

మోహం తొలగాలంటే సత్సాంగత్యము, ఈశ్వరార్పణపూర్వకమైన కర్మనిరతి, బ్రహ్మార్పణము, జ్ఞానయోగము అనునవే మార్గములు.

**అర్జునుడు:** హే కృష్ణా! నా అజ్ఞాన మోహం తొలగడానికి గాను – 1. సత్సాంగత్యం, 2. ఈశ్వరార్పణం, 3. జ్ఞానయోగం, 4. బ్రహ్మార్పణం – వీటి గురించి సవివరంగా చెప్పండి.

**శ్రీకృష్ణ భగవానుడు:** ...విను.

1. **సత్సాంగత్యము -** 'సత్' స్వభావమునకు సంబంధించిన శ్రవణమననాదులు, జ్ఞానులతో స్నేహం, సంభాషణ, శ్రవణం.
2. **ఈశ్వరార్పణము -** సహజీవులను ఈశ్వరరూపంగా దర్శించటం. ఈశ్వర సేవాభావంతో ప్రేమ, కరుణ మొ॥న సాత్త్విక గుణములను ప్రవృద్ధపరచుకోవటం
3. **జ్ఞాన యోగము -** ఉత్తమ బుద్ధిని సంపాదించుకునే ప్రయత్నములే 'జ్ఞానయోగ స్థితి' కి త్రోవ తీస్తున్నాయి.
4. **బ్రహ్మార్పణం -** "నేను, జగత్తు" మొదలైన వాటి యందు ఏర్పడే అహంభావాన్ని బ్రహ్మానికి సమర్పించటం. అంటే 'అధ్యాస'ను అధిష్ఠానమైన బ్రహ్మానికి అభిముఖం చేయటం. సర్వం బ్రహ్మమునకు చెందినవిగా భావన కలిగిఉండటం.

ఓ అర్జునా! బ్రహ్మం అంతర్‌శూన్యమై, బహిర్‌శూన్యమై పాషాణం వలె చిద్ఘనమై, పరమశాంతమై, ఆకాశకోశము వలె స్వచ్ఛమై వెలయుచున్నది. అయ్యది ఈ దృశ్యం కంటే, ఈ దృశ్యాన్ని పరికించే ద్రష్ట కంటే కూడా అత్యంత సూక్ష్మము. అయితే ఏం? అట్టి బ్రహ్మము నుండి ఈ స్థూల జగత్తుల అనుభవం ఉత్పన్నమౌతోంది. అట్లు జగత్తుగా తోచుచున్నదంతా స్వప్నసదృశమే!

బ్రహ్మమునందు జగత్తులు ఆరోపించబడుచున్నాయి. అనగా... బ్రహ్మము యొక్క స్వల్పాంశము లోని అత్యంత స్వల్ప విభాగమునందు 'జీవుడు' అనునది భ్రమచే ఆరోపించబడుతోంది.

అట్టి భ్రమయందు (బ్రహ్మము వేరు, ఈ జీవుడు వేరు–అను అల్పదృష్టులందు) నీవు మాత్రం చిక్కుకోవద్దు. నిజానికి ఏ వస్తువునందైతే పరిచ్ఛేదము ఏర్పడటానికి ఏమాత్రం వీలే లేదో... అట్టి అపరిచ్ఛేద వస్తువునందు పరిచ్ఛేదము స్వీయ అజ్ఞానముచే దర్శించబడుతోంది. ఏది ఎట్లు ఉన్నప్పటికీ, బ్రహ్మము నందు పరిచ్ఛేద, అపరిచ్ఛేద సంబంధమైన అహంభావం యుక్తియుక్తమే కాదు. అఖండమైన వస్తువునందు అనేకత్వ భావనను ముందు వదలివేయటం అభ్యసించు. 'అహంకారము అనబడేది కూడా బ్రహ్మము నుండి వేరైనది కాదు' అను అవగాహనను పెంపొందించుకో. జలమయమగు సముద్రంలో జలరూపములగు తరంగాలు కనబడుచున్నట్లు బ్రహ్మమునందు అహంకార–మమకార, తరంగ–ఉపతరంగాలు స్ఫురిస్తున్నాయి. ఇక దేనిని చూచైనా ఎందుకు దుఃఖించటం చెప్పు? విచిత్రము లైన 'భిన్న భావాలు' అనే వైచిత్ర్యాలు జ్ఞానమయమైన ఆత్మయందు భ్రమచే స్ఫురిస్తున్నాయి. ఎందులో అయితే ఈ నానాత్వము, తదితర భావపరంపరలూ స్ఫురిస్తున్నాయో, అది సత్యవస్తువగు ఆత్మయే అయి ఉన్నది. అట్టి ఏకత్వము నందు నీ బుద్ధిని ఎందుకు నిలపరాదో చెప్పు?

ఈ విధంగా ఉత్తమబుద్ధితో విమర్శించి సారాసారములను గ్రహించిన పురుషుని యందు క్రమంగా "అహం–నాది" అనునవి ఉపశమిస్తున్నాయి. అప్పుడు అకృత్రిమమైన కర్మఫలత్యాగం సిద్ధించ గలదు. అట్టి అకృత్రిమ ఫలత్యాగమును సన్యాసము అని పిలువబుడుచున్నది.

కర్మఫలత్యాగ పూర్వకమైన సన్న్యాసము వలన సంకల్పత్యాగం అనే అసంగస్థితి నీకు సుసాధ్య మౌతుంది. తద్ద్వారా కర్మల పట్ల ఈశ్వరార్పిత బుద్ధి జనించి, సుదృఢమౌతుంది. కల్పన లన్నీ ఈశ్వరుని యందు ఏకీభూతమొనర్చి, ద్వైతబుద్ధిని విలీనమొనర్చుటే ఈశ్వరార్పణం.

**అర్జునుడు:** ఈ భేద భావాలన్నీ ఎందుకు ఏర్పడుచున్నాయి?

**శ్రీకృష్ణ భగవానుడు:** అనేకం అనేది అజ్ఞానం వలన ఏకైక చిదాత్మయందే కల్పించబడుచున్నదని చెప్పాను కదా! జ్ఞానికి బ్రహ్మము, జగత్తు వేరువేరైనవి కావు.

ఓ విజయా! ఈ దిక్కులు, ఈ జగత్తు, ఈ ద్వైతాద్వైతములు, ఇక్కడి కర్మలు, అట్టి కర్మలను ఆశ్రయించి ఉన్న యోచనలు, కాలం, వస్తు సంబంధమైన భ్రాంతులు – ఇవన్నీ నేనే. అందుచేత నాయందు మనస్సు ఉంచుము. నా భక్తుడవు కమ్ము. అప్పుడు నన్నే పొందుతావు.

❖❖❖

# 4. పరాపరములు

**అర్జునుడు:**

**ద్వే రూపే తవ, దేవేశ! పరంచ, అపరమేవచ ।**
**కీదృశం తత్కదారూపం తిష్ఠామి ఆశ్రిత్య సిద్ధయే ॥**

హే దేవేశా! మీకు పరము, అపరము అను రెండు రూపములు ఉన్నాయని చెప్పగా విన్నాను. ఆ రెండు ఎట్టివి? ఆ రెండిటిలో దేనిని ఆశ్రయిస్తే త్వరగా సిద్ధిని పొందవచ్చు?

**శ్రీకృష్ణ భగవానుడు:** అవును. నాకు రెండు రూపాలున్నాయి.

**1. సామాన్య రూపము -** ఈ కాళ్ళుచేతులతో, శంఖచక్రగదాది ఆయుధాలతో కనిపించే రూపం. నీవు ప్రబోధితుడవు కానంత వరకు వేదవిధిని అనుసరించి ఈ సామాన్య (నామ-రూపాదులతో కూడిన) రూపాన్ని పూజించు.

**2. పరరూపం -** అది ఆద్యంతరహితమైనది. దీనిని బ్రహ్మం, ఆత్మ, పరమాత్మ మొదలైన శబ్దాలతో వేదోపనిషత్తులు పేర్కొంటున్నాయి. నీవు ప్రబోధితుడవు కానంత వరకూ సామాన్య రూపాన్ని దాటి చూడలేవు. ప్రబోధితుడవైన మరుక్షణం నా పరరూపాన్ని గ్రహిస్తావు. ఆద్యంతరహితమగు నా పర రూపమును గ్రహించావా... ఇక నీవు మరల జన్మించవు. చిత్తశుద్ధిని పొందితే గ్రహించ వలసిన దానిని గ్రహించ గలుగుతావు.

కాబట్టి నీవు సాధన సమయంలో ఈ నా సామాన్య రూపాన్ని (సాకారోపాసన) గ్రహించు. అయితే, సాధన కొనసాగుచుండగా అతిత్వరలో 'విజ్ఞానైక స్వభావమగు బ్రహ్మం సర్వదా విశుద్ధం' అను వినూత్నమైన అవగాహన పెంపొందుగాక. క్రమంగా విజ్ఞాన దృష్టిచే 'జీవుడనగా ఎవరు? ఈశ్వరుడు అనగా ఎవరు?' అను పరిశీలన నిర్వర్తించు. జీవేశ్వరులను వేదాంత పరిభాషలో త్వమ్, తత్ అను శబ్దాలచే ఉద్దేశిస్తున్నాయి. ఆ రెండిటిని శోధించుచూ పోవుచుండగా ఏకమగు అఖండాత్మ ప్రస్ఫుటం కాగలదు. అదియే నా నిజస్వరూపమని గ్రహించు.

**ఇదంచాఽహమ్ ఇదం చాఽహమ్ ఇతి యత్ ప్రవదామ్యహమ్ ।**
**తదేతత్ ఆత్మతత్త్వం తు తుభ్యం హి ఉపదిశామ్యహమ్ ॥**

అయితే, 'ఇది నేను, ఇది నేను' అని నాచే ప్రవచించబడే దానియొక్క ఉద్దేశము ప్రతి ఒక్క జీవుని స్వస్వరూపమగు ఆత్మతత్వమే, అనగా అధిష్ఠానము, సాధకుని స్వస్వరూపమగు ఆత్మతత్త్వాన్నే సూచిస్తున్నాయని సాధకులు మరువకూడదు సుమా! కనుక శంకలన్నీ పరిత్యజించి సర్వదా సత్యమగు ఏకాత్మయందు ప్రకాశించుము.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని ।**
**పశ్య త్వం యోగయుక్తాత్మా, సర్వత్ర సమదర్శనః ॥**

నీవు యోగయుక్తాత్ముడవగుము. సర్వభూతాలలో గల ఆత్మనే దర్శించు. సర్వభూతములను ఆత్మయందే దర్శించు. సర్వత్రా సమదర్శివై ప్రకాశించు!

**సర్వభూతస్థమాత్మానం, భజత్యేకత్వమాత్మనః ।**
**సర్వథా వర్తమానోపి, న స భూ యోఽభిజాయతే ॥**

ఏది ఎట్లు నిర్వర్తిస్తున్నప్పటికీ నీవు ఆత్మైకత్వ దృష్టిని ఆశ్రయించే ఉండు! సర్వభూతములందు ఏకరీతిగా వెలయుచున్న ఆత్మనే గాంచుచున్నచో... ఇక నీవు సర్వవిధ కార్యములు నిర్వర్తిస్తున్నప్పటికీ, నిన్నవి అంటవు. నీవు అందులో మరల తగుల్కొనవు.

❖

సర్వజీవుల, సర్వశబ్దముల అసలైన అర్థం ఏకత్వమే అయి ఉన్నది. అందరి, అన్నిటి, ఏకశబ్దార్థం ఏదైతే ఉన్నదో, అదే ఆత్మ. అయితే, అట్టి ఆత్మ ఇక్కడ కళ్ళకు కనబడే స్థూల భూతములు కాదు. కళ్ళకు కనబడని సూక్ష్మభూతములు కాదు. కళ్ళకు, మనస్సుకు విషయము కాకపోయినప్పటికీ అది క్షణంలో అనుభవమునకు లభ్యం కాగలదు. ఎందుకంటే, మనందరిలో ఉండి సర్వమును పొందుచున్నది అదే సుమా! ఈ ముల్లోకములలో గల చిత్తములన్నిటి లోపల వెలయుచు, ఆ చిత్తములన్నిటినీ ప్రకాశింప జేయుచూ, "నేను" – అను అనుభూతికి కారణమగుచున్నది ఆ ఆత్మయే.

ఈ ముల్లోకాలలో ఆయా పదార్థాలు చూస్తున్నప్పుడు ఇది ఆవు, ఇది కొండ అని తెలుసు కొంటున్న రసానుభవ జ్ఞానమే ఆత్మ. అది సర్వశరీరములలోనూ అనుభవ రూపమై ఉండి కూడా, అది అందరికీ అనుభవవిషయంగా లభ్యమవటం లేదు. సత్–అసత్ వివేకులగు వారికి అది అత్యంత సుస్పష్టంగా ఘనీభూతమై గోచరిస్తోంది.

**సమగ్ర పయసామ్ అంతః యథా ఘృతమివ స్థితమ్ ।**
**తథా సర్వపదార్థానాం దేహానాం సంస్థితః పరః ॥**

పాలలో అంతటా నెయ్యి ఉన్నది. అయితే అది పాలు తోడేసి చిలికితేనే లభిస్తుంది. అట్లాగే సర్వ శరీరాలలో, సర్వ పదార్థాలలో పరమాత్మ సర్వదా వేంచేసి ఉన్నారు. నిర్మలబుద్ధి సంపాదించుకున్న వారికి అది అత్యంత స్వభావసిద్ధంగా ఇక్కడే, ఇప్పుడే అనుక్షణికమై సర్వే, సర్వత్రా అనుభవమౌతోంది.

రత్నములలోని అంతస్థితమైన కాంతియే ఆ రత్నముల బహిఃప్రకాశము, కాంతి పుంజములుగా వెలయుచున్నది కదా! ఈ సర్వ శరీరములందు అంతర్గతమై ఉన్న ఆత్మయే 'చిత్' అను బహిః ప్రకాశమునకు కారణమగుచున్నది.

ఒకచోట కొన్ని కుండలు పేర్చబడ్డాయనుకో... ఆ కుండలన్నిటి లోపల, వెలుపల ఆకాశం ఏర్పడి ఉన్నది కదా! ఈ ముల్లోకములలోని శరీరములన్నిటిలో 'అహం' రూపమున ఆత్మయే వెలయు చున్నది. అయితే సాంసారిక దృష్టి గలవారికి అది అగుపించటం లేదు. ముత్యాలు గ్రుచ్చబడిన దారం కనిపించక పోయినప్పటికీ... దారమే లేకపోతే ముత్యాలు ఒక వరుసలో నిలువవు కదా! ఈ శరీర సమూహము లన్నిటిలోనూ ఆత్మ అలక్షితమై వెలయుచున్నది.

ఆ బ్రహ్మదేవుని మొదలు ఒక గడ్డిపరక వరకు గల సర్వపదార్థములు ఆత్మయందే అధ్యస్తమై వెలయుచున్నాయి. అట్టి ఆత్మను జన్మరహితమైన దానిగా, విపరిణామ రహితమైన దానిగా జ్ఞానులు

ఎరుగుచునే ఉన్నారు. అట్టి ఆత్మయొక్క అధ్యాస యే అహంకారము – జగత్తు మొదలైన భ్రమలు ఏర్పడి ఉండటానికి కారణమైయున్నది. అయినా కూడా ఆత్మ స్వస్వరూపము కోల్పోక సర్వదా యథాతథంగా అఖండమై విషయాతీతమై, నిర్వికల్పమై ఉండనే ఉంటోంది.

**ఆత్మైవ ఇదం జగద్రూపం, హన్యతే హన్తివా అత్రకిమ్? ।**

**శుభాశుభైః జగదుః ఖైః కిమస్య అర్జున! లిప్యతే? ॥**

ఓ అర్జునా! ఈ జగత్తు యొక్క వికారములన్నీ ఆత్మయే. వంకరటింకర తరంగాలన్నీ జలమే కదా! అట్టి ఏకము, సర్వము అగు ఆత్మ ఎవరిని చంపుతుంది? ఎవరి చేత చస్తుంది చెప్పు? ఇక శుభాశుభములగు ఈ జాగృతిక దుఃఖములచే నీవు దుఃఖితుడవు కావలసిన పనేమున్నది? అనేక వస్తువులను తనయందు ప్రతిబింబించే అద్దమునకు, ఆ వస్తువుల రాకపోకలకు సంబంధమేమైనా ఉన్నదా? వస్తుసంబంధమైన శుభాశుభాలను ఆ దర్పణం పొందుతోందా? లేదు కదా! ఆత్మ సర్వదా సాక్షి అయి ప్రకాశిస్తూ, ఈ నశించు శరీరములందు స్వతహాగా అవినాశి అయి వెలయుచున్నది. అట్టి ఆత్మను దర్శించువాడే యథార్థదర్శి.

"ఈ సర్వము నేనే" అయితే, "ఈ శరీరాలన్నిటిలో ప్రతిబింబించే 'అహం' అను చిదంశయే 'నేను'. అంతే గాని జడంశములగు, ప్రతిబింబిత చిదంశములగు ఈ శరీరాదులు నేను కాదు."

"దర్పణంలో ప్రతిబింబించే ప్రతిబింబాలను నిషేధించి దర్పణమును నిరూపిస్తున్నట్లు ఈ సర్వమూ నా యందు ప్రతిబింబించవచ్చు గాక!... అయినా, ఈ అహంకారాదులు నా స్వరూపం కాదు"

అనే నా ఉభయవాక్యాలనూ సూక్ష్మబుద్ధితో అర్థం చేసుకో. దర్పణము వలె స్వచ్ఛస్వభావుడను, పదార్థములకు అసంబంధితుడను అద్వయుడను సర్వాత్మకుడను అగు నన్ను ఎరిగినప్పుడు నీవు సర్వ దుఃఖములు అధిగమించగలవు.

❖❖❖

## 5. నేను సర్వదా అకర్తను

ఓ అర్జునా! సముద్రంలో నీరు కదులుచున్నట్లు చిత్తమునందు అభిమానవృత్తులు ప్రవర్తిస్తు న్నాయి. అట్టి అభిమానవృత్తుల ప్రభావం చేతనే ఈ సృష్టి ప్రళయ వికారములన్నీ కలుగుచున్నాయి. వాస్తవానికి నీకు కనబడే ఎత్తైన పర్వతములన్నీ శిలామయమే కదా! వృక్షములన్నీ కొయ్యయే కదా! తరంగములన్నీ జలమే కదా! అలాగే పదార్థములన్నీ ఆత్మయే అయి ఉన్నది.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని ।**

**యఃపశ్యతి తథాత్మానం, అకర్తారం, సపశ్యతి ॥**

సర్వజీవుల యందు ఆత్మను, సర్వజీవులను ఆత్మయందు గాంచుట అభ్యసిస్తున్నవాడు ఆత్మను దర్పణమువలె అకర్త అని గ్రహించగలుగుతాడు. "నేను ఈ సర్వజీవుల యందు వెలుగొందుచున్నాను. ప్రత్యక్షమై ఉన్నాను. ఈ సర్వజీవులు నాయందే వెలుగొందుచున్నారు. ప్రత్యక్షమై ఉన్నారు. అయితే,

అట్టి నేను నిర్విషయుడిని అకర్తను అభోక్తను" – అని ఎవ్వరు స్వస్వరూపము విషయమై ఎరుగుచున్నారో, ...వీరే సత్యమును దర్శించుచున్నవారు... సత్యద్రష్టలు. ఓ పార్థా! మరల చెప్పుచున్నాను–

**నానాకార వికారేషు తరంగేషు యథాపయః ।**
**కటకాదిషు వా హేమ, భూతేషు తథా, అర్జున ॥**

నానావిధ ఆకృతులలో కనిపించే తరంగములన్నీ జలం కాక మరింకేమిటి? ఉంగరం, గొలుసు, గాజులు మొదలైన ఆభరణాలన్నీ బంగారమే కదా!

అంతయూ ఆత్మయే అయున్నది. ఇందులో నీవు సందేహించవలసినదేమీ లేదు. ఆత్మయే భూతములన్నిటా వెలయుచున్నది. సామాన్యములైన ఈ పదార్థములు, ఈ జీవులు, మహత్తరమగు ఆ బ్రహ్మము ఒక్కటే అని గ్రహించు. వీటికి ఒకదానితో మరొకదానికి భేదమే లేదు. నిర్వికారమగు బ్రహ్మమొక్కటే అన్నివైపులా వెలయుచుండగా ఇక జగత్తు – ఆ జగత్తులోని భావవికారాలకు చోటు ఎక్కడిది చెప్పు? జగత్తు అనేదే బ్రహ్మమునకు వేరుగా లేనప్పుడు, అట్టి జగత్తులో 'బంధువధ' అనునదెక్కడ? వృథాగా మోహం చెందవద్దు సుమా! అందుచేత ముందుగా బ్రహ్మం గురించి విను. విని, మననం చేయి. చేసి, చక్కగా బ్రహ్మమును అనుభవమునకు తెచ్చుకో. తెచ్చుకుని సమరసతత్త్వాన్ని అనుక్షణికంగా ఆశ్రయించు. అట్లు ఆశ్రయించి అనేకమంది సాధుపురుషులగు జీవన్ముక్తులు ఈ లోకంలో నిశ్చింతులై విహరిస్తున్నారు. వారు మానమోహముల నుండి విడివడుచు న్నారు. సంగ దోషాన్ని జయించి అసంగస్థితిని సంపాదించుకుంటున్నారు. సుఖదుఃఖములనబడే స్వకీయ భ్రమాత్మక నిర్వచనాల నుండి ముక్తిని బడయుచున్నారు. అవ్యయమగు పరమపదాన్ని అధిరోహించుచున్నారు.

వారి మార్గమే నీకు శిరోధార్యం. కనుక కర్మలలో నిస్సంగుడవై సర్వసమత్వాన్ని అధిరోహించు.

❖❖❖

## 6. ఆత్మార్పణం

**శ్రీకృష్ణ పరమాత్మ :** హే మహాబాహో! అర్జునా! నీకు ప్రీతి, హితము చేకూర్చాలనేదే నా ఉద్దేశం. అందుచేత పరమశ్రేయోదాయకము, ఉత్తమము అగు విషయాలు మరికొన్ని చెప్పుచున్నాను. శ్రద్ధగా విను –

ఈ భౌతిక శరీరాంతార్భాగమై ఉంటున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే పంచతన్మాత్రలు బాహ్య విషయాలను స్పర్శిస్తున్నప్పుడు 'ఇది సుఖము కనుక కావాలి. అది అసుఖం. కనుక వద్దు' – అనే భావాలు కలుగజేస్తున్నాయి, సుఖ భావంగాని దుఃఖ భావంగాని స్థిరంగా ఉండవు. సుఖ దుఃఖ భావాలన్నీ వచ్చిపోయే స్వభావం కలిగినవి. ఒకప్పుడు సుఖకరమని అనిపించినది మరొకప్పుడు, "ఎందుకొచ్చిన కర్మరా?"...అనురూపంగా దుఃఖదాయకమౌతోంది. అందుచేత వాటియందు నమ్మకం ఉంచవద్దు. వాటిని సహించగలిగే శక్తిని పెంపొందించుకో. వాటిని ఎదుర్కోవాలంటే సహనానికి మించి వేరే ఉపాయం లేదు.

నీవు వాస్తవానికి స్వతఃగా అద్వయ పరిపూర్ణానంద స్వభావుడవు. ఈ తన్మాత్రస్పర్శలు లేవు. సుఖదుఃఖములు లేవు. ఇవన్నీ నీ భావాభావాంతర్గతములు. నీవో? భావాతీతుడవు. నిత్యనిర్మలుడవు. ఆద్యంతరహితుడవు. నిరవయుడవు. పరిపూర్ణుడవు. అట్టి నీకు ఈ బంధుమిత్రుల సంయోగ - వియోగ - దుఃఖములు ఎట్లా కలుగుతాయో చెప్పు?

నీ సంపూర్ణత్వమగు స్వస్వరూపమును ఏమరచుటచేతనే ఇదంతా కూడా సంభవిస్తోంది. లేక, ఈ రీతిగా అనుభవమౌతోంది. కాబట్టి 'విషయేంద్రియ సంయోగం' అను భ్రమను నశింపజేయి. ధీరుడవై సుఖదుఃఖములందు సమభావమును కలిగి ఉండుము. అప్పుడే నీవు అమృతత్వానికి అర్హుడవౌతావు. అట్టి అమృతత్వమే నీ సత్యరూపం.

**అర్జునుడు:** నిజమే. అయినా ఈ సుఖదుఃఖములను సహించటం సులభమా?ఎట్లా?

**శ్రీకృష్ణ భగవానుడు:** అసద్వస్తువులగు ఈ సుఖదుఃఖాలన్నీ కూడా ఆత్మయందే పరికల్పితాలై వెలయుచున్నాయి. నీవు సర్వదా ఆత్మ స్వరూపుడవే గాని మరేదీ కాదు. వాస్తవానికి ఆత్మలో సుఖదుఃఖ లేశమనునది ఉండజాలదు. అట్టి ఆత్మతత్త్వమొక్కటే సర్వత్రా సమమై అంతయూ వెలయుచుండగా ఇక అనాత్మ అనునది ఎక్కడ ఉండగలుగుతుంది?

**నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః ।**
**నాస్త్యేవ సుఖదుఃఖాదిః, పరమాత్మాస్తి "సర్వగః" ॥**

ఈ బంధుమిత్రాది సంబంధములు అనే అసత్తుకు అసలు స్వకీయమైన ఉనికియే లేదు. కల్పనచే అవి ఏర్పడి, కల్పనచే అనుభవమౌతున్నాయి. మరొక కల్పనచే లయమైపోతున్నాయి. ఇక మనందరి స్వరూపమగు సత్తకు 'లేకపోవటం' అనే వినాశనమే ఉండదు. అందుచేత అసత్యములగు సుఖదుఃఖములనేవి స్వతఃగా ఉన్నవి కావు. అది అట్లు పరికల్పించబడటం చేత మాత్రమే ఆయా రీతిగా తోచుచున్నాయి.

అంతటా సర్వవ్యాపియగు పరమాత్మ ఒక్కటే వెలయుచున్నది.

జగత్తు ఉన్నది - లేదు... జగత్తు - ఇచ్చటి సంబంధాదులు... జగత్తు - ఆత్మ.... జగత్తు - ఆత్మల మధ్య ఏర్పడియున్న మనస్సు... మొదలైన విశేషాలన్నీ అధిగమించు. అప్పటికీ నీ యందు శేషించి ఉండు చిత్‌స్వరూపమునందు ప్రతిష్ఠితుడవై ఉండుము. ఓ విజయా! ఆత్మ చేతనమైనది. ద్రష్టత్వము అను క్రియా విశేషమును ఆశ్రయించి... ఈ దేహము నందు వెలయుచున్నా కూడా సుఖమును హర్షించదు. దుఃఖమునకు క్రుంగదు. ఆత్మ సర్వదా సర్వత్రాయథాతథం.

మరి దుఃఖములను పొందుచున్నదేది?... జడరూపమగు చిత్తమే వాస్తవానికి దేహరూపం పొందుతోంది. అదియే తనకు తాను సుఖదుఃఖములను తయారు (కల్పించుకుని) చేసుకుని అనుభవిస్తోంది.

ఈ శరీరము ఉప్పొంగవచ్చు. క్షీణించవచ్చు. ఆత్మకు ఎట్టి మార్పుచేర్పులు ఉండవు. ఇక ఈ అనుభవములు సంగతేమిటంటావా? ఇక్కడ తారసపడే అల్ప సామాన్య, ఆశ్చర్యకర, సుఖదుఃఖ

అనుభవములన్నీ ఆ అనుభవములను పొందే మనస్సుతో సహా – మాయ నుండి భ్రమచేత ఏర్పడి ఉంటున్నాయి. భ్రమ అనునది అజ్ఞానము నుండి బయల్వెడలుతోంది. ఈ శరీరము, ఇంద్రియములు, సుఖ దుఃఖములు మొదలైనవన్నీ ద్రష్టయొక్క కల్పనయే గాని, అవి వేరుగా (స్వయంగా) లేనే లేవు. అసలు ఆత్మకంటే వేరైనదానిని ఎవ్వరు ఎక్కడ కల్పించగలరు చెప్పు?

బంధువులను, తదితర సంఘటనలను చూస్తున్నప్పుడు నీకు కలిగే సుఖ–దుఃఖ భ్రాంతి అజ్ఞానం వలననే సంభవిస్తోంది. అజ్ఞానం చేత ఏది సంభవిస్తుందో… అదంతా జ్ఞానంచే మాత్రమే… నశించగలదు. అందుచేత అభ్యాసపూర్వకంగా సమ్యక్‌బోధను సంపాదించుకో.

**అర్జునుడు:** జ్ఞానం, అజ్ఞానం, సమ్యక్‌బోధ – అను వాటి గురించి మరికొంత వివరించి చెప్పండి.

**శ్రీకృష్ణ భగవానుడు:** చెపుతాను… విను.

ఒకడు చీకటి సమయంలో అత్యవసరమైన పనికొరకై బాటలో వస్తూ వస్తూ ఎదురుగా అంత దూరంగా మెలికలుగా పడి ఉన్న దానిని చూచి "అయ్యబాబోయ్! త్రాచుపాము!" – అని పెద్దగా అరిచాడు. వళ్ళు వణకటం ప్రారంభించింది. ముందుకు వెళ్ళక తప్పదు. వెళ్ళాలంటే ఆ పాము బుస్సున మీదికి వస్తుందేమో? ఇప్పుడు ఏం చేయాలి? – అని ఆ బాటసారి భయంతో పరితపిస్తున్నాడు. పాము కాటు వేసినప్పుడు నురుగు కక్కుకోవటం, యమయాతన అనుభవించటం, విషప్రభావం చేత ఒళ్ళు నీలం కావటం, చావటం మొదలైన వినిన, చూచిన వార్తలతో అతని మనస్సంతా నిండిపోయాయి.

ఇంతలో ఆ ప్రక్కగుడిసెలలో ఉండే ఒక అవ్వ ఆ కేకలు విని ఒక దీపం చేతపట్టుకుని అక్కడ కొచ్చింది. దీపపు కాంతి అటువైపు చూపి "ఒరే అబ్బాయ్! ఇక్కడ పాము లేదు, గీము లేదు. అది త్రాడు మాత్రమే. కావాలంటే కొంచెం చూడు నీకే తెలుస్తుంది" అని చెప్పింది. ఆ దీపపు కాంతిలో తాను కూడా కళ్ళు తెరచి బాటసారి చూచాడు. అరె! అది పాము కాదు. "ఏదో చాంతాడు ముక్క. అనవసరంగా భయపడ్డాను" అని గ్రహించాడు. అంతే, …మరుక్షణం అతని భయాలు, కేకలు అన్నీ ఉపశమించాయి. అట్లాగే, అజ్ఞానజనుల దుఃఖభ్రాంతులు, శరీరతదాప్య భ్రమలు – ఇవన్నీ కూడా, "శాస్త్రములు, జ్ఞానులు" – అందించే సమాచారముచే నశించగలవు.

ఈ శరీరమును అవధరిస్తున్న 'శరీరి'యొక్క వాస్తవ స్వరూపం బ్రహ్మమే.

**విష్వగ్విశ్వమజం బ్రహ్మ న నశ్యతి న జాయతే ।**
**ఇతి సత్యం పరం విద్ధి బోధః పరమ ఏష సః ॥** (శ్లో 15, సర్గ 54)

ఈ విశ్వమంతయు పూర్ణబ్రహ్మమే. బ్రహ్మము జనించుట లేదు, నశించుట లేదు. ఇదియే పరమసత్యము. ఇదియే జ్ఞానము.

బ్రహ్మ మహాసముద్రమునందు 'సంకల్పములు' అనే తరంగాలు ఎప్పుడో లేచి, మరెప్పుడో ఆ బ్రహ్మ మహాసముద్రమునందే లయమౌతున్నాయి. జ్ఞానోదయ కాలమందు అవన్నీ కూడా బ్రహ్మమే అగుచున్నాయి. స్వస్వరూపమగు బ్రహ్మము యొక్క వాస్తవ స్వభావమును సంతరించుకున్న వానికి

ఈ దేశ-కాల-క్రియలు, నీవు-నేను అనే ఈ భావవికారములు మొదలైనవన్నీ కూడా బ్రహ్మముగానే తెలియవస్తున్నాయి. వాస్తవానికి ఇక్కడ అనుభవమయ్యే భేదాభేదములు బ్రహ్మమునందు లేవు - అనే నిర్మలమైన అవగాహన పరిఢవిల్లుతోంది. స్వస్వరూపమును ఏమరచినప్పటి ఈ దేశ-కాల-దేహ క్రియాదుల కల్పితానుభవ పరంపరలే అజ్ఞానము యొక్క స్వరూపం.

❖

కాబట్టి, అర్జునా! నీవు ఇప్పటికిప్పుడు సకల భయశోకాలను, మానమదాలను, సుఖదుఃఖ నిర్వచనములను, సర్వ కోర్కెలను వదలి ఉండుట అభ్యాసం చేయి... అసద్రూపమగు ద్వైతభావమును పరిత్యజించే ప్రయత్నం చేయి. సద్రూపుడవు కమ్ము. నీవు ఈ యుద్ధం చేస్తున్నప్పుడు కూడా నీ సర్వ కర్మలను, భావములను బ్రహ్మముతోడ నింపివేయి. నీ యొక్క సుఖ, దుఃఖములను, లాభాలాభాలను, జయాపజయములను శుద్ధబ్రహ్మముతో ఐక్యమొనర్చివేయి. నీవు బ్రహ్మసముద్రుడవే గాని, ఒక తరంగమో, బుడగయో కాదు. హీనములైన 'నేను ఒక జీవుడను' మొదలైన భావములకు తావీయవద్దు, తత్త్వనిశ్చయము చేసుకుని, గుహలోని వాయువువలె నిశ్చలత్వము వహించి, అటుతరువాత ప్రకృత కార్యమగు ఈ యుద్ధమును ఆచరింపుము. "నేను ఆచరించేది, భుజించేది, ఇచ్చేది, వ్రేల్చేది... అంతయూ ఆత్మయే" అను స్థిర నిశ్చయము కలిగియుండుటయే సమ్యక్‌బోధ. అదియే ఆత్మార్పణము అని కూడా చెప్పబడుతోంది.

ఎవడు తనయందు ఏ భావాన్ని ఆశ్రయించి ఎట్లు నిశ్చయుడై ఉంటాడో... అతడు దానినే పొందటం జరుగుతుంది. అందుచేత సత్యమగు బ్రహ్మమును పొందుటకుగాను నీవు బ్రహ్మాకార స్థిర చిత్తుడవు కమ్ము. అప్పుడు నీవు కార్య-కారణాతీతమగు బ్రహ్మమే కాగలవు. ఇందులో సందేహం లేదు.

బ్రహ్మజ్ఞుడైనవాడు కర్మఫలాలను ఆశింపక, ఈ సర్వకర్మలు-పూర్వాపరాలతో సహా బ్రహ్మమే"... అను భావనతో యథాప్రాప్తములైన కర్మలను ఆచరించుచున్నాడు. అందుకు ప్రయోజనంగా బ్రహ్మమే అగుచున్నాడు. ఏ మనుష్యుడైతే సర్వకర్మలయందు నిష్క్రియమగు బ్రహ్మమును, బ్రహ్మమునందే సర్వకర్మలను గాంచుచున్నాడో... అతడే అందరిలోకి బుద్ధిమంతుడు. అతడే పరిపూర్ణకర్మి అని కూడా చెప్పబడుచున్నాడు.

❖❖❖

## 7. అకామకామి

ఓ ధనంజయా! నీవు లాభ - అలాభాదులకు, లభ్య-అలభ్యాదులకు వశీభూతుడవు కావద్దు. యథాప్రాప్తాలైన కర్మలను నిర్వర్తించటమే ఉచితం. అయితే అట్లు నిర్వర్తించే సమయంలో అనాసక్తుడవై ఉండుము. ఆసక్తిని సమూలంగా త్యజించి యోగస్థుడవై కర్మలు ఆచరించుము.

అజ్ఞానము ఆశ్రయించక.... కర్మలయందు ఆసక్తి లేక కర్మల సహిత - రహితత్వములకు అతీతుడవై సర్వదా సముడవై వెలయుము.

కర్మ ఫలాసక్తిని విడచి నిత్యతృప్తుడవై – నిరాశ్రయుడవై యథాప్రాప్తములైన కర్మలు ఆచరిస్తూ ఉంటే, అప్పుడాకర్మలు నీపట్ల లేనివే అవుతాయి. 'నేను ఇది చేయుచున్నాను'..... అను కర్తృత్వబుద్ధియే ఆసక్తి, అకర్తృత్వ బుద్ధియే అనాసక్తి. మనస్సు అజ్ఞానావృతమైనప్పుడే ఆసక్తి ప్రబలుతుంది. అట్టి కర్తృత్వబుద్ధి విభాగమునకు సంబంధించిన మనస్సును వెంటనే పరిత్యజించుము. పరతత్త్వమును సుస్పష్టముగా ఆకళింపు చేసుకుని అనాసక్తబుద్ధితో స్వధర్మములైన కర్మలను ఒనర్చుచున్న మహాత్మునికి మరింకెన్నడూ కర్తృత్వబుద్ధి కలగదు.

**అకర్తృత్వాత్ "అభోక్తృత్వమ్", అభోక్తృత్వాత్ సమైః ।**
**సమైకత్వాత్ "అనంతత్వమ్", తతో "బ్రహ్మత్వమ్" ఆతతమ్ ॥**

'నేను దేనికీ కర్తను కాదు' అను అభ్యాస యోగముచే 'నేను దేనికీ భోక్తను కూడా కాదు' అను అవగాహన బలం పుంజుకుంటుంది. అభోక్తృత్వము వలన సమత్వము లభ్యపడుతుంది. సమత్వము నుండి అనంతత్వము, అనంతత్వము వలన బ్రహ్మత్వము సిద్ధించగలవు. ఎట్లాగైనా సరే, నీవు ఇక్కడ నానాత్వమును పరిత్యజించు. పరబ్రహ్మైక్యము పొందు లక్ష్యం గల ఆచరణలను ఆశ్రయించు. అప్పుడు విధ్యుక్తములైనప్పటికీ నీవు ఆ ఈకర్మలకు కర్తవు కావు. ఎవని కార్యములు కామసంకల్ప వర్జితములో అవి ప్రారంభమునందే జ్ఞానాగ్నిచే దగ్ధం కాబడినాయో అట్టి వానిని శాస్త్రములు 'పండితుడు' అని పిలుస్తున్నాయి. సముడు, సౌమ్యుడు, స్థిరుడు, స్వస్థుడు, శాంతుడు, విషయనిస్పృహుడు అగువాడు కర్మలు ఆచరించుచున్నప్పటికీ నైష్కర్మియే అగుచున్నాడు.

❖

అందుచేత కిరీటీ! నీవు ద్వంద్వ రహితుడవై ఆత్మవంతుడవై యథాప్రాప్తములైన స్వధర్మానుకూల మగు కర్మలు ఆచరించుచూ, ఈ భూమండలమును అలంకరించుము. ఏ మూఢుడైతే కర్మేంద్రియాలను మాత్రం నిరోధించి ఆయా విషయానుభవములను మనస్సునందు స్మరించుచున్నాడో అట్టివాడు "మిథ్యాచారి" అని పిలవబడుచున్నాడు. ఎవరైతే ఇంద్రియములను ఆయాకర్మలందు నియమించే టప్పుడు మొదలే సంగరహితుడై కేవలం కర్మలను కర్మేంద్రియాల సహాయంతో నిర్వర్తిస్తున్నాడో... అట్టి అనాసక్త కర్మయోగం అత్యంత ప్రాశస్త్యమైనది సుమా!

నదులు సముద్రంలో ప్రవేశించగానే అవి తమ ప్రవాహత్వాన్ని సముద్రజలంతో ఏకం చేసి ఆ సముద్రజలంలో ఉపశమిస్తాయి చూచావా?... ఎవనియందు దృశ్యాదులు ప్రకాశించగానే అవన్నీ నిర్వికారమగు బ్రహ్మమునందు లయమైపోతాయో... అట్టి పురుషుడు పరమశాంతిని పొందుచున్నాడు.

అంతే గాని కోర్కెలు కోరుకొంటూ రోజులు గడుపుచున్నవాడు, ఉపాధులు ధరిస్తున్నవాడు ఎప్పటికీ శాంతిని పొందుటయే లేదు.

❖❖❖

# 8. దేహి - దేహము - వాసనలు

**శ్రీకృష్ణ భగవానుడు:** ఓ పార్థా! ఇక్కడ ఇంద్రియములకు తారసబడే ఆయా భోగములపై నమ్మిక కలిగి ఉండవద్దు. అయితే, యథాప్రాప్తములైన కర్మలను మాత్రం సమత్వ - నిర్వికారబుద్ధితో నిర్వర్తిస్తూ ఉండు. ఇక ఈ దేహములంటావా? ఇవి జన్మ - జరా - మరణాది స్వభావయుక్తమై అనాత్మ అయిఉంటున్నాయి.

**అనాత్మన్ ఆత్మతాం దేహే మా భావయ భవాత్మని ।**
**ఆత్మన్యేవాత్మతం సత్యే భావయా అభవరూపిణి ॥**

అనాత్మభూతములగు ఈ శరీరాదులందు ఆత్మభావం కలిగి ఉండకుము. వికార రహితమగు సత్య వస్తువునందే ఆత్మభావము కలిగి ఉండుము.

**దేహనాశే, మహాబాహో! న కించిదపి నశ్యతి! ।**
**ఆత్మనాశోహి నాశఃస్యాత్ ! నచాత్మానశ్యతి ధ్రువః ॥**

గొప్ప బాహువులు గల ఓ అర్జునా! ఈ శరీరం నశించినంత మాత్రం చేత ఇక్కడేమీ నశించటమే లేదు. ఆత్మ నశించినప్పుడే అది నాశం అని అనిపించుకుంటుంది. అయితే... ఆత్మకు నాశనమనునదే లేదు. ఇది సత్యం. చిత్తం కంటే కూడా అత్యంత సూక్ష్మమైన ఆత్మ జీర్ణమొనర్చ బడజాలదు. కనుక ఆత్మను చిత్తమునుండి వేరు చేసి కర్మలను నిర్వర్తించిన, ఏమియు నిర్వర్తించనివాడవే అగుచున్నావు.

'కర్తృత్వం' అంటే ఏమిటి? ఆసక్తియే కదా!... ఇప్పటికిప్పుడే నీవు 'అజ్ఞానం' అను మూర్ఖత్వాన్ని పరిత్యజించు. అందుకుగాను జ్ఞానులను ఆశ్రయించు. అనాసక్తమతి అయిన మహాత్ముడు కర్తృత్వ అహంకారం పొందనే పొందడు.

ఆత్మ అవినాశి అని, ఆద్యంతరహితమని విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. ఆత్మ నశించుచున్నదను భ్రమ నీకు అర్హమే కాదు. అట్టి భ్రమయే అన్ని దుఃఖాలకు మూలకారణం. ఆత్మజ్ఞులు ఆత్మను నశించు దానిగా ఎంచరు. వారు తమయందే ఆత్మను ప్రత్యక్షం చేసుకుని ఉంటారు. ఇక ఈ శరీరాదులందు ఆత్మబుద్ధిని కలిగి ఉండరు.

**అర్జునుడు :** ఓ జగన్నాథా! శ్రీ కృష్ణా! అట్లా అయితే అజ్ఞానుల శరీరము నశించినప్పటికీ కూడా దాని వలన వారికి కలిగే నష్టమేమీ లేదు కదా?

**శ్రీకృష్ణ భగవానుడు :** అవును. అజ్ఞానుల విషయమైనా సరే, ఈ దేహం నశించినంతమాత్రంచేత ఎక్కడా నశిస్తున్నదేదీ లేదు. అవినాశియగు ఆత్మ ఒక్కటే సర్వే-సర్వత్రా వెలయుచుండగా ఇక ఈ దేహములు నశించినంత మాత్రంచేత ఎవరికి మాత్రం ఏమి నష్టం?

మోహము వలననే 'ఇది లభించింది - ఇది వినష్టమైనది' అనునదంతా తోచుచున్నది. గొడ్రాలి రెండవ కుమారుడు ఎక్కడైనా తారసపడతాడా? అట్లాగే పరిశీలన సహాయంతో భ్రమను

త్యజించిన వానికి ఈ శరీరాలు – వాటి వినాశనములు అసలు కనిపించనే కనిపించవు. అసత్తగు "నా దేహము – వారి దేహము" మొదలగు భావములన్నిటికీ స్వతః అయిన ఉనికియే లేదు. సర్వభావములు ఎందులో కలుగుచున్నాయో... అట్టి సమరస వస్తువుకు వినాశనముగాని, అభావము గాని లేవు. జ్ఞానులు సత్ – అసత్తుల విభాగము విషయంలో నిర్ణయం చేసుకునే వర్తిస్తున్నారు.

**అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।**
**వినాశం అవ్యయస్యఅస్య! న కశ్చిత్ కర్తుమర్హతి ॥**

అర్జునా! సర్వవ్యాపియగు ఆత్మ అవినాశి అని గ్రహించు. అవ్యయమగు ఆత్మను ఎవ్వరూ వినాశనం కావించలేరు.

**అన్తవన్త ఇమే దేహా, నిత్యస్యోక్తాః శరీరిణః ।**
**అనాశినో, అప్రమేయస్య! తస్మాత్ ఉద్ధ్యస్వభారత! ॥**

నీకు కనబడుచున్న ఈ శరీరాలన్నీ ఒకనాటికి నశించవలసిందే. అయితే ఏం? ఈ శరీరాలను ధరిస్తున్న శరీరి నాశరహితమైనది. అద్దానికి ఈ దేహాదులతో ఏమాత్రం ప్రమేయం లేదు. ఆత్మ (దేహి) యొక్క ఉనికి దేహాదులతో వచ్చేది కాదు, దేహాదులతో పోయేది కాదు. అందుచేత ఈ దేహాదులను దృష్టిలో పెట్టుకుని, వీరంతా నశిస్తారేమోననే శంకతో నీ స్వధర్మమైన యుద్ధం మానవలసిన అవసరం లేదు. అఖండము, సర్వగమము అగు ఆత్మ ఒక్కటే వెలయుచుండగా ఇక అసత్తైనదంతా ఎక్కడ ఎట్లు ఏర్పడగలదో చెప్పు? అవినాశి, అనంతము, సత్‌స్వరూపము అగు ఆత్మను గురించి ఎవరైనా దుఃఖించవలసినపనేమున్నది?

కారణం, దానికి సంబంధించిన కార్యం, అద్దానిచే కనబడే అనేకత్వం – ఇవన్నీ పరిత్యజించ బడగా అప్పుడు ఆ ఏకత్వ – అనేకత్వముల మధ్య శాంత పరమపద స్వస్వరూప మొక్కటే వాస్తవమైన ఉనికిని కలిగి ఉన్నది. తక్కినదంతా భ్రమయే!

**అర్జునుడు:** అయితే భగవాన్! నాదొక చిన్న సందేహం. ఆత్మకు 'మరణం' అనే ధర్మమే లేదు కదా! అట్టి ఆత్మ "అయ్యో నేను మరణించబోవుచున్నాను" అని ఎందుకు అనుకుంటోంది? మరొక ప్రశ్న కూడా వినండి. ఈ మానవుల యొక్క, ఈ లోకాల యొక్క, స్వర్గ, నరకాదుల యొక్క స్థితి గతు లన్నిటికీ కారణం ఏమిటి?

**శ్రీకృష్ణ భగవానుడు:** బ్రహ్మమే తన యొక్క 'అధ్యాస' అను చమత్కారమును ప్రకటించుచు శరీరము లందు వెలయుచున్నది. "ఆకాశము, వాయువు, నీరు, అగ్ని, భూమి, మనస్సు, బుద్ధి" అను తన్మాత్రలతో కూడి జీవుడుగా అగుచున్నది. ఆవుదూడ త్రాడుచే లాగబడునట్లు, పక్షిపిల్ల పంజరంలో చిక్కునట్లు ఈ జీవుడు తనకుతానుగా శరీర బద్ధుడగుచున్నాడు. వాసనానుసారంగా దేహమును ధరిస్తున్నాడు. ప్రస్తుత దేహం శిథిలమైనప్పుడు వాసనలను కొనసాగించిన కారణంగా మరొక దేహం పొంది వేరైన దేశకాలములను గాంచుచున్నాడు. వాయువు ఒక పుష్పముపై ప్రసరించి అక్కడి గంధమును తనవెంట గొనిపోవునట్లు ఈ జీవుడు ఒక దేహము నుండి వాసనలను గొనిపోయి

మరొక దేహంతో కొనసాగిస్తున్నాడు. చక్షురాది ఆయా ఇంద్రియముల సంస్కారమును వెంటబెట్టుకుని దేహ–తదనంతర దేహములను పొందుచూ తనయందు తానే సుదీర్ఘమైన ప్రయాణం చేస్తున్నాడు.

ఈ శరీరముతో ఏర్పడే సంబంధమంతా కేవలం వాసనలచేతనే ఏర్పడుతోంది. వాసనలే రహితమైతే ఇక అట్టి జీవునకు "నేను ఈ దేహమునకు సంబంధించిన వాడను" ...అను భావన, అనుభవములు ఉండవు. అప్పుడు శేషించేది పరమపదమే అయి ఉంటుంది.

వాసనాయుక్తుడగు జీవుడు అన్న – పాన – మైథునములచే ధ్యాసయుక్తుడగుచు నానావిధ యోనులందు తిరుగాడుచున్నాడు. 'భ్రమ' అను భారమును మోయుచు ఇంద్రియ ధర్మములందు ఆసక్తి కలవాడై తనస్వరూప మెట్టిదో పూర్తిగా ఏమరచుచున్నాడు.

**దేహో నిస్పన్దతామేతి, జీవే కౌన్తేయ! నిర్గతే ।**
**నిస్పన్దావయవా భోగః శాంతవాతి ఇవ ద్రుమః ॥**

ఎప్పుడైతే జీవుడు అను చైతన్యసత్త స్వరూపుడు ప్రాణసంచలనముతో సహా దేహము నుండి బయల్వెడలుతాడో... అప్పుడు ఈ దేహం చలనరహితమౌతోంది. గాలి ఆగిపోతే లత యొక్క కదలిక ఆగిపోతుంది చూచావా? అట్లా దేహి దేహము నుండి బయలు వెడలినప్పుడు ఈ దేహం నిస్పందం (స్పందరహితం) అవుతోంది. అప్పుడు, 'ఈతడు మరణించాడు' అని చెప్పబడుతోంది. అయితే ఇక్కడ దేహి, దేహమును త్యజించాడు. అంతమాత్రమే ఇక్కడి విశేషం.

ఈ జీవుడు శరీరం నుండి బయల్వెడలిన తరువాత అక్కడ ఉన్న ఆకాశమునందు తన వాసనా బలం చేత తన వాసనలన్నీ రూపుదాల్చినట్లు గాంచుచున్నాడు. వాసనల "తీవ్రత దిశ – క్రమము" లను అనుసరించి మరల పాంచ భౌతిక సమ్మేళనములను ఆశ్రయించి ఇతఃపూర్వమునకు వేరైన దేశ కాలాలను గాంచుచున్నాడు. ఈ మహా ప్రయాణం అనంత కాలంగా కొనసాగుతూనే ఉంటుంది. ఈ ఒక శరీరనాశనము–నూతన శరీర ఆవిర్భావం కూడా స్వప్నానుభవం వంటివే. అయితే ఏం? శరీరముతో కూడిన విషయములు సంబంధములన్నీ కూడా ఎప్పటికప్పుడు వాస్తవమైనట్లు అజ్ఞానవశం చేత పరికించుచున్నాడు. నిద్రలో కలకంటున్న వానివలె నీవు ఇదంతా చూచి భ్రమించవలదు.

❖❖❖

## 9. వాసనాక్షయం - ఆత్మానుభవం

ఏ వస్తువు ఏ రీతిగా ఏర్పడుచున్నదో... దాని వినాశనము కూడా అట్లే జరుగుతోంది. సృష్టి ప్రారంభంలో ఈ సమష్టి సృష్టికర్త (హిరణ్యగర్భుడు, బ్రహ్మదేవుడు) తన యొక్క పూర్వ కల్ప వాసన లను అనుసరించి గుబ్బము, ఆవు మొదలైన జీవజాతములను కేవలం కల్పన సహాయంతో సృష్టిస్తు న్నాడు. అందుచేత ఇక్కడ దృశ్యజగత్తు, ఇందలి జీవన్–మృత్యువులతో సహా సర్వం కల్పన మాత్రమే.

కుమ్మరివాని రకరకాల కుండలలాగా ఈ వివిధ జీవ జంతు జాతులు కల్పించబడుచున్నాయి. కుమ్మరివానికైతే మట్టిని కుండలుగా మలచటానికి 'సారె' మొదలైన ఉపకరణాలు కావలసి ఉంటుంది. మరి ఈ దృశ్య జగత్తు విషయమో? సమష్టి సృష్టికర్తకు ఎట్టి ఉపకరణాలు అక్కర్లేదు. ఎందుకంటే

ఇదంతా మనోకల్పితమే కదా! ఒక కథారచనవలె కల్పన కల్పనలోనే ఉదయిస్తోంది. కల్పనలోనే కొనసాగుతోంది. కల్పనలోనే లయిస్తోంది. కల్పనయందే ఉపశమిస్తోంది.

జీవునికి–జగత్తుకు గల సంబంధం కథారచయితకు–కథారచనకు గల సంబంధం వంటిదే!

ఈ జగత్తు మొదలు – చివర కూడా కల్పనయే కాబట్టి ఇది వర్తమానంలో కూడా మిథ్యయే. కల్పనతో కూడినది వాస్తవమెట్లా అవుతుంది? జీవుని స్వరూపం జ్ఞానశక్తియే. అట్టి జ్ఞానశక్తి చేతనే పదార్థాల ఉనికి అనుభవమౌతోంది. ఆ అనుభవం యొక్క రూపం కల్పన చేతనే నిర్మించ బడుతోంది. కనుక ఈ జగత్తు ఆరోపితమైన భ్రమతో కూడిన దృష్టి కారణంగా ఘనీభూతమైన సంసార సాగరంగా (ఆత్మానుభవ – వ్యతిరేకమైనదిగా) తోచుచున్నది.

❖

ఈ జగత్తు ద్రష్ట యొక్క వాసనలను అనుసరించి అనేకానేక విధములుగా స్ఫురించుచున్నది. ఆ వాసనలు ఇతఃపూర్వపు కర్మ, భావనల పరంపరావిశేషము చేతనే ఆయా వర్తమాన రూపములు కలిగి ఉన్నాయి. ఇతఃపూర్వపు పురుషకారముచే ఏర్పడిన వాసనలు వర్తమాన పురుషకారం యొక్క ఉచ్ఛ–నీచములను అనుసరించి ఇక ముందు బలహీనపడటమో, బలపడటమో జరుగుతోంది. నిన్న సంపాదించుకున్న ధనం ఈ రోజు చేసే వినియోగ – సముపార్జనలను అనుసరించి తరగటమో, పెరగటమో జరుగుతుంది కదా! నిన్న తిన్న ఆహారమువలన కలిగిన అజీర్ణమువంటి ఏదైనా అనారోగ్యం ఈ రోజు సేవించే ఔషధంచేత తొలగించబడుతోంది చూచావా! అట్లాగే, వర్తమానంలో నిర్వర్తించే తపస్సు, దానం, ధ్యానం, కర్మఫల సమర్పణ – వంటి ఉత్తమ కర్మలు ఔషధరూపంలో ఇతఃపూర్వపు వాసనలను తగ్గించగలవు. తొలగించగలవు. జీవుడు వాసనలను తొలగించుకొన్నప్పుడు అతని యందు ఆత్మస్వభావం స్వయంసిద్ధంగా ప్రకాశించగలదు. అందుచేత అర్జునా! నీవు ఎంత శ్రమించి అయినా సరే, శాస్త్రవిహిత ధ్యానాది కార్యక్రమములను, నీకు విధించిన కర్మల ఫలసమర్పణను ఏక సమయంలో అత్యంత శ్రద్ధతో నిర్వర్తించు. అంతే గాని, ఇంద్రియాల వెంట మనస్సుతో పరుగు లిడి వెనుక – ముందు చూచుకోకుండా వాసనలను మరింత మూటగట్టుకోకు. అప్పుడు మానవజన్మ అను అవకాశమును దుర్వినియోగపరచినవాడవే అవుతావు.

ఈ జీవునికి ఎదురుగా ధర్మ, అర్థ, కామ, మోక్షములనే చతుర్విధములైన పురుషార్థములు ఉన్నాయి. అయితే ఈతడు దేనిని గ్రహించి విశేషంగా ప్రయత్నించటం జరిగితే... ఆ ప్రయత్న ప్రాబల్యముల ననుసరించి ఆ పురుషార్థమే సిద్ధించగలదు. ఇది గ్రహించి ఉండుట చేతనే వింధ్యపర్వతం పగులునంతటి ప్రళయవాయువులు వీచుచున్నప్పుడు కూడా ధీమంతులైనవారు తమ యొక్క శాస్త్రవిహిత పురుషకారాన్ని వదలిపెట్టరు.

**అర్జునుడు:** హే జగత్పతీ! ఈ జగత్ స్థితికి, స్వర్గ నరకములు, సృష్టి మొదలైన కల్పనలకు అసలు కారణమేమిటో చెప్పండి.

**శ్రీకృష్ణ భగవానుడు:** అర్జునా! అజ్ఞానావృతుడైన జీవుడు తనయొక్క అభ్యాసబలం చేత చిరకాలం నుండి ఈ స్వర్గ–నరకాదులను గాంచుచున్నాడు. స్వర్గ–నరకాది సంసార సంభ్రమానికంతటికీ కారణం

వాసనలే. కాబట్టి వాసనాక్షయం వలననే నీకు నిత్య శ్రేయస్సు సమకూరుతుంది. వాసనలు రహితమైతే 'జీవుడు' అనబడునదే ఉండదు. అనగా, ఇదే జీవుడు స్వయముగా శివస్వరూపమై ప్రకాశించగలడు.

**అర్జునుడు:** దేవదేవా! వాసనలు దేనివలన కలుగుచున్నాయి? అవి సమూలంగా నశించేది ఎట్లా?

**శ్రీకృష్ణ భగవానుడు:** అజ్ఞాన భ్రమ నుండి వాసనలు లేచి... అనాత్మ యందు ఆత్మభావాన్ని కలిగిస్తు న్నాయి. ఆత్మజ్ఞానం పెంపొందించుకుంటేనే అజ్ఞానం నశించి వాసనలు విలీనం కాగలవు. ఓ కౌంతేయా! నీవు ఆత్మ గురించి విన్నావు, విచారించావు, గ్రహించావు. ఇక 'ఇది, నేను, నాది, నా వారు' అను రూపంలో గల వాసనలను త్యజించటంలో జాప్యం ఎందుకు? అభ్యంతరమేమిటి?

**అర్జునుడు:** హే శ్రీ కృష్ణా! నాదొక సందేహం. ఏది దేనిని ఆశ్రయించి ఉంటుందో, అది నశించినప్పుడు ఆ ఆశ్రయించబడేది కూడా నిరాశ్రయమౌతుంది కదా! మీరు వాసనలు రహితమైతే జీవుడనబడేవాడే ఉండడని ప్రవచించారు. జీవుడే లేకపోయినప్పుడు ఇక ఇటు అనర్థదాయకమగు సంసారాదులు, అటు పరమానందావిర్భావమగు ఆత్మసాక్షాత్కారమును అనుభవించే వాడెవడు?

**శ్రీకృష్ణ భగవానుడు:** ఓ మహామతీ! వాస్తవానికి ఆత్మయే ఉన్నది. జీవుడనబడే వాడు ఆత్మకు వేరుగా లేడు. ఆత్మసర్వదా అఖండమే గాని అది ఎన్నడూ ఈ ఈ జీవులుగా ఖండితమగుటలేదు. ఆత్మయే వాసనత్వం వహిస్తోంది. అట్టి ఆత్మజ్ఞానం సముపార్జించుకొనుచున్నప్పుడు అకృత్రిమంగా అజ్ఞానాన్ని విసర్జించటం జరుగగలదు. వాసనల నుండి విడివడినప్పుడు ఇంకనూ ఈ జీవుని యొక్క ఏ స్థితి శేషించి ఉంటోందో అద్దానిదే ఆత్మస్థితి అని, మోక్షం అని పిలవటం జరుగుతోంది. ఏ ద్రష్ట అయితే అజ్ఞానదశలో "నేనొక అల్పజీవుడను. ఈ జగత్తు నిండా కష్టాలే! ఇక్కడ దుఃఖములే నా గతి"... అని తలచుచున్నాడో అదే ద్రష్ట (జీవుడు) సర్వ వాసనలూ నశించనప్పుడు 'నేను ఈ సర్వ ఉపాధులకు అతీతమైనట్టి – మునుముందే ఉన్నట్టి నిర్వికార – ఆత్మ చైతన్యమును' అని అనుభవపూర్వకంగా గ్రహిస్తున్నాడు. 'నేను ఉపాధిని ఉపయోగించే ప్రజ్ఞను' అని తననుతాను ఎరుగువాడు ఇక 'ఉపాధి' – (లేక) 'జీవుడు' అని ఎట్లా అనిపించుకుంటాడు చెప్పు?

ఓ పార్థా! నీవు జీవన్ముక్తుడవగుము. యథార్థమగు ఆత్మతత్త్వమును దర్శించుము. వాసనా జాలం నుండి విడివడినవాడు మాత్రమే 'ముక్తుడు' అని అనిపించుకుంటున్నాడు. వాసనాక్షయం కానంత వరకు ఎంతటి శాస్త్రకోవిదుడు అయినప్పటికీ పంజరమున చిక్కిన పక్షిలాగా బద్ధుడే సుమా!

ఎంతగా బోధించినా మాయయందు కాపురముండే వానికి ఆత్మ దుర్దర్శనము. ఇంద్రజాలంలో కనిపించే భ్రమ విశేషాల వంటి ఈ జగత్ సంబంధాలను నమ్ముకుని కూర్చున్నవానికి ఆత్మ యొక్క దేహాతీతత్వం – అఖండత్వాల గురించి ఎంత చెప్పితే ఏమున్నది?

అందుచేత... శాస్త్రాలలో ప్రవచించబడిన విధివిధానాలను శ్రద్ధగా అనువర్తించు. సాధనాదు లను ప్రవృద్ధం చేసుకో. తద్వారా, వాసనలను నశింపజేసుకో. అప్పుడు నీవు తప్పక ముక్తుడవౌతావు. మరొక్కసారి ప్రకటిస్తున్నాను– వాసనాక్షయమే మోక్షం... వాసనలు కలిగియుండటమే బంధం.

❖❖❖

# 10. స్వధర్మ నిరతి

**శ్రీకృష్ణ భగవానుడు :** ఓ కిరీటీ! 'వాసనారాహిత్యం' అనేది అమోఘమైన ప్రయోజనం కలిగి ఉంది. వాసనలు రహితమైనప్పుడు నీవు జీవన్ముక్తము, అత్యంత సుఖప్రదము అగు మనశ్శాంతిని పొంద గలుగుతావు. వాసనల ప్రభావంచేతనే 'నేను నా బంధువులను చంపుచున్నానే?'...అనే దుఃఖం నీలో ప్రవేశించి నీ యొక్క స్వధర్మనిరతిని, ధర్మాధర్మ విచక్షణను కించిత్ కప్పిచేసింది. కనుక నీవు 'ఈ బంధువులు నావారు' అనే దుఃఖమాలిన్యమును త్యజించు. జరామరణముల శంక విడిచిపెట్టు. ఆకాశము వలె విశాల హృదయము సంపాదించుకో. 'ఇష్టము – అయిష్టము' ...అను సంకల్పములను దరిజేరనీయ వద్దు. 'ఇది నా అభిలాష కనుక ఇది ఇట్లే ఉండాలి' అను రూపమును దాల్చుచున్న కామమును వదులుము.

**ప్రవాహపతితం కార్యమిదం కించిద్యథాగతమ్ ।**
**కురు కార్యాణి కర్మాణి! న కించిదిహ నశ్యతి॥**

నీకు విధించబడిన 'యుద్ధం చేయుట' అను ధర్మమును శుభాశుభఫలత్యాగబుద్ధితో నిర్వర్తించుటే ఉచితం. స్వధర్మనిరతి నిష్కామబుద్ధితో నిర్వర్తిస్తున్నప్పుడు అది నీ తత్త్వబోధకు దోహదమే అవుతుంది కాని అంతరాయం కాజాలదని గ్రహించు. ఇక్కడ వాస్తవానికి ఏదీ జనించేది లేదు. నశించేది లేదు.

పారంపర్యంగా, శాస్త్రానుసరణంగా, సంఘనియమానుసారంగా, ప్రవాహపతితంగా వస్తున్న విహిత కర్మలను ఆచరించటమే జీవన్ముక్తుల స్వభావమై ఉంటోంది. ఎవరైనాసరే, విధి – విహితములైన స్వకర్మలను యోగబుద్ధితో ఆచరించి ఆ సర్వాత్మకునకు సమర్పణ చేయుట చేతనే 'జీవన్ముక్తి' అనబడు సముద్ధరణ సులభరీతిగా పొందగలడు. అంతేగాని కేవలం కర్మలు త్యజించి ఊరుకున్నంత మాత్రం చేత ఎవరికీ ముక్తి లభించదు.

**"ఇదం కర్మ త్యజామి, ఇదం ఆశ్రయామి"–ఇతి నిర్ణయః ।**
**మూఢస్య మానసోరూపం! జ్ఞానినస్థు సమాస్థితిః ॥**

'అయ్యో ఈ కర్మ చేయవలసి వస్తోందే? ఆ కర్మ చేస్తే బాగుండునే?' అనే రూపంగల నిర్ణయాలు, భావాలన్నీ అజ్ఞానులందలి మానసిక వికారములు మాత్రమే. జ్ఞానులు సర్వ సమయములందూ సమస్థితియందే వెలయుచున్నారు.

**ప్రవాహపతితం కర్మ కుర్వన్తః శాంత చేతసః ।**
**జీవన్ముక్తాః సుషుప్తస్థాః స్ఫురన్తి అత్ర సుషుప్తవత్॥**

వారు యథాప్రాప్తములై నిర్జీవమైయున్న కర్మలను శాంతచిత్తులై సంకల్పరహితులై, నిద్రించుచున్న వారి యందుండు 'ప్రజ్ఞ' వలె మౌనం వహించి స్వయంజ్యోతి స్వభావులై నిర్వర్తిస్తున్నారు. వారి మనన శక్తి స్వాభావికంగానే తాబేలు అంగముల వలె ఇంద్రియ విషయాల నుండి మరలి హృదయం నందు ఏకీకృతమును పొంది శాంతైశ్వర్యమగు స్వస్వరూపము వైపుగా ఎక్కుబెట్టి ఉంటోంది. అట్టి జీవన్ముక్తులైన మహనీయులు పరమాత్మయందే నిత్యము స్థైర్యం పొంది ఉంటున్నారు.

ఆహా! 'చిత్తము' అనే శిల్పి తనయొక్క అధిష్ఠానమగు పరమాత్మయందు మూలమంటూ ఏదీ లేనట్టి ఈ 'త్రిజగత్తులు' అనే శిల్పచాతుర్యమును ప్రకటించుచున్నాడు కదా! అందుచేత పరమాత్మ విషయవిశేష రహితమైనప్పటికీ ఈ విశ్వమంతా కూడా పరమాత్మ స్వరూపమై, పరమాత్మయందే ఉన్నది. అయితే పరిమిత దృష్టి గలవారు శిల్పమునే చూస్తారు గాని, శిలను చూడజాలరు చూచావా? అట్లాగే ఈ త్రిజగత్ ఆకారాది విశేషములన్నీ (అజ్ఞానావగాహనచే) పరిమితజ్ఞాన దృష్టికి పరమాత్మ స్వరూపంగా – కానవచ్చుట లేదు. ఇవన్నీ అజ్ఞానాకాశంలో – అంతఃకరణవృత్తులు – అనే కుంచెచే చిత్రించబడి అద్భుతంగా విస్తరించి ఉన్నాయి. సమష్టిమనః స్వరూపుడగు హిరణ్యగర్భుడు తన యొక్క సత్యసంకల్ప ప్రభావంచే ఈ త్రిజగత్తులను, వీటికి ఆధారమైన సూక్ష్మాకాశమును పరికల్పన చేస్తున్నాడు. అట్టి ఈ సమష్టి భ్రమ అనాది అయినది. ఇది గడ్డిపరకలచే నిర్మించబడిన గోడ వలె సారశూన్యము. ఇదంతా 'మాయ' లేక 'భ్రమ' అను మూలపదార్థముచే నిర్మించబడుతోంది. దీనిని మూఢులు సత్యమైనదానివలె గాంచుచున్నారు. విజ్ఞులు ఇందలి సారాసారములను ఎరిగి, తమ వివేకమును సర్వదా కాపాడుకుని ఉంటున్నారు. నాటకంలోని సంఘటనలలో తన్మయమై రసానుభవం పొంది అమిత దుఃఖము పొందే ప్రేక్షకునిలాగా ఈ జీవులు తమ విస్తార స్వస్వరూపమును ఏమరచుచున్నారు. రంగుల చిత్రం – రంగులు ఒక్కటే అయినట్లు... 'ఈ జగత్తు – దానిని దర్శించే మనస్సు – ఈ జగత్తును దర్శించే కర్త' ఈ మూడిటికీ కనిపించే భేదం వాస్తవమైనది కాదు. ఆ మూడిటి ఏకతపిమే (లేక) జగత్తు–మనస్సు–ద్రష్టల సంయోగమే జగదనుభవానికి అసలు కారణం.

❖❖❖

# 11. మనోకల్పన

ఓ పార్థా! మనస్సు చేసే 'త్రిజగత్తులు' అనే చిత్రరచనంతా ఆకాశమువలె అత్యంతశూన్యమైనది. స్వప్నంలో ఉన్నప్పుడు క్షణంలో త్రిజగత్తులను అనుభవించే ఆ మనస్సే జాగ్రత్‌లో కూడా అనేకానేక కల్పనలను అనుభవిస్తోంది.

కథయే ఒక కల్పన. ఇక అందలి పాత్రలు స్వభావాల గురించి వేరే చెప్పాలా? అట్లాగే, మనస్సే ఒక కల్పన. ఇక దాని సృష్టులమాట వేరే చెప్పేదేముంది? అయితే అట్టి కల్పనలను చిరాభ్యాస వశం చేత జనులు సత్యమని తలుస్తున్నారు. ఈ జగత్‌దృశ్యం ఏమాత్రం యథార్థం కాదని మరల గుర్తు చేస్తున్నాను. భ్రమయందు సత్యమైనదేమి ఉంటుంది? కానీ ఈ విషయం తత్త్వబోధ సముపార్జించిన వారికి మాత్రమే అవగతమౌతోంది. ఒక సమయంలో సత్యమైనట్లు తోచుచున్న ఈ జగత్తు తత్త్వజ్ఞానము పొందినవారికి – చీకటి తొలగిన తరువాత సుస్పష్టమయ్యే వస్తుజాలంలాగా – కల్పిత మాత్రంగా తెలిసిపోతోంది. జగదృష్టులన్నీ ద్రష్టలో లీనమై రహితమైపోతున్నాయి. అప్పుడు చిత్తశిల్పిచే నిర్మించబడిన భావాభావములన్నీ రూపరహితమై ఆత్మతత్త్వమును సంతరించుకుంటున్నాయి. వాస్తవానికి...

ఈ జగత్తు నీయందు లేదు... నీవు ఈ జగత్తునందు లేవు... నీకు వేరుగా జగత్తు లేదు.

ఇప్పుడు చెప్పు! ఎవరి వలన ఎవరు చంపబడుచున్నారు?

**రోధ్యరోధక సంమోహం త్యక్త్వా ఖే విమలోభవ।**
**ప్రవృత్తిరేవ న వ్యోమ్నః ప్రవృత్తిశ్చైవ ఖాత్మికా ॥**

'ఈ చచ్చువాడు – చంపువాడు' అను వ్యర్థమైన ప్రేలాపనలన్నీ త్యజించు. పవిత్ర భావ సమన్వితుడవై బ్రహ్మాకాశమున వెలయుము.

బ్రహ్మమునకు ఎట్టి ప్రవృత్తీ లేదు! ప్రవృత్తి వలె తోచుచున్నదంతా బ్రహ్మమే. అందుచేత కాలము, క్రియలు, వాటి భేదాభేదములు ఇవన్నీ నిశ్చయంగా బ్రహ్మమే. మనస్సు నందు ఊహచే కల్పించబడే ఊహాప్రపంచం ఏ విధంగా రసానుభూతి కలిగించ గలుగుతోందో... అట్లాగే అదే రీతిగా శూన్యమాత్రమగు ఈ పాదార్థిక జగత్తుకూడా ఊహతో కూడినదై రసానుభూతి కలిగిస్తోంది. స్వతఃగా ఇది శూన్యమాత్రమే!

ఓ అర్జునా! చిత్తములోనే జగత్తుల ఉదయాస్తమయములు జరుగుచున్నాయి. నిర్మాణము – క్షయము – జన్మ – మృత్యువు మొదలైనవన్నీ క్షణిక విషయములై ఉంటున్నాయని గ్రహించు. నీవు కొంచెం మోహం ఆశ్రయించి మోహగ్రస్తుడవై నీ మనోరాజ్యమున 'వీరు నావారు – వీరు చచ్చుచున్నారు' అనే వ్యధ – ఆఘాతములను గాంచుచున్నావు.

అట్టి అసంగత కల్పనలన్నీ ఉపదేశవశం చేత క్షీణించగలవు సుమా!

❖

ఈ మనస్సు ఆత్మయొక్క సంకల్పమే అవటం చేత ఇది మహత్తరమైన శక్తిని పొంది ఉంటోంది. అది క్షణంలో సువిశాల మనోరాజ్యమును కల్పించగల నిపుణత కలిగి ఉన్నది. దాని శక్తి వలననే మిథ్యయగు ఈ సంసారము 'అనాది – అనంతము' వలె భ్రమింపజేస్తోంది. ఒక్క క్షణాన్ని యుగంగా కల్పన చేయగల ఈ మనస్సే సత్యమును అసత్యముగా, అసత్యమును సత్యముగా చేయగలదు. భ్రాంతిచే చిత్రవిచిత్రములగు జగత్సమూహములను దర్శిస్తోంది. ఇట్టి ఈ కల్పన నిత్యముక్తమగు ఆత్మయందే అధ్యస్తమైయున్నదని గ్రహించు. స్వతఃగా తుచ్ఛమై, క్షణికమై, కల్పనామాత్రమైన ఈ జగత్తుపట్ల జన్మజన్మల జాడ్యమును ఆశ్రయించిన జీవులు అజ్ఞానముచే గొప్పనమ్మకము కలిగి ఉంటున్నారు. భ్రమయగు ఇదంతా భ్రమ తొలగుటచే తొలగిపోగలదు. కానీ భ్రమచే "అయ్యో! దీనిని ఎట్లా దాటటం?" అని జనులు తలచుచున్నారు. ఇదంతా స్వయంకల్పిత గుణసమన్విత ఊహాప్రదర్శనా చమత్కారమేనని గమనించటం లేదు!... ఎంత ఆశ్చర్యం!

❖

ఓ అర్జునా! మరల ప్రకటిస్తున్నాను. ఆత్మయందు ప్రతిభాసగా కల్పించబడు అజ్ఞాన తత్త్వమగు ప్రవృత్తిగాని, నివృత్తిగాని ఎన్నటికీ వాస్తవం కాదు. చిత్త శిల్పి లేదు. చిత్తం లేదు. ఉన్నట్లు కనబడుచున్న దంతా ప్రతిబింబం మాత్రమే. జలానికి, జలంలో ప్రతిబింబించే దృశ్యానికి ఏమి సంబంధం? ఆహా! ఏమి చిత్రం? ఆధారమే లేని చిత్రం ఉజ్జ్వలమై, భ్రమాసక్తులను కలుగజేస్తూ తాండవిస్తోంది కదా!

ఇదంతా కూడా ఒక గొప్ప చిత్రకారునిచేత చిత్రించబడిన కళాఖండంలాగా సంసారజీవుల దృష్టిని చిత్రంగా ఆకర్షిస్తోంది. 'కటిక చీకటి నుండి తేజోమయమైన సూర్యచంద్ర నక్షత్రాలు బయల్వెడలుతాయి' అను చమత్కారవాక్యంలాగా, 'భేదదృష్టులు' అనే విలాసంతో 'నానాత్వము' అను విస్తారముతో వెలయుచున్నది.

'జగత్రయం' అనే దేవనటి (Damsel) బ్రహ్మాకాశమున పరికల్పితమై ఉంటోంది. బుద్ధి ఆ దేవనటి నృత్యం చేసే నాట్యశాల. ఏది ఎచ్చట ఎట్లా గ్రహించబడినప్పటికీ అదంతా బుద్ధి వృత్తుల చమత్కారమే కదా. బుద్ధి యొక్క హావ భావ విలాసములే జగత్ నిర్మాణము యొక్క మూలపదార్థమని విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. బుద్ధి యొక్క చపలత్వము ననుసరించి ఆ బుద్ధిని మరింత తనవైపుగా ఆకర్షించటానికి ఎవరో కాముకుడు ఇదంతా పరికల్పిస్తున్నాడు. ధర్మ, అర్థ, కామములను నిర్వచించే ప్రవృత్తి-నివృత్తులు ఆ దేవనటి యొక్క అంగవస్త్రములు.

నానావిధ విలాపములతో గూడిన ఈ త్రిలోకములను మనస్సు అనే కల్పనా చాతుర్యం గల చిత్రకారుడే రచిస్తున్నాడు. మనస్సు యొక్క మూలం కల్పనయే కదా! ఇకమనస్సుతో మనస్సులో పొందబడే ఈ దృశ్యము కూడా కల్పనయే! కనుక అర్జునా! ఇదంతా చూచి నీవు మోహము చెంద వలసిన పనేమీ లేదు. ఇదంతా శూన్యమాత్రము... స్వయం కల్పితమైన భ్రమ మాత్రమే.

❖❖❖

## 12. అసాధ్యం కాదు సుసాధ్యమే

**శ్రీకృష్ణ భగవానుడు:** ఈ దృశ్య కళాఖండానికి రంగులతో గోడపై నిర్మించిన కళాఖండానికి ఒక ముఖ్యమైన తేడా ఉన్నది. రంగుల చిత్రంకన్నా ముందు గోడ ఉండాలి కదా! కానీ ఈ మహాశ్చర్యం చూడు! ఈ దృశ్య కళాఖండం విషయంలో మొదట చిత్రము, ఆ తరువాత దానికి ఆధారం నిర్మించ బడుచున్నాయి.

జగత్తు అనబడే నిరర్థకమైన వ్యవహారంలోనికి జీవుడు అనువాడు ప్రవేశించి జగత్తునకు అర్థమును కల్పన చేసి అనుభవిస్తున్నాడు. మొట్టమొదట నిరాధారమగు జగత్తు... ఆ తరువాత జగదనుభవమునకు ఆధారమగు కల్పన ఒనగూడుతున్నాయి. ఆహా! మాయ ఎంత చిత్రమైనది. 'జలంలో సొరకాయ మునుగుతోంది. బండరాయి తేలుతోంది" అన్న వాక్యంలాగా జీవుడు వచ్చి ఇక్కడ అర్థములను కల్పించి భావాభావములను పరంపరగా పొందుచున్నాడు.

ఓ ఫల్గుణా! నీవు బ్రహ్మజ్ఞానము పొందియే ఉన్నావు కదా! మనోరాజ్యమును బోలు ఈ దేహాది శూన్య పదార్థములపట్ల నీకు ఆసక్తి ఎందుకో చెప్పు? స్వతహాగా శూన్యమగు ఈ జగత్తునందు 'ఇది నాది, వీరు నావారు' అను అనర్థములకు అర్థమేమున్నది?

అంతాకూడా 'ఆకాశమునందు ఆకాశము ఏర్పడి ఆకాశమునందు విలీనమగుచున్నది. ఆకాశము ఆకాశముచే విభాగించబడుచున్నది. (తూర్పు ఆకాశం - పడమర ఆకాశం లాగా?)

ఆకాశం ఆకాశము చేతనే ఆవరించబడుతోంది' ...అను విచిత్ర వ్యవహారంలా ఇక్కడ ఏర్పడి ఉంటోంది సుమా!.

ఓ అర్జునా! ఈ జగత్తునంతా అనంతము – విస్తృతము అయిన వాసన ఒకానొక చాంతాడువలె చుట్టుకొని ఉన్నది. అనంతమగు ఆకాశమును అల్పమగు మేఘము ఆవరించి ఉన్నట్లు చిదాకాశమును వాసనామేఘము ఆవరించి ఉంటోంది. అద్దంలో దృశ్యం ప్రతిబింబిస్తోంది చూచావా! అట్లా బ్రహ్మం నందు ఈ జగత్తు ప్రతిబింబిస్తోంది. బ్రహ్మమే ఈ జగత్తుకు అధిష్ఠానం. అందుచేత జగత్‌జాడ్యం వదలాలంటే బ్రహ్మజ్ఞానము కాక మరింకే ఉపాయంలేదు. ఇదంతా కూడా బ్రహ్మమునకు అనన్యమై ఉన్నది. ఇక్కడా – అక్కడా కూడా బ్రహ్మమే ప్రకాశిస్తోంది. కాబట్టి ఇక ఇక్కడ ఎవరు ఎవరివలన వినాశనము పొందగలరు చెప్పు?

❖

నా ఉపదేశం యొక్క ముఖ్యోద్దేశం... నీవు వాసనారహితుడవగుటకు యత్నించాలనేదే సుమా! 'వాసనారాహిత్యం' ఎవడు సంపాదించుకోడో అట్టివాడు సర్వ శాస్త్రకోవిదుడైనప్పటికీ, గొప్ప కార్యదక్షుడు అయినప్పటికీ ఏం లాభం? అతడు పంజరంలోని చిలకలాగా వాసనాపంజరంలో బద్ధుడై ఉంటున్నాడు. చిత్తం అనే భూమిపై స్వల్ప వాసనలు మిగిలి ఉన్నప్పటికీ వాటి వల్ల మరల సంసారారణ్యం విశాలమై విస్తృతి పొందటం జరిగే ప్రమాదమున్నది.

**అర్జునుడు :** మరి అనేక వాసనలు సంక్షిప్తమైయున్న మనస్సు గల నావంటి వారికి సంసారమును అతిక్రమించటం దుర్లభమే కదా!

**శ్రీకృష్ణ భగవానుడు:** ఓ అర్జునా! నీవు నిరుత్సాహ పడవద్దు. నీవు మహావీరుడివి కదా! అభ్యాసమును ఆశ్రయించు. అభ్యాసబలం చేత హృదయంలో 'సత్యజ్ఞానం' అనే అగ్నిచే వాసనాబీజాన్ని సంపూర్ణంగా దగ్ధం చేయి. అప్పుడు నీ మనస్సు ఈ సుఖదుఃఖాలు అందించే వస్తుజాలంలో చిక్కుకోదు. సర్వుల స్వరూపం ఆత్మయే అయి ఉండగా ఆత్మను ఆశ్రయించటం అసాధ్యమెట్లా అవుతుంది? సర్వ ఆశలను ఇప్పటికిప్పుడే మొదలంట విడిచివేయి. ప్రతిఒక్కరికీ ఆత్మస్వభావమగు అసంగ – అప్రమేయాదులు సంతరించుకోవటం సుసాధ్యమేనని సిద్ధాంతీకరిస్తున్నాను.

**శాన్తాత్మా విగతభయోజ్ఝితామితాశో నిర్వాణో గలితమహామనోవిమోహః ।**
**సమ్యక్త్వం శ్రుతమవగమ్య పావనం తత్తిష్ఠాత్మన్యపహతి రేకశాన్తిరూపః ॥** (శ్లో 12, సర్గ 58)

అందుచేత నీవు శాంతాత్ముడవై, మోహశూన్యుడవై, ప్రశాంతమనస్కుడవై నీకు విధించబడిన ధర్మమును నిశ్చింతగా నిర్వర్తించు. కర్మలు నిర్వర్తిస్తున్నప్పుడు – లేనప్పుడు కూడా సర్వదా ఆత్మయందు నిర్వికల్ప స్వభావమును అవధరించి ఉండు.

❖❖❖

# 13. నేర్పుతో కూడిన ప్రయత్నము

**అర్జునుడు :**

**నష్టో మోహః స్మృతిః లబ్ధా త్వత్ప్రసాదాత్ మయా, అచ్యుతా! ।**
**స్థితోఽస్మి గతసందేహః। కరిష్యే వచనం తవ ॥**

ఓ అచ్యుతా! నీ అనుగ్రహం వలన నా మోహం నశించింది. 'స్వతః సిద్ధమగు ఆత్మతత్త్వము యొక్క స్మృతి' – అనే బ్రహ్మసాక్షాత్కారం లభించింది. నా సందేహాలన్నీ తొలగినాయి. నీ ఉపదేశాలను అనుసరించి ఇప్పుడు నేను యుద్ధం చేయటానికి సిద్ధంగా ఉన్నాను. నీ వాక్యముల సమీక్ష మరొక్కసారి వినాలని నా కుతూహలం.

**శ్రీకృష్ణ భగవానుడు :** నాయనా! అర్జునా! నీకు విస్తారంగా చెప్పవలసిన పనేమున్నది? చిత్తము ఉపశమించుట చేతనే జన్మసార్థకమౌతుంది. కామాది వృత్తులు నశిస్తేనే చిత్తం ఉపశమిస్తుంది. వృత్తులన్నిటికీ మూలం వాసనలే. వాసనలు తమ తమ వృత్తులతో సహా రహితం కావాలంటే అభ్యాసం ఒక్కటే ఉపాయం. ఏదైతే వ్యావహారిక సహిత స్థితిలో 'ప్రత్యక్ చేతనము' అని అనిపించు కుంటుందో... అదియే వాసనారహిత స్థితి సంపాదించుకున్నప్పుడు ఈ ఉపాధికి అతీతమగు – సర్వమునకు కేవల నిర్మల సాక్షీభూతమగు బ్రహ్మమే అగుచున్నది. ఆ నిర్మల బ్రహ్మమే సర్వులయందు సర్వత్రా సర్వ వేళలా వ్యాపించి ఉన్నదను దృష్టియే ఉత్తమ దృష్టి.

అయితే... ఎక్కడో ఆకాశములో సుదూరంగా విహరిస్తున్న పక్షిని ఈ కళ్ళు చూడలేవు కదా! అట్లాగే "స్వప్నజాగ్రత్" అనుభవమునకు మాత్రమే పరిమితమైన ఈ భౌతికమైన ఇంద్రియములకు ఆ ఆత్మపదము అవస్తువే అయి ఉంటోంది. చైతన్యమే ఈ ఇంద్రియములన్నిటికీ ఉత్తేజ – విషయ పరిజ్ఞానముల సామర్థ్యము ప్రసాదిస్తున్నది. అయితే ఏం? ఇంద్రియములు ఆత్మను సమీపించలేవు. నిర్వచించలేవు.

అత్యంత శుద్ధము, సర్వసంకల్పవర్జితము అగు ప్రత్యక్‌చేతనమే ఈ కనబడే వివిధ వస్తువులను ప్రకాశింపజేస్తున్నది. ఆ ప్రత్యక్ చేతనం మాత్రం ఒక వస్తువు వలె కనబడేది కాదు. అతి సూక్ష్మ గ్రాహ్యమైనది. అందుచేత శ్రవణము, మననము మొదలైన శుద్ధవాసనలు లేకపోతే మలినవాసనలు తొలగవు. మహత్తరమైన ప్రయత్నం ఉంటేనే సూక్ష్మతరమగు ఆత్మను గాంచగలవు. ఆత్మజ్ఞానానుభవము పొందబడినప్పుడు మాత్రమే ఈ జగత్తు యొక్క ఆభాస నశిస్తోంది.

వాసనా లయం ఆత్మ దర్శనానికి కారణమౌతోంది... ఆత్మ దర్శనం వాసనా లయానికి కారణ మౌతోంది.

ఓ అర్జునా! "అయ్యో ఈ వాసనలు ఎలా తొలగుతాయ్?"...అని అనుకుంటూ మననం చేస్తూ దిగాలుబడి కూర్చుంటే ఏం లాభం? నీవు ప్రయత్నశీలుడవు కావాలి. అగ్నిపర్వతంపై మంచు బిందువులు కురిస్తే ఏమౌతాయి? క్షణంలో రూపుమాసిపోతాయి. అట్లాగే శుద్ధమగు ఆత్మ యొక్క అనుభవం పొందిన తరువాత అవిద్య సమీపించిందా... అది మౌనంగా విలీనం కావలసిందే.

అయినా... తుచ్ఛము, భోగధూళి సమన్వితము, అల్పదృష్టి ప్రదాత, బంధప్రదాత – అగు వాసన ఎచ్చట? జగత్తులన్నీ వ్యాపించియున్న చైతన్యమెచట? వాసనలు చైతన్యమును బంధించటమేమిటి?

నాయనా! నీవు బ్రహ్మభావమును శరణువేడు. "కాల బద్ధం కాని బ్రహ్మమును నేనే" అను అనుభూతిని సుస్థిరీకరించుకో. వాసనల గురించిన వేదనను–ధ్యాసలను వదిలివేయి.

ఆత్మ వలననే పరిపూర్ణము – శుద్ధము అగు ఆత్మ ఎరుగబడుతోంది! నానావిధ వికారములగు ఈ దృశ్యములన్నీ రాజుగారి ముందు నర్తకి నృత్యంలాగా ఆత్మ సమక్షంలో స్ఫురించి విలీనమవుతున్నాయి. అయినప్పటికీ ఆత్మ ఆకాశమువలె అప్రమేయ తేజోవిరాజితమై వెలుగొందుచున్నది. పూర్ణము – జగద్వివర్జితము – వాక్కుకు అతీతము అగు ఆ పరవస్తువుతో పోల్చతగినది ఎక్కడా ఏదీ లేదు. కనుక ఫల్గుణా! నీవు సర్వదా హృదయంలోని వాసనల నివృత్తికొరకై నేర్పుతో కూడిన ప్రయత్నంలో ఉండు. క్రమంగా సంసార భయరహితుడవై, భగవంతుడవై ప్రకాశించగలవు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా త్రిలోకనాథుడైన శ్రీకృష్ణ భగవానుడు అర్జునునికి బోధించటం ముగించి మౌనం వహిస్తారు.

సూర్యభగవానుని స్పర్శచే కమలములు వికసించినట్లు అర్జునుని హృదయపద్మం శ్రీ కృష్ణుని జ్ఞాన స్పర్శచే వికసిస్తుంది. ఆతడు శోకరహితుడౌతాడు. గాండీవధారి అయి తన విధ్యుక్తమైన యుద్ధమును నిర్వర్తిస్తాడు.

❖❖❖

# 14. ఆత్మయొక్క కృతనిశ్చయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** రాబోయే ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు అర్జునుని ఎదుట ప్రవచించబోయే నిర్మలాత్మ దృష్టిని నీవుకూడా అవలంబించు. ఈ నామరూపాత్మకమగు జగత్తునంతటినీ బ్రహ్మముతో ఐక్యమొనర్చి నిస్సంగమగు సన్న్యాసమునందు సర్వదా వెలయుము. అసంయోగమే సులభశరణ్యం.

**'పరమాత్మ' అనగా ఎవరు? -** పరమాత్మ త్రికాలములందు సత్యము. సర్వదా ప్రకాశించునది. ప్రపంచాతీతం కనుక అత్యంత దూరస్థమైనది. సర్వవ్యాపి అవటం చేత అత్యంత సామీప్యమైనది.

అద్దాని యొక్క విశిష్టత ఏమిటంటే.... నీవు అద్దానియందు ప్రతిష్ఠితుడవైన మరుక్షణం నీవే ఆ వస్తువవుతావు. ఇక నీకు అద్దానినుండి భిన్నమైన ఉనికియే సంభవించదు. అదియే చిత్తవృత్తులన్నిటియందు ప్రతిబింబిస్తోంది. ఈ జ్ఞాతృ – జ్ఞాన – జ్ఞేయములు తమ భేదములు కోల్పోయిన మరుక్షణం ఇక శేషించేది ఆ పరమాత్మయే. ఆ పరమాత్మతత్త్వంలో ఏకత్వమే పరమోత్తమపదమని గ్రహించు. అదియే ఆనందం యొక్క అవధి. అది దృక్కులనన్నిటి కంటే పరమదృక్ (the perceiver of all perceivers). మహత్ విశేషము లన్నిటి కంటే పరమశ్రేష్ఠము. గౌరవనీయము లన్నిటికంటే కూడా గౌరవనీయమైనది.

అయితే… విషయములన్నిటికీ అతీతమైనదైనప్పటికీ, ఆత్మ సంవిత్‌స్వరూపమైనది. (It has the form of Existence and Knowledge) అది శూన్యం అని మాత్రం అనుకోకు. ఎందుకంటే అది జ్ఞానమయం. మంగళప్రదము. శ్రేయములన్నిటి కంటే శ్రేయోదాయకం కూడా! అద్దాని యందే సర్వదేహములలోని సర్వ అనుభవములు ఉనికి కలిగి ఉన్నాయి. ఇక్కడ నీకు కనబడేదంతా సత్స్వరూపంగా తోచటానికి కారణం ఆ బ్రహ్మవస్తువు యొక్క ప్రభావమే. 'జగత్' అనే నువ్వులలో నూనె, జగత్ వృక్షము నందలి రసము, జగత్ పశువునకు పాలకుడు అదియే. 'ప్రాణులు' అనే ముత్యములందు సూత్రమువలె వ్యాపించి ఉన్నది ఆ ఆత్మయే! అదియే 'పంచభూతములు' అను మిరియపు గింజలందు కారం.

పదార్థములందలి పదార్థత్వము… సద్వస్తువులందు గల సత్త… అసద్వస్తువుల యొక్క మిథ్యాత్వము… ఇవన్నీ కూడా ఆ పరమోత్తమ తత్త్వమేనయ్యా! ఇదంతా ఇట్లా ఉండగా, ఇక్కడ కనబడే జగత్ భావములన్నీ అజ్ఞానము వలననే ప్రకాశిస్తున్నాయి. అయితే ఆత్మతత్త్వము జ్ఞానదార్ఢ్యము వలననే ప్రకాశించగలదు.

**శ్రీరాముడు:** ఈ ఇంద్రియములకు విషయములగు పదార్థములన్నీ ఆత్మజ్ఞానమును మరుగు పరచుచున్నాయి కదా! ఈ అడ్డు జీవునికి తొలిగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఇక్కడి ఇంద్రియ భావనలన్నీ 'విచారణ' అను వాయువీచికా ప్రభావంచే నశించ గలవు. అహంకారం మొదలుకొని ఇంద్రియాలకు గోచరించే ఒక చిన్న వస్తువు వరకు అన్నీ కూడా ఆత్మయందు పరికల్పించబడిన భ్రమలే కానీ మరింకేమీ కాదు. ఎవరికైతే ఈ కల్పిత పదార్థ – విషయాదులందు నమ్మకం ఏర్పడి ఉంటుందో… వారు మాత్రమే ఇక్కడ బద్ధులగుచున్నారు. ఈ జగత్తు యొక్క మొదలు–చివర కూడా అహంకారము యొక్క పర్యవసానం మాత్రమే.

❖

ఆద్యంతరహితమగు ఆ బ్రహ్మాకాశమును ఎవరు 'ఇట్టిది' అని నిర్వచించగలరు?

ఓ రామచంద్రా! ఆత్మయొక్క కృతనిశ్చయము పొందినవారు కర్మలన్నిటినీ ఆచరించిన వారే అగుచున్నారు. అట్టి సమస్థితిని సంపాదించిన వారి మనస్సు ఇక ఎక్కడా ఎట్టి ఉదయాస్తమయములు పొందటమే లేదు. జగత్ రహితమైనట్టి బ్రహ్మమయ శరీరమును సంపాదించుకున్నవాడు ఒకానొక అనిర్వచనీయమగు అద్వైతభావమును అధిరోహించి ఉంటున్నాడు. నిద్రాసమయంలోని మనస్సువలె నిర్వికారుడై ఉంటున్నాడు. ఒకవేళ వ్యవహారములు నిర్వర్తిస్తున్నప్పటికీ ఆతడు ఏ సమయంలోనూ ఎట్టి క్షోభ పొందటం లేదు. అతని హృదయం కించిత్ చలనమునకు కూడా లోను కావటం లేదు. అద్దంలో ఏఏ దృశ్యములు ప్రతిబింబిస్తున్నప్పటికీ ఆ అద్దం ఏమన్నా మార్పు–చేర్పులు పొందుతోందా? అట్లాగే ఆత్మానుభవజ్ఞుడు ఈ జగత్తుల అనుభవం పొందుచున్నప్పటికీ అదంతా తన స్వస్వరూపమునకు మార్పు చేర్పులు ఏర్పరచలేవని సుస్పష్టంగా గ్రహించియే ఉంటున్నాడు.

ఆ నిశ్చలమగు ఆత్మయే నీ స్వరూపం. తదితరమైనదంతా ప్రతిబింబం మాత్రమే!

❖

వాస్తవానికి ఇక్కడగాని, మరెక్కడ గాని 'చిత్' తప్పితే మరింకేదీ లేదు. ఇక ఈ ఏకము – అనేకము – గురువు – శిష్యుడు – ఉపదేశము మొదలైనవన్నీ ఆ 'చిత్' యొక్క ఉపాంగములు మాత్రమే. ఒక్కమాటలో చెప్పాలంటే శాంతమగు ఆత్మ – 1. తన యందు తానే జగత్తుగా వివర్తం పొందటం, 2. జగత్ అతిక్రమించి సర్వశేష్యముగా అనుగమించటం – అను ఉభయ చిద్విలాసము లను ప్రకటించుచున్నది.

వివర్తము ఉపశమిస్తే జగత్తు కూడా ఉపశమిస్తుంది. ఎందుకంటే, చిత్ యొక్క వివర్తమే ఈ జగత్తు. అట్లు వివర్తం పొందకపోవటమే పరమపదము.

జగత్తు యొక్క ఉపశాంతి – వాసనాక్షయం అనునవి అవిభాజ్యములని గ్రహించు.

ఆత్మయొక్క ఈ జగత్ స్పందనమంతా కల్పితం మాత్రమే! అందుకనే... 'అజడమగు స్పంద శూన్యత్వమే బ్రహ్మము' అని విజ్ఞులు చెప్పూచూ ఉంటారు.

అట్టి బ్రహ్మ స్వభావమే నీవై ఉండగా ఇక కల్పనామాత్రమైన ఈ జగత్తు గురించి నీకు దుఃఖం గాని మోహం గాని ఏర్పడవలసిన అగత్యమేమున్నదో చెప్పు? ఈ జగత్తంతా జడాకృతియే కదా! ఇది 'అనాత్మదర్శన ప్రభావం' తప్పితే మరింకేమీ కాదు. ఈ జగత్ కల్పనము 'సత్యమే' అని నమ్మిన వారికి ఇది అట్లే సత్యం వలె తోచుచున్నది. "కల్పన నుండి అనుభవం. అనుభవమే జగత్తు. కనుక కల్పన సత్యమెట్లా అవుతుంది?" అను అవగాహన ద్వారా జగత్‌భావన లయం చేస్తున్న వారికి ఇదంతా సారశూన్యమగుచున్నది. సర్వభావములు చైతన్యములో లయం చేసిన మరుక్షణం చైతన్యమొక్కటే మిగులుతుంది.

చైతన్య వివర్తమే (చైతన్యముయొక్క స్వస్వరూపమునకు సంబంధించిన ఏమరుపే) సంసారభ్రమ అని మనం చెప్పుకున్నాం కదా! ఇంతకు మించి ఇక్కడ మరింకే విశేషం లేదు. "ఇది జ్ఞానుల – శాస్త్రముల తుది నిర్ణయం. దృఢనిశ్చయం," – అని మరొక్కసారి ప్రకటిస్తున్నాను.

**శ్రీరాముడు:** హే మహర్షీ! ఈ కార్య – కారణ – కర్తృత్వాలు ఎదురుగా ఉండగా భావనను లయం చేయటం, ఇద్దాని నుండి బ్రహ్మమును వేరు చేసి ఆశ్రయించటం ఎంతో దుర్లభమైన ప్రక్రియ అని, సులభ సాధ్యం కాదని కొందరి అభిప్రాయం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఉంగరం, గొలుసు, గాజులు మొదలైన ఆభరణాలు బంగారం కంటే వేరైనవా? కాదు కదా! ఈ కార్య–కారణ–కర్తృత్వాలనేవి బ్రహ్మము నుండి వేరుగా లేవు. చిత్ యొక్క స్పందనయే "సంకల్పించుట, భ్రమించుట..." మొదలైనవన్నీ కూడా. అట్టి చిత్ యొక్క స్పందనమునే మనం 'చిత్తము' అని అంటున్నాం. 'తరంగము అనబడేది జలమే. అట్లాగే, చిత్తము దాని సర్వచర్యలతో సహా చిత్‌యే'... అని తెలియకపోవటమే అజ్ఞానం. అజ్ఞాన కారణంగా బ్రహ్మము నుండి జగత్తు వేరైనదైనట్లు అనిపించటం జరుగుతోంది. అజ్ఞానము వలన ఏది ఏర్పడుతుందో అది తొలిగేది ఎట్లా? జ్ఞానము చేతనే. జ్ఞానముచే అజ్ఞానం జ్ఞానమునందు లయం అవగలదు. జ్ఞాన ప్రకాశముచే చిత్తము తొలగి ఆ స్థానంలో 'చిత్' ప్రకాశించగలదు.

ఆత్మతత్త్వము గ్రహించిన తరువాత ఇక భోగవాసనలు కూడా స్వయంగా క్షీణిస్తున్నాయి. భోగవాసనల చింతారాహిత్యమే జీవన్ముక్త లక్షణము. జీవన్ముక్తుడు భోగవాసనలను చింతించక పోవటానికి కారణం... ఆ భోగవాసనల కంటే కూడా అత్యంత ప్రియమైన ఆత్మ యొక్క అనుభూతి లభించటమే! తృప్తిగా భుజించినవాడు చిరుతిళ్ళు కోరుకుంటాడా? జీవన్ముక్తుడు అత్యంత స్వాభావికంగా ఇక్కడి భోగవస్తువులు నిస్సారమని, అర్థరహితమని, అల్పవిషయమని గ్రహిస్తున్నాడు.

❖❖❖

# 15. జీవన్ముక్తుని పరమ లక్షణములు

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రాఘవా! ఇప్పుడు నీకు జీవన్ముక్తుని పరమ లక్షణములు ఎట్లా ఉంటాయో మరొక్కసారి ఇప్పటి సందర్భానుచితంగా చెబుతాను విను.

❖

జీవన్ముక్తుడు స్వాభావికంగానే భోగములను వాంఛించడని అనుకున్నాం కదా! ఆత్మ ఒక్కటే ఈ భోగ్యభోక్తృత్వములు మొదలైన నానావిధ రూపాలుగా ఉన్నదను నిశ్చయజ్ఞానం అతని యందు సర్వదా ఏర్పడి ఉంటోంది. అట్టి నిశ్చయమును అభ్యాసవశంగా అలవర్చుకొనువాడే జీవన్ముక్త శబ్దమునకు అర్హుడగుచున్నాడు. అట్టి బుద్ధిమంతుడు ఆయా యథాప్రాప్తాలైన భోగాలను అనుభవించ వలసివస్తున్నప్పటికీ అనుభవించనివాడుగానే అగుచున్నాడు. ఆకాశాన్ని పిడికిలితో గుద్దితే ఆకాశానికి ఏమౌతుంది? జీవన్ముక్తుని క్రియలు లోకానుకూలత అను ఉద్దేశమును మాత్రమే కలిగి ఉంటాయి కాబట్టి అవన్నీ సంగమునకు ఏమాత్రం కారణం కాజాలవు. అతడు కృత్రిమమైన వ్యవహార బుద్ధి కలిగియుండి, "ఈ కృత్రిమ వ్యవహారబుద్ధి కూడా భ్రాంతి రూపమే" అని గ్రహించియే ఉంటాడు. ఇక్కడ ఏది భ్రమమాత్రమో, ఏది భ్రమరహిత త్రికాలాబాధ్యసత్యమో విభాగయోగముచే గ్రహించని వారికి నిరతిశయానందరూపమైన ఆత్మతత్త్వప్రాప్తి లభించటమనేది దుర్లభము.

ఈ కనబడే పదార్థాలన్నీ జీవన్ముక్తుడు ఆత్మతత్త్వానుభవమునందు విలీనం చేసివేస్తున్నాడు. దృష్టి యొక్క సమున్నతిని సాధించటం మాని ఒకడు ఈ భౌతిక దేహాన్ని శుష్కించుకుని ఏం ప్రయోజనం? ఖండించుకుని ఏం లాభం? భ్రమ ఆమాత్రానికి తొలగుతుందా? అజ్ఞానం సమూలంగా తొలగనంత వరకూ ఆ అజ్ఞాన రూపమగు స్పందన కలుగుచూనే ఉంటుంది. పరిపూర్ణజ్ఞానం కలిగిన క్షణంలో ఆరి, దుఃఖం, భ్రమ, ప్రలోభం – వంటి సర్వవికారాలూ వాటంతట అవే తొలగుతాయి. దీపం కొండెక్కగానే దాని ఉష్ణం, ఆకారం, కాంతులు – తమంతట తామే తొలగుతాయి కదా!

అయితే... 'ప్రశాంత దీపికను బోలిన చిత్తునందు స్పందాస్పందనములు లేవు'... అనునది ఉత్తమ సత్యము, సిద్ధాంతము కూడా!

❖

ప్రాణవాయువు స్పందనరహితమైనప్పుడు దానికి 'ఉన్నది – లేదు' మొదలైనవి ఆపాదించలేం. అలాగే చిత్తము స్పందనరహితమైనప్పుడు 'చిత్' నందు చిత్తం ఉన్నదని గాని, లేదని గాని చెప్పలేం. శుద్ధ చిత్తము కేవల ఆత్మ స్వరూపమే అయి ఉన్నది. చిత్తము చిత్‌లో ఏకమై ఉన్నప్పుడు బంధ – మోక్షము లనేవి ఆపాదించలేం. అసలీ చిత్ వ్యర్థమగు ఆకృతుల పట్ల గ్రాహ్యాత్యాజ్యములు త్యజిస్తే ఇక బంధమోక్షములనబడేవే ఉండేవికావు. కనుక 'నాకు మోక్షం కావాలి' అను ఆవేదన కూడా అంతఃపూర్ణానుభవమునకు హాని కలిగిస్తోందని చెప్పవలసివస్తోంది. 'ఆ మోక్షం నాకు వలదు' అను భావనను ఆశ్రయించినా కూడా అది బంధముగానే ఉండి ఉంటోంది.

అందుచేత బంధమోక్షములు రెండూ స్మరించకుండుటచేత నీకు పరమశ్రేయస్సు లభిస్తుంది.

**'పరమ పదము' అంటే ఏమిటి? -** స్వయం ప్రకాశమై, చైతన్య స్వరూపమై, సర్వాశ్రయమై, విషయవర్జితమైనదే పరమపదము. అది భావనకు ఆవల ఉన్నది. భావనకు ఈవల మాత్రమే ఈ దేహాదులు ఉన్నాయి. సర్వ సంకల్పములు అందులోంచే బయలుదేరుతున్నాయి. మరి సంకల్పములు అద్దానిని బంధించటమేమిటి? కనుక 'బంధము' అనబడేదానికి అర్థం, ఆస్కారం కూడా లేవు.

**శ్రీరాముడు:** మరి బంధమోక్షము లెవరికి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** మహాచైతన్యము యొక్క స్పందనము ఏదైతే ఉన్నదో.... అద్దానికే బంధమోక్షములు ఆపాదించబడుతున్నాయి. అయితే 'ఇదంతా కూడా ఆత్మయొక్క స్పందనము మాత్రమే' అని గ్రహించ బడిన తరువాత ఇక బంధమోక్షములు లేవని స్వభావసిద్ధంగానే తెలియవస్తోంది. ఈ విధంగా ఎరిగినంత మాత్రం చేతనే అహంకారాదులన్నీ శమించి ఆశ్రయరహితమగుచుండగా... ఇక ఎవడు దేనిచేత, ఎక్కడ ఎట్లు బంధితుడౌతాడు చెప్పు?

ఇంద్రియ పరిమితసంబంధమే బంధము... ఇంద్రియములకు సాక్షియగు ఆత్మతోటి ఏకత్వ సిద్ధియే బంధరాహిత్యము.

వివేకి అయినవాడు 'ఇది నా సంకల్ప విభాగం. ఇది సంకల్పముల నుండి వివర్తమగుచున్న అనుభవం. ఇది సంకల్పాలకు ముందే ఉన్న నా చిత్‌చైతన్య స్వరూపం'... అని విభాగించి గాంచ గలుగుచున్నాడు. అట్టి స్వనిర్మిత సంకల్ప విభాగమునంతటినీ మిథ్యగా గాంచగలుగుచున్నాడు. ఇకప్పుడు క్రియాత్మక సంకల్పములు ఉండిఉంటున్నప్పటికీ సర్వమును స్పందాతీతమైన తత్త్వముగా గమనించుచున్నాడు. ప్రబుద్ధమైన చైతన్యసమన్వితుడై ఈ దృశ్యప్రపంచమును అదృశ్యమునందు విలీనమొనర్చుచున్నాడు.

❖

చిద్ఘనమగు ఆత్మ సర్వదా స్పందానాతీతమైన స్థితి అవధరించియే ఉన్నది. అద్దాని రూపమే స్పందనారూపమగుచున్నది. ఇట్టి బోధ దృఢపడిన జీవన్ముక్తుడు ఈ జగత్తులను ఆత్మయొక్క 'నిర్వృత్త తేజము'గా అనుభూతిని పొందుచున్నాడు.

ఓ రామచంద్రా! తదితర సర్వము ముక్షువులారా! ఈ నా వర్తమానం జాగ్రత్తగా వినండి.

"చైతన్యము యొక్క ప్రకాశమే చిత్ స్పందనము. ఆ ప్రకాశము యొక్క ఒకానొక కిరణమే ఈ జగత్తు" అను అవగాహనచే మరిక్కడ చైతన్యప్రకాశము తప్పితే ఏదీ ఉండదు. అనేకమంది దేహులు ఇక్కడ సుదీర్ఘమైన ఇంద్రియస్వప్నమును గాంచుచుండగా... ఒక్క జ్ఞాని మాత్రం అందుకు భిన్నమైన దర్శనమును కలిగి ఉంటున్నాడు సుమా! అతడు తన నిజస్వరూపమగు ఆత్మను సర్వవ్యాపిగా, సర్వాంతర్యామిగా, సర్వరసస్వరూపంగా, నామరూపాతీతంగా గాంచగలుగుచున్నాడు. తనకు ఆద్యంతాలు లేవని ఎరిగి ఉంటున్నాడు.

**యత్రోదేతి ప్రసభమనిశం సర్వసంవిత్తి సత్తా ।**
**యస్మిన్నేతే సకలకలనాకార పంకా గలన్తి ।**
**ఉద్యన్త్యేతే స్వదనుసుభగం యత్ర సర్వోపలమ్భా ।**
**ధ్యానేనైవం తమవగమయ ప్రత్యగాత్మానమన్తః ॥**

ఓ ప్రియరామచంద్రా! ఏ పరమాత్మయందు నిరంతరము జగదాకారప్రాప్తి, అద్దానినుండి ప్రీతిపూర్వకమగు విషయానుభవం కూడా అనుభవమౌతోందో, ఎవనిలో సమస్త సృష్టి సమూహాల సత్త జనిస్తోందో అట్టి సాక్షిరూపమగు నీ స్వస్వరూపపరమాత్మను నీ అంతఃకరణంలోనే వీక్షించు.

నీ సాక్షి రూపమే ఆ పరమాత్మ. ఇక కల్పిత జగత్తు నందలి సత్యాసత్యాల గురించి దుఃఖించుట మూర్ఖత్వమే అవుతుంది... ఇదియే ఈ బోధ సారం.

❖❖❖

# 16. స్వకంఠాభరణం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రఘురామా! ఈ ప్రకారంగా ఆత్మపదమే సమస్తమునకు ఆది. బ్రహ్మ – విష్ణు – మహేశ్వరాది మహత్స్వరూపులు ఆ పరమపదమునందే నెలకొనియుండి ఈ ముల్లోకములను పరిపాలిస్తూ లోకపూజ్యులై ఉంటున్నారు. స్వర్గవాసులలో కొందరు జ్ఞానులై ఆకాశగమనాది క్రీడలచే స్వర్గమున క్రీడిస్తున్నారు. అదేవిధంగా ఈ మనుష్య, దేవ, గంధర్వ, తిర్యగాది – జాతులలో కూడా కొందరు జీవులు ఆత్మతత్త్వమును ఎరిగినవారై బ్రహ్మానందపూర్వకంగా ఈ లోకంలో విహరిస్తున్నారు. మనుష్యానందము నుండి బ్రహ్మదేవుని ఆనందము వరకు పరికించి చూస్తే, సర్వానందముల కంటే ఆత్మానందమే (లేక) బ్రహ్మానందమే పరాకాష్ఠ. అట్టి బ్రహ్మైక్యానందమును పొందిన జీవుడు ఇక మరణ–జననాది దుఃఖములను పొందడు. అందరూ ప్రాణాధారములనుకొనే విషయాలచే ఆతడు నిరోధించబడజాలడు. ఏ జీవుడైనా సరే, ఆ పరమాత్మ యొక్క 'సర్వవ్యాపక చిన్మాత్రము' (లేక) 'ఆత్మయొక్క సత్తా సామాన్య రూపము'ను ఏ కొంచెం ఎరిగినప్పటికీ ఆతడు ధన్యుడే. ఒక్క నిమిషం కాలం స్వస్వరూపం అవధరించినప్పటికీ, అట్టివాడు యుక్తచిత్తుడేనని చెప్పబడుచున్నాడు. అతనికిక జన్మమృత్యుజరావ్యాధులుండవు. ఆతడు ఈ దేహము నుండి తన స్వరూపమును విభేదపరచి గాంచగలడు. ఆయా అనివార్య యథాప్రాప్త కార్యక్రమములు అతనిని సంతాపమొనర్చజాలవు.

**శ్రీరాముడు:** మహర్షీ! మీరు 'సత్తా సామాన్యము' గురించి చెబుతూ వస్తున్నారు కదా! అట్టి సత్తా సామాన్యము... 1. ఈ మనస్సు, బుద్ధి, అహంకారాది సమస్తము లీనమైనట్టి నిర్విశేష రూపమని మీ ఉద్దేశమా?... లేక, 2. మనోబుద్ధ్యహంకారాలు ఉండియే ఉన్నట్టి సవిశేషరూపమా?

ఎందుకంటే... మనోబుద్ధ్యహంకారాలు లేకపోతే దానిని వర్ణించటమెట్లా? నిర్ణయించటమెట్లా? మనోబుద్ధ్యహంకారాలు ఉన్నంత వరకు దుఃఖం తొలగదు కదా! అవే కదా సంసారానికి మూలం?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! మనం అనేక విశేషాలు చర్చించుకున్న తరువాత మరల ఈ ప్రశ్నకు వచ్చామేమిటి?

అయినా కూడా ...ప్రశ్న ఉచితమే. చెబుతాను. విను.

❖

ఏది సమస్త జీవులందూ, ఈశ్వర భావమునందు, ముక్తియందు కూడా అనుగతమై వ్యాపించి ఉన్నదో... ఏదైతే సమస్త దేహములలోనూ తినుట, త్రాగుట, గ్రహించుట మొదలగు సమస్త వ్యవహారములను కావించుచున్నదో... ఏదైతే సుషుప్తి – ప్రళయములందు సమస్తమును తనయందే లయం చేసుకుంటోందో... ఏది తురీయపదమునందు సమస్త విషయములను త్యజించినదై సర్వమునకు అతీతమై ప్రకాశించుచున్నదో... ఏది నీ యొక్క, నాయొక్క, సర్వుల యొక్క వాస్తవ స్వస్వరూపమేఅయిన్నదో...

...అద్దానిని 'బ్రహ్మము, సత్తాసామాన్యము' అని కూడా అంటున్నాం. మన ఈ సంవాదము యొక్క ఉపలక్షితము, చర్చనీయాంశము అదే.

అది సర్వవ్యాపి. ఆద్యంతరహితము. ఒక స్త్రీ కంఠాభరణం తన మెడలోనే ఉంచుకొని ఆ విషయం మరచి తన కంఠం తప్ప మిగతా చోట్లంతా ఆ ఆభరణంకోసం వెతుకుచున్నట్లు ఈ జీవుడు ఆ ఆనందమయతత్త్వమును తనయందే ఉంచుకొని ఆ విషయం తెలియక ఎక్కడెక్కడో వెతుకుచున్నాడు. 'అది నీయందే నీ స్వరూపంగా ఇక్కడే ఉన్నదయ్యా' అని శాస్త్రకారులు గుర్తు చేస్తు న్నారు. వేదాంత వాఙ్మయమంతా జీవునకు ఆతని "అప్రమేయ, అనంత, నిర్వికల్ప, అఖండ, వాస్తవ స్వభావ, తత్త్వములను" నిరూపిస్తూ చూపటానికే ఇంతటి విస్తారంగా రచించబడినదై ఉంటోంది.

అట్టి వాస్తవ స్వస్వరూపమే కారణ కారణం అయినప్పటికీ అక్కడ 'సవిశేషమా? నిర్విశేషమా?' అనే మీమాంస ఉండదు. ఈ విశేషములు ఇట్లే ఉండగా అది అట్లే ఉంటోంది. కాబట్టి ఒకటి తరువాత మరొకటి, ఒకటి లేనప్పుడు మరొకటి... అను భ్రమ త్యజించు.

'ఆ ఆత్మవస్తువు ఇట్టిది' అని నిర్ణయించటానికి ఈ మాటలు, సంజ్ఞలు సరిపోవు. అయినా శిష్యునికి అది చూపుచూ మేం మా పరిమితమగు ప్రవచనాశైలితో వర్ణించి చెప్పుచున్నాం.

**ఆత్మస్తోత్రం -** ఆ అనంతాత్మ...

ఆకాశమునందు ఆకాశముగాను, శబ్దము నందు శబ్దరూపంగాను, చర్మేంద్రియమునందు స్పర్శరూపంగాను, ఘ్రాణేంద్రియమునందు గంధ రూపంగాను ...ప్రకటితమౌతోంది.

ఆ ఆత్మయే శరీరమునందు శరీరత్వంగా భూమియందు భూసారత్వంగాను, జలమందు రసత్వంగాను, వాయువు నందు వాయుత్వంగాను, తేజము నందు తేజో రూపంగాను, బుద్ధియందు బుద్ధి రూపంగాను, మనస్సునందు మనో రూపంగాను, అహంకారమునందు అహంకార రూపంగాను, సంవిత్ నందు సంవిద్రూపంగాను, చిత్తము నందు చిత్త రూపంగాను, చతుర్విధ ప్రాణులందు చేతన రూపంగాను, దేవతలందు దేవతా రూపంగాను, మనుష్యులందు మనుష్య రూపంగాను, క్రిమికీటకాదులందు కీటక రూపంగాను, యుగ-సంవత్సరములందు కాల రూపంగాను, క్రియాదులందు క్రియా రూపంగాను, నియతి యందు నియమిత రూపంగాను, స్థితియందు స్థిర రూపంగాను, నశించే వస్తువులందు నాశన రూపంగానూ... ప్రకటితమౌతోంది

బాల్యంలో బాల్యరూపంగాను, యౌవనంలో యౌవనరూపంగాను, వార్ధక్యంలో వృద్ధ రూపంగాను, మరణమునందు మృత్యు రూపంగాను... ఆ పరమాత్మయే స్థితి కలిగి ఉన్నాడు.

❖

సముద్రంలోని తరంగాలు జలముకంటే వేరా? ఈ సమస్త పదార్థములు ఆ పరమేశ్వరునికి భిన్నమైనవి కావు. అయితే, ఈ పదార్థములలో ఏ అనేకత్వము గోచరిస్తోందో... అదంతా అసత్యమే అయ్యున్నది. దృష్టాంతానికి ఒక్కొక్కడు చూచేది ఒక్కొక్క విశేషం అయినప్పటికీ, అందరిలోని 'చూపు' ఒక్కటేకదా! చూపు - స్పర్శ - రుచి మొదలైనవి వేరువేరైనప్పటికీ అనుభవములన్నిటి యొక్క అర్థప్రదాత అనుభవస్వరూపుడు అగు దేహి ఒక్కడే కదా!

పిల్లవాడు కొరివిదయ్యమును కల్పన చేసుకుంటున్నట్లు సత్యమగు చిత్‌స్వభావమే ఈ జగత్తుయొక్క కల్పన గావించుచున్నది.

మహాత్ముడగు ఓ రామచంద్రా! 'ఈ అనుభవమయ్యేదంతా చిద్రూపుడనగు నేనే. నేనే లీలా మాత్రంగా ఇదంతా వ్యాపించి ఉన్నాను'... అను నిశ్చయముతో కూడుకున్నవాడవై ఉండుము. శాంత చిత్తుడవగుము. స్వమహిమయందు వర్తించుము. నీ స్వసంకల్పమహిమవలననే ఏదేది ఎట్లెట్లు తోచుచున్నదో... అట్లట్లు నీయొక్క సత్త ప్రకటనమగుచున్నదని గ్రహించు.

❖

సాయం సమయమైనది. 15వ రోజు సంవాదము ముగించబడింది. శాంతి ప్రవచనములు ప్రవచించబడ్డాయి. సభికులంతా తమ యొక్క నిత్య - అనిత్య కల్పిత-వాస్తవ స్వరూప విభాగములను వివేకదృష్టిచే పరికించటం గురించి చింతన చేస్తూ గృహోన్ముఖులయ్యారు.

దశరథుడు, రామచంద్రుడు, మంత్రివరేణ్యులు, తదితర రాజ పరివారం ఆ సంవాద శ్రవణము నకు వేంచేసిన ముఖ్యులందరి వసతి - అతిథి మర్యాదలను పర్యవేక్షించటంలో నిమగ్నులయ్యారు.

అయోధ్యా ప్రజలు తమ ప్రియరాజకుమారుడు రామచంద్రుని నిమిత్తంగా తమకు లభించిన జన్మజన్మల ప్రయోజనమైన శ్రీ వసిష్ఠ - శ్రీరామ సంవాదము గురించి చెప్పుకుంటూ ఆనందిస్తున్నారు. ఆ మరునాడు (16వ రోజు) జరుగబోయే చర్చనీయాంశముల గురించి తమకు తోచిన విధంగా

సంభాషించుకోసాగారు. సుదీర్ఘకాలం వర్షాలు లేక నిస్సత్తువగా ఆకాశంవైపు దృష్టి సారించుచూ ఎదురు చూచే వన్యజీవులు ఒక్కసారి తొలకరి వాన కురియగానే ఎంతటి సంరంభంగా ఉంటాయి? అయోధ్యారాజ్యంలోని ప్రజలు అంతటి సందడిగా కన్పట్టసాగారు.

❖❖❖

**(పదిహేనవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# VI. జీవుడు - స్వప్నపరంపరలు

## 1 స్వప్నసదృశ సిద్ధాంతం

**శ్రీరాముడు:** మునీంద్రా! ఈ పాంచభౌతిక సృష్టి అతి చమత్కారంగా తాండవిస్తోంది. ఇదంతా ఒకానొక మహత్తర సంకల్పము అని అనక తప్పదు. అట్టి చమత్కార సృష్టి రచనా వ్యవహారంలో రెండు రకాల సంకల్పాలు గోచరిస్తున్నాయి.

**1. వృష్టి సంకల్పం -** ఇందు 'జీవులు' అనబడు వ్యష్టి సంకల్పులు ఉపాధి సహితులై ప్రవేశిస్తున్నారు, నిష్క్రమిస్తున్నారు.

**2. సమష్టి సంకల్పం -** ఒకానొక సమష్టితత్త్వము ఇక్కడ ఏర్పడి ఉండి, జీవుల ఉపాధులకు ప్రేరణ, సంరక్షణ, సంచారం, కాలం, ఆహారం, సంక్షయం – వంటి కార్యక్రమములకు కారణమగుచూ వ్యవహరిస్తోంది. అట్టి సమష్టితత్త్వమునకు రచయిత అయిన సమష్టి జీవుని 'హిరణ్యగర్భుడు' అని కొన్ని శాస్త్రములు వర్ణిస్తున్నాయి.

'సమష్టి జీవుడగు హిరణ్యగర్భుని స్వప్నమే ఇదంతా!' – అని ప్రతిపాదించే శాస్త్రాల విషయమై మీ అభిప్రాయములు తెలియజేయ ప్రార్థన. వేదాంత వాఙ్మయంలో ప్రసిద్ధమైయున్న 'స్వప్నసదృశ సిద్ధాంతం' గురించి వివరించమనవి.

**శ్రీవసిష్ఠ మహర్షి:** "పూర్వకల్పంలో సమష్టి సంకల్పుడగు హిరణ్యగర్భుని స్వప్నమే ఈ వర్తమాన జగత్తు. అతని వాసనల ప్రకటనమే ఈ ప్రపంచం" అనే ఒకానొక సిద్ధాంతం లోక ప్రచారమైయున్నది. ఈ సిద్ధాంతము ననుసరించి "ఆ హిరణ్యగర్భుడు (సమష్టి స్వప్నమాత్ర జగత్తుకు కర్త) అజ్ఞానదశ యందు ఉన్నప్పుడు ఈ జగత్ రచన నిర్వర్తించినాడు. సమష్టి స్వప్నకర్త ఆ స్వప్నమునుండి ముక్తి నొందినాడు. అందుచేత ఈ జగత్తు వాస్తవానికి లేదు" అని సిద్ధాంతీకరించబడుతోంది. దీనిననుసరించి 'ఈ జగత్తు స్వప్నసదృశం మాత్రమే. సమష్టి జీవుడగు హిరణ్యగర్భుని స్వప్నంలో తదనుకూలమైన భ్రమ సమన్వితులగు జీవులు స్వప్న సదృశంగా ఇందులో ప్రవేశించి, సంచరించి, మరొకప్పుడు బహిర్గతులగుచున్నారు. – అని సిద్ధాంతీకరించబడుతోంది. ఆ సిద్ధాంతమును అనుసరించి కూడా 'ఈ జగత్తు వాస్తవానికి లేదు' అనియే నిరూపించబడుతోంది కదా!

చైతన్యము సర్వవ్యాపకమైనది. అట్లా అయి కూడా అయ్యేది ఇట్లు సమష్టి జీవునిగా, అటు వ్యష్టి జీవునిగా వ్యవహారము రచించుకుంటోంది. తాను వ్యాపించి, అట్లు వ్యాపించినచోట దృశ్యమును

పరికల్పించుకుని తన చుట్టూ ఈ దీర్ఘ సంసారమును అనుభవిస్తోంది. ఈ సంసారము "సమ్యక్ దర్శనము" అను దివ్యౌషధముచే మాత్రమే తొలగగలదు. అజ్ఞాన కారణంగా ఏర్పడిన అసమ్యక్ దర్శనం, లేక సంసారం, విజ్ఞాన కారణంగా తప్పక తొలగగలదు. "ఇక్కడెక్కడా అనేకమనేది లేదు. ఏకత్వమే ఇందలి సత్యం" అను జ్ఞాన ప్రాప్తిచే నిద్రలేచిన వాని స్వప్నంలాగా 'సంసారము' అనబడు దృశ్యపరిమితానుభవం తనంతట తానే పలాయనం చిత్తగిస్తుంది.

"సమష్టి సంకల్పస్వరూపుడు తత్త్వజ్ఞానలాభం పొంది ఉండటం చేత ఈ ప్రపంచం గడచిపోయిన స్వప్నం వంటిది" – అనునది స్వప్నసదృశ సిద్ధాంత సారం.

అందుచేత ఈ జగత్తు ఇప్పటికే గడచిపోయిన ఒక స్వప్న కథనం వలె, ఊహాకల్పిత భావావేశంతో కూడిన సంఘటనానుభవం వలె ద్రష్ట యొక్క స్వయంకల్పితానుభవం. నాశనమాత్రం, సారహీనం అని గ్రహించు. ఇది దర్పణాంతర్గతమైన ప్రతిబింబంలాగా వ్యష్టి–సమష్టి జీవుల సత్స్వరూపం నందు ప్రతిబింబిస్తోంది.

**జరిగిపోయిన స్వప్నం -** 'ఇదంతా సమష్టి జీవుని గతించిపోయిన స్వప్నం మాత్రమే' అనునది ఒక సిద్ధాంతమని అనుకున్నాం కదా! అట్టి స్వప్నం నుండి సమష్టి జీవుడగు హిరణ్యగర్భుడు (బ్రహ్మదేవుడు – సమష్టి ఇచ్ఛకు ప్రదాత) సృష్టి స్వప్నం నుండి నిదుర లేచినప్పటికీ, అజ్ఞానముచే ఉదయించిన వ్యక్తిగతాభిమాన రూపమైన "అహం" ఇందు ప్రవేశించి ఇక్కడ కల్పనను కొనసాగిస్తోంది. చమత్కారంగా ఇదంతా స్వప్న సదృశంగా కాకుండా దృఢమైన సత్యం వలె పొందటం జరుగుతోంది. కనుక దృశ్య ప్రపంచం యొక్క నిర్వచనం 'ద్రష్ట యొక్క అజ్ఞాన కారణమైన అపరిపక్వ, పరిమిత దృష్టియే.'

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ జగత్తు 'హిరణ్యగర్భుడు' అనబడే సమష్టి ఇచ్ఛారచయిత యొక్క స్వప్నం మాత్రమేనని సెలవిచ్చారు. అట్టి సమష్టి సంకల్పుడు అజ్ఞానమనే స్వప్నం నుండి ఇతఃపూర్వమే నిదుర లేచాడని కూడా చెప్పారు.

ఒకడు నిదురలో స్వప్నం గాంచుచున్నాడనుకోండి. అతడు నిదుర లేవగానే ఆ స్వప్నం కూడా ముగించబడుతుంది. ఒకని యొక్క గతించిన స్వప్నంలో మరొకరు ప్రవేశించటమనేది, దానిని కొనసాగించటమనేది చాలా ఊహాతీత విషయాలు. యుక్తియుక్తం అని అనిపించదు. హిరణ్యగర్భుని అజ్ఞానం తొలగగానే అతని స్వప్నమాత్రమైన ఈ సమష్టి జగత్తు కూడా వైదొలగాలి గదా! ఇది ఎందుకు వినాశనమొందటం లేదు?

**శ్రీవసిష్ఠ మహర్షి:** స్వప్నము అత్యంత క్షణికమైనది. అయితే ఆ స్వప్న ద్రష్ట యొక్క భోగదృష్టిని అనుసరించి అది ఆ స్వప్న ద్రష్టకు సుదీర్ఘంగా అనుభవమౌతోంది.

ఈ సమష్టి సృష్టి కూడా 'భోగము' అనే వ్యసనం లేక ప్రతిబంధకాన్ని ఆధారంగా చేసుకుని కొనసాగుతోంది. సర్వేసర్వత్రా ప్రసరించుచున్న చైతన్యం సమష్టి జీవునిగా ఒక వైపు కల్పనను ప్రారంభించి వ్యష్టి జీవునిగా మరొకవైపు అనుభవపరంపరను కొనసాగిస్తోంది. ప్రతిభాసవంటి సమష్టి జీవుని జగత్‌స్వప్నమున జీవజగత్తులు తోచుచు అనంత ప్రవాహరూపమున వెలయుచున్నాయి.

ఒకనికి కలలో కనిపించేవన్నీ అంతర్గత భావతరంగాలే కదా! భోగాభిలాషతో కూడిన అంతర్గత భావతరంగాలే జగత్తు యొక్క అనుభవముల రూపమున సమష్టి – వ్యష్టి ద్రష్టలకు ఇద్దరికీ ఘనీభూతమై ఇట్లు ప్రాప్తిస్తున్నాయి.

❖

బీజం ఎటువంటిదైతే చెట్టుకూడా అట్టిదే అవుతుంది కదా! స్వప్న పురుషుని వంటి హిరణ్యగర్భుని (ప్రజాపతి) యొక్క స్వప్నమాత్రమైన ఈ జగత్తు కూడా స్వప్నము వంటిదే. అసత్యమగు మనః సంకల్పము ద్వారా గాంచబడేదంతా అసత్యమే అవుతుంది కదా! ఈ ప్రపంచానుభవం అసత్యమైనదే! ఇక్కడ కల్పన అను ఊహా సంబంధమైన మనో వికారం నిశ్చల స్వస్వరూపం నుండే నిశ్చలజలంలో ఆవిర్భవిస్తోంది. ఇది నిశ్చల నిరాకారజలంలో చిన్న గులకరాయిని వదలినప్పుడు ఏర్పడే చంచల ఆవృత్తముల వంటిది. అదియే జగత్తు యొక్క ఉత్పత్తి. అంతేగానీ కేవలం పంచభూతాల కలయిక మొదలైనవి జగదుత్పత్తి కాదు. ఆ విధంగా ఏర్పడిన కల్పన జన్మ జన్మాంతరాలుగా, స్వర్గ నరకాదులుగా విస్తారం పొందుతోంది. అట్టి దృశ్య వ్యవహారం నందు సత్యత్వబుద్ధి ఉంచవలసిన అవసరమే లేదు.

ఎవరికైనా సరే, ఈ జగత్తు పట్ల పాతుకుపోయి ఉన్న 'ఇది సత్యమే' అను రూపంలో ఏర్పడిన బుద్ధి (లేక) అవగాహన అయుక్తం మాత్రమే. అట్టి భ్రమాత్మకమైన నమ్మికను ఎంత త్వరగా త్యజిస్తే అంత మంచిది.

**కల్పము -** సమష్టి జీవుడగు ప్రజాపతి ఒక్క నిమిషంలో గాంచిన త్రిజగత్ స్వప్నం అత్యంత దీర్ఘమై 'కల్పము' అను శాస్త్రీయనామంచే చెప్పబడుతోంది. ఈ జీవులంతా చూచుచున్నది 'సృష్టి' అనబడు ఆ క్షణకాల స్వప్నాన్నే! చిత్ యొక్క కల్పనలగు ఈ దృశ్య సమూహాలు నీటి యందు అలల లాగా అనుక్షణం లేచి, లయమౌతున్నాయి. ఈ 'కల్పములు – సృష్టులు – స్వర్గములు' అను పేర్లతో చెప్పబడే దృశ్యపరంపరా వ్యవహారములు సత్యము కానే కాదని గుర్తు చేస్తున్నాను.

ఈ దృశ్య ప్రపంచం మిథ్యయేనని గ్రహించు. ఈ జీవులు తమయొక్క సంకల్పముల ద్వారా (లేదా) 'అంతరంగం నందు కల్పించుకొనిన సమాలోచనలు / భావనాతరంగాలు' అను వాహనం అధిరోహించి ఇద్దాని యందు ప్రవేశించి ఇదంతా వాస్తవమేనని, ఇక్కడ సుఖదుఃఖాలు కలవని ఎంతో నమ్మకం పెంపొందించుకుని వ్యవహరిస్తున్నారు. స్వర్గ నరకాదుల అనుభవం పొందుచున్నారు. క్షణక్షణం మారిపోతూ ఉండే ఈ జగత్తు 'ఇది శాశ్వతం – విస్తారం – సత్యం – అనుసరణీయం – దాటుటకు అశక్యం ...అని గమ్మత్తుగా అనిపించటమే ఇక్కడి చమత్కారం. ఒక స్వప్నం తరువాత మరొక స్వప్నం ఏర్పడుతూ ఉన్నప్పటికి స్వప్న ద్రష్ట ప్రతిస్వప్నమునూ తనయొక్క పరిమితముగా, అది మాత్రమే వాస్తవమైనట్లు గాంచుతూ ఉంటాడు కదా! ఈ జీవుని బాల్య–యౌవన–వార్ధక్యదశలు, సుఖ–దుఃఖ సంఘటనలు, జన్మ–మృత్యు–జన్మాంతరములు ఎప్పటికప్పుడు క్షణికమే అయినప్పటికీ "నేను బాలుడను – నేను యువకుణ్ణి – నేను ముసలివాడను – నేను సుఖిని – నేను దుఃఖిని – నేను పుట్టుచున్నాను – నేను చచ్చుచున్నాను" అను ఎంతో ఘనీభూతమైన వర్తమానానుభవ భ్రమకు

లోను అవుచున్నాడు. ఈ జగద్విషయములన్నీ కాల ప్రవాహంచే ఎటకో అనుక్షణం కొట్టుకుపోబడు చున్నాయని ఎవరికి తెలియదు? అయినా కూడా ఈ జీవుల సుఖదుఃఖములకు అంతు కనబడుతోందా? ఇక్కడ హిరణ్యగర్భుని స్వప్నం, జీవుని వ్యక్తిగతమైన స్వప్నం – ఒకచోటికి వచ్చి కాపురం చేస్తున్నాయి. ఇక చూడు, చమత్కారం! ఇదంతా సంసారసాగరం – అనంత దుఃఖమయం – విధి వైపరీత్యం – విధి చిద్విలాసం – అధిగమించుటకు అసాధ్యం అను రూపం గల అనేక సమ్మిళితాలతో కూడి అనుభవ పరంపరలు ఎదురుగా ఏర్పడి ఉంటున్నాయి.

**శ్రీరాముడు:** ఎందుచేత అట్లా ఏర్పడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఎందుచేత అని ఏమున్నది? ఏది ఎట్లా గాంచబడితే అది అట్లే ఉండటం అనేది ఆత్మకు గల ఒకానొక శక్తి. అట్టి శక్తి భ్రమతో కూడి ప్రవర్తిస్తున్నప్పుడు సృష్టి సంభవిస్తోంది. భ్రమ వల్ల సంభవం కానిదేమున్నది? అయితే... స్వప్నంలో అప్పటి భ్రమ అప్పటికి సత్యమే అయినప్పటికీ ఆ స్వప్నం మెళుకువ వచ్చిన తరువాత వ్యవహారయోగ్యం కాగలదా? భ్రమలకు చెందిన జీవుడు వాటితో కూడా తమకము పొందుచున్నాడు. అట్లే ఈ జగత్తు కూడా!

ఈ సృష్టి, దీని కర్తయగు ప్రజాపతితో కూడా... ప్రళయం పొందిన మరుక్షణం... ఆత్మవస్తువు ఒక్కటే శేషించి ఉంటుంది. దృష్టి లయమొందినప్పుడు ఇక శేషించేది ద్రష్ట మాత్రమే కదా! విషయ రహితమగు ద్రష్టయే సత్ – చిత్ – ఆనందస్వరూపుడగు పరమాత్మయొక్క నిర్వచనం. ఆత్మస్వరూపుడగు పరమాత్మ ప్రతిఒక్క జీవుని స్వస్వరూపుడై ఎట్టఎదుట నిలచియే ఉండగా ...అజ్ఞాన జీవులు ఎక్కడెక్కడో వెతకుచున్నారు.

అజ్ఞానము వలననే భూత భవిష్యత్ వర్తమానములందు త్రిలోకములలో చిత్రవిచిత్రాలైనవన్నీ తోచుచున్నాయి. చైతన్యము వాస్తవానికి నిర్విషయమైనది. నిర్విషయము – సర్వము అగు ద్రష్టయందు ఎందుకో ఆశ్చర్యంగా ఈ త్రికాల, త్రిజగద్విషయాలు ప్రదర్శనమగుచున్నాయి. ఈ ప్రపంచంలోనూ, ఈ మనస్సులోనూ చమత్కారాలకు లోటు ఏమున్నది? అయితే నీటిలో నిప్పు ఉంటుందా?

**శ్రీరాముడు:** ఉండదు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి:** అయితే ఏం? సముద్ర జలంలోంచి బడబాగ్ని బయలుదేరుతోంది. శూన్యంగా మానవులకు కనబడే ఆకాశంలో విమాన విహారులగు దేవతలకు ఆశ్రయమైన స్వర్గ – మహర్ మొదలైన లోకాలు విస్తరించి ఉన్నాయి. మృత్తికారహితమైన (మట్టి ఏమాత్రం లేనట్టి) కొండ శిఖరంపై మహావృక్షాలు వెల్లివిరుస్తున్నాయి. నిస్సారమగు ఒక గండశిల దేవతా విగ్రహంగా మలచబడగా, ఆ విగ్రహం భక్తులచే పూజింపబడి మహత్తరమైన ప్రయోజనాలు ప్రసాదిస్తోంది. శిలలో ప్రాణులు జీవిస్తున్నాయి. రాతిలో కప్ప బ్రతుకుతోంది కదా! ఒక శిలనుండి నీరు ప్రవహించి అది పొడవైన జీవనదిగా పరిణమిస్తోంది. కొద్ది నిమిషముల నిద్రాసమయంలో సుదీర్ఘమైన కాల వ్యవహారం స్వప్న ద్రష్ట పొందుచున్నాడు. కల్ప వృక్షం – మణి వంటి జడవస్తువులు ఆరాధకులకు పుంఖానుపుంఖములైన ప్రయోజనములను వరంగా ప్రసాదిస్తున్నాయి. ఒకడు స్వప్నంలో తాను

చచ్చినట్లు, తన బంధువుల రోదనను వినుచున్నట్లు పరస్పర వ్యతిరిక్త విషయములను గాంచుచున్నాడు. ఆకస్మికంగా గంగ ఉద్భవించి పాతాళం జేరటం లేదా? జీవుని ప్రయత్నం లేకుండానే ఆ జీవుని పొట్టలో ప్రవేశించిన ఆహారం పచనమై శక్తిరూపం దాలుస్తోంది. పెద్ద పర్వతములు జడమై ఉండి కూడా రెక్కలు దాల్చి గాలిలో లేచి జనావాసంపై వ్రాలి సర్వనాశనం చేస్తున్నాయి. చింతించుచూ ఉండగా కొన్ని కోరికలు ఫలిస్తున్నాయి. మరికొన్ని కోరికలు ఎంత చింతిస్తున్నా ఫలించటమే లేదు. 'నా బాల్యం, నా యౌవనం ఇట్లాగే ఉండుగాక!" అని కోరుకుంటే అది ఫలిస్తోందా! లేదు. యంత్ర నిర్మితమగు జడవస్తువులు స్వయంనిర్ణయాధికారంతో కర్మలు నిర్వర్విస్తున్నాయి. అతి పెద్దవగు గ్రహాలు, నక్షత్రాలు, ఉపగ్రహాలు భూమిమీద నుండి చూస్తున్నప్పుడు మిళుకుమిళుకుమంటూ అతి చిన్నవై కనిపిస్తున్నాయి. ఇంద్రజాల – గంధర్వ విద్య ప్రదర్శనం చూస్తున్నప్పుడు అదంతా నిజమేనని భ్రమ కలిగి అనుభూతులన్నీ ఏర్పడుచున్నాయి. కల్పితమగు ఆకాశమున విస్తార జీవ – జగత్ అనుభవాలు కనిపిస్తున్నాయి. యంత్ర–ఓషధాల ప్రయోగాల వల్ల ఆశ్చర్యకర ప్రయోజనాలు కలుగు చున్నాయి. భయము నుండి మదము ఉద్భవిస్తోంది.

ఈ విధంగా ఈ జగత్తులో చిత్ర విచిత్రములకు లోటేమున్నది? అందుకే భ్రమలో సంభవం కానిదేమున్నదని మనం అనుకున్నాం కదా! (అఘటనా ఘటనాపటీయసీ మాయా – అని అంటారు కదా!) ఈ జగత్తు గురించి "దీని నుండి నేను తప్పించుకోలేను" – అని ఒక సమయంలో అనిపిస్తున్నప్పటికీ జ్ఞానం లభించినప్పుడు 'ఇది అర్థరహితం. కనుక ప్రతిబంధకమయ్యే శక్తి దీనికి లేదు'... అనునది కూడా అనుభవం కాగలదు. అప్పుడీ జీవునికి స్వస్వరూపము నందు పరమవిశ్రాంతి లభించగలదు. ఇక ఈ ఉపాధులంటావా... జ్ఞానుల దృష్టిలో వీటి రాకపోకలు, తదితర వ్యవహారాలు తాము గాంచే ప్రశాంత స్థితికి ప్రతిబంధకమే కాదు.

రసావేశం దృష్ట్యా ఈ జగత్తు భ్రమ మాత్రమే. బ్రహ్మ రూపం దృష్ట్యా ఇక్కడ అసత్యమేదీ లేదు. జగత్ రూపంలో వీక్షిస్తే ఇక్కడ సత్యమేదీ లేదు.

ఈ విధంగా ఈ సృష్టి స్వప్నమున అన్నియు, అంతటా సంభవములే అయి, అట్లట్లు గాంచ బడుచున్నాయి. సృష్టిస్వప్నమునందు ముగ్ధుడగుచున్న జీవుడు ఇదంతా యథార్థమని, ఇది ఇట్లే ఉండబోతోందని భావించుచున్నాడు. ఒక భ్రమ తరువాత వెనువెంటనే మరొక భ్రమ చోటు చేసు కోవటం జరుగుతోంది. 'ఇదంతా అత్యంత స్థిరం' అను స్థిరబుద్ధిని ఆశ్రయించుట చేతనే జీవుడు మోహం చెందుచున్నాడు. లేడి పచ్చిక మేసే ప్రయత్నంలో ఒక గోతిలోంచి బయటబడి మరోగోతిలో పడుచున్నట్లు ఈ జీవుడు సంసారము మీద గల నమ్మికతో ఒక దేహంలోంచి మరొక దేహంలో ప్రవేశిస్తూ దేశ ద్రిమ్మరిలా సంచరిస్తున్నాడు.

❖❖❖

# 2. స్వప్నంలో ఇంకొక స్వప్నం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఈ జీవుడు ఒకటి తరువాత మరొకటిగా అనేక స్వప్నములను గాంచుచున్నాడు. అనేకచోట్ల వేర్వేరు భ్రమలను ఒకేసారి కూడా పొందుచున్నాడు. "స్వప్నంలో ఇంకొక స్వప్నం, ఆ స్వప్నంలో మరొక స్వప్నం" – ఈ విధంగా స్వప్న–స్వప్నాంతర్గత పరంపరలను గాంచు చున్నాడు. ఈ విషయం నిరూపిస్తూ ... 'జీవట స్వప్నదేహపరంపరలు' అని పేరుతోనూ, 'శతరుద్రీయం' అనే ఒకానొక విశేషం నా దృష్టిపథంలో మెరుస్తోంది. ఆ వృత్తాంతం ఇప్పుడు చెబుతాను... విను.

❖

ఒకానొక సుదూర ప్రాంతంలో 'జీవటుడు' అనే పేరుగల గొప్ప సాధకుడొకడు ఉన్నాడు. అతడు జన్మతః గొప్ప విజ్ఞాని. బాల్యంలోనే గృహమును త్యజించి సన్న్యాసాశ్రమం స్వీకరించాడు. భిక్షాటనంతో దేశసంచారం చేస్తూ ఉండేవాడు. ఆ పరివ్రాజకుడు ఒక ప్రక్క దేశాటనం చేస్తూనే తన తీవ్రమైన సాధన కొనసాగిస్తూ ఉండేవాడు. క్రమంగా శాంతి, ఓర్పు, వైరాగ్యం, తపస్సు, శాస్త్ర పరిజ్ఞానం అతనిని ఆశ్రయించాయి. ఆత్మజ్ఞానంతో ఆతని స్వరూప–స్వభావాలు పరమప్రశాంతత్వము సంతరించుకున్నాయి.

అతడు ఒకసారి తనను ఆశ్రయించిన కొద్దిమంది శిష్యులతో ఒక గ్రామప్రాంతం చేరాడు. అక్కడి ప్రశాంత వాతావరణం అతనికి ఎంతో నచ్చింది. ఆ గ్రామంలోని నివాసిత ప్రాంతానికి కొంత దూరంలో ఒక పాడుబడిన ఇల్లు కనిపించింది. ఒకటి రెండు రోజులలో శిష్యుల సహాయంతో దానిని ఒక ఆశ్రమంగా తీర్చిదిద్దాడు. అక్కడే కొన్ని రోజులు నిరంతర సమాధిని అభ్యసించాడు. క్రమంగా అతని యందు సాంసారిక వాసనలన్నీ వైదొలగాయి. చిత్తము శుద్ధము అతి పవిత్రము అయింది. సత్య సంకల్ప సమన్వితం అయింది. అనగా, చిత్తము పరిశుద్ధం పొంది, తద్వారా ఏది ఎట్లు సంకల్పిస్తే అది అట్లే సంభవమవగల సంకల్ప సిద్ధిత్వం పొందింది. ఇక అతని చిత్తము మౌనము – సర్వత్వము – చంచలరాహిత్యము – గుణాతీతత్వము వహించి ఉంటోంది.

ఒకరోజు అతడు యథారీతిగా ఆసనము ధరించి సమాధిని అభ్యసిస్తున్నాడు. ప్రశాంతజలంలో తరంగం ఉద్భవించినట్లు అతని అంతరంగంలో "నిర్విషయమగు ఆత్మయందు ఈ కార్యకారణవ్యవస్థ యొక్క చమత్కారమంతా ఏమిటి?" అను రూపంలో ఒక జిజ్ఞాస ఉద్భవించింది. "ఈ జగత్తంతా ఒక లీలయే కదా! కేవలం వినోదార్థం అధ్యాత్మశాస్త్రజ్ఞులు కూడా కలిగియుండే ఒకానొక చిత్తవృత్తిని అవలంబించి కొద్దిసేపు ఈ జగత్ చమత్కారం చూచి రావాలి"... అని అనుకున్నాడు. అట్టి సంకల్పం ఉత్పత్తి అయి రూపం దిద్దుకుని, బలపడగానే ఆతడు కనులు మూసుకున్నాడు. ఇంతవరకూ అతనికి అనుభవమగుచున్న ఆత్మధర్మమును కొంచెం ఏమరచి చిత్తధర్మమును ఆశ్రయించాడు. అంతవరకూ ఒక క్రమముగా పారుచున్న జలం తన క్రమము కోల్పోయి అకస్మాత్తుగా సుడులు పొందుతుంది చూచావా? అట్లా ఇంతవరకూ నామ–రూప–గుణ అతీతత్వమును వహించిన అతని మనస్సు

నామ–రూప–గుణ సహితత్వమును ఆశ్రయించింది. అంతే! ఇక యతిధర్మమును కోల్పోయి, ధర్మరహితుడగు ఒక అజ్ఞాని యొక్క స్వభావ – సంకల్పములను లీలగా అవధరించాడు.

'నేను' జీవటుడు అనే పేరుగల ఒక మానవుణ్ణి కదా! – అని అనుకోసాగాడు. నిరవయవము అపరిమితము అగు స్వభావము నుండి చ్యుతుడై కేళీవినోదంగా హస్త–పాద పరిమితమైన దేహస్వభావం ఆశ్రయించాడు. భిక్షకుని రూపంలో అతని భౌతికదేహము – సమాధి యథాతథంగా ఉండగానే అతని చిత్తము మరొక జీవ–పాంచభౌతిక దేహం కల్పించుకుని అక్కడి నుండి బయలుదేరింది.

'ఊళ్ళో విశేషాలేమిటో చూచివద్దాం' అని తలచిన అతని చిత్తము నూతన జీవట ద్వితీయ దేహంతో ఊరిలో ప్రవేశించింది. ఆ ద్వితీయ జీవటుడు వీథులలో అటూ ఇటూ తిరుగుతూ ఉండగా ఒకచోట ఒక చెట్టు తొఱ్ఱలో ఒక తేనెతుట్టె కనిపించింది. ఒడుపుగా ఆ చెట్టు ఎక్కి తేనెతుట్టెను నేలకు దించాడు. ఆ తేనెపట్టులో గల తేనెను శుభ్రంగా త్రాగాడు. ఇక అక్కడి నుండి బయలుదేరాడు. అక్కడి వీథులలో సంచరించే జనులను ఆశ్రయించి కొన్ని డబ్బులు సంపాదించాడు. ఆ సమీపంలో గల ఒక కల్లు దుకాణంలో ప్రవేశించాడు. అక్కడి వారితో సరసాలు ఆడుతూ అర్ధరాత్రి వరకూ మత్తుగా త్రాగాడు. ఒక తాగుబోతు పాడుచున్న తత్త్వపు పాటలు విన్నాడు. అర్ధరాత్రి ఇక అక్కడి నుండి బయలు దేరి తూగుతూ ఒక ఇంటి అరుగుపై నిద్రకు ఉపక్రమించాడు. ఆ నిద్రలో అతను ఒక కలలో ప్రవేశించాడు. తనను ఒక పాఠ్య – అధ్యయనములతో కూడిన సత్కర్మపరుడగు బ్రాహ్మణ బాలకునిగా గాంచసాగాడు.

❖

ఆ బ్రాహ్మణ బాలకుడు బ్రాహ్మణగృహంలో ఉంటూ, తండ్రి దగ్గర సంధ్యావందనం, వేదాలు నేర్చుకుంటున్నాడు. చాలాకాలం తదితర విద్యార్థులతో కూడి అనేక శాస్త్ర విషయాలు నేర్చుకుంటు న్నాడు. క్రమంగా యుక్త వయస్సు వచ్చింది. వివాహం చేసుకుని పిల్లలను కన్నాడు. వారి కోసం అనేక శ్రమలకు ఓర్చి, ధనం సంపాదిస్తూ ఉండేవాడు. చాలా రోజులు గడిచాయి. ఒక రోజు నిత్య నైమిత్తిక కర్మలను విశేషపూజలను అర్ధరాత్రి వరకు ఇంటివద్దే నిర్వర్తించాడు. రాత్రి పొద్దుపోయింది. రోజంతా అలసి ఉన్న ఆ బ్రాహ్మణునికి ఆ రాత్రి రాజాశ్రయం గురించి యోచిస్తూ నడుం వాల్చగానే నిద్రపట్టింది. ఆ నిద్రలో తానొక సామంత రాజకుమారుడైనట్లు కలగాంచాడు.

❖

ఆ సామంతరాజ కుమారుడు బాల్యం నుండే ఎన్నో కష్టాలు పడవలసి వచ్చింది. అతనికి చెందవలసిన సింహాసనం ఆక్రమించటానికి అతని దాయాదులు ఎన్నో కుట్రలు పన్నారు. రాజభక్తులగు కొద్దిమంది మంత్రుల సమాలోచనల సహాయంతో అతడా కుయుక్తులన్నీ పటాపంచలు చేసి సింహాసనం అధిష్ఠించాడు. కొన్ని సంవత్సరాలు రాజ్యం ఏలాడు కూడా!

ఒక రోజు ఆ సామంతరాజు రోజూలాగానే రాచ కార్యములన్నీ ముగించుకుని అంతః పురంలో ప్రవేశించాడు. ఆ మరునాడు తాను వరించిన చక్రవర్తి యొక్క రాజకుమార్తె స్వయంవరానికి వెళ్ళవలసి ఉన్నది. ఆ విషయమై మరునాటి ప్రయాణ సన్నాహాలకు ఆజ్ఞాపించాడు. ఆ రాత్రి

అంతఃపురంలో తీయటి ఆలోచనలలో నిమగ్నమయ్యాడు. అతనికి తెలియకుండానే ఎప్పుడో నిద్రలోకి జారుకున్నాడు. ఆ నిద్రలో అతడు ఒక చక్రవర్తి అయినట్లు కలగాంచాడు.

**శ్రీరాముడు:** ఆ జీవట భిక్షువు పరివ్రాజకుడై ఆ గృహంలోనే త్రాగుబోతుగా... త్రాగుబోతుగా ఉంటూనే జీవట బ్రాహ్మణుడుగా... జీవట బ్రాహ్మణుడుగా ఉంటూనే ఒక సామంతరాజుగా... సామంతరాజుగా ఉంటూనే ఒక చక్రవర్తిగా... కొనసాగుచున్నాడా? ఇదంతా ఎట్లా జరుగుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** అవును. భిక్షకుడుగా ఆ గృహంలో ఉండియే త్రాగుబోతుగాను, తదితరులు గాను కొనసాగుచున్నాడు. ఎక్కడికక్కడ నిద్రకు ఉపక్రమించినప్పుడు మరొక నూతన స్వప్నంలో ప్రవేశించి కల్పిత ఉపాధులను అనుభవించుచున్నాడు. "ఇది ఎట్లా?" – అనే విషయాన్ని కొద్దిసేపు తరువాత చర్చిద్దాం. ఇప్పుడు చక్రవర్తి దాకా వచ్చాడు కదా!

❖

ఆ చక్రవర్తి చాలాకాలం నానావిధ భోగములు అనుభవించాడు. అనేక రాచకార్యములు చక్కబెట్టుచూ ఉన్నాడు. శత్రు – మిత్రులకు సముచితరీతిగా దండన – సత్కారములను నిర్వర్తించాడు. పట్టపురాణులతో విహరిస్తూ, సామంతరాజులను పరిపాలిస్తూ, మహాసామ్రాజ్యం ఏలాడు. అందమైన రాజపుత్రికలను నయానా, భయానా, తన సొంతం చేసుకొనే వాడు. ఒకసారి ఒక రాజపుత్రిక అతనిని వివాహం చేసుకోవటానికి తిరస్కరించింది. అతనిలో పట్టుదల ఎక్కువైంది. అక్కడి రాజ్యంపై దండెత్తి ఆ రాజ్యాన్ని, రాజపుత్రికను కబళించాలని పన్నాగం పన్నసాగాడు. మంత్రులతో, సైనికాధికారు లతో రాజకీయ ఎత్తుగడలు, యుద్ధవ్యూహ రచనలతో 15 రోజులు అవిశ్రాంతంగా గడిపాడు. ఒక రోజు దండయాత్రకు బయలుదేరి త్రోవలో సైనికశిబిరం నిర్మించాడు. ఆ రోజు మంత్రులతో చాలా సేపు సమాలోచనలు చేశాడు. ఆ తరువాత నృత్యవినోదాలతో చాలా రాత్రి గడచిపోయింది. మర్నాడు చాలా కార్యక్రమములు, రాజకీయపు ఎత్తుగడలు నిర్వర్తించవలసి ఉన్నదికదా! ఆ రాత్రి పొద్దుపోయిన తరువాత కొంచెం విశ్రాంతి తీసుకుంటూ ఉండగా, ప్రియురాలి పట్ల అతని ఆలోచనలను మరుగు చేస్తూ నిద్ర అతనిని ఆక్రమించింది. ఆ నిద్రలో తానొక అప్సర (దేవతాస్త్రీ) అయినట్లు కలగన్నాడు.

❖

ఆ అప్సరస తన ప్రియాతి ప్రియుడగు ఒక దేవతా పురుషునితో కూడి ఎక్కడెక్కడో సంచరిస్తూ ఉండేది. ఆ దేవతా పురుషుడు తన పట్ల ధ్యాస మరల్చకూడదనే పట్టుదలతో అనేక కుయుక్తులు పన్నుతూండేది. ఒకసారి ఆ దేవతా పురుషుడు తనపై విరక్తి కలిగియుండటం అప్సరస గమనించింది. ఎంతో దుఃఖితురాలైనది. ఏకాంతంలో దుఃఖిస్తూ, కుత్సిత భావాలతో నిండిన మనస్సుతో, రతిక్రీడ యందు డస్సినదై నిదురకు ఉపక్రమించింది. ఆ నిద్రలో తాను ఒక లేడిగా వనంలో సంచరిస్తున్నట్లు కలగన్నది.

❖

ఆ లేడి పచ్చికను, చిగురుటాకును నమలుతూ ఒక అడవిలో సంచరించేది. ఒక రోజు ఒక పులిని దూరం నుండి చూచి ఎంతో భయంతో ఒక పొదలో దూరింది. ఆ పొదలో కొన్ని పూతీగలు

ఆ లేడి కాళ్ళకు చుట్టుకున్నాయి. ఆ తీగలను విదిలించుకోవటానికి ఎంతో ప్రయత్నించి విఫలమైనది. చివరికి సొలసి అక్కడే కించిత్ నిద్రకు ఉపక్రమించింది. ఆ నిద్రలో తన భయం యొక్క పరిణామంగా ఒక పూల తీగగా అయినట్లు కలగన్నది.

❖

**శ్రీరాముడు:** అదేమిటి స్వామి! పూర్ణ – శుద్ధ – చైతన్య సమన్వితుడగు ఆ జీవట భిక్షువు ఎక్కడ? ఆతడు అర్ధజడమగు పూతీగగా పరిణమించటమేమిటి? ఆశ్చర్యంగా ఉన్నదే!

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఇందులో ఆశ్చర్యం ఏమున్నది?

> **తిర్యక్చో౾ః ప్రహ్యన్తి స్వప్నం చిత్తస్వభావతః ।**
> **దృష్టానాం చ శ్రుతానాంచ చేతః స్మరణమక్షతమ్॥**

దేవతలు కావచ్చు. మానవులు కావచ్చు. జంతువులు, వృక్షములు, పూతీగలు కావచ్చు... ఆయా జీవులందరూ తమతమ చిత్తముల స్వభావమును అనుసరించే స్వప్నసదృశ జగత్తులను గాంచుచున్నారు. అఖండము, అప్రమేయమూ, అనిర్దేశము – అగు ఆత్మతత్త్వానుభవం తప్ప తదితరమైనదంతా స్వప్నసదృశ్యం కాదా? మరింకేమిటి? ప్రతిఒక్కజీవుని అంతరంగ సంస్కారములే అతడు చూచే, వినే, పొందే – దృశ్య శబ్దార్థ అనుభవములకు అవగాహనలకు ముఖ్య కారణములై ఉంటున్నాయి. జీవునిలో పేరుకునియున్న సంస్కారముల ప్రదర్శనయే వారి వారి జగదనుభవములై ఉన్నాయి. సంస్కారములు, అవగాహనలు ఈ రెండూ ఒకదానిపై మరొకటి ప్రభావితమవుతూ ఉంటున్నాయని జనులు గమనించెదరు గాక!

**శ్రీరాముడు:** ఆ పరివ్రాజకుడు పూతీగగా స్వప్నానుభవం పొందుతూ ఇంకా ఏం చేశాడు?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆ పూతీగ కొంతకాలానికి పత్ర – పుష్ప – ఫలములతో ఒక పెద్ద లతాగృహంగా విస్తరించింది. ఆ లతా గృహంపై అనేక తుమ్మెదలు ఝంకారం చేస్తూ వ్రాలుతూ ఉండేవి. కొంతకాలం తరువాత ఆ లతలోని సాక్షి చైతన్యం గాఢనిద్రకు ఉపక్రమించింది. ఆ పూలతలోని భావికాలపు అంకుర బుద్ధి మరల స్వప్నోన్ముఖమైనది. సంసారానుగతంగా తాను ఒక తుమ్మెద అయినట్లు కలగాంచింది.

❖

ఆ తుమ్మెద అనేక రకాల పుష్పాలపై వ్రాలుచూ అనేక ప్రదేశాలలో తన సుందరమైన రెక్కలతో విహరిస్తూ ఉండేది. ఒకసారి అది ఒక తామర పుష్పంలో ప్రవేశించింది. పుష్పరసాన్ని గ్రోలింది. అక్కడ మత్తును పొంది మోహవశంగా తామరతూడులో ప్రవేశించి అక్కడ చిక్కుకున్నది. ఈ జడమగు మనస్సు మోహవశం చేత పొందని కష్టాలు, చేరని దుష్ట ప్రదేశాలు ఉంటాయా? తామర తూడులో చిక్కుకున్న ఆ తుమ్మెద ఇట్లా ఆలోచించసాగింది.

అరె! ఈ తామరతూడులో చిక్కుకుని కదలలేని పరిస్థితిలో ఉండిపోయానే? ఇప్పుడేం చేయటం? అయినా ఫరవాలేదులే! తెల్లవారుతుంది. ఈ తామర రెక్కలు విచ్చుకుంటాయి. నేను బయటపడతాను. ఇంకా అనేక పూవులలోని మధువును గ్రోలుతూ హాయిగా ఉంటాను...

అని అనుకుంటూ వేచి ఉన్నది. ఇంతలో ఒక మదపుటేనుగు ఆ కొలనులో ప్రవేశించి అల్లకల్లోలం చేసింది. తన మొరటు పాదాలతో సుతిమెత్తని తామరపూలన్నిటినీ నిష్కర్షగా త్రొక్కివేసింది. మూర్ఖులు రమ్యమైన వస్తువులను పాడుచేయటంలో సిద్ధహస్తులై ఉంటారు కదా! అప్పుడా ఏనుగు దంతము యొక్క ఒరిపిడికి తామరపూవు నలిగి ఒడ్డున విసిరి వేయబడింది. తూడులో వున్న తుమ్మెదకు గాయాలై మూర్ఛిల్లింది. అట్లు మూర్ఛిల్లే ముందు ఏనుగుకు సంబంధించి భయాందోళనలకు సంబంధించిన చాంచల్యమును అనుసరించి తానొక మదపుటేనుగు అయినట్లు స్వప్నం పొందింది.

❖

ఆ మదపుటేనుగు రాజఠీవితో విశాలమైన అరణ్యంలో చాలాకాలం సంచరించింది. ఒక రోజు ఏమరుపాటు చేత రాజభటులు దానిని బంధించటానికి నిర్మించిన ఒక పెద్ద గోతిలో చిక్కుకుంది. రాజభటులు ఆ ఏనుగును బంధించి తమ రాజు దగ్గరకు తీసుకుపోయారు. ఆ రాజు ఏనుగును అనేక యుద్ధాలలో వినియోగిస్తూ ఉండేవాడు. అది దీర్ఘమైన తొండంతో శత్రుసైనికుల దేహాలను ఒడుపుగా చుట్టుచుట్టి నేలకేసి బాదటంలో ఎంతో ప్రావీణ్యత కనబరచేది. అందుచేత అక్కడి సేనాపతికి ఆ ఏనుగంటే ఎంతో ఇష్టం. కొంతకాలానికి ఆ ఏనుగు ముసలిది అయింది.

ఒకసారి ఆ రాజ్యమును కబళించటానికి శత్రురాజులు చుట్టుముట్టారు. ఆ యుద్ధంలో ఎంతో మంది శత్రుసైనికులను ఆ ఏనుగు తన పాదఘట్టనలతో నలిపివేసింది. చివరకు కొందరు సైనికులు ఆ ఏనుగును శూలములతో గండస్థలంపై పొడిచారు. అది నేలకూలి మూర్ఛిల్లింది. ఆ ఏనుగు జీవిత కాలమంతా తన గండస్థలంపై వ్రాలే దోమలను త్రోలే ధ్యాస కలిగి ఉండటం చేత, తత్సంబంధమైన సంస్కార ప్రాభవానికి లోనై ఒక దోమ అయినట్లు కల గాంచింది.

❖

ఆ దోమ ఒక కొలనులో అటూ ఇటూ తిరుగుతుండేది. ఆ కొలనులో కొన్ని హంసలు ఉన్నాయి. ఆ హంసలపై వ్రాలే నిరంతర ధ్యాస చేత అది ఒక హంస శరీరంపై నిదురిస్తూ తానొక హంస అయినట్లు మనఃప్రవేశం చేసింది.

❖

హంసగా పరిణమించిన ఆ జీవుడు ఆ తరువాత దీర్ఘకాలం విభిన్నమైన యోనులలో ప్రవేశ – నిష్క్రమణములచే పరిభ్రమిస్తూ మరికొన్ని జన్మలు గడిపాడు. ఆ తరువాత ఉపాధిక్రమంగా మరల హంస అయినాడు. ఆ హంస బ్రహ్మదేవుని వాహనమగు రాజహంస గురించి విని 'నేను కూడా బ్రహ్మదేవుని వాహనమగు రాజహంస అయితే ఎంత బాగుంటుంది'... అని నిరంతరం చింతిస్తూ ఉండేది. బ్రహ్మదేవోపాసన నిర్వర్తిస్తూ ఉండేది. కొంతకాలానికి ఒక విషపురుగు కాటుకు గురి అయి ఆ దేహం నిర్వీర్యమైనది. పూర్వవాసనా ప్రభావం చేత బ్రహ్మదేవుని వాహనమగు రాజహంసగా జన్మించింది. జీవట భిక్షువు నుండి చూస్తే అది 99వ జన్మ.

ఆ రాజహంస అత్యంత వినయముతో, శ్రద్ధగా, భక్తి పూర్వకంగా పరతత్త్వ స్వరూపుడగు బ్రహ్మదేవుని సేవిస్తూ ఉండేది. అట్టి సేవాప్రభావంగానూ, తన యొక్క వినయ – విధేయతలకు

ప్రతిఫలంగానూ 'వివేకం' పొందింది. భగవానుడగు బ్రహ్మదేవుడు తనను ఆశ్రయించ వచ్చిన దేవ–ముని–ఋషిపుంగవులకు బోధించే బ్రహ్మతత్త్వమును తాను కూడా వినేది. ఆ రాజహంస తన వివేక – వైరాగ్యముల బలం చేత లౌకిక భోగములను ఇంద్రియార్థములను సారశూన్యమని గ్రహించి, లౌకికమైన వస్తుదృష్టిని అధిగమించింది. జీవన్ముక్తి పొందింది. బ్రహ్మదేవునితో సమానంగా 'తదనంతర విదేహ ముక్తి'కి అన్ని విధముల అర్హత సంపాదించుకున్నది.

❖❖❖

## 3. రాజహంస - రుద్రుడు

**శ్రీవసిష్ఠ మహర్షి:** సన్న్యాసి, భిక్షుడు అగు జీవటుడు ఇప్పుడు జీన్ముక్తత్వము అవధరించి హంస అయి భగవంతుడగు బ్రహ్మదేవుని సేవలో నిమగ్నుడై ఉన్నాడని అనుకున్నాం కదా! బ్రహ్మదేవునితో లోకసంచారం చేయగలిగే అవకాశం పొంది ఉండటం చేత ఆ హంస యొక్క పవిత్ర జ్ఞానదృష్టి మరింత ఉత్కృష్టత పొందింది. ఒకసారి బ్రహ్మదేవునితో రుద్రలోకం వెళ్ళటం జరిగింది. రుద్రుని దర్శనం చేసుకుని అర్చించింది.

'రుద్రుని అర్చించుటచే నేనిప్పుడు రుద్రుడను' అని భావన చేసింది. *(నారుద్రో రుద్ర మర్చతి)* మరుక్షణం ఆ జీవటుడు అద్దంలో ప్రతిబింబము ప్రవేశించినట్లు యోగజ్ఞానయుక్తమగు రుద్రరూపం దాల్చింది.

**శ్రీరాముడు:** మహర్షీ! జీవటుడు జీవన్ముక్తుడయ్యాడు కదా! మరల రుద్రుడుగా ఎట్లా జన్మించాడు? అప్పుడాతడు జీవటుడుగా విదేహముక్తి సమన్వితుడని కూడా మీరు చెప్పారు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** సంసార జీవులు ఇంద్రియానుభవములకు సంబంధించిన సంస్కారం కలిగి ఉంటారు. అందుచేత వారు ఒక ఉపాధిని త్యజించినప్పుడు తమ యొక్క అంతర్గతమై ఉన్న సాంసారిక సంస్కారాలచే ప్రభావితులై, తదనుభవానికి అనుకూలమైన ఉపాధి పరంపరలను పొందుతూ ఈ సంసారారణ్యంలో సంచరిస్తున్నారు. వారియందు 'పునరావృత్తి' అను దోషం ఉండి ఉంటోంది. అట్టి పునరావృత్తి దోషం చేత జన్మ – జన్మాంతరములు ఒక పరంపరగా వచ్చిపడుచున్నాయి.

అయితే, జీవటుని వ్యవహారం వేరు. ఆతడు జీవన్ముక్తుడు అవటంచేత 'జీవన్మరణములు' అను జాడ్యం అతనికి లేదు. అతడు సారూప్యముక్తి అనుభవిస్తున్నాడు. ఒకడు ఒక సమయంలో ఒక ఆలోచనను ఆశ్రయించి కొద్దిసేపయిన తరువాత ఆ ఆలోచనను త్యజించి మరొక ఆలోచనను స్వీకరిస్తాడు చూచావా? ఆలోచన – ఆలోచనల మధ్య తన స్వస్వరూపం త్యజించటం లేదు కదా! జీవటుడు కూడా హంస యొక్క అనుభవమును త్యజించి రుద్రుని యొక్క అనుభవం స్వీకరించాడు. 'నేను ఉపాధులకు జన్మ జన్మాంతరాలకు సంబంధించిన వాడను కాను' అను అకృత్రిమ స్వభావంతో కూడిన యోగజ్ఞానములు సంపాదించి ఉండుటచే అతనికి 1. సత్యసంకల్పబలం (సంకల్పించింది సత్యమయి ప్రాప్తించటం) 2. సంకల్పాతీతత్వం రెండూ కూడా ఒనగూడుచున్నాయి.

గంధము వాయువును అనుసరిస్తూ తన స్వరూప స్వభావములను త్యజించినట్లు అతడు హంస శరీరం త్యజించటం, రుద్ర శరీరం స్వీకరించటం జరుగుతోంది. యోగులు ప్రారబ్ధశేషానుభవం కొరకై పూర్వ శరీరములను విడవటం, నూతన శరీరం స్వీకరించటం లీలగా నిర్వర్తిస్తారు. తదితర సంసార జీవులు వేదన-ఆవేశములతో కూడిన కౌతుకంచేత ఉపాధులను పొందుచూ, దేహ పరిమితులై అల్పయోచనాపరులై, దృశ్యమునకు దాసులై సంచరిస్తూ ఉంటారు.

ముక్త జీవునకు బద్ధజీవునకు మధ్య ఉన్న భేదం అవగాహనకు సంబంధించినది మాత్రమే.

❖

జీవటుడు రుద్రత్వం స్వీకరించి, రుద్రుడై ప్రధానమైన గణపతిత్వం పొందాడు. శివలోకంలో ఉచితములను, ఆచారములను నిర్వర్తిస్తూ రుద్రపురియందు యథేచ్ఛగా విహరించసాగాడు. అట్లా రుద్రుడుగా ఉండగా ఒక రోజు తన జ్ఞానైశ్వర్య ప్రభావం చేత ఒక్కసారి తనయొక్క సుదీర్ఘమైన పూర్వజన్మలన్నీ అవలోకించసాగాడు. ఆతడప్పుడు ఆవరణశూన్యమైన జ్ఞానశరీరమున వెలయు చున్నాడు. అట్టి జ్ఞానావరణ నుండి తను జీవట ఉపాధికి ముందు - వెనుక ఎత్తిన అనేక పూర్వ జన్మలవైపు ఒక్కసారి దృష్టి సారించి, ఇట్లు తలపోయసాగాడు.

**జీవటరుద్రుడు:** ఆహా! 'చిత్తవృత్తులను అవలంబించాలి' అని అనుకుని ఎన్ని దేహములలో ప్రయాణించి వచ్చాను. ఈ మాయ ఎంత చిత్రమైనది? జ్ఞానానందమయ స్వరూపుడగు నాకు జన్మ ఏమిటి? మృత్యువేమిటి? ఎండమావులలో జలం ఉండునట్లు ఈ మాయకు వాస్తవమైన ఉనికియే లేదు. కాని, అత్యంత ఘనీభూతమై ఉన్నట్లు అనుభూతిని కలిగించగల శక్తి ఈ మాయ కలిగియున్నది. అట్టి శక్తి ద్వారా ఈ విశ్వమునంతటినీ మోహింపజేయగలుగుతోంది. 'పారమార్థిక చిత్' స్వరూపుడగు నాకు అనేకసార్లు అనేక సంకల్పసమూహములు ఉదయించాయి. ఆ సంకల్పములు ఆయా పంచభూత సముదాయములను నిర్మించుకుంటూ త్యజిస్తూ ఈ సంసారవనంలో పచార్లు చేసి ఇక్కడికి వచ్చాయి. సర్వశక్తిమంతుడనగు నా యొక్క చిదంశము ఒకవైపు చెక్కుచెదరక ఉన్నది. మరొక వైపు నా జడంశమునకు ఈ ఆకాశాది విభాగములు ఒనర్చబడుచున్నాయి. నేను స్వీయస్వేచ్ఛాఉపక్రమమును ఆశ్రయించి చిదాభాసుడనై ఈ స్థూల - సూక్ష్మదేహములలో సమష్టి - వ్యష్టితత్త్వములుగా వెలయటం జరిగింది. నా యొక్క జడంశము సూక్ష్మ - స్థూలములగు తన్మాత్ర విభాగములుగా పరిణామం పొందింది. ఆయా దేహముల వాసనావైచిత్ర్యములను అనుసరించి రంగుల మేళవంలాగా హావ-భావ -రూప-గుణ వైచిత్ర్యములను ప్రదర్శించింది. నేను జ్ఞానినై ఉండి కూడా ఆయా సమయ సందర్భాలలో ఆయా ఉపాధి సంబంధితమైన తాదాత్మ్యము ప్రకటించాను. దేహభావమును స్వీకరించిన సమయంలో నా యొక్క అనంత స్వరూపమును కించిత్ ఏమరచినవాడనై ఆయా ఉపాధులలో కునుకులు తీశాను. ప్రతి ఒక్క ఉపాధీ తన చుట్టూ ఒక్కొక్క ప్రత్యేకమైన సృష్టిని పొందింది. కొన్ని కొన్ని సంబంధ-బాంధవ్యములను ఆస్వాదించింది. ఇట్లా అనేక సృష్టులలో ప్రవేశిస్తూ నిష్క్రమిస్తూ నా వెంట 'విషయములు' అనే అభ్యాసమును తెచ్చిపెట్టుకున్నాను. అయితే కొన్ని కొన్ని సృష్టులలో

(జన్మలలో) నిర్వర్తించిన శమదమాది సాధన సంపత్తి కూడా నా వెంటనంటి వచ్చింది. ఇప్పుడు నేను విషయరహితుడను కావాలి కదా! అందుచేత నా వెంటనంటి ఉన్న సాధన సంపత్తికి తోడుగా మరికొంత సాధనధనాన్ని సంపాదించి తద్ద్వారా మరికొంతగా విషయములను అధిగమిస్తాను.

❖

రుద్రత్వ సంకల్పావరణను ఆశ్రయించి ఉన్న ఆ పరివ్రాజకుడు ఒకచోట పద్మాసనాశీనుడైనాడు. గతించిన ఆవరణలను విజ్ఞానబలంచే పఠించి మహత్తరమైన అవగాహనను పొంది మహాస్థైర్యం పొందాడు. 'ఇక త్యజింవలసినది త్యజిస్తాను' అను నిమగ్నములో ప్రవేశించాడు.

మొట్టమొదట స్థూలదేహావయవములైన ఈ కాళ్ళు, చేతులు మొదలైన వాటిని 'వీటితో నాకు సంబంధమే లేదు' అను అప్రమేయత్వాన్ని స్వీకరించాడు. ఆ తరువాత సూక్ష్మదేహావయవములైన మనో – ప్రాణాదులను కూడా అధిగమించాడు. బహిరంగ విషయములగు బాహ్యవిషయాలాపన మొదలైన బాహ్య సంసక్తిక స్వభావమును దాటివేశాడు. "అంతర్యామియగు తత్త్వాన్ని ఆరాధిస్తున్నాను" అనురూపంలో ఉండే తత్త్వ – ఆరాధనలను కూడా అధిగమించాడు.

తానే సర్వాత్మకుడయ్యాడు. తక్కిన స్వభావములన్నిటికీ అసంబంధితుడైనాడు.

❖

**శ్రీరాముడు:** అట్టి విషయత్యాజ్య – అనుభవగ్రాహ్యాలను ఎట్టి మంత్ర – తంత్ర – ఉపాసన – సాధనలను ఆశ్రయించకుండానే ఆ పరివ్రాజకుడు సంపాదించాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఈ చిత్తమునకు ఒక లక్షణమున్నది. అది ఎప్పుడు దేనిని దృఢంగా భావన చేస్తే అప్పుడు అట్లే పరిణమిస్తుంది. భావానుగత అనుభవములుగా నూతన భావనలో ప్రవేశిస్తూ క్షణంలో క్రితం భావనను తనయందు విలీనం చేసుకోగలదు. చిత్తంలో ఆ మహత్తర శక్తి పొందుపరచబడి ఉన్నది.

**శ్రీరాముడు:** ప్రతి ఒక్కరి చిత్తమునకు మీరు చెప్పిన మహత్తర శక్తి ఉన్నది కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** అవును ఉన్నది. అయితే అనేక ఇంద్రియ – దృశ్య – భావవిషయాలను ఆశ్రయించే వారి చిత్తము అతిచంచలమై ఉండటంచేత తాను ఉదేశించినట్లుగా ఎక్కడా ఏదీ పొందటానికి అశక్తత చెందుతోంది. అందుచేత సాధకులు చిత్తమునకు ఏకాగ్రత అభ్యసింపజేస్తేగాని సంసారమును జయించలేరు. ఈ జీవుడు సాధనచే తన భావాలు తనకు శ్రేయోదాయకులగు సేవకులుగా ప్రవర్తింపజేయగలడు. సాధన కొరవడినప్పుడో, ఈ జీవుడు తానే తన భావాలకు సేవకుడగుచున్నాడు.

చిత్తము యొక్క దేహము చింతనయే కదా! ఒకడు పరస్పర భావములలో ఏది ఎక్కువగా చింతన చేస్తే అదియే ఆ చిత్తమునకు సంప్రాప్తిస్తూ ఉంటోంది.

❖

ఆ జీవటరుద్రుడు ఆత్మసిద్ధిని పొందికూడా కించిత్ శాస్త్ర విరుద్ధమైన లౌకిక వాసన శేషించటం చేత తన గతించిన దేహములందు క్రీడలాగా, లీలాగా మరల పరిభ్రమించాడు.

భక్తి సాధనములు, శాస్త్ర అధ్యయనములు నిర్వర్తించే బ్రాహ్మణ దేహమునందు, సామంతరాజ దేహమునందు, అప్సరస, లేడి, తుమ్మెద, ఏనుగు దేహ భావములందు, అట్లాగే తదితర ఉపాధులందు, ...ప్రవేశించటం, అప్పటి వాసనలను ప్రదర్శించటం, బయల్వెడటం... మొదలైనవి క్రీడించాడు.

**జీవట రుద్రుడు:** ఆహా! సత్యము వలె భాసించే ఈ సంసారారణ్యంలో అనేక మానసిక సృష్టులలో ప్రవేశించి అనేక దశలను అనుభవించాను. నా యొక్క బ్రహ్మస్వరూపం నుండి చ్యుతుడనై వేలాది సంవత్సరాలు, వందలాది చాతుర్యుగాలు గడిపాను. భిక్షుకుని ఉపాధి ధరించి ఉండగా బ్రహ్మజ్ఞానానికి కొంచెం అర్హత సంపాదించుకున్నాను. మరల, అక్కడి నుండి కూడా సంసారం మీద ఉత్సుకతచే ప్రమాదవశంగా భావనాసముద్ర తరంగాలలో అనేక జన్మపరంపరలు గడిపాను. రాజహంస – మానసిక జగత్తులో ప్రవేశించినప్పుడు భగవంతుడగు బ్రహ్మదేవునితో ఏర్పడిన సత్సాంగత్యం చేత ఆత్మస్వరూప జ్ఞానం వికసించింది కదా! పూర్వాభ్యాసాలన్నీ జ్ఞానయోగంచే ఫలించగా ఇట్లు రుద్రుడ నయ్యాను. జీవటుడుగా అత్యంత దృఢమైన శాస్త్రీయ సాధనాభ్యాసం నిర్వర్తించాను. అయినా కూడా ఒకింత 'మాయపట్ల అభిలాష' అను చ్యుతి ఘటిల్లినందుకు ఫలితంగా ఇట్లు అత్యంత వివశములైన, విరసములైన యోనులలో పరిభ్రమించవలసి వచ్చింది. ఏదిఏమైనా కూడా శాస్త్ర ప్రవచితాభ్యాసమే జీవుని యందు విజయముగా మార్గప్రదమౌతుంది. 'సత్యమేవ జయతే' అని శాస్త్రకారులు చెప్పియే ఉన్నారు కదా! సత్యము మాత్రమే జీవుని కాపాడగలదు. కాకతాళీయన్యాయం చేత ఈ జీవునకు సాధుజన సంగం లభిస్తోంది. అట్టి సాధుజన సంగం సద్వినియోగ పరచుకున్న జీవుడు దృశ్యాతీతత్వం సాధించగలుగుచున్నాడు. దృశ్యాతీతం యొక్క అభ్యాసబలం చేత వాసనలు జయించబడుచున్నాయి. ఏ అశుభవాసనలైతే ఈ జీవుల అంతరంగంలో దాగి ఉన్నాయో, అవి ప్రయత్నపరుల యందు మాత్రమే క్షీణిస్తున్నాయి. అందుచేత పురుషప్రయత్నమే శ్రేయోదాయకం.

పూర్వ – తత్పూర్వ జన్మలలో ఏదేది నిరంతరంగా అభ్యసించబడుతోందో... అదియే దృష్టికి సత్యముగా తోచటం జరుగుతోంది. శుభచింతనాభ్యాసం వలన అశుభచింతనలు తొలగుతాయి.

ఏదేది జాగ్రత్ – స్వప్నములందు సుదృఢంగా భావిస్తామో అదియే సత్యముగా అనుభూత మవుతోంది. అంతేగాని, ఇందులో మరొకరెవరిదో పాత్ర లేదు. "నన్ను ఎవరో భ్రమింపజేస్తున్నారు" అని అనుకుంటే అది భ్రమ మాత్రమే. తత్త్వ చింతనచేతనే నాకు ఈ పరిశీలనా సామర్థ్యం లభించింది. కల్పితమైన దేవార్చన మొదలైనవే ఫలప్రదాతలగుచుండగా తత్త్వచింతన శుభప్రదం కాకుండా పోతుందా? అయి తీరుతుంది.

నా యొక్క చ్యుతికి కారణమేమిటి? ఆత్మతత్త్వవిచారణను ఏమరచి శాస్త్రములలోని అనాత్మ విభాగపు విషయములకు గ్రుడ్డిగా పరిమితుడనగుట చేతనే. ఫలితంగా, సుఖ – దుఃఖమిశ్రితములగు ప్రయోజనములచే పరిమితుడనయ్యాను. వాటి వలన అవిచ్ఛిన్నమగు ప్రయోజనం కలుగలేదు.

అసలీ సంసారము యొక్క చింతన – భావనలు కొంచెం ఆశ్రయించినంత మాత్రం చేతనే సుదీర్ఘ ఉపాధిపరంపరా ప్రహసనమంతా వచ్చి పడుతోంది. భావన – చింతన త్యజించటం చేత

అనర్థములన్నీ జయించబడుచున్నాయి. భావన – చింతన ఉన్నంత వరకూ దేవతా ఉపాధులు కూడా ఉత్కృష్టతను ప్రసాదించలేవని తేలిపోయింది.

❖

ఎంత ఆశ్చర్యం! తన స్వరూప స్వభావములను ఏమరచిన ఈ జీవుడు 'ఈ శరీరమే నా స్వభావం' అని నమ్మకుని ఉండటం సంభవిస్తోంది. అసత్యభావములను ఆశ్రయించటంచేత ఆత్మ స్వరూపుడగు ఈ జీవుడు తనను తాను అనేక నీచస్థితులకు, తుచ్ఛ ఉపాధులకు దుఃఖ పరంపరలకు మోసుకెళ్ళుచున్నాడు. తత్త్వదృష్టితో చూస్తే... ఉపాధులూ లేవు, జన్మమృత్యువులూ లేవు. ఈ ఉపాధులు, వాటి సంబంధిత వ్యవహారాదులు మధ్యలో వస్తున్నాయి. మధ్యలోనే పోతున్నాయి. భూత – భవిష్యత్ – వర్తమానములచే స్పృశించబడనిదేదైనా ఉంటే అది నా స్వస్వరూపమగు ఆత్మ ఒక్కటే. సత్ – చిత్ స్వరూపుడనగు నాకు ఇట్టి అసత్ అగు ఉపాధులతో సంపర్కం కలగటమేమిటి? నేను ఈ దృశ్య జగత్తుతో అనుబంధం కలిగి ఉండటమేమిటి? ఆకాశంలోని నీలపువర్ణం భ్రమమాత్రమే అయినట్లు... జగత్‌భ్రమ అజ్ఞాన కారణంగానే ఉదయిస్తోంది.

కనుక 'సాధన' అనేది ఆత్మను పొందటానికి అవసరం లేదు. అనాత్మ విషయములందు అభిలాష తొలగటానికి మాత్రమే సాధన యొక్క అవసరం.

ఈ జగత్తు యొక్క వాస్తవరూపం బ్రహ్మమే. ఇద్దాని అసన్మయసత్త పరబ్రహ్మమునందే అకారణంగా బహుశః వినోదార్థమై ఏర్పడి ఉంటోంది. కనుక ఈ కల్పనలు బ్రహ్మమే స్వరూపముగా గల నన్నేం చేస్తాయి? ఇప్పుడు నేను చూచిన (నిద్రకుపక్రమించినప్పటి) దేహములన్నీ వినోదార్థమై ఏర్పడి సమ్యక్‌జ్ఞానప్రకాశము వలన నా స్వరూపమునందే ఏకీకృతం కాగలవు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఈ విధంగా చింతిస్తూ ఆ భిక్షుకుడు "కల్పనారాజ్యము" అనతగిన – తాను నిద్రపొందిన – అనేక ఉపాధులలో మరొకసారి పచార్లు చేసివచ్చి తిరిగి రుద్ర ఉపాధిలో ప్రవేశించాడు. అతడు సత్యసంకల్పుడవటం చేత అతని క్రితం 99 జన్మలలోని స్వప్నతుల్య సత్తు ఒక్కసారి అనువృత్తమయింది. అతను జ్ఞానలాభం పొంది ఉండుటచేత తన యొక్క రుద్రత్వం, జీవజటాడి పూర్వదేహములు ఒకేసారి వీక్షించగలిగాడు.

❖❖❖

# 4. వివిధ ఉపాధుల సమావేశం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఇప్పుడు 'రుద్రుడు' అను ఉపాధి – అనుభవములలో సన్న్యాసి భిక్షువు ఉన్నాడు కదా! అట్టి ఉపాధితో మరల రుద్రలోకమునుండి బయలుదేరాడు. తన యొక్క తాత్త్వికబలం చేత జీవటుడు ఉన్న బ్రహ్మాండంలో ప్రవేశించాడు. జీవటుడు ఉన్న ప్రదేశం చేరాడు. జీవట భిక్షువును సమాధి నుంచి ఉత్థానపరిచాడు. ఆ ఇద్దరు కలసి త్రాగుబోతును సమీపించారు. జీవట త్రాగుబోతు ఆ సమయంలో సుష్టుగా తేనె, మద్యం త్రాగి నిదురిస్తున్నాడు కదా! రుద్రుడు జీవటభిక్షువు ఆ

జీవట త్రాగుబోతును నిదురలేపాడు. ఆ ముగ్గురి చైతన్యం ఒక్కటే అయినప్పటికీ మాయ యొక్క భావావేశం చేత అది ముగ్గురు వ్యక్తులైనట్లుగా ప్రకటన – ప్రవర్తనలు కలిగి ఉన్నది.

భిక్షువు, త్రాగుబోతు, రుద్రుడు – ఒకరితో ఒకరు కొద్దిసేపు సంభాషించుకుని ఇక అక్కడి నుండి బయలుదేరారు. ఆ ముగ్గురూ చిదాకాశమునందు గల మరొక పాంచభౌతిక బ్రహ్మాండంలో ప్రవేశించారు. బ్రాహ్మణ యువకుని సమీపించారు.

ఆ విప్రుడు కూడా జీవటుని మనస్సు యొక్క పరిణామమేకదా! ఆ విప్రుడు ఉన్న ప్రదేశం అనేక ప్రాణుల శబ్దములతో నిండియున్నది. ఆ బ్రాహ్మణుడు తన భార్యతో ఏకశయ్యపై నిదురించి ఉన్నాడు. ఆ విప్రుని భార్య 'ఈ నా భర్త నా బహిర్ ప్రాణం' అను భావనతో, నిదురపోతూనే, తన భర్త యొక్క కంఠమును ఆలింగనమొనర్చుకుని ఉన్నది. రుద్ర, జీవట, భిక్షువులు తమ యొక్క చైతన్యత్వమును ఉపయోగించి ఆ విప్రుని ప్రబుద్ధుని చేశారు. అప్పుడా విప్రుడు ముగ్గురినీ చూచి తనను చూచుకొని కించిత్ విస్మయ పరవశుడైనాడు. రుద్రునితో బోధింపబడి, విషయమంతా గ్రహించి ఉద్వేగరహితుడైనాడు.

ఆ తరువాత ఆ రుద్ర – జీవట – ద్రిమ్మర – విప్రులు నలుగురు అక్కడి నుండి బయలుదేరారు. 'చిదాకాశము యొక్క చిత్త వికృతి' అనతగ్గ మరొక బ్రహ్మాండలో ప్రవేశించారు. అక్కడ గల సామంత రాజు నిద్రించి ఉన్న ద్వీపంలో ప్రవేశించారు. బంగారుఛాయతో అంతఃపురంలో నిద్రిస్తున్న ఆ సామంతరాజును తమ యొక్క చిత్తచైతన్యం సహాయంతో ప్రబుద్ధుని చేశారు. ఇప్పుడా ఐదుగురు ఐదుగురైనప్పటికీ ఏకభావముననే వెలయుచున్నారు. అదే విధంగా ఆ ఐదుగురు సామ్రాట్టును సమీపించి అతనిని నిదురలేపారు.

అట్లే వారు తమ సూక్ష్మ శరీరంతో తక్కిన ప్రపంచములందు తిరుగుతూ అక్కడక్కడ నిద్రించియున్న తదితర జీవట చైతన్య ఛాయలనన్నిటినీ ప్రబుద్ధం చేశారు. మృతులైన వారిని, నిద్రించే వారిని కూడా మేల్కొలిపారు. వారందరి చిత్తమంతా 'బ్రహ్మహంస'గా పరిణామం పొంది రుద్రభాసమును పొందారు. రుద్రుని చిత్త–చేతనాంశాలు వారి చిత్తాలను చేతనమొనర్చాయి కదా! వారి దేహాలన్నీ జ్ఞానైశ్వర్యంచే ఆశ్రయించబడ్డాయి. వారంతా శతసంఖ్యాక రుద్రులై విరాజిల్లారు.

❖

**శ్రీరాముడు :** స్వామీ! 'జీవటుడు' అనుపేరుగల జీవుడు ఒక్కడే అయిఉండి వంద ఉపాధులు వేరు వేరుగా ఎట్లా కలిగి ఉన్నాడు. ఒకే సమయంలో ఆ వంద ఉపాధులు వేరు వేరుగా ఎట్లా ఉద్బోధ పొందగలిగాయి? ఇది విచిత్రంగా ఉన్నదే!

**శ్రీవసిష్ఠ మహర్షి:** చైతన్యము అనంత శక్తియుతము. ఈ 'శతరుద్రీయకథనం' అనబడే జీవటుని చైతన్యము యొక్క శతాది ఉపాధులలో ప్రవేశించటం, నిష్క్రమించటం, ఉపక్రమించి ఆ సమయంలో మరొక ఉపాధిని ఉత్తేజపరచటం... ఇదంతా చైతన్యమునందు సాధ్యమే.

పరమేశ్వరుని ఐశ్వర్యము ఇట్టిదే సుమా! అతడు ఏకమే అయి ఉండి అనేకములందు వివిధ రీతులుగా ప్రతిబింబిస్తున్నాడు. 'జ్ఞానము' అనునది ఒక్కటే అయినప్పటికీ అది వివిధ శరీరములందు

ఉండి వేరు వేరు జ్ఞేయములను ఆస్వాదిస్తోంది. సూర్యుని ప్రకాశము ఒక్కటే అయినప్పటికీ అందులోంచి బయలుదేరిన వేరువేరు కిరణములు వేరు వేరు వస్తువులపై ప్రసరించి ప్రకాశింపజేస్తున్నాయి. జలం ఒక్కటే అయినా అసంఖ్యాక తరంగాలుగా ప్రకటితమౌతోంది. అగ్ని 'ఒక్కటే' అయిఉండికూడా, అనేకచోట్ల వేరువేరు దీపములను వెలిగించుచు వేరువేరు దృశ్యవిషయములపై కాంతిని ప్రసరింపజేస్తోంది కదా! అట్టి "ఏకము నుండి అనేకము" అను చమత్కారం విశదీకరించటానికే మనం ఇక్కడ ఈ శతరుద్రీయం చెప్పుకుంటున్నాం.

❖

మనం చెప్పుకుంటున్న ఆ శతరుద్రీయమూర్తి ఆవరణ శూన్యమగు చిన్మయ స్వరూపమున విరాజిల్లుచున్నాడు. ఆతడు పరిశుద్ధ స్వరూపమును ఆశ్రయించుట ద్వారా ఈ జగత్తులో అంతర్యామి అయ్యాడు. ఈ ప్రాతిభాసిక జగత్తుకు ఆధారుడయ్యాడు. ఓ రామచంద్రా! ఈ విధంగా చిదాకాశంలో వందలకొలది శతరుద్రమూర్తులు వెలయుచున్నారు. నీకు – నాకు ఇప్పుడు ఇక్కడ అనుభూతమయ్యే ఈ వర్తమాన జగత్తు భిక్షు – రుద్రకల్పితమైన జగత్‌శతములలో పదకొండవది.

**శ్రీరాముడు:** మహర్షీ! ఆ జీవటుడు ఏ విధంగా వందలకొలది ఉపాధులలో ప్రవేశించాడో అదే విధంగా ప్రతిజీవుడు తన సుదీర్ఘ సంచారంలో అనేక ఉపాధులలో ప్రవేశించటం, నిష్క్రమించటం చేస్తున్నాడు కదా! అంటే అతనిలో కూడా జీవటుని లాగానే వివిధ అంతర్గత జీవులు వ్యక్తిగతమైన వివిధ ప్రపంచములను దర్శించటం జరుగుచున్నది కదా! ఆ వివిధ జీవులు అంతర్గత జీవులు ఒకరితో మరొకరు కలవటం ఎప్పుడైనా జరుగగలదా?

**శ్రీవసిష్ఠ మహర్షి**: సంసార జీవుడు తానున్న దానిలో భ్రాంతిచే బద్ధుడై ఉంటున్నాడు. అందుచేత తన స్వరూపాలైన తదితర జీవులను కలియలేకపోతున్నాడు. ఈ జీవుడెప్పుడు జ్ఞానంచే ప్రబుద్ధుడవుతాడో, అప్పుడు "నేను ఇన్ని రూపములుగా ఉంటున్నాను' అను నూతనానుభవంలో ప్రవేశించగలడు. ఈ వేరు వేరుగా కనిపించే జీవులన్నీ జ్ఞానియందే ఉంటాయి. వాటన్నిటిలో తానే ఉంటాడు. జ్ఞాని కానంత వరకు అట్టి అనుభవం దుర్లభం. మనం చెప్పుకున్న ఆ భిక్షుకుడు ప్రబుద్ధుడైనాడు. ఎవ్వరిలో తత్త్వజ్ఞానం ఉదయిస్తుందో అట్టివారు 'సముద్రములోని వేలాది తరంగాలలోని ఒకే జలం' ...లాగా సర్వజీవులలోని ఏకాకారమును అనునిత్యం వీక్షించగలుగుచున్నారు. ఇక అప్రబుద్ధులైన వారంటావా... వారు ఈ దృశ్యములో గల స్థూల విషయములకు బద్ధులై గ్రహించుచు, 'ఆత్మ యొక్క ఏకాకృతిని' గ్రహించలేకపోతున్నారు.

జలం యొక్క ద్రవత్వం చేత ఒక తరంగం, మరొక తరంగంతో పూర్ణంగా కలిసే విధంగా, స్థూలబుద్ధి తొలగుటచే ఇతఃపూర్వపు ఉపాధుల పరస్పర సమ్మేళనం సంభవిస్తోంది. ప్రబుద్ధ జీవులు తమ యొక్క చిన్మాత్రసమైక్యతా స్వభావంచే తదితర జీవులతో పరస్పరత్వం పూర్ణంగా పొందగలుగుచున్నారు.

ఈ 'సంసృతి'యందు మనకు కనబడుచున్న నానావిధ జీవజాతమంతా నిజానికి కల్పితము, అసత్యం అయి ఉన్నాయి. ఈ జీవులంతా సర్వవ్యాపియగు చిత్‌శక్తియందే ఉండి ఉన్నారు. అందుచేత

చిత్‌శక్తి వలెనే ఇవి కూడా సత్యమువలె తోచుచున్నాయి. ఎప్పుడైతే ఈ జీవుడు సర్వజీవుల తత్త్వమైన ఆ పరబ్రహ్మముతో ఐక్యమొందుతాడో... అప్పుడు, 'బ్రహ్మము తప్పితే మరింకేమీ లేదు. తదితరంగా అగుపించేదంతా స్వయంకల్పితమైన భ్రమమాత్రమే' అని గ్రహిస్తాడు. అప్పుడట్టి విజ్ఞానం సముపార్జించిన ద్రష్టకు తదితర జీవులతో ఒకానొక అంతర్గతమైన పరస్పర సమ్మేళనం లభిస్తోంది. భూమిని ఎక్కడ త్రవ్వితే అక్కడ సర్వవ్యాపకమగు ఆకాశం ప్రకాశిస్తూనే ఉంటుంది కదా! స్వయమాత్మానుభవులకు సర్వవైపులా స్వస్వరూపమే తాండవిస్తూ ఉంటుంది.

ఓ రామా! సర్వవ్యాపకము, సత్యము అయినట్టి చైతన్యము యొక్క అభ్యాసబలంచే తత్త్వదర్శనముచే తదితరమైనదంతా లయిస్తుంది. ఏ మనోబుద్ధి – చిత్త – అహంకారములు నిరోధించాలని జనులు అనుకుంటున్నారో, అదంతా కూడా నిర్మల హృదయులగు సర్వజ్ఞులకు చిన్మాత్రము (లేక) నిర్మల చైతన్యముగానే అనుభవమౌతోంది. అనేక బంతులలో నిండి ఉన్న గాలి ఒకే గాలి కదా! వివిధ నదులలో లభించే జలం వాస్తవానికి జలం దృష్ట్యా ఒక్కటే కదా! వేరు వేరు వస్తువులు వేరు వేరు చోట్ల తగలబడుచుండవచ్చు గాక! 'అగ్ని' సర్వదా ఒక్కటే కదా! వివిధ ప్రదేశములలో వివిధ ధర్మములు గల పదార్థజాలం ఉండవచ్చు గాక! కానీ, ఆకాశం ఒక్కటే కదా!

అట్లాగే సర్వభూతములందలి ఆత్మసత్త ఒక్కటే. ఒకే 'ఆత్మసత్తా చైతన్యతత్త్వం' సర్వత్రా వెలయుచున్నదని అనుభూతమొనర్చుకో.

శిల ఒక్కటే అయినప్పటికీ ఒక శిల్పి అనేక ఆకారాలుగా మలచి చిత్ర విచిత్ర శిల్పాలుగా తయారుచేసి మన ముందు ఉంచుతున్నాడు. మనం వాటినన్నిటినీ చూచి 'ఆహా! గొప్ప కళాకారుడే!' అని సంతోషిస్తున్నాం. అట్లాగే ఏకైక చిద్రూపమే ఈ విస్తార జగత్తుగా వెలయుచున్నది.

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ జగత్తు వస్తుతః ఏమై ఉన్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** 'ఇంద్రియాదులకు విషయమే కానట్టి, శుద్ధమైన – చిదేకరసమైన పరబ్రహ్మమునందు మనస్సుననుసరించి స్ఫురించే విషయరూపమైన అన్యథాజ్ఞానమే జగత్తు'... అనునదే ఈ జగత్తుకు నిర్వచనం. ఈ జగదాకార మనోజడత్వమంతా కారణమంటూ లేనిదే అగుచూ 'ఆకాశము నందు శూన్యము' అను చమత్కారంలాగా వర్తించుచున్నది. చూచువానిలో కలుగు మిథ్యాజ్ఞానం కాకుండా ఈ జగత్తుకు వేరే కారణమంటూ ఏదీ లేదు.

❖❖❖

# 5. దృశ్య వృత్తి - దృశ్య నిర్వృత్తి

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఇప్పుడు ఒక పరమ సత్యమును ప్రతిపాదిస్తున్నాను.... విను.

ఈ దృశ్యమును గూర్చిన వృత్తియే బంధము. దృశ్యజ్ఞాననిర్వృత్తియే మోక్షము. అంటే... 'ఈ దృశ్యములో నేను ఒకానొక వస్తువును గాని, విషయమును గాని కాను. ఈ దృశ్యము నా యందు విషయము కాదు' అను సర్వ సంబంధాతీతమైన జ్ఞానమునే మోక్షజ్ఞానం అని పిలుస్తున్నారు.

1. ఇవేమీ నేను కాదు, 2. ఇదంతా నేనే ఈ రెండిటిలో నీకు ఏది నచ్చితే అద్దానిని శీఘ్రంగా దృఢతరం చేసుకో.

అంతేకాదు... సృష్టి-అసృష్టి, బంధం-మోక్షం, జ్ఞానం-జ్ఞానం యొక్క అభావం... ఇవన్నీ కూడా సాక్షి యొక్క జ్ఞానస్వభావాలు మాత్రమే కనుక అవి సాక్షికి అభిన్నాలే. ద్రష్టను బట్టే దృశ్యాలు ఉంటున్నాయి. ద్రష్ట కంటే అవి వేరుగా ఉన్నాయని ఎవరూ నిరూపించలేరు. ఇది స్పష్టంగా తెలుసుకున్నవాడవై ఆ తరువాత ఇక నీ ఇచ్ఛ వచ్చినట్లు ఈ జగత్తులో సంచరించు.

❖

ఈ జగత్తు అనబడేది చూడనంతమాత్రం చేత లేకుండా పోగలదు. అట్టి దీని గురించి ప్రయాస ఎందుకో చెప్పు? ఈ జగత్తును త్యజించినప్పటికీ ఏ స్వసత్త శేషించియే ఉంటోందో... అది ఎప్పటికీ, ఎల్లస్థానము లందూ లభించియే ఉన్నదని గ్రహించు.

ఈ జగత్తు అనేది దీనిని స్మరించుట చేతనే కనబడుతోంది... స్మరించబడనప్పుడు లేకుండా పోతోంది.

ఈ జగత్తుకు సాక్షియగు నీ స్వస్వరూపుడు అట్టి సంస్మరణ – విస్మరణలకు కర్త అయి కర్తృత్వ – అకర్తృత్వ స్వభావుడై ఉన్నాడు. అతడు జగత్తు ఉన్నప్పుడూ ఉన్నాడు. జగత్తు లేనప్పుడూ ఉన్నాడు. అతనిని స్పష్టీకరించుకున్నవాడవై ఆ తరువాత ఈ జగత్తునందు నీ ఇష్టమైనదానిని ఆశ్రయించు.

తరంగము నీటి యొక్క స్పందమే కదా! ఈ జగత్తు కూడా నీ స్వస్వరూపమగు 'చిత్తు' యొక్క హృదయ స్పందన మాత్రమే. స్వస్వరూపభావము నుండి ఏర్పడిన కించిత్ 'చ్యుతి' మాత్రమే!

జల – తరంగములకు గల భేదమే బ్రహ్మము – జగత్తులకు ఉన్నది.

అనగా, ఏమిటి?... ఈ జగత్తుకు, బ్రహ్మమునకు సత్యదృష్టిలో అసలు భేదమే ఉండి ఉండలేదు.

నీటియందు మొట్టమొదట 'తరంగములు' అనేవి లేవు. ఆ తరువాత కూడా లేవు. చూచువాడు నీటి యొక్క చలనవ్యవస్థకు 'తరంగములు' అను పేరు పెట్టి పిలుచుచున్నాడు. 'తరంగములన్నీ జలం మాత్రమే'... అను విషయం మరచుచున్నాడు. అలాగే, బ్రహ్మమునందు మొట్టమొదట ఈ జగత్తు లేదు. ఇప్పుడూ లేదు. తరువాత కూడా లేదు. కానీ అజ్ఞానదృష్టి కలిగియున్న వాడు మాత్రం తన యొక్క ఆరోపణ దృష్టి చే ఈ కార్యభూతమగు జగత్తును పరిగణించుచున్నాడు. కనుక ఈ జగత్తు 'వేదన' వలన లభిస్తోందని, 'వేదనాక్షయం' చేత ఇక్కడేమీ లేదని తత్ప్రయత్నపరులు ఎరిగియే ఉన్నారు. ఈ సభలోని అనేకమంది విజ్ఞులు ఈ విషయం తెలుసుకొనియే ఉన్నారు.

❖

కాబట్టి "స్వయం ప్రకాశ ఆత్మరూపము – చైతన్యమాత్రము అగు బ్రహ్మమే అవిద్యావరణము స్వస్వరూపమును ఏమరచి జగత్తు స్వరూపంగా కల్పించుకొనుచున్నది"... అనునదే ఇక్కడ సిద్ధాంతము. 'చిత్' రూపమగు పరమాత్మయొక్క పారమార్థిక స్వరూపం జ్ఞానమయమేగాని, జడం కాదు. ఇక ఈ జగత్తు అంటావా?... ఇదంతా ద్రష్ట యొక్క భేదభావము వలన కల్పించబడినది మాత్రమే!

ఓ రామచంద్రా! అట్టి భేదభావమును శ్రుతులు చెప్పుచున్న ఉపాయములను అనుసరించి క్రమక్రమంగా ఉపసంహరించుకో. అప్పుడు 'ఈ జగత్తు కేవలం నామమాత్రం'... అని గ్రహించ గలవు. అట్టి నామమాత్రమైనది కూడా బ్రహ్మమున లేదు. అది సర్వదా ప్రశాంతము, శివస్వరూపము, నిష్కళంకము అయి ఉన్నదని గ్రహించు.

❖

ఈ జగత్తంతా సర్వదా ఆత్మచైతన్యమే ఉన్నది. 'జగత్తు యొక్క శబ్ద - అర్థములు బ్రహ్మము కంటే వేరైనదేదో కాదు'... అని మరొక్కసారి ప్రకటిస్తున్నాను. జగత్తు - బ్రహ్మము అనబడే రెండు వస్తువులు ఏనాడూ లేవు. తరంగ-జలము లనబడే రెండు వస్తువులు ఏనాడైనా ఉన్నాయా?

**శ్రీరాముడు:** అవట్లా జీవునకు ఎందుకు స్ఫురిస్తున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** చెప్పాను కదా! కేవలం అజ్ఞానమే అందుకు కారణం. అజ్ఞానమనేది సత్యమును పరిశీలించక పోవటం చేతనే కలుగుతోంది. పరిశీలించక పోవటమనేది ప్రయత్నలోపం వలన, విషయములందు చిక్కిన మనస్సు ప్రబుద్ధం కాకపోవటం చేత సంభవిస్తోంది. అజ్ఞానావస్థలో కనిపించే ద్వైతము జ్ఞానము వికసించగానే తొలగిపోవుచుండగా... ఇక జగత్ - బ్రహ్మములకు ద్వైతము ఎట్లా ఆపాదించగలవు చెప్పు? కాబట్టి జగద్భ్రమ తొలగటం, సంసారమును దాటటం, మోక్షమును పొందటం... ఇవన్నీ శిష్యునిలో సత్యదృష్టిని నిదురలేవటానికే చెప్పుచున్నాం. అంతేగాని, అవన్నీ వాస్తవానికి అసంగతములే.

❖❖❖

# 6. గణపతిత్వం

**శ్రీరాముడు:** మునీశ్వరా! మనం జీవట భిక్షుకుని స్వప్నోపాధుల గురించి ప్రస్తావించుకుంటున్నాం కదా! ఆతని జీవట - భిక్షు - బ్రాహ్మణ - హంసాది శరీరములకు ఆ తరువాత ఏమి సంభవించింది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** రుద్రుని ప్రేరేపణచే నిదురలేచిన జీవట-భిక్షు-బ్రాహ్మణ-హంసాదులు రుద్రుని అనుసరించారు కదా! వారంతా పరస్పరములకు సంబంధించిన భూత-భవిష్యత్-వర్తమాన వ్యాపారములను వీక్షించి కృతకృత్యులైనారు. నిర్వేదనచే సుఖవంతులైనారు.

అప్పుడు రుద్రుడు 'నేను కొంతసేపు నిదురించెదను గాక!' అనుకున్నాడు. స్వాంశసంభూతులగు ఆ జీవటుడు, బ్రాహ్మణ యువకుడు, సామంతరాజు మొదలైనవారిని చూచి ఇట్లు ఆజ్ఞాపించాడు.

**శ్రీరుద్రుడు:** ఓ జీవటాదులారా! మీరు మీమీ తావులకు వెళ్ళండి. అక్కడి మీ భార్య - పుత్రాది సహజీవులతో కొంతకాలం ఉండండి. మీ భోగవాసనలు తృప్తి పొందిన తరువాత తిరిగి నా దగ్గిరకు రండి. ఆ తరువాత మీరంతా నా అంశమున రుద్రనగరంలో రుద్రగణరూపాన్ని ధరించెదరు గాక! మహాప్రళయంలో ఈ జగత్తంతా క్షయం కాగానే మనమంతా కలిసి పరమపదమున ప్రవేశిద్దాం.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రాఘవా! భగవంతుడగు రుద్రుడు వారందరినీ అట్లు ఆజ్ఞాపించి అంతర్ధాన మైనాడు. ఇక వారంతా అంతరమున రుద్రగణములుగా వెలయుచు, బాహ్యమునమాత్రం సంసార దర్శనమును చేయు సాక్షి రూపమును ధరించారు. తమ తమ సంసారములలో ప్రవేశించారు. అక్కడక్కడ గాఢనిద్రలో ఉన్న భౌతిక ఉపాధులను నిదురలేపారు. మరల యథాతథంగా 'భార్య – ఆహారము – రాజ్యము – అను బంధములు' మొదలైన అనేక విషయములతో కూడిన సంసారమును అనుభవించసాగారు. ఇదీ, ఇప్పటి పరిస్థితి. వారంతా మరికొంతకాలం భోగములను అనుభవించ గలరు. ఆ తరువాత తమ శరీరానంతరం రుద్రలోకం పొందగలరు. ప్రమథగణంలో చేరి రుద్రభక్తులకు సుఖ–శాంతి–ఐశ్వర్యములు కలిగిస్తూ కొన్నాళ్ళు గణత్వము పొందుతారు. ఆకాశంలో దర్శనమిచ్చే నక్షత్ర మండలంలాగా వారు అప్పుడప్పుడూ లోకంలో అక్కడక్కడా భౌతిక రూపమున వెలయుచూ లోక కళ్యాణకారకులై జనులకు సాధన రూపంగా ప్రాప్తించగలరు.

❖❖❖

# 7. సంకల్పిత దేహములు

**శ్రీరాముడు:** హే గురువర్యా! తమరు చెప్పిన జీవటరుద్రుని కథనం నాకు చాలా ఆశ్చర్యం గొలుపు తోంది. నాకు కొన్ని సందేహాలు కూడా కలుగుచున్నాయి. జీవట – బ్రాహ్మణ – సామంతరాజాదులన్నీ ఆ భిక్షుకుని నిద్రకుపక్రమించినప్పటి స్వప్నతుల్యమైన సంకల్ప రూపములే కదా! అట్టి సంకల్ప రూపములు సత్యమై ఎట్లా భాసించాయి? సంకల్పము భౌతికంగా ఏర్పడటం, ఆయా బ్రహ్మాండముల లోని సంసారంలో తదితర జీవులతో సంయోగాదులు ఎలా ఒనగూడాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** సర్వమునూ సర్వదా ఆక్రమించి ఉన్న (అధిష్ఠానమగు) చిత్ అంశము నందు ఈ భౌతిక–మానసిక జగత్తులు సత్యంవలె భాసిస్తున్నాయి. ఆద్యంత విద్వత్ దృష్టిచే చూస్తే ఈ సత్–అసత్ యుక్తములగు సంకల్పవిషయములకు స్వయంగా అస్థిత్వం లేదు. వాటికి అస్థిత్వం ఉన్నట్లు తోచటానికి కారణం ఏమిటంటావా? అవన్నీ దేనిపై ఆరోపించబడుచున్నాయో... అది నిత్యసత్యమగు బ్రహ్మం అగుట చేతనే!

**ఆ సర్వము ఆత్మయే -** అయితే జీవుల భోగదృష్టిని అనుసరించి ఈ సంకల్పిత విషయాలు క్రియాసామర్థ్యముతో అగుపడుచున్నాయి. ఈ సంకల్ప మాత్ర విషయములను నీవు వివేక బలంతో పరిత్యజించవలసి ఉన్నదని గ్రహించు.

స్వప్నంలో కనబడేవన్నీ కేవలం మానసిక సంకల్ప తరంగములు మాత్రమే కదా! సర్వకాలము లందూ అధిష్ఠానుభూతము అగు సత్‌చిత్ స్వరూపం స్వతఃగా స్వచ్ఛమై ఉండికూడా... ఈ దేశ – దేశాంతర ఆగమన – నిష్క్రమణాది క్రియా వ్యవహారాలన్నీ తోపింపజేస్తోంది. అయితే అట్టి ఆరోపిత సమయంలో కూడా అయ్యది అధిష్ఠానముగానే వెలయుచున్నది సుమా! 'దేశము – దేశాంతరము' అనబడేవి 1. ఇంద్రియపాటవము, 2. కాలము, 3. మార్గాన్వేషి ...అనే మూడు ఒనగూడినప్పుడు మాత్రమే సంభవిస్తాయి కదా! అలాగే చిత్‌వస్తువు లేకపోతే స్వప్న – జాగ్రత్ సుషుప్తులు సంభవించవు.

**శ్రీరాముడు:** ఓ మహర్షీ! ముక్కుకు సూటిగా అడుగుచున్నాను. ఈ దృశ్యరూపంగా పరిణమించేదంతా ఎట్లు, ఏ ప్రభావం చేత పరిఢవిల్లుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** బ్రహ్మం సర్వాత్మకమైనది. తత్కారణంగా బ్రహ్మమే స్వరూపంగా గల ఈ అనుభవ స్వరూపుడగు జీవుని సంకల్పములను అనుసరించి పూర్వవాసనానుగతంగా 'చిత్తము' అనబడేది రూపుదిద్దుకుంటోంది. అట్టి చిత్తమునకు ఏదేది ఎప్పుడెప్పుడు పర్యాలోచితం అవుతుందో... అప్పుడప్పుడు అదంతా దృశ్యరూపముగా పొందబడుతోంది.

**శ్రీరాముడు:** ఒకడు ఏది సంకల్పిస్తే అది అట్లే దృశ్యరూపంగా పరిణమించగలదని మీ ఉద్దేశమా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** అవును. సంకల్పము ననుసరించే దృశ్యము ఉంటోంది, ఉండగలదు.

**శ్రీరాముడు:** అయితే, ఒకడు 'ఇది ఇట్లు ఉండుగాక' అని సంకల్పించాడనుకోండి. ఉదాహరణకు ఒకడు ఒక కొండను చూచి 'ఇది పిండి అగు గాక' అని సంకల్పించినంత మాత్రంచేత అది పిండి అయిపోవటంలేదు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఎంత సంకల్పించినప్పటికీ అనేకులకు భౌతికమైన విషయములు సంకల్పానుసారం పరిణమించటం లేదు. ఉత్తమమైన అభ్యాసయోగం లేకపోతే పదార్థజాలం సంకల్పానుసారం ఉనికిని పొందజాలదు. యోగ, విజ్ఞానదృష్టి పొందినవారు సర్వత్రా తమ యొక్క సంకల్పానుగతంగా పదార్థాలను నిర్దేశించగలుగుచున్నారు. అదియే 'యోగబలం' అని పిలువబడుతోంది. యోగబలం అనేది ఏకాగ్రత యొక్క సాధనానంతర ప్రయోజనమేనని గ్రహించు. ఏకాగ్రత యొక్క సాధనబలం లేకపోతే ఎవ్వరికైనాసరే, సంకల్పసిద్ధి' అనే ఫలం లభించదు.

అభినివేశము + ధ్యాస ----> చిత్తము.

అట్టి ఈ చిత్తము ఉద్వేగసహితమైన ఒక విషయాన్ని సంస్మరణ పూర్వకంగా ఆశ్రయిస్తోంది. ఇంతలోనే అతిత్వరలో ఆ విషయాన్ని వదలి మరొక విషయాన్ని స్మరిస్తోంది. ఈ విధంగా అది అనుక్షణం ఉభయభ్రష్టత్వం పొందుతోంది. చిత్తము యొక్క చాంచల్యం కారణంగా సంకల్పములు బలహీనమై సిద్ధిని కలుగజేయలేక పోతున్నాయి. ఏకనిష్ఠుడగువాని కార్యములు నెరవేరటం లోకవిదితమే కదా! దక్షిణ దిక్కుగా ప్రయాణించేవారు పడమర దిక్కునగల గ్రామములు చేరజాలనట్లు సంకల్పార్థనిష్ఠులు మాత్రమే సంకల్పిత విషయాలు పొందగలుగుచున్నారు. సంకల్పము యొక్క ఏకాగ్రత – ప్రయోజనం గురించి ఇదివరకే అనేక విషయాలు ప్రస్తావించుకున్నాం కదా!

జనులు ఎట్టెదుటగా ఉన్న విషయములందు మాత్రమే బుద్ధిని నిలిపి, అంతవరకు మాత్రమే పరిమితమైన వివేచననే గ్రహిస్తున్నారు. వారు సంకల్పిత వస్తువును పొందగోరికూడా ఏకనిష్ఠులు కాకపోవటం చేత, ఏకాగ్రత పొందలేకపోతున్నారు. వారు వాస్తవానికి సంకల్పిత వాంఛితములను గాని, ఎదురుగానున్న వస్తువులనుగాని అసంపూర్ణంగా మాత్రమే పొందటం జరుగుతోంది.

అయితే ఆ భిక్షువు ఏకనిష్ఠుడవటం చేత రుద్రత్వం, సర్వాత్మకత్వం, రుద్ర సంబంధమైన సర్వజ్ఞత్వం పొందగలిగాడు. ఏకాగ్రత యొక్క ప్రయోజనంగానే అతనికి 'స్థితి' అనే పరమోన్నత అనుభవం కలిగింది. ఏకాగ్రతే లేకపోతే అనేక మందిలాగానే అతనికీ భావించినది లభించేది

కాదు. అంతరాళ వాసులగు జీవటుడు – బ్రాహ్మణుడు – సామంతరాజు – చక్రవర్తి మొదలైన వారు ఆ భిక్షుకుని సంకల్పఫలములగు జీవులే అయినప్పటికీ వారందరు వేరు వేరు లోకములలో ఉన్నప్పుడు ఒకరి గురించిన అనుభవం మరొకరికి కలుగుటలేదు. రుద్ర చైతన్యం యొక్క సమావేశేచ్ఛ వలననే ఆ వివిధ ఉపాధుల ప్రజ్ఞలు ఒకటితో మరొకటి ఒకచోట సమావేశమైనాయి.

**శ్రీరాముడు**: చైతన్యము దృష్ట్యా భిక్షుకుని మొదలు రుద్రుని వరకు ఒక్కటే అయి ఉన్నది కదా! ఒకరికి మరొకరు తెలిసి ఉండకపోవటం ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** మాయ యొక్క వైచిత్ర్యం ఏమని చెప్పమంటావ్? ఈ జీవునికి ఈ ఉపాధికి ముందు విషయాలతో సంబంధమే ఉండటం లేదు కదా! నీవు ఒక స్వప్నాన్ని గాంచుచున్నావనుకో... అప్పుడు జాగ్రత్‌కు సంబంధించిన విషయముతో గాని, క్రితం రోజు స్వప్నాలతోగాని సంబంధం ఉంటోందా? లేదు. అట్లాగే ఇది కూడా!

ఆ పరమాత్మ యొక్క సంకల్పబలం చేతనే ఈ జీవసృష్టులు, వీటిలో భేదాజ్ఞానయుతులు – అప్రబుద్ధులగు జీవులు... మొదలైన వారంతా ఉత్పన్నమవటం జరుగుతోంది. అట్టి ఏక – అనేక శక్తి యొక్క ప్రకటన చేతనే రుద్రుడు – భిక్షువు మొదలైన వివిధ రూపములు ఏర్పడ్డాయి. అవన్నీ 'సంకల్పము, నిష్ఠ, ధ్యానము' అను త్రివిధత్వము యొక్క చమత్కారమేనని గ్రహించు.

ఈ కనబడు జీవులంతా భిక్షుకుని స్వప్నసదృశ వివిధ జీవుల వంటివారే సుమా! ఈ జీవుడు తన ధ్యానచింతాబలమును అనుసరించి ఏకత్వం, బహుత్వం, విజ్ఞత్వం, మూర్ఖత్వం, పాండిత్యం, నరత్వం, దేవత్వం మొదలైనవన్నీ పొందుచున్నాడు. ఆ వివిధ పరస్పర వ్యతిరిక్త ధ్యానములను... ఒక్కసారి అనేక ధ్యానములను, అనేకసార్లు ఒక్కొక్క ధ్యానమును పొందటం జరుగుతోంది.

ధ్యానమును బట్టి నైజము ఉంటోంది. నైజము (స్వభావము)ను బట్టి ఉపాధులు ఉంటున్నాయి. పరిమిత – అపరిమిత నైజముల నుండి భావనలు, భావనల నుండి నైజము ఏర్పడుచున్నాయి. అయితే ఈ జీవుడు పారమార్థికంగా బ్రహ్మ స్వరూపుడే.

బ్రహ్మస్వరూపుడగు ఈ జీవుడు అనంతుడు, సర్వశక్తిమంతుడు కూడా అయి ఉన్నాడు. అట్లయి కూడా ఒకే శరీరమున అభిమానము వహించి ఉన్నప్పుడు ఒక్క శరీరవ్యవహారమునకు మాత్రమే పరిమితుడై ఉంటున్నాడు. ఆతడు స్వతహాగా అపరిచ్ఛిన్నుడై ఉండటం చేత ఒక్కసారే అనేక శరీరములను ఆశ్రయించ గల అంతర్గతశక్తి ఉన్నవాడేనని యోగులు ఎరిగియే ఉన్నారు. అనేక శరీరములను ఆశ్రయించినప్పుడు ఆ వివిధ వ్యవహారములు ఒక్కసారే నిర్వర్తించగల 'చిత్‌శక్తి' ప్రతీజీవుని యందు దాగియే ఉన్నది సుమా! అట్టి అనేక శరీరముల ప్రకటనను అవతార పురుషులలోను, మహాయోగులగు లోకగురువులందు, మంత్రతంత్ర సమన్వితులగు రావణాది కొందరు అసురులందు కూడా మనం గాంచుచూనే ఉన్నాం.

❖

ప్రాణుల యొక్క కర్మలను అనుసరించే సర్వేశ్వరునియందు ఈ పిపీలికాది బ్రహ్మపర్యంతం ఉపాధులు, 'భూ–స్వర్గ–నరక–పాతాళాది లోకాలు' అనబడే ఈ సృష్టి అంతా వికసిస్తోంది. వాస్తవానికి

పరమేశ్వరుని యందు ఈ హింసాజనిత వైషమ్యాలుగానీ, కష్టసుఖాలు, సుఖదుఃఖాలు' మొదలైనవి గానీ లేవు. జీవులు ఏది కోరుకుంటున్నారో... అదే చిదాత్మయందు స్పందించి స్వయంగా సుసంపన్నం అవుతున్నది. స్వయంగా ఆపాదించుకున్న దేశ-కాల-క్రియా క్రమాలను ఈ జీవులు మోహం జోడించుకొని పొందుచున్నారు. ఇక్కడ 'ఏకాగ్రత - అనేకాగ్రత' అనే రెండు దృష్టులు పోటీపడి, జీవుని అభిలాష, అభ్యాసము, శ్రద్ధ, అవగాహలను అనుసరించి ఒకటి రెండవదానిని ఆక్రమించివేసి ఉండటం జరుగుతోంది. ఏకము, అనేకము మొదలైన అనుభవములన్నీ కూడా జీవుని నుండే బయలుదేరుచున్నాయి.

"ఈ దృశ్యమునకు వేరె, కేవల సాక్షియై, భావ నియామకుడనై ఉన్నాను... అను రూపంగా ఉండే భావౌన్నత్యమును సాధించిన యోగులు తమ ఇచ్ఛానుసారం శరీరములను ధరించగలుగు చున్నారు. యోగౌన్నత్యము లేని జీవులు కర్మల - ఇచ్ఛ - ఉద్వేగములననుసరించి ప్రవాహపతితులై, అస్వతంత్రులై విధివశంగా ఉపాధులను పొందుచున్నారు. సాధన, జ్ఞానములను అనుసరించే జీవునిలో యోగశక్తి రూపుదిద్దుకుంటోంది.

యోగశక్తి యొక్క పాటవమును అనుసరించి యోగి - యోగినులు తమ గృహమునందుగాని, వేరువేరు చోట్లగాని, వేరు వేరు లోకములందుగాని ఒకేసారి ఒకటి - రెండు - అనేక దేహములను ధరించు శక్తి కలిగి ఉంటున్నారు. అదంతా ధ్యాన - ధారణాఫలితంగా సుసాధ్యమేనని గ్రహించు. అలాగే మరికొందరు యోగులు నిగ్రహ-అనుగ్రహ సమర్థములగు అధికార దేహాలను ధరించి ధర్మ, శాస్త్ర, విధాన సంరక్షణములు నిర్వర్తిస్తున్నారు. ఇంకా కొందరు యోగులు ప్రారబ్ధమును త్వరితంగా పూర్తి చేయటానికి ఇహ-పరలోకములలో విభిన్న దేహములను అనుభవించటం కూడా ప్రసిద్ధమే.

ఇక మరికొందరు యోగులు ఉన్న చోట ఉండియే జగత్తులో అనేక చోట్ల అనేక కార్యక్రమములు నిర్వర్తిస్తూ ఉంటారు. ఉదాహరణకు కార్తవీర్యార్జునుడు అనే చక్రవర్తి తన గృహంలో ఉంటూనే జగత్తులోని అనేక మూలల గల తదితర రాజులను గడగడలాడిస్తూ శాసిస్తూ ఉండేవాడు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. విష్ణుభగవానుడు లక్ష్మీసమేతుడై క్షీరసాగరంలో ఉండియే, ఇట్లు ఈ పృథివిపై ధర్మరక్షణార్థం అనేకసార్లు అనేక భూచర-జలచర అవతారాలు ఎత్తుతున్నాడు. అట్లాగే యోగినులు సువర్లోకంలో యోగిణీగణం మధ్యలో ఉంటూనే ఈ భూలోకంలో అనేకచోట్ల తమకు సమర్పించబడుచున్న బలులను గ్రహిస్తున్నారు. ఇంద్రుడు స్వర్గ సింహాసనమున ఉండి అదే తరుణంలో భూలోకంలోని యజ్ఞశాలలో యజ్ఞభోక్తగా సాక్షాత్కారమౌతున్నాడు. శ్రీమన్నారాయణ అవతారమగు 'శ్రీరామచంద్రుడు' అను ఆరాధ్య స్వరూపుడవగు నీవు ఈ అవతారంలోనే ఒకానొక సందర్భంలో 14,000 రూపములు ధరించి 14,000 మంది రాక్షసులతో ఒకేసారి పోరాడి సంహరించి మరుక్షణం మరల ఒకే రూపం పొందటం చేస్తావు. ఈ మానవ రూపంతో అనేకమంది భక్తులకు ఆరాధ్యదైవమై యుగ-యుగాంతరములందు రామభక్తుల ప్రణామాలు స్వీకరించి వారిని అనుగ్రహిస్తూ ఉంటావు. శ్రీరామావతారమగు ఆ మహావిష్ణువు ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా అవతరించి దుర్యోధనుని

సభలోను, యుద్ధరంగంలో అర్జునుని విషాదం పోగొట్టి అనుగ్రహించటానికి శతసహస్ర విశ్వరూపధారి అయి భక్తులకు ప్రత్యక్షమౌతాడు. మళ్ళీ తన విశ్వరూపాన్ని ఉపసంహరించి మానుషరూపం ప్రకటించి, ఆ తరువాత అనంతకాలం ఆశ్రితవాత్సల్యంతో భక్తులముందు మానవరూపంలో ప్రత్యక్షమై ఉండగలడు.

'నిమి' అనే పేరు గల ఒక రాజర్షి విదేహముక్తిని సంపాదించాడు. అట్టి విదేహముక్తి సమన్వితుడై సమస్త దేహాల నేత్రాలతో దర్శన ప్రక్రియారూపంతో వసించుచున్నాడు. ఒకే సమయంలో ఈ భూత-భవిష్యత్-వర్తమాన దేహాల కళ్ళలో ప్రవేశించి ఉంటున్నాడు. భగవంతుడు సర్వదా ఒక్కడే అయినప్పటికీ అసంఖ్యాక అవతారాలతో ఆయా భక్తుల ముందు ప్రత్యక్షమగుచున్నాడు. ద్వాపర యుగంలో శ్రీకృష్ణభగవానుడు పదహారువేల రూపములు ధరించి పదహారు వేలమంది గోపికలతో ఒకేసారి క్రీడించగలడు.

ఇట్టి చమత్కారమును అనుసరించే ఆ భిక్షువు జీవటుడు, రాజు, చక్రవర్తి మొదలైన అనేక ఉపాధులను వేరు వేరు జగత్తులలో దాల్చాడు. రుద్రశక్తిచే ఉపాధులను ఒకచోట సమాయత్తపరచాడు కూడా. మరల ఆ ఉపాధులు తమతమ లోకములలో ప్రవర్తించేటట్లు సంకల్పించాడు. వారందరూ తిరిగి రుద్రుని చేరగలరు. వారంతా భూ - స్వర్గ - బ్రహ్మ - విష్ణు - మహేశ్వర లోకములలో పూజార్హులు కాబోవుచున్నారు కూడా!

❖❖❖

# 8. మోహవశాత్తుగా సుదీర్ఘ పయనం

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఆ భిక్షుకుడు ఒకచోట ఆసీనుడై కొంచెం చింతన చేసి తనయందుతానే తన పూర్వ ప్రారబ్ధమును వేరువేరుగా ఆయా... ఉపాధుల రూపంలో వేరువేరు దేశ-కాలములలో గాంచటం జరుగుతోంది. వాస్తవానికి "అతనికి అనుభవయ్యేది - ఆతడు" ఈ రెండూ... కూడా ఆత్మయే కాక మరింకేదీ కాదు.

ఈ జీవులందరి విషయం కూడా ఇట్టిదేనని గ్రహించు. మరణ కాలమున సారభూతమైన స్వకర్మయే ఉత్తరోత్తర జన్మలకు కారణమగుచున్నది. స్వప్నసదృశమైన ఇట్టి జన్మపరంపరలు మోక్షస్థితివరకు భాసిస్తూనే ఉంటాయి. అయినా కూడా ఇదంతా చిదాకాశముకంటే వేరే మరొకటేదీ కాదు. ఆత్మయే ఈ సంసార విభాగములన్నీ తననుండి వేరు చేసుకుని "అనుభవము" అను పరిజ్ఞానం ద్వారా తనయందే ఇదంతా పొందుతోంది. ఇక ఈ వర్తమాన జన్మ విషయానికి వస్తే ఇది ఇతఃపూర్వము మృతించిన జీవుడు పొందుచున్న మరొక స్వప్నం అనికూడా అనవచ్చు. ఓ రఘురామా! ఈ విధంగా స్వతఃగా అపరిచ్ఛిన్నుడగు ఈ జీవుడు పరిచ్ఛిన్నుడై దేహాదులను ఎట్లు పొందుచున్నాడో తెలియజేయటమే ఈ భిక్షుకోపాఖ్యానం యొక్క ఉద్దేశం. ఆ భిక్షుకుడే కాదు ఆత్మ నుండి విచ్యుతులైనట్టి ఈ జీవులందరూ కూడా పైనచెప్పిన విధంగా ఒక మోహమునుండి మరొక మోహం పొందుచున్నారు. ఇదంతా కూడా ప్రతిరోజూ ఒకడు ఒక స్వప్నంలో ప్రవేశించి, ఆ తరువాత ఆ మరునాడు మరొక స్వప్నంలో ప్రవేశించటం వంటిదేనని గ్రహించు.

**పర్వతాగ్ర పరిభ్రష్టోహ్యధో అధ ఉపలోయధా ।**
**పరమాత్మ పరిభ్రష్టో జీవః స్వప్నమిమంధృధమ్ ॥**

పర్వతశిఖరం పైనున్న ఒక శిల విభాగం క్రిందకు జారి అధఃపతనం అవుతూ ఎక్కడో లోయ లోకి పడిపోతోంది చూచావా? పరమాత్మ నుంచి చ్యుతి పొందిన ఈ జీవుడు 'దేహపరంపరలు' అనే అధఃపతనాన్ని గాంచుచున్నాడు. తన అభ్యంతరమున ఉన్న మాయ వలన శైథిల్యం పొంది 'నేనీ అల్ప శరీరాన్ని' అని భ్రమిస్తున్నాడు. "దేహాల రాక-పోకలకు ఆవల అప్రమేయమై వెలుగొందే ఆత్మయే నా స్వరూపం"... అను ఆస్వాదన పెంపొందనంత వరకు ఈ ప్రయాణం ఇట్లే కొనసాగుతోంది.

అతనెప్పుడో యథార్థం తెలుసుకుని, అప్పుడు తక్షణం ఈ శరీరములతో భ్రమచే ఏర్పడే సంబంధములను గుర్తెరిగి ఆత్మ యొక్క అనుభవమును పొందగలడు.

**శ్రీరాముడు:** ఆహా! మునీంద్రా! ఈ జీవుని పట్ల 'విషయము' అనే మోహం ఎన్నెన్ని చిత్రములకు దారి తీస్తోంది! ఈ జీవుడు తానెవరో తన నిజస్వరూపము ఏమిటో గ్రహించకుండా, ఈ విషయ స్వప్నమునందు నిదురిస్తున్నాడు కదా! నానావికారములతో కూడిన తన మనస్సుచే 'మిథ్యాజ్ఞానం' అనే రాత్రియందు సకల భేదదృష్టులతో కూడిన ఈ దృశ్య సమూహములను తనయందు తానే పొందుచున్నాడు. ఇట్టి మాయా జగత్తునందు అన్నియూ సంభవమేనని నేను ఒప్పుకుంటున్నాను. మీరు సంభవయోగ్యమేనని చెప్పినది తప్పక అనుభవసిద్ధమే.

ఇప్పుడు నాదొక చిన్న ప్రశ్న – మీరు చెప్పిన మహాత్ముడగు ఆ భిక్షుకుడు నిజంగా ఉన్నాడా? లేక మా మీద దయతో బోధ కొరకు 'భిక్షుకుడు' అనువాని గురించి, ఆతని ఉపాధి పరంపరల గురించి కల్పించి చెప్పారా? ఈ విషయం తెలియజేయవలసినదిగా నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఇప్పుడు నేను చెప్పిన భిక్షుకుని వృత్తాంతమంతా నేను భౌతికంగా చూచి చెప్పినది కాదు. అదంతా నా అంతర్దృష్టిచే ఈ బోధరూపంగా ఈ సందర్భంలో స్ఫురించింది. అయినా కూడా "అది యాదృచ్ఛికం, అయథార్థం కాజాలదు" అని అనుకుంటున్నాను. నా దివ్యదృష్టి యొక్క బలంతోనే కదా, నేనిదంతా చెప్పుచున్నది!

నీవిప్పుడు అడిగావు కనుక నేను ఈ రోజు రాత్రి సమాధిని అవలంబించి ఈ ముల్లోకాలు సంచరించి వస్తాను. ఆ భిక్షుకుడు నిజంగా ఉన్నదీ, లేనిదీ నీకు రేపు ఉదయం బోధలో వివరిస్తాను.

❖

రాజులు, పౌరులు, తదిర సభికులు శ్రీ వసిష్ఠమహర్షిని సమీపించి ఆయనకు పాదాభి వందనములు సమర్పించారు. సభికులంతా ఆహా! మేము ఈ జన్మ – మృత్యువుల మధ్య పరిమితులమై ఉన్నామని ఇంతకాలం అనుకుంటూ వచ్చాం. మమ్ములను రోదింపజేయుచున్న ఈ మాయ కేవలం స్వకీయమైనదే కదా! ఇంతకీ ఆ భిక్షుకుడు వసిష్ఠ మహర్షికి తారసపడతాడా? ఏమో? రేపు ఆయన ప్రవచించే విశేషాలు వినవలసిందే! అని చెప్పుకుంటూ గృహోన్ముఖులయ్యారు

❖❖❖

**(పదహారవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# పదిహేడవ రోజు

## 9. సూక్ష్మదేహంతో అన్వేషణ

**శ్రీవాల్మీకి మహర్షి:** ఓ భరద్వాజా! వింటున్నావుగా! మరునాడు 17వ రోజు సభ పునః ప్రారంభమైంది. ఆకాశంలో నక్షత్రాల లాగా శ్రీరామలక్ష్మణాదులతో, తదితర మహనీయులతో ఆ అయోధ్యలోని సభ ప్రకాశకాంతులు విరజిమ్ముచున్నది. సభికులంతా వసిష్ఠ మహర్షి కనుగొనినదేమిటో వినాలని ఉత్సాహపడుచున్నారు. దయాశాలురగు సాధుపుంగవులు ఈ సంసారజనుల పాట్లు చూచి, వారికి బలవంతంగానైనా సరే బోధ చేస్తూనే ఉంటారు. అట్లాగే శ్రీ వసిష్ఠ మహర్షి ఎవరి ప్రశ్నకై వేచి ఉండకుండానే ఇట్లు బోధ కొనసాగించారు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ సభికులారా! నిన్నటిరోజు చిట్టచివర ఈ రామచంద్రుడు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలనే ఉద్దేశంతో జరిగిపోయిన రాత్రి నేను సమాధిని ఆశ్రయించాను. సూక్ష్మశరీర ధారినై జ్ఞాననేత్రంతో మూడు లోకాలూ అన్వేషించాను. ఆ భిక్షుకుని కొరకై వెదుకుచూ సప్తద్వీప – సప్తకుల సమన్వితమగు ఈ పృథివిపై అంతటా ధ్యానమార్గంలో పరిభ్రమించాను.

మనోరాజ్యం బయట దొరికేది కాదు కదా! ఆ భిక్షుకుడు కనబడనంత వరకూ నేను అట్లే మారుమూలలా తిరుగాడుచూనే ఉన్నాను.

రాత్రి మూడవ జామున గాలిచే కొట్టబడిన ఒక పెద్ద సముద్రతరంగంవలె నేను ఉత్తరదిక్కుగా వెళ్ళటం జరిగింది. అక్కడ 'వల్మీకం' అనే పేరుతో ప్రసిద్ధి కెక్కిన ఒక ప్రాంతం ఉన్నది. ఆ జనపథం దాటగానే 'జిన' అనే ఒక గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో 'విహారం' అనే పేరు గల ఒక జనసమ్మర్దమైన స్థానం ఉన్నది. అక్కడ చాలా ఇళ్ళు ఉన్నాయి. ఆ ఇళ్ళకు కొంచెం దూరంగా 'దీర్ఘదృశుడు' అను పేరుతో జనులు పిలిచే ఒక భిక్షుకుడు ఉన్నాడు. ఆతడున్నది పాడుబడిన ఒక కుటీరంలో. సామాన్యంగా ఆతడు ఆ కుటీరం వదలి బయటకు రాడు. అతడు అక్కడ ఎంతకాలంగా ఉంటున్నాడో అక్కడివారి కెవ్వరికీ తెలియదు. అక్కడివారెవ్వరూ అతనిని అంతగా ఏమీ పట్టించుకోరు. అక్కడి పెద్దలు మాత్రం అతనిని 'దీర్ఘదృశుడు' అని పిలుస్తూ ఉంటారు. అతనికి కొద్దిమంది శిష్యులు మాత్రం ఉన్నారు. వారిని గురించిన వివరాలు అక్కడి కొద్దిమందికి మాత్రమే తెలుసు. ఆ భిక్షుకుడెప్పుడన్నా రాత్రి కొంత పొద్దుపోయిన తరువాత తన భిక్షుపాత్ర పుచ్చుకొని కొన్ని ఇళ్ళకు వెళ్ళుచూ ఉండేవాడు. మౌనంగా నిలబడే ఆతనికి వాళ్ళు కొంచెం ఆహారం ఇవ్వగానే ఊరి చివరి కుటీరం వైపు మౌనంగా నడచి వెళ్ళిపోతూ ఉండేవాడు.

ఒక రోజు ఆతడు ఆ కుటీరానికి గల తలుపు మూసి ధ్యాననిమగ్నుడైనాడు. ధ్యానమునకు ఉపక్రమించే ముందే తన శిష్యులను ఒక నెల వరకూ తన సమాధిని భంగపరచవద్దని ఆజ్ఞాపించాడు. ఇప్పటికి ఆతడు 21రోజులు సమాధిలో ఉన్నాడు. నేను సూక్ష్మదేహినై ఆ కుటీరంలో ప్రవేశించాను. ఆతని ప్రియశిష్యులు తమ గురువు యొక్క ఆజ్ఞను అనుసరించి బయటనే ఉన్నారు. వారలు ఆ కుటీరంలో ప్రవేశించకపోవటం గమనించాను.

ఆతడు సమాధిలో ఉండి వేలాది సూర్యుల కాంతితో ఒప్పారుచున్నాడు. దీర్ఘ సమాధిలో ఉన్న ఆతనితో సంభాషించటానికి నేను సాహసించనైనా సాహసించ లేకపోయాను. ఆతని శిరోజములు కపిలవర్ణం సంతరించుకున్నాయి. ప్రాణములు నిరుద్ధమై ఉన్నాయి.

ఒక్కసారి అక్కడి నుండి నేను భూత – భవిష్యత్‌లలోకి తొంగిచూశాను. ఆతడు ధ్యాననిష్ఠలో ఉన్నది 21 రోజుల క్రితమే అయినప్పటికీ, తన చిత్తంతో వేలాది సంవత్సరాలు అనుభవించాడు. ఆతడు ఈ రోజే శరీరమును వదలి విదేహకైవల్యము పొందబోవుచున్నాడు.

❖

ఓ రామచంద్రా! ఆతని విదేహ కైవల్య చమత్కారమంతా గమనించి నేను ఆతనికి నా ఆతివాహిక దేహంతో సాష్టాంగనమస్కారం సమర్పించి వెనుకకు మరలాను. అప్పుడు నీ ప్రశ్నకు ఉచిత సమాధానం ఇచ్చే ఉద్దేశంతో 'ఇతః పూర్వకల్పంలో కూడా ఇట్టి చరిత్ర–ధారణ–విదేహముక్తి కలిగి ఉన్న భిక్షుకుడెవరైనా ఉన్నాడా? లేడా? గ్రహించాలి' అని అనుకున్నాను. నేనిప్పుడు చూచి వచ్చినది రెండవ భిక్షుకుడని, ఇంతకు ముందు కల్పంలో కూడా ఇట్టి చరిత్ర గల భిక్షుకుడున్నాడని గమనించాను. అప్పుడు నేను ఇంకా ముందు కల్పములు కూడా తరచిచూశాను. ఎంతో చతురతతో అంతకు ముందటి కొన్ని కల్పముల వరకూ వెదకినా కూడా మరి మూడవ భిక్షుకుడు అంతకు క్రిందటి ఆ కల్పములలో నాకు తారసపడలేదు.

❖

తిరిగి ఆశ్రమం ప్రవేశించిన నేను అట్టి భిక్షుకుని వృత్తాంతం గల వారెవరైనా ఇంకా ఉన్నారేమో గ్రహించటానికి మరికొంత ప్రయత్నించాలని అనుకున్నాను. అప్పుడు మరల సూక్ష్మదేహినై ఈ సృష్టి నుండి బయలుదేరి మరొక భవిష్యత్ సృష్టిలో ప్రవేశించాను. చిదాకాశమున వెలయుచున్న ఆ భవిష్యత్ సృష్టిలో 3వ భిక్షుకుడు ఉండి ఉండటం గమనించాను. బ్రహ్మ నిర్మితమైన ఆ సృష్టిలో కూడా మన ఈ వర్తమాన సృష్టి లాగానే అనేక జగత్తులు ఉన్నాయి.

**శ్రీరాముడు:** మీరు భవిష్యత్తులో ఉండబోయే ఆ సృష్టిలో ఇప్పుడే ఎలా ప్రవేశించగలిగారు? అందులో కూడా ఈ మన సృష్టిలాగానే పదార్థములు మొదలైనవి ఉన్నాయా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** యోగబలంచేతనే నా మనస్సుకు అది సుసాధ్యమయింది. ఆ భవిష్యత్ సృష్టిలో కూడా ఇక్కడ తారసపడే పదార్థములను, ఆకారములను చూశాను. ఇటువంటివే అనేక జగత్తులు ఆ సృష్టిలో కూడా ఉన్నాయి.

ఈ సృష్టిలో ఆ భిక్షుకుడు, బ్రాహ్మణుడు, రాజు మొదలైనవి ఉన్నట్లే ఆ భవిష్యత్ సృష్టిలో కూడా అప్పటి భిక్షుకునకు ఆయా ఉపాధి పరంపరలు కల్పితమై ఉండగలవు.

ఓ రామచంద్రా! ఒక్క విషయం ఇక్కడ ప్రకటించదలచుచున్నాను. ఆ భిక్షుకునికి సంభవించినట్లే నాకు, నీకు, ఈ సభికులకు, తదితర జీవులందరికీ ఇట్టివి, ఇందుకు భిన్నమైనవి అయిన అనేక పూర్వ, తత్పూర్వ... భవిష్యత్, తత్‌భవిష్యత్ వృత్తాంతాలతో కూడిన అనేక కథనాలు జరిగిపోతూనే ఉన్నాయి. ఆ రాబోయే సృష్టిలో ఈ నారదమహర్షి ఇట్లే ఉండబోవుచున్నారు. ఈ సభలోని కొందరి కొందరి జ్ఞాన చరిత్రలు ఇట్లే ఉండబోవుచున్నాయి. ఈ సభలోని కొందరు ఆ రాబోవు సృష్టిలో అత్యున్నత జ్ఞానులై, మరికొందరు అల్పజ్ఞానులై ఉండబోవుచున్నారు.

ఇదంతా కూడా ఈ మాయ ఉన్నంతవరకూ... ఇలా ఒకసారి కాదు... అనేకసార్లు సంభవించ గలదు. ఇట్లు పూర్వం కూడా సంభవించింది. మరల భవిష్యత్‌లో సంభవించబోతోంది. సముద్ర తరంగాలను చూచావు కదా? అవి ఒకసారి విస్తరిస్తున్నాయి. మరొకసారి ఉపశమిస్తున్నాయి. ఒక్కొక్కసారి ఒకే తీరైన తరంగాలు మరల మరల వెలువడుచున్నాయి. ఇంతలోనే మరికొంతసేపు వేరు వేరు ఆకారం గల తరంగాలు ఎక్కడి నుంచో వస్తున్నాయి. అట్లాగే సృష్టి పరంపరలు మాటిమాటికీ విస్తరిస్తున్నాయి. మరల ఉపశమిస్తున్నాయి. కొన్ని సృష్టులు ఒకదానిలో మరొకటి అత్యంత సాదృశం కలిగి ఉంటున్నాయి. కొన్నిటికి అసలు పోలికయే ఉండటం లేదు. ఆహా! ఈ మాయ ఇట్లు విస్తరించి మహాత్ములగు వారిని కూడా మోహమున ముంచెత్తుతోందే!

**శ్రీరాముడు:** ఈ మాయ ఎట్లా కల్పించబడుతోంది? మానసిక చింతన చేతనా? లేక ఇదంతా శారీరక యత్నము చేతనేనని అనవచ్చునా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఇదంతా ప్రతిభాస చేతనే ఉత్పన్నమౌతోంది. శారీరక – మానసిక యత్నములు లేకుండానే మాయ పరిఢవిల్లగలదు. మాయయే ఆ భిక్షుకుని విషయంలో 21 రాత్రులు అనేక యుగ – మన్వంతరముల అనుభవం కల్పించటం జరుగుతోంది. ఆయా సమయములందు ఆయా ఆకారములన్నీ దీర్ఘప్రయాణీకుడగు ఈ జీవునిచే మాయయే అనుభవింపజేస్తోంది. స్వస్వరూపసత్యం కించిత్ ఏమరచటమే మాయయొక్క చమత్కార విన్యాసానికి 'నాంది'.

మనస్సు యొక్క గతి ఎంతటి భయంకరమైనదో... గమనిస్తున్నావా?

అంతటికీ కారణం ప్రతిభాసయేనని మరొకసారి ప్రకటిస్తున్నాను. మనస్సు యొక్క అలజడియే ఈ భూత – వర్తమాన – భవిష్యత్ సృష్టులన్నిటికీ మూలపదార్థం సుమా! కదలుచున్న జలంలో అస్తవ్యస్తంగా బింబం ప్రతిబింబిస్తున్నట్లు, చంచలమగు మనస్సునందు ఆత్మస్వరూపమాత్రమగు ఈ దృశ్యం అస్తవ్యస్తంగా ప్రతిభాసిస్తోంది. ప్రతిభాసఖండములగు ఈ జగత్తులు, అట్టి ప్రతిభాస మాత్రమగు ఈ జగత్తులలోని ఈ జీవులు, వీరి వ్యవహారపరంపరలు – ఇవన్నీ కూడా మాయ యొక్క కార్యములే అయినప్పటికీ వీటికి వ్యవహార సత్త, కార్య–కారణ వైచిత్ర్యము, ఘనీభూతమైన సుఖ–దుఃఖ అనుభవాలు ఏర్పడి ఉంటున్నాయి. ఇదంతా సర్వవ్యాపకము, సర్వాత్మకము, చిదేకరసము

అగు బ్రహ్మమే అయినప్పటికీ మాయా దృష్టి ఉన్నంత వరకు ఇదంతా ఇట్లే ఉంటోంది. ఉండబోతోంది. తత్త్వబోధచే మాయ తొలగిందా... ఇక ఈ సృష్ట్యాదుల భ్రమ దానంతట అదే తొలగగలుదు.

❖❖❖

# 10. బ్రహ్మైక్య ప్రతిపాదన

**దశరథ మహారాజు:** ఓ మహర్షీ! మీరు ఆ భిక్షుకుని గురించి చెప్పిన విశేషాలన్నీ చాలా చమత్కారంగా ఉన్నాయి. నాదొక చిన్న విన్నపం. ఇది సముచితమేనని మీరు అనుకుంటే మీరు ఆ భిక్షుకుడు ఉన్నచోటికి సూక్ష్మశరీరధారులై సమీపించి అతనిని సమాధి నుండి లేపండి. మనం భటులను, మంత్రులను పంపి ఆయనను ఆ కుటీరం నుండి ఇక్కడికి సాదరంగా ఆహ్వానిద్దాం. ఆతని అంతరంగ వాణి ఏమిటో మేము మరింతగా గ్రహించవచ్చునేమోనని నా ఉద్దేశం.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ మహారాజా! ఆ మహాభిక్షుకుని శరీరం ఇప్పుడు ప్రాణరహితమై ఉన్నది. నేడే ఆతడు ఆ భౌతికదేహం త్యజించవలసి ఉండుట దైవనియతి. ఈ విషయం నేనిదివరకే చెప్పాను కదా!

ప్రాణచలనమునకు ఆధారమైన అన్నరసం ఆతని దేహమునందు పూర్తిగా శుష్కించి ఉన్నదని ఆతనిని చూడగానే నేను గమనించాను. ఇప్పుడాతడు జీవితుడుగా లేడు. ఎందుచేతనంటావా? ఆ దేహమును అనుభవించుటకు కావలసియున్న ప్రారబ్ధం ఆతని యందు ఏమాత్రం శేషించి ఉండలేదు. అట్టి ప్రారబ్ధం ఏమాత్రమైనా మిగిలి ఉంటే నేనే ఆతనిని సమీపించినప్పుడు పునరుజ్జీవితుని చేసి ఉండేవాడిని. ఆ శరీరమునందలి జీవుడు జీవన్ముక్తుడై, బ్రహ్మహంస అయి వెలయుచున్నాడు. ఆతడీ దృశ్య ప్రపంచ విశేషమునకు తిరిగివచ్చి, దేహముచే ఈ భౌతికలోకంలో మనబోటి వారితో ప్రవర్తించుటకు సిద్ధపడే సూచనలు కనిపించుటలేదు.

**శ్రీరాముడు:** మహాత్మా! ఆతని పాంచభౌతిక దేహమునకు ఏమి కానున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆ భిక్షుకుడు తన శిష్యులకు వీడ్కోలు పలికేటప్పుడు 'ఒక మాసం వరకు ఈ గది తలుపులు తెరువవద్దు' అని నిర్దేశించి ఉన్నాడు కదా! ఆతని భృత్యులు ఆతని దర్శనము కొరకై బయటయే నిరీక్షిస్తూ ఉన్నారు. ఒకవేళ మీరు మీ భటులను పంపినప్పటికి ఆ శిష్యులు వారిని లోన ప్రవేశించనివ్వరు.

గురు ఆజ్ఞను అనుసరించి నెలరోజులూ గడచిన తరువాత వాళ్ళు ఆ గది తలుపులు తెరుస్తారు. ప్రియాతిప్రియుడగు తమ గురువు ఆ దేహమును త్యజించినట్లు కనుగొంటారు. ఆ భౌతిక దేహమును శుభ్రపరచి నదీజలంలో వదులుతారు. ఆ తరువాత ఆ సమాధిని ఆశ్రయించినచోట ఒక పూజా మందిరం నిర్మించగలరు. పూజ – భక్తి వ్యవహారార్థమై అక్కడ ఆ భిక్షుకుని ప్రతిమను నెలకొల్పుతారు. ఆ ప్రతిమ ఆ భిక్షుకుని భక్తులందరికీ ప్రియదేవతామూర్తిగా, ఉపాస్యదైవంగా ఆరాధించబడనున్నది. దృఢమనఃకల్పితమగు సర్వాత్మ–పరబ్రహ్మము యొక్క సంజ్ఞారూపంగా వారికి–వారివారి శిష్య పరంపరలకు సాక్షాత్కరిస్తూ మార్గదర్శకమై సుదీర్ఘకాలం పూజింపబడగలదు. కాలక్రమేణా అనేకచోట్ల

ఆ ప్రతిమవంటివే అనేకం నిర్మించబడి అనేకమంది సాధకజనులచే జగద్గురుభావంతో ఆరాధించ బడబోతోంది.

ఇట్లు నేను ఆతనిని సమీపించిన క్షణంలో ఆతడు ఆ దేహమునందే ముక్తుడై వెలయుచున్నాడు. ఆతని దేహం వినష్టమైపోయింది. కాబట్టి నాయొక్క పునఃప్రాణస్పందనయత్నం ఆతని పట్ల సఫలం కాలేదు.

❖

ఓ రామచంద్రా!

**ఏషా గుణమయి మాయా దుర్బోధేన, దురత్యయా**
**నిత్యం సత్యావబోధేన సుఖేనైవాతివాహ్యతే ॥**

త్రిగుణమయమగు ఈ మాయ జీవుని జ్ఞానము వలననే తన యొక్క విక్షేపశక్తిచే అనేక భ్రాంతిపరంపరలను విస్తరింపజేస్తోంది.

అయితే... జ్ఞానం వల్ల ఈ సర్వము ఆకృతిని కోల్పోగలదని గ్రహించు. ఈ మాయ అసత్యమే. అయితే ఏం? ఇది ఈ జగత్తులను ప్రదర్శించుచున్నది. ఆభరణంలో బంగారం దృష్టిన పడకుండా – ఆకారం దృష్టిని ఆకర్షిస్తున్నట్లు ఈ మాయ కూడా సత్యవస్తువును అన్యవిధంగా అనిపించేటట్లు చేస్తోంది. "జలమందు తరంగంలాగా పరమాత్మ యందు ఈ సృష్టులు అవాస్తమైనవి మాత్రమే" అని శ్రుతులు చేతులెత్తి ప్రకటిస్తున్నాయి. ఒక్కసారి మొదలంటా ఈ సర్వమును మాయగా వీక్షించావా... సర్వభ్రమలు మరుక్షణం తొలగిపోతాయి.

ఆ పరమాత్మయే స్వయంకల్పితమైన అవివేకం చేత జీవత్వమును పొంది క్రీడగా స్వప్న – స్వప్నాంతరములను , జన్మ జన్మాంతరాలను పొందుచున్నాడు. ఓ రామచంద్రా! నీవు ఈ సర్వమును ఆత్మగానే అవలోకించు. అప్పుడు 'చిన్మాత్రం' మాత్రమే అన్ని వైపులా శేషించగలదు. 'బోధ' యొక్క బలం చేత ఏదైతే సర్వమూ ఆత్మగా తెలియవస్తోందో... అదియే అజ్ఞాన సమయంలో ముళ్ళపొదల వలె 'సంసారమండలం'గా ఉదయించి, ఏర్పడి ఉంటోంది. ఆ భిక్షుకుడు గాంచినవన్నీ మనఃతరంగ మాత్రములు, స్వప్నతుల్యములు మాత్రమే.

సమష్టి జీవుడగు హిణ్యగర్భుని మనోసంకల్పనిర్మాణమగు ఈ సృష్టి స్వప్నతుల్యం మాత్రమే. కాబట్టి వ్యష్టిజీవుడు చూచుచున్నది కూడా స్వప్నమే అయి ఉన్నది. ఇదంతా అశుద్ధచిత్తమున ఉదయించి అట్టి చిత్తదోష బలం చేతనే సత్యమైన దానివలె వెలయుచున్నది. చిత్తశుద్ధిని పొందినప్పుడు మాత్రమే ఇదంతా స్వప్నవిలాసము వలె అసత్యమని, అసత్తుల్యమని బోధపడగలదు. అప్పుడు "ఈ ప్రత్యేక జీవుడే కోటానుకోట్లుగా వెలయు బ్రహ్మాండ రూపుడు కూడా!" అని గ్రహించగలుగుతావు.

ఈ జీవుడు వ్యష్టి–సమష్టిగా, లేక సాధారణ–అసాధారణ ప్రపంచరూపంగా స్ఫురించుచున్నాడు. ఏది ఎట్లా స్ఫురించినా, స్ఫురించకపోయినా... ఆతడు అదంతా తన హృదయమున ఏర్పడే ప్రతిభాసకు అను రూపములగు విషయములే పొందుచున్నాడు.

అనగా ఈ 'జీవుడు' అనబడే ద్రష్ట తననుతానే తన ఆత్మను జగత్తు రూపంగా – దృశ్యం రూపంగా – స్వప్నమునందువలె – దర్శిస్తున్నాడు.

ఆ అనురూపములన్నీ ఒక్కొక్కసారి సుదీర్ఘంగా గాంచుచున్నాడు. అదంతా భ్రమయే కనుక స్వప్నమువలె మిథ్యయే అయున్నది. ఈ జీవుడు 'తత్త్వచ్యుతుడు' అయి చిత్తసత్తను ఆశ్రయించి క్రమక్రమంగా ఈ దేవ, నర, జంతు మొదలైన యోనులలోని ఒకానొకదాని యందు పడి జరామరణ దుఃఖాలను అనుభవిస్తున్నాడు. దేహములను సమాశ్రయిస్తున్న ఆ చైతన్యము చిత్తస్పందనము వల్ల జగత్ స్వప్నములను గాంచుచున్నది. ఆయా స్వప్నాలలో పాతాళ లోకాన్నో, లేక బ్రహ్మ లోకాన్నో కల్పించుకుని ఆయా భోగాదులచే తన్మయం పొందుచూ వెలయుచున్నది.

ఆ బ్రహ్మ చైతన్యమే ప్రాణకల్పనను ఒనర్చుకొని, ఆ ప్రాణవశమున ఉండు స్పందనరూపమును గ్రహించుచున్నది. అందుకు ఫలితంగా 'జీవుడు' అను పేరును బడయుచున్నది. తద్వారా 'నేను దేహమును' అనే భ్రమకు వశమగుచున్నది. ఆ దేహం నుండి పంచేంద్రియాల ద్వారా బయటకు వెడలి విషయాకారాన్ని పొంది విషయజ్ఞాన తదాత్మ్యము పొందుతోంది. ఇక ఏం చెప్పాలి? అనేక సంభ్రమములలో పడి పొరలుచున్నది.

ఏది ఎట్లైతే ఏం? ఈ జీవుని వాస్తవరూపం ప్రత్యగాత్మయే కదా! 'చిత్త ఉపాధి' అనే భ్రాంతి గొనినంత మాత్రం చేత బ్రహ్మం యొక్క స్వభావం మరొకటిగా మారగలదా? మారదు. దర్పణంపై నీటిచుక్కలు పడటంచేత ప్రతిబింబం అస్తవ్యస్తంగా కనబడవచ్చు. అంత మాత్రంచేత నీ ముఖం అస్తవ్యస్తం అవుతుందా? కాదుకదా! బ్రహ్మము ఎల్లప్పుడూ బ్రహ్మముగానే ఉన్నది. బ్రహ్మమునందు గల ఉపాధియోగం చేతనే ఇవన్నీ సంభవిస్తున్నాయి. ఉపాధి ఉండుట చేత గాని, లేక... లేకపోవుట చేత గాని పరమాత్మయందు కలిగే మార్పు చేర్పులేమీ ఉండవు. "బ్రహ్మము మునుపటి యోగ్యత పోగొట్టుకొంటోంది" అను వాక్యం ఏ సమయమునందునూ యుక్తియుక్తం కాదు. వేలకొలది అధ్యాసలు ఉండవచ్చు గాక! అధిష్ఠానం స్వస్వరూపాన్ని విడువదు. విడువజాలదు. ఎన్ని భావోద్రేకాలు ఏర్పడినా ఒకడు తన 'నేను'ను విడచి ఉండకపోవటమే అందుకు తార్కాణం. అందుచేత జీవబ్రహ్మైక్యం చేకూరుటకు ఎట్టి ఆటంకము లేదు. ఇదియే పరమపురుషార్థము.

❖

శుద్ధ ఆకాశము ఆకాశముననే వెలయుచున్నది కదా! జలము జలముననే వెలయుచున్నది. 'తరంగములు పొందుచున్నది కాబట్టి జలం జలత్వం నుండి బయల్వెడలింది.' ...అని ఎవరైనా సిద్ధాంతీకరిస్తారా? లేదు కదా! అట్లాగే వ్యావహారిక దృష్టితో చూచినా సరే, ఈ జగత్తు బ్రహ్మముననే వెలయుచున్నదని గ్రహించు. ఇక పరమార్థ దృష్టితో చూస్తే, వేరుగా చెప్పవలసిన పనేమున్నది?

దర్పణం – ప్రతిబింబం – బింబం – ఒకింత వేరువేరని తోచవచ్చునేమో. కానీ, ఈ జీవలోకం బ్రహ్మమునకు వేరుగా ప్రతిష్ఠ కలిగి ఉండలేదు. బాలురు అద్దంలో తమ ప్రతిబింబం చూచి భయం, ఉత్సాహం, ఉద్రేకం, ఆవేదన – పొందునట్లు అభయ బ్రహ్మమున వెలయుచున్న తమను

తామే చూచుకుని ఈ జీవులు భ్రమచెందుచున్నారు. తమ భావోద్రేకములే తదితరమంతా ప్రవేశించి ఇష్టము, అయిష్టము, కోపము, నిర్లిప్తము - మొదలైనవన్నీ అనుభవరూపాలుగా పరిణమింప జేస్తున్నాయని గమనించలేక పోతున్నారు.

❖❖❖

# 11. పరమ నిశ్శంక స్థితి

**శ్రీరాముడు:** అట్టి 'అన్యధా' అను బోధ ఎట్లా ఆత్మయందు ఉత్పత్తి అవుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** (చిరునవ్వు నవ్వుతూ)

> **స్పందే స్పందీకృతేచ ఇహ స్వతః సంజ్ఞా విలీయతే ।**
> **సాప్యలం పరిణామేన లీలయే అగ్నౌ ఘృతం యథా॥**
>
> **చిత్స్పన్ద ఏవ చిత్స్పన్దే సర్వాత్మని విజృమ్భితః ।**
> **స్పన్దాస్పన్దౌ జృంభణాది కల్పితం! నాఽత్ర వాస్తవం ॥**

ఈ ద్వైతభావనకు, ఈ 'అన్యధా' భావనకు కారణం 'బుద్ధి యొక్క స్పందన' మనే చెప్పాలి. సమాధిని అభ్యసించటం ద్వారా ఈ బుద్ధి యొక్క స్పందనను నిలిపివేయటం జరిగితే అప్పుడు మిగిలి ఉండే స్థిరబుద్ధిని 'చరమసాక్షాత్కారం' అని పిలుస్తారు. అగ్నియందు నేయిని వ్రేల్చినట్లు అప్పటి చరమసాక్షాత్కార స్థిరబుద్ధిని కూడా బ్రహ్మమునందు వ్రేల్చితే అది విలీనమై ఆత్మ యొక్క అఖండ - అప్రమేయాది సంపదతో ఈ జీవుడు ప్రకాశించగలడు.

చిత్ స్పందనరూపమగు పరమాత్మయందే చిత్ స్పందనరూపమగు ఈ జగత్తు ప్రకాశించు చున్నది. కానీ, నిజానికి స్పందనము, అస్పందనము, జృంభణము మొదలైనవన్నీ చిదాత్మ పట్ల కల్పిత విషయములే అగుచున్నాయి.

ఓ రామా! ఈ జగదనుభవం వెయ్యి గొడ్డళ్ల వ్రేటులకైనా తెగదేమోనని అనిపించవచ్చు గాక! ఇదంతా కల్పనామాత్రమే కనుక, ఇదంతా కల్పనాత్యాగముచే నశించగలదు. అనగా, ఇప్పుడు 'దాట రానిది'గా అనిపించేదంతా కల్పనలన్నీ నశించినప్పటి దృష్టికి ఇది ఏదీ కాదు.

అందుచేత ఈ జగత్తు ఏదీ కాదు. శుద్ధచిన్మాత్రమగు స్వస్వరూపబ్రహ్మం ఒక్కటే ఒకే రీతిగా వెలయుచుండగా, ఇద్దానిని తత్త్వదృష్టితో పరికించకపోవటం చేత ఇందు "స్పందం, అస్పందం, ఏకం, అనేకం"... మొదలగు భావావేశాలు స్ఫురిస్తున్నాయి. ఇదంతా 'ఏదీ కాని ఒక శిలయందు కల్పించుకున్న ఏవేవో "శిల్ప-శిలా సంబంధ ప్రియాప్రియములు" వంటివి మాత్రమే. అందుచేత ఈ జగత్తు కల్పితం మాత్రమేనని గ్రహించు.

**శ్రీరాముడు:** 1. 'ఈ సర్వము బ్రహ్మమే', 2. 'సర్వమునకు అతీతమైనది బ్రహ్మము'... ఈ రెండు వాక్యములలోని సముచితార్థం విశదపరచమని ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి:**

**సారేణ తు విచారేణ "సర్వ" శబ్దార్థ యోః సమే**
**చిన్మాత్రమేవ జ్ఞాతేఽయం నాస్తీత్యపి నవిద్యతే॥**

'సర్వ' శబ్దము యొక్కయు, దాని అర్థము యొక్కయు ఏకస్వభావం విచారణచే తెలియవస్తుంది. అప్పుడు చిన్మాత్రవస్తువు సర్వదా ఒక్కటేనని నీవే గ్రహిస్తావు. ఆ సమయంలో భావాభావరూపము మాత్రమే అగు ఈ ప్రపంచం నీ యొక్క నిర్మలావగాహనచే లేకుండా పోగలదు. ఓ సర్వసభికులారా! ప్రియ ప్రవచన శ్రోతలారా! నా ఈ మాటలు విశ్వసించండి. ఈ ప్రపంచం ఏనాడు మీ కల్పనలకు వేరుగా లేనే లేదు. అవిచారణ యొక్క విస్తృతి చేతనే ప్రకృతికి చిహ్నమగు ఈ భేదమంతా ఉదయిస్తోంది. ఈ కనబడే భేదములన్నీ విలీనమైనప్పుడు ఆ పరవస్తువు ఒక్కటే మిగులుతోంది. మనం ఈ విషయమై అనేక రీతులలో అనేక కోణాలనుండి చెప్పుకుంటున్నాం. ఇంకా చెప్పుకోబోతున్నాం. ఏది ఏమైనా ఉన్న యథార్థ స్థితి ఇది. దీనిని మరెవ్వరూ మరొక విధంగా ఒనర్చజాలరు. అజ్ఞానం (లేక) అబోధ వలన నానాత్వదర్శనమంతా సంభవిస్తోంది. జ్ఞానం వల్ల నానాత్వదర్శనమంతా తొలగిపోగలదు. అప్పుడీ జీవుడు స్వయంగా పూర్ణచిద్రూపుడై ప్రకాశించుచున్నాడు. ఇదియే పరమార్థము.

అట్టి 'పరమ నిశ్శంక స్థితి' యందు సుస్థిరులై ఉన్న మహనీయులెందరో ఈ సభకు వేంచేసి మన ఈ సంవాదమునకు సాక్షులై దీనిని పరమపావనము, లోకకల్యాణపూరితము చేస్తున్నారు. వారంతా ఇప్పటికే ఆశ్రయించి ఉన్న అట్టి నిశ్శంకస్థితి (సందేహ రాహిత్య స్థితి) మరియు అభయస్థితి యొక్క బలం చేత మాత్రమే బంధమోక్షాల కల్పనలు, జాగ్రత్-స్వప్న-సుషుప్తాది ఆయా సంక్షుబ్ధావస్థలు ఈ జీవులు అధిగమించగలరు. అప్పుడు మాత్రమే ద్వైతభ్రాంతి సంపూర్ణంగా తొలగిపోగలదు.

❖

అజ్ఞానం వల్లే ద్రష్ట, దర్శనం, దృశ్యం - అను త్రిపుటీజ్ఞానంతో కూడిన ఈ జగత్తు అనబడేది ఉపలభ్యమౌతోందని పదే పదే ప్రకటిస్తున్నాను. ఏది అజ్ఞానంచే పొందబడుతోందో... అదంతా అసత్ లేక అసత్యమే సుమా! అట్టి అసత్‌కు నివృత్తి, లేక శమనం ఏమిటి? 'బ్రహ్మం మాత్రమే సత్యం (బ్రహ్మ సత్యం జగన్మిథ్యా)' అనునదే జ్ఞానం! అట్టి శుద్ధాత్మస్వరూపమగు శాంతియే (ఆత్మయే) సర్వే - సర్వత్రా వ్యాపించియున్నది. అది అట్లుండగా ఇక అందులో త్రిపుటికి చోటెక్కడిది?

సంకల్పం వలననే చిత్తం, ప్రాణం మొదలైనవన్నీ స్పందించుచున్నాయి. జ్ఞానోదయం అయినపుడు సర్వ సంకల్పాలు జ్ఞానవస్తువగు స్వస్వరూపమునందు లయించగలవు. సంకల్పాలు తొలగిపోయినప్పుడు స్పందనం అస్పందనమౌతుంది. చైతన్యం సంకల్పాలను వీడిన మరుక్షణం స్పంద-అస్పందాలు అనే భేదభావాలు తొలగిపోతాయి. మేఘాల వెనుక ఉన్న సూర్యుడు సర్వదా స్వయం ప్రకాశకుడే అయియున్నట్లు సంకల్పాలకు ఆవల ఉన్న చిత్ సర్వదా స్వయంప్రకాశకమే! వాస్తవానికి స్వయంజ్యోతి, స్వయం చైతన్య, స్వయమాత్మ - స్వరూపుడగు ఈ జీవుని స్వస్వరూపాన్ని దురవగాహన అనే మేఘాలు ఆవరించి ఉన్నాయి. అట్టి అల్ప-సంకుచిత-పరిమిత భావనా మేఘతరంగాలు అధిగమిస్తేనే చిద్ఘన బ్రహ్మము అనుభూతమవగలదు.

ఓ రాఘవా! నీవు విశాలమగు చిద్ఘనబ్రహ్మపదమును అధిష్ఠించుము. "నేను సర్వదా పూర్ణుడనే" అను భావమునందు వెలయుము. నీవు చేయు సంకల్పాలన్నీ కూడా చిద్ఘనబ్రహ్మంతో ఏకరస స్వరూపము పొందియుండు గాక! 'ఇదివేరు... వారువేరు' అను పృథక్‌భావాన్ని త్యజించి ఉండు. ఓ సర్వజనులారా! 'మోక్షం' అనగా ఎన్నటికో, ఎక్కడో లభించేది కాదని మీరంతా గ్రహించి ఆత్మైక రసమును సంపాదించెదరు గాక! నిర్దోషమగు బోధసారమును గ్రహించెదరుగాక! భావాభావములు తమ యందు లయం చేసి వర్తించు మహనీయులు స్పర్శించు పదార్థములన్నీ అమృతమయం అవుతాయి. సత్యము యొక్క మహిమ అట్టిది సుమా!

భావాభావముల కల్పనకు ఏది కారణమై ఉన్నదో ...అద్దానిని నీవు నీ బుద్ధితో గమనించు. అట్టి కారణాత్మక చైతన్యం నందు సుస్థిరుడవై, ఈ బాహ్య విషయ జగత్తుకు అతీతుడవై చిద్బ్రహ్మం నందు విశ్రాంతి సుఖాన్ని అనుభవించు. పూర్ణాపూర్ణ దశలన్నీ ఏకీకృతమగునది ఏదైతే కలదో ...అదియే నీ స్వస్వరూపం. అంతేగాని, అది ఏదో తొలగిన తరువాత ఎప్పటికో ప్రాప్తించబోయేది కాదు సుమా! అట్టి బాల్యక్రీడలకు తావిచ్చి అజ్ఞుడవు కావద్దు.

❖❖❖

# 12.మౌన ధారణ

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! నీవు చిత్తము యొక్క స్వాభావికమైన ప్రవృత్తులను అనుసరించటం వదిలివేయి. 'సుషుప్తమౌనము' ను ఆశ్రయించుము. కల్పనా మాలిన్యములన్నిటినుండి విడివడుము. ఆ పరమపదం మాత్రమే అనుసరణీయం. ఆ పరమపదం నందు ఏది కలదో ...అదే నీవగుము. అదే నీ సత్య స్వరూపమై ఉండటంచేత అక్కడొక్కచోట మాత్రమే అకృత్రిమమైన శాంతి లభిస్తుంది. మరెక్కడా కాదు. అట్టి ఆత్మైక్యస్వరూపం నుండి చ్యుతిపొందకుండా దేదీప్యమానంగా వెలుగొందు!

**శ్రీరాముడు:** మౌనీశా! వాక్ సంయమ రూపమైనట్టి 'వాక్ మౌనం', ఇంద్రియాల సంయమ రూపమైనట్టి 'ఇంద్రియమౌనం' ఈ దేహాన్ని క్రియారహితం చేసే 'కాష్ఠమౌనం'ల గురించి నేను విని ఉన్నాను. మీరిప్పుడు 'సుషుప్తమౌనం అవధరించు' అని ఆజ్ఞాపించారు కదా! అదేమో దయచేసి వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి:** శాస్త్రకారులు సాధనపరులగు మునులను రెండు తరగతులుగా విభజించి చెప్పుచున్నారు.

**1. కాష్ఠతాపస్యులు :** వీరు బ్రహ్మవస్తువును భావన చేయక కేవలశుష్క క్రియలగు చాంద్రాయనం, ఇంద్రియ హఠం మొదలైనవి నిర్వర్తించేవారు.

**2. జీవన్ముక్తులు :** వీరు యథాభూతమగు బ్రహ్మాన్ని వహించి ఉన్నవారు. తమ స్వస్వరూపమును అఖండమైనదిగా, అప్రమేయమైనదిగా, నిత్యమైనదిగా నిర్మలమైనదిగా, సత్యమైనదిగా సర్వమైనదిగా ధారణ వహించి ఉండేవారు. వీరు ఆత్మను ఆత్మయందు భావనాభ్యాసం చేస్తూ ఉంటారు. వీరు తదితరుల వలెనే (లేక) తదితర తపస్యుల వలెనే బాహ్యమున వ్యవహరిస్తూ ఉండవచ్చు గాక! అభ్యంతరమున మాత్రం నిరతిశయానందమును గ్రోలుచూ తృప్తిని వహించి ఉంటారు.

**శ్రీరాముడు :** 'మహామౌనము' అనగా నేమి? అది ఎవరికి లభ్యపడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి:** శాంతిభావమును పొందిన చిత్తనిశ్చయమునే 'మౌనం' అని అంటారు. మౌన విదులగు శాస్త్రకారులు 'ప్రథమ మౌనం నాలుగు రకాలుగా విభజించి చెప్పుచున్నారు.

**1. వాక్ మౌనము :** వాక్కును నిరోధించటం.

**2. అక్షమౌనము :** బలవంతంగా ఇంద్రియాలను నిగ్రహించి ఉంచటం. ఇదే ఇంద్రియ మౌనం అని కూడా అంటారు.

**3. కాష్ఠ మౌనము :** సర్వదేహ ప్రయత్నాలను విడిచిపెట్టి ఉండటం.

→ ఈ మూడూ 'కాష్ఠ మౌనం' అనే అంటారు. కాష్ఠతపస్వియే వీటిని అవలంబిస్తున్నాడు.

**4. సౌషుప్త మౌనము :** ఇంద్రియ–మనస్సులకు అతీతము వహించి విషయ రాహిత్యస్థితిని అభ్యసించటం. వీరు ఈ భౌతిక జగత్తును తిరస్కరించి ఏకాంతులై గాఢనిద్రతో పోల్చదగిన సమాధిని సాధన చేస్తూ ఉంటారు.

→ ఇది కాష్ఠమౌనంలోని ఉత్తరోత్తర స్తితి. జీవన్ముక్త లక్షణం.

❖

ఇక ఐదవది ఒకటుంది. అది మహామనో మౌనం. మనస్సు సంచలనరహితమగు స్థితి అది. ఇది సామాన్యజనులకు మూర్ఛ, గాఢ నిద్రలందు మాత్రమే ఏర్పడుతుంది. ఇది కాష్ఠ తపస్యులకు సాధ్యకాలంలో ఏకాగ్రత యొక్క తీవ్రతను అనుసరించి కలుగుచున్నది. అందుచేత మనోమౌనమును కాష్ఠమౌనంగానే పరిగణిస్తారు. అయితే, ఒక విధంగా చూస్తే, ఇది నాలుగిటిలోనూ పాల్గొనుచునే ఉన్నది కనుక ఐదవదిగా చెప్పరు.

జీవన్ముక్తులు ఆత్మతత్త్వమును అనుభవించుచున్నప్పుడు ఈ సర్వదృశ్యములలో ఉంటూ కూడా వాటి పట్ల ఒకానొక అతీతస్వభావమున సుస్థిరులై ఉంటారు. అందుచేత వారు మౌనాన్ని 'సుషుప్త మౌనం' అని పిలుస్తారు. కాష్ఠ తపస్వి మూడు విధములైన మనో, ఇంద్రియ, కాష్ఠమౌనాలను సాధనా పరిణామంగా అనుభవిస్తున్నాడు. సుషుప్తమౌన స్థితియందు 'తురీయావస్థ' అంతర్గతమై ఉంది. అయితే అది జీవన్ముక్తస్థితిలో మాత్రమే కాష్ఠమౌనసాధకులకు అనుభవయోగ్యమౌతుంది. అనగా, అభ్యాసబలం చేత కాలక్రమంగా సౌషుప్తమౌనం లేక జీవన్ముక్తస్థితి సాధకునకు లభిస్తోంది.

**శ్రీరాముడు :** మహాత్మా ! మోక్ష సాధకజనులకు వాక్ – అక్ష – కాష్ఠ మౌనముల అభ్యాసం నిర్వర్తించటం తప్పనిసరి అని మీ ఉద్దేశమా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** జ్ఞాన సముపార్జనమే అన్నిటికంటే పరాకాష్ఠ. వాక్ – అక్ష – కాష్ఠ మౌనములు అభ్యాసపరంగా మౌనములే అయినప్పటికీ, అవి అశుద్ధ చిత్తం యొక్క దృఢనిశ్చయాలే అగుచున్నాయని గ్రహించు. అందుచేత అట్టి నిశ్చయములు జీవునకు జ్ఞానము లక్ష్యమయి ఉండకపోతే బంధమునే కలిగిస్తున్నాయి. జ్ఞాన బలం తోడైతే తప్పక ఉపకరిస్తాయి.

కాష్ఠమౌని బలవంతంగా ఇంద్రియములను నిగ్రహించుచున్నాడు కదా! తద్వారా జరుగుచున్న దేమిటి? లోపల అహంభావము యొక్క స్మృతిని వెలుపల ఆ దృశ్యప్రపంచమును, వాఙ్మయ ప్రపంచముల సంపర్కములను త్యజించటానికి శ్రమతో ప్రయత్నిస్తున్నాడు. అతడు నిరోధ ప్రయత్న శీలుడై ఉంటున్నాడు. నిద్రపోవువాడు కూడా ఈ జాగ్రత్ జగత్‌ను తిరస్కరించి మౌన – జడస్థితిని ఆశ్రయించి ఉంటున్నాడు. అది ఈ దేహారోగ్యానికి ఉపయోగిస్తూందేమో గాని, ఈ మాయాజగత్‌ను అధిగమించటానికి ఉపయోగించదు కదా! అట్లాగే కాష్ఠమౌని జ్ఞానదృష్టిని స్వీకరించకపోతే, సర్వేసర్వత్రా అజ్ఞానముతో కూడి ఆవరించియున్న పరిశుద్ధాత్మత్త్వమును దర్శించజాలడని నా అభిప్రాయం. అయితే జ్ఞానముతో కూడిన సాధన జీవుని జీవన్ముక్తునిగా తీర్చిదిద్దగలదు."అందుకు ఇది మాత్రమే మార్గం" అని ఏ ఒక్క సాధన విషయంలో కూడా ఎవరమూ నిర్దేశింపజాలమని గ్రహించు.

❖

జీవన్ముక్తుని ఆత్మదృష్టి అనునిత్యం వికల్పరహితమై ఉంటోంది. అతడు నివురుగప్పిన నిప్పు వలె ఆత్మచైతన్య ప్రకాశభావమును అంతటా గాంచుచునే ఉంటాడు. ఇక నిరోధయత్నమునందు నిమగ్నమైయున్న కాష్ఠమౌని, అట్టియత్నమునందు మనసా – కర్మణా నియమితుడై ఉండటం చేత అతని పూర్ణానుభవమునకు 'ప్రయత్నము' అనే ఒక తెర అడ్డుగా ఉండటం గమనార్హం. వాక్ – ఇంద్రియ – కాష్ఠములకు సంబంధించిన త్రివిధ మౌనములను ఆశ్రయించినవారు సమాధినుండి లేచినప్పుడు, వారి చిత్తము తగినంతగా నిర్మలం అయి ఉండకపోతే... మరల అది చంచలత్వం పొందుతోంది. ఇక తత్త్వజ్ఞుడై సుషుప్తమౌనము ఆశ్రయించినవాని చిత్తము మొదలంట జయించివేయ బడగలదు. చిత్తమే నశిస్తుంది. కనుక ఇక అట్టి వానిపట్ల చంచలత్వము పొసగదు. అనగా 'అంతయూ ఆత్మయే' అను దృష్టిని సుస్థిరపరచుకుంటూ కాష్ఠమౌనమును అభ్యసించేవారు క్రమేపీ కృతకృత్యులై జీవన్ముక్తులై వెలయగలరు.

సుషుప్తమౌనులు జ్ఞానసమన్వితులైనప్పుడు స్వయంగా పూర్ణాత్మయందు వెలయుచున్నారు. అట్టి ఆత్మానుభవస్థితియందు వారు రెండు విధములైన నిర్ణయములు ఆశ్రయించి ఉండటం జరుగుతోంది.

**1. కర్మసన్యాసం:** "వాక్ – ఇంద్రియ – కాష్ఠ (దేహము)లు బంధములే కనుక వీటి పట్ల పరిత్యాజ్య భావముతో ఉంటాను." (లేక)

**2. కర్మయోగం:** "ఈ వాక్–ఇంద్రియ–దేహములు కూడా సచ్చిదానందము యొక్క విలాసములే కదా! అందుచేత అవి వాటి ధర్మములను లోకానుకూలంగా నిర్వర్తించు గాక! కర్మయోగం సమర్పిత భావంతో ప్రవాహపతితమైనదంతా నిర్వర్తిస్తాను."

ఏది ఎట్లైననూ వారికి 'ఈ ఉభయంలో ఇది మంచిది– అది కాదు, వీళ్ళు గొప్ప వాళ్ళు – వాళ్ళు కాదు... ఇటువంటి ఉపాధేయబుద్ధి ఉండదు. అట్టి ఉపాధేయాతీత అనుభవం గల యోగులకు సుషుప్తమౌని, జీవన్ముక్తుడు... మొదలైన పేర్లు శాస్త్రకారులు ఇచ్చారు. అట్టి మౌనం 'నా స్వరూపానికి పునర్జన్మ గాని, ఈ జన్మ గాని లేదు. కనుక నేను సర్వదా జన్మరహితుడను'... అను అవగాహన

పెంపొందించుకొన్న వారికి సులభ సాధ్యమౌతుంది సుమా! 'సుషుప్తమౌనం' జీవన్ముక్తులలో జన్మ – కర్మలచే స్పృశించబడక నిశ్చలమై, స్వభావసిద్ధియై ఉంటుంది.

**శ్రీరాముడు :** 'సుషుప్త మౌనము' అనునది జీవన్ముక్తులకు స్వభావసిద్ధమై అంతర్గతంగా ఉంటుందని సెలవిచ్చారు కదా! అట్టి సుషుప్తమౌనము గురించి మరికొన్ని విశేషాలు వినాలని నా అభిలాష.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆత్మదర్శనం అయితే సుషుప్తమౌనం అత్యంత సహజమై సిద్ధించగలదు. తదితర వాక్–ఇంద్రియ–కాష్ఠ మౌనాల వలె ఇది సిద్ధించటానికి కొత్తగా పడవలసిన కష్టమేమీ ఉండదు."నేను సత్యమును, సర్వుల స్వరూపుడను" అను ఆత్మానుభూతి పొందుచుండగా ఇక సుషుప్తమౌనం కొరకై ప్రాణనిరోధంతో గాని, పూరక – కుంభక–రేచకములతో గాని పని లేదు. అది సిద్ధించిందా... ఇక విషయాలు లభించుటచే హర్షంతో ఉప్పొంగటం గాని, అవి లభించనప్పుడు కృంగటం గాని ఉండదు. ఆ స్థితియందు నానాత్వ కల్పన ఉదయించదు, శాంతించదు. సుషుప్తమౌని ఈ జగత్ విచిత్ర కల్పనల మధ్య ఉండవలసి వచ్చినపుడు కూడా 'అవన్నీ భ్రమలేకదా'... అని గ్రహించియే ఉంటాడు. ఆత్మజ్ఞాన బలం చేత సుషుప్తమౌనం అకృత్రిమం అవుతుంది.

❖

సాధనా బలిమిచే ఉచిత కాలంలో చిత్తం తన యొక్క చిత్తత్వం కోల్పోయి ఆత్మత్వం సంతరించు కుని ఉంటుంది. అనగా చిత్తం చిత్తంగా ఉండక ఆత్మగానే ప్రకాశిస్తూ ఉంటుంది. ఇక అతనికి 'నేను మనస్సును త్యజించాలి. నిరోధించాలి' అనే విభ్రాంతితో అవసరముండదు. అతని మనస్సునందు కర్తృత్వ – భోక్తృత్వాది అభిమానాలు గాని, సత్తు–అసత్తు మొదలైన విభేదాలు గాని ఉండవు. ఆ సుషుప్త మౌనంలో విభాగించునది, విభాగించబడునది – అనేవేవీ స్ఫురించవు. అతని యందు సర్వప్రయత్నాలు విలీనమౌతాయి. ఇచ్చుట గాని, మరెచ్చుటగాని ఆత్మతత్త్వము గాక మరింకేమి కలదో చెప్పు?

"ధ్యానక్రియ ఉన్నప్పటికీ... లేనట్టి త్రిపుటీశూన్యస్థితియే అది" అని విజ్ఞులు ప్రకటిస్తున్నారు. 'నానాత్వభ్రమపూర్ణమగు ఈ జగత్తు ఆత్మతత్త్వముననే వెలయుచున్నది'... అను దృష్టితో కూడిన అభేద – నిస్సందేహ స్థితియే సుషుప్తమౌనం అని అనిపించుకుంటోంది. నానాత్వజ్ఞానమునకు ఆశ్రయమైన ఆ పరమ శివమునందే సర్వము వెలయుచున్నాయను అనుభవం సుషుప్తమౌనికి అత్యంత సులభంగా కరతలామలకమౌతుంది.

ఆ తత్త్వానుభవం సర్వవ్యాపకము అయి ఉండుటచే ఆకాశమువంటిది. కాని అది శూన్యము కాదు కాబట్టి, ఆకాశం కానిది. సకలుర స్వస్వరూపి కాబట్టి మిథ్యకానిది, పరతత్త్వాన్ని గ్రహించుటచే చిత్తము ఎవరికి ప్రశమనము పొందుతుందో అట్టివాడే సుషుప్తమౌన సంజ్ఞకు అర్హత పొందుచున్నాడు. అచ్చుట సర్వవికల్పములు శూన్యమై, బహిర్విషయజ్ఞానాతీతమై సర్వోపశమన జ్ఞానయుక్తమై, సత్–అసత్ అతిరిక్తమై ఉండగల 'ఉత్తమమౌనస్థితియే' అయిఉంటుంది. భావాభావదశలు ఏర్పడుచున్నప్పుడుకూడా అజ్ఞానము ఏర్పడక, ఆత్మానుభవస్థితి నుండి వివర్తమనునది లేకుండా ఉండుటయే సుషుప్తమౌనం అనిపించుకుంటుంది.

చిత్తవృత్తులు ఉపశమిస్తే వాటి వ్యాపారములగు ఈ జగత్ భేద భావాలు కూడా ఉపశమిస్తాయి. ఆ క్షణమే చిత్తము సమత్వం పొందుతుంది. ఇకప్పుడు జగతు, నీవు, నేను, వారు, మనస్సు - వంటి మనో కల్పనలు ఉండవు. "ఈ జగత్తంతటా నేనే వ్యాపించి ఉన్నాను. ఇక "శబ్దార్థమాత్రమంతా నిర్వికారమగు సత్తాసామాన్యమే" అను అవగాహన అతడు సుస్పష్టంగా కలిగి ఉంటాడు. విషయభావముచే పరిమితుడు కాకపోవుటచే అతడు అపరిమితుడై ఉంటాడు. సుషుప్తమౌనమే తక్కిన మౌనములన్నిటియొక్క ఆశయసిద్ధి.

అనంతమగు ఆ సుషుప్తమౌనం ప్రబోధము మాత్రమే. ఆ ప్రబోధమే అవిద్యను లేకుండా చేయు తురీయస్థితి. 'అవిద్యను తొలగించుచున్నాను' అను రూపంలో ఉండే వృత్తులు కూడా అక్కడ లేకుండా పోతాయి కాబట్టి అద్దానిని 'తురీయాతీతస్థితి' అని కూడా అంటున్నారు.

1. సుషుప్తరూపసమాధి, 2. తురీయసమాధి, 3. తురీయాతీతసమాధి ...ఈ మూడు పేర్లతో చెప్పబడుచున్న ఏకైక ఆత్మస్థితి జ్ఞానికి జాగ్రత్‌నందు, స్వప్నమునందు కూడా అనుక్షణికమై అనుభూతం కాగలదు.

నాయనా! రామచంద్రా! నీవు బ్రహ్మభూతుడవైతివి. ఇక ఈ భౌతిక దేహమును ఉపయోగించి సర్వత్రా నైపుణ్యముతో ఇక్కడి వ్యవహారార్థమును అనుసరించుము. నీవు ఇప్పటికే జీవన్ముక్తస్థితి పొంది ఉన్నావు. ఆకాశమువలె అత్యంత నిర్మలుడవు, శాంతి మొదలైన పవిత్రవృత్తులచే అలంకృతుడవు అయున్నావు. తురీయమునందే ఈ దేహస్థితిని పొంది ఉన్నావు. స్థూల సూక్ష్మములను పరిత్యజించి ఆకాశమువలె శూన్యుడు కాగలవానికే అట్టి సుషుప్తమౌనం లేక జీవన్ముక్తి ఏర్పడి ఉంటోంది. నీయందు అట్టి లక్షణములు స్వతఃసిద్ధంగా ఉండనే ఉన్నాయి. కాబట్టి నిస్సంశయుడవై, నిర్వికారుడవై, నిర్విచారముగా ప్రకాశించుము. 'ఓం' అను సంజ్ఞచే చెప్పబడిన శబ్దార్థమును గ్రహించినవాడవై సంసారవాసనాశూన్యుడవై తురీయపదమునే అధిష్ఠించి ఉండుము. లీలామాత్రంగా నీవు నిర్వహించ వలసి వస్తున్నవాటియందు పాల్గొనుము. 'ఈ దృశ్యము ఇట్లున్నదేమిటి?' అనునదంతా కూడా కేవలం అంతరానుభూతమగు స్వప్నమువంటిది. ఈ సత్యమును గ్రహించి చిదాకాశకళ యందు చ్యుతిరహితుడవై వెలయుము.

❖❖❖

# 13. ప్రాణ-మనోసంయోగం

**శ్రీరాముడు:** గురువర్యా! మీరు భిక్షుకోపాఖ్యానం ప్రవచించేటప్పుడు శతరుద్రీయం (100 మంది రుద్రులు) అనుదానిలో నూరవవాడు రుద్రుడు అగుచున్నాడా? లేక గణముల కంటే వేరుగా రుద్రుడు ఒకడు ఉన్నాడా? అనగా రుద్రుడు తదితర జన్మలన్నిటికీ యజమాని, లేక, అధిపతా? లేక అతడు కూడా వంద జన్మలలోని ఒకడా? ఎందుకంటే మీరు ఒకచోట రుద్రుడు - రుద్రగణం అని అన్నారు. మరొకచోట ఆ 'వందమంది రుద్రులు'... అని ప్రయోగించారు.

**శ్రీవసిష్ఠ మహర్షి:** భిక్షుకుడు గాంచిన నూఱు స్వప్నములే నూఱు విధములైన శరీరములు గ్రహించటం జరిగిందని చెప్పుకున్నాం కదా! ఆ స్వప్నశతమూర్తులే... ఈశ్వరుని (ముఖ్యరుద్రుని) పరిచారకులు అని చెప్పునపుడు 'గణములు' అని అనబడినది. ఐశ్వర్య-సామ్యములను పరిగణించినప్పుడు 'శత రుద్రులు' అని చెప్పబడినది.

'శతరుద్రులు' అని చెప్పబడినది - రుద్రుని యందు, రుద్రగణం నందు (లేక) శతరుద్రులందు ఆ భిక్షుకుని చైతన్యమే సమముగా విస్తరించి ఉండటం చేతనే.

**శ్రీరాముడు:** తండ్రీ! ఒక దీపం నుండి అనేక దీపములు వెలిగించినట్లుగా ఆ భిక్షుకుని చిత్తం 100 చిత్తములను కల్పించిందా? ఒకే చిత్తము నుండి అనేక చిత్తములు ఎట్లా కల్పించబడినాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఆ భిక్షుకుడు మాయావరణము లేనివాడు. జ్ఞాని. జ్ఞానైశ్వర్యం కలిగి, మాయావరణం లేనట్టి మహనీయులు ఒకానొక ప్రతిభాసాసంపద కలిగి ఉంటారు. వారు ఏ కల్పన చేయాలనుకుంటారో అట్టిది మాయ యందు ప్రతిబింబితమై, అది తదితర జగత్ కల్పన లాగానే వ్యవహార యోగ్యమై భాసిస్తుంది.

ఎందుచేతనంటావా? వారు జ్ఞానబలం చేత "సర్వాత్మకత్వం, సర్వవ్యాపకత్వం" అవధరించి ఉంటారు కాదా ! అందుచేత ఈ బ్రహ్మానుభవులు - సర్వజ్ఞమగు బుద్ధిచే ఏది భావన చేస్తే అది ఈ తీరుగానే ఏర్పడుచూ ప్రాప్తిస్తూ, పరిఢవిస్తూ ఉంటుంది.

**శ్రీరాముడు:** మహర్షీ! అట్టి జ్ఞానైశ్వర్యము, సత్యసంకల్పము, సర్వాత్మకత్వము అవధరించిన ఆ రుద్రభగవానుడు (కపాలియగు శివుడు) మెడలో కపాలమాలిక ధరించి, ఒళ్ళంతా బూడిద పూసుకుని దిగంబరుడై, శ్మశానవాసి అయి, కాముకుడై ఎందుకు ఉంటున్నాడు. అతడు జ్ఞానైశ్వర్యం కలిగి ఉండి, మాయావరణారహితుడై ఉండి కూడా అట్లు ప్రవర్తిస్తున్నాడేమిటి? మరొక ప్రశ్న. అట్టి జ్ఞానైశ్వర్య పరిపూర్ణులు శాస్త్రాలు వచించే నియమ-నిష్ఠల పట్ల ఎట్టి ఉద్దేశం - ప్రతిస్పందన కలిగి ఉంటారు?

**శ్రీవసిష్ఠ మహర్షి:** సిద్ధిని పొంది, జీవన్ముక్తులై, పరమైశ్వర్యము పొందియున్న మహనీయులు తమ దేహములను శాస్త్రీయ క్రియలందు గాని, భౌతికభోగ ఐశ్వర్యములందు సామాన్యంగా సానుకూల్యత వహించి ఉంటారు. అయితే, వారు "సాంఘికమైన తదితరమైన నియమనిబంధనలకు బద్ధులై ఉంటేనే జ్ఞాన్న సిద్ధిని పొందినట్లు అని వ్యాఖ్యానించటానికికూడా కుదురునది కదా!

వారు వేదవిధులకు దాసులు కారు. శాస్త్రములు అజ్ఞానులను ఉద్ధరించటానికే విధి-విధానాలు ప్రతిపాదిస్తున్నాయి. సుజ్ఞానికి శాస్త్రములు క్రొత్తగా నియమించి చెప్పవలసినదేదీ ఉండదు. అందుచేత అజ్ఞానులకు శుభకరాలుగా తోచే శాస్త్రీయ - లౌకిక కామ్యకర్మాదులు ఆత్మజ్ఞులగు జ్ఞానశీలురకు ఆవశ్యకమని గాని-అనావశ్యకమని గాని అనిపించకపోవచ్చు. ఎందుకంటే వారికి ప్రారబ్ధం యొక్క ఉనికియే ఉండదు. కనుక సామాన్యులకు దుఃఖకరాలుగా తోచే విషయాలు విజ్ఞానులకు అత్యంత సామాన్యమైన విషయాలుగా ఉంటాయి.

క్రియ - నియమము మొదలైనవన్నీ అజ్ఞానుల కొరకే కల్పించబడ్డాయి. ఎందుచేత వారి చిత్తము రాగద్వేషములతో కూడిన వేలాది విషయములతో అనుసంధానమై, ఖండఖండములుగా

ఉండి ఉంటుంది కనుక. అంతేకాదు. ఈ సంసారజీవులలో అనేకులు 'పెద్ద చేప చిన్న చేపను హింసించటం సమంజసమే' అను మత్స్యన్యాయముతో కూడిన కుత్సిత - పాపదృష్టులు కలిగి ఉంటున్నారు. వారికి సమరసమగు ఆత్మ యొక్క సమాచారమే తెలియదు. కనుక క్రియ - నియమాలు, చెయ్యవలసినవి - చెయ్యకూడనివి, సవ్య - అపసవ్యముల నిర్దేశము ఎంతో ఆవశ్యకము.

'ఇవి చేస్తే శుభప్రదం. అవి చేయకుంటే అశుభం. ఇవి చేశారో దుఃఖితులౌతారు' అని ప్రవచిస్తూ సంసారజీవుల ఇష్టానిష్టములను శాస్త్రకారులు నియమం చేస్తున్నారు. అదంతా అత్యంత అవసరం. అయితే, జీవన్ముక్తులగు ప్రాజ్ఞులు ఇష్ట - అయిష్ట విషయములందు చిక్కుకొని ఉండరు. వారు జితేంద్రియులై వాసనాపథమును అతిక్రమించి ఉంటారు. అందుచేత వారు 'ఇది ఇట్లా ఉండాలి... అది అట్లు ఉండకూడదు' అని కోరుకోకుండానే ప్రవాహపతితమై సందర్భమౌతున్న కార్యములను కాకతాళీయ న్యాయమును అనుసరించి ఆచరించుచున్నారు.

**కాకతాలీయవద్రూఢాం క్రియాం కుర్వన్తి తే సదా**
**న కుర్వన్త్యపి వై కించిన్నైషాం క్వచిదపి గ్రహః ॥**

క్రియలు నిర్వర్తించినా, లేక నిర్వర్తించకపోయినా వాటన్నింటి యందు వారికి కించిత్ కూడా ఆసక్తి ఉండదు. బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు కూడా ఇట్లాగే కాకతాళీయ న్యాయమును అనుసరించి మనుష్యాది జన్మలు స్వీకరించి కార్యములను ఆచరించుచున్నారు.

**న నిన్ద్యమస్తి నానిన్ద్యమ్, నోపాదేయమ్, న హేయతా,**
**న చ ఆత్మీయం, న చ పరం, కర్మ జ్ఞవిషయం క్వచిత్ ॥**

జీవన్ముక్తులగు ఆయా సిద్ధ పురుషులకు నింద్య - అనింద్యములు గాని, గ్రాహ్య - త్యాజ్యములు గాని, స్వ - పర భేదములు గాని ఉండవు. వారిని బంధించగలిగిన కర్మ ఈ భూనభోంతరాలలో ఏదీ లేదు. సృష్టి యొక్క ప్రారంభం నుండి అగ్నికి ఉష్ణము, జలమునకు రుచి - ప్రవాహ స్వభావం మొదలైనవి ఏర్పడియే ఉంటున్నట్లు ఆ ఈశ్వరేచ్ఛను అనుసరించి హరి-హరాది క్రియలు, బ్రాహ్మణ -క్షత్రియాది ధర్మములు లోకంలో వెల్లివిరుస్తున్నాయి.

**శ్రీరాముడు:** అయితే మహర్షీ ! అగ్నికి ఉష్ణము స్వభావసిద్ధమే అయినట్లు అజ్ఞానులకు అజ్ఞానం కూడా స్వభావసిద్ధమేనని అనవచ్చునా ? వారి ఆచరణలు కూడా ఈశ్వరేచ్ఛేనని తలచవచ్చునా ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కాదు. ఈ అజ్ఞానం సృష్ట్యాది నుండి అభివ్యక్తమైనది కాదు. ఈ జీవుడు అజ్ఞానవిభాగ సంకేతములను అనుసరించి ఐహిక - పారలౌకిక సుఖ దుఃఖములను కలిగించు స్త్రీ-ధన-జన వ్యవహారములను అన్వయించుకొని అనుసరిస్తున్నాడు. అనగా తన సుఖ దుఃఖములు తానే నిర్వచించుకుంటున్నాడు. అట్టి నిర్వచనముల వెనుక ఉన్న అభ్యాసపూర్వకమైన అజ్ఞానమును తొలగించటానికి ధ్యాన, దాన, పూజాది కార్యక్రమములతో కూడిన విధివిధానములను శాస్త్రములు జనులకు ప్రతిపాదిస్తున్నాయి. సాధనాక్రమము ననుసరించి మనస్సు శుద్ధమగుచుండగా ఈ జీవుడు పవిత్రుడు కాగలడు. ఆత్మత్వమే ఈ జీవుని స్వతః సిద్ధస్వభావంగాని విషయత్వం కాదు. విధ్యుక్తము

– ప్రవాహపతితము అగుచున్నదంతా  ఈశ్వరేచ్ఛ అని, ఆసక్త–అనాసక్త, సుఖ–దుఃఖ, హేయ–ఉపాధేయ భావనలంతా అజ్ఞాన కల్పితములని ఎఱుగువాడు సులభంగా ముక్తుడగుచున్నాడు.

❖❖❖

# 14. విదేహముక్తి - మౌనము

**శ్రీరాముడు :** మహాత్మా ! శరీరియగు జీవుని యందు ప్రసిద్ధమై ఉండే 4 విధాలైన మౌనాల గురించి వివరించి చెప్పారు. అట్లాగే 'విదేహముక్తి – మౌనము" ల గురించి కూడా చెప్పమని అర్థిస్తున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి:** 'విదేహముక్తి' అనునది ఆకాశం కంటే కూడా అత్యంత నిర్మలమైన చిన్మయాత్మాకాశం. "దేహాదులచే గాని, అహంకారాదులచే గాని పరిమితం కాబడనట్టి దృశ్యస్వరూపుడను నేను" … అని స్వస్వరూపావగాహనకు సంబంధించినది అది. అదియే పరమశ్రేయం, పరం, మోక్షం కూడా. అద్దాని గురించి కూడా కొన్ని విషయాలు ప్రస్తావిస్తాను. విను.

విచ్ఛిన్న రహితము – విషయరహితము అగు సమాధి యొక్క అభ్యాసం వలనను, వివేక విచారణలతో కూడిన జ్ఞానయోగముననూ "సంపూర్ణ జ్ఞానము" పొందినవారున్నారు. వారిని 'సాంఖ్య యోగులు' అని శాస్త్రకారులు పిలుస్తున్నారు.

మనం ఇతఃపూర్వం చెప్పుకున్న 'హఠయోగం' అభ్యసిస్తూ, తద్వారా ప్రాణాదులను నిరోధించి క్రమంగా అనామయము, ఆద్యంతరహితము అగు పదమును అధిరోహించేవారు కూడా ఉన్నారు. వారిని "హఠయోగయోగులు' అని పిలుస్తారు. సర్వ కర్మ ఫల సమర్పణ చేయువారు "కర్మయోగులు". ఈ సాంఖ్యయోగులు, యోగయోగులు… ఇద్దరూ కూడా యోగసాధన ద్వారా పొందాలనుకోతగినది శాంతము–అకృత్రిమము అగు పరమపదమే ! కొందరు కేవలం వివేక – విచారణములతో కూడిన 'సాంఖ్యము' ద్వారా మరికొందరు 'సర్వకర్మఫలత్యాగం' అను కర్మయోగము వలన, ఇంకొందరు క్రియాయోగ–ధ్యానాల సమాయంచే ఈ జన్మయందే ఆ పరమపదం పొందుచున్నారు. వారు తమ మనోబుద్ధులను సర్వ నియామకుడగు ఆ పరమేశ్వరునికి సాంగపూర్వకంగా సమర్పించి తాము సర్వరహితత్వము  సంపాదించుకుంటున్నారు.

అయితే సాంఖ్యము – యోగము ఒక్కటే. ఆ రెండిటిలోనూ అంతర్లీనమై అనుస్యూతంగా ఉన్నది 'సర్వత్యాగ బుద్ధియే'… అని ఎవరు గ్రహిస్తారో వారే తత్వాన్ని ఎరిగినవారు ఎందుకంటే సాంఖ్యులు తమ వివేక–విచారణ ద్వారా, యోగులు తమ కర్మఫల సమర్పణ ద్వారా చేరే ఆద్యస్థానం ఒక్కటే. ఎక్కడ ప్రాణము యొక్క వృత్తులు కూడా విషయమే కావో, ఎక్కడ వాసనాజాలం – జన్మకర్మలు అతిక్రమించబడియున్నవో… అట్టి అనుభవైకవేద్య స్థానమే 'పరమపదము' అని గ్రహించు.

❖

నాయనా! వాసనలనే చిత్తము అని అంటాం. అదియే ఈ సంసారమునకు మూల కారణం. ఈ సంసారమునకు వాసనలకు వేరైన మరొక కారణమేదీ లేదు. వాసనలే సంకల్ప పరంపరలను

ఉత్పత్తి చేస్తోంది. సంకల్పాలు ఏదో విధంగా సన్నగిల్లితే వాసనలూ సన్నగిల్లుతాయి. దానితో పాటు ఈ సంసారం సన్నగిల్లుతుంది. అట్టి వాసనలు నే చెప్పిన సాంఖ్యం-యోగం రెండిటిలోనూ విలయం పొందుతాయి. రెండిటిలో గల ప్రయత్నం తత్త్వజ్ఞానానుభవ రూపంగా మార్చబడుచుండగా ఇక ఈ సంసారం తన యొక్క కారణత్వం కోల్పోతుంది.

బాలుడు 'బేతాళం (దయ్యం)' అను దానిని కల్పించుకుని చూస్తూ ఉంటాడు చూచావా? ఈ మనస్సే శరీరాన్ని ఆత్మగా గాంచుచున్నది. ఇట్లా గాంచుటయే సంసారం కనుక సంసారానికి కారణం మనస్సే. ఎప్పుడైతే ఈ మనస్సు ఆత్మజ్ఞానంచే నింపబడి పునీతమౌతుందో... మరుక్షణం దీనికి శరీరమే కనిపించదు. మనస్సు శాంతించిందా, సంసారం స్వభావ సిద్ధంగానే ఉపశమిస్తోంది.

దేహాలు నిర్విషయమై ఉండటమే విదేహముక్తి లక్షణం.

మనస్సు శాంతించాలంటే ఆత్మదర్శనం తప్పితే వేరే ఉపాయం లేదు. నిద్రించే వానికే స్వప్నం. అసత్యమైన స్వప్నంలో "నేను మరణించాను" అను స్వప్న రూపమైన స్వమరణం కలగటం కూడా జరుగునట్లు ఆత్మదర్శనం ఒనర్చనివానికే మనస్సు ఉత్పన్నమౌతోంది. స్వప్నంలో చూచిన స్వమరణం నిదుర లేవగానే ఉండదు కదా ! ఆత్మ దర్శనమైన తరువాత ఆ మనస్సుకు ఏమౌతుందో ఏమీ చెప్పలేం సంసారదృష్టిని కలుగజేస్తున్న మనస్సు జ్ఞానంచే చంచలరహితం అగుచుండగా అప్పుడు మాత్రమే నేను చేస్తున్న ఈ ఆత్మబోధ హృదయంలో ప్రవేశించగలుగుతుంది అప్పుడిక బంధ-మోక్షముల ఛాయలన్నీ వాటంతట అవే తొలగిపోతాయి.

**సాధనాత్రయం -**

1. దృఢమగు ఏకత్వము యొక్క అభ్యాసం. (భిన్నత్వంలో ఏకత్వం సందర్శించటం.)
2. ప్రాణనిరోధం (రేచక-కుంభక-పూరకములవంటి ప్రాణయోగోపాసనలను అభ్యసించటం)
3. మనోనిగ్రహం (ఇంద్రియ విషయాలను మననం చేయక, వాటికి అతీతత్వం వహించటం అభ్యసించటం)

...ఈ మూడిటినీ మోక్ష కారణమగు ' సాధనాత్రయం' అని అంటూ ఉంటారు. ఇదియే సర్వ శాస్త్రముల తాత్పర్యం.

❖

**శ్రీరాముడు :** మునీంద్రా! మధ్యమాధికారి అనుసరిస్తూ ఉండే ప్రాణవిలయం మోక్షమునకు కారణం అగుచున్నదని అంటున్నారు కదా ! మరణ సమయంలో కూడా ఈ జీవుని విషయంలో ప్రాణాలు నిరోధించబడుచున్నాయి. మరి, అందుచేత మృతి అనునది కూడా మోక్షార్హత కలిగించగలదని అనవచ్చునా?

**శ్రీవసిష్ఠ మహర్షి:** 1. ప్రాణ నిరోధము, 2. సాంఖ్యము, 3. కర్మయోగము... ఈ మూడు ఉపాయాలు పరిలక్షితమైనది మనోనిరోధం వైపునకే. మనో నిరోధమే శ్రేష్ఠాతిశ్రేష్ఠం. అది ఏ ఉపాయం చేతనైనా సరే... ఎంత త్వరితంగా లభిస్తే అంతమంచిది.

ఇక మరణం విషయానికి వద్దాం. ఒకడు మరణించినంత మాత్రం చేత అతని మనః ప్రాణములు ఆతనిని విడచివేయవు.

దృష్టాంతానికి ఒకడు మూర్ఛిల్లినాడనుకో, లేక గాఢంగా నిద్రిస్తున్నాడనుకో. అంతమాత్రం చేత ఆతని కోరికలు, ఆశలు, శంకలు, వృత్తులు నశించుచున్నాయా?... లేదు. అవి నీటియందు కరిగిన ఉప్పు వలె వాసనా రూపమున వెలయుచున్నాయి. అట్లాగే ఒకడి ఈ భౌతిక శరీరం మరణించినంత మాత్రంచేత మనోలయం గాని, వాసనావిలయం గాని జరుగుటలేదు. ఆ దేహి మరల మరొక దేహంతో ప్రత్యక్షమైన (లేక) ఆవిర్భవించిన మరుక్షణం ఆ వాసనలు మరల ప్రకోపిస్తున్నాయి. మరణకాలంలో ప్రాణాలు ఈ భౌతిక దేహాన్ని త్యజిస్తున్నాయి. ఇంతలోనే వాసన – కామ్య కర్మలచే ఉపస్థాపితమైన భవిష్యత్ దేహాకారమును అనుభూత మొనర్చుకొనుచున్నాయి. బాహ్యాకాశంలో తదనుకూలమైన తన్మాత్ర సమన్వితమైన అనుభూతులను ఆశ్రయించి అనుభవమును కొనసాగిస్తున్నాయి

ఈ భూతతన్మాత్రలు వాసనాత్మకములే గాని మరింకేమీ కాదని గ్రహించు. ఈ వాసనలు తదనుకూలమైన మనోప్రాణములనే ఆశ్రయించుకొని ఉంటాయి. తదితరమైన మనోప్రాణాలను ఈ భూతతన్మాత్రలు తాకజాలవు. ఈ విషయములు వేదములచే చెప్పబడి ఉండటమే కాదు... యుక్తి చేత కూడా గ్రహించవచ్చు. ఈ జీవుని విషయంలో ప్రాణములు భవిష్యత్ దేహవాసనలతో కూడియే పూర్వదేహమును పరిత్యజించుచున్నాయి. అందుచేత తరువాతి దేహముకూడా వాసనల వలననే ఉత్పన్నమగుచున్నది. 'వాసనలు' అనగా సంకల్ప పరంపరల ఉత్పత్తి స్థానమే కదా!

పుష్పములలోని సుగంధమే నువ్వులలో ప్రవేశిస్తోంది. ఆ నువ్వులు గానుగయందు నలుపబడుట అను క్లేశము ననుభవించి నూనెగా పరిణమిస్తోంది. అట్లాగే శరీరమునందున్న హృదయాకాశము తోడను, తదంతర్గతమగు ప్రసరణ స్వభావం గల వాయువుల తోడను కలసి ఈ మనస్సు క్లేశములు పొందుచున్నది. అందుచేత 'మృతి చెందిన వెంటనే ప్రాణములు నిరోధం పొందుతాయి'... అని నీవు అన్నది యుక్తియుక్తం కాదు. జలముతో నిండిన ఒక కుండను తటాకంలో ముంచినంత మాత్రంచేత ఆ కుండలో జలం నశించిందని అనటానికి వీలు లేదు కదా! వాసనాసమన్వితమైన ఈ మనస్సు కూడా అదృశ్యమైపోయేది కాదు. మరణమాత్రం చేత మనస్సు నశించదు. ప్రాణములు నశించవు. ప్రాణములు వర్తమాన భౌతిక దేహమును మాత్రం త్యజిస్తున్నాయి. కిరణరహితుడైన సూర్యుడు ఉండజాలడు కదా! అట్లాగే మనోరహితమైన ప్రాణాలు ఉండజాలవు. అంతేకాదు. తిత్తిరిపక్షి నోట కరచిన గడ్డిపరకను ఉచితాహారం కనబడేవరకు పట్టుకునే ఉంటుంది. మనస్సునందు జ్ఞానోదయం అయిందా, ఇక ఆ మనస్సు వాసనాశూన్యమై తనకు కారణమైయున్న స్వస్వరూపమునందు విలయం పొందుచున్నది. అప్పుడిక మనస్సు, ప్రాణం స్పందనాభావం పొందకుండా ఉంటాయి. అట్లు మనస్సు స్పందనాభావం మానివేస్తే ఇక మిగిలేదేమిటి? కేవలం అఖండశాంతియే. కాబట్టి రామా! జ్ఞానం యొక్క శక్తి వలననే నీ దృష్టిలో ఈ పదార్థముల యొక్క అస్థిత్వం తొలగిపోవుచున్నది. అప్పుడు ప్రాణం – చిత్తం కూడా ప్రశాంతిస్తున్నాయి. ప్రశాంతి పొందిన మనస్సు దేహభావాన్ని ధరింపదు.

❖

ఏ వాసనలైతే నాశనం కాగా, పరమపదము లభిస్తుందో ...అట్టి వాసనలనే మనం 'మనస్సు' అని వర్తమానంలో అంటున్నాం. వాసనలే చిత్తము కూడా. అవి లేకుండుటే పరమపదము. జ్ఞానం ఉదయిస్తే అప్పుడు అది వాసనతో కూడిన అన్నిటినీ తిరస్కరించి వేస్తుంది. ఆ జ్ఞానమే ఆత్మతత్త్వముగా పరిణతి పొందుతోంది. ఆత్మతత్త్వము విక్షేపరహిత అనుభవ స్వరూపంగా వెలయుచున్నది. ఈ విషయమునే అనుభవిష్టులగువారు వేద – ఉపనిషత్‌ల రూపమున, మరెన్నో శాస్త్ర సిద్ధాంతముల రూపమున స్వస్వరూపాత్మజ్ఞానమును లోకమునకు చాటుచున్నారు.

త్రాడును చూచి 'పాము' అని భ్రమించువాడు 'అది త్రాడే' అని తెలియగానే సర్వవికారములు త్యజించివేస్తాడు కదా! ఈ దృశ్య జగత్‌పట్ల ఈ జీవునకు ఏర్పడి ఉంటున్న ఆశ – ఆవేశరూపములైన సంసారము వివేకము చేతనే స్వయంగా నశించగలదు. 1.ఏకత్వాభ్యాసము 2.ప్రాణ నిరోధము 3.మనోలయములలో... ఏ ఒక్కటి సిద్ధించినా సరే, తక్కినవన్నీ స్వాభావికంగానే సిద్ధించగలవు. విసనకఱ్ఱ వీచటం ఆగిపోతే, అట్టి వీచుట వలన కలిగే వస్తువుల కదలికలు కూడా ఆగిపోతాయి కదా! ప్రాణవాయుస్పందన నిర్వృత్తం కాగా మనస్సుచే పొందబడే విషయాలు కూడా సశాంతిస్తాయి.

'మృత్యువు' విషయమై మనం కొన్ని విషయాలు ఇక్కడ మననం చేసుకుందాం. ఈ దేహి దేహమును వహించటం మనందరి పట్లా చూస్తున్నాం కదా! అన్నపానాదులచే ప్రవృద్ధమగుచున్న ఈ దేహం వ్యాధుల ప్రబలత్వం చేతనో, వార్ధక్యం చేతనో, యుద్ధము నందు ఖండింపబడటంచేతనో, ఏవైనా ఆకస్మిక సంఘటనల వలననో ఒక రోజున నిరుపయోగ స్థితి పొందుతోంది. శరీరం పతనం కాగానే ఇంతకాలం ఈ శరీరమును ఉత్తేజపరుస్తూ కార్యోన్ముఖం చేస్తున్న ప్రాణవాయువులు ఈ శరీరమును విడచి బాహ్యాకాశమునందలి వాయువుతో లీనమగుచున్నాయి. మనస్సు ప్రాణములను అనుసరిస్తున్నది. నేలకూలి నిరుపయోగమై ఉన్న ఆ జీవుని భౌతిక దేహాన్ని బంధువులు త్యజిస్తున్నారు. ఆతని బంధువులకు తదితరులకు ఆతడు జ్ఞాపకమాత్రుడు అగుచున్నాడు.

ఇక, ఆ మరణించిన జీవుని విషయానికి వద్దాం. ఆతని ఒక విభాగమగు పాంచభౌతిక దేహం నేలకూలింది కదా! ఇంకా ఆతనికి రెండు దేహాలు ఉన్నాయి.

1. మానసిక దేహం (సూక్ష్మదేహం, ఆతివాహికదేహం); 2. చిత్ దేహం (కారణదేహం)

ఈ భౌతికదేహం త్యజించిన ఆ జీవుడు అప్పుడే, అచ్చటే తన వాసనలను అనుసరించి స్వకీయ కల్పనారూపమైన సమస్త ప్రపంచాన్ని గాంచుచున్నాడు. ప్రతిజీవుని యొక్క వర్తమాన దృశ్య ప్రపంచ దర్శనం కూడా అటువంటిదే!

**మొదటి ఉపాయం : ప్రాణ, మనోనిశ్చలాభ్యాసం -** ఇక ప్రాణవాయువుల విషయమంటావా? ఈ జీవులందరి ప్రాణవాయువులు కర్మల చేత శరీరములను విడిచి, మరల కర్మల చేతనే ఆకాశమున ఉద్భవిస్తున్నాయి. ఈ విధంగా జీవులకు ప్రాణవాయువులతో సంయోగ – వియోగములు నిరంతరం ఏర్పడుచున్నాయి. ఈ జీవులు వాసనామయాలై శరీరం ఉన్నప్పుడు – శరీరం లేనప్పుడు కూడా వాసనామయమగు సుర–నర–పశ్వాది దేహాలను గాంచుచున్నారు. ఈ జీవుడు అతను ఆశ్రయించే ఉపాధిని అనుసరించే ఆచార – వ్యవహారములు పరిరక్షించుకొనుచున్నాడు.

గాలివీచటం ఆగిపోయినప్పుడు పుష్పములందు గల సుగంధం కట్టుబడిపోతుంది కదా! అట్లాగే మనస్సు యొక్క స్పందనము శాంతిస్తే ప్రాణవాయువుల చలనము కూడా కట్టుబడిపోతుంది.

❖

ఈ జీవుని ప్రాణం – చిత్తం ...ఇవి వేరుగా ఉండజాలవు. నువ్వులు – నూనె, పుష్పములు – సువాసన, ప్రాణము – మనస్సు ...ఇవి కలిసియే ఉంటాయి కదా!

మనస్సు యొక్క స్పందనయే ప్రాణము... ప్రాణము యొక్క స్పందనయే మనస్సు.

ఇవి రెండూ రథికుడు – సారథివలె కలిసియే విహరిస్తున్నాయి. అగ్నికి ఉష్ణమునకు పరస్పరం ఆధార – ఆధేయ సంబంధం ఉంటోంది కదా! అట్లాగే, మనస్సు – ప్రాణములు ఒకదానిపై మరొకటి ఆధారపడి ప్రదర్శితమగుచున్నాయి. అవి పరస్పరం లయం పొందినప్పుడు మోక్షము అను ఉత్తమ కార్యమును (నిశ్చలస్థితిని – స్థానమును) సంపాదించుకుంటున్నాయి.

**ఏకతత్త్వ ఘనాభ్యాసాచ్చానం శామ్యత్యలం మనః**
**తల్లీనత్వాత్ స్వభావస్య, తేన ప్రాణోఽపి శామ్యతి ॥**

మనస్సు పూర్ణంగా శమించటం అనేది ఏకత్వం యొక్క దృఢాభ్యాసం వల్ల సుసాధ్యపడుతుంది. అప్పుడు మనస్సు యొక్క అంతర్గతమైన ప్రాణాలు కూడా మనస్సుతో పాటే శమించుచున్నాయి. అంతేగాని శరీరం నిరుపయోగమైనంత మాత్రంచేత (దేహం మరణించినంత మాత్రంచేత) ప్రాణాలు శమించటం లేదని గుర్తు చేస్తున్నాను.

**విచార్యయత్ అనన్తాత్మతత్త్వం, తన్మయతాం నయ**
**మనస్తత స్తల్లయేన తదేవ భవతి స్థిరమ్ ॥**

ఓ రామచంద్రా! నీవు తత్త్వ విచారణను ఆశ్రయించు. అనంతమగు ఆత్మతత్త్వమునందు నీ మనస్సు తన్మయమయేట్లు చేయి. ఆత్మతత్త్వమునందు లయమొందిన మనస్సు ఆత్మయే అవుతుంది. అప్పుడది తన చంచలత్వం త్యజించి అకృత్రిమమైన స్థిరత్వం పొందుతుంది. అప్పుడు ప్రాణాలతో బంధం సంశాంతిస్తుంది. లేదా...

**యదేవాతితరాం శ్రేయో, అనుపలమ్భో, ఉపలమ్భయోః,**
**ద్వయోరప్యసతోస్తత్ర శేషేవాపి స్థిరోభవ ॥**

**రెండవ ఉపాయము -** ఉపలంభము (perception) అనుపలంభము (Non-perception) అను రెండింటి పట్లా కూడా ఏది నిర్వికారమై సర్వ విషయాతీతమై ఉన్నదో, అట్టి శ్రేయోదాయకమునందు ప్రాణమనస్సులను ధారణమొనర్చి నీవు స్థిరుడవు కమ్ము. ఈ విధంగా తత్త్వభావనావృత్తి కూడా చరమ సాక్షాత్కారము వలన వినష్టమై ఆభావత్వము పొందనంత వరకు నీవు నీ అభ్యాసమును కొనసాగిస్తూనే ఉండు. “నాతో సహా ఈ సర్వము ఆత్మ యొక్క సంప్రదర్శనమే! విన్యాసమే!”... అనునదే తత్వభావనావృత్తి.

ఆహారం లేకపోతే ఈ శరీరం క్షీణిస్తూ ఉంటుంది కదా! అట్లాగే విషయములకు సంబంధించిన సంచయము సన్నగిల్లుతూ ఉంటే మనస్సు సన్నగిల్లుతూ ఉంటుంది. అట్టి మనోరాహిత్యం అత్యంత

శుభప్రదం. ప్రత్యాహారపరాయణులు క్రమక్రమంగా నిర్వికల్ప సమాధియందు తమ మనః ప్రాణాలను విలయం చేస్తున్నారు. అప్పుడిక పరమవస్తువు ఒక్కటే శేషిస్తుంది. ధారణాదుల వలన మనస్సు ఏకాగ్రమగుచుండగా ఇక అది బాహ్యవికారములను వీడి ధ్యానలక్ష్యమగు ఏకత్వం సంతరించుకో గలదు. అభ్యాసవశం చేత సర్వత్రా సమదర్శనం సుసాధ్యమేనని నేను అందరికీ మనవి చేస్తున్నాను. అందుచేత ఏకత్వము అను లక్ష్యశుద్ధితో సాధన కొనసాగించవలసినదిగా సాధకులకు నా విన్నపం.

ఓ రామా! అవిద్య యొక్క రూపమే ద్వైతం. అవిద్య అనునది లేని వస్తువై ఉన్నది. నీ స్వరూపమే అగు పరతత్త్వం ఆత్మజ్ఞానం వలననే సంప్రాప్తిస్తోంది. కనుక శాస్త్రీయ యుక్తియుక్తములను గ్రహించిన బుద్ధితో ధారణ – ధ్యానాల ద్వారా జ్ఞానాన్ని జనులు అభ్యసించెదరు గాక! శరత్కాల మేఘం తొలగగానే, ఆ మేఘం నుండి కురుస్తున్న మంచు కూడా తొలగిపోతుంది కదా! సూర్యప్రకాశం అధికమగుచుండగా 'చలి' క్రమంగా దానంతట అదే తొలగుచున్నది. మనస్సు శాంతిస్తూ ఉంటే అద్దాని 'వికార మృగతృష్ణ' యగు ఈ సంసారచపలత్వం దానంతట అదే ఉపశమిస్తుంది.

చిత్తమే అవిద్య అని అనుకున్నాం కదా! ...అందుచేత నీవు తత్త్వ విచారణను ఎల్లప్పుడూ ఆశ్రయించు. మనస్సును బ్రహ్మాంకితం చేయి. పరిణతి పొందిన మనోవిభాగం మాత్రమే చంచల విభాగమైన మనస్సును నిరోధించగలుగుతుంది. మనస్సు కొద్ది క్షణములైనా పరమపదము నందు విశ్రాంతి పొందుతూ ఉండటం అభ్యసిస్తూ ఉంటే, క్రమంగా బ్రహ్మాకార నిరతి తప్పక లభించగలదు. నిరతిశయమగు ఆనందరసాస్వాదనం పొందుచున్న మనస్సు విషయములను ఇచ్ఛగించమన్నా ఇచ్ఛగించదు. నీవు సాంఖ్యం ఆశ్రయిస్తావా? లేక, యోగం ఆశ్రయిస్తావా? కాక, ఆ రెండూ ఆశ్రయిస్తావా? అది నీ ఇష్టం. మొత్తం మీద మనస్సు బ్రహ్మాకారం పొందాలనే పరిలక్ష్యమును కలిగి ఉండు. అద్దానిని ఏమరవకు. మంచినీటి సరస్సులో స్నానం చేసి వచ్చేవాడు దోవలో కనబడే మురికిగుంటను చూచి ఆకర్షితుడౌతాడా? బ్రహ్మాభ్యాసం చేసేవానికి ఇక మనస్సు ఆత్మతత్త్వమే పొందుతుంది కాని విషయత్వం కాదు.

ఏ చిత్తంలో అవిద్య తొలగుతుందో, దానినే జ్ఞానులు సత్త్వము అని పిలుస్తున్నారు. ఆ సత్త్వం సంసారబీజాన్ని దగ్ధం చేసి, ఇక ఆ బీజం యొక్క పునరుత్పాదన స్వభావాన్ని వినష్టం చేసివేయగలదు. అట్టి సత్త్వం ఉదయించిందా, ...ఇక బ్రహ్మాభావం నుండి చ్యుతి ఉండదు. ఆతనిలో అవిద్య, వాసనా బీజం స్వయంగా విచ్ఛిన్నములగుచున్నాయి. అట్టిది అజ్ఞులకు అసంభవమేమో అని అనిపిస్తోంది. కాని సాధన – ప్రయత్నం ఉన్నవారికి మార్గం – లక్ష్యం సులభసాధ్యమేనని ప్రకటిస్తున్నాను. నేను చెప్పిన త్రివిధ ఉపాయాలు ఆశ్రయించుటచే పొందబడు జీవన్ముక్తి స్థితియందు జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు అనబడే మూడు అవస్థలు, భ్రాంతి, ఆ భ్రాంతి యొక్క బీజాలు, మనస్సు కూడా లయించగలవు. అప్పుడు దగ్ధమైన వస్త్రంలాగా సత్త్వము మాత్రమే మిగులుతుంది. ఇక అద్దానియందు సంసారకారణములైన రాగద్వేషములు ఏర్పడజాలవు. అట్టి సత్త్వమాత్రశేష్యమే విదేహముక్తి.

❖❖❖

# VII.బేతాళ ప్రశ్నలు

## 1. ఆరు ప్రశ్నలు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! తత్త్వ విచారణచే జ్ఞానసముపార్జన అత్యంతావశ్యకం. జ్ఞానోత్పత్తి అయిన తరువాత 'ఇది జీవుడు – ఇది చిత్తము' అను కల్పనలు ఇక మిగలవు.

విచారణ చేయటమే అవిద్యోపశమనమునకు ఉపాయం. ఎందుకంటే అవిద్యకు మూలం అవిచారణయే కదా! అందుచేత ముముక్షువు జ్ఞానోదయ పర్యంతమూ విచారణ చేస్తూనే ఉండాలి. జ్ఞానోదయమునే 'మోక్షము' అనికూడా అంటున్నాం.

'మనస్సు – అహంకారము' మొదలైనవాటికి ఎండమావులలోని జలంలాగా అసలు ఉనికియే లేదు. అవి ఉన్నట్లు అనిపించటమంతా భ్రమచేతనే సుమా! కొంచెం విచారణకు ఉపక్రమించటం జరిగినా సరే ...అవి లయం పొందుతాయే! ఇక తాత్సారం ఎందుకు? వేదన చెందవలసిన పనేముంది?

ఈ 'సంసారస్వప్న విభ్రమము' గురించి ఒక సందర్భంలో ఒక బేతాళుడు కొన్ని ప్రశ్నలు ప్రతిపాదించటం జరిగింది. ప్రసంగవశంగా అవిప్పుడు నాకు గుర్తుకు వస్తున్నాయి. శుభకరములగు ఆ ప్రశ్నలేమిటో ...విను.

❖

వింధ్య పర్వత ప్రాంతంలో అనేక జనపదాలు, మహారణ్యాలు కూడా ఉన్నాయి. ఆ ప్రాంతంలో గల ఒకానొక దట్టమైన అడవిలో భీకరమైన శరీరం గల ఒక బేతాళుడు ఉండేవాడు. ఆతనికి జ్ఞానులంటే మహాయిష్టం, అజ్ఞానులంటే మహాతిరస్కార భావం ఉండేది. ఒకసారి 'అజ్ఞానులను' మాత్రమే నేను భక్షిస్తాను... అనే నిర్ణయం తీసుకున్నాడు.

అతడు ఒక కిరాతరాజ్యం ప్రవేశించాడు. మంత్రతంత్రాలపై అత్యంత ప్రవేశము, అభిరుచిగల ఆ కిరాతరాజ్యపు ప్రజలు ఆతనికి బలులు ఇచ్చి సంతోషపెట్టేవారు. ఆతడు కిరాతరాజ్యంలో అడవిలో గల ఒక మఱ్ఱిచెట్టును నివాసంగా ఏర్పరచుకొని తనకు ఇవ్వబడే బలులను స్వీకరిస్తూ అక్కడి ప్రజలకు రోగవిముక్తి మొదలైన సుఖములను ప్రసాదిస్తూ ఉండేవాడు. తాను మాత్రం జ్ఞానబలంతో నిత్యతృప్తుడై నిశ్చలమగు సమాధియందు కాలం గడుపుతూ ఉండేవాడు.

❖

ఆతడు ఆకలైనప్పుడు ఆ బాటలో వచ్చే బాటసారులను చంపి స్వాహా చేసేవాడు. అయితే, తాను జ్ఞాని అయి ఉండడంచేత, ఆకలిగా ఉన్నాసరే ...నిష్కారణంగా సుజనులను చంపేవాడు కాదు. దుష్ట – దుర్మార్గ – దురాచారులను మాత్రమే ఆహారంగా తీసుకునేవాడు. క్రమంగా బేతాళుని

విషయం తెలిసిన అక్కడి ప్రజలు సత్ప్రవర్తనులై భక్తి -జ్ఞానములు పెంపొందించుకున్నారు. అందుచేత ఆతనికి అక్కడ భక్షించుటకు తగినవారే దొరుకుట లేదు. ఆకలిచే ప్రేరితుడై ఆహారమగుటకు అర్హులగు వారికోసం వెతుకుతూ కిరాతరాజ్యానికి దగ్గరలో ఉండే ఒక నగరంలో ప్రవేశించాడు. అర్థరాత్రి అయింది. అక్కడి రాజు నగరపరిసర ప్రాంతంలోగల దొంగలను, దుష్టులను, దారిదోపిడీ చేసేవారిని పట్టుకోవటానికి బయలుదేరి యాదృచ్ఛికంగా బేతాళునకు ఎదురుపడ్డాడు. అప్పుడు ఆ రాజును చూచిన బేతాళుడు 'ఆహా! ఈ రోజు నా పంట పండింది. మంచి కండపుష్టి గల ఈ మనుజుడెవ్వడో ఇటువైపే వస్తున్నాడు. ఈ రోజు ఈతడే నాకు ఆహారం' అని అనుకున్నాడు. రాజు వస్తున్న మార్గంలో ఎదురుపడి తన భయంకరరూపం ప్రదర్శించాడు.

❖

**బేతాళుడు :** ఓయీ! బాటసారీ! నేనెవరో తెలుసా! దిక్కులు పిక్కటిల్లచేసే శక్తిగల బేతాళుడను. ఈ రోజు నీవు నాకు ఆహారమవటానికే ఇటు వచ్చావు. ఇక తప్పించుకోలేవు. నాకు భోజనం కమ్ము.

**రాజు :** ఏం బేతాళా! బాగానే ఉన్నది గాని, మరి నెనెవ్వరో తెలుసా? ఈ దేశపు రాజును. న్యాయ పూర్వకమగు 'క్రూరమృగ వధ' - అనే నా విధ్యుక్తధర్మమును నిర్వర్తించటానికి ఈ నిర్జన ప్రదేశానికి వచ్చాను. నేను నీకు ఎటువంటి ఇబ్బందీ కలిగించ లేదే! అన్యాయంగా నన్ను బలవంతంగా భక్షించటానికి ప్రయత్నించావా? ...ఈ ఆయుధాలతో నీ తల వేయివ్రక్కలు చేసివేయగలను.

**బేతాళుడు :** ఓ రాజా! నేనెవరినీ అన్యాయంగా భక్షించనను వ్రతం గలవాడిని. అయితే నిన్ను భక్షించటం న్యాయమో, అన్యాయమో తెలియాలి కదా?

మరొక విషయం. నీవు ఈ దేశపు రాజువు కదా! ధర్మశాస్త్రానుసారం నీ రాజ్యంలో ప్రవేశించి ఉన్న నాకు ఆకలి దప్పికలు తీర్చటం నీ కర్తవ్యమే! నీవు వధించటానికి అర్హుడవైతే మాత్రం నిన్ను ఈ రోజు వదలిపెట్టేది లేదు. వ్యర్థంగా విజ్ఞులను వధించటం నా ప్రవృత్తియే కాదు. అజ్ఞులను వదలిపెట్టే ప్రసక్తీ లేదు.

ఇప్పుడు నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. నీవు సమాధానం చెప్పు. నీ సమాధానమును బట్టి నీ యొక్క జ్ఞానాజ్ఞానాలు గ్రహించి, నీవు నాకు ఆహారమవకుండటానికి తగినవాడవో, కాదో నేను నిర్ణయిస్తాను.

**రాజు :** నీవు మనుష్యులను భక్షించే ముందు వారు వివేకులో, అవివేకులో ... జ్ఞానులో, అజ్ఞానులో ... పరిశీలించి అజ్ఞానులను మాత్రమే భక్షిస్తూ ఉంటావా? ...చాలా ఆశ్చర్యంగా ఉన్నదే! నీ వంటి బేతాళులకు కూడా సిద్ధాంతాలు, నియమాలు ఉంటాయా?

**బేతాళుడు :** (బిగ్గరగా పకపకా నవ్వి) ఇప్పుడు నిన్ను నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. ఆ ప్రశ్నలకు నీ సమాధానమేమిటో చెప్పు. ఆ సమాధానాలను అనుసరించి నిన్ను భక్షించవచ్చునో, లేక నమస్కరించి శరణువేడాలో నేను గ్రహిస్తాను.

**బేతాళ ప్రశ్నలు -**

1. ఈ సృష్టిలో అసంఖ్యాక బ్రహ్మాండములున్నాయి కదా! ఇవన్నీ కూడా ఏ సూర్యుని యొక్క సూర్యరశ్మిలోని, సూక్ష్మపరమాణువులు, లేక, త్రసరేణువులు అయి ఉన్నాయి?

2. ఆ బ్రహ్మాండ త్రసరేణువులు ఏ మహాకాశవాయువులో స్ఫురించుచున్నాయి?

3. ఒకాయన ఉన్నాడు. ఆయన అనేక స్వప్నములను నిష్కారణంగా గనుచున్నాడు. ఆ అనేక స్వప్నములలోని ప్రతి ఒక్క స్వప్నములో మరల ఇంకెన్నెన్నో ఉపస్వప్నములను కూడా గనుచున్నాడు. ఒక స్వప్నం వదలి వెంటనే మరల ఇంకొక స్వప్నంలోకి వెనువెంటనే ప్రవేశిస్తున్నాడు. ఆతడు ఎన్ని స్వప్నాలు కనుచున్నప్పటికీ తన స్వరూపం మాత్రం త్రికాలములలో యథాతథంగానే కలిగి ఉంటున్నాడు. ఆయనను నీవెక్కడైనా చూచావా? ఎవ్వరాయన?

4. అరటి పట్టలను విప్పుకుంటూపోతూ ఉంటే చివరికి బయటనున్న ఆకాశమే లోన కూడా శేషించి ఉంటుంది. అట్లాగే ఈ స్వప్నస్వప్నాంతరములలో బయట–లోపలకూడా అవిచ్ఛిన్నంగా అఖండంగా వెల్లివిరిసి సదా ఉన్నది ఏమిటి? ఎవరు?

5. మనకెదురుగా ఈ దృశ్యప్రపంచం ఉన్నది. దీనిలో విశాల ఆకాశము, భూత సముదాయం, సూర్యమండలము, మేరు పర్వతం ... ఇవన్నీ ఘనీభూతమై ఎదురుగా ఉన్నాయి. ఇవి అత్యంత మహత్వముతో ప్రవర్తిస్తున్నాయి. అయితే ఇవన్నీ కూడా ఒకానొకని అణుఅంశమునందు ఒక పరమాణు పరిమాణమై ఇమిడి ఉన్నాయి? ఆతడెవడు? ఆతడెక్కడ ఉంటున్నాడు.

6. అవయవరహితుడగు ఒకానొక పురుషుడున్నాడు. 'ఆకారము' అనే వికారము ఆతనియందు లేదు. అయితే ఏం? ఆయనయొక్క ఒక స్వల్పాంశ ఈ రాళ్ళు–మట్టి–పర్వతము–దేహములతో కూడిన పాదార్థిక జగత్తుకు అస్థిత్వం కల్పిస్తోంది. అట్టి అస్థిత్వము కల్పిస్తున్నదెవరు? ఆయనను నీవెక్కడైనా చూచావా?

ఓ రాజా! ఇప్పుడు నిన్నొక ఆరు ప్రశ్నలు అడిగాను. వీటికి నీకు సమాధానం తెలియకపోతే 'ఆత్మద్రోహి'వి అవుతావు. దేహబుద్ధి పరిమితుడవు అవుతావు. యముడు లోకములను మ్రింగుచున్నాడు చూచావా? నీవు సమాధానాలు చెప్పకపోయావో ...నేను కూడా నిన్ను, నీ ప్రజలను చప్పరించి మ్రింగివేస్తాను. ఇక నీ ఇష్టం.

రాజు ఆ ప్రశ్నలన్నీ శ్రద్ధగా విన్నాడు. ఆతని పెదిమలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. ఇక ఒక్కొక్క ప్రశ్నకు సమాధానం ఇవ్వనారంభించాడు :

**ఒకటవ ప్రశ్న -** ఈ బ్రహ్మాండములు ఏ సూర్యరశ్మిలోని త్రసరేణువులు?

ఒకచోట ఒక ఫలం వ్రేలాడుతూ ఉన్నది. ఆ ఫలమే ఈ బ్రహ్మాండము. ఆ ఫలం (ఈ బ్రహ్మాండము) నీకూ, నాకూ, తదితర అసంఖ్యాక జీవులకు ఆశ్రయభూతమై ఘనము – ద్రవము – ఉష్ణము – వాయువు – ఆకాశము అను, పంచభూతములను ఆవరణగా కలిగియున్నది. అది జ్ఞానులకు అత్యంత చంచలంగానూ, అజ్ఞానులకు ఘనీభూతంగానూ, స్థిరంగానూ అగుపిస్తోంది.

జీవుల ఆశ – తృష్ణలు ఆ ఫలమును అనంతరీతులుగా ద్యోతకమయ్యేటట్లు చేస్తున్నాయి. (కనుక ఆశ – తృష్ణలే ఆ బ్రహ్మాండము యొక్క నిజాకారం).

అట్టి వేలాది ఫలాలతో కూడిన ఒక కొమ్మ ఉంది. ఆ కొమ్మ కదలుచున్న అనేక చిగుళ్ళు కలిగి ఉంది. ఆ కొమ్మ ఎంతో ఎత్తుగా ఉండి ప్రకాశిస్తోంది. జీవుల భావపరంపరలు, కల్పనయే ఆ కొమ్మ యొక్క వాస్తవాకారం.

అట్టి వేలాది కొమ్మలు కలిగిన ఒక మహావృక్షం ఉన్నది. ఆ మహావృక్షం ఎంతో విశాలంగా వ్యాపించి దుర్నిరీక్ష్యమై ఒప్పుచున్నది. అట్టివేయగు వేలాది వృక్షములు గల ఒక మహారణ్యం ఉన్నది. ఆ మహారణ్యం వృక్షములతోనే కాకుండా ఎత్తైన పొదలతో దట్టంగా వ్యాపించి చొరరాకున్నది.

అట్టివేయగు అనేక మహారణ్యసమూహములతో కూడిన మహోన్నతమగు ఒక పర్వతం ఉన్నది. అట్టి అనేక పర్వతపంక్తులకు ఆకరమైన ఒక సువిస్తార 'దేశం' ఉన్నది. ఆ దేశము ఊహకందనంత సువిస్తారంగా ఏర్పడి ఉన్నది.

అట్టి దేశములు అనేకం గల మహాద్వీపమొకటి ఉన్నది. ఆ ద్వీపమునందు చిత్రవిచిత్రమైన అనేక నదులు–సరస్సులు ఉన్నాయి. ఆ నదీ–సరస్సులు నిరంతరం రకరకాల ఆకారములతో కూడిన పుట్టిన–పుట్టబోవు అనేక ప్రవాహపరంపరలతో ఒప్పుచున్నాయి.

అట్టివేయగు అనేక మహాద్వీపములు తనయందు కలిగియున్న ఒక మహాపీఠం ఉన్నది. ఆ మహాపీఠం అతిచిత్రవిచిత్ర రచనా సమన్వితమై ఉన్నది. అట్టి అనేక మహా పీఠములతో సమన్వితమై ఉన్న ఒక మహాలోకం ఒకటి ఉన్నది.

అట్టి వేలాది లోకములతో గూడిన భయమును గొల్పు ఒక మహాండకోశము ఉన్నది. అట్టి వేలాది మహాండకోశములకు ఆధారమైయున్న ఒక మహాసాగరం ఉన్నది. ఆ మహాసాగరం స్పందనారహితమై విపుల బ్రహ్మాండకోశజలరాశికి నిలయమైయున్నది.

ఓ బేతాళా ! అంతేకాదు. ఆత్మ విలాసమైన 'మహార్ణవం' ఒకటున్నది. మనం చెప్పుకున్న మహాసాగర సమూహములు ఆ మహార్ణవంలో చిన్న చిన్న తరంగముల వలె ఒప్పుచున్నాయి.

అట్టి మహార్ణవములు అనేకం తన ఉదరమున కలిగియున్న మహాపురుషుడొకడున్నాడు. ఆతడు సర్వవ్యాపి అయి మహోన్నతుడై, 'విష్ణువు' అను పురాణ నామముతో కూడా వెలయుచున్నాడు. అట్టి వేలకొలది మహాపురుషుల మాలను తన వక్షస్థలమున ధరించిన పరమపురుషుడొకడున్నాడు. ఆతనిని రుద్రుడు అనే పురాణనామంతో కూడా పిలుస్తూ ఉంటారు.

అట్టివే వేలకొలది పరమపురుషులగు రుద్రులు రోమముల వలె అనాయాసముగా వెలువడు చున్నారో …అట్టి మహాసూర్యుడొకడు కలడు. సర్వప్రాణులకూ ప్రత్యక్షములగుచున్న ఈ బ్రహ్మాండ – రుద్రాది కల్పనలన్నీ మహామండల రూపుడగు ఆ మహాసూర్యుని దీప్తులయి ఉన్నాయి. ఎదురుగా దృశ్యమానమగుచున్న ఈ బ్రహ్మాండమంతా కూడా ఆ మహాసూర్యకాంతిలో కనిపించే అసంఖ్యాక త్రసరేణువులలో ఒకానొకటి మాత్రమే. చిదాత్మయే ఆ మహా సూర్యుడు.

చిదాత్మయే ఈ జగత్తంతటికీ 'తెలియుట, తెలియబడుట' అను వెలుగు, వేడిమిలను ప్రసాదించు చున్నాడు. ప్రతిజీవుని స్వస్వరూపము అట్టి చిదాత్మయే! ఇదే నీ మొదటి ప్రశ్నకు సమాధానం–

ఆ చిదాత్మసూర్యుని రశ్మిలోని సూక్ష్మ పరమాణువులే ఈ బ్రహ్మాండములన్నీ కూడా!

విజ్ఞానమే ఈ చిదానంద సూర్యుని ఆత్మ! ఈ జగత్తును ప్రకాశింపజేయటమే ఆయన చేస్తున్న మహత్తర కార్యక్రమం. ఈ విశాలమగు బ్రహ్మాండములన్నీ ఆయన కాంతిపుంజములే!

భౌతికమగు ఆకాశాన కనిపించే సూర్యునిచే ఈ జగత్తంతా శోభిల్లుతోంది చూచావా? అట్లాగే ఆ విజ్ఞాన సూర్యుని చిత్–కాంతుల వలన ఈ జగత్తులు సత్త పొందుచూ, శోభతో ప్రకాశిస్తున్నాయి.

ఓయీ! బేతాళుడా! ఆ మహాచిత్ సూర్యునే 'భగవంతుడు' అని, 'పరమాత్మ' అని 'బ్రహ్మము' అని శాస్త్రవేత్తలు పిలుస్తున్నారు. ఈ త్రిలోకములు ఆ బ్రహ్మము అనే మణికాంతులలో ప్రకాశిస్తాయి. ఉత్తమాధికారులగు ఆ మహాసూర్యుని పారమార్థికతత్త్వమగు ఆత్మ అఖండాకారమున అన్ని స్థితులందు ప్రత్యక్షమగుచునే ఉన్నది. అనధికారులకో, అది తెలియరావటం లేదు. అగ్నియందు విస్ఫులింగములు వేరువేరు వలె బయల్వెడలుచున్నాయి చూచావా? అలాగే ఆ ప్రత్యగాత్మయందు జీవజగత్తులు వేరువేరుగా తోచుచు, కర్తృత్వం – భోక్తృత్వం మొదలైన అనేక విభ్రమములు కలుగజేస్తున్నాయి.

ఓ బేతాళ మహాశయా! పారమార్థిక దృష్టితో చూస్తే అవేవీ కూడా ఒకింతైనా లేవు. చిదాత్మ ఒక్కటే సర్వదా సర్వత్రా సర్వాత్మకమై ప్రకాశిస్తోంది. అందుచేత నీ ప్రశ్నాడంబరమంతా వదలిపెట్టి సుశాంతుడవు కమ్ము.

**రెండవ ప్రశ్న -** ఈ బ్రహ్మాండములు, ఈ భావాభావములు ఏ మహాగగన వాయువునందు ధూళిరేణువులై స్ఫురిస్తున్నాయి? అని కదా...?

ఒకానొక చోట ధూళి ఉన్నది. ఆ ధూళి కోట్లాదిమైళ్ళ విస్తారం విస్తరించి అత్యంత లోతుగా ఆక్రమించి ఉన్నది. ఆ ధూళిలో రకరకాల రంగుల ధూళికణములు కలసిపోయి ఉన్నాయి.

1. కాలసత్త (కాలము అనురూపం గల మాయా సత్త).
2. స్పందనసత్త (క్రియాశక్తి ప్రధానమైన సత్త)
3. చిన్మయసత్త (ఎరుగుట అనునది ప్రధానముగాగల సత్త)
4. చిదాభాససత్త (విషయములందు ప్రతిబింబించే చమత్కారం)

ఇవన్నీ అత్యంత సూక్ష్మ పదార్థములవటం చేత వాటిని 'ధూళికణములు' అని వేదములు అభివర్ణిస్తున్నాయి. అట్టి రేణువులన్నీ 'పరమాత్మ'అనే వాయువునందు లేచుచు వివిధ ఆకారములు కల్పించుకొనుచున్నాయి.

పరమాత్మే అన్నిటా వెలుగు సత్త. ఆయన యందే కాలం మొదలైన సత్తలు ప్రతిబింబిస్తున్నాయి. ఆయన నిర్మలుడు, నిర్విషయుడు కదా! ఆయనలో ఆధార, ఆధేయాలు, వ్యపదేశాలు (Misinter pretation) ఎక్కడి నుండి వచ్చాయి? ...అనే సందేహమే అక్కర్లేదు. ఒక పుష్పాంతర్గత రసమే తనలో 1.పుష్పశరీరం, 2.సువాసన ... అనేవి కల్పించుకుని గంధానికి ఆధేయమై వెలయుచున్నది కదా!

పరమార్థసత్తయే కాలసత్త మొదలైన భేదములన్నీ తనయందు కల్పించుకుని వాటన్నిటికీ తానే ఒకవైపు ఆధారమై మరొక వైపు అనుభవమునకు కారణభూతమై (ఆధేయమై) వెలయుచున్నది.

ఈ "కాలము-క్రియ-ఎరుక-విషయాస్వాదన" అను వేరు-వేరు రంగుల ఇసుకరేణువులను ఒకదానితో మరొకటి అనంతకోట్ల దేహోపాధి పరంపరలను ఆటబొమ్మలవలె పరమాత్మతత్త్వమే నిర్మించుకుంటోంది. ప్రతి ఆటబొమ్మను ఆశ్రయించి నీవు-నేను-ఇది-అది-అక్కడ-ఇక్కడ-ఇప్పుడు-అప్పుడు-ఏకానేక ఆంతరంగిక స్ఫురణలను జతజేరుస్తోంది. ఇంతలోనే ఆ ఆటబొమ్మలను నిర్మించుకొని ఆటలాడుకొంటోంది. ఆ విధంగా స్ఫురించే అనంతకోటి చమత్కారాలలో నీ దేహం ఒకటి. నా దేహం మరొకటి. ఆత్మతత్త్వమే అంతటా సత్యం మిగిలినదంతా కల్పన మాత్రమే!

**మూడవ ప్రశ్న-** ఒక స్వప్నంలో మరొక స్వప్నం, స్వప్నం తరువాత మరొక స్వప్నం ...ఈ విధంగా స్వప్నాలు, స్వప్నాంతర స్వప్నాలు, స్వప్న తదనంతర స్వప్నాలు గనుచున్నప్పటికీ ఆ స్వప్న - స్వప్నాంతరాలతో సంబంధం లేక, తన నిర్మల స్వభావాన్ని ఏ కాలమందూ త్యజించనట్టి ఆ స్వప్నద్రష్ట స్వరూపుడెవడు?... అని కదా, నీ ప్రశ్న?

నీ యొక్క, నా యొక్క, ప్రతి ఒక్కరి వాస్తవ స్వస్వరూపమే ఆ పరమాత్మ. అట్టి పరమాత్మ లేక, బ్రహ్మమే ఈ 'జగత్తు' అను మహాస్వప్నమును, ఆ జగత్స్వప్నంలో 'నేను దేహమును' అను మరొక స్వప్నమును, ఆ దేహతాదాత్మ్య స్వప్నంలో 'జాతి, దేశము, మతము, అయినవారు, కానివారు..." మొదలైన ఇంకెన్నో ఉపస్వప్నములను కల్పించుకొని పొందటం జరుగుతోంది. అయితే అట్టి స్వప్నములు పొందుచున్నప్పుడు, ఆ స్వప్నములలో విస్తరించి ఉన్నది తానే అయినప్పటికీ, తనయొక్క నిజరూపం కోల్పోవటం లేదు. స్వప్నదోషములు స్వప్న ద్రష్టను కళంకితం చేయగలవా? వస్తువుల సంయోగ వియోగములు ఆకాశమును మరొకరీతిగా మలచగలవా?... లేనేలేదు!

ఆత్మ ఆయా స్వప్నముల లోపలా-వెలుపలా విస్తరించి ఉన్నప్పటికీ, ఈ స్వప్న జాగ్రత్ విషయ సముదాయాలు ఆత్మ యొక్క ఔన్నత్యాన్ని దిగజార్చలేవు. ఆత్మసర్వదా, అన్నిటా నిస్సంగమున, జ్యోతిరూపమున వెలుగుచూనే ఉన్నది. అట్టి శాంతం, మహదానందం, సర్వశక్తిమంతం - అగు ఆత్మను ఏమరచి ఈ జనులు నశ్వరములగు పదార్థముల సమ్మేళన-విభజనములను చూచి ఎందుకో వ్యథలు చెందుచున్నారు. సంసారమంతా స్వప్నతుల్యమే! స్వస్వరూపమే పరమసత్యము! పరమసత్యము మాత్రమే నిత్యము! అనునిత్యము!

**నాలుగవ ప్రశ్న-** అరటి చెట్టు కాండములో గల అరటిపట్టలను విప్పుచూ పోగా ... లోపల ఇక చిట్టచివరగా 'ఆకాశము' కాక మరింకేమీ మిగలదు. ఈ స్వప్న - స్వప్నాంతరములలో ఉన్నదంతా కల్పనను తొలగిస్తూ తరచి చూస్తే ఇక శేషించేదేమిటి?

స్వప్న ద్రష్టయొక్క స్వస్వరూపమే! ద్రష్ట యొక్క స్వరూపమే స్వప్నములో కల్పిత రూపంగా ప్రవేశించి ఉన్నది. కనుక స్వప్నము యొక్క వెలుపల - లోపల ఉన్నది ద్రష్టయే. ఈ విశ్వం యొక్క అంతరాంతరము లందు బ్రహ్మమే వివర్తితమై ఏర్పడి ఉంటోంది. బ్రహ్మము యొక్క అణువులే

అంతటా వెలయుచున్నాయి. వివర్తితం అగుచున్న ఈ 'జగత్‌విస్తృతి'కి ఆ బ్రహ్మమే సత్తయి ఉన్నది. అట్టి స్వస్వరూపమునకు నామరూపములు లేవు!

కాని సర్వజగత్ భావ–అనుభవములకు అది ఆలవాలం కనుక ...దానిని 'ఆత్మ' అను పేరుతో పిలుస్తున్నారు. 'సత్‌బ్రహ్మం' అని కూడా అది అందుకే పిలువబడుతోంది.

అద్దాని గురించి 'అట్టిది' అని ఎవరమూ చెప్పలేము. ఆ బ్రహ్మము సర్వధర్మ శూన్యము. అందుకని పదార్థ వ్యవహారముల దృష్ట్యా అది శూన్యం అని కూడా వర్ణింపబడుతోంది.

ఈ బుద్ధికి కనబడే వస్తువులలో అది ఏదీ కాదు. ఎందుచేతనంటే బుద్ధిని కూడా గ్రహించునది అదే! దానియందు ఏవీ లేవు. అయినా కూడా, అది తప్పితే ఇక్కడ మరొక్కటేదీ లేదు. మనోబుద్ధులకు అదియే సత్త ప్రసాదిస్తోంది. గుణములు కలవాడు లేకపోతే గుణములు ఉంటాయా? అట్లాగే అదే లేకపోతే జగత్తు లేదు, దాని అనుభవం లేదు. స్వప్నము, స్వప్నకారణము, స్వప్నమునకు ముందు – వెనుకల ఉన్నది స్వప్నకర్తయే కదా! జగత్తు విషయములో కూడా ...జగత్తు, జగత్ కారణము, జగత్తుకు ముందు వెనుకల ఉన్నది జగత్ ద్రష్టయే.

| | | |
|---|---|---|
| వస్త్రమునందలి | వస్త్రసత్త | దారములోనూ ఉన్నది |
| దారములోని | దారసత్త | దూదిలో ఉన్నది |
| దూదిలోని | దూదిసత్త | ప్రత్తికాయయందు ఉన్నది |
| ప్రత్తికాయలోని | ప్రత్తిసత్త | ప్రత్తివృక్షమునందున్నది |
| ప్రత్తివృక్షములోని | ప్రత్తివృక్షసత్త | ప్రత్తి బీజమునందున్నది |
| బీజములోని | బీజసత్త | మట్టి–జలమునందున్నది |

ఈ విధంగా, ఒక విధమైన సత్త మరొకవిధమైన సత్తగా పర్యవసించటం జరుగుతోంది. ఇట్టి సత్తయొక్క క్రమమును పరిశీలించిన విజ్ఞులు... ఇట్లు సిద్ధాంతీకరిస్తున్నారు.

ఎక్కడెక్కడ ఏఏ క్రమముచే ఏఏ సత్త భావించబడుచున్నదో ...అదంతా కాలానుగతంగా ఆయా భావాకృతులను వీడి, అనుభవజ్ఞరూపమగు 'చిన్మాత్రము' గానే పరవశించుచున్నది. అట్టి నిర్మల మగు చిద్వస్తువే ఈ జగద్రూపముగా వ్యాపించి ఉన్నదని జనులు గ్రహించెదరు గాక !"

**బేతాళుడు :** ఓహో ! అద్భుతం చాలా బాగా సమాధానం చెప్పావు.

**రాజు :** .... **ఐదవ ప్రశ్న -** ఈ విశాలమగు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూత సముదాయమునకు ఈ బ్రహ్మాండమండలమే ఆధారమై ఉన్నది కదా! ఈ బ్రహ్మాండ మండలం, సూర్యమండలం, మేరు పర్వతము ...ఇట్టి అత్యంత విస్తార పదార్థములన్నీ ఏ అణువు నందు పరమాణురూపంగా ఉన్నాయి? ...అని కదా, నీ ప్రశ్న?

ఆ పరమాత్మ సూక్ష్మాతిసూక్ష్మము, ఇంద్రియాలకు అలభ్యము అవటం చేత 'ఆతడు పరమాణు స్వరూపుడు; అణోరణీయాన్' అని వేదములు ప్రవచిస్తున్నాయి. అనంతగుణవిశిష్టుడు అవటం చేత మేరు పర్వతమునకూ ఆతడే ఆధారుడు కూడా! ఆతడు లింగ–స్వరూపభేదములకు సంబంధించని

వాడు. కనుక, సులభసాధ్యుడు కాదని కొందరి అభిప్రాయం. అయితే, జ్ఞానుల అనుభవమునకు అత్యంత సులభ ప్రాప్యుడు అగుచున్నాడు. అనేక బ్రహ్మాండములతో కూడిన ఈ జగత్తంతా కూడా ఆత్మదేవుని ఒకానొక అణువు యొక్క ఒకానొక అంశ మాత్రమే.

ఈ కనబడే బ్రహ్మాండములన్నీ సూక్ష్మతరములగు చిత్కణములచే పరిచ్ఛిన్నమై ఇట్లు దృష్టికి ప్రాప్తిస్తోంది. అందుచేత "ఆత్మదేవునియందు పరిచ్ఛిన్నమై ఉంటోంది" అను పాఠ్యాంశములన్నీ మిథ్యా పాఠములే. స్వప్నంలో చూచే వస్తువులన్నీ స్వరూపహీనములే అయినట్లు, ఈ జాగ్రత్ బ్రహ్మాండాదులన్నీ స్వతఃగా చూస్తే (అణువుల సముదాయమే కాబట్టి, భావానుగతమే కాబట్టి) స్వరూపహీనములేనని చెప్పక తప్పదు. కనుక ఆత్మదేవునియందు ఇది ఒక అణువువలె పరిచ్ఛిన్నము... అనునదంతా మిథ్యయే. ఇవన్నీ సూక్ష్మనాడులందు స్వప్నసమయంలో తోచే కల్పిత పదార్థ పరమాణువుల వంటివే. వీటన్నిటి యొక్క అంతిమ స్వభావం 'బ్రహ్మమే' అని జ్ఞానులు దర్శిస్తున్నారు.

కాబట్టి ఆత్మయందే ఈ పంచభూతములు, బ్రహ్మాండములు ఒక స్వల్ప విభాగమునందు అనుభూతమవుతున్నాయి. కాని ఆత్మకు విభాగమూ లేదు. అణువూ లేదు. పరమాణువూ లేదు. ఇదే నీ ఐదవ ప్రశ్నకు సమాధానం

**బేతాళుడు:** ఓ రాజా! నీ సమాధానం యుక్తియుక్తమే. నీవు పరమసత్యమును ప్రకటించుచున్నావని నాకు స్పష్టంగా తెలియవస్తోంది. నా 6వ ప్రశ్న మరొక్కసారి విన్నవిస్తాను.

శిలలన్నీ ఒకచోట కూడితే పర్వతం అవుతుంది. కనుక శిలలే పర్వతానికి అస్థిత్వం కల్పిస్తున్నాయని అందరికీ తెలిసిన విషయమే. అయితే ఒకానొక నిరవయవ పురుషుడు శిలలకు, తదితర సర్వమునకు తానే ఉనికి అయి అస్థిత్వమును ప్రసాదిస్తున్నాడు. అట్టి రాజాధిరాజైన మహత్పురుషుడు ఎవడు? అతనిని నీ వెప్పుడైనా చూచావా?

**రాజు :** ఓం! చూచాను, చూస్తున్నాను ! అయితే ఈ భౌతికమైన కళ్ళతో కాదు. మనం ఇంతవరకూ వివరించి చెప్పుకున్న ఆ బ్రహ్మమే కళ్ళు-చెవులు మొదలైన వాటికి అగోచరం కాబట్టి 'ఆతడు పరమాణువుకే పరమాణువు'అని మనం ఈ సంభాషణలో గ్రహించియే ఉన్నాం కదా! ఆతడు సర్వ వ్యాపి అవటం చేత 'స్థూలమగు మహాపర్వతము వంటివాడు' అని కూడా విజ్ఞులు అంటున్నారు.

| | |
|---|---|
| అధ్యారోపదృష్టికి | అదియే ఆకార-అనాకారములన్నిటికీ అవయవము. |
| అపవాద దృష్టికి | అది సర్వదా నిరవయవము. |

ఆతడే సర్వవ్యాపకుడై నెగడుచున్నాడు. ఓ సాధూ! ఈ జగత్రయం ఆ విజ్ఞాన స్వరూపుని సారమై, ఆతనియందే వెలయుచున్నది. అట్టి స్వస్వరూపుని సామవేదం 'మహత్పురుషుడు'గా గానం చేస్తోంది.

ఓ బేతాళా ! ఈ జగత్రయమును ఆత్మవిజ్ఞాన స్వరూపంగా గ్రహించు. ఆ విజ్ఞానాత్మ దేవుడే నీవు, నేను కూడా! అట్టి నన్ను వినష్ట మొనర్చగలిగిన వారెవరు? నిన్ను స్వస్వరూపందృష్ట్యా వినష్టమొనర్చగలిగినది కూడా ఏదీ లేనేలేదు. కాబట్టి నీవు నా ఈ సమాధానమును అనుసరించి త్వరగా అనుభవపదమును అధిరోహించుము.

అట్లు అధిరోహించి సర్వ గర్వాలను విడనాడినవాడివై స్వస్వరూపమున అనంత శాంత అనుభవుడవు కమ్ము.

❖❖❖

# 2. సర్వసమత్వము

**శ్రీవసిష్ఠ మహర్షి :** రాజు ఇచ్చిన సమాధానాలు విని బేతాళుడు "ఈతడు తత్త్వజ్ఞుడు" – అని గ్రహించాడు. ఆతని సమాధానాలు బేతాళుని మనస్సుకు శాంతిని ప్రసాదించాయి. ఆతడు రాజుకు సాష్టాంగదండప్రణామం చేశాడు. శాంతచిత్తుడై పరమానందవస్తువును మననం చేసుకోవటం చేత, ఆ బేతాళుడు ఆకలిని కూడా మరచి సమాధిని పొందాడు.

❖

ఓ రామచంద్రా ! ఆ రాజు చెప్పినట్లు ఈ జగత్తంతా చిద్రూపపరమాణువు నందే ఉన్నదని గ్రహించు. చిన్నపిల్లవాడు ఒకచోట కూర్చుని "నేనిప్పుడు మా చుట్టాల ఊరు వెళ్ళాను. అక్కడ అక్క–బావ–చెల్లి–అన్న తదితర తోటివారితో ఆడుకుంటున్నాను" ఇటువంటి ఊహలలోకి వెళ్ళుతూ ఉంటాడు. ఇంతలో "ఒరే ఎక్కడున్నావురా? రా ఇంట్లోకి!" అని తండ్రి పిలుపు వినబడగానే ఆ ఊహ నుండి బయల్వెడలి (లేక) ఆ ఊహను వదలి "ఏమిటి నాన్నా"? అంటూ ఇంట్లోకి వస్తాడు. దీనిని 'బాలభ్రాంతి' అంటాం.

ఈ విశ్వమంతా 'బాలభ్రాంతి'లాగా జ్ఞానవిచారముచే తప్పక ద్రష్టయందు విలీనమైపోతోంది. చివరకు పరమపదమే శేషిస్తోంది. కనుక ఇక నీవు నీ మనస్సును ఈ విషయములనుండి – దృశ్య సమూహముల నుండి త్వరగా వెనుకకు మరల్చుము. నిశ్చలాత్మకమగు ఆత్మబుద్ధిని ఆశ్రయించు. అట్లా ఉంటూనే స్వాభావికంగా నిన్ను సమీపించే కర్మలను వ్యవహారములను నిర్లిప్తుడవై ఆచరించు.

ఓ మననశీలా! మనస్సుచే మనస్సును ఆకాశమువలె నిర్మలం చేయి. ఏకైక వస్తువు అయున్న ఆత్మయందు వృత్తులన్నీ లయం చేసి 'ప్రశాంతచిత్తము' ను సంపాదించుకో. అట్టి ప్రశాంత చిత్తముచే నీవు సర్వత్రా బ్రహ్మభావమును దర్శించి, తద్ద్వారా సమదర్శివి కమ్ము. మోహశూన్యుడవగుము.

యథాప్రాప్తములగు విషయములను నిర్లేపబుద్ధితో అనుసరించువారు భగీరథుని వలె అసాధ్యమగు దానిని కూడా తప్పక సాధించి తీరుతారు.

ఎవడైతే పూర్ణముగా శాంతచిత్తుడై, పరితృప్తాంతఃకరణుడై, ఆత్మయందు ఆత్మచే నిత్యతృప్తుడై వెలయుచున్నాడో ...ఆతనికి అత్యంత దుర్లభమైన అభీష్టములు కూడా సిద్ధించగలవు. గంగావతరణలో భగీరథుడు, సగరుడు మొదలగు వారి చరిత్రలే అందుకు దృష్టాంతం.

కాబట్టి రామా! నిర్విచారుడవై, ఇక ఆపై సర్వక్రియాశీలుడవగుచుండుము. సర్వసమత్వమును అధిరోహించి, యథారీతిగా సర్వకార్యములు నిర్వర్తించుము.

❖❖❖

# VIII. భగీరథ యత్నం

## 1. శ్రీత్రితల-భగీరథ సంవాదం

**శ్రీరాముడు:** మహాత్మా! మీరు ప్రసంగవశంగా భగీరథ చక్రవర్తి పేరు చెప్పటం జరిగింది. భగీరథ చక్రవర్తి గురించి మీరు కొన్ని విషయాలు మాకు ఆశ్రమంలో బోధించియే ఉన్నారు. ఆ భగీరథుడు చిత్తపరిపక్వత ఎట్లా సంపాదించాడో చెప్పవలసిందిగా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** విను ...చెబుతాను.

భగీరథుడు కోసలవంశ తిలకుడై జన్మించి యౌవన ప్రాంగణంలో ప్రవేశించగానే అతి విశాల సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. ఆతడు చిన్నప్పటి నుండే పరమధార్మికుడు. ఆయనను సమీపించిన ప్రజలు ప్రార్థన అను పరిశ్రమ లేకుండానే తమ అభీప్సితములు పొందేవారు. ఆతని ముఖమండలం ఎల్లప్పుడూ చంద్రమండలంలాగా అతి ప్రసన్నమై ఉండేది. ఆతడు ఒక్క క్షణంలో పాత్రాపాత్రము ఎరిగి సజ్జనులకు ధనములను ఇస్తూ న్యాయమగు దానిని తృణమైనా వదలక తన ప్రజల సుఖశాంతులను దృష్టిలో పెట్టుకుని రాజ్యపాలన చేస్తూ ఉండేవాడు. వజ్రవేధ మణి వజ్రమునకు రంధ్రం చేసి ఆ వజ్రమునకు శోభ చేకూరుస్తుంది చూచావా? ఆతడు తన శత్రువులను, దొంగలను, దురాశాపరులను బంధించి వారిని అనేక ఉపాయములచే సచ్చరిత్రులుగా, సద్గుణసమన్వితులుగా తీర్చిదిద్దేవాడు. ప్రజల మధ్య రహస్యంగా సంచరిస్తూ వారిలోని అధర్మప్రవృత్తి గమనించి వారిలోని కార్యవిరతిని, దుష్టాచారములను, ప్రలోభప్రవృత్తులను పోగొట్టుతూ ఉండేవాడు. తన పరాక్రమముచే శత్రురాజులకు సింహస్వప్నమై ఉండేవాడు. బ్రహ్మవేత్తల వద్ద ఆర్ద్రాన్తఃకరణుడై ఎంతో అణకువతో మెలగేవాడు.

ఆతడొకప్పుడు కపిల ముని శాపంచేత పాతాళగర్భమున చిక్కిన తన పూర్వీకులను ఉద్ధరించదలిచాడు. ఎడతెగని తపః క్లేశములచే బ్రహ్మదేవుని, శంకరుని, జహ్నుమునిని మెప్పించి భూపాతాళములకు గంగాజలము ప్రవహింపజేశాడు.

ఓ రామచంద్రా! ఇక ఆ భగీరథుని యౌవనంలో జరిగిన కొన్ని విశేషాలు ఇచ్చట ముచ్చటించుకుందాం. భగీరథునికి నీలాగే యౌవనంలోనే సంసారాన్ని గూర్చిన 'విచారణ'తో గూడిన చమత్కార బుద్ధి కలిగింది. యౌవ్వనంలోనే అట్టి సమబుద్ధి కలగటం ఈ లోకంలో కొంత దుర్లభమైన విషయమే.

ఆతడొకసారి ఒక ఒంటరి ప్రదేశంలో ఆసీనుడై ఇట్లు చింతించసాగాడు.

**భగీరథుడు :** (తనలో) ఆహా! ఈ జగత్‌యాత్ర ఎంత అసమంజసమైనది? ఎంతటి ఉద్వేగములతో కూడి ఉన్నది? తెల్లవారుతోంది. ప్రొద్దుగ్రుంకుతోంది. రాబోయే కాలం రానే వస్తోంది. వర్తమానం 'గతం' అనే అగాధంలో పడి మటుమాయమౌతోంది. ఇక దినచర్యలన్నీ నిన్నటి లాగానే ఈ రోజు,

రేపు కూడా ఉంటున్నాయి. ఈ కర్మలు, వాటి ఫలములు ...వీటిలో ఏం ప్రత్యేకత ఉన్నది? తిన్నదే మరల తింటున్నాం. ఈ రాజ్య - గృహ - జన వ్యవహారములలో అపూర్వమైనది ఏమున్నది? ఏది పొందితే అన్నీ పొందినట్లే అవుతుందో ...అట్టి దేదైనా పొందాలిగాని, అల్ప విషయాలు ఆశ్రయిస్తూ ఎందుకీ జీవితం? నాకు తారసపడుచున్న ఈ వస్తుసముదాయమంతా నిస్సారమని, అర్థరహితమని, చివరకు దుఃఖకరములేనని తెలిసిపోతోంది. పుట్టుక-చావుల మధ్య గల జీవితం అను అవకాశాన్ని అర్థంపర్థం లేని పనులకు వెచ్చించి ఏం ప్రయోజనం? చర్విత చర్వణంగా, గానుగ ఎద్దులా నిర్వర్తించే ఈ తినటం, త్రాగటం, వాగటం - వంటి నిరర్థక క్రియలలో కాలమంతా వెచ్చించుచున్నందుకు నాకు సిగ్గనిపించటం లేదేం? అల్పప్రతిఫలాలు-దుఃఖ ప్రయోజనాలు అగు విషయేంద్రియ కార్యక్రమాలతో సంతోషించి రోజులు గడపటమనేది కుక్క బొమికను నోటకరచుకొని గొప్ప వస్తువుగా తలచి వీథులందు సగర్వంగా పరుగెత్తటం వంటిది కాక మరేమిటి?

ఇట్లు ఆలోచిస్తూ ఆ భగీరథుడు సంసార వ్యవహారమంతా పరికించి చూశాడు. అజ్ఞానాంధకార పర్యవసానాలను, సంసారం యొక్క విన్యాసాన్ని చూచి మిక్కిలి భీతిచెంది, తన కులగురువగు త్రితల మహర్షి ఆశ్రమానికి అప్పటికప్పుడు బయలుదేరాడు. ఆయనను సమీపించి సాష్టాంగ నమస్కారం సమర్పించాడు.

❖

**భగీరథుడు :** తండ్రీ! సద్గురూ! మా సంగతి గమనిస్తూనే ఉన్నారు కదా? సారశూన్యమగు ఈ సంసార మహారణ్యంలో చిక్కుకుని మేము బక్కచిక్కిన ఎద్దులాగా అలమటిస్తున్నాం. అంతులేని 'ఆశలు' అనే ముళ్ళపొదలలో ఎప్పుడో చిక్కుకున్నాం. అనేక సుఖదుఃఖాల రాకపోకలు మమ్ము అనుక్షణం పీల్చి పిప్పిచేస్తున్నాయి. ఇక్కడ కనిపించే తుచ్ఛ - అల్పకాలిక విషయాల పట్ల మాకు క్షణక్షణం ఏర్పడు చున్న రాగ-ద్వేషాలు కాలమేఘంలా క్రమ్ముకుని మమ్ములను అజ్ఞానంలో కప్పి ఉంచి ఆట ఆడిస్తు న్నాయి. అనేక కర్మలందు ఆసక్తి గలవారమై మేము మా ఉత్తరోత్తర గతులేమిటో గ్రహించలేకపోతున్నాం. ఒకవేళ గ్రహించినా, మా బుద్ధి మాకు వ్యతిరేకమై ఉండటం చేత నిస్సహాయులమైన కాలయాపనాన్ని, కాల దుర్వినియోగాన్ని నిరోధించలేకపోతున్నాం. ఊరకుక్క నిస్సారంగా వీథివీథికి, ఇంటింటికి తిరిగి, మరల మురికి గుంటకు చేరుతుంది చూచారా? మేము కూడా మతితప్పి స్వర్గ - నరక - మనుష్య లోకాలలో తచ్చాడి తిరిగి అంధకారమయమగు అజ్ఞాన స్థానాలలో చేరుకుంటున్నాం?

హే కరుణా సముద్రా! నా పుణ్యవశం చేత ఈ రోజు మిమ్ములను సమీపించాలని, శరణు వేడాలని బుద్ధి పుట్టింది. 'జరామరణ మోహాలు' అనే ఆకృతి ధరించిన ఈ దుఃఖాలు ఉపశమించేది ఎట్లా? సంసారహేతువుల నుండి నన్ను నేను ఎట్లా రక్షించుకోవాలి? సెలవివ్వండి.

**త్రితల మహర్షి :** నాయనా ! ఎందుకీ దిగులు? నీవు నిరుత్సాహపడటమేమిటి? మహాప్రయత్న శీలుడవగు నీవు 'దుర్లభం - నిస్సహాయం - దుస్సాధ్యం' అంటూ అల్ప శబ్దములు పలుకుచున్నావేం?

1. శుశ్రూష, 2. శ్రవణము, 3. గ్రహణము, 4. ధారణ... ఇవి సాధన చతుష్టయం కదా!

వీటిని అవలంబించు. క్రమంగా వైషమ్యరహితుడవు కమ్ము. సామ్యస్థితి సంపాదించుకో. అనాది సిద్ధమైన బ్రహ్మరూపమున ఆవిర్భవించు.

జ్ఞేయం అయినట్టి ప్రత్యక్‌తత్త్వాన్ని గ్రహించటానికి నీకున్న అన్ని మార్గాలను, అవకాశాలను, సాధనలను ఉపయోగించుకో. అప్పుడు తత్త్వజ్ఞానము నందు తప్పకుండా పరిపూర్ణత పొందుతావు. నిర్మలస్వరూపుడా! తత్త్వజ్ఞానివైన మరుక్షణం ఆ దుఃఖాలన్నీ వాటంతట అవే తొలగిపోతాయి. ఇక సంశయాలూ ఉండవు. సంసారగ్రంథులూ ఉండవు.

**భగీరథుడు :** 'జ్ఞేయం' అంటే ఏమిటి?

**త్రితల మహర్షి :** 'తెలుసుకోవలసినది తెలుసుకోవటం' ...అనే అర్థాన్ని ఉద్దేశించి శాస్త్రకారులు జ్ఞేయం అనే శబ్దాన్ని ఉపయోగిస్తున్నారు. పరమపవిత్రం, సర్వగతం, నిత్యం, జ్ఞాపకములన్నిటికీ ఆధారం – స్థానము అయిన జ్ఞప్తి రూపమగు ఆత్మయే జ్ఞేయము.

'ఆత్మ' అనగా ఏది? ఎక్కడున్నది? నీ యొక్క స్వస్వరూపమే ఆత్మ కదా! అనగా జ్ఞేయము నీ యొక్క వాస్తవ స్వరూపమే! అట్టి ఆత్మకు మాయాబంధం లేదు. దుఃఖం లేదు. అలసత్వం లేదు.

**భగీరథుడు :** మునీశ్వరా ! తమరు ఒకప్పుడు తాత్త్విక విషయాలు బోధిస్తూ రెండు గొప్ప విషయాలు నాకు చెప్పారు–

1. ఆత్మ నిర్గుణము, నిర్మలము, శాంతము చ్యుతిరహితము.
2. ఆత్మ ఒక్కటే అయి అన్ని కాలములందూ, అందరియందును ఒకే విధంగా వెలయుచున్నది.

ఈ దేహాదులకు వాస్తవమైన అస్థిత్వము లేదని, ఆత్మకు మాత్రమే అస్థిత్వము కలదని మీరు బోధించగా నేను శ్రవణం చేశాను. మీరు ప్రవచించింది అత్యంత యుక్తమని కూడా గ్రహించాను. అయితే సత్–అసత్‌లకు సంబంధించిన ఉభయ బోధలలోని సదాత్మకత్వము తగినంతగా బోధపడ లేదని నా కనిపిస్తోంది. నేనెప్పుడు ఏ ఉపాయం అవలంబించి ...తద్వారా విక్షేపం లేని శాంతిని సంపాదించుకోగలను? ఏ మార్గం అనుసరించి ఆత్మ సంవిత్తును ఇప్పుడు నేను పొందాలి? ఈ విషయం నాకు విశదీకరించి చెప్పండి.

**త్రితల మహర్షి :** ... ఊఁ! ఇంకొంత స్పష్టంగా నీ సందేహమేమిటో చెప్పు.

**భగీరథుడు :** మహర్షీ! అఖండాకారము, శాంతము, నిర్మలము అని మీచే వర్ణించబడిన ఆత్మ నాకు అనుభూతమగుటలేదు. ఎందుచేత?

**త్రితల మహర్షి :** ఎందుచేతనంటే... 1.ఈ రాజ్యం పట్ల అభిమానం, 2.అట్టి సంసర్గం వలన ప్రాప్తించే అనేక విషయాలలో నీ చిత్తం తగుల్కోవటం... ఈ రెండు కారణాల వల్ల నీకు ఆత్మ స్పష్టంగా అనుభూతమగుట లేదు.

నీ హృదయాకాశమున అమానిత్వం (గర్వం రహితమై పోవటం) ఉదయించిందా, అప్పుడు నీ యందు 'అభిమానం' అనే జాడ్యం తొలగిపోతుంది. అభిమానవిరహితమైన చిత్తం మాత్రమే

జ్ఞేయమును గ్రహించగలదు. అనగా ...జ్ఞేయానికి – నీకు మధ్య 'అభిమానం' అనే తెర అడ్డుగా ఉంటోంది. జ్ఞేయమును గ్రహించినప్పుడు నీ చిత్తం ఆ జ్ఞేయమునందు నెలకొని, ఇక తన చిత్తత్వం త్యజించివేయగలదు. అప్పుడు నీవు పూర్ణ స్వభావాన్ని బడయగలవు. ఇక ఆ తరువాత తత్స్వభావం నుండి చ్యుతి ఉండదు. 'ఈ దేహంచే నేను జన్మిస్తున్నాను. దీనితో మరణిస్తున్నాను. మరొక దేహంతో పునర్జన్మ పొందుచున్నాను' ...అను పునర్జన్మ స్వభావం పొందవు.

ఓ భగీరథా ! ఏది జ్ఞానమో, ఏది అజ్ఞానమో ముందుగా తెలుసుకో.

**భగీరథుడు:** 'జ్ఞానము' అనుదానికి సవివరమైన నిర్వచనం ప్రసాదించ ప్రార్థన.

**త్రితల మహర్షి :**

**అసక్తిం, అనభిష్వంగః పుత్ర-దార-గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్ట-అనిష్టోపపత్తిషు ॥**
**ఆత్మనో అనన్యయోగేన తద్భావనమ్ అనారతమ్ ।**
**వివిక్తదేశ సేవిత్వమ్ అరతిః జనసంసది ॥**
**అధ్యాత్మజ్ఞాన నిత్యత్వమ్ తత్త్వ జ్ఞానార్ధదర్శనమ్ ।**
**ఏత జ్ఞానమితి ప్రోక్తమ్, అజ్ఞానం తదతో అన్యథా॥**

'జ్ఞానము' అనగా మా ఉద్దేశంలో ఏమిటో విను–

1. భార్య, పుత్రులు, గృహములు మొదలైన దృశ్య సంబంధమైన విషయముల పట్ల ఆసక్తిగాని, 'అవి నావి' అను మమకారము గాని ఉండకపోవటం.
2. నీ ఇంద్రియములకు ఇక్కడ ఇష్ట అయిష్టములు తారసపడుతూ ఉంటాయి కదా! అట్టి ఉభయ విషయముల పట్ల సమచిత్తుడవై ఉండటం
3. అనన్యమగు ఆత్మ వస్తువును అన్ని వేళలా భావన చేస్తూ ఉండటం.
4. జనులతో ఏర్పడే సంబంధ వ్యవహారములతో అభిరుచి పొందక ఏకాంత స్థానమును సేవిస్తూ ఉండటం.
5. జ్ఞాన విషయమై శ్రవణ మననముల నిరంతరాభ్యాసం.
6. తత్త్వార్థమైన ఆ అఖండ – నిర్మల – నిత్య పరమాత్మ స్థానమును – ఎక్కడికి నీ చూపు వెళ్ళితే అక్కడ – దర్శిస్తూ ఉండటం.

ఇవి 'జ్ఞానం' అని అంటున్నాం. వీటికి సానుకూలం కానివన్నీ 'అజ్ఞానం' అని మా ఉద్దేశం. నాయనా! అహంభావమును ఉపశమింపజేసి, నీ చిత్తం నుండి రాగద్వేషములను వెడలగొట్టావా... మరుక్షణం సంసారమనే వ్యాధికి దివ్యౌషధమైనట్టి జ్ఞానం నీకు తప్పక లభిస్తుంది. శాస్త్రాదులచే, మా వంటి గురువులచే ప్రతిపాదించబడే సర్వసాధనాల ముఖ్యఫలం అనహంకారమేనని గ్రహించు. నీలో అహంకారం ఉన్నంత వరకూ 'అమానిత్వం' మొదలైన దైవీసంపత్తికి చోటెక్కడిది?

**భగీరథుడు:** గురువర్యా! వృక్షము పర్వతముపై అధిరోహించి తిష్టవేసుకుని కూర్చుంటుంది చూచారా?

అట్లా అహంభావము నా ఈ శరీరము నందు దృఢంగా పాతుకుపోయి ఉన్నది. దయచేసి, అది ఎట్లా తొలగుతుందో చెప్పండి.

**త్రితల మహర్షి :** వత్సా ! అందుకు ఉపాయం ఊసురోమంటూ, దుఃఖిస్తూ కూర్చోవటం మాత్రం కానే కాదు. విషయ భోగముల పట్ల 'అభిలాష' అప్రయత్నశీలునియందు జన్మ–జన్మకూ పేరుకుపోతూ ఉన్నది. అట్టి అభిలాష వ్యసనమై 'వాసనలు'గా అంతరంగమునందు వ్యాపించి ఉంటున్నది. ఆ వాసనలు ఆత్మను ఆవరించి ఉండటంచేతనే పరమానందమయమగు నీ స్వస్వరూపము నీ కనుభవం కావటం లేదు. ఇప్పుడేం చేయాలి? దిగాలుపడి కూర్చుంటే ఎట్లా? లే! లేచి పురుషప్రయత్నమును ఆశ్రయించు. అట్టి పురుషప్రయత్న బలంచే నీ యందు పేరుకొనియున్న భోగవాసనలను పరిత్యజించు. భోగాల గురించి చింతించటం మానివేయి. అప్పుడు అహంకారం కూడా వినాశనం కాక తప్పదు.

అయ్యో! ఈ నా రాజ్యం పోతుందేమో?... కొంతకాలం తరువాత ఏ కారణం చేతైనా ఇప్పటి వలె నన్నెవరూ గౌరవించరేమో?... అందరూ నన్ను యాచిస్తూ ఉండగా వారికి–వీరికి దానధర్మాలు చేస్తున్నాను, అట్టి నేను భిక్షుకుడనై ఇంకొకరిని ఏదైనా యాచించే సమయం రాదుకదా?... నేను గొప్పవాడి నని చాలామంది అనుకుంటున్నారు కదా! రేపు అనేకమంది ప్రజలు, ఆ శత్రురాజులు నన్ను ఎగతాళి చేయరుకదా! నా పట్ల ఏదైనా అసమర్థత వచ్చిపడుతుందా?... ఈ రోజు బాగానే ఉన్నది. మరి రేపు సరి అయిన అన్నపానములు, గృహాదులు ఉండకపోతే రేపు నా గతి ఏమిటి?... నేను వీరి కొరకై ఏదైనా చేస్తే బాగుండు !...

...ఇటువంటి రూపంలో ఉండే అనేకానేక చింతల వల్ల నీకు లజ్జాభిమానాలు కలుగుచున్నాయి. ఇటువంటి చింతలు నీ కొరకై గృహాభిమాన రూపంలో ఒక గొప్ప పంజరం తయారుచేసిపెట్టాయి. అట్టి పంజరమే నీ నిరుత్సాహ – దిగుళ్ళకు కారణమై ఉంటోంది. అట్టి విషయ పంజరం సంపూర్ణంగా భగ్నం కానంత వరకూ నీలో అహంకారం కాపురం చేస్తూనే ఉంటుంది. అహంకారం నీ చిత్తంలో భయాన్ని గొలిపేటట్లు తాండవం చేస్తుంటే నీకు శాంతి ఎక్కడిదయ్యా? వాస్తవానికి 'నావి' అనుకునే ఏవీ నీవి కావు. 'నావి' అను రూపం గల ఆవేశమే నీ వివేక బుద్ధి వికసించకుండా అడ్డుకుంటోంది.

❖

ఓ రాజా! నీవిప్పుడు 'వివేకబుద్ధి' అనే స్నేహితుని సహాయం ఆశ్రయించు. నీకిప్పుడు చెప్పిన అజ్ఞాన విషయాలన్నీ పరిత్యజించు. నిశ్చలతను అలవర్చుకో. అప్పుడా ఆత్మపదం నీకు కరతలామలకం అవుతుంది. 'నాది' అనునది అహంకార – మమకారముల జాడ్యంచేతనే నిన్ను పట్టి పీడిస్తోంది. కాబట్టి అహంకార–మమకారాలు వదిలేదెట్లాగో యోచించు.

ఇక, అహంకారత్యాగం కొరకై ఏమి చేయాలో చెప్పమంటావా?... నీవిగా నీవు భావిస్తూవస్తున్న రాజోపయుక్తమైన ఛత్ర – చామరాది చిహ్నములను అన్నిటినీ పరిత్యజించు.

ఈ రాజ్యలక్ష్మిని ఎవరికైనా సమర్పించివేయి. శరీరాభిమానం ప్రారత్రోలి, ఎవ్వరికంటే నీవు ఉన్నతుడవని అనుకుంటున్నావో ...వారివారి దగ్గిరకు వెళ్ళి భిక్ష ఎత్తు. తద్వారా "నేనే అంతటి వాడినీ – ఇంతటివాడిని" – అనే భ్రమను వదిలించుకో!

ఇచ్ఛారాహిత్యం అలవరచుకో! అనగా, సర్వ ఇచ్ఛలను ఆ ఇచ్ఛలకు సంబంధించిన ప్రయత్నములను వదలివేయి.

'జీవాత్మ ఎవరు? సంసారమేమిటి? మోక్షం ఎప్పుడు వస్తుంది? ... అనే ప్రశ్నలను పరిత్యజించు. "ఇదంతా... నాతో-నీతో సహా... పరమాత్మ విన్యాసమే" - అనే అవగాహనను, అనుభూతిని నిరంతర భావన ద్వారా ఆశ్రయించు.

అట్టి ప్రశ్నలకు అనేక వివరములను ఇస్తున్న నీ గురువైన నన్ను కూడా త్యజించివేయి.

అంతా వదలిన తరువాత ఇకప్పుడు ముముక్షువులకుండవలసిన ఉత్తమగుణములందు మాత్రమే దృష్టిసారించు. భోగ-త్యాగములను జగన్నాటకములోని క్రీడా వినోదములుగా గమనిస్తూ పరిత్యజించు.

జగత్తులో ఉంటూ జగత్తులో లేనివాడగుము. సర్వత్యాగివైన మరుక్షణం నీవు మోక్షస్వరూపుడవే! అప్పుడు సర్వోత్కృష్టమగు బ్రహ్మాభావమును పొందగలవు. సంసారభ్రాంతికి నీయందు కొంచెం చోటు కూడా ఇక దొరకదు.

❖❖❖

## 2. సర్వ పరిత్యాగం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా భగీరథుడు కులగురువైన త్రితల మహర్షిచే బోధించ బడ్డాడు. ఆశ్రమం నుండి బయలుదేరి అంతఃపురం చేరాడు. గురువు చెప్పిన విషయాలన్నీ ఒకటి తరువాత మరొకటిగా చాలాసార్లు మననం చేసుకున్నాడు. ప్రతివాక్యాన్ని స్వబుద్ధితో బాగా విచారణ చేశాడు. ఇక తన తరువాత కర్తవ్యమేమిటో దృఢంగా నిశ్చయించుకుని స్థిరసంకల్పుడయ్యాడు.

కొద్దిరోజులు మౌనంగా గడిచిపోయాయి. 'సర్వత్యాగము' అను సంకల్పబలం సిద్ధించాలనే ఉద్దేశంతో సోమయాగము నుండి విశ్వజిత్ యాగము వరకు గల అనేక యజ్ఞములను నిర్వర్తించాడు. అవన్నీ ముగియగానే ఇక తాత్సారం చేయలేదు. పాత్రాపాత్రముల విచారణ చేయకుండా బ్రాహ్మణులకు, బంధువులకు, తదితరులకు అనేక గోవులను అశ్వములను భూమిని, బంగారమును అమితంగా ఇచ్చివేశాడు. అంతఃపురంలోని అమూల్య వస్తువులను అక్కడి పరిచారికలకు, పేదవారికీ ఇచ్చి వేయగా, ఇక ఆతడు కట్టుబట్టలతో మిగిలాడు. రాజు చేస్తున్న దానాలన్నీ చూచి "ఏమిటి? ఈతనికి ఏమన్నా పిచ్చి పట్టలేదు కదా?" అని మంత్రులందరు గుసగుసలాడసాగారు.

ఒక రోజు రాజసభ అనేక సంరంభములతో జరుగుచుండగా, భగీరథుడు లేచి నిలుచున్నాడు. "ఓ కోసలదేశ ప్రజలారా! మంత్రులారా! మీ అనుజ్ఞతో నేనీ రాజ సింహాసనాన్ని పరిత్యజించదలిచాను. మీరు ఎరిగియే ఉన్నారు. ఆతడు రాజుగా మీకు సేవలందించుగాక!" అని అభిప్రాయం వెలిబుచ్చి, సభ నుండి వెనువెంటనే బయల్వెడలి అంతఃపురం జేరాడు.

నాలుగు రోజులు పోయిన తరువాత ఒక రోజు ఒక ఆంతరంగికుని పిలిచి ఆ కోసల రాజ్యాన్ని జయించాలని ఎంతో కాలంగా కలలు కంటున్న శత్రురాజుకు కబురుపెట్టి, తన రాజ

సింహాసనాన్ని ఆ శత్రురాజుకు సమర్పించివేశాడు. ఆ శత్రురాజు ఎంతో సంతోషంగా కోసల రాజ్యాన్ని తన సొంతం చేసుకున్నాడు.

ఇక భగీరథుడు ఒక గోచీ మాత్రం ధరించి అక్కడి వారందరి కన్నులు కప్పి ఎక్కడో తనకే అప్పటికి తెలియని సుదూర ప్రాంతానికి ఒంటరిగా వెళ్ళిపోయాడు.

❖

ఆ భగీరథుడు తన పేరు ఊరు తెలియని సుదూర గ్రామములందు, అరణ్యములందు ఓపికతో వసించసాగాడు. ఇలా ఆతని జీవితం గడచుచుండగా కొంతకాలానికి ఆతని చిత్తంలోని వాసనలన్నీ తొలగిపోయాయి. అచిరకాలంలోనే పరమశాంతి లభించగా, ఆత్మయందు విశ్రాంతి పొందాడు.

అట్టి నిర్వికార స్థితిని పొందిన భగీరథుడు భూమండలమున గల అనేక ద్వీపాలలో సంచరిస్తూ ఒక రోజు సుదీర్ఘ ప్రయాణవశంగా తాను ఇతఃపూర్వం రాజ్యమేలిన కోసల రాజ్యంలో ప్రవేశించాడు.

'ఇది ఒకప్పుడు నా రాజ్యం, నా నగరం' అనే సంస్కారం లేకుండానే ప్రధాననగరాన్ని (ముఖ్యపట్టణం) యాదృచ్ఛికంగా చేరాడు. అక్కడ వీధులందు తిరుగుతూ పౌరుల వద్ద మంత్రుల వద్ద భిక్ష యాచిస్తూ ఉండేవాడు.

కొందరు పౌరులు, కొందరు మంత్రులు ఆతనిని గుర్తించటం జరిగింది. అయితే ఆతడు అదేమీ పట్టించుకోలేదు. అయినప్పటికీ ఆతనిని చూచిన కొద్దిమంది మంత్రులు పౌరులు ఖేదచిత్తులయ్యారు. 'ఆహా ! ఎంతటి మహారాజు ! అంతటివాడు ఈ రోజు ఇక్కడ భిక్షాటనం చేయటమా? మనలను తన కన్న బిడ్డల వలె చూచిన ఈ భగీరథ చక్రవర్తి మనలను యాచించటమా? అరుగులపై, చెట్టు నీడలలో నిద్రించటమా? ఇది అసమంజసం' ...అని తలచిన కొందరు పౌరులు ఆతనికి మధురపానీయములు, ఆహారం తెచ్చి ఇవ్వటం ప్రారంభించాడు. ఆతడు తనకు ఆకలి తీరువరకు మాత్రమే ఎవరిచ్చినా ఏమీ అనకుండా స్వీకరించి 'శుభం' పలికి ఊరుకునేవాడు. కొందరు ఆయనను తమ గృహములకు ఆహ్వానించారు. 'లేదు. నాకు ఎక్కడున్నా ఒక్కటే. నాకేమీ కష్టమనిపించనప్పుడు మీకెందుకు తాపత్రయం? మీరు యథా విధంగా మీమీ పనులు చూచుకోండి"...అని చెప్పి మరొక వీథికి వెళ్ళిపోతూ ఉండే వాడు, ఆ చక్రవర్తి !

4,5 రోజులు గడిచేటప్పటికి భగీరథుని రాక గురించి కోసల రాజ సింహాసనం అనుభవిస్తున్న రాజుకు ఎవరో చెప్పటం చేత తెలిసింది. ఎవరినో సేవకులను పంపించి భగీరథుని అంతఃపురానికి ఆహ్వానించాడు. కానీ భగీరథుడు ఆ ఆహ్వానం స్వీకరించలేదు.

అప్పుడా శత్రురాజే భగీరథుడున్న ప్రదేశానికి వచ్చి "హే భగీరథ చక్రవర్తీ! మీరు మహత్తర ఉదార స్వభావులు. ప్రజలకు మీరంటే ప్రాణం. మీ పరిపాలనను ఇప్పటికీ వారు మధుర స్వప్నం వలె భావించటం నేను గమనించాను. పరిపాలనాదక్షులగు మీ ముందు నేనెందుకూ కొరగానని గ్రహించాను. రాజులమైనందుకు మనం కోరుకునేది ప్రజల క్షేమమే కదా! నాకు కుమారులు లేరు. మిమ్మల్నే నా కుమారుడుగా తలుస్తాను. దయచేసి మీ సింహాసనం మీరు అలంకరించి ప్రజలకు,

నాకు ఆనందం చేకూర్చండి. నేను మీ రాజ్యం మీకు సమర్పించి మీకు భృత్యుడనై ఉండటానికి సంసిద్ధుడను... అని అనేక విధాల బ్రతిమలాడాడు. నచ్చచెప్పజూచాడు. లాభం లేకపోయింది. ఆ రాజు ప్రేమతో ఇచ్చిన ఒక పండు తప్పితే భగీరథుడు ఇంకేమీ ముట్టుకోలేదు. రాజ్యం విషయంగాని, రాజకీయ విషయాలుగాని, బంధువుల విషయంగాని, మరింకెవ్వరి గురించిగాని భగీరథుడు సంభాషించనైనా లేదు. ఏదైనా ఆ శత్రురాజు చెప్పవస్తే వినలేదు కూడా!

మరొక నాలుగు రోజుల తరువాత భగీరథుడు ఆ నగరం నుండి కాలినడకన బయలుదేరాడు. త్రోవలో కోసలదేశ గ్రామాలూ, పట్టణాలూ ఉన్నాయి. అక్కడక్కడి ప్రజలు భగీరథుని గుర్తుపట్టి గౌరవ – ఆశ్చర్య – దుఖాదులు ప్రదర్శించటం చూచి వాటన్నిటికీ చిరునవ్వుతో సమాధానం ఇస్తూ తన ప్రయాణం కొనసాగించి, క్రమంగా త్రితల మహర్షి ఆశ్రమం చేరాడు. ఆయన భగీరథుని సాదరంగా ఆహ్వానించారు. భగీరథుడు మాత్రం తదితర శిష్యుల లాగానే గురుశుశ్రూష చేస్తూ ఆ ఆశ్రమంలోనే కొన్ని రోజులు గడిపాడు. అట్లా కొంతకాలం గడిచింది.

త్రితలుడు శిష్యుడగు భగీరథుని త్యాగబలం, ఆత్మావలోకనాభిలాష చూచి ఆశ్చర్యచకితుడైనాడు. ఒక రోజు శిష్యులందరినీ, భగీరథునితో సహా, సమావేశపరిచాడు.

“ఓ ప్రియశిష్యులారా! ‘సర్వము త్యజించు’ – అని ఈ భగీరథునికి బోధించాను. ఈతడు సర్వమును త్యజించి గురువగు నాకన్నా కూడా సమున్నతమోక్షస్థానంలో సంస్థితుడైనాడు. ఈ రోజు నుండి ఈతడు నాకు శిష్యుడు కాడు. ఈతనికే నేను శిష్యుడను. ఈతనిని సేవిస్తూ నేను అనుసరించ దలిచాను. మీరందరూ మీమీ ఇచ్ఛానుసారం మరొక గురువును ఆశ్రయించవచ్చు” అని ప్రకటించాడు.

ఆ తరువాత గురుశిష్యులగు త్రితలమౌని – భగీరథులు కలసి పాదచారులై అక్కడి నుండి ఏ నిమిత్తం లేకుండానే బయలుదేరారు. వనములందు, గ్రామములందు, పర్వతప్రాంతములందు, పట్టణములందు సంచరిస్తూ అక్కడక్కడా కొంతకాలం గడిపారు.

వారిరువురు ఈ దేహసంబంధమైన, గ్రహణ – త్యాజ్యముల రెండింటికీ అతీతమగు మానసిక స్వస్థితితో సామ్యభావము పొంది, ఆత్మసుఖ విశ్రాంతి అనుభవిస్తూ ఉండేవారు. అకృత్రిమమగు సుఖ విశ్రాంతిని పొందుతూ ఉండేవారు. ఒక రాజు వెన్నెలకాంతిలో తన ఉద్యానవనంలో సంచరిస్తున్నట్లు వారు నిశ్చింతులై శోక – భయ – ఉద్వేగరహితులై, సుఖదుఃఖ ప్రసంగము లేనివారై అనేక ప్రదేశములలో సంచరిస్తూ ఉండేవారు.

ఎద్దాని సమ్ముఖంలో విషయానందములు అర్థరహితములగుచున్నాయో, ఏదైతే సుఖస్ఫురణ గాని, దుఃఖస్ఫురణగాని, మధ్యస్థమైనదిగానీ కాదో ...అట్టి నిర్విషయ పరమానందమును వారు అనునిత్యం అనుభవిస్తూ బాలురు సంచరించే ఆటస్థలంలాగా ఈ భూమిపై గల అనేక ప్రాంతాలలో ప్రవేశించారు. ఈ జన – ధన – తదితర వైభవములు, బ్రహ్మలోకవాసులవరకూ గల అణిమాదిసిద్ధులు వారి దృష్టికి రహదారి ప్రక్కగా ఉన్న ఎండుగడ్డిపరక వలె స్వల్పమైనవిగా తోచేవి. వారిద్దరూ మనుష్య భోగముల నుండి దివ్యభోగముల వరకు పరమవైరాగ్యము కలిగి ఉండేవారు.

❖

ఓ రామచంద్రా! ప్రారబ్ధకర్మ వల్ల ఈ శరీరం లభిస్తోంది. మరల కర్మల చేతనే ఇది క్షీణించ బోతోంది. అయితే ఎవరు ఆత్మయందు అనుక్షణికమైన ధారణ కలిగి ఉంటారో ...అట్టి వారికి ఈ ప్రారబ్ధ – ఆగామి – సంచిత క్రమములన్నీ వర్తించవు. ఈ శరీరాలు, తత్సంబంధిత వ్యవహారాలు చిన్న పిల్లల ఆటలుగా తోచేవారికి, స్వస్వరూప అనుభూతియందు, నిశ్చలులై ఉన్నవారికి ఇక ప్రారబ్ధం లేదు. ఆగామీ లేదు. అనగా అవన్నీ వారి దృష్టిలో విషయరాహిత్యం సంతరించుకుంటాయి. సర్వస్థితులందు సమవర్తియగు ఆత్మను సర్వదా సందర్శించేవారికి సంసారమెక్కడిది? సంసారమే లేనివారికి కర్మలు–ఫలాలు ఏమి ఉంటాయి?

❖

ఆ మునులిద్దరూ పూర్వ కర్మల వలన లభించే సుఖ–దుఃఖముల రెండిటినీ ఆనందంగానే చూడసాగారు. వారి స్వస్వరూపమే ఆనందమయమయినప్పుడు ఇంక లోటేమున్నది? ఇచ్ఛను పూర్తిగా వదలి ఉండుటచే వారిద్దరకీ స్వాభావికంగానే పరమశాంతి లభించింది.

❖❖❖

## 3. పునః పట్టాభిషేకం - గంగావతరణం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా ! ఆ విధంగా ఆ త్రితల – భగీరథులు శాంతైశ్వర్య మనస్కులై ఒక సారి అయోధ్య రాజ్యం చేరుకున్నారు. ఆ రాజ్యం ఏలే మహారాజు అప్పటికి కొద్దిరోజుల క్రితమే మరణించి ఉండటం జరిగింది. ఆ మహారాజుకు సంతానం లేదు. అక్కడి ప్రజలు ఖిన్నులై తమకు ప్రాప్తించిన అరాజకత్వము పోగొట్టుకోవటానికి ఉత్తమార్హత గల వ్యక్తి కొరకై వెతకుచున్నారు.

అక్కడ వేదజ్ఞులు కొందరు దైవేచ్ఛానుసారం ఆకస్మికంగా భగీరథుని చూడటం జరిగింది. చక్రవర్తికి ఉండే రేఖలు, ముఖవర్చస్సు వారికి భగీరథునిలో కనిపించాయి. వెంటనే వేదపండితుల నిర్ణయం అక్కడి మంత్రులకు చేరవేయబడింది. వారు కలిసికట్టుగా వచ్చి తమకు రాజు కావలసినదిగా భగీరథుని ప్రార్థించారు. హర్ష వైషమ్యాలు లేకయే సర్వుల సంక్షేమ సంతోషాలు కోరటం మహనీయుల నైజం. త్రితల మహర్షి అభిప్రాయం కూడా అదే అవడం చేత భగీరథుడు అందుకు కాదనలేదు. అక్కడి సైనికులు అప్పటికప్పుడు భగీరథుని పేరు అడిగి తెలుసుకొని "భగీరథ మహారాజుకు జై" అను నినాదాలు పలికారు. పట్టపు ఏనుగు తేబడింది. ఆ భగీరథుడు భిక్షుకుని రూపంతోనే ఏనుగును అధిరోహించాడు. ఆ రోజు మొదలుకొని కొన్ని రోజులుగా గొప్ప ఆడంబరములతో పట్టాభిషేక మహోత్సవం జరిగింది.

❖

ఆ సమయంలోనే కోసల మహారాజు మరణించియున్నాడు. తమ భగీరథ చక్రవర్తే అయోధ్యకు రాజయ్యాడని కోసలరాజ్యమంత్రి వర్యులకు – ప్రజలకు తెలిసింది. వెంటనే సభాప్రముఖులు అయోధ్యకు వెళ్ళి భగీరథుని కలిశారు.

"హే మహారాజా! తామే కదా మా ప్రభువులు. పెద్ద చేపవచ్చి చిన్న చేపను గుటుక్కున మ్రింగినట్లు మీరు రాజ్యం ధారబోసిన రాజు మృత్యువుచే మ్రింగివేయబడ్డాడు. ఆతనికి సంతానం లేరు. అందుచేత, మీరు ఈ అయోధ్యతో బాటు కోసల రాజ్యమును కూడా మహాచక్రవర్తి అయి పరిపాలించండి. తమరు యోగులే! ఇందులో సందేహం లేదు. అయితే, యోగులు కూడా తాము కోరకుండా ప్రాప్తించిన ప్రవాహపతితములగు కార్యములను ధర్మబుద్ధితో నిర్వర్తిస్తారు కదా! మన ప్రజల కోరిక మన్నించండి." అని వేడుకున్నారు. భగీరథుడు చిరునవ్వుతో వారి కోరికను అంగీకరించాడు.

ఆ విధంగా భగీరథుడు మరల సప్తసాగర చిహ్నితమైన భూమండలమునకు చక్రవర్తి అయ్యాడు. ఆతడిప్పుడు బ్రహ్మజ్ఞానము పొందియున్నాడు కదా! అందుచేత అజ్ఞాని వలె కాక ...సమదర్శి అయి, శాంతమనస్కుడై వీతరాగుడై, మాత్సర్య – విస్మయములు లేనివాడై యథాప్రాప్తములైన కార్యములందు నియమితుడైనాడు.

❖

ఒకప్పుడు ఆ భగీరథుని ముత్తాతలు సగరులు గొప్ప యజ్ఞం చేశారు. ఆ యజ్ఞములో నియోగించబడిన యజ్ఞాశ్వం కనబడ లేదు. వారు భూమండలమంతా యజ్ఞాశ్వం కోసం సగరులు వెతికారు. అది పాతాళం జేరినట్లు తెలియరావటంతో, వారు భూమిని త్రవ్వటం ప్రారంభించారు. ఫలితంగా సాగరాలు ఏర్పడ్డాయి. ఆ సగరులు పాతాళం జేరారు. అక్కడ యజ్ఞాశ్వం కోసం వెతక సాగారు. అక్కడ వాళ్ళు కపిలముని ఆశ్రమం ప్రవేశించి ఆయన కోపకారణంగా శపించబడి భస్మీభూతులయ్యారు. వారిని పునీతులను చేయాలి.

ఈ విషయం గరుడుడు చెప్పగా కోసల రాజ్యంలోని కొందలు ప్రజలు విన్నారు.

ఆ వార్త మన భగీరథుని చెవినబడింది. 'మా ముత్తాతలను పునీతులుగా చేయడం ఎట్లా'? అను విషయం ఆతడు విజ్ఞులతో సంప్రదించాడు. శాస్త్రకారులు 'అయ్యా ! అందుకు ఒక్క ఉపాయం ఉన్నది. స్వర్గలోకంలోని మందాకినీ నదిని పాతాళం వరకు తీసుకుపోగలిగితే ఆ నదీజలస్పర్శచే నీ వంశీకులు పవిత్రులౌతారు. అయితే అది అత్యంత దుస్సాధ్యమైన విషయం'... అని రాజుకు తెలియజేశారు.

అప్పటికి ఇంకా గంగానది భూమిపై ప్రవహించ లేదు. అప్పుడు భగీరథుడు తన వంశీయుల సూక్ష్మదేహములను పునీత మొనర్చాలని నిర్ణయించుకున్నాడు. బ్రహ్మదేవుని కరుణకై గొప్ప తపస్సు ప్రారంభించాడు. కొంతకాలానికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు.

**బ్రహ్మదేవుడు :** బిడ్డా! భగీరథా! నీ సుదీర్ఘ తీవ్ర తపస్సుకు మెచ్చాను. నీకు ఏమి కావాలో కోరుకో.

**భగీరథుడు :** తండ్రీ! బ్రహ్మదేవా! మేమంతా మీ భావనాస్వరూపులమే కదా! నా అంతరంగమేమిటో మీకు తెలియదా? స్వర్గంలోని మందాకినీ నదిని పాతాళం వరకు జేర్చి ఆ పవిత్రజలంతో మా ముత్తాతలగు సగరుల సూక్ష్మదేహాలను పునీతం చేయాలనునది నా ఉద్దేశం.

**బ్రహ్మదేవుడు :** నాయనా! నీవు చేపట్టినది పవిత్రము, మహత్తరము అగు లక్ష్యము. కానీ అదంత సులభం కాదు.

**భగీరథుడు :** కాకపోవచ్చు. కానీ పరమాత్మ స్వరూపులగు మీ దర్శనమైన తరువాత ఇక దుస్సాధ్యాలేమి ఉంటాయి? కనుక నాకు మార్గం ఉపదేశించి ఉద్ధరించండి.

❖

ఆ తరువాత బ్రహ్మదేవుని ఉపదేశానుసారం భగీరథుడు అనేకసార్లు తపస్సు - శ్రమలకు ఓర్చి ప్రయత్నించాడు. ఈశ్వరుని, జహ్నుమునిని తపస్సుచే సంతోషింపజేసి మందాకిని భూమిపై గంగానదిగా అవతరించటానికి కారకుడయ్యాడు. ఆకాశము నుండి జగత్పతియగు చంద్రశేఖరుని శిరముపై ఆకాశగంగ ఒప్పారుటచే సాంబశివుడు గంగాధరుడైనారు. స్వర్గమున ఉండే పవిత్ర మందాకిని భూమిపై గంగగాను, పాతాళంలో భోగవతిగాను అవతరించి త్రిపథగామి అయింది. ఆ నదీజలం యొక్క స్పర్శచే సగరులు పవిత్రులైనారు.

అజ్ఞానమును తొలగించి ధర్మప్రబోధి అయిన గంగామాత తనయొక్క పుణ్యజలముతో, అనంతకాలం ఈ భూమిని, ఆశ్రితులను పవిత్రం చేస్తూనే ఉండగలదు.

చూచావా రామా ! సగరుడు, అంశుమంతుడు, దిలీపుడు మొదలైన పరాక్రమవంతులకు కూడా దుర్లభమైన గంగావతరణం ఆ వంశమున జన్మించిన భగీరథుడు తన శాంతి-తృప్తి-సమదర్శనాది గుణముల బలంతో సాధించాడు. ఆ గంగయే సగర పుత్రులకు, సముద్రమునకు కూడా సంజీవని అయింది.

ఎవరైతే పూర్ణశాంతచిత్తులై ఉంటారో, ఆత్మ తత్త్వమును అలవరచుకుంటారో ... అట్టివారికి అసాధ్యములైనవి సుసాధ్యములౌతాయి.

❖❖❖

# IX. చూడాలోపాఖ్యానం (మోక్ష నిర్వచనం)

## 1. శిఖిధ్వజ రాజ్యపాలన

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! స్థిర-సమత్వబుద్ధి అలవరచుకుంటేనే ఆత్మలాభాన్ని ఈ జీవుడు పొందగలడు. ఆయా యథాప్రాప్తములైన కర్మలను నిర్లేపబుద్ధితో ఆచరిస్తూ ఉండేవారికి అవి అధ్యాత్మయానమునకు ఏమాత్రమూ ఇబ్బంది కలిగించలేవు. ఇక ఈ కనబడే వైభవములంటావా... వీటినన్నిటినీ శిఖిధ్వజ మహారాజువలె మనస్సులో పరిత్యజించు. అట్టి మనస్సును విషయముల నుండి ఈవలకు గొని వచ్చి ఆత్మయందు నిలిపి నిశ్చలుడవగుము. ఇక ఈ భౌతికదేహమంటావా? ఇది ఏఏ క్రియలు నిర్వర్తించవలసి ఉంటోందో... అది అట్లే అగుగాక! మనస్సు మాత్రం సర్వమునకు అతీతత్వము సంతరించుకొనును గాక!

**శ్రీరాముడు:** మహర్షీ! ఆ శిఖిధ్వజుడెవరు?ఆతడు మోక్షమును ఎట్లా బడయగలిగాడు? హే బ్రహ్మజ్ఞా! మా జ్ఞానాభివృద్ధికై ఆ విషయాలు విశదీకరించమని ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామా! క్రితం కల్పంలోని ద్వాపరయుగంలో 'శిఖిధ్వజుడు' అనే అతను, ఆతని భార్య చూడాల జన్మించియున్నారు. అట్లాగే ఈ కల్పంలో కూడా రాబోయే ద్వాపరయుగంలో కూడా వారిద్దరు జన్మించి వివాహం చేసుకోబోవుచున్నారు.

**శ్రీరాముడు :** స్వామీ! పూర్వం జరిగింది. ఇప్పుడు జరుగుతుందని, ఇకపై మళ్ళీ అదే జరుగబోతోందని అంటున్నారు కదా! ఈ భూత-భవిష్యత్-వర్తమానాలకు కారణమేమిటో ముందుగా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జగత్ సృష్టి విషయంలో బ్రహ్మ మొదలైన సృష్టికర్తల 'సత్య సంకల్ప జ్ఞానము' యొక్క అనివార్యస్వభావం అంతర్లీనంగా కారణమై ఉంటోంది. ఆ అనివార్య సంకల్ప స్వభావమునే శాస్త్రకారులు నియతి అని పిలుస్తున్నారు. వస్తువులకు-కాలగతికి గల ఆ అనివార్య స్వభావమును ఎవరూ నివారించలేరు.

దృష్టాంతానికి... మామిడి చెట్టుకు అనేక ఫలములు కలుగుచున్నాయి. అవన్నీ మామిడి పళ్ళే అయి ఉంటున్నాయి. మరల అట్టివేయగు అనేక ఫలములు ప్రతి సంవత్సరం కలుగుచున్నాయి. ఆ వృక్షము యొక్క ఒకానొక మామిడిటెంక కాలక్రమేణా మరొక మామిడి వృక్షం అవుతోంది. ఆ వృక్షమును ఛిన్నం చేస్తే?... అవన్నీ తొలగుతున్నాయి. అట్లాగే...

పూర్వ సన్నివేశములనేకముల ననుసరించి అట్టివేయగు కొన్ని, వాటికి కొనసాగించు కథనాలతో వేరైన సన్నివేశాలు మరికొన్ని - ఈ వర్తమానంలో ఏర్పడుచున్నాయి. వర్తమానంలో ఏర్పడి ఉన్న కొన్ని సన్నివేశాలు రాబోవు కాలంలో మరల ఏర్పడటమో, లేక ఇక్కడి నుండి కొనసాగటమో జరుగు

చున్నాయి. అందుకే 'ఇప్పుడు సాదృశ్యమై ఉన్న కొన్ని సంఘటనలకు పూర్వకర్మలో, తత్పూర్వ సంఘటనలో కారణంగా కలిగియున్నాయి. కనుక ఇదంతా ఒక సుదీర్ఘ కార్యకారణ సంఘాతము'... అని కార్య – కారణాంతరములను పరిశీలించే కార్య–కారణ పండితులు (ఉత్తర మీమాంస కోవిదులు) సిద్ధాంతీకరిస్తూ ఉంటారు. అయితే... అజ్ఞానం తొలగిందా... ఈ సాదృశ్యము, ఈ జగదాకారం కూడా తొలగిపోతాయి.

ఒకే రకమైనవి, అనేక రకాలైనవి అయిన తరంగాలు సరోవరంలో లేచి మరల ఎక్కడో లయిస్తున్నాయి చూచావా? ఈ సంసారంలో కూడా పూర్వం తోచిన విషయములే మరల మరల తోచుచున్నాయి. మనం చెప్పుకున్న శిఖిధ్వజరాజు విషయంలో కూడా ఇట్లే జరుగుతోంది. ఇప్పుడు నేను చెప్పబోవు శిఖిధ్వజ కథనం రాబోవు ఒక ద్వాపర యుగంలో జరుగబోయేది. ఇట్టిదే క్రితం మన్వంతరములోని ద్వాపరయుగంలో కూడా జరిగింది.

నాలుగు యుగాలు గడచిన తరువాత కాలక్రమంగా చతుర్థ సృష్టి ప్రారంభమౌతుంది. అప్పుడు ఏడవ మనువు గతించి, ఎనిమిదవ మనువు అధికారంలోకి వస్తారు. ఆ చతుర్థసృష్టిలో కృత – త్రేతాయుగాలు గడచిపోయి ద్వాపరయుగం వస్తుంది. ఆ కాలంలో ఒకానొకప్పుడు ఈ కథానాయకుడు శిఖిధ్వజుడు జన్మించనున్నాడు. ఇక ఆ చరిత్ర మనం ప్రస్తావించుకుందాం.

❖

జంబూద్వీపంలో గల ఒకానొక భూఖండంలో మాళవరాజ్యం ఉన్నది. ఆ మాళవదేశపు రాజధాని ఉజ్జయిని. ఆ పట్టణంలో శిఖిధ్వజుడు జన్మించి రాజయ్యాడు. ఆతడు గొప్ప ధైర్యశాలి. సదాచారం, శౌర్యం, ధైర్యం, ఔదార్యం, శమాది సంపత్తి, మౌనం – వంటి ఉత్తమ గుణాలతో రాజ్యం ఏలుచున్నాడు. అనేక యజ్ఞములు నిర్వర్తించాడు. అనేకమంది శత్రువీరులను జయించాడు. అయినా కూడా అతడు కోమల మృదుమధుర స్వభావుడు, ప్రేమసాగరుడు, లౌకిక శాస్త్రవేత్త కూడా! అతడు అనేక ప్రజాహిత కార్యక్రమాలు ప్రారంభించి ప్రజాహితుడైనాడు. ప్రజా సంక్షేమ కార్యక్రమాల విషయంలో అక్కడి చుట్టు ప్రక్కల రాజులు ఆతనిని సంప్రదించటం, అనుకరించటం, ఉదాహరణగా తీసుకోవటం చేస్తూ ఉండేవారు. "నేను శ్రమిస్తాను. తద్వారా జనించిన సంపదను అందరికీ పంచి పెడతాను" అనునది ఆతడు సోదాహరణ పూర్వకంగా తదితర జనుల ముందుంచిన గొప్ప సిద్ధాంతం. "శాంతి, వినయం మన రాజు వద్దనే మనం నేర్చుకోవాలి" అని రాజ సేవకులు ఎప్పుడూ సంభాషించు కుంటూ ఉండేవారు. ఆతని పాలనలో దేశ సంపదలు పెరిగాయి. ప్రజలలో పొరపొచ్చాలు ఉండేవి కావు. ఆతని వాక్యములు ఇతరులకు సద్భావనను, ఐకమత్యమును, వినయ – విధేయతలను నేర్పేటట్లుగా ఉండేవి. ప్రజలు ఆ రాజును ప్రాణప్రదంగా ప్రేమించేవారు. ఆతని పాలనలో మాళవ రాజ్య ప్రజలు హాయిగా, ప్రశాంతంగా రోజులు గడుపుతూ ఉండేవారు. ఇటువంటి మహారాజు లభించటం మేము చేసుకున్న పుణ్యఫలం – అని ప్రజలు అనుకుంటూ ఉండేవారు.

ఆ శిఖిధ్వజుని బాల్యంలోనే పితృవియోగం సంభవించినప్పటికీ క్రుంగిపోలేదు. రాజభక్త పరాయణులగు మంత్రుల ఉత్తమ యోచనలతో పదహారవ ఏటనే సింహాసనం అధిరోహించాడు.

అతి త్వరలో అతని కీర్తి దేశవిదేశాలలో విస్తరించినది. ఆతడు యుక్త వయస్సులో సౌరాష్ట్ర రాజకుమారి అగు చూడాలను ప్రేమించి వివాహం చేసుకున్నాడు. వారిద్దరూ అన్యోన్యచిత్తులవటం చేత వారి ప్రేమ ప్రవర్ధిల్లింది. ఆ చూడాల మహా సౌందర్యవతి. అంతే కాదు. ఆమె గాన, నృత్య, వాద్యాది కళలలో నిష్ణాతురాలు. అనేక పూజలు, నోములు నిర్వర్తించి, చిన్న వయసులోనే తన హృదయంలో జ్ఞాన బీజాలు పొందిన మహాసాధ్వి. ఆమె శాస్త్రార్థములను గొప్ప వివేకంతో పఠించే పండితురాలు కూడా.

పార్వతీ పరమేశ్వరుల వలె, లక్ష్మీ నారాయణుల వలె ఆ చూడాల–శిఖిధ్వజులు ప్రకాశిస్తూ ఉండేవారు.

ఆ శిఖిధ్వజ మహారాజు రాజసభలో ప్రతిరోజూ దైనందిన కార్యక్రమాలు ముగిసిన తరువాత కొంతసేపు సత్సంగం జరుగుచూ ఉండేది. అందులో అనేక పురాణ కథాకాలక్షేపాలు, ఆధ్యాత్మశాస్త్ర చర్చలు చోటు చేసుకుంటూ ఉండేవి. శ్రుతి వాక్యాలు, వాటిని విశదపరచగల కథలు, చరిత్రలు ఆ సత్సంగంలో వినిపించబడుతూ ఉండటం చేత ప్రజలలో సాత్వికత, ఉత్తమాశయాలు పెంపొందుతూ ఉండేవి. ఒక్కొక్క రోజు రాజే ఆధ్యాత్మికోపన్యాసం చేస్తూ ఉండేవాడు. ఆతనికి అనేక శాస్త్ర విషయములు తెలిసి కూడా నేను 'జ్ఞానిని' అనే కించిత్తు అహంభావం కూడా ఉండేది కాదు.

ఇట్లా చాలా కాలం గడచింది. చిల్లికుండలో నీళ్ళు ఉండేదెంతసేపు? వారి యౌవనం క్రమంగా కాలముచే గ్రసించబడుచుండగా వారిద్దరూ మధ్య వయస్కులయ్యారు.

❖❖❖

## 2. ఆధ్యాత్మ శాస్త్రముల యొక్క ఆవశ్యకత

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఒక రోజు చూడాల శిఖిధ్వజ దంపతులు చంద్రకాంతిలో ఉద్యానవిహారం చేస్తూ ఒక పూలపొదల ప్రక్కన ఇసుక తిన్నెపై ఆసీనులై చల్లగా వీచే గాలులు ఆస్వాదిస్తూ ఇట్లు సంభాషించుకోసాగారు.

**శిఖిధ్వజుడు :** ప్రియసఖి చూడాలా! ఏమి ఈ విచిత్ర జగత్తు! ఈ జీవుడు శరీరమును గైకొని అనేక వ్యవహారములందు పరిభ్రమిస్తున్నాడు, బాగానే ఉన్నది కానీ.....తరంగ సమూహముల వలె ఈ దేహములన్నీ క్షణభంగురములే కదా! అక్కడి మహావృక్షం చూడు! నవనవలాడుతూ పళ్ళు వ్రేలాడుతున్నాయి. ఆ పళ్ళన్నీ పక్వమై ఒకనాటికి రాలిపోవలసిందే! అట్లాగే ఈ దేహము కూడా కొన్నాళ్ళికి వినాశనమొందటం అనివార్యమే కదా! అక్కడి తటాకంలో కలువపూలు చూచావా? వాటిపై క్షణక్షణం మంచురాలుటచే అవి ఎంతగా శిథిలమైపోతున్నాయో! అట్లాగే ఈ శరీరముపై ముసలితనం కొంచెంకొంచెంగా వచ్చిపడుతోంది. దోసిలిలోని నీరువలె ఆయుష్షు అనుక్షణం క్షయం అయిపోతోంది. ఒకవైపు ఈ భోగతృష్ణ వర్షాకాలంలోని సొరతీగలాగా పెరుగుతుంటే.... మరొక వైపు యౌవనం పర్వతం మీద నుంచి జారిపడే నదీజలం లాగా ఎచ్చటెచ్చటికో పరుగులు తీస్తోంది.!

ఈ జీవుడికి అనుభవించే శక్తి క్షీణిస్తున్నా, అనుభవించాలనే కోరిక తరగకపోవటంచేత ఈ జగద్వ్యవహారమంతా అసంతృప్తిని, దుఃఖపరంపరలను కలుగజేస్తోందే! ఈ శుష్క శరీరము ఇంద్రజాలము వలె అసత్యమైనప్పటికి ఇందులో భ్రమలకు మాత్రం కొదువలేదు.

**చూడాల :** ఓ ప్రాణనాథా! మీరు చెప్పినదంతా అక్షరాలా నిజం. తృష్ణ హృదయంలో ఆవిర్భవించి, తుచ్ఛ క్రియలందు ఆసక్తిని రగిలింపజేస్తోంది. క్రుళ్ళిన మాంసముపై ఈగలు వ్రాలునట్లు ఈ ఇంద్రియములు అల్ప విషయములపై వ్రాలి వెనుకకు మరలక, మొరాయిస్తున్నాయి.

**శిఖిధ్వజుడు :** అవును. వర్షాకాలంలో జలంపై నీటిబుడగవలె ఈ దేహములు క్షణికమైనవే కదా! వీటిని నిజమని సుదీర్ఘకాలం నిలువబోతున్నాయని నమ్మి, మనం ఏవేవో సంబంధ – బాంధవ్యములతో అనుబంధం కల్పించుకొని రోజులు గడుపుతున్నాం. పర్యవసానం? ఈ శరీరం జీవులమగు మనలను మోసం చేసి ఒక రోజు తన దారి తాను చూసుకుంటోంది.

**చూడాల :** శరీరంతోబాటే మనస్సు కూడా కృంగి, విరసభావం పొందుతోంది.

**శిఖిధ్వజుడు :** ఈ సంసారమంతా ఇంతే! ఈ ప్రపంచంలో సుందరమైనదీ, ఎప్పటికీ ఉండేదీ ఒక్కటి కూడా లేదు.

**చూడాల :** కానీ ఆశ మాత్రం చావటం లేదు.

**శిఖిధ్వజుడు :** ఓ చూడాలా! మనం ఈ సంసారమును ఎట్లాగైనా సరే... అతిత్వరలో జయించాలి.

**చూడాల :** అందుకు దివ్యౌషధం ఆధ్యాత్మశాస్త్రమే. అనగా ఆత్మజ్ఞానాన్ని ప్రతిపాదించే పాఠములే!

❖

ఆ రోజు నుండి వారిద్దరూ ఆధ్యాత్మశాస్త్రం ఆమూలాగ్రం మరింత ఏకాగ్రతతో అభ్యసించాలని నిర్ణయించుకున్నారు. ఇద్దరూ కలసి మాళవదేశంలో గల అనేకమంది శాశ్వత శాంతి పరిలక్షితులు, బ్రహ్మగతచిత్తులు, బ్రహ్మనిష్ఠులు – ఆత్మశాస్త్రవేత్తలు అగు మహనీయులను సమీపించి వారివద్ద "ఆత్మవిద్య", లేక, "భౌమావిద్య" ను వినటం, నేర్చుకోవటం ప్రారంభించారు.

జీవుని యొక్క స్థూల-సూక్ష్మ-కారణ దేహాలు; మనస్సు, దాని స్వభావం; బుద్ధి-చిత్తం -అహంకారాల నిర్వచనాలు; ఆత్మ యొక్క తత్త్వం; దేహి-దేహాల సంబంధం, అసంబంధం; ఇంద్రియాలు-విషయాలు-విషయాలతో తాదాత్మ్యం; ఈ జీవునిలోని జన్మ-జన్మాంతర విభాగం, జన్మరాహిత్య విభాగం; బంధం- మోక్షం; ద్రష్ట-దర్శనం-దృశ్యం; కర్త-హేతువు-క్రియ; జ్ఞానం -జ్ఞేయం-జ్ఞాని ...

...ఇటువంటి అనేకమైన ఆధ్యాత్మశాస్త్ర విశేషాలు దృష్టాంతపూర్వకంగా వింటూ ఉండేవారు. మరల అంతఃపురం ప్రవేశించి అనేక అధ్యయన విశేషాలన్నీ చర్చించుకుంటూ ఉండేవారు. పరస్పరం బోధించుకుంటూ, వారిద్దరూ ఆ పరమాత్మ యందే తమ ధ్యాస, ప్రీతి కలిగి ఉండేవారు. కేవలం ఆత్మారాధన యత్నమునందే నిమగ్నమై ఉండేవారు. అయినా కూడా, శిఖిధ్వజుడు రాచకార్యముల కొరకు శత్రురాజులను భయపెట్టుటలో, తమ రాజ్యములోని సంపదలను పెంపొందించుటలో,

కీర్తి-ప్రతిష్ఠలను పెంపొందించుటలో ప్రయత్నపరుడై ఉండేవాడు. ఏ కారణాల చేతనోగాని, ఆతనికి ఏకాగ్రత కొంచెం కుంటువడుతూ ఉండేది. చూడాల మాత్రం తాను విన్న ఆధ్యాత్మిక శాస్త్ర విషయాలను ఏకాగ్రచిత్తంతో రాత్రింబవళ్ళు మననం చేస్తూ ఆయా విషయాల యుక్తియుక్తములను స్వబుద్ధితో పరిశోధిస్తూ, పరిశీలిస్తూ ఉండేది. స్వతహాగా సునిశిత బుద్ధి కలిగి ఉండుటచే ఆమె తాను విన్న విషయాలను హృదయస్థం చేసుకుంటూ తన ప్రపంచదర్శనాన్ని పవిత్రం చేసుకుంటూ ఉండేది. మరొకవైపు తన భర్తకు రాచకార్యాలలో అవసరమైన సలహాలు, సహకారాలు అందిస్తూనే ఉండేది. "భర్తను సేవించటంలో ఈమెకు ఈమే సాటి" అని శిఖిధ్వజుడు తన భార్య చూడాల గురించి అనుకుంటూ ఉండేవాడు.

❖❖❖

## 3.ఆత్మ ప్రబోధం కలిగించేవే అనుసరణీయాలు!

ఒక రోజు చూడాల అంతఃపురంలోని తన ఏకాంత మందిరంలో సుఖాసీనురాలై ఇలా పర్యాలోచించ సాగింది-

**చూడాల :** ఈ శరీరం తన వ్యాపారాలలో ఉండనీ! లేక, ఏ కారణం చేతనో ఎప్పుడో ఒకప్పుడు ఊడనీ! ఇందులో విశేషమేమున్నది? నేను 'విచారణ' అను మార్గాన్ని ఇప్పుడు అవలంబిస్తాను.

❖

ఈ శరీరం కార్య-కారణ సంభూతమైనది. ఇట్టి ఈ దేహంలో ఎక్కడో త్రికాలాల చేత స్పర్శించబడజాలని మహత్తరము, సత్యము అగునదేదో దాగి ఉన్నది. అది చైతన్యం కావచ్చు, సత్-చిత్-ఆనందం కావచ్చు. పరమాత్మ కావచ్చు. 'స్వస్వరూపం' కావచ్చు ...మరింకే పేరుతోనైనా శాస్త్రకారులచే పిలువబడవచ్చు. దానిని యోగాన్ని ఆశ్రయించో (లేక) విచారమార్గాన్ని అనుసరించో, ఎట్లాగైనా సరే అనుభవపూర్వకంగా అతిత్వరలో ఎరుగవలసి ఉన్నది. అది ఎరుగవలసింది నేనే గాని మరెవరో కాదు. శాస్త్రములు, శాస్త్రకారులు, శాస్త్రప్రవచకులు, అనుభవజ్ఞులు... వీళ్ళంతా అది ఏమై ఉన్నదో నాకు గుర్తు చెప్పుచున్నారు. వారంతా మార్గదర్శకులు మాత్రమే! మార్గాన్ని అన్వేషించి, ప్రయాణించి, పొందవలసింది - నేనే గాని వారు కాదు. అట్టి త్రికాలాబాధ్యమగు నా యందలి 'సత్యం' గురించి ఇప్పుడు నేను స్వయంగా నాయందు అన్వేషించి కనుగొన యత్నించెదను గాక!

❖

ఎప్పటి నుండో తెలియదు గాని, ఈ దేహం పట్ల, దేహంలోని ఇంద్రియాలకు విషయాలగు ఈ జగత్ విషయాల పట్ల దురవగాహనతో కూడిన ఒకానొక అనుబంధం ఏర్పడి ఉంటోంది. ఆ అనుబంధం మోహాన్ని కల్పిస్తోంది. కాలక్రమంగా పుట్టి కాలక్రమంగా నశించగల కల్పిత వస్తువుల పట్ల ఆకర్షితురాలిగా చేస్తోంది. నిస్సహాయురాలనై నేను సత్యం-నిత్యం అగుదానిని ఏమరచి ఉంటున్నాను.

**కస్యాయమాగతో మోహః? కథ మభ్యుత్థితః క్వ వా?**
**దేహస్తావజ్జడో మూఢో, నాఽహమిత్యేవ నిశ్చయః ॥**

అసలు ఈ 'మోహము' అనేది ఎందుకు కలుగుతోంది? ఎవరు కల్పిస్తున్నారు. ఎట్లు, ఎచటి నుండి వచ్చిపడుతోంది? నాయందు మోహం కలిగి ఉంటున్నదెవరు? మోహానికి అతీతమై ఉన్నదెవరు? భ్రాంతి తొలగిందా ... నాయందు భ్రాంతుడు కూడా తొలగుతాడు. స్వస్థత చెందుతాడు. అసలు భ్రాంతికి నిమిత్తం ఏమిటి? మూలమేమిటి? ఏది ఏమైనప్పటికీ, ...మూఢము, జడము అయిన ఈ పాంచభౌతిక దేహం మాత్రం నేను కాదు.

ఎందుకంటే ...'నేను' అని ప్రసిద్ధమై ఉన్నది ఏది కలదో, అది జడంగా మూఢంగా ఉండటం లేదు. కాని, చిన్నప్పటి నుండీ "నేను ఒక స్త్రీని. ఈ రంగు, ముక్కుతీరు, జుట్టుగల ఆకారమును"... అని బుద్ధి వృత్తులు ఆశ్రయించి ఉండటం చేత 'నేను శరీరమును' అనే భావం ఆరూఢమై ఉంటోంది. మారుచున్న ఈ దేహం – మారని నేను' ...ఈ రెండింటినీ విడదీసి చూడకపోవటం చేత, దేహ ధర్మములను నాపై ఆపాదించుకుంటూ పోతున్నాను. ఇట్లా ఎన్ని ఉపాధులు వచ్చి పోయాయో!

నాలో బుద్ధి వృత్తులు ఉన్నాయి. బుద్ధి వృత్తులే లేకపోతే శరీర జ్ఞానమే కలిగేదికాదు. కాబట్టి శరీరం స్వయంగా జడమైనప్పటికీ బుద్ధి వృత్తులు ఈ శరీరం పట్ల భావాలూ, అభిప్రాయాలు అనుభవాలూ కలుగజేస్తున్నాయి. తద్వారా నాకు వాటితో తాదాత్మ్యం అనే వ్యాపారం ఏర్పడుతోంది.

ఇక ఈ కాళ్ళు, చేతులు, తదితర కర్మేంద్రియాల సంగతేమిటి? ...అవన్నీ ఈ దేహానికి వేరు కాని (దేహాంతర్గత) అవయవాలే కదా! అవయవాలకు, అవి చేసే కర్మలకు, వాటిని ఎరుగుచున్న జ్ఞానేంద్రియాలకు భేదం లేదు. అవయవాలు, అవయవాలతో జ్ఞానరూపమై ఉన్న 'అవయవి'... ఈ రెండు స్వయం ప్రవర్తన కలిగి ఉన్నవి కావు. కనుక రెండూ జడములే. ఈ అవయవాల వంటివే మనోబుద్ధులు కూడా.

"ఒకాయన చేతి కఱ్ఱతో రాయిని దొర్లిస్తున్నాడు" అని అనుకుందాం. కఱ్ఱతో రాయిని కదల్చునట్లు ఈ దేహాన్ని మనస్సే చలింపజేస్తోంది. మనస్సు ఇంద్రియాలన్నిటితో సంయోగం చెందే మరొక పదార్థం మాత్రమే.

అయితే మనస్సుకు స్వయంసంకల్పాత్మక శక్తి లేదు. ఆ చేయి కఱ్ఱను ప్రేరేపిస్తున్నట్లు నిశ్చయాత్మక బుద్ధి చేత మనస్సు ప్రేరేపించబడుతోంది.

చెయ్యికి కూడా స్వయంనిర్ణయాధికారం లేదు. చేయిని కదల్చే మననరూపమగు మనస్సు జడమే! ఎందుకంటే, 'మననం చేయువాడు' – ఉన్నప్పుడే కదా, మననశక్తి ప్రయుక్తమయ్యేది!

అట్లాగే బుద్ధికి కూడా తనను ప్రేరేపించు మరొక తత్త్వం ఉంది. అందుచేత బుద్ధి కూడా జడమే. ఒక పల్లపు ప్రదేశంలో జలం వేగంగా ప్రవహించునట్లు 'అహంకారము' బుద్ధిని చలింపజేస్తోంది.

అయితే, బాగా పరిశీలిస్తే అహంకారానికి కూడా స్వయంకృతమైన ఉనికి లేదు. అహంకారం అనబడేది అంతఃక్రితమే ఏర్పడి ఉన్న ఏదో తత్త్వంచే ప్రవర్తింపజేయబడుతోంది.

బాలుడు దయ్యమును కల్పించుకొని గాలిలో చూస్తాడు. అలాగే చిదాకాశస్వరూపుడనగు నేను 'ప్రాణము' అను ఉపాధిచే శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాలు పొందుచున్నాను. అనగా జీవుడే తనకు తాను జీవత్వాన్ని కల్పన చేసుకుంటున్నాడు.

కాబట్టి జీవుడు 'అహంకారం' కంటే ముందే ఉండి ఉన్నాడు. జీవుడు అనగా 'ప్రాణములు' అను ఉపాధితో కూడిన చిదాకాశము ...మాత్రమే.

ఈ "నీవు, నేను, అతడు... అనునవన్నీ చిదాకాశమునందు అనుభవమయ్యే కల్పిత అనుభవాలు మాత్రమే. బింబచైతన్యమే ఈ జీవులందరిలోనూ ప్రతిబింబిస్తోంది. కనుక జీవుని వాస్తవరూపం బింబచైతన్యమే గాని, ప్రతిబింబ ఖండము కాదు. ప్రతి జీవుడు వాస్తవానికి పరిపూర్ణుడే! పరిపూర్ణుడై కూడా ఈ 'జీవితము' అనుదాని యందు పరిమితము వలె తోచుచూ ప్రతిబింబిస్తున్నాడు. 'విషయాలను ప్రకాశింపజేయుట' అను కళంకంచే నిర్మల చైతన్యం కప్పబడి ఉంటోంది. ఆ సాక్షి చైతన్యమే "నేను జీవుడను" అని కూడా తెలుసుకొంటూ ఉంటోంది. అందుచేత నిత్యం – ఆత్మరూపం అగు 'చిత్‌స్వరూపము' వలననే 'జీవుడు' అనువాడు జీవిస్తున్నాడు. అంతేగాని జీవుడనువాడు స్వయంప్రకాశకుడు కాడు. కనుక జీవుడనబడువాడు కూడా జడమే!

వాయువు వలన సువాసనలు ప్రసరిస్తున్నాయి. పల్లం వలన నీరు ప్రవహిస్తోంది. చిద్రూపమే దృశ్య విషయములందు ప్రసరిస్తూ, భ్రమలను కలిగి ఉంటూ జీవునకు జీవనమైయున్నది. అనగా తాదాత్మ్యాభ్యాసం చైతన్యమును జడంగా ప్రదర్శిస్తోంది. జీవభ్రాంతిని కల్పిస్తోంది. ఆహాఁ! ఇన్నాళ్లూ నేనెక్కడ నిద్రిస్తున్నానో తెలిసింది. ఏ ఉపాయాలు అవలంబిస్తే అవిద్యావరణం తొలగి దృశ్యస్వప్నం నశించి చైతన్యమునకు ప్రబోధం లభిస్తుందో ...అవియే ఇప్పుడు నాకు అనుసరణీయాలు.

❖❖❖

# 4. తనయందు తానై ఉన్న ఆత్మసత్త

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వింటున్నావా రామచంద్రా! ఇట్లా చూడాల చింతించ ప్రారంభించింది. క్రమంగా ఆత్మతత్త్వమును గ్రహించింది.

❖

**చూడాల :** ఆహా! ఏమి నా అదృష్టం! చాలాకాలం తరువాత నిర్మలమగు జ్ఞానమును నేనిప్పుడు గ్రహించగలిగాను. ఆత్మయోగమును ఆశ్రయించిన తరువాత ఇక చ్యుతికి అవకాశమెక్కడున్నది? ఆత్మ స్వరూపము గ్రహించుటచే సర్వము ప్రాప్తించినట్లే! ఇక కోరుకోవలసినదేమున్నది?

ఈ మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఇవన్నీ చిద్విలాసం యొక్క పరిచ్ఛేదానికి హేతువైనట్లు కనిపించినప్పటికీ... అసత్తచే ఈ ప్రపంచమంతా ద్వితీయచంద్ర భ్రాంతి వలె కల్పితమాత్రమే కదా! వాస్తవానికి ఇక్కడ సత్తస్వభావమగు 'మహాచైతన్యం' ఒక్కటి మాత్రమే వెలయుచున్నది. అది కళంక రహితం. ప్రతి ఒక్క జీవుని శుద్ధస్వరూపం. సంవేదన మాత్రం. అది భూమానందస్వరూపం. మంగళ స్వరూపం. అది తనను తానెప్పుడూ త్యజించటం లేదు. కనుక అచ్యుతం. అవిద్య తొలగిన మరుక్షణం ప్రకాశించేది అదే ! అది నిత్యోదితం. 'బ్రహ్మము, పరమాత్మ' అని వేదాంతాది అధ్యాత్మ శాస్త్రములచే పేర్కొనబడుచున్నది అదే.

1.చిత్తం, 2.చేత్యం(దృశ్యం), 3.చేతనం – అనే త్రిపుటి ఆ మహాచైతన్యం కంటే ఎప్పుడూ వేరు కాదు. ఆ సాక్షీభూత మహాచైతన్యమే త్రిపుటికి ఉనికిని, ఉత్తేజాన్ని కలుగజేస్తోంది. మహాచైతన్యం యొక్క పాత్ర లేకపోతే త్రిపుటి తనంతట తానుగా ఏమీ చేయజాలదు. ఒక దానిని మరొకటి స్పర్శించ జాలవు. సాక్షిచైతన్యం త్రిపుటికి ముమ్మందుగానే ఉంది. కనుక అది ఆద్యచిత్. అది త్రిపుటి జనితాలగు ప్రమాణాలపై ఆధారపడి ఉన్నది కాదు.

ఆ మహాచైతన్యం యొక్క అక్షయరూపం ఏమిటి? విషయరహితమగు 'చిత్' తత్త్వమే కదా! అదియే మనస్సు–బుద్ధి–ఇంద్రియాలు గాను, ఇంద్రియాలకు గోచరమగుచున్న విషయాలు గాను విస్తరిల్లుచున్నది. 'మనో–బుద్ధులు' అనే రంగు వేసుకున్న మరుక్షణమే భూత–భౌతిక పదార్థాలతో కూడిన దృశ్యం యొక్క సత్త ఆవిర్భవిస్తోంది. కాబట్టి... 'జగత్‌సత్త' అను శబ్దార్థాన్ని కలిగి ఉన్న ఈ పదార్థాలన్నీ కూడా మహాచైతన్యం యొక్క రూపాంతరాలే అయి ఉండాలి కదా! స్ఫటికంలో దృశ్యం ప్రతిబింబించవచ్చు గాక! కాని దృశ్యం స్ఫటికాన్ని స్పర్శించలేదు కదా ! ఆ మహాచైతన్యం కూడా తాను నిర్లిప్తంగా ఉంటూనే తన యందు 'భావపరంపరలు' అను ప్రతిబింబాన్ని కలిగి ఉంటోంది. జగత్ సత్తగా వ్యవహారసత్తగా స్ఫురిస్తోంది. అనగా, మహాసత్తకు రెండు రూపాలున్నాయి.

1. మూర్తము (Form) ; 2. అమూర్తము (Formless)

ఉభయము అయి ఉండటం చేత అద్దానిని 'మూర్తి' అని పిలుస్తూ ఉంటారు.

కాబట్టి ఈ ఎదురుగా కనబడే జగత్తు మహాచైతన్యం యొక్క వివర్తశక్తి వలననే నిలబడి ఉండ గలుగుతోందని చాలా తేలికగా తెలిసిపోతోంది. 'మాయ' కంటే వేరుగా ఈ జగత్తు యొక్క సత్త సంభవించ జాలదని స్పష్టంగా నిరూపణమౌతోంది. ఆభరణాలన్ని బంగారంతో తయారవుతున్నాయి. ఆభరణంలోని ఆకారం వదిలేసి చూస్తే మిగిలేదేది? బంగారమే కదా! దృశ్య సత్త యొక్క నామరూపాలు నశించినప్పుడు (ప్రళయ సమయంలో) బ్రహ్మత్వమే స్వయంగా శేషించుచున్నది. ఇంకొకరకంగా చెప్పాలంటే ...మాయ తొలగగా, ఇక ఆత్మసత్తే ఆనందైక రసస్వరూపంగా తనను తాను అనుభవిస్తోంది.

❖❖❖

## 5. నిర్మలశాంత స్వరూపం

జాగ్రత్‌లో ఈ మనస్సు ఇంద్రియాలలో ప్రవేశించి అనేక విషయాలు దర్శిస్తోంది, అనుభవి స్తోంది. స్వప్న సమయంలోనో? ఇంద్రియాలు మౌనం వహించి ఉంటున్నాయి. అయితే ఏం? మనస్సు తనకు తానే మహాసముద్రమై 'స్వప్నానుభవాలు' శబ్ద–స్పర్శ–రూప–రస–గంధ సంబంధమైన భావనా తరంగాలను తనయందు పొందుతోంది. స్వప్నద్రష్ట స్వప్నం కంటే వేరుగా ఉంటున్నాడు, వేరుగా ఉంటూనే... తనకు తానుగా ఇటు స్వప్నంలోనూ, అటు జాగ్రత్‌లోనూ అనేక భావనా తరంగాలలో ప్రవేశ నిష్క్రమణాలు నిర్వర్తిస్తున్నాడు. అయినా కూడా, ద్రష్ట ద్రష్టగానే ఉంటున్నాడు గాని మరింకొకటిగా అగుచుండుటలేదే !

మహాచైతన్యంలో సృష్టి లేదు. అయినా అందు జగత్తు ఉదయించినట్లు (అజ్ఞానదృష్టికి) తోచుచున్నది. చిద్రూపమగు ఆత్మ స్వప్నంలోనూ, జాగ్రత్‌లోనూ కూడా తన యొక్క కల్పిత రూపాలనే దృశ్యం నందు గాంచుచున్నది. పూర్ణచిదాత్మ కంటే ఎక్కడా ఏదీ లేదు. అహంభావ రహితమగు చిన్మాత్రయే సర్వత్రా వ్యాపించి ఉన్నది.

**న తస్య జన్మమరణే, న తస్య – సదసద్గతీ ।**
**న నాశః సంభవత్యస్య, చిన్మాత్ర నభసః క్వచిత్॥**

ఆ మహాచిత్ (లేక) చిన్మాత్రం (లేక) స్వస్వరూపానికి జనన–మరణాలు లేవు. అది ఎక్కడా ఏ మాత్రం పరిచ్ఛిన్నమే అవటం లేదు. ఆ చిన్మాత్రాకాశానికి ధ్వంసం అంటూ లేనే లేదు. అట్టిది అసంభవం అయి ఉన్నది.

**అచ్ఛేద్యోఽ యమ్, అదాహ్యోఽ యమ్ చిదాదిత్యో అతినిర్మలః ।**
**అహో ను చిరకాలేన శాన్తాస్మి పరినిర్వృతా ॥**

ఆ చిదాదిత్యుడు అత్యంత నిర్మలుడు. ఆతనికి ఛేదన – దహనములు లేవు. ఉండవు. నేను చిత్ సూర్యుడిని. అంతేగాని ఆయన ప్రతిబింబించే 'జీవుడు' అను ప్రతిబింబాన్ని ఎట్లా అవుతాను? సర్వదా స్వప్నద్రష్టనేగాని, స్వప్నంలో కనిపించే అనేకరూపాలుగాని, ఆ అనేక స్వప్నాంతర్గత రూపములలో ఒకానొకరూపంగాని ఎట్లా అవుతాను? అవను.

సూర్యబింబం సూర్యబింబంగానే ఉంటుంది. "నీటిలో సూర్యబింబం ప్రతిబింబిస్తోంది కాబట్టి ఆకాశంలోని సూర్యుడు నీటిలో ప్రవేశించాడు" అని ఎవరైనా అనగలరా? ...అంటే మాత్రం అది నిజమా?... కాదు. నేను బుద్ధిలోను, మనస్సులోను ప్రతిబింబిస్తున్నంత మాత్రం చేత నా యొక్క మహాచైతన్య స్వరూపం పోగొట్టుకుంటున్నానా? లేనేలేదు.

ఇక జరిగిపోయిన జీవభ్రమల గురించి ఆలోచించవలసిన పని నాకు లేదు. ఆహా! నేడెంత సుదినం! ఇప్పుడు నేను భ్రమరహితమగు నిర్వాణమును పొందుచున్నాను! ఆత్మాకాశమంతా ఆవరించి ఉన్నది నేనే! అట్టి నా వాస్తవ స్వరూపంలో దృశ్యాభాస లేదు. నేను సర్వదా అత్యంత నిర్మలము, అజము, అచ్యుతము అయి ఉన్నాను. నా స్వరూపవిస్తారంచే ఈ పధ్నాలుగు లోకాలు, ఈ చరాచర జగత్తు సర్వదా నింపివేయబడియున్నది.

నా యొక్క నిజస్వరూపము బాధారహితమైనది. నిర్మలమైనది. సర్వదృశ్య పదార్థములకూ పరమైనది. దేశ–కాల–వస్తువులచే అపరిచ్ఛిన్నమైనది. ఈ నా స్వరూపము అనంతము.

బ్రహ్మం నుండి వెలయు ప్రాణులు, వారి కర్మఫలాలు, ఆ ఫలాలను సంపాదించటానికి ఏర్పడి ఉన్న సాధనాలు, ఫలరహిత క్రియలు ...ఇవన్నీ బ్రహ్మం నందు జడమాత్రాలై స్వయంగా ఆత్మాకాశ రూపాలే అయి ఉన్నాయి. ఈ కనబడే దేహాలు, ఇందలి దేహులు, ఈ నా దేహం, ఇందలి 'చూడాల' అని చెప్పబడు ఈ దేహి ...ఇవన్నీ ఆత్మాకాశరూపాలే! అందువల్ల ఈ జగత్తంతా అకృత్రిమ చైతన్యమే అయి ఉన్నది. కుమ్మరివాని బొమ్మలు, వాటి కదలికలు ...అంతా మన్నే కదా !

**ద్రష్ట-దృశ్యమయీ సత్తా చిన్మాత్రైక్యమయీ తథా,**
**ఇదమైక్యమ్-ఇదమ్ ద్విత్వమ్ అహం-నాఽహమితీతి చ ॥**
**క ఇవ భ్రమ సంమోహః? కథం కస్య కుతః క్వ వా?**
**స్వమనస్తమనాయాసం ఉపశాన్తాస్మి సంస్థితా ॥**

అట్లే ద్రష్ట-దృశ్యమయ ఈ జగత్తంతా చిన్మాత్రం మాత్రమే. 'ఇది ఏకం, అది అనేకం, ఇది నేను, అది నేను కాదు'... అను వాటికి ఇంకా ఆయా తదితరములైన భ్రమ సమ్మోహాలకు స్థాన మెక్కడ? ఆ భ్రమలు ఉన్నదెవరికి? అవి ఎందువలన ఎచ్చటి నుండి రాగలవు? ఇక అవన్నీ లేనివే!

ఆత్మ ఒక్కటే సత్యము. లేనివాటిని పొందట మేమిటి? తొలగించుకోవట మేమిటి? నేను ఎప్పటికీ కూడా అనంత పరమార్థస్వరూపాన్నే! కనుక, శాంతియే నా స్వభావమై ఉన్నది.

❖

ఇప్పటికి నేను 'మోక్షసుఖం' అనగా ఏమో గ్రహించాను. నా స్వస్వరూపమున వెలయుచున్నాను. అజ్ఞానకాలంలో కూడా నేను నెలకొని ఉన్నది నా యందే కదా! అయితే నేను నా వాస్తవ స్వరూపాన్ని కించిత్తు ఏమరచాను... అంతే! ఆ కారణం చేత ఇప్పుడొచ్చే లోటేమీ లేదు.

ఈ కనబడుచున్న చేతనాచేతనములు... వాటిని అనుభవించుచున్న భావములు... ఇవన్నీ ఆత్మకు అభిన్నములై ఆత్మాకాశముననే వెలయుచున్నాయి. 'ఇది, నేను, అతడు' మొదలైనవన్నీ భావనా మాత్రములే. ఆత్మయో, భావనకు ముందే ఉన్నది. అది పరమశాంతము, నిరాలంబము, కేవలము, పరస్వరూపము, శుద్ధము, సర్వము – అయి వెలయుచున్నది.

ఆత్మ తప్పితే ఇక్కడగాని, మరెక్కడా గానీ ఏదీ లేదు. నేనే ఆ ఆత్మను!

ఇట్లు చూడాల పరమాత్మతత్త్వమును గ్రహించింది. రాగము, మోహము, తమోవిలాసము... అనే అవస్థాత్రయం నివృతమై, నిర్మలశాంతి స్వరూపమున ఆమె విరాజిల్లింది.

❖❖❖

# 6. చూడాల స్వకీయ విచారణ

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ చూడాల ఒకవైపు తన భర్త శిఖిధ్వజునికి రాజ్యపాలన విషయాలలో చేదోడు వాదోడుగా సహకరిస్తోంది. మరొకవైపు కొంచెం సమయం దొరికినప్పుడల్లా ప్రతీరోజూ తాను ఆత్మ శాస్త్రవేత్తల దగ్గర వినియున్న భౌమావిద్య, లేక ఆధ్యాత్మవిద్యను సునిశితబుద్ధితో పరిశీలిస్తూ ... "నేనే ఆ అఖండము, అప్రమేయము, అగు నిర్మలాత్మను. నాకు అనుభవమయ్యేదంతా నా స్వరూప విస్తారమే!"...అను అనిర్వచనీయానుభవమును, సాక్షీ మహత్త్వమును స్థిరీకరించుకుంటూ ఉండేది. అంతర్వృత్తి చేత తన స్వాభావికమైన 'స్వాత్మారామము'ను ఆశ్రయించి ఆత్మతత్త్వం నందు స్థితి కలిగి ఉండేది. ఆమె యథాప్రాప్తములైన కార్యాలను, దినచర్యలను ఏవీ త్యజించలేదు. అయితే రాగ-ద్వేష-సంగ వర్జితమైన, నిర్ద్వంద్వమైన, ఇచ్ఛారహితమైన, సుసమగ్రమైన అవగాహన – అంతరంగ

సంస్థితత్వం మాత్రం పెంపొందించుకుంటూ ఉండేది. సందేహ జాలములను త్యజించివేస్తూ సంసార సముద్రమును ఆత్మస్వభావౌన్నత్యముచే అధిగమించసాగింది. పరమాత్మజ్ఞాన లాభముచే లభించే 'పరమపదము' నందు విశ్రాంతి పొందుతూ ఉండేది.

మనం ఆమె మనోస్థితి గురించి ఎంతగా చెప్పుకున్నప్పటికీ ...అది ఉపమానాలన్నిటి కన్నా అతీతమైనది. కనుక 'అనిర్వచనీయం' అనక తప్పదు. ఈ విధంగా ఆ రాజపత్ని అత్యల్ప కాలంలో 'ఆత్మజ్ఞాన సంయుక్త' అయినది. ఆమెకు అంత స్వల్పకాలంలో అది ఎట్లా సాధ్యపడింది?'...అని శ్రోతలెవరైనా ఆశ్చర్యపడతారేమో! ...అజ్ఞాని యందు అకస్మాత్తుగా ఎట్లా సంసార భ్రమలు ప్రవేశిస్తు న్నాయో ...జ్ఞాని యందు అంతే వేగంగా, అంతే అకస్మాత్తుగా ఆ అజ్ఞాన వీచికలు (శీఘ్ర గతిని) వినాశన మొందుచున్నాయి. ఆ చూడాల 'ప్రతి ఒక్కని స్వగృహమే'... అన తగిన ఆత్మపదము నందు విశ్రాంతి పొంది, శరత్కాల మేఘపంక్తి వలె శోభిల్లింది.

ఓ రాఘవా ! ఒక గోవు పచ్చగడ్డి, నీరు గల ఒక విస్తార ఏకాంత ప్రదేశం పొందిన తరువాత ఇక వ్యాకులతకు కారణమేముంటుంది? 'జాగ్రత్' ఆదిగా అవస్థలన్నిటిలో సాక్షీభూతమై, జాగ్రదాది ఆయా అవస్థలచే బంధింపబడ జాలనిదై, సదా-సర్వత్రా ఏకమై ఉండే ఆత్మతత్త్వము నందు స్థిరులైన వారికి ఇక వ్యాకులత యొక్క అగత్యం ఉంటుందా? ఉండదు. స్వవివేకం యొక్క పూర్ణానంద స్వరూపం ఆమె యందు ఆవిర్భవించింది. ఇక ఆ చూడాల యొక్క స్వభావం నూతన పుష్పలత వలె శోభించింది. ఆమె ముఖంలో బ్రహ్మానందం యొక్క ప్రభావ వీచికలు 'వర్చస్సు'గా ప్రకాశించసాగాయి.

❖

ఒక రోజు శిఖిధ్వజుడు తన భార్య చూడాల ముఖంలో వెల్లివిరుస్తున్న ఆనందశోభను చూచి కించిత్ ఆశ్చర్యచకితుడైనాడు.

**శిఖిధ్వజుడు:** ఓ ప్రియ లలనా! చూడాలా! ఈ మధ్యగా నీ ముఖాన ఏదో నూతనోత్సాహం, నూతన కాంతులు విరజిమ్ముచున్నవే! మరల లేతయౌవనం పొందిన దాని వలె, పూర్ణచంద్ర శోభతో వెలుగొందుచున్నావే?

అమృతం తాగినప్పుడో, ప్రపంచ మొత్తానికి మహారాణివయినప్పుడో ముఖం ఎట్లుంటుందో... నీ వట్లు కనబడుచున్నావు. నీ శరీరంలో శాంతి, సౌందర్యం, గొప్ప శోభ ప్రకాశిస్తున్నాయి. భోగాశ త్యజించి, 'సమత్వం' పొందిన మునివరేణ్యుల వర్చస్సు నీలో ప్రస్ఫుటమౌతోంది. ఒకానొక గంభీరత్వం, పూర్ణత్వం నీలో ద్యోతకమౌతున్నాయి.

ఓ ప్రియురాలా! పరిహాసంగా అడుగుచున్నాను... నీ మనస్సు ఈ ముల్లోకాలలోని అమృతాన్ని అంతా గ్రోలి, ఆత్మానందశోభచే ముల్లోకాలను తృణప్రాయం చేసివేసిందా ఏమి? నీ కళ్ళలో ప్రపంచం లోని సౌమ్యం, సంతృప్తి, ప్రశాంతత అంతా వచ్చి కాపురం చేస్తున్నట్లుగా ఉందే? ఎండమావుల జలభ్రమ తొలగినప్పటి ఎడారి ప్రదేశంలాగా, క్షీరసాగరం సంతరించుకుని ఉండే పూర్ణత్వంలాగా, ఆనందసారంతో కూడుకుని నీ చిత్తం చమత్కారంగా ప్రభవిస్తున్నట్లు నా కనిపిస్తోంది. ఈ నీ శరీరం

ఇతఃపూర్వానిదే అయినప్పటికీ ఇప్పుడు అనిర్వచనీయ చిదానందసమన్వితమై బ్రహ్మానందప్రదమై మా అందరి కళ్ళకు కనిపిస్తోంది.

ఏమిటి విశేషం చెప్పు? దేవతలు ప్రత్యక్షమై అమృత కలశములను నీచే త్రాగించారా? నీ యొక్క హఠయోగసాధనచే మృత్యువుకు కూడా అందజాలనట్టివి అగు అలౌకిక శక్తులేవైనా సంపాదించావా? చింతామణిని గాని, త్రైలోక్యములపై ఆధిపత్యాన్ని గాని ఏ విష్ణువో ప్రత్యక్షమై ప్రసాదించలేదు కదా?... అసలు విశేషమేమిటో నీ నుండి నేను వినాలని కొద్ది రోజులుగా అనుకుంటున్నాను. ఏదీ, చెప్పవూ?

**చూడాల:** ఓ ప్రియ రాజా! నా యందు మీకు నూతన తేజోసమన్వితమైన వర్చస్సు, ప్రశాంతత ద్యోతకమవటానికి నేనెరిగి నంత వరకూ కారణమేదై ఉండి ఉన్నదో అది చెపుతాను... వినండి.

మూఢత్వం వహించినప్పుడు జీవులకు ప్రియంగా తోచే దేహాత్మభావాన్ని నేను త్యజించాను. నిరాకారం, సంపూర్ణం అయినట్టి బ్రహ్మాత్మభావనను జ్ఞానబలంతో ఆశ్రయించాను. తత్ఫలితంగానే ఈ భౌతిక దేహంలో మీకు ఒకానొక అనిర్వచనీయ వర్చస్సు లేక శోభ కనిపించటం జరుగుతోంది.

ఈ దేహంతో సహా ఈ చరాచర జగత్తులో ఉన్నవన్నీ పరిచ్ఛిన్నం, కాలగతిని అనుసరించి రాక-పోకలు కలవి అయి ఉన్నాయి కదా!

వీటిని మనస్సులో పరిత్యజించాను. అట్టి పరిత్యాజ్యానంతరం శేషించియున్న నిర్మలమనస్సుతో ...భూత-వర్తమాన-భవిష్యత్తులలో ఒకే విధంగా వెలుగుచూ, ఈ మూర్త-అమూర్త ప్రపంచానికి సంబంధించనట్టి 'అపరిచ్ఛిన్న బ్రహ్మం' ను ఆశ్రయించి ఉన్నాను. ఏ ఆత్మ అయితే ద్రష్ట దృష్టిని అనుసరించి సృష్టి సమయంలో కొంచెం పరిచ్ఛిన్నంగాను, లయకాలంలో పరిచ్ఛిన్న రహితంగానూ కన్పట్టుచున్నదో... కానీ యథార్థానికి సర్వదా నిరాకారము, నిరాలంబమో అట్టి ఆత్మను గాంచుచున్నాను. అనగా నిరాకారకూటస్థ భౌమానందము అగు సుమధుర స్వభావమును అభ్యసిస్తున్నాను.

ఇప్పుడు నేను అనుభవిస్తున్న భోగములచే ఎట్లు సంతుష్టురాలనై ఉంటున్నానో... అట్లాగే అనుభవించని భోగాల పట్ల కూడా సంతుష్టియే కలిగి ఉంటున్నాను. ఎందుకంటే నా స్వరూపం చేతనే నాకు సంతుష్టి కలుగుచుండుటచే, సంతుష్టియే నా స్వరూపమగుచున్నది. దృశ్య విషయాల సంసర్గం కలుగుట చేతగాని, కలుగకుండుట చేతగాని నాకు సుఖ-దుఃఖాలు ఏర్పడవలసిన అగత్యమే లేదని గ్రహించాను. ఆకాశం వలె స్వచ్ఛమై 'కేవల హృదయస్థితి'ని పొందుచున్నాను. దృశ్య సంపర్కం లేని మనస్సుచే ఏకాకినై సర్వమునందు క్రీడించుచున్నాను.

ఈ రాజ్యలీల నందు నేను ఉండియే ఉండలేదు. ఈ దేహమునందు ఉన్నంత మాత్రం చేత నా యొక్క 'పూర్ణాత్మస్థితి'కి వచ్చే లోటేమీ లేదు. ఈ భోగాలతో గాని, ఇక్కడ తారసపడే తదితర విషయాలతో గాని నాకు ఏనాడూ సంబంధం లేదు. లజ్జ-అభిమానం-కోపం-భయం నాకు లేవు. నాకు సంబంధం లేని వాటిచే నేను బంధింపబడటమేమిటి? ...కనుక నాకు బంధమూ లేదు, మోక్షమూ లేదు.

నేను స్వతహాగా ఆకారరహితుడనైనప్పటికీ ఈ అనేక బ్రహ్మాండములకు ప్రభువునై ఉన్నాను. ఆత్మచే ఆత్మయందు పూర్ణప్రభతో వెలుగొందుచున్నాను.

'అధిష్ఠానదృష్టి'తో చూస్తే... ఈ దేహాదులన్నీ నేనే. నేను నిత్య సత్యమై ఈ దేహాదులందు ప్రసరించి ఉన్నాను. 'అపవాద దృష్టి' ప్రకారం ఇవేమీ నేను కాదు. 'దేహాత్మ దృష్టి'తో ఈ దేహ-మనో-బుద్ధులేవీ సత్యమే కాదు.

వెయ్యేల?... అంతయూ నేనే! సర్వతత్వాత్మకుడను! ఇదేమియూ నేను కాదు! సర్వతత్వ విదూరుడను! నేనిప్పుడు సుఖాన్ని కోరుటలేదు. దుఃఖానికి వాపోవుట లేదు. అర్థమును వాంఛించుట లేదు. అనర్థమును ద్వేషించుట లేదు. యథాప్రాప్తములైన వస్తువులతో సంతృప్తిని పొందుచున్నాను.

రాగద్వేషము లనేవి లేనట్టి బుద్ధితో 'శాస్త్రదృష్టి' అనే స్నేహితురాలితో కూడి ఈ జగత్తునందు విహరిస్తున్నాను.

ఓ ప్రాణనాథా! ఈ నేత్ర ప్రకాశంచే తదితర ఇంద్రియాలచే, ఈ మనోబుద్ధులచే నేనేమేమి చూస్తున్నానో, పొందుచున్నానో, అనుభవిస్తున్నానో... అదంతా మిథ్య అయి ఉన్నది. అందుచేత ఈ ఇంద్రియ - మనోబుద్ధుల నుండి వియోగం పొందినదాననై, ఆ 'నిష్ప్రపంచవస్తువు'ను నా యందే గాంచుచున్నాను.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఆ చూడాల ఆత్మయందు విశ్రాంతి పొందుతూ చెప్పే వాక్యాలలోని అంతర్గత ఆత్మానుభవరసాన్ని శిఖిధ్వజుడు గమనించనే లేదు. చిన్నపిల్లలు పెద్ద-పెద్దమాటలు మాట్లాడుచున్నప్పుడు తండ్రి చూపే అవహేళనను మాత్రం ప్రకటించాడు.

❖

**శిఖిధ్వజుడు:** ఓ ప్రియురాలా! నీవు బాలికవు కనుకనే ఇటువంటి అసందర్భమైన మాటలను, పాత్యాంశాల వలె వల్లిస్తున్నట్లు చెప్పుచున్నావు. అటువంటి పిచ్చి ఆలోచనలను కట్టిపెట్టి, ఇంతవరకూ ఏ రాజ్యవ్యవహారంలో నాతోబాటు పాల్గొనుచున్నావో, అట్లే ఈ కార్యక్రమాలను కొనసాగించు.

ఏమిటి నీవన్నది? ప్రత్యక్ష సద్రూపమైనట్టి ఈ ఆకారమును త్యజించి... అప్రత్యక్షమై, ఊహా సంబంధితమైన నిరాకారాన్ని ఆశ్రయిస్తున్నావా? శూన్యంచే శోభిస్తున్నావా? అనుభవించునట్టి భోగాలచే సంతుష్టి పొందుచున్నావా? అనుభవించని వాటిచే కూడా సంతుష్టి పొందుచున్నావా?

మూర్ఖురాలి వలె శయ్యా-ఆసనము త్యజించి ఎక్కడో వెతకటమా? ఈ మిత్రభృత్యాది రూపాలను, రాణివాసపు భోగాలను, వాటికి సాధన భూతాలగు ధనాధులను పరిత్యజించి పిశాచి వలె ఎక్కడో సంచారం చేయడం ఉచితమని నీ అభిప్రాయమా? ఎవరు చెప్పారీ మాటలు? జ్ఞానులు ప్రవచనాలన్నీ విని నేర్చుకున్నది ఇదా? 'మోక్షం' అంటే ఏవో ఉబుసుపోని ఆలోచనలనుకున్నావా? ఏదో కోపం వచ్చి వస్త్ర, భోజన, శయ్య, త్యజిస్తేనూ, మొండిగా ఆకలి దప్పికలను సహిస్తేనూ మోక్షం వస్తుందా?

నేను దేహమునకు అన్యమైన విషయమును... ఇవేమీ నేను కాదు... ఇవన్నీ నేనే... ఇవి నాలో లేవు... వీటన్నిటిలో నేనే ఉన్నాను... వీటన్నిటికీ, వేరై నేనెక్కడో ఉన్నాను... ఇటువంటి

పరస్పర వ్యతిరేకార్థ వాక్యములు స్వీకరించి ఏం సాధిద్దామనుకుంటున్నావు? నీవు ప్రయాణించేది ఎటో నీకైనా తెలుసా?

'కళ్ళకు కనిపిస్తున్నదంతా మిథ్య. ఇందులో నేను చేస్తున్నది మరొకటి'... ఇట్టి అసద్వాక్యముల ప్రేలాపన ఏ జీవునికైనా శోభ అవుతుందా? ఇన్ని జ్ఞాన విషయాలు విన్నావు. నీతో బాటు నేనూ విన్నాను. జీవించి ఉండగానే శ్రమించి సాధన చేసి ఉత్తమ బుద్ధిని సంపాదించుకోవాలి కదా! అది మానివేసి 'మనస్సు, బుద్ధి వదిలేశాను. మనో బుద్ధులను త్యజించి మరొకచోటకు చేరుచున్నాను' ...అని అంటున్నావే?

ఓ చూడాలా! నీవు మాట్లాడే మాటలు తాత్త్వికోపన్యాసం వినిన ఐదుసంవత్సరాల బాలిక మాట్లాడుచున్నట్లున్నాయి గాని, నీవంటి ప్రౌఢ మాట్లాడాల్సిన మాటలుగా లేవు. వాక్యాలకు పెడర్థం కల్పించుకొని పిచ్చిదానివి కావద్దు. ఉచితానుచితాలు నాకు తెలియవా? పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టి నా వలెనే రాజ్యవిషయాలు చూచుకుంటూ తపస్సు, ధ్యానం చేయి. ఇంకా తాత్త్వికోపన్యాసాలు విను. అంతే గాని, మనస్సును చెదరగొట్టుకొని పిచ్చిదానివై వీధుల వెంట తిరుగు మార్గంలోకి వెళ్ళకు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఆ విధంగా శిఖిధ్వజుడు ఆ చూడాల మాటలకు కొంచెం కోపం, అపహాస్యం ప్రకటించి, పకపకా నవ్వుతూ ఆ చూడాల చెయ్యి పట్టుకొని ఆ రోజు అవశ్యం నిర్వర్తించవలసియున్న సభాకార్యక్రమ నిర్వహణకై అక్కడినుండి బయల్వెడలాడు. చూడాల తన ప్రియపతి శిఖిధ్వజుని వెంటనంటి అడుగులు వేస్తూ ఆ సమయంలో ఇట్లా అనుకున్నది.

❖

**చూడాల:** (తనలో) అయ్యో! నా ప్రియుడైన ఈ రాజు ఆత్మయందు విశ్రాంతి పొందకపోవుటచేతనే నా వాక్యార్థములను గ్రహించలేకపోయాడు కదా! దృశ్యముపై అపేక్ష, అల్పావగాహన, అసమగ్రమైన అభిప్రాయములు ఉన్నంతవరకూ ఆత్మానుభవమునకు సంబంధించిన ఉత్కృష్టవాక్యములు పిచ్చివాని మాటలవలెనే అనిపిస్తాయి కాబోలు. సరే! ఇప్పుడు చేసేదేమున్నది? సముచితమైన సమయం ఆసన్నమైనపుడే ఈయనకు చెప్పటం మంచిది కదా!

❖

ఇట్లు చింతించుచూ తాను కూడా భర్త వెంట సభలో ప్రవేశించింది. యథారీతిగా ఆయా రాచకార్యములు నిర్వర్తించుటలో భర్తకు ఉపాయములు, యోచనలు, అభిప్రాయములు అందించింది. ఆ తరువాత కూడా యథావిధంగా తన ఆత్మచింతనావ్యాపారమునందు సంలగ్నచిత్త అయి, రోజులు గడపసాగింది. రెండు వేరు వేరు దృక్పథాలు - ఆశయాలు కలిగి ఉన్న వారిరువురూ తదితర సర్వ విషయాలందూ లోకరీతిగానే (లౌకిక వ్యవహారాలన్నీ) నిర్వర్తిస్తూ ఉన్నారు.

ఒకసారి శిఖిధ్వజ మహారాజు శత్రురాజులను జయించటానికి మూడు సంవత్సరాల కాలం విదేశాలకు వెళ్ళవలసి వచ్చింది. ఆ మూడు సంవత్సరాలు చూడాలయే రాజస్థానంలో ఆయా రాచ కార్యములు నిర్వర్తిస్తూ ఉండేది. ఆ సమయంలో నిత్యతృప్త అయి, ఇచ్ఛారహిత అయి అఖండము

– అప్రమేయము – నిత్యము అగు ఆత్మాభ్యాసం ("నేనే ఆత్మను" అను సమాధి యొక్క అభ్యాసం) కొనసాగిస్తూ ఉండేది. ఒక రోజు ఆమె మానసికాకాశంలో ఆకాశగమన ఇచ్ఛ స్వయంగా ఉద్భవించింది. అందుచేత ఆ రాజపుత్రి అప్పటికప్పుడే రాజ్యాన్ని వదలి ఒకానొక నిర్జన స్థానం ప్రవేశించింది. ఒక ప్రశాంతమైన ఏకాంత ప్రదేశం ఎన్నుకున్నది. అచ్చట తనకు అనుకూలమైన ఉచితాసనం వేసి అవయవాలను దృఢపరచుకున్నది. ఆకాశగమన విద్య సిద్ధికొరకై ఊర్ధ్వగామి యగు ప్రాణవాయువులను భ్రూమధ్యంన నిరోధించటమనే అభ్యాసాన్ని చిరకాలం ఆచరించింది. కుండలినీ శక్తిని ఉద్బోధించి క్రమక్రమంగా యోగాభ్యాసంచే ఆకాశగమన శక్తిని ప్రభవింప జేయసాగింది.

❖❖❖

# 7. సుషుమ్నానాడి

**శ్రీరాముడు:** మహాత్మా! నాదొక సందేహం. ఈ స్థావర–జంగమాత్మకమైన ప్రపంచమంతా క్రియా సిద్ధంగా కనిపించుచున్నది కదా! అయితే "క్రియ" అనే స్పందనం యొక్క సిద్ధి దేని వల్ల కలుగుతోంది?

ఏదైనా "చలనక్రియ" వలన కలుగుచున్నదంటారా?... లేక ఆత్మ వలననా?

ఏదైనా చలనక్రియ వలననే అయితే, అప్పుడు ఆత్మను 'క్రియావస్థ'గా మార్చగల ఒక దోషం ఏర్పడుచున్నట్లే అవుతోంది. ...పోనీ, 'ఆత్మ వలన' అని అంటారా?...

ఆత్మ నిష్క్రియాత్మకమైనదని చెప్పుచున్నారు కదా? మహాత్మా! ఏ క్రియ యొక్క దృఢాభ్యాసం చేత ప్రయత్నశీలుడగు జీవునకు 'ఆకాశగమనము' మొదలైన విద్యలు లభిస్తున్నాయి? ఒకడు ఆత్మజ్ఞుడు అయినా, కాకపోయినా సిద్ధి కొరకో, లేక విలాసం కొరకో ఆకాశగమనం, ప్రత్యక్షం కావటం, మాయమవటం మొదలైన ఫలాలు ఎట్లు ఏ ప్రయత్నంచే పొందుచున్నాడో చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఈ ప్రపంచంలోని సాధ్యవస్తువులన్నీ 3 రకాలుగా విభజించి చెప్పుతూ ఉంటారు.

1. **ఉపాధేయములు -** ఎట్టి ప్రయత్న ఫలితమైన వస్తువు ఒకని అనుకూల్యమునకు సహకరిస్తున్నాయో అట్టి ప్రయత్నములను 'ఉపాధేయములు' అని పిలుస్తారు.
2. **హేయములు -** ఒకనికి ప్రతికూలమైన ఏ వస్తువులు ప్రయత్నముచే త్యజించబడుచున్నాయో అట్టి వానిని 'హేయములు' అని అంటారు.
3. **ఉపేక్ష -** వేటివేటిని ఉపేక్షించుటచే ఒకనికి అనుకూలమౌతుందో అట్టి ప్రయత్నములకు 'ఉపేక్ష్యములు' అని పేరు పెట్టారు.

సుఖకరమైన పదార్థములు ఏవి కలవో అవే ఉపాధేయములు. తద్విరుద్ధమైనవి... త్యాజ్యములు, లేక, హేయములు. ఈ రెండు విధములు కానివి... మధ్యస్తములు లేక ఉపేక్షములు.

అయితే... సద్బుద్ధియగు జ్ఞానికి ఎప్పుడైతే 'సర్వమూ ఆత్మమయం'గా స్ఫురిస్తుందో, అప్పుడు ఈ మూడూ ఆతని దృష్టిలో ఉండవు.

❖

జ్ఞాని ఒకప్పుడు లీలగా ఈ మూడిటినీ ఉపేక్షాభావంతో చూస్తాడు. అనగా, ఈ మూడూ కూడా అతనికి తోచక మటుమాయమౌతాయి. సర్వమూ ఆత్మమయమై ఉండగా, ఇంక వదలవలసిన దేమున్నది? స్వీకరించవలసినది ఏది?

కానీ జ్ఞానికి ఏదైతే ఉపేక్షామాత్రంగా ఉంటుందో, అదంతా మూఢునికి ఉపాధేయం అవుతోంది. గొప్ప వైరాగ్యశీలురకు అది హేయం అవుతోంది.

❖

ఇక నీవు ప్రశ్నించిన సిద్ధుల విషయానికి వద్దాం, వసంత ఋతువు వచ్చి భూతలమును ప్రసన్నంగా చేస్తూ ఉంటుంది కదా! అట్లాగే సిద్ధులన్నీ కూడా యథోచితమైన దేశ–కాల–ద్రవ్య రూప సాధనలను అనుసరించి మామిడి ఫలంలో దాగి ఉన్న రుచిలాగా, ఈ జీవుణ్ణి సంతోష పెట్టటానికి వచ్చి చేరుచున్నాయి. ఆ దేశ–కాల–ద్రవ్యాలలో కూడా దేశకాలాదుల ఉత్తమత్వం చేత "క్రియ" యొక్క ఉత్తమత్వం చేకూరుతోంది. ఉత్తమ క్రియచేతనే ఉత్తమఫలసిద్ధి సంభవిస్తోంది.

'ఆకాశ గమనం' వంటి సిద్ధులు, వాటి సాధనా సామగ్రి సృష్టికర్తచే పొందుపరచబడి ఉన్నాయి. అవి 1. సిద్ధగుటిక, 2. సిద్ధాంజనము, 3. సిద్ధఖడ్గము, 4. సిద్ధపాదుక –మొదలైనవి. వాటిని వివరించి సిద్ధులు సంపాదించటానికి ఉపకరించే శాస్త్రాలు కూడా ఉన్నాయి. 'ఉడ్డామరతంత్ర, యోగినీకల్పం' మొదలైన కొన్ని శాస్త్రాలలో సిద్ధులకు సంబంధించిన సాధనలు వివరించబడ్డాయి.

ఇప్పుడు నీ ప్రశ్నకు వద్దాం. ఆ క్రియలను నిరూపించటం నీ ప్రశ్న యొక్క ఆశయమా?

నాయనా! జిజ్ఞాసువులగు (ఆత్మను ఎరుగు లక్ష్యముతో వివేకులై ప్రయత్నించువారు), వారికి వాటి యందు ప్రవృత్తి కలిగితే మహాదోషం సంభవించగలదని నా మనవి. హెచ్చరిక కూడా! అది జ్ఞాన నిరూపణకు హాని కనుక ఇక్కడ అప్రస్తుతమనే చెప్పాలి. ఇప్పుడు మనం మణి–మంత్ర–ఓషధాది సిద్ధుల గురించి చెప్పుకోవటం మన ఈ ఆత్మతత్త్వనిరూపణ సందర్భానికి ఉచితం కాదు. అట్లాగే సిద్ధ ప్రదేశాలు, అక్కడ సాధనచే పొందగల సిద్ధులు కూడా అప్రస్తుతమే. అందుచేత వాటిని వదలి ఈ శిఖిధ్వజ కథా విషయ సందర్భంగా వచ్చి ఉన్న ప్రాణాదివాయు నిరోధం, తద్వారా లభించే కొన్ని సిద్ధుల గురించి మాత్రం ప్రస్తావిస్తాను విను.

❖

మామూలుగా ప్రాణవాయువులు సామాన్యజీవుని అధీనంలో ఉండక, తమ ప్రకృతి నియమాన్ని అనుసరించి ప్రవర్తిస్తూ ఉంటాయి. సాధనచే అట్టి ప్రాణవాయువులు సాధకుని అధీనంలోకి రాగలవు.

1. ఇతర సాధ్యవస్తువుల వాసనలను వదలి యోగశాస్త్ర ప్రవచితమైన క్రియలచే నవద్వారాలను సంకోచం గావించటం. – కాయము, శిరస్సు కంఠములను సమంగా ఉంచటం, నిశ్చలంగా నాసికాగ్రమును అవలోకించటం మొదలైన క్రియలు.

2. భోజన – ఆసనాదుల శుద్ధత్వం

3. ఉత్తమ శాస్త్రార్థభావన చేత

ఇట్లాగే ఉత్తమ ఆచారం చేత, సజ్జన సహవాసం చేత, సుఖాసనం చేత కొంతకాలం ప్రాణాయామం అనునిత్యంగా దృఢంగా అభ్యసించటం చేతనూ, కోపలోభాది గుణాలు సుదీర్ఘకాలంగా త్యజించటం చేతనూ ప్రాణవాయువులు అట్టి అభ్యాస జీవుని వశంలో ఉంటాయి. అప్పుడు ప్రాణాది వాయువులు రేచక–కుంభక–పూరక క్రియలందు ఒక అణకువతో కూడిన భృత్యుని వలె ఆ సాధకుని ఆజ్ఞలు నెరవేరుస్తాయి. ఎప్పుడైతే దేహంలో చలిస్తున్న ఆ ప్రాణవాయువులు దేహికి వశీకృతమౌతాయో అప్పుడు ఆ దేహికి విద్య మొదలైన సంపద మొదలుకొని, కోరుకున్న సిద్ధులే కాక, మోక్ష సంపద వరకు సమస్త సంపదలు సుఖసాధ్యమౌతాయి. ఈ జీవులు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యా లనే ఆరు శత్రువులకు (అరి షడ్వర్గానికి) మనస్సులో స్థానం కల్పించి తద్వారా ప్రాణ వాయువుల నియమించడంలో నిస్సహాయులౌతున్నారు. యోగ కుశలురు ఈ అరి షడ్వర్గాన్ని జయిస్తూ క్రమంగా ప్రాణవాయువులను అత్యంత సులభంగా తమ వశం చేసుకోగలుగుచున్నారు సుమా!

**సుషుమ్నానాడి -** ఈ శరీరంలో 'సుషుమ్నా' అని యోగశాస్త్రంచే పిలువబడుచున్న శక్తిరేఖా రూపమైన నాడి ఉన్నది. అది విస్తరించబడిన శాఖలతోనూ, నలువైపులా చుట్టబడి ఉన్నది. ఇది మర్మసానాన్ని ఆశ్రయించుకుని ఉన్నది. అది వందలకొద్ది ఉపనాడులచే సమాశ్రయించబడి ఉన్నది. ప్రేగులచే పరివేష్టించబడి ఉన్నది.

ఆ సుషుమ్నానాడి వీణాతంతువుల మూలభాగంలోని చలనలయలాగా రేఖారూపమైన ఆవర్ణం కలిగి ఉంటోంది. నీటిలోని ప్రవాహ ప్రక్రియ లాగా మౌనంతో కూడిన సంచలన క్రియ కలిగి ఉంటోంది. 'ఓం' కారంలోని అర్ధభాగం వలె కుండలంతో సమానమై ఉంటోంది.

ఈ సుషుమ్నానాడి దేవ, అసుర, మనుష్య, మృగం, జలచరం... సమస్త ప్రాణులందు కూడా ఉన్నది. చలిచే పీడించబడేవాడు ముడుచుకుని ఉన్నట్లు, నిద్రిస్తున్నప్పటి పాము వలె ఈ సుషుమ్నానాడి అసాధనపరులలో ముడుచుకుని ఉంటోంది. ప్రళయాగ్నిచే మింగబడుచున్న చంద్రుని వలె కుండలం యొక్క ఆకృతి కలిగి ఉన్నదై, స్వచ్ఛమై ఉంటోంది.

'శక్తి స్వరూపం' అని చెప్పతగ్గ ఈ నాడి గుదస్థానం నుండి భ్రూమధ్య పర్యంతం వరకు గల సర్వరంధ్రాలను స్పృశిస్తోంది. బాహ్యానికి ప్రాణవాయువుల స్పందనతో కూడుకొని ఉంటోంది. అభ్యంతరంలో మనోవృత్తుల చంచలం కలిగి ఉన్నదగుచున్నది. అది మూలాధారమున వెన్నెముక చివరగా వీణాశబ్ద వేగం వలె శోభాయుక్తమై ఉన్నది. శబ్దబ్రహ్మ రూపంలో పరాశక్తిని స్ఫురింప జేస్తోంది.

ఇది అరటిబోదెను పోలి కుండలాకారంగా ప్రవహిస్తూ ఉండటంచే దీనినే 'కుండలిని' అని కూడా అంటున్నారు. ఈ కుండలిని ప్రాణ – ఇంద్రియ – మనోబుద్ధుల వంటి దేహాల్లోని సమస్త శక్తులకు హేతుభూతమై ఉండటం చేత ఇది సర్వులకు స్ఫూర్తి ప్రదమైయున్నది. ఈ కుండలినీ శక్తియే తన ఊర్ధ్వకృతమైన ముఖంచే ప్రాణవాయువును పైకి, అపానవాయువును క్రిందకు త్రోయుచూ దేహస్పందనానికి కారణమై ఉంటోంది. శ్వాస గొనుచూ ఆడ త్రాచులాగా చరిస్తోంది.

❖

హృదయంలో ఉండే ప్రాణవాయువు ఎప్పుడైతే కుండలిని చేత ఆకర్షించబడి అపాన వృత్తిచే కుండలినీ పదం పొందుతుందో, అప్పుడు పంచీకృతమైన అంతఃకరణంతో అపంచీకృతమైన జ్ఞాపకం, సంకల్పం, ఇష్టం, కార్యకుశలత, ధ్యానం - ఇత్యాది వృత్తి భేదాలతో కూడిన జ్ఞానం పుడుతోంది. ఆ జ్ఞానమే జీవుని దేహసంబంధమైన ఆవిర్భావానికి నాంది. ఆ జ్ఞానమే 'జీవసంవిత్తు' అని కూడా అనబడుతోంది.

ఈ విధంగా కమలము నందు భ్రమరం లాగా దేహంలో స్ఫురించే కుండలిని బుద్ధి-ప్రాణాలకు జ్ఞాన-క్రియా శక్తులను ఇస్తోంది. అదే విధంగా అంతఃకరణము నందు ఇంద్రియార్థములకు (శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములకు) స్ఫూర్తిని కలుగజేస్తోంది. కుండలినియే ఇంద్రియార్థముల నానావిధ రూపములుగా ప్రదర్శితమౌతోంది.

ఈ కుండలిని ఎంతెంత వేగంగా స్ఫురిస్తుందో... అంతంతగా ఈ కళ్ళు మొదలైన ఆయా ఇంద్రియాలకు తటస్థపడు వస్తుజాలం యొక్క స్పష్టమైన జ్ఞానం జనిస్తోంది. అలాగే బుద్ధి-ప్రాణాలకు కూడా అదే స్ఫూర్తి ప్రదాత అని అనుకున్నాం కదా! అట్టి స్ఫూర్తిచే ఈ కార్య-కారణ యంత్రానికి ప్రేరకుడైన 'ప్రమాత' యొక్క స్పష్టజ్ఞానం కూడా పుడుతోంది. హృదయ కోశంలోని నాడులన్నీ కూడా ఈ కుండలినీ నాడికి సంబంధం కలిగి ఉండి తద్ద్వారా శక్తి - స్ఫూర్తులను పొందుచున్నాయి. అంతే కాదు నదులన్నీ సముద్రంలో ఉత్పన్నమై మరల సముద్రంలోనే లయిస్తున్నాయి చూచావా? దేహంలోని నాడులలోని శక్తితత్వం కుండలినియందు ఉత్పన్నమై మరల కుండలినిలోనే లయిస్తున్నాయి. అది ప్రాణరూపమున ఊర్ధ్వగమన మందు, అపానరూపమున అధోగమనమునందు ఉన్ముఖమవటం చేత సాధారణార్థంలో 'కుండలినియే సమస్త ఇంద్రియ జ్ఞానములకు బీజము'... అని చెప్పబడుతోంది.

**శ్రీరాముడు:** ఓ మునీంద్రా! దేశ-కాల-వస్తువులచే పరిచ్ఛిన్నం కానటువంటి చిత్-చైతన్యము మాత్రమే ఈ అంతయు అయి ఉన్నది కదా! మరిప్పుడేమో "కుండలినీ కోశము చేతనే సర్వవిధములైన సంవిత్తు (జ్ఞానము) ఉదయిస్తోంది" అని అంటున్నారు. అసలీ ఇంద్రియ జ్ఞానం ఎందుకు ఎలా ఉదయిస్తోంది? అదంతా ఎలా సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** వత్సా! రామచంద్రా! సర్వకాలములందు సమస్తము చైతన్యము మాత్రమే అయి ఉన్నది. ఇందులో సందేహించవలసినదేదీ లేదు. అయితే పంచభూత - పంచతన్మాత్రల చమత్కారం చేత ఆ చైతన్యం యొక్క అభివ్యక్తం ఒక్కొక్కచోట అత్యంత విశేషమైన ప్రకటనతో కన్పట్టుచూ ఉంటుంది. ఉదాహరణకు సూర్యుడు ఆకాశంలో ఒకే రీతి ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యభగవానుని ప్రకాశం నీళ్ళలోను, దర్పణంలోనూ విశేషంగా భాసిల్లుతోంది కదా! అట్లాగే చైతన్యం అంతటా విద్యమానమై ఉన్నప్పటికీ అది దేహములందు, బుద్ధులందు విశేషమైన స్పష్టతతో భాసిల్లుతోంది. నీ స్వరూపం యొక్క కాంతి పుంజాలు అన్ని వైపులా ప్రసరిస్తూ ఉంటాయి. అయితే ఎక్కడ దర్పణం ఉంటుందో అక్కడ మాత్రమే నీ రూపం ప్రతిబింబిస్తుంది, అక్కడ మాత్రమే చూడగలుగుతావు. దర్పణం అక్కడ లేనప్పుడు కూడా నీ యొక్క ప్రతిబింబ సంబంధమైన కాంతిపుంజాలు ప్రసరిస్తూనే ఉన్నాయి కదా!

ఆత్మ నిర్లిప్తంగా అంతటా ప్రసరించియే ఉంటోంది. మనోబుద్ధులున్న చోట స్పష్టంగా ప్రతిబింబితమగుచున్నది. రాళ్ళయందు, మట్టియందు అస్పష్టమైన మౌనస్వరూపం వహించి ఉంటోంది. దేవ – మనుష్యాదులలో సుస్పష్టంగా భాసించుచున్నది. ఇక వృక్షాదులందు ఇష్టా–ఇష్టముల వివేకము లేకుండానే ప్రకటనమగుచున్నది. ఆత్మ శక్తిరేఖాదృశమై ఆనువర్తమవటమే కుండలిని యొక్క నిర్వచనం.

❖❖❖

## 8. వాసనలు - ఉపాధులు

**శ్రీరాముడు:** ఈ దేవతలు – మనుష్యులు – జంతువులు – స్థావరములందు 'సంవిత్తు' ఉదయిస్తున్న క్రమము గురించి మరల ఒక్కసారి సందర్భోచితంగా వివరించమని తమకు నా ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** చైతన్యము సర్వదా అవికారము, నిరామయము కూడా! ఈ చేతనాచేతనంగా కనిపించే ప్రపంచమంతా ఆ చిన్మాత్ర – సన్మాత్ర – సూక్ష్మ – విభు – అసంగ – సంగచైతన్యము చేతనే వ్యాపించి ఉన్నది.

నిరాకార నిర్వికల్ప చైతన్యము యొక్క ఒకానొక కల్పితమైన స్వల్పాంశమునందు మాయచే ఆకాశము మొదలైన సూక్ష్మభూతముల అధ్యాస ఏర్పడి ఉంటోంది. అనగా ఆ చైతన్యమే భూత తన్మాత్రల రూపమున వెలయుచున్నది. అట్టి పంచభూతతన్మాత్రలే 1.ప్రాణము, 2. మనస్సు, 3. బుద్ధి, 4. కర్మేంద్రియములు, 5. జ్ఞానేంద్రియములు – అను ఐదు విధాలుగా అభివ్యక్తమౌతున్నాయి. అద్దానినే 'లింగశరీరం' అంటున్నాం. చైతన్యమే లింగ శరీరమున ప్రతిబింబరూపంగా ప్రవేశించి తన పట్ల తనే అచ్చోట జీవభావమును (నేనొక జీవుడను – అను భావం) కల్పించుకొంటోంది, లేక, ఆపాదించుకుంటోంది.

అయితే, రామా! అట్టి ప్రవేశమేదైతే ఉన్నదో ...అది 'ఒక వస్తువు మరొక దానిలో ప్రవేశించటం వంటిది'... అని తలచవద్దు మరి! చైతన్యము పంచతన్మాత్రల ద్వారా జ్ఞాన క్రియలందు ప్రవేశించటం... అనేది ఒకే అగ్నిదేవుడు నూరు దీపాలుగా వెలుగుతూ ఉండటం వంటిది. ఈ విధంగా ఆ చైతన్యం తన యొక్క వికారాలతోనూ, జాగ్రత్–స్వప్న–సుషుప్త్యాది అవస్థాభేదాలతోనూ గూడినదై జీవభావంగా ప్రస్ఫుటించుకొనుచున్నది.

ఈ విధంగా లింగశరీర నిర్మాణమున పరిశేషించిన కొన్ని తన్మాత్రలు దేవ, మనుష్య, జంతు, స్థావరాది వాసనలను ప్రదర్శిస్తున్నాయి. చైతన్యమే ఒకచోట 'నేను దేవతను' అని, మరొకచోట నేను మనుష్యుడను అని ఇంకొక చోట నేను వృక్షమును అని అనేక చోట్ల అనేక రీతులుగా కల్పనను ఆశ్రయించటం జరుగుతోంది. ఆయా వాసనలను అనుసరించి సంకల్పములతో కూడినదై పంచీకరణము ద్వారా ఈ సకల దేహభావములను పొందుతోంది. ఒకే వ్యక్తి స్వప్న – జాగ్రత్తులలో వేరువేరైన దేహభావములతో వ్యవహరిస్తున్నట్లు ఒకే చైతన్యం ఈ ఏకానేక వివిధ దేహముల భావనలను కలిగి ఉంటోంది. అట్టి వాసనాసహిత భావనాతరంగములలో కొన్ని ద్రవ్య భావములను మరికొన్ని దేశ – కాల విభాగముల భావనను కలిగి ఉంటున్నాయి.

ఈ విధంగా ఈ జగత్తంతా కూడా 'శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు.... అనే భౌతిక భావముచే గమనించబడు పంచన్మాత్రల క్రియయే అయి ఉన్నది. అధిష్ఠానమైన చైతన్యమే అంతటా నిండి ఉన్నది. అది ఈ తతంగమంతటియందూ అవ్యక్తమై పూలదండలోని దారం లాగా సర్వదా ఆధారరూపంగా ప్రసరించి ఉంటోంది.

❖

ఈ మనుష్యాది దేహములందు లింగశరీర ప్రాధాన్యము ద్వారా ముఖ్య చేతనత్వం కలుగుతోంది. ఆ లింగశరీరము ప్రాణము, మనస్సు, బుద్ధి, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు - అను పంచకముచే నిర్మించబడుచున్నదని అనుకున్నాం కదా! ఇక జంతుశరీరాల విషయానికి వస్తే వాటి యందు ఇటు లింగ - అటు స్థూలశరీరముల మధ్య స్థూలత్వము అధికమైన పెత్తనం చెలాయిస్తోంది. అందుచేత తిర్యగాది జంతువులలో 'జడచేతనత్వం' అధికంగా ప్రకటితమౌతోంది.

ఇక స్థావరాదులందు అంతరంగ చైతన్య జ్ఞానం ఉన్నప్పటికీ బాహ్యాన ఘనీభూతమైన అత్యంత జడత్వం ఏర్పడి ఉంటోంది. అనగా చేతనమే స్థావరాదులందు అత్యంత జడత్వం అనుభవిస్తోంది.

దృష్టాంతానికి... ఒక విశాలమైన పాత్రలో నేయి ఉన్నదనుకో. అది మధ్యాహ్నపు ఎండతీవ్రతకు ద్రవీభూతం గాను, కాబట్టి చంచలంగాను, సాయంకాలం శీతలవాయు స్పర్శచే ఘన-ద్రవ సమన్వితం గాను, (కొంత భాగం చంచలంగాను, మరి కొంతభాగం ఘనీభూతంగాను), రాత్రి శీతలత్వం కారణంగా అత్యంత ఘనీభూతమై చంచల రహితంగానూ ఉంటుంది చూచావా?

సముద్రం ఒకచోట చంచలంగా, మరొకచోట కొంత మాత్రమే చంచలంగా, ఇంకొకచోట తరంగరహితమై నిశ్చలంగానూ ఉంటుంది కదా! 'తరంగములున్న చోట సముద్రం, తరంగములు లేనిచోట సముద్రం కాదు'... అని ఎవరైనా అంటున్నారా? అనరు కదా!

అట్లాగే... మహాచైతన్యము దేవతాజీవులందు అత్యుత్తమమైన సుస్పష్టతతోనూ, మానవులందు కొంత స్పష్టతతోను, జంతువులందు కొంత అధికమైన జడత్వముతోను రాళ్ళు - కొండలు - మట్టియందు (స్థావరములందు) అత్యంత జడత్వముతోనూ ఏర్పడి ఉంటోంది. ఆ చైతన్యము యొక్క చంచలమునకు - జడత్వమునకు సంబంధించిన న్యూన - ఆధిక్యతలు ఎట్లా ఉన్నప్పటికీ... ఇదంతయూ చైతన్యమయమే గాని మరింకేమీ కాదు.

❖

కనుక ఓ రామచంద్రా! దేహము మొదలైన రూపములుగా పరిణతి చెందిన పంచతత్వములు 'ప్రాణధారణ' వలన చేష్టితములగుచు చేతనవంతమై ఒప్పుచున్నాయి. ఆ చైతన్యమే శిలాది రూపాలుగా పరిణతి రూపుదాల్చినప్పుడు జడంగా కనిపిస్తోంది. ఈ శిలలు బాహ్యావాయువుల అధీనంలో ఉండి కదలుచు, అంతరాంతరమున చేతనములుగానే ఉన్నాయయ్యా!

ఈ విధంగా స్పర్శ - రూపాది పంచతన్మాత్రల స్వభావవశం చేతనే ఈ అనేక వికల్పములన్నీ చూడబడచున్నాయి. చైతన్యజ్ఞులకు ఇదంతా ప్రశాంత - విస్తార - కల్పనారహిత చైతన్యం చేతనే

సమాక్రమించబడుచున్నట్లు నిత్యానుభవం అవుతోంది. ఇదంతా స్వాత్మ స్వభావమగు చైతన్యము యొక్క విన్యాసచమత్కారమేనని సభికులంతా గ్రహించెదరు గాక!

**శ్రీరాముడు:** స్వామి! చైతన్యమే స్వాత్మస్వభావమైయున్నది కదా! అది వికల్పాత్మకం ఎట్లా అవుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** చైతన్యం సర్వదా స్వాత్మస్వభావముననే పూర్ణత్వం, అఖండత్వం వహించి ఉన్నది. అయితే అది లీలగా వికల్పాన్ని భావన చేస్తోంది. అదంతా వికల్పం కాదు అని కూడా చెప్పవచ్చు. మన ఈ ఆత్మబోధ కొరకు 'వికల్పం' అని చెప్పుకుంటున్నాం. ఎట్లా అంటావా? శీతలం – ఉష్ణం – హిమం – అగ్ని.... ఇటువంటి విరుద్ధ శబ్దములన్నీ ఒకానొక ముందుగా నిర్ణయించుకొనిన స్థితి నుండి తత్సంబంధంగా చెప్పుకొనుచున్నవే కదా! ఈ చిత్, జడము మొదలైన శబ్దములన్నీ అటువంటివే! వాసనల యొక్క 'అంశ'తో విరుద్ధ వికల్పభావములు కూడుకొని ఉంటున్నాయి. అట్టి విరుద్ధ వికారాలతో పంచభూతాలు స్ఫురిస్తున్నాయి.

వాసనలు లేకపోతే అప్పుడు విరుద్ధ కల్పనలే ఉండవు. ఇది జడం కదా! అది దేవత కదా! ఆ స్వప్నద్రష్ట నిత్యచైతన్య రూపుడైనప్పటికీ, స్వప్నంలో స్థావర–జంగమాది విశేషములుగా ఆ స్వప్నద్రష్టకు అనుభవమవటమే ఈ తతంగమంతటికీ దృష్టాంతం. వచ్చేది దున్నపోతు కదా?' ...అనే అన్ని భావాలకూ వాసనలే అసలు కారణం.

పంచతత్త్వాలు ఒకప్పుడు స్ఫురిస్తాయి. మరొకప్పుడు స్ఫురించవు. వాక్కుకూడా పంచతత్త్వాధీనమే కదా! సత్యమగు చైతన్యము త్రికాలాబాధ్యమై ఉన్నది. మహా చైతన్యమునకు చైతన్యము – జడత్వము మొదలైనవి ఆపాదించటం కుదరనే కుదరదు.

అథవా... ఈ పంచతత్వముల స్థితి వల్ల మహాచైతన్యానికి వచ్చే లోపం గాని, అర్థవ్యతిరిక్తం గానీ ఏమీ లేనే లేవు.

బుద్ధిమంతుడైన వాడు అసలీ చిత్తాన్ని అటూ ఇటూ పరుగెత్తేటట్లు చేస్తున్న వాసనల గురించి ఆక్షేపణ చేసుకోవాలి. వాటిని అరికట్టేటందుకు సరైన ఉపాయం కోసం వెదకాలి. ఈ వాసనలు దేవాది శుభరూపములందు ప్రబుద్ధం గాను, జంతు – స్థావరాది జడాధిక రూపాదులందు సుప్తం గాను, సత్త్వ–జడ ప్రవృత్తమగు మానవ రూపములందు మిశ్రమంగాను ఉంటున్నాయి. అయితే మానవ ఉపాధి కర్మనిర్వహణకు ఉత్తమ ప్రదేశం అయి ఉండటం చేత ఇక్కడ ఉత్తమ ప్రయత్నం కలవారు వాసనలను తమ మనోవీథి నుండి కొంతసులభంగా పారద్రోలి వేయ గలుగుచున్నారు.

వాసనలను అనుసరించే ప్రాణాది పంచకం (ప్రాణులు – మనస్సు – బుద్ధి – కర్మేంద్రియాలు – జ్ఞానేంద్రియాలు) యొక్క ఆయా రూపాలు సంతరించుకుని ఉంటున్నాయి. ఎప్పుడైతే ఈ ప్రాణాది పంచకం ఆక్షేపణ చేయబడుతుందో... అప్పుడు వాసనాక్షయమైన రూపఫలం అనుభవ మవుతుంది.

ఓ ముముక్షువులారా! వాసనలను క్షీణింపజేయటం ఆపి స్వభావాదుల గురించి ఎంతగా చింతిస్తే మాత్రం ఏం ప్రయోజనం? ఆకాశంపై ధూళి విసరితే ఎంత ప్రయోజనమో, ఏమి

ప్రయోజనమో – వాసనల గురించి పట్టించుకోకుండా, ఆ వాసనలచే అనుభవమయ్యే స్వభావముల గురించి సుదీర్ఘంగా మాట్లాడుకోవటం అట్టిదేనని నా ఉద్దేశం. ఎవరికి వాసనలు క్షీణిస్తాయో అట్టి వారికి కొండంత సువర్ణరాశులు కూడా ఎండుగడ్డిపరకలతో కూడిన గుట్టమాత్రంగా కనిపిస్తాయి. వారి దృష్టికి ఈ కనబడే స్థావరజంగమ భోగాలు, వివేకసహితమైన దేవలోక భోగాలు, అక్కడి సుందరదేహాలు... ఒక పురుగు జీవితంలాగానే అతిమామూలై కన్పట్టగలవు. ఎప్పుడు? వాసనలు క్షయించినప్పుడు.

❖

ఓ రఘురామా! నీకు మరింత సుస్పష్టపడటానికి గాను మరొక్కసారి చెప్పుతున్నాను, విను. ఈ ప్రాణులలో... స్థావరాదులు సుషుప్తవాసనలు కలిగి ఉంటున్నాయి. దేవ – మనుష్యాది కొన్ని జాతులు ప్రబుద్ధ వాసనలు కలిగి ఉంటున్నాయి. పశుపక్ష్యాదులేమో కలుషితవాసనలు కలిగి ఉంటున్నాయి. మోక్షగాములగు వారిలో వాసనలు క్షీణిస్తూవస్తున్నాయి. మోక్షస్వరూపులలో వాసనా రాహిత్యం ప్రకాశిస్తోంది.

ఈ స్థావర – జంగమములగు నానావిధ ప్రపంచంలో ఇంతకు మించిన తేడా ఏదీ లేదు.

వాసనావైచిత్ర్యము చేతనే పంచతత్వ సమన్వితములు ఏర్పడుచున్నాయి. ఈ ద్రష్టలంతా తమ సంవిత్తులలో వ్యవహారానికి అనుకూలమైన 1. మనస్సు, బుద్ధి మొదలగు అంతరింద్రియములు, 2. కాళ్ళు – చేతులు మొదలైన బాహ్య ఇంద్రియములు – ఆయా సంజ్ఞలతో కూడినదై పొందుచున్నారు. వాసనా చమత్కారం చేతనే ఈ సర్వ సజీవ, సజడ జాతులలోని ఆయా స్వభావములన్నీ చమత్కారంగా ప్రకటితమౌతున్నాయి. ఆవు, గాడిద మొదలైన తిర్యక్‌జాతి జంతువులకు 4 కాళ్ళు, 2 కొమ్ములు, 1 తోక ఇటువంటి సంజ్ఞలన్నీ వాసనాజాల పర్యవసానమే! మానవులలో కొన్ని సంజ్ఞలు, రాళ్లు మొదలైన స్థావరాలలో వేరొక సంజ్ఞ – ఈ విధంగా తమతమ వాసనలను అనుసరించి వ్యవహార యోగ్యమైన అవయవాది ఆయా సంజ్ఞలు ఏర్పడుచున్నాయి. మధ్య చివరకూడా చంచల జడరూపములై రూపం పొందుచున్నాయి. మరలా అధిష్ఠాన సద్రూపం దృష్ట్యా చూచామనుకో... ఇవన్నీ ఏవీ ఉండిలేవు. శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాలన్నీ 'సత్‌చిత్'కు అలంకార మాత్రమై వెలయుచున్నాయి.

శాస్త్రవేత్తలచే ప్రవచించబడే ఒకానొక ఉపమేయం ఇక్కడ ఉదహరిస్తాను–

ఈ 'సృష్టి' అనబడే ఆకాశవృక్షానికి సంకల్పరూప పరమాణువే బీజం. ఇంద్రియములు వాటి పుష్పాలు. విషాయాలు సుగంధం. ఇచ్ఛయే ఆ సుగంధానికి ఆకర్షించబడుచున్న తుమ్మెద. ఈ చంచల ఇంద్రియ క్రియలు ఆ వృక్షముయొక్క గాలివాటు కదలికలు. స్వర్గాది లోకములు అద్దాని శాఖలు. మేరువు మొదలైన పర్వతాలు అద్దాని మూలం. ఆకాశనగల నీలిమేఘాలు ఈ వృక్షమును చుట్టుకొనియున్న లతలు. భూతభవిష్యత్తు వర్తమాన కాలాలలోని ఈ ఈ ఉపాధులన్నీ, ఈ చతుర్విధ ప్రాణులన్నీ ఆ వృక్షముయొక్క పళ్ళు. ఆకాశాది పంచతత్త్వాలు ఈ వృక్షముయొక్క బీజాలు.

**శ్రీరాముడు:** హే మహర్షీ! శాస్త్ర ప్రవచితమైన మీరు వర్ణిస్తున్న వృక్షం అసలు ఉన్నదెక్కడ?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** (చిరునవ్వు చిందిస్తూ) మంచి ప్రశ్నవేశావు. ఆ మహావృక్షం 'సంసారము' అనే పేరుతో ప్రసిద్ధి కెక్కినదే! ఇక "కేవలం స్వవివేకశూన్యం చేత స్వయంగా ఆత్మయందే ఉద్భవిస్తోంది. కనుక అది ఆత్మయందే ఏర్పడి ఉన్నది. ఓ భూత–వర్తమాన–భవిష్యత్ సర్వజీవులారా! మీరంతా ఆత్మస్వరూపులు మాత్రమే! అంతేగాని సంసారజీవులు కాదు. ఇది ఎంత త్వరగా ఎరిగితే, అనుభవ సమన్వితులైతే... అంత మంచిది!

ఓ రామచంద్రా! నీ వివేకబుద్ధిని సర్వదా నిద్రలేపి ఉంచు. 'జీవ – జడ' ఆదిగా గల వివిధ రూపాలుగా నీకు కనిపిస్తున్నవన్నిటినీ వివేక దృష్టితో ఆత్మగానే చూచావా... సముద్రంలో తరంగాల లాగ సర్వమూ విలయమైపోతాయి. సముద్రంలో ఒకవైపు తరంగాలు పుట్టుచూ, మరొకవైపు లయిస్తూ ఉంటాయి కదా! అలాగే బహిర్ముఖదృష్టి కలవారికి ఇవన్నీ జడత్వ భావనచే ఉన్నాయి. బహిర్ముఖ భావనచే పొందబడుచున్నాయి. అదే సమయంలో... అంతర్ముఖావలోకితమైన దృష్టి కలవారి పట్ల వివేకోదయకారణంగా స్వయంగా శమిస్తున్నాయి. వాసనా ప్రాప్తి రాహిత్యం సంపాదించు కున్న మరుక్షణం ఇక నీవీ సంసారములో స్థితియే పొందవు. వాసనలు లేనివారికి జగత్తుగా కనిపించేదంతా "స్వస్వరూపాంతరంగం" గానే ఆస్వాదించబడుతోంది.

వాసనలు కలిగి ఉన్న జీవులు అనంతకాలం ఈ వస్తుసమన్విత జగత్తులో పరిభ్రమిస్తూనే ఉంటారు. ఇక దిగులు దేనికి చెప్పు?... నీ వివేకాన్ని మరల మరల నిదుర లేపు. అదే అన్నిటికీ పరమౌషధం. తద్వారా వాసనలు జయించు.

❖❖❖

## 9. ఆధి - వ్యాధులు

**శ్రీ వసిష్ఠ మహర్షి:** నాయనా! రామచంద్రా! ఇప్పుడు మనం కుండలిని విషయమై పరిశీలన కొనసాగిద్దాం.

ఈ స్థూలదేహంలో మూలాధార ప్రదేశంలో, కుండలిని యందలి లోభాగంలో ప్రాణాది పంచకం యొక్క బీజం ప్రాణవాయు రూపంలో సదా స్ఫురిస్తూ ఉంటుంది. అట్టి స్ఫురణ ప్రభావంచే కుండలిని ప్రాణరూపంలో స్ఫురిస్తూ ప్రాణవాయుధర్మం చేత మరియు నిజధర్మం చేత మూడు రూపాలుగా పరికల్పించబడుతోంది – 1. స్పందనము, 2. స్పర్శ, 3. సంవిత్తు

ఈ కుండలినీ శక్తియే...

2. ఎరుక కావించటంచేత 'కళ' అని పిలుస్తున్నారు.
3. చేతితం ఒనర్చటంచేత చిత్తము అంటున్నాం.
4. జీవించటాన్ని ప్రసాదించటంచేత జీవము అని చెప్పుచున్నాం.
5. మననం చేయటం చేత మనస్సు అని అభివర్ణిస్తున్నారు.
6. సంకల్పించటంచేత సంకల్పము అని ప్రవచిస్తున్నారు.

7. అదియే అహంకారము యొక్క రూపమునకు ప్రభవస్థానం.

8. తనయందు బోధ కలిగి ఉండుటచే 'బుద్ధి' అనిపించుకుంటోంది.

ఈ విధంగా కుండలినీ శక్తిని పుర్యష్టకం అని కూడా పిలుస్తున్నారు. ఈ కుండలినీ శక్తి దేహములో అత్యుత్తమ జీవస్థానం అయున్నది.

❖

ఈ కుండలిని అధోదిశలో ఉన్నప్పుడు అపాన రూపంగా ఉంటుంది. మధ్యప్రదేశంలో ఎల్లప్పుడు సమానరూపంలో నిశ్చలంగా ఉంటుంది. అపాన – సమానములచే పరిపోషింపబడు చున్నప్పటికీ దీనికి ఊర్ధ్వవృత్తి ఉదానరూపంగా ఉంటుంది.

ఈ విధంగా ఇది దేహంలో స్వస్థతను పరిపోషిస్తూ ఉంటుంది. కుండలిని కనుక సమానవృత్తి ధరించకపోతే దేహములోని జీవసంవిత్తు సర్వప్రయత్నముల చేత అధోమార్గం గుండా బైటికి పోగలదు. అలా బలంగా బైటకు పోవటం చేత ఆ దేహము మృత్యువునకు లోను కాగలదు.

ప్రాణా – అపాన వృత్తిని నిరోధించటం ద్వారా కుండలిని యొక్క ఊర్ధ్వ – అధోగమనములను సర్వదా త్యజించి, 'సమానవృత్తి' యొక్క ఆశ్రయం చేత జీవసంవిత్తు ఆత్మయందు నెలకొని ఉంటే... అప్పుడు ఆ ప్రాణి యొక్క సమస్త వ్యాధులూ నశిస్తాయి. ఆ జీవి మృత్యువును కూడా జయించివేయగల శక్తిని కలిగి ఉంటాడు.

❖

ఒక్కొక్కసారి సామాన్య నాడుల యొక్క వ్యాపార దోషం చేత శరీరంలో ప్రవేశించిన అన్నరసం పచనం కాదు. అప్పుడు దేహంలో సామాన్య రోగాలు ఉత్పన్నమౌతాయి. క్రమంగా ప్రధాన నాడుల వ్యాపార భాగంలో ప్రధానరోగాలు జనిస్తాయి.

**శ్రీరాముడు:** స్వామీ! ఈ జీవునికి ఆధి – వ్యాధుల వలననే సర్వదుఃఖాలు వచ్చి పడుచున్నాయని అంటూ ఉంటారు కదా! అవి రెండూ ఎలా ఉత్పన్నమౌతున్నాయి? ఎట్లా తొలగుతాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఔను. ఆధి – వ్యాధులు రెండూ జీవుని దుఃఖమునకు కారణభూతములే. వాటి యొక్క నివృత్తి చేత మాత్రమే జీవునికి 'సుఖం' అనేది లభ్యపడేది. జ్ఞాన ప్రభావం చేత అవి రెండూ సమూలంగా నశించాయా... అప్పుడది 'మోక్షము' అని అంటున్నాం. అవి రెండూ ఒకానొకప్పుడు ఒకదాని కొకటి కారణమై ఈ శరీరంలోనే పుట్టుచున్నాయి. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కటి తీవ్రతరమై ఉంటోంది. చాలా సందర్భాలలో ఈ రెండూ కూడియే ఉంటున్నాయి. అవి ఒకసారి క్రమక్రమంగాను, మరొకసారి అకస్మాత్తుగాను ఉద్భవిస్తున్నాయి. అజ్ఞానమే రెండిటియొక్క కారణం.

**"వ్యాధి"** - శరీరమునకు సంబంధించిన దుఃఖమును 'వ్యాధి' అంటారు. శరీరవ్యాధులు ఎట్లా ఉత్పన్నమౌతున్నాయో విను!

1. కోరికలు మరల మరల స్ఫురించటం చేత.

2. చిత్తము అనుక్షణం అతిచంచలమై ఏమాత్రం జయింపబడకపోవటంచేత.

3. దోషభూయిష్ఠమైన ఆహారం భుజించటంచేత.

4. దుర్వాసన, మురికి, తదితర దోషములతో కూడిన స్థలంలో నివసించటంచేత.

5. కల్మషములతో కూడిన వాయువులను చిరకాలం సేవించటంచేత.

6. అయుక్తమైన కాలములో వ్యవహరించటంచేత.

(ఉదా:వేళ కాని వేళ (లేక) అత్యంత ఆలస్యంగా భుజించటం, మిట్టమధ్యాహ్నం వంటి అయుక్తమైన సమయాలలో నిద్రించటం, ఏదో చూస్తూనో, వింటూనో, జూదం వంటి ఆటలు ఆడుతూ అనేక గంటలుగా నిద్రపోక పోవటం మొదలైనవి.)

7. దురలవాట్లకు ప్రోత్సాహం లభించే దుర్జనసాంగత్యం చేయటంచేత.

8. దుష్టభావాలు భావన చేయటం చేత. (కామ, క్రోధ, అసూయా, ద్వేషాదులు)

9. అన్నరసం ప్రవేశించని కారణంగా నాడీరంధ్రాలు బలహీనపడటం, క్షీణించటం వలన.

10. అన్నరస ప్రవేశం అవసరమైన దాని కంటే ద్విగుణీకృతంగా నాడీరంధ్రములను ప్రపూర్ణం చేయటం చేతనూ, తద్వారా ఆ అన్నరసం దీర్ఘకాలం నాడీ రంధ్రాలలో వేచి ఉండటంచేత.

11. కఫ - పిత్తాది ప్రకోపం కారణంగా ప్రాణములు వ్యాకులమవటంచేత.

12. దెబ్బలు మొదలైనవి తగలటంచేత అవయవాలు, సున్నితవిభాగాలు శిథిలమవటంచేత

...ఇటువంటి ఆయా అనేక దోషాల చేత అస్వస్థత సంభవిస్తోంది. వ్యాధి ఈ దేహం యొక్క ఆకారాన్నే మార్చి దౌర్బల్యంగానూ, అపక్రమమైన ఆకారంగానూ తయారుచేసి వేయగలదు.

పూర్వజన్మ యొక్క (లేక) ఈ జన్మ యొక్క శుభ-అశుభ బుద్ధులలో ఏది అధికంగా ఉంటుందో అది 'ఈ వ్యాధి' యొక్క క్రమమును, సుదీర్ఘత్వాదులను నియోగిస్తూ ఉంటుంది.

ఈ విధంగా భూత పంచకమైన ఈ దేహంలో ప్రవేశించే పదార్థ జాలముల ఉచిత - అనుచితములను అనుసరించి ఈ దేహంలోనే వ్యాధి జనిస్తోంది. రసవిభాగముననుసరించి ఉచితము, అధర్వణవేద - ఆయుర్వేదాది శాస్త్ర ప్రవచితము అయిన ఆయా పదార్థముల సేవనం చేత 'వ్యాధి' అనునది ఉపశమించటం జరుగగలదు. ఆహార పరిశుభ్రత, సమయాసమయ విచక్షణ, కాల నియమానుసారమైన లంఖణం మొదలైనవి అర్థమైనంతగా ఆచరించే వారి శరీరంలో ప్రవేశించే ఆహారం అతిత్వరగా పచనమైపోతుంది. అట్లా కాకుండా దేహంలో దీర్ఘకాలం ఆహార పదార్థాలు అపచన స్థితిలో ఉంటే రోగకారకములౌతాయి.

**'వ్యాధి' అనేది రెండు విధములు -**

**1. సామాన్య వ్యాధి -** ఆకలి, దప్పిక... ఇట్టి వ్యవహారములతో ఉత్పన్నమయ్యేది 'సామాన్యము' అని అంటాం. ఇష్ట - అనుకూల వస్తువుల ప్రాప్తిచే ఆకలి, దాహము మొదలైనవాటి వల్ల పుడుతున్న వ్యవహారిక వ్యాధులు నశిస్తాయి.

**2. విరస వ్యాధి -** దేహంలోని వివిధ రసముల సంచలనము, క్రియా విశేషంవలన శరీరం మనగలుగుతోంది. అట్టి రసముల ఉత్పత్తి కుంటుపడటం చేతనో, మిక్కిలిగా ఉత్పత్తి అవటం

చేతనో దేహంలోని రక్త-మాంస-ప్రేగు-బొమికలు తమ సాధారణ క్రియాతత్త్వాన్ని కోల్పోవటమో, విపరీత ప్రవర్తనమో జరుగుచున్నప్పుడు ఏర్పడు వ్యాధులను 'విరసవ్యాధి' అంటారు.

ఆహారం వలననే ఈ దేహం పరిపుష్టి చెందుతోంది కదా! మరల ఆహారము యొక్క అనియమితాదుల వలననే దేహమునకు సామాన్య-విరసాది వ్యాధులు వాటిల్లుచున్నాయి. అయితే సృష్టి కర్త ఆయా వివిధ రసములను ప్రకృతియందు (వృక్షాలందు వ్రేళ్ళయందు, ఫలములందు, ఆకులందు) పొందుపరచారు. అట్టి రసమయ పదార్థముల వినియోగముచే దేహము యొక్క రస సామాన్యత కాపాడబడి వ్యాధి చికిత్స పొందగలదు. అధర్వణవేదం, ఆయుర్వేదంవంటి గ్రంథములలో వాటిని ఉపయోగించు వివరణలు పొందబరచబడి ఉన్నాయి. వైద్యులు చేసే ఆయా చికిత్సా విధానాలచే వ్యాధులు నయమగుచున్నాయి. అట్లాగే మంత్రం, పవిత్ర తీర్థములలో స్నానం చేయటం, ఓషధులున్న ప్రదేశంలో నివసించి అక్కడి గాలి పీల్చడం - ఇటువంటివి దేహారోగ్యాన్ని కాపాడు చున్నాయి. ఇవన్నీ ఆశ్రమ విద్యార్జన సమయంలో నీకు బోధింపబడియే ఉన్నాయి కదా! సాధకుడు తన శరీరంలో సరసము కొనసాగేటట్లు, విరసము ఏర్పడకుండానూ చూచుకోవటం ఉచితం.

**ఆధి -** వాసనలు కారణంగా పుట్టే మనస్సుకు సంబంధించిన బంధాన్ని 'ఆధి' అంటారు. ఆధికి ముఖ్యకారణం అజ్ఞానముచే అభ్యాసవశంగా ఏర్పడిన సాంసారిక వాసనా జాలములే! తత్త్వ జ్ఞానం వల్ల మాత్రమే అజ్ఞానం తొలగుతుంది.

ముఖ్యసేవకుడు అంతఃపురాన్ని కాపాడుచున్నట్లు చిత్తమే ఈ శరీరాన్ని పర్యవేక్షిస్తూ, కాపాడు తోంది. అయితే తత్త్వజ్ఞానం, ఇంద్రియనిగ్రహం లేనప్పుడు నిశ్చలవాయువు వంటి ఈ చిత్తం తన స్థిరత్వాన్ని సూక్ష్మత్వాన్ని కోల్పోయి చంచలాన్ని ఆశ్రయిస్తోంది. "ఇది పొందాలి, అది పొందలేదు, ఇదే ఇష్టం, ఈ రూపం, ఆ శబ్దం, ఈ కథనం, ఆ దూషణం" - ఇలా రాగద్వేషాలచే జడత్వం, చంచలత్వం కలిగి ఉంటోంది. ఇంకేముంది? వర్షాకాలపు మంచులాగా మహామోహ ప్రదాలగు మానసిక రోగాలు (ఆధులు) ఉత్పన్నమౌతున్నాయి.

జన్మాది వికారాలకు కారణమౌతున్నదానిని "సారము" అని అంటారు. సారం వలన మానసిక చాంచల్య కారణంగా కోపం, దుఃఖం, నిరుత్సాహం, దైన్యం, భయం, అనునిత్య చంచలత్వం, ఆవేశ కావేషాలతో కూడిన మనో చపలత్వం (పిచ్చి), దుష్టమైన సంకుచితత్వం - ఇవన్నీ ఏర్పడు చున్నాయి. ఇవన్నీ దేహంపై దుష్ప్రభావం చూపించి విరసత్వానికి క్రమంగానో, ఒక్కసారిగానో దారి తీస్తున్నాయి. మానసిక వ్యాధి నశిస్తే దానికి సంబంధించిన మానసిక వికారాలూ (కోప - తాపాదులు) నశిస్తాయి.

ఆత్మజ్ఞానం లేకపోతే సారం నశించదు. "అది త్రాడు మాత్రమే" అని పూర్తిగా తెలియకపోతే పాము యొక్క భ్రాంతి ఎట్లా నశిస్తుందో చెప్పు?... వర్షాకాలపు నదీ ప్రవాహం ఒడ్డున ఉన్న వృక్షాలను ఏ విధంగా సమూలంగా నశింప జేస్తుందో అట్లాగే ఆత్మజ్ఞాన బలం పుంజుకున్నప్పుడు ఈ జన్మాది వికారరూపమైన ఆధి క్షయిస్తుంది. అప్పుడాజీవుడు ఆధి-వ్యాధులకు అతీత్వం సంతరించు కుంటాడు. ఆధి-వ్యాధుల విలాసం సమూలంగా నశించబడుతుంది.

❖❖❖

# 10. ఆధి - వ్యాధుల ఉపశమనోపాయాలు

**శ్రీరాముడు:** హే జగద్గురూ! 'ఆధి' చేత 'వ్యాధి' ఉత్పన్నం కాగలదనునది యుక్తి యుక్తమే. అట్లాగే ఆయా రససమన్వితములగు ప్రకృతిసిద్ధమైన ఓషధులచే దేహ సమరసత్వము పునఃప్రతిష్ఠించబడి, తద్వారా వ్యాధులు ఉపశమించగలవనేది దైనందికానుభవమే.

అయితే నా సందేహం వినండి. వ్యాధి అనేది ఔషధాల చేత ఉపశమిస్తుంది కాని, 'మంత్రాలు, పుణ్యాలు, తీర్థస్నానాలు' – వల్ల ఎలా ఉపశమిస్తుందో మా బోధ కొరకై వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి:** విను – మానసిక వ్యాధుల చేత చిత్తం వ్యాకులమైనప్పుడు ఈ శరీరం కూడా వ్యాకులత్వం పొందుతుంది. ఉదాహరణకు తీవ్రకోపంతో ఉన్న వ్యక్తి తన ఎదురుగా ఉన్నవాటిని యుక్తాయుక్తమైన అవగాహనతో చూడలేడు. అలాగే బాణం దెబ్బ తిన్న జింక తన ముందుగా ఉన్న మార్గం వదలి ఎటో పిచ్చిగా పరుగులు తీస్తుంది. మానసిక వ్యాధిగ్రస్తుడు తనను సమీపించిన బంధువులను గుర్తించలేక ఏవో కుమార్గముల వైపు, కుశబ్దముల ఉచ్చారణతో కదలిపోతూ ఉంటాడు.

సెలయేటి నీరు ఒక క్రమంగా ప్రవహిస్తూ ఉండగా, ఒక ఏనుగు ఏరులో ప్రవేశించిందనుకో ...అప్పుడు సూటిగా ప్రవహిస్తున్న ఏటిజలం ఒడ్డువైపుగా కదులుతుంది కదా! అలాగే మానసిక వ్యాధులచే వ్యాకులమైన ప్రాణవాయువు తన సమత్వాన్ని వదలి అన్యమార్గంగా ప్రవహిస్తుంది. అది అసమ్యక్ స్థితి (Inequal placement) పొందుతుంది. సర్వసమదృష్టి లేని రాజు వలన ఆ పరిపాలనకు సంబంధించిన ప్రజాధర్మాలు, సర్వ సంక్షేమ కార్యక్రమాలూ కుంటువడతాయి చూచావా? అట్లాగే ప్రాణవాయువు గనుక అపసవ్యస్థితిలో ప్రవహిస్తూ ఉంటే, నాడులు విషమం పొందుతాయి. అప్పుడీ శరీరం విహ్వలమౌతుంది. చెదరగొట్టబడిన నీరు విధివిధానం లేకుండా చెదరుమదురై పోతుంది చూచావా? మామూలుగా ప్రాణవాయువుచే నింపబడి స్పందిస్తున్న నవనాడులూ, తదితర ఉపనాడులూ కొన్నిచోట్ల అధికంగానూ, మరికొన్ని చోట్ల అల్పంగానూ ప్రాణవాయువును పొందుతాయి. ప్రాణ సంచారం సరిగ్గా లేకపోతే భుజించబడిన ఆహారములు అల్పజీర్ణత్వంగాని, అజీర్ణత్వంగాని, అతి జీర్ణత్వంగాని పొందుతాయి.

❖

ప్రవాహానుకూలంగా వదలిపెట్టబడిన బంతి సుదీర్ఘంగా ప్రక్కవాటు పొందకుండా వెళ్తుంది కదా! అట్లాగే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లని పిలువబడే పంచప్రాణాలలో 'సమాన ప్రాణవాయువు'చే భుజింపబడిన అన్నం చక్కగా రసంగా మార్చబడి శరీరమంతటా ఆయా స్థానములకు సమాన ప్రాణంచే చేర్చబడుతుంది. మనస్సునందు ఉద్వేగం ఉండి ఉన్నప్పుడు శరీరంలో ప్రవేశించిన అన్నం కొన్నిచోట్ల నిరోధం పొందుతూ ఉంటుంది. అట్లు అంతర్గతంగా అధిక సమయం ఉండిపోయిన అరసపరిణామమైన అన్నము ధాతువైషమ్యంగా పరిణమించి స్వభావవశంగా దేహం నందు వ్యాధిత్వం పెంపొందింపజేస్తుంది. దేహాన్ని పెద్దపొట్ట మొదలైన కురూపాలను కూడా

కలుగ జేయగలదు. అట్టి ధాతువైషమ్యం మనస్సును వైషమ్యపరచుటలో మరింత వైఖరి చూపుతుంది. ఈ విధంగా మానసిక వ్యాకులత చేత వ్యాధి, వ్యాధి చేత మరింత మానసిక వ్యాకులత ఏర్పడుతూ ఉంటాయి. సర్వసమ 'భావన' ఆశ్రయించనంతకాలం మానసిక వ్యాకులతలకు అంతూ పొంతూ ఉండవు. ఈ విధంగా ...ఆధి చేత వ్యాధి సంభవిస్తోంది. ఆధి లేకపోతే వ్యాధి నశిస్తోంది.

**మంత్రములు** - ఇక నీ వడిగిన ప్రశ్నయగు 'మంత్రం' విషయానికి వద్దాం.

బీజాత్మకములైన మంత్రవర్ణములు ఆ సాధకుని భావ – సత్సంకల్పావేశమును అనుసరించి రోగ నివారణ నిర్వర్తించగలవు. శక్తికి – భావనకు పరస్పర సంబంధమున్నది. ప్రాణముగాని, కుండలిని గాని భావేకాగ్రత చేతనే కదా సంచయము పొంది ఉన్నాయి! వాయువు, అగ్ని, భూ, జల, ఆకాశ – పంచభూతత్త్వం బీజాక్షరోచ్చారణతో కూడిన భావసమన్వితమైన ఆరాధనచే మంత్రద్రష్టకు కార్యనిర్వహణార్థం సహకరించగలవు. ఈ చరాచర సృష్టియంతా సమష్టితత్త్వమగు హిరణ్యగర్భుని భావనాకల్పనయేనని మనం ఇతఃపూర్వం చాలాసార్లు చెప్పుకున్నాం కదా! ఈ మనస్సు కూడా భావనారూపమే!

అట్లాగే శుద్ధమైనట్టి సేవాభావము – పవిత్ర హృదయముతో కూడిన 'సాధుసేవ' అనే క్రియ మనస్సుకు సుఖత్వం, నిర్మలత్వం ప్రసాదించగలదు. తద్వారా తదితరములైన ఆధి, వ్యాధుల శమనము వంటి శుభప్రయోజనములన్నీ కలుగుతాయి.

అంతఃకరణశుద్ధి చేత ప్రాణవాయువు సక్రమంగా ప్రవహిస్తోంది. రాగ, ద్వేష, లోభముల వంటి వ్యతిరిక్తతత్త్వముల వల్ల అంతఃకరణం అపరిశుద్ధమై దేహం నందలి ప్రాణవాయు ప్రసరణమును అపక్రమం చేస్తోంది.

సాత్వికములగు శాస్త్రప్రవచిత మంత్రోచ్చారణ, భక్తి, శాంతం వంటి అనుకూలతత్వాలు అధికమగుచుండుట చేత అంతఃకరణశుద్ధి ప్రాప్తించగలదు.

పూర్ణచంద్రుడు ఉదయిస్తుంటే ప్రపంచం ఎట్లా ప్రకాశిస్తూ ఉంటుందో, అట్లా శుద్ధ చిత్తంలో ఆనందం వెల్లివిరుస్తూ ఉంటుంది. అంతఃకరణ శుద్ధిచే దేహమంతా ప్రాణవాయువులు సక్రమంగా ప్రవహిస్తూ ఉండగా తద్వారా అన్నం చక్కగా పచనమొనర్చబడి సమస్త వ్యాధులు నశిస్తాయి. మనస్సు నందు సంతోషం–ఉత్సాహం–హాస్యం లను పరిపోషించుకుంటూ ఉంటే, భౌతిక దేహం కూడా సమప్రాణ ప్రసరణ పొందుచున్నదై ఆయురారోగ్యాలను పొందుతూ ఉంటుంది.

ఇవి నన్ను పవిత్రం చేస్తాయి ...అను సాధకుని ఆంతరంగికమైన భావనయే అతనికి సహకారికమగుచున్నది.

ఈ విధంగా కుండలినీ కథా ప్రసంగం సందర్భంలో ఆధి – వ్యాధులు ఏ విధంగా ఉత్పత్తి అవుతున్నాయో, అవి ఏ విధంగా ఉపవమనములు పొందుచున్నాయో చెప్పుకున్నాం. ఇప్పుడు ప్రస్తుత ప్రసంగమైన కుండలినికి వద్దాం.

❖❖❖

# 11. యోగశక్తులు

**శ్రీ వసిష్ఠ మహర్షి:** సుగంధమునకు ఆధారమేమిటి? పుష్పమే కదా? అట్లాగే 'పుర్యష్టకము' అను పేరు గల జీవునకు ప్రాణము అను పేరు గల కుండలినియే ఆధారమైయున్నదని గ్రహించు. ఈ కుండలిని యందు పూరకము అనే ప్రాణాభ్యాసముచే ఎప్పుడైతే జీవుడు సంస్థితుడౌతాడో అప్పుడాతడు మేరువు వంటి స్థిరత్వం పొందుతాడు. ఈ శరీరం యొక్క గురుత్వం సిద్ధిస్తుంది. ఎప్పుడైతే మూలాధారం నుండి బ్రహ్మరంధ్రం వరకు శరీరమంతా తిన్నగా గాలి నిలుపబడుతుందో... అప్పుడు ప్రాణవాయువు యొక్క ఆకర్షణ వలన కుండలినీ సంవిత్తు పైకి పంపబడుతుంది. అప్పుడు ఆ దేహికి శారీరక - మానసిక పరిశ్రమ సహించ గల ఓర్పు, నేర్పులు ప్రాప్తిస్తాయి. ప్రాణవాయువు యొక్క ఆకర్షణ చేత కుండలిని కఱ్ఱ వలె దీర్ఘత్వం పొందుతుంది. నాడులన్నిటినీ తనతో తీసుకొనుచూ దేహాన్ని త్రాళ్ళచే బంధించబడిన పూతీగ వలె శీఘ్రంగా పైకి పోవుచున్నది. బావి యొక్క లోతు నుండి బయటకు లాగబడుచున్న బొక్కెన తనతో బాటు నీటిని కూడా పైకి తీసుకువస్తుంది చూచావా? ఆ విధంగా వాయువుతో పూరించి, నవరంధ్రాలను మూసివేసి, అప్పుడీ శరీరాన్ని కూడా "కుండలినీ సంవిత్తు" పైకి తీసుకుపోగలదు. ఇదియే యోగి యొక్క ఆకాశగమనం.

యోగులైన వారి (కుండలినీ సంవిత్తు యొక్క ఊర్ధ్వగమనాన్ని అభ్యసించిన వారి) ఆకాశగమనం యొక్క అభ్యాసం చేత ఊర్ధ్వ దిశను పొందుచున్నారు. అభ్యాసరహితులగు సామాన్య జనులకు ఇది ఇంద్రపదవి పొందినంతగా తోచుచున్నది.

**అశరీరులగు సిద్ధుల దర్శనం -** ఆకాశమున అశరీరులై సంచరించు సిద్ధులను కూడా దర్శించ వచ్చు. అది ఎట్లాగో చెబుతాను, విను-

'ఇతర నాడీ వ్యాపార నిరోధకరూపం' అయినట్టి 'రేచక ప్రాణాయామ ప్రయోగం' యొక్క సమయ-సందర్భాలలో ప్రాణవాయువులను కుండలినీ శక్తిచే బ్రహ్మనాడి యందు (సుషుమ్నానాడి యందు) ప్రవహింపజేయవచ్చు. అప్పుడు శిరస్సు యొక్క రెండు కవాటాల సంధిరూపమైన కవాట ప్రదేశానికి (సహస్రారమునకు) 12 అంగుళముల వెలుపల ఉన్న షోడశాంత స్థానమున ముహూర్త కాలం (12 seconds) ఉంటే అప్పుడు ఆకాశంలో సంచరించే సిద్ధపురుషుల దర్శనం అవుతుంది.

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ ఇంద్రియాలు, వీటి పట్ల గల దృష్టి దివ్యత్వం పొందకుండానే షోడశాంత స్థానంలో ప్రాణధారణ ఒనర్చినంతమాత్రం చేత సిద్ధుల దర్శనం కాదేమోకదా? ఈ విషయం దయచేసి వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవును. నీవు చెప్పింది నిజమే. భూమిపై చరించే జనులు మలినమైన అజ్ఞానముచే ఆశ్రితమైన ఇంద్రియధ్యాసలు ఉన్నంత వరకూ వాయురూపులైన (ఆకాశంలో సంచరించే) సిద్ధులను చూడలేరు. అయితే, విజ్ఞాన - యోగాభ్యాసములచే శుద్ధమైనట్టి మనస్సుకు ఒకానొక అధికారత్వం ప్రాప్తిస్తోంది. అట్టి మనస్సుచే సుదూర దర్శనం చేయగల బుద్ధి పొందబడుతుంది. అట్లాగే నిర్మల

సునిశిత మనోబుద్ధులచే ఆకాశంలో సంచరించే సిద్ధులను తప్పక చూడవచ్చు. అంతేకాదు. ఆ సిద్ధులు స్వప్న సదృశ్యంగా జనులకు వారి అభీష్టములను కూడా నెరవేరుస్తూ ఉంటారు. స్వప్నదర్శనం ఎట్లా ఉంటుందో ఆ సిద్ధుల దర్శనం కూడా అట్లాగే ఉంటుంది. అయితే ఆ సిద్ధులు కరుణతో ప్రసాదించే వర–దానాది ఫలాలు మాత్రం భౌతికప్రపంచంలో సిద్ధించగలుగుతాయి. ఇదే ఇందులోని విశేషం.

**పరకాయ ప్రవేశం -** రేచకాభ్యాస రూపమైన యుక్తి చేత క్రమంగా ముఖానికి 12 అంగుళాల వెలుపల ప్రాణవాయువును నిలుపవచ్చు. అట్లు నిలపటం చిరకాలం అభ్యసిస్తూ వస్తే మరొక శరీరంలో ప్రవేశించ గల ప్రావీణ్యత, అది కోరుకొను వారికి లభించగలదు. ఇవన్నీ సందర్భం వచ్చింది కనుక పురశ్చరణగా చెప్పటం జరుగుతోంది సుమా!

❖

**శ్రీరాముడు:** శిష్యుడు శరణువేడుతూ ఒక వేళ అల్పవిషయములకు సంబంధించిన ప్రశ్నలు వేసినప్పటికీ తమవంటి జగద్గురువులు దయచూపుతారేగాని, కోపగించరు కదా!

ఈ మాయామయ ప్రపంచం స్వతఃగా లేనేలేదని, దృష్టిని బట్టి మాత్రమే అనేక రీతులుగా స్ఫురిస్తోందని అందుచేత ఇదంతా అనియతా స్వభావం కలిగియున్నదని మీరు ఈ సంవాద సమయంలో అనేకసార్లు మాకు ఉద్బోధించటం జరిగింది. అయితే, ఈ ప్రపంచంలో పదార్థములు – తదితరములు నియతాబద్ధమై ఉంటున్నాయి. ఇదంతా ఎట్లా సందర్భపడుతోంది? ఈ ప్రశ్న సందర్భానుచిత మనుకుంటే మరొక్కసారి "స్వభావ నియతి" గురించి కొన్ని విశేషాలు ప్రస్తావించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! సత్యసంకల్పుడైన ఆ పరమాత్మ నిర్ణయమైన 'స్వభావం' లేక 'నియతి' అనే శక్తి కల్పాదియందు ఏ విధంగా స్ఫురిస్తోందో... అదే కల్పాంతం వరకు ఉంటోంది.

అసలు, అవిద్య అవస్తువే కదా! అట్టి నియతి యందు కొన్ని విశేషమైన తత్త్వాలు ప్రకటనమౌతూ ఉంటాయి. ఇది ఇట్లా ఉండగా, శరద్రుతువులో కొన్ని ప్రదేశాలలో వసంత ఋతుపుష్పాలు ఫలిస్తూ ఉంటాయి చూచావా! వస్తు శక్తి కూడా అక్కడక్కడ కొంత భిన్నత్వంతో గోచరిస్తూ ఉంటుంది.

ఏకంగా, అనేకంగా, నియతస్వభావంగా, అనియతక్స భావంగా – కన్పట్టుచున్న ఈ జగత్తంతా నిజానికి బ్రహ్మరూపం మాత్రమే అయున్నది. జీవుల కర్మలు, ఆయా ఫలభోగ కార్యక్రమముల కొరకు మాత్రమే బ్రహ్మము యొక్క "అజ్ఞాన – నియతిల విభాగం" కొంతకాలం వరకు నియతస్థితిని ధరించి విజృంభిస్తోంది.

❖

**శ్రీరాముడు:** స్వామీ! మరొక్క విషయం. యోగులు సూక్ష్మరంధ్రం గుండా ప్రయాణించటానికి అణుత్వాన్ని, ఆకాశమునంతా నింపివేయటానికి బృహతత్వమును అదే దేహమునకు సిద్ధింపజేసుకో గలుగుచున్నారు! అట్టి సూక్ష్మ – సువిశాలత్వములు ఒకే దేహమునకు ఎట్లా ఏర్పడుచున్నాయి?

❖❖❖

# 12. చైతన్య - జడముల పరస్పర హేతుత్వం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! దేహమునకు సంబంధించిన సూక్ష్మ – విస్తీర్ణయోగముల గురించి క్రమంగా చెప్పుకుందాం. ముందుగా విజ్ఞాన – జడ విజ్ఞేయాలకు, సత్ – అసత్‌లకు సంజ్ఞలైనట్టి 1.అగ్ని–శీతలాలు, 2. సూర్య–చంద్రతత్త్వాలు, 3.వెలుగు–చీకట్లు, 4. చైతన్య–జడములు ...ఒకదానితో మరొకటి కార్యకారణత్వం ఎట్లా కలిగి ఉంటున్నాయో, కొన్ని శాస్త్ర ప్రతిపాదిత విషయాలు ప్రస్తావిస్తాను విను, ఆ ప్రమాణములు జడ – చైతన్య 'పరస్పర కార్యకారణ సంబంధం' ఎరుగటానికి సహకరిస్తాయి.

**జఠరాగ్ని - దేహనిర్మాణం (అగ్ని - స్థూలం) -** 'కొయ్య, అంపము' – ఈ రెండిటి యొక్క సంఘర్షణల వలన కొయ్య రెండుభాగాలుగా అగుచుండగా నిప్పు రవ్వలు జనించి పైకి – క్రిందికి ప్రసరిస్తున్నాయి చూచావా? అట్లాగే సౌమ్య స్వరూపమగు ప్రాణవాయువులు దేహంలో సంచరిస్తూ ఉండగా వాటి ఊర్ధ్వ–అధో గమనాల సంఘర్షణచే (ప్రాణ–అపానాలు ఒకదానితో మరొకటి తాకుచుండుటచే) స్వభావసిద్ధంగా జఠరాగ్ని ఉత్పన్నమౌతోంది. ఈ జఠరాగ్ని 'దేహం' అనే యంత్రంలో మొట్టమొదటగా ఉదరభాగంలో ఉత్పన్నమౌతోంది. ఉదరభాగమున నాభికి పైన, క్రింద కలుస్తూ ఉండే రెండు తోలు తిత్తులచే నిర్మితమైన స్థూలమాంస విభాగంలో ఈ జఠరాగ్ని పుడుతోంది. ఆ స్థూలమాంస విభాగం – క్రింద గల జలం చేత, పైన ప్రసరిస్తున్న వాయువు చేత – కదలడం జరుగుతోంది. గాలిచే పొదరిల్లు కదలించబడుచున్నట్లుగా, అది వాసనలచే కదిలించబడుతోంది.

ఆ స్థూలమాంస విభాగం యొక్క క్రిందభాగంలో 'మూలాధారం' అను నిజస్థానమున 'కుండలిని'... ముత్యపు పెట్టెలో ముత్యాలహారం వలె...శక్తి–ప్రజ్ఞ తత్త్వంగా వెలయుచున్నది.

ఈ కుండలిని సర్వులకు ప్రాణప్రదాత అయి ఉండటం చేత ఇది అత్యంత పవిత్రమైనది. అది తిరుగుచున్న రుద్రాక్షల వలె ఎప్పటికప్పుడు మూలాధారం వద్ద సరసరలాడుతూ ఉంటుంది. కఱ్ఱతో కొట్టబడిన ఆడత్రాచుపాము వలె అది ఎల్లప్పుడూ ఊర్ధ్వముఖమునకు పరివర్తనశీలమై ఉంటోంది. ప్రాణ, అపానముల సంఘర్షణకు, జఠరాగ్ని యొక్క ఉత్పత్తికి ఈ కుండలినియే ప్రేరణ కారణమై ఉన్నది. అనగా, ప్రాణ – అపాన ఊర్ధ్వ – అధోగతులకు ఉత్ప్రేరకం ఇదే.

ఈ కుండలినీ శక్తియే – తుమ్మెద కమలంపై వ్రాలునట్లు – నేత్రాలు మొదలైన ఇంద్రియాలలో ప్రవేశించి స్వతహాగా జడస్వరూపమైన ఆ కళ్ళు, చెవులు మొదలైనవి విషయములను గ్రహించగల 'బోధ'ను ప్రసాదిస్తోంది. ఈ బయట ప్రపంచంలో గాలి వీస్తున్నప్పుడు చెట్లు కదులుచూ ఉంటాయి చూచావా? అట్లాగే ఈ కుండలినీ శక్తి అభ్యంతరములగు ప్రాణవాయువులకు ఒక క్రమశిక్షణ పూర్వకమైన కదలికను కల్పిస్తూ జ్ఞానేంద్రియశక్తులను, హృదయకమలమును నాడి సమూహములను జడస్థితి నుండి ఉత్తేజపరుస్తూ క్రియాశీలకం చేస్తోంది.

కుండలినీ శక్తిచే కదల్చబడుచున్న ప్రాణవాయువులు భుజించిన అన్నాన్ని జీర్ణం చేస్తూ తద్వారా శరీర నిర్మాణానికి, పరిరక్షణకు కారణమౌతున్నాయి. అది ఎట్లాగో చెపుతాను విను.

ప్రాణవాయువులచే స్పర్శించబడటం చేత, (ఉత్తేజపరుపబడటం చేత – కొట్టబడుట చేత), హృదయం యొక్క నాడులు కంపించటం జరుగుతోంది. అట్టి నాడుల యొక్క కంపనచే శరీరంలో ప్రవేశించిన అన్నం మొట్టమొదట రసంగా మారుతోంది. ఆ రసం క్రమంగా రక్తంగా మారుతోంది. రక్తం క్రమంగా మాంసమగుచున్నది. మాంసం చర్మం అగుచున్నది. చర్మం మేధస్సు అగుచున్నది. మేధస్సు మజ్జగాను, మజ్జ బొమికలుగాను, బొమికలు శుక్లం రేతస్సుగాను... ఇట్లు ఒక పదార్థం విలక్షణమైన మరొక పదార్థంగా పరిణామం చెందటం జరుగుతోంది. ఇదంతా కూడా భూమి నుండి వృక్షంలో ప్రవేశించి రసం పుష్ప–పల్లవ–ఫలాదులుగా పరిణమించటం వంటిదని నీవు గ్రహించవచ్చు. 'జడప్రతీతి' యగు వెదుళ్ళు ఒకదానితో మరొకటి ఒరిపిడి పొందటం చేత అగ్ని పుడుతుంది చూచావా? అట్లాగే ప్రాణ అపానాలు దేహంలో ఒకదానితో మరొకటి కుండలినీ ప్రోత్సాహ బలంచేత ఒరిపిడి పొంది తద్వారా జఠరాగ్ని పుడుతోంది. ఆ జఠరాగ్ని అన్నరసం మొదలు అంతిమధాతువైన శుక్రరసం వరకు పరిణామాన్ని కలిగింపజేస్తోంది. ఉష్ణతత్త్వం ఆహార పదార్థములను రసంగా మారుస్తుంటే, శీతలతత్త్వం తదనంతర కార్యక్రమం నిర్వర్తిస్తోంది.

స్వభావపరంగా ఈ కంటికి కనబడే భూమి శీతల స్వభావంతో కూడి ఉన్నది. అయితే ఇది సూర్యతేజస్సుచే ఉష్ణం పొందుతోంది కదా! అట్లాగే శీతల–వాత స్వభావం గల ఈ దేహం, దీని అంగాంగాలలో ప్రసరిస్తున్న జఠరాగ్ని వల్ల ఉష్ణత్వం పొందుతోంది. చూచావా ఆ సర్వేశ్వర శక్తి! ఈ సర్వదేహములలో కుండలినీ శక్తి స్వరూపము దాల్చి ఎంతటి తతంగం నడిపిస్తోందో కదా!

'ప్రాణ–అపాన' జనితమైనట్టి జఠరాగ్ని యొక్క తేజం నక్షత్రమండలం వంటి ఆకారం కలిగి ఉన్నదై ఉంటోంది. అది హృదయకమలమున సంచరించే బంగారుతుమ్మెద వలె ప్రకాశిస్తోంది. దేహమంతా ఉత్తేజమానమై ప్రకాశిస్తున్న ఆ జఠరాగ్ని కొందరు యోగిపుంగవులకు ఉపాస్యవస్తువుగా అగుచున్నది. అట్టి జఠరాగ్ని ప్రకాశమును ఆరాధ్య భగవంతుడుగా చిద్రూపంగా చింతన చేస్తూ ఉంటే కాలక్రమేణా అట్టి యోగాభ్యాసపరునికి 'సర్వపదార్థముల అంతరాంతరం వైపుగా దర్శించగల సిద్ధి' లభిస్తోంది. అప్పుడా యోగి లక్ష యోజనాల దూరంలో ఉన్న వస్తువును కూడా అరచేతిలోని అరటిపండును చూచినట్లు చూడగలుగుతాడు.

**అగ్ని, శీతలముల ప్రవర్తనం -** మాంసరూపము యొక్క ఖండములచే పూర్ణమైయున్న 'హృదయము' అనే తటాకంలో కమలము వలె ఈ జఠరాగ్ని ప్రకాశిస్తోంది. అగ్నికి కట్టెలు కావాలి కదా! ఆ జఠరాగ్నికి ఈ జీవుడు స్వీకరించే అన్నజలాదులు ఎండుకట్టెల వలె అగుచున్నాయి. శరీరంలోని స్వభావ శీతలత్వం ఎండవేడిమిని ఉపశాంతపరచే చంద్రునిలాగా – ఆ జఠరాగ్నిని తదితర అంతర్‌దేహ విభాగములను మండించకుండా ఉపశాంతపరుస్తున్నది.

**సూర్య – చంద్రాది సంజ్ఞలు**

1. సూర్యుడు – తేజోరూపం ఉష్ణ స్వభావం → "సత్" "చిత్"లకు → "విద్య" సంజ్ఞ

| 2. చంద్రుడు – | చీకటి రూపం<br>శీతల స్వభావం | → | "అసత్"<br>"జడము"లకు | → | "అవిద్య"<br>సంజ్ఞ |
|---|---|---|---|---|---|

ఈ బాహ్య జగత్తులో ఏఏ ఉష్ణత్వమైతే ప్రసరించి ఉన్నదో అదంతా కూడా సూర్యుని యొక్క 'తేజోరూపము' అయి ఉన్నది. చంద్రునియందు భూమియందు స్వభావసిద్ధంగా శీతలత్వం ఏర్పడి ఉన్నది. ఈ రెండిటి చేతనే, భౌతికంగా చూస్తే, ఈ బాహ్యజగత్తంతా నిర్మించబడుతోంది. ప్రతి ఒక్క వస్తువు అగ్ని – శీతలాల వేరు వేరు పాళ్ళ కలయికయే! ఈ భౌతికమైన అగ్ని–శీతలాల తత్త్వమే సూర్యచంద్రుల (అగ్నిష్టోమ) చమత్కారం. ఇక చైతన్యపరంగా చూస్తే విజ్ఞులగు యోగులు ఈ సూర్యచంద్ర (లేక అగ్ని–శీతల) తత్త్వములను చిత్–జడముల ప్రదర్శనాచమత్కారంగా సంజ్ఞలుగా దర్శిస్తున్నారు. అనగా, ఈ జగత్తంతా 'చిత్, జడము' అనే ఉభయ స్వరూపాలచే సంఘటితమై ఉంటోంది. యోగులు 'సత్ – అసదాత్మక మైనప్పటి బ్రహ్మం యొక్క ఒకానొక అవిద్యాంశయే ఈ జగత్ ఆకారంగా ప్రకాశిస్తోంది. అదియే ఇందు 'అగ్ని, శీతలం' అనే రెండు పరస్పర విరుద్ధ తత్త్వాలుగా ప్రవేశించి ఉంటోంది... అని గ్రహిస్తున్నారు అనగా ఆత్మతత్త్వ పరిలక్షితులగు ఆ బుద్ధి మంతులు (సాధకులు) – జ్ఞాన ప్రకాశం (సంవిత్), ఆత్మజ్ఞానం (విద్య), చైతన్యం – మొదలైనవాటికి 'సూర్యుడు' లేక 'అగ్ని'ని సంజ్ఞలుగా దృష్టాంతీకరిస్తున్నారు.

అదే విధంగా ...అసత్తు, అవిద్య, జడము మొదలైన వాటిని – 'చంద్రుడు' లేక 'శీతలము' అనే సంజ్ఞలుగా దృష్టాంతీకరిస్తున్నారు. సూర్య – చంద్రుల, అగ్ని–శీతలముల కలయికయే ఈ బాహ్య సృష్టి కదా! "సత్–అసత్‌ల కలయికే ఈ బాహ్య–అభ్యంతర సృష్టి అయి ఉన్నది" ...అనేదే అట్టి యోగ సాధకులకు ఉపాస్య వస్తువై ఉంటోంది.

అయితే ఓ రామచంద్రా! ఈ జగత్తంతా 'పరమ విజ్ఞానమగు సత్ చిదానంద స్వస్వరూపం యొక్క ఒకానొక తుచ్ఛాంశం అయి ఉన్నది' ...అని నీవు ఇప్పటికిప్పుడు గ్రహించి ఉండు. అనగా "కంటికి కనిపిస్తున్న ఈ జడజగత్తు, జడదేహం మొదలైనవన్నీ చైతన్య–స్వస్వరూపం యొక్క ఒకానొక అంశమే" అనునదే అగ్ని–ష్టోమయోగ సాధన. ఇక ఈ జీవుడో... స్వయంగా చైతన్యస్వరూపుడే!

❖❖❖

# 13. అగ్నిలో శీతలం!
# విజ్ఞానం (లేక) ప్రజ్ఞ నుండి జడ వ్యవహారం!

**శ్రీరాముడు :** మహర్షీ! ఇప్పుడు నాదొక సందేహం ఈ జీవుడు సర్వదా నిత్యోదిత – శుద్ధవిజ్ఞానంతో కూడిన శుద్ధచైతన్య స్వరూపుడే అగ్నిలో శీతలంలాగా అగ్ని, వాయు స్వరూపుడగు సూర్యుని నుండి జడ స్వరూపుడగు చంద్రుని లాగా ... విజ్ఞానంలో (శుద్ధ సంవిత్‌లో) అజ్ఞానం ఎట్లా ఉదయిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మంచి ప్రశ్నే వేశావు.

"అగ్ని వాయు స్వరూపుడగు సర్యుడు ప్రజ్ఞకు, శీతల-జడ ప్రకాశమగు చంద్రుడు ఈ జగత్ దర్శనమునకు సంజ్ఞలు" - అని అనుకున్నాం కదా!

1. విజ్ఞానం (శుద్ధ విజ్ఞానం), 2. జడ వ్యవహారం (విజ్ఞానంచే తెలియబడేదైన విజ్ఞాన జడం) - ఈ రెండూ కూడా పరస్పరం కార్యవ్యవహారం నెరవేరుస్తూ పరస్పర సంస్థితములై ఉన్నాయి.

"చెట్టులోంచి విత్తు. విత్తులోంచి చెట్టు" లాగా ఈ విజ్ఞాన - జడ వ్యవహారములు రెండూ ఒకదానికి మరొకటి ఉపాదాన కారణమై ఉంటున్నాయి.

'రాత్రి గడచిపోయింది కాబట్టి పగలు; పగలు గడచిపోయింది కాబట్టి రాత్రి' వలె ఒకదానికి రెండవది నిమిత్తకారణమై ఉంటున్నది.

'వెలుగు-చీకటి' లాగా ఒకదానితో మరొకటి వ్యతిరిక్త కారణం కలిగి ఉంటున్నది. 'బింబము - ప్రతిబింబా'ల వలె అవి రెండూ ఒకే సమయంలో ఉండియే ఉంటున్నాయి. ఎండ-నీడల వలె (ఎండ ఒక ఆకారంపై పడినప్పుడు 'నీడ' ఏర్పడియే ఉంటుంది. నీడ కనబడుతోందంటే ఎండ కాస్తున్నట్లే) ...అవి రెండూ పరస్పర అనుమాన కారణములై ఉంటున్నాయి. ఆ విజ్ఞాన-జడ వ్యవహారాల కార్య-కారణ పరిణామాలు (భావాలు) రెండు రకాలుగా ఉంటున్నాయి.

**1. సద్రూప పరిణామం -** తాను తానుగా ఉంటూనే రెండవదిగా పరిణమించటం. దృష్టాంతాలు: బీజాంకుర కార్య-కారణ భావం... విత్తు తాను నశించక తన నుండి వృక్షంగా పరిణమించటం; మట్టి మట్టిగా ఉంటూనే కుండగా పరిణమించటం; బంగారం బంగారంగా ఉంటూనే ఆభరణంగా అవటం.

జ్ఞాన ప్రకాశము అట్లు జ్ఞాన ప్రకాశంగా ఉంటూనే జడమగు జగదనుభవం పొందుతూ జడ స్వభావ సమన్వితమై ఉండటం.

**2. వినాశకరపరిణామం -** ఒకటి నిర్వీర్యమగుటచే (లేక, ఏమరవబడుటచే) రెండవది పరిణమించటం. దృష్టాంతాలు : దివారాత్ర కార్య - కారణభావం ...రాత్రి గడచిన తరువాత పగలు, పగలు గడచిన తరువాత రాత్రి రావటం.

విజ్ఞాన - జడవ్యవహారములలో, లేక (సత్-అసత్‌లలో) ఒకటి లేకుండా పోయినప్పుడు రెండవది ఏర్పడుచూ ఉండటం.

❖

**1. అప్రత్యక్ష ప్రమాణం -**

**సద్రూప పరిణామస్య మృద్ఘటక్రమ సంస్థితేః ।**
**అక్షోపలమ్భాదితరత్ ప్రమాణం నోపయుజ్యతే ॥**

"సద్రూపం నుండి - అసద్రూప జగత్తుగా కనిపించే జడతత్త్వం అను ప్రత్యక్షమునకు ఏదో అప్రత్యక్షమైన ప్రమాణం ఉన్నది" ...అని అనుకుంటూ ఉండటం యుక్తియుక్తం కాదు. మరెక్కడో ఏదో 'అనిర్వచనీయమైన, తాకరాని, చూడరాని తత్త్వం ఉండి, తనకు అనుకూలంగా ఇక్కడ ఉన్న

సర్వమును నడిపిస్తోంది. ఇక్కడ జీవులందరు ఆ అనిర్వచనీయ అప్రత్యక్ష తత్త్వము చేతిలోని జడమగు చదరంగపు పావులు మాత్రమే"... అని కొందరు తమ భావనలను కొనసాగిస్తున్నారు.

అయితే, ఇటువంటి అభిప్రాయాలు పైకి సొగసుగా కనబడవచ్చు గాక! జ్ఞాన విషయంలో అల్పసాధకులకు, బద్ధకస్థులకు ఇట్టి అభిప్రాయాలు అనుకూలంగాను, ప్రియంగాను అనిపించవచ్చు గాక! అట్లాగే సాధన యొక్క కించిత్ ప్రారంభదశలో సాధకులను సన్మార్గ నిరతులుగా చేయటానికి ఇటువంటి అప్రత్యక్షప్రమాణ వాక్యాలు కొంచెము ఉపకరిస్తూ ఉండవచ్చు గాక! ఏది ఏమైనా అట్టి అప్రత్యక్ష ప్రమాణం – చెప్పింది ప్రశ్నించకుండా వినేవారికి – ఊహాజనితమై అంగీకారయోగ్యం కావచ్చునేమో గాని, సత్యశీలురగు యుక్తాయుక్తముల పరిశీలకులకు అట్టి అప్రత్యక్ష ప్రమాణం నిరూపణకు దొరకుట లేదు. పిల్లవాడికి 'బూచి' గురించి కథలు చెప్పి, 'ఎఱ్ఱటి కళ్ళు, రెండు దంతాలు, బారెడు గడ్డం, పది అడుగల నాలుక' ...అను వర్ణనలు ఆపాదించి ఆ పిల్లవాడు అల్లరి చేయకుండా కొంచెం భయపడి చెప్పిన మాట వినటానికి దాది చెప్పుచున్నది. ఆ పిల్లవాడు ఆ బూచిని ఊహించుకుని అట్టి ఊహాబలంచే నిజంగానే ఉన్నట్లు అనుభూతి పొంది, కొంత అల్లరి మానవచ్చు గాక! అంతమాత్రానికి ఆ 'బూచి' అనబడేది సత్య నిరూపణార్హం అవుతుందా?...

ఓ రామచంద్రా! ఈ జీవుడు కల్పిత మధ్యే మార్గగాథలతో కాలయాపన చేయక, 'ఏది ఆత్యంతిక సత్యం? ఏది కల్పితం? నా వాస్తవ స్వరూపమేమిటి? ఆపాదితమాత్రమైన దేమిటి ? నే నెవరు? ఈ జడ జగత్తు ఏమిటి? దేహిగా నా స్వభావమేమిటి? దేహతాదాత్మ్యంచే అనుభవ మవుతున్న దేమిటి ...ఇట్టి ప్రశ్నలకు సరియగు అవగాహన ఎంత తొందరగా పెంపొందించుకుంటే అంత మంచిది.

'ఎక్కడో ఏదో ఉండి దీన్ని నడిపిస్తోంది. మట్టిలోంచి కుండలాగా, ఇది ఏదో తెలియనిదానిచే నిర్మించబడుతోంది. దాని దయ, నా ప్రాప్తి. ఇప్పటికి ఇంతే' ...అని సరిపుచ్చుకొని ఉండటం ఉచితం కాదు. శ్రేయస్సు కాదు. తానే ప్రజ్ఞా స్వరూపుడై ఉండగా సత్ స్వరూపుడై ఉండగా 'మరొక టేదో ఉన్నది' అని అప్రమాణమైన దానిపై (అనుమాన ప్రమాణమైన దానిపై) ఆధారపడి ఊరుకుంటే, – ఈ జీవుడు స్వస్వరూప విషయంలో ఎరుగవలసినది ఎరుగవలసినంతగా ఎరుగుట లేదని, అది జీవుని సమస్యకు పరిపూర్ణమగు సమాధానం కాజాలదని జనులందరికీ మనవి చేస్తున్నాను.

**2. అభావ ప్రమాణం లేక అనుపలబ్ధి ప్రమాణం -** రాత్రి, పగలు ఉంటున్నాయి కదా. అయితే రాత్రి అయిందా... పగలు ఉండదు. తెల్లవారిందా... రాత్రి మిగలదు, అట్లాగే విజ్ఞాన, జడ వ్యవహారాలలో (సత్–అసత్‌లలో) ఒకదానిని అభావించుటచే రెండవది ఉండదు. భావనయే ఈ జగత్తు. అభావన చేసినప్పుడు జగత్తు ఉండదు. జగత్తును భావన చేస్తున్నప్పుడు ఒక ద్రష్ట యొక్క నిర్మల ప్రజ్ఞ ఏమరచబడుచున్నది... ఇదియే అభావ అనుపలబ్ధ ప్రమాణం.

ఈ అభావ ప్రమాణం కొంతవరకు యుక్తి యుక్తమనవచ్చు. ఎందుకంటే అసత్‌యొక్క అభావన సత్ యొక్క భావనగా పరిణమించగలదు కనుక.

**3. అకర్తృత్వ ప్రమాణం -** కొందరు యుక్తివాదులు 'మట్టిలోంచి కుండ తయారవటానికి మట్టిలో కర్తృత్వం ఉండక్కర్లేదు. అట్లాగే జగత్తుకు కర్త లేదు. అచేతనమగు మట్టిలోంచి చేతనమగు కుండ తయారవుచున్నట్లు అచేతనమగు తత్త్వంలోంచి చేతనమగు ఈ జగత్తు పుడుతోంది. ఇక జగత్ నిర్మాత, దైవము మొదలైనవన్నీ కల్పితమాత్రమేగాని, ఇంతకుమించి ఎక్కడా ఏదీ లేదు ...అను సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నారు. అయితే వారి దృష్టిలో ఈ ఎదురుగా కనిపించే వస్తువులను మించి ఇక ఎక్కడా ఏదీ లేదు. ఇట్లా వారు ఆస్తికులను ప్రశ్నిస్తున్నారు.

ఈ ప్రతిపాదనలో సాధనాదుల అనావశ్యకత – దేహాత్మ బుద్ధి పొంచి ఉన్నాయి. జీవుని ఈ పదార్థ జగత్ పరిమితునిగా ప్రతిపాదించబడుతోంది. అందుచేత ఇట్టి ప్రతిపాదనలను త్యజించటమే ఉచితం. ఇట్టి ఆయా కల్పనలన్నీ అనవస్థానబుద్ధి వలన అనిపిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహర్షీ! అప్రత్యక్ష ప్రమాణం కంటే అభావ ప్రమాణం ఉత్తమమని అంటున్నారు కదా! అభావము అనేది ఒకానొక అనుభవ స్థితి కదా! జగత్తును అభావించినప్పుడు ఆత్మానుభూతియే శేషిస్తుంది కదా! ఇక, అభావమును కూడా చీకటి – వెలుగులు, అగ్ని–శీతలముల వలె ఒకానొక ప్రమాణంగా మాత్రమే చెప్పుచున్నారేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

> **ప్రత్యక్షవత్ అభావోఽపి ప్రమైవ రఘునందనా!**
> **అగ్న్యభావోపి శీతాస్య ప్రమాణం సర్వజన్తుషు ॥**

ఓ రఘునందనా! ప్రత్యక్షము లాగానే అభావము కూడా ఒక ప్రమాణమే. ఎందుకంటే 'నేనిప్పుడు అభావన చేస్తున్నాను' అను ప్రక్రియలో అభావన యొక్క భావన ఉండనే ఉన్నది కదా!

ఉష్ణము యొక్క అభావమే శీతలము యొక్క అనుమానము అగుచున్నది. కొందరు 'ప్రత్యక్షమైనదంతా అసత్తు. దీనిని అభావించుటయే సత్తు' అని ప్రవచిస్తున్నారు. అయితే అభావించటం కూడా ప్రత్యక్షంలోని ఒక ప్రమాణమే కదా! ప్రమాణం స్వతహాగా సత్యం కాదు. 'అది సత్యవస్తువును నిరూపించటానికి ఆశ్రయించబడే ఒకానొక సహకారిక ఉపాయం వంటిది, లేక దృష్టాంతము వంటిది అని సభికులంతా గ్రహించి ఉండెదరు గాక! ఒకడు శీతలము గురించి చెప్పటానికి గాను ఉష్ణము యొక్క అభావము ప్రమాణంగా తీసుకోవటం వంటిది. విజ్ఞానము యొక్క అభావమే ఈ మాయా జగత్తు యొక్క అంతర్లీన రహస్యం.

❖❖❖

# 14. చిత్ - జడపరిణామ చమత్కారం

**చిత్ యొక్క సద్రూప పరిణామం -** చిత్, తన యొక్క 'సద్రూప పరిణామం' అనే భావనకు సంబంధించినట్టి, ఆశ్రయం చేత 'జడమునకు సంబంధించిన అనుభవం' ఏర్పడటానికి కారణ మవుతోంది.

**చిత్ యొక్క జడరూప వినాశన పరిణామం -** అట్టి జడత్వము యొక్క సుదీర్ఘ భావనచే చిత్ తనను తానే ఏమరచుచున్నది. 'చిత్ లేదు జడమే ఉన్నది' – అను రూపంలో ఉండే చిత్ యొక్క వినాశకరపరిణామముచే ఈ జీవునకు మహాజడత్వం, సుదీర్ఘ దృశ్యతాదాత్మ్యం సంప్రాప్తిస్తున్నాయి. ఫలితంగా, ఈ జీవుడు తనయొక్క చిత్ స్వరూపమును పూర్తిగా మరచిపోయి, 'ఈ జడమే నా ఉనికి' అను నిద్రాణస్థితికి వస్తున్నాడు.

**జడము యొక్క సద్రూప పరిణామం -** దృశ్య విషయ సంబంధమైన ఘనీభూత భావనయందు చిక్కుకున్న జీవుడు ఎప్పుడో తనయొక్క చిత్‌చైతన్య రూపమును ఏమరచినట్లు గుర్తిస్తున్నాడు. తిరిగి ఇంటికి జేరే గృహయజమాని లాగా, (జడ విషయాలనే సాధనగా గైకొని) "తన చిత్ స్వరూపమునకు తిరిగి మరలటమే దుఃఖశమనోపాయం" – అని గుర్తిస్తున్నాడు. ఇదే జడం యొక్క చిత్ వైపుగా ఏర్పడే సద్రూప పరిణామం.

**జడము యొక్క వినాశన పరిణామం -** జడములకు సంబంధించిన సాధనలను ఉపకరణములుగా తీసుకొని తీవ్ర ప్రయత్నం చేస్తూ ఉండగా, ఆ సాధకుడు తన జడ స్వభావమును పూర్తిగా త్యజించి క్రమంగా 'చిత్ చైత్య స్వరూపుడు' అయి ప్రకాశిస్తున్నాడు. ఇది జడము యొక్క వినాశన పరిణామము.

చిత్ చైతన్యము యొక్క చిత్ ఏమరపు – జడభావనా పరిణామం; పరిణామం (అసద్రూప పరిణామం) యొక్క పునః చిదనుభవ – జడభావ వినావన పరిణామం (సద్రూప పరిణామం)

(చిత్ = తెలుసుకుంటున్నది. జడము = తెలియబడేది.)

ఈ విధంగా చిత్ చైతన్యము – జడమునకు, జడము – చిత్ చైతన్యమునకు 'సద్రూప – వినాశ' పరిణామ రూపములలో కార్య – కారణములౌతున్నాయి.

అనగా ...చైతన్యంలోంచి భావనా పరిణామంగా జడం వస్తోంది. జడంలోంచి పురశ్చరణ భావనా పరిణామం చేత చైతన్యం లభిస్తోంది.

చైతన్యం జడమునకు కారణమౌతోంది. అట్లాగే జడం – చైతన్యమునకు కారణమై పరిణమిస్తోంది.

**శ్రీరాముడు :** జడం చేతనమునకు కారణమవటమేమిటి స్వామీ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను జడ వస్తువులను విషయాన్ని, తత్సంబంధమైన విధి విధానాలను ఆశ్రయించి ఒకడు 'చైతన్యానుభవం' అనే ఆవలి ఒడ్డు చేరుచున్నాడు కదా! ఇదియే మనకు ఇక్కడ దృష్టాంతం.

ఈ జడ – చైతన్యముల పరిణామ – విపరిణామములే ఈ సృష్టి యొక్క చమత్కారం. జడ – చైతన్యముల భావాభావపరిణామములే ఈ వివిధ జీవులలో కనబడే వైవిధ్యం అయి ఉన్నది.

ఈ సిద్ధాంతం ఇంకొంచెం సుస్పష్ట పరచటానికి ప్రకృతికి సంబంధించిన రెండు – మూడు విశేషములను ఇక్కడ దృష్టాంతంగా తీసుకుంటాను.

**1. సూర్య (అగ్ని) చంద్రుల (శీతలము) దృష్టాంతం -** అగ్ని తన 'ప్రజ్వలనం' అనే సద్రూప పరిణామంచే పొగను వెడల గ్రక్కుతోంది. ఆ పొగ మేఘరూపమును పొందుతోంది. ఆ మేఘముల నుండి శీతలరూపము (చంద్రుని సంజ్ఞ) నిర్మించబడుతోంది. ఇది అగ్ని యొక్క సద్రూప పరిణామం.

ఆ అగ్ని తాను నశించుచున్నప్పుడు కూడా శీతలత్వంగా పరిణమిస్తూ వాయురూపము పొందుతోంది. ఆ వాయువు మేఘమునకు, మేఘము శీతలరూప చంద్రునకు కారణమౌతోంది. ఇది అగ్ని యొక్క వినాశన పరిణామం... ఇది చిత్ నుండి జడమునకు సంజ్ఞగా గ్రహించు.

జడమగు సముద్రంలో తరంగాల రాపిడికి బడబాగ్ని పుడుతోంది. ఆ బడబాగ్ని సప్తసముద్రాల లోని జలం ఆవిరి కావటానికి కారణమౌతోంది. ఆ ఆవిరి మేఘాలుగా అగుచున్నాయి. ఆ మేఘాల నుంచి 'జలరూప చంద్రుడు' నిర్మించబడుచున్నాడు. ఆ చంద్రుని సూర్య తేజస్సు జలరూప చంద్రుని 'అమావాస్య' వచ్చే సరికి పూర్తిగా మ్రింగి, మరల శుక్లపక్షంలో తన నుండి వెడలగ్రక్కుచున్నది. ఇదంతా జడంలోంచి చైతన్య పరిణామమునకు 'సంజ్ఞ'గా చెప్పబడుతోంది.

చంద్రునితో గూడిన వసంత-గ్రీష్మ ఋతువులలో భూమిపై ఉష్ణవాయువులు జనిస్తున్నాయి. ఆ ఉష్ణ వాయువులు భూమిపై గల శీతల - జలములను పీల్చి మేఘములుగా పరిణమిస్తున్నాయి. ఆ మేఘములు శరత్-వర్ష ఋతువులలో వర్షించటం చేత మరల భూమి జలంలో నిండిపోతోంది. జడంలోంచి చైతన్యం చేసే రాకపోకలకు ఇది కూడా ఒకానొక దృష్టాంతం.

**శ్రీరాముడు:** మహర్షీ! సూర్యుని కిరణాల చేతనే జలం పానం చేయబడుచున్నది కదా! తద్వారా మేఘాలు... అవి వర్షించటం జరుగుతోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవును. అప్పుడు కూడా జలం తనయొక్క సద్రూపపరిణామం చేత సూర్యుని కిరణస్థితి పొందుచున్నది కదా! జలమే ఆవిరి రూపమును పొందుతోంది కనుక జలం అగ్నికి కారణమగుచున్నట్లే కదా! ఉష్ణత్వ కారణంగా వినాశన పరిణామం చేత జలము అగ్నిరూపత్వం పొందుతోంది. అనగా జలము తనయొక్క వినాశకర పరిణామం చేత అగ్నికి కారణమౌతున్నట్లే!

జడము తన వినాశన పరిణామం చేత చైతన్యానుభవం ఏర్పడటానికి కారణమవటమనుదానికి ఇది సంజ్ఞగా శాస్త్రములు ఉద్బోధిస్తున్నాయి. అగ్ని యొక్క నాశనముచే అద్దాని సద్రూప పరిణామం 'శీతలం' శీతలం యొక్క నాశనం చేత అద్దాని సద్రూప పరిణామం 'అగ్ని'

దీనిని చైతన్యం - జడముల సద్రూప - అసద్రూపముల పరస్పర పరిణామ చమత్కారంగా అన్వయించి గ్రహించవలసినదిగా సభికులకు నా మనవి.

**2. దివా రాత్రము దృష్టాంతం -** ఓ రాఘవా! మనం ఇప్పుడు చెప్పుకునే దృష్టాంతాలలో...

చిద్రూపానికి - అగ్ని, సూర్యుడు, ప్రకాశం; జడానికి - జలం, చంద్రుడు, చీకటి... సంజ్ఞలుగా ఉదహరించుకుంటున్నామని ఇక్కడ మరొక్కసారి గుర్తుచేస్తూ... చైతన్య-జడముల పరస్పర కార్య-కారణాల వ్యవహారాన్ని వివరించే ఉద్దేశంతో పగలు-రాత్రులను ఉదహరించుకుంటున్నాం.

అగ్ని (సూర్యుడు) తొలగుటచే శీతలం (చంద్రుడు), శీతలం నశించుటచే అగ్ని పరిణమిస్తున్నట్లే, పగలు గడచిపోయిన తరువాత రాత్రి వస్తోంది. రాత్రి గడచిన తరువాతనో, తిరిగి తెల్లవారుతోంది, పగలు వచ్చిపడుతోంది. ఒక చిన్న ప్రశ్న. పగలు, రాత్రి కానట్టి సమయమంటూ ఏదైనా ఉన్నదా?

**శ్రీరాముడు :** ఉదయ సంధ్యా సమయం, సాయం సంధ్యాసమయం ఉన్నాయి కదా స్వామీ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఉన్నాయా? ఎక్కడున్నాయి?

**తమః ప్రకాశయోః ఛాయా – తపయోః దిన రాత్రయోః ।**
**మధ్యే విలక్షణరూపం ప్రాజ్ఞైరపి న లభ్యతే ॥**

1. చీకటి – ప్రకాశము; 2. నీడ – వెలుగు; 3. రాత్రి – పగలు ...ఈ మూడు ద్వంద్వములకు మధ్య తద్విలక్షణమైన స్థితి ఏదైతే 'సంధ్యా సమయం' అనే పేరుతో చెప్పుకుంటున్నామో... అది మహాప్రాజ్ఞులకు కూడా లభ్యపడటం లేదు.

అట్లాగే సత్–అసత్, చైతన్యం–జడముల మధ్య ఆయా రెండిటికీ విలక్షణమైన దేదీ గొప్ప గొప్ప సాధకులకు కూడా అనుభవమవటం లేదు.

అట్టి వెలుగు – నీడల మధ్య ఏదైనా సంధిరూపం ఉండిఉంటే అది కూడా అశూన్యరూపమే అవుతుంది. ఎందుకంటే అట్టి సంధిరూపం ఆ వెలుగు–నీడల రెండిటి రూపం అయి ఉండాలి కదా!

అట్లాగే భావ–అభావాలు కూడా! అభావనలో కూడా "అభావనను భావన చేయటం" అనే భావన ఉండనే ఉంటుంది కదా!

ఏ విధంగా అయితే చీకటి – వెలుగులచే ఈ భూమి మీద రాత్రింబవళ్ళు ఏర్పడుచున్నాయో .... అట్లాగే చిత్–జడములచే వాటి వివిధ పాళ్ళ కలయికచే ...ఈ ప్రపంచంలోని సమస్త ప్రాణులు స్ఫురిస్తున్నాయి. ఈ జగత్తంతా చిద్రూప జడముల మిశ్రమం మాత్రమే!

❖

జడము నందు కనిపించేదంతా చైతన్యము యొక్క ప్రకాశమే!

రాత్రి చిమ్మచీకటితో నల్లగా ఉండవచ్చు గాక! సూర్యుడు ఉదయించిన మరుక్షణం ఆ చీకటి అంతా పటాపంచలౌతోంది చూచావా! నిర్మలమైన చిత్ సూర్యుడు ఉదయించగానే ఈ సంసారాంధకారమంతా వినాశనమొందుతోంది.

అర్ధరాత్రి చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. అయితే చంద్రుడు జడము, స్వయం ప్రకాశ రహితము కదా! మరి ఎట్లా ప్రకాశిస్తున్నాడు? సూర్య ప్రకాశమే ఆ చంద్రునిలోని వెన్నెల అయి మనకు ప్రాప్తి స్తోంది. అయితే చంద్రప్రకాశము కనబడుతోంది గాని, ఆ చంద్రుని వెలిగించే సూర్యుడు కనబడుటలేదు కదా! జడమగు ఈ దేహమున స్వసత్తయే (స్వయం ప్రకాశమగు సూర్య ప్రకాశమువలె) అసత్త వలె (రాత్రియందు సూర్యుని ఉనికి – ప్రభావములు లేనట్లుగా అనిపిస్తున్నట్లు)... ప్రకాశిస్తోంది. పరిమితమైన జ్ఞానం కలవారికి చంద్రప్రకాశం వెనుక గల సూర్యుని ఉనికి తెలియరానట్లు, దేహ తాదాత్మ్య దృష్టి కలవారికి చైతన్యం యొక్క ఉనికి తెలిసిరావటం లేదు.

సూర్యుని నుండి బయలుదేరిన సూర్య ప్రకాశరూపమగు అగ్ని చంద్రమండలంలో ప్రవేశిస్తోంది. జడమయమగు ఆ చంద్రమండలమును స్ఫురద్రూపంగా చేస్తోంది. అట్లాగే, చిద్రూపం అనే అగ్ని ఈ దేహంలో ప్రతిష్ఠమౌతోంది. ఆ చిద్రూపాగ్ని జీవితపర్యంతం 'అహం' భావమును ప్రకాశితంగా

చేస్తోంది. చంద్రుని చూస్తున్నప్పుడు, "ఆహాఁ! ఈ చంద్రుడు ఎంత అందంగా ప్రకాశిస్తున్నాడు!" అని అనుకుంటున్నాం. ఆ చంద్రునిలోని వెలుగు సూర్యునిదే కదా! అట్టి సూర్య-చంద్రుల ప్రభవాలు అభేదాలే అగుచున్నాయి. అభేదాధ్యాసచే సూర్యునిలో ఉత్పన్నమయ్యే ప్రభామండలము చంద్రునిలోని ప్రభ ఒక్కటే కదా! ఆ చిత్ చైతన్యమే లేక, చిదానందమే స్వసంవిస్మయము పొందినదై 'నేను మనుష్యుడను. సంబంధితుడను, దేహస్వరూపుడను' ...ఇత్యాది స్వకీయమైన అనుభవములను ఆశ్రయించి, దేహస్థమై ఉంటోంది.

❖

అగ్ని (కాంతి) సర్వే సర్వత్రా ఉండి ఉన్నప్పటికి అది దీపం ఉన్న చోటే ప్రకాశం వెడలగ్రక్కు చున్నట్లు 'క్రియ – ఉపాధి' లేకుండా కేవల చైతన్యము పైకి భాసించదు. దీపము ద్వారా ప్రకాశము ఎరుగబడుచున్నట్లు ...దేహము ద్వారానే ఆ చైతన్యము ఎరుగబడుచున్నది.

**చితః – చేత్యో ఉన్ముఖత్వేన లాభః సైవ చ సంసృతిః ।**
**నిశ్చేత్యాయాః శుభో లాభో నిర్వాణం వా తదేవ హి ॥**

అజ్ఞానముచే కప్పబడిన చైతన్యము విషయముల వైపు ఉన్ముఖం అవటమే... 'సంసారము' అను రూపమైన అనర్థప్రాప్తి కారణం. విషయరహితమగు చైతన్యానుభవమే – శుభం, లాభం, మోక్షం కూడా!

ఒకచోట ఒక పెద్ద గోడ ఉన్నది. అయితే దట్టంగా క్రమ్ముకుని ఉన్న చీకటి చేత ఆ గోడ ఏ మాత్రం కనిపించటమే లేదు. ఆలోగా తెల్లవారింది. సూర్యుని ఉదయకాంతులు ఆ గోడపై ప్రసరిం చాయి. ఇప్పుడు ఆ గోడ సుస్పష్టంగా కనిపిస్తుంది కదా! సూర్యకాంతి – గోడ పరస్పరం కలియటం చేత ఆ గోడ యొక్క దర్శనం అవుతోంది. అట్లాగే సూర్యకాంతి-చంద్రుల వలె ఈ దేహంలో చైతన్య రూపుడగు దేహి, జడరూపమగు పంచభూత మిశ్రమం (చంద్రుడు – సూర్యకాంతిచే ప్రకాశించబడే గోడ) కలిసి ఉంటున్నాయి. దేహి యొక్క సుదీర్ఘము – ఘనీభూతము అయిన దేహ స్వరూప భావనచే పరమ జడమగు కేవలీ జడస్థితి సంభవిస్తోంది. అట్లా కాకుండా ఈ ఉపాధితో ఏర్పడే తాదాత్మ్యం యొక్క నివృతిచే ఆ దేహికి అత్యంతానందం ఉదయిస్తుంది. అది అగ్ని యొక్క (లేక) చైతన్యము యొక్క 'కేవలీస్థితి' అవుతుంది.




**ప్రాణ, అపానవాయువుల సమన్వయం -** ఇప్పుడు మనం సంభాషించుకుంటున్న 'చిత్ – జడ' సూర్యచంద్ర తత్త్వాన్ని దేహము నందలి ప్రాణవాయువుల గతికి అన్వయిద్దాం.

ప్రాణవాయువు ఉష్ణ ప్రకృతి కలిగియున్నది. అనగా, అగ్ని రూపమైయున్నది. అపానవాయువు శీతల ప్రకృతి కలిగియున్నది. ఒక ఆకారము - దాని నీడలాగా ఈ రెండు కూడా తమతమ మార్గములలో ప్రవర్తిస్తూనే ఒకదానితో మరొకటి ముఖాముఖి అగు చున్నాయి.

శీతల స్వభావమైనట్టి అపానవాయువు నందు ఉష్ణ స్వభావమై, అగ్ని రూపమగు ప్రాణవాయువు సత్త పొందుచున్నది. వస్తువు అద్దంలో ప్రతిబింబించినట్లుగా అపానవాయువు ప్రాణవాయువునందు సత్త పొందుతోంది. ఈ విధంగా ఆ రెండిటికి అన్యోన్యమైన తాదాత్మ్య స్థితి ఏర్పడుతూ ఉంటోంది.

ఈ బాహ్య జగత్తులో గోడ మొదలైన జడ వస్తువుల ప్రకాశమును జనింపజేస్తున్నదెవరు? సూర్యుడే కదా! సూర్యుడే లేకపోతే ఈ భూమిపై ప్రకాశమే ఉండేది కాదు. అట్లాగే చిద్రూపమగు అగ్ని, లేక కాంతి ఈ దేహమున ఏర్పడి ఉండి మూలాధారం నుండి కంఠం వరకు గల చంద్ర ప్రకాశ శక్తిని ఉత్పన్నం చేస్తోంది. చిద్రూప సూర్యుని నుండి శక్తిని పొందిన ఆ మనోరూపమైన చంద్రశక్తి ఈ దేహంలో వాక్‌శక్తిగా, దర్శనశక్తిగా, వినికిడి శక్తిగా, స్పర్శగ్రహణ శక్తిగా ప్రదర్శితమౌతోంది.

❖❖❖

# 15. సాధన - ఉపాసన

ఓ రామచంద్రా! ఇంతవరకు మనం కుండలిని గురించి, ప్రాణ-అపానాల పరస్పర సంయోగం గురించి కొన్ని విశేషాలు చెప్పుకున్నాం. ఇప్పుడు యోగోపాసన ఎట్లా చేయాలో చెప్పుతాను విను.

**ప్రాణ, అపానముల సంధిస్థాన ఉపాసన -** ముఖమునకు దాదాపు 12 అంగుళముల దూరమున చంద్రుని యొక్క 16వ కళ సూర్యకళగా అగుచున్నది. అనగా అపానం యొక్క 16వ కళ ప్రాణముగా (అనగా ప్రాణశక్తి యొక్క - బాహ్యం నుండి - దేహములోనికి తిరుగు ప్రయాణ ప్రారంభ స్థానం) రూపం పొందుతోంది. ఆ సంధిస్థానంలో నీవు నీ ధ్యాసను నిలుపు. అట్లాగే హృదయాకాశమున ఎక్కడైతే ప్రాణవాయువు సమాప్తి పొందుచుండగా అపానవాయువు కేవల నిజస్థితియందు ఉన్నదో, అనగా ప్రాణవాయువు సమాప్తి అయి, అపానవాయువు ఇంకను బయల్వెడలవలసి ఉన్నట్టి సంధిస్థానంలో (ప్రాణశక్తిలో) నీ ఏకాగ్రధ్యాసను నిలుపు.

ఈ ప్రాణ - అపానముల సంధిస్థానం గురించి మనం ఉపశమన ప్రకరణంలోను, ఈ నిర్వాణప్రకరణంలో భుశుండోపాఖ్యానంలోను చెప్పుకున్నాం.

ఓ రామచంద్రా! చిత్ సూర్యుడు అగ్ని - ఉష్ణరూపుడని, జడ చంద్రుడు శీతలరూపుడని చెప్పుకున్నాం కదా! 1. అర్ధరేచక, 2. అర్ధ పూరకముల అంతరమున ఈ ప్రాణ-అపానములు ప్రతిబింబ రూపంలో ఉంటాయి. అవియే మనం చెప్పుకున్న సంధిస్థానాలు. అచ్చట నీవు స్థిరుడవై ఉండు. అభ్యాసవశం చేత అట్టి స్థిరత్వపు ఉనికి అనుక్షణికం అవగలదు.

**బాహ్య జగత్తులో ఋతువులు, రాసులు, సంక్రాంతి -** ఈ బాహ్య జగత్తులో వసంత, గ్రీష్మ, వర్ష, ఋతువులందు (3×2=6 నెలలు) భూమిపై గల ఉష్ణంచే శీతలం స్వీకరించబడుతోంది. దీనిని శీతలం యొక్క (చంద్రుని) అగ్ని సంక్రాంతి అంటున్నారు.

ఇక, శరత్, హేమంత, శిశిర ఋతువులందు భూమిపై గల శీతలంచే ఉష్ణం గ్రహించ బడుతోంది. దీనిని అగ్ని యొక్క శీతల (చంద్ర) సంక్రాంతి అంటున్నారు.

| ఈ శీతలము యొక్క అగ్ని సంక్రాంతి | | అగ్ని యొక్క శీతల సంక్రాంతి |
|---|---|---|

సంధికాలమున మేషాది రాసులందు సూర్య సంక్రాంతి సంభవిస్తోంది. అయితే ఈ బాహ్య సంక్రాంతులు తృణప్రాయములు. చాలా స్వల్ప విషయములు.

ఈ దేహాంతర్గతంగా కూడా ప్రాణ – అపానములు సూర్య – చంద్రుల వలె ప్రవర్తిస్తూ ప్రాణ–అపానముల సంక్రాంతులను కలిగి ఉంటున్నాయి. అవి జీవునికి సంబంధించిన ముఖ్య సంక్రాంతులు. వాటి గురించి వివరిస్తాను. విను.

**దేహాంతర్గత సంక్రాంతులు -**

**శీతలం యొక్క అగ్ని సంక్రాంతి -** శరీరమునందలి జఠరాగ్నిచే అపానవాయువు యొక్క అంతర్గత శీతలత్వము గ్రహించబడే టప్పుడు శీతలము యొక్క అగ్ని సంక్రాంతి అగుచున్నది.

**అగ్ని యొక్క శీతల సంక్రాంతి -** ప్రాణవాయువు యొక్క అంతర్గత ఉష్ణత్వముచే బాహ్యమున ఉన్న శీతలత్వము గ్రహించబడుచున్నప్పుడు అగ్ని యొక్క శీతల (లేక చంద్ర) సంక్రాంతి అవుతోంది.

| ఈ శీతలము యొక్క అగ్ని సంక్రాంతి | ↓ ↑ | అగ్ని యొక్క శీతల సంక్రాంతి |
|---|---|---|

...మధ్యలో ఏర్పడియున్న సంధియందు అగ్ని సంక్రాంతి సంభవిస్తోంది.

ఓ రామచంద్రా! ఈ విధంగా దేహంలోని అగ్ని–శీతల సంక్రాంతులను ఎరుగుము. ఇవే ప్రాణ అపానాల సంక్రాంతి కూడా అని గ్రహించు. ఇవే ముఖ్య సంక్రాంతులు. బాహ్య ప్రసిద్ధ సంక్రాంతి, ఉత్తరాయనం, దక్షిణాయనం... ఇవన్నీ కూడా ప్రాణ–అపానాల గతి భేదం ద్వారా ఈ దేహాభ్యంతరం లోనే ఉన్నాయి. వాటిని ఎరిగినవారు యోగుల సభలో ప్రముఖులై శోభిస్తున్నారు.

❖❖❖

# 16.కుండలిని - అష్టసిద్ధులు - జ్ఞానసాధన క్రమం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'యోగుల దేహాలు ఏ విధంగా అతిచిన్నవి గాను, అతిపెద్దవి గాను అగుచున్నాయి?' ...చెప్పమని అడిగావు కదా! ఇప్పుడా క్రమమేమిటో చెబుతాను, విను.

ఈ హృదయచక్రము యొక్క కోశములోని పై భాగంలో బంగారు తుమ్మెదలాగా, సాయంకాల మేఘములోని మెఱుపులాగా ఒకానొక అగ్నికణం (లేక) విస్ఫులింగం ప్రకాశిస్తోంది. అది అభౌతికం. (శక్తి గురుత్వాకర్షణలతో పోల్చ తగినది.) జ్ఞాన స్ఫురణ... అనతగినది. ప్రజ్ఞా సంబంధమైనది. ఉషోదయంలో సూర్యుడు ఉదయించి ఈ భూమిపై నలువైపులా ప్రసరిస్తూ చిమ్మచీకటిని పటాపంచలు

చేస్తాడు చూచావా? ఆ అగ్నికణం కూడా ప్రవర్ధమానమగు సంవిత్ స్వరూపముచే (జ్ఞానస్వరూపముచే) శీఘ్రంగా వృద్ధి చెంది దేహమంతా ప్రసరిస్తోంది. సూర్యభగవానుడు ఆకాశమును ప్రకాశింపజేయు నట్లు ఆ అగ్ని విస్ఫులింగం ఈ దేహమును ప్రకాశింపజేస్తోంది. భౌతికమైన అగ్ని బంగారమును ద్రవింపజేయుచున్నట్లు ఆ విస్ఫులింగం ఈ దేహమునంతటినీ ద్రవింపజేస్తోంది. అది నఖ-శిఖ పర్యంతము దేహమంతా ప్రవహించి ఈ దేహములోని జడత్వమును తొలగించి చైతన్యముతో నింపివేస్తోంది. బాహ్యజగత్తులోని ఉష్ణము వస్తువుల తడిని పీల్చి, ఆ వస్తువులను పొడిగా చేయునట్లు (తడిని తొలగించునట్లు) ఆ ప్రజ్ఞాతత్త్వం అంతరింద్రియములలో ప్రసరించి యోగశక్తిచే అందలి జడత్వమును తొలగించి ఉత్తేజపరుస్తోంది.

ఈ విధంగా అది దేహంలో దేహమునకు వేరైన మనోరూపసూక్ష్మమున ఉండి ఉంటోంది. ఇట్లు పార్థివ, అటు జల దేహాల రెండిటినీ ఉత్తేజపరచి తాను కూడా వాటియందు లీనమై ఉంటోంది.

ఆ విస్ఫులింగం ఉద్భవమై ఇంకనూ దేహమందు ప్రసరించవలసియున్న క్షణములలో కుండలినీ శక్తి సుషుమ్నానాడీ రహితమై, (కానీ) తనయొక్క సంస్కారముచే శోభితమై ఉంటోంది. అగ్నిలో బయల్వె డలటానికి సిద్ధమై ఉన్న పొగలాగా కుండలినీ శక్తి అతివాహిక దేహం నందు స్థితి కలిగి ఉంటోంది.

ఆ అగ్నికణం (విస్ఫులింగం) బాహ్యమున మనస్సు - బుద్ధి - జీవుడు మొదలైనవి కలిగి ఉన్నదై అంతరమున చిత్కళాప్రకాశము కలిగి ఉన్నదై 'పొగపంక్తి' వలె భాసిస్తోంది.

ఆ విస్ఫులింగముతో కూడిన కుండలినీ శక్తి యోగులకు ధ్యాన విషయములగుచున్నది. ఆ శక్తిని ఎక్కడ నియమిస్తే అక్కడికి వెళ్ళి ఆ రూపమును పొందగలదు. ధ్యానాభ్యాసముచే యోగులు ఆ శక్తిని ఆశ్రయించి, ఆరాధించి తమ ఇచ్ఛాంగీకారయోగ్యంగా చేస్తున్నారు. ఆ కుండలినీ శక్తిని ధ్యానాభ్యాసముచే వశం చేసుకున్నప్పుడు ఆ యోగి పర్వత - గోడ - శిల - స్వర్గ - పాతాళాది లోకములలో ఎక్కడికి కావాలనుకుంటే అక్కడికి క్షణంలో వెళ్ళగలడు.

ఆ కుండలినీ శక్తి ఒక దేహంలో జడభాగాన్ని విసర్జించి ఇంకొక దేహంలో ప్రవేశించి ఆ నూతన దేహాన్ని రసపూర్ణం చేసివేయగలదు అది రసపూర్ణత్వ విభూతిచే ఏ దేహాన్ని భావన చేస్తే ఆ దేహాకారాన్ని శీఘ్రంగా ధరిస్తోంది. ఒక గొప్ప చిత్రకారుని బుద్ధిలో ఏ రేఖాకృతి ఉద్దేశించబడుతుందో, అది ఏ విధంగా చిత్రకళా ఖండమై ప్రకటనమగుచున్నదో, అట్లాగే కుండలినీ శక్తి కూడా యోగి ఇచ్ఛానుసారం ఏ రూపం భావిస్తే ఆ పాంచభౌతిక రూపం ధరిస్తోంది.

తల్లి గర్భంలో ప్రవేశించిన సూక్ష్మమగు బీజశక్తి కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు మొదలైన తత్త్వాలు గల దేహాంకుర స్థితి పొందటం కూడా అట్టి ప్రక్రియయే! అయితే అది ప్రవాహపతితమైనదే గాని, బుద్ధిపూర్వకమైనది కాదు. అనగా, యోగ సాధనచే స్వాధీనమైనది కాదు. ఆ కుండలినీ శక్తి తదనంతర దృఢభావనచే బొమికలు చర్మము మొదలైనవి గల వేరైన దేహమును పొందగలుగుతోంది. అదియే క్రమంగా యోగసాధనచే తాను అనుకున్నట్లు దేహపరిణామమును మార్చగలదు. అతివాహిక దేహసహితమైన కుండలినీ శక్తి చిన్నదేహమును, పెద్దదేహమును కూడా ధరించగలుగుతోంది.

(కుండలిని = శక్తి + ప్రజ్ఞ + నేను)

ఆయా యోగశక్తులు యోగశాస్త్రంలో అష్టసిద్ధులుగా ప్రసిద్ధికెక్కాయి –

1. అణిమాసిద్ధి – అణు స్వరూపుడవటం
2. గరిమాసిద్ధి – బృహత్ స్వరూపుడవడం
3. లఘిమాసిద్ధి – దూరప్రదేశాలను క్షణంలో జేరటం
4. మహిమాసిద్ధి – ఆయా మహిమలు (వస్తువులను సృష్టించటం వంటిది) ప్రదర్శించటం.
5. ఈశిత్వసిద్ధి – అనేకచోట్ల ఒకేసారి ఏర్పడి ఉండటం
6. వశిత్వసిద్ధి – ఎదుటివారి మనోబుద్ధులను వశం చేసుకోగలగటం
7. ప్రాకామ్యసిద్ధి – కోరినవి నిర్మించుకోగలగటం, కోరగానే పొందటం, ప్రసాదించ గలగటం.
8. ఇచ్ఛాసిద్ధి – సంకల్పించినది సంకల్పించినట్లుగా సిద్ధింపజేయ గలగటం.

కుండలినీ అధ్యాస దేహాంకుర స్థానం నుండి (అనగా, ఈ భౌతికదేహం తల్లిగర్భంలో చైతన్యవంతమగు క్షణమును కూడా) యోగులు సాధన వస్తువుగా ఆరాధిస్తున్నారు. అంతకుముందు కూడా ఏ మనోబుద్ధ్యాది సూక్ష్మదేహాకారమైయున్నదో, ఆ చిత్ శక్తి విస్ఫులింగమును ఆరాధించిన యోగులు ఈ జన్మకర్మల రహస్యమును సాదృశంగా ఎరుగుచున్నారు.

ఇప్పటిదాకా చిదగ్ని కణతత్త్వాన్ని (లేక) కుండలినిని ఆరాధించే యోగులు పొందగల అణిమాది సిద్ధుల గురించి ప్రస్తావించాను. ఇప్పుడు తద్వారా లాభించగల జ్ఞానసాధ్య క్రమాన్ని వివరిస్తాను. విను.

**జ్ఞానసాధ్య క్రమం –**

**ఏకం 'చిన్మాత్రం' అస్తి ఇహ శుద్ధం సౌమ్యమ్, అలక్షితమ్,**
**సూక్ష్మాత్–సూక్ష్మతరమ్ శాన్తం, న జగత్–న జగత్ క్రియా ॥**

ఈ ప్రపంచమునందంతటా 'చిన్మాత్రవస్తువు' మాత్రమే ఉన్నది. అది సర్వదా ఏకమై (అనేకంగా అవటమే లేదు), శుద్ధమై (ఏ దోషమూ దానికి అంటటం లేదు), సూక్ష్మం కంటే కూడా సూక్ష్మాతి సూక్ష్మమై ఉన్నది. అయితే అద్దానిలో ఈ జగత్తూ లేదు... ఇందలి క్రియావ్యవహారాలూ లేవు. ఆ చిన్మాత్రం ఎప్పుడైతే తనయొక్క 'అధ్యాసచే తనకు తానే' సంకల్పము వైపు ఉన్ముఖం చేసుకుంటోందో... మరుక్షణం అది కలుషితమైనదానివలె కనబడి 'జీవుడు' అను నామధేయమునకు అర్హమగుచున్నది.

**అసత్యమేవ సంకల్ప, భ్రమేణ ఇదం శరీరకమ్,**
**జీవం పశ్యతి మూఢాత్మా, బాలో యక్షమివోద్ధతమ్ ॥**

మూఢుడగు బాలుడు ఇంద్రజాలం – ఐంద్రజాలికులను గాంచునట్లు ఈ జీవుడు తన 'అసత్య భావనావశం' చేత తనయందు ఈ స్థూల–సూక్ష్మ శరీరాలను గాంచుచున్నాడు. ఎప్పుడైతే ఈ జీవుని ప్రజ్ఞ–అవగాహన అను జ్ఞానదీపంచే సమ్యక్ ప్రకాశం పొందుచున్నదో... అప్పుడు మేఘ రహితమైన నిర్మలాకాశం లాగా సంకల్పం యొక్క మోక్షాన్ని సంపాదించుకుంటున్నాడు. అనగా, సంకల్ప సహాయంచే సర్వసంకల్పాలకు మునుముందే ఉన్న స్వస్వరూపాన్ని గాంచుచున్నాడు. సంకల్ప క్షయం చేత ఈ స్థూల దేహభావం తైలరహితదీపంలాగా శమిస్తోంది.

**నిద్రావ్యపగమే జంతుః యథా స్వప్నం న పశ్యతి,**
**జీవ_వోపి భావితే సత్యే తథా దేహం న పశ్యతి ॥**

నిద్రిస్తున్న ఒకప్రాణి నిద్ర నుంచి మేల్కొనగానే ఇక ఆ ప్రాణి కంటున్న కల మటుమాయ మవుతుంది కదా! అట్లాగే, మిగలదు కదా! సత్యమును ఎఱిగిన తరువాత ఈ జీవుడు ఇక ఈ దేహ భావమును గాంచడు. నిర్మలాత్మ భావనచే వెలుగొందుతాడు.

**అతత్త్వే తత్త్వభావేన జీవో దేహావృతః స్థితః ।**
**నిర్దేహో భవతి శ్రీమాన్ సుఖీ తత్త్వైక భావనా ॥**

అతత్త్వములైనట్టి ఈ దేహము మొదలైనవాటియందు 'ఇవియే నా స్వరూపం' అను తత్త్వభావనం చేయటం చేతనే జీవుడు దేహవశుడై ఉండటం జరుగుతోంది. ఏకతత్త్వమగు బ్రహ్మము యొక్క భావన చేయటం చేత అతడు దేహాతీత స్వభావుడై, శ్రీమంతుడు, సుఖి కాగలడు.

ఓ రామచంద్రా! అనాత్మరూపములగు ఈ శరీరాదులందు ఆత్మభావన చేయటం' ...అను రూపంలో ఉండే ఒకానొక నిబిడాంధకారం ఈ జీవుని చుట్టూ అలముకొని ఉన్నది. ఆ అంధకారం ఈ భౌతిక సూర్యోదయంచే నశించేది కాదు. సుమా! మరి? ఆత్మ యందు 'నేను నిత్యోదితమైన నిర్మలాత్మ స్వరూపుడను' అను ఆత్మభావన చేయాలి. "సర్వవ్యాపి అయి, నిరంజనమై, నిర్మలమైనట్టి చిన్మాత్రమే నేను" అను ఒక్క జ్ఞాన సూర్యోదయం చేత మాత్రమే ఈ అజ్ఞానజనితమైన అసత్తుల్య జీవత్వాంధకారం నశించగలదు. అంతకు మించి వేరే ఉపాయం లేదు.

మిగతా ఉపాయాలన్నీ అందుకొరకై ఉన్నాయి. మరి అట్టి ఆత్మభావనను సముపాదించటం ఎట్లా? మహాత్ములగు ఆత్మజ్ఞానులు, సత్యసంకల్పులు ఈ భూమిపై ఆయా సర్వజాతులలోను సంచరిస్తూ ఈ భూమిని పావనం చేస్తున్నారు. ఈ జనులు వారెలా భావన చేయుచున్నారో గమనించి శీఘ్రంగా అట్లే అనుసరించెదరు గాక!' "దృఢమైన భావన" కు సర్వము సుసాధ్యమేనని అందరూ ఎరిగిన విషయమే. ఒకనికి ఏమీ తెలియకపోవచ్చు గాక! అతని దృఢమైన భావన విషమును అమృతంగానూ, అమృతమును విషంగానూ చేసివేయగలుగుతుంది.

**ఏవం యథా యదేవ_ఉహ భావ్యతే దృఢభావనాత్,**
**భూయతే హి తదేవాల_శు తదిత్యాలోకితం ముహుః ॥**

దృఢభావనచే ఏ పదార్థం ఎట్లు అవలోకించబడుతుందో... అప్పుడది అట్లే అగుచుండుట మనందరం అనేకసార్లు రోజూ చూస్తున్న విషయమే. ఈ "దేహం, దేహ సంబంధిత విషయాలు సత్యమే" అను దీర్ఘాభ్యాసభావనచే చూచుచుండుటచే దేహి దేహసంబంధమాత్రుడుగా అవగతమగు చున్నాడు. ఈ దేహాదులను తత్సంబంధిత విశేషాలను అసత్యభావనచే దర్శించువారికి దేహి యొక్క బ్రహ్మాకాశరూపం అనుభవమగుచున్నది. కుండలినీ ధ్యానం అందుకు సాధకునికి ఉపకరించగలదు. ఉత్తములగు యోగులు కుండలినీ ధ్యానంచే సత్వరమే దేహభావనను జయించి బ్రహ్మతత్త్వభావనను – బ్రహ్మేత్మాహంభావనను సంతరించుకుంటున్నారు. అల్పపరిలక్షితులగు యోగులు అణిమాది

సిద్ధులను ఆశ్రయించి పునః సంసారమునకు వెనుతిరుగుచున్నారు. ప్రజ్ఞావంతులగు యోగులకు అణిమాది అష్టసిద్ధులు ఉన్నప్పటికీ మహదాశయ సంపన్నులై ఉండటం చేత అవి వారికి భూషణాలు అగుచున్నాయే గాని తిరోగనమమునకు కారణములు కాలేవు. మహదాశయుల దృష్టిలో అణిమాది సిద్ధులు బాటలో కనిపించే గడ్డిమొక్కలవంటివి మాత్రమే!

❖

సాధుపుంగవులలో అగ్రగణ్యుడవగు ఓ రామచంద్రా! నీకింతవరకూ చిదగ్నికుండలినీ శక్తుల ఆరాధన, అణిమాది సిద్ధులు, అణిమాది పదప్రాప్తి యందలి జ్ఞానయుక్తి గురించి కొన్ని విశేషాలు విశదీకరించాను. ఇప్పుడు యోగాభ్యాసబలంచే యోగులు నిర్వర్తించే మరొక దేహప్రవేశం గురించి వివరించి ఈ యోగము గురించిన విషయమును ముగిస్తాను.

**పరకాయ ప్రవేశం -** మనిషి వాయువునుండి పుష్పగంధమును ఆకర్షించి ముక్కును ఉపయోగించి ఘ్రాణము అనుభవిస్తాడు చూచావా? జీవుడు కూడా కుండలినీ శక్తిరూప గృహం నుండి బయల్వెడలి మరొక దేహములో కుండలినీ సమన్వితుడై ప్రవేశించగలుగుతాడు. ఆ యోగి ఆ మరొక దేహమును ఎంతకాలం ఉపయోగిస్తూ ఉంటాడో... అంతకాలం ఆతనిచే అతని పూర్వదేహం త్యజించబడినదై ఉంటుంది. ఆ అన్యదేహంలో తన ఇష్టం వచ్చినంతకాలం ఉన్న తరువాత ఆతడు మరల ఆ దేహాన్ని ఒక రాయి – కొయ్య – చెక్కలను విడచినట్లు విడచిపెట్టేస్తున్నాడు. చెట్లకు నీరుపోయువాడు తాను ఏ చెట్టుకు నీరు పోయాలనుకుంటే ఆ చెట్టుకే పోస్తూ మరల ఆ చెట్టును వదలి తన ఇచ్ఛ వచ్చినట్లు మరొక చెట్టును సమీపిస్తాడు చూచావా? ఆ విధంగా యోగి కూడా తన ఇచ్ఛానుసారంగా ఏ స్థావర జంగమ దేహమును ప్రవేశించాలనుకుంటే ఆ దేహమునందే ప్రవేశించగలుగుచున్నాడు. ఎవరి సంపదను అనుభవించాలనుకుంటే అతని దేహ, మనో, జీవ, బుద్ధులందు తాను ప్రవేశించు చున్నాడు. ప్రతి ఒక్క దేహి ఈ తన దేహమును కూడా అట్టి రీతిగానే మాతృదేహంలో ప్రవేశించి ఆశ్రయించి ఉంటున్నాడని కూడా సూక్ష్మబుద్ధితో గ్రహించు. అయితే అది కర్మజాల కారణమైన ప్రవాహపతిత వ్యవహారం.

ఇట్లు ఆ యోగి అన్యశరీరంలో ప్రవేశించి ఆ అన్యశరీరమునకు సిద్ధించియున్న సంపదను అనుభవించి మరల తన పూర్వదేహం ఇంకా ఉండి ఉంటే, అందులో ప్రవేశించగలడు. లేదా, తన కిష్టమైన మరొక దేహంలోనైనా ప్రవేశించగలడు. కాదా, ఉత్కృష్టులగు యోగులు ఆ అన్యశరీర భోగానంతరం... సమస్త ప్రతిబింబభూతములగు ఉపాధులను, బింబభూతములగు సమస్త దేహులందును, ఈ జగత్తంతటా వ్యాప్తమైయున్న తమ ఆత్మను దర్శించగలరు. ఇట్టి తమ యొక్క ఆత్మ సంవిత్తుచే ఈ సర్వమునూ పరిపూర్ణం ఒనర్చి ఉండగలుగుచున్నారు.

ఓ రామచంద్రా! యోగైశ్వర్యములలో అన్నిటికన్నా ఉత్తమమైనది. ఘనమైనది, పవిత్రమైనది స్వస్వరూపానుభవమే. యోగైశ్వర్యులగు కొందరు మహనీయులు దోషరహితము, నిత్యోదయము అగు తమ స్వరూపమును ఎరిగి, అందు ప్రవేశించినవారై ఉంటున్నారు. అట్టి మహాత్ములు దేనిని వాంఛిస్తారో దానిని శీఘ్రంగా పొందగలుగుతారు.

అయితే, తత్త్వజ్ఞాని అయినవాడు ఆయా అల్పసిద్ధులను గొప్పవిగా భావించడు. నిరతిశయానంద రూపమగు ఆత్మనే అన్నిటికన్నా అధికమైన దానిగాను, ప్రియమైనదానిగాను, మహత్తరమైనదానిగాను ఎరిగియే ఉంటాడు.

❖❖❖

# 17. వెతికేది చిల్లిగవ్వ కోసం - దొరికేది చింతామణి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు అడిగిన రీతిగా ఇప్పటివరకూ కుండలినీ యోగం, సిద్ధులు, యోగముచే జ్ఞానం మొదలైన ఆయావిషయాలు ప్రస్తావించాను. ఇప్పుడు తిరిగి చూడాల – శిఖిధ్వజుల కథా ప్రసంగానికి వద్దాం.

❖

రాజపత్ని చూడాల రాజ్యమును వదలి ఒకానొక ఏకాంత ప్రదేశంలో అణిమాది సిద్ధుల కొరకై ప్రాణాయామాదుల దృఢాభ్యాసం ప్రారంభించిందని అనుకున్నాం కదా! ఆత్మ తత్త్వజ్ఞాన బలంచే సంపాదించుకున్న ఏకాగ్రత, పవిత్రతల ప్రభావం వల్ల ఆమె అతి స్వల్పకాలంలో అణిమాది శక్తులచే, తత్సంబంధిత గుణాలచే సుసంపన్నురాలైనది.

ఆమెయందు జ్ఞానము ఇంకా పవిత్రం కాగా, ఇక మోహకాలుష్యం, తాపత్రయాలు ఏ కొద్ది మిగిలినా, అవి కూడా వినాశనం పొందాయి. ఆమె హృదయం గంగాజలంలాగా నిర్మలము, శీతలత్వము పొందాయి.

ఆమె యథాప్రకారం గృహోన్ముఖురాలై భర్తచే నిర్వర్తించబడవలసిన ఆయా రాజధర్మములను పవిత్ర భావనతో నిర్వర్తిస్తూ 'సహధర్మచారిణి' అను మాటకు పూర్ణార్థత పుణికిపుచ్చుకున్నది.

ఒకవైపు రాజ్యభారాన్ని వహిస్తూనే మరొకవైపు ఆ చూడాల ఒకప్పుడు ఆకాశమార్గమున పోవుచూ, మరొకప్పుడు సముద్రకోటరములలో ప్రవేశిస్తూ, ఇంకొకప్పుడు భూమండలమంతా చుట్టి... సంచారాలు చేసివస్తూ ఉండేది. ఎన్ని సిద్ధులు సంపాదించినప్పటికీ ఆమె తన సహజసిద్ధమగు స్త్రీ భావమును వదలలేదు. ఆమె చిత్తం తన పతియొక్క వక్షస్థలం నుండి ఒక్క క్షణం కూడా విముక్తమవలేదు.

ఆమె ఇచ్ఛానుసారం కొన్ని సమయాలలో సమస్త రాజ్యములందూ, సమస్త లోకములందూ 'లక్ష్మి'వలె నివసించుచూ ఉండేది. ఒకవైపు మహారాణికి సంబంధించిన భూషణాలు ధరిస్తూ సభా కార్యక్రమముల వంటి రాచకార్యములు నిర్వర్తిస్తూనే ఉండేది. కొంచెం సమయానుకూలమైనప్పుడు ముత్యాలలో దారం ప్రవేశించినట్లు, పర్వతాలతో కూడిన భూమిపై మేఘాలు క్రమ్మినట్లు కాష్ఠ, తృణ, శిలమయ భూ ప్రదేశములందు; ఆకాశ, వాయు, అగ్ని, జలాది భూతజాత ప్రదేశములందు నిర్విఘ్నంగా ప్రవేశిస్తూ ఉండేది. యమ, వరుణ, కుబేర, వరుణ, ఇంద్రాది లోకపాలకుల నగరాల లోను, ఆకాశములోని దశదిశల అంతరాంతరాళములలోనికి వాయుతరంగంలాగా ప్రవేశ,

నిష్క్రమణాలను సల్పుతూ ఉండేది. అంతే కాదు. పశుపక్ష్యాదులతోను, పిశాచాదులతోను, నాగ - దేవ-దైత్యులతోను, విద్యాధర-అప్సరస-సిద్ధులతోను, సామీప్య-స్నేహ సంభాషణలు నిర్వరిస్తూ ఆనందిస్తుండేది.

అట్లా అనేక జగత్తులలో పచార్లు చేస్తూ కొన్నిసార్లు తన భర్త అంతరంగంలో కూడా ప్రవేశించింది. అశరీరి అయి అనేక సంజ్ఞలతో జ్ఞానామృతమును వర్షించటానికి, ఉపదేశించటానికి ఏవేవో ప్రయత్నాలు చేసింది కూడా! కాని స్థూలదృష్టిని ఆశ్రయించి ఉండటంచేత ఆమె భర్త శిఖిధ్వజుడు ఆమె యొక్క విజ్ఞానవైభవాన్ని గాని, ఆమె సూక్ష్మ మార్గాలలో చెప్పే జ్ఞానబోధలను గాని ఏమాత్రం తన హృదయంలోకి స్వీకరించనే లేదు. మధ్య మధ్య తన భార్య చూడాల గురించి యోచిస్తున్నప్పుడు 'నా ప్రియురాలు చూడాల ఉట్టి పిచ్చిది. ఏమీ తెలియనిది. సంగీతం, నృత్యం మొదలైన వాటిలో ప్రావీణ్యురాలే! కానీ ఏం లాభం? ఇంత తెలిసి, ఇంతగా ప్రయత్నిస్తున్నా నాకే ఆత్మవిద్య అలవడలేదు. ఏమీ తెలియకపోయినా, ఏదో ఊహించి ఏదేదో అనుకునే నా భార్య చూడాల వంటి వారికి ఆత్మ విద్య యొక్క ఆనుపానులు కాస్త తెలియాలంటే కూడా ఎన్ని వందలసార్లు జన్మించాలో కదా! 2 సంవత్సరాల చిన్న పిల్లవాడికి అస్త్ర విద్య ఏం తెలుస్తుంది? మా చూడాల కూడా ఏమీ తెలియని అమాయకురాలు, పాపం!" అని తనలో అనుకుంటూ ఉండేవాడు. స్వల్పజ్ఞానులు తదితరుల జ్ఞానాదులపై తమవైఖరికి అనుకూలమైన అభిప్రాయములు కలిగి ఉండి, తమకు తదితరుల జ్ఞాన-అజ్ఞానాదులు తెలుసునని అనుకోవటం సాధారణమైన విషయమే కదా!

**శ్రీరాముడు :** మహర్షీ! ఆ చూడాల తన భర్త సమక్షంలో ప్రత్యక్షమై తన సిద్ధులను చూపి, ఆ తరువాత ఆత్మ విద్యను మరల బోధించవచ్చు కదా! అట్లా అయితే శిఖిధ్వజునకు తన భార్య యొక్క సామర్థ్యముపై గౌరవాదులు ఉండి అప్పుడు ఆమె బోధించేది శ్రద్ధ-యోచనలతో వినేవాడేమో?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** యజ్ఞ విధానం, తత్త్వరహస్యం ఎరిగిన మహనీయులు అల్పాధికారులకు ఆయా యజ్ఞక్రియలను విడమరచి చూపరు చూచావా? బహుప్రాచుర్యమైన దేవతా విగ్రహమునకు వస్త్ర విభూషణాది అలంకారాలు చేస్తున్నప్పుడు భక్తులకు అది ప్రదర్శించక తెరకడతారు కదా! అట్లాగే ఆ చూడాల కూడా ఆత్మయందు విశ్రాంతి పొందని ఆ రాజుకు తన ఆకాశగమనాది సిద్ధులను ప్రదర్శించుటకు ఉద్దేశించలేదు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఇప్పుడు నా మానసికాకాశంలో ఒక గొప్ప సందేహం పుట్టుకోస్తోంది. ఆ చూడాల గొప్ప యోగి, సిద్ధురాలు, ఆత్మజ్ఞాన - అనుభవ సమన్వితురాలు కదా! అంతటి చూడాల ఎంతెంతో ప్రయాసపడినప్పటికీ తన భర్తకు ఆత్మవిద్య నేర్పలేకపోతోందే! ఇక సిద్ధులు మొదలైనవి లేనట్టి గురువులు తమ శిష్యులలో ఆత్మానుభవం ప్రేరేపించటం ఎంతటి దుస్సాధ్యమైన విషయం!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నీవు చెప్పిన అభిప్రాయముతో నేను ఏకీభవించటం లేదు. ఎందుచేతనంటావా?

**ఉపదేశక్రమో, రామ! వ్యవస్థామాత్ర పాలనమ్ ।**
**జ్ఞప్తేస్తు కారణం శుద్ధా శిష్యప్రజ్ఞైవ రాఘవ! ॥**

ఓ రఘురామా! "గురువు, ఉపదేశించటం, ఉపదేశక్రమం'... ఇవన్నీ కూడా ఒకానొక వ్యవస్థాక్రమం, శాస్త్ర మర్యాదను కాపాడటం కోసం మాత్రమే. యథార్థానికి శిష్యునిలో జ్ఞానబోధ జనించటానికి గురువు యొక్క పాత్ర్యాంశములు మొదలైనవి అసలైన కారణం కాదు. శిష్యుని జ్ఞానప్రాప్తికి అతని శుద్ధమైన బుద్ధియే అసలైన కారణం.

**న శ్రుతేన న పుణ్యేన జ్ఞాయతే జ్ఞేయమాత్మనః ।**
**జానాతి ఆత్మానమ్ ఆత్మైవ సర్పః సర్పపదాన్ ఇవ ॥**

ఏదో శ్రవణం చేతనో, శబ్దజ్ఞానం చేతనో, తదితరమైన పరోక్షజ్ఞానంచేతనో, పుణ్యకార్యములు నిర్వర్తించటం చేతనో ఆత్మ తెలియబడదని గ్రహించు. మరి? పాముయొక్క అడుగుజాడలను పామే గ్రహించగలుగుతుంది. అట్లాగే, ఆత్మయే ఆత్మను ఎఱుగగలదు.

"ఆత్మ యొక్క సంకల్ప – ఉద్దేశములు" లేకుండా ఆత్మకు ఆత్మ గురించి మరెవరూ ఎరుకపరచలేరు.

**శ్రీరాముడు :** మీరు చెప్పేది చమత్కారంగా ఉంది. అట్లా అయితే, గురూపదేశం ఈ జగత్తులో ఆత్మజ్ఞానమునకు ఎట్లా కారణమౌతుంది? గురూపదేశమే లేకపోతే ఆత్మజ్ఞానం లభించటం దుర్లభమని కొన్ని శాస్త్రములు సిద్ధాంతీకరిస్తున్నాయే?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (చిరునవ్వు నవ్వుతూ) నీవు అడిగిన ప్రశ్నకు సమాధానంగా విజ్ఞుల సభలలో 'చిల్లిగవ్వ కోసం వెతుకుతూ ఉంటే చింతామణి దొరుకుతుంది' అను ఒక దృష్టాంతం చెప్తుతూ ఉంటారు. అది ఇప్పుడు ప్రస్తావిస్తాను విను.

**చిల్లిగవ్వకోసం వెతుకుతుంటే చింతామణి దొరకటం -** వింధ్య పర్వత ప్రాంతంలో గల బోయజాతి వారు నివసించే ఒక పల్లెలో ఒక ఆటవికుడు (కిరాతకుడు) ఉన్నాడు. అతని దగ్గర చాలా ధనం ఉన్నది. అయితే ఏం? అతను పరమ లోభి. అతని దగ్గర ఎంత ధనం ఉన్నదో అతనికే తెలియదు. కానీ ఆతడు చిల్లిగవ్వ కోల్పోవటానికి కూడా ఎంతమాత్రం సిద్ధపడడు. అంతటి లోభ రాగ సంబంధమైన తుచ్ఛ భావాదులు కలిగి ఉన్నాడు.

ఒకసారి అతను ఏదో అవసరమైన పని ఉండి వింధ్యాచల మార్గంలో ఏదో పట్టణం వైపు వడివడిగా నడచి వెళ్ళుచున్నాడు. ఆ వేగానికి ఒకచోట జేబులోంచి ఒక చిల్లిగవ్వ గాలిలోకి ఎగిరి దట్టంగా ఎదిగి ఉన్న పచ్చగడ్డి దుబ్బులో పడిపోయింది. 'అయ్య బాబోయ్! నా చిల్లిగవ్వ పడిపోయింది నాయనోయ్! అని గంతులేసి ఇక ఆ చిల్లిగవ్వకోసం రెల్లుదుబ్బులలో వెతకటం ప్రారంభించాడు. ఒక గంట గడచిపోయింది. చిల్లిగవ్వ కనబడనే లేదు. అయినా ఇంకా వెతుకుతూనే ఉన్నాడు. ఆ మార్గంలో ఆతనికి తెలిసియున్న కొందరు బాటసారులు అటు వెళ్ళుచూ అతనిని పలకరించారు.

**బాటలో వెళ్ళే ఎవరో జనులు:** ఏయ్ కిరాతా! ఏమిటి... వెతుకుతున్నావ్?

**కిరాతకుడు:** ఒక చిల్లిగవ్వ ఎక్కడో పడిపోయింది. రెండుగంటలుగా వెతికినా ఇంకా కనబడలేదు. అందుకే మళ్ళీ వెతుకుతున్నాను.

**బాటసారులు :** నీకేమైనా పిచ్చి పట్టిందా? ఒక్క చిల్లిగవ్వకోసం ఇంతసేపు వెతుకుతున్నావా? పైగా ఇంకా వెతుకుతావా? నీకు బోలెడు డబ్బు ఉన్నది కదా! అంత డబ్బు ఎదురుగా పెట్టుకుని వెతకట మేమిటి? అవతల చీకటి పడిపోతోంది చూచావా? లేదా? చీకటి పడిందంటే ఇక్కడికి ఏవైనా క్రూరమృగాలు వస్తే రావచ్చు.

**కిరాతకుడు :** డబ్బు ఉంటే ఉండొచ్చు గాక! ఇప్పుడా ఊసు ఎందుకు? ఈ చిల్లిగవ్వను ఎందుకు పోగొట్టుకోవడం? వెతగా-వెతగ్గా ఈ చిల్లిగవ్వ ఇప్పుడు దొరకిందనుకో. అప్పుడు నేను ఆ చిల్లిగవ్వను ఉపయోగించి క్రయవిక్రయాలు చేస్తాను. ఒక చిల్లిగవ్వ పది చిల్లిగవ్వలౌతాయి. ఆ 10 చిల్లిగవ్వలతో మరేదైనా వ్యాపారం చేస్తే 2000 చిల్లిగవ్వలౌతాయి. అప్పుడీ చిన్న చిన్న వ్యాపారాలు మానేసి మా బోయవాళ్ళ దగ్గిర అటవీ సంపదలను కొని వాటిని పట్టణంలో అమ్ముకుంటాను. అవే లక్షలక్షల చిల్లిగవ్వలౌతాయి. ఇక మీరు పదండి. మీకేం తెలుసు డబ్బు విలువ?

కిరాతుని లోభపూరితమైన అమాయకపు వాక్యములు విని ఆ బాటసారులు పకపకా నవ్వుకున్నారు. 'వీడొక మూర్ఖుడు. చెప్పితే వినడు. వీడిగతి ఇంతే. ఇక పదండిరా' ...అని హాస్యం చేస్తూ వాళ్ళంతా వెళ్ళిపోయారు. కిరాతుడు మాత్రం ఆ చిల్లిగవ్వ కోసం వెతుకుతూనే ఉన్నాడు. అప్రమత్తుడై, మరల-మరల ఆ చిల్లిగవ్వ దొరికితే తాను ఏం చేయగలడో ఊహించుకుంటూ ఆ చుట్టు ప్రక్కలంతా చూస్తున్నాడు. మూడు రోజులు గడచిపోయాయి.

చివరికి అతనికి చిల్లిగవ్వ కనిపించలేదు. కానీ, ఆశ్చర్యం! మూడో రోజు సాయంకాలమౌతూ ఉండగా అతనికి ఆ రెల్లు గడ్డిలో దేదీప్యమానమైన, మహత్తర సమన్వితమైన ఒక 'చింతామణి' దొరికింది. ఏది అభ్యర్థిస్తే అది ప్రసాదించగల గొప్ప శక్తి ఆ మణికి ఉన్నదని గ్రహించాడు. దానిని చూచి ఆ కిరాతుడు చాలా ఆనందం పొందాడు. ఎంతో సంతోషంగా ఆ చింతామణిని గుప్పెట్లో దాచుకుని ఇంటికి చేరాడు. ప్రపంచంలోని భోగైశ్వర్యములన్నీ ఆ చింతామణి యొక్క ప్రభావం చేత లభించుచుండటంచే హాయిగా ఉన్నాడు.

❖

ఓ రామచంద్రా! ఇదీ కథ. ఇది జ్ఞానుల సభలో ఎందుకు ముచ్చటిస్తారో చెబుతాను విను. చిల్లిగవ్వకోసం వెతుకుతుంటే ఆ బోయవానికి చింతామణి లభించినట్లు శాస్త్రముల ఉపదేశాలు వింటూ ఉండగా కూడా ఆత్మజ్ఞానం లభించటం జరుగుతోంది. గురువులు శబ్దములను ఉపయోగించి ప్రత్యక్ష పరిమితులై (దృశ్యవ్యవహార పరిమితులై) దిక్కు గానక సంచరిస్తూ తమను ఆశ్రయించిన శిష్య జనులకు 'పరోక్షజ్ఞానం' అందిస్తున్నారు. ఈ శబ్దజన్యమైన పరోక్షజ్ఞానం గురువాక్యానుసారం అన్వేషిస్తూ ఉండగా ఎప్పుడో నిత్యము అపరోక్షము అయినట్టి 'ఆత్మజ్ఞానం, ఆత్మానుభూతి లభిస్తున్నాయి.

ప్రియ రాఘవా! గురువు యొక్క ఉపదేశంచే 'శబ్దవృత్తులు' మాత్రమే జనిస్తున్నాయి. అయితే, బ్రహ్మం ఇంద్రియాలన్నిటి కంటే పరం అయినది కదా! ఇంద్రియాలను నియమించేది, ఉపయోగించేది అయిన బ్రహ్మం ఆ ఇంద్రియాలకు విషయం ఎట్లా ఎవుతుందో చెప్పు? ఇక శబ్దబోధల విషయానికి వస్తే అవన్నీ ఇంద్రియజ్ఞానానికి సంబంధించిన చిత్తవృత్తులచే రచించబడినవే కదా! ఇదంతా

దృష్టిలో పెట్టుకుంటే, 'నిత్య, అపరోక్ష బ్రహ్మానుభవం శిష్యుని శుద్ధబుద్ధియందే ఉద్భవిస్తోంది. అంతే గాని కేవల ఉపదేశమాత్రంచేత అది ఆత్మతత్త్వోదయమునకు స్వయంగా హేతువు కాజాలదు' … అని ఎవరైనా గ్రహించవచ్చు.

అయితే మరొక్క విషయం. చిల్లిగవ్వకోసం వెతికి ఉండకపోతే ఆ బోయవానికి అసలు చింతా మణియే కనబడేది. కాదు కదా! అట్లాగే గురూపదేశం, పురాణాదుల సంసేవనం లేకపోతే ఆత్మతత్త్వం ప్రాప్తించదు. మహదర్థరూపమైనట్టి ఆత్మతత్త్వం ఒకడు పొందటానికి సూటిగా గురూపదేశమే కారణం కాకపోయినప్పటికీ… 'గవ్వకోసం వెతకటమే చింతామణి దొరకటానికి కారణం' అనునది మనం కాదని అనలేం కదా! గురూపదేశం వింటూ ఉండగా శిష్యుని ప్రజ్ఞను అనుసరించి ఎప్పుడో ఆత్మతత్త్వానుభవం లాభిస్తోంది.

**పశ్య రాఘవ! మాయేఽ మం, మోహినీ మహతామపి ।**
**అన్యత్ అన్విష్యయతే యత్నాత్! అన్యత్ ఆసాద్యతే ఫలమ్ ॥**

చూడు రామా, ఎంత చమత్కారమో! ఈ మాయ మహాత్ములైన వారిని కూడా మోహింప జేస్తోందయ్యా! యత్నశీలురై గురుశిష్య వ్యవహారమునందు, అన్వేషించేదేమో ఒక వస్తువు కోసం. తీరా ఫలితం చూస్తే ఆ దొరికేది మనోవాక్కులకు విషయం కానే కానట్టి వస్తువు!

మనుజుడు ఒక పనికోసం యత్నం కొనసాగిస్తూ ఉండగా, మరొకటైన ఫలితమో, ప్రయోజనమో ఒనగూడటం లోకంలో అందరికీ అనేక సందర్భాలలో అనుభవమయ్యే విషయమే. ఒకదాని కొరకై చూస్తూ ఉండగా, ఇంకొకటేదో కనబడుతుంది. ఒకదాని కొరకై వింటూ ఉండగా ఇంకొకటేదో వినబడుతుంది. అట్లాగే ఈ జీవుడు కూడా దేని కోసమో (దృశ్య-పలముల కోసం) అంతరంగంలో ఉద్దేశించి తీవ్రప్రయత్నం జరుగుచుండగా ఆత్మజ్ఞానమే లభిస్తోంది.

శాస్త్రములు జీవుని ప్రయత్నమునందు అట్టేబెట్టి ఉంచటానికి ఉపకరిస్తున్నాయి. గురువులు పరోక్షస్మృతి కలిగిస్తున్నారు. శిష్యుడు అపరోక్షజ్ఞానం సంపాదిస్తున్నాడు.

ఆత్మజ్ఞానమే నిజమైన సంపాదన. అందరూ దేహం ఉండగానే ఆర్జించవలసినది అదే! అట్టి ఆత్మజ్ఞానం సంపాదించుకుని, ఆ తరువాత ఇక శేషించిన జీవితమున తారసపడే ఈ జగద్భ్రమను అసంగముగాను అనిచ్ఛాపూర్వకంగానూ గడపటం శ్రేయస్కరమని నా ఉద్దేశం.

❖❖❖

## 18. శిఖిధ్వజ వనవాసం

**శ్రీ వసిష్ఠ మహర్షి:** ఇక శిఖిధ్వజుని విషయానికి వద్దాం! అతడు మూడు సంవత్సరముల జైత్రయాత్ర దిగ్విజయంగా ముగించుకొని మాతృదేశం చేరాడు. అయితే, అతడు తత్త్వజ్ఞానం సంపాదించుకోక పోవటంచేత అనేక మోహాంధాకారములలో చిక్కుకుని ఉన్నాడు. తాను మహారాజు కనుక తనకు అభీష్టమైన వస్తువులకేం కొదువలేదు. కాని… "ఈ రాజ్యభోగాలన్నీ ఆత్మజ్ఞానంముందు తుచ్ఛమైనవే గదా! మరి నాకు ఆత్మజ్ఞానం లభించటమెట్లా?" …అని ఎప్పుడూ వ్యాకులపడుతూ ఉండేవాడు.

అతని మనస్సు ఎక్కడో కొండగుహలలోనో, అరణ్యప్రదేశాలలోనే ఏకాంతంగా ఉండాలని కోరుకుంటూ ఉండేది. మన ఈ విశ్వామిత్రమహర్షి నిన్ను తీసుకువెళ్ళటానికి వేంచేయకమునుపు నీవు అంతః పురంలో పరధ్యానంగా ఉండేవాడివే! అట్లాగే ఆ శిఖిధ్వజుడు కూడా భృత్యుల సాంత్వన అనునయ వాక్యాలతో బ్రతిమలాడితే గాని దైనందిన క్రియలను కూడా నిర్వర్తించే వాడు కాదు. నిరంతరం వైరాగ్యశీలుడై ఒక సన్న్యాసిలాగా ఉండాలని ఎప్పుడూ కోరుకునేవాడు. రాజ్య సంపదలను తలచు కున్నప్పుడల్లా ఆతనిలో విరక్తి ఇంకా ఎక్కువ అయ్యేది. ఇక అక్కడి నుండి ఆత్మజ్ఞానోదయం కోరుకున్నవాడై రకరకాల ప్రయత్నాలు ప్రారంభించాడు. బ్రాహ్మణులకు, దేవాలయాలకు, స్వజనులకు అనేక భూ-సువర్ణదానాలు సమర్పించాడు. చాంద్రాయణాది అనేక వ్రతాలు నిర్వర్తించాడు. అనేక పవిత్రక్షేత్రాలను, వనములను, తదితర పవిత్ర ఆశ్రమాలను సందర్శించి, అక్కడక్కడ కొద్ది రోజులు గడిపివచ్చాడు. అంతా బాగానే ఉన్నది కాని, ఏ లాభం? నిధిని కోరుకునే వాడు ఎంతగా త్రవ్వినా నిధి లభించకుంటే ఎంత నిరుత్సాహంగా ఉంటాడో, ఆ రాజు కూడా శోకరాహిత్యము సంపాదించుకోలేక పోయాడు. దైన్యం, నిరుత్సాహం అతని వెంటనంటి ఉండేవి. రాత్రులందు అతనికి నిద్రపట్టేది కాదు. 'నా ఈ సంసారవ్యాధికి ఔషధం ఏమిటిరా?' అని ఎల్లప్పుడూ చింతిస్తూ ఉండేవాడు. ఆ రాజ్యం, రాచరికపు మర్యాదలు, తదితరమైన సంరంభాలు ఆతనికి విషం వలె కనిపించేవి. వాటిపట్ల ఆతనికి రోతపుట్టింది. ఎదురుగా ఉన్న మహావిభవములన్నీ ఆతనికి గొప్ప బంధనాలుగా తోచేవి. ఒకరోజు ఒక ఏకాంత స్థలంలో తన ప్రక్కనే కూర్చుని ఉన్న తన ప్రియాతిప్రియ చూడాలతో ఇలా పలికాడు.

**శిఖిధ్వజుడు :** ఓ ప్రేయసీ! చూడాలా! చాలాకాలం ఈ రాజ్యం, రాజ్యవిభవములు అనుభవించాను కదా! ఇప్పుడు నాకు ఎంతో వైరాగ్యం కలుగుతోంది. అందుచేత వీటన్నిటినీ వదలి అడవులలో ఏకాంత ప్రదేశం ఆశ్రయించాలని అనుకుంటున్నాను. వనవాసియగు మునికి ఇక్కడి సంసారంలో ఉండే దుఃఖాలు, సుఖాలు, ఆపదలు, సంపదలు ఉండవు కదా! అందుచేత ఇవి కల్పించే మోహాల నుండి తప్పించుకోవటం తేలిక అవుతుంది. రాజుగా ఉన్నంతవరకూ "అయ్యో! ఈ రాజ్యం ఏమౌతుందో? శత్రురాజులు బలం పుంజుకుంటున్నారేమో! వారితో యుద్ధం చేయగల సామర్థ్యం సంపాదించటం ఎట్లా? ఒకవేళ యుద్ధం చేశామనుకో... అది జన నష్టానికి కారణమై అదంతా పాపంగానే పరిణమిస్తుంది కదా!" ...ఇటువంటి సమస్యలు వనవాసులకు ఉండవు కదా! నా ఉద్దేశంలో ఈ రాజ్యాలు ఏలే వారికంటే వనవాసులదే ఉత్తమమైన సుఖం అయి ఉన్నది. పైగా, అరణ్యాలలోని ప్రకృతి సాధనపరులకు అత్యంత అనుకూలంగా ఉంటుంది. ఏకాంతమగు వనాలలో ఈ మనస్సుకు లభించే సుఖం ఇంద్రలోకంలో గాని, బ్రహ్మలోకంలో గాని, చంద్ర లోకంలో గాని అనేక మంది మధ్య గడిపేవారికి గాని ఏమాత్రం లభించదని నేను గమనించాను. నేను ఏకాంత ప్రదేశం వెతుక్కుంటూ అరణ్యములలో ప్రవేశించదలచాను. అందుకు నీవు అడ్డుచెప్పవనే అనుకుంటు న్నారు. నీవంటి కుల స్త్రీలు భర్త కోరికలకు ప్రతికూలంగా వ్యవహరించరనేది లోకవిదితమే కదా!

**చూడాల :** హే ప్రాణనాథా! ఏ సమయంలో ఏ కార్యం ఉచితమో ఆ సమయానికి ఆ కార్యం నిర్వర్తించటమే 'శోభ'అని అనిపించుకుంటుంది. ఆ ప్రకృతిని చూడండి. వసంతకాలంలో పుష్పాలు

పుష్పిస్తాయి. శరత్కాలానికి ఫలములు శోభిస్తాయి. అదే అందం కదా! 'వానప్రస్థం' అనే ఆశ్రమం వార్ధక్యం వచ్చిన వారికి ఉచితం. మీ వంటి యౌవనవంతులకు వనవాసం ఉచితమెట్లా అవుతుంది? అందుచేత వనవాసానికి ఇప్పుడు మీరు వెళ్ళాలనుకోవటం నాకేమాత్రమూ ఇష్టం లేదు.

మనిద్దరం వార్ధక్యచిహ్నాలు వచ్చేవరకు ఈ గృహస్థాశ్రమం నిర్వర్తిద్దాం. వార్ధక్యం పొడచూపగానే ఇద్దరం కలిసి వనవాసానికి వెళ్ళిపోదాం. ఎందుకా? మీరు మహారాజు. ఏదో మామూలు గృహంలో నివసిస్తున్నవారు కాదు. ఇప్పుడు సమయం కాని సమయంలో ప్రజాపాలనను వదలి వనవాసానికి వెళ్ళిపోతే, స్వధర్మమును నిర్వర్తించకపోవటం చేత, అది పాపమే అవుతుంది కదా! ఉచితమైన సమయం ఆసన్నం కాకుండా మీరు రాజ్యపాలనను వదలి అడవులలోకి వెళ్ళి తపస్సు చేసుకుంటాననంటే రాజ్యం సంగతి, ప్రజల సంగతి ఏం కావాలి? సేవకుడు చెప్పాపెట్టకుండా యజమానిని విడిచి వెళ్ళితే ఆ యజమాని అనేక విషయాలు తెలియక ఇబ్బంది పడడా? అట్లాగే ఈ మన ప్రజలు కూడా ఇబ్బందులు పాలు అవరా? మీ మంత్రులు, సేనాధిపతులు తప్పక అడ్డుకుంటారని నా ఉద్దేశం.

**శిఖిధ్వజుడు :** ఓ కమలనేత్రీ! నీవు చెప్పిన విషయాలన్నీ నేను ముందుగానే ఆలోచించాను. దయ చేసి నా ఈ వనవాస ప్రయత్నానికి విఘ్నం కలిగించవద్దు. ఇప్పటికే నేను ఏదో సుదూరమగు వనములకు ఏకాంతవాసం కోసం తపస్సు చేసుకోవటానికి వెళ్ళినట్లే భావించు. ఈ విషయమును ప్రజలకు తగు సమయంలో తెలియజేసి వారి ఆలన - పాలన నీవు చూస్తూ ఉండు.

**చూడాల :** పోనీ, మీరు లేని ఈ రాజ్యం నాకెందుకు? నేను కూడా మీ వెంట వనవాసానికి వస్తాను. కాదనకండి.

**శిఖిధ్వజుడు :** లేదు చూడాల! నీవింకా చిన్న పిల్లవు. నీవు వనములకు వచ్చి అక్కడి దుర్భరజీవితం గడపటం ఉచితం కాదు. వనవాసమనేది పురుషులకే ఎంతో కష్టసాధ్యమైన విషయం. కఠినమైన అవయవాలు గల వారికే వనవాసం ఎంతో కష్టమనిపిస్తుంది. నీ వంటి అతి సున్నితమైన దేహం కలవారు వనవాసానికి అసలు ఏమాత్రం అర్హులే కాదు. నా మాట విని ఈ రాజ్యాన్ని పరిపాలిస్తూ నీవు ఇక్కడే ఉండు. నీవు నా సహధర్మచారిణివి. అర్ధాంగివి కదా! ఇంటి యజమాని ఎటైనా వెళ్ళి నపుడు కుటుంబాన్ని నడిపించటం స్త్రీలకు గొప్ప వ్రతం అవుతుంది. నీవిక్కడే ఉండి నేను నిర్వర్తించ వలసియున్న రాజ్యపాలనను నిర్వహించు. నీ పాలనాసామర్థ్యముపై నాకు-మనప్రజలకు నూటికి నూఱుపాళ్ళు నమ్మకం ఉన్నది.

ఈ శిఖిధ్వజుడు మరింకా ఏమీ మాట్లాడకుండా, జవాబు కోసం వేచి ఉండకుండా అక్కడి నుండి లేచాడు. గబగబా రాజాంతఃపురానికి నడచి వెళ్ళాడు. చూడాలకు అవాక్కవుతూ, ఏం మాట్లాడటానికి పాలుపోక, భర్తను అనుసరించి తాను కూడా అంతఃపురంలో ప్రవేశించింది. ఇంతలో బాగా చీకటి పడింది. ఆ దంపతులిద్దరూ దైనందికమైన స్నానాదులను, సాయం సంధ్యా వందనాది కార్యములను నిర్వర్తించారు. శిఖిధ్వజుడు తనకత్యంత ప్రీతీపాత్రురాలగు చూడాల సహవాసంతో శయనాగారమున నిదురించాడు.

❖

అర్ధరాత్రి అయింది. పట్టణ ప్రజలంతా గాఢ నిద్రకు ఉపక్రమించటం చేత వీధులన్నీ నిర్మానుష్యమై నిశ్శబ్దమును సంతరించుకుని ఉన్నాయి. శిఖిధ్వజుడు మెల్లగా కనులు తెరిచాడు. తన గుండెపై అరచేయి ఉంచి గాఢనిద్రను అనుభవిస్తున్న చూడాల ముఖంవైపు చూచాడు. నెమ్మదిగా ఆమె చేయిని నిద్రాభంగం కాకుండా ప్రక్కకు పెట్టి శయనము నుండి లేచాడు. చిన్న నిట్టూర్పుతో మనస్సులోనే 'శలవు' చెప్పాడు. శయనాగారం నుండి బయటకు వచ్చాడు. అక్కడ అంతఃపురంలో సంచరించే అంగరక్షకులతో "నేను ఒంటరిగా దొంగలను, దుష్టాచారపరులను నిగ్రహించటానికి బయలుదేరుచున్నాను. మీరంతా మీమీ నియమితకార్యములలో జాగరూకతతో నిమగ్నులై ఉండండి" అని ఆజ్ఞాపించి నిస్పృహుడగు ఆ రాజు అక్కడి నుండి బయలుదేరాడు. కొద్ది దూరం నడచిన తరువాత ఒక్కసారి వెనుతిరిగి 'ఓ రాజ్యలక్ష్మీ! నీకు నమస్కరిస్తూ శలవు తీసుకుంటున్నాను' అని రెండు చేతులూ ఎత్తి నమస్కరించాడు. ఆతని కళ్ళు చెమర్చాయి. ఆప్యాయతతో అక్కడి రాజ్య పరిసరలములను కళ్ళతో చూచి ఇక ప్రయాణం కొనసాగించసాగాడు.

❖

క్రమంగా నడచుకుంటూ అంధకార బంధురము, భయంకరము అయిన ఒక అరణ్యంలో ప్రవేశించాడు. ఆ మహారణ్యం దాటే సరికి భళ్ళున తెల్లవారింది. అక్కడి నుండి శూన్యారణ్యం వైపుగా పోవుచూ త్రోవలో గల ఒక తటాకం వద్ద సంధ్యాది క్రియలు నిర్వర్తించాడు. మరల ఒక వనం వరకు నడిచే సరికి సాయం సమయమైనది. అక్కడ సాయంసంధ్యా క్రియలు నిర్వర్తించి అక్కడ దొరికే కొన్ని పళ్ళు భుజించి అక్కడనే ఒక అనువైన ప్రదేశంలో ఆ రాత్రి విశ్రాంతి తీసుకున్నాడు. ఈ విధంగా వనాలు, దట్టమైన అడవులు, పురములు, పర్వత ప్రాంతాలు, నదీ ప్రాంతాలు దాటుతూ 12 రోజులు ప్రయాణించి మనుజులెవ్వరూ ప్రవేశించని మందర పర్వతంపై గల ఒక దుర్గమమైన అరణ్యంలోకి ప్రవేశించాడు. అక్కడ క్షుద్ర జంతువులు సంచరించనట్టి ఒక అందమైన ప్రదేశం కనబడింది. అక్కడ అప్పటికప్పుడు పూలతలను ఉపయోగించి ఒక ఆశ్రమం నిర్మించుకున్నాడు. ఆ ప్రక్కనే ఒక సెలయేరు ప్రవహిస్తూ ఆ ప్రదేశం ధ్యానాదులకు, నివసించటానికి యోగ్యమై ఉన్నది. అక్కడి అడవులలో సంచరించి వెదురు దండం. భోజనపాత్ర, పూజాపాత్ర, పుష్పాల పాత్ర, కమండలం, రుద్రాక్షమాల, చలి కాచుకోవటానికి నారతో తయారు చేసుకున్న ఒక బొంత, ఆసనం, మృగచర్మం మొదలైన వస్తువులను సంపాదించుకున్నాడు. ఆ కుటీరమును నివాసయోగ్యంగానూ, ధ్యానానుకూలం గాను అమర్చుకున్నాడు. ఇక సాధనకు ఉపక్రమించాడు.

తెల్లవారు జామున లేవటం, ప్రాతః సంధ్యాపూర్వకంగా జపం చేయటం, ఆ తరువాత చుట్టు ప్రక్కల వనములలో పూలు కోసుకొని రావటం, పూజ నిర్వర్తించటం, రాత్రిపూట ఫలములను కందమూలములను, ఇంకా, అక్కడే దొరికే సాత్త్వికాహారవస్తువులను సేవించటం... ఈ విధంగా ఆ పర్ణశాలలో సాధనను కొనసాగిస్తూ ఆ శిఖిధ్వజుడు చాలా రోజులు గడిపాడు. తన రాజ్యం గురించి గాని, అక్కడి తదితర రాజకీయ విశేషాల గురించి గాని, తన ప్రియురాలు చూడాల గురించి గాని అతడు స్మరించేవాడు కూడా కాదు. హృదయంలో వివేకం జనిస్తూ ఉంటే ఇక

అల్పవిషయములగు రాజ్య సంపదల గురించి ఇళ్ళు–వాకిళ్ళ గురించి తలచుకొనే వాడెవడు, ఒక్క మూర్ఖుడు తప్ప?

❖❖❖

# 19. చూడాల - శిఖిధ్వజ పునఃదర్శనం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా మందర పర్వతారణ్యంలో శిఖిధ్వజుడు కుటీరం కట్టుకొని ఉండగా ఇక్కడ చూడాల ఏం చేస్తోందో చూద్దాం.

❖

ఆ అర్ధరాత్రి శిఖిధ్వజుడు శయనాగారం నుండి లేచి రాణిని, రాజ్యాన్ని వదలి వెళ్ళిపోయాడు కదా! తెల్లవారుజామున చూడాలకు మెళుకువ వచ్చింది. ప్రక్కన శిఖిధ్వజుడు ఉండవలసిన చోటు శూన్యమై ఉండటం గమనించింది. ఆమె ముఖం మ్లానమైంది. హృదయములోని ఖేదం చేత ఆమె అందమైన ముఖం స్వేదబిందువులను వర్షించాయి. వ్యాకులత, నిరుత్సాహం పొంది కొద్ది క్షణాలు ఆ శయ్యమీదనే కూర్చుని ఇట్లు అనుకోసాగింది.

**చూడాల : (తనలో)** ఆహా! నా పతి నన్ను విడచి వనవాసానికి వెళ్ళినట్లే ఉన్నారే! ఈయన వెళ్లిపోవాలనుకోవటం ఎంతటి దుఃఖకరమైన విషయం! ఇప్పుడు నా కర్తవ్యమేమిటి? నేను కూడా నా పతి ఉన్న చోటికి వెళ్ళటమే బాగుగదా! ఎందుకంటే పతియే ఏ స్త్రీకైనా శరణ్యస్థానమని శాస్త్రాలు చెప్పుచున్నాయి.

ఇట్లా ఆలోచించి ఆమె భర్తను అనుసరించటానికే నిశ్చయించుకున్నది. యోగశక్తితో శయ్య నుండి పైకి లేచింది. అణిమాదిసిద్ధులను ఉపయోగించి కిటికీ గుండా బయల్వెడలి ఆకాశమార్గాన్ని ఆశ్రయించింది. సిద్ధులకు కూడా ఆశ్చర్యం గొలిపేటట్లుగా ఆకాశమార్గంలో పరిభ్రమించుచు తన భర్త కొరకై అటూ ఇటూ సంచరించింది. ఒక కీకారణ్యంలో ఖడ్గధారి అయి శిఖిధ్వజుడు అడుగులు ముందుకు వేస్తూ వెళ్ళుచుండటం గాంచింది. ఆకాశకోశముననే ఉండి భర్తను గమనిస్తూ ఒక్కసారి భవిష్యత్తులోకి తొంగిచూసింది. యోగబలం చేత తన భర్త ఎట్లు ఏ నిమిత్తం చేత ఏ దేశ కాలములందు ఎట్టి క్రియలచే అభ్యుదయం పొంది నిరతిశయ బ్రహ్మానందమును సంపాదించుకోబోవుచున్నాడో... అదంతా కొద్ది క్షణాల కాలంలో వీక్షించింది. భవిష్యత్తులో తన భర్త అవశ్యం పొందుబోవు దానిని సుస్పష్టంగా గమనించింది. అట్టి భవిష్యత్తుకు అనుకూలంగా ఉండటమే ఉచితమని భావించి తన గమనాన్ని ఆపింది.

"ఇప్పుడు నేను నా భర్తను సమీపించటం ఉచితం కాదు. చాలా కాలము గడచిన తరువాత మాత్రమే నేను అతనిని సమీపించగలను. ఈశ్వర నియతిని ఎవ్వరు అడ్డుకోగలరు? పైగా, ఆతని నిష్ఠ నా వలన కుంటుపడటం, అందుకు నేను కారణమై ఉండటం మంచిదా? కానే కాదు. నా భర్త ఆజ్ఞాపించినట్లు నెరవేర్చుట చేతనే అతనికి మరింత ప్రియార్హురాలను కాగలను కదా!"

...ఇట్లు యోచించి చూడాల వెనుకకు మరలింది. మరల అంతఃపురంలో ప్రవేశించి శయనస్థానమున నిద్రించింది. ఆ మరునాడు రాజసభలో ప్రసంగిస్తూ 'ఓ సభికులారా! పుర ప్రముఖులారా! మన శిఖిధ్వజ మహారాజు రాజ్యరక్షణ, ప్రజా సంక్షేమం ఉద్దేశించి ప్రవాసం వెళ్ళి ఉన్నారు. వచ్చేసరికి చాలా రోజులు పట్టవచ్చని ఆజ్ఞాపించి ఉన్నారు. ఆయన వచ్చేవరకూ మనందరమూ అత్యంత జాగురూకులమై ధర్మపాలన, రాజ్యవ్యవహారాలు నిర్వర్తించాలని మహారాజు యొక్క నిర్దేశము' ...అని ప్రకటించింది. ఇక ఆ రోజు నుండి సమదృష్టితో ప్రజాహితంగా రాజ ప్రతినిధిగా రాజకార్యాలను నిర్వర్తిస్తూ ఉండేది. ఆ శిఖిధ్వజ-చూడాల దంపతులు ఒకరు అరణ్యం లోను, రెండవవారు రాజ్యంలోను ఉండి ఆయా ధర్మాలు నిర్వర్తిస్తూ ఉండగా రోజులు, పక్షాలు, నెలలు సంవత్సరాలు గడచిపోయాయి. కాల ప్రవాహం ఎవరికోసం ఆగుతుంది? ఈ విధంగా పద్దెనిమిది సంవత్సరాలు గడచిపోయాయి.

❖

కాలం ఎంత చమత్కారమైనది! ఇది చూస్తూ-అది వింటూ ఉండగానే రోజులు-సంవత్సరాలు గడచిపోతాయి. విజ్ఞులు కాలమును ధనాదులకంటే అధికంగా సద్వినియోగ పరచుకుంటున్నారు.

అజ్ఞులో... కాలం యొక్క గతిని గమనించక ఆహార-నిద్రా-మైధునాది దృశ్యవ్యాపకాలలో సమయాన్ని వెచ్చించుచు రిక్తహస్తాలు మిగిల్చుకుంటున్నారు. కాలగతిచే పదే పదే మోసగించబడు చున్నారు.

పద్దెనిమిది సంవత్సరములు గడచిపోయిన తరువాత ఒక రోజు చూడాల ఇట్లు అనుకున్నది.

**చూడాల : (తనలో)** ఇన్ని సంవత్సరములు నా భర్త శిఖిధ్వజుడు సాధన చేసి ఉండటం చేత అతని సర్వ రాగ-ద్వేషములు అంతరించి ఉంటాయి. అప్పటికి ఆత్మతత్త్వజ్ఞాన ప్రాప్తికి అర్హమైన సమయం ఆసన్నమైనట్లే. ఇంకా అలశ్యం దేనికి?

ఆత్మకార్యం యొక్క భవితవ్యం నిర్వర్తించటానికి ఈ రోజే కార్యోన్ముఖురాలనై మందర పర్వత ప్రాంతంలో తపస్సు చేస్తున్న నా భర్తను సమీపిస్తాను.

❖

ఆ రాత్రే అంతఃపురం నుండి చూడాల బయలుదేరింది. వాయుమార్గంగా పయనిస్తూ ఆ మార్గంలో తారసబడే మహానుభావులగు సిద్ధ పురుషులకు నమస్కరిస్తూ త్రోవలో మేఘమండలమును, విద్యుత్ (మెఱుపు) సమూహాలను చూచింది. అది చూచి తన భర్త ఒడిలో తాను గడిపిన మధుర క్షణములు గుర్తుకొచ్చాయి. స్త్రీ సహజమైన భర్తృ సమక్షానందనము గుర్తుకు వచ్చింది. చిరునవ్వు నవ్వుతూ ఇట్లు అనుకున్నది.

**చూడాల : (తనలో)** ఈ జీవిత పర్యంతమూ ఈ ప్రాణుల స్వభావం యధాతధంగానే ఉంటుంది గాని, శమించదు కాబోలు! సింహం వంటి భుజాలతో పరమ ప్రేమాస్పదుడగు నా భర్తను త్వరగా చూడాలని నా మనస్సు ఉత్కంఠత పొందుతోందే! అనేక వివేక విషయాలచే బోధింపబడి కూడా ఈ

నా మనస్సు శిఖిధ్వజుని సమక్షం కొరకై ఉవ్విళ్ళూరుతోంది. ఎంత నిరోధించప్రయత్నించినా నా ప్రియుని దర్శనం కొరకు వ్యాకులపడుతోంది. ఈ మెల్లని వాయువులు, ఈ చంద్రకిరణాలు, ఈ మేఘపంక్తితో కాంతులు విరజిమ్మే మెఱుపులు ఇవన్నీ నా మనస్సు యొక్క ఉత్కంఠతను ఇంకా అధికం చేస్తున్నాయి కదా!

ఓ చిత్తం యొక్క అజ్ఞాన విభాగమా! నీవింకా వ్యర్థ ఆడంబరాలను వదలలేదా? ప్రియచిత్తమా! ఆకాశం వలె నిర్మలమైన నీ వివేకమంతా ఇప్పుడు ఏ చోటికి పోయింది? అయినా చిత్తసఖీ! ఇదీ నీ తప్పు కాదులే! నీ పతి యొక్క ప్రేమను ఎంతగానో పొందినట్టి నీవు అతని కోసం ప్రత్యుత్సాహ పడటంలో ఆశ్చర్యం ఏమున్నది? ఏది ఏమైతేనేం! నీవు నీ చాంచల్యంచే ఎట్లు ప్రవర్తించినా సాక్షి స్వరూపం – నిశ్చలం అగు నా ఆత్మ స్వరూపానికి వచ్చే లోటు ఉండదు. కదా!

ఓ 'చూడాల' నామంతో పిలువబడుచున్న పాంచభౌతిక స్త్రీ శరీరమా! నీవు వ్యర్థంగా ఎందుకు దేని కొరకై సముత్సాహపడుచున్నావు? ఎవని కౌగిలింతకై తత్తరపడుచున్నావో ఆ నీ ప్రియసఖుడగు శిఖిధ్వజుని దేహం ఇప్పుడు వృద్ధత్వం సంతరించుకుని ఉంటుంది కదా! పైగా 18 సంవత్సరాలు ఏకాంతంగా తపస్సు చేస్తూ ఉండటం చేత ఎంతో కృశించి ఉంటుంది. ఇక అంతటి తపస్సు ప్రభావం చేత వాసనారహితుడై ఉంటాడు. అతని మనస్సు స్త్రీని లాలించే ఉత్సాహం కలిగి ఉంటుందని ఎట్లా అనుకుంటావు?

ఎక్కడెక్కడో వర్షం కురిస్తే ఆ జలమంతా నదిలోకి ప్రవహించిన తరువాత ఏ నీరు ఎటునుంచి వచ్చిందో భేదమేమైనా నదీజలంలో అగుపిస్తుందా? నా భర్త యొక్క మునుపటి, ఇప్పటి, ముందు ముందు వాసనలన్నీ ఆత్మ కంటే భిన్నం కాదు. ఆతడిప్పుడు ఆత్మానుభవమొక్కటే లక్ష్యంగా కలిగి ఉంటాడు కదా! ఏకాంతంలో అనాసక్తుడై, ఏకాత్మరూపుడై, ఇచ్ఛారహితుడై ఉన్న నా భర్త యొక్క భౌతికమైన కరస్పర్శకు ఈ నా కరాలు ఉత్సుకత పొందటం ఒక చమత్కారమే అవుతుంది.

ఓ నా చిత్తమా! ఇప్పుడా శిఖిధ్వజుడు శుష్కించిన మహావృక్షంలాగా చిక్కిశల్యమై కనబడతాడని నేను ఊహిస్తున్నాను. అయినా కూడా నీతో బాటే నేను కూడా ఆతనిని త్వరగా చూడాలని ఉత్కంఠ పొందుచున్నాను. నేను యోగబలం చేత ఆతనిని ఆత్మజ్ఞానిగా చేస్తాను.

ఆత్మజ్ఞాని అయిన తరువాత ఆతని మనస్సును సంకల్పం వైపు కించిత్ ఉన్ముఖం చేస్తాను. అప్పుడాతనిని ఆలింగనం చేసుకుంటాను. మరల ఆతనిని రాజ్య పట్టాభిషిక్తునిగా చేసి ఇక ఈ శేష జీవితాన్ని ఇద్దరం సుఖంగా గడిపివేస్తాం. ఆహా! చాలా కాలానికి నా మనోరథం సిద్ధిస్తోంది.

అయినా, తత్త్వచింతనలో నా భర్త తక్కువ వాడా? కాదు. గొప్ప మహాసామ్రాజ్యాన్ని, అనేక విజయ పరంపరలచే లభించిన పెద్ద ధనాగారాన్ని నన్ను ...జ్ఞానసముపార్జన కొరకై ఒక్క క్షణంలో విడచి అరణ్యంలో ఏకాంత ప్రదేశం చేరిన గొప్ప జ్ఞానసంపన్నుడు. బాహ్యా–అభ్యంతరములలో కూడా గొప్ప విచారణాతత్పరుడు కాబట్టే రాజ్యము యొక్క ఊసైనా ఎత్తకుండా పద్దెనిమిది ఏళ్ళు వనవాసంలోనే ఉన్నాడు. కనుక అంతటి మహనీయుడగు నా భర్తతో పునఃసమాగమం చిన్న

విషయమెట్లా అవుతుంది? మా ఇద్దరిదీ జ్ఞానమార్గమే కదా! సమానమైన మనోవృత్తులు కలవారు ఒకరినొకరు కలియటం సమస్త సుఖముల కంటే అత్యంత అధికమైనది కదా!

❖

ఇట్లా ఆలోచనలు చేస్తూ ఆ చూడాల తన భర్త నివసిస్తున్న పర్ణశాలను సమీపించింది. ఏకాంతంగా నివసిస్తున్న తన భర్తను అశరీరి అయి చూసింది. ఆహా! ఆతని శరీరపు తీరే మారిపోయింది కదా! ఒకప్పుడు కిరీటము, కుండలాలు, ఇంకా ఎన్నో దివ్యాభరణాలు ధరించిన శరీరం ఇప్పుడు ఎండుటాకు వలె చిక్కి శల్యమై ఉన్నది. అతడు ఇచ్ఛారహితుడై, నార వస్త్రములు ధరించి ఏకాకిగా ఉన్నాడు. ఆ వనంలో ఒకచోట కూర్చుని పూలతో మాలను కట్టుచున్న తన భర్తను చూసి ఎంతో విషాదం పొందింది. "ఆహా! అజ్ఞానంచే కలుగు మూర్ఖత్వం ఎంత భయంకరమైనది! మూర్ఖత్వం చేతనే కదా, ప్రాణులు అనేక నీచాతినీచ పరిస్థితులు పొందుచున్నారు! ఏది ఏమైతేనేం? నా భర్త రాగద్వేషాల నుండి విడివడి ఉన్నాడు కదా! ఈతని నిర్మల చిత్తంలో ఆత్మతత్త్వం చాలా తేలికగా ప్రతిఫలిస్తుంది"...అని తలచసాగింది. అగ్నిష్టోమ (అగ్ని - చంద్రధారణ) యోగాన్ని కొద్ది క్షణాలు ధ్యానం చేసింది.

❖❖❖

## 20. సుఖ దుఃఖాదులన్నీ - స్వయంకల్పిత మాత్రములే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శిఖిధ్వజుడు తాను ప్రతి రోజూ పూజచేసే ఈశ్వరునికి పుష్పాలంకారం చేయాలని అందమైన ఘుమఘుమలాడే పుష్పాలతో మాల కట్టుచూ ఏదో చిన్నచప్పుడైనట్లు ఉంటే తల ఎత్తి చూచాడు. ఎదురుగా అల్లంత దూరం నుండి చిరునవ్వు చిందిస్తూ ఒక ముని బాలకుడు తాను కూర్చుని ఉన్న వైపుగా నడచి వచ్చుచుండటం గమనించాడు. బాలకుడు విభూతిరేఖలతో, మూర్తీభవించిన తపఃశక్తి వలె ఉన్నాడు. ఆతని దేహం బంగారపు ఛాయతో మెరుస్తోంది. మెడలో తెల్లని ముత్యాలహారం వ్రేలాడుతోంది. తెల్లని జందెం, పట్టు వస్త్రములు ధరించి ఉన్నాడు. రెండు చేతులలోనూ వీణ వ్రేలాడుతోంది. చేతులకు, మెడలోను రుద్రాక్షమాలలు అలంకరించుకొని ఉన్నాడు. ఆతని పాదములు నడుస్తున్నప్పుడు నేలను అంటక భూమికి జానెడు ఎత్తులో ఉన్నాయి. చెవుల కుండలాలు ధగధగాయమానంగా మెరుస్తున్నాయి. ముఖం గొప్ప తేజస్సుతో మెరుస్తోంది. గొప్ప దేహపుష్టితో కనిపిస్తున్నాడు. నుదుటిన తెల్లటి భస్మం తిలకంగా ధరించాడు. ఆ ముని బాలకుడు తనవైపే రావటం గమనించి శిఖిధ్వజుడు తటాలున లేచి నిలుచున్నాడు. "ఎవ్వరో దేవతా కుమారుడు కాబోలు, ఎందుకో ఇటు వస్తున్నాడు" అని తలచాడు. వినమ్రతతో పాదుకలను విసర్జించి రెండు చేతులూ జోడించి ఆతనికి ఎదురేగాడు.

**శిఖిధ్వజుడు :** ఓ దేవరాజ కుమారా! శిఖిధ్వజ నామధేయుడగు ఈ వానప్రస్థాశ్రమవాసి మీకు వినమ్రతతో నమస్కరిస్తున్నాడు. దయచేయండి. ఈ పత్రాసనం పై సుఖాసీనులవండి. నాచే అర్పించబడుచున్న ఈ పుష్పాంజలి స్వీకరించండి.

**ముని బాలకుడు :** ఓ రాజర్షీ! తమకు నమస్కారం. మీరు ప్రేమతో ఇస్తున్న పుష్పములు నాకు శిరోధార్యం. నాకు ఎంతో సంతోషాన్ని కలుగజేస్తున్నాయి. మీరు కూడా సుఖాసీనులవండి.

**శిఖిధ్వజుడు :** హే దేవపుత్రా! తమరి దర్శనముచే ఈ రోజు అత్యంత ఫలప్రదమైందని తలచుచున్నాను. ఈ అర్ఘ్యపాద్యములు స్వీకరించండి.

ఇక చెప్పండి. తమకు సర్వదా శుభమగు గాక! తమరు ఎచ్చటి నుండి ఇటువైపుగా వస్తున్నారో, తమ నామధేయాదు లేమిటో, ఏమికోరి ఇటువైపుగా దయచేసారో, మేము మీకు ఎట్టి సేవ చేయ గలమో శలవీయ ప్రార్ధన. ఈ వానప్రస్థాశ్రమ దేహి మిమ్ములను సేవించి తద్వారా మీ దర్శన భాగ్యానికి కృతజ్ఞత తెలుపటానికి సిద్ధంగా ఉన్నాడు.

**ముని బాలకుడు :** ఓ రాజర్షీ! ఈ భూతలంపై నేను అనేక ప్రదేశాలలో సంచరించటం జరిగింది. ఎక్కడా కూడా మీ నుండి పొందినంతటి అతిథి పూజాసత్కారాలు పొంది ఉండలేదు. మీరు నిష్కాముడు గాను, పాపరహితుడు గాను కనిపిస్తున్నారు. ఇంతటి వినయం గల మీరు పరమేశ్వర అనుగ్రహంచే దీర్ఘాయుష్కులయ్యెదరు గాక!

ఓ సాధూ! మొట్టమొదట మీ విషయమేమిటో చెప్పండి. సువిశాలమగు సామ్రాజ్యమును వదలి ఈ వనవాసానికి వచ్చారేమిటి? శాంతసమన్వితమగు మనస్సుతో సర్వ కోరికలు త్యజించి మోక్షం కొరకు మాత్రమే ఈ తపస్సు చేస్తున్నట్లు నాకనిపిస్తోంది. అయినా ఖడ్గధారవలె అతి కష్ట మైనది, అత్యంత సౌమ్య-శాంత చిత్తులకు మాత్రమే అర్హమైనది అయిన వానప్రస్థాశ్రమం ఇంత చిన్న వయస్సులోనే ఎందుకు స్వీకరించారు?

**శిఖిధ్వజుడు :** హే మహాత్మా! మీరు దేవతా స్వరూపులు గదా! అందుచేత చూడగానే అంతా గ్రహించగలగటంలో ఆశ్చర్యమేమున్నది? అవును. మీరన్నట్లు మోక్షమును సంపాదించగోరి ఈ వానప్రస్థాశ్రమం చాలా సంవత్సరాలుగా సేవిస్తున్నాను.

ఓ దేవా! మీయందు నాకు లోకోత్తరమైన శోభ కనిపిస్తోంది. గొప్ప ప్రతిభచే వెలుగొందు చున్నారు. తమ దేహం చంద్రుని యొక్క అమృతమయ కిరణాలచే నిర్మించబడినదా - అన్నట్లున్నది. తమ దర్శనంచే మనస్సు ప్రశాంతత, ఉత్తేజం, అనిర్వచనీయమైన ఆనందం పొందుచున్నాయి. మీ అవయవాలు అతి కోమలం, సుందరం అయి, నేను వదలి వచ్చిన రాజ్యాన్ని పాలిస్తున్న నా ప్రియపత్ని చూడాల దేహాన్ని గుర్తు చేస్తున్నాయి. హే మహాత్మా! శిరం నుండి పాదం వరకు పరమ శాంతం, మహారమణీయం ప్రస్ఫుటిస్తున్న మీ ఈ సుందరదేహానికి ఈ మల్లెపూల దండను కూడా సమర్పించటానికి నాకు అనుజ్ఞ ఇవ్వండి. పుష్పదళముల వలె అత్యంత కోమలంగా కనిపిస్తున్న మీ అంగాలు సూర్యరశ్మి తాకితే కందిపోతాయేమోననిపిస్తోంది. దేవపూజకై నిర్మించిన ఈ తెల్లటి పుష్ప మాల తమ దేహస్పర్శచే సాఫల్యం పొందుచున్నది.

హే మహానుభావా! మీకు తెలియని ధర్మములేమి ఉంటాయి? మనలను సమీపించిన అభ్యాగతి, ఎవ్వరైనాసరే, భగవంతునితో సమానం. అందులోనూ మీ వంటి దేవతామూర్తులు అభ్యాగతి అయి

రావటమంటే, అది మా మానవులకు భగవంతుడు ప్రసాదించే గొప్పవరం. స్వామీ! మరల అడుగుచు న్నందుకు ఏమీ అనుకోకండేం! తాము ఎవరి పుత్రులు? ఏ నామధేయం మిమ్ములను అలంకరించి ఉన్నది? ఎక్కడి నుండి ఏ నిమిత్తం ఇటువచ్చి ఈ నా ఆశ్రమం పావనం చేస్తున్నారు?... ఈ సంశయాలు తొలగించమని వేడుకొనుచున్నాను.

**ముని బాలకుడు :** రాజా! ఇంతటి వినమ్రతతో అడుగుతుంటే చెప్పకుండా ఉంటానా? మీరడిగిన ప్రశ్నలన్నిటికీ సవివరంగా సమాధానం చెప్పుచున్నాను. వినండి.

ధర్మమూర్తి అయి, భక్తి పారవశ్యంతో నారాయణ జపం చేస్తూ, భక్తులకు ప్రియదర్శనం ప్రసాదిస్తూ ఈ ముల్లోకాలలో సంచరిస్తూ ఉండే నారద మహర్షి గురించి మీరు వినే ఉంటారు కదా!

**శిఖిధ్వజుడు :** నారదమహర్షి గురించి వినకపోవటమేమిటి? వారు మహాభక్త శిఖామణులు. అందరికీ ప్రాతఃస్మరణీయులు. ఆబాలగోపాలం వారి గురించి తెలుసు. వారు లోకకళ్యాణమూర్తులు కదా!

**మునిబాలకుడు :** వారి కుమారుడనే నేను.

**శిఖిధ్వజుడు :** ఆశ్చర్యం! వారు బ్రహ్మచారులు కదా!

**మునిబాలకుడు :** అవును. అది లోకవిదితమే. అయితే, ఒక విశేషం చేత నేను పుత్రుడనై జనించాను. ఆ దేవర్షి ఒకానొక సమయంలో మేరు పర్వతం పైగల ఒక గుహ యందు ధ్యాననిష్ఠులై ఉన్నారు. ఆయన తపస్సు చేస్తున్న గుహకు అతి సమీపంగా విశాలమైన తరంగాలతో గంగానది ప్రవహిస్తోంది.

ఒక రోజు ధ్యానము ముగిసిన తరువాత కళ్ళు తెరుస్తూ ఉండగా ఆ మహర్షికి గంగానదీజల ప్రాంతం నుండి జలక్రీడల యొక్క గొప్ప కోలాహలం వినిపించింది. "ఆశ్చర్యంగా ఉన్నదే! ఈ జన దూరమైన ఏకాంత ప్రాంతంలో సందడిగా జలక్రీడలాడుచున్నది ఎవరై ఉంటారు?" ...అనే కుతూహలంతో ఆయన గుహ నుండి బయటకువచ్చి చూచారు. వినోదంగా నది ఒడ్డుకు వచ్చి చూడగా రంభ, తిలోత్తమ మొదలైన అప్సరసలు జలక్రీడలాడుతూ కనిపించారు. పురుషులు లేనట్టిఆ ప్రదేశంలో వివస్త్రలై వారు నగ్న సౌందర్యంతో ప్రకృతినే పరవశింపజేస్తూ స్నానమాడు చున్నారు. అంత్యంతరమణీయమైన ఆ ప్రకృతి సౌందర్యాన్ని నగ్నదేహాలతో పరవశులై జలకాలాడుతున్న సౌందర్యరాసులైన ఆ అప్సరసలను చూస్తున్న ఆ నారదమహర్షి యొక్క మనస్సు అకస్మాత్తుగా వివేకరహితమైనది. ప్రమత్తత పొందింది. గ్రీష్మఋతువు యొక్క చివరిలో గాలి తాకిడికి మేఘాలు వర్షించి ఫలాలు నేలవ్రాలినట్లు ఆ మహర్షి వీర్యం స్ఖలితం అయింది. ఆతడు చ్యుతవీర్యుడైనాడు.

**శిఖిధ్వజుడు :** మహాత్మా మీరు చెప్పేది చాలా ఆశ్చర్యంగా ఉన్నదే? మహాజ్ఞాని, జీవన్ముక్తుడు, రాగ వర్జితుడు, ఇచ్ఛారహితుడు, పూర్ణస్వభావుడు, బాహ్య అభ్యంతరాలలో నిత్యం ఆకాశస్వరూపపుడై నిర్మలంగా విస్తరించి ఉన్నవాడు కదా, ఆ నారదమహర్షి! అంతటి బ్రహ్మర్షి అప్సరసలను చూచి చ్యుతవీర్యుడు అయినాడా? ఇది ఎట్లా సాధ్యం?

**అభ్యాగత బాలుడు :** ఓ రాజర్షీ! ఈ మూడు లోకాలలో ఉత్పత్తి అగుచున్న సమస్త ప్రాణులకూ,

ఆ మాటకు వస్తే... దేవతలకు కూడా... ఈ దేహ వ్యవహారమంతా స్వభావసిద్ధంగా రెండు విధాలుగా ఉంటోంది- 1. దుఃఖ స్వభావం, 2. సుఖ స్వభావం.

ఒకడు అజ్ఞాని కావచ్చు, జ్ఞాని కావచ్చు. ఈ దేహము ఉన్నంతవరకు ఇది సుఖదుఃఖమయమై ఉంటోంది. 'తృప్తి' కలిగించే పదార్థాలు లభించినప్పుడేమో సుఖం వృద్ధి చెందుతోంది. 'ఆకలి' మొదలైన వాటిచే దుఃఖం వృద్ధి చెందుతోంది.

అట్లా అవటానికి స్వభావమే కారణం. దేహం యొక్క దేహ-ప్రకృతి స్వభావమే సుఖదుఃఖాదులు వచ్చిపడటానికి కారణమగుచున్నాయి. దేహి తన యొక్క సత్య-నిర్మల-నిత్య-అప్రమేయ దేహి స్వభావాన్ని ఒక్క క్షణం ఏమరచాడా, దేహ స్వభావం ఆతనిని క్రమ్మివేయటానికి సిద్ధంగా ఉంటుంది. ఇక వర్షాకాలపు మేఘంలాగా ఆ దేహిపట్ల ఆ దృశ్యం ఉల్లాసం పొందగలదు, అందుచేత మనం నిరంతరం ఆత్మానుసంధానం చేయాలి. క్షణం - క్షణం మధ్య గల సంధిరూపమగు అతి స్వల్పకాలం కూడా ఆత్మను విస్మరించకూడదు.

**స్వరూపే నిర్మలే సత్యే నిమేషమపి విస్మృతే ।**
**దృశ్యముల్లాసమాప్నోతి ప్రావృషీవ పయోధరః ॥**

ఆత్మను (శరీరి స్వభావాన్ని) విస్మరించామా, దృశ్య పిశాచం చిత్తం నుండి ఉల్లాసం పొందుతుంది. సముద్రం వలె అన్ని శాస్త్రవిశేషాలు తన యందు కలిగి ఉన్న జ్ఞాని విషయంలోనూ అంతే. అజ్ఞాని విషయంలోనూ అంతే.

చీకటి - వెలుగులాగా, రాత్రి - పగలులాగా సుఖదుఃఖముల కలయికచే ఈ శరీరం స్థితి పొంది ఉంటోంది.

'ఈ దేహాదులే నా స్వరూపం, ఆ దేహాదులు ఆతని రూపం' ఈ విధంగా దేహాదుల పట్ల ఆత్మభావమును దేహి అజ్ఞానముచే దర్శిస్తున్నాడు. ఇంకేమున్నది? సుఖ - దుఃఖకారణములు రెండూ ఆతనియందు నాటుకొని ఉంటున్నాయి. తెల్లని వస్త్రమును నల్లని రంగు తాకితే, ఆ రంగు వస్త్రమును అంటుకుంటోంది. అదే ఒక స్ఫటికమును తాకితే అంటుకుంటుందా? తత్త్వజ్ఞానవశం చేత ఈ సుఖ-దుఃఖములు జ్ఞానిని స్పర్శించనైనా లేవు.

అందుచేత, ఈ జీవుడు 'కోపం-ఆవేశం-చెడువిషయాల మననం"... మొదలైన వాటిని దరిజేరనీయక పోవటమే ఉచితం. ఎందుకంటే, అవి నిర్మల మనస్సును కూడా కలుషితం చేయగలవు.

ఒక స్ఫటికమణి ఉన్నదనుకో, దాని సమీపంలో ఎరుపురంగు వస్తువేదైనా ఉంటే ఆ వస్తువు యొక్క సమీపంలో ఉన్నంత వరకూ స్ఫటికమణి కూడా ఎరుపుగా కనిపిస్తుంది. జీవన్ముక్తుని విషయం ఆ స్ఫటికమణి వంటిది కూడా కాదు. ఎందుకంటే జీవన్ముక్తుడు తన యొక్క తత్త్వజ్ఞాన కారణం చేత సుఖదుఃఖములచే కొంచం కూడా ప్రభావితం కాదు.

**వస్తునః శ్లేషమాత్రేణ ఘనరంజితమేతి ధీః ।**
**గతేఽపి వస్తుని దృఢం బుద్ధిర్యా పరితాపితా ॥**

**గతాఽపి కుంకుమే, వస్త్రం తదీయమనురంజనమ్**
**న జహాతి యథామూఢః తథా విషయ రంజనమ్ ॥**

ఒక తెల్లటి రంగుగుడ్డ తీసుకొని కుంకుమజలంలో ముంచామనుకో. ఆ తెల్లటి వస్త్రం కాస్తా ఎఱ్ఱగా ఉంటుంది. ఆ తరువాత మంచినీళ్ళతో కడిగి కుంకుమను తొలగించినా ఎరుపురంగు గుడ్డను అంటియే ఉంటుంది కానీ, తొలిగిపోదు కదా! మూఢుడు వస్తువును సమీపించగానే ఆ వస్తువు యొక్క ఆకర్షణాది ప్రభావం చేత ఆతని బుద్ధి కాస్తా కలుషితమౌతోంది. ఒకవేళ ఆ వస్తువును అక్కడి నుండి తీసివేసినా, ఆ మూఢుని బుద్ధిలోని కాలుష్యం మాత్రం పోదు.

దీనిని బట్టి నీవు గమనించవలసినదేమిటి?... బంధ-మోక్షాలనేవి బుద్ధియందే వ్యవస్థితాలై ఉన్నాయి. విషయాలను దృఢంగా భావన చేయటమే 'బంధం'. విషయాలను భావన చేయకపోవటమే 'మోక్షం'. ...మరల చెప్పుచున్నాను. బంధమోక్షాలు వస్తువుల ఉనికి - నాశనాలకు సంబంధించినవి కావు. "దేహం వస్తువులకు దగ్గిరగా ఉన్నదా? దూరంగా ఉన్నదా?" ...అను దాని ననుసరించి బంధ-మోక్షాలు ఉండవు. బుద్ధి యొక్క విషయ భావన-అభావనలే జీవుని బంధ-మోక్షాలు నిర్ణయిస్తున్నాయి.

**శిఖిధ్వజుడు:** ప్రభో! తమ వచనములు అతి స్వచ్ఛములై, విశాలమైన అర్థమును ప్రతిపాదిస్తున్నాయి. నెమలి మేఘాల శబ్దం ఒకసారి విన్న తరువాత ఇంకా, ఇంకా వినాలని కోరుకుంటుంది చూచారా! అట్లాగే మీరు చెప్పుచూ ఉంటే ఇంకా, ఇంకా సవిస్తారంగా వినాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. ఈ సందర్భంగా నాదొక చిన్న ప్రశ్న. ఈ పుత్రుడు, రాజ్య సంపద, ధనం, ప్రతిష్ఠలు - మొదలైన ఆయా విషయాల లాభ - వినాశనాలు జరుగుచున్నప్పుడు ఈ జీవునకు సుఖ-దుఃఖాలు అనుభవ మవుతున్నాయి. అవన్నీ దూరంగా ఉన్నప్పుడు, దగ్గిరగా ఉన్నప్పుడు కూడా జీవుని క్షోభింపజేస్తున్నాయి, మరి! అట్టి సుఖ-దుఃఖాలు ఏ క్రమం చేత ఏర్పడుచున్నాయ్?

**ముని బాలుడు :** ఆ సుఖదుఃఖాలన్నీ ఏర్పడటానికి కారణం ఆ జీవుడు తన యొక్క అనంతమగు సాత్మతత్త్వాన్ని తెలుసుకొని ఉండకపోవటమే.

1. సమీపమున ఉన్న బాహ్య విషయములు,
2. ఈ శరీరము యొక్క నేత్ర, హస్త, స్పర్శాది ఆయా సంఘటిత విషయములు,
3. అనుమాన - ప్రమాణములచే ఆలోచింపబడే దూరస్థమైన, లేక, భవిష్యత్ సంబంధమైన అనుకూల - ప్రతికూల విషయాలు.

వీటినన్నిటినీ ఈ జీవుని యొక్క బుద్ధి స్వీకరిస్తోంది. అవిజ్ఞత కారణంగా బుద్ధియందున్న 'సుఖ సంవిత్తు' క్షోభ చెందుతోంది. అట్టి క్షోభ భోక్తయగు జీవుని యొక్క కుండలినీ నాడి యందు స్వయంగా ప్రకటితమౌతోంది.

ఈ జీవుని హృదయంలో ఆతని భోగానుభవం కొరకై వేరువేరు నాడులున్నాయి. అవన్నీ దేహమంతా ప్రసరించి ఉన్నాయి. ప్రాణవాయువులచే పూరితమైన ఈనాడులన్నిటిలో జీవుడు

స్వయంగా స్ఫురించుచూ ఆక్రమించుకుని ఉన్నాడు. ఒక వృక్షము యొక్క (లేదా) ఒక లత యొక్క మూలభాగంలో నీరుపోస్తే ఆ నీరు వృక్షమంతటా (లేక లత అంతటా) రసరూపంలో ప్రవేశిస్తోంది కదా! అట్లాగే స్పర్శ మాత్రంచేత జాగృతుడైన ఈ జీవుడు కూడా సుఖ-దుఃఖానుభవాలను వెతుక్కుంటూ శరీరమంతా ప్రాణస్వరూపుడై ప్రసరించి ఉంటున్నాడు.

సుఖాదుల అనుభవము కొరకై వేరు వేరు నాడులున్నాయి. సుఖానుభవమున ప్రవృత్తుడైన జీవునకు శీఘ్రంగా 'స్వస్థత' అనుభవానికి వస్తోంది. దుఃఖానుభవమున ప్రవృత్తుడైనప్పుడో, లేక, సుఖానుభవప్రవృత్తికి నిరోధం కలిగినప్పుడో ఆ జీవుని అనుభవమునకు అస్వస్థత చేకూరుతోంది. ఒకడు 'సువాసనను ఆఘ్రాణించాలి' ...అని అనుకున్నప్పుడు ఆ జీవుని సంవిత్తు సుఖమును వెతుక్కుంటూ ముక్కులోకి వేంచేస్తోంది. అప్పుడు కర్పూర – చందన – ధూప – పుష్పాది మార్గములు ఆ జీవుని బాహ్య ప్రపంచంలో వెతుకుచున్నాడు. ఘ్రాణము కొరకు సుఖానుభవనాడులు విస్తరిల్లి తెరుచుకుంటున్నాయి. సువాసన లభించకపోవటం దుఃఖమౌతోంది. లభించటం చేత వచ్చే స్వస్థత లేక దుఃఖరాహిత్యం 'సుఖం' అని అనిపించుకుంటోంది. జీవుని సుఖసంవిత్తు ఘ్రాణములోనికి అసలు ప్రసరించదనుకో! అప్పుడు? ఆ జీవునికి సుఖదుఃఖాలు ఉండేవే కావు. 'సుఖం కావాలి' అనుకోవటంతో దుఃఖం ప్రారంభమైనది. అయితే విషయ స్పర్శచే ఏర్పడే సుఖం వాస్తవమైన సుఖం కాదు. అది సంవిత్తు యొక్క ప్రతిబింబిత సుఖం మాత్రమే.

ఎంతవరకైతే ఈ జీవుడు అత్యంత చంచలమైన నాడి మార్గంలో ప్రవేశించనే ప్రవేశించడో... అనగా, అతని సంవిత్తు వృత్తులను అనుసరించదో... ఎంతవరకూ తాను ఉన్నచోటే శాంతుడై ఉంటాడో... అంతవరకూ ఆతడు 'ముక్తుడు' అని చెప్పబడుచున్నాడు.

ఎంతవరకైతే ఈ జీవుడు నాడీమార్గంలో ప్రవేశించి అక్కడ ప్రశాంతంగా ప్రసరించి ఉన్న ప్రాణవాయువులను సుఖాభిలాషచే సంక్షోభమొందించుకుంటున్నాడో, అంతవరకు ఆతడు 'బద్ధుడు' అని గ్రహించు.

**శిఖిధ్వజుడు :** అయితే ఈ జీవుని స్వస్వరూపం త్యజించి అట్టి సుఖదుఃఖానుభవము వైపుగా ప్రేరేపిస్తున్నదెవరు? దైవమా? మరింకెవరన్నానా?

**ముని బాలకుడు :** ఈ జీవుడు స్వయం ప్రకాశస్వరూపుడు. ఆతనిని మరెవ్వరో ఎక్కడి నుండో ప్రేరేపించటం లేదు. ఆతని ప్రేరణకు ఆతడే కారణం. విషయముల గురించిన సుఖదుఃఖాల మనన స్ఫురణచే ఆతనికి బంధం ఏర్పడుతోంది. దీనినే 'చిత్త స్పందన' అని శాస్త్రకారులు పిలుస్తున్నారు.

సుఖము యొక్క అభావనచే దుఃఖం వచ్చి చేరుతోంది. దుఃఖం యొక్క అభావనచే సుఖభావనకు చోటు లభిస్తుంది. సుఖదుఃఖముల అభావనచేతనే ఈ జీవునకు మోక్షం సిద్ధించగలుగుతుంది.

ఈ విధంగా – 1. సుఖ-దుఃఖముల సత్త బంధము, 2. ఆ రెండింటి యొక్క అభావన మోక్షము... అను రెండు నిర్దేశిత మార్గాలనూ ఆత్మశాస్త్రజ్ఞులు ఎత్తి చూపుతున్నారు.

ఈ జీవుడు సర్వదా శాంతస్వరూపుడే. అయితే ప్రజ్ఞను ఏమరచి ఇంద్రియాలు ఉపయోగిస్తు న్నప్పుడు ఏర్పడే అనురాగాదులు శాంతిని భంగపరుస్తున్నాయి. దుష్ట ఇంద్రియాలచే విషయాలకు

సంబంధించిన సుఖదుఃఖ దశలు ఎంతవరకు ఏర్పడకుండా ఉంటాయో, అంతవరకు ఈ జీవాత్మ శాంతచిత్తంతో సౌమ్యం వహించి ఉండగలదు.

ఇక్కడ మనం నేర్చుకోవలసినదేమిటి? సుఖదుఃఖాలు తటస్థపడుచున్నప్పుడు సమస్వభావాన్ని అలవరచుకుంటూ ఉంటే, ఈ జీవుడు మోక్షార్హత సంపాదించుకోగలడు.

❖

చంద్రుని చూడగానే మూర్ఖ సముద్రం ఎక్కడ లేని ఉల్లాసం ప్రదర్శిస్తుంది చూచావా? అనేక జన్మలలోని దుష్ట అభ్యాస–దురవగాహనల కారణంగా ఈ జీవుడు తనపై అజ్ఞానపు పొరలు తనకు తానే సాలె పురుగు వలె కల్పించుకుంటున్నాడు. స్వతహాగా స్వయం ప్రకాశ – స్వయంచైతన్య స్వరూపుడే అయిన ఈ జీవుడు స్వయం నిర్మిత సంస్కారాల ప్రభావం చేత సుఖవిషయాన్ని గాని, దుఃఖ విషయాన్ని గాని గాంచినపుడు అభ్యంతరమున 'ఉల్లాసం' అను చంచలత్వాన్ని పొందుచున్నాడు. పిల్లి మాంసాన్ని తలచుకుంటూ మాంసం ఎదురుగా ఉన్నప్పుడు, లేనప్పుడూ కూడా 'మ్యావ్–మ్యావ్' అంటూ సంక్షోభం చెందుతుంది చూచావా? జీవుడు కూడా సుఖాల యొక్క, తత్సాధన భూతాలైన ధనాదుల యొక్క రాగంచే అనేక ఉత్సాహ – నిరుత్సాహ భావాలను తన చుట్టూ కల్పించుకొని మ్రగ్గుచున్నాడు. క్షోభిస్తున్నాడు. కారణమేమిటి? మూర్ఖత్వమే!

**శిఖిధ్వజుడు :** ఔను, దేవమునీ! మీరు చెప్పిందంతా పరమ సత్యం. అందుకు నాకు సాక్ష్యం (దృష్టాంతం) నేనే! మరి ఆ జీవుడు బాగుపడే మార్గమేదైనా ఉన్నదా?

**ముని బాలకుడు :** ఎందుకు లేదు? తప్పక ఉన్నది. స్వాత్మజ్ఞానమగు శుద్ధబోధ యొక్క అభ్యాసం చేత "సుఖ–దుఃఖాదులనేవి లేవు" అనే అనుభవస్థితి సుస్థిరమగు గాక! అట్టి సుస్థిరతచే "స్వస్వరూప చాంచల్య రాహిత్యం" అను అలౌకికమైన దారుఢ్యం ఈ జీవుడు సంపాదించుకోవటమే ఉచితం. సద్గ్రంథ పఠనం వల్ల, గురుబోధ వల్ల 'శుద్ధరూపుడనగు నా యందు ఈ సాంసారిక సుఖాలూ లేవు, దుఃఖాలూ లేవు. నేను వ్యర్థంగా విషయసుఖాదులందు దురవగాహన, అపభ్రంశమైన నిర్వచనాలు కల్పించుకుంటున్నాను' అని గ్రహిస్తున్నాడు. ప్రబుద్ధుడై పరమశాంతిని, 'నిర్వాణం' అని పిలుబడే మోక్షానుభవాన్ని సంపాదించుకుంటున్నాడు. 'విషయ జనితసుఖాలు అవస్తువులు' అనే అభ్యంతర జ్ఞానం చేత జీవుడిక వాటి వైపు మరలక, కేవలము శాంతుడై ఒప్పుచున్నాడు. "అంతయూ చిదాకాశమగు బ్రహ్మమే. అనగా నా వాస్తవ స్వరూపమే సర్వే సర్వత్రా వెలయుచున్నది. (మమాత్మా సర్వభూతాత్మా)" అను దృఢ నిశ్చయం తనయందు నెలకొనుచుండగా జీవబ్రహ్మైక్యభావన అనుభూత మవుతుంది. ఈ జగత్తంతా శూన్యమాత్రమే అని ఎరుగుచుండగా ఇక ఆ జీవుడు దేనికీ క్షోభ చెందడు. బ్రహ్మం తోటి ఐక్యం పొందుచుండగా ఇంక క్షోభకు, విభ్రమానికి అవసరమేమిటి? అవకాశమెక్కడ?

"నేనే ప్రథమ సృష్టియందు కల్పితుడనైనట్టి హిరణ్యగర్భుడను. సర్వమునకు అంతర్యామిని. సర్వజీవాత్మల రూపంలో ఈ సంసారవనంలో లీలగా పచార్లు చేస్తున్నాను" అని గ్రహిస్తున్నాడు.

ప్రియరాజర్షీ! ఇక్కడ తారసపడుచున్న ప్రతిజీవుడు స్వకీయకల్పన చేతనే స్వయంగా బంధ

మోక్షాల మార్గములను కల్పించుకుని అందులో అనువర్తిస్తున్నాడు. తత్త్వబోధచే ముక్తుడగుచున్నాడు. ఇక్కడ గాని, మరెక్కడగాని ఇంతకుమించి మరే విశేషం లేదు.

**శిఖధ్వజుడు:** ఓ దేవపుత్రా! మీ వివరణ నాకు తృప్తిని కలుగజేసింది. అయితే మరొక్క చిన్నవిషయం కూడా వివరించండి. సుఖసంచార యోగ్యములైన ఆయా నాడులందు ఈ జీవుడు ఎప్పుడు ప్రవేశిస్తున్నాడు? అప్పుడాతని యొక్క వీర్యపతనం ఎట్లా అగుచున్నది?

**మునిబాలకుడు :** మహారాజు తన సేనలను యుద్ధసమయంలో ఆయా పనులందు చెల్లాచెదురుగా నియమిస్తాడు చూచావా? అట్లాగే స్త్రీ యొక్క స్వరూపాన్ని చూచినప్పుడు తన యొక్క రాగవాసనలచే ఉద్బోధితుడై ఈ జీవుడు స్వభావవశం చేత మౌనంగా తన దేహమంతా ఆక్రమించి ఉన్న ప్రాణ వాయువులను క్షోభితములుగా చేసివేస్తున్నాడు. ఆ సమయంలో ప్రాణవాయువు యొక్క చేష్టచేత మేధస్సు నందలి – మజ్జ యందలి సారం తన యొక్క సుగంధయుక్తమైన రజం లేక సూక్ష్మాంశాన్ని త్యజించుచున్నది. అట్లా బయలుదేరిన ఆ రజం (Minute Particles) నాడి ద్వారా అధోభాగం నుండి శుక్రరూపంలో స్వభావవశం చేత బయటకు పోవుచున్నది.

**శిఖిధ్వజుడు :** ఓ దేవపుత్రా! మీరు ఆత్మజ్ఞులు. ఈ జగత్‌స్థితి యొక్క పూర్వాపరాలు ఎరిగి ఉన్నవారు. మీ వచనాలు వింటూ ఉంటే మీరు పరమజ్ఞానులని తెలియవస్తోంది. ఇప్పుడు మీరు 'స్వభావవశం చేత' అనే శబ్దం ప్రయోగించారు. 'స్వభావం' అంటే ఏమిటి?

**ముని బాలకుడు :** సృష్ట్యాదియందు హిరణ్యగర్భుడు ప్రాణుల కర్మలను అనుసరించి ఆయా జీవుల యొక్క ఏ ధర్మములు తనయందు స్ఫురింపజేసియున్నాడో ఇప్పుడూ కూడా ఆయా పదార్థములు, ప్రాణులు అవే ధర్మములు కలిగి ఉండి ఈ జగత్ ప్రదర్శనకు రచనలుగా ఉండి ఉంటున్నాయి. దీనినే శాస్త్రములు 'స్వభావము' అని పిలుస్తున్నాయి. జలంలో బుద్బుదములు పుట్టి నశిస్తున్నట్లు, కాకతాళీయ న్యాయం చేతను ఘుణాక్షర న్యాయం వలె (ఒక చెట్టు యొక్క కాండంపై మసిపురుగు భాష గానీ, అక్షరాలు గానీ ఏమీ తెలియకపోయినా ఏదో అక్షరాన్ని తొలచటం) ఇదంతా కూడా మాయయే. అగ్ని ఉష్ణంగానూ, జలము శీతలంగానూ... ఈ విధంగా, సృష్ట్యాదిగా ఏ పదార్థం ఏ ధర్మములతో కూడి ఉన్నదో దానినే పండితులు 'స్వభావం' అంటున్నారు.

పంచభూతములను ఆయా మిశ్రమంగా ఆయా ధర్మముల వైపుగా ప్రేరేపించుచున్న దెవరు? ఏదో ఒకానొక ప్రజ్ఞయే అయి ఉండాలి కదా! ఆ సమష్టి ప్రజ్ఞనే హిరణ్యగర్భుడు, సమష్టి తత్త్వము, సమష్టి జీవుడు, స్వభావము మొదలైన సంజ్ఞలతో పిలుస్తున్నారు.

స్వభావ కారణం చేతనే ఈ జగత్తు మహావృద్ధిని పొందటం, ఇందులో పలువిధ వికారయుక్తాలగు దేహాలు ప్రాణవాయు సమన్వితమై పరిభ్రమించటం జరుగుతోంది. ఇందులో గల కొన్ని దేహాలు వాసనాక్షయముచే జ్ఞానయుక్తములై మరల ఈ వాసనామయ ప్రపంచంలోకి తిరిగి ప్రవేశించటం లేదు. ఇక మరికొన్ని అజ్ఞాన దేహములైతే ఈ ప్రపంచంలోకి వస్తున్నాయి, పోతున్నాయి. పునః ప్రవేశం చేస్తున్నాయి. (ఇక్కడ దేహం ... అనగా దేహి అనే అర్థం అన్వయించుకోవాలి)

❖❖❖

# 21. స్ఫటిక ఘటంలో జననం

**ముని కుమారుడు:** ఓ మహారాజా! ఈ జగత్తంతా కూడా ఆత్మ యొక్క ఒకానొక చిత్కళా స్వభావవశం చేత ఉత్పన్నమౌతోంది. వాసనల చేత స్థితి పొందుతోంది. ధర్మాధర్మవశం చేత వెలయుచున్నది. ఎప్పుడైతే వాసనలు క్షయిస్తాయో ఇక ఆపై జీవుడు ధర్మాధర్మములందు తగుల్కొనటం ఉండదు. కాబట్టి ఈ సంసారం మరల ఏర్పడి ఉండదు. ఇక్కడ అనుభవమయ్యేదంతా 'మాయానుభవమే' అని ఈ సందర్భంలో గుర్తు చేస్తున్నాను.

**శిఖిధ్వజుడు :** చాలా చక్కగా ప్రవచించారు. ఓ మహావక్తా! మీరు చెప్పుచున్న మాటలన్నీ కూడా అత్యంత ఉదారంగాను, గొప్ప అర్థాలతో కూడుకొనినవి గాను, అనుభవయోగ్యమైనవి గాను, నిగూఢాలు గాను, పరమార్థ సాధకాలుగాను, నాకు అనిపిస్తున్నాయి. మీ వాక్య వైభవాన్ని వింటున్నప్పుడు అత్యంత తృప్తి, శాంతి కలుగుతున్నాయి. మీ జన్మ వృత్తాంతం సంక్షిప్తంగా చెప్ప ప్రార్థన. ఆ తరువాత ఆత్మజ్ఞానపూరితమైన తమ ప్రవచనాన్ని అవకాశమున్నంత విస్తారంగా వినాలని నాకున్నది.

బ్రహ్మదేవుని పుత్రుడైన నారదమహర్షి తన వీర్యమును ఎక్కడ, ఏ విధంగా స్థాపన చేశారు?

**మునికుమారుడు :** అప్సరసలను వినోదంతో చూచిన ఆ మహర్షి స్ఖలనానంతరం వెంటనే మనస్సును తిరిగి యథాప్రకారం తన బుద్ధితో వివేక-విశుద్ధ సమన్వితం చేశారు.

అంతటి తపశ్శాలి, మహర్షి యొక్క వీర్యము మహత్తర తేజోమయమై ఉంటుంది కదా! అందుచేత ఆయన అక్కడికి దగ్గిరలో కనబడిన స్ఫటిక నిర్మితమై, ప్రకాశమానమైన ఒక ఘటంలో స్థాపన కావించారు. స్వసంకల్పంతో క్షీరమును సృష్టించి ఆ ఘటములో నింపారు. సర్వదా లోకకళ్యాణకారకులగు ఆ మహర్షి ఆ ఘటమును తాను తపస్సు చేసే గుహలోనికి తీసుకువెళ్ళి అగ్ని కార్యములతోను, మంత్రోచ్చారణతోను అతి పవిత్రం చేశారు. ఒక మాసము కాలంలో ఆ ఘటములోని వీర్యము వృద్ధి చెందింది. మాసం గడచిపోగానే ఆ ఘటం లోంచి పరిపూర్ణమయిన అవయవాలతో శోభిస్తున్న ఒక బాలుడు బహిర్గతుడైనాడు. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడగు చుండగా, నారదమహర్షి జాతకకర్మ, ఉపనయనం మొదలైన సంస్కారాలను నిర్వహించారు. తన వద్ద గల మహత్తర విద్యావైభవమంతా ఆ బాలునికి ప్రసాదించారు. అచిరకాలంలోనే ఆతనిని తనంతటి విద్యాపారంగతునిగా తీర్చిదిద్దారు. ఒక రోజు ఆ మహర్షి ఆ బాలుణ్ణి తన తండ్రి బ్రహ్మ దేవుని దగ్గరకు తీసుకువెళ్ళారు. తనకు భక్తి పారవశ్యంగా సాష్టాంగదండప్రమాణాలు సమర్పిస్తున్న మనుమణ్ణి చూచి బ్రహ్మదేవుడు ఆ బాలకుణ్ణి వేద-వేదాంత విద్యలలో కొద్దిసేపు పరీక్ష చేశారు. ఆ తరువాత తన ఒడిలో కూర్చోబెట్టుకుని ఆతనిని ఆశీర్వాద మాత్రం చేత సర్వజ్ఞునిగా, జ్ఞానసాగరునిగా తీర్చిదిద్దారు. అప్పుడు 'కుంభుడు' అని నామకరణం చేశారు.

ఆ "కుంభుడు" అనబడు నారదపుత్రుడు, బ్రహ్మదేవుని మనుమడు మరెవరో కాదు... నేనే! నేను, నా తండ్రి బ్రహ్మ లోకంలోనే కలసి ఉంటున్నాం. ఇక తదితర బంధువుల విషయమేమిటంటారా?

సాధన - ఆరాధనలచే నాకు గాయత్రీదేవి పినతల్లి అవుతుంది. సరస్వతీదేవి నాకు తల్లి. నాలుగు వేదములు నేను ఆడుకునే క్రీడాస్థలం. ఇక నేను చేసే పనేమిటంటారా? లీలా నిర్మిత స్వరూపుడను, పరిపూర్ణుణ్ణి అయి ఉండటంచే నేను నిర్వర్తించవలసిన కార్యమంటూ ఎక్కడా ఏదీ లేదు. ఏ నిమిత్తం లేకపోయినప్పటికి నేను బ్రహ్మాండాలన్నీ స్వేచ్ఛగా సంచారం చేస్తూ ఉంటాను. భూమిపై సంచరించాలని అనుకున్నప్పుడు ఇటు కూడా వస్తూ వుంటాను. నేను భూమిపై సంచరిస్తున్నప్పుడు నా ఈ పాదాలు నేలను తాకవు. ఈ భూమి యొక్క ధూళిరేణువులు నా అంగాలను స్పృశించవు. ఈ శరీరం గ్లాని పొందటమంటూ ఉండదు. ఈ రోజు ఎప్పుడూలాగానే ఆకాశమార్గంలో పోతున్నాను. ఇక్కడ మీరు కనిపించారు. దైవేచ్ఛానుసారం మీతో సంభాషించాలని అనిపించింది. ఇక, ఇక్కడికి వచ్చాను. ఇదీ నా చరిత్ర.

ఓ రాజర్షీ! మిమ్ము ఆకాశంలోంచి చూచాను. వనవాసముచే చిత్తశుద్ధిని సంపాదించినారని గ్రహించి సంతోషమనిపించింది. ఉత్తములైన మీవంటివారితో ప్రశ్న-సమాధానాలు నిర్వర్తించటం నాకు ఒక చక్కటి అవకాశమని, జ్ఞాన విశేషముల పరస్పర సంభాషణం మానవులలో కనిపించే ప్రియసమాగమము వలె ఒక మాధుర్యమైన విశేషమని నా అభిప్రాయం.

❖

ఇట్లు కుంభమహర్షి చెప్పిన వాక్యములతో ఈ 17వ రోజు సంవాదము ఇక్కడ ముగించారు. శాంతి వచనాలు ప్రవచించబడ్డాయి. సభికులంతా గొంతులు కలిపి "జ్ఞానం సర్వదా పరిఢవిల్లు గాక! లోకములు సుఖ - శాంత - ఐశ్వర్య - ఆనంద - పరస్పరానూకూల్యములతో ఉత్తమ సంపద సమన్వితమగు గాక!" - అను అర్థమును ప్రవచించే వేదవాక్యాలు వల్లించారు. సభ చాలించబడింది.

❖❖❖

**(పదిహేడవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# పద్దెనిమిదవవ రోజు

## 22. క్రియ - జ్ఞానములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నిన్నటి రోజు మనం చెప్పుకుంటున్న కుంభమహర్షి – శిఖిధ్వజ సంవాదమును, తదనంతర కథా విశేషాలను కొనసాగిద్దాం.

❖

**శిఖిధ్వజుడు :** ఓ దేవపుత్రా! కుంభర్షీ! జన్మజరామృత్యురూపమగు ఈ సంసారమున చిక్కుకునిఉన్న నేను ఎప్పుడో, ఏ జన్మలోనో మహత్తరమైన పుణ్యకార్యములు చేసి ఉంటాను. అందుకు ప్రయోజనంగా ఈ రోజు ఆకాశంలో ప్రయాణిస్తున్న మీకు నన్ను చూసి నాతో కొంత సమయం సంభాషించాలని అనిపించి ఉంటుంది. హే మహాత్మా! నేనిప్పుడు భాగ్యవంతులలో కెల్లా గొప్ప భాగ్యవంతుడినని అనుకుంటున్నాను. ఎందుకంటారేమో? అమృతప్రవాహం వంటి మీరు చెప్పే మాటలు, మీ తోటి సాంగత్యము ఏమైనా చిన్న విషయాలా? తమ వంటి మహనీయులతో ఏర్పడే సమాగమం ఈ చిత్తమును ప్రశాంతపరచినట్లుగా రాజ్యలాభం, చక్రవర్తిత్వము మొదలైనవి కలిగించగలవా? లేనేలేదనునది ఘంటాపథం. మీ వంటి సాధువులతో సమాగమం వలన నా వంటి సామాన్యునికి కూడా రాగద్వేషరాహిత్యరూపమగు అపరిచ్ఛిన్న బ్రహ్మానందం లభించగలదు. రాజ్యలాభం మొదలైన కల్పితమాత్రమైన తుచ్ఛసుఖములెక్కడ? మీ సామీప్యతలో ఏర్పడగల ఆత్మానుభవ లాభం ఎక్కడ? ఈ రెండింటికీ కొంచం కూడా పోలిక లేదు.

**కుంభర్షి :** (శిఖిధ్వజుని వాక్య ప్రవాహమును కించిత్ నిరోధిస్తూ) అదంతా అట్లా ఉండనివ్వండి. నేను నా జన్మ వృత్తాంతమంతా చెప్పాను కదా! ఇప్పుడిక మీ విషయం గురించి చెప్పండి. హే సాధూ! మీరు ఈ పర్వతంపై ఇంతకాలంగా ఏం చేస్తున్నారు? ఏమి సాధించగోరి దుర్భరమైన ఈ ఏకాంత వనవాసాన్ని ఇంత సుదీర్ఘకాలంగా నిర్వర్తిస్తున్నారు? ఇంకా ఎంతకాలం ఈ వనవాసం కొనసాగించాలనుకుంటున్నారు?... మీ వంటి మహాత్ములగు తాపసులు అసత్యం పలుకటమన్నది ఎరుగరు కదా! అందుచేత ఇందుకు అసలైన కారణాలేమిటో వివరించండి.

**శిఖిధ్వజుడు :** ఓ కుంభమహర్షీ! మీరు సర్వజ్ఞులు. సర్వలోక వృత్తాంతముల యథాస్థితి అంతా ఎరిగియున్నవారు. ఇక మీ దగ్గిర దాయగలిగినది ఏముంటుంది? చెపుతాను. నేనేమీ చెప్పకుండగానే అంతా గ్రహించగలిగినట్టి మహత్తర శక్తి సంపన్నులు మీరు. అయినా అడిగారు కాబట్టి ఉన్నదున్నట్లు అంతా వివరిస్తాను స్వామీ!

ఈ సంసారమును చూచి భీతిల్లినవాడనై నేనీ వనవాసం చేస్తున్నాను. నా పేరు శిఖిధ్వజుడు. మాళవదేశపు రాజును. 'ఉజ్జయిని' అను పేరుగల రాజధానిని, మాళవదేశ సంపదను త్యజించాను.

జనన–జరా–మరణ వృత్తాంతములతో భయమును గొలిపే సంసారవ్యవహారమును గమనించి భీతిల్లినవాడనై దీనిని ఎట్లాగైనా జయించాలని 18 సంవత్సరాలుగా ఈ ఏకాంత వనవాసం ఆశ్రయించాను.

**సుఖం పునః పునః దుఃఖం, పునర్మరణ–జన్మనీ ।**
**భవతస్తేన తప్యేఽహం, తత్త్వజ్ఞ! వనవీథిషు ॥**

హే తత్త్వజ్ఞా! ఇక్కడంతా ఉన్నదేమిటి? ఇంతలోనే దుఃఖం, ఇంతలోనే సుఖం! ఇంతలోనే జన్మ, ఇంతలోనే మృత్యువు. ఇకదాని తరువాత మరొకటి వస్తూనే ఉంటాయి గాని వీటికి అంతెక్కడు న్నది? ఇదంతా గమనించిన నేను ఈ సంసారచక్రం నుండి విడివడాలని ఉద్దేశించి వనవాసాన్ని ఆశ్రయించాను. ఇన్నేళ్ళు గడిచాయి. అనేక దిక్కులలో సంచరించాను. ఉగ్రమైన తపస్సు కూడా చేశాను. ఏం లాభం? నా మనస్సుకు కొంచెం కూడా విశ్రాంతి లభించనే లేదు. నా ఈ ప్రయత్నాలు ఒక కొలిక్కి రావటం లేదు. ఇంతవరకూ ఏ ఫలితమూ కనబడటం లేదు. ఏ అసంపూర్ణత్వంతో ఈ వనవాసం ప్రారంభించానో... అది ఇంకా కొనసాగుచూనే ఉన్నది. కీటకములచే భక్షించబడే వృక్షంలాగా నిస్సహాయుడనై నేనీ ఏకాంతవనంలో శుష్కిస్తూ ఏం చేయాలో పాలుబోక ఇక్కడే ఇట్లా ఇంకా రోజులు గడపుచున్నాను. సుదీర్ఘమైన తపఃధ్యానాది ఆయా క్రియలను బాగా ఆచరిస్తూనే ఉన్నాను. అయినా కూడా ఫలితం కనబడటం లేదు. ఒక దుఃఖంలోంచి ఇంకొక దుఃఖంలోకి పయనించటమే నా పనిగా అవుతోంది. అమృతతుల్యంగా చెప్పబడే వేదోక్తకర్మలతో గూడిన ఉపాసన నాకు విశ్రాంతి కలిగించకపోవటం చేత నాకు క్రమంగా విషమువలెనే అనిపిస్తోంది? మహర్షీ! నా గురించిన ముఖ్యమైన వివరాలు ఇవి. ఇక తదితర వివరాలు పెద్దగా చెప్పుకోవలసినవేమీ కావు.

**కుంభమహర్షి :** ఓ రాజర్షీ! ఒకసారి పితామహులగు బ్రహ్మదేవునికి ఒక ప్రశ్నవిన్నవించాను. 'తాతగారూ! 1. జ్ఞానము, 2.క్రియ ...ఈ రెండిటిలో ఏది శ్రేయోదాయకమైనది? దానికి భగవంతుడగు బ్రహ్మదేవుడు ఆశ్రితవాత్సల్యంతో ఇట్లా సమాధానమిచ్చారు.

❖

**బ్రహ్మదేవుడు :**

**జ్ఞానం హి పరమం శ్రేయః కైవల్యం తేనవేత్త్యలమ్**
**కాలాతివాహనాయైవా వినోదాయోదితా క్రియా॥**

వత్సా! కుంభా! నీ కింకా సందేహం దేనికి? జ్ఞానమే పరమశ్రేయమైనది. జ్ఞానం చేతనే ఈ జీవుడు మోక్షార్హుడై పూర్ణానుభవాన్ని సంతరించు కుంటున్నాడు. ఇక క్రియల విషయ మేమంటావా? క్రియలన్నీ జ్ఞానం యొక్క అర్హత సంపాదించుకోవటానికి చెప్పబడ్డాయి. లేదా, కేవలం స్వర్గాది భోగాల వినోదం కొరకు, కాలయాపన కొరకు చెప్పబడ్డాయి. అయితే ...ఇక్కడొక విశేషమున్నది.

**అలబ్ధజ్ఞానదృష్టినాం క్రియా అత్ర పరాయణమ్ ।**
**యస్య నాస్తి అంబరం పట్టం కంబలం కిం త్యజత్య సౌ ॥**

ఒకడికి ఇంకా పట్టువస్త్రాలు లభించలేదనుకో. ఉన్న గుడ్డలు, కంబళి తీసిపారవేయడు కదా! ఎవరికి ఇంకా జ్ఞానం లభించలేదో అట్టివారికి క్రియలే (సాధనా కార్యక్రమములే) ఆశ్రయమై ఉన్నాయి. అందుకొరకే శాస్త్రములు క్రియాక్రమములను (పూజ-ధ్యానము-అష్టాంగయోగాలు-దేవాలయాలు-వ్రతాలు-తీర్థాలు మొ॥) రచించి సాధనపరులకు అందజేస్తున్నాయి.

ప్రతిక్రియకు కొన్ని ప్రయోజనాలుంటాయి. ఆ ప్రయోజనాలు మరికొన్ని క్రియల ఆవశ్యకతను కలిగిస్తూ ఉంటాయి. ఈ క్రియా ప్రయోజనముల వ్యవహారమునకు అంతు ఉన్నట్లు కనబడదు.

**నేను (కుంభమహర్షి) :** తాతగారూ! మీరు చెప్పేది విషయాన్ని మరింత జటిలం చేస్తోందే! క్రియలు తప్పవంటున్నారు. ఆ క్రియల ప్రయోజనములు మరికొన్ని క్రియలకు ఆవశ్యకతను కల్పిస్తాయంటు న్నారు. ఇదంతా... పెద్ద చిక్కు వచ్చి పడుతోంది కదా!

**బ్రహ్మదేవుడు :** ప్రియ మనుమడా! కుంభా! గాభరాపడకు. ఇక్కడ మరొక విషయం. నీవు గమనించు. అజ్ఞాని వాసనాయుక్తుడై ఉండటం చేత అతని సమస్త క్రియలు ఫలయుక్తములౌతున్నాయి. వాసనలు క్షయిస్తూ ఉండగా జ్ఞానియొక్క సమస్త క్రియలు ఫలరహితములుగా ఉండిపోతున్నాయి.

నీళ్ళు పీల్చనప్పుడు ఫలసహితమైన లత కూడా నిష్ఫలత్వం (ఫలములను పొందకపోవటం) పొందుతుందే! అట్లాగే వాసనల అభావం జ్ఞాన సముపార్జితుని ఫల ప్రదాలగు క్రియలు కూడా నిష్ఫలత్వం పొందుతాయి. శరద్రుతువు వచ్చిన తరువాత ఇక వర్షాకాలపు మేఘాలు మిగలవు కదా!

వాసన యొక్క నాశనంచే క్రియల యొక్క ఫలదీకరణం కూడా నశించగలదు. రెల్లు తీగకు స్వభావసిద్ధంగానే ఫలాలు కాయనట్లు, వాసనారహితమగు క్రియ ఫలాన్ని ఇవ్వదు.

**సయక్షవాసనో బాలో యక్షం పశ్యతి, నాఽన్యథా ।**
**సదుఃఖవాసనో మూఢో దుఃఖం పశ్యతి నాఽన్యథా ॥**

భూతప్రేతాలకు సంబంధించిన వాసనలు కలిగి ఉన్న బాలునికి చీకట్లో భూతప్రేతాలు తాండవ మాడుచున్నట్లు కనిపిస్తాయి. అదే, అట్టి వాసనయే లేని మరొక బాలుడికో? అక్కడ చీకటి మాత్రమే కనిపి స్తుంది. సుఖదుఃఖాలకు సంబంధించిన వాసనలు కలిగి ఉన్న జీవునికి మాత్రమే సుఖదుఃఖాలు అనుభవ మవుతాయి. అటువంటి వాసనలు అంతరంగంలో లేనివానికి సుఖం ఉండదు. దుఃఖం ఉండదు.

గొప్ప ఆకారం కలిగిన ఒక శుభక్రియ గాని, అశుభక్రియ గాని జ్ఞానికి ఏ ఫలం కలుగజేయలేదు. వాస్తవానికి అహంకారాదుల రూపంగా కనబడే ఈ 'వాసన' అనేది ఒక వస్తువే కాదు. అది అజ్ఞానం యొక్క అభ్యాసం మాత్రమే. అది వస్తుతః మిథ్య మాత్రమే. ఎడారిలో ఎండమావుల మహా సముద్రం ఎట్లా ఉదయిస్తోంది? ఆ చూచేవాడి అసత్యమైన అవగాహన చేతనే కదా! అట్లాగే వాసనలు, క్రియల పట్ల ఏర్పడే ఫలాభిలాష అజ్ఞానం చేతనే ఏర్పడుచున్నాయి. తెలివిగలవాడికి ఎడారిలో జల తరంగాలు కనిపించనట్లు (ఎండమావులే గాని జలం కాదని గ్రహించునట్లు)... "అంతయూ సర్వదా బ్రహ్మమే కదా!"...అను భావనచే ఎవని అజ్ఞానం నశిస్తూ ఉంటుందో, అట్టివాని యందు వాసన ఉదయించదు. వాసనలను పరిత్యజించాడా... ఇక ఆ జీవునికి జరామరణ వర్జితమైన పునర్జన్మానుమానరహితమైన పరమపదము ప్రాప్తిస్తోంది.

ఓ కుంభా! అసలు మనస్సుయొక్క రూపం ఏమిటి? వాసనాసహితమగు మననమే మనస్సు యొక్క స్వరూపం. వాసనారహితమైన మనస్సు జ్ఞానరూపమే అవుతుంది. జ్ఞానవస్తువు ప్రాప్తిస్తుంది. అట్టి జీవునకు, "నేను దేహంతో పుట్టుచున్నాను. దేహంతో నశిస్తున్నాను. మరల మరొక దేహంతో పుట్టువాడను" ...అను రూపంలో ఉండే పునర్జన్మ యొక్క భ్రమ ఉండదు.

❖

**కుంభమహర్షి :** చూచారా శిఖిధ్వజా! బ్రహ్మదేవుడు మొదలైన మహాత్ములంతా 'జ్ఞానమే పరమ శ్రేయోదాయకము' అని నిర్ద్వంద్వంగా ఎలుగెత్తి ప్రకటిస్తున్నారు కదా! మీరు అజ్ఞానివలె ఇక్కడ ఏవేవో క్రియా వ్యవహారములు కల్పించుకొని కాలక్షేపం చేస్తున్నారేమిటి? "ఇది నా దండము. అది నా కమండలం. ఇవి నా రుద్రాక్షలు. ఇది నా ఆసనం" ఇటువంటి తపోరూపాలైన అనర్థ విలాసాలతో క్రీడిస్తూ రోజులకు రోజులు గడిపివేస్తున్నారే?

**కోఽహం? కథమిదం జాతం? కథం శామ్యతి? చేతి భోః,**
**రాజన్! ఆవేక్షసే కస్మాత్? కిమజ్ఞ ఇవ తిష్ఠసి?**
**"కథం బంధః? కథం మోక్షః?" ఇతి ప్రశ్నాన్ ఉదాహరన్**
**పారావారవిదాన్ పాదాన్ కస్మాత్, రాజన్! న సేవసే?**

నేనెవరు?... ఈ ప్రపంచం ఎట్లా ఉత్పన్నమై ఉంటోంది?... ఇది ఏ ప్రకారంగా శమిస్తుంది? ...ఇటువంటి విషయాలను విచారణ చేయకుండా అజ్ఞానివలె ఏవేవో క్రియా వ్యవహారములకు పరిమితులై సంవత్సరాలు జరిగి పోతుంటే చూస్తూ ఊరుకొని ఉంటున్నారేం?

అసలీ బంధం అనేది ఎట్లా కలుగుతోంది? మోక్షం ఏ సమాచారం వల్ల సంపాదించుకోవచ్చు? ...ఇటువంటి ప్రశ్నలను అఖండ వాక్యార్థాలను వదలి ఊరకే క్రియలు నిర్వహించి ఊరుకుంటే లాభ మేముంటుంది?... అఖండ వాక్యార్థం అయినట్టి ఆత్మపదాన్ని ఎఱిగిన మహనీయులెందరో ఈ భూమిపై ఉన్నారు కదా! వారి పాదాలను ఆశ్రయించి, శరణువేడి వారి దగ్గర ఆత్మజ్ఞానం సంపాదించుకోకుండా ఇక్కడ కూర్చుని రోజులు వృథా చేసుకుంటున్నారేమిటి? ఈ తపోకార్యమంతా బహిర్ముఖ వృత్తి రూపమని, శ్రమాదులచే దుఃఖప్రదమని ఇంకా మీరు గమనించనే లేదా? కొండ రాయిపై పురుగు సంచరిస్తున్నట్లు మీరు అమూల్యమైన జీవితాన్ని ఇక్కడ కూర్చుని నశింపజేసు కుంటున్నారే?

అందుచేత సమదృష్టి గల సాధువులకై వెతకి వారిని సమీపించండి. వారిని సేవించి, సంతోషింప జేసి అప్పుడు మీరు చక్కగా ప్రశ్నించి సమాచారం సంపాదించుకోవాలి. వారి సాంగత్యం చేతనే జ్ఞానం, యుక్తి (ఉపాయం) లభిస్తున్నాయి. అద్దానిచే జీవుడు ముక్తిని సంపాదించుకుంటున్నాడు. ఆ సాధువులు తమ అనుభవాల సారాన్ని ప్రసాదిస్తూ అండగా వారి లాగానే అభ్యాస – వివేకాల ద్వారా క్లేశదాయకాలగు ఈ బహిర్ముఖ వృత్తులను నిరోధించి అంతర్ముఖుడవు కావాలి. ఆహారం కొరకై నేలపై అటూ–ఇటూ సంచరించే కీటకమునకు త్వరితంగా ఆహారం లభించినట్లు మీరు కోరుకున్న జ్ఞానం అప్పుడు లభిస్తుంది. కొండరాయిపై ఉన్న కీటకంలాగా ఇక్కడ ఒంటరిగా ఎన్ని సంవత్సరాలుంటే ఏమి లాభం?

**శిఖిధ్వజుడు :** (నీళ్ళు నిండిన కళ్ళతో) ఓ కుంభమహర్షీ! ఇంతకాలానికి నేను ఈ రోజు తమ వాక్యాలచే బోధితుడనగుచున్నాను. ఆహా! నా అజ్ఞానంచే జ్ఞాన పురుషుల సాంగత్యం వదలి ఈ మహారణ్యంలో ఏకాంతవాసినై ఆయుష్షు అను అవకాశాన్ని వృథా చేసుకుంటున్నానని గ్రహిస్తున్నాను. అమ్మయ్య! నా పాపమంతా ఇప్పటికి శమించినదని నా కనిపిస్తోంది. ఎందుకంటే బ్రహ్మాలోక నివాసులు, సాక్షాత్తు నారదమహర్షి పుత్రులగు మీ వంటి మహాత్ములు నా దగ్గిరకు దయచేసి నాకు జ్ఞానామృతం ప్రసాదిస్తూ పునీతుణ్ణి చేస్తున్నారు.

హే దేవపుత్రా! మీరే నా గురువులు. మీరే నా తండ్రి, మిత్రులు కూడా! నేను తమ శిష్యుణ్ణి. మహానుభావా! తమ పాదపద్మాలకు సాష్టాంగదండ ప్రణామాలు సమర్పిస్తున్న నాపై దయ చూపండి.

ఎద్దానినైతే మీరు సర్వము కంటే శ్రేష్ఠమని అనుకుంటున్నారో, ఏది ఎరిగిన తరువాత ఇక నాకు శోక–మోహాలు ఉండవో, దేనిచే నేను సుఖస్వరూపుడనై విశ్రాంతి పొందగలుగుతానో... అట్టి బ్రహ్మం యొక్క ఉపదేశాన్ని నాకు శీఘ్రంగా ప్రసాదించమని వేడుకొనుచున్నాను. 'జ్ఞానం' ప్రసాదించే చర్చ – పాఠ్యాంశాలలో మట్టి–కుండ, దూది–వస్త్రం మొదలైన దృష్టాంతాలు, వెలుగు – వెలిగించబడునది, జీవాత్మ – పరమాత్మల సమన్వయం మొదలైన అనేక మార్గాలు ఉన్నాయి. వాటన్నిటిలో ఏది ఉత్తమ మార్గమని మీరనుకుంటే ఆ మార్గంలో నాకు బోధించండి. సంసార దుఃఖాలను ధరింపజేయునట్టి, దాని నుండి ఉద్ధరింపజేసే జ్ఞాన విభాగాలను నాకు బోధించమని సవినయుడనై అర్థిస్తున్నాను.

**కుంభమహర్షి :** ఓ రాజర్షీ ! నా వాక్యాలపై మీకు శ్రద్ధ ఉంటే మంచిదే. మీ ప్రశ్నలన్నిటికి నాకు తెలిసినంత వరకు సమాధానాలు చెప్పటానికి సంతోషంగా సిద్ధంగా ఉన్నాను. అయితే శ్రద్ధ లేక పోతే మాత్రం కొండరాయికి ఎదురుగా కాకి కావు కావు మన్నట్లు నా వాక్యములు వ్యర్థములవుతాయి. కాబట్టి జ్ఞానోపదేశం చేయకపోవటమే ఉచితమవుతుంది. ఏదో వినోదం కోసమో, కాలక్షేపం కోసమో, "ఇది కాదు – అది కాదు" అని కేవలం సిద్ధాంత తిరస్కారోద్దేశం తోనో, (లేక) "కొంత విని, తరువాత చూసుకుందా లేఁ!" ఇటువంటి అర్ధ ఆశయాలతోనో సంభాషించాలనుకునే వారికి వక్త యొక్క వాక్కు, ఉద్దేశం అనర్థమై... బయల్వెడలి నిష్ప్రయోజనమౌతాయి. చీకటిగా ఉన్నచోట నేత్రమునకున్న చూచేశక్తి ఎందుకు పనికివస్తుంది? "చూడకూడదు లేఁ!"... అనుకునే వాడి ముందు కాంతి ప్రసరింపజేసి ఏం ప్రయోజనం?"

**శిఖిధ్వజుడు :** మహాత్మా! మీరు చెప్పే బోధ విషయాలను, మీరు ఎన్నుకునే బోధమార్గాలను వేద వచనాల వలె – ఏ పూర్వాపర చర్చలు ఇప్పటికి లేకుండా – యథాతథంగా స్వీకరించటానికి నేను సిద్ధంగా ఉన్నాను.

**కుంభమహర్షి :** తండ్రి చెప్పినది పిల్లవాడు "ఎందుకూ?'. అని ప్రశ్నించకుండా గ్రహిస్తాడు చూచారా? అట్లాగే మీరు కూడా కొంత సమయం వాక్యాల అర్థం శ్రద్ధగా గ్రహించండి. "అంతా విన్న తరువాత ఇది నాకు శ్రేయస్సును కలుగజేస్తుంది" అని ఇప్పటికి భావించండి. హేతువును త్యజించి చెవులకు

ఇంపుగా ఉండే పాటలాగా నా వాక్యాలకు వినండి. మన ఈ సంభాషణలో మీ చరిత్రనే దృష్టంగా చేసి చెప్పుతాను. మనం చెప్పకోబోయే ఆయా కథా విశేషాలు, చర్చనీయాంశాలు, బోధనా విధానాలు మంద మతులకు కూడా బోధజనకాలై ఉండగలుగు గాక! ఇక బుద్ధిమంతుల గురించి వేరే చెప్పేదేమున్నది? మన ఈ సంభాషణా సారాంశం సంసారభయం నుండి ఎవరినైనా దాటించ గలదుగాక! ఇక మనం బోధనా విషయంలో ప్రవేశిస్తున్నాం, జాగరూకుడవై, అప్రమత్తుడవై విను!

❖❖❖

## 23. మణి సాధకుడు - గాజుమణి

**కుంభమహర్షి :** ఓ శిఖిధ్వజ మహారాజా! ఒక కథా ప్రసంగంతో మన ఈ బోధ ప్రారంభిద్దాం–

ఒక ఊళ్ళో నాకు ఒక గొప్ప ధనికుడున్నాడు. ఆతని ఇల్లు ఇటు సంపదతోనూ, అటు ఉదార గుణములతోనూ ప్రసిద్ధమై ఉన్నది. అనేక కళలందు ఆతడు నేర్పరి. అస్త్ర విద్యయందు కూడా నిపుణుడు. వ్యవహారదక్షత కలవాడు. అన్నీ బాగున్నాయి కానీ, 'పరమాత్మపదము' గురించి ఆతను తగినంతగా పట్టించుకోలేదు. ఆలోచించనూ లేదు.

ఒకసారి ఆతనికి 'ప్రపంచంలో అన్నిటికన్నా మహత్తరమైన వస్తువేదైనా సంపాదించాలి' అని అనుకున్నాడు. 'అటువంటి వస్తువు ఏదై ఉన్నది?' అని అనేక మందిని సంప్రదించాడు. ఎవ్వరో సర్వపదార్థ స్వభావాలనూ ఎరిగిన పండితులు, "అటువంటి వస్తువు ఒకటి ఉన్నది. దాని పేరు చింతామణి. అది ఎవరి దగ్గర ఉంటే వారు ఎప్పుడు ఏది కోరుకుంటే అది తక్షణం లభించగలదు. అయితే దానిని సంపాదించటం అంత సులువైన విషయం కాదు. అనేక జన్మల సుకృతఫల భాగ్యంగా అది లభించవలసిందే. కొందరికి అది ఈ జన్మంతా ప్రయత్నించినా లభించదు. కానీ, ఈ జన్మలో చేసిన ప్రయత్నం చేత వచ్చే జన్మలో, లేక రేండు, మూడు జన్మల తరువాతో కొద్ది ప్రయత్నానికే లభిస్తుంది. ఇక మరికొందరికి కొన్ని జన్మలుగా చేసిన ప్రయత్నం చేత ఈ జన్మలో త్వరగా లభిస్తుంది" ... అని శాస్త్రనిక్షిప్తమైన వివరణ ఇచ్చారు.

ఇక ఆ ధనికుడు ఎట్లాగైనా సరే ఆ చింతామణిని సంపాదించి ప్రపంచంలోని కోటీశ్వరు లందరిలోకి ప్రప్రథముణ్ణవాలని నిర్ణయించుకున్నాడు. శాస్త్రజ్ఞులు శాస్త్రాల నుండి చదివి విశదీకరించిన మార్గాలలో చింతామణి కొరకై ధ్యానం–పూజ–నిష్ఠ – మంత్రోచ్చారణ ఉపవాసాదులు ప్రారంభించాడు. సుదీర్ఘకాలం (అనగా, కొన్ని సంవత్సరాలు) ప్రయత్నం కొనసాగించటానికి కావలసిన పదార్థ పరిసరాలన్నీ ఒనగూర్చుకుని ఇక అత్యంత పట్టుదలతో 'చింతామణి' యొక్క ఆరాధన ప్రతి రోజూ అనేక గంటలు నిర్వర్తిస్తూ ఉండేవాడు.

ఇరవై రోజులు గడిచాయి. ఇరవ ఒక్కటవ రోజున మధ్యాహ్నధ్యానం 'పూజ' నిర్వర్తిస్తూండగా దేదీప్యమానమై, కాంతిపుంజములను నాలుగు దిక్కులకూ వెదజల్లుతూ, ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తూ, చూపరుల హృదయంలో ఉత్సాహ ఐశ్వర్యాన్ని నింపివేస్తూ చింతామణి ప్రత్యక్షమైంది.

ఆ ధనికుడు మూసిన తన కళ్ళపైబడ్డ కాంతి పుంజాలకు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. తనకు చేయి చాపితే అందేంత దూరంలో గాలిలో నిరాలంబంగా ప్రకాశిస్తూ ఆ చింతామణి కనిపించింది. ఇక చేతులతో దానిని పట్టుకొని సొంతం చేసుకోవటమే తరువాయి. మన ధనికుడు పరమానంద పడిపోయాడు. మంత్రోచ్చారణ ఆపి ఆ చింతామణిని చూచి ఇక దానిని సొంతం చేసుకోవాలని కూర్చున్న చోటి నుండి లేచాడు.

**శిఖిధ్వజుడు :** ఓ దేవర్షీ! ఆతనికి అంత సులభంగా చింతామణి లభించిందా?

**కుంభమహర్షి :** ఇందులో ఆశ్చర్యమేమున్నది? ప్రయత్నాన్ని బట్టే కదా, ప్రయోజనం!

**తస్య యత్నేన మహతా కాలేన అధ్యవసాయినః**
**సిద్ధశ్చిన్తామణి కిం వాన సిద్ధతి ఉద్యతాత్మనామ్?**

ప్రయత్నశీలుడై ఉండటం చేత ఆతని ఏకాగ్రత – పట్టుదలల ఫలితంగా ఇరవై ఒక్క రోజులలోనే చింతామణి లభించింది. ఒక్క చింతామణి ఏమిటయ్యా? ఈ మానవుడు ప్రయత్నశీలుడు కావాలే గాని, సాధింపలేని దంటూ ఏది ఉంటుంది?

**ప్రవృత్తిమ్ ఉద్యమం ప్రజ్ఞాం ప్రయుంక్తే ఖేద-ఖేదవాన్**
**అకించనోఽపి శక్తత్వం సమవాప్నోతి అవిఘ్నతః॥**

ఎవ్వడైతే ప్రజ్ఞ (తెలివితేటలు) ఆశ్రయించి ఖేదరహితుడై ప్రయత్నంనందు ప్రవృత్తుడై ఉంటాడో... అట్టివాడు కొంచెం శక్తితోనే నిర్విఘ్నంగా అనుకున్నది సాధించి తీరుతాడు. త్వరగా కూడా సాధిస్తాడు.

సరే! ఆ ధనికుడు గాలిలో వ్రేలాడుచు ప్రశాంతకాంతి వీచికలు వెదజల్లుచున్న ఆ మణికి ఇంకొంచెం దగ్గిరగా అడుగులు వేసి, ఆ మణిని చూస్తూనే ఒక్కసారి ఆగిపోయాడు. అతని మనస్సులో ఒక సంశయం మొలకెత్తి మహావృక్షంగా రూపం పొందసాగింది. ఏదైనా శీఘ్రంగా లభిస్తుంటే 'ఇందులో ఏదో తిరకాసు ఉన్నది' అనే అనుమానం కలగటం జనులలో పరిపాటియే కదా!

అంతవరకూ అతనిలో ఏర్పడిన ఆశ్చర్య-ఆనందాల మధ్యగా విషాదంతో కూడిన అనుమానం చోటు చేసుకున్నది.

❖

**ఆ ధనికుడు :** ఏమిటి? ఇది చింతామణే? దీని రూపం, తేజస్సు చూస్తుంటే మంత్రశాస్త్రంలో చెప్పిన చింతామణికి సరిపోతోంది. కానీ...! నా బొంద! సంవత్సరాల తరబడి ప్రయత్నిస్తే కూడా చింతామణి లభించటం కష్టసాధ్యమని పండితులు అనగా విన్నానే! ఇరవై రోజులలో చింతామణి ప్రత్యక్షం కావటమా? అదీ... నాకు? లాభం లేదు. ఇది కనుక చింతామణి అయితే నాకు ఇంత త్వరగా ప్రత్యక్షం అయ్యేదే కాదు. కచ్చితంగా ఇది చింతామణి కాదు. పోనీ దీనిని తాకి చూద్దామా? తాకగానే ఇది మాయమైపోతుంది కదా! మంత్రశాస్త్రంలో కొన్ని మాయా చింతామణులు (చింతామణి కాకపోయినా చింతామణివలె కనిపించేవి) ఉంటాయని చెప్పారు కదా! ఇంత స్వల్ప ప్రయత్నంతో చింతామణి లభించటమనేది కల్ల. జీవితాంతంగా చేసే మహా ప్రయత్నం చేత మాత్రమే అది లభిస్తుందని ఎందరో అనగా విన్నాను కదా!

ఆ! ఇప్పుడు తెలిసిపోయింది. నేను లోభిని. నా లోభకారణం భ్రాంతి చేత నా సంకుచితమైన కళ్ళకు ఈ కల్పితమైన రత్నం కనబడుతోంది. ఇది మణియే కాదు. ఇదేదో నా ఊహామాత్రమే. సర్వ సిద్ధులు ప్రసాదించగలిగే మణి అనే భాగ్యం అంత తేలికగా అబ్బేది కాదు. అల్పకాలంలో కూడా చింతామణి వంటి గొప్ప ఐశ్వర్యం పొందగలిగేవారు ఎక్కడో కొందరు ఉంటారు. వాళ్ళంతా గొప్ప తపశ్శక్తి గల మహాభాగ్యశీలురు. నాలాంటి ఒక సామాన్యమైన మానవునికి అది ఇంత స్వల్పకాలంలో ఇంత తేలికగా లభించే ప్రసక్తే లేదు. పది రోజులు ప్రయాణిస్తే గాని కనబడని కాశీ పది నిమిషాలు నడిచేసరికి కనబడిందంటే అది కాశీ కాదు. ప్రక్క ఊరు మాత్రమే.

ఇట్లా ఆలోచిస్తూ ఆ ధనికుడు కళ్ళు మూసుకుని తిరిగి రెండడుగులు వెనక్కి వేసి యథాస్థానంలో కూర్చుని రుద్రాక్షమాలతో చింతామణి గురించి జపం కొనసాగించాడు.

**న యదా యేన లబ్ధవ్యం న తత్ప్రాప్నోత్యసౌ తదా**
**చిన్తామణిరవాప్తోఽపి దుర్ధియా హేలయోజ్ఝితః**

ఎప్పుడు ఎవరికి ఏది లభ్యం కాతగి ఉండదో, అప్పుడాతడు అది పొందడని ఇందుకే అంటారు కాబోలు. ఆతడు చింతామణిని పొందాడు. కాని తన అల్పబుద్ధిచే నిరాదరించాడు. చాలాసేపు వేచి ఉండి ఆ చింతామణి, సాధకుడు స్వీకరించక పోవటం చేత ఎటో వెళ్ళిపోయింది. ఎందుచేతనంటే ఎవరు సిద్ధులను ఆదరించకుండా ఉంటారో వారిని ఆ సిద్ధులు విడచి వెళ్ళిపోతాయని మంత్రశాస్త్ర సిద్ధాంతం. సిద్ధులు వస్తున్నప్పుడు అవి ఆ సాధకుని విచక్షణకు పటుత్వం కలుగజేస్తాయి. అవి విడచి వెళ్ళుచున్నప్పుడు ఆత్మజ్ఞానరహితులగు సాధకుల విచక్షణా జ్ఞానాన్ని కూడా తమ వెంట లాక్కుపోతాయి.

ఆ ధనికుడు చింతామణి యొక్క సిద్ధికై మరల తన ప్రయత్నం కొనసాగించాడు. మరికొంతకాలం గడచింది. ఒకరోజు పరిహాసకులు, వంచకులు అగు కొందరు ఆకాశ సిద్ధులు ఒక గాజుతో నిర్మిత మైన మణి ఆకారాన్ని ఆతని ఎదురుగా గాలిలో వ్రేలాడగట్టారు. మన ధనికుడు కళ్ళు తెరచి ఆ గాజు వస్తువును చూచి, 'అమ్మయ్య! ఇదీ, చింతామణి' అని తలచి పరుగున పోయి దానిని చేతి లోకి తీసుకున్నాడు. మహదానందపడ్డాడు. దానిని భద్రంగా దాచుకుని ఇక అక్కడి నుండి బయలుదేరి ఇంటికి వచ్చాడు. అజ్ఞానంచే మోహితుడైనవాడు త్రాడును చూచి పామనుకోవటం, స్థలాన్ని చూచి జలం అనుకోవటం, ఒక చంద్రుని చూచి రెండు చంద్రులనుకోవటం, అమృతం చూచి మృతమను కోవటం, మృతమును చూచి అమృతమనుకోవటం మామూలే కదా!

ఆతడు ఇంటికి చేరిన తరువాత ఆ మణిని ఎవరికీ కనబడకుండా దాచుకున్నాడు. 'చింతామణి లభించిన తరువాత సమస్తం ప్రాప్తించినట్లే కదా! ఇక నేను ఎక్కడికైనా దూరప్రాంతం వెళ్ళి అక్కడ గొప్ప భవనాలను, సేవకులను, సుఖమయమగు వస్తువులను సృష్టించుకొని ఆనందంగా ఉంటాను'... అని తలచాడు. ఆతనికి ఆతని ఇల్లు, అందులో ఆయా వస్తువులు చాల అల్పమైనవిగా కనిపించాయి. వాటినన్నిటిన వాళ్ళకి వీళ్లకీ ఇచ్చివేశాడు. 'ఈ దేశంలో ఏం సుఖమున్నది? ఇదంతా పాపులచే ఆవరించబడింది. ఈ పాత ఇంటితో నాకేంపని? మా బంధువులలో నన్ను చూచి ఏడ్చేవాళ్ళే గాని

ఒక్కడు మంచివాడు లేడు. దూరప్రాంతానికి పోయి సంపదలు కలవాడినై ఇష్టమున్నన్ని సంవత్సరాలు హాయిగా ఉంటాను'... అని అనుకున్నాడు. ఉన్న ఊరును, బంధువులను, ఇంటిని వదిలేసి ఒక్క చింతామణిని మాత్రం తీసుకుని ఇక బయలుదేరాడు. సుదూర ప్రాంతంలోని ఒక అడవిలో ఒక చెట్టు క్రింద కూర్చుని ఇక ఆ గాజుమణిని బయటకు తీశాడు. ఎదురుగా పెట్టి "ఓ చింతామణిగారూ! ఇక్కడ నాకొక నగరం కావాలి. ఆ నగరంలో నాకు సర్వసేవలు చేయటానికి అందమైన స్త్రీలు, విహరించటానికి ఉద్యానవనాలూ, తినటానికి ప్రపంచంలో మరెక్కడా దొరకని మధురపదార్థాలూ ఉండాలి. మా అంతఃపురపు గోడలు ఖరీదైన నవరత్నాలచే పొదగబడి ఉండాలి..." ఇట్లా కళ్ళు మూసుకొని వర్ణిస్తూ పోతున్నాడు. "ఆహా! ఇప్పుడు నేను గొప్ప సింహాసనంపై అధిష్ఠించి ఉంటాను. ప్రపంచంలో మరెక్కడా లేని అతి సౌందర్యవతులగు స్త్రీలు నాకు వింజామరలు వీస్తూ ఉంటారు. ఇక కళ్ళు తెరుస్తాను" ...అని నెమ్మదిగా కళ్ళుతెరిచాడు. కానీ ఏం లాభం! తాను ఆ అడవిలో చెట్టు క్రిందనే ఉన్నాడు. శరీరంపై అందమైన వస్త్రాలు, ఆభరణాలు ఉన్నాయేమోనని చూచుకున్నాడు. ఏమీ లేదు. చిరిగిన బట్టలు, ఆకలి, దాహం, ఎదురుగా గాజుమణి, అడవి – ఇవన్నీ యథాతథంగానే ఉన్నాయి. "ఏమిటిరా ఇదీ?" అని అనుకుంటూ ఉండగా ...ఇంతలో నరమాంసం మరిగి అత్యంత ఆకలితో ఉన్న ఒక పులి తనకు అతి దగ్గరగా గాండ్రించటం మాత్రం వినిపించింది.

❖

ఓ శిఖిధ్వజా! ఈ మనుజుడు మూర్ఖత్వం కారణంగా తెచ్చిపెట్టుకునే ఆపదలు, దుఃఖాలు వార్ధక్య – మరణాల వలన కూడా రావు. మానవుని నెత్తిమీద నల్లటి జుట్టు ఉన్నట్లు ప్రపంచంలోని ఆపదలన్నీ మూర్ఖుని నెత్తిమీదే నృత్యం చేస్తూ ఉంటాయి.

❖❖❖

# 24. తప్పించుకుని కూడా మరల చిక్కిన ఏనుగు

**కుంభమహర్షి :** ఇప్పుడు నీకు ధనికుని వృత్తాంతం చెప్పాను కదా! ఇటువంటిదే ఇంకొక వృత్తాంతం చెబుతాను. ఇది ఒక ఏనుగు యొక్క కథ.

కొంతకాలం క్రితం వింధ్యపర్వత ప్రాంతపు అడవులలో ఒక గొప్ప ఏనుగు సంచరిస్తూండేది. దాని రెండు పొడవైన దంతాలు తెల్లగా ప్రకాశిస్తూ చాలా బలంగా ఉండేది. అది తలచుకుంటే మహా వృక్షాలను సైతం కూకటివ్రేళ్ళతో సహా తన దంతములతో పెకలించి వేయగలదు. అది యథేచ్ఛగా అక్కడి అడవులలో సంచరిస్తూ సుఖంగా కాలం గడుపుతోంది.

కొందరు జీవులు 'అన్ని రోజులు మనవే' అనుకుంటూ రోజులు గడుపుతూ గర్విస్తూ, హూంకరిస్తూ ఉంటారు. ఈ లోగా ఏవేవో కష్టాలు వచ్చిపడుతూ ఉంటాయి. అట్లాగే... ఆ ఏనుగుకు కూడా ఒకసారి ఒక కష్టం వచ్చి పడింది.

ఒక మావటి వాడు అందమైన, పెద్దకాయం గల ఆ ఏనుగును ఎట్లాగైనా సరే బంధించి రాజుగారికి బహుమతిగా ఇచ్చి డబ్బును, హోదాను సంపాదించుకోవాలని యోచించాడు. కొద్దిరోజులు

ఆ ఏనుగు సంచరించే అడవులలోని ఆనుపానులన్నీ కనిపెట్టాడు. రకరకాల ఉపాయాలతో, ఎట్లాగైతేనేం, ఆ ఏనుగును ఒక పెద్ద వృక్షం క్రింద గొలుసులతో బంధించాడు. ఇక ఆ ఏనుగును రాజ్యానికి తోలుకు పోవటానికి కావలసిన అంకుశం, మోకు త్రాళ్ళు తేవటానికి గూడెం వెళ్ళాడు.

రెండురోజులు గడచిపోయాయి. మూడవరోజు మావటివాడు పరికరాలన్నీ మూట కట్టుకుని ఏనుగును బంధించిన ప్రదేశం చేరేసరికి చాలా చీకటి పడింది. తెల్లవారి ఏనుగును రాజనగరానికి తీసుకుపోవచ్చునని యోచించి ఆ రాత్రి ఆ మహావృక్షం మీద వసతి చేసుకుని నడుంవాల్చాడు. బాగా కునుకు పట్టింది.

ఇక ఆ ఏనుగు మూడురోజులుగా గొలుసులతో బంధించబడి ఉండటం చేత చాలా వ్యధ చెందింది. దానిలో కసి పెరిగింది. తన ఓపికనంతా కూడదీసుకుని గొలుసులను త్రెంచటానికి ప్రయత్నించసాగింది. మావటివాడికి నిద్రపట్టడం చేత ఇది గమనించటం లేదు. ఒక్కొక్క గొలుసే తెగిపోవటం ప్రారంభమైనది. సరిగ్గా తెలతెల్లవారుతుండగా చివరిగొలుసు కూడా పుటుక్కున తెగిపోయింది. అదే క్షణంలో మరొక చమత్కారమైన సంఘటన జరిగింది.

మహావృక్షముపై నిదురిస్తున్న మావటివాడు నిద్రమత్తులో ఉండి ఒళ్ళు తెలియని స్థితిలో డుబుక్కున ఏనుగు మీదకు ... ఏనుగు మీదనుంచి నేలమీదకు పడ్డాడు. ఆతడు ఏనుగు పాదాల దగ్గర పడటం జరిగింది. తను మూడు రోజులుగా పడిన బాధంతా గుర్తుకు వచ్చి ఆ ఏనుగు కోపంగా పాదం ఎత్తింది. పాదం కనుక మావటి వాని పొట్టమీద ఉంచి నలిపితే ఆ మావటివాడు బొమికలు కూడా మిగలకుండా నుజ్జునుజ్జు అయ్యేవాడే! కానీ తన పాదం మావటి వాని పొట్టను తాకుచుండగా ఆ ఏనుగుకు మావటివానిపై ఏదో జాలి కలిగింది.

**ఏనుగు (తనలో) :** నా కాళ్ళ దగ్గిర పడిన ఈ మావటి వానిని ఒక్క క్షణంలో మాంసపు ముద్దగా మార్చి వేయగలను. నన్ను మూడు రోజులు బాధించిన ఈతడు అంతటి శిక్షకు అర్హుడే. వీడికి నేను ఏ హానీ చేయకపోయినా నన్ను గొలుసులతో కట్టి పడేసి ఉంచాడు. ఏమైతేనేం? నిద్రమత్తులో నా కాళ్ళ దగ్గిర పడిన వీడిని చంపటం ఏం ఉచితం? ఇక దుర్మార్గుడగు వీడికీ నాకూ తేడా ఏమున్నది? వీడు మనిషి అయి కూడా అజ్ఞానిగా ఉన్నాడు. మూడు రోజులు నన్ను ఈ మహావృక్షానికి గొలుసులతో కట్టి ఉంచాడు, జంతువునైనప్పటికీ నాకు కూడా ఆకలి-దప్పికలు ఉంటాయని, ఆహార-పానీయాలు లేకపోతే కష్టపడతాననీ వాడు గుర్తించనేలేదు. నేను జంతువునే కావచ్చు. వీడి కన్నా ఉత్తమజ్ఞానం కలిగి ఉండటమే గొప్ప. అప్పుడు లోకం నన్ను మెచ్చుకుంటుంది. లేదంటే లోకం నన్ను కూడా నీచునిగా జమ కట్టుతుంది. వీడు చస్తే, అమాయకులగు వీడి భార్య - పిల్లలు పోషించే వారు లేక యాతనలు పొందుతారు కదా! పోనీలే. వీడి కర్మానికి వీడిని వదిలేద్దాంలే.

**తం పురః పతితం దృష్ట్వా మత్తేభః కరుణాం యయౌ ।**
**స్ఫురత్స్ఫారగుణాః సన్తః సన్తి తిర్యగ్గతావపి ॥**

ఒక ఏనుగు తనను కష్టాలు పాలు చేసినప్పటికీ, తోటి జీవియగు ఆ మావటి వాని పట్ల

ఎంతటి కరుణ ప్రకటించిందో! విశాలమైన గుణములు, దృక్పథములు గల మహాత్ములు జంతు దేహములలో కూడా ఉన్నారు.

ఆ విధంగా ఏనుగు మావటి వాని పొట్టపై నుండి తన పాదాన్ని ఉపసంహరించింది. వడి వడిగా యథేచ్ఛగా అడవులలో ప్రవేశించింది.

❖

ఆ ఏనుగు అట్లా వెళ్ళగానే మావటివాడు నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. క్రింద పడిన పాటుకు దిమ్మరిల్లిన అతని శరీరము, బుద్ధి కొద్దిసేపట్లో స్వస్థత పొందాయి. నెమ్మదిగా మామూలు మనిషి అయ్యాడు. నిందిత కార్యములు ఆచరించే వారికి బలం త్వరగా వృద్ధి చెందుతుందని అంటారు, ఇదే కాబోలు! ఇక ఆతడు ఇట్లా అనుకున్నాడు.

"ఆరి నాయనోయ్! కొద్దిగా ఏనుగు కాలేసి ఉంటే చచ్చేవాడిని! ఎందుకో నన్ను చంపలేదు. ఏం ఏనుగురా ఇది? దీనికి పోయే కాలంరాను! గొలుసులనే త్రెంచుకున్నదే! దొరికినట్లే దొరికి తప్పించుకున్నది. దీని మోహాన ఇంత పెట్టుబడి పెట్టి ఈ చాంతాళ్ళు పరికరాలు తెచ్చి సొమ్మంతా నాశనం చేసుకున్నాను. తీరా చూస్తే ఈ ఛండాలపు ఏనుగు తప్పించుకున్నది. సరే! దీనిని నేను వదలుతానా? దీని అంతు చూడాల్సిందే! ఇంతకీ ఇది ఉండేదెక్కడో గమనించి ఇంకేదైనా ఉపాయంతో దీనిని పట్టుకుని తీరాలి! దీనిని బంధించిన తరువాతే ఇంటికి పోయేది!"

...ఆ దుష్టుడు ప్రాణం దక్కింది కదా అని కొంచం కూడా అనుకోవటం లేదు. పైగా ఆ ఏనుగును అపశబ్దములతో దూషిస్తూ ఇక బయలుదేరాడు. దుష్టులు సాత్వికుల క్షమాగుణం చూచి కసిని పెంచుకుంటారే తప్ప, మంచిని మంచిగా గుర్తించలేరు కాబోలు!

ఆ మావటి వాడు కొద్ది రోజులకు ఏనుగు విశ్రమించే చోటు కనిపెట్టేశాడు. ఆ ఏనుగుకు కనబడకుండా లతల వెనుక దాక్కుంటూ, ఇక ఆ ఏనుగు నడిచే బాటలో తను తెచ్చుకున్న పలుగు, పాఱలతో ఒక పెద్ద కందకం త్రవ్వాడు. ఆ కందకం పైకి కన్పించకుండా పూలతీగలతో కప్పి పలచగా మట్టి కప్పాడు.

మరునాడు ఉదయం ఆ ఏనుగు లేచి అడుగులు వేస్తూ ఆ కందకంలోకి పడిపోయింది. ఇక ఆ కందకంలోనే నిస్సహాయంగా అటూ ఇటూ తిరగసాగింది. మావటివాడు "దీని శిఖతరగా! దొరికిందిరా!" అని అనుకుంటూ ఆ ఏనుగును మరల గొలుసులతో బంధించాడు.

ఆ ఏనుగు ఇప్పటికీ ఆ కందకంలోనే చిక్కి ఉన్నది.

చూచావా శిఖిధ్వజా! మొదలే గనుక ఆ ఏనుగు మావటి వానిని చంపి ఉంటే ఇప్పుడీ దుర్దశ పట్టేదా? కాదు. కందకంలో చిక్కేది కాదు. గొలుసులచే బంధింపబడేది కాదు.

❖

ఆ వింధ్యాచలగజేంద్రునిలాగానే వర్తమాన క్రియలలో మూర్ఖత్వముతో తలమునకలై ఉంటున్న ఈ జీవుడు రాబోయే కాలంలో వచ్చే విషయాలను గమనించటమే లేదాయే! "గొలుసుల బంధాన్ని

త్రెంచుకున్నాను కదా! ఇంక నాకేం?" ...అని ఏనుగు అనుకున్నదే గాని, "ఈ మావటివాడు నన్ను వదలుతాడా? మరల బంధించటానికి యత్నిస్తాడేమో?" ...అనే అనుమానమే దానికి రాలేదు. దూరాలోచన లేకుండా మూర్ఖత్వం వహించి ఉండటం చేతనే ఆ ఏనుగుకు ఆ గతి పట్టింది కదా!

**మౌర్ఖ్యం హి బన్ధనమవేహి పరం, మహాత్మన్!**
**బద్ధో, న బద్ధ ఇతి చేతసి తద్విముక్త్యైః ॥**
**ఆత్మోదయం త్రిజగదాత్మమయం సమస్తం**
**మౌర్ఖ్యేస్థితస్య సహసా నను సర్వభూమిః ॥**

ఓ శిఖిధ్వజ మహారాజా! మూర్ఖత్వమే జీవునకు పరమబంధమని గ్రహించు. "నేను బద్ధుడను. ఇంక ఇంతే! ఇంతకుమించి ఏమీ ఎవరూ చేయగలిగింది లేదు" అను రూపం గల ఒకానొక పరమ మూర్ఖత్వాన్ని ఈతడు వహించి ఉంటున్నాడు. ఈతని స్వరూపం సర్వదా ఆత్మయే కదా! బంధం ఎక్కడి నుండి వస్తుంది? "నేను దేహ బద్ధుడను. మనో బద్ధుడను" అని మూర్ఖంగా ఇక ఎవరు ఎంత చెప్పినా వినకుండా, అనుకోవటమే బంధం. "నేను బద్ధుడను కాను. ఆత్మ స్వరూపుడనగు నేను దేనిచే ఎట్లు బంధింపబడతాను?" ...అని భావన చేయటమే ముక్తి. కాబట్టి రాజా! ఈ సర్వం ఆత్మచే నిండి ఉన్నదని, ఇక్కడి త్రివిధ (ఆధిభౌతిక – ఆధిదైవిక – ఆధ్యాత్మిక) బంధనాలతో కూడి సమస్త జగత్తు తదితర సమస్తమూ, ఆత్మయేనని గ్రహించు. ఆత్మ విషయాలన్నిటికీ అతీతమైనదై ఉండగా విషయాలు అద్దానిని ఎట్లా బంధిస్తాయి?

**శిఖిధ్వజుడు :** మరి దుఃఖమునకు కారణం?

**కుంభమహర్షి :** సర్వ బంధములకు, తత్ఫలితమైన దుఃఖములకు బీజక్షేత్రం మూర్ఖత్వము వహించి ఉండటమేనని గ్రహించవలసినదిగా నా మనవి.

**శిఖిధ్వజుడు :** మహర్షీ! ఇప్పుడు మీరు 'మణిసాధకుడు, వింధ్యాచల గజేంద్రుడు' అని రెండు కథలు చెప్పారు. వాటిని ఏదో తాత్పర్యాన్ని ఉద్దేశించి చెప్పి ఉంటారు. అది ఏమిటో వివరించి చెప్పండి.

**కుంభమహర్షి :** ఇప్పుడు నీ చిత్తఫలకంపై రెండు విచిత్రమైన కథా చిత్రాలు చిత్రించాను కదా! ఇప్పుడా రెండు రేఖాచిత్రముల వ్యాఖ్యానమేమిటో చెప్పుచున్నాను. సావధానంగా విను.

❖❖❖

## 25. ఒక బంధం నుండి మరొక బంధంలోకి

**కుంభమహర్షి :** ఇప్పుడు రత్నసాధకుని గురించి విచారిద్దాం. శాస్త్రములందు కుశలుడు, కానీ తత్త్వ జ్ఞానం ఎరుగని వాడు అగు ఆ రత్నసాధకుడు మరెవరో కాదు. నా ఉద్దేశంలో నీవే!

**శిఖిధ్వజుడు :** నేనా?

**కుంభమహర్షి :** అవును. అక్షరాలా నీవే. ఎందుకంటే నీవు శాస్త్రజ్ఞానంలో కుశలుడవే. కానీ, తత్త్వజ్ఞానంలో మాత్రం విశ్రమించలేదు.

ఇక "చింతామణి" అనగా స్వాభావికం, సర్వదుఃఖవినాశకం అయినట్టి "సర్వత్యాగం" అనునదే! ఆ సర్వత్యాగాన్ని నీవు ఈ అడవికి రాక ముందే శాస్త్ర ప్రవచనాలు విని సంపాదించావు. శుద్ధమగు సర్వత్యాగంతో సమస్తం లభిస్తుంది. సర్వత్యాగం ముందు చింతామణి ఎంతటిది? దాని ముందు బ్రహ్మదేవుని ఐశ్వర్యం కూడా దిగదుడుపే అవుతుంది. ఆత్మజ్ఞానోదయ కారకమగు సర్వత్యాగం నీకు సిద్ధించింది. అందుచేతనే స్త్రీ–ధన–బాంధవ్య సహితమగు సామ్రాజ్యాన్ని క్షణంలో వదలి ఇక్కడికి రాగలిగావు.

అయితే, అన్నింటినీ త్యజించి ఇక్కడికి వచ్చినా నీవు 'అహంకార, మమకారాలను మాత్రం హృదయం నుండి పారద్రోలలేదు. సంపూర్ణ త్యాగంచే నీకు జగత్తు పూర్ణానందమగు బ్రహ్మస్వరూపంగా అనుభవమయ్యేదే! అయితే, మమకారాన్ని ఇంకా కలిగి ఉండటం చేతనే నీవు ఇంకా త్యాగ–అత్యాగ రూపాలగు వికలంచే ఆవరించబడిఉన్నావు. ఈ కారణం చేత నీ యందు బ్రహ్మానందం ఇంకా భాసించుట లేదు.

సర్వత్యాగరూపమగు 'ఆత్మానందమణి' తప్ప వేరొక చింతామణితో పనిలేదు.

'బ్రహ్మానందము' అంటే ఏమిటి? సర్వమూ త్యజించివేయగా ఆ త్యాగరూపమగు మహోదయమే బ్రహ్మానందం. 'ఊహూ! బ్రహ్మానందం చాలా కాలం సాధన చేసిన తరువాత మరేదో అన్యంగా లభిస్తుంది. అంతేగాని ఇక్కడ అంత తేలికగా దొరికేది కాదు' అను అపోహతో ఉన్నావు గాని, "ఇప్పటికిప్పుడు ఇక్కడ అన్నీ త్యజిస్తే అప్పుడిక శేషించేదే బ్రహ్మానందము" అని గ్రహించుట లేదు. "ఎప్పుడో, ఎప్పటికో, ఎక్కడో, ఎన్నడో"... అనే స్వల్ప అభిప్రాయవీచిక నీలో క్రమంగా దృఢం కాగా నీవు సంపాదించుకున్న సర్వత్యాగబుద్ధి కాస్తా తిరోగతి పొందింది.

గొప్ప గాలి వీచి చెట్లు కదలుతుంటే పక్షులు నిశ్చలతను కోల్పోయి 'కావ్ కావ్ – కీచ్ కీచ్' అంటూ గాలిలోకి లేస్తాయి చూచావా? అనేక శాస్త్ర రహస్యాలు విజ్ఞుల ద్వారా విని కూడా నిశ్చిత అభిప్రాయం కలిగి ఉండకపోవటం చేత నీవు సమకూర్చుకున్న సర్వత్యాగ బుద్ధి కూడా నిశ్చలత్వం త్యజించి, వీథిన పడింది.

త్యాగి అయినవాడికి ఇక చింతలతో పనేముంది? చింతలతో పూర్ణుడైనవాడికి త్యాగం ఎలా సాధ్యపడుతుంది? గాలివేగంగా వీస్తూ ఉంటే, "ఓ వృక్షమా! కాస్త కదలకుండా నిశ్చలంగా ఉండు" అని కేక వేస్తే ఆ వృక్షం నిశ్చలంగా ఉంటుందా?

సంకల్పము అని దేనిని అంటామో అదియే చింత. చింతయే చిత్తము. అంతేగాని చిత్తము అనగా మరింకేదో కాదు. అట్టి చింతలు ఉండియే ఉండగా చిత్తము యొక్క త్యాగము ఎట్లా లభిస్తుంది చెప్పు?

ఈ "ముల్లోకాలు" అను జాలానికి ఆధారభూతం చిత్తమే. అది కొద్దిసేపు ఉన్నా... ఉన్నంతసేపూ చింతచే గ్రస్తమై ఉంటోంది. అట్టి చిత్తం ఉండి ఉండగా ఇక నీకు 'సర్వత్యాగఫలం' ఎక్కడి నుండి వస్తుంది? కాస్త చప్పుడైతే పావురాలు పైకి ఎగిరిపోతాయి చూచావా? నీ అంతఃకరణం సంకల్ప గ్రహణమును కొంచెం నిర్వర్తించగానే నీ 'సర్వత్యాగం' ఎటో ఎగిరిపోయింది.

నీవు చేసిన శాస్త్ర పఠనం, సాధనలు, ఆత్మశాస్త్రజ్ఞులు అందించిన సమాచారం, నీ భార్య చూడాలతో కూడి చేసిన తాత్త్విక సంభాషణలు, వివేకముతో స్వయంగా చేసిన పరిశీలన ఇవన్నీ ప్రసాదించిన ప్రయోజనంగా 'సర్వత్యాగం' అనే చింతామణి నిన్ను సమీపించింది. 'సర్వత్యాగమే పరమ మోక్షస్థానం' అని విని ఉండి కూడా నీవా సర్వత్యాగాన్ని స్వీకరించి ఉండవలసింది పోయి, "మోక్షమంటే ఈ మాత్రానికే వస్తుంది! గొప్ప తపోధనులకే రావటం లేదు. ఇక నేనెంత? అందుకని ఇంకా తపస్సు చేసి మోక్షానికి అర్హత సంపాదించుకుంటాను" ...అని భావించి సర్వత్యాగమణిని అనాదరించావు. సర్వత్యాగమణినీ సమీపం నుండి వెళ్ళిపోగానే 'సంకల్పాలు' అనే నీ కళ్ళకు 'తపస్సు' అనే గాజుమణి కనిపించింది. "ఆహా! ఇదండీ, అసలైన మార్గం" అని అనుకోసాగావు. బాలుడు నీళ్ళలో చంద్రుని చూచి, 'ఈ దాదికి బుద్ధిలేదు. చంద్రుడు నీళ్ళలో ఉన్నాడు. ఈ నీళ్లలో చేతులు పెడితే చేతులకు దొరకుతాడు. చంద్రుని పట్టి ఇవ్వమంటే ఆకాశం వైపు చూపించి ఆ చంద్రుని ఎవరూ చేతులతో పట్టుకోలేరయ్యా! ... అని అంటుందేమిటి? ఆమెకు ఏమీ తెలియదులే" ...అని అనుకున్నట్లు నీవు కూడా ప్రయత్నిస్తున్నావు. "త్యాగేనతు కైవల్యమ్" అని ఆత్మవేత్తలు నీకు చెప్పితే కూడా, త్యాగమంటే ఏమిటో బాగా విని కూడా "ఎక్కడో ఒంటరిగా తపస్సు చేసి అప్పుడు త్యాగం సంపాదిస్తాను" ...అని భావన చేయసాగావు. క్రమంగా దుఃఖహేతువైన ఏకాంత తపస్సుకై ఇక్కడికొచ్చి ఈ దండం, కమండలం, రుద్రాక్షలు, పర్ణశాలను పట్టుకు వ్రేలాడుచున్నావు.

ఓ శిఖిధ్వజా! నీవు తక్కువవాడివా? కాదు. స్వయంగా యుక్తాయుక్త – నిత్యానిత్య విచక్షణ కలవాడివి. మహారాజుగా ఉంటూనే అనునిత్యం ఉదయ – సాయం సంధ్యావిధుల రూపంలో ధ్యానాలను నిర్వర్తించే అభ్యాసపరుడవు. ఆత్మతత్త్వాన్ని పఠనాదులచే గ్రహించినవాడివి. ఆ తరువాత మీ దేశంలోని ఆత్మజ్ఞులను ఆహ్వానించావు. వారు ప్రవచించే ఆయా ఆత్మశాస్త్ర ప్రతిపాదిత విశేషాలను విన్నావు. ఈ దృశ్య విషయాల పట్ల అనాదరణను, వాసనారాహిత్యాన్ని చక్కగా ప్రారంభించావు.

అది మరికొంత వివేకంతో కొనసాగించి ఉంటే సర్వత్యాగఫలం లభించేదే! ఇంతలోనే "అబ్బే! ఇక్కడ కూర్చుంటే కాదు. తపస్సు చేస్తేగాని లాభం లేదు" ...అని క్లేశయుక్తమైన తపస్సు వైపుగా నీ ధ్యాస మళ్ళింది. ఈ ఏకాంతవనవాస తపస్సు వలన ఏం లభించింది? మొదట ఇల్లు, రాజ్యం మొదలైనవి వదలటం చేతను, మధ్యలో శీత–వాతాదులను సహించవలసిరావటం చేతను, చివరికి ఫలసంగం చేతా ఈ కార్యక్రమమంతా నీకు దుఃఖాన్నే కలుగజేయడమే ఇక్కడ జరిగింది.

**అమితానందముత్సృజ్య సుసాధ్యం యః ప్రవర్తతే ।**
**మితే వస్తుని దుఃసాధ్యే స్వాత్మహా శఠః స్మృతః ॥**

ఎవరైతే "ఆత్మానందదాయకము, తేలికైన సాధనము, అపరిమితము" అయినట్టి సర్వత్యాగాన్ని వదలి పరిమితాలైన ఇట్టి తపస్సులందు ప్రవృత్తుడౌతాడో అట్టివాడు తనకు తానే ద్రోహం చేసుకున్నవాడు మొండివాడు, (ఆత్మహంతకః, శఠః) అవుతాడే గాని సుఖి అవడు సుమా!

"తపస్సు చేత నేను ఇక్కడ ఆత్మవస్తువుతో ఏకత్వము సంపాదిస్తాను" అని తలచి ఇక్కడ ఈ అజ్ఞానగృహంలో చిక్కుకున్నావు. ఇక్కడ సర్వత్యాగము సంపాదించాలని ప్రయత్నించకుండా

విఫలుడవౌతున్నావు. "రాజ్యం దుఃఖపూరితం కదా" అని దానిని వదలి ఇక్కడకి వచ్చి "వనవాసం" అని ఈ దృఢబంధనంలో చిక్కుకున్నావు. ఒక బంధం నుండి బయల్వెడలి ఇంకొక బంధనంలోకి ప్రవేశించినట్లైనది నీ పని! ఇంతకు ముందెప్పుడూ నీకు వనవాసం అనుభవమై ఉండకపోవటం చేత ఇక్కడి శీత-వాత-తాపాలు నీ ఈ సుకుమార దేహాన్ని బాధించి కృశింపజేశాయే గాని, కొత్తగా ఇక్కడ నీవు సాధించినదేదీ లేదు. "ఈ వనవాసానికి వచ్చి నేను చింతామణిని పొందుచున్నాను" అని అనుకుంటున్నావే గాని యథార్థానికి నీవు పట్టుకున్నది గాజుమణి మాత్రమే.

ఓ అందమైన కనులు గల శిఖిధ్వజా! ఈ విధంగా నీ కథను మణిసాధకుని గాజుమణికి అన్వయించి చెప్పాను. ఇప్పుడు నేను చెప్పిన సమన్వయమును జాగ్రత్తగా పరిశీలించి ఆ తరువాత 1.సర్వత్యాగం, 2. తపస్సులలో ...దేనిని ఎన్నుకోవాలనుకుంటావో, ఇక నీ ఇష్టం. స్వయముగా నీ బుద్ధితో యోచించి అర్హమైన దానిని, ఉపయుక్తమైన దానిని ఆశ్రయించు. ఏది ఉపయుక్తమనుకుంటే అద్దానిని నీ చిత్తకోశములో నెలకొల్పి అప్పుడు ఫలప్రాప్తి పర్యంతము ఆచరించు.

❖❖❖

## 26. జ్ఞానము కొరకు త్యాగం

**కుంభమహర్షి :** ఇంతవరకూ నీకు చింతామణిల కథలో ఉద్దేశమేమిటో చెప్పాను కదా! ఇక ఇప్పుడు వింధ్యాచలంలో ఒక కందకంలో చిక్కుకున్న గజేంద్రుని కథలోని ఉద్దేశమేమిటో విను.

వింధ్యపర్వత శ్రేణులలో ఆ ఏనుగు సంచరిస్తున్నట్లు నీవీ భూమిపై సంచరిస్తున్నావు. వైరాగ్య వివేకములే నీ దంతములు. ఇక ఆ ఏనుగును పట్టుకోవటానికి ప్రయత్నించిన మావటివాడు ఎవర నుకున్నావ్? దుఃఖప్రదం, శత్రురూపం అయినట్టి నీ అజ్ఞానమే!

ఆ ఏనుగులాగా నీవు కూడా శాస్త్రజ్ఞాన రూపమైన గొప్పబలం కలవాడివే. అయితే ఆత్మవిషయమై ఏర్పడి ఉన్న 'అజ్ఞానం' అనే మావటివాని చేత నీవు ఒక దుఃఖం నుండి మరొక దుఃఖానికి, ఒక భయం నుండి మరొక భయానికి పరిగెత్తించబడుచున్నావు. ఆ ఏనుగు ఇనుపగొలుసులతో బంధింప బడితే, నీవేమో అనేక ఆశాపాశాలచే బంధింపబడ్డావు.

**ఆశాహి లోహరజ్జుభ్యో విషమా, విపులా, దృఢా ।**
**కాలేన క్షీయతే లోహం! తృష్ణాతు పరివర్ధతే ॥**

ఆశాపాశములతో పోల్చితే ఇనుప గొలుసులు ఎంతటివి? విషంతో సమానమైన ఆశాపాశాలే అతి దృఢమైనవి. ఎందుచేత నంటావా? ఇనుపగొలుసులైతే ఎంతో కొంత కాలానికి త్రుప్పుపట్టి విరుగుతాయి. ఇక ఆశాపాశాలో? కాలం గడుస్తూ ఉంటే ఇంకా ఇంకా వృద్ధి చెందుతాయి!

ఆ ఏనుగు బంధించబడి ఉంటే మావటివాడు చూస్తూ వినోదిస్తున్నట్లు ఏకాంతమున బంధించ బడి ఉన్న నిన్ను చూచి నీ అజ్ఞానం వినోదంగా పరికిస్తోంది. ఆ ఏనుగు గొలుసులను విఱగగొట్టినట్లు, నీవు రాజ్యాది భోగాలను త్యజించావు. అంతవరకు బాగానే ఉన్నది. కానీ...

**కదాచిత్ సుకరం శస్త్ర శృంఖలా బంధభేదనమ్,**
**న త్వస్య మననః, సాధో! భోగాశా వినివారణం॥**

నీవు మనస్సులోని భోగాల గురించిన ఆశను మాత్రం నివారించలేదు. ఆ ఏనుగు బంధాలను త్రెంచివేయు క్షణాలలో మావటివాడు ఆ ఏనుగు మీదపడినట్లు రాజ్యమును త్యజించునప్పుడు అజ్ఞానం నీ కాళ్ళ క్రిందకు వచ్చిపడింది.

**శిఖిధ్వజుడు :** రాజ్యమును త్యజించటం 'త్యాగం' కాదంటారా?

**కుంభమహర్షి :** త్యాగమే. అయితే, త్యాగం అనేది రెండు రకాలుగా ఉంటున్నది.

**1. విరక్త త్యాగం -**

**యదా విరక్తః పురుషో భోగాశాం త్యక్తుమిచ్ఛతి,**
**తదా ప్రకమ్పతే అజ్ఞానం ఛేద్యే వృక్షే పిశాచవత్ ॥**

విరక్తుడగు మనుజుడు భోగాలపై ఆశలను వదలి పెట్టడానికి ప్రయత్నించగానే కొమ్మలు కొట్టినా కూడా ఆ మోడువారిని చెట్టు మీద పిశాచం వ్రాలినట్లు అజ్ఞానం ఆతని నెత్తి మీద వ్రాలి ఆతనిని కంపింపజేస్తుంది.

**2. వివేక త్యాగం -**

**యదా వివేకీ పురుషో భోగాన్ సంత్యజ్య తిష్ఠతి,**
**తదా పలాయతే అజ్ఞానం ఛిన్నే వృక్షే పిశాచవత్ ॥**

వివేకి అగువాడు భోగములు త్యజించటం జరిగిందనుకో ...వృక్షం మొదలంట ఛేదించబడగా పిశాచం పలాయనమగునట్లు ఆతని అజ్ఞానం కూడా పలాయనం చిత్తగిస్తుంది.

❖

అంపంతో ఒక వృక్షాన్ని నరికి వేశామనుకో, ఆ వృక్షంపై ఉన్న గూళ్ళు కూడా నేలకూలుతాయిగా. నిశ్చయపూర్వకంగా భోగజాలాలను పరిత్యజించి ఉంటే అప్పుడు అజ్ఞానం కూడా నేల కూలేదే? కానీ నీవు చేసినదేమిటి? రాజ్యాదులైతే వదలిపెట్టావు. ఈ అడవిలోకి వచ్చిపడ్డావు. అజ్ఞానం తొలగగానే నీ యందు జ్ఞానమును ప్రవేశింపజేయాలి కదా? అందుకు చేయవలసినదేమిటి? ఏ మహాత్ముల పాదములనైనా ఆశ్రయించి జ్ఞానమును సంపాదించుకొని ఉండి ఉంటే మనస్సు యొక్క త్యాగమును గుర్తెరిగే వాడివి. అట్టి మనోత్యాగరూప మహాఖడ్గంతో అజ్ఞానమును వినాశనమొనర్చేవాడివే! మనస్సును త్యజించకుండా మనస్సుకు విషయములైన రాజ్యాదులను మాత్రమే త్యజించావు. అందుచేత మనస్సు ఉండనే ఉండి అది మరల ప్రకోపించి నీ కొంపముంచింది. మనోత్యాగం సంపాదించలేదు కనుక అజ్ఞానం నిన్ను మరల ఓడించింది. అది నిన్ను ఈ 'తపస్సు' అనే మహాకందకంలోకి త్రోసివేసింది. పద్దెనిమిది ఏళ్ళు తపస్సు చేసిన తరువాత ఇప్పుడిక ఏమి చేయాలో నీకు పాలుపోవటం లేదు. ఎందుకంటే రాజ్యాన్ని వదలావేగాని, ఆ రాజ్యమును దేనిచే ధరించావో ఆ మనస్సును ఎలా వదలాలో నీవు గ్రహించయత్నించలేదు. రాజ్యాన్ని వదిలేటప్పుడే ఏ అజ్ఞానం మిగిలి ఉన్నదో, ఆ అజ్ఞానాన్ని జ్ఞానప్రాప్తిచే సమూలంగా నశింపజేసుకొని ఉంటే, అది

మరల నిన్ను బాధించేదే కాదు. మావటి వాడు ఏనుగును బంధించటానికి కందకం ఏర్పాటు చేసినట్లు నీ అజ్ఞానమే ఈ తపోదుఃఖాన్ని కలుగజేసింది. ఏనుగును బంధించటానికి ఉపయోగించే పరికరాలు నీ అజ్ఞానం యొక్క అంతరమున సంచరించే 'చింత'. నీవు జ్ఞానవిషయాలు తెలియనివాడవేం కాదు. కానీ లాభమేముంది? 'అజ్ఞానం' అనే శత్రువు కొద్ది క్షణాలకాలంలో 'తపస్సు' అనే కందకం లోకి నిన్ను ఈడ్చుకొచ్చింది. ఆ కందకం బయటకు కోమల పూతీగలచే కప్పిపెట్టినట్లు నీ ఈ తపో దుఃఖం కొంచెం శాంతి, మౌనం మొదలైన గుణ ప్రవృత్తులచే ఆవరించబడింది. ఆ విధంగా తపో కందకంలో ఈ రోజు వరకూ కూడా బద్ధుడవై పడి ఉన్నావు.

ఓ రాజా! ఈ విధంగా నీవే ఆ ఏనుగువు. ఆశయే గొలుసు. నీ అజ్ఞానమే ఆ మావటి వాడు. ఉగ్ర తపస్సు చేయాలనే పట్టుదలే కథలోని కందకం. నీవు సంచరించే ఈ భూతలమే వింధ్యపర్వత ప్రాంతం. ఇదంతా ఎరిగినవాడవై ఇక నీకు ఏది సముచితమో అదియే చక్కగా ఆచరించు.

❖❖❖

# 27. సర్వత్యాగమంటే వస్తు త్యాగమా?

**కుంభమహర్షి :** ఓ శిఖిధ్వజ మహారాజా! జ్ఞానులగు మహనీయులెందరో గ్రంథస్థంగాను, నీవు ఆహ్వానించగా వచ్చి నీ సభలలోను, మనం చెప్పుకునే అనేక సర్వత్యాగాల గురించి, తదితర జ్ఞాన విషయాల గురించి చెప్పారు. నీవు వినియే ఉన్నావు. అదట్లా ఉంచు.

నీ ప్రియురాలు చూడాల గొప్ప నిపుణత కలిగియున్న ఆత్మజ్ఞాన సంపన్నురాలు కదా! ఆమె ఏ జ్ఞాన – విజ్ఞానములు నీకు చెప్పిందో అవన్నీ నీ వెందుకు స్వీకరించలేదు చెప్పు? ఆత్మజ్ఞానులలో ముఖ్యులైనవారిలో ఆమె ఒకరు కదా! ఆమె ఏదేది చెప్పిందో అదంతా సత్యము, ఆదరింపబడవలసినది, అనుష్ఠానయోగ్యము అయి ఉన్నది. ఆమె ఏమి చెప్పుచున్నదో మనోబుద్ధులను కొంచం ఏకాగ్రపరచి విన్నావా? ఆమె మాటలు వినబడుచుండగానే, అంతకుముందే నీవు ఏర్పరచుకొన్న కొన్ని అభిప్రాయములలో ప్రవేశించి జ్ఞాన సూచనలను పరిశీలించనైనా లేదు. "ఈమె స్త్రీ కదా! ఈమెకేమి తెలుసు?" అని ఉదాసీనంగా ఊరుకున్నావు. చెప్పేవారి భౌతిక, సాంఘిక విషయాలు ముఖ్యమా? చెప్పే విషయం ముఖ్యమా నీకు? పోనీ, ఆమె మాట అలా ఉంచు. "నా భార్య కదా! నాకే తెలియనిది ఈమెకేం తెలుస్తుంది?" అని ఊరుకున్నావు సరే. నీ స్వబుద్ధితో సర్వత్యాగము గురించి విచక్షించి అప్పుడు బుద్ధి స్థిరత్వం సంపాదించుకొని ఉండవలసింది. అదీ నీవు చేయనేలేదు!

**శిఖిధ్వజుడు :** ఆగండాగండి మహాత్మా! ఒక్కమాట. నేను రాజ్యమును, గృహమును ఆ ప్రాంతమునే త్యజించివేశానే! ప్రాణప్రదయగు భార్యను కూడా వదలిపెట్టి వచ్చేశానే! ఇవన్నీ వదలి ఇక్కడకు వచ్చిన తరువాత కూడా అది 'సర్వత్యాగం' అవదంటారా? అంతకన్నా ఎవరు మాత్రం ఏం త్యజిస్తాడు?

**కుంభమహర్షి :** (చిరునవ్వుతో)

**ధనం దారా గృహం రాజ్యం భూమిః ఛత్రంచ బాంధవాః ।**

**ఇతి సర్వం న తే రాజా! సర్వత్యాగోహి క స్తవ ॥**

ఏమి రాజా? నీవు చమత్కారంగా మాట్లాడుచున్నావే! అక్కడి ధనము, భార్య, ఇల్లు, రాజ్యం, భూమి, పదవులు, అధికారులు, బంధువులు... ఇవన్నీ 'నీవి' అని అనుకుంటున్నావా? నీ బాటలో అవి, వాటి బాటలో నీవు కాకతాళీయంగా తారసపడటమే కదా ఇదంతా?

**శిఖిధ్వజుడు :** ...!

**కుంభమహర్షి :** ఏమి, మాట్లాడవేం? నీవి కానివి నీవు వదలటమేమిటి? నీవి కానివి వదిలితే నీకు సర్వత్యాగఫలం ఎట్లా లభిస్తుంది?

**తవాస్త్యేవాపరత్యక్తః సర్వస్మాద్భాగ ఉత్తమః ।**
**తం పరిత్యజ్య నిః శేషమ్ ఆయాస్యసి విశోకతామ్ ॥**

నీచే త్యజించబడవలసియున్న సర్వోత్తమ విభాగము ఒకటి ఉన్నది. అద్దానిని వదలనే లేదు. ఆ ముఖ్య విభాగమును పరిత్యజించి దుఃఖరాహిత్యాన్ని పొందు.

**శిఖిధ్వజుడు :** ఏమిటి! ఇంకా నేను వదలవలసినది ఉన్నదా? తెలిసింది మహాశయా! రాజ్యాదులు వదిలిపెట్టి ఈ వనమునకు వచ్చి "వనం నాది" అని పద్దెనిమిది సంవత్సరాలుగా అనుకొని ఉన్నాను కదా! మీ ఉద్దేశం ఇదే అయి ఉంటుంది. ఇప్పుడు చూడండి పర్వతవృక్షాదులతో కూడిన ఈ వనము పట్ల నాకు గల ఆపేక్షను ఇప్పటికిప్పుడే త్యజించివేస్తున్నాను చూడండి.

❖

ఓ రామా! కుంభర్షి వాక్యాలచే ప్రేరితుడైన జితేంద్రియుడు, మహావీరుడు అయిన ఆ శిఖిధ్వజుడు కనులు మూసుకున్నాడు. కించిత్ మాత్ర 'స్ఫురణ'చే హృదయంలో స్ఫురించే ఆ పరిసరముల పట్ల ప్రీతిని-ధూళితో కప్పబడిన అద్దమును తుడిచినట్లు-తుడిచివేసాడు. నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

**శిఖిధ్వజుడు :** ఇప్పుడు చెప్పండి మహర్షీ! వృక్ష-పర్వత-లతాదులతో అలంకరించబడి ఉన్న ఈ వనం యొక్క పరిసరాల పట్ల గల నాకు ఏర్పడి ఉన్న ప్రియత్వాన్ని, వాటికి సంబంధించిన ఇష్ట-అయిష్ట-కోప-తాప-అభిప్రాయ-దురభిప్రాయముల సంబంధమైన సర్వ వాసనలను క్షణంలో త్యజించి వేశాను. కాబట్టి ఇక ఇప్పుడు చెప్పండి! ఇప్పుడు నాకు సర్వత్యాగం సిద్ధించినట్లే కదా!

**కుంభమహర్షి :** (పకాలున నవ్వుతూ) ఏమిటీ! ఇక్కడ గల వృక్షాలను, స్థలాన్ని, లతలను, జల-సరోవరాలను త్యజిస్తున్నావా? బాగున్నదయ్యా! నీవు ఇక్కడికి రాక ముందే ఇవన్నీ ఇక్కడున్నాయి. ఇక్కడి నుండి నీవు వెళ్ళిపోయిన తరువాత కూడా ఇవి ఇక్కడే ఉంటాయే! వీటిని పట్టుకుని "ఇవి నావి" అని ఎట్లా అంటావు?

**శిఖిధ్వజుడు :** అవును. ఇవి నావి కావు.

**కుంభమహర్షి :** మరి! "నా మిత్రుడు ధరించిన ఆతని వజ్రపు ఉంగరం నేను త్యాగం చేస్తున్నాను"... అన్నట్లున్నది నీ వాక్యం! ఇవి నీవి కానప్పుడు వీటిని నీవు త్యజించటమేమిటి? తద్వారా సర్వత్యాగసిద్ధిని సంపాదించటమేమిటి, ఏవో పరాచికాలు కాకపోతే? నీవు పరిత్యజించవలసింది ఇది కాదు. ఇంతకన్నా ఉత్తమమైన ఒకానొక నీయందలి విభాగమును నీవు పరిత్యజించనే లేదయ్యా! నీదైనదేదో,

అది వదలకుండా ఏవేవో వదలి "వదలాను కదా!" అంటావేమిటి? పరిత్యాజ్యావశ్యకమైనట్టి నీయందు చోటు చేసుకున్న విభాగమును నిశ్శేషంగా త్యజించి అప్పుడు తద్వారా దుఃఖరాహిత్యం పొందటం గురించి యోచించు.

**శిఖిధ్వజుడు :** ఓ కుంభ మహాశయా! పోనీ, అవన్నీ కాకపోతే, ఇప్పుడింకా నా దగ్గిర ఉన్న ఈ నా యజ్ఞపాత్ర, అగ్నికార్యము చేసే యజ్ఞవాటిక, ఈ కుటీరం, పులిచర్మము మొదలైనవి కూడా త్యాగం చేసి వస్తాను. చూస్తూ ఉండండి.

❖

ఓ రాఘవా! శాంతుడు, శుద్ధచిత్తుడు అయిన ఆ మహారాజు తను ఆసీనుడైయున్న ఆసనం నుండి తటాలున లేచి నిలబడ్డాడు. కుంభ ఋషి (మునిపుత్ర రూపంలో ఉన్న చూడాల) మాత్రం అసనము మీదే ఉండి శిఖిధ్వజుడు చేస్తున్న చర్యలను మౌనంగా చూస్తున్నాడు. "ఈతడు ఏం చేస్తాడో చూద్దాం – ఇదంతా ఇతనికి శ్రేయమే కాబోవుచున్నది గదా!" ...అనుకుంటూ కుంభుడు ఆతని కదలికలను మాత్రం మెదలకుండా గమనిస్తున్నాడు.

శిఖిధ్వజుడు గంభీరవదనంతో కుటీరంలో ప్రవేశించాడు. యజ్ఞపాత్రలు మొదలైన సామాగ్రిని ఆశ్రమం నుండి బయటకు తీసుకుని వచ్చి ఒకచోటికి చేర్చాడు. అక్కడికి కొద్ది అడుగుల దూరంలో ఎండు కట్టెలను తెచ్చి అగ్ని రగిల్చి మంటచేశాడు. రగులుతున్న మంటలలో ఒక్కొక్క వస్తువును విడువసాగాడు.

**శిఖిధ్వజుడు :** ఓ జపమాలా! నీవు గొప్ప స్వామి భక్తపరాయణుడవై నన్ను కొలిచావు. ఇక నేను చేసినదేమిటి? స్వార్థసాధనతత్పరుడనై ఇంతవరకూ నీకెంతో శ్రమ ఇచ్చాను. ఇప్పటికి నీ సేవ పరిసమాప్తమైనది. ఇప్పుడు జపము–తపము మొదలైన కర్తవ్యములకు సంబంధించిన భ్రాంతి నాయందు తొలగింది. ఇక నీతో నాకేమీ పనిలేదు. నీతో కూడా నేను అనేక మంత్రరూప మహారణ్యాలలో సంచారం చేసిచేసి అలసిపోయాను. మనిద్దరం కలసి ఎన్నో సిద్ధక్షేత్రాలు చూచాం. ఇక నేను ఆత్మయందు విశ్రమించే సమయం ఆసన్నమైనది. అందుచేత నీవు ఈ అగ్నిలో ప్రవేశించి నీ మూల ప్రకృతిలో విశ్రమించు.

ఓ పులిచర్మమా! మనుష్య రూప మృగమువంటి నేను ఒక మృగం నుండి ప్రాప్తించిన నిన్ను అనేకసార్లు బాధిస్తూ ధర్మాసనం మీద పరచాను. నిన్ను ధరించిన ఆ మృగదేహి ఇప్పుడు ఎన్నో దేహాలలో ప్రవేశిస్తూ నిష్క్రమిస్తూ ఎక్కడో ఉండి ఉంటాడు. నీ మూల ప్రకృతి యగు ఆకాశం నందు ఎప్పుడో విలీనం కావలసిన నీవు నా వలననే ఇంకా ఈ చర్మాకారం వహించి ఉన్నావు. "ఏకాంతం – తపస్సు" ... అని అనుకుంటూ నిన్ను నీ పుట్టినిల్లు అగు ఆకాశానికి చేరకుండా నేను నిరోధించాను. ఇప్పుడిక నీకు స్వదేశమగు ఆకాశస్థితి ఈ అగ్ని ద్వారా ఒనగూడుగాక!

ఓ దండమా! ఓ కమండలమా! గుండ్రని ఆకృతిగల నీవు ఇంతకాలం నాకోసం జలమును ధరించేదానివి. మీరు చూపిన సౌజన్యమునకు, నేను చేయగల ప్రత్యుపకారమేమున్నది? ఓ జల పాత్రమా! అగ్నిచే శుద్ధిపొంది నన్ను సేవించావు. తిరిగి నిన్ను అగ్నికి అర్పిస్తున్నాను.

ఓ రాఘవా! ఈ విధంగా పలుకుచూ ఆ శిఖిధ్వజుడు ఆయా వస్తువులను భోజన సామాగ్రిని కూడా అగ్నికి ఆహుతి చేసివేశాడు. కమండలము వంటి కొన్ని పవిత్ర వస్తువులను ఆ బాటలో పోవుచున్న ఒక బాటసారికి ఇచ్చివేసాడు. అప్పుడు తిరిగి కుంభుని ముందు నిలబడి ఇలా పలికాడు.

❖

**శిఖిధ్వజుడు :** ఓ కుంభమహర్షీ! మీరు నేను చేస్తున్నదంతా గమనిస్తున్నారు కదా! నాకు ఈ వస్తువులపై గల ప్రీతిని తొలగించుకోవటానికీ, మీరు ప్రవచించినట్లు నిష్క్రియుడను కావటానికీ ఈ వస్తువులన్నీ అగ్నికి వదలివేశాను. ఇదంతా చూచి మీరు ఖేదమొందకుండెదరు గాక! అయోగ్యమైన వస్తువులను లోకంలో కలిగి ఉండరు కదా! సర్వత్యాగము సంపాదించే సమయం ఆసన్నమగుటచేతనే అవి అగ్నిలో మండి నేడు బూడిద అగుచున్నాయి. ఇంకా చూస్తూ ఉండండి. రెల్లు గడ్డితో నిర్మించిన ఈ ఆశ్రమ మందిరమును కూడా ఇప్పుడే అగ్నికి ఆహుతి ఇచ్చి దీనిని కూడా త్యజించినవాడనవుతాను.

❖

ఇలా పలికి శిఖిధ్వజుడు కణకణమండే రెండు కట్టెపుల్లలను తెచ్చి పర్ణశాలను కాల్చివేసాడు. ఇంకా అక్కడా – ఇక్కడా ఏవైనా వస్తువులు కనిపిస్తే వాటినన్నిటినీ విసరివేయటమో, విరగగొట్టటమో, అగ్నిలో పడివేయటమో, దారినపోయేవారికి ఇచ్చివేయటమో చేశాడు. నార వస్త్రములన్నీ తగలబడి బూడిద అయినాయి. ఇక శిఖిధ్వజుడు కట్టుబట్టలతో "నావి" అని చెప్పుకోవటానికి వస్తువులేమీ మిగలకుండా మిగిలాడు.

**శిఖిధ్వజుడు :** ఆహా! కుంభమహర్షీ! నా జీవితంలో చాలా కాలం గడిచిపోయిన తరువాత 'సర్వత్యాగము' అనే మహత్తరమైన సందేశం మీరు నాకు ప్రదర్శించారు. ఇప్పుడు, ఈ గోచీ తప్ప మరే వస్తువు కలిగిలేను. ఈ గోచీని కూడా లోకులకొరకై మాత్రమే ధరించాను గాని, ఈ జీవునకు ఏదో మమకారం ఉండి కాదు.

ఈ సమస్త పదార్థములూ "నావి కావు" అని వాటిపట్ల మమత్వం వదలివేశాను. కాబట్టి నేనిప్పుడు సర్వత్యాగస్థితి పొందినట్లే కదా! ఇప్పుడు నేను శుద్ధుడను. సులభంగా ప్రబోధం పొందాను. ఈ ప్రపంచములోని సర్వపదార్థములూ ఇవి నావి అను మమత్వం ఏర్పడి ఉండటం చేతనే చివరికి దుఃఖభాజకములుగా పరిణమించటం జరుగుతోందని గ్రహించాను. బంధహేతువులన్నీ ఒక్కొక్కటీ తొలగుచుండగా ఇకనేను పరమశాంతిని పొందుచున్నాను. నేనిపుడు నిర్విషయుడనైనాను. సర్వదా తృప్తుడనగుచున్నాను. మీరు చెప్పిన మార్గంలో సర్వమూ త్యజించటం చేత సుఖవంతుడనై ఒప్పు చున్నాను. వివిధ బంధములన్నీ నశించాయి. కాబట్టి సర్వత్యాగము ఆచరించిన వాడనే కదా!

ఓ దేవపుత్రా! ఇప్పుడు నేను దిగంబరుడనై మిగలటం, సర్వ వస్తువులను వాటిపట్ల అపేక్షను మీ కళ్ళ ముందే త్యజించివేయటం చూచారు. కాబట్టి నేను మహాత్యాగాన్ని సంతరించుకున్నట్లేనని ఇప్పటికైనా ఒప్పుకుంటారా? లేదా?

**కుంభమహర్షి :** ఏమిటి నీవు సర్వత్యాగివా? కాదు. అర్థ త్యాగివేకాని నీవు సర్వత్యాగివి మాత్రం కాదు. సర్వత్యాగానికి ఒక ముఖ్యమైన గురుతు ఉన్నది. అది ఏమిటంటే... సర్వత్యాగం వల్ల నిర్హేతుకమైన జహేతువు యొక్క అగత్యం లేకుండానే – పరమానందం స్వభావసిద్ధం అవుతుంది. అందుచేత ఓ రాజా! నీవు సర్వత్యాగం యొక్క అభినయం చెయ్యకయ్యా! నటన కాదు ఇప్పుడు కావలసింది. నిజమైన త్యాగం కావాలి. త్యజించటమవసరమై ఉన్న నీయొక్క అత్యుత్తమ విభాగం ఇంకా కలిగియే ఉన్నావు. దానిని పూర్తిగా త్యజిస్తేగానీ నీకు సర్వత్యాగం సిద్ధించదు.

**శిఖిధ్వజుడు:** (తనలో) ఏమిటీయన ఇట్లా అంటాడు! అన్నీ త్యజించాను కదా! ఇప్పుడు రాజ్యం లేదు, బంధువులు లేరు, ధనాదులు లేవు, రాజవస్త్రాలు, నారవస్త్రాలు కూడా లేవే! కనీసం నివసించటానికి... అంతఃపురం మాట దేవుడెరుగు... ఉన్న రెల్లుగడ్డి కుటీరాన్ని కూడా అగ్నికి ఆహుతి చేసి వదిలేశానే! జపమాల, యజ్ఞపాత్రలు అన్నీ వదలి తగులబెట్టటమో, పారవేయటమో, ఇచ్చి వేయటమో చేశానే! ఇంకా నా దగ్గిర ఏమున్నదని ఈ పెద్దమనిషి వదలమంటాడు? ఏదో ముఖ్యమైన విభాగం ఇంకా మిగిలియే ఉన్నది. అది త్యజించు... అని ఇంకా అంటూనే ఉన్నాడే ఈయన! ఏది ఏమైనా ఇప్పుడు నేను సర్వత్యాగిని అయి మోక్షార్హత సంపాదించుకోవలసిందే! ఎట్లాగైనా ఈతని లెక్కకు నేను సర్వత్యాగి అను పదమునకు అర్హుడనని అనిపించుకోవసిందే. లేకుంటే... ఇన్నాళ్ళిక్కడ ముక్కుమూసుకుని ఈ తపస్సు చేయటం ఎందుకు? సరే ఇప్పుడింకా నా దగ్గిర ఏమున్నది?

❖

ఇట్లా ఆలోచిస్తూ శిఖిధ్వజుడు బుఱ్ఱ బద్దలుకొట్టుకుంటూ ఉంటే, ఆ కుంభమహర్షి పరమ ప్రశాంతమైన చిరునవ్వుతో ఆ పరిసరములను అగ్నికి ఆహుతి అగుచున్న ఆయా వస్తు సముదాయాన్ని, ఇటు శిఖిధ్వజుని వైపూ చూస్తూ మౌనం వహించి ఉన్నాడు. శిఖిధ్వజుడు మాత్రం పరీక్షించబడుచున్న విద్యార్థిలాగా బుఱ్ఱగోక్కుంటూ యోచిస్తున్నాడు. కొద్దినిమిషాలు గడిచేసరికి ఆతని మనస్సులో ఒక సమాధానం తళుక్కుమన్నది. తటాలున కూర్చున్న చోటినుంచి లేచాడు.

**శిఖిధ్వజుడు:** ఓ దేవర్షీ! ఇంతసేపూ "త్యజించటానికి ఇంకా ఏమి మిగిలింది?" అని మూర్ఖుడనై ఆలోచిస్తున్నాను. ఇప్పుడు తట్టింది. బహుశః ఇంతసేపూ మీరు కూడా ఇదే ఉద్దేశిస్తున్నారని గ్రహించివేశాను. ఇంకా ఈ దేహం మిగిలియే ఉన్నది కదా!

అసలు అన్ని అనర్థాలకూ దేహమే కారణం. దేహము కలిగియుండటమే బంధం భవరోగం కూడా"... అన్న శాస్త్రవాక్యాలు నాకు ఇప్పుడు గుర్తుకు వచ్చాయి. దేహమే దేహికి ఐహికమోహమని చెప్పగా విన్నాను. ఈ దేహంలో కళ్ళు, చెవులు, తదితర ఇంద్రియాలు ఉన్నాయి. సర్వాతీతమైన ఆత్మ స్వభావం నుండి నేను ఇంద్రియార్థములను ఆశ్రయించి, విషయములపై వాలుట చేతనే సర్వ అనర్థములు వచ్చి పడుచున్నాయి. ఈ దేహం త్యజించి దేహరహితుడగు పరిశుద్ధ దేహి (విదేహుడను) అయితేనే నా ఈ సర్వత్యాగం సంపూర్ణమయినట్లు. పరమజ్ఞానులగు మీ సమక్షంలో అన్నీ అగ్నిపరం చేసినట్లు ఈ నా దేహాన్ని కూడా అగ్నికి ఆహుతి ఇచ్చి మీ చేత 'సర్వత్యాగి' అని పిలిపించుకుంటాను.

ఇంక కుంభుని అభిప్రాయమునకు ఎదురుచూడకుండా ఆ శిఖిధ్వజుడు గంభీరముగా అగ్నివైపు అడుగులు వేయసాగాడు. ఇంకా అగ్ని కొద్ది అంగుళముల దూరంలో ఉండగా "ఓ రాజా! ఆగు" అని కుంభర్షి కేక పెద్దగా వినబడింది. గురు ఆజ్ఞను తెలివి గలవాడెవడైనా పాటిస్తాడు కదా! రాజు ఆగి ఒక్క అడుగు వెనక్కు వేసి కుంభర్షి వైపు తిరిగాడు.

**కుంభమహర్షి :** దా! ఇటొచ్చి కూర్చో! ఆ! ఇప్పుడు చెప్పు, ఏమిటి నీవు చేస్తున్నది? సంసారమునకు కారణం నీవా, ఈ దేహమా? నిపరాధియగు ఈ దేహం ఏం పాపం చేసిందని నీవు అగ్నిలోకి త్రోసివేయాలనుకుంటున్నావు? యజమాని ఇంకా మేత వేయలేదని ఒక తెలివి లేని ఎద్దు ప్రక్కనే గల దూడను తన్నినట్లుంది నీవు చేసేపని. ఆటలో ఓడిపోతున్నామని ఉక్రోషంతో ఆటవస్తువును విరగగొట్టితే ఏమిటర్థం? కఱ్ఱతో కొట్టిన వాడిని వదలి కఱ్ఱను పట్టుకుని తగలబెట్టితే ప్రతీకారం చేసినట్లౌతుందా? ఇల్లు దోచిన దొంగను వదలి దొంగలు పడ్డ ఇంటిని, గోడలను పగలగొట్టి ఏమి ప్రయోజనం? జడము, దీనము, మూగతపస్వి అయినట్టి ఈ దేహము నీకేం అపరాధం చేయలేదే! దీనిని త్యజించకు. త్యజించవలసింది దేహమును కాదు.

పాప మీ దేహం ఎవరినీ ఏమీ అనకుండా తనయందు తానే మౌనముగా ధ్యానమున నెలకొనియున్నది. కట్టె నీళ్ళలో కొట్టుకుపోతుంటే... ఆ కట్టె బలతరంగాలచే దొర్లించబడుతోంది గానీ, తనకు తానుగా కదలి వెళ్ళటం లేదే! అట్లాగే ఈ దేహము తానుగా ఏమీ చేయటం లేదు. దీనిని మరొకటేదో ఉపయోగిస్తోంది. ఏకాంతవాసంలో ఉన్న ఒక తాపసిని ఒక మదించిన దొంగ బాధించినట్లున్నది నీ వ్యవహారం! శిక్షకు యోగ్యుడైన మరొకడు ఈ దేహంలో ఉండి విషయేచ్ఛను, అల్పాశయములను ప్రదర్శిస్తూ ఉంటే ఆ దోషిని వదలి, ఈ దేహాన్ని శిక్షిస్తానంటావేమిటయ్యా బాబూ! ఒక తోటమాలి మామిడి వృక్షం దగ్గిరకు వెళ్ళి "ఓ వృక్షమా! ఈ పళ్ళు నీవలననే రాలాయి. కనుక నిన్ను ఈ గొడ్డలితో నరికివేస్తాను" అంటే ఏం లాభం, మామిడి పళ్ళు రాలింది, తుపాను గాలికైతే? చేతనైతే గాలిని పట్టుకుని ప్రశ్నించాలి? సుఖదుఃఖములకు ఉత్పత్తి స్థానం దేహము కావచ్చు. కానీ, ఉత్పత్తికి కారణం దేహం కాదు. అది వేరే ఉన్నది. కారణమును వదలి కార్య సాధన మాత్రమగు ఈ దేహమును ప్రశ్నిస్తే అదేం చేస్తుంది చెప్పు? పుష్పాలు, ఫలాలు నేలరాలటానికి గాలి కారణంగాని చెట్టు కారణం కానట్టే శరీరం చలించటానికి కారణమగుచున్నది మరొకటి ఉన్నది. దానిని పట్టుకుని శిక్షించు.

సరే! ఒకవేళ ఈ శరీరాన్ని త్యజిస్తావు. అంతటితో సమస్య తీరుతోందా? అబ్బే, లాభమే లేదు. ఎందుకంటావా, మరణానంతరం మరొకదేహం వస్తుంది. అయితే ఆ దేహం ఈ దేహంతో సమానంగా జ్ఞానార్హమై ఉంటుందని చెప్పగలమా? జ్ఞానార్హతకు మానవ ఉపాధి కన్న ఉత్తమమైనదేది ఉన్నది? సాధనకు, గురుసేవల వంటి ఉత్తమ కార్యక్రమాలకు పఠన, గ్రహణాదులకు ఇంత అవకాశం మరల లభిస్తుందని నమ్మకమేమున్నది? పోనీ ఏదో దేహం లభిస్తుందనుకో, అప్పుడైనా సర్వత్యాగం లభిస్తుందని అనగలమా? లభించాలంటే ప్రయత్నించాలి కదా! అట్టి ప్రయత్నరూపమైన కార్యక్రమం ఇప్పుడే

నిర్వర్తించవచ్చు కదా! కనుక ఏ విధంగా చూచినా, దేహమును మంటలో పడవేయడం ఉపాయమే కాదు. మరణించినంత మాత్రం చేత సర్వత్యాగఫలితమగు మోక్షం లభిస్తుందంటే ఇక సాధనలు, గురువులు, విచారణలు ఎందుకు? మరణోపాయాల మీదనే గ్రంథాలు రాసుకోవచ్చు కదా!

"కనుక దేహము త్యజిస్తాను అనే నీ అభిప్రాయం ...నేను చూపు సర్వత్యాగానికి మార్గమే కాదు. దేహాన్ని అగ్నిలో ఆహుతి చేయటం వ్యర్థమైన ఆలోచన. ఒక మదపుటేనుగు వృక్షమును అటూ ఇటూ కలుస్తున్నట్లు... ఈ దేహమును కూడా ఏదైతే సంక్షుభితం చేస్తోందో, అట్టి ఆ పాప వస్తువును త్యజించు. మరుక్షణం మహాత్యాగవంతుడవౌతావు. అద్దానిని త్యజించటం చేత అసలీ దేహములే ఇక ఉత్పన్నం కావు. కాదూ, ఈ దేహమును మాత్రం అగ్నిలోనో జలంలోనో పడవేసి నశింపజేయాలనుకుంటే మరల మరల దేహాలు వచ్చిపడుతూనే ఉంటాయి. కనుక త్యజించటం అత్యవసరమై ఉన్న నీ యందలి సూక్ష్మ విభాగం ఎలా త్యజించాలో యోచించు.

**శిఖిధ్వజుడు:** హే సద్గురూ! మీరు చెప్పింది అత్యంత యుక్తియుక్తం. ఇప్పటి దాకా అసలు ఏది త్యజించాలో గుర్తించడానికి నా అల్పమైన తెలివితేటలు ఉపయోగించానే గాని, మిమ్మల్ని సంప్రదించనే లేదు. ఇప్పుడు మిమ్ములను శరణువేడి అభ్యర్థిస్తున్నాను.

**కేనాఽయం చాల్యతే దేహః?కిం బీజం జన్మకారణామ్?**
**కస్మింస్త్యక్తే పరిత్యక్తం సర్వం భవతి సుందర!**

సుందరరూపుడవగు ఓ దేవఋషీ! వినమ్రుడనై, సాష్టాంగదండప్రణామములు సమర్పిస్తూ మిమ్ములను వేడుకుంటున్నాను. నా ఈ సందేహములు తీర్చండి. ఈ భౌతికదేహం దేనిచే చలించ బడుతోంది? ఈ జన్మ – కర్మలన్నిటికీ బీజ కారణం ఏమిటి? దేనిని త్యజించటంచే అంతా కూడా త్యజించబడినది (సర్వత్యాగం) అగుచున్నది?

❖❖❖

# 28. మనస్సును అధిగమించుటమే "సర్వత్యాగం"

**కుంభమహర్షి:** ఓ సాధుపుంగవా! శిఖిధ్వజ మహారాజా! ఈ దేహమును, ఇళ్ళు – వాకిళ్ళను, రాజ్యమును, వంటపాత్రలను, కుటీరములను వదలితేనో, లేక, తగలబెడితేనో సర్వత్యాగము కానే కాదని మరొక్కసారి నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను.

మరి ఈ దేహాదుల కార్యక్రమమంతా ఏదై ఉన్నదో, ఏది నాలుగు వైపులా వ్యాపించి ఆయా అనుభవాలన్నిటికీ అసలు కారణమైయున్నదో... అద్దానికి శాస్త్రజ్ఞులు మనస్సు, వాసనలు, అహంకారం మొదలైన పేర్లు పెట్టారు. అదీ... నీవు త్యజించవలసింది.

**శిఖిధ్వజుడు:**

**సర్వం, సర్వగతం, సర్వహేయం–త్యాజ్యం చ సర్వదా ।**
**సర్వం కిముచ్యతే? బ్రూహి, సర్వతత్త్వవిదాంవర ॥**

హే సర్వతత్త్వములను ఎఱిగినవారిలో శ్రేష్ఠుడా! "ఇక్కడి రాజ్యము, భార్య, వస్తు సముదాయము మొదలైనవిగా ప్రకటనమగుచు, సర్వమునందు వ్యాపించి ఉన్నదై సర్వదా త్యాజ్యము అయినట్టిది" ...ఏదైతే ఉన్నదో అద్దాని గురించి నాకు తెలియజేయండి.

**కుంభఋషి:**

**సాధో! సర్వగతాకారం జీవప్రాణాది నామకమ్ ।**

**న జడం, నాజడం భ్రాన్తం "చిత్తం" సర్వమితి స్మృతమ్ ॥**

ఓ సాధూ, వినండి! నీ యొక్క స్వస్వరూపమునందు ఒకానొక విభాగం ఉన్నది. నీ అనుభవ ప్రారంభానికి కించిత్ ముందే ప్రవేశించి ఏర్పడి ఉంటోంది. ఆ స్వల్పవిభాగమే సర్వగతమైన ఆకృతి కలిగి ఉన్నదగుచున్నది. అది ఆయా ప్రదేశములలో జీవం, ప్రాణం మొదలైన నామాలు కలిగినదై ఉంటోంది. అది చేతనం కాదు.

పోనీ, జడం అని అందామా! అది తదితరాలైన బాహ్య విషయాలను ప్రేరేపించుచుండుటచే జడం కూడా కాదు. అయితే అది భ్రమశీలమై ఉన్నది. అది "ఆత్మ యొక్క దృశ్య విషయ మనన" స్వభావ విభాగం అని గ్రహించిన వేదజ్ఞులు దానికి 'చిత్తము' అని పేరుపెట్టారు. మనస్సు మొదలైనవన్నీ అదే. "అదియే ఇక్కడ అనుభవమగుచున్న సర్వం" అని ఆత్మజ్ఞులచే సిద్ధాంతీకరించబడుతోంది.

ఓ రాజా! చిత్తమునే నీవు భ్రమ అని కూడా గ్రహించు. ఇంతెందుకు? అదియే ఈ మనుజుడు సుమా! మనుజుడంటే దేహం కాదు. మనుజుడంటే చిత్తమే. చిత్తమే మనస్సు కూడా! నీవు జగజ్జాలం అని సంబోధించేది కూడా ఆ చిత్తమునే. ఒక్క మాటలో చెప్పాలంటే చిత్తమే సమస్తము. చిత్తమే సంసారము గాని, దృశ్యజగత్తు సంసారం కానే కాదు.

❖

ఒకచోట ఒక మహావృక్షమున్నదనుకో, ఆ వృక్షమునకు పూలు, కొమ్మలు, ఆకులు, కాయలు, కాండము మొదలై ఆయా విభాగములు వెల్లివిరుస్తాయి. "ఆ వృక్షమునకు అసలైన కారణమేమిటి?" అను ప్రశ్నను మథించి వెతికితే "ఒకానొకప్పుడు అక్కడి నేలలో జేరిన బీజమే"... అనే సమాధానం రాక తప్పదు. అలాగే ఈ దేహాదులు, ఈ రాజ్య – రాజ సంబంధములు, ఆశ్రమవాస అభినివేశములు, బంధము, మోక్షము మొదలైనవాటికన్నిటికీ మనోబీజమే (లేక చిత్తబీజమే) అసలైన కారణం.

ఇప్పుడు నీవు రాజ్యమునో, కమండలమునో త్యజిస్తున్నావు. ఏం లాభం? ఒక దయ్యం వదిలితే ఇంకొక దయ్యం పట్టుకుంటుంది. నీవు వదలవలసింది వీటిని కాదు.

సమస్తమునకు బీజమైన మనస్సును లేక చిత్తమును త్యజించవయ్యా! అప్పుడు తదితరమైన సమస్తమూ త్యజించబడినదే అగుచున్నది. మనస్సును త్యజించినప్పుడు మాత్రమే సర్వత్యాగం సంభవ మవుతుంది. మనస్సు కంటే అతీతత్వము సంతరించుకోవటమే మనోత్యాజ్యం. మనస్సును వదలకుండా ఆ మనస్సు పట్టుకునే ఎన్ని వస్తువులను, లేక, విషయాలను వదిలితే ఏం లాభం? మనస్సు ఉండట మంటేనే విషయములను, లేక వస్తువులను ధరించి ఉండటం కదా!

**సర్వధర్మా అధర్మావా, రాజ్యాది విపినాది వా,**
**"సచిత్తస్య పరందుఃఖమ్! నిశ్చిత్తస్య పరం సుఖమ్!"**

ఇప్పుడు దుఃఖం ఎక్కడి నుండి వస్తుందో చెబుతాను విను. చిత్తము కలిగి ఉన్నంత కాలం సమస్త ధర్మాధర్మములు, రాజ్యాదులు, వనవాసం చేయటాలు, తపశ్చర్యలు మొదలైనవన్నీ దుఃఖ రూపాలుగానే పరిణమిస్తాయి. చిత్తరహితునికో... అవన్నీ సుఖ రూపాలుగా అగుచున్నాయి.

ఒక బీజం మహావృక్షం కావటం మనం చూస్తూన్నాం కదా! అట్లాగే చిత్తం (లేక) మనస్సు కూడా ఈ సమస్త జగద్రూపంగాను, ఈ దేహ సమూహములుగానూ పరిణామమొందుచున్నది. గాలి వీచికలచే వృక్షము, భూకంపముచే పర్వతము, కమ్మరివానిచే కొలిమితిత్తి, కదల్చబడుచున్నట్లే చిత్తముచే ఈ శరీరము కూడా చలింపబడుచున్నది. ఈ సమస్త ప్రాణుల భోగముల యొక్క (అట్లాగే) దేహ ధర్మములైనట్టి చావు – పుట్టుకల యొక్క, ఇంకా మునుల శమ, దమ, ధారణ మొదలైన సుదృఢభావముల యొక్క పేటిక ఏదయ్యా అంటే ...అది చిత్తమే సుమా!

**ఇదం ప్రవర్తతే సర్వం చిత్తమేవ జగత్తయా ।**
**దేహాద్యాకారజాలేన చిత్తం జీవో మనోమయమ్ ॥**

సమస్త దేహముల ఆకారంగా, జగదాకారంగా పరిణమిస్తున్నది, ప్రవర్తిస్తున్నది చిత్తమే. అసలు అంత ఎందుకు? (చిత్తోహి జీవః) ఈ జీవుడే చిత్తమయుడై ఉన్నాడు. అట్టి చిత్తమే ఆయా క్రియారూప వ్యాపారములచే... "అంతఃకరణం, బుద్ధి, మహత్తు, అహంకారం, ప్రాణం, జీవుడు, మనస్సు" మొదలైన పేర్లచే చెప్పబడుతోంది. వేదాంత శాస్త్రం "ఇదంతా చిత్తము యొక్క ప్రవాహ పతిత ఫలమే" అని నొక్కివక్కాణిస్తోంది. కాబట్టి, ఆ చిత్తమును త్యజించావా, సమస్త ఆధి – వ్యాధులకు 'హద్దు' అయినట్టి సర్వత్యాగము కావించినట్లే అవుతుంది.

త్యాగవేత్తలలో శ్రేష్ఠుడవగు ఓ శిఖిధ్వజ మహారాజా!

**చిత్తత్యాగం విదుః సర్వత్యాగం, త్యాగవిదాంవర**
**తస్మిన్ సిద్ధే మహాబాహో! సత్యం కిం నాఽనుభూయతే?**

"ఇంకా ఏదో పొందాలి" అను రూపం గల చిత్తాన్ని త్యజించడమే 'సర్వత్యాగం' అని పేర్కో బడింది. అంతేగాని ఇల్లు, వాకిలి వదిలేసి వస్త్రాల రంగు కాషాయం చేసుకున్నంత మాత్రం చేత అది 'గృహత్యాగం, బంధుత్యాగం' అనిపించుకుంటుందేమో గాని, సర్వత్యాగం మాత్రం కానే కాదు. చిత్తత్యాగం అనబడే సర్వత్యాగం సిద్ధించిందా, ఇక పరమానంద రూపమగు సత్యపదార్థ అనుభవం ఎందుకు ఈ జీవునికి కలుగదు? తప్పకుండా కలుగుతుంది. చిత్తం త్యజించబడిన తరువాత కార్యవిభాగ పరంపర అయినట్టి ద్వైతమూ ఉండదు, కారణవిభాగమైనట్టి 'ఏకమూ' ఉండదు. ఇక కేవలం పరమశాంతమై, స్వచ్ఛమై, నిరామయమై, ఏకమైనట్టి మన పరమాత్మ తత్త్వమే శేషిస్తుంది.

❖

ఈ 'సంసారము' అనే విస్తారమైన పంట పండుచున్న క్షేత్రం చిత్తమే గాని బాహ్యమైన ఏదో విషయమో, ప్రదేశమో కాదు. క్షేత్రమే నశిస్తే ఇక ధాన్యరూపమన తగినట్టి ఈ సంసారం ఎందులోంచి

మొలచుకొస్తుంది? జలమే పలు ఆకారలైన తరంగాలుగా పరిణమిస్తున్నది కదా! మనస్సే భావాభావాల రూపంలో చిత్రవిచిత్రాలైన క్రియలను నిర్వర్తిస్తూ ప్రవాహపతితంగా ఆయా పదార్థముల ఆకారంగా రూపుదిద్దుకుంటోంది. సర్వత్యాగమును చిత్త త్యాగరూపంలో నిర్వర్తించాలి. అప్పుడు పరమాత్మ సర్వత్రా సంప్రాప్తించినదగుచున్నది. 'ఏదో లేదు' అనే వెలితి కాస్తా కనబడకుండా పూడుకుపోతుంది.

❖

ఓ త్యాగశీలా! మరొక సూక్ష్మగ్రాహ్యమగు విషయం చెప్పుచున్నాను విను. నీవు ఆయా వస్తువులను విశేషములను త్యజించావు. బాగున్నది. అనగా, అవన్నీ నీకు త్యాజ్యవస్తువులు గానూ, నీవేమో త్యజించువాడవు గానూ ఉన్నావు కదా! అట్లాగే ఇన్నిటినీ త్యజిస్తున్న నీవు కూడా (అహంకారం) నిన్ను త్యజించ గల మరొక వస్తువునకు త్యాజ్యవస్తువై ఉన్నావు.

అయితే త్యాజ్యవస్తువును (అహంకారాన్ని) నీవు నీ స్వరూపంగా (లేక) ఆత్మగా అనుకుంటున్నావు ఇంకొక విధంగా చెప్పాలంటే, ఏ అహంకారంతో నేను ఇది వదులుతాను, అది వదులుతాను... అని చిలుక పలుకులు పలుకుచున్నావో ఆ 'నేను, నేను' అనబడు అహంకారమే అసలైన త్యాజ్యవస్తువు. అట్టి అహంకారాన్ని వదలకుండా అహంకారానికి విషయములై ఉంటున్న ఈ దేహాదులను వదిలితే ఏం లాభం? ఈ కారణం చేతనే నీకు సర్వత్యాజ్య ప్రయోజనమైన సర్వాత్మత్వం చేకూరటం లేదు.

❖

ఇంకొక చమత్కారమైన, ఘనీభూతమైన సత్యం చెబుతాను విను. ఎవని చేత ఈ సమస్తం త్యజించబడుతుందో ఆతడు సర్వమునకు అప్రమేయమై ఉన్న ఆత్మ స్వరూపుడే అవుతాడు. ఆత్మ చేతే ఈ జగత్తంతా అవధరించబడుతోంది అనగా భూత-భవిష్యత్-వర్తమానాలలో ఉన్నట్టి ఈ జగత్తంతా కూడా ఆయా జగద్విషయములచే అపరిచ్ఛిన్నమగు నీ - నా ఆత్మ చేతనే ధరించబడినదగుచున్నది. చూచావా? సర్వమూ త్యజించినవాడు సర్వమును ఆక్రమించిన వాడే అగుచున్నాడు.

**యేన సర్వం పరిత్యక్తం తస్యన్ శూన్యేఽపి సంస్థితం ।**
**జగత్సర్వం త్రికాలస్థం తన్తౌ ముక్తావలీ యథా ॥**

ఆ సమస్తమూ పరిత్యజించిన వారియందు, లేక ఆ విషయ శూన్యరూపుని యందు - ఒకే దారమునకు ముత్యములన్నీ గ్రుచ్చబడినట్లు - ఈ జగత్తులన్నీ కూడా స్థితి నొందియున్నవై ఉంటాయి.

తైలం లేని దీపం ఏ విధంగా వస్తువులన్నీ పరిత్యజిస్తుందో అట్లా ఈ సమస్తమును అహంకారంతో సహా పరిత్యజించావనుకో... అప్పుడు తైలం గల దీపం వలె ఈ సర్వం నీ స్వరూపంచే ప్రకాశమానమైనదగుచున్నది. అనగా, చిత్తము నందు ఉన్న సర్వ పదార్థములనూ త్యజించి తైలం లేని దీపం వలె ఎవడు శాంతి పొందుతాడో అట్టివాడు సర్వత్యాగ రూపమగు ప్రకాశాత్మగా ఉద్భవిస్తున్నాడు. అప్పుడు తైలం గల దీపం వలె సర్వసమన్వరూపుడై వెలుగొందుచున్నాడు.

**శిఖిధ్వజుడు:** ఒక గృహం స్తంభాలచే నిలబెట్టబడి ఉంటోంది. స్తంభం కూలిపోతే ఇల్లు పడిపోతుంది కదా! చిత్తం త్యజించబడితే చిత్తం చేత నిలబెట్టబడుచున్న ఈ దేహం కూడా నేల కూలుతుందా?

**కుంభమహర్షి:** నీవడిగిన ప్రశ్నకు సమాధానంగా ఒక దృష్టాంతం చెబుతాను విను. ఇప్పుడు నీవు రాజ్యాన్ని, నీ సతీమణి చూడాలను, ఇక్కడికి నేను వచ్చిన తరువాత ఈ కుటీరాన్ని, తదితర పరికరాలను త్యజించావు. అన్నీ వదలినా కూడా వాటన్నిటినీ వదలుచున్న నీవు ఉండియే ఉన్నావు కదా!

**శిఖిధ్వజుడు:** నేను లేకుండా ఎందుకుపోతాను? వాటిని వదిలేది నేనే కదా! ఆ వదలుచున్నట్టి నేను ఉంటే కదా, వదలటమనేది!

**కుంభమహర్షి:** బాగా చెప్పావు. అట్లాగే చిత్తమును త్యజించుటచే ఏర్పడే సర్వత్యాగానంతరం కూడా జ్ఞానరూపమగు ఆత్మ శేషించియే ఉంటుంది. ఈ దేహ – జీవాహంకారం మటుమాయమై తత్‌స్థానంలో సర్వాత్మత్వం, అప్రమేయత్వం పరిఢవిల్లుతాయి.

**సమస్త వస్తుదాహేఽపి యథా త్వం నేఽతరోనృప ।**
**సర్వత్యాగత ఏవాజ్ఞ యథా నిర్వాణముచ్యతే ॥**

రాజా! అన్ని వస్తువులను అగ్నికి ఆహుతి చేశావు. అయినా కూడా నీవు ఉన్నావు. అట్లాగే సర్వత్యాగం చేసిన తరువాత కూడా ఏ ఆత్మగా ఈ దేహం ఉన్నప్పుడు లేనప్పుడు కూడా శేషిస్తావో – దానినే మోక్ష శాస్త్రం 'నిర్వాణం' అని పిలుస్తోంది. అది నీకంటే అన్యమైనదేదో కాదని గ్రహించు.

గొప్ప ప్రకాశవస్తువులగు సూర్య–చంద్ర–నక్షత్రాలన్నీ శూన్యమగు ఆకాశాన్ని ఆశ్రయించుకొని ఉంటున్నాయి కదా! అట్లాగే పదార్థవిషయ శూన్యమగు చిత్స్వరూపమే సమస్త జ్ఞానానికి ఆశ్రయమై ఉన్నది. ఒకడికి ఆకాశంపై కోపం వచ్చి ఒక ఉలిని తీసుకుని ఆకాశాన్ని బాదనారంభించాడనుకో... అసంగం, ఉదాసీనం అయినట్టి ఆకాశాన్ని ఉలి దెబ్బలు బాధించగలవా? 'సర్వత్యాగం' అను అమృతపానం చేసిన మనుజుని ఈ జన్మ–జర–మరణాది వ్యవహారములు స్పర్శించనైనా లేవు. ఇక బాధించటమనే ప్రసక్తి ఎక్కడిది?

**సర్వత్యాగో మహత్త్వస్య కారణం నిర్మలద్యుతేః ।**
**సర్వం త్యజసిచేత్ అస్మాత్‌బుద్ధిః స్థైర్యం బృహత్తమమ్ ॥**

అన్నిటి కన్నా కూడా సర్వత్యాగం మహత్తరమైనది. ఎందుకంటావేమో? సర్వం త్యజించినప్పుడే నీ బుద్ధి స్థిరత్వం పొందినదై మనో నిర్మలం అనుభవమౌతుంది. తద్వారా బుద్ధికి సర్వోత్తమత్వం ప్రాప్తించగలదు.

సర్వత్యాగమే పరమానందమైనది, దానికి భిన్నమైన సమస్తం దారుణమైన దుఃఖానికి కారణమై ఉంటోంది.

కనుక చిత్తాన్ని, అహంకారాన్ని ఎలా త్యజించాలో బాగా విచారణ చేసి, గ్రహించి తదనుకూల మైన ఉపాయాలను ఆశ్రయించి ఉండమని నా విన్నపం. వేద వేదాంగాలు ప్రతిపాదించే 'ఓం' అను సంజ్ఞ యొక్క అర్థాన్ని అంగీకరించినవాడవై, ఆ అర్థసారాన్ని ఆశ్రయించినవాడవై ఆ తరువాత ఇక నీ ఇచ్ఛానుసారం ఏది ఎట్లు ఉచితమనుకుంటావో అట్లే ఆచరించు. పైగా, మరొక చమత్కారం విను.

సముద్రం బడబాగ్నిలోకి జలాన్ని త్యాగం చేస్తోంది. ఆ జలం ఆవిరై ఆకాశంలో మేఘ రూపం పొందుతోంది. ఆ మేఘం వర్షించి నదీనదముల రూపంలో తిరిగి సముద్రంలో ప్రవేశిస్తోంది. ఎవడెంత త్యాగం చేస్తాడో తిరిగి అంతయూ పొందుతాడు. సర్వమూ త్యాగం చేశాడా, సర్వమూ పొందుతాడు. రాజుగారికి రాజ్యంలోని సర్వమూ ప్రాప్తించినదే అయినట్లు చిత్తత్యాగరూపమగు సర్వత్యాగముచే సదా, సర్వత్రా సమస్తము ప్రాప్తించినదే అవుతుంది.

పాత్ర గనుక ఖాళీగా ఉంటే మనం అందులో మధురమగు పళ్ళరసముతో నింపవచ్చు. అట్లాగే మనస్సు నుండి నాది, నాకు కావాలి, నాకు ఉండాలి... అను రూపంలో ఉండే అజ్ఞానమును, తత్సంబంధిత భావపరంపరావ్యవహారములను త్యజిస్తే అట్టి సర్వత్యాగస్థితియందు మాత్రమే ఆత్మప్రసాదకమగు జ్ఞానము వర్ధిల్లుతుంది.

అట్టి సర్వత్యాగమహేశ్వరులగు ఎందరో మహనీయులు ఈ భూమిపై సర్వకాలాల్లో ఉన్నారు. ఉదాహరణకు శాక్యముని (బుద్ధదేవుడు) సంశయరహితుడై మేరుపర్వతం వలె స్థితి కలిగి ఉన్నారు.

**సర్వత్యాగో, మహరాజ! సర్వసంపత్సమాశ్రయః ।**
**న గృహ్ణాతి హి యత్కించిత్ సర్వం తస్మై ప్రదీయతే ॥**

మరల చెప్పుచున్నాను. సర్వత్యాగమే సమస్త సంపదలకు ఆశ్రయమై ఉన్నది. ఎందుకంటే ఎవడు ఏది గైకొనడో, ఆతనికి అది ఇవ్వబడుచున్నది.

అందుచేత మహారాజా! సర్వపరిత్యాగం చేయి, అప్పటికీ "ఏకాంతం, స్వస్థం, ఆకాశం" వంటి ఏ నీ రూపం శేషించియే ఉందో, అట్టి రూపుడవే అయి ఉండు. నీవు అంతా త్యజించావు. మంచిదే. అయితే అంతటితో ఆగకూడదు. ముఖ్యంగా, ఏ మనస్సుతో ఇదంతా త్యజించావో అద్దానిని కూడా త్యజించు. అభిమాన, అహంకారాలను కూడా పరిత్యజించు.

"ఈ రాజ్యము, భార్య, ఈ పరిసరములు మొదలైనవి నావి కావు" అని ఏ విధంగా ఒక్క క్షణంలో నిర్ణయించుకున్నావో... అదేరీతిగా, "ఈ మనస్సు, అభిమానము, అహంకారం – ఇవేవీ నావి కావు " అనే నిశ్చయాన్ని ఆశ్రయించుకొని ఉండు. అప్పటి నీ స్థితియే ముక్తి, మోక్షం కూడా!

❖❖❖

# 29.బ్రహ్మముకాక మరింకెక్కడా ఏ ఇతరమైనదీ లేదు

శిఖిధ్వజుడు అంతా శ్రద్ధగా వింటూ కొంచెంసేపు మౌనం వహించాడు. తరువాత ప్రశాంత – సమగ్రత్వములను వహించి ఉన్న కుంభర్షి ముఖం వైపు చూచాడు.

**శిఖిధ్వజుడు:** మీరు చెప్పినదంతా అత్యంత శ్రద్ధగా జాగరూకుడనై విన్న తరువాత 'ఈ చిత్తమును (లేక) మనస్సును త్యజించటమెట్లా?' అని యోచించాను. ఆకాశంలోని పక్షి, చెట్టుపై గంతులేసే కోతి లాగా ఈ మనస్సును నేను మాటిమాటికీ త్యజించటానికి ప్రయత్నించినప్పటికీ మరల వచ్చి

పడుతూనే ఉన్నది. ఈ మనస్సును ఎట్లా పట్టుకోవాలో తెలుసు కాని, ఆయా పదార్థములను త్యజించినట్లు మనస్సును (లేక) చిత్తమును ఎట్లా త్యజించాలో మాత్రం నాకు ఏమాత్రం అవగతం కావటం లేదు. మీరు నాకు రెండు విషయాలు తెలియజేయాలి.

1. ఈ చిత్తం, లేక, మనస్సు స్వరూపం ఏమిటి? 2. దీనిని పరిత్యజించే విధానమేమిటి?

**కుంభమహర్షి:** అనేక జన్మలుగా శబ్ద దృశ్య స్పర్శాది విషయాల పట్ల ఈ జీవునికి అభిమానం, అభిలాష, ఆకాంక్షలతో కూడిన ఒకనొక అనుబంధం ఏర్పడుతోంది. సంకల్పాల నుండి అభిలాష, అభిలాష నుండి అభ్యాసం, సుదీర్ఘ అభ్యాసం నుండి వాసనలు ఏర్పడుచున్నాయి. అట్టి వాసనలే చిత్తం యొక్క రూపం. వాసనలకు పర్యాయపదమే చిత్తం. అంతకుమించి చిత్తమనగా మరింకేమీ కాదు.

**శిఖిధ్వజుడు:** అట్టి చిత్తాన్ని జయించటం అంత తేలిక అంటారా, ఏదో మీ బోటి మహత్తర జన్మలను పొందిన వారికి తప్పితే?

**కుంభమహర్షి:**

**త్యాగస్తస్యాతి సుకరః సుసాధ్యః స్పన్దనాదపి,**
**రాజ్యాదపి అధికానందః కుసుమాదవి సుందరః ॥**

రాజర్షీ! నా ఉద్దేశంలో చిత్తత్యాగం చాలా తేలికైన పని. తప్పకుండా సాధ్యమే. ఊపిరి పీల్చు కోవటం కన్నా కూడా తేలికైనది. రాజ్యాధిపత్యం కన్నా పోల్చలేనంత ఆనందకరమైనది. పుష్పం కంటే కూడా అత్యంతరమణీయమైనది.

అయితే మూర్ఖత్వం ఎవరు వహించి ఉంటారో, వారికి నేను చేయగల ఉపకారమేదీ లేదు. ఒక సామాన్య పౌరుడు చక్రవర్తి కాగలడా? ఒక పువ్వుతో వింధ్యపర్వతాన్ని కదల్చగలమా? అట్లాగే ఆత్మజ్ఞులు చెప్పే ఉపాయాలను సంకోచిస్తూ పెడచెవిన పెట్టే మూర్ఖులకు, అల్పమైన ఆశయాలకై తాపత్రయపడే వ్యర్థజీవులకు అది దుస్సాధ్యమని నేననక తప్పదు.

**శిఖిధ్వజుడు:** మహాత్మా! వాసనలచే వ్యాకులమైనట్టి ఈ చితం యొక్క స్వరూపమేమిటో మీ వచనాల ద్వారా నేను గ్రహించాను. అందుకు మీకు కృతజ్ఞతలు కూడా వ్యక్తం చేస్తున్నాను. అయితే అట్టి చిత్తత్యాగం విషయానికి వచ్చేసరికి అది వజ్రం మింగటం కంటే కూడా చాలా దుస్సాధ్యమని నా కనిపిస్తోంది. మీరేమో "అబ్బే! అది చాలా తేలికయ్యా"! అని ప్రవచిస్తున్నారు.

మీరంటే నారదమహర్షి పుత్రులు. తపోసంపన్నులు. బ్రహ్మదేవునిచే జ్ఞానం ప్రసాదించబడినట్టి మహామహిమాన్వితులు. మీకు చిత్తాన్ని జయించటం ఒక లెక్కలోనిది కాదు. మరి మా సంగతేమిటి? ఈ చిత్తం మాకు సంసార దుర్గంధాన్ని, దుఃఖదాహాన్ని తప్పించుకోవటానికి వీలు కానట్టి జగద్వ్యవహారా లను, ఏమాత్రం అర్థంకాని మోహాన్ని, విషయాల వైపుగా పతనాన్ని, అనేక దేహపరంపరలను కలుగజేస్తోంది. పైగా, ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టుకోలేడు కదా! రాజాధిరాజులను కూడా పాదాక్రాంతం చేసుకోగల మహావీరుడగు చక్రవర్తి కూడా అంతఃపురంలో మహారాణి ముందు దాసోఽహమన్నట్లు మేము ఈ చిత్తానికి దాసులమై అనువర్తిస్తున్నాం. మా హృదయంలోనే ఉదయించి

ఉన్న ఈ చిత్తాన్ని త్యజించటమెట్లా? బాహ్యవస్తువునైతే ఒక్కక్షణంలో వదలవచ్చు. హృదయంలో తిష్ఠ వేసుకుని ఉన్న చిత్తాన్ని వెడలగొట్టటమెట్లా? అధిగమించటం ఎట్లా కుదురుతుంది?

**కుంభమహర్షి:** చిత్తత్యాగం తేలిక అను, లేక కష్టమను. ఏది ఏమైనా చిత్తం యొక్క సమూల నాశనమే సంసార క్షయం. చిత్తం త్యజిస్తేనే ఈ జీవునికి నిశ్చింత. లేదా తిప్పలు తప్పవు. అంతకు మించి వేరే మార్గం లేదు. చిత్తమును నశింపజేయాలంటే ఆ చిత్తమును త్యజించాలి.

**శిఖిధ్వజుడు:** మహాత్మా! మీ వాక్యామృతం గ్రోలటం చేత "చిత్తత్యాగం చేతనే చిత్తం యొక్క నాశనం ఒనగూడుతుంది" అనే విషయం నేను బాగా గ్రహించాను. కానీ ఏం లాభం? ఈ చిత్తం యొక్క అభావం ఎట్లా సంపాదించాలో నేను ఏమాత్రం గ్రహించలేకపోతున్నాను. ఈ విషయమై మార్గమేమిటో చెప్పి నన్ను కాపాడండి.

**కుంభమహర్షి:** శాఖ-ఫల-పల్లవాలుగా విస్తరిల్లిన మహావృక్షం వంటి ఈ చిత్తానికి బీజం 'అహంకారం' అను జ్ఞానమే! అట్టి వృక్షమును సమూలంగా పెల్లగించాలంటే నీవు ఆకాశం వలె సువిస్తార హృదయుడవు కావాలి. అనగా నీ హృదయాన్ని నిరావరణంగా, విక్షేపరహితంగా తీర్చిదిద్దుకోవాలి.

**శిఖిధ్వజుడు:** (కొద్ది నిమిషాలు తనలో యోచన, తర్జన భర్జనలు చేసుకున్న తరువాత) ఓ మునీశ్వరా! ఇప్పుడు నాలో చిత్తవృక్షం గురించి మరికొన్ని ప్రశ్నలు ఉదయిస్తున్నాయి.

ఈ చిత్తము యొక్క మూలమేమిటి? దీని ఉత్పత్తి స్థానమేది? ఇది ఎట్లా అంకురిస్తోంది? దీని యొక్క శాఖలు, కాండము ఏమై ఉన్నాయి? దీనిని సమూలంగా పెల్లగించటమెట్లా?... ప్రభో! మీ పాదములంటి ప్రణమిల్లుచున్నాను. ఈ విషయాలన్నీ నాకు తెలియజేయండి.

**కుంభమహర్షి:** ఈ చిత్త వృక్షమునకు మూలం అజ్ఞానముచే ఉదయించే అభిమానమునకు కర్తయగు జ్ఞాతయే! పరమాత్మను ఆశ్రయించియున్న మాయయే దీని క్షేత్రం.

ప్రప్రథమంగా ఉత్పన్నమైన ఈ చిత్తం నుండే "పరిచ్ఛిన్న అహం" అను నిశ్చయరూపమైనట్టి, అనుభవాత్మకుడైనట్టి చిదాభాసుని అంకురం జనిస్తోంది. నిశ్చయాత్మకమై నిరాకారమైనట్టి చిత్తక్షేత్రంలో వెలసిన దానినే "బుద్ధి" అని పిలుస్తున్నారు. నిజానికి "నిర్వికారం, నాశరహితం" అయిన చైతన్యమే మిథ్యాభూతమై 'చిత్తం' అనే ధర్మంతో సంబంధం కల్పించుకున్నదై "జీవుడు" అనే నామధేయానికి అర్హమగుచున్నది. కనుక చిత్తక్షేత్రం ఏర్పడి ఉన్న స్థానం కూడా ఆత్మయే!

ఆ చిత్తం నాడి, బొమికలు, రక్తమాంసాలతో కూడిన ఈ భౌతిక దేహాన్ని నిలబెట్టి ఉంచటానికి గృహస్తంభం వంటిది అగుచున్నది. అనగా ఈ దేహం ఉద్భవమవటానికి మూలం చిత్తం. మధ్యలో అనుభవమయ్యే వాసనలు కూడా చిత్తమే. బాహ్య-అభ్యంతరాలలో కూడా వృక్షరసస్వరూపం వంటిదై ఈ దేహం పడిపోకుండా రక్షిస్తోంది. ఇంద్రియానుభవాలన్నీ చిత్తవిన్యాసం కాక మరింకేమీ కాదు.

ఓ రాజా! చెట్టు కొమ్మలను త్రెంచినట్లుగా మొట్టమొదట చిత్తరూప ప్రసరణములగు విషయ భోగాసక్తులను త్రెంచుకుంటూ పోవాలి. అద్వితీయమగు ఆత్మదర్శనం చేత ఈ చిత్త వృక్షాన్ని సమూలంగా నశింపజేయాలి. ఇదీ నీవు చేయవలసిన పని!

**శిఖిధ్వజుడు:** మహానుభావా! ఇప్పుడు మీరు రెండు విషయాలను ఆజ్ఞాపించారు–

1. చిత్తముచే ఏర్పడుచున్న విషయభోగాసక్తిని ఉపశమింపజేయటం;
2. ఆత్మాసాక్షాత్కారంచే చిత్తమును సమూలంగా నశింపజేయటం.

ఈ రెండు ఇప్పుడు నా కర్తవ్యములై ఉన్నాయని ఒప్పుకుంటున్నాను. అయితే, వీటినిప్పుడు నేను ఎట్లా సాధించగలనో సవివరములతో కూడిన ఉపాయములేమైనా చెప్పండి.

**కుంభమహర్షి:** క్రమంగా చిత్తము నుండి "కర్మలు–కర్మఫలాలు–కర్తృత్వం–భోక్తృత్వం" అనే భ్రమాత్మక విషయములను బయల్వెడలగొట్టటం అభ్యసించు. అప్పుడు చిత్తము తప్పక స్వాధీనమవగలదు. అటుపై చిత్తము చిత్‌స్వరూపమై విరాజిల్లుచున్నది.

**శిఖిధ్వజుడు :** మరి అవశ్యంగా నిర్వర్తించవలసి ఉన్న ఫల – క్రియాదుల విషయమేమిటి? వాటిని త్యజించమంటారా?

**కుంభమహర్షి:** ఈ చిత్తం ఫల–క్రియాదులతో కూడిన వాసనల రూపంగా ప్రకటితమౌతోంది. అట్టి ఫల–క్రియాదులందు ఆసక్తిని కలిగి ఉండకపోవటమే. (అనాసక్తి కలిగి ఉండటమే) ఈ చిత్తమును జయించే ఉపాయం. అట్టి అనాసక్తి ఎట్లా ఏర్పడుతుంది? అంతర్ముఖ వృత్తిచే సర్వ విషయాల కంటే మధురాతి మధురమైన ఆత్మ యొక్క విచారణ చేస్తూ ఉంటే క్రమంగా ఫల–క్రియాదులందు ఆసక్తి స్వయంగా సన్నగిల్లుతుంది. అట్లు ఫలక్రియాదుల వైపుగా ప్రసరించే ఆసక్తులను త్యజించి మౌనివై, శాంతుడవై సర్వవాదోపవాదాలను త్యజించు. ఆత్మ విచారణలో మాత్రమే తత్పరుడవగుము.

ఓ రాజా! ఈ దృశ్య విషయాల పట్ల అనాసక్త బుద్ధిని పెంపొందించుకో. అట్టి అనాసక్త బుద్ధిచే యథాప్రాప్తాలైన కర్మలను ఆచరిస్తే, అంతరంగంలో తిష్ఠవేసుకున్న ఈ చిత్తాన్ని అతి సులభంగా త్రెంచి వేయవచ్చు. పురుషప్రయత్నంచే విషయాభిముఖ స్వభావాన్ని ఛేదించుచుండగా అప్పుడు ఈ చిత్త వృక్షాన్ని ఛేదించటం సులభతరం అవుతుంది. ఏది ఎట్లా ఐనా సరే, ఈ చిత్తవృక్షాన్ని సమూలంగా పెరికివేయటంలోనే ఈ జీవుడు అధిక ప్రయత్నశీలుడై ఉండాలి. అనగా, చిత్తవృక్ష శాఖయగు విషయాభిలాష త్యజించటం గౌణమైతే, మూలాన్నే ఛేదించటం ప్రధానమైన కార్యక్రమమని గ్రహించు.

ఓ మహారాజా! ఈ విధంగా ఆత్మవిచారణ పరాయణుడవై, ముఖ్యంగా చిత్తవృక్షం యొక్క మూలచ్ఛేదనమునందు తత్పరుడవైతే అప్పుడు శీఘ్రంగా "అచిత్తత్వదశ" ప్రాప్తించగలదు.

**శిఖిధ్వజుడు:** చిత్తవృక్షమును దహింపజేయటంలో నాకు ఉపకరించే 'అగ్ని' ఏది?

**కుంభమహర్షి :** "నేనెవరు? నా వాస్తవమైన స్వభావం ఏమిటి"? అనే ప్రశ్నను చిట్టచివరి వరకు విచారణ చేయి. స్వస్వరూపానుభవ సాక్షాత్కారం వరకు ఆ విచారణ కొనసాగించు. అట్టి విచారణయే చిత్త వృక్షమును మొదలంట దహించి వేయగల అగ్ని.

**శిఖిధ్వజుడు :** మహర్షీ! "నేను ఎవరు?" అను ప్రశ్నను నా స్వబుద్ధితో చాలాసార్లు విచారణ చేశాను. అయినా కూడా...

**కుంభమహర్షి :** చేశావు కదా! మంచిది. అయితే నీ స్వబుద్ధిచే చేసిన విచారణచే నీవెవరో చెప్పు?

**శిఖిధ్వజుడు :** నేనీ ఎదురుగా కనబడే జగత్తును కాదు. జగత్తు నాది కాదు. నేను జగత్తుకు సంబంధించినవాడను కాను. ఈ పృథివి, పర్వతాలు, ఇక్కడి వనాలు, ఆకుల కదలికలు నేను కాదు. ఇవి నాకు సంబంధించినవి కావు. నేను వీటికి సంబంధించినవాడను కాను. అట్లాగే, జడమాత్రములై ఉండటం చేత కాళ్ళు, చేతులతో కూడిన ఈ దేహం మొదలైనవి కూడా నేను కాదు.

**కుంభమహర్షి :** బాగు బాగు.

**శిఖిధ్వజుడు :** కర్మేంద్రియాలు గాని, జ్ఞానేంద్రియాలు గాని నేను కాదు. మనస్సును కాదు. బుద్ధిని కాదు. జడమే అయి ఉండటం చేత 'అహంకారము' కూడా నేను కాదు.

ఓ దేవఋషీ! బంగారపు ఉంగరంలో బంగారం – ఉంగరం అనునవి వేరు వేరు వస్తువులు కాదు కదా! బంగారంలో ఉంగరం అనబడు మరొకటెక్కడున్నది? అట్లాగే చిదాత్మయందు జడమగు అహంకారం వేరుగా లేదు. మృగతృష్ణ, ముత్యపుచిప్పలో వెండి అసద్రూపాలే అయినప్పటికీ భ్రమ చేతనే ప్రసిద్ధములై ఉంటున్నాయి కదా! అదే విధంగా జడమగు అహంకారం కూడా అసత్తు మాత్రమే. లేక, అది ఆత్మ యొక్క ఆసక్తి రూపం. ఆసక్తికి వేరుగా అహంకారం లేనే లేదు. అట్లాగే – 14 లోకాలకు ఆధారం శబ్దాది విషయాలు. ఆ శబ్దాది విషయాలకు ఆది కారణం ప్రకృతి కదా!... అట్టి ప్రకృతి కూడా చిదాత్మయందు వేరుగా లేదు. మునీశ్వరా! ఈ విధంగా అహంకార మలం యొక్క మార్జనం (Washing off) ఎరిగియే ఉన్నాను. అయితే, ఆ ఆనందైక సాక్షి చైతన్యమును మాత్రం ఎరగలేకపోతున్నాను. బహుశః అందుచేతనే ఇంకా దుఃఖితుడనై మిగిలిపోతున్నాను.

**కుంభమహర్షి :** పాపరహితుడవు, బుద్ధిమంతుడవు అగు ఓ శిఖిధ్వజ మహారాజా! శరీరం దగ్గర నుండి అహంకారం వరకు నీవు కావని బుద్ధితో గ్రహించానని అంటున్నావు. సంతోషం! నీవు ఏవేవి కావో చెప్పుచున్నది యుక్తి–యుక్తమే! ఇంతకీ నా ప్రశ్న 'నీ వెవరు?' అని కదా! ఇవేవీ నీవు కాకపోతే ఇంతకీ నీవేదై ఉన్నావో, అది చెప్పు.

**శిఖిధ్వజుడు :** హే దేవపుత్రా! అదీ చెబుతాను వినండి. ఎద్దానియందైతే ఇటు జడరూపాలగు శబ్ద–స్పర్శ–రూప–రసాది విషయాలు... అటు వాటి సంబంధితమైన ఆనందం అనుభూతమగు చున్నాయో, ఎద్దాని యందు ఈ బుద్ధి యొక్క వృత్తులు ఆరూఢమై తద్వారా ఈ సమస్తము యొక్క విభాగం నిర్ణయించబడుచున్నదో, అట్టి శుద్ధ చిన్మాత్ర సాక్షి చైతన్యమునే నేను.

కానీ, అంతటి శుద్ధుడనగు నాకు ఏ కారణం చేతనో ఈ దేహాహంకారమునందు, "దీనికి నేను చెందినవాడను"... అను రూపంతో కూడిన ఆత్మాభిమానం సంలగ్నమై ఉంటోంది. అట్లు నిష్కారణంగా ఎందుకు అట్టి సంలగ్నమేర్పడుతోందో నాకు అర్థమవటం లేదు. అంతేకాదు 'బ్రహ్మపదం' అని దేనిని అంటున్నారో నేను గ్రహించలేకపోతున్నాను. హే మహర్షీ! చాలా కాలంగా ఎంతో ప్రయత్నించి కూడా 'ఆత్మయొక్క ఆవరణం' అనదగిన అసలైన అనాత్మరూప అహంకారాన్ని నేను రహితం చేయ లేకపోతున్నాను. కాబట్టే మహద్దుఃఖాన్ని అనుభవిస్తున్నాను.

**కుంభమహర్షి :** అట్లాగా? ఏ మహాదోషము నీయందు సంలగ్నమైనట్లు నీ కనిపిస్తోందో, దేనిచే నీవు సంసారివై పడి ఉంటున్నావో, అట్టిది సత్తయా? లేక అసత్తయా? కొంచెం యోచించి చెప్పు?

**శిఖిధ్వజుడు :** మహాత్మా! అది సత్తయో, అసత్తయో నాకు తెలియదు. "చిత్త వృక్షమునకు బీజము" అని మీరు చెప్పిన అహంకారం గురించి కూడా నాకు పెద్దగా తెలియదు. దానిని వదలించుకునే ఉపాయమేమిటో నాకు తెలిసిరావటం లేదు. ఒకవేళ ఎలాగో అలా దానిని త్యజించాననుకోండి... మరల ఎటువైపు నుంచో మరింత బలం పుంజుకుని అది కొద్దిసేపట్లో వచ్చిపడుతోంది!

**కుంభమహర్షి :** ఓహో! అదా సంగతి? బాగా ఉన్నది. అయితే ఈ ప్రపంచంలో ఒక కార్యం ఉన్నదీ అంటే, దానికొక కారణం ఉండియే తీరాలన్నది ఒక సుప్రసిద్ధమైన సిద్ధాంతం కదా! ఒకవేళ కారణం లేకనే ఏదైనా కార్యం ఉన్నట్లుంటే అది రెండవ చంద్రుడు (మెల్లకన్నులకు కనబడే రెండు చంద్రబింబాలు) వలె లేనిదే అగుచున్నది. కాబట్టి కారణమనేదే లేకపోతే, అట్టిది బాగా పరిశీలించుట చేత లేనిదిగానే (అసత్తుగానే) అగుచున్నది కదా!

ఇప్పుడు నా ప్రశ్న ఏమిటంటే... ఏ అహంభావం కారణంగా కలిగి మనస్సు, జగత్తు మొదలైన అంకురం ఉత్పన్నమైనదో, అట్టి అహంభావం ఏ కారణం చేత ఉత్పన్నమైనదని నీకు అనిపిస్తోందో కొంచెం సేపు స్వబుద్ధితో విచారించి నాకు చెప్పు.

**శిఖిధ్వజుడు :** (కొంచెంసేపు అంతరంగ మథనం చేసిన తరువాత) ఓ మునీశ్వరా! మీరు చెప్పినట్లు నేను అంతరంగంలో అహంకారం గురించి స్వబుద్ధితో పరిశీలన చేశాను.

ఈ దేహం, తదితర దృశ్య పదార్థములు ఏర్పడి ఉండి, అవి తటస్థించటం చేతనే అహంభావం ప్రస్ఫుటమౌతోంది. కనుక అహంభావం అను దోషానికి కారణం దేహంతో సహా ఏర్పడిన దృశ్యమేనని నాకు అనిపిస్తోంది. అట్టి అహంకారాన్ని ఎట్లా శమింపజేయాలో నాకు చెప్పండి. ఎందుకంటే చిత్తం ఒకవైపు విషయాల వైపు ఉన్ముఖమౌతుంటే అహంభావం దుఃఖములు కలిగించుట కొరకే జనిస్తోంది. విషం ఉపశమించటానికి ఔషధం సేవించినట్లు నేను విషయాల నుండి ఉపశమించటానికి ఏం ఔషధాలు వాడాలో చెప్పండి.

**కుంభఋషి :** ఓ రాజా! ఎరుగుచున్న ఈ చిత్తం (వేద్యం) ఎరుగబడుచున్న విషయాలు... ఈ రెండిటిలో దృశ్యమే చిత్తం యొక్క ఉన్ముఖమునకు కారణమని నీవు అన్నావు కదా! ఈ విషయమై, అనగా 1. "సంసారానుభావానికి చిత్తం కారణమా? 2. చిత్తమునకు లభిస్తున్న విషయాలు చిత్తాన్ని ప్రలోభపరుచుటచే దృశ్య విషయాలే కారణమా?" అనే విషయం మరికొంత పరిశీలించి నీకేమనిపిస్తు న్నదో చెప్పు? దృశ్యం స్వతహాగా జడమైనప్పటికీ అద్దానికి చిత్తమును తన మార్గంలో స్పందింపజేయ టానికి స్పందనశక్తి ఎట్లా లభిస్తోందో యోచించు.

**శిఖిధ్వజుడు :** ఓ మునీంద్రా! వేద్యం (చిత్తం), వేదనం (విషయం); మరియు చేత్యం, చేతనం... ఈ ఉభయ ద్వంద్వాలు ఏర్పడటానికి కారణం దేహం, తదితర పదార్థముల ఉనికియేనని నాకు అనిపిస్తోంది. కళ్ళకు కనబడకపోవుటచే అసత్యం వలె అనిపించే వాయు వీచికలే వృక్షం యొక్క కదలికలకు కారణమగుచున్నట్లు జడములే అయినప్పటికీ శరీరాది వస్తువులు ఉన్నాయి కాబట్టి వాటిని గూర్చిన విజ్ఞానం ఉదయిస్తోంది. శరీరమే లేకపోతే ఇంద్రియాలుండేవి కావు. ఇంద్రియాలు

లేకపోయినా, వాటికి విషయమగుచున్న పదార్థాదులు లేకపోయినా వేదన, బంధం (తెలియబడుటచే ఏర్పడే సాంసారిక వ్యవహారం) ఉండేది కాదు. అయితే, ఈ దేహాది వస్తువుల 'అభావము'ను నేను సంపాదించుకుని ఉంటే అప్పుడు విషయముల సంబంధ – బంధనములు నాకు ఉండేవి కాదేమో! అభావం ఎట్లా సంపాదించుకోవాలో నాకర్థమగుట లేదు.

**కుంభమహర్షి :** ఓ రాజా! ఈ దేహాది పదార్థముల సత్త యథార్థంగా ఉండి ఉంటే నీవు చెప్పినట్లు వాటి యొక్క జ్ఞానమునకు అవియే కారణమని మనం అనవచ్చు. దేహాదుల సత్తయే లేదు కదా! మరి ఈ దేహాదులకు అనుభవాన్ని కలిగింపజేసే మనస్సును స్పందింపజేసే స్వయంశక్తి ఎక్కడున్నది?

**శిఖిధ్వజుడు :** దేవమునీ! ఏ వస్తువు యొక్క స్వరూపం, ఆకారం, తదితర లక్షణాలు ప్రత్యక్షంగా లభ్యమగుచున్నాయో, ఇక అది 'అసద్రూపం' అని మీరు ఎట్లా వ్యాఖ్యానిస్తారు? "అది వెలుగునిస్తున్నప్పటికీ వాస్తవానికి అది చీకటి"... అనటం కుదరదు కదా!

కాళ్ళు, చేతులు మొదలైనవన్నీ కలదై, క్రియాఫలయుక్తమై స్పష్టంగా ఉన్నట్లు సత్తుగా అనుభూతమగుచున్న ఈ దేహం 'లేనిది' ఎట్లా అవుతుంది?

**కుంభమహర్షి :** మనం ఇప్పుడు ఒకసారి అనుకున్నట్లు ఒక వస్తువు యొక్క 'కారణం' లేనిదే అయినప్పుడు, ఇక ఆ కార్యవస్తువు కూడా లేనిదే అవుతుంది. అద్దాని జ్ఞానమేదైతే ఉన్నదో అదంతా భ్రమ మాత్రమే అవుతుంది. ఇప్పుడీ శరీరం విషయానికి వద్దాం. శరీరముండటం చేతనే బంధనం ఉంటోందని నీవు అన్నావు కదా! ఈ శరీరం ఏ కారణం చేత ఏర్పడి ఉంటోంది? బీజమే లేకపోతే వృక్షం కూడా లేనిదే అయినట్లు కారణం లేకపోవుటచే ఈ 'దేహం' అనబడే కార్యం కూడా లేనిదే అగుచున్నది. ఎండమావులలోని జలం యొక్క అనుభవం ద్రష్ట యొక్క భ్రమ వల్లే కలుగుచున్నట్లు... ఏ కార్యమైనా సరే కారణం లేకపోతే అది లేనట్లే. అందుచేత ఓ మహారాజా! ఈ శరీరం, తదితర దృశ్య వ్యవహారం అసత్తు అయి ఉన్నాయి. అనగా, ఈ శరీరం, ఈ దృశ్యం మొదలైవి ద్రష్ట యొక్క మిథ్యాభ్రమచే ఉదయించినవిగా ఎరుగుము.

ముత్యపు చిప్ప మిలమిల మెరుస్తోంది కాబట్టి అందులో వెండి లభిస్తుందంటే ఒప్పుకుంటావా? 'ఆకాశంలో రెండవ చంద్రుడు నాకు కనిపిస్తున్నాడు' అని ఒక మెల్లకన్నువాడు అంటే, నీవు రెండవ చంద్రుని ఉనికి అంగీకరిస్తావా?... 'గొడ్రాలి రెండవ కుమార్తె చాలా అందంగా ఉంటుంది' అని ఎవరైనా అంటే ఆ సౌందర్యవర్ణనం నీకు నమ్మదగినదౌతుందా?... వాటన్నిటికీ కారణం అలభ్యం. కాబట్టి కార్యం కూడా లేదు. అట్లాగే 'ఈ శరీరాదులు కారణ రహితమగుటచే లేవు'... అని గ్రహించు. అది అసద్రూపమే.

**శిఖిధ్వజుడు :** కళ్ళకు కనబడే శరీరము, దృశ్యము లేవంటున్నారే? దేహమునకు కారణం లేదని ఎందుకనుకోవాలి? "ఈ దేహోత్పత్తికి తండ్రియే కారణం" అని ఎందుకనరాదు?

**కుంభమహర్షి :** వాస్తవానికి తండ్రి అనబడువాడు, అతని దేహాదులు కారణరహితమైయున్నాయి. అసత్తు నుండి ఉత్పన్నమైనదంతా అసత్తేనని చెప్పక తప్పదు కదా! బీజం లేకుండా వృక్షం సంభవించనట్లు

...పదార్థములకు కార్యములకు కారణం ఉండాలి. ఆ కారణమును 'బీజము' అని పిలుస్తున్నారు. బీజకారణం లేనిదే అయినప్పుడు అట్టి దాని గురించిన జ్ఞానము కూడా భ్రమయే అవుతుంది. నిర్బీజమైన వృక్షము భ్రమమాత్రమే అయినట్లు ఈ దేహములు, వాటితో కల్పన చేసుకోబడే బాంధవ్యములు ఇవన్నీ మతి యొక్క భ్రమయేనని సిద్ధాంతీకరించబడుతోంది.

**శిఖిధ్వజుడు :** ఈ దేహంలాగానే, తండ్రిదేహం, ఆ తండ్రి దేహమునకు కారణమైన తాతదేహం కూడా అకారణమవటం చేత అసత్ దృశ్యం అని తేలుస్తున్నారు. ఒక దేహం అసత్ కనుక, ఆ అసత్ నుండి వచ్చిన మరొక దేహం కూడా అసత్తేనని మీరు నిర్ణయిస్తున్నారు. ఇంతవరకు, పోనీ, మీరు చెప్పినదే కాసేపు ఒప్పుకుందాం. ఈ ముల్లోకాలలోని ప్రజాసృష్టిస్రష్టలగు ఋషులున్నారు కదా! మనువు, దక్షుడు, మరీచి మొదలైన ఋషులు ఆదిపురుషులని, వారే ఈ పుత్ర – పిత్ర – పితామహాది సమస్త ప్రాణికోట్ల సంతతికి కారణమని పురాణములలో చెప్పబడినది కదా! కాబట్టి ఈ దేహానికి పూర్వాతి పూర్వమైన కారణం ఉన్నట్లే కదా! మరి అకారణమని ఎందుకనుకోవాలి? ఈ సృష్టి జీవుల దేహాలన్నిటికీ ఆదికారణం ఆది పితామహుడగు హిరణ్యగర్భుడేనని మనం నిర్ణయించవచ్చు కదా!

**కుంభఋషి:** కారణం యొక్క అభావం (లేక) అలభ్యం చేత అది పితామహుడు కూడా ఈ జీవ–దేహాల వల్లే లేనివాడై ఉన్నాడు. ఎందుకంటే కారణం లేనప్పుడు ఇక ఏ పదార్థాల ఉనికి లేనట్లే!

**శిఖిధ్వజుడు :** సముద్ర జలంలోని మొట్టమొదటి తరంగం వలె చిత్ సాగరంలోని ప్రప్రథమ విజ్ఞాన తరంగమే ఈ హిరణ్యగర్భుడు అని వేదజ్ఞులు ప్రవచిస్తున్నారు. ఆతని సంకల్పమే ఈ జడ – చేతన జగత్తు. అట్టి సమష్టి సృష్టి విజ్ఞానం (లేక) ప్రజ్ఞ యొక్క కార్యమగు ఈ జగత్తు మనకు ఎదురుగా ఉన్నది కదా! కార్యం ఉన్నది కనుక కారణమగు సృష్టి ప్రజ్ఞకు యజమానియగు (కర్తయగు) హిరణ్యగర్భుడు ఉండి తీరాలి. మీరు 'హిరణ్యగర్భుడు కూడా కారణం లభించని కారణంగా లేనే లేడు' అని ఎట్లా నిర్ణయిస్తున్నారో నాకు అర్థమగుటలేదు. "సృష్టి ఉన్నది గాని, సృష్టికి కర్తలేడు" అని మీరు అంటుంటే 'కుండ ఉన్నది గాని, మట్టి లేదు, వస్త్రం ఉన్నది గాని దూది లేదు, గోడ ఉన్నది గాని ఇటుకలు లేవు"... అన్న వాక్యాల వలె అర్థరహితం కాదంటారా?

**కుంభఋషి :** ఓహో...అదా నీ సందేహం? కొన్ని సిద్ధాంతాల ద్వారా పితామహుడగు హిరణ్యగర్భుడు లేనివాడేనని భ్రమచే ఉన్నట్లు దర్శించబడుచున్నదని మనం నిరూపించుకోవచ్చు.

**1. కాలమునకు అతీతమైనదే సత్యం! -** ఏది సత్యమో, సత్తయో అది త్రికాలాబాధ్యమై ఉండాలి. కాలమునకు లోబడినవన్నీ భ్రమ మాత్రమే! లేక అసద్వస్తువులే! లేక అసత్యమే!

ఏదైనా ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకపోతూ ఉంటే దానిని త్రికాల బాధితము అంటాం. కాలము చేత వచ్చి కాలము చేత పోయేది సద్వస్తువు కాదు. "నిన్న లేదు. కానీ ఈ రోజున ఉన్నది. మరి రేపటి రోజుకు లేకుండా పోతోంది" అనునదేదైనా సరే, వాస్తవానికి లేనిది. మరి ఉన్నట్లు అనిపిస్తోందే? అట్లా అనిపించటానికి కారణం అసత్‌దృష్టి, అల్పమైన (లేక) సంకుచితమైన అవగాహన, నిత్యానిత్యముల అవివేకము అని అనక తప్పదు.

"సమష్టి సృష్టి ప్రజ్ఞాస్వరూపుడగు పితామహుడు (హిరణ్యగర్భుడు) బ్రహ్మం నుండి లేక చిత్ సాగరం నుండి ప్రకటితమయిన మొదటి తరంగం వంటివాడు"...అని నీవే అన్నావు కదా! అంటే ఆ సమష్టి సృష్టి ప్రజ్ఞకు ముందు ఏమున్నది? బ్రహ్మం లేక చిత్ సాగరం కదా! కనుక సృష్టి-కర్త కూడా సర్వదా వస్తుతః బ్రహ్మమే అయి ఉన్నారు. చిద్వస్తువే సర్వదా ఉన్నది. భ్రమ చేతనే హిరణ్యగర్భుని యొక్క ద్వితీయమైన ఉనికి అనుభవమౌతోంది.

**2. ఈ సృష్టిభ్రమయే -** సమష్టి సృష్టి ప్రజ్ఞ బ్రహ్మానికి వేరుగా లేదని, ఏది ఉన్నట్లుగా కనబడుతోందో అది భ్రమతో కూడిన దృష్టిచే అట్లనిపిస్తోందని అనుకున్నాం కదా! కనుక ఆ పితామహుని సంకల్పమగు ఈ సృష్టి, ఇందలి వ్యష్టి ప్రజ్ఞలు, సమష్టి ప్రజ్ఞలు భ్రమయే! సదా, సర్వదా ప్రజ్ఞయే ఉన్నది కాని, ఆ ప్రజ్ఞకు విషయాలగు ఈ దేహాలు, జీవులు, ఆ జీవుల జన్మ, కర్మఫలములు, ఆ జీవులకు బంధ మోక్షాలు ఏర్పడటం ఇవన్నీ భ్రమ మాత్రమే! భ్రమ కారణంగా గల తదనంతర విశేషాలన్నీ భ్రమయే కదా! కల్పనచే ఏర్పడియున్నవన్నీ కూడా కల్పనా విశేషాలే కదా! ఈ శరీరం, ఈ శరీరాన్ని ధరించే వ్యక్తిగత జీవుడు, ఆతని ప్రారబ్ధ-సంచిత-ఆగామి కర్మలు, జన్మమృత్యువులు, వ్యక్తికి వ్యక్తికి మధ్య కనబడే సంబంధ బాంధవ్యములు, మనవారు కానివారు, మనజాతి-వేరుజాతులు, భాషా-ప్రదేశ సంబంధమైన మానవ దేవత జంతు తదితర విభాగాలు ఇవన్నీ భ్రమయే. ఎండమావులే భ్రమ అయినప్పుడు ఆ భ్రమలోని ఒక తరంగానికి, మరొక తరంగానికి గల భౌతికపరమైన విభేదములు భ్రమ కాదా? కనుక హిరణ్యగర్భుని నుండి పురుగు వరకు ఉన్నది సద్వస్తువగు నిర్మల ప్రజ్ఞయే. అదియే బ్రహ్మం. విషయరహిత ప్రజ్ఞయే బ్రహ్మం. విషయ సహితమైనదంతా భ్రమయే.

**3. ఈ సృష్టి అంతా బ్రహ్మమే! -** ఒక వస్తువు నుండి ఏ కారణం లేకుండానే మరొక వస్తువు బయల్వెడలుతోందంటే ఆ రెండవ వస్తువు మొదటి వస్తువుకు భిన్నమైనది కాదు. జలంలోంచి ఏర్పడే తరంగం జలానికి భిన్నం కాదు. ఒక తరంగానికి, మరొక తరంగానికి మధ్య కనిపించే పొడవు, వెడల్పుల తేడా భ్రమయే. ఆ రెండు తరంగాలు జలమే కదా! జలానికి "తరంగం అను మరొకటి అగుట" అనే ధర్మం లేదు. తరంగంగా కనిపించేదంతే జలమే. అగ్నిజ్వాలలు అగ్ని నుండి వేరైనవి కావు.

అట్లాగే... నీవు చెప్పినట్లు చిత్ సాగరం నుండి ప్రప్రథమంగా బయలుదేరిన 'హిరణ్యగర్భుడు, పితామహుడు' అను పేర్లతో పిలువబడే సమష్టి సృష్టిప్రజ్ఞ (బ్రహ్మదేవుడు) ఆకాశంలోని ద్వితీయ చంద్రుని వలె, మట్టిని ఏమరచినట్టి కుండ వలె, బంగారాన్ని గమనించనప్పటి ఆభరణం వలె అసత్ దృష్టి ఫలితమే! లేక, భ్రమచే ఏర్పడిన అవగాహన, మరియు కల్పన మాత్రమే! ఈ విధంగా ఈ దేహ-జీవాదులంతా కల్పితానుభవములే!

ఈ విధంగా పితామహుడగు హిరణ్యగర్భుడు బ్రహ్మము కంటే వేరు కాదు. భ్రమ (లేక) అవిద్య విద్యచే మాసిపోతుంది. అజ్ఞానం తొలగితే బ్రహ్మమే సమష్టి సృష్టి ప్రజ్ఞగా తెలియవస్తుంది. ఈ కారణం చేత ఆ బ్రహ్మమే స్వరూపంగా గల సమష్టి ప్రజ్ఞా స్వరూపుని సంకల్పం నుండి ఏర్పడిన ఈ జీవ-జడ సృష్టి కూడా బ్రహ్మమే. బ్రహ్మానికి ఎక్కడైనా వేరుగా అనిపిస్తే అది భ్రాంతి మాత్రమే.

భూత-భవిష్యత్-వర్తమానాలలో ఉన్నదంతా బ్రహ్మమే. బ్రహ్మం నిర్విషయమైనట్లే ఈ సృష్టి కూడా నిర్విషయమైనప్పటికీ భ్రమచే విషయ సమన్వితమైనట్లుగా గోచరిస్తోంది.

❖

ఓ శిఖిధ్వజా! ఈ విధంగా సత్ (పౌరాణికంగా విష్ణువు) యొక్క నాభి నుండి ఏర్పడిన హిరణ్యగర్భుడు, ఆ హిరణ్యగర్భుడు కారణం నుండి ఏర్పడిన మనువు, దక్షుడు, మరీచి మొదలైన ఋషులు, వారిచే కల్పన చేయబడిన ఈ సృష్టి అనే కార్యం - ఇవన్నీ కూడా బ్రాహ్మీ దృష్టిచే బ్రహ్మం, ద్వితీయ దృష్టిచే భ్రమ అయి ఉన్నాయి.

సృష్టి, జీవుడు, బంధం, మనస్సు, బుద్ధి ఇటువంటి ఏ దృఢప్రతీతి నీకు ఉండి ఉన్నాయో వాటిని త్యజించటమే సర్వత్యాగం. బ్రహ్మమునకు సంబంధించిన ద్వితీయత్వం నీ యందు - మన ఈ సంభాషణా బలిమిచే - నివృత్తమైనదని నేను తలచుచున్నాను. ఇక ప్రతిభాస మాత్రం చేత ఏ కొంచెంగాని ఇంకా శేషించి ఉన్నదో, అద్దానిని తత్త్వసాక్షాత్కారంచే రహితమొనర్చుకో.

ఓ రాజా! చైతన్యం కంటే భిన్నంగా కనిపించేదంతా అసత్త మాత్రమే. హిరణ్యగర్భుని దగ్గర నుండి ఒక గడ్డి వరకు కూడా ఆ సర్వస్వరూప దేవదేవుడే కార్య-కారణ పరంపరా రూపంగా వికసితుడై ఉంటున్నాడు. సర్వాత్మకుడు, అనునిత్య చైతన్యమూర్తి అగు ఆ ఈశ్వరుడు తన యందు తానే హిరణ్యగర్భుడు - వ్యక్తిగత జీవుడు మొదలైన నామరూపాలతో స్వయంగా ప్రదర్శితుడై ఉంటున్నాడు. కాబట్టి సమస్త ద్వైతం కూడా శాంతమగు బ్రహ్మరూపమే అయి ఉన్నది.

❖❖❖

# 30. 'అహంకారం' అనేది ఒక భ్రమ మాత్రమే

**శిఖిధ్వజుడు :**

**ఆబ్రహ్మ స్తంభపర్యంతం యద్యయం భాసతే భ్రమః,**
**అర్థక్రియాఽసమర్థశ్చ తత్కథం దుఃఖ కారణమ్?**

మహాత్మా! మీరు చెప్పినట్లు సృష్టికర్తయగు బ్రహ్మదేవుని నుండి గడ్డిపరక వరకు ఈ జగత్తంతా మృగతృష్ణాజలం వలె మిథ్యగానే భాసిస్తోందని కొద్దిసేపు అనుకుందాం. ఇప్పుడు మృగతృష్ణా జలంలో నీరు త్రాగటం చేత ఎవరికైనా దాహం సమసిపోతుందా? లేదు కదా! కానీ ఈ జగత్ పదార్థాల విషయం అట్లా లేదే! ఇవన్నీ క్రియా సామర్థ్యాలై ఉన్నాయి. ఇక్కడి ఆహారం తింటే ఆకలి తీరుతోంది. జలం త్రాగితే దాహం పోతోంది. ఇవన్నీ ఎట్లా జరుగుచున్నాయి? ఈ వస్తు సముదాయం జీవునికి దుఃఖకారణం కూడా అగుచున్నది కదా? ఈ సుఖ దుఃఖాలు జీవునికి వస్తువు యొక్క ప్రాప్తాప్రాప్తాలచే కలుగుచున్నాయనేది మీరు కాదనటానికి వీలు లేదు కదా?

**కుంభమహర్షి :** ఓ రాజర్షీ! జలానికి భౌతికంగా కొన్ని ధర్మాలు కనిపిస్తున్నాయి. దానికి ఆకారం లేదు. అది చలిస్తుంది. త్రాగితే దాహం తీరుస్తుంది. స్పర్శిస్తే సుతిమెత్తగా స్పర్శాస్పర్శంగా అనుభవ

మవుతుంది. అయితే, అది జలం శీతలత్వం చేత గడ్డ కట్టిందనుకో. మంచుగడ్డగా ఘనీభూతమై ఆవిర్భవించిన ఆ జలానికి ఇప్పుడు ఆకారం ఏర్పడుతోంది. పొడవు, వెడల్పులు కనబడుచున్నాయి. బాగా దాహంగా ఉన్నవాడు మంచుగడ్డను మ్రింగటం అనుకూల విషయం కాదు కదా! ఆ ఘనీభూతమైన మంచుగడ్డలో కత్తి ఆకారం నిర్మించబడితే, అట్టి మంచు ఖడ్గంతో ఒక అరిటి చెట్టును నఱకవచ్చు. అనగా మంచుతో నిర్మించిన వస్తువుకు జలమునకు లేని ధర్మాలు అగుపిస్తున్నాయి. ఆ నీరు ఆవిరి అయినప్పుడు వేఱువేఱైన ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయి. కాని కఠినమగు మంచుగడ్డతో నిర్మించబడిన వస్తువు జలముకన్నా వేరా? నీటికన్నా నీటి ఆవిరి వేరా?

సత్య సంకల్పుడగు ఈశ్వరుని భావనయే ఈ జగత్తు. భ్రమ రూపమగు ఈ జగత్తు ఆయా అర్థక్రియాదులచే వ్యాపించి ఉన్నది. అట్టి అర్థక్రియాదుల పరిమిత దృష్టిగల వారికి జగద్భావన వెనుక గల భావనారాయణుడు అగుపించటం లేదు.

ఈ ఎదురుగా ఉన్నదంతా అజ్ఞానముచేతనే అనేక అజ్ఞాన విషయ పరంపరా సమన్వితమై అగుపిస్తోంది. అజ్ఞానం శిథిలం అవుతూ ఉంటే క్రమంగా జగదనుభవం కూడా శిథిలమై వస్తూ ఉంటుంది. మూల అజ్ఞాన నాశనంచే ఈ జగత్తు యొక్క రాహిత్యం అనుభవం కాగలదు.

నేను చెప్పే ఈ విషయం అనేక మంది విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. (ఉపనిషదాది) వేదాంత వాఙ్మయంలో గ్రంథస్తమయ్యే ఉన్నది. కనుక ఇది నేను క్రొత్తగా చెప్పుచున్నది కాదు. నీవు నీ ప్రియురాలు చూడాల కూడా అనేకసార్లు ఆత్మజ్ఞానం వినియే ఉన్నారు.

అజ్ఞానం ఉన్నంతవరకూ ఈ జగత్తు ఉండియే ఉన్నట్లు అనుభవమై తీరుతుంది. అజ్ఞానం తొలగినదా, నీ దృష్టిలో ఈ జగత్తు లేనిదని తెలిసిపోతోంది.

అజ్ఞానం తొలగేది ఎట్లా? "నేతి, నేతి" ...అను అవాస్తవత్యాగరూపమై నిరోధాభ్యాసంచే నీ యొక్క బాహ్యాకారవృత్తి స్థూలత్వం నుండి వైదొలగి సూక్ష్మత్వం సంచరించుకుంటుంది. అట్టి దృష్టి యొక్క సూక్ష్మత్వంచే అజ్ఞానం వైదొలగి నీ అంతరంగమందలి ఆ ప్రదేశంలో జ్ఞానం వెల్లివిరుస్తుంది. అట్టి జ్ఞానం యొక్క ప్రకాశంచే పరమపదం లేక, 'ఆత్మయొక్క సాక్షాత్కారం' లభిస్తోంది. అప్పుడు జగత్తు యొక్క సంపూర్ణ విలయం లభిస్తోంది. ఈ జగత్తులో ఏ వస్తువైనా సరే... సూక్ష్మత్వం పొందుతూ ఉంటే క్రమంగా అద్దాని వర్తమాన స్థూలత్వం వైదొలగగా క్రమంగా అది అకారాదుల యొక్క సంపూర్ణ రాహిత్యమును పొందుతుంది. ఏ జీవుడైతే వర్తమానంలో ఈ దేహాన్ని ఉపయోగించి స్థూలానుభవాలైన శబ్ద స్పర్శరూపాదులను, సంబంధ-బాంధవ్య-అసంబంధ-అబాంధవ్యములను, సంచిత-ఆగామి -ప్రారబ్ధాది కర్మవాసనలను దర్శిస్తున్నాడో... అట్టి ఆతడి దృష్టి స్వస్వరూపజ్ఞానబలిమిచే సూక్ష్మత్వం పొందగా అప్పుడు 'నేను జీవుడను- ఇది సాధన- అది లక్ష్యం' మొదలైనవన్నీ పోయి 'అఖండం - అప్రమేయం అగు ఆత్మయే నా స్వరూపం' అనే నూతనానుభవం సర్వే సర్వత్రా వెల్లివిరుస్తోంది.

**అనేనైవ క్రమేణైవం త్వమాదిపురుషో నృపః**
**భ్రమాకారోదయం విద్ధి మృగతృష్ణాంబువత్ స్థితమ్ ॥**

ఓ ప్రియమహారాజా! క్రమక్రమంగా అట్టి అజ్ఞానం యొక్క శైథిల్యం చేత చివరికి నీవే శుద్ధ చిన్మాత్రమగు ఆది పురుషుడవై, హిరణ్యగర్భుని ఉత్పత్తికి కూడా ముందే ఉన్న శుద్ధ చిత్ చైతన్యమై శేషించగలవు. ఇకప్పుడు నీ అనుభవం ఈ జగత్తు విషయంలో మరొకటిగా ఉంటుంది. అనగా చైతన్యం కంటే భిన్నంగా కనబడుచున్న ఈ దృశ్యజగత్తు మృగతృష్ణలోని జలతరంగాల గురించి అంతయూ ఎరిగిన వానివలె మిథ్యారూపమై అనుభవం కాగలదు. బ్రహ్మదేవుడే (సమష్టిసృష్టి అను కర్తృత్వమే) స్వతహాగా లేడని, తద్వారా ఈ ప్రాణిసమూహమంతా కూడా ఆ రీతిగానే భ్రమచే దర్శన మిస్తున్నాయని అప్పుడు నీవు ఒప్పుకుంటావు. స్వయంగా ఏదైతే ప్రసిద్ధమైలేదో, అద్దానిచే ఏ కార్యం సిద్ధించగలదు చెప్పు? మృగతృష్ణాజలంలాగా ఉదయించిన ఈ ప్రాణి కోట్ల యొక్క ఏ బాహ్య రూపం నీకిప్పుడు అనుభవమౌతోందో, అదంతా కూడా తత్త్వవిచారణచే ముత్యపు చిప్పలోని వెండి లాగా 'అకారణం కనుక ఇవి లేవు. ఉన్నదల్లా సర్వాత్మకమగు చైతన్య మొక్కటే' అని ఎవరూ కొత్తగా చెప్పకుండానే గ్రహిస్తావు. మరల సిద్ధాంత పరంగా ఒక వాక్యం చెప్పుచున్నాను.

**కారణాభావతః కార్యమభూత్వా భవతీతి యత్**
**మిథ్యాజ్ఞానాదృతే తస్య నరూపముపపద్యతే**

కారణం లేకుండానే ఎక్కడైనా ఏదైనా కార్యం ఉన్నట్లనిపిస్తే అట్టిదాని రూపం మిథ్య మాత్రమే.

**మిథ్యాదృష్టి ప్రేక్షితం తు న కదాచనవిద్యతే**
**మృగతృష్ణాంబసా కేన ఘటకేః పరిపూరితాః?**

ఎవడైనా మృగతృష్ణలో ప్రవేశించి కుండ నిండా మంచినీళ్ళు నింపుకొని ఇంటికి తీసికెళ్ళగలడా? మిథ్యా దృష్టిచే మిథ్యయే లభిస్తుంది. మిథ్యాదృష్టిచే ఉదయించిన దేహి-దేహ సంబంధాది పదార్థములన్నీ వివేక దృష్టితో వీక్షించామా, ఇక వాటికి ఎక్కడా ఉనికి ఉండజాలదు.

**శిఖిధ్వజుడు :** మీరు చెప్పే యుక్తాయుక్త వాక్యాలు మహత్తరమైన అర్థం ప్రసాదిస్తున్నప్పటికీ ఇంకా నాకు ఒక అనుమానం కొంచెం శేషించియే ఉన్నది. అది ఏమిటంటే?... "ఆదిస్రష్ట అయినట్టి బ్రహ్మదేవునికి అజం - అవ్యక్తం - శాంతం, అచ్యుతం... అయినట్టి పరబ్రహ్మం కారణమై ఉన్నది" అని మనం ఎందుకు అనుకోకూడదు? అప్పుడు ఈ సృష్టికి కారణం ఉన్నట్లే అవుతుంది కదా!

**కుంభమహర్షి :** ఓ రాజా! నీవు అడిగిన ప్రశ్నలోనే సమాధానం కూడా ఉన్నది. అయినా, నీకు సమాధానం చెప్పుచున్నాను విను. నీవు వేద వేదాంతోపన్యాసాలు నీ ప్రియురాలు చూడాలతో కూడి విన్నావు కదా! శ్రుతి వాక్యాలు కొన్ని ఇక్కడ ఉదహరిస్తాను.

నేహ నానాఽస్తి కించన (ఇక్కడ నానాత్వమనేది కించిత్ కూడా లేదు); తదేదత్ బ్రహ్మపూర్వ మతఃపరమ్ (ఇప్పుడు, మరొకప్పుడు కూడా బ్రహ్మము బ్రహ్మముగానే ఉన్నది); అసంగోహి అయం పురుషః (ఈ జీవుడు వాస్తవానికి దేనితోనూ సంగము లేనివాడు)... ఇటువంటి వాక్యముల నిర్వచనము, విశ్లేషణము నీవు విని ఉన్నావు. వాటి గురించి నీ భార్య చూడాలతో సంభాషించావు కదా! వీటిని బట్టి గ్రహించవలసిన దేమిటి?

కూటస్థమగు బ్రహ్మము పరిణామరహితం, అద్వయం, ప్రపంచాతీతం, సదా నిర్వికల్పం, నిర్గుణం కదా! అట్టి బ్రహ్మమునందు కార్యకారణ కల్పన ఎక్కడున్నది? అది సమష్టి ఇచ్ఛాజ్ఞాన స్వరూపమగు (లేక, సమష్టి సృష్టి కర్తయగు) బ్రహ్మదేవుని సృష్టికి కారణమై ఉండటమేమిటి?

ఓ రాజా! బ్రహ్మము సర్వదా కార్యకారణ భావవర్జితమైయున్నది. శుద్ధ బ్రహ్మము లేక ఆత్మ దేనికీ కార్యముగాని కారణముగాని అవదు, అవజాలదు. ఒక నాటకంలోని ఒక పాత్ర యొక్క గుణగణాలకు ఆ పాత్రధారి కారణమా? కార్యమా? ఏదీ కాదు కదా!

కర్త – కర్మ – కారణ రహితమైన, ఉపాదాన – నిమిత్తకారణ వర్జితమైన, అప్రతర్క్యమైన తర్కముచే పొందుటకు, నిరూపించుటకు విషయము కానట్టి అవిజ్ఞేయమైనట్టి బ్రహ్మము 'హిరణ్యగర్భుడు' అను సృష్టికర్తను సృష్టించుటకు కారణమెట్లా అవుతుంది?

ఇంద్రియములను వెలిగించేది ఇంద్రియములకు విషయం కాజాలదు. కన్నును పనిచేయింపజేసే విషయ విజ్ఞానశక్తి ఆ కళ్ళకు కనబడే నామరూపాత్మక వస్తువు ఎట్లా అవుతుంది? అందుకే అది 'అవిజ్ఞేయము' అనే బిరుదుకు అర్హమగుచున్నది.

బ్రహ్మం దేనికీ కారణం కాదు. కాబట్టి అది సర్వదా కర్తృత్వ రహితమై ఉన్నది. ఒకవేళ 'కార్య కారణాత్మకమైన ఈ జగత్తు ఉన్నది" అని నీవు ఇంకా అనుకుంటున్నావనుకో... అప్పుడు, "ఈ జగత్తు అంతా ద్వైత–ఐక్య లక్షణ వర్జితం, దేశ–కాల–వస్తు పరిచ్ఛేదశూన్యం, అనాది, అనంతం, అయినట్టి బ్రహ్మమేగాని మరింకొకటేమీ కాదు" అను భావనను ప్రారంభించి దృఢపరచుకో.

**అప్రతర్క్యం, అవిజ్ఞేయం, యచ్ఛివం, శాన్తమవ్యయమ్,**
**తత్కథం కస్య కేనైవ కర్తృ–భోక్తృ కథా భవేత్?**

మనందరి వాస్తవ స్వరూపమగు బ్రహ్మము:

1. అప్రతర్క్యమైనది (IT IS NOT OBTAINABLE BY LONG ARGUMENTS) 2. అవిజ్ఞేయమైనది (IT CANNOT BE KNOWN BECAUSE IT ITSELF IS THE KNOWER) 3. శివం (శుభప్రదమైనది) 4. శాంతము 5. అవ్యయమైనది (IT IS IMPERISHABLE) ...అట్టి సర్వాత్మక బ్రహ్మము దేనికి కర్త అవుతుంది? దేనికి భోక్త అవుతుంది?

కనుక ఈ జగత్తు, ఇందలి పుత్ర – మిత్ర – కళత్రాది సంబంధములు, తదితర జగద్విషయములు దేనిచేతనూ నిర్వర్తించబడలేదు. కనుక అవన్నీ లేనివే అవుతాయి.

ఆత్మయే స్వరూపముగా గల నీవు ఇందు దేనికీ కర్తవు కావు. భోక్తవూ కావు. ఇదంతా కూడా జన్మరహితమై, శాంతమై, శివమై ఒప్పుచున్నది. ఈ జగత్తు దేని యొక్క కార్యమూ కాదు.

ఈ జగద్రూపమంతా మనం ఇంతవరకూ చెప్పుకున్నట్లు భ్రమ చేతనే సిద్ధించుచున్నదగుచున్నది. ఇదంతా దేని యొక్క కార్యమూ కానందున ఈ ఆవిర్భూతమై కనబడు సృష్టి లేనిదే అని మరల నిర్ణయించి చెప్పుచున్నాను. ఇక్కడి పదార్థాల అభావమే వాస్తవమైన సిద్ధి. ఆ పదార్థాల భావనయో... అవాస్తవమైన

సిద్ధి. పదార్థాలే లేనప్పుడు, ఇక వాటి యొక్క జ్ఞానం మాత్రం ఎక్కడున్నది? ఆ జ్ఞానాన్ని ప్రకటించే అహంకారం మాత్రం ఎక్కడున్నది. కాబట్టి నీయందు 'అహంకారం' అను దోషం ఉండటానికే వీలు లేదు. ఒకవేళ ఉంటే అది భ్రమ యొక్క విన్యాసం మాత్రమే. అనగా, తెలియబడే ఈ జగత్తు భ్రమ అయినట్లే, అహంకారం కూడా భ్రమయే. కాబట్టి నీవు శుద్ధుడవు.సదా విముక్తుడవు. ఆత్మరూపుడవగు నీకు బంధమోక్షాలు ఉండటానికి ఎప్పుడూ వీలులేదు.

**శిఖిధ్వజుడు :** ఓ దేవర్షీ! తమరు యుక్తియుక్తంగా ఉత్తమమైన కథనం ప్రవచించారు. ఔను. మీరు సెలవిచ్చినదంతా అక్షరసత్యం.

1. బ్రహ్మము దేహ–జగత్తులుగా పరిణమించటానికి కారణమే లేదు. 2.బ్రహ్మం ఈ జగత్తుకు కర్త కాదు. 3. కర్త అనేవాడే లేడు కనుక ఈ జగత్తు స్వతహాగా లేనిదే అయి ఉన్నది. 4. జగత్తే లేదు కనుక నామరూపాత్మకమైనదంతా భ్రమచేతనే అనుభవమవటం జరుగుతోంది. 5. భ్రమ తొలగటం చేత "బ్రహ్మమే సర్వదా బ్రహ్మం నందు నెలకొని ఉన్నది"...అని నిర్మల దృష్టిచే తెలియవచ్చుచున్నది. పై ఐదు ఉత్తమ వాక్యాలు నాకు ప్రస్ఫుటమౌతున్నాయి.

కనుక ఈ నామరూపాత్మక జగత్తుకు మాతాపితలు చిత్తాహంకారాలే. అయితే చిత్త – అహంకారాలు ఏ క్షణమందునూ కొంచెం కూడా లేవు. ఈ విధంగా 1.జగత్తు, 2.చిత్తం, 3.అహంకారం – మొదలైనవి "లేనివే" అవటంచేత నేను శుద్ధుడను, విబుద్ధుడను, శివస్వరూపుడను అయి ఉన్నాను.

చైతన్యానికి వేరైన విషయ సమూహాలు ఏమాత్రం లేవని మీరు బోధించారు. మీరు చెప్పుచుండగా ఒకవైపు వింటూనే, మరొక వైపుగా పదార్థాల గురించి మీరు చెప్పిన కోణం నుండి విచారణ చేస్తూనే ఉన్నాను.

అధ్యారోపం (లేనిది ఆరోపించటం); అపవాదం (ఉన్నది సరిగ్గా గుర్తించకపోవటం)... ఈ రెండు మార్గములలో నేను ఇంతకాలంగా మత్తుడనై భ్రమిస్తూ సుదీర్ఘకాలం గడిపివేశాను. ఈ రెండు మార్గాలను మీ వాక్యాలు ప్రసాదించిన జ్ఞాన కాంతిచే పరిశీలించగా ఇప్పుడు అహంకారం మొదలుకొని ఈ దృశ్యప్రపంచం వరకు సమస్త పదార్థాలు అసత్యాలుగా, బాలుని వినోద–విషాదాల వలె, భ్రమ–లీలా మాత్రంగా తెలిసిపోతున్నాయి. తత్ఫలితంగా సమస్తం బోధించబడుటచే ఇక నేను ఆకాశకోశం వలె విక్షేపరహితుడనై ఉన్నాను.

అట్టి నా స్వరూపానికి నేనే నమస్కరిస్తున్నాను. చిరకాలానికి దేశ–కాల–క్రియా సమూహ సహితమైన పదార్థ దృష్టి శమించింది. ఇప్పుడిక నేను అవినాశినై, నిర్వికారుడనై, బ్రహ్మాత్ముడనై స్థితి నొంది ఉన్నాను. శాంతుడను, తృప్తుడను అయి సర్వత్రా వెలయుచున్నవాడనని నన్ను నేను దర్శిస్తున్నాను. నేను ఎక్కడికీ పోవటం లేదు. ఎక్కడి నుండీ వచ్చుట లేదు. ఉదయించటం లేదు. అస్తమించటం లేదు. ఎప్పుడూ ఎట్లున్నానో ఎప్పటికీ అట్లే ఉండి ఉంటున్నాను. తమరు కూడా అట్లే ఆనందైక రస స్వరూపులై సర్వదా ఉండండి.

నేను ఆత్మస్వరూపుడను. శుద్ధుడను. శివస్వరూపుడను. పవిత్రుడను. మౌన స్వరూపుడను.

❖

ఇట్లు అఖండ బ్రహ్మాకారం ఉదయించటం చేత ఆ శిఖిధ్వజుడు బ్రహ్మము నందు ఘనీభూత మౌనస్వరూపుడై, శాంతిస్వరూపుడై ప్రకాశించాడు. గాలి వీచని చోట నిశ్చలంగా ప్రకాశించే దీపం లాగా రెండు ఘడియల కాలం నిశ్చలుడై ఉండిపోయాడు.

❖❖❖

## 31. బ్రహ్మము యథాతథంగా ఉండి ఇక్కడ వినోదిస్తోంది!

**శ్రీవసిష్ఠ మహర్షి :** కుంభఋషి రాజు వైపు చూచాడు. ఆతడు శీఘ్రంగా నిర్వికల్ప సమాధి వైపు అభిముఖం అవుతున్నట్లు గమనించాడు. తన యొక్క స్వలీలచే ఆతనిని త్వరితంగా ప్రబోధితం చేశాడు. కుంభుడు సంకల్పశక్తిచే పిలిచిన ఆ పిలుపును అందుకుని శిఖిధ్వజుడు మెల్లగా సమాధి నుండి బహిర్ముఖుడైనాడు. కుంభుని వైపు కృతజ్ఞతలను తెలుపుచూ కనులు తెరిచి చూచాడు.

❖

**కుంభర్షి :** ఓ రాజా! నీవిప్పుడు అజ్ఞాన నిద్ర నుండి మేల్కొన్నావు. శివరూపుడవై చెన్నొందుచున్నావు. ఇంతలోనే నిర్వికల్ప సమాధిలో ప్రవేశిస్తుండటం గమనించి నిన్ను ఈ భౌతిక ప్రపంచం వైపుగా అభిముఖం చేశాను.

అమృతానంద స్వస్వరూపాన్ని గ్రహించిన తరువాత ఇక ఈ దృశ్యాన్ని అస్తమింపజేయుట చేత గాని, అస్తమింపజేయక పోవుటచేత గాని వచ్చే ప్రయోజనం లేదు. నిష్ప్రయోజనమూ లేదు. ఒక్క పర్యాయం ఆత్మను దర్శించిన తరువాత నీ ఇష్టానిష్టాలన్నీ నశించాయి. నీవు ఇప్పుడు సమస్త కల్పనల నుండి విముక్తుడవై వెలయుచున్నావు. జీవన్ముక్తుడవయ్యావు. ఇక మోహకారణాలు నీయందు లేవు.

❖

శిఖిధ్వజుడు ఆ కొద్ది క్షణాలలోనే విశ్రాంతి చిత్తుడై, ముక్తాత్ముడయ్యాడు. కుంభఋషిచే మేలుకొలుప బడ్డాడు కదా! లీలామాత్రంగా దృశ్యవస్తువు యొక్క సత్తను గాంచుచు కుంభుని వైపు చూచి ఇట్లు పలికాడు.

**శిఖిధ్వజుడు :** హే పరమజ్ఞాతా! కుంభ మునీంద్రా! మీరు ఇప్పటిదాకా వచించిన దానిని అనుసరించి నాకు అంతా సుబోధకమైనది. అయినప్పటికీ బోధ యొక్క సుదృఢత కొరకై మరల ఒక చిన్న ప్రశ్న అడగాలని అనిపిస్తోంది.

**శివే శాంతే నిరాభాసే పదే అనుల్లసితాత్మని,**
**ద్రష్టృ దర్శన దృశ్యాఖ్యో విశ్వాత్మా ప్రత్యయః కుతః?**

శివమై, శాంతమై, నిరాభాసితమై సర్వదా అప్రకటితమైన ఆత్మయందు 1. ద్రష్ట, 2. దర్శనం, 3. దృశ్యాల – సమావేశమగు ఈ దృశ్య ప్రపంచ ప్రతీతి ఎట్లా, ఎక్కడి నుండి, ఎందుకు ఏర్పడుతోంది?

**కుంభమహర్షి :** మహారాజా! నీవు చక్కటి ప్రశ్న వేశావు. వాస్తవానికి అజ్ఞానావరణము తొలగుటచే నీవు స్వయంప్రకాశకుడగు సూర్య భగవానునివలె ప్రకాశిస్తున్నావు. నీ కింక ఏ శంకలూ లేవని

నాకు తెలుసు. అయినా కూడా నీ ప్రశ్నకు సంబంధించిన విషయం మనం ఇంకా చర్చించలేదు కనుక, నీ ప్రశ్న వర్తమానానికి సముచితమే. విను, చెపుతాను.

❖

అనేక పదార్థములచే పూర్ణమైనట్టి ఈ చరాచర ప్రపంచం నీకు కనిపిస్తోంది కదా! ఇదంతా కూడా ఒకానొకప్పుడు కల్పాంతంలో నశించబోవుచున్నది. ఆ మహాకల్పాంతమున అంతా నశించిన తరువాత ఇంకా శేషించేదేమైనా ఉన్నదా? నాశనానికి విషయమే కాని ఒకానొకటి ఉన్నది. అద్దానినే శాస్త్రజ్ఞులు ఆత్మ, సన్మాత్రం, చిన్మాత్రం మొదలైన పేర్లతో సంబోధిస్తున్నారు. అది వాక్యాలకు అందనిది. అయినప్పటికీ శిష్యవాత్సల్యంతో అది మాచే ఏవో ఆయా శబ్దాలతో వర్ణించబడుతోంది.

**అప్రతర్క్యమ్, అవిజ్ఞేయమ్, సమమ్, శివమ్, అనిందితమ్ ।**
**బ్రహ్మ నిర్వాణమాపూర్ణమాపూర్ణోదిత సంవిదా ॥**

ఈ విధంగా వాచాతీతమగు మనలోని ప్రతి ఒక్కరి స్వస్వరూపమే అగు ఆ బ్రహ్మము అనేక ఉత్తమ వచనములచే అద్దానిని దర్శించేవారిచే, వేదోపనిషత్ ఆదిగా గల ఆయా గ్రంథములచే ప్రవచించబడుతోంది. ఆత్మానుభవజ్ఞులు తమ వాక్కులచే మనకు ఇట్లు చెప్పుచున్నారు.

అప్రతర్క్యం, అవిజ్ఞేయం, సమం, సర్వత్రా ఏకరసము,శివము, నిర్వాణరూపం, సర్వత్రా ఉదయించినది, నిజబోధచే పూర్ణమైఒప్పునది ఆ బ్రహ్మము సూక్ష్మతర పదార్థముల కంటే సూక్ష్మమైనది. స్థూలతరపదర్థాములకంటే స్థూలమైనది. గురుతరములన్నిటి కంటే గురుతరమైనది. శ్రేష్ఠతర పదార్థములన్నిటి కంటే శ్రేష్ఠతరమైనది.

ఒక పరమాణువు కూడా మహా సూక్ష్మమగు ఆత్మయందు కొండంత స్థూలమనిపించుకుంటుంది. ఆ ఆత్మ ఎదుట ఆకాశము కూడా అత్యంత స్థూలమైనదే అవుతుంది. అది ఎంత స్థూలమైనదంటే, అద్దాని ఎదుట ఈ సమస్త బ్రహ్మాండము ఒక అణువు వలె గోచరిస్తుంది.

❖

ఓ రాజా! పూర్వ – తత్ పూర్వ కర్మానుసారం, అధ్యాసానుసారం కనిపించే అనేక ప్రాణికోట్లతో కూడిన ఈ జగత్తు యొక్క ఏ స్ఫురణ అనుభూతమౌతోందో, అదంతా కూడా 'పరమాత్మ నుండి ఉత్పన్నమైన బ్రహ్మదేవుని (సమష్టిగతమైన ప్రజ్ఞ యొక్క) అహంభావ రూపమగు జ్ఞానధ్యానము'... అని నీవు ఎఱిగి ఉండుము. ఆ బ్రహ్మదేవుని అహంభావమునందే ఈ జగత్తు విషయరూపమున స్థితి నొందియున్నది. అట్టి జగత్స్థితినే 'విరాడ్రూపం' అని కూడా పిలుస్తున్నారు.

❖

వాయువుకు, వాయు వీచికలకు భేదం లేనట్లు; శూన్యత్వం, ఆకాశాలు ఒక్కటే అయినట్లు; చిన్మాత్రం, అందులోంచి బయలుదేరిన అహంభావ స్ఫురణకు – ఏమాత్రమూ భేదం లేదు.

దేశకాలాలకు అసంబంధితమైన జలం వివిధ రీతులైన పేర్లతో (నదీనద నామధేయాలతో) అకారణంగా ఉన్నట్లే దేశ – కాల వస్తువులచే అపరిచ్ఛిన్నమగు పరమాత్మయందు అకారణంగా ఈ

జగత్తు స్థితి కలిగి ఉంటోంది. ఆకారరహితమగు బంగారం రకరకాల ఆకారాలచే రకరకాల ఆభరణ నామాలను (గాజులు, గొలుసు, ఉంగరం మొదలైన పేర్లను) పొందుతోంది చూచావా? తాను నిరాకారమై ఉండి కూడా బ్రహ్మం అకారణంగా వివిధ దేశ-కాల-వస్తు పరిచ్ఛిన్నమైన ఈ జగత్తును తనయందు ప్రకటీకరిస్తోంది. ఈ జగద్రూప రాజ్యానికి బ్రహ్మమే చక్రవర్తి. సర్వశ్రేష్ఠం, నాశరహితం, ద్వైతవర్జితం, నిర్మలం, శాంతం - అయినట్టి బ్రహ్మం యొక్క సమక్షంలో ఈ జగత్తు ఒక తృణం వలె అతి తుచ్ఛమై తోచుచున్నది. పరమ శ్రేయోదాయకమగు బ్రహ్మం ఉండటం చేతనే ఈ జగత్తు శోభను, సత్తను ప్రదర్శించగలుగుతోంది. ఇందలి సారం బ్రహ్మమే! బ్రహ్మమొక్కటే సర్వత్రా వ్యాపించి చిన్మాత్ర స్వరూపమై, నిరుపాధిక ప్రేమపదమై, అద్వితీయమై, ద్వైత - ఐక్యరహితమై సర్వదా ఉండి ఉంటోంది.

❖

పైన మనం ఇప్పటిదాకా వర్ణించుకున్న శాస్త్ర ప్రవచిత విశేషముల కారణంగా 'ద్వితీయమైన కల్పన' అనేది ఎక్కడా లేదు. సర్వదా పూర్ణమై, అక్షయమై, నిర్మలమైనట్టి ఆత్మతత్త్వమే ప్రకాశించుచున్నది. అది సదా సర్వరూపమై, సర్వాకారముగా ఉదయిస్తూ ఒప్పుచున్నది.

అయినా కూడా అది కళ్ళకు కనబడేది కాదు. చేతులచే నిర్వర్తించబడే కర్మ సంబంధితమైనది కాదు. అది వాటన్నిటికీ కార్యమూ కాదు, కారణమూ కాదు. ఆ బ్రహ్మము ప్రత్యక్ష - అనుమానములచే ఎక్కడో పొందబడేది కాదు. అయితే అది ఎవరికి వారే తమ అనుభవముగా ధ్రువీకరించుకోవలసినది.

ప్రపంచంలో ఏది పొందితే ఏం లాభం? నిరతిశయానంద స్వరూపం, సర్వశ్రేష్ఠం, సర్వరూపం, సర్వాత్మకం, అతి సూక్ష్మం, స్వచ్ఛం, అనుభవమాత్రం - అగు ఆ బ్రహ్మం ఒక్కటే మహత్తరసాధ్యమైన వస్తువు. 'చిన్మాత్రం, పరమాత్మ స్వరూపం' ఇత్యాది శబ్ద, తదర్థ రూపమై వ్యక్తావ్యక్త స్వరూపమై, నిరాభాసమై, దృక్ మాత్రమైనది ఆ బ్రహ్మం.

పరమార్థ దృష్టికి అది మాత్రమే సత్తు. వ్యవహారదృష్టికో అది అసత్తుగా అనిపించటమే ఇక్కడి చమత్కారం! ఇట్లు సత్ - అసత్ రూపంగా భాసించే బ్రహ్మమునకు కారణత్వం ఎట్లా సంభవిస్తుందో చెప్పు రాజా?

ఆ బ్రహ్మం నామ రూపరహితం. కాబట్టి దేనికీ బీజం కాదు, కారణం కాదు. కనుక, వ్యాపక రూపమగు ఆ పరమాత్మ నుండి ప్రమాణ, ప్రమేయాల రూపమగు ఈ జగత్తు కించిత్ కూడా జనించజాలదు. ఈ జీవుని అనుభవం ఎట్లా ఉన్నాసరే సర్వుల స్వరూపమగు ఆత్మ కర్త-కర్మ-కరణాది రహితమై ఉన్నది. సత్యమై, నాశనరహితమై, చిద్ఘనమాత్రమై, నిరాభాసమైయున్నది. ఆ ఆత్మస్వరూపం స్వయంగా అనుభవమాత్రమై ఉన్నదని మాత్రం తప్పకుండా సిద్ధాంతీకరించవచ్చు.

❖

కాబట్టి ఓ రాజర్షీ! మనం నీ ప్రశ్నకు సమాధానరూపంగా ఇప్పటి వరకూ చెప్పుకున్న దానిని అనుసరించి ఆ పరబ్రహ్మం నుండి ఏదీ ఉత్పన్నమగుట లేదు. ఎందుకంటే జలంలో

సకారణంగా పుట్టిన తరంగాలు జలం కంటే వేరని ఎవ్వరంటారు? ఇక బ్రహ్మం నుండి నిష్కారణంగా ఉత్పన్నమైన ఈ జగత్తు ఎట్లు ఎవనికి, ఎందుకు దేనికంటే భిన్నంగా లభించగలదు చెప్పు? ద్రష్ట లందరి స్వరూపం బ్రహ్మమే అయి ఉండగా ఒక ద్రష్టకు వేరొక ద్రష్ట నుండి అనుభవమయ్యేది బ్రహ్మం కాక మరేమిటి? 'దేశకాల వస్తువులచే అపరిచ్ఛిన్నమగు పరబ్రహ్మమున అకారణంగా ఈ జగత్తు ప్రదర్శితమౌతోంది'... అని ఇతఃపూర్వమే అనేక చోట్ల శాస్త్రకారులు నిర్ణయించి చెప్పారు. నీవు మీ రాజసభలో జరిగిన అనేక సత్సంగములలో ఈ విషయాలు – శాస్త్రజ్ఞుల ప్రవచనాలను వినియే ఉన్నావు కదా!

**శిఖిధ్వజుడు :** మహాత్మా! "జలములో తరంగాలు సకారణమై ఉన్నాయి. బ్రహ్మమున ఈ అహంకార – జగదాదులు అకారణమై ఉన్నాయి" అని మీరు చెప్పినప్పుడు ఈ సకారణ – అకారణ వ్యవహార మేమిటో నేను గ్రహించలేకపోతున్నాను.

**కుంభమహర్షి :** రాజా! విను.

పంచ భూతాల సమ్మేళనంచే జలం ఏర్పడుతోంది. ఆ జలంచే సముద్రం తయారగుచున్నది. బాహ్యమున వాయు ప్రసరణ కారణంగా జలం తరంగాల రూపంగా ప్రసరిస్తోంది. అందుచేత 'జల తరంగాలు సకారణమై ఉన్నాయి' – అవి మనం అంటున్నాం. బ్రహ్మం నుండి అహంకారం పుట్టుకకు కారణమేదైనా ఉన్నదా? ఎవరైనా చెప్పగలరా? లేదు. అందుచేత "బ్రహ్మం నుండి అహంకారం పుట్టటానికి సహకారిక కారణం లేదు' అని అనవలసివస్తోంది. కనుక 'బ్రహ్మం అహంకారంగానూ, జగత్తుగానూ పరిణమిస్తోంది' అని అనటానికి కుదరదు" అని చెప్పటానికే సకారణ – అకారణ పదాలను ప్రయోగించాను. అయితే 'బ్రహ్మం నందు అకారణంగా ప్రకటనమయ్యే అహంకార, జగదాదులు బ్రహ్మముకంటే వేరుకాదు' అనే సిద్ధాంతమును తత్త్వజ్ఞానం లేకపోతే ఎవ్వరూ ఎరుగ జాలరు. ఇక నీ విషయానికి వస్తే నీవు 'తత్త్వజ్ఞానం' (లేక) 'అద్వైతజ్ఞానం' ఎరిగియే ఉన్నావు కదా! కాబట్టి ఈ సిద్ధాంతం నీకు అత్యంత సులభంగా సుబోధకం కాగలదనే ఉద్దేశంతో అట్లా చెప్పాను.

ఓ రాజా! ఈ 'జగత్తు' గానీ, 'అహం' మొదలైనవిగానీ పరమాత్మయందు లేవు. కనుక ఈ జగత్తు జగత్‌శబ్దార్థరహితమైన శివమే (లేక) బ్రహ్మమే అయి ఉన్నది.

ఆకాశమునందు ఆకాశముకంటే సూక్ష్మమైన సంకల్పమయ ఊహానిర్మిత గంధర్వనగర రచన ఎట్లున్నదో, ఆకాశమునందు నిత్యశాంతమగు శూన్య సత్త ఎట్లు ఏర్పడి ఉన్నదో, ఈ జగత్తు కూడా ఆ విధంగానే ఈశ్వరుని యందు శూన్య సత్తారూపమై మౌనముగా ఏర్పడియున్నదని గ్రహించు.

ఈ జగత్తును చైతన్యరూపంగా గాని, లేక శూన్యరూపంగా గాని లెస్సగా ఎటిగానా, అప్పుడిది బ్రహ్మరూపమే కాగలదు. సమ్యక్ జ్ఞాన ప్రభావంచే ఈ జగత్తు అమృతతుల్యము కాగలదు. అట్లా కాకుండా, అసమ్యక్ జ్ఞానముచే చూచావా, ఈ జగత్తంతా కూడా అమంగళకరమై, మహాదుఃఖ ప్రదమై సంప్రాప్తించగలదు సుమా!

ఒకడు ఏ భావంతో ఏ అనుభవమును దర్శిస్తాడో, ఆతనికి అది అట్లే అనుభూతమవగలదు. మాయతో కూడిన ఈశ్వరుడు కూడా భావనను అనుసరించియే తత్సంబంధిత పదార్థ రూపమును

సంతరించుకుంటున్నాడు. (యద్భావమ్ తత్‌భవతి). ఒకడు అమృతమును 'ఇది విషము' అను భావనచే భుజిస్తే అది అట్లే అనుభవమవగలదు.

'జ్వాలా తిమిరము' (కంటికి వచ్చే ఒకానొక జబ్బు)చే ఆకాశంలో వెంట్రుకలు ముత్యములు ఉన్నట్లు అగుపిస్తాయి. అట్టి రూపములెన్ని కనిపించినా వాస్తవానికి అవన్నీ ఆకాశము మాత్రమే కదా! ఈ జగత్తు స్ఫురిస్తున్నప్పటికీ వాస్తవానికి ఇది బ్రహ్మ సత్తయే అయి ఉన్నది. ఎందుచేత ఈ జగత్తు స్ఫురిస్తోందంటావా? చిత్స్వరూపమగు పరబ్రహ్మము తనయందు ఎందుకో ఒకప్పుడు మందప్రబోధయుక్తమై ఉంటోంది. అప్పుడు అది తనయందు 'దేహము – దేహి' మొదలైన జగత్స్వరూపములను గాంచుచున్నది. అది మరొకప్పుడు దృఢజ్ఞానయుక్తము కాగా, అప్పుడు తన పట్ల తానే పరమశాంతమగు కేవల శివరూపముగా భాసించుచున్నది.

**శిఖిధ్వజుడు :** ఓ దేవర్షీ! మీరు చెప్పేదంతా వింటుంటే నాకు "అహం – అనేది కూడా బ్రహ్మమేనా? ఎట్లా?" – అనే ప్రశ్న ఇంకా కొంత కొనసాగుచునే ఉన్నది.

**కుంభఋషి :** అట్టి నీ ప్రశ్న అనుచితమేనని చెప్పక తప్పదు. ఎందుకంటావేమో? ఏదైనా వాస్తవంగా ఉన్నదైతే, 'అది బ్రహ్మమా లేక మరొకటియా?' అనే ప్రశ్న – దానికి ఒక సమాధానం ఉండవచ్చునేమో! ఏ వస్తువైతే వాస్తవంగా విద్యమానమై లేదో, ఇకది "బ్రహ్మమా?కాదా?" అని అడగటమెందుకు? "కలలో సంపాదించిన ధనం ధనం కాదంటారా? ఎట్లా?"…అన్నట్లున్నది నీ ప్రశ్న.

ఏది విచారణ చేయగా 'అట్టిది లేనేలేదు!' అని నిరూపించబడుతోందో, అద్దాని లాభ నష్టముల గురించి, నిత్యానిత్యాదుల గురించి విచారణచే గాని, తరచి తరచి ప్రశ్నించటం చేతగాని ఏం ప్రయోజనం?

బంగారానికి 'దీని ఆకారం ఇట్టిది' అనునదేమీ ఉండక పోయినా…. సువర్ణం అన్న తరువాత… ఏదో ఒక ఆకారం ఉండి ఉంటుంది కదా! అట్లాగే 'జగత్తు – అహంభావాలు' …అనేవి లేకపోతే 'ఏది బ్రహ్మం? ఏది కాదు?' అనే ప్రశ్నార్హత కూడా ఈశ్వరునియందు ఉండదు.

కారణము అనేది లేనందువలన జగత్తు యథార్థమునకు 'లేనిదే' అగుచున్నది. కాబట్టి బ్రహ్మమే జగద్రూపంగా, అహంరూపంగా విజృంభించుచున్నదగుచున్నది. అయితే, ఆ బ్రహ్మము తన స్వరూపం యొక్క 'పరిణామం' అనేది కించిత్తు కూడా గావించకయే, యథాతథంగా తాను ఉంటూనే… ఈ విధంగా జగద్రూపమున, అహం రూపమున ఉంటోంది.

దంపతులు కామప్రేరితులై యథాతథస్వరూపులై ఉంటూనే పుత్రుడు జన్మించటానికి కారణమగు చున్నట్లు 'మాయ' అను ఆవరణంతో కూడిన ఈశ్వరమయములగు ఈ సమస్త పదార్థాలూ ఆ ఈశ్వరుని ప్రేరణచే అనుభవానికి అర్హత పొందుచున్నాయి. అట్టి ప్రేరణ కొరకై ద్రష్ట – దృశ్యం అను రెండూ పరస్పరం ప్రేరితములై తత్ప్రయోజనంగా ఈ పంచభూతాత్మక సమూహమును, వాటి కార్యచమత్కారాన్ని గావించుచున్నాయి. అనగా చిన్మాత్రమే మాయాసమేత చిన్మాత్రము ద్వారా ఆయా వివిధ రూపములు ధరించి ఆయా కార్యాకార్యముల రూపమున పరిచ్ఛిన్నమై ఉంటోంది. చిన్మాత్రమే మాయా సమన్వితమై సృష్టి రూప చమత్కారంగా సాక్షాత్కారవైభవం ప్రదర్శిస్తోంది.

**పూర్ణాత్ పూర్ణాన్యుద్ధరన్తి, పూర్ణాత్పూర్ణాని చక్రిరే**
**భవన్తి, పూర్ణాత్ పూర్ణాని పూర్ణమేవాఽవశిష్యతే ॥**

పూర్ణరూపమగు బ్రహ్మము నుండి పూర్ణరూపములే అగు ఈ జగత్ – అహంకారాలు, వాటిని ధరించినట్లు కనిపించే ఈ జీవులు మాయచే ప్రకటితమగుచున్నారు. పూర్ణమునుండి బయల్వెడలినట్టి వాటి యొక్క క్రియాదుల చమత్కారములన్నీ పూర్ణములే.

ఈ జీవులంతా పూర్ణమునుండే బయలుదేరి, పూర్ణములోనే ఉంటూ, తిరిగి పూర్ణరూపులే అగుచున్నారు. మాయతో కూడుకున్నప్పుడు కూడా ఈ జీవుల రూపం బ్రహ్మమే! మాయావరణము తొలగినప్పుడు శేషించేదీ బ్రహ్మమే! చిన్మాత్రమగు ఆత్మయందు చిన్మాత్రరూపమగు జగత్తు స్ఫురిస్తోంది. యథార్థానికి బ్రహ్మము సృష్టిరూపరచనగా స్ఫురించకయే స్ఫురిస్తున్నట్లు తోచుచున్నది.

ఓ రాజర్షీ! మరల ప్రకటిస్తున్నాను. ఇక్కడ గానీ, మరెక్కడగానీ, చిన్మాత్రమగు ఆత్మయందు చిన్మాత్రమే స్ఫురిస్తోంది. ఆ స్ఫురణయే జగద్దృష్టికి జగత్తుగా ప్రసిద్ధమగుచున్నది. ప్రత్యగాత్మకమగు చైతన్యము తన యొక్క నిరామయ – తేజోమయ – ఆద్యంతరహిత చిత్స్వరూపమును ఏమాత్రం వదలకయే, సృష్ట్యాదియందు అనేక విధములైన మనోరూపములను పొంది వినోదిస్తోంది. పరమాత్మ తన యొక్క స్థూలరూపకల్పనచే ప్రకాశశీలుడై స్వయంగా విరాట్ స్వరూపమును (సమష్టి సృష్టికర్త స్వరూపం, సృష్టి ప్రజ్ఞా స్వరూపం) ధరిస్తున్నాడు. ఆ పరమాత్మయే మరల వ్యష్టిజీవభావముచే జగద్భ్రాంతికి కారణముగా అగుచున్నాడు. ఈ జగత్తును సత్యముగా చూచుచున్నాడు. మరొకప్పుడు పరమార్థదృష్టిచే దానిని సత్తుగా పరమాత్మరూపంగా గాంచుచున్నాడు. ఆతడే భావన యొక్క దార్ఢ్యములే చేత అండజ – స్వేదజ – బీజజాది చతుర్విధ ప్రాణుల రూపత్వమును, ఇటు దృశ్యరూపత్వమును క్షణంలో పొందుచున్నాడు.

'జగత్తు' అని పిలువబడే ఈ శాంతరూప బ్రహ్మము స్వభావముగానే నామరూపరహితమై అనిర్వచనీయమై ఒప్పుచున్నది. ప్రకాశరూపమై, అనుభవాత్మకమై, సదా – సర్వదా ఏకమైనట్టి పరబ్రహ్మము స్వమాయచే నిజచమత్కృతి ద్వారా అహంకార – జగత్తుల వలె దృశ్య – దర్శనరూపమై వెలయుచున్నది. ఉన్న సత్యమిదియే! తదితరమైనదంతా కల్పన మాత్రమే!

❖❖❖

# 32. భావనయొక్క అభావన

**కుంభమహర్షి :** ఓ రాజర్షీ! ఈ చమత్కారమంతా గమనిస్తున్నావు కదా! ఆకారరహితమైన బంగారం తన సువర్ణత్వం కోల్పోకుండానే దేశ – కాల పరిచ్ఛిన్నమగు ఆభరణముల రూపముగా అకారణంగా ఉంటోంది చూచావా? అట్లాగే పరమాత్మయందు నిష్కారణంగా ఈ జగత్తు జనింపజేయునది – జనించునది – సృష్టికర్త – సృష్టి అను భావక్రమంచే ఏర్పడి ఉంటోంది. ఆభరణమైనా, చతురస్రాకారమైనా, మరొక రూపమైనా బంగారం సర్వదా బంగారమే కదా!

పరమాత్మ నుండి ఏదీ ఉత్పన్నమవటం లేదు. మరేదీ లయించటం లేదు.

**స్వసత్తాయాం స్థితం బ్రహ్మ నబీజం, న చ కారణం,**
**శుద్ధానుభవమాత్రం తత్ తస్మాత్ అన్యత్ న విద్యతే**
**కించిత్ జగదహన్తాది తదేవానన్తమస్తి హి ॥**

బ్రహ్మము తన సత్తయందే తానున్నది. అది దేనికీ బీజము కాదు, కారణమూ కాదు. అది శుద్ధము, అనుభవమాత్రము అయి ఉన్నది. అది మరింకేమీ కాదు, అవదు. కనుక మరొక దేనితోనో దానిని ఎరగటమనేది లేదు. ఇక ఈ జగత్ – అహంభావాదులంటావా? ఇవేవీ ఎప్పుడూ లేవు. ఆ బ్రహ్మమే అనంతమై, సమస్తమై ఉన్నది.

**శిఖిధ్వజుడు :** హే మహర్షీ! 'ఆ పరమాత్మయందు జగత్తు – అహంకారము మొదలైనవి లేవు' అనే మీ నిర్ద్వంద్వమైన ప్రకటనను నేనిప్పుడు గ్రహించాను. అయితే, అసలీ సృష్టియొక్క జ్ఞానం ఎట్లా భాసిస్తోందో...... ఆ విషయం నాకు తెలియజేయండి. తద్వారా అజ్ఞానమును నిరోధిస్తాను.

**కుంభఋషి :** ప్రియమిత్రమా! శిఖిధ్వజా! ఏ అనాది అయిన అనంతమైన–సమస్తమైన–సర్వాధిష్ఠానమైన సన్మాత్రము ఈ సృష్టిని విస్తరింపజేస్తోందో... అదియే సృష్టిజ్ఞానముగా కూడా భాసిస్తోంది.

అందుచేతనే 1. అధ్యస్తములైనట్టి ఈ జగత్ అహంకారాదులు, 2. అధిష్ఠానమగు సచ్చిన్మాత్ర బ్రహ్మము... ఈ రెండు అభేదములైనవై ఉన్నాయి. ఇదంతా సచ్చిన్మాత్రమే అయి, జగత్తుగా భాసిస్తోంది. ఇక వేరు వేరు సిద్ధాంతములు కూడా ఉన్నాయి.

విజ్ఞానవాదులు = ఈ జగత్పదార్థములన్నీ విజ్ఞానము యొక్క పరిణామము మాత్రమే.
గౌతమవాదులు = బాహ్యములగు పంచభూతముల సత్తయే ఈ జగత్పదార్థములు.
గౌతములు = శూన్యం మాత్రమే ఉంది. అంతకుమించి ఏదీ లేదు. ఇతరమైనదంతా భ్రమయే.

...ఈ వాదాల అంతర్గతాన్వేషణచే 'బ్రహ్మమే ఇదంతా' అను ఉత్కృష్టానుభవమే సిద్ధించగలదు. ద్రష్టయే దృశ్యానుభవంగా ప్రతిబింబిస్తున్నాడనునది సూక్ష్మదృష్టికి ప్రస్ఫుటం కాగలదని గ్రహించు.

ఎవరైనా ఏదైనా సిద్ధాంతం ప్రతిపాదించవచ్చు గాక! సర్వవాదాలలోను అంతర్లీనమై ఉన్నది జ్ఞానమే కదా! జ్ఞానమే లేకపోతే వస్తు సాక్షాత్కారం ఎట్లా కలుగుతుంది? కాబట్టి జలమందు ద్రవత్వం లాగా సమస్త పదార్థములందూ ద్రష్ట యొక్క జ్ఞానమే విస్తరించి ఉన్నది. అట్టి జ్ఞానమునే 'చిన్మాత్రం' అని అంటున్నాం. ప్రతి అనుభవము వెనుక జ్ఞానం మూల పదార్థమై దాగియున్నది సుమా! చిత్తు జ్ఞానస్వరూపమే. ఇక 'చిత్తు జడజగద్రూపంగా భాసిస్తోంది' అనేది 'ముత్యపు చిప్పలో వెండి వెల్లివిరుస్తోంది' అను అనుభవంలాగా కారణరహితం, అనిర్వచనీయం కూడా!

ఆ చిన్మాత్రం సాత్విక భావాలలోనూ, దానికి విరుద్ధ భావాలలోనూ కూడా ప్రతిబింబిస్తోంది. పరస్పర వ్యతిరిక్త – అనుయుక్తములైన భావ–అభావాలలో ప్రత్యక్షమై ఉంటూనే మరొకవైపు ఆ భావాదులకు సంబంధించక తన అనంత చిన్మాత్రం కొనసాగిస్తూనే ఉంటోంది. అది ఇటు జగదాకారం గాను, అటు చిన్మాత్రరూపంగాను ఒకే సమయంలో ఏర్పడి ఉండగల సామర్థ్యం కలిగియే ఉంటోంది.

వాస్తవానికి మన స్వస్వరూపము ఒకప్పుడు తానెట్లు ఉన్నదో, ఇప్పుడు ఇంకొకప్పుడు ఇట్లే ఉండటం జరుగుచున్నదని గ్రహించుటచేతనే మోక్ష స్వరూపానుభవం లభ్యమగుచున్నది. 'చిత్' స్వరూపమునకు విరుద్ధములైన అసత్య - అస్వచ్ఛ భావములు అసత్యములు కాబట్టే అవి చిన్మాత్రమగు పరమ పదమునకు నిరోధములుగా ఉంటున్నాయి.

**శిఖిధ్వజుడు :** మహాత్మా! స్వచ్ఛమగు చిద్రూపమే అస్వచ్ఛమగు జగద్భావమునకు కారణమగుచున్నదని మనం అనుకొనవచ్చునా?

**కుంభమహర్షి :** అట్లా సిద్ధాంతీకరించటం ఎట్లా కుదురుతుంది? విజ్ఞుల అనుభవం, శ్రుతి-స్మృతి వాక్యములను అనుసరించి 'స్వస్వరూపమగు బ్రహ్మం చేష్టా-స్ఫురణ రహితము, అప్రతర్క్యము, అవిజ్ఞేయము, అప్రమేయము, అకర్తృత్వము' అని మనం వింటున్నాం. కాబట్టి బ్రహ్మము ఏ కారణమునకు, తనకుతానుగా కారణం కాదు. అనగా ఈ సృష్టికి బీజమే లేదు. అందుచేత ఈ సృష్టి కూడా యథార్థానికి లేనిదే అగుచున్నది. ఓ మహారాజా! ఈ సృష్టి అనబడునది 'చైతన్యము యొక్క ఒక అధ్యాస' అనటం తప్పించి దీనికి మరొక ఏ యుక్తి కూడా కుదరదు.

చిన్మాత్రమొక్కటే ఉన్నది. ఈ జడమైన సృష్టి కొంచెం కూడా లేదు. ఇక, అహంభావము - జగత్తు... అనబడేవేవైతే ఉన్నాయో, అవన్నీ కూడా చిన్మాత్రము ఆయా రూపములుగా స్వయముగా స్వయం శక్తిచే ఏర్పడే చమత్కృతి విన్యాసము మాత్రమే! జలము జరజర ప్రవహిస్తున్నప్పుడు ఏర్పడే మెలికలతో కూడిన ఆకారంలాగా చైతన్యము చైతన్యంగా ఉంటూనే ఒక సమయంలో స్వయంకల్పిత జగత్తును గాంచుచూ తన నిత్యత్వ - నిర్మలత్వ అప్రమేయత్వాదులను ఏమరుచుచున్నది.

**శిఖిధ్వజుడు :** దేవర్షీ! యాదృచ్ఛికవాదుల అభిప్రాయం అనుసరించి "ఈ జగత్తు యాదృచ్ఛికంగా, లేక, ఆకస్మికంగా ఉదయించింది" అని కదా! మరి ఆ వాదన విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

**కుంభమహర్షి :** 'యాదృచ్ఛికంగా ఎందుకు ఉదయించింది?'... అనే ప్రశ్నకు వారు సమాధానం అందించలేకపోతున్నారు. కారణం ఉంటే కదా, కార్యం ఉండేది? కారణం లేకుండానే కార్యము ఉన్నదంటే అది యుక్తియుక్తమెట్లా!

❖

ఓ శిఖిధ్వజ మహారాజా! ఆ పరమాత్మ ద్విత్వ - ఏకత్వాతీతుడై, కార్య కారణములకు సంబంధించిన సర్వభావముల రహితుడై ఉన్నాడు. ఇక ఈ ప్రపంచమున కంటికి తోచే జడాంశము సంగతేమింటంటావా? ఇది "ఆకాశంలో వికసించిన పుష్పం" అను మాటలాగా కల్పనా మాత్రమే! ఈ దృశ్యమంతా నశ్వర స్వభావము కలిగియున్నదవటం చేత ఈ జగత్తు ఆత్మను ఎరిగిన పండితుల దృష్టిచే సర్వదా లేనిదే... అని గ్రహించబడుతోంది. ద్రష్ట మాత్రమే ఉన్నాడు. ద్రష్ట జగత్తు కన్నా ముందే చిన్మాత్ర స్వరూపుడై ఉన్నాడు. ఆ చిన్మాత్ర స్వరూపుడు తన అనంత తత్త్వంలో ఒకానొక మూల జగత్తు అనబడు చమత్కారమును స్వయంగా ఎవరి ప్రమేయమూ లేకుండానే కలిగి ఉంటున్నాడు. అనంతమగు ఆకాశంలో ఒక చిన్న ప్రదేశంలో ప్రకాశమానమగు సూర్యబింబం, ఆ సూర్యబింబంచే

ప్రకాశించబడే చంద్రబింబం ఉన్నట్లు... నిత్య – అద్వితీయ – అఖండ స్వరూపమునందు కించిత్ ప్రదేశంలో ఈ దృశ్యవ్యవహారం ప్రతిబింబిస్తోంది. ఆకాశమును ఏ పదార్థమైనా సంకుచిత పరచ గలదా? ఏదైతే నీ వాస్తవతత్త్వము, లేక, స్వరూపము అయి ఉన్నదో... అద్దానిని ఈ ద్రష్ట – దృశ్య వ్యవహారములు ఎట్లా పరిమితపరుస్తాయని అనుకుంటున్నావో, నా కర్థం కావటం లేదు? చిద్రూపానికే 'నాశనం కలదు' అని నీవు అనదలచుకుంటే అద్దానిని జనింపజేసేది, నశింపజేసేది ఇంకొకటి ఉండాలి కదా, ఏది? చిత్తు యొక్క ఈ జన్మ – నాశనముల అనుభవం చిత్తుకే గాని మరెవ్వరికో కాదు కదా! మనం చిద్రూపం అని పిలిచేది అహంకార–జగదాదుల ఉనికి లేములకు కూడా సాక్షీభూతమై, అసంబంధితమై ఉంటున్న దానిని కదా! అహంకార – జగదాదులకు సంబంధించినది మాత్రమే. ఈ జన్మ మృత్యు కర్మ – అకర్మ, ధ్యాన – పరధ్యాన వ్యవహారాలు. మట్టికి – మట్టిబొమ్మకు ఆకాశంతో ఏం సంబంధమున్నది?

**శిఖిధ్వజుడు :** అవును! మీరు చెప్పేది అక్షరాలా నిజం. ఎద్దాని సమక్షంలో కారణకారణమే వాస్తవానికి అకారణమైయున్నదో, అట్టిచిదాకాశ స్వరూపుడనే నేను. మరొకటేదీ అవటానికే వీలులేదు. నా అనంత అప్రమేయ స్వరూపం యథాతథంగా ఎప్పటియట్లే ఏర్పడి ఉండగా నా యందు కల్పిత మాత్రమై ఈ శిఖిధ్వజ నామధేయం, దేహ, మహారాజాది ఆపాదిత విషయాలు, జన్మమృత్యు ఇత్యాది ప్రసంగాలు భ్రమ దృష్టి గలవానికి మాత్రమే దర్శనమౌతున్నాయి. అవన్నీ లేవు. అప్రమేయమగు చిన్మాత్రం మాత్రమే ఉన్నది. నా చిదాకాశ స్వరూపం మరింకొకటేదీ అగుటలేదు. సమస్తానికీ నేనే ఆదిని. నాకు ఎక్కడ ఏది అనిపిస్తోందో అదంతా నా యొక్క చిత్ ప్రకాశమునకు సంబంధించిన ఒకానొక కాంతిపుంజం మాత్రమే!

అయితే ఓ ఆత్మబంధూ! మన ఈ సంవాదము యొక్క ప్రాశస్త్యము కొరకు, మహనీయమగు మీ అమృతవాక్కులను గ్రోలటానికి మాత్రమే ఒక చిన్న ప్రశ్న మీ ముందు ఉంచుచున్నాను.

స్వభావవాదులు చిత్తు నిత్యము ఉత్పన్నమౌతోంది. నిత్యము నశిస్తోంది"... అని ప్రతిపాదిస్తు న్నారు కదా! ఈ విషయమై తమ అభిప్రాయం?

**కుంభమహర్షి :** వారు ప్రతిపాదించే స్వభావవాదం వేద వాక్యములకు సరిపోవుట లేదని నా అభిప్రాయం. 'ఆత్మ సర్వదా అఖండమై చిదేకరసరూపమై వెల్లివిరుస్తోంది' అని శ్రుతులు గానం చేస్తుంటే ఇక నీవు అనుమానం కలిగి ఉండవలసిన పనేమున్నది? ఈ ప్రపంచంలో ఈ అనేక పదార్థముల ప్రాప్తి రూపంగా ఏదైతే సంభవిస్తోందో, అట్టి అనుభవమంతా, ఈ దేహాదులతో సహా కేవలం చిత్తు యొక్క ఒకానొక చమత్కారం మాత్రమే.

**చిత్తత్త్వమాత్ర సత్తాస్తి ద్విత్వం –ఐక్యంచ నాస్తి అలమ్,**
**అతః పదార్థ సత్తాయా అభావే సతి! భూపతే!**

ఓ భూపతీ! కేవలం చిన్మాత్ర ఒక్కదానికే 'సత్త' ఉన్నది. ఇక ద్విత్వ ఏకత్వములంటావా, అవన్నీ ఎప్పుడూ లేవు.

యథార్థానికి పదార్థముల సత్త లేనే లేదు. 'పదార్థములకు సత్త ఉండటం అసంభవం' అను భావనను దృఢంగా ఆశ్రయించావా... అప్పుడు 'అహంభావం' కూడా తనంతట తానే రహితమై పోతుంది. ఇక అహంభావాన్ని జయించటానికి వేరే మరో ప్రయత్నం అవసరమే ఉండదు. అసంభవ భావనచే ఇక చిత్తుకు అన్యంగా చిత్తము అనునది ఎక్కడుంటుంది? చిత్తమే లేకపోతే జన్మ – మృత్యువుల అనుభవం ఎవరికి? ఈ దేహానుభవమే యోచన యొక్క మహాసముద్రంలో ఒక చిన్న తరంగము వంటిది అవుతుంది. నీవో, మహాసముద్ర స్వరూపుడవై ఉన్నావు.

ఈ విధంగా చిత్తము ఉండదు, అహంకారం ఉండదు, వాటి భిన్నత్వము ఉండదు. జీవ–బ్రహ్మ భేదం ఉండదు. చిత్–అచిత్ భేదం గాని, దృశ్యానుభవభేదం గాని ఉండజాలవు. కాబట్టి రాజా! మొదట వాసనారాహిత్యం అభ్యసించు. అంతే! ఇక శాంతమనస్కుడవై, మౌనివై, చిదాకాశమయుడవై ఆత్మమాత్రుడవై శేషించగలవు. "శుద్ధచైతన్యదృష్టి"ని అవలంబించటం చేత జడ పదార్థముల అభావం స్వయంగా సిద్ధించగలదు. అప్పుడు నీవు సదేహుడవైనా, విదేహుడవైనా, సమస్త పదార్థములందున్నను వాటి కంటే భిన్నంగా ఉన్నావు... అను ఒక నిశ్చలమైన కొండవలె, స్థిరంగా, శుద్ధాత్మ స్వరూపుడవై ఉండగలవు. అట్టి మోక్ష స్వరూపాన్ని నీవు ఆశ్రయించ వలసి ఉండగా, 'నాకు ఎప్పటికైనా మోక్షం లభించకూడదా?" అని ఎటో ఆకాశంలోకి చూస్తూ మీనమేషాలు లెక్కపెట్టుకోవటమేమిటో చెప్పు?

❖

"భావన యొక్క అభావన" అను చిన్న ప్రయత్నం చేత చిత్తంలోంచి అహంకారం శమిస్తుంది. వేదార్థము యొక్క భావన చేతను, విద్వాంసుల అనుభవమును విని హృదయస్థం చేయుటచేతను సత్య జ్ఞానానందమైన బ్రహ్మమే శేషిస్తోంది. అనుభూతమయ్యే బ్రహ్మమొక్కటే సత్యము. అట్టి స్వబోధచే చింతాది వృత్తులు తప్పక బాధితమౌతాయి. ఇక బ్రహ్మమునకు వ్యతిరిక్తమైనదంటూ ఏదీ మిగలదు. ఇకప్పుడు చింతలకు కారణం కనబడదు.

ఓ రాజా! మనం ఇప్పటిదాకా చెప్పుకున్న కారణాల చేత నీవు పదార్థ–దేహాదుల స్వరూపం అయి ఉండలేదు. నిర్మలమై, అకారణమై, సమస్తమునకు ఆదియై, ముక్తమై, నిత్యమై, అనేక రూపమై నప్పటికీ ఏకరూపమే అయి, శూన్యమై, నిరామయమై, అసత్పదార్థములన్నిటికీ అధిష్ఠానమై, సర్వజగద్రూపమై నప్పటికీ అవికారమై, శ్రుతులచే ప్రతిపాదించబడే ఏ బ్రహ్మం గలదో... అదే నీవై ఉన్నావు. "అది ఇంకా పొందవలసి ఉన్నదేమో?" అను నీ సంశయాన్ని ఇక త్యజించమని నా ప్రార్థన.

❖❖❖

## 33. చిత్తమనేది లేదు!

**శిఖిధ్వజుడు :** అందరి స్వస్వరూపం విషయమై దేవఋషియగు మీ నిర్వచనం అమోఘమని, తప్పకుండా యుక్తి యుక్తమని, పరమశ్రేయోదాయకమని నేను ఒప్పుకుంటున్నాను. మీరు నాకు చేస్తున్న మేలుకు మీకు ఎట్లా, ఏమిచ్చి కృతజ్ఞతలు చెప్పుకోవాలో నాకు తెలియటమే లేదు.

ఇదంతా, బ్రహ్మలోకం నుండి ఈ నారదపుత్రుల రూపంలో మా జనులందరిపై వర్షిస్తున్న బ్రహ్మానంద వర్షమని నాకు అనిపిస్తోంది.

హే దేవర్షీ! ఇంతవరకు బాధిస్తూ ఏమి చేయాలో తెలియని పరిస్థితులలోకి త్రోసివేసిన ఈ చిత్త–అహంకార–జగత్తులకు సంబంధించిన నా అవగాహనను మీరు పరమ పవిత్రం చేస్తున్నారు. హే మహానుభావా! ఈ చిత్తము గురించి మరికొన్ని విశేషాలు మీ దగ్గర నుండి వినాలని ఉన్నది. "చిత్తము లేదు" అని నిరూపిస్తూ ఏఏ యుక్తులు ఇంకా చెప్పబడినాయో, అవేమన్నా నా బోధ కొరకై విశదీకరించవలసినదిగా నా మనవి. అట్టి పూర్వోక్తమైన యుక్తులు క్లుప్తంగానో, విస్తారంగానో చెప్పమని పాదాక్రాంతుడనై వేడుకొనుచున్నాను. ఎందుకంటే చిత్తము యొక్క అభావమును నేను ఇంకా సంపాదించుకొనవలసియున్నదని అనుకుంటున్నాను.

**కుంభమహర్షి :**

> **చిత్తం నా స్త్యేవ, హే రాజన్! కదాచిత్, కించన, క్వచిత్!**
> **యచ్చే-దం చిత్తవత్ భాతి, తద్బ్రహ్మాభిదమవ్యయమ్ ॥**

హే రాజన్! నీకు ఇంకా సందేహం దేనికి? చిత్తము ఏ సమయంలోనూ లేదు. ఇక నీకు చిత్తమువలె భాసించేది ఏదైతే ఉన్నదో... అది స్వయముగా అవ్యయమగు బ్రహ్మమే అయున్నది. జ్ఞానము యొక్క బలిమిచే ఎప్పుడైతే జ్ఞేయ రూపమగు జగత్తే లేదని మనం అనుకున్నామో, ఇకప్పుడు 'నీవు – నేను' ...మొదలైన కల్పిత రూపములు ఎక్కడుంటాయి? ఎక్కడి నుండి వస్తాయి?

ఈ జగత్తు యథార్థానికి లేదయ్యా! ఈ వాక్యం చాలాసార్లు చెప్పుకున్నాం కదా! "ఇక్కడ ఏదైతే ఉదయిస్తున్నట్లు మనకు అనిపిస్తోందో, అదంతా బ్రహ్మమే" అను జ్ఞానం కలిగిన తరువాత ఇక ఎవనికి 'చిత్తము' అనబడేది గోచరిస్తుంది? ఏ స్థితిలో 'అంతయు బ్రహ్మమే' అని అనుభవమౌతోందో, అట్టి స్థితియందు ఇక ఎవడు దేనిని ఎఱుగుచున్నాడు

మహాప్రళయానంతరం సృష్ట్యాదియందు ఈ జగత్తు అనబడేది యథార్థానికి ఉత్పన్నమే కాలేదు. ఇక 'చిత్తము ఉదయించింది' అని శాస్త్రములు చెప్పటమంతా నిర్విషయమగు దానిని విషయభావనతో ఆశ్రయించినట్టి ఈ జీవుని అట్టి భావననుండి విరమింపజేయటానికి చెప్పు మధ్యేమార్గ పాఠం మాత్రమే. ఎందుకంటే, సృష్ట్యాదియందు చిత్తము అనబడేది ఆత్మకంటే వేరుగా రూపుదిద్దుకోవటానికి ఉపాదానకారణం ఎక్కడున్నది? లేదు. అందుచేత, మునుముందుగా ఆత్మ మాత్రమే ఉన్నట్లు ఇప్పుడు కూడా ఆత్మయే ఉన్నది. కారణరహితముగా ఆత్మమాత్రమే ఉన్నట్లు ఇప్పుడు కూడా ఆత్మయే ఉన్నది. కారణరహితమగు అజ్ఞానబుద్ధిగాని, చిత్తాత్మకమగు జగత్తు గాని ఆత్మనుండి వేరుగా జనించటానికి అవకాశమే లేదు. 'తస్మాత్ యదిదమాభాతి భాసనం బ్రహ్మనే-తరమ్', కనుక ఇక్కడ జగదాకారంగా భాసించేదంతా బ్రహ్మమే కాని, మరింకొకటేది కాదు.

**శిఖిధ్వజుడు :** హే మహాత్మా! నామరూపరహితుడగు పరమాత్మ గురించి వేదాదులు కొంచెం విరుద్ధమైన పదజాలంతో ఆయా చోట్ల వచించటం జరుగుతోంది.

1. సర్వభూతాంతరాత్ముడై ఒకే పరమాత్మ వెల్లివిరిసి ఉన్నాడు (ఏకో వశీ సర్వభూతాంతరాత్మా)

2. ఒకే రూపము అనేక విధములుగా చేస్తున్నాడు (ఏకం రూపం బహుధా యః కరోతి)

...ఈ వాక్యములు 'పరమాత్మయే ఈ సర్వము రచిస్తున్నాడు' అని చెప్పుచున్నాయి కదా! మరి మనం పరమాత్మ 'అకర్మ' అని 'అభోక్త' అని 'అప్రమేయుడు' అని ఎట్లా అనగలుగుతాం?

**కుంభర్షి :** నీవు చెప్పిన ఇత్యాది వాక్యాలన్నీ ఈశ్వరుని విషయంలో అర్థారూపవాదాలు మాత్రమే. ద్రష్ట యొక్క అనుభవ జ్ఞానం, నిర్ణయాత్మక స్వభావాన్ని అనుసరించి అవి ఆయా అర్థములను ప్రతిబింబించటం, అవి వాస్తవత్వానుభవమును కలుగజేయటం జరుగుతోంది. కారణరహితమగు ఆత్మ విషయంలో ఉత్తమార్థమును ప్రతిపాదించే 'నిష్కలమ్ - నిష్క్రియమ్' అని కూడా అవే శాస్త్రములు పదప్రయోగం చేశాయి కదా! కనుక "ఆత్మ ఆయా రూపములుగా పరిణమిస్తోంది" - అనునది విద్వదనుభవమునకు విరుద్ధములైనది. అంతేగాని, పరిణామము అనేది ఆత్మకు ఆపాదించ వీల్లేదు. ఇక 'నామరూపరహితుడు, ద్వంద్వ వర్జితుడు, శీత-వాతాది దోషరహితుడు, నిరాకారుడు అగు ఈశ్వరుడు ఈ జగత్తును రచించుచున్నాడు - ఇటువంటివన్నీ తాత్పర్యరహితమైన వాక్యాలు. అవి అర్థారోపవాదములు మాత్రమే! ఇంకా చెప్పాలంటే, అవి హాస్యాస్పదమైన వాక్యాలని అనక తప్పదు.

ఈ విధంగా ఎటుచూచినా కూడా చిత్తము అనేది లేదు. ఈ జగత్తే వాస్తవం కానప్పుడు ఇక ఇద్దానికి అంతర్గతమై ఉన్న చిత్తము మొదలైనవి ఎక్కడుంటాయి?

**శిఖిధ్వజుడు:** చిత్తము గురించి చాలా విశేషాలు మీరు చెప్పియే ఉన్నారు. అసలీ చిత్తము దేనిచే నిర్మించబడి సంసిద్ధమౌతోంది?

**కుంభమహర్షి :** చిత్తము వాసనల రూపమే అయి ఉన్నది. వాసనలకు విషయమగు ఈ జగత్తే లేదు - అని మనం అనుకున్నాం కదా! జగత్తుకే అస్తిత్వం లేకపోతే, ఇక చిత్తమునకు మాత్రం అస్తిత్వం ఎక్కడున్నది? ఎట్లా ఉంటుంది?

మాయా సమన్వితమైన బ్రహ్మము తనయందు తానే నిర్మించుకునే కల్పనలనే మనం 'చిత్తం - జగత్తు' అను పేర్లతో పిలుస్తున్నాం. నీవు ఒక కల గంటుంటే ఆ స్వప్నములోనిదంతా నీ ఊహే కాబట్టి, అందులో ఉన్నదంతా నీ స్వరూపం గాక, మరొకరి మరొక స్వరూపం నీ ఊహలోకి ఎట్లా వస్తుంది? అట్లాగే బ్రహ్మం యొక్క ఊహయే ఈ చిత్తు - జగదనుభవాలు కాబట్టి అవి రెండూ, తదితర అహంకారాదులు బ్రహ్మం కంటే వేరు అవటానికి వీలులేదు. ఆ బ్రహ్మం యొక్క అనుభవం మరొకరెవరో ఉద్దేశించినదను ప్రతిపాదనయే మిథ్య.

బ్రహ్మము కంటే వేరొక సత్త ఉంటే, లేక, నిరూపించగలిగితేనే, అట్టి ప్రతిపాదన యుక్తియుక్త మౌతుంది. లేకుంటే కాదు.

స్వప్నద్రష్ట సగం నిద్రలో తన అంతర్గత వాసనలను అనుసరించి ఊహానిర్మితంగా సుఖ దుఃఖాదులను, ఆశ్చర్యక - అసహ్యాది ఏవేవో వస్తు - జీవ - దృశ్యాదులను పొందుచున్నాడు కదా! అట్లాగే, వాసనలను అనుసరించి ఈ జాగృత్ ద్రష్ట కూడా సుఖ-దుఃఖాదులను, ఆశ్చర్యక-అసహ్యాది

విషయములను గాంచుచున్నాడు. ఉభయ ద్రష్టలు "మేము బాహ్యమున ఇవి పొందుచున్నాం" అనియే భ్రమిస్తున్నారు. వాసనా విషయకమగు ఈ జాగ్రత్ దృశ్య జగత్తు గాని, స్వప్న దృశ్య జగత్తు గాని అసలు ఉత్పన్నమే కాలేదు... అని నీవు నిస్సంకోచంగా గ్రహించి ఉండు. "అబ్బే! నాకు ఉత్పన్న మైనట్లు కనబడుతోంది!"... అంటావా? అది నీ బ్రాహ్మీస్వరూపమును ఏమరచినపుడు ఏర్పడి ఉన్న భ్రమ మాత్రమే"... అని మా అనుభవమును రంగరించి ప్రకటిస్తున్నాం. అందుకు అనుభవజ్ఞులమగు మేము, శాస్త్రకారుల ప్రవచనములు, శాస్త్ర వాక్యములే ప్రమాణం.

ఇక చిత్తము విషయానికి వస్తే దృశ్యము ఏ విధంగా ఉత్పన్నమే కాలేదని అనుకుంటున్నామో, అట్లాగే చిత్తము కూడా కారణము ఉండజాలనందువల్ల మొదలే ఉత్పన్నం కాలేదు.

భ్రమను వీడి బ్రహ్మమును ఎంత త్వరగా దర్శించటం ఆరంభిస్తే అంత మంచిది. పరమాకాశం (పరబ్రహ్మం) అను పేరుగల చిదాకాశం మాత్రమే విశాలరూపమున సర్వేసర్వత్రా అనుభవమౌతోంది. ఇక నీ జగత్తు అనేది ఎక్కడున్నది?

దర్పణంలో కనిపించేదంతా దర్పణం యొక్క విభాగమేగాని, దర్పణంలో దర్పణమునకు సంబంధించనిదేదో ప్రవేశించి ఆ దర్పణమును మరొక దానిగా పరిణమింపజేయటం లేదే!

అట్లాగే 'చిత్ స్వరూపము' అనే అద్దంలో అనిర్వచనీయ రూపముచే ఏ కొంచెము 'చిత్తము' అను పేరుతో పిలువబడుతూ భాసిస్తోందో... అదంతా చిదాకాశమే అయి ఉన్నదని మరొక్కసారి చేతులెత్తి ప్రకటిస్తున్నాను.

❖

ఓ రాజా! పునరావృత్తి దోషం అయినప్పటికీ నీ యొక్క ఆరూఢత కొరకు మరల మరల నేను ప్రకటించక తప్పదు. యథార్థానికి చిత్తము గాని, జగత్ అనబడు క్రియగాని ఈనాడు లేదు, ఎన్నడూ లేదు. భ్రమను వీడక, భ్రమలోనే ఉండదలచిన వారికి అవి ఉంటున్నాయి. నిన్ను నీవే యుక్తి యుక్త వాక్యబలాన్ని ఆశ్రయించి భ్రమ నుండి బయల్వెడలజేసుకోవాలి గాని "ఎవరో వస్తారు! ఎప్పుడో ఏదో అవుతుంది! అప్పుడు ఈ భ్రమ పోతుంది" అని తలస్తూ ఈ విధంగా అడవు లందో, ఆరామములందో సంచరిస్తూ జ్ఞాన సమాచారమును పొందక కేవలం కమండలమును ఆశ్రయించటమో, గడ్డములను పెంచటమో, దూరంగా ఎక్కడికో వెళ్ళటమో చేసినంత మాత్రాన ఏం ప్రయోజనం?

ఓ రాజా! "సర్వానర్థకారకమగు నేను, నీవు, జగత్తు, చిత్తము ...అను వ్యవహారమంతా వాస్తవం కాదు. "సాక్షియగు నా కిదంతా స్వప్నమువలె భాసిస్తోంది" అని నీవు శీఘ్రంగా గ్రహించి ఉండటం ఉచితం, ఆవశ్యకం కూడా!

ఈ జగత్తు వాసన యొక్క విషయభూతము మాత్రమే. వాసన యొక్క అభావనను ఆశ్రయించి చూడు. అప్పుడు వాసన లేనిదే అగుచున్నది. వాసనతో బాటు వాసనారూపమైన చిత్తము, చిత్తరూపమైన జగత్తు మటుమాయమౌతాయి. అప్పుడు చిదాకాశమే శేషిస్తుంది. అనగా, ఏది అజ్ఞాన సమయంలో

జగత్తు, వాడు, వీడు, నేను, నీవు, నా మతం, ఈ వర్గం, ఆ దేశం, ఈ రాజ్యం, ఈ అడవి – మొదలైన జగద్విషయాలు అనుభవమౌతున్నాయో... అవన్నీ లేవని, చిదాకాశమే ఉన్నదని, ఈ కనబడేవన్నీ చిదాకాశ ఆపాదితములనీ జ్ఞానదృష్టికి తేటతెల్లమౌతోంది. అజ్ఞానిగా ఉన్నంతకాలం నీవు ఈ భూ ప్రపంచంలోని ప్రతి కీకారణ్యంలోనూ వందల–వేల యేళ్ళ తరబడి తపస్సు చేసినా లాభం లేదు. అంతరంగసార దర్శనం అను జ్ఞానంచే కల కలగా, అసత్యం అసత్యంగా, కల్పితం కల్పితంగా, నిత్యమైనది నిత్యంగా ఎఱుగబడగలదు.

ఓ రాజా! మరొక్కసారి గుర్తు చేస్తున్నాను.

**అప్రబుద్ధైః అవగతం చిత్తం దృశ్యమిదం జగత్,**
**అసచ్చిత్తం నిరాకారం పూర్వముత్పన్నమేవ నో ॥**

అజ్ఞాన దృష్టికి ఏ చిత్తము – తద్ద్వారా – జగత్తు – దృశ్యము మొదలైనవన్నీ అగుపిస్తున్నాయో అట్టి అసత్తైన, నిరాకారమైన చిత్తము మొదటే ఉత్పన్నం కాలేదు. స్వప్నానికి స్వప్నద్రష్టకన్నా వేరే కారణం లేనట్లే జగదనుభవమునకు జాగ్రత్ ద్రష్టకన్నా వేరే ఎవరూ కారణం కాదు.

కనుక,"కారణము యొక్క అభావముచే సృష్ట్యాదిలోనే ఈ జగత్తు ఉత్పన్నం కాలేదు. ఇదంతా చైతన్యము నందు స్వయంకృతమై జలతరంగంలాగా ఏర్పడిన చైతన్యరూపమే అయినట్టి జగద్భావన యొక్క మాహాత్మ్యం అనునది మాత్రమే ఉత్తమోత్తమమైన సత్యం.

"సాకారము, స్థూలము, ప్రతిఘాతయోగ్యము అగు ఆకృతి కలిగినట్టిది అయిన ఈ దృశ్య వస్తువు అనాదియు, స్థిరము, జన్మవికారసహితము"... అని అనటం ఉచితం కాదు. అది ఆత్మజ్ఞులు అనుభవమునకు అనుకూలంగా లేదు. "ద్రష్ట యొక్క కల్పనయే ఈ జగత్తు" అనటానికి ఒక దృష్టాంతం, "ఇదంతా ఎవరికి ఎట్టి చిత్తం ఉంటుందో వారికి తదనుసారమే అనుభవమవటం" అనునదే సుమా!

❖

అయితే, ఇక్కడొక చమత్కారం గమనార్హం. ఇక్కడ జగత్తు వికారాలైనట్టి ప్రళయ – మహా ప్రళయాదులు ఉన్నాయని శాస్త్రములు ప్రవచిస్తున్నాయి కదా! అట్టి ప్రళయ – మహాప్రళయాదులు కారణ అభావం చేతనో, లేక శాస్త్రానుభవం చేతనో నిరాకరించటానికి వీలు ఎట్లా కుదురుతుంది? "శాస్త్ర, అనుభవ, వేదార్థ, సిద్ధాంతాలచే చెప్పబడే ప్రళయాలు లేవు" అని గాని, శాస్త్ర – వేదానుభవాలే లేవని అనటం నా ఉద్దేశం కాదు. ప్రత్యక్షంగా జరుగుచున్న దానిని లేవు అన్నంత మాత్రాన ఏం లాభం? మనం సంభాషించుకునేదంతా 1.లోకానుభవ ప్రమాణం, 2.శాస్త్ర ప్రమాణం, 3.వేద ప్రమాణం... ఈ మూడింటికి సరిపోవుచూ ఉండాల్సిందే! అట్లా కాకుండా కేవలం లోక ప్రమాణం మాత్రమే తీసుకుంటే అట్లు ప్రతిపాదించేది "పదార్థములు మాత్రమే ఉన్నాయి. ఇంకేమీ లేవు. ఇంక తెలుసుకోవలసినది మరింకేమీ లేదు" అనే చార్వాకసిద్ధాంతం కన్నా ఉన్నతమైనది కాదు. అట్టి వానిని సజ్జనులు ఆశ్రయించరు.

అందుచేత మనం ప్రతిపాదించే అకారణ సిద్ధాంతం (కారణమే లేదు కనుక చిత్త – జగత్తులు లేవు – అనే సిద్ధాంతం) కొన్ని వాక్య పరంపరగా సమీక్షిస్తాను.

1. జీవునకు సాకార – ప్రతిఘాతయోగ్యమైన ఈ దృశ్య జగత్తు అనుభవమౌతోంది.

2. ఈ వస్తువు జగత్తుకు ఒకప్పుడు ఉత్పత్తి ఉన్నట్లే మరొకప్పుడు వినాశనము (ప్రళయ – మహా ప్రళయములు) అనివార్యం.

3. ఇట్టి సాకార – ప్రతిఘాతయోగ్య దృశ్య జగత్తునకు కారణం నిరాకార – అప్రతిఘతమైనట్టి బ్రహ్మము కాజాలదు.

4. పదార్థముల అనుభవం దృష్టిని బట్టి ఉంటోంది. దృష్టియే సృష్టి. దృష్టియే చిత్తము.

5. వ్యవహార దృష్టిచే సాకారము పొందుచున్న ఈ జగత్తు అట్టి వ్యవహారదృష్టికి మాత్రమే అర్థ క్రియా సామర్థ్యము కలిగి ఉంటోంది

6. పరమార్థమున బ్రాహ్మీదృష్టిచే (బ్రహ్మము యొక్క అఖండ – అప్రమేయ దృష్టిచే) ఈ జగత్తు నిత్యము అలక్ష్యమై, అవిషయమై ఉంటోంది.

❖

కాబట్టి మనందరి ఏ బ్రాహ్మీ స్వస్వరూపమున్నదో ...అది సర్వదా నిరంశమై, ప్రతిఘాతయోగ్య మగు రూపం లేనిదై, నిరాకారమై, పూర్వము కంటే కూడా పూర్వమై, పూర్ణ స్వభావ యుక్తమై, శాంతమై, చిదాకాశమై, సర్వత్రా వర్తించునదై, ఉన్నది. అట్టి బ్రహ్మం యొక్క సమమగు ఆత్మప్రకాశం అను నిజస్వరూపం స్వయంగా ఈ "ప్రళయ – మహా ప్రళయాలు" అను జగద్వికారాలను ధరిస్తోంది.

ఆత్మస్వరూపము – అజ్ఞానదశయందు క్షణకాలంలోనే జగద్రూపంగా భాసిస్తోంది. మరొక క్షణంలో అదే ఆత్మస్వరూపము "తత్త్వమసి" వంటి అఖండార్థప్రదమగు వాక్యములను ఆశ్రయించి తద్వారా తన యొక్క ద్వైతరహితమగు నిజబ్రహ్మరూపంగా ప్రకాశిస్తోంది. వీటినే మనం బంధము అని, మోక్షము అని శాస్త్ర రచన కొరకు చెప్పుకుంటున్నాం.

**బ్రహ్మైవేదమతః సర్వం, క్వచిన్న జగదాది ధీః?**
**క్వాచిత్తాదిః? క్వచిత్తాదిః? క్వద్వైత్యైక్యాది కల్పనా?**

శాస్త్రీయమగు బోధచే అంతయూ బ్రహ్మమే అగుచున్నది. ఇక ఈ జగదాదులకు సంబంధించిన బుద్ధి ఎచట? చిత్తాదులెచట? అచిత్తాదులు ఎచట? ద్వైత – ఐక్య కల్పనలు ఎక్కడున్నాయి? ఇట్లు జ్ఞానం కలుగగా, ఈ జగత్తంతాకూడా ప్రశాంత రూపమై, నిరాలంబమై, జన్మరహితమై, అనాది అయి, యథాస్థితమైనట్టి (ఎప్పటియట్లే ఉన్నట్టి) బ్రహ్మమే అగుచున్నది. కానీ, అజ్ఞానుల దృష్టికి మాత్రం ఈ జగత్తు, ఇందలి సారాసారములన్నీ కూడా అసత్తుగా బ్రహ్మమునకు వేరైనదిగా ఎరుగబడుట చేతనే అటు నానారూపాలుగాగాని ఇటు ఏకరూపంగా గానీ కాకుండానే ఉన్నాయి.

కాబట్టి ఓ ప్రియమిత్రమా! శిఖిధ్వజ మహారాజా! నీవు... వ్యవహార దృష్టిచే యథాప్రాప్తములైన వ్యవహారములను ఆచరించు. తత్త్వ దృష్టిచే కాష్ఠమౌనమును అవలంబించి ఉండు. ఈ వాక్ మొదలైన ఇంద్రియ వ్యాపారరహితుడవై, ప్రశాంత స్వరూపుడవై ఏర్పడి ఉండు.

❖❖❖

# 34. ఈ జగత్తే బ్రహ్మము

**శిఖిధ్వజుడు:** హే బ్రహ్మన్! నేను మీ రాకచే ఎంతటి ధన్యుడనైనాను!

**నష్టో మోహః స్మృతిః లబ్ధా త్వత్ప్రసాదాత్, మహామునే!**
**స్థితోఽస్మి గత సందేహో విశ్రాంతమతిరాత్మవాన్ ॥**

తమ అనుగ్రహం చేత నా అజ్ఞానం నశించింది. ఆత్మ స్వరూపం ఇప్పుడు స్మృతికి (జ్ఞాపకానికి) వచ్చింది. ఇప్పుడు సంశయరహితుడనై ఆత్మయందు అనిర్వచనీయమైన విశ్రాంతిని పొందుచున్నాను. ఏది తెలుసుకోవాలో... అది తెలుసుకున్నాను. మాయారూపమగు మహాసముద్రమును దాటివేశాను. నేనిప్పుడు మహామౌనినై పరమశాంతుడనై, అహంకారవర్జితుడనై, ఆత్మజ్ఞాన సంపన్నుడనై ఉన్నాను.

ఆహాఁ! ఇంతకాలం ఈ సంసారారణ్యంలో మార్గం తెలియక తిరిగి తిరిగి అలసిపోయానే! ఇప్పటికి మార్గం చూపించే మీరు అనేక జన్మల పుణ్యఫలంగా లభించారు. ఇప్పటికి దుఃఖరహితమైనట్టి అక్షయ స్థానమును పొందాను. మీరు చెప్పినట్లు అజ్ఞానదశలో తెలియవచ్చే అహంకార సహితమైన ఈ స్వర్గ – మర్త్య – పాతాళములనబడే మూడు లోకములు లేవు. ఏదేది ఎక్కడెక్కడ భాసిస్తోందో అదంతా బ్రహ్మముగానే ఎరుగుచున్నాను. 'అహంకారం' విషయమై మీరు చెప్పే యుక్తియుక్తమైన ఆప్తవాక్యాలు వింటుంటే 'బ్రహ్మానందం' అని శాస్త్రకారులు చెప్పే అనుభవం యొక్క ఔన్నత్యం నిజంగా ఇప్పుడు అవగతమౌతోంది. ఏ దేవతలు నా ప్రపత్తికి సంతసించి ఈ రోజు మీ వాక్యామృతాన్ని వినే అవకాశాన్ని ప్రసాదించారో, వారికి కృతజ్ఞతలు చెప్పటానికి నాకు మాటలు రావడం లేదు. మీ వాక్య బలంచే 'అహంకారం లేదు' అని గ్రహిస్తున్నాను. ఎంతటి ఆశ్చర్యం!

**కుంభమహర్షి:** ఔను నిజమే! ఈ జగత్తే లేకపోతే ఇక అహంకారం ఎట్లు ఎవరికి భాసిస్తుంది? మాంత్రికుని మాయాకల్పన వంటి ఈ జగత్తుకు ఎక్కడా కారణం లేదు. ఇది సత్యమెట్లా అవుతుంది? ఇది గ్రహించి నీవు యథాప్రాప్తములైన ఆయా వ్యవహారములను నిర్వర్తిస్తూనే మౌనివై శాంత మనస్కుడవై, ఆత్మ మననశీలుడవై ఉండు.

శాంతమగు సముద్రంలో శాంతమగు కెరటమువలె ఏర్పడి ఉండు. ఇదంతా కూడా యథాస్థిత మైనట్టి శాంతపరబ్రహ్మమే అయి ఉన్నది. ఇక నేను, ఇది, జగత్తు మొదలైన శబ్దార్థముల వాస్తవ స్వరూపం శూన్యమే సుమా! ఆత్మరూపమగు ఆద్యంత రహితమైన చిదాకాశమే తనయొక్క చిత్ (ఎఱుక) అను చమత్కారం చేత చాకచక్యంగా ఈ జగద్రూపమున ప్రకాశిస్తోంది. బంగారుగొలుసులో గొలుసు ఆకారాన్ని ప్రక్కకు పెట్టామనుకో, ఇక అందులో బంగారం కాక మరింకేమున్నది? అట్లాగే, ఈ జగత్తు యొక్క నామరూపాలు ప్రక్కకు పెట్టామా ...ఇక ఇదంతా బ్రహ్మం మాత్రంగానే మిగిలి ఉంటుంది.

"సమష్టి అహంకారాత్మకుడు" అయిన బ్రహ్మదేవుడు స్వయంగా సంకల్పమాత్రుడే కదా! అట్లాగే 'వ్యష్టి అహంకారాత్మకుడు' అగు ఈ జీవుడు కూడా స్వయంగా సంకల్పమాత్రుడే అయి ఉన్నాడు.

సంకల్పరూపమే ఈ జగత్తు. సంకల్పము వల్లే బంధం కలుగుతోంది. అహంకారం కూడా సంకల్పం యొక్క ఒక ప్రకటన మాత్రమే. సంకల్ప త్యాగమునందు మోక్షం వ్యవస్థితమై ఉంటోంది.

**అహమిత్యేవ సంకల్పో బంధోయాతి వినాశినే**
**నాఽహమ్ ఇత్యేవ సంకల్పో మోక్షాయ విమలాత్మనే ॥**

'ఈ దేహాదులే నేను' అను సంకల్పము జ్ఞాన వినాశనకరమగు బంధమును కలుగజేస్తోంది. "ఈ దేహాదులు నేను ఏ క్షణంలోనూ కాదు" అను సంకల్పం నిర్మలమగు మోక్షమును కలుగజేస్తోంది. ఆత్మ సర్వదా ఈ బంధ మోక్ష విపర్యయపదాలకు సంకల్పాది శబ్దార్థములకు సాక్షీభూతమై ఉన్నది. అట్టి ఆత్మ స్వరూపం యొక్క సాక్షాత్కారజ్ఞానమును 'సద్బ్రహ్మం' అని, 'కైవల్యం' అని చెప్పుచున్నారు.

భావనయే బంధ-మోక్షాలను నిర్ణయిస్తోంది. 'అహంభావన' అను అజ్ఞానం లేకపోతే మోక్షం. 'అహంభావన' అను అజ్ఞానం కలిగి ఉంటే బంధం. కాబట్టి మహారాజా! నీవు దేహాహంభావనను ఇప్పుడే ఇక్కడే నిస్సందేహంగా త్యజించు. "నేను సద్రూపుడను. అహంభావరహితుడను" అనే జ్ఞానాన్ని అత్యంత అవశ్యంగా శీఘ్రంగా ఆశ్రయించి తద్వారా 'శుద్ధాత్మబోధి'వి కమ్ము. నిస్సంకల్పం (లేక) సంకల్పరాహిత్యం అను చిన్న ప్రయత్నం నీకు సమ్యక్ జ్ఞానాన్ని అతి త్వరగా ప్రసాదించగలదు. అప్పుడు క్రమంగా నీ నుండి అసద్రూప సంకల్పం స్వయంగా తనంతట తానే నశిస్తుంది.

సర్వ తర్కములకు అతీతమైన (అప్రతర్క్యమైన) పరమాత్మయందు కారణత్వం ఎట్లా సంభవిస్తుంది? కారణమే ఉద్భవించజాలనప్పుడు కార్యరూపమగు ఈ పదార్థములు ఎట్లా ఉంటాయి? పదార్థముల అభావనచే ఇక దానిలో అహంభావం ఎన్నటికీ ఉదయించజాలదు. అహంభావమే ఉదయించకపోతే ఇక ఈ ప్రపంచం ఎవరికి ఉన్నట్లు? ప్రపంచం యొక్క అభావనచే సమస్తం కేవలం పరబ్రహ్మ మాత్రమై శేషించగలదు.

**యదిదం భాసతే తత్సత్పరమేవాత్మని స్థితం**
**పరంపరే పరాపూర్ణం సమమేవ విజృంభతే ॥**

జ్ఞాన సముపార్జనకు పూర్వం ఏదైతే జగత్తుగా భాసిస్తోందో, అదంతా జ్ఞాన సమన్వితుడవైన తరువాత ఆత్మప్రసరణ సమన్వితమై అనుభవమౌతోంది, పరమార్థమున చూస్తే, - "సద్రూపమగు పరమాత్మ తన ఆత్మయందు తానే సర్వదా సంస్థితమైయున్నది" - అని గ్రహించబడుచున్నది. సమస్వరూపమగు పరమాత్మయే సమస్వరూపమగు జగత్తును తన చిత్కళతో నింపివేసి అదే సమయంలో తన పరస్వభావమును యథాతథంగా కలిగియే ఉంటున్నాడని జ్ఞాని ఎరుగుచున్నాడు.

వజ్రం అంతరమున నిశ్చలంగా ఉన్నది. కాని బాహ్యమున ఆ వజ్రం యొక్క కాంతి ఆయా సమీప వస్తువులను ప్రకాశింపజేయుచున్నది. "పరమాత్మ" అను వజ్రమణి యొక్క కిరణసమూహ ప్రతిబింబాకారమే పరమాత్మయందు ప్రకటితమయ్యే జగత్తు - అని గ్రహించి ఉండు.

సంకల్పములన్నీ (లేక ఊహలన్నీ) నశించగా, ఇక సంకల్ప నిర్మిత నగరానికి (లేక, ఊహానిర్మిత నగరానికి) స్వరూపం ఏముంటుంది? ఆకాశము కంటేకూడా స్వచ్ఛమైన, సదసన్మయమైయున్న ఈ జగత్తు కూడా నిర్మల - నిర్విషయాకాశముగానే గ్రహించు.

వస్తువులు కదులుచున్నప్పటికీ, ఆ వస్తువులు ఏ వజ్రశిలయందు ప్రతిబింబిస్తున్నాయో అది నిశ్చలం కదా! ఈ జగత్తును ఎవడు శాంత మననరహిత – మౌనతత్త్వముగా గాంచుచున్నాడో అట్టి వాడు మాత్రమే దీనిని సరిగ్గా దర్శిస్తున్నవాడౌతాడు.

ఓ రాజా! నీయందు సమ్యక్ జ్ఞానోదయం అగుగాక! అప్పుడు బాహ్యరూపాలగు ఈ లోకాలు, ఆంతరికములైన మనో బుద్ధి అహంకారాలు ఇవన్నీ నిస్సారమని, నామమాత్రా వశిష్టములని ఎవరూ చెప్పకుండానే గ్రహిస్తావు. అట్టి స్థితినే విజ్ఞులు "మోక్షం" అనే పేరుతో పిలుస్తున్నారు.

❖

వాయువు చలిస్తోంది. అయితే చలనము లేకపోయినప్పుడు కూడా వాయువు ఉన్నది కదా! దీపం వెలిగిస్తే వెలుగు వస్తోంది. దీపం వెలిగించనప్పుడు ఆ కాంతి ఆకాశంలో దాగి ఉన్నది కదా! ఆభరణం యొక్క రూపం ధరించనప్పుడు కూడా బంగారం ఉన్నది కదా! అట్లాగే జగత్తు యొక్క సన్నివేశం లేకపోయినప్పుడు కూడా బ్రహ్మము ఉన్నది. బ్రహ్మమునకు 'లేకపోవడం' అనేది ఉండదు. జగత్తు యొక్క ఈ జగత్ ప్రత్యయాకారములు, ఇందులోని నామరూపాదులు, వీటి యొక్క కల్పనను ప్రదర్శించే మనోబుద్ధ్యాదులు – ఇవన్నీ మిథ్యాభాసములు మాత్రమే! అయితే, ఇవన్నీ బ్రహ్మమునందే ఉండి, బ్రహ్మము నందే ప్రతిబింబిస్తున్నాయి.

సముద్రంలో వేలాది తరంగాలు ఉండవచ్చు గాక! తరంగాలన్నిటిలో ఉన్నది జలమే కదా! జలాన్ని గ్రహించిన తరువాత తరంగాల యొక్క శబ్దార్థాలు ఎక్కడ మిగులుతాయి? అట్లాగే బ్రహ్మమున అనేక సృష్టులు ఉండవచ్చు గాక! అవన్నీ కూడా బ్రహ్మమును గ్రహించిన తరువాత అర్థరహితములగు శబ్దాదులకు కూడా అనర్థములు కాగలవు. వాస్తవానికి ఈ సృష్టి నుండి శబ్దార్థములను వేరు చేస్తే అప్పుడీ సృష్టియే బ్రహ్మము. బ్రహ్మమే సృష్టి. 'ఇదంతయు బ్రహ్మమే (సర్వం ఖల్విదంబ్రహ్మ)' అను శ్రుతి వాక్యము యొక్క అర్థం ఇదే కదా! 'బ్రహ్మము' అను శబ్దమునకు అర్థం 'వృద్ధి కలిగించునది' అని కదా! కనుక 'బ్రహ్మము' అను శబ్దమునందు సర్గము లేక సృష్టి అనే అర్థం కూడా ప్రతిక్షేపించబడియే ఉన్నది. అట్లాగే 'సర్గము' అను శబ్దమునకు అర్థము 'త్యాగము' అని కూడా కదా! కాబట్టి 'సర్గము' అను శబ్దంలో త్రివిధ పరిఛేదాత్యాగరూపములగు "త్యాగము (బ్రహ్మము)" అనే అర్థం సంక్షిప్త పరిచియే ఉన్నది. అనగా బ్రహ్మమునకు, సర్గమునకు ఉన్న అర్థం ఒక్కటే ఆగుచున్నది. ఇట్టు సృష్టియే బ్రహ్మము, బ్రహ్మమే సృష్టి అని గ్రహించు.

"సమస్త శబ్దములు, ఆ శబ్దముల అర్థములు, వాటి భావనలు, ఆ భావనల ఉదయము" ఇట్టి సర్వరూపంగా వర్తించే చిదాకాశమేదైతే ఉన్నదో అద్దానినే 'బ్రహ్మము' అని పిలుస్తున్నారు.

మనం సమ్యక్ దర్శనం సిద్ధింపజేసుకుంటే అప్పుడు జగత్తు – బ్రహ్మము అనబడు ఉభయ శబ్దముల వాచ్యార్థం నివృత్తమౌతుంది. అప్పుడు వాటి లక్షణావృత్తి శేషిస్తుంది. ఇకప్పుడు మిగిలేది అనుభవం మాత్రమే! అజరమై, అమరమై, శాంతమైనట్టి ఏ పరబ్రహ్మము కలదో – అద్దాని నుండి బ్రహ్మ–జగదాది వాక్కులన్నీ వెనుకకు మరలుతాయి. (యతో వాచోనివర్తంతే అప్రాప్యమనసా సహా

– తతోవాగ్వినివర్తతే). యథాస్థితమైన ఏ ఈ జగత్తేదైతే ఉన్నదో, ఇది అతి దృఢమగు శిలారూపము వంటిదై పరబ్రహ్మస్వరూపమే అయున్నది.

ఈ జగత్తును నీవు మార్చటమో, వదలటమో, పట్టుకోవటమో మోక్షం కాదు. దీని వాస్తవ స్వరూపం గ్రహించి ఉండటమే మోక్షమనబడుచున్నది.

సర్వాత్మక జ్ఞానముచే బ్రహ్మము శేషించగలదు. అజ్ఞానముచే ఒక జీవుడు సర్వాత్మక జ్ఞానము కలిగి ఉండకపోవచ్చు గాక! అయినప్పటికీ ఇక్కడ సర్వదా ఏకాత్మక స్వరూపమగు బ్రహ్మమే ఉన్నది. బ్రహ్మమే తాండవించుచున్నది. బ్రహ్మమునకు జగత్తుకు వేరు వేరు సత్త లేదు.

❖❖❖

# 35. దృశ్యము ద్రష్టను పరిమితం చేయలేదు

**శిఖిధ్వజుడు :** మీరు ఇంతవరకు ఒక నూతన సిద్ధాంతమును ప్రతిపాదిస్తున్నారు. 'బ్రహ్మమే జగత్తు, జగత్తే బ్రహ్మము' అని ప్రవచిస్తున్నారు. ఈ బ్రహ్మము – జగత్తులకు మీరు చెప్పినట్లు ఒకే సత్త ఉన్నట్లైతే – పరబ్రహ్మమునకు కారణము సత్యమైనది, జగద్రూపమునకు కార్యము సత్యమైనది – అని నేను అనుకుంటున్నాను. అట్టి "కార్య–కారణన్యాయం" అను అవగాహన యుక్తియుక్తమే నంటారా?

**కుంభ మహర్షి :** ఓ రాజర్షీ! బ్రహ్మము సర్వదా ఏకమే అయినప్పటికీ ఆశ్రితులగు శిష్యులను ఉద్ధరించే ఉద్దేశంతో మహనీయులగు ఆత్మజ్ఞులు బ్రహ్మమును రెండు విధములుగా విభాగించి చెప్పుచున్నారు– 1. మాయతో కూడినట్టి బ్రహ్మము. 2. నిష్కళంక బ్రహ్మము.

మాయతో కూడిన బ్రహ్మమునకు జగత్తు యొక్క కారణత్వం ఉన్నదని బోధకొరకై చెప్పుకోవచ్చు. కాబట్టి అద్దానికి 'జగత్తు' అనే కార్యము ఏర్పడి ఉంటోంది. కానీ నిర్గుణ – శుద్ధ బ్రహ్మమునకు కారణం లేదు. కారణం లేదు కాబట్టి కార్యము కూడా లేదు.

**నేహాఽస్తి కారణం కించిత్ న చ కార్యం కదాచన ।**
**విద్యమానమిదం సర్వం సర్వం శాన్తమయం జగత్ ॥**

నిర్విషయమగు బ్రహ్మమునకు కార్యము గాని, కారణం గానీ లేవని ఇతఃపూర్వమే అనుకున్నాం కదా! అయితే మాయాదృష్టిచే ఈ కార్య – కారణ వ్యవహారం స్వీకరించబడుతోంది. యథార్థానికి విద్యమానమై కనిపిస్తున్న ఈ జగత్తంతా శాంతము, అజము అయినట్టి బ్రహ్మమే అయిఉన్నది.

ఒక కారణం నుండి ఏది ఉత్పన్నమౌతుందో, అట్టి కార్యం ఆ కారణమును పోలియే ఉంటుంది. ఏది ఉత్పన్నమే కాలేదో, అద్దానియందు ఇక సాదృశభావమెచ్చట? "ఇక్కడ ఈ చెట్టు ఉన్నది చూచారా! దీనికి కొమ్మలు, ఆకులు అన్నీ ఉన్నాయి. అయితే దీనికి బీజము మాత్రమే లేదు" అనే వాక్యం నిరర్థకమే కదా! అట్లాగే తర్కములకు లభించనిది, నామరూపరహితమగు ఆత్మయందు నామ

రూపాత్మకమైన జగత్తు యొక్క బీజం ఉండటానికే వీలులేదు. బీజం లేదు కనుక జగత్తు కూడా నిర్హేతుకమనే చెప్పాలి. అయితే భావనామాత్రమగు ఆత్మయందు భావనాత్మక జగద్భావం ఏర్పడు తుంది. అట్టి దేశ – కాల – వస్తువశం చేత సమస్త కారణములు, ప్రమాణములు సిద్ధిస్తున్నాయి. అయినా అకర్త విభాగమగు బ్రహ్మం ప్రమాణానికి గానీ, కారణానికి గానీ విషయం ఎట్లా అవుతుంది?

**బ్రహ్మైవ త్వం స్వరూపం సదృత్ సిద్ధితం ధారయస్వ తత్,**
**అసమ్యక్ దర్శి విషయం తదేవ జగదాచితమ్**

ఓ మహారాజా! నీ స్వరూపం బ్రహ్మం కానిదెప్పుడు చెప్పు? "సద్రూపమై శుద్ధాకాశం వలె నిర్విశేషమయినట్టి బ్రహ్మమే నేను" అను భావనను నీ హృదయంలో అవధరించు. అజ్ఞానుల దృష్టి యందు బ్రహ్మమే జగత్‌రూపంగా వ్యాప్తమైయున్నది.

1. ఏకమై, శాంతమై, అజరమై, చిన్మాత్రమైనట్టి "ప్రమ" (బ్రహ్మజ్ఞానం)చే జగత్తు బ్రహ్మ రూపంగా ప్రమాణితం ఒనర్చబడుచున్నది; 2. బ్రహ్మాకారవృత్తి రహితమైన ఈ మనస్సు యొక్క భ్రాంతిచే అశాంతంగా దర్శించబడే సద్‌బ్రహ్మం ఈ జగద్రూపంగా ఎఱుగబడుచున్నది... ఈ రెండు దృష్టులు ఇక్కడ ఉన్నాయి.

ఈ చిత్తం స్వయంగా 'అన్యథా' అను భావన ధరించుట చేతనే తాను ఏకమగు బ్రహ్మస్వరూపాన్ని ఏమరచి ఇక్కడ అనేకమును దర్శిస్తోంది. అయితే ఈ చిత్తమును నమ్ముకొని జగత్తులో అనేకములో ఎంతవెతికినా బ్రహ్మం అనుభవం కాదు. పైగా ఇది నాశనస్వభావం కలది. కనుక నాశనస్వభావం గల వస్తువులనే ఆశ్రయించి క్రింది – మీద అగుచున్నది. అదియే ఆత్మానుభవమునకు అడ్డంకి అయి కూర్చుంటోంది. క్షణకాలం ఆత్మస్వరూపం యొక్క విస్మరణమే ...కల్పకాలం వరకు 'చిత్తం' అను శబ్దంగా చెప్పబడుతోంది. కనుక ఇప్పుడు సమ్యక్ జ్ఞానం అత్యావశ్యకం.

సమ్యక్ జ్ఞానం వలన నిస్సంకల్పం లభించగలదు. నిస్సంకల్ప బలంచే అసత్యమయినట్టి సంకల్పరూప చిత్తం క్షయించి మోక్షం సిద్ధించగలదు.

**విశ్వము -** 'విశ్వము' అనే శబ్దానికి అర్థం? "ఏవమ్ విశతీతి విశ్వమ్ – ఏదైతే అధిష్ఠానమున ప్రవేశిస్తోందో, అదియే విశ్వము"...అని కదా! ఈ విశ్వము తనయొక్క అభావమును స్వీకరిస్తోంది. ఇక అది స్వయంగా విద్యమానమై ఎట్లా ఉండగలదు?

ఎవడైతే రెండు చేతులెత్తి "నేనొక పరమదరిద్రుడను" అని ప్రకటిస్తున్నాడో, అతడు దరిద్రుడు గానే ఉంటాడుగాని ధనికుడని ఎట్లా అనిపించుకుంటాడు? సన్నిపాత జ్వరముచే ఒకడు 'నేను చచ్చినట్లేరా నాయనోయ్!" అని గోలపెట్టుచుండగా అతడిక చచ్చినవాడే అవుతాడు గాని, జీవనము గురించిన అనుభవం కలవాడు కాదు కదా!

ఒకడు కొరివిని పట్టుకుని '8' అను ఆకారంలో త్రిప్పుతూ ఉంటే అక్కడ గాలిలో '8' ఆకారం ఏర్పడి ఉన్నట్లు కనబడుతుంది చూచావా? మృగతృష్ణలో జలం మిలమిలమెరుస్తూ ఉన్నట్లే అగుపడుతుంది కదా! బాలునికి గాలిలో దయ్యము ఉన్నట్లే అనిపిస్తుంది కదా!

అట్లాగే ఈ జగత్ – చిత్తాదులు భ్రమచే మాత్రమే ఉన్నట్లు అనిపిస్తున్నాయి. ఏది సర్వదా భ్రాంతి పుంజమే అయ్యున్నదో అది సత్యమెట్లా అవుతుంది? అజ్ఞానజనితమైన భ్రమయే 'అంతః కరణం, చిత్తము' మొదలైన శబ్దములచే ఉద్దేశించబడుచున్నది.

సత్తువలె ఉన్నట్టి అసత్తగు అజ్ఞానమే 'చిత్తము' అను శబ్దమునకు నిర్వచనం.

'అసంవేదనం అజ్ఞానం, జ్ఞానం సంవేదనం భవేత్' – బ్రహ్మం యొక్క అనుభవం లేకపోతే అజ్ఞానమని, అట్టి అనుభవం ఉంటే జ్ఞానమని చెప్పబడుతోంది. 'అజ్ఞానసత్త' యొక్క అజ్ఞానం జ్ఞానానుభవ మాత్రం చేత తప్పకుండా నశించగలదు. ఎండమావులలోని జలం భ్రమయే అయినట్లు ఆత్మకు వ్యతిరిక్తమైన అనుభవాలన్నీ భ్రమమాత్రమే! "ఎండమావులలో జలం ఉండదు" అను జ్ఞానంచే జల భ్రాంతి నశిస్తుంది కదా! "భ్రాంతి కాకుండా చిత్తమనేది ఉండదు" అను జ్ఞానముచే చిత్త భ్రాంతి తప్పక తొలగగలదు. అజ్ఞాన భ్రమచే త్రాడును చూచినప్పటి పాము యొక్క భ్రమ భావన – "ఇది త్రాడు మాత్రమే" అని ఎరిగిన తరువాత – ఇంకా ఉంటుందా?

అట్లాగే ఆత్మయందు ఉదితమైనట్లు కనబడే 'మనస్సు' అనబడేది 1. 'మనస్సనేది భ్రమయే' అను ఎరుకచే, 2. 'ఆత్మయొక్క స్వభావం' అను జ్ఞానముచే తప్పక రహితమౌతోంది.

**శిఖిధ్వజుడు :** ఆత్మ నిర్విషయము, అప్రమేయము కదా! మరి చిత్తము, మనస్సు మొదలైనవన్నీ అసలు ఎందుకుంటున్నాయి? ఎందుచేత ఏర్పడుచున్నాయి?

**కుంభమహర్షి :** హే శిఖిధ్వజా! ఈ ప్రశ్నకు మన ఈ సంవాదములో ఇప్పటికే సమాధానం చెప్పుకున్నాం? అయినా కూడా నీవు అదే ప్రశ్న ప్రశ్నించటం జరుగుచున్నది సుమా! సరే, మరల ముక్కుకు సూటిగా సమాధానం చెప్పుచున్నాను.

చిత్తము, మనస్సు, అహంకారము మొదలగు సమస్తమూ కూడా అజ్ఞానము వలననే ఉన్నట్లుగా అనుభూతమగుచున్నాయి. ఆత్మజ్ఞానముచే లేనివిగా తెలియవస్తున్నాయి.

ఆత్మ తనను తానే ఏమరిచి, వ్యవహారసత్తను ఆశ్రయించటమే మనోబుధ్యహంకారాదుల శబ్దములతో సూచించబడుతోంది. అంతకు మించి వాటికి వేరే రూపముగాని, ఉనికి గాని లేవు. యథార్థానికి ఈ ప్రపంచంలో చిత్తం లేదు. అహంకారం లేదు. మనస్సు లేదు. వాటికి విషయాలగు ఈ దేహాదులు లేవు. కేవలం శుద్ధమగు బ్రహ్మ సంవిత్తు మాత్రమే ఉన్నదని మరల ప్రకటిస్తున్నాను.

చిన్మాత్ర సంవిత్తు స్వయం కల్పితంగా, అనిర్వచనీయ కారణంగా అజ్ఞానయుక్తమై చిత్తమును ప్రదర్శిస్తోంది. అదియే జ్ఞానయుక్తమైనప్పుడు చిత్త సంబంధితమైన సంకల్పములను త్యజిస్తోంది. సంకల్పముల అభావముచే ఇక సమస్తం పరిత్యజించబడుతోంది. గాలి వీచుటచే అగ్నిలో జ్వాలలు ప్రకటనమౌతాయి. గాలి వీచటం ఆగిపోతే? అగ్నిజ్వాలలుకూడా ఉపశమిస్తాయి. సంకల్పములచే ఏది (చిత్తాదులు) ఉత్పన్నమగుచున్నదో, అది సంకల్పం యొక్క అభావంచే నశిస్తోంది. సముద్రమంతా జలం చేతనే ఆక్రమించబడుచున్నట్లు ఈ జగత్తంతా కూడా బ్రహ్మసత్త చేతనే, లేక ద్రష్ట యొక్క అనుభవసత్త చేతనే వ్యాపించబడియున్నది.

**నాఽహమస్తి, నచాఽన్యోస్తి, న త్వం, నై తే, న చిత్తకమ్**
**నేఽన్ద్రియాణి, నచాకాశమ్ "ఆత్మా-ఆత్మైకోఽస్తి నిర్మలః"**

ఓ రాజా! ఈ ప్రపంచమున నేనుగాని, మరొకరు గాని, నీవు గాని, ఈ చిత్తాదులు గాని, ఇంద్రియాలు గాని, ఆకాశాలు గాని లేవు. ఒకవేళ ఇవి అనుభవమౌతూ ఉంటే అది మాయతో కూడిన ఆత్మ యొక్క అభ్యాస చమత్కారం మాత్రమే. కేవలం నిర్మలమైన ఆత్మ మాత్రమే, త్రికాలాలలోను ఉన్నది. ఒక దేహి చూచేవాడు, వినేవాడు, ఆఘ్రాణించేవాడు మొదలైన ఆయా సర్వవిషయాలలోనూ ఏకస్థుడై ఉన్నట్లే - ఆత్మ సర్వవస్తు రూపంగా కనిపించుచున్నది. అటువంటివే చిత్తము, నేను, నీవు, జీవ, జాతి, దేవ, తిర్యక్, మానవాది విభాగములు కూడా!

**న జాయతే న మ్రియతే కించిత్ అస్మిన్ జగత్త్రయే,**
**కేవలోఽయం "చిత్-ఉల్లాసః" సత్-అసత్ భావనాత్మనా ॥**

ఈ మూడు లోకములలో ఏదీ మరణించటం లేదు. ఏదీ కూడా జన్మించటమూ లేదు. మరి? సత్ - అసత్ భావనా రూపమగు ఇదంతా కూడా కేవలం చైతన్యము యొక్క ఉల్లాసము- విలాసము మాత్రమే అయున్నది.

**సర్వమాత్మా పరంబ్రహ్మ సకృత్ ప్రకటమాతతమ్**
**ద్విత్వ-ఏకత్వేన విద్యతే న భ్రాంతిః న చ సంభ్రమః ॥**

పరబ్రహ్మమగు ఆత్మయే ఏకకాలమున సర్వరూపముగా ప్రకటనమగుచున్నది. ఇక ద్విత్వము గాని, ఏకత్వము గానీ, భ్రాంతిగాని, మరణాది భయములు గానీ ఏవీ కూడా లేవు. సఖుడా! శిఖిధ్వజా! నీవు ఈ సమస్త ఇంద్రియములలోను, ఈ ఇంద్రియములకు విషయములగు పంచభూత సమన్విత సృష్టి (లేక) దృశ్యములోను, సత్తామాత్రస్వరూపుడవై వ్యాపించి ఉన్నావు. సత్త స్వరూపుడవైన నీవు దేనిచేతా దహించబడజాలవు. నిన్ను లిప్తము చేయగలిగేదేదీ ఇక్కడ లేదు. ఎక్కడా లేదు.

**న తే వినశ్యతి, సఖే! న చ కించిత్ వివర్ధతే ।**
**నిర్మలాకాశ రూపస్య కైవల్యానన్తరూపిణః ॥**

ప్రియ సఖుడా! నీ వాస్తవ రూపం నిర్మాలాకాశము వంటిది. స్వతహాగానే అనంతము, మోక్ష రూపమూ అయి ఉన్నది. అట్టి నీ స్వస్వరూపం కించిత్ కూడా నశించదు, వృద్ధి చెందదు. నీయందు ప్రస్ఫుటమగుచున్న ఇచ్ఛ, అనిచ్ఛ, క్రియ మొదలైన శక్తులన్నీ - సూర్యకిరణములన్నీ సూర్యబింబమే అయినట్లు - నీవే అయి ఉన్నాయి.

కిరణములు లేకుండా సూర్యబింబం ఉంటుందా? సూర్య కిరణాలు ఏ వస్తువుపై ప్రసరించినా, ఆయా వస్తువులు సూర్యకిరణాలను గాని, కిరణ స్వరూపుడగు సూర్యభగవానుని గాని బంధించగలవా? అట్లాగే చిత్ స్వరూపుడవగు నిన్ను చిత్త విషయాలు ఎట్లా పరిమితం చేస్తాయి? ఎట్లా బంధిస్తాయి?

...సర్వ వ్యవహారముల కంటే మునుముందుగానే సిద్ధమై, జన్మ-జరా-మృత్యురహితమై, అనాది అయి, వృద్ధి - పరిణామాది వికారాలు లేనిదై, సదా నిర్మలమై, ప్రకాశరూపమై, సద్రూపమై,

ఏకమై, కల్పనారహితమై, సర్వదా, 'స్వస్వరూప పరిచయము' అనునది లీలగా కలిగినదై ... ఏదైతే ఉన్నదో అట్టిది ఆత్మయే అయి ఉన్నది. అట్టి ఆత్మయే నేను, నీవు, ఒక చీమ, దోమ కూడా. మనమెవరం ఎన్నడూ ఈ దేహ, మనో, బుద్ధి, చిత్త, అహంకారాదులు కానేకాము. అవము.

❖❖❖

# 36. తరంగాలన్నీ జలమే! చిత్తములన్నీ చిత్తే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** వింటున్నావు కదా, రామచంద్రా! ఆ విధంగా శిఖిధ్వజుడు కుంభుని అకృత్రిమమగు వాక్యార్థములు విన్నాడు. ఆ వాక్యాలు ప్రతిపాదిస్తున్న తన యొక్క ఆత్మ స్వరూపాన్ని మననం చేస్తూ క్రమంగా తన పూర్వభావాలను, తత్సంబంధమైన సంశయాలను త్యజించాడు. "శాశ్వతం, నిర్మలం అగు ఆత్మయే నా స్వరూపం కదా!" అను దర్శనంచే కనులు మూసుకున్నాడు. మనస్సు, వాక్కు తమ వ్యాపారాలు ఉపశమింపజేసుకున్నాయి. అతడు శిలయందు చెక్కబడిన ఒక విగ్రహంలాగా చేష్టా రహితుడైనాడు. ఒక ముహూర్తకాలం నిర్విషయ స్వయమాత్మానుభవం పొంది అప్పుడు కళ్ళు తెరిచాడు.

❖

**కుంభఋషి:** ఓ రాజా! యోగుల విశ్రాంతి స్థానము, మహత్తరము, శుద్ధము, వ్యాపకము, నిర్మలము, నిర్వికల్పము అగు సమాధియందు ప్రవేశించినట్లున్నావు. నిరతిశయానందదాయకమగు ఆత్మపదము నందు నీకు విశ్రాంతి లభించింది కదా? నీ అంతఃకరణం ప్రబోధమైనదా? భ్రాంతులను వదలివేశావు కదా? ఏది 'జ్ఞేయము' అని వేదాంత ప్రవచనాలు నిర్వచిస్తున్నాయో, అద్దానిని తెలుసుకున్నావు కదా! చూడవలసినది చూచావు కదా?

**శిఖిధ్వజుడు :** హే మహాత్మా! తమ అనుగ్రహం చేత మహావిభవరూపమగు భూమికను పొందాను. మహత్తరమైన ఆత్మ పదమును నాయందే దర్శించాను. విషయానందము నుండి బ్రహ్మదేవుని ఆనందము వరకు గల సర్వానందముల ఆవల స్థితిని పొందాను.

ఆహాఁ! ఈనాడెంత సుదినం! వేద్య పదార్థమును ఎఱిగిన తమతో సాంగత్యం మహత్తరమై లభించింది. నాకీనాడు అపూర్వము, అమృతమయము, సారయుక్తము అయినట్టి ఫలం మీరు ప్రసాదించడం జరిగింది. ఏ అమృతతత్త్వమైతే నేను నా జీవితపర్యంతం ఇప్పటి వరకూ త్రాగకయే ఉన్నానో, అయ్యది మీ వాక్యములను విన్నంత మాత్రం చేత స్వయంగా లభించింది. ఒక చిన్న విషయం మాత్రం నాకు చమత్కారంగా అనిపిస్తోంది. అనేక సందర్భాలలో ఆత్మ గురించి విజ్ఞులు చెప్పిన విషయాలను విన్నాను. అయినా కూడా, "అనంతము, ఆద్యము, అమృత స్వరూపము అయిన ఆత్మపదము యొక్క అనుభవం ఈనాడే లభించింది. మరి, ఇతఃపూర్వమే ఎందుకు లభించలేదా?'... అని కించిత్ ఆశ్చర్యంగా ఉన్నది.

**కుంభఋషి :** ఓ రాజా! దానికి కారణం నీ మనస్సు శమించటమే. ఈషణములు (ఈషణత్రయం) దారేషణ, పుత్రేషణ, ధనేషణ – అనే కషాయములు నివృత్తమైనాయి. తెల్లని, శుభ్రంగా ఉతికిన

వస్త్రంపై రంగు చక్కగా అంటుతుంది. మురికి గుడ్డపై రంగు అంటదు కదా! చిత్తము నిర్మలమైనప్పుడు మాత్రమే గురూపదేశ వాక్యములు అందులో ప్రవేశిస్తాయి. చిత్తము నిండా అనేక దోషములు ఉంటే, లౌకిక వాక్యముల పట్లే ఆ చిత్తము స్పందిస్తుందిగాని, ఆత్మ నిర్వచన పూర్వకమగు శాస్త్ర వాక్యములు ఆస్వాదించటానికి అట్టి చిత్తము సిద్ధమయి ఉండదు. అనేక జన్మలందు స్వయంగా ఆశ్రయిస్తూ ప్రోగుచేసుకొన్న స్వవాసనా స్వరూపములైన దోషములు దృష్టిని కలుషితం చేసి ఉంచాయి. నీవు చేసిన సాధనకు ప్రయోజనంగా, చెట్టునుంచి పరిపక్వమైన పళ్ళు నేలకు రాలినట్లు, లింగదేహం నుండి రాగద్వేషాది కషాయాలు, పాపభావనలు పూర్తిగా శమించాయి. ప్రవేశించిన గురు వాక్యములు మహత్తరమైన ప్రభావమును కలిగించాయి. తపస్సుచే నీ హృదయం నిర్మలత్వం సంతరించుకొన్నది కాబట్టే ఆకాశమున సంచరిస్తున్న నాకు నిన్ను సమీపించి జ్ఞాన విశేషాలు బోధించాలనే సంకల్పం కలిగింది. ఫలితంగా నీ యందు గల అజ్ఞానపూర్వకమైన అవగాహనలు శమించటం జరిగింది. జ్ఞాన పూర్వకమైన ప్రసంగములు రుచించాయి. ఉపదేశించిన అర్థములను ఇప్పటికిప్పుడే నీవు హృదయమున అవధరించావు. ఆత్మసాక్షాత్కార రూప జ్ఞానము యొక్క ప్రభావముచే ముక్తుడవైనావు. 'సత్సంగము' అను మిషచే నేడు నీ యొక్క సమస్త శుభాశుభ కర్మలు సంక్షయించాయి.

'చూచావా రాజా! ఈ రోజు మధ్యాహ్నం నేను నీ ముందుకు వచ్చేటప్పటికి నీ యందు చిత్తం, అహంకారం, మమకారం మొదలైన వాటితో కూడిన అజ్ఞానసత్త ఏర్పడి ఉన్నది. ఆ తరువాత నా వాక్యాల బోధచే నీ హృదయం ఆ అజ్ఞాన సత్తను త్యజించింది. చిత్తము క్షయం పొందగా, ఇక నీవు ప్రబుద్ధుడవైనావు. ఆత్మజ్ఞానము నీ యందు ప్రకాశమానమై కాంతి పుంజములను వెదజల్లుచున్నది.

ప్రియశిఖిధ్వజా! హృదయంలో ఎంతవరకు మనస్సు యొక్క సత్త ఉంటుందో, అంతవరకు అజ్ఞానం యొక్క స్థితి ఉండియే తీరుతుంది. చిత్తము చిత్తరూపాన్ని త్యజించిన మరుక్షణం జ్ఞానోదయం అవుతుంది. అసలు 'చిత్తము' అనగా ఏమిటి?

**ద్విత్వ-ఏకత్వదృశౌ చిత్తం తదేవ అజ్ఞానముచ్యతే**
**ఏతయోర్యో లయో దృష్టేస్తజ్ఞానం సా పరా గతిః ॥**

ద్విత్వ - ఏకత్వముల దృష్టియే చిత్తం. దానినే 'అజ్ఞానం' అని కూడా అంటున్నాం. పరమాత్మ సాక్షాత్కారం చేత ఈ ద్విత్వ - ఏకత్వములు రెండూ నశిస్తాయి. అట్టి నాశనమునే 'జ్ఞానము' అని, 'పరాగతి' అని పిలుస్తూ ఉంటారు.

ఓ రాజా! ఇప్పుడు నిన్ను చూస్తుంటే నాకు పరమ సంతోషంగా ఉన్నది. నీవు ప్రబుద్ధుడవు. విముక్తుడవు అయ్యావు. చిత్తం చేతనే అసత్ దృశం, సత్-అసత్‌మయము అగు జగత్తు యొక్క కల్పన ధరించబడుతోంది కదా! అట్టి చిత్తమును నీవు త్యజించావు. ఇక నీవు దుఃఖరహితుడవు, ఆయాస వర్జితుడవై ఉండుము. నిస్సంగిగా ఈ జగత్తులో తీర్థయాత్రాస్థలంతో సంచరిస్తున్నట్లు వ్యవహరించెదవు గాక! అద్వైతాత్మజ్ఞాన సంపన్నుడవై, మహోదయయుక్తుడవై మునివై, మౌనివై, నిర్మలమగు ఆత్మ స్వరూపమున స్థితి కలిగి ఉండు.

**శిఖిధ్వజుడు :** మహాత్మా! మీరు చెప్పినట్లు చిత్తభూమి మూర్ఖుని కొరకే రచించబడి ఉంటోంది. అయితే ఒక్క విషయం మిమ్ములను అడగాలని అనుకుంటున్నాను. ప్రబుద్ధుడు ఆత్మజ్ఞాని అయినవానికి చిత్తమే ఉండదు కదా! మరి అమనస్కులై కూడా మీ వంటి జీవన్ముక్తులు ఈ ప్రపంచంలో ఎట్లా వ్యవహరిస్తున్నారు? మనోరహితులై కూడా మనో విషయములగు లౌకిక కార్యములు ఎట్లా నిర్వర్తిస్తూ ఉంటారో వివరించ ప్రార్థన. ఈ విషయంలో నాకు కొన్ని దురభిప్రాయములే ఉన్నాయని నా కనిపిస్తోంది. అట్టి వాటిని మీ బోధ తుడిచివేయగలదనే ఉద్దేశంతో మిమ్ములను అర్థిస్తున్నాను.

**కుంభ మహర్షి:** ఔను! నీవు అన్నది నిజమే.

శిలలు ఎక్కడన్నా మొలకెలెత్తుతాయా? జీవన్ముక్తులయందు చిత్తమే ఉండదు. అయితే, 'చిత్తము' అంటే ఏమిటి? ఏ ఘనీభూతమైన వాసనలు మరల మరల ఉత్పన్నమయ్యే స్వభావం కలిగి ఉంటాయో, అది 'చిత్తము' అను శబ్దముచే చెప్పబడుతోంది. జ్ఞానికి అట్టిది ఉండదు.

జనులు ఏఏ వాసనలతో గూడి ఈ సంసారములో మరల మరల ప్రవేశిస్తున్నారో, అద్దానిని చిత్తము అంటున్నారు కదా! ఇక జ్ఞానులలో వాసనలు జగత్క్రియ నిర్వహణము వరకే కార్యక్రమము కలిగి ఉంటాయి. అవి పునఃపునః జనించే శక్తిని, స్వభావమును కలిగి ఉండవు. అందుచేత జ్ఞానియొక్క వ్యావహారిక చిత్తమును "సత్వము" అను పేరుతో పిలుస్తారు. జీవన్ముక్తులు, జితేంద్రియులు అగు మహాత్ములు సత్వము నందు ఉనికిని కలిగి ఉంటారు గాని చిత్తము నందు కాదు.

కనుక, మూఢ చిత్తమే, చిత్తము అని అనిపించుకుంటోంది. జ్ఞానయుక్తమగు చిత్తము సత్వము అవుతుంది. అజ్ఞానులకు చిత్తము ఉనికి స్థానమైతే, జ్ఞానులకు సత్వమే సర్వానుకూల స్థానం అవుతోంది.

**భూయః ప్రజాయతే చిత్తం, సత్వం భుయో న జాయతే**
**అప్రబుద్ధస్య బంధోస్తి, న ప్రబుద్ధస్య, భూపతే!**

చూచావా రాజా! మూఢత్వంతో కూడిన సంస్కారాలు లేక వాసనలు గల చిత్తమునే 'చిత్తం' అని అంటున్నారు గాని, జ్ఞానంతో కూడిన చిత్తమును 'చిత్తం' అనరు. అది 'సత్వం' అవుతుంది. సత్వం కూడా చిత్తం వలెనే ప్రవాహ పతిత వ్యవహార సామర్థ్యం కలిగియున్నప్పటికీ అద్దానిలో పునర్జన్మ యోగ్యత ఉండదు. "ఇది పొందుతాను, దీని తరువాత అది చేస్తాను. ఆ తరువాత ఇక చూచుకో, నేను ఇట్లా ఉండను, ఇకప్పుడు నాకేం!"... చిత్తం యొక్క క్రియా విషయాల స్వభావం ఇట్లా ఉంటుంది.

ఇక సత్వము యొక్క క్రియలో... నిత్యజాగరూకమై, నిత్య ప్రశాంత – సంతృప్త సమన్వితమై, అసంతృప్తి – ఆశాదులకు కారణమే కలిగి ఉండక ఉంటుంది. అది తాను అకర్తవ్య స్వరూపమై అవశ్యమైన దానిని స్వభావయుతంగా నిర్వర్తిస్తుంది.

చిత్తము ప్రతిఫలం వైపు ఉన్ముఖమై ఉంటుంది. సత్వము యొక్క స్వరూపమే సమాధాన స్థితి కనుక కర్మల సిద్ధాసిద్ధములపై అద్దాని సమస్థితి ఆధారపడి ఉండదు.

ఓ రాజా! ఈ జగత్తులో అప్రబుద్ధుడు మాత్రమే బంధమును గాంచుచున్నాడు. ప్రబుద్ధుడు సర్వదా నిర్వికారుడై, సత్వమునందు ఏర్పడి ఉండి, ప్రక్కింటివారి ఇంటిలో జరిగే వివాహాది

కార్యక్రమాలకు సహకరించే సద్గుణుడగు గృహస్థుని వలె ఈ జగత్తులో సర్వకార్యములు నెరవేరుస్తున్నాడు. కాబట్టి అజ్ఞానికి బంధముంటోంది. జ్ఞానికి బంధమునకు కారణమే అగుపించటం లేదు. చిత్తము మరల మరల ఉత్పన్నమౌతూ ఉంటుంది. సత్వము సర్వదా యథాతథంగా ఉంటుంది. అద్దాని మార్పు చేర్పులకు కారణముండజాలదు.

ఓ ప్రియా సఖుడవగు శిఖిధ్వజ మహారాజా! నీవు సత్వమయుడవై, మహాత్యాగివై ఉండుము. ఎందుకంటే, నీవు చేసిన ఆయా ప్రయత్నముల బలంతో చిత్తమును జయించివేశావని నాకు తెలుసు. నీవిప్పుడు వాసనలన్నీ త్యజించినవాడవై శోభిస్తున్నావు. నీ మనస్సు ఇప్పుడు నిర్మలాకాశముతో సామ్యము పొందుచున్నదని నేను గమనిస్తూనే ఉన్నాను. ఏది తదితరమైనట్టి సర్వరూపమై ఉన్నదో అట్టి చిత్తమును త్యజించుటచేతనే నీవు మహాత్యాగిని అగుచున్నావు. నీ విప్పుడు సమస్థితిని, ఉత్తమశమమును పొందుచున్నావు.

ఇప్పటికే నీవు రాజ్యాదులను, ధనాదులను, తపో – దాన ఫలాదులను, స్వర్గ – మోక్షములను ప్రబుద్ధమైన మేధాశక్తితోడను, పరమ జ్ఞానయుక్తమైన బుద్ధితోడను త్యజించివేశావు.

❖

**తపో నామ క్రియన్ మ అత్ర దుఃఖ క్షయకరంభవేత్**
**క్షయాతిశయ నిర్ముక్తం యత్సుఖం సమతామయమ్ ॥**

ఓ రాజా! వాస్తవానికి తపస్సు మొదలైనవి స్వయంగా దుఃఖమును క్షయింపజేయలేవు. అవి నీ మనో నైర్మల్యమునకు ఉపకరించే సాధనలు మాత్రమే. మనస్సు నిర్మలమైనప్పుడు జ్ఞానము ప్రవేశించుటచే ఏర్పడిన అవగాహన చేతనే దుఃఖములు క్షయించి, స్వభావసిద్ధమగు ఆనందము వెల్లివిరుస్తుంది. ఆనంద ప్రదమగు ఆత్మయే నీవై ఉండగా, నీకు ఆనందం ఇచ్చుటకై మరొక వస్తువు గాని, విషయం గాని ఎందుకు అగత్యమౌతాయి చెప్పు? మరి "ఏదో లభిస్తేగాని నా ఆనందం రూపు దిద్దుకోదు"... అని ఎందుకు అనిపిస్తోంది? అది మనస్సు చేసే కోతిపని. సమత్వమును సాధించామా, అప్పుడు మనస్సు త్యజించబడినది అయినట్లే, మనోత్యాగరూపమగు సమత్వముచే 'జ్ఞానము' అనే ఫలం ప్రత్యక్షంగా లభించగలదు. అట్టి జ్ఞానం యొక్క సమృద్ధిచే ఆత్మసుఖం అనుభవమౌతుంది. ఆత్మసుఖం సంపాదించుకున్న ద్రష్టకు క్షయ – అతిశయాలు (హాని – వృద్ధులు) ఉండవు. జ్ఞానముచే ఉత్పన్నమైన ఫలమే సత్యవస్తువు అయి ఉన్నది. అంతేగాని తపస్సు మొదలైన వాటిచే వచ్చే ఫలములు స్వయంగా సత్యవస్తువులు కావు. తపోయాగాదుల వలన స్వర్గలోకాదుల వంటి కొంత సుఖమయ ప్రయోజనములు కలుగవచ్చుగాక! ఆ ప్రయత్నములు జ్ఞాన దిశగా సంధించబడకపోతే ఉత్తమ ప్రయోజనం పొందనట్లే. తపో–యజ్ఞ–దాన, తదితర ఆచారాదులు మనస్సు యొక్క త్యాగం వైపుగా, జ్ఞాన సముపార్జనాలక్ష్యంతో నిర్వర్తించటమే ఉచితం. ఎందుకంటే స్వర్గాదిఫలాలు కూడా క్షణ భంగురాలే. వాటికి కూడా ఉత్పత్తి, నాశనములు ఉన్నాయి. అవన్నీ వర్తమానమునందు మాత్రమే అనుభూత సుఖమును ఇస్తాయేమోగాని, భవిష్యత్తును సానుకూల్యం చేయజాలవు సుమా!

**స్వర్గో నామ కిమానందః? సోఽపి సందేహ సంస్థితః ।**
**అప్రాప్తస్వాత్మ సంసిద్ధేః క్రియాకాండః న శుభోభవేత్ ॥**

ఆత్మజ్ఞానానందం ముందు స్వర్గాదులవి అత్యంత స్వల్పానందాలు మాత్రమే! ఎందుకంటే అట్టి స్వర్గానందాలు కూడా అనేక అపరాధములతో కూడి కాలక్రమేణా నశించునవై, సందేహాస్పదంగానే ఉంటున్నాయి. ఇక క్రియాకాండ అంటావా? అదంతా ఆత్మజ్ఞాన ప్రాప్తికి ముందు మాత్రమే శుభప్రదం. ఆ తరువాత వాటికి ప్రాముఖ్యమే లేదు. ఎవడికి ఇంకా బంగారం లభించలేదో, అతడే ఇత్తడి వస్తువులను కలిగి ఉంటాడు. బంగారపు వస్తువులు లభించిన తరువాత ఇత్తడి ముక్కలను జాగ్రత్త పరచుకోవలసిన పనేముంటుంది?

జ్ఞానియగు నీ ప్రియురాలు చూడాల సాంగత్యంలో నీకు జ్ఞానము సులభంగా లభించేదే. అయితే ఆమె వాక్యాలలోని అంతరార్థాన్ని నీవు అప్పుడు చూడలేకపోయావు. నిర్మలమైన వివేకంతో జ్ఞాన విషయాలను పరిశీలించటానికి బదులుగా హృదయములోని తపస్సుకు సంబంధించిన విక్షేపముల కారణంగా నీవు ఇట్లు అడవుల పాలయ్యావు. ఈ వానప్రస్థాశ్రమమునకు సంబంధించిన శ్రమ, తపోక్లేశము పొందవలసిన అవసరమేమున్నది? ఇంతకాలం నిమగ్నమైన తరువాత ఇప్పుడు కూడా జ్ఞానోపదేశమే అగత్యమై ఉన్నది కదా! ఓ రాజా! తపస్సు యొక్క ప్రయోజనమేమైతే ఉన్నదో, అట్టి ఫలము యొక్క ఆద్యంతములలో సుఖం లేదు. ఆ ఫలము యొక్క అనుభవకాలంలో మాత్రమే సుఖవంతమై ఉండగలదు. అయితే నీవు భౌతిక ప్రయోజనములను ఆశించక తపస్సు చేశావు. అందుచేత ఆ తపోప్రభావం చేత నీ చిత్త దోషాలు నేలరాలాయి. అందుచేతనే తత్త్వబోధకు సమయం సానుకూల్యమైనది. తపోరూప వికల్పాంశములన్నీ నీ పట్ల తత్త్వజ్ఞానము వినుటకు, గ్రహించుటకు కావలసిన పరిణతిని సంపాదించిపెట్టాయి. ఇక నీవు తత్త్వజ్ఞాన ఫలమును ఆస్వాదిస్తూ, ఆత్మజ్ఞానమున సంస్థితుడవై నిరభ్యంతరంగా ఉండవచ్చు. ఇప్పుడు నీవు నీ శ్రద్ధను చిదాకాశ తత్త్వమును ఎఱగటానికే వినియోగించమని నా ముఖ్యోపదేశం. ఎందుకంటే నీవు – నేనుతో సహా సమస్త పదార్థములు అట్టి అతిస్వచ్ఛమగు చిదాకాశమునుండే ఆవిర్భవిస్తున్నాయి. అద్దానియందే ఏర్పడి ఉంటున్నాయి. అద్దానిలోనే విలీనం కాబోతున్నాయి. ఇది గ్రహించిన తరువాత ఏవేవో కర్మ వ్యవహారముల ఆవశ్యకత ఏమున్నది?

**ఇదం కార్యమ్, ఇదంనేఽతి సంకల్పా బ్రహ్మబిన్దవః,**
**వన్ద్యం, శిఖిధ్వజ! త్యక్త్వా, పూర్ణమేవ సమాశ్రయ ॥**

హే శిఖిధ్వజా! “ఇది ఇంకా, చేయాలి! అది ఎట్లాగైనా సరే, చేయకూడదు” ...ఇటువంటి ఇష్ట – అనిష్టారూపమైన ఏ సంకల్పములు నీకు ఏర్పడుచున్నాయో, అవన్నీ బ్రహ్మ మహాసముద్రము యొక్క నిష్ఫల బిందువులు మాత్రమే అయి ఉన్నాయి. జల బిందువులను త్యజించి సముద్రమును ఆశ్రయించటమే ఉత్తమం కదా! ఇష్టానిష్ట సంకల్పములను త్యజించి నీవు ఆత్మ రూప పూర్ణ మహాసముద్రమునే ఆశ్రయించు. ప్రియుడు కనబడనంతవరకూ ఒక ప్రియురాలు ఆ ప్రియునికి

సంబంధించిన ఏవైనా వస్తువులనో, చిత్రపటమునో కోరుకోవడం జరగవచ్చు గాక! ఒకానొక రోజు ప్రియుడే స్వయంగా వచ్చి నిలబడితే, ప్రియుని ప్రేమను అర్థించటమే ఉచితం. అంతేగాని, ప్రియుని చిత్రపటమును అభ్యర్థించవలసిన పనేమున్నది? ప్రియుని అభ్యర్థించుటచేతనే అతనిని పొందటమనే మనోరథం తీరుతుంది కదా! ఏవేవో ఇష్ట పదార్థముల కొరకు ప్రార్థించటం కంటే నిరతిశయ ఆనందరూపమగు ఆత్మ లాభమును ప్రార్థించటమే శ్రేష్ఠమని నా ఉద్దేశం. ప్రజ్ఞావంతులు బింబసూర్యుణ్ణి వదలి ప్రతిబింబ సూర్యుణ్ణి ఆశ్రయిస్తారా? లేదు. ఈ ప్రాపంచిక పదార్థములన్నీ సంకల్పవిరచితములు మాత్రమే. అంతేకాదు, ఇవి 'విపత్తి' లాగా అరమణీయాలై ఉన్నాయి. అటువంటి ఈ పదార్థములను, తత్సంబంధిత విషయ పరంపరలను మహాత్ములు లెక్కలోకి తీసుకోనే తీసుకోరు. అందుచేత ఓ ప్రియరాజా! నీవు జ్ఞాన లాభం సంపాదించుకో. క్రమంగా స్వర్గ – మోక్షదాయకములగు కర్మలన్నీ త్యజించు. అంతటా సమరూపముగా భాసించే ఆత్మయొక్క రూపము కలవాడవగుము.

సర్వ పదార్థములలోనూ రెండు అంశలు ఏర్పడి ఉన్నాయి– 1. సదంశము (Absolute presence), 2. అసదంశము (Relative presence).

సదంశమును సత్యరూపంగానూ, అసదంశమును నాశనరూపంగానూ... గ్రహించాలి. నీవు ఇచ్ఛారహితుడవై ఈ సమస్త పదార్థ సమూహములనూ అచంచల చిత్తంతో దర్శిస్తూ ఉండు.

వివేకము ఉదయించనంతకాలం స్వాభావిక ప్రవృత్తి చేత అపరాధపూర్వక పురుషకారం ఉత్పన్నమౌతూనే ఉంటుంది. అది ఈ మనిషిని సమీపించి సర్వ అనర్థములను కలుగజేస్తూనే పోతుంది. చిత్త చాంచల్యము లేనివానికి సంసారము అనబడేది సమీపించను కూడా లేదు. ఈ లోకంలో ఏఏ దుఃఖములు కనిపిస్తున్నాయో, అవన్నీ కూడా చిత్తచాంచల్యము చేతనే ఉత్పన్నమౌతున్నాయి. ఎవనియొక్క చిత్తమైతే స్థిరమై, శాంతమై, చేష్టారహితమై, అచంచలమై ఉంటుందో, అతడు మాత్రమే మహానంద సామ్రాజ్యమునకు అర్హుడగుచున్నాడు.

❖

కనుక ఓ రాజా! నీవు స్పందన – అస్పందనాలను, చేష్ట – నిశ్చేష్టములను ఏకము చేయి. ఉభయ ద్వంద్వములను 'సాక్షిమాత్రుడై ఉండుట' అను స్థితియొక్క అభ్యాసముచే ఐక్యపరచివేయి. అట్టి సాక్షిత్వమును కూడా బ్రహ్మాత్మైక్యమును పొందింపజేయి. భూమానందభావముతో కూడి, పూర్ణకాముడవై ఉండు.

**శిఖిధ్వజుడు :** హే మహానుభావా! చేష్ట–అచేష్టల (స్పంద–అస్పందముల) అభావం ఎట్లా సాధ్యం? ఏకత్వం పొందటం ఎట్లా?

**కుంభఋషి :** ఒక తరంగానికి, ఇంకొక తరంగానికి రూపభేదం ఉంటే ఉండవచ్చుగాక! తరంగములన్నీ జలము చేత నిర్మించబడినవే కదా! అంతా ఒకే సముద్రం కదా! చిన్మాత్రము దృష్ట్యా సమస్తమూ ఏకవస్తువే అయున్నది. తరంగములచే నిశ్చలజలం చేష్టితమగుచున్నట్లు, చిన్మాత్రము బుద్ధి వృత్తులచే చేష్టితమగుచున్నది. ఆత్మజ్ఞాన శాస్త్రము దేనినైతే సత్యము, జ్ఞానము, అనంతము అని వర్ణిస్తున్నదో,

అట్టి నిర్మలమగు చిన్మాత్ర బ్రహ్మమే ఈ సర్వము అయున్నది. అనగా ఆ బ్రహ్మమే మూఢుల దృష్టికి జగత్తు రూపముగా కనబడటం జరుగుతోంది. చైతన్యము యొక్క స్పందనమే ఈ విశ్వము యొక్క సర్వస్వము. అట్టి స్పందనము నామము, రూపము అను రెండు చమత్కారములతో కూడినదై ఈ ప్రపంచంగా భాసిస్తోంది.

ఓ మునివరా! చైతన్యము యొక్క స్పందనాస్పందనాలు కూడా వాస్తవానికి చైతన్యమునకు అభిన్నమని, ఈ కనబడేదంతా ఆత్మయొక్క విన్యాసమేనని భావన చేస్తూ ఉండు. అప్పుడు అత్యంత శీఘ్రంగా ఆత్మరూపమగు నిర్మలమైన శివబ్రహ్మమే నీవుగా శేషిస్తావు.

'చిత్ యొక్క స్పందనమే ఈ సృష్టి' అను సమ్యక్ దృష్టిని నీవు ఆశ్రయించావా… అప్పుడు 'సృష్టి' అనబడునదంతా స్వయంగా, నీ పట్ల నశించగలదు. సమ్యక్ దృష్టి లేనివారికి మాత్రం సర్ప – రజ్జు భ్రాంతి వలె, ఈ జగత్తు పరిపరివిధములుగా తోచటం జరుగుతోంది.

❖

ఓ రాజా! 'సమ్యక్‌దృష్టి' యొక్క అభ్యాసము కొరకై మరొక్కసారి 'జలము'ను దృష్టాంతంగా తీసుకుని సమీక్షిస్తున్నాను.

తరంగాలతో కూడి ఉన్న జలాన్ని చంచల జలం అనీ, తరంగాలు లేనప్పటి జలాన్ని నిశ్చల జలం అనీ అంటాం. ఉభయ సందర్భములలోనూ జలం జలంగానే ఉన్నది! అంతేకాదు, యథాతథం గానే ఉన్నది! తరంగం ఏర్పడినంతమాత్రాన జలం యొక్క స్వాభావిక ధర్మాలు మారిపోయినాయా?

**శిఖిధ్వజుడు :** ఎట్లా మారుతాయి! "దాహం తీర్చుట" మొదలైన ఆయా ధర్మాలు ఎప్పటిలానే ఉంటాయి.

**కుంభఋషి :** అట్లాగే చిత్తు (చైతన్యం) స్పందన కలిగి ఉన్నప్పుడు, స్పందన కలిగి ఉండనప్పుడు కూడా ఆ చైతన్యం యొక్క నిర్మల–నిత్య–అఖండ–అప్రమేయాది స్వభావాలు యథాతథంగానే ఉంటున్నాయి.

**సస్పన్దా చిత్తదభిదా, నిఃస్పన్దా త్వియమాతతా,**
**తుర్యాతీతపదారూఢా, వాచావక్తుం న పార్యతే ॥**

స్పంసహితమగు చిత్తు (చైతన్యము) సృష్టి అనే పేరుచే పిలువబడుతోంది. అట్టి చిత్ స్పందన చేతనే ఈ జగత్తంతా వ్యాపించబడి ఉన్నది. స్పందనరహితమైన చిత్తో… 'తురీయాతీతపదము' నందు ఆరూఢమై ఉంటోంది. అయితే, తురీయాతీత చైతన్యము వాక్కునకు లభించేది కాదు. అది అనుభవైకవేద్యము మాత్రమే.

నేత్రములలోని తిమిరదోషం తొలగుతూ ఉంటే ఆకాశంలో 'రెండవచంద్రుడు'గా కనిపించేది మటుమాయమౌతుంది కదా! శాస్త్ర – సజ్జన సాంగత్యములు నిరంతరం అభ్యసిస్తూ రాగా, కాలక్రమంగా చిత్తము నిర్మలమై, తన సాక్షియగు చైతన్యముతో ఏకత్వం పొందగలదు. అప్పుడు జగత్తంతా ప్రసరించియున్న, తాండవిస్తున్న ఏకత్వము తప్పక అనుభవమవగలదు. అట్టి 'సాక్షియగు చైతన్యముతో సమస్తము యొక్క ఏకత్వము' కేవలం అనుభవమాత్రమేగాని అది గురువు వాక్యాలతో చెప్పగలిగేది కాదు. ఆ వాక్యాలు వినినంతనే శిష్యుడు అందుకోగలిగేది కాదు. అది ఎవరికి వారే

తమ జ్ఞానబలిమిచే నిర్మించుకొనవలసిన కైవల్య సామ్రాజ్యము. అయితే అట్టి అనుభవజ్ఞులు చెప్పే స్వానుభవములగు (ఉపనిషత్తు మొదలైన) శాస్త్రాలు మార్గదర్శకం, నిరూపణములు కాగలుగు చున్నాయి. అట్టి తురీయాతీత అనుభవజ్ఞులు తదితరులకు చెప్పే పరిమిత ఉపకరణములగు 'వాక్కులు' నిరూపణ అగుచున్నాయి. అవి తప్పితే వేరే నిరూపణ ఎట్లా?

ఓ సాధూ! నీవు ఇప్పుడు సత్య విషయమును గ్రహించావు. సమస్తమునకు సారభూతమైనట్టి, ఆదిమధ్యాంతరహితమైనట్టి స్వాత్మపదమునందే నిస్సందేహముగా స్థిరముగా నెలకొనియుండుము. ఈ శరీరాదుల భేదమంతా మిథ్య మాత్రమే. కనుక నిస్సంకోచంగా మహాచిత్స్వరూపుడవై, ప్రాదుర్భవించి ఉండుము. నిన్నిక శోకము యొక్క ఛాయ అయినాసరే సమీపింప జాలదు.

❖❖❖

## 37. ఋషి వాక్య మననం

**కుంభ ఋషి :** ఓ శిఖిధ్వజ మహారాజా! ఈ విధంగా ఈ సాయంకాలం మనం ఈ ప్రపంచం ఎట్లా ఉత్పన్నమౌతోంది? (అధ్యారోపం); ఇది ఎట్లా లయిస్తోంది? (అపవాదం)... అను ఉభయ విషయాల గురించి కొన్ని విషయాలు చెప్పుకున్నాం. దీనినంతా గ్రహించు. మననం చేయి. స్పష్ట పరచుకో. ఆపై నీకు వానప్రస్థం ఇష్టమనిపిస్తే ఇక్కడే ఉండు. లేదూ, రాజసింహాసనం అధిష్ఠించదలుచుకుంటే అట్లే చేయి. ఏది ఎట్లైనా ఫరవాలేదు, సర్వసాక్షిగా స్వభావించుకున్నవానికి ఎక్కడుంటే ఏమున్నది?

ఓహోఁ! మరచాను! ఇప్పుడు నేను అవశ్యం స్వర్గలోకం వెళ్ళవలసి ఉన్నది. ఈ రోజు మహా పవిత్రమైన పర్వదినం. బ్రహ్మలోకం నుండి స్వర్గలోకం పోతూ మార్గమధ్యంలో నిన్ను చూచి ఇటు వచ్చాను కదా! నా తండ్రి నారదమహర్షి ఇప్పటికే ఇంద్ర సభకు వేంచేసి ఉంటారు. ఆయన యొక్క ఇంతఃపూర్వపు ఆజ్ఞను అనుసరించి ఆయన వచ్చేసరికి నేను ఇంద్రసభలో ఉండి తీరాలి. ఉత్తములగు గురువులకు మనం ఉద్వేగం కలిగించటం ఏమాత్రం ఉచితమే కాదు కదా! ఇక నేను వెళ్ళి వస్తాను!

నీవు మాత్రం సంకల్పమును, ఇచ్ఛను సదా పరిత్యజించి నాచే చెప్పబడిన 'ఆత్మదృష్టి' యందు స్థితి కలిగి ఉండు.

**శిఖిధ్వజుడు :** అటులనే మహర్షీ! మీరు ఆజ్ఞాపించినట్లే ఆచరిస్తాను. అయితే, ఇప్పుడే వెళ్ళిపోతారా? వెళ్ళక తప్పదా?... సరే, మహామహితాత్ములగు మిమ్ములను ఉండమని అనగలిగేశక్తి నాకెక్కడున్నది? ఒక్క నిమిషం. మీ పాద పద్మములకు ప్రేమతో పుష్పాంజలి సమర్పించుటకు అనుజ్ఞ ఇవ్వండి.

❖

ఓ రామా! ఇట్లు పలికి శిఖిధ్వజుడు తటాలున లేచి నిలబడ్డాడు. పరుగులు తీస్తూ ఒక పూలమొక్కను సమీపించి నాలుగు క్షణాలలో దోసిలి నిండా సుకుమారమగు పుష్పములు కోసి కుంభఋషి ఉన్న స్థలానికి వస్తున్నాడు. ఆతడు అలా అడుగులు వేస్తూ కుంభుని సమీపిస్తున్నాడు. ఇంతలో శిఖిధ్వజుడు చూస్తూ ఉండగానే కుంభఋషి అంతర్ధానమైనాడు. కలలో చూస్తూ ఉన్న

ధనరాశులు హఠాత్తుగా మాయమైతే ఆ స్వప్న ద్రష్టకు ఎట్లా అనిపిస్తుంది? మన శిఖిధ్వజుడు కూడా అంతటి చకితుడైనాడు. అతనినే ధ్యానిస్తూ శిల్పంలాగా కాసేపు నిలబడి ఉండిపోయాడు. చాలాసేపటికి గాని పూర్తిగా తేరుకోలేదు.

**శిఖిధ్వజుడు :** (తనలో) సర్వాంతర్యామియగు హే పరమాత్మా! ఏమి మీ లీలా చమత్కారములు! సర్వదా ప్రకాశమానమై ఉన్న బ్రహ్మము యొక్క జ్ఞాపకమును 'ఈ కుంభ ఋషి ఆగమనము' అను మిషతో నాకు కలిగించారా! బ్రహ్మలోకం నుండి స్వర్గలోకానికి ఆకాశమార్గంగా వెళ్ళుచున్న ఈయన చల్లటి చూపులు నాపై ప్రసరించటం ఎంతటి సౌభాగ్యం!

నారదపుత్రుడైన ఈ కుంభు డెక్కడ? కమండలధారినై ఏవేవో క్రియావ్యవహారపరిమితుడనైన ఈ శిఖిధ్వజు డెక్కడ? ఇదంతా భాగ్యోదయ సమయం కాక మరింకేమిటి?

ఈయన చెప్పిన యుక్తుయుక్తవాక్యాల ప్రభావం చేత నాకు ఎంతటి శోభ అబ్బింది! మోహనిద్ర యందు ఉండి చాలా కాలంగా వ్యాకులుడనై ఉన్న నేను ఇప్పటికి ప్రబుద్ధుడనైనాను. ఇంతకాలం 'ఇది చెయ్యకూడదు – అది చెయ్యాలి' ఇటువంటి మిథ్యాభ్రమమయ చక్రంలో చిక్కుకుని వాక్కుచేత చెప్పనలవిగాని క్లేశములన్నీ అనుభవించానే! అప్పటి అజ్ఞానపు బురదలో చిక్కుకున్న స్థితి ఎచ్చట!... ఇప్పటి ఈ నా స్వాత్మ సామ్రాజ్యమెచట! ...పొంతనే కుదరదు. ఈ మహనీయుని దయవల్ల అమృతం నుండి ఉత్పన్నమైన ఆకృతిని ధరించాను. నా మనస్సు శీతలం, శుద్ధం, వాసనారహితం అయినది. ఇప్పటికి శాంతుడను, తృప్తుడను అయ్యాను. సుఖపూర్వకంగా ఉండి ఉన్నాను. ఇక ఈ చరాచర దృశ్యజగత్తు నుండి ఒక గడ్డిపరకకూడా నాకు అక్కర్లేదు.

ఇప్పుడు నేను ఈ జగత్తులో లేను. ఇది నాయందు లేదు. మరి? యథాస్థితంగా నా స్వరూపమున నేను సర్వదా ఏర్పడి ఉన్నాను. సర్వకార్యములకు ఆది కారణమై, కానీ, సర్వదా కారణరహితుడనై, స్వయం తత్త్వస్వరూపమున విరాజిల్లుచున్నాను. అజ్ఞాన – విజ్ఞాన ఉభయ సందర్భములలో నా స్వరూపము అప్రమేయ స్వయం ప్రకాశకముగానే ప్రభవిస్తోంది.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! వాసనారహితమగు అంతఃకరణం గల ఆ శిఖిధ్వజుడు ఇట్లు చింతన చేయసాగాడు. క్రమంగా మనస్సు విషయరహిత స్థితి పొందసాగింది. "భావాలకు అతీతమైన, ప్రశాంతమగు సాక్షిమాత్రమైన" అనుభవం సంతరించుకోసాగాడు. ఒక శిలయందు చెక్కబడిన శిల్పం లాగా మౌనం ధరించు సమాధినిష్ఠుడు అయ్యాడు. సంకల్ప వర్జితం, ఆశ్రయరహితం అగు ఆ మౌన సమాధిలో పర్వతశిఖరం వలె స్థిరప్రతిష్ఠితుడయ్యాడు. ఆ సమాధిలో సమరసమగు ఆత్మస్వరూపాన్ని పొందుచుండుటచే విశ్రాంతిచిత్తుడై, నిర్భయుడై, సంయోగ–వియోగద్వంద్వాలను అధిగమించిన వాడయ్యాడు. అట్టి నిర్ద్వంద్వయోగాభ్యాసబలం చేత అఖండ స్వభావం పొందాడు. విషయాల దృష్ట్యా గాఢనిద్రకు ఉపక్రమించిన వానిలా, ఆత్మానుభవం దృష్ట్యా నిత్యోదయ జాగ్రత్ అనుభవిగా ప్రకాశించాడు.

❖❖❖

# 38. కుంభ పునరాగమనం

**శ్రీరాముడు :** మహర్షీ! కుంభ ఋషి ఇంద్రసభకు బయలుదేరాడు కదా! ఆ తరువాత ఏం జరిగింది?

**శ్రీవసిష్ఠ మహర్షి (చిరునవ్వుతో) :** కుంభ ఋషి వేషము ధరించిన చూడాల శిఖిధ్వజునికి తత్త్వబోధ చేసిన తరువాత, ఆతని సమక్షము నుండి అంతర్ధానమై ఆకాశమార్గంలో ప్రవేశించింది. అక్కడ తన మాయారచితమైన దేవపుత్రుని రూపం త్యజించి సౌందర్యరాశియగు చూడాల రూపమును ధరించింది. ఆకాశమార్గంగా కొద్ది క్షణముల కాలంలో అంతఃపురంలో ప్రవేశించింది. అతి కొద్ది సమయంలో రాచకార్యములకు సంబంధించిన విధులను నిర్వర్తించసాగింది. మంత్రులతో సమాలోచనలు, వ్యవహార నిర్ణయములు యథారీతి ప్రారంభించింది.

మూడు రోజులు గడిచాయి. మూడు రోజుల తరువాత మరల కుంభ ఋషి రూపము ధరించి శిఖిధ్వజుడు ఉన్న వన ప్రదేశమును ఆకాశ మార్గంలో సమీపించింది. శిఖిధ్వజుడు మౌన – ప్రశాంత – నిర్విషయ స్వరూపమగు సమాధిని అవధరించి ఉండటం చూచింది.

❖

**కుంభఋషి (చూడాల) :** ఆహా! ఎంతో సౌభాగ్యవశం చేత ఇంతకాలానికి ఈ ప్రియ శిఖిధ్వజుడు స్వస్థుడై, శాంతుడై, సమదృష్టి కలిగి ఆత్మయందు విశ్రమించుచున్నాడు. అయితే ఈతడు ఇట్లాగే ఉంటే కొంతకాలానికి తైలరహిత దీపం లాగా దేహత్యాగం చేయటం జరుగవచ్చు. అటువంటి దేహత్యాగంతో ఈతనికి ఇప్పుడేమిపని? మరికొంతకాలం ఈ వనంలోనో, లేక రాజ్యములోనో దేహసహితుడై ఉంటూనే ఆత్మైక్యమును కూడా అనుభవించవచ్చును కదా! అందుచేత ఈతనిని ఈ సమాధి స్థితి నుండి నిదురలేపుతాను. కొంతకాలం ఈ భూమిపై సంచరించిన తరువాత ఉచిత సమయంలో ఇద్దరం విదేహకైవల్యమును ఆశ్రయించవచ్చు. నేను ఇంతవరకు ఈతనికి చేసిన ఉపదేశ ప్రభావం చేత ఇప్పుడీతడు సప్తమ భూమికలో ప్రవేశించకుండుగాక!

❖

ఈ విధంగా నిశ్చయించుకున్న ఆ చూడాల తన భర్త శిఖిధ్వజుని ఎదురుగా నిలబడి భీకర మైన సింహనాదాలు చేయసాగింది. ఆ శబ్దాలకు పర్వతాలు కంపించాయి. అక్కడి ఆరణ్యంలోని వన్యమృగాలు భయంతో అటూ ఇటూ పరుగులు తీశాయి. ఆకాశమంతా ధ్వని, ప్రతిధ్వనులతో నిండిపోయింది. అయితే ఏం? ఆ శబ్దములు శిఖిధ్వజుని చెవులను తాకినట్లు కూడా లేవు. అతను అట్లాగే నిశ్చలంగా ఉండటం చూచి చూడాల ఆయన భుజములను చేతులతో పట్టుకొని అటూ ఇటూ చాలాసార్లు కదిల్చింది. అయినా లాభం లేకపోయింది.

❖

**కుంభఋషి :** ఆహా! ఈ సాధు మహాత్ముడు సప్తమ భూమికా ప్రవేశము వరకు పరిణతి చెందాడే! ఈ 18 సంవత్సరాలుగా ఈతడు చేసిన తపస్సు అంతటి ఏకాగ్రత – నిష్ఠ కలిగి ఉన్నాయన్నమాట!

అయినా... ఈ మహాత్ముని ఇప్పుడు సమాధి నుండి లేపటం ఎందుకు? పోనీ, విదేహముక్తిని పొంది అక్కడే ఉండనిస్తే పోలేదా? నేను కూడా ఈ స్త్రీ శరీరమును పరిత్యజించి, ఇక మరల జన్మ లేనిదాననై నా పతితో కూడా పరమపదమును పొందితే సరిపోతుంది కదా!

ఇట్లా తలచి విదేహముక్తికి సంసిద్ధపడుచూ ఉండగా, ఆమెలో ఏదో మరొక ఆలోచన తళ్ళుక్కుమన్నది. అట్లాగే చేస్తాను. అయితే ఇక్కడ మరొక ముఖ్య విషయం సరిచూచు కోవలసియున్నది. ఈ మహారాజు ఇప్పుడు నిర్విషయ సమాధిని అత్యంత తీవ్రంగా ఆశ్రయించి ఉన్నాడు. ఈతని అంతఃకరణంలో జాగ్రత్తుకు సంబంధించిన బీజభూత విషయమేమైనా ఇంకా మిగిలి ఉన్నదా, లేదా? బీజంలో కొంచెం అంకురశక్తి మిగిలి ఉన్నా, మరల, తడి తగిలితే అంకురించటం ఆరంభించి ఎప్పుడో మహావృక్షంగా పరిణమిస్తుంది. అట్లాగే ఈతని అంతరంగంలో జాగ్రత్‌కు సంబంధించిన సంస్కార లవశేషం ఏ కొంచెం మిగిలినా సరే, ఈతడు మరల జాగ్రతుడౌతాడు. అట్లా జాగ్రతుడైనప్పటికీ ఈతడు జీవన్ముక్తుడే కాబట్టి నిశ్చింతుడై ఈ భూమిపై విహరించ గలడు.

ఒక వేళ ఈతడు లౌకిక సంబంధిత సంస్కారం కించిత్తు కూడా కలిగి ఉండకపోతే అప్పుడు నేను కూడా ఈ భౌతిక దేహం త్యజించి, నిర్వికల్ప సమాధిని అవలంబించి సప్తమ భూమికలో ఇప్పటికిప్పుడే ప్రవేశిస్తాను.

❖

ఇట్లా యోచిస్తూ కుంభఋషిరూపియగు చూడాల మరల భర్త దేహమును సమీపించింది. ఒక వైద్యుని వలె శిఖిధ్వజుని దేహమును స్పర్శచేతను, కళ్ళతోనూ నఖశిఖపర్యంతము పరిశీలించింది. ఆ శిఖిధ్వజుడు దేహమునందలి ముఖ్య నాడీ ప్రదేశములలో చేతి స్పర్శకు కించిత్తు స్పందిస్తున్నట్లు గమనించింది. ఉహూ! ఈతని దేహంలో జాగ్రత్తుకు సంబంధించిన, మనో సంబంధమైన, కించిత్తు శేషము ఇంకా ఉన్నది. ఎందుకంటే ఈతని దేహము నందు కొన్ని నాడీ మండలములలో ఉష్ణత్వము మొదలైన కొన్ని చిహ్నాలు ఇంకా ఉన్నాయి. కనుక ఎప్పుడో ఈతడు మరల మనస్సును ఉత్తేజపరచి జాగ్రత్తుకు తిరిగి రాగల అవకాశాలు లేకపోలేదు... అని తలచినది.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! ఒక సాధకుడు చిత్తమును శమింపజేసి కొయ్య – మట్టిలాగా అచంచల స్థితి పొంది ఉన్నప్పుడు, అట్టి ధ్యానశీలుడగువానిలో మనస్సు ఇంకా శేషించి ఉన్నదో–లేదో ఎట్లా తెలుసుకోవచ్చు? ఆ దేహము గ్లాని పొందదా? ఎందుచేత?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒక బీజంలో భవిష్యత్ సంబంధమైన పుష్ప–ఫలములకు సంబంధించిన సంవిత్తు మౌనంగా దాగి ఉంటుంది చూచావా? అట్లాగే సూక్ష్మదృష్టిని, జ్ఞానదృష్టిని అవలంబించిన హృదయంలో కూడా ఒక్కొక్కప్పుడు ఎక్కడో ఒక మూల ప్రబోధ కారణమైన మనస్సు యొక్క ఒక శేషం ఉండవచ్చు. అయితే అట్టి సమాధి నిష్ఠుడగు యోగి దేహం మాత్రం యథాతథంగానే ఉంటుంది. ఏ మనుజుడైతే చేష్టరహిత చిత్తం కలవాడై, ద్విత్వ–ఏకత్వరహితుడై, సచ్చిదాత్మ స్వరూపుడై, నిశ్చలంగా ఉంటాడో... అట్టి సమరూప అచంచలస్థితి పొందినవాని దేహం గ్లాని పొందదు, ప్రసన్నం కాదు,

అస్తమించదు, ఉదయించదు. ఆ దేహము సమరూపము కలిగి ఉంటుంది. అట్లా కాకుండా ఆ సాధకుడు ఇంకా ద్విత్వజ్ఞానయుక్తుడై, చేష్టలు నిర్వర్తించే మనస్సు కలవాడై ఉంటే ఆ దేహము వృద్ధి – క్షయములు పొందటం జరుగుతుంది. నిర్విషయ నిశ్చల సమాధియందున్న వాని దేహమునకు వృద్ధి క్షయములు ఉండవు. ఆ సాధకుడు నిశ్చల – నిశ్చితమనస్కుడై ఆ దేహమును త్యజిస్తేనే అది ఇక పంచభూతములందు ప్రవేశిస్తుంది.

**చిత్తస్పందోహి సర్వేషాం కారణం జగతః స్థితేః!**
**రామ! భావవికారాణాం కుసుమానాం యథామధుః ॥**

ఓ రామచంద్రా! పుష్పములకు వసంతకాలము కారణమగుచున్నట్లు సమస్త భావవికారములతో కూడియున్న 'ఈ జగత్తు యొక్క – ఈ దేహము యొక్క' స్థితికి చిత్తము యొక్క చేష్టలే కారణమై ఉంటున్నాయి. ఈ కారణం చేత చిత్తము ఇంకా శేషించియే ఉన్నప్పుడు ఈ దేహమును బలవంతంగా నిర్జీవింపజేసినప్పటికి, హర్ష – కోప – సంమోహములు ఇంకా ఉండియే ఉంటాయి. కాబట్టి మరియొక దేహము ఆ జీవుని కొరకు వేచియే ఉంటోంది. చిత్తము పూర్తిగా ప్రశాంతత పొందినప్పుడు అట్టి నిర్వాసనా చిత్తముచే దేహము త్యజించబడుచున్నప్పుడు భావవికారములకు స్థానమైన ఈ దేహము అట్టి దేహిని బాధింపజాలదు. జలము యొక్క సమస్థితి యందు తరంగాలు ఉండవు కదా! చిత్తము యొక్క సమస్థితియందు అద్దానిలో వృద్ధ – క్షయాది వికారములు గాని, రాగ – ద్వేషములుగాని కనిపించవు. ప్రారబ్ధకర్మ సంపూర్ణంగా క్షయించనంతవరకూ జీవన్ముక్తులకుండే సత్వము (విషయరహిత చిత్తము) అభావత్వం పొందకుండానే ఉంటుంది. ప్రారబ్ధ కర్మలు నివృత్తం కాగానే ఆ సత్వము అభావత్వం పొంది పూర్తిగా శమించటం జరుగుతుంది.

ఏ దేహమునందైతే ఇటు చిత్తము గాని, అటు సత్వము గాని ఏర్పడి ఉండదో, అట్టి దేహము ఎండయందు ఉంచబడిన మంచుగడ్డలాగా మృత్యువునందు విలీనమైపోతుంది.

ఆ శిఖిధ్వజుని దేహం విషయానికి వస్తే... అతడు నిర్విశేషసమాధిని ఆశ్రయించటంచేత, చిత్తరహితమైనప్పటికీ, అది తేజముతోను, సత్వాంశతోను కూడియే ఉన్నది. అందుచేత అది గ్లాని పొందలేదు. ఆ విషయం యోగాభ్యాసకురాలగు చూడాల ఆయా దేహనాడులలో స్పర్శకు లభించిన ఉష్ణమును బట్టి గ్రహించింది. యోగాభ్యాసకులకు అట్టి విజ్ఞానము సులభసాధ్యమే.

❖

ఉత్తమ స్త్రీయగు చూడాల భర్త దేహము నందు జాగ్రత్ వ్యవహార సంబంధమైన సత్వాంశమును గమనించి, తాను దేహత్యాజ్య ప్రయత్నమును ఉపసంహరించుకున్నది.

**కుంభఋషి రూప చూడాల :** ఈతనిని సమాధి నుండి విరమింపజేయటానికే ప్రయత్నిస్తాను. సూక్ష్మదేహాన్ని ఆశ్రయించి – సర్వవ్యాపకము, శుద్ధము అయినట్టి ఈతని చిత్తములో ప్రవేశిస్తాను. ఎప్పుడో అతి దీర్ఘకాలం తరువాత జాగృతం కావలసిన ఈతనిని ఇప్పుడే సమాధి నుండి మేలుకొలుపుతాను. లేకపోతే ఈతడు జాగృతమయ్యే వరకు ఒంటరికి ఉండటం ఉచితం కాదు.

❖

ఇట్లు విచారణ చేసి ఆ చూడాల ఇంద్రియ పంజర రూపమైనట్టి నిజదేహాన్ని వీడింది. భర్త దేహంలో ప్రవేశించింది. అతని యొక్క ఆద్యంతరహితమైన చిత్‌తత్త్వంలో స్థితిని పొందింది. హంస క్షీరం నుండి జలమును వేరు చేస్తుందే!

అట్లా నిర్వికల్ప సమాధియందు చైతన్యముతో ఏకత్వము పొందియున్న తన భర్త యొక్క 'బుద్ధి'ని వేరుపరచింది. అదే తీరుగా దేహంలో ఆ బుద్ధిచే స్పందన క్రియను ఉత్తేజపరచింది. మరల పక్షిగూటిలో ప్రవేశించినట్లు తన నిజకల్పిత కుంభఋషి దేహంలో ప్రవేశించింది. ఇతఃపూర్వం ఆసీన మైన ఎత్తైన శిలాసనంపై కూర్చుని ఏమీ తెలియనట్లు సామవేదం గానం చేయటం ప్రారంభించింది.

సామవేదగానం చెవులకు చేరుచుండగా ఆ రాజు యొక్క దేహం క్రమంగా సత్వగుణంతో శోభించసాగింది. అతని చిత్ ప్రబుద్ధమయి, జాగ్రత్ దేహవ్యవహారము వైపు ప్రసరించసాగింది. క్రమంగా అతడు సమాధి నుండి మేల్కొనుచూ కనులు తెరచి దృష్టిని వికసింపజేశాడు. ఎదురుగా కుంభఋషి ఆసీనుడై ఉండటం చూచాడు.

'అహో! మేం ధన్యులం. ఈ దేవఋషి స్వయంగా ఇక్కడికి విజయం జేశారు'... అని అనుకుంటూ లేచి నిలబడ్డాడు. పరమానందంగా దోసిలినిండా పూలు తీసుకుని కుంభఋషి పాదాలపై ఉంచి సాష్టాంగదండ ప్రణామములు సమర్పించాడు. కుంభఋషి చిరునవ్వుతో అదంతా గమనిస్తున్నాడు.

**శిఖిధ్వజుడు :** హే మహాత్మా! తమ పవిత్రమైన చిత్తముచే నా బుద్ధి ప్రేరేపించబడటం నా సౌభాగ్యం. మహాత్ములు ఇతరులను అనుగ్రహించే సమయంలో వారి చల్లటి చూపులు ప్రసరించేచోటనే కొంతసేపు ఏర్పడి ఉండటం నిజంగా గొప్ప ఫలప్రదమైన విషయం. మహాత్మా! మీ ఈ రాకకు కారణం నన్ను పవిత్రుణ్ణి చేయటానికేనని నేను అనుకుంటున్నాను. అంతకు వేరైన ఏదైనా కారణముంటే మిమ్ములను సేవించి, సంతోషింపజేసి, తరించటానికి ఈ శిఖిధ్వజుడు వినమ్రుడై సంసిద్ధంగా ఉన్నాడు.

**కుంభమహర్షి :** ఓ రాజా! నేను మొట్టమొదట వచ్చినప్పటి నుండి పరమ పవిత్రుడవగు నీ సామీప్యాన్ని నా చిత్తం విడువనే లేదు. స్వర్గలోకం రమణీయమైనదైతే కావవచ్చుగాక. నీ సమక్షం గుర్తుకు రాగానే నాకు అక్కడ నిలవాలని అనిపించలేదు. అందుకే మరల వచ్చేశాను. ఈ చిత్తము దేనిని రమ్యమనుకుంటే అద్దాని సమక్షమే ఆనందం కలిగిస్తుంది. ఏది రమ్యమని అనుకోకపోతే... అది ఎంతటి స్థానమైనా కూడా స్వల్పమాత్రంగానే ఉంటుంది. ఓ సాధూ! శిఖిధ్వజ మహారాజా! నీతో సమానమైన బంధువుగాని, ఆప్తుడు గాని, సుహృత్‌గాని, మిత్రుడు గాని, సఖుడు గాని, విశ్వాసపాత్రుడుగాని, శిష్యుడు గాని, ఈ భూ – నభోంతరాలలో మరెక్కడా లేదని నేను నమ్ముచున్నాను. అందుకే నీ చెంతకు వచ్చి ఇక్కడ కూర్చున్నాను.

**శిఖిధ్వజుడు :**

**అహో! ను ఫలితం పుణ్యాపాదపైర్నః కులాచలే,**
**యస్మాత్ భవాన్ అసంగోఽపి, వాంఛతి అస్మత్ సమాగమమ్ ॥**

ఆహో! ఏమి నా అదృష్టం! ఆ మందర పర్వతంపై గల పవిత్ర వృక్షాలకు సుందరమైన పుష్పాల మధురమైన ఫలాలు వెల్లివిరుస్తున్నట్లు నా అనేక జన్మల పుణ్యము ఫలప్రదమౌతోంది.

లేకుంటే అసంగులైన మీరు నా యొక్క స్నేహాన్ని కోరి స్వర్గాన్ని వీడి ఇక్కడికి రావటమా! హే ప్రభో! ఇదిగో ఉత్తమమైన వనం, అవిగో, రమణీయమైన పుష్ప-ఫల సంపదతో కూడిన వృక్షాలు, పిల్లగాలులు ఎంత సువాసనతో చల్లగా వీస్తున్నాయో గమనిస్తున్నారు కదా! ఇక మిమ్ములను సేవలచే సత్కరించటానికి ఈ శిఖిధ్వజ నామధేయుడగు మీ ఈ సేవకుడు ఉండనే ఉన్నాడు. కాబట్టి మీకు స్వర్గ-బ్రహ్మలోకాలు రుచించకపోతే నిస్సంకోచంగా ఇక్కడే ఉండండి. హే మహానుభావా! మీరు చెప్పిన యోగయుక్తిచే నేను ఏ విశ్రాంతిని పొందానో, అద్దాని ముందు స్వర్గాదులు కూడా రుచించ వనుటలో అతిశయోక్తి ఏముంది? అట్టి స్వచ్ఛమైన ప్రకాశయుక్తమైన స్థితిని ఆశ్రయించి ఇక్కడ ఉండండి. ఎప్పుడు స్వర్గాన్ని దర్శించాలని మీకనిపిస్తే అప్పుడే వెళ్ళండి. మీ ఇష్టానుసారం చరించండి.

**కుంభ ఋషి :** ఓ రాజా! మహత్తరమైన పరమపదంలో నీవు విశ్రాంతి పొందావు కదా! దుఃఖ పూర్ణమై, భేదమయమైనట్టి ఈ సంసారమును నీవు త్యజించినట్లే కదా? విచారణ చేయని కారణంగా మాత్రమే రమణీయంగా తోచే సంకల్పములయందు నీరసములగు భోగములయందు నీకు ఉండి ఉన్న ప్రీతి నిర్మూలనమయిందా? త్యజించటం, ఆశ్రయించటం (హేయ ఉపాధేయములు) అనే దశకు అతీతమైన, స్వయముగా పరమశాంతమైన సమస్థితి కలిగి ఉన్న స్థానమును నీ చిత్తము సంపాదించుకున్నదా? యథాప్రాప్తములగువాటి పట్ల రాగద్వేషరాహిత్యము సంతరించుకున్నదా?

**శిఖిధ్వజుడు :** హే మహాత్మా! తమ అనుగ్రహం చేత ఈ సర్వదృశ్య వ్యవహారములకు పరమైనట్టి "నా యొక్క ప్రతి ఒక్క జీవుని యొక్క" ఒకానొక మహత్తర స్థానాన్ని దర్శించాను. ఈ సంసారమునకు అక్కడ చోటే లేదు. పొందవలసినది అదే! మీ దయచే పొందవలసిన స్థితిని పొందాను. చాలాకాలం అర్థరహితంగా గడపిన తరువాత ఇప్పటికి నిర్విఘ్న విశ్రాంతిని పొందాను. ఇప్పటికి శాశ్వతమగు అకారణతృప్తిని పొందాను. ఇక నాకు ఉపదేశము యొక్క అవసరమంతా తీరిపోయింది. అంతటా, సర్వధా తృప్తుడనై, దుఃఖరహితుడనై ఉన్నాను... తెలుసుకొనవలసిన దాన్ని తెలుసుకున్నాను. పొందవలసినది పొందాను. త్యజించవలసినది త్యజించాను.

ఇప్పుడు ఆత్మపరతత్త్వాన్ని ఆశ్రయించియున్నాను. ఇక నాకు ఆత్మకు భిన్నమైనదేదీ ఎక్కడా కనిపించటమే లేదు. ఇప్పటికి మీ ప్రవచనమాహాత్మ్యంచేత సంసారం, మోహం, భయం, రాగం, మొదలైన దోషాలు లేనివాడనయ్యాను. నిత్యోదయరూపుడనయ్యాను. సముడను, సర్వసమమగు అంతఃకరణం కలవాడను అయ్యాను. సర్వము పట్లా సౌమ్యం వహించి ఉంటున్నాను. సర్వరూపుడనై, సర్వ కల్పనావినిర్ముక్తుడనై, ఆకాశకోశం వలె నిర్మలుడనై, సర్వత్రా ఏకరూపుడనై ఉన్నాను.

❖❖❖

# 39. లోక సంచారం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ శిఖిధ్వజ - చూడాలలిద్దరూ అక్కడే కొద్ది గంటలు ఆధ్యాత్మిక కథలు పరస్పరం చెప్పుకుంటూ ఉన్నారు. తరువాత అక్కడి నుండి ఒక పర్వత శిఖరంపై చేరారు. అక్కడ జీవన్ముక్తుల ఆచారములతో కూడినవారై ఆధ్యాత్మిక విషయాలు సంభాషించుకుంటూ, అక్కడే విహరిస్తూ

8 రోజులు గడిపారు. అక్కడి నుండి ఇంకా ఎన్నో ప్రదేశాలు సంచరించసాగారు. పరస్పరం సమానమైన స్నేహం, సమానమైన ధైర్యోత్సాహములు కలిగియున్నవారై పరస్పరం ప్రశంసించుకుంటూ సదా కూడియే ఉండేవారు. కలిసియే భుజించేవారు. కలిసియే శీతోష్ణాదులను పొందుచూ సమబుద్ధిని కలిగి ఉండేవారు. కలిసియే దేవతలను, మహనీయులగు ఆత్మజ్ఞులను పూజిస్తూ ఉండేవారు. 'ఇది ఇలు, అది గ్రామం, ఇది అడవి, అది పట్టణం, ఇది మనదేశం, అది వారి ప్రాంతం' – మొదలైన వికల్పములకు వాళ్ళ మనస్సునందు గాని, సంభాషణయందు గాని చోటు దొరికేదే కాదు.

ఆ స్నేహితులిద్దరూ ఒక్కొక్కప్పుడు ధూళిచే కప్పబడిన దేహములతో గ్రామములలోనూ, పట్టణ వీథులలోనూ సంభాషించుకుంటూ సంచరించేవారు. మరొకప్పుడు నిర్జనప్రదేశాలలో తిరుగుతూ ఉండేవారు. ఒకప్పుడు మంచి వస్త్రాలు ధరించేవారు. మరొకప్పుడు దిగంబరులై, ఆకులతో ఒళ్ళు కప్పుకొని తిరిగేవారు.

కొద్దిరోజులు ఏకచిత్తులై వారిరువురూ సంచరించటం చేత స్వయముగానే వాసనారహితమైన శిఖిధ్వజుని చిత్తము కుంభుని చిత్తమువలెనే పరమపవిత్రమై, ఉత్తమజ్ఞాన సమన్వితమై ప్రకాశించింది.

❖❖❖

# 40. నియతిని పాలించటమే ఉచితం!

**శ్రీవసిష్ఠ మహర్షి :** వింటున్నావా! రామచంద్రా! ఆ కుంభ – శిఖిధ్వజులిద్దరూ ఆత్మను ఎరిగినవారై, ఆత్మమాత్రనిష్ఠులై, లీలగా అనేక వనములు, తీర్థయాత్రా స్థలములు, నదీ నద ప్రాంతములు సంచరిస్తున్నారు కదా! ఒక రోజు వారిద్దరూ ఒక అతి సుందరమైన వనంలో యాదృచ్ఛికంగా ప్రవేశించారు. అచ్చటి మధురరసమైన ఫల పుష్పములు, కోయిలల కూహూరాగాలు, పూతీగలచే ప్రకృతి సిద్ధంగా – ఎవరి ప్రమేయం లేకుండా నిర్మించబడిన లతాగృహములు, నిర్మల జలం పారే సెలయేర్లు మొదలైనవన్నీ ఆ ఇరువురినీ ఎంతో ఆహ్లాదపరిచాయి.

**శిఖిధ్వజుడు :** మహర్షీ! ఏమి ఈ ప్రకృతి సౌందర్యం! ఇక్కడ మునులకు గొప్ప తపో ఏకాగ్రత, ప్రేమికులకు పరమోల్లాసభరితమైన ఏకాంతము ఈ రెండిటినీ ప్రసాదించగల గొప్ప ప్రావీణ్యత ఈ వనమునకు కనిపించటం లేదా? ఈ వనదేవత చూపరులకు అందిస్తున్న ఆహ్లాదమును అభినందించక తప్పదు.

**కుంభ ఋషి :** ప్రియసఖా! నీవు చెప్పిన దానిలో అనుమానమే లేదు. పద! ఈ వనంలోనే మనం కొద్దిరోజులు ఉందాం. ఈ వనదేవత ప్రదర్శించే ఈ పవిత్ర – పరమాహ్లాద ప్రకృతిని ఆస్వాదిస్తూ ఇక్కడి ఏదైనా చక్కటి ఒక లతాగృహమును ఎన్నుకుందాం. ధ్యానాదులకు ఇది ఎంతో సానుకూల్య ప్రదేశమనిపిస్తోంది.

**శిఖిధ్వజుడు :** తప్పకుండా! మీరు భావించినట్లే అగుగాక!

❖

ఆ ఇద్దరూ చేతులు కలుపుకుని ఆ వనంలోని సుందరవాతావరణం ఆస్వాదిస్తూ ముందుకు అడుగులు వేస్తున్నారు. కుంభుని మనస్సు మరింతగా పరవశించసాగింది.

**కుంభరూప చూడాల (తనలో):** ఆహాఁ! ఏమి ఈ వన సౌందర్యం! వసంతకాలపు అందాలు చూడాలంటే ఈ వనమునే చూడాలి. పైగా ఈ ప్రదేశమంతా చాలావరకూ నిర్మానుష్యంగా ఉన్నది. ఇక్కడి లతా గృహాల సౌందర్యం వర్ణించాలంటే మాటలు చాలవు. ప్రక్కనే ఈ సెలయేరు. నా ప్రక్కనే చూస్తేనేమో ఉదారచరితుడైన నా ప్రియ ప్రాణసఖుడు. అరాగరంజితమైన ఈ స్థితి నేను కోరుకోకుండానే నాకు లభించింది.

యథాప్రాప్తములైన భోగముల పట్ల 'తిరస్కారబుద్ధి' అనే పట్టుదల నాకెందుకుండాలి? అట్టి పట్టుదల కూడా జీవన్ముక్తులకు మూఢత్వమనే అనిపిస్తుంది కదా! నా ఈ పతి నవవయస్కుడే కదా! ఇట్టి ప్రియసఖుడు ప్రక్కన ఉండగా ఈ సుందరవాతావరణంలో భర్తతో సమాగమం పొందకపోతే ప్రకృతి ప్రసాదించిన ఈ స్త్రీత్వమునకు అర్థమేమున్నది? వివాహితయగు స్త్రీ తన భర్తతో ఏకాంతం లభించినప్పటికీ భర్తతో పొందు వాంఛించకపోతే ఆమె ఉత్తమ స్త్రీ ఎట్లా అవుతుంది? జ్ఞాని కూడా యథాప్రాప్తములైన ధర్మవిహితములైన భోగములను త్యజించడు కదా!

అయితే, ఈ నా ప్రియపతి ఇప్పుడు నన్ను నారదపుత్రుడగు కుంభఋషి అనియే తలుస్తున్నాడు. నన్ను ఆత్మజ్ఞానం ప్రసాదించిన పరమగురువుగా గౌరవిస్తున్నాడు. పైగా, సర్వత్యాజ్యము చేత ఆత్మానుభవాన్ని పొంది ఉన్నాడు. ఒకవేళ చూడాల రూపంలో ఈతనికి కనిపించినప్పటికీ ఈతడు నాతో రమించుటకు సిద్ధమవుతాడని నేననుకోను. మరిప్పుడేం చేయాలి?

❖

కుంభఋషి రూపంలో తన భర్తతో చేతులు కలిపి అడుగులు వేస్తున్న చూడాల కొంచెం యోచనలో పడింది. ఆమె ఏకాగ్రతతో గొప్ప తపస్సు చేసి ఉన్న మహాయోగి కదా! కొద్ది క్షణములలో ఒక ఉపాయం ఆమెకు స్ఫురించింది.

❖

**కుంభఋషి :** మహారాజా! హరెరేఁ! మరచాను! ఈ వనం చూస్తే గుర్తుకొచ్చింది. ఈ రోజే వసంత ఋతువు ప్రవేశిస్తోంది కదా! నేడు చైత్రశుద్ధపాడ్యమి. కనుక చాలా గొప్ప రోజు. ఈ రోజు స్వర్గంలో ఇంద్రసభ జరుగుతుంది. ఈ విషయం నాకు ఇంతవరకూ ఎందుకు గుర్తుకురాలేదబ్బా?

**శిఖిధ్వజుడు :** ఏమి దేవఋషీ! నేటి ప్రత్యేకత ఏమిటి?

**కుంభఋషి :** చిన్నగా 'ప్రత్యేకత'... అంటావేమిటి? నేడు అనేక మంది దేవతలు, ఋషులు ఇంద్ర సభలో సమావేశం కానున్నారు. నా తండ్రిగారు నారదమహర్షి కూడా వేంచేయనున్నారు. ఆయన సమ్ముఖమునకు నేను అవశ్యం వెళ్ళవలసి ఉన్నది. యథాస్థితమైన మర్యాదలను ఎప్పుడూ అతిక్రమించ కూడదు కదా! కనుక నిన్ను విడచి నేను వెళ్ళిరాక తప్పదు.

**శిఖిధ్వజుడు :** అదేమిటి గురువర్యా! తప్పక వెళ్ళిరండి.

**కుంభ ఋషి :** అట్లాగే వెళ్ళివస్తాను. నూతన పుష్పములతో కూడిన ఈ వనంలో విహరిస్తూ నీవు నా కొరకై ఉద్వేగరహితంగా ప్రతీక్షిస్తూ ఉండు. మరల సాయంకాలానికి తిరిగి వస్తాను. నాకు నీ సాన్నిధ్యం కలిగించే సుఖం ఆ స్వర్గలోకంలో ఏమాత్రం ఉండదు సుమా!

❖

ఇట్లా పలికి కుంభుడు సువాసనా భరితమైన పూలగుత్తులను మర్యాదపూర్వకంగా శిఖిధ్వజుని చేతికి అందించాడు. రాజు చూస్తూ ఉండగానే ఆకాశంలో పయనిస్తూనే దోసిలినిండా మల్లె పుష్పములను కల్పించి శిఖిధ్వజునిపై పూలవర్షం కురిపించాడు. కనుచూపుమేర రాజు కుంభుని చూస్తూనే నిలుచున్నాడు.

ఆకాశంలో ప్రవేశించిన చూడాల తన నిజ స్త్రీ రూపం ధరించింది. కొద్ది క్షణములలో అంతఃపురం ప్రవేశించింది. ముఖ్యులగు మంత్రులను పిలిపించి అవశ్యమైన రాజకార్యములు నిర్వహించింది. ఆయా ముఖ్య విషయములన్నీ పర్యవేక్షించింది. సాయంకాలానికల్లా మరల కుంభ ఋషి రూపంలో శిఖిధ్వజుని సమక్షంలో నిలచింది.

శిఖిధ్వజుడు కుంభ ఋషి ఆగమనాన్ని చూచి సంతోషించాడు. గబగబా అతనిని సమీపించి సుస్వాగతం పలికాడు. ఆతని ముఖంలోకి చూచి ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే ఎప్పుడూ లేనిది... కుంభ ఋషి ముఖంలో దైన్యము, విషాదము తాండవిస్తున్నాయి.

❖

**శిఖిధ్వజుడు:** హే దేవఋషీ! ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండేవారు కదా! అత్యంత సూక్ష్మమైన తాత్త్విక విషయాలు చెప్పేటప్పుడు కూడా మీ ముఖంలో ఆటల గురించి మాట్లాడుకునే చిన్నపిల్లల కేరింతల వంటి ఆనందం ఎప్పుడూ ద్యోతకమయ్యేది. మరి ఈ రోజేమిటి ఇట్లా ఉన్నారు? మరి నా దృష్టి దోషమేమో తెలియదు గాని, మీ ముఖంలో ఏదో విషాదము, నైరాశ్యము కొట్టొచ్చినట్లు కనబడుచున్నాయి. తమరు సర్వసంగపరిత్యాగులు కదా! మీ యొక్క జ్ఞానదృష్టిచే ఈ దుఃఖకవళికలు త్యజించి ఇటు రండి.

ఈ ఆసనముపై కూర్చోండి. మహాత్మా! కమలాలు నీటిలో ఉన్నప్పటికీ జలం యొక్క తడిని స్వీకరించవు కదా! తమవంటి తత్త్వవేత్తలు సుఖ-దుఃఖాల వలన కలిగే స్థితిని ఆశ్రయించరు. ఒకవేళ ఏదో యాదృచ్ఛికంగా సుఖ-దుఃఖ సంఘటనలకు స్పందించవలసివచ్చినప్పటికీ, వాటిని హృదయంలో ప్రవేశింపనీయరు. అసలేం జరిగింది? మీరు ఇంత నిరుత్సాహంగా ఉండటానికి కారణమేమిటి?

**కుంభఋషి :** (విచారయుక్తమైన గద్గద స్వరంతో) హే రాజన్! ఈ 'దేహము' అనేది ఉన్నదీ అంటే, దీనితో పాటే కర్మేంద్రియాలు కూడా ఉంటాయి కదా! కర్మేంద్రియాలతో బాటే యథాప్రాప్తములైన ఆయా అనుభవాలూ ఉంటాయి. ఇట్టి దేహావస్థయందు కర్మేంద్రియాలచే ప్రాప్తములగు భోగాలను సమచిత్తులై అనుభవించాలి. అట్లా కాకుండా, కర్మేంద్రియాలను నిరుపయోగంగా ఉంచాలనుకోవటం ఒక రకమైన మొండితనమే అవుతుంది గాని, అది తత్త్వవేత్తల లక్షణం కాదు. ఈ శరీరానికి స్వభావ సిద్ధంగా ప్రాప్తించే ఆయా అవస్థల నుండి పారిపోవాలనుకుంటే అది తత్త్వవేత్తలు కానివారు

మాత్రమే తమ మూర్ఖత్వం చేత అట్లా అనుకుంటున్నారని మనం అనక తప్పదు. నువ్వులు ఎంతవరకు ఉంటాయో, అంతవరకు నూనె కూడా ఉంటుంది. ఎంతవరకు ఈ శరీరం ఉంటుందో, అంతవరకు కర్మేంద్రియాల హర్ష–శోక వ్యవస్థలు కూడా ఉంటాయి. 'నేను ఈ కర్మేంద్రియ వ్యవస్థను త్రెంచివేసి అప్పుడు శేషజీవితాన్ని గడుపుతాను'... అని ఎవడైనా అన్నాడనుకో, అది ఒక కత్తి తీసుకొని ఆకాశాన్ని త్రెంచటానికి ప్రయత్నించటం వంటిదే అవుతుంది. అనగా మూర్ఖత్వమే అనిపించు కుంటుంది. అవునంటారా? కాదంటారా?

'దేహమును జయించటం' అంటే కర్మేంద్రియములను నిరుపయోగంగాను, నిర్వీర్యంగాను ఉంచటం మాత్రం కాదని నా ఉద్దేశం. మరి? ఈ దేహదశయందు ఏ సుఖ–దుఃఖాదులు ఉన్నాయో వాటన్నిటిపట్ల అంతరంగంలో ఒకానొక 'అతీతత్వము' అను యోగ స్థితిని సంతరించుకుని ఉండటం – ఇదీ దేహమును జయించటమంటే. అద్దానిని యోగబలమని, సమాధి యొక్క అనుసంధానమని అంటారు. అట్టి సంయోగ – వియోగాతీతమగు యోగస్థితిని స్వభావసిద్ధం చేసుకొనే అభ్యాసం ఉత్తమంగాని, కర్మేంద్రియములను హఠయోగం చేత నిగ్రహించి, అట్టి మూర్ఖచర్యలచే ప్రాప్తించే దుఃఖమును సహించటం దేహభావత్యాగం అవదు, అవజాలదు. కనుక జ్ఞాని కూడా దేహం ఉన్నంత వరకు కాళ్ళు, చేతులు మొదలైన కర్మేంద్రియములను, చూపు – వినికిడి మొదలైన జ్ఞానేంద్రియములను ఆయా యథా ప్రాప్తములైన ఆచారములందు నియమిస్తూనే ఉంటాడు. ఉండాలి కూడా! అయితే అతడు మనోబుద్ధులందు సర్వదా సమత్వము వహించి ఉంటాడు. బ్రహ్మదేవుడు మొదలుకొని తదితర జ్ఞానులు, తత్త్వవేత్తలు అందరూ ఈ విధంగానే దేహస్థితియందు నెలకొనియున్నారు. ఎవ్వరైనా సరే ఈశ్వరేచ్ఛను పాటించి తీరవలసిందే కదా!

**అజ్ఞ – తత్త్వజ్ఞ భూతాని దృశ్యజాతమిదం హి యత్**
**తత్సర్వమేవ నియతిం ధావత్యమ్బు యథా అంబుధిమ్ ॥**

ఎక్కడ ఏ జలమున్నా చివరికి సముద్రం వైపుగానే పరుగులు తీస్తున్నట్లు, జ్ఞాని అయినా, లేక అజ్ఞాని అయినా జగత్తులోని ప్రాణులందరూ ఈశ్వర నియతినే పాటిస్తున్నారు. ఈశ్వర నియతిని అనుసరించే పరుగులు తీస్తున్నారు.

అయితే జ్ఞానులగువారు తమ తమ మనోబుద్ధులను పరిశుభ్రంగా ఉంచుకుని అంతరంగంలో సామ్యత్వం అవధరిస్తూ ఈ దేహము ఉన్నంతవరకు ఈశ్వర నియతిని పూర్ణముగా పాలిస్తున్నారు. ధర్మాధర్మములను ఈశ్వారానుకూలంగా నిర్ణయించి అనువర్తిస్తున్నారు.

ఇక అజ్ఞానుల విషయమో... వారు చేయవలసివస్తున్న వాటిని, చేయలేకపోతున్న వాటిని తలచుకుని క్షోభ చెందుతున్నారు. 'నేను ఈశ్వర నియతిని పాటిస్తున్నాను కదా'... అనే విషయం ఏమరచి సుఖదుఃఖ దశలకు వశులై, హతాశులై లక్షల కొద్ది దేహాలను ధరిస్తున్నారు. 'మాకు ఇది బాగు, అది కాదు. ఇట్లాగే ఉండాలి, అట్లా ఉండటం ఇష్టముండదు. ఇది మాకు సుఖం, అది దుః ఖం'... అని స్వకీయ నిర్వచన పరంపరలను ఆశ్రయించి ఈశ్వరనియతి యొక్క ప్రభావమేమిటో

ఏమరచుచున్నారు. ఫలితం? దేహస్థితి పర్యంతమూ బలవంతంగానూ, అపూర్ణముగానూ ఈశ్వర నియతిని పాలిస్తున్నారు.

**ఇత్థం సుఖేషు, నను దుఃఖ-దశాసు చేత్థం స్థాతవ్యమితి అధిగతం యదిహాఙ్గ జీవైః**
**అజ్ఞజ్ఞభూత నివహస్ఫురితస్తదేవం "దుర్లంఘ్య ఏష నియతో నియతేర్విలాసః" ॥**

ఓ రాజా! 'ఈ ప్రాణి ఈ జన్మలో ఈ సుఖస్థితులలో ఉండాలి - ఆ ప్రాణి ఆ సుఖ-దుఃఖ స్థితులలో ఉండాలి' - అని ఈ ప్రకారంగా ప్రతి ప్రాణి నుదుట ఆయా స్థితి - గతి విశేషాలన్నీ ముందుగానే వ్రాయబడి ఉన్నాయి. నుదుటి వ్రాతను ఎవరు తప్పించగలరు? జ్ఞానికైనా సరే, అజ్ఞాని కైనా సరే, 'నియతి' లేక 'పారబ్ధకర్మ యొక్క విలాసము'ను తప్పించటం ఎవరి తరం?

❖❖❖

# 41. దుర్వాస మహర్షి శాపం

**శిఖిధ్వజుడు:** హే మహానుభావా! వేదవిద్వరా! మీరు చెప్పినట్లే 'నియతి' లేక ప్రారబ్ధ విలాసాన్ని అనుసరించే ఈ ప్రాణులు తెలిసో, తెలియకో అనువర్తిస్తున్నాయి. ఇందులో క్షోభ చెందవలసిన పనేమున్నది? జన్మ - మృత్యువుల మధ్య మాత్రమే కనబడే ఆయా ప్రాప్తాప్రాప్త సంఘటనలను చూచి అజ్ఞాని అంతకుముందే అంతరంగంలో కలిగి ఉన్న సుఖదుఃఖాది నిర్వచనాల ప్రభావం చేత సుఖ-దుఃఖ భావపూరితంగా దర్శిస్తున్నాడు. జ్ఞాని ఈశ్వరేచ్ఛగా దర్శిస్తున్నాడు.

మీరు చెప్పినదంతా యుక్తియుక్తమే. ఇంతకీ ప్రశాంత సమన్వితమగు మీ ముఖంలో కనిపించే ఈ ఉద్వేగమునకు విషాదమునకు కారణమేమిటో వివరించకపోతిరి?

**కుంభ ఋషి:** తప్పకుండా! ఈ రోజు స్వర్గలోకంలో జరిగిన వృత్తాంతమంతా చెబుతాను. సావధాన చిత్తుడవై విను. నీ వంటి స్నేహితునితో వచ్చిన కష్టమంతా మనస్సు విప్పి చెప్పుకుంటే సగం బాధ తీరిపోతుంది. నిష్కపటియగు నీ ముందు ఉన్నదంతా చెబితేనే ఈ మనస్సు ప్రసన్నత్వం పొందగలదని ఎరిగియే శీఘ్రంగా ఇక్కడికి వచ్చాను. ఇక విను.

❖

నీకు ఈ ఉదయమే ప్రేమపూర్వకంగా పుష్పగుచ్ఛములను సమర్పించి ఇక్కడి నుండి బయలుదేరాను కదా! ఆకాశమార్గమును దాటి స్వర్గలోకంలో ప్రవేశించాను. అమరావతీ నగరంలో నా తండ్రిని దర్శనం చేసుకొని ఆయన వాత్సల్య - ఆశీర్వాదాలు పొందాను. ఇంద్రసభలో అనేక జ్ఞానసంవాదములు విని మరింత పవిత్రుడనయ్యాను. అయితే ఏం? నాలో ఇంకా బాల్యచాపల్యం వదలలేదు కాబోలు... సరే ఈ సంగతికి తరువాత వద్దాం.

సభ శాంతి ప్రవచనాలతో ముగిసింది. ఎందరో ఋషులు, వక్తలు నన్ను ప్రేమపూర్వకంగా పలకరించారు. పెద్దలనేకులికి హృదయపూర్వక నమస్కారాలు సమర్పించి వారి వద్ద ఆశీర్వాదం పొందాను. మరల నా తండ్రి నారదమహర్షిని సమీపించి పాదాభివందనం చేసి ఆయన ఆశీర్వాదం

కూడా పొందాను. సభలోని వారందరూ వారి వారి స్థానాలకు బయలుదేరారు. నేను కూడా ఇక మరొక మార్గంలో బయలుదేరాను. క్రమంగా వాయు మార్గంగా మేఘములను స్పృశిస్తూ వస్తున్నాను. వస్తూ వస్తూ ఉండగా నా ఈ దుఃఖమునకు కారణమైన ఒక చమత్కారమైన సంఘటన జరిగింది.

**శిఖిధ్వజుడు:** చెప్పండి మహాత్మా! ఏమిటది?

**కుంభ ఋషి:** జలపూరితమైన మేఘాల మధ్య నుండి దుర్వాస మహాముని వేగంగా వస్తూ ఉండటాన్ని చూచాను. ఆయనతో నాకు బాల్యం నుండి పరిచయం. నా తండ్రిగారు నారదమహర్షి, ఆ దుర్వాస మహర్షి అనేక భక్తి – జ్ఞాన విషయాలు సంభాషించుకోవడం నేను చాలాసార్లు విన్నాను. ఆయన నన్ను ఎంతో ప్రేమతో ఎప్పుడూ పలుకరిస్తూ ఉండేవారు కూడా!

ఆయన మేఘాల మధ్య నుండి వస్తూ ఉంటే మేఘాలలోని జల బిందువులు నుదిటిపై తాకాయి కాబోలు. ముఖంపై గల గంధం, విభూదిచారల రూపంగా ఏర్పడ్డాయి. తెల్లటి ఛాయగల ఆయన అల్పవస్త్ర సహితదేహం నీలి మేఘాలు ప్రతిబింబంచే నీలపు చీర ధరించిన అభిసారిక (వ్యభిచారిణి)ను గుర్తుచేస్తున్నట్లున్నది.

ఆయనపై నా చూపులు పడీపడకముందే నన్ను చూచి పకపకా నవ్వుతూ పలకరించారు. 'ఏమి కుంభ ఋషీ! భూలోకానికి పోవుచున్నట్లున్నావే? నిన్ను చూచి చాలాకాలమయిందయ్యా'... అని ఆప్యాయంగా పలికారు. నేను ఆయనను సమీపించి సాష్టాంగ నమస్కారం చేశాను. నెమ్మదిగా కళ్ళు తెరచి చూచి తటాలున నవ్వాను. నన్ను ఆయన ఆశీర్వదిస్తూనే, 'ఏమిటి నవ్వుచున్నావు?' అని కించిత్ హాస్యరసపూరితంగా అడిగారు. ఆయన మహానుభావుడని తపోలక్ష్మి యొక్క ముద్దుబిడ్డ అని నాకు తెలుసు. ఆగ్రహ-అనుగ్రహములలో ఆయన ఎంతటివాడో పురాణములను ఎఱిగిన నీకు వేరే చెప్పేదేమున్నది? అన్నీ తెలిసి కూడా బాల్యము నుండి ఆయనతో గల సంభాషణా స్వాతంత్ర్యమును పురస్కరించుకొని యౌవన పరిహాస చాపల్యంచేత మనస్సులో ఏర్పడిన చిలిపి ఆలోచనను అనాలోచితంగా మాటలలో పలికాను.

**శిఖిధ్వజుడు:** ప్రసంగవశంగా మహానుభావుడగు దుర్వాసమహాముని గురించి వినటం నాకు ఆనందంగా ఉన్నది. మహా తపస్వి, పరమజ్ఞానియగు ఆయనకు సర్వదా శుభమగుగాక! చెప్పండి. అప్పుడేమైనది? మీరు ఆయనతో ఏమన్నారు?

**కుంభ ఋషి:** నేను ఆయనతో 'ధవళఛాయతో మెరిసే మహా తపస్విని అగు మీ దేహాన్ని చూస్తున్నప్పుడు ఈ రోజు ఏమనిపిస్తోందో చెప్పమన్నారా? నీటి బిందువులు జాలువారుతూ, వాటిలో నీలి మేఘములు ప్రతిబింబించటం చేత మీరు నీలమేఘశ్యాములు అయ్యారు. అంతేగాదు, ఇంకా ఏమని పిస్తుందంటే!" అని కొంచెం వెనుకాటుగా ఊరుకున్నాను. అప్పుడా దుర్వాస మహర్షి చిరునవ్వుతో "ఊ! చెప్పవయ్యా ఏమనిపిస్తోందో?" అని చిరునవ్వు నవ్వారు.

ఇక నేను మనస్సులో మాట ఆపుకోలేక 'జలబిందువులతో కూడి జాలువారే నుదురుపైగల గంధ – విబూదులు, దేహముపై కప్పబడిన నీటి బిందువులలో ప్రతిబింబించే నీలమేఘచ్ఛాయ

లోంచి కనిపించే తెల్లటి దేహం అప్పుడే రతిలో పాల్గొనిన అతి సుందరమైన అభిసారికను (వేశ్య స్త్రీని) గుర్తుచేస్తున్నాయి” అని నోరు జారాను.

ఇక ఆ దుర్వాసముని ముఖ కవళికలు మారటం గమనించాను. కొంపమునిగిందని కనిపెట్టేశాను. ‘మహర్షీ! క్షమించండి. కోపగించకండి’ అని అంటూనే ఉన్నాను.

ఆయన అవేమీ వినిపించుకోనేలేదు. ‘నారదమహర్షి పుత్రుడవనే గర్వంతో ఏది ఏ దృష్టితో చూడాలో గ్రహించక పెద్దలు, పూజ్యుల పట్ల ఇటువంటి దుర్వాక్యాలు పలుకుతావా! సరే. ఇదే నా శాపం. నీవు ఈ రోజు నుండి ప్రతిరాత్రీ పాలిండ్లతోను, కేశాలతోను, కామభావాలతోను, విలాసపూరిత మైన హావభావాలతోనూ కూడిన స్త్రీ రూపం పొందెదవు గాక!” అని మంత్రజలం సంప్రోక్షించారు.

నేనిక “అయ్యా! స్వామీ మునివర్యా! మహర్షీ! ఇదేమీ?”...అనే లోపల ఆ మునివరేణ్యులు అంతర్ధానమైనారు.

ఓ శిఖిధ్వజా! ఈ కారణం చేత నేను ఖిన్నుడనై ఏం చేయాలో తెలియక ఆకాశం నుండి ఇటువచ్చాను. ఆ మహర్షి అమోఘమైన శాపం ఊరికేపోదు కదా! ఇక ఈ రోజు నుండి రాత్రులందు కామభావాలతో కూడిన స్త్రీ రూపం పొందబోవుచున్నాను. ఆ దుర్దశను అనుభవించేదెట్లా? ఎప్పుడైనా రాత్రులందు నా తండ్రికి కనబడితే నేను ఏమని సమాధానం చెప్పాలి?

ఆహా! ఈ సంసారంలో ఉండునట్టి ప్రాణులగతి అతి భయంకరమైనది కదా! ఇక నేను కూడా ‘గృధ్రమాంసన్యాయం’ వలె (స్నేహంగా ఉన్న గ్రద్దలు మాంసాన్ని చూడగానే ఒకదానికొకటి హింసించుకుంటున్నట్లు) యువకులు చేసే అల్లరి పనులకు ఎఱ కావలసిందేనా? నన్ను అపహరించుకు పోవటానికి ఇప్పుడొక యువకుల సంఘం పుట్టుకొస్తుందేమో? స్వర్గంలో దేవగురువుల ఎదుట, ద్విజుల ఎదుట నిలబడి ముఖం చూపేదెట్లా?రాత్రులందు స్త్రీ దేహంతో నేను ఎక్కడ నివసించాలి?

❖

ఇట్లు పలికిన ఆ కుంభఋషి కొన్ని క్షణాలు వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆ దుఃఖం ఆపి కళ్ళు తుడుచుకున్నాడు. కొంచెంసేపు ప్రశాంతంగా యోచించి మరల ఇలా అన్నాడు.

❖

**కుంభ ఋషి:** అయినా మహారాజా! నేనెందుకు ఈ విధంగా దుఃఖిస్తున్నాను? ఈ దేహం స్త్రీ రూపమైతే ఏమున్నది? పురుషరూపమైతే ఏమున్నది? ఆత్మకు కలిగే హాని ఏమీ లేదు కదా! ఆయా సందర్భానుచితములైన కర్మలన్నీ ఈ దేహమే పొందుతోంది గాని, నిర్విషయాత్మస్వరూపుడనగు నేను పొందుటలేదు కదా! ఇంకెందుకు దిగులు?

**శిఖిధ్వజుడు:**

**పరిదేవనయాకోఽర్థో, దేవపుత్ర! తథైతయా?**

హే దేవపుత్రా! అదంతా సరేగానీ, ఇప్పుడు విలపించి ఏం ప్రయోజనం? జరగనున్నది జరుగక మానుతుందా? అంతా ఈశ్వరచ్ఛే కదా!

**యదాయాతి తదాయాతు దేహస్య, ఆత్మా న లిప్యతే**
**కాని చిద్యాని దుఃఖాని సుఖాని విహతాని చ,**
**తాని సర్వాణి దేహస్య, దేహినో నతు కానిచిత్ ॥**

ఈ దేహానికి ఏది కావాలని ఉంటే అదే కానివ్వండి. మీరు చెప్పినట్లు ఆత్మకు దేనితోనూ సంబంధమే లేదు కదా! ఇక ఈ సుఖదుఃఖములంటారా... ఇవన్నీ ఏ నియతిచే విధించబడ్డాయో, అవన్నీ దేహముకొరకే గాని ఆత్మ స్వరూపుడగు 'దేహి' కొరకు కానే కాదు.

హే కుంభమహర్షీ! ఈ ప్రపంచ వ్యవహారాలు చూచి మీరా, ఖేదం పొందటం? మీరే ఖేదం పొందితే ఇక ఈ ప్రపంచంలో గల తత్త్వాన్వేషకులకు దిక్కెవరు? శాస్త్ర విషయాలను, స్వానుభవాలను రంగరించి ఆత్మతత్త్వమును ప్రకటించగల ఒక గొప్ప వైద్యునివంటి మీరే ఆత్మానుభవచ్యుతిని పొందితే ఇక మాకు చికిత్సకులు, ఎవరు? మేము ఎవరిని శరణువేడాలి? కనుక ఈ దైన్యత్వం మీకు ఉచితం కాదేమో గమనించండి. అయినా మీరు ఏదో సందర్భానుచితం కాబట్టి ఈ అనుకోని విషాద సంఘటనకు విషాద రసపూర్వకంగా బాహ్యస్పందనం ప్రకటించటం జరిగింది. ఇక యథాస్థితమైయున్న సర్వసమత్వమును, దుఃఖరాహిత్యమును ఎప్పటిలాగే అవధరించెదరు గాక!

❖

ఇటువంటి అనేక వాక్యములచే వారిరువురు పరస్పరం సమాధానపరచుకొంటున్నారు. ఇంతలో "కుంభునకు స్త్రీత్వ ధర్మము కలుగజేయటానికేనా?" అన్నట్లు జగద్దీపకుడగు సూర్యుడు అస్తమాద్రిని సమీపించసాగాడు. క్రమంగా బాటసారులకు మార్గములు కనబడకుండా పోనారంభించాయి. పక్షులు కిలకిల శబ్దాలు చేస్తూ గూటికి చేరనారంభించాయి. ఆత్మ సర్వదా ఏర్పడియే ఉండగా సాంసారిక దృష్టికి అగుపించక, జ్ఞానదృష్టి ఒనగూరుచుండగా స్వయంగా దర్శనమౌతుంది చూచావా? అట్లా నక్షత్రాల ఉనికిని దృష్టికి తెస్తూ కాంతి పుంజాలు ప్రసరించసాగాయి. ఒకవైపు సూర్యుడు అస్తమించుచుండగా మరొకవైపు ఇక్కడ కుంభుని భౌతికదేహం మెల్లమెల్లగా స్త్రీత్వమును ప్రకటించ ప్రారంభించింది. ముందుగా ఆమె కంఠనాదము సున్నితమవసాగింది.

❖

**కుంభ ఋషి :** ఓ రాజా! చూస్తున్నావు కదా! ఈ వనమంతా వసంతగాలులు వీస్తున్నట్లు ఈ దేహమంతా సిగ్గుతో నిండిపోతోంది. చేతికట్టు వలె ఈ అవయవములు తోచుచున్నాయి. నీ ఎదుట ఇప్పుడే ఈ దేహం స్త్రీత్వం పొందుతోంది. ఈ కేశములు ఎట్లా వృద్ధి చెందుచున్నాయో చూస్తున్నావా? తామరమొగ్గలు వికసిస్తున్నట్లు నా ఈ వక్షస్థలముపై స్తనద్వయం స్వోన్ముఖమై వృద్ధి చెందుతున్నది. ఈ వస్త్రములు కూడా చీలమండలము వరకు విస్తరిస్తున్నాయే! మహర్షి శాపం ఎంతటి మహత్తరమైనది? ఏమిటిది? స్త్రీలకు యోగ్యమైన ఆభరణములు కూడా తమంతట తామే ఈ దేహముపై వెలువడుచున్నాయే! ఇవి శ్రీదూర్వాస మహర్షి యొక్క శాపసౌందర్య చిహ్నాలు కాబోలు!

ఇప్పుడు స్త్రీ చిహ్నములన్నీ కలిగాయి. అయ్యో! ఎంత కష్టతరం! ఇప్పుడు నేను పూర్తిగా స్త్రీని అయ్యాను. పిరుదులు, మొల... ఇంతెందుకు, నా అంతఃకరణమే స్త్రీత్వం సంతరించుకున్నది.

❖

శిఖిధ్వజుడు కూడా కుంభుడు స్త్రీగా మారటం చూచి కళ్ళ తడిపెట్టుకున్నాడు. ఒక ఘడియ సేపు ఆ ఇద్దరి మధ్య దుఃఖముతో కూడిన మౌనము తాండవించింది... ముందుగా శిఖిధ్వజుడే కొంచెం తేరుకున్నాడు.

**శిఖిధ్వజుడు :** మహాత్మా! ఇదంతా మీరు చెప్పినట్లు దుఃఖకరమైన పరిణామమే. ఏదన్నా కానివ్వండి. మహాసత్వసంపన్నులగు మీరు తమ జ్ఞానౌన్నత్యమును వీడకుండానే ఈ దేహం విషయంలో స్త్రీగా మారారు. అయితే కానివ్వండి. జ్ఞానానికి దేహానికి సంబంధమేముంటుంది? మీరు ఆత్మవేత్తలు కాబట్టి 'నియతి' యొక్క అనివార్యత గురించి వేరుగా చెప్పేదేమున్నది? అవశ్యం జరగబోయే విషయాల గురించి మీరు ఖిన్నచిత్తులు కావద్దు. బుద్ధిమంతులు ఆయా సుఖ-దుఃఖ దశలు ఈ శరీరానికి సంబంధించినవే గాని, తమకు సంబంధించినవి కావని ఎఱిగియే ఉంటున్నారు కదా! మీరు కూడా అట్లాగే ఉండండి. ఇటువంటి ఆయా సుఖదుఃఖానుభవాలను అజ్ఞానులు మాత్రమే చిత్తంలో ప్రవేశించ నిస్తారు. నిత్యానిత్య వివేకజ్ఞానం కలిగిన మీవంటివారు వాటిని దేహ పరిమితమైన వాటిగా చూస్తారు.

**కుంభ ఋషి :** (చిరునవ్వుతో) ఓ రాజా! మీరు చెప్పినట్లే అగుగాక! రాత్రులందు దుర్వాసమహాముని నిర్ణయించినట్లు ఈ స్త్రీత్వమునే ధరిస్తూ ఉంటాను. ఇక దుఃఖం ఎందుకు? ఈశ్వర నియతిని నేను గాని, మరెవ్వరు గాని ఉల్లంఘించగలరా?

ఇట్లా సంభాషించుకుంటూ ఉండగా వారిద్దరి మనస్సులు దుఃఖరహితమైనాయి. ఇక యథా ప్రకారం ఆయా తాత్త్విక విషయాలు చర్చించుకుంటూ అర్ధరాత్రిదాకా గడిపారు. ఉద్వేగరహితులై ఆ రాత్రి గాఢనిద్రకు ఉపక్రమించారు.

❖

చూచావా రామా! ఈ విధంగా ఆ పట్టపు దేవియగు చూడాల పగలు పురుషరూపంలో ఆ శిఖిధ్వజునితో ఆ వనంలో సంచరించేది. రాత్రిపూట అవివాహితయగు కన్యాధర్మమును పాటిస్తూ తన పతికి మిత్రురాలై సంచరించేది. అక్కడినుండి అనేక వనములలో వారిద్దరూ అదే రీతిగా సంచరించేవారు. కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజు సాయంకాలం కుంభరూపంలో చూడాల శిఖిధ్వజునితో ఇట్లా పలికినది.

❖❖❖

# 42. గాంధర్వ వివాహం

**కుంభ ఋషి రూప చూడాల:** హే శిఖిధ్వజ మహారాజా! ఇప్పుడు నాకొక క్రొత్త ఆలోచన వస్తోంది. నా ఈ వాక్యములు కాస్త ఓపికతో వినండి. నేను ప్రతి రోజు చీకటి పడేసరికి స్త్రీగా మారుచున్నాను కదా! అట్టి స్త్రీరూపమును సఫలం చేయటానికి ఒకానొక పతికి వివాహముద్వారా నన్ను సమర్పణ చేయాలనే ఇచ్ఛ జనిస్తోంది. ఈ ముల్లోకములలోను నీ ఒక్కడివే భర్తగా నా కిష్టమైనవాడవగుచున్నావు. కాబట్టి నన్ను వివాహం చేసుకొని రాత్రులందు భార్యగా స్వీకరించు. ఎట్టి పరిశ్రమ లేకుండానే ప్రాప్తించిన నీ వంటి మిత్రునితో స్త్రీపురుష సమాగమ సుఖము అనుభవించదలిచాను. దయచేసి

ఈ ఆలోచనను అంగీకరించవలసిందని, అడ్డుచెప్ప వద్దని నా మనవి. ఈ 'వివాహం' అనేది సృష్ట్యాది నుండి ఇప్పటి వరకూ ఒక వ్యవస్థగా ఏర్పడియే ఉన్నది కదా! అట్టి మనువు వంటి మహనీయులచే నిర్ణయించబడిన సాంఘిక విధానం, సర్వజనులకు శ్రేయము అయిన 'వివాహం' మనం చేసుకుంటే తప్పేమున్నది? పైగా, మనిద్దరి స్వభావం ఒకే తీరుగా ఉన్నది. ఇద్దరమూ కూడా సమస్త వస్తువుల యందు ఇచ్ఛ – అనిచ్ఛలను, వాటికి సంబంధించిన ఆయా ప్రయోజనములను త్యజించియున్నాము. అనగా, ఇచ్ఛానిచ్ఛరహితులమై ఉన్నాం. ఒకరినొకరం దీర్ఘకాలంగా స్వభావపూర్వకంగా ఎరిగి ఉన్నాం. స్నేహితులం. దంపతులం కావటానికి ఇంతకు మించిన అర్హత ఏమి కావాలి? కనుక నా అభీష్టాన్ని చెల్లించమని నా మనవి. ఈ విషయమై నీ ఉద్దేశమేమిటో వినటానికి సంసిద్ధంగా ఉన్నాను.

**శిఖిధ్వజుడు :** మహాబుద్ధిమంతుడవగు ఓ దేవర్షీ! మీరు ప్రతిపాదించిన దానిలో నాకు శుభంగాని, అశుభముగాని ఏదీ కనబడటం లేదు. మీకు ఎట్లు సమ్మతియో, అట్లే అగుగాక! ఈ నా చిత్తంనందు మీరు బోధించిన వాక్యబలం చేత సమత్వము సుస్థీకరణమయింది. అందుచేత నాకు సర్వము స్వాత్మగానే అనుభవమగుచున్నది. ఇక మీకు ఎట్లా ఇష్టమైతే అట్లే ఆచరించబడుగాక!

**కుంభ ఋషి :** అట్లా అయితే నేడే శుభలగ్నం. ఈ రోజు శ్రావణపూర్ణిమ కదా! నిన్ననే నేను వివాహ లగ్నాన్ని గణించి నిర్ణయించాను. నేటి రాత్రి పూర్ణచంద్రుడు ఉదయించగానే ప్రారంభపు అమృత ఘడియలలో మనిద్దరికీ గాంధర్వ వివాహం జరుగుతుంది. మన వివాహానికి కావలసిన సరంజామా, ప్రదేశాన్ని నిర్ణయించి అంతా సిద్ధం చేసుంచాను. ఈ పుష్పలతను, ఆ పర్వతశిఖరాలు, ఇక్కడి సెలయేళ్ళు, ఆకాశంలోని పాలపుంతలు మన ఈ వివాహానికి సాక్షులు, బంధువులు అగుగాక! ఇక లేద్దాం. మనం వివాహవేదిక కొరకై ఇంకా కొన్ని ఉత్తమ పుష్పాలు, చందనాది ద్రవ్యాలు ప్రోగుచేసుకో వలసి ఉంది.

ఓ రామచంద్రా! ఈలోగా పూర్తిగా పొద్దుగూకింది. కుంభుడు ప్రతిరోజులాగానే సుందర స్త్రీగా రూపం పొందాడు. ఆ ఇద్దరూ కలసి ఒక ఘడియకాలంలో దేవత, అధిదేవత, ప్రత్యధిదేవతలను పూజించటానికి కావలసిన ఫలపుష్పాలన్నీ సేకరించి వివాహ వేదికాస్థానం జేరారు. ఆ ఇద్దరూ ఆ ప్రక్కనే గల సరస్సులో చక్కగా స్నానాలు ఆచరించారు.

తరువాత వివాహ వేదికను సమీపించి ఆసీనులైనారు. మనోవాక్కులచే దేవత–పితృ–ఋష్యాదులను ప్రతిమాహ్వానం చేసి పూజించారు. ఆ ఇద్దరూ కూడా క్రియా ఫలముల పట్ల ఎట్లు ఇచ్ఛారహితులో, అట్లాగే క్రియాత్యాగము పట్ల కూడా ఇచ్ఛారహితులై ఉన్నారు. సంధ్యావందన – అఘమర్షణ మంత్రములను సమాప్తం చేసుకున్నారు.

అప్పుడు దేవఋష్యాది పూజానంతరం శాస్త్రోక్త విధిగా వివాహం చేసుకున్నారు. పరస్పరం హృదయసమర్పణ చేసుకున్నారు. లౌకిక మర్యాద పూర్వకమైన ఉత్తమ భోజనములను భుజించారు. ఇంతలో దంపతులకు ప్రధాన సఖియగు ఉత్తరరాత్రి ప్రారంభమైనది. ఉదయించిన సూర్యుని వలె తెల్లని వస్త్రములను ధరించిన స్త్రీ రూపియగు కుంభుడు శిఖిధ్వజుని సమీపించాడు.

**స్త్రీ రూపిణి యగు కుంభుడు :** మానప్రదుడవగుస్వామీ! 'మదనిక' అనే పేరుగల ఈ నీ భార్య నీ కరచరణములకు ప్రీతిపూర్వకంగా నమస్కరిస్తోంది. సిగ్గుతో నిండిన ఈ ఉత్తమ శరీరంతో, చంచల

కేశములతో నా అభ్యర్థనపై నన్ను స్వీకరించటానికి అంగీకరించుటచే పరమ ఆప్తుడవైనావు. అంతేకాదు ఉత్తమ భుజాలు గల నీ గంభీరమైన సుందరరూపం నన్ను ఈ సమయంలో కామపీడితగా చేస్తోంది.

❖

ఓ రామచంద్రా! ఆ విధంగా పలికి మదనిక శిఖిధ్వజుని పాదములు స్పృశించింది. శిఖిధ్వజుడు చిరునవ్వుతో ఆమె భుజములను స్పృశించి లేపి ప్రక్కనే కూర్చుండబెట్టుకున్నాడు. అప్పుడు మదనిక అక్కడి అనేక సుగంధలేపనాలతో భర్తను మరింత అలంకృతునిగా చేసింది. సుదీర్ఘకాలం దూరమైన ఆ దంపతులిరువురి ప్రణయవాగ్విలాసంతో నాటి రాత్రి కొద్ది క్షణముల వలె గడిచిపోయింది.

❖

ఎప్పుడు తెల్లవారిందో వారికే తెలియలేదు. సూర్యుడుదయించేసరి కల్లా మదనిక మరల కుంభుని రూపం పొందింది. ఆ రోజు నుండి వారిద్దరు పగటి పూట ప్రియమిత్రులుగానూ, రాత్రి యందు ప్రయాతిప్రియులగు దంపతులుగానూ రోజులు గడపసాగారు. అయితే చూడాల మాత్రం 3 రోజుల కొకసారి భర్త నిదురిస్తున్న సమయంలో రాజనగరం ప్రవేశించి, అక్కడి రాచకార్యములన్నీ చక్కబెట్టి మరల ఆ వనంలో భర్త సమక్షం చేరుతూ ఉండేది.

ఆ దంపతులు మహేంద్ర పర్వతముపై ఒక నెల రోజులు గడిపారు. ఆ తరువాత శక్తిమాన్ పర్వతముపైన, మైనాక పర్వతపు దక్షిణ భాగంలోను కొన్ని రోజులు గడిపారు. ఆ తరువాత ఉత్తరకురుదేశంలో 10 రోజులు, ఉత్తర కోసల దేశంలో 27 రోజులు గడిపారు. ఆ తరువాత అనేక ప్రదేశాలు సందర్శిస్తూ పగటిపూట మిత్రులుగానూ, రాత్రిపూట దంపతులుగాను విహరించసాగారు.

ఆ విధంగా కొన్ని నెలలు గడిచిపోయాయి. ఒక రోజు దేవతాపుత్రరూపియగు చూడాల ఇట్లా అనుకున్నది.

**చూడాల :** (తనలో) ఈ శిఖిధ్వజుడు పరమజ్ఞానియే. ఇందులో సందేహం లేదు. నాతో స్నేహ – దాంపత్యాదులు నిర్వర్తిస్తూ కూడా ఏమాత్రం కించిత్ కూడా అజ్ఞాన దృష్టిని గాని, జ్ఞానవ్యతిరిక్తమగు ప్రవర్తన – అభిప్రాయములను కలిగి ఉండటమే లేదు. స్త్రీ సాంగత్యము వలన ఈతనికి ఎట్టి దోష – సాంసారిక దృష్టి ఏర్పడుట లేదంటే ఈతడు మహాజ్ఞానులలో ఒకడుగా రూపుదిద్దుకుంటున్నట్లే! అయితే ఈతని చిత్తములో భోగములకు సంబంధించి ఆశాదులేమైనా ఉన్నాయా? లేవా? ఈ విషయం ఇప్పుడు పరీక్ష చేయాలి.

❖❖❖

# 43. ఇంద్రుని ఆహ్వానం

ఒక రోజు శిఖిధ్వజుడు ఒంటరిగా ఒక నది ఒడ్డున సుఖాసీనుడై కనులు మూసుకుని ఉన్నాడు. కుంభుడు సమీపవనంలోని ఫలపుష్పాలు తేవటానికి అంతకుముందే ఆతని అంగీకారమును తీసుకొని వెళ్ళి ఉన్నాడు.

ఇంతలో ఉత్తర దిక్కున గల తెల్లటి మేఘములవైపు నుండి ఏదో నూతన – అత్యాహ్లాదమైన కాంతి పుంజం తన నుదుటిని తాకినట్లు అనిపించింది. “ఆహా! ఏమిటిది?” అనుకొని కనులు తెరచి ఉత్తరం వైపుగా చూచాడు. ఆశ్చర్యం! అతి సున్నితమైన, ధవళఛాయతో ప్రకాశిస్తూ మిరుమిట్లు గొలిపే వస్త్రాలంకారములను ధరించి ఎవరో దివ్యపురుషుడు తను ఉన్న వైపుగా వస్తున్నట్లు గమనించాడు. ‘ఎవరా?’... అని అనుకుంటూ లేచి నిలబడుచుండగా అగ్ని–వరుణ–వాయువు మొ॥న అష్టదిక్పాలకులు ఐరావతము మొ॥న చిహ్నములను అనుసరించి ఆ దివ్య పురుషుడు ఇంద్రభగవానుడని ఎవరూ ప్రత్యేకంగా చెప్పకుండానే రాజు గ్రహించాడు. గబగబా కొద్ది అడుగులు వేసి ఆయనకు సుస్వాగతం పలుకుచూ సాష్టాంగదండప్రణామం చేశాడు.

**శిఖిధ్వజుడు :** హే ఇంద్ర భగవాన్! మీకు జయమగు గాక! మీ పాదాలకు పదే పదే ప్రణామాలు. దివ్య పురుషులు, పరమాత్మయగు మీరు ఈ రోజు ఈ మానవప్రాణికి దర్శనమివ్వటం చేత ఈ శిఖిధ్వజుడు పునీతుడైనాడు. మహాత్ములగు మీవంటి వారి దర్శనం లభించటమనేది మా వంటి వారికి ఊహకందని విషయం. ఈ సేవకుడు మిమ్ములను సేవించి తరించుటకు సిద్ధంగా ఉన్నాడు. అయినా దేవరాజేంద్రా! తాము స్వయంగా ఇంతదూరం వచ్చే శ్రమ ఎందుకు తీసుకున్నారు? ములోకాలను ఏలే మీరు ఆజ్ఞాపించి ఉంటే నేనే వచ్చేవాడిని. తమ రాకకు కారణమేమిటో ఆజ్ఞాపించెదరు గాక! మీ పాదపద్మాలను సర్వసమర్పణ పూర్వకంగా సేవించటానికి ఈ మీ భృత్యుడు సర్వదా సంసిద్ధుడై ఉన్నాడు.

**ఇంద్రదేవుడు (చిరునవ్వుతో) :** హే శిఖిధ్వజ మహారాజా! సుందర సరోవరం చేత హంసలు ఆకర్షించ బడునట్లు నీ యొక్క ఉన్నతం, పవిత్రం అగు గుణ సంపదచే మేమంతా ఆకర్షించబడి నీ సమక్షానికి వచ్చాం. ఇక లే! స్వర్గమునకు పోవుదము. అక్కడ దేవతాస్త్రీలు నీయొక్క పుణ్యగుణ సంపదకు ఆకర్షితులై, ఉత్కంఠతో నీ రాకకై ఎదురు చూస్తున్నారు. నీ కోసం దేవదూతలు సిద్ధపాదుకలు, సిద్ధ గుటిక, సిద్ధ ఖడ్గము, రసాదులు తెచ్చియున్నారు. నీవు వాటిని స్వీకరించి సిద్ధమార్గం గుండా స్వర్గ మండలం చేరుటకు అంగీకరించు. నిన్ను ఆహ్వానించటానికే మేమందరం వచ్చాం. నీవు ఈ జీవన్ముక్త రూపంలో దేవతల నివాసములందు అనేక భోగాలు నీకు ఇష్టమున్నంతకాలం అనుభవించవచ్చు. నీ వంటి సాధుమహాత్ములు స్వయంగా ప్రాప్తించే ఐశ్వర్యాలను తిరస్కరించరు కదా! అట్లాగే ప్రాప్తించని ఐశ్వర్యాలను కాంక్షించరు. విష్ణుమూర్తి యొక్క సంచారంచే ముల్లోకాలు పవిత్రమైనట్లు నీరాకచే మేమంతా ఎంతో ఆనందించబోతున్నాం. ఇదిగో దివ్యరథం. అధిరోహించు. నీకు స్వర్గానికి సుస్వాగతం.

**శిఖిధ్వజుడు :** దేవేంద్రా! నన్ను స్వర్గమునకు ఆహ్వానిస్తున్నందుకు, అందుకు అంతటి మీరే స్వయముగా వచ్చినందుకు మీకు కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాను. అయితే నాపై దయతో నేను చెప్పేది ఆలకించవలసినదిగా సమర్పించుకుంటున్నాను. నా ఈ హృదయ పూర్వక పుష్పాంజలులు, వినమ్రపూర్వక పాదస్పర్శ ప్రణామములు మరలమరల స్వీకరించ ప్రార్థన.

నాకు అన్ని స్థానములు సర్వ సంపదలతో కూడిన స్వర్గంతో సమానంగానే కనిపిస్తున్నాయి. అంతేకాదు నేను గాంచుచున్న పరమానందయుక్తమగు ‘చిదాత్మతత్త్వము’ అనే స్వర్గము అంతటా

విస్తరించి ఉన్నదేగాని అది ఒకచోట పరిచ్ఛిన్నమై ఉన్నది కాదు. నేను దర్శించే, ఉపాసించే ఆత్మానందం సర్వలోకాలకు – సర్వప్రదేశాలకు సర్వదా విస్తరించి, వేంచేసియే ఉన్నది. కాబట్టి హే ప్రభూ! నేను ఎక్కడున్నప్పటికీ సంతుష్టుడనై ఉన్నాను. సర్వత్రా క్రీడించుచునే ఉన్నాను. నా మనస్సు ఇచ్ఛారహితమై ఉండటం చేత సర్వత్రా ఆనందమయంగా కనిపిస్తోంది. ఆత్మానందాన్ని ఆస్వాదిస్తోంది. సర్వత్రా సర్వదా ఆక్రమించుకున్న బ్రహ్మానంద సాగరము కొరకై ఒకానొక పరిచ్ఛిన్నమైన ప్రదేశమునకు వెళ్ళవలసిన పనేమున్నది? కాబట్టి స్వర్గమును జేరి అక్కడ క్రొత్తగా పొందవలసినదేదీ కనిపించటం లేదు. కనుక నన్ను క్షమించవేడుకొనుచున్నాను. మీ ఆజ్ఞను నెరవేర్చనందుకు నన్ను క్షమించ ప్రార్థన.

**ఇంద్రదేవుడు :** ఓ శిఖిధ్వజా! మరొక్కసారి ఆలోచించు. ఇట్టి అవకాశం అత్యంత దుర్లభం. నీ వంటి విదితవేద్యులు పరిపూర్ణబుద్ధి సమన్వితులు అగు మహాత్ములు భోగాలను సేవించటం, సేవించక పోవటం ఒకే తీరుగా చూస్తారు కదా! సజ్జనులు ప్రారబ్ధకర్మ అనుభవించి క్షయింపజేసు కోవటమే యోగ్యమని అనుకుంటూ ఉంటారు. నీవు కోరకయే విధివిలాసంగా ఈ ఆహ్వానం లభించింది. కనుక స్వీకరించటమే ఉచితమని నేను అనుకుంటున్నాను.

**శిఖిధ్వజుడు :** ... (మౌనంగా ప్రశాంతతను వహించియే వినమ్రుడై నిలుచున్నాడు)

**ఇంద్రదేవుడు:** ఓ శిఖిధ్వజ మహారాజా! మీరు మౌనం వహించి స్వర్గమును స్వీకరించుటకు ఇచ్ఛగించకుంటే నేనిక వెడలుటయే యుక్తం కదా!

**శిఖిధ్వజుడు :** "ఇప్పుడు కాదు. మరొకసారి మీ దర్శనం ఆశ్రయించి వస్తాను'... అని మర్యాద క్రమమును అనుసరించి అంటూ ఉండగా, ఇంతలో ఇంద్రదేవుడు ఆ వాక్యములను చివరి కల్లా వినకుండానే సాంగ–సపరివారసమేతంగా అంతర్ధానమైనాడు.

"కుంభుడా! నీకు శుభమగు గాక!" ...అను వాక్యం మాత్రం ఆ దేవతలు విచ్చేసిన మార్గం నుండి పదే పదే మృదుమధుర స్వరంతో గానరూపంగా వినిపించింది. కొద్ది క్షణముల తరువాత కుంభుడు శిఖిధ్వజుని సమీపించాడు. శిఖిధ్వజుడు చెప్పుచుండగా జరిగినదంతా విని, ఆ కుంభుడు రాజు భుజములను మెచ్చుకోలుగా తట్టాడు.

❖

చూడాల తన అంతరాంతరంలో తన భర్త స్వర్గ సుఖాదుల పట్ల చూపిన ఉదాసీనతను, ఆతని మనస్సు భోగేచ్ఛల పట్ల వశీభూతం కాకపోవటాన్ని చూచి చాలాచాలా సంతోషించింది.

**చూడాల(తనలో) :** ఈ రాజు మనస్సు ఇంద్రుని ఆగమనమును క్షోభరహితంగాంచింది. ఈతని బుద్ధి ఉత్తమ నిర్ణయాన్ని, నిశ్చయాన్ని ఆశ్రయించి ఉన్నది. ఇంద్రుని పూజించుట మొదలైన లౌకిక కర్మలను పాటిస్తున్నప్పుడు శ్రద్ధను కూడా వీడలేదు. కనుక ఈతడు "భోగములు" అను మనస్సు యొక్క విభాగాన్ని పూర్తిగా జయించినట్లే! అయితే ఇంకొక ముఖ్యమైన పరీక్ష చేయవలసి ఉన్నది. ఈ జీవుని హృదయం లోంచి ఎందుకో 'ఇది నాది... నాకే చెందినది' అనే ఒకానొక అజ్ఞాన నిర్మిత మైన లోభగుణం పుట్టుకొస్తోంది. ఇక అక్కడి నుండి అతి విలువైన జీవితమనే అవకాశాన్ని అల్ప

వస్తువుల కొరకై అల్పచింతనలతో వృథా చేసివేసుకుంటున్నాడు. సత్యము - నిత్యము అగుదానిని ఏమరచి నిష్కారణంగా దుఃఖమహా సముద్రంలోనికి తనను తానే త్రోసివేసుకుంటున్నాడు. దుష్ట గుణములు కలవాడు సాత్వికుని వేషం వేసినట్లు, లోభగుణం - లోపల విషమును కలిగి ఉండి - పైకి మాత్రం విజ్ఞులను కూడా "అవును! అవసరం కదా! లేకపోతే ఎట్లా?... ఆ మాత్రం ఎవరికైనా అనిపిస్తుంది"... ఇత్యాది రూపంగా మోసగిస్తోంది.

లోభం నుండి క్రోధం, క్రోధం నుండి మోహం పుట్టుకొస్తున్నాయి. ఆత్మానుభవానికి ఈ లోభ - క్రోధ - మోహాలు రెండు గొప్ప అడ్డులు కదా! మరి నా భర్త ఈ లోభ-క్రోధ-మోహాలను జయించాడో, లేదో ఒక చివరి పరీక్ష పెడతాను. ఈ పరీక్షలో నెగ్గాడా, ఇక ఈయనకు నేను చెప్ప వలసినదేమీ లేదు. అప్పుడు చూడాల రూపంలో ఈయనను సమీపించి చేసినదంతా చెప్పివేస్తాను. ఇక ఈ ఉపాధికి శేషించియున్న కాలమంతా ఈయన సేవలో-సాంగత్యంలో గడిపి, ఆ తరువాత విదేహముక్తిని ఆశ్రయిస్తాను. ఈయనతో ఉండటమనేది అడవులలోనైనా ఫరవాలేదు, లేక, రాజ్యంలో నైనా ఫరవాలేదు.

ఈ జగత్తులోని బాహ్య శత్రువులైతే దూషణ - తిరస్కారాదుల ద్వారా అహంకార జాడ్యం, మదం ప్రకోపించకుండా ఉండటానికి సహకరించి ఒక విధంగా మహోపకారమే చేస్తున్నారు. వారి వలన మహా అయితే, కొంచెం అవమానమో, లేక, ఒక్క ఉపాధికి హానియో మాత్రమే కలుగుతుంది. అదే అంతర్ శత్రువుల విషయమేమిటి?

ఓయీ! జీవుడా! "కామ-క్రోధ-మోహ-లోభ-మద-మాత్సర్యములచే 6 గురు అంతర్ శత్రువుల గురించి పట్టించుకోకుండా ఎక్కడో బాహ్య శత్రువుల పేర్లు మననం చేసి గంతులు వేస్తావేం? పరమానందము, ప్రతి జీవుని సొత్తు అగు ఆత్మానుభవమును నీకు కాకుండా చేస్తున్నది బాహ్య శత్రువులు కాదు. నీ అంతరంగంలో మారు వేషాలలో తిష్ట వేసుకున్న ఈ "అరిషడ్వర్గములు (6 శత్రువర్గములు) గురించి ఏం చేయాలో యోచిస్తున్నావా?" అని శాస్త్రకారులు నిలదీసి ప్రశ్నిస్తున్నారు.

కనుక జ్ఞాన సమన్వితుడు, మహాత్యాగి, జగద్విషయములకు అలభ్యుడు అగు నా భర్త శిఖిధ్వజుని శ్రేయస్సు కోరి ఈ చివరి పరీక్ష పెడతాను.

❖❖❖

# 44. తుది పరీక్ష

ఇంద్రుని ఆగమన - నిష్క్రమణముల తరువాత కొద్దిరోజులు ఎప్పటిలాగానే కాలగర్భంలో కలిసిపోయాయి. చూడాల పగటిపూట కుంభుని రూపంలోనూ, రాత్రిపూట మదనిక రూపంలోను శిఖిధ్వజునితో ఇటు తాత్త్విక చింతనలు, అటు ఉత్తమ దాంపత్యమును కూడా నిర్వర్తిస్తోంది.

ఒక రోజు సాయంకాలం అయినది. క్రమంగా సూర్యుడు అస్తమించుచుండగా కుంభుడు పరమేశ్వర పూజ కొరకై పూలు, పళ్ళు తదితర సరంజామా తేవటానికి వన ప్రదేశాలలో ప్రవేశించాడు. శిఖిధ్వజుడు అతని రాకకై వేచి ఉన్నాడు.

ఎంతసేపటికీ కుంభుడు రాకపోయేసరికి సాయం సంధ్యాసమయం అగుటచే సాయం సంధ్యావందనం నిర్వర్తించటానికి శిఖిధ్వజుడు సమీపంలోగల ఒక నదీ తటమును సమీపించాడు.

ఎప్పటిలాగానే భక్తి ప్రపత్తులతో సంధ్యావందనాన్ని, అఘమర్షణ జపాన్ని నిర్వర్తించి ప్రశాంత చిత్తంతో అడుగులు వేస్తూ తాము అక్కడ నివసిస్తున్న వసతి ప్రదేశం వైపుగా వస్తున్నాడు. త్రోవలో ఒక కొండ శిల ప్రక్కగా వస్తూ ఉండగా బాటకు సమీపాన గల ఒక లతా గృహం నుండి ఏవో పకపకలు వినిపించాయి. యాదృచ్ఛికంగా అటు చూస్తే అక్కడ మదనిక కనిపించింది. 'ఓహో! ఇక్కడున్నావా! ఇంత ఆలస్యమేమిటి?'... అని అంటూ అటువైపుగా నాలుగైదు అడుగులు వేశాడు.

అక్కడ కనబడిన దృశ్యం చూచి కొంచెంసేపు ఆగాడు. అక్కడ లతా గృహ ప్రవేశ ప్రాంతంలోగల ఒక పూల శయ్యపై పుష్పాలంకృతుడైన ఎవరో పురుషుని తొడలపై తల ఉంచి మదనిక సరససల్లాపాలు ఆడుతోంది. ఆ వ్యభిచార పురుషుడు, ఆ మదనిక లోకములను మరచి పరస్పర హాస్యయుక్తములగు ముఖాలతో సంలగ్నులైయున్నారు. ఒకరి కరస్పర్శతో మరొకరు ప్రేమానందమును అనుభవిస్తున్నారు. ఆ పరస్పర కామపీడిత చర్యలను కొద్ది క్షణములు గమనించిన రాజు కించిత్ కూడా ఉద్వేగం పొందలేదు. పైగా ప్రసన్నతతో కూడిన ముఖకవళికలతో 'ఆహా! ఈ వ్యభిచార స్త్రీ – పురుషులిద్దరూ ఎంత సుఖవంతులై ఉన్నారు!' అని తలచుచూ వెనుతిరిగాడు.

ఈలోగా ఆ వ్యభిచారులిద్దరి చూపు రాజుపై పడింది. రాజును గమనించిన మదనిక ఒక్కసారి ఉలిక్కిపడింది. పైట సర్దుకుంటూ ఆ విటుని భుజములపై నుంచి చేతులు వెనక్కు తీసుకున్నది. తటాలున అతనిని విడచి, పూశయ్య నుండి నేలపైకి దిగి నిలబడింది. అప్పుడు శిఖిధ్వజుడు అది గమనించి, వెనుకకు పోవుచూ, అడుగులు వేస్తూనే ' ఓ ప్రియురాలా! మదనికా! మీరిద్దరూ సుఖ వంతులై ఉండండి. నన్ను చూచి భీతిల్లవలసిన పని లేదు. నేను మీకు విఘ్నమును కలిగించను'... అని పలికాడు. కొంచెం వేగంగా కూడా నడవటం ప్రారంభించాడు. అప్పుడు మదనిక ముఖంలో విటుని సమాగమం చేత ఏర్పడిన ప్రసన్నత, 'రాజు మనస్సును వ్యాకులపరచాను కదా' అనే వ్యాకులత – రెండు ఒక్కసారే అత్యధికంగా ప్రస్ఫుటమయ్యాయి. ఒక చేతితో పైట, చీరకుచ్చెళ్ళు సర్దుకుంటూనే రాజు వెళుచున్న వైపుగా వేగంగా పరుగులు తీసింది. "రాజా! ఎక్కడున్నారు? ఈ మదనిక మీ మనస్సుకు కష్టం కలిగించింది కదా! మీరు ఈ నీచురాలిని క్షమించకండి. మీ చేతుల మీదుగా తుదముట్టించండి! మీరంటే నాకు ప్రేమ తగ్గలేదు. మీరు ఎటు వెళ్ళారో నేను గుర్తించలేకపోతున్నాను. దయచేసి బదులు పలకండి. నేను మీకు చెప్పుకోవలసినది ఒక ముఖ్యమైన మాట ఉన్నది. ఆ తరువాత మిమ్ములను ఇంకేమీ కోరను. ఓ రాజా! ఓ రాజా! నా అరుపులకు బదులు ఇవ్వరూ! నేను చెప్పుకునేదేమిటో ఒక్కసారి వినే అవకాశం ఇవ్వరూర? మీ వంటి చక్రవర్తి నేరం ఆపాదించ బడినవాడు చెప్పుకునేదేమిటో వినకుండా శిక్షను ఖరారు చేయరు కదా!" అని పెద్దగా కేకలు పెట్టుచూ అటూ ఇటూ తిరగసాగింది. రాజు జాడ కనిపించనే లేదు. అయినా అక్కడ గల రెండు మూడు బాట–ఉపబాటలలో వేగంతో కూడిన అడుగులతో తిరుగసాగింది. ఒక అరగంట గడచిన తరువాత ఒకచోట శిఖిధ్వజుడు కనిపించాడు. ఒక ప్రశాంతమైన ప్రదేశంలో బంగారు ఛాయతో

మెరిసే శిలా ఖండముపై కూర్చుని సమాధి తత్పరుడైయున్నాడు. చంద్రుని చల్లటి కాంతులతో ఆతని దేహ కాంతి ఏకత్వము పొందినదా – అని అనిపిస్తోంది.

మదనిక నెమ్మదిగా శిఖిధ్వజుని సమీపించింది. ఆమె వెక్కి-వెక్కి ఏడ్చు సన్నటి శబ్దములు మాత్రం ఆపుకోలేకపోతోంది. కొద్ది క్షణములకు ఆ శబ్దములు శిఖిధ్వజుని చెవిని సోకుటచే నెమ్మదిగా కనులు తెరచి చూచాడు. ఎదురుగా మదనిక నిలబడి ఉన్నది. ప్రశాంతంగా నాలుగు వైపులకు ఒక్కసారి కలియజూశాడు.

**శిఖిధ్వజుడు :** ఏమి మదనికా! ఇంత త్వరలో ఇక్కడున్నావేమిటి? మీ పరస్పర ప్రేమాభిలాషకు ఎవరైనా విఘ్నం కలిగించారా ఏమిటి?

**మదనిక :** ...హూ!

**శిఖిధ్వజుడు :** ఈ జగత్తులో ప్రతిప్రాణి కూడా ఆనందము కొరకే అఱ్ఱులు చాచుచున్నది. పోయి ఆ వ్యభిచార పురుషుని నీ ప్రణయవృత్తులతో సంతుష్టిపరచిరా.

**మదనిక :** హే రాజన్!...

**శిఖిధ్వజుడు :** ...? ఓహో! నీ కృత్యమును చూచి నాకేమైనా క్షోభ కలిగిందేమోనని దుఃఖిస్తున్నావా? లేనేలేదు. ప్రపంచంలో ఏఏ ప్రియమైన వస్తువులున్నాయో... అవన్నీ కూడా అందరి ఆనందము కొరకేనని విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. అందుచేత, నాకు ఏమాత్రం మనఃస్తాపం కలుగనే లేదు. కనుక, నీవు బిడియపడక ప్రారంభించిన ప్రేమకార్యమును నిర్వర్తించియే రా.

నీ వంటి సుందర స్త్రీని చూచి ఈ ప్రమోదవాతావరణంలో ఆ విటుడు ఆకర్షించబడటం నాకు ఆశ్చర్యం కలిగించటం లేదు.

ఏమిటి నీ సందేహం? ఓ! నాతోటి స్నేహం గురించా? నా మిత్రుడు కుంభుడు వీతరాగుడు. సర్వానికి అతీతత్వం, సాక్షీమాత్రం అనువర్తించే మహాయోగి. ఇక నీవో, దుర్వాసమహాముని శాప సంకల్పంచే కల్పించబడిన చంచలస్వభావంతో గూడిన స్త్రీవి. కుంభర్షి సాన్నిధ్యముచే ఏర్పడిన విజ్ఞానానుభవం నాకు చెక్కుచెదరుట లేదు. కనుక 'మదనిక' అను స్త్రీ ఉపాధి ధరించిన ఇప్పటి నీవు ఏది చేయదలచుకుంటే అదియే నిస్సందేహంగా నిర్వర్తించవచ్చు. కాబట్టి వెళ్ళిరా. ఆ నీ విటుని కామ పీడితుని చేసి తద్వారా దుఃఖింపజేయడం విషయంలో ఉచితానుచితాలను నీకే వదిలివేస్తున్నాను.

❖

ఇట్లు పలికి శిఖిధ్వజుడు మౌనమును వహించాడు. ఆ మాటలు విన్న మదనిక కొంచెం కుదుటపడి దుఃఖము నుండి ఉపశమనం పొందింది.

**మదనిక :** మహాత్మా! మీరు చెప్పినమాట నిజమే. స్త్రీ స్వభావము అతి చంచలమైనది. పైగా స్త్రీకి పురుషుని కంటే 8 రెట్లు అధికంగా కామం ఉంటుందని కామశాస్త్రములు అంటూ ఉంటాయి.

**శిఖిధ్వజుడు :** (మౌనంగా, నిర్లిప్తంగా, నిర్వికారంగా ముఖ ప్రదర్శనం చేస్తూ మర్యాద కొరకు మాత్రమే అన్నట్లుగా కొంచెం ముఖకవళికను ప్రదర్శించాడు).

**మదనిక :** అందుచేత నాపై ఏమాత్రం కినుక వహించటం మీ వంటి జ్ఞానులకు భావ్యం కాదు. నాపై కోపం లేకుండా నేను చెప్పేది వినవలసిందిగా నా మనవి.

నేను మీకు చెప్పే, పూలకొరకై వనంలోకి వెళ్లాను కదా! తిరిగి వచ్చి చూచేసరికి మీరు కనబడలేదు. అప్పుడు మీరు సాయంసంధ్యావందనానికి నదీతటం వైపుగా వెళ్ళి ఉంటారని అనుకుంటూ... అటువైపుగా నేను కూడా వద్దామని బయలుదేరాను. ఈలోగా, ఎక్కడినుండి వచ్చాడో, ఆ కాముకుడు నన్ను సమీపించి సమాగమం కొరకై అతిదీనంగా ప్రార్థన చేశాడు. నా సౌందర్యమును శృంగారపరిభాషలో వర్ణించనారంభించాడు. అబలనైనట్టి నేను ఆ పరిస్థితులలో ఏమి చేయగలను చెప్పండి?

ఒక స్త్రీ వివాహిత కావచ్చు, అవివాహిత కావచ్చు. అటువంటి ఏకాంత ప్రదేశంలో అంతటి రసికావేశం గల కాముకుడు ఎదురుపడినప్పుడు చేయగలిగినదేమైనా ఉంటుందా, కాస్త ఆలోచించండి! భౌతికంగా బలవంతుడగు అట్టి జారుని ప్రేమావేశాన్ని నిరోధించటమెట్లా?

**శిఖిధ్వజుడు :** (అత్యంత సౌమ్యంగా గడ్డంపై చేతులు పెట్టుకుని ఎటువంటి భావన ప్రదర్శించకుండానే వింటున్నాడు. కళ్ళు మాత్రం అపరిచయస్తుని చూస్తున్నట్లు ఏ భావనా లేకుండా ఉన్నాయి)...

**మదనిక :** ఈ సమయంలో మరొకమాట కూడా చెప్పాలి. స్త్రీలో సౌందర్యం లేకపోవటమే పురుషుల అసంగమమునకు హేతువు కావచ్చుగాని, ఏ స్త్రీలో కామశాస్త్ర ప్రవచనములగు శృంగార లక్షణములు ఉంటాయో, అట్టి స్త్రీని ఏకాంతములో చూచినప్పుడు ఎవరికైనా సరే, కామోద్రేకం తప్పక కలుగగలదు. అందుచేత ఆ విటుని దూషించటం కూడా సందర్భానుచితం కాదని నా మనవి.

పైగా, ఏకాంత ప్రదేశంలో స్త్రీ పురుషులు తారసపడినప్పుడు వారిలో కామభావాలు కలుగ కుండా ఉంటాయా? అట్టి సమయంలో క్రోధ, నిషేధ, ఆక్రందనములు గాని, పాతివ్రత్యాది సాంఘిక వాదుల ప్రవచనాలు గాని జరుగవలసినదానిని నిరోధించలేవని నేను అనుకుంటున్నాను.

హే నాథా! అయినదేమో అయినది. నేను అబలను. చిన్నదానిని. మూఢురాలిని, అపరాధిని. కాబట్టి నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ అటువంటి తప్పు చేయను. 'కామం', 'కామచాంచల్యం' అను వికారాన్ని ఇప్పటికిప్పుడు త్యజించివేస్తున్నాను. సాధుజనులు క్షమాశీలురు కదా! అందుచేత మీ సాంగత్యం నుండి నన్ను దూరం చేయకండి. మరింకేదైనా శిక్ష మీరు విధిస్తే అది నాకు శిరోధార్యం.

**శిఖిధ్వజుడు :** ఓ బాలికా! ఆకాశంలో వృక్షం ఉండదు కదా! అట్లాగే నా అంతః కరణంలో కించిత్ కూడా ఎవరి మీదా ఏ కోపం లేదు. అయితే సాధుజననింద్యమై ఉండటం చేత నేను నిన్నిక భార్యగా మాత్రం స్వీకరించదలచలేదు. పూర్వంలాగానే వీతరాగులగు మిత్రులుగా ఉండటానికి మాత్రం నేను నిస్సందేహంగా సంసిద్ధుడనే.

❖❖❖

# 45. చూడాల - శిఖిధ్వజ సమాగమం

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా ! అప్పుడు చూడాల తనలో ఇట్లా అనుకోసాగింది.

❖

**చూడాల :** (తనలో) ఆహా ! నా భర్తయగు ఈ శిఖిధ్వజుడు అత్యుత్తమమగు ఆత్మ పదమును ఇంత త్వరగా సంపాదించుకోవటం ఎంతటి పవిత్రమైన విషయం. ఈ మహాత్ముడు పూర్ణకాముడైనాడు. గొప్ప గొప్ప భోగములుగాని, మహత్తరమైన సిద్ధులు గాని, ఇంద్రలోకవాసం వంటి సుఖ సంపదలు గాని, సుఖదుఃఖములు గాని, సంపద– ఆపదలు గాని, ఈతని చిత్తమును హరించలేకపోతున్నాయే! నారాయణుని లక్ష్మీదేవి ఆశ్రయించినట్లు శాంతి, ధైర్యము, క్షమ, తృప్తి మొదలైన సమస్త జీవన్ముక్త లక్షణాలు ఈతని యందు వచ్చి చేరాయి.

కాబట్టి ఇప్పుడు నా వృత్తాంతమంతా స్మరింపజేయటానికి ఉచితసమయం ఆసన్నమయినట్లే. ఇక నేను కుంభరూపము కొనసాగించవలసిన అవసరమే లేదు.

❖

ఇట్లా తలచి పరమజ్ఞానియగు ఆ చూడాల అప్పటికప్పుడే మదనిక రూపమును త్యజించి చూడాల రూపం ధరించి ఆ రాజు ఎదుట నిలచింది. రాజు చూడాలను చూచాడు. వికసితనేత్రుడై కొంచెం ఆశ్చర్యమును ప్రకటించాడు.

❖

**శిఖిధ్వజుడు:** ఓ సుందరీ! నీ వెవరు? ఎక్కడి నుండి ఇక్కడికి వచ్చావు? నీవు వచ్చి ఎంతసేపైనది? ఈ ప్రదేశంలో నిన్నెపుడూ చూడలేదే ! ఈ ప్రాంతం చాలావరకు నిర్జనమైనది కదా! జన ప్రదేశం నుండి ఇంతదూరం ఎందుకు వచ్చావు? నిన్ను ఎక్కడో చూచినట్లు, నాకు బాగా పరిచయమున్నట్లు అనిపిస్తోంది. నిజానికి మాళవదేశాన్ని ఏలుతున్న రాణి చూడాలలా ఉన్నావు?

**చూడాల:** ప్రభూ ! నేను నిజంగా చూడాలనే. నేడు నా స్వాభావిక దేహంతో మీ సమక్షంలో నిలబడ్డాను. మీకు బోధించటానికి వచ్చిన కుంభుడను నేనే. అదంతా నా మాయా రచన మాత్రమే. కొద్ది క్షణాల క్రితం మీరు చూచిన మదనిక ఎవరనుకుంటున్నారు ? నేనే ఆ రూపమును మీ ముందు ప్రకటించాను. “ఇంద్రుడు పరివారసమేతంగా మీ దగ్గిరకు రావటం” అనేదంతా మీముందు ప్రదర్శించింది నేను సముపార్జించిన యోగశక్తి యొక్క కల్పితమాయ మాత్రమే. మీ దగ్గర నుండి కుంభునిరూపంలో సెలవు తీసుకుని వెళ్ళినది ఇంద్రసభకు కాదు. మన రాజధానికి వెళ్ళి రాచకార్యాలు చక్కబెట్టటం కోసమే.

మీరు మోహవశం చేత రాజ్యమును వదలి ఒంటరిగా వనములోని ఏకాంత ప్రదేశం చేరి తపస్సు ప్రారంభించారు. పద్దెనిమిది ఏళ్ళు గడచినా రాలేదు. మరి నేనేంచేయాలి ? రాజ్యపాలనా ధర్మం మీది కాని, నాది కాదు కదా ! నేను మిమ్ములను సేవించి తరించుట కొరకే ధర్మవశముగా

నియమించబడ్డదానను. మీ సహధర్మచారిణిని అవటం చేత మీ రాజ్యపాలనాధర్మాన్ని నేను నిర్వర్తించాను. అయితే మీ సహచర్యమునకు నేను అర్హురాలనై ఉన్నాను కదా! పైగా, అన్ని సంవత్సరములు గడిచినా మీరు సూక్ష్మము - అనునిత్యము అగు అప్రమేయాత్మతత్త్వమును గ్రహించటం లేదు. మీరు రాజ్యమును త్యజించియున్న సమయంలో యోగాభ్యాసంచే సంపాదించిన సిద్ధులను ఉపయోగించి మీకు మహాత్యాగ రూపమగు సంసారాతీతత్వమును విశదీకరించి మీ జ్ఞానానుభవమునకు సహకరించాలని నాకు అనిపించింది. మనిద్దరి దాంపత్యము పరిఢవిల్లుచుండగా, మన జ్ఞానము పరమపవిత్రము కాగా... ప్రారబ్ధమును పరిపూర్ణం చేసి ఉచితమైన సమయంలో మీతోబాటే విదేహముక్తిని ఆశ్రయించాలనేది నా ఉద్దేశం. అందుకే ఈ మాయా రచనను కొనసాగించి ఇప్పటిదాకా ఆ తంత్రాన్ని నడిపాను. ఇప్పుడు మీరు పరిపూర్ణ జ్ఞానులైనారు. ఆత్మానాత్మ వివేక సమన్వితులైనారు. పరోక్షజ్ఞాన దశ నుండి సర్వ రాగద్వేషములను జయించి అపరోక్ష జ్ఞానార్హత పొందారు. ఇప్పుడు మీరు అనుభవసమన్వితులగు జ్ఞానులలో అగ్రగణ్యులైనవారిలో ఒకరైనారు. మాయా రచన యొక్క ఉద్దేశమైనట్టి ఆత్మజ్ఞానాన్ని పొందారు. అందుకే నేను కల్పించిన మాయనంతా ఉపసంహరించి మీ ముందు వినమ్రురాలినై నిలబడ్డాను.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** శ్రద్ధగా ఆలకిస్తున్నావా రామచంద్రా ! ఆ శిఖిధ్వజ మహారాజు అకస్మాత్తుగా చూడాల కనబడటం, కుంభ-ఇంద్ర-మదనికాదులు తన మాయా కల్పన మాత్రమేనని చెప్పటం... ఇవన్నీ విని ఆశ్చర్యపోయాడు. అప్పటికప్పుడే కనులు మూసుకొని ధ్యాననిష్ఠుడైనాడు. యోగనేత్రంతో పద్దెనిమిది సంవత్సరాల కాలంగా వర్తమాన క్షణం వరకు చూడాల నిర్వర్తించిన కార్యపరంపరలన్నీ కొద్ది నిమిషాలలో దర్శించాడు.

సమాధి నుండి మేల్కొన్నాడు. హర్షాతిశయంతో కనులు తెరిచాడు. అతిస్నేహభావయుతుడై ఆనందబాష్పాలు వదలుచు చూడాలను సమీపించి ఆమెను కౌగిలించుకున్నాడు. అప్పటి ఆ ఇరువురి పరస్పరానురాగం వర్ణించాలంటే వేయి నాల్కలుగల ఆ ఆదిశేషునికి మాత్రమే సాధ్యమేమో! ఆ దంపతులిరువురు పులకాంకిత శరీరులై ఒకరి కౌగిలిలో మరొకరు చాలా సేపు ఉండిపోయారు. ఆ తరువాత ఒకరి నుండి మరొకరు విడివడి మౌనభాష కళ్ళలో ప్రదర్శిస్తూ ఒకరినొకరు చూచుకుంటూ ఉండిపోయారు. మాటల కందని మధురభావాలు ఒకరినుండి మరొకరిని ముంచెత్తాయి.

❖

**శిఖిధ్వజుడు :** హే ప్రియురాలా! చూడాలా! ముగ్ధవు, బాలికవు అగు నీవు నీ మాయా రచనాది శ్రమలచే ఇంతటి అనురాగ ప్రవాహం వర్షిస్తావనేది నేను ఊహించనైనా లేదు. ఈ నీ పతి కొరకు ఇన్ని సుదీర్ఘ సంవత్సరాలు ఎన్నో క్లేశములు అనుభవించావు! దుస్సహమైనట్టి సంసార ప్రవాహంలో పడిన నన్ను ఏ మహోన్నత బుద్ధితో రక్షించావో అట్టి బుద్ధి - తెలివిలతో పోల్చగలిగినదేదీ నేను చూడలేదు, వినలేదు, ఊహించటం కూడా నా వల్ల కాదు. అరుంధతి, శచి, గౌరి, గాయత్రి, లక్ష్మి, సరస్వతి - వారి భర్తృప్రేమ ఈ నీ ప్రేమ ముందు వెలవెలపోతున్నది. వారంతా గొప్ప సేవలు చేశారు. అయితే నీవు నీ భర్తకు ఆత్మజ్ఞానమే ప్రసాదించావు.

ఎన్ని ఉపాయాలతో నీవు నన్ను పూర్ణజ్ఞానిగా తీర్చిదిద్దావు ! ఆశ్చర్యం! ఏ ప్రత్యుపకారం చేసి నిన్ను నేను సంతోషపెట్టగలను?

'కులస్త్రీ గనుక జ్ఞాని అయితే, ఇక ఆ పురుషుని పంటపండినట్లే, శిఖిధ్వజుని యథాశిఖిధ్వజ! కులస్త్రీ తన భర్తను అనాది – అనంతము అగు మోహ సాగరం నుండి కాపాడినట్లు శాస్త్రముల చేత, గురువుల చేతకూడా సమర్థము కాదు. కులస్త్రీయే పతికి సఖుడు, ఆప్తుడు, సోదరుడు, గురువు, సుహృత్, భృత్యువు, స్నేహితుడు, ధనము, సుఖము, శాస్త్రము, గృహము... సమస్తము కాగలదు. ...అను ఒక నూతన సిద్ధాంతమును నీవు నీ మహోన్నత సేవా నిరతిచే ఈ ప్రపంచంలో ప్రవేశింపజేశావు. కులస్త్రీలందరికీ తలమానికమయ్యావు.

అట్టి కులస్త్రీలను సర్వ ప్రయత్నముల ద్వారా, సర్వ విధములా పూజించాలి. పురుషుల సముద్ధరణ కులస్త్రీలపైనే ఆధారపడి ఉంటుంది కాబట్టి, పురుషులు తమభార్యలను అన్ని విధముల సత్కరించటం అత్యవసరమని భావికాల జనులందరికి ఇదే నా ప్రబోధం.

ఇచ్ఛారహితవు, సంసార సముద్రమును దాటివేసినదానవు అగు నీవు నన్ను కూడా సముద్ధరించాలనే కంకణం కట్టుకున్నావు. నాకు చేసిన ఉపకారమునకు ఋణం ఎట్లా తీర్చుకోగలను? నీవు మహాపతివ్రతవని నేను ప్రశంసించుచున్నాను. ఇంకా చెప్పాలంటే ఈ ప్రపంచంలోని పతివ్రతలందరినీ నీవు జయించావు. ఇక నుంచి స్త్రీల సౌజన్యము చర్చనీయాంశమయినప్పుడల్లా నీ పేరు మార్మ్రోగుగాక! సమస్తసద్గుణ సమన్వితమగు నిన్ను సృష్టి చేసినందుకు ఆ బ్రహ్మదేవునిపై అరుంధతి మొదలైన మహాసాధ్వులకు కొంచెం కోపం వస్తుందేమో కూడా! ఓ సతీ! మహాపతివ్రతవగు నిన్ను చూస్తే కించిత్ మరల ఉత్కంఠితుడనగుచున్నాను. రమ్ము. నిన్ను మరల ఆలింగనం చేసుకొనెదను గాక!

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇట్లు పలికి శిఖిధ్వజుడు పరమసాధ్వియగు ఆ చూడాలన్ను ఆలింగనం చేసుకున్నాడు.

❖

**చూడాల :** దేవా! మీరు వ్యాకులచిత్తులై, శుష్కక్రియాతత్పరులై సూక్ష్మము – సులభము అగు సత్యమును గ్రహించక పోవడం చూచి నేను ఒకప్పుడు దుఃఖితురాలనయ్యాను. అట్టి నా దుఃఖాన్ని తొలగించుకోవటానికే మీకు తాత్త్విక సత్యము బోధించటానికై ఉద్యుక్తురాలనయ్యాను. కనుక ఒక విధంగా నేను నిర్వర్తించినదంతా నా స్వార్థం కొరకే గదా! ఇక ఇందులో నన్ను పొగడవలసినదేమి ఉన్నది?

**శఖిధ్వజుడు :**

> **త్వయా యథా వరారోహే! స్వార్థః సంపాద్యతే శుభః ।**
> **తమిదానీం తథా సర్వాః సాధయన్తు కులాంగనాః ॥**

ప్రియ చూడాలా! నన్ను సముద్ధరించి శుభప్రదునిగా తీర్చిదిద్దటమే స్వార్థమనుకుంటే, ప్రపంచంలోని భార్యలందరు ఇట్టి స్వార్థమును కలిగి ఉండుటకు ప్రయత్నించెదరు గాక!

**చూడాల :** ఇప్పుడు చెప్పండి స్వామీ! ఇప్పుడు ఈ జగజ్జాలము యొక్క ఆవల విశ్రాంతి పొందుచున్నారా? తత్త్వపదార్థమును ఎఱిగినారా? పూర్వకాలపు అజ్ఞానము ఇంకా ఏమైనా మిగిలి ఉన్నదా? "ఇది చేయాలి. అక్కడికి వెళ్ళాలి. అదేదో పొందాలి" ...ఇటువంటి పూర్వకాలపు స్థితులు జ్ఞాపకమునకు వచ్చినపుడు అట్టి అపరిపక్వ తుచ్ఛస్థితులను చూచి ఇప్పుడు పకపకా నవ్వుకుంటున్నారు కదా! తుచ్ఛమగు సంకల్పములు, తృష్ణ మొ॥న కుకల్పములు మీ చిత్తము నుండి పలాయనం పుచ్చుకున్నాయి కదా!

ఇప్పుడు మీరు ఎట్లా ఉన్నారు? దేని యందు నిష్ఠ కలిగియున్నారు? దేనిని కోరుకుంటున్నారు? పూర్వకాలపు తపస్సు మొదలైన దేహక్రియలను చూచి ఇప్పుడు మీకేమనిపిస్తోంది? ఏదీ? కొద్ది విషయాలు చెబుతారా ?

**శిఖిధ్వజుడు :** ఓ ప్రియ చూడాలా ! నీవు ఏ వివేకం యొక్క అంతఃప్రకాశ రూపంచే స్థితి కలిగి ఉన్నావో గ్రహించాను. నేను కూడా అట్టి వివేకమునందే ప్రకాశ సాక్షీరూపంచే స్థితి కలిగి ఉన్నాను.

తత్త్వదర్శనం అనునది బాహ్యదర్శనమయ్యే విషయం కాదని, అది 'కేవలం స్వానుభవం'మాత్రమే నని గ్రహించాను. ఇప్పుడు నేను ఇచ్ఛారహితుడను. ఈ సర్వ జగద్విషయముల పట్ల నిస్పృహుడను. అంశ వర్జితుడను. ఆకాశమువలె స్వచ్ఛుడను. శాంతుడను, పరమార్థ సద్రూపుడను కూడా!

చాలాకాలం తరువాత నాయందు 'అహంకారము' అనే భ్రమ తొలగింది. నేను చిదాత్మనే అయి తద్రూపముననే వెలయుచున్నాను. హరిహరాదులు అడ్డం వచ్చినా నిషేధింపజాలనట్టి ఆత్మానుభవ మార్గాన్ని అధిరోహించి నిరతిశయానంద దశను పొందాను. ఒక్క చిన్మాత్రమునందు తప్ప మరింకే అన్యమైన దానియందును ఏ మాత్రం నిష్ఠ నాకు లేదు.

ఈ సంసార భ్రమ నుండి విముక్తుడనైనాను. పరమ సంతుష్టుడనైనాను. ఇక నాకు దేని గురించీ ఏ దిగులు లేదు.

**భ్రమేణ అహం విముక్తోఽస్మి సంసారే, నీలిలోచనే,**
**న తుష్టోఽస్మి! న ఖిన్నోఽస్మి! నాయమస్మి! నచేఽతరత్ ॥**

ఓ నీలి నేత్రాలు కలదానా! నేను కార్యవర్గమగు దృశ్యమును కాను, కారణమగు ద్రష్టత్వమునకు సంబంధించినవాడను గాను. ఈ సుఖ దుఃఖాలుగాని, ఇది గాని, మరొకటిగాని నేను కాదు.

**న స్థూలోఽస్మి! న సూక్ష్మోఽస్మి! సత్యమస్మి చ సుందరీ!**
**తేజోబింబాత్ ప్రయాతేన భిత్తావపతితేనచ ॥**

**క్షయ - అతిశయ ముక్తేన ప్రకాశేన అస్మి వై సమః**
**శాన్తోఽస్మి! సామ్యనేతాఽస్మి! స్వస్థోస్మి, విగతాశయః**

నేను స్థూలరూపుడను గాను. సూక్ష్మరూపుడను కూడా కాదు. ఏది నా వాస్తవ రూపమైయున్నదో అది సర్వదా సత్యము, అబాధితం అయి ఉన్నది. సూర్యమండలము నుండి బయలుదేరిన కొన్ని కిరణములు ఒక గోడపై పడుతున్నాయనుకో! అంతమాత్రం చేత గోడకు సంబంధించిన లక్షణములు

కిరణములకు ఆపాదించటానికి వీలులేదు కదా! గోడ పడిపోతే కిరణములు నశిస్తాయా? లేదు. సూర్యగోళమునుండి బయలుదేరే కిరణములు క్షయము గాని, అతిశయము గాని లేనట్టి తేజోరూపం. మరి గోడయో? కొన్ని జడ పదార్థముల సమ్మేళనం. సూర్య ప్రకాశము సర్వదా సమరూపముననే ఉన్నది. దానికి హెచ్చుతగ్గులు లేవు. కాని వస్తువు యొక్క స్థితి – గతులు, ఆకార – కోణాదులు, ప్రతి బహిర్గత స్వభావము (Counter- emitting of light waves) మొదలైన వాటిని అనుసరించి ఆ వస్తువు దృశ్యమానమౌతుంది.

నేను ప్రకాశమువలె సర్వదా సమస్వరూపుడను. శాంతుడను. ఈ ప్రపంచము యొక్క విషమత్వ – సృష్టి – వినాశనాదులతో నా స్వరూపమునకు ఏమాత్రం సంబంధము లేదు. ఈ మనో – బుద్ధి – అహంకారాదులు నా స్వరూపము పట్ల నిర్వర్తించబడే అసత్యమగు ఆరోపణలు మాత్రమే! సూర్యగోళమునకు ఉదయ–మధ్యాహ్న సాయంకాలములు ఉన్నాయా? అది నిత్య ప్రకాశమై ఉండగా అట్టి దానికి ఉదయ – మధ్యాహ్న – సాయంకాల – రాత్రులు ఎట్లా ఉండగలవు? పోనీ, అవి భూమికి సంబంధించినవా? భూమి సర్వదా ప్రకాశరహితమగు జడ పదార్థం కదా ! మరి అవి ఎవరికి సంబంధించినవి ? 'భూమి' అను వస్తువు ఉన్న స్థానము ననుసరించి ఏర్పడిన కాంతి యొక్క అల్ప–అధిక ప్రసరణలే రాత్రింబవళ్ళుగా అనుభవమౌతున్నాయి. అంతకు మించి రాత్రింబవళ్ళకు వేరుగా ఉనికి లేదు. సూర్యతేజస్సుకు రాత్రింబవళ్ళు లేనట్లు నేను మనోబుద్ధ్యాది విషయరహితుడను.

ఓ సాధ్వీ ! నేను ఏదై ఉన్నానో, అదియే నీవు కూడా అయి ఉన్నావు. అదియే సమస్త ప్రాణులు కూడా! అద్దానినే శాస్త్రములు 'బ్రహ్మము' అని పిలుస్తున్నాయి. నీవు నిర్వాణరూపమున ఈ దేహాదులు ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా ఏ స్థితి పొంది ఉన్నావో, అదే నిర్వాణరూపమున నేను కూడా సర్వదా స్థితి పొంది ఉన్నాను. ఇంతకుమించి మౌనం వహించటం తప్పించి ఏమీ చెప్పజాలను. ఓ చూడాలా ! నీవు నా కొరకై ఎంతో శ్రమ తీసుకున్నావు. నారద పుత్రుడు మొదలైన మాయలన్నీ కల్పించి చూపించావు. నా భార్య రూపంలో వచ్చి ఉంటే నీ జ్ఞాన వాక్యములను యుక్తయుక్తమైనప్పటికీ "ఆ ! ఈ చూడాల చిన్నపిల్ల ! ఈమెకేం తెలుసు?" ….. అని ఉపేక్షయే చేసి ఉండేవాడిని. అసత్యమగు కల్పనల ద్వారా మహత్తర సత్యమును అతి సులభశైలితో ప్రత్యక్షపరచిన నీ బుద్ధిని వర్ణించటానికి నాకు నోట మాట రావటం లేదు.

నీవే నా గురువువు. నా జ్ఞాననేత్రమును తెరచి అజ్ఞానాంధకారముతో కూడిన అంతరంగ స్థితిని ఉద్ధరించావు కదా! నీకు నమస్కరిస్తున్నాను. నీ అనుగ్రహము చేతనే ఈ సంసారసాగరమును నేను దాటగలిగాను. అగ్నియందు పదిసార్లు పుటం ఒనర్చబడిన బంగారంలో ఇక మాలిన్యము ఉండదు కదా ! అనేక సంఘటనలను కల్పించి తద్వారా నన్ను నీవు మలరహితునిగా చేశావు.

ఇప్పుడు నేను శాంతుడనై, స్వస్థుడనై, కోమలుడనై, సర్వవ్యాపినై ఉన్నాను. ఆకాశమువలె అంతటా స్థితి పొందియున్నాను.

**చూడాల :** అయితే ఓ ప్రాణేశా! నా హృదయ ప్రియా! ప్రభో! ఇప్పుడిక మీకు ఏది ఇష్టమని అనిపిస్తోంది? ఈ అరణ్యవాసమా? లేక రాజ్యపాలనయా?

**శిఖిధ్వజుడు :** ఇప్పుడు ఇది చేయాలన్న ఉద్దేశము గాని, అది చేయకూడదన్న ప్రతి నిషేధము గాని నాకు లేవు. నీకు ఏది అభిమతమైతే నాకూ అదే. ఏదేది చేయవలసి వచ్చినా అది 'సమాధి యొక్క వ్యుత్థానకాలంలో సర్వమును ఆక్రమించుకొనియున్న నా స్వస్వరూపం ఒకచోట వ్యవహారమునందు ప్రతిబింబించటం' ...అనియే గ్రహిస్తున్నాను. అందుచేత నీకు ఏది ఇష్టమో! అదియే నాకూ ఇష్టం. అట్లే జరుగుగాక! దేనిపట్ల కావాలని గాని, అక్కర్లేదని గాని నాకు భావన ఏర్పడుట లేదు. నీకు ఏది ఎట్లు అనిపిస్తే అట్లే నిర్వర్తించు. నాకు దేనికీ అభ్యంతరం లేదు. మణి ప్రతిబింబమును అనిచ్ఛాపూర్వకంగా గ్రహిస్తుంది చూచావా ? ఇచ్ఛారహితమగు చిత్తముచే అనిందితమగు యథాప్రాప్త వస్తువును ధరించటానికి నేను సిద్ధంగా ఉన్నాను.

నేనెవరినీ, దేనినీ స్తుతించటం లేదు...... నిందించటం లేదు. నీ వెట్లు అనుకుంటావో అట్లాగే చేయి. తదనుకూలంగా చరించుటకు నాకేమీ నిషేధం లేదు.

**చూడాల :** హే మహాబాహూ! జీవన్ముక్తా! అట్లా అయితే నా అభిప్రాయమేమిటో చెబుతాను. విన్న తరువాత మీకేది అంగీకారమో అట్లే నిర్వహిద్దాం. మనిద్దరం సర్వత్రా ఏకత్వజ్ఞానం కలిగియున్నాం. రాజ్యపాలన అయినా, వనవాసమైనా మనకు రెండూ ఒక్కటే. ఇద్దరం అజ్ఞానముయొక్క ఆనుపానులను ఎఱిగాం కదా. ఇచ్ఛారహితులమై అకాశమువలె స్వచ్ఛముగా వెలయుచున్నాం. కనుక మనకు రాజ్యభోగముల పట్ల అపేక్షగాని, అనపేక్షగాని లేవు. ఎందుకంటే ఈ నేత్రేంద్రియములు తమకు ఏమి యోగ్యమో – ఆ విషయములను సేవించటం చేత 'చిన్మాత్రము' అగు ఆత్మకు క్రొత్తగా కలిగే విశేషమేముంటుంది? ఇది గ్రహించిన తత్త్వవేత్త ప్రవాహపతితమగు ఆయా విషయాలను సేవిస్తూ ఉంటాడు. ఓ పురుషోత్తమా! ఆద్యంతములలో మనం ఏ స్వభావం కలిగియున్నామో అట్టి దానినే స్వీకరిద్దాం. 'ప్రారబ్ధ కర్మ' అను దానిని అనుభవము ద్వారానే నశింపచేయాలి'....... అనునది శాస్త్ర సిద్ధాంతము కదా! కాబట్టి మనకు ఇప్పటికే ప్రాప్తించియున్న ' రాజ్యపాలన' అను ధర్మమును నిర్వహిస్తూ శేషించియున్న ఈ దేహము యొక్క ఆయువును గడిపివేద్దాం.ఆ తరువాత ఉచితమైన సమయంలో విదేహముక్తులమౌదాం.

**శిఖిధ్వజుడు :** ఓ ప్రియా చూడాలా! ఏదీ, చెప్పు! ఆద్యంతములలో మనం ఏ స్వభావంతో కూడుకొనియున్నాం? ప్రారబ్ధమును అనుభవించి ఆపై ఎట్లా ఉండబోతున్నాం?

**చూడాల :** మీరు మోహము చేతనే ఈ వనవాసం స్వీకరించారు కదా! అంతకు ముందో? రాజు కదా!ఒక్క మోహాన్ని మాత్రం త్యజించి మరల యథావిధంగా రాజుగానే అవండి. రాజసింహాసనంపై ఆసీనులై ప్రజాభీష్టానుసారం ధర్మనిరతులై రాజ్యపాలన చేయండి! 'మా రాజుగారు ఎప్పుడో వస్తారు! ఆ తరువాత ఇంకా సానుకూలమౌతుంది!' అని మాళవ రాజ్య ప్రజలు, మంత్రులు ఎదురుచూస్తున్నారు. ఏ ఏ పరిస్థితులలో ఉండి ఏవేవి నిర్వర్తించటం శాస్త్రానుకూలమో, లోకానుకూలమో ఆయా

నిర్వర్తించవలసియున్న వ్యావహారిక ధర్మములే జ్ఞానుల దృష్టిలో ప్రారబ్ధము. అంతకు మించి ప్రారబ్ధమనేదేదీ వారికి లేదు.

కాబట్టి మీ సింహాసనం మీరు అధిష్ఠించి ఎప్పటిలాగానే రాజ్యాన్ని పరిపాలించండి.

ఇక నేనో! మీ పట్టమహిషిగా రాజాంతఃపురంలో ఉంటూ మీ సాంగత్యముచే శోభను పొందుతాను. ఎప్పటిలాగానే ఉచితానుచితములగు ఆయా రాచకార్యములందు నా యోచనలను అందిస్తూ, "సహధర్మచారిణి" అను శబ్దమును అర్థప్రదం చేస్తాను. జ్ఞానులమగు మనిద్దరం ఆత్మజ్ఞాన విషయమై ఆప్తవాక్యములను ప్రసంగించుకుంటూ విశ్రాంతి కాలాన్ని గడిపివేద్దాం. మనకు అవగతము – అనుభవము అగుచున్న ఆత్మానుభవమును తదితర జ్ఞానాన్వేషకులతో పంచుకుందాం.

**శిఖిధ్వజుడు :** ఓ విశాలనేత్రీ ! అట్లా అయితే, మనిద్దరం స్వర్గములో నివసించటానికి కూడా స్వతంత్రులమై ఉన్నాము కదా !ఎచ్చట సిద్ధులగు దేవతల భోగైశ్వర్యములు ఉన్నాయో అట్టి స్వర్గలోకంలోనే మనం ఎందుకు నివసించకూడదు?

**చూడాల :** అటు స్వర్గలోకంలో గాని, ఇటు ఈ రాజ్యపాలనలో గాని క్రొత్తగా లభించే సుఖమేదీ లేదు. అఖండమగు స్వస్వరూపాత్మను గ్రహించటంచేత క్షోభ లేనివారమై, స్వస్థచిత్తముతో యథారీతిగా స్థితిని కలిగియున్నాము. "ఇది సుఖము – ఇది కాదు" – అనే ద్వంద్వం మనపట్ల నశించిపోయింది. ఇప్పుడు మనం సమరూపముచే శాంతపదమున సుఖముగా ఏర్పడియున్నాము కదా!

**శిఖిధ్వజుడు :** ఆహాc! చూడాలా! సమబుద్ధితో నీవు యుక్తియుక్తిమైనదానినే చెప్పావు. ఈ రాజ్యమును కలిగియుండుట చేతగాని,త్యజించుటచేతగాని మనకు క్రొత్తగా వచ్చే ప్రయోజనమేమున్నది?

**సుఖ దుఃఖ దశా చిన్తాం త్యక్త్వా విగత మత్సరమ్.**
**యథా సంస్థానమేవేమౌ తిష్ఠావః స్వస్థతాంగతౌ॥**

ఇక మనం సుఖ – దుఃఖ దశలకు సంబంధించిన సర్వ చింతనలు వదలివేద్దాం. మాత్సర్యరహితులమై స్వస్థత పొంది ఇతఃపూర్వంలాగానే స్థితి పొంది ఉందాం.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇటువంటి జ్ఞాన – విజ్ఞానయుక్తమగు సంభాషణలో ఆ రాత్రి తెల్లవారవచ్చింది. వారిద్దరు పరస్పర సమాగమమునందు అత్యంత ఉత్కంఠ కలవారైనప్పటికీ, వాసనారహితులై ఉండటం చేత ఉత్కంఠరహితులు కూడా! ఆ మరునాడు కూడా సంధ్యావందనాది దైనందిన దేవకార్యములను నిర్వర్తించి పగలంతా అనేక జ్ఞాన విషయాలు సంభాషించుకున్నారు. సాయంసంధ్య అయిన తరువాత తటాకం సమీపించి సాయం సంధ్యోపాసనాకార్యక్రమాలు నిర్వర్తించారు. స్వర్గస్థితిని కూడా నిరాదరించి ఆ ఇరువురు పూర్ణచిత్తులై ఒకే శయ్యపై ప్రణయచేష్టలతో ఆ రాత్రంతా గడిపారు. భోగలక్ష్మి, మోక్షలక్ష్మిల సేవలో వారిద్దరికీ ఆ రాత్రి ఒక క్షణంలాగా గడచిపోయింది.

❖❖❖

# 46. పునః రాజ్య ప్రవేశం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ రాత్రి గడచిన తరువాత మరునాడు ఆ దంపతులిద్దరూ ఒకరినొకరు అభిషిక్తులనుగా చేసుకున్నారు. "ఓ రాజా! మునులకు యోగ్యమైన శాంతతేజమును కొంచెం ఉపసంహరించి మాళవ రాజ్యపాలనకు అవసరమైయున్న శాసన తేజమును అవధరించెదరు గాక" అని చూడాల ఛలోక్తులు ఆడుచుండగా, ఇక అక్కడి నుండి ఆ దంపతులిద్దరూ బయలుదేరారు. మధ్య మధ్యలో ఆయా ప్రదేశములు తారసపడుచున్నప్పుడు ఇతఃపూర్వపు ఆయా అనుభవములను సంభాషించుకుంటూ క్రమంగా మాళవదేశం ప్రవేశించారు.

రాజదంపతుల పునరాగమనం గురించిన వార్త రాజధానియగు ఉజ్జయినీపట్టణం చేరింది. మంత్రులు, సామంతరాజులు మొదలైన వారంతా రాజు శిఖిధ్వజుని అనేక సంవత్సరాల తరువాత దర్శించటానికి, సుస్వాగతం పలకటానికి సమాయత్తమైనారు. ఉజ్జయినీ నగరమంతా అత్యంత సుందరంగా అప్పటికప్పుడే అలంకరించబడింది. శిఖిధ్వజుడు నగరంలో ప్రవేశించాడు. అప్పటికప్పుడే సమావేశమైన గొప్ప ప్రజానీకాన్ని చూచి రాజు సుదీర్ఘంగా ప్రసంగించాడు. తాను కార్యార్థి అయి వెళ్ళి తిరిగి వచ్చిన ఈ 18 సంవత్సరాల కాలం రాజ్యాన్ని తమ మంత్రాగంతో కాపాడిన మంత్రులను, తదితర సేనానాయకులను పేరు పేరునా పిలిచి సన్మానించాడు. ముఖ్యంగా చూడాలను మెచ్చుకోలుతో, పొగడ్తలతో ముంచెత్తాడు. ప్రజలందరికి తనపై గల వాత్సల్య-ఆప్యాయతలకు కృతజ్ఞతలు పలికాడు. అనేక మంది ప్రజలు సుదీర్ఘకాలం తరువాత తమ రాజు శిఖిధ్వజుని చూచిన ఆనందంతో కంట తడిపెట్టారు. రాజుగారి రాకను పురస్కరించుకొని ఉజ్జయినీ పట్టణంలోను, మాళవ రాజ్యమంతటా అనేక ప్రదేశాలలోను, సామంతరాజ్యాలలోను 7 రోజులు గొప్ప ఉత్సవం జరిగింది.

ఆ తరువాత శిఖిధ్వజుడు చాలాకాలం రాజ్యపాలన ప్రజానురంజకంగానూ, ధర్మ నిరతితోను, లోక కళ్యాణ దీక్షతోను నిర్వర్తించాడు. భయ - విషాద - అభిమాన - మాత్సర్యరహితుడై ప్రాప్తించిన కర్మలను రాగవర్జిత బుద్ధితో నిర్వర్తించాడు.

సుదీర్ఘకాలం రాజ్యపాలన నిర్వర్తించిన ఆ రాజు ఆ తరువాత ఒకానొక సమయంలో రాజ్యపాలనపై విరక్తుడై రాజ్యమును పుత్రునకు సమర్పించాడు. ఒకానొక ఉచితకాలంలో భార్య చూడాలతో సహా విదేహముక్తిని ఆశ్రయించి 'సన్మాత్రము' నందు శేషించాడు. ఆ దంపతులిరువురు 'పరమపదము' అను అమృతమును పొందారు.

❖

ఓ రామచంద్రా! నీవు కూడా ఈ శిఖిధ్వజ - చూడాలల వలె యథా ప్రాప్తములైన కార్య సమూహములను నిర్వర్తించు. మరొకవైపు సమాధియందు తత్పరుడవై ఉండు. భోగమోక్ష జ్ఞానైశ్వర్యమును అనుభవిస్తూ లోకపావనుడవై ఉండెదవు గాక! నీ ఈ రామావతారము మహత్తరమై, జనులందరికీ ఇహపరములందు మార్గదర్శకమగుగాక!

❖❖❖

# X. బృహస్పతి - కచ సంవాదం

## 1. సర్వ త్యాగం అంటే ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఈ విధంగా శిఖిధ్వజుని మోక్ష కథను విన్నావు కదా! అందులో చెప్పబడిన మార్గంలో పయనిస్తే నీవు ఎన్నటికీ ఖిన్నుడవు కావు. అందులో అంతర్లీనంగా ప్రకటించ బడిన రాగద్వేషవినాశకారకమగు దృష్టిని అవలంబించి పూర్ణానందపథమున సుదృఢముగా నెలకొని ఉండు. శిఖిధ్వజుని లాగానే నీవు కూడా వ్యవహారం ఆచరిస్తూనే భోగమోక్షాలచే పూర్ణుడవై ఉండు.

ఆ శిఖిధ్వజుని లాగానే "పూర్వం ఒకప్పుడు బృహస్పతి కుమారుడైన కచుడు జ్ఞానిగా తీర్చిదిద్ద బడటం" అనే ఒక దృశ్యం నా మస్తిష్కంలో మెరుస్తోంది. సందర్భానుచితం కనుక ఆ సంఘటనను కూడా ఇక్కడ ప్రస్తావించుకుందాం.

❖

శ్రీమంతుడు, మహాజ్ఞాని, దేవ గురువు అగు బృహస్పతి గురించి నీవు వినే ఉన్నావు కదా! ఆయన కుమారుడు కచుడు. ఆతడు బాల్యంలోనే సర్వవిద్యా పారంగతుడైనాడు. యౌవనం ప్రవేశించే సరికి అఖండాత్మానుభవమునకు అనేక అర్హతలు సంపాదించుకున్నాడు. ఒక రోజు తండ్రి బృహస్పతి ప్రశాంతంగాను, ఆహ్లాదంగాను ఉన్న సమయంలో కచుడు సమీపించి ఒక ప్రశ్న అడిగాడు.

**కచుడు :** పితృదేవుల వారికి సాష్టాంగదండ ప్రణామములు.

**బృహస్పతి :** పుత్రా! పూర్ణజ్ఞానివయ్యెదవు గాక! ఏమిటి విశేషం? ఏదో అడగాలని వచ్చినట్లున్నావు! నిస్సంకోచంగా నీ సందేహమేమిటో చెప్పు.

**కచుడు :** తండ్రీ! ఈ జీవుడు ఎప్పుడూ సంసారపంజరంలో చిక్కుకుని నానా అగచాట్లు పడుచున్నాడే! అట్టి బంధనం నుండి విముక్తుడు కావటం ఎట్లా?

**బృహస్పతి :** కుమారా! అనేక మొసళ్ళకు ఆలవాలమైన ఈ సంసారసాగరం అతి దుర్భరమైనదే. అయితే 'సర్వత్యాగము' అను బలం నీకు ఉంటే ఆ మొసళ్ళు నిన్ను ఏమీ చేయలేవు. అప్పుడు నీవు నిర్భయంగా సంసారమును దాటి వేయవచ్చు.

**కచుడు :** అయితే నేను సర్వమును త్యజించి ఎటకో వెళ్ళిపోతాను.

**బృహస్పతి :** ...

బృహస్పతి మౌనం వహించాడు. 'అవును-కాదు' అనలేదు. 'సర్వత్యాగము' అను శబ్దమునకు కచుడు గ్రహించిన అర్థం అత్యంత అసంపూర్ణమైనదైనప్పటికీ అప్పటికి మాత్రం ఇంకేమీ పలుకలేదు. పుత్రుడు ఎటకో వెళ్ళుచున్నప్పటికీ బృహస్పతికి దుఃఖమేమీ కలుగలేదు. మహాత్ములు సంయోగ వియోగములందు మేరుపర్వతంలాగా స్థిరబుద్ధి కలిగి ఉంటారు కదా!

❖

కచుడు అక్కడి నుండి బయలుదేరాడు. ఇల్లు–వాకిలి–విడిచి మహారణ్యాలలో ప్రవేశించాడు. ఆ విధంగా 8 సంవత్సరాలు గడచిపోయాయి. ఒక రోజు ఒక మహారణ్యంలో ఒకచోట కాకతాళీయంగా కచుడు తండ్రిని కలుసుకున్నాడు. ప్రణామములు అర్పించాడు.

**బృహస్పతి :** పుత్రా! క్షేమమే కదా?

**కచుడు :** తండ్రీ! మీరు నన్ను సర్వత్యాగం చేయమన్నారు కదా! ఇప్పటికి 8 సంవత్సరాలు గడిచాయి.

**బృహస్పతి :** ఊ!

**కచుడు :** సర్వత్యాగం చేసి ఇన్నాళ్ళైనా నేనింకా అనిందితమైన విశ్రాంతిని పొందనే లేదు. ఎందుచేత? నన్నిప్పుడు ఏం చేయమన్నారు? అతిదీనుడనై మిమ్ములను వేడుకుంటున్నాను, చెప్పండి.

**బృహస్పతి :** చెప్పాను కదా! కొంత త్యజించి, కొంతపట్టుకుని ఉంటే సరిపోదు. సమస్తము త్యజించు. అప్పుడు విశ్రాంతి దానంతట అదే లభిస్తుంది.

❖

ఇట్లా అని బృహస్పతి ఇంకేమీ మాట్లాడకుండా అంతర్ధానమై నిజమార్గంగా వెళ్ళిపోయాడు.

తండ్రి అంతర్ధానమైన తరువాత కచుడు కొంచం సేపు యోచించాడు. 'ఏమిటి? నాన్నగారు సమస్తం త్యజించమంటున్నారు! అన్నీ వదిలాను కదా! అన్నీ వదలిన తరువాత ఇంకేమి త్యజించాలి?'... అని ఆలోచించగా, అతని మనస్సులో ఒక ఆలోచన వచ్చింది. "ఓహో!అదా! ఈ వస్త్రములు, బొంత, చేతికఱ్ఱ ఇవి కూడా త్యజించమని ఆయన ఉద్దేశం కదా! మంచిదే. వీటిని కూడా ఇప్పుడే త్యజిస్తాను"– అని అనుకున్నాడు. శరత్కాలాకాశం మేఘములను త్యజించునట్లు అతను తన వస్త్రములను, బొంతను, చేతి కఱ్ఱను అక్కడే వదిలేసి దిగంబరుడై బయలుదేరాడు. 3 సంవత్సరాలు గడిచాయి. ఒక రోజు అతను ఒక కొండగుహలో దిగంబరుడై ఉండగా తండ్రి, గురువు అయిన బృహస్పతి మరల తారసపడటం జరిగింది. భక్తితో తండ్రిని పూజించాడు. చాలా రోజులైన తరువాత చూడటం చేత బృహస్పతి ప్రేమగా అతనిని కౌగలించుకున్నాడు.

కొద్ది క్షణములైన తరువాత ఖేదచిత్తుడైన కచుడు గద్గదస్వరంతో ఇట్లా పలికాడు.

**కచుడు :** నేను బొంత, దండం, వస్త్రం అన్నీ త్యజించాను. సమస్తం త్యజించమని మూడు సంవత్సరాల క్రితం మీరు అన్నారు. అట్లాగే చేశాను. అయినప్పటికీ ఆత్మపదంలో విశ్రాంతి లభించనే లేదు.

**బృహస్పతి :** 'సమస్తం' అనగా ఏమిటి? వస్త్రాలా? కాదే. ఈ సమస్తం చిత్తమే అయి ఉన్నదని నీవు శాస్త్రకారుల వాక్యములు వినియే ఉన్నావు కదా! కనుక చిత్తమును త్యజించినప్పుడే సమస్తం త్యజించినట్లౌతుంది. చిత్తము ఉన్నంతవరకూ ఏదీ త్యజించనట్లే.

ఇట్లు పలికి బృహస్పతి వేగంగా ఆకాశమునకు ఎగిరి మరల ఎటో వెళ్ళిపోయాడు. అప్పుడు కచుడు ఖేదరహితమైన బుద్ధితో మరికొంత యోచించసాగాడు.

"అవును ! నా తండ్రి అన్నది నిజమే. ఈ వస్తువులను ధరిస్తున్నది చిత్తం చేతనే కదా! చిత్తాన్నే త్యజించాలి. అయితే చిత్తమును త్యజించటమంటే ఏమిటి? ఎట్లా?" – అని తీవ్రంగా చింతన

చేయసాగాడు. "ఒక వస్తువునైతే త్యజించవచ్చు. మరి, చిత్తమును ఎట్లా త్యజించటం?" అని చాలాసేపు యోచించాడు. అతనికి ఆ వాక్యములోని అర్థము గాని, ఉద్దేశము గాని ఏమాత్రం అవగాహనకు రాలేదు. 'పోనీ, ఈ దేహమును త్యజిద్దామా? ఇదొక్కటేగా నాకు మిగిలి ఉన్నది!' అని యోచించసాగాడు. 'లాభం లేదు. పదార్థమయమగు ఈ దేహం చిత్తం యెట్లా అవుతుంది? స్వయం ప్రతిపత్తి లేని దేహాన్ని త్యజించినంత మాత్రంచేత పితృదేవులు ఉద్దేశించిన చిత్తం యొక్క త్యాజ్యం అవదు'... అనుకున్నాడు.

మరిప్పుడేం చేయాలి? "ఎందుకు? మహాశత్రువగు చిత్తం గురించి నాన్నగారినే ప్రశ్నిస్తే పోతుంది కదా!" అనే ఆలోచన వచ్చింది. వెంటనే ఏమాత్రం తాత్సారం చేయలేదు. తండ్రిని దర్శించ టానికి బయలుదేరాడు. దేవలోకంలో ఒకానొక ఏకాంత ప్రదేశంలో బృహస్పతి ఆసీనులై ఉన్నాడు.

❖

**కచుడు :** మహాత్మ ! పితృదేవా! మీరు చిత్తమును త్యజించమని ఆజ్ఞాపించారు. నేను ఈ దేవలోకాన్ని త్యజించాను. చివరికి వస్త్రాలు కూడా త్యజించాను. అంతేకాదు ఈ పాంచభౌతికదేహం త్యజించటం కూడా పెద్ద కష్టమేమీ కాదు. అయితే చిత్తమును త్యజించటం ఎట్లాగో నేను గ్రహించలేకపోతున్నాను. అది ఒక వస్తువా? దాని స్వరూపమేమిటో, ఎక్కడుంటుందో, ఎలా త్యజించాలో చెప్పండి. అది విని మీరు చెప్పినట్లే చిత్తమును త్యజించివేస్తాను.

**బృహస్పతి :** కుమారా! 'మనుజునికి గల అహంకారమే చిత్తము' అని చిత్తము గురించి ఎరిగిన విజ్ఞులు చెప్పుతూ ఉంటారు. ఈ జీవుని అంతరంలో ఏ అహంకారమేదై ఉన్నదో... అదే చిత్తము.

**కచుడు :** 33 కోట్ల దేవతలకు గురువగు ఓ బృహస్పతి గురువర్యా! 'అహంభావం' అనేది చిత్తము ఎట్లా అవుతుంది. అది అట్లా ఉంచి, నా దృష్టిలో అహంకారం త్యజించటమనేది దుష్కరమైన విషయమనిపిస్తోంది. అట్టి త్యాగం నేను ఎంత ప్రయత్నించినా కూడా సిద్ధించటమే లేదు. కాబట్టి ఈ అహంకారం ఎట్లా త్యజించాలో తెలుప ప్రార్థన.

**బృహస్పతి :** ఈ అహంకారం త్యజించటం కష్టతరమైన విషయమే. అయితే దీనికొక ఉపాయం ఉన్నది. ఆ ఉపాయాన్ని ఆశ్రయించావా, అహంకారాన్ని త్యజించటం పూవును నలిపినంత తేలిక అవుతుంది.

ఆ అహంకారమునకు ఏదైతే 'నిత్య – నిర్లిప్తసాక్షి' అయున్నదో... అట్టి సాక్షిమాత్రమును ఆశ్రయించావా అప్పుడు కనులు మూయుటకంటే కూడా అహంకారమును త్యజించటం సులభమని నీవు గ్రహించగలవు. ఇందులో అనుమానమే లేదు.

ఈ అహంకారం ఎట్లా పుడుతోందో ముందుగా గ్రహించు. అది ఎట్లాగో చెబుతాను, విను–

సాక్షియగు ఆత్మ యొక్క స్వరూప–స్వభావములు ఏమరచుటచేతనే, లేక ఆత్మ గురించి అజ్ఞానమాత్రం చేత అహంకారము అనబడే భ్రమ వస్తువు సిద్ధిస్తోంది. కనుక అహంకారము ఆత్మజ్ఞానముచే తప్పకుండా నశిస్తుంది.

మిథ్య అయి కూడా భ్రమచే ఉన్నట్లు తోచుటచేత 'అహంకారము' అనబడేది యథార్థానికి లేదు. యథార్థానికి లేకపోయినా ఉన్నట్లు అనిపించటానికి ఈ ప్రపంచంలో అనేక దృష్టాంతాలు ఉన్నాయి. ఒక పిల్లవాడి బుద్ధిలో భూతమునకు సంబంధించిన సమాచారం ఏర్పడి ఉండటం చేత, ఆ బాలునికి మసక చీకట్లో భూతము ఉన్నట్లే కనిపిస్తుంది.

**మిథ్యాజ్ఞానానుభవం -**

1. "ఏమిరా అబ్బాయ్! నీకు భూతం కనిపిస్తోందా?" అంటే, ఆ పిల్లవాడు "ఆహాఁ! ఉన్నది. చూచాను" అంటాడు. "ఎట్లా ఉంటుంది, నీవు చూచిన భూతం?" అని అడిగితే 'కొమ్ములు - పిల్లికళ్ళు - చారెడు ముక్కు - బారెడు నోరు" ... అని తాను ఎవరి దగ్గరో విన్న వర్ణనలన్నీ చెపుతాడు. అతను చూస్తున్న భూతం ఆతని బుద్ధిలోనే ఉన్నది కాని, బాహ్యమున కాదు కదా!

2. ఒకాయన ఏదో మసక చీకట్లో ఒక పెద్ద త్రాడును చూచి, 'నీకేం తెలుసు! ఆ పాము చుట్టలు చుట్టుకుని బారెడంత ఉన్నది. అది కాటువేసిందా, చచ్చామే ! ఆ మధ్య ఎవరినో ఇట్లాగే పాము కరచి వాడు చచ్చాడట కూడా! దానికి నోరు తెరచినప్పుడు మిరమిర మెరిసే కోరలు ఉంటాయి. అది ఊదిందా, ఆ విషం శరీరానికి తగిలి, ఇక మనం పుళ్ళు వచ్చి చావవలసిందే' ...ఇలా చెప్పుకుంటూ పోతాడు. ఆ పాముకు సంబంధించిన అనుభవ జ్ఞానమంతా ఉన్నదెక్కడ? ఆ భ్రమించేవాని బుద్ధిలోనే కదా! అది పాము కాకపోయినా, పాముకు సంబంధించిన వికారాలన్నీ ఆతని ఆలోచనలను కలచివేస్తూ ఉంటాయి.

3. ఎండమావులలో తరంగాలు చూచి "అదిగో! అక్కడ నీళ్ళు మిలమిల మెరుస్తుంటే నీళ్ళులేవని అంటారేం?" అని ఒక బాటసారి తోటివారిపై మండిపడతాడు. అక్కడ నీళ్ళు లేవు. అయినా ఆ బాటసారి బుద్ధిలో గల నీళ్ళకు సంబంధించిన సమాచారమంతా ఏకమై జలమునకు సంబంధించిన భ్రమను బలపరుస్తోంది కదా!

4. ఒక మెల్లకన్ను వానికి నిజంగానే రెండవ చంద్రబింబం కనిపిస్తుంది. 'అరేఁ! నాకు రెండవ చంద్రుడు స్పష్టంగా కనిపిస్తుంటే వీడెవడో రెండవ చంద్రుడు ఉండడమే అసంభవమని దబాయిస్తాడేమిటి?'... అని కొఱకొఱా చూస్తాడు.

ఈ నాలుగు దృష్టాంతాలులాగానే అహంకారం మిథ్యయే అయి ఉండి కూడా స్ఫురిస్తోంది. అజ్ఞానముచే అవన్నీ ఎట్లా కనబడుచున్నాయో, సత్తుగాని, అసత్తుగాని కానట్టి అహంకారము కూడా అట్లాగే ఉన్నట్లే అనిపిస్తోంది.

వాస్తవానికి ఆత్మ అంశరహితమైనది. అది సంకల్ప వర్జితమైనది. అంతేకాదు. ఈ సమస్తము సర్వదా అదే అయి ఉన్నది. సర్వవ్యాపకమగు అయ్యది పరమాణువు కంటే కూడా అత్యంత సూక్ష్మమైనది. అట్టి చిన్మాత్రము అగు ఆత్మ ఒక్కటే సత్యమై వెలయుచున్నది.

**సర్వత్ర, సర్వదా, సర్వప్రకాశం, సర్వజన్తుషు ।**
**తదేవైకం కచత్యమ్బు విలోలా స్వబ్ధి వీచిషు ॥**

సముద్రంలో అనేక తరంగాలున్నాయి. నిరంతరం ఎన్నో లయిస్తున్నాయి. మరికొన్ని పుట్టుకొస్తున్నాయి. అయితే తరంగాలన్నిటిలోనూ ఉన్నది ఒకే జలం కదా! సర్వదా, సర్వత్రా సర్వజీవుల రూపంగా – సర్వ జీవులందూ ఆ ఆత్మ ఒక్కటే ప్రకాశరూపమై స్ఫురిస్తోంది. అటువంటి ఆత్మయందు అహంభావం అనునది ఏ రూపంలో ఎట్లా ఉత్పన్నమౌతుంది చెప్పు? దీపంలో ఉండే నీలఛాయా విభాగం జలమంటే మనం ఒప్పుకుంటామా? అట్లాగే జలంలో చంద్రుడు, నక్షత్రాలు ఉంటాయా? ఆత్మయందు అహంకారమనునది ఉండజాలదు. కాబట్టి కుమారా, కచుడా! నీకు వ్యర్థముగా అనుభవమగుచున్న 'నేను–వాడు–నీవు' అను పరిమితాహంకార స్వరూపములపై నీవు విశ్వాసమును తొలగించుకో. ఎందుకంటావా? నీవు ఆత్మవు మాత్రమే. అట్టి ఆత్మయందు దేశ–కాల పరిచ్ఛేదములు ఎట్లా ఏర్పడతాయి? అది సర్వదా స్వచ్ఛమై నిత్యోదిత తత్త్వమై సర్వవ్యాపకమై సమస్తమునకు అధిష్ఠానమై ఉన్నది. సమస్త బ్రహ్మాండములకు ఆధారము, సారము కూడా ! అట్టి నిర్మలము, నిత్యము, అనంతరము, నిత్యానంద స్వరూపమే నీవు కూడా!

అఖండము, అద్వయము, సన్మాత్ర రూపము అయినట్టి నీ యందు ఇక పరిచ్ఛిన్నమగు "నేను" "నీవు" అను వాటికి ఉనికి ఉండటమే కుదరదు. ఒకే రసము వనమంతా విస్తరించి ఫలములుగాను, పుష్పములుగాను, ఆకులుగాను అగుచున్నది చూచావా! నీవే నీకు దర్శనమగు ఈ చరాచర జగద్విషయములుగా విస్తరిస్తున్నావు. ఇది గమనించి, స్వస్వరూప ఔన్నత్యమును గ్రహించి స్వస్థుడివి కమ్ము.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** చూచావా రామా! ఈ విధంగా 'ప్రత్యగాత్మ–పరమాత్మ' ఈ ఇరువురి 'ఐక్యము' అనే పరమయోగమును దేవగురువగు బృహస్పతి తన కుమారుడగు కచునకు ఉపదేశించాడు. అది విని, మరల–మరల తాను అంతకు ముందే వినిన యుక్తుల చేత, స్వకీయ విచక్షణ చేత విచారణ చేసిన వాడై, ఆ కచుడు క్రమంగా 'లేనివస్తువే' అయిన అహంకారమును రహితం చేసుకున్నాడు. హృదయగ్రంథులు ఛిన్నమొనర్చుకుని, ప్రశాంత బుద్ధికలవాడై, ఏ వికారములు లేనివాడై స్వయంప్రకాశకమగు మణివలె వెలుగొందాడు. నీవు కూడా అట్లే స్వయమాత్మజ్యోతి స్వరూపుడవై వెలుగొందుము.

అహంకారమును అసత్తుగా ఎరుగుము

**అహంకారమ్ అసత్ విద్ధి, ఏన మా ఆశ్రయ మాత్యజ ।**

**అసతః శశ్వ శృంగస్య కిలత్యాగ గ్రహౌ కుతః ॥**

"ఈయనేమో కుందేటికొమ్మును ఆశ్రయిస్తున్నాడు. ఆయనేమో త్యజిస్తున్నాడు" ...అనే వాక్యానికి అర్థమేమన్నా ఉన్నదా? కుందేలుకు కొమ్మే ఉండదు కదా! అట్లాగే 'అహంకారము అనేది మిథ్య' అని తెలుసుకొని ఉండు. ఇక నీవు దానిని ఆశ్రయించనూ వద్దు, త్యజించనూ వద్దు. మిథ్య అయిన దానిని పట్టుకోవటం గాని, వదలటం గాని ఉంటాయా?

**అసంభవత్యహంకారే, క్వతే మరణ-జన్మనీ ।**
**నభః క్షేత్రే తథా వృప్తం కేన సంగృహ్యతే ఫలమ్ ॥**

"ఒకాయనకు ఆకాశంలో గొప్ప పొలం ఉన్నది. ఆ పొలంలో మామిడి వృక్షాలు ఉన్నాయి ఆ మామిడి వృక్షాలకు కాచినవే ఈ ఫలములు" ...అనే వాక్యం ఒప్పుకుంటామా? ఆకాశంలో పొలం ఎట్లా ఉంటుంది? అహంకారమే అసంభవమైనప్పుడు ఇక అహంకారం పుట్టటం చావటం అనేది ఎవరికి? ఎచ్చట?

**నిరంశం శాంతసంకల్పం, సర్వభావాత్మకమ్ తతమ్ ।**
**పరమాదప్యణోః సూక్ష్మం చిన్మాత్రం, త్వమ్ అమనోమయమ్ ॥**

సర్వ అంశలకు అతీతమై, శాంతమై సర్వభావాత్మకమై, పరమాణువు కంటే కూడా సూక్ష్మమై మనోరహితమై ఏ చిన్మాత్రము సర్వదా ఉండి ఉన్నదో.... ఓ రామా! అదియే నీవు.

**యథా అంబస తరంగాది, యథా హేమ్నే అంగదాది చ ।**
**తదేవ తదివా భాసం తథా అహంభావ భావితః ॥**

ఒకడు సముద్రం ఒడ్డున కూర్చుని 'ఇది చిన్నతరంగం, అది పెద్ద తరంగం'... అని అనుకుంటున్నాడు గాని, తరంగాలన్నిటిలోనూ ఉన్నది ఒకే జలం అని ఏమరచుచున్నాడు. 'ఇది ఉంగరం, అది గాజు, ఆ ప్రక్కది వడ్డాణం'... అని అనుకుంటున్నాడు గాని 'ఇదంతా ఒకే బంగారం' ...అని ఏమరచుచున్నాడు చాచావా ? అట్లాగే చిన్మాత్రుడైన ఈ జీవుడు 'అహంభావమును భావించ బడుచున్నాడు. ఓ రామా! మాయామమయమగు ఈ జగత్తంతా కూడా అజ్ఞానము చేతనే స్థితి పొందియున్నది. అయితే జ్ఞానముచే ఇదంతా కూడా బ్రహ్మరూపంగా అనుభవం కాగలదు. కనుక నీవు ద్వైత-ఏకత్వబుద్ధిని త్యజించు. అప్పటికీ శేషించియుండే దానియందు సుఖంగా స్థితి కలిగియుండు. అంతేగాని మిథ్యాపురుషుని వలె వ్యర్థంగా దుఃఖితుడవు కావద్దని నా మనవి.

ఈ సంసారము మహాసాగరమువలె దాటుటకు అత్యంత దుర్భరంగా అనిపించవచ్చు గాక! అయితే ఏం? ఎండకు మంచుకరిగిపోవునట్లు, జ్ఞానముచే ఇది పటాపంచలు కాగలదు.

❖❖❖

# XI. మిథ్యా పురుషుడు

## 1. ఆకాశాన్ని భద్రపరచుకోవటమెట్లా ?

**శ్రీరాముడు :** మునీంద్రా! ఒక చాతక పక్షి చాలాకాలంగా వర్షపు జలం కోసం ఎదురుచూస్తూ ఉండగా, ఒక రోజు అనుకోకుండా దైవవశంగా కుంభపోతవర్షం పడితే ఎంత ఆనందిస్తుంది? మీరు కురిపించే జ్ఞానామృతంచే నా అంతరంగం అంతటి తృప్తిని శీతలత్వమును అనుభవిస్తోంది. సమస్త - అసమాన సంపదలకు ఆవల నేనిప్పుడు స్థితి కలిగియున్నాను.

అయితే, బాగా దాహంగా ఉన్న ఒక చకోరపక్షి ఎంతగా చంద్రకిరణాలు గ్రోలినా తృప్తి పొందనట్లు మీ వాక్యాలు ఇంకా ఇంకా వినాలని అనిపిస్తోంది. 'చాలు' అను తృప్తి కలగటమే లేదు.

మీ వాక్యములచే తృప్తుడనైనప్పటికీ మిమ్ములను మరల అడుగుచున్నాను. ఎంత తృప్తిచెందినా అమృతాన్ని వద్దు అని ఎవడూ అనడు గదా!

ఇప్పుడు మీరు "మిథ్యా పురుషుడు" అనువాని గురించి ప్రస్తావించారు. అవస్తువగు ఈ జగత్తును వస్తురూపంలో ప్రదర్శించే ఆ మిథ్యా పురుషుడెవడు? ఆతని కథ ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** హాస్య సన్నివేశం వంటి ఆ మిథ్యా పురుషుని గురించి చెబుతాను విను.

❖

అందరికీ తెలిసియే ఉన్న ఒకానొక పురుషుడున్నాడు. ఆతను మాయాయంత్ర మయుడు. చిన్న పిల్లవాడిలాగా అల్పమైన బుద్ధిగలవాడు. మూఢత్వంలోను, మూర్ఖత్వంలోను ఆతనికి ఆతడే సాటి. ఆతడు ఒకానొక ప్రదేశంలో నివసిస్తున్నాడు. బాగానే ఉన్నదా...?

అయితే, అతడు పుట్టింది, పెరిగింది ఒక ఏకాంత ప్రదేశంలో. ఇప్పటికీ ఆతడు ఆ ఏకాంత ప్రదేశంలోనే ఉన్నాడు. అక్కడ ఆ మిథ్యా పురుషుడు తప్పితే మరింకెవరూ లేరు. ఆ ప్రదేశంలో ఏదేది ఉన్నదో అదంతా ఆతడి విన్యాసమే. అనేక దర్పణాలలో ఒకే మనిషి అనేక కోణాలలో ప్రతిబింబిస్తాడు, చూచావా? ఆ మిథ్యా పురుషుడే అనేక విశేషాలుగా అక్కడ (ఆతడు ఉన్న ప్రదేశంలో) ప్రతిబింబిస్తున్నాడు. ఆతనికి అనుభవమయ్యేదంతా ఆతని ఆభాస మాత్రమే!

అయితే ఏం ? 'ఇన్నిట్లో నేనే ఈ వివిధ రూపాలుగా ప్రతిబింబిస్తున్నాను'... అనే విషయం ఆ దుర్బుద్ధికి తెలియటం లేదు.

ఆతడు ఈ విధంగా ఆ ఏకాంత ప్రదేశంలో ఎదుగుచూ ఉండగా ఏం జరిగిందో విను. ఒక రోజు "నేనెవరినబ్బా?" అనే ప్రశ్న వచ్చింది. 'నేను నా చుట్టుప్రక్కల ఉండే ప్రదేశ ఆకాశమునకు చెందిన వాడను. అసలు నేను ఆకాశమునే. కాబట్టి నా ఈ ప్రదేశమును సర్వదా రక్షించుకోవటమే నా పని. - అనే సంకల్పం ఆతనిలో పుట్టింది.

మరి ఈ ప్రదేశాకాశమును రక్షించటానికి ఏం చేయాలి? “ఇది ఎటూ పోకుండా గోడలతో ఇల్లు కట్టిస్తే పోలా?” అని అనుకున్నాడు. ఇంకేముంది? తానున్న ఆ ప్రదేశంలో చుట్టూ ఓ పెద్ద ప్రహరీ గోడ కట్టి, దాన్ని పెద్ద గృహంగా తీర్చిదిద్దాడు . “తనది. తన రూపమే” అని అనుకున్న ఆ ప్రదేశాకాశాన్ని గృహాకాశంగా మార్చివేశాడు. ఆ గృహము యొక్క అంతర్భాగాకాశంలో కూర్చుని ‘ఇక నాకేమీ ఫరవాలేదు. ఈ నాలుగు గోడల మధ్య నేను రక్షించబడినట్లే. దీనిని ఎప్పటికీ కాపాడుకుంటూ ఉండటమే నా పని. ఇక నాకేం అవసరం లేదు’... అని అనుకుంటూ సంతుష్టుడైనాడు.

రోజులు దొర్లుతున్నాయి. మాసాలు, ఋతువులు గడచి పోతున్నాయి. ఎండాకాలం ఎండ, వర్షాకాలం వర్షం వస్తున్నాయి. గతిస్తున్నాయి. ఏదైనా సరే, కాలగతికి హరించవలసినదే కదా! ఆ ఇల్లు కాస్తా, కాలగతిచే శిథిలమైపోయింది. గోడలు నేలకూలాయి. అప్పుడా మిథ్యా పురుషుడు ఇట్లా అనుకున్నాడు.

“అయ్య బాబోయ్! కొంపమునిగింది. ఈ గోడలు కాస్తా నేలకూలాయ్! ఓ గృహాకాశమా! నీవు నశించిపోయావా? అయ్యో! కొద్ది రోజులలో అంతు దొరక్కుండా పోయావే? ఇప్పుడేమిటి చేయాలి?”... అని దుఃఖించసాగాడు. తనదనుకున్న గృహాకాశాన్ని రక్షించటానికి అక్కడే ఒక నుయ్యి ఒకటి త్రవ్వుకున్నాడు. ‘నా ఆకాశాన్ని ఈ నుయ్యిలో జాగ్రత్తగా పదిలపరచుకుంటాను’ అని అనుకున్నాడు. ఇక ఆ కూపాకాశాన్ని రక్షించుకుంటూ రోజులు గడుపుచున్నాడు.

ఆ విధంగా కొన్ని సంవత్సరాలు గడచిపోయాయి. ‘ఈ నుయ్యి నాది’ అని అనుకుంటూ ఉన్నంత మాత్రంచేత కాలగతి ఊరకుంటుందా? కాలక్రమంగా కొన్నాళ్ళకి గాలి – ధూళి ఏకమై ఆ నూతిని క్రమక్రమంగా పూడ్చి వేయసాగాయి. అట్లా ఆ కూపమంతా పూడిపోయేసరికి ఆ మిథ్యా పురుషునికి ఎక్కడ లేని దుఃఖాలన్నీ మళ్ళీ వచ్చిపడ్డాయి. ‘అయ్యో! నేను నా ఆకాశమును తీసుకువచ్చి ఈ నుయ్యిలో కూపాకాశంగా మార్చి దాచుకున్నానా! ఈ పాడు ధూళి గాలికి లేచి నూతిలోకి పడటంతో ఈ నుయ్యి కాస్తా పూడుకుపోయింది. ఇప్పుడు నా ఈ ఆకాశాన్ని ఎక్కడ దాచుకోవాలి? సరే ఇక్కడ మట్టితో ఒకపెద్ద కుంభమును తయారుచేసి ఆ కుంభము (కుండ) ఆకాశాన్ని జాగ్రత్తగా దాచుకుంటాను”... అని అనుకున్నాడు.

క్రిందా – మీదా పడి ఒక కుంభాన్ని తయారు చేసుకున్నాడు. కుపాకాశాన్ని కుంభాకాశముగా మలచుకొన్న అనుభూతితో సంతోషం పొందాడు. ‘అమ్మయ్య! ఇక ఫరవాలేదు. ఈ కుంభములో నా ఆకాశాన్ని కాపాడుకుంటాను. ఇంతే! ఇక ఎంతకాలమైనా కానీ!” ...అని సంతోషించాడు. అట్లా ఆ కుంభమును, అందులోని ఆకాశాన్ని చూచుకుంటూ కొద్ది నెలలు గడిపాడు. కొంతకాలానికి ఈ కుంభముకాస్తా చెత్త, మట్టి కూరుకుపోయి క్రమంగా ఎప్పుడో నామరూపాలు కనబడకుండా పోయింది. ‘ఇదేంటిరా నాయనా! కుంభము కాస్తా నశించిపోయింది ? ఇప్పుడేం చేయాలి?’ అని కొంతకాలం దుఃఖించాడు.

సరే! అప్పుడు అక్కడా–ఇక్కడా తిరిగి కొన్ని వాసాలు, రెల్లుగడ్డి, తాటాకులు సంపాదించి ఒక

పాకను నిర్మించాడు. ఈ పాకలో నాలుగు గదులున్నాయి. ఆ గొప్ప పాకశాలపై ఎంతో ఆసక్తి కలవాడై, తన్మయుడై తన ఆకాశాన్ని ప్రతిక్షేపించుకున్నాడు. మరికొంత కాలం తరువాత ఆ పాక కూడా నేలకూలింది. ఆకులు, రెల్లుగడ్డి ఎండి నశించిపోయాయి. మన మిథ్యా పురుషుని దుఃఖ స్థితి మరల పునరావృతమైనది. ఆ నాలుగు గదుల పాకశాల గురించి ఏడ్చి, ఏడ్చి కొన్నాళ్ళైన తరువాత గోగు పుల్లలు తెచ్చి ఒక ధాన్యపు కొట్టు (కుసూలము) నిర్మించాడు. అతి కొద్ది కాలంలో ఆ కుసూలము కూడా నేలమట్టమై హరించుకుపోయింది. అది నశించినప్పుడు ఆతని దుఃఖం వర్ణనాతీతం.

❖

ఓ రామచంద్రా! ఈ విధంగా ఆతడు ఇల్లు, నుయ్యి, కుండ, పాకశాల, ధాన్యపు కొట్టు మొదలైనవి నిర్మించుకోవటం... అవి కాస్తా నశించటం – ఈ విధంగా అనంతకాలం గడచిపోతోంది. అతను ఎంతో అభిమానంతో ఏదో ఒకటి నిర్మించుకోవటం, అది కాస్తా కాల ప్రవాహముచే నశించటం, అది నశించినప్పుడల్లా ఆ మిథ్యా పురుషుడు గొప్ప దుఃఖం పొందుతూ కొంతకాలం గడపటం–ఈ తతంగం సాగిపోతూనే ఉన్నది. అట్లా వేల కొలది రచనలు చేసుకుంటూనే ఉన్నాడు. అవన్నీ మరికొంత కాలానికి నశించటం జరుగుచూనే ఉన్నది.

ఇక ఆ మిథ్యా పురుషుడు ఒకప్పుడు 'నేను సుఖంగా ఉన్నాను. ఎందుకంటే నీ ఆకాశం ఇక్కడ పదిలపరచాను కదా!" ...అనుకోవటం, ఆ నిర్మించుకున్నది శిథిలం కాగానే భోరున ఏడవటం... ఇదంతా చూస్తుంటే నాకు జాలి కలుగుతోంది. కానీ ఏం చేయాలి? మేము చెప్పుచున్న దేమో అతడు వినడాయె!

❖❖❖

## 2. అహంకారమే ఆ మిథ్యా పురుషుడు!

**శ్రీరాముడు :** స్వామీ! మీరు ఇంతవరకు వర్ణించి చెప్పిన ఆ మిథ్యా పురుషుడెవడు? ఆతడు ఆకాశ సంరక్షణ చేసుకొంటున్న తాపత్రయమంతా ఏమై ఉన్నది? ఆ మాయా పురుషుడు తను పుట్టిన తనదనుకొన్న స్థానమును (స్థలమును) కాపాడుకోవటానికి గృహాదులను నిర్మించుకోవటంలోను అవి నశిస్తున్నప్పుడు భోరున ఏడవటంలోను తాత్పర్యమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ మాయా యంత్రమయుడగు పురుషుని గురించి మనం చెప్పుకున్న విశేషాలకు సంబంధించిన తాత్త్వికార్థం ఏమిటో చెపుతాను విను.

❖

అతడు మరెవరో కాదు. ఆతడు శూన్యాకాశమునుండి ఆవిర్భవించిన ఈ 'అహంకారము' అనునదే! ఏ ఆకాశకోశమునందైతే ఈ జగత్తంతా అనంతమై భాసిస్తోందో... అదియే అహంకారము. అయితే అట్టి అహంకారం సృష్టికి పూర్వం స్వయంగా అసత్తై, శూన్యమాత్రమై ఉన్నది. ఏ మాయాకాశం

నుండి అహంకారమనునది ఉత్పన్నమౌతోందో అట్టి ఆ మాయాకాశము యొక్క ఉనికి - అధిష్ఠాన రూపముచే బ్రహ్మమునందే ఉండి ఉన్నది. అనగా, చిదాకాశమునందు ఆధ్యస్తమైన మాయాకాశము నుండి 'అహంకారము' అనేది ఉదయిస్తోంది సుమా!

అనాత్మయే అయినప్పటికీ 'ఆత్మత్వం' పొందిన ఈ అహంకారం మాయాకాశముననే (తాను జన్మించిన స్థానమునందే) వృద్ధి పొందుతోంది. అక్కడే 'ఇదిగో, ఇది నాకు ఇష్టం. అది ఇష్టం ఉండదు' ...మొదలైన అనేక రకములైన కల్పనలన్నీ కల్పించుకుంటోంది. ఇక ఆ అహంకారం ఇష్టమైన వాటిని సంపాదించుకోవటం కోసం, అయిష్టమైన వాటిని తొలగించుకోవటం కోసం సుదీర్ఘ కాలంగా మహాప్రయత్నముల సంరంభంలో మునిగి ఉంటోంది. అనాత్మయగు ఈ పాంచ భౌతికమైన దేహ పంజరమును - అద్దాని సంబంధమైన ఆశావిశేషాలను చూచుకుని 'ఇదే నా సర్వస్వం. ఇదే నా స్వరూపం. ఇంత మాత్రమే నేను' అని అనుకుని దేహాన్ని-ఆశలను రక్షించుకోవటానికి ప్రవృత్తమౌతోంది. అట్టి ఈ పాంచభౌతిక దేహం కాలంచే నిర్మించబడింది కనుక తప్పకుండా అయితే, కాలము చేత పొందబడేదంతా హరించబడవలసినదే కదా!

ఈ దేహం ఆయా అవస్థలలో కృంగిపోతూ ఉంటే ఇక ఆ అహంకారం 'గోవిందా! ఇక నా పని అయిపోతోంది. ఇక గతి లేదు. చేయగలిగినది లేదు'... అంటూ వాపోతున్నది. దేహమును ఆశ్రయించినంత కాలం దేహరంధ్రముల వంటి ఇంద్రియములకు విషయములగుచున్నవాటి పట్ల ప్రీతి-అప్రీతులను కల్పించుకొని ఉంటోంది. ఇక దేహము శిథిలమగుచున్నప్పుడు 'నా సర్వస్వము పోతుంది-నేను ఇట్లా శిథిలమౌతున్నాను'... అని గావుకేకలు పెట్టుచున్నది. ఆ విధంగా పూర్వ దేహములు నశించుచుండగా క్రొత్త క్రొత్తవగు ఉత్తరోత్తర దేహములను సృష్టించుకుంటోంది.

ఈ అహంకారమే మాయాపురుషుడు అదియే మిథ్యా పురుషుడు స్వతహాగా అసత్తే అయినప్పటికీ ఈ అహంకారము (నేను-నాది అను ఆవేశం) మాయచే వ్యర్థంగా ఉదయిస్తోంది. ఈ భూచర-జలచర ఆకాశచరాది అనేక దేహములను ఇష్టానిష్టముల కారణంగా ఆశ్రయిస్తోంది. ఎప్పుడు ఏ దేహమును ఆశ్రయించటం జరిగితే అదే తన పరిమితము, అవధులు అని సంకుచితత్వము సంతరించుకుంటోంది 'ఈ దేహాన్ని నేను ఏం చేసి రక్షించుకోవాలి?' అని అగచాట్లన్నీ తెచ్చిపెట్టుకుంటోంది.

అయితే ఏఏ జగదాకార విభ్రమములు అహంకారమును మోహింపజేస్తున్నాయో చెబుతాను విను- 1. జీవుడు 2. బుద్ధి 3. మనస్సు 4. చిత్తము 5. మాయ

6. ప్రకృతి 7.సంకల్పము 8. కల్పన 9. కాలము 10. కలన...

ఇటువంటి పేర్లన్నీ అహంకారము ఆశ్రయించే మోహ వేషములే! ఇటువంటి అనేక నామరూపములచే అనేకత్వము పొంది, వేలకొలది రూపములు ధరించి, తనచే కల్పించబడిన పదార్థములచే తానే విజృంభిస్తోంది.

అనగా, 'పూర్ణబ్రహ్మము' న 'అహంకారము' అనే మిథ్యాపురుషుడు భ్రమ (లేక మాయ, కల్పన)... అనతగిన కారణంగా ఉదయిస్తున్నాడు. అతడు భూతాకాశము యొక్క కల్పన కావించుకొనుచున్నాడు. మట్టి రాయి లేని గోడలాగా ఈ జగత్తు యొక్క రచనాచమత్కృతిని

నిశ్చయిస్తున్నాడు. తనంతట తానే జగజ్జలంలో కష్టాలను, చెప్పలేనన్ని చిక్కులను, దుఃఖములను, సుదీర్ఘకాలగతిని పొందుచున్నాడు.

❖

ఓ రామచంద్రా! ఆ మిథ్యా పురుషుడు ఘటాకాశములను "తనది-తన స్వరూపము" అను శంకతో ప్రవర్తిస్తున్నట్లుగా నీవు మాత్రం అట్టి క్లేశావస్థలకు చోటు ఇవ్వవద్దు. వాస్తవానికి నీ స్వరూపం. నా స్వరూపం. తదితరులందరి స్వరూపం ఆత్మయే కదా! ఆకాశము కంటే విస్తృతమై, శుద్ధమై, శివమై, శుభమైనట్టి ఆత్మను స్వీకరించటమేమిటి? రక్షించటమేమిటి ఎక్కడో ఏ దేహాదులందో ఉంచి కాపాడటమేమిటి? సర్వవ్యాపక మగు స్వస్వరూపమును ఈ దేహాదులచే కాపాడుచున్నామనుకొనేవారు కేవలం భ్రమ చేత, అవగాహనారాహిత్యం చేత అట్లా పలుకుచున్నారని గ్రహించు. ఈ శరీరము స్వభావవశం చేత నశిస్తే ఆత్మయే నశిస్తోందనే శంకచే కొందరు జనులు నిష్కారణంగా, వ్యర్థంగా దుఃఖిస్తున్నారు. అది వాస్తవం కాదు. కుండ పగిలితే లోన ఉన్న ఆకాశం నశిస్తుందా?... లేదు.

అట్లాగే... దేహములు నశించనప్పటికీ దేహి నశించడు. ఆ దేహినే మనం 'ఆత్మ' అని అంటున్నాం. ఏ జీవుడైనా 'దేహి'యే స్వరూపంగా కలిగి ఉన్నాడు గాని, ఈ దేహము అతని స్వరూపమే కాదు. ఆత్మయగు దేహి నిత్యమై, నిర్లేపమై అవినాశి అయి వెలుగొందుచున్నాడు.

ఓ రామచంద్రా! ఆత్మ సర్వదా శుద్ధ చిన్మాత్రమై, ఆకాశము కంటేకూడా అత్యంత సూక్ష్మమై, స్వానుభవమాత్రమై ఉన్నది. ఆకాశంలాగానే ఆత్మ కూడా ఏ సమయమందును నశించటం లేదు.

**న జాయతే న మ్రియతే క్వచిత్ కించిత్ కదాచన ।**
**జగద్వివర్తరూపేణ కేవలం బ్రహ్మ జృంభతే ॥**

ఆత్మ ఎప్పుడూ, ఎక్కడా ఉత్పన్నం కాదు నశించదు. అయితే.ఈ 'జగత్తు' అను వివర్త రూపంగా ప్రదర్శితమయ్యేదంతా ఆత్మయే గాని మరింకేదీ కాదు.

**సత్యమ్, ఏకమ్ పదమ్, శాంతం, ఆదిమధ్యాన్త వర్జితమ్ ।**
**భావాభావవినిర్ముక్తమ్ - ఇతి మత్వా సుఖీభవ ॥**

ఓ రాఘవా ! ఆ ఆత్మపదము సత్యమై, ఏకమై, శాంతమై, ఆదిమధ్యాంతరహితమై, భావ - అభావ వినిర్ముక్తమై ఉన్నదయ్యా ! ఇది సర్వదా గ్రహించి సుఖవంతుడవు కమ్ము.

ఇక అజ్ఞానమంటావా?... అది సమస్త ఆపదలకు స్థానం. అద్దానిలో ధ్రువము అంటూ ఏదీ లేదు. పైగా, అది జీవునిపట్ల అస్వాతంత్ర జనకమైనది. జీవుని వివేకమునకు అది శత్రువు వంటిది. మిథ్యయైనది. అందులో అంతర్గతమై ఉన్న విశేషాలన్నీ అజ్ఞానసమన్వితమగు దేహాభిమానమునకు సంబంధించినవి మాత్రమే! అటువంటి 'అహంకారము' అనే భూతాన్ని వదించుకోవాలంటే జ్ఞానమే శరణ్యం. నీవు సర్వదా జ్ఞానమును ఆశ్రయించి, ఆపై, అజ్ఞానమగు అహంకారమును త్యజించగా శేషించియున్న ఆత్మ పదమున దృఢంగా స్థితి కలిగిఉండెదవు గాక!

❖❖❖

# 3. అహంకారము ఆత్మకు అన్యమైనది కాదు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ సృష్టికి ముందే పరబ్రహ్మమునందు మొట్టమొదట 'మనస్సు' అనేది బయల్వెడలుతోంది. దాని రూపము మననమే గాని మరింకేదో కాదు. ఈ మననమే సువిశాలమగు జగద్రచనగా అనుభవమౌతోంది. అది ఇప్పటికీ పరమాత్మయందే ఉన్నది. పరమాత్మయందు ఉంటూనే తదితర కల్పనలన్నిటికీ హేతువుగాకూడా అయి ఉంటోంది. తరంగాలు ఎక్కడున్నాయి? సముద్రంలోనే కదా! కిరణ సమూహాలన్నీ ఎక్కడి నుండి వస్తున్నాయ్? సూర్య బింబము నుండే కదా! సువాసన ఎక్కడి నుండి వస్తోంది? పుష్పకోశము నుండే కదా! అట్లాగే మనస్సు కూడా బ్రహ్మమునందే ఉండి, బ్రహ్మము నందే వర్తిస్తోంది. అయితే చమత్కారం చూస్తున్నావా? ఈ మనస్సు అదృశ్యమగు ఆత్మను ఏమరచి జగత్తు యొక్క కల్పనలందు ఉపక్రమిస్తోంది. క్రమంగా దృశ్యజగత్తును తనయందు గాంచుచున్నది.

ఒకడు ఒక త్రాడును చూచి 'పాము ' అని బెంబేలెత్తుచున్నాడనుకో. 'పాము' అనేది ఎక్కడినుండి వచ్చింది? త్రాడును చూచినప్పుడే కదా! కనుక పాము త్రాడులోంచే వచ్చినట్టు కదా! అట్లాగే అత్మయందు మనస్సు బహిర్గతమౌతోంది. వాస్తవానికి త్రాడులో పాములేదు. ఆత్మయందు మనో-అహంకారాలు లేవు.

**శ్రీరాముడు :** నిర్లిప్తము, నిర్విషయము అగు అత్మ నుండి విషయరూపమగు మనస్సు ఉద్భవించటం చమత్కారమే కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎవడైతే 'సూర్య కిరణములు సూర్యుని కంటే వేరు'... అని అనుకుంటాడో, వానికి ఆ సూర్య కిరణములు అన్యమైనట్లే భాసిస్తాయి. 'బంగారము కంటే ఆభరణములు వేరైనవి'... అనుకునే వాని అనుభవం అట్లే (వేరైనట్లుగానే) ఉంటుంది గాని, అది 'బంగారం కదా' అని అతను అనుకోవటం లేదు. కానీ, 'సూర్యబింబము నుంచే బయలుదేరిన కిరణములు సూర్యునికి వేరైనవి ఎట్లా అవుతాయి? బంగారము కంటే ఆభరణం వేరైనదని అనటం ఎట్లా?'... అని భావించావనుకో? అప్పుడు మొదటి వానికంటే వ్యతిరిక్తమైన అనుభవమే ఉంటుంది.

తరంగములు చూచేవానికి తరంగబుద్ధియే ఉంటుందిగాని, జలబుద్ధి ఉండదు. "తరంగములు జలము కంటే వేరు కాదు" అని తలచేవాడికో? ఇతనికి జలబుద్ధియే ఉంటుంది గాని, తరంగ బుద్ధి ఉండదు. "బంగారము యొక్క ఆకారములైన ఆభరణములందు కూడా ఉన్నది బంగారమే"... గ్రహించేవాడు మహాబుద్ధిమంతుడై ఉంటాడు. అట్టివాడు "నిర్వికల్పుడు" అని చెప్పబడతాడు. "త్రిగుణాత్మకమైన కనిపించే ఈ దృశ్యాంతర్గత జీవులంతా త్రిగుణాతీతమగు పరమాత్మ యొక్క సంప్రదర్శనా విన్యాసమే" – అని గమనించడాన్నే 'నిర్వికల్పము' అను శబ్దముచే ఉద్దేశించబడుతోంది.

"అగ్ని జ్వాలలు అగ్ని కంటే వేరు" అని భావించేవానికి అగ్నిబుద్ధి నశించి జ్వాలాబుద్ధియే ఉంటుంది. "ఈ జ్వాలలు ఆకారసమన్వితాలు" అని కల్పన చేస్తే, అవి అట్లే గోచరిస్తాయి.

ఆకాశంలో పొగపంక్తిపోతుంటే "ఇవి మేఘములే" అని అనుకుంటాడేగాని, "ఇవి బయలు దేరినవి అగ్నిలోంచే" అనేది దృష్టికి రాదు. జ్వాలల యొక్క ఊర్ధ్వ వక్ర గమనములను మేఘముల లాగానే చూస్తాడు. 'అగ్నిజ్వాల అగ్ని కంటే వేరు కాదు' అనే బుద్ధి (లేక, భావన) కలవానికి అగ్నిబుద్ధియే సర్వదా కొనసాగుతుంది.

అంతయూ ఆత్మగా దర్శించువాడు వికల్పరహితుడని చెప్పబడుచున్నాడు. అట్టి వికల్పరహితుడైనవాడు 'మహాపురుషుడు' అనిపించుకుంటాడు. ఎవరికి సర్వసంశయములు సంక్షయించి ఉంటాయో... అతడే మహామతి. అట్టివాడు ఏది పొందాలో, అది పొందినట్లే. ఇక అతడు కల్పిత వస్తువులను, విషయములను, వ్యవహారములను చూచి కలత చెందడు. ఎందుకంటే అతడు సర్వదా సత్యత్వబుద్ధి చేతనే నిమగ్నుడై ఉంటాడు కదా!

ఓ రామచంద్రా! నీవు "ఇది మనస్సు – ఇది చిత్తము – ఇది బుద్ధి" ...ఇటువంటి అనేకత్వమంతా ఈ క్షణమే త్యజించు. 1. సంవేద్యరహితమై 2. శుద్ధచిన్మాత్రమై , 3.సాక్షి రూపమై, 4.అభ్యంతరవస్తువు మొదలుగా గల మహత్తర స్వభావయుక్తమై ఆత్మయందు స్థిరుడవై ఉండుము.

❖

ఒక చిన్న దృష్టాంతం చెబుతాను విను. వాయువు ఉన్నది. అది అంతటా ఏర్పడి వ్యాపించి ఉన్నది. అట్టి వాయువు నందు ఒకానొక చలనశక్తి (ప్రసరించు స్వభావము) ఉన్నది. ఫలితంగా వాయుతరంగాలు ఏర్పడుచున్నాయి. వాయువుయొక్క తరంగత్వము అకారణమనే చెప్పాలి. అయితే ఆ తరంగత్వము "జీవులను జీవింపజేయుట" మొదలుగా గల అనేక వ్యవహారములకు కారణ మగుచు, తాను మాత్రం నిష్కారణమై ఉంటోంది. అట్లాగే ఆత్మ కూడా స్వయంగా అకారణమైనప్పటికీ తనయందు సంకల్పాత్మక శక్తి కలిగి ఉంటోంది. అట్టి స్వయంకృతమగు సంకల్పాత్మకత్వం చేత 'జగత్తు' అను అనుభవమును తాను పొందుతూ, ఇద్దానికి కారణమగుచున్నది. అట్టి సంకల్ప వ్యవహార సందర్భంగా అది తననుండి ఏర్పడిన మనస్సును. అందలి భావాలను, ఆ భావాలకు విషయమగుచున్న ఈ సర్వమును అనుభవరూపంగా పొందుతోంది. సంకల్పకల్పనామయమై, ప్రపంచరూపమైనట్టి ఆ మనస్సు తన ఆకృతిని తానే భావన చేయుచు స్వయముగా ఉత్పన్న మగుచున్నది. సంకల్పాత్మకమైన సమష్టి చిత్తము సమస్త ప్రపంచమును గూర్చి సంకల్పించుచుండగా, ఈ సమస్త ప్రపంచరూపము పరికల్పించబడుతోంది. అది ఎట్లు దేనిని సంకల్పిస్తుంటే – ఆ సంకల్పములను అనుసరించి – క్షణకాలంలో అట్లే అగుచున్నది. ఆ సమష్టి చిత్తమే ఒక కీటకంగాను, బ్రహ్మదేవునిగాను, మేరు పర్వతంగాను, మనస్సు – జీవుడు – అహంకారం – చిత్తము మొదలైన వ్యవహారములుగాను స్వసంకల్పముచే ధరిస్తోంది.

ఈ చిత్తము 'సంకల్పము' అను మూల పదార్థముచే నిర్మించబడినదై, ద్వైత–ఏకత్వరూపమగు జగత్‌స్థితిని పొందుతోంది. ఇక ఆ తరువాత ఇద్దానియందు తనకు తానే స్వయంగా అనేకత్వమును సుదీర్ఘకాలం అనుభవిస్తోంది.

❖

కనుక రామా! సంకల్పముచేతనే ఈ విశాల జగత్తు కన్పిస్తోంది. ఈ కారణం చేత ఇది సత్యం కాదు. ఎందుకంటే, ఏదీ ఎట్లు అనుభవమౌతోందో... అదంతాకూడా సంకల్పమాత్రం మరియు సంకల్ప నిర్మితమే కదా!

ఈ జగత్తు మిథ్య కూడా కాదు. స్వప్నజాలము వలె ఇది అనిర్వచనీయమై ఉన్నది. స్వప్నము అసత్యమందామా... 'అనుభవం' అనేది ఉన్నది కదా! కాదు, సత్యమందామా?

స్వప్నం కల్పనామాత్రమే కదా! నిద్రకొనసాగిస్తున్నంతవరకు స్వప్నం సర్వ వికారములు కలిగిస్తూ, ఒక సందర్భ – అసందర్భ సంఘటనల కలయిక వలె కొనసాగుతూనే ఉంటుంది. సుఖదుఃఖాది రసాభావములు గాలి కెరటముల వలె ఉంటాయి. స్వప్న సంఘటనకు ఆ స్వప్న సమయంలో దుఃఖం ఉంటుంది కనుక వాస్తవముగా అది ఉన్నట్లే కదా! ఆ ప్రాణి నిదుర లేవగానే స్వప్నం లేదు. స్వప్న సంఘటనలు లేవు. అట్లాగే ఈ జాగ్రదనుభవం కూడా! నిద్రపోయినవాని జాగ్రదనుభవం నిద్రలేవగానే కొనసాగుచున్నట్లు, దేహము పోయిన తరువాత మౌనం వహించే జాగ్రదనుభవపరంపరలు మరల దేహము ప్రాప్తించగానే సంస్కార రూపములతో కొనసాగుచూనే ఉన్నాయి. అయితే ఆత్మస్వభావం జ్ఞానపూర్వకంగా సంతరించుకున్న మరుక్షణం ఈ దృశ్యము పట్ల – దేహదుల పట్ల ఏర్పడియున్న సర్వ సందేహాలు తొలగుతాయి.

ఈ జీవుని మనోరాజ్యం 'ప్రేమ – ద్వేషము – అభిమానము – ఆశ – నిరాశ – అజ్ఞానము – విజ్ఞానసాధనలు'... మొదలైన వాటితో కూడినదై వివిధ కార్యకలాపములతో భాసిస్తోంది కదా! అట్లాగే బ్రహ్మదేవుని [సమష్టితత్త్వము యొక్క (లేక) హిరణ్యగర్భుని] సువిశాల – సుదీర్ఘ మనోరాజ్యం కూడా 'కల్పితము – భావనామాత్రము' అగు చమత్కారములతో భాసిస్తోంది.

**యధా భూతార్ధభావిత్వాత్ తదేవత్ ప్రవిలీయతే ।**
**పరమార్ధేన దృష్టంచేత్ తదిదం నైవ కించన ॥**

యథార్థరూపంలో భావించేవానికి దీని మాయారూపమంతా లయించిపోతోంది. ఎందుకంటే బ్రహ్మరూపముగా భావించే వానికి ఇక్కడ మాయారూపమైనదేదీ ఉండియే ఉండదు.

**దృశ్యంత్వ పరమార్ధేన ప్రయాతి శతశాఖతామ్ ।**
**జలమ్ ఊర్మి-తరంగాది కలనార్ణం పరిస్ఫురన్॥**

'సముద్రం' అంటే ఏమిటి? జలం మాత్రమే కదా! అయితే అందులో తరంగాలు, ఆవృత్తాలు, నురుగు మొదలైనవన్నీ వివిధ కల్పనా రూపాలుగా స్ఫురిస్తున్నాయి. జలదృష్టిచే అవన్నీ జలమే కదా! ఆ పరమార్థమగు ఆత్మతత్త్వమే అపరమార్థ దృష్టిచే ఈ వందలాది సృష్టిశాఖల రూపంలో స్ఫురిస్తోంది.

సముద్రం తరంగములు మొదలైన రూపములన్నీ ధరిస్తున్నప్పటికీ సముద్రం సర్వదా జలమాత్రంగానే ఉంటోంది కదా! అట్లాగే ఈ జీవుడు 'దేహభావన' అను వ్యవహారమును ఆశ్రయించి వేలకొలది కర్మలు ఆచరించుచుండవచ్చు గాక! అనేక దేహములు పొంది ఉండవచ్చు, పొందబోవవచ్చుగాక! అదంతా కూడా 'మనస్సు యొక్క చలనము' మాత్రమే. 'కూటస్థమగు

చైతన్యము' అను ఆ జీవుని వాస్తవ స్వరూపమునందు అపూర్వమగు వికారమేదీ కించిత్తు కూడా కలగటం లేదు. కలుగదు. అందుచేత రామా! నీవు తుచ్ఛములగు సర్వభేదములను త్యజించు. ఇక నీవు నడుస్తున్నప్పుడైనా, వింటున్నప్పుడైనా, తాకుచున్నప్పుడైనా, మాట్లాడుతున్నప్పుడైనా, నిద్రిస్తున్నప్పుడైనా, వ్యవహరిస్తున్నప్పుడైనా 'నా ఆత్మ స్వరూపమునందు అపూర్వమైనదీ ఎక్కడా ఉండజాలదు' అని గ్రహించియే ఉండు. ఏ నీ వాస్తవ స్వరూపము అఖండమై, నిర్మలమై, అప్రమేయమై, సత్యమైయున్నదో, అద్దానినే భావన చేయుచూ ఇక ఏది ఎట్లో అట్లే నిర్వర్తించు. నీవు ఏది చేసినా, చూచినా, అదంతా కూడా నిర్మలమై, వ్యాపకమైనట్టి చిన్మాత్రమేనని' ఎఱుగుము. ఈ సర్వజీవుల, సర్వ పదార్థముల నిజస్థితి సారభూతమగు సత్‌చిత్ స్వరూపమే అయి ఉన్నది. ఆ 'సత్‌చిత్' కు అన్యంగా ఎక్కడా ఏదీ లేదు.

ఈ విశాల రూపంగా భాసించేదంతా బ్రహ్మము మాత్రమే ఈ జగత్తంతా సంవిత్‌మాత్రమే! ఇక్కడ మరొక కల్పన లేనే లేదు. సంవిత్ యొక్క స్ఫురణ మాత్రమైన 'జగజ్జాలము' అను పేరుగల ఇద్దానిలో 'అది వేరు – ఇది వేరు' అనేది. ఎట్లా ఏర్పడగలదు చెప్పు? సత్‌లో మిథ్యాగ్రహణం భ్రమమాత్రమే. మరియు... అంతటా ఒకే 'సంవిత్తు అను చైతన్యమై ఉండియున్నది కనుక, ఇక సంవేద్యము (తెలియబడునది) అను దాని యొక్క (తెలుసుకొనుదానికంటే వేరైన) ఉనికి ఎక్కడున్నది? దేనికైతే ఉనికియే లేదో అది ఉనికిగలదానిని ఎట్లా బంధించగలదో చెప్పు? 'స్వప్నం ఎక్కడి నుండో బయలుదేరివచ్చి స్వప్నద్రష్టను బంధించి ఉంచుతోంది' అనేది అర్థరహిత వాక్యంగాక మరేమిటి? స్వప్నం స్వప్నద్రష్టలోంచే బయల్వెడలుతోంది కదా! కాబట్టి 'ఉనికి–ఎరుక' అను స్వరూపముగల నీకు నీ కల్పనచే ఎరుగబడే ఈ జగత్తు వలన బంధమోక్షములు ఏర్పడుతాయని ఎవరైనా అంటే అది పరిహాసవాక్యం మాత్రమే.

కనుక రామా!

**మోక్షోయమేష ఖల బంధ ఇతి ప్రసహ్య చిన్తాం నిరస్య సకలాం విఫలాభిమానాం**
**మౌని, వశీ, విగతమానమదో, మహాత్మా! కుర్వన్స్వకార్యమనహంకృతిరేవ తిష్ఠ ॥**

ఓ రామచంద్రా! "ఇది బంధము, ఇది మోక్షము" అనబడే వ్యర్థాభిమానము గురించిన చింతను సర్వప్రయత్నములచే వదిలివేయి. ఈ వాక్కు మొదలైన సర్వ ఇంద్రియములను అధిగమించివేయి. నీకు ప్రవాహపతితంగా ప్రాప్తమైన ఈ రాజ్యపాలనము మొదలైన ఆయా కార్యక్రమములను ఉచితరీతిగా నిర్వర్తించు. అట్లు నిర్వర్తిస్తూనే మౌనివై, సంయమివై అభిమాన–మదాదులు లేనివాడవై, అహంకార – మమకార వర్జితుడవై వెలయుము.

సంశయములన్నీ పారద్రోలి నిర్భయుడవై ఉండు. శాశ్వతమైనట్టి కూటస్థభావనను అవలంబించి ఉండు. మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము.

❖❖❖

# XII. శ్రీ శివ - భృంగీశ్వర సంవాదం

## (మహాకర్త - మహాభోక్త - మహాత్యాగి)

## 1. జీవన్ముక్త లక్షణములు

**శ్రీరాముడు :** హే మహర్షీ! 'మహాకర్త' 'మహాభోక్త' 'మహాత్యాగి' అను మూడు మహావ్రతాలు వేదాంత వాఙ్మయంలో ప్రసిద్ధమై ఉన్నాయి కదా! ఆ మూడిటి గురించి మీ ప్రవచనాన్ని వినాలని నా అభిలాష!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ! తప్పకుండా. ఒకప్పుడు ఈ మహాకర్తది మూడు వ్రతముల గురించి భృంగీశ్వరునకు జగత్ప్రభువగు శివభగవానుడు ఒక సందర్భంలో బోధించటం జరిగింది. ఆ బోధను ఇప్పుడు ప్రస్తావించుకుందాం.

❖

ఒకసారి లోకపావనుడగు శివభగవానుడు ఏదో సందర్భంలో పరివార సమేతంగా మేరు శిఖరం యొక్క ఉత్తర భాగంలోని ఒక ప్రదేశంలో విడిది చేయడం జరిగింది. ఆ విడిది చేసియున్న రోజులలో ఒక సమయంలో మహా తేజస్వియగు భృంగీశుడు తనకు గల జీవన్ముక్తికి సంబంధించిన కొన్ని సందేహాలు నివారించుకోవటానికి భక్తజన వాత్సల్యుడగు స్వామిని సమీపించాడు.

**భృంగీశుడు :** హే భగవాన్! దేవ దేవేశా! సర్వజ్ఞా! పరమేశ్వరా! జీవన్ముక్తి విషయమై నా సందేహనివృత్తి కొరకు మిమ్మల్ని ఒక విషయం అడిగి తెలుసుకోవాలని ఉంది. నా పై దయతో నన్ను అనుగ్రహించండి.

**ఈశ్వరుడు :** రా నాయనా! ఇటొచ్చి కూర్చో. అడుగు ఏమిటి నీ సందేహం!

**భృంగీశుడు :** స్వామీ! అంతరంగ స్వామి అయిన మీకు నా గురించి అన్నీ తెలుసు. అయినా వైద్యుని దగ్గిరకు భవరోగమునకు గొప్ప వైద్యులు కదా! ఇక వినండి.

**సంసార రచనాం, నాథ! తరంగ తరలామిమామ్ ।**
**అవలోక్య విముహ్యామి, తత్త్వ విశ్రాంతి వర్జితః ॥**

మహాత్మా! నా ఎదురుగా ఏర్పడి ఉన్న ఈ చంచల సంసార రచనను చూస్తూంటే నాకు భయమేస్తోంది. నేను అనుక్షణం విమోహితుణ్ణి అవుతున్నానే గాని, ఆత్మతత్త్వంలో విశ్రాంతి మాత్రం పొందలేకపోతున్నాను. అప్పుడు నా కనిపించింది, నేను అపరిపక్వమైన నిర్ణయాలు కలిగియుండుట చేతనే సంసారసాగరంలో కొట్టుకుపోతున్నానేమో? అందుకే సద్గురువులు, సర్వ సాక్షిస్వరూపులు, పుత్రవాత్సల్య సమన్వితులగు మిమ్ములను ఆశ్రయిస్తున్నాను.

ఇప్పుడు నేను ఎటువంటి నిశ్చయం కలిగి ఉంటే ఈ జగద్రూప జీర్ణ గృహంలో దుఃఖ రహితుడనై ఉంటానో అట్టి ఉత్తమ - ప్రియవిషయమును నాకు బోధించండి.

**ఈశ్వరుడు :** పుత్రా! భృంగీశా! ఈ సంసారము గురించి నీకెందుకయ్యా భయం? సంశయములన్నీ వదిలిపెట్టి, నిర్భయమైన శాశ్వతమైన 'కూటస్థాత్మ'ను అవలంబించు. మహాకర్తవు... మహాభోక్తవు... మహాత్యాగివి కమ్ము.

**భృంగీశుడు :** అయ్యా! 'మహాకర్త' 'మహాభోక్త' 'మహాత్యాగి' అవటమంటే మీ ఉద్దేశ మేమిటో సవివరంగా దయచేసి చెప్పండి.

**ఈశ్వరుడు :** వత్సా! ఆ మూడింటిని నిర్వచిస్తూ చెబుతాను. విను.

❖❖❖

## 2. మహాకర్త

**ఈశ్వరుడు :** మహాకర్త అయినవాడు ఎట్లా ఉంటాడో ముందుగా వివరిస్తాను.

**1. అసంశయుడు -** *(ధర్మాధర్మౌ శంకా విరహితాత్మక్షయః, యః కరోతి యధా ప్రాప్తౌ)* 'ఆత్మయందు కర్తృత్వం – అనే ధర్మమే లేదు' అను నిశ్చయం కలిగి ఉంటాడు. ఇక యథా ప్రాప్తాలైన ధర్మాధర్మాలను, 'ఇది చెయ్యవచ్చా? అది చేయవలసియున్నదేమో?' అనే సంశయములను మొదలే విడిచిపెట్టి ఉంటాడు. అనివార్యమగు ఆయా కర్మవ్యాసంగముల పట్ల నేను చేయవలసి ఉన్నదే ఇదంతా. చెయ్యవలసింది చేయవలసిందే! సందేహించవలసినది లేదు ...అను అవగాహన కలిగి ఉంటాడు.

**2. అపేక్షారహితుడు -** *(రాగ–ద్వేషౌ, సుఖం–దుఃఖం, ధర్మ–అధర్మౌ, ఫలా–అఫలే అనపేక్షేణమ్ యః కరోతి)* అతనికి రాగద్వేషాలు ఉండవు. "దీని వలన సుఖం రావాలే! అది దుఃఖం కదా! ఇదే నేనెందుకు చేయాలి? అది వాడెందుకు చేయకూడదు? ఇది చేస్తే ప్రయోజనం దానివలన ఏం లాభం?"...ఇటువంటి అపేక్షతో కూడిన భావాలు కలిగి ఉండడు. ఇక ఆతని రాగద్వేష – సుఖ దుఃఖ – ధర్మాధర్మ – ఫలాఫల కార్యాలన్నీ లోకానుకూలత కొరకు మాత్రమే ఉద్దేశించబడి ఉంటాయి గాని తన యొక్క అభిప్రాయం కొరకో, అపేక్ష కొరకో కాదు.

**3. ఉద్వేగ రహితుడు -** *(మౌనవన్, నిరహంభావో, నిర్మలో, ముక్తమత్సరఃగతోద్వేగం యః కరోతి)* "ఏం, నేను ఎందుకు చేయాలట?... నేనింత చేస్తున్నానే! మరి జనం చూస్తున్నారా?... నీ తోటి వారు చేసేదంతా తప్పే!... నేను కాకపోతే ఇంకెవ్వడయ్యా చేయగలిగేది?... అసలు వీళ్ళందరి సంగతి చూడాలి!" ...ఇటువంటి ఉద్వేగ భావాలు ఆ మహాకర్తకు ఉండవు. సాంసారికమైన భావావేశాల పట్ల అంతరంగంలో మౌనం వహించి ఉంటాడు. కొండపైన చెట్టు కదులుతుందేగాని కొండ కదలదుకదా! "నేను అంతటివాడిని. ఈ పని ఇంతటిది"...అనే అహంకారం వహించడు. నిరహంకారం అభ్యసిస్తూ ఉంటాడు. ఎదుటివారి తప్పులను ఏకరువు పెట్టే దోషము ఆశ్రయించకుండా నిర్మలుడై ఉంటాడు. మాత్సర్యం దరిజేరనివ్వడు. సర్వ ఉద్వేగములను జయించినవాడై విధివశాత్తు తాను చేయవలసినది నిర్వర్తిస్తాడు.

**4. శంకారహితుడు -** *(శుభాశుభేషు కార్యేషు ధర్మాధర్మైః యస్యమనః కుశంకయా న లిప్యతే)* ఆయా శుభ-అశుభ కార్యవ్యవహారములందు ఎవని బుద్ధి అయితే అనుమానాలతో దోషభూయిష్ఠం కాదో, అతడే మహాకర్త. బుద్ధి నిశ్చలత కలవాడై ఎప్పటికి ఏది ప్రస్తుతమైనదో అద్దానిని ధర్మనిరతుడై నిర్వర్తిస్తూ ఉంటాడు.

**5. నిర్ ఇఛ్ఛిన్నుడు -** *(యః సర్వత్ర విగతస్నేహో, సాక్షివత్ స్థితః - కార్యే నిరిచ్ఛం వర్తతే)* అతనికి 'ఇది నాకు ఇష్టం.అది నాకు ఇష్టం కాదు' అనబడేదంటూ ఏదీ ఉండదు. ఎందుకంటే అతడు సర్వత్రా రాగరహితుడై ఉంటాడు. సర్వమునకు సాక్షిమాత్రుడై ఉంటాడు. ఇచ్ఛారహితుడై నిజాశ్రమధర్మములను నిర్వర్తిస్తూ ఉంటాడు.

**6. ఆవేశ - ఆనందరహితుడు -** *(ఉద్వేగానంద రహితః, సమయా, స్వచ్ఛయా, ధియా, యో న శోచతో, యో నోదేతి)* దేనికీ ఉద్వేగంగాని, ఆనందంగాని చెందదు. సమమైన - స్వచ్ఛమైన బుద్ధిని కలిగి ఉంటాడు. ఈ సుఖదుఃఖాలన్నిటికీ అతీతుడై నిర్మలమైన హృదయంతో ఈ 'జీవితం' అనుదానిని తన అనంత స్వరూపమునందలి ఒకానొక చిన్నచమత్కారముగా, ఒక కళగా గాంచుతూ ఉంటాడు.

**7. అసంసక్త మనస్కుడు -** *(యః యధార్థకాలే మతిమానః, అసంసక్తమనాః, మునిః, కార్యానురూపవృత్తస్తో)* అతడు ఆయా కాలాలో సంప్రాప్తించే విధి విధానాలను అసంసక్తంగా నిర్వర్తిస్తూ ఉంటాడు.కార్యానుకూలంగా ప్రవర్తిస్తూనే మహాబుద్ధిమంతుడై నిత్యానిత్యవివేకి అయి ఉంటాడు.

**8. సమదర్శి -** *(యః కర్తృతాం చ, కర్మ - అకర్మాచరంశ్చ ఉదాశీనః, యః అంతరః అత్యంతమ్ సమం యాతి)* ఉదాసీనుడై ఉంటూనే దైవికంగా ప్రాప్తించే విహిత-అవిహిత కర్మలను నిర్వర్తిస్తూ ఉంటాడు. అయినా కూడా కర్తృత్వము లేనివాడై ఉంటాడు. "ఇక్కడ తోచే కర్తృత్వమంతా అన్యప్రేరితమే కదా" అని ఎరిగియే ఉంటాడు. అత్యంత సమభావంతో ప్రకాశిస్తూ అందరితో వ్యవహరిస్తూ ఉంటాడు.

**9. స్వభావశాంతుడు -** *(యః స్వభావేనైవ శాంతః, యః హి శుభాశుభం ఆచరన్యో సమతాం వై నజహాతి)* స్వభావంగానే శాంతి స్వరూపుడై ఉంటాడు. ప్రాప్తించే ఆయా శుభాశుభ కర్మలు ఆచరిస్తూనే సమత్వమును, అంతరంగశాంతిని ఏమాత్రం వదులుకోడు.

**10. సర్వదా సమమనస్కుడు -** *(యస్య మనః జన్మస్థితి వినాశేషు, ఇదమ్ దేహాది ఉదయాస్తమయేషు చ సమమేవ యాతి)* ఈ శరీరం యొక్క పంచ వికారములయినట్టి జన్మ - స్థితి - వృద్ధి - క్షయ - వినాశన సమయములందు కూడా ఎవని మనస్సు సమత్వం కోల్పోదో... అతడే మహాకర్త.

**భృంగీశుడు :** ప్రభూ! కర్మలను నిర్వర్తించేటప్పుడు ఎట్లు మహాకర్తృత్వం వహించి ఉండాలో 10 విశేషణములతో వివరించారు. అద్భుతం. ఇప్పుడు కర్మ యొక్క ఫల భోక్తా సమయంలో మహాభోక్తృత్వం వహించి ఉండడమంటే ఏమిటో సవివరంగా చెప్పండి.

❖❖❖

# 3. మహాభోక్త

**ఈశ్వరుడు :** అట్లాగే, 'మహాభోక్త' గురించి చెబుతాను విను–

**1. ద్వేష - కాంక్షారహితుడు -** *(యః ప్రకృతం సర్వమ్ భుంక్తేచ, నకించిన ద్వేష్టి, తథా, నకించిత్ అభికాంక్షతి)* యథా ప్రాప్తములైన సమస్తమూ అనుభవిస్తున్నప్పుడు అతడు ఎవరినీ ద్వేషించడు. ఎవరి మీదా ఎట్టి కోపం అంతరంగంలో కలిగి ఉండడు. 'ఇది నేను ఎప్పటికి పొందుతానో?'...అని దేనినీ కాంక్షించడు.

**2. పొందుతూ కూడా పొందని వాడు -** *(యః ఆదదానశ్చపి చ నాదత్తే, ఆచరన్నపి చ నా–చరత్యాత్, భుంజానోపి చ న భుక్తే)* ఈ ఇంద్రియాలు విషయాలను గ్రహిస్తూ ఉండవచ్చు గాక. అతను అసంగమగు ఆత్మను గురించిన బుద్ధిచే ఏదీ గ్రహింపనివాడుగానే ఉంటాడు. కాళ్ళు–చేతులతో అనుభవములందు ఆచరణ కలిగియున్నప్పటికీ నిష్క్రియమగు ఆత్మబుద్ధినే ఆశ్రయించుకొని ఉంటాడు. సమస్తమును అనుభవిస్తున్నప్పటికీ నిత్యతృప్తమగు ఆత్మబుద్ధి యొక్క బలంతో ఏదీ అనుభవించని వాడుగానే ఉంటాడు.

**3. అనుభవములన్నిటికీ సాక్షిమాత్రుడు -** *(యః అఖిన్నఃత ధీః యో సకలం సాక్షివత్ పశ్యతి, అవగతేచ్ఛతి)* కేవలం సాక్షిమాత్రుడై సర్వ అనుభవములను దర్శిస్తూ ఉంటాడు. ఇచ్ఛారహితుడై ఖిన్నము లేనట్టి బుద్ధితో లోక వ్యవహారములన్నీ గాంచుతూ ఉంటాడు.

**4.విక్షేపరహితుడు, భ్రమరహితుడు -** *(యస్య మతిః సుఖైః దుఃఖైః క్రియాయోగైః భ్రమప్రదైః భావాభావైః నోత్క్రామతి)* ఇక్కడి సుఖ – దుఃఖములను, సంయోగ – వియోగ సమన్వితములగు కార్య వ్యవహారములను, భ్రమదాయకములగు లాభ – వ్యయాది విషయములను పొందుచున్నప్పుడు ఎవని బుద్ధి విక్షేపము పొందదో, ఆయా సర్వస్థితి – గతులందు మేధావి అయి ఉత్తమ అవగాహనను వీడడో... అప్పుడు అతడు మహాభోక్త అనిపించుకుంటాడు.

**5.బ్రాహ్మీదృష్టి సమన్వితుడు -** *(యో జరామరణమ్, ఆపదః రాజ్యం, దారిద్ర్యమేవచరమ్యమిత్యేవ వేత్తి)* ఆ మహాభోక్తకు వార్ధక్యము, మరణము, ఆపదలు, రాజ్యం దారిద్ర్యం ఇటువంటివన్నీ కూడా రమణీయంగానే ఉంటాయి గాని, దుఃఖదాయకం కాదు. ఎవడు ఈ సంసారరూప ప్రపంచం పై నమ్మిక, ప్రియత్వం ఏర్పరచుకుని ఉంటాడో... అట్టి వానికి మాత్రమే వార్ధక్యమరణాదులు దుఃఖ కారకములై ఉంటాయి. ఈ సంసారమునకు ఎట్టి స్థానం ఇవ్వాలో అట్టి స్థానమే ఇస్తే ఇక ఇవన్నీ అట్టివానిని చలింపజేయలేవు సుమా!

**6. సర్వ సమబుద్ధిమంతుడు -** *(యః మహోన్తి సుఖదుఃఖాని సమం పయాంసీవ సాగరః సముపగృహ్ణాతి)* మహాసముద్రం ఉన్నది. అందులోని జలంలో చిన్న పెద్ద కెరటాలు ఏర్పడుచున్నాయి. కెరటాల అల్పాధిక్యములవలన మహాసముద్రమునకు అల్పాధిక్యములు ఏర్పడగలవా? అట్లాగే, సూర్యకిరణములచే నీరు ఆవిరి అవుతోంది. సముద్రజలం తరిగిపోతోందా? నదుల ద్వారా నీరు

వచ్చి చేరుతోంది. సముద్రం ఉప్పొంగి పోతోందా? లేదు కదా ! మహాభోక్త కూడా మహాసముద్రం లాగా మహాశుభములు గాని, మహాదుఃఖములు గాని, వచ్చి పోతున్నప్పుడు పొంగడు, క్రుంగడు. వాటినన్నిటినీ సమబుద్ధితోనే గ్రహిస్తూ ఉంటాడు. అవన్నీ జీవతః ఆస్వాదిస్తూనే పరతః ఆస్వాదించని వాడై, స్పర్శించబడనివాడై ఉంటాడు.

**7. సహజ సాత్వికగుణస్వభావుడు -** *(యస్మాత్ అహింసా, సమత, తుష్టి,ఉపయాతి చ నో–పయాతిః)* చంద్రబింబము నుంచి సహజంగానే చల్లని కిరణాలు బయలుదేరుచున్నాయి కదా! అట్లాగే ఆ మహాభోక్త నుండి అత్యంత స్వభావ సిద్ధంగా అహింస, సమత్వము, సంతుష్టి మొదలైన ఉత్తమగుణములు ప్రసరిస్తూ ఉంటాయి. అయితే సహజ సాత్విక గుణములు అకృత్రిమమై ఉండటంచేత అవన్నీ, బయల్వెడలనట్లే అతడా అనుభవం పొందుతూ ఉంటాడు. అనగా అవి సహజసిద్ధము, అప్రయత్నపూర్వకము అయి ఉంటాయి.

**8. సౌమ్యబుద్ధి సమన్వితుడు -** *(యో కటుః, ఆమ్లమ్, లవణమ్, తిక్తం, అమృష్టమ్, ఉత్తమమ్ మృష్టిమ్, అధమమ్ సామ్యేన వేత్తి)* అతను కారం, పులుపు ఉప్పదనం, చేదు, అరుచికరమైనవి, రుచికరమైనవి, నికృష్టమైనవి – అన్ని పదార్థాలను సమబుద్ధితో చూడగలడు. స్వీకరించగలడుకూడా. రసములచే అతడు సంబంధితుడు, బంధితుడు కాడు. రసములను జయించి వాటికి అతీత స్థానమున నెలకొని ఉండుటచే అతడు వాటి పట్ల ఆశ – నిరాశలను కలిగి ఉండడు. జీవించుటకై తింటాడుగాని, తినటానికి జీవించడు. ఏది ఎట్లున్నా అతని సామ్యబుద్ధి చలించదు.

**9. సమ - సౌమ్యద్రష్ట -** *(యః సరసం, నీరసం,సురతం,విరతం,సౌమ్యా సమం, పశ్యతి)* రస సమన్వితమైనవి, రసవిహీనమైనవి. సుఖ ప్రదమైనవి, సుఖ విఘాతమైనవి...ఇటువంటి పరస్పరానుకూల – ప్రతికూల వ్యవహారాలు తారసపడుచున్నప్పుడు వాటినన్నిటినీ అతడు సమదృష్టితో, సౌమ్యదృష్టితో చూడగల శక్తి కలిగి ఉంటాడు. అతని సౌమ్య స్థితి వాటిచే చంచలం పొందదు. అతని సమదృష్టి ముందు అవన్నీ స్వల్ప విషయాలై ఉంటాయి.

**10. సమత సుస్థిర సమన్వితుడు -** *(యస్య మనః క్షారేచ, ఖండప్రకారేచ, శుభేచ, అశుభేచ సమతా సుస్థిరా భవతి)* "ఇదా, కారంగా ఉన్నది అది తియ్యగా ఉన్నది. ఇది శుభప్రదం. అది అశుభప్రదం – ఇటువంటి స్పర్ధభావాలు అతనికి ఉండవు. మనస్సు సమతాభావంతో సుస్థిరమై ఉంటుంది. "ఒకనికి ఒకటి శుభప్రదంగాను, అదే మరొకటి అశుభప్రదంగాను ఉండటం సృష్టి చమత్కారమైయున్నది" అని అతడు గ్రహించియుండుటచే వాటిని అనుభవించవలసి వస్తున్నప్పుడు అతనికి స్పర్ధ ఉండదు.

**11. అభిలాషారహితుడు -** *(యో భుంక్తే అభిలాషమ్ త్యక్త్వా,ఇదం భోజ్యం, ఇదం అభోజ్యమితి ఏవం వికల్పితమ్ త్యక్త్వా గతాభిలాషం భవతి)* "నా మటుకు నాకు ఇవి అనుభవించవలసినవి, అవి అనుభవించకూడనివి, కనుక ఇవి లభించాలి. అవి తొలగాలి"... ఇటువంటి అభిలాషలన్నీ, వికల్పములన్నీ దరికి రానీయడు. అభిలాష చేతనే ఈ జీవుడు నిబద్ధుడౌతున్నాడు. లేకపోతే ...సత్

స్వరూపుడగు ఇతడు అసత్తగు ఈ దేహ – ఇంద్రియ – విషయములచే నిబద్ధుడు అవటమేమిటి? ఏది – ఎక్కడ– ఎట్లు పొందవలసివచ్చినా కూడా, అవన్నీ వికల్పములే కాబట్టి, మహాభోక్తకు అవి అభ్యంతర– నిరభ్యంతరములు కాజాలవు.

**12. సర్వసమస్వీకారుడు -** *(యో బుద్ధ్యా భుక్తే ఆపదం, సంపందం, మోహమ్, ఆనందం, అపరమ్, ఇత్యాదినమయా యాతి)* ఒక రోజు సంపద – మరొక రోజు ఆపద, ఒక సమయంలో ఆనందం – మరొక సమయంలో దుఃఖమోహాలు, కొన్ని రోజులు ఉత్కృష్టత – మరికొన్ని రోజులు నికృష్టత ...జీవితమంతా ఇంతేకదా! చిన్న పిల్లల వంటి ఈ జీవులు వీటిని చూచి కేరింతలు కొట్టటమో, కెవ్వున ఏడ్వటమో చేస్తున్నారు. మహాభోక్తకు వాటి రాకపోకల చమత్కారం తెలుసు కనుక సమబుద్ధితో చూస్తూ ఉండగలడు. అతడే మహాభోక్త.

❖❖❖

# 4. మహాత్యాగి

**1. ధియాసంత్యక్తుడు:బుద్ధితో సర్వము బాగుగా త్యజించినవాడు -** *(యేనేతి ధర్మాధర్మౌ, సుఖం దుఃఖం, మరణ–జన్మని ఇత్యాది ధియా సంత్యక్తం)* ఉత్తమమైన బుద్ధి (లేక) తెలివితేటలు సంపాదించుకొని ఉంటాడు. అట్టి ఉత్తమ బుద్ధిచే ధర్మాధర్మములను, సుఖ – దుఃఖములను, జన్మ – మరణములను స్వతఃగా మొదలంట త్యజించివేసినవాడై ఉంటాడు. " ఆయా విశేషములచే నేను బద్ధుడనైనాను".. అను మీమాంస ఆ మహాత్యాగికి ఉండదు.

**2. ఇచ్ఛ - శంక - వ్యవహార - నిశ్చయ పరిత్యక్తుడు -** *(యేన ధియా సర్వేచ్ఛాః సకలాః శంకాః సర్వేహాః, సర్వనిశ్చయాః, పరిత్యక్తాః)* ఈ ఇంద్రియములు, వాటి విషయములు ఎట్టివో, స్వభావమేమిటో ఎరిగి ఉంటాడు. అందుచేత సర్వ ఇచ్ఛలు త్యజించియే ఉంటాడు, "దీనివలన ఏది పొందుతామో? మళ్ళా అ తరువాత ఏమి కానున్నదో?"... ఇటువంటి అనుమానాలకు చోటివ్వడు. సమస్త శారీరక, వాచిక, మానసిక చేష్టలను– దూరస్తమగు అసంబంధిత విషయాలుగా గాంచుతూ ఉంటాడు. సమస్త నిశ్చయములచేతను కట్టుబడక పూర్ణాత్మ స్వరూపమునందు స్వభావమును అనుభవమును ఏర్పరచుకుని ఉంటాడు.

**3. దేహేంద్రియసత్తత్యాగి -** *(దేహస్య, మనసః ఇంద్రియాణాంహి – తత్‌దుఃఖత్యాగి, తత్ సత్తత్యాగి)* ఈ దేహ, ఇంద్రియ, మనస్సుల సత్తను వాటి వాటి దుఃఖ స్వభావంతో సహా మొదలే త్యజించి వేసి ఉంటాడు. ఏది త్యజించబడినదో అది దుఃఖమును కలిగింపజాలదు. తాను శుద్ధచైతన్య స్వరూపుడై ఉండగా ఈ దేహేంద్రియ మనస్సులు ఎట్లా పరిమితం చేస్తాయి? ఎట్లా బంధితుణ్ణి చేయగలవు చెప్పు?

**4. నదేహ - నజన్మ - నకర్మ నిశ్చయుడు -** (న మే దేహో, న జన్మాసి, న యుక్తే, అయుక్తే కర్మణి – ఇతి అంతర్ నిశ్చయవాన్ః) "ఈ దేహం నేను ఉపయోగించే ఒక బాహ్యవస్తువు, అంతేగాని ఇది

నేను కాదు, దీనికంటే ముందే ఉన్న నేను దేహంతో జన్మించేవాడిని కాదు. దేహంతో మరణించేవాడిని కాదు. ఏది నేనై ఉన్నానో అద్దానికి జనన – మరణ ధర్మాలు లేవు. ఒక ఉపకరణ మాత్రమగు ఈ దేహము యొక్క చేష్టలు దేహ ధర్మములే గాని నా ధర్మములు కావు. నాకు వాస్తవానికి దేహములేదు. విహిత – నిషిద్ధకర్మలులేవు. ఇష్టానిష్ట చేష్టలు లేవు".. ఇట్టి అంతఃకరణ నిశ్చయమును ఆ మహాత్యాగి కలిగి ఉంటాడు. 'ఇట్టి త్యజించియుండుట' అను స్వస్వరూప ధర్మమును సర్వదా వహించి ఉండుటచే అవన్నీ అతనికి అసంబంధిత విషయములే అవుతాయి.

**5. మనో మనన పరిత్యక్తుడు -** *(యేన ధర్మాధర్మమ్ మనో మననమీహితమ్ సర్వమ్ అన్తః పరిత్యక్తం)* అతడు శారీరకమైన ధర్మాధర్మములను, మనస్సు యొక్క మానసిక చేష్టలను, వాక్కు మొదలైన క్రియలను అంతరంగంలో పరిత్యజించి ఉంటాడు. సత్–చిత్– ఆనందమనబడు స్వభావమొక్కటే అతని పట్ల ఏర్పడి ఉండి ఉంటుంది. అట్టి అనుభవము ద్వారా సర్వమునకు అందజాలని అప్రమేయ స్వరూపస్వస్థుడై ఉంటాడు. సర్వధర్మములు, సర్వ చేష్టలు త్యజించివేసి ఉంటాడు. ఆయా దేహ మనోధర్మాలచే ఎవరూ ఆతనిని సంకుచితపరచలేదు. అతడు ఎవరినీ దేహ మనోధర్మా ధర్మ బద్ధునిగా గాంచడు. సదా అప్రమేయమగు ఆత్మగానే దర్శిస్తాడు.

**6. సమ్యక్‌దర్శి :** *( సాయేన యావతీ దృశ్యకలనా సకలేయం సుఘట సంతక్తా విలోక్యతే)* ఈ కనిపించే దృశ్య కల్పననంతటినీ అతడు 'సమ్యక్ దర్శనము' అనే పవిత్ర దృష్టిచే, "మిథ్యయే కదా!"... అని ఎఱిగి, సర్వమును త్యజించివేసి ఉంటాడు.

❖

నాయనా! భృంగీశా! ఈ విధంగా త్రయీవ్రతము అవలంబించు.

**కర్మ నిర్వర్తిస్తున్నప్పుడు :** 1.అసంశయుడవు, 2.అపేక్షారహితుడవు, 3.ఉద్వేగరహితుడవు, 4.శంకా రహితుడవు, 5.ఇచ్ఛారహితుడవు, 6.ఆవేశ ఆనందరహితుడవు, 7.అసంసక్త మనస్కుడవు, 8.సమదర్శివి, 9.స్వభావ శాంతుడవు, 10.సర్వదా సమమనస్కుడవు ...అయి ఉండు.

**కర్మల భోక్తవైయున్నప్పుడు :** 1.ద్వేష కాంక్షారహితుడవు, 2.పొందుతూ కూడా పొందనివాడవు, 3.అనుభవములన్నిటికి సాక్షి మాత్రుడవు, 4.విక్షేపరహితుడవు, 5.బ్రాహ్మీదృష్టి సమన్వితుడవు. 6.సర్వ సమబుద్ధిమంతుడవు, 7.సహజ సాత్విక గుణ స్వభావుడవు, 8.సామ్యబుద్ధి సమన్వితుడవు. 9.సమ – సౌమ్యద్రష్టవు, 10.సమత – సుస్థిర సమన్వితుడవు, 11.అభిలాషారహితుడవు, 12.సమస్వీకారుడవు కమ్ము.

**ఈ జగత్తులో ఏర్పడే సంబంధముల విషయంలో :** 1.ధియా సంత్యక్తుడవు, 2.ఇచ్ఛ –శంక – వ్యవహార– నిశ్చయ పరిరత్యక్తుడవు, 3.దేహేంద్రియ సత్తత్యాగివి, 4.నాకు దేహ జన్మకర్మలు ఉండ జాలవు అను నిశ్చయం కలవాడవు, 5.మనోమనన పరిత్యక్తుడవు, 6.సమ్యక్‌దర్శివి ...అయి ఉండు.

త్యజించుటచే త్యాగివవుతావు. ఎవరు ఏది త్యజించరో అది మాత్రమే వారిని దుఃఖింప జేయ గలదు. అది మాత్రమే అతనికి సంసార విభాగమగుచున్నది,. ఏది త్యజించబడదగినదో

అది జయించబడినట్లే. కనుక భృంగీశా! నీవు మనం వివరించి చెప్పుకున్నట్లు మహాకర్తవు మహాభోక్తవు మహాత్యాగివి అగుచూ ఈ భూమిపై నిశ్చింతగా సంచరించు. ఇక ఈ సంసార దుఃఖాదులు నిన్ను సమీపించనైనా లేవు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! భక్తజన సులభుడగు సాంబశివునికి భృంగీశునికి మధ్య జరిగిన సంవాదము విన్నావు కదా! ఆ పరమశివుడు బోధించియున్న దృష్టిని నీవు కూడా అవలంబించు. అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ – ఆనందమయములనబడే పంచకోశములకు అతీతమైయున్న నీ స్వస్వరూపమును ఆశ్రయించు. అది జాగ్రత్ – స్వప్న – సుషుప్తములనబడే అవస్థాత్రయరహితమై ఉన్నదని గ్రహించియుండు.

ఏ ఆత్మ అయితే నిరంజనమై (దోషరహితమై) నిత్యోదితమై, విమలరూపమై, అనంతమై, ఆద్యమైయున్నదో..అట్టి బ్రహ్మమే నేను – అను నిశ్చయముతో సమస్త కల్పనారూపములను శమింపజేసినవాడవై, నిర్వాణ పదమును పొందియుండు. సమస్తకల్పములందు ప్రసిద్ధములైయున్న కార్యములన్నిటియొక్క బీజభూతము, నిరామయము – పరమాత్మ రూపమగు బ్రహ్మమే అయి ఉన్నదని విజ్ఞులు ఎరిగియే ఉంటున్నారు. విశాల సృష్టి భేదంతో వృద్ధి చెంది భాసిస్తున్న ఈ కనబడేదంతా చిదాకాశమే అయి ఉన్నది.

ఓ రామా! "బ్రహ్మము కంటే భిన్నంగా సత్తుగాని అసత్తు గాని ఎక్కడాకూడా కొంచమైనా సంభవించజాలదు" అని అంతఃకరణంలో దృఢనిశ్చయము కలిగియుండుము. సంశయములన్నీ త్యజించి సుఖముగా నిశ్చింతగా ఉండు.

**అంతర్ముఖః సన్సతతం సమస్తం, కుర్వన్ బహిష్ఠం ఖలు కార్యజాతమ్.**
**నఖేద మాయాసి కదాచిదేవ, నిరాకృతాహంకృతితాముపైషి॥**

ఓ ప్రియ రామచంద్రా! నీవు అంతర్ముఖుడవై 'నిరహంకృతి' పొందావా... అప్పుడిక బహిర్ముఖములగు ఈ సమస్త కార్యములు నెరవేరుస్తున్నప్పటికీ, ఎన్నటికీ ఖేదం పొందవు. ఖేదముల ఛాయ కూడా నిన్ను ఆవరించజాలదు.

❖❖❖

# 5. చిత్త శామ్య స్థితి

**శ్రీరాముడు:** హే భగవాన్! హే సర్వధర్మజ్ఞా!అహంకారము అనే పేరు కూడా కలిగి ఉన్న ఈ చిత్తం ఎప్పుడు ఏ పరిస్థితులలో శమిస్తుంది? లేక శమించనారంభిస్తుంది? వాసనారహితమగు చిత్తం ఏ ఏ లక్షణాలు కలిగి ఉంటుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** బలాత్కారంగా జలం పద్మదళములను తాకినప్పటికీ జలబిందువులు పద్మదళములో ప్రవేశించలేవు కదా? ఎప్పుడైతే అహంకారమయమగు చిత్తము ప్రశమిస్తూ ఉంటుందో. ఎప్పుడైతే

జ్ఞానాగ్నిచే పాప సంకల్పాదులు ఉపశమిస్తూ ఉంటాయో అప్పుడు బలాత్కారముగా సమీపించే లోభమోహాలు కూడా శుద్ధచిత్తమును స్పృశించజాలవు. అట్టి వాని ముఖంలో అకృత్రిమమైన ప్రసన్నత, మైత్రి, కరుణ మొదలైన ఉత్తమగుణాలు వెల్లివిరుస్తూ ఉంటాయి. చిత్తము శమిస్తూ ఉంటే మెల్లమెల్లగా వాసనాగ్రంథులు ఛిన్నాభిన్నమై పోతూ ఉంటాయి. కోపము సన్నగిల్లుతూ ఉంటుంది. ఇంద్రియముల ప్రబలత్వం అల్పమౌతుంది. అట్టివానిని క్రమక్రమంగా దుఃఖము – ఖేదము దరిజేరలేకపోతాయి. అనగా అతని దుఃఖములు వృద్ధి చెందుటకు కారణమును కోల్పోతాయి. సుఖములు అభిమానమును కల్పించలేకపోతాయి. హృదయమునందు సర్వత్రా (ఆధి భౌతిక – ఆధిదైవిక – ఆధ్యాత్మిక) తాపత్రయ నివారకమగు సమత్వము ఉదయిస్తూ ఉంటుంది. ఒకవేళ ముఖంలో సుఖ–దుఃఖాదుల చిహ్నములు ఎప్పుడైనా కనిపించినా. ఎండలోని జలకణంలా అవి అల్పకాలం మాత్రమే ఉంటాయి. ఆ తరువాత 'ఇవి మిథ్యయే కదా" అను బుద్ధి కలుగుటచే అవి మనస్సును స్పృశించలేవు.

❖

చిత్తము శమించినప్పుడు, అట్టి మనుజుడు దేవతాగణమునకుకూడా వాంఛనీయుడౌతాడు. ఆ సమయంలో 'సర్వసత్వము' అనే శీతల చంద్రిక వాని యందు ఉదయించి ఉంటుంది.అతడు స్వభావ సిద్ధంగా శాంతము – ప్రియము – సేవాతత్వము – అవిరోధి – నమ్రత – తేజోయుక్తము– స్వచ్ఛము అయినట్టి మహత్తర స్వరూపమును, స్వభావమును సంతరించుకొని ఉంటాడు.

ఈ సంసారభ్రమ జనుల విషయంలో విభవ – దారిద్ర్యములచే విచిత్రము, అవగాహనకు అందనిది. దుర్భరము అయి ఉంటోంది కదా! అహంకారరహితులగు మహాత్ములకు అది దుఃఖమును గాని, ఆనందమును గాని కలిగించజాలదు.

ఎవడైతే "బుద్ధి యొక్క ప్రకాశమాత్రము – సమస్త ఆపదలను నశింపజేయునది" అగు అత్మజ్ఞానమును మోహవశంచే అశ్రయించటానికి సిద్ధపడడో, అతడు నరులలో అధమతరగతికి చెందినవాడగుచున్నాడని శాస్త్రజ్ఞులు ప్రవచిస్తున్నారు. అనేక దుఃఖములకు నెలవై, జనన – మరణ రూపముతో ఏర్పడియున్న సంసారసాగరమును దాటాలనుకునే పురుషుడు నిరతిశయానందమగు ఆత్మ విశ్రాంతి పొందుటకు ప్రయత్నించుటే ఉపాయం. అట్టి విశ్రాంతి లభించాలంటే "నేనెవరు! ఈ ప్రపంచమేమిటి! అత్మతత్త్వమనగా ఎట్టిది! తుచ్ఛభోగములతో ప్రయోజనమేమిటి!?"...ఈ విధంగా అభ్యసిస్తూ క్రమంగా విచార – వైరాగ్య సమన్వితమైన బుద్ధిని సంపాదించుకోవటమే అన్నిటికంటే ముఖ్యమైన ఉపాయం.

❖❖❖

# XIII. మను - ఇక్ష్వాకు సంవాదము

## (నే నెవరు!)

### 1 ఈ కనిపించేదంతా ఏమిటి!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇక్ష్వాకు వంశజుడవగు ఓ రామచంద్రా! మీ వంశమునకు ఆదిపురుషుడైన ఇక్ష్వాకు చక్రవర్తి ఏ విధంగా ముక్తుడైనాడో ...ఆ వృత్తాంతం చెబుతాను. విను.

❖

ఈ అయోధ్యా నగరాన్ని చాలా కాలం క్రితం ఇక్ష్వాకు చక్రవర్తి పాలిస్తూ ఉండేవాడు. ఆయన చాలాకాలం రాజ్యం ఏలిన తరువాత ఒకసారి ఈ రాజ్యాదులందు విరక్తుడైనాడు. ఒక ఏకాంత ప్రదేశం చేరి మనస్సులో ఇట్లు చింతించసాగాడు.

**ఇక్ష్వాకు చక్రవర్తి:** (మనస్సులో) : ఈ దృశ్య ప్రపంచమంతా జన్మ - వార్ధక్యము- మరణము - సంక్షోభము - దుఃఖము మొదలైన అనేక భ్రమలకు స్థానభూతమై ఉన్నది కదా! ఇట్టి ఈ దృశ్య ప్రపంచమునకు అసలైన కారణమేమిటి!

అతడు చాలా రోజులు అలోచిస్తూనే ఉన్నాడు కాని, కారణం అతనికి తెలియరాలేదు. అప్పుడు, "లాభం లేదు! ఎంత యోచించినా నా బుద్ధికి తోచటమే లేదు. మరి ఈ దృశ్య ప్రపంచమునకు కారణమేమైయున్నదో తప్పక తెలుసు కోవలసినదే"... అని నిశ్చయించుకున్నాడు.

అతని పంట పండి ఒక రోజు భగవంతుడగు మనుప్రజాపతి అనుకోకుండా సభకు రావటం జరిగింది. కుశల ప్రశ్నానంతరం ఇక్ష్వాకువు ఇట్లు ప్రశ్నించాడు.

❖

**ఇక్ష్వాకువు:** హే మనుప్రజాపతి! అనేక జన్మలలో చేసిన పుణ్యంచే ఈ రోజు మీ దర్శనం లభించింది. బ్రహ్మలోకం నుంచి మీ రాకచే మేమంతా పరమ పవిత్రులమైనాం. మహాత్మా! కొంతకాలంగా కొన్ని సందేహాలు నన్ను పట్టి పీడిస్తున్నాయి. అటువంటి కష్టసమయంలో లోకపాలకులు లోకగురువులగు మీరు దర్శనమిచ్చారు. మిమ్ములను కొన్ని సందేహాలు అడిగి తెలుసుకోవటానికి అనుజ్ఞ ఇవ్వండి.

**మనుప్రజాపతి :** సందేహములా! ఊఁ! అడుగు.

**ఇక్ష్వాకువు :** స్వామీ! సవినయుడనై నా సందేహాలు మీ ముందు ఉంచుతున్నాను-

ఈ సృష్టంతా ఎక్కడినుండి ఇక్కడికి వచ్చింది? దీని బాహ్య స్వరూపమిట్లుండగా ఇద్దాని అసలు స్వరూపం వేరే ఏదన్నా అయి ఉన్నదా? ఉంటే దీని అసలు స్వరూపమేమిటి? దీని సంఖ్య ఎంత? పరిణామమెంత? ఇందులోని జీవులెంతమంది? దీనిని ఎవరు, ఎప్పుడు, ఎందుకు నిర్మించారు?

విశాలమైన వలలో ఒక పక్షి చిక్కుకుని గిలగిలలాడే విధంగా, నేను కూడా ఈ సువిశాల సంసారంలో ఎప్పుడో ఎందుకో చిక్కుకుని ఉన్నట్లు నాకు అనిపిస్తోంది. ఈ భయంకరమైన సంసార విభ్రమమునుండి నేను విముక్తుడను అయ్యేదెట్లా?

**మను ప్రజాపతి:** ఇక్ష్వాకా! ఇప్పుడు నీ ప్రశ్నలు, వింటుంటే నాకు చాలా సంతోషంగా ఉంది! జన్మ ఎత్తినందుకు ఏది సారభూతమై ఉన్నదో, ఏ ప్రశ్నలకు సమాధానం గొప్ప అనర్థములన్నీ ఛేదించి వేయగలదో... అటువంటి ప్రశ్నలను వివేకం యొక్క ఉత్కృష్టత చేతనే సమీపించగలిగావు.

నీ ప్రశ్నలకు సూటి అయిన సమాధానం చెబుతాను. ఉద్వేగరహిత-ప్రశాంత చిత్తంతో విను. మేము మా అనుభవాలు రంగరించి ఈ సమాధానాలను నీ ముందు ఉంచుచున్నాం-

**యదిదం దృశ్యతే కించిత్ నాస్తినృప, కించన యథా గంధర్వనగరం ।**
**యథా వారి మరుస్తలే యత్త నో దృశ్యతే కించిత్ తన్ నకించిదివ స్థితమ్ ॥**

ఏ దృశ్యమైతే నీకు ఎదురుగా కనబడుతూ "దీనిని అధిగమించటం నా వలన అవుతుందా?"... అనే గొప్ప సమస్యను ఉదయింపజేస్తోందో, అటువంటి ఈ దృశ్యం యథార్థానికి ఏమాత్రం లేదు. కొంచెం కూడా లేదు. "మరి, నాకు కనబడుతోంది కదా?" అని అంటావా? ఎండమావులలో (మృగ తృష్ణలో) రకరకాల ఆకారాలు గల తరంగాలు కూడా కనిపిస్తూ ఉంటాయి. మాయా సంబంధమైన గంధర్వ నగరంలో సుందరమైన వస్తువులు, కన్యలు కనిపిస్తారు. అవన్నీ యథార్థమా? అవెంత వాస్తవమో, ఈ కనబడేవీ అంతే!

**ఇక్ష్వాకువు :** మరి ఇక్కడ యథార్థమైనదంటూ ఏమైనా ఉన్నదా?

**మను ప్రజాపతి :** ఏది పంచేంద్రియముల కంటే మనస్సు కంటే కూడా అతీతమైయున్నదో, దేని గురించైతే సంభావన మహత్తర ప్రయోజనకారకమై ఉన్నదో, ఏది నాశరహితమై ఉన్నదో, అది మాత్రమే ఇక్కడ ఉన్నది. అదియే "సద్రూపమగు ఆత్మ అని చెప్పబడుతోంది. ఒక పెద్ద అద్దంలో కనిపించే ప్రతిబింబంలాగా అసంఖ్యాక దృశ్యములచే పూర్ణమై ఉన్న ఈ సృష్టిపరంపర చిదాత్మయందలి ప్రతిబింబం మాత్రమే. ఆ పరమాత్మ నుండి స్వభావంగా కొన్ని స్ఫురణ శక్తులు బయల్వెడలుచున్నాయి. అవి చిదాభాసాలు" అని పిలువబడుచున్నాయి. ఆ స్ఫురణశక్తులే బ్రహ్మాండ రూపాన్ని పొందుచు న్నాయి. వాటిలో మరికొన్ని శక్తులు భూమ్యాకాశాది పంచభూత రూపత్వం పొందుచున్నాయి. తక్కినవి తక్కిన చతుర్విధ ప్రాణుల రూపము పొందినాయి.

ఇదియే జగత్తు యొక్క స్థితి ఇంతకు మించి ఇక్కడ బంధము లేదు, మోక్షమూ లేదు.

**న బంధోఽస్తి నమోక్షోఽస్తి, బ్రహ్మైవాస్తి నిరామయమ్ ।**
**నైక్యమస్తి న చ ద్విత్వం సంవిత్సారం విజృంభతే॥**

ఓ ప్రియా ఇక్ష్వాకూ! ఇక్కడ బంధం గాని, మోక్షం గాని, ఎవరికీ లేదు. నిర్వికారమగు బ్రహ్మం మాత్రమే కలదు. ఇందులో ఏకత్వమూ లేదు, ద్వైతమూ లేదు. చిదాత్మయే సంవిత్ సారంగా విజృంభిస్తోంది.

జలమంతా ఒక్కటే అయినప్పటికీ అనేక తరంగ భేదములచే విజృంభిస్తోంది కదా! ఒక తరంగానికి మరొక తరంగానికి ఉన్న భేదమేమిటి? రెండూ జలమే కదా! అయితే ఏం? జలం జలంగా ఉంటూ ఉండగానే అనేక తరంగాలుగా కనిపిస్తున్నది.

అట్లాగే ఒకే బ్రహ్మము అనేక జగత్ భేదములుగా కనిపిస్తోంది. ఏ భేదం కనిపిస్తోందో అది అవాస్తవం. కనుక దానిని 'మాయ (యా మా, ఏదీ స్వతఃగా లేదో!)... అని పిలువబడుతోంది. మాయామాత్రములే అగుటచే జీవునికి జీవునికి, నీకు, నాకు, ఆత్మకు భేదములు లేనివే అగుచున్నాయి. కాబట్టి నాయనా! నీవు ముందుగా బంధమోక్షములకు సంబంధించిన ఆశలను, భయమును దూరంగా త్యజించు.

సంసారభయ రహితుడవై ఉండుము. అభయ సారభూతమగు బ్రహ్మరూపుడవై ఉండు.

❖❖❖

## 2. కొంగు క్రింద బిడ్డను పెట్టుకొని ఊరంతా వెతికొచ్చినట్లు!

**మను ప్రజాపతి :** జలం తరంగాల రూపం పొందుతోంది చూచావా? చిన్మాత్ర సంవిత్తు స్వతహాగా విషయరహితమైనది. అయితే అది స్వయంగా ఎందుకో ఆయా సంస్కారాలచే అతి విచిత్రమై ఉన్న అవిద్య యందు ప్రతిబింబిస్తోంది. అట్టి ప్రతిబింబిత సంవిత్తు సంకల్పాల వైపుగా ఎందుకో ఉన్ముఖ మౌతోంది. ఫలితం ఈ జీవభావమును పొందుతోంది. అట్టి కారణ స్వరూపులగు ఈ జీవులు ఇతః పూర్వమే ఆవిర్భూతమైన సృష్టియందు తిరుగాడుచున్నారు. సృష్టి-దృశ్యము అనబడేవి ఇది ఇట్లుండగా వాస్తవానికి "జీవులు – వారి సుఖదుఃఖ దశలు" అనే మోహం మనస్సునందే ఉన్నదిగాని, ఆత్మయందు కాదు. నిర్మలజలంలో దృశ్యం ప్రతిబింబించినంత మాత్రంచేత దృశ్యం జలంలో ఉన్నట్లౌతుందా? కాదు.

అయితే... రాహువు అదృశ్యరూపుడైనప్పటికీ, ఒకానొక నీడ మాత్రమే అయినప్పటికీ చంద్రుని యందు కనబడే 'గ్రహణం'చే రాహువు అదృశ్యరూపం కనిపిస్తోంది కదా! అట్లాగే ఆత్మ అదృశ్యరూపం, అనుభవమాత్రం అయి ఉన్నది. అట్టి ఆత్మ దర్శనమవటం ఎట్లా? ఎట్లా అంటే ... ఆత్మ సాక్షాత్కారం ఒనర్చుటయందు అభిముఖమైన అంతఃకరణంచే మాత్రమే అది అనుభవైక వేద్యం అగుచున్నది.

**ఇక్ష్వాకువు :** అయితే నిర్మలాంతఃకరణులగు తమవంటి గురువులు అట్టి ఆత్మ సాక్షాత్కారం ప్రసాదించ గలరని లోకప్రతీతి కదా! స్వామి! మహానుభావా! నన్ను రక్షించి, నాకు ఆత్మసాక్షాత్కారం ప్రసాదించండి.

**మను ప్రజాపతి :** తప్పకుండా ప్రసాదించేవాడినే! అయితే ఇందులో ఒక చిక్కు ఉన్నది.

**నశాస్త్రైః, నాఽపిగురుణా దృశ్యతే పరమేశ్వరః,**
**దృశ్యతే స్వాత్మనైవ ఆత్మా స్వయా సత్త్వస్థయా ధియా॥**

ఆ పరమేశ్వరుడు (లేక 'స్వాత్మ') శాస్త్రములచే గాని, గురువులచే గాని కనిపించేవాడు కాదు. మరి? అహంకార – మమకారరహితమగు బుద్ధిచే తనచేతనే తాను కనిపిస్తున్నాడు. నీవు

పరమాత్మను దర్శించదలిచావా? అయితే త్రోవలో నడుస్తూ ఉండగా తారసపడే అపరిచిత బాటసారులను రాగద్వేష రహితబుద్ధితో చూస్తున్నట్లు ఈ ఇంద్రియాలను ఈ ఇంద్రియ విషయ ప్రపంచాన్ని కూడా చూడు. బుద్ధిమంతుడైనవాడు ఈ ఇంద్రియాలను గాని, వీటి విషయాలను గాని ఆదరించడు, అనాదరించడు. ప్రాప్తించిన పదార్థములతో కూడినవై ఈ దేహేంద్రియాలు సుఖంగానే ఉండుగాక! లేదూ ప్రాప్తించని పదార్థములచే పేదరికం పొందుగాక! ఓ మానవా! నీవు మాత్రం బుద్ధితో పదార్థమాత్రాలు అగు ఈ దేహాదులను మానసికంగా దూరంగా త్యజించు. పూర్ణ శీతలాంతఃకరుణుడవై ఉండు. నిత్యం ఆత్మమయుడవై ఉండు.

**'దేహోఽ హమ్' ఇతియా బుద్ధిః, సా సంసార నిబంధనీ,**
**న కదాచిత్ ఇయం బుద్ధిరాదేయా హి ముముక్షుభిః॥**

'నేను దేహమును' అని ఏ బుద్ధి యొక్క విభాగం ఈ జీవుని సంసారమునందు బంధిస్తోందో గమనించబడు గాక. ముముక్షువైనవాడు అట్టి బుద్ధిని గ్రహించనే కూడదు. 'నేను సూక్ష్మమైన ఆకారం కంటే కూడా సూక్ష్మాతిసూక్ష్మమైన చిన్మాత్రంనే గాని, మరింకేమీ కాదు'... అను బుద్ధి జీవుని సంసారం నుండి విముక్తుని చేస్తోంది. అట్టి 'నిరంతరం – అచ్యుతం' అయిన బుద్ధిని నీవు సంపాదించుకో. అట్టి బుద్ధిబలంతో మాత్రమే నీవు సంసార బంధం నుండి విడివడగలవు.

నిర్మల జలం యొక్క లోపల, వెలుపల అంతటా సూర్యకాంతి ప్రసరించి ఉంటున్నట్లు, ఆత్మ సర్వ వస్తువుల యొక్క బాహ్య–అభ్యంతరములందు నిండి ఉన్నది. ఆయా ఆభరణములు రూపముల దృష్ట్యా వేరు–వేరుగా ఉంటున్నప్పటికీ, ఆభరణములన్నిటిలో ఒకే బంగారము ఉండి ఉన్నది కదా! ఇక వివిధత్వమనేది కేవలం ఆకార వైచిత్ర్యము తప్పితే మరింకేమీ కాదు. అట్లాగే ఈ సర్వ జగత్ పదార్థములందంతటా ఆత్మయే ఉన్నది. మాయా రచనాచమత్కారంచేత ఒక్కటే అయినప్పటికీ అసంఖ్యాక తరంగాలు తమంతట తామే ఎక్కడో పుట్టి మరెక్కడో లయిస్తున్నాయి. తరంగాలు కనబడుచున్నంత సేపు 'ఇది పెద్ద తరంగం – అది చిన్నది, ఇవి తరంగం – తరంగం ఢీకొనుటచే ఏర్పడే జలకణములు'... మొదలైన వర్ణనలకు సముద్రం అర్హమగుచున్నది. ఎన్ని అసంఖ్యాక తరంగాలు ఒకచోట లేస్తున్నా, ఆ తరంగాలు ఎన్నిచోట్ల కనిపిస్తున్నా, తిరిగి ఆ తరంగాలు ఎక్కడ లయిస్తున్నా, అన్ని తరంగాలలోనూ ఉన్నది – వాస్తమైనది జలమే కదా!

కామము అనే ఈ సంసార మహా సముద్రంలో 'ప్రాణికోట్లు' అనే అసంఖ్యాక తరంగాలు అటూ – ఇటూ వర్తిస్తున్నాయి. 'జగత్సమూహాములు' అనే నదులు ఈ సంసార మహాసముద్రంలో నిరంతరం ప్రవేశిస్తున్నాయి.

ఈ జీవులు 'వినాశనము'అనే బడబాగ్నిలో ప్రవేశించి జగత్తునుంచి నిష్క్రమిస్తున్నారు. మరల మరొకవైపు నుండి – నిరంతరం ప్రవేశిస్తున్నారు.

అగస్త్య మహాముని సముద్ర జలాన్నంతా త్రాగి కూడా ఇంకా తృప్తి చెందనట్లు, 'కాలము' అనే మహత్తరతత్త్వము ఈ జగత్తులను అసంఖ్యాకంగా తనయందు లయం చేసుకుంటూ కూడా

ఏమాత్రం తృప్తి పొందటంలేదు. ఏ ఆత్మయందైతే అట్టి మహత్తర మహాకాలము కేవలము ప్రతిబింబితమాత్రమై ఉన్నదో-అట్టి ఆత్మను నీవు నిరంతరం భావన చేయి. అంతేగాని అనాత్మభూతమగు ఈ దేహము మొదలైన దృశ్యజాలమును వందల - వేల జన్మలుగా భావన చేస్తూ పోతున్నా కలిగే ప్రయోజనం? ప్రవాహపతితములగు జన్మ - కర్మపరంపరలే తప్పించి మరింకేమీ కాదు. కనుక నీవు 'నిర్వాసనా భావన' యందు ఆరూఢుడవగుము. గూఢరూపమగు ఆత్మభావనను ఆశ్రయించి సుఖపూర్వకంగా ఉండు.

**ఇక్ష్వాకువు :** అట్టి ఆత్మను ఆశ్రయించటం, ఆత్మానుభవంలో ఆరూఢత పొందటం ఎట్లా? అందుకు మార్గాలేమిటి? ఎంతకాలం ఎట్లు శ్రమిస్తే నిర్వాసనాభావప్రాప్తి, ఆత్మానుభూతి కలుగుతాయి? అసలు ఆత్మ లభిస్తుందా? మిమ్ములను అట్టి ఆత్మానుభవం ప్రసాదించవలసినదిగా నా విన్నపం!

**మను ప్రజాపతి:** వెనుకటికి ఒక గొప్ప తెలివిగల స్త్రీ "అయ్యో ! నా బిడ్డ ఎక్కడ?" అని గాభరా పడసాగిందట.

**కుచకోటర సంసుప్తం విస్మృత్య జననీ సుతం ।**
**యథారోదిత పుత్రార్థం తథాఽఽత్మార్థమ్ అయం జనః॥**

ఆవిడ పసిపిల్లవాడికి పైట క్రింద పాలిస్తూ ప్రక్కింటావిడతో ఆకశ-పోకశ కబుర్లు చెబుతోంది. ఈలోగా ఇంటాయన వచ్చి "ఏమే! పిల్లవాడేడీ? నిద్రపోతున్నాడా?"అన్నాడు. ఆ మహాతల్లి, "అవునండీ నిద్రపోతున్నాడు!" అని చెప్పి ఉబుసుపోక కబుర్లు కొనసాగిస్తోంది. ఈలోగా ఇంటాయన ఇంట్లో పిల్లవాడి కోసం చూస్తే కనబడలేదు. "ఏమే పిల్లవాడేడీ? ఇక్కడ లేడే?" అని గావుకేక వేశాడు. ఇక ఆ స్త్రీ ప్రాణాలు ఝల్లుమన్నాయి. "నెలల బాలుడు కదా! నా బిడ్డ ఎటూ వెళ్ళలేడే! మరెవరైనా ఎత్తుకుపోలేదు కదా?" అని అనుకొన్నది. ఆ ఆలోచన రాగానే ఇక పెద్ద పెట్టున ఏడవటం ప్రారంభించింది. ఇంటాయన ఇంట్లో చిందులేస్తున్నాడు. ఈ తతంగమంతా చూచిన ప్రక్కింటావిడ "ఏమిటి ఒదినగారూ?"అన్నది. అప్పుడా ఇల్లాలు "ఇంకా ఏమిటంటారేమిటండీ! నా కొంప మునిగింది. పసిపిల్లవాడు కనిపించటం లేదు. ఇక నేనేం చెయ్యాలి బాబోయ్? నా పిల్లవాడు ఎక్కడున్నాడు నాయనోయ్? ఏం పోయే కాలం వచ్చి ఇక్కడ పెత్తనాలు నేను చేస్తున్నానో? ఏమిటి నా గతి? ఎక్కడని వెతకాలి?"... అని భోరున ఏడవసాగింది.

ఈ జీవుడు కూడా ఆ మహాతల్లి లాగానే ఆత్మ కొరకే ఏడ్చుచున్నాడు. ఎక్కడెక్కడో వెతుకుచున్నాడు ఎందుచేత? అంతఃకరణమునందే నిత్యలబ్ధమైయున్న ఆత్మను ఏమరుచుటచేతనే! కనుక అతని దుఃఖం భ్రాంతిచే ఏర్పడినది మాత్రమే. పైట క్రింద గల పిల్లవాడిని తల్లి ఏమరచినట్లు తన అఖండ-అప్రమేయ స్వభావమగు ఆత్మను ఏమరచిన ఈ జీవునికి గుర్తు చేయటానికే శాస్త్రములు పరికల్పించబడ్డాయి.

**అజరామరమ్ ఆత్మానమ్ అబుద్ధ్వా పరిరోదితి ।**
**హా హతోఽహమ్! అనాథోఽహమ్! నష్టోఽస్మి ఇతి వపుర్వ్యయే ॥**

స్వస్వరూపమగు ఆత్మ సర్వదా జరామరణ రహితమైనది. ఇది ఏమరచిన ఈ జీవుడు దేహమును మాత్రమే చూస్తూ "నేను ముసలివాడనయ్యాను. నా పని అయిపోయింది. అయ్యో! నేను చచ్చుచున్నాను! నాకు దిక్కెవరూ లేరు, నేను అనాథుడను"... ఇటువంటి బాల్య చాపల్యమువంటి ప్రేలాపనలు చేస్తూ నిష్కారణంగా దుఃఖిస్తున్నాడు. కనుక ఓ ఇక్ష్వాకా! ఆత్మ లభించటమేమిటి? దానిని మరొకరు నీ కివ్వటమేమిటి? అది సర్వదా నీ రూపమే అయి, నీచే పొందబడియే ఉన్నది. ప్రతి జీవుడు అదియే అయి ఉన్నాడు. ఇక, వివిధ కార్యరూపములతో కూడిన ఈ జగత్తేమి టంటావా...? జలము తన యొక్క చలనము వలననే తరంగములు మొదలైన అనేక రూపములుగా కనిపిస్తున్నట్లు, సంకల్పవశంచేత చిద్బ్రహ్మమే వివిధ కార్యపరంపరా రూపంగా వృద్ధి చెందుతోంది.

❖

ఓ కుమారా! ముందుగా నీ చిత్తమునందలి సంకల్ప వ్యవహారమును శమింపజేయి. సంకల్పాలు లయించగా, అప్పుడు శేషించి ఉన్న కళంకరహిత చిత్తాన్ని ఆత్మయందు సంస్థాపన మొనర్చివేయి. ఇక ఈ లౌకికమైన రాజ్యాది వ్యవహారములంటావా? వ్యవహారార్థం ఈ శరీరాదులతో ఆయా క్రియలు ఆచరించుచున్నప్పటికీ వీటినన్నిటినీ అభాస మాత్రంగా చూడు. అభాసమాత్రమే అయిన ఈ కర్మలు ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మచే ఏదీ ఆచరించనివాడవై (నిష్క్రియుడవై), స్వస్థుడవై, సుఖివై ... ఇక ప్రాప్తించిన ఆయా ధర్మములను నిశ్చింతగా, నిర్వికారంగా నిర్వర్తించు.

❖❖❖

## 3. జగత్తు చిత్ దర్పణంలోని ప్రతిబింబము మాత్రమే

**మను ప్రజాపతి :** ఓ ఇక్ష్వాకు మహారాజు! ఒక బాలుడు అనేక కల్పనలతో కూడిన ఆటలను ఆశ్రయించి ఆడుకుంటూ ఉంటాడు చూచావా? పరమాత్మ అస్పష్టరూపమగు తన "అవిద్యాశక్తి"చే ఆయా సృష్టి రూప క్రియలను ఆశ్రయించుచూ చిన్నపిల్లవాడివలే స్వయముగా క్రీడించుచున్నాడు. ఆటలు ఆడుకొంటున్న బాలుడు కొద్దిసేపైన తరువాత ఆ ఆటను, అందలి కల్పిత విశేషములను త్యజించి ఇంట్లోకి వెళ్ళిపోతున్నట్లు ఆ పరమాత్మ మరొక తరుణంలో తన జ్ఞాన దృష్టిచే 'విద్య' అను సంహారకశక్తిని ప్రదర్శిస్తున్నాడు. అట్టి సంహారశక్తిచే సర్వమును ఉపసంహరించి స్వాత్మయందు పునఃప్రవేశం చేస్తున్నాడు. తన నిర్మల – అప్రమేయ – నిస్సంగ – అఖండ స్వరూప – ఔన్నత్యమును సంతరించుకుంటున్నాడు.

**ఇక్ష్వాకు చక్రవర్తి:** ఈ జీవుడు దేనిచే బంధింపబడుచున్నాడో.....అట్టి శక్తి ఎక్కడి నుండి ఏర్పడుతోంది?

**మను ప్రజాపతి :**

> **స్వయమస్య తథాశక్తిర్ ఉదేత్యాం బధ్యతే యయా ।**
> **స్వయమస్య తథాశక్తిర్ ఉదేత్యున్ముచ్యతే యయా ॥**

దేనిచే ఆత్మయే వాస్తవ స్వరూపంగా గల ఈ జీవుడు బంధింప బడుచున్నాడో... అట్టి శక్తి

ఆతనియందే స్వయంగా ఉదయిస్తోంది. అంతే కాదు. ఏ శక్తిచే ఆతడు ముక్తుడగుచున్నాడో, అది కూడా వానియందే స్వయంగా ఆవిర్భవిస్తోంది. అనగా ఆత్మనుండే బంధనశక్తి ఒకప్పుడు బయల్వెడలి, మరొకప్పుడు లయిస్తోంది.

చంద్ర, సూర్య, అగ్ని, కాల్చబడిన ఇనుపచువ్వ – వీటన్నిటి నుండి ఎట్లా ప్రకాశము వేరుగా ఏర్పడుతుందో, ఎట్లా వృక్షం నుండి ఆకులు వేరుగా ఏర్పడుచున్నాయో, సెలయేరు నుండి జలకణాలు ఎట్లా బయల్వెడలుచున్నాయో... అట్లాగే విశాలమగు బ్రహ్మమునందు బుద్ధి – జగత్తు మొదలైనవి వేరుగా కల్పనచే ఏర్పడుచున్నాయి. బ్రహ్మమునందు కల్పనచే దర్శించబడేదంతా బ్రహ్మమే అయి ఉన్నది. అందుచేత జ్ఞానులకు ఈ జగత్తంతా ఆనందమయ బ్రహ్మముగానే అనుభవమౌతోంది. అజ్ఞానులకో ఇది బ్రహ్మమునకు వేరుగా తోచుచుండుటచే దుఃఖ ప్రదమౌతోంది. ఆహాఁ! ఈ జగత్తునంతా మోహింపజేస్తున్న ఈ మాయ ఎంతటి విచిత్రమైనది! సర్వాంగములను లోపల–బయట ఆక్రమించియున్న ఆత్మను ఈ మాయ కనబడకుండా ఉంచగలుగుతోందే! ఈ జీవుడు మాయను చూస్తున్నాడు గాని ఆత్మను చూడటమే లేదు. శాస్త్రములు మాయ గురించి బోధిస్తూ ఆత్మతత్త్వమును చూపుతూ – సుస్పష్టం చేస్తున్నాయి.

**"చిదాదర్శమయం సర్వం జగత్" ఇత్యేవ భావయన్ ।**
**యస్తిష్ఠతి ఉపశాంతేచ్ఛం స బ్రహ్మకవచః సుఖీ ॥**

"ఈ జగత్తంతా చిత్ అనే దర్పణం నందు వ్యాపించి ఉన్నది. ఎందుకంటే ఇదంతా ప్రతిబింబిస్తున్నది చిత్‌లోనే కదా!" అని భావన చేస్తూ ఎవడు సమస్త కోర్కెలు త్యజించి ఉంటాడో... అట్టివానిని అజ్ఞాన బాణములు ఏమీ చేయలేవు. 'బ్రహ్మము' అను కవచమును ఆతడు ధరించి ఉంటే చాలు, ఇక ఆతడు మహాసుఖవంతుడు.

ఓ ఇక్ష్వాకూ! నీవు అహంకారరహితుడవై ఉండు. దుఃఖం ఉన్నదీ అంటే... అక్కడ అహంకార – మమకారములు ఉన్నట్లే. నీవు అభావరూపభావనతో సర్వవస్తువులు దర్శించు. అనగా "అంతయూ కూడా శూన్యమై నిరాలంబమైనట్టి చిద్రూప బ్రహ్మమే అయి ఉన్నది" అని భావన చేయి. "ఇది రమ్యమైనది, అది రమ్యమైనది కాదు. ఇది ఉచితము, అది అనుచితం. ఇది సానుకూలం, అది ప్రతికూలం"...ఇటువంటి వైషమ్యముతో కూడిన కల్పనయే నీ దుఃఖములన్నిటికి అసలైన బీజమై ఉన్నదని గ్రహించు.

**ఇదం రమ్యం ఇదంనేఽతి, బీజం తే దుఃఖసంతతేః ।**
**తస్మిన్ సామ్యాగ్నినా దగ్ధా దుఃఖస్యావసరః కుతః ॥**

ఎప్పుడైతే నీవు 'సమత్వము' అనే అగ్నిని ప్రజల్వింపజేస్తావో ...ఇక సర్వ వైషమ్య కల్పనా బీజములు దహించబడతాయి. ఆపై దుఃఖానికి చోటెక్కడిది చెప్పు? కనుక 'సమాధి' అనే అభ్యాసానికి ఉపక్రమించు. 'సర్వ దృశ్య విస్మృతి' అనే మహాస్త్రాన్ని చేకూర్చుకో. పురుష ప్రయత్నబలంతో 'రమ్య – అరమ్య విభాగ కల్పన' లను అతి త్వరగా ఛేదించివేయి.

అభావనచే భావనను లయం చేయి. సర్వ దృశ్య విస్మృతిచే దృశ్య స్మరణను నిరోధించు. 'కర్మ' అనే అరణ్యాన్ని 'ఆసక్తి రాహిత్యము' అనే ఖడ్గంతో త్రెంచివేయి.

అట్టి నిజ ప్రయత్నంతో ఆకాశముకంటే కూడా అతి సూక్ష్మమైన బ్రహ్మమును పొంది దుఃఖరహితుడవగుము.

మొట్టమొదట మన ఈ సంవాదము యొక్క ప్రయోజనంగా వివేకమును సంపాదించు. ఇక 'సమాధి' అను అభ్యాసముచే 'బాహ్య కల్పనా అభాస'ను సన్నగిల చేయి. సత్య దృష్టితో చూడగల 'పవిత్రదృష్టి'ని నిదుర లేపు.

క్రమంగా పూర్ణాత్మానుభూతిచే జగమంతా వ్యాపించి ఉండు. జగమంతా వ్యాపించిన శరీరం కలవాడై, విభాగ రహితుడవై పరమానందం పొంది ఉండు. శాశ్వతంగా సంసారరోగ వర్జితుడవగుము. శాంతమై, సమమై, ఏకరసమై, స్వచ్ఛమైనట్టి చిన్మాత్ర దేహము కలవాడవై... సంసారభయ రహితుడవై ఉండుము.

❖❖❖

# 4. 'అహమ్' నుండి 'అనహమ్'

**మను ప్రజాపతి :** బిడ్డా! 'సర్వాత్మకత్వము' అనేది ఒక అనిర్వచనీయమైన అనుభవస్థితి. అది సాధ్యము, లక్ష్యము అయి ఉండగా అందుకు సాధనములను, మధ్యే మార్గమగు వేరు వేరు అనుభవ స్థితులను శాస్త్రకారులు ప్రవచిస్తున్నారు.

అనుభవమాత్రము, 'జ్ఞేయము' అగు సర్వాత్మకత్వము వాస్తవానికి మనోవాక్కులకు లభించేది కాదు. అయితే అందుకు తరుణోపాయములను, ఆయా అవస్థలను శాస్త్రకారులు ఎట్లా ప్రవచిస్తున్నారో చెబుతాను. విను–

ప్రజ్ఞాశ్రయము – విచారణ – అసంగము – విలాపినీ – శుద్ధ సంవిన్మయానందము – నిరతి శయానందము – పరమ యోగి / పరమ హంస / తురీయవస్థ.

❖

మొట్టమొదట 'నేనీ పరిమిత పరిజ్ఞానంతో జీవితమంతా వెచ్చించటమనేది అర్థంలేని పని".... అని ఈ జీవుడు ఎప్పుడో గ్రహిస్తున్నాడు. అట్టి వేదన ఉత్పన్నమైన మరుక్షణం ఆతని ప్రయత్నమునకు సహకరించటానికి శాస్త్రములు, అనుభవజ్ఞులు సిద్ధంగా ఉన్నారు. 'శాస్త్రాభ్యాసము – సజ్జన సహవాసము...'ఈ రెండింటిచే ప్రజ్ఞను వృద్ధి పరచుకోవాలి. ఇది ప్రజ్ఞాశ్రయం అనబడేది యోగి యొక్క మొదటి భూమిక. ఇక మనస్సు నిర్మలమగుచుండగా ఆ యోగి 'విచారణ' అనబడే రెండవ భూమికలో క్రమంగా ప్రవేశిస్తున్నాడు. "ఇది అల్ప కాలికం గతించిపోయేది...' అని క్రమంగా ఈ దృశ్యం విషయమై గ్రహిస్తున్నాడు. ఏది కాలబద్ధము, భ్రమతో కూడినది అయున్నదో, అట్టి విభాగాన్ని వేరు చేసి 'అసంగము' అను మూడవ భూమికలో ప్రవేశిస్తున్నాడు. క్రమంగా సాధన కొనసాగిస్తూ

ఉండగా వాసనలకు ఆశ్రయభూతమైన అవిద్య సన్నగిల్లుతూ ఉండగా ఆ యోగి (లేక, సాధకుడు) 'విలాపనీ' అనే నాలుగవ భూమిక (లేక, నాలుగవ అవస్థలో ప్రవేశిస్తున్నాడు. ఆ విధంగా విలాపనీ యందు సాధన కొనసాగుచుండగా కొంతకాలానికి 'శుద్ధ సంవిన్మయానందము' అను 5వ భూమికలో ప్రవేశిస్తున్నాడు. ఈ ఐదవ భూమిక శుద్ధ సంవిత్తుచే పూర్ణమై ఉంటుంది. ఆనందరూపమైన ఈ భూమికలో ప్రవేశించిన యోగిని 'జీవన్ముక్తుడు' అని అనవచ్చు. ఈ భూమికలో ఆతడు అర్ధ నిద్రితుడు గాను, అర్ధ జాగృతుని వలెను ఉంటాడు.

అట్టి ఐదవ భూమికలో కొంత కాలమున్న తరువాత యోగి 'స్వభావనిరతిశయానందము' అను ఆరవ భూమికలో ప్రవేశిస్తున్నాడు. ఈ భూమిక (లేక అవస్థ) బ్రహ్మాకారము అను అనుభవవృత్తి రూపంగానూ, స్వభావంగానే నిరతిశయానందరూపంగానూ ఉంటుంది. లౌకిక జగత్తు దృష్ట్యా ఇది సుషుప్తి రూపము వంటిది. ఇందులో ఏర్పడి ఉండే కించిత్ వృత్తి కూడా లయించుచుండగా ఆ 'పరమయోగి' (లేక, పరమహంస) కేవలముక్తి రూపమై, సౌమ్యమైనట్టి 'తురీయాతీతావస్థ' అనే ఏడవ భూమికలో ప్రవేశిస్తున్నాడు.

ఇట్టి 'తురీయాతీతావస్థ' అనే ఏడవ భూమిక పరా నిర్వాణరూపమైనది. ఈ సప్తమ భూమిక మిక్కిలి ప్రౌఢమైతే 'విదేహముక్తి' లభిస్తుంది. అట్టి ఏడవ భూమికకు అతీతమైన స్థితి కేవలానుభవమే తప్పించి సదేహుల సంభాషణకు అందేది కాదు. అయితే ఆ విదేహముక్తి అనుభవానికి లభ్యమే సుమా!

**తురీయాతీతము -**

7. తురీయాతీతము : స్వయంప్రకాశ రూపం, మనోవాక్కులకు అగోచరం
6. స్వభావ నిరతిశయానందము : కేవల స్వరూప మాత్ర – తురీయావస్థ
5. శుద్ధ సంవిన్మయానందం : సుషుప్తరూపం
4. విలాపనీ : స్వప్నరూపం
3. అసంగము
2. విచారణ జాగ్రదావస్థలు
1. ప్రజ్ఞాశ్రయం–శాస్త్రాశయం

(3, 2, 1) → ఈ మూడు జాగ్రదవస్థలు

మనోవాక్కులకు అగోచరం, కేవలానుభవమాత్రం.

'సప్తమ భూమికామహాసమత్వము' అనబడే 7వ భూమికలో అంతరంగమునందు సమస్తమూ లయించి పోతాయి. విషయములు భాసించవు. ఇట్టి యోగి 'ముక్తుడు' అని కూడా పిలువబడుచున్నాడు. 7వ భూమికలో ప్రవేశించిన వాని బుద్ధి సుఖములచే గాని, దుఃఖములచే గాని కొంచెం కూడా స్పృశించబడదు. 'ఈ శరీరం ఉన్నా ఒక్కటే! లేకున్నా ఒక్కటే' అను మహత్తర భావమును ఆతడు కలిగి ఉంటాడు. 'నేను మరణించటం లేదు. జీవించటం లేదు. నేను సత్తును గాను. అసత్తును గాను' అని గ్రహించి కేవలం ఆత్మారాముడై ఉంటాడు కాబట్టి ఈతనిని మనం 'జీవన్ముక్తుడు' అను శబ్దానికి సరితూగే అర్థంగా చెప్పుకుంటాం.

**వ్యవహార్యుపశాన్తోవా, గృస్థోవా అథ వైకకః,**
**అహం న కించిత్ చిదితి, మత్వా జీవో న శోచతి॥**

**అలేపకోఽహమ్, అజరో, నీరాగః, శాంతవాసనః**
**నిర్మలోఽస్మి చిదాకాశ ఇతి మత్వా న శోచతి॥**

**అహమ్ అన్తాది రహితః శుద్ధోబుద్ధో అజరామరః**
**శాన్తః సమసమాభాస ఇతి మత్వా న శోచతి॥**

**తృణాగ్రేషు అంబరే భానౌ నర నాగ అమరేషుచ,**
**యత్తదస్తి తదేవ ఇతి మత్వా భూయో నశోచతి॥**

'సంసారము – అనబడే దానిచే నేను లిప్తుడను అయ్యేవాడిని కాను. దేహధర్మములైన వార్ధక్యాదులు నా స్వస్వరూపమునకు లేవు. రాగద్వేషములు నా నిర్మల స్వస్వరూపమునకు లేవు. నేను వాసనా శూన్యుడను. నిర్మల చిదాకాశమాత్రుడను' అని ఎరిగియే ఉండటంచేత సుఖ–దుఃఖ ద్వంద్వములు అతనిని సమీపించనైనా లేవు.

"నేను వ్యవహారస్థుడనై ఉండవచ్చు. లేదా వ్యవహారములు లేనివాడనై ఉండవచ్చు. గృహస్థుడనైనా, సన్యాసిని అయినా సరే ...ఏది ఏమైనా, ఎట్లున్నా, నేను చిన్మాత్రుడను"అని విశ్వసించే యోగి ఇక దుఃఖము పొందే ప్రసక్తే ఉండదు.

"నేను ఆద్యంతాలు లేని వాడను. శుద్ధుడను. బుద్ధుడను. వార్ధక్యాదులు నాకు లేవు. అమరుడను. శాంతుడను. సర్వత్రా–సమంగా భాసించేవాడను" అని ఎరిగిన తర్వాత ఇక ఆ యోగిని శోకమోహాలు సమీపించటానికి సాహసించలేవు. 'ఒక గడ్డి పరక చివరి కొసభాగంలోను, ఆకాశమందు, సూర్యుని యందు, మనుష్యులందు, పాములందు, దేవతలందు ఏ సన్మాత్రము ఉండి ఉన్నదో, ఆ ప్రత్యేక చిన్మాత్రమే నేను'... అని ఈ విధంగా అఖండ వాక్యార్థం ఎరిగిన తరువాత దుఃఖించుటకు కారణమే కనిపించదు. "చిద్రూపుడనగు నా యొక్క మహిమయే సర్వజంతువులలోను, ఇటు భూమియందు, అటు ఆకాశమునందు అంతటా వ్యాపించియున్నది"... ఇట్లు అనంత విలాసయుక్తునిగా తనను తాను గ్రహించి తీర్చిదిద్దుకునే ఆ మహాత్ముని మరణాది దుఃఖములు ఎట్లా అడ్డుకుంటాయి?

❖

ఓ ఇక్ష్వాకూ! ఈ కనబడే వస్తువులలో సాంసారిక జీవుడు ఏదో సుఖాశతో వెతకుచున్నాడు. అయితే సుఖము ఎక్కడ లభిస్తుంది? వాసనలతో కూడిన అజ్ఞానికి ఏఏ పదార్థములు ఇప్పుడు సుఖములు కలిగిస్తున్నాయని నమ్ముకొని ఉంటున్నాడో, అవన్నీకూడా ఒకప్పటికి కాలక్రమేణా నశించేవే! కనుక నశించేటప్పుడు అవి అతి శీఘ్రంగా దుఃఖమును కలిగించబోతున్నాయి.

"మాకున్నవన్నీ ఇట్లాగే ఉంటాయి? ఈయన ఏమిటి, ఇట్లా అంటాడు?"...అని ఎవరైనా అనదలిస్తే ... వారికి – "భౌతికానుభవములకు ఉపకరణమైన దేహమే కాలక్రమేణా నశించబోతోంది కదా"...అని గుర్తు చేస్తున్నాం. అందుచేత, "ఏఏ వస్తువులు వాసనారహితమైన మనస్సుచే అనుభవించ

బడతాయో, అవి మాత్రమే దుఃఖరహితమైన సుఖమును అందించగలుగుతాయి'... అని జనులందరికీ నా మనవి.

**అవినాభావ నిష్ఠత్వం ప్రసిద్ధం సుఖ-దుఃఖయోః,**
**తనువాసన మర్థో యః సేవ్యతే వా వివాసనమ్,**
**నాసౌ సుఖాయతే, నాసౌ నాశకాలేన దుఃఖ దః ॥**

ఈ సుఖ-దుఃఖాలనేవి ఒకదానితో మరొకటి 'అవినాభావ సంబంధం' కలిగి ఉన్నాయి. 'ఇది సుఖం' అన్నచోట 'మరొకటి దుఃఖం' అని అనుకున్నట్లే అవుతుంది. వాసనారాహిత్యంచే ఏది అనుభవించబడుతుందో అది సుఖం కలిగించజాలదు. అది తొలగినప్పుడు దుఃఖం కూడా కలిగించజాలదు.

ఎవడు వాసనలు నశించిన బుద్ధితో ఏది చేస్తాడో, అది దగ్ధమైన బీజంలాగా మరల అంకురించ జాలదు. అట్టివాని కర్మలన్నీ దేహేంద్రియముల చేతనే నిర్వర్తించబడుచుండగా, మనస్సు అకర్తృత్వము వహించి ఉండే సామర్థ్యము కలిగి ఉంటుంది. వాసనలు కలిగి ఉండే మనస్సు అకర్తృత్వమును వహించాలని అనుకున్నా కూడా ...వల్ల కాదు.

❖

ఇంద్రియ సమూహములన్నిటియందు ఏకస్థమైయున్న శుద్ధ చైతన్యము ఇంద్రియ వ్యవహారానికి కర్తగాని, భోక్తగాని ఎట్లా అవుతుంది? ఎందుకంటే ఈ ఇంద్రియములకు, 'అహం' భావనకు కూడా శుద్ధ చైతన్యం వేరుగా ఉంటోంది. అయితే ఆ శుద్ధ చైతన్యం జడమగు ఇంద్రియ అహంకారాదులకు ప్రవర్తనశక్తిని ప్రసాదిస్తోంది. ఆ చైతన్యతత్త్వమే ఇంద్రియాలను వెలిగిస్తోంది గాని, ఇంద్రియాలు అద్దానిని ప్రకాశింపజేయటం లేదని గ్రహించు. అయ్యది పూర్ణచంద్రదీప్తి వలె పూర్ణ ప్రకాశమానమై ఉన్నది. అదొక్కటే స్వయం ప్రకాశకమని, తక్కినదంతా అద్దాని ప్రభావ వీచికలు మాత్రమేనని ఎరిగి ఉండు. ఇక ఈ దేహం విషయం అంటావా! ఈ దేహము, దేహమునకు సంబంధించిన భావన, దేహముచే నిర్వర్తించబడే ఆయా క్రియలు ...ఇవన్నీ కూడా 'జ్ఞానము' అనే వాయువు గట్టిగా వీచినప్పుడు (ఇవి) నిర్విషయమై ఎటో కొట్టుకుపోతాయి.

❖

నీవు శాశ్వతం - నిర్మలం అగు చైతన్యస్ఫూర్తి అయి ఉన్నాయి. ఇక ఈ దేహమో? ఈ మధ్య కాలంలో వచ్చినది. మధ్యలోనే పోతోంది. ఈ దేహకళలు నీ చైతన్య కళలను కప్పి ఉంచగలవా? లేదు. మరి చైతన్య కళలను చూచి ఆనందించక ...ఈ దేహ కళలను చూచి దుఃఖించవలసిన పనేమిటి?

**సర్వైవ హి కలా జంతోః అనభ్యాసేన నశ్యతి,**
**ఏషా జ్ఞాన కలాత్వస్తః సకృజ్జాతా దినేదినే,**
**వృద్ధిమేతి బలాదేవ సుక్షేత్ర వ్యుప్తశాలివత్॥**

దేహ సంబంధితమైన ఏ కళంకాలు ఉన్నాయో, అవన్నీ అనభ్యాసం వల్ల నశించిపోతాయి. అయితే స్వస్వరూప చైతన్యమునకు సంబంధించిన జ్ఞానకళ అట్టిది కాదు. ఆత్మజ్ఞానము జనించిందా,

అట్టి కళ తదితర దేహ సంబంధిత విషయముల వలె కాలబద్ధంకాదు. కాబట్టి మంచి ప్రదేశంలోని పూలమొక్కవలె దినదినం వృద్ధి చెందగలదు. అందుచేత నీవు దేహకళలను ఆశ్రయించటం తగ్గించి జ్ఞానకళను ఆశ్రయించు.

ఓ కుమారా! ఇక్ష్వాకా! సమస్త తటాక – నదీ – సముద్రములందునూ ఒకే స్వచ్ఛమైన జలం ఏర్పడి ఉన్నట్లు – ఒకే 'విశ్వరూప – సన్మాత్రము'అగు ఆత్మ ఈ సమస్త పదార్థములందును సర్వదా స్ఫురిస్తోంది. కనుక ఈ జగత్తంతా కూడా సమస్త విచిత్ర కల్పనా రహితమైయున్నదని, ఏకసత్తాంశమాత్రమని గ్రహించి ఉండు. వ్యక్తిగతమైనది ఎచ్చటైతే ఏమాత్రం లేదో, అట్టి జగదహంకారాదుల దాని గురించి లెక్కలు కట్టుకుందో దుఃఖించవలసిన పని నీకేమున్నది?

❖❖❖

# 5. సచ్చిదానందమును సంతరించుకో

**ఇక్ష్వాకు చక్రవర్తి :** హే ప్రజాపతీ! ఈ ఆత్మకు జీవత్వమనేది ఎంతవరకు అనివార్యమై ఉంటుంది?

**మను ప్రజాపతి :** ప్రియకుమారా! ఎంతవరకైతే విషయ భోగేచ్ఛల గురించి 'ఆశ' అనేది అంతర్గతంగా కలిగి ఉంటుందో అంతవరకు ఆత్మకు 'నేను జీవుడను' అనే దశ ఉండియే తీరుతుంది. మరి విషయ భోగాశ ఎక్కడి నుండి వస్తోంది? అది 'అజ్ఞానము' అనే వీచికయేగాని, అవివేకముచే సంప్రాప్తిస్తున్నదే గాని వాస్తవమైనది కాదు.

వివేకము బలం పుంజుకుంటూ ఉంటే భోగాశ తనంతట తానే క్షయిస్తూ ఉంటుంది.

విషయ భోగాశ క్షీణించగానే అప్పుడు ఆత్మ జీవదశను త్యజించి స్వభావసిద్ధము, అనామయము అగు 'బ్రహ్మరూపత్వం' పొందుతోంది. అప్పుడు దేహము ఉన్నా, ఉండకపోయినా బ్రహ్మానుభవం ఏర్పడియే ఉండగలదు.

బొక్కెన త్రాడుచే కట్టబడి క్రిందినుంచి పైకి, పైనుండి క్రిందకు బలవంతంగా తిరుగాడుతున్నట్లు, 'భోగవాంఛ' అనే అవివేక స్వభావం (చింతన) అనే త్రాడుచే కట్టబడి ఈ సంసార కూపం (నుయ్యి)లో తిరుగాడుతోంది. అట్టి చింతన అనే త్రాడుచే భోగవాంఛాస్వభావుడవై బంధించ బడబోకు.

ఈ భోగవాంఛ అనేది చాలా చమత్కారంగా జీవుని ఆవరించి ఉంటోంది. దాని రూపమేమిటో చెబుతాను విను.

**"ఇది నాది -నేను దీనికి చెందినవాడను?" -** 'ఇది నాది, నేను దీనికి చెందిన వాడిని'... అని ఘనీభూతమైన వ్యవహార భ్రమను ఎవరైతే మోహవశంచేత ఆశ్రయించి ఉంటారో ... అట్టి మూర్ఖులు ఇంకా క్రిందకు, అక్కడి నుండి ఇంకా ఇంకా క్రిందకు పడిపోతూనే ఉంటారు. నేను వీనికి చెందిన వాడిని. ఇతను నా వాడు. ఈ దేహం నేను ...ఈ ప్రకారంగా మోహమును ఆశ్రయిస్తూ ఎవరు జ్ఞానానికి దూరమౌతూ ఉంటారో వారిని ఎవరు ఎట్లా కాపాడగలరు? అట్టి మోహమును పరిత్యజిస్తూ ఉండేవారో ... క్రమక్రమంగా ఉన్నతిని సంపాదించుకోగలరు.

❖

కనుక ఓ రాజా! ఇప్పుడు నీవు చెయ్యవలసినదేమిటో చెబుతాను. స్వయం ప్రకాశరూపమగు నీ యొక్క ఆత్మను అవలంబించు. అట్టి సంపూర్ణభావనచే ఈ జగత్తులన్నిటినీ నింపివేయి. జగత్తులన్నిటా పూర్ణమొనర్చి వ్యాపించియున్న 'చిదాకాశము'నే గాంచుము. ఎప్పుడైతే అఖండ-అప్రమేయ -నిర్మల చిద్రూపమును సర్వే సర్వత్రా దర్శిస్తావో అప్పుడు నీవీ సంసార సాగరమును అధిగమించి పరమేశ్వరత్వం పొందుతావు. ఉత్తమ భావన చేయి. ఉత్తముడవౌతావు.

**ఇక్ష్వాకువు :** 'ఉత్తమభావన'అంటే తమ ఉద్దేశం చెప్పండి.

**మను ప్రజాపతి :** 'బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు, వరుణుడు, ఈశ్వరుడు మొదలైన వారంతా ఏదేది చేయటానికి ఉద్యమిస్తున్నారో ...అదంతా కూడా చిత్ శరీరినగు నేనే చేయుచున్నాను'... అని భావన చేయి. 'చిత్'యొక్క విలాసము నిరంకుశము కాబట్టి ఏదేది ఎట్లు భావన చేస్తే అదియే క్రమంగా సిద్ధించగలదు. ఏ భావన యొక్క ఉత్కృష్టత త్రిమూర్తులలో ఉన్నదో అది కూడా నీవే అగుచున్నావు. అట్టి 'ఆత్మాఽహం' భావనచే దృశ్యము వైపుగా ఎక్కుబెట్టబడి ఉన్న చిత్తం ఉపశమించి బ్రహ్మాకారం పొందుతోంది. చిత్తం శమించగా, మృత్యువును అధిగమించి చిన్మాత్రత్వం (నేను శుద్ధ చిత్‌ను – అనే ఆరూఢత్వం) పొందిన వారికి ఏ పరమానందం లభిస్తోందో అది దేనితో పోల్చగలం?

ఇక ఈ జగత్తు విషయంలో ఎట్టి భావన కలిగి ఉండాలో ...చెబుతాను విను. "ఈ జగత్తు శూన్యం కాదు. అశూన్యమూ కాదు. చిద్రూపం కాదు. అచిద్రూపమూ కాదు. ఆత్మరూపం కాదు. అనాత్మ రూపం కాదు. ఇది భావన అను ప్రక్రియపై ఆధారపడి ఉన్నది..." అని గమనిస్తూ జగద్భావనను అధిగమించి ఆత్మను మాత్రమే ఆశ్రయించి ఉండు.

'ఆత్మ సాక్షాత్కారం' అనే సాక్షాత్ పారిమార్థిక స్వరూపం ప్రాప్తిస్తూ ఉండగా ఈ ప్రకృతి తనకు తానే స్వయంగా తొలగిపోగలదు.

**ఏతత్ స్వరూపమాసాద్య ప్రకృతిః పరిశామ్యతి ।**

**న దేశో మోక్షనామాస్తి న కాలో నేఽతరా స్థితః ॥**

"మోక్షం అని పిలుబడే స్థితి ఎప్పటికో, ఎంతోకాలానికి గాని రాదు. ఎక్కడో మరొకచోటు అది. మోక్షస్థితిలో మనం ఇట్లా ఉండం. మరొక స్థితిలో మరొకటేదో రూపంలో ఉంటాం"... అని లోక రీతిగా అనుకుంటూ ఉంటారు. అదంతా వాస్తవంకాదు. మోక్షమనేది ఎక్కడికో వెళ్ళిన తరువాతనో, ఏ మరొక స్థితి పొందిన తరువాతనో, ఏ కొంత కాలమో జరిగిన తరువాతనో వచ్చి కూర్చునేది కాదని గ్రహించు. మరి?

వ్యక్తిగతమైన అహంకారం (లేక) దేహగతమైన 'అహంకార – మమకారములు' అనే మోహం క్షయిస్తూండగా, ఆ ద్రష్ట అంతరంగంలో ఈ ప్రకృతి యొక్క ప్రభావం పరిశ్యామం పొందుతూంటుంది. అప్పుడా ద్రష్టకు "నేనే ఆత్మను. ఆత్మ గురించి చెప్పబడిన అఖండ అప్రమేయాది లక్షణములన్నీ నా స్వరూప వర్ణనలే"...అని సుస్పష్టమౌతుంది. అనుభవైక వేద్యమౌతుంది. అట్టి అవగాహన యొక్క – వాక్‌మనో అతీతమైన వైభవం – అనుభవాల ఔన్నత్యస్థితినే 'మోక్షం' అని పిలుస్తారు.

అనేక శాస్త్రముల అనేక కథా – సోదాహరణములు, విభాగ సిద్ధాంతములు, విధి విధానాదులు చెప్పుకుపోతున్నాయి. మా ఉద్దేశంలో అవన్నీ కూడా 'నేను నిత్యసత్యమగు నిర్మలాత్మను'... అని నిరూపించుటకొరకై (మధ్యే మార్గ ప్రతిపాద్యములై) ఉన్నాయి. అందుచేత వివిధ శాస్త్రముల గూర్చిన 'జిజ్ఞాస'అనే చపలత్వం కూడా శమించవలసిన వాటిలో ఒకటియే అయియున్నది. అట్టి 'శాస్త్రార్థజిజ్ఞాస'అనే చపలత్వం కూడా శమించినవాడు, అనేక విధములగు కావ్య – నాటక కౌతుకములు కూడా లేనివాడు, సమస్త వికల్ప – ఉపద్రవములు తొలగినవాడు, సమరూపమగు జీవన్ముక్తత్వము సంపాదించుకొన్న మనిషి శాశ్వతమైన సచ్చిదానందముతో సుఖ పూర్వకంగా ఏర్పడి, ఈ ప్రపంచమున ఉండగలడు.

ఓ ఇక్ష్వాకూ! నీవు కూడా అట్టి సచ్చిదానందత్వము అనువర్తించుకో. సంతరించుకో. ఇక ఏది ఎట్లు ఉచితమో అట్లే అగుగాక!

❖❖❖

# 6. జీవన్ముక్త మాహాత్మ్యం

**ఇక్ష్వాకు చక్రవర్తి :** ప్రభో! పవిత్రమగు జీవన్ముక్తత్వము సంతరించుకున్న మహనీయుల ప్రవర్తన ఎట్లా ఉంటుంది? వారిలో ప్రత్యేకమైన లక్షణాలేమైనా కనిపిస్తాయా? వారితో ఎటువంటి సంబంధం కలిగి ఉండటం మావంటి వారికి అనుచితం? అసలు వాళ్ళు ఎక్కడెక్కడుంటారు?

**మను ప్రజాపతి :** జీవన్ముక్తునికి 'ఇక్కడే ఉండాలి – అక్కడ ఉండకూడదు' అనే సాంఘిక – లౌకిక సిద్ధాంతాలు వర్తించవు. ఎక్కడైనా ఏదో తింటూ, ఎవరో ఏ వస్త్రమో కప్పితే కూడా తన ఇచ్ఛానుసారం ఉండగలడు. వర్ణాశ్రమ ధర్మాలనుండి, శాస్త్రరూప యంత్రము నుండి అంతర్గతంగా విడువబడినవాడై ఉంటాడు. బాహ్యానికి ఏది ఎట్లు ఎంతవరకు లోకానుకూలంగా అవుతుందో, అది అట్లే అనుసరిస్తాడు. 'జీవన్ముక్తుడు' బోను నుండి సింహం లాగా ఈ జగజ్జాలము నుండి బయల్వెడలుచున్నాడు. వాక్కుచే అందనట్టి నిరతిశయానందము పొంది ఉంటాడు. విషయదశల నుండి విడివడినవాడగు ఆ యతివర్యుడు శరద్రుతువులోని మేఘరహిత నిర్మలాకాశంలాగా ఒకానొక అనిర్వచనీయ శోభను పొందుచున్నాడు. పర్వతముపైన గల ఒక పెద్ద మడుగులాగా గంభీరుడై, నిర్మలుడై ఒప్పుతూ ఉంటాడు. 'ఆత్మానంద రసాస్వాదము' నుండి చ్యుతుడు కావటానికి ఆతనికి కారణమే కనిపించదు. సదా, సర్వదా, సర్వ అవస్థలలోనూ ఆత్మయందే క్రీడిస్తూ ఉంటాడు.

**సర్వకర్మఫలత్యాగీ, నిత్యతృప్తో, నిరాశ్రయః ,**
**న పుణ్యేన, న పాపేన లిప్యతే నేతరేణచ ॥**

సమస్త కర్మల ఫలములను మొదలే త్యజించివేసి ఉంటాడు. నిత్యతృప్తుడై, నిరాశ్రయుడై ఈ మాయామేయ జగత్తు యొక్క నిత్యానిత్య రహస్యములను ఎఱిగి ఉంటాడు. పుణ్యపాపములుగాని, తదితరములైన హర్ష – శోకములు గాని ఆతనిని అంటజాలవు.

**స్ఫటికః ప్రతిబింబేన యథాయాతి న రంజనమ్**
**తత్‌జ్ఞః కర్మఫలేనాన్తస్తథా నా యాతి రంజనమ్॥**

ఒక స్ఫటికమును ఒకచోట ఉంచామనుకో. అందులో ఎదురుగా ఉన్న ఎరుపు రంగు వస్త్రం ప్రతిబింబించటం చేత స్ఫటికము ఎఱుపుగా కనిపిస్తుంది. అంతమాత్రం చేత "స్ఫటికం రూపాంతరం పొందింది"...అని అనగలమా? స్ఫటికం ఇతఃపూర్వపు నిర్మలత్వం కోల్పోతుందా? ప్రతిబింబిత వస్తువును ప్రక్కకి పెట్టగానే స్ఫటికం యథాతథమౌతుంది కదా! అట్లాగే ప్రారబ్ధ కర్మ ఫలరూపములగు ఇక్కడి సుఖ - దుఃఖాదులచేత ఆ జీవన్ముక్తుడు ఆత్మ స్వభావము నుండి ఏమాత్రం చ్యుతుడు కాడు. ఒక ప్రక్క జన సమూహం మధ్య విహరిస్తూనే, స్వతంత్ర బుద్ధితో ఆత్మారాధన చేస్తూనే ఉంటాడు. అద్దము తనలో ప్రతిబింబించే దృశ్యము వృద్ధిచెందినా ఖండింపబడినా ఖేదము పొందదు కదా! దేహము పూజించబడుచున్నప్పుడు, ఖండించబడుచున్నప్పుడు కూడా - అద్దంలో ప్రతిబింబించే దేహము మోహముగాని, గర్వముగాని, దుఃఖం గాని పొందనట్లు - ఆతడు దేనికీ ఖేద, దుఃఖ, మోహ, గర్వాదులు పొందడు. పూజింపబడనప్పుడు కూడా స్తుతి శూన్యుడై ఉంటాడు. పూజితుడు కాకున్నప్పటికీ వికార రహితుడై ఉంటాడు. ఒకప్పుడు ఆచారనియమములు పాటిస్తున్నప్పుడు, మరొక్పుడు పాటించని తరుణంలోను కూడా ఆతని ఆత్మావగాహన ఒకే తీరుగా ఉంటుంది. ఆ ఉభయములు ఆతనికి ఒక్కటే అవుతాయి.

**తస్మాన్ నో ద్విజతే లోకో, లోకాన్నోద్విజతే చ సః**
**రాగద్వేషభయానంద్తైః త్యజ్యతేఽపి చ యుజ్యతే॥**

ఆతనిని చూచి లోకము, భయం పొందదు. లోకమును చూచి ఆతడు భీతుడు కాడు. ఒకప్పుడు రాగ-ద్వేష-భయ-ఆనందాలు త్యజించి ఉంటాడు. మరొకప్పుడు లీలామాత్రంగా కూడి ఉంటాడు. అవి ఉన్నా, లేకున్నా ఆతని ఆత్మానుభూతికి కొఱత ఉండదు. ఇక ఆతని తత్త్వజ్ఞానానుభవం యొక్క లోతును ఎన్నో లౌకిక తెలివి తేటలు కలవాడు కూడా కనుగొనలేడు. అయితే వ్యవహారానికి వస్తే శుద్ధచిత్తుడైన ఒక చిన్నపిల్లవాడికి కూడా ఆతను ఇట్టే వశమై ఉంటాడు.

**తనుం తయ్జతు వా తీర్థీ శ్వపచస్య గృహేఽపి వా**
**మా కదాచన వా రాజన్। వర్తమానేఽపి వా క్షణే॥**

ఒక పవిత్ర క్షేత్రంలో దేహం విడచుచుండవచ్చు గాక. లేదా, మరెక్కడో అపవిత్రమైన పరిసరాలలో విడుచుచుండవచ్చు. ఈ శరీరమును సుదీర్ఘ కాలం కలిగి ఉండవచ్చు. అల్పకాలంలోనో, లేక మరికొద్ది క్షణములలోనో త్యజించవలసి ఉండవచ్చు. ఈ అన్ని సందర్భములలోనూ ఆతనికి ఏ ప్రత్యేకతా కనిపించదు. దేహ గ్రాహ్యంలోగాని, దేహ త్యాజ్యంలోగాని ఆతనికి విశేషమేదీ కనిపించదు. ఆతనియందు కోర్కెలేవీ ఉండనందువల్ల జ్ఞాన ప్రాప్తిపొందిన సమయంలోనే ముక్తిని పొంది ఉంటాడు. పఠన శ్రవణాదుల ద్వారా జ్ఞాన విషయములు పొంది ఆత్మానుభవి అయి శేషిస్తాడు గాని, "ఈ ఈ క్రియల తరువాతనే ముక్తి"... అనే వ్యవహారం యొక్క అగత్యం ఆతనికి ఉండదు.

ఈ ప్రపంచంలో జీవునికి ప్రతిబంధకమగుచున్నది అహంకారమే కదా! జీవన్ముక్తునిలో 'అహంకారభ్రాంతి' అనే బంధనం ఉండదు. జ్ఞానముచే అది స్వతఃసిద్ధంగానే రహితమైపోయి ఉంటుంది. ఆ జీవన్ముక్తుడే మోక్ష స్వరూపుడు. అంతేగాని ఆతని పట్ల మోక్షమనేది ఎక్కడినుండో వచ్చేది కాదు.

ఓ ఇక్ష్వాకు చక్రవర్తీ! అటువంటి మహనీయులు ఈ భూమిపై ఉన్నారు. వారు పూజనీయులు. వారిని పూజించినవారు, నమస్కరించినవారు కూడా పవిత్రులు, జ్ఞానైశ్వర్యులు కాగలరు. అందుచేత ప్రయత్నపూర్వకంగా అట్టి వారిని దర్శించాలి. నమస్కరించాలి, స్తుతించాలి. అభివందనలు సమర్పించాలి. ఎందుకంటే వారు ఇక్కడి సంసారరోగమును తమ చూపుచే, వాక్కుచే, స్పర్శచే శమింపజేయగలరు.

ఓ జనులారా! ఆత్మవేత్తలపట్ల మీరు భక్తి-ప్రపత్తులు కలిగి ఉండండి. ధర్మపరిరక్షణకు, సంసారమందు చిక్కుకున్న ఈ మనస్సును ఎప్పటికైనా ఇవతలకు లాగి 'మోక్షమార్గము' అను పవిత్ర ప్రదేశములో నిలిపి ఉంచటానికి ఈ లోకమునకు వారే దిక్కు. వారే ప్రవక్తలై ధర్మ సంరక్షణార్థం జన్మించి పెడత్రోవనపోతున్న ఈ జన స్రవంతిని దుఃఖముల నుండి కాపాడి లోకముకు మహోపకారం చేస్తూ ఉంటారు. ఆత్మవేత్తలను దర్శించటం, వారితో సంభాషించి ఆత్మజ్ఞానోన్నతిని సంపాదించటం వలన కలిగే పవిత్ర ఫలము యజ్ఞ-తీర్థ-తపో-దానాదులచే కూడా లభించజాలదు. ముముక్షువులగు జనులు తమ ప్రయత్నసౌలభ్యం కోసం జీవన్ముక్తులు, జ్ఞానులు అగు వారికొరకు వెతుకుతూ ఉండటం, వారు తారసబడినప్పుడు వినమ్రులై అనుద్వేగకరములైన ప్రశ్నలచే సంభాషించి తద్వారా ఆత్మజ్ఞాన వివేకమును పెంపొందించుకోవటం అవశ్య కర్తవ్యమై ఉన్నది.

ఓ ఇక్ష్వాకా! ఇక నీకు శుభమగుగాక! లోకములందు ఆత్మ వివేకము పరిఢవిల్లి, నా బిడ్డలగు ఈ జనులంతా దుఃఖరహితులగు గాక!

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇట్లు దీవించి భగవంతుడగు ఆ మనుప్రజాపతి శీఘ్రంగా బ్రహ్మలోకమునకు జేరుటకై అంతర్ధానమైనాడు. మహనీయుడగు మను ప్రజాపతి చెప్పిన ప్రతివాక్యమును వివేకముతో విశ్లేషించి, ఆత్మదృష్టిని దృఢంగా అవలంబించిన మీ వంశజుడగు ఆ ఇక్ష్వాకువు స్థిరచిత్తుడైనాడు.

❖❖❖

## 7. జీవన్ముక్తుడు - సామ్యస్థితి

**శ్రీరాముడు :** ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడవగు ఓ వసిష్ఠమహర్షీ! మనం ఇన్ని రోజులుగా అనేక సందర్భములలో జీవన్ముక్తుని గురించి చెప్పుకున్నాం. అయినా కూడా మా పూర్వీకులైన ఇక్ష్వాకు చక్రవర్తి మను ప్రజాపతిని అడిగినట్లే నాకు కూడా మిమ్ములను అడగాలనిపిస్తోంది. జీవన్ముక్తులగు

మహనీయులు ఉన్నారని, వారిని సేవ – స్తోత్రాదులచే సంతసింపజేయటం విధ్యుక్తధర్మమై ఉన్నదని మనుప్రజాపతి చెప్పారు. సన్మతి అయిన జీవన్ముక్తుని వెతికి పట్టుకోవటం ఎట్లా? ఆతనిలో ఏ ప్రత్యేకతలు ఉంటాయి? సాంసారిక జనులలో ఉండనిది, జీవన్ముక్తులలో కనిపించేవి ప్రత్యేక లక్షణాలు ఏమైనా ఉన్నాయా? వారియందు ఏవైనా ఉత్తమ శక్తులు గాని, మరింకేమైనా గాని–మనం గుర్తించటానికి వీలుగా ఉంటాయా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** జ్ఞానికి జ్ఞానమే అతిశయం. అజ్ఞానికి అజ్ఞానమే అతిశయం. ఇక సాంసారిక సిద్ధులంటావా? మనం చూడాలోపాఖ్యానంలోను, అంతకు ముందే మరికొన్ని సందర్భములలోను జ్ఞానము–భౌతికసిద్ధులు–ఈ రెండు ఒకదాని ననుసరించి మరొకటి తప్పక ఉండాలనే నియమమేదీ లేదని చెప్పుకున్నాం. ఇప్పుడు సందర్భం వచ్చింది కనుక మరికొంత విశ్లేషణం చేసుకుందాం.

❖

జ్ఞానికి, (లేక) జీవన్ముక్తునికి సాంసారిక సిద్ధుల విషయమై కొంచెము కూడా అతిశయముతో కూడిన పట్టుదల ఉండదు. ఎందుకంటే ఆతడు సర్వదా నిత్యతృప్తుడై, శాంతచిత్తుడై ఆత్మయందే నెలకొని ఉంటాడు.

జనులు ఎంతో తపస్సు చేసి, మంత్ర – తంత్రములను దీర్ఘకాలం ఆశ్రయించి, అప్పుడు ఆకాశగమనము మొదలైన భౌతికశక్తులు సంపాదిస్తున్నారు. జ్ఞాని ఆ మంత్రవేత్తను, ఆతని భౌతిక శక్తులను కూడా తన రూపంగానే దర్శిస్తూ ఉంటాడు. అందుచేత వాటి ప్రాప్తియందు ఆతనికి అపూర్వమైనదేదీ కనిపించదు. అనేక మంత్ర – తంత్రాదులను నిర్వర్తించుటలో అణిమ – గరిమ – లఘిమ – ఈత్వ – వశిత్వ – ప్రాకామ్య – ఇచ్ఛాది సిద్ధులు లభిస్తున్నాయి. అవన్నీ స్వప్రయత్నముల చేతనే సాధించబడుచున్నాయి. కాబట్టి అవన్నీ సపూర్వములే గాని, అపూర్వములైనవి కాజాలవు. ఆత్మజ్ఞాని స్వతఃగాను, అకృత్రిమంగాను సర్వాత్మభూతుడై ఉంటాడు. అందుచేత ఇతరులచే అనేక ప్రయత్నముల ద్వారా సంపాదించబడుచున్న ఆయా సాంసారిక సిద్ధులు ఆ సాధకులయందే తాను ఉండి ఉన్నట్లు అనుభూతి కలిగి ఉండడంచేత తనచేత సాధించబడుచున్నట్లే గాంచగలడు. మరి తాను వాటిని సాధించుటవలన కలిగే నూతన ప్రయోజనమేదీ ఆతనికి కనిపించదు.

**ఏష ఏవ విశేషో అస్య న సమో మూఢబుద్ధిభిః**
**సర్వత్రా స్థాపరిత్యాగాన్నీరాగమమలం మన్యా**
**భావేత్తస్య మహాబుద్ధేర్నాసౌ వస్తుషు మజ్జతి ॥**

'ఆత్మజ్ఞాని మూఢబుద్ధులతో సమానంగా ఉండడు.' రాగ–ద్వేషాదులు పొందడు. ఆత్మనిశ్చయం వదలడు. ఇదియే వాని యందలి విశేషం. అంతటా అనురాగం త్యజించివేసి ఉంటాడు. రాగ రహితుడైన ఆ మహాబుద్ధిమంత మనస్సు ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటుంది. అట్టివాడు పదార్థము లందు నిమగ్నం కాడు. ఓ రామచంద్రా! ఆతడు చిహ్నరహితుడు, శాంతచిత్తుడు, చిరకాల సంసారభ్రమ తొలగినవాడై ఉంటాడు. ఇక ఆతనిని గుర్తించటానికి చిహ్నమేమంటావా?

**తజ్ఞస్య యత్ మదన - కోప - విషాద - మోహ**
**లోభ-ఆపదాం అనుదినం నిపుణం తనుత్వమ్**

...ఆతనిలో కామ-క్రోధ-లోభ-మోహ-శోకాల వల్ల కలిగే ఆపదలు మొదలైనవి రోజురోజుకు ఆత్మానుభవ నిపుణతచే క్షయం పొందుతూ ఉంటాయి. వాటి రాహిత్యమే ఆతని చిహ్నం.

❖❖❖

## 8. మూడు అవస్థలు - తురీయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** నిర్మలుడు, సర్వాంతర్యామియగు ఈశ్వరుడే ఈ జీవుడుగా కూడా పరిణమిస్తున్నాడు. ఒకానొక బ్రాహ్మణుడు తుచ్ఛమైన కోరికచే ఒక శూద్రస్త్రీయందు ఆసక్తుడై నిర్మల - సాత్విక సమన్వితమగు బ్రాహ్మణ ధర్మమును మెల్లమెల్లగా త్యజించి చివరికి శూద్రత్వమును ఆశ్రయిస్తూ ఉన్నట్లు ... ఈశ్వరుడు కూడా తన నిత్య పూర్ణానంద స్వభావమును త్యజించి బుద్ధి మొదలైనవాటితో కూడినవాడై 'జీవత్వము' అనబడుదానిని ఆశ్రయించి జీవుడు పరిణమించుచున్నాడు.

నిర్మల నిర్విషయమగు ఈశ్వరతత్త్వమునందు మొట్టమొదటగా జనించే 'భోక్తృత్వ - భోగ్యములు' అనే మహా ప్రారంభ కెరటాన్నీ "హిరణ్యగర్భాత్మకం" లేక "సమష్టి సృష్టి సంకల్పం" అని పిలుస్తూ ఉంటారు. హిరణ్యగర్భాత్మకమగు స్పందముచే జనించే ఈ 1.భోక్తృత్వము, 2.భోగ్యము ...అనే చమత్కారమైన ద్వంద్వములు ప్రతి సృష్టిలోను ఏ కారణము లేకయే స్ఫురిస్తున్నాయి.

ఈ జీవులంతా ప్రప్రథమంగా ఈశ్వరునినుండే వస్తున్నారు. ఆ తరువాత ఈ జీవులంతా వారి వారిచే మరల మరల కావించబడే కర్మల తరువాత అనేక శుభ-అశుభములగు జన్మ - జన్మాంతరములను అనుభవించుచున్నారు.

సమస్త జీవులు మొట్టమొదటగా నిష్కారణంగానే పరమపదము నుండియే బయల్వెడలు చున్నారు. అందుచేత, ఇక్కడి జీవుల జన్మ-కర్మలకు సంబంధించిన కార్య - కారణ భవము కూడా ఈ విధంగా నిష్కారణమే అగుచున్నది. ఏది ఏమైతేనేం? తరువాత తరువాత మాత్రం స్వస్వరూపమును ఏమఱచిన ఈ జీవులు నిర్వర్తించే కర్మలే వారి సుఖదుఃఖములకు కారణములగుచున్నాయి.

మరి కర్మలకు కారణమేమిటి? "దేహాత్మ జ్ఞానము"చే (నేను దేహ సంబంధితుడను అను అనుభవముచే) ఉత్పన్నమగుచున్న సంకల్పమే కర్మలకు కారణమగుచున్నది.

**సంకల్పిత్వం హి బంధస్యకారణం, తత్పరిత్యజమ్ ।**
**మోక్షస్తు, నిః సంకల్పిత్వం తదభ్యాసపరో భవ ॥**

ఓ రామచంద్రా! సంకల్పములతో కూడి ఉండుటయే బంధమునకు కారణము, సంకల్పములు లేక ఉండుటయే మోక్షం. అందుచేత నీవు 'సంకల్పము లేక ఉండటం' అనే అభ్యాసము నందు తత్పరుడవై ఉండు. సంకల్ప దశలను నిరంతరం మెల్లమెల్లగా త్యజిస్తూ ఉండు.

నీవు వ్యవహారరీత్యా అవశ్యం గ్రహించు విషయములను భావించవద్దు. అనగా భావాతీతుడవై నిర్వర్తించవలసిన దానిని యథారీతి నిర్వర్తించు. అంతేగాని గ్రాహ్య భావకుడవు (భావములను గ్రహించువాడివి) కావద్దు. అట్లాగే గ్రాహ్య భావకుడవు (భావించువానిని భావించువాడివి) కూడా కావద్దు. ఈ ఇంద్రియ సమూహములు ఆయా పదార్థములందు (లేక), విషయములందు కలిగియుండే "రాగము" వలననే ఈ జీవుడు బంధింపబడుచున్నాడు. రాగరహితుడై ఉన్నప్పుడు ఈతడు ముక్తుడే అగుచున్నాడు.

**కించిత్ యత్ రోచతే తుభ్యం తద్బద్ధోసి భవస్థితౌ ।**
**న కించిత్ రోచతే చిత్తే, తన్ముక్తోసి భవస్థితౌ॥**

ఓ రామా! ఏ వస్తువైనా నీకు రుచించుచున్నదా, అద్దానియందు రాగము ఏర్పడినప్పుడు ఏర్పడే స్థితిని 'సంసారము' అంటున్నాం. రాగము చేతనే జీవుడు సంసార స్థితియందు బద్ధుడగు చున్నాడు. చిత్తము నందు ఏ వస్తువు రుచించకపోతే ... ఇక అట్టి సంసారస్థితిలో ఉన్నప్పటికీ నీవు ముక్తుడవే అవుతావు. అందుచేత ఒక తృణము మొదలుకొని బ్రహ్మదేవుని శరీరము వరకు స్థావర జంగమమగు సమస్త పదార్థ సమూహమునందు నీకు కొంచెము కూడా రుచి ఏర్పడకుండుగాక!

**యత్కరోషి యదశ్నాసి యజ్జుహోసి, దదాసి యత్ ।**
**న కర్తాసి, న భోక్తాసి తత్రముక్తమతిః, శమీ ॥**

నీవు ఏది చేస్తున్నా, ఏది తింటున్నా, ఏది హోమ-దానాలు చేస్తున్నా 'ఆయా క్రియలన్నిటికీ నేను కర్తను కాదు. భోక్తను కాదు'... అను భావనతో అభిమానరహితుడవై, ఆత్మనిష్ఠుడవై ఉండు.

**సన్తో అతీతం న శోచన్తి భవిష్యత్ చింతయంతి నో ।**
**వర్తమానం చ గృహ్ణన్తి కర్మ ప్రాప్తమఖండితమ్ ॥**

జ్ఞానులగు మహాత్ములు గడిచిపోయిన దాని గురించి శోకించరు. గడపవలసియున్న భవిష్యత్తు గూర్చి చింతించరు. ప్రారబ్ధకర్మల ననుసరించి సంప్రాప్తిస్తున్న వర్తమానమును మాత్రం అఖండ స్వభావము కలిగి ఉంటూనే నిర్వర్తిస్తూ ఉంటారు. అంగీకరిస్తూ ఉంటారు. ఆస్వాదిస్తూ ఉంటారు.

ఈ 'తృష్ణ, మోహము, మదము'... మొదలైన వికారాలన్నీ మనస్సులోనే కాపురముంటున్నాయి. కాబట్టి విజ్ఞుడైనవారు మనస్సుతోనే మనస్సులో అంతర్గతమైన వికారాలన్నీ ఛేదించివేయాలి. ముల్లును ముల్లుతోనే తీస్తాం. ఇనుముతోనే ఇనుమును ఛేదిస్తాం కదా! మనస్సులోని భ్రమ నశించటానికి నిర్మల మనస్సే ఉపకరణం. యుక్తమగు మనస్సుతో - అయుక్తమగు మనస్సును జయించు. మురికిని క్షారం మొదలైన మురికి వస్తువులతోనే తోమి, అప్పుడు, ఆ పాత్రను నిర్మల జలంతో పరిశుభ్రపరుస్తారు కదా! విషమును విషంతోనే నివారిస్తారు. అట్లాగే మనస్సును మనస్సుతోనే నిరోధించాలి.

❖

జీవుని రూపం ఈ బాహ్యమైన కాళ్ళు, చేతులు, ముఖం మాత్రమే కాదు. ప్రతి ఒక్క జీవునికి మొత్తం మూడు రూపాలున్నాయి.

**1. స్థూలరూపం :** ఇది కాళ్ళు – చేతులతో కనబడే పాంచభౌతిక సమన్వయం. ఇది జీవుని భోగములకు ఉపకరించే ఉపకరణం. ఇది మాత్రమే కళ్ళకు కనబడుతోంది.

**2. సూక్ష్మరూపం :** దీనిని 'అతివాహికం' 'చిత్తము' అని కూడా పిలుస్తున్నాం. దేనియొక్క స్వసంకల్పానుసారంగా ఈ ప్రపంచములన్నీ కలుగుచున్నాయో అద్దానికే 'అతివాహికం' అనే పేరు పెట్టారు. జీవుని గుణములు – స్వభావములు – ఆశలు – భావాభావములు – మానావమానములు మొదలైనవన్నీ ఏర్పడి ఉన్నది ఈ అతివాహికంలోనే! దీనిని భౌతికమైన కళ్ళతో చూడలేం కనుక 'సూక్ష్మం' అంటారు.

**3. పరరూపం :** ఈ మూడవ రూపం స్థూల – సూక్ష్మముల కంటే విభిన్నమైనది. జీవునియొక్క ఈ రూపం విశ్వమంతా వ్యాపించి ఉండటం చేత దీనిని 'విశ్వరూపం' అని కూడా అంటారు. ఇది ఆద్యంతరహితమైనది. సత్యమైనది. చిన్మాత్రమైనది, నిర్వికల్పమైనది. (ఇందులో వికల్పములనేవే ఉండవు. ప్రపంచమునకు 'సత్త' ప్రసాదించేది ఈ పరరూపమే.

ఓ రామచంద్రా! ఇప్పుడు నీవేం చేయాలి? మొదటి రెండు రూపములైన స్థూల – సూక్ష్మములను వదలిపెట్టి మూడవదైన 'పరరూపము' లేక 'చిత్‌పదము'ను ఆశ్రయించాలి. ఎన్ని రోజులుగా ఎన్ని చమత్కార వాక్యాలతో తత్త్వవిచారణ చేసినా ...దీని సారమంతా ఒక్క విషయమే. అదేమిటంటే... స్థూల – సూక్ష్మములందు ఆత్మబుద్ధిని విరమింపజేసి, చిత్ పదము (లేక) తురీయపదమును (లేక) పరరూపమును ఆశ్రయించి ఉండటం.

ఈ ఒక్క విషయం ఆరూఢపరచుకొంటే చాలు, ఇక మరింకేమీ అక్కర్లేదు. మనం చెప్పుకున్న మిగతాదంతా కూడా అట్టి ఆరూఢత యొక్క యుక్తియుక్తత గురించే సుమా!

**తురీయం - నిర్వచనం :**

**శ్రీరాముడు :** హే మునీశ్వరా! మీరు చెప్పే 'తురీయ పదమునందు, (పరదేహం నందు) మాత్రమే ఆత్మబుద్ధి కలిగి ఉండటం'... అత్యంత ముఖ్యమైన పాఠ్యసారం కదా! జాగ్రత్–స్వప్న–సుషుప్తులనే మూడిటికి పరమితమౌతున్న ఈ జీవునకు ఆ మూడిటికి అలక్షితమైన 'పరదేహానుభవం, చేతికందటమే లేదు. అందుచేత తురీయరూపమైనట్టి ఆ పరదేహానుభవ నిశ్చలత గురించి చెప్పమని నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఏదైతే 'అహమ్–అనహమ్, సత్–అసత్'లకు అతీతమై, దేనియందూ ఏమాత్రం సక్తముకాక, స్వచ్ఛమై–సమరూపమై ఉంటోందో అద్దానినే 'శుద్ధచైతన్యము' అని 'తుర్యము' అని, 'పరదేహము' అని అంటున్నాం. ఇదియే జీవన్ముక్తుల వ్యవహారమందలి సాక్ష్యావస్థ. ఈ పర దేహావస్థలో సంకల్పములు సంభవించవు. కాబట్టి ...ఇది జాగ్రత్తు కాదు. స్వప్నం కాదు. ఇందులో జడత్వం ఉండదు కనుక ఇది 'సుషుప్తి' కూడా కాదు. అందుకే దీనికి 'అవస్థాత్రయసాక్షి' అని కూడా పేరు ఉన్నది. ఈ జగత్‌స్థితి ఏ జ్ఞానిలో సంపూర్తిగా విలీనమైపోతుందో, అట్టి 'అప్పటికీ శేషించి ఉండే' స్థితియే ఆ తురీయం. జ్ఞానులకు ఆ తురీయ స్థితి అత్యంత సుస్థిరమై అనుభవమగుచుండగా, అజ్ఞానులకు ఈ క్షణికమాత్ర జగత్తు స్థిరముగా అనుభవమవటమే జ్ఞానాజ్ఞానుల దృష్టి భేదం.

అహంకారం త్యజించబడుచుండగా ...సమత్వము ఉత్పన్నమగుచుండగా ...చిత్తము ప్రశమనము పొందుచుండగా ...ఆ 'తురీయావస్థ'చేకూరుతూ ఉంటుంది.

నీవు ప్రబుద్ధుడవై, మరింత అధిక బోధను పొందాలనే ఉద్దేశంతో ఈ సందర్భంలో ఒక చిన్న దృష్టాంతం చెబుతాను విను.

❖

ఒకానొక అరణ్యంలో ఒక ఏకాంత ప్రదేశంలో ఒక ముని చిన్న ఆశ్రమం కట్టుకొని తపస్సు చేసుకుంటూ ఉన్నారు. ఒక రోజు ఆయన ఆశ్రమం యొక్క ఆవరణలో గల రావిచెట్టు క్రింద ఆసనం వేసుకుని మహామౌనము అనుభవిస్తున్నారు. ఒక బోయవాడు బాణములు ధరించి పరుగు పరుగున అక్కడి త్రోవలో వస్తూ మునిని చూచి ఆగాడు.

అయ్యా! మునీశ్వరా! నేను ఒక లేడిని బాణంతో కొట్టాను. ఆ లేడి గాయపడి పరుగు లంకించుకుని ఇటువైపే వచ్చింది. అది ఎటువైపు వెళ్ళిందో చెప్పగలరా? అని అడిగాడు.

దానికి ఆయన సమాధానం విను.

**మునీశ్వరుడు:** నాయనా ! మేము వనవాసులగు మునులం కదా! అందుచేత సమశీలురమై ఉంటాం. లోక వ్యవహారాలు తెలుసుకోవాలంటే అహంకారం ఉండాలి. వ్యవహారములకు సమర్థమైన అహంకారం నాయందు లేదు. అహంకారాదులన్నీ ఎందులో ఉన్నాయో అద్దానిని ఆశ్రయించి నేను ఉన్నాను.

**బోయవాడు :** అయ్యా! నేనడిగింది గాయపడిన లేడి గురించి. మీరేదో 'అహంకారం అదీ ...ఇదీ' అంటారేం? మీరు లేడిని చూచారా? అది చెప్పండి. చూడలేదా... చూడలేదని చెప్పండి.

**మునీశ్వరుడు:** మిత్రమా! నేను చెప్పేది కూడా నీవు అడిగినదానిగురించేనయ్యా! ఈ కళ్ళు – కాళ్ళు మొదలైన ఇంద్రియాలు స్వయంగా పనిచేస్తాయా చెప్పు? లేదు కదా! ఈ కళ్ళను పనిచేయించేదేమిటి!

**బోయవాడు :** ...?

**మునీశ్వరుడు:** చెప్పవయ్యా మరి? మనస్సు కదా!

**బోయవాడు :** మనస్సా? ... అది సరేలెండి ...

**మునీశ్వరుడు:** అవునా? అటువంటి అహంకారమయమగు నా మనస్సు ఎల్లప్పుడు నిజంగా ప్రశమించి ఉంటోందయ్యా! మనస్సుకు అతీతమైనదానిని ఆశ్రయించి ఉన్న నాకు, మనస్సుకు మాత్రమే విషయమైనది ఎట్లా అగుపిస్తుంది చెప్పు?

**బోయవాడు :** అది సరే అయ్యగారూ ! నా లేడి ...?

**మునీశ్వరుడు:** ఎప్పుడైతే మనస్సు శమిస్తోందో, ఇక నాకు జాగ్రత్‌గాని, స్వప్నంగాని, నిద్రావస్థగాని తెలియటమే లేదు. ప్రియమిత్రమా! ఏ మహత్తర తత్త్వమైతే జాగ్రత్‌లోంచి స్వప్నంలోకి, స్వప్నంలోంచి సుషుప్తిలోకి, సుషుప్తిలోంచి మరల జాగ్రత్‌లోకి పయనిస్తూ ఉంటుందో, అట్టి అప్రమేయమైన దాని గురించి ఇప్పుడు నేను మననం చేస్తున్నానయ్యా!

ఎద్దానిలో అయితే 'దృశ్యము' అనబడే దానికి స్థానమే లేదో ... అట్టి 'తురీయావస్థ' యందు నేను నెలకొని ఉన్నాను. ఇక నీ లేడి గురించి ఏం చెప్పమంటావ్? అట్టి నా మననమునకు ఈవలగాని, ఆవలగాని మరింకేదీ నాకు అగుపడడమే లేదు.

**బోయవాడు :** అయ్యగారూ! మీరు ఏదేదో చెప్పి బుఱ్ఱతినకండి. ఇంతకీ గాయపడిన లేడి ఎటు పోయిందో తెలుసునో, తెలియదో చెప్పవచ్చుగదండీ? అది చెప్పడేమిటిరా బాబు!

❖

ఇట్లా పలికి ఆ బోయవాడు 'ఈయనకేం తెలియదు, ఏదో మాట్లాడుతాడు. భలేవాడు దొరి కాదురా నాయనా!' అనుకుంటూ లేడిని వెతకటానికి ఎటో బయలుదేరాడు. ఇక ఆ ముని "పాపం తన 'నిత్యసాక్షిత్వం' వదలి ఈ జీవుడు ఇంద్రియముల వెంట, లేళ్ళ వెంట పరుగులు తీస్తున్నాడు కదా! ఇతనికి ఈతని గురించే తెలియదాయె!" అని అనుకుంటూ తన మహామౌనాన్ని కొనసాగించాడు.

చూచావా రామా! "తురీయదశయందు మరింకొక అవస్థ ఏదీ ఉండదు'... అని చెప్పటానికే ఇక్కడ ఈ దృష్టాంతాన్ని చెప్పాను. పరదేహాన్ని ఆశ్రయించిన వాడు ద్రష్టత్వము కంటే ముందుగానే ఏర్పడి ఉంటాడు కనుక ఆతడు జాగ్రత్‌ద్రష్ట కాడు. స్వప్నద్రష్ట కాడు, సుషుప్త ద్రష్టకాడు. ఈ మూడు తురీయానికి ఈవల ఉన్నవానికే విశేషాలుగాని జ్ఞానముచే ఆవల ఉన్నవానికి అవి విశేషమే కాదు.

వికల్పరహితమగు శుద్ధ చైతన్యమే తురీయం. వాస్తవానికి ఇక్కడ ఆ శుద్ధ-బుద్ధ చైతన్యమే ఉన్నది గాని, తదితరమైనదేదీ లేదు, ఉండజాలదు కూడా. ఇక ఈ జాగ్రత్ స్వప్న-సుషుప్తులంటావా? ఇవి చిత్తం యొక్క మూడు రూపాలు మాత్రమే. అందుచేత చిత్తం వలే అవి కూడా మిథ్య మాత్రమే.

ఈ చిత్తము మూడు రూపములలో స్థితి కలిగి ఉంటోంది-

ఘోరము (జాగ్రన్మయం); శాంతము (స్వప్నమయం); మూఢము (సుషుప్తిమయం)... ఈ మూడు రూపములు లేనిదానిని 'మృతచిత్తం' అంటూ ఉంటారు.

అట్టి 'మృత చిత్తము'నందు ఏకమై, సమమైనట్టి 'సత్వము' నెలకొని ఉంటుంది. యోగులు దానిని ప్రయత్నపూర్వకంగా సంపాదించుకుంటున్నారు. ఓ రామచంద్రా! సమస్త సంకల్పములు రహితమగుచున్న 'తురీయపదము'నందు నిరామయమగు ఆత్మస్వరూపుడవై నీవు స్థితిని కలిగి ఉండెదవుగాక! సాధువులగు మహనీయులంతా అట్టి నిర్విషయ చిదానంద స్వస్వరూపమును దర్శిస్తూ తదితరమైనదంతా 'అతీతత్వము' అను యుక్తిచే త్యజించి ఉంటున్నారు.

❖❖❖

# 9. తురీయమునకు ఉపాయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఆధ్యాత్మ శాస్త్రము యొక్క ముఖ్య సిద్ధాంతం ఏమై ఉన్నది?"... అని మనం పరిశీలిస్తే, 'ఈ సమస్త దృశ్య వ్యవహారము లేదు' అని నిరూపించటమే అయి ఉన్నది. ఇక్కడ అవిద్య లేదు, మాయ లేదు. మాయ - అనగా యాఉ మా..."ఏది లేదో" ...అని శబ్దార్థమే

కదా! ఇక్కడ వాక్కు మొదలైన వాటికి అగోచరమైనట్టి శాంతమగు బ్రహ్మము మాత్రమే ఉన్నది. ఆ బ్రహ్మము పూర్ణమై, చిదాభాస ప్రతిబింబమునకు బింబరూపమై, స్వచ్ఛమై, సర్వాత్మకమై, సమమై, సమస్త కళలచే పరిపూర్ణమై ఉంటోంది. అట్టి 'బ్రహ్మము' అను పేరుగల వస్తువు గురించి జనులు వారి వారి బుద్ధిని అనుసరించి అనేక రూపములైన సిద్ధాంతములను కల్పించుకొనుచున్నారు. కొందరు 'అది శూన్యము' అని, మరికొందరు 'విజ్ఞానమాత్రము' అని, ఇంకొందరు 'అది ఈశ్వర రూపము' అని పరస్పర వాదోపవాదములు చేసుకుంటున్నారు. ఓ రామచంద్రా! నీవు మాత్రం అత్యంత త్వరితగతిని సమస్త వాదములను పరిత్యజించు. దృశ్యమునంతటినీ అంతరంగమునందు త్యజించివేసి ఉండు. మనోవర్జితుడవై ఉండు. శాంతచిత్తుడవై, నిర్వాణయుక్తుడవై, ప్రశాంతమైన బుద్ధిని సంపాదించుకున్న వాడవై మహామౌనివై ఆత్మయందే స్థితి కలిగియుండుము.

**ఆత్మన్యేవా స్స్వ శాంతాత్మా, మూక-అంధ-బధిరోపమః,**
**నిత్యమ్ అంతర్ముఖో భూత్వా స్వాత్మనాన్తః ప్రపూర్ణ ధీః॥**

ఒక మూగవానిలాగా, గ్రుడ్డివానిని బోలి, చెవిటి వాని చందంగా దృశ్యసంపర్కం లేనివాడవై ఉండు. నిత్యం అంతర్ముఖుడవై, శాంతస్వభావుడవై, పూర్ణబుద్ధితో, ఆత్మలోనే ఎల్లప్పుడూ నెలకొని ఉండు.

**జాగ్రత్యేవ సుషుప్తస్థః కురు కర్మాణి రాఘవ ।**
**అన్తః సర్వపరిత్యాగీ బహిః కురు యథాఽఽగతం ॥**

ఓ రాఘవా! జాగ్రత్తులో ఉన్నప్పుడు సుషుప్తియందు వలె కర్మలచే అస్పృశ్యత్వము వహిస్తూనే ఆయా విధ్యుక్తమైన కర్మలను నిర్వర్తించు. అనగా, అంతరంగమున సమస్తము త్యజించియే ఉండు. బాహ్యమున మాత్రం యథాప్రాప్తములైన కర్మలను ఆచరించు.

చిత్తము యొక్క ఉనికియే పరమ దుఃఖం. చిత్తము లేకపోవటమే పరమసుఖం. ఉన్న విషయం ఇది. కాబట్టి చిదేకాత్మ స్వరూపుడవై, ప్రియ - అప్రియములను ఏమాత్రం చింతించక క్రమక్రమంగా చిత్తమును క్షయింపజేస్తూ ఉండు.

**దృష్ట్వా రమ్యమ్, అరమ్యంవా స్థేయం పాషాణవత్ సమమ్,**
**ఏతావతాత్మయత్నేన జితా భవతి సంసృతిః ॥**

ఒక చిన్న ఉపాయం విను. ఈ ప్రపంచంలోని కొన్ని వస్తువులు రమ్యంగా ఉంటాయి. మరికొన్ని అరమ్యంగా అనిపిస్తూ ఉంటాయి. అట్టి రమ్య - అరమ్య వస్తువులను చూస్తున్నప్పుడు నీవు ఏతత్-పూర్వమువలె సమముగా ఉండటం అభ్యాసం చేయి. ఇంత మాత్రమైన నీ స్వప్రయత్నం తోనే ఈ సంసారం జయించివేయబడగలదు.

**నవేదనీయం, న సుఖం, నాఽసుఖం, న చ మధ్యమం,**
**ఏతావత్ ఆత్మయత్నేన దుఃఖాంతో అనన్త ఆప్య తే॥**

సుఖ దుఃఖములను గురించి గాని, వాటికి సంబంధించిన సాధనల గురించి గాని కొంచెం కూడా చింతించకూడదు. ఎవరికి వారే ఇంత మాత్రపు స్వప్రయాత్నానికి ఉపక్రమిస్తే చాలు,

అనంతానందము సంప్రాప్తించగలదు. జ్ఞాని ఈ ముల్లోకాలలోని సమస్త పదార్థముల సారాసారం లేమిటో గ్రహించి ఉంటున్నాడు. సర్వత్రా ప్రకాశముచే శోభాయమానమైన 'నిరతిశయ బ్రహ్మానంద అమృతము'చే పరిపూర్ణుడగుచున్నాడు. బుద్ధియందు పరిపుష్ఠుడై, 'జీవన్ముక్తి' అనే సుఖమును పొంది ఉంటున్నాడు. అతను బాహ్యమున సమస్తమైన కర్మలు నిర్వర్తిస్తున్నప్పటికీ అభ్యంతరమున మాత్రం ఏమీ చేయనివాడే అగుచున్నాడు.

❖❖❖

# 10. భూమికా ప్రవేశం

**శ్రీరాముడు :** స్వామీ! మీరు సప్త భూమికల గురించి, వాటి అభ్యాసకుల గురించి రెండు మూడు చోట్ల అనేక విషయాలు చెప్పారు. అయితే ఈ నిర్వాణ ప్రకరణము పూర్వార్థము చివరికొస్తున్న సమయంలో సప్తభూమికాసాధనల గురించి మరొక్కసారి సవివరంగా చెప్పుకోవటం ఉచితమని నా అభిప్రాయం. సప్తభూమికాభ్యాసం ఎట్లా గావించబడుతోంది? ఆయా భూమికలందున్న యోగులు ఎట్టి చిహ్నములు కలిగి ఉంటారు? దయతో మీరుకూడా సందర్భోచితమనే అనుకుంటే, చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** యోగుల తాత్త్వికోన్నతిని విశదపరచే శాస్త్రప్రవచితమైన సప్తభూమికల గురించి, అంతిమ సాక్షాత్కారమైనట్టి భావాతీతత్వము గురించి ఇక్కడ పురశ్చరణ పూర్వకంగా చెప్పుకోవటం సముచితమే అవుతుంది. కనుక సప్త భూమికల గురించి మరికొన్ని విశేషాలు ప్రస్తావించుకుందాం.

❖

వేద వ్యతిరిక్త మార్గాలు అనుసరించేవారు తమ మూఢత్వమునకు తామే కారణమగుచు ఈ భౌతిక ప్రపంచంలో ఒక ఉపాధి నుండి మరొక ఉపాధికి అంతులేకుండా ప్రయాణిస్తున్నారు. పుట్టటం – పెరగటం – చావటం మరల మరొక ఉపాధిని ఆశ్రయించటం (మరల పుట్టటం) ఇట్లా చర్విత చరణంగా జరిగిపోతోంది. వారికి ఇంద్రియానుభవముల నుండి ధ్యాస మరలటం లేదు. కాల ప్రవాహంలో పడి వాళ్ళు స్థావర–జంగమ దేహములను నమ్ముకుని ఉంటూ తమ దుఃఖములకు కారణమేమిటో ఆరా తీయటం లేదు. వారికి ఎవరేం చెప్పగలరు?

వేద అనుకూల మార్గానుయాయుల విషయానికి వద్దాం. వీరిని రెండు విధాల విభజించవచ్చు.

**1. ప్రవృత్తిమార్గం :** "భోగములను సంపాదించి అనుభవించటమే ఉత్తమంగాని, వీటిని వదలి ఉండటమనేది అర్థరహితం. కనుక ఉత్తమ లోకాలు పొందాలి. అక్కడి సౌఖ్యములను పొందాలి..." అని అందుకు సాధనగా వేద ప్రవచిత మార్గాలలో ఉపక్రమించే వారే ఈ ప్రవృత్తిమార్గ బాటసారులు. "విషయ రహితమగు నిర్వాణం ఎవడికి కావాలి? భోగముల చేతనే నాకు శాంతి" అని తలచి వేద విహితములైన యజ్ఞము మొదలైన కర్మలు నిర్వర్తించే వారు ఈ కోవకు చెందుతారు. తాబేలు తన అవయవములను బయటకు రానివ్వటం, ఇంతలోనే ఏదైనా ఎదురు రాగానే లోపలికి తీసుకోవటం చేస్తుంది చూచావా? ఈ జీవుని మనస్సు కూడా ఒక దేహంలో ప్రవేశించటం, ఇంతలోనే మృత్యువు

ముఖంలో ప్రవేశించటం – ఇట్లా జన్మ – మృత్యువుల ప్రయాణాలు కొనసాగిస్తున్నది. వాస్తవమైన వివేకం ఉదయించనంత కాలం ఇది ఇట్లాగే చర్వితచరణంగా కొనసాగుతూ ఉంటుంది. ప్రవృత్తి మార్గంలో శ్రమతో బాటు పునరావృత్తి తప్పదు. అనేకసార్లు బలవంతంగా మృత్యుముఖమున ప్రవేశించి ఈ జీవుడు ఎప్పుడో 'ఈ అవివేకమంతా ఏమిటి?' అనే ప్రశ్నకు వస్తున్నాడు. "ఈ దేహమేమిటి? ఈ దేహ సంబంధమేమిటి? మరల మరల ఈ దుఃఖాలు ఎందుకొస్తున్నాయి? ఈ సంసారం యొక్క వ్యవస్థ అంతా అపారమైనది కదా! దీని వలన నాకు కలిగే ప్రయోజనం కొంచెమైనా కనబడటం లేదే? అనుచితమైన పరిణామాలు గల కర్మ వ్యవహారాలచే నేను రోజులు ఎందుకు గడుపుతున్నాను? ఇంతకీ నేనెవరు? ఎక్కడి నుండి వచ్చాను? నా వాస్తవ స్వరూపం ఏమిటి?"...అనే యోచన ఆతనికి వస్తోంది. 'అసలు నాకు నిజమైన విశ్రాంతి లభించే దెక్కడ?' ...అనే ప్రశ్నకు వస్తున్నాడు. ఇటువంటి ప్రశ్నలు ప్రారంభమవగానే ప్రవృత్తి తిరోగమించటం ప్రారంభించి, ఆతని స్వభావం నివృత్తి వైపుగా వెనుకకు మరలుతోంది.

**2. నివృత్తి మార్గం :** ఎప్పుడైతే ఈ జీవుడు సద్బుద్ధితో కూడుకున్నవాడై 'వైరాగ్యవంతుడనై నేను ఈ అపార సంసార సాగరమునుండి తరించేది ఎట్లా?"...అను విచారణ యందు తత్పరుడగుచున్నాడో ఇక ఇక్కడి నుండి సప్తభూమికా ప్రవేశం చేస్తున్నాడు.

**జాగ్రత్ భూమికలు -** ఆతనికి భోగములందు, వాటికి సంబంధించిన సాధనములందు చింతన క్రమక్రమంగా సన్నగిల్లుతూ ఉంటుంది. అనగా ఆతనిలో వైరాగ్యం (రాగరాహిత్యం) ఉదయించి, దిన దిన ప్రవర్ధమానమౌతూ ఉంటుంది. ఇక చిత్తశుద్ధికి కారణం కాగల జపం – ఈశ్వరారాధన మొదలైన క్రియలందు తత్పరుడౌతూ ఉంటాడు. అనుదినం తృష్ణను క్షయించుచుండగా ఆతనికి ప్రసన్నత అభ్యాసమౌతూ ఉంటుంది. ధనం–ప్రతిష్ఠ మొదలైన జడ క్రియలందు అరుచి పెంపొందు చుండగా అతని యందు 'ఇతరుల దోషముల గురించి ఊరకే సంభాషించటం' ఇటువంటి నిరర్థక కాలయాపనలు ఉపశమిస్తూ ఉంటాయి 'పుణ్యకార్యములు నిర్వర్తించాలి' అనే ఉత్సాహం పెల్లుబుకుతూ ఉంటుంది. ఇక ఇతరులకు గాని, తనకు గాని మనస్సునకు కష్టం కలిగించే ప్రవర్తనను సరిదిద్దుకుంటూ ఉంటాడు. పాపము పట్ల భయము కలిగి ఉంటాడు. భోగములను వాంఛించడు. స్నేహ, ప్రీతి, కోమల, ఉచిత, దేశకాల యోగ్యములైన మాటలను, భావములను, ప్రవర్తనను అలవరచుకుంటాడు.

ఇట్టి మార్గమును ఆశ్రయిస్తున్నవాడు 'శుభేచ్ఛ' అనే మొట్టమొదటి భూమికలో ప్రవేశించిన వాడగుచున్నాడు. ఈ భూమికలో కొనసాగుచున్న ఆ జీవుడు మనోవాక్కాయ కర్మలచే పవిత్రతను ఆశ్రయించడం, సజ్జనులను సేవించడం ప్రారంభిస్తాడు. ఎక్కడెక్కడినుండో జ్ఞాన వర్ధకములైన పుస్తకముల (శాస్త్రములను), వాక్యములను తీసుకువచ్చి పరిశీలిస్తూ ఉంటాడు. ఈ విధంగా ఆతడు క్రమంగా 'విచారణ' అనే రెండవ భూమికలో ప్రవేశిస్తాడు.

ఈ 'విచారణ' భూమికలో ప్రవేశించేవాడే ఉన్నతికి అర్హుడని, విచారణ లేనంతకాలం ఈ జీవుడు భ్రమార్థ సాధకునిగానే మ్రగ్గుతూ ఉంటాడని గ్రహించు. విచారణ అనబడే రెండవ భూమికలో

ప్రవేశించినవాడు వేద - ఉపనిషత్తు - సదాచారము సమాశ్రయిస్తూ ఉంటాడు. ధారణ - ధ్యానకర్మానుష్ఠానులగు మహనీయులను సంప్రదిస్తూ వివేకమును పరిపుష్టం చేసుకుంటూ ఉంటాడు. స్వయంగా శబ్దశాస్త్రము, వ్యాకరణ శాస్త్రము పఠనం చేస్తూ ఆ ప్రయత్నముచే లోక ప్రసిద్ధములైన వేదాంత శాస్త్రముల పరిశీలనచేస్తూ, పద - పదార్థముల విభాగం ఎరుగుతూ ఉంటాడు. గురుముఖతః శ్రవణం చేస్తూ అర్థసారాన్ని మననం చేస్తూ ఉంటాడు. ఇంటి యజమాని ఒక రోజు కుంచె చీపురును తీసుకొని తలకు గుడ్డ కట్టుకుని బూజు ఊడ్వటం, ఇంటిని పరిశుభ్రం చేయడం ప్రారంభించినట్లు ఆ సాధకుడు మనస్సులో గల అకార్యములను గుర్తించి విడిచిపెట్టుచూ, సకార్యములను ఆశ్రయించే సప్రయత్నంలో ఉంటాడు. లోకమర్యాదను అనుసరించి బాహ్యానికి అభిమానము మొదలైనవాటిని కొంచెం ఆశ్రయించినప్పటికీ, ఆతను పాము తన కుబుసమును విడచునట్లు క్రమంగా మదము, అభిమానము, మాత్సర్యము, లోభము, మోహము, మొదలైన వాటిని త్యజించివేస్తూ ఉంటాడు. ఆతనియందు శాస్త్ర-సజ్జన సేవ పెంపొందుచుండగా ... క్రమంగా శాస్త్రముల రహస్యమును యథార్థంగా, సంపూర్ణంగా ఎఱుగుతూ ఉంటాడు.

ఆ విధంగా ఆ సాధకుడు తన సాధన కొనసాగిస్తూ-ప్రియుడు తన ప్రియురాలి ప్రక్కకు చేరునట్లు, "అసంగము" అని పిలువబడే మూడవ భూమికలో ప్రవేశిస్తాడు. అప్పుడు ఆ జీవుడు ["**అహం బ్రహ్మాస్మి**" (నేను బ్రహ్మమునే అయి ఉన్నాను), "**తత్త్వమసి**" (నా ఎదురుగా భౌతికంగా కనిపించే నీవు స్వయంగా బ్రహ్మమే అయివున్నావు), "**నేఽ హనానాస్తి కించన**" (ఇక్కడ నానాత్వమనేది కించిత్తు కూడా లేదు), "**ఏకోసత్, విప్రా బహుధా వదంతి**" (సత్ వస్తువగు బ్రహ్మము మాత్రమే ఉన్నది. ఇక బుద్ధి, మనస్సు, దేహం, దృశ్యం అనునవన్నీ కల్పితమాత్రాలే)...] ఇటువంటి వేదాంత వాక్యములకు ఉన్న అర్థమేమిటో గ్రహిస్తూ ఉంటాడు. బుద్ధి నిశ్చలం అవుతూ ఉంటుంది. హృదయాన్ని క్రమంగా తీర్చిదిద్దుకొని విశ్రాంతి తీసుకుంటూ ఉంటాడు. ఆధ్యాత్మిక శాస్త్రాధ్యయనాల ద్వారా సంసారాన్ని మనోవాక్కులచే దూరం చేసివేస్తూ ఉంటాడు. వైరాగ్య సాధన క్రమాలను అవలంబించడం ద్వారా జీవితమును ఉత్తేజమయం గాను, విస్తారం గాను చేసివేసుకుంటూ ఉంటాడు.

ఈ విధంగా సచ్ఛాస్త్రముల అభ్యాసం చేతను, పుణ్య కార్యములను ఆచరించటం చేతను జీవునికి ఆత్మదృష్టి ప్రసన్నమౌతూ ఉంటుంది. ఈ మూడవ భూమికను సంపాదించుకున్న బుద్ధిమంతుడు రెండు విధములైన అసంగములను స్వయంగా అనుభవిస్తూ ఉంటాడు. ఆ రెండు విధములైన అసంగముల గురించి, వాటి భేదం గురించి ఇప్పుడు ప్రస్తావిస్తాను. విను.

**1. సామాన్యాసంగం**

**నాఽహం కర్తా, న భోక్తాచ, న బాధ్యో, న చ బాధకః**
**ఇత్యసంజనమర్థేషు సామాన్యాసంగనామకమ్॥**

"నేను దేనికీ కర్తను కాదు. భోక్తను కాదు. బాధ్యుడను కాదు. బాధకుడను కాను" ...ఇటువంటి నిశ్చయంతో పదార్థములందు సంసక్తం కాకపోవటాన్ని 'సామాన్యాసంగం' అని అంటారు.

'అంతా కూడా పూర్వకర్మ నిర్మితమయి ఉన్నది. లేక, ఈశ్వరాధీనమై ఉన్నది. కనుక సుఖంలో గాని, దుఃఖంలో గాని నాకు ఏమాత్రం కర్తృత్వం లేదు. ఈ భోగాలను చూచి నేను మురియవలసిన పని లేదు. వాస్తవానికి భోగాలలో తగుల్కొనటమే మహారోగం. సంపదలన్నీ ఆపదామయాలే కదా! సంయోగాలన్నీ వియోగం కొరకే అయి ఉన్నాయి. మనస్సులో ఏ ఏ చింతలు కలుగుచున్నాయో, అవన్నీ కూడా బుద్ధి యొక్క వ్యాధి రూపాలు మాత్రమే. కాలం ఎల్లప్పుడు సమస్త పదార్థములన్నిటినీ మ్రింగివేయటానికి సంసిద్ధమై వేచి ఉంది కదా! ఇక నాకు దేని గురించి ఆశ? దేని గురించి దిగులు?'

ఇట్టి వాక్యార్థములందు ఆతని మనస్సు లగ్నమై ఉంటుంది. అనాసక్తి యొక్క బలంచేత ఆతనియందు పదార్థముల అభావం రూపుదిద్దుకుంటూ ఉంటుంది. దీనికే శాస్త్రకారులు 'సామాన్యాసంగం' అనే పేరు పెట్టారు.

**2. శ్రేష్ఠాసంగం -** క్రమంగా కొంతకాలానికి సామాన్యాసంగం శ్రేష్ఠాసంగంగా రూపుదిద్దు కుంటోంది. మహాత్ముల సాంగత్యం చేతను; దుష్టమైన అల్పమైన – సంకుచితమైన అభిప్రాయాదులు కలవారితో స్నేహ సంబంధములు తగ్గించుకొనటం చేతను; శ్రవణము, మననము మొదలైన వాటి అభ్యాస కౌశలం చేతను నిరంతరమైన అభ్యాసంతో కూడిన పురుష ప్రయత్నము చేతను... శ్రేష్ఠాసంగం అలవడుతోంది.

అట్టివారికి క్రమంగా, 'సంసారసముద్రము యొక్క ఆవలి ఒడ్డు – సమస్తమునకు సారము – కారణములకెల్ల కారణం' అయినట్టి ఆత్మవస్తువు అరచేతిలో ఉసిరికాయలాగా ప్రత్యక్షమౌతోంది. ఇట్టివాడు 'నేను కర్తను కాదు, ఈశ్వరుడే అన్నిటికీ కర్త'... ఇట్టి శబ్దార్థ భావన కూడా త్యజిస్తున్నాడు. 'పూర్వకర్మ లేదు. వర్తమాన కర్మ కూడా లేదు' అని గ్రహిస్తూ క్రమంగా ఇటువంటి మాటలను కూడా అధిగమిస్తున్నాడు. శాంతం, మౌనం వహిస్తున్నాడు. అట్టి స్థితి 'శ్రేష్ఠాసంగం' అని చెప్పబడుతోంది. ఆతనికి పూర్వ–వర్తమాన–భవిష్యత్ జన్మలు వేరువేరు కథాపుస్తకములను ఉబుసుపోకగా చదవటం వంటిదౌతూ ఉంటుంది.

ఏది లోన–వెలుపల, పైన–క్రింద, దిక్కులందు–ఆకాశమునందు, పదార్థమందు–అపదార్థ మందు, జడమునందు–చిదాభాసునియందు ...స్థితి కలిగి ఉండదో; ...ఏది 'స్వప్రకాశ చిత్' రూపమై పరమశాంతమై, వేరొక ప్రకాశకమైనదేదీ లేనిదై పదార్థరహిత ఆకాశం వంటిదై, జన్మ గాని–ఆదిగాని–అంతముగాని లేనిదై, ఏర్పడి ఉంటోందో ...అదే శ్రేష్ఠాసంగం అంటే !

ఎక్కడైతే ...'సంతోషం' అనే సుగంధంతో 'నిష్కామ సత్కార్యాలు' అనే నును రెక్కలతో, 'చిత్తం' అనే తూడు యొక్క చివర సంలీనమై ఉన్నదో ...అదే శ్రేష్ఠాసంగపద్మం. ఆ పద్మం చుట్టు విఘ్నరూపం కంటకాలు (ముళ్ళు) ఉండుగాక! అయితే ఏం? "అంతర్ విచారణ" అనే సూర్యుని నుండి కిరణ పుంజములు పొంది ఎప్పుడూ వికసించియే ఉండగలదు.

ఏ హృదయంలో ఈ 'శ్రేష్ఠాసంగం' అనే పద్మం వికసించి ఉంటుందో ...ఆ మహనీయుడు 'అసంసంగము' అనే మూడవ భూమికలో ప్రవేశించినట్లు చెబుతారు.

❖

చూచావా రామా! ఈ జాగ్రత్ భూమికలను మరల సమీక్షిస్తున్నాను ...విను.

మొట్టమొదటిది "శుభేచ్ఛ" కదా. అది ఎట్లా ఏర్పడుతోంది? శుద్ధాంతఃకరణులగు మహాత్ములను ఈ జీవుడు ప్రయత్నపూర్వకంగా ఆశ్రయించాలి. వారిని సేవించి, సుముఖులను చేసుకొని వారి అభిప్రాయములను, అనుభవములను, ప్రవచనములను సంపాదించాలి. మహనీయులగు ఆత్మజ్ఞులు లౌకిక సంపద కలవారివలె ప్రదర్శితులు కాకపోవచ్చు. వారు అనేకచోట్ల నివురుగప్పిన నిప్పువలె ఉంటారు. వారిని గుర్తించటమెట్లా? ఉత్తముల అభిప్రాయములే అందుకు శరణ్యం. వివేకులగు మహనీయులను ఆ సర్వేశ్వరుడు సాధకజనులపై గల ప్రేమచే సర్వకాలాలో ఈ భూమిపై ప్రసాదిస్తూనే ఉంటాడు. అయితే "ఈయన ఆత్మజ్ఞుడు. నిత్యానిత్య వివేకి. ఉత్తమ సమాచార సమన్వితుడు"... అని తెలిసి ఉండి కూడా, అట్టి వారిని ప్రయత్నపూర్వకంగా శరణువేడక ఊరకే తాత్సారం చేసేవారిని ఏమనాలి? అమృత కలశాలను సమీపంలో సిద్ధంగా ఉంచుకొని అల్పమైన తృణములవంటి ఇంద్రియ విషయాలపై ధ్యాసను, శ్రద్ధను చూపేవారిని బ్రహ్మ, విష్ణువులంతటి వారు కూడా కాపాడలేరు. ఓ జనులారా! మీరు శుద్ధాంతఃకరణులు, ఆత్మజ్ఞులు, వివేకులు అగువారి కొరకు వెతకండి. వారిని శరణు వేడండి. "ఆ! ఏముంది? ఎవరిని నమ్మగలం? ఇట్లాగే కానిద్దాం. చూద్దాంలే! ఇప్పుడు లాభం లేదు"... ఇటువంటి అల్ప – అశ్రద్ధపూర్వక – నిరుత్సాహ – బద్ధక వాక్యాలకు చోటిచ్చారా... గొప్ప అవకాశములను కోల్పోతున్నందుకు తరువాత విచారించక తప్పదు.

పుణ్యకార్యములచే మనస్సు పవిత్రం కాగా, ఉత్తమ వాక్యముల అర్థము పొందటానికి ఈ జీవునికి అర్హత ఏర్పడుతోంది. సాత్వికమైన గుణ సంపద పెంపొందించుకొనువారికి మహాత్ములు స్వయంగా తమ జ్ఞాన సంపదను అందిస్తూ ఉంటారు. ఈ విధంగా శుద్ధాంతఃకరణులగు మహాత్ముల సాంగత్యము చేతను, అనేక జన్మార్జితములగు పుణ్యముల సంచయముచేతను, కాకతాళీయ యోగం చేతను 'శుభేచ్ఛ' అనే మొట్టమొదటి భూమిక ఉదయిస్తోంది, బలవత్తరమగుచున్నది.

విత్తనం మొలకెత్తగానే రైతు ఏం చేస్తాడు? అది వాడిపోకుండా ముందుగా నీళ్ళు పోస్తాడు. అది ప్రవర్ధమానమైయ్యేరీతిగా తగు జాగ్రత్తలన్నీ తీసుకుంటాడు. అట్లాగే ప్రథమభూమిక ఉదయించ గానే ఆ జీవుడు వివేకంచే ప్రయత్నపూర్వకంగా దానిని కాపాడుకోవాలి, పాలించుకోవాలి, పెంపొందించు కోవాలి. సాధనచతుష్టయం (శమం, విచారణ, సత్సంగం, సంతోషం)తో కూడిన వైరాగ్యాది అంశమే శుభేచ్ఛకు అంకురం. అట్టి అంకురాన్ని విచారణను కొనసాగించుటచే అభివృద్ధి పరచుకోవాలి. ప్రతిరోజు రక్షించుకోవాలి. శుభేచ్ఛ అంతఃకరణంలో రూఢిపడిందా, ఇక అట్టి అంతఃకరణం ఇతర భూమికలన్నిటియొక్క ఉత్పత్తికి స్వయంగా అతిత్వరలో స్థానం కాగలదు. దీని నుండే సాధకుడు సర్వాత్మత్వము వరకు పయనించగలడు.

ఓ రామచంద్రా! ఈ విధంగా "అసంగసంగం" వరకు మూడు జాగ్రత్ భూమికల గురించి వర్ణించి చెప్పాను. 3వ భూమికలో స్థితి పొందినవాడు సమస్త సంకల్ప కల్పనలను అతి తేలికగా పారద్రోలగలుగుతాడు.

❖❖❖

# 11. జన్మ - జన్మాంతర ప్రయత్నం

**శ్రీరాముడు :** మహర్షీ! ఇప్పుడు ఈ సందర్భంలో రెండు సందేహాలను మీముందు ఉంచాలని అనుకుంటున్నాను–

1. ఒక జీవుడు మూఢత్వం తాండవించే పరిసరాలలో జన్మించాడనుకుందాం. భోగరాగాదులలో ప్రవృత్తుడై అధమత్వముతో జీవితం గడుపుచున్నాడనుకోండి. ఆతనికి యోగుల సాంగత్యం లభించకపోతే ఇక ఆతడు ఉద్ధరించబడేది ఎట్లా? ఇక ఆతని గతి అంతేనా? ఆతను మోహరాగాలలో మునిగితేలుతూ అధమ స్థితులకు దిగజారవలసిందేనా? ఆతడు ఎట్లా బాగుపడేది?

2. ఒకడు 'శుభేచ్ఛ' అనే మొదటి భూమికలోనో లేక రెండవ భూమికలోనో ప్రవేశించియుండగా ఆయుష్షు తీరిపోయిందనుకోండి. ఇప్పుడాతనికి ఎటువంటి గతి లభించబోతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** (చిరునవ్వుతో) ఓ రామచంద్రా! సాధకజనులపై గల అవ్యాజమైన ప్రేమచే అవతారమూర్తివగు నీవు ఈ ప్రశ్నలను ఈ సందర్భంలో అడుగుచున్నావన్న సంగతి నేను గమనిస్తు న్నాను. మంచిది. అయితే ఈ విషయం ఇతఃపూర్వం మనం ఈ సంవాదంలో సంభాషించుకున్నదే. ఈ సందర్భమునకు ఉచితంగా మరికొన్ని విశేషాలతో ప్రస్తావిస్తాను.

❖

ఒకడు మూఢుడై అనేక దోషములను ఆశ్రయిస్తూ జీవితమును గడిపివేస్తున్నాడనుకో. అతడు ఎప్పటికైనా "నా ఈ మార్గం కుయుక్తమైనది. దోషభరితమైనది. దుఃఖభరితమైన యోనులకు దారి తీయగలదు"...అనే వివేకం పొందాలి. అట్టి వివేకం (లేక) వైరాగ్యం పొందనంతవరకు ఆతడు ఈ విశాల సంసారంలో ఉండియే తీరుతాడు. "ఇప్పుడు ఉపాయం ఏమిటి?"...అనే ప్రశ్నకు అతను రావాలి. అప్పుడు స్వవిచారణచేతనో, కాకతాళీయంగానో, (లేక) సాధుజన సాంగత్యం చేతనో ఉద్ధరించబడతాడు.

**వైరాగ్యే అభ్యుదితే జంతోః, అవశ్యం భూమికోదయః**
**తతో నశ్యతి సంసార, ఇతి శాస్త్రార్థసంగ్రహః॥**

అట్టి జీవునిలో 'వైరాగ్యం' ఉదయించాలి. వైరాగ్యం ఉదయించిన తరువాత, తప్పకుండా త్వరలోనే 'భూమిక' అనేది ఉదయిస్తుంది. తద్వారా సంసారము నశిస్తుంది. ఇది శాస్త్ర సిద్ధాంతము. వైరాగ్యము ఉదయించగానే ఆతనికి సహకరించటానికి సాధన–జ్ఞానపాఠముల రూపములో శాస్త్రములు సిద్ధంగా ఉన్నాయి.

అట్లా కాకుండా "నేను కుమార్గాన్ని దోషస్వభావాన్ని కొనసాగిస్తూనే ఉంటాను. మీకు చేతనైతే నన్ను ఉద్ధరించండి"...అని పలికేవారికి పదార్థములు ఎదురుగా ఉన్నా ...తిననివానికి ఆకలి తీరనట్లు ...శుభేచ్ఛ ప్రవృత్తం కాదు. సంసారం బంధశృంఖలాలను తగిలించి ఆతనిని తన వెంట త్రిప్పుకుంటూనే ఉంటుంది. అప్పుడు గురువులు చేయగలిగేదేమిటి చెప్పు? ప్రయత్నశీలుడైన జీవుడు పరిసరముల ప్రభావమును అధిగమించగలడు.

ఇక నీ రెండవ ప్రశ్నకు వద్దాం – 'దేహపతనం' అనేది – భూమికల దృష్ట్యా చూస్తే – ఒకడు నిద్రకుపక్రమించి, గాఢ నిద్ర తరువాత నిదురవలేవటం వంటిది. ఒకడు ఏ విషయపరిజ్ఞానంతో, సమాచారంతో ఉండి గాఢనిద్రకు ఉపక్రమిస్తాడో ...ఆతడు నిదురలేచిన తరువాత అదే పరిజ్ఞానం, అదే సమాచారం తిరిగి కొనసాగిస్తాడు కదా! అట్లాగే, ఒకడు ప్రథమభూమికయందో, లేక ద్వితీయ – తృతీయ – భూమికలయందో ఆరూఢుడై ఉండగా ఆతని ఈ భౌతికదేహం పతనమైనదనుకో. ఆయా భూమికల ననుసరించి పూర్వ దుష్కృతాలన్నీ సంక్షయించి ఉంటాయికదా. అందుచే అట్టి జీవుడు దేవతానగరములందో, లోకపాలకుల నగరములందో ప్రవేశించి క్రీడించగలడు. ఆ తరువాత పూర్వకాలకృతమైన పుణ్యసమూహం, దుష్కృతములు క్షయించిన తరువాత భూలోకంలో యోగి అయి జన్మిస్తాడు. శుద్ధులు, శ్రీమంతులు, గుణవంతులు, సజ్జనులు అగువారి ఇళ్ళలో పుడతాడు. అప్పుడిక పూర్వకాలికమైన వాసనలచే మరల యోగమును సేవిస్తాడు. ఆ బుద్ధిమంతుడు పూర్వాభ్యాసవశం చేత మరల యోగభూమికాక్రమమును గుర్తుకు తెచ్చుకోవటం జరుగుతుంది. మరల ఉత్తరోత్తర భూమికలను అధిరోహిస్తూ ముందుకు పోతూ ఉంటాడు.

❖❖❖

# 12. ఉత్తరోత్తర భూమికా సంప్రయాణం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇప్పటిదాకా ఈ సందర్భంలో చెప్పుకున్న 1.శుభేచ్ఛ, 2.విచారణ, 3.అసంగం... అనే మూడు భూమికలు జాగ్రత్తుకు సంబంధించినవి. ఎందుకంటే ఇవి యథాప్రకారంగా జాగ్రత్తు లాగానే భేదబుద్ధిచేతనే ఏర్పడతాయి.

ఈ భూమికలలో ఉన్న ఉత్తరోత్తర యోగయుక్తులచే 'ఆర్యత్వం' ఉదయిస్తుంది. అనగా వీరు తదితరులచే, ఆరాధించబడుటకు అర్హులౌతారు. సద్గుణాధిక్యతచేత వారు పూజార్హులు, మార్గదర్శకులు అవుతారు. వీరిని చూచుటచే, పూజించుటచే మూఢజనులకు కూడా మోక్షంపట్ల అపేక్ష పుడుతుంది.

'ఆర్యుడు' అనగా ఎవరో ...ఇక్కడ కొన్ని విశేషాలు చెప్పుకుందాం.

**ఆర్యుడు -**

**కర్తవ్యమాచరన్, కామమకర్తవ్యమనాచరన్,**
**తిష్ఠతి ప్రాకృతాచారో యః స 'ఆర్య' ఇతి స్మృతః ॥**

ఎవడైతే నిత్య – నైమిత్తకమైన కర్తవ్యములను ఆచరిస్తూ, కర్తవ్యములు కాని వానిని కామ్యకర్మలను ఆచరించక ప్రస్తుతమైన ఆచారమునందు స్థితి కలిగి ఉంటాడో అట్టి వానిని 'ఆర్యుడు' అంటాం. ఈతడు సాంఘిక – లోక ప్రసిద్ధ ఆచారములకు అనుకూలంగా ఉంటాడు. శాస్త్రోక్తములైన వాటిని, చిత్తమునకు సౌమ్యము కలిగించగల వ్యవహారములను గ్రహిస్తూ ఉంటాడు. యోగికి ఈ 'ఆర్యత్వము' అనేది ప్రథమ భూమికలో అంకురిస్తుంది. ద్వితీయ భూమికలో వికసిస్తుంది. 3వ భూమికలో ఫలీభూతమౌతూ ఉంటుంది. ఇట్టి ఆర్యత్వ దశలో దేహపతనమైన యోగి శుభ సంకల్పములకు సంబంధించిన భోగములను చిరకాలం పొంది మరల యోగి అయి జన్మిస్తాడు.

ఈ మూడు భూమికల అభ్యాసంచే క్రమక్రమంగా అజ్ఞానమంతా నశిస్తుంది. 'సమ్యక్‌జ్ఞానం' ఉదయిస్తుంది. చిత్తము పూర్ణచంద్రునివలె శాంతి పొందుతూ ఉంటుంది.

**నాలుగవ భూమిక ద్వైత శమము - స్వప్నసాదృశ్యభూమిక -** ఇక నాలుగో భూమికలో ఆ సాధకుడు ప్రవేశిస్తాడు. ఈ భూమికలో ప్రవేశించిన యుక్తచిత్తులగు యోగులు జగత్తునంతటినీ విభాగరహితమైన దానిగానూ, అనాది-అనంతమైనట్టిదిగానూ, ఆనందరసైక స్వరూపంగానూ వీక్షిస్తూ ఉంటారు. ద్వైతము సర్వదా శమిస్తూ ఉంటుంది. ఈ 4వ భూమికలోని యోగులు ఈ జగత్తునంతటినీ ఒక స్వప్నమువంటిదిగా చూస్తూ ఉంటారు. అందుచేత దీనిని 'స్వప్నసాదృశ్యభూమిక' అని అంటూ ఉంటారు. మొదటి మూడు భూమికలు జాగ్రత్ సంబంధములైతే, ఈ నాలుగవది స్వప్న సదృశ్యమైనది.

**ఐదవ భూమిక అద్వైత బ్రహ్మస్థితము - సుషుప్త ఘనుడు, ఆనందమయుడు, అంతర్ముఖుడు -** ఇక ఐదవది సుషుప్త సాదృశ భూమిక. ఇందులో యోగి కేవలం సత్తా మాత్రంగా సంభాషించి ఉంటాడు. ఈతనిలో ద్వైతభావం (లేక) స్ఫురణ అనేది మచ్చుకైనా ఉండదు. కనుక అతి ప్రసన్నుడై ఉంటాడు. ఈతడు అసంగమగు తన స్వరూపము (లేక) ఆత్మస్వరూపము ఎరిగి ఉండటం చేత అద్వైత బ్రహ్మమునందే సదా స్థితి కలిగి ఉంటాడు. తోటి వారికి తన సర్వతత్త్వాత్మకం గురించి చెప్పుకోవటానికి మాటలు చాలవు. మూగవాడు తన ప్రియురాలిపై గల ప్రేమాధిక్యత చెప్పుకోజాలనట్లు ఈతడు తన సర్వాంతర్గతమైన ప్రేమాస్పద స్వరూపం ఇట్లని చెప్పజాలడు. తదితరులనందరినీ తన ఆత్మయొక్క విన్యాస ప్రకటనము వలె దర్శిస్తాడు. ఈ 5వ భూమిక సంపాదించిన యోగి బాహ్య వ్యాపార తత్పరుడై ఉన్నప్పటికీ అంతర్గతంగా ఘనీభూతమైన నిర్విషయత్వమును దాల్చి ఉంటాడు. ఆతని ఆనంద సాగరమునకు అవధులు ఉండవు. ఎవరూ అవధులు కల్పించజాలరు. తోటివారితో మాట్లాడుచున్నప్పుడు అంతా తెలిసి కూడా ఏమీ చెప్పజాలనట్లు ఉంటాడు. ఈతనిని సుషుప్తఘనుడు, ఆనందమయుడు, అంతర్ముఖుడు.. అని కూడా పిలుస్తున్నారు. ఈ 5వ భూమికను అభ్యాసం చేస్తూ వాసనారహితుడైన పూర్ణశాంతుడై ఉండటం చూసి 'ఈతడు నదరు – బెదరు లేని మొద్దురా'... అని కొందరు అనుకోవచ్చు. ఎందుకంటే అందరూ "గొప్ప విలువైనవి" అనుకునేవాటిపట్ల ఈతడు నిద్రాళువువలే ఉంటాడు.

**అరవ భూమిక - తురీయము -** ఉక్త సమయంలో, ఉక్త ప్రకారంగా 5వ భూమికను అభ్యసించే యోగి ఎప్పుడో 'తురీయం' అనబడే ఆరవ భూమికలో ప్రవేశిస్తున్నాడు. అచ్చట సత్తుగాని, అసత్తుగాని, అహంకారముగాని, అనహంకారముగాని భాసించదు. ఆ యోగి మనన వర్జితుడై ఉంటాడు. ద్వైత-అద్వైత వితర్కరహితుడై ఉంటాడు. గ్రంథి శూన్యుడై, సందేహములనేవేవీ లేనివాడై ఉంటాడు. భావనలకన్నిటికీ ఆవల నెలకొని ఉంటాడు. అట్టివాడు 'జీవించుట' అనబడు కార్యక్రమముచే స్పర్శించబడక ఉంటాడు. అతీత స్వభావము అలవరచుకొనటంచేత 'ఆత్మవంతుడై ఉండటం' అను విశేషంతో ప్రకాశిస్తూ ఉంటాడు. సర్వదా నిగృహీతత్వం (Non-taking) అలవరచుకొని ఉంటాడు. కర్మలచే నిబద్ధించబడక పోవటం చేత శాస్త్రములు ఈతనిని 'జీవన్ముక్తుడు'... అని పిలుస్తున్నాయి.

ఈ జీవన్ముక్తుడు శరీరము ధరించి ఉన్నప్పటికీ ముక్త రూపుడే. శరీరము ఉండి కూడా జగత్స్వభావరహితుడై ఉంటాడు. చిత్రపటంలోని దీపం గాలి వీచికలకు రెపరెపలాడుతుందా? లేదుకదా! అట్లాగే ఆతని బుద్ధి సర్వదా నిశ్చలత్వమును వీడదు. ఖాళీగా ఉన్న కుండకు లోపల – బయట కూడా శూన్యాకాశమే ఉన్నట్లు ఆతడు లోపల – బయట విషయాతీతమైన నిర్వికారవైనము కలిగి భాసిల్లుతూ ఉంటాడు.

**అన్తః పూర్ణో బహిః పూర్ణకుంభ ఇవ అర్ణవే ।**
**కించిదేవైష సంపన్నస్త్వథవైష న కించన ॥**

సముద్రంలో ఒక ఘటం (పాత్ర) ముంచబడిందనుకో. అప్పుడా పాత్ర యొక్క బయట – లోపల కూడా జలమే ఉన్నది కదా! అరవవ భూమికలో ఉన్న నిత్య నిరతిశయానందరూపుడగు ఈ యోగి బాహ్య – అభ్యంతరములందు పరిపూర్ణుడై, పరమాశ్చర్యరూపమును పొందినవాడై ఉంటాడు. తన యొక్క పరిపూర్ణ స్వభావముచే అన్నీ పొందినవాడై ఉంటాడు. 'ఇంకా ఈ లోకం పొందాలి! ఆ రూపం కావాలి. అచ్చటికి వెళ్ళాలి. ఇది ఇంకా ఏర్పడాలి'... అనే అసంపూర్ణ భావాలు ఆతనికి ఉండవు. ఓ రామా! ఈ నిత్యసిద్ధుని ముందు భౌతికసిద్ధులు సూర్యునికి చూపే దివిటీవంటివి. నిత్యసిద్ధుడై ఉండికూడా ఏమీ పొందనివాడై ఉంటాడు.

ఇట్లా 6వ భూమిక యందున్నవాడై క్రమంగా ఆ యోగి ఏడవ భూమికను పొందుచున్నాడు.

**ఏడవ భూమిక విదేహముక్తిత్వం -** ఈ 7వ భూమికను 'విదేహముక్తిత్వం' అని వర్ణిస్తున్నారు. ప్రాపంచిక భూమికలన్నిటికీ ఇది ఎల్ల. ఈ భూమిక వాక్కుకు అగోచరం అనబడుచున్నది.

కొందరు దీనిని శివం అంటున్నారు. మరికొందరు బ్రహ్మము అని పిలుస్తున్నారు. ఇంకొందరు ప్రకృతి–పురుషుల ఐక్యము యొక్క వివేకము అని భావిస్తున్నారు. కొందరైతే, "తాను చూస్తున్నదంతా తానే అయిఉండటం" అని అభివర్ణిస్తున్నారు. ఇంకా కొన్ని సైద్ధాంతిక విభాగాలలో దీనినే వాసుదేవత్వం – స్వర్గం – మహేశ్వరత్వం ఇట్లా నిజకల్పిత విభేదాలచే పలు విధాలుగా వర్ణించటం జరుగుతోంది.

అయితే రామచంద్రా! అది వచించటానికి అలవికానిమాట నిజమే కాని ...ఏదో విధంగా అద్దాని గురించి వర్ణించడం ఉపదేశించటం జరుగుతూనే ఉన్నది. అద్దాని భోగ–త్యాగ అధోగత్యాగ లక్షణాలు – ఉపదేశాలు కొనసాగుతూనే ఉన్నాయి. మంచిదే ! చివరికి మాత్రం అది అనిర్వచనీయమైన అనుభవం మాత్రమే.

❖

ఓ రామచంద్రా ఈ విధంగా సప్త భూమికల గురించి ఇక్కడ చెప్పాను. ఈ సప్తభూమికలు జీవుని స్థితిని నిర్ణయిస్తాయి కదా! అందుచేత మనం ఇతఃపూర్వమే (స్థితి ప్రకరణంలో) సవిస్తారంగా చెప్పుకున్నాం. అక్కడ 1.శుభేచ్ఛ, 2.విచారణ, 3.తనుమానస, 4.సత్వాపత్తి, 5.అసంసక్తి, 6.పదార్థాభావన, 7.తుర్యగము – అని వర్ణించాం. వేరు వేరు ఋషులు వేరు వేరు కాలాలలో ప్రవచించిన ఈ భూమికా సిద్ధాంతానికి కొంచెం పేర్ల భేదం ఉంటే ఉండవచ్చుగాని, సిద్ధాంతపరంగా సామ్యత్వమే కలిగి ఉందని గ్రహించు.

భూమికా యోగం గురించి మరి, ఈ వర్తమాన పరిశీలనను ముగించేముందు ఒక్క వాక్యం చెబుతాను– **అసాం అభ్యాసయోగేన న దుఃఖమనుభూయతే ॥**

ఈ సప్త భూమికలు అభ్యాసవశం చేతనే సంప్రాప్తిస్తాయి. అంతేకాని, ఓ జనులారా! అవి ఏవో ఉదాహరణపరిమితములనుకొని, మహనీయులెవరికో మాత్రమే సాధ్యమనుకుని విని ఊరకోకూడదు. అభ్యాసము కొరకే ఇవి చెప్పబడ్డాయి. శుభేచ్ఛలో ప్రవేశించే జీవుడు అభ్యాసవశంగా క్రమంగా ఉత్తరోత్తర భూమికలను అధిరోహించగలడు. ఈ భూమికల అభ్యాసయోగం చేత దుఃఖానుభవాలన్నీ త్వరితరీతిగా తొలగుతాయి. క్రమంగా దుఃఖం యొక్క అనుభవలేశంకూడా ఉండదు. కనుక ఏఏ భూమికలో ఏఏ లక్షణాలు చెప్పబడ్డాయో అవి ప్రయత్నపూర్వకంగా అలవరచుకోండి.

❖❖❖

# 13. ఇచ్ఛను అధిగమించాలి

**శ్రీరాముడు:** మహాత్మా! మీరు అత్యద్భుతంగా వర్ణించి చెప్పిన 'ఆ సప్తభూమికలలో ప్రవేశించటం, ఈ సంసారమును జయించి వేయటం' అనే ఉభయ విషయములను దృష్టిలో పెట్టుకొని ఏవైనా ఉపాయాలుగాని, దృష్టాంతోపమానాలు గాని ఉపదేశించ ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఈ జీవునికి సంబంధించిన ఒక గొప్ప యుద్ధం జరుగుతోంది. ఆ యుద్ధంలో విజయం పొందాలి. పొందితేగాని సప్త భూమికలలో జీవుడు ప్రవేశించలేడు. అయితే యుద్ధభూమిలో ఒక గొప్ప ఆడఏనుగు శత్రుపక్షంలో ఉండి ఈ జీవుని గెలుపును నిరోధిస్తోంది. మందగమనము కలది, మహా – గర్వితమైనది, యుద్ధంలో మహా – ఉత్సాహము – నేర్పరితనము కలది అగు ఆ ఆడ ఏనుగును నిరోధించడం గురించి జనులంతా యోచించెదరు గాక! యుద్ధభూమిలో కలియతిరుగుచున్న ఆ ఆడఏనుగుకు గొప్ప భయమును గొలిపే దంతాలున్నాయి. అది ఘీంకరిస్తూ ఆ యుద్ధభూమిలో అటూ – ఇటూ సంచరిస్తూ ఉంటే చెప్పరాని అనర్థాలన్నీ వచ్చిపడుతున్నాయి. ఇప్పుడా ఏనుగును పట్టుకుని చంపాలి. లేకపోతే సప్తభూమికా ప్రదేశమును పొందగలిగే ప్రసక్తే లేదు. ఆ ఏనుగు యుద్ధభూమిలో యథేచ్ఛగా సంచరిస్తూ ఉన్నంతవరకూ ఎవడైనా సరే సప్త భూమికా ప్రవేశం చేయగల సామర్థ్యం పొందలేడు.

**శ్రీరాముడు:** మహర్షీ! ఆ ఏనుగు ఏది? ఆ యుద్ధ భూములెక్కడున్నాయి? దానిని సంహరించటం ఎట్లా? చాలా కాలంగా అది ఎక్కడ క్రీడిస్తోంది? మాపై కరుణతో ఈ విషయాలు విశదీకరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి:** 'నాకు ఏదో ఈ దృశ్యములో లభించాలి' అనే కోరికయే ఆ ఆడ ఏనుగు. ఈ 'దేహం' అనే అరణ్యంలో అది చాలా ఉల్లాసంగా పచార్లు చేస్తోంది. మదించిన ఇంద్రియాలే దాని శిశువులగు గున్న ఏనుగులు. 'మనస్సు' అనే కారడవిలో దాగి ఉండి అది తెలియకుండా వచ్చి పడుతోంది. 'శుభాశుభకర్మలు' దాని యొక్క రెండు దంతాలు. నలువైపులా విస్తరించి ఉన్న వాసనా సమూహములే దాని మదము. సంసార దృష్టులే ఆ యుద్ధభూమి.

'ఇచ్ఛ' అనబడే ఆ ఏనుగు అల్పజ్ఞులగు జీవులను అతి తేలికగా చుట్టచుట్టి గాలిలోకి విసరివేస్తోంది. ఇక ఆ జీవులు అనేక ఉపాధుల ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నారు. 'వాసనా – చేష్ట – మనస్సు – చిత్తము – సంకల్పము – భావన – స్పృహ...' ఇవన్నీ కూడా చిత్తకోశములోగల ఇచ్ఛ యొక్క వివిధ నామములు.

'మహా ధైర్యము' అనే అస్త్రం చేబూని "నిరాదరణము" అను బలంతో సర్వ పదార్థ రూపములలో అన్ని వైపులా వ్యాపించియున్న ఈ ఇచ్ఛ అనే ఆడ ఏనుగును సర్వవిధాలా జయించాలి. ఎందుకంటావా? ఈ ఇచ్ఛ ఎంతెంతవరకు సమస్త వస్తు రూపమయి విజృంభిస్తూ ఉంటుందో ...అంతవరకూ మహా – భయంకరమైన 'దుష్ట సంసారము' అనే విష విషూచి ఉండియే తీరుతుంది.

**ఏతావానేవ సంసారః ఇదమస్త్వితి యన్మనః,**
**అస్య తు ఉపశమో మోక్షః! ఇత్యేవం జ్ఞాన సంగ్రహః॥**

'ఏదేదో నాకు లభించాలి...' అనురూపం గల మనస్సేదైతే ఉన్నదో ...అద్దానినే మనం 'సంసారం' అని అంటున్నాం. అట్టి దాహస్వభావం శమించిందా ...అదియే మోక్షం. సమస్త జ్ఞానసారం ఇదే. తెల్లటి పరిశుభ్రమైన వస్త్రంపై రంగు చక్కగా అంటుతుంది. అద్దముపై నూనెచుక్క ఇంకకుండా యథాతథంగా ఉంటుంది కదా! ఎవడైతే ఇచ్ఛారహితుడై నిర్మలాకారయుక్తుడై ఉంటాడో ...అట్టివాని హృదయంలో 1. ఉపదేశవాణి 2. అనుభవ ప్రకాశము. ఈ రెండూ వికసిస్తాయి.

**అయితే, ఇచ్ఛ రహితమైయ్యేదెట్లా? -** విషయములు స్మరించకపోయినంతమాత్రం చేతనే సంసారమునకు అంకురమైనట్టి ఇచ్ఛ ఉపశమించగలదు. ఇచ్ఛ అనేది కొంచెం ఉదయించినా సరే, అది అనర్థకారిణి కాగలదు. అందుచేత 'విషయములను విస్మరించటం' అనే శస్త్రంతో ఇచ్ఛ అనే అంకురం ఏర్పడకుండా తగు జాగ్రత్త తీసుకోవాలి.

ఇచ్ఛచే వ్యాపించిన హృదయం గల జీవుడు జీవస్వభావానికి అతీతుడు కాలేకపోతున్నాడు. "విషయేచ్ఛా విస్మరణ" అనబడే ప్రత్యాహార రూపమగు యత్నమున తత్పరుడగువాడు అత్యంత సులభంగా ఆత్మయందే స్థితి కలిగి ఉంటాడు. ఈ 'ప్రత్యాహారం' అనే దానికి రెండు దశలు ఉన్నాయి.

**1. ప్రత్యాహార అభ్యాసదశ:** "విషయముల పట్ల విస్మరణము" అనేది మొట్టమొదట సాధిస్తూ రావాలి. క్రమక్రమమైన ప్రయత్నము చేతనే ఇది సాధ్యం. క్రమంగా ధ్యాస – అభినివేశములను విషయముల నుండి విరమింపజేయాలి. శాస్త్రములు – శాస్త్రజ్ఞులు దైవారాధన – యోగాభ్యాసము వంటి అనేక ఉపాయములను అందించటంలో అంతర్లీనోద్దేశం ప్రత్యాహారమే అయి ఉన్నది.

**2. ప్రత్యాహార పరిపక్వదశ:** పరిపక్వదశయందు ఇక ప్రత్యాహారమునకు ప్రత్యేకమైన అవధానం అవసరం ఉండదు. నిద్ర మొదలైనవి స్వతఃసిద్ధంగా ఏర్పడునట్లే, ప్రత్యాహారం స్వతఃసిద్ధమగుచున్నది.

**కల్పన -** 'ఇది నాకు కలుగుగాక'... అనబడే తీవ్రేచ్ఛను విజ్ఞులు 'కల్పన' అని కూడా పిలుస్తున్నారు. 'పదార్థముల విస్మరణ' అనే ప్రత్యాహార ఫలం 'కల్పనాత్యాగం' అయి ఉన్నది. స్మృతి విషయాల గురించి స్మరణ లేకపోవటాన్ని 'శివరూపం' ...అని పిలుస్తున్నారు.

సంకల్పదశలో ఇతఃపూర్వం అనుభవించినవి, అనుభవించనివి కూడా పాల్గొనుచున్నాయి. అందుచేత రాఘవా! అనుభవించినవాటి గురించిగాని, అనుభవించనివాటి గురించి గాని ఏర్పడే 'స్మృతి'ని ఒక కాష్ఠం (కొయ్య) వలె శ్రీఘ్రంగా విస్మరించి ఉండు. ఆ రెండింటి చేత స్పర్శించబడని ఒకానొక రహస్యమైన రూపమును ధరించినవాడవై ఉండు.

❖

**అసంకల్పమే శ్రేయం -**

**ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష, న చ కశ్చిత్ శృణోతి తత్!**
**"అసంకల్పః పరం శ్రేయం!" స కిమ్ అంతర్ న భావ్యతే?**

ఓ జనులారా! 'సంకల్ప రహితుడై ఉండటమే పరమ శ్రేయం....' అని నేను రెండు చేతులు పైకెత్తి, ఎలుగెత్తి ప్రకటిస్తూనే ఉన్నాను కదా! అయినా అనేక మంది నా ఈ మాటలు వినిపించుకోవటమే లేదు. సంకల్పములలో ప్రవేశించి అందులో తారసపడే సుఖదుఃఖానుభవములను గొప్పగా నమ్ముకుని ఉంటున్నారు. అసంకల్ప స్థితియొక్క మహిమను ఈ జనులు ఎందుకో పట్టించుకోవటం లేదు. అసంకల్పత్వమును అంతఃకరణంలో ప్రతిక్షేపించుకోవటానికి యత్నించరేం?

నాయనలారా! సమస్త ఇంద్రియ – మనో వ్యాపారములను రహితం చేసి కేవలం 'తూష్ణీం' స్థితి యందు ఉండటం అభ్యసిస్తూ ఉన్నంతమాత్రం చేతనే ...అప్పుడు బ్రహ్మదేవుని మహా సామ్రాజ్య సుఖం కూడా ఒక గడ్డిపరకవలె స్వల్పమైనదిగా, తుచ్ఛమైనదిగా భాసించగలదు. ఇక ఈ ప్రాపంచిక సౌఖ్యాల గురించి వేరే చెప్పేదేమున్నది? అట్టి సంకల్పరాహిత్యస్థితే భౌమానందమైయుండగా మీరు 'అబ్బ! ఎప్పటికో ఆ స్థితి! అది మనకు లభ్యపడుతుందా? లేదు. ఎవరో గొప్ప గొప్ప వాళ్ళకి మాత్రమే' అని ఎందుకు వేదన చెందుతున్నారో చెప్పండి?

**శ్రీరాముడు:** మహర్షీ! సంకల్పములన్నిటికీ ముందే సత్ స్వరూపమున ఏర్పడియున్న స్వయమాత్మ స్వరూపులై ఉండి కూడా జనులలో అనేకులు 'అవశ్యం నిర్వర్తించవలసిన అనేక కార్యక్రమములు ఉండి ఉండగా అసంకల్పత్వం ఎలా సాధ్యం ...' అనే అభిప్రాయం కలిగి ఉండటం జరుగుతోంది. ఈ విషయమై తమ వ్యాఖ్యానం ప్రసాదించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి:**

**గమ్యతి ఏకైక నిష్ఠస్య యథా పాంథస్య పాదయోః,**
**స్పన్దో విగత సంకల్పస్తథా స్పన్దః స్వకర్మసు ॥**

ఒకడు ఒక ముఖ్యమైన పని మీద ఒకానొక చోటికి వెళ్ళాలనే ఉద్దేశంతో అడుగులు వేస్తూ బయలుదేరాడనుకో ....! అప్పుడా బాటసారి 'ఈ అడుగు ఇటు వేయాలి, ఆ అడుగు అటు'... అనే ప్రయత్నపూర్వకమైన సంకల్పము లేకుండానే బాటలో సాగిపోతూ గమ్యానికి చేరుతాడు చూచావా? యోగి కూడా అసంకల్ప పూర్వకంగా స్వకర్మలందు ప్రవర్తించుచున్నాడు. ఎక్కడ, సుఖదుఃఖమానావమానాది భావావేశాలు జత చేరి ఉంటాయో అక్కడ మాత్రమే సంకల్పం సంకల్పంగా

కొనసాగుతుంది. లేదా, ఆ సంకల్పత్వమును నిర్వరించవలసినది నిర్వర్తించగానే మటుమాయ మౌతుంది. ప్రతి జీవుడు తన దినచర్యలో అనేక సంకల్పాలు అసంకల్పంగా పరిణమింపజేయు చున్నాడు. ఒక తల్లి తన పిల్లవాడిపై చూపే కోపం కోపసంస్కారంగా రూపుదిద్దుకుంటుందా?... లేదు. పిల్లవాడు అల్లరి ఆపగానే ఆ కోప సంకల్పం అసంకల్పమైపోతోంది కదా! అట్లాగే సర్వ సంకల్పములను వ్యవహారము కొరకు మాత్రమే ధరించిన మరుక్షణం ఎందుకు అసంకల్పంగా చేసి వేయరాదు చెప్పు? తప్పకుండా ప్రయత్నంచేత సుసాధ్యమేనని సకల జనులకు నా మనవి.

ఈ విధంగా ... ఎక్కువగా చెప్పవలసిన పనేమున్నది? సంక్షేపంగా ఒక్కమాట మరల మరొక్కసారి ప్రకటిస్తున్నాను విను- **సంకల్పం పరోబంధః, తదభావో విముక్తతా ॥**

సంకల్పమే పరమబంధం, సంకల్పములు లేకుండటమే మోక్షం.

❖

ఓ రామచంద్రా! ఈ సమస్త ప్రపంచమును 'అజము - శాంతము - అనంతము - ధ్రువము - అవ్యయము - నిత్య సిద్ధము' అయినట్టి 'పరమార్థ చిద్రూపం'గా చూస్తూవుండు. యథాసుఖంగా ఉండి ఉండు.

సమస్త దృశ్యమును మఱచి, 'అక్షయము - శాంతము' అయిన రూపమును అవధరించి ఉండటమే యోగం అను శబ్దముచే ఉద్దేశించబడింది. కాబట్టి నీవు వాసనారహితుడవై యోగమునందు 'స్థితి' కలిగియుండి ఇక ఆపై యథాప్రాప్తములైన కర్మలను నిర్వర్తించు. లేదూ, కర్మలు త్యజించదలచావా...సమాధిపరుడవై కర్మలు చేయకుండుము.

"అహం...మమ...నేను...నాది" అనే అధ్యాసయొక్క త్యాజ్యమే చిత్తక్షయం. సమస్త దృశ్యం యొక్క అకృత్రిమం, స్వాభావికం అగు చిత్తరాహిత్యం. అదియే 'జీవబ్రహ్మముల యోగం' కూడా. అదే సంకల్ప త్యాగం అని కూడా చెప్పబడుతోంది. కాబట్టి నీవు ఆత్మమయుడవై, ఆత్మకు చెప్పబడిన అప్రమేయ - అసంగాది స్వభావమును సంతరించుకున్న వాడివై ప్రశాంతుడవై ఉండుము. పరమాత్మ సర్వదా శివమై, సర్వవ్యాపకమై, శాంతమై, బోధరూపమై, అజమై, శుభప్రదమైయున్నది. అట్టి పరమాత్మతోటి ఏకత్వభావనయే సర్వత్యాగం. అట్టి సర్వత్యాగ భావనను నీ అంతఃకరణమందు నిరంతరం చేస్తూ ఉండి, ఇక ఆపై కర్తవ్యములైన కార్యములను బాగుగా ఆచరించు.

ఓ సర్వజనులారా! నా ఈ మాటలు శ్రద్ధగా వినండి.

1. "నేను - నాది - అహం - మమ"...మొదలైన భావనలు ఉన్నంతవరకూ ఈ జీవుడు ఎన్నటికీ దుఃఖముల నుండి విముక్తుడు కానేరడు.

2. అహం - మమలను త్యజించటం చేత విముక్తుడౌతాడు.

ఈ రెండు విషయాలూ ఎఱిగినవారై, ఇక ఆపై మీరు కర్మలను నిర్వర్తించటమో త్యజించటమో మీ ఇష్టం ... ఏది ఎట్లైనా ఫరవాలేదు ... అట్లే నిర్వర్తించండి.

❖❖❖

# XIV. శ్రీ వాల్మీకి మహర్షి ప్రవచనం

## 1. ఆత్మావలోకనం

**భరద్వాజుడు :** మహాత్మా! వాల్మీకి మహర్షీ! ఇంద్రభగవానుని కరుణచే, మీ పాదాలు నేటికి జేరగలిగాను. మీ యొక్క కథా సంవిధాన చమత్కారముచే శ్రీ వసిష్ఠ రామ సంవాదమును వింటున్నాను. వినడం చేత నేను మహత్తరమైన ప్రయోజనం పొందుచున్నాను. అనేక జన్మల తపస్సు ఫలీకరించుటచేతనే దేవదూత నన్ను మీ సమ్ముఖమునకు తీసుకురావడం, మీరు నాపై కరుణతో ఈ సంవాదమును వర్ణించి చెప్పటం జరుగుతోంది.

ఇప్పుడు చెప్పండి మహాత్మా ! శ్రీ వసిష్ఠ మహర్షి చెప్పిన జ్ఞానసారాన్ని వినిన శ్రీరామచంద్రుడు ఏం చేశాడు? ఆ ఉపదేశమాత్రంచేత సందేహరహితుడై పరమ సుఖమును పొందాడా? పూర్ణ బోధమయుడైనాడా? ఇంకా ఏమైనా ప్రశ్నించాడా?

**స ఖలు పరమయోగీ విశ్వవన్ద్యః సురేశో,**
**జనన మరణహీనః, శుద్ధబోధ స్వభావః,**
**సకలగుణ నిధానం, సంనిధానం రమాయాః,**
**త్రిజగత్ ఉదయ రక్షా-అనుగ్రహాణమ్ అధీశః ॥**

ఆ శ్రీరామచంద్రుడు స్వయంగా మహాయోగి. జగత్తుకు పూజార్హుడు. దేవతలకే దేవేశుడు. జనన మరణరహితుడు. శుద్ధబోధ స్వరూపుడు. సకల గుణనిధి. లక్ష్మీపతి. ఈ మూడులోకముల ఉత్పత్తి - స్థితి - రక్షణలకు కారణకారణుడై ఉన్నాడు. అట్టి రామచంద్రుడు నావంటి భక్తజనులను, ఆర్తులను దృష్టిలో పెట్టుకొని మహర్షిచే నిండు సభలో మహత్తరమైన జ్ఞానము ప్రవచింపజేశారు. ఎంతటి ఆశ్చర్యం! అప్పుడింకా ఏం జరిగిందో ...అది కూడా చెప్పండి.

**శ్రీవాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! వేదాంత సంగ్రహరూపమైనట్టి శ్రీ వసిష్ఠ మహర్షి చెప్పిన ఆ వాక్యాలన్నీ శ్రీరామచంద్రుడు విన్నాడు.

సమస్త జ్ఞానం యొక్క పరాకాష్ఠను చవి చూచాడు. ఆతని చిత్తవృత్తియందు అఖండాకారవాక్య ప్రభావంచే ఒకానొక అనిర్వచనీయ నిరతిశయానందం తాండవించింది. 'ఆనందం యొక్క నిర్మల చిద్ఘనం' యొక్క చిహ్నాములు ఆతని కమల నేత్రములలో ప్రకాశించాయి. అతడు చైన్యానందసాగర మగు స్వస్వరూపమునందు జాగృతుడైనాడు. ఇక ప్రశ్న-సమాధానం అనే వృత్తి భేదం స్వస్వరూపంలో విలీనమైనది. ఈ వర్తమాన క్షణంలో 'ఇది యుక్తం, అది అయుక్తం' అనే విభేదం, వివేచన ఆతనికి లేవు. ఎందుకంటే ఆతడు, మనో-బుద్ధి-ఇంద్రియ వ్యాపారశూన్యుడైనాడు. 'ఆత్మానందం' అనే అమృతంచే పూర్ణుడగుట చేత పులకిత శరీరుడైనాడు.

**మహాసామాన్య రూపత్వాత్ చిద్వ్యాపకతయా స్థితః**
**నిత్యమ్ అష్టగుణైశ్వర్య తృణప్రాయ మనోరథః ॥**

అతను 'మహాసామాన్య రూపము' అని, 'సర్వాధిష్ఠాన సన్మాత్ర' అని పిలువబడి సర్వాత్మకత్వం సంతరించుకున్నాడు. అంతటా ప్రసరితుడై ఉన్నాడు. అనగా, చిద్వ్యాపకత్వంచేత అంతటా స్థితి పొందినవాడై ఉన్నాడు. స్వయంగా ఉపాధికి అసంబంధితమైన అష్టగుణైశ్వరములను కూడి ఉండటం చేత భౌతిక పరిభాషితమగు సమస్త మనోరథములు ఆతనికి తృణప్రాయంగాను, తుచ్ఛంగాను గోచరిస్తున్నాయి. ఆ పిల్లవాడు నిరతిశయానందమగు బ్రహ్మముతో ఏకత్వం పొందియుండటం చేత ఏమియు చెప్పజాలక ఊరుకొని ఉన్నాడు.

❖

**భరద్వాజుడు:** ఆహాఁ! మహాత్మా! నాకు చాలా ఆశ్చర్యం కలుగుతోంది. శ్రీరామచంద్రుడు వాక్యములకు అందజాలని మహత్పదమును పొందినాడు కదా!

హే వాల్మీకి మహర్షీ! అటువంటి ఆత్మపదం మాకు కూడా ప్రాప్తించటమెట్లాగో చెప్పండి! మేం మూర్ఖులమై స్తబ్ధులమై, కించిజ్ఞులమై, పామరులమై ఈ సంసార మరుభూమిలో కాళ్ళు అరిగేటట్లు సంచరిస్తున్నాం. అటువంటి మేమెచట? బ్రహ్మ మొదలైన దేవతలకు కూడా ప్రార్థనీయము, దుర్లభము అయినట్టి ఆ శ్రీరామచంద్రుని ఉత్తమస్థితి ఎచట? హై గురువర్యా! మునీశ్వరా! నాకు శ్రీరాముని లాగానే విశ్రాంతి ఎట్లా లభిస్తుంది? దుస్తరమగు ఈ సంసారమును దాటగలగటం నా వల్ల అయ్యే పనేనా? చెప్పండి.

**శ్రీవాల్మీకి మహర్షి :** ప్రియ భరద్వాజా! ఇప్పటి దాకా వసిష్ఠ మునీంద్రులు రామచంద్రుల మధ్య జరిగిన సంవాదమంతా పూసగుచ్చినట్లు చెప్పుకొచ్చాను కదా! దీనినంతా నీవు స్వబుద్ధితో విచారించు. పరాపరవిమర్శ చేయి. అందులో వివిధ కోణాల నుండి చెప్పుచున్న ఆత్మజ్ఞాన సమాచార సారాన్ని నీ అనుభవంగా ఆరూఢం చేసుకో. అప్పుడు శ్రీరామచంద్రునిలాగానే విశ్రాంతి లభించకపోతే నన్నడుగు.

❖

ఓ భరద్వాజా! నీ నిరంజన – నిరాకార – శుద్ధతత్త్వము అనుభవం కావటానికి వీలుగా నేను కూడా నా అనుభవమంతా రంగరించి అవస్థాత్రయ సాక్షిత్వం మొదలైన కొన్ని విశేషాలు ఇక్కడ ప్రస్తావిస్తాను. విను.

మొట్టమొదట ఒక నగ్న సత్యం ప్రతిపాదిస్తున్నాను.

**అవిద్యాయాః ప్రపంచోఽయం నాస్తి సత్యమిహాణ్వపి**
**వివేచయంతి విబుధా, వివదన్తి అవివేకినః ॥**

ఈ జగత్తంగా కూడా 'అవిద్య' చేతనే పరికల్పితమై ఉన్నది. ఇందులో అణువంత కూడా (కొంచెమైనా) సత్యం లేదు. అయితే వివేకులు దీనిని వివేచనతో పరిశీలిస్తున్నారు. అవివేకులో, వివాదాలలో ప్రవేశించి దృశ్యవశులగుచున్నారు.

ఓ ప్రియ భరద్వాజా! ఇక్కడ చైతన్యమునకు భిన్నమైనదంటూ ఏదీ కొంచెం కూడా లేదు. ఉండజాలదు. నీవు ప్రణవము – మహావాక్యముల అర్థరహస్యాన్ని ఎఱిగి అభ్యసించు. అభ్యాసముచే శుద్ధచిత్తుడవు కమ్ము.

ఈ జీవునకు ప్రపంచ విషయాల పట్ల యావృత్తి ఉంటోంది కదా! ఈ యావృత్తిని ఆత్మానుభవం దృష్ట్యాం 'జాగ్రత్ నిద్ర...' అని పిలుస్తున్నారు. అట్టి జాగ్రత్ నిద్ర యొక్క అంతరమున నిరంజనమైనట్టి చైతన్య ప్రదీపము జాగృతమై ఉన్నది. చైతన్యం జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు సాక్షీ భూతంగా దర్శిస్తోంది. అట్టి సాక్షి చైతన్యం వైపుగా నీ బుద్ధిని ప్రసరింపజేయటం అభ్యాసం చేయి.

ఇక ఈ ప్రపంచమంటావా? ... విను చెబుతాను.

**శూన్యమూలః ప్రపంచోఽ యం శూన్యతా శిఖరః, సఖే!,**
**సారశూన్య తయామధ్యే అపి అనాస్థా సన్మనీషిణామ్ ॥**

ఓ సఖుడా! ఈ ప్రపంచానికి మొదలుగాని, మధ్యగాని, చివరగానీ లేదు. ఎందుకంటే ఇది స్వయంగా శూన్యమూలమైనది. "ఇది ఎందుకు, ఎట్లా ఏర్పడుతోంది?...." అన్న ప్రశ్నకు నా నిర్మోహమాటమైన సమాధానం "అజ్ఞానము చేతనే".... అని సుమా! అందుచేత సజ్జనులగు బుద్ధిమంతులకు దీనిపట్ల అపేక్షయే ఏర్పడదు.

అనేక భ్రమలను కలుగజేయుచున్నట్టి ఈ దృశ్య ప్రపంచం స్వతహాగా అసత్తే అయి ఉన్నది.

"అట్లా అంటారేమండీ! మాకు ఈ దృశ్యజగత్తు కనిపిస్తోంది కదా?" – అని ఎవరైనా అంటారేమో? ఓ స్వయమాత్మ స్వరూపులగు ప్రియజనులారా! అంతరంగంలో ఉండే వాసనాదోషం చేతనే గంధర్వ నగరంలాగా మాయాకల్పిమై లేనిది ఉన్నట్లుగా ఇక్కడ గోచరించటం జరుగుతోంది. ఆ అంతరంగానికి ఆవల జగత్ సాక్షియగు స్వస్వరూపము ప్రతి జీవునిలోనూ జాజ్వల్యమానంగా వెలుగుతోంది. ఇప్పుడు నీకు, నాకు ప్రతిజీవునికి ఎదురుగా రెండు మార్గాలు వున్నాయి.

1. అనేక జన్మల వాసనల నుండి ఇంద్రియములను ఉపయోగించుచుండగా అనుభవమయ్యే ఈ దృశ్య జగత్.

2. సర్వమునకు సాక్షియగు నిర్వికార – నిరాకార – నిరంజన – అప్రమేయ – నిరాశ్రయ స్వస్వరూపం.

**త్వమ్ అనభ్యస్య కల్యాణీం చైతన్యామృత కన్దలీమ్,**
**సంముహ్యసి కిమధ్యాస్య వాసనా విషవీరుధః?**

ఓ భరద్వాజా! ఇప్పుడు చెప్పవయ్యా! శుభప్రదమగు అమృత కదలీ (అరటి) వృక్షమును ఆశ్రయించటం ఉచితమా? 'వాసన' అనే విషలతను ఆశ్రయించి విమోహితులం కావటం మంచిదా?

సమాధానం అక్కర్లేదనే అనుకుంటున్నాను. తత్త్వ దర్శనంచే నిరాలంబమైన నీ యందలి ఆత్మను పరిగ్రహించు. అప్పుడు పూర్వకాలికమైన అజ్ఞానావస్థలో కనిపించే జాగ్రత్ ప్రపంచం ఇక కనిపించదు. ఇదంతా కూడా ఆత్మస్వరూపంగానే కనిపిస్తుంది.

జాగ్రత్-స్వప్న-సుషుప్తులందు సర్వదా అస్పృశ్యమై విభేదరహితమై ఏర్పడియున్న సాక్షితత్వము యొక్క అనుభవము పొందియున్న మహనీయులెందరో ఉన్నారు. వీళ్ళని శాస్త్రకారులు 'తురీయ సంస్థితులు' అని పిలుస్తున్నారు. అట్టి వారి సమక్షంలో ఇదే ఘనీభూత సాంసారిక దృశ్యం ఒక కల్పితకథా సంఘటనలాగా అర్థరహితమై ఉంటోంది. అట్టి వానికి ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులనే మూడు అవస్థలు ఉండవు. అతడిక తనకు తానే సర్వదా ఏర్పడి ఉన్నవాడగుచున్నాడు. విజ్ఞుడైనా, అజ్ఞుడైనా ప్రతి జీవుని వాస్తవ సత్యమిది. ఇక నీ ఇష్టం. దేన్ని ఏ ఉద్దేశంతో ఆశ్రయించటం ఉచితమో వివేచనచే గ్రహించు. అంతేగాని గుడ్డెద్దు చేనులో పడినట్లు ఈ దృశ్యాన్ని అనుకరించి ఉండకు.

❖

అమృత రూపమగు సత్‌ప్రవాహముతో కూడిన ఆ మహాచైతన్య సాగరమే నీవు. అంతేగాని, ఈ దేహ – జగత్ – భావాదులు నీవు కానే కావు. ఈ విషయం నీవు బుద్ధితో గ్రహించి ఉండు. బుద్ధిని ఆత్మమయం చేయనంతవరకు ఈ జగద్రూపతరంగాలు కనిపిస్తూనే ఉంటాయి. జ్ఞానకాలంలో ఆత్మగా భాసించేదే ...అజ్ఞానకాలంలో జగత్తుగా భాసిస్తోంది.

**ప్రాక్ నాస్తి, చరమే నాస్తి వస్తుసర్వమిదం, సఖే ।**
**విద్ధి మధ్యేపి తన్నాస్తి స్వప్నవృత్తమిదం జగత్ ॥**

మిత్రమా! ఏ జగత్తైతే ఘనీభూతమై ఉన్నదని, సంసారరూపంగా ఏర్పడి దాటుటకు అశక్య మౌతోందని అనుకుంటున్నావో ...అట్టి ఈ దృశ్యం ఒకప్పుడు నీ పట్ల లేదు. ఇది ఇంకొకప్పుడు ఉండ కుండా పోతోంది. జాగ్రత్‌లో స్వప్నం అవాస్తవం. స్వప్నంలో జాగ్రత్ అవాస్తవం. 'స్వప్నం' విషయంలో "అంతకు ముందు ఏమై ఉన్నది. ఆ తరువాత ఏమికానున్నది?..." అని మనం ప్రశ్నిస్తున్నామా! ఈ దృశ్యము కూడా అట్టిదే!

ఏదైతే ఆది-అంతాలలో లేదో... అది మధ్యలో కూడా లేనిదే అగుచున్నది. అందుచేత ఈ జగత్తు స్వప్నతుల్యంగానే ఎఱిగి ఉండు. ఈ సమస్త పదార్థ భేదం కూడా జలంలో బుద్బుదాల లాగా అవిద్యచేతనే ఉత్పన్నమౌతోంది. నీటిలో లేచిన బుడగ మరెప్పుడో నీటిలోనే లయం కావలసిందే కదా! సర్వ పదార్థ భేదమంతా భావనారూపంలో పైకి లేచి, కొద్ది క్షణాలుండి మరల జ్ఞాన సముద్రంలో విలీనమగుచున్నది. మధ్యలో కనిపించే తరంగం మధ్యలోనే లయమౌతోంది. సముద్రం మాత్రం సర్వదా యథాతథంగా ఉంటోంది. ప్రతి జీవుడు జ్ఞాన సముద్ర స్వరూపుడే. అయితే ఆతనిలో ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్త్యాది భావానుభవమంతా ఎప్పుడో జనించి మరెప్పుడో అతని యందే లీనమౌతోంది. మధ్యలో ఏర్పడిన భావనానుగత బుద్బుదములను అనుసరించి "ఈతడు జీవుడు. ఆతడు బద్ధుడు. ఆ ప్రక్కాయన ముక్తుడు" ఇత్యాది ...శబ్ద ప్రయోగాలు శాస్త్రాలు చేస్తున్నాయి. మధ్యలో వచ్చిందంతా మధ్యలోనే పోక తప్పదు. అందుచేత 'నేను చైతన్య సాగరాన్ని'... అనే నీవు మననం చేయి గాని, "నేనీ దేహంలో చిక్కుకున్న పక్షి వంటివాడను" అని అల్పయోచనకు తావియ్యనే వద్దు. అత్యంత ప్రశాంతమగు ఆత్మ గురించి తెలుసుకో. ఆ ఆత్మసాగరంలో స్నానం చేయి. అప్పుడీ క్లేశ దాయకమైన 'బాహ్యభ్రాంతి' అనే మనోదేహ సంబంధమైన అపరిశుభ్రత తనకు తానే తొలగి పోతుంది.

ఈ జగత్తు అనే సముద్రం 'అజ్ఞానము' అనే గొప్ప ఉప్పురసంతో వ్యాపించియున్నది. అందులో 'అహంకారం' అనేది ప్రప్రథమ తరంగం. ఆ తరంగం అవిద్య అనే వాయువుచే ఉత్పన్నమై అన్ని వైపులా ప్రవహిస్తోంది. చిత్తము యొక్క అనేక విషయముల పట్ల ఏర్పడే ప్రవృత్తులున్నాయి చూచావు? అవియే రాగరూపంగా కనబడే చిన్న చిన్న తరంగాలు. "నాది, మమత్వం" అనే సుడి ఇక్కడ యథేచ్ఛగా ప్రవర్తిస్తోంది. ఈ సాగరంలో 'రాగము, ద్వేషము' అనే రెండు పెద్ద మొసలి జాతులు విహరిస్తున్నాయి. అవి కనుక పట్టుకున్నాయా ...ఇక ఈ జీవుడు 'అనర్థము' అనే పాతాళానికి చేరవలసిందే. మృత్యుముఖము వంటి అభినివేశములో ప్రవేశించాడా ...ఈ జీవుని ఎవరూ కాపాడలేరు. కనుక జాగ్రత్త!

"సముద్రస్నానం చేయాలి..." అని నీకు అభిలాష ఉన్నదా? అయితే ఈ దృశ్య సంసార సముద్రంలో ఎందుకు స్నానం చేయటం? ప్రశాంతము, అమృతమయ తరంగములచే అత్యంత శోభితము, అద్వైతరూపము ...అయినట్టి ఆత్మానంద సాగరంలోనే స్నానం చేయి. అంతేగాని ద్వైతరూప ఉప్పు సముద్రంలో ఎందుకు మునుగుచున్నావో చెప్పు?

❖

ఓ భరద్వాజా! 'అయ్యో! శ్రీరామచంద్రుని ప్రపంచం జ్ఞానముచే తొలగిపోయింది. నా ప్రపంచమో, ఇంకా మిగిలియే ఉన్నది...'అని అంటున్నావు కదా.

**కస్తిష్ఠతి? గతః కోవా? కస్య కేన కిమాగతం?**
**కిం ను మజ్జసి మాయాయాం? పత మా త్వమతన్ద్రితః ॥**

అసలు ఉన్నదేది? పోయేదేది? ఎవనికి ఏమి వస్తోంది? ఏమి పోతోంది? ఏమిటయ్యా, ఇంకా మాయయందే నిమగ్నమౌతున్నావ్? నాయనా! ఇన్ని రోజులుగా శ్రీ వసిష్ఠ - శ్రీరామ సంవాదం విన్నాం కదా! ఇకలే. జాగరూకుడవు కమ్ము. వివేకివగుము. అంతేకాని, ఈ మాయలో పడవలసిన అగత్యమేమున్నదో చెప్పు? వద్దు. పడనే వద్దు.

**భరద్వాజుడు:** హే వాల్మీకి మహర్షీ! నాదొక చిన్న సందేహం. అసలు నిర్విషయము, నిత్య నిర్మలము అగు బ్రహ్మము జగదాకారంగా ఎందుకు వివర్తం పొందుతోంది.

**శ్రీవాల్మీకి మహర్షి:** "బ్రహ్మము జగత్తుగా వివర్తం పొందుతోంది..." ఇటువంటి వాక్యాలన్నీ చిన్న పిల్లలతో హాస్య సంభాషణ చేయటానికి కల్పించబడ్డాయి. బ్రహ్మము సర్వదా నిర్విషయంగా, నిత్య నిర్మలంగా ఉన్నది. నీవు జ్ఞాని వగుచున్న కొలదీ అపరివర్తనశీలమగు ఆనంద బ్రహ్మను దర్శిస్తావు. అందులోనే స్థితి పొంది ఉంటావు. ఆ బ్రహ్మమే నీవు. నీవు సదాశివస్వరూపుడవు, సదా బ్రహ్మానంద స్వరూపుడవు సుమా!

అవివేకియగు జీవుడు ఒకప్పుడు "అబ్బో! నేను అంతటి వాడిని, ఇంతటి వాడిని ..." అని హర్షం పొందుతాడు. ఇంకొకప్పుడేమో "ఇదేంటిరా, ఇది ఇట్లా ఉన్నది..." అని దుఃఖిస్తూ ఉంటాడు. అకస్మాత్తుగా హర్షం, అకస్మాత్తుగా శోకం! ఇదీ అతని పని. తత్త్వవేత్తయో? ఆతడు ఎల్లప్పుడూ

ప్రసన్నంగానే ఉంటాడు. ఒకవేళ అతను కొంచెం బాహ్యానికి శోకం ప్రదర్శిస్తున్నాడూ అంటే ... అది అజ్ఞానులతో సహజీవనం కొరకు మాత్రమేగాని, తన స్వరూపం ఎట్టిదో తెలియక కాదు. అజ్ఞానులగు జీవులు జలమునందు స్థలభ్రాంతిని, స్థలమునందు జలభ్రాంతిని (ఎండమావులను) పొందుచున్నారు. సూక్ష్మమగు ఆత్మతత్త్వమును 'అవిద్య' అనే దర్పణంలోంచి చూస్తున్నారు. అందుచేత అవిద్యాచ్ఛాదితమైన 'అనాత్మ' యందు ఆత్మభ్రాంతి కలుగుతోంది. నీవు అవివేకివి కాదలచుకుంటే మనం ఎన్ని రోజులు సంభాషిస్తే ఏం ప్రయోజనం? అందుచేత వివేకివి అవటానికి ప్రయత్నించు. అంతేగాని, అవివేకి ఈ జగత్తును ఎట్లా చూస్తున్నాడో సమీకరించి, దానిని పట్టుకుని వ్రేలాడకు.

ఈ ప్రపంచంలో అనేక వస్తు సముదాయం కంటికి కనిపిస్తోంది కదా? ఇవన్నీ పరమాణువల కలయికయే కదా! అట్టి పరమాణువుల సంయోగ-వియోగములచే ఏర్పడే ఈ పాదార్థిక జగత్తు గురించి దుఃఖించవలసిన పనేమిటి? ఈ దేహం కూడా పరమాణువుల సంయోగంచే ఏర్పడి, వియోగముచే నశించినదగుచున్నది. నీవుగాని, నేనుగాని, మరెవరైనా గాని ...మనమంతా చిత్ స్వరూపులం. 'ఎరుగుట' అనునది మన స్వరూపం. పరమాణువుల సంయోగ - వియోగముచే పరమాణువుల కంటే అత్యంత సూక్ష్మమగు మన చిత్ స్వరూపం ఎట్లా స్పర్శించబడగలదు? అది మనలను దుఃఖింప జేయటమేమిటి? అది ఎలా సాధ్యం? కనుక దుఃఖానికి కారణం మన ప్రత్యక్ స్వరూపము యొక్క ఏమరుపేనని సిద్ధాంతీకరించబడుచున్నది.

**అసతః సంభవోనాస్తి, నాస్తి అభావః సతః సఖే**
**అవిర్భావ-తిరోభావాః సంస్థానానామమీ పరమ్॥**

ఓ స్నేహితుడా! 'అసత్' పదార్థానికి ఉత్పత్తియే లేదు. 'సత్' పదార్థానికి వినాశనమనేదే లేదు. ఇక్కడల్లా ... కేవలం మాయారూపములైనట్టి ఈ 'దేహము' మొదలైన ఆయా పదార్థములు - 'పరమాణువుల కలయిక - విడిపోవడం' అనే ప్రక్రియచే - వాటివాటి ఆవిర్భావ - తిరోభావములు సంభవించటం జరుగుతోంది.

అయితే ...దృశ్యము ఈ విధంగా ఉండగా, ఇక దృక్ స్వరూపుడగు జీవుని విషయమేమిటి?

**భరద్వాజుడు:** అవును మహర్షీ! ఈ పదార్థిక జగత్తంతా పరమాణువుల సంయోగ-వియోగరూపములే. అయితే వీటి యొక్క అనుభవం పొందే ఈ జీవుడు అనబడు దృక్ స్వరూపుడు (లేక) ద్రష్ట, (లేక) అనుభవజ్ఞుడు ఎక్కడి నుండి వస్తున్నాడు. ఎక్కడికి వెళ్ళుచున్నాడు. ఈ విషయాలు శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రుని సమక్షంలో ప్రవచించారు. అయినా సరే, ఈ 'నిర్వాణ ప్రకరణం పూర్వార్థం' సమీక్షిస్తున్న ఈ సందర్భంలో మరొక్కసారి మీ అనుభవ - అభిప్రాయములను ప్రవచన రూపంగా విశదీకరించండి.

**శ్రీవాల్మీకి మహర్షి :** పంచభూతములలో ఒకటి అయిన 'ఆకాశము' తదితర భూతముల కంటే సూక్ష్మమైనది కదా! అట్టి ఆకాశపు అంతర్గతమైన ఒక విభాగాన్ని ఉద్దేశించి 'ఇది ఇక్కడి నుండి అక్కడికి వెళుతోంది. అది అక్కడి నుండి ఇక్కడికి వస్తోంది' అనే వాక్యాలు చెల్లుతాయా? ఆకాశము

ఒకచోట నుండి ఇంకొక చోటికి పోవటం – రావటం ఉండదు కదా! ఇక, ఆకాశము కంటే కూడా సూక్ష్మాతి సూక్ష్మము, ఈ జీవుని స్వస్వరూపము అయిన ఆత్మ అన్నిటా, అంతటా నిండి ఉంటోంది. అది తనయందు తానే నెలకొని ఉన్నది. అద్దాని రాకపోకలెక్కడుంటాయ్?

❖

అయితే,పూర్వ సంచితములైన అనేక పుణ్యపాపములను హేతువులుగా చేసుకొని ఈ దేహాదులు విషయతుల్యమైన 'మరణము' మొదలైన అనర్థాలను పొందటం జరుగుతోంది. దేహాదులపై భ్రాంతిని పెంచుకున్న ఈ జీవుడు అనుక్షణికంగా దుఃఖితుడు అగుచున్నాడు. "ఆ దుఃఖం తొలగేది ఎట్లా?".... అనేది గొప్ప అవశ్యమైన ప్రశ్న. అందుకు మా సమాధానం ఒక్కటే! ఓ సర్వజనులారా! అట్టి సర్వ అనర్థాలు మీ పట్ల తొలగాలంటే జగద్గురువగు ఆ పరమేశ్వరుని మనసా, వాచా, కర్మణా శరణు వేడండి. ఉపాసించండి. ఓ భరద్వాజా! నీవు అన్నిటినీ త్యజించి గొప్ప తపస్సు చేశావు. నిర్మలమైన మనస్సును సంపాదించుకున్నావు. తపో ప్రభావం చేత అంతరంగమును పరిశుద్ధపరచుకొని తద్వారా 'వివేకత్యాగి'గా రూపుదిద్దుకున్నావు. అందుచేత నీ అంతరంగంలోని పుణ్యపాపాలన్నీ నిశ్చయంగా సంక్షయించాయి. 'ఆ పశుపతి యొక్క పాశాలు అనగా ప్రాణుల శుభాశుభకర్మలే! – అని శ్రుతి ప్రసిద్ధం. కనుక, ఇంక ఆగకు. నీ చిత్తము మరింత పరిశుద్ధమయ్యే వరకు ఆ భగవంతుని సాకార రూపం ధ్యానించు. భజించు. అట్లా ధ్యానిస్తూ ఉండగా ఉచితకాలంలో నిరాకారమగు బ్రహ్మమున నీకు స్వాభావికమైన స్థితి లభిస్తుంది. అనగా, సగుణేశ్వరోపాసన వలన హృదయం పరిశుద్ధమౌతుంది. అట్టి 'శుద్ధసత్వము'యొక్క బలం చేత ప్రచండమగు (ఇప్పుడు శేషించియున్న) అజ్ఞాన వ్యామోహాన్ని జయిస్తావు. నాయనా! అప్పుడు శాస్త్ర – గురువాక్యాలపైన నీకు గురి కుదురుతుంది. అట్టి విశ్వాసము యొక్క బలంచే 'ఇంద్రియాతీత మనో విభాగంచే ఇంద్రియ సహిత మనస్సును జయించటం...' లేక 'యమము' అను మార్గాన్ని నీవు అనుసరిస్తూ ఉండు. రోజూ కొద్ది క్షణాలైనా మనస్సును సమాధానపరచి ఉంచి "మనో సమాధానము"అనే సమాధిని ఆశ్రయించు.

'ప్రత్యగాత్మ'...అని పిలువబడే సాక్షి చైతన్యమును ఆశ్రయించు. అప్పుడు తమో – రజో గుణాచ్ఛాదన తప్పక తొలగుతుంది.

❖

ఓ సర్వ ముముక్షువులారా! మీరంతా ఆ సర్వేశ్వరుని ప్రేమించండి. ప్రేమయే భక్తి. భక్తి రహితమగు కేవల పురుష ప్రయత్నముచే, కేవల కర్మానుష్ఠానంచే ఏం ప్రయోజనం? ఆ సర్వేశ్వరుని మహిమ చేతనే ఈ జీవుడు ఉత్కృష్టతను, వాంఛిత ఫలమును పొందుచున్నాడు.

**నాభిజాత్యం, న చారిత్ర్యం, న నయో న చ విక్రమః,**
**బలవన్తి పురాణాని సఖే, కర్మాణి కేవలమ్॥**

ప్రియమిత్రమా! ఒకడు ఎంతో గొప్ప జాతిలో పుట్టి ఉండవచ్చు. లేదా, ఆతనికి గొప్ప చరిత్ర ఉండవచ్చుగాక! సదాచారం, తపస్సు, పరాక్రమం మొదలైనవి ఎన్నో ఉండవచ్చు గాక! అంత మాత్రం చేత ఆతడు ఆత్మానుభవం పొందలేడు.

**భరద్వాజుడు :** అదేమిటి స్వామీ ...?

**శ్రీవాల్మీకి మహర్షి:** అవును. ఎందుకంటే ఈ జీవుని పూర్వ సంచిత కర్మలు అంతులేనివై ఉన్నాయి. వాటిని జయించాలంటే తపస్సులు, సదాచారాలు ఏ మూలకి?

**భరద్వాజుడు :** మరెట్లా స్వామి?

**శ్రీవాల్మీకి మహర్షి :** అయితే, ఎవ్వరూ ఏమీ నిరుత్సాహపడవద్దు. సర్వేశ్వరుని పట్ల ప్రేమను పెంపొందించుకోండి. ఈశ్వరభక్తి యొక్క సహాయం లేకపోతే ఆత్మానుభవం లభించదు. భక్తి పరిపక్వమగుచుండగా జ్ఞానం వికసిస్తుంది. అట్టి సమూలాజ్ఞాన నాశనమగు జ్ఞానబలంతో ఆత్మానుభవంలో ప్రవేశించగలరు.

కేవలం ఉపాసనకు పరిమితమైతే ఈశ్వరుడు కూడా నొసటన వ్రాయబడిన 'అజ్ఞానము' అనే అక్షరములను తొలగించలేడని కూడా గ్రహించు. కాబట్టి ఉపాసనతో బాటు యమనియమాదుల ద్వారా జ్ఞానం కూడా సంపాదించుకోవాలి.

ఈ లోకంలో గురువు చక్కగా బోధిస్తున్నాడు. శిష్యుడు ఆత్మ సమాచారాన్ని వింటున్నాడు మంచిదే. ఇదంతా అవసరమే. అయితే మనోవాక్కులకు అగోచరమైన ఆ చిద్బ్రహ్మమును బోధమాత్రంచే ఎరుక పరచగల గురువెక్కడ? వినుటలో మనోవాక్కులకు పరిమితమైతే, ఆ శిష్యుడు ఆ గురువుచే బోధించబడినంత మాత్రంచేత మోహలత ఉపశమిస్తుందా? లేదు.

ఎద్దానిచే ఈ గురు, శిష్య, శమ, దమ, ఉపాసనాది సామాగ్రి అంతా పరస్పరం కలుస్తుందో, అట్టి ఈశ్వరనియతి అనిర్వచనీయమైనది.

❖

ఓ భరద్వాజా! ఏది ఎటైనా ఉండుగాక, ఈ జీవుడు ఈశ్వర స్వరూపుడేగాని ...ఏదో పరమాణువుల కలయిక అగు ఈ భౌతిక దేహమో, లేక వాసనల రూపమగు భావనల సంకలనమో కాదు. ఏ జీవుడు దేనిని ఎట్లు గ్రహించినా సరే... ఉన్న సత్యం మాత్రం ఇది. ఇది మా తపో-ధ్యానాదుల బలంతో గ్రహించాం. అందరికీ చెప్పుచున్నాం. ఇందుకు వేరుగా ఏ జీవునికి అనిపిస్తుందో ... ఆతడు ఉపాసన-భక్తి-వైరాగ్యాదుల సాధనలచే మనస్సును నిర్మలం చేసుకోవటానికి వెంటనే ఉపక్రమించాలి. "రేపు - మాపు" అనుకుంటూ తాత్సారం చేయరాదు సుమా! నాయనా! వివేకముచే మోహమును మొదలంటా పెకలించివేసే ప్రయత్నమునకు సన్నద్ధుడవు కమ్ము.

❖

ఒక మహారాజు ఉన్నాడు. ఆయన శాంతిసమయంలో మహాశయంతో ధనము, సేన సమకూర్చుకున్నాడు. ఇంకేం? ఇంక ఆయనకు దిగులు లేదు. అనుకోకుండా యుద్ధం చేయవలసి వచ్చినా, ఏదైనా సాధించవలసిన అగత్యం ఏర్పడినా ...ఆతడు సర్వ సమృద్ధితో సంసిద్ధంగా ఉన్నాడు. కాబట్టి ఎటువంటి ఇబ్బందులనైనా ఎదుర్కోగలడు. అంతేకాదు దుష్ట జనులను నిగ్రహించి చక్కగా ప్రజాపాలన చేయగలడు.

ఇంకొక రాజు ఉన్నాడు. ఈతడు ధనము - సైనిక బలము సమకూర్చుకోకుండా ఊరకే ఆట - పాటలతో రోజులు గడిపేస్తున్నాడు తనను పొగడే కొందరు వందిమాగధులకు ఉద్యోగం ఇచ్చి,

వారు చెప్పే పొగడ్తలకు ఉబ్బితబ్బిబ్బవుతూ బలమును సమకూర్చుకోకుండా అంతఃపురంలో కూర్చుని ఆకస – పోకస కబుర్లు మాత్రం చెప్పుచున్నాడు. ఈతని గతి ఏమిటి? చిన్న సామంతరాజు ఎదురు తిరిగితే గుండె గుభేలుమంటుంది. మంత్రులకు, సేనానాయకులకు సర్ది చెప్పలేడు, శాసించలేడు. ప్రజాహిత కార్యక్రమాలు నిర్వర్తించే సరంజామా గాని, శ్రద్ధగాని లేదు. అప్పుడు ఆతని ప్రజలే ఆతనిని దుయ్యబట్టుచున్నారు.

నీవు మొదటి రాజులాగా తపస్సు – భక్తి – ఉపాసన పెంపొందించుకుంటూ విషయములపై ప్రవేశించే మనస్సును ఆక్రమించివేయగల, జయించగల నిర్మల మనస్సును పెంపొందించుకోవాలి. అంతేగాని 'అది ఆయనకంటే లభించింది. మనకెట్లా?'...... అని తలచుచూ, కాలమును దిగులుతో వృథా చేసుకోవటం విజ్ఞుల లక్షణమే కాదు.

'ఆత్మానుభూతి' అను ప్రయోజనముగా గల బోధ స్వరూపం. ఈశ్వరోపాసన మొదలైన అనేక పుణ్యకార్యములకు అధీనమై ఉంటోంది. అనేక జన్మల ప్రయోజనంగా ప్రకటితమౌతోంది. జీవన్ముక్తుల అనుభవములకు సంబంధించిన అభిప్రాయములు పుణ్యవంతులగు ధీరులను మాత్రమే సమీపిస్తున్నాయి.

**ద్విషద్భూతేన యేనైవ కర్మణా బంధ ఈదృశః**
**సుహృద్భూతేన తేనైవ మోక్షమాప్స్యసి, పుత్రక!**

బిడ్డా! ఏ కర్మ అయినా సరే, ... రాగముతో కూడుకొన్న వాడవై నిర్వర్తించావా ... అది నీకు ఒకనాటికి బంధమే కానున్నది. అట్లా కాకుండా రాగహితంగా సుహృద్భావ సమన్వితుడవై కర్మలు నిర్వర్తిస్తే, అవే కర్మలు నీ మోక్ష మార్గానికి దోహదపడతాయి. సజ్జనుల రాగరహితమగు సత్కర్మలన్నీ పూర్వసంచితమైన పాపకర్మలను నశింపజేస్తున్నాయి. వర్షం పడితే దావానలం ఉపశమిస్తున్నట్లు రాగరహిత పుణ్యకర్మలు ఈ జీవుల త్రివిధ తాపములను చల్లార్చుచున్నాయి. ఇక్కడ 'సంసారము' అనే పెద్ద మహాచక్రం తిరుగాడుతోంది. అందులో ఈ జీవుడు చిక్కుకుని చెప్పనలవిగాని మానసిక తాపాలు అనుభవిస్తున్నాడు. తన బిడ్డలు దుఃఖస్థితులను గమనించిన ఆ సర్వేశ్వరుడు ఆధ్యాత్మ శాస్త్రమును ప్రకటించే ఉపనిషత్తులను, ఈ యోగవాసిష్ఠం వంటి గ్రంథాలను, ఆత్మతత్త్వాన్ని ప్రకటించే గురువులను ప్రసాదించారు. బ్రహ్మమునందు ఆసక్తిగలవారికి శాస్త్రముల – గురువుల సేవలు సిద్ధంగా ఉన్నాయి. కుమారా! ఈ 'సంసార చక్రము' అనే ఆవర్తము యొక్క భ్రమ నుండి నీవు బయల్వెడలదలచుకున్నావా? అయితే సత్వరంగా సమస్త కర్మలను కర్మఫలత్యాగ బలంతో, (లేక) సమర్పణ భావంతో వదలి, 'బ్రహ్మము'నందు అసక్తుడవై ఉండుము.

సముద్రం సంక్షోభంతో కూడి ఉన్నంతవరకు దానియందు చంచలత్వం ఉండనే ఉంటుంది. ఎప్పుడైతే జలము నిశ్చలంగా ఉంటుందో, అప్పుడు ఆ సముద్రంలో తరంగాలన్నీ లయించి నిశ్చల – శాంతిజలము మాత్రమే ఉంటుంది. అట్లాగే బాహ్య విషయములందు చిత్తము చంచలంగా ఉన్నంతవరకు ఆ చిత్తంలో 'జగత్తులు' అనే వికల్పాలు లేస్తూనే ఉంటాయి. ఒక్కొక్క చిత్తంలో ఎన్నెన్ని జగత్తులు సంస్కారరూపంలో దాగి, సమయంకోసం వేచి ఉన్నాయో... చెప్పనలవికాదు.

వివేకదృష్టిని ఆచ్ఛాదించే 'శోకము' అను దానిని నీవెందుకు అవలంబిస్తావు చెప్పు? శోకాంధకారము అలముకుంటున్నప్పుడు 'అకుంఠిత ప్రజ్ఞ' అనే చేతి కఱ్ఱతో, 'వివేకము' అనే దీపంతో ముందుకు సాగాలిగాని, అంధకారంలో చతికిలబడి కూర్చోకూడదు. అనేక మంది జీవులు 'హర్ష - శోకములు' అనే శుభాశుభ తరంగాలచే గడ్డిపరకలవలె ఎచటెచటికో కొట్టుకుపోబడుచున్నారు. మహాత్ముల మార్గం అదెన్నటికీ కాదు. నీవు మహాశయముతో మహాత్మత్వమును సంతరించుకోవటానికే ప్రయత్నించాలి. అంతేగాని అల్పాశయములతో అల్ప విషయములచే ఎందుకు ప్రభావితుడవై ఉండటం? బాలుర వంటి అనేకమంది సాంసారిక జీవులు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే - ఆరు ఊర్ములు (కాళ్ళు) గల ఊయలలో హర్ష కోశాల మధ్య ఊయలలూగుచున్నారు. క్రీడా కుతూహలయగు 'కాలము' అనే ఆమె ఆయా జీవులను సృష్టించి పాలించి సంహరించి... తద్వారా ఆటాడుకుంటోంది.

కాలసర్పం ఈ జీవులను ఆక్రమించి ఈ అసంఖ్యాక భౌతిక దేహములను తనకు భక్ష్యంగా, మధుర ఉపాహారంగా చేసి వేసుకుంటోంది. ఆహారము కావటానికై పెంచే పక్షులవలె ఈ జీవులకు కొన్ని కాలగత హర్ష-శోకాదులను అందించి ఎప్పుడో సంహరించి దిగమ్రింగి వేస్తోంది. అటువంటి ఈ దృశ్య ప్రపంచంలో విశేష దృష్టిని, విశేష ధర్మము గాని, విశేష ధర్మిగాని లేదు. సర్వ జీవులను సమాన రూపంగానే ఆ కాలస్వరూపిణి భక్షించటం జరుగుతోంది. అల్పకాలస్థములగు మనుజదేహాల గురించి వేరే చెప్పేదేమున్నది? దీర్ఘ కాలస్థములగు దేవతల దేహములనే అది భక్షిస్తోంది కదా!

❖

మరొక్క విషయం. ఈ దేహము - ఈ దేహంలో ప్రవర్తించే ఇంద్రియాలు తమ తమ విశేష ధర్మములతో, ఇంద్రియ విషయాలతో సహా కాలముచే ఎటుతిరిగీ మ్రింగబడబోతున్నాయి. మరి విపత్తియందు వ్యాకులమైన మనోభావాలు ఉండవలసిన అవసరమేమిటి? ఈ కాలక్రమంలో ఏర్పడే విషయాల పట్ల ప్రీతి కలిగియుండి సంసారనాట్యశాలలో వాటికి అనుకూలంగా నీవు ఇంద్రియ విషయ సమాచారములతో కూడి నృత్యం చేయవలసిన పనేమిటి? అందుచేత ఓ భరద్వాజా! నీవు క్షణకాలం ఆత్మస్వరూపమునందు నిశ్చలంగా ఉన్నవాడవై, అప్పుడీ సంసారనాటకమును చూడు. అదియే మరల-మరల అభ్యాసం చేయి. క్రమక్రమంగా అదియే అనునిత్యత్వంగా సంతరించుకొనుగాక!

**అస్యానేక తరంగస్య జగతః క్షణభంగినః**
**న విషీదతి మనస్వీ భరద్వాజ! మనాగపి ॥**

ఓ భరద్వాజా! క్షణభంగురమైన అనేక తరంగములో కూడిన ఈ జగత్తును గూర్చి వివేకియగు జీవుడు కొంచెం కూడా దుఃఖించడు.

**త్యజ శోకం అమంగల్యం, మంగలాని విచిన్తయ ।**
**చిదానందఘనం, స్వచ్ఛం ఆత్మానం చ విభావయ ॥**

కనుక నీవు అమంగళమైనట్టి శోకమును త్యజించు. ఆత్మదర్శనసాధనములైన మంగళములను బాగుగా చింతన చేయి. చిదానందఘనము, స్వచ్ఛము అయినట్టి ఆత్మస్వరూపం గురించి బాగా విచారణ చేయి, దేవతల, బ్రహ్మాభ్యాసపరుల, గురువాక్యముల పట్ల శ్రద్ధచే పరిపూర్ణమైన చిత్తము కలవారు, వేద ప్రవచనములు ప్రమాణంగా కలవారు అగు మనుజులకు ఆ మహేశ్వరుని అనుగ్రహం తప్పకుండా కలుగుతోంది.

**భరద్వాజుడు :**

**జ్ఞాతం తవ ప్రసాదేన సర్వమేతత్ అశేషతః**
**న వైరాగ్యాత్ పరో బంధుర్, న సంసారాత్ పరో రిపుః ॥**

హే మహాత్మా! తమ అనుగ్రహం చేత నా అజ్ఞానం దేనిపట్ల ఎట్లా ఏర్పడియున్నదో గ్రహిస్తున్నాను. "వైరాగ్యాన్ని మించిన బంధువు లేదు. సంసారాన్ని మించిన శత్రువు లేదు" అని గ్రహిస్తున్నాను. మునీంద్రా! శ్రీ వసిష్ఠ మహర్షి ఇప్పటిదాకా చెప్పిన జ్ఞానసారాన్ని ఒక్కసారి సమీక్షించి చెప్పవలసినదిగా నా ప్రార్థన.

**శ్రీవాల్మీకి మహర్షి :** 'ముక్తిదాయకమ్, మహాజ్ఞానమ్' అని చెప్పబడుదాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను. విను.

**సంహృతిస్థితి సంభూతి భేదైర్యోఽనేకధా స్థితః,**
**ఏకోఽపిసన్, నమస్తస్మై సచ్చిదానందమూర్తయే!**

ఏ పరమాత్మ సర్వదా ఒక్కడే అయినప్పటికీ సృష్టి - స్థితి సంహార భేదం చేత అనేక రూపములుగా ఉండి ఉన్నాడో అట్టి సచ్చిదానందమూర్తికి ఇవే నమోవాక్కులు.

ఈ కనబడే ప్రపంచమును తన కారణమునందు లయమొనర్చుటంచేత ఏ విధంగా ఆత్మతత్త్వము ప్రకాశించగలదో ...అట్టి ఉపాయరూపమైన - ఇప్పటి వరకు జరిగిన సంవాదమును సంక్షేపంగా చెప్పుచున్నాను విను-

ఈ జీవుడు 'అహంకారము' అను ఒక కల్పితమును ఆశ్రయించుటచే ఆతని పూర్వాపర విచారయోగ్యమైన ఆత్మకు సంబంధించిన 'స్మృతి' ఆత్మయందు అప్రత్యక్షమై, దృశ్యమునందు ప్రవేశించి ప్రవర్తిస్తోంది.

అట్టి 'స్మృతి' యొక్క నిర్మలత్వము చేతనే సమస్తము స్వయంగా కరతలామలకమై గోచరించ గలదు. దేనిని పొందటం చేత ఈ జీవుడు మరల శోకించడో... అట్టి వస్తువు లభించేది ఎక్కడ? ఎక్కడో కాదు. స్వచిత్తమునందే, స్వయంగా విచారణ చేయటంచేత మాత్రమే లభించగలదు.

వైరాగ్యముతో కూడిన మనిషి ఈ క్రింది మార్గములలో ఆత్మతత్త్వమును ఎంత అధికంగా సాధ్యమైతే అంతగా విచారణ - విమర్శలు చేయవలసి ఉన్నది.

1. సత్సంగం, 2. సచ్ఛాస్త్రం, 3. స్వవివేకం.

❖❖❖

# 2. ఆత్మానంద సాగరం

**శ్రీవాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఈ జీవుడు మొట్టమొదట "అజ్ఞానపూరితములు, పరమ దుఃఖ పూరితములు అగు విషయేంద్రియముల మధ్య దేహధారినై చిక్కుకున్నాను"- అని గుర్తించాలి. నేనెవరు? ఈ జగత్తంతా ఏమిటి? ఈ జన్మ - మృత్యు - జరా - వ్యాధి - దుఃఖములన్నీ ఎక్కడి నుండి వచ్చిపడుచున్నాయి? - అనే ప్రశ్నలకు రావాలి. 'నా దృష్టి అపవిత్రమై ఉండుటచేతనే నాకు ఈ దుఃఖాదులు దాపురిస్తున్నాయి. "ఇప్పుడు ఇద్దానిని పవిత్రపరచి జ్ఞాన విశేషాలతో నింపివేయాలి." ... అని మహత్తర కార్యక్రమమునకు సంసిద్ధుడు కావాలి.

ఇంద్రియ విషయములకై అఱ్ఱులు చాచే మనస్సును కించిత్తు శాంతపరచాలి. ఇంద్రియాలను విషయాల నుండి మరల్చటానికై వాటిని దమింపజేయాలి. శమము, దమము మొదలైన శాస్త్ర విహిత ఉపరతి కార్యక్రమాలు చేపట్టాలి. నిషిద్ధ కామ్యకర్మల నుండి, విషయేంద్రియ సంయోగంచే కలిగే సుఖాభాస నుండి విరతుడై స్వస్వరూపాత్మ వైపుగా దృష్టి సారించాలి.

శ్రద్ధావంతుడై మృదువైన ఆసనమును ఆశ్రయించాలి. ఇంద్రియములను జయిస్తూ ఈ మనస్సు ప్రసన్నమయ్యేంత వరకు 'ఓం'కారమును ఉచ్చరించాలి. అట్లాగే అంతఃకరణ శుద్ధికొరకై ప్రాణాయామము మొదలైనవి ఆచరించాలి. క్రమంగా మెల్ల మెల్లగా ఇంద్రియములను విషయములనుండి తొలగించాలి.

దేహము - ఇంద్రియములు - మనస్సు - బుద్ధి - జీవుడు వీటన్నిటి యొక్క చమత్కారమంతా దేనినుండి కలుగుతోందో అట్టి అధిష్ఠానమగు ఆత్మ గురించి తెలుసుకోవాలి. ఆ ఆత్మయందు తదితరమైనదంతా లయం చేస్తూ రావాలి.

❖

**విరాజి ప్రథమం స్థిత్వా తత్రాత్మని తతః పరం**
**అవ్యాకృతే స్థితః పశ్చాత్, స్థితః పరమకారణే॥**

**అ :** మొట్టమొదట 'అ' కారవాక్యమైనట్టి 'స్థూలభూత సమష్టి రూపమైన విరాట్టును నేనే' అనగా, 'ఈ స్థూలరూప బ్రహ్మాండముల ఉనికికి కారణకారణం నా అంతర్యామి స్వరూపమే' అని భావన చేయాలి.

**ఉ :** ఆ తరువాత ఆ 'విరాట్టు అహంభావన'ను 'ఉ' కారవాచ్యమగు 'సూక్ష్మభూత సమష్టిరూపము' అయిన హిరణ్యగర్భ జ్ఞానమునందు లయం చేయాలి. అనగా 'అట్టి సూక్ష్మభూత సమష్టి రూపహిరణ్యగర్భుడగు జ్ఞానిని నేనే' అను అహంభావనను ఆశ్రయించాలి.

**మ :** అప్పుడిక ఆ సమష్టి మనోరూపమును అద్దానికి కారణమైయున్న 'మ' కార్యవాచ్యమైనట్టి 'వ్యాకృతము' నందు లయం చేయాలి. అనగా, 'స్థూల-సూక్ష్మముల ఉభయములకు ఆశ్రయమైయున్న సాక్షితత్త్వమే నేను'..... అను రూపమైన అహంభావనను ఆశ్రయించాలి. అనంతరం ఆ మాయా

వ్యాకృతము కూడా అర్ధమాత్ర వాచ్యము – పరమకారణము అయిన శుద్ధబ్రహ్మమునందు లయం చేసి ... ఇక ఆపై ఆ శుద్ధ బ్రహ్మమునందే స్థితి కలిగి ఉండాలి.

❖

ఏది ఎందులోంచి వస్తే చివరికి అది అందులో లయం కావలసిందే కదా....అందుచేత ఉత్కృష్టులగు ఉద్దాలకుడు వంటి నిర్వాణయోగుల సంయోగసాధన గురించి విను.

ఈ దేహము యొక్క 'మాంసము' మొదలైన పృథివీ సంబంధ (పార్థివ సంబంధ) విభాగములను పృథివీతత్వంలో లయం చేయాలి. అనగా, దేహమును తదితర విరాట్ పృథివీతత్వంలోని ఒక చిన్న విభాగంగా దర్శించాలి. ఈ దేహమును తదితర బ్రహ్మాండముల వలెనే తనకు బాహ్యమైన ఒక భౌతిక పదార్థంగా దర్శించాలి.

అట్లాగే ...జల సంబంధమైన రక్తాదులను జలతత్వంలో, తేజోసంబంధమైన విభాగమును తేజోతత్త్వంలో, వాయుసంబంధ విభాగమును వాయువులో, ఆకాశసంబంధమైన విభాగమును ఆకాశంలో లయం చేయాలి. అనగా, అవన్నీ వాటివాటి తత్త్వములుగా చూడసాగాలి.

అదే విధంగా ఘ్రాణము, కళ్ళు, చెవులు మొదలైన ఇంద్రియములను తమ తమ కారణములగు దేవతోపాధిభూత సూక్ష్మతత్త్వములందు లయం చేసివేయాలి. వీటినన్నిటినీ ఆయా అధిదేవత సొత్తుగా, ప్రదర్శనగా గాంచాలి. అనగా ...అన్నిటికీ కర్త అయిన ఈ జీవుని యొక్క చెవులు, కళ్ళు, ముక్కు మొదలైన ఇంద్రియములలో ఆయా దేవతలు అధివసిస్తున్నారు కదా! కనుక ఇంద్రియ భావములన్నీ ఆయా అధిదేవతలకు సమర్పణ చేయాలి.

ఎట్లా అంటే ...

| | |
|---|---|
| శ్రోతేంద్రియము (చెవులు)ను | ... దిగ్దేవతలయందు (దిగ్దేవతల ప్రదర్శనా చమత్కారంగా) |
| త్వక్ఇంద్రియాన్ని (చర్మం, స్పర్శను) | ... విద్యుత్ తేజోశక్తియందు, |
| నేత్రేంద్రియమును (కళ్ళు) | ... సూర్య బింబమునందు, |
| జిహ్వేంద్రియమును | ... వరుణుని యందు, |
| ప్రాణమును | ... వాయువునందు, |
| వాక్కును | ... అగ్నియందు |
| హస్తేంద్రియము (చేతులను) | ... ఇంద్రునియందు |
| పాదేంద్రియమును (కాళ్ళను) | ... విష్ణువునందు, |
| గుదేంద్రియమును | ... మిత్రునియందు |
| ఉపస్థేంద్రియమును | ... కశ్యపునియందు, |
| మనస్సును | ... చంద్రునియందు |
| బుద్ధిని | ... బ్రహ్మదేవునియందు |

...లయింపజేయాలి. వీటన్నిటినీ ఆయా అధిదేవతల సొత్తుగా, సమర్పిత భావనతో దర్శనం చేయాలి.

ఓ భరద్వాజా! వాస్తవానికి 'ఇంద్రియములు"... అనబడే వేఱు వస్తువులేవీ లేవు. ఆ దేవతలే ఈ దేహంలో 'ఇంద్రియములు' అనే మిషచే స్థితినొందియున్నారు. ఈ వాక్యాలు నేను శ్రుతి వాక్యములను అనుసరించే చెప్పుచున్నాను గాని, ఏదో స్వకపోలకల్పితం కాదు.

ఈ విధంగా మనుజుడు ఈ తన దేహమును అద్దాని కారణమున లయింపజేసి "నేను విరాట్ పురుషుడను"..... అని భావనచేయాలి. నాయనా! ఈ సమస్త భూతములకు ఆధారం, కారణం కూడా సర్వ బ్రహ్మాండములకు ప్రభువైనవాడు, అర్ధనారీశ్వర స్వరూపుడు అగు ఆ ఈశ్వరుడే సుమా! ఇదంతా ఆయనదే అయి ఉన్నది. కనుక ఆయనకు సమర్పించడంలో కష్టమేమున్నది? ఆతడే తన యజ్ఞసృష్టి రూపములలో ఈ జగద్వ్యవహారమునందు అంతటా స్థితి కలిగియున్నాడు. ఇక్కడ కొన్ని శ్రుతి ప్రతిపాదిత సృష్టి చమత్కారాలు పురశ్చరణ చేద్దాం!

❖

ఈ బ్రహ్మాండమునకు బాహ్యమున దీనికి రెండింతలు పృథివీతత్త్వమున్నది. అట్టి పృథివికి ఆవల, దానికి రెండింతలు జలతత్త్వమున్నది. జలమునకు ఆవల రెండింతలు తేజము ఉన్నది. తేజమునకు ఆవల రెండింతలు వాయువు ఉన్నది. వాయువుకు ఆవల రెండింతలు ఆకాశము ఉన్నది... ఈ విధంగా ఉత్తరోత్తరక్రమముచే ఒకదానికంటే మరొకటి ద్విగుణీకృతమై ఉంటోంది.

ఈ ప్రపంచమంతా కూడా 1.పంచీకృతము, 2.అపంచీకృతము అగు భూతములచే నిండి ఉంటోంది. అందుచేత ఆత్మతత్త్వమును ఆశ్రయించాలనుకునే యోగి పృథివిని దానికి కారణమైన జలమునందు, జలమును అగ్నియందు, అగ్నిని వాయువునందు, వాయువును ఆకాశమునందు, ఆకాశమును సమస్తోత్పత్తికి కారణమగు హిరణ్యగర్భాశయమునందు లయమొనర్చి వేయాలి.

**లింగ శరీరం -** 1. వాసనలు, 2. సూక్ష్మభూతములు, 3. కర్మ, 4. అవిద్య, 5. దశేంద్రియములు, 6. మనస్సు, 7. బుద్ధి ... ఇవన్నీ చేరినదానినే పండితులు 'లింగశరీరం' అని పిలుస్తున్నారు.

ఈ విధంగా స్థూలోపాధియొక్క భావనావిలయముచే ఆ యోగి అర్థరూపము పొందినవానివలె ఉంటున్నాడు. ఆ తరువాత 'బ్రహ్మాండాభిమానత్యాగము'చే ఆతడు ఈ బ్రహ్మాండ వ్యవహారము నుండి బహిర్భూతుడౌతున్నాడు. అప్పుడు సూక్ష్మభూతాత్మకమైన సమష్టిలింగదేహమున 'నేను సర్వమునకు అధిష్ఠానమగు హిరణ్యగర్భుడనే'.... అని భావన (లేక) చింతన చేయాలి.

ఈ సమష్టి భూతాభిమానియే ప్రప్రథమంగా 'చతుర్ముఖ బ్రహ్మ...' అను రూపమున వ్యవస్థితుడై ఉన్నాడు. అట్టి లింగశరీరాన్ని కూడా ...దానికంటే కూడా సూక్ష్మమై అద్దానికి కారణభూతమైయున్నట్టి 'అవ్యాకృతము ...అని చెప్పబడుదానిలో ఆ బుద్ధిమంతుడు లయం చేయుగాక!

**అవ్యాకృతం -** దేనియందైతే ఈ సమస్తమైన జగత్తు కలదో ... అట్టి అవ్యాకృతం, లేక అవ్యక్తము నామరూపరహితమైనది. దానినే కొందరు 'ప్రకృతి' అని, మరికొందరు 'మాయ' అని ఇంకొందరు 'పరమాణుతత్త్వము' అని చెప్పుచున్నారు. అట్లాగే ఇంకాకొందరు తార్కికులు (బౌద్ధులు మొదలైనవారు) ఆయా తర్కములచే ఏర్పరచుకున్నవారే అదే 'సంవృతరూపము' అని, అవిద్య అని

ప్రతిపాదిస్తున్నారు. ప్రళయకాలంలో అద్దానియందే సమస్త పదార్థభావములు లయించి అవ్యక్తరూపంలో ఉంటున్నాయి. మరల సృష్టి ప్రారంభమయ్యే వరకు అవి అవ్యక్తమునందే పరస్పర సంబంధరహితములై ఉంటున్నాయి.

అనగా ...జగత్ సంబంధిత భావనలన్నీ తమ తమ భోగ్యత్వరూపాన్ని కోల్పోయి చిత్ స్వరూపం సంతరించుకుంటున్నాయి. మరల సృష్టి ప్రారంభంలో చిత్ నుండే ఉత్పన్నమౌతున్నాయి.

అధ్యారోప (లేక, అనులోమ) క్రమం చేత అవ్యక్తం నుండి అవి సృష్టిగా అగుచున్నాయి. అపవాద (లేక, ప్రతిలోమ) క్రమముచే సమస్తము అద్దానియందే లయిస్తున్నాయి.

**స్థానత్రయాతీతమైన తురీయపద ధ్యానం**

| | | |
|---|---|---|
| 1. విరాట్ | 2. హిరణ్యగర్భ | 3. అవ్యాకృతం |
| { 1. స్థూలం | 2. సూక్ష్మం | 3. కారణం } |
| { 1. జాగ్రత్ | 2. స్వప్నం | 3. సుషుప్తం } |

ఈ త్రిపుటీ సమూహములను జయించి నీవు నాశరహితమగు తురీయ పదమును ధ్యానించాలి. అట్టి తురీయపద ప్రాప్తి కొరకై 'చరమ సాక్షాత్కార వృత్తి'చే లింగ దేహమును కూడా వలయమొనర్చాలి. అనగా 'ధ్యాన – కర్మ – కరణ'వృత్తి రూపమగు లింగ దేహమును కూడా 'మూలాజ్ఞాన త్యాజ్యము' అను సాక్షాత్కారవృత్తిచే శుద్ధబ్రహ్మమునందు విలయమొనర్చాలి. కుండ పగిలితే కుండలోని ఆకాశం మహాకాశంలో విలీనమౌతుంది చూచావా? అట్లాగే నీవు నిరతిశయానందరూపమగు పరబ్రహ్మమున ప్రవేశించెదవు గాక.

❖

**పంచభూతములు -** మనస్సు, బుద్ధి, వాసన, కర్మ, ప్రాణవాయువులు... వీటన్నిటి యొక్క ప్రతిష్ఠ అజ్ఞానమే అయి ఉన్నది. శుద్ధ బ్రహ్మమున అజ్ఞాన రూపావరణ ఏర్పడుచటే అది తనకు తానే మొట్టమొదట అవ్యాకృతంగాను,ఆ తరువాతనే సూక్ష్మభూతలము ద్వారా లింగ శరీరంగాను జనిస్తున్నది. కనుక లింగ శరీరమునకు అజ్ఞానమే మూల ప్రతిష్ఠ. అజ్ఞాన నివృత్తిచే లింగ శరీరం అనే విశృంఖలములు తప్పకుండా స్వయంగా విచ్ఛిన్నమగుచున్నాయి.

❖

**భరద్వాజ మహర్షి :** హే మహర్షీ ! యొక్క చెప్పే మహత్తరమైన అవ్యాకృతాతీత తురీయస్థితి గురించిన విశ్లేషణా ప్రభావం చేత నేనిప్పుడు లింగ శరీర విశృంఖలముల నుండి సర్వదా విముక్తుడనైనాను. చిద్రూపసాగరమున ప్రవేశించిన వాడనైనాను. అట్టి చిద్రూపసాగరంలో 'అభేదం' పొందటం చేత సర్వోపాధివర్జితుడనగు పరమాత్మయే అయి ఉన్నాను. ఇట్టి "ఐక్యకూటస్థాత్మ" గురించి ఇతఃపూర్వం శ్రుతులు చెప్పగా విన్నాను. ఇప్పుడు మీ కృపచే తదనుభవజ్ఞుడనగుచున్నాను. అగ్నిలో వేయబడిన అగ్ని ఆ అగ్నితో ఐక్యం పొందినప్పుడు తన్మయత్వముచే 'అగ్ని' అనే పేరుతోనే చెప్పబడుతుంది కదా! అట్లాగే నా విశేషరూపం మరింకే పేరుతోనూ చెప్పబడటం లేదు. అది

'పరమాత్మయే' అనబడుతోంది. లవణ సముద్రంలో పడిన తృణ-కాష్ఠాదులు (గడ్డిపరక-కట్టె మొదలైనవి) లవణ మయమే అవుతాయి కదా! అట్లాగే అచేతనమగు ఈ జగత్తు చైతన్యమునందు లయమొనర్చబడిప్పుడు ఇది కూడా చైతన్యమే అగుచున్నది.

ఒక సైంధవ లవణపు బొమ్మ (ఉప్పుబొమ్మ) ఉన్నది. అది సముద్రపు లోతు ఎంతో కొలవటానికి బయలుదేరి, సముద్రంలో ప్రవేశించింది. అప్పుడేమౌతుంది. ఆ ఉప్పుబొమ్మ జలంలో ప్రవేశించగానే జలరూపంగా అయి తన నామరూపములు కోల్పోతుంది. పాల సముద్రంలో పోయబడిన పాలు ఇక క్షీరంగానే మారుతుంది. కడివెడి నేతిలో కలుపబడిన నేతిబొట్లు నేతిరూపమే అగుచున్నాయి. ఈ జలాదుల ఉపాధులన్నీ (మంచుగడ్డలన్నీ) జలంలో ప్రవేశిస్తే జలమే అవుతున్నాయి. అట్లాగే నేను కూడా సత్స్వరూపమగు చైతన్యమున ప్రవేశించి, చైతన్యరూపుడనై వెలయుచున్నాను.

**నిత్యానందే సమస్తజ్ఞేష పరే, పరమకారణే,**
**నిత్యం, సర్వగతం, శాంతం, నిరవద్యం నిరంజనమ్॥**
**నిష్కలం, నిష్క్రియం, శుద్ధం, తద్బ్రహ్మాస్మి పరం పరమ్।**
**హేయోపాదేయ నిర్ముక్తం, సత్యరూపం, నిరింద్రియం॥**
**కేవలం సత్య సంకల్పం శుద్ధం బ్రహ్మాస్మ్యహం పరమ్,**
**పుణ్యపాప వినిర్ముక్తం కారణం జగతః పరం॥**
**అద్వితీయం పరంజ్యోతిర్ బ్రహ్మాస్మ్యానన్దమవయం,**
**ఏవమ్ ఆది గుణైర్యుక్తం సత్వాది గుణవర్జితమ్,**
**ప్రవిష్ఠం సకలం బ్రహ్మ సదాధ్యాయేత్స్వకర్మకృత్॥**

నిత్యానందరూపమై, సర్వజ్ఞమై, సర్వసాక్షియై పరమ కారణమైనట్టి పరబ్రహ్మమునందు నేను. నిత్యమై, సర్వ వ్యాపకమై, శాంతమై, దోషరహితమై, నిరంజనమైనట్టి బ్రహ్మరూపుడనై ఉన్నాను. నిష్కళమై, నిష్క్రియమై, హేయ ఉపాధేయ రహితమై, సత్యరూపమై, ఇంద్రియరహితమైనట్టి శుద్ధబ్రహ్మమే నేను. నా స్వరూపం కేవలమై సత్య సంకల్పయుతమై, పుణ్య-పాప వర్జితమై, జగత్తు యొక్క పరమకారణమై, శుద్ధమైనట్టి పరబ్రహ్మమే అయి ఉన్నది. నేను అద్వితీయమై, నాశనరహితమై, పరమప్రకాశమైనట్టి అవ్యయానంద బ్రహ్మమునే అని అనటంలో నాకు సందేహమే లేదు. నా స్వరూపం సత్య సంకల్పాది సౌరభ్యంతో కూడి ఉన్నది. మాయికములైనట్టి సత్వ-రజో-తమో గుణములు లేవు. సర్వ రూపమైనట్టి బ్రహ్మమగు నా స్వరూపమే సాధకులందరికి శ్రవణ-మననాది స్వకర్మలచే ఆరాధనార్హమైయున్నది.

ఈ విధంగా నేను బ్రహ్మమును ధ్యానించటం, అభ్యసించుట చేత నా మనస్సు ఆ బ్రహ్మమునందే లయం పొందుతోంది. మనస్సు లయించగానే నేను స్వయాత్మ స్వరూపుడనై అన్ని వైపులా ప్రకాశిస్తు న్నాను. ఆనందరూపమగు ఆత్మ ప్రకాశిస్తూ ఉండగా ఇక సమస్త దుఃఖాలు అనే క్రీనీడలు స్వయంగా తొలగిపోతున్నాయి. అప్పుడు ఆత్మ సహజసిద్ధమగు తన ఆనందరూపమును పొందుతోంది.

ఓ గురువర్యా! నా కంటే వేరైన సచ్చిదానందమయుడగు ప్రభువు మరొకడెవడూ లేడు. 'నేనొకడనే పరబ్రహ్మమును' అని నా సర్వరూపాత్మ లోలోన అనుభవించుచున్నది. ఎందుకంటే, తదితరులంతా నా స్వరూపులే!

**శ్రీవాల్మీకి మహర్షి :**

**సఖే! సంన్యస్య కర్మాణి బ్రహ్మణః ప్రణయీ భవ**
**నేష్యేసే యది సంసారచక్రావర్త భ్రమః శమమ్॥**

ఓ సఖుడా! నీ స్వస్వరూపము అంతటిదే! ఇందులో సందేహమే లేదు. సర్వ కర్మలు పరిత్యజించినవాడవై, బ్రహ్మప్రాప్తియందే ఏర్పడి ఉండుము. ఈ 'సంసారచక్రము'అనే పెద్ద ఆవర్తము భ్రమవంటిది మాత్రమే. 'ఇందులో ఏదో పొందవలసియున్నది ....' అని అల్పభ్రమను ఆశ్రయించకుండా ఉన్నావా...నీ బ్రాహ్మీస్థితికి రాగల లోటేమీ ఉండదు.

**భరద్వాజుడు :** గురుదేవా! తాము వచించిన జ్ఞానమంతా తమ కృపారసం చేత నేను గ్రహించాను. తమ అనుగ్రహంచేతనే నా బుద్ధి నిర్మలమైనది. ఇక ఈ 'సంసారభ్రమ'గురించి తెలుసుకొని ఉండటంలో ఏమాత్రం జంకుగాని, అనుమానం గాని, ఆలస్యంగాని నాకు లేవు. అయినా కూడా 'జ్ఞాని' యొక్క కర్మ విశేషములు ఎట్లా ఉంటూ ఉంటాయో మరల మీ నుండి వినాలని అభిలాష మాత్రం ఉన్నది. ప్రభూ! ఆతని కర్మ ప్రవృత్తి రూపంలో ఉంటుందా? లేక నివృత్తి రూపంలో ఉంటుందా? లేక ఆతనికి కర్తవ్యమంటూ ఏదైనా ఉంటుందా? ఏదీ ఉండదా? ఈ విషయంలో మీ అమూల్యమైన అభిప్రాయాలు దయచేసి నాకు తెలియజేయండి.

**శ్రీవాల్మీకి మహర్షి :**

**తస్మాత్ యన్నకృతే దోషః తత్కర్తవ్యం ముముక్షుభిః,**
**కామ్యం కర్మ నిషిద్ధం చ న కర్తవ్యం విశేషతః ॥**

ఓ భరద్వాజా! సమస్తము త్యజించి బ్రహ్మము గురించి మాత్రమే అభ్యాసపరుడవై ఉంటే కాలక్రమంగా సంసారమును జయిస్తావు. "సంసారభ్రమ నివర్తకం" అనేది లభించాలంటే సమస్తం త్యజించి బ్రహ్మమును గూర్చిన అభ్యాసమునే ఆశ్రయించాలి. అందుచేత ఏ కర్మలు ఆచరిస్తే దోషమేదీఉండదో...అవియే ముముక్షువులు ఆచరించతగినవై ఉంటాయి. ఇంతకు మించిన కామ్య – నిషిద్ధ కర్మలు ముముక్షువులు విశేషంగా ఆచరించవలసిన పని లేదు. దేహమునకు, మనస్సుకు బ్రహ్మమునకు వేరువేరైన చమత్కార ధర్మములు ఏర్పడి ఉన్నాయి.

**1. దేహ గుణములు (లేక) దేహ ధర్మములు :** ఈ దేహము ప్రకృతిచే నిర్మించబడి ప్రకృతి చేతనే ఉపసంహరించబడుతోంది. దీనికి బాల్యయౌవన వార్ధక్యాలున్నాయి. అనుక్షణం మార్పు చెందుతూనే ఉంటుంది. పరమాణువుల సంయోగ వియోగాలచే ఇది వృద్ధి, క్షయాలు పొందుతోంది.

**2. మనో గుణములు (లేక) మనో ధర్మములు :** ఇది ఏది ఎట్లు ఎంతకాలం ఏ రీతిలో ఆశ్రయిస్తే అద్దానిని అట్లే అంతకాలం ఆ రీతిలోనే పొందుతూ ఉంటుంది. అల్పకాలిక విషయములను

ఆశ్రయిస్తే అల్పత్వం పొందుతోంది. గుప్తము – శాశ్వతము అగు ఆత్మను ఆశ్రయిస్తే ఆత్మత్త్వము సంతరించుకుంటోంది.

**3. బ్రహ్మము యొక్క ధర్మములు :** ఆత్మ (లేక) బ్రహ్మము స్వయంజ్యోతి స్వరూపం. అఖండం. అప్రమేయం. నిత్యనిర్మలం, సత్యం. కారణ–కారణం. అంతటా ఏర్పడి వ్యాపించి ఉన్నది.

ఈ జీవుడు ఎప్పుడైతే దేహం యొక్క, మనస్సు యొక్క గుణాలను వదలి బ్రహ్మం యొక్క 'సత్–చిత్–ఆనందం' అనబడే గుణములతో కూడుకొని ఉంటాడో ...అప్పుడు సమస్త ఇంద్రియములు కర్మల పట్ల నిరంజనం, నిరాకారత్వం, నిర్వికారత్వం వహించి ఉంటాయి. ఆ జీవుడి పట్ల ఇంద్రియత్వం శమించటం చేత, ఇక ఆతడు సర్వవ్యాపియగు ప్రభువై ఉంటాడు. అట్టి వానిని ఆతని కర్మలు అంటవు. అవి అతనిని నిర్వచించలేవు.

**జీవుడు - విముక్తుడు :** ఎప్పుడీ జీవుడు విముక్తుడు (లేక) విముచ్యుడు అయి ఉంటాడో అదిప్పుడు చెప్పుచున్నాను విను.

**దేహేంద్రియమనోబుద్ధేః పరస్తస్మాచ్చ యః పరః,**
**సో హమస్మి యదా ధ్యాయేత్ తదా జీవో విముచ్యతే॥**
**కర్తృత్వ–భోక్త్రాది నిర్ముక్తః సర్వోపాధి వివర్జితః,**
**సుఖదుఃఖ వినిర్ముక్తస్తదానీం విప్రముచ్యతే॥**
**సర్వభూతేషుచ ఆత్మానం సర్వభూతాని చ ఆత్మని,**
**యదా పశ్యతి అభేదేన తథా జీవో విముచ్యతే॥**
**జాగ్రత్ స్వప్న సుషుప్తాఖ్యాం హిత్వాస్థానత్రయం యదా**
**విశేత్ తురీయమానందం తదా జీవో విముచ్యతే॥**

'ఈ దేహ – ఇంద్రియ – మనో – బుద్ధుల కంటే పరమై, అన్నమయ – ప్రాణమయ – మనోమయ – విజ్ఞానమయ కోశములకంటే విశిష్టమైన ఆనందమయకోశం' ఉన్నది. ఆ ఆనందమయ కోశమునకు కూడా పరమై "బ్రహ్మము" ఏర్పడి ఉన్నది. అట్టి బ్రహ్మమే నేను ... అను ధ్యానం చేత అతడు విముక్తుడౌతాడు.

ఎప్పుడైతే "నేను కర్తృత్వ – భోక్తృత్వ రహితుడను. సర్వ ఉపాధులలో ఉండికూడా, సర్వ ఉపాధులను త్యజించినదై, సర్వదా వాటినన్నిటికీ అతీతమై ఏ బ్రహ్మమున్నదో ...అదే నేను..." అని గ్రహిస్తూ ఉంటాడో అప్పుడు సుఖ దుఃఖముల నుండి విడివడినవాడై విముచ్యుడౌతాడు.

"ఈ సమస్త జీవజాలాలో నేనున్నాను. ఇవన్నీ నా ఆత్మయందే, ఆత్మగానే ఉన్నాయి. అందుచేత ఒక జీవునికి మరొక జీవునికి భేదమే లేదు. నాతో సహా ప్రతి ఒక్క జీవి స్వయంగా ఆత్మయే అయి ఉండగా...ఇక ఇక్కడ అభేదమే సిద్ధిస్తోంది గాని భేదము కాదు..." అను అనుభవాన్ని ఆశ్రయించి ఉన్నవాడు సంసార విముక్తుడు స్వభావ సిద్ధంగా అగుచున్నాడు.

ఏ జీవుడైతే "నేను జాగ్రత్ సంవిత్తు కాదు. స్వప్న సంవిత్తు కాదు. సుషుప్త సంవిత్తు కూడా కాదు. అందుచేత ఈ మూడు అవస్థలను ఇక్కడే ఉండనిచ్చి, ఈ మూడింటికి ఆవల ఉన్న తురీయమునందు ఏర్పడి ఉంటున్నాను" అను నిత్య సంస్థితానుభవమును సంతరించుకుంటున్నాడో, ఆతడు మాయ నుండి ఇట్టే విడివడుచున్నాడు. అట్టి తురీయమే ఈ జీవుని యొక్క పరమాత్మయందలి స్థితి. అద్దానిలో ఈ జాగ్రత్–స్వప్న–సుషుప్త బీజవాసనలు లేవు. ఎందుకంటే అది స్వతః నిర్మలమైనది, స్వయంప్రకాశమైనది, సర్వమును వెలిగించునది కూడా. అది 'నిద్రాణవిరహితం' అని విజ్ఞులు ఎఱుగుచున్నారు. కర్మ–అజ్ఞానము మొదలైనవి అందులేవు. అది సుషుప్తికంటే కూడా పరమైనది. చైతన్య సుఖ సమన్వితమైయున్నది.

ఆ మహత్తర సుఖానుభవమే భక్తియొక్క, యోగము యొక్క, విచార మాత్రజనితమైన సాక్షాత్కారము యొక్క పరాకాష్ఠ.

ఏ జీవునికైనా సరే, ఆ తురీయ సంస్థితమునందు మాత్రమే వాస్తవమైన సుఖవిశ్రాంతులు లభిస్తున్నాయని కర్మ–భక్తి–యోగ–జ్ఞాన సాధకులందరు ముందుగానే గ్రహించి ఉండెదరు గాక! తరంగములు శమిస్తే ఇక సముద్రమంతా నిండి ఉండేది జలమే కదా! ఆత్మామృత సముద్రంలో మనస్సు లయించగా, అట్టి మనుజునికి ఆత్మ తప్ప మరింకేదీ గోచరించదు. అట్టి వానినే 'ఆత్మజ్ఞుడు. ఆత్మను మాత్రమే ఎరుగుచున్నవాడు' లేక 'ఆత్మ సంవిత్తు' అని పిలుస్తున్నాం.

ఓ భరద్వాజా! మరొక్కసారి గుర్తు చేస్తున్నాను. అట్టి ఆత్మ రూపమహాసముద్రంలోనే నీవు స్నానమాడాలి. అంతేగాని ద్వైతరూప ఉప్పు సముద్ర తరంగాలలో దూకవలసిన పనేమిటి చెప్పు?

**భరద్వాజుడు :** అట్టి జ్ఞానస్థితి నాకు సులభతరమయ్యేదెట్లా?

**శ్రీవాల్మీకి మహర్షి :**

**మజ్జమజ్జసి కిం ద్వైతగ్రహక్షారాబ్ధి వీచిషు?**
**భజ సంభరితాభోగం పరమేశం జగద్గురుమ్॥**

ఆ జగద్గురువగు పరమేశ్వరుడు తన భక్తులను అనుగ్రహించుట కొరకై 'అర్ధనారీశ్వరుడు' మొదలైన ఆయా రూపములను ధరించి భక్త జనులకు జ్ఞానము ప్రసాదిస్తున్నాడు. అట్టి సర్వాత్మకుని ఆయా అనుకూలరూపంతో జ్ఞాన సిద్ధి కొరకై భజించు, అర్చించు. అర్చనాదులచే భక్తి ప్రవృద్ధమగుచుండగా జ్ఞానము వికసించి జ్ఞానసిద్ధిచే చిదానందమగు తురీయమునుండి ఏర్పడి ఉండగలుగుతావు. అంతేని, ఈ ద్వైతరూప క్షార సముద్రంలో మునుగవలసిన పనేమిటి?

❖

పుత్రకా! భరద్వాజా! ఈ విధంగా శ్రీవసిష్ఠ మహర్షి విశ్వామిత్ర – నారదాది మహర్షులు, సిద్ధులు, తదితర మహనీయులు వేంచేసియున్న ఆ దశరథ మహారాజు యొక్క నిండు సభలో శ్రీరామచంద్రునికి ఇప్పటివరకూ చెప్పియున్న ఉపదేశమంతా పూసగుచ్చినట్లు చెప్పుకుంటూ వచ్చాను. దీనినంతా నీవు జ్ఞానమార్గంచేత, యోగమార్గం చేత చక్కగా నిశ్చయరూపంగా ఎఱుగుము.

ఎందుకంటే శాస్త్ర విచారణ చేతను, గురువాక్యముల అర్థము ఎఱుగుట చేతను, అభ్యాస యోగము చేతను సమస్త జ్ఞానము యొక్క సిద్ధి లభించగలదు.

**తస్మాత్ త్వమ్ సర్వముత్సృజ్య కుర్వభ్యాసే స్థిరం మనః ॥**

కాబట్టి నీవు సర్వమును త్యజించి అభ్యాసయోగం చేత మనస్సును స్థిరపరచుకో. అప్పుడు అంతా నీకు స్వయంగానే అత్యంత సులభంగా కరతలామలకమవగలదు.

❖❖❖

# 3. రామానంద సాగరం

**భరద్వాజుడు :** ఓ మునీశ్వరా! ఆ శ్రీరామచంద్రుడు శ్రీ వసిష్ఠ మహర్షి బోధించిన జ్ఞానయోగములను ఆలకించినవాడై సమాధిలో ప్రవేశించి ఈ ఉపాధి మొదలుగా గలవాటికి పరమైనట్టి బ్రహ్మముతో ఏకత్వము అనుభవిస్తు ఉపాధితో అసంబధిత్వము దర్శిస్తున్నాడు కదా! అట్టి రామచంద్రుని వసిష్ఠమహర్షి మరల ఏ విధంగా వ్యవహారపరునిగా తీర్చిదిద్దారు? ఈ విషయం చెప్పండి. ఈ విషయం ఎఱిగి నేను కూడా శ్రీరామచంద్రుని వలెనే బ్రహ్మాభ్యాసిని, దేహవ్యవహార నిర్వహణవర్తిని కూడా అయి ఉంటాను. 1. సమాధి 2. సమాధి యొక్క వ్యుత్థాన కాలము ... ఈ రెండింటినీ చక్కగా నా పట్ల సమన్వయించుకోగలుగుతాను.

**శ్రీవాల్మీకి మహర్షి :** అవును. ఆ విషయం ఇప్పుడు సుసందర్భమైన విషయం. విను. చెపుతాను.

❖

మహామనస్వి, అపరిచ్ఛిన్న బ్రహ్మాకార చిత్తుడు, శుభాచరణశీలుడు అగు ఆ శ్రీరామచంద్రుడు అఖండ-అప్రమేయ-నిర్వికల్ప స్వరూపమునందు పరిణతి చెందియున్నాడు కదా! అప్పుడు ఋషిసత్తముడైన శ్రీవసిష్ఠ మహర్షితో శ్రీవిశ్వామిత్ర మహర్షి ఇట్లా పలికాడు.

❖

**శ్రీవిశ్వామిత్ర మహర్షి :** హే మహాభాగా! బ్రహ్మపుత్రా! శ్రీ వసిష్ఠ మునీంద్రా! తమ అనుగ్రహదృష్టిమాత్రం చేత మీరు మీ ప్రియ శిష్యుడగు ఈ శ్రీరామచంద్రునియందు బ్రహ్మాజ్ఞాన శక్తిని కలుగజేసి మీ గురుత్వ మహనీయత్వమును ఇప్పుడిక్కడే నిరూపించుకున్నారు.

**దర్శనాత్ స్పర్శనాత్ శబ్దాః కృపయా శిష్యదేహ కే,**
**జనయేద్యః సమావేశం శాంభవం స హి దేశికః ॥**

ఎవరైతే తన దర్శనం చేత స్పర్శనంచేత, శబ్ద ప్రయోగం చేత, కృపాకటాక్షవీక్షణచేత శిష్యుని దేహమందు 'శివరూపమగు పరమాత్మ' యొక్క సమావేశమును కలుగజేయగలరో ...వారే గురువు. వారే సద్గురువు. మీ శిష్యుడగు ఈ శ్రీరామచంద్రుడు స్వయంగా విశుద్ధాత్ముడై, ఈ సంసారవ్యవహారం పట్ల విరక్తుడై, కేవలం ఆత్మయందు విశ్రాంతిని కోరిన వాడై ఈ సంవాద ప్రారంభంలో మహత్తరంగా వైరాగ్యమును ప్రవచించాడు. ప్రయోజనంగా ఈ సంవాదము అనే రూపంలో సర్వ ముముక్షువులపై

జ్ఞానామృతవర్షం మీరు కురిపిస్తున్నారు. అయితే మీరు సిద్ధాంతీకరించినట్లు 'శిష్య ప్రజ్ఞైవకారణం...' అనేది కూడా సముచితమే!

**శిష్య ప్రజ్ఞైవ బోధస్య కారణం గురువాక్యతః**
**మలత్రయమపక్వంచేత్ కథం బుధ్యతి పకవత్?**

గురువాక్యములు శిష్యునితో మహత్తరమైన 'ఆత్మానుభవం' జనింపజేయటానికి శిష్యుడిలోని ప్రజ్ఞయే కారణమని మనం ఎఱిగినదే. ఎందుకంటే ఎవనిలో అయితే శారీరక-వాచిక-మానసిక దోషములు, దేహ-మనో-బుద్ధి మాలిన్యములు, కామ-కర్మ-వాసనలు తొలగవో అట్టి శిష్యుడు గురుబోధ యొక్క ఔన్నత్య సారాంశము గ్రహించలేడు కదా! ఈ రామచంద్రుడు ఆశ్చర్య జనితమైన బుద్ధికుశలత కలవాడు.

మీరీ కొద్ది రోజులుగా ఏదేది బోధించి అనేకమందిలో ఆత్మ యొక్క ప్రత్యక్ష జ్ఞానమును కలిగిస్తున్నారో ...అదే గురుశిష్యుల సమావేశ ప్రయోజనమై ఉన్నది. గురు-శిష్యులు ఇద్దరూ యోగ్యులైన వారైతే ఆ శిష్యుడు, అనేకమంది తదితరులు కూడా ఇటువంటి కైవల్య లక్షణమునకు పాత్రులు కాగలరు. అందుచేత మహాసమర్థులగు మీ గురు-శిష్య సమావేశం లోకకళ్యాణార్థమే అయి ఉన్నది.

ఇప్పుడు మీకొక విన్నపం చేస్తున్నాను. మాపై దయతో శ్రీరామచంద్రుని సమాధి నుండి మేలుకొలుపవలసినదిగా నా ప్రార్థన. హే వసిష్ఠ మహర్షీ ! మీరైతే 'పరమపదము'నందు పరిణతి చేత కృతకృత్యులై ఉన్నారు. మా సంగతి ఆ విధంగా లేదు. మేము ఇంకాకూడా లోకకార్యములందు ప్రవేశించియే ఉన్నాము. ప్రభూ ! నేను ఏ లోకకళ్యాణ కార్యక్రమమును ఉద్దేశించి ఈ అయోధ్యకు వచ్చానో, దేనికొరకై ఈ మహారాజు దశరథుని అతికష్టంగా స్వయంగా ప్రార్థించానో, దానిని ఒక్కసారి స్మరించండి. ఈ శ్రీరామచంద్రుని మీరే సమాధినుండి లేపవలసినదిగా మిమ్ములను అర్థిస్తున్నాను. మీరు సర్వజ్ఞులు. భూత-భవిష్యత్-వర్తమానములు ఎఱిగినవారు. రాగరహితులు. సర్వదా ఆత్మానుభవం సంతరించుకున్న మహనీయులు. మీకు కొత్తగా విన్నవించుకోవలసిన పనేమున్నది? ఈ శ్రీరామచంద్రుడు సమాధి నుండి లేచిన తరువాత ఈ అవతార ప్రయోజనమైన దేవకార్యము లోకములకు మనం సంపాదించిపెట్టవలసి ఉన్నది.

❖

ఈ వసిష్ఠ-రామ సంవాదము ముగించిన తరువాత నేను ఈ రామచంద్రుని నా సిద్ధాశ్రమానికి తీసుకు వెళ్ళటం జరుగుతుంది. 'నేను ఉద్దేశించిన యాగమును సంరక్షించటం' అనే మిషతో ఈతడు అనేక మంది లోకకంటకులగు దుష్టరాక్షసులను సంహరించనున్నాడు. ఆ తరువాత పరమ పవిత్రమగు తన పాదధూళి యొక్క స్పర్శచే అహల్యకు శాపవిమోచనం ప్రసాదిస్తాడు. ఆ తరవాత జనకుని సభలో ఇంద్రుని వలె ప్రవేశించి శివధనుస్సును విఱిచి సీతాదేవిని పరిణయమాడుతాడు. ఆ సీతారామ కళ్యాణం మనం చూచి తరించవలసిందే కదా!

ఆ తరువాత ఈతడు జమదగ్ని కుమారుడగు పరశురాముని ఎదుర్కొని ఆతని గతిని భంగం చేయగలడు. ఆ తరువాత పితృ పితామహప్రసాదితమైన ఈ అయోధ్యను పాలించటానికి అన్ని

విధాలా అర్హత ఆర్జించుకుని ఉంటాడు. అప్పుడొక చమత్కారమైన మిషచే తండ్రి ఇచ్చిన మాటకోసం వనవాసం ఆశ్రయిస్తాడు. భార్య-సోదర సమేతుడై దండకారణ్యంలో ప్రవేశిస్తాడు. అక్కడ తనను శరణువేడవచ్చిన సజ్జనులను సంతోషపరిచే నిమిత్తం దుర్మార్గవృత్తులను ఆశ్రియించే అనేకమంది రాక్షస జనాన్ని సంహరిస్తాడు. అనేక ఆశ్రమములను, ఋషులను, మునులను, తీర్థాలను దర్శిస్తూ అనేక మంది జీవులకు తన దర్శనముచే ఆనందం కలిగిస్తాడు. అక్కడ మోక్షార్థులగు అనేక మంది భక్తజనులు ఈ శ్రీరాముని దర్శనం కొరకై సుదీర్ఘకాలంగా వేచియున్నారు కదా! ఆ తరువాత సీతాదేవి అపహరణం జరుగుతుంది. అట్టి సీతా వియోగ దుఃఖమును ప్రదర్శించి ఈ అవతార పురుషుడు 'తన్నివారణము' అనే మిషచే లోకబాధకుడగు రావణాసురుని బంధు-మిత్ర-పరివార సమేతంగా హతం చేయనున్నాడు. 'పరస్త్రీ వ్యామోహము కలవానికి వినాశనము తప్పదు' ... అను దుష్టసంగము యొక్క దురవస్థను లోకములకు ప్రదర్శించనున్నాడు. అనంతరం ఇంద్రుని వరదానముచే యుద్ధంలో మృతి చెందినన వానరులు పునర్జీవులౌతారు. ఆ తరువాత సీతయొక్క అగ్ని ప్రవేశముచే విశుద్ధిని కోరినవాడై ... శిష్టజనులందు తన ఉత్తమ చరిత్ర యొక్క మాననీయత్వము ప్రకటించగలడు.

అప్పుడు అయోధ్యా రాజ్యాభిషిక్తుడౌతాడు. జీవన్ముక్తుడై, నిస్పృహుడై కూడా క్రియాకాండ పారాయణుడై ఈ అయోధ్యారాజ్యం ఏలగలడు. అనేక యజ్ఞయాగములను నిర్వర్తించి జ్ఞానము-కర్మల ఉభయముల సముచ్చయ రూపమగు గతిని లోకములకు ఆదర్శప్రాయమై ప్రదర్శించగలడు.

**యైర్ ద్రష్టో, యైః స్మృతోవాపి, యైః శ్రుతో, బోధితస్తుయైః**
**సర్వావస్థాగతానాం తు జీవన్ముక్తిం ప్రదాస్యతి ॥**

ఎవరీ రామచంద్రుని దర్శిస్తారో, ఎవరీతని చరిత్రను స్మరిస్తారో, వింటారో, ఎవరీతని చరిత్రను తదితరులకు బోధిస్తారో .... అట్టి భక్తజనులందరికీ ఈతడు వారి సర్వావస్థలయందునూ జీవన్ముక్తిని ప్రసాదించగలడు.

ఈ విధంగా ఈ అవతారమూర్తి శ్రీరామచంద్రుని వలన ఈ ముల్లోకముల యొక్క నా యొక్క కార్యము సంపూర్ణంగా నెరవేరగలదు.

**నమోస్మై జితమేవైతే కోఽప్యేవం చిరమేధతాం!**

ఓ సర్వ సభికులారా! మీరంతా కూడా ఈ శ్రీరామచంద్రునికి నమస్కరించి తరించండి. ఈతని నమస్కరించినంత మాత్రం చేత మీరు ఈ సమస్త సంసారసాగరమును జయించి వేసినవారు కాగలరు. పురుషార్థములన్నీ వాటికవే సిద్ధించగలవు.

అంతేకాదు. మీలోని శ్రేష్ఠులగు వారు ఈ శ్రీరామచంద్రుని వలెనే చిరకాలం నిర్వికల్పసమాధి యందు ఆత్యంతికమైన విశ్రాంతిని, సుఖమును బడయగలరు. కనుక సమస్తజనులు ఈ శ్రీరామచంద్రుని ఆరాధించి మోక్షసుఖమును పొందెదరు గాక!

❖

శ్రీవిశ్వామిత్రుని పరతత్త్వార్థ వాక్యములు వినిన ఆ సభలోని సిద్ధులు, వసిష్ఠుడు మొదలైన శ్రేష్ఠ యోగీంద్రులు ... అందరూ కూడా శ్రీరామచంద్రుని కరచరణముల ధూళిని ఆదరంగా స్మరించారు.

ఋషిగణం శ్రీరామచంద్రుని కథాక్రమమంతా తమ హృదయంతో దర్శించి, ఆతని గుణగుణములను పరవశించి తృప్తి పొందారు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ బ్రహ్మర్షీ! విశ్వామిత్రా! "ఈ శ్రీరామచంద్రుడు ఈ జన్మకు ముందు దేవుడా? మనుజుడా?" అనే విషయం శ్రోతలమగు మేమంతా చక్కగా గ్రహించే నిమిత్తం వచించండి.

**శ్రీవిశ్వామిత్ర మహర్షి :**

**అత్రైవ కురు విశ్వాసమ్ అయమ్ స పురుషః పరః**
**విశ్వార్థమ్ అథిత అంభోధిః గంభీరాగమ్ గోచరః**

ఓ సభికులారా! మీరంతా ఈ శ్రీరామచంద్రునియందు 'ఈతడు సాక్షాత్ భగవంతుడే'... అని నిస్సంకోచంగా విశ్వాసం కలిగి ఉండండి.

ఎప్పుడైతే ఈ విశ్వం కొరకై పాల సముద్రాన్ని మథించాడో, ఎవని గురించి శ్రుతులన్నీ ఒక్క చోటికిజేరి ప్రతిపాదిస్తూ గానం చేస్తున్నాయో, అట్టి పరమపురుషుడగు సాక్షాత్ వాసుదేవుడే ఈతడు.

**పరిపూర్ణపరానందః సమః శ్రీ వత్సలాంఛనః**
**సర్వేషాం ప్రాణినాం రామః ప్రదాతా సుప్రసాదితః ॥**

పరిపూర్ణ పరానంద స్వరూపుడు, సర్వసముడు, 'శ్రీవత్సమణి' మొదలైన మహత్తర చిహ్నములతో శోభితుడు, అగు ఈ శ్రీరామచంద్రుని ఎవరైతే తమతమ భక్తి-కర్మ-యోగ-జ్ఞానములచే ప్రసన్నం చేస్తారో, అట్టి ప్రాణులందరికీ ఈతడు పురుషార్థములన్నీ ప్రసాదిస్తున్నాడు.

**అయం నిహన్తి కుపితః, సృజత్య అయమ్ అసత్సకాన్**
**విశ్వాదిర్, విశ్వజనకో, ధాతా, భర్తా, మహాసఖః ॥**

ఈ రామచంద్రుడే క్రుద్ధుడైనప్పుడు సమస్తమును సంహరిస్తున్నాడు. మరల ఎప్పుడో ఎందుకో మిథ్యా పదార్థములచే ఈతడే ఇదంతా సృజిస్తున్నాడు. విశ్వమంతటికీ ఆది, జనకుడు, ధాత (ధరించువాడు) పాలకుడు, మహాసఖుడు ఈతడే!

నిర్మలమగు చిత్తము గలవారై ఎవరు ఆత్మానాత్మ విచారణచే నిస్సారము - అల్పము అగు ఈ సంసారముయొక్క కార్య-కారణ సంబంధములు జయించి వేస్తున్నారో ... అట్టి సంసారమును జయించిన వీతరాగులగు మహాత్ములు ప్రవేశించే విశాలానందసముద్రమే శ్రీరాముని స్వరూపం. ఈ రామానందసాగరమే సర్వసాధనముల అంతిమ ప్రయోజన ఫలం.

**క్వచిన్ ముక్తఇవాత్మస్థః, క్వచిత్ తుర్యపదాభిదః,**
**క్వచిత్ ప్రణీత ప్రకృతిః, క్వచిత్తస్థః పుమానయమ్॥**

ఈతడే ఒకచోట పరజ్ఞాన సంయుక్తుడై ఆత్మస్థితిచే ముక్తుడై ఉంటున్నాడు. మరొకచోట చిదానంద ఘన స్వభావుడై ప్రకాశిస్తున్నాడు. 'తురీయపదము' అనబడు మహోన్నతమగు సర్వమును ఆక్రమించియున్నట్టి రూపమును అవధరిస్తున్నాడు. ఒకచోట అప్రమేయుడు, నిర్గుణుడు, అసంగుడు అయి ఉంటున్నాడు. ఇంతలోనే కావాలని మాయయొక్క నియంత అగుచున్నాడు.

ఇంకా చమత్కారమేమంటే...ఒకచోట నిర్విషయుడుగా, మరొకచోట ఈ మాయకే రచయితగా, ఇంకొకచోట ఈ మాయకు బద్ధుడుగా అగుపిస్తున్నాడు.

**అయం త్రయీమయో దేవః త్రైగుణ్య గహనాతిగః !**
**జయత్యంగేరయం షడ్భిః, వేదాత్మా, పురుషో అద్భుతః !**

ఈతడే మూడు వేదములను ఆక్రమించియున్న మహత్పురుషుడగు భగవానుడు. ఈ విశ్వమంతా త్రిగుణముల వివిధ పాళ్ళ కలయిక మాత్రమే అయి ఉండగా, త్రిగుణములకు ఆవల ఏర్పడియున్న వేదాంత స్వరూపుడు ఈతడే. సృష్టి – స్థితి – లయ – శిక్ష – స్మృతి – కల్పములనబడే షడంగములతో శోభిల్లే నిత్యోదిత చైతన్య స్వరూపుడు. వేదాత్మ స్వరూపుడు, పారమార్థిక స్వరూపుడు, వేదప్రతిపాదిత స్వరూపుడు ఈ అద్భుత పురుషుడే.

**అయం చతుర్బాహుః, అయం విశ్వస్రష్టా చతుర్ముఖః,**
**అయిమేవ మహాదేవః, సంహూర్తా చ త్రిలోచనః ॥**

చతుర్బాహువులతో ఈ ప్రపంచ మంతటినీ పరిపాలించే విష్ణుభగవాను డీతడే. ఈ ప్రపంచమునంతటినీ సృష్టించే చతుర్ముఖబ్రహ్మ కూడా ఈయనే! అంతేకాదు. ఈతడే త్రినేత్రుడగు మహేశ్వరుడై ఈ సృష్టి యొక్క సంహారం కూడా నిర్వర్తిస్తున్నాడు.

**అజోయం జాయతే యోగాత్ జాగరూకః సదా మహాన్**
**భిభర్తి భగవానేతత్, విరూపో, విశ్వరూపవాన్॥**

స్వతహాగా చూస్తే ఈయనకు జన్మాదులు లేవు. అయితే ఏం? తనయొక్క యోగమాయాశక్తి సంబంధంచేత జన్మించినవానివలె అవతరిస్తున్నాడు. ఈయనకు 'మోహనిద్ర'అనే ఆవరణ లేదు. అందుచేత 'నిత్యజాగరూకుడు' అనబడుచున్నారు. ఈయన వాస్తవానికి నామరూపరహితుడు. కానీ విశ్వరూపుడై సమస్తము యొక్క భారము వహిస్తున్నారు.

**విజయో విక్రమేణేవ, సుపర్ణే ప్రకాశ ఇవ తేజసా,**
**ప్రజ్ఞోత్కర్షః శ్రుతేనేవ సుపర్ణే నాయముహ్యతే॥**

వాక్ – మనస్సులకు ఈతడు అందనివాడు. మరి? ఈతడు ఆనందస్వరూపం అనుభవైకవేద్యమే. దృష్టాంతానికి ..."ఈతడు పరాక్రమవంతుడురా!" అంటాం. కానీ పరాక్రమమును కళ్ళతో చూడగలమా? లేదు. సాధించిన విజయములను చూచి పరాక్రమం ఊహించుకుంటాం. అట్లాగే ప్రజ్ఞను చూడగలమా? లేదు. కానీ, ఒకని శాస్త్ర పఠనాదులను చూచి "ఈతడు ప్రజ్ఞావంతుడురా!" అని గుర్తించగలం.

అట్లాగే సమస్త విషములందలి ఉత్తమత్వమే ఈయన రూపం. అందుచేత 'శ్రేష్ఠ పురుషుడు' అని వేదజ్ఞులు దర్శనం చేస్తున్నారు.

**అయం దశరథో ధన్యః సుతోయస్య పఠః పుమాన్ !**
**ధన్యః స దశకంఠోఽపి చిన్యశ్చిత్తేన యోమునా !**

ఇట్టి సాక్షాత్ పరమపురుషుని ఎవడైతే తన కుమారునిగా సంపాదించుకున్నాడో అట్టి ఈ దశరథ మహారాజు ధన్యుడు. అంతేకాదు. ఎవ్వడైతే ఈతనిని 'ఈతడే నా శత్రువు' అని తన చిత్తంలో అహర్నిశలూ చింతన చేయబోతున్నాడో ...అట్టి దశకంఠుడగు రావణాసురుడు కూడా ధన్యుడే.

**హాం! స్వర్గమమునా శూన్యం, హా పాతాలాది హాగతః !**

**తస్యాగమాత్ అయం లోకో మధ్యమః శ్రేష్ఠతాం గతః ॥**

ఆహా! మధ్యదగు ఈ భూలోకంలో ఈ శ్రీరామచంద్రమూర్తి అవతరించటం చేత ఈ భూలోకమంతా శ్రేష్ఠత్వం సంతరించుకోగా... స్వర్గ, పాతాళ లోకాలు వెలవెలపోతున్నాయి కదా!

**రామ ఇత్యవతీర్ణోఽ యమ్ అర్ణవాన్తిశయః పుమాన్,**

**చిదానందఘనో రామః పరమాత్మాయమవ్యయః ॥**

క్షీర సముద్రంలో (సత్యసాగరంలో) శయనించియుండే ఆ విష్ణు భగవానుడే ఇక్కడ దశరథుని కుమారుడగు శ్రీరామచంద్రుడుగా అవతరించాడు. ఈయనే చిదానందఘనుడు, నాశనరహితుడు అగు పరమాత్మ అయి ఉన్నాడు.

**నిగృహీతేన్ద్రియగ్రామా రామం జానన్తి యోగినః**

**వయం త్వవరమేవాస్య రూపం రూపయితుం క్షమాః ॥**

ఇంద్రియసమూహములను జయించిన యోగులు మాత్రమే ఈ శ్రీరామచంద్రుని యథార్థరూపం ఎఱుగగలుగుతారు. ఓ వసిష్ఠ మహర్షీ! ఈతని ఇతఃపూర్వరూపం ఏమిటో మీరు, నేను ఎఱిగియే ఉన్నాం కదా! అందుచే నిరూపించుటకు సమర్థులమైయున్నాం.

హే వసిష్ఠ మహర్షీ! భగవంతుడగు ఆ మహావిష్ణువు రఘువంశంలో జన్మించి రఘువంశమును, సర్వలోకములను పావనం చేయబోతున్నాడని మనిద్దరం పెద్దలు చెప్పుకోగా వినియే ఉన్నాము కదా! కనుక ఈతనిని ఇప్పుడు వ్యవహారపరునిగా చేయవలసినదిగా మిమ్ములను ప్రార్థిస్తున్నాను.

❖❖❖

# 4. ఫలశ్రుతి

**శ్రీవాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఆ విధంగా లోకహితైషుడగు విశ్వామిత్ర మహర్షి రామతత్త్వ మాహాత్మ్యాన్ని గానం చేసి, శ్రీరామచంద్రుని పునర్వ్యవహారపరునిగా చేయమని వసిష్ఠ మునీంద్రులను అభ్యర్థించి మౌనం వహించారు. అప్పుడు శ్రీ వసిష్ఠ మహర్షి విశ్వామిత్రుని ప్రేమాస్పదమైన చూపులతో అభినందించి రామచంద్రునివైపు చూచారు.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**రామ! రామ! మహాబాహో! మహా పురుషా! చిన్మయా!**

**నాయం విశ్రాంతి కాలోహి, లోకానందకరో భవ ॥**

ఓ రామచంద్రా! రామయ్యా! హే మహాబాహో! చిన్మయ స్వరూపుడగు ఓ మహాపురుషా! ఇది లోకములను మరచి ఆత్మయందు విశ్రాంతి తీసుకుని ఉండే సమయం కాదయ్యా! ఈ లోకాలన్నీ తమ బాధనుండి విముక్తి పొందటానికి నిన్ను శరణువేడుచున్నాయి. లే! లేచి లోకము లన్నిటికీ ఆనందకారకుడవు, "రమయతేతి రామా" అయ్యే సమయమిది. ఈ లోకముల క్షేమం కొరకే గదా, నీవు అవతరించావు! ఈ లోకములకు సంబంధించిన సాత్విక సంసారము ఇంకా మిగిలి ఉన్న యోగులకు స్థిరసమాధి సమయోచితం కాదు. కాబట్టి నశ్వరములగు (కాలముచే రహితం కాబోయే) ఈ రాజ్యాది వ్యవహారములు నీవింకా కొంతకాలం నిర్వర్తించవలసియున్నది. దైవ కార్యము కొరకై అవతరించిన నీవు బాగుగా దైవకార్యము నిర్వర్తించి, ఆ తరువాత సమాధిని ఆశ్రయించి సుఖుడవై ఉండవచ్చునని నా ఈ ప్రార్థన.

❖

శ్రీవసిష్ఠ మునీంద్రుని ఈ పలుకులు రామచంద్రుని చెవులలో ప్రవేశించనే లేదు. ఆతడు అట్లే నిర్వికల్పసమాధియందు బ్రహ్మముతోటి ఏకత్వము కొనసాగిస్తూ బదులు పలకలేదు. అప్పుడు వసిష్ఠ మహర్షి కనులు మూసుకొని మనోయోగ వైభవంచేత రామచంద్రుని సుషుమ్నానాడిలో ప్రవేశించారు. సుషుమ్నానాడి ద్వారా మెల్లమెల్లగా శ్రీరామచంద్రుని హృదయంలో సమీపించి అక్కడ తన జాగృత బోధనను కొనసాగించారు. అప్పటికి రామచంద్రుని హృదయాంతరంగము యొక్క అభ్యంతర విభాగం సద్గురువగు శ్రీ వసిష్ఠ మహర్షి యొక్క మేలుకొలుపుకు స్పందించింది. మొట్టమొదట క్రమరీతిగా ప్రాణ – మనస్సులు ఆ ప్రాణాదుల బీజరూపమైనట్టి 'ఆధారశక్తి'యందు ఆవిర్భావమైనాయి. క్రమక్రమంగా ప్రకాశరూపుడగు 'జీవుడు' రూపుదిద్దుకున్నాడు. అతడు 'అహం' అను వాహనం ద్వారా ప్రాణముల సహాయంతో సమస్త నాడీ మండలములలో ప్రవేశమునకు ఉపక్రమించాడు. నెమ్మది నెమ్మదిగా అట్లు ప్రవేశించుచుండగా జ్ఞాన కర్మేంద్రియములు క్రమరీతిలో పరిపోషించబడ్డాయి.

కొద్ది క్షణములిట్లు జరిగిన తరువాత శ్రీరాముడు మెలమెల్లగా కనులు తెరిచాడు. వసిష్ఠుడు మొదలైన ముఖ్య విద్వాంసుల వైపు చూచాడు. సర్వ అభిలాషలు వర్జించియున్నవాడై, కృతకృత్యముల గురించి (నిర్వర్తించియున్న–నిర్వర్తించబోయే ఆయా కృత్యముల గురించి) కించిత్ కూడా విచారవృత్తి లేనివాడై మహర్షి వాక్యములు వినటానికి సంసిద్ధుడైనాడు. అప్పుడు 'రామచంద్రా! రామయ్యా! మహాబాహూ!' –అని వసిష్ఠ మహర్షి కొద్ది క్షణముల క్రితం పలికిన వాక్యాలన్నీ ఒక్కటొక్కటిగా అతని చెవులకు సోకాయి. "అవును. గురువాక్యములు అనుల్లంఘనీయములు కదా!" అని అనుకున్నాడు. అప్పుడు తండ్రి, బంధువులు పలుకుచున్న అభ్యర్థన వాక్యాలు కూడా విన్నాడు.

❖

**శ్రీరాముడు :**

> **న విధేః, న నిషేధస్య త్వత్ప్రసాదాత్ అయం ప్రభుః !**
> **తథాపి తవవాక్యం తు కరణీయం హి సర్వదా॥**

హే మహాత్మా! శ్రీ వసిష్ఠ మహర్షీ! మీ అనుగ్రహం చేత ఈ 'రాముడు' అని పిలువబడే జీవుడు ఎట్టి విధి – నిషేధములకు అందనివాడై స్వయంగా సాక్షాత్ ప్రభురూపుడైనాడు. అయినప్పటికీ తమ వాక్యము ఎప్పటికీ అనుసరణీయమే!

**వేదాగమపురాణేషు స్మృతిష్వపి మహామునే,**
**గురువాక్యం విధిః ప్రోక్తో నిషేధస్తద్విపర్యయః ॥**

జీవుని క్షేమం కోరి ఏర్పడియున్న వేద–శాస్త్ర–పురాణ–స్మృత్యాదులచే 'గురువాక్యములు' పాలించటమే విధి. గురువు యొక్క అనుజ్ఞలను అతిక్రమించటం నిషేధం...' అని చెప్పుచున్నాయి కదా! కనుక మీ ఆజ్ఞ నాకు సర్వదా శిరోధార్యం.

❖

ఇట్లు పలికి సర్వాత్మకుడు, కృపానిధి అగు ఆ శ్రీరామచంద్రుడు లేచి నిలుచున్నాడు. శ్రీ వసిష్ఠ మహర్షిని సమీపించాడు. ఆయన కరచరణములను తన నుదుటితో స్పృశిస్తూ సాష్టాంగదండ ప్రణామం సమర్పించాడు. ఆ తరువాత ఒక్కసారి సభనంతా అమృత దృక్కులతో చూచాడు.

**శ్రీరాముడు :**

**సర్వే శృణుత భద్రం వో నిశ్చయం, నః సునిశ్చితం!**
**ఆత్మజ్ఞానాత్ పరం నాస్తి! గురోరపి చ తద్విదః !**

ఓ సర్వ సభికులారా! మీ కందరికీ శుభమగుగాక! సర్వ నిశ్చయములలో అత్యంత సునిశ్చయమైన ఒకానొక వాక్యం చెప్పుచున్నాను. వినండి. ఆత్మజ్ఞానము కంటే, దానిని ఎఱిగిన సద్గురువు కంటే ఉత్తమమైనది ఈ ప్రపంచంలో ఏదీ లేదు. ఉండబోదు.

అప్పుడు సభలో వేంచేసియున్న సిద్ధులంతా ఒక్కసారి నిలబడి శ్రీరామచంద్రుని మహిమను గానం చేశారు.

**సిద్ధులు :** ఓ వసిష్ఠ రామచంద్రులారా! మీ అనుగ్రహంచేత ఈ సభలో పాల్గొన్న మేమంతా 'ఆత్మభావన' అను మహత్తర స్థితిని పొందాం. తమ సంవాదం కొనసాగుచుండగా అది వాక్కుతో ప్రకటించలేనంతగా దృఢత్వం పొందింది. ఓ రామచంద్రా! మీ ఈ అవతారము అనేకమంది భక్తజనులకు మోక్షమార్గమై వెలుగొందుగాక! మీకు సర్వదా శుభమగుగాక! మీ కర–చరణ స్మరణము యుగయుగాలుగా భక్త జనులకు కొంగు బంగారమై, మోక్షమార్గ సౌలభ్యమై, ధైర్య–స్థైర్య ప్రసాదితమై తేజరిల్లునుగాక! క్రూరస్వభావులగు అనేకమంది రాక్షస జనులు తమ క్రౌర్యమును రామబాణమునకు సమర్పించి పవిత్రులగుదురుగాక!

ఇట్లు అనేక స్తోత్రములు చేస్తూ రామచంద్రునిపై, సద్గురువగు వసిష్ఠునిపై పూలవర్షం కురిపించారు.

❖

ఓ భరద్వాజా! ఈ విధంగా నిర్వాణ ప్రకరణ పూర్వార్ధ కథనమంతా నీకు తెలియజేశాను.

శ్రీరామచంద్రుని ఉద్దేశించిన సిద్ధమునియగు వసిష్ఠ మహర్షి ప్రవచితమైన వచనసమూహమగు రత్నమాల విచిత్రమైన ప్రభావం కలిగియున్నది. ఇది సమస్త కవికులమునకు, యోగులకు సేవించుటకు యోగ్యమైయున్నది.

పరమ గురువు యొక్క కటాక్షం చేత ఇది పఠించువానికి సులభమైన మోక్షమార్గమై పరిఢవిల్లుగాక!

**య ఇమం శృణుయాత్ నిత్యం విధిం రామవసిష్ఠయోః**
**సర్వావస్థోపి శ్రవణాన్ ముచ్యతే, బ్రహ్మ గచ్ఛతి॥**

ఎవరీ, 'శ్రీ వసిష్ఠ - శ్రీరామచంద్రుల సంవాదము'ను ప్రతిదినం శ్రవణం చేస్తారో, శ్రవణమాత్రంచేత అట్టివారి రాగాది సర్వదోషములు అతి సులభంగా తొలగుతాయి. ఎట్టివారైనా, ఏ తరగతి వారైనా సరే, సర్వ దోషములనుండి విడివడి శాంతి మొదలైన ఉత్తమ గుణములు ప్రాప్తించుకున్నవారై బ్రహ్మమే తమ స్వరూపంగా దర్శనానుభవం పొందగలరు.

❖❖❖

**శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః ॥**

**శ్రీ వసిష్ఠ - విశ్వామిత్ర - వాల్మీకి - నారదాది మహర్షయో, మహానుభావో న తామః ॥**

❖❖❖

# I. ఉత్తరార్ధ ప్రథమ విభాగ ప్రకరణ పరిచయము

## 1. సంకల్పరాహిత్యము

**శ్రీరాముడు :** హే వసిష్ఠ మహర్షీ ! ముముక్షువ్యవహార - స్థితి - ఉపశమన - నిర్వాణ (పుర్వార్ధం) ప్రకరణాల వరకు మీరు మహత్తరమైన ఆత్మనిర్వచన సంబంధమైన అనేక విశేషాలు మాకు ప్రబోధించారు. మీ ప్రవచనం మహాద్భుతమైనదనటంలో సందేహమే లేదు.

మీ అమృతవాక్కులు ఇంకా ఆస్వాదించాలని, మోక్షసాధకులగు మహనీయుల మరికొన్ని కథన విశేషాలు వినాలని మా ఉత్సుకత మరింతగా కొనసాగుచూనే ఉన్నది. మన ఈ సంవాదము మరిన్ని తాత్త్విక విశేషాలు లోకములకు ప్రకటించటానికి వీలుగా కొన్ని ప్రశ్నలతో ప్రారంభించితే బాగుంటుందని నా మనవి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మంచిది. అట్లే అగుగాక !

**శ్రీరాముడు:** ఈ జీవుడు బ్రహ్మానందానుభూతికి అర్హత సంపాదించుకోవటానికిగాను రెండు అతి ముఖ్యమైన సందేశాలు మాకు గతానుగతంగా ప్రసాదిస్తూ వచ్చారు- 1.నైష్కర్మ్య సిద్ధి; 2.అహంకార కల్పనా త్యాజ్యం...

అయితే మహర్షీ! "నైష్కర్మ్యము (Non Activity)" చేతను, దేహాదులందు ఏర్పడే అహంకార కల్పనను త్యజించటంచేతను ఈ దేహం శీఘ్రంగా నేలవ్రాలే అవకాశం లేదంటారా? అట్లా అయితే జీవించటం అనునది ఎట్లా సిద్ధిస్తుంది? అట్టి సిద్ధి-త్యాజ్యము ఆశ్రయించినవాడు అనివార్యమగు లోకవ్యవహారములు నిర్వర్తించటం ఎట్లా? జీవిస్తూ ఉండగా వ్యవహార త్యాజ్యం - కల్పనాత్యాగం అనేది కుదురుతాయా? కుదిరినప్పటికీ లోకవ్యవహారం దృష్ట్యా అది ఉచితమే నంటారా? కల్పనాత్యాగికి జీవితం దుర్భరం కాదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా ! జీవించే వానికే కల్పనలు అనేది ఉంటుంది. జీవించనివానికి కల్పనలనేది ఏం ఉంటుంది? కాబట్టి జీవించువానికే కల్పనాత్యాగం అనేది తగుతుంది.

అయితే... అ అహంభావ కల్పన గురించి ముమ్మందుగా ప్రస్తావించుకుందాం, విను.

పరిచ్ఛిన్నమైన ఈ దేహదులపట్ల "ఈ శరీరమే నా స్వరూపం" అను అభిప్రాయం కలిగి ఉండడం "అహంభావన" అని చెప్పబడుతూ ఉంటోంది. ఒకడు తనపట్ల తదితరులపట్ల కూడా అపరిచ్ఛిన్నమగు బ్రహ్మ భావన నిర్వర్తిస్తూ ఉంటే అది "కల్పనాత్యాగం" అని అంటున్నారు. అదియే, "నిరహంకారం" కూడా! కల్పన గురించి పరిశోధించియున్న విజ్ఞులు "పరిచ్ఛిన్నమైనట్లు కనిపిస్తున్న

ఈ వేరువేరు దేహులను చూస్తున్నప్పుడు – నేను వేరు, అతను వేరు, నీవు వేరు – అను రూపంలో ఉండే పరిచ్ఛిన్న భావనను ఆశ్రయించటమే అహంకారం. అంతటా ఏకమైయున్న బ్రహ్మాకాశము యొక్క సత్తాను భావించుటను "కల్పనాత్యాగం" అని అంటున్నారు.

సంకల్పము అంటే దేహము మొదలైన పరిచ్ఛిన్నమైన దృశ్యవస్తువులను చూస్తున్నప్పుడు "ఈ కనబడే రీతిగా ఇవన్నీ సత్యమే" అను రూపమైన అభిమానము.

సంకల్పత్యాగం అంటే ఈ కనబడే వస్తువులు, దేహాలు పంచభూతాల వికారమేకదా? కాబట్టి వేరు – వేరు అనబడేదంతా సత్యం కాదు. సమస్తము బ్రహ్మాకాశమాత్రమే ...అనే ఎఱుక కలిగి ఉండటం. ఇంకొక విధంగా చెప్పాలంటే... పదార్థాల పట్ల ఏర్పడే అనురాగపూర్వకమైన స్మరణయే సంకల్పము. అట్టి స్మరణ (లేక, విషయ చింతన) లేనప్పుడు, ఆ స్థితిని "మోక్షం" అని పిలుస్తున్నారు.

ఈ 'స్మరణ' అనేది ఇతఃపూర్వం చూచిన–చూడని, అనుభవించిన–అనుభవించని విషయాల పట్ల కూడా ఏర్పడి ఉండటం జరుగుతోంది. అట్లా అనుభవించిన–అనుభవించని... ఉభయ విషయాలను అటుండనిచ్చి, బ్రహ్మం కంటే అన్యమైన సమస్త వృత్తులను శీఘ్రంగా విస్మరించి, బ్రహ్మంనందే లీనుడై ఉండేవాడు 'మోక్ష స్వరూపుడు' అగుచున్నాడు. కనుక ఓ రామచంద్రా! అంతరంగంలో సర్వదృశ్యవ్యవహారములూ, వాటి–వాటి ఏక–అనేకత్వాదులు విస్మరించి ఉండు. అయితే ఇక ఈ అవశ్యం నిర్వర్తించివలసి ఉన్న కార్యక్రమాల విషయ మంటావా? సగం నిద్రిస్తున్న బాలునివలె బ్రహ్మమునకు అనన్యమగు భావనతో అంతర్వృత్తులను ఆయా పనులలో ఉపయోగించే ఉపకరణములవలె గమనిస్తూ ఉండు. నీవు దేనికీ కారణం కాకుండానే, ఆయా వృత్తులే నిర్వర్తించ బడే క్రియాదులకు కారణమై ఉండుగాక! నీవు వాటికి కారణం కావద్దు. సంస్కారములకు కూడా ఆవల గల నీ స్వస్వరూపం అవధరించి ఉండటం అభ్యసిస్తూ ఉండు. కుమ్మరివాని చక్రం ఎట్లా తిరుగుతుందో అట్లే సంస్కారాలు జగత్క్రియలను నిర్వర్తించునుగాక! నీవు ఆ సర్వక్రియలకు సర్వదా అతీత్వం వహించి ఉండు. వాసనారహితుడవై నిర్మల చిత్తమును సంతరించుకున్నవాడవై, ఆ నీ చిత్తం యొక్క ఒక అల్ప విభాగమును ఒక పరికరమాత్రంగా గ్రహించి ప్రవాహ పతితములగు ఆయా కార్యాలను నిర్వర్తించు. ఎచ్చటైతే సమస్త బ్రహ్మాండం యొక్క ఆధిపత్యం కూడా తృణ ప్రాయంగా (గడ్డిపరకతో సమానంగా) గోచరిస్తుందో...అట్టి పరమపదం సంకల్పరహితుడవై ఉన్నంత మాత్రంచేతనే లభించగలదని గుర్తు చేస్తున్నాను.

"సంకల్పరహితుడనై ఉంటే ఈ ప్రపంచంలో ఆయా క్రియలు నిర్వర్తించటమెట్లా?"...అని ఎవరైనా అనుకుంటారేమో! ఓ జనులారా! ఒక బాటసారి కాళ్ళు ప్రత్యేకమైన సంకల్పం లేకుండానే వెళ్ళాలనుకున్న చోటువైపుగా బాటలో అడుగులు వేయటం లేదా? అట్లాగే ఎవరైనా సరే... ప్రవాహ పతితములగు ఈ జగద్వ్యవహారాలన్నీ కూడా సంకల్పరహితంగానే నిర్వర్తించవచ్చునని నా మనవి.

జాగ్రత్తులో కొంతవరకు సంకల్పితంగా ఊపిరి పీలుస్తున్నావు. మరి స్వప్న దశలోనో?... అసంకల్పితంగా ఊపిరి పీలుస్తున్నావు కదా! "అట్లాగే నా ఇచ్ఛచే నేను జీవిస్తున్నాను. ఇచ్ఛచే

కర్మలు నిర్వర్తిస్తున్నాను" ...అనే ధ్యాసను శాంతమునందు లయం చేసివేయి. అసంకల్పితంగా కల్పనారూపమగు ఈ దృశ్య జగత్తు నందు క్రీడగా – లీలగా విహరించు.

ఒక గడ్డిమొక్క ఉన్నది. అది స్వతహాగా ఎట్టి సంకల్పము లేకుండానే గాలివాటుకు కదలి ప్రక్కమొక్కలతో సంయోగ వియోగ చేష్టలు నిర్వర్తిస్తోంది కదా! అట్లాగే రామచంద్రా! నీవు కూడా సంకల్పరహితుడవై, సుఖ దుఃఖములకు సంబంధించిన ఎట్టి భావన చేయకుండానే ప్రవాహపతిత కార్యములను నిర్వర్తించమని మరల గుర్తుచేస్తున్నాను. తోలుబొమ్మలాటలో తోలుబొమ్మలు తమయందు ఎట్టి రస వికారాలు లేకుండానే ప్రేక్షకులకు మాత్రం శృంగారం మొదలైన భావనలను కలుగజేస్తున్నాయి చూచావా? అట్లాగే ఈ అవశ్య కర్తవ్యాల పట్ల – అంతరంగంలో శృంగార–సుఖ –దుఃఖాది రసభావనలు పెంపొందించుకోకుండానే లోకానుకూలంగా, సందర్భానుకూలంగా వ్యవహరించు. ఈ జగత్తును ఒక గొప్ప, సుదీర్ఘ నాటక సన్నివేశంగా ఆస్వాదించు.

**ఊర్ధ్వబాహుః విరౌమ్యేష! న చ కశ్చిత్ శృణోతి మే ।**
**అసంకల్పః పరంశ్రేయః! స కిమ్ అంతర్ న భావ్యతే ॥**

నేను చేతులెత్తి ఊర్ధ్వ స్వరంతో ప్రకటిస్తూ ఉన్నప్పటికీ ఈ జనులు నా ఈ వాక్యాలు ఎందుకో తగినంతగా వినిపించుకోవటమే లేదే! ఎట్టి సంకల్పములు ప్రవేశించనీయకుండా అంతరంగమున మౌనం వహించి ఉండటమే పరమశ్రేయోదాయకమగు స్థితి. అట్టి సంకల్పరాహిత్యాన్ని అంతరంలో ఎందుకు భావన చేయరాదు చెప్పు? ఆహా! ఈ మోహం యొక్క గొప్పతనం ఏమని చెప్పాలి? సర్వ దుఃఖాలను హరించగలిగినట్టి ఆత్మ విచారణ అను చింతామణిని ప్రతి ఒక్కరు తమలోనే ఉంచుకొని అద్దానిని వదలి ఈ జనులు సంకల్పాలలో ప్రవేశించి అనేక ఉపాధులతో గొప్ప సంచారం చేస్తున్నారే!

దృశ్య–దర్శన రహితమగు ఆత్మతత్త్వమే 'అసంకల్పం' అను దాని రూపం. అట్టి సంకల్ప రహితమగు స్వస్వరూపంతో తన్మయులై ఉండటం మాత్రంచేత పరమశ్రేయస్సు లభించగలదని ప్రకటిస్తున్నాను. అట్టి ఆత్మీస్థితి ఎవరికి వారే సముపార్జించుకోవాలి గాని, ఆ అనుభవం ఒకరికి మరొకరు ఎట్లా అందించగలరు? శాస్త్రములు – గురుస్థానమున గల మేము అట్టి అంతర అసంకల్ప సామ్రాజ్యమును గుర్తుచేస్తున్నాము. అంతవరకే మా పాత్ర!

అందుచేత రామా! నిద్రిస్తున్నవానికి జగత్ లేనట్లు సర్వకర్మఫలముల పట్ల పూర్ణమగు ఉదాసీనతను అంతరంగంలో వహించి అటుపై ఆయా ప్రవాహపతిత కార్యములను నిర్వర్తించేవానికి ఈ 14 లోకాలు ఆటవస్తువు వంటివి అవుతాయి. ఓ రామచంద్రా! సమస్త ఇంద్రియ విషయాలు నీకు రసరహితంగా కన్పట్టుగాక! హేమంత ఋతువులో పూతీగ ఉంటుంది గాని పూలు పూయవు చూచావా? అట్లా ఇవన్నీ ఆకార మాత్రాలేనని నీచే గ్రహించబడుగాక! నీవు జ్ఞాన సూర్యుని ఆశ్రయించి జ్ఞాన రసం మాత్రను ఆస్వాదించు. ఇక ఈ నీ యొక్క – తదితరుల యొక్క శరీరాల విషయమేమిటంటావా? యంత్రపుబొమ్మలు భావాభావాలు లేకుండా కదులుతాయి. చూచావా? ఈ దేహాలు కూడా ఆయా వివిధ "భావాభావ–గుణ–నిర్గుణ" మిశ్రమాలచే తయారుచేయ బడుచున్నాయి.

1. పంచకోశాలలో (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ) ప్రతిబింబించే చిదాభాసుడు,
2. పంచప్రాణములు – మనస్సు (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన – సప్రాణములు),
3. జ్ఞానేంద్రియ వర్గము (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు),
4. కర్మేంద్రియ వర్గము (చెవులు, చర్మము, కళ్ళు, నోరు, ముక్కు),
5. అంతఃకరణచతుష్టయం (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము),
6. శరీర వర్గము (స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు)...

ఈ ఆరు మిశ్రమాలతో తయారయిన సమ్మిళిత వస్తువే ఈ దేహము.

ఈ ఇంద్రియాలు స్వభావసిద్ధంగా బాహ్యరసాస్వాదనమునందు ప్రవృత్తములై ఉంటున్నాయి కదా! వీటిని జీవుని యొక్క ఉనికికే కారణమై ఉన్న భూమానందరూప చైతన్యరసంచే నింపి ఉంచాలి. బ్రహ్మానందమే ఈ సర్వరూప దృశ్య ప్రదర్శనంగా అనుక్షణికంగా ఆస్వాదించాలి.

**శ్రీరాముడు:** మహర్షీ! ఈ ఇంద్రియాలు స్వభావ సిద్ధంగా ఆయా విషయాలందు ప్రవేశిస్తూనే ఉంటాయి. కదా! కనులు చూస్తునే ఉంటాయి. చెవులు వింటూనే ఉంటాయి. విషయభోగాలు కూడా ఈ జీవుని ఏదో రూపంలో తప్పక సమీపిస్తునే ఉంటాయి. మరి విషయ రాహిత్యమనేది జీవించి ఉన్నంత వరకూ ఎట్లా కుదురుతుంది ?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** అవును. దేహమంటేనే ఇంద్రియాలు – ఇంద్రియ విషయాలు. అయితే "ఇంద్రియాలను స్వయత్నం చేత ఇంద్రియవిషయాల నుండి నివారించటం" అనగా ఏమో వివరిస్తాను. సూక్ష్మగ్రాహివై విను–

ఇంద్రియములను ఇంద్రియ విషయములపై వినియోగించు సందర్భంలో 'ఇష్టం – అయిష్టం' అనే రూపంలో ఒకానొక 'వృత్తి' అంతరంగంలో ఏర్పడుతుంది. ఆ వృత్తియే క్రమంగా (అనేకసార్లు ఇష్టం కలిగి ఉండటంచేత) 'యా వృత్తి' (Habituated Avocation) గాను, సంస్కారాలుగాను, చిత్త ప్రవృత్తిగాను రూపుదిద్దుకొంటోంది. కనుక ఇంద్రియ జన్యమైన విషయరసమునందు నీవు 'వృత్తి' (లేక) 'అనురాగం' కలిగి ఉండకపోతే... ఇకప్పుడు నీవు విషయభోగం పొందినా, పొందకున్నా సంసారం యొక్క అనర్థం నీ పట్ల శమించియే ఉంటుంది. వృత్తి యొక్క ఉత్పత్తి స్థానం 'సంకల్పం' అయి ఉన్నది. కనుక సంకల్పరహితుడవై, ప్రసరిస్తున్నప్పుడు తారసపడే వస్తువుల పట్ల వాయువు ఎట్టి భావన పొందనట్లు, దహిస్తున్నప్పుడు అగ్ని ఎట్టి ఇష్టాయిష్టములు పొందనట్లు, యంత్రం పని చేస్తున్నప్పుడు లాభాలాభాల ప్రవృత్తి కలిగి ఉండనట్లు, జలం ఎట్టి భావవికారాలు పొందనట్లు, నీవు కూడా ఉండు. ఈ జీవుడు ప్రవాహపతిత కర్మలందు అధ్యస్తమై ఉన్నప్పుడు "నేనే వీటికి కర్తను" అను రూపంలో ఉండే కర్తృత్వ వాసన లేకపోవటమే 'జన్మ' అనే జ్వరానికి గొప్ప నివారణోపాయమై ఉన్నది. "నేను జన్మించువాడను" అను భ్రమ తొలగాలంటే జన్మలకు అతీతం – అప్రమేయం అగు స్వస్వరూపం ఆస్వాదించాలంటే "కర్తృత్వభ్రమ" ముందుగా తొలగాలి.

ఓ ప్రియ జనులారా! మీలో ప్రతి ఒక్కరు "విషయరస - అనురాగ నివృత్తస్థితికి సర్వదా అర్హులే! వాసనారహితులై సంకల్పవర్జితులై ఒక చక్రం వలె భ్రమణం పొందుతూ ఆయా వస్తువులను తాకుచున్నట్లు నిజకర్మలందు చేష్టలను సల్పుచూనే మెల్లమెల్లగా కర్మఫలం నందు గాని, కర్మఫల త్యాగం నందు గాని ఆసక్తి ఉండకుండు గాక. కర్మలను త్యజించండి, లేక ఆశ్రయించండి. అయితే ఆసక్తిని త్యజించండి. కర్మఫలాసక్తి లేనప్పుడు కర్మలను త్యజించినా, ఆశ్రయించినా అందులో మీ పట్ల విశేషమేమీ ఉండదని గ్రహించండి.

**బహునాత్ర కిముక్తేన, సంక్షేపాత్ ఇదమ్ ఉచ్యతే ।**
**సంకల్పనం మనోబంధః! తదభావో విముక్తతా ॥**

ఈ విషయమై మనము పెద్దగా చెప్పుకోవాల్సిన పనేమీలేదు. సంక్షిప్తంగా ఒక్కమాట చెప్పుచున్నాను, విను- సంకల్పమే మనస్సు యొక్క బంధం. అట్టి సంకల్పం లేకపోవటమే ముక్తి.

**నేఽహకార్యం, న వా అకార్యమస్తి కించిన్, న కుత్రచిత్**
**సర్వం శివమ్, అజమ్, శాంతం, అనంతం ప్రాగ్వదాస్యతామ్ ॥**

ఈ ప్రపంచంలో ఎక్కడాకూడా "చేయతగినది - చేయతగనిది"...అంటూ ఏదీ లేదు. ఎందుకంటే ఈ సమస్తం శివమై - అజమై - శాంతమై - అనంతరూపమైనట్టి బ్రహ్మరూపమే అయి ఉన్నది కదా! కాబట్టి ఓ రామచంద్రా! ఈ జగత్తు నీ పట్ల ఏర్పడక ముందే ఏ విధంగా ఆత్మ స్వరూపుడవై ఉన్నావో ఇప్పుడు కూడా అట్లే ఆత్మారాముడనై నిరభ్యంతరంగా సర్వత్రా స్థితి కలిగి ఉండు. సమస్త కర్మలందును నిష్క్రియమగు బ్రహ్మతత్త్వమును గాంచు. నిష్క్రియమగు బ్రహ్మము నందే ఈ అవశ్యకర్తవ్యములన్నిటినీ గాంచుచుండు. యథార్థచిద్రూపుడవై శాంతముగను, శివ రూపముగాను సుఖస్వరూపుడవుగాను సర్వత్రా ఏర్పడి ఉండు.

❖❖❖

## 2. 'యోగం' అంటే ఏమిటి ?

దృశ్య-దర్శనాతీతమగు ఆత్మతత్త్వమును అనుసంధానం చేయటమే 'యోగము' అను శబ్దము ఉద్దేశిస్తున్నదని గ్రహించు. అదియే 'స్వాభావికం - అకృత్రిమం' అగు చిత్తక్షయం కూడా! కాబట్టి ఆత్మయందు ఎప్పటియట్లే తన్మయుడవై ఆత్మారాముడవై వెలయుము. ప్రతిఒక్క జీవుని ఆత్మరూపం సమమై, శాంతమై, శివమై, సూక్ష్మమై, ద్వైతైక్య వర్జితమై, సర్వవ్యాపకమై అనంతమై, సమస్తమై, సమస్తానికి పరమై పరమశుద్ధమైయున్నది. అట్టి ఆత్మరూపమునకు ఎవడు, ఎచ్చట, ఎట్లా భేదాన్ని ఆపాదించగలడు? ఓ రామచంద్రా! ఎడారి ఇసుకలో గడ్డి మొలుస్తుందా? అట్లాగే నీ నిర్మల ఆత్మ స్వభావంలో 'సంకల్పం' అనునది ఉదయించదు. ఒకవేళ ఉదయించినా అది లీలా (క్రీడా) మాత్రమే.

'ఇచ్ఛ' (అభినివేశం) ఉన్నప్పుడే సంకల్పం ఉన్నట్లని గ్రహించు. సంకల్పరహితుడగు శాంత పురుషుడు తాను జీవించుచుండటంచేతగాని, జీవించకుండుటచేతగాని, ఈ ప్రపంచంలో ఏదైనా

కార్యం నిర్వర్తించుట చేతగాని, నిర్వర్తించకుండుట చేతగాని ఎట్టి ప్రయోజన - నిష్ప్రయోజనాలనూ గాంచదు. నీ అంతఃకరణము "ఇది కర్మ - అది అకర్మ" అనే ఉభయభావాలు శమించి ఉండును గాక! అనివార్యములగుచున్న ఉభయ స్థితుల పట్ల నిరంతరం 'ఆత్మానుభవము' అనే అభేదస్థితిని నీ అంతరంగము సంతరించుకొనుగాక! ఆత్మారాముడవగు నీకు కర్మ - కర్తృత్వము - భోక్తృత్వము - అకర్మ ...ఇవేవీ ఆపాదించబడజాలకుండును గాక !

ఓ రామచంద్రా! ఎవరికైనా సరే, ఈ దేహాదులందు "అహం - మమ " అనే అభిమానం ఉన్నదా... ఇక ఆ జీవుని దుఃఖాదులు తొలగే అవకాశమే లేదు. దేహాదులందు ఆత్మాభిమానం లేని వాడు ముక్తికి అత్యంత వేగంగా అర్హుడగుచున్నాడు.

ఓ సర్వజనులారా! ఇట్లు 1.దేహాభిమానం, 2.దేహాభిమానరాహిత్యం... అను ఈ రెండిటిలో మీకు ఏది శ్రేయోదాయకమో పరిశీలించి ఆపై అద్దానిని ఆశ్రయించవలసినదిగా నా మనవి. అసలు ఈ అహం, మమ అనేవి మొదలే లేవని గ్రహించండి. లేని దానిని పట్టుకుని వ్రేలాడడం అనుచితం కాక మరేమిటి? ఏదైతే ఉన్నదో... అది కేవలం పరమశివ రూపమై ఉంది. ఎందు కంటారా... ఆనందఘనమైనట్టి శివరూపమగు పరమాత్మ కంటే భిన్నంగా ఏదైనా దృశ్యం కనిపిస్తుంటే అదంతా అవస్తువే సుమా! ఆభరణం కంటే బంగారం వేరా? ఈ కనబడే జగత్తంతా కూడా ఆత్మకు భిన్నమైన అనుభవం పొందకపోవడమే దీని యొక్క నాశనం (లేక) ఉపశమనం. అట్లు జగత్తు (దృష్టి యందు) రహితమైనప్పుడు శేషించేదేదైతే ఉన్నదో... అదియే పరమార్థమగు సత్య స్వరూపమై ఉన్నది.

❖❖❖

# 3. కర్మ అంటే ఏమిటి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ద్వైత-ఏకత్వ రహితం, మనన వర్జితం, పరమ శాంతం... అయినట్టి ఆత్మయే ఈ జగద్రూపంగా నెలకొని ఉన్నది. మట్టి బొమ్మలన్నీ తయారయినది మట్టితోనే కదా! అట్లాగే ఈ జగత్తంతా శివమయమే అయి ఉన్నది. ఈ కాల-ఆకార-క్రియ-శబ్ద-శక్తి సందర్భ సహితమగు మనో బుద్ధి చిత్త అహంకారాలుగా కనబడేదంతా కూడా చిన్మయమే అయి ఉన్నది.

**శివపంకమయా ఏవ రూపాలోక మనః క్రమాః ।**
**తన్మయత్వాత్ అనంతత్వాత్, అతః కిం కేన చేత్యతే ॥**

బొమ్మలన్నీ ఒకే మట్టిచే తయారుచేయబడి ఉండగా, ఇక ఆ బొమ్మలలో - శత్రు సైన్యం, మిత్ర సైన్యం, రాజు, మంత్రి, ఆయుధం, ఏనుగు... ఈ భేదాలన్నీ ఎక్కడున్నాయి ? ఈ కనబడే దంతా శివం అనే ఒకే మట్టితో తయారుచేయబడింది. ఇదంతా కూడా శివమయమై అనంత చిద్రూపమై వెలయుచుండగా, ఇక ఇందులో రూపం, ఆ రూపం యొక్క ఆలోకనం (చూడబడేది, చూచేది) ఆలోకనం చేయు మనస్సు... ఇవన్నీ ఎక్కడున్నాయి? ఏది దేనిని ఎట్లా చూస్తుంది? ఓ

రామా? ప్రమాత ప్రమేయము, ప్రమాణము 1. తెలుసుకునే ఆయన, 2.తెలియబడేది, 3.దేనిచేత తెలియుచున్నదో, అయ్యది... ఈ మూడు కూడా శివపంకమయములే. (పంకము అంటే మట్టి, మూల పదార్థం). అంతే కాదు. ఈ కనబడే దేశ-కాలాలు, దిక్కులు, ఇక్కడి భావ-అభావ వివర్తాదులు... ఇవన్నీ శివతన్మయములేనయ్యా! అందుచేత ఇక్కడ గాని, మరెక్కడ గాని సారభూత మైనది పరమేశ్వరుడు (శివం, లేక ఆత్మతత్త్వం) మాత్రమే!

**అహం మమేత్యతః సారాన్నేఽ తరత్ పరమేశ్వరాత్ ।**
**అసంసక్తమతిస్తిష్ఠ హే, శిలోదరమౌనవత్ ॥**

అందుచేత ప్రియ రామచంద్రా సారభూతమైన పరమేశ్వరుడొక్కడే ఉన్నాడు. అతనికి భిన్నంగా "నేను - నీవు" మొదలైన వివర్తములేవీ లేనే లేవు. అందుచేత నీవు వీటన్నిటి పట్ల అసంసక్తమగు బుద్ధిని పెంపొందించుకొని, అటుపై శిలయొక్క అంతరాంతర విభాగం వలె పరమ మౌనం వహించి ఉండు. అంతేగాని, స్వతఃగా లేనివానిని పట్టుకొని వ్రేలాడనే వద్దు.

**శ్రీరాముడు:**

**అహం-మమ ఇతి అసద్రూపం జ్ఞాస్యా భావయతః, ప్రభో ।**
**అశుభం కర్మణాం త్యాగాత్, అనుష్ఠానాచ్ఛ కిం శుభమ్ ॥**

హే ప్రభూ! జ్ఞాని అనగా ఎవరు? ఏది ఉచితమో ఏది అనుచితమో ఏది నిర్వర్తించాలో, ఏది నిర్వర్తించకూడదో తెలిసియున్నవాడు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఊ !

**శ్రీరాముడు:** "ఈ అహం - మమ (నేను - నాది)" ఇత్యాది దృశ్య సమూహాలన్నీ అసద్రూపమే అని ఎఱిగిన జ్ఞానికి త్యజించవలసిన అశుభ కర్మలేమి ఉంటాయి? నిర్వర్తించవలసిన శుభకర్మలేమి ఉంటాయి? ఎందుకంటే "నేను - నావి అనేవే లేవు"...అని కదా అతని అవగాహన? మీ ఉద్దేశంలో శుభకర్మలు, అశుభ కర్మలు లేవనా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! "ఉచిత-అనుచిత కర్మలు ఉన్నాయా, లేవా?" అనా నీ ప్రశ్న? అయితే నిన్ను కర్మల విషయమై కొన్ని ప్రశ్నలు అడుగుతాను. నీ అనుభవాన్ని, అవగాహనను దృష్టిలో ఉంచుకొని నీవు ఏమని అనుకుంటున్నావో అది సమాధానంగా నీకు ఏమి అనిపిస్తే అది చెప్పు.

1.'కర్మ' అంటే ఏమిటి? 2.కర్మ అనునది ఎంతవరకు విస్తరించియున్నది? 3.కర్మ అనబడేదాని మూలమేమిటి? 4.కర్మ అనబడుదాని యొక్క ఏ విభాగము నిపుణతతో నశింపజేయవలసియున్నది? 5.అట్టి నశింపజేయవలసిన అంశమేదైతే ఉన్నదో... అద్దానిని నశింపజేయటానికి నీ ఉద్దేశంలో ఉపాయాలేమిటి ?

**శ్రీరాముడు:** వైద్యుడు అడిగే ప్రశ్నలన్నిటికి రోగి తన అనుభవములన్నీ సత్యముగా చెప్పితేనే ఉత్తమ ప్రయోజనం కదా! మీ రడిగిన ప్రశ్నలకు నాకు ఏమని తెలియవస్తోందో... అది సమాధానంగా చెపుతాను, వినండి.

ఏదైతే (ఏ కర్మ వ్యవహార విభాగమైతే) నిపుణతతో నశింపజేయవలసియున్నదో అద్దానిని మూలచ్ఛేదంగా నశింపజేయాలేగాని, కొమ్మలు మాత్రమే నరికితే ఏం ప్రయోజనం? మరల అది ఎప్పుడో చిగురుస్తుంది కదా!

బుద్ధిమంతుడైనవాడు తన యొక్క శుభ - అశుభ కర్మల రెండిటినీ (ద్వంద్వమును) నశింపజేసుకోవలసియున్నదని నా అభిప్రాయం. అసలీ కర్మలయొక్క మూలమెక్కడ ఉన్నదో కనిపెట్టి ఆ మూలమునే నశింపజేయాలి. అయితే, దేని యొక్క ఏ మూలమును ఛేదించుటచే ఈ కర్మ వృక్షము మరల చిగురించదో.... అట్టి కర్మమూల వ్యవహారము గురించి చెప్పుచున్నాను. వినండి.

ఈ దేహమే 'కర్మవృక్షం'గా ప్రకటితమైయున్నది. కాళ్ళు, చేతులు మొదలైన ఆయా అంగాలు అనే లతలతో ఇది శోభిస్తుంది. ఈ దేహం సంసారం అనే ఒక మహారణ్యంలో చిక్కుకుని ఉన్నది. ఈ దేహం వల్లనే జీవునకు సుఖదుఃఖాలన్నీ కలుగుచున్నాయి. ఈ దేహ వృక్షమునకు కర్మయే బీజం. ఈ దేహవృక్షం యొక్క ఫలములే సుఖ-దుఃఖములు. ఇది క్షణికమగు యౌవనంతో భాసిస్తూ చివరికి 'ముసలితనం' అనే నిస్సహాయ భూములకు నడిపిస్తోంది.

కోతి చెట్టు ఎక్కి ఆ వృక్ష సౌందర్యమునంతా నాశనం చేస్తుంది చూచారా? అతి భయంకర మైన 'కాలం' అను రూపం గల మర్కటం ఈ దేహవృక్షాన్ని ఆశ్రయించి దీని ఈకృతిని నిమిష నిమిషానికి ధ్వంసం చేస్తుంది. ఆలోచనలే ఈ దేహవృక్షపు చిగుళ్లు. నిద్ర, ఆ నిద్రలో కలలు గనటం... ఇవి కూడా ఈ దేహవృక్షమునకు ఆకులు వంటివే!

ఈ దేహము 'జగత్తు' అనే ఒక మహారణ్యంలో జన్మించింది. "భార్య-భర్త-కొడుకులు-తదితరులగు అయినవాళ్లు-కానివాళ్ళు"... అనబడే సంబంధాలే ఈ దేహవృక్షం ప్రక్కన మొలచిన గడ్డి మొక్కలు. అట్టి ఈ దేహవృక్షము 'ముసలితనం' అనే శిశిర ఋతువులో తన ఆకులతో సహా నేలకూలుతోంది. ఈ కాళ్ళు- చేతులు దీని పల్లవాలు. లోనగల నాడులు-ప్రేగులు-ఎముకలు-రక్తం... ఇవన్నీ వృక్షం యొక్క వ్రేళ్ళు మొదలైన అంతర్విభాగాల వంటివి. ఈ గోళ్ళు-జట్టు మొదలైనవన్నీ కోసినప్పటికీ మరల చిగురించే వృక్షపు లేపూత వంటిది.

కర్మప్రవాహ పరంపరయే ఈ దేహరూపంలో వికసితమగుచున్నది. కర్మేంద్రియాలే ఈ దేహ వృక్షపు మూలాలు. ఆ కర్మేంద్రియాలు దేహంలో ప్రవేశించే అన్నరసం చేత ప్రవృద్ధమవుతున్నాయి.

అయితే ఈ కర్మేంద్రియాలకు మూలం జ్ఞానేంద్రియములై ఉన్నాయి. వృక్షపు వేళ్ళు ఎంతో దూరం విస్తరించి ఉంటాయి చూచారా? ఈ దేహంలో గల జ్ఞానేంద్రియాలు కూడా నిజ విషయ రూపమున ఈ దృశ్య జగత్తులోనికి, సుదూరంగా విస్తరించి ఉన్నాయి. ఆ జ్ఞానేంద్రియాలు ఒక వైపు ఈ కళ్ళు - ముక్కు - చెవులు - నోరు మొదలైన పంచేంద్రియ స్థానమును, మరొకవైపు ఈ జగద్విషయ సమూహమును ఆశ్రయించి ఉన్నాయి.

కర్మేంద్రియములకు (చెవులు, చర్మం, కళ్లు, నోరు, ముక్కు) జ్ఞానేంద్రియాలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు) మూలం కదా! ఇక ఆ జ్ఞానేంద్రియాలకో ? మనస్సు మూలం. ఈ మనస్సు

చేతనే ఈ జీవుడనబడేవాడు చేత్యముల వైపుగా (విషయాల వైపుగా) ఉన్ముఖుడై ఉండటం జరుగుతోంది. మరి, "అట్టి ఈ మనస్సుకు మూలస్థానం ఏమిటి?" అని పరిశీలిస్తే "చిదాభాసుడు అనతగ్గ ఈ జీవుడే మనస్సుకు మూలస్థానం"... అని తెలియవస్తోంది. మరి, చేత్యాంశమును ప్రదర్శించే ఈ 'జీవుడు' అనబడేవానికి మూలమేమిటంటారా?

ఈ చిదాభాసాంశమునకు మూలము సర్వమూలములకు ఏకైక కారణమైనట్టి బ్రహ్మమే అయి ఉన్నది. ఆ బ్రహ్మము మనోవాక్కులకు అవిషయమైయున్నది. అనంతము, శుద్ధము, సత్యము అయి ఉన్న ఆ బ్రహ్మమునకు మరొక మూలమంటూ ఏదీ లేదు.

కనుక మహర్షీ! చైతన్యము విషయోన్ముఖమైనప్పుడు ఆ విషయోన్ముఖ చైతన్యమే సమస్త కర్మలకు మూలమైయున్నది. ఆ చైతన్యం తన నుండి బయల్వెడలిన అహంకారంతో తాదాత్మ్యం పొందినదైనప్పుడు క్రియారూపమగు స్పందము బయల్వెడలుతోంది. ఆ విధంగా కర్మలు – కర్మ ఫలములు – కర్మ ఫలజనిత తదనంతర కర్మలు... ఒక దాని ననుసరించి మరొకటి గొలుసులోని కొక్కెం వలే ఏర్పడి ఉంటున్నాయి.

ఓ మునీంద్రా! సమస్త కర్మలకు ఆదియగు బీజము జీవచైతన్యమే అయి ఉన్నది. ఎందుకంటే జీవచైతన్యం ఉంటే కదా ఈ దేహం ఉండేది! దేహం ఉంటే కదా కర్మలు ఉండేవి! అట్టి ఈ జీవచైతన్యము అహంకారాదులతో కూడి "నేను ఈ కర్మలకు కర్తయగు చైతన్యమును"... అను భావంతో కూడి ఉన్నప్పుడు, అట్టి కూటమియే కర్మలకు బీజమగుచున్నది. జీవ చైతన్యం అకర్తృత్వం వహించి ఉన్నప్పుడో, అదియే పరమపదరూపమగు 'సత్తు' అయి ఉన్నది. అనగా....

1. జీవచైతన్యము 'అహంకారము' మొదలైన భావనలతో కూడుకొని ఉన్నప్పుడు అది కర్మ వ్యవహారములన్నిటికీ తానే బీజమై ఉంటోంది.

2. జీవచైతన్యము అహంకారాదులన్నిటికీ విభిన్న మైన "శుద్ధ చిద్రూప భావన" కలిగి ఉన్నప్పుడు అదియే 'పరమపదరూపము' లేక 'బ్రహ్మము' అయి ఉంటోంది.

కాబట్టి ఈ దేహాదులకు సంబంధించిన 'అహంభావం' యొక్క భావనయే కర్మలకు బీజ కారణమై ఉన్నదని నా ఉద్దేశం.

స్వామీ! ఇప్పుడు నేను చెప్పిన విశేషాలన్నీ మీరు ఇతఃపూర్వమే చెప్పియున్నారు. మీ బోధను అనుసరించే నా బుద్ధికి కూడా 'అవును కదా' అని తోచుటచే మీ ప్రశ్నకు సమాధానంగా ఇప్పుడు చెప్పటం జరిగిందని నా మనవి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! నీవు చెప్పినదంతా దృష్టిలో పెట్టుకొని ఈ కర్మబీజము విషయమై మరికొంత పరిశీలిద్దాం.

ఎంతవరకైతే ఈ ఉపాధి ఉంటుందో... అంతవరకు జీవ చైతన్యమునకు అహంకారము, ఆ అహంకారమును ఆశ్రయించి కర్మ వ్యవహారం ఉంటాయి కదా? కనుక దేహమున్నంత వరకు 'కర్మలు' అనేవి ఉంటూనే ఉంటాయి.

నీవు చెప్పినట్లు ఈ జీవచైతన్యం ఏ దృశ్యం వైపుగా ఎట్లు ఉన్ముఖమౌతున్నతో అది అద్దానిని అట్లే పొందుతోంది. "ఆ దృశ్యం సత్యమా, అసత్యమా? అది బాహ్యమా, అంతరమా?"అనేది ఇక్కడ ప్రశ్న కాదు. జీవచైతన్యం ఏ రూపంగా ఉన్ముఖం అయితే ఆ రీతిగా అనుభవం పొందుతోంది. దేనిని ఎట్లా భావన చేస్తే అట్లా అది పొందుతోంది, అనుభవిస్తోంది కదా! అట్టి ఈ జీవచైతన్యం దృశ్యం వైపుగా ఉన్ముఖమే కాలేదనుకో? అప్పుడు? అది సంసారం నుండి విడివడిపోవుచున్నది. ఇక "సంసారం భ్రమా? సత్యమా?" అనేది అప్రస్తుతమే అవుతుంది. అటువంటి విచారణతో పనేంటి?

కాబట్టి ఈ జీవనచైతన్యమే వాసన, ఇచ్ఛ, మనస్సు, కర్మ, సంకల్పము... మొదలైన ఆయా రూపాలలో తనను తానే ప్రదర్శించుకుంటోంది. అది స్వయంగా భ్రమలను ఆశ్రయించి ఈ సంసారం యొక్క రూపమును వికసింపజేస్తోంది.

ఒకడు జ్ఞాని అయి ఉన్నా కూడా, అతనికి ఎంతవరకైతే ఈ దేహం ఉంటుందో అంతవరకు ఈ దేహగృహంలో అతనికి 'చిత్తం' అనేది ఉండియే ఉంటోంది. జీవించి ఉన్నంత వరకు చిత్తమును త్యజించుట ఎట్లా సాధ్యం? సాధ్యం కాదు. అయితే జ్ఞాని యొక్క జీవచైతన్యం "నేను అసంగమైన అద్వితీయమైన, కూటస్థమైనట్టి స్వరూపమును"... అను ఎఱుకను, అనుభూతిని, అనుభవమును సంతరించుకుని ఉంటోంది.

"సర్వకర్మలకు ఆవల, కర్మలన్నిటికీ సంబంధించనివాడనై శుద్ధ చిద్రూపుడనైన నేను ఏర్పడియున్నాను. అందుచేత కర్మాకర్మలతో నాకు ప్రమేయం లేదు. "నాఽహంకర్తా! నైవ కించిత్ కరోమి! నేనేమీ చేయటం లేదు"... అని ఈ విధంగా నిష్క్రియమైన ఆత్మస్వభావ స్థితిచే ఈ చిత్తమును ఆక్రమించివేసి ఉంటున్నాడు. తదితర జీవులవలెనే ఆయా కర్మలు ఈ దేహముచే నిర్వర్తిస్తున్నప్పటికీ స్వస్వరూపమునందు అతనికి కర్మ యొక్క భావనయే జనించదు. అతడు కర్మ – అకర్మల వికల్పం త్యజించివేసి ఉంటాడు. అట్టి జీవచైతన్యం స్వయంగా అజమైనట్టి బ్రహ్మరూపంగా అయి, తదనుకూల అనుభవమును అనిర్వచనీయంగా పొందుతూ ఉంటుంది.

కర్మ–అకర్మల వ్యవహారం త్యజించకుండా, ఆ ఉభయాలకూ అతీతత్త్వం సంతరించుకోకుండా, ఒకడు "ఈ శరీరమే కదా కర్మలకు మూలం! అందుకనే ఈ శరీరాన్ని నిష్క్రియంగా ఉంచుతాను"... అని తలచి శరీరముచే మాత్రమే విహితకర్మలను త్యజించేవాడు ఎన్నటికీ "కర్మత్యాగి" కాలేడని జనులందరికీ గుర్తు చేస్తున్నాను.

జ్ఞాన బలం చేత ఈ దృశ్య ప్రతిభాస స్వయంగా లయించగలదు. అప్పుడు "ఈ జగత్తు అనబడేది భావనామాత్రమే గాని స్వయంగా లేదు"... అనురూపంగా ఉండే జగత్తు యొక్క అత్యంత – అభావం సిద్ధించగలదు. అట్టి జగత్ అభావన, మరియు అప్రమేయ అఖండ ఆత్మభావనయే త్యాగం, అసంగం, మోక్షం అను శబ్దములచే ఉద్దేశించబడుతున్నది సుమా! సందర్భానుచితంగా ఇక్కడ వేద్య (తెలుసుకొనబడుచున్న విషయం) – వేదనముల (తెలుసుకొనుచున్న తత్త్వం (లేదా) చిదాభాసరూప చైతన్యం) గురించి కొన్ని విషయాలు ప్రస్తావించుకుందాం.

"వేదనము" ఉన్నప్పుడే (తెలుసుకొనుచున్నది ఉన్నప్పుడే) "తెలియబడే విషయాలు" అనేది ఉంటుంది. ఆ తెలుసుకొనుచున్న విభాగం ఎందులోంచి బయలుదేరుతుందో... (లేక) తెలుసుకొను చున్న విభాగమునకు ముందే ఉన్నదేమిటో... అది వేద్య దృష్టి కంటే కూడా సూక్ష్మమై, కారణ కారణమై ఉన్నది.

అట్టి మున్ముందుగా ఉన్న తత్త్వమును ఆశ్రయించడమే "వేద్య దృష్టిని అధిగమించి తత్త్వదృష్టిని ఆశ్రయించటం"... అని గ్రహించు.

ఏ తత్త్వ దృష్టి యొక్క పరిపుష్టి చేత "వేద్య దృష్టి యొక్క ఉత్పన్నమే లేదు"... అని గ్రహించ బడుతుందో అట్టి తత్త్వానుభవాన్ని సంతరించుకొన్న వానికి ఇక "తెలియబడే విషయాలు – వేదనము" అనునది ఎక్కడుంటుంది ? అనగా, వేద్యదృష్టి – వేదనము కూడా స్వతహాగా లేవని గ్రహించినచోట జగద్దృష్టి యొక్క అతీతత్వం రూపుదిద్దుకుంటుంది. దృశ్యం ద్రష్ట యొక్క అవగాహన – అభిప్రాయం – భావనలను అనుసరించే ఉంటోంది సుమా!

'జ్ఞానదృష్టి' (ఆత్మ దృష్టి) యొక్క పరిపుష్టి చేత ఒకడు వేద్యోన్ముఖత్వమును (విషయముల పట్ల గల మూలాధ్యాసను) త్యజించినాడనుకో, అనగా వేద్య దృష్టి ఉత్పన్నముకానప్పటి వేదనము యొక్క స్వరూపమేమికలదో... అద్దానిని ఏమని పిలవాలి?

అది 'వేదనం' కాదు. ఎందుకంటే తెలుసుకోవటం అను కార్యక్రమం కన్నా అది ముందే ఉన్నది కదా! అది కర్మ (లేక, క్రియారూపం) కాదు. ఎందుకంటే సర్వక్రియలకు అది ముందే ఏర్పడి ఉన్నది కదా! అందుకే అది "నిష్క్రియం" అని కూడా వర్ణించబడింది మరి! అది స్వతహాగా శాంతమగు బ్రహ్మమే అయి ఉన్నది.

ఆకాశంలో ఉండే మేఘాలు జలాదులందు ప్రతిబింబిస్తున్నట్లు, బుద్ధ్యాదులందు (ఆ బుద్ధికి అనుగుణంగా) ఈ దృశ్యం ప్రతిబింబిస్తోంది. అట్టి ప్రతిబింబాన్ని ఎఱుగుచున్న చైతన్య విభాగం "చిదాభాస చైతన్యం" అను పేరుతో ఉద్దేశించబడుతోంది. అట్టి చిదాభాస చైతన్యం క్రియారూపంగా ఈ జగత్తులో ప్రదర్శితమౌతోంది. "ఏ జీవుడైనా చిదాభాస – శూన్యత్వమును అవధరించి ఉంటే అట్టి అతని పరిశేష్యమును... 'మోక్షం' అని పిలుస్తున్నారు. అట్టి వారు ఈ లోకానికి ఉపదేశిస్తున్న దంతా శిష్యుని వాస్తవ స్వరూపం గురించే.

కాబట్టి రామా! దేహం ఎంతవరకు ఉంటుందో, అంతవరకు కర్మలయొక్క 'త్యాగం' అనేది సంభవించదు. కర్మలను ఆశ్రయిస్తున్నంత కాలం, ఆ కర్మలకు మూలమైన (వాసనాసంబంధమైన, మనో సంబంధమైన) చిదాభాసరూపసంవిత్తు ప్రవర్తిస్తున్నట్లే అవుతోంది. ఆ చిదాభాస సంవిత్తును అధిగమించి పరిశీలిస్తే 'శుద్ధసంవిత్తు' మనకు ద్యోతకమౌతుంది. అట్టి అధిగమనం జ్ఞానబలిమిచే సుసాధ్యం. శుద్ధ సంవిత్తు సర్వదా యథాతథంగా ఉండగానే అద్దాని 'చిత్కళ' అనతగిన చిదాభాస సంవిత్తు అంతఃకరణమునందు వాసనలను కలిగి ఉంటోంది. అట్టి వాసనారూపసంవిత్తు కర్మలకు కర్తృత్వాదులకు కారణత్వము వహించి ఉంటోంది.

ఎవడైతే చిదాభాసరూప సంవిత్తును అద్దాని మూలాజ్ఞానముతో సహా 'ఆత్మవిచారణ' అను స్వప్రయత్నముచే యథార్థముగా ఎఱుగుచున్నాడో... అట్టి వాడు ఆ చిదాభాస స్వరూపమును అధిగమించి శుద్ధ చిద్రూపమును ఎఱుగుచున్నాడు. "చిదాభాససంవిత్తును అనుసంధానం కావించకపోవటం"... అను అభ్యాసముచే మాత్రమే చిదాభాససంవిత్తు అధిగమించబడుతున్నది.

**తేన సంసృతి వృక్షస్యం । మూలకాషో వితన్యతే ॥**

అతడే ఈ సంసార వృక్షమును మూలాఛేదం కావించినవాడగుచున్నాడు. కనుక అవేదత్వమే మోక్షం (ఆవేదన విదుర్ మోక్షం)!

ఓ రాఘవా! ఇక్కడేగాని, మరెక్కడైనాగాని బ్రహ్మమొక్కటే ఉన్నది. అది చిదాభాసవర్జితమై మేఘవిభాగ రహిత ఆకాశము వలె ఉన్నది. సజాతీయ – విజాతీయ, స్వగతాది భేదములు అద్దానికి లేవు.

"చిదాకాశరూపమై నిరామయమైనట్టి ఆ బ్రహ్మమే సమస్త చేతనములయొక్క సారం"... అని బ్రహ్మవేత్తలు ఎలుగెత్తి పలుకుచున్నారు. ముముక్షువులంతా అది శ్రద్ధగా విని, అందు సూచించే అర్థసారాన్ని గ్రహించి తమ చిదాభాసాతీతమైన చిదాకాశత్వాన్ని గ్రహించి, అనువర్తించెదరు గాక!

❖❖❖

# 4. కర్మ త్యాగము

**శ్రీరాముడు :** మునీంద్రా! "అవేదనమే మోక్షం" (ఈ తెలియబడేదంతా తెలియకుండా ఉండటమే మోక్షం) అనే అర్థం మీరు సూచిస్తున్నట్లు నాకు అనిపిస్తోంది. "సర్వజ్ఞానాలకు పరాకాష్ఠ అయిన మోక్షం ఆత్మజ్ఞానం అనే ఎఱుక కూడా రహితమైన స్థితి" అని మీ ఉద్దేశమా? ఎందుకంటే, ఆత్మ జ్ఞానం కూడా తెలియబడే విషయాంతర్గత విభాగమే కదా! "అసత్తుకు ఉనికి లేదు. సత్తుకు లేమి లేదు... అని కదా శాస్త్ర సిద్ధాంతం? జ్ఞాన స్వరూపమగు సత్తు తెలియబడనిది" అనే నాకు వినిపిస్తున్న మీ అభిప్రాయం నేను సమన్వయించుకోలేకపోతున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మొట్టమొదట ఆత్మ నిత్యోదిత చైతన్యస్వరూపమై ఉన్నది. ఇది సత్తు. మిగిలినదంతా అసత్తుగా (లేక) కల్పనగా ఏర్పడుతోంది. నిర్విషయ – అఖండ – అప్రమేయమగు ఆత్మ నుండి స్వయంకల్పితంగా ద్రష్టత్వం (లేక) అనుభవత్వం బయల్వెడలుతోంది. అదియే 'జీవుడు' అని 'చిదాభాసుడు' అని అంటున్నాం. ఈతనినే 'దృశ్యద్రష్ట' అని గమనించు. ఆ దృశ్యద్రష్ట స్వయంభావనచే పొందుచున్నదే ఈ దృశ్యము (లేక) వేదనము.

**నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః ।**
**యదా తదైవ సుకరం వేదనావేదనం స్వయమ్ ॥**

ఓ రామచంద్రా! ఎప్పుడైతే "అసత్తుకు ఉనికి లేదు. సత్తుకు లేమి లేదు" అనేది సిద్ధాంతమై ఉన్నదో... అప్పుడు "వేదనం (దృశ్యమును ఎఱుగుచున్న విభాగం) అవేదనమగుట"... అని నేను ప్రతిపాదించే మోక్ష సిద్ధాంతం మరింత సుకరం అవుతోంది.

ఇప్పుడు మనం "వేద్యము (తెలియబడుచున్నది)" అనే శబ్దం ఉపయోగించాం కదా! అయితే అట్టి వేదనము అనబడు శబ్దము, దాని అర్థము కూడా "త్రాడునందు చూచే పాము" వలె "ఎండమావులలో కనిపించే జలతరంగాల" వలె భ్రమయుక్తములు మాత్రమేనని గ్రహించు. వేదనము అసత్యంగానే ఉదయించినదగుచున్నది. అందుచేత ఆ వేదన – వేద్యములు (ద్రష్టత్వ – దృశ్యములు) "వేదనము" (తెలియబడేది) అనబడే శబ్దార్థములను రెండిటి యొక్క విస్మరణయే పరమశ్రేయస్సును కలుగజేయగలదు సుమా!

ఎందుకంటావా? "తెలియబడేది"... అనుదాని చేతనే కదా, ఈ జీవునకు దుఃఖములన్నీ కలుగుచున్నవి! తెలియబడేదానికి ముమ్మందుగానే "తెలుసుకుంటున్నది"... అనునది ఉండనే ఉంటోంది. ఆ "తెలుసుకుంటున్నది" అనబడేదే ఈ జీవుని వాస్తవ స్వరూపం.




అట్టి "తెలుసుకునుచున్నది" అనబడేది తెలియబడేదానిచే ఎట్లా తెలియబడుతుంది చెప్పు? అందుచేత ఓ రామచంద్రా! నీవు 'తెలుకొనుచున్నది (ద్రష్ట – జీవుడు)' అను ఒకానొక చమత్కారం తనయందు ప్రదర్శించే స్వస్వరూపమగు ఆత్మనే ఎఱుగుము. అంతేగాని ఈ చిదాభాసుని (ఆత్మ నుండి బయల్వెడలుచున్న ద్రష్ట – జీవుడు) గురించి ఎంతగా విచక్షణ చేసి ఏమి ప్రయోజనం?

మరొకసారి చెప్పుచున్నాను. వేదనము (తెలియబడేది – దృశ్యం) అను దానిలో చిక్కుకొనటం చేతనే వాస్తవానికి సత్–చిత్–ఆనందస్వరూపుడగు ఈ జీవుడు (చిక్కుకున్నట్లుగా ఏర్పడుచున్న భ్రమచేతనే) సర్వ దుఃఖములు, సర్వ అనర్థములు తెచ్చి పెట్టుకుంటున్నాడు. అందుచేత ఈ తెలియబడుచున్న దానికి సంబంధించిన 'జ్ఞప్తి' యొక్క శబ్దార్థముల రెండింటినీ త్యజించి సుఖస్వరూపుడవై ఉండు.

ఓ రామచంద్రా! 1. ద్రష్ట–దర్శనము–దృశ్యము... అనబడే త్రిపుటీ బోధ లక్షణము అయి ఉన్న ఈ వ్యవహారశీలత్వము; 2. వ్యావహారిక సంబంధమైన 'జ్ఞప్తి' లక్షణము; 3. సర్వార్థసారమైన పరమకూటస్థ చిన్మాత్రము... ఈ మూడింటిలోను మొదటి రెండు అధిగమించి అటుపై సర్వశబ్దపరం – మూడవది అయినట్టి 'ఓం' కారమును అన్వయించుకొని ఉండు. అట్టి పారవశ్యంనందు అనుభవమయ్యే శుద్ధాత్మయే నిర్వాణోదయం సుమా! (అదియే ఈ వర్తమాన నిర్వాణ ప్రకరణసారం). అట్టి నిత్యోదిత శుద్ధాత్మయందు ఎట్టి విక్షేపము లేకుండా వ్యవహరించుము.

**కర్మ, కర్మ త్యాగము –**

**శుభాశుభాత్మకర్మ స్వం నాశనీయం వివేకినా ।**
**తన్నాస్తీత్యవబోధేన, తత్త్వజ్ఞానేన సిద్ధ్యతి ॥**

వివేకి అయినవాడు తన యొక్క శుభ – అశుభ కర్మల రెండింటినీ దాటివేసి ఉంటాడు. "అవి వాస్తవానికి లేవు"... అను బోధ చేతను, ఆ రెండింటిచేత స్పృశింపబడనట్టి 'తత్త్వం' యొక్క జ్ఞానం చేతను వాటి 'రాహిత్యం' లేక అతీతత్వం సిద్ధింపజేసుకోగలడు.

**కర్మమూల నికాషేణ, సంసారః పరిశామ్యతి ।**
**సువిచారితమన్విష్టం యావత్ కర్మ న విద్యతే ॥**

కర్మ యొక్క ఏ మూలమైతే ఉన్నదో... అదే చిత్ యొక్క "అభాసరూప సంవిత్తు" అని వర్ణించబడింది. అట్టి కర్మల యొక్క మూలాన్ని ఛేదించుటచేతనే సంసారం శమిస్తోంది. "మూల, ఫల, పుష్ప, శాఖ – ఉపశాఖసహితమగు కర్మ వృక్షమే మొదలే లేదు"... అనే పర్యవసానం, ప్రయోజనం కలిగి ఉండే "పూర్ణ విచారణ" చేతనే ఈ వృక్షం నశించగలదు. అనగా ఈ జీవుని పట్ల కర్మవృక్షం అప్రభావితమై ఉండాలంటే అది విచారణ శాస్త్రాన్వేషణలచే (కర్మ రాహిత్యత్వం – కర్మాతీతత్వం) తప్పక లభించగలదని నా మనవి.

**శ్రీరాముడు :** స్వామీ! 'చిత్తము' అనబడేదాని అసలైన రూపమేమిటి ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బిల్వ వృక్షములోని మజ్జలో గల బీజతత్త్వమే బీజముగా బయల్వెడలుతోంది కదా! బిల్వబీజం బిల్వవృక్షం కంటే వేరా? ఎట్లా అవుతుంది? రెండింటిలోని 'సత్త' (జీవ తత్త్వం) అనేది ఒక్కటే. అట్లాగే 'చిద్రూపం' అనే బిల్వవృక్షం నుండి బయల్వెడలిన 'చిత్తం' అనబడు క్రియాకారాది త్రిపుటి ఆ చిద్రూపం కంటే లేశం కూడా వేరైనది కాదు. ఈ భూలోకంలో ఉండే ఒక ప్రదేశం భూలోకం కంటే వేరైనది కాదుకదా! అట్లాగే ఈ అవకాశం, ఆకాశమున అంతర్గతమై ఉంటున్న భూతజాలం, భవనాది వస్తుజాలం – ఇవన్నీ కూడా సన్మాత్రమగు పరమాత్మ కంటే వేరైనవి కానేకావు. " జలమందలి తరంగత్వము జలం కంటే వేరు"... అని ఎవరైనా అనగలరా? చిత్తం కూడా చిద్రూపమే అయి ఉన్నది. చిత్తం చిత్తే! చిత్తు చైతన్యమే! జలంలో ద్రవత్వం, అగ్నిలో ప్రకాశం ఉన్నట్లే బ్రహ్మం నందు గ్రాహకత్వం (గ్రహించటం) అనే స్వభావం, స్మృత్యత్వం (స్మృతి అనే చమత్కారం)... అను వ్యవహారాల కంటే సూక్ష్మమైన చిత్తం ఉండి ఉన్నది.

అయితే "చేతనము"...అనే శబ్దం యొక్క అర్థం "క్రియాత్మకము" అని కదా! అయితే సర్వ క్రియలకూ ముందే ఏర్పడి ఉన్న నిష్క్రియ కూటస్థ చైతన్యం నందు యక్షుని భ్రమలాగా క్రియాత్మక చైతన్యం ప్రజ్వరిల్లుతోంది. అది స్వతహాగా అకారణం కనుక 'క్రియాత్మకం' అనబడేదంతా వాస్తవానికి "ఉదయించనిది, లేనిది" – అయి ఉన్నది. వాయువు – వాయు చలనము వేరు వేరా?

**శ్రీరాముడు :** కాదు. వాయువు – వాయు చలనము వేరు వేరుగా ఉండజాలవు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లాగే, చేతనము – దాని యొక్క అభివ్యక్తరూపం అగు క్రియ అభిన్నములై

ఉన్నాయి. ఈ సిద్ధాంతమును అనుసరించి ఇక్కడి బాహ్య అభ్యంతర రూపములగు, జాగ్రత్ – స్వప్న – సుషుప్తులందలి – పదార్థబుద్ధి కూడా ఆత్మరూపమే గాని... మరింకేదో మరొకటి కాదు.

**విస్తారః కర్మణాం దేహః, సోఽహంతాత్మా, స సంసృతిః ।**
**అచేతనాన్ అనహన్త్వేన శామ్యతి అస్య స్పన్దవాతవత్ ॥**

ఓ రాఘవా! కర్మల యొక్క విస్తారమే ఈ దేహం. అదియే అహంకారం, అదే సంసారం కూడా! కనుక నీవు చిదాభాసత్యాగ పూర్వకమైన "అనహం" భావన అనే గొడ్డలిచే ఈ సంసారం– ఈ దేహాహంకారాలను శమింపజేయి. అప్పుడు నిశ్చలస్థితిలోని వాయువు వలె సర్వాతీతమైన నీ వాస్తవ స్వభావం తేటతెల్లమవగలదు. ఆ విధంగా చిదాభాసుని త్యజించు. అనంతాత్ముడవగుము. చిద్రూపుడవై ఒక శిలవలె నిశ్చలత్వమును అవధరించి ఉండు. అట్టి నిశ్చలాత్మకత్వ బలిమిచే వరాహం రెల్లుగడ్డిని తొలచునట్లు, ఈ సంసార మూలమును (ఈ జన్మ కర్మ వ్యవహారత్వమును) ఛేదనమొనర్చివేయుము. ఈ మార్గంలో మాత్రమే ఈ కర్మబీజము యొక్క కోశము త్యజించ బడుతుంది. ఇక వేరే మార్గం లేదు.

ఈ ప్రకారంగా కర్మబీజకళ త్యజించబడుగాక! అప్పుడు క్రమంగా బ్రహ్మం కంటే భిన్నమైనది. కనిపించటానికి కారణమగుచున్న "చిదాభాసుడు", ఆ చిదాభాసునికి కనిపించే దృశ్యప్రపంచం జీవునకు మిథ్యగా తేలిపోవుచున్నది. ఇక అతడు వేద్యమగు పరబ్రహ్మమును స్వతఃసిద్ధంగానే ఎఱుగుచున్నాడు. ఇక పరమశాంతస్వరూపుడగు అట్టి మహాత్ముడు దేనినీ త్యజించడు. గ్రహించడు. అనగా అతడు "గ్రహణము – త్యాజ్యము" లకు సంబంధించిన అనుభవమే కలిగి ఉండడు. సర్వ ప్రాపంచిక వ్యవహారములకు నిమిత్తమాత్రుడై, శాంతచిత్తుడై ఉంటాడు. ఆకాశమువలె విశదమై దృశ్యరహితమైనట్టి తన ఆత్మస్వరూపమునందు స్థితి కలిగి ఉంటాడు. అంతేకాదు. అతడు ఆయా ప్రవాహపతితములగు కార్యములు చేయుచున్నప్పటికీ నిర్వర్తించనివాడుగానే ఉంటాడు. నదీ ప్రవాహంలో కొట్టుకువస్తున్న చెక్క – కొమ్మ మొదలైన వాటిని చూచి నదీ జలం చలిస్తుందా? అట్లాగే తత్త్వజ్ఞుడు తన "జీవుడు – అనబడు ద్రష్టత్వమును – కర్మేంద్రియ మనోవికారములను తన స్వరూపముపై (ఆత్మస్వరూపముపై) ఆపాదించుకోడు. అయితే సగం నిదిస్తున్న బాలునిలాగా ఆయా చేష్టలను మాత్రం సల్పుతూ ఉంటాడు. నిర్విషయమగు నిరతిశయానందం (బ్రహ్మం) లభించటం చేత అతని ఇంద్రియాలు ఆయా ఇంద్రియ విషయాల పట్ల రాగరహితమై ఉంటాయి. అవి అంతరమున గాని, బాహ్యమున గాని ఎట్టి ఉనికిని కలిగియే ఉండవు సుమా!

ఇప్పటిదాకా మనం చెప్పుకునే ఆత్మతోటి ఏకత్వానుభవమే (నేను శాశ్వతం – అప్రమేయం అగు ఆత్మను... అను అనుభవమే) 'కర్మత్యాగం' అను శబ్దంచే ఉద్దేశించబడుతోందని మరల ప్రకటిస్తున్నాను. అట్టి జ్ఞానం ఆత్మ ప్రబోధం వలననే సిద్ధిస్తోంది.

**కర్మణో వేదనం త్యాగః స చ సిద్ధః ప్రబోధతః ।**
**అవస్తు నేతఽరేణార్థః కింకృతేన అకృతేనవా ॥**

కర్మలతో 'రాహిత్యము' సంతరించుకోవటమే కర్మత్యాగం. ఇక ఈ దేహ – ఇంద్రియాదులతో జరిగే చేష్టలంటావా? అవన్నీ మిథ్యారూపాలని గ్రహించు. అవి ఒనర్చినా, ఒనర్చకున్నా... అందులో విశేషమేమీ లేదు. ఆత్మభావంతో (ఆత్మసాక్షాత్కార బుద్ధితో) ఈ దృశ్య – జగత్తులో చరిస్తున్న తన 'జీవుడు' అను పాత్రను తదితర దేహులను చూస్తున్న విధంగానే చూచేవానికి ఇక బంధమెక్కడిది?

ఓ రామచంద్రా! మరల చెప్పుచున్నాను. ఈ జీవుడు ఎట్లాగైనా సరే, తనకున్న అవకాశాలన్నీ ఉపయోగించుకుని ఆత్మస్థితిని సంపాదించుకోవాలి, అనగా... "నా యొక్క వాస్తవ తత్త్వం చిదాభాసవర్జితం – విషయజ్ఞాం కంటే ముందే ఏర్పడి ఉన్నది. కనుక... అది విషయజ్ఞాన వర్జితం. అది పరమ శాంతస్వరూపము, సర్వదా సమస్వరూపము, అది సర్వవేళలా కృత – అకృత – ప్రతిసంధానరహిత స్వరూపము, అది వాసనారహితము, పరమ శుద్ధము" ...ఇటువంటి అవగాహన ఎవరు సంతరించుకుంటారో, అట్టి వారే "కర్మ త్యాగి" అని చెప్పబడుతారు.

అయినా.... ఒక్క విషయం. "సంసార బద్ధుడు" అని చెప్పబడే జీవుడు కూడా కొన్ని సంవత్సరాల క్రితం ఒకానొక రోజు నిర్వర్తించిన కర్మలేమిటో చెప్పమంటే చెప్పలేడు కదా! కానీ ఆతడు 1.ఇప్పటికి ఇది చేశాను, 2.అప్పటికి అది చేయవలసి ఉన్నది, 3. ఆ, ఇంత చేశానే! నాకేం వచ్చింది? 4.అయ్యో! ఇది ఎందుకో చేయలేకపోయాను... అనే ఈ నాలుగు రకాల కర్మ సంగమమును వర్తమానంలో కలిగి ఉంటున్నాడు. ఇక 'ముక్తుడు' అనువాడో, వర్తమానంలోనే సర్వ కర్మలు, సర్వదృశ్యములు విస్మరించి ఉండగలుగుచున్నాడు. అట్టి సునిశ్చితము, సునిశ్చలము అగు ఆత్మస్థితికి శాస్త్రములు 'కర్మత్యాగము' అని పేరు పెట్టాయి.

**శ్రీరాముడు :** అయితే 'కర్మత్యాగము' అనేది కర్మలను నిర్వర్తించటం మానివేయటం చేత వచ్చే స్థితి కాదని మీ ఉద్దేశమా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కర్మరహిత స్థితియే మోక్షరూపమగు కర్మత్యాగస్థితి అయి ఉంటే జడరూపమగు గాఢ నిద్రాస్థితియే మోక్ష స్థితి అయి ఉండేది. కర్మలను మానివేసి ఒకచోట ఊరకే కూర్చుని ఉండటం 'కర్మత్యాగం' అనిపించుకోజాలదని మరల మరల ప్రకటిస్తూనే ఉన్నాను సుమా! అసలు మూలము అయినట్టి చిదాభాసుని త్యజించకుండా (దృశ్య–జగత్తులో చరించే ద్రష్టత్వము – జీవత్వములకు అతీతత్వం పుణికి పుచ్చుకోకుండా) కేవలం కర్మేంద్రియాలను గాలికి వదిలినంత మాత్రం చేత కర్మత్యాగం అని అనిపించుకోదని చేతులెత్తి మరల ప్రకటిస్తున్నాను. అట్టి వ్యర్థమైన అవగాహనతో కూడినవారిని 'మాంద్యము' అనే పిశాచము గుటుక్కున మ్రింగటానికి సిద్ధంగా ఉన్నదని గుర్తు చేస్తున్నాను. అట్లా అయితే మత్తుగా త్రాగి మొద్దుగా నిదురించేవాడు మోక్ష స్వరూపుడౌతాడు. అది అట్లు కాదు కదా!

ఇక 'సమూల కర్మ త్యాగము' సంతరించుకుని ఎవరైతే ప్రశాంతముగా ఉంటారో.... అట్టి వారికి ఈ ప్రపంచం విషయంలో కర్మలు నిర్వర్తించినా, నిర్వర్తించకున్నా వచ్చే ప్రయోజనం ఏమీ ఉండదు. వివేకి అయినవాడు 1."నేను కర్మలు నిర్వర్తించాలి; 2.ఎందుకు నిర్వర్తించాలి?"...

ఇటువంటి ఉభయ కర్మబీజకళలను సమూలంగా త్యజించి ఏకంగా ఆత్మయందే నిత్యసమాహితుడై వెలయుచున్నాడు. అనగా......

**ప్రవాహపతితే కార్యే ఈషత్ స్పన్ధా అతన్మయాః**
**ఘూర్ణమానాఇవ క్షీబాయంత్ర సంచారితా ఇవ**
**మోక్షలక్ష్మ్యా విలాసిన్యా వ్యసనోపహతా ఇవ**
**అర్ధసుప్త ప్రబుద్ధాభాః కామప్యవనిమాగతాః ॥**

వివేకులు ఒకవైపేమో పూర్ణ అనాసక్తులై, అభిమానాది ఎట్టి వికారాలు లేని వారై ఆయా ప్రవాహపతితమైన కార్యాలను (ఆయా నియమిత క్రియాదులను) ఉత్సాహంగా నిర్వర్తిస్తూనే... మరొకవైపు మదిరోన్మత్తుని వలె, యంత్రాలచే చలింపబడే ఆట బొమ్మలాగా నిస్పృహులై ఉంటారు. 'మోక్ష లక్ష్మి' పట్ల మాత్రమే అత్యాసక్తియుతులై, ఈ దేహదులతో ఏమాత్రం సంబంధం లేనివారై ఉంటారు. సగం నిద్రలో ఉండే బాలునివలె ఉత్తమ భూమికలను అవధరించి ఉంటారు.

ఒక చెట్టును మొదలంట (వేళ్ళతో సహా) పెకలించిస్తేనే అది తొలగించబడినది అవుతుంది గాని కొమ్మలు నరికినంత మాత్రంచేత చెట్టును నశింపజేయటం అవుతుందా? లేదు కదా! "నేను కర్మ వ్యవహారములకు అప్రమేయుడను, అసంబంధితుడను, అతీతుడను"... అని గ్రహించటమే కర్మత్యాజ్యం గాని "నేను కర్మలు నిర్వర్తించను" అనేది కర్మత్యాజ్యం కాదు. జీవించటమనేది కూడా ఒక కర్మయే కదా! "నేను జీవన్ పరిమితుడను కాను"... అని గ్రహించటం చేతనే దేహాదులు జయించబడినవి అవుతున్నాయి. మూలాఛేదనం చేయకపోవటం చేతనే ఈ కర్మ వృక్షం మరల మరల చిగురించి, శాఖోపశాఖలై జీవుని దుఃఖమును వర్ధింపజేయుచున్నదని సాధకులు గ్రహించవలసినదిగా నా మనవి.

ఓ జనులారా! చిదాభాసుని ఛేదనం చేసినప్పుడు మాత్రమే (నేను జీవ – దేహ పరిమితుడను – అను భ్రమను వదలినప్పుడు మాత్రమే) 'కర్మత్యాగం'... అనేది సిద్ధిస్తోంది. ఇది గ్రహించి మీమీ సాధనలు కొనసాగించండి. ఇతర వ్యవహార పరంపరలతో, క్రియా క్రమములతో ఏమి పని?

ఎవరైతే ఈ 'కర్మత్యాగం'ను ఆచరించకుండా హఠాదులచే కేవలం కర్మేంద్రియాలను మాత్రం సంయమనం చేస్తారో... అదియే 'త్యాగము' అని తలుస్తూ ఉంటారో... అది వ్యర్థ ప్రయత్నమని చెప్పక తప్పదు. అది ఆకాశమును చేత్తో బాది వశం చేసుకోవాలని అనుకోవటం వంటిది.

**శ్రీరాముడు :** మహాత్మా! మీరు చెప్పే కర్మత్యాజ్యం సిద్ధింపజేసుకునేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మజ్ఞానం సంపాదించుకోవటంచేతనే కర్మత్యాగం స్వయంగా సిద్ధించగలదు. వేయించబడిన విత్తనం మరల మొలకెత్తదు కదా! వాసనావర్జితులు, ఇచ్ఛారహితులు అయిన జీవన్ముక్తులు నిర్వర్తించే క్రియలన్నీ అక్రియలే అవుతాయని గ్రహించు. నాయనలారా! మీరంతా కూడా "కర్మ ఎప్పుడు, ఎందుచేత ఫలోన్ముఖమగుచున్నది? అది ఎప్పుడు ఫలరహితం, బంధనా రహితం కాగలదు?"... అనే విషయాన్ని జాగరూకులై గ్రహించాలి. బుద్ధి సహితమగు ఇంద్రియాల

చేత "భోగాసక్తి – రసభావన" కలిగి ఉండి కర్మలు నిర్వర్తిస్తేనే అవి ఫలోన్ముఖములై బంధహేతువులు అగుచున్నాయి. వాసనారహితమగు చేష్టలు ఎన్నటికీ కర్మసంగమునకు దారితీయజాలవు సుమా! పులుసులో ప్రవేశింపజేయబడిన గరిటకు పులుసులోని రుచులతో సంబంధమే లేదు కదా!

అందుచేత "జ్ఞానంచే కర్మలను త్యజించి ఉండేదెట్లా?"... అనే మార్గాన్ని మీరంతా ఆశ్రయించండి. వాసనారహితుడగు జీవన్ముక్తుడు ఇంట్లో ఉన్నా, లేక, అరణ్యంలో ఉన్నా, ధనాది సంపదలతో కూడుకొని ఉన్నా, నిరుపేదగా ఉన్నా... ఆయా సందర్భములచే అతడు స్పృశించబడటం లేదు. అవన్నీ అతనికి సమానమే! జ్ఞానముచే ప్రశాంతి పొందిన మనుజునికి గృహమే నిర్జనారణ్యమై ఉండగలదు. ఇక అజ్ఞానముచే అశాంతి కలిగియున్నవాని సంగతో?... అతనికి జనశూన్యమైన మహారణ్యం కూడా అనేక రకాలైన జనులు సమావేశమై ఉన్న పట్టణం వలె ప్రాప్తిస్తోంది. ప్రశాంత బుద్ధి సమన్వితుడగు జ్ఞానికి కలలో కూడా జనసంసర్గము ఉండటం లేదు. అతని హృదయం నిర్మలమై, విశాలమై, అత్యంత రమణీయమై విరాజిల్లుతోంది. అందుచేత జ్ఞానాగ్ని చేత ఈ 'దృశ్యము' అనబడే ఎండుటాకుల ప్రోగును దహింపజేయండి. జ్ఞానాగ్నిచే శ్రమించిన దృశ్యముగల జ్ఞానికి ఈ జగత్తు, ఇందలి పదార్థముల సంచలనము శూన్యమయమై గోచరిస్తాయి. సమస్త విశేషములు శమించినప్పటి మహారణ్యంలాగా ఇదంతా అతనికి గోచరించగలదు.

**అజ్ఞాని హృదయం -** అజ్ఞాని తన హృదయంలో అనేక సంకల్పపరంపరలు కలిగి ఉన్నవాడై తన హృదయం నందే 'జగత్తు' అనబడునది ధరిస్తున్నాడని గ్రహించబడు గాక! అజ్ఞానికి తన హృదయంలోనే ఈ సప్త సముద్రాలతో కూడిన పృథివి విద్యమానమగుచున్నదయ్యా! అతనికి ఇదంతా కూడా నానావిధ సుఖదుఃఖాది ద్వంద్వ సంకటాలతో వ్యాప్తమై అనేక కార్యారంభాలతో ఉన్నదై.... తన యొక్క హృదయం నందే ఏర్పడి ఉన్నదగుచున్నదని విజ్ఞులు ఎఱిగియే ఉన్నారు.

అద్దంలో అంతా ప్రతిబింబిస్తున్నట్లు మలిన హృదయంలో – "ధనం లభించితేనే శాంతి. ఈ ఈ వస్తువులు, ఈ ఈ స్నేహములు, ఈ ఈ విధంగా ఉంటేనే సంతోషంగా ఉండటం సాధ్యం. ఏదో పొందితేగాని ఇప్పటి ఈ అసంతృప్తి పోవటానికి అవకాశం లేదు"... ఇటువంటి వీచికలు వీస్తుండగా మోహ–శోక–భయాది ధూళికణ సమూహాలు తిష్ట వేసుకొని ఉంటున్నాయి. అటువంటి హృదయమునందు మాత్రమే దేశ–దేశాంతరాదులు, జీవ–జీవేతరులు, నేను–నీవు మొదలైనవి ప్రతిబింబస్తున్నాయి సుమా!

❖❖❖

# 5. అహంత్వమే సంసారం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! తైలము తరిగిపోతూ ఉంటే దీపం కూడా క్షయిస్తూ ఉంటుంది చూచావా? అట్లాగే ఈ అహం – మమ రూపంలో ఉండే జగద్భావన తొలగుతూ ఉండగా సంసారము క్షీణిస్తూ ఉంటుంది. సంసారము తొలగుచూ ఉండగా, ఆత్మజ్ఞాన రూపమగు చిత్కళ

ప్రవృద్ధమౌతూ ఉంటుంది. సంసారము తొలగాలనుకుంటే ఆత్మజ్ఞానరూపమగు చైతన్యాశ్రయం కాక మరింకే ఉపాయమూ లేదు. దృశ్యమును వదలి "దృక్"ను ఆశ్రయించి ఉండటమే మోక్షం. అంతేగాని, మోక్షమనగా ఇక్కడి నుండి ఎక్కడికో వెళ్ళి మరింకేదో అవటం కాదని సర్వజనులకు గుర్తుచేస్తున్నాను.

**న త్యాగః కర్మ సంత్యాగో, బోధః త్యాగ స్మృతః**
**అజగత్ ప్రతిభైకాత్మా యే అనహన్తాదిరవ్యయః ॥**

కర్మత్యాగం 'త్యాగం' కాదు. సర్వదృశ్యగరూపమగు ఆత్మస్థితిని 'బోధ' అంటారు. అట్టి బోధయే త్యాగము అని చెప్పబడుతోంది. ఓ సర్వ సహోదరులారా! మీరంతా జగత్ప్రతిభ అంటూ లేనిది... సర్వదా ఏకమే అయినది, (ఏనాడూ అనేకం కానిది)... నాశనరహితమైనది, అహంత్వం చేత పరిమితం కానిది అయినట్టి మీ స్వస్వరూపమగు ఆత్మను ఆశ్రయించి ఉండండి.

అట్టి ఆత్మను ఆశ్రయించి ఉండటమే సర్వత్యాగరూపమగు మోక్షము.

"ఈ శరీరమే నేను. ఈ బంధువులు గృహాదులు నావి" – ఈ రూపంగా దృశ్య తాదాత్మ్యం ఏర్పడి ఉంటోంది. అట్టి దృశ్య తదాత్మ్య భావన ఎవని పట్ల శమిస్తుందో అతడే త్యాగి. అట్లు శమించ నంతకాలం జ్ఞానం గాని, త్యాగం గాని ఉండుటకు అవకాశమే లేదు. దేహభావం – మమకారం అను రూపంలో ప్రదర్శితమవుతున్న ఆవేశం శమిస్తేనే... అప్పుడు బోధరూపమై, శివరూపమై, సర్వదా శాంతరూపమైనట్టి ఆత్మ శేషిస్తుంది. ఆత్మకు అన్యమైనది. ఎక్కడా ఏమీ లేదని సర్వజనులు గమనించెదరు గాక! తత్త్వబోధ (సర్వం ఆత్మస్వరూపమే) అనునది సమాశ్రయిస్తేనే దేహాభిమాన రూపమైన 'అహం' క్షయించగలదు.

అహం క్షయిస్తే మమత్వరూపమైన (నాది–నాది అను రూపముతో కూడిన) ఈ జగత్తంతా కూడా క్షయించిపోతుంది. యథార్థానికి ఏదీ క్షయించదు. మరి? "సర్వత్రా ఆత్మయే ఆక్రమించుకొని ఉన్నది"... అనే సమరసభావనచే జగత్తు స్థానంలో స్వస్వరూపం ప్రదర్శితమౌతుంది. ఏ జీవుడైతే వర్తమానంలో (బద్ధుడై ఉన్నప్పుడు, "నేను బంధమునందు ఉన్నాను" అనుకొనుచున్నప్పుడు) అహంభావంతో కూడుకొని ఉన్నాడో... అట్టి అహంభావన 'అనహం' (నేను అహం – మమ భావనలకన్నా ఉత్కృష్టుడను)... అను భావనా మాత్రంచేత నిర్విఘ్నంగా శాంతిని పొందగలడు. 'అనహం' (ఇవి ఏమీ నేను కాదు) అనబడు ఇంతమాత్రపు సాధనచే ముక్తి సిద్ధించుచుండగా ఇక అన్య సాధనాల గురించి వాద–వివాదాలు ఎందుకు?

**శ్రీరాముడు :** "అనహం" భావన గురించి మరికొంత వివరించమని నా ప్రార్థన. ప్రభూ! "నేను దేహాదులు కాను"... అనేది కూడా ఒక భావనయే కదా! అప్పుడు కూడా అట్టివాడు భావనలయందే ఉన్నట్లే గాని భావాతీతుడు కాలేదు కదా! ఆత్మానుభవం భావాతీతమైనది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "నేను దేహాదులు కాను. శుద్ధ చిన్మాత్రుడను" అను అనహం బుద్ధి ద్వైతం వలె ప్రారంభంలో అనిపించవచ్చు గాక! కాని ధూళి చిల్లగింజను ఆశ్రయించగా

జలం పరిశుద్ధమైపోవునట్లు... అనహంబుద్ధి చైతన్యమును నిర్మలమొనర్చి చైతన్యమునందు విలీనమై పోగలదు. కాబట్టి 'అనహం' చైతన్యం కంటే భిన్నం కాదు. అయినా, నాదొక ప్రశ్న! చిత్స్వరూపం వాస్తవానికి ఆకాశం వలె స్వచ్ఛమై ఉండగా, నిర్లేపమై ఉండగా... అందు జగద్భ్రాంతికి తావెక్కడిది?

**న భ్రమో భ్రమణంనైవ, న భ్రాంతిర్ భ్రామకోస్తివా,**
**అనాలోకనమే వేదమ్, ఆలోకాన్నేదమస్తి తే ॥**

వాస్తవానికి భ్రమ లేదు. భ్రమింపజేసేదీ లేదు. భ్రాంతి లేదు. భ్రాంతికి కారణమూ లేదు. మరి? అవన్నీ అజ్ఞానముచేత మాత్రమే సిద్ధిస్తున్నాయి. జ్ఞానముచే నివృత్తిస్తున్నాయి. లేక, 'లేనివి'గా అగుచున్నాయి. అంతే!

ఓ రామచంద్రా! ఈ కనబడేదంతా కూడా "చిన్మాత్రమే, అసద్రూపమును బోలి ఈ రీతిగా వ్యాపించి ఉన్నది"... అని ఎఱుగుము. ఈ సమస్తము నిర్వాణ రూపమగు "ఆత్మ మాత్రము"గా గ్రహించినవాడవై మౌనము వహించి ఉండుము.

ఏ క్షణమందైతే ఈ జీవునకు శరీరాదుల పట్ల 'అనహంబుద్ధి' ఏర్పడుతుందో... అప్పుడు ఆ అనహందేహ భావనాపటిమచే సర్వదుఃఖాలు వాటంతటవే తొలగుతాయి. అందుచేత నిరంతరం 'అనహం' భావన యొక్క అభ్యాసం చేత 'అహం' అనుదానిని 'ఆకాశపుష్పం' వలె మిథ్యగా చేసి వేయాలి. నీవు ధనుస్సు నుండి విడివడిన బాణంవలె సదా అంతర్ముఖుడవై ఉండు. శీఘ్రంగా, దృఢంగా 'బ్రహ్మపథము'ను అవలంబించి శాశ్వత-తత్త్వమును సంతరించుకొని వెలయుము. సర్వ భావముల చేతను అప్రాప్యమై ఉన్న (భావాతీతమై ఉన్న) ఆత్మపదాన్ని పొంది ఈ సంసార సాగరాన్ని దాటినవాడవు కమ్ము. స్వాభావికమై ఉంటున్న ఈ అహంకార మాత్రమును జయించటానికి ఎవనికి వీర్యత్వము లేదో... అట్టివానికి ఇక బ్రహ్మపద ప్రాప్తి యొక్క మాట ఎక్కడిది చెప్పు?

**షడ్వర్గో నిర్జితఃపూర్వం యేనోత్తమవిదా స్వతః**
**భాజనం స మహార్థానాం నేఽతరో నరగర్ధభః ॥**

ఓ సర్వ జీవులారా! మీమీ శత్రువులు ఎక్కడో బాహ్యాన కాదు ఉన్నది. "కామ-క్రోధ-లోభ-మద-మాత్సర్యం"...అనే ఆరు శత్రువులు అంతరంగంలోనే తిష్ట వేసుకుని ఉన్నారు. ఎవడైతే తన అంతఃకరణంలో ప్రవేశిస్తున్న ఈ ఆరుగురు శత్రువులను గుర్తించి, వారిపై యుద్ధం ప్రకటించి, వాటిని జయిస్తాడో... అట్టివాడు మాత్రమే 'ముక్తి' అనబడే మహత్ పదార్థానికి అర్హత సంపాదించు కుంటున్నాడు. ఇక తదితరుల జీవితాలు గాడిదల జీవితాల వంటివే అగుచున్నాయి. ఎవని అంతః కరణంలో మనోవృత్తి జయింపబడుచున్నదో... అతడే వివేకానికి అర్హుడగుచున్నాడు. ఓ రామా! సముద్రంలో కొన్ని శిలలను పడవేశామనుకో. ఆ రాళ్ళు సముద్రంతో సంబంధం లేకుండా ఉంటు నట్లు నీవు కూడా నీకు సంప్రాప్తించే ప్రవాహపతిత క్రియలను "ఈ దేహాదులు నేను కాదు. నేను సర్వదా అసంగమగు ఆత్మనే"... అను అనహం భావన కలిగి ఉండియే నిర్వర్తించు. సర్వదా సర్వం పట్ల నిర్లిప్తం వహించియే అన్నిటినీ నిర్వహించు. మనం ఇన్ని రోజులుగా చెప్పుకొనే సంవాదం యొక్క ప్రభావం చేత "నీవు సర్వదా - ఆత్మ స్వభావుడవే గాని, దేహ స్వభావుడవు కాదు" అని

క్రొత్తగా చెప్పవలసిన అవసరం లేదు. కదా! ఇక ఎవరైనా సరే, అజ్ఞునివలె ఈ దృశ్యం పట్ల మోహం చెందవలసిన పనేమున్నది?

బంగారం గురించి తెలుసుకున్న తరువాత ఇక ఆభరణం గురించి కొత్తగా తెలుసుకోవలసిన దేముంది? అట్లాగే "సర్వకారణ కారణం" అనతగిన ఆత్మ గురించి ఎఱిగిన తరువాత ఇక దానికి అన్యమైన ఏ పదార్థం గురించి కారణతః ఎఱుగవలసి ఉన్నది చెప్పు? నామ రూపాత్మక సమస్తం కేవలం భ్రాంతిమాత్రమే అయి ఉంది. అట్టి భ్రాంతి శమించాలంటే ఆత్మజ్ఞాన మొక్కటే ఔషధం.

ఓ ముముక్షు మిత్ర జనులారా! వాయువు నందు చలనంలాగా అంతఃకరణంలో 'వృత్తులు' అనే వీచికలు వీస్తున్నాయి. చిదాకారవృత్తి (నేను చిదానందమగు ఆత్మను అను భావన) చే ఆ తదితర వృత్తులన్నిటినీ త్రోసిరాజనవలె! అనగా "ఈ తదితర వృత్తులు నా స్వరూపం కాదు" అను సునిశ్చయమును ప్రవృద్ధపరచుకోవాలి. తద్ద్వారా ఆ తదితర వృత్తులన్నీ క్రమంగా నిరాధార మవుతాయి. అనహం భావనచే ఎవరైతే క్రోధ-లోభ-లజ్జ-మద-మోహాలను జయించటానికి ప్రయత్నించరో... అట్టి వారికి ఎంత అధ్యాత్మ జ్ఞానం బోధిస్తే మాత్రం ఏం ప్రయోజనం?... ఈ అధ్యాత్మ శాస్త్రం ప్రతిపాదించేది అతనికి వక్రగతిగానే అగబడుచున్నది. వాయువు కంటే చలనము వేఱుకానట్లు... నీ స్వరూపము కంటే పరమాత్మ వేఱు కాదు సుమా!

ఒకాయన పూలమాల ధరించి అనాలోచితంగా రహదారిలో నడుస్తూ వెళ్ళుచున్నాడు. ఇంతలో ఒక పోకిరి పిల్లవాడు "ఏమయ్యోయ్! నీ మెడలో ఆడత్రాచు పామును ధరించావేమిటి?" అని కేకవేశాడు. వెంటనే ఆ బాటసారి ఒళ్ళు ఝల్లుమన్నది. "అరె! ఈ త్రాచుపాము నా మెడలోకి ఎలా వచ్చి జేరిందిరా బాబు? నేను పూలమాలనుకొని చూచుకోకుండా ధరించానా ఎమిటి? ఇది పొరపాటున కరిచిందా నా పని ఆఖరు? ఏం చెయ్యాలి?" ...అని నిలబడి బిగ్గరగా విలపించ సాగాడు. ఇంతలో మరొక బాటసారి ఆ మార్గంలో వస్తూ "అయ్యా! ఎందుకు విలపిస్తున్నారు? మీ మెడలో ఆ పూలహారం ఎంత ముచ్చటగా ఉన్నది?"...అన్నాడు. వెంటనే మొదటి ఆయన "మెడలో పాము! మెడలో పాము! తీయండి! తీయండి!" ...అని కలవరించసాగాడు. అప్పుడా రెండవ బాటసారి దగ్గరగా వచ్చి పరిశీలనగా చూచి "అదేమిటండీ బాబు! ఇంత మంచి పూలహారం ధరించి 'పాము, పాము' అని అరుస్తారేం?"...అని అనునయంగా పలికాడు. అప్పుడా మొదటి బాటసారి మెడలోని హారంతీసి చూచుకొని "ఓస్! ఆ పోకిరీవాడెవడో పాము అనేసరికి నేనెంత భయపడ్డాను!" అని మరల హారమును ధరించి శాంతచిత్తుడై నడక కొనసాగించాడు.

ఈ సంఘటనలో లాగానే జీవుడు కూడా కూటస్థమగు అద్వయచిన్మాత్రం యొక్క జ్ఞానముచే పరమాత్మయందు విలీనమై తానే తద్రూపమై శోభించుచున్నాడు. యథార్థానికి పరమాత్మ ఉదయిం చటం లేదు. అస్తమించటం లేదు. అయ్యది సత్యసిద్ధమైయున్నది. కల్పిత వస్తువులైన "నేను - నీవు" మొదలైన వాటిచే అది బాధింపబడటమే లేదు. అంతేకాదు, పరమాత్మ కంటే అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేనేలేదు. ఇక ఈ భావాభావముల గురించి వేరుగా చెప్పవలసినదేమున్నది?

**"పరం పరే, పూర్ణం పూర్ణే, శాంతం శాంతే శివం శివే"**
**ఇత్యేవమాత్రం వితతం నాఽహం, న చ జగత్, న ధీః ॥**

ఓ రామచంద్రా! ఇక్కడ జీవుడు లేడు. మరొకడూ లేడు. మరి ఇదంతా ఏమిటంటావా? నీకు జీవుడుగా ఏదైతే కనబడుతోందో... ఆ కనబడేదంతా కూడా... "పరమై, పూర్ణమై, శాంతమై, శివమైనట్టి పరమాత్మ... పరమై-పూర్ణమై-శాంతమై-శివవమైనట్టి పరమాత్మయందు అట్లు స్థితి కలిగియున్నది"... అని గ్రహించు.

అనగా... నీవు ఏ జీవుని చూస్తున్నప్పుడైనా సరే, "ఈతడు పరమై-పూర్ణమై-శాంతమై-శివ మైనట్టి పరమాత్మ స్వరూపుడే కదా! మరి నేనూ? నేనూ అదే స్వరూపుడను"...అనే అవగాహనను ప్రవృద్ధపరచుకోవటమే సరి అయిన మార్గం. అదియే తత్త్వమార్గం. ఇక అహంకారం గాని, బుద్ధిగాని, జగత్తు గాని ఎక్కడున్నాయి... ఉన్నదంతా ఆత్మయే అయినప్పుడు?

**అనిర్వాణే వినిర్వాణం, శాంతం శాంతే, శివే శివమ్ ।**
**నిర్వాణమప్య నిర్వాణం స నభోర్ధం న వాపి తత్ ॥**

మరల చెప్పుచున్నాను. నాశనరహితమై, శాంతమై, శివమైనట్టి బ్రహ్మం నందు... నాశ రహితమై - శాంతమై - శివమైనట్టి (జీవుడుగా అనుకుంటున్న) బ్రహ్మమే స్థితినొంది ఉన్నది. త్రాడులో కల్పించబడిన పాము - త్రాడుగా తెలుసుకొన్న తర్వాత త్రాడునందే శమనం పొందుతుంది చూచావా? అట్లాగే, నామరూపాత్మకమైన కల్పిత జగత్తు బ్రహ్మమునందే శమించగలదు. వాస్తవానికి బ్రహ్మం ఆకాశాది ఆయా పదార్థములుగా ఎన్నడూ అవటమే లేదు. అవబోదు. బ్రహ్మం బ్రహ్మం గానే ఉంటోంది. ఇక ఒకప్పుడు కల్పన ప్రదర్శితమౌతోంది. ఆత్మజ్ఞానముచే అది మరొకప్పుడు శమిస్తోంది. బ్రహ్మం దృష్ట్యా చూస్తే ఏదీ క్రొత్తగా ఉదయించడం లేదు, శమించడం లేదు.

❖❖❖

# 6. తితిక్ష

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ మనుజుడు ఒక్కొక్క సందర్భంలో అనేక గాయములను, వ్యాధులను, మానసిక బాధలను ఓర్చుకుంటున్నాడు. తట్టుకుంటున్నాడు. మరి "ఈ శరీరాదులు నేను కాదు"... అను అనహంభావనను ఓర్పుగా ఎందుకు ఆశ్రయించి ధరించలేడు చెప్పు? ప్రతి ఒక్కరికి అట్టి అనహంభావన సాధ్యమే. వాస్తవానికి ఈ దేహాదులందు అహంభావన ఏర్పర్చుకో వటమే శ్రమతో కూడిన పని. ఎందుకంటే 'అనహం' అనునదే ప్రతి ఒక్క జీవుని స్వభావమే అయి ఉన్నది కదా! అహంభావన ఆపాదిత స్వభావమైయున్నది. జగత్తునందలి సమస్త పదార్థ సమూహాలకు దేహాదులందలి అహంభావనయే అక్షయమైన, అంకురమై ఉన్నదని జనులంతా గమనించెదరు గాక! ఆత్మ బోధచే అట్టి జగత్తు అనబడేది నిర్మూలనమగుచున్నది.

**వాయు ఉపమానం -** పరమాత్మ "వాయువు" అని అనుకుంటే అందు వాయు తరంగం వంటిది ఈ అహంకారం. వాయువు సంచలనం శమిస్తే (వాయు తరంగాలు ఉండవు కదా!

అట్లాగే అహంకారం శమిస్తే) అప్పుడిక జగద్దర్శనమంతా తనకు తానుగానే శమిస్తుంది. అప్పుడు 'అనిర్దేశం, చిదాభాసరహితం, అనంతం, అజం, అవ్యయం" అయినట్టి స్వస్వరూప చిదాకాశం మాత్రమే శేషించగలదు.

**దర్పణ ఉపమానం -** పరమాత్మ అనే స్వచ్ఛమైన అద్దముపై 'అహంకారము' అనే జలతుంపర మాలిన్య సహితంగా గోచరిస్తుంది. ఆ 'అహంకారము' అనే జలబిందు సమన్విత ధూళి కణములను తొలగించామా, అప్పుడు ఆత్మ యొక్క నిర్మలత్వం గోచరించగలదు. అహంకారమే ఎదుట ఉండే పదార్థములను చైతన్యం నందు వికారసమన్వితంగా ప్రతిబింబింపజేస్తోంది. అహంకారం శమిస్తే, చైతన్యం అభాసరహితమౌతుంది. అనంతమై, అజమై, అవ్యయమైన పరమాత్మ రూపాన్ని సంతరించు కుంటుంది.

**మేఘ ఉపమానం -** ఆకాశము మేఘావృతమైనప్పుడు సూర్యకాంతి ప్రసరించదు. ఎప్పుడైతే మేఘములు తొలగుతాయో... ఇక క్రొత్తగా ఎట్టి ప్రయత్నం లేకుండానే ఆకాశం సూర్య తేజస్సుతో ప్రకాశమానమౌతుంది. అట్లాగే అహంకారమేఘం తొలగగానే ఆత్మసూర్యప్రకాశం అంతటా అన్నిటా విరాజమానమై ప్రస్ఫుటం కాగలదు.

**రాగితో కూడిన బంగారు ఉపమానం -** చిరకాలంగా రాగితో కలిసి ఉన్న బంగారం తన స్వచ్ఛతను కోల్పోయి అల్పకాంతితో కనిపించవచ్చు గాక! ఆ బంగారాన్ని పుటం వేసి రాగిని తొలగిస్తే... బంగారం మరల ధగధగ ఛాయతో వెలుగొందుచున్నది కదా! చైతన్యం చిరకాలంగా అహంకారంతో కూడుకొని ఉండటం చేత 'జీవుడు' అనబడు రూపంలో కనబడుతోంది. ఎప్పుడైతే శ్రవణ, మననాది ఉపాయాలచే బ్రహ్మమును ఆవరించిన అహంకార దోషం తొలగుతుందో... ఆ మరుక్షణం బ్రహ్మము బ్రహ్మ రూపత్వముచే విరాజమానం కాగలదు.

**సముద్రం చేరిన ఉప్పు... ఉపమానం -** సముద్ర జలంలోంచి ఉప్పు బయల్వెడలుతోంది. అయితే, సముద్రంలో వేయబడిన ఉప్పు గడ్డ తన నామరూపాలు కోల్పోయి సముద్రజలంలో విలీనమైపోతుంది, చూచావా? అట్లాగే... అహంకారం బ్రహ్మమునందు ప్రవేశించగానే తన యొక్క జగదత్వమును కోల్పోయి బ్రహ్మముగానే పరిణమిస్తోంది.

వాస్తవానికి బ్రహ్మము సద్రూపమై, శాంతమై, నిత్య ప్రకాశమానమై అనిర్దేశ్యమై, అవాఙ్మానస గోచరమైయున్నది. అయితే (బ్రహ్మం, గుణాదుల కంటే అతీతమైనదైనప్పటికీ) అల్ప విషయాలైన అహంత్వం మొదలైనవాటికంటే బ్రహ్మం యొక్క ఔన్నత్యాన్ని నిరూపించటానికి అద్దానికి బృహదత్వం మొదలైన లక్షణాలు శాస్త్రములచే కల్పించబడ్డాయి. వాస్తవానికి అహంత్వ రూపంగా స్థితి కలిగి ఉన్నది కూడా బ్రహ్మమే! అహంకారాన్ని కూడా బ్రహ్మంగా దర్శించటమే అహంకారాన్ని అధిగమించటం (లేదా) జయించటం అనునదే శాస్త్రముల ముఖ్యోద్దేశము.

జగత్తు జగద్భావనచేతనే సిద్ధిస్తోంది. భావనచే సిద్ధించేది అభావనచే తొలగిపోక ఏం చేస్తుంది? అభావనచే (భావనామూలమగు అజ్ఞాన నాశనం) జగత్తుకు బీజమైన అహం పదార్థం స్వయంగా శమిస్తోంది. అప్పుడిక 'అహంత్వం-జగత్తు-బంధం'... ఇటువంటి కల్పనలకు తావేది?

**సద్బ్రహ్మ శివమాత్మేతి పరే నామ కలంకితా**
**ఉదేత్య హన్తా కుంభత్వాదివ మృద్ధాతు విస్మృతిః ॥**

ఆకారసమన్వితమైన కుండను చూస్తుండగా ఆకారాదులు వర్తించనట్టి మృత్తిక (మట్టి)ని ఏమరుస్తూ ఉంటారే! అట్లాగే ఎదురుగా కనబడే ఈ పాంచభౌతిక దేహం, గుణములు, మనస్సు-బుద్ధి-అహంకారము మొదలైన పరిమిత-కల్పనారూప విషయములను చూస్తూ స్వభావతః అపరిమితము, శుద్ధము, పరిపూర్ణము అగు (సత్తు-బ్రహ్మము-శివము అనబడే) ఆత్మను ఏమరచటం జరుగుచున్నప్పుడే 'జీవుడు' అనబడేది దర్శనమగుచున్నది. అనగా,.... ఆత్మ అనబడే "అపరోక్ష - చిదేక రసము" నందు అజ్ఞానముచేత మాత్రమే "ఆత్మకు అస్వభావమైనది, సంకోచరూపమైనది, నామాదులచే కళంకితమైనది, నేను-నీవు-మొదలైన పరిమిత దృష్టులను సంతరించుకున్నది" అయినట్టి అహంత్వము భ్రమచే స్ఫురిస్తోంది.

'అహ'మనే బీజం నుండి "దృశ్యసత్త" అనే ప్రతిబింబితమంతా గోచరిస్తోంది. ఈ 'దృశ్య సత్త'లో అనంత సంఖ్యలో "జగత్తులు" అనే ఫలాలు ఉత్పన్నమౌతున్నాయి. నశిస్తున్నాయి కూడా!

'అహంకారం' అనే చిన్న మిరియపు గింజలో ఈ పర్వత - సముద్ర - నది - భూమి సహిత బ్రహ్మాండం, రూపాలను సందర్శించే ఇంద్రియ స్వభావం, మనస్సు, ఆ మనస్సుకు గోచరించే కామ సంకల్పాది ఇంద్రియ వృత్తులు ఇవన్నీ చమత్కారంగా ఉదయిస్తున్నాయి. నీకు బాహ్యం వలె కనిపించే ఈ అంతరిక్షం, భూమి, వాయువు, ఆకాశం, దిక్కులు - ఇవన్నీ "అహంకారం" అను వికసించిన పుష్పం యొక్క సుగంధాలు మాత్రమే! తెల్లవారగానే వస్తువుల రూపాలు కనిపించటం ప్రారంభించినట్లు, ఆత్మయందు అహంకారం ఉదయించగానే జగత్తు ప్రకటితమౌతోంది. అనగా... అహంకారం భావనా మాత్రంచేత క్షణకాలంలో అసత్తగు ఈ జగత్తును నిర్మించుచున్నది. జలంలో చిన్న రాయి పడగానే ఆవృత్తాలు బయల్వెడలే విధంగా, నిశ్చల బ్రహ్మంలో 'అహంకారం' అనే గులకరాయి పడగానే, "ప్రవృత్తి" అనే ఆవృత్తం బయలుదేరి - అదికాస్తా ముల్లోకాల అనుభవానికి కారణభూతమగుచున్నది. కళ్ళుమూసుకుంటే ఏదీ కనిపించదు. కళ్ళు తెరిచిన మరుక్షణం అనేక వస్తువులు కనిపిస్తాయి. ఆ కళ్ళకు అసత్యాలైన ఆకారాలు సత్యం వలే అగుపిస్తాయి. అట్లాగే రెప్ప పాటు కాలంలో 'అహంత్వం' ఆత్మయందు ఉద్భవించి అదే అనేక జగత్తులను అనుభవిస్తోంది. ఎంత ఆశ్చర్యం! అట్టి అహంకారం రహితమవగానే 'జగదనుభవం' అనే బంధం ముడి వీడుతుంది.

**శ్రీరాముడు :** అహంకారమును మేము రహితం చేసుకొని ఆత్మస్వరూపులమై ప్రకాశించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అహంకారము ఆత్మస్వరూపమే! ఆత్మ యొక్క విన్యాసమే! నిరంతరమైన పరమాత్మ జ్ఞానముచే అహంకారము నిశ్శేషముగా నశించగలదు. అప్పుడు సంసారము అనే మృగతృష్ణ పూర్ణంగా శమించిపోగలదు. ఓ రామచంద్రా! ఈ జగత్తు జీవునికి ఎట్లా లభ్యమౌతోంది?

**శ్రీరాముడు :** "జగత్తు" అనగా అనుభవముయొక్క రూపమే కదా! అనుభవము "భావనచేయటం" అనే రజోగుణం నుండి బయల్వెడలుతోంది. కనుక జగత్తు భావననుండే పరిలక్ష్యం అగుచున్నది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** భేష్! సరిగ్గా చెప్పావు. కనుక... స్వతఃసిద్ధమగు ఆత్మ 'చిన్మాత్రము యొక్క భావన' అను చిన్న అభ్యాసం చేత సుసాధ్యమగుచున్నది. అట్టి ఆత్మానుభవి ఇక ఇక్కడ భ్రమనుగాని, భేదమునుగాని పొందనే పొందడు.

**స్వయత్నమాత్ర సంసాద్యాదసహాయాది సాధనాత్**
**"అనహమ్ వేదనాన్ న అన్యత్ శ్రేయః" పస్యామి తే, అనఘ!**

"ఈ దేహ-జగదాదులు నేను కాదు" అను భావనను ఈ జీవుడు ఎందుకు ఆశ్రయించ రాదు? అట్టి 'అనహం' అను భావనకు శ్రమ ఏమున్నది? అందుకు బాహ్యమైన ఎట్టి సాధనలు అవసరం లేదు కదా! అంతటి సులభ సాధ్యమైన 'అనహం' అను దానినిమించి శ్రేయమైనదేదీ లేనే లేదని నా అభిప్రాయం. కనుక - రామచంద్రా! నీవు 'అనహం' భావనను ఆశ్రయించు.

**శ్రీరాముడు :** మహర్షీ! అట్టి "అనహం" భావనను అతి త్వరగా సుస్థిరీకరించుకోవటానికి వీలుగా ఏదైనా సులువైన క్రమమార్గాన్ని ఈ సందర్భంలో ఉపదేశించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

1. మొట్టమొదట "నేను ఒక వ్యష్టిని"... అనే అభిప్రాయమును తీసుకో. "ఈ వ్యష్టి అహంభావం సరి అయినది కాదు. అనగా వాస్తవమైనది కాదు. పైగా... అసమంజసం కూడా!"... అనే నిర్ణయమును ధ్రుపరచుకో.

2. "ఈ నలువైపులా విస్తరించియున్న జీవ - పర్వత-అంతరిక్ష - పృథివి-సముద్ర-వాయువులన్నీ నా స్వరూపము వంటివే"... అనే సమష్టి అహంకారమును ఆశ్రయించు.

3. క్రమంగా "ఈ పర్వతాదులు ఎందులో సమాగతమై ఉంటున్నాయో... అట్టి ఆకాశ స్వరూపుడను"... అను భావనను సమీపించి అభ్యసించు.

4. అట్లు ఆకాశస్వరూపమును అనుగతం చేసుకున్న తరువాత క్రమంగా నీ స్వరూపముతో ఈ విశ్వమంతటినీ పూరించివేయి. అట్లా సర్వమును పరిపూరితం చేసి దశదిశలా వ్యాపించిన విభవము కలవాడవగుము.

5. ఆ తరువాత "ఈ చరాచర జగత్తంతా నిష్ప్రపంచరూపమగు బ్రహ్మమే కదా"... అను అవగాహనను పెంపొందించుకో. ఆ విధంగా ఈ ప్రపంచమంతటినీ నిషేధము గావించివేయి.

ఆ తరువాత ఇక చెప్పవలసినదేమున్నది? ఆ నిష్ప్రపంచరూపమగు ఆత్మయే నీవు కదా! అదే ప్రతి జీవుడు కదా! కనుక స్వస్థుడవై, శాంతుడవై, దుఃఖరహితుడవై ఇంద్రియ దోషముచే స్పృశించబడనివాడవై కళాకళలు లేనివాడవై ఉండు. నిర్మలాత్ముడవై వెలయుము.

ఎందుకంటే... అధ్యారోపము, అపవాదము - అను రెండు సిద్ధాంతాలూ చివరికి నిష్ప్రపంచ రూపమగు శుద్ధాత్మనే ఉద్దేశిస్తున్నాయని మా అభిప్రాయం. అనగా....నిష్ప్రపంచమైనట్టి శుద్ధాత్మయే సర్వ వేదాంత సిద్ధాంత సారమైయున్నది.

❖❖❖

# II. శ్రీ భుశుండ - విద్యాధర సంవాదము

## 1. బరువైన 18 వస్తువులు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ నిర్వాణ ప్రకరణ ఉత్తరార్ధ పరిచయ వాక్యాలలో ఈ జీవుడు "వ్యష్టిఅహంకారభావన" నుండి "నేను నిష్ప్రపంచకరూపమగు బ్రహ్మాన్ని" - అనే సమున్నత స్థితిని సముపార్జించటమే వేదాంత సిద్ధాంతసారం అని అనుకున్నాం కదా!... అది సాధించడమెలా?

ఈ జీవుని స్వభావం అనిత్యమగు దేహము-ఇంద్రియ విషయములలో ప్రవేశించి ఉన్నది. అదియే పరిమితత్వమునకు, జడాజడములగు ఉపాధుల రాకపోకలకు కారణమగుచున్నది. కనుక, "అపరిమితమైన ఆత్మకు దుఃఖం ఎందుకు తారసపడుతోంది?" అను ప్రశ్నకు సమాధానం "అపరిమిత స్వభావుడగు ఈ జీవుడు పరిమిత వస్తువుల పట్ల నమ్మకం-ప్రీతి-అభ్యాసం కలిగించుకొని ఉండటమే"... అని చెప్పబడుతోంది.

కనుక ఓ జనులారా! "ఈ మనస్సు ఇంద్రియముల వైపుగా పరిగెడుచున్నది" అనే విషయం గమనించండి. అట్టి మనస్సహితమైన సర్వేంద్రియ విషయ స్వభావాన్ని మొదట జయించాలి సుమా! ఆ తరువాత "వివేకము" మొదలైన సాధనములను ఆశ్రయిస్తే సర్వము అతిశీఘ్రంగా సిద్ధించగలదు.

**స్వభావమాత్రం యేన అన్తర్ నజితం దగ్ధబుద్ధినా**
**తస్య ఉత్తమపదప్రాప్తిః సికతా తైలదుర్లభా ॥**

ఎక్కడైనా ఇసుకను ఎంతగా పిండినప్పటికీ తైలం లభిస్తుందా? ఎవడైతే ఇంద్రియ విషయ లోలత్వ స్వభావంతో కూడిన అంతఃకరణాన్ని ముందుగా జయించడో... అట్టివానికి ఉత్తమ పద ప్రాప్తి ఎట్లా అభిస్తుంది?... అందుకే శాస్త్రాలు సాధనాలను మొట్టమొదటగా ప్రతిపాదిస్తున్నాయి.

తెల్లటి గుడ్డపై కొంచెం రంగైనప్పటికీ చక్కగా అంటుతుంది చూచావా? అట్లాగే శుద్ధమైన చిత్తంలో కొంచెం ఉపదేశం కూడా చక్కగా ప్రవేశించి బ్రహ్మానుభవం అనుభూత మొనర్చగలదు. సాధనచతుష్టయం లేని చిత్తమునకు ఎంత ఉపదేశించినా కూడా కంఠశోషయే మిగులుతుంది.

ఈ విషయం గురించి ఒకప్పుడు ఒక మహానుభావుడు నాకు చెప్పిన కొన్ని విశేషాలు గుర్తుకు వస్తున్నాయి అది వివరిస్తాను. విను.

పూర్వం ఒకప్పుడు నేను భుశుండ వాయసము వారిని (భుశుండుడు అనే కాకి స్వరూప మహాత్ముని) సందర్శించటం జరిగిందని చెప్పి ఉన్నాను కదా! ఆయన మేరుపర్వతం యొక్క శిఖరాగ్రంపై ఒక గుహలో ఏకాంత స్థానంలో విరాజమానుడై ఉన్నారు. అప్పుడు నేను ఆయన్ను ఇట్లా ప్రశ్నించాను.

ఓ భుశుండ మహాశయా! మీకు అనేకమంది జ్ఞానులు, అజ్ఞానులు తారసపడి ఉంటారు కదా! ఇంద్రియములను జయించనట్టి మందబుద్ధి ఆత్మజ్ఞానరహితంగా దీర్ఘకాలం జీవించిన ఎవ్వరైనా ప్రాణి గురించి చెప్పండి. తద్ద్వారా మన ఈ అధ్యాత్మకథా ప్రసంగం రసవత్తరంగా ఉంటుందని నా అభిప్రాయం...

అప్పుడు భుశుండుడు చెప్పిన వృత్తాంతమేమిటో విను.

❖

**శ్రీ భుశుండుడు :** మహాత్మా! వసిష్ఠమహర్షీ! మీరు అడిగిన దానికి అనుకూలంగా ఒక సంఘటనను వివరిస్తాను, వినండి. పూర్వం ఒకానొక విద్యాధరుడు ఉండేవాడు. అతడు సదాచార సంపన్నుడు. చక్కటి విచారవంతుడు. కానీ అతడు ఇంద్రియయలోలుడు. అనగా ఇంద్రియ విషయాలలో తగినంత నిగ్రహం లేనివాడు. అయితే తపస్సు మొదలైనవి బాగా చేసి చేసి, దేహం శుష్కింప జేసుకున్నాడు. ఆత్మజ్ఞానం సముపార్జించకపోవటం చేత అతని ఇంద్రియాలే అతనికి క్రమేణా ఎంతో ఖేదాన్ని కలుగజేయసాగాయి. అతడు కూడా దీర్ఘమైన ఆయువుపొందాడు. నాలుగు కల్పాలు ఆ విధంగా ఆత్మజ్ఞాన రహితమైన కేవల తపో-యమ-నియమాలు నిర్వర్తించాడు. చేయగా చేయగా, నాలుగవ కల్పం ఆఖరులో అతని యందు వివేకం జనించింది.

**విద్యాధరుడు :** "ఏమిటిది? ఈ జీవునికి మరల జన్మ – మరల మృత్యువు – మరల వార్ధక్యము"... ఇట్లా కలుగుతూనే పోతున్నాయి కదా! ఇదంతా ఎంత సిగ్గుపడవలసిన విషయం! ఇటువంటి జన్మ – కర్మల వలన లాభమేమిటి? ఏదైతే సుస్థిరమైనదో... అట్టి వస్తువును ఆశ్రయించటం ఉచితం. అయితే అటువంటి స్థిరమైన వస్తువు ఏదైనా ఉన్నదా?"

... ఇట్లా వివేకముతో యోచించసాగాడు. ఆతడు అప్పటికే 18 వస్తువులతో కూడిన మోత బరువును (పంచప్రాణాలు, దశ ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, స్థూలదేహాలతో కూడిన ఈ ఉపాధిని) అతి దీర్ఘకాలం ధరించి ఉన్నాడు కదా! అందుచేత వాటన్నిటి మూలంగా ఎంతగానో అలసిపోయాడు. ఈ సంసారం పట్ల విసుగు, విరక్తి జనించింది. ఆయా జ్ఞానులను సంప్రదించి వారి సలహాను అనుసరించి ఆ విద్యాధరుడు నా వద్దకు వచ్చాడు. వచ్చి ఆదరపూర్వకంగా నమస్కరించాడు. అప్పుడు స్వాగతమర్యాదలతో అభ్యాగతి పూజ సమర్పించి, ఇక ఆ తరువాత, "ఏమి విద్యాధరా! ఇటు వచ్చావు?" అని ప్రశ్నించాను.

**విద్యాధరుడు :** మహాత్మా! భుశుండా! నేను అనేక కల్పాలు ఈ దేహంతో ఎన్నో యమ – నియమాలు నిర్వర్తించాను. సుదీర్ఘకాలం కాయక తపస్సు చేశాను. ఈ ఇంద్రియ విషయాలను నేను ఇప్పటికీ జయించలేకపోయాను. ఈ నా ఇంద్రియాలను చూస్తున్నారు కదా! ఇవి విషయాలలో ప్రవేశించటంలో అతి ప్రావీణ్యం చూపుచున్నాయి. ఆ విషయాల నుండి ఎన్నో ప్రియాప్రియరూప బంధాలు ఏర్పడుచున్నాయి. ఈ నా ఇంద్రియాలు విషయాల నుండి తొలగటమే లేదాయె! మీదకు దూసుకువచ్చే సునిశితమైన బాణాల కన్నా ఈ ఇంద్రియ విషయాలు మరింత ప్రమాదకరమై ఉంటున్నాయని నేను గమనించాను.

ఇవి హృదయంలో అంధకారం వలె అలముకొని ఉన్నాయి. ఇక హృదయం తమోమయమై ఉంటోంది. 'కామం'అనే మర్కటం హృదయాన్ని అనుక్షణం వ్యాకులపరుస్తోంది. నేను ఇంద్రియాలను జయించనే లేదని, అవియే నన్ను జయించి నా హృదయమును ఆక్రమించుకుని ఉన్నాయని నేను గమనిస్తున్నాను. వీటిని జయించకపోతే నేనేమాత్రం సుఖవంతుడను కాలేనని తెలుసుకున్నాను. విద్యాధర ఉపాధికి అనేక భోగాలు లభించే మాట నిజమే! ఆ భోగాలన్నీ మానసిక మహారోగాలేనని, వాటిని ఎంతగా అనుభవించినా తనివి తీరదని, ప్రతిభోగం కలిగించేది స్పర్థయే గాని శాంతి కాదని నేను గ్రహించాను. వాటిపట్ల విరక్తుడనైనాను. మహనీయుల ఉపదేశాన్ని అనుసరించి "మహత్ భాగ్యమే"... అన్నట్లుగా ఈనాటికి మీ దర్శనం చేసుకోవాలని, శరణు వేడాలని, మీ బోధ వాక్యాలు వినాలని బుద్ధి పుట్టింది.

❖❖❖

## 2. ఇంద్రియముల దురాక్రమణం

**శ్రీ భుశుండవాయస మహాయోగి :** ఓ విద్యాధరా! ముందుగా మీ అనుభవ – అవగాహనలను విశదీకరించండి.

**విద్యాధరుడు :** మహాత్మా! భుశుండమహాశయా!

**యత్ ఉదారమ్ అనాయాసమ్ క్షయ – అతిశయ వర్జితమ్**
**పదం పావనమ్ ఆద్యంతరహితం తత్ వదాశు మే ॥**

ఈ విద్యాధర ఉపాధితో అనేక కల్పములు వివిధ భోగములు రుచి చూచాను. కాని ఏం లాభం? ఇందులో దుఃఖరహితమైనది. శాశ్వతమైనది అయిన సుఖమేదీ అగుపించటమే లేదు.

ఏ స్థానమైతే ఉదారమై ఎట్టి దుఃఖాలకు కారణం లేనిదై, ప్రయాసరహితమై, సహజానంద రూపమై, క్షయం గాని – అతిశయం గాని లేనట్టినదై, పరమ పవిత్రమై, ఆది–అంతం లేనిదై ఉన్నదో... అద్దానిని గురించి విశదీకరించగల సమర్థులని చెప్పగా చెప్పగా విని, మిమ్ములను శరణు వేడుచున్నాను.

ఓ మునీంద్రా! ఇంతకాలం నేను జడాత్మకంగా (విషయాలలో) నిదురిస్తున్నానని నాకు తెలిసిపోయింది. చాలాకాలం తరువాత మనస్సు తీవ్ర వైరాగ్యంచే జాగృతమగుచున్నది.

**కామము -** మహాత్మా! ఏది ఎచ్చట ఎంతగా పొందినా కూడా... ఈ మనస్సు "ఇంకా ఏవేవో కావాలి" అను రూపంలో ఉండే కామంచే సంతప్తమగుచున్నది. ఆ కామం నుండి అజ్ఞానవృత్తులన్నీ ఒకదాని వెంట మరొకటి బయలుదేరి నింద్యముగ మహాక్షోభను కలుగజేస్తున్నాయి. ఫలితం? ఇక నేను దుశ్ఛేద్యములైన అనేక సాంసారిక క్రియాపరంపరలలో ఇరుక్కుపోతున్నాను. ఇంకేమున్నది? అనాత్మయందు ఆత్మాభిమానం ఏర్పడి, మోహం గుట్టలుగా ప్రోగగుచున్నది. ఇట్టి మోహం నుండి నన్ను సముద్ధరించండి.

**దోషభూములు -** విద్యాధరునిగా అనేక ఐశ్వర్యములు ఉండవచ్చు గాక! గుణ సంపద కూడా ఉండవచ్చు గాక! సుందరమైన ఆయా శాస్త్ర ప్రవచిత అభ్యాసాలు నిర్వహిస్తూనే ఉన్నాను కూడా, కాని ఏం లాభం? ఇప్పటికి కూడా ఈ ఇంద్రియాల ప్రబలత్వమును జయించలేకపోయానే! ఆత్మ జ్ఞాన రహితుడనై తదితర విద్యాధరులపై కామ-క్రోధాలు వదలలేకపోయాను. క్రోధ, భయ, దుః ఖ, కార్పణ్యాది ఆయా దోషాలు అసంఖ్యాకంగా నా హృదయ ప్రాంగణంలోకి వచ్చి పడుచూనే ఉన్నాయి. ఈ విద్యాధరాది దేవయోనులు కూడా ఆత్మజ్ఞానం లేనంతవరకు కమలాపై వ్రాలే దోమల వలె తుచ్ఛమైనవే కదా! జన్మ, మృత్యవులు విద్యాధరులకు కూడా తప్పేవి కావు కదా మరి!

ఈ శబ్దస్పర్శాది విషయాలన్నీ కూడా పూర్వం అనేకసార్లు అనుభవించినవే. అవియే మరల మరల అనుభవించటం జరుగుతోంది. అవి ఇచ్చేవన్నీ తుచ్ఛమైన అల్ప సుఖాలు మాత్రమే. ఈ విషయేంద్రియ స్పర్శలన్నీ వంచనోపాయాల ద్వారా మమ్ము అనేకసార్లు మోసం చేస్తున్నాయి. దాని ఫలితంగా దీర్ఘకాలంగా నేను ఖిన్నుడనై వీటి పాల పడి ఉన్నాను. మనస్సుకు విశ్రాంతియే లేదు. క్షణ భంగురాలైన అనేక విశేషాలతో కూడిన ఈ సంసారానికి అటు స్థిరత్వమూ లేదు. ఇటు అంతూ లేదు.

**ఆపాతమధురారంభా, భంగురా, భవహేతవః,**
**అచిరేణ వికారిణ్యో భీషణా భోగ భూమయః ॥**

సంసార దుఃఖాలకు హేతభూతాలైన భోగాలన్నీ ప్రారంభంలో మాత్రం కొద్దిసేపు రమణీ యంగా తోచుచున్నాయి. అవన్నీ క్షణభంగురాలే కదా! అందుచేత అతి శీఘ్రంగా అవన్నీ కూడా వికారయుక్తములై భయాన్ని గొలుపుచున్నాయి. ఈ విద్యాధర సంబంధమైన సంపదలు నమ్మ దగినవి ఎట్లా అవుతాయి? వాస్తవానికి ఈ సంపదలన్నీ అనేక మానావమానాలకు కారణమై ఉంటున్నాయి. దుష్టమగు అహంకారం ప్రవృద్ధమగుటకు ఇవియే ఆజ్యం. ఇవి 'వివేకం' అనుదానికి సుతరామూ వ్యతిరేకమై ఉంటున్నాయి. ఓ భుశుండ మహాశయా! అనేక మధుర ఆఘ్రాణాలకు ఆలవాలమైన సుందర నందనవనాలలో సంచరించాను. కల్పవృక్షం ప్రసాదించగల భోగాలన్నీ అనుభవించాను. అనేక విషయానందాలు చవిచూచాను. సుందర విద్యాధర స్త్రీలతో అనేకచోట్ల విహరించాను. క్రొత్తగా ప్రారంభమయ్యేదంతా మొదట ఒక వింతగా ఉండి, అతిత్వరలో రోతగా పరిణమిస్తుంది. కాలక్రమేణా ఇవన్నీ అయోగ్యమైనవేనని, స్వభావసిద్ధమగు సుఖాన్ని ప్రసాదించ జాలవని నేను గమనించాను. పైగా మానసిక వ్యధ నన్ను ఏమాత్రం వదలటం లేదని, ఆయా భోగాలన్నీ మానసిక వ్యధను కొద్ది సమయం దాచిపెట్టటానికి మాత్రమే కారణమగుచూ, చివరికి చూచుకుంటే... ఆ వ్యధను ఇనుమడింపజేస్తున్నాయని తెలిసిపోతోంది.

**1. నేత్రేంద్రియము -** ఈ కళ్ళు రూపాన్ని గుర్తించడానికి ప్రకృతి ప్రసాదించింది. అయితే ఇవి రూపగ్రహణం విషయంలో ఎంత చంచలంగా ఉంటున్నాయి? ఆహా! స్త్రీల ముఖాన్ని గాంచటంలో వీటికి ఎంతటి అభిలాష! అన్నిటిని చూడటానికి ఉపకరించే ఈ నేత్రేంద్రియాలు అనేక విషయాలలో సంగం కలిగి ఉన్న నాకు చివరికి దుఃఖకారకమే అగుచున్నాయి. ఇవి నన్ను ఎంతగానో మోసగిస్తు

న్నాయి కూడా! ఎందుకంటే ఇవి వివేకం లేకుండా బాహ్యరూపాలను చూచి ఆకర్షించబడి పరుగులు తీస్తున్నాయి గాని, ఆయా వస్తువుల ప్రక్కనే చాటుమాటుగా ఉన్న తుచ్ఛత్వమును గమనించటమే లేదు. స్త్రీల రంగు రంగు వస్త్రములు, కులుకు, బెళుకులను చూచి చంచలమగుచున్నాయి. అంతే గాని "ఈ జంతు, మనుష్య దేహాలన్నీ రక్త-మాంస మయాలే కదా!" అనే విషయం చూరగొనటమే లేదు. చిత్తం చంచలమై ఉండగా, అది నానావిధ బంధాలను కలుగజేసే కర్మలందు తత్పరమై ఉండగా, నరకం మొదలైన అనేక అనర్థములను కలిగించగల దుర్వ్యసనాలలో ఆసక్తి కలిగి ఉండగా... ఈ నేత్రేంద్రియానికి విశ్రాంతి ఎక్కడ ఎట్లా లభిస్తుంది? చిత్తం ఉపశమించే వరకు ఈ నేత్రేంద్రియం యొక్క గతి ఇట్లే అతి చంచలమై అలసిపోతూ ఉండక తప్పదు కదా!

**2. ఘ్రాణేంద్రియము -** అక్కడ ఇక్కడ ప్రత్యక్షమై ఉన్న ఆయా అనర్థాల వైపుకే పరుగులు తీస్తూ ఉంటే, పెంకి గుఱ్ఱములతో పోల్చతగిన ఈ ఘ్రాణేంద్రియాన్ని నేను నివారించలేక పోతున్నాను. అతి క్రూరుడగు మాంత్రికుడు తన మంత్రబలం చేత ఒక అమాయకుని బలవంతంగా తన వశం చేసుకొని దుర్గంధయుతమైన ప్రదేశాలలో నియమిస్తున్నట్లు ఈ ఘ్రాణేంద్రియం తనయందు శ్లేష్మాది దుర్గంధములతో కూడినదై ఉండి నన్ను మాత్రం ఆఘ్రాణిత వస్తువుల వైపు తరలించి బలంగా ఆ స్థానములందు బంధం కలుగజేస్తోంది!

**3. జిహ్వేంద్రియము -** "ఇది పొట్టకు మంచిది. ఇది కాదు. ఇది క్షేమకరం. ఇది అనారోగ్య కరం" అనే విచక్షణ లేకుండా ఈ నాలుక ఆయా రుచులందు ఆకర్షిత అయి ప్రవర్తిస్తోంది. ఆహా! మహత్తర సచ్చిదానంద స్వరూపుడగు ఈ జీవుడు పశువు, క్రిమికీటకాలు మొదలైన అవివేకపూరిత ఉపాధుల పరంపరలు సంపాదించుకుంటున్నాడంటే కారణం?... ఈ జిహ్వేంద్రియానికి దాసుడు అగుటచేతనే కదా!

**4. త్వక్ ఇంద్రియం (స్పర్శేంద్రియం) -** ఆహా! ఏమి ఈ చర్మేంద్రియం యొక్క స్పర్శలోలుత్వం! వేసవి కాలంలో ఎండవేడిమిని నిరోధించలేకపోతున్నట్లు, ఈ చర్మేంద్రియం యొక్క స్పర్శాశయాన్ని నిరోధించ లేకపోతున్నానే!

**5. శ్రవణేంద్రియం -** ఈ శ్రవణేంద్రియం (చెవులు) శబ్దతరంగాల యొక్క ఆస్వాదమునందు అనురాగం కలిగి ఉన్నది. కోమలమైన గడ్డిపరకలను అభిలషించిన జింక భయంకర మృగములున్న స్థానములలో ప్రవేశించునట్లు... ఈ శ్రవణేంద్రియం నన్ను అవివేకపూరితమైన స్థానములకు చేరుస్తోంది. దూషణ - భూషణ - తిరస్కార - పురస్కారములు కేవలం భాషాప్రయోగ మాత్రమే అయినప్పటికీ, శ్రవణేంద్రియం అందుకు కుస్పందనను ఆశ్రయించి ఒక్క క్షణంలో బుద్ధితత్త్వము వరకు ప్రకంపనలను కలుగజేస్తోంది. ప్రియ వాక్యములు పలికేవారు, వందనాలు సమర్పించేవారు, వినమ్రులైన భృత్యులు, స్తోత్రాలు ఉచ్చరించే వందిమాగధులు, వీళ్ళంతా పలికే అనేక శుభ శబ్దముల వైభవమును ఈ చెవులు విని ఉన్నాయి. కించిత్ సుఖమును, ఇంతలోనే దూషణ తిరస్కార శబ్దములు వినటంచే అవి కలిగించే దుర్భర దుఃఖములకు తీవ్రస్థాయిలో పొందుతూ పోతున్నాయి.

**6. సుందర స్త్రీల లావణ్యములు -** సరస వాక్యాలు పలికే సుందర స్త్రీల అభినయాలను ఆస్వాదించాను. వినమ్రులైన స్త్రీలు తమ చేతులతో అందిస్తుండగా అనేకసార్లు మధుర పానీయాలను గ్రోలాను. వారిచే తయారుచేయబడిన మధుర పదార్థములు రుచి చూచాను. వారు ధరించే పట్టు వస్త్రములను, హారములను, దేహములను ఈ చేతులతో స్పృశించాను.

మునీంద్రా! ఈ విధంగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విశేషము లనేకములు అనేకసార్లు అనుభవించాను. కాని అవన్నీ 'అత్యంత శుష్కప్రాయాలు" అని ఇప్పుడు తెలిసిపోయింది.

**భుక్త్వా వర్ష సహస్రాణి దుర్భోగపటలీమ్ ఇమామ్ ।**
**ఆబ్రహ్మస్తంభపర్యంతం న తృప్తిః ఉపజాయతే ॥**

బ్రహ్మలోకం నుండి ఒక గడ్డిపరక వరకు గల ఈ భోగసమూహాలను వేల సంవత్సరాలు అనుభవించినప్పటికీ తృప్తి కలుగనే కలుగదు. ఒకడు విస్తారమైన సామ్రాజ్యానికి మహాచక్రవర్తిగా సుదీర్ఘకాలం ఉండవచ్చు గాక! అనేక మంది సుందరస్త్రీలను లాలించి ఉండవచ్చు గాక! అనేక శత్రు రాజ్యాలను హస్తగతం చేసుకొని ఉండవచ్చు గాక! అందులో "దేహము-ఇంద్రియములు-ఇంద్రియ విషయములు" అను పరిధిని మించి అపూర్వమైన విషయాలు గాని, పదార్థాలు గాని ఏమున్నాయి? ఎవరైతే "ఈ మూడు లోకాలలో నా పరాక్రమానికి ఎదురే లేదు కదా! నన్ను ఎవరూ ఏమీ చేయలేరు"... అని అనుకుంటూ విఱ్ఱవీగారో... వారంతా అతిత్వరలో కాలప్రభావం చేత గుప్పెడు బూడిదగా మిగిలిపోయారు! ఆ రాజ్యాలు, ఆ బల - పరాక్రమాలు వారిని మృత్యువు నుండి కాపాడాయా? లేదు. మూడు లోకాలలోని అనేక పదార్థములను పొందినప్పటికీ, "నేను పొందవలసినదంతా పొందాను. ఒక పొందవలసినది లేదు" అని ఒక్క రోజన్నా అనుకోగలిగారా? ...లేదు. వాస్తవానికి అవన్నీ వారు తపస్సు వంటి అనేక కష్టతర కార్యక్రములచే ఎంతో శ్రమించి సంపాదించుకున్నవే! వారికి తృప్తి అనేది ఎందుకు కలగలేదు?

**ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్యమ్ అవశిష్యతే,**
**తత్ ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్ కష్టయాపి హి చేష్టయా ॥**

దేనినైతే పొందిన తరువాత ఇక పొందవలసినదంటూ ఏమీ ఉండదో... అద్దాన్ని ప్రాప్తి కొరకై ఎంత కష్టపడైనా ప్రయత్నించాలి. కాలంతో వచ్చి, కాలంతో పోయేది పొందిమాత్రం ఏం లాభం? కాలముచే బద్ధము కానిది పొందితేనే ప్రయోజనం.

ఎవడైతే చిరకాలం ధన-నారీ-తదితర విషయభోగాలను పొందాడో... ఆ తరువాత అతని శిరస్సుపై ఏమైనా కల్పవృక్షం మొలిచిందా? అతనికి క్రొత్తగా ఏదైనా శాశ్వత వస్తువు ప్రాప్తించిందా? లేనే లేదు. ఓ భుశుండమహాశయా! దురంతమైన (అంతు అనేదే లేని) 'విషయాలు' అనే మహారణ్యంలో సంచరించిన నేను - సౌమ్య బాలుడు అల్లరి బాలురచే వంచించబడినట్లు - అవే విషయాలచే వంచించబడ్డాను. ఈ ఇంద్రియాలు ఇంతకాలం నన్ను మోసం చేసి అవాస్తవ సుఖాలు, దుఃఖసమ్మిళిత పదార్థజాలాల వైపుగా తరలించాయి. ఈ శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయ

– ఉప విషయాలన్నీ బయలుదేరింది మనస్సులోంచే కదా! అనగా నా మనస్సులోంచే ఈ విషయ శత్రువులు బయలుదేరి, నా మనస్సును తమ వైపుగా ఆకట్టుకొని నన్ను నిర్వీర్యునిగా, అర్థరహితునిగా చేసి ఉంచాయి. ఇంతకాలానికి "ఈ విషయాలే నా శత్రువులు"... అని తెలుసుకున్నాను. బోయ వాళ్లు జింకను వేటాడుచున్నట్లు ఈ విషయశత్రువులు నన్ను వేటాడుచున్నాయి.

ఆహా! అతి భయంకరమైన ఈ ఇంద్రియ విషయశత్రువులకు పట్టుబడనివారు ఈ భూతలముపై అతి కొద్దిమంది ఉంటారు. ఇక నావంటి మిగతావారి సంగతంటారా! ఈ దేహము అనే నగరం "విషయాలు" అనే శత్రుసేనచే ఆక్రమించబడటం జరుగుతోంది. ఇక్కడి భోగాలే ఆ విషయశత్రువుల భయంకరమైన గజబలగం. తృష్ణ వాళ్ళ పాశాలు. లోభం వారి ఖడ్గం. క్రోధం వారి ఈటెలు. శీతోష్ణాది ద్వంద్వాలు వారి రథబలం. అహంకారం వారి సేనాపతి. దుష్ట ఇంద్రియాలే వారి పతాకం. అటువంటి విషయ శత్రుసైన్యమును జయించుటకు సన్నద్ధుడైనవాడే వీరుడు గాని... ఈ రాజ్యాలు జయించేవారు నిజమైన వీరులు కానే కారు.

ఒక మదించిన ఏనుగు కుంభస్థలమును చీల్చటం సులభమేమో గాని, కుమార్గాలలో ఎప్పటి కప్పుడు ప్రవృత్తమగుచున్న ఈ ఇంద్రియాలను నిగ్రహించటం మాత్రం అంత సులభమైన పని కాదు. ఓ సాధూ! ఒకనికి అనేక తాత్త్విక విషయాలు తెలిసి ఉండవచ్చు గాక. గొప్ప పౌరుషం, మహత్తు, మహాధైర్యం కలిగి ఉండవచ్చు గాక! చివరికి వారంతా ఈ ఇంద్రియ శత్రువులతో పోరాడి జయిస్తేనే విశ్రాంతి. కుత్సితమైన ఈ ఇంద్రియాలను ఎవడు జయిస్తాడో అతడు దేవతలకు కూడా పూజార్హుడు అవుతాడు. జితేంద్రియులగు మహాత్ములు మాత్రమే 'మనుజుడు' అని అనిపించుకోవటానికి అర్హుడు. ఇక ఇంద్రియాలను జయించనివారు కేవలం మాంసపు ముద్దలతో సమానమే గాని 'మనుజుడు' అను పేరుకు అర్హులు కారు. అయితే ఈ పంచేంద్రియాలను జయించటం ఎట్లా? వీటికి సేనాపతి మనస్సు. కాబట్టి మనస్సును జయిస్తే ఈ ఇంద్రియాలు తమంతట తామే వశమౌతాయి.

అయితే, ఈ మనస్సును ఎట్లా వశం చేసుకోవాలో అర్థం కాక... ఈ రోజు మీ పాద పద్మములను ఆశ్రయిస్తున్నాను.

**ఇంద్రియోత్తమ రోగాణాం భోగాశావర్జనాదృతే**
**నౌషధాని, న తీర్థాని, న చ మన్త్రాశ్చ శాంతయే ॥**

ఈ ఇంద్రియములు నన్ను భయంకర రోగముల వలె పట్టుకున్నాయి. భోగములను గురించిన ఆశ చావదే! ఆశను త్యజించటమే ముఖ్యమైన ఔషధం. అంతేగాని తీర్థములు, మంత్రములు ఎన్ని సేవించినా లాభం లేదనే నిశ్చయానికి వచ్చాను.

**ఈ ఇంద్రియములు ఎటువంటివి?**

**నీతో౭స్మి పరమం ఖేదమభిధావద్భిః ఇంద్రియైః**
**ఏక ఏవ మహారణ్యే, తస్కరైః పథికో యథా ॥**

మహారణ్యంలో ఒంటరిగా ఉన్న బాటసారి "ఎప్పుడు దొంగలు వచ్చి పడతారో?"....అని భయపడునట్లు నేను ఈ ఇంద్రియ విషయముల మధ్య చిక్కి ఖేదంతో పరుగులు తీస్తున్నాను. ఈ

ఇంద్రియసమూహమును "బురదతోకూడి, అతిమలినమై, అత్యంత దౌర్భాగ్యంతో కూడినదై, దుర్గంధ భూయిష్ఠమై నాచువంటి తుచ్ఛములచే ఆక్రమించబడిన అల్పాశయము (మురుగు గుంట)తో పోల్చవచ్చు. దట్టంగా భయమును గొలిపే అరణ్యముతో పోల్చవచ్చు. బురదలో పుట్టి, అనేక తంతువులు కలిగిన తామరతూండ్ల వంటివి ఇవి. మొసళ్ళతో కూడిన ఉప్పునీరు వంటివి.

**బాంధవోద్వేగదాయీని, దేహాన్తరకరాణిచ,**
**కరుణాక్రందకారీణి, మరణానీన్ద్రియానిచ ॥**

మృత్యువు 1.బంధువులకు ఉద్వేగము కలిగించునది, 2.మరొక దేహమునకు కారణభూతమైనది, 3.కరుణచే రోదనము కలిగించేది... అను మూడు లక్షణాలు కలిగి ఉన్నట్లే ఈ ఇంద్రియాలు కూడా ఆ మూడు (ఉద్వేగం, పునర్జన్మ, రోదనం అనే) లక్షణాలు కలిగియే ఉన్నాయి.

**అవివేకిషు అమిత్రాణి, మిత్రాణి చ వివేకిషు,**
**గహనాంతర శూన్యాని, కాననాని ఇంద్రియాణి చ ॥**

ఒకడు ఒక అరణ్యం మధ్యలో ఉన్నాడనుకోండి. అతనికి ఆ అరణ్యం గురించి చక్కగా తెలిసి ఉంటే అది స్నేహితుని వంటిది. తెలియకపోతే శత్రువు వంటిది. ఈ ఇంద్రియారణ్యం కూడా అట్టిదే! ఇంద్రియాలు అవివేకికి శత్రువులు. వివేకికి మిత్రులు. వివేకసూర్యుణ్ణి కప్పి ఉంచటంచేత ఇవి మేఘాలతో కూడా పోల్చవచ్చు. మహాత్ములు వీటిని మొదలంట జయిస్తున్నారు. తుచ్ఛ సుఖాలలో ఆసక్తి గల ప్రాణులకు ఈ ఇంద్రియాలు గొప్పవిగా అగుపిస్తున్నాయి. వాటి నిండా రజో–తమో గుణాలు వ్యాపించి ఉన్నాయి. కనుక ఇవి మురికిగుంటల వంటివి. జీవుని క్రిందకు త్రోయటంలో ఈ ఇంద్రియాలకు అతి నైపుణ్యం ఉంది. లోపల విషం ఉండటంచేత అవి పాములతో సమానం. లోపల శిథిలత్వం జడత్వం కలిగి ఉండటంచేత కట్టెపుల్లలతో సమానం. ఇవి చోరత్వం, జూదం, కలహం మొదలైన దుర్వ్యసనాలు కలిగి ఉన్నాయి. శిథిలమైన నూతులు ఈ ఇంద్రియాలు ఒక్కటే.

మహాత్మా! ఈ ఇంద్రియాలు జనింపజేయు 'ఆపదలు' అనే మహాసముద్రంలో నేను మునిగి ఉన్నాను. ఇప్పుడు సమస్తము త్యజించి మిమ్ములను సమీపించాను. ఈ దీనుని తత్త్వోపదేశంతో ఉద్ధరించండి. తత్త్వజ్ఞులగు మహాత్ములతో సాంగత్యమే సర్వదుఃఖములకు పరిహారమని శాస్త్రజ్ఞులు ప్రవచిస్తున్నారు కదా! స్వామీ! జ్ఞాన – యోగానంద స్వరూపులగు మిమ్ములను మనసా – వాచా – కర్మణా – శరణు వేడుచున్నాను.

❖❖❖

## 3. దృశ్యమును వదలాలి - దృక్‌ను పట్టుకోవాలి

**శ్రీ భుశుండుడు :** ఓ వసిష్ఠ మహర్షీ! ఆ విధంగా సుదీర్ఘమైన ఆయుష్షును అనుభవించియున్న ఆ విద్యాధరుడు నాతో తన అంతరంగమథనాన్ని ప్రకటించాడు. అప్పుడు నేను ఇట్లు పలికాను.

**శ్రీ భుశుండుడు :** (విద్యాధరునితో) ఓ విద్యాధరచక్రవర్తీ! నీవు చెప్పే మాటలు నాకు ఆనందాన్ని కలుగజేస్తున్నాయయ్యా! ఎందుకంటే నీవు ఇంతకాలానికి 'ఆత్మజ్ఞానము' అనే సౌభాగ్యం కొరకై

జాగృతుడవైనావు. చాలా మంచిది. సంసారము అనే అంధకూపం నుండి నీవు వెలువడినవాడ వయ్యావు! అగ్ని చేత వ్యాప్తమైన బంగారములాగా నీ బుద్ధి వివేకముచే పూర్ణమైయున్నది. కాబట్టి ఇప్పుడు నీ బుద్ధి నా ఉపదేశవాక్యము యొక్క సూక్ష్మార్థమును పెద్ద ప్రయత్నం అవసరం లేకుండానే గ్రహించగలుగుతుంది. నిర్మలమైన అద్దంలో దృశ్యము స్పష్టంగా ప్రతిబింబిస్తుంది కదా!

❖

ఇప్పుడు నేను కొన్ని విశేషాలు చెప్పబోవుచున్నాను. నేనిప్పుడు చెప్పేదంతా ఇప్పటికి మాత్రం కొంత అంగీకారబుద్ధితో విను. తర్వాత నీకే అంతా సుబోధమౌతుంది. ఎందుకంటే మేము చాలా కాలంగా అనేక సందర్భాలలో సుదీర్ఘ విచారణ చేసి ఇప్పుడు ప్రతిపాదించబోతున్న నిర్ణయాలకు వచ్చాం. కనుక మేము చెప్పబోయే వాటి పట్ల అనుమానం అక్కర్లేదు. ఇదంతా మా స్వానుభవం. మొట్టమొదటగా నీవు ఒక ముఖ్యమైన కార్యక్రమం చేపట్టు – "అజ్ఞానాన్ని త్యజించటం!"

**శ్రీ విద్యాధరుడు :** స్వామీ! అజ్ఞానాన్ని త్యజించుటమంటే ఏమిటి? నేను దేనిని వదలాలి?

**శ్రీ భుశుండుడు :** అహంకారం మొదలుగా గల ఏ దృశ్య ప్రపంచం నీకు అంతరంగంలో అనుభూత మగుచున్నదో... "అదంతా నేను కాదు. నాకు సంబంధించినది కూడా కాదు, ఈ దృశ్యానికి సంబంధించిన వాడను కాను"... అని గ్రహించటమే అజ్ఞానమును త్యజించటం. ఎందుకంటే ఈ దృశ్య ప్రపంచంలో ఎంతకాలం నీ స్వరూపం కొరకై వెతకి వేసారినా... నీ రూపం ఈ దృశ్య ప్రపంచంలో లభించేది కాదు. ఈ దృశ్యాన్ని దాటివేసే ప్రయత్నానికి ఉపక్రమించు.

"ఆత్మ గురించి తెలుసుకో!" దృశ్యమాత్ర రూపమైనట్టి అజ్ఞానాన్ని వదలిపెట్టి ఆ దృశ్యమునకు 'సాక్షి' అయిన ఆత్మ గురించి నీవు ఎఱుగు. "ఈ దృశ్యాన్ని, ఈ అహంకారాన్ని త్యజిస్తే ఏదేదో కోల్పోతామేమో?"... అని కొందరు జనులు సందేహిస్తూ ఉంటారు. కాని అది వాస్తవం కాదు.

**"న అహమ్ – త్వమ్ అస్తి, న జగత్" ఇతి నిశ్చయినస్తవ ।**
**సర్వమస్తి శివం, తుచ్ఛ న దుఃఖాయ, సుఖాయ తే ॥**

"నేను గాని, నీవు గాని, జగత్తుగాని లేవు. అంతా కూడా బ్రహ్మమయమైయున్నది"... అనే సుస్థిర నిశ్చయమే ఈ జీవునికి నిజమైన సుఖం కలిగిస్తుంది. అది దుఃఖం కలిగించదు సుమా! "అది కోల్పోవటం కాదు. సంపాదించవలసినది సంపాదించటం"... అని నిశ్చయించుకొని ఉండు.

"అజ్ఞానం యొక్క ఆను–పానులు కనిపెట్టు!" 'అజ్ఞానం' గురించి విచారణ చేయాలి. అయితే "ఎట్లా ఎక్కడ విచారణ చేయాలి?"... అనేది ఇప్పటి మన ప్రశ్న కదా?

**శ్రీ విద్యాధరుడు :** అవును స్వామీ! నా అజ్ఞానం ఎప్పుడు ప్రారంభమైనది ఎట్లా ప్రారంభమైనది?

**శ్రీభుశుండుడు :** 1.భావన నుండి జగత్తు పుడుతోందా?... లేక, జగత్తు నుండి భావన పుడుతోందా?

2. 'సుషుప్తి' అనే ప్రసిద్ధమైన అజ్ఞానం నుండి జాగ్రత్–స్వప్న రూప ఈ జగత్తు పుడుతోందా?... ...లేక, జాగ్రత్ నుండి స్వప్న సుషుప్తులు పుడుతున్నాయా?

3. కర్మల నుండి జన్మ పుడుతోందా? జన్మ నుండి కర్మలు పుడుతున్నాయా?... వీటిలో ఏది ముందు? ఏది వెనుక?...

ఈ విధంగా ప్రశ్నలు తయారుచేసుకొని... ఆ ప్రశ్నలకు సమాధానం కొరకై ఎన్ని జన్మలుగా వెతకినా ప్రయోజనం ఉండదు, సమాధానం లభించదు. అనగా, వాటియొక్క కార్య – కారణ భావనా వ్యవస్థ గురించి ఏమాత్రం ఎఱుగజాలం. కాబట్టి... "కాఠిన్యత్వం – ద్రవత్వం ఈ రెండూ ఒకే ఘృతము (నేయి) యొక్క లక్షణాలు"... అని మనం గమనిస్తున్నట్లు జాగ్రత్–స్వప్న–సుషుప్తులు మూడూ అజ్ఞాన వ్యవస్థలే కనుక... వాటి గురించిన విచారణ వ్యర్థమే అవుతుంది. ఆ మూడు వ్యవస్థలకు సంబంధించక, వాటిలో ఆయా సమయాలలో ప్రవేశ – నిష్క్రమణలను నిర్వర్తిస్తున్న సత్ – చిత్ తత్త్వం గురించే మనం విచారణ చేయటం అవసరం సుమా!

అజ్ఞానాన్ని ప్రక్కకుపెట్టి, జ్ఞానం కోసం అన్వేషించు.

**మృగతృష్ణాంబువత్ విశ్వమ్, అవస్తుత్వాత్ సదప్యసత్**
**యచ్చేదం భాతి తద్బ్రహ్మ న కించిత్కించిదేవ వా॥**

ఎండమావులలో ఎన్ని తరంగాలున్నాయి? ఎందుకున్నాయి? ఎప్పటి నుంచి ఉన్నాయి? అని తర్కించి ఏం లాభం? ఎండమావులలో జలం కనిపిస్తున్నప్పటికీ అది భ్రాంతిచేత మాత్రమే కదా! అట్లాగే ఈ జగత్తంతా "వాస్తవంగా, సత్తుగా" కనిపిస్తున్నప్పటికీ ఇది అసత్తే సుమా! అయితే ఈ భాసిస్తున్నదంతా అధిష్ఠాన రూపంచే బ్రహ్మమే అయి ఉన్నది. కాని 'జగత్తు'గా (బ్రహ్మం కానట్లుగా) అనిపించుచున్నది. "మృగతృష్ణలో జలం నాకు కనిపిస్తోంది. కనుక, లేదు అనే మాట నేను ఒప్పుకోను"... అని వాదించే వానితో మనమేం చెప్పగలం? అతని దృష్టికి అది ఉన్నట్లే అగుచున్నది. అట్లాగే ఈ జగత్తుకు 'నాస్థిత్వం–అస్థిత్వం' రెండూ లేవు. అభావాన్ని సిద్ధించుకున్న వానికి 'ప్రతిభాస' అనునది కూడా లేదు. (యథాదృష్టం – తథా స్థితర) ఇది అనిర్వచనీయమని చెప్పబడుతోంది.

కాబట్టి ఈ సమస్తము శివరూపమగు బ్రహ్మమే అయి ఉన్నది.

ఈ జగత్తంతా కూడా "మృగతృష్ణలోని జలం" లాగా అవస్తువు మాత్రమే! ఇది 'సత్తు' వలె భావిస్తున్నప్పటికీ అసత్తు మాత్రమే! ఇక్కడ భాసిస్తున్నదంతా అధిష్ఠానరూపం చేత బ్రహ్మమే అయి ఉన్నది. కాని జగద్రూపం చేత ఇది అవాస్తవం కనుక బ్రహ్మం కాదు. మృగతృష్ణలో (ఎండమావులలో) జలం ఉన్నదా?

"లేదు" అందామా... ఒక ద్రష్ట (అవిజ్ఞాత)కు జలం, జల తరంగాలు కనబడుచున్నాయి, అనుభవమగుచున్నాయి. కదా! అతడు ఆ జలం కొరకు పరుగులు తీస్తూ "నన్ను ఆపకండి. అక్కడ జలం ఉన్నది. నాకు అక్కడ తరంగాలు కనబడుతున్నాయి"... అని పల్కుచున్నాడు.

"గాలి తరంగాలు కాంతి కిరణాల సంయోగం చేత జలం యొక్క భ్రమ మాత్రమే కలిగిస్తుంది. అంతేగాని అక్కడ జలం ఉండటానికి అవకాశమే లేదు"... అని (మృగతృష్ణగా) గ్రహించిన వారికి అక్కడ జలభావం కలుగదు.

అభావ బలం చేత ఇక్కడ ప్రతిభాస కూడా లేకుండా పోతుంది. కాబట్టి సమస్తము శివ రూపమగు బ్రహ్మమే అయి ఉన్నది.

ఓ విద్యాధరా! మనం పైన చెప్పుకున్న విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుని ఈ జగత్తునకు మూలం అహంకారమే అని గ్రహించు. అట్టి అహంకారం నుండే దిక్కులు, పృథివి, ఆకాశం, సముద్రాలు, పర్వతాదులతో కూడిన 'ఈ జగత్తు' అనే పురాతన వృక్షం బయలుదేరింది.

**సూక్ష్మాహంకారం నుండి స్థూల జగత్ వృక్షం -** సూక్ష్మమైనట్టి 'అహంకారం' అనే బీజం నుండి జగత్తు అనబడే ఈ స్థూల వృక్షం బయలుదేరింది. "ఇంద్రియ విషయాల పట్ల ఆసక్తి" అనే రసం ఆ వృక్షమంతటా నిండి ఉన్నది. "అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళాలు" అను పేర్లతో చెప్పబడే అధోలోకాలు ఆ వృక్షం యొక్క మూలాలు. నక్షత్ర మండలాలు ఆ వృక్షం యొక్క మొగ్గలు. వాసనలు దాని పూగుత్తులు. స్వర్గం మొదలైన లోకాలు దీని కొమ్మలు. కాల ప్రవాహమే ఈ వృక్షమును తొలచుచున్న పురుగు.

అసలు ఈ వృక్షం ఏ ప్రదేశంలో ఉత్పత్తి అయింది? 'అజ్ఞానము' అనే చోట! ఈ అసంఖ్యాక దేహపరంపరలు ఈ వృక్షముపై వ్రాలే పక్షులు. భ్రాంతి ఈ వృక్షము యొక్క కాండము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే ఇంద్రియ విషయాల యొక్క విషయ సాక్షాత్కారాలు; మనస్సు యొక్క సంకల్ప-వికల్పములు... ఇవి ఈ వృక్షము యొక్క గంధము.

హాస్య-విషాదాది రస ప్రకటనయే ఈ వృక్షం యొక్క చర్మం (డొల్ల). ఋతువులు దాని విచిత్రములైన ఉపశాఖలు. దశ దిక్కులు అద్దాని ప్రసరణ ప్రదేశాలు. ఆత్మసంవిత్తు దీని జీవన హేతువైన రసప్రవాహము. అవ్యాకృతాకాశము ఈ వృక్షము ఉన్న వనప్రదేశము. రాత్రింబవళ్ళు దీనిపై వ్రాలే తుమ్మెదల భ్రమణము.

ఈ విధంగా ఈ సంసారవృక్షము తన మూలముచే పాతాళమున, మధ్యభాగముచే ఈ దిక్సమూహమున, అగ్రభాగముచే అంతరిక్షమున వ్యాపించి ఉన్నది. అయితే ఈ సంసారవృక్షము వాస్తవానికి అసత్తే! అయితే ఏం? అది భ్రాంతిచేత సత్తువలె గోచరించటం జరుగుతోంది.

**విద్యాధరుడు:** అటువంటి మహాభయంకరం, సువిస్తీర్ణం, మహాదీర్ఘం అయిన సంసారవృక్షమును ఈ మా అంతరంగం నుండి మొదలంటా తొలగించటం మాకు సాధ్యమేనంటారా?

**శ్రీ భుశుండుడు :** ఓ! తప్పకుండా సాధ్యమే. ఎంతటి వృక్షాన్నైనా అగ్ని దహించివేయ గలదుకదా! ఆత్మజ్ఞానరూపమైన 'అనహం అనే అగ్నిచే 'అహంకారం' అను బాహ్యాడంబర సమన్వితమైన సంసార విషవృక్షం దహించివేయబడగలదు. ఆపై "జన్మజన్మాంతర పరంపరలు"... అనే బీజరూప పునరుత్పత్తి స్వభావం కోల్పోయి ఈ వృక్షం నశించగలదు.

కనుక ఆత్మజ్ఞానాగ్నిని ఆశ్రయించి ఈ ఆగామి - ప్రారబ్ధ - సంచిత రూపమగు సంసారరూప వృక్షమును మొదలంటా నశింపజేసుకొనినప్పుడే సర్వదుఃఖములు శమించగలవు సుమా!

❖❖❖

# 4. నేను - నీవు మొదలైనవి ఉండజాలవు!

**శ్రీ భుశుండుడు :** ఓ విద్యాధరా! ఈ సంసారవృక్షం ఉత్పన్నమైనది 'అహంకారం' అనే బీజం నుండే! జ్ఞానాగ్నిచే అహంకార బీజాన్ని దహింపజేశామా... ఇక మరల సంసారవృక్ష సంబంధమైన పునరుత్పత్తికి హేతువు ఉండదు.

అందుకే వివేకం కలవాడు మునుముందుగా "ఈ ప్రపంచం యొక్క అసలైన రూపమేమిటి?" అనే ప్రశ్నకు సరైన సమాధానం సముపార్జించుకోవాలి. తత్త్వదృష్టిచే విచారణ చేయాలి. "ఈ సమస్తం బ్రహ్మమే" అనే నిశ్చయం సుదృఢమగుచుండగా... ఇక అహంకారం యొక్క ఛాయ కూడా ఉండ జాలదు. ఇంతమాత్రపు అవగాహన చేత అహంకారం దహించబడు చుండగా, ఇక దిగులెందుకు?

**అహంత్వభావాచ్ఛ 'అహం – త్వమ్ అస్థి' సంసారబీజకమ్ ।**
**నాహంత్వభావాన్ 'నాహం – త్వమ్ అస్థి' ఇతిజ్ఞానముత్తమమ్ ॥**

ఈ దేహాదులందు 'అహం' భావన ఏర్పరచుకొని ఉండటం చేతనే నేను వేరు – నీవు వేరు అనునది మొదలై అదికాస్తా సంసారమునకు బీజమగుచున్నది. "నేను గాని, ఇంకొకరు గాని ఈ దేహాదులు కాదు. కనిపించే ఈ దేహములను ఏ కనిపించని చిత్ చైతన్యము కదలిస్తోందో అదియే నేను–నీవు కూడా" అను ఇంతమాత్రపు జ్ఞానంచే అహంకారము తప్పక దహించివేయబడగలదు. సృష్టికి ముందు ఉన్నదేది? స్వస్వరూప చైతన్యమే కదా! అట్టి చిత్‌నందు అహంభావంగాని, నేను–నీవు అనునవి గాని ద్వైత–ఏకత్వ భ్రమలుగాని ఉండజాలవు. ఆ చైతన్యం సృష్టిని సిద్ధింపచేయ వచ్చుగాక! అంతమాత్రం చేత తన అనంత అప్రమేయ చిదానంద ఘనత్వము కోల్పోవుచున్నదా? లేదు. మరి ఈ దుఃఖాదులు ఎందుకు? ఎవరికి?

ఎవరైతే "నీవు సృష్టి కంటే ముందే ఏర్పడి ఉన్న నిర్విషయ చైతన్యమువు. ఇప్పటికీ మరెప్పటికీ యథాతథంగా అఖండ చైతన్యస్వరూపుడవే. ఈ సంసారాదులకు నీవు సంబంధితుడవు కాదు"... అను గురువాక్యం శ్రద్ధతో విని, తదనుసరణంగా సంకల్పాన్ని సమూలంగా త్యజించుటకై స్వయంగా యత్నం చేస్తారో... వారే ఈ సంసారాన్ని జయిస్తారు. జయించి నిస్సంకల్పమగు ఆత్మపద ప్రాప్తి యందు సఫలీకృతులౌతారు. అట్లా కాకుండా గురువాక్యాలను విని ఊరకుంటే లాభమేముంటుంది? ఒకాయన "వంట చేయటమెట్లా?" అనే విషయం బాగా పఠనం చేశాడు. అది తెలిసిన వాని వద్దకు వెళ్ళి "పదార్థాలు, వాటి పాళ్ళు, ఎప్పుడు ఎట్లా కలపాలి..." ఇవన్నీ నేర్చుకున్నాడు. అంత మాత్రం చేత సరిపోతుందా? ఆ నేర్చుకున్న విశేషాలన్నీ దృష్టిలో ఉంచుకుని ఇక వంట చేయటం ప్రారంభించాలి. వంట తయారుచేసి ఆ పదార్థం చక్కగా భుజించాలి. అప్పుడు కదా ఆహార ఆస్వాదనానందం! అట్లాగే వివేకవంతుడు ముందుగా గురువు వద్ద శ్రవణం చేయాలి. అంతటితో ఊరకుంటే సరిపోతుందా? లేదు. ఆ శ్రవణం చేసిన దానిని స్వప్రయత్నంతో, సత్–భావనతో కూడిన సాధన చేయాలి. అప్పుడే ఈ జీవుడు సంసారానికి ఆవలి ఒడ్డు చేరగలుగుతాడు. సంసారం

హృదయంలో ఏర్పడి ఉన్నంత వరకు శ్రవణం, సాధన వదలకూడదు సుమా! "ఈ కనబడే శత్రు – మిత్రాది సమస్తమూ బ్రహ్మమే – అని అనుకోవటం" సాధన. "సమస్తము బ్రహ్మమే – అని అనిపించటం" అంతిమ లక్ష్యం.

ఓ ప్రియ విద్యాధరా! నీకు "నేను–నీవు" మొదలైనవాటితో కూడిన ఏ ఈ జగత్తు కనిపిస్తోందో ...అదంతా చిత్ (చైతన్యం) యొక్క చమత్కారమనియే గ్రహించు. అందుచేతనే "చైతన్యమునకు అన్యమైనది ఎక్కడా ఏదీ లేదు" అని సిద్ధాంతీకరించబడుతోంది. ఒక చిత్రకారుడు ఆయా రంగులు మేళవించి ఒక గొప్ప ప్రకృతి దృశ్యమును చిత్రీకరించాడనుకో... ఆ చిత్రం యొక్క రూప విశేషా లన్నీ చిత్రకారుని సంకల్ప విశేషం నుండే రంగుల మేళవింపుచే బయల్వెడలినాయి. కదా! ఈ జగద్రూప చిత్రమంతా స్వ-సంకల్పం యొక్క ఆవిర్భావ విశేషం చేతనే కనిపిస్తోంది. సంకల్పం యొక్క అభావముచే జగద్భావన లయించగా, జగత్తు కూడా లేనిదిగా అగుచున్నది. ఈ లోకాలు, ఈ వెలుగు చీకట్లు, ఈ స్త్రీ–బాల–వృద్ధాది అనుభూతులు, ఈ కల్ప–కల్పాంతాలు చిరకాల సంకల్ప భావన యొక్క బాహ్య స్వరూపాలు మాత్రమే! అంతఃకరణంలో చిరకాలం దృశ్యం యొక్క భావనను నిర్వర్తించి ఉన్న తరువాతే అట్టి చిత్ లోంచి బయల్వెడలిన భావనారూప చిత్తమునకు ఈ బాహ్య మంతా గోచరించటం జరుగుతోంది.

చిత్రకారుని చిత్తములోని చిత్రము వలె ఈ జగద్రూప చిత్రం సంకల్పం యొక్క ఆవిర్భావం చేతనే కనిపిస్తూ... సంకల్పము యొక్క అభావముచే లయించటం జరుగుతోంది. మాంత్రికుడు మాయచే లేనివి ఉన్నట్లుగా కల్పించి చూపుచున్నట్లు – ప్రతిభాస చేత మాత్రమే సత్యమై, (కానీ వాస్తవానికి అసత్యమై) ఈ జగత్తు స్ఫురిస్తోంది. సువర్ణం సువర్ణంగా ఉంటూనే ఆభరణములుగా ప్రదర్శితమగుచున్నట్లు చిత్తు... చిత్తుగా ఉంటూనే చమత్కారంగా సంకల్ప–వికల్పాలను నిర్వర్తిస్తూ ఈ జగత్తును సముపార్జించుకుంటోంది.

అందుచేత ఓ విద్యాధరా! ఈ జగత్తు యొక్క ఉత్పత్తి – వినాశనములు ఈ మనుజుని యొక్క అధీనంలోనే ఉన్నాయని గ్రహించు. ఎట్లా అంటావా? జగత్ అనేది సంకల్పంలో జనిస్తూ సంకల్పాలు ఉపశమించగా తాను కూడా లయించేది కదా! మరి సంకల్పాన్ని ఆశ్రయించడం, త్యజించటం జీవుని చేతిలోనే ఉన్నాయి గాని, మరెవరి చేతులోనో కాదు కదా! కనుక సంసారమును కల్పించుకునేదీ ఈ జీవుడే, ఆ కల్పనలను త్యజించేదీ ఈ జీవుడే సుమా! ఇది గ్రహించి ఆపై నీకు ఏది ఎట్లు ఉచితమనిపిస్తే అది అట్లే నిర్వర్తించు. ఒక్క ముఖ్య విషయం మాత్రం గుర్తుచేస్తున్నాను.

**అత్యంతమేవ స్వాయత్తో యథేచ్ఛసి తథాకురు**
**యశ్చ అన్న–పానదానాదానావనాదరముపేయివామ్**
**తస్యేదం పశ్చిమం జన్మ న సకర్మ మముజ్ఝతి ॥**

ఎవడైతే అన్నపానాది ఐహిక భోగముల యొక్క, దాన – యజ్ఞాది ఆముష్మిక భోగముల యొక్క సర్వఫలములను కోరుకోక ఉంటాడో... అట్టి వానికి ఇదే ఆఖరి జన్మ కాగలదు. "నేను

జన్మ – కర్మ రహితుడను" అని అతిత్వరగా గ్రహించగలుగుతాడు. అట్టివాడు (తన అవగాహనను సుస్పష్టంగా, సునిర్మలంగా తీర్చిదిద్దుకున్న తరువాత) కర్మలను నిష్కామంగా ఆచరించగలుగుతాడు.

శుద్ధ బుద్ధివగు ఓ విద్యాధరా! నీవు ఇప్పటికే పతనహేతువగు అవివేకమును ఉల్లంఘించావు. కాబట్టే జ్ఞానార్థివై నా దగ్గరకు వచ్చావు. ముల్లోకములను పునీతం చేయగలిగినట్టి అతి పవిత్రమైన వివేకమును సంపాదించుకున్నావు. అట్టి వివేకయుక్తమైన నిర్మల మనస్సు సంపాదించుకున్న నీకు 'సంసారము' అనే పతనము ఉండజాలదని నా అభిప్రాయం.

కాబట్టి నీవు మనోవాక్కులకు పరమై, చిన్మాత్రమైనట్టి నిర్మల ఆత్మపదమును మాత్రమే అవలంబించు. మనస్సు ఇత్యాది దృశ్యసమూహములను సర్వదా త్యజించి ఉండు.

❖❖❖

# 5. బాహ్యాభ్యంతర చిద్రూపుడు

**శ్రీ విద్యాధరుడు :** ఓ భుశుండమహాశయా! మీ ప్రవచనం అత్యంత శిరోధార్యం. అయితే, ఈ మనస్సు మొదలైనవి నా పట్ల నిర్విషయమాత్రం అవటానికి గాను నేను చేయవలసినదేమిటి?

**శ్రీ భుశుండుడు :** సూర్య కిరణం నిర్మల జలంలో ప్రవేశించినప్పుడు తాపరహితమై, ప్రకాశమాత్రమై ఉంటుంది కదా! నీవు కూడా... "ఏ చిదాభాసుడైతే విషయాలలో, వాటి క్రియా-గుణ దోషాలలో, వాటిని ప్రకాశింపజేయటలో ప్రవేశిస్తున్నాడో... అట్టి చిదాభాసుని ఏ మాత్రం స్మరించనే వద్దు. పరమశాంతుడవై చిద్ఘనమాత్రుడవై కేవల చైతన్యమును ఆశ్రయించి అప్రమేయుడవై ఏర్పడి ఉండు.

**శ్రీ విద్యాధరుడు:** స్వామీ! మేము తమ వలె ఈ జగత్తును జయించి, కారణకారణమగు కేవల చైతన్యమును ఆశ్రయించు శక్తిని సంపాదించకపోవటం చేత కాబోలు... ఈ సంసారభ్రమ శేషించియే ఉంటోంది?

**శ్రీ భుశుండుడు :** నాయనా! విద్యాధరా! ఈ జగత్తు అనబడేది అజ్ఞాన జీవుని పట్ల అచేతనమై, జడమై, దుఃఖాది రూపంగా, చైతన్యంతో అసాదృశ్యంగా అనిపిస్తూ ఉండవచ్చు గాక! వాస్తవానికి ఈ జగత్తు చైతన్యం యొక్క చమత్కారమే కాబట్టి, ఇది కూడా బ్రహ్మమే! సముద్ర మధ్యంలో అగ్ని ఉంటున్నట్లు ఇదంతా చైతన్య సదృశమై చైతన్యమునందే వెలయుచున్నది సుమా! అంతేగాని, చైతన్యమునకు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేనే లేదు. అగ్ని పుట్టటానికి, అగ్ని ఆరటానికి కూడా వాయువే కారణమౌతోంది చూచావా? (గాలి లేనిచోట అగ్ని వెలగదు. గాలి యొక్క తీవ్రతచే అగ్ని ఆరిపోతుంది.) అట్లాగే చిత్తు తన చైతన్య శక్తిచే తనలోనే ఇదంతా గాంచుచున్నది. తానే ఈ సర్వ చేతనాచేతన పదార్థములకు కారణమైయున్నది.

**నాఽహమస్తీతి చిద్రూపం చితి విశ్రాన్తిరస్తు తే**
**తతో యథా యాదృశేన భూయతే, తాదృశో భవ ॥**

"నేను సంసారబద్ధుడను. అల్ప స్వభావుడను. అర్హతలు లేని వాడను"... ఇటువంటి సాంసారికమైన అభిప్రాయాలను వెంటనే త్యజించు. "నాఽహమస్థితి చిద్రూపం... నేను ఆత్మ రూపుడనుకాను" ...అనే జాడ్యాన్ని వదిలించుకో. "జీవుడుగా నేను ఒక కీటకం కంటే కూడా అధికం కాదు. ఆత్మగా ఈ 14 లోకాలకు అధిష్ఠానమై ఉన్నాను... నేను సర్వదా కేవల చిద్రూపుడనే" అను నిర్మలమైన సదవగాహనను సుస్థిరపరచుకొని అట్టి చిద్రూపంలో విశ్రాంతి కలిగి ఉండు. దేహాఽహంభావన సంపూర్ణంగా నశించగా, అప్పుడు ఏ (చిన్మాత్ర) స్వరూపం నీకు అనుభవం అవుతుందో... అట్టి చిన్మాత్ర స్వరూపుడవై ఉండు.

**చిద్రూపః సర్వ భావానామ్ అన్తర్-బహిరపి స్థితః**
**ప్రసన్నాంబుభరస్య అన్తర్-బహిశ్చైవ యథా పయః**

నదీజలం యొక్క అంతరమున, పైపైన ఉన్నది జలమే కదా! సర్వభావముల యొక్క అంతరమున, బాహ్యమున కూడా చిద్రూపమే స్థితి కలిగి ఉన్నది.

కాబట్టి "నేను ఒక అల్పుడను. చిద్రూపుడను కాను"... అనే వాక్యాలు కట్టిపెట్టు. దేహమనో సంబంధమైన అహంకారము చేత మాత్రమే ఆ విధంగా అనిపిస్తోంది అని గమనించు. అట్టి అహంకారమును త్యజించి, నీవు అఖండమగు చిద్రూపమునందే సంలగ్నుడవై ఉండు. అట్టి నీ చిద్రూపము స్వయంప్రకాశకమేగాని, మరింకేదానిచేతను అది ప్రకాశించటం లేదు సుమా!

**యథా రంగమయం కుడ్యే జగత్ మౌనమివ స్థితిమ్**
**తథా చిచ్చిత్ర కచితం ఖే కుడ్యే చ ఆత్మసంస్థితమ్ ॥**

తెల్లటి గోడపై రంగులతో కూడిన యుద్ధ దృశ్యం చిత్రీకరించబడినట్లు మౌన స్వరూపమగు చిదాకాశంపై ఈ అనేక సంరంభాలతో కూడిన త్రిలోక సమన్వితమైన జగత్తు చిత్రించబడుతోంది. వాస్తవానికి ఈ జగత్తంతా నిర్వికార అద్వయరూపమగు ఆత్మయే గాని మరింకేదీ కాదు. ఓ విద్యాధరా! ఏ చైతన్యమగు స్వతః విశేషముచే ఇటు అచేతనమగు జగత్తుగా, అటు చేతనమగు బ్రహ్మంగా ప్రకటనమగుచున్నదో అట్లే ఆయా విశేషాల అనుభవంగా కూడా చిత్తు పొందుతోంది. కాబట్టి "నేను సర్వదా నిర్వికార చైతన్యమునే"... అని గ్రహించి ఉంటూనే ఏది నీకు ఇష్టమైతే అద్దానినే (ఇటు జగత్తునుగాని, అటు బ్రహ్మమును గాని) ఆదరిస్తూ ఉండు. ఈ జగత్తు చేత నీ స్వస్వభావం కుంటుపడుతోందనే భ్రమకు ఏమాత్రం తావు ఇయ్యవద్దు సుమా! "ఎండమావులలో నీరు ఉండదు"... అని ఎఱిగి ఉన్న తరువాత అందలి భ్రమాత్మకమగు జలతరంగ దృశ్యమును చూస్తూ ఉన్నా, చూడకుండినా – అందులో విశేషమేమీ ఉండదు కదా! అట్లాగే తత్త్వవేత్తలు ఈ జగద్రూప చమత్కారముల మధ్యగా ఉంటూనే పూర్ణావగాహనపరులై కూడా ఉంటున్నారు. ఈ జగత్తు ఉనికి వారి అఖండాత్మానుభవమును నిరోధించజాలదు!

తిమిర దోషం గల కలవానికి ఆకాశమంతా కేశమయంగా కనిపిస్తుంది చూచావా? అనాత్మ భావనలో ఉన్నవానికి మాత్రమే ఈ జగత్తు ఆత్మకంటే అన్యమైనదిగా గోచరించటం జరుగుతోంది.

ఈ విధంగా ఈ జగత్తంతా బోధరూపమగు ఆత్మయేనయ్యా! ఇది అభాసరూపమై అజ్ఞుల దృష్టికి ఉదయించినట్లు ఉండవచ్చుగాక. కానీ, తత్త్వజ్ఞుల దృష్టికి మాత్రం ఈ జగత్తనేది ఎప్పుడూ ఉదయించనిదే అయి ఉంటోంది. ఆకాశంలో (మేఘాలను చూచి) కొండలు ఉన్నట్లు అనిపిస్తు న్నట్లు... లేని జగత్తు అజ్ఞాన దృష్టికి ఉన్నట్లే ఘనీభూతమై అనుభవమౌతోంది. ఈ జగత్తు యొక్క విశేషము ఇంతమాత్రమే.

❖❖❖

# 6. నీవే ఆ బ్రహ్మమువు (తత్త్వమసి)

**శ్రీ భుశుండుడు :** విద్యాధరా! "ఈ జగత్తు అనబడేది ఏ సమయమందునూ లేదు" అని గ్రహించు.

**విద్యాధరుడు :** మహాత్మా! మీ వాక్యాలు శిరోధార్యమే. కానీ ఎదురుగా ఈ జగత్తు కనిపించటం, ఇది ఇంద్రియ-మనస్సులకు విషయమయి ఉండటం, ఘనీభూతమైన ఈ జగత్తు దాటరానిదిగా అనిపించటం మాత్రం మాపట్ల జరుగుతోంది. ఇట్టి ఘనీభూతానుభవమును తిరస్కరించి "ఇది లేదు" అని అనటం ఎట్లా?

**శ్రీ భుశుండుడు :** ఓ విద్యాధరా! ఈ జగత్తు నీయందలి ఒకానొక 'స్ఫురణ'గా కదా, బాసిస్తున్నది? ఈ జగత్తును వదిలి నీ యందలి ఆ స్ఫురణను ఆశ్రయించు. ఆ స్ఫురణ చైతన్యమే కనుక ఆ స్ఫురణకు భాసించేది కూడా చైతన్యమే అనే నిశ్చయాన్ని కలిగి ఉండు. చైతన్యం నందలి స్ఫురణ చైతన్యమునకు వేరైనది కానేకాదు. దృష్టాంతానికి... జలంలో దీపపు కాంతి ప్రతిబింబిస్తోందనుకో... ఆ జలంలో ప్రతిబింబించే దీపం జలం కంటే వేఱు కాదు కదా! చిత్తు - ఆ చిత్తు యొక్క స్ఫురణచే తోచుచున్న జగత్తులోని దృశ్యత్వము వేఱు వేఱు కాదు.

ఇట్లు జ్ఞానాజ్ఞానముల అభేదమే సిద్ధించగలదు. అట్లు సిద్ధించుకుని, పరిచ్ఛేద రహితుడవై ఉండు. ఒక చిత్రకారుని చిత్రములోని చిత్రత్వము, ఆ చిత్రమునకు సంబంధించిన చిత్తములోని జ్ఞానము ఒక్కటే కదా! అట్లాగే చైతన్యములోని జగత్ సంబంధమైన స్ఫురణ స్వభావము, జగత్తుకు సంబంధించిన జ్ఞానము ఒక్కటే. ఈ సిద్ధాంతమును అనుసరించి ఈ జగత్తు చైతన్యమేగాని మరింకొకటేదీ కాదు. ఇది గ్రహించి ఊహాజనితమైన గంధర్వనగరముయొక్క అధిష్ఠానమైన ఆకాశము యొక్క మధ్య భాగం వలె సర్వదా స్వస్థుడవై ఉండు. ఈ జగత్తు సృష్టికాలంలో ఉంటోంది. సృష్టికి ముందు, ప్రళయానంతరం లేకుండా పోతోంది. చైతన్యం మాత్రం కాలాతీతమై, సృష్ట్యాతీతమై సర్వదా యథాతథంగా ఉంటోంది. అట్టి నిర్మల-నిర్విషయ చైతన్యమే నీవు. ఇది గ్రహించి ప్రశాంత చిత్తుడవై మౌనస్వరూపం వహించి ఉండు. ఇక ఏది ఎట్లా ఉండాలో అట్లే ఉండుగాక! నీ యథాతథ స్థితికి వచ్చే లోటేమున్నది?

**విద్యాధరుడు :** హే సద్గురూ! నాదొక చిన్న సందేహం. సృష్టికి ముందు ప్రళయమునకు తదనంతరం ఈ జగత్తు అనబడేది ఉండటం లేదని అన్నారు. కదా! మరి సృష్ట్యాదియందు, ప్రళయానంతరం ఈ జగత్తు ఏ రూపంగా ఎచ్చట దాగి ఉంటోంది?

**శ్రీ భుశుండుడు :** ఒకచోట నిర్మలజలం ఉన్నదననుకో... ఆ జలంలో భావికాలపు నుఱుగు, బుడగలు ఏ రూపంగా, ఎచ్చట దాగి ఉంటున్నాయి? ఏం చెపుతాం? ఒక చిత్రకళాకారుని అద్భుత చిత్రకళా విన్యాసం ఆతని మునివ్రేళ్ళలోను - ఆ మునివ్రేళ్ళు ధరించే రంగులకుంచెలోను ఎట్లా ఒదిగి ఉన్నది? ఒక వాహన చోదకుని చోదకకళ ఆతనిలో ఏ రూపంగా దాగినదై ఉన్నది? అట్లాగే బ్రహ్మము అనంతశక్తియుతమైయున్న కారణంగా అద్దాని మాయా విభాగమునందు ఈ జగత్తు సూక్ష్మరూపమున మహాప్రళయసమయంలో దాగి ఉంటోంది. గాఢ నిద్రలో ఉన్న జీవుడు కేవల నిర్విషయుడై ఉండి కూడా తనయందు జగత్ జ్ఞాపకములన్నీ, కోప - ద్వేష - ప్రేమ - త్యాగాది భావావేశములన్నీ అప్రకటిత సూక్ష్మరూపంలో కలిగి ఉండటమే ఇందుకు మనకు దృష్టాంతం.

జలంలోనుంచే జలరూపమైన బుద్బుదములు అకారణంగా (జలము మరొకటిగా అగుటకు ఏ కారణం లేకుండానే) ప్రకటితమౌతున్నాయి. అట్లాగే బ్రహ్మము నుండి ఎట్టి కారణము లేకుండానే ఈ సృష్ట్యాదులు కూడా ఉద్భవించినట్లు కనిపిస్తున్నాయి. స్వయంగా అకారణమై ఉన్న బ్రహ్మము నందు సృష్టి రచనకు కారణమేదీ ఉండజాలదు. కనుక ఈ జగత్తులనబడేవేవీ ఉత్పత్తి కాజాలవు, నశించజాలవు. కారణము యొక్క అభావముచే... ఈ జగత్తు లేశమైనా ఉద్భవించటంలేదు సుమా! ఎండమావులలో జలము ఉద్భవించటానికి కారణం లేకపోయినా, జలం కనిపిస్తున్నట్లు... ఈ జగత్తు అజ్ఞానముచే అనుభూతమౌతోంది. కనుక... "బ్రహ్మము బ్రహ్మముగానే బ్రహ్మమునందు సృష్టి - స్థితి - లయ విన్యాససమన్వితమై ఉంటోంది" అని; "నేను నేనుగానే నాయందు ఈ సృష్టి. స్థితి, లయ ప్రదర్శిత రూపుడనై క్రీడగా, లీలగా, సరదాగా విన్యాసములు సలుపుచున్నాను" - అని గమనించు, గ్రహించు.

కాబట్టి ఏ 'సృష్టి' అనబడేది నీకు ఉన్నట్లుగా అనిపిస్తోందో... అదంతా 'అజమై (జన్మ రహితమై), శాంతమై, అనంతమై, అఖండమైనట్టి బ్రహ్మమే, నని గ్రహించి ఉండు. నీవు బ్రహ్మ స్వరూపుడవే! ఇది గ్రహించి శిలామధ్యభాగ కోశమువలె ప్రశాంతుడవై జన్మకర్మాది రహితుడవై, అవయవరహితుడవై చెన్నొందుము.

పరమాత్మ జన్మాది రహితుడు. స్వాభావిక నిత్యానందస్వరూపుడు. అందుచేత అతనికి కార్య నిమిత్తమైన ఎట్టి ప్రయోజనం యొక్క అపేక్ష ఉండదు. అందుచేత ఆయనయందు సృష్ట్యాది కార్యాలు అసంభవాలు. ఏదేది అతనియందు దీపించుచున్నదో... అదంతా అజమగు శివరూపమే అయి ఉంది. అప్రబుద్ధుల దృష్టిలో ఏ శివం, అజం, చిద్రూపం అగు బ్రహ్మం ఏమరపాటు పొందుతోందో ...అట్టి మూర్ఖ విలాస దృష్టికి కనబడే సృష్టి యొక్క నాశోత్పత్తులతో నీకు భావావేశాలతో కూడిన సంబంధం అవసరమే లేదు సుమా! ఆత్మజ్ఞుల అనుభవం అట్లాగే ఉంటోంది. ఇక అజ్ఞుల అనుభవం నీకెందుకు? ఆత్మజ్ఞుల అనుభవము మాత్రమే నీకు అనుసరణీయం కదా!

అప్రబుద్ధులు బ్రహ్మమును ఏమరిచి దృశ్యమును మాత్రమే చూస్తున్నారు. ఇక అర్థప్రబుద్ధులు "ఎక్కడెక్కడ బ్రహ్మము ఉంటే అక్కడక్కడ జగత్తు (దృశ్యము) కూడా ఉండనే ఉంటోంది"... అను

విచారణను ప్రకటిస్తున్నారు. ఈ రెండూ అవగాహనలు అసంపూర్ణములే గాని, పూర్ణార్థములు కావు. ఎందుకంటే "బ్రహ్మము వేఱు-దృశ్యము వేఱు"... అనే అభిప్రాయం ఇక్కడ వినబడుతోంది కదా! అయితే, ఈ కనబడే తృణం (గడ్డి), కాష్ఠం (కట్టె), జలం, కుడ్యం (గోడ) మొదలైనవాటినన్నిటా పరబ్రహ్మమే స్థితినొందియున్నది. ఈ సృష్టి సమూహములన్నీ పరబ్రహ్మమునందే పరస్పరం గ్రుచ్చబడి ఉన్నాయి. ఇక్కడొక్క విషయం! అయితే...

**బ్రహ్మణః కః స్వభావో అసావితి వక్తుం న యుజ్యతే**
**అనంతే పరమే తత్త్వే స్వత్వాస్వత్వాత్య అసంభవాత్॥**

"ఇదియే బ్రహ్మము యొక్క స్వభావం" అని నిర్ణయించి చెప్పటానికి వీలేలేదు. ఎందుచేత నంటావా? అనంతమై, అద్వయమైనట్టి పరబ్రహ్మమునందు 'నిజస్వభావము - పరస్వభావము' మొదలైనవన్నీ అత్యంత అసంభవములైనవై ఉన్నాయి. అయ్యది అభావము అని అందామా? అప్పుడు "భావము అది కాదు"... అని అనవలసి వస్తుంది. పోనీ "అది భావనామాత్రము" అందామా... నిర్మల పరమాత్మ భావాభావముల దోషముచే పరిమితమైనదగుచున్నది. కనుక పరమాత్మయందు "స్వభావము" మొదలైన దుష్ట (పరిమిత) వచనములకు చోటు లభించదు.

ఓ సాధూ! కాస్త విచారణ చేసి చూస్తే "బ్రహ్మమునందు అహమ్ - త్వమ్ మొదలైనవి సంభవించనేరవు"... అని సుస్పష్టం కాగలదు. పరబ్రహ్మము నిత్యమైనది. అనంతమైనది. సర్వస్వరూపమైనది. అందులో నేను, నీవు, వారు అనబడునదంతా ఎట్లా ఉంటుంది? వాయువులో - "నీ వాయువు, నా వాయువు, వారి వాయువు", అగ్నిలో - "నీ అగ్ని, మా అగ్ని, వారి అగ్ని", భూమిలో - "నీ భూమి, నా భూమి, వారి భూమి" ... ఉంటాయా? వ్యవహారరీత్యా ఉన్నప్పటికీ, వాటి మొదలు-చివరలలో భ్రమయే దాగి ఉన్నది కదా!

అట్లాగే అద్దాని వ్యావర్తక పదార్థమనతగిన స్వ-త్వ (Sense of self) భావన కూడా ఉండ జాలదు. కనుక పరబ్రహ్మముపట్ల "స్వభావవచనము" కూడా సిద్ధించజాలదని, సంభవించనేరదని చెప్పటమైనది. ఏ ఏ "అహం-త్వమ్-సః" భావనలు (ఈ జీవునకు) అనుభవమౌతున్నాయో అవన్నీ బాలుడు చీకటిలో చూచే బేతాళునివలె భ్రమచేతనే అనుభవమౌతున్నాయి. అట్టి అల్పానుభవం శాస్త్రాచార్యుల అనుభవంతో పరీక్షించి తత్త్వదృష్టితో చూస్తే తప్పక నశించిపోతుంది.

జగత్తు బ్రహ్మము వేఱు వేఱు కాదు! జగత్తు - బ్రహ్మము అను శబ్దముల భేదమేదైతే ఉన్నదో... అది వాస్తవానికి అభేదమే అయి ఉన్నది. ఈ రెండూ పర్యాయపదములే. ఆభరణం - బంగారం, బంగారు ఆభరణం అను అభేద రూప శబ్దములవంటివే అవి. "రాహువు యొక్క శిరస్సు" అనునది (గ్రహణకాలంలో భూ - చంద్ర - సూర్యుల చలన సమయంలో సంభవించే) క్రీనీడమాత్రమేగాని, నిజమైన శిరస్సు కాదు కదా! అట్లాగే జగత్తు బ్రహ్మముల భేదం వికల్పము మాత్రమేనని విజ్ఞులు నిర్ణయిస్తున్నారు.

❖❖❖

## 7. తటస్థ భావముతో జగద్దర్శనం

**శ్రీ విద్యాధరుడు :** ఓ భుశుండ మహాశయా! మీరు చెప్పే జగత్-బ్రహ్మముల పర్యాయపదత్వం యుక్తియుక్తమే.. అయితే మా సాంసారిక దృష్టికి ఈ జగత్తు నిర్వికారమగు బ్రహ్మముగా ప్రాప్తించటం లేదు.

**శ్రీ భుశుండుడు :** ఔను! అభ్యాసవశంచేతనే అట్టి దర్శనము సంభవం. జితేంద్రియుడైనవాడే ఈ జగత్తు యొక్క బ్రహ్మముతోటి అభేదమును దర్శించగలడు. ఇంద్రియ విషయములచే చంచల మనస్కుడైనవాడు సంసారబద్ధుడై జన్మ-జరా-సుఖ-దుఃఖాది అనుభవ పరంపరలనే పొందుచున్నాడే గాని, ఇద్దానిని నిష్కళంక బ్రహ్మముగా గాంచలేకపోతున్నాడు. ఎవడైతే 1.స్త్రీ యొక్క వస్త్రరహితమైన కోమల అవయవాలు తనను తాకుచున్నప్పుడు. 2.శస్త్రములు తనను తాకుచు న్నప్పుడు... ఆ ఉభయ అనుభవములలోను వికారరహితుడై సమముగా ఉంటున్నాడో... అట్టి జితేంద్రియుడే జగత్తు యొక్క బ్రహ్మత్వమును దర్శించగల పరమపదము నందు నెలకొని ఉండగలుగుచున్నాడు.

కనుక ఓ విద్యాధరా! శస్త్రముల ఆఘాతములుగాని, స్త్రీల యొక్క అవయవములు గాని ఈ దేహమునకు సోకినప్పుడు "వీటితో అనివార్యంగా సంబంధం కలుగుచున్నప్పటికీ ఈ సంబంధము వస్తుతః మిథ్యయే. లేక ఇది విరసమే"... అని ఎఱిగి జాగ్రత్తునందే సుషుప్త మౌనస్థితిని సంపాదించుకో. అట్టి ఘనీభూతమైన సర్వ సమస్థితి అనబడే సుషుప్త మౌనం అలవడేవరకూ పురుషప్రయత్నముచేతను, ధైర్యం చేతను ఇంద్రియ .జయమును అభ్యసించు. నీవు సంసారములోనే ఉండవచ్చు గాక! ఈ సంసారము నీయందు ఉండవలసిన అగత్యమేమున్నదో చెప్పు?

**యథా భూతార్థ తత్త్వజ్ఞ మాధయో అగ్రగతా అపి ।**
**న మనాగపి లింపన్తి పయాంసీవ సరోరుహమ్ ॥**

కమలము జలంలో ఉన్నప్పటికీ ఆ జలం కమలమును స్పృశించలేకపోతోంది కదా! యథార్థమగు తత్త్వజ్ఞానము ఎఱిగిన జ్ఞానిని తీవ్ర మానసిక వ్యధలు కూడా లవలేశమైనా స్పృశించజాలవు. ఓ ప్రియ విద్యాధరా! అందుచేత మరల చెప్పుచున్నాను విను. స్త్రీ కోమల అవయవాలుగాని, శస్త్రముల ఆఘాతము (బాణపు దెబ్బలు) గాని తన శరీరమును తాకుచున్నప్పటికీ వికారరహితుడై, అతీతత్వము వహించిన వాడై 'ఆకాశము' వలె తాకబడజాలక ఎవడైతే ఉంటాడో... అట్టి శాంతుడగు మహాత్ముడే ఈ దృశ్య జగత్తు యొక్క వాస్తవతత్త్వమును దర్శించగలుగుచున్నాడు.

మట్టి మట్టిగా ఉంటూనే ఘటరూపంగా తయారగుచున్నది కదా! ఆ ఘటం (కుండ) మట్టి కన్నా వేఱుకాదు కదా! అట్లాగే ఆత్మ కూడా ఆత్మగా ఉంటూనే ఈ 'జీవుడు' అను రూపాన్ని దాల్చుతోంది. ఆత్మను గురించిన జ్ఞానంచే జీవరూపత్వం నశిస్తోంది. ఒక నటుడు తన వ్యక్తిత్వం కోల్పోకుండానే... నాటకంలో తాను నటిస్తున్న పాత్రయొక్క లక్షణాలు ధరించి నటిస్తున్నాడు కదా!

ఈ సుదీర్ఘ వేదాంత ప్రవచనం యొక్క సారమంతా ఇంతే. విషమును గుళికగా తయారు చేశామనుకో. ఆ గుళిక ఒకానొక ఆకారము పొందినప్పటికీ తనయొక్క "దేహమును చంపుట"

అను విషస్వభావమును విడచుటలేదు కదా! చిద్రూపమగు బ్రహ్మము కూడా తన స్వభావమును విడువకయే ఈ జడ-అజడమగు జీవరూపమును ధరిస్తోంది. ఓ స్వభావ మాధుర్యమగు ఆత్మ స్వరూపుడవగు విద్యాధరా! నీవు బ్రహ్మమువేగాని జీవుడుగా పరిణమించటం లేదని గ్రహించు.

ఈ సృష్టి ఏ క్షణమందు కూడా బ్రహ్మం నుండి వేఱు కాదు. వేఱు కానప్పటికీ వేఱుగా ఉన్నట్లు అనిపిస్తోంది. ఇదంతా వాస్తవానికి బ్రహ్మమునందే ఉన్నది. బ్రహ్మంగానే ఉన్నది. బ్రహ్మమే జీవుడు రూపంగా పొందుచున్నది. జనన మరణ రహితమగు బ్రహ్మమే జనన-మరణాల మధ్యగా ఉన్నట్లు అనిపించే ఈ జీవుడు సుమా! ఇది అనుభవమయ్యేది ఎట్లా? అందుకు ఉపాయం ఒక్కటే! ఈ దేహేంద్రియములందు తద్విషయములైన శబ్ద, స్పర్శ, రూపాదులందు అహంకార-మమత్వ రూపమైన ఆసక్తిని జయించాలి. గురుశుశ్రూష, శ్రవణ, మననాది సాధనాలు చేపట్టాలి. స్వ-ప్రయత్నం చేత మాత్రమే ఈ సంసారసాగరం గోష్పాద జలం వలె దాటబడుచున్నది. అంతేగాని ఏదో దైవం (అదృష్టం) చేత కాదు. స్వప్రయత్నం, వివేక దృష్టిని వీడి "ఎవరో నన్ను తరింప జేస్తారులే"... అని అనుకుంటూ ఊరకొని ఉండటం ఉచితమే కాదు.

ఓ బిడ్డా! ఈ దృశ్యజగత్తులో ఇంద్రియాలకు ప్రియాలుగా అనిపిస్తున్న కొన్ని వస్తువులు తారసపడవచ్చు గాక! సర్వ సాంసారిక సుఖములకంటే, సమస్త ప్రియతమ పదార్థములకంటే ఆత్మ సుఖమే అత్యుత్తమమైనది. అది నీయందే సర్వదా వేంచేసి వేచియే ఉన్నది. ఎప్పుడైతే అంతః కరణంలో ఆత్మసుఖరూపమైన శీతలత్వం ఉదయిస్తుందో... అప్పుడా జీవుడు పరమ దరిద్రుడై ఉండి కూడా పూర్ణమగు ఆత్మ విశ్రాంతిని బడయగలడు. ఎప్పుడైతే ఈ మనస్సు, బుద్ధి, అహంకారము మొదలైనవన్నీ సమస్తము యొక్క 'సత్తాసన్మాత్రము' అగు బ్రహ్మమునందు లయిస్తాయో... ఇక అట్టి నిర్మలబ్రాహ్మీస్థితి యందు కళంకమెచ్చట? కనుక ఓ విద్యాధరా! ఈ జగత్పదార్థములను తటస్థ భావంతో దర్శించటం అభ్యసించు.

**తటస్థ భావన -** ఈ జగత్తులో అనేక వస్తువులను తటస్థభావంగా చూడటం ఈ జీవునకు క్రొత్తేమీ కాదు. అపరిచితులను, అసంబంధితమైన ప్రాపంచిక వస్తువులను, నూతన ప్రదేశములను ఇంకా ఎన్నిటినో తటస్థభావంతో చూస్తూనే ఉన్నాడు కదా! అట్లాగే 'అహంత్వం' అను దానిని అతిక్రమించి ఉండు. ఈ శరీరమును, మనస్సును, బుద్ధిని, చిత్తమును, అహం అను దానిని కూడా తటస్థభావంతో గాంచుచూ ఉండు.

**సాక్షి స్వరూపం -** అటు తరువాత క్రమంగా సర్వసాక్షీస్వరూపము సంతరించుకో. సర్వసాక్షీ స్వరూపుడవై ఇటు బాహ్య జగత్ పదార్థాల, అటు అభ్యంతరాలగు మనోబుద్ధ్యాదుల -అనుభవాన్ని పొందవద్దు. అనగా, అంతరంగంలో వాటికి స్థానం కేటాయించనే వద్దు. ఆ అనుభవాలకు ఆవల సాక్షీమాత్రుడవై ఉండు. అనగా స్వాభావిక 'చిత్' యందు స్థితి కలిగి ఉండు. అట్టి జ్ఞానస్థితిని సుస్థిరీకరించుకున్న తరువాత ఇక ఈ సుఖ దుఃఖాదుల మధ్య నీవు ఉన్నా, ఉండకున్నా ఒక్కటే. ఎందుకంటే అవి నిన్ను తాకజాలవు కదా! అట్టి శుద్ధాత్మస్థితియందు కర్తృత్వ - భోక్తృత్వములు

ఉండజాలవు. అట్టి స్థితిని నీకుగా నీవే సముపార్జించుకోవాలి సుమా! అయితే శాస్త్రములు, గురువాక్యములు నీకు సహకరించుట కొరకై ఉన్నాయి.

❖❖❖

## 8. అహంభావము కల్పిత మాత్రమే!

**శ్రీ విద్యాధరుడు :** అయితే, 'అహంభావన' అనునదంతా కేవలం కల్పితమాత్రమేనంటారా?

**శ్రీ భుశుండుడు :** అవును. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. ఒక దృష్టాంతం చెబుతాను. ఆకాశం సర్వత్రా వ్యాపించి ఉన్నది కదా! అందులో "తూర్పువైపు ఆకాశం – పశ్చిమ దిక్కున గల ఆకాశం – పైనున్న ఆకాశం – క్రింద ఉన్న ఆకాశం – కుండలో గల ఆకాశం... మొదలైనవన్నీ ఆకాశమునందు ఒనర్చబడే ద్వితీయాకాశకల్పనయే కదా! ఇంటికి లోపలి ఆకాశం – ఇంటికి బాహ్యమున గల ఆకాశం"... అనేదంతా కల్పన గాక మరేమిటి? అట్లాగే ఈ అహం – త్వమ్ – సః మొదలైనవన్నీ కూడా! అవన్నీ ఆత్మయందు భ్రాంతిచే కల్పించబడినవి మాత్రమే. "మహాకాశంలో ఈపైన కనబడే ఆకాశం కల్పించబడునది" అను దృష్టిగల ద్రష్టయొక్క అనుభవము ఎట్టిది? భ్రమయే కదా! అట్లాగే ఆత్మపట్ల అవిద్యచే కల్పన చేస్తున్న ద్రష్ట, ఆతని తదితరమైన దర్శనము.... ఇదంతా ఆత్మయేనని గ్రహించు. కల్పకుని చిద్రూపమే తనయొక్క సంకల్పాత్మక దేహమును 'జగత్తు'గాను, 'అహం'గాను తదితర 'త్వం' ఇత్యాది రూపములుగాను దర్శిస్తోంది. కాబట్టి 'నేను' అనే అహంకారంగాని, ఈ జగత్తుగాని అవిద్యయే తప్ప మరింకేమీ కాదు.

పంచభూతములన్నిటిలో కెల్లా ఆకాశము అతి సూక్ష్మమైనది. అయితే పరమసూక్ష్మమైనది – సమస్త స్థూల కల్పనలకు అధిష్ఠానమైనది అగు బ్రహ్మమునకు ఎదురుగా ఈ ఆకాశము అత్యంత స్థూలమైనదిగా గ్రహించు. అట్టి సూక్ష్మాతిసూక్ష్మమైన చిదాకాశమొక్కటే ఉనికిని కలిగి ఉంది. ఆ చిత్తు యొక్క కల్పనయే ఈ జగత్తంతా కూడా! అట్టి ఆకాశం కంటే కూడా అతి సూక్ష్మమైన చైతన్యం అహం, ఇదం (నేను, ఇది) అను రూపవాసనలను ఆశ్రయించి ఉత్తరోత్తరా ఈ దేహ, దృశ్య, జడ దాదులు పొందుతోంది. తనయందు స్వభావమును కల్పన చేసుకొని ఆ తదనంతరం 'తదితరమైనది' అను రూపంగా తనకు అన్యముగాని ఈ జగత్తును దర్శిస్తోంది.

**చిత్తు యొక్క కల్పనయే ఈ సృష్టి -** జలము ఆవర్తము, తరంగము, సుడిగుండము మొదలైనవి ప్రదర్శిస్తున్నప్పటికీ జలం జలంగానే ఉంటోంది కదా! చైతన్యము యథాతథంగా ఉంటూనే చమత్కారంగా జగత్తుగా అగుచు, తత్‌జగత్తును పొందుచున్నది. ఆత్మచైతన్యము 'అహం' అనబడు వివర్తము పొంది, ఈ విస్తార జగదనుభవమునకు తానే కారణకారణమై ఉంటోంది.

**ప్రళయం -** చిత్తు వివర్తరూపంగా (జగత్తుగా) విస్తారమొందుచున్నదని అనుకున్నాం కదా! ఒకానొకప్పుడు జగద్భావనను తనయందే ఉపశమింపజేసుకుంటోంది. తరంగాలన్నీ ప్రశాంత జలంలో లయమగుచున్నట్లు అది జగద్భావనను తనయందు లయింపజేసినప్పటి స్థితే 'జగత్ప్రళయం' అను పేరుతో చెప్పబడుతోంది.

ఈ ప్రకారంగా ఈ దేశకాలాదులన్నిటియందు చిత్తు యొక్క ప్రసరణ (వ్యాప్తి)యే సిద్ధించి ఉన్నది. చిత్తు యొక్క ఉనికిచేతనే దేశ – కాలములు, ఆకాశము, జలము, స్థలము, స్వప్నము, జాగ్రత్తు, జాగ్రత్తులోని మనోరాజ్యము... ఇవన్నీ అనుభవం కాగలుగుచున్నాయి. జగదనుభవ మంతా చిత్తుదే... చిత్తుకే! అందుచేత అది "ఒకచోటి నుండి మరొకచోటికి పోవటం"... అనే వికారము పొందటం లేదు. అద్దానికి విస్తరణముగాని, సంకోచముగాని అసంభవం.

కాబట్టి ఈ జగత్తుయొక్క ఉత్పత్తిగాని, వినాశనముగాని కేవలం అజ్ఞాన సిద్ధములే గాని... వాస్తవములైనవి కావు. ఇద్దరు కూర్చుని చెప్పుకునే 'కథ' లోని కథాసంఘటనల వంటివి. ఆకాశము ఒకచోట నిర్మలంగాను మరొకచోట కాంతిసమన్వితమైన వస్తువులతోను, ఇంకొకచోట చీకటి మయంగాను ఉంటున్నట్లే, చిదాకాశం ఒకచోట జ్ఞానమయంగాను, మరొకచోట అజ్ఞానమయం గాను ఉండటమే ఇక్కడి చమత్కారం.

ఈ దృశ్యము, ఈ జగత్తు, ఈ సుఖ దుఃఖములు మొదలైనవన్నీ మనస్సుకు సంబంధించిన వికారాలు మాత్రమే గాని... ఆత్మ ధర్మములు కావు. ఆత్మ సర్వదా జ్ఞానయుతమైయున్నది.

**జ్ఞశ్చేతతి న భోగాది, న చైవ ఆత్మన్ అన్యసావహమ్ ।**
**ద్రవత్వమ్ అంభసీవ అంతర్ అద్వితీయ పరే స్థితః ॥**

జ్ఞానమాత్రమగు ఆత్మ విషయజనితములగు భోగ – దుఃఖాదులతో చిక్కుకునేది కానేకాదు. అంతేకాదు అద్దానియందు "నేను–నీవు–మేము–మీరు"... మొదలైన వ్యవహారములు ఉండవు. జలంలో ద్రవత్వం స్వభావసిద్ధమై ఉన్నట్లుగా... ఆత్మ సర్వదా తన కూటస్థ స్వభావముననే ఏర్పడి ఉంటోంది. ఆత్మ సంకల్పములకు ఆవల ఏర్పడి ఉన్నదని గ్రహించు. సంకల్పములకు ఈవల మాత్రమే చింత, లజ్జ, హర్షము, భయము, స్మృతి, కీర్తి, ఇచ్ఛ మొదలైన మనోవృత్తులు సంకల్ప రూపమున ఉంటున్నాయి. కనుక ఆత్మ మనోవృత్తి సంబంధితమైనది కాదు సుమా! బ్రహ్మము చంద్రబింబము వంటిది అగుచుండగా... ఆ చంద్రబింబము ప్రతిబింబిస్తున్న జలమువంటిది ఈ సృష్టి. ఈ నేత్రాదులకు కనబడే జ్ఞానం చంద్రకిరణముల వంటిది. బ్రహ్మము – ఈ సృష్టి – దేశ – కాలములచే స్పృశించబడేది కాదు. జలంలో చంద్రప్రతిబింబం కనబడుచున్నంతమాత్రంచేత ఆకాశములోని బింబచంద్రుడు జలతరంగములచే స్పృశించబడటం లేదు కదా! పరమాత్మ సర్వదా తనయందు తానే తన నిజస్వరూపమునకు వేఱుకానట్టి జగదాకారంగా తనయొక్క సర్వసమాన్య సచ్చిదానంద రూపముచే స్ఫురిస్తున్నారు. అయితే "దేహములు" అనబడు ఒకానొకచోట విశేషాభిమానంచే జీవులు మానసిక చింతాయుతులై ఉంటున్నారు. 'అహంకారాత్మ'గా తమ స్వరూపమే వేఱుపడినట్లు స్ఫురిస్తున్నారు. అది జలమందు ప్రతిబింబించే ఆకాశాదులవంటివి మాత్రమే. ఈ సమస్త జీవ – బంధ – మోక్షాదులతో కూడిన జగద్రూపమంతా ఆత్మయందు కల్పితమై, భ్రాంతి దృష్టికి కనిపించేదేగాని ఆత్మయందు అవి లేవు. ఆత్మ వాటియందు లేదు. కథ అనునది కవియొక్క కల్పనయే అయినప్పటికీ,... కవిని కథలో వెతకి పట్టుకోగలమా?

ఈ 'సృష్టి' అనే సరోవరము మజ్జన-ఉన్మజ్జనము (మునగటం, తేలటం) వంటి అనేక శబనీఖిములతోను, భావాభావతరంగములతోను కన్పట్టవచ్చుగాక. ఇదంతా ఎండమావులలో కనిపించే భ్రమపూర్వక జలతరంగములు మాత్రమే.

**శ్రీ విద్యాధరుడు :** మరి ఆ జగత్‌భ్రమ దృష్టి తొలిగేది ఎట్లా?

**శ్రీ భుశుండుడు :** ఆత్మసాక్షాత్కారముచే అవన్నీ ఇట్టే మటుమాయమౌతాయి. ఆత్మకు సంబంధించిన అవగాహనాబలం చేత ఇక ఈ చూచేవాడు, కనబడేదీ, ఉభయము బ్రహ్మముగానే తెలియవస్తాయి. జలమే తరంగములుగా కనిపిస్తున్నట్లు పొగయే మేఘరూపంగా భాసిస్తున్నట్లు - బ్రహ్మమే మనస్సుగాను, జగత్తుగాను (జడ-అజడ రూపములై) భాసిస్తోందనునది అనుభవమౌతుంది. అంపమును కొయ్యపై అదిమినప్పుడు ఏర్పడే ఆవర్తనములు (గీతలు) ఆ కొయ్యకు వేఱుగాను, వేఱైనవి కానివిగానూ కూడా కనిపిస్తున్నాయి చూచావా? అట్లాగే దేశకాలముల వర్జితమైన పరమాత్మయందు ఈ సృష్టికూడా జడ-అజడ రూపములుగా భాసిస్తోంది.

ఆ అజ్ఞాన దృష్టికి కనిపించే సృష్టి మిథ్యమాత్రమే! జ్ఞానదృష్టితో చూచినంతమాత్రంచేతనే ఇది రహితమై పోతోంది. కనుక "ఇది అతి కోమలము"... అనతగినది. అయితే ఇదంతా బ్రహ్మమే కనుక, బ్రహ్మము సర్వదా సత్యమే కనుక ఈ జగత్తు శిలవలె ఘనీభూతమైనదని కూడా అనవచ్చు. స్ఫటిక శిలలో ప్రతిబింబించే అరటి చెట్టు ఎటువంటిదో, ఈ జగత్తు కూడా (జగత్తు అనగా ఆత్మ యందు భావనానుసారం కనబడే ప్రతిబింబమే కాబట్టి) ప్రతిబింబమాత్రమేనని కూడా చెప్పవచ్చు.

ఈ కనబడే వేలకొలది తలలు, కాళ్ళు, నేత్రములు... వాటి వాటి చేష్టలు ఇందులో కనిపించే తర్కవితర్కములు, ఇంకా ఈ దృశ్యంలో విద్యమానమయ్యే దిక్కులు, పర్వతములు, ప్రాణులు, నదులు మొదలైన వాటితో కూడిన ఈ జగత్తంతా అనంతస్వరూపుడగు పరమాత్మ యొక్క అంగుష్ట మాత్రమైన ఒకానొక పరిచ్ఛిన్న విభాగము అని కూడా అనవచ్చు సుమా!

అనగా... ఓ విద్యాధరా! ఏ ఈ జగత్తు నీకు అనుభూతమౌతుందో... ఇదంతా కలిపితే నీ యొక్క అనంత స్వరూపముయొక్క ఒకానొక అంగుష్టమాత్ర పరిచ్ఛిన్న విభాగము మాత్రమే! ప్రతి ఒక్క జీవుని విషయంకూడా ఇట్టిదే! - అని వివేక దృష్టితో గ్రహించు.

**శ్రీ విద్యాధరుడు :** స్వామీ! ఈ జగదత్వమంతా కలిపి నా ఆత్మ అనబడు అనంత స్వరూపం యొక్క ఒకానొక పరిచ్ఛిన్న విభాగంగా, అంగుష్ఠమాత్రంగా నిరూపిస్తున్నందుకు మీకు ధన్యవాదాలు. ఇదంతా ఆత్మయేనని తెలుపుటచే మీరు నాకు సద్గురువులయ్యారు. అనంతస్వరూపమగు ఆకాశాన్ని పరిమిత స్వరూపాలగు మేఘాలు కప్పి ఉంచినట్లుగా భ్రమింపజేసినట్లు ఈ జగదత్వం నా అప్రమేయ -నిర్వికల్ప స్వరూపాన్ని కప్పి ఉంచుతోందే! ఏమీ ఆశ్చర్యం! ఈ ప్రతిబంధకం తొలిగేది ఎట్లా?

**శ్రీ భుశుండుడు :** (చిరునవ్వు చిందిస్తూ) బిడ్డా! ఈ జగత్తు అసారమైనది. పైకి అనేక ప్రకారములైన కామాదులతో రంజితమై పటాటోపంగా కనిపిస్తోంది. లోనంతా శూన్యము (మిథ్య) మాత్రమే. అటువంటి ఈ జగత్తు కేవలము తీవ్రవైరాగ్యముచేత మాత్రమే తుడిచివేయబడగలదు.

❖❖❖

# 9. చంచల మనస్సే జగత్తు యొక్క రూపం

**శ్రీభుశుండుడు:** ఓ విద్యాధరా! ఈ జగత్తంతా సుర-అసుర-గంధర్వ-విద్యాధర-మహోరగాది సహితంగా అనేక సంరంభాలతో కనబడుతోంది కదా! అయితే ఇదంతా కూడా జడమైన వాయువు చేతనూ, సూత్రాత్మచేతనూ సంచలనశీలమై ఉంటోంది. అట్టి జగత్తంతా ద్రష్టయొక్క చైతన్యం చేతనే ప్రకాశితమౌతోంది. అట్టి ద్రష్ట చైతన్యమే పరమాత్మ చైతన్యమని గ్రహించు. ఒక చమత్కారమైన చిత్రకారుడు ఒక వస్త్రముపై "రాజసౌధం, తటాకాదులు, వీథులు" మొదలైనవాటితో కూడిన నగర సౌందర్యాన్ని చిత్రించాడనుకో... అదంతా వస్త్రముపై తాకించిన రంగుల మేళవమే కదా! అయితే చూచేవానికి అనేక వికల్పములతో బహురమణీయంగా అనేక విశేషములతో స్ఫురించవచ్చు గాక! పరిశీలనాత్మక దృష్టి కలవానికి అది వస్త్రము - రంగుల మేళవింపుకాక మరింకేమీ కాదు. అట్లాగే అనేక వికల్పాలతో కూడి 'మనస్సు' అను వస్త్రంపై చిత్రీకరించబడిన 'జగత్తు' అనబడే ఈ చిత్రం ఆత్మ విచారణచే తన వికల్పత్వం కోల్పోతుంది. అనేక వికల్పాలు జగత్తులో లేవు. మరి? ద్రష్ట యొక్క మనస్సులోనే ఉన్నాయి! జలంలో పడిన నూనెచుక్క జలం యొక్క కదలికచే నలువైపులా విస్తరిస్తోంది చూచావా? మనస్సు చంచలమై బ్రాహ్మీస్వరూపమగు జగత్తు ఆ మనస్సు నందు ప్రతిబింబించు నప్పుడు అనేక సరస - విరసానుభూతులను కలుగజేస్తోంది. అట్టి దర్శనమే సంసారము.

ఈ సంసారము హృదయమునకు గొప్ప క్షోభ కలుగజేస్తోంది. మనస్సంతా నామ, రూప, గుణ వాసనామయమై ఉండగా హృదయం దృశ్యానికి బంధితమౌతోంది. స్త్రీ, పుత్ర, ధనాది వ్యవహారాల పట్ల ఏర్పడే రాగమే ఈ సంసారానికి జీవుని కట్టి ఉంచు కట్టుత్రాళ్ళు. "అట్టి ఈ సంసారం మిథ్యయే"... అని ఆత్మజ్ఞాని మాత్రమే ఎఱుగుచున్నాడు. ఇది శబ్దస్పర్శాదుల ఆస్వాదనచే సుదీర్ఘంగా విస్తరించి ఉన్నది. మనం చెప్పుకున్నట్లు, వస్త్రముపై చిత్రమువలె ఇది హృదయముననే తిష్టవేసుకొని ఉన్నది. ఈ విధంగా అది చైతన్యం "అహంభావం" మొదలుగా గల వికల్పాలను ఆశ్రయిస్తోంది. ఆశ్రయించి బహిర్ముఖమౌతోంది. బహిర్ముఖమై జీవత్మం పొందుతోంది. అయినా కూడా చైతన్యం సర్వదా చైతన్యముగానే ఉంటోంది. జలం తరంగాలుగా అయినా కూడా జలం జలంగానే ఉంటోంది. కదా! మట్టి బొమ్మగా అయినా కూడా మట్టి మట్టిగానే ఉంటోంది కదా!

వాస్తవానికి పరమాత్మకంటే వేరైనది ఎక్కడా ఏదీ లేదు. 'చైతన్యం' అనే సూర్యుడే ఈ ఉపాధి యందు ప్రవేశించి తద్ద్వారా 'అహం' మొదలైన పేర్లను సంపాదించుకున్నవాడై ఇక ఈ సృష్టిగా అగుచున్నాడు. యథార్థానికి చైతన్యమునకు అన్యంగా స్రష్టలేదు, సృష్టిలేదు.

జలం తరంగత్వం వహిస్తున్నప్పుడుకూడా జలంగానే ఉంటోంది. తరంగాలు మాత్రం కదలుచున్నాయి. తరంగానికి ఆకారం ఉన్నప్పటికీ, జలం సర్వదా ఆకార రహితమే! జలము యథాతథంగా ఉంటూనే ఎట్లా చలనరూపసత్తయందు చలనరహితంగా ఉంటోందో... అట్లాగే ఆకాశము మొదలైన వాటితో కూడిన ఈ ప్రపంచమును రచిస్తూనే, చిదాత్మ ఈ ఆకాశాదుల

రూపంలో లేదు. కథారచయిత పాత్రల కల్పనకు కారకుడై ఉంటూనే, ఆ పాత్రలన్నిటికంటే విభిన్నుడై ఉన్నట్లు, చిదాత్మ జగత్తుకంటే విశిష్టరూపమై ఉన్నది. అంతేకాదు! పాఠకుల అభిరుచికొరకై కదా, కథారచయిత కథ, పాత్రలు రచించేది! అభిరుచిని అనుసరించి సాహిత్యం ఉంటోంది. ఈ జగద్రచన కూడా జీవుల అభిరుచిని అనుసరించే రచించబడుతోందని గ్రహించు. అందుచేత జగత్తు భ్రాంతి మాత్రమే.

మరొక రహస్యం. ఈ జగత్తుకు చిదాత్మ కర్త కూడా కాదు. అది వానిని ఎఱుగుటయులేదు. జలమునకు తరంగకర్తృత్వం ఆపాదితం అయినట్లు జగత్తుయొక్క కర్తృత్వం చిదాత్మకు ఆపాదించబడుతోంది.

**శ్రీ విద్యాధరుడు :** మహాశయా! మరి ఈ మనస్సు మొదలైనవాటికి సంబంధించిన వర్తమానానుభవమును ఏ విధంగా అన్వయించుకోవాలి?

**శ్రీ భుశుండుడు :** ఈ మనస్సు, అహంభావము, బుద్ధి మొదలైనవన్నీ "అవిద్య" చేతనే ఏర్పడినవై ఉంటున్నాయి. పురుష ప్రయత్నబలంచేత అవి తప్పక నశిస్తాయి. ఆత్మకు అన్యమైనది లేదు అని గురు వాక్యం. కాబట్టి వాటిని ఆత్మ స్వరూపములే అని భావిస్తూ ఉండు.

పురుష ప్రయత్నం అంటే – 1. శాస్త్రములలో చెప్పిన విధి విధానములను నిర్వర్తించటం, 2. శాస్త్రార్థములను వివేకముతో విచారణ చేయటం, 3. పుత్ర, దార, ధనాదులందు మమకారం (ఇవి నావి, నాకు చెందినవనే భ్రమ) తొలగించుకోవటం, 4. మనస్సును చంచలత్వము నుండి ఉపశమింపజేయటం.

ఇట్టి పురుష ప్రయత్నబలంచే క్రమంగాగాని, అప్పటికప్పుడే గాని ఆత్మానుభవం పరిఢవిల్ల గలదు. అవిద్య యొక్క అర్ధభాగం తత్త్వవేత్తలతో సంభాషించుచుండగా తొలగగలదు. మిగతా సగభాగం ఆత్మ విచారణచేత, ఆత్మ సాక్షాత్కారంచేత నశించగలదు. భ్రమలన్నీ తొలగితే శేషించేదే సన్మాత్రమగు ఆత్మ.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠమహర్షీ! అవిద్య యొక్క అర్ధభాగం తత్త్వవేత్తలను ప్రసన్నం చేసుకొని, వారితో సంభాషించటం చేతను, మిగతా అర్ధభాగం శాస్త్రవిభాగముచేతను–ఆత్మ సాక్షాత్కారం చేతను... ఎట్లా తొలగుచున్నదో సవివరంగా చెప్పమని నా ప్రార్థన.

అట్లాగే "అవిద్య అప్పటికప్పుడేగాని, క్రమక్రమంగా గాని తొలగగలదు"... అని కూడా అన్నారు. ఇది కూడా విశదపరచమని విన్నపం. "సమకాలముగా గాని, క్రమక్రమంగా గాని"... అనే మాటలకు అర్థమేమిటి?

"అవిద్య తొలగితే నామరూపరహితమగు సన్మయం శేషించగలదు"... అని అన్నారు కదా! 'సత్' అనగా బ్రహ్మము. ఇక 'మయము' అనగా 'నిండి ఉన్నది' అని అర్థం. మయము – అనేది అసత్‌నే సూచిస్తోంది. కనుక "సన్మయము" అనుదానిలో సత్ – అసత్ అంశం లేవేవి ఉన్నాయో అవి విశదీకరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా!

**సుజనేన విరక్తేన సంసారోత్తరణార్థినా ।**
**సహచాపి ఆత్మవిదుషామ్ ప్రసృతిం ప్రవిచారయేత్॥**

ఈ సంసారమును దాటివేయాలనుకున్నవాడు ముందుగా ఈ జగద్విషయాల పట్ల విరక్తిని సంపాదించుకోవాలి. అనగా జన్మ జన్మాంతరార్జితమైన అనురక్తిని ఉపశమింపజేసుకోవాలి. అప్పుడు తదితర ముముక్షువులతో కలిసి "ఈ సంసారము ఎట్టిది? ఎక్కడి నుంచి వస్తోంది? దీని మూల మేమిటి? పరిణామమేమిటి? దీని సారమేమిటి? మనుజుడు ఇద్దాని నుండి తరించేది ఎట్లా?" అనే ప్రశ్నల గురించి విచారణ చేయాలి. ఎడారిలో ఒయాసిస్సులు ఉన్నట్లు ఈ సంసార మహారణ్యంలో ఆత్మజ్ఞులగు సజ్జనులు కూడా ఉన్నారు. అట్టి బుద్ధిమంతుడు, విరక్తుడు, మాత్సర్యరహితుడు అగు మహనీయుని ఎట్లాగైనా సరే, ఎంత ప్రయత్నించైనా సరే... వెదకి సేవాదులచే ఆయన కృపకు పాత్రులు కావాలి. ఆ విధంగా "శుభేచ్ఛ" అను ప్రథమ భూమికను ఉదయింపజేసుకోవాలి. అప్పుడు తప్పకుండా అవిద్య తిరోగమించనారంభిస్తుంది. అవిద్యయొక్క అర్ధభాగం సజ్జనసాంగత్యం చేత తొలగుతుంది. ఇక నాలుగవభాగం శాస్త్రవిభవాలచే – స్వకీయమైన సునిశితావగాహనచే తోక ముడుస్తుంది. మిగతా భాగం ఆత్మసాక్షాత్కారరూపమైన స్వప్రయత్నముచే వైతొలగగలదు.

ఇన్ని మాటలెందుకయ్యా? కేవలం "మోక్షమును నేను సంపాదించాలి?"... అనే తీవ్రేచ్ఛ ముందుగా హృదయంలో జనిస్తే చాలు. అట్టి అభిలాషయే వైరాగ్యాది సంపత్తిని ప్రవృద్ధపరచి ఈ జీవుని సంసారము నుండి, భోగాభిలాషల నుండి బయటకు తీసుకురాగలదు. భోగాభ్యాసం నశిస్తూ ఉండగా స్వప్రయత్నము యొక్క తీవ్రత్వమును అనుసరించి ఈ అవిద్య తొలగగలదు.

1.సాధుజనసాంగత్యము, 2.శాస్త్రవిచారము, 3.స్వప్రయత్నము... ఈ మూడూ ఒకేసారి ఒనగూడితే ఈ అవిద్య ఒక్కసారిగా తొలగిపోతోంది. ఇవి క్రమ క్రమముగా ప్రాపిస్తూ ఉంటే అవిద్య కూడా క్రమక్రమంగానే తొలగుతుంది. అట్లు అవిద్య తొలగగా, ఇక శేషించుచున్న దేమిటో... అదియే 'పరమాత్మ' అను శబ్దముచే ఉద్దేశించబడుతోంది.

ఆత్మ అనబడేది దృశ్యమా?... కాదు. ఎందుకంటే అది దృశ్యమంతటి కంటే పరమ విశిష్ట మైనది. పోనీ అది ద్రష్టయా? దృశ్యం లేనప్పుడు ద్రష్ట కూడా ఉండదు కదా! కనుక అది దృశ్యం గాని, ద్రష్ట గాని కాదు. అయితే...? ద్రష్టగా ఏర్పడియున్నదంతా ఆత్మయే! అదే సమయంలో, దృశ్యమంతా కూడా అదియే! అది నీ యొక్క స్వస్వరూపమే అయి ఉంది (తత్త్వమసి). ఆ పరమాత్మ నామరూప రహితమైనది. అదియే సత్తు. అదియే అసత్తు కూడా!

**శ్రీరాముడు :** "సత్తు – అసత్తు కూడా అదియే" అనేది యుక్తియుక్తంగా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మ అర్థ–క్రియా వ్యవహారానికి విషయం కాదు కాబట్టి (లోకంలో కనిపించే ఒక వస్తువు కాదు కాబట్టి) 'అసత్తు' అనవచ్చు. అదియే అబాధ్యమైన (అది విభాగంగా అవదు కాబట్టి) పరమ పురుషార్థమై ఉన్నది కనుక... అది సద్రూపమే.

ఓ రామచంద్రా! ఈ విధంగా సర్వదృశ్య వ్యవహారాలు తిరస్కరించబడగా అప్పుడు శేషించేదే ఆత్మ. అట్టి మన వాస్తవస్వరూపాన్ని మనం గాని, మరొకరు గాని తిరస్కరించటానికి కుదిరేది కాదు. ఆ ఆత్మ వస్తువు ఆనంద ఘనమైనది. అనంతమైనది. జన్మ జరామరణాది వికారాలు అద్దానికి లేవు. అది సర్వదా ఏకమే గాని... అనేకం కాదు. అద్దాని సమక్షంలో ఈ జీవ-జనన-మరణ జగద్రూపా లన్నీ సంకల్ప స్ఫురణా మాత్రాలేనని గ్రహించు. కనుక ఇవన్నీ కూడా అసత్తుల్యాలు మాత్రమే.

ఓ రామచంద్రా! అట్టి ఆత్మతత్త్వాన్ని ఎఱుగుము. ప్రమాణ, ప్రమాతృ, ప్రమేయాది త్రిపుటీ వ్యవహారమంతా పారద్రోలివేయి. నీవే ఆ బ్రహ్మంగా, పరమాత్మగా అగుము. (అహమ్ బ్రహ్మాస్మి) నిరతిశయరూపం చేత అంతటా వ్యాపించి విహరించు. అంతేగాని, 'ఇది దుఃఖం, అది సుఖం' అనుకుంటూ అప్రమేయ స్వస్వరూపానంద స్థితి నుండి దిగజారనేవద్దు. (బ్రహ్మైవ న బ్రహ్మవిత్)

సరే! ఇక మనం శ్రీ భుశుండ – విద్యాధర సంవాదమును కొనసాగిద్దామా?

❖❖❖

## 10. ద్రష్టయే దృశ్య జగత్తుకు రచయిత

**శ్రీ విద్యాధరుడు :** హే మహర్షీ! ఈ జీవుడు ఎక్కడినుండో వచ్చి ఇక్కడి దేశ కాలాలలో ప్రత్యక్షమగు చున్నాడు. ఇక్కడ ఈ జీవుడు దేహధారణ చేయకముందే దేశకాలాలు ఉండి ఉన్నాయి. కదా! ఈ దేశకాలాలను జీవునికొరకై కల్పించినదెవరు? ఎందుకు కల్పించి ఉంటారు? ఏమి ప్రయోజనాన్ని ఉద్దేశించి దేశకాలాలు కల్పన చేస్తున్నారు? ఆ కల్పన చేసినవారికి, ఇందులో ప్రవేశించిన జీవునికి గల సంబంధమేమిటి? ఆ సంబంధాన్ని కల్పించినది ఎవరు? ఎందుకు? దేశ కాలాలే లేకపోతే జీవుడి ప్రవేశం గాని, జన్మ కర్మలు గాని ఉండేవే కావు కదా! అసలీ జీవుడు ఎందు నిమిత్తం ఈ దేశకాలాలలో ప్రవేశిస్తున్నాడు? ఈ నా సందేహాన్ని సర్వజ్ఞులగు మీరే తొలగించ సమర్థులు.

**శ్రీ భుశుండుడు :** ఓ విద్యాధరా! ఒకచోట ఒక స్తంభము ఉన్నది. అది... "ఆకాశమంతటా ఏర్పడి ఉన్న ఈ వెలుగును నాయందు దాచుకుంటాను. ఎవరికీ దక్కన్వీను"... అని అనుకున్నదట? ఆ స్తంభం అంతటా నిండి ఉన్న వెలుగును మ్రింగి తనయందు దాచుకోగలదా?

**విద్యాధరుడు :** (నవ్వుతూ) స్తంభమునకు అంతా ఏర్పడి ఉన్న వెలుగును తనయందు దాచిపెట్టుకో గలటం ఎట్లా కుదురుతుంది?

**శ్రీ భుశుండుడు :** అట్లాగే... ఈ మాయా జగత్తు యొక్క విస్తారమును దేశ కాలాలు తమయందు దాచిపెట్టుకోలేవు. అసలీ 'జగత్తు' అనబడేది బాహ్యమున ఉన్నదని అనుకుంటున్నావా?... లేదు! దృశ్యమంతా ఉన్నది ద్రష్టలోనే!

ఈ ఇంద్రియ లక్ష్యమగుచున్న 'జగత్తు' అనేది ఆత్మయందు గల మనస్సు యొక్క కాల్పనిక రచన మాత్రమే. వాయువు నందు సుగంధం కళ్ళకు కనబడకుండా దాగి ఉన్నట్లు ఈ 'జగత్తు' అనే రూపంగా అనుభవమయ్యేదంతా అతి సూక్ష్మరూపంగా ద్రష్టయొక్క 'ద్రష్టత్వం' అను స్వకీయమైన

ఆరోపిత స్వభావం నందే దాగి ఉన్నదని గ్రహించు. ఈ దర్శనమంతా కూడా చైతన్యం యొక్క చమత్కారమైన ఒకానొక చిత్కళా విభాగం అని అనవచ్చు.

ద్రష్టచేతనే ఈ జగత్తు పరికల్పించబడి, అనుభవించబడుతోంది. అనగా, ఇదంతా మరెవరో ఎవరికొరకో కల్పిస్తున్నది కాదు.

**విద్యాధరుడు :** "జగత్తుకు కర్త జీవుడే" అను వాక్యం యొక్క సూక్ష్మార్థాన్ని నేను గ్రహించలేక పోతున్నాను.

**జగత్తు యొక్క కర్త జీవుడేనా! -**

**శ్రీ భుశుండుడు :** రెండు దృష్టాంతాల ద్వారా "ద్రష్టయే దృశ్య జగత్తు యొక్క రచయిత" అనే విషయం విశదపరుస్తాను.

**1. మనో రాజ్యము -** ఒక బాలుడు ఒక చోట సుఖాశీనుడై ఉన్నాడు. ఏదో ఉబుసుపోకగా ఊహాలోకంలో విహరించసాగాడు. తన మనస్సులో "ఒక రాజ్యంలో ప్రవేశించినట్లు, ఆ రాజ్యంలో తానే అన్ని ఆటలలో అందరినీ ఓడించినట్లు, ఇక తదితరులంతా ఆటలలో ఓడి నిస్సహాయు లగుచున్నట్లు..." ఊహ కొనసాగిస్తున్నాడు.

ఇట్టి ఊహాలోక విహారం జీవులందరికి దైనందినానుభవమే కదా! ఆ మనోరాజ్యంలో అతనికి తారసపడే తదితర బాలురను రచించిందెవరు? బయటి నుండి మరెవ్వరోనా? కాదే!... ఆ బాలుని మనస్సే కదా!... ఊహకు సాక్షి అయిన ఆ బాలుడే ఊహలోని పాత్రలకు, సంఘటనలకు రచయిత అయినట్లు... ఈ జగత్తు కూడా ద్రష్ట ఊహను అనుసరించే ఆతనికి అనుభవమవుతూ పోతోంది.

**2. స్వప్నము -** ఒకడు నిదిరిస్తూ ఒక సుదీర్ఘమైన కల కంటున్నాడు. ఆ స్వప్నంలో కొందరు మనుష్యులు. వారితో అనేక అనేక సుదీర్ఘమైన సంభాషణలు, సంబంధాలు!

ఇప్పుడు చెప్పు... స్వప్నద్రష్టకు ఆ కలలో కనిపించిన ఆ తదితర జనులంతా ఎవరు? ఎవరి చేత కల్పించబడ్డారు? బయటనుండి ఎవరైనా ఆ స్వప్నములోని పాత్రలను పంపించారా? లేక ఇంకెవరో జనులు ఆతని స్వప్నములో ప్రవేశించారా?

**విద్యాధరుడు :** (కొంచెం సేపు ఆలోచించి) లేదు. ఆ స్వప్నంలో కనిపించినవారంతా స్వప్న ద్రష్ట యొక్క ఊహాకల్పిత రూపాలే.

**శ్రీ భుశుండుడు :** సాక్షియగు ఆ ద్రష్టయే మనోరాజ్యంలోని వస్తువులను-మనుష్యులను, స్వప్న ద్రష్టయే స్వప్నంలో కనిపించే వస్తువులను, మనుష్యులను కల్పన చేసి పొందుచున్నారు కదా! అట్లాగే ఈ జీవునికి కనిపించే జగత్తంతా ఆ దర్శనక్రియ నిర్వర్తించే జీవుని స్వయంకల్పిత ఊహా పరంపరలే సుమా!

**విద్యాధరుడు :** మీరు చెప్పినట్లు 1.మనోరాజ్యములోని, 2.స్వప్న జగత్తులోని సర్వరూపములు, సంఘటనలు, వ్యవహారాలు ద్రష్టచే స్వయంకల్పితంగా పరికించబడినవేనని నేనూ ఒప్పుకుంటు

న్నాను. అయితే జాగ్రత్ విషయంలో "ఇదంతా ద్రష్టయొక్క ఊహాసదృశమైన అనుభవం మాత్రమే. కనుక ఈ కనబడే జగత్తు యొక్క నిర్మాత ద్రష్టయే"... అనే మీ అభిప్రాయం నాకు పూర్ణానుభవం కావటం లేదు.

**శ్రీ భుశుండుడు :** "దృశ్య జగత్తు యొక్క రచయిత ద్రష్టయే"... అని నిరూపించటానికి ఇతఃపూర్వం జరిగిన ఒకానొక యథార్థ సంఘటనను నీకు విశదపరుస్తాను, విను.

❖❖❖

# 11. ఇంద్ర - త్రసరేణు న్యాయం

**శ్రీ భుశుండుడు :** ఒకానొకప్పుడు ఒక కల్ప వృక్షం యొక్క ఒక యుగ-సంధి రూపమగు ఒకానొక శాఖయందు ఒక 'జగత్తు' అనే మేడిపండు కాచింది. ఆ జగత్తు అనే ఫలం దేవతలు-దానవులు మొదలుగా అనేక ప్రాణి సమూహాలతోను, స్వర్గ-భూ-పాతాళాది లోకాలతోను, నదీ-పర్వతాదులతోను పరివేష్టించబడి ఉన్నది. ఆయా జీవుల వాసనా ప్రదర్శనలతోను, ఆ వాసనా సమూహాలతో పరికల్పించబడే అనేక సూక్ష్మ జగత్ సమూహాలతోను నిండి ఉంది. చిత్ చమత్కృతిచే అలరారుతూ 'మోక్షం' అనే బహిర్ద్వారంతో శోభిల్లుతూ, అంతరాన పంచతన్మాత్రలచే అలంకరించబడి ఉంది. ఆ బ్రహ్మమహావృక్షమునకు కాచిన జగత్తు అనే ఫలం కల్పాంతమున పండి రాలటానికి సిద్ధంగా ఉన్న స్వభావం కనబరుస్తోంది. 'అవివేకులు' అనే కాకులచే, 'వివేకులు' అను కోయిలచే పరస్పర వ్యతిరిక్త దృష్టులచే ఆ జగత్తు చూపబడుచూ ఉన్నది. ఆ జగత్తు ఎప్పుడో పరిపక్వమై పండి, 'శాంతి' అనే బ్రహ్మాభావం పొందటానికి సంసిద్ధమగుచున్నట్లున్నది.

ఆ జగత్తులోగల ముల్లోకాలకు ప్రభువై, దేవతలందరికీ కూడా నాయకుడై ఒకానొక పవిత్ర జీవుడు ఇంద్రుడుగా విరాజిల్లుచున్నాడు. ఆ ఇంద్రుడు గొప్ప జ్ఞానబలం కలవాడు. గురూపదేశ బలం చేత జగత్తు యొక్క పూర్వాపరాలన్నీ ఎఱిగి ఉన్నాడు. సంకల్పాలన్నీ త్యజించి శుద్ధాంతఃకరణుడై ఉన్నాడు. ఆ విధంగా ప్రశాంతమైన అంతఃకరణంలో, జ్ఞానదృష్టితో ముల్లోకాలను పాలిస్తూ కాలం వెళ్ళబుచ్చుచున్నాడు. అట్లా సుదీర్ఘమైన కాలం గడచిపోతోంది. రోజులన్నీ ఒకే రకంగా ఉండకపోవటమే ఈ కాలగతి యొక్క చమత్కారం కదా! "మాకేం! హాయిగా ఉన్నాం" అని అనుకుంటూ ఉండగానే, ఎక్కడి నుండో ఏవేవో కష్టాలు వచ్చి పడుతుంటాయి. అట్లాగే ఆ ఇంద్రునికి కూడా కొన్ని కష్టాలు ప్రారంభమయ్యాయి.

అప్పుడొక సయయంలో త్రిలోకరక్షకుడగు శ్రీహరి క్షీరసాగరంలో శయనించి ఉన్నాడు. ఒక అదను చూచుకొని అసురులు దేవలోకంపై దండెత్తారు. అప్పుడు దేవతలకు, అసురులకు మధ్య గొప్ప సంగ్రామం జరిగింది. విధివశాత్తూ ఆ యుద్ధంలో అసురులదే పై చేయి అయింది. ఆ దేవతాసైన్యం, ఇంద్రుడు కూడా తలకొక దిక్కుగా పలాయనం చిత్తగించక తప్పలేదు. క్రూరులగు అసురనాయకులు ఇంద్రుని వెంబడించారు. ఇంద్రుడు ఎక్కడా కొంచెం విశ్రాంతి తీసుకోవటానికి కూడా అవకాశం దొరకక పరుగులు తీస్తూనే ఉండవలసి వచ్చింది.

అప్పుడు ఇంద్రుడు బాగా అలసిపోయాడు. ఎట్లాగైనా సరే కొంతకాలం అసురుల కళ్ళు కప్పి ఎక్కడైనా విశ్రాంతి తీసుకోవలసినంతగా అగత్యం వచ్చింది. ఒకచోట ఒక్క క్షణం ఆగి కళ్ళతో విశ్రాంతి స్థానం కొరకై పరికించి చూచాడు. ఎదురుగా సూర్యకిరణాలు ప్రసరిస్తూ కనిపించాయి. ఆ సూర్య కిరణాలలో త్రసరేణువులు (ధూళికణాలు) అనంత సంఖ్యలో ఉండటం కనిపించింది.

ఒక గొప్ప ఆలోచన వచ్చింది. "ఈ త్రసరేణువులలోని ఒకానొక రేణువులో నేను దాగి ఉంటే ఈ దుష్ట దానవ సైనికనాయకులు నన్ను కనిపెట్టలేరు కదా!" – అని అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా అట్టి కార్యక్రమం కొరకై ఉపక్రమించాడు.

తన శరీరం యొక్క స్థూలాకార సంకల్పాలను తన అంతఃకరణంలోని సూక్ష్మభూతాలలో లయం చేశాడు. స్థూలత్వమంతా త్యజించి అత్యంత సూక్ష్మ రూపం సంతరించుకున్నాడు. సూక్ష్మ భూతరూపుడై బాహ్యప్రదేశంలో గల త్రసరేణువులలోని ఒకానొక త్రసరేణువులో ప్రవేశించాడు. "అమ్మయ్య! ఇక ఇక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకుంటాను"... అని అనుకొని ఆ త్రసరేణువులో విశ్రమించాడు. అసుర నాయకులు కొంతకాలం అతని కొరకు వెతికి వెతికి కూడా ఆ ఇంద్రుడు దాగి ఉన్నచోటు కనిపెట్టలేక పోయారు. అతడు కనబడకపోవటం చేత వెనుకకు మరలారు.

చాలాకాలం తరువాత ఇంద్రునికి తాను దాగి ఉన్న త్రసరేణువులో భౌతికమైన విశ్రాంతి లభించింది. ఇక కాలక్రమంగా యుద్ధం మొదలైనవన్నీ మఱచాడు. ఆ చోటును విడచి బయల్వెడలకుండా అచ్చటనే ప్రశాంత నిద్రా విశ్రాంతిని పొందాడు. అసురుల సంగతి కాస్త ఏమరచినప్పటికీ ఇంద్ర పదవికి సంబంధించిన సంస్కారాలు అతనిలో మేలుకొనియే ఉన్నాయి.

కొంతకాలం గడచిపోయింది. ఆ త్రసరేణువులోనే ఉండి ఎప్పుడో ఒక మనః స్వభావమును ఆశ్రయించసాగాడు. "ఇప్పుడు ఇంద్ర – రాజగృహంలో నేను ఉన్నాను"... అని అనుకోసాగాడు. అతడు అక్కడే ఒక గృహంలో ఉండటం జరిగింది. ఆ గృహంలో ఒకచోట పద్మాసనం వేసుకుని "స్వర్గలోకం, అమరావతి, దేవసభ, ఇక్కడ నా సింహాసనం, ఇప్పుడు నేను ఈ సింహాసనాన్ని అధిష్ఠించి ఉన్నాను, దిక్పాలకాది దేవతలు నన్ను పర్యవేష్టించి ఉన్నారు, ఈ స్వర్గానికి క్రిందగా భూలోకం ఉన్నది, దానికి కూడా నేనే అధిపతిని"... ఇట్టి రూపంతో కూడిన మనోకల్పనను పొందసాగాడు. ఇక ఆతని కల్పనలోని మూడు లోకాలకు అధిపతి అయి, ఇంద్రపదవి యొక్క కార్యక్రమమంతా నిర్వర్తించసాగాడు.

ఇంద్రభవనం నుండి బయల్వెడలి అమరావతి నగరమును, ఆ నగరం యొక్క చివరికి పోయి భూలోకాన్ని దర్శించాడు. అక్కడి పర్వత, నదీ, నదములు సక్రమగతిలో ఉన్నాయో, లేవో నని అంతా త్రిలోకపాలకునిగా పర్యవేక్షించాడు. భూమి అంతా ఆయా రాజ్యాలతో, రాజ్యపు సరిహద్దులతో ఉండునట్లుగా ప్రకృతి – కాలాలను సరిపోల్చి ఉంచాడు. క్రియా కలాపాలతో భూమి సక్రమంగా ఉన్నదని అనుకున్న తర్వాత ఇక పాతాళంలో ప్రవేశించాడు. అక్కడ కూడా రాజ్యాలు–రాజులు–ప్రజలు–విధి విధానాలు–యజ్ఞయాగాది వ్యవహారాలు పర్యవేక్షించాడు. ఏ దిక్పాలకులకు ఏ నిర్ణయాలు తెలియజేయాలో... అవన్నీ నిర్వర్తించి మరల స్వర్గలోకం జేరాడు.

ఇక ఇతఃపూర్వం లాగానే యథావిధిగా త్రిలోక పాలన చేస్తూ అష్టైశ్వర్యాలు అనుభవించసాగాడు. దేవతలకు ప్రభువై విరాజిల్లాడు.

ఆ విధంగా చాలా కాలం గడిచింది. ఆ తరువాత అతనికి మహాపరాక్రమశాలి అయిన పుత్రుడు జన్మించాడు.

**విద్యాధరుడు :** భుశుండ మహాశయా! మీ మాటకు అడ్డువస్తున్నాని అనుకోకండేం. ఆ ఇంద్రుడు మొట్టమొదట అసురులు తరుముచుండగా ఒక త్రసరేణువులో ప్రవేశించాడు కదా! ఆ త్రసరేణువులోనే ముల్లోకాలు ఏర్పాటు చేయబడ్డాయా?

**శ్రీ భుశుండుడు :** (చిరునవ్వుతో) ముల్లోకాలు త్రసరేణువులో లేవు. అవన్నీ సూక్ష్మాతిసూక్ష్మదేహం అవధరించిన ఇంద్రుని మనస్సులోనే ఉన్నాయి. అనగా అవన్నీ అతని మనస్సు చేతనే కల్పించబడి అనుభవింపబడుచున్నాయి. ఇక ఆ త్రసరేణువు గతి ఏమిటంటావా? అది తదితర త్రసరేణువుల లాగానే యథామార్గంలో ఎటో వెళ్ళిపడింది.

ఇక మనం ఆ ఇంద్రుని చరిత్ర కొనసాగిద్దాం. ఈ విధంగా మరికొంత కాలం గడిచి పోయింది. ఆ ఇంద్రుని కుమారునికి యుక్త వయస్సు రాగానే తదనంతర ఇంద్రుడుగా పట్టాభిషిక్తు డైనాడు. ముల్లోకాలను తన మనో వీధిలో సృష్టించిన మొట్ట మొదటి ఇంద్రుడు తన స్థూల-సూక్ష్మ దేహములను కాలక్రమంగా త్యజించి 'నిర్వాణము' అనే మోక్ష స్థితిని పొందాడు. అతని కుమారుడైన 'కుందుడు' అనువాడు కూడా ఇంద్ర పదవిని అధిష్ఠించి చాలాకాలం ముల్లోకములను పాలించి ఆ తరువాత తన కుమారునికి పట్టంగట్టి ఆతడు కూడా పరమపదమును పొందాడు.

ఈ విధంగా మన కథానాయకుడగు మొట్టమొదటి ఇంద్రుని తరువాత వందలకొలది పుత్ర – పౌత్రులు గడచిపోయారు. ఇప్పుడు అతని వందలాది వంశజుల పరంపరానంతరం వర్తమానంలో 'అంశకుడు' అను పేరుగలాయన ఇంద్రపదవిని అలంకరించి ఉన్నాడు.

చూచావా విద్యాధరా! మొట్టమొదటగా ఇంద్రుడు ప్రవేశించిన త్రసరేణువు ఎచ్చటనో విలీనమై, క్షయించి, నాశనం పొందింది. అయితే ఆ త్రసరేణువులో ప్రవేశించి విశ్రాంతికై ఉపక్రమించి, ఆ తరువాత తనయొక్క వాసనలచే ఆ ఇంద్రుడు దర్శించనారంభించిన త్రిలోక రాజ్యం మాత్రం ఇంకా ఇప్పటికీ కొనసాగుతూనే ఉన్నది.

❖❖❖

# 12. ఆత్మసాక్షాత్కార పర్యంతం దృశ్యం ఉంటోంది

**శ్రీ భుశుండుడు :** ఓ విద్యాధరా! ఈ సందర్భంలో మరో చమత్కారమైన విశేషం ప్రస్తావిస్తాను, విను.

ఇప్పుడిక ఆ ఇంద్రుని వంశంలో జన్మించి, దేవరాజు అయినట్టి ఒకానొకని గురించి మనం చెప్పుకుందాం. అతడు ఇంద్రవంశంలో జన్మించాడు. ఉత్తమ గుణాలచే పరిపూర్ణుడు. ఆ దేవరాజు శ్రీమంతుడు, వైరాగ్యాది సంపదలతో కూడుకొని ఉన్నవాడు. మోక్షార్థితచేత అతనికి అదియే అంతిమ శరీరధారణం కూడా! యౌవనంలోనే దేవగురువు బృహస్పతుల వారిచే బోధించబడి అతడు

ఆత్మజ్ఞాని అయ్యాడు. వేద్య వస్తువైన ఆత్మ గురించి అనుభవ సమన్వితంగా ఎఱిగి కూడా యథా విధంగా త్రిలోక సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు. యథాప్రాప్తాలైన కర్మలన్నీ నిర్వర్తిస్తూ ఉండేవాడు. అతడు ఒకసారి అసురులతో గొప్ప యుద్ధం చేసి, వారినందరినీ జయించాడు. ఆతడు అజ్ఞానాన్ని దాటినట్టి విశుద్ధమైన మనస్సుతోనే వంశాచారానుసారం నూఱు అశ్వమేధయాగాలను నిర్వర్తించి ఉన్నాడు.

ఆతడు ఒకసారి ఏదో కార్యవశంగా ఒకానొక ప్రదేశానికి వెళ్ళటం జరిగింది. ఆ ప్రదేశంలో సుందరమైన మానస సరస్సు కనిపించింది. ఆ సరస్సులో బహుసౌకుమార్యమైన కమలాలు కనిపించాయి. అక్కడి ప్రశాంతమైన వాతావరణమును గమనించి, అనేక యుద్ధ సంరంభముల చేతను, అశ్వమేధాది యాగాల కార్యక్రమాల చేతను ఎంతగానో అలసిపోయిన ఆతని మనస్సుకు కించితు, విశ్రాంతి పొందాలనిపించింది. ఆలోచన వచ్చినదే తడవుగా ఇక విశ్రాంతి కొరకై ఉపక్రమించాడు. ఆ కమల నాడులలోని ఒకానొక అతి సౌరభమైన దానిని ఎన్నుకొని ఆ కమలము యొక్క ఒక 'తూడు'(సన్నని కాండం)లో సూక్ష్మదేహి అయి ప్రవేశించాడు. అక్కడ అతడు ఒక ప్రక్క దేహ పరంగా విశ్రాంతి పొందుతూనే మనస్సు పరంగా ఊహాపథంలో విహరించసాగాడు. మనస్సు తోనే రాజ్య ఏలటం, యుద్ధాలు చేయటం, ఆ యుద్ధాలలో గెలుపు – ఓటములు చవిచూడటం... ఇవన్నీ అనుభవించసాగాడు. ఇట్లా కొంతసేపు గడిచింది.

అతడు బృహస్పతిచే ఎంతగానో బోధించబడిన సుజ్ఞాని కదా! అందుచేత ఒక రోజు ఇట్లా అనుకున్నాడు. "ఇంతకాలం నేను మాయలో ఉన్నాను. ఇప్పుడిక ఈ మాయ నుండి బయటకు వచ్చి మాయకు సాక్షిగా ఉండి మాయను దర్శించెదను గాక! ఇక నేను బ్రహ్మతత్త్వాన్ని, ఆ బ్రహ్మం మాయతో కూడుకొని ఉన్న చమత్కారాన్ని దర్శించటానికి ఈ నా మనస్సును వినియోగిస్తాను గాక"!

తన మనస్సును రాజ్యం మొదలైన వాటి నుండి మరల్చి ఇక 'బ్రహ్మం – మాయ' అనే రెండిటినీ పరిశీలించే క్రమంలో నియమించినాడు. ధ్యాననిమగ్నుడైనాడు. బాహ్య–అభ్యంతరాలైన విక్షేపాలన్నీ త్యజించాడు. శాంతబుద్ధి కలవాడైనాడు. ఏకాంతస్థితుడైనాడు. ఇక ధ్యానం ద్వారా సర్వశక్తియుతం – సర్వ వస్తుమయం – సర్వ వ్యాపకం – సర్వదా సర్వవిధ స్వరూపం – సర్వత్రం – సర్వగామి... అయినట్టి పరబ్రహ్మమును వీక్షించసాగాడు.

**పరబ్రహ్మము యొక్క వర్ణన (గానం) -**

**సర్వతః పాణిపాదంతం, సర్వతోక్షి శిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య సంస్థితమ్ ॥**

**సర్వేంద్రియగుణైర్ముక్తం, సర్వేంద్రియ గుణాన్వితమ్ ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥**

**బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవచ ।**
**సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయం దూరస్థం చ అన్తికేచతత్ ॥**

**సర్వత్ర చంద్రార్కమయం, సర్వత్రైవ ధరామయమ్ ।**
**సర్వత్రపర్వతమయం, సర్వత్రిబ్ధిమయం తథా ॥**

**సర్వత్ర సార గురుకం సర్వత్రైవ నభోభయమ్ ।**
**సర్వత్ర సంస్రుతిమయం, సర్వత్రైవ జగన్మయమ్ ॥**

**సర్వత్రైవ చ మోక్షాత్మ, సర్వత్రైవాద్య చిన్మయమ్ ।**
**సర్వత్ర సర్వార్థమయం, సర్వత్ర సర్వ వర్జితమ్ ॥**

**ఘటే పటే వటే కుడ్యే శకటే వానరే తథా ।**
**ధామ్ని వ్యోమ్నితరావద్రావనిలే, సలిలే అనలే ॥**

అత్యంతాశ్చర్యంగా పరబ్రహ్మం అతనికి కనిపించింది. ఆ పరబ్రహ్మం అంతటా చేతులు, కాళ్ళు, కళ్ళు, ముఖాలు, చెవులు కలదై ఉన్నది. సమస్త లోకాలలోనూ వ్యాపించి ఉన్నది. సర్వ ఇంద్రియ-గుణాలకు సంబంధించనిదై (వివర్జితమై) ఉంది. అయితే సర్వేంద్రియ - గుణాన్వితమై ఉన్నది. పరమార్థంగా చూస్తే అద్దానికి దేనితోనూ సక్తత (Allotment) లేదు. అనగా సర్వత్రా అసక్తమై ఉన్నది. వ్యవహారరీత్యా అన్నిటినీ భరిస్తున్నది అదే! అన్నిటియొక్క భారం వహిస్తున్నప్పటికీ దాని స్వభావం గుణములు కాదు. అది నిర్గుణం. అది సమస్త భూతాల యొక్క (పంచభూతాల-జీవుల) బాహ్య- అభ్యంతరాలలో ఏర్పడి ఉంది. తాను ఎట్టి కదలికా పొందనప్పటికీ కదలికలన్నీ దానివే. అది అత్యంత సూక్ష్మమై ఉండటం చేత అజ్ఞాతస్థూల దృష్టికి అది కనబడటమే లేదు. సూక్ష్మ దృష్టికి మాత్రం అత్యంత స్పష్టంగా కనబడుతోంది. అనుభూతమౌతోంది. అది సర్వత్రా చంద్ర-సూర్య-పృథివి-పర్వత-సముద్ర-ఆకాశమయమై, సర్వత్రా చిత్సార- గురురూపమై, సర్వత్రా సృష్టి పూర్ణమై- జగన్మయమై ఉన్నది. సర్వత్రా మోక్షరూపమై, ఆద్యచిన్మయమై, సర్వత్రా సర్వపదార్థమయమై ఉన్నది. సర్వత్రా సర్వవర్జితమై ఉన్నది. అయినా కూడా, ఘట-వస్త్ర-వృక్ష-శకట-గృహ-మందిర-ఆకాశ-పర్వత-వాయు-జల-అగ్న్యాది సమస్త పదార్థములందున్నదై నర - వానరాది సర్వజీవులుగా తానే అయి అన్ని వైపులా వెలయుచుండుటను ఆతడు చూచాడు. ఈ ముల్లోకాలు అనేక ఆచార-విచారాలతో వివిధ కార్య సంరంభాలతో కూడుకొని ఉండవచ్చు గాక, ఇట్టి త్రైలోక్యం ఆ పరబ్రహ్మం నందు ఒకానొక స్వల్ప అంశమాత్రంగా ఆ దేవరాజు వీక్షించాడు.

మిరియంలో కారం ఉన్నట్లు, ఆకాశంలో శూన్యత్వం ఉన్నట్లు ఆ కాలాత్ముడగు చిన్మయ పరమాత్మలో ఇట్టి అసంఖ్యాక ముల్లోకాల యొక్క ఆవిర్భావతిరోభావాలు ఏర్పడి ఉంటున్నాయి.

ఈ విధంగా జీవభావవర్జితుడై, శుద్ధజ్ఞానంచే ఆ ఇంద్ర శరీరంతో పరబ్రహ్మాన్ని గాంచుచూ క్రమంగా పూర్ణాత్మధ్యానవంతుడైనాడు. ఆ పరబ్రహ్మం యొక్క మాయావిభాగం నందు అనేక బ్రహ్మాండాలను గాంచసాగాడు. అట్లాగే ఈ మనం ఉన్న బ్రహ్మాండాన్ని కూడా వీక్షించటం జరిగింది.

ఆ తరువాత ఆతడు ఈ బ్రహ్మాండమంతా మనస్సుతో సంచరించుచూ, ఈ బ్రహ్మాండములోని ఇంద్రలోకంలో ప్రవేశించాడు. తానే ఇంద్రుడై ఇంద్రత్వమును మనస్సుతో అవధరించాడు... ఆ

ఇంద్ర పదవిచే అనేక లోకాలు పరిపాలించాడు. ఇప్పటికి ఈయన ఈ బ్రహ్మాండమును పరిపాలిస్తూనే ఉన్నాడు. చూచావా విద్యాధర నృపాలా! ఈ ప్రకారంగా మొట్టమొదటి త్రసరేణువు లో ప్రవేశించి ముల్లోకముల భావనా మాత్ర సృష్టికి కారణమైన ఇంద్రుని వంశానుగతంగా ఆతని వంశంలోని ఒకానొక దేవరాజే ఈ మన వర్తమాన బ్రహ్మాండంలోని ఇంద్రుడై ఉన్నాడు సుమా!

ఈ లోకమందలి ఇంద్ర పదవిని అవధరించిన తరువాత త్రసరేణు ప్రవేశితుడగు ఇంద్రుడు తనయందు సంస్కారరూపమున ఎక్కడో అంతరాంతరాళాలలో దాగి ఉన్న పూర్వపు జ్ఞానయోగ అభ్యాసం చేత అతడు తాను కమలనాళ సూత్రంలో ప్రవేశించటం, నివసించటం స్మరించాడు. పరబ్రహ్మం యొక్క నిర్వికల్ప – సవికల్పరూపాలను గ్రహించి బ్రహ్మానందం అనుభవిస్తూనే ఇంద్రుడుగా బ్రహ్మాండానికి సంబంధించిన పరిపాలనను కొనసాగించటం జరిగింది. ఆతని వంశజుడు ఈ బ్రహ్మాండంలో ఇంద్రత్వాన్ని ఈ వర్తమానంలో అవధరిస్తున్నాడు.

ఓ విధ్యాధరా! మనం కమలనాళ తంతువులలో ప్రవేశించిన ఒకానొక ఇంద్రుని కథాక్రమ మెట్టిదో చెప్పుకున్నాం. ఇటువంటి ఇంద్రులు చిదాకాశంలో అక్కడ, ఇక్కడా, మరింకా ఎన్నోచోట్ల లక్షల కొలదిగా ఉండి ఉన్నారు. ఇప్పుడు కూడా ఉన్నారు. చిదాకాశంలో ఇటువంటి వ్యవహారా లెన్నో అసంఖ్యాకంగా గడచిపోయాయి. గడుస్తున్నాయి.

**విద్యాధరుడు :** స్వామీ! ఇదంతా చూస్తూ ఉంటే ప్రతి ఒక్క ద్రష్ట యొక్క దృశ్యపరంపరలు అనంతమని అనిపిస్తోంది. ఈ దృశ్యములకు అంతు లేదా? ఇవి ఎప్పటికీ ఉపశమించవా?

**శ్రీ భుశుండుడు :** ఆత్మసాక్షాత్కారం కానంత వరకు ఈ మహాప్రబలమైన 'దృశ్యము' అనునది ఇట్లా త్రెంపు లేకుండా ప్రవహిస్తూనే ఉంటుంది.

1. జీవుడు మాయలోనే ఉన్నంత వరకు ఎప్పటికప్పుడు ఆ ఉపాధి విశేషములే తన మొత్తం స్వరూపమని అనుకుంటూ ఉపాధిపరంపరలు పొందుతూనే ఉంటాడు.

2. అతడు పరబ్రహ్మము గురించి బ్రహ్మజ్ఞులచే విని సగము పరబ్రహ్మమున – సగము మాయయందు ఆరూఢుడైనాడా... "ఇదియే సుదీర్ఘమైన మాయ"... అని గమనించగలుగుతాడు. అనగా బ్రహ్మమును, మాయను వేఱువేఱుగా దర్శించగలుగుతాడు.

3. సత్యమగు పరమాత్మ యొక్క సాక్షాత్కారమాత్రంచే ఈ అనుభవమయ్యే మాయ పూర్ణంగా విలయమొందగలదు. అనగా మాయను కూడా ఆత్మవిన్యాస చమత్కారంగా దర్శించగలడు.

**విద్యాధరుడు :** స్వామీ! భుశుండ మహాశయా! మీరు చెప్పిన అనేక విశేషాల ప్రభావం చేత ఆ మాయ యొక్క అనేక చమత్కారాలు తెలుసుకున్నాను. ఇప్పుడు నాదొక ప్రశ్న. మనం అందరం చిదాకాశ (లేక) పరబ్రహ్మ స్వరూపులమే కదా! అట్టి మనకు 'మాయ' అనే అనుభవం ఎందుకు, ఎక్కడి నుండి, ఏ విధంగా సంప్రాప్తించి మభ్యపెడుతోంది?

**శ్రీ భుశుండుడు :** పాపరహితుడగు ఓ విద్యాధరా! ఈ మాయ ఎట్లాగో, ఎచ్చట నుంచో, ఏ విధం గానో వచ్చిపడి అనుభవమౌతోంది. ఎక్కడి నుండి వస్తే ఏం? మొత్తం మీద నీకు మాయ అనుభవ మవుతోంది కదా! ఇప్పుడిక మాయ అంటే ఏమిటో గ్రహించడానికి ఉపక్రమించు.

'మాయ' అంటే ఏమిటి? 'యామా'... "ఏదైతే స్వయంగా (వాస్తవానికి) లేదో" అని కదా, అర్థం? లేనిది ఎందుకోస్తే ఏం? దృష్టాంతానికి... అక్కడ దయ్యం లేదు. కానీ ఏదో రూపం చూచి "ఇది దయ్యం" అనే భ్రాంతి కలిగింది. "భ్రాంతి ఎందుకు కలిగింది?"... అనే ప్రశ్న ముఖ్యమా? ఆ భ్రాంతిని తొలగించుకోవటం ముఖ్యమా?

**విద్యాధరుడు :** భ్రాంతిని తొలగించుకోవటమే ముఖ్యం.

**శ్రీ భుశుండుడు :** అదీ సంగతి. అది మాయయే కాబట్టి, భ్రమ కల్పితమే కాబట్టి దీని హేతుభూతము లందు గల విశేషములను సుదీర్ఘంగా వాదోపవాదాలకు ఉపక్రమించటం ఉచితం కాదని విజ్ఞుల అభిప్రాయం. నా అభిప్రాయం కూడా.

"మాయ ఎట్లా వచ్చింది?"... అనే చర్చ వృథా కాలయాపనయేనని చెప్పబడుతోంది. "మాయ ఎట్లా తొలగుతుంది?" అనేదే ఇక్కడ మనకు ముఖ్యం. ఆచరణయోగ్యం. స్వప్నంలో సంఘటనలకు కారణాలు వెతికి లాభమేమిటి? ఆ కారణాలు కూడా స్వప్నతుల్యమే కదా!

మేఘం లోంచి వర్షం పడుతోంది చూచావా? అట్లాగే 'అహంభావం' అను ఒక చమత్కారం నుండి ఈ మాయ వర్షిస్తోంది. అట్టి అహంభావం ఆత్మదర్శన మాత్రంచేత తొలగగలదు. అందుచేత ఆత్మను దర్శించు. తద్వారా అహంకారం దానంతట అదే తొలగగలదు. అంతే!

'జగత్తు' అనునది భావనల సమూహమే కదా! భావనాప్రకటలన్నీ భావికుని ప్రకటనా చమత్కారమే! భావికుడు భావనల కంటే ముందే చిదానంద ఘనస్వరూపుడుగా ఉండనే ఉన్నాడు. (భావనలు చేయువాడు ఆ భావనల కంటే ముందే ఉండాలి కదా!) కనుక చిత్‌చైతన్యమే భావనలు గాను, జగత్తు గాను వెల్లివిరిస్తున్నదని గ్రహించు. ఈ విధంగా ఈ జగత్తు పరమార్థమున బ్రహ్మస్వరూపమై, సర్వవికల్పరహితమై ఉన్నది.

మరొక విధంగా చెప్పాలంటే... జగత్తు భావనల కంటే వేఱు కాదు. భావనలు భావికుని కంటే వేరు కాదు. భావికుడు బ్రహ్మం కంటే వేఱు కాదు. ఇట్లు జగత్తు బ్రహ్మమే అయి ఉన్నది.

అహంకారవశంగా విస్తృతమగు మానసిక వికల్పములు తోచవచ్చుగాక! ఆ పరబ్రహ్మం నందు ఇంద్రియ జనితమైన వికల్పాలు లేవు, జాగ్రత్ మొదలైన అవస్థలు లేవు. అది వాసనా మయమగు సర్వస్వప్నపదార్థ రహితం అకాశం వలె సర్వదా పరిపూర్ణం. అట్టి చిద్రూపమగు ఆత్మయే నేను, నీవు, తదితరులతో కూడిన మనమంతా కూడా!

❖❖❖

# 13. ఇంద్రత్రసరేణు న్యాయ సారాంశం

**విద్యాధరుడు :** మహాత్మా! "ఇంద్రుడు – త్రసరేణువునందు ఇంద్రలోక దర్శనం"... అనే ఒక చమత్కారమైన వృత్తాంతం చెప్పారు. ఈ వృత్తాంతంలోని ముఖ్యోద్దేశం మరొక్కసారి సమీక్షించ వలసినదిగా నా విన్నపం.

**శ్రీ భుశుండుడు :** ఓ విద్యాధరా! ఆ ఇంద్రుడు సర్వమును త్యజించి సూక్ష్మ రూపి అయి ఒక త్రసరేణువులో ప్రవేశించి విశ్రమించాడు. అయితే జరిగినదేమిటి? ఆ త్రసరేణువునందు విశ్రమిస్తూ ఉండగానే అతని మనస్సు త్రిలోకములను అక్కడికక్కడే కల్పించింది. అతని దర్శనమంతా మన ఈ భౌతిక ప్రపంచంలాగానే ఘనీభూతంగా అనుభవమయింది.

దీని అర్థమేమిటి?...ఎచ్చట అహంభావం ఉంటుందో అచ్చట త్రసరేణువులోని (త్రసరేణువు = ముప్పది పరమాణువులు కలది) ఇంద్రరాజ్యంలాగా 'జగత్తు' అనబడునది – తగుదునమ్మా అని – వచ్చి కూర్చుంటుంది. కాబట్టి ఈ 'జగత్తు' అని అనబడేదానికి అహంకారమే ఆదిమూలంగా చెప్పబడుతోంది. అహంకారి (లేక అభిమానించువాని) రూపమగు అహంకారమే ఈ జగత్తు.

బ్రహ్మం అనే మహాపర్వతం. అద్దానిపై 'భ్రమ' అనే మహారణ్యం. ఆ భ్రమ మహారణ్యంలో 'అహంకారం' అనే బీజం. ఆ అహంకార బీజం 'వాసనలు' అనే జలంచే తడుపబడి మొలకెత్తి ప్రవృద్ధమవటం. అట్టి అహంకార బీజమే ఈ 'త్రిలోకాలు' అనే మహావృక్షంగా పరిణతి పొందటం ...ఇదియే "ఇంద్ర – త్రసరేణు న్యాయం" యొక్క ముఖ్యపాఠ్యాంశం. దుష్టవాసనలచే విస్తృతమైన ఈ త్రైలోక్యం 'అహంత్వం' అను జలం యొక్క సంచలనవిలాసమే నని గ్రహించు.

జన్మ–మరణ–పురోగమన–తిరోగమన–ఆవిర్భావ–తిరోభావ పరంపరలతోను, శరీరాదుల ఉత్పత్తి, వినాశనాలతోను, అహంభావ జనిత త్రైలోక్య జగత్తు బహుచమత్కారమై వెలయుచున్నది. అట్టి ఈ జగత్తు అహంత్వవాయువు యొక్క చలనమని, అహంత్వ కమలాల యొక్క సుగంధమని విజ్ఞులు ఎఱిగియే ఉన్నారు.

వాయువు, వాయు చలనాలు వేఱు వేఱా? ...కావు. జలం, ద్రవత్వం– భిన్నాలా? ...కానే కాదు. అగ్ని, ఉష్ణత్వము...రెండు వేఱు వేఱు విశేషాలా? కావు. కావు. అట్లాగే... అహంత్వము, జగత్తు – ఈ రెండూ సర్వదా అభిన్నరూపములేనని గ్రహించు.

ఈ జగత్తు అహంకారమునందే ఉన్నది, అహంకారం ఈ జగత్తునందే ఉన్నది... ఈ రెండూ ఒకదాని చేత మరొకటి ఉత్పన్నం కావించబడుచున్నాయి. పరస్పరం ఒకదాని ఆధీనంలో రెండవది స్థితి కలిగి ఉన్నది.

**విద్యాధరుడు :** అహంభావమును తొలగిస్తే జగత్తు కూడా 'లేనిదే' అగుచున్నది కదా! మరి అహంభావమును తొలగించటమెట్లా?

**శ్రీ భుశుండుడు :** ఈ జగత్తుకు ఏదైతే బీజమగుచున్నదో అట్టి అహంభావము (లేక, అహంకారము) 'అనహంభావము' అను రూపమగు జ్ఞానబలిమిచే మొదలంట్ల తొలగించవేయబడగలదు. కనుక జ్ఞానము అనే జలముచే 'అహంభావము' అనే మాలిన్యమును పూర్ణముగా కడిగివేయాలి సుమా!

**అహన్త్వం నామ తత్కించిత్, విద్యాధర! నవిద్యతే ।**
**అకారణమవస్తుత్వాచ్చ శ్వశ్వశృంగమివ ఉదితమ్ ॥**

ఓ విద్యాధరా! "కుందేటి కొమ్ములు" అనే శబ్దానికి అర్థం ఏమిటి? కుందేలుకు కొమ్ములు

అసలు ఉండవు కదా! కుందేటికి కొమ్ములు మొలచినదెప్పుడు? తొలగినదెప్పుడు? కుందేలు పరుగులు తీస్తూ ఉంటే అది చెవులు రిక్కపొడుచుకొని ఉండటం చేత కొమ్ముల వలె కనిపిస్తాయి. అట్లాగే యథార్థానికి 'అహంభావం' అనునదేదీ లేదు. ఆకాశంలో నీలత్వం కనబడుతోంది. అక్కడ నీలిరంగు గల ఏదైనా పదార్థం ఉదా? లేదు. శూన్యమగు ఆకాశం కంటి భ్రమచే నీలి రంగుగా కనబడటం జరుగుచున్నట్లు, వాస్తవానికి ఉనికియే లేని 'అహంత్వము' ఉన్నట్లే భ్రమింపజేస్తోంది.

ఎట్లా అంటావా?... సర్వస్వరూపమగు పరబ్రహ్మం మనస్సు కంటే, ఇంద్రియాదుల కంటే పరమై ఉన్నది. అది స్వతహాగానే అనంతం. ఆకాశం ఎల్లప్పుడు అఖండమే అయినట్లు పరబ్రహ్మం కూడా ఎల్లప్పుడు అఖండమే. అట్టి పరబ్రహ్మమునందు 'అహంత్వం' అనే ఖండత్వము ఏర్పడటానికి కారణం ఏముంటుంది? ఉండదు. లేనేలేదు. కారణ రాహిత్యంచే 'అహంత్వం' అనేది అసత్తే గాని సత్తు కాదు. అనగా... అద్దానికి స్వయంకృతమైన ఉనికి లేదు.

వస్తువులైతే ఖండత్వం అనేది ఉన్నది. పరబ్రహ్మం అన్నిటినీ ధరిస్తున్న అవస్తువు. అవస్తువు నందు మార్పుగాని, చేర్పుగాని సంభవింపజేయగల కారణం ఉండజాలదు. అద్దానియందు "సృష్టి" అనేది జనింపజేయగల కారణమేమున్నది? లేదు. కనుక "గొడ్రాలి యొక్క రెండవ కుమారుడు" అనే మాటవలె అహంభావాదులు (నీవు – నేను మొదలైనవి) ఎక్కడా లేనివే అగుచున్నాయి.

'అహంకారం' అనే బీజమే లేనప్పుడు అద్దాని కార్యము అనతగినట్టి జగత్తు కూడా 'లేనిదే' అగుచున్నది కదా! కాబట్టి ఓ విద్యాధరా! "ఈ జగత్తు జీవుడు మొదలైనవన్నీ వాస్తవానికి లేవు" అను సూక్ష్మం – పరమవాస్తవం అగు 'జగత్‌జీవ – అభావన'ను అవధరించు. ఆ విధంగా జగత్తు – జీవుడు అభావించకబడగా అప్పుడు శేషించునట్టి చిద్రూపమైన 'నిర్వాణం' నందు శాంతంగాను, సుఖస్వరూపంగాను ఉండు. ఈ విధంగా జగత్తు – అహంభావాల అభావనచే, ఆ తదనంతరం కూడా ఏ నీ స్వస్వరూపం శేషించియున్నదో... అద్దాని యొక్క రూపమే ఈ బాహ్య పాదార్థిక జగత్తని, అభ్యంతరమగు మానసికాది జగత్తు కూడానని గ్రహించు. అంతేగాని నీకు అన్యమైనదేదీ లేదు. ఇదియే 'అనన్య స్థితి' అని చెప్పబడుతోంది. 'నీవు – నేను' మొదలైనవిగా కనిపించేదంతా నీయొక్క పరమాత్మతత్త్వమేనని గ్రహించి శాంతం వహించి ఉండు.

**యన్నాస్తి, తత్తు నాస్త్యేవ! శేషం శాన్తమసి ధ్రువమ్ ।**
**సంప్రబుద్ధోఽసి మా భూయో, నిర్మూలాం భ్రాంతిమాహర ॥**

ఓ విద్యాధరా! ఏదైతే (నేను – నీవు – అయినవాళ్ళు – కానివాళ్ళు – ఇష్టులు – అయిష్టులు – నావి–నా జగత్తు మొదలైనవి) ఒకప్పుడు కూడా లేకయే ఉన్నదో... అది ఇప్పుడు కూడా లేదు. అనగా భూతకాలంలో లేనిది వర్తమానకాలంలోనూ లేదు. వర్తమానకాలంలో లేనిది భవిష్యత్తు లోనూ లేదు. ఒకప్పుడు లేక, ఇప్పుడు మాత్రం అనుభవ మగుచున్నదంతా భ్రమ చేతనే అనుభూత మౌతోందని గ్రహించు. ఈ "నేను – జగత్తు"... అనునవి నీకు మధ్యలో వచ్చాయి. స్వతహాగా ఉన్నవి కావు. మధ్యలో వచ్చినవి మధ్యలోనే పోతున్నాయి. 'నేను' అను భావన కంటే మునుముందే

ఆ భావన చేయు నీవు ఉండనే ఉన్నావు. అట్టి 'నేను' అను భావన (అహంభావన) కు ముందే గల ఏ నీ శాంత-బుద్ధ రూపమున్నదో... అదియే బ్రహ్మం. ఓ విద్యాధరా! నీవిప్పుడు ప్రబుద్ధుడవైనావు. అనేక సాధనల ప్రయోజనంగా సర్వభ్రమలను నిర్మూలన మొనర్చుకొనియే ఉన్నావు. ఇంక మరల భ్రమను ధరించవలసిన పని లేదు.

**వ్యపగత కలనా కలంక శుద్ధః, శివమఽసి, శాన్తమసి, ఈశ్వరోసి నిత్యః**
**ఖమపి భవతి పర్వతోపమానం, జగదపి వా పరమాణురూపమేవ॥**

ఓ విద్యాధరా! నీవు పరబ్రహ్మమే స్వరూపంగా కలవాడవు. 'బాహ్య-అభ్యంతరాలు' అనే కళంకాలు నీయందు లేవు. పరమశుద్ధుడవు. శివరూపుగవు. శాంతుడవు. ఎల్లప్పుడు ఏర్పడి ఉన్నట్టి నిత్యస్వరూపుడవు. అత్యంత సూక్ష్మమైన ఈ ఆకాశం నీ స్వస్వరూపం ముందు పర్వతమంత స్థూలం. అనేక బ్రహ్మాండాలతో కూడిన ఈ మహత్తర జగత్తు నీ పరబ్రహ్మస్వరూపం ముందు ఒక అణువు ప్రమాణం కలది. సంసారం ఉన్నప్పుడు గాని, ఇప్పుడు గాని, మరొకప్పుడు గాని నీ స్వస్వరూపం నిర్విషయ – నిష్ప్రపంచ – అఖండ – అప్రమేయ – కాలాతీత – గుణాతీత పరబ్రహ్మమే అయి ఉన్నది.

నాటకంలోని పాత్రచే ఆ పాత్రధారి పరిమితుడా? కాదుకదా! అట్లాగే, నీవు దృశ్యత్వము చేతగాని, ద్రష్టత్వముచేతగాని పరిమితుడవు కావు.

నీవు అపరిమిత, అప్రమేయానంద స్వరూపుడవు. ఇదియే నీ స్వరూపానికి సంబంధించిన పరమ సత్యం. ఓ సహజీవులారా! మీ అందరి స్వరూపం అట్టి పరబ్రహ్మమేనని గ్రహిస్తారు గాక!

❖❖❖

# 14. అంతఃకరణ శుద్ధి

**శ్రీ భుశుండుడు :** ఓ వసిష్ఠ మునీంద్రా! వింటున్నారు కదా! నేను ఆ విధంగా చెప్పుచుండగానే ఆ విద్యాధరుని దృశ్యవృత్తులన్నీ శమించాయి. అతడు సమాధినిష్ఠుడైనాడు. అప్పుడు నేను నా వాక్ప్రవాహమును ఆపి ఆతనిని సమీపించి మరల మరల అటు – ఇటు కదల్చి మేల్కొల్పటానికి ప్రయత్నించాను. పరమ నిర్వాణ దశను పొందిన ఆతడు మరల శబ్దాది విషయములవైపుగా మరలనే లేదు. ఆతడు అప్పటికి పూర్వమే నిర్మలమైన అంతఃకరణము సంపాదించుకొని ఉండటం వలన కాబోలు, అంతమాత్రపు ఉపదేశంచేతనే, ఆ నిర్వాణమగు పరమపదము, (లేక) బ్రాహ్మీస్థితి సంతరించుకున్నాడు. ఎంతో శ్రవణ – మనన – నిధిధ్యాస మొదలైన అనేక ప్రయత్నములచే కూడా లభించనిది ఆ నా కొద్ది వాక్యములు విన్నంతనే కలిగినదంటే, ఆతని హృదయ నైర్మల్యము అంతటిది! అందుకే జలంలో పడ్డ నూనెబిందువు వలె శుద్ధచిత్తమునందు కొద్ది ఉపదేశము కూడా మహత్తరమై వ్యాపించగలదని ముందే చెప్పాను కదా!

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కనుక ఓ రామచంద్రా!

**నాఽహమ్ ఇత్యస్తి తేనాస్త్వర్మైనం భావయ శాంతయే,**
**ఏతావత్ ఉపదేశోక్తిః పరమా నేఽతరాస్తి హి ॥**

నీవు చిదేకరసస్వరూపుడవు, అట్టి నీ ప్రత్యగాత్మయందు 'అహంకారము' అనునది వాస్తవానికి ఉండజాలదు. ఇక అసత్యమగు అహంకారమును భావించనే వద్దు. ప్రశాంతచిత్తుడవై పరమాత్మ స్వభావమున వెల్లివిరియుము. నా ఇంతటి ఉపదేశముయొక్క సారము ఇదే!

"నాయందు అహంకారం (అహంభావన)కు చోటే లేదు. అహంభావన (నేను అనే భావన)కు ముందే సర్వదా అంతటా ఏర్పడి ఉన్నట్టి పరమాత్మతత్త్వమేవ అస్మత్ స్వభావమ్" అనేదే సారాంశం.

**అవిచారులు / సంసారాసక్తులు -** ఋషులమగు మేము ఈ పరమతత్వమును ప్రవచిస్తూనే ఉన్నాం. అయితే ఇక్కడ ఉంచిన ముత్యం అటువైపుగా త్రిపిపెట్టి ఉన్న అద్దంలో ప్రతిబింబించదు కదా! అట్లాగే అవిచారపరులు సంసారాసక్తులు అగు మనుజుల మనస్సులలో మా ఈ బోధ ప్రవేశించినప్పటికీ అది ప్రతిఫలించక అప్రభావితంగానూ, నిష్ప్రయోజనంగానూ ఉండిపోతున్నది!

**విచారపరులు / సంసార అనాసక్తులు -** విచారశీలమై, భవ్యము-శాంతము అయినట్టి మనస్సులో మా ఈ బోధ (ఉపదేశం) ప్రవేశించిందా... ఇక అది వృద్ధియే పొందుతుంది గాని, చ్యుతి పొందదు. అంతేకాదు. ఇటువైపు త్రిప్పి ఉన్న అద్దంలో ప్రతిబింబించే ముత్యం నూతన తేజః పుంజాలను ప్రదర్శించుచున్నట్లుగా సువిచారపరుల (సంసార అనాసక్తుల) హృదయంలో ప్రవేశించిన మా ఈ వాక్యాలు తిరిగి మహారణ్యాన్ని భస్మీభూతం చేయగల మహత్తర ప్రదర్శనంతో బయల్వెడలుతాయి. అందుకే అవతారమూర్తివగు నీ ముందు మేము గ్రహించిన పరమసత్యమును సుదీర్ఘంగా విశదీకరిస్తున్నాం. ఈ మా సందేశసారం అవతారమూర్తివగు నీ ద్వారా తరతరాలా విస్తరించి లోకకళ్యాణ దాయకమగు గాక! మరల భుశుండినితో నాకు కొనసాగిన సంవాదం కొనసాగిస్తాను, విను.

❖

**శ్రీ భుశుండుడు :** ఈ సంసారం దుఃఖరూపమైనదని ప్రతిఒక్కరికీ తెలిసిన విషయమే! అయితే ఇది బయల్వెడలేది ఎక్కడి నుండి? అహంభావము నుండే సుమా!



**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ భుశుండ మహాశయా! జ్ఞానబలం చేతను, అహంకార రాహిత్యముచేతనే మీరు దీర్ఘాయుష్కులై ఉంటున్నారు కదా!

**శ్రీ భుశుండుడు :** ఓ ప్రియుడగు మునిశ్రేష్ఠా! విషయలంపటులగు మూఢులు కూడా ఒక్కొక్కసారి సుదీర్ఘమైన ఆయుష్షు కలిగి ఉండవచ్చు. "జ్ఞానులకే దీర్ఘాయువు ఉంటుంది. ఇతరులకుండదు"... మొదలైన నియమాలేవీ లేవు. అభ్యాసం ముఖ్యం. నిర్మలమైన హృదయం సంపాదించుకోవటం ముఖ్యం. అంతేగాని సుదీర్ఘమైన ఆయుష్షు ముఖ్యం కాదు.

**అంతః శుద్ధమనస్కాయే సుచిరాయాభయప్రదమ్ ।**
**మనాగపి ఉపదిష్టాస్తే ప్రాప్నువంతి పరం పదమ్ ॥**

చిరకాలాభ్యాసంచేత ఎవరి అంతఃకరణం శుద్ధమై ఉంటుందో... అట్టివారు స్వల్పమైన ఉపదేశము చేతనే ఆత్మసాక్షాత్కారం పొందుచున్నారు. ఇక దేహధారణ – దేహవిసర్జన అంటావా, అదంతా వస్త్రధారణ – వస్త్ర విసర్జన వంటిది మాత్రమే కదా!

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా మేరు పర్వత శిఖరంపై అధివసించే పక్షిరాజగు భుశుండమహాశయుడు నాకు చెప్పి అటుపై ఆ ముక్తాత్ముడు మౌనం వహించాడు.

ఆ తరువాత కొంతసేపైన తరువాత నేను అక్కడినుండి బయలుదేరాను. ఆ విద్యాధరుడు నివసించే ప్రదేశం సందర్శించాను. మహనీయుడైనట్టి ఆ విద్యాధరునితో కూడా సంభాషించి అటు తరువాత నిజాశ్రమమైనట్టి సప్తర్షిమండలం జేరాను.

ఆ విధంగా స్వల్ప సందేశం చేతనే విద్యాధరుడు ముక్తస్వరూపుడై ప్రకాశించాడు. ఈ విషయమై నేను ఆ భుశుండమహాశయునితో సంభాషించి ఇప్పటికి అనగా ఈ కల్ప ప్రారంభానికి ముందే 11 మహాయుగాలు గడచిపోయాయి.

❖❖❖

# 15. బ్రహ్మజ్ఞానాగ్ని జ్వాల

**శ్రీరాముడు :** మహర్షీ! హృదయాంతరాళాలలో ఎక్కడనో 'ఇచ్ఛ' అనే జాడ్యం జనించి అహంకారాన్ని పరిపోషించి ఈ జీవునకు భ్రమపూర్వకము – దుఃఖమయము అగు 'సంసారము' అనే సంకటమును తెచ్చిపెడుతోంది కదా! అనహంభావనాభ్యాసం చేత ఈ అహంకారము ఎటుపోతోంది? ఆ తరువాత అప్పటి వరకు హృదయంలో రాజ్యమేలినట్టి అహంభావనకు ఏమి కానున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! 'అనహమ్' భావనాప్రభావంచేత సంసారరూపము, శుభాశుభ ఫలప్రదాతయగు ఇచ్ఛ అంతఃకరణమున ఉపశమించగలదు. అట్టి అనహంభావనాభ్యాసబలంచేత మనుజుడు సువర్ణమును – మట్టిని కూడా సమముగా గాంచగలుగుతాడు. అతని సంసారమంతా ఉపశమించుటచే ఇక దుఃఖము ఆతనిని సమీపించజాలదు.

**న జానే క్వాఽు గచ్ఛతి! -** ఈ జీవుడు కనుక శ్రవణ–మననాది అభ్యాసమును ఆశ్రయించితే కాలక్రమంగా ఆతని స్వస్వరూపమునందు బ్రహ్మజ్ఞానము అనే జ్యోతివీచిక ఉద్భవిస్తుంది. అట్టి శక్తిచే ఈ 'అహంభావము' అనే శిల దూరంగా విసిరివేయబడగా – అది ఎక్కడికి పోయి పడగలదో ఏం చెప్పను? బ్రహ్మసాక్షాత్కారరూపుడగు వీరునిచే అహంభావనయే కాదు, ఈ "నేను దేహమును–దేహపరిమితుడను"... అను దేహాహంకారము తదితర జగద్వికారములతో సహా కూడగట్టుకొని ఈ సంసార వ్యవహారమంతా సుదూరంగా విసిరివేయబడగలదు.

ఓ రామచంద్రా! ఈ జీవుడు తనయొక్క జడదాతీత – దృశ్యాతీత – మనోబుద్ధ్యాతీతమగు స్వస్వరూపము యొక్క ఆత్మతత్త్వమును ఎఱిగినప్పుడే దృశ్యజాడ్యం తొలగుతుంది. తత్త్వజ్ఞానం లేకపోయిందా.... ఈ జీవుడు స్థూలదేహంలో ఉన్నా, స్థూలదేహరహితుడై ఉన్నా, శయ్యపై ఉన్నా, వృక్షముపై దాగినా, పర్వతములపై ఉన్నా, గృహంలో ఉన్నా, ఆకాశమందు ఉన్నా, స్థలమందు ఉన్నా, స్థూలంగా ఉన్నా, సూక్ష్మంగా ఉన్నా, సాకారంగా ఉన్నా, నిరాకారంగా ఉన్నా, రూపాంతరం పొందినా, ఎచ్చటెచ్చట ఉన్నా, నిదురించినా, మేలుకున్నా, అగ్నిలో దూకి భస్మీభూతమైనా, కమలంలో దాగినా, త్రసరేణువులో దాగినా, ఏదైనా ధరించినా, త్యజించినా, ఎందులోనో నిమగ్నమై ఉన్నా, అన్నిటినుండి దూరంగా పోయినా, దేనికైనా దగ్గిరగాజేరినా, ఎట్టి పరిస్థితులలో ఉన్నా కూడా.... అహంకారముయొక్క నూతనాంకురత్వం ఉండియే ఉంటుంది. కాస్త ఇచ్ఛతో కూడి ఆ అహంకారము యొక్క నూతనావతారం విస్తారమైన సంసారమును అక్కడికక్కడే కల్పించుకొని దర్శించగలదు. అహంకారము ఉన్నచోట ఇచ్ఛ, ఆ రెండిటి మేళవింపుచేత మనస్సు. ఆ మనస్సు యొక్క విస్తారము చేత జగత్ పరంపరలు ఒకదానివెంబడే మరొకటి తక్షణం బయల్వెడలగలవు. కాబట్టి ఇంతటికీ ఔషధం ఆత్మజ్ఞానమే!

ఒక చిన్న బీజములోనుంచి కాలక్రమంగా పెద్ద మహావృక్షం బయలుదేరుతోంది చూచావా? ఇక వృక్షముయొక్క ఘనమైన కాండము, కొమ్మలు, ఆకులు, చిగుళ్ళు, పూలు, పళ్ళు. లేచిగుళ్ళు... విస్తారమగుచున్నాయి! అట్లాగే 'అహంకారము' అనే సూక్ష్మబీజంలో అనేక దృశ్యవృత్తులతో కూడి దేహపరంపరలు ఏర్పడటం వివేకులు సూక్ష్మదృష్టిచే గాంచగలుగుచున్నారు.

"ఈ దేహాదులు వాస్తవానికి ఏమై ఉన్నాయి? ఈ 'అహంత్వము' అనుదానియొక్క అసలైన స్వరూపమేమిటి?" ...ఇట్టివాటి యొక్క విచారణచే నిత్యనిరతిశయానందమగు ఆత్మయొక్క జ్ఞానం పరిఢవిల్లుతోంది. అట్టి జ్ఞానాగ్నిచే ఈ అహంత్వబీజమనే కోశము దగ్ధమైపోతోంది.

దగ్ధమైన బీజం పైకి మామూలుగా ఉన్నప్పటికీ ఇక మొలకెత్తదు కదా! అంతరమున జ్ఞానాగ్నిచే దగ్ధమైన అహంకారము ఇక ఈ సంసారక్షేత్రంలో మరల మొలకెత్తదు. ఈ జీవులు ఇది ఎఱిగి "జీవితము" అనే పుణ్యకాలమును సద్వినియోగ పరచుకొనెదరు గాక!

❖❖❖

# 16. గాలిలో ఎగిరే జగత్ దూదిపుంజాలు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! కాలముచే పుట్టుచున్న ఈ దేహములు కాలము చేతనే మ్రింగివేయబడవచ్చుగాక! అంతమాత్రంచేత ఈ జీవుడు మరణించుట లేదు. జనించుటలేదు.

**శ్రీరాముడు :** అది ఎట్లా మహర్షీ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. దేహము నశించినంతమాత్రంచేత జీవుడు సర్వనాశనమగుటలేదు.

**మరణం సర్వనాశాత్మ న కదాచన విద్యతే ।**
**స్వసంకల్పాంతర స్థైర్యం మృతిరిత్యభిధీయతే ॥**

జీవుని దేహం నాశనమైనంతమాత్రంచేత ఆతని మనోబుద్ధ్యంహకారాలు నశిస్తాయా? లేదు. అవి ఉండనే ఉంటాయి. అవి ఉంటాయి కాబట్టి ఆ జీవునికి నాశనరూపమగు మరణం కలగనట్లే కదా! 'జీవుడు' అనగా ఆతని అనుభూతులు - అనుభవాలేగాని ఈ భౌతికదేహం కాదుకదా! జీవుడు 'మరణించాలి' అంటే ఆతని మనోబుద్ధ్యహంకారాలు నశించాలి. అవి నశించటమనేది జ్ఞానబలంచేతనే సాధ్యం. ఈ దేహం పోవటం నిజమైన మరణం కాదు.

మరి? ఆత్మ జ్ఞానముచే తన యొక్క సమస్త కర్మల-సంకల్పముల అభావం ఏర్పడగలదు. అట్టి అభావమే జీవుని మరణం గాని, దేహం నశించటం మరణం కాదు. అయితే, అట్టి అభావనచే సర్వభావములకు ముందుగానే సర్వదా ఏర్పడి ఉన్న భావాతీత, గుణాతీత, అఖండ, అప్రమేయ చిదాకాశంగా ఈ జీవుడు పరిణమించగలడు. భావముల మధ్యనున్న ఈ సాంసారిక జీవుడు భావములకు 'ఆది' అయిన స్వస్వరూపమును సంతరించుకొనుటచే పరమాత్మగానే పరిణమిస్తు న్నాడు. ఆతని పట్ల భావ జగదాదులు క్రీడామాత్రంగా మాత్రమే చోటు కలిగి ఉంటాయి.

**గాలిలో ఎగురుచున్న జగత్‌భాండములు, మృతజన మానసిక జగత్తులు -** ఓ రాఘవా! అదిగో అటు ఆకాశంలోకి చూడు! అనేక సంకల్ప పరంపరలు అనే ధూళికణములచే నిర్మించబడిన అసంఖ్యాక జగత్తులు గాలిచే ఎగురవేయబడి ఒకచోటి నుండి మరొక చోటికి తీసుకుపోబడటం కనిపిస్తోంది కదా! అయాజీవుల సంకల్పములచే కల్పితములైన మేరు - మందరములవంటి లక్షల - కోట్లాది సంకల్పపర్వతములు నాలుగు దిక్కులలోను ఎలా గాలిలో ఎగురుచున్నాయో చూడు! అరటి స్తంభముల పట్టలవలె ఒకదానిపై మరొకటి - ఒకదానియందు ఇంకొకటి ఉండి ఉన్నట్లు... ఆ జగత్సమూహములు పరస్పరం కూడియున్నాయి. కాని విడివిడిగా కూడా ఉన్నాయి. చూడు! అదంతా ఎంత చమత్కారమో!

**శ్రీరాముడు :** మునీంద్రా! మేరు పర్వతములతో పోల్చతగిన అనేక జగత్ భాండములు గాలిచే ఆకాశంలో కొట్టుకుపోతున్నాయని, నన్నుకూడా చూడమని అంటున్నారు.! ఈ మీ వాక్యము యొక్క అసలైన ఉద్దేశమేమిటో నేను కొంచెం కూడా గ్రహించలేకపోతున్నాను. 'జగత్సమూహాలు' అంటేనూ, అవి గాలిచే కొట్టుకుపోవటమంటేనూ మీ ఉద్దేశమేమిటో విశదపరచవలసినదిగా నా విన్నపం.

ఎందుకంటే ఆకాశంలోకి చూచినా కూడా మీరు వర్ణించి చెప్పే జగత్‌భాండములు నాకేమీ కనిపించటం లేదే?

**శ్రీవసిష్ఠ మహర్షి :** "ఆ జగత్‌భాండములు – అవి గాలిలో కొట్టుకుపోతూ ఉండటం, వాటిని నిన్ను చూడమనటం".... అను నా వాక్యముల యొక్క ఉద్దేశార్థమేమిటో చెబుతాను విను.

ఓ రామచంద్రా! ప్రతిరోజూ అనేక దేహాలు మరణిస్తున్నాయి. ఆ మరణించినవారి ప్రాణాలు ఆకాశంలోకి ఎగిరిపోవుచున్నాయి. అట్టి ప్రతి ప్రాణి యొక్క ప్రాణాలలో అంతర్గతంగా ఒక చిత్తం – (బీజంలో మహావృక్షం ఉన్నట్లు) ఉన్నది. అట్టి ప్రతి చిత్తంలో వివిధ ఆకారాలతో కూడిన జగత్తు కలదు. అటువంటి జగత్తులు అసంఖ్యాకంగా ఆకాశ వాయువులలో కొట్టుకుపోతున్నాయి.

ద్రవస్వభావం కలిగి ఉన్న నదీజలం ద్రవస్వభావ సమన్వితమైన సాగరజలంలో కలుస్తున్నట్లు ఈ జీవుడు మృతి చెందిన తరువాత ఈతని ప్రాణవాయువులు ఆకాశవాయువులలో కలుస్తున్నాయి. ఆకాశవాయువుచే మరికొంత ప్రేరణ పొందిన ఆ ప్రాణవాయువులందు గల సంకల్పరూప జగత్తులు అటూ ఇటూ పరిభ్రమిస్తున్నాయి. అట్టి సంకల్ప జగత్ సమేతమైన ప్రాణవాయువులు నలుదిక్కులలో నిండి ఉన్నట్లుగా నేను చూస్తున్నాను. నీవు కూడా గమనిస్తున్నావా? నా ఎదురుగా గాలిలో ఎగురుతూ కనిపించే ఈ జగత్ సమూహాలు నీకూ కనిపిస్తున్నాయి కదా! బుద్ధిని ఉపయోగించి చూస్తే అవి కనిపిస్తాయి సుమా!

ఈ ఆకాశంలో వాయువునందు మృతి చెందిన వారి ప్రాణాలు ఉన్నాయి. ప్రాణాలలో వారి మనస్సు, ఆ మనస్సులో జగత్తు ఉన్నది. ఆకాశమునకు వాయువు, ఆ వాయువునకు ఈ చనిపోయిన వారి ప్రాణములు, ఆ ప్రాణములకు ఆ జీవుల మనస్సులు... ఆ మనస్సులకు వారి ఊహా మాత్ర జగత్తులు ఆధారభూతమై ఎగురుచూ కనిపిస్తున్నాయి.

పూల నుంచి వాసన గాలిలోకి ప్రవహించి పరిభ్రమిస్తూ ఉంటే భౌతిక దృష్టికి కనిపించదు కదా! అట్లాగే ఈ గాలిలో ఎగురుచున్న ప్రాణ–మనో అంతర్గత జగత్తులు భౌతికమైన కళ్ళకు కనిపించవు. అయితే వాటిని సుతీక్ష్ణమైన బుద్ధితో గాంచవచ్చు.

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు చెప్పేదంతా చాలా చమత్కారంగా ఉన్నది. అయితే యుక్తియుక్తమే నని కూడా ఒప్పుకుంటున్నాను. మీరు చెప్పే మృతజనమానసిక జగత్తులతో ఒక్కొక్కదానిలో మరల త్రిలోకములు ఉంటాయికదా! అట్టి ఈ మృతుల జగత్తులు తదనంతరం ఏమి కానున్నవి? అవి ఆకాశంలో ఒకానొక విభాగంగా ఉంటాయా ఏమిటి? లేక, అవన్నీ వాయువిభాగమూ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ జగత్తులు సంకల్పజనితములు కదా! అనగా మనోకల్పితాలే కదా! కనుక అవి ఆకాశం కంటే కూడా అత్యంత సూక్ష్మమైనవి. పైగా అవి కల్పనామాత్రాలే కనుక ఆ జగత్తులు వాస్తవానికి లేవు కూడా! ఒకని స్వప్నంలో కనిపించిన బంగారుకొండ గురించి విని ఆతని స్నేహితుడు అద్దాని ఆనుపానులకై వెతుకుతాడా? ...వెతకడు కదా!

అయితే, చిదంశమే సర్వత్రా వ్యాపించి ఉన్నది కదా! అందుచేత ఆయా మృత జీవులు తమ తమ భోగ్య వస్తువులైనట్టి స్వర్గ–నరక–భూమ్యాదులను దృఢభావనతోనే గాంచుచున్నారు. ఆ స్వయం

సంకల్పమయ జగత్తులు ఆయా ద్రష్టలకు సుఖము, దుఃఖము మొదలైనవి కలుగజేస్తూనే ఉన్నాయి. నీవు నాకు ఎదురుగా ఎంతటి వాస్తవంగా కనిపించటం జరుగుతోందో ఆ మరణించిన జీవులకు కూడా వారివారి జగత్ కల్పనలు అంతటి వాస్తవంగానూ తోచుచున్నాయి. ఈ విధంగా ప్రాణరూప నదీజలంలో ప్రతిబింబిత నగరముల వలె ఈ జీవుల కల్పనాజగత్తులు ఆవిర్భవించి వాసనా మాత్రముచే ప్రభవిస్తూ ఎటో కొట్టుకుపోతున్నాయి.

కానీ, జగత్తులు లేవు. కొట్టుకుపోవటమూ లేదు. అవన్నీ ఊహాసమూహ సంపుటాలే కదా!

ఒకచోట ఒక కుండ ఉన్నదనుకో, దాన్ని అక్కడి నుండి తీసి ఎవరైనా దూరంగా ఏదో ప్రాంతానికి తీసుకుపోయి అక్కడ ఉంచారనుకో. ఆ కుండలోని ఆకాశంలో భేదమేమైనా ఉంటుందా?... ఉండదు కదా! అట్లాగే ఈ చిత్తం, అట్టి ఈ చిత్తంలో అంతర్గతమై ఉన్న జగత్తులు పరిభ్రమణం పొందితే పొందవచ్చు గాక! ఆత్మకు మాత్రం ఎట్టి పరిభ్రమణమూ లేదు, ఉండదు. ఆత్మయందు ఎట్టి ఖేదం గాని, మోదం గాని జనించదని ఎఱుగుటయే ఆత్మజ్ఞానము.

**శ్రీరాముడు :** మృతి చెందినవారి ప్రాణములందు గల జగత్తుల యొక్క వాస్తవమైన రూపమేమిటి?

**శ్రీవసిష్ఠమహర్షి :** చెప్పాను కదా! అదంతా సంకల్పమయమే కనుక కల్పనా మాత్రమే. అదంతా సప్న జగద్దృశ్యము వంటిదే!

**శ్రీరాముడు :** అట్టి మృతించినవారు మనోసంకల్పంతో గాంచుచున్న జగత్తుకు, మనం ఈ కళ్ళతో చూస్తున్న పాంచభౌతిక జగత్తుకు సంబంధమేమైనా ఉన్నదా? సారూప్యం – అనుభవం దృష్ట్యా ఒకే తీరువా, వేఱు–వేఱైనవా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకానొక సామ్యత తప్పకుండా ఉన్నది. మృతించినవారి జగత్తు ఏ విధంగా భ్రాంతిమయమో, కల్పనామాత్రమో... అట్లాగే ఈ జీవించి ఉన్నవాని జగత్తు కూడా భ్రాంతి మయమై, అసత్యముగానే ఉదయించినదగుచున్నది.

యథార్థానికి భ్రాంతి కూడా ఉదయించటం లేదు. నశించటం లేదు. భ్రాంతి కూడా తత్త్వ దృష్టిచే బ్రహ్మమే అయి ఉన్నది. ఒకవేళ వ్యవహార దశయందు ఈ పృథివి ఉదయించినదే కదా... అని అంటావేమో?

నౌకలో జనులకు నౌక యథారీతిగా (కదలకుండా) ఉన్నట్లు, ఒడ్డున ఉన్న చెట్లు కదులుతు న్నట్లు కనిపిస్తాయి చూచావా? అట్లాగే వాయుప్రేరితమైన చలనం పొందుచున్నప్పటికీ ఈ భూమి ఎప్పటియట్లే కదలకుండా ఉన్నట్లు – భ్రమచేతమాత్రమే అనిపిస్తోంది. పృథివియందు ఉన్న ఈ జనులకు పృథివి యొక్క అనుక్షణికచలనం ఏమాత్రం గోచరించటమే లేదు. అలాగే ఈ దేహం కూడా. ఈ దేహం ఎప్పటికప్పుడు మార్పుచెందుతూనే ఉండగా ఈ జీవుడు "నా దేహం ఎప్పట ిలాగానే యథాతథంగానే ఉన్నది"... అని ప్రతి ఉదయం లేచి అనుకుంటున్నాడు.

ఒక చిత్రకారుడు అతి విస్తారమైన ప్రదేశమును చిన్నవిస్తీర్ణము కలిగిన కిత్తనార గుడ్డపై చిత్రీకరించున్నాడు కదా! అట్లాగే, ఒక పరమాణువునందు కూడా ఈ మనస్సు విస్తారమైన జగత్తును కల్పన చేసుకుంటోంది. అనుభవిస్తోంది.

ఈ జీవులు జీవించి ఉన్నంతకాలం అల్ప లక్ష్యాల పట్ల తమ ధ్యాసను పరిమితం చేసుకొని, అనేక వ్యాకులతలతో కాలం గడిపివేస్తున్నారు. జీవించినంత కాలం మరికొన్ని ప్రాపంచిక భ్రమలను ప్రోగుచేసుకొని వాటిని 'మనస్సు' అనే సంచిలో నింపుకొని ప్రాణములతో వాటిని మోసుకొంటూ దేహాలు త్యజిస్తున్నారు. నీకు నేను వాయువులో చూపిస్తున్న జగత్తులు అవే సుమా! ఒక ఎలుక ఒక రోజు ధనాగారం ప్రవేశించింది. అది రత్నములన్నీ వదిలి అక్కడ గల దోసిలి మాత్రపు అన్నాన్ని మహత్తరంగా భావిస్తుంది కదా! అట్లాగే ఈ జీవులు జ్ఞానమును సముపార్జించ టానికి అర్హమైన 'మానవుడు' వంటి ఉత్తమ జన్మలలో ప్రవేశించికూడా మహత్తరమగు ఆత్మజ్ఞాన విశేషాలను, అనుభవాలను వదిలి మరిన్ని ప్రాపంచిక వాసనలను ప్రోగుచేసుకోవటమే జరుగుతోంది. పసిబాలుడు అమూల్యమగు ఆభరణాను ప్రక్కకు పారవేసి మట్టి ముద్దను అధికమైనదిగా భావించు నట్లు ఈ జీవుడు చైతన్యతత్త్వమును వదలి పరమాణు నిర్మిత వస్తు సముదాయాలగు ఈ దేహం, గృహం మొ॥ వాటిని మహత్తరమని ఎంచి ఈ పాంచభౌతిక జగత్తులలో తారట్లాడు చున్నాడు.

ఓ రామా! నీవు "సజీవుని ఇహలోక జగత్తు – మరణించినవాని యొక్క పరలోక జగత్తు"ల సామ్యం గురించి అడిగావు కదా! ఈ చైతన్యము అజ్ఞానముచే ఆవరించబడి ఉన్నంతకాలం.... ఈ సజీవుడు చూస్తున్న ఈ పదార్థ రూప ఇహలోక జగత్తు, మృతునికి అనుభవమౌతున్న భావనామాత్ర (లేక, ఊహామాత్ర పరలోక) జగత్తు.... ఈ ఉభయము "వృద్ధి చెందిన చిత్తముయొక్క సంకల్ప రూప భావనయే"నని గ్రహించు. ఇక్కడి – అక్కడి సుఖదుఃఖములు, ధర్మాధర్మ భావనలు.... అంతా కూడా చిత్తము యొక్క విన్యాసమే!

"ఇది త్యజింపతగినది. ఇది గ్రహింపవలసినది" అను రూపంలో ఎవనిలో ఉన్నదో... అదే మమత్వభావనయొక్క రూపం. ఎవని అంతఃకరణంలో అట్టి గ్రాహ్య – త్యాజ్య భావన ఉన్నదో... అదియే అజ్ఞానం యొక్క రూపం సుమా! ఎందుకంటే, సర్వజ్ఞుడైన జ్ఞాని ప్రారబ్ధక్షయ పర్యంతరము వ్యవహార నిమిత్తం కార్యసంరంభమునకు సంబంధించిన వ్యవహారత్వము వహించియే ఉంటాడు.

చైతన్య సహితుడగు ఈ జీవుడు ఈ హస్త–పాదాది ఆయా అవయవాలను తన మనస్సునందే మనస్సుచేతనే అనుభవిస్తున్నాడు. అట్లాగే హిరణ్యగర్భుడు కూడా! సమిష్టి జీవుడు తన మనస్సునందే ఈ త్రిలోకాలను తన అంతఃకరణం యొక్క వ్యాప్తిచే తనే అనుభవించుచున్నాడు. ఓరామా! ఈశ్వరుడు వాస్తవానికి చైతన్యస్వరూపుడై, చిదాకాశరూపుడై, అవ్యయుడై, జన్మాదులు లేనివాడై అనంతరూపుడై ఉన్నాడు. ఇక ఈ జగత్తుల విషయానికి వస్తే, ఇది ఆ ఈశ్వరుడు తన అవయవంగా దర్శించడం జరుగుతోంది. అనగా ఈ జీవుడు ఈశ్వరస్వరూపుడైకూడా తన ఈశ్వరత్వమును ఏమరచి ఈ ఇహ–పర దేహాలను అవిశ్రాంతంగా గాంచుచున్నాడు. ఇనుపగుండు అగ్ని యొక్క సహకారంచే కత్తి, సూది వంటి తన భావికాలపు వికారాలను గాంచుచున్నట్లు ఈశ్వరస్వరూప జీవుడు ప్రళయకాలానంతరం తనయందు ఈ ముల్లోకాల భ్రమను గాంచుచున్నాడు. అధిష్ఠానమగు మృత్తిక (మట్టి) తనయందు గల కుండను తన రూపంగా గాంచుచున్నట్లు ఈశ్వరుడు తన యొక్క

మాయచే జగత్తును తన అంగంగా గాంచుచున్నాడు. విత్తులో గల అంకురరూప సత్త కాలక్రమంగా వృక్షత్వభావనచే వృక్షమును తన అవయవముగా తలచుచున్నట్లు బ్రహ్మం తనయందు స్వీయ మాయచే ఈ త్రిలోకాల దర్శనం చేస్తోంది.

నిజరూపం దృష్ట్యా జడమాత్రమగు అద్దం తనయందు ప్రతిబింబించే నగరంలో ఆయా కార్యకలాపాలు చూపరులకు చూపుచున్నట్లు బ్రహ్మము నిర్విషయ – నిర్మలతత్త్వమై ఉండి కూడా జీవేశ్వర ఉపాధిసంబంధిత దృష్టిచే తనయందు ఈ త్రిలోకాలను దర్శించి అనుభవించుతోంది. శుద్ధ దృష్టిచే తనయందు తానే సర్వదా ఏర్పడి ఉంటోంది.

**దేశ కాల క్రియా ద్రవ్య మాత్రమేవ జగత్త్రయమ్ ।**
**అహంత్వ జగతోస్తేన భేదో నాస్త్యేతదాత్మనోః ॥**

ఇక్కడ కనబడే ముల్లోకాలు దేశ–కాల–క్రియ–ద్రవ్యమాత్రాలే అయి ఉన్నాయి కదా! అట్టి దేశ–కాల–క్రియా–ద్రవ్యాల పట్ల అభిమానం గల అహంకారం వాటితో తాదాత్మ్యం చెంది ఉండటం చేత వాటితో 'తత్సమానవస్వభావం' కలిగి ఉండటం జరుగుతోంది. కాబట్టి అహంకారానికి – జగత్తుకు భేదం లేదు.

ఓ రామచంద్రా! శ్రుతులు గాని, నేను గాని 'లోహం – మట్టి' మొదలైనవి దృష్టాంతాలుగా తీసుకుంటున్నప్పుడు కేవలం బోధ సూచకమైన ఒకానొక విశేషాన్ని ఉపమాన సామ్యంగా గ్రహించాలని ఉద్దేశిస్తున్నాం సుమా! అది గమనించవలసినదిగా శ్రోతలకు నా విన్నపం.

ఈ స్థూలంగా కనిపిస్తున్న స్థావర–జంగమ జగత్తంతా ఏమై ఉన్నది? తన సూక్ష్మ బ్రహ్మ భావాన్ని ఏమాత్రం త్యజించనట్టి చైతన్యం యొక్క వివర్తమాత్ర (Deduced) శరీరమే అయి ఉన్నది సుమా! నీవు జ్ఞానదృష్టితో దర్శించావా... ఈ వివర్తమంతా తొలగి శుద్ధము – పూర్ణము – సర్వత్రా వ్యాప్తము అయినట్టి నిస్సంగమగు ఆత్మయే కనబడుతోంది. అప్పుడిక జీవ – జగత్ భేదం కొంచెం కూడా కనిపించదు. ఒకడు తన యొక్క అజ్ఞానముచే ఏఏ వివర్తము చూస్తున్నాడో అదంతా ఆతని అజ్ఞానాంశము చేతనే అట్లగుపిస్తోందని గ్రహించు. ఎవరు ఏది ఎట్లు చూడటానికి సంకల్పిస్తే అది అట్లే అనుభూతమవటం చైతన్యముయొక్క విశేషము. అట్టి చైతన్యము యొక్క దర్శనమునే "చైతన్యాంశ వివర్తము" అని మనం పిలుస్తున్నాం.

ఈ సర్వము చైతన్యమే అయి ఉన్నది. చైతన్యముయొక్క సమక్షము చేతనే మనస్సు, ఆ మనస్సునందు సంకల్పములు ఉంటున్నాయి. చైతన్యము లేనిచోట సంకల్పములు ఉండజాలవు.

చైతన్య ప్రభావము చేతనే చిత్తము ఉంటోంది... చిత్తము యొక్క సంకల్పపరంపరలే జగత్తు యొక్క రూపం... కాబట్టి 'ఈ జగత్తు చైతన్యమే' అని శాస్త్ర నిర్ణయం. చిదాకాశము సర్వవ్యాపకము, అనంతము కదా! అందుచేత చైతన్యమే తన స్వరూపంగా గలిగి ఉన్న ద్రష్ట యొక్క జగద్దర్శనమంతా చిదాకాశమే అయి ఉన్నదనటంలో కించిత్ సందేహం కూడా ఉండనక్కర్లేదు. జ్ఞాని విషయానికి వస్తే... అతని అంతఃకరణమునకు ఏ వికల్ప సముదాయం ఉదయిస్తోందో, అదంతా ఆతని

(జ్ఞాన) దృష్టికి ఏమాత్రం ఉదయించనిదే అగుచున్నది. ఎందుకంటే... ఆ కనబడే జగద్విశేషమంతా ఆతడు మిథ్యగానే ఎఱుగుచున్నాడు కాబట్టి!

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జగత్తంతా బాలునికైనా, వృద్ధునికైనా సత్యం వలే అనిపిస్తోంది కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** "బాలునికి వృద్ధునికి జగత్తు సత్యము వలె అనిపిస్తోంది కాబట్టి ఇది సత్యమే కదా"... అని కాసేపు మాటవరుసకు అనుకుందాం. మరి ఒకడు తన స్వప్నంలో వస్తు – వాహన – జనాది విశేషాలు చూస్తున్నాడు. ఆ స్వప్నం నుండి మైదొలగే వరకూ ఆ స్వప్నద్రష్ట స్వప్నంలోని బంధువులను, వస్తువులను వాస్తవమనియే ఆ కాసేపు తలచుచున్నాడు కదా! కాబట్టి స్వప్నంలో కనిపించిన బంధువులు, వస్తు – గృహ – వాహనాదులు వాస్తవమని అందామా? కాదు. మెళుకువ వచ్చేసరికి అవన్నీ లభించటం లేదు. కనుక అవి అవాస్తవమే కదా! అట్లాగే, ఈ చంచల జాగ్రత్తులో అజ్ఞానికి కనిపించే జగదంతర్గత సంబంధ బాంధవ్యములన్నీ జ్ఞానము పొందిన తరువాత "అవి భ్రమయే" అని తప్పక గ్రహిస్తున్నాడు. కనుక జగద్దర్శనమంతా భ్రమయేనని గ్రహించు.

**శ్రీరాముడు :** స్వామీ! స్వప్నమును ఈ జీవునికి కల్పిస్తున్నదెవరు? ఎవరి ఉద్దేశమును అనుసరించి ఒక జీవునికి స్వప్నంలో తదంతర్గత విశేషాలు అగుపిస్తున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకడు చూచే స్వప్నం మరొకరెవరో బయట నుండి నిర్మిస్తున్నారనునది హాస్యపు మాట. ఆ స్వప్నద్రష్ట యొక్క కూటస్థ చైతన్యమే తన స్వప్న ఫలకమునందు స్వప్న దృశ్యమును సంకల్ప పూర్వకంగా రచించి – అంతర్గత సంస్కారముల ప్రభావం చేత దర్శిస్తోంది. ఆ కూటస్థ చైతన్యమే "జాగ్రత్, స్వప్నములు" అనే సంకల్పమునందు, 'సుషుప్తి' అను వాసనయందు భోక్తగా ప్రతిబింబిస్తోంది. అనగా ఈ సంసారం అనేది కూటస్థ చైతన్యం తన 'స్వరూపం' అను కాగితంపై చిత్రించిన చిత్రీకరణమే గాని మరొకటేదీ కాదు. అనగా, చైతన్యం స్వప్న సమయంలో తాను రచించిన దానిని తానే వాస్తవమైనట్లు భావించి అనుభవిస్తోంది. "స్వప్న సదృశ జాగ్రత్ – జాగ్రత్ సదృశస్వప్నము" – ఈ ఉభయం సత్యంగా తోచుచున్నప్పటికీ సత్యం కాదు. కూటస్థ చైతన్యం యొక్క ప్రతిబింబంతో పోల్చతగిన ఈ జీవునకు అనుభూతమయ్యేదంతా ఒక నాటకంలోని పాత్ర యొక్క గుణాదుల వలె మొదలే అసత్యం.

కూటస్థ స్వరూపం దృష్ట్యా ఈ జీవుడు నిత్యసత్యం. గుణ – కర్మాదుల దృష్ట్యా మొదలే అసత్యం.

నిత్యముక్తుడు, సత్యస్వరూపుడు అగు పరమాత్మయే అసత్యరూపమైన ఈ జగత్తును ధరిస్తు న్నాడు. ఇది ఎట్లా అంటావా? జ్ఞానము ద్వారా ఈ జీవుడు ఈ "సూక్ష్మ శరీర సహిత అజ్ఞానము"ను సంక్షయింపజేసుకున్నప్పుడు ఈతడు శివస్వరూపుడే అగుచున్నాడని శాస్త్రవాక్యం కదా!

**[జీవశ్శివో శివోజీవః జీవో బ్రహ్మేతినాపరః । పాశబద్ధః తథాజీవో పాశముక్తః సదాశివః ॥]**

కాబట్టి రామచంద్రా! "దూది పుంజములలాగా ఆకాశంలో ప్రాణవాయువులచే జగత్తులు కొట్టుకుపోబడుచున్నాయి"... అని చెప్పాను చూచావా? అటువంటి వాక్యాలన్నీ అజ్ఞానుల కొరకే

వారి జ్ఞానాభివృద్ధిని ఉద్దేశించి నేను కల్పితపాఠ్యాంశంగా చెప్పాను. వాస్తవానికి అంతా కల్పనా మాత్రమే కనుక జగత్తులు లేవు, అవి కొట్టుకుపోవటం లేదు, అవి విద్యమానమవటమూ లేదు. "నాకు కనబడుచున్నాయి" అని చెప్పినవన్నీ ద్రష్టల స్వయంకృత కల్పనావిశేషాలే - అని గ్రహించు.

ఈ విధంగా చిదాకాశం సమస్త పదార్థసమూహాల కోశరూపమై సర్వత్రా వ్యాప్తమై ఉన్నది. ఆ చిదాకాశము అజ్ఞాన కారణం చేతనే అనేక బ్రహ్మాండాలు, వాటిలో కొన్ని ఒకదానితో మరొకటి కలియటం, మరికొన్ని వేఱు వేఱై ఉండటం - ఈ చమత్కారమంతా జరుగుతోంది. పరబ్రహ్మం సర్వశక్తిమంతమైనది. తత్కారణంగా ఈ బ్రహ్మాండాలన్నీ అనంతరూపాలై అనేక కార్యారంభాలతో కూడుకొన్నవై ఉంటున్నాయి. అందులోని ఈ బ్రహ్మాండాలు అనేకమంది జీవులతో పూర్ణమై, చంచల మేఘాలలోని నగర ప్రతిబింబాల వలె ఉంటున్నాయి. గంధర్వ నగరాలలాగా మాంత్రికునిచే కల్పించబడి కనిపింపజేసే మాయా వస్తువుల వలె ప్రవర్తిస్తున్నాయి. ఈ జగత్తులలోని దేహములు, పదార్థములు మొదలైనవి పైకి స్థిరంగా ఉంటున్నట్లు భ్రమింపజేస్తున్నప్పటికీ లోన అతిచంచల శీలమై ఉంటున్నాయి. జల తరంగాల వలె చిద్రూపమహాసముద్ర తరంగాలుగా ఈ బ్రహ్మాండాలు ఏర్పడి, కనబడి, ఉండి - ఇంతలోనే కాలగర్భంలోకి జారుకుంటున్నాయి. ఏది ఏమైనా ఆత్మ సర్వదా నిశ్చలంగానే ఉన్నది.

ఇక జీవునికి 'నిశ్చలత్వము'నకు సంబంధించిన భావన కలగటానికి కారణం స్వరూపతః ఆత్మయే కాబట్టి!

❖❖❖

# 17. సమష్టి రూప విరాట్ పురుషుడు - వ్యష్టి

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జీవునకు రెండు విధాలైన రూపములున్నాయి. కదా!... 1. ఆకృతరూపం (శాస్త్రీయ, వ్యవహారయుక్తమైన రూపం), 2. అవ్యాకృతరూపం (పారమార్థిక రూపం)... ఇప్పుడు నా ప్రశ్నలు విన్న విస్తాను-

1. జీవునికి వ్యవహారకారణమయ్యే ఈ స్థూలదేహం స్వీకరించటమనేది ఎట్లా సంభవించింది.

2. ఈ భౌతిక-వ్యావహారిక రూపాన్ని అతిక్రమించి పారమార్థిక స్వరూపాన్ని అతడు ఎట్లా సంతరించుకో గలుగుతాడు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! విను, చెపుతాను.

చిదాకాశము సర్వదా అనంతమైనది. అట్టి చిదాకాశబ్రహ్మము స్వ (తన యొక్క) సంకల్ప చమత్కారంచే మనోబుద్ధ్యహంకార రూపమగు సూక్ష్మోపాధియందు ప్రవేశిస్తోంది. అట్లు ప్రవేశించి ఈ నేత్రాలు మొదలైన ఇంద్రియాల ద్వారా విషయాలను అనుభవిస్తోంది. అట్టి అనుభవాన్ని అవధరించటం అను చర్యను దృష్టిలో పెట్టుకొని అది 'చేతనం' అని పిలువబడుతోంది. అయ్యది ప్రాణాలను అవధరించటంచేత 'జీవుడు' అను నామం చేత చెప్పబడుతోంది.

కాబట్టి... ఈ జీవుని రూపము సూక్ష్మమూ కాదు, స్థూలమూ కాదు, శూన్యమూ కాదు, ఒకానొక వస్తు రూపము కాదు, మరి?... అయ్యది సర్వత్రా వ్యాప్తమై, అంతటా ఉత్తేజతత్వమైనట్టి స్వానుభవమే అయి ఉన్నది. చిన్మాత్రమే 'జీవుడు' అను శబ్దముచే చెప్పబడుతోంది.

"జీవుని రూపం అణువువంటి సూక్ష్మపదార్థాల కంటే అత్యంత సూక్ష్మం. స్థూల పదార్థాలన్నిటి కంటే అత్యంత స్థూలం. అది ఇదేదీ కాదు కానీ, ఇదంతా అదే. బ్రహ్మమే ఈ జీవుని వాస్తవరూపం" ...అని విజ్ఞులు నిర్ణయిస్తున్నారు. ఏ ఏ పదార్థములకు ఏఏ జాతి-గుణాది అసాధారణ విశేషాలు అగుపిస్తున్నాయో... ఆయా రూపంచే జీవచైతన్యమే స్థితి కలిగి ఉందని గ్రహించు. ఎందుకంటావేమో? ఆ చైతన్యమే చిత్తవృత్తి ద్వారా ఆయా అనుభవమగుచున్న పదార్థంగా భాసించుచున్నది.

స్వస్వరూపం నుండి బయల్వెడలుచున్నట్టి సమష్టి జీవుడు (బ్రహ్మ, సృష్టికర, విరాట్ పురుషుడు) ఎప్పుడు ఎచ్చట ఏ అనుభవాన్ని ఆశ్రయిస్తాడో... అప్పుడు అచ్చట అట్లే శీఘ్రంగా అగుచున్నాడని సూక్ష్మదృష్టితో గ్రహించు. వాయువుకు చలనం స్వభావంగా అగుచున్నది చూచావా? సమష్టి జీవునికి ఈ సృష్టి తన యొక్క స్వభావమే అయి ఉంది. అంతేగాని ఇది – బాలునికి బేతాళుని భ్రాంతి వలె ఎవరో ఏదో చెప్పితే కలిగినది కాదు. జీవునకు ఎవరో చెప్పితే దర్శన ప్రతిభ కలిగినది కాదు. ఇది స్వభావమే అయి ఉన్నది. అయితే ఈ విషయం స్వ విజ్ఞాన మాత్రంచే నిర్ణయించ వలసినదే! ఒకరు బోధిస్తే మరొకరు పొందేది కాదు.

గాలి సంచలనం కలిగి ఉండటంచే దాని స్పర్శ తెలుస్తోంది. సంచలనం లేకపోతే? వాయువు ఉన్నప్పటికీ స్పర్శాస్పర్శలు ఉండవు. అట్లాగే ఈ జగత్తు ఇందలి పదార్థ విశేషాలు ఎదురుగా ఉంటున్నప్పటికీ ఎవరికైతే ఇవన్నీ అర్థరహితాలనీ, నిర్విషయాలనీ తెలియవస్తుందో (అనుభవమౌతుందో... అనగా, ఈ జగత్పదార్థాలన్నీ పరిగణార్హత కోల్పోతున్నాయో) అప్పుడు ఆతనికి బ్రహ్మభావం విద్యమానమౌతోంది. జగత్ భావన తొలగిపోతోంది.

జీవుడు స్వయంగా చిద్ఘనరూపుడే. అందుచేత ఆతని 'స్ఫురణ' అగు 'అహం' అను రూపంలో గల అహంకారం ఈ "దేశ-కాల-క్రియ-ద్రవ్య"... మొదలైన శక్తులను ఆవిర్భవింపజేసి వెలయుచున్నది. అట్టి అహం నుంచి చిత్తం యొక్క కల్పన కావించబడుతోంది. చిత్తం యొక్క రూపమేమిటి?

1. దేశకాలక్రియాదుల రూపమున తన సూక్ష్మసంస్కార చమత్కారంచే కించిత్ ఆవిర్భవించిన చిత్తు యొక్క చమత్కారమే చిత్తము.
2. సూక్ష్మత్వము నుంచి స్థూలమును సంతరించుకోవటమే చిత్తము.
3. అసత్యమైనప్పటికీ ఈ దృశ్యమును సత్యమువలె భాసింపజేయునదే చిత్తము.
4. జగదనుభవమే చిత్తము యొక్క రూపం. అంతకుమించే వేఱే ఏ రూపమూ లేదు.
6. చిత్తముయొక్క ఆకారము ఆ చిత్తమునకు అనుభవమయ్యే జగత్తు... రెండూ అవాస్తవాలే!
7. ఈ చిత్తము అతి సూక్ష్మమగుటచేత దాని వికారాలు సూక్ష్మ తరంగాలుగా హృదయంలో ప్రవహిస్తున్నాయి. అవియే జగత్తును నింపి ఉంచుతున్నాయి.

ఈ చిత్తం స్వప్నంలో కల్పిత పరంపరల వలే తన అభిలషిత పాంచభౌతిక శరీరాన్ని కల్పిత మాత్రంగా గాంచుచున్నది. స్వప్నంలో ఒకనికి తాను మరణించినట్లు, బంధువులు దుఃఖిస్తున్నట్లు సంఘటనలు ప్రాప్తమగుచున్నట్లే జీవునికి ఈ జాగ్రత్ శరీర పరంపరలు వస్తున్నాయి, పోతున్నాయి.

స్వప్నంలో కనిపించే ఆయా జనులు స్వప్నద్రష్ట యొక్క స్వప్న శరీర విభాగములే కదా! అయినా, స్వప్నద్రష్ట స్వప్నంలో తారసపడిన రూపాలు తనకు వేరైనట్లుగా భ్రమిస్తున్నాడు చూచావా?

ఈ జీవుడు స్వతహాగా బ్రహ్మానందమయుడు, అఖండ నిత్యత్వ సంపన్నుడు అయి ఉండి కూడా "వీరు–వారు–నా వారు–నీ వారు–స్వజనులు–పరజనులు" ఇత్యాది విశేషాలతో కూడిన పరిచ్ఛిన్న జగద్రూపాన్ని (తన స్వరూపానికి అన్యమైనట్లు) గాంచుచున్నాడు. ఇట్టి "అహం – చిత్తం – ఇంద్రియ జగత్" వరుస క్రమంలోనే సమష్టిజీవుడు చింతిస్తూ సమష్టి స్థూల రూపమగు ఈ విరాడ్రూపాన్ని (పాంచభౌతిక సమష్టి జగత్తును) పొందుచున్నాడు. అంతేకాదు. ఆతడు తన ఆత్మ యందే సమష్టి మనస్సును నీళ్ళలో ప్రతిబింబించే చంద్రబింబంలా గాంచుచున్నాడు. ఇదియే సమష్టి జీవుని హిరణ్యగర్భరూపం. ఆ తరువాత ఈ తన సమష్టి యుక్తమైన హిరణ్యగర్భరూపాన్ని కాకతాళీయ న్యాయంచే తనకు భిన్నమైనదానిగా పంచజ్ఞానేంద్రియాల ద్వారా గాంచుచున్నాడు. ఆ పంచజ్ఞానేంద్రియాల ఛిద్రసహిత స్థానాలైన ఇంద్రియ ద్వారాలను (కర్మేంద్రియాలను) చింతిస్తూ, ఆయా విషయానుభవాలను పొందుచూ విరాట్పురుషుడై శోభిస్తున్నాడు.

ఈ విధంగా "అవ్యక్తరూపుడు–నిరామయుడు–అనంతాకార జ్ఞానయుతుడు–పరమేశ్వర స్వరూపుడు" అయినట్టి ఈ జీవుడు అనబడువాడు పంచేంద్రియములు అవయవములుగా గలవాడై విరాజిల్లుచూ, ఆయా విషయములను (శబ, స్పర్శ, రూపాదులను) అనుభవిస్తూ పోతున్నాడు.

అనగా... మనస్సు ప్రప్రథమంగా పరబ్రహ్మం నుండి ఆవిర్భవించి అనేక దేహపరంపరలను అనుభవించటంలో నిమగ్నమై, తన ఉత్పత్తి స్థానమును తానే ఎఱుగక తబ్బిబ్బగుచున్నది.

ఈ జీవుడు వాస్తవానికి పంచభూత పరిమితుడు కాదు. కాని పంచభూత పరిమితునివలె తోచుచున్నాడు. కారణం? కదిలే దానిని చూస్తూ కదిలించేదానిని ఏమఱచుచుండటం చేతనే. ఏది ఏమైనా ఈ జీవుడు తన యొక్క అప్రమేయ – అనంతాది విశేష సంపన్నమైన చైతన్యనమునకే 'ఆది' అయిన చిదానంద ఘనముగాక, పరమాత్మగాక మరొకటేదో కానే కాడు. పరమాత్మస్వరూపుడుగా ఈతడు సర్వశక్తి సంపన్నుడేగాని ఏదో చావు–పుట్టుకుల మధ్య చిక్కుకున్న పిట్టవంటి వాడు కాదు. ఈతడు తనకు తానే స్వయంగా ఆవిర్భవిస్తున్నాడు, స్వయంగానే సంచాలనం నిర్వర్తిన్నాడు. స్వయంగానే లయం అగుచున్నాడు. ఈతడు స్వసంకల్పవశం చేత కల్పసమూహాలలోను, క్షణకాలములందు ప్రవేశించి మరల భావనను ఉపశమింపజేస్తూ శమించుచున్నాడు. ఈ జీవుడు దేహధారిగా కనిపించినా, సూక్ష్మదృష్టికి ఈతడు కేవల మనోమాత్రధారిగా తెలియవస్తున్నాడు.

మనస్సే శరీరములలో ప్రవేశించి, ఇంతలోనే నిష్క్రమిస్తోంది. ఏ చైతన్యాత్మ సమష్టి రచనా సంవిధానంలో ప్రవేశించి ఈ విరాడ్రూప విశ్వంగా ప్రకటనమగుచున్నాడో... ఆతడే వ్యక్తి జీవుల

యొక్క పుర్యష్టకంలో (పంచ కర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, వాసనలు, అవ్యక్తం) ప్రతిబింబిస్తున్నాడు.

**సూక్ష్మః స్థూలో అంబరాత్మైష వ్యక్తో అవ్యక్తోంతవర్జితః**
**సర్వస్య బహిరన్తశ్చ న కించిత్ కించిదేవ చ॥**

అవ్యక్త అనంతాకాశ రూపుడగు ఆ పరమాత్మయే సూక్ష్మ శరీరాలలో... సూక్ష్మంగా, స్థూల శరీరాలలో... స్థూలంగా – సమస్త పదార్థముల బాహ్య అభ్యంతరాలలో వెలయుచున్నాడు. పరమార్థమున ఈతడు సర్వదా అపరిచ్ఛిన్నుడే అయినా కూడా వ్యవహారమునకు వచ్చే సరికి పరిచ్ఛిన్నుని లాగా ఒప్పుచున్నాడు.

పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు, వీటన్నిటినీ ఆక్రమించి ఉన్న భావాభావాలతో కూడిన అహంకారం – ఇవన్నీ కలిసిన రూపమే జీవుడు.

ఈ జీవులలో ప్రకాశిస్తున్న ఆత్మయే చతుర్ముఖుడగు బ్రహ్మదేవునియందు కూడా ఉండినదై శబ్దార్థ కల్పనా సహితమైన నాలుగు వేదాలను గానం చేయుచున్నది. ఆ బ్రహ్మదేవుడే నేటి వరకు వ్యవస్థితమై ఉనట్టి నియతిని (శాస్త్రీయ, అశాస్త్రీయ సంచారాలను, విహిత, అవిహిత కర్మలను, కర్మల ఫలాదులను) స్థాపించినాడు. అతనినే "విరాట్పురుషుడు" అని కూడా అంటారు.

స్వర్గలోకం ఆ విరాట్ పురుషుని శిరస్సు, పృథివి ఆతని పాదం. మధ్యగా ఉన్న ఆకారం ఆతని ఉదరం. ఈ బ్రహ్మాండమండపం ఆతని శరీరం. అనంతమైన ఇతర లోకాలు ఆతని ప్రక్క అవయవవాలు. జలం ఆతని రక్తం. పర్వతాలు ఆతని మాంస పిండం. నిరంతర ప్రవాహ శీలాలగు నదులు ఆతని నాలుకలు. సముద్రాలు ఆతని రక్త సంచయస్థానాలు. సప్త ద్వీపాలు ఆతని ప్రేగులు. విశాలమగు దిక్కులు ఆతని బాహువులు. నక్షత్రాలు ఆతని రోమసమూహాలు. వాయువుల ఆతని ప్రాణవాయువులు. సూర్యమండలం ఆతని నేత్రం. చంద్రుడు ఆతని మనస్సు. ఆ మనస్సే ఈ శరీర వృక్షములకు బీజం. ఆ చంద్రమండలమే అన్నాదులకు హేతువు. మనస్సే ఈ జీవుడు.

చంద్ర రూపుడగు విరాట్ – జీవుని వలననే ఈ మూడు లోకములందలి సమస్త జీవులు, వారి మనస్సులు, కర్మలు సుఖములు, మోక్షములు – ఇవన్నీ ఏర్పడి ఉన్నాయి.

చంద్రరూప విరాట్ పురుషుని సంకల్ప రూపులే బ్రహ్మ – విష్ణు – మహేశ్వరులు కూడా! అంతేకాదు. సురులు, అసురులు, మానవులు, జంతువులు, పక్షులు – ఇవన్నీ ఆ సమష్టిచిత్తం యొక్క చమత్కారము మాత్రమే!

ఈ విధంగా సృష్టికర్తలోని చిత్తు, జీవునిలోని చిత్తు ఒక్కటేగాని వేఱువేరైనవి కావు. వాస్తవానికి నిర్విషయము, అనంతయుతము అగు చిత్ త్రికాలాభాద్యసత్యము. అందులోంచి 'స్వభావము' అనే చమత్కారం స్వయంకృతంగా అయి బయల్వెడలుతోంది. ఆ చిత్ స్వభావమే సూక్ష్మమగు అమృతకళకు సాక్షిగా దర్శించుటకు ఉపక్రమించి చంద్రునికి "కార్యం, కారణంగా" అగుచున్నది. ఆ చిత్కళ ఎప్పుడు ఏ 'దేవత, ప్రజాపతి' మొదలైన ఆకారాన్ని సంకల్పించుచున్నదో... అప్పుడు

అక్కడ అట్లా ఆ దేవత, ప్రజాపతి, మానవుడు, పురుగు మున్నగు రూపాలతో వెలయుచున్నది. అమృతకళతో కూడిన ఈ భౌతిక చంద్రుని ప్రభావం చేతనే భూమిపై ఓషధులు, పదార్థ – శరీర సృష్టి ఏర్పడుచుండుట చేతనే "జాగ్రద్దశగా అందరికీ అనుభూతమగుచున్న ఈ చంద్ర (విరాట్) మండలమే సమష్టి జీవుడగు విరాట్ పురుషుని శరీరం అపంచీకృత పంచభూతాలే ఆతని అవయవాలు"... అని శాస్త్రకారులు (సామవేదం మొ॥) ప్రవచిస్తున్నారు.

చంద్రరూపుడగు ఆ విరాట్ (సమష్టి) జీవుని నుండి చల్లటి కిరణ ప్రసరణ ద్వారా ఓషధుల రూపమున ఆ విరాట్‌తత్త్వరసతత్వము భూమిపై ప్రసరించి వ్యష్టి జీవులయొక్క ఆహారము–తదితర జీవశక్తులు–జీవనాడులూగా విస్తరించుచున్నది.

అనగా... విరాట్ పురుషుని నుండి బయలుదేరిన జీవ రసస్రవంతి చంద్రుని ద్వారా అమృత కళను సంతరించుకొని, అన్నరసరూపంగా భూమిపై ప్రసరించి ప్రాణధారణ ఒనర్చి, జీవుల దేహా లలో 'జీవం' అను రూపంగా ప్రవర్తిల్లుచున్నది. ఆ విరాట్ పురుష చైతన్య స్రవంతియే మనస్సు – జన్మ – కర్మలన్నిటికీ ముఖ్య కారణమై పరుగుచు, సర్వచేష్టలను ఒనర్చుచున్నది. ఇటువంటి విరాట్ పురుష శరీరాలు అసంఖ్యాకంగా ఒక్కొక్క కల్పంలో ఉన్నాయి. అటువంటి అసంఖ్యాక కల్పములు ఎన్నో గతించాయి. మరెన్నో గతించబోతున్నాయి. అయితే... ఇదంతా మాయా చమత్కారమే! ఎందుకంటే నిర్మల – నిర్విషయ – నిశ్చల బ్రహ్మం నుండి బయలుదేరిన ఈ విరాట్ పురుషుడు (సమష్టి జీవుడు) బ్రహ్మానికి వేఱు కాదు. కనుకనే ఆతడు అనంతుడై, అనుభవరూపుడుగా ఉంటున్నాడు. ఈ వ్యష్టి–సమష్టి సంబంధితమైన అధిష్ఠాన సత్తతో కూడుకొనినవాడుగా ఉంటున్నాడు.

సర్వ దేశ–కాలాలో ఆ విరాట్‌రూపుడు బ్రహ్మం యొక్క మాయావిభాగం నందే స్థితి కలిగి ఉంటున్నాడు. అందుచేతనే "అంతయు బ్రహ్మమయమే" అని సిద్ధాంతీకరించబడుతోంది.

❖❖❖

## 18. వ్యష్టి - విరాట్టు ఒక్కటే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నిర్విషయ ఓంకార ప్రవచిత శుద్ధ – బుద్ధ పరతత్త్వమునుండి విరాట్ పురుషుడు స్వయంసంకల్ప ప్రభావంచే ఆవిర్భవిస్తున్నాడు. ఆ విరాట్ పురుషుడు సత్యసంకల్పుడై (దేనిని ఎట్లు సంకల్పిస్తే అది అట్లే ఏర్పడగల ప్రభావసంపన్నుడై) ఆ తదనంతరం పంచభూతాత్మకుడు అగుచున్నాడు. ఆ విరాట్ పురుషుడు ఏ వస్తువును ఎట్లెట్లు సంకల్పిస్తే అది ఆ విధంగానే స్వయంగా అగుచున్నది.

అనగా, చిదాకాశమగు బ్రహ్మమే ఈ జగత్తులోని ఆయా అనేక విశేషములుగా వివర్తము పొందుచున్నది. అందుచేతనే "ఈ జగత్సమూహమంతా విరాట్‌పురుషుని సంకల్పరూపము మాత్రమే" అని విజ్ఞులు నిర్వచిస్తున్నారు. ఎందుకంటే...

1. మొట్టమొదటి బ్రహ్మం తన యొక్క ఉపాసనా సంయుతమైన వాసనచే సృష్ట్యాదిలో పంచ భూతాత్మకమైన విరాడ్రూపంగా సంతరించుకుంటోంది.

2. ఆ తరువాత అట్టి ఉపాసనా ప్రయోజనమైనట్టి పంచమహాభూతాత్మకమైన విషయాల సమష్టి భోగాల పట్ల స్వయం ప్రేరణచే ఉన్ముఖమౌతోంది.

ఈ విధంగా సమస్త జగత్ పదార్థముల సమూహం యొక్క మూలకారణం విరాట్ పురుషుడే అయి ఉన్నాడు. ఇక ఈ జగత్-జీవ రూపాలగు కార్యాలన్నీ కూడా అట్టి మూలకారణమగు విరాట్ పురుషసంకల్పమును ఆశ్రయించి, అనుసరించి ఉన్నాయని విశదీకరించబడుతోంది. ఇందులో సందేహం లేదు కూడా!

ఇక వ్యష్టి జీవుని విషయానికి వద్దాం. ఈతడు కూడా "పరమాత్మతత్త్వము" అను ముడి పదార్థంతో తయారు చేయబడినవాడే కనుక ప్రతిఒక్క వ్యష్టిజీవుడు కూడా తనయందు తాను సర్వ సృష్టి సమర్థుడయ్యే ఉన్నాడు. ఏ విధంగా అయితే సమష్టి జీవుడు తనయందలి దివ్యచైతన్యశక్తిని ఆసరాగా తీసుకొని ఈ మహాభూతాత్మిక సృష్టిని సంకల్పిస్తున్నాడో... అట్లాగే దివ్య చైతన్యమే స్వరూపంగా గల ఈ వ్యష్టి జీవుడు కూడా, నిజమనోవృత్త్యానుసారం స్వానుభవజ్ఞానాన్ని ప్రసరింప జేసి ఆయా పదార్థముల జ్ఞానానుభవాలను పొందుచునే ఉన్నాడు. అనగా... ప్రతి వ్యష్టిజీవుడు ఏ ఏ జగద్విశేషాలు అనుభవిస్తున్నాడో అట్టి జగద్విశేషమంతా నిజమనో వృత్త్యానుసారమైన జ్ఞాన విశేషమే గాని మరొకరెవరో అద్దానికి కారణం కాదు. ఈ జీవుని జగత్ మనో వ్యాపారమంతా తన స్వరూపము నుండి స్వయంకల్పితంగా ప్రవహిస్తున్న జగత్‌లహరి మాత్రమే !

ఒక క్రిమి నుండి రుద్రుని వరకు జగదనుభవమంతా ఈ ప్రకారంగానే స్వస్వరూపమునుండి జగదాకారభ్రమరూపంగా ఉదయించటం జరుగుతోందని గ్రహించు. ఇదియే సృష్టి.

ఒక బీజంలో మహావృక్షం సంస్కారరూపంలో దాగి ఉండే విధంగా, ఒక అణువులో కూడా సముద్ర-పర్వతాది వస్తు పరంపరలచే విస్తారమైన అనేక జగత్తులు ఉంటున్నాయి. ప్రవర్తిస్తున్నాయి కూడా!

అయితే "ఒక పరమాణువునందు కూడా అనంతాత్మ కలదు" - అనే విషయం జ్ఞానం చేతనే తెలియవస్తోంది గాని, అజ్ఞానం చేత కాదు. ఒక కీటకం - దోమ మొదలుగా రుద్రుని వరకు గల ప్రత్యగాత్మ యందు (ప్రతి ప్రత్యేక ఆత్మయందు) విరాట్ సృష్టి ఉండియే ఉన్నది.

ఈ విధంగా "వ్యష్టి - సమష్టి ఉభయం ఒక్కటే" అనే ఒక మహత్తరమైన సిద్ధాంతం మనకు ఇక్కడ సిద్ధిస్తోందని గమనించు. విరాడాత్మ యందు ఏ విధంగా ఈ సమస్తమైన జగత్తు యొక్క విస్తారము సిద్ధిస్తోందో, అట్లాగే అణుమాత్రమైన ఒక దోమ జీవునియందు కూడా విరాడాత్మ సంబంధమైన విస్తార జగత్తు సంభవించియే ఉంటోంది.

ప్రతిజీవుని విషయంలో ఈ సిద్ధాంతం వర్తిస్తున్నదని గ్రహించబడు గాక! ఇక ఆత్మ ఎటువంటిది?... అది పరమార్థమున స్థూలం కాదు, సూక్ష్మం కాదు, పరిచ్ఛిన్నమూ కాదు. అయితే అది తన యొక్క భ్రాంతి విభాగంచే ఎచ్చట ఎట్లు విస్తరించుచున్నదో, అచ్చట అట్లే శీఘ్రంగా అనుభవించబడుచున్నది. ఆత్మచేతనే ఆత్మ అనుభవించబడుతోంది సుమా!

లేక... చంద్రుని నుండి మనస్సు, మనస్సు నుండి చంద్రుడు... ఉత్పన్నమగుచున్నాయి చూచావా? (చంద్రమా మనసోజాతో); అట్లాగే ఆత్మయందు జీవుని నుండి ఆత్మయే అగు దృశ్యము కల్పితచమత్కారంచే ఉత్పన్నమౌతోంది. జలం, ద్రవత్వం... ఈ రెండూ వేరు వేరా?

**శ్రీరాముడు :** కావు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్లాగే సమష్టి – వ్యష్టి అనబడే రెండూ కూడా ఒకే 'సత్త' కలిగి ఉన్నాయి.

**శ్రీరాముడు :** "ఈ జీవుడు పరమాత్మ యొక్క ప్రతిబింబం. కనుక పరమాత్మయే జీవసంవిత్తు యొక్క కారణం. పరమాత్మ యొక్క కార్యం ఈ జీవుడు"... అను ఒకానొక కార్య–కారణ సిద్ధాంతం కొందరిచే ప్రతిపాదించబడుచున్నది కదా! అట్టి "పరమాత్మ కార్య – జీవ కారణ" సిద్ధాంతము గురించి మీ అభిప్రాయం వినాలని ఉన్నది.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

> **శుక్రసారం విదుర్జీవం ప్రాలేయ కణ సంనిభమ్**
> **ఆనన్దో అచలసందోహస్తత ఏవ ప్రవర్తతే॥**
> **తం చేతతి తదాభాసం పూర్ణమాత్మస్థమాత్మనా**
> **తత్ర తన్మయతాం ధత్తే తేన తన్మయరూపిణీ॥**

"మంచుకణమును పోలినదగు వీర్యమే జీవునియొక్క సారం"... అని అంటూ ఉంటారు. మాతాపితరుల సమాగమ కాలమున చిత్తైకాగ్రతచే 'భోగాకారవృత్తి' యందు నిశ్చలమగు బ్రహ్మం యొక్క ప్రతిబింబం పడుచున్నది. అట్టి వీర్యమునుండి ఉపహితుడైన జీవుని నుండి అభాసరూపమగు 'ఆనందాతిశయం' ప్రవర్తిస్తోంది. అప్పుడు ఆ వీర్యోపహితమైన జీవచైతన్యం తనయందున్న వీర్య స్వభావంచే బ్రహ్మం యొక్క అభాసరూపమైన ఆనందాన్ని అనుభవిస్తోంది. ఇక ఆపై "ఈ నా అనుభవమైన వీర్య రూపమే ఆనందం, నేను ఇద్దాని చేత ప్రియతముడనగుచున్నాను" అని అనుకుంటూ, క్రమంగా వీర్యోపహితమైన స్థితిచే తాదాత్మ్యం పొందుచూ తన్మయమై వర్తిస్తోంది.

...ఇంకా ఆ తరువాత ఆ జీవ సంవిత్తు (లేక) గర్భస్థమైన వీర్యోపహిత చైతన్యం తదందర్గతమైన దేహరూపాన్ని 'తదాత్మ్యం' అనే చమత్కారంచే పొందుతోంది.

కాబట్టి... అట్టి 'దేహోత్పత్తి' అనే చమత్కారమునందు విరాట్టు–వ్యష్టి, కారణము–కార్యము అనునవి ఏమీ లేవు.

**శ్రీరాముడు :** ఈ సమష్టి – వ్యష్టి దేహసృష్టికంతటికి "పరబ్రహ్మం యొక్క స్వభావమే కారణం. తదితరమైనది కార్యం"... అని నిర్ణయించటం యుక్తియుక్తమేనా? కాదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్లా యుక్తి యుక్తం కాదు. ఎందుకంటావేమో? శుద్ధ బ్రహ్మం నందు 'స్వ' శబ్దం వాచకం కానేరదు. అనగా శుద్ధబ్రహ్మానికి "స్వ–పర" శబ్దమునకు సంబంధించిన వాచకాలను ఆపాదించలేం, ప్రతిపాదించలేం. 'స్వ – పర' అను విభేదం బ్రహ్మమునకు అనువర్తించలేనప్పుడు

ఇక 'వ్యష్టి – సమష్టి' అను వ్యవహారం ఎట్లా ఒనగూడుతాయి? కనుక ఆ స్వ – పర మొదలైనవన్నిటికీ బ్రహ్మం కారణమని గాని, కార్యమని గాని ప్రతిపాదించటం భ్రమాత్మకమైన దర్శనపటాటోపం మాత్రమే. బ్రహ్మమునందు 1.ప్రతియోగి, 2.వ్యవచ్ఛేదము, 3.విరోధి – అనే విశేషములే లేవు. అట్లాగే బ్రహ్మమునందు 'స్వభావం' అనబడే బాహ్యా–ఆంతరిక ఆవరణమేదీ లేదు. ఉంటే 'ఏకోసత్' అను ప్రమాణవాక్యం సిద్ధించదు కదా!

**శ్రీరాముడు :** మహర్షీ! "ఈ జీవుడు అనగా 'స్వ', 'స్వభావం' అను రెండింటి సంయోగం"... అనే ఒకానొక సిద్ధాంతం గురించి మీ అభిప్రాయం చెప్పమని నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇప్పుడు నేను మరొక ప్రశ్నను ప్రతిపాదిస్తున్నాను.

జీవుడు అనగా... 'స్వ' అనబడు వాడా? లేక, దేహ, గుణములా? (అంటే స్వభావమా?) లేక రెండూ కలసియా?

'స్వ'యే ఉపహితుడగు జీవుడని మనం అనుకుంటే, ఇక స్వభావం అనేది ఆతనిలో ఒక విభాగమనటానికి కుదరదు. ఆతనికి స్వభావం బాహ్యమైనదీ కాదు. వాయువు యొక్క బాహ్యా–అభ్యంతరాలలో వాయువే ఉన్నట్లు, జీవుని బాహ్యా–అభ్యంతరాలలో స్వస్వరూపుడైన జీవుడే ఏర్పడి ఉన్నాడు. కనుక జీవత్వం – జీవుడు అనునది స్వతహాగా ఒక్కటే గాని వేరు వేరైనవి కాదు.

అట్టి ఈ జీవుడు ప్రాణం, ఇంద్రియాలు మొదలైన జడవస్తువులతో, "ఇవియే నేను. వీటిచే నేను పరిమితుడను"... అను రూపంతో తాదాత్మ్యం చెందుచున్నాడు. తద్వారా సంకుచితుడై, దృశ్య–విషయ–వస్తు పరాయణుడై జన్మాంధుని వలె ఉంటున్నాడు. అవిద్యాంశ పట్ల ధ్యాసచే ఆ అవిద్యా దశలో తన నిజమార్గమును (స్వస్వరూపమగు బ్రహ్మమును) గాంచటమే లేదు. తన నిశ్చల విభాగాన్ని ఏమరచి, చంచల విభాగాన్ని మాత్రమే నిరంతరం దర్శిస్తున్నాడు. 'చలనశక్తి'చే వాయువు కప్పబడినట్లు ఈ జీవుడు (నిశ్చల స్వరూపుడై ఉండి కూడా) జగదాకారంగా విజృంభిస్తున్న మాయాశక్తిచే కప్పబడి ఉంటున్నాడు. తన యొక్క ఏకత్వ రూపమునందు "ద్రష్ట – దృశ్యం" అను విభేదం గల ద్వైతరూపం కల్పన చేసుకుంటున్నాడు. అట్టి చంచలత్వమును అధిరోహించి తన శుద్ధ, సుస్థిరరూపమును గమనించలేకపోతున్నాడు.

ఏదైతే మిథ్యారూపమై, దృశ్యాత్మకమై, వాస్తవానికి అసత్తై ఉన్నదో... అదే అజ్ఞానం! జ్ఞానంచే అట్టి అజ్ఞాన మహాగ్రంథి భేదనమే మోక్షం. "ద్రష్టత్వమంతటి కంటే ముమ్ముందుగా ఉన్న నా స్వరూపం సర్వదా యథాతథంగా ఉంది"... అనే అనుభవమే 'మోక్షం' అను పరిభాషగా చెప్పబడుతోంది.

అందుచేత, ఓ రామచంద్రా! నీవు అజ్ఞానమేఘం తొలగినప్పటి చిత్ప్రకాశమాత్రుడవై ఉండు. అసలీ అహంకారమనబడేది లేనే లేదని గ్రహించు. మూర్త – అమూర్త వివర్జితమై, అజ్ఞానశూన్యమై, నిత్యోదితమైనట్టి చైతన్యఘనమును పొందినవాడవై, పరిపూర్ణుడవై, ఆనందపూర్వకంగా ప్రకాశిస్తావు గాక!

❖❖❖

# 19. జ్ఞాని - జ్ఞానబంధువు

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ మనుజుడు జ్ఞానబంధువైతే సరిపోదు. జ్ఞానియే కావాలి. ఎందుకంటే, ఒక్కోసారి జ్ఞానబంధువు కంటే అజ్ఞానియే మెఱుగేమో నని కూడా అనిపించవచ్చు.

**శ్రీ రాముడు :**

**కిముచ్యతే జ్ఞానబంధుః? జ్ఞానీచైవ కి ముచ్యతే?**
**కిం ఫలం జ్ఞానబంధుత్వే? జ్ఞానిత్వేఽ పి చ కిం ఫలం?**

మునీంద్రా! జ్ఞానబంధువు అంటే ఎవరు? జ్ఞాని అనగా ఎవరు? ఉభయముల ప్రయోజనాలు ఎట్లా ఉంటాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**వ్యాచష్టే యః పఠతి చ శాస్త్రం భోగాయ శిల్పివత్ ।**
**యతతే నతు అనుష్ఠానే "జ్ఞానబంధుః" స ఉచ్యతే॥**

శిల్పి శిల్పమును చెక్కుతాడు. ఉత్తమ భక్తుడు (లేక) ఉపాసకుడు ఆ శిల్పంలో ఇష్టదైవం యొక్క స్ఫూర్తిని దర్శించి తరించగలుగుతాడు. శిల్పి "ముక్కు-నోరు బాగున్నాయా? లేదా?"... అని మాత్రమే గమనించగలడు. అట్లాగే ఎవరైతే శాస్త్రమును భోగం కొరకో (లేక) చిలకపలుకులు పలుకుట కొరకు మాత్రమే పఠిస్తాడో... అంతేగాని మనస్సుతో అనుష్ఠించ ప్రయత్నించడో అట్టివాడు 'జ్ఞాన బంధువు' అని పిలువబడతాడు.

అనగా, ఎవనికి శాస్త్రాభ్యాసం చేత లభించినట్టి శబ్దబోధ ఆతని దైనందిన జీవితావగాహనగా వ్యవహారాలలో ప్రస్ఫుటం కాదో, వైరాగ్యం హృదయస్థం కాదో, ఎవడు తత్త్వబోధను కథలుగా మాత్రమే వల్లిస్తాడో... ఆతడు జ్ఞానబంధువు మాత్రమే! ఎవడు శాస్త్రపఠనాన్ని కేవలం భుక్తి కొరకై వల్లిస్తాడో ఆతడూ జ్ఞానబంధువు. 'అగ్నిహోత్రం' మొదలైన ప్రవృత్తి రూపధర్మాలలో నిష్కాముడై ప్రవర్తించక, కేవలం డాంబికంగా నిర్వర్తిస్తూ ఆయా ప్రవృత్తి ధర్మాలను ఆత్మజ్ఞానం వైపుగాను, మనస్సు యొక్క పవిత్రత కొఱకై మలచుకోకపోతే ఆతడు జ్ఞానబంధువౌతాడే గాని, జ్ఞాని కాదు.

**జ్ఞానం, జ్ఞానాభాస -** ఆత్మ జ్ఞానాన్ని మాత్రమే 'జ్ఞానం' అని అంటారు. ఇక తక్కిన వివరణ-విశ్లేషణ-పదార్థ సంబంధ జ్ఞానమంటావా? అవన్నీ కూడా 'జగత్తు-జీవుడు' ఈ రెండిటికీ అధిష్ఠాన మైనట్టి బ్రహ్మం గురించి బోధించజాలవు. అందుచేత అవన్నీ జ్ఞానాభాసలు మాత్రమే!

'ఆత్మజ్ఞానం' గురించి యత్నించకుండా తదితర సాధనా విశేషాలను ఆశ్రయించి స్వర్గాది ఫలప్రాప్తికై ప్రయత్నించేవారిని 'అల్పశుభ జ్ఞానబంధువులు'... అని పిలుస్తూ ఉంటారు.

1.బాహ్య-అభ్యంతర దృశ్య రూపజ్ఞానం, 2.వాటి వృత్తులకు కారణమైన ప్రమాత, 3.ప్రమాతకు తెలియవచ్చే శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలు, 4.వాటి అనుభవవిశేష పరంపరలు.

...భాషాపూర్వకంగా ఇవన్నీ కూడా జ్ఞానమే. అయితే ఇవి అసలైన జ్ఞానం కాదు సుమా! ముముక్షువు అయినవాడు నిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మముతోటి ఏకత్వం సంపాదించుకునే వరకు ఆగకూడదు. తృప్తి పొందరాదు. ఓ ప్రియ సభికులారా! మీరంతా జ్ఞానబంధువులై రోగరూపాలగు ఈ సంసార భోగాలందు రమిస్తూ కాలమును, అవకాశములను అల్ప వినియోగం చేయకుండెదరు గాక!

**అత్రాహారార్థం కర్మకుర్యాత్ అనింద్యమ్, కుర్యాత్ ఆహారం ప్రాణసంధారణార్థమ్ ।**
**ప్రాణాః సంధార్యాత్ తత్త్వజిజ్ఞాసనార్థం, తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో నదుఃఖమ్ ॥**

ఈ 'మానవజన్మ' అనే అవకాశం వచ్చినందుకు ముముక్షువు చేయవలసినదేమిటి?

1. సహజీవులను బాధించనట్టి, సానుకూలమైన అనింద్యమైన కర్మలు మాత్రమే నిర్వర్తించాలి.
2. అట్టి కర్మలు కూడా ఆహారం సంపాదించుకోవటానికి మాత్రమే పరిమితం చేయబడాలి.
3. మరి ఆహారం ఎందుకు? జిహ్వాచాపల్యము కొరకై కాకూడదు. కేవలం ఈ ప్రాణాలు నిలబెట్టుకోవాలి కాబట్టి అంతవరకే ఆహార సముపార్జన ఉద్దేశించబడాలి.
4. ఆపై ప్రాణాలు నిలబెట్టుకోవటం అనేది తత్త్వజిజ్ఞాస కొఱకే అయి ఉండాలి.
5. ఇక తత్త్వజ్ఞానం మరల దుఃఖరహిత స్థితి సంపాదించుకోవటానికి సద్వినియోగపడాలి.

...ఇట్లు జీవుడు జనన మరణ చక్రం నుండి తరించటానికే సర్వదా ప్రయత్నించటం ఉచితం.

❖❖❖

## 20. జ్ఞానియొక్క నిర్వచనం

**శ్రీరామచంద్రుడు :** స్వామీ! 'జ్ఞానబంధువు' గురించి, 'జ్ఞానాభాస' గురించి విశదపరిచారు. సాధకులగు, మేమంతా కృతజ్ఞులం. అట్లాగే జ్ఞాని – జ్ఞాన దర్శనం గురించి మరికొన్ని విశేషాలు విశదపరచవలసినదిగా నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** జ్ఞాని యొక్క నిర్వచనం విను.

ఆతడు తనయొక్క జ్ఞానప్రవృద్ధముచే జ్ఞేయమగు ఆత్మ గురించి నిష్ఠ పెంపొందించుకుంటూ ఉంటాడు. అట్టి చిన్మాత్ర బ్రహ్మమునందు నిష్ఠచే క్రమంగా శబ్దస్పర్శాది విషయసమూహమును, కర్మ ఫలాలను, "ఇవన్నీ బయటగా లేవు. నా చిత్తముయొక్క లక్షణవిశేషమే ఇదంతా"... అని గ్రహిస్తూ అవన్నీ అసత్యాలుగా గమనిస్తూ ఉంటాడు. ఈ కళ్ళు మొదలైన ఇంద్రియాలకు తారసపడే దృశ్యాదులను ప్రక్కకుపెట్టి, అట్టి కళ్ళలోను, తదితర ఇంద్రియములలోను, అంతఃకరణంలోను ఏ సాక్షితత్త్వమైతే ప్రత్యక్షమై ఉంటోందో... అట్టి చిత్‌తత్త్వమును గుర్తిస్తాడు. అట్టి సాక్షిగా ఉన్నట్టి చిన్మాత్రమగు పరమాత్మను బాగుగా ఎఱిగినవాడై ఈ దృశ్యమును అంతఃకరణం యొక్క వాసనా మాత్రంగా కూడా శేషించియే లేనట్లు గాంచుచూ ఉంటాడు.

ఇప్పుడు 'జ్ఞాని' యొక్క నిర్వచనం విను–

**అన్తః శీతలతేహాసు ప్రాజ్ఞైర్యస్యావలోక్యతే ।**
**అకృత్రిమైక శాన్తస్య స జ్ఞానీత్యభిధియతే ॥**

ప్రతి జీవుడు 'ఆత్మ' అను ఏకైక లాభమును సర్వదా అవధరించియే ఉన్నాడు. ఎవనియందైతే అట్టి ఆత్మైక్య లాభముచే సంతుష్టి, శాంతము, వ్యవహారములందు అంతఃకరణ శీతలత్వము మనకు కనిపిస్తాయో, అట్టివాడు, 'జ్ఞాని' అని మనం గుర్తించవచ్చు. ఏ సమాచార ప్రసాదితమైన అవగాహన చేత అజ్ఞాన మూలము తొలగుచుండగా పునర్జన్మత్వము (నాకు జన్మ-మృత్యువులు ఉన్నాయి - అనే భ్రమ) సమూలంగా కడిగివేయబడుతుందో అట్టి బోధయే జ్ఞానము. ఇక తక్కిన శబ్దజ్ఞాన చాతుర్యము శిల్పియొక్క శిల్పకళలాగా వస్త్రభోజనాదులు కొరకే గాని అనుభవము కొరకై కాదు.

**పండితుడు :**

**ప్రవాహపతితే కార్యే కామసంకల్పవర్జితః ।**
**తిష్టత్యాకాశహృదయో యః స పండిత ఉచ్యతే ॥**

ఎవడైతే యథాప్రాప్తములైనట్టి ఆయా కార్యాలలో కామసంకల్పవర్జితుడై నిర్మలాకాశమువలె హృదయము కలిగి ఉన్న వాడై ప్రవర్తిస్తూ ఉంటాడో... అట్టి వానిని 'పండితుడు' అని పిలుస్తారు.

ఓ రామచంద్రా! ఈ జగత్తు, అహంకారం మొదలైనవి లేవు. కాని ఉన్నట్లు అనిపిస్తున్నాయి. ఎందుచేత? దానికి కారణం లేదు. అభిలాష, అభిరుచులకు కారణం లేనట్లే, జగత్, అహంకారాలకు కూడా కారణం లేదు. అకారణంగా అనిపించేవన్నీ అకారణాలే. కారణం లేకయే ఉత్పన్నమైనాయి. కాబట్టి అవి వాస్తవానికి ఉత్పన్నము కానివే అగుచున్నాయి.

**శ్రీరాముడు :** "ఉత్పత్తియే కాలేదు. కానీ ఉన్నట్లుగా అనిపిస్తోంది" అను పరస్పర వ్యతిరిక్త వాక్యం ఎట్లా యుక్తియుక్తం స్వామీ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచంలో వాస్తవానికి లేకపోయినా కూడా ఉన్నట్లు అనిపించే అనేక దృష్టాంతాలు ఉన్నాయి.

**1. కుందేటి కొమ్ము -** పరిగెత్తే కుందేలుకి (చెవులు రిక్కి ఉండటం చేత) కొమ్ములు ఉన్నట్లు కనిపిస్తుండటం.

**2. మృగతృష్ణాజలం -** మృగాలు దాహంచే అటూ ఇటూ వెతుకుచుండగా, ఎండ యొక్క వాయుతరంగ సంబంధమైన క్రీనీడలు సరోవర జలంలాగా అనిపించటంచే ఆ మృగాలు జలంగా భ్రమించి పరుగులు తీయటం.

కుందేటికి కొమ్ము ఎందుకు కనిపించింది? భ్రమచేతనే కదా! మృగతృష్ణలో జలం ఎందుకు కనిపించింది? భ్రమ చేతనే! భ్రమ చేత అనిపించేవన్నీ అవాస్తవాలే కాబట్టి అవి అకారణాలే గాని, సకారణాలు కావు. లేదా, అవిచారణతో ఉన్న అజ్ఞానావేశమే అందుకు కారణమని అనక తప్పదు.

అట్టివే ఈ సోదర-మిత్ర-శత్రు-తదితర సర్వ సంబంధములు కూడా! అంతేకాదు. ఈ సర్వ జగత్తు అట్టి జగత్తులో జన్మాదిగా సంచరించే ఈ దేహము కూడా భ్రమయే కాబట్టి అవాస్తవము,

అకారణం కూడా! "కుందేటికి కొమ్ము ఎందుకు కనిపించింది?"... అనే ప్రశ్నకు "అసత్తైన ఈ దేహ–పుత్ర–తదితర దృశ్యవ్యవహారం సత్తు వలె ఎందుకున్నాయి" అనే ప్రశ్నకు సమాధానం ఎంత వెతికి ఏం ప్రయోజనం?... సత్తు సత్తుగా, అసత్తు అసత్తుగా గ్రహించటమే ఇక్కడ సముపార్జించు కోవాలి. అట్లా కాకుండా "ఈ దృశ్య సంబంధం ఎప్పటి నుండి ఎందుకు ఎట్లా ప్రాప్తించింది?"... అనే విషయంగా కార్య – కారణాలు వెతుకుతూ పోవటం "గొడ్రాలి యొక్క కుమారుని, మనుమని భుజాలపై కూర్చుని ఊరంతా చుట్టి రావడం ఎట్లా?" అనే వాక్యంలాగా నిరర్థకం.

ఆజ్ఞానమే అసదనుభవమునకు కారణం! అసత్తైనవి, అసద్రూపమైనవి అగు విశేషములగు పదార్థములకు కారణం అజ్ఞానమే అయి ఉన్నది. అజ్ఞానమునకు రూపమేమిటి? జ్ఞానం యొక్క అప్రకాశమే, (లేక) ఏమరుపే!

అజ్ఞానము యొక్క ఆశ్రయముచే జ్ఞానము ఆవరించబడి ఉంటోంది. జ్ఞానము యొక్క అప్రకాశమే అజ్ఞానం. జ్ఞానము యొక్క ప్రకాశముచే అజ్ఞానము తొలగుతోంది.

❖

జీవుడు ⟶ పరమాత్మ

నాటకంలో కనిపిస్తున్న పాత్ర – పాత్రధారి ఒక్కరే కదా!... అదేవిధంగా వాస్తవానికి ఈ జీవాత్మయే పరమాత్మ. అట్లాగే ఆ పరమాత్మయే ఈ జీవాత్మ.

అయితే, ఈ జీవుడు (జీవాత్మ) "నేనే పరమాత్మను"... అనే పరమసత్యమును సంతరించు కోవటం, (లేక) అనుభవైక వేద్యం చేసుకోవటం ఎట్లా?... అనే ప్రశ్నకు సమాధానమే ఈ మన సంవాదసారము.

❖❖❖

## 21. జీవాత్మయే పరమాత్మ!

**శ్రీరాముడు :** మహర్షీ! "నేను జీవాత్మను" అను భావమునందు, అటు తరువాత భ్రమపూర్వక – కల్పిత అనుభవపరంపరలందు తననుతానే ఏర్పరచుకొనియున్న ఈ జీవుడు తనయొక్క సత్స్వరూపమగు పరమాత్మత్త్వము సంతరించుకొనేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**పరమాత్మాయతే జీవో బుధ్యమానస్త్వచేతనమ్ ।**
**చేతనం బుధ్యమానస్తు జీవఏవావ తిష్ఠతే॥**

"ఈ అహంకారము – దేహము అనునవి స్వయంప్రతిపత్తిగలవి కావు. చేతనములు కావు. ఇవి జడాలు. వీటిని ప్రవర్తింపజేసే (వీటికి వేరై ఉన్న) ఆత్మ మాత్రమే చేతనం"... అని ఏ జీవుడు గ్రహిస్తున్నాడో, ఆ జీవుడు పరమాత్మయే అగుచున్నాడు. అట్లా కాకుండా ఎవరైతే ఈ దేహ– అహంకారాలను చేతనాలుగా ఆత్మగా భావన చేస్తున్నవాడో, అట్టివాడు జీవభావ పరిమితుడై

ఉంటున్నాడు. హేమంత ఋతువులో మామిడి వృక్షం తనంతట తానే చిగురుస్తుంది చూచావా? అట్లాగే "ఈ దేహం - అహంకారం - మనస్సు అనేవన్నీ స్వయంగా చూస్తే అచేతనాలు. వీటిని ప్రవర్తింపజేసే నేను చేతన స్వరూపుడను"... అని గ్రహించిన మరుక్షణం ఆ జీవుడు పరమాత్మ అయి ప్రకాశిస్తాడు.

అనగా, అహంకారం, దేహం మొదలైనవాటిని గాంచుచున్నప్పుడు "ఇవి చేతనాలు" అని అనుకుంటూ ఉండటం చేత ఈ జీవుడు జీవరూపంగానే ఉండిపోతున్నాడు. తత్ఫలితంగా అనేక యోనులలో ప్రవేశిస్తూ శిథిలీభూతుడగుచున్నాడు.

అందుచేత ఈ జీవుడు బ్రాహ్మీదృష్టిని అలవరచుకోవాలి. "కదిలే ఈ దేహం, ఈ అహంకారం చేతనం కాదు. వీటిని కదిలించే ఆత్మయే చేతనం. అట్టి అఖండ - అద్వితీయ - నిత్యప్రకాశక చైతన్యమే నేను"... అను జ్ఞానమే ఆత్మజ్ఞానం.

**యే పరాం దృష్టిమ్ ఆయాతా విద్ధి తేషామ్ అపామివ ।**
**ఆరూపాలోకమననం స్పన్ధమస్పన్ధనం సదా॥**

ఎవరైతే అట్టి బ్రాహ్మీదృష్టిని సంపాదించుకుంటున్నారో... అట్టివారి రూప-సంకల్ప-క్రియాదులన్నీ అరూప-అసంకల్ప-అక్రియలు గానే ఉంటాయి. అభిమానరాహిత్యం చేత అవన్నీ ప్రవర్తించనివిగానే అవుతాయి. జలం తరంగంగా కనబడినంతమాత్రంచేత ఆ జలం తన స్వరూపం కోల్పోతుందా? లేదుకదా! దేహం, సంకల్పం మొదలైనవి ఆత్మీదృష్టిని మరల్చజాలవు. దృశ్యమును అధిగమించి ఆ దృశ్యమునకు కేవల సాక్షియగు 'దృక్' రూపాన్ని సంతరించుకొని ఉన్నవారు బ్రాహ్మీదృష్టిని సంపాదించుకున్నవారు అగుచున్నారు. అట్టి బ్రాహ్మీదృష్టి (కేవల దృక్‌స్థితి) సంతరించుకున్నవారు ఈ దృశ్యాన్ని చూస్తున్నా, లేక ఇందులో పాల్గొనుచున్నా కూడా ఇక్కడ వారికి ద్వైతదర్శనం ఉండదు. వారికి ఇక్కడ సర్వదా అంతటా బ్రహ్మమే దర్శనమౌతూ ఉంటుంది. వారి సమస్త క్రియలు కర్తృత్వ అభిమాన రహితాలై ఉంటాయి. ప్రవాహపతితంగా, ప్రారబ్ధానుసారం ఏదేది నిర్వర్తించ వలసి వచ్చుచున్నప్పటికీ వారు దృశ్యరహితులుగానే ఉండగలరు. అట్టి జ్ఞానుల సమస్త క్రియలు అక్రియలే అగుచున్నాయి. వారు బంధనం త్రెంచుకొనిన ఎద్దులాగా రూపాదులచే నిబద్ధులు కారు. వాయువు వృక్షంపై, ఆకులపై, పూలపై, పిందెలపై ప్రసరిస్తూ తాను యథాతథంగానే ఉంటున్నట్లు... ఆత్మీదృష్టి సముపార్జితులు ఈ దృశ్యంలో ఉంటూకూడా ఇక్కడి రూప-నామ-క్రియాదులచే స్పర్శించబడరు. నిబద్ధితులు కారు.

గంగానది ఒడ్డున నివసించేవారు ఎక్కడో కూపజలాన్ని ప్రశంసించరు కదా! అట్లాగే బ్రాహ్మీ దృష్టిని పొందినవారు ఇక్కడి సంసార విశేషాలను ప్రశంసించరు, నిరశించరు. ఓ రామా! వాసనలచే బద్ధులైన మూఢులే కర్మలను ప్రశంసిస్తూ తత్త్వజ్ఞానం యొక్క అభావంచే ఆ కర్మల ఫలాలను పొందుచున్నారు. ఆత్మదర్శులు కర్మలను నిర్వర్తించినా ఆ కర్మల యొక్క ఫలాలతో వారికి ఏ ప్రయోజనమూ కనిపించదు. కనుక వారు కర్మ ఫలాలను పొందనివారే అగుచున్నారు.

ఓ జనులారా! ఎక్కడో ఆకాశంలో ఎగిరే గ్రద్ద దృష్టి అంతా నేలపై కనిపించే మాంసపు ముక్కలపై ఉన్నట్లు ఈ ఇంద్రియములు జగత్ విషయములవైపుగానే ఆకర్షితమై ఉంటున్నాయి. కనుక జాగరూకత వహించాలి సుమా! ఎందుకంటే అట్టి ఇంద్రియ విషయసేవనాభ్యాసముచేతనే ఈ జీవుడు తన శివత్వము గాంచలేకపోతున్నాడు. కాబట్టి ఈ ఇంద్రియములను ఉపయోగించే టప్పుడు బుద్ధిమంతుడైనవాడు "కర్మలు-ప్రయోజనాలు" అనే దృష్టి నుండి మరల్చి వీటిని ఉపయోగి స్తున్న మనస్సును ఆత్మార్పణ చేయాలి సుమా! ఆత్మానుభవామృతం గ్రోలినవాడికి ఈ ఇంద్రియ విషయాలు ఆకర్షణ విషయాలై ఉండజాలవు.

**శ్రీరాముడు :** ఈ జీవుడు ఎదురుగా ఉన్న సృష్టిని త్యజించి ఆత్మను ఆశ్రయించాలి. కానీ అది సులభ సాధ్యమగుట లేదు.

**శ్రీవసిష్ఠమహర్షి :** ఆకారం లేని సువర్ణం ఉంటుందా? ముద్దగానో, ఆభరణంగానో... ఏదో ఆకారం కలిగియే ఉంటుంది కదా! అట్లాగే బ్రహ్మం-సృష్టి అనునవి స్వభావసిద్ధం, అయితే ఈ సృష్టి పట్ల జ్ఞాని యొక్క దృష్టి, అజ్ఞాని యొక్క దృష్టి వేరు వేరుగా ఉంటున్నాయి. వీటినే 1.ఆత్మదృష్టి, 2. సంసారదృష్టి అనే పేర్లతో చెప్పుకుంటున్నాం. దగ్ధమైన వస్త్రం యొక్క ఆకారం, అదగ్ధమైన వస్త్రం యొక్క ఆకారం ఒకే తీరుగా ఉన్నా కూడా ఆ రెండింటికి సంబంధమెక్కడిది? జ్ఞానికి ఈ సృష్టి కేవల శివరూపం గానే అనుభవమౌతోంది. ఇక అజ్ఞానికో... ఇదే సృష్టి అనేక సంసార- జన్మ - కర్మ - వ్యవహారభరితంగా అత్యంత భయంకరమై తోచుచున్నది. కనుక ఈ జీవుడు పవిత్రమైన దృష్టిని అలవరచుకోవాలే గాని, ఈ సృష్టిని వదిలి ఎక్కడికో పరుగులు తీయాలని మా బోధసారం కాదు. ఈ సృష్టి కల్పాంతంలో బ్రహ్మం యొక్క మాయా విభాగమునందు ఏ విధంగా నిర్విభాగమై, నిరాభాసమై జగత్ శబ్దార్థరహితమై ఉంటోందో... అట్లాగే వివేకవంతుని అవగాహనలో ఈ సృష్టి ఈ వర్తమానంలోనే నిర్విభాగమై, నిరాభాసమై, జగత్‌శబ్దార్థరహితమై అగుపిస్తోంది.

ఆకాశంలో మేఘాలు ఉన్నాయి. అవి చమత్కారంగా 'కొండలు-వృక్షం-గోపురం-గుహ' వంటి ఆకారాలు కనిపిస్తాయి. మరల ఆ మేఘాలు అటూ ఇటూ కదులుచూ ఉండగా ఆ కనబడే దృశ్యవిశేషచమత్కారం మటుమాయమౌతూ ఉంటుంది. గుహలా కనిపించే మేఘపంక్తి గుహను స్ఫురింపజేస్తోంది. మరల ఆ గుహ ఏమౌతోంది? మేఘాల కదలికచే మటుమాయ మవుతోంది. అట్లాగే అనేక విరుద్ధ ధర్మములచే కనిపించే ఈ జగత్తు మరల ఈశ్వరుని యందు విలీనమౌతోంది.

ఈ జగత్తు ఉపాధి. ఈశ్వరుడు ఔపాధికుడు. భావనయే జగత్తు. అజ్ఞానం చేత ఒకరీతిగా తోచే ఈ జగత్తు సుజ్ఞానం చేత శివంగా తెలియవస్తోంది. వస్తు దృష్టితో మేఘాలను చూస్తున్నప్పుడు కొండ-గోపురం మొదలైనవి కనిపించవచ్చుగాక! అంతా మేఘములే కదా! జలంలో అనేక తరంగాలు కనిపిస్తాయి. తరంగాలు శాంతించినప్పుడు ఆ శాంతజలంలోనే తరంగాలన్నీ లయిస్తు న్నాయి కదా! అసలు జలానికి - తరంగానికి భేదమెక్కడున్నది? తరంగానికి జలమునకు వేరైన ఉనికి (స్థితిత్వం-సత్త) ఉన్నదా?

బ్రహ్మనికి- బ్రహ్మం యొక్క చిదాభాసులగు ఈ జీవులకు బేధమెక్కడిది? ...లేదు. బ్రహ్మంలో కనిపించే భేదం అనిర్వచనీయం, ఆత్మదృష్టిచే అంతా బ్రహ్మంగా అనుభవం కాగలదు. అనగా "ఆత్మ స్వరూపుడగు ఈ ద్రష్ట తనయందు దర్శిస్తున్న భావతరంగాలే ఈ జగత్తు" గా వివేక దృష్టి కలవాడు గ్రహిస్తున్నాడు.

మనకు ఎదురుగా ఈ దిక్కులు ఉన్నాయి కదా! "ఇదిగో, ఇది తూర్పు, అది పడమర. అటు ఉత్తరం, ఇటు ఊర్ధ్వం" ...ఈ విధంగా దశదిశలు కనిపిస్తున్నాయి. అయితే 'ఆకాశం' అనే దానిలో దిక్కులు అనేవి ఉన్నాయా? "సూర్యోదయం-మనం నిలుచున్న స్థానం" - ఈ రెండిటిచేత మాత్రమే 'దిక్కులు' అనునవి మనం చెప్పుకుంటున్నాం కదా! కనుక... 1. ఆకాశంలో దిక్కులు లేని మాట నిజమే! 2.మనకు ఇది తూర్పు, అది పడమర అనేది నిజమే!

అట్లాగే బ్రహ్మము అకారణం. అది మరిదేనికి కారణం కాదు. కాని అన్నిటికి అధిష్ఠానం అదే! అట్లాగే ఈ జీవుడు - జగత్తు మొదలైనవన్నీ బ్రహ్మము కాక మరింకేమీ కాదు.

అనగా బ్రహ్మములోనే ఇవన్నీ ఉండి ఉండగా, బ్రహ్మము సర్వదా నిర్విషయమై ఉన్నది. ఈ విధంగా ద్వైత-అద్వైతములు బ్రహ్మమునకు సిద్ధిస్తున్నాయి. దిక్‌రహితమగు ఆకాశమే సర్వదిక్కులను ధరిస్తున్నట్లే నిరవయవమగు పరబ్రహ్మమే ఈ జీవ-జగత్ ఆదిగా గల ఈ సర్వరూపాత్మక సృష్టిని అవధరిస్తోంది.

❖

అహంకారం ఉన్నప్పుడే జగత్తు. అహంకారం లేకుంటే జగత్తు లేదు.

జగత్తులో అహంకారం, అహంకారంలో జగత్తు. ఈ విధంగా ఈ రెండు అరటిపట్టలవలె ఒకదానిని మరొకటి చుట్టుకొని ఉన్నాయి.

సృష్టి అనబడేది జీవునియందే ఉన్నది. హిమాలయపర్వతం తన నుండి జాలువారిన జలమునే తనకు బాహ్యమైన మానససరోవరంగా గాంచుచున్నది చూచావా? అట్లాగే ఈ జీవుడు కూడా తన యందు గల సృష్టినే ఇంద్రియ - మనస్సులందు గల వృత్తి చమత్కారం చేత ఇట్లా బాహ్యజగత్తుగా గాంచుచున్నాడు. బంగారంలో నుంచే ఉంగరము, ప్రక్కపిన్ను మొదలైన ఆయా భవిష్యత్ ఆభరణ ఆకారాలన్నీ బయల్వెడలుచున్నట్లుగా ఈ జీవుడు కూడా తన స్వరూపమునే అకారణంగా ఈ జగత్తు రూపముగా దర్శిస్తున్నాడు.

ఇక ఈ సంసారము యొక్క ఆవలి తీరమును దర్శించిన పవిత్రాత్ముల జీవనము - దర్శనము మరొక విధంగా ఉన్నది.

**జీవన్తో అపి న జీవన్తి, మ్రియంతే న మృతా అపి,**
**సన్తోపి చ న సన్తీవ, పారావారవిదః శుభాః॥**

అట్టి మహనీయులు ప్రాణములు ధరిస్తూకూడా ధరించనివారుగానే ఉన్నారు. శరీరము, ప్రాణములు ధరిస్తున్నప్పటికీ దేహ-ప్రాణాతీతులై ప్రకాశిస్తున్నారు.

**ప్రబుద్ధః సర్వకర్మాణి కుర్వన్నపి న పశ్యతి,**
**గృహకర్మాణి గేహస్థో గోష్ఠభాండమనా ఇవ**

ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు తన దృష్టి అంతా ఆకాశంలోనే ఉంచుకుని ఇంటిలోని ఆయా దైనందిన కర్మలు ఆచరించునట్లు, బ్రహ్మమునందు మాత్రమే ఆసక్తిగల జ్ఞాని ఈ శరీరయాత్రాది ఆయా కర్మలను నిర్వర్తిస్తూనే సర్వదా నిర్వర్తించనివాడుగానే ఉంటాడు. తన ధ్యాసనంతా – "ఇదంతా ఆత్మగా దర్శించటం" – అను సాధన కార్యక్రమంలో వినియోగిస్తూ జీవితమంతా గడపుచున్నాడు.

ఈ విరాట్ నందు చంద్రుడు ఉండి అంతటా తన అమృత కిరణాలతో ప్రసరిస్తున్నాడు చూచావా? అట్లాగే ప్రతి వ్యష్టిశరీరమునందు మంచుబిందువు వంటి ఆకృతి గల జీవుడు ఇటు స్థూలంలో సూక్ష్మం గాను, అటు సూక్ష్మంలో సర్వత్వం గానూ అంతటా ప్రసరించి ఉంటున్నాడు.

❖❖❖

# 22. అహంకారాత్మ - దేహాత్మ

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ అహంకారం అనే చమత్కారం నిర్విషయమగు ఆత్మయందు ఎప్పుడు ఎందుకు ఎట్లా ప్రవృత్తమౌతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఆత్మ అంతటా, అన్నిటా, అన్ని వేళలా ఏర్పడియే ఉన్నది. అట్టి ఆత్మ నుండి ప్రవృత్తి అనే ఒకానొక చిత్ వృత్తి (సముద్ర జలంలో తరంగం వలె) స్వయంగా బయలుదేరి క్రమంగా దేహాత్మగా ప్రవృద్ధం అవుతోంది. ప్రవృత్తి స్వరూపుడగు అహం స్వరూపాత్మ ధ్యానము నందు ప్రవేశించి, అక్కడి నుండి దేహమును ఆశ్రయిస్తున్నాడు.

**దేహారంభం -**

**అహమాత్మా త్రికోణత్వమ్ ఉపగచ్ఛతి కల్పనమ్ ।**
**అసదేవ సదాభాసం మన్యతే చేతనాద్వపుః ॥**

**కర్మకోశే త్రికోణే చ శుక్రసారే అవతిష్ఠతే ।**
**దేహే జీవోఽహమిత్యాత్మా స్వామోదః కుసుమే యథా ॥**

తండ్రి దేహం నుండి అహంకారత్ముడగు జీవుడు వీర్యరూపంలో తల్లి యొక్క త్రికోణాకారమగు యోని యందు పరిచ్ఛిన్న రూపమున కల్పన పొందుచున్నాడు. క్రమంగా అక్కడి రక్తాదులు పొంది బుద్బుద–పిండాది క్రమంగా దేహాశ్రయుడగుచున్నాడు. ఇక అక్కడి నుండి, అసత్తగు "శరీరమే నేను" అనే భ్రమకు లోనగుచున్నాడు. ఈ జడ దేహమును సత్తుగాను, చేతనముగాను గాంచుచు అందు "అహం" అను అభిమానమును గాంచుచున్నాడు.

❖

ఆహా! ఏమి ఆశ్చర్యం! స్వయంగా పరమానందమైన అఖండ చిదాకాశ స్వరూపుడు అయి ఉండి కూడా... అట్టి నిరంకుశ సత్యమును ఏమరచి ఈ జీవుడు స్వకర్మ నిర్మితమై, సంకుచితము

– పరిమితం అయిన దేహ పంజరంలో చిక్కుకున్నాడు. త్రికోణాకారమగు మాతృ గర్భాన నిర్మితమైన వీర్యమే సారంగా గలిగిన ఈ పంచభౌతాత్మిక దేహంపై అభిమానమును కల్పించుకొని ఇక పుష్పంలో సుగంధం ఉన్నట్లు ఈ దేహంలో అనుభవజ్ఞుడై పరిమితత్త్వం వహించి ఉండటం ప్రారంభిస్తున్నాడు.

చంద్రబింబం నుండి బయల్వెడలిన అమృత కిరణ సమన్వితమగు చంద్రిక బ్రహ్మాండమంతా విస్తరించి ప్రవహిస్తోంది చూచావా?

అట్లాగే... వీర్యమందు ఉన్నట్టి చంద్రకళా రూపమగు సంవిత్తు (జ్ఞాన స్ఫూర్తి) ఈ దేహమంతా కూడా ఆపాదమస్తకం వ్యాపించి ఉంటోంది. పొగ ఆకాశమంతా మేఘ రూపంగా వ్యాపించి ఉంటోందే! అట్లా అంతరం నుండి బాహ్యానికి ఇంద్రియాల ద్వారా ప్రసరితమగుచున్న జ్ఞాన స్ఫూర్తి ముల్లోకాలోకి (పాతాళ-భూ-స్వర్గములలో) వ్యాపించుచున్నది. ఈ సమస్త శరీరమునకు బాహ్య అభ్యంతరమున ఈ అహంకార రూప జ్ఞానం విస్తరించి (వ్యాపించి) ఉన్నప్పటికీ అది హృదయంలో గల వీర్య విశేషంలో ఘనవాసనారూపంపై అధికమైన అభిమానం ఏర్పరచుకొని ఉంది.

ఈ విధంగా ఈ అహంకార రూప జ్ఞానం హృదయమున అధికమైన అభిమాన సమన్వితమై ఉండటం చేత... అట్టి హృదయమున ఆ జీవుడు ఏదేది ఎట్లు సంకల్పిస్తున్నాడో, ఆ రూపంలో అట్లే బాహ్యంలో కూడా స్థితి కలిగి ఉంటున్నాడు. అనగా తత్సంకల్ప పూర్వకంగానే బాహ్యంలో కూడా వ్యవహరిస్తున్నాడు. చూచావా రామా! అయితే, అట్టి అహంకారాభిమానం కేవలం భ్రమ మాత్రమే!

**అహంకారాభిమానం -**

**శ్రీరాముడు :** జీవునికి ఏర్పడిన ఈ అహంకార రూప అభిమానమే అన్ని తదితర సాంసారిక దృష్టులకు కారణం కదా! అట్టి దురభిమానపూర్వక అహంకార భ్రమ తొలిగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవుని స్వభావసిద్ధమైన స్వరూపం దివ్య ఆత్మ చైతన్యం (ఆత్మ తేజం) అంతేగాని, ఈ అహంకార-దేహ-దృశ్యత్వాలు కావు. ఎందుకంటే అవన్నీ కూడా భేద రూపమైనవి. ఆత్మ చైతన్యమో... అభేదరూపమైనది.

కాబట్టి ఈ జీవుడు అస్వభావం నుండి స్వభావానికి ప్రయాణిస్తేనే ప్రశాంతత. కానీ ఈ అహంకార భ్రమ బలీయమైనది. అనేక జన్మ-కర్మల సముదాయం చేత ఉపార్జించుకున్నది కదా! అందుచేత చిన్నచిన్న ఔషధాలు, ఉపాయాలు సరిపోవు మరి? స్వభావసిద్ధమైన, చిత్త వర్జితమైన బ్రహ్మంతో అభేద జ్ఞానరూపమగు స్థితిని సంపాదించుకుంటే తప్ప తమరింకే ఉపాయం చేత కూడా అహంకార భ్రమ శమించదు. ఓ రామా! నీవు శ్రవణ-మనన-నిధిధ్యాసలచే బ్రహ్మం గురించి చింతన చేయి.

అంతటితో తృప్తి చెందకు. వాటినన్నిటినీ అనుభవైకవేద్యము వైపుగా తరలించు. సమాధి యొక్క అభ్యాసం చేత మౌనస్వరూపమై ఆకాశాన్ని బోలి నిశ్చలమైనట్టి చరమ భూమికను (సప్తమ భూమికను) సముపార్జించుకో. 'ఆత్మ స్థితి' సంపాదించుకునే వరకూ సాధకుడు ఎక్కడా ఆగకూడదు. జ్ఞానులు అందరిలాగే ఆయా ప్రవాహపతిత కర్మలు నిర్వర్తిస్తూ కూడా మానసికమైన సర్వ బాహ్య

అభ్యంతర దృశ్య– దర్శనాభిమానరహితులై ఉంటున్నారు. బాహ్య–భావనా వర్జితులై ఉంటున్నారు. చెక్కతో తయారు చేయబడిన మనుజుని వలె ఈ భౌతిక ప్రపంచంలో దిగులు–ఇష్టం–మమత్వం–అయిష్టం మొదలైనవి లేకుండా సంచరిస్తున్నారు.

**అప్రమేయత్వం -** సదా బ్రహ్మ భావన ఉండే వారు ఈ దేహాదులతో కూడి జీవిస్తూ ఉన్నప్పటికీ ఆకాశం వలె నిర్మలులై, వాస్తవానికి ఎట్టి బంధాలూ లేని వారై, ముక్తులై ఉంటున్నారు.

సూర్యప్రకాశం బ్రహ్మాండమంతటా వ్యాపించి ఉన్నట్లు వీర్యమునందున్న జీవ సంవిత్తే ఈ దేహమునందు అంతటా ఆపాదమస్తకం అహంభావ రూపంలో వ్యాపించి ఉంటోందని అనుకున్నాం కదా! ఆ వీర్య సంవిత్తు కళ్లు–నాలుక–చెవులు–చర్మము మొదలైన అన్ని ఇంద్రియాలలోనూ ప్రవేశించి వాటి నన్నిటినీ అహంభావబద్ధంగా చేస్తోంది. అక్కడి నుండి దర్శన–స్పర్శన–శ్రవణాదు లందు నిమగ్నమై ఆయా విషయాలను కూడా అహంభావరసంతో ముంచెత్తుతోంది. భూమి యందంతటా ఉన్న రసం విత్తనంలో అంకుర రూపంలో ఉదయించి వృక్ష విభాగాలుగా ప్రదర్శిత మౌతోందే! అట్లా అజ్ఞానం చేత ఆవరించబడిన సందర్భములో చైతన్యం సర్వత్రా ఉండి కూడా… ప్రప్రథమంగా మనస్సుగా అయి, ఆ తరువాత అహంభావ రూపం సంతరించుకుని దేహంలో ప్రవేశించి ఆయా ఇంద్రియాల రూపంగా ఉదయిస్తోంది.

**జగత్తు లేదు : బ్రహ్మమే ఉన్నది -** శ్రుతులు (“నేఽ తి, నేఽ తి, నేఽ హ నానాస్తి కించన” మొదలైన శ్రుతివాక్యాల ద్వారా) జగత్ నాస్తిత్వం ప్రతిపాదిస్తున్నాయి కదా! ఎవడైతే ఈ జగత్తులో ఆరూఢమై ఉన్న మనోహంకార దేహాదులకు అభావనను ఆశ్రయిస్తూ తద్వారా అతీత్వం వహిస్తాడో అతనికే బ్రహ్మం అనుభవమౌతోంది. ఎవడు అభావన ద్వారా ఈ దేహ – మనో – అహంకారాలకు అతీతత్వ భావన సంతరించుకోవటానికి ప్రయత్నించడో… అట్టి ప్రయత్నరహిత మనుజునికి అనంతమైన సంసార దుఃఖం ఎన్నటికీ శమించదు. జ్ఞానామృతముచే తృప్తుడైన మనుజుడు ఏది ఎట్లు ఉన్నా, ఏది ఎట్టైనా దుఃఖించడు. సుఖించడు. తాను ఏది ధరించినా, ఏది భుజించినా, ఎచ్చట పరుండినా సర్వదా సర్వోత్తమమైన ఆత్మసుఖమునే అనుభవిస్తూ చక్రవర్తి వలె శోభిస్తూ ఉంటాడు.

అతడు అనేక వాసనలతో కూడి ఉండినప్పటికీ తాను దగ్ధమైన వస్త్రాకారములాగా వాటిచే స్పర్శించబడకయే ఉంటాడు. అంతరాంతరమున సాంసారిక వృత్తులేవీ లేనివాడై, అశూన్యమగు చిన్మాత్ర రూపుడే అగుచు – ఆకాశం ప్రాణవాయువులను ధరించి ఉన్నట్లు – ఈ మనో దేహ అహంకారాదులను… అసంబంధితుడై ఉండియే… ధరిస్తూ ఉంటాడు.

**ఆసనే శయనే యానే స్థితో యత్నైర్నబోధ్యతే**
**నిద్రాలురివ నిర్వాణ మనో మనన నిర్వృతః॥**

అట్టి జ్ఞాని ఆసన–శయన–ప్రయాణ సమయాల్లో ఆరూఢమై ఉన్నప్పుడు కూడా నిర్వాణ దశను అవధరించి నిద్రాళువు వలె అతీతత్వం సిద్ధింపజేసుకొనియే ఉంటాడు. సంచిత్ స్వరూపుడగు పురుషుడు సర్వవ్యాపి అయికూడా శరీరంలో సారభూతమైనట్టి విభాగంలో స్థితి కలిగి ఉంటున్నాడు.

ఈ జీవుడు వాస్తవానికి సంవిన్మాత్రుడే (లేక) జ్ఞాన మాత్రుడే సుమా! ఆతని యొక్క విస్తారమే ఈ జగత్తు. అతడు జగత్తు పట్ల అభిమానం ఉన్నప్పుడు జగత్తును అనుభవిస్తున్నాడు. జగత్ రహితుడుగా ఉన్నప్పుడు పరమాత్మత్వము అనుభవిస్తున్నాడు. ఉపదేశసారమంతా ఇంత మాత్రమే సుమా!

కనుక జగత్తు ఉండవచ్చు గాక, ఉండకపోవచ్చుగాక! నీవు మాత్రం జగదతీత్వము వహించిన వాడవై ఉండు. ఈ సమస్త సాంసారిక పదార్థములందు, స్థితియందు విభవములందు, దారిద్ర్యములందు పొంగని - క్రుంగని స్థితి కలిగి ఉండు. సర్వదా విరాగివై హృదయమును శిలవలె ఇచ్ఛారహితంగా చేసేవేసి 'జ్ఞానము' అనే ఐశ్వర్యమునుకు పొందటానికి సర్వదా సంసిద్ధుడవై ఉండు.

జడమగు ఒక శిల యొక్క అంతర్భాగం ఛిద్రరహితమై మౌనము వహించి ఒప్పుచున్నది కదా! చిదాకాశరూపమగు నీ హృదయము కూడా అంతరమున ఛిద్రరహితమై 'జగత్తు' అను భూతాదులకు స్థానము పొందనిదై ఒప్పుగాక! కేవల చైతన్య సమన్వితమైన ప్రకాశించుగాక! హృదయమునందు సాంసారిక వాసనలకు స్థానమే లభించకుండు గాక! చైతన్యపూరిత హృదయాకాశమున కేవల చైతన్యమునే దర్శిస్తూ పరమానందము పొందుచుండెదవు గాక!

❖❖❖

## 23. జ్ఞాని - అజ్ఞాని - వారి వ్యవహార విశేషాలు

ఓ రామచంద్రా! జ్ఞానికి అజ్ఞానికి ఇక్కడి సమస్త భావ-అభావాల విషయంలోను, కర్మలు నిర్వర్తించే పద్ధతియందు పెద్ద తేడా ఉండదు. వారిద్దరిలోనూ ఉండే భేదమంతా ఒక్కటే!

1. జ్ఞాని ఆ పదార్థములందు, సంఘటనల యందు, కర్మల యందు, తదితర విశేషములందు వాసనారహితుడై ఉంటాడు. వాటియందు అతనికి సత్యత్వ బుద్ధి ఉండదు.

2. అజ్ఞాని వాటన్నిటి పట్ల వాసనా సహితుడై ఉంటాడు. వాటి పట్ల సత్యత్త్వ బుద్ధి కలిగి ఉంటాడు. వారిరువురిలో భేదమంతే!

చైతన్య సత్తయే ——— వాసనలచే స్ఫురించుటచే ఈ జగద్రూపంగా అవుతోంది.
——— వాసనల అభావముచే ఈ జగద్రూపం శమించి అపరిచ్ఛిన్నము నామరూపరహితము అగు మోక్ష స్వరూపమే అగుచున్నది.

ఇంత మాత్రమే జ్ఞానమంతా! ఇక ఈ 'దృశ్యం' అంటావా?

**దృశ్యం వినశ్యతి అఖిలమ్, వినష్టం జాయతే పునః ।**
**యన్ననష్టం న చ ఉత్పన్నం! యత్ సత్ భవతి తత్ భవాన్ ॥**

ఈ దృశ్య జగత్తంతా ఒకప్పుడు నశిస్తోంది. నశించినదంతా మరల మరొకప్పుడు ఉత్పన్నమౌతోంది. అయితే... ఏదైతే నశించుటయే లేదో, నశించడం లేదు కాబట్టి 'ఉత్పన్నం' అనేది కూడా లేదో ...అదియే సత్తు.

"ఆ సత్తయే నీవు" ఇట్టి బోధచే అజ్ఞాన మూలము నశించుచున్నది.

అజ్ఞాన మూలము నశించిన తరువాత 'జగద్భ్రాంతి' అనేది ఇక ఎంత వెతికినా కనిపించదు. "మృగతృష్ణలో భ్రమచేతనే జల తరంగాలు కనిపిస్తున్నాయి కదా!"... అని తెలిసే వరకే కదా, మృగతృష్ణ వైపుగా పరుగులు! అట్లాగే, "జగత్‌దర్శనమంతా భ్రమ చేతనే ఏర్పడుతోంది" అని గ్రహించబడిన తరువాత ఇక "ఈ జగత్తు ఎక్కడి నుండి వచ్చింది? దీని మొదలేమిటి? చివర ఏమిటి?"... అనే ప్రశ్నలకు తావు ఎక్కడిది?

ఏ 'అహంకారము' అను దాని గురించైతే 'ఇదేమిటిరా బాబు? ఇది ఎక్కడి నుండి వచ్చింది?" అని సాధకులంతా తర్జన భర్జనలు చేసుకుంటున్నారో... ఆత్మ దర్శనమైన తరువాత ఇట్టి అహంభావన గురించిన ఊసైనా ఉండదు.

ఆత్మజ్ఞానికి అంతఃకరణము ఉపకరణమే అవుతుంది. కాని అది సంసారమును కలుగజేయ జాలదు. దగ్ధమైన బీజము మరల మొలకెత్తదు కదా! వీత రాగుడు (రాగములను జయించినవాడు), మనోవికార రహితుడు అయిన జ్ఞాని కర్మలు చేయుచుండవచ్చు. లేక చేయకుండవచ్చు గాక! అతడు సదా అమనస్కుడై, నిత్యనిర్వాణ రూపుడై ...ఆత్మయందే స్థితి కలిగి ఉంటాడు.

ఎవరైతే ఈ తమ చిత్తమును సశాంతింపజేసుకుంటారో ...వారే శాంతియుతులై ఉండ గలుగుతారు. భోగ వాసనలు కలవారికి మాత్రమే భోగముల ఉనికి – లేములు బంధించడం, బాధించడం చేస్తున్నాయి. భోగాశ ఉన్నచోట మాత్రమే చిత్తమనేది ఏర్పడుతుంది. అట్టి వారికి శాంతి లేదు. ఎవరైతే సర్వాశలు సర్వదా త్యజించియే ఆయా ప్రవాహపతిత విధి విధానములను నిర్వర్తిస్తూ ఉంటారో ...వారికి చిత్తము లేనట్లే అవుతుంది. ఆ విధంగా చిత్త – దేహాదులుగా ఘనీభూతం కాని వాడు (వాటిపట్ల అహంకార బుద్ధి ఉంచనివాడు), కేవల చిన్మాత్ర రూపుడగు పరమాత్మయే! అహంభావముతో కూడి ఉండేవాడు ఇసుకపై నిలుచుని మధ్యాహ్న సూర్యుని తాపము అనుభవించువాడే అగుచున్నాడు.

**శ్రీరాముడు:** చిత్త రహితుడు పరమాత్మయే అగుచున్నాడని అనుచున్నారు కదా! అట్టి చిత్త రహిత పరమాత్మ స్వరూపము ఎట్టిదో ఏదైనా దృష్టాంతపూర్వకంగా చెప్పమని నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి:**

**ఏకదేశ స్థితాత్ పుంసో దూరాయాతస్య చేతనః ।**
**యద్రూపం సకలం మధ్యే తద్రూపం పరమాత్మనః ॥**

ఒకడు ఒక ప్రదేశంలో నిలుచున్నాడనుకో. అతని చిత్తము (ధ్యాస) దూరంగా ఉన్న సూర్య – చంద్ర మండలమునకో వెళ్లినదనుకుందాం. ఆ మనుజుని చిత్తము అతడు నిలుచున్న చోటు నుండి బయలుదేరిన తరువాత, ఇంకా సూర్య మండలము చేరక ముందు ఆ మధ్య ప్రదేశములో ఏ చైతన్య స్ఫురణ కలదో అదియే 'పరమాత్మ' యొక్క రూపం. అనగా......

ఈ జీవ సంవిత్తు విషయములను పట్టుకొంటోంది కదా! ఇది ఒక విషయమును ఆశ్రయించి ఇంతలోనే ఏదో కారణం చేత ఆ విషయమును త్యజించి మరొక విషయమును ఆశ్రయిస్తోంది. ఇట్లు అవిశ్రాంతంగా విషయ పరంపరలను ఆశ్రయించి స్వభావమే 'చిత్తము' అనబడుతోంది.




**విషయము – విషయముల మధ్య గల విషయ రహిత విరామం**

చిత్త స్వభావమును ఆశ్రయించి విషయపరంపరలను అనుభవిస్తున్న జీవసంపత్తు విషయము – విషయముల మధ్య గల 'నిర్విషయ విరామము'ను గమనించటమే లేదు.

ఒక విషయము – మరొక విషయముల మధ్య ఈ జీవ సంవిత్తు యొక్క ఏ చైతన్య స్ఫురణ నిర్విషయమై ఉన్నదో అదియే 'పరమాత్మ' యొక్క స్వరూపం.

ఇక ఈ జగత్తంటావా? మనోహరమైన అనంత చిదాకాశము తాను స్వయంగా ఏ చమత్కారమైతే గావించుచున్నదో... అట్టి చమత్కారము యొక్క వ్యక్తీకరణ రూపమే ఈ జగత్తు. కనుక జ్ఞానులకు ఈ జగత్తు భ్రమ రహితమై, ప్రకాశశీలమై (కాంతి వంటి), నిర్వాణ రూపమై, అక్షయపరబ్రహ్మముగానే భాసిస్తోంది. ఇక అజ్ఞానులకో?... ఇదంతా నిరంతరమైన ఈశ్వరనియతి గాను, అనేక వ్యవస్థ – వ్యవహారములతో కూడుకొనియున్నదిగాను, అప్రతిహతమైనది గాను, అనేక భోగాదులతో కూడుకొని ఉన్నదిగాను గోచరిస్తుంది. ఇదంతా కూడా వాస్తవానికి పరమార్థమున వెలయుచున్నప్పటికీ, అజ్ఞానులకు మాత్రం అసద్రూపంగానే అనుభవమౌతోంది. కాబట్టి జ్ఞానము సంపాదించి అప్పుడు ఈ జగత్తు వైపుగా దృష్టి సారించమని సర్వ జీవులకు నా మనవి.

❖❖❖

# III. శ్రీ వసిష్ఠ - మంకి సంవాదము

## 1. ప్రక్కదోవ పట్టుచున్న బహుదూరపు బాటసారి

**(ఆత్మానంద స్థానమును ఏమఱచి దృశ్యము వైపుగా ఆకర్షించబడుచున్న ఒక బాటసారి)**

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! పూర్వం ఒకప్పుడు 'మంకి' అను పేరుగల మహనీయునికి నేను ఆత్మ విషయమై బోధించటం జరిగింది. ఆ బ్రాహ్మణుడు తత్త్వమును విని సంసార వాసనా రహితుడై ఆత్మపదమును సముపార్జించుకున్నాడు. ఆ సంఘటనను ఇప్పుడు మనం చెప్పుకోవటం సందర్భోచితం. కనుక, విను! చెబుతాను.

❖

మీ తండ్రిగారి యొక్క తండ్రి (తాతగారు) అజుడు ఒకసారి ఒక గొప్ప యజ్ఞం తలబెట్టారు. తత్సంబంధిత కార్యనిర్వహణకై కొన్ని విషయాలు సంప్రదించాలనే ఉద్దేశంతో మీ వంశపురోహితుడ నైన నాకు కబురు పంపారు మీ తాతగారు. ఆ కబురు విన్న నేను ఒక సమయంలో ఆకాశము నుండి భూమికి వస్తున్నాను. అట్లా భూమిపైకి వస్తూ అయోధ్యానగరం సమీపిస్తూ ఉండగా త్రోవలో కాకతాళీయంగా ఒక విశాలమైన అరణ్యం తారసపడింది. ఆ అరణ్యం ఎండచే వేడెక్కిన ధూళితో కూడిన సుడిగాలులచే ధూసరమై ఉన్నది. నేలంతా ఇసుక దిబ్బలకు ఆలవాలమైయున్నది. ఆ దీర్ఘమైన అరణ్యంలో అక్కడక్కడ క్రూర ఆటవికుల గ్రామాలు ఉన్నాయి. కొన్ని ప్రదేశాలలో మాత్రం క్షోభరహితమైన ఆకాశం, వాయుతరంగములపై ప్రసరించే సూక్ష్మ సూర్య కిరణాల వలన ఏర్పడిన మృగతృష్ణలు కన్పిస్తున్నాయి.

అక్కడ అస్తవ్యస్తంగా ఉన్న కాలి బాటలలో ఎంతో శ్రమ, అలసటతో సంచరిస్తూ బాటసారులు కనిపించారు. అక్కడి ఆకాశం బ్రహ్మం వలె నిర్మలంగాను, ఖాళీ ప్రదేశాలు మృగతృష్ణలచే మోహ దాయకంగాను అగుపిస్తున్నాయి. అవిద్య వలె అక్కడి ఆయా ప్రదేశాలు జడత్వంతో కూడి అతి విశాలమై, కనిపిస్తున్నాయి. అక్కడక్కడా జనశూన్యమై కూడా కనిపిస్తున్నాయి.

నేను అట్లా పయనిస్తూ వస్తూ ఉన్నాను. ఇంతలో అక్కడ ఒక బాటసారి కనిపించాడు. అతడు ఎంతో అలసి విసుగును ప్రదర్శిస్తూ ఉన్నాడు. ఇట్లా పైకి పలకటం నాకు వినిపించింది.

**బాటసారి:** అబ్బా! ఏం ఎండ? ఒక పాపితో, దుర్జనునితో సాంగత్యం ఎంతగా పరితాపం కలిగి స్తుందో... ఈ ఎండ కూడా అంతగా పరితాపం కలిగిస్తోంది.

నా ఈ అవయవలన్నీ క్రుంగిపోతున్నాయి! ఈ ఎండ మంటలు చిలకరిస్తోందే! ఎండకు అరణ్యాలన్నీ సంతాపం పొందుతున్నాయి. ఇక లాభం లేదు. ఆ ప్రక్కన ఏదో పల్లె, గుడిసెలు

కనిపిస్తున్నాయి. అటు వెళ్లి ఏ ఇంట్లో అయినా కొంతసేపు సేద తీర్చుకొని అప్పుడు నా ఈ ప్రయాణం కొనసాగిస్తాను.

ఇట్లా అంటూ నడుస్తున్న బాటను వదలి కొంత దూరంలో ప్రక్కత్రోవగా నడవసాగాడు. నేను అది గమనించాను. అతడు అల్లంత దూరంగా కనిపిస్తున్న క్రూర ఆటవికుల గ్రామం వైపుగా తిరిగి అడుగులు వేయసాగాడు. అతడు వెళ్ళుచున్నది ప్రమాదమైన ప్రాంతానికి. "మరి అతనికి ఆ విషయం తెలుసా? లేదా?" అని నా మనస్సులో అనిపించింది. వెంటనే నేనప్పుడు అతనిని కొంచెం వెనుకకు పిలిచి ఇట్లా అన్నాను.

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** శుభమైన ఆకృతితో వెలుగొందుచున్న ఓ మిత్రమా! ఒక్కమాట. రండి, రండి సుస్వాగతం! ఏమిటి, ఈ ముఖ్య మార్గమగు బాటను, మీరు వెళ్లవలసియున్న మార్గ–లక్ష్యములను వదలి ప్రక్కవైపుగా వెళ్లుచున్నారేమిటి? సరైన మార్గం తెలియక ప్రక్కకు వెళ్లుచున్నారా? మీరు వెళ్ళే ఆ ప్రదేశం ఎటువంటిదో మీకు తెలుసా? లేదా? (పాఠక మహాశయులు... అది ఇంద్రియ విషయముల వైపుగా అని గమనించ ప్రార్థన.)

**బాటసారి :** కొంచెం విశ్రాంతి లభిస్తుంది కదా అని ప్రక్కనున్న ఆటవిక గ్రామం వైపుగా వెళ్దామను కుంటున్నాను. ఇలా బాట వెంబడి వస్తూ అక్కడక్కడ పక్క కుగ్రామాలలో విశ్రాంతికై వెళుతూ వచ్చాను లెండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** నిమ్న మార్గములలోకి వెళుతూ వస్తున్న ఓ బాటసారీ! మీరు పూర్వ గ్రామాలలో (ఇంద్రియ గ్రామాలలో) అక్కడక్కడ కొంచెం విశ్రాంతి దొరుకుతుంది కదా అని వెళ్లి వచ్చి ఉండవచ్చు గాక! ఇప్పుడు మీరు వెళ్లాలనుకునే (విషయ పరంపరలు అనే) గ్రామం సంగతి మీకు తెలుసో? తెలియదో? అతిథి సత్కారాలు చేసే వారు ఇక్కడి గ్రామంలో ఉండరు. ఇక్కడంతా పైకి ప్రియం గానూ, లోన బంధప్రసాదితంగాను కనిపించే (శబ్దస్పర్శాది విషయ) ప్రదేశము సుమా! అటువైపుగా ప్రియంగా అనిపించినా, అక్కడి (ఇంద్రియ) గ్రామం శ్రేయం కాదు. తెలిసీ తెలియక ప్రవేశించే వారికి ఈ దేహాలు బంధములను ప్రవృద్ధపరుస్తాయని గ్రహించి ఉన్నారా?

పామరులకు మాత్రమే ఈ (దేహము అనే) గ్రామం నివాస స్థానమగుచుండగా, మీకు ఈ (దేహ) గ్రామంలో ఏం విశ్రాంతి లభిస్తుంది చెప్పండి?

**బాటసారి :** మీరు చెప్పింది నిజమే కావచ్చు! కానీ, ఈ (దేహ) గ్రామంలో విశ్రాంతికి వసతులు (ఇంద్రియాలు, ఇంద్రియ విషయాలు) ఉంటాయి కనుక, కాస్త విశ్రాంతి, కాలక్షేపం సాయంకాలం దాకా లభిస్తాయి... సాయంకాలం అవగానే ఎండ చల్లబడగానే మరల బయలుదేరుతాను కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఉప్పు నీటిని త్రాగితే దాహం ఇంకా అధికమౌతుంది గాని, దాహం తీరుతుందా చెప్పండి? ఈ (ఇంద్రియ – దేహ) ఆటవిక గ్రామం చేరినా మీ దాహం తీరదు సుమా! ఈ గ్రామంలో క్రూరులైన (ప్రియాప్రియ స్వరూపములైన) మొరటు ఆటవికులు ఉంటారు. వారందరికి మహాత్ములన్నా, వివేకమన్నా వ్యతిరక్తము, ఎగతాళి, భయము కూడా!

వారంతా (ఈ ఇంద్రియాలన్నీ) అశాస్త్రీయమైన మార్గాల వైపుగానే అధికంగా ఆకర్షితులై ఉంటారు. ఇక్కడి కోయజాతి వారు 'కామం – క్రోధం' కలిగి పశుతుల్యులై (ఇంద్రియ పశువులై) ఉంటారు సుమా!

**న స్ఫురన్ని విచారేషు ప్రజ్వలన్తి అనుభూతిషు ।**

**న త్రస్యన్తి దురాచారాదశ్మయన్త్రమయా ఇవ ॥**

ఇక్కడి (ఇంద్రియ)గ్రామంలో ప్రజలకు(ఇంద్రియాలకు) 'తత్త్వ విచారణ' లేకపోవడం చేత మూఢులై ఉంటారు. వారివారి పరిమితానుభవాలలోనే ప్రజ్వలిస్తూ ఉంటారు. 'అయ్యో! ఇది దురాచారం కదా! సత్క్రమం కాదు కదా!"... అనే విజ్ఞత, జ్ఞానం అక్కడి (ఇంద్రియ)గ్రామ ప్రజలకు ఉండదు. అక్కడివారి పురుషార్థమంతా అర్థ–కామాల కొరకై రాగద్వేషములందే పరిసమాప్తమౌతూ ఉంటుంది. పైగా వారిలో సత్–అసత్, నిత్య–అనిత్య... వివేక – విచారణలు లేవు. అందుచేత ఆ బుద్ధిహీనులకు కర్మలయందే ప్రీతిగాని, జ్ఞానంలో కాదు. విశాలమైన ఎడారిలో ప్రవేశించిన మేఘాలకు ఆ ఎడారిపై నమ్మకం లేదు. కాబట్టి అక్కడ కురియవు కదా! అట్లే 'పూర్ణం – శీతలం – కాంతి రసం – బ్రహ్మానందం'... అనే ప్రజ్ఞావర్షం అక్కడివారి 'హృదయాలు' అనే ఎడారిలో కురియవు. విజ్ఞానం పట్ల వారికి విశ్వాసం లేకపోవడం చేత వారు మూర్ఖులుగానే ఉన్నారు.

**బాటసారి :** అయితే ఏం? నా పని నాది. ఏదో కొద్దిసేపు వారితో స్నేహంగా ఉండి ఆ తరువాత వచ్చేస్తాను కదా! వారితో (ఇంద్రియ విషయాలతో) వినోదించాలని నేను వెళ్ళుచుండగా... మీరెందుకు "వద్దు–వద్దు" అని నాకు చెప్పవస్తారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**వర మన్ధ గుహాహిత్వం శిలాన్తః కీటతా వరమ్ ।**

**వరం మరౌ పఙ్గుమృగో న గ్రామ్య జన సంగమః ॥**

మిత్రమా! ఓ బాటసారి! పైకి ప్రియుల వలె కనిపిస్తూ అనేక ఇష్ట–అయిష్ట, రాగ–ద్వేష ద్వంద్వాలకు బహు ఆవేశపూరితంగా కలిగి ఉండే అజ్ఞానులతో సాంగత్యం మంచిదా?... కాదు! అంతకంటే అంధకారంతో ఆకృతమైన కొండ గుహలో కొండచిలువ అయి ఉండటమో, దట్టమైన అడవిలో జింకగా జీవించటమో ఉచితమేమో! అంతేగాని, అక్కడి ఇంద్రియగ్రామ ప్రజలతో కొద్ది సేపు స్నేహం కూడా ఉచితం కాదు. నిమిషకాలం మంచిగా అనిపిస్తూ మరుక్షణమే స్నేహవిరతులు అయ్యేవాళ్లు. వాళ్ళాయె? 'బాధించటం – వేధించటం – హింసించటం – కృంగదీయటం' వంటి క్రియలలో అతి ప్రావీణ్యులు అయిన ఇక్కడి గ్రామ్య జనులు (ఇంద్రియ సమూహాలు) మధుర పదార్థములతో మిశ్రమమై ఉన్న విషగుళికల వంటి వారు సుమా!

❖

ఓ రామచంద్రా! నేనిట్లా అనే సరికి, నా వాక్యాలు విన్న ఆ బాటసారి కొంచెం శాంతించాడు. మండుటెండలో శ్రమించి, చల్లటి నీళ్లతో స్నానం చేసి సేదతీరిన వానివలె అయి, ఇట్లా పలికాడు–

**త్వమ్ తత్ అసి! -**

**బాటసారి :** మహాత్మా! తమరెవరు? చూడగా పూర్ణాత్మజ్ఞానుల వలె, ఆత్మవిద్యను కూలంకషంగా ఎఱిగినవారి వలె ఉన్నారే! అంతేకాదు. ఒకవైపు మేమీ సంసారారణ్యంలో దిగాలు పడి అక్కడా – ఇక్కడా ప్రక్క త్రోవలు పట్టుచుండగా మీరు మాత్రం "ఇక్కడి సంసారంలో నాకు చెందినది, చెంద వలసినది ఏమీ లేదు"... అని గ్రహించి కాబోలు ప్రక్క త్రోవకు మరలుచుండడమే లేదు. సుదూర ప్రయాణీకుడు త్రోవలో తారసపడే జనులను పట్టించుకోనట్లుగా మీరు వ్యాకుల రహితులై సాక్షీ మాత్రంగా ఈ పరిసరములను దర్శిస్తున్నట్లున్నారే!

**కిం త్వయా సీతమమృతమ్? కిం త్వం సమ్రాడ్విరాడథ ।**
**సర్వార్థరిక్తో అపి, చిరమ్ సంపూర్ణఇవ రాజసే ॥**

మీ ముఖారవిందం పరమ ప్రశాంతంగా, నిర్లిప్తంగా ఉన్నదే. తాము ఏమన్నా అమృత పానం చేసి ఉన్నారా ఏమిటి? లేక మీరు లోకేశ్వరులా? కాక విరాట్ పురుషులా? ఎందుకంటే ఒక వైపు సర్వ పదార్థ రహితులై ఉండి కూడా, ఇంకొక వైపుగా పరమార్థశోభితులై – పూర్ణ స్వరూపులై భాసిస్తున్నారే! మిమల్ని చూస్తూ ఉంటే.

**శూన్యోఽసి, పరిపూర్ణోఽసి ఘూర్ణోఽసీవ స్థిరోఽసి చ।**
**న సర్వమపి సర్వం చ న కించిత్ కించిదేవ చ ॥**

ఒక వైపు (సంసార దోష) శూన్యులుగా ఉన్నారు. మరొక వైపు నుంచి బ్రహ్మానందం చేతను, జీవన్ముక్త గుణముల చేతను పరిపూర్ణులై కన్పిస్తున్నారు. (ఈ దేహాదుల పట్ల అనుసంధానం లేక పోవుటచే) ఒక విధంగా జగద్విషయాలకు అతీతమైన మత్త చిత్తుని భంగి అగుపిస్తున్నారు.

(ఈ దేహమనో బుద్ధ్యాదులచే సంబంధం వహించకపోవుటచే) ఏదీ కానివారై ఉన్నారు. (అపవాద దృష్టి) ఈ దేహ మనో బుద్ధ్యాదులన్నీ తమ చమత్కారమే కనుక – "అంతయు తామేనా!" అన్నట్లుగా కూడా ఉన్నారు. (అధ్యారోపదృష్టి) పరిచ్ఛిన్నుల వలె కనిపిస్తూనే అపరిచ్ఛిన్ను లుగా అనిపిస్తున్నారు.

**ఉపశాంతం చ, కాన్తం చ, దీప్తమ్ అప్రతిఘాతి చ**
**నివృత్తం చ ఊర్జితం తాదృగ్రూపం కిమితి తే మునే?**

మీ రూపం పరమశాంతంగాను, అత్యంత ప్రకాశమానంగాను, ప్రదీప్తవంతంగాను, అప్రతిఘాతం గాను, సర్వ వ్యవహారముల నుండి నివృత్తిని సముపార్జించుకొన్న దాని వలెను, సర్వసామర్థ్యమును అవధరించిన దాని వలెను నాకు కన్పట్టుచున్నది. స్వామీ! మీరీ భూమిపై పాంచభౌతిక దేహంతో కనబడుచున్నప్పటికీ సర్వలోకాలకు ఆవల చిదాకాశస్వరూపమున స్థితిని పొందిన వారివలె ఉన్నారు. అంతేగాక, మీరు ఎక్కడా స్థితిని పొంది ఉండక నిరాకారులైనప్పటికి మావంటి రూప-నామాది సంసారబద్ధుల నిమిత్తమై రూపయుక్తులగుచున్న వారి వలె నాకు అనిపిస్తున్నారు. చంద్రుని చల్లటి కిరణాలు భూమిపై గల ఆయా పదార్థములపై ప్రసరిస్తూ

కూడా, ఆయా విషయాల దోషాలను తాను పొందక యథాతథంగా అమృతమయంగా ఉంటుంది చూచారా! మీరు కూడా, పరిపూర్ణంగా కళంకరహితులుగా, స్వభావసిద్ధమైన శీతలాంతఃకరణులుగా, ప్రకాశానందమయులుగా, సర్వత్రా సమరూప సముపార్జితులుగా, అమృత ప్రవాహపూరితులుగా, పూర్ణ చంద్ర శోభాయమానులుగా నాకు కనిపిస్తున్నారు.

హే మహాత్మా! ఒక విత్తనంలోనే వృక్ష-శాఖ-పత్ర-ఫలాదులన్నీ ఉన్నట్లు మనం గ్రహిస్తాం చూడండి! అట్లా, మీ ఆత్మయందే ఈ జగన్మండల వైశిష్ట్యమంతా నేను వీక్షిస్తు న్నాను. చిత్ స్వరూపులగు తమ ఇచ్ఛయందే సత్-అసత్ భావ చమత్కారం అంతా ఉన్నట్లుగా నాకు గోచరిస్తోంది.

స్వామీ! మీరెవరో, తదితర మీకు సంబంధించిన విశేషా లేమిటో తెలుసుకోవాలని నాకు అనిపిస్తోంది. ప్రభూ! ముందుగా నా గురించి నేను పరిచయం చేసుకోవటానికి అనుజ్ఞనివ్వండి.

❖

నన్ను "మంకి" అనే పేరుతో పిలుస్తూ ఉంటారు. శాండిల్య గోత్రోద్భవుడనగు బ్రాహ్మణుడను. అహం భో అభివాదయే! తీర్థయాత్రలు చేసి వద్దామని చాలాకాలం క్రితం బయలుదేరాను. చాలా దూరదూరాలు సంచారం చేసి ఇక ఇంటికి చేరాలని తిరిగి వస్తున్నాను. చాలా చాలా ప్రదేశాలు సందర్శించి వస్తున్నాను. అనేక ప్రదేశములను, స్థానములను చూచిన నా మనస్సు "ఈ ప్రపంచం మెరుపుతో సమానమైన పంచభూత సంయోగ వియోగ చమత్కారమే..." అనే వివేకం చూచాయగా పొందింది. మనస్సు వైరాగ్యయుక్తం కాగా 'ఈ ప్రాపంచిక విషయాలు ఏమి చూడాలి? ఇంటికి చేరి విశ్రాంతి పొందటమే ఉచితం కదా!... అని అనిపించసాగి, ఇక గృహోన్ముఖుడను అయ్యాను. నన్ను మీరు సంబోధించిన విధానం చూచి "మీరు శాస్త్రజ్ఞానులు, ఆత్మజ్ఞాన నిధి"...అని గ్రహించాను. హే మహాత్మా! ఈ బాటసారి అనేక బాటలలో సంచరించి సంచరించి అలసి పోయాడు సుమా! దయచేసి నా అలసట తీర్చగల ఆత్మజ్ఞానం వచించండి. సాధు మహాత్ముల చిత్తము గంభీరముగాను, నిర్మల సరోవర సదృశంగాను ఉంటుంది కదా! ఇక నా చిత్తం నాకే అర్థంకాని అనేక వ్యాకులతతో, దిగుళ్లతో సతమతమగుచు ఉడికిపోతోంది. కనుక నాకు ఆత్మజ్ఞానం ప్రసాదించమని మరల వినమ్రుడనై వేడుకొనుచున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ మంకి మహాశయా! నీవు ఆత్మజ్ఞానం కొఱకై అర్థించే నమ్రతతో కూడిన విధానం నాకు నచ్చింది. నీ విప్పుడు నన్ను సంబోధిస్తూ చెప్పినదంతా తత్త్వశాస్త్ర ప్రవచనమై ఉన్నది. ఇట్టి దృష్టితో చూడటమే తత్త్వశాస్త్రజ్ఞానోదయం.

ముందుగా నా వివరాలు కూడా చెప్పుతాను. నేను బ్రహ్మలోక నివాసిని. 'వసిష్ఠుడు' అను నామధేయుడను. రాజర్షి అయిన అజుడు ఏదో కార్యం నిమిత్తం నాకు కబురు పంపగా ఇటు వస్తున్నాను. నీవు ఆత్మజ్ఞానం కొరకై నన్ను అర్థించడం నాకు సంతోషం కలుగజేస్తోంది. ఎందుకంటే అనేకమంది జీవ నామధేయ బాటసారులు ఆత్మజ్ఞానం కొరకై యత్నించకుండా అనేక ఉపాధులు ఆశ్రయిస్తూ ఇక్కడి సంసారారణ్యంలో ఉపాధి పరంపరలు పొందుతూ సుదీర్ఘకాలం గడిపివేయడం నేను గమనిస్తున్నాను.

ఆత్మజ్ఞానము కొరకై నీవు అడుగుచున్నందునకు నిన్ను ముందుగా అభినందిస్తున్నాను. ఓ ప్రియ విప్రోత్తమా! నీవు ఈ కల్పిత విషయ ప్రపంచంలో దేని కొరకూ దుఃఖించవలసిన పనేలేదని మొట్టమొదటి వాక్యం చెప్పుచున్నాను.

**మాగా విషాదం పంథానమ్ ఆగతోషి మనీషిణామ్**
**ప్రాయ ప్రాప్తోసి సంసారసాగరస్య పరం తటమ్!**

నీవు దుఃఖించవలసిన అవసరమే లేదు. పైగా, బుద్ధిమంతులైన వారు పొందే మార్గం నీవు దాదాపు పొందావు. 'వైరాగ్యం' అనే వైభవం ఉన్నప్పుడే నీవలె ఇటువంటి ఉదారమైన బుద్ధి, యోచన, వచనములు, ఆకృతి ఉంటాయి.

నీవిప్పుడు ఆత్మజ్ఞానం గురించి అడిగావు కదా! ప్రతి జీవునిలోనూ 'ఆత్మజ్ఞానం' అనే రత్నం ఉన్నది. అయితే, రత్నమును సాన పెట్టనంతకాలం అప్రకాశమానంగానే ఉంటుంది కదా! అట్లాగే బుద్ధి అనే రత్నం "అనేక రాగద్వేషములు" అనే మాలిన్యములచే ఆవరించబడి ఉంటోంది. 'వివేకము' అనే సాన పెట్టితే ఆత్మజ్ఞానం స్వయంగానే ప్రకాశించగలదు.

అయితే ఓ విప్రుడా! నీవు తెలుసుకోవాలనుకుంటున్నది ఏమిటి? సంసారము నీకెట్లా అనుభవమౌతోంది?... శిష్యుడు తనకున్న అనుమానాలను సవివరంగా ప్రదర్శిస్తే గురువు అర్హమైన మార్గంలో ఉత్తమ అర్థయుక్తమైన బోధ నిర్వర్తించగలుగుతాడు. ఈ ప్రశ్న-ఉత్తరములు అనేవి గురు-శిష్యుల మధ్య అత్యంతావశ్యకమైన పాఠ్య విధానం. కాబట్టి నీవు చక్కగా నీకున్న అనుమానా లను బయటపెట్టు.

శిష్యుడిలో 5 లక్షణాలు ముఖ్యంగా ఉండాలి- 1. రాగాది దోషములు తొలగించుకోవడం, 2. నిర్మలమైన (ధ్యాన-పఠనాది) వాసనలు కలిగి ఉండడం, 3. వైరాగ్య సంబంధమైన సాధనాలతో కూడి ఉన్న మనస్సు, 4. నిత్యానిత్య వివేచనా సామర్థ్యం, 5. సమబుద్ధి. ఈ ఐదు లక్షణాలు శిష్యునిలో ఉంటేనే గురూపదేశం ప్రభావ సమర్థంగా అవుతుంది. అప్పుడు గురూపదేశ తేజస్సుచే ఆ శిష్యుడు శోక రహితుడుగాను, ఆత్మజ్ఞాన సుసంపన్నుడుగాను అగుచున్నాడు. యోగ్యత ఉన్నప్పుడే 'గురుబోధ' ప్రయోజనకరం.

నీవు ఏం తెలుసుకోవాలనుకుంటున్నావో నీ యందు గల అనుమానాలేమిటో ప్రశ్నించు. నీ ప్రశ్నలను అనుసరించి జననమరణాది దుఃఖముల నుండి తరించాలనే బుద్ధి పట్టుదల ఎంత వరకు ఉన్నాయో నాకు తెలుస్తుంది. నీవు తగిన అర్హత కలవాడివైతే నీకు తప్పక ఉపదేశిస్తాను.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నేను ఆ 'మంకి' అను విప్రుని ఇట్లు తిరిగి ప్రశ్నించాను. అప్పుడు ఆతని కళ్లు ఆనందబాష్పములతో చమర్చడం గమనించాను. నా పాదములకు సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆ ప్రక్కనే గల ఒక పెద్ద వృక్షపు నీడలో ఇద్దరం సుఖాసీనులమైనాం. ఇక అతడు ఇట్లా చెప్ప ప్రారంభించాడు.

❖❖❖

# 2. సంసార పంజరం

**మంకి :**

**భగవన్! భూరిశోఽభ్రాన్తా, దిశో దశ దృశో యథా ।**
**మయా న తు పునః సాధు లబ్ధః సంశయనాశ కృత్॥**

మహాత్మా! ఉపదేశం ప్రసాదించగల గురువుకోసం నేను పది దిక్కులలోనూ దృష్టిసారించి మరీ వెతికాను. కానీ, నా సంశయములను పోగొట్టగల మహాత్ముడెవడూ నాకింతవరకూ లభించనేలేదు. నేడు మీ దర్శనం అయినందుకుగాను, సమస్త దేహములలోనూ ఉత్తమమైన ఈ మానవజన్మ లభించిన సత్ఫలితం పొందిన వాడనగుచున్నాను.

**పునర్జాతం పునర్నష్టం సుఖ దుఃఖ భ్రమః సదా ।**
**అవశ్యం భావి పర్యన్త దుఃఖత్వాత్ సకలానపి ॥**
**సుఖాన్యేన అతి దుఃఖాని వరం దుఃఖాన్యతో, మునే ॥**

ఓ మునీశ్వరా! ఈ సంసారమును గమనించాను. ఇదంతా సదా సుఖ-దుఃఖ భ్రమలచే నిండి ఉంటోంది. పుట్టడం-చావటం, మరల జన్మ - ఇదియే ఈ సంసారం యొక్క రూపం. చివరికి ఇది దుఃఖాలనే కలుగజేస్తోంది. ఈ సమస్త సంసార సుఖాలు వాస్తవానికి దుఃఖం రూపాలే అయి ఉన్నాయి. అందుచేత ఈ సంసారంలో ఉండే సుఖాల కంటే దుఃఖాలే కాస్తంత మేలు అని నా కనిపిస్తూ ఉంటుంది. ఎందుకంటారేమో? ఈ సంసార సుఖాలు మోసగించి మరీ సుదీర్ఘ దుఃఖ సముద్రంలోకి మావంటి జీవులను త్రోసివేస్తున్నాయి.

ఇంక ఎవరి సంగతో మనకెందుకు? నా సంగతే చూడండి. వయస్సుతో బాటుగా ఈ ప్రేగులు దంతాలు, కేశాలు శిథిలమైనాయి. అయినా కూడా ఈ నా బుద్ధి ఉత్తరోత్తరా పొందగల ఏవేవో భోగాల యందే ఇంకా తత్పరమై ఉంటోంది. అంతేగాని పరమ పురుషార్థం వైపుగా మరలటమే లేదాయె?

ఇక ఈ మనస్సు! ఇది అనేక రాగ- ద్వేషాలతో, దుష్ట - నికృష్ట సంకల్ప పరపరలతో వివేక రహితంగా ఉంటోంది. సాక్షి చైతన్యం గురించిన వివేకం దీనికి ఎంత ప్రయత్నించినా, విన్నా కూడా కలగటం లేదు. మహాత్మా! ఎండిన ఆకులు చిందరవందరగా రాలి క్రుళ్లి దుర్వాసనా భూయిష్ఠం అయినట్లు ఈ మనస్సు నిండా దుర్వాసనలు, దుష్ట వ్యాపకాలు, సారహీనమైన పదార్థాలు ఉంటున్నాయి. ఇక ఈ ఇంద్రియాలను చూద్దామా? "ఎక్కడో వినీలాకాశంలో ఎగిరే గ్రద్ద దృష్టంతా నేలపైన గల చచ్చిన క్రుళ్ళిన జంతుదేహంపైనే" - అన్నట్లుగా, ఈ ఇంద్రియాల దృష్టి అంతా దుష్ట దురభ్యాసాలవైపే! దుష్ట గ్రామంలోని జనుల వ్యాపకాల వలె ఈ ఇంద్రియాలు నిత్యం పాప వ్యాపకాలే కలిగి ఉంటున్నాయి.

నా ఈ 'బుద్ధి' ఉంది చూచారూ! బురద నేలలోని ఈత ముళ్ళ వలె ఇది అతి కుటిలమై మహాభయంకరంగా తయారయింది. ఆయుష్షంతా అజ్ఞానాంధకారంలో నిరంతర విషయ చింతనతో

గడచిపోతోంది. చీకటి రాత్రిలో ఒదిగి ఉన్న కళ్లులాగా వ్యర్థంగా ఆయువు గడచిపోతోంది. అంతరాంతరాలలో ఏదో తృష్ణ! ఆ తృష్ణ దేని కొరకో అర్థం కాక, ఏమి పొంది ఆ తృష్ణను వదిలించు కోవాలో నాకేమీ పాలుపోవటం లేదు. సృష్టిలో అత్యంత అవివేకమైనది ఈ తృష్ణయే. వ్యర్థమైన వాటిని ఆశ్రయించి నేను నిరర్థకంగా మిగిలిపోతున్నాను. ఈ వ్యధ, ఈ తృష్ణ, ఈ దురాశ ఎక్కడి నుండి నన్ను పట్టుకున్నాయో తెలియదు. నేను ఎటువైపు పయనిస్తున్నానో నాకే తెలియక చాలా దూరం వచ్చేశాను. ఎండిపోయిన పూతీగకు ఇక చిగురించటమేమి ఉంటుంది? ఈ ఆశలు తీరట మనే దశయే నాకు కనిపించటం లేదు.

రోజూ నిదరలేచి నిత్య నైమిత్తిక కర్మలు నిర్వర్తిస్తున్నాను. కొన్ని సాధనలకు ఉపక్రమిస్తున్నాను. మంచిది. అయితే ఏం లాభం? పెద్ద కొండంత దుష్కర్మల రాశి పేరుకొని ఉండగా నా ఈ చిన్న కార్యక్రమాలు ఏ మూలకి? చిన్న అంపంతో పెద్ద పర్వతాన్ని గీయటం ప్రారంభిస్తే ఆ మహాపర్వతం అరిగేది ఎన్నటికి చెప్పండి? పూర్వపు దుష్కర్మరాశి కరగాలంటే ఎన్ని జన్మలు ఎత్తాలి? అంతు కనబడడమే లేదు. భోగ వాసనలచే ప్రభావితుడనై నేను రోజులు గడిపేస్తున్నాను. అట్టి భోగ బీజ ప్రభావం చేత నా ఉత్తరోత్తర కర్మలన్నీ అనర్థము కొరకే నిషిద్ధమార్గంలో ప్రవర్తిస్తున్నాయి.

**జీవితం చ జనే జీర్ణం నైవోత్తీరో భవార్ణవః**
**దినానుదినముచ్ఛూనా భోగాశా భయదాయినీ ॥**

పుత్ర – కళత్ర – మిత్రాది వ్యవహారములలో పడిపోయి ఈ జీవితం రోజురోజుకూ క్రమంగా శిథిలమైపోతోంది. అనేక ఆసక్తులతో నేను ఉండగా ఆయుష్షు క్రమంగా కరిగిపోతోంది. ఇన్ని రోజులు గడచిపోయాయి. నేను సంసార సాగరాన్ని దాటనే లేదు. భోగాశ వదలనే లేదు. వదలక పోగా భయంకరమైన ఈ భోగాశ రోజు రోజుకూ అధికం అవుతోంది. ఈ పుత్ర–మిత్ర–పశు–ధనాదుల మధ్య రోజులు గడుపుచున్న నాకు ఒక రోజు "నాకేం? ఏమీ ఫరవాలేదు"... అనిపిస్తోంది. ఆ రెండవ రోజే "భారమైన బ్రతుకు ఎన్నాళ్ళురా?"... అని మరల ఇంతలోనే అనిపిస్తోంది. అనేక చింతలతో ధనము ఆర్జించి గొప్ప ఆపదలు తెచ్చి పెట్టుకుంటూ పోతున్నాను. అల్లంత దూరంలో గల చీకటిమయమైన బిలంలో విషసర్పముపై గల మణి యొక్క ప్రకాశపు ఆకర్షణలాగా ఈ సంసార విశేషాలన్నీ పైకి అందంగా, లోన విషపూరితంగా ఉంటున్నాయి. కష్టపడి ధనం కూడ బెట్టడం, దొంగలకు – చుట్టాలకు – శత్రువులకు భయపడి దుఃఖిస్తూ రోజులు గడపటం... ఇదీ నా దైనందిన తతంగం.

ఈ నా చిత్తం అనేకమైన ఆశాతరంగాలతో మలినమై ఉన్నది. ఇది ఎక్కడెక్కడికో పరుగులు తీస్తోంది. అది పొందే ప్రయోజనమూ లేదు. దాని ఆరాటం తీరేదీ కాదు. సముద్రం ఎండిపోతే... ఇంటి నుండి చెంబులతో నీళ్లు తెచ్చి సముద్రభూమిని తిరిగి నింప గలమా? అట్లాగే ఈ చిత్తమును పూడ్చడం ఎట్లాగో నాకేమీ తెలియటం లేదు. ఎవరైనా వివేకులను ఆశ్రయిద్దామా? ఇంద్రియములకు వశీభూతుడనై అటూ ఇటూ తిరిగే నన్ను వివేకులు దగ్గరకు రానీయటం లేదు.

ఈ మనస్సు అపవిత్ర స్థానములలో తిష్ఠ వేసుకొని ఉన్నది. అసత్తైనట్టి ఘనకార్యములు మహా సంరంభంతో ప్రారంభించటంలో మాత్రము ఈ మనస్సు ఎప్పుడూ సిద్ధమే. ఇక దీని చంచలత్వం ఏమని చెప్పమంటారు? పెనుగాలి వీచికలను కదలికలు ప్రదర్శించే మఱ్ఱి ఆకులు నా ఈ మనోచాంచల్యం ముందు సిగ్గుతో తలవంచవలసిందే! ఇది క్షణక్షణం చస్తూ కూడా చావదు. ఇష్టమొచ్చినట్లు కుళ్లిన పదార్థాలపై వ్రాలుచుండే ఈగకన్నా ఈ మనస్సే నికృష్టం.

నా దేహంలో 'అహంభావము' అనే ఒక గొప్ప కల్పిత యక్షుడున్నాడు. అట్టి అహంభావంతో కూడిన అజ్ఞానం క్షయించదాయె! ఈ అజ్ఞానం 'కర్మలు' అను గడ్డి పరకలను భక్షిస్తూ 'వాసనలు' అనే చీకటి నూతిలో చిక్కుకొని ఉపాధులు గడపివేస్తోంది. ఆ నూతిలో నుంచి బయటపడేది ఎన్నటికి, ఎట్లా? వివేక సూర్యుని దర్శనం అయ్యేనా? మహాత్మా! అవస్తువులైన వాటిని వస్తువులుగా నమ్మి నేను అవివేక నిబిడాంధకారంలో చిక్కుకొని దిక్కుతోచక ఉన్నాను.

**ఇంద్రియాణి నికృన్తన్తి, న జానే కిం భవిష్యతి!**
**శాస్త్రదృష్టిరపి ప్రాజ్ఞైః న ఆశ్రితా తరణాయ యా॥**

ఈ ఇంద్రియాలు నన్ను నీచ స్థితులకు దిగజారుస్తున్నాయి. ముందుముందు ఏమి కానున్నదో నాకు అవగతం కావటం లేదు. చక్కటి ఉపాయాలతో ఈ ఇంద్రియములను జయించిన ప్రాజ్ఞులను నేను శరణువేడటం లేదు. ఈ సంసారంలో కొట్టుకొంటూనే ఉన్నాను గాని ఉపాయం ఆశ్రయించటం చేతకావడం లేదు. నాకున్న కొద్దిపాటి శాస్త్ర దృష్టి నన్ను వాసనలకు మరికొంత దాసోహంగా చేయిస్తున్నాయి గాని, నన్ను ఉద్ధరించటం లేదు. నా శాస్త్ర దృష్టి నాలోని దోషదృష్టుల కారణంగా నన్ను మరికొంత గ్రుడ్డివానిగా చేస్తోంది.

విన్నారుగా మహాత్మా! నా పరిస్థితి ఇది. మీరడిగిన దానికి సమాధానంగా నా ప్రస్తుత స్థితి చెప్పుకొన్నాను. ఈ ప్రకారంగా అజ్ఞానంలో నిమగ్నుడనైన నేను శ్రేయము అయిన మోక్షము సంపాదించుకోవడానికి ఏమి చేయలో సెలవు ఇవ్వండి. తమవంటి లోక గురువులు ఇప్పుడు నాకు లభించడం ఒక గొప్ప భాగ్యం. మీ దయచేత మాత్రమే ఈ మీ శిష్యుని చిత్తములో పేరుకొని ఉన్న అజ్ఞాన మంచుకొండ కరగగలదు. సాధు పురుషులగు మీ వాక్కు, ఉపదేశము నాయందు ప్రవేశించి నా సంసార భ్రమను ఉపశమింపజేయగలందులకు నన్ను కరుణించండి.

మీ పాద పద్మములకు సాష్టాంగ దండ ప్రణామం ఆచరిస్తున్నాను.

❖

ఓ రామచంద్రా! ఇట్లా పలికి ఆ మంకి అను బహుదూరపు బాటసారి నా పాదములపై వ్రాలాడు. కనుల వెంట జాలువారిన కన్నీళ్లు నా పాదాలను స్పృశించాయి.

❖❖❖

# 3. ఏదైతే తెలుసుకొంటోందో - అదియే తెలియబడవలసినది!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ మంకి మహాశయా! నీవు చెప్పినదంతా విన్నాను. ఒక్క విషయం! నీవు ఇప్పటికి కూడా దుఃఖించవలసిన అగత్యమేమీ లేదు. ఆనందమే నీ స్వభావం గాని దుఃఖం నీ స్వభావం కానేకాదు. మరి? సరి అయిన విశ్లేషణకు ఉపక్రమించనందు చేత ఆపాదితమైన దుఃఖం వచ్చిపడింది. ఎందుచేతనో విను.

కేవలం మిథ్యాభూతాలై ఉన్న ఒక 4 విశేషాలు ఈ ప్రపంచంలో అవిద్యచే విజృంభించటం జరుగుతోంది.

**సంవేదనం భావనం చ, వాసనా కలనేతి చ**
**అనర్థాయేహ శబ్దార్థే విగతార్థో విజృంభతే ॥**

1. అనుభవం (సంవేదనం) : ఇంద్రియములచే ఏర్పడే విషయ భోగరూపమైన అనుభవం
2. భావన : విషయాలు ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా ఆయా విషయాల గూర్చి భావన
3. వాసన : చిత్తము నందలి విషయముల గురించి 'వాసన'
4. కలన : మరణకాలంలో కూడా వెంటనంటి ఉన్నటువంటి విషయాలకు సంబంధించిన స్మృతి

**మంకి:** స్వామీ! మీరు చెప్పినట్లు ఈ నాలుగు... ఈ జీవుణ్ణి జీవితపర్యంతం వెంటనంటి ఉంటున్న మాట వాస్తవమే. అయితే ఈ నాలుగింటిని 'అవిద్య' అని అంటున్నారు కదా! 'అవిద్య' అనగా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఏది మిథ్య అయి ఉండి కూడా... ఒకానొక వ్యాపక దృష్టికి అత్యంత ఘనీభూత మైన సత్యం వలె అనిపించటం జరుగుతోందో... అద్దానిని 'అవిద్య' అని పిలుస్తున్నారు.

**మంకి :** మీరు చెప్పిన అవిద్య ఎందుచేత ఏర్పడుతోంది? 'సంసారం' అనగా ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సమస్త దోషముల యొక్క ఆశ్రయమే సంసారము.

1. విషయముల అనుభవం 2. వాటియొక్క భావన... ఈ రెండే సమస్త దోషాల ఆశ్రయం. అయితే... బ్రహ్మం గురించిన చింతన చేస్తూ, విషయాలలో ఏర్పడి ఉన్న దోషాలను గమనిస్తూ గ్రహిస్తూ ఉండగా... అట్టి వివేకికి 'సంసార భ్రమ' వాసనాసహితంగా క్రమంగా స్వయంగా క్షయించి పోగలదు. చూచావా? ఈ 'సంసారం' అనబడుదానిని వాసనయే పరిపోషించి వృద్ధి చెందింపజేస్తోంది. ఈ ప్రపంచం అనునది మనుజుని వాసనా రూపమే సుమా!

**మంకి :** ఈ ప్రపంచము భౌతికమగు వస్తు సమన్వితమా? వాసనామాత్రమా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వస్తు సముదాయంగా అనిపించటానికి కారణం? వాసనయే! కాబట్టి, ఈ ప్రపంచం వాసనామయమే. అజ్ఞానావృతం అయినట్టి జీవ చైతన్యం నందు వాసనా రూపమగు సంసారం ఉదయిస్తోంది. 'శూన్యత్వం' కంటే వేరుగా ఆకాశం అనేది ఎక్కడైనా ఉన్నదా?... లేదు. అట్లాగే యథార్థానికి ఈ ప్రపంచంలో బ్రహ్మం మాత్రమే ఉన్నది. బ్రహ్మానికి భిన్నంగా మరింకేమీ లేదు. అట్టి బ్రహ్మం అద్వైత నిర్మల – చిన్మాత్ర తత్త్వమైయున్నది.

తెలుసుకునేది (చిత్, చిన్మాత్రం); తెలియబడేది (వేదనం). చిన్మాత్ర రూపమగు వేదనాత్మ అంతటా, అన్నిటా ఏర్పడి ఉన్నది. అది సదా సర్వత్రా స్ఫురించుచున్నప్పటికీ దేహ – ఇంద్రియాదుల విషయముల కంటే అన్యముగా భాసించటం లేదు. అంతే కాదు.

దృశ్య రూపముగా స్ఫురించేదంతా భ్రాంతియే. ఈ దృశ్య రూప భ్రాంతికి రెండు విశేషాలు ఉన్నాయి– 1. ఆవరణ శక్తి ప్రాధాన్యమగు అవిద్య, 2. విక్షేప శక్తి ప్రాధాన్యమగు భ్రమ.

ఈ అవిద్య – భ్రమ ...అను ఉభయ రూపములే ఈ సంసారముగా వ్యాపించి ఉన్నది.

**మంకి :** ఈ జగత్తు సత్తా? అసత్తా? ఇది ఎట్లా ఎందుచేత సిద్ధించింది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జగత్తు అసత్తు మాత్రమే. అయితే సత్తు వలె భాసిస్తోంది. ఆత్మజ్ఞానం యొక్క లేమిచే (ఆత్మ యొక్క సమాచారాన్ని ఏమరచి ఉండటం చేత) ఈ 'జగత్తు' అనబడేది సిద్ధించింది. పసిబాలుడికి, "అది దయ్యం కాదు. పగటి పూట కనబడే చెట్టు మాత్రమే"... అని తెలిసిపోగానే దయ్యమునకు సంబంధించిన భయం మొదలైనవి తొలగుతాయి చూచావా? అట్లాగే జ్ఞాన వికాసం చేత ఈ జగత్ భ్రమ క్షణకాలంలో నశించగలదు.

**మంకి :** "జ్ఞానం యొక్క వికాసం"...అనుదాని తదనంతరం ఈ దృశ్యం ఏమి కానున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అనేక ప్రదేశాలలో ప్రవహిస్తూ పోతున్న నదుల జలమంతా సముద్రం చేర గానే ఏమి అవుతోంది?

**మంకి :** సముద్రంలో జేరిన తరువాత "ఈ జలం ఈ నదిది" అనే గుర్తు కూడా ఉండదు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవునా? అట్లాగే ఆత్మజ్ఞాన ప్రకాశముచే ఈ దృశ్యం అదృశ్యం అయిపోతుంది. సర్వ దృష్టులు సమసిపోగా... ఇక బోధరూపమగు ఆత్మయే శేషిస్తోంది. అనగా సర్వ దృశ్యములు బోధమయమగు ఆత్మరూపత్వమునే పొందుచున్నాయి.

**మృన్మయం తు యధా భాణ్ణం మృచ్ఛూన్యం నోపలభ్యతే**
**చిన్మయాదితయా చేత్యం చిచ్ఛూన్యం నోపలభ్యతే॥**

ఒకాయన కుమ్మరి వృత్తి నిర్వర్తించే ఒక మిత్రుని దగ్గిరకు ఉబుసుపోకగా వెళ్లి ఇట్లా అడిగాడు.

**ఆ వచ్చిన పెద్ద మనిషి:** మిత్రమా! ఉదయం ఈ అరుగు మీద కొంత మట్టి ఉండాలి కదా? ఏమైంది?

**కుమ్మరి :** ఇదిగో ఈ కుండ.

**పెద్ద మనిషి :** ఓహో! ఈ కుండ తెచ్చి ఇందులో మట్టిని ఉంచావా? (ఆ కుండలోకి తొంగి చూచి), అరె కుండలో ఆ మట్టి లేదే?

**కుమ్మరి :** కుండలో కాదయ్యా! ఈ కుండ ఆ మట్టే.

**పెద్దమనిషి :** నేను మట్టిని అడుగుతుంటే నీవు ఖాళీ కుండను చూపిస్తావేం?

**కుమ్మరి :** ఎందుకంటే ఆ మట్టే ఈ కుండగా తయారుచేశాను కనుక!

ఆ కుమ్మరి చెప్పుచున్నట్లు మట్టియే మట్టికుండగా అయింది. కుండంతా మట్టి తప్పితే ఇంకేమీ లేదు. అట్లాగే చిన్మయం యొక్క భావాభావాలే ఈ జగత్తు యొక్క ఉనికిలేములు. కనుక, ఈ జగద్రూపదృశ్య విషయమంతా సచ్చిన్మాత్రమగుపరమాత్మ తప్పితే మరింకేమీ అన్యంగా లేదు.

**మంకి :** అట్లాగా మహర్షీ! ఈ జగత్తే జీవునకు బంధము అని నా కనిపిస్తుంటే, మీరేమో 'ఈ జగత్తే పరమాత్మ'... అని ప్రతిపాదిస్తున్నారే! ఆశ్చర్యం! సరే, "ఈ జగత్తు పరమాత్మమయం" అనేది ఎట్లాగో విశదీకరించమని నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచం దేని చేత ఎరుగబడుతోంది? జ్ఞానంచే కదా! జ్ఞానం చేత తెలియ బడేది 'జ్ఞేయం' కదా! "జ్ఞానం చేత ఏది తెలియబడుతోందో అది జ్ఞానరూపం" అని గమనించు.

జ్ఞానము లేకపోతే జ్ఞేయమే (తెలియబడేది) ఉండేది కాదు (లేక) తెలివి అనేది మొట్టమొదటే ఉండి ఉండకపోతే, ఇక 'తెలియబడేది' అనుదానికి ఉనికియే ఏర్పడదు కదా! కనుక,

**బోధావ బుద్ధం యదృస్తు బోధ ఏవ తదుచ్యతే ।**
**నా బోధం బుధ్యతే బోధో వైరూప్యాత్తేన నాఽన్యతా ॥**

తెలుసుకొనుచున్న దాని 'తెలివి' ని అనుసరించే తెలియబడేది ఉంటోంది. తెలుసుకొనేది లేకపోతే 'తెలియబడేది' అనే దానికి ఉనికియే ఉండేది కాదు. కనుక, తెలుసుకొనేది తెలియబడే దానిలో తెలివి రూపంగా ఏర్పడి, ఆ తదనంతరం మాత్రమే 'అనుభవం' అనే సారరూపం ధరిస్తోంది.

కాబట్టి 'జ్ఞాన జ్ఞేయములు ఒక్కటే' అనే సిద్ధాంతం ఒనగూడుతోంది కదా! 'బ్రహ్మం' అనే రూపం గల ద్రష్ట యొక్క స్వయం పరికల్పిత దర్శన 'చమత్కారమే ఈ దృశ్య జగత్తు' అని వేదాంత శాస్త్ర నిర్ణయం.

ద్రష్ట – దర్శనం – దృశ్యం అనే మూడిటిలో, జాగ్రత్తగా పరిశీలించి చూస్తే 'జ్ఞానమే సారం' అని తెలిసిపోతోంది. జ్ఞానానికి భిన్నంగా ఏదైనా ఉన్నదని భావిస్తే ...అది 'ఆకాశ పుష్పం' అనే శబ్దంలాగా అర్థరహితం. ఆకాశం అంటేనే శూన్యం. శూన్యంలో పుష్పం ఉండటమేమిటి? 'శూన్యంలో జగత్తు' అనేది కూడా మొదలే అర్థరహితం.

**మంకి :** "చూచేవాడు చైతన్యం. ఈ చూడబడే జగత్తు జడం" అని ఎందుకు అనగూడదు? ఎందుకంటారా? ఈ జగత్తు చూచేవానిని అనుసరించే ఉన్నదని నేనూ ఒప్పుకుంటున్నాను. కాని జగత్తే లేకపోతే "చూడబడేది" అనే వ్యవహారమే ఉండేది కాదు కదా! కాబట్టి చూచేది – చూడబడేది వేరు వేరేనని ఎందుకు అనుకోకూడదు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** భలే ప్రశ్న వేశావయ్యా! నీ ప్రశ్నకు సమాధానం విను. తెలుసుకొనేది– తెలియబడేది... ఈ రెండూ సజాతీయమా? విజాతీయమా? అనగా చైతన్యం, జడం అనేవి ఒకదానికి మరొకటి సంబంధించినవా? కావా?

**మంకి :** వేరు వేరైనవే కదా! అనుభవజ్ఞుడు వేరు – అనుభవము వేరు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** వేరు వేరైనవైతే ఆ రెండూ ఎందుకు కలుస్తాయి? ద్రవం ద్రవాదులతోనే కలుస్తుంది కాని మట్టితోనో, రాయితోనే కలిసిపోదు కదా! తెలుసుకునే చైతన్యం – తెలియబడే జగత్తులకు పరస్పర సంబంధం లేకపోతే అవి రెండు ఒకచోటికి వచ్చి ఎట్లా ఏకరూపం (అనుభవ రూపం)గా పరిణమిస్తున్నాయి?

**మంకి :** మీరు చెప్పినట్లు తెలియబడే జగత్తుకు, తెలుసుకునే 'చైతన్యం'నకు ఒకదానితో మరొకదానికి సంబంధం ఉండబట్టే కలుస్తున్నాయి. ఒకటి రెండవదానికి సంబంధించినదే కాకపోతే అవి ఒక దానితో మరొకటి కలియవు. ఆ రెండింటిలో అనుభవ రూపమైన ఏకత్వము అంతర్లీనమై ఉంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ రెండిటిలోను గల ఏకత్వమేదైతే ఉన్నదో ఆ ఏకత్వమునో "బోధ స్వరూపరసం" అని పిలుస్తున్నారు. చెక్క–రాయి మొదలైన వాటిలో సద్రూపమగు బోధరూపత్వం (బోధ స్వరూపం, బోధతత్త్వం) ఉండకపోతే కుందేటికి కొమ్ము లేనట్లుగా... 1. చెక్కగా–రాయిగా అనుభవించేవాడు. 2. చెక్క–రాయిగా అనుభవించబడేది అను రెండిటి మధ్య 'అనుభవము' అనేది ఏర్పడేదే కాదు.

ఈ విధంగా బోధ (లేక జ్ఞానము)చే ఈ దృశ్యమంతా కేవల బోధరూపమే అగుచున్నది.

**మంకి :** ఈ దృశ్యంలో రెండు వస్తువులు ఒకదానికి మరొకటి వేరువేరైనట్లు (అన్య–అన్యంగా) కనిపిస్తున్నాయి కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అన్యంగా భాసించినప్పటికీ, ఆ రెండింటిలో బోధ (లేక జ్ఞానం) అనునది ఒకే రీతిగా ప్రవేశించి 'అనుభవం' అను ప్రదర్శనం నీవు గమనించు. "ఇది చెట్టు–అది పుట్ట" అని తెలుసుకుంటున్న తెలివి ఒక్కటే కదా! చెవితో వింటున్నట్టి–కళ్ళతో చూస్తున్నట్టి తెలివి ఒక్కటే కదా!

ఈ సిద్ధాంతం (లేక) సూత్రం నిరూపించటానికి ఇక్కడి 'జల–తరంగాలు' అనే దృష్టాంతం తీసుకుందాం. నీవు సముద్రం ఒడ్డున కూర్చున్నావు. ఇప్పుడు ఎడంచేతి వైపు కుడిచేతి వైపు అనేక తరంగాలు కనిపిస్తున్నాయి. ఆయా తరంగాలన్నీ వేరువేరా?

**మంకి :** అవును, వేరు వేరే.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అయితే ఎడంచేతి వైపు తరంగాలు ఎట్లా ఏర్పడుతున్నాయి?... జలం యొక్క స్పందన చేత. మరి... కుడివైపు తరంగాలు? అదే జలం యొక్క స్పందన చేతనే కదా! స్పందన (కదలిక) వేరైనా అన్ని తరంగాలు సముద్ర జలమే కదా!

అట్లాగే వ్యాప్తమగు జగద్రూపదృశ్య మంతా బోధరూపమే అయి ఉన్నది. అనగా, వేరువేరుగా తెలియబడే విశేషాలన్నీ ఒకే 'తెలివి' యొక్క ప్రదర్శనలే అయి ఉన్నాయి. అయితే ఇక్కడ మరో చమత్కారం. "తెలివి" (బోధ, లేక జ్ఞానం) 'తెలియబడేది' గా (లేక బోధిత్వంగా, లేక జ్ఞేయంగా) మారిపోతోందా? లేదు.

తెలివి (జ్ఞానం) తెలివిగానే ఉంటూనే 'తెలియబడేది' అనే దర్శనమును మాత్రం నిర్వర్తిస్తోంది. ఒక కొయ్యముక్కపై లక్కను వేడిచేసి పోశామనుకో, అవి రెండూ కలసి ఉంటున్నా... వేరువేరుగానే

ఉండి ఉంటాయి కదా! కానీ 'బోధ' యందు తెలియబడే "ఆయా వేరువేరు విషయాలు" అనేది లేదు. కనుక "సమస్తము ఏకమే! అనేకం కాదు!" అనునది ఇక్కడ సిద్ధించుచున్నది.

కానీ, కొయ్య-లక్క అనే రెండిటికి 'సంయోగం' అనుదానిచే ఏకత్వం ఉండవచ్చు గాక! ద్రష్ట - దృశ్యాల సంబంధం అట్టిది కూడా కాదు. ద్రష్ట ద్రష్టగానే ఉంటున్నాడు. కానీ దృశ్యాన్ని పొందు చున్నాడు. దృశ్యం ద్రష్ట యొక్క కల్పనను అనుసరించి ఉంటోంది. ద్రష్ట యొక్క బోధ స్వరూపమే దృశ్యంలో ప్రవేశించి ఉన్నది. ద్రష్ట లేకపోతే దృశ్యమే లేదు. కనుక ద్రష్ట-దృశ్యం ఒక్కటే.

అట్టి అన్యోన్య-అనన్యత్వానుభవమే నిజమైన ఏకత్వము.

కాబట్టి ఓ ప్రియ బాటసారీ! మంకీ! ఇక్కడంతా ఏకత్వమే తాండవిస్తోంది గాని, అనేకత్వము లేనేలేదు. ఒకవేళ ఇంకా అనేకత్వము అనుభవమవుతుంటే ... అందుకు కారణం ఈ దేహాదుల పట్ల సుదీర్ఘ కాలంగా ఏర్పరచుకొని ఉన్న అహంభావన చేత మాత్రమే సుమా! "ఈ దృశ్యమంతా ఏదై ఉన్నదో, అదంతా నేనే" అనునదే 'సోఽహమ్' భవం (లేక) అద్వైతానుభవం.

ఇక్కడ ఒక రహస్యం (లేక) చమత్కారం.

**"అహమ్॥ ఇత్యేవ బంధాయ, "నాఽహమ్" ఇత్యేవ ముక్తయే**
**ఏతావన్మాత్రకే బంధే స్వాయత్తే కిమ్ అశక్తతా?**

ఈ దేహాదులందు ఏర్పరుచుకొన్న అహంభావనయే ఏకత్వానుభవమునకు ప్రతిబంధకంగా వచ్చి కూర్చుంటోంది. "ఈ దేహాదులు నేను కాదు" అను నాఽహంభావనను ఆశ్రయించావా, అప్పుడు నిన్ను పట్టి పీడిస్తున్న ద్వైతం నుండి నీకు ముక్తి కలుగుతుంది. "నేను శరీరాదులు కాదు. ఈ శరీరంలో గల ఇంద్రియాలకు విషయమగుచున్న జగద్విషయాలు నేను కాదు, నాది కాదు"... అని అనుకుంటూ ఉన్నంత మాత్రం చేత ఇక్కడ అనుభవమగుచున్న బంధం తనంతట తానే స్వయంగా తొలగిపోగలదు. ఈ మాత్రం ప్రయత్నం చేయటానికి ఏం కష్టం? ఇది కుదరదని అనుకో దలిస్తే అట్టి జీవుని ఈ సంసారం నుండి ఎవరూ కాపాడలేరు.

ఒకాయనకు మెల్లకన్ను దోషంచేత రెండవ చంద్రుడు కనిపిస్తున్నాడనుకో... "ఆ రెండవ చంద్రుడు ఎప్పటి నుండి ఎవరిచే సృష్టించబడి కనిపిస్తున్నాడు?" - అనే ప్రశ్నకు సమాధానమే మున్నది? అసలు ఆ రెండవ చంద్రుడు ఉంటే కదా, ఒకప్పటి నుండి ఉండటం? "మృగతృష్ణలో జలం ఎంత కాలం నుండి ఉన్నది?" అన్న ప్రశ్నకు సమాధానం ఏముంటుంది? మృగతృష్ణలో జలం భ్రమ మాత్రమే కదా! అలాగే 'అహంభావం' అనేది అసత్తుగా ఆవిర్భవించినదని, అసత్తు కాబట్టి ఆవిర్భవించనే లేదని కూడా అంటూ ఉంటారు. అట్టి దేహాహంకారమునకు అనుభవమయ్యే ఈ దృశ్య జగత్తు, అట్టి దృశ్య జగత్ సంబంధమైన అహంకారం కూడా అసత్తుల్యం మాత్రమే.

**"మమేఽదమ్" ఇతి బంధాయ "నాహమ్" ఇత్యేవ ముక్తయే**
**ఏతావత్ మాత్రకే వస్తుః ఆత్మాయత్తే కిమజ్ఞ తా?**

ఇదమ్ మమ (ఇది నాది)...అను మమత్వ బుద్ధి – ఇదే బంధానికి కారణం. నాఽహమితి (ఇవి నావి కావు) – అను మమత్వరాహిత్యమే బంధముక్తి.

1.ఇవి నావి అని తలచటం, 2. ఇవేవీ నావి కావు అని తలచటం... ఈ రెండూ ఎవరికి వారికే తమ చేతిలోనే ఉన్నది కదా! కనుక బంధము–బంధ విముక్తి ఎవరికి వారికే వారి చేతిలోనే ఉన్నది. 'నావి కావు' అనుబంధ విముక్తి ప్రయత్నంలో 'అయ్యో! నేను అజ్ఞానిని కదా'... అని వాపోవలసిన అగత్యమేమిటి? ఇందులో 'తెలియకపోవటం' అనే ప్రసక్తి ఎక్కడిది?

**మంకి :** ఇవేవీ నావి కావు – అని అనుకోగానే మోక్షం సిద్ధిస్తుందని మీరు ప్రవచిస్తున్నారు. కానీ అది అంత సులభమంటారా? ఈ సందర్భంగా లోక ప్రతీతమైన కొన్ని సిద్ధాంతాలు ఇక్కడ ఉదహరించి, వాటి పట్ల అనుభవం దృష్ట్యా మీ అభిప్రాయాలు చెప్ప వేడుకొంటున్నాను.

**1. కుండ-బదర న్యాయం :** ఒక రేగు పండు కుండలో ఉన్నది. ఆ రేగు పండు కుండచే కప్పబడి ఉండటం చేత మామూలుగా కనిపించటం లేదు. కుండలోకి చూడకుండా "రేగుపండు కనిపించడం లేదు కాబట్టి లేదు. కుండ కనిపిస్తోంది కాబట్టి ఉన్నది" అనేది యుక్తియుక్తం కాదు.

అట్లాగే సత్యమగు ఆత్మ అసత్యమగు అహంకారం నందు ప్రవేశించి ఉన్నది. అహంకారం చేత కప్పబడి ఉండటంచే ఆత్మ కనిపించడం లేదు. అహంకారం యొక్క అంతరంలోకి తొంగిచూస్తే ఆత్మ అగుపిస్తుంది.

**2. ఘటాకాశన్యాయం :** ఆకాశం అంతటా ఉన్నది. ఒక కుండలోను, బయట కూడా ఉన్నది. కుండ ఉన్నంత కాలం కుండ వల్ల – ఘటాంతరాకాశం, ఘట బాహ్యాకాశం – ఏర్పడుచున్నాయి. ఘటం పగిలితే ఉభయాకాశాలు ఏకమౌతాయి. అట్లాగే అహంకారం ఆత్మను జీవాత్మగా, పరిణమింపజేసింది. అహంకారం తొలగితే (కుండ పగిలితే ఉభయాకాశాలు ఏకమగునట్లు) జీవాత్మ – పరమాత్మ ఏకమౌతాయి. అప్పటిదాకా జీవుడు జీవుడుగానే ఉంటాడు.

**3. జడాంశ-బోధాంశ సమాగమం :** 1.జడము, 2.బోధ. ఈ రెండు ఎక్కడ కలుస్తాయో అక్కడ 'ఆత్మ' అనే నూతన విషయం ఏర్పడుచున్నది. అవి విడిపోతే ఆత్మ అనేది ఉండదు. ఆత్మ జడాంశంలో జడంగా, బోధాంశంలో బోధ రూపంగా ఉండి ఆ రెండూ కలసినప్పుడు స్ఫురిస్తోంది. కలియనప్పుడు నిర్విషయమై ఉంటోంది. (ఇది జైమిని మతానుయాయుల సిద్ధాంతం)

**4. అనేకాత్మవాదం :** ప్రతి జీవికి ఒక ఆత్మ ఉన్నది. ప్రతిజీవి ఒక్కొక్క ప్రత్యేక ఆత్మయే. ఇందులో జంతు ఆత్మలు, మానవ ఆత్మలు, దేవతా ఆత్మలు వేరు వేరుగా ఉన్నాయి. వీటన్నిటికీ పరమాత్మ సర్వాధికారి. జీవాత్మ వాసనలచే కప్పబడి ఉంటుంది. పరమాత్మ నిర్మలమై, వాసనారహితమై ఉంటుంది.

ఈ నాలుగే కాక, ఇంకా అనేక సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి. వీటివీటిపై మీ ప్రవచనమేమిటో, ఇందులోని సత్యాసత్యాలు ఏమిటో వాటిని ఆశ్రయించటంచే ఆ తదనంతరం పర్యవసానమేమిటో విశదీకరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆత్మ అపరిమితమైనది. ఈ జీవుడు దేహ–మనో–బుద్ధి స్వరూపుడు కాదు. దేహ–మనో–బుద్ధులు పరిమితమైనవి. కనుక, 'కుండలో రేగుపండు'... అనే 'కుండ బదర న్యాయం' యుక్తియుక్తం కాదు. అపరిమితమైన ఆత్మ పరిమితమగు దేహంలో దాగుకొని ఉండటమేమిటి? అది అసమంజసం.

ఆత్మ అపరిచ్ఛేద్యమైనది. అది దేహాదులచే పరిచ్ఛేదం పొందటమేమిటి? కుండలో ఆకాశం – బయటగల ఆకాశం... అనే ఘటాకాశ న్యాయం అనేది కూడా ఆత్మకు వర్తించజాలదు. ఆత్మకు 'ఈ దేహం–ఆ దేహం' అనే పరిభేదం, విభాగాలు ఉండవు. ఆత్మ సర్వదా అఖండము. (అది నిరూపిస్తోంది కనుకనే ఈ గ్రంథానికి 'అఖండ రామాయణం' అనే పేరు వచ్చింది). అది సర్వదా దేహ–మనో–బుద్ధ్యాదులకు అప్రమేయం. (వాటితో దేహానికి ప్రమేయం లేదు). కనుక 'ఘటాకాశ న్యాయం' అనేది కూడా ఆత్మకు యుక్తియుక్తం కాదు.

ఆత్మకు వేరుగా జడాదులకు ఉనికియే లేదు. 'జడము' అనే అనుభవం ఎవరికి? 'జడము' అనేది ఆత్మయొక్క అనంత అనుభవ పరంపరలలో ఒకానొకటేగాని జడమునకు (తెలియబడుదానికి) వేరుగా ఉనికి లేదు. ఆత్మ అనుభవించేది. జడము అనుభవించబడేది. అయితే, ఆత్మకు మాత్రమే ఉనికి ఉన్నది. ఆత్మ ఎక్కడ తన సత్‌విన్యాసం ప్రకటిస్తే అక్కడ మాత్రమే జడానుభవం అనేది భావాభావాలను అనుసరించి ఉండగలదు. కనుక "జడ–బోధల కలయికచే 'ఆత్మ' అనేది అనుభవమౌతోంది"... అనేది యుక్తి వాక్యం కాజాలదు.

'ఆత్మ ఉండటంచేత 'జడము' అనే ఒకానొక అనుభవంగా ఉండగలుగుతోంది'... అనునదే అసలైన సిద్ధాంతం. వాస్తవానికి 'జడము–అజడము'... అనే రెండు లేవు. ఉన్నట్లు కనబడటమంతా స్వప్న సదృశ్యమే. "ఆత్మ యొక్క ఒకానొక స్వభావమే జడము"... అనేది కూడా కుదరనది కాదు. "ఆత్మయొక్క దృష్టికి ముందే 'దృక్' స్వరూపమగు ఆత్మ ఉన్నది. 'స్వప్నద్రష్ట' లేదుగాని... స్వప్నం ఉన్నది".... అనే మాటకు అర్థం లేదు కదా! అట్లాగే ద్రష్ట లేకపోతే జడము లేదు, అజడము లేదు, జగత్తు లేదు.

'అనేక ఆత్మలు' అనేది దేహము దృష్ట్యా, మనస్సు దృష్ట్యా, బుద్ధి దృష్ట్యా అనిపించవచ్చు గాక! కానీ, ఆత్మ దేహ–మనోబుద్ధులకు మునుముందుగాని ఉన్నది.

❖

కనుక ఓ ద్విజుడా! నీవు అఖండం, అప్రమేయం, నిత్యం, సత్యం, దృశ్యరహితం, సర్వం అగు ఆత్మవే అయి ఉన్నావు. అట్టి నీ యొక్క సత్ చిత్ స్వరూపమునకు మనోబుధ్యహంకారాది ఏ జాడ్యమూ లేదు. 'కాదు. అనేక ఆత్మలు ఉన్నాయి. అందులో నేనొక ఆత్మను'... అనే రూపం గల అనేకాత్మవాదాన్ని ఆశ్రయించి ఉన్నావా.. స్వవాసనల చేత, దేహాభిమానం చేత ఆత్మతత్త్వమును ఏమరచి పర్వతం మీద నుండి క్రిందపడే శిలవలె ఉచ్ఛ–నీచ ఉపాధి పరంపరల ప్రవాహంలోకి జారిపడతావు సుమా! "వాసనలచే ఇటూ అటూ కదలే మనస్సే తన స్వభావంగా భావించే జీవుడు పొందే దుఃఖ పరంపరలను లెక్కించనలవి కాదు"... అని నా హెచ్చరిక.

తమ తమ వాసనలచే, దేహ అభిమానం చేత రాగాది ఆయా రసములందు అనురక్తులగు జనుల చేతితో కొట్టబడిన బంతి వలె అనేక జన్మలందు పరిభ్రమిస్తున్నారు. చిరకాల క్లేశాలచే ఎంతగానో శైథిల్యం అనుభవిస్తున్నారు. కాలాంతరమున స్థావర – క్రిమి – కీటకాది అన్య రూపత్వమును అవధరిస్తున్నారు.

ఓ బాటసారి! మంకీ! నీవు ఆత్మస్వరూపుడవేగాని, దేహ స్వరూపుడవు కాదు. ఇందులో నీవు సందేహించవలసినదేమీ లేదు. ఇక దుఃఖమెందుకో చెప్పు?

❖❖❖

# 4. బ్రహ్మమయమ్ జగత్

**మంకి :** అయితే, మునీంద్రా! మరి ఆత్మయే నా స్వరూపము అయి ఉండగా నాకు 'అసంతృప్తి'... అనే స్థితి, 'జడదేహధారిని' అనే భ్రమ ఎందుచేత, ఏ ప్రభావం చేత కలుగుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రతి జీవునికి ఎదురుగా రెండు మార్గాలు ఉన్నాయి. ఏ మార్గము ఉచితమో, ఏది అనుచితమో అతడే తేల్చుకోవాలి. అయితే, ఆ రెండు మార్గాలు ఏమిటో ఇక్కడి విశదపరుస్తాను.

1. ఆత్మతత్త్వ మార్గం , 2. సంసార మార్గం.

**సంసార మార్గం :** నేను వేరు – నీవు వేరు – తదితర జీవులు వేరు. నేను ఒక మానవుణ్ణి, అది ఒక కీటకం, ఈయన ఒక బ్రహ్మదేవుడు... ఈ సంసార మార్గంలో పయనించే జీవుడు స్థావర–క్రిమి–కీటకాది జన్మరూపమగు పరిస్థితులకు లోను అగుచున్నాడు. ఛేదన–భేదనాలు, ఆకలి–దప్పులు, జనన–మరణాలు ఆతనిని ఆయా దేహాదులతోబాటే వెంబడిస్తున్నాయి. 'అడవిలో ఉండే అనేక శిలలులాగా ఈ సమస్తం పరస్పరం వేరు వేరు' అను అనుభవం ఎక్కడి నుండి బయల్వెడలుతోంది? ఈ జీవుని భావనలో నుండే! భావన చిత్తం లోంచి బయల్వెడలుతోంది. చిత్తం అంధత్వంతో కూడి, పూర్వవృత్తాంత వాసనలతో నిండినదై, రాగ ద్వేషములనే రంగులు పులుముకున్నదై ప్రవర్తిస్తోంది. చిత్తమే భావనకు మూలం.

**అహో!బత! విచిత్రాణి! వాసనావశతో అవశైః ।**
**భూతకైరనుభూయన్తే, సుఖదుఃఖాని జన్మసు ॥**

ఆహా! ఏమి ఆశ్చర్యం! ఆత్మయే తమ స్వరూపమై ఉండి కూడా ఈ జీవులు తమ వాసనలకు వశులై వివిధ జన్మలు, ఆ జన్మలలో అనేక చిత్ర–విచిత్ర సుఖ–దుఃఖాలు అనుభవిస్తూ ఉన్నారే! దేని యొక్క ప్రభావం చేత మిథ్యాభూతాలైన త్రిపుటి రూప పదార్థములను (ద్రష్ట–దర్శనం–దృశ్యం, వినేవాడు–వినికిడి–వినబడేది మొదలైనవి)... ఈ జీవుడు అనుభవిస్తున్నాడో ...అట్టి వాసన ఎంత భయంకరమైనది!

ఈ ప్రపంచంలో జ్ఞానులు ఉన్నారు. అజ్ఞానులు ఉన్నారు. ఆ ఉభయులు కలసియే కాలం గడుపుచున్నారు. అయితే వాళ్లిద్దరి మధ్య అంతరం అంతఃకరణ సంబంధమైనది.

**1. జ్ఞాని -** ఈతడు ఆత్మానందముచే ప్రసన్నుడై ఉంటున్నాడు. నిరంతరం ఆత్మామృతమైన తృప్తిని అనుభవిస్తున్నాడు. తాను శుద్ధుడై, అంతటా తన యొక్క జ్ఞాన ప్రకాశముచే ప్రసరిస్తూ, ప్రకాశ ప్రదుడై ఉంటున్నాడు. సమస్త పదార్థముల పట్ల శీతలాంతఃకరణుడై మెలగుచున్నాడు. ఈతనిని పూర్ణచంద్రుని ప్రశాంతప్రకాశంతో పోల్చవచ్చు. ఆతడు – ఈ కనబడే సర్వజీవులను లోకాలను తన స్వరూపంగా గాంచుచున్నాడు.

**2. అజ్ఞాని -** ఈతడు తన సమక్షంలో తారసపడుచున్న ఆయా జగద్విషయాల పట్ల పూర్వాపర విచారణ చేయడం లేదు. సత్–అసత్ వివేకాన్ని వదలి ఉండటం చేత అనుచితమైన విషయాలను అసంఖ్యాకంగా, అవిశ్రాంతంగా కోరుకుంటున్నాడు. (ఉపనిషత్తు, బ్రహ్మసూత్రాలు, యోగ వాసిష్ఠం మొదలైన) శాస్త్రములు అందజేస్తున్న ఆతని స్వస్వరూపమునకు సంబంధించిన సమాచారం ఆతడు పట్టించుకోవడం లేదు. ఒకవేళ అక్కడా–ఇక్కడా కొంత విన్నప్పటికి "నేను ఈ కనబడే సర్వ పదార్థములకు, సర్వ సంఘటనలకు అసంబంధితమై, అప్రమేయమై, నిత్య నిర్మలమై... సర్వదా ప్రకాశించే ఆత్మనే" అనే అనుభవంలో ప్రవేశించక, ఎక్కడికెక్కడో తారట్లాడుచున్నాడు. పసిబాలుడు 'నాయనా! అట్లా దూకకురా! పడతావు. ఇది తినకురా! తెల్లవార్లు అరగక మూలుగుతావు'... అని చెప్పుచున్నా కూడా "అంతే! నేను దూకుతాను. నేను తింటాను"... అని మారాం చేస్తాడు చూచావా! అట్లాగే అజ్ఞాని చెప్పినా వినక, స్వస్వరూపాన్ని వివేక దృష్టితో అవగాహన చేసుకోక... మూర్ఖత్వం వహించి ఉంటున్నాడు.

అట్టి మూర్ఖత్వమే అన్ని దుఃఖాలకు మూల కారణం. "ఇది ఇష్టం, అది అయిష్టం. ఇది శుభము, అది అశుభం"... అనే సాంసారిక విశేష పరంపరలచే ఆకర్షించబడి ప్రాణాలు పోయే వరకు అవివేక మనస్కుడుగానే అజ్ఞాని ఉంటున్నాడు. అంతేగాని, శాస్త్రాలు అందించే ఉత్తమ పాఠ్యాంశాన్ని అంతర్గతం చేసుకోవటం లేదు. అట్టి అవివేకికి 'ఎఱ'ను చూచి గాలము వైపు పరుగులు తీసే చేపకు తేడా ఏమున్నది?

ఓ ప్రియ జనులారా! మీరు ప్రియం కదా! అని భావించే దేహ–స్త్రీ–పుత్ర–ధనాది సమస్త పదార్థములు కూడా ఎండిన ఇసుకతో తయారుచేయబడిన మూకుడు వలె అతి త్వరలో విచ్ఛిన్నం కానున్నాయి. ఏ ఇంద్రియాలతో విషయాలు పొందుచున్నారో, ఆ ఇంద్రియాలే కాలగతికి నశించటం (తదితర జీవుల పట్ల) మీరు గమనిస్తున్నదే కదా! ఇంద్రియాలు ఎంతగా నమ్మతగినవో, విషయాలు అంతే నమ్మతగినవి సుమా!

**మంకి :** 'అనేక జన్మ పరంపరలు' అనే సాంసారిక మార్గంలో ప్రవేశించిన మాకు గతి ఏమిటి? నిర్గతియేనా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**ఆ బ్రహ్మస్తమ్బ పర్యంతమపి యోని శతేషు తే ।**
**ఆకల్పం భ్రమతః చిత్తశాంతిః నాస్తి శమాదృతే ॥**

పురుగు నుండి బ్రహ్మ వరకు గల అనేక వందల యోనులలో అవిశ్రాంతంగా ప్రవేశ–నిష్క్రమణలు నిర్వర్తిస్తూ పరిభ్రమించే ఈ జీవ బాటసారికి ఇంద్రియ విషయములపట్ల ధ్యాస కలిగి ఉన్నంత వరకు చిత్తశాంతి కలుగుట లేదు. చిత్తశాంతి కలగాలంటే ఇంద్రియములకు సంబంధించిన అభినివేశము శమింపజేసుకోవాలి. మఱింక దేనిచేతాకూడా చిత్తశాంతి కలుగదు. కాలి క్రింద చూచుకుని నడిచే వానికి బాటలోని ఎత్తు–పల్లాలు బాధించవు కదా! 'వివేకము' ఆశ్రయించి ఉండేవానికి బంధము యొక్క లేశము కూడా ఉండజాలదు. కనుక వివేకముచే శమమును ఆశ్రయించి ఉండాలి సుమా!

ఓ మంకీ! ఈ సాంసారిక వ్యవహారము పట్ల సావధానుడవై ఉంటే చాలు. (వివేక రహితంగా) అసావధానమైన చిత్తమును మాత్రమే 'కామము' అనే సాంసారిక పిశాచి మ్రింగగలుగుతోంది.

**మంకి :** 'సావధానుడనై ఉండటం'... అనగా మీ ఉద్దేశం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మనస్సు స్వస్వరూప విభాగమును ఏమరచి 'ఇచ్ఛ' అను మార్గముతో ప్రవేశించి ఈ కళ్లు మొదలైన ఇంద్రియముల ద్వారా ఇంద్రియవిషయముల వైపు ప్రసరణమై ఉంటోంది.

ఆత్మ⟶ మనస్సు⟶ ఇచ్ఛ⟶ కళ్లు మొదలైన ఇంద్రియాలు⟶ ఇంద్రియ విషయాలు (జగత్తు)

మనస్సు నందలి "రూపాదులను చూడాలి" అనే ఇచ్ఛ నేత్రాది ఇంద్రియాలలో ప్రవేశించి ఆయా విషయాల వైపు ప్రసరించి ఈ జగత్తును పొందుతోంది. ఆత్మను ఏమరచినప్పటి వివేక రాహిత్యమే అసావధానత్వం. అట్టి అసాధానపూర్వకమైన మనో విభాగం స్ఫురణమాత్రం చేత అహంకార సహితమగు ఈ సువిస్తార జగత్తుగా స్థితి పొంది ఉన్నది. కళ్లు తెఱచినప్పుడు రకరకాలైన ఆకారాదులుగా కనిపించే ఈ జగదృశ్య విశేషాలు కళ్లు మూయగానే కనిపించకుండాపోతాయి చూచావా? బహిర్ముఖమైన సంవిత్తు (జ్ఞానం) అంతర్ముఖమై ఆత్మయందు సంలగ్నం అయిన మరుక్షణం ఈ సమస్త దృశ్యం స్వయంగా క్షయించగలదు. ఒకే వాయువు తన యొక్క చలనాన్ని తానే విస్తరింపజేయునట్లు శుద్ధ చైతన్యం కొంచెం స్ఫురణమాత్రం చేత తనయందు తానే అసత్తే అయినట్టి అహంకార సహితమగు ఈ సమస్త జగత్తుగా విస్తరిస్తోంది. దృష్టాంతానికి–

**1. వాయువు -** ఒకానొక తరంగంగా 'అసత్తు'. తనయందు తానే అనేక తరంగాలుగా ప్రదర్శించే వాయువు 'సత్తు'.

**2. జలం -** తనయందు తానే అనేక తరంగాలుగా విస్తరిస్తోంది. ఒక్కొక్క తరంగంగా 'అసత్తు' ప్రతి తరంగం జలమే. కనుక అన్ని తరంగాలలోను ఉన్న జలంగా ప్రతితరంగం సత్తే! జలంలో అనేక తరంగాలు ఉన్నాయి కాని ఆ తరంగాలలో అనేక జలాలు లేవు. ఎందుకంటే ఈ తరంగ జలం – ఆ తరంగ జలం వేఱువేఱు కాదు. తరంగాలన్నిటిలో గల జలం చూస్తుంటే అది 'అంతర్ముఖం', జలంలో గల అనేక తరంగాలను చూస్తుంటే అది 'బహిర్ముఖం'.

అట్లాగే... చిదాకాశం ఈ అనేక జీవాహంకారాలుగా తన యందు తానే (తాను తానుగా ఉంటూనే) ప్రదర్శిస్తోంది. ప్రతి జీవాహంకారం తనదైన శైలిలో జగద్దర్శనం చేస్తోంది.

ఒక్కొక్క జీవునిగా (అహంకార సహిత జగత్ దర్శనానుభవంతో సహా) అసత్తు! చిదాకాశము తన యందు తానే ఈ అహంకార సహిత జగత్తు యొక్క దర్శనం చేస్తోంది. కనుక చిదాకాశంగా ప్రతి జీవుడు సత్తే.

ఈ ప్రత్యేక జీవరూపంలో చిదాకాశం తన యందు తానే అవిద్యావృత జగత్తుగా విస్తరింప జేస్తోంది. ఈ జగత్తు అనేకత్వం దృష్ట్యా అసత్తు. చిదాకాశమే ఇద్దాని 1. విస్తారణ, 2. కారణ కారణం. కనుక... ఇది చిదాకాశంగా సత్తు. యథార్థానికి బ్రహ్మసంవిత్తు తన నుండి తనకు వేఱుగా ఏదీ రచించడం లేదు. జలం తన నుండి వేరుగా 'తరంగం' అనేదేదీ రచించటం లేదు కదా! అసత్యమే అయి ఉండి కూడా ఈ జగత్తు 'సత్యం వలె' (చిదాకాశం కంటే వేరుగా ఉన్నట్లు) విజృంభిస్తోంది.

**మంకి :** స్వామీ! ఈ సత్ అసత్‌లను విడదీయగలగటానికి సామర్థ్యం పొందే ఉపాయం చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**సదివాసత్యమే వేదమ్ అకుర్వత్యన్య మేధతే ।**
**మృదా హేమ్నేవ కుంభత్వమ్ అపృథక్ లభ్యమాత్మగమ్ ॥**

బంగారు ఆభరణం నుండి బంగారమును - ఆభరణమును వేరుచేసి చూపగలమా? మట్టి కుండలోంచి మట్టిని-కుండను విడిగా తీసి చూపగలమా?

**మంకి :** లేదు. బంగారమే ఆభరణమగుచున్నది. కనుక బంగారము-ఆభరణము వేరుకాదు. మట్టియే కుండ అగుచున్నది. మట్టిని-కుండను వేరు పరచడం అర్థం లేని మాట.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బాగు! మట్టి కుండలోనుంచి కుండను అట్టేబెట్టి మట్టిని వేరుగా ఎట్లా చేయ లేమో, బంగారు ఆభరణం లోనుంచి ఆభరణాన్ని అట్టేబెట్టి బంగారం వేరుగా ఎట్లా చేయలేమో... అట్లాగే ఈ జగత్తును బ్రహ్మచైతన్యం నుండి వేరుచేసి పొందటం (జగత్తు నుండి బ్రహ్మ చైతన్యాన్ని వేరు చేసి చూడటం) సాధ్యం కాదు.

ఎందుచేత?... ఆభరణం సత్యం కాదు. బంగారం సత్యం. కుండ సత్యం కాదు. మృత్తిక సత్యం. తరంగం సత్యం కాదు. జలం సత్యం.

అదే బంగారం ఎన్ని ఆకారాలైనా పొందగలదు. అదే మట్టి కుండ-బొమ్మ... ఎన్నెన్ని రూపాలైన పొందగలదు. అదే జలం తరంగాలుగా ఆవృత్తాలుగా ఎన్ని రూపాలైనా పొందగలదు. జీవుడుగా కనిపించే ఈ చైతన్యం (జీవ చైతన్యం, అదే చిదాకాశం కూడా)... పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఏ స్వరూపమైనా పొందగలిగే తత్త్వం తనయందు ఇముడ్చుకునే ఉన్నది. ఏ ఆభరణత్వ మైనా (ఏ ఆకారమైనా) పొందగలిగే బంగారానికి ఆకారం ఉన్నట్లా? లేనట్లా? లేనట్లే. అట్లాగే జగత్తుగా ప్రదర్శితమయ్యే బ్రహ్మ సంవిత్తునకు జగదత్వం (రూప-నామాదులు) లేనట్లే. కనుక జగత్తు మిథ్య. (బంగారానికి ఆకారం మిథ్య. మృత్తికకు కుంభత్వము మిథ్య .. వలె)

**శూన్యమాత్రం యథా వ్యోమ, స్పందమాత్రం యథా అనిలః**
**జలమాత్రం యథా ఊర్మ్యాది సంవిన్మాత్రమ్ తథా జగత్ ।**

ఆకాశానికి 'ఇది తూర్పు ఆకాశం, అది పడమర ఆకాశం, ఇది నైరుతి ఆకాశం' – మొదలైనవి ఉన్నాయా?... లేవు. ఆకాశమంతా శూన్యమాత్రమే.

'ఇది పెద్ద తరంగ జలం అది చిన్న తరంగ జలం. ఇది ఆవృత జలం. అది నిశ్చల జలం" ... మొదలైనవి జలానికి ఉన్నాయా? లేవు. తరంగాలు, ఆవృత్తాలు, సుడులు, బుడగలు... అన్నీ కూడా జలమే! జలానికి ఆ అనేకత్వాలు లేవు. వాయువుకు ఇది పిల్లగాలి, అది సుడిగాలి, ఇది తుపాను గాలి, ఇది తరంగ రహిత వాయువు'... మొదలైనవి లేవు కదా! పిల్లగాలి, సుడిగాలి, తుపాను గాలి, కదలిక లేని గాలి... అన్నీ ఒకే గాలి. (ఒకే వాయువు)

అట్లాగే "ఈ జగత్తు – ఇందులో నేను–నీవు–వాడు మొదలైన విభాగాలు" ఇవేవీ లేవు. జగత్తంతా చిన్మాత్రమే!

**మంకి :** స్వామీ! మరి మనస్సు, ఆ మనస్సుకు అనుభవమయ్యే స్థావర – జంగమ పదార్థాలు కనిపిస్తున్నాయి కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** కనిపిస్తున్నాయి. అయితే ...మనస్సుకు జగత్తుగా కనిపిస్తున్నదంతా ఏ విధంగా అభ్యసించాలో ...అది చెపుతాను.

**అవ్యవచ్ఛిన్న నిర్భాగ సంవిన్మాత్రం జగత్రయం ।**
**విద్ధి శాంతం తథావ్యోమ యథా, 'వారిణి పర్వతమ్' ॥**

జలంలో ఒక పెద్ద కొండ ప్రతిబింబిస్తోందనుకో... ఆ జలంలో ఉన్నది కొండా? కాదు. జలంలో జలం మాత్రమే ఉన్నది. అయితే కొండగా కనిపించేది? కొండగా కనిపించేది కూడా జలమే. అట్లాగే ఓ ప్రియ బాటసారీ! ఈ ముల్లోకాలు, ఇందులో కనిపించే సజాతీయ–విజాతీయ, స్వగత–పరగత వ్యవహారమంతా భేదరహితమగు 'బ్రహ్మ సంవిన్మాత్రమే' అని గ్రహించు.

ఈ ప్రకారంగా జగత్‌తత్వం గురించి ఎరిగి ఉపశాంతుడై, ముక్తుడై ఉన్న జ్ఞాని యొక్క అంతఃకరణం అపూర్వ శీతలత్వంతో పూర్ణ చంద్రుని వలె వెల్లివిరుస్తుంది. ఓ మిత్రమా! ఈ జగత్తు సర్వదా 'పరమశాంతమై, దృశ్య శూన్యమై, సర్వ వ్యాపకమై' ఉన్నట్టి బ్రహ్మం మాత్రమే అయి ఉండగా ఇక ఇందులో 'నేను అజ్ఞానిని. ఇది తెలుసు. అది తెలియదు'... అనే ప్రకాశ రాహిత్యం గాని, దీనిని ప్రకాశమానం చేసే మరొకటిగాని, దీనిని బ్రహ్మంగా మరల్చే ఏవో సాధ్యాసాధ్యాలు గాని ఎక్కడ ఎట్లా ఉంటాయి చెప్పు?

ఎందుకంటావా?...'బ్రహ్మము' అనే శబ్దంచే ఏ చైతన్య సత్త ఉద్దేశించబడుచున్నదో... అదియే సమస్త పదార్థముల యొక్క నిజరూపమై ఉన్నది. అందుచేత ఈ జగత్తు బాధ్య–బాధక రహితమై, అద్వయమైనట్టి బ్రహ్మమయంగానే వెలయుచున్నది. ఈ సమస్తం బ్రహ్మమే! (సర్వమ్ బ్రహ్మామయమ్ జగత్, సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ, జీవో బ్రహ్మేతి నాపరా మొదలైన శ్రుతి వాక్యాలు)

❖❖❖

# 5. మనస్సును అధిగమించటం ఎట్లా?

**మంకి :** మహర్షీ! ఈ రోజెంత సుదినం! అనేక ప్రక్క త్రోవలు పట్టిపోతున్న దీనుడనగు ఈ మంకి నామధేయ బాటసారిని మీరు సంశుద్ధపరుస్తున్నారు. సముద్ధరిస్తున్నారు.

స్వామీ! ఇక్కడ నాదొక సందేహం. ఈ జగత్తులో ప్రవేశించి సదేహులమై మేము కొన్నిటిని చూచి సుఖిస్తున్నాం. మరికొన్నిటిని చూచి దుఃఖిస్తున్నాం. ఎప్పటి నుండి తెచ్చిపెట్టుకున్నామో గాని... ఈ సుఖ దుఃఖాలు మమ్ములను ఎక్కడినుండో తరిమి తరిమి ఇక్కడకు జేర్చాయి. మరి మీరేమో, "మీరంతా సుఖమయమగు ఆత్మస్వరూపులయ్యా"... అని సిద్ధాంతీకరిస్తున్నారు. ఈ సుఖదుఃఖాలు ఎక్కడి నుండి వచ్చాయి? ఎందుకు అనుభూతమౌతున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వేనియొక్క 'బాధ' నీకు అనుభూతమౌతోందో... అట్టి పదార్థముల యొక్క విచారణ చేయి. విచారణ లేకపోవటమే అన్ని జాడ్యాలకు మూలం సుమా! వాస్తవానికి ఆయా బాధించే పదార్థముల యొక్క నామ-రూపములుగాని, ఆయా బాధాసాధనములుగాని, వాటి వ్యుత్పత్తి మొదలైన వికారాలుగాని (విచారణ చేసి చూస్తే) లేవు. ఆకాశపుష్పంలాగా అవి భ్రమచేతనే ఏర్పడుచున్నాయి. ఉదాహరణకు, "ఈ వాక్యం వినగానే నాకు కోపంగాని, సంతోషంగాని, దుఃఖం గాని, గర్వంగాని ఎందుకు అనిపిస్తోంది?" ...అని విచారణ చేస్తే వాటికి ఒక పరిధి తరువాత కారణమే దొరకదు. ఆకాశంలో పుష్పం కనిపించటానికి కారణం లేనట్లే స్వప్నంలో ఏవేవో కనిపించ టానికి కారణం లేనట్లే, వాటికీ కారణం లేదు. కారణం లేనివి మిథ్యమాత్రమే.

సోదరా! నీవు మనస్సును అధిగమించు. మనస్సు దృష్ట్యా కనబడేవన్నీ మనస్సును అధిగమిం చినపుడు రహితమౌతాయి. "మనస్సుకు అనిపించేవి మనస్సుకు సంబంధించినవే గాని నాకు సంబంధించినవి కావు" అని గ్రహిస్తూ ఉండు. జ్ఞాన బలంతో మాత్రమే మనస్సును అధిగమించ గలవు. అదే మనోరాహిత్యం. మనస్సును అధిగమించి, అప్పుడు శేషించే జ్ఞానరూపంచే ఒక మహాశిల వలె నిశ్చలంగా స్థితి పొంది ఉండు. అట్టి నీయొక్క జ్ఞానరూపం మనోవికల్ప రహితమై, ఈ నేత్రాది ఇంద్రియ వర్జితమై (వాటికి అసంబంధితమై), అనంతమై, అజమై, అవ్యయమై ఉన్నది. ఆ నీ ఘనీభూత జ్ఞానస్వరూపమే 'బ్రహ్మం' అనే పేరుతో చెప్పబడుతోంది.

మనస్సును అధిగమించటమంటే? మనస్సుకు అద్దాని చర్యలతో సహా చూరగొనకపోవటమే! అనగా, అద్దానిని (దాని చాంచల్యాది క్రియా విశేషములతో సహా) లెక్క చేయకపోవటమే! ఏ జ్ఞాని అయితే ఆకాశమును బోలి శుద్ధమైనట్టి తనయొక్క ఆత్మ రూపమున స్థితినొంది ఉంటాడో ఆ జ్ఞానికి నామ రూపాల ప్రతీతి ప్రసక్తి ఉండదు. అట్టి ఆత్మస్థితి యొక్క అభ్యాసదార్ఢ్యం లేకపోవుట చేతనే నామరూపాలు నిన్ను బాధిస్తున్నాయి. జాగరూకుడు కానివానికి నిద్రవచ్చి కలలు చోటుచేసు కుంటాయి చూచావా? అట్టి స్వప్న వికారాలు లాగానే తన యొక్క ఆత్మస్థితిని ఏమఱచినంత మాత్రం చేతే 'దేహం-దృశ్యం-జన్మ-మృత్యువు'... వంటి భ్రమలు ఎదురుగా నిలుస్తున్నాయి.

మనస్సులో నామ-రూపాలు ఉన్నప్పుడే బయట నామరూపాలు బాధ్య-బాధక రూపంగా ప్రవర్తిస్తున్నాయి. మనస్సు నిండా ఆత్మ యొక్క సత్-చిత్-ఆనందాది లక్షణాలు ఉన్నప్పుడో? బాధ్య-బాధకాలు సుదూరంగా తొలగిపోతాయి. క్రమంగా రహితత్వం సంతరించుకుంటుంది.

**మంకి :** ఈ జగత్తు ఎక్కడినుండి వచ్చింది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** హిరణ్యగర్భుని మనస్సే... ఎటువంటి ఉపాదాన-నిమిత్త కారణాలు లేకుండా, (మట్టి, కుమ్మరి లేకుండా) సంకల్పమాత్రం చేత నిరాశ్రయమగు ఈ జగద్రూప చిత్రాన్ని (కుండను) గాంచుతోంది. కాబట్టి... ఈ జగన్నిర్మాణానికి మనస్సు తప్ప అన్యమైన కారణం గాని, కార్యం గాని లేవు.

**తనోతి యత్తదాత్మైవ, తస్య తత్ర తథా స్థితమ్ ।**
**దృశ్యాభావాదసద్దృశ్యం తేన కః క్వ కరోతి కిమ్ ॥**

మనస్సు దేనిని ఎట్లు వివర్తింపజేస్తోందో, అది ఆయా రూపాలుగా ఆ మనస్సుకే అనుభవ మవుతోంది. ఆత్మ నుండి బయల్వెడలిన మనస్సే మనస్సును జగత్తుగా చూస్తోంది. ఆత్మయే మనస్సుకు అట్లట్లు కల్పనను స్థితింపజేస్తోంది. ఆత్మ నుండి బయలుదేరిన మనస్సు ఆత్మకు కల్పనకు ఆపాదించి దర్శిస్తోంది. జగత్తుకు సంబంధించి ఇంతకుమించి విశేషం ఏదీ ఎక్కడా లేదు.

అందుచేత... 1.ఆత్మ కంటే వేఱుగా దృశ్యం లేదు. 2.దృశ్యం అసత్తు... ఈ రెండు సూత్రాలను అతి జాగరూకతతో సమన్వయించుకో! ఇప్పుడు చెప్పు... ఎవడు, ఎద్దానిని ఎట్లు ఏది నిర్మిస్తున్నాడు?

**'అహం సుఖీ' ఇతి సుఖితా,' అహం దుఃఖీ' ఇతి దుఃఖితా ॥**
**సర్వ ఏవ సరూపస్థా వ్యోమాత్మానోఽపి పార్థివాః ॥**

ఓ మిత్రమా! 'నేను సుఖిని' అని నీ మనస్సు అనుకున్నదా... సుఖియే అవుతోంది. 'నేను దుః ఖిని' అని అనుకుంటే దుఃఖియే అవుతోంది. ఇక సుఖ-దుఃఖ సాధనాలన్నీ కూడా మనస్సు యొక్క కల్పనను అనుసరించే ఉన్నాయి. సుఖ-దుఃఖాలు మనస్సు చేతనే కల్పించబడుచున్నాయి. వాస్తవానికి సుఖ-దుఃఖాలు, వాటికి సాధనభూతమైన శబ్ద-స్పర్శ-రూపాది విషయాలు-ఈ సమస్తము చిదాకాశరూపమగు ఆత్మ స్వరూపమే అయి ఉన్నాయి. సమస్త పదార్థములు చిదాకాశరూపమే అయినప్పటికీ మనస్సు మాత్రం వాటిని దృశ్యరూపంగా దర్శిస్తోంది. ఏ భౌతిక రూపత్వం మనస్సుకు గోచరిస్తోందో అదంతా కూడా 'కలలో కనిపించే కొండలు' లాగా మిథ్య మాత్రమే అయి ఉంది.

ఆత్మసత్త సర్వదా నిర్మలము, అప్రమేయము, నిత్యోదితము, నిత్యనూతనము, నిరాధారము సర్వ పదార్థ-కాల అతీతం అయి ఉండి కూడా అయ్యది తనయొక్క అహంభావం యొక్క స్ఫురణ మాత్రంచేత భ్రమమయమగు పదార్థముల వికారంతో కూడి ఉన్నదగుచున్నది. అహంభావం (నాది, నా సంబంధమైనది అను భావావేశం) శమిస్తే పదార్థ భావం కూడా తనంతట తానే శమిస్తుంది. అప్పుడు ఆ జీవుడు శివస్వరూపుడే అవుతాడు. అహంభావం శమించటం చేత శాంతిచే

శోభితుడై 'కేవల ఆత్మస్వరూప సత్త'గా శేషిస్తాడు. ఓయీ స్నేహితుడా! సహాత్మ స్వరూపా! బంగారం కంటే వేఱుగా ఆభరణం ఎక్కడున్నదయ్యా? ఆభరణం... అనే శబ్దం, అర్థం కూడా మిథ్యయే కదా! అట్లాగే శమాత్మకమైన ఆత్మ స్వరూపుడవగు నీకంటే వేఱుగా అహంభావము యొక్క సత్తయే మిథ్య.

**నిర్వాణో నిర్మనా మౌనీ కర్తా అకర్తా చ శీతలః ।**
**'జ్ఞ' ఏవ శాన్త ఏవాస్తే శూన్యఏవాభిపూరితః ॥**

కాబట్టి... నీవు మోక్ష స్వరూపుడవై, మనోరహితుడవై, క్రియాశూన్యుడవై, మహాకర్తవై, అకర్తవు కూడా అయి, శాంత స్వరూపుడవై, దర్శనమునకు అతీతమై ఉన్న 'దృక్' రూపుడవై, కేవల పరబ్రహ్మ రూపుడవై జ్ఞాన ప్రకాశముచే అంతా అన్నిటా వెలుగొందుచూ ఉండుము.

వాసనారహితుడగు జ్ఞాని ఈ జగత్తులో ఎక్కడ ఏమి నిర్వర్తించినా యంత్ర నిర్మితమైన శిలా విగ్రహంలాగా యథాతథంగా నిశ్చలుడై ఉండునట్లే అగుచున్నది. ఎందుకంటే... అతడు ఏదైనా కార్యం ఈ చేతులతో ఆచరించినప్పటికీ వాటియందు అభిమానవర్జితుడై ఆత్మస్వరూపమునందే సర్వదా స్థితి కలిగి ఉంటున్నాడు. కనుక! ఒక శిశువు ఊయలలో గాఢంగా నిద్రిస్తూవుండగా, ఊయల ఊగుచున్నప్పటికీ శిశువు యొక్క అవయవాలు చలించకయే ఉంటాయి కదా! శరీరం యొక్క అనుసంధానం లేని జ్ఞానికి అవయవాలు కదులుచున్నప్పటికీ తాను నిశ్చల స్వరూపుడై చేష్టారహితుడై ఉంటున్నాడు. ఆత్మగా తానేమీ జన్మించడంలేదని, మరణించడం లేదని, దేనికీ కర్తృత్వ, భోక్తృత్వ దశలను పొందటం లేదనీ ఎఱిగియే ఉంటున్నాడు. అన్నీ నిర్వర్తిస్తూ ఏమీ నిర్వర్తించనివాడై ఉండటమెట్లాగో ఆతడు ఎఱిగియే ఉంటున్నాడు. ఆతని ఆత్మస్థితుని కర్మలు, దృశ్యములు, మనస్సు మొదలైనవి ఏవీ స్పృశించజాలవు.

**మంకి :** దేహంతో, జగత్తుతో (దేహం దేహంగా ఉండగా జగత్తు జగత్తుగా ఉండగా) అనుసంధానం ఎట్లా తొలగేది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** జ్ఞాని యొక్క విలక్షణమైన కొన్ని లక్షణాలు ఇక్కడ ప్రస్తావిస్తాను. నీవు కూడా అవి అలవరుచుకో, తద్ద్వారా నీవు జ్ఞానివి అవుతావు. జ్ఞాని యొక్క విశేష లక్షణాలు –

**1. బహిర్ముఖ వృత్తిరహితుడు -** అతని చిత్తము సర్వదా అంతర్ముఖమై ఉంటుంది. కనబడే దేహాలలో కనబడని దేహిని దర్శిస్తూ ఉంటాడు. కనబడే రూప–గుణాదులకు అతీతుడై ఉంటాడు.

**2. అఖండ బోధ స్వరూపుడు -** ఏ తత్త్వమైతే అనేక దేహాలుగా కనిపిస్తూ ఉంటుందో అది అతనికి ఏక – అఖండంగా అనుభవమౌతూ ఉంటుంది.

**3. ప్రాప్తించని విషయముల పట్ల 'ఆశ - కామము' లేనివాడు -** ఇంకా ఏదో పొందాలి అను అభినివేశమును 'కామము' అంటారు. ఏది ప్రాప్తించినా అతనికి క్రొత్తగావచ్చేది, పోయేది ఏదీ కనిపించదు. ఏది ఎట్లా ఉన్నా తాను తానుగానే ఉంటాడు కదా!

**4. ప్రాప్తించిన విషయములందు 'రాగము' లేనివాడు –** ఏదేది ఇప్పుడున్నదో అది కొంతకాలం క్రితం వచ్చి చేరింది. కాలంచేతనే మరల తొలగటం అనివార్యం, స్వభావసిద్ధం. (యత్ దృశ్యమ్... తత్ నశ్యం). కనుక దేనిని పట్టుకు వ్రేలాడవలసిన అగత్యం ఏమున్నది?

**5. శాంతుడు -** బాహ్యా విశేషాలు ఆత్మలో సుస్థిరత సంపాదించనంతకాలం స్పర్థ కలిగిస్తాయి. "అంతటా ఉన్న ఆత్మను నేనే" అని ఎఱిగిన తరువాత ఏదీ ఆశ్చర్యపరచదు, సుఖ-దుఃఖ పరచదు.

**6. అనంతాత్మ స్వరూపుడు -** దేహానికి పొడవు, వెడల్పులు ఉన్నాయి. దేహిగా తనకు పొడవు, వెడల్పులు లేవు. పొడవు, వెడల్పులు లేనిది అనంతమై ఉంటుంది.

**7. ద్రష్ట - దర్శన - దృశ్య రహితుడు -** చూచేవానిని నియమించేవాడు తానుగాని, చూచేది-చూడబడేది-చూడడం తాను కాదు! చూడబడేది చూచేవానిని ఆకర్షించవచ్చు గాక! అయితే ఆ చూచే వానినే చూచేవాడుగా తాను ఉంటాడు.

**8. స్వయంగా నిరాకారుడు -** దేహానికో, మనస్సుకో, బుద్ధికో, అహంకారానికో, ఏదైనా ఆకారం ఉంటే ఉండవచ్చుగాక! తాను మాత్రం ఆకారాలకు సంబంధించినవాడు కాదు. కనుక నిరాకారుడు.

**9. అపేక్షావర్జితుడు -** "నేను అపేక్షను నియమించేవాణ్ణి, అపేక్ష కన్నా ముందే ఉన్నవాణ్ణి, మరి అపేక్ష చేత నేను బద్ధుడనవట మేమిటి? 'అది అర్థరహిత వాక్యం' అనే మహాసత్త్వ స్థితి అవధరించి ఉంటాడు.

**10. ఆత్మ దర్శి -** ఎవరినైనా చూస్తున్నప్పుడు అతని దేహ-మనో-బుద్ధి-అహంకారాలను అధిగమించి వాటికి సాక్షి, కారణము అయి వున్న అప్రమేయ దోషరహిత ఆత్మనే దర్శించెదనుగాక! అను మహా దృష్టిని కలిగి ఉంటాడు.

ఇట్టి విశేషాలతో జ్ఞాని ఈ జగత్తులో సంచరిస్తాడు. ఇక దేహాదులతో అతనికి అనుసంధానం ఎక్కడిది చెప్పు?

**మంకి :** అసలు బంధం - అనుసంధానం ఎందుకు ఏర్పడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**అపేక్షైవ ఘనోబంధః ఉపేక్షైవ విముక్తతా ।**
**సర్వశబ్ధాన్వితా తస్యాం విశ్రాన్తేన కిమీక్ష్యతే ॥**

కలలో ఉన్నవాడు "ఇది కలే! మెళుకువ రాగానే ఇదంతా లేకుండా పోతుంది"... అని గ్రహించిన తరువాత ఇక ఆ కలలో ఏ పదార్థాలు కావాలని కోరుకుంటాడు. చెప్పు?

ఈ జీవునికి... "అపేక్ష" అనునదే ఘనీభూతమైన బంధం. అపేక్ష ఎట్లా పోతుంది? ఉపేక్ష చేతనే. "ఉపేక్ష" యే విముక్తి! వేద - వేదాంత సారమంతా ఇంతే!

**మంకి:** 'అపేక్ష' అనునది నిర్వచిస్తూ మరింత వివరంగా చెప్ప ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మిత్రమా! ఈ జగత్తు యొక్క అనుభవంలో ముఖ్యంగా 4 చోటు చేసుకుంటున్నాయి - 1. దేహం, 2. కోరికలు, 3. మోహం, 4. కర్తృత్వ - భోక్తృత్వ అభిమానం... ఈ నాలుగు భ్రమయే! దేహికి దేహం ఐహికమోహం!

"ఈ దేహం భ్రమమాత్రమే" అని తెలియటంచే దేహభావన జయించబడుతోంది. "ఈ దేహం లేకపోతే నేనే లేను. ఇక అనుభవాలూ లేవు" అని ఈ జీవుడు ఎందుకో భ్రమిస్తున్నాడు.

**మంకి :** అవును కదా స్వామీ! దేహమే లేకపోతే భావన – అనుభవం ఉండదు కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వప్నంలో అనుభవాలు, అనుభవజ్ఞుడు... ఈ రెండు ఉంటున్నాయి కదా! భౌతికదేహం జడప్రాయమై ఉండగా ఆ స్వప్నద్రష్ట ఏ దేహంతో 'అనుభవం' అనేది పొందుచున్నాడు? కనుక, దేహి దేహమాత్రుడు, దేహ పరిమితుడు కాదు. స్వప్నం తొలగగానే స్వప్నదేహం తొలగుచున్నట్లు... దేహ భ్రమ తొలగితే, ఇక అట్టి జీవుడు దేనినీ (ఏ పదార్థమును) కోరడు. దేహభావ రాహిత్యముచే కోరికలు నశిస్తాయి. కోరికలు తొలగితే 'మోహం' కూడా విడివడుతుంది. మోహం తొలగితే "దీనికి కర్తను–దానికి భోక్తను"... అనే మనోమాలిన్యం కూడా స్వభావసిద్ధంగా తొలగుతుంది. దేహాదులందు అభిమానం లేనివాడు "అపేక్ష" అనే గాలానికి చిక్కుకోడు.

మహాత్ముడైన అట్టి జ్ఞాని కేవలము తన ఆత్మయందే నెలకొని ఉంటాడు.

ఓ మంకి! నీవు ఆత్మయందే సర్వదా నెలకొని ఉండు. అనగా దేహ–మనో–బుద్ధి–అహంకారాలలో భ్రమచే నెలకొని ఉండకు. మనోబుద్ధులలో నెలకొని ఉన్నవానికి ప్రపంచంలో మనోబుద్ధులే అగుపిస్తాయి. ఆత్మయందు నెలకొని ఉన్నవారికి సర్వత్రా ఆత్మతత్త్వమే గోచర మౌతుంది. ఇదే మన ఈ సంవాదము యొక్క అసలైన సారాంశము.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మహాత్ముడగు ఆ మంకి నా ఉపదేశం అతి శ్రద్ధగా విన్నాడు. అప్పటికప్పుడే పాము కుబుసమును విడుచునట్లు సంసారమోహమును సంపూర్ణంగా త్యజించాడు. వాసనారహితుడై, పూర్ణచంద్రుని వలె ప్రకాశించాడు. నా వద్ద సెలవు తీసుకొని గృహోన్ముఖంగా నడిచి వెళ్లాడు. ఇకప్పటి నుండి కొంతకాలం గృహంలో గడపి కొన్ని సంవత్సరాల తరువాత ఒక పర్వతంపై ఒకచోట సుఖాసీనుడైనాడు. మనస్సు–ఇంద్రియాలు మొదలైనవాటిని స్వస్వరూపంలో శమింపచేసి, ఆ యోగి శిల వలె నిశ్చల స్వరూపుడైనాడు. సమాధి యందు మగ్నుడై, ఇప్పటికీ ఆ పర్వతం పైనే ఉండి ఉన్నాడు. ఎవరైనా అతనిని మేల్కొలిపితేనే అతడు సమాధి నుండి లేవడం జరుగగలదు.

ఓ ప్రియ సభికులారా! మీరుకూడా మంకి వలె ఉత్తమ ఉపాయమును ఆశ్రయించండి. జ్ఞానం నందు ఉత్సాహంగల మనస్సుతో వివేకం ద్వారా స్వాత్మయందు విహరించుటకై శాంతిని సముపార్జించండి. అంతేగాని మీ బుద్ధి వివేకాన్ని వదలి దీనత్వం పొందటం ఉచితమే కాదు.

శరీరం పరిమితం! ఆత్మయో... అపరిమితం!

సౌమ్యుడగు ఓ రామచంద్రా! స్ఫటికంచే నిర్మించబడిన మనుజవిగ్రహం ఆకారం దృష్ట్యా మనుజ శరీరం లాగానే కనబడవచ్చు గాక! అయితే దానికి కోప–తాప–భయ–ఆశ–నిరాశలు ఉంటాయా? ఉండవు. అట్లాగే యథాప్రాప్తాలైన ఆయా కార్యాలను ఆచరిస్తూ కూడా నీవు శాంతాత్ముడవై, నిర్వాణరూపుడవై ఉండు.

'ఏకం' అగు ఆత్మయే ఇటు ఏకం నందు, అటు అనేక నందు కూడా కలదు. అట్టి ఏక–అనేకాలకు అప్రమేయమై ఉండే ఆత్మను గ్రహించిన తరువాత 'వ్యష్టి–సమష్టి' సంబంధితమైన సాంసారిక జాడ్యం తొలగగలదు.

**శ్రీరాముడు :** ఆత్మ సర్వదా ఏకమే అయిఉండికూడా, చిత్తము అనే అనేకత్వ దర్శనస్వభావం ఎందుకు పొందడం జరుగుతోంది? అనేక చిత్తములు ఎక్కడి నుండి వచ్చాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**ఆద్యన్తరహితం సర్వం వ్యోమ చిత్తత్త్వ నిర్భరమ్ ।**
**శరీరోత్పత్తి నాశేషు కా చిత్తత్త్వస్య ఖండనా ॥**

చిద్వస్తువు (చిత్ తత్త్వం) ఆద్యంత రహితమైనది. సర్వవ్యాపకమైనది. చిదాకాశ రూపమైనది. నాశనవర్జితమైనది. అట్టి చిత్‌తత్త్వం చిత్తత్త్వము చేత, శరీరాదుల చేత ఎట్లా ఖండితం అవుతుంది? ఆత్మ పరిచ్ఛేదయుక్తమే కాదు.

ఇక ఈ దేహం? ఇది ఆద్యంతసహితమైనది, పరిమితస్వభావమైనది, పాంచభౌతిక స్వరూప మైనది, నాశన స్వభావమైనది. శరీర లక్షణాలు తీసుకొచ్చి ఆత్మకు ఎట్లా ఆపాదిస్తావు? కుదరదు. ఆత్మయే సమస్తంలోను... సమస్తంగాను ఉన్నదని, సమస్తానికీ అతీతంగా ప్రకాశిస్తూ ఉంటోందని గ్రహించటమే ఆత్మజ్ఞానం.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ప్రియ రామచంద్రా! స్ఫటికంతో నిర్మించబడిన ఇక మనుజ విగ్రహం యొక్క శరీరం కళ్ళకు కనబడుచున్నప్పటికీ ఆ స్ఫటిక విగ్రహానికి దేహస్పృహ ఉంటుందా? ఉండదు. అట్లాగే నీవు కూడా దేహమునకు కేవల సాక్షివై ఉంటూనే... యథా ప్రాప్తములైన ఆయా కార్యాలను ఆచరిస్తూ ఉండు. శాంతాత్ముడవై, నిర్వాణ (మోక్ష) రూపుడవై ప్రకాశించు. ఎట్టి విషయం గురించి నీకు (మోక్ష రూపాన్ని సునిశ్చితం చేసుకుంటూ ఉన్నప్పుడు) మరింకే సందేహం ఉండవలసిన పనిలేదు. "ఈ సృష్టి-వ్యష్టి-సమష్టి భేదాలు ఉపశమించేది ఎట్లా"... అనే అనుమానాలన్నీ "ఏక మగు ఆత్మయే వ్యష్టియందు - సమష్టి యందు కూడా వ్యవస్థితమై ఉన్నది"... అను అవగాహన చేత మాత్రమే తొలగుతాయి. ఆత్మయే సమస్తములోను, సమస్తంగాను ఉన్నది"... అను సుస్పష్టమైన అవగాహన వైపుగా నీ సకల సాధనలు, క్రియలు ఎక్కుబెట్టబడుగాక! క్రమంగా ఏకం-సర్వస్వం-వ్యష్టి-సమష్టికి సంబంధించిన ఈ జీవుడు సుదీర్ఘకాలంగా మోసుకువస్తున్న కల్పనలన్నీ వాటంతట అవే క్రమక్రమంగా తొలగుతాయి.

ప్రతి ఒక్క జీవుడు చిద్వస్తు స్వరూపుడే! చిద్వస్తువు ఆద్యంతరహితమై, సర్వవ్యాపకమై, చిదాకాశ రూపమై, నాశనవర్జితమై ఉన్నది. ఈ శరీరాల చేతనో చిత్తాల చేతనో చిద్వస్తువు ఖండితాలుగా (అనేక జీవులుగా, నీవు-నేను మొదలైనవిగా) పరిచ్ఛేదమెట్లా అవుతుంది?

పరిచ్ఛేదమయినట్లు ఏదైతే అనిపిస్తోందో అదియే సంసారము యొక్క రూపం. చిత్తు (ఆత్మ) సర్వదా అచంచలం. జలం యథాతథంగా ఉంటూ ఉండగానే అద్దాని యందు 'తరంగాలు' అనే చమత్కారం అగుపిస్తోంది కదా. అట్లాగే ఆత్మ సర్వదా యథాతథంగా ఉంటూనే తనయందు చంచలమగు 'మనస్సు' అనబడు దానిని ప్రదర్శిస్తోంది. అట్టి చంచల మనస్సు తన చంచలత్వం

త్యజించిందా... ఇక శేషించేది (అనుభవమయ్యేది) అచంచలమగు ఆత్మయే. ఒక పసిబాలుడు నల్లని మేఘాల మధ్యగా గల తెల్లని మేఘమును చూచి వాళ్ళ నాన్నను పిలిచి "నాన్నా! ఆకాశంలో అక్కడ ఎవరో తెల్లటి దుప్పటిని కట్టినట్లున్నారే?... ఎవరు కట్టారు?" అని ప్రశ్నించాడనుకో. ఆ బాలునికి కనిపించేది భ్రమ మాత్రమే కదా! అట్లాగే దేహాదులందు కనిపించే 'అహంకారం' అనేది భ్రాంతి మాత్రమే! "అట్టి అహంకారం యొక్క అనుభూతి అవాస్తవం, నిష్ఫలమైనది కూడా"... అని ముముక్షువు గ్రహించి ఉండుగాక! ఓ సర్వ సత్యాన్వేషులారా! మీరు భ్రమమాత్రమైన, మిథ్యా భూతమైన, సంసారరూప పరంపరను ప్రసాదించునట్టి ఈ దేహాదులందు, అహంకారం నందు నిమగ్నులై ఉండకండి. వాటిని నమ్మి "వీటిని ఏం చేయాలి? ఏం చేస్తే పోతాయి"- మొదలైన నమ్మక, అపనమ్మక భావాలను కూడా కలిగి ఉండవద్దు.

దేహం, అహంకారం మొదలైనవి భ్రమయే కాబట్టి, అవి నిర్వర్తించే పనులు కూడా భ్రమయే. మీరో?... అనంతాత్మస్వరూపులు కదా! దేహాదుల పట్ల ఏ భావన కలిగి ఉంటున్నారో, అట్టి భావనలో దాగి ఉన్న ఒకానొక అల్పత్వమే 'సంసారం' అనుదానికి ముడి పదార్థం. దేహ, అహంకా రాదులను భావించడాన్ని క్రమంగా సన్నగిల చేయండి. ఎందుకంటే అనంత సుఖప్రదమైన 'మోక్షం' కొరకై "ఆద్యం-భవ్యం-సత్యం-నాశరహితం" అగు ఆత్మవస్తువును మాత్రమే భావించడం అత్యవ సరం. చిదాకాశం అనంతమై, పరిమితం లేనిదై, సమరూపమై ఉన్నది. అదే సర్వానికి పరమై ఉన్న ఆత్మవస్తువు. ఇక ఈ ధ్యాత-ధ్యానం-ధ్యేయం.... అనే మూడూ కొంచెం కూడా సత్యం కానే కాదు.

అసత్యాలను అసత్యాలుగా గుర్తించినంత మాత్రం చేత "దోష రహితమగు ఆత్మను నేనే" అని ఎవరికి వారే ఎఱుగగలరు. ఈ ద్రష్ట, దర్శనం, దృశ్యం అనబడే మూడు ఆత్మ యొక్క విభూతులు మాత్రమే! ఎందుకంటావేమో? అనుభవజ్ఞరూపమైన చైతన్యమే లేకపోతే "ఇది జడం" అనే జడానుభవం ఎవరికి?... అనుభవజ్ఞుడే లేకపోతే అనుభవం ఎవరికి? ఎక్కడ ఉంటుంది?

'ధ్యేయము' అగు చిద్వస్తువు ధ్యానమునకు ముందే, ధ్యానం లేకున్నప్పుడు కూడా సిద్ధించియే ఉంటోందని గ్రహించబడుగాక! సముద్రమైతే శుక్లపాడ్యమి చంద్రుని చూచి క్షోభచెంది కెరటముల క్షోభ ప్రకటిస్తోంది. ప్రళయ వాయువీచికలచే శుష్కించిపోతోంది. ఇక, ఆత్మయో సర్వదా ఏకరూపమై, సమమై, సౌమ్యరూపమై క్షోభరహితమై ప్రకాశించుచున్నదని గ్రహించబడు గాక!

**చిత్తము యొక్క భ్రమ! -** రథంలో ప్రయాణిస్తూ బయటకు చూస్తున్న ప్రయాణీకునికి రహదారి ప్రక్కన ఉండే కొండలు, చెట్లు, రాళ్లు కదలుచున్నట్లుగా కనిపిస్తాయి. ఆ చెట్లు మొదలైనవి నిజంగా కదులుచున్నాయా?... లేదు. ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లు తెలుపు కనిపిస్తూ ఉంటుంది. ముత్యపుచిప్పలో నిజంగా వెండి ఉన్నదా?... లేదు. అట్లాగే అంతటా చిత్స్వరూపమే సర్వదా ఏర్పడి ఉండగా ఇక దేహాదులు గోచరించడం... ఇదంతాకూడా చిత్తం యొక్క భ్రమ మాత్రమే!

విచిత్రం చూడు! చిత్తం దృష్టిలో దేహాలు కనిపిస్తున్నట్లే, దేహాల దృష్టికి చిత్తం కనిపిస్తోంది. ఒక దానిచే రెండవది కల్పితంగా తోచుచున్నది. దేహ - చిత్తాల దృష్టిచే 'జీవుడు' అనునది కూడా

కల్పితమై సంప్రాప్తిస్తోంది. జీవదృష్టిచే దేహ చిత్తాలు కల్పితాలై ఉంటున్నాయి. అంతయూ కల్పిత మాత్రమే అయి ఉండగా... ఇక ఆ 'పరమపదం' అనుదానియందు ద్వైతానికి చోటెక్కడిది? శుద్ధ చైతన్యం యొక్క స్వయంకృతమైన ఏమఱుపు చేతనే దేహ-చిత్త-జీవాదులు మేఘాల ఆకారంచే ఆకాశంలో కనిపించే కొండ శిఖరరూపం వలె రూపుదిద్దుకుంటున్నాయి.

బ్రాహ్మీదృష్టిచే సమస్తమూ ఏకం, శాంతం, బ్రహ్మరూపం అయివున్నది. బ్రహ్మమునందు నామవాచకం-సర్వనామం గాని, తదితర భ్రమలు గాని లేనేలేవు. ఆకాశంలో మేఘాలు గుమిగూడి ఉండగా బాలునికి ఆకాశంలో కొండలు తోటలు ఉన్నట్లుగా కనిపిస్తూ ఉంటుంది. ఆకాశం శూన్య మాత్రమై ఉండగా అక్కడక్కడ తోట-బాట ఉండటమేమిటి? ఇసుకలో ఎక్కడైనా నూనె ఉంటుందా? చంద్రబింబంలో మెఱుపుతీగలుంటాయా? అవన్నీ భ్రమ మాత్రమే కదా! తత్త్వదృష్టిచే ఈ దేహాది పదార్థాలు లేనేలేవు. సత్యాన్ని ఎఱుగుటలో ఉత్తమోత్తముడవగు ఓ రామచంద్రా! "లేనిదే" అయినట్టి ఈ జగత్తు యొక్క భ్రమయందు నీవు చిక్కుకోకూడదు సుమా!

ఈ జగత్తు వాస్తవానికి లేదు. ఇది పరమసత్యం. సామాన్యంగా అనేకమంది "జగత్తే ఉన్నది. బ్రహ్మ సత్తా లేదు" - అను భ్రాంతికి లోను కావడం లోకపరిపాటి. అట్టి భ్రమ తొలగటానికి ఈ మన సంవాదం మహత్తరమై సహకరించుగాక! జగత్తే లేనప్పుడు ఇక బంధానికి కారణం ఎక్కడున్నది చెప్పు?... "కుండ-మూకుడు- చట్టి - పిడత - ప్రతిమ - ప్రమిద" ఇవన్నీ స్వతహాగా మట్టియే కదా! అట్లాగే అనేక విశేషాలతో కనిపిస్తున్న ఈ జగత్తంతా చిత్తం మాత్రమే! అయితే అట్టి చిత్తం విచారణచే తనంతట తానే (స్వయంగా) క్షయించిపోవుచున్నది.

ఓ రామచంద్రా! ఓ తదితర సర్వ స్వయమాత్మ ఘన చిదానంద స్వరూపులారా! నా ఉపదేశం యొక్క సారమంతా సులభవిషయమే కాని అసాధ్యమైన విషయం కాదు-

అహంకారం నేను కాదు. అహంకారం ఆమూలాగ్రంగా భ్రమ మాత్రమే! సంపదలందు హర్షించటం, విపత్తులందు శోకించటం... ఇవన్నీ మనోధర్మాలే గాని ఆత్మ యొక్క ధర్మాలు కాదు. మనస్సు "భ్రమ-దురవగాహన" అను వాటిచే కల్పించబడినది. మనస్సు ఉన్నా, ఎట్లా ఉన్నా... ఆత్మ యథాతథంగానే ఉన్నది. మీరంతా 'రాక-పోక' అను స్వభావం కలిగిన సుఖ దుఃఖాలను అధిగమించి "ఇవన్నీ ఏది ఎట్లా ఉన్నా కూడా నేను సర్వదా అఖండమగు ఆత్మ స్వభావినే" అనే స్థితిని సొంతం చేసుకుని ఉండండి.

మీరెవరూ దేహ స్వభావులు, మనో స్వభావులు కాదు. సర్వదా ఆత్మ స్వభావులు! దేశ-కాలాతీతులై, అప్రమేయులై, నిత్యోదిత ఆత్మ చైతన్యసూర్య స్వభావులై ప్రకాశించండి. 'ఎఱుక' అనే కిరణ సమూహాలై సర్వదా వెదజల్లుతూ కూడా నిర్విషయానందంతో కూడిన ఆత్మైశ్వర్యమయులై చొన్నొందండి.

ఓ రఘుకుల తిలకా! రామచంద్రా! ఓ ప్రియ సర్వజనులారా! మీరంతా యథాస్థితమగు ఆత్మ వస్తువును చక్కగా సాక్షాత్కరించుకోండి. చిత్తం యొక్క రూపం "హర్షం - శోకం - ఇచ్ఛ"

అను మూడూ కలిసినది మాత్రమే! మరి మీరో... ఈ హర్ష-శోక-ఇచ్ఛల కంటే కూడా అతీతమైన, సూక్ష్మమైన రూపం కలవారై ఉన్నారు. అట్టి మీ అనంతత్వాన్ని ఏమఱువకపోవటమే మోక్షం. ఇంతకు వేఱైన మోక్షశబ్దార్థం లేదని గ్రహించి, అటుపై యథేచ్ఛగా సమర్థించువారై ఉండండి. అప్పుడిక ఏది ఎట్లున్నప్పటికీ మీరు మోక్ష స్వరూపులే! ఓ సర్వ సహజీవులారా! మీరంతా ఆత్మారాములే!

❖❖❖

## 8. వాసనాక్షయం యొక్క ఆవశ్యకత

**శ్రీరాముడు :** ప్రభూ! ఈ పురుషకారం అనేది అనేక కర్మ వ్యవహారాలకు కారణమగుచున్నది. 'దైవం' అనే శబ్ద-అర్థములకు కారణం కూడా ఈ కర్మల వ్యవహారమే కదా! ఇదే మరల జనన మరణాలకు కూడా కారణం అగుచున్నదని శాస్త్ర ప్రసిద్ధి. అట్టి "బీజంలోంచి చెట్టు, చెట్టులో నుంచి బీజం" అను బీజ-వృక్ష న్యాయాన్ని ప్రదర్శిస్తున్న పురుషుడు - పురుషకారం లేక 'కర్త-భోక్త'ల తత్త్వాన్ని విశదీకరించవలసినదిగా నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! నీ యొక్క "సర్వసాధక జనుల పట్ల గల అవ్యాజ ప్రేమ" చేతనే ఇటువంటి ప్రశ్నను ఈ సందర్భంలో ప్రస్తావించావు.

సరే, ఇప్పుడు 'కర్మలు - కర్త - భోక్త' అను వాటి గురించి కొన్ని విషయాలు చెప్పుకుందాం. కుండ కార్యరూపం, మట్టి కారణరూపం; వస్త్రం కార్యరూపం, దూది కారణరూపం; అట్లాగే "జీవుడు కార్యరూపం, దైవము, కర్మలు కారణరూపం" - అని సిద్ధాంతీకరించబడుతోంది.

అయితే 'దైవం-కర్మ' అను కారణరూపం, పురుషుడు (జీవుడు) అను కార్యరూపం... ఈ మొదలైనవన్నీ వాస్తవానికి 'చిత్‌స్పందం' యొక్క పర్యాయ పదాలే! చైతన్య స్పందమే లోకంలో ఆయా వివిధ రూపాలుగా పొందినదగుచున్నది. ఎట్లా అంటావా?... చిదాత్మయే ప్రాథమిక రూప మగు "చిత్ స్పందం"చే 1.సమష్టి మనస్సు, 2.వ్యష్టి మనస్సుగా అగుచున్నది. ఆ పిదప దేహాకార ధ్యాసచే పురుషకారం ఆశ్రయించి 'పురుషుడు' అను రూపాన్ని దాల్చుచున్నది. పురుషకారం నుండి 'కర్మలు' బయల్వెడలుచున్నాయి. క్రమంగా ఉచితానుచిత్వం రూపు పొందగా పుణ్య-పాపాలు దృష్టి మొదలైన ద్వంద్వాలు బయల్వెడలి జగద్రూపంగా వివర్తమొందుచున్నాయి.

చైతన్యం యొక్క స్పందం లేకపోతే పురుషుడు (జీవుడు) గాని, కర్మలు గాని ఎక్కడ? ఎవరికి? అవి స్వతహాగా చూస్తే అసద్రూపాలు మాత్రమే! చైతన్య సత్తాయే ఈ జగత్తుగా ప్రాప్తిస్తున్న అణువణువు కూడా! వాసనారహితమగు చైతన్యం యొక్క స్పందం చేత ఈ 'జగత్తు' అనే భావనా రూపానుభవం సుదూరంగా కనిపించే కుగ్రామం వలె బాహ్యవస్తువుగా అగుపించ నారంభిస్తుంది.

చైతన్యం సర్వదా యథాతథంగానే ఉంటున్నది సుమా! వాసనారహితమగు చైతన్యం యొక్క స్పందన అస్పందనమనియే చెప్పవచ్చు కూడా! ఎందుకంటే... తరంగాలు దృష్ట్యా సముద్రజలం సర్వదా చంచలమై ఉంటున్నప్పటికీ సముద్రం దృష్ట్యా (జలం దృష్ట్యా) సముద్రం సర్వదా ఏకమే

అయి ఉన్నది, నిశ్చలమే అయి ఉన్నది. జలం జలంగానే ఉంటోంది కదా! అనేకంగా కనిపించేదంతా ఏకంగా అనిపించే వరకు ముముక్షువు తన సాధనలను కొనసాగిస్తూనే ఉండుగాక!

ఓ రామచంద్రా! ఈ జీవునకు కర్మలలో కనిపించే భేదమంతా సృష్టియందు ప్రారంభమైన కల్పనాంశమే. వాస్తవానికి చైతన్యమునకు, చైతన్య స్పందనా రూపాలగు కర్మలకు ఒకించుక కూడా భేద లేదు. 'జలతరంగాలు' అను శబ్దార్థంలో జలానికి తరంగాలకు భేదమేమున్నది? ఏదైనా భేదం కనిపిస్తే అది సంకల్పమాత్ర జనితమే గాని వాస్తవం కానేకాదు! కర్మయే పురుషుడు. పురుషునిదే కర్మత్వం పురుషునికి కర్మలకు భేదం – మంచుగడ్డ, శీతలత్వము వలె భ్రమయే. పురుషునికి – అనిర్వచనీయ చైతన్యమునకు గల భేదం అట్టిదే.

'చైతన్యస్పందం' అనే రసమే దైవంగా చెప్పబడుతూ, ఆరాధించబడటం లోకంలో జరుగుతోంది. బీజమే కొమ్మలు, ఆకులు, పూలు అగుచున్నట్లుగా... చైతన్యరసమే దైవం, కర్మ, జీవులు అయి ఉన్నది. 'మనుష్యుడు, జంతువు, దేవత, త్రిమూర్తులు మొదలైనవన్నీ చైతన్యం యొక్క అంశ స్వరూపాలే! చైతన్య రసమునకు వేఱుగా మనుష్యులు, దేవతలు, జంతువులు, మొదలైనవీ లేవు.

చైతన్యం స్పందయుక్తం అగుటయే 'జగత్తు' అనబడే దానికి బీజం. చైతన్యం స్పందానికి ముందే ఉండటం చేత స్పందనసమయంలో కూడా యథాతథంగా ఉండడం చేత చైతన్యం దేనికీ బీజమగుట లేదు కూడా! చైతన్యం తనలో తానే స్వయంగా బీజత్వాన్ని కల్పించుకొని సూక్ష్మావయవ రూపమున కూడా ఉన్నదై క్రమంగా విస్తార జగత్ రచనకు కర్మల రూపంగా నిర్వర్తిస్తోంది.

**చిత్త్వంచ క్వచిత్ అస్పంన్దం, క్వచిత్ స్పందమ్ స్వభావతః ।**
**అనంతమ్ ఏకార్ణవత్ "దిక్–కాల" క్రమ సంస్థితమ్ ॥**

అనంత మహాసముద్రజలం ఒకచోట తరంగ సహితంగాను, మరొకచోట తరంగ రహితంగాను (చంచలంగాను, నిశ్చలంగాను) ఉంటోంది చూచావా?... చైతన్యం స్వయంగా స్వభావతః ఒకానొక చోట దేశకాలక్రమంతో కూడినదై ఉంటూనే... మరొకచోట దేశ కాలాదులచే స్పర్శించ బడకయే ఉంటోంది. 'చిత్' స్వయంగా అకారణమే అయివుండి కూడా, ఆ చిత్‌స్పందం వాసనా రహితమై దేహం – ఇంద్రియాలకు అంకురరూపంగా అవధరిస్తోంది. ఒక గడ్డిపరక గడ్డిపూలు పూయడానికి, ఒక పూతీగ పుష్పాలను, ఆకులను ప్రదర్శించడానికి, ఒక మట్టి గింజ మహావృక్షంగా పరిణమించడానికి... వీటన్నిటికీ కారణం చైతన్యమే!

ఓ రామచంద్రా! అగ్నికి, ఉష్ణత్వానికి భేదమేముంటుంది? బీజమునకు, ఆ బీజంలో నుంచి అంకురిస్తున్న వృక్షమునకు భేదమే లేదు. బీజంలో నిద్రాణమై ఉన్న చిత్‌తత్త్వమే స్పందమును స్వీకరించి "చిత్ చైతన్యము" అనబడు మహిమచే మహావృక్షంగా ప్రకటనమగున్నది కదా!

బీజమే అంకురచైతన్యం. 'అంకురశక్తి' కి వేఱుగా బీజమనబడునది లేదు. కర్మయే మనుజుడు. జలం తనయందు తానే బుద్బుదాలను రచించుకొనుచున్నది చూచావా? చైతన్యం అంకురసత్త రూపంగా విత్తనంలో స్ఫురిస్తున్నట్లే ఈ పృథ్వియందు కూడా ఓజోరూపంగా స్ఫురించి ఒకచోట

స్థూలం గాను, మరొకచోట సూక్ష్మం గాను, ఒకచోట మృదువుగాను, మరొకచోట అత్యంత కఠినంగాను తనను తాను రచించుకొనుచున్నది. చైతన్యం కాక మరింకేది భూగర్భంలో వజ్రం నిర్మితమగుటకు కారణం కాగలదు? చైతన్యం యొక్క అతికోమలమగు 'అంకురం' అను చమత్కారం ద్వారా అతి కఠినమగు రత్నం, వజ్రం మొదలైనవి ప్రాప్తిస్తున్నాయని గ్రహించు.

లత యందు 'రసము'నకు కారణమైన చైతన్యమే ఫలపుష్పాదులను విస్తరింపజేస్తోంది. ప్రాణి యొక్క వీర్యరసమందున్న చైతన్యము ఈ జంగమ జీవులను విస్తరింపజేస్తోంది.

సర్వవ్యాపకమగు సంవిత్ చైతన్యం అతి బలవత్తరమైనది కాబట్టే అది తనయందు దైవ-అసురాది-పర్వతాది సమస్తమును అవధరిస్తోంది. సమస్త స్థావర-జంగమ పదార్థముల యొక్క "ఆదిబీజం"... చైతన్యం యొక్క స్ఫురణ మాత్రమే అయి ఉన్నది. అట్టి చైతన్యమునకు బీజమైనదేది? ఏదీ లేదు. చైతన్యము సర్వమునకు బీజమై కూడా, తాను బీజ-అంకుర రహితము.

బీజము-అంకురము, పురుషుడు-క్రియ, దైవము-పురుషుడు, వాయువు-వాయువీచికలు... వీటన్నిటినికి పరస్పర భేదమేమి ఇసుమంత కూడా లేదు.

**ద్విత్వంనృకర్మణోర్యస్య, బీజ-అంకురతయా తయోః ।**
**విపశ్చిత్ పశవే, తస్మై మహతే అస్తు సదా నమః ॥**

ఎవరి దృష్టిలో "పురుషుడు వేరు - కర్మలు వేరు, బీజాంకుర శక్తి వేరు - కారణ శక్తివేరు, కార్యరూపమగు ఈ స్థావర జంగమ పదార్థములు వేరు, చిత్ చైతన్యము వేరు-కనబడే జీవులు వేరు- విత్తులోని అంకుర రసం-విత్తు-వేఋ, కొమ్మ వృక్షము వేరు, కాండము వేరు, కొమ్మ వేరు, పుష్పము వేరు..." ఇటువంటి అభిప్రాయాలు ఘనీభూతమై ఉంటాయో, అట్టి నరరూప పశువుకు నేనేం చెప్పగలను? - ఆ మహానుభావుడికి ఒక నమస్కారం.

ఓ రామచంద్రా! చైతన్యమునందు 'జన్మించటం' అనే దానికి సంబంధించిన ఏ బీజం లేక ఏ వాసనారూపమగు రసం కలదో... అదే జన్మరూపమగు అంకురానికి, దేహం చేత పొందబడే సమస్త వ్యవహారానికి కూడా "బీజం" అయి ఉన్నది. అట్టి చైతన్యంలో ప్రదర్శితమయ్యే వాసనారూప రసమే జన్మకర్మలకు కూడా కారణం. కనుక ఆ వాసనారూప రసం దహింపజేస్తే శేషించేది నిర్మల-జన్మ కర్మాతీత చిత్‌తత్త్వమే! అట్టి అప్రమేయ చిత్ తత్త్వం అనుభవయోగ్యం కావాలంటే 'అసంగం' అనే అగ్నిచే వాసనారూప రసమును శోషింపజేయాలి.

**శ్రీరాముడు :** 'అసంగం' అనుదాని గురించి మరికొంత సుస్పష్టం చేయండి.

**అసంగము -**

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**కుర్వతో అకుర్వతశ్చైవ మనసా యదమజ్జగమ్ ।**
**శుభాశుభేషు కార్యేషుతత్ "అసంగం" విదుర్ బుధాః" ॥**

ఎద్దాని సహాయం చేతైతే "ఆయా క్రియలు చేస్తున్నప్పుడు, చేయకుండా ఉన్నప్పుడు కూడా ఆయా శుభ - అశుభ కర్మలందు మనస్సుచే ఈ జీవుడు తగుల్కొనకుండా ఉంటాడో"... అద్దానిని

"అసంగం" అని విజ్ఞులు పిలుస్తున్నారు. అయితే ఈ "తగుల్కోవటం" అనేది ఎట్లా ఏర్పడుతుంది? దానికి కారణం "అంతరంగంలోని వాసనలే" అని ప్రవచించబడుతోంది. వాసనలు అనగా ఏమిటి? అజ్ఞానవశంచేనిర్వర్తించబడిన అభ్యాసం యొక్క ఆంతరంగిక సమీకరణమే వాసనలు. జ్ఞానాభ్యాసం చేత అజ్ఞానాభ్యాస ప్రభావం సన్నగిల్లుతూ రాగా అప్పుడు వాసనలు వాటికవే తోకముడుస్తాయి. కనుకనే "వాసనల యొక్క నాశనమే అసంగం. వాసనల ప్రకోపమే సంగం" అని కూడా చెప్పబడు తోంది. ఓ రామచంద్రా! ఉపాయం ఏదైనా ఫరవాలేదుగాని, ఎలాగో అలా ఈ అంతరంగంలోని వాసనలను నశింపజేయాలి. "ఈ జగత్తే బ్రహ్మం. నీవే ఆ 'తత్' అయివున్నావు. నేను స్వయంగా సర్వదా బ్రహ్మాన్ని. నేనే నీయందున్నాను. నీవే నాయందు ఉన్నావు. నేనే అంతటా ఉన్నాను"... అనే వాక్యాల అనుభవార్థమేమిటో అప్పుడుగాని సుస్పష్టమవదు. ప్రియజనులారా! భావిసహజీవులారా! మీరంతా ఈ వాసనలు రహితం చేయడానికే మీమీ కార్యక్రమాలన్నీ ఉద్దేశించి ఉండండి. మీకు రాజయోగం, హఠయోగం, పూజ, ప్రార్థన, ఉపన్యసించండం, శ్రవణం మననం... మొదలైన ఆయా యుక్తులతో ఏది సులభమని అనిపిస్తే అదో (లేక) ఏ కొన్నియో అవలంబించండి. పురుష ప్రయత్నశీలురై ఉండండి. వాసనారాహిత్యమే పరమశుభప్రదం, పరమ మంగళమై ఉంది. వాసనా రహిత స్థితియే ప్రత్యగాత్మ స్వరూపం.

అహంభావమే సర్వ వాసనలకు మూలం. "నాఽహం" భావనయే వాసనాక్షయం యొక్క నాంది, విధానం, అంతిమ ప్రయోజనం కూడా! "అహం" అనబడు ప్రత్యయమునకు ముందే ఉన్న తన అప్రమేయరూపాన్ని ఏమఱచుట చేతనే 'సంగం' అనేది రూపుదిద్దుకుంటోంది. అందుకుగాను, ఇప్పుడు పురుషప్రయత్నం ఆశ్రయించవలసిందే .

**నాస్త్యేవ పౌరుషాత్ అన్యా, సంసారోత్తరణే గతిః ।**
**'నిరహం' భావరూపే అస్మిన్ వాసనాక్షయనామని ॥**

"సంసారం నుండి నేను ఉద్ధరించబడాలి" అని ఊరకే అనుకుంటూ ఉంటే ప్రయోజనం ఏమిటి ? వాసనలు క్షయిస్తే సంసారమూ లేదు, మరొకటీ లేదు. వాసనలు క్షయించాలంటే ఈ జీవుడు పురుషప్రయత్నం ఆశ్రయించడం తప్పించి వేఱే ఉపాయమే లేదు.

"అనాది, అనంతం" అయిన ఏ చైతన్యమైతే కలదో... అదే అంకురం, అదియే 'బీజం', అదే 'కర్మ'. అదే 'పురుషుడు'. అదే శుభాశుభప్రదమగు 'దైవం'. అదే 'అదృష్టం' కూడా! సృష్టి అనేది జీవుని యొక్క "వ్యష్టి-సమష్టి"ల భావావేశాల సమావేశమే గాని... వేరేమీ కాదు. సృష్టి యొక్క మొట్టమొదటి చైతన్యానికి అన్యంగా ఎక్కడా ఏదీ లేదు. సృష్ట్యాదిలో చైతన్యానికి అన్యంగా అంకురం గాని, బీజంగాని, పురుషుడుగాని, కర్మగాని, దైవాదులుగాని లేవు. కేవలం చైతన్యమే సర్వరూపంగా ప్రకటనమగుచున్నది. అనగా వర్తమానంలో 'జీవుడు'గా ఎవరిని పిలుస్తున్నా అతడు ఒకప్పుడు తన యొక్క నిర్వివాదసర్వాంశ చైతన్యంగానే అనుభవం కలిగి ఉన్నాడు. ఇప్పటికీ ఆతడు అట్టివాడే! అయితే, అట్టి తన సర్వత్త్వమును, నిత్యత్త్వమును ఏమఱచి ఆతడు ద్వైతాన్ని ఆశ్రయించి "నేను జీవుడను. నన్ను కర్మలు, పురుషుడు, దేహం మొదలైనవి బంధించాయి"... అని తలచుచున్నాడు.

పురుషుడు అనబడు జీవుడు "నేను బద్ధుడను" అను అపేక్షాసంప్రాప్తమైన దుస్థితిని త్యజిస్తేనే శాంతి అనుభవిస్తాడు. అట్లా త్యజించగలగాలంటే పురుషప్రయత్నంచే "నేను సర్వదా చైతన్యాన్నే"... అనే సంస్థితిని సముపార్జించుకోవటమొక్కటే ఉపాయం.

వాస్తవానికి బీజం గాని, అంకురం గాని, పురుషుడు గాని, కర్మలు గాని లేవు. ఏకైక చైతన్యమే ఈ సుర-అసుర-మనుష్యాది ఆయా వేషాలను ధరించి ఈ 'జగత్తు' అనే నామరూపాత్మక శోభతో ఉదితమై ఇక్కడ జగన్నాటకం ఆడుతోంది. కనుక ఓ రామా! లే! సందేహాలన్నీ త్యజించు. సందేహరహితం, సర్వస్వరూపం అగు బ్రహ్మాన్ని (చైతన్యాన్ని) భావన చేయి. అసత్యాలైనట్టి ఈ పురుష-కర్మాదుల గురించిన శంకలన్నీ పారత్రోలివేయి. ఈ పాంచభౌతిక దేహాన్ని అధిగమించు. "సమస్త కల్పనా వర్జితము, వాసనా వినిర్ముక్తము"... అయినట్టి చిన్మాత్ర శరీరాన్ని అవధరించు. సమాధి (సమ + అధి) యందు మాత్రమే సర్వదా ఏర్పడివుండు. సమాధి యందు మాత్రమే వ్యవహరించు. సమస్త కోరికలను, సంశయములను విడిచివేయి. నిర్మలమైన చిన్మాత్రమునందు మాత్రమే స్థితి కలిగి ఉన్నవాడవై, ప్రవాహపతితమైన సర్వకార్యాలను నిర్వర్తించు. ఆశాసమన్విత కర్మచరుడవు కాకుండానే స్వభావసిద్ధ కర్మ నిర్వహణ కలిగి ఉండు. కేవలం ఆత్మారాముడవై, పూర్ణ కాముడవై, శాంతిచే మనోహరుడవై, నిర్భయుడవై ప్రకాశించు. నీ మనస్సు అఖండాత్మయందు, హస్తములు లోకవ్యవహారములందు - వ్యవహరించును గాక!

❖❖❖

## 9. ప్రవాహపతితం కర్మ - అసంగపూర్వక నిర్వహణ

**శ్రీరాముడు :** మహర్షీ! "ప్రవాహపతితం" అను శబ్దం యొక్క అర్థమును మరికొంత వివరించ ప్రార్థన. అనివార్యములైన ఆయా క్రియలు నిర్వర్తించవలసి వచ్చుచుండగా... ఈ జీవుడు ఎట్టి జ్ఞాన యోగములను అవధరించాలో బోధించ వేడుకొంటున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఓ ప్రియా సహజీవులారా! మీ స్వరూపము ఆత్మయేగాని, ఈ దేహ-మనో-బుద్ధ్యాదులు కాదు కదా!

**నిత్యమ్ అంతర్ముఖః తిష్ఠ, వీతరాగో, వివాసనః**
**చిన్మాత్రం అమలం, శాన్తం కర్మ సర్వత్ర భావయన్॥**

ఈ రాగము, వాసన మొదలైనవన్నీ బహిర్ముఖుడై జగదర్శన సమయంలో ఈ జీవుని పట్ల అకస్మాత్తుగానో, క్రమక్రమంగానో ప్రోగవుతున్నాయి. అయితే యథా ప్రాప్తములైన ఆయా కర్మలను నిర్వర్తిస్తున్నప్పటికీ 'రాగ-వాసన'లను అధిగమించి (త్యజించినవాడవై) అంతర్ముఖుడవగుము. 'అంతర్ముఖమవటం' అనగా నిర్మలం-శాంతం-చిన్మాత్రం అయినట్టి ఆత్మ స్వరూపం అవధరించ టమే! ఆకాశం వలె నిర్మలమైన స్వరూపం కలవాడవై, ప్రాజ్ఞుడవై కేవలం 'చిన్మాత్రం' అయినట్టి ఆత్మ యందే సదా స్థితి కలిగి ఉండు. సమరూపుడవై, సౌమ్యుడవై, సమమగు ఆనందంతో కూడి

ఉండు. 'బ్రహ్మంతో అభేదం సంతరించుకోవాలి'... అను ఆశయమును నిర్దుష్టపరచుకో! యథా ప్రాప్తాలగుచున్న సర్వ అల్ప-మహత్తర కార్యాలలో, అట్లాగే, ఆయా శోక-ఆపద-సంకట-భయ సమయాలలో, నిమ్న - ఉచ్ఛ స్థితులలో ఆయా దుఃఖ హాసాదులను ఈ ప్రపంచంలో బాహ్యానికి నటించు. 'ఈ జగత్తు, ఈ పరిస్థితులు, ఈ దేహం - ఇవన్నీ కూడా అన్ని వేళలా ఒకే తీరుగా ఉండవు. వాటి స్వభావము అట్టిది మరి!... నేనో? ఆత్మయే స్వరూపంగా గలవాడను'... అనే మననం కలిగి ఉండు. అన్నీ తెలిసియే శీతోష్ణాది సర్వ ద్వంద్వాలను పొందుతూ పొందని వాడవై ఉండు. అంతరంగంలో సౌమ్యుడవై ఉంటూనే... బహిరంగంలో మాత్రం తదితరుల వలెనే తదితర అనుకూలంగా వర్తించు. బంధు మిత్ర సమాగమ-వియోగాలలో, ఉత్సవ-నిరుత్సవాలలో, వాసనా ప్రదర్శన - అప్రదర్శనలలో అందరిలాగానే సుఖ దుఃఖాలు ప్రదర్శిస్తూనే... అన్నీ ఎఱిగినవాడవై 'అతీతత్వం' వహించి ఉండు.

**భూతాని మృత్యు కార్యేషు సంగ్రామాదిషు నిర్ధహ**
**దావానల తృణానీవ వాసనాక్రాంత మూఢవత్॥**

అగ్ని రుచి-పచి తెలియకుండానే గడ్డిపరకలను దహిస్తున్నట్లు, పైకి మాత్రం యుద్ధంలో వాసనలచే ఆక్రమించబడిన మూఢుని వలె శత్రుసైన్యమును దహించివేయి. అయితే అంతరంగంలో ఎవరిపైనా ఇసుమంత కూడా క్రోధం కలిగి ఉండకు. ధనంపై మమకారం కలిగి ఉన్నవాడు ధనం ఆర్జించినట్లే నీవు ఆర్జించు. అయితే ధర్మనిరతిని వదలకు, మమకారాదులు లేకయే ఉండు.

దీనుల యెడ కరుణ, మహాత్ముల పట్ల ఉదారత్వం, దుష్టుల యెడ కఠినత్వం వహిస్తూనే సర్వాత్మకుడవై ఉండు.

ఏది ఎట్లు ఏ రీతిగా అగుచున్నప్పటికీ నీవు సర్వదా అంతర్ముఖుడవై, ఆత్మానందయుతుడవై, స్వాత్మారామత్వంతో కూడి ఉండు. 'శమం'చే పరిపూర్ణుడవై, ఉదారచిత్తుడవగుచు ఉన్నప్పుడు నీవు ఏ కార్యం నిర్వర్తించుచున్నప్పటికీ నిర్వర్తించనివాడవే (అకర్తవే) కాగలవు. ఓ సాధూ! రామచంద్రా! 'నేను అఖండము-అప్రమేయము అగు ఆత్మనే' అను ఆత్మ భావనచే ఎవని యొక్క వృత్తి నిత్యం అంతర్ముఖమై ఉంటుందో... అట్టివాని పట్ల ఇంద్రుని వజ్రాయుధం కూడా నిష్ఫలమైపోగలదు.

**సంకల్ప కలనోన్ ముక్తే, స్వ సంవిన్మాత్రకోటరే**
**యః తిష్ఠతి ఆత్మనిస్వైరమ్ "ఆత్మారామో మహేశ్వరః"!**

సంకల్ప కల్పనా విశేషాలను తన హృదయాకాశం నుండి బయటకు నెట్టి ఎవడైతే యథేచ్ఛగా ఆత్మయందు స్థితి కలిగి ఉంటాడో... అట్టి ఆత్మారాముడే మహేశ్వరుడు. అట్టి చిన్మాత్ర నిష్ఠుని ("నేను సర్వాతీతమగు ఆత్మను" - అను నిష్ఠను ఆశ్రయించిన వానిని) శస్త్రములు ఛేదించలేవు.

**న తం భిన్దన్తి శస్త్రాణి, న దహన్తి హుతాశనాః**
**న క్లేదయన్తి వారీణి, శోషయన్తి న మారుతాః ॥**

ఆత్మతో ఏకీభూతుడైన వానిని శస్త్రాలు ఛేదించజాలవు. అగ్ని దహించజాలదు. జలం తడుపలేదు. వాయువు ఎండించలేదు. కాబట్టి రామా! జన్మ-జరా-మరణాలు లేని నిత్య

నిరతిశయానంద రూపమైన 'స్వాత్మ' అను స్తంభమును ఆశ్రయించి ఉండు. ధీరుడవై నిశ్చలతను అవలంబించి ఉండు.

ఈ జగత్తుకు కారణము, ఆశ్రయము, సారభూతము అయిన శాంతమగు బ్రహ్మచైతన్యము మాత్రమే ఆశ్రయించతగినది. తదితర బాహ్యవృత్తులనన్నిటినీ అంతర్ముఖం చేసి చ్యుతిలేని స్థితిని సముపార్జించుకోవటమే సాధనలన్నిటియొక్క ఉత్తమ లక్ష్యమని జనులు గ్రహించెదరు గాక! నిత్యము అంతర్ముఖత్వము కలిగి బాహ్యమున యథా ప్రాప్తములగు కార్యములకు రాగ–మమకార రహితంగా నిర్వర్తించే వారికి 'వాసన' ఉదయించజాలదు.

ఈ మనస్సు మరల మరల సాంసారిక విషయాలలో నిమగ్నమౌతోంది. 1.నిర్వర్తించటం, 2.నిమగ్న మవటం... ఈ రెండిటి ఫలితమేమిటో గమనించు. ముముక్షువులైన వారు ఎక్కడెక్కడ తమ మనస్సులు వృత్తులతో కూడి ప్రవేశిస్తోందో ముందుగా గమనించాలి. ఎక్కడ ఆత్మ కంటే అతిరిక్తమైన (ఇష్ట–అయిష్ట–ఉచిత–అనుచిత మొదలుగా గల) భావన ఏర్పడుతోందో అక్కడక్కడ మనస్సు నిమగ్నమౌతున్నట్లే. తాబేలు తన అవయవాలు అంతర్ముఖం చేస్తున్నట్లు ఈ మనస్సును కూడా అంతర్ముఖం చేయాలి. కనబడే తదితర జీవులందరినీ ఆత్మ స్వరూపులుగా చూడటమే మనస్సు యొక్క అంతర్ముఖత్వం సుమా! ఓ రామా! అంతరంగమున వృత్తిరహితుడవై బహిర్గతంగా మాత్రం ఆయా నియమిత సమస్త కర్మలు ఆచరించు.

**అంతర్ వృత్తి విహీనేన, బహిర్వృత్తిమతేవ చ ।**
**సుప్త ప్రబుద్ధ ప్రాయేణ కార్యమ్ ఆచర, చేతసా ॥**

ఓ రామా! అభ్యంతరమున వృత్తి రహితంగాను, బాహ్యమున వృత్తి సహితుని వలెను ఉన్న వాడవై సగం నిద్రించే చిత్తముతో ప్రపంచమున కార్యములు ఒనర్చుము. బాలుడు అంతరమున వాసనలు లేకుండానే కేరింతలు, ఆటలు, చేతులు–కాళ్ల కదలికలు ప్రదర్శిస్తాడు కదా! మూగవాడు అనేక విషయాలు తెలిసికూడా ఏమీ మాట్లాడడు చూచావా? అట్లాగే అభ్యంతర వాసనలన్నీ త్యజించి ఒక బాలుని వలె, మూగవాని వలె ఈ జగత్తును దర్శించటం అలవరుచుకో. ఆసక్తి లేనప్పుడు ఏ కార్యము నిర్వర్తించినప్పటికీ – ఆకాశమును పదార్థములు స్పృశించజాలనట్లు – నిన్ను ఆ కార్యాకార్యములు స్పృశించజాలవు. సదా నిర్వికల్ప సమాధి యొక్క అభ్యాసము నిర్వర్తిస్తూ నీ చిత్తము బాహ్యమున ఒకింత ప్రసరించి అభ్యంతరమున మాత్రం అంతటా మౌనము వహించి ఉండుగాక! సంతాపరహితమై అంతటా ఆత్మయే ఈ సర్వ సహజీవులుగా అగుచున్నది కదా... అను దృఢత్వము నీ చిత్తము వహించును గాక! జ్ఞానముచే చిత్త – బాహ్య ప్రసరణము క్షయిస్తుంది. సంకల్ప కళంక వర్జితుడవై సదా సర్వదా, సర్వత్రా శుద్ధ బ్రహ్మ చైతన్యమున స్థితి కలిగి ఉండుము. ఆపైన ఇక వ్యవహరింపుము. లేదా వ్యవహరింపకుండా ఉండుము. ఏది ఎట్లో అట్లే అగుగాక!

**సుషుప్త సమయా వృత్త్యా జాగ్రత్ వ్యవహరన్ వ్రజన్ ।**
**గృహీణి మా కించిదపి, మా వా కించిత్ పరిత్యజ ॥**

నీవు మేలుకొని ఉన్నప్పుడు ఆయా అనేక వ్యవహారాలను నిర్వర్తిస్తున్నప్పుడు, రహదారిలో నడుస్తూ ఉన్నప్పుడు... తదితర సర్వసమయాలలో సుషుప్తసమయ-వృత్తితో కూడుకొన్నవాడవై ఉండు. ఇష్టం కదా అని ఏ వస్తువును గ్రహించనూ వద్దు. అయిష్టం కదా అని దేనిని త్యజించనూ వద్దు. జాగ్రత్తులో 1. స్థూల 2. సూక్ష్మ ఉభయ ఉపాధులు అనుభవమౌతున్నాయి కదా! ఈ రెండింటినీ అధిగమించినప్పటి స్థితిచే జాగ్రత్తులోనే సుషుప్త స్థితి అనుభూతమొనర్చుకున్న వాడవౌతావు. అట్లాగే 'అజ్ఞానం' యొక్క ఆవరణ తొలగుటచే సుషుప్తిలో జాగ్రత్తుడవే ఆగుచున్నావు. ఈ విధంగా జాగ్రత్ - సుషుప్తుల భేదకమైన అజ్ఞానం తొలగగా అప్పుడు ఆ ఉభయంలో ఒకానొక ఏకత్వం సిద్ధించుచున్నది. భేదమును అధిగమించటంచేతనే సర్వస్వరూపమగు ఆత్మస్థితి లభిస్తుంది. ఈ ప్రకారంగా అభ్యాసంచే మెల్లమెల్లగా 'ఆద్యంతరహితము, ద్వంద్వవర్జితము, సమస్త వస్తువులకు పరము' అయిన ఆత్మ పదము అనుభూతమవగలదు.

❖❖❖

## 10. ఆత్మ అవ్యాఖ్యానసగోచరం

**శ్రీరాముడు :**

**యద్యేవంముని శార్దూల! తదహం ప్రత్యయాత్మకః ।**
**భవానేవేహ కిం తావత్ వసిష్ఠాఖ్యః స్థితో, వద ॥**

ఓ ముని శార్దూలా! మీరు 'సమస్త వస్తువులు మిథ్యయే. అఖండ పరమాత్మ ఒక్కటే సత్యం'... అనే సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నారు కదా! అంతా మిథ్యయే అయినప్పుడు 'అహం (నేను)' అను ప్రత్యయ రూపుడనైన ఈ 'రాముడు' ఎవరు? 'వసిష్ఠ మహర్షి' అని పిలువబడే తమరు ఎవరు? గురువులగు మీకు, శిష్యుడనగు నాకు గల గురు శిష్య సంబంధం కూడా భ్రమయేనా? మీరెవరు? నేనెవరిని?... ఈ విషయం విశదీకరించండి.

❖

**శ్రీవాల్మీక మహర్షి :** ఓ భరద్వాజా! శ్రీరామచంద్రుడు ఇలా ప్రశ్నించగానే వక్తలలో శ్రేష్ఠుడగు శ్రీ వసిష్ఠ మహర్షి మౌనం వహించారు. ఆయన ముఖంలో కించిత్ చిఱునవ్వుతో కూడిన పరమ గాంభీర్యమైన శాంతి ప్రదర్శితమైంది. సభికులంతా ఇది గమనించి "ఆహా! ఇప్పుడు ఏమి కానున్నదో? రామడు సూటిగా అడిగిన ప్రశ్నకు వసిష్ఠ మహర్షి సమాధానం ఎట్లు ప్రారంభించనున్నారో!"... అని ఎంతో ఉత్సుకతతో నిశ్శబ్దంగా వేచి ఉన్నారు. ఆ విధంగా మౌనము తాండవిస్తూ ఉండగా నిశ్శబ్దంగా 45 నిమిషాలు గడచిపోయాయి. అప్పుడు మరల శ్రీరాముడే పెదవి విప్పాడు.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! ఏమిటి మీరు మౌనం వహించి ఉన్నారు? విద్వాంసులు, లోకగురువులు అయిన మీరు ప్రత్యుత్తరమీయలేని ప్రశ్న ఉండజాలదని నాకు తెలుసు. సమస్త తర్కాలకు మీ వాక్కే సమాధానమగుచుండగా మీ జ్ఞాన విశేష లహరి మాపై ప్రసరింపజేయకున్నారేమి?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

> **న మే వక్తుమ్ అశక్తత్వాత్ యుక్తిక్షయ ఉపస్థితః**
> **కింతు ప్రశ్నస్య కోట్యాస్య తూష్ణీమేవ, అనఘ! ఉత్తరమ్ ॥**

ఓ రామచంద్రా! చెప్పుటకు అశక్తుడనై మౌనం వహించాను. యుక్తి లేక కాదు. నీకు సమాధానం ఈ 45 నిమిషాలుగా చెప్పుచూనే ఉన్నాను కూడా! నీ ప్రశ్నకు పరమావధియగు సమాధానం మౌనమే నా ప్రత్యుత్తరం.

ఈ ప్రపంచంలో గురువును తాత్త్విక విషయమై ప్రశ్నించే వారిని రెండు రకాలుగా విడదీయ వచ్చు. 1.జ్ఞాని, 2.అజ్ఞాని. అజ్ఞానికి అజ్ఞానత్వమును జతచేర్చి చెప్పబడుతోంది. ఇక జ్ఞానికేమో జ్ఞానవిశేషం ద్వారానే ప్రత్యుత్తరం ఇవ్వవలసి ఉంటుంది. అనగా, శిష్యుడు కూడా ఎంత వరకు జ్ఞానానికి సమీపంగానో, దూరంగానో ఉన్నాడో గ్రహించి తదనుసారంగా సమాధానపరచాలి.

ఇతఃపూర్వం నీవు 'ఆత్మపదం' గురించి 'ఇంకనూ గ్రహించాలి' అని నాకు అనిపించనంత వరకు నేను వికల్ప సహితమగు ఆయా దృష్టాంత-సోదాహరణాలతో కూడిన సమాధానాన్ని చెప్పుచూ వచ్చాను. ఇప్పుడో? తత్త్వజ్ఞుడవై పరమ పదమున విశ్రాంతి పొందావు. ఇప్పుడు నీకు వికల్ప సహితములగు ఉదాహరణాదులతో ప్రత్యుత్తరం ఇవ్వవలసిన అవసరం లేదు. ఒకవేళ మాటలు ఉపయోగించి ఒక సూక్ష్మార్థాన్ని గాని, పరమార్థాన్ని గాని, లేక మరొక మామూలు అర్థాన్ని గాని ఆయా ఉదాహరణలు, దృష్టాంతాలు తీసుకొని చెప్పానే అనుకో.... అట్లా మాటలలో చెప్పే వర్ణనకు కొన్ని దోషాలు ఉండియే తీరుతాయి. ఉదాహరణకు సుదూరంగా ఒక ప్రదేశంలో గల ఒక సుందరమైన శిల్పం గురించి నీకు చెప్పాలనుకో... అప్పుడు "అది చాలా అందంగా ఉంటుంది. మన అయోధ్యలో గల మహా విష్ణువు యొక్క విగ్రహంలా ఎత్తుగా ఉంటుంది. మెఱుస్తూ ఉంటుంది. ముక్కు బుగ్గలు అందమైన స్త్రీ వలె అత్యంత సౌకుమార్యంగా ఉంటాయి." మొదలైన ఆయా ఉత్ప్రేక్షలు, ఉపమానాలు, విశేషణములు తీసుకొని చెప్పవలసి ఉంటుంది. అట్లా చెప్పుకొనే వాక్యాలన్నీ కొన్ని కల్పనా కళంకములతో కూడి ఉండక తప్పేది కాదు.

'కళ్లు కలువలవలె ఉంటాయి' అనే ఉపమానంలో 'కలువలకు రెక్కలెన్ని ఉంటాయో, కళ్లకు కూడా అన్నే కనురెప్పలు ఉంటాయి. కాబోలు'... అనే రూపంలో ఉండే దోషాలు ఉంటాయి. అనగా... 1.నిరూపక 2.వ్యావృత్తి 3.సంఖ్య 4.పరమార్థ-సాధన... మొదలైన ఆయా దోష కారకాలు ఉండే అవకాశం ఉంటుంది. జ్ఞాని కళంకసహితమైన సమాధానం చెప్పటానికి అర్హుడు కాదు. అజ్ఞానికి కళంకరహితమైన సమాధానం చెప్పినా అర్థం చేసుకోలేడు. ఓ ప్రియ రామచంద్రా! నీవిప్పుడు జ్ఞానులలో అగ్రగణ్యుడవు సుమా! జ్ఞాని అయిన శిష్యునితో సత్య వస్తువునకు ముక్కుకు సూటిగా, నేఱుగా, సమగ్రంగా ప్రతిపాదించవలసివస్తుంది.

'ఈ రామచంద్రుడెవరు? ఈ వసిష్ఠుడు ఎవరు'... అను నీ ప్రశ్నకు 'సమాధానం సత్యవస్తువగు ఆత్మయే' అను సమాధానమే ఉచితం. 'ఆత్మ' గురించిన పరిచ్ఛేదక కళంక రహితమైన సమాధానం

కాష్ఠం వంటి మౌనమే అయి ఉన్నది. ఆ కాష్ఠ మౌనమునే ఇప్పుడు నీ ముందు సమాధానంగా ప్రకటించాను.

జ్ఞానోదయానికి పూర్వం తత్త్వం తెలియపరచటానికి వాక్-వ్యవహార రూపం, సంకల్పమయం అగు బోధ అత్యావశ్యకం; జ్ఞానోదయానంతరం మౌనమే వ్యాఖ్యానం

కనుకనే జ్ఞానివగు నీకు ఆ సుందరమైనట్టి మౌనరూప ప్రత్యుత్తరం ఇచ్చాను. 'వసిష్ఠ మహర్షి నామధేయుడగు మీరు వాస్తవానికి ఎవరు?' - అని నీవు ప్రశ్నించినప్పుడు నేను వాక్కుకు కూడా అతీతము, అవిషయము అగు ఆత్మ స్థితిని అవధరించాను. మనుజుడు ఏ స్థితిలో ఉంటే ఆ స్థితిని బట్టే మాట్లాడతాడు. ఎప్పుడైతే నేను ఆత్మ స్థితుడనైనానో, ఆ స్థితి వాక్కుకు అతీతమైనది. మనస్సును కూడా అధిగమించినది. కనుక (యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహా) అట్టి అనుభవ స్థితిలో వాగ్రూపాలను ఎట్లా పరిగ్రహించగలను? ఆత్మానుభవం అవాచ్యం. వాక్కు అనేక కళంకాలతో మాత్రమే నిర్మితమౌతుంది. కాబట్టి ఇక మౌనమే నా సమాధానంగా నాకు శరణ్యమైనది.

**శ్రీరాముడు :** మీ 'మౌనం' అనునది సముచిత సమాధానమేనని నేను శిరసు వంచి అంగీకరిస్తున్నాను. అయితే అట్టి సమాధానం గ్రహించడానికి మేము వాక్-మనో అతీతత్వ నిశ్చితత్త్వమును గ్రహించునంతటి సాధనా ఔన్నత్యం సముపార్జించి ఉండాలి. సాధక జనులలో అనేకులు అంతటి సూక్ష్మ-పక్వ దృష్టి పొంది ఉండకపోవటం లోకరీతి కనుక వాక్కుకు ఏ నిరూపక వ్యావృత్తాది దోషాలు ఉంటాయో, వాటిని పట్టించుకోకయే (వాటిని వదలి) భోగ-త్యాగ-లక్షణాది ఉపాయాలచే' వసిష్ఠ మహర్షి నామధేయుడగు మీరెవరు? అను నా ప్రశ్నకు సమాధానం ప్రసాదించ ప్రార్థన.

❖❖❖

## 11. మనమందరమూ అద్వితీయాత్మస్వరూపులమే!

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**ఏవం స్థితే రాఘవ హే! యథా భూతమిదం శృణు**
**కస్త్వం? కోహం? జగద్వా కిమితి? తత్త్వవిదాంవర!**

తత్త్వజ్ఞులలో శ్రేష్ఠుడవగు ఓ రామచంద్రా! నీవు కోరుచున్నావు కాబట్టి "నీవెవరు? నేనెవరు? ఈ జగత్తు ఏమిటి?"... అనే ప్రశ్నకు వాచ్య-వాచకపూర్వకమైన సమాధానం చెబుతాను, విను.

ఏ చిదాకాశమైతే విషయ వర్జితమై, సమస్త కల్పనలకు పరమై, నిర్వికారమై ఉన్నదో అట్టి చిదాకాశమే నేను, నేనే కాదు. నేను-నీవు కూడా ఆ చిదాకాశరూపులమే! ఈ సమస్త జగత్తు కూడా చిదాకాశమే అయి ఉన్నది.

శుద్ధజ్ఞానమయ ఆత్మయందు శుద్ధజ్ఞానైకరూపుడనగు నేను అన్య విషయ జ్ఞానా లన్నింటికి అతీతుడనై నెలకొని ఉన్నాను. నాకంటే వేఱుగా ఏదీ అణుమాత్రంగా కూడా గోచరించటం లేదు. ఒకటి రెండవ దానికి వేరైనప్పుడు కదా, 'సంబంధం' అనే మాట? కనుక చిదాకాశమునకు నాకు

'సంబంధం' అనే మాట అనుచితం, అయుక్తియుక్తం. అయితే ఆత్మాకాశమే దివ్యానుభవంగా గల నన్ను శిష్యులు ఆశ్రయిస్తూ ఉండగా, వారికి వారి యొక్క స్వస్వరూపాన్ని బోధించాల్సిన సందర్భం ఏర్పడుతోంది. అట్టి సందర్భంలో వారి సందేహాలు నివర్తించటానికి, ప్రతివాదాలపై విజయం కొఱకు, అద్వైతపక్ష స్థానమునందు తత్పరులై ప్రయత్నశీలురై ఉన్న జ్ఞానుల సౌకర్యార్థం ఈ ఆత్మ తత్త్వమును సవివరంగా అభివర్ణిస్తున్నారు. అంతేగాని, అజ్ఞానుల వలె - వీరిది తప్పనో - వారిది ఒప్పనో - ఖండించి - శ్లాఘించడానికి కానే కాదు.

ప్రశాంతుడగు పూర్ణజ్ఞాని ఈ దేహము ఉన్నప్పుడు లేనప్పుడు కూడా ఏ పరమశాంతమగు స్థితిని అనుభవిస్తున్నాడో అట్టి అభిమానరహితమగు అఖండ - అప్రమేయ స్థితియే "పరమపదము."

**అబహిఃసాధనం , శాంతమనన్తః, సాధనమ్ సమమ్ ।**

**న సుఖం నాఽసుఖం నాఽహమ్ న అన్యదిత్యాది తం "శివమ్"॥**

అట్టి పరమ పదం (ఆత్మస్థితి) బాహ్య-అభ్యంతర సాధన రహితమైనది. శాంతం-అనంతం కూడా! సుఖ-దుఃఖ రహితమైనది. "అహం-త్వమ్" ఇత్యాది పదార్థశూన్యమైనది. అది కేవల శివస్వరూపమైనది.

'అహంత్వము' అనేది ముక్తి యొక్క అభావరూపం అయి ఉన్నది. మరప్పుడు అహంత్వముచే ముక్తి యొక్క అనుభవం ఎట్లా? కాబట్టి'అహంభావము'ను అంగీకరించి ఆపై ముక్తిని వెతుకువాడు - జన్మాంధుడు చిత్ర పటమును చూడజాలనట్లు - ముక్తత్వమును గాంచలేడు మరి?

**స్పందనే అస్పందనే చైవ యత్ పాషాణవదాసితమ్**

**అజడస్యైవ తత్విద్ధి నిర్వాణం, అజరం పదమ్ ॥**

మనస్సు-బుద్ధి-చిత్తం-అహంకారం మొదలైన చేష్టలు ఉన్నప్పుడు, అట్టి చేష్టలు లేనప్పుడు కూడా చైతన్యం యొక్క నిశ్చలమైన ప్రశాంతస్థితి కొనసాగుతూనే ఉంటోంది. అద్దానినే అజరమైన 'నిర్వాణపదం' అని గ్రహించు. ఒక అజ్ఞాని తన అంతరంగంలో కుండ-ఇల్లు-ఊరు మొదలైన వస్తువులను స్ఫురణరూపఫలంగా పొందుతూంటాడు చూచావా? లోకైషణా సహితుడు లోకంలోని వస్తువులను ఊహలద్వారా హృదయంలో - ఈ భౌతిక దేహం ఉన్నప్పుడు లేనప్పుడు కూడా గాంచుచూనే ఉన్నాడు.

ఇక లోకైషణారహితుడైన జ్ఞాని అంతే స్పష్టంగా తనలో "చిద్రూపం- స్వయంప్రకాశమయం" అగు ఆత్మను స్వయంగా అనుభవిస్తున్నాడు. ఆత్మకు వేరైనదేదీ అతనికి అనుభవం కావటమే లేదు. అట్టి ఆత్మపదమునందు 'నేను-నీవు' అను విశేషాలుగాని, అనహంత్వం - అన్యత్వం మొదలైన భావనలు కూడా గాని లేవు. కేవలం "కేవలీ భావమైన - నిర్వాణరూపమైన నిర్మలమగు శివరూప ఆత్మ" ఒక్కటే ఉన్నది. చైతన్యమునందు కించిత్ చమత్కారంగా విషయాల సంబంధితమైన "వ్యాప్తి రూప క్రియ" ఏర్పడటం జరుగుతోంది. అట్టి నిర్విషయ నిర్మల ఆత్మ యొక్క కించిత్ విషయాసక్త రూప ఆశ్రయమే మహత్తర క్లేశాన్ని కలిగించు బంధంగా కనబడుచున్నది.

విషయోన్ముఖత్వమే... సంసారము! చైతన్యం విషయోన్ముఖత్వం కాకుండుటయే... అవ్యయ పదమగు మోక్షం! వాస్తవానికి అపరిమితమగు చైతన్యం పరిమితమగు విషయాలచే బాధింపబడటం ఎట్లా కుదురుతుంది? దేశకాలాదులచే అపరిచ్ఛిన్నమై, శాంతమై, నిజశాంతస్వరూపమున స్థితి కలిగి ఉన్నదైనట్టి చైతన్యమునందు "విషయం" అనబడేదేదీ సంభవించజాలదు. ఇక అట్టి ఆత్మ చైతన్యం దేనిచే ఎట్లు బంధం పొందగలదు?

ఓ ప్రియశ్రోతలారా! ఒకడు ఒక కల కంటున్నాడనుకోండి. ఆ స్వప్నం ఎక్కడి నుండి ఎవరు కల్పించగా వచ్చింది? స్వప్నరూపమగు చైతన్యమునకు అంతర్గతంగానే వాసనా రూపసంకల్పంగా ఆ స్వప్న జగత్తు ఉబుకుచున్నది కదా! కనుక ఆ స్వప్నజగత్తు చైతన్యమునుండే వచ్చింది. వేరుగా ఎక్కడి నుండి రాలేదు. అనగా స్వప్న జగత్తు చైతన్యమునకు వేఱుకాదు. కానీ వేరుగా అజ్ఞానంచేత అనిపిస్తోంది. అట్లాగే... ఈ బాహ్యజగత్తు కూడా స్వస్వరూపమగు చైతన్యమునకు అభిన్నంగా 'అనన్యంగా' ఉన్నప్పటికీ భిన్నమైనట్లు బాహ్యజగద్రూపంగా అనిపిస్తోంది.

వాస్తవానికి ఈ జగత్తు ఆత్మ కంటే భిన్నం కాదు. జగత్తులాగానే మనో-బుద్ధి-చిత్త అహంకా రాదులు కూడా బహిర్ముఖంగా కనిపిస్తున్నప్పటికీ అంతర్ముఖత్వం చేత అవన్నీ ఆత్మకు అభిన్నమైన చిద్రూపాలే. బాహ్య అభ్యంతరాలలో అంతటా కూడా "నిర్మలం-సమం-అభిన్నం"... అయినట్టి చైతన్యం మాత్రమే వ్యాపించి ఉండగా, ఇక అన్యమైనదెక్కడుంది చెప్పు? "చైతన్యంలో బహిర్ముఖత్వం" ...అనే భ్రమ చేత ఏ బుద్ధి ఉందో... ఆ బుద్ధియే ఈ 'సంసారం' అనే అనర్థమంతా కలిగిస్తోంది సుమా! శుద్ధమైన చైతన్యం, శూన్యం అను రెండింటి భేద-అభేదాలేమిటో విజ్ఞులు తమయందు అనుభవైకవేద్యంగా స్పష్టంగా గ్రహిస్తున్నారు. చిన్మాత్ర రూపమైన నిత్య నిరతిశయానందం ఎవరికి వారికే అనుభవైకవేద్యమేగాని వాక్కుతో చెప్పగలిగేది కాదు. మసక చీకటిలో వస్తువులు కొంత కనబడి కొంత కనబడక అవాస్తవతతో కూడి అనుభవమౌతాయి చూచావా? అట్లాగే ఈ జగత్తు కూడా అజ్ఞాన మసకచీకట్ల కారణంచేత "ఉన్నది ఒకటి, చూచేది మరొకటి"గా అనుభవమౌతోంది.

స్వతహాగా వాసనారహితుడను శాంతుడను అగుటచేత నేను చిదాకాశరూపుడను అయి ఉన్నాను. నేనే కాదు. నీవుగాని, మరెవరైనా గాని వాసనలను ధరించకపోతే మనసంతా సర్వదా స్వతఃసిద్ధమగు చిదాకాశరూపులమే అయి ఉన్నాము. ఓ రామా! వ్యవహారదశయందు అజ్ఞుని వలె ఉన్నప్పటికీ సర్వదా చిన్మాత్ర శరీరధారివై ఉండు. చిన్మాత్ర శరీరధారణ అను అనునిత్యమైన అభ్యాసం బలపడుతూ ఉండగా, ఇక ఈ దేహాదులతో కూడిన జగత్తు క్రమంగా అసత్తుల్యమై స్వయంగా శమం పొందుచూ పోగలదు.

"నేను అజ్ఞుడను"... అను స్వస్వరూపముపై గల అభిప్రాయమే సంసారరూపమగు అవిద్యాగ్ని. అది అజ్ఞానవాయువుచే ప్రజ్వలితం అవుతోంది. అయితే అదే జీవుడు "నేను సర్వదా అఖండము అప్రమేయము అగు బ్రహ్మమునే"... అను రూపం గల ఆత్మసాక్షాత్కార చరమవృత్తి రూపమైన 'పరిణతి' సంపాదించుకోవటం చేత సంసారాగ్ని తానంతట అదే చల్లారుతుంది.

"జీవుడుగా నేను ఒక చీమ కంటే కూడా అధికుడను గాను. కానీ ఆత్మగా నేను బ్రహ్మదేవుని కంటే కూడా అతీతుడను" అని ముక్తపురుషులు గ్రహించి ఉంటారు. అట్టి ముక్త పురుషులు కూడా ఈ జగత్తులోనే ఉన్నారు. వారు నిత్యనిరతిశయానంద రూపంలో స్థాణువు వలె అజ్ఞానం లేనట్టిది – దుఃఖక్షోభా వర్జితం... అయినట్టి "ఆత్మయందలి స్థితి"నే శాస్త్రములు అక్షయమైన "మోక్షము" అను శబ్దముచే ఉద్దేశిస్తున్నాయి.

ఆత్మను ఎఱుగకపోవటం చేత జీవుడు అజ్ఞాన దశను పొంది పశువృక్షాది జన్మలు సంపాదించుకుంటున్నాడు.

ఆత్మజ్ఞానం చేత ఆత్మరూపత్వం పొంది మానవుడు సాక్షాత్ "ముని"గా పరిణమిస్తున్నాడు. చీకటిలో వస్తువులు మిథ్యతో కూడిన ఆకారాలుగా కనిపిస్తాయి. అట్లాగే "నేను, జగత్తు, బ్రహ్మం" ఇవన్నీ వేరువేరు ఆకారాల వలె అవిద్యామయమగు భ్రమచేత అనిపిస్తున్నాయి. 'ఆత్మదర్శనం' అనే దీపం వెలుగగానే... అంతటా శివము, శాంతము అగు ఆత్మయే గోచరించటం జరుగగలదు. సంకల్పరహితుడు, దృశ్యమునకు సంబంధించిన వేదనను అధిగమించినవాడు, అహంకార–వాసనా వర్జితుడు, ప్రశాంతచిత్తుడు అయిన జీవన్ముక్తుడు ఈ ఇంద్రియ సమూహాలు, ఈ బాహ్య పదార్థాలు ఎదురుగా ఉన్నప్పటికీ త్యజించడు. ఒకింతగా కూడా ఆశించడు. అనగా, అవన్నీ మిథ్యగా చూడ గలుగుతాడు. గాఢనిద్రలో ప్రవేశించేవానికి జాగ్రత్ స్వప్న వ్యవహారాలు లేకుండా పోతాయి. చూచావా? అట్లాగే "ఆత్మాజ్ఞానానుభవి" విషయంలో సమస్త దృశ్య సమూహాలు ఆత్మయందు లయించిపోతాయి. అతనికి ఈ జగత్తంతా స్వాత్మరూపంగానే భాసిస్తూ (గోచరిస్తూ) ఉంటుంది.

ఆకాశంలో నీలత్వం కనిపించటమనేది కంటియొక్క భ్రమేకదా! అట్లాగే బ్రహ్మమునందు పృథివి మొదలైన ఆయా వస్తువులు, దేహములు కనిపించటమనేది భ్రాంతి మాత్రమే గాని, మరింకేమీ కాదు. ఆకాశం వాస్తవానికి నీలరంగు రహితంగా, స్వచ్ఛంగా ఉంటున్నట్లు బ్రహ్మం కూడా సర్వదా దృశ్య పదార్థరహితమై, నిర్మలమై ఉన్నది "ఈ సమస్తజగత్తు అసత్తుయే" అను చక్కని బుద్ధి ఎవడు పెంపొందించుకుంటాడో... అట్టివాడు సమస్త వాసనలు కలిగి ఉన్నప్పటికీ వాసనా రహితుడే సుమా!

భవ్యరూపుడవగు ఓ రామచంద్రా! స్వప్న–సంకల్ప– ఇంద్రజాలము లందు... కనిపించే సమస్త అద్భుత సృష్టి మాయామయము, అసత్తు మాత్రమే కదా!

అట్లాగే ఈ బ్రహ్మాండ సృష్టులన్నీ అసత్యములే అయి ఉన్నాయి. స్వప్నసమయమందలి స్వప్నంలాగానే ఈ బాహ్య వస్తు–వ్యవహారములందు వివేకులకు ఏమాత్రం విశ్వాసం జనించదు.

**న దుఃఖమస్తి న సుఖం న పుణ్యం న చ పాతకమ్**
**న కించిత్ కస్యచిత్ నష్టం కర్తుర్భోక్తురసంభవాత్ ॥**

స్వయంకృతమైన భ్రమచే అనుభవమగుచున్న కల్పితానుభవాలకు కర్త ఎవడు? భోక్త ఎవడు? ఇక సుఖదుఃఖ పుణ్యపాపాలు ఎక్కడివి? ఎవనికి ఏది నశిస్తోంది? ఏది ఉత్పన్నమౌతోంది? ఈ సమస్త జగత్తు కూడా "దృశ్యశూన్యమై నిరాధారమైన" ఆత్మయే అయి ఉన్నది. ఏ అహంకారమునకైతే

మమత్వము అనేది ప్రతీత మగుచున్నదో... అది కూడా రెండవ చంద్రునివలె, స్వప్ననగరంవలే "ఆ ఉభయములు కూడా లేనివే" సుమా!

ఓ రఘురామా! ఈ జగత్తుకు ఒక కారణం అంటూ ఉంటే... అది అకారణ - శాంత - నిరాకార అగు కూటస్థ బ్రహ్మమేగాని, మరింకేమీ కాదు.

ఈ సృష్టి, సంకల్పాత్మకమగు (కారణరూపమగు) చిత్తం, ఆ చిత్తము యొక్క కార్యరూపమగు ఏక-అనేక రూపములతో కూడిన బ్రహ్మాండరూప ప్రపంచము, ఆ బ్రహ్మాండరూప ప్రపంచము యొక్క అంతర్గతాలైనట్టి "పృథివి" మొదలైన పదార్థజాలం, దేహి-దేహం (అవయవి-అవయవాలు) యొక్క స్థితి-గతులు... ఇవన్నీ కూడా బ్రహ్మం యొక్క వివర్తం తప్ప మరింకేమీ కాదు.

మరింకేదియో అనటానికి యుక్తి కుదరదు. అనగా, అజ్ఞానముచే త్రాడే పామురూపంగా భాసించునట్లు తత్త్వజ్ఞానం యొక్క లేమిచేత బ్రహ్మమే 'జగత్తు' రూపంగా భాసించటం జరుగుతోంది. "పాముగా కనిపించటం త్రాడు యొక్క స్వభావం"... అని అనగలమా? లేదు. అట్లాగే "జగత్తుగా భాసించటం బ్రహ్మం యొక్క స్వభావం" అను స్వభావం గూర్చిన వచనం యుక్తి యుక్తమే కాదు. అట్లాగే "ఈ ప్రకాశ్యకమైన జగత్తు మిథ్యయే అయినట్లు ప్రకాశమగు చైతన్యం అనేది కూడా మిథ్యయే"... అనే నాస్తికవాదం కూడా ఏమాత్రం యుక్తియుక్తం కాదు. ఎందుకంటే "సమస్తం లేదు. అంతా నాస్తి" అని చెప్పే ఆ నాస్తికుడు విద్యమానమే అయి ఉన్నాడు కదా! "ఇదంతా లేదు" అనే అనుభవం లేక అభిప్రాయం ఎవరిదో... అదియే పరమాత్మ యొక్క సత్త. "ఏదీ లేదు. (సర్వం నాస్తి). కనుక నేను కూడా లేను"... అని తనను తాను ఎవరూ నిషేధించలేరుకదా! ఎద్దాని ఉనికైతే నిషేధించటానికి ఏమాత్రం వీలుకాదో... అదే బ్రహ్మం. ఓ రామచంద్రా! ఏ పరమార్థసత్యమగు 'ఆత్మ' బ్రహ్మజ్ఞానులచే ఎల్లప్పుడూ సేవించబడుతుందో, ఏ స్వస్వరూపమైతే అన్యులచే అపహరించ బడటానికి ఏమాత్రం శక్యం కాదో ...అట్టి శాంతం-నిర్మలం-అజం-సమం-అక్షయం-నిత్యసిద్ధం అగు శివస్వరూపుడవై ఉండు. ఇక, వ్యవహార దశలందంటావా... తదితరులవలెనే నీవు కూడా భోజన-పాన-క్రీడాదులు నిర్వర్తించు. "ఏది ఎట్లు ఉంటున్నప్పటికీ, ఉండకపోయినప్పటికీ అస్మత్ స్వస్వరూపం త్రికాలలోనూ యథాతథం" అని గ్రహించి ఉండు. "స్వస్వరూపం, తదితరం" - ఈ ఉభయం గ్రహించి సమన్వయించుకొని పరమార్థమును సుస్థిరీకరించుకున్నావా... ఇక నీవు ముక్తుడవే అవుతావు. ఎందుకంటే, ఈ దృశ్యబంధమే నీకుండదు కాబట్టి! 'బంధం' అనబడేది స్వయంకల్పితమైన వైచిత్ర్య చమత్కారమే కాబట్టి!

❖❖❖

## 12. "అనహమ్" ఏవ ముక్తిః

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జీవుడు స్వతహాగా మోక్ష స్వరూపుడై ఉండి కూడా... అతని అట్టి అనుభవమునకు ఏది నిరోధమై ప్రాప్తిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! "అహంభావం (నేను-నాది)" అనేది సమస్త సాంసారిక వ్యవస్థ లకు, అవిద్యకు మూలభూతమై ఆతని మోక్షపదానికి అడ్డుగా అగుచున్నది. అట్టి అహంభావమును కలిగియే ఉండి ఎవరు మూడు లోకాలలోనూ ముక్తి కొరకై వెతుకుతూ ఉంటారో... అట్టి మూఢుల ప్రయత్నమంతా 'పిచ్చివాని పరుగులు' వంటివేనయ్యా! అజ్ఞానంచే ఏర్పడిన అహంభావం యొక్క ఉనికియే 'ఇంకా అజ్ఞానం ఉన్నది' అనటానికి గుర్తు సుమా! శాంతుడగు జ్ఞానికి 'అహం-మమ' (నేను-నాది) అనే అభిమానం ఉండదు. జ్ఞాని తన యొక్క జ్ఞాన సముపార్జనాబలం చేత ఈ అహంభావ మాలిన్యాన్ని పూర్తిగా త్యజించివేసి ఆకాశం వలె నిర్మలుడై మోక్షరూపంలో వెలయు చున్నాడు. అట్టి జ్ఞాని దేహసహితుడై ఉన్నా, లేక, దేహరహితుడై ఉన్నా కూడా... సదా సంతాప రహితుడై వెలయుచున్నాడు. అట్టి అహంకారరహితుడై ప్రకాశించే జ్ఞాని శోభించే విధంగా పూర్ణ చంద్రబింబం గాని, కెరటత్వం వదలి అత్యంత శాంతం వహించిన సముద్రంగాని, శరత్కాలంలోని మేఘరహిత ఆకాశంగాని శోభించలేవు. ఒక చిత్రపటంలో చిత్రించబడిన సైన్యం ఏ విధంగా సంక్షోభవర్జితమై ఉంటుందో... అట్లా వ్యవహార నిమగ్నుడైనప్పుడు కూడా జ్ఞాని సదా సమత్వం తోనే కూడి పరమప్రశాంతుడై, నిర్లిప్తుడై, సుఖ విశ్రాంతి స్వరూపుడై ఉంటాడు.

**తరత్తరంగో జలధిః జలమేవ యథాఖిలమ్**
**దృశ్యోచ్ఛూనమపి బ్రహ్మ, తథా బ్రహ్మైవ నేఽతరత్**

చంచల తరంగాలతో కూడి ఉన్నప్పటికీ సముద్రమంతా జలమే కదా! దృశ్యంతో తాదాత్మ్యమై ఉన్నప్పటికీ బ్రహ్మం బ్రహ్మమేగాని అన్యం కాదు. తరంగాలతో కనిపించే సముద్రం బాహ్యానికి క్షోభయుతంగా ఉన్నప్పటికీ లోన ప్రశాంతంగానే ఉంటుంది కదా! అట్లాగే బాహ్యానికి ఆయా సందర్భానుచితంగా క్షుబ్ధంగా కనిపిస్తున్నప్పటికీ అభ్యంతరంలో ముక్తుడు పరమశాంతంగాను, సదా ప్రసన్నంగాను ఉంటాడు. అన్ని తరంగాలలోనూ జలమే స్ఫురిస్తూ ఉండగా, ఇక ఒక తరంగానికి మరొక తరంగానికి భేదమెక్కడున్నది? చైతన్యమగు ఆత్మయందు అహంకారాది సృష్టి రూపంగా చైతన్యమే స్ఫురిస్తూ ఉండగా, ఇక పదార్థముల అనేకత్వం ఎక్కడిది? ఆ అనేకంగా స్ఫురించేదంతా భ్రమచేత మాత్రమే! ఆకారంలో దట్టమైన పొగ ప్రవేశించినప్పుడు ఆ పొగ అనేక ఆకారాలుగా కనిపిస్తున్నప్పటికీ ఆ ఆకారాలన్నీ వస్తుతః పొగ (ధూమం) కంటే వేరు కానట్లే ఈ కనబడే సృష్టులన్నీ పరబ్రహ్మం కంటే, వేరు కాదు. ఓ విజ్ఞులకు సర్వసభికులారా! మీరంతా దేనిగురించి కూడా విషాదం పొందవలసిన అవసరమే లేదు. నేను చర్వితచర్వణంగా చెప్పుతూ వస్తున్నట్లు సమస్త విషాదాలకు హేతువుగా అనిపిస్తున్న ఈ ప్రపంచం కేవలం చైతన్యం యొక్క వివర్తం మాత్రమే! ఇది విచారణాబలం చేత గ్రహించండి. ఈ ప్రపంచం యొక్క భ్రాంతిని వదలి ఆత్మయందు విలాసశీలురై తత్ఫలితంగా సర్వోత్తమత్వముచే విరాజిల్లండి. మన ఈ సంభాషణా ప్రభావం చేత జ్ఞానులుగానే అగుచుండగా, ఇక అజ్ఞత్వ మెక్కడిది?

**అంకుర దృష్టాంతం** - విత్తనములో దాగి ఉండే ఆకార రహితమైన అంకురసత్త తనయందు వృక్షము ఆకులు పూలు మొదలైనవన్నీ అనుభవిస్తున్నట్లు, తాను నిరాకారుడైనప్పటికీ ఈ జీవుడు

ఆకాశమువలె నిర్మలము - విశాలము అయిన ఆత్మయందు జగత్తు - అహంకారము మొదలైనవన్నీ అనుభవించుచున్నాడు.

**గాలిలో కదిలే అగ్నిజ్వాల దృష్టాంతం -** ఒక కొఱివిని (లోహపు గొట్టానికి నూనె గుడ్డలు చుట్టి అంటించగా ప్రజ్వలించే అగ్నిజ్వాల) గాలిలో త్రిప్పుతూ ఉంటే అప్పుడు కంటికి (ఆ త్రిప్పే విధానాన్ని బట్టి) గాలిలో చక్ర-దండాది ఆకారం వలె కనిపిస్తుంది. అక్కడ కనిపించే ఆకారం భ్రమ అయినట్లు ఆత్మయే స్వరూపంగా కలిగి ఉన్నప్పటికీ ఇక్కడ జీవునకు జగత్తు అహంకారాది అనుభవమంతా ప్రాప్తిస్తోంది.

**కాముకుడు, ప్రేయసి -** ఎదురుగా ఉన్నది తదితర అన్ని దేహాల వలె రక్తమాంస నిర్మితమే అయినప్పటికీ... కాముకుని చిత్తానికి స్త్రీ రూపాలు కామినుల వలె అగుపిస్తున్నట్లు... జీవునికి తన అంతరంగంలో ప్రక్షిప్తమై ఉన్న వికారాలను అనుసరించి బాహ్యంలో రూపాదుల సత్త, అభ్యంతరంలో మనస్సు మొదలైన వాటి యొక్క సత్త అనుభవమౌతోంది. వాస్తవానికి అవన్నీ ఆత్మయే అయినా, విరుద్ధమైన లక్షణత్వంగా ప్రదర్శితమవుతోంది. ఆత్మ వ్యతిరిక్తంగా అనుభవమౌతోంది.

కాబట్టి ప్రియ శ్రోతలారా! ఈ జగత్తు ఎట్లా ఉత్పన్నమౌతోంది? ఎట్లా స్థితి కలిగి ఉంటోంది? ఎట్లా తన కార్య సంరంభమంతా ప్రదర్శిస్తోంది? ఇది ఎట్లా సుఖ దుఃఖాలు అనుభవిస్తోంది? ఎట్లా నశిస్తోంది? దీని దేశ-కాలములు ఎట్టివి?...

ఈ ప్రశ్నలకు సమాధానంగా మనం ఉత్పత్తి - స్థితి - ఉపశమనాది ప్రకరణాలలో అనేక విషయాలు చెప్పుకున్నాం కదా! అనేక యుక్తులతో ఇన్ని రోజులుగా మనం చెప్పుకున్న విషయాలన్నీ విమర్శించి 'జగత్తుగా' అనిపించేది భ్రమచేతనేనని, వాస్తవానికి ఇదంతా ఆత్మయే అయి ఉన్నదని గ్రహించి, దేహసంబంధ జరామరణాదులను స్వస్వరూపంపై ఆపాదించటం మానివేసి శాంతాన్ని వహించి ఉండెదరు గాక! ఎవడైతే ఈ జగత్తులో ఇష్ట-అయిష్టములు ప్రాప్తించే సందర్భంలో (సమయంలో) ఒక శవం వలె పరమశాంతచిత్తుడై ఉంటాడో, సమత్వం వహించగలిగి ఉండే యుక్తితో కూడిన శక్తిని సంపాదించుకుని ఉంటాడో - అట్టివాడే "జీవన్ముక్తుడు" అని అనిపించు కుంటాడు. ఈ ప్రపంచం నిండా భిన్నత్వం ఉన్నప్పటికీ అతనిలో భిన్నత్వం ఒకింత కూడా ఉదయించదు, సంభవించదు. వాసనారహితులగు జీవన్ముక్తుల అహంత్వమునకు, ఆ అహంత్వముచే భోక్తృత్వమునకు, చైతన్యమునకు ఒకింత కూడా భేదం ఉండదు. సముద్రంలో ఓడ భారంగా ఆయా వస్తువులను మోసుకు వెళ్ళుచున్నట్లు సాంసారిక జీవుడు తాను అహంకార - వాసనాది పాశములచే బంధించబడి తద్ద్వారా అనుభవించే జగత్ రూప వ్యవహారమంతా మోస్తున్నాడు. అట్టిమోత బరువు (ప్రాపంచిక సంస్కారాల ధారణ) భారం కొరకే అయి ఉన్నది. "ఈ జగత్తు-మనో-ప్రాణాదులన్నీ చిద్రూపమే, ఆత్మరూపమే"... అని గ్రహించినవాడు దేహ-మనో- ప్రాణాదులు ధరించి ఉన్నప్పటికీ ధరించనివాడే అగుచున్నాడు. కాదూ? ఈ జీవ-జగత్తుల రూపసత్త (భేద వ్యవహారాలను నమ్మకంతో) పొందు వారికి దుఃఖమే పరిణామంగా అగుచున్నది.

'అజ్ఞానం' అను జడత్వ రూపమైన అపరాధాన్ని దృష్టియందు, హృదయం నందు అట్టేబెట్టుకొన్నంత వరకు 'మోక్షము' యొక్క నిరతిశయానందము జీవునకు అలభ్యం

ఓ రామచంద్రా! ఏ పదార్థములు సంకల్పముచే సిద్ధించుచున్నాయో, ఆయా పదార్థములన్నీ కూడా సంకల్ప ప్రభావం చేతనే మరల తప్పక నశించబోతున్నాయి. సంకల్పాలకు ఈవల మోక్షం సిద్ధించదు. ఎచ్చటైతే సంకల్పం సంభవించదో... అదే సత్యమైన నాశరహితమైన మోక్షపదము. దేనిని ఆత్మకు అనన్యంగా చూస్తామో అద్దాని పట్ల అంతంత వరకూ మనం సంకల్ప రహితులమేనని సూక్ష్మదృష్టితో గ్రహించు.

**"నా అన్యో, న చ అహమస్మి" ఇతి భావనాత్ నిర్భయోభవ**
**సత్యం యుక్తం భవతి ఏతత్ విషమపి అమృతం యథా ॥**

'నేను' – అనునది స్వతహాగా దేహాతీతమైనది జగదతీతమైనది. ఓ ప్రియమైన శ్రోతలారా! "నేను గాని, దానికి అన్యమైన 'నీవు' మొదలైనవి గాని లేవు"... అను భావనచే మీరంతా నిర్భయత్వం పెంపొందించుకోండి. ఒక మూఢుడు అమృతమును "ఇది విషం" అని తలచి ఉపేక్షించవచ్చుగాక! విషమును అమృతమని తలచి అపేక్షించవచ్చుగాక! విజ్ఞుడైనవాడు బాగా పరిశీలించి అప్పుడు అమృతమును స్వీకరించటం, విషమును దూరంగా ఉంచటం చేస్తాడు కదా! అట్లాగే ప్రాజ్ఞుడైనవాడు విషప్రాయమగు 'అహంకారము'ను వదలి అమృతప్రాయమగు 'అనహమ్'ను చక్కగా గ్రహిస్తు న్నాడు. "సకల భయాలకు కారణ 'అహమ్' అనునదే" అని గుర్తిస్తున్నాడు. జ్ఞాని అయినవాడు అల్ప దృష్టికి తారసపడే సత్యములను ప్రక్కకు పెట్టి 'పరమార్థసత్యము'నందు మాత్రమే లక్ష్యశుద్ధి కలిగి ఉంటున్నాడు. ఎందుకంటావేమో? ఈ జగత్తు, దేహం మొదలుకొని చిత్తము వరకు గల ఈ ఉపాధిని ఎంతగా వెతకి వెతకి చూచినా కూడా "నేను" అనుదానికి ఎచ్చటా స్థానమే లభించటం లేదు. కాబట్టి "ఈ జడమైన దేహాదులు నేను కాదు" అనునదే ఇక్కడి పరమార్థసత్యము. ఆత్మ విచారణచే ఎవరిపట్లైతే ఈ చిత్తము మొదలైనవి అకృతముగాను, సహజంగాను శమించిపోతాయో (లేక) 'అవి లేనివే' అని తెలియవస్తాయో... అట్టివారియందు అహంత్వము అనేది కూడా స్వయంగా నిర్విషయరూపమై స్వయంగా ఆత్మత్వమునందు లయిస్తోంది, 'అది నశిస్తోంది' అని మనం అంటున్న ప్పటికీ వాస్తవానికి నశించదు. మరి? అది ఆత్మత్వము (అఖండత్వము అప్రమేయత్వము – నిర్గుణద్వము – నిర్మలత్వము) సంతరించుకొంటోందని గ్రహించు. అట్టి ముక్తత్వము సంతరించు కోవటానికి మూడు ఉపాయాలు–

1. భోగత్యాగము – తద్వారా క్రమక్రమంగా దృశ్యత్యాగము
2. ఆత్మవిచారణ – తద్వారా దృశ్యాతీతత్వము
3. మనో ఇంద్రియాదుల నిగ్రహరూప పురుష ప్రయత్నం (శాస్త్ర ప్రవచిత సాధనాభ్యాసం)

సర్వముముక్షువులారా! పై మూడు యత్నాలచే అనాత్మత్వాన్ని మొదలంటా పరిత్యజించి 'స్వాత్మ'ను శరణువేడండి. ఆత్మ స్వరూపం చే ఈ పృథివిని ఈ లోకాలను ఆక్రమించివేసి ఉండండి.

**మోక్షము అనగా? -** "వాసనలన్నీ క్షయింపగా అప్పటి మనస్సు యొక్క బ్రహ్మం తోటి ఏకత్వ సంబంధమైన స్థితియే మోక్షము" అని శ్రుతులు, విద్వాంసులు సిద్ధాంతీకరించుచున్నారు. ఈ ప్రపంచంలో సంఘటనల పట్ల, పదార్థములపట్ల, సంబంధాల పట్ల, వ్యవహారాల పట్ల మనస్సుకు సుఖ-దుఃఖ-భయ-క్రోధాది ఎటువంటి ప్రభావం కలగకపోతే, అప్పుడు ఆ మనస్సు వాసనా రహితమైన దానిగా చెప్పుతారు. అయితే, అట్టి 'మోక్షము' అనేది తత్త్వజ్ఞానం లేకపోతే ఎన్నటికీ సంభవించదు. "ఆత్మసత్యమ్-జగత్‌మిథ్యా" అనునదే మోక్ష శాస్త్రం యొక్క సారం. కానీ, చాలా మంది జీవులకు రాగాదుల ప్రాబల్యం చేత "ఈ జగత్తు సత్యమే కదా"...అనే భ్రమతో కూడిన నమ్మకం తొలగటం లేదు. అందుచేతనే ఆత్మశాస్త్రాలపై, ఆత్మజ్ఞానంపై సరైన విశ్వాసం కలగటం లేదు. తత్ఫలితంగా అట్టి జీవులపట్ల సంసార బంధము నిత్యము అనువర్తిస్తూనే ఉంటుంది.

కనుక ఓ రామచంద్రా! ఈ జీవుడు ఆత్యవసరంగా "జగత్తు - అహంభావము అనేవి అసత్తు (లేక) భ్రమ మాత్రమే" అని ఎరుగునుగాక! గృహ-బంధు-దార-సుత-స్వశరీరాదులందు "ఇవి నావే" అనే మూర్ఖరూపమైన మమత్వము క్రమంగానో, ఒక్కసారిగానో ఎట్లాగో అట్లా వదలును గాక! అప్పుడు వర్తమానంలో పరిచ్ఛిన్నత్వం అనుభవిస్తున్న ఈ జీవుడు స్వయంగా బ్రహ్మమే అగుచున్నాడు. "ఇవి నావి కావు. ఎందుకంటే ఇవి ఎల్లప్పటికీ నా వద్దనే ఉండవు కదా"...అను భావన చేస్తున్నంతమాత్రంచేత ఈతడు బ్రహ్మత్వమును సంతరించుకొనుచుండగా, ఈ మాత్రం ప్రయత్నం చేయటానికి సిద్ధంగాని జీవులకు నేనేం చెప్పాలి?

1. ఇది నిత్యం, ఇది అనిత్యం, 2. ఇది సత్యం, ఇది భ్రమ - అని గ్రహించి ఉండటమే జీవన్ముక్తి. చివరికి జ్ఞానం కంటే వేఱుగా ముక్తి కొరకై మరే ఉపాయమూ లేదని మా అభిప్రాయం.

❖❖❖

# 13. అనంత స్వస్వరూపంలో అల్ప దృశ్య విభాగం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! చైతన్యము యథాతథంగా ఉంటూనే... తన అనంత తత్త్వము యొక్క ఒకానొక స్వల్పరూపవిభాగమునందు స్వయంసంకల్పనానుసారంగా సత్తును-అసత్తును పరికల్పించు కొని, ఆపై అద్దానినే సత్తుగానో, అసత్తుగానో అనుభవించుచున్నది.

అ చైతన్యమే 'బాహ్య పదార్థముల అనుభవం' అనబడే తనయొక్క దృఢాభ్యాసం చేత బాహ్య మగు ఈ జగదాకారంగా స్ఫురిస్తోంది.

**శ్రీరాముడు :** అనగా చైతన్యమే అసలైన స్వరూపంగా గల జీవుడు పొందే బాహ్యానుభవమంతా అతని అంతరంగమునందలి దృఢాభ్యాస ప్రభావము మాత్రమేనని మీ ఉద్దేశమా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కచ్చితంగా అంతే! ఇక్కడ మనకు స్వప్నమే దృష్టాంతం. స్వప్నంలో కనిపించేదంతా స్వప్న ద్రష్ట యొక్క స్వస్వరూపకల్పిత విస్తారమే కదా? ద్రష్ట యొక్క అంతర్గత చైతన్యమే బాహ్యమున జగత్తువలె దర్శించబడుచున్నది కదా!

ఈ సమస్త జగత్తు చిత్తు యొక్క కల్పితరూపం తప్పితే మరింకేమీ కాదు. అట్టి చిత్తు సర్వదా అకాశంకంటేకూడా అత్యంత నిర్మలమై వెలయుచున్నది. నేయి తనయందు కాఠిన్యం విస్తరింప జేసుకొంటోంది కదా! అట్లాగే చిత్తు కూడా తనయందు ఈ సమస్తమును విస్తరింపజేసుకొంటోంది. అందుచేత ఈ జగత్తుగా కనిపించేదంతా చిత్తు మాత్రమే. చిత్తుకు అన్యంగా ఎక్కడా ఏదీ లేదు. వాస్తవానికి 'నాశనం అవటం' అనేది కాని, అనేక పదార్థ-జీవులు గాని, అ జీవుల సంబంధమైన జనన మరణాలు గాని, అటు ఆకాశం గాని, శూన్యత్వం గాని, అనేకత్వం గాని లేనే లేవు. అధిష్ఠాన రూపంగా సమస్తం బ్రహ్మమే గాని, ఏదీ పదార్థరూపం కాదు. వేఱుగా కనిపించే దంతా మిథ్యాదృష్టి ప్రభావం చేత మాత్రమే! ఆ జగత్తు అసత్తే! కాబట్టి, ఇక ఇందులో "అహంత్వం, పుట్టటం, ఉండటం, నశించటం" అనునదంతా భ్రమ చేత మాత్రమే అనిపిస్తోంది. వాస్తవానికి ఇక్కడ ఏదీ నశించటం లేదు. స్వప్నంలో అంతా కల్పితం, ఊహా జనితం అయి ఉండగా ఇక అందులో పదార్థాలు జనించటం ఏమున్నది? నశించటం ఏమున్నది? అట్లాగే శాస్త్రాలు ప్రవచించే జ్ఞాన దృష్టిచే 'అహం నశించటం' అనేది కూడా "స్వప్నంలోని పదార్థం నశించటం" వంటిది మాత్రమే!

"ఈ జగత్తు అసత్తే! వాస్తవానికి లేనిదే! మరిక అద్దాని ఆశ్రయమును నిందించటం, దానిని గురించిన సిద్ధాంతపూర్వక నిర్ణయాలు శాస్త్రాలు ఎందుకు చేస్తున్నాయి?" అని ఎవరైనా అంటే... ఆ మాట కూడా నిజమే! వాస్తవానికి అసత్తైనట్టి వస్తువు గురించి నిందగాని, నిర్ణయంగాని ఎలా సంభవం? స్వప్నంలో కనబడే గృహం "ఎవరు కట్టారు? వారి తెలివి ఎటువంటిది"... అనే ప్రశ్న లకు సమాధానం వెతకటం అర్థంలేని పని కదా! ఆకాశపుష్పం (తెల్లటి మేఘాలు, ఆ మేఘాల మధ్య ఊహాదృష్టికి కనిపించే సరోవరం, అందులో పుష్పం)... గురించి నిందగాని, నిర్ణయం గాని ఎవరికి ఉంటుంది? అది ఎవరికి కనబడుతుందో వారు ఊహలో తేలే పసిపిల్లల వంటివారే కదా!

అయితే శాస్త్రాలు జగత్ నిర్ణయం గురించి అద్దాని నింద మొదలైన వాటిని చెప్పటంలో ఒక ముఖ్యమైన కారణం ఉన్నది. "ఆత్మ యొక్క స్వరూపాన్ని జీవునకు సిద్ధింపజేయటం" అనే కార్యక్ర మాన్ని నిర్వర్తించటమే శాస్త్రములు నిర్వర్తించే కార్యక్రమం కదా! అట్టి ప్రయత్నంలో మొదటగా అసత్తైన వాటిని కొన్నిటిని సత్తు వలె నిర్ణయిస్తున్నాయి. అట్లా నిర్ణయించి మనస్సు-బుద్ధి-ఆత్మ ఇటువంటి వాటిని నిర్వచించి తద్వారా వైరాగ్య వివేకాది మార్గంగా తత్త్వసాక్షాత్కారానికి ఉపాయాలు కల్పిస్తున్నాయి. సృష్టి నిర్ణయం కూడా అట్టిదే! కాబట్టి ఓ రామచంద్రా! శాస్త్ర-ఆచార-సంప్రదాయాదు లకు అనుకూలంగా ముముక్షువు భూమికాక్రమమును అభ్యసించాలి. క్రమంగా ఆధ్యాత్మికమైన ప్రవృద్ధిని సముపార్జిస్తూండగా అంతరంగం పరిశుద్ధమౌతోంది. అప్పుడు "మనస్సు మొదలైనవి, జగత్ సంబంధిత శాస్త్ర నియమాదులు వాస్తవ సత్యం సమక్షంలో మిథ్యయే అగుచున్నాయి"... అని ఎఱుగుచు శిల వలె క్షోభ-వాసనాది వర్జితుడై ప్రకాశించు గాక! ఇకప్పుడు సాంసారిక పురుషార్థం యొక్క అభాసతో కూడి ఈ సంకల్పమాత్ర జగత్తు నిశ్శేషంగా ఆ ముముక్షువు పట్ల శమిస్తుంది. ఇదే భ్రమరూపమగు ఈ సృష్టిని గూర్చిన శాస్త్రప్రవచిత నిర్ణయం యొక్క ఉద్దేశం.

ఈ సృష్టి యొక్క మూలచ్ఛేదం బ్రహ్మజ్ఞానం చేతనే అగుచున్నది. ఇక 'సృష్టి' అనే భ్రమ కల్పన ఆ ప్రజ్ఞానియందు మరల ఉదయించదు. ఆత్మజ్ఞానం లేకపోయిందా... ఈ సృష్టి సుషుప్తి-ప్రళయాదులలో మౌనంగా ఉన్నప్పటికీ బీజరూపంలో ఉండియే ఉంటోంది. అనగా కార్యరూపంలో ఉండకపోయినా కూడా, కారణరూపంలో దాగియే ఉంటోంది. మనం ఐందవోపాఖ్యానంలో చెప్పుకున్నట్లు కారణరూపంలో అంతరాళాల్లో దాగిన జగత్తులు మరల ఎప్పుడో కార్యరూపం దాల్చుచున్నాయి. కనుక 'ఆత్మజ్ఞానం' అనే అగ్నిచే మాత్రమే కారణత్వము దహనం కాగలదు సుమా! స్వప్నంలో కనిపించే మనుజులు, వారి మాటలు కూడా అసద్రూపమేకదా! స్వప్నంలో కనిపించిన ఆ మిత్రుడు అట్లా ఎందుకు నన్నంత మాట అన్నాడు? అనే ప్రశ్నకు అర్థమేమున్నది? అట్లాగే ఏ మనుజుని దృష్టిలో ఏ 'సృష్టి' అనేది విద్యమానమై ఉన్నదో... ఆ సృష్టి - ఆ సృష్టిని పొందే జీవుడు కూడా మృగతృష్ణలోని జలతరంగాలు, జలం లాగా - అసద్రూపులే అయి ఉన్నారు. ఆ ఉభయములకు అప్రమేయమై ఉండే చిదానంద స్వరూపం మాత్రమే సర్వదా సత్యం, నిత్యం కూడా!

**అసతామేవ సద్భావమివ ఏషామ్ ఉపేయుషామ్**
**న వయం నిర్ణయం విద్మో వంధ్యాపుత్రగిరామివ**

"వంధ్యాపుత్రుని (గొడ్రాలి కుమారుని) మాటలు - అభిప్రాయాలు వింటుంటే ఎంత బాగున్నాయో!" - అనే నమ్మకం కలవారి నిర్ణయం ఏమిటో తెలియవస్తుందా? అట్లాగే అసత్పదార్థములను 'సద్భావం'గా అంగీకరించేవారికి కనిపించే నిర్ణయాలు మాకు తెలియటం లేదు. జీవ-జగత్ పదార్థాలను నిర్వచించే విషయంలో కొందరి నిర్ణయములు ఆత్మజ్ఞానం విషయంగా అసంబద్ధంగానే ఉంటున్నాయి. అయితే జ్ఞానులో? పరిపూర్ణమైన సముద్రంలాగా 'అద్వితీయ చిదానందం' యొక్క పూర్ణత్వము సదా వారిపట్ల సంతరించుకొని ఉంటోంది. వారు ఈ ద్రష్ట - దృశ్యాల దృష్టిని ఏ మాత్రం పొందటమే లేదు. వారు ఈ జగత్తును చూస్తూ కూడా పర్వతం వలె అచంచలులై ఉంటున్నారు. గాలి వీచని చోట ఉంచబడిన దీపం వలె నిర్విచారులై, నిర్వికారులై ప్రకాశిస్తున్నారు. ఆచార సహితులైనప్పటికీ ఆచారరహితులై సదా స్వస్థచిత్తులై ఉంటున్నారు.

**ఆపూర్ణైకార్ణవ ప్రఖ్యా కాప్యన్తః పూర్ణతోదితా**
**అన్తః శీతలతా జ్ఞప్తిః జ్ఞస్యా పూర్త్యైవ లక్ష్యతే ॥**

జ్ఞాని యొక్క హృదయంలో పూర్ణ సముద్రం వంటి అపూర్వమైన పూర్ణత్వం ఉదయిస్తోంది. జ్ఞానరూపమైనట్టి అపూర్వ శీతలత్వం అతని యందు కనిపిస్తోంది.

ఇక అజ్ఞానియో?... వాసనలే అజ్ఞానం కాబట్టి, ఆతడు వాసనారూపుడే అగుచున్నాడు. వాసనలు రహితమైనప్పుడు "ఇది జీవుడు - ఇది ఆత్మ (బ్రహ్మం)" అను భేదమే కానరాదు. అయితే వాసనలు తొలిగేది ఎట్లా? విచారణ చేయటం చేతనే!... "నా స్వరూపం వాసనాబద్ధం కాదు. అపరిమితమైన ఆత్మ పరిమిత వాసనలచే బద్ధమవటమేమిటి? అనంతమగు ఆకాశం పరిమితమైన మేఘాలచే ఆచ్ఛాధించబడవచ్చునేమో గాని, అది తన సహజ స్వభావమగు అనంతత్వం మేఘాల

కారణంగా కోల్పోతుందన్నదను మాట ఎక్కడిది?"... అనే నూతనమైన సహజ స్వభావం పునః దర్శనమగుచున్నది. విచారణ యొక్క ప్రభావం చేత వాసనలు తమ ఉనికినే కోల్పోతాయి. అనగా "ప్రపంచంలో జరిగేదంతా నా స్వరూపానికి అప్రమేయమైనది"... అను నూతనమైన అవగాహన రూపుదిద్దుకుంటుంది. కాబట్టి సంసారం అనేది తనంతటతానే అంతర్ధానమగుచున్నది. లేదూ? ఆత్మజ్ఞానం ఒనగూడనంతకాలం సంసారం ప్రత్యక్షమయ్యే ఉంటోంది.

ఓ రామచంద్రా! ఇక్కడ "ఆత్మయొక్క అనవలోకనం" అనే కారణం చేత సంబంధబాంధవ్య-స్వ-పర-కర్తృత్వ-భోక్తృత్వాలతో కూడిన మాయ అంతా అనుభవమౌతోంది. 'ఆత్మజ్ఞానము' అనే ప్రకాశముచే ఇవన్నీకూడా "అవలోకనసిద్ధి"యందు లయించిపోతాయి. చీకటి ఉన్నప్పుడు కనబడే భ్రమాకారాలు, "అక్కడ దయ్యం ఉందేమో? ఇటు దొంగలు వస్తారేమో?" మొదలైన భయాలు వెలుగురాగానే ఏమౌతున్నాయి? భ్రమ తొలగగా నలువైపులా బట్టబయలు కాగా "దయ్యాలు లేవు. ఆకారాలు లేవు. అవి చెట్లు, ఇది వీధి"...అని తెలియవస్తోంది. కదా! మాయా విరచితమైన మానావమాన - ఆశనిరాశ - ఆగామిసంచితాదులన్నీ "లేనివే" అని జ్ఞానకాంతి ప్రసరించగానే తెలిసిపోతుంది. అనగా జ్ఞానప్రకాశ ప్రభావం చేత-

1. ఈ దేహమాంసాది 'స్థూల శరీరం' - పంచభూతాలు ఆయాపాళ్ళలో కలవగా ఏర్పడిన పంచీకృత భూతసముదాయంగా, అసత్తుగా, భ్రమరూపంగా, జడమైనదిగా తెలిసిపోతోంది.

2. ఈ బుద్ధి - అహంకార - చిత్తాది రూపమైన "సూక్ష్మశరీరం" కూడా - అపంచీకృత భూతమయమై, వికారవంతమై, అసత్తే, జడమే అయి ఉన్నదని కూడా సుస్పష్టమౌతోంది.

బుద్ధి అహంకార - చిత్తాదుల అపంచీకృత భూతరూపత్వమును కూడా వదలాలి. అనగా "వాటన్నిటి నామ రూపములు మిథ్యయే" అని గ్రహించబడాలి!

అప్పుడు శేషించిఉండే స్వప్రకాశమగు చిన్మాత్రమునందు స్థితిపొందిన జీవుడు ఇక ముక్తిని పొందినట్లే! ఇంతకు మించి వేరే అర్థమేదీ 'ముక్తి' అను శబ్దమునకు లేదు... అనునదే మా ఉద్దేశం. అట్లా కాకుండా వాస్తవానికి స్వయంప్రకాశమగు ఆత్మచైతన్యము లింగ శరీరమునందు (మనో - బుద్ధి - అహంకారాదులందు) తాదాత్మ్యధ్యాస ఉంటే? అప్పుడు ఏర్పడుచున్న విషయోన్ముఖత్వముచే వాసనలు ఉంటున్నాయి. ఆ వాసనలు ఆత్మ చైతన్యమును ఆవరించి ఉండి 'జగత్తు' అనబడు కల్పిత వ్యవహారమును అనుభవింపజేస్తున్నాయి.

ముక్తిదశలో లింగశరీరమే బాధింపబడుతోంది కాబట్టి... ఆపై ఇక వాసన ఎచట ఏ ప్రకారంగా ఉండగలదు చెప్పు?

ఈ 'సంసారము' అనేది-భ్రమచేత మాత్రమే అనుభవమౌతోంది. తత్త్వదృష్టి సంపాదించుకున్న వారికి "మృగతృష్ణలో జలం లేనట్లే, ఈ సంసారం అసత్తు"... అని సుస్పష్టంగా తెలియవస్తోంది. అప్పుడిక సంసారబంధం ఏది, ఎవనికి, ఎచ్చట కలదో చెప్పు? అయితే ఒకడు ఆత్మజ్ఞానం నందు ప్రవృత్తుడై ఉంటూనే మరల ఎప్పుడైనా జగత్ విషయాల స్మరణ నిర్వర్తించటం ఆరంభించాడనుకో,

అప్పుడు ఏ 'చిత్తము' అనునది కల్పితంగా ఉదయించినదై ప్రవర్తించటం ఆరంభిస్తుందో... అదే ఈ సంసారానికి హేతువై ఇక సకల సంసారభ్రమలు కలిగించటానికి ఉద్యమిస్తోంది.

**తస్మాత్ సర్వమ్ అనాశ్రిత్య వ్యోమవత్ సముపాస్యతామ్ ।**
**అపునః స్మరణం శ్రేయ ఇహ విస్మరణం పరమ్ ॥**

కాబట్టి సమస్తము త్యజించి ఆకాశమువలె నిర్మలము - స్వచ్ఛము అయినట్టి ఆత్మనే ఉపాసించాలి. ఈ సంసారము మరల స్మరణమవనంతగా పూర్ణ విస్మరణమే మోక్షమార్గంగా ఆశ్రయించ తగిన ఉపాయం.

వాస్తవానికి ఇక్కడ ద్రష్టగాని, భోక్తగాని, అస్తిత్వముగాని, నాస్తిత్వముగాని లేవు. మరి? సముద్రమంతా సర్వదా జలముచే పరిపూర్ణమై ఉన్నట్లు (తరంగాలనేవి జలమునకు అభేదమే అయినట్లు)... ఇదంతా శాంతము - ఏకము - పూర్ణము అగు ఆత్మయే అయి ఉన్నది.

ఒక తటాకం ఉన్నది. అందలి జలంలో ఆకాశం, నక్షత్రాలు, చెట్లు ప్రతిబింబిస్తున్నాయి. అప్పుడు ఆ జలం ఎండిపోయిందనుకో. అందు ప్రతిబింబించిన దృశ్యాలన్నీ ఏమౌతున్నాయి? ప్రతిబింబమంతా తొలగిపోయి బింబరూపమగు ఆకాశనక్షత్రాదులే శేషిస్తాయి కదా! భ్రమ తొలగి పోతే సమస్త దృశ్య జగత్తు సద్రూపమగు బ్రహ్మమేననే విషయం స్పష్టంగా ఎఱుగబడుతుంది. అనగా దృశ్యం ఇట్లే ఉండి ఇది 'సంసారభ్రమ'గా కాకుండా కేవల శివస్వరూపంగా అనుభూత మౌతోంది. తత్ఫలితంగా ఆ జీవునకు తనయొక్క చిదాభాస-ఉపాధి మొదలైన భ్రమలు తొలగగా, అప్పుడు శివస్వరూపుడై నిత్యోదితంగా ప్రకాశించుచున్నాడు. అంతేకాదు ఈ ఇంద్రియ-త్రిగుణ-దేహ-విదేహ-జగదాదులకు ఆవల నిత్యోదితమై, నిత్యప్రకాశకమై పరతత్త్వము స్వయంజ్యోతి స్వరూపంగా వెలుగొందుచున్నది. అట్టి పరతత్త్వము నొందినవాడు, మరియు సందర్శియగు జ్ఞానికి "ఇటు సమాధి-అటు వ్యవహారము" -ఈ రెండు కూడా ఒకే రీతిగాను, రాగద్వేష రహితంగాను భాసిల్లుచున్నాయి.

సప్తమభూమికను పొందిన జ్ఞానికి సర్వత్రా కేవలం శాంతత్వమే శేషించుచున్నది. అతడు అంతటా వ్యవహరిస్తూనే వ్యవహరించనివాడుగా ఉంటున్నాడు. సప్తమభూమికయందు విశ్రాంతి లభించనంత వరకు జ్ఞాని ప్రవాహపతితమైన వ్యవహారత్వమును-రాగ ద్వేషవర్జితుడై తనయందు సంసారమును ప్రవేశించనీయ కుండానూ... నిర్వర్తిస్తూనే ఉంటాడు. అజ్ఞానికి ఈ సంసారము, ఇందలి వ్యవహారములు బంధములగు చుండగా... జ్ఞాని ఇదే సంసారమును తన ఆధ్యాత్మికోన్నతికి సాధనద్రవ్యముగా మలచుకోగలుగుచున్నాడు. ఇక సప్తమ భూమికను పొందిన తరువాత ఆ జ్ఞాని మునీశ్వరుడై, రాగ-ద్వేష-భయ-క్రోధ వర్జితుడై, మోక్షరూపుడై, శాంతమనస్కుడై శివ స్వరూపమున ప్రకాశిస్తున్నాడు. శిల వలె నిశ్చలస్వరూపుడై, కేవల చిద్రూపుడై వెలయుచున్నాడు .

**శ్రీరాముడు :** మహాత్మా! అట్టి కేవల శివస్వరూపియగు సప్తమ భూమికాగ్రహీత ఈ జగత్తును త్యజించి వ్యవహారరహితుడై మౌనం వహించి ఉంటాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** నీవు చెప్పిన 'జగత్తు' అనబడేది సప్తమభూమికాప్రవేశికి అతని స్వస్వరూపమునకు అభిన్నంగానే అనుభవమౌతోంది. ఒక చింత విత్తనము యొక్క కోశమునందే చింతచెట్టు యొక్క సకల విశేషములు అభిన్నంగా ఉండి ఉన్నాయి కదా! స్వప్నభ్రాంతి వంటి ఈ జగత్తుయొక్క బాహ్యత్వము ఆత్మకు భిన్నంగా లేదు. అందుచేత సర్వము యథాతథమై ఉండగా అతడిక త్యాజ్య గ్రాహ్యముల కంటే అతీతమైన పదవి యందు ప్రకాశిస్తూ ఉంటాడు.

**బాహ్యతా భావనాత్ బాహ్యమ్ ఆత్మైవ ఆత్మత్వభావనాత్ ।**
**భవతీదం పరే తత్త్వే భావనం తత్తదేవ హి ॥**

ఆత్మయే "బాహ్యత్వము" అను భావనచే బాహ్యరూపముగా అగుచున్నది. ఆ బాహ్యత్వము ఆత్మత్వభావనచే ఆత్మరూపమే అగుచున్నది. కాబట్టి 1) బాహ్యత్వము, (2) అభ్యంతరత్వము అను ఈ రెండూ కూడా ఆత్మయొక్క ఆయా భావనా రూపములు మాత్రమేనని గ్రహించు.

మరొక విషయము. అంతఃకరణమున స్వప్నాది రూపంగా ఏ భ్రాంతి అయితే ముందుగానే ఉన్నదో... అదియే బాహ్యజగత్తు రూపంగా ఉదయించటం జరుగుతోంది.

స్వప్నంలో కనిపించేదంతా జాగ్రత్ సంబంధమైనదే అయినట్లు ఈ జాగ్రత్‌లో కనిపించేదంతా స్వప్న సంబంధమైనదేసుమా! జాగ్రత్‌కు-స్వప్నమునకు మా దృష్టిలో భేదమే లేదు. ఎందుకంటే ఆ రెండు కూడా ఆత్మయొక్క భావనను ఆశ్రయించి మాత్రమే ఉన్నాయి. రెండు పాత్రలలో గల పాలలో ఏమాత్రం భేదం లేనట్లు జాగ్రత్‌కు - స్వప్నమునకు భేదమే లేదు. అనగా జీవుడు జగత్తుగా అనుభవించుచున్నదంతా స్వప్నసదృశమేనని గ్రహించు.

**శ్రీ రాముడు :** అయితే, జాగ్రత్తులో కనబడే పదార్థములు స్థిరంగాను సుస్పష్టంగానూ, స్వప్నంలో కనబడే పదార్థములు అస్థిరంగాను, అస్పష్టంగాను భాసిస్తున్నాయి కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**స్థైర్య - అస్థైర్యే తథైవ అత్ర భ్రాంతిమాత్రమయే తతే ।**
**ఆధార - అధేయతే తే ద్వే యథా జలతరంగ తే ॥**

ఓ రామా! జగత్తులో అనిపించే స్థిరత్వం, స్వప్నంలో అనిపించే అస్థిరత్వం - ఆ రెండింటి అనుభవం కూడా భ్రాంతి మాత్రమే అయి ఉన్నాయి.

స్వప్నంలో కనిపించే శరీరాలకు జాగ్రత్తు ఆధారం, స్వప్నం ఆధేయం. అయితే ఈ ఆధార - ఆధేయములు జల-తరంగముల వలె ఒకదానితో మరొకటి అభేదమైనవి. మనిషికి స్వప్నంలో ఆయా పదార్థములన్నీ ఎందుకు భాసిస్తున్నాయి? అజ్ఞానం చేతనేకదా! తన్ను ఎఱిగిన వెంటనే ఆ స్వప్న ద్రష్ట జాగ్రత్‌లో ప్రవేశిస్తున్నాడు. వెంటనే అతనికి జాగ్రత్ రూపం అనుభవమవుతుంది. అట్లాగే, శుద్ధాత్మజ్ఞానము యొక్క సముపార్జనచే ఈ జాగ్రత్ పదార్థములు ఇక పదార్థరూపముగా అనిపించక ఆత్మరూపముగా అనుభవమగుచున్నాయి. అనగా, "కల్పనారహితము - శాంతము" అయినట్టి పరమాత్మ యొక్క రూపమే ఆయా పదార్థముల భావనచే ఆయా రూపములుగా అనుభవ

మగుచున్నాయి. ఆయా పదార్థములు భావించకపోతే ఆయా రూపములన్నీ ఆత్మ పొందేదే కాదు. పదార్థ సంబంధమైన బాహ్యత్వపు భావన శమించగా అప్పుడు ఏ ఈశ్వరరూపము శేషిస్తోందో అది దేశ – కాలాదులకు అసంబంధమైనది కాబట్టి – 'అది ఉన్నది' అని అనలేం. ఆత్మయే స్వయంగా "సత్–ఉనికి" కాబట్టి "అది లేదు" అని కూడా అనలేము. అయ్యది వాక్కుకు విషయమే కానిదిగా అగుచున్నది. భ్రమయొక్క సంపూర్ణ వినాశన స్థితిని సమాధియందుండే యోగి మాత్రమే ఎఱుగగలడు. అది అనుభవవైకవేద్యమేగాని, మాటలతో "అది ఇట్టిది"... అని చెప్పలేం, సర్వ భ్రమ "ఆత్మసాక్షాత్కారం" అనేది ఉపదేశమునకు విషయమే కాదు. మరి? అది విజ్ఞుల యొక్క అనుభవమునకు మాత్రమే విషయమగుచున్నది.

**శ్రీరాముడు :** మరి ఈ గురు – శిష్య – ఆత్మబోధ వ్యవహారం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాక్కుకు విషయమే కాని సర్వభ్రమనాశరూప ఆత్మసాక్షాత్కారం వైపుగా శిష్యుని బుద్ధిని ప్రవృత్తం చేయటానికే ఈ ఉపదేశక్రమము, గురుశిష్య బోధల ప్రయోజనమై ఉన్నది.

కాబట్టి ఓ సర్వ ప్రియజనులారా! అహంకారమును త్యజించండి. అభిమాన, విషాద, భయ లోభ, మోహములను పారత్రోలండి. దేహ, ఇంద్రియ, మనో, చిత్తాదుల సంబంధమైన జడత్వమును పాము కుబుసమువలె వదిలివేయండి. శాంతస్వరూపులై ప్రకాశించండి.

శాంతము – సమస్త భేద శూన్యము–అక్షయము– ఏకము – అజము – నిర్వాణరూపము అయిన బ్రహ్మమును సంతరించుకొని సమాధి వహించి ఉండటమే యుక్తం.

❖❖❖

## 14. తత్త్వజ్ఞులతో సాంగత్యం - స్వవిచారణ

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! తనయొక్క చలనముచే వాయువు సుడిగాలి మొదలైన రూపములను దాల్చి అనేక బీభత్సములను కలిగిస్తుంది చూచావా? అట్లాగే అవిద్యచే ఆకృతమైన చైతన్యము విషయములందు వ్యాపించుటకు ఉద్యమించిన మరుక్షణం అసద్రూపములే అయినట్టి అహంకారం మొదలైన వాటితో కూడిన ఈ జగద్భ్రమనంతా ఉదయింపజేస్తోంది. అయితే బ్రహ్మ రూప భావనాబలంచేత ఈ జగద్భ్రమ దుఃఖం కలిగించగలిగే శక్తిని కోల్పోగలదు. అట్లాకాదా... జగత్తు యొక్క శబ్దార్థ భావనచే అది మహానర్థమును కలుగజేయగలదు. ఈ కంటిచూపు ప్రసరించినంత మాత్రంచేత రూపానుభవం ప్రాప్తిస్తోంది చూచావా? చైతన్యము ప్రసరించినంత మాత్రం చేత ఈ జగద్భ్రమరూపమంతా స్థితి పొంది ఉంటోంది.

ఇక వాస్తవానికి వస్తే, కూటస్థచైతన్యమునకు రాకపోకలు ఉన్నాయా? లేవు! విషయముల అభావన చేత 'చాంచల్యము' అనే ప్రసరణ తొలగిపోతే నిర్విషయ చిదానందమే పరమసత్యమై అనుభవం కాగలదు. ఏ చైతన్యము యొక్క వ్యర్థ ప్రసరణమున్నదో... అది అసత్తే సుమా! అదంతా "గొడ్రాలి కుమారుడు ఏమి నృత్యం చేస్తున్నాడో కదా!"... అను అర్థరహిత వాక్యము వంటిదే!

చిత్తు యొక్క ప్రసరణం "అనుభవం" అను దాని ద్వారానే సిద్ధిస్తోంది. అయితే ఆ అనుభవం ఆత్మ – విద్యచే అతిక్రమించబడగలదు. బాలునికి పిశాచము యొక్క అనుభవం తొలిగేది ఎట్లా? పిశాచము యొక్క భ్రమ తొలగటంచేతనే కదా! అట్లాగే అసత్పదార్థము యొక్క అనుభవం తొలగాలంటే అసత్పదార్థమును అభావించటమే ఉపాయం. ఈ విధంగా చూస్తే చైతన్యము యొక్క ప్రసరణ అనబడేది మిథ్యయే అయి ఉన్నది సుమా! అదే రీతిగా "అహంభావముయొక్క ప్రసరణ" అనేది కూడా మిథ్యా వాక్యమనియే గ్రహించబడుగాక! లేదా, "అహంభావముయొక్క ప్రసరణ" అనేది కూడా మిథ్యా వాక్యమనియే గ్రహించబడుగాక! లేదా, అహంభావము యొక్క అనుభవము దుఃఖమునే కలిగించుచున్నది. అనహంభావనచే అహంభావన తొలగగా అప్పుడు మోక్షసుఖము జనిస్తోంది. ఈ విధంగా బంధ – మోక్షములు జీవునకు తన అధీనంలోనే ఉన్నాయిగాని, మీరెవరో బయటవారి ఆధీనంలో లేవు. అటువంటప్పుడు మోక్షము కొరకై ఎక్కడో వెతకి ఏం ప్రయోజనం?

**తద్ధ్యానం స సమాధిర్వా యదవేదనమాసితమ్**
**అజడానాం జడమివ సమం శాన్తమనామయమ్**

అజడములగు మనో–బుద్ధి–అహకారాదులపట్ల నిర్లిప్తమగు శిలామౌనాభ్యాసమే సమాధి. "తెలుసుకుంటున్నది – తెలియబడేది"... అనే ఉభయముపట్ల అతీతత్వముతో కూడిన స్థితియే ధ్యానము–నిశ్చలము–సమము–శాంతము–నిర్వికారము–ఏకము అగు చిద్రూపమున నెలకొని ఉండు స్థితియే "ధ్యానము" అని, 'సమాధి' అని కూడా చెప్పబడుతోంది.

వాదోపవాదాలలో సిద్ధాంతపూర్వకంగా ప్రవేశించే ఓ పండితులారా! వాదోపవాదాలు కలహ రూపాలగు వాక్భ్రమలకు కారణమే అగుచున్నవి. వ్యర్థమైన కంఠశోష బదులుగా శుద్ధ చిద్రూపంలో స్థితిపొంది ఉండే ఉపాయాలు ఆశ్రయించటమే అత్యావశ్యకమని మా అనుభవసారం!

ఈ జీవుడు అనేక దేహములలో ప్రయాణించి క్రమంగా ఘనీభూతములగు వాసనలతో కూడి ఉంటున్నాడు. సంకల్పరచితములు, స్వప్నతుల్యములు, అసత్తుల్యములు అగు అనేక బాహ్య – అభ్యంతర విషయములను ఆశ్రయించి తద్వారా అనేక విధములైన దుఃఖములకు భోక్తగా తనను తాను తీర్చిదిద్దుకుంటున్నాడు. ఎవరిపట్ల వాసనలు సన్నగిల్లుచున్నాయో, అట్టివాడు సంకల్ప రహితుడై ఈ బాహ్య – అభ్యంతర విషయములను మిథ్యగా ఎఱుగుచున్నాడు. గాఢంగా నిద్రించే మనుజుడు దోమ కుట్టినా బాధింపబడనట్లు... వాసనా రహితుడైనవాడు ప్రారబ్ధం చేత ఆయా సుఖ దుఃఖ సంఘటనలను పొందవలసి వస్తున్నప్పటికీ వాటిని ఆతడు అనుభవించడు. దేశ–కాల–క్రియా యోగం చేత పదార్థభావన ఏర్పడుచున్నట్లే దేశ–కాల–క్రియా పూర్వకమైన అభ్యాస యోగం చేత సూక్ష్మమగు వాసనలు కూడా ముక్తత్వదశను (తొలగిపోవటం) పొందుతాయి. అతి సూక్ష్మమగు పరమాణువులు అకాశరూపత్వము పొందునట్లే వాసనలు కూడా సాధనలో నిమగ్నమైన యోగి పట్ల తప్పక ముక్తత్వం సంపాదించుకోగలవు. పండితులతో సాంగత్యం కొనసాగిస్తూ రాగా క్రమంగా మూఢత్వం పోయి, పాండిత్యము అలవడుతుంది చూచావా? అట్లాగే బ్రహ్మాహంభావన

యొక్క అభ్యాసం చేత వాసనలు సూక్ష్మత్వం పొంది క్రమంగా శూన్య రూపం పొందుతాయి. "సర్వ సహజీవులు ఏ మూల పదార్థంచే తయారు కాబడినారో... అట్టి బ్రహ్మమే నేను" అనునదే బ్రహ్మోహంభావన సుమా! "నేను ఇహలోకంలోగాని, పరలోకంలోగాని సర్వదా శుద్ధ బ్రహ్మ రూపుడనే! అంతేగాని 'అహం' శబ్దార్థరూపమగు జీవుడను కాదు" అనే నిశ్చయం ఎప్పుడైతే కలుగుతుందో... అట్టి శాంతరూపుడగు మనుజుడు "దృఢ బోధ కలవాడు" అని చెప్పబడతాడు.

ఈ విధంగా... ఏ జగత్-జీవాదులన్నీ భాసిస్తున్నాయో అవన్నీ కూడా "నేనెవడను? ఈ జగత్తు ఎట్టిది?" అని ఈ ప్రకారంగా విచారణ చేయటం చేత తప్పక ఉపశమిస్తాయి.

"నేను ఈ దేహ-ఇంద్రియ-మనో-బుద్ధ్యాది రూపుడను గాను. నిర్వాణరూపమగు ఆత్మయే నేను" -అని ఇంతమాత్రం ఎఱుగటంలో కష్టం ,అసాధ్యం మొదలైనవి ఏమున్నాయి చెప్పు? సత్సాంగత్యము-శాస్త్ర విచారణ-ఈ రెండిటి సహాయం చేత - ఏజీవుడైనా సరే - తన యొక్క స్వస్వరూప అజ్ఞానమును తప్పకుండా అధిగమించగలడు.

**"కోఽహం? కథమిదమ్ దృశ్యమ్? కో జీవః? కించ జీవనమ్?"**
**ఇతి తత్త్వజ్ఞ సంయోగాత్ యావజ్జీవం విచారయేత్ ॥**

నే నెవరు? ఈ దృశ్యం ఎట్టిది? జీవుడు అనగా ఎవరు? అతని ప్రాణాదుల ధారణ ఎట్టిది? ...ఈ మార్గంగా తత్త్వజ్ఞానుల సాంగత్యంలో మోక్షపర్యంతమూ విచారణ చేస్తూనే ఉండాలి. అట్టి తత్త్వజ్ఞుల సాంగత్యం యొక్క ప్రయోజనం.

| | | |
|---|---|---|
| మొట్టమొదట | : | ఈ జగత్తంతా జ్ఞానానందమయమైనట్లు భాసిల్లుతుంది. |
| తరువాత | : | అహంభావం అనే అంధకారం నశిస్తుంది. |
| ఆ తరువాత | : | ఒక్కసారిగా ఆత్మ ప్రకాశం బోధకమౌతుంది. |

అందుచేత ముముక్షువైనవాడు "తత్త్వజ్ఞాని" అనే సూర్యుణ్ణి తప్పక సేవించాలి. ఓ సభికులారా! తత్త్వజ్ఞులైన వారు ఎక్కడెక్కడున్నారో చూడండి, వెతకండి, వారిని అతి జాగరూకులై గుర్తించండి. ఎందుకంటే తత్త్వజ్ఞత కంటే అన్యంగా ఏవో కొన్ని సిద్ధాంతములతో, వాదోపవాదాలతో ఉండే వారి సమూహంలోంచి తత్త్వజ్ఞులను గుర్తించటం ఒక పెద్ద కార్యక్రమమే సుమా! "వాదం" అను పిశాచం ఉదయించగానే అది "అహంరూప ప్రత్యేకతత్త్వమే ముఖ్యము. అనహమ్ రూపసర్వాత్మకత్వము అనూహ్యము, అసంభవము, అసందర్భము, అనవసరము" అని అనిపించే విధంగా తర్క-వితర్క ప్రభావం చేత ఈ జీవుని శ్రుతి విరుద్ధమైన ప్రతిపాదనలచే ముంచెత్తగలదు. "ఇదియే చాలు. ఇంతే నీ పరిధి" అను మూర్ఖత్వముతో కూడిన అనర్థమును పండితులైన వారికి కూడా "వాదోపవాద వ్యవహారం కలిగించగలదు" అందుకే ఆత్మతత్త్వమును 'అతర్క్యమ్' (వాదోపవాదాలచే అలభ్యం, తర్కమునకు విషయం కానిది)" అని చెప్పబడింది. బాలురు "ఇంతే! ఇదే కావాలి! ఇంకేం వినను. ఈ పుస్తకంలో ఉన్నది చెప్పండి, ఇంకేం చెప్పొద్దు, మాట్లాడవద్దు"... అని అమాయకత్వంతో కూడిన మొండితనమును వహిస్తున్నట్లుగానే పండితులైన వారిలో కొందరు "ఏదో చెప్పుతారు. ఏం

వినకండి. ఇంతే చేయండి, ఇక ఆలోచించకండి. ఊరుకోండి"...అని తమ అనుయాయిలకు బోధించి 'అంధగోలంగుల న్యాయం'లాగా తమకు కనబడేదానికే తదితరులను పరిమితులను చేయటం లోకంలో చూస్తూ ఉంటాం. కాబట్టి బుద్ధిమంతుడైనవాడు తత్త్వజ్ఞాని అయిన పండితుణ్ణి సమీపించి, తన వినయం, సేవ మొదలైన వాటిచే ప్రసన్నునిగా చేసుకోవాలి. ఏకాంతంగా ప్రశ్నించాలి. వారు చెప్పేది రెండు చెవులతోనూ వినాలి. వారు ఉపదేశించే అర్థములను అన్నిటినీ క్రోడీకరించుకొని స్వబుద్ధితో విచారణ చేసుకోవాలి. అందులోని సార విశేషాన్ని గంభీరంగా గ్రహించాలి. విశేషాల పట్ల మౌనం పెంపొందించుకోవాలి.

ఈ బుద్ధిని - 1.శుద్ధపరచుకోవటం; 2.వృద్ధి పరచుకోవటం, సునిశిత పరచుకోవటం; 3.సువిశాల పరచుకోవటం... ఇది 'గురుబోధ' యొక్క సద్వినియోగోద్దేశం. వారు వచించే శ్రుతి-యుక్త-స్వానుభవపూర్వక వాక్యాలను వాక్యార్థాలను హృదయంలో పదిలపరచుకోవాలి. "విద్వజ్ఞుల తోటి సంభాషణ" అను సదావకాశంతో సహాయంతో స్వబుద్ధిచేత విచారణ జేస్తూ క్రమక్రమంగా సర్వసందేహాలను నివృత్తింపజేసుకోవాలి. ఇంక ఆ తరువాత "నిధిధ్యాస" ద్వారా సర్వసంకల్ప రహితమైనట్టి, సద్రూప మైనట్టి 'బ్రహ్మము' నందు తన్మయత్వమును సముపార్జించుకోవాలి.

కనుక ఓ రామా! బుద్ధిమంతుడైనవాడు ప్రతిరోజు కూడా తత్త్వజ్ఞుల సాంగత్యంచే బుద్ధిని సుతీక్ష్ణం చేసుకోవాలి. 'అజ్ఞానం' అనే జన్మజన్మాంతర సముపార్జితమైన లతను ముక్కలు ముక్కలుగా ఖండించివేయాలి. అట్టి "జ్ఞానప్రాప్తి" అనే ఉత్తమ ప్రయోజనం తత్త్వజ్ఞులలో కలిగే సాంగత్యం చేత మాత్రమే సులభరీతిగా సంభవిస్తుంది. ఈ వాక్యమును నేను స్వానుభవమంతా రంగరించి చెప్పుచున్నాను. మేము అసమంజసమైన వాక్యములు పలికే బాలురంవంటివారం కాదు సుమా!

❖

ఓ సాధక జనులారా! ఈ జగద్వ్యవహారములన్నీ కూడా కొంత 'సానుకూలత' మరికొంత 'ప్రతికూలత' కలిగి ఉండే స్వభావం కలిగి ఉన్నాయి. సముద్రం చూచారా! అది తరంగములు విజృంభించటం చేతగాని, ఉపశాంతించటం చేతగాని ఏమైనా అనిష్టప్రాప్తిగాని, ఇష్టనాశనముగాని పొందుతోందా? లేదు. అటు ఆకాశాన్ని చూడండి! మేఘం - మంచు - ఎండ మొదలైనవి విజృంభించటం చేత తాను వృద్ధినిగాని, హానినిగాని పొందదు కదా! అట్లాగే సంకల్పరహితుడైన జ్ఞాని ఈ జగద్వ్యవహారములపట్ల కొంచెంకూడా ఇష్ట నాశనముగాని అయిష్టప్రాప్తినిగాని పొందటం లేదు. పొందవలసిన అవసరమూ లేదు.

ఈ జీవుడు నిర్వికారము-పరిపూర్ణము-శాంతము-సర్వవ్యాపకము అయినట్టి బ్రహ్మము యొక్క జ్ఞానముచే 'బుద్ధుడు' కాగలడు. వాస్తవానికి మృగతృష్ణాజలంలాగా ఈ జగత్తు భ్రమమాత్రమే అయినప్పటికీ, బ్రహ్మజ్ఞానికి ఈ సమస్త జగత్ - జీవాదులు ఆత్మరూపుడగు తనకంటే వేఱుగా భాసించదు.. తన స్వరూపంగానే భాసిస్తుంది. ఇక అట్టి తత్త్వజ్ఞానికి 'జగత్మననము' అనే విభ్రమములు ఎట్లు ఎందుకు కలుగుతాయి? కలగవు.

❖❖❖

# 15. పరలోకవ్యాధి - ఇహైవ చికిత్స

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అధికార యోగ్యమైన శరీరం పొందిన తరువాత కూడా ఈ మనుజుడు ఆత్మోద్ధరణకై పురుషప్రయత్నమునకు ఉపక్రమించకపోతే ఎట్లా? ఇప్పుడే ఇక్కడే "సత్సాంగత్యము" సహాయంతో తనయొక్క బుద్ధిని వికసింపజేసుకోవాలి. ఇక్కడే స్వబుద్ధి చేత ఆత్మజ్ఞానం సంపాదించుకోవటం తప్పితే వేరే ఉపాయం ఏదీ లేదు. విషం కూడా వైద్యశాస్త్రయుక్తమైన ప్రయోగాదులచే తన మరణహేతుత్వమును వదలి దేహమునకు శ్రేయోదాయకం అవుతోంది చూచావా? అట్లాగే అశాస్త్రీయములు - కల్పితములు అగు వాసనాదులు కూడా అధ్యాత్మ శాస్త్రీయమైన ప్రతికల్పనచే అవి తమ బంధహేతుత్వము త్యజించి మోక్ష హేతుత్వమును అవధరించ గలవు. కల్పనలు ప్రతికల్పన (అధ్యాత్మికమైన కాల్పిక సాధనల)చే నశించగలవు. కల్పనలన్నీ పూర్తిగా నశించేవరకు ఆధ్యాత్మిక సాధన పూర్వకమైన ప్రతికల్పనను కొనసాగిస్తూనే ఉండక తప్పదు. సర్వకల్పనారహిత స్థితే ముక్తి. అట్టి ముక్త స్థితి భోగత్యాగానికి ముందే కలుగుట కుదిరేది కాదు.

1. శ్రవణ - మననములచే ఆత్మతత్త్వమును సునిశ్చితం చేసుకోవటం.
2. వాక్కుచేత, మనస్సుచేత లోన పదార్థములను భావించకపోవటం.
3. ప్రతి కల్పన అభ్యసించటం.

...ఇట్టి మార్గంలో వాక్-మననముల నిరోధం చేత మెల్లమెల్లగా కల్పనయొక్క శమనము వృద్ధి పొందగలదు.

ఆ తరువాత అహంభావాన్ని 'అనహమ్' భావన ద్వారా వర్జించాలి. ఎందుకంటే అహంభావం కంటే వేఱుగా అవిద్య అనేది లేదు. ఆ విధంగా అహంకారం బాధితం కాగా, సర్వభావనా రాహిత్యం చేత తత్త్వసాక్షాత్కారం ఉదయిస్తుంది. అదే మోక్ష స్థితి. అంతకు వేరుగా 'మోక్షం' అనేది ఎక్కడా ఏదీ లేదు. అట్టి సాక్షాత్కారమును పరిరక్షించుకోకుండా ఈ జగత్-జీవాది భావాలలో ప్రీతియుక్తుడై ఈ జీవుడు అట్టి కొంచెం అహంభావమును దేహ పర్యంతరం ఆశ్రయించి ఉన్నా కూడా... ఈతడు మరల సంసారం పొందటం జరుగగలదు. అందుచేత 'అహంభావాన్ని త్యజించటం' అనే ప్రతికల్పన అభ్యసిస్తూ వస్తే... అప్పుడా జీవుడు శాంతిని పొంది నిరతిశయానందస్థితిని పొందగలడు.

ప్రతికల్పన అనగా - బహిర్ముఖ వృత్తిచే ఈ జగత్తును గాంచకపోవటం, అంతర్ముఖ వృత్తిచే ఈ జగత్తును పరమాత్మతత్త్వంగా గాంచటం. పరమాత్మయే ఈ సర్వజీవాదుల రూపంగా ఉన్నట్లు గమనిస్తూ ఉండటం.

అట్టి ప్రతికల్పనచే ఎవనికి ఈ సమస్త జగత్తు కూడా ఎదురుగా ఉండి కూడా అసత్తుగాను, శిల వలె ప్రశాంతంగాను తోచుచున్నదో అట్టి మహాత్మునకు శిరస్సు వంచి మేము నమస్కరిస్తున్నాం. జేజేలు పలుకుచున్నాం.

పరబ్రహ్మమున లీనమైనట్టి చిత్తం కలవాడు దృశ్య శూన్యుడగుచున్నాడు. అనగా ఆతని చిత్తం బహిర్ముఖరహితమై ఉంటోంది. అతడు అభ్యంతరమున చైతన్యమాత్రభావనతో కూడి

ఉంటున్నాడు. అందుచేత ఈ జీవ – జగదాది సమస్త ప్రపంచము అతని దర్శనముచే శిలవలె ప్రశాంతమై ఉంటోంది.

కల్పన అనగా... "ఇది నాకుండుగాక, ఇది నాకు లేకుండుగాక, వాళ్లు అటువంటి వారు – మేం ఇంతటివాళ్లం – వీళ్లంటే ఇష్టం. వాళ్లు నాకు ఇష్టముండదు. ఇత్యాది ద్వంద్వములతో కూడిన" భావనా పరంపరలే సుమా! అట్టి కల్పనయే దుఃఖమును వృద్ధింపజేస్తోంది. బ్రహ్మాకారభావనచే దృశ్యముయొక్క రూప–నామ దర్శనరూపమైన చిత్తము బలహీనమగుచుండగా, అట్టి చిత్త నిరోధముచే ప్రతికల్పిత సుఖము అగు ఆత్మసుఖం లభిస్తోంది.

**ద్వౌ వ్యాధీ దేహినౌ ఘోరవయం లోకస్తథా పరః ।**
**యాభ్యాం ఘోరాణి దుఃఖాని భుంక్తే సర్వైర్షి పీడితః ॥**

ఈ జీవునికి రెండు వ్యాధులున్నాయి– 1.ఇహలోక వ్యాధి, 2.పరలోక వ్యాధి. ఈ రెండు వ్యాధుల వల్లనే ఈతడు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికాది సమస్త దోషములచే పీడితుడై అనేక మహాదుఃఖములన్నీ అనుభవించుచున్నాడు.

**ఇహలోక వ్యాధి -** ఆకలి, దప్పిక మొదలైనవన్నీ. ఈ వ్యాధి యొక్క శమనము కొరకై అన్న పానాదులు సంపాదించుకుంటున్నారు. మంచిదే. అయితే కొందరు జీవులు ఇహజీవితము కొరకే జీవితమంతా తమకున్న శక్తినంతా ధారపోసుకుంటున్నారు. మరి పరలోక వ్యాధి మాట ఏమిటి?

**పరలోక వ్యాధి -** ఆ వ్యాధి జనన – మరణాది రూపాలుగా ఉంటోంది. పరలోక వ్యాధికి ఇక్కడి భోగాదులు ఔషధమే కాదు.

**పరలోక మహావ్యాధౌ ప్రయతన్తే చికిత్సనమ్ ।**
**శమః సత్సంగ భోధాఖ్యైః అమృతైః పురుషోత్తమాః ॥**

మరి? పరలోక వ్యాధికి శమం (ఇంద్రియనిగ్రహం), సత్సాంగత్యం, జ్ఞానం మొదలైనవి ఔషధములు. అట్టి అమృతతుల్యములగు ఔషధముల ప్రాముఖ్యమేమో ఎఱిగిన మహనీయులు అట్టి పరలోకవ్యాధి కొరకై ఔషధములు సేవించుచున్నారు. అవకాశములను సృష్టించుకుంటున్నాడు. ఉపయోగించుకుంటున్నారు.

**పరలోక చికిత్సాయాం సావధానా భవన్తి యే ।**
**మోక్షమార్గమహేచ్ఛాయాం శమశక్త్యా జయన్తి తే ॥**

ఓ జనులారా! ఇహలోక విభాగములైన ఈ రక్తమాంసమయ శరీరము దృష్ట్యా మాత్రమే జీవితమును ఉద్దేశించువారు సంసారముచే అనేకసార్లు మోసగించబడనున్నారు.

1. అపథ్యములైనట్టి ఇక్కడి భోగములను త్యజించి ఉండటం.
2. సంత్సంగము – జ్ఞాన సమాచార సేకరణ వంటి ఔషధ సేవనము.

ఈ రెండూ ఇప్పుడు కావాలి. ఉట్టి "మందు" తీసుకొని "పథ్యం" (తీసుకోవలసినవి, తీసుకోవటం, తీసుకోకూడనివి తీసుకోకపోవటం) విషయంలో అశ్రద్ధగా ఉన్నా, పథ్యం తీసుకొని మందును తీసుకోకపోయినా... వ్యాధికి చికిత్స కుదురదు కదా! పై ఉభయముల పట్ల సావధానులై

ఉండండి. అప్పుడు 'శమము' అనే ఔషధము యొక్క శక్తిచే మీ యొక్క మోక్ష 'సాధనము' అనే అభిలషితమార్గంలో విజయం పొందుతారు.

**ఇహైవ నరకవ్యాధేః చికిత్సా న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం స్థానం స రుజః కిం కరిష్యతి ॥**

ఈ మనుష్యజన్మ మహత్తరమైన అవకాశం. ఇక్కడ 'నరకం' అనబడే పరలోకస్థిత వ్యాధికి 'సత్సంగం' మొదలైన ఔషధములు సేవించి, తద్ద్వారా ఆత్మజ్ఞానము సముపార్జించి చికిత్స పొందాలి. ఎవడైతే అట్టి నరకవ్యాధికి చికిత్స ఇక్కడ పొందుటకు సిద్ధపడడో... అట్టివాడు సరి అయిన ఔషధములు లభించని స్థావర-జంగమాదులైన జన్మలకు పోయి ఏమి చేయగలడు? శాస్త్రాశ్రయం మొదలైన చికిత్సలు అక్కడ లభించక పోవచ్చు కదా!

**ఇహలోక చికిత్సాభిః జీవితం యాతు మా క్షయమ్ ।**
**ఆత్మజ్ఞానౌషదైః అజ్ఞాః! పరలోకశ్చికిత్స్యతామ్ ॥**

ఓ సహజీవులారా! మీపై గల అవ్యాజమైన ప్రేమచే మేము చెప్పే ఈ జాగరూక వాక్యాలు వినండి. మహత్తరమైన ఈ "మనుష్య-జీవితము" అనే దుర్లభమైన అవకాశమును ఇహలోక విషయములైన తినటం-త్రాగటం-భోగములు అనుభవించటం అనే కార్యక్రమాలకు మాత్రమే ఉద్దేశించి, తద్ద్వారా, ఇహలోక చికిత్సాపరిమితులు కాకండి. 'ఆత్మజ్ఞానము' అనే ఔషధమును సేవించి పరలోకవ్యాధికి చికిత్స ఒనర్చుకోండి. "ఆ! ఆత్మజ్ఞానానికి అంతతొందరేం వచ్చిందిలే! తరువాత ఎప్పుడో చూసుకోవచ్చు"... అని కాలాయాపన చేయవద్దని నా మనవి. ఎందుకంటా రేమో? గాలిచే కదల్చబడుచున్న ఆకుపైగల అల్పమైన నీటిబిందువుల వలె ఈ ఆయుష్షు అత్యంత క్షణభంగురమైనది. కనుకనే సత్సంగము - స్వచ్ఛాస్త్ర అధ్యయనము మొదలైన యత్నములచే పరలోకవ్యాధికి వెంటనే చికిత్స కావించుకోవటమే ఉచితం సుమా!

**పరలోక మహావ్యాధౌ యత్నేనాశు చికిత్సితే,**
**ఇహలోకమయో వ్యాధి స్వయమాశు ఉపశామ్యతి!**

చక్కగా ప్రయత్నించి 'పరలోకము' అనే వ్యాధికి చికిత్స పొందారా... అప్పుడిక ఇహ లోకమునకు చెందిన వ్యాధి తనంతటతానే శీఘ్రంగా శమించిపోగలదు.

❖

ఈ జీవుడు చైతన్యమాత్రుడనియే కదా అధ్యాత్మశాస్త్ర నిర్ణయం అతనియొక్క ప్రసరణా వ్యాసంగమే ఈ జగత్తు. జీవునిలో గల చైతన్యమే ఒక పరమాణువులో కూడా వ్యాపించి ఉండటం చేత, అట్టి ఒక పరమాణువునందు కూడా అనేక భూ-పర్వతాదుల విస్తారముతో కూడిన జగత్తు కలదు. ఆ చైతన్యము యొక్క బహిర్ముఖత్వ ప్రసరణచే బాహ్యపదార్థ రూపముగాను, అంతర్ముఖత్వ ప్రసరణచే కోరికలు మొదలైన మానసిక పదార్థ రూపాలుగాను చిదాకాశమున అనుభూతమగు చున్నాయి. కనుక ఈ జగద్భ్రమ సత్యంకాదు. ఇది స్వయంకల్పిత భ్రాంతి మాత్రమే. మిథ్యయే

అయిన ఈ దృశ్య జగత్తు ప్రళయంచే నశించేదీ కాదు, సృష్టులచే జనించేదీ కాదు మరి? భ్రమ ఉన్నప్పుడు జగత్తుగాను, భ్రమ తొలగుటచే కేవలం ఆత్మగాను ఇదంతా అనుభూతమగుచున్నది.

ఏ జీవుడైతే 'భోగం' అనే బురదలో చిక్కుకున్న తనయొక్క ఆత్మను ఇప్పుడికక్కడ స్వకీయపురుష ప్రయత్నంచే సముద్ధరించుకోవటానికి ప్రయత్నించడో అట్టివాడు దుఃఖ పరంపరలను అనివార్యంగా పొందవలసియే వస్తోంది. స్వకీయమైన పురుష ప్రయత్నం తప్పితే ఆత్మోద్ధరణకు వేరే ఉపాయం ఎక్కడా ఏదీ లేదు. అడ్డమైన నీళ్ళు వచ్చి సముద్రంలో జేరుచున్నాయి చూచావా? అట్లాగే ఇంద్రియ జయము లేనివాడు కేవలం 'భోగం' అనే బురదలో నిమగ్నమైనవాడు అగు మూఢుడు ప్రపంచంలోని అన్ని ఆపదలకు, అల్పజన్మలకు అర్హుడగుచున్నాడు.

ఏ విధంగా బాల్యావస్థ 'ఆయువు' అనబడుదానికి మొట్టమొదటి దశ అవుతుందో... ఆ విధంగానే నిర్వాణమునకు రాగాదుల శమనపూర్వకమైన భోగత్యాగం మొదటి నియమం అగు చున్నది. జ్ఞానికి కూడా సుఖదుఃఖాదులు ఉంటే ఉండవచ్చుగాక! అయితే ఏం? అవన్నీ కూడా చిత్రపటంలోని సాగరతరంగాలలాగా సౌమ్యం – సంభ్రమరాహిత్యం సంతరించుకొని ఉంటాయి. అజ్ఞానుల జీవితమో అట్టి సుఖ దుఃఖ సంఘటలు ఉన్నా, ఉండక పోయినాకూడా – హోరుగా శబ్దం చేసే నదీ జలతరంగాల వలె – కామాది అనేక వృత్తులతో మనోవ్యవస్థ పరంపరలతో, వ్యాకులత – విక్షోభములతో నిండి ఉంటోంది. మెల్లకన్నువానికి రెండు – మూడు చంద్రబింబాలు అగుపిస్తాయి చూచావా? బాలునికి గాలిలో దయ్యాలు కనబడతాయి! మూర్ఖ బాటసారికి ఎండమావులలో అనేక జలతరంగాలు గోచరమౌతాయ్! అట్లాగే అజ్ఞాని తనయొక్క అవిచారముచే స్వప్న సదృశమైన విమోహం పొందుచున్నాడు.

చైతన్యము యొక్క కించిత్ ప్రసరణరూపమగు ఈ సృష్టి సమూహాములు భ్రమచే దాటుటకు వీలుకాని–అర్థమేకాని సుదీర్ఘ దృశ్యపరంపరగా ఆతనికి అనుభవమౌతోంది. ఈ సృష్టులన్నీ కూడా 'చైతన్యం' అనే సముద్రం యొక్క తరంగ సమూహాలు మాత్రమే! తత్త్వ విచారణచే ఇవన్నీ అసత్యాలుగా తెలియవస్తున్నాయి. భ్రమానుభవం చేతనో... ఇవి సత్యములైనట్లే గోచరిస్తున్నాయి.

సుప్రసిద్ధమై కనిపించే ఈ భూతాకాశంలో చైతన్యం యొక్క స్వయంకృత చమత్కారమైన "ప్రసరణ" అను భ్రమచే అనేక జగత్తులు సత్యమే అయినట్లు అనుభూతమౌతున్నాయి.

వాస్తవానికి ఈ దృశ్య జగత్తులు సత్యం కాదు. ఈ సృష్టి వాస్తవానికి రూపరహితమైనప్పటికీ అహంభావం మొదలైన పదార్థముల వికారంచే రూపవంతంగా అవబడుచున్న ఈ సృష్టుల భ్రమంతా "చైతన్య ప్రసరణము" అనే జలంలో కనిపించే బుద్బుదములు (బుడగలు) వంటివి.

ప్రవృత్తిచే ఈ జగత్తులు అగుపిస్తున్నాయి. చైతన్యముయొక్క అంతర్ముఖత్వమే ఈ జగత్తులన్నిటి యొక్క నివృత్తి రూపం. అట్టి నివృత్తియే నిర్వాణము. అనగా, చైతన్యము యొక్క బహిర్ముఖత్వమే ఈ జగత్తులకు మూలపదార్థం. వాస్తవానికి చైతన్యం బాహ్యం కాదు, అభ్యంతరం కాదు, సత్యం కాదు, అసత్యం కాదు. (అధిష్ఠాన దృష్టిచే) సమస్తము అదే! బంగారమునకు రూపమెక్కడున్నది? అయితే గాజుకు రూపమున్నది. బంగారం కాకుండా గాజు ఎక్కడున్నది? బ్రహ్మము చిద్రూపమై,

జన్మాదులు లేనిదై, అవ్యక్తమై, అద్వితీయమై, నాశరహితమై ఈశ్వర స్వరూపమై మనోబుద్ధి అహంకారాదులకు ఆవల ఉన్నదై, పరమశాంతమై ఆకాశముకంటేకూడా అతి నిర్మలమై ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! స్వభావరహితమైన బ్రహ్మం స్వయంగా సృష్టిరూపంగా ఎందుకు స్ఫురిస్తోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మెల్లకన్నువానికి కనిపించే మూడు చంద్ర బింబాలలో మొదటి రెండు బింబాల మధ్య గల దూరం కంటే చివరి రెండు బింబాల మధ్య గల దూరం ఎందుకు అధికంగా ఉన్నది? మెల్లకన్ను దోషం చేత భ్రమచే కనిపించే మూడు చంద్రబింబాలకు అర్థమే లేదుకదా! అంతా భ్రమయే కదా!

వాయువు యొక్క చలనమునకు కారణం అంటూ ఏదీ లేనట్లే బ్రహ్మం సృష్టిరూపంగా స్ఫురించటానికి కారణం అంటూ ఏదీ లేదు. స్వప్నంలో ప్రాప్తించే అనుభవమంతా భ్రాంతిరూపమే కదా! స్వప్నంలో "ఆ ఇల్లు ప్రక్కనే ఆ చెట్టు ఎందుకున్నది"... అనే ప్రశ్నకు సమాధానమేమున్నది? ఆ ఇల్లు, ఆ చెట్టు కూడా భ్రాంతియే కదా! సముద్రంలో ఆ తరంగం పెద్దగా, ఆ ప్రక్కనే ఉన్న మరొక తరంగం చిన్నగా ఎందుకున్నది?" అనే దానికి కారణం లేనట్లే, ఒకవేళ కారణమున్నా... అది కూడా భ్రమచేతనే కూడుకొని ఉన్నట్లే... ఈ జగత్తు బ్రహ్మమునందు ప్రదర్శనమౌతోంది. కాబట్టి మనం 'అకారణం' అని చెప్పుకుంటున్నాం అట్లాగే బ్రహ్మము అను సముద్రంలో అనేక భేదములతో కనిపిస్తున్న 'సృష్టులు' అను తరంగాలకు కారణం లేదు.

**బ్రహ్మ రూప స్థితి - మునిసత్తముడు -**

**ఏకమేవ నిరాభాసమ్ అచిత్తత్త్వమ్, అజడం సమమ్,**
**న సన్ న అసన్ నసత్ – అసత్ ఇదమ్ అవ్యయమ్ అద్వయమ్။**

"సర్పరజ్జు భ్రాంతి"లో త్రాడుకు పాముగా కనబడే ధర్మం ఉన్నది అని అనగలమా? పరమాత్మ యగు బ్రహ్మము ఏకమై, అభాసరహితమై, చిత్తధర్మములేనిదై, జడత్వరహితమై, సర్వత్రా సమ రూపమై, సత్తు గాని – అసత్తుగాని – సదసత్తుగాని కానిదై, అవ్యయమై ఒప్పుచున్నది. ఎవడైతే అట్టి బ్రహ్మరూపస్థితి కలిగి ఉంటాడో... అతనికి చిత్తము ఉండదు. అనగా ఆతని చిత్తము బాహ్యత్వము కోల్పోతుంది. అంతర్ముఖమౌతోంది. దృశ్యస్ఫురణ లేనిదౌతుంది. ప్రశాంతత్వము స్వభావసిద్ధంగా సంతరించుకుంటుంది. అట్టివాడు "మునిసత్తముడు"... అని చెప్పబడుచున్నాడు.

**ముని శ్రేష్ఠుడు -** ఎవడైతే అందరిలాగానే దేహధారియై కనిపిస్తూ కూడా ఒక మట్టితో తయారు కాబడిన బొమ్మవలె దృశ్యవేదనారహితుడై ఉంటాడో, ఎవని దృష్టిలో అయితే అహంభావంతో సహా ఈ జగత్తంతా తన స్వస్వరూప భావనయందు విలీనమై ఉంటుందో... ఆతడు "ముని శ్రేష్ఠుడు."

**దృశ్యవేదన లేకపోతే - జగత్తు లేదు -** ఊహ (సంకల్పము) నందు అనుభవించబడే నగరం... ఆ ఊహ శమించగానే (ఆ నగరం కూడా) శమిస్తుంది కదా! అట్లాగే దృశ్యవేదనచే ఉత్పన్నమైన, అహంభావసహితమైన ఈ జగత్తు దృశ్యవేదన లేకపోయినప్పుడు తనంతటతానే శమిస్తోంది.

**ముక్తి -** ఈ జీవులయందు అనుగతమై జడత్వరూప సంబంధమై "స్వభావము" కలదు. అట్టి 'స్వభావము' యొక్క శబ్ద – అర్థములే "మూలావిద్య". ఆ స్వభావమును ప్రక్కకు పెట్టి చూస్తే, ఆ

తరువాతి పదార్థములన్నీ సహేతుకములే! అట్టి స్వభావమునకు హేతువు సాక్షిరూపమగు ఆత్మ. అట్టి ఆత్మయొక్క అనుభవము కలిగి ఉండుటే 'ముక్తి'.

వాస్తవానికి ఏ పదార్థమునకు (జీవునకు) తనదంటూ ప్రత్యేకమైన ఏ స్వభావమూ లేదు. మరి? సమస్త అనుభవములూ మహాచైతన్యము యొక్క దృశ్యత్వపు చమత్కారమేనని అనవచ్చు. ఈ 'అనుభవములు' అనబడేవన్నీ కూడా మహాచైతన్యము యొక్క చలనములే అయి ఉన్నాయి. అంతేకాకుండా వీటినన్నిటినీ కూడా 'బ్రహ్మము' అనే ఆకాశము యొక్క శూన్యత్వంగా కూడా మనం చెప్పుకోవచ్చు. వాయువు – వాయుచలనము – ఈ రెండూ ఒక్కటే కదా! అట్లాగే బ్రహ్మము – సృష్టి అనబడు రెండూ కూడా అభిన్నములే సుమా! ఒకవేళ ఆ రెండింటికీ ఏదైనా భేదమున్నట్లుగా ఎవరికైనా అనిపిస్తే ..., అది "స్వప్నంలో నేను మరణించాను" అని చెప్పుకొనే జీవుని పరిభాషవలె భ్రాంతి రూపము, మిథ్య. ఆత్మతత్త్వము గురించిన విచారము పరిపక్వము పొందనంతవరకు అట్టి భ్రాంతి ఉండియే తీరుతుంది. ఆత్మతత్త్వము సుస్పష్టము – కరతలామలకము అయిందా,... అప్పుడు ఆ భేదసంబంధమైన భ్రాంతి కూడా బ్రహ్మరూపమునే చెందుతుంది.

**శ్రీరాముడు :** మహాత్మా! భ్రాంతి కూడా బ్రహ్మరూపమునే చెందుతుందా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. నా ఉద్దేశమేమంటే ఏ సత్తా స్ఫూర్తిరూపమైన అంశముచే భ్రాంతి ఏర్పడి ఉంటుందో, అట్టి సత్తాస్ఫూర్తి బ్రహ్మరూపత్వమే చెందగలదు. ఇక సత్తాస్ఫూర్తికి వేరుగా గల భ్రమ విభాగమంటావా? పరుగులు తీస్తున్న కుందేలును దూరంగా చూసినపుడు ఒకనికి చెవులు కొమ్ములుగా కనిపించినాయనుకో! అతడు కుందేలును దగ్గరగా చూసినపుడు ఇంతకు ముందు కనిపించిన కొమ్ములు ఏమైనాయి? తొలగాయా? ఉంటేగదా, తొలగటానికి? మరి ఎందుకు ఇంతకు ముందు కనిపించాయి? సమన్వయలోపమే కదా! ఆ విధంగా సత్తాస్ఫూర్తికి వేరుగా కనిపించేదంతా తత్త్వవిచారణానంతరం అవస్తువై మచ్చుకకు కూడా లభించదు. అప్పుడు అంతటా, అన్నిటా అతి నిర్మలమగు బ్రహ్మమే శేషించుచున్నది.

కాబట్టి ఓ రామచంద్రా! ఓ ప్రియసభికులారా! మీరంతా కూడా దేహ సంబంధముచే మాత్రమే సంప్రాప్తిస్తున్న సమస్త జర–జన్మ–మోహాది వికారభారరూపమగు భ్రాంతిని విడనాడండి. ఆదిమధ్యాంతరహితము, అనంతము, నిర్మలము, సమము, శాంతము, శివరూపము, శాశ్వతము, ఏకము అయినట్టి బ్రహ్మాకాశభావమును పొందండి.

❖❖❖

# 16. దృష్టియే సృష్టి

**జగత్ అదర్శనమే జగత్ నాశనం -**

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వామీ! ఆత్మ అత్యంత సుఖస్వరూపమైనది కదా! ఈ జీవుడు సర్వదా ఆత్మస్వరూపుడే అయినప్పటికీ ఎందుకో సుఖదుఃఖములు ఈ జీవుని ఏదో రూపంగా వెన్నంటియే ఉంటున్నాయి. అసలు ఈ సుఖదుఃఖముల స్వరూపం ఏమిటి?

**శ్రీరాముడు :** రామచంద్రా! సుఖదుఃఖాలు ప్రాప్తిస్తున్నప్పుడు ఏదైతే కాలంచే నాశనమవుతోందో... అదంతా ఇప్పటికే నశించియే ఉన్నదని ఈ జీవుడు గ్రహించుగాక! "తెలుసుకొంటున్నవాడు- తెలుసుకోవటం-తెలియబడేది" అనే త్రిపుటి ప్రతిక్షణం మార్పు చెందుతూనే ఉన్నది. ఇవన్నీ నశిస్తున్నప్పటికీ ఏదైతే తాను నశించక కేవల సాక్షి రూపంగా నిత్యోదితమైఉన్నదో... అదియే ఆత్మ, ఏదైతే ఇతఃపూర్వమే (త్రిపుటికి మునుముందుగానే) త్రిపుటికంటే వేఱుగా సదా, సర్వదా విద్యమానమై ఉన్నదో... అట్టి ఆత్మయే శాస్త్రసారం. ఇంతకంటే ఎక్కువగా శాస్త్రోపదేశంతో నిజానికి పనిలేదు. ఇక సుఖదుఃఖాదులు ఎందుకుంటున్నాయి?" అనే ప్రశ్నకు వద్దాం.

**ఇచ్ఛ -** ఎవనికి ఇచ్ఛ ఉదయిస్తుందో...వానికి అవశ్యం సుఖదుఃఖాదులు ఉండనే ఉంటాయి. ఇచ్ఛా రహితుడైన ఆత్మజ్ఞానికి అవి ఉండవు. కాబట్టి ఎవరైనా సరే "సుఖ దుఃఖములు" అనే రోగమును వదిలించుకోవాలంటే మొట్టమొదటిగా ఇచ్ఛను త్యజించాలి.

**శ్రీరాముడు :** శుద్ధ పరమపదంపై 'ఇచ్ఛ' - ఏ విధంగా ఏ కారణంగా ఎందుకొరకై ఏర్పడుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** శుద్ధమగు పరమపదమునందు "అహంభావము - జగత్తు - ఇచ్ఛ" మొదలైన భ్రాంతి లేనేలేదు. ఈ సర్వము శుద్ధ పరబ్రహ్మమే అయి ఉన్నది. ఇదంతా కూడా సదా శాంతమై, నిరాధారమై అవ్యయమై, నిర్వాణరూపమైనట్టి చిదాకాశమే అయి ఉన్నది. ఇక "అహం - బ్రహ్మము - జగత్తు" ఇటువంటి శబ్దముల భ్రమను ఎవరో బోధ కొరకో, లేక, మరెందుకో కల్పించారు. సర్వాత్మకమై పరమశాంతమైనట్టి చిదాకాశమున అవన్నీ కల్పనారూపంగా దర్శించబడుచున్నాయి. చిదాకాశరూపమైనట్టి ఆత్మయందు జగత్తు-బ్రహ్మము-అహంకారము మొదలైన శబ్దార్థముల ప్రవృత్తియే లేదు. ఏకము-సర్వాత్మకము-శాంతము అగు ఆత్మకు కర్తృత్వంగాని, భోక్తృత్వంగాని ఎట్లా సంభవిస్తుంది? మరి ఈ కనబడే 'అనేక జీవులు' అనే వ్యవహారమంటావా?

...'చిద్రూపము' అనే ఒకానొక మట్టి "అనేక జగత్తులు' అనే పాత్రను తనయందు ధరిస్తుంది. ఆ చిద్రూపము దేనిని ఎట్లా స్మరిస్తే అది అట్లే తనకుతానై అనుభవిస్తోంది. ద్రవరూపమగు సముద్రం తనయందు అనేకతరంగములు ధరించటం లేదా? జలమే తరంగాలుగా భాసిస్తున్నట్లు బ్రహ్మమే తనయొక్క నిర్మలసత్తచే జగద్రూపంగా భాసిస్తోంది. వాస్తవానికి చైతన్యము రూపరహితమైనదే. అయితే అది తనయందు ఈ జగత్తు మొదలైన వస్తువులను స్మరిస్తోంది. అట్లు స్మరించినప్పుడు వానివాని ఆయా రూపములను తనయందే చమత్కారంగా గాంచుచున్నది. అది దేనిని స్మరించకుండా ఉన్నదో... అది గాంచకయే ఉన్నది.

మాయతో కూడుకొని ఉన్న బ్రహ్మము. బ్రహ్మము (లేక, ఈశ్వరుని) యొక్క మాయారూప దేహము-చేతనత్వము-అచేతనత్వము. వీటన్నిటి గూర్చిన కథనం కేవలం ఉపదేశం కొఱకు ఉద్దేశించి కల్పించబడ్డాయి యథార్థానికి అట్టి కథనమంతా కూడా శుద్ధాత్మ విషయము గూర్చి కాదుసుమా! అవన్నీ మధ్యేమార్గ వర్ణనలని గ్రహించు. ఆత్మ గురించిన పాఠ్యాంశములకు సంబంధించిన ఉపకరణములు మాత్రమేనని గమనించు.

ఈ జగత్తు సత్తు కాదు. అసత్తు కూడా కాదు. ఇదంతా చైతన్యమునందు ఆ చైతన్యముయొక్క విస్తరణచే భాసిస్తోంది. చైతన్యమునందు విస్తరణయే లేకపోతే అప్పుడు ఈ జగత్తు భాసించదు. ఇట్టి మిథ్యాజగత్తునందు మనం విశ్వాసం ఎందుకు ఉంచాలి?

**స్వాధీనం - పరిశ్రమానంతర లభ్యం -** ఈ ప్రపంచంలో జీవునికి సంబంధించి విషయాలు రెండు విధాలుగా ఉంటాయి – 1.ప్రయత్నిస్తేనే లభించేవి, 2. ఏ ప్రయత్నం లేకుండానే ఇప్పటికే స్వాధీనంలో ఉన్నవి. స్వభావసిద్ధమై ఉన్నవి. ఉదాహరణకు ఒకడు ధనం, పదవులు, గృహాలు సంపాదించాలంటే ప్రయత్నం చేసి సంపాదించుకోవాలి. ఆలోచించటం మొదలైనవి స్వభావ సిద్ధంగా ఉంటున్నాయి. ఒక స్ఫటికశిలలో ప్రతిబింబించే దృశ్యంలోని జీవుల, వస్తువుల కదలికలు ఆ స్ఫటిక శిలకు స్వభావసిద్ధంగాను స్వాధీనంగాను ఉంటున్నాయి కాని, ఆ శిల యొక్క ప్రయత్న సాధ్యమైనవి కావు. అట్లాగే చైతన్యాత్మకు కూడా తనలో "విస్తరణ, అవిస్తరణలు" స్వాధీనాలే గాని యత్నంచే సాధ్యమగుచున్నవి కావు. అద్దాని విస్తరణయే జగదనుభవం. అద్దాని అవిస్తరణయే జగత్‌రాహిత్యం.

**శ్రీరాముడు :** మహాత్మా! చైతన్యాత్మ 'అహంకారము' విషయమై మేము శాస్త్ర – స్వానుభవ – పరస్పర చర్చల సహాయంతో పరిశీలన చేశాం. అట్లు విచారణ చేయగా ఈ "అహంకారము"నకు "సత్తు (ఉనికి)గాని, ఆధారముగాని, కారణముగాని లేవు" అనియే తేలింది.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**యస్యేక్షి తస్యనో సత్తా, నాఽధారో, న చ కారణమ్ ।**
**సో 'అహమ్' ఇత్యేవ యోయక్షో న జానే కుత ఉత్థితః ॥**

ఏ అహంకారమునకు తనదైన ఉనికి గాని, ఆధారముగాని కారణముగాని ఏకించిత్‌కూడా లేదో, అట్టి అహంకార యక్షుడు ఎక్కడినుండి వచ్చాడంటే ఏమి చెప్పగలం? ఓ జనులారా!

**యస్యాహమ్ ఇతి యక్షస్య సత్తైవాస్తి న సత్యతః ।**
**అహో ను చిత్రం! తేనేమే భవన్తో వివశీకృతాః ॥**

నాయనలారా! ఏ 'అహంకారము' అనే పిశాచానికి వాస్తవానికి సత్తయే (ఉనికియే) లేదో, అట్టి దానికి మీరు వివశులు కావటం చాలా విచిత్రంగా ఉన్నది సుమా! ఓ రామా! కళ్ళలో ఉండే ఏదో దోషం చేత ఆ కళ్ళకు ఆకాశంలో వెంట్రుకలవంటి ఆకారాలు కనిపిస్తాయి చూచావా? అట్లాగే కాకతాళీయంగా భ్రాంతిచే తనయొక్క రూపమే తనయందు – భ్రమయందు "అహంభావము"గా భాసించుచున్నది. (స్వమేవ రూపం దృక్ భ్రాన్త్యా కేశోణ్డకమివ అంబరే).

అయితే... "అంతా బ్రహ్మమే" అయి ఉండగా ఇక అందులో "ఇది అహంకారము. అది జగత్తు" అనబడు విభాగములు ఎక్కడుంటాయి? అట్టి జగత్తు ఉత్పత్తి పొందటం, నశించటం మొదలైనవి మాత్రం ఎట్లా ఉంటాయి? కాబట్టి ఇక సంతోషించేందుకుగాని, దుఃఖించేందుకు గాని విషయమేమి? ఆశ్రయమేమి?

❖

ఓ రామచంద్రా! పరమాత్మ సర్వేశ్వరుడు, సర్వ శక్తిమంతుడు అయి ఉన్నాడు. అందుచేత ఆ పరమాత్మ యొక్క స్మరణమాత్రం చేత ఈ సమస్త విచిత్ర జగత్తు భాసించుచున్నది. స్మరించక పోయినంత మాత్రం చేత ఈ జగత్తు అనబడేది భాసించదు. కాబట్టి అద్దాని విస్మరణయే జగదతీతత్వం. అట్టి జగదతీతత్వం సిద్ధించు గాక! వాస్తవానికి ఈ 'జగత్తు' అనబడేది కూడా చిద్రూపమే కాబట్టి... "చిదాకాశమగు బ్రహ్మమే స్వప్న సంకల్పరచితమైన పురము వలె కాకతాళీయంగా జగద్రూపంగా భాసిస్తోంది"... అని కూడా సిద్ధాంతీకరించబడుచున్నది. కనుక పరమార్థమున బ్రహ్మం నుండి ఈ జగత్తును విడదీయటం ఎట్లా కుదురుతుంది? కుదరదు.

జలమందు తరంగాలున్నాయి. జలమును, తరంగములను విడదీయగలమా? కొయ్యలో (మనిషిదో–జంతువుదో–దేవతదో) విగ్రహం ఉన్నది. కొయ్య నుండి విగ్రహమును వేఱుచేయ గలమా? విగ్రహం నుండి కొయ్యను వేఱుచేయగలమా! మట్టిచే కుండ తయారవుతోంది. మట్టి లోంచి కుండను వేఱు చేయగలమా?

బ్రహ్మము నందు కూడా అట్లే ఈ సృష్టి ఉన్నది. అట్టి ఈ సృష్టిని బ్రహ్మము నుండి వేఱుచేసి చూడలేం. "అవయవరహితం–నిర్మలం" అగు బ్రహ్మం నందు ఏ జగత్తైతే అనుభూతమౌతుందో, అది కూడా బ్రహ్మమే! ఇక అహంకారం మాట వేఱే చెప్పాలా? అది కూడా బ్రహ్మమే! బ్రహ్మమునకు వేఱుగా అహంకారమును చూడటానికి ప్రయత్నించామా... అది మిథ్యయేనని అనక తప్పదు. జలం వేఱు చేసి చూస్తే తరంగం మిథ్యే కదా! మట్టిని వేరుచేసి చూస్తే కుండ మిథ్యయే కదా!

వాయువు యొక్క 'సత్త'యే చలన వైచిత్ర్యంగా భాసిస్తోంది కదా! అట్లాగే అవిద్యాస్వభావ రహితమై బ్రహ్మం యొక్క 'సత్త' ఉన్నది. ఆ బ్రహ్మము యొక్క సత్తయే అహంభావము – జగత్తు మొదలైన రూపములుగా భాసించుచున్నది. ఆకాశంలో మేఘాలను ఒక ఆకారం అంటూ ఏదీ లేదు కదా! అయితే ఆ మేఘమే వృక్షము – కొండ – గుఱ్ఱము – ఏనుగు మొదలైన ఆకారాలలో కనబడుతూ ఉంటుంది. చూచావా? అట్లాగే, నిరాకారమగు బ్రహ్మమున అహంకారము – జగత్తులతో కూడిన ఈ ప్రపంచ రూపం భాసిస్తోంది. సూక్ష్మమగు మఱ్ఱివిత్తులో మహావృక్షం యొక్క లక్షణములన్నీ దాగి ఉన్నట్లు సూక్ష్మీభూతమగు శివరూపమున ఇదంతా ప్రదర్శితమౌతోంది. పరమాత్మయందు ఈ సృష్టి అంతా కూడా అద్దాని అవయవములవలె వెలయుచున్నది.

ఓ రామచంద్రా! ఈ విధంగా "ఆత్మకంటే భిన్నంగా ఈ జగత్తు సంభవించదు" అని గ్రహించి అంతఃకరణంలో ప్రశాంతుడవై ఉండు. ఉపాధివర్జితుడవై ఆయాసరహితుడవై భ్రమ తొలగినవాడవై ఆకాశమువలె సమత్వము వహించి ఉండు.

**న భవన్తో, న చ వయం, న జగన్తి, న ఖాదయః ।**
**సన్తి శాంతం అశేషేణ బ్రహ్మేదం నిర్భరమ్ స్థితిమ్॥**

ఓ సభికులారా! యథార్థానికి మీరు, మేము, జగత్తులు, ఆకాశాదులు ఏవీ లేవు. మరి? సర్వదా శాంతమై పరిపూర్ణమైనట్టి బ్రహ్మం మాత్రమే ఉన్నది. ఇదంతా బ్రహ్మమే అయి ఉన్నది.

ఓ రామచంద్రా! ఈ కనబడే పదార్థములన్నిటికీ కూడా చైతన్యం కంటే భిన్నమైన రూపమును ఎవరూ నిరూపించలేరు. ఈ సమస్త పదార్థముల అవిశేషములే అయి ఉన్నాయి. కనుక విశేషత్వము గురించిన సర్వభ్రమలు త్యజించు. ముముక్షువులంతా మోక్షము కొఱకై "సర్వ విశేష రహితము" – పరమార్థ సత్యము అయినట్టి ఆ చైతన్యమే నేను" అని భావించెదరు గాక!

**వేదనం బంధనం విద్ధి, విద్ధి మోక్షమ్ ఆవేదనమ్,**
**యథాస్థితం యథాచారమ్ భవ శాంతమ్ అవేదనమ్ ॥**

"జగత్తు యొక్క స్మరణయే బంధం. జగత్తు యొక్క విస్మరణయే మోక్షం" – అని గ్రహించు. అందుచేత విజ్ఞులు అనుసరించే మార్గం అయినట్టి భూమికలను అభ్యసిస్తూ క్రమంగా జగత్తుయొక్క విస్మరణమును సముపార్జించాలి. ఈ జగత్తును జగత్తుగా కాకుండా శాంతమగు పరబ్రహ్మముగా దర్శించటమే జగత్తును త్యజించటం(జగత్తు విస్మరణ) గాని, మరింకేమీ కాదని కూడా గ్రహించు.

**శ్రీరాముడు :** స్వామీ! "చైతన్యమే జగత్తుగా, జగత్ పదార్థములుగా అగుచున్నది" అను భావనను అనుసరించమంటారా? అట్టి భావనచే శుద్ధ చైతన్యము ప్రకాశమానమవుతుంది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ద్రష్టయే తన రూపముగా కలిగినట్టి ఈ జీవుడు దృశ్యములోని వాడా? కాదు. ఈ దేహము దృశ్యంలో ఉన్నప్పటికీ ద్రష్ట దృశ్యరూపము కానేరడు కదా! అట్లాగే చైతన్యము సర్వదా చైతన్యంగానే ఉంటుందికాని... ఎన్నటికీ చైతన్యం జడమగు విషయరూపత్వం పొందజాలదు. కాబట్టి జగద్రహితమైన శుద్ధ చైతన్యమును విషయభావనచే ఎవడూ ప్రకాశింప జేయజాలడు. ఎవడైనా సరే... తనకు తానై విషయాతీతత్వముచే జగద్రహితశుద్ధ చైతన్యత్వమును స్వానుభవంగా సంతరింపజేసుకోవాలిసిందే.

ఆత్మతోటి స్థితిని పొందియుండుటకు గాను... 1. ద్రష్ట–దృశ్యముల సంబంధము యొక్క అభావముచే జాగ్రత్తునందే సుషుప్తునివలె ఉండగలగటం; 2. శరత్కాలాకాశంలాగా నిర్మలత్వం – విషయశూన్యత్వం సంపాదించుకోగలగటం; 3. సర్వత్రా ప్రసరించియున్న తన ఆత్మతత్త్వమును గమనించగలగటం... అనునవి సముపార్జించు కోవాలి.

వాయువు అనేక వాయుతరంగాలుగా చలిస్తున్నప్పటికీ వాయువు సర్వదా ఏకమేగాని అనేకం కాదు కదా! "తరంగాలు వేఱువేఱు కాబట్టి ఆ వాయువు వేఱు. ఈ వాయువు వేఱు"... అని అనుకోవటం అవిజ్ఞత చేతనే కదా! అట్లాగే ఏకము–చిద్రూపము అగు బ్రహ్మమున అజ్ఞానం చేత భేదమే దర్శించబడుతోంది. తన చిత్స్వరూపమును ఏమరచిన సందర్భంలో "జీవుడు – జగత్తు" మొదలుగా గల భేదదర్శనమే "సృష్టి". వాని ఐక్యజ్ఞానమే 'మోక్షము'.

వాయువు అంతటా ఉన్నప్పటికీ అది ఎక్కడ సంచలనము ప్రదర్శిస్తుందో అక్కడ ఆయా క్రియా విశేషాలు ప్రకటితమౌతూ ఉంటాయి. కదా! (ఉదా: వాయు చలనముచే ఆకులు కదలటం, దేహంలో ప్రాణాపానాది క్రియలు మొదలైనవి). అట్లాగే 'బ్రహ్మము' అనే వాయువునందు ఎచ్చట "చిత్ యొక్క జగత్ రూప స్పందము" ఉన్నదో... అచ్చటనే సృష్టి ప్రదర్శితమౌతోంది. అట్టి చిత్

స్పందము లేనప్పుడు 'నిర్వాణము' అని చెప్పబడుతోంది. ఒక విత్తు (బీజము) తనయొక్క నిజరూపముననే పల్లవము (కొమ్మలు, ఆకులు, పళ్ళు మొదలైన) రూపంగా దర్శిస్తోంది. అట్లాగే మహాచైతన్యము కూడా తనయొక్క అభ్యంతరమును సృష్టిరూపంగా తనకు తానే ఎఱుగుచున్నది. బీజమే (బీజాంతర్గమైన బీజసత్తుయే) ఆ తదనందరం ఒకానొకచోట "ఆకులు" అను అనుభవంచే "ఆకులు"గా స్థితినొందినట్లు మహాచైతన్యము తనయొక్క "సృష్టి" అనబడు స్వీయకల్పనచే సృష్టిరూపంగా అగుచున్నది. బీజము యొక్క వృక్షరూపమునందు 1. ఉత్పత్తి, 2.స్థితి. 3.వృద్ధి, 4. అపక్షయము, 5.వినాశనము, 6.లయము అనబడే షడ్వికారాలు పొందుచున్నట్లే చైతన్యము యొక్క "వివర్తరూపము" అగు సృష్టియందుకూడా షడ్వికారాలు భాసిస్తున్నాయి. బీజము నందలి చైతన్యమే వృక్షమునందు కూడా ఉన్నట్లు సమస్త సృష్టి కూడా చిద్రూపము, చిన్మయము అయి ఉన్నది.

❖

ఓ రామచంద్రా! ఈ జగత్తంతా కూడా నిర్వికారమైనట్టి పరబ్రహ్మమే అయి ఉన్నదయ్యా! అందుచేత నీవు ఇదంతా నిర్వికారంగాను, ఆద్యంతరహితంగాను, నిరామయంగాను గ్రహించు. అయితే ద్వైతాద్వైత వికారాలతో కూడిన ఈ జగత్తు 'సంకల్పంలో నిర్మించబడిన నగరం'లాగా నిజ సంకల్పం యొక్క "అభావం"చే నశిస్తోంది. జగదుత్పత్తి, వినాశాలు అనగా ఇంత మాత్రమే!

ఆకాశం శూన్యమాత్రమై ఉన్నది కదా! అయితే... "ఆకాశమునకు, శూన్యత్వమునకు భేదం ఏదైతే అనిపిస్తోందో... అది మిథ్య మాత్రమే" – అని గ్రహించెదవుగాక! ఈ జగదనుభవమునకు ముందుగానే బ్రహ్మం సర్వదా సిద్ధించి ఉంది. అట్టి పూర్వసిద్ధమగు చిద్రూపం, శాంతం అగు బ్రహ్మ సత్తయే అజ్ఞానం చేత "నేను మనుష్యుడను" అను భావన వలన స్వయంగా అహంకారరూపం గాను, జగత్తు రూపంగాను స్థితినొంది ఉంటోంది. "జలంలో తరంగం జనిస్తోంది" అనే వాక్యం అపరిపూర్ణ వాక్యం. ఎందుకంటే, జలమే తరంగంగా కనిపిస్తూ కూడా జలం జలంగానే ఉంటుంది కదా! అదే విధంగా బ్రహ్మంలో ఈ జగత్తు జనిస్తున్నట్లున్నప్పటికీ జగత్తు అనబడేది జనించుటయే లేదని సుతీక్షణమైనబుద్ధితో గ్రహించు. అనగా జగత్తు జనించుటయూ లేదు, నశించుటయూ లేదు. జగత్తుగా కనిపిస్తున్నదంతా బ్రహ్మమే! బ్రహ్మమును గురించి ఎఱిగినవారికి ఇదంతా జగత్తుగా కనిపిస్తూనే బ్రహ్మంగా అనిపిస్తోంది.

వృక్షమే తన శాఖలు మొదలై అవయవాలలో స్థితిపొంది ఉన్నట్లు; ఆకాశమే ఆకాశమునందు ఉన్నట్లు; జలమే జల తరంగాలలో కూడా ఉన్నట్లు... బ్రహ్మము అటు నిర్వికార – నిర్విషయ బ్రహ్మరూపముగాను, ఇటు పదార్థ రూపంగాను కూడా స్ఫురిస్తూ వాస్తవానికి తన స్వరూపమునందు అవికార రూపముగా స్థితి కలిగియున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! బ్రహ్మమే అటు బ్రహ్మసత్తగా, ఇటు జగత్తుగా కూడా అనుభవ మగుచున్నదను వాక్యం యుక్తియుక్తమే! అయితే అనేక భేదములతో కూడిన జగద్దర్శనమునందు అభ్యాసపరులమై ఉన్న మేము బ్రహ్మమును ఉపాసించటం ఎట్లాగో చెప్ప ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**నిమేషాత్ అర్ధభాగేన దేశాత్ దేశాన్తర స్థితౌ ।**
**యత్‌రూపం సంవిదో మధ్యే స స్వభావ ఉపాశ్యతామ్ ॥**

ఓ రామచంద్రా! నీయొక్క జ్ఞానసత్త ఒక ప్రదేశమున ప్రవేశించి, ఇంతలోనే అర నిమిష కాలంలో ఆ ప్రదేశమును వదలి మరొక ప్రదేశమును ఆశ్రయిస్తోంది కదా! ఆ రెండింటి యొక్క మధ్యలో (ఒక విషయజ్ఞానము-మరొక విషయ జ్ఞానముల మధ్యలో) ఏమున్నది? నీ "జ్ఞానసత్త" ఆ ఉభయముల మధ్యలో నిర్విషయజ్ఞాన రూపంగా ఉన్నది కదా!

అట్టి నిర్విషయ జ్ఞానసత్తను ఉపాసించు. నీవు ఒక విషయము గురించి ఆలోచన చేస్తూ, ఇంతలోనే ఆ విషయమును వదలి మరొక విషయమును గురించి ఆలోచన చేయటం జరుగుచున్నది కదా! ఇట్టిదే జీవులందరి అనుభవం కూడా! ఇప్పుడు ఆ రెండు విషయముల మధ్య నిర్విషయమగు 'ప్రజ్ఞాసత్త' ఉన్నది. అట్టి ఆలోచనరహితమగు నిర్మల, నిర్విషయ ప్రజ్ఞాసత్తను ఆశ్రయించి ఉండు.

నీవు "భూమండలము"ను త్యజించి "సూర్య మండలము"ను ఆశ్రయిస్తున్నప్పుడు ఆ రెండింటి మధ్య (ఒకదానిని వదలిన తరువాత, రెండవ దానిని ఇంకనూ ఆశ్రయించనప్పటి) వేంచేసియున్న నిర్విషయజ్ఞాన సత్తను ఉపాసించు.

**సంక్షుబ్ధమ్ అక్షుబ్ధమ్ ఇతి ద్విరూపం సంవిత్‌స్వరూపం ప్రవదంతి సన్తః ।**
**శ్రేయః పరం యేన సమీహసే త్వం తదేకనిష్ఠో భవ! మా అమతిర్భూః ॥**

ఓ రామచంద్రా! మహనీయులగు ఆత్మజ్ఞులు చైతన్యము గురించి ప్రవచించేటప్పుడు రెండు మార్గాలుగా బోధిస్తున్నారు.

**1. వివర్త రూప చైతన్యం :** అజ్ఞానులకు అనుభవమగుచున్న ఈ సంక్షుబ్ధ సహిత జగత్తంతా వాస్తవానికి ఏకము, అద్వితీయము అగు చైతన్యమే! కనుక ఈ జగత్తును చైతన్యముగా, బ్రహ్మముగా ఆరాధన చేయటం.

**2. నిర్విషయ చైతన్యం :** చైతన్యము సర్వదా ఏకరూపమై, వివర్తరహితమై, అక్షుబ్ధమై పూర్ణానందైక రసరూపమై ఉన్నది. అయ్యది జగద్రహితం అనగా...

1. ఈ సంక్షుబ్ధ జగత్తే చైతన్యం; 2. చైతన్యం సర్వదా జగద్రహితం... ఈ రెండు మార్గాలలో ఏ ఉపాసన నీకు సానుకూలంగా అనిపిస్తే దానిని ఆశ్రయించు.

అయితే! భేదము, ఏకము ...అనబడే రెండింటిలో భేదము భ్రమ ఏకము వాస్తవము.

ఇది గ్రహించి ఉపాసన కొనసాగించు. అంతేగాని, గుడ్డి ఎద్దు చేలోపడ్డట్లు ఏ మార్గము ఎటు త్రోవతీస్తుందో గ్రహించకుండా అవివేకివై ఉండకు.

❖❖❖

# 17. ప్రపంచసహిత - ప్రపంచరహిత అఖండైక్య దృష్టి

**శ్రీరాముడు :** స్వామీ! "చైతన్యోపాసన" అనే విషయంలో "నిర్విషయ పరమాత్మను ఉపాసించటం" గురించి మరికొన్ని విషయాలు సాధక జనుల సుస్పష్టత కొరకై ప్రవచించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** పరమాత్మ యొక్క ఉపాసన ఉపక్రమించే ముందు పరమాత్మ యొక్క స్వరూపం ఏమిటో సుస్పష్టం చేసుకోవాలికదా! ఏతద్విషంలో మరల మరికొన్ని దృష్ట్యాంతపూర్వకమైన విశేషాలు చెబుతాను విను.

**దేశద్దేశాన్తరం దూరం ప్రాప్తాయాః సంవిదః క్షణాత్**
**యద్రూపమమలం మధ్యే పరం తద్రూపమాత్మనః ॥**

ఓ రామచంద్రా! నీయొక్క "చూపు" క్షణకాలంలో ఒక వస్తువును చూస్తూ, ఇంతలోనే క్షణ కాలంలో ఆ వస్తువు నుండి మరల్చబడి దూరంగా ఉన్న మరొక వస్తువుపై ప్రసరించినదనుకో! ఆ నేత్రేంద్రియం ద్వారా ప్రయాణించిన నీ చూపుకు సంబంధించిన జ్ఞానం సమీపంలోని ఒక జ్ఞేయాన్ని (చూడబడి-తెలియబడుచున్న వస్తువును) వదలి మరొక జ్ఞేయాన్ని ఆశ్రయించటం జరుగుచున్నది. వదలిన – స్వీకరించబడిన వస్తువుల జ్ఞానమునకు మధ్యగా (దగ్గిర వస్తువును చూడటం మానివేసిన తరువాత దూరవస్తువును ఇంకా నీ చూపు గ్రహించక ముందు)... నిర్విషయ నేత్ర జ్ఞాన సత్త ఉన్నది. అది అత్యంత స్వల్పకాలమే ఉంటోంది. అయితే, అట్టి నిర్విషయ చిద్రూపమునే జ్ఞప్తియందు ఉంచుకుంటూ, అద్దానియందే నిత్యమూ తన్మయుడవై ఉండుము.

ఇక ఆయా వ్యవహారములంటావా? నీ యొక్క వర్తమాన (దేహ సంబంధమైన) స్థితిగతులను అనుసరించి ఆయా స్వకులాచారాలను నిర్వర్తిస్తూనే "ఆ నిరాభాస-నిర్విషయ-చిద్రూపమే నేను" అని మననం చేస్తూ అట్టి వాసనా వర్జితమైనట్టి చిద్రూపమునందు నిశ్చలుడవై ఉండుము. అద్దాని నుండి ఎన్నటికీ చలించనేవద్దు.

విద్య-అవిద్యల భేదమేమిటో గ్రహించు. ఏదైతే విచారణ చేసి చూచినప్పుడు లభించదో అదియే అవిద్య. విచారణ చేసి చూస్తే అంతిమంగా చెక్కు చెదరక లభించేదే పరవిద్య. అవిద్య లభించేదే కాదు. విద్య (ఆత్మ)కు అలభ్యమైన క్షణమే లేదు. ఇక చిత్తు, చేద్యములకు, అనగా... "తెలుసుకునేది, తెలియబడేది" అనబడే రెండింటికి భేదమెక్కడున్నది? ఈ జీవుడు స్వయముగా – తనకు తానే స్వతహాగా ప్రకాశరూపమైయున్నాడు. ఆతనిచే ఏది ప్రకాశించబడుచున్నదో అదియే 'ప్రకాశ్యకము' అగు జగత్తు. అంతకు మించి జగత్తుకు ఉనికి గాని, నిర్వచనముగాని, వాస్తవానికి లేదు. చైతన్యము దర్శించే భేద – అభేదములన్నీ ఈ చైతన్యము యొక్క ప్రకాశమాత్రములే! కనుక చిత్‌కు చేత్యమునకు (లేక, ద్రష్టకు – దృశ్యమునకు) భేదము లేదు. బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్య. అట్టి మిథ్యాత్వము తొలగిస్తే శాంతము – నిర్వషయము అయినట్టి చిన్మాత్ర స్థితియే సర్వకాల – సర్వావస్థలయందు శేషించియున్నదగుచున్నది.

**బ్రహ్మము - జగత్తు ఒక్కటే : బ్రహ్మమయం జగత్ -** పరమార్థమున బ్రహ్మము, జగత్తు ఒక్కటే! కాని అజ్ఞానము చేత.... బ్రహ్మము ఏకమే అయినప్పటికీ, అనేకంగాను; పూర్ణమే అయినప్పటికీ అపూర్ణంగాను; శుద్ధమే అయినప్పటికీ అశుద్ధంగాను; అశూన్యమైనప్పటికీ శూన్యంగాను; పదార్థ రహితమైనప్పటికీ పదార్థసహితంగాను; పరిచ్ఛిన్నరహితమైనప్పటికీ, దేశకాలములచే పరిచ్ఛిన్న మైనట్లు; రూపరహితమైనప్పటికీ దేశ కాలాది రూపసహితమైనట్లు; వికారరహితమైనప్పటికీ వికారవంతంగాను; సమము, శాంతము అయినప్పటికీ అసమము, అశాంతముగాను; 'సత్తు' అయినప్పటికీ దృశ్యముకానందు వలన అసత్తుగాను; నిర్విభాగమైనప్పటికీ భాగసహితంగాను, చిద్రూపమైనప్పటికీ జడంగాను; విషయశూన్యమైనప్పటికీ విషయరూపంగాను; నిరంశమైనప్పటికీ అంశయుక్తంగాను; అహంకార రహితమైనప్పటికీ అహంకార సదృశంగాను; నాశరహితమైనప్పటికీ నాశవంతంగాను; కళంకవర్జితమైనప్పటికీ కళంకయుక్తంగాను; విషయవర్జితమైనప్పటికీ విషయ సహితంగాను; స్వయంప్రకాశమైనప్పటికీ పరప్రకాశభూతములగు అహంకారాదులవలెనూ; పురాతనమైనప్పటికీ నూతనంగాను; పరమాణువు కంటే కూడా సూక్ష్మమైనప్పటికీ తన ఉదరము నందు బ్రహ్మండములు ధరించినదిగాను; సర్వరసమైనప్పటికీ వైరాగ్యాది ఉపాసనలచే దృశ్యమును త్యజించినదిగాను; ప్రపంచరహితమైనప్పటికీ ప్రపంచపూర్ణమైనదానివలెను; అద్వితీయ మైనప్పటికీ అనేక రూపాలతో ఉన్నట్లు గాను; మాయారహితమైనప్పటికీ మాయా కిరణములు బయలుదేరుచున్న సూర్యబింబమువలెను; శుద్ధజ్ఞానమాత్రమైనప్పటికీ అన్నిటినీ ఎఱుగుచూ ఉండేదిగాను; 'జగత్తులు' అనే రత్నములు గల మహాకోశము (గని) అయినప్పటికీ, 'వివేకము' అనే తక్కెడలో తూచినప్పుడు లవలేశము కంటే కూడా లఘువైనది గాను; దృష్టికి గోచరం కానిదైనప్పటికీ, కిరణ సమూహపు చంద్రునివలె సుస్పష్టంగా కనబడుచున్నట్లే అనిపించేది గాను; దేశకాలములచే అనంతమైనప్పటికీ, ఆయా దేశకాలముల రూపం సంతరించుకొనుచున్నట్లుగానూ; శూన్యస్థానమందు ఉన్నప్పటికీ వన పర్వతాదులను నిర్మించటంలో తత్పరమైయున్నది గాను... (బ్రహ్మము)... అగుచున్నది.

❖

బ్రహ్మము సూక్ష్మతరవస్తువుకంటే సూక్ష్మతరమైనది. స్థూలవస్తువులన్నిటికంటే స్థూలమైనది. గురుతర వస్తువులన్నిటికంటే గురుతరమైనది. శ్రేష్ఠ వస్తువులన్నిటికంటే శ్రేష్ఠతమమై వెలయుచున్నది.

**అకర్తృ కర్మకరణమ్, అకారణమ్, అకారకమ్**
**అన్తః శూన్యతయైవై తచ్చిరాయ పరిపూరితమ్ ॥**

బ్రహ్మము కర్త–కర్మ–కారణరహితమైనది. అది దేనికీ కారకము కాదు. అంతఃశూన్యము అయినప్పటికీ కూడా చిరకాలంగా కర్తృ–కర్మాదులచే పూర్ణమైయున్నట్లు తోచుచున్నది. అది 'జగత్తులు' అనే రత్నములకు పేటిక. కాని ఆకాశమువలె మహాకోమలము, సర్వ పదార్థరహితము. ప్రత్యేక వస్తు–కాలరూపంగా ప్రకాశించేదంతా అదే! పురాతనమై ఉండి కూడా నిత్యనూతనం. స్వప్రకాశరూపమై కూడా అజ్ఞానదృష్టికి అది అంధకారమే! ప్రకాశరూపమై సర్వదా అంతటా వ్యాపించి ఉంటూ కూడా ఈ జగత్తుల తిరోధాన స్థానం అదే!

బ్రహ్మము సర్వదా సాక్షిరూపమున ప్రత్యక్షమయ్యే ఉన్నది. కాని నేత్రములకు దుర్లక్ష్యమగు చున్నది. సాక్షిగా పరోక్షమైనా, ప్రత్యక్షంగా ఎదురుగానే ఉన్నది. చిద్రూపమై కూడా జడజగత్తుగా భాసిస్తున్నదంతా అదే!

**అది సదా శుద్ధ చిన్మాత్రమే!** - అహంభావ రహితంగా ఉండి కూడా అహంభావ రూపంగా భాసించేది అదే! పైగా, అది ద్రష్టకు అన్యమైనదిగా ఒప్పుచున్నట్లు అనిపించినా... ఆత్మరూపమే అది! ద్రష్ట యొక్క రూపమే అది! ఆ పూర్ణ చిద్రూప మహాసముద్రంలో ఈ మూడు లోకములు ద్రవరూప సముద్ర తరంగాలుగా వెలయుచున్నాయి.

మంచు తనయందు తెలుపుదనాన్ని ధరించుచున్నట్లు ఆ చైతన్యం తనలో సృష్టిని ధరిస్తోంది. అయితే మంచువలననే తెలుపుదనం భాసించటం జరుగుతోంది కదా! అట్లాగే చైతన్యము వలననే ఈ 'సృష్టి' అనబడేది భాసిస్తోంది. జలమునకు ఆకారం అంటూ ఏదీ లేకపోయినప్పటికీ ఆ జలమే ఆకార సహితమైన తరంగములను విస్తరింపజేస్తోంది. అట్లాగే దేశకాలాది అవయవరహితుడైన ఈ చిద్రూపభగవానుడు దివారాత్రములతోకూడిన ఈ అసలైన జగత్తును విస్తరింపజేస్తూ వెలయు చున్నాడు. 'చిదాకాశము' అనే మహారణ్యంలో పంచభూతములు అనే అనేక రంగుల కలయికతో 'జగత్తులు' అనే పురాతనమైన లతలు వికసిస్తున్నాయి.

❖

చిద్రూపుడగు పరమాత్మ యొక్క స్వప్రతిబింబమే ఈ జీవ-జగద్రూపం. ఆయన తన ప్రతిబింబ మగు ఈ జీవ జగద్రూపములను తనకు అన్యమైన ఆకారంగా దర్శించు ఇచ్ఛయే ఈ దృశ్యాదులు. ఆతడు స్వస్వరూపదర్శనేచ్ఛచే స్వస్వరూపమును, అన్యదర్శనేచ్ఛచే దర్పణ ప్రతిబింబ రూప అహం-జగదాదులను పొందుచున్నాడు. బ్రహ్మచైతన్యం సర్వదా అపరిచ్ఛిన్నము. ఆ చైతన్యము ఆకాశంలో వృక్షంలాగా మిథ్యయగు తనయొక్క కల్పనా రూపమే అనతగిన స్వేచ్ఛా కల్పిత బ్రహ్మాండాదులను, త్రైలోక్యములను దర్శిస్తున్నది. ఈ సూర్యచంద్రాదులు, నేత్రాలు, మొదలైనవన్నీ అద్దానికి ఉపకరణ మాత్రములై ప్రవర్తిస్తున్నాయి.

ఆ పరమాత్మయే... అభ్యంతరమున వాసనామయ ప్రపంచంగాను, బాహ్యమున భువన రూప ప్రపంచంగాను, స్వప్నమున భావరూప ప్రపంచంగాను, సుషుప్తియందు ఏకమైన అవిద్యా రూపంగాను, ఆవిర్భావ, తిరోభావ రూపభావకుడుగానూ... ఉంటున్నాడు.

స్వయంగా అంతర్-బాహ్యములందు ఆయా బహువిధ విశేషములతో ప్రకాశిస్తున్నాడు. ఆతనికి అన్యంగా అణుమాత్రం కూడా ఎక్కడా ఏదీ లేదు.

ముఖం అనే బిలంతో జిహ్వ అనేక చమత్కారాలు నిర్వర్తిస్తోంది చూచావా? అట్లాగే చిదాత్మ యందు చైతన్యం యొక్క ఇచ్ఛచే చిద్రూపాలే అగు ఆయా పదార్థములన్నీ చమత్కారాలు చేస్తున్నాయి.

చైతన్యము యొక్క సంవిత్తే (జ్ఞానమే) "అనుభవము" అనే తన యొక్క అంగములచే రూప రసాదులను జగత్తుగా ఆస్వాదిస్తోంది. అట్టి 'లోకములు' అనే 'అనుభవ రూప ఆస్వాదములు' అనే తరంగములచే ఈ ద్రవత్వ జగత్తు ఏర్పడుతోంది.

ఓ రామచంద్రా! ఈ సూర్యచంద్రాద్రి ప్రకాశమానములు, తదితర రూపాది పదార్థములు – ఇవన్నీ చిద్రూపమునందే ప్రకాశిస్తున్నాయి. అంతేకాదు. సమస్త ప్రళయములు అట్టి చిద్రూపము నందే లయిస్తున్నాయి. ఈ జాగ్రత్ – స్వప్నాదులన్నీ ఉద్భవించేది – లయించేది ఆ చిద్రూపము నుండే. ఈ జీవుడు చిద్రూపస్వభావుడే కాని దేహాత్మస్వభావుడు కానేకాదు. తెలుపుదనం మంచునందే ఉన్నట్లుగా ఆ చిద్రూప బ్రహ్మమునందే జగత్తంతా కలదు. కాబట్టి ఈ జగత్తు బ్రహ్మమే అయి ఉన్నది. ఎందుకంటే బ్రహ్మము నుండే ఈ సమస్తము వెలువడుచున్నది.

చైతన్యము అవయవరహితము, రంగుచే చిత్రము లిఖించబడునట్లు 'చైతన్యము' అనే రంగుచే ఈ 'జగత్తు' అనే చిత్రము లిఖించబడి ఉన్నది. కాబట్టి ఈ జగత్తును నీవు జన్మాదివికార రహితమైనది గాను, శాంతము – చిన్మయముగాను ఎరుగుము. 'చిద్రూపము' అనే ఒక మహావృక్షము నుండి (కొమ్మలు–ఆకులు వలె) ఈ దృశ్యరూప శాఖలు విస్తరించి ఉన్నాయి. 'బ్రహ్మము' అనే నిశ్చల పర్వతముపై చంచలజలము వంటి ఈ దృశ్య సమూహములన్నీ బయల్వెడలుచున్నాయి.

**జగన్నాటకం -** 'చిదాకాశము' అనే ఒక గొప్ప నాటకరంగంలో 'జగద్రచన' అనే భ్రమాత్మక మైన అభినయమంతా అత్యంత చమత్కారంగా విరాజిల్లుతోంది. 'నియతి' అనే ఒకానొక నర్తకి అనేక కార్యారంభములతో కూడినదై ఆ నాటకరంగముపై నృత్యం చేస్తోంది. కన్నుమూసి–తెరిచే లోపల అనేక బ్రహ్మాండముల ఉత్పత్తి– వినాశములు జరిగిపోతున్నాయి. 'కాలము' అనే బాలకుడు 'బ్రహ్మము' అనే మండపముపై మరల–మరల నాట్యం చేస్తూ ఇంతలోనే ఉపసంహరిస్తూ, మరల ఏతెంచుచూ ఉన్నాడు.

❖

అద్దంలో అనేక ప్రతిబింబములు ఉదయించి, ఉపసంహరణమయినంత మాత్రం చేత ఆ అద్దం ఏదైనా వికారం పొందుతోందా? లేనేలేదు. అట్లాగే ఈ అనేక బ్రహ్మాండాలు ఉత్పన్నమగుచు – నశించుచున్నప్పటికీ బ్రహ్మము సర్వదా వికార రహితంగాను, శాంతంగాను ఉంటూనే ఉన్నది.

ఈ కనబడే స్థూలపంచభూతములకు కారణమేమిటి? సూక్ష్మపంచభూతములు కదా! ఘనము–ద్రవము–వాయువు... ఇవన్నీ ఒకే సూక్ష్మ పదార్థము యొక్క వివిధ రూపాలు అని అనక తప్పదు. ఉదాహరణకు ఒకానొక సూక్ష్మపదార్థమే మంచు–జలము–నీటి ఆవిరి అను స్థితులను ఉష్ణోగ్రత యొక్క అల్ప–ఆధిక్యతల ననుసరించి పొందుతోంది. అట్లాగే తాను కారణరహిత మైనప్పటికీ చిన్మాత్రమగు బ్రహ్మము– భూత వర్తమాన–భవిష్యత్ సృష్టులన్నిటికీ కారణబీజమై ఒప్పుచున్నది. ఆ బ్రహ్మం యొక్క విస్తరణయే ఈ జగత్తు అట్టి విస్తరణ యొక్క అభావమే ప్రళయం. కానీ ఈ సృష్టి – స్థితి – లయములనబడే – మూడు విధములైన స్థితులందు బ్రహ్మము సమముగా తన స్వరూపమునందే స్థితినొందియున్నది.

ఓ రామచంద్రా! వాయువు యొక్క చలనములన్నీ వాయురూపములే కదా! సృష్టి ప్రళయ – జనన – మరణ – హాని – వృద్ధి ఆదిగాగల దశలతో కూడిన ఈ మహా మహా బ్రహ్మాండములన్నీ ఆ అపరిచ్ఛిన్నములగు చిదాకాశమునందే ఉత్పన్నమవుతున్నాయి. అయినా కూడా చిదాకాశంలో

తత్ వ్యతిరేకము, అన్యము అయినదేదీ ఉత్పన్నమగుటయే లేదు. బ్రహ్మమునందు సర్వదా బ్రహ్మమే సర్వతత్వస్వరూపమై ప్రదర్శితమగుచున్నది. ఈ జగత్తులన్నీ చిదాకాశము యొక్క రూపములేనని ఎఱిగి సశాంతుడవై ఉండుము.

❖❖❖

# 18. ఇచ్ఛా జాడ్యం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అసలీ సంసార చమత్కారమంతా ఎట్లా ఏర్పడుచున్నదో ఎట్లా రూపుదిద్దుకొనుచున్నదో చెపుతాను, విను–

తటాకంలోని జలం నిశ్చలంగా, శాంతముగా ఉన్నప్పుడు అంతటా ఒకే జలం ప్రశాంతంగా కనిపిస్తుంది. ఇంతలోనే అందులో అనేక తరంగములు కనబడగానే పొడవైన, పొట్టి అయిన, చిన్న పెద్ద, ఆదిగా గల అనేక తరంగాలు, ఒక తరంగానికి – మరొక తరంగానికి భేదాలు మొదలైనవన్నీ అగుపిస్తున్నాయి. ఆ తరువాత కొన్ని తరంగాలు సుందరంగాను, మరికొన్ని వంకర–టింకరగా (అస్తవ్యస్తంగాను) కూడా కనిపిస్తున్నాయి.

అట్లాగే అంతా బ్రహ్మమే అయి ఉండగా, అట్టి యథాతథత్వం కొనసాగుచూనే... క్రమంగా అద్దానిలో అనేక పదార్థములతో కూడిన 'జగత్తు' అనబడునది అగుపిస్తోంది. మరికొంత క్రమంచేత అద్దానిలో రాగద్వేషం, సుఖదుఃఖాది అనేక అనర్థాలన్నీ ఘనీభూతమై ప్రాప్తిస్తున్నాయి. తరంగాలన్నీ జలమే అయినట్లు, సర్వజీవ జడాదులన్నీ కూడా యథార్థానికి ఏకమగు బ్రహ్మమే స్వభావంగా కలిగి ఉన్నాయి. ఆ బ్రహ్మసత్త సర్వ పదార్థాలలో వ్యాపించి ఉన్నదై (కానీ) సర్వ నామరూపాలకు వేరై – కేవలం జ్ఞేయమై ఉన్నది. అనగా తెలుసుకొనేది తెలియబడేది అనే రెండూ అదే! అది సన్మాత్రరూపమై, చిదాకాశస్వరూపమై ఉన్నది. ఈ జగత్తు పట్ల ధ్యాస (భేద దర్శనమనే ధ్యాస) తొలగగా అట్టి సమాధి రూపమగు ఉపశమునందే ఈ సమస్త విశ్వం (జలంలో తరంగాలులాగా) ఏర్పడి ఉన్నది.

**శ్రీరాముడు :** ఈ జగత్తంతా ఏకరూపమగు బ్రహ్మమే అయినప్పటికీ... ఎందుకో అనేక భేదములు, తద్వారా ప్రాప్తిస్తున్న ఆయా సుఖ దుఃఖాదులు ఈ జీవుని వెంటబడి బాధిస్తూనే ఉన్నాయనునది కూడా మనం గమనిస్తున్నాం కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చీకట్లో గాలికి కదిలే చెట్లను చూస్తే ఒక బాలుని చింతనలో అనేక పిశాచాది రూపాలన్నీ కనిపించవచ్చు గాక. ఒక ప్రౌఢునికి అక్కడ చెట్లే స్ఫురిస్తాయి కాని, పిశాచాదులు స్ఫురించవు కదా! చిదాకాశంలో కల్పించబడిన ఈ జగత్తు విజ్ఞుల దృష్టికి మాత్రం చిదాకాశానికి అనన్యంగానే కనిపిస్తోంది. అజ్ఞుల చిత్తమునకు సత్యమని తోచే ఈ జగత్తు విజ్ఞులకు (చిదాకాశానికి వేరైనదంతా) స్వకీయకల్పనా మాత్రమని తెలియవస్తోంది. జ్ఞానియొక్క దృష్టియందు ఈ జగత్తు... శిలయందు చెక్కబడిన శిల్ప సంబంధమైన 'సైన్యం' మొదలైన చాతుర్యం వలె మాత్రమే కనిపిస్తోంది. ఈ అనేకంగా కనిపించేదంతా జ్ఞానికి ఏకంగాను, ఆత్మస్వరూపంగాను అనిపిస్తోంది. ఇదంతా

కూడా బాహ్యమున ప్రకాశరహితమై, అభ్యంతర సంబంధమైన కుసంకల్పాది మానసిక చేష్టా రహితమై శిల్పకళా రచనవలె అగుపిస్తోంది. ఇది ఇట్లుండగా ఇక జ్ఞాని దృష్టియందు విశ్వత్వం ఎచ్చట? అజ్ఞానికి మాత్రం ఇదంతా సంకల్పాదియుక్తమై భాసిస్తోంది.

కాస్త విచారణ చేసి చూస్తే... ఇక్కడ కనిపించే బాహ్య-అభ్యంతరములైనట్టి రూప ప్రకాశ-సంకల్పాదులన్నీ కూడా... వాటి సారం చిన్మాత్రమే అయి ఉన్నది. ఎందుకంటే చిన్మాత్రం కంటే భిన్నంగా జీవుడు-మనస్సు మొదలైనవి లభించే వస్తువులు కావు. బంగారానికి భిన్నంగా ఆభరణ మెక్కడ? కాబట్టి ఇక ప్రపంచమనేది ఎక్కడ? సంసారము ఎవరికి? ఓ రామచంద్రా! మరింత క్రోడికరించి ఒక సిద్ధాంతం రూపంగా ప్రతిపాదిస్తున్నాను... విను.

**ఇదం జగత్ బ్రహ్మమేవ - సిద్ధాంతం -** జ్ఞాతకు - ఈ జగత్తును జగత్తుగా (అనేక భేదములుగా) పొందటమే "జగద్భ్రాంతి" అయి ఉన్నది. అట్లు ఎఱుగకుండుటయే (ఈ జగత్తంతా ఏకరూప బ్రహ్మముగా ఎఱుగుటయే) సర్వభ్రమ ఉపశాంతి.

అనగా, ఈ జగత్తు యొక్క స్మరణం అనేది నీ ఆధీనంలోనే ఉన్నది కదా! ఈ విధంగానే బంధం, మోక్షం నీ ఆధీనంలోనే ఉన్నాయని గ్రహించు. వ్యాపకమగు చిదాకాశం అంతటా ఏర్పడి ఉన్న 'పరమాకాశ రూపమే' అయి ఉండగా, అందులో 'పరివర్తనం' అనేది ఎట్లా సంభవం? సంభవం కాదు. ఆకాశం ఎక్కడున్నా మూర్తివంతం అవుతుందా? కాదు. మూర్తివంతమే కాని దానికి ఉత్పత్తి - వినాశనాలు ఎక్కడుంటాయి? చిన్మయమగు ఈ విశ్వమునకు ఉత్పత్తి-వినాశనము అనబడే స్వభావ వికారత్వమేమీ లేదు. ఇక ఈ కనబడే నామరూపాత్మకమైన వికారమంటావా? విచారణ చేసి చూస్తే ఈ ద్రష్ట-దృశ్యములకు ఆకార-అనుబంధాలు, నామరూపాదులు లేవని తెలియవస్తోంది. చైతన్యమునందు అవన్నీ ఎట్లా (చైతన్యమునకు వేరై) ఉండగలుగుతాయి?

❖

ఈ కనబడే సమస్త ప్రపంచం చిదాకాశమాత్రమే అయి ఉన్నది. అట్టి 'చిత్' (జ్ఞానస్వరూపం) నందు అహంకారాది ఆయా వికారములు ఎన్నడూ లేవు. జ్ఞానమునకు అన్యంగా ఎక్కడా ఏదీ లభించుటయే లేదు.

**సర్వం శాంతం శివం శుద్ధం త్వమ్-అహన్తాది విభ్రమమ్ ।**
**న కించిదపి పశ్యామి వ్యోమజం కాననం యథా ॥**

ఆకాశాన్ని చూపించి ఎవడైనా 'అయ్యా! చూడండి! ఆకాశంలో గొప్ప కీకారణ్యం కనిపిస్తోంది"... అని అంటాడనుకో, అది నిజమా? కాదు! అట్లాగే త్వమ్, అహమ్ (నీవు, నేను) మొదలగు రూపములన్నీ సమావేశమైనట్లుగా అనిపించే ఈ సమస్త విభ్రమములన్నీ "శాంతము - శివము - శుద్ధము అయినట్టి బ్రహ్మరూపమే" అయి ఉన్నది. చైతన్యముకంటే వేఱుగా ఎక్కడా ఏదీ లేదు. చైతన్యమునందు 'అహమ్-త్వమ్' అనునవేవీ లేవు. ఓ మిత్రులారా! నాకు బ్రహ్మమే అంతటా కనిపిస్తోంది. అందులో 'నేను-నీవు' అనేవేవీ కించిత్ కూడా కనబడటం లేదు.

ఓ రామచంద్రా! నేను, నా వాక్యములు – ఇవన్నీ కూడా శుద్ధము దృశ్యరహితము అగు చిదాకాశంగానే ఎఱుగుము. ఎందుకంటే నీకు అనుభవమయ్యేదంతా నీయొక్క చిదాకాశరూపము నందే సంస్థితమైయున్నది గాని... ఎక్కడో జడస్వరూపమున కాదు.

**పరపదము -** "ఇచ్ఛ" అనబడే ఒకానొక భ్రమయే. ఈ జీవుని "పరమపదం" అనబడు ఆత్మ యొక్క స్థితిని అనుభవములోనికి రానీకుండా చేస్తోంది. ఒక శిలయందు చెక్కబడిన మనుజుని వలె, ఒక చిత్రమందు చిత్రించబడిన మనుజునివలె ఎప్పుడైతే అంతరంగము ఇచ్ఛారహిత మౌతుందో... ఆ మరుక్షణం ఈ జీవునికి 'చైతన్యస్థితి' అనబడే పరమపదం స్వయంగా అనుభవ మౌతుంది. ఎవని అవగాహన అయితే ఆయా యథాప్రాప్తములగుచున్న కర్మల పట్ల ఇచ్ఛా, వ్యాకులం అనునవి లేనిదై ఒక కొయ్యబొమ్మవలె ఉండగలుగుతోందో... అట్టి వానిని "విశ్రాంతి చిత్తుడైన జీవన్ముక్తుడు" అని పిలుస్తారు.

**జ్ఞాని దృష్టి -** జ్ఞానికి ఈ ప్రపంచం, ఇందలి తన–తదితరుల జీవనం... ఇదంతా వెదురునాళం వలె బాహ్య అభ్యంతరాలలో శూన్యంగాను, రసహీనంగాను, వాసనారహితంగాను, పిల్లల ఆటవలె అర్థరహితంగాను తోచుచున్నది. ఎవని హృదయంలో దృశ్య ప్రపంచం కించిత్ కూడా రుచించదో, అదృశ్యమగు 'చిన్మాత్ర బ్రహ్మం' మాత్రమే రుచిస్తుందో... అట్టివాడు మాత్రమే బాహ్య అభ్యంత రాలలో "శాంతి"ని దర్శించగలుగుతారు. అతడు మాత్రమే ఈ సంసారాన్ని దాటివేయ గలుగుతాడు.

ప్రియా ఆత్మబంధువులారా! మీరు 'ప్రారబ్ధకర్మ'ను నశింపజేయటానికి ఉపయోగించే మాటలు మాత్రమే మాట్లాడండి. అన్యశబ్దములను ఉచ్చరించనే వద్దు. క్రమక్రమంగా ఈ దేహాదుల పట్ల అహంకార, మమకారములను త్యజించండి. వాటితో సంబంధరాహిత్యమును ఒనగూర్చుకోండి. వేణువు తనయందు ఇచ్ఛ–అనిచ్ఛ అనేవేవీ లేకుండానే లోకానికి మధుర గానాన్ని వినిపిస్తుంది చూచారా? అట్లాగే మీరు కూడా వాసనారహితులై (ఆ వేణువు వలె) శబ్దములను ఉచ్చరించండి. దేనినైనా ప్రవాహపతితమైన వ్యవహారానుసారంగా స్పృశించవలసివచ్చిందా... అట్లే స్పృశించండి. అయితే క్షోభవర్జితులై, ఇచ్ఛారహితులై, వాసనలనేవేవీ లేకుండా ఆయా యథాప్రాప్తములైన చందమున–మాలాదులను ఈ త్వక్ ఇంద్రియము స్పృశించుగాక.

**స్వాద్యన్తాం రసజాలాని విగతేచ్ఛాభయైషణమ్**
**అపరాగాభిలషణం యథా ప్రాప్తాని దర్వివత్ ॥**

ఒక గరిట ఎటువంటి ఇచ్ఛ–భయ–క్రోధాలు లేకుండానే పులుసులో ప్రవేశించి తన విధిని నిర్వర్తిస్తూ ఉంటుంది చూచావా? అట్లాగే ఈ జిహ్వేంద్రియం కూడా ఎటువంటి ఇచ్ఛ–భయ–క్రోధములు లేకుండానే యథాప్రాప్తములైన పదార్థములను అస్వాదించునుగాక!

ఒక చిత్రంలోని మనుజుని కళ్ళు ఎవరిని చూచినప్పటికీ అభిమానరహితంగానూ, వాసనా రహితంగానూ, అమనస్కంగానూ యథాతథంగా ఉంటుంది కదా! అట్లాగే ఈ కళ్లు కూడా వాసనా రహితంగాను నిరభిమానంగాను, అమనస్కంగాను, రాగత్యాగ రహితంగాను యథాప్రాప్తమగుచున్న

ఆయా రూప సమూహములను దర్శించును గాక! అలాగే ఈ ఘ్రాణేంద్రియం ఆయా పుష్పాదుల సుగంధమును 'వనం' త్యజించినట్లు త్యజిస్తూనే పొందునుగాక!

ఈ ప్రకారంగా కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ విషయాలలో మనస్సు నిస్సారత్వం సంపాదించుకుని ఉండటమే ముఖ్యమైన ఉపాయం. అట్లా మనస్సుకు పట్టిన 'భోగాలు' అనే రోగాలకు చికిత్స కావించబడకపోతే... ఇక ఈ జీవునికి 'శాంతి' యొక్క వార్త కూడా దరిజేరదు.

**ఇచ్ఛాత్యాజ్యం -** ఓ సాధక జనులారా! ఈ ఇంద్రియ విషయ భోగములతో కాలం వృథా చేసుకోకండి! 'కాలం' అనే మహత్తరమైన భగవత్ ప్రసాదితమైన ఉత్తమావకాశమును సద్వినియోగపరచుకోవాలే గాని, దుర్వినియోగపరచుకోవటం ఏమాత్రం ఉచితం కాదు సుమా!

**యః స్వాదయన్ భోగ విషం రతిమేతి దినేదినే ।**
**సో అగ్నౌ స్వమూర్తిం జ్వలితే కక్షమక్షయముజ్ఝతి ॥**

ఎవడైతే ఇక్కడ 'భోగములు' అనే విషమును ఆస్వాదిస్తూ రోజురోజుకు సంతోషిస్తూ కాలం వెళ్ళబుచ్చుతాడో... అట్టివాడు ప్రజ్వలించుచున్న అగ్నిని తన శరీరముపై ధరించి అద్దానిపై ఎండుగడ్డి పరకలను మరల మరల విసరుకొన్నవాడే అవుతాడు.

అందుచే ఎట్లాగైనాసరే "ఇచ్ఛగించటం" అను మనస్సు యొక్క అలవాటుకు ఇక్కడ చికిత్స చేసుకోవాలి. 'ఇచ్ఛ' అనే అడ్డు తొలగనంతకాలం ఈ జీవుడు సంసారంలో ఉంటూనే ఉంటాడుగాని... ఆనంద స్వరూపుడగు పరమాత్మ యొక్క తత్త్వమును గుర్తించనేలేడు. వేదవేత్తలలో శ్రేష్ఠులైనవారు "ఇచ్ఛారాహిత్యమే సమాధాన స్థితి. అదియే సమాధి. ఈ మనస్సు ఇచ్ఛారాహిత్యముచే శమించినట్లుగా వేల కొలది ఉపదేశములు విన్నప్పుడు కూడా శమించదు" అని అంటూ ఉంటారు.

**ఇచ్ఛోదయే యథాదుఃఖం, ఇచ్ఛాశాంతిమ్ యథాసుఖమ్ ।**
**తథా న నరకేనాఽపి బ్రహ్మలోకే నానుభూయతే ॥**

'ఇచ్ఛ' యొక్క ఉదయముచే కలిగే దుఃఖం నరకంలో కూడా అనుభవం కాదు. ఇచ్ఛ శమించినప్పుడు కలిగే సుఖం బ్రహ్మలోకంలో కూడా అనుభూతం కాదు సుమా! "ఇచ్ఛా మాత్రమే చిత్తం. ఇచ్ఛా రాహిత్యమే మోక్షం" అనేదే శాస్త్రసారం. ఇచ్ఛను జయించివేసినప్పటి (త్యజించినప్పటి, అతీతత్వం సంతరించుకున్నప్పటి) స్థితియే సమస్త శాస్త్రముల యొక్క, తపస్సుల యొక్క, యమ-నియమాదుల యొక్క తాత్పర్యం. ఎంతెంతవరకైతే ఏ ప్రకారాలుగా ఇచ్ఛ ఉదయించకుండా ఉంటుందో, అంత వరకు దుఃఖ సమూహబీజం వృద్ధి పొందదు. వివేకబలంచే జీవునిలో ఇచ్ఛ సన్నగిల్లుచున్న కొద్దీ 'దుఃఖచింత' అనే మహమ్మారి శమిస్తూ ఉంటుంది. 'రాగం'చే ఇచ్ఛ ప్రవృద్ధమౌతూ ఉంటుంది. ఇచ్ఛచే దుఃఖము అనే విషయతరంగాలు ప్రవృద్ధమౌతూ ఉంటాయి.

ఈ 'రాగం - ఇచ్ఛ' అనే వ్యాధికి "మనస్సును నిగ్రహించటం" అనే పురుష ప్రయత్నరూపమైన ఔషధమే శరణ్యం. పురుష ప్రయత్నంకంటే బలవత్తరమైన ఔషధం వేఱొకటేదీ లేదు. ఓ ప్రియ సహజీవులారా! మీరు ఒకే కాలంలో ఇచ్ఛలన్నీ జయించలేకపోతే, కనీసం కొంచెం కొంచెంగానైనా

వీటిని త్యజిస్తూ ఉండే ప్రయత్నంలో ఉండండి. మీరు అట్టి సన్మార్గంలో ఉంటే చాలు, ఇక దుః ఖాదులు మిమ్ములను సమీపించే సాహసం చేయలేవు.

**యస్తు ఇచ్ఛాతానవే యత్నం న కరోతి నరాధమః ।**
**సో౽ంధకూపే స్వమాత్మానం దినానుదినం ఉజ్ఝతి ॥**

ఎవడైతే "తనయందలి ఇచ్ఛను సన్నగిల్లజేయటం" అనే ప్రయత్నంలో తనను నియమించు కుని ఉండడో... అట్టివాడు ప్రతిరోజు తననుతాను చీకటి నూతిలోని లోతులలోకి ప్రతిదినం పడదోసికొనినవాడే అగుచున్నాడని నా హెచ్చరిక. అట్టి నరాధముడు తననుతానే దుఃఖపరంపరలకు అప్పజెప్పుకొన్న వాడగుచున్నాడు. "దుఃఖములు" అనే పుష్పములచే శోభితమై ఉన్న ఈ సంసార లతకు "ఇచ్ఛ" అనేదే బీజం. అట్టి బీజం అంకురించకుండా ఉండాలంటే 'ఆత్మజ్ఞానం' అనే అగ్నిచే అద్దానిని దహించాలి. అప్పుడిక అది మరల మొలకెత్తదు.

రామచంద్రా! మరల మరల గుర్తు చేస్తున్నాను. 'ఇచ్ఛ'యే సంసారం. 'ఇచ్ఛ' యొక్క అభావమే నిర్వాణం. అందుచేత ఇచ్ఛ అనేది ఉత్పన్నమే కాకుండటానికి సమస్త ప్రయత్నాలు ఆచరించు. సకల ఉపాయాలు అనుసరించు. ఇక తక్కిన వ్యర్థ ప్రయత్నముల వలన ప్రయోజనమేమున్నది?

**శాస్త్రోపదేశ గురవః ప్రేక్ష్యాన్తే కిమనర్థకమ్ ।**
**కిమ్ "ఇచ్ఛా న అనుసంధాన సమాధిః" న అధిగమ్యతే?**

ఓ ప్రియ సహాత్మజనులారా! మీరు శాస్త్రములు కొఱకు, గురూపదేశముల కొఱకు ఎందుకు ప్రతీక్షించటం? చిత్తశాంతికి ఉపాయమైనట్టి "ఇచ్ఛా రాహిత్యము"ను ఎందుకు అభ్యాసపూర్వకంగా ఆశ్రయించటం లేదు? ఎందుకంటారేమో? ఎవనికైతే "తన యొక్క వివేకాదులచే ఇచ్ఛను సన్నగిల జేయటం"... అనేది "దుస్సాధ్యం!" అని అనిపిస్తూ ఉంటుందో అట్టి వానికి గురూపదేశాలు, శాస్త్ర పఠనాదులు ఎంతగా అందిస్తే ఏం లాభం? అవన్నీ చెవిటివానికి రాగయుక్తంగా శంఖం ఊది వినిపించటంలాగా నిరర్థకమే అవుతాయి. పులులతో నిండిన అరణ్యంలో ఒక జింక అటూ ఇటూ పచార్లు చేస్తూ ఉంటే, ఇక ఆ జింకకు మరణం నిశ్చయమైనట్లే కదా! "ఇచ్ఛ" అనే వికారముచే అనేక విషయసంబంధమైన వికారములతో కూడి, అనేక దుఃఖములను విస్తరింపజేసే స్వభావం గల ఈ సంసారంలో ప్రవేశించిన ఈ జీవునికి ఆ జింకలాగానే అధఃపతనం నిశ్చితమై ఉన్నది. ఈ జీవుడు సకల తదితర ఆధ్యాత్మిక సాధనలను ఒక్క ప్రక్క ఉంచి, ముందుగా ఈ ఇచ్ఛ' అనే దానిని సన్నగిల చేసుకోవటం ఎట్లాగో యోచించటం మంచిదని నా అభిప్రాయం. ఎందుకంటావా?

**న బాలీక్రియతేతి  ఈషత్ ఆత్మజ్ఞానాయ చేదసౌ ।**
**ఇచ్ఛోపశాన్తిః క్రియతాం తయాలం తదవ్యాప్యతే ॥**

బాలునిలాగా ఇచ్ఛచే చపలుడు కాకపోతే ఈ మానవునకు ఆత్మజ్ఞానం సంపాదించు కోవటానికి కొంచెం ప్రయత్నం సరిపోతుంది. ఓ సభికులారా! కొందరికి ఎంత ప్రయత్నించినా, ఎన్నో సాధనలు చేసినా, ఎంతగానో గురుపదేశములు విన్నా, ఎంతెంతగానో శాస్త్రములు కంఠో

పాఠంగా వచ్చినా, వారికి కూడా ఆత్మజ్ఞానం అనుభవానికి రాలేదంటే... దానికి అసలైన కారణం? వారి అంతరంగంలో ఈ దృశ్య విషయాల పట్ల నిర్మించుకొని ఉన్న 'ఇచ్ఛ' యొక్క ప్రభావం చేత ఏర్పడిన మనోచాంచల్యమేనని నా కనిపిస్తుంది. కాబట్టే మనముందుగా ఇచ్ఛ యొక్క ఉపశాంతికై ఉపాయములు ఆశ్రయించటం ముముక్షువు చేయవలసిన పని - అని నా అభిప్రాయం. ఇచ్ఛ సన్నగిల్లితే ఆత్మజ్ఞానం అతి సులభంగా మనస్సుకు హత్తుకుంటుంది.

**నిరిచ్ఛత్తై నిర్వాణం, స ఇచ్ఛత్తైవహి బంధనమ్**
**యథాశక్తి జయేదిచ్ఛాం! కిమేతావతి దుష్కరమ్?**

ఇచ్ఛ యొక్క అభావమే నిర్వాణం (నిరిచ్ఛ); ఇచ్ఛ యొక్క ప్రవృద్ధమే బంధనం (సఇచ్ఛ)... కాబట్టి యథాశక్తి ఇచ్ఛను జయిస్తూ రావాలి.

ఇంతమాత్రం ప్రయత్నం "అబ్బో! కష్టసాధ్యం!"... అని అంటే ఇక మేము చేయగలిగిన దేమున్నది? (నిర్వాణ స్థితి ప్రాప్తికి) ఈ మాత్రం ప్రయత్నించటంలో దుస్సాధ్యం ఏమున్నది?

**జరామరణజన్మాది కరఞ్జ ఖదిరావలేః**
**బీజమిచ్ఛా సదైవ అంతర్ దహ్యతాం శమవహ్నినా ॥**

ఓ రామచంద్రా! ఈ "జరామరణ జన్మాదులు" అనే కంటక వృక్ష సమూహమునకు బీజము ఇచ్ఛయే సుమా! అందుచేత ఆ కంటక వృక్ష బీజమును "శమము (ఇంద్రియ నిగ్రహము)" అనే వివేకాగ్నిచే దహింపజేయాలి. ఎందుకంటే ఎక్కడెక్కడ ఇచ్ఛ ఉంటే అక్కడక్కడ బంధపాశములన్నీ వచ్చిపడుచున్నాయి. ఇచ్ఛ ఉన్నచోట పుణ్య-పాపరూప దుఃఖ రాసులన్నీ వచ్చి చేరుతున్నాయి. ఇక అట్టి జీవుని యొక్క మహాబాధలకు అంతూ-పొంతూ ఉండటం లేదు. సాధువైనవాడు ఇచ్ఛారహితం చేసుకోకుండా కొంచెం సమయం గడిపినా కూడా, ఆ కొద్ది సమయం ఏమఱచి ఉండడంచేత, దొంగలచే సంపదలు అపహరించబడిన గృహయజమానిలాగా, సర్వస్వం కోల్పోయిన బాటసారి లాగా - చిరకాలం రోదన, వేదనలు పొందవలసి వస్తుంది. మరి ఈ సంసారమార్గం అటువంటిది! ఎంతెంత వరకైతే ఇచ్ఛ అంతఃకరణంలో శమిస్తూ ఉంటుందో, అంతంత వరకు అతనిపట్ల మోక్షము కొఱకై శుభదాయకమగు సాధన చతుష్టయ సంపత్తి ప్రవృద్ధమౌతూ ఉంటుంది.

సంసారము = వాస్తవానికి ఆత్మ స్వరూపుడే అయిన ఈ జీవుడు, ఆత్మజ్ఞాన వివేకరహితుడై విషయోపభోగముల ద్వారా ఇచ్ఛను పరిపూర్ణం చేసుకోవాలని, ఎండమావుల వైపుగా నీటికొరకై ప్రయాణించే జింకలాగా, ఈ దృశ్య వ్యవహారంలో నిర్వర్తించే జన్మజరామరణములతో కూడిన నిరంతరమైన రాకపోకలు. ఇదే సంసారం! ఇంతకు మించి సంసారముగా ఎక్కడా ఏదీ లేదు.

'హృదయము' అనే వృక్షం యొక్క అగ్రభాగంలో ఎక్కడో ఈ 'ఇచ్ఛ' అనే నిప్పుకణం పుట్టి ఇక హృదయమును దహించివేస్తోంది.

'జీవుడు' అనే పశువు కాలుచున్న హృదయ గృహంలో చిక్కుకుని అల్లాల్లాడుచున్నాడు. 'పుణ్య పాపాలు' అనే స్వకీయ ఆశ్రయంచే ఎంతో శ్రమపడుతూ దీర్ఘకాలంగా వగరుస్తున్నాడు.

'మోహం' అనే పొగ అతని కళ్ళు కప్పి అంధునిగా చేసివేస్తోంది. 'రాగము-ద్వేషము' అనే కట్టుత్రాళ్ళచే అతడు బంధించపబడి ఉన్నాడు. 'ఆశ-నిరాశలు' అనే ఛట-ఛట ధ్వనులను వింటూ ఈ జీవుడు దిక్కుతోచకుండా ఉన్నాడు.

❖❖❖

# 19. ఇచ్ఛయొక్క ఉపశాంతి

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఇచ్ఛారాహిత్యము, తద్వారా ఏర్పడగల ఆత్మతో సంయోగము గురించి మనం ఇప్పుడు కొన్ని విశేషాలు చెప్పుకున్నాం. అయినా కూడా "ఇచ్ఛ యొక్క సంపూర్ణశాంతి" గురించి ఇంకా మరికొన్ని విశేషాలు ఇప్పుడు చెప్పుకోవటం సందర్భోచితమని నాకు అనిపిస్తోంది. కనుక "ఇచ్ఛ యొక్క ఉపశాంతి" సంబంధితంగా మన సంవాదము కొనసాగిద్దాం.

"అసలు 'ఇచ్ఛ' యొక్క ఆవశ్యకత ఏమిటి?" అనే ప్రశ్నకు వద్దాం.

> **ఆత్మనో వ్యతిరిక్తం చేత్ విద్యతే తదిహ ఇచ్ఛయా!**
> **ఇష్యతామ్ అసత్ ఇత్యేతత్ స్వాత్మాన్యత్వం కిమిష్యతే?**

'ఆత్మ' కంటే వేరుగా ఎక్కడైనా ఏదైనా ఉంటే, అప్పుడు అద్దానిని కొఱుకోవటం భావ్యమే! అసలు ఆత్మకు వేరుగా ఏది ఎక్కడున్నది? అంతా ఆత్మయే అయి ఉండగా, ఆత్మకు వేఱుగా రెండవ వస్తువు కనిపించటమనేది భ్రాంతియే. అనగా "భ్రాంతి చేతనే ఇచ్ఛ ఉదయిస్తోంది" అనే కదా! ఆత్మ జ్ఞానం యొక్క ప్రవృద్ధి చేత "రెండవ వస్తువే ఉండజాలదు" అని గ్రహించుటచే ఇచ్ఛ సునాయాసంగా జయించబడుతుంది. ఇచ్ఛను అధిగమించాలంటే ఆత్మజ్ఞానమే ఉపాయం. "అవయవరహితం, ఆకాశం కంటే కూడా అత్యంత సూక్ష్మం, దృశ్య శూన్యం" అగు చైతన్యమేది కలదో... అదియే ఇటు అహంకారంగానూ, అటు జగత్తుగాను కనిపిస్తోంది. నీకు కనిపించేదంతా నీ రూపమేనని గ్రహించిన తర్వాత అందులో ఇక నీవు కోరవలసినదేముంటుంది? త్యజించవలసినదేముంటుంది?

ఈ ఆకాశము, ఇక్కడి విషయములు, ఆ విషయములు గ్రహించే జ్ఞాత... ఇవన్నీ కూడా చిదాకాశరూపమగు చైతన్యమే అయి ఉన్నాయి. ఈ జగత్తు యొక్క అభాస కూడా చిదాకాశ రూపమే! ఇకప్పుడు 'ఇచ్ఛ'కు విషయమెక్కడున్నది?

అజ్ఞాన దృష్టిచే అశాంత దృష్టి ఏర్పడుతోంది. అట్టి అశాంతదృష్టికి 'గ్రహించువాడు-గ్రహించ బడునది"... అనబడే గ్రాహ్య-గ్రాహక సంబంధం ఇక్కడ కనిపిస్తోంది. ప్రశాంత దృష్టికి ఆ సంబంధమే అగుపించదు. ప్రశాంత చిత్తులమగు మనకు ఇక గ్రాహ్యం ఎక్కడ? గ్రాహకం ఎక్కడ? ఎవరియందు ఈ గ్రాహ్య-గ్రాహక సంబంధము కనిపిస్తోందో... వారు కూడా ఆత్మకు వైఱైనవారు కాదు కదా! ఆ గ్రాహ్య - గ్రాహక సంబంధము పరిశీలించిచూస్తే అగుపించేదికాదు. ఎందుకంటే స్వతః అసత్తైనది ఎక్కడ ఎట్లా లభిస్తుంది? ఎవరికైనా చంద్రుడు ఆకుపచ్చగా కనిపిస్తాడా?... ఆకుపచ్చ రంగుటద్దంలోంచి చూచే వారికి తప్ప!

**గ్రహించువాడు, గ్రహించబడునది -** అజ్ఞానంచే ఆత్మయందు నిష్ఠ లేకపోవటమే "గ్రాహ్యము–గ్రాహకము"ల యొక్క 'సత్త' అయి ఉన్నది. అశాస్త్రీయమైన దృష్టి చేతనే ఈ అనేకాలుగా కనిపించే వన్నీ సత్యం వలె అనిపిస్తున్నాయి. శాస్త్రీయమగు తత్త్వ నివారణచే "గ్రహించువాడు గ్రహించ బడునది" అనే విషయ–విశేషములన్నీ ఎచటికో పలాయనం చిత్తగిస్తాయి. ఓ ప్రియజనులారా! అజ్ఞానులగు వారిపై గల అవ్యాజమైన ప్రేమచే సుజ్ఞానులు "శాస్త్రములు" అనే అమృతపు జల్లు కురిపిస్తున్నారు. అట్టి శాస్త్రముల సహాయంతో అసత్యమగు "అహంత్వము"ను అధిగమించెదరు గాక! ఈ అహంత్వము ఆత్మతత్త్వజ్ఞాన ప్రభావంచే ఆత్మయందే విలీనమైపోతోంది. అదియే ద్రష్టృ–దృశ్యాదుల సంపూర్ణ క్షయరూపమైనట్టి 'నిర్వాణము'. అదియే ఆత్మతత్త్వము యొక్క స్వభావము.

**దృశ్యము, నిర్వాణము -** 'నిర్వాణం' నందు దృశ్యాదులు లేవు. దృశ్యాదులందు శాంతి రూప నిర్వాణం లేదు. 'ఎండ–నీడ' లాగానే ఆ నిర్వాణ–దృశ్య వ్యవహారములు రెండూ ఒక్కచోట ఏర్పడి ఉండేవి కావు. ఇక ఆ రెండిటి యొక్క 'సమభావన' కలుగవచ్చునంటావా? అవి రెండూ పరస్పరం బాధించుకుంటున్నాయి. కాబట్టి రెండూ అసత్యములేనని అనాలి. కానీ 'రెండూ అసత్యములే' అనే మాట విద్వజ్ఞుల అనుభవానికి భిన్నంగా ఉన్నది. ఎందుకంటే అసత్యమైన దానిలో శాంతి లేదు. ఇక నిర్వాణమో... దుఃఖ శూన్యముగాను, పరమశాంతముగాను తత్త్వజ్ఞులకు అనుభవమౌతోంది. ఈ దృశ్యాదులో... సదా దుఃఖదాయకంగాను, భ్రమ రూపములుగాను అయి ఉన్నాయి.

కాబట్టి ప్రియ రామచంద్రా! ఈ దృశ్యాదులను భావించనే వద్దు. సర్వ భావములకు ఆవల సర్వదా వేంచేసి ఉన్న 'నిర్వాణం' అనబడు ఆత్మ పదమునందే సదా సంస్థితుడవై ఉండు.

ఒకనికి ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లుగా అనిపించవచ్చు గాక! కాస్త విచారించి చూస్తే ముత్యపుచిప్పలో వెండి ఉన్నదా? అందులో లభించే దానితో మనకేమైనా వెండిరూపమైన ప్రయోజన మున్నదా? లేదు. అట్లాగే దృశ్యాదులలో వాస్తవంగా లభించేదేమీ లేదు. అందుచేత 'ఈ దృశ్యాదులు మిథ్య' అని ఎరుగటంలో హాని ఏమున్నది? 'ఈ దృశ్యం సత్యం' అని తలచటంలోనే మహా దుః ఖాలన్నీ దాగి ఉన్నాయి. 'ఈ దృశ్యం మొదలంట అసత్యం' అని గ్రహించటంలో మహా సుఖముంది.

**శ్రీరాముడు :** దృశ్యమును అనుక్షణం ఎంతగానో అనుభవిస్తున్న మాకు దృశ్యము అవాస్తవమని ఎరిగి ఉండటం ఏమంత తేలికంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆత్మ యొక్క మనన సహితమగు 'నిధిధ్యాస'చే అట్టి దృశ్యం యొక్క అభావం తప్పక లభించగలదని నేను చేతులెత్తి ప్రకటన చేస్తున్నాను. (ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష!)

**ఆత్మకు బంధం లేదు -** ఆత్మజ్ఞానమును ఏమరచి సంసారంలో సంచరించే బాటసారులారా! 'ఉత్పత్తి' మొదలైన వికారాలకు విషయమే కానట్టి ఆత్మ స్పష్టంగా కరతలామలకమై స్ఫురించు చుండగా అద్దానిని మీరు ఎందుచేత దర్శించలేకున్నారు? అట్టి ఆత్మకు బంధహేతురూపంగా ప్రకటనమగుచున్న దృశ్య సమూహాన్ని జ్ఞానాగ్నిచే ఎందుకు దహించివేయటం లేదు?

ఎప్పుడైతే కార్య–కారణ భావాదులు కూడా బ్రహ్మమే అని సునిశ్చితమౌతుందో... అప్పుడే దేహము మొదలుగా గల సర్వ పరిచ్ఛిన్న భావాలు వాటంతట అవే సమసిపోతాయి. అటు తర్వాత

మాత్రమే బ్రహ్మత్వము సిద్ధిస్తుంది. అంతేగాని అణుమాత్రం దృశ్యము మీ దృష్టిలో శేషించి ఉన్నప్పటికీ జగదత్వమే సిద్ధిస్తుంది కాని... బ్రహ్మత్వము కాదు.

చిదాకాశరూపం-ఏకం-సర్వవ్యాపకం-పరిపూర్ణం అయినట్టి సర్వాత్మయగు బ్రహ్మము నందు కార్య-కారణ సహితమగు దృశ్యాన్ని ముందుగా అంగీకరించి, తరువాత బ్రహ్మ ప్రబోధం కొరకు సాధనలను వెతుకువారు మా ఉద్దేశంలో పసిబాలుర వంటి వారే! అట్టి వారి కల్పితవాక్యములతో మాకు పని లేదు. వారి పరిశ్రమంతా వృథాయాసమేనని మా ఉద్దేశం! ఎందుచేతనంటావా? కార్యకారణ పూర్ణములగు వ్యాక్యములందు అవిద్య తప్ప మరింకేమి క్రమం ఉన్నది?

**శ్రీరాముడు :** మహాత్మా! నిర్విషయమని చెప్పబడే చిదాత్మయందు సృష్టిత్వము అనే చమత్కారం ఎందుకు ప్రత్యక్షమౌతోంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాయువు యొక్క చలనమునకు హేతువు ఏముంటుంది? జలము యొక్క ద్రవత్వమునకు కారణమేమున్నది? ఆకాశము యొక్క శూన్యత్వమునకు ఎవరు కారణమంటే ఏం చెపుతాం? చిదాత్మ యొక్క సృష్టిత్వమునందు కూడా అదే కారణమున్నది. గాలి, గాలి తరంగాలు ఒక్కటే అయినట్లు కార్య-కారణాదులన్నీ బ్రహ్మమే అయి ఉన్నాయి. ఎప్పుడైతే అవి రెండూ బ్రహ్మమే అయి ఉన్నాయో... ఇకప్పుడు సృష్టుల యొక్క కారణత్వము 'వెతకటం, ప్రబోధించడం' అనునది సిగ్గులేనిపనే అవుతుంది. (బ్రహ్మణి సర్గాణాం కారణార్థా విలజ్జతా)

**న దుఃఖమస్తి న సుఖమ్ శాంతం శివమయం జగత్ ॥**

కాబట్టి ఈ జగత్తు కేవలం శాంతము, శివమయము అయి ఉన్నది. అంతేగాని, ఇక్కడ సుఖము లేదు, దుఃఖము లేదు.

**నాస్తి చిన్మాత్రతా అన్యత్వమ్, అత ఇచ్ఛోదయః కుతః?**
**మృత్ దేహయోధసేనాయాం న మృణ్మాత్రే ఇతరత్ యధా!**

ఒక కళాకారుడు మట్టితో యుద్ధ దృశ్యమును తయారుచేసి ఎదురుగా పెట్టాడనుకో. మనకు ఆ మట్టి బొమ్మల దృశ్యంలో శత్రుసైన్యం, మిత్రసైన్యం, గుఱ్ఱాలు, ఏనుగులు, శూలాలు, గదలు, బల్లేలు మొదలైన సంరంభమంతా చిత్ర విచిత్రంగానూ, రసవత్తరంగాను అగుపించవచ్చు గాక! కానీ ఆ బొమ్మలన్నీ మట్టితోనే తయారయ్యాయి కదా! మట్టిగాక ఆ బొమ్మల సంబంధాలన్నీ (శత్రు సైనికుడు-మిత్ర సైనికుడు-శత్రు-మిత్ర సంబంధాలు మొదలైనవి) ఎక్కడున్నాయి? ఈ జగత్తంతా కూడా శాంతమగు చిన్మాత్రము తప్ప మరింకేమీ కాదు. ఇక ఇచ్ఛ యొక్క ఉదయము ఎవరికి? ఎట్లు సంభవం?

**న స జగత్ - అహంతాదౌ దృశ్య బ్రహ్మేతరత్తథా ॥**

నేను-నేను చూసే జగత్తు మొదలైన వాటితో కూడిన ఈ దృశ్యమునందు బ్రహ్మము కంటే వేరైనది అణుమాత్రం కూడా లేదు. ఉండ జాలదు. ఏదైనా బ్రహ్మము కంటే వేరుగా నవరసాల రూపంలో కనిపిస్తుంటే, అది సత్యము కాదు. కాబట్టి ఇక ఇచ్ఛతో పనేమున్నది?

**ఇచ్ఛ కూడా బ్రహ్మమేనా? -**

**శ్రీరాముడు :**

**ఏవం చేత్ తత్ ఉదేత్ ఇచ్ఛా మాహోదేతు, మునీశ్వర!**
**సా తు బ్రహ్మైవ కోఽర్థఃస్యాదస్యా విధి-నిషేధనే?**

హే మునీశ్వరా! మీరు ఇంత వరకు 'ఇచ్ఛయే సంబంధం. ఇచ్ఛా రాహిత్యమే ముక్తి' అనే భావమును ఆయా కోణాలనుండి నిరూపిస్తూ వస్తున్నారు కదా! 'మట్టి బొమ్మలన్నీ మట్టియే అయినట్లు, సర్వము బ్రహ్మమే' అని ఇప్పుడు సిద్ధాంతీకరించారు. అంతయూ బ్రహ్మరూపమే అయినప్పుడు 'ఇచ్ఛ' అనేది కూడా బ్రహ్మమే కదా! అప్పుడిక ఇచ్ఛ ఉదయించినా, ఉదయించకున్నా కూడా ఒక్కటే కదా! ఇచ్ఛ ఉదయిస్తే మాత్రం హాని ఏమున్నది? ఇకప్పుడు 'ఇచ్ఛను త్యజించడం – ఇచ్ఛారాహిత్యాన్ని ఆశ్రయించడం'... అనే రూపంతో కూడిన విధి-నిషేధములతో పని ఏమున్నది? వాటి వల్ల క్రొత్తగా కలిగే ప్రయోజనమేముంటుంది? మరి, శాస్త్రములు గాని గురువులు గాని, మహనీయులగు తమవంటివారు గాని విధి-నిషేధములు చెప్పవలసిన అవసరమేమున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆత్మజ్ఞానం ఉదయించిన తర్వాత "ఇచ్ఛ కూడా బ్రహ్మమే! బ్రహ్మమునకు అన్యంగా ఏదీ లేదు" అని నీవు చెప్పే విషయం నగ్న సత్యమే! అందులో అనుమానానికి తావులేదు. అయితే... ఇక్కడ ఒక్క విషయం నీవు గమనించెదవుగాక! ఎప్పుడైతే "ఇదంతా మట్టియే" అని గ్రహించబడుతోందో అప్పుడు ఇచ్ఛ కూడా స్వభావసిద్ధంగా శమిస్తుంది. ఎందుకంటే 'ఇచ్ఛ శమించటం' అనేది ఆత్మజ్ఞానము యొక్క స్వభావము అయి ఉన్నది. సూర్యుడు ఉదయించగానే చీకటి తొలగటం ఎంతగా స్వభావసిద్ధమో, అంతగా ఆత్మజ్ఞానం ఉదయించగానే ఇచ్ఛ మొదలైనవి అత్యంతస్వాభావికంగా శమిస్తాయి. ఎంతెంతగా జ్ఞానం ఉదయిస్తూ ఉంటుందో అంతంతగా ద్వైతశాంతి, వాసనా విలయము కూడా కలుగుతూ ఉంటాయి. అప్పుడిక ఇచ్ఛ క్రమంగా ఉదయించటమేలేకుండా పోతూ ఉంటుంది. ఎవనికైతే సమస్త దృశ్య పదార్థములందు వైరాగ్యము కలుగుతూ ఉండగా ఇక ఇచ్ఛ ఉదయింపకయే ఉంటుందో... అతనిపట్ల సంసారము గురించిన అవిద్య స్వయంగా నశించి (అతని యందు) నిర్మలమగు ముక్తి ఉదయిస్తూ ఉంటుంది.

అట్టి ఇచ్ఛా రహితునికి ఈ దృశ్య పదార్థాలను చూస్తూ ఉన్నప్పుడు అటు రాగం గాని, ఇటు ద్వేషంగాని ఉండదు. కేవలం స్వభావసిద్ధంగానే ఈ కనబడే దృశ్య విషయాల పట్ల రుచి కలుగదు. అట్టి జ్ఞాని ఒకవేళ ఆకస్మిక ఘటనచే (లేక) ఇతరుల ప్రేరణచే (కాదా)... శాస్త్ర నియమానుసారంగా ఏవైనా క్రియాదులు (దానం-ధర్మం మొ॥) నిర్వర్తిస్తూ ఉండవచ్చు. లేదా, నిర్వర్తించకనూ పోవచ్చు.

ఇచ్ఛ కూడా ఈ సృష్టిలోని ఒక చమత్కార వస్తువు అని ఎప్పుడు గ్రహించబడుతుందో... అప్పుడు మాత్రమే అట్టి జ్ఞానికి "ఇచ్ఛ-అనిచ్ఛ ఈ రెండూ కూడా బ్రహ్మరూపములే!" అనే అనుభవం కరతలామలకమౌతుంది. ఈ విధంగా ఆ రెండూ వాస్తవానికి బ్రహ్మరూపములేనని అనటంలో ఏమాత్రమూ సందేహములేదు. పైగా జ్ఞానియొక్క పూర్వాభ్యాస వశంచేత అతనికి క్రొత్తగా దేనిపట్లా 'ఇచ్ఛ, అనిచ్ఛలు' ఉండవలసిన ఆవశ్యకతయే కనిపించదు. ఈ జీవునికి ఎప్పుడైతే ఆత్మజ్ఞానం

ఉదయిస్తుందో... అప్పుడు ఇచ్ఛ దానంతట అదే శమిస్తుంది. లేదా, ఇచ్ఛను శమింపజేసుకున్న వానికి ఆత్మజ్ఞానం అతిసులభంగా కరతలామలకం అవుతుంది. ఎందుచేతనంటే... చీకటి - వెలుగు ఒకచోట ఉండలేవు కదా!

**ప్రతిషేధ విధీనాం తు తజ్ఞో న విషయః క్వచిత్ ।**
**శాంత సర్వైషణ - ఇచ్ఛస్య కోఽస్య కింవక్తి, కిం కృతే?**

శాస్త్రాలలో చెప్పబడిన విధినిషేధాలకు జ్ఞాని ఎన్నటికీ విషయమే కానేరదు. ఎందుకంటావా? సమస్త ఈషణలు, వాంఛలు నశించినవానికి నియమాల వల్ల క్రొత్తగా ఏది పొందవలసినదున్నది?

**ఇచ్ఛ రహితం అవటమంటే -** ఎప్పుడైతే ఈ సర్వదృశ్య పదార్థములు నీరసములై రుచించకయే ఉంటాయో, ఇవన్నీ అతిస్వల్ప సమాచార విశేషాలుగా అనిపిస్తాయో.... అప్పుడు అతని ఇచ్ఛ ప్రసరణను త్యజించి ఉన్నట్లౌతుంది. అదియే 'ముక్తి' యొక్క ఉదయం కూడా! ఎవడైతే ఆత్మజ్ఞానం చేత ద్వైత - అద్వైత రహితమగు శాంతిరూపమున నెలకొనిన స్థితి కలిగి ఉంటాడో... అట్టి వానికి ఇచ్ఛ - అనిచ్ఛాది సర్వ పదార్థములు బ్రహ్మ రూపములుగానే దర్శనమౌతాయి.

కనుక ఓ ప్రియ సభికులారా! మీరు జ్ఞానులు అయ్యెదరుగాక! ఆత్మజ్ఞానముచే ద్వైత వివర్జితులు, ద్వైత - అద్వైత రహితులు, నిర్మల స్వభావులు, వ్యాకుల రహితులు, ప్రశాంత చిత్తులు, ఆత్మయందే స్థితి పారాయణము కలిగియున్నవారు అయ్యెదరుగాక! ఆత్మయందే స్థితి కలిగి ఉన్న జ్ఞానికి ఈ ప్రపంచంలో ఏవైనా కార్యములు నిర్వర్తించటం చేతగాని, నిర్వర్తించకుండటం చేతగాని ఏ క్రొత్త ప్రయోజనమూ ఉండదు. అంతే కాకుండా సమస్త తదితర సహజీవులపట్ల అతనికి తన ప్రయోజన నిమిత్తమై ఆశ్రయించవలసిన పదార్థమేదీ కనబడదు.

**నానిచ్ఛయా నేఽచ్ఛయాథ న సతా నాసతా సదా ।**
**నైవాత్మనా న చ అన్యేన నైతైర్ మరణజీవితైః ॥**

అట్టి జ్ఞానికి ఇచ్ఛచేగాని, అనిచ్ఛచేగాని, సత్తుచేగాని, అసత్తుచేగాని, ఆత్మచేగాని, లేక మరింక దేనిచే గాని, జీవితంచే గాని, మరణంచే గాని ఎప్పుడునూ ఏ ప్రయోజనమూ అగుపించదు. "నిర్వాణరూపుడు-ప్రబుద్ధుడు" అయిన అట్టి జ్ఞానికి ఇచ్ఛయే ఉదయించదు. ఒకవేళ ఎప్పుడైనా ఉదయించినా అది కూడా అతనికి బ్రహ్మముగానే అనుభవమౌతుంది.

❖❖❖

# 20. ప్రబుద్ధుడు - అప్రబుద్ధుడు

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**న దుఃఖమస్తి న సుఖం, శాన్తం-శివమ్ అజమ్ జగత్ ।**
**ఇతి యోఽన్తః శిలేవ అస్తే తం 'ప్రబుద్ధం' విదుర్ బుధాః ॥**

ఓ రామచంద్రా! "సుఖముగాని, దుఃఖముగాని లేదు. ఈ జగత్తు శాంతము-శివమయము అయి ఉన్నది"... అని ఎవడైతే తన అంతఃకరణంలో నిశ్చయం కలిగి ఉంటాడో, శిల యొక్క

అంతరము వలె నిశ్చలముగా ఉంటాడో... అట్టివాడే "ప్రబుద్ధుడు"... అని పండితులు మనకు చెప్పుచున్నారు.

**దుఃఖం సుఖం భావనయా కుర్వన్ విషమివామృతమ్ ।**
**ఇతి నిశ్చత్య ధీరాత్మా 'ప్రబుద్ధ' ఇతి కథ్యతే ॥**

"ఆత్మతత్త్వము ఇట్టిది కదా" అని నిశ్చయించుకొన్నవాడై ఎవడైతే విషయమును అమృతంగా మార్చినట్లు దుఃఖమును కూడా నిరతిశయానందాత్మ భావనచే సుఖమయంగా ఒనర్చి వేస్తాడో అట్టి ధీరచిత్తుడే ప్రబుద్ధుడు.

**ప్రబుద్ధుని జ్ఞాన స్థితి -** అట్టి జ్ఞానస్థితియందు ఉన్న వానికి... శాంతం–చిదాకాశరూపం–శివం–దృశ్యరహితం–సద్వస్తువు అయిన బ్రహ్మం నందు; శాంతం–చిదాకాశరూపం–శివం–దృశ్యాది రహితం సద్వస్తువు అయిన జగత్తు ...నెలకొని ఉన్నట్లు, స్థితికలిగి ఉన్నట్లు అత్యంత స్వభావసిద్ధంగా అనుభూతమౌతుంది. ఈ జగత్తు భేదయుక్తమై అనిపించటమే భ్రమ, బంధం, అనుబంధం కూడా!

ఇది భేదరహితం, స్వయంగా నిర్విషయం అని అనిపించటమే జ్ఞానం యొక్క పరాకాష్ఠ! ఈ జగత్తు బ్రహ్మమయమై బ్రహ్మం నందే సదా సర్వదా స్థితి కలిగి ఉన్నది. కనుక బ్రహ్మమునకు వేరుగా 'జగత్తు' అనబడేది ఎక్కడా లేదు. జగత్తుగా కనిపించేది, అనిపించేది వ్యాపక బ్రహ్మము తప్పితే మరింకేమీ కాదు. బ్రహ్మము తప్పితే మరింకెక్కడా ఏదీ లేదు.

**శ్రీరాముడు :** మరి ఈ 'అహంకారము' అనుదాని రూపము?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మరల రెండు వాక్యములు పునరుద్ఘాటిస్తున్నాను.

1. ఈ జగత్తు బ్రహ్మమయమైయున్నది. ఇక్కడ కనబడే అహంకారాదులతో, ఇచ్ఛాదులతో సహా సర్వము బ్రహ్మమే!
2. బహ్మం విషయవర్జితం–చిదాకాశం–సర్వవ్యాపకం–సౌమ్యం–సమం–శివం అయి ఉంది.

అట్టి బ్రహ్మమునందు అహంకారాదులకు తావెక్కడిది? "అంతయు బ్రహ్మమే" అనునది సుగ్రాహ్యమై అనుభవైకవేద్యమగుచుండగా అహంకారాదుల భ్రమ తనంతటతానే తొలగిపోతోంది. దృశ్యజగత్తు ఒకానొక మనోవ్యాపకం మాత్రమే!

**శ్రీరాముడు :** మరి ఈ ఎదురుగా కనిపించే స్థావరజంగమాత్మకమగు జగత్తు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ సూక్ష్మార్థగ్రాహీ! రామచంద్రా! ఈ స్థావర – జంగమాత్మక జగత్తు మనోరాజ్యనగరము వంటిదే సుమా! ఊహలో ఒక నగరం కళ్ళు మూసుకొని చూడటం ఎటువంటిదో కళ్ళు తెరచినపుడు కనిపించే స్థావరజంగమాత్మక జగత్తు అటువంటిదే! వాస్తవానికి ఈ జగత్తు శాంతమగు చిదాకాశమే అయి ఉన్నది.

**శ్రీరాముడు :** "ఈ జగత్తుగా కనిపించేది భ్రమయే! రసవత్తరమగు నాటక ప్రదర్శనమే!" అను ఎఱుక (లేక) జ్ఞానమును సిద్ధించుకొన్న జ్ఞానికి ఈ జగత్తునందు సంచారం, తదితరులతో సహ

జీవనం – ఇవన్నీ ఎట్లా (ఏ రూపంగా) అనిపిస్తున్నాయి? అట్టి ప్రబుద్ధుడు తదితర అప్రబుద్ధులతో సహజీవనం చేస్తున్నప్పుడు ఏవైనా గుర్తింపతగిన విశేష లక్షణములు కలిగి ఉంటాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకాయన గొప్ప స్వప్నంలో ఉన్నాడనుకో! అతని స్వప్నదర్శనంలో నీ యొక్క రాక–పోకలు నీకు సంబంధం లేకుండానే ఎట్లా సిద్ధిస్తున్నాయో, ఆ విధంగా ఈ జగద్రూపమగు భ్రమయందు తత్త్వజ్ఞుని రాకపోకలు కూడా ఉంటున్నాయి. అతడు అంతా యథాతథంగా (అప్రబుద్ధులవలెనే) పొందుతూ కూడా ఇదంతాకూడా అన్యమనస్కంగా దర్శిస్తూ ఉంటాడు.

**అన్యమనస్కం -**

**పరచిన్తా పురోమధ్యే గత విఘ్నం గమ–ఆగమౌ ।**
**యథాన్తస్తవ శూన్యత్వాత్ తథైవ అస్మిన్ జగత్భ్రమే ॥**

ఎవరో ఒకాయన యొక్క మనోరాజ్యం (ఊహారాజ్యం)లో కల్పితమైన నగర మధ్యంలో నీ యొక్క రాక–పోకల వలె ఈ జగద్రూపభ్రమయందు ఈ జీవుల రాక–పోకలు సిద్ధిస్తున్నాయి సుమా! తత్త్వజ్ఞులు ఈ చమత్కార వ్యవహారం అట్లే గమనిస్తున్నారు. ఇక ఈ ఎదురుగా కనబడే సముద్ర–పృథ్వి–నది–పర్వతాదులతో కూడిన సృష్టి గురించి అడుగుతావా? బాగా దాహం వేస్తూ ఉన్నవాని కళ్ళకు జల రహిత ఎడారి ప్రదేశంలోని వాయు సంబంధమైన నీడ తరంగాలే జల తరంగాలుగా కనిపించి అతనిని పరుగులు తీయించినట్లుగా... ద్రష్ట యొక్క అంతఃకరణమే ఆయా సముద్రము మొదలైన రూపములుగా విజృంభిస్తోందని జ్ఞానుల నిర్వచనం. స్వప్న నగరంలో అంతా మిథ్యయే అయినట్లు, బాలునికి భూతాలు కనిపించటం భ్రమ మాత్రమే అయినట్లు ఈ జగత్తునందు అసత్యత్వమే తప్ప మరింకేమీ లేదు. సత్యమగు బ్రహ్మమే అసత్యమగు జగత్–అహంకారముల రూపమున భాసిస్తోంది. ఏదైతే భ్రాంతికి లభించకయే సర్వదా స్ఫురిస్తోందో అయ్యది మాత్రమే 'వాస్తవమగు సత్యము' అయి ఉన్నది. ఈ జగత్తు సత్తు కాదు. పోనీ అసత్తా? ఊహూ! అసత్తూ కాదు. సత్–అసత్‌మయము కూడా కాదు. ఇదంతా కూడా ఇంద్రియములచే నిశ్చయించబడజాలని తత్త్వమై ఉన్నది. ఇది అనిర్వచనీయమై ఆకాశంలో గంధర్వనగరంలాగా భావనచే స్వకల్పితమాత్రమై భాసిస్తోంది.

ఓ రామచంద్రా! తత్త్వ బోధ యొక్క బలం చేత జ్ఞాని పట్ల సర్వ విషయములు శమిస్తున్నాయి. ఇక అతని ఇచ్ఛ–అనిచ్ఛలు సమత్వమును పొందుచున్నాయి. విక్షేపరహితమై జీవన్ముక్త సుఖము కొరకై, శ్రేయము కొరకై 'అనిచ్ఛయే' పరమ ఫలదాయకమగుచున్నది.

**శ్రీరాముడు :** నిర్వికారమగు ఆత్మయందు సవికారమగు అహంకారము – జగత్తు అనబడేవి ఎందుకు స్ఫురిస్తున్నాయి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** నిర్వికారమగు ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి ద్రవం (జలం), ద్రవం నుండి ఘనం (భూమి) అనే క్రమాల వలెనే నిర్వికారమగు ఆత్మ నుండి సవికారమగు అహంకారము–జగత్తు మొదలైనవన్నీ ప్రభవిస్తున్నాయి. అవి మొట్టమొదట ఆత్మయందు జ్ఞప్తి రూపంలోనే, నిశ్చల వాయువునందు చంచల వాయు తరంగత్వము వలె ఉండి

ఎప్పుడో ప్రదర్శితమౌతున్నాయి. నిశ్చల వాయువునందు చంచల వాయు తరంగ ప్రదర్శనమునకు కారణము లేనట్లే... నిర్వికారమగు ఆత్మయందు జ్ఞప్తి రూపంగా స్వయంకల్పిత జగత్తు అనబడేది ప్రదర్శితమౌతున్నది. నిర్వికారమగు ఆత్మయందు ఈ చంచల అహంకార జగదాదుల ప్రదర్శనకు కారణమంటూ ఏదీ లేదు.

చైతన్యము విషయముల వైపుగా అభిముఖమై ఉండటమే చిత్తము. అదియే సంసారము. అదియే 'ఇచ్ఛ' కూడా. అట్టి 'ఇచ్ఛ' నుండి ముక్తి అవటమునే 'ముక్తి' అంటున్నారు. కాబట్టి అట్టి ముక్తిని ఎఱిగినవాడై ఇచ్ఛారహితుడవై, శాంతుడవై ఉండెదవు గాక!

అయితే... ఇచ్ఛ ఉండవచ్చు గాక! ఉండకపోవచ్చు గాక! సృష్టి ఉండవచ్చు. లేక ప్రళయం వస్తూనో, లేక వచ్చియే ఉండవచ్చు. ఏది ఎట్లున్నా ఆత్మజ్ఞానికి సందేహాలే ఉండవు. ఎందుకంటే ఈ జగత్తు సత్యము కాదు కాబట్టి! ఆత్మజ్ఞాన రూపకమగు చిదాకాశమునందు "ఇచ్ఛ-అనిచ్ఛ-సత్తు-అసత్తు-భావము-సుఖము-దుఃఖము"-ఇటువంటి కల్పనలేవీ సంభవించజాలవు.

**ఇచ్ఛానాం తానవం యస్య దిన - అనుదినమాగతమ్**
**వివేక-శమ-తృప్తస్య తమాహుః మోక్షభాగినమ్**

ఏ మనుజుడైతే వివేకము చేతను, శమము చేతను ఇచ్ఛలు రోజు రోజుకు తగ్గించుకుంటూ స్వభావ సిద్ధమగు తృప్తిని పెంపొందించుకుంటూ ఉంటాడో... అట్టివాడే 'మోక్ష భాగినుడు' అని చెప్పబడతాడు.

'ఇచ్ఛ' అనే చాకుతో హృదయమును పొడవటం జరిగినప్పుడు మాత్రమే ఆ హృదయంలో శోకము-మోహము మొదలైన వేదన పుడుతోంది. ఆ శోకము-మోహము అను వేదన తొలగాలంటే మణి-మంత్ర-ఔషధముల వలన అయ్యే పని కాదు. బ్రహ్మదేవుని సృష్టిలోని పదార్థములైనట్టి ఈ మణి-మంత్ర-ఔషధములు దేహమునకు చికిత్స చేయగలుగుతాయేమో గాని,... అతని మనస్సుకు చికిత్స చేయలేవు. ఎందుకంటే మనిషి యొక్క దుఃఖ కారణమేమిటో, దానికి నివారణోపాయమేమిటో మేము ఎంతగానో ముందుగానే పరిశీలించి చూచాం. భ్రాంతితో కూడుకొని, మిథ్యారూపమైన ఉపాయములతో ఒకనికి ఒక విషయము పట్ల గల భ్రాంతిని తొలగించవచ్చునేమో గాని... అతని భ్రాంతి స్వభావమును తొలగించగలవా? లేదు. ఒకనియొక్క బహు యోజన విస్తారమైన మనో కల్పనలో మరొకడు ప్రవేశించగలడా? ఆ మరొకడు భ్రమచే దర్శించే స్వప్న సదృశ విషయాలను తొలగించడం మొదటివానికి కుదురుతుందా? కుదరదు. అనగా... నీ మిత్రుడు నిదురిస్తూ-పీడకలకంటూ దుఃఖ భాజనుడగుచుండగా జాగృత్‌లో ఉన్న నీవు నీ పొగడ్తల చేతనో, ధనాదులు ఇచ్చో ఆ దుఃఖము తొలగించడం కుదరనిది కదా! లేదు కదా! అందుచేతనే ప్రాపంచిక విషయాలు జీవునికి అనునిత్య శాంతిని ప్రసాదించలేకపోతున్నాయి.

అసత్పదార్థమును తీసుకొని అసత్తుగా ఏర్పడిన సంసార దుఃఖమును మొదలంటా తొలగించటం కుదేరేపని కాదు. పిల్లవాడు వస్తువుల కోసం ఏడుస్తుంటే ఏదో వస్తువు ఇచ్చి అప్పటి వరకు ఏడుపు మానిపించగలం. అంతమాత్రం చేత ఏడ్చే స్వభావం తొలగదు. ఆ వస్తువుపై అపేక్ష

తొలగగానే మరల మరొక వస్తువు కోసం దుఃఖిస్తూనే ఉంటాడు. అట్టి దుఃఖం జీవితాంతం ఏదో రూపంలో అనేక జీవులను వెంటనంటి ఉంటూనే ఉంటోంది. 'అసత్ పదార్థములచే దుఃఖం తొలగుతుంది' అని తలచటం 'కుందేటి కొమ్ములను తీసుకొచ్చి ఆకాశాన్ని కప్పి ఉంచాలనుకోవటం'... వంటిది.

శీతలం అధికం అయినప్పుడు జలం కొద్ది క్షణాలలో గడ్డకడుతుంది చూచావా? అట్లాగే చిదాకాశము కూడా ఈ దేహాదులపట్ల అహంభావ రూపమగు అభిమానమును పొందినప్పుడు మనస్సు ద్వారా దేహాది వ్యవహారాలను పొందుచున్నది. అయితే ఈ జడమగు దేహాదులు పొందిన ప్పటికీ చిదాకాశం యొక్క వాస్తవ తత్త్వమగు చిత్‌శక్తి అక్షయమయ్యే ఉంటోంది గాని, చిత్‌శక్తి ఏదీ పోగొట్టుకోవటం లేదు. కానీ అది అద్దాని యందే అసత్యములగు ఈ దేహాదులన్నీ అనుభవిస్తోంది. అనగా, ఈ దేహాదులు స్వప్న సదృశంగా పొందుచున్నంత మాత్రం చేత చిదాకాశానికి వచ్చిపడే లోటేమీ వాస్తవానికి ఉండదు. ఆకాశం నీలంగా కనిపించినంత మాత్రంచే అక్కడ నీలిరంగుతో కూడిన ఏదైనా పదార్థం ఉన్నదా? లేదు కదా! నీలం రంగు వాస్తవానికి అసత్యమైనప్పటికీ సత్యమే అయినట్లు కనిపిస్తోంది. అట్లాగే పరమాత్మయందు ఈ సృష్టి సత్యము కాదు. అసత్యము కాదు. అందుకనే దీనిని 'అనిర్వచనీయం' అని శాస్త్ర నిర్ణయం.

ఆకాశము-శూన్యత్వము అభేదము కదా! వాయువుకు-వాయు తరంగాలకు భేదమేమున్నది? అట్లాగే బ్రహ్మము-సృష్టులు అభేదమగు ఏక రూపములే సుమా!

**నేఽహ సంజాయతే కించిత్ జగదాది! న నశ్యతి,**
**స్వప్నే నిద్రాగతస్యేవ కేవలం ప్రతిభాసతే ॥**

యథార్థానికి బ్రహ్మమున 'జగత్తు-అహంకారము' ఆదిగాగల పదార్థాలేవీ ఉత్పన్నం కావటం లేదు. నశించటయూ లేదు. నిద్రించేవాని స్వప్నంలోని పదార్థముల వలె అవన్నీ కేవలం 'ప్రతిభాస మాత్రములు' అయి ఉన్నాయి. స్వప్నంలో ఏ వస్తువులు పడుతున్నాయ్? ఏవి నశిస్తున్నాయ్? ఈ జగత్ పదార్థములు అట్టివే! ఈ విధంగా ఈ పృథ్వి మొదలైనవేవీ లేనివే! సృష్టి అంతా ప్రతిభాస మాత్రమే సుమా! కేవలం చిన్మాత్రము మాత్రమే తనయందు తానే స్థితి కలిగియున్నది! ద్వైత-ఏకత్వమూ రెండూ ఇక్కడ అసంభవమే! అందుచేత బుద్ధి మొదలైన వాటన్నిటి యొక్క కరణత్వమంతా అసత్యమే! ఎందుకంటావా? అంతా బ్రహ్మమే అయి ఉండగా 'దీని చేత ఇది నిర్వర్తించబడుతోంది. అది అద్దానిని నిర్వర్తించటం లేదు'... మొదలైన వ్యవహారమంతా అసత్తు కాక మరింకేమిటి? ఇక్కడగాని, మరింకెక్కడైనా గాని... పరమార్థ వస్తువు ఒక్కటే సంభవం. ఇక తదితరమైనదంతా ఆ పరమార్థ సద్రూపమునే పొందినదగుచున్నది. అట్టి నిర్విషయ చైతన్యమున ఈ కల్పములు, మహా కల్పములు, వాటి క్రియాసమూహములు సహేతుకంగాను-సక్రమంగాను ఉన్నట్లే ప్రతిభాసించ వచ్చుగాక! ఇవన్నీ స్వప్న సదృశము మాత్రమే! స్వప్నంలో కొద్ది క్షణముల కాలంలో సుదీర్ఘమైన సంఘటనలు, స్వమరణం వంటి అహేతుకమైన-క్రమరహితములైన విశేషములు అనుభూతము

లగునట్లు ఇదంతా చైతన్యము తనయందే తన స్వరూపమునే సృష్టి రూపంగా అనుభవం పొందుతోంది. కనుక ఈ కనబడే పృథ్వి, పర్వతాలు, ఈ కంటికి కనిపిస్తున్న గోడ మొ॥ తదితర సర్వ వస్తు సముదాయము, ఆయా వస్తువుల సంచలనము ఇవన్నీ చిదాకాశమే అయి ఉన్నాయి. స్వప్నంలో కనిపించే నది, ఆలయం, గుడిసె మొదలైనవన్నీ ఆ స్వప్నద్రష్ట యొక్క చిదాకాశ రూపమే అయినట్లు... ఈ జాగ్రత్ ద్రష్టదర్శనము కూడా జాగ్రత్ ద్రష్ట యొక్క చిదాకాశ రూపమే అయి ఉన్నది. 'చిదాకాశ'మనే గోడపై 'చైతన్యము' అను రంగుచే ఈ 'జగత్తు' అనే చిత్రం అంతటా పరిపూర్ణమై వ్యాపించియున్నది. అట్టి ఈ జగత్తు భావనచేతనే అనుభవమౌతోంది, కాబట్టి... అట్టి ఈ జగత్తు ఉదయించటమూ లేదు, అస్తమించటమూ లేదు. శమించటమూ లేదు, గ్లానిని పొందటమూ లేదు. 'చైతన్యం' అను ద్రవ రూపమైన జలమునందు 'జగత్తు' జలంగానే ఉంటోంది.

1. చైతన్యము సర్వదా యథాతథంగా నిర్వికారంగా జగత్ రహితంగా ఉన్నది.
2. అయితే జగత్తుగా కనించేది ఆ నిర్విషయ చైతన్యమే!

...అనే ఉభయ వాక్యములు సమంజసమే అనిపించుకుంటున్నాయి. వాస్తవానికి చైతన్యము నందు 'జగత్తు' అనునదేదీ ఉత్పన్నమవటం లేదు, శమించటమూ లేదు. 'శాంతము-జగత్ రహితము' అగు చైతన్యమునందు జగత్తు మొదలుగాగల ఈ ఈ విషయములు అత్యంత అసంభవమై ఉండగా, ఇక జగద్రూపముచే చైతన్యము ఉదయించిందని, జగత్ రాహిత్యముచే చైతన్యము అస్తమించిందని చెప్పటం ఎట్లా కుదురుతుంది? అది కుదిరేది కాదు.

ఎప్పుడైతే బ్రహ్మము తన యొక్క మాయచే సృష్టి రూపంగా వివర్తితం అవుచున్నదో, అప్పుడు చైతన్యం యొక్క వాసనానుసారంగా (సంకల్పముల చమత్కారంచే) పర్వతాలు ఆకాశ రూపంగాను, ఆకాశము పర్వతముల రూపంగాను అనుభవములు కాగలవు. ఇది ఇట్లా అయి ఉండగానే కొందరు యోగులైనవారు తాము సంపాదించిన యోగ శక్తి (తపోశక్తి) చేత 'చైతన్యం' అనే సిద్ధ చూర్ణం యొక్క ప్రయోగం చేత ఈ జగత్తును ఆకాశంగాను (శూన్యంగాను), శూన్యమగు ఆకాశమును ముల్లోకములుగాను అర్ధ నిమిషంలో కావించి వేయగలుగుచున్నారు. సిద్ధులచే కల్పితములైన ముల్లోక జగత్తులు ఆకాశంలో ఒకదాని నుండి మరొకటి రహస్యమై (గుప్తమై, తెలియబడనివై) ఏర్పడి ఉంటున్నాయి. మహా సముద్రంలో వేలాది తరంగాలు ఒకదానిలో మరొకటి మిళితం అయి ఉంటూనే తరంగములన్నీ కూడా వేర్వేరుగా కూడా కనిపిస్తాయి కదా! తరంగాలన్నీ వేర్వేరుగా కనిపిస్తున్నప్పటికీ అవన్నీ కూడా జలము కంటే వేరుకాదు కదా? అట్లాగే మహా చైతన్యమున అనేకములైన బ్రహ్మాండములు పరస్పరం కూడి ఉన్నప్పటికీ అవన్నీ కూడా చైతన్యము కంటే ఏమాత్రం వేఱు కాదు.

**శ్రీరాముడు :** హే సర్వజ్ఞా! వసిష్ఠ మహర్షీ! "యోగులు ఒక సృష్టిలోంచి ఇంకొక సృష్టిలోకి ప్రవేశించగలిగే సామర్థ్యము కలిగి ఉంటారు"... అని విజ్ఞులు అంటూ ఉంటారు. వారికది ఎలా సాధ్యమగుచున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒక యోగి తన యోగ బలం చేత ఈ ఉపాధిని 'మూల ప్రకృతి' యందు లయింపజేసి... పరస్పరం రహస్యంగా (ఒకదానిచే మరొకటి) అగ్రాహ్యంగా ఉన్నట్టి ఒక సిద్ధ లోకంలోంచి మరొక సిద్ధ లోకంలోనికి ప్రవేశించటము అనే ప్రక్రియను 'ఒక సృష్టి నుండి మరొక సృష్టిని పొందటం'... అని విజ్ఞులు చెపుతూ ఉంటారు.

**ఈ జీవులందరూ ఉన్నదెందులో? -** ఓ రామచంద్రా! ఆకాశమునందు శూన్యత్వము ఉంటోంది చూచావా? అట్లాగే నాశనరహితమగు పరబ్రహ్మమునందు ఈ సమస్త భూతములు (జీవులు), వాటికి భోగ్యములగుచున్న సమస్త సృష్టి సమూహములు నిర్విఘ్నంగా స్థితి కలిగి ఉంటున్నాయి. ఈ సృష్టి విభ్రమములన్నీ కూడా పరమార్థమగు చిదాకాశము యొక్క నిజ క్రీడారూపములే! ఇవన్నీ స్వాభావికములే కూడా! స్ఫటిక శిలలో కనిపించే గీతలవలె అవి వాస్తవానికి చిదాకాశమునందు ఉదయించటం లేదు. అస్తమించటం లేదు. పుష్పము-సుగంధము వేర్వేరు కానప్పటికీ వేర్వేరుగా ఉన్నట్లు అనిపిస్తుంది చూచావా? చిదాకాశము-అందలి సృష్టులు వేర్వేరు కానప్పటికీ అవి వేర్వేరుగా ఉన్నట్లు అనిపిస్తూ ఉంటుంది.

**స్వసంకల్పానుసారమే ఇదంతా! -** ఈ ప్రపంచమంతా కూడా స్వసంకల్పానుసారం రూపము కలిగి ఉన్నది. కనుక స్థూల సంకల్పము-స్థూల మోహము గల సామాన్య దృష్టికి ఇదంతా స్థూలంగా కనిపిస్తోంది. సూక్ష్మదృష్టి గల వారికి సూక్ష్మ రూపంగాను, సూక్ష్మతర దృష్టి గల వారికి సూక్ష్మతరం గాను, సూక్ష్మతమ దృష్టిగలవారికి సూక్ష్మతమముగాను స్థితినొంది ఉన్నదగు చున్నది. ఈ విధంగా, వారి వారి అనుభవములను అనుసరించి వారందరి కథనము సత్యమే అయి ఉన్నది. అట్టి వేర్వేరు దృష్టులు కలవారు వేర్వేరు అనుభవాలు కలిగి ఉండి వాదోపవాదములు చేసుకొంటున్నారు గూడా! ఎవరి దృష్టి ఎట్టిదో... వారి వారికి అట్టి దర్శనము ఘనీభూత సత్యంగా అనుభవమౌతోంది.

**విజ్ఞాన వాదులు :** "అభ్యంతర విజ్ఞానం మాత్రమే సత్యము కాని, బాహ్యమున ఏదీ సత్యం కాదు."

**వైశేషికులు :** "బాహ్యమున గల దృశ్య వస్తువులైనట్టి ద్రవ్య-గుణ-కర్మాదులు సత్యమే! ఎదురుగా కనిపిస్తున్న వాటిని అన్యమని అనటమే మూర్ఖత్వం."

ఓ వాదోపవాదులారా! మీ మీ సంకల్పానుసారమే ఆయా విశేషములు సత్యమనియో, కాదనియో అనిపిస్తూ అట్లే ఫలీభూతములగుచున్నాయని గుర్తించెదరు గాక! ఈ కనబడేదంతా ఆత్మ స్వరూపమే!

ఏ చైతన్యమైతే ఈ జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములు... అనబడే త్రిపుటిని ప్రకాశింపజేసే శక్తి కలిగియున్నదో, ఆ చైతన్యమే ఈ జగత్తు రూపంగా కూడా భాసించుచున్నది. కాబట్టి జలము-ద్రవత్వములులాగానే చైతన్యమునకు-జగత్తుకు భేదమేమీ లేదు.

ఓ రామచంద్రా! సర్వమునకు ఆధారమైనట్టి కాలము, ఆ కాలమునకు అంతర్గతమైయున్న బ్రహ్మాండాలు, ఆ బ్రహ్మాండాలలో గల 14 లోకాలు, ఆ లోకాలలో గల అహమ్-త్వమ్ (నేను-నీవు) ఇత్యాది భోక్తలు, ఆ భోక్తలు ఉపకరణములై ఉంటున్న ఇంద్రియ సమూహాలు, ఆ ఇంద్రియ

సమూహాలకు విషయాలై ఉంటున్న శబ్ద-స్పర్శాది భోగ్య విషయాలు, వాటివాటి విచిత్ర భోగాలు... ఈ సమస్తం కూడా మాయక-సర్వజ్ఞ-సర్వశక్త్యాదులతో కూడుకొనియున్న ఈశ్వరాత్మయే! పరమార్థమున ఏకం-శాంతం-అజం అయినట్టి చిదాకాశం మాత్రమే ఉన్నది. చిదాకాశమే చిదాకశంలో "ద్రష్ట-దర్శన-దృశ్య" చమత్కారరూపంగా, జలంలో ఆకాశంలాగా ప్రతిబింబిస్తోంది.

ఇట్టి నిశ్చయము ఎవరు కలిగి ఉంటారో వారికి ఇక రాగాదులు ఏమాత్రం సంభవించవు. 'ఇచ్ఛ' మొదలైన సర్వదోషములు జయించడానికి ఇదొక్కటే ఉపాయం.

❖❖❖

# 21. జగత్తే పరమాత్మ స్వరూపం

**శ్రీవసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! మాంత్రికునిచే మంత్రించబడిన కాటుక కళ్ళకు పూసుకున్నప్పుడు ఆకాశంలో ఉద్యానవనాలు, సుందర స్త్రీలు అగుపిస్తారు చూచావా....? అట్లాగే చైతన్యము తన యొక్క అబ్రహ్మత్వపు భ్రమచే "నేను జీవుడను మాత్రమే కదా"!... అని తలచుచూ చమత్కారంగా విక్షేపము పొంది తత్ఫలితంగా తన స్వరూపమునందే ఈ జగత్తును దర్శిస్తోంది. ఇక్కడ ఈ జగద్దర్శనమును రెండు విశేషాలుగా వివరించుకుందాం-

1. బ్రహ్మమునందు 'జగత్తు' అనబడేది ఉండటం.
2. జీవుడు 'జగత్తు' (దృశ్యం) అనే దానిని తన చిత్తంలో ఊహాత్మకంగా అనుభవించటం.

పరమార్థమున ఈ రెండూ ఏక స్వరూపాలే! బ్రహ్మము-జగత్తు... ఈ రెండూ కూడా సదా చిద్రూపాలే! ఈ రెండూ సర్వదా క్షోభవర్జితాలే అయి ఉన్నాయి. కాబట్టి 1. బ్రహ్మం యొక్క సృష్టి, 2. చిత్తంచే సంకల్పితమైన దృశ్యం... ఈ రెండూ కూడా సమానాలే అయి ఉన్నాయి.

ఓ రాఘవా! ఇదిగో... ఈ గోడ ఉన్నది. శిలచే నిర్మించబడిన గోడపై శిల్పిచే ఆయా విశేషాలతో లిఖించబడిన విశాల చిత్ర లేఖనం ఉన్నది. గోడపై చిత్రించబడిన చిత్రం కూడా గోడయే కదా! గోడకు వేరైనది కాదు కదా! అయితే అత్యంత చమత్కారంగా శిల్పకారునిచే నిర్మించబడిన ఈ చిత్ర కథనంలో లీనమైనవానికి గోడ దృష్టి యందు ఉండదు. గోడయందలి ఆయా స్థలవిభాగములే చిత్రకారుని కల్పనా చాతుర్యం చేత 'నది-పక్షులు-వినీలాకాశం-బాట-బాటసారులు' మొదలైన విశేషములుగా కనిపిస్తోంది. అట్లాగే...

జ్ఞానము (చిత్తు) నందు కల్పించబడిన ఈ జగద్రూప సృష్టి కూడా జ్ఞాన స్వరూపమే! అయితే ఏం? భ్రాంతి చేత ఇదంతా బాహ్యరూపంగా భాసిస్తోంది. జ్ఞానము సర్వదా సత్యమే కదా! కాబట్టి, 'జ్ఞాన రూపమే' అయి ఉన్న ఈ బాహ్య పదార్థరూపత్వము కూడా సత్యమే!... అని ఎఱిగెదవు గాక!

విజ్ఞానవాదులు ఈ 'దృశ్యము సత్యమే! అసత్యం కాదు' అని అంటూ ఉంటారు కదా! అట్లాగే వేదాంతవాదులు 'ఇవన్నీ చిదాత్మ రూపాలే! చిదాత్మ ఎట్లా నిత్య సత్యమో, అట్లా ఇవన్నీ చిదాత్మ రూపంచే సత్యమే! ఆత్మ కంటే (సద్రూపం కంటే) బాహ్య ప్రపంచం వేరుగా స్థితియే కలిగి లేదు -

అని ప్రవచిస్తున్నారు. అందుచేత 1. బాహ్య పదార్థ వాదము 2.అభ్యంతర విజ్ఞాన వాదము, 3. మేము ప్రవచించే జీవ-దృశ్య-బ్రహ్మైక్య వాదము... ఈ మూడు సమన్వయమే అగుచున్నాయి గాని పరస్పర వ్యతిరిక్తం కావటంలేదని మా అభిప్రాయం.

**ఈ సమస్తము పరమాత్మయే -** సమస్త పదార్థములు చిద్రూపములే! అందుచేత, క్షుబ్ధముగా (కలత పెట్టబడినదిగా) కనిపించే ఆకాశ-వాయు-అగ్ని-జలము-భూమి అను పంచభూతముల యందు అంతటా కూడా క్షోభరహితము-శాంతిమయము, వ్యాపకము, మహాసంరంభ యుక్తము అగు బ్రహ్మసత్తయే ప్రవేశించి ప్రకాశించుచున్నది. ఇట్లు ఆ ఉభయ సత్త (బ్రహ్మము యొక్క సత్త-ఈ కనిపించే జగత్తు యొక్క సత్త).... ఏకైక సత్తయే గాని వేర్వేరు సత్త కాదు. అంతటా (ఇటు జీవుడుగాను-అటు దృశ్యముగాను) ఉన్నది ఆ బ్రహ్మ సత్తయే!

**తస్మై సర్వం, తతఃసర్వం, తత్సర్వం, సర్వతశ్చ తత్ ।**
**తచ్చ సర్వమయం నిత్యం తస్మై సర్వాత్మనే నమః ॥**

ఈ సమస్తము ఆ పరమాత్మ కొరకే అయి ఉన్నది. పరమాత్మ నుండే ఈ సమస్తము బహిర్గతమౌతోంది. ఈ సమస్తము పరమాత్మయే. ఇదంతా పరమాత్మచేతనే వ్యాపించబడి ఉన్నది. పరమాత్మయే సర్వమయుడై జాజ్వల్యమానంగా అంతటా ప్రకాశిస్తున్నాడు.

కుండలన్నీ మట్టే! అయితే సామాన్య దృష్టికి అనేక కుండల రకరకాల ఆకారాలే కనిపిస్తాయి. 'ఇది కుండ! అది కూజ! ఇదేమో మూస (మూత)!... అనే అనిపిస్తుంది గాని, అన్నీ మట్టియే అయి ఉన్నాయి'... అని అనిపించదు. అయితే, ఎప్పుడైతే దృష్టి ఆకారభావనను త్యజిస్తుందో, (ఆకారమునకు పరిమితమవదో) అప్పుడు అన్ని మట్టి పాత్రలలోని మట్టి దర్శనమివ్వగలదు.

అట్లాగే, ఈ సర్వము చిన్మయమే! ఈ బాహ్యమున కనిపించే నామరూపములు ఏ నేత్ర వృత్తికి కనిపిస్తున్నాయో, ఆ నేత్ర వృత్తి 'చైతన్యముతోటి వృత్తి' అను దాని ద్వారా జయించబడినపుడు ఇదంతా 'జగత్తు-జనులు'గా కాక ఏకైక చైతన్యంగా ప్రస్ఫుటం కాగలదు. కదిలే దేహాలలోగల కదిలించే ఏకైక చైతన్యం అనుభవమవగలదు. అటు తర్వాత 'చైతన్యములే!' అని స్పష్టమవగలదు. ఈ విధంగా 'ఈ జగత్తే చైతన్యము' అను ఆత్మానుభవం సిద్ధిస్తోంది.

చూచే వానిలో - చూడబడే దానిలోను గల చైతన్యము ఏకరూపములే! అందుచేత ద్రష్ట-దర్శనములు సాక్షియగు చైతన్యము సర్వదా ఏకత్వం పొందుచున్నాయి. ద్రష్ట - దృశ్యము కూడా ఏకైక చైతన్య స్వరూపులే

**శ్రీరాముడు :** అదేమిటి మహర్షీ! 'ద్రష్ట చైతన్య స్వరూపం-దృశ్యం జడం'... అని చెప్పబడుచున్నది కదా! ద్రష్ట-దృశ్యం... ఈ రెండూ ఏక రూపాలే'... అని మీరు ప్రతిపాదిస్తు న్నట్లు నా కనిపిస్తుంది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. ద్రష్ట-దృశ్యము కూడా సాక్షియగు చైతన్యమున ఏక రూపములే. ఒకడు ఒక చెఱకు గడను చూచి భక్షిస్తున్నాడనుకో... చెఱకుగడలోని రసము జడము - అది భక్షించే జీవుడు మాత్రమే 'చైతన్యం' అయి ఉండి ఉంటే... అప్పుడు రసానుభవమే సిద్ధించేది కాదు.

జడమగువాడు రసానుభవం పొందలేడు. కనుక ఆ చెఱకు భక్షించేవాడు చైతన్యమే! జడమగు చెఱకు రసము 'మధురము' అనే రూపంగా స్ఫురించజాలదు. కాబట్టి అదీ చైతన్యమే!

జలంతో జారవిడువబడిన జల బిందువు ఆ జలముతో ఏకత్వం పొందుతుంది కదా! అట్లాగే విషయం కూడా చిన్మయ రూపమే అవటం చేతనే చైతన్యంతో లీనమై ఏకరూపమగుచున్నది. కాబట్టే 'నేను ఈ రసమును అస్వాదిస్తున్నాను. ఆ రూపమును చూస్తున్నాను'... అనే అనుభవం కలుగుతోంది. చిన్మయమునందు ద్రష్ట-దృశ్యము ఏకరూపత్వం పొందకపోతే ఒక కట్టె మరొక కట్టె యొక్క అనుభవం పొందజాలనట్లు అసలు 'అనుభవము' అనేదే ఉండేది కాదు.

**శ్రీరాముడు :** ఒక కట్టె-మరొక కట్టె సజాతీయమైన ఏకత్వము కలిగియే ఉన్నాయి కదా! మరి ఆ రెండూ ఒకదాని యొక్క అనుభవమును మరొకటి ఎందుకు పొందటం లేదు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ కట్టెలు (కొయ్యముక్కలు) సజాతీయమే అయినప్పటికీ అవి భౌతికంగా మాత్రమే ఏకత్వం కలిగి ఉన్నాయి! ద్రష్టలో అనుభవం స్వీకరించు చైతన్య రూపంగాను, కట్టెలో అనుభవం ప్రసాదించు చైతన్యం - ఈ రెండూ ఒనగూడినప్పుడే 'అనుభవం' అనేది సిద్ధిస్తోంది. ఈ రెండూ ఒనగూడకపోతే అనుభవం ఉండదు. అయితే ఆ ద్రష్ట-దర్శనాలు చైతన్య రూపాలే నని ఇక్కడ నీవు గమనించవలసిన విషయం.

అయితే కాష్ఠము (కట్టె) మొదలైన దృశ్య పదార్థముల స్థితి ఏదైతే కలదో అట్టి అచేతన రూపమును మాత్రమే జనులు ఎఱుగుచూ ఉన్నారు. తద్విలక్షణమై సర్వత్రా వ్యాపించి ఉన్నట్టి (అటు ద్రష్టలో ఇటు దృశ్యంలో కూడా ఏకరూపంగా వ్యాపించి ఉన్నట్టి) ఏ చైతన్య రూపస్థితి కలదో... అద్దానిని గమనించలేకపోతున్నారు.

ద్రష్ట-దృశ్యం-ఈ రెండూ కూడా చైతన్య రూపాలే! అదే విధంగా జలం-వాయువు-భూమి-శిలలు మొదలైన పదార్థాలన్నీ కూడా చిద్రూపాలే! అయితే వాటిలో 'స్పందం-బుద్ధి-ప్రాణం-జీవం' మొదలైనవి లేవు.

ఈ ప్రాణ-బుద్ధి-జీవాదులు భావనావశం చేత (కల్పన చేత) సత్తను పొందుచున్నాయి. భావం ఎక్కడి నుండి బయల్వెడలుతోంది చెప్పు? చైతన్యము నుండే! కనుక చైతన్యం యొక్క చమత్కారమే అవన్నీ కూడా! అట్టి చమత్కారం యథేచ్ఛగా చైతన్యమునందే ఉదయిస్తోంది.

**సర్వ దృశ్యముల సారం బ్రహ్మమే! -** అట్టి బ్రహ్మసత్త యగు ఆత్మ... వీర్యమునందు పురుషశక్తి గాను, వట బీజం (మఱ్ఱి చెట్టు యొక్క విత్తునందు) వృక్షశక్తిగాను, జాగ్రత్-స్వప్నములందు విషయానంద శక్తిగాను ప్రకటితమై ఉంటోంది.

బీజమునందు ఏ సారమైన సత్తా పదార్థము కలదో... అదియే పరమాత్మ. ఆ పరమాత్మయే అంకుర రూపంగాను, శాఖాదుల రూపంగాను విస్తరిస్తూ మరల బీజ రూపుడగుచున్నాడు. బ్రహ్మము సర్వదృశ్య వస్తువుల కంటే కూడా అత్యంత సూక్ష్మము, అంతటికీ కారణ రూపము. అందుచేత బీజాదులలో ఏ సూక్ష్మరూప కారణ సత్త కలదో... అది బ్రహ్మమే అయి ఉంటుంది. ఇక స్థూల

రూపమైనట్టి బీజము-అంకురము-ఆకులు-కాయలు మొదలైనవి సూక్ష్మ బీజ సత్త యొక్క మాయక రూపములు. అవి మిథ్యయేనని కూడా గ్రహించవచ్చు. ఈ సిద్ధాంతమును అనుసరించి సర్వత్రా (ఈ దేహ-మనో-బుద్ధ్యాదులందంతటా) సారమైన వస్తువు బ్రహ్మమే అయి ఉన్నది.

ఒక కుండ లోపల-బయట-ఆ ప్రక్క-ఈ ప్రక్క... అంతటా కూడా ఎటువైపు చూచినా కూడా... మట్టియే అయి ఉన్నది కదా! అట్లాగే ఈ జగత్తు యొక్క ఆమూలాగ్రం ఎవరు ఎలా పరీక్షించి చూచినప్పటికీ... ఈ సమస్తము బ్రహ్మముగానే కనిపించగలదు. బంగారు ఆభరణంలో బంగారం తప్ప మరింక ఎక్కడ మాత్రం ఏముంటుంది? ఈ జగ-జ్జీవాది సర్వము బ్రహ్మమే!

ఓ రామచంద్రా! నీ ప్రక్కనే నిదురించు నీ మిత్రుని స్వప్నంలో కనిపించే గర్జిస్తున్న మేఘ సమూహాలు నీకేమియూ కనిపించవు కదా! అట్లాగే... నాకు ఇక్కడ సృష్టి-ప్రళయాది సంరంభాలేవీ కనిపించటమే లేదు. ఆకాశంలో కనిపించే ఊహా సంబంధమైన గంధర్వసైన్యం ఆకాశం మాత్రమే కదా! అట్లాగే ఈ సమస్త జగత్తు చిదాకాశమే అయి ఉన్నది. భూమిపై పడిన ఒక చిన్న మఱ్ఱివిత్తు జలముచే తడుపబడినదై మహావృక్షంగా అంకురించి అనేకమందికి నీడను ప్రసాదిస్తోంది. అట్లాగే అంతరంగమున గల ఒకానొక సంకల్ప భ్రమయే బాహ్యమున జగద్రూప ఫలాకారంగా ఆవిర్భవిస్తోంది. ఎప్పుడైతే ఈ జీవుడు అహంభావరహితుడై నిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మముతోటి ఏకత్వం పొందుతాడో... అట్టి జ్ఞాని యొక్క దృష్టిలో ఈ జగత్తులోని సర్వ వస్తువులు, యోగాభ్యాసంచే లభించగల అణిమ-గరిమ-మహిమ- మొదలైన సిద్ధులు... ఇవన్నీ కూడా బాట ప్రక్కన పడి ఉన్న ఎండుగడ్డి పరకవలె అతిస్వల్ప విషయాలుగా కనిపిస్తాయి. బ్రహ్మంగా అనిపిస్తాయి.

**త్రైలోక్యే తన్ న పశ్యామి సదేవ-అసుర-మానుషమ్,**
**ఏకే రోమాంశ విశ్వస్య యల్లోభాయ మహాత్మనః ॥**

ఏ మహాత్ముడగు జ్ఞానికి ఈ బ్రహ్మాండమంతా ఒక కేశం యొక్క విభాగం వంటిది మాత్రమే (అతి లేశమైనది) అవుతుందో... అట్టి వానిని ప్రలోభపరచగల మానవుడు గాని, దేవతగాని, అసురుడుగాని నా కెక్కడా తారసపడలేదు. జ్ఞాని ఎక్కడకు ఏ రీతిగా వెళ్ళవలసి వచ్చినా కూడా... అక్కడ అతనికి ద్వైతరూపమైనదేదీ ఏమాత్రం కనిపించనే కనిపించదు. ఏ మహాత్ముని దృష్టియందు ఈ ప్రపంచమంతా కూడా ఆకాశం వలె శూన్యమాత్రమై ఉన్నదో... అట్టి వానికి ఈ భ్రమ మాత్రాలగు భోగాదులన్నిటిపట్ల ఇచ్ఛ ఉదయిస్తుందా? లేదు. సమస్త విషయములను మొదలంటా నిర్విషయములుగా గాంచ గల మహనీయుడు ధనాది సర్వ ఈషణలు శమించి ఉన్న వాడై... ఇక, ఇక్కడి విభవ-దారిద్ర్యములు రెండింటినీ సమదృష్టితో చూస్తూ ఉండగలుగుతాడు. అట్టి మహాత్ముని మహిమను వర్ణించటం ఎవరి వల్ల అవుతుంది?

మరణ హేతువులచే ఒకింతగా కూడా మరణించనివాడు, జీవన హేతువులచే ఒకింతగా కూడా జీవించనివాడు, బంధు మిత్రాదుల జనన మరణాలదులచే కించిత్తు కూడా హర్ష విషాదాలు పొందనివాడు, శుద్ధ జ్ఞానమయుడు, స్వ ప్రకాశరూపుడు ఆకాశం వలె నిర్మలం – సర్వ వ్యాపకం

అయిన నిత్యానుభవి... అగు మహనీయుని మహిమాతిశయం ఊహించటానికి కూడా అలవి అయినది కాదు సుమా!

**బ్రహ్మరూపానుభవి -** భ్రాంతి కలవానికి మృగతృష్ణలో నదీజల తరంగ సమూహం కనిపిస్తున్నట్లు అజ్ఞానికి తన భ్రాంతి యొక్క ప్రభావం చేత వాస్తవానికి లేనివన్నీ ఘనీభూతమై ఉన్నట్లే అగుపిస్తోంది. మిథ్య అయినవన్నీ సత్యము వలె అనిపిస్తోంది. కాస్త బాగా పరీక్షించి చూచిన వానికి... "భ్రాంతిని పొందేవాడు లేడు. అంతటా ఏకం-కేవలం-అవ్యయం అయినట్టి పరమాత్మ ప్రకాశమానుడై ఉన్నాడు"... అని సుస్పష్టంగా తెలియబడుచున్నది. భ్రాంతి యొక్క పరీక్షకుడు కూడా భ్రాంతి వలెనే వాస్తవానికి లేనిదే! ఎవడైతే శాంతుడై ఆత్మారాముడై, సర్వ దృశ్యాదులయెడల అత్యంత విరక్తుడై సంసార సముద్రమును దాటివేసినవాడై ఉంటాడో, అట్టి ఉత్త్వజ్ఞుడగు మహనీయుడు బ్రహ్మరూపానుభవి అవుతాడు. అతడు దేహ-ఇంద్రియాది రూపంచే అభాస మాత్రుడు గాను, ఆత్మపరంగా సర్వ లక్షణ-విలక్షణుడుగాను ఉంటాడు. అతని స్వానుభవం జన్మ-మరణాది సర్వ సంసార వ్యవహారాలకు అతీతమై, కేవలీమాత్రమై చెన్నొందుచున్నది. అతడు జగద్రహితుడై జగత్తును వీక్షించగలడు. అతని పట్ల మనస్సు యొక్క గతి అస్తమించి ఉంటుంది. అతడు ఆత్మయందే శాంతుడై బ్రహ్మరూపముతో విద్యమానుడై ఉంటాడు. అట్టి మహాత్ముడు నిశ్చల దీపంలాగా నిర్మల నిర్వాణ స్థితిని అవధరించి ఉంటాడు.

**ముక్తుడు :** ఎవనికైతే బుద్ధి మొదలుకొని జగత్తు వరకు సమస్త దృశ్యము నిర్విషయమై తోచుచున్నదో క్రొత్తగా లాభించవలసినదంటూ ఏదీ ఎక్కడా తోచదో, అట్టి ఆకాశం వలె ప్రశాంతుడగు మహనీయుని 'ముక్తుడు' అని వేదజ్ఞులు పిలుచుచున్నారు.

**శ్రీరాముడు :** మహాత్మా! అట్టి మహనీయునిపట్ల 'అహంకారము' అనునది ఉండదు కదా? ఒకవేళ ఉంటే ఏ రూపంగా ఉంటుంది?

**అహంకారము యొక్క రూపమేమిటి? -**

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవిచారణ చేత 'అహంకారము' అనునది ఉన్నట్లుగా అనిపిస్తోంది.

**'అహమ్' అస్థి అవిచారేణ, విచారేణ అహమస్తి నో!**
**అభావత్ 'అహమ్' అర్థస్య క్వ జగత్? క్వ చ సంసృతిః?**

విచారణ చేత 'అహమ్' అనబడేదే లేదు – అని తెలియవస్తోంది సుమా! అహంభావమే లేకపోతే... ఇక జగత్తు ఎచట? జనన-మరణ రూపకమగు సంసారమెచ్చట? వాస్తవానికి చిదాకాశమే 'అన్యథా అనే రూపమగు బుద్ధి మొదలైన ఆకారాలుగా ఉంటోంది. చిదాకాశమే 'బుద్ధి' అను ఆకారాన్ని సంతరించుకొన్నదై రూప-ప్రకాశ-సంకల్పాది రూపమగు బాహ్యాభ్యంతర జగత్తును ఎఱుగుచున్నది.

**శ్రీరాముడు :** అయితే మనందరికీ కనబడుచున్న ఈ జగత్తు యొక్క రూపమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఎప్పుడైతే నీ మనస్సు సర్వాత్మరూపమై, అదే తరుణంలో సర్వ పదార్థరహితమై ఒప్పుతుందో... అప్పుడు ఈ సమస్త జగత్తు, ఇందులో కనిపించే సర్వ క్రియా

వ్యవహారాలు బ్రహ్మరూపంగానే భాసించగలవు. ఇప్పుడు జగత్తుగా కనిపించేదే అప్పుడు 'పరమాత్మ'గా అనుభూతమౌతూ ఉండగలదు.

**యత్కరోషి, యదశ్నాసి, యజ్జుహోషి, దదాసి యత్,**
**యత్ తపస్యసి హంస్యేషి తత్సర్వం శివమవ్యయమ్**

నీవు ఏమి చేస్తున్నప్పటికీ, ఏది తింటున్నప్పటికీ, దేనిని హోమం చేస్తున్నప్పటికీ, ఏది ఇచ్చుచున్నప్పటికీ, ఏ తపస్సు చేస్తున్నప్పటికీ, దేనిని వధిస్తున్నప్పటికీ... అదంతా కూడా వాస్తవానికి బ్రహ్మమే అయి ఉన్నది. అంతేకాదు! నేను, నీవు, ఈ దిక్కులు, ఆకాశము మొదలైన పంచభూతాలు, ఇచ్ఛ, క్రియ, కాలం, లోక-అలోక పర్వతాలు, ఈ రూప-ప్రకాశ-సంకల్పాది రూపమగు బాహ్య-అభ్యంతర జగత్తు యొక్క అనుభవాలు, త్రికాలాలు, సమస్త బ్రహ్మాండాలు, జరా మరణాది దుఃఖాలు – ఇవన్నీకూడా వ్యాపకరూపమైనట్టి మహా చిదాకాశ రూపమగు బ్రహ్మమే సుమా! బ్రహ్మం తప్పించి మరింకెక్కడా ఏదీ లేదు. ఉండ జాలదు. కాబట్టి ప్రియ రాఘవా! నీవు సుఖ-దుఃఖ-ఆవేశ-చింతా రహితుడవు గాను, అభాసవర్జితుడవు గాను, (భిన్నాభిప్రాయాలు కలిగి ఉండక పోవటం), ఇచ్ఛారహితుడవు గాను, అమనస్కుడవు గాను, దృశ్యవర్జితుడవు గాను, మౌనివియు (సర్వ విశేషాల పట్ల మౌనం సముపార్జించుకున్నవాడి గాను), నిర్వాణరూపుడవు గాను అగుము. ఇక ఆపై ఏది ఎట్లో అట్లే వ్యవహరిస్తూ వెలయుము.

**శ్రీరాముడు :** మరి మేము ఆవశ్యం నిర్వర్తించవలసి ఉన్న ఆయా క్రియా-వ్యవహారముల పట్ల?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ దశరథరామా! నీ పురుషోచితమైన క్రియలన్నీ కూడా వాసనారహితాలై 'శాస్త్రం' అను యంత్రవాహకునిచే నిర్వహించ బడుచున్నవగు గాక! అవన్నీ కల్పనావరితాలై, శాంత సమన్వితమై ఒక కొయ్య విగ్రహాన్ని పోలి ఉండుగాక! ఈ బాహ్యంలో మాతాపితృ ఇత్యాది బంధుజనాదుల తోటి నీ యొక్క ఆయా వ్యవహారాలన్నీ అతి స్నేహయుక్తం గానూ ఉండనక్కర్లేదు. లేక, కేవలమూ స్నేహరహితం గానూ ఉండవలసిన పని లేదు. ఇతరులు 'ఇది' అని నిర్దేశించ టానికి గాని, నిర్వచించటానికి గాని కుదరనట్టి నిశ్చల స్వభావుడవై ఉండు. ప్రశాంత మనస్కుడవై ఉండు. చిత్రంలో దేదీప్యమానంగా చిత్రించబడిన దీపం వలె అతి నిశ్చలత వహించి ఉంటూనే ఈ దేహాదుల కారణంగా ప్రవాహపతితంగా సంభవించే ఆయా విధి-నిషేధాలకు, నిర్విషయ-నిర్లిప్తాలకు అతీత స్వభావుడవై నిర్వర్తించు. రామచంద్రా! వాసనారహితుడు, వర్తమాన భోగాలలో విరసత్వం కలవాడు, భావి కాల భోగాలలో ఎట్టి ఆశ-నిరాశ-కోర్కెలు లేనివాడు అగు జ్ఞానికి సచ్ఛాస్త్రాలు ఆత్మసుఖాన్ని, విశ్రాంతిని కలుగజేస్తూ ఉంటాయి. అంతకుమించి అన్యమైనహేతువేదీ అతనికి విశేషరూపమై అగుపించదు. కాబట్టి... నిర్మల చిత్తుడగు తత్త్వజ్ఞానికి కూడా జీవిత వ్యవహారాలలో సచ్ఛాస్త్రాలు, సజ్జనులు, సజ్జనుల అభిమతానుసరణం, ఫలాభిసంధిరాహిత్యం – స్వభావ సిద్ధం గానే రుచిస్తూ ఉంటాయి. అట్లు వర్తించటయే జ్ఞానులు అసాధారణ చిహ్నమని చెప్పవచ్చు. అంతే గాని, యథేచ్ఛానుసరణం (తన ఇష్టం వచ్చినట్లు వ్యవహరించడం) జ్ఞానుల స్వభావమే అయి ఉండుటలేదు.

❖❖❖

# 22. సర్వరూపియగు చిదాత్మ

**శ్రీరాముడు :** మహర్షీ! సంసారబంధం క్షయించగా విశ్రాంతి పొందిన జ్ఞాని తదితరులతో కూడి ఈ సంసారమున పాల్గొనుచున్నప్పుడు ఆతని వ్యవహార సరళి అవగాహన, అనుభవం ఎట్లా ఉంటాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సంసార బంధం క్షయించినప్పుడు అట్టివాడు స్వాభావికమగు ఆత్మ సాక్షాత్కారం సంతరించుకొని ఉంటాడు. అతడు శాస్త్రానుసారంగా, లోకమర్యాదానుసారంగా వ్యవహరిస్తూనే మరొకవైపుగా సంకల్పరాహిత్యము వహించి ఉంటాడు.

**శ్రీరాముడు :** అనగా సంకల్పరహితుడై (సంకల్పములను వదలి) కాష్ఠ మౌనం వహించి ఉంటాడా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఊఁహూ! కాదు. సర్వ వ్యవహారాలకు హేతువై ఉండే సంకల్పాలను కూడా 'స్వాత్మ' గానే గాంచుచూ ఉండడం చేత అతడు సంకల్పం అనబడేదేదీ తన నుండి వేరుగా ఎరుగకయే ఉంటాడు. స్వస్వరూపం నుండి సంకల్పాలను వేరుగా ఎరుగటయను సంకల్పాభాస అని అంటారు. అట్టి సంకల్పాభాస (అలీకమే గాని) అసత్తేగాని, సత్తు కాదు. అద్దముపై ధూళీ కణాలను నోటితో ఊది తొలగిస్తాం చూచావా? అట్లాగే ఏదైనా కారణంచే కించిత్ అహంభావం తత్త్వజ్ఞుని యందు ఎప్పుడైనా ఆవిర్భవించినా అది జ్ఞాన స్వభావంచే తొలగించబడుతుంది. ఆ అహంకారం అద్దంపై తుడిచివేయబడిన ధూళివలె మరల అగుపించదు.

అజ్ఞానావరణం క్షయించినవాడు. సర్వ కోర్కెలు ఉపశమించినవాడు. ఆనందముచే పరిపూరితమైన ఆత్మగా సంతరించుకున్నవాడు... అగు జ్ఞాని నిరతిశయా నందరూపమగు 'ఆత్మసత్తే' గానే శోభిస్తూ ఉంటాడు.

అతడు సర్వుల 'సందేహాలు' అనే ధూళిని తొలగించే వాయువు వంటివాడు. నిరావరణమైనట్టి (ఆవరణలు లేనట్టి) ఆత్మ ప్రకాశంతో కూడిన బుద్ధి కలిగినవాడై ఉంటాడు. అట్టి జ్ఞాని ఎక్కడుంటే ఆ ప్రదేశము పూర్ణచంద్రోదయమైన ఆకాశం వలె ప్రకాశిస్తూ ఉంటుంది.

సంసార మోహరహితుడు... సర్వసందేహ వర్జితుడు, ఆత్మప్రకాశ స్వరూపుడు... శరత్కాల ఆకాశం వలె నిర్మలుడు. అగు తత్త్వ జ్ఞానికి – జ్ఞేయస్వరూపమగు ఆత్మకు అభేదమేనని గ్రహించు.

సంకల్పరహితుడు నిరాధారుడు. శాంతుడు అగు జ్ఞాని తన స్పర్శచే జనులను నిస్సందేహులు గాను, పాపరహితులుగాను స్వభావసిద్ధంగానే తీర్చిదిద్దగలుగుతాడు. వారందరి హృదయాలలోను బ్రహ్మలోకం నుండి వేంచేసిన 'వాయువు' వలె అకృత్రికమగు ఆహ్లాదత్వమును స్థాపింపజేయగలడు. అట్టి మహనీయులతో మరల మరల సంభాష కొనసాగించమని జనులకు నా మనవి.

**అసద్రూప ఉపలంభానాం ఇయం వస్తు స్వభావతా ।**
**యత్ సర్గ వేదనం స్వప్న, వంధ్యా పుత్రో ఉపలంభవత్ ॥**

ఓ సర్వ జనులారా! స్వచ్ఛము, త్రికాల అబాధ్యము అగు నిర్మలాత్మతత్త్వమును సంపాదించు కోవటం మానివేసి ఈ నిస్సార సంసారంలో మూర్ఖుల వలె సంచరించటం ఏం ఉచితం? ఈ

అసత్పదార్థ రూపాల ప్రాప్తి యొక్క వస్తు స్వభావం ఎటువంటిదో గమనిస్తున్నారా? ఇదంతా కల లోని స్వర్గానుభవం వంటిది! గొడ్రాలి కుమారులు ఎటు వెళ్ళారో తెలుసుకోవాలనుకోవటం వంటిది! ఇదంతా మొదలంట అవిద్యా మాత్రమైయున్నది. అట్టి ఈ స్వప్న సదృశ జగత్పదార్థముల అనుభవమునకు ప్రాకులాడటమే సంసారం యొక్క రూపం. అసత్పదార్థ ప్రాప్తియే జగత్తు యొక్క స్వభావమై ఉన్నది. అసత్యమగు ఈ సంసారమును పరికిస్తూ ఇందు సృష్టి-మోక్షములను ఎఱుగుట కొరకు ఎంత వెతికి ఏం ప్రయోజనం? ఇదంతా గొడ్రాలి కుమారులను చూడటానికి వెళ్ళటం లాగాను, స్వప్న సదృశంగాను ఉండి ఉండగా ఇక్కడ అర్థసిద్ధి ఎట్లా లభిస్తుంది? ఈ జగత్తు వాస్తవానికి అనిర్మితమైనది. భాషకు విషయమే కాదు. ఎందుకంటే 'ఇది ఇట్లు' అను స్థిరమైన భావనకు అర్హమైనదేదీ ఇక్కడ లేదు. 'ఇది దీనిపై ఆధారపడి ఉన్నది' అని చెప్పటకు కూడా కుదరనిది. అట్టి ఈ జగత్తు బ్రహ్మరూపముచే మాత్రమే సత్యం. బ్రహ్మరూపమును అంగీకరించక పోతే ఈ జగత్తుకు గల రూపమేమిటో నాకు తెలియదు.

**ఆత్మ యందు విశ్రాంతి -**

**శ్రీరాముడు :** 'ఆత్మయందు విశ్రాంతి' అని శాస్త్రములచే చెప్పబడే వస్తు స్వభావము ఎట్టిది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అహంభావాదులుగాని, సృష్ట్యాదులుగాని, సుఖ దుఃఖాదులుగాని పొందక పోవటమే 'ఆత్మయందు విశ్రాంతి' అను వస్తువు యొక్క స్వభావం అయి ఉన్నది.

**శ్రీరాముడు :** ఆత్మ ఎట్లు ఎక్కడ దర్శనమౌతుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒకవ్యక్తి ఒక చోట నిలబడి తన చూపును భూమి పైనుండి మరల్చి లక్షలాది మైళ్ళ దూరంలో గల ఒకానొక ప్రదేశముపై నిలిపి ఉంచాడనుకో! అనగా? అతని సంవిత్తు (ప్రజ్ఞ/ఎఱుక) భూమిని వదలి దూరమున గల మరొక ప్రదేశంపై నిలిచినట్లు కదా! అయితే, అట్లు సంవిత్తు నేత్రవృత్తి ద్వారా సమీప వస్తువును త్యజించిన తర్వాత, మరియు ఇంకనూ సుదూర స్థానమును (ఉదా: సూర్యుని) చేరకముందు మధ్య నిర్విషయరూపమై ఉంటోంది కదా! అట్టి ఆ రెండు ప్రదేశముల మధ్య ఉండే ఏ నిర్విషయ చైతన్య స్వరూపము కలదో... అదే నిరంజనమగు ఆత్మ యొక్క రూపమై ఉన్నది. (సంవిత్తు 'భూమి' అను విషయమును త్యజించిన తర్వాత... ఆకాశంలోని సుదూర స్థానమును ఇంకను చేరకముందు... మధ్యలో నిర్విషయమై ఉంటుంది కదా! ఇదియే నిర్మల సంవిత్తు లేక ఆత్మరూపం). అట్టి భూతల-సూర్య స్థాన (ఆకాశ-ప్రదేశ స్థాన) ముల మధ్యగా గల చైతన్యం స్వరూపం... చలనము లేని వాయువు వంటిది. ఆకాశకోశం వలె అతి నిర్మలమైనది. విషయరహితమైనది (ఒక విషయమును త్యజించి, ఇంకనూ మరొక విషయమును స్వీకరించనట్టి స్థితి కదా!) పరమశాంతమైనది. చిన్మయ రూపమైనది. చిన్మాత్రము అని చెప్పబడునది. వికసించిన లత వలె నిత్యోదితమైనది.

'అదే సమస్త జీవ సమూహం యొక్క ప్రసిద్ధమైన స్వభావం'... అని విజ్ఞులు చెప్పుచున్నారు. అట్టి శుద్ధ-అచంచలిత భావాన్ని సంతరించుకొనినట్టి వివేకి దృష్టికి ఈ సృష్టి భాసింపకయే ఉంటోంది.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ జగత్తులో పాల్గొనుచున్న జీవునికి అట్టి నిర్విషయత్వము అనుభవం అవటం సుసాధ్యమేనంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వప్న సమయంలో జాగ్రత్తు లేదు. సుషుప్తిలో స్వప్నం లేదు. స్వప్నంలో సుషుప్తి లేదు. జాగ్రత్తులో స్వప్న-సుషుప్తులు లేవు. కానీ చైతన్యము సర్వత్రా సాక్షిరూపముచే ఆ మూడు స్థితులలోనూ ఆక్రమించుకొనియే ఉన్నది. వాస్తవానికి ఈ జీవునకు అనుభవమగుచున్న జాగ్రత్-స్వప్న-సుషుప్తులు భ్రమ రూపాలే నని గ్రహించు. అంతేకాదు. సృష్టి-ప్రళయాలు కూడా భ్రమ రూపాలే అయి ఉన్నాయి. యథార్థానికి ఆ స్వప్న-సుషుప్తి-సృష్టి-ప్రళయాలు భ్రాంతియే స్వభావంగా కలిగి ఉన్నాయి. అనగా వాస్తవానికి లేవు. మరి? సత్యం, శాంతం అయినట్టి చిద్రూపమే అంతటా పరిపూర్ణమై ఉన్నది. మనం దేనిని 'భ్రాంతి' అని పిలుస్తాం? ఏదైతే అనుభవమగుచూ, పరిశీలించి చూచినప్పుడు 'మొదలే లేదు' అని తెలియవస్తుందో... అద్దానిని భ్రాంతి అంటాం. ఉదాహరణకు 'ముత్యపు చిప్పలో వెండి కనిపిస్తోంది' అని ఒకనికి అనిపించవచ్చు. అతడు పరిశీల నకు ఉపక్రమించి అసలు విషయం గ్రహించినప్పుడు ముత్యపుచిప్ప ఇతఃపూర్వంలా కనిపిస్తున్న ప్పటికీ 'అందులో వెండి ఉండజాలదు. అది వెండి వంటి రంగు కలిగి ఉన్నది' అని గ్రహిస్తాడు కదా! తన యొక్క ఇతఃపూర్వపు దర్శనం గురించి చెప్పవలసి వచ్చినప్పుడు 'అది ఆ సమయం లోని నా భ్రాంతి'... అని అంటున్నట్లే ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తి-సృష్టి-ప్రళయములు కూడా! ఆత్మ వీటిచే ఆవరించబడినట్లు అనిపించినప్పటికీ, జ్ఞాన దర్శనముచే ఆత్మ వీటన్నిటికంటే విలక్షణమై, వీటికి ఆధారరూపమై, వీటిచే స్పర్శించబడనిదై ఉన్నదని గమనించబడుగాక!

భ్రాంతి అనగా అసత్యరూపం అని అర్థం. ఎందుకంటే, విచారణ చేసి చూస్తే ఏది లభించదో, అద్దానిని 'భ్రాంతి' అని పిలుస్తున్నాం. కాబట్టి పరమార్థమున 'భ్రాంతి' అనగా 'వాస్తవానికి పొంద బడనిది. లభించనిది'... అని కూడా గ్రహించు. భ్రాంతికి అన్యంగా ఉన్నది జ్ఞానరూపమే అవుతుంది. తెలియబడేది అనుదానికి వెనుకగా 'తెలుసుకునేది' ఉన్నది కదా! తెలియబడేదంతా అట్టి కేవల-అనునిత్యసాక్షి రూపమగు 'ప్రజ్ఞ' కంటే వేరు కాదు. కాబట్టి సాక్షియగు 'చిద్రూపము' కంటే అన్యమైనట్టి సత్య వస్తువు ఎక్కడా లేనే లేదు.

ఓ రామచంద్రా! సర్వదా 'ఏకము' అయినట్టి చిత్స్వభావము అట్లు ఏకమే అయినప్పటికీ, ఈ వివిధ రూపములుగా భాసించుచున్నది. సర్వజీవుల యందును సదా పరమ ప్రేమాస్పదరూపమై స్ఫురిస్తోంది. అట్టి సాక్షియగు చిద్రూపమునే సర్వదా భావన చేస్తూ ఉండు. ఇక వ్యర్థమగు తదితర సర్వ భావనలతో పని ఏముంది? వాటినన్నిటినీ వదలివేసి ఉండు. ఎందుకంటావా?

**అస్వభావే మహద్దుఃఖం, స్వభావే కేవలం శమః ।**
**ఇతి బుద్ధ్వా విచార్య అంతర్, యదిష్టం తత్ విధీయతామ్ ॥**

**<u>కైవల్యము</u> -** చిత్స్వభావం కంటే వేరుగా అనిపించేదంతా స్వకీయ కల్పన చేతనే అట్లు అనిపి స్తోందని గ్రహించు. అట్టి చిత్స్వభావానికి వేరైన కల్పనయే మహాదుఃఖం. అదియే సంసారం అనగా! అకల్పితమైనట్టి సాక్షి చిత్‌స్వభావమందలి స్థితియే 'కైవల్యము' అని, కేవల 'పరమశాంత స్థితి' అని

గ్రహించబడుతోంది. ఇట్లు 'కనబడేదంతా కూడా ఈ నేను-నీవు మొదలైన వాటన్నిటితో సహా సర్వదా ఏకమే అయి ఉన్న చిత్స్వభావమే! అస్వభావమైనదంటూ ఏదీ ఉండజాలదు' అను వాక్యార్థ సారాన్ని అంతరంగంలో బుద్ధిచే విచారణ చేయి, అటు తర్వాత నీకు ఏది ఇష్టమో దానినే గ్రహించు.

**శ్రీరాముడు:** హే మహనీయా! వసిష్ఠ మహర్షీ! అత్యంత సూక్ష్మము, నిర్విషయము అగు చిత్స్వభావం ఈ స్థూల-మూర్త జగత్తుగా ఎందుకు రూపం పొందుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి:** సూక్ష్మమగు ఒక బీజాంతర్గత రసమే - తన రస స్వరూపం కొనసాగిస్తూనే- స్థూలమగు మహావృక్షంగాను, ఆ వృక్షం యొక్క వివిధ విభాగాలు గాను అగుచున్నది కదా! అట్లాగే 'అమూర్తమగు శివరూప బ్రహ్మం నందే మూర్తివంతమగు ఈ జగత్తు కలదు' - అని వేదాల యొక్క ఉత్తమమైన కథనం అయి ఉన్నది. జలమునందు ద్రవత్వం జలమునకు అభేదమై, స్వభావయుతమై ఉన్నది. అట్లాగే ఈ రూప-సంకల్పాది బాహ్య-అభ్యంత విషయాలన్నీ కూడా పరబ్రహ్మమున చిదాకాశరూపాలే అయి ఉన్నాయి.

మూర్తివంతమైన ప్రాణి తన ఆత్మభూతాలనదగ్గ ఈ కాళ్ళు-చేతులు మొదలైన అవయవాలతో ఆయా క్రియాదులు నిర్వర్తిస్తోంది కదా! అట్లాగే అకర్త-సద్రూపం అగు చిదాకాశం తన యొక్క ఆత్మ భూతాలగు పంచభూతములచే జగదుత్పత్తి మొదలైన క్రియాదులన్నీ సలుపుచున్నది. తప్పెట వాయించే వాని ఉద్దేశమును అనుసరించి, అతని అభిప్రాయానుసారమే ఆ తప్పెట యందు వివిధ శబ్దములు ఉత్పన్నములగుచున్నాయి కదా! అంతేగాని తప్పెట తనదైన అభిప్రాయంచేత శబ్దములు పలకటం లేదే! ఈ వసిష్ఠ-రామాది పేర్లచే పిలవబడే ఈ దేహాలు జడత్వం కారణంగా స్వయంగా వ్యవహారములు నిర్వర్తించలేవు. మరి? ఈ వసిష్ఠ-రామాది దేహాలు, ఇందులో 'నేను' మొదలైన అభిప్రాయాలు తెలిపే శబ్దాలు... ఇవన్నీ కూడా చిదాత్మ యొక్క అధిష్ఠానత్వము చేతనే ఉనికిని పొంది ప్రవర్తిస్తున్నాయి. చిదాత్మ యొక్క అధిష్ఠానం వలననే ఈ నాలుక మొదలైన కరణాలు విశేషత్వం పొందుచున్నాయి. అనగా చిదాత్మయే ఈ నాలుక మొదలైన కరణాలన్నిటిలో ప్రవేశించి వాటిని ప్రవర్తింపజేస్తోంది. ఏదైతే సర్వదా ఏకమే అయి ఉన్నదో... అదియే అనేకంగా కనిపిస్తోంది. అయితే...

**యద్భాతం ప్రేక్షయా నాస్తి, తన్నాస్త్యేవ నిరంతరమ్,**
**జగద్రూపమరూపాత్మ, బ్రహ్మ బ్రహ్మణి సంస్థితమ్ ॥**

ఏదైనా కళ్ళకు కనబడుతూ, విచారణ చేసినప్పుడు 'అది లేదు' అని తెలియవస్తుందో... అట్టిది సర్వదా లేనిదే అగుచున్నది. కనుక అవిచారణ కారణంగా ఈ జగత్తు సిద్ధించవచ్చు గాక! విచారణచే 'ఈ జగత్తు యొక్క జడత్వాంశరూపం, ఈ జగత్తు యొక్క స్వరూపంగా కనిపించేది'... ఇదంతా వాస్తవానికి శూన్యమే అయి ఉన్నది. కాబట్టి బ్రహ్మం సర్వదా బ్రహ్మస్వరూపం నందే స్థితి కలిగియున్నది. ఇదియే ఈ జగత్తు యొక్క వాస్తవమగు స్థితి.

ఏ అజ్ఞానులకైతే "ఈ జగత్తు ఉన్నది కదా!" - అని అనిపిస్తూ ఉండియే ఉందో... అట్టి జగత్ స్వప్న శీలురకు తమ తమ ఆత్మయందు పరస్పరం లేకయే ఉన్నారు. (ఆకాశపుష్పం అనేది

ఉండటమనేది అసంభవం ఎట్లాగో), సర్వదా బ్రహ్మతత్త్వ దర్శకులమగు మా యొక్క దృష్టియందు ఈ జీవుల పరస్పరత్వ వ్యవహారమంతా లేకయే ఉన్నది. మా దృష్టిలో సర్వదా అవిభాజకమగు పరమాత్మ తత్త్వమే స్వభావికంగా ఏర్పడి ఉన్నది.

వాయువు యొక్క అనేక తరంగాలు వాయువుకన్నా వేరా? కాదు కదా! అట్లాగే తమకంటే వేరు కానట్టి తమ యొక్క వ్యవహారాలతో సహా ఈ తదితర జీవులంతా నాయందు ఉండి ఉన్నారు. నేనో, వారియందు ఉండి ఉన్నాను. ఎందుకంటే నేను – ఈ తదితర సర్వజీవులు కూడా ఆకాశ కోశం వలె ప్రశాంతమైనట్టి బ్రహ్మైక్య స్వరూపులమే అయి ఉన్నాం. వారి యందలి బ్రహ్మమే నా యొక్క ప్రత్యగాత్మ. స్వప్నద్రష్టకు స్వప్నము సత్యము వలె తోచునట్లు, అజ్ఞానుల దృష్టియందు నా యొక్క ఈ వసిష్ఠ రూపమే అగుపిస్తుంది. కాని నాకో... సుషుప్తిలో ఉన్న వానికి స్వప్న పురుషులు లేనివారే అగుచున్నారు కదా! అట్లా నా దృష్టియందు 'ఈ జీవుడు–ఆ జీవుడు' అనబడునవేవీ లేవు. వారందరు నా యొక్క ఆత్మయే స్వరూపముగా కలవారు (మమాత్మా సర్వ భూతాత్మా).

**గురువు, శిష్యుడు ఏకరూపులే! -**

**శ్రీరాముడు :** అయితే స్వామీ! మీరు గురువులై ఆత్మతత్త్వం బోధిస్తున్నారు. మీ యొక్క శిష్యులమై మేం మీరు ప్రసాదించే బోధామృతం గ్రోలుచున్నాం. ఈ వ్యవహార సిద్ధి తిరస్కారమైనది కాదుకదా! (కాదనలేం కదా?)

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శిష్యులతో ఏ ఉపదేశాది వ్యవహారం నిర్వర్తించబడుతోందో అదంతా కూడా 'గాలిలో గాలి వీచికలు'లాగా 'బ్రహ్మం బ్రహ్మంనందే స్థితి కలిగి ఉండటం'గా నాకు తెలియవస్తోంది. ఇక మరొకరు ఎట్లు దర్శిస్తుంటే ఏం? దాని వల్ల నాకు ప్రయోజనం గాని, సంబంధం గాని లేదు.

నేను వాస్తవానికి ఈ వసిష్ఠ దేహ భాగముచే లేను. మరి? ఒకే వాయువు అన్ని వాయు తరంగాలలోనూ ఏర్పడి ఉన్నది కదా! ఒకే జలం సర్వ తరంగాలలోనూ ఏర్పడి ఉన్నది కదా! బ్రహ్మ సత్తయే ఈ వసిష్ఠాది ఆకారములలో వ్యాపించి ఉన్నది. మీకు లభించే బోధ అంటావా? ఆ బ్రహ్మసత్తయే గురూపదేశముగా కూడా వివర్తమొందినది అగుచున్నది. ఈ వాక్కు బ్రహ్మ సత్త యొక్క వివర్త భావనచే ఉపదేశాదుల రూపమున ఆవిర్భవించినదగుచున్నది.

ఓ రామచంద్రా! ఏ ఆత్మజ్ఞానికైతే విరుద్ధములగు దుఃఖాదులు కూడా అవిరుద్ధమగు శుద్ధ సచ్చిదా నందరూపములుగా భాసిస్తాయో, అట్టివాని హృదయంలో ఇక భోగేచ్ఛ గాని, మోక్షేచ్ఛగాని స్ఫురించనే స్ఫురించవు.

ఆహా! ఏం ఆశ్చర్యం! తమ తమ బ్రహ్మ స్వభావం ప్రతి వారికి తమ యొక్క ఆధీనంలోనే ఉన్నది కదా! తమ ఆధీనంలోనే ఉన్నట్టి తమయొక్క 'బ్రహ్మ స్వభావమాత్రం' నందు స్థితి కలిగి ఉన్నంత మాత్రం చేతనే ఈ జనులు బంధం నుండి విడివడి మోక్షస్థితిని సొంతం చేసుకోగలరే! అద్దానిని ఏమరచి అజ్ఞానంచే ఈ జనులు ఎన్నెన్ని బాధలు కొనితెచ్చుకుంటున్నారు! గోష్పాద జలమును చూచి' 'అయ్యో! ఇది సంసార సముద్రం! దీనిని దాటటమా? మా వలన అవుతుందా?' ...అని భ్రమ ఎందుకు పొందుచున్నారో కదా! 'అసత్తే' అయినట్టి దుఃఖమునకు వాస్తవమైన

ఉపశమన రూపమగు తన యొక్క 'బ్రహ్మ స్వభావ మాత్రమందలి స్థితి' అనే స్వగృహమును బోలిన మోక్ష స్థితి ఎవరికి వారే నిర్మించుకోవలసిన విషయం కదా! అట్టి మోక్ష సాధన విషయంలో ధనంగాని, మిత్రులు గాని, మరే విధమైన క్రియలు గాని ఉపకరించవు.

నూనెచుక్క నిర్మలమైన నీటిలో పడగానే అనేక చక్రాకారాలుగా అగుచున్నది కదా! విషయం యొక్క సంకల్పమాత్రంచే చైతన్యం అతి శీఘ్రంగా జగద్రూపంగా స్థితి కలిగిన దగుచున్నది. అయితే ఈ జగత్తు తత్ జగద్రూపంగా మిథ్య మాత్రమే! జాగ్రత్ సమయంలో మనుజుని స్వప్న వృత్తాంతమంతా ఏ విధంగా మిథ్యయో, ఆ విధంగా వర్తమాన జాగ్రత్తులో కనిపించేదంతా అనగా, అహంభావ సహితమగు ఈ జగత్సమూహమంతా తత్త్వజ్ఞానికి మిథ్యగానే తెలియవస్తోంది. అజ్ఞానికో... భవిష్యత్తులో వర్తమానము స్వప్నతుల్యంగానే అగుచున్నది.

అంతటికీ మునుముందుగానే నిత్యోదితమై సర్వదా వేంచేసి ఉన్న 'బ్రహ్మ స్వభావమాత్ర స్థితి' అనే అభ్యాసం గల వివేకవంతులగు యోగులకు ఈ జగజ్జాలమంతా అత్యంత సూక్ష్మమై పోతుంది. అనగా, అతి స్వల్పమైన విషయంగా కన్పట్టుచున్నది. అట్టి సమయంలో అతనికి అహంకారం గాని, జగత్తు గాని భాసించదు. శాంతమగు బ్రహ్మమే అంతటా సర్వదా శేషించి ఉన్నదగుచున్నది. ఎప్పుడెప్పుడు 'బ్రహ్మ స్వభావము' అనే సూర్యుడు ఉదయిస్తాడో... అప్పుడప్పుడు భోగరూపమైన అంధకారమంతా నశిస్తుంది. అప్పుడు 'ఈ భూత–భవిష్యత్–వర్తమాన కాలాలలో భోగాలరూపంగా కనిపించుచున్నవన్నీ కూడా అసత్యములు' అనే అనుభవం కూడా స్వయంసిద్ధమై కలుగుతుంది. ఆ విధంగా భోగరూపాలైన అంధకారం నశిస్తే... అప్పుడు 'నేను ఈ కనబడే ఇంద్రియ పరిమితుడను కాను. ఈ దేహ పరిమితుడను కాను'... అనే రూపంగా ఉండే ఇంద్రియాతీతత్వం సంతరించు కుంటాడు. క్రమంగా 'ఈ అంతఃకరణములైన మనస్సు–బుద్ధి–చిత్తము–అహంకారములచే కూడా నేను పరిమితుడను కాను. ఇవన్నీ పరిమిత వస్తువులు. నా స్వరూపమో... అపరిమితమైనది' అని సుస్పష్టంగా గ్రహిస్తాడు. ఈ విధంగా అతడు 'బాహ్య–అభ్యంతర కరణాదిరహితుడు' అగుచున్నాడు. సర్వ అజ్ఞానములను త్యజించివేస్తున్నాడు. అట్టి అజ్ఞానరహిత స్థితిలో స్థూల దేహముల అధ్యాసము లేనివాడై ప్రకాశిస్తున్నాడు. ఇకప్పుడు అతడు దీపము నుండి బయలుదేరిన ప్రకాశము వలె తన యొక్క బ్రహ్మ ప్రకాశముచే సర్వత్రా వ్యాపించినవాడై బ్రాహ్మీభూతుడై వెలయుచున్నాడు.

❖❖❖

## 23. జగద్భ్రాంతి

**శ్రీరాముడు :** స్వామీ! ఈ దేహ–మనో–బుద్ధి–బహిర్–అంతర్ ఇంద్రియములన్నీ నేను కానప్పుడు వీటన్నిటియొక్క అసలైన రూపం ఎట్టిది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ రూపాది బాహ్య విషయాలు, సంకల్పాది అభ్యంతర విషయాలు, బుద్ధి మొదలైన అంతరింద్రియాల అనుభవం... ఈ సమస్త వస్తువుల యొక్క వాస్తవ స్వరూపం నిర్వికారమగు చైతన్యమేనని విజ్ఞులచే సిద్ధాంతీకరించబడింది. ఎట్లా అంటే, భావం

భావించువానిరూపమేగాని వేరుగా లేదు కదా! ఎప్పుడైతే 'అవిద్య సన్నగిల్లుతుందో అప్పుడు బ్రహ్మ స్వభావము యొక్క వ్యాప్త స్థితి గోచరిస్తుంది.' అనగా "బ్రహ్మమే తనయొక్క వ్యాప్త స్వభావముచే ఈ దృశ్య-బాహ్యాభ్యంతర కరణాదులన్నీ కల్పనచే పొందుచూ తన స్వరూపాన్ని తానే అట్లు అనుభవించుచున్నది"... అని బ్రహ్మజ్ఞానంచే సుస్పష్టమౌతుంది. అప్పుడిక ఈ సృష్టి భ్రమమాత్రంగా గోచరిస్తుంది. అనగా, ఎప్పుడైతే ఆత్మస్వరూపజ్ఞానంచే బ్రహ్మ స్వభావమున (అఖండ-అప్రమేయ-నిత్యత్వ-సత్యత్వాది విలక్షమైన లక్షణములచే) శాంతి రూపమైన విశ్రాంతి లభిస్తుందో... అప్పుడు సుషుప్తిలో స్వప్నం అదృశ్యమగుచున్నట్లుగా – ఈ జగత్తు అనే దృశ్యం కూడా శమించిపోవుచున్నది.

రామచంద్రా! ఆ రీతిగా ఆత్మలో విశ్రాంతిని సంపాదించుకోవటమే మనుజ జన్మ సార్థకత. అంతేగాని, ఈ దృశ్యంలో సంచరిస్తూ దేహ-మనో-బుద్ధ్యాది ధర్మాలు తన స్వరూపంపై నిష్కారణంగా ఆపాదించుకుంటూ ఆశ-నిరాశల మధ్య కొట్టుమిట్టాడటం సార్థకతయే కాదు.

**ఆత్మయందు విశ్రాంతి -**

**భోగా భవమహారోగా, బంధవో దృఢ బంధనమ్**
**అనర్థాయా అర్థసంపత్తిరి, ఆత్మన్ ఆత్మని శామ్యతామ్ ॥**

ఓ జనులారా! భోగములే ఈ సంసారఅ యొక్క మహారోగాలు. బంధువులే ఇక్కడి దృఢ బంధనాలు. ధనాన్ని ప్రోగుచేసి పెట్టుకోవటం అనర్థం కొరకే అగుచున్నది. కాబట్టి ఇవన్నీ చక్కగా పరిశీలించి గమనించి "ఆత్మయందు శాంతంగా స్థితినొంది ఉండటం"... అనేది అభ్యసించండి.

బ్రహ్మస్వరూపమునకు విరుద్ధమైన భావన చేయుటయే సృష్టి. బ్రహ్మ స్వరూపమందు స్థితి కలిగి ఉండటమే 'శివరూప బ్రహ్మము' గా చెప్పబడుతోంది. కాబట్టి ఓ రామచంద్రా! నీవు సర్వదా చిదాకాశరూపుడవై ఉండు. అంతేగాని, ఈ 'సంసారము' అనే గ్లానిని పొందనే వద్దు.

ఓ రఘురామా! నేను ఈ వసిష్ఠ రూపమందలి జీవునిగాని, దృశ్యమును గాని, జగద్భ్రమను గాని ఎఱుగుటయే లేదు. సర్వదా శాంతరూపమగు బ్రహ్మమున, బ్రహ్మముగా, నిత్యోదిత – ప్రకాశస్వరూపుడనై ఉంటున్నాను. నిర్వికారమగు బ్రహ్మముగానే ఉన్నాను. తదితరులెవరైనా 'నీవు వసిష్ఠుడవు' అని త్వమ్ బోధచే సంబోధిస్తున్నప్పుడు కూడా "ఈ 'త్వమ్' అనునది శాంతం-సర్వం-శాశ్వతం-అనంతం అగు చిదాకాశమే"... అనే నేను సర్వదా వీక్షిస్తున్నాను. శాంతం, పరం అగు చిదాకాశమే నేనని ఎఱిగియే ఈ వసిష్ఠ నామధేయ దేహ సమన్వితంగా జలంలోనే సంచరించే జల స్వరూపమాత్ర జలతరంగంగా ఈ జగత్తు అనబడే దానిలో సంచరిస్తున్నాను. నాకు అన్యమైన దంటూ జగత్తు అనబడేదేదీ మొదలంటా కూడా నాకు అగుపించటమే లేదు. ఏ తరంగానికైనా, తనకు అన్యమైనది ఏ మరొక తరంగంలో లభిస్తుంది? జలానికి వేరైన ఏ ఉనికి ఏ తరంగానికి ఉన్నది?

**శ్రీరాముడు :** మహర్షీ! సంసార జీవులమగు మా యొక్క అనుభవం మీ వలె లేదే?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామా! నీకుగాని, నాకుగాని, మరొకరికిగాని చిదాకాశమగు బ్రహ్మమున ఈ శబ్ద-అర్థాది బాహ్య, అభ్యంతర విషయముల గూర్చిన భ్రమలన్నీ కూడా పరమార్థమున

అసలు జనించినవే కావు. ఈ విషయం సుస్పష్టమవటానికి గాను ఒకటి రెండు దృష్టాంతాలు తీసుకొని చెప్పుతాను.

**వాయు - వాయుతరంగ దృష్టాంతం -** 'వాయువు చలిస్తోంది' అంటాం. వాయువు ఏ రూపంగా చలిస్తోంది?...

**శ్రీరాముడు :** తరంగరూపంగా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాయువులోనే వాయు తరంగం చలిస్తోంది. అంతేగాని వాయువు ఎక్కడి నుండి ఎక్కడికో చలించడం లేదు కదా! అట్లాగే ఆత్మయందే ఆత్మభూతములగు సర్వ శబ్దార్థ బాహ్యాంభ్యంతర భ్రమలు ఏర్పడి ఉంటున్నాయి. వాయు తరంగం కూడా వాయువే అయినట్లు... ఆత్మయందు భ్రమచే తోచేవన్నీ కూడా ఆత్మకంటే వేరైనవి కావు.

జలమునందు జల స్వరూపమే అయిన జల తరంగాలున్నట్లు మనోబుద్ధ్యహంకారాదులన్నీ కూడా ఆత్మయందే ఆత్మ స్వరూపమే అయినవై ఉంటున్నాయి.

**స్వప్న సుషుప్త న్యాయం -** సుషుప్తిలో ఉన్నవారికి స్వప్నం ఉండదు. స్వప్నంలో ఉన్నవాడు సుషుప్తిని ఎఱుగుట లేదు. అట్లాగే... బ్రహ్మ స్వరూపమునందు ఉన్న వానికి సృష్టి కనిపించడం లేదు. అనగా, (తదితరులకు) సృష్టిగా కనిపించేదంతా అతనిచే బ్రహ్మముగానే ఎఱుగబడుచున్నది. సృష్టి స్వరూపమునందు లీనమై ఉన్నవానికి బ్రహ్మము అనుభవమవటం లేదు. ఇంతకు మించి ఇక్కడ మరే విశేషమూ లేదు.

జీవన్ముక్తుడు, ప్రశాంతచిత్తుడు, ప్రబుద్ధుడు అగు జ్ఞాని బ్రహ్మ స్వరూపమును నిత్య జాగ్రత్తుగా ఎఱుగుచున్నాడు. ఇక ఈ జగత్తునో... స్వప్నము వలె గమనించుచున్నాడు. కాబట్టి అతనికి ఇక్కడ వ్యవహారాలన్నీ కూడా స్వప్నతుల్యంగానే సంభవిస్తున్నాయి. ప్రబుద్ధుడు, శుద్ధాత్ముడు అగు జ్ఞాని ఈ సమస్త జగత్తును పరమాత్మ స్వరూపంగా నిర్ద్వంద్వంగానూ, సంశయరహితంగానూ ఎఱుగుచున్నాడు. ఈ జగత్తు యొక్క సత్యరూపమును ఎఱిగి ఉండుటచే, అతడు శరత్కాల మేఘం వలె ప్రశాంతిని పొంది ఉంటున్నాడు. ఒకడు ఒక యుద్ధ సంరంభమును గురించి తనయొక్క స్మృతి యందు గాని (లేక) తన యొక్క కల్పనలో గాని ఎట్లు భావించుచున్నాడో... అట్లే జ్ఞానికి సత్-అసత్తులు (ఉండటం-ఉండకపోవటం మొదలైనవి), ఈ అహంకారాదులతో సహా జగత్ భ్రమలు భవనామాత్రములుగా భాసిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ 'జీవుడు' ఆత్మయందున్నట్టివాడా? లేక ఆత్మ జీవునియందు ఉన్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**ఆత్మన్య నాస్తి హి యా ద్రష్టా యస్యా న విద్యతే కశ్చిత్ ।**
**న చ శూన్య నా శూన్యం భ్రాంతిరియం భాసతే సేతి ॥**

పరమార్థ సత్యమగు ఆత్మయందు ఈ కనిపించే జగన్మాయ లేదు. ఈ 'జగత్తు యొక్క ద్రష్ట' అయిన 'జీవుడు' అనబడేవాడు వాస్తవానికి ఎవడూ లేదు. నివాసం దృష్టిలో పెట్టుకొని "పల్లెటూరి వాడు, పట్టణం వాడు"... అని విభజన పూర్వకంగా చెప్పుకొన్నంత మాత్రంచేత దేహాదులకు ఆ

విభజన ఉందా? ఉండదు కదా! జగత్తు యొక్క ద్రష్ట (జీవుడు) – తదాధారమగు పరమాత్మతత్త్వం అట్టివే!... ఆహా! ఈ విధంగా అనిర్వచనీయమైన జగద్భ్రాంతి ఇటు శూన్యము కాక, అటు అశూన్యము కాక... శూన్యాశూన్య విలక్షణమై... అనిర్వచనీయమై భాసించుచున్నది కదా! ఏది ఏమైనా కూడా... ఆత్మ ఒక్కటే ఉన్నది. ఆత్మకంటే వేరైన జగత్తనేది, జీవుడు అనబడేది – ఇదంతా మాకేదీ అగుపించటమే లేదు.

❖❖❖

# 24. వివేకముచే స్వాత్మభూతుడగు పరమాత్మారాధన

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సర్వమునకు మునుముందుగా శాంతమగు 'కూటస్థాత్మయే ఉన్నది. అద్దానియందు నిశ్చల జలంలో ఏర్పడే ఆవృత్తంలాగా ప్రప్రథమంగా చిత్తరూప సమన్విత మైన జగత్స్ఫురణ ఏర్పడినది. అయితే జలంలో కనిపించే ఆవృత్తము జలమునకు అభిన్నమే కదా! అట్లాగే చిత్తము అనే శబ్దం యొక్క అర్థం ఉద్దేశం అయినటువంటి జగత్స్ఫురణ కూడా ఆ చిదాత్మకు అభేదం. వాస్తవానికి ఆత్మ అవ్యాకృతం! అందులో సృష్టి మొదలైనవి వేరైన ఆవృత్తం అంటూ ఎక్కడా లేదు. జలంలో జలమునకు అభేదమైన జలతరంగాలు ఉత్పన్నమగుచున్నట్లు, అయినా జలం సర్వదా యథాతథంగానే ఉన్నట్లు... ఆత్మకు బాహ్య–అభ్యంతర (దృశ్యం–దేహం; మనో బుద్ధి–చిత్త–అహంకారాలు) విషయాల యొక్క అనుభవమంతా యాదృచ్ఛికంగా కలుగు తోంది. మృగతృష్ణలో జల భ్రాంతిలాగా అదంతా అనుభవానికి వస్తోంది. అయితే మృగతృష్ణ సూర్య కిరణాల–వాయు వీచికల కలయికచే ఏర్పడే నీడల వంటివే గాని, అందులో కనిపించేదంతా జల తరంగాలు కావటానికే వీలులేదని తెలియవచ్చిన తర్వాత ఎవరికైనా మృగతృష్ణా జల తరంగాల భ్రాంతి ఉంటుందా? ఉండదు. సూర్యుడస్తమించగానే మృగతృష్ణా దృశ్యం అదృశ్యమౌతోంది కదా! అట్లాగే చిత్తం అనే సూర్యుడు అస్తమించగానే జగత్ విషయాల అనుభవం కూడా అదృశ్యమౌతోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జగత్తు పరమాత్మ యొక్క శరీరంలో విభాగంగా భావించవచ్చా? పరమాత్మ దేహములు అవధరించి ఈ దృశ్యమును అంగీకరించి, ఇందు ప్రవేశించుచున్నాడను సిద్ధాంతం యుక్తియుక్తమేనా? దేహ విలక్షణమైన పరమాత్మను దర్శించడమెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** పరమాత్మయందు ఈ జగత్తు దేహములన్నిటికీ విలక్షణమై, కానీ దేహములన్నీ తానే ప్రకాశింపజేయుచున్నవాడై విస్తరించి ఉంటున్నాడు. ఎటువంటి కారణాలు అపేక్షించకుండానే వాయువు యొక్క చలనం, సూర్యుని యొక్క ప్రకాశం విస్తారాన్ని పొందుచున్నట్లే, పరమాత్మయందు ఈ జగత్తు విస్తారం పొందుతోంది. జలంలో ద్రవత్వం, ఆకాశంలో శూన్యత్వం, వాయువు నందు ప్రతిబింబత్వం స్వభావసిద్ధమై భాసిస్తున్నట్లు 'మహాచిత్' రూపమగు మహాకాశమున 'జగత్తు' అనునది స్ఫురించుచున్నదగుచున్నది.

జలమందు –ద్రవత్వం, ఆకాశమందు –శూన్యత్వం, వాయువునందు –సంచలనత్వం, మహాచైతన్యమునందు –జగదత్వము... స్వభావ సిద్ధమై అనిర్వచనీయమై ఉంటున్నాయి.

వాయువు తనయందు చలనమును ఎఱుగుచున్న విధంగానే చైతన్యము తనయందు ఈ జగత్తును ఎఱుగుచున్నది. కాబట్టి ఇక్కడ ద్వైత-ఏకత్వ భేదాలంటూ ఏవి సంభవించవు.

అవివేకంచే ఈ జగత్తు అనబడేది ప్రకాశశీలమై ఉంటోంది. వివేకం చేతనో, అది వినాశన శీలమై (స్వయంగా లేనేలేదను అనుభవంగా) ఒప్పుచున్నది. కానీ... ఇదంతా సదా 'కేవలం-సద్రూపం' అగు బ్రహ్మం మాత్రమే అయి ఉన్నది. ఎందుకంటే, 'ఆదిమధ్యాంత రహితం-కేవల జ్ఞానమాత్రం-శుద్ధం'... అయినట్టి మహాచిన్మాత్రమునకు అన్యంగా ఎక్కడా ఏదీ ఉండజాలదు - అనేది నిర్వివాదాంశమని వివేకులు నిర్ణయించియే ఉన్నారు. అట్టి మహాచైతన్య రూపమగు అప్రమేయ తత్త్వమును... కొందరు 'పరమాత్మ' గాను, మరికొందరు 'శాంతమైనట్టి శివరూపం' గాను, ఇంకొందరు 'నిత్యమైనట్టి బ్రహ్మము' గాను, ఇంకా కొందరు 'శూన్యమాత్రం' గాను, మరికొందరు 'జ్ఞానమాత్రము' గాను, ఉపాసిస్తున్నారు. ఆ మహా చైతన్యము తనయందు జ్ఞేయత్వము (లేక ఆత్మరూపత్వము)ను అట్టేబెట్టుకొనే... తాను అనంతాత్మయగు చిద్రూపము అయి ఉండి కూడా... అయ్యది విషయరూపమును భావించుచున్నదాని వలె ఉన్నదై అజ్ఞాని చందమున అగుచున్నది. ఎవరు ఎట్లు ఉపాసిస్తున్నారో... వారికి అట్లే అనుభూతిని ప్రసాదిస్తోంది.

❖

శూన్యం-కూటస్థం అగు ఆకాశం లేకపోతే వాయువునకు కారణం లేదు. వాయువే లేకపోతే వాయు స్పందానికి (వాయు వీచికలకు) కారణం ఉండదు. అట్లాగే, చైతన్య సత్త లేకపోతే దృశ్య సత్తకు కారణం ఉండజాలదు. దృశ్య సత్త లేకపోతే చిత్తం యొక్క చిత్తత్వం కూడా లేనిదే అగుచున్నది.

కనుక సృష్టి-సృష్టి రూప భ్రాంతులు బ్రహ్మ సత్త యొక్క ఆధీనంలోనే ఉన్నాయి. బ్రహ్మ సత్తకు అన్యమైన కారణాపేక్ష ఏదీ లేదు. ఈ విధంగా బ్రహ్మం ఈ జగత్తుకు అధిష్ఠాన రూపమై ఉంటోంది. ఈ జగత్తు అధిష్ఠాన రూపంచే నిత్యత్వమును, నిజ దృశ్య రూపముచే అనిత్యత్వమును సిద్ధింపజేసుకుంటోంది.

❖

ఈ రూపంగా, ఈ సృష్టి అంతా కూడా భ్రాంతి మాత్రమై చెన్నొందుతోంది. అయితే ఈ సృష్టి భ్రాంతు లందు కనిపించే చిత్, జడములు యొక్కయు; ద్వైత ఏకత్వము యొక్కయు అస్థిత్వమంతా స్వతఃసద్వస్తువు అయినట్టి ఆత్మయొక్క అధీనంలోనే ఉన్నది. ఇదియే శాస్త్ర సార రహస్యం.

కూటస్థం-అద్వయం అగు మహా చిదాకాశంలో ద్వితీయం-ఏకత్వం కల్పించే మరొకరెక్కడు న్నారు? ఎవ్వరూ లేరు. ఇక ద్రష్టత్వం మొదలైనవన్నీ ఆత్మ స్వయంకృత క్రీడ వినోదరూపమైన చిద్విలాసం మాత్రమే! వాయువుకు వాయు తరంగాలకు (అద్దాని స్పందానికి) భేదమేమున్నది? అట్టి భేదం శబ్దమాత్రమే గాని, వాస్తవం కాదు కదా! అట్లాగే అనంతం-ఏకం అగు చిదాకాశానికి ఈ జగత్తుకు భేదం శబ్ద మాత్రమే గాని, వాస్తవమైనది కాదు! అంతే కాదు. 'విశ్వం వేరే-విశ్వేశ్వరుడు వేరు'... అని ఎవరికైనా ఇప్పుడు అనిపించవచ్చు గాక! జ్ఞానంచే అది అసత్యమైనది. 'ద్వైతం' అనేదే అసంభవం కాబట్టి ఈ విశ్వం చిత్స్వరూపమగు మహాచిన్మాత్రమే సుమా!

పరమాత్మయే జగత్తు వలె భాసించుచున్నాడు. ఇక ఈ కంటికి కనిపించే ప్రపంచమంటావా? ఇదంతా దేశ-కాలములకు లోబడి ఉంటోంది. పరమాత్మ సర్వదా దేశ కాలములకంటే ప్రత్యేకము - ముఖ్యము-అతీతము అయి ఉన్నాడు.

స్వప్నమునకు ఆధారమై, స్వప్నమునకు ఆదికారణమై, స్వప్నస్వరూపమంతా తానే అయి స్వప్నము కంటే ప్రత్యేకమై స్వప్న ద్రష్ట ఉన్నట్లుగా ద్రష్ట స్వరూపుడగు పరమాత్మ జగత్‌నందు జగత్తుగా వేంచేసి ఉంటున్నాడు. ఈ దృశ్యమునకు ఆధారమై, ఆదికారణమై, ఇదంతా తానే అయి, దీనికంతటికీ ప్రత్యేకమై ఉన్నాడు.

కాబట్టి ఈ ప్రపంచము ప్రపంచరూపంగా సత్యం కానే కాదు. 'ప్రపంచత్వము' అనేది ఎవరికీ కూడా వాస్తవము కాదు. బంగారు ఆభరణం బంగారమునకు భిన్నమైన సత్యం కాదు కదా!

"విశ్వం సత్యమే-విశ్వేశ్వరుడు సత్యమే" అనే వాక్యం "ఆకారం సత్యమే! బంగారం సత్యం!" అను వాక్యంలాంటిది మాత్రమే! అట్లాగే పరమాత్మ కంటే భిన్నంగా విశ్వమందు సత్యత్వం లేదు. ఈ విధంగా ద్వైత-ఏకత్వాల వ్యవహారమే అసంభవమగుచున్నది. బంగారానికి సత్యత్వం-బంగారు అభరణాలకు, జలానికి-జలతరంగాలకు ద్వైత-ఏకత్వాల కార్యకారణాలెక్కడివి? అట్లాగే 'అహం భావం'చే కనిపించే ద్వైత-ఏకత్వముల వ్యవహారాల కార్య-కారణత్వం మాత్రం పరమాత్మ యందు ఎట్లా ఉంటుంది?

**శ్రీరాముడు :** మరి ఈ జగత్తు అందరికీ అనుభవమౌతోంది. కదా! ఎందుకు అలా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'కల్పన' అను అజ్ఞాన జనిత చమత్కారం చేత మాత్రమే జగత్తు సత్యం వలె అనుభవమౌతోంది. బంగారపు ఆభరణానికి "నీది-నాది-వారికి చెందినది"... అనే కల్పన జగత్తులో ఉంటున్నప్పటికీ... అవన్నీ బంగారం యొక్క ధర్మాలుగా ఆపాదించలేం కదా! అట్లాగే ఈ జగత్తుగా కనబడేది పరమాత్మయే అయినప్పటికీ పరమాత్మలో వాస్తవానికి జగదత్వం లేదు. జగదత్వంగా కనిపించేది కల్పన మాత్రమే! సత్ వస్తువును కల్పనతో ఆపాదించి దర్శించటమే 'సంకల్పం' యొక్క అర్థోత్పత్తి అంతటా నిండి ఉన్న ఆకాశం అత్యంత అభేదమైనప్పటికీ 'ఇటు సూర్యుడు ఉదయిస్తున్నాడు. కనుక ఇది తూర్పువైపు ఆకాశం. అటు పడమరవైపు ఆకాశం' అనే విశేష సంభాషణ ఉంటోంది. ఎట్లా? 'సూర్యోదయం' అను ఘటనా వ్యవహారం చేత! స్వయంగా ఆకాశమునకు తూర్పు-పడమరలు లేవు కదా! ఆకాశంలో ఆకాశరేఖ వలె బ్రహ్మము - జగత్తులకు గల భేదం కల్పిత భేదం మాత్రమే! వాస్తవానికి ఆకాశము యొక్క రూపం ఏమిటో, అదే ఆకాశ రేఖ యొక్క రూపం కదా! అట్లాగే, బ్రహ్మము యొక్క రూపం ఏమిటో, అదియే జగత్తు యొక్క రూపం కూడా అయి ఉన్నది. అది అట్లై ఉండగా, ఇక ద్వైతం ఎచ్చట? ఏకత్వం ఎచ్చట?

ఆకాశము-శూన్యత్వము అనునవి ఏకరూపములే కదా! అట్లాగే బ్రహ్మము-జగత్తు ఒకే రూపములు కలిగి ఉన్నాయి. అట్టి బ్రహ్మము ఏకము-ఆత్మ స్వరూపము-సర్వ రూపము అయి ఉన్నది. ఒకానొక శిలచే నిర్మించబడిన సైన్యమంతా ఏకైక శిలాతత్త్వమే కదా! ఇక ఆ శిలా

నిర్మితమైన శిల్పకళాఖండంలో శత్రు సైనికులు-మిత్ర సైనికులు (శిల దృష్ట్యా) ఎక్కడున్నారు? జగత్తంతా బ్రహ్మము చేతనే నిర్మించబడి ఉండగా, ఇక ఈ జగత్తుకు 'ఇది కారణం-అది కార్యం'... అనే వ్యవహారం ఎట్లా కుదురుతుంది? అట్టి వైచిత్ర్యం సంభవించ టమెట్లా? సంభవించదు. చిదాకాశమునందు రెండవ వస్తువు (జగత్తు) ఎట్లా ఉంటుంది? శిలయందు చెక్కబడిన శిల్పము శిలామయమే. అయితే శిలయందు చెక్కబడిన స్త్రీ విగ్రహమును చూచి "శిలలో ఈ స్త్రీ (స్త్రీ విగ్రహం) ఉన్నది" అనునది శబ్ద మాత్ర సంభవమేగాని... అర్థ మాత్ర సంభవం కాదు కదా! మహా చైతన్యమున ఈ సృష్టి కూడా చిత్రకాశమయమై ఉండటంచేత ఇది బ్రహ్మ రూపమే అయి ఉన్నది. శిల్పంలోని చెవులు, ముక్కు, నోరు, కాళ్లు... అన్నీ కూడా శిలయే కదా! అట్లే ఈ కనబడే 'నేను-నీవు' మొదలైనవన్నీ బ్రహ్మ రూపమే సుమా! శిల గురించి ఎఱిగిన తర్వాత శిల్పం యొక్క ఆకారాదులు (శిల దృష్ట్యా) పరిగణలోకి రావు చూచావా? వాస్తవమగు బ్రహ్మతత్త్వము ఎఱిగిన తర్వాత ఈ జగత్తు తనంతటతానే అట్టి జ్ఞానదృష్టి యందు లయించిపోయినదగుచున్నది.

**శ్రీరాముడు:** ఇక్కడ రూప-సంకల్పాదులు ఉండి ఉంటున్నాయి కదా! ఇక ఇక్కడ అద్వితీయ బ్రహ్మము సులభంగా అనుభవమయ్యేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ బాహ్య జగత్తు రూపాదులతోను, అభ్యంతర జగత్తు సంకల్పాదులతోను ప్రాప్తిస్తున్నాయి కదా! అట్టి రూప-సంకల్పాది బాహ్య-అభ్యంతర జగత్తు అంతా కూడా భావనారూప మనస్సు యొక్క చలన మాత్రంచే జనించుచున్నది. భావనా మాత్రంచే ప్రాప్తించేదంతా ఆ భావనా త్యాగంచే తొలగుచున్నది. ప్రపంచం నుండి దృష్టిని మరలించుటచే భావనా త్యాగం సముపార్జిత మగుచున్నది. సర్వ భావాలు త్యజించబడగా, అనగా, మానసిక బాహ్య సర్వ చేష్టలు ఉపశమించగా ...అప్పుడు లభించే ఏ 'కాష్ఠమౌనస్థితి' స్ఫురిస్తుందో అదియే శేషబ్రహ్మం. ప్రపంచాన్ని ప్రపంచంగా కాకుండా దీనినంతా బ్రహ్మంగానే దర్శించటం అభ్యసించేవారికి దృశ్యానికి అనునిత్యంగా ఆధారభూతమై ఉన్న కాష్ఠమౌన స్వరూపమగు బ్రహ్మం అతి సులభంగా అనుభవమగుచున్నది.

ఇక "ఈ ప్రపంచం ఎదురుగా ఉండగా బ్రహ్మము అనుభవమయ్యేది ఎట్లా?"... అనే ప్రశ్నకు వద్దాం. మనకు పదార్థాలు ఎదురుగా ఉన్నాయి. కనుక అనుభవమౌతున్నాయి. అయితే,... 'అనుభవం' అనేది ఉండటానికి పదార్థాలు ఉండవలసిందేనా? పదార్థాలు లేకుండానే, అనుభవం ఉండటం లేదా?

**శ్రీరాముడు :** పదార్థ సమన్వితమైన ఈ జగత్తు ఎదురుగా ఉంటేనే ఇద్దాని అనుభవం కూడా ఉంటుంది. లేకుంటే ఉండదు కదా?

**దృశ్య వస్తువు లేకపోయినా అనుభూతులు కొనసాగగలవు! -**

**శ్రీవసిష్ఠ మహర్షి :** కానీ, పదార్థములతో కూడిన ఈ జగత్తు లేకపోయినా కూడా చాలా సందర్భాలలో అనుభవాలు ఉంటున్నాయి. ఉదాహరణకు... స్వప్నంలో ఏ పదార్థాలు లేకపోయిన ప్పటికీ పదార్థాలతో కూడిన స్వప్న జగత్తు అనుభవమౌతోంది కదా! అలాగే జాగ్రత్తులో కూడా

సమ్ముఖమున లేని పదార్థములు, వ్యక్తులు, సంఘటనలు, తత్ భావనచేత ఆ భావికునకు అనుభవరూపంగా ప్రాప్తించుచున్నాయి కూడా! ఒకానొక విరహ వేదనతో తపించే ప్రియునికి తన ప్రియురాలి రూపమే నలువైపులా అగుపించటం జరుగుతోంది కదా! కాబట్టి భావనయే అనుభవానికి ముడి పదార్థమగుచున్నది. భావన లేకపోతే ఎదురుగా ఉన్న పదార్థాలు కూడా అనుభవానికి రావు. అనగా, ప్రపంచము వైపుకు దృష్టిని మరలించుటచే తత్ ప్రపంచ దృష్టి భావన ద్వారా ఈ రూప-సంకల్పాది బాహ్య-అభ్యంతర విషయ రూప జగత్‌భ్రమ భాసిస్తోంది. జగద్భ్రమకు భావనయే మూలంగాని, పదార్థములు కాదు. సంఘటనలు కూడా కావు. ఈ విధంగా స్వప్నంలోను, జాగ్రత్తులోను కూడా సమ్ముఖమున ఉండి-లేని పదార్థాలు కూడా తత్ భావనచే ఉన్నట్లుగా తోచుచున్నాయి.

దీని అర్థం...? జగత్‌భావనను ఉపశమింపజేసి ఆత్మయందు స్వాభావికంగా శిలవలె నిశ్చలంగా ఉండటం అభ్య సించాలి. అదియే సమాధి. అదియే బ్రహ్మానుభవం. అదియే బ్రహ్మ భావన. "నా స్వస్వరూప బ్రహ్మమే ఈ తదితరుల రూపంగా భాసిస్తోంది"... అని అద్వితీయ భావనచే జగత్‌భ్రమ ఉపశమిస్తోంది.

**అందుకు మార్గం? -** అందుకు పూర్ణ వివేకమే ఉపాహారం. యథా ప్రాప్తములైన పదార్థములను అసంగబుద్ధితో స్వీకరించటమే అందుకొరకై చేసే పూజ. కాబట్టి ఓ ప్రియ శ్రోతలారా! మీరంతా చైతన్య రూపమగు-సచ్చిదానంద ఘనమైనట్టి ఆత్మ స్వభావమును అవలంబించి సర్వము పట్ల సమత్వమును అభ్యసించండి. అట్టి ఆత్మబోధ నిర్మలమైన బుద్ధికే సాధ్యం. స్వబుద్ధిచే వివేకము-వైరాగ్యము అనే సాధన పుష్పాలతో ఆ సర్వాత్మకుడగు పరమేశ్వరుని పూజించాలి. అట్లు వివేకముచే పూజితుడైన పరమాత్మ తక్షణమే 'నిరతిశయానందము' అనే వరాన్ని ప్రసాదిస్తాడు.

ఓ రామచంద్రా! అట్టి పరమాత్మ యొక్క పూజను కొన్ని భౌతిక పుష్పాలతో అష్టోత్తర శతనామ పఠనములతో ఒకచోట కూర్చుని కొద్దిసేపు రుద్ర-ఉపేంద్రాదుల ఆకార కల్పనచే నిర్వర్తించటమనేది గౌణము (ప్రారంభస్థితి) అని గమనించు. ఎందుకంటే ఆ సర్వాత్మకుడు స్వాత్మ స్వరూపుడై నీ యందు నా యందు, సర్వమునందు వేంచేసి ఉండగా, అంతటా ఆక్రమించి ఉన్న వానిని ఎక్కడికి ఆహ్వానిస్తావు? అందుచేత 1. విచారణ, 2. శమం, 3. సత్సంగం, 4. సంతోషం – అనే కానుకలతో ఆయన పూజింపబడు గాక! అప్పుడా పరమేశ్వరుడు సంతోషించి 'మోక్షము' అనే ఫలాన్ని ప్రసాదిస్తాడు. సత్యావలోకనము అనే ఆత్మ దర్శనముచే మాత్రమే అతడు నిజమైన పూజితుడు అవుతాడు. తద్వారా సర్వోత్కృష్టమైన ఫలం లభించగలదు.

సత్సంగ-శమ-సంతోష పుష్పములచే ఆత్మను పూర్ణముగా పూజించువానికి అతని ఆత్మగానే వేంచేసియున్న పరమేశ్వరుడు సమస్త ఫలములను ప్రసాదించుచుండగా ఇక అన్యుని ఆశ్రయించే మూఢుడు ఎవడుంటాడు? సర్వ స్వరూపుడగు ఆత్మను పూజించువానికి శాస్త్రములు-విషము-అగ్ని మొదలైనవి కూడా విరిసిన మల్లెపూల వలె అతి కోమలములై ఉంటాయి.

ఇక అసంపూర్ణ వివేకులగు సాధకులను దృష్టిలో ఉంచుకొని ప్రతిపాదించబడిన దేహపూజ-తపస్సు-దానము మొదలైన వాటితో ఆత్మ పూజను జోడించినప్పుడు మహత్తర ఫలమును, అట్లా జోడించకపోతే అల్పప్రయోజనమును ఇచ్చుచున్నాయని గమనించు. 'ఆత్మపూజ' యొక్క సమక్షంలో అవన్నీ (అల్ప ప్రయోజనములకై ఉద్దేశించే పూజదులు) భస్మమువలె గోచరిస్తున్నాయి. వివేకముతో కూడి నిర్వర్తించబడిన దేవ పూజాదులే సఫలములగుచున్నాయి. మీరప్పుడు 'వాసనాత్యాగరూపము సత్యతత్త్వమగు ఆత్మ యొక్క విజ్ఞానము' అనే వివేకమును అంతఃకరణంలో సాధించటానికి అందరూ ఎందుకు ప్రయత్నించకూడదు? సాధనలు అందుకే మార్గంగా ఉన్నాయని గమనించబడుగాక!

**లజ్జాం భయం విషాద ఈర్ష్యే సుఖం దుఃఖ జయేత్ సమమ్ ।**
**జగదాది శరీరాది నాస్త్యేవ ఆదౌ! కుతోఽద్య తత్ ॥**

ఆత్మ జ్ఞానముచే 'దేహము యొక్క సత్త మిథ్య' అని ఎరుగాలి. అట్టి 'దేహము మిథ్య' అను ఎఱుకనే 'సమత్వము' అను అగ్నిని ప్రజ్వలింపజేయాలి. లజ్జ-భయము-విషాదము-ఈర్ష్య-సుఖము-దుఃఖము మొదలైనవాటిని 'సమత్వము' అను అగ్ని ప్రజ్వలనముచే దహించి వేయాలి.

**ఇది జీవుని ముఖ్య కార్యక్రమం -** ఎందుకంటావా? ఈ దేహాదులు గాని, అట్టి దేహాదుల ఉనికికి కారణభూతం అయిన జగత్తు గాని, అట్టి ఈ జగత్తు మొదలైన వాటికి కారణమైన 'అవిద్య' గాని మొదలే లేవు. మొదలే లేనప్పుడు ఇప్పుడు ఎక్కడి నుండి వచ్చాయి? కాబట్టి జగత్తుగా దర్శించబడుచున్నది. మిథ్యయేనని మా అభిప్రాయం. మాకు అనుభవైకవేద్యం.

పోనీ ఈ 'జగత్తు' అనేది 'బ్రహ్మం' అనే కారణం యొక్క కార్యమనే అనుకుందాం! అప్పుడు కూడా ఇదంతా 'ప్రకాశమాత్రం-నిర్మలం' అయినట్టి బ్రహ్మం మాత్రమే అవుతుంది. మట్టి కారణ మనుకుంటే, కుండలు కార్యమనుకుంటే, కుండలలో ఉన్నదంతా మట్టియే కదా! కుండలో మట్టికి వేరైన పదార్థ మేమున్నది? ఈ దృశ్యమంతా 'జ్ఞానము' అను దానిలోంచే అనుభవమౌతోంది.

కాబట్టి,... ఇదంతా జ్ఞాన రూపమగు బ్రహ్మము కంటే భిన్నంగా ఏమాత్రం సత్యం కానేరదు. అనగా 'దృశ్య వికల్ప ప్రతిభ చిత్ యొక్క అభాసరూపమే కాబట్టి అదే ఈ జగత్తు అట్టి చిదాభాస రూపజ్ఞానం కూడా ఆత్మతత్త్వం యొక్క విభూతియే! లేక, ఆత్మ యొక్క విన్యాసమే! ఆభరణత్వం అను ఆకారాదులు బంగారం యొక్క విభూతియే కదా! అద్దంలో కనిపించే ముఖం యొక్క శోభ అద్దంలోని విభాగమే కదా! సాక్షి చైతన్యం యొక్క యథార్థ జ్ఞానముచే 'జగత్తుగా కనిపించేది' అనునది కూడా ఆమూలాగ్రం ఉపశమించగలదు. ఆత్మాంతర్భాగ విభాగమే కాగలదు.

కనుక ఓ సభికులారా! మీరంతా కూడా శిలా ప్రతిమ యొక్క కోశం వలె అంతఃకరణం నందు ప్రశాంతులై ఉండండి. స్వస్థచిత్తులై ఉండండి. ఈ ప్రపంచమున వ్యవహరిస్తున్నప్పుడు-వ్యవహరించ నప్పుడు కూడా పరమశాంత చిద్రూపమగు ఆత్మగానే ఉండండి. ఇక్కడి జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ రూపమగు త్రిపుటి కంటే అతీతులై ఉండండి. సద్రూపులై, సత్-అసత్‌లకు సారభూతమన దగ్గ ఆత్మస్వరూపులై ప్రకాశించండి. నిర్మలాకాశం వలె నిర్మల స్వరూపులై సర్వ సంసార భూములకు పరము అయినట్టి బ్రహ్మముననే స్థితి కలిగి ఉండండి.

**యథా స్థితం చ తిష్ఠన్తి గశ్చన్తశ్చ యథాగతమ్ ।**
**యథా ప్రాప్తైక కర్మాణః సంపదన్త్యే బుధాః పరమ్ ॥**

జ్ఞానులు తమ ఇచ్ఛాపూర్వకంగా ఒక చోటనే ఉన్నప్పటికీ, (లేక) అక్కడో ఇక్కడో సంచారం చేస్తూ ఉన్నప్పటికీ, యథాప్రాప్తములైన ఆయా వ్యవహారములను ఆచరిస్తూనే... మరొకవైపు నిశ్చల పరమాత్మ యందు స్థితి కలిగియే ఉంటున్నారు. లేక సర్వ వ్యవహారములను త్యజించి శాంతమైన అంతఃకరణముతో ఏకాంత స్థలమందు లిఖితమైన చిత్ర పటంలాగా నిశ్చల సమాధిని అవధరించి ఉంటున్నారు. ఆ రెండింటిలో వారికి తేడాయే కనిపించటం లేదు. సమస్త సంకల్పములు శమించినట్టి ఆ మహాత్మునికి (లేక) ఆ ప్రబుద్ధునికి ఈ జగత్తంతా సంకల్పములోని పట్టణంలాగా, లేక స్వప్నంలో కనిపించే అరణ్యంలాగా మొదలే అస్తమించియున్న దానివలె అగుపిస్తోంది.

**అపరోక్ష ఆత్మజ్ఞానం -**

**స నేత్ర రూపానుభవం జాతి తో ఉన్ధ ఇవ భ్రమైః,**
**నిర్వాణం వర్ణయన్ అజ్ఞస్త ఆప్యతే అంతర్ న శామ్యతి ॥**

ఓ రామచంద్రా! ఈ జీవుడు అజ్ఞాన దశ నుండి జ్ఞానిగా తనను తాను తీర్చిదిద్దుకోవాలి. 'ఆత్మ నిర్మలము-సత్యము-అప్రమేయము-ఆద్యంతరహితము-అఖండము'...అను శాస్త్ర వాక్యాలు వింటూ కూడా అజ్ఞాన కారణంగా కొందరు ఆత్మ వర్ణనను పరోక్ష విషయంగా భావిస్తూ వస్తున్నారు. అప్పుడేమౌతోంది? నిర్వాణము గురించి వింటున్నప్పటికీ అపరోక్ష సాక్షాత్కారం (ఆయా వర్ణలకు విషయమగుచున్నది. తమ యొక్క స్వస్వరూపమే – అను సాక్షాత్కారం) లభించకయే పోతోంది. అట్టి వారికి ఎంత విన్నా కూడా వారిపట్ల సంసారం కొనసాగుతూనే పోతోందిగాని శమించటమే లేదు! ఒకడు కళ్ళు మూసుకొన్నప్పటికీ సంస్కారవశం చేత అతనికి నేత్ర రూపానుభవం కొనసాగు తూనే ఉంటుంది. చూచావా? అనగా – నేను ఏదీ చూడనే కూడదు అని ఒకడు కళ్ళు మూసుకొని కూర్చున్నప్పటికీ సంస్కారవశం చేత అతని మనోవీథిలో ఏదో ఒకటి దృశ్యరూప సంబంధమైన అనుభవంగా కొనసాగుతూనే ఉంటుందే! అట్లాగే ఒకడు ఆత్మ యొక్క మాహాత్మ్యం గురించి ఎంత వింటున్నా కూడా... "అదంతా మహాత్ములకే సాధ్యం, నాకెప్పటికి లభిస్తుందో?" అని అనుకుంటూ సంసారాన్ని తనకుతానే కొనసాగించుకొంటున్నాడేగాని 'ఆత్మ అనగా నేనే' కనుక నేనే! అఖండుడను. నిత్యుడను. అప్రమేయుడను. అనంతుడను'... అను ఆత్మానుభవంలో ప్రవేశించలేకపోతున్నాడు. అందుచేత ఓ సహ ఆత్మస్వరూపులారా! "శాస్త్రములు ప్రసాదించే 'ఆత్మ జ్ఞానం' అనే ప్రవచనమంతా మీ స్వస్వరూపము గురించే" అనే అపరోక్ష జ్ఞానం నిస్సందేహపూర్వకంగా ప్రవృద్ధపరచుకోండి. ఆత్మ జ్ఞానముచే అంతఃకరణ సంతృప్తిని, శాంతిని సుస్థిరపరచుకొనెదరు గాక!

**పరోక్ష ఆత్మజ్ఞాన పరిమితత్వం -** అజ్ఞానులు 'అవిద్యామయం-కల్పనారూపం' అగు పరోక్ష జ్ఞాన పరిమితమైన ఉపదేశాన్ని విని అజ్ఞత్వంచే 'మేం ఈ సమాచారం విన్నాం కదా! ఇక కృతార్థులమే'... అని తలచుచున్నారు. విన్నదంతా అపరోక్షజ్ఞానంగా రూపుదిద్దుకున్నప్పుడే 'కృతార్థత'... అని నేను గుర్తు చేస్తున్నాను. అంతేగాని మూర్ఖత్వం వహించి' 'పరోక్ష జ్ఞానంచే

కృతార్థులమైతిమి' అని తలచుచు పరిమిత ప్రయోజనంతో తృప్తిపడకండి. జ్ఞాని ఎదుట-ప్రశ్న-ఉత్తరాదుల ద్వారా అట్టి పరోక్ష-పరిమిత జ్ఞానుల అకృతార్థము క్షణాలలో వెల్లడి అవుతుంది.

కల్పనాత్మకమైన జ్ఞానము భావ-అభావ-ఇచ్ఛ-ద్వేషాది భ్రమలచే నిమిషమాత్రంలోనే మహా దుఃఖప్రదమగుచున్నది. అందుచేత ఆత్మజ్ఞాన సంపన్నులు అట్టి కల్పనా రూపమగు ఉపాయ-అపాయముల గురించి పెద్దగా వచించనే వచించరు. వారి సంవాదమంతా జీవుని యొక్క వాస్తవ-నిత్య-సత్యతత్త్వము వైపుగా ఉద్దేశించబడే ఉంటుంది.

కనుక ఓ రామచంద్రా! ఈ జగత్తును, ఇద్దాని భేదాభేదరూపముచే మిథ్యగానే దర్శించు. పురుగు నుండి హిరణ్యగర్భుని వరకు సమస్త విషయముల పట్ల వాసనారాహిత్యపూర్వకంగా విరక్తిని కలిగి ఉండు. ఆ విధంగా "నా అనంతము-అపరిమితము-సర్వాత్మకము అగు ఆత్మ స్వరూపము నందు ఈ దేహ జగత్తులు మొదలైనవి ఒకానొక స్వల్ప విభాగము" అను అనుభూతిచే ఆత్మయందు నెలకొని ఉండటమే 'నిర్వాణము' లేక 'మోక్షము' అని పెద్దలచే చెప్పబడుచున్నది.

కాబట్టి, నేను ఇప్పటిదాకా చెప్పిన ఉపదేశమంతా లౌకిక కథ వలె పరోక్ష రూపంగా ఎఱుగటం సరిపోదు. పరోక్ష రూపంగా ఎఱిగినంత మాత్రం చేత ఎవరూ కృతార్థులు కాలేరు. అపరోక్షంగా ఎఱగాలి. అట్టి అపరోక్ష జ్ఞానముచే పూర్ణము-నిర్మలము-అవేద్యమైనది (తెలుసుకునేదే అది కాబట్టి), భగవత్స్వరూపమైనది అగు ఈ జగత్తును సాక్షాత్తు స్వస్వరూప భావ చమత్కారముగా అనుభవించెదరు గాక! తద్ద్వారా నిర్వాణ సుఖరూప శాంతిని సర్వదా అవధరించెదరు గాక!

**జాత్యంధరూపానుభవాను రూపం, యదా గమైః బుద్ధమ్-అబోధ రూపమ్,**
**అథ స్వదీకృత్య తదన్తరే, అస్మిన్ బోధే నిపత్యానుభవో భవాభూః ॥**

పైన మనం చెప్పుకున్న కారణాలచేత వేదశాస్త్ర ఉపదేశములచే బహిర్ముఖ భావన కొనసాగిస్తూ పరోక్షజ్ఞానానికి పరిమితం కాకూడదు. వేదశాస్త్ర ఉపదేశముల ఉద్దేశాన్ని పరిమిత బుద్ధితో స్వీకరించటం సరికాదు. అదంతా జన్మాంధుని రూపానుభవ సదృశం. అట్టి పరోక్ష జ్ఞానాన్ని కూడా అణగగొట్టి నిత్య అపరోక్షమైనట్టి ఆత్మ స్వరూపమున నిమగ్నులు కావలసినదిగా నా మనవి. ఇది బోధసారం కూడా! ఇట్లు జన్మాది రహితమగు నిర్వాణరూపులై ప్రకాశించెదరు గాక!

❖❖❖

# 25. 'అశాంతి' నుండి విశ్రాంతికి

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవుని పట్ల అభ్యంతరమున అహంకారాదులు, బాహ్యమున ఈ జగత్తు అను భోక్తృ-భోగరూపమంతా ప్రవర్తిస్తోంది కదా! అయితే... అభ్యంతరంలోని అహంకారాదులు గాని, బాహ్య జగత్తు గాని... తదనుభవరూపమగు భోగం యొక్క తాదాత్మ్యం... అసత్యంగా భాసించుచున్నాయి. అనగా తత్త్వజ్ఞానం లేనప్పుడు అవి సత్యం వలె అనిపిస్తున్నప్పటికీ, తత్త్వజ్ఞానానంతరం అవన్నీ లేవనియే తెలియవస్తోంది.

ఎందుకంటావా ? అసలు, భోగము అంటే ఏమిటి?




భోక్త యొక్క భోగ్య వస్తువులతోటి సంబంధం యొక్క అనుభవమే భోగం. ఏదైతే ఆత్మయే అయి ఉన్నదో అదే మూఢులకు అజ్ఞానముచే భోగానుభవసహితంగా 'జీవుడు' అనబడునదిగా తోచుతోంది. వాస్తవానికి ఆత్మ బోగానుభవరహితమైన అనునిత్య సత్యమగు బ్రహ్మమే అయి ఉన్నది. 'అజ్ఞానము' అనే రుగ్మత తొలగినప్పుడు సర్వులు ఆత్మ స్వరూపులేనని, అంతా కూడా ఆత్మ యొక్క విన్యాసమేనని అనుభవసిద్ధి కాగలదు. 'జ్ఞానం' అనే శాంత స్వరూప శీతలత్వం సముపార్జించుకున్న వారికి ఇక ఈ జగత్ భోగములు స్వభావ సిద్ధంగానే 'రహదారిలో పడి ఉన్న ఎండుగడ్డి పరక' వలె అల్పంగాను, అరుచికరమైనవిగాను కనిపించగలవు.

ఓ రామచంద్రా! శాస్త్రములచే చెప్పబడే ఆయా పదజాలాలచే (ఆత్మ–పరమాత్మ–జీవుడు–బ్రహ్మం–సత్త్వం మొదలైన ఆయా శబ్ద జాలంతో)... పెద్దగా పనిలేదు. 'నిర్వాణం' అను జగదతీత సంస్థితి లభించాలంటే....

1. ఇంద్రియ సంబంధమైన భోగముల పట్ల అనురక్తి తొలగడం (విరక్తి కలగటం)
2. వ్యక్తిగత పరిమితమైన 'అహంభావం' అనునది రహితమవటం.... ఈ రెండూ చాలు!

అందుచేత ముముక్షువు ఈ రెండిటి కొరకై నిరంతరమైన ప్రయత్నపూర్వక కార్యక్రమంలో తనను తాను నియమించుకోవాలి. ఎవరికైనా స్వప్నంలో రుచిగా కనిపించిన పదార్థ సమూహముల కొరకు మేల్కొనిన తరువాత వెతికి సంపాదించాలని అనిపిస్తోందా? లేదు. ఎందుచేత అసలు అవి భ్రమయే కదా! మెలుకువ రాగానే అవన్నీ కనబడకుండానే పోతున్నాయి. ఇక ఆ స్వప్నంలోని తినుబండారాల కొరకై ఎవడూ ఏడ్వడు కదా! స్వప్నంలో కనిపించిన ఇళ్ళు–వాకిళ్లు–మనుష్యులు మొదలైనవి... మెలకువ తర్వాత 'అయ్యో! అవి పోయినాయే' అని ఎవరూ దుఃఖించటం లేదు కదా! "అలాగే ఈ జాగ్రత్‌లో సర్వ విషయాలు కూడా" అని గ్రహించబడు గాక! అజ్ఞానదశలో రుచికరంగా కనిపించే అహంకారము–జగదనుభవములు మొదలైనవన్నీ తత్త్వజ్ఞుడు (ఆత్మజ్ఞాన సహితుడు) అయిన తర్వాత అవన్నీ నిరర్థకంగాను, సార రహితమైనవిగాను, అరుచికరంగాను ఉంటాయి. అతని దృష్టియందు ఈ అహంకారము–జగత్తు మొదలైనవి 'లేనివే' అగుచున్నాయి. స్వతహాగానే మొదలంట లేని పదార్థముల వలన సంబంధమేమిటి? బంధమేమిటి? మోక్షమేమిటి? అవి బాధించటమేమిటి? ఎట్లా వదిలించుకోవాలి... అను సంఘర్షణ ఎందుకు? అరణ్యంలో ఉన్న యక్షుడు తన యొక్క సంకల్ప బలం చేత మాయాకల్పిత పురమును, అందులో స్వజనులను దర్శించి, అందులో ప్రవేశించి విహారంచేస్తూ ఉంటాడు చూచావా? ఆ యక్షనగరం మొదలే

అసత్యం కదా! అదే తీరుగా ఈ జీవుడు కూడా తన యొక్క 'అవిద్య' అను ప్రమత్తతచే 'మిథ్య మాత్రమే' అగు ఈ సంసారమును కల్పించుకొని, అందులో ప్రవేశించి అద్దానియందు తన కొఱకు తానే వెతకుకొనుచున్నాడు. తన కల్పనను తానే సంసారంగా గాంచుచున్నాడు. 'యక్షుడు-అతని నగరం' ఈ రెండూ కూడా భ్రమ సిద్ధమే అయినప్పటికీ, కల్పితమాత్రమే అయినప్పటికీ, అందులో వ్యవహారాలు మాత్రం అర్థ-క్రియా సమర్థములై వర్తించుచున్నాయి. అట్లాగే అజ్ఞానంచే ఇక్కడ అహంకారం-జగద్భ్రమ సత్యం వలె వర్తిస్తున్నాయి. అరణ్యంలో యక్ష-ప్రేతాదులు భ్రమ రూపమున వర్తిస్తున్నట్లు ఆవరణరహితమగు చైతన్యమున ఈ 14 లోకాలు భ్రమ రూపాలై స్ఫురిస్తున్నాయి. ఆకాశమున స్వతహాగా 'తూర్పు-పడమర-లోపల-వెలుపల-పైన-క్రింద' అను ఆవరణలు లేక పోయినప్పటికీ జగత్ వ్యవహారం దృష్ట్యా అవన్నీ ఒనగూడు చున్నట్లే, ఆత్మలో ఆవరణలు లేకపోయి నప్పటికీ అహంకారము-జగత్ భ్రమ మొదలైన ఆవరణలు సాపేక్షిక మాత్రంగా సిద్ధిస్తున్నాయి.

**విచారణ -** ఓయీ మానవుడా! ఆత్మ గురించి ముందుగా ఎఱుగవలసినదిగా మా విన్నపం! 'అహంకారము-జగత్తు' అనేవి మిథ్య మాత్రమే'... అని 'భ్రమ మాత్రమే' అని క్రమంగా గ్రహించు. అట్టి నిశ్చయము యొక్క ప్రభావం చేత చిత్తము అని చెప్పబడేది కూడా చైతన్యము నొందగలదు. కాబట్టి మీరంతా సమస్త సంశయములను విడనాడండి. గ్రహణ-త్యాగముల రెండిటినీ త్యజించినవారై ఉండండి. సర్వ సంశయములను విడనాడండి. కోర్కెలన్నిటినీ పారద్రోలినవారవండి. శాంత స్వరూపమును సంతరించుకొని ఉండండి. స్వతహాగా సత్తయే లేనట్టి ఈ దృశ్యము వాస్తవానికి ద్రష్టయొక్క రూపమే అయి ఉండి, ఇట్లు వ్యాపించి ఉన్నది సుమా! లేదా... (మరో విధంగా) ఇది ద్రష్ట యొక్క రూపం కూడా కాదు!

తరంగమంతా జలమయమే అయినప్పటికీ 'జలం తరంగంగా గుండ్రని పొడవైన ఆకారంగా ధర్మంగా కలిగి ఉన్నది'... అని అనలేం కదా! ఈ దృశ్యమంతా అనిర్వచనీయమగు చిత్స్వరూపమే అయి ఉన్నది. కానీ చిత్స్వరూపంలో ఈ జగత్తులు, దృశ్యాదులు లేవు. ఎందుకంటే...

1. దృశ్యమంతా ద్రష్ట స్వరూపమే! 2. 'పరమార్థ చిద్రూప సత్తా' అగు ద్రష్ట 'అసత్తు' అయినట్టి ఈ దృశ్యరూపంగా ఎట్లు గావించ బడుతుంది?

వసంతకాలపు రస ప్రవాహ రూపాలే ఈ వృక్ష-లత-లతా గృహాలు కదా! అట్లాగే ఈ సృష్టి అంతా కూడా ఆత్మ స్వరూపమాత్ర పరిపూర్ణమగు చైతన్యము యొక్క రూపమే అయి ఉన్నది.

జగత్తు యొక్క అభాస అని ఏది దర్శించబడుచున్నదో, అదంతా కూడా శుద్ధ చిన్మాత్రమే అయి ఉన్నది. ఇక ఇక్కడ ద్వైత-ఏకత్వములనబడేవి ఎట్లా ఉంటాయి? కాబట్టి ఓ సహప్రియా సర్వ జీవులారా! మీరంతా కూడా నిర్వాణ రూపమును సంతరించుకొని ఉండండి. చిదాకాశరూపులై ఉండెదరుగాక! నిరతిశయమగు ఆత్మానంద రసమును పానం చేసినవారై పరమశాంత మనస్కులు అవండి. సర్వ సంశయాలను పారద్రోలి 'నిర్వాణం' అనే పరమశాంత స్థానమున సుస్థిరులుకండి.

**కిమ్ ఏతా ఆస్వతి శూన్యాసు సంసారారణ్య భూమిషు ।**
**మానవా! వాతహరిణా భ్రమథో భ్రాంత బుద్ధయః ॥**

ఓయీ! మానవుడా! ఈ సంసారం అని పిలువడే అతి శూన్యమైన అరణ్య భూమిలో భ్రాంతి బుద్ధితో ఎందుకు తిరుగాడుచున్నావు? ఓ ప్రియ సహజనులారా! 'ముల్లోకాలు' అనే మృగతృష్ణా జలం చూచి మీరు మోసపోకండి. 'ఆశ' అనే ఆవరణచే ఏర్పడిన చిత్తమును నమ్మి తద్వారా ధైర్యాన్ని కోల్పోయి ఎచ్చుటెచ్చటికో పరుగులు తీయటమెందుకు? ఇక్కడి రూపాలు, సంకల్పాలు, బాంధవ్యాలు నమ్ముకొని సంసారంలో సంచరించటమనేది మూర్ఖపు జింక ఎండమావు లలోని నీళ్ళు త్రాగి దాహం తీర్చుకుందామని పరుగులు తీయటం వంటిదే! అందుచేత ఈ సాంసారిక పరిశ్రమలలో మీ ఆయువును వ్యర్థం చేసుకోకండి. జగత్తు అనే గంధర్వ నగరాన్ని (గారడీ కల్పన) చూసుకొని 'మాకు అవి ఉన్నాయి. ఇవి తెలుసు' అనుకుంటూ మురియకండి. ఎక్కడైనా సంసార సుఖం కనిపిస్తున్నా కూడా అది భావి వినాశనరూపాలుగాను, దుఃఖ కారకాలు గాను పరికించండి.

దృష్టి యొక్క భ్రాంతి దోషం చేత ఆకాశంలో వెంట్రుకల వంటి ఆకారాలు కనిపిస్తున్నాయి చూచావా? అట్లాగే బ్రహ్మాకాశంలో 'జగత్తు' అనే ఆకారాలు అగుపిస్తున్నాయి. కాబట్టి రామా! భ్రాంతి రహితం-సత్యం అగు ఆత్మలో సదా విశ్రమించి ఉండు. వాస్తవానికి ఆత్మయే స్వస్వరూపంగా గల జీవునకు 'మానవ శరీరం' అనేది... ఒక మహత్తరమైన అవకాశం అయితే, వృక్షం యొక్క ఊర్ధ్వ భాగమున గల రెపరెపలాడే ఆకు చివరగల జలబిందువు వలె ఈ దేహం అతి చంచలమైనది. అట్టి ఈ దేహం ఏ క్షణమైనా మట్టిలో కలిసిపోవచ్చు. అట్టి మానవ దేహం యొక్క సంసార రూపాలైనట్టి 'అవయవాలు-తత్ సంబంధిత విషయాలు'... అనే గర్భశయ్యలో పరుండకండి. దేహ స్వభావమును ఆశ్రయించి నానా అగచాట్లు ఎందుకు పడాలి? 'ఆద్యంత రహితం-అఖండితం' అగు ఆత్మ స్వభావంలో శాంతంగా నెలకొని ఉండండి. అంతేగాని, ద్రష్టు-దృశ్య పరంపరలు మొదలుగాగల 'దృశ్య రూపం' అను దోషంతో కూడిన ఆ స్వభావం (అనాత్మ స్వభావం) నందు ప్రవేశించి దుఃఖ పరంపరలను కొనితెచ్చుకోవద్దు. అజ్ఞానికి మాత్రమే ఈ ప్రపంచం సత్యం వలె భాసిస్తోంది. ఆత్మ జ్ఞాని యొక్క దృష్టి నుండి ఈ ప్రపంచం సర్వదా వినాశనశీలమై, స్వప్న సదృశమై ఉండటంచేత అతనికి సత్యమగు శుద్ధాత్మవస్తువే అన్ని వైపులా తాండవిస్తూ అనుభవమౌతోంది. నామ రూపాత్మకంగా కనిపించే ఈ జగత్తు స్థానంలో వారికి నామరూపరహిత పరబ్రహ్మం మాత్రమే అనుభవమౌతోంది. అట్టి పరబ్రహ్మంలో 'జగత్తు' అనేది లేశమైనా కూడా వారికి అగుపించడం లేదు.

**త్రోటయిత్వా తు తృష్ణాయః శృంఖలావలితం బలాత్,**
**సంసారపంజరం తిష్ఠ సర్వస్య ఊర్ధ్వమ్ మృగేంద్రవత్ ॥**

ఓ రామచంద్రా! 'తృష్ణ' అనే గొలుసులతో 'సంసారం' అనే పంజరం చుట్టబడి ఉన్నది. అట్టి పంజరంలో చిక్కుక్కున్న ఈ జీవుడు 'ఆత్మ జ్ఞానం' అనే బలముచే తృష్ణారూప పంజరమును త్రెంచివేయు గాక! సింహం వలె పంజరమును చీల్చివేసి సర్వోత్కృష్టుడై వెలయుగాక!

ఓ రామచంద్రా! 'ముక్తి' అనగా ఏమిటి? 'నేను-నాది' అను రూపమైన అభిమానం శమించటమే ముక్తి. ఒకడు వ్యవహారమునందు ఉన్నప్పటికీ, లేక సమాధియందు ఉన్నప్పటికీ... 'స్వాత్మ సత్త' యొక్క అనునిత్య రసాస్వాదనయే ముక్తి యొక్క స్వరూపం. సంసార మార్గంలో ఖిన్నుడై

– 1. జగదత్వము, 2. వాసనా సమూహము, 3. త్రివిధ తాపములు, 4. అజ్ఞానము, 5. ఆధి భౌతిక–దైనిక–ఆత్మికములనబడే ...అయిదు దోషములు కలిగి ఉండటం చేతనే జన్మ–కర్మాదులు, తదితర భ్రమ అంతా అతని పట్ల ప్రవర్తిస్తోంది.

అందుకు ఉపాయములు, మార్గములు– 1. నిర్వాణత్వము, 2. వాసనారాహిత్యము, 3. త్రివిధ తాప శూన్యత్వము, 4. ఆత్మజ్ఞానము, 5. సర్వాతీతత్వము ...ఈ '5' కూడా ప్రశాంతాలైన విశ్రాంతి రూపాలు. అనగా జీవుడు ఈ అయిదింటినీ క్రమక్రమంగా పెంపొందించుకొనటం చేత మాత్రమే 'అశాంతి' నుండి 'విశ్రాంతి' స్థానములకు పయనించగలుగుతాడు.

తత్త్వజ్ఞానులు–అజ్ఞానులు కలిసియే ఈ జగత్తులో (భౌతికంగా) సంచరిస్తూ ఉన్నారు. అయితే ...తత్త్వజ్ఞులు ఈ జగత్తును ఏ విధంగా (ఏ అవగాహనతో) ఎఱుగుచున్నారో... అజ్ఞానులు ఆ విధంగా ఎఱుగటం లేదు. అట్లాగే, అజ్ఞానులు ఈ జగత్తును ఏ రీతిగా పొందుచున్నారో, ఆ రీతిగా తత్త్వజ్ఞులు పొందటం లేదు. వారిరువురి అనుభవం పరస్పరం చెప్పుకోవటానికి కూడా అనర్హమై ఉంటోంది. జ్ఞానికి ఈ జగత్తంతా ఆనందమయమై ఉంటోంది. ఇక అజ్ఞానికో... ఇది ఎంతగానో దుఃఖమయమై ప్రాప్తిస్తోంది. అనేక నదీ జలాలు సముద్రంలో ప్రవేశించిన తర్వాత... ఇక ఒడ్డును నిలబడ్డ వానికి 'ఇది ఈ నదీ జలం, అది ఆ నదీ జలం'... అనే తేడా ఏమాత్రం అగుపించదు కదా! అట్లాగే భ్రమ శమించినట్టి తత్త్వజ్ఞానికి ఈ జగత్తు కనిపిస్తున్నప్పటికీ ఇక్కడ వారికి 'సంసారం' అనే బంధం కనిపించడం లేదు. ఈ జగత్తు యథాతథంగా ఉండి ఉంటున్నప్పటికీ కూడా ప్రబుద్ధుడు–నిర్వాణ సముపార్జితుడు అగు జ్ఞానికి ఇదంతా లేనిదే అగుచున్నది. గాలి వీస్తూ ఉండగా ఎండు గడ్డి పరక ఎచటికో దొర్లుతూ పోతున్నట్లుగా ఆత్మ స్వభావమున విశ్రాంతిని పొందియున్న సజ్జనునికి ఈ జగత్తు అనునిత్యంగా ఎచటికో పలాయనం చిత్తగిస్తూనే ఉన్నట్లు అగుపిస్తోంది.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జగత్తు అనుక్షణం పరిణామశీలమై 6 రకాలైన వికారాలతో (పుట్టుక–పెరగడం–ఏర్పడటం–తరగటం–సన్నగిల్లటం–నశించటం) ప్రవర్తిస్తూ ఉంటోంది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును కదా!

**శ్రీరాముడు :** అయితే బ్రహ్మం సర్వదా యథాతథమై ఉంటున్నది. అవునా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును.

**శ్రీరాముడు :** మరి 'ఈ జగత్తు బ్రహ్మమే' అనే వాక్యం ఎట్లా యుక్తియుక్తం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** పరబ్రహ్మం నుండి భావన ఏర్పడుతోంది. కనుక పరబ్రహ్మం–భావన అభేదమే కదా! భావన నుండి జగదనుభవం బయల్వెడలుతోంది. కనుక అనుభవం–అనుభవజ్ఞుడు అభేదమే అగుటచే జగత్తు బ్రహ్మంగా చెప్పబడింది. అయితే, ఆత్మజ్ఞాన నిత్యత్వము సముపార్జించుకున్నవారికి మాత్రమే ఈ జగత్తు అభేదం–నిరతిశయం అగు బ్రహ్మంగా గోచరిస్తోంది. కాని అజ్ఞానులకు మాత్రం ఇదంతా వివిధ జీవులతో–సంఘటనలతో అత్యంత సంక్లిష్టంగా ఉండవచ్చు. భావికుడు (జ్ఞాన–అజ్ఞాన భావన చేయువాడు) ఒక్కడే గదా! అనేక ఆకారాలతో, భంగిమలతో తరంగాలు

ఉండవచ్చు గాక! జలం ఒక్కటే కదా! జలం దృష్టిలో పెట్టుకున్న వారికి 'ఇది ఈశాన్యం మూల నుండి వస్తున్న పెద్ద తరంగం! అది నైఋతి వైపుగా సాగుతున్న చిన్న తరంగం'... అన్న విభేదాలన్నీ అర్థరహితంగా ఉంటాయి. త్రిగుణాత్మకమై ఈ జగత్తు 'గుణాలకు మునుముందే గుణాలకు ఆవల సర్వదా ఏర్పడి ఉన్న గుణి' అనబడు ఆత్మతత్త్వం దృష్టిలో గల వారికి ఇక్కడ సర్వం బ్రహ్మమయంగా గోచరిస్తోంది. దృష్టి జ్ఞానమయం అయ్యే వరకు ఇక్కడ షడ్వికారాలతో కూడి పరివర్తన శీలమగు జగత్తు కనిపిస్తోంది. శాస్త్ర-గురు పాఠాల ప్రభావం చేత, స్వయంకృషితో నిర్మలమైన-సూక్ష్మమైన దృష్టిని సంపాదించుకున్న తత్త్వవేత్తలకు ఇదే జగత్తు నిరతిశయానందమగు బ్రహ్మంగా గోచరిస్తోంది. అట్లు దర్శింపజేయుటమే శాస్త్రముల ముఖ్యోద్దేశం.

**శ్రీరాముడు :** స్వామీ! సామాన్యులమగు మాకు సహజీవులను దేహాల-గుణాల దృష్టితో కాకుండా "వీరు అద్వితీయం-గుణాతీతం-ఏకం అగు ఆత్మ స్వరూపులే" ...అనే దృష్టితో చూడటం సాధ్యమౌ తుందంటారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎందుకు కాదు? దృశ్యాతీత దృష్టి అనేది జీవులందరికీ అభ్యాసంలో ఉన్న విషయమే. ఉదాహరణకు నిన్న నిన్ను కలిసిన ముగ్గురు నలుగురు స్నేహితుల పేర్లు చెప్పమంటే చెప్ప గలవు. కానీ వారు ఏ రంగు చొక్కా ధరించారు?... అంటే చాలా వరకు చెప్పలేవు కదా! ఎందుకని? వారిని వస్త్రాల దృష్టితో కాకుండా స్నేహదృష్టితో చూచి ఉన్నావు కాబట్టి! వస్త్రాలకు అతీతమైన స్నేహ దృష్టి సాధ్యమైనట్లే... గుణములకు అతీతమైన ఆత్మదృష్టి సుసాధ్యమేనని చేతులెత్తి చెప్పుచున్నాను.

ఓ రామచంద్రా! చింతలు మొదలైనవేవీ లేనివాడు, ప్రపంచం గురించి ఏమంతగా తెలియని వాడు అగు ఒక చిన్న పిల్లవానికి ఈ జగత్పదార్థములన్నీ ఆట వస్తువులవలె వికల్ప రహితంగా అగుపిస్తాయి చూచావా? అట్లాగే వాసనలు క్షయించినట్టి ఆత్మజ్ఞానికి ఇవన్నీ కూడా నిర్వికల్పంగా (కల్పన అనే వికారం ఏమాత్రం లేనివై) భగవత్ స్వరూపంగా (ఆత్మ మాత్రంగా) భాసిస్తున్నాయి.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥**

అజ్ఞానులందరికీ ఏది (ఆత్మ జ్ఞానం) రాత్రి అయి ఉన్నదో (ఏ విషయంలో నిద్రాముద్ర వహించి, పట్టించుకోవటానికి అనర్హంగా అనిపిస్తోందో)... అది (అట్టి ఆత్మ జ్ఞానం) ఆత్మజ్ఞాన శీలుడగు సంయమికి జాగరూకతకు అత్యంత అర్హమైనదిగా అనిపిస్తోంది. ఏది (ప్రాపంచిక విశేషాలు, సంబంధాలు మొదలైనవి) ఆత్మజ్ఞుడగు మునికి అత్యంత నిస్సారము-పట్టించుకోవటానికి అనర్హముగా అనిపిస్తుందో... అది అజ్ఞాన జీవులకు గొప్పగొప్ప విషయాల వలె అనిపిస్తోంది. అట్టి ప్రాపంచిక విషయాల పట్ల ఆత్మజ్ఞానికి దృష్టియే కలగటంలేదు. అంతేకాదు. సంసారిక దృష్టి గల జీవులకు అజ్ఞానాంధకారము ఆవరించి ఉండటంచేత ఆత్మ వస్తువు సుదూరంగా మరెక్కడో ఉన్నట్లు తోచుచున్నది. సుజ్ఞానికో?... ఆత్మ వస్తువు విరామ శూన్యమై సదా జగద్రూపంగా కూడా ప్రదర్శన మగుచున్నట్లు అనుభవమౌతోంది. అజ్ఞానికి జగద్రూపంగా ప్రసిద్ధమై కనిపిస్తున్న శబ్ద-స్పర్శ-

రూపాది విషయములు జ్ఞానికి చిత్రంలో లిఖించబడిన అరణ్యములోని వివిధ వృక్షముల ఆకులవలె ఎదుట వాస్తవానికి లేనివిగా అనుభూతమౌతున్నాయి. జన్మాంధునికి రూపానుభవమే ఉండనట్లు జ్ఞానికి అజ్ఞాన ప్రసిద్ధమైన జగత్తు భ్రాంతిప్రాయంగా, అసద్రూపంగా సుషుప్తి సమయంలోని అనుభవరాహిత్య స్థితిలాగా... భాసించకయే ఉంటోంది.

దుఃఖ రూపంగా ప్రసిద్ధమై ఉంటున్న ఈ త్రిజగత్తులు విమూఢులకు మాత్రమే విషయమగుచున్నది. జ్ఞానికి ఇదంతా విషయమగుటయే లేదు. ఎందుకంటే... ఈ జగత్తు సత్తు కాదు. స్వప్నం స్వప్నరూపంగా సుస్పష్టమైన తర్వాత ఆ స్వప్నంలో తారసపడిన రూపాలు, భావాలు, అందలి బాహ్య-అభ్యంతర విషయాలు మేలుకొనిన వానికి అర్థరహితమౌతాయి కదా! అట్లాగే 'జ్ఞానం' అనే మెళకువ వచ్చిన తర్వాత ఈ జగత్తులో సాంసారిక దృష్టికి కనిపించే సంబంధాలు, భోగాలు మొదలైనవి మొదలంట సాంసారిక రూపం కోల్పోతాయి. అనగా జ్ఞానికి అవి స్ఫురించనే స్ఫురించవు. అతడు సదా విభాగరహితుడై ఉంటాడు. స్వస్థచిత్తుడౌతాడు. సర్వానికి అవిరోధమైన ఆ పరమాత్మను అనుభవిస్తూ ఉంటాడు. నిర్వాణ స్వరూపుడై శీతలాంతఃకరణుడై, అత్యంత తృప్తిని పొంది ఉన్నవాడు అగుచున్నాడు.

❖❖❖

# 26. మనస్సు - పదార్థములు

**శ్రీరాముడు :** మహాత్మా! మీరు ప్రవచిస్తూ వస్తున్న జ్ఞానస్థితికి కావలసిన 'ధ్యానం' ఎట్టిదో తెలపండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'ధ్యానం' అను ప్రక్రియ శాస్త్రములచే-భోగవాసనలతో కూడిన చిత్తం గల ముముక్షువుల కొరకై ప్రతిపాదించబడుతోంది. 'ధ్యానం' అనునది చిత్తం యొక్క ప్రవృత్తి స్వభావానికి ఔషధం. అయితే, భోగవాసనలచే ఆకర్షించబడని చిత్తం గల జ్ఞాని యొక్క స్థితి 'నిత్య ధ్యాన స్థితి' గా వర్ణించబడింది. అనగా, అతడు వేరే ధ్యానాభ్యాసం చేయకున్నప్పటికీ సర్వదా సర్వత్రా స్వభావసిద్ధంగా సమత్వం దర్శించగలుగుతాడు. సర్వత్రా సమదర్శనమే వాస్తవమైన ధ్యానం. ఒక తటాకంలోని జలం క్రింద తూము మొదలైన బహిర్గత మార్గాలు లేనప్పుడు ప్రవాహ స్వభావం లేక నిశ్చలంగా ఉంటుంది చూచావా? అట్లాగే జ్ఞాని యొక్క హృదయంలో పదార్థ సంబంధమైన వాసనలు ఉండవు. కనుక... అతని చిత్తం అటూ-ఇటూ వెళ్ళదు. ఎందుకంటే... పదార్థాలే మనస్సు. ఈ మనస్సే పదార్థాలను రంజింప జేసినవిగా చేస్తోంది. అట్టి పదార్థముల పట్ల ఎప్పుడైతే వాసనలు సన్నగిల్లుతాయో అప్పుడు మనో నిరోధము స్వయంగా సంభవిస్తోంది.

ఈ మనస్సే బాహ్య-అభ్యంతర పదార్థాల అభాస. జలం వివిధ తరంగాలుగా స్ఫురిస్తున్నది చూచావా? అట్లాగే ఏ ఏ అర్థ-అనర్థ రూపాలుగా ఏ ఏ బాహ్య-అభ్యంతర పదార్థాలు భాసిస్తున్నాయో... అవన్నీ కూడా మనస్సు యొక్క వివిధ రూపాలేనని గ్రహించు. ఈ మనస్సే అనేక చోట్లకు పరుగులెత్తి ఆయా చోట్ల తన యొక్క వివిధ ఆకారాలను ప్రదర్శిస్తోంది. ఏ విధంగా

జలానికి, తరంగాలకు భేదమే లేదో... అదేవిధంగా మనస్సుకు-జగత్ పదార్థాలకు భేదమే లేదు. వాయువును తొలగిస్తే వాయు సంచలనం పోతుంది. అట్లాగే వాయు సంచలనం తొలగిస్తే వాయువు తొలగుతుంది. పదార్థాలు తొలగించామా... మనస్సు తొలగుతుంది. మనస్సు తొలగిస్తే పదార్థాలు అనుభవం కావు. కాబట్టి సాధకుడు తత్త్వజ్ఞానంచే పదార్థములు నిస్సారమును గ్రహించాడా, ఇక మనస్సును తొలగించటానికి వేరే ప్రయత్నమేమీ అక్కర్లేదు. మనస్సు-పదార్థములు... ఇవి రెండూ ఒక్కటే! కాబట్టి జ్ఞానం వృద్ధి పొందుతూ ఉంటే అవి రెండూ ఏకకాలంలోనే తొలగిపోతూ వస్తున్నాయి. పదార్థములు అట్లు అనుభవమవటానికి సంకల్పమే కారణం. మనస్సు యొక్క మూల పదార్థం సంకల్పములే! కనుక విజ్ఞుడైన వాడు సంకల్ప రూపములైన పదార్థములను వాంఛించటం తగ్గిస్తూ వస్తాడు. క్రమంగా సమ్యక్ జ్ఞానం యొక్క బలిమి చేత మనస్సు-పదార్థములు ఈ రెండూ శమిస్తూ వస్తాయి. స్వప్నంలో పులి 'ఇది స్వప్నమే' అని ఎఱిగియున్న వానిని భయపెట్టలేదు కదా! జ్ఞానికి ఎదురుగా ఈ ప్రత్యక్ష జగత్తు ఏర్పడి ఉన్నప్పటికీ అది నశించియున్న దానిగానే అతనికి అనుభవమౌతుంది. అతనికి వాటిపట్ల 'కావాలి' అను జాడ్యం స్వయంగా తొలగిపోతోంది.

ఒక కుమ్మరి మట్టితో 'వీథిలో ఆడుకుంటున్న పిల్లలు-దూరంగా కొండలలోంచి లేచి వస్తున్న బ్రహ్మరాక్షసి' అనే రసవత్తరమైన సన్నివేశం తయారుచేశాడు. ఆ తయారు చేసిన మట్టి బొమ్మల కొలువును చూచిన ఒక పసిబాలుడు 'అయ్యా బాబోయ్! ఇది బ్రహ్మరాక్షసి! ఈ కొఱివిదయ్యం జట్టు విఱబోసుకొని మిడిగుడ్లతో నా వైపే చూస్తోంది. ఇక ఇది మీద పడిందా, చచ్చానే!'... అని తలచి భయంతో వణుకుచూ కెవ్వున ఏడుపు లంకించుకున్నాడు. అది చూచిన దాది, "బాబూ! ఇవన్నీ మట్టితో తయారు చేయబడిన ప్రతిమలు (బొమ్మలు) మాత్రమేనయ్యా!" అని తెలియజెప్పిన తర్వాతనో? ఆ మట్టి బొమ్మల పట్ల ఇతఃపూర్వం ఏర్పడిన భయము, భ్రమ, 'శత్రు-మిత్ర సైన్యము' అనే ఆయా భావావేశాలు తమంతట తామే తొలగిపోతాయి. అట్లాగే జ్ఞానికి మనస్సు-పదార్థములు ఈ రెండూ కూడా బ్రహ్మ స్వభావమునందే స్థితి పొంది ఉన్నవగుచున్నాయి. అందుచేత ఈ జగత్తు ఎదురుగా ఉన్నప్పటికీ వాని నామ రూపములు, వాటిచే జనించే ఆసక్తి-భయాదులు ఇవన్నీ జ్ఞాని యొక్క ఆంతరంగిక దృష్టికి సర్వదా నశించియే ఉంటాయి. అతడు సంసారదశ కంటే విలక్షణమైనట్టి పూర్ణానంద స్వరూపమును స్వయంగా సంతరించుకుని ఉంటున్నాడు. అతనికి అద్వితీయమైన పరమార్థ సద్రూపము అనుభవమగుచుండగా ఇక ఆపై ఈ ప్రపంచ దర్శనమంతా సంశుద్ధత పొందుతోంది. అటుపై ఇక్కడి జన్మాది వికారాలు, వాటి భోక్తయగు అజ్ఞానం, ఆ అజ్ఞానానికి విషయాలగుచున్నట్టి ఇక్కడి శబ్ద-స్పర్శ-రూపాదులు,... ఇవన్నీ కూడా ప్రక్కన నిద్రించుచున్న బాలుని యొక్క స్వప్నంలోని సంఘటనల వలె, బాలునిచే కల్పించబడిన యక్ష కథల వలె అసత్తుగా గోచరిస్తుంది. ధైర్యముతో కూడిన యువకునికి పిశాచాలకు సంబంధించిన బుద్ధి ఉండనట్లు... జ్ఞానికి విషయపరంపరలతో కూడిన 'జగత్తు' యొక్క బుద్ధియే ఉండదు.

అజ్ఞాని యొక్క బుద్ధికి జ్ఞాని అజ్ఞానివలె అనిపిస్తూ ఉంటాడు. అజ్ఞాని యొక్క అనుభవమునకు వంధ్య (గొడ్రాలు) యొక్క కుమార్తెలు చిరకాలం వర్ధిల్లుచున్నారు. జ్ఞానియో? జ్ఞానమునకు

విషయమే కానిది, పదార్థకారణంగా కనిపించనిది, ఆద్యంతరహితమైనది, సర్వ వ్యాపకమైనది, మనస్సు యొక్క శబ్ద-అర్థములకు కూడా సంబంధించనిది, విభాగ రహితమైనది, స్వయంగా జ్ఞాన స్వరూపమైనది అగు బ్రహ్మమే ఈ సృష్టికి వాస్తవ రూపంగా అయి ఉన్నదని గమనిస్తున్నాడు.

'జలంలో తరంగాలు' అనే శబ్దం అనుచితం కదా! ఎందుకంటే జలమే తరంగాలుగా అగుచున్నప్పుడు ఇక జలంలో తరంగాలు ఉండటమేమిటి? అట్లాగే 'బోధ' అనే చైతన్య జలము నందు మనో-బుద్ధులు నిర్మల తరంగాలు వంటివి. (లేదా) చైతన్యమే మనో-బుద్ధి స్వరూపముగా అగుచు తాను సర్వదా యథాతథంగానే ఉంటోంది. వాస్తవానికి శుద్ధాత్మయందు మనోబుద్ధి తరంగాలు ఎట్లా సంభవిస్తాయి? లేదు.

ఓ రామచంద్రా! ఈ మనస్సు యొక్క భ్రమ, ఈ జగత్ భ్రమ... ఇవన్నీ నిరర్థకమేనని అనక తప్పదు. అందుచేత బ్రహ్మ స్వభావమునందే స్థితి కలిగి ఉండటం సముచితం. ఆకాశంలోని 'సూర్యుడు' అనే జ్యోతిర్మండలములలో 'చీకటి' అనే ప్రసక్తియే ఉండదు కదా! బ్రహ్మ స్వభావమున నెలకొని ఉన్న విజ్ఞులకు జాగ్రత్-స్వప్న-సుషుప్తులు మొదలైన అవస్థలన్నీ నిర్విషయత్వమును సంతరించుకొని ఉంటాయి. అనగా అతని నిత్యోదిత స్వానుభవం వాటికి అతీత్వమును సంతరించు కుని ఉంటుంది. అతనికి ఈ అవస్థలన్నిటిలోనూ సాక్షిరూపంగా ఉన్న నిజాత్మయే సర్వత్రా అనుభూతమౌతూ ఉంటుంది. అట్టి అనుభూతి యొక్క సాంద్రత చేత అనంత రూపాలుగా ఉన్న ఈ జ్ఞేయ దృశ్య (తెలియబడే) పదార్థాలన్నీ మిథ్యగా ఎఱుగుచున్నాయి. త్రాడులో అధ్యస్తమగు సర్పంలాగా వారికి ఇదంతా నిర్వికార-చిద్ఘన ఆత్మ యొక్క స్వభావం గానే స్థితి నొంది ఉంటోంది.

రామచంద్రా! బీజమే కొమ్మలు-ఆకులు-ఫలాలు రూపం ధరించుచున్నట్లు... బుద్ధి యొక్క వృత్తియే ఈ బాహ్య-అభ్యంతర పదార్థాలన్నీ ధరిస్తోంది. బీజానికి అన్యమైనదేదీ వృక్షంలో ఉండ జాలనట్లుగా, బుద్ధికి వేరుగా దృశ్యం లేదు. మనస్సు గాని, పదార్థాలు గాని బుద్ధి యొక్క ఒకానొక పరిణామం మాత్రమే! ఇట్లు జ్ఞానమునకు వేరుగా జ్ఞేయం ఉండజాలదని గ్రహించటం చేత బుద్ధి యొక్క వృత్తి అనిర్వచనీయమగు ఆత్మత్త్వమును సంతరించుకోగలుగుతుంది. అట్టి బుద్ధి 'సర్వ విశేష రహితము - స్వ ప్రకాశము - సద్రూపము'... అగు ఆత్మగా తానే శేషిస్తోంది.

పదార్థములే ...మనస్సు; మనస్సే ...పదార్థాలు. అయితే, ఈ రెండూ కూడా భ్రమాత్మకాలు, అభావ రూపాలు అయి ఉన్నాయి. జన్మాదిరహితమగు బ్రహ్మము సర్వ వస్తువుల యొక్క ఆత్మయే అవటం చేత... మనోరూపమున కూడా అదియే అకారణంగా భాసింస్తున్నదగుచున్నది. బ్రహ్మం అకారణంగా మనస్సుగా భాసిస్తున్నట్లే... మనస్సు అకారణంగా పదార్థములుగా భాసిస్తోంది.

అట్లు మనస్సు, మనఃకారణంగా కనిపిస్తున్న పదార్థాలు వాస్తవానికి మిథ్యయే అయిన ప్పటికీ... భ్రమానుభవం చేత అవన్నీ సత్యాలుగా తోచుచున్నాయి. ఓ రామచంద్రా! మేఘాలలో కనిపించే మెరుపు తీగ వాస్తవమైన తీగయా? కాదు కదా? అట్లాగే ఈ మనస్సు, ఈ మనస్సుకు తోచుచున్న ఈ జగత్తు వాస్తవానికి మెఱుపు తీగ విలాసం లాగానే ఆకారమాత్రాలు, అస్థిరాలు,

అత్యంత చంచలములు అయి ఉన్నాయి. అజ్ఞానం ఆశ్రయించావా, నీవు మనోవ్యసన ప్రభావం చేత ఈ సంసారం పొందవలసి వస్తుంది సుమా! అయితే 'ఆత్మ' యొక్క స్వభావమేమిటో ఎఱుగటం జరిగిందా... ఇక అజ్ఞుడవయ్యే ప్రసక్తియే ఉండదు. భ్రమ కించిత్ కూడా కలుగదు. ఆత్మ జ్ఞానముచే మాత్రమే అదే మనస్సు ద్వారా ఈ సంసారము శమించిపోగలదు. ముత్యపుచిప్పలో వెండి యొక్క భ్రమ ముత్యపుచిప్ప గురించి తెలియనప్పుడు మాత్రమే ఉంటుంది కదా! ముత్యపుచిప్పలో వెండి ఉండియే ఉంటుందని కొందరు తలచుచున్నట్లే, భ్రాంతి రూప జగత్ భ్రమ యందు మిథ్యగానే ఈ జనులు అనేక దుఃఖ పరంపరలు అనుభవిస్తున్నారు. పరమాత్మ యొక్క 'యథార్థ జ్ఞానం' చేత మాత్రమే ఈ సంసారము యొక్క 'అభావము' సిద్ధించగలదు. 'శాంతమగు ఆత్మ' యే నిర్వాణము.

**నిర్వాణాత్ ఇతరా సత్తా దుఃఖాయ 'అహమ్' ఇతి భ్రమః**
**మృగతృష్ణాంబు రూపో 'అహమ్' అసత్, శూన్య స్వరూపకః ॥**

నిర్వాణం (శాంతమగు ఆత్మ) కంటే వేరైన 'నేను (అహం)' అనేది భ్రమ మాత్రమే! అట్టి అహంరూప భ్రమ దుఃఖమును మాత్రమే కలిగిస్తోంది. వాస్తవానికి మృగతృష్ణలో కనిపించే జలం లాగా 'అహం' అనేది శూన్యం, అసద్రూపం మాత్రమే! ఈ ప్రకారమైన శుద్ధాత్మ జ్ఞానం చేత అహంకారం శమిస్తోంది.

**శ్రీరాముడు :** అసలు భ్రమమాత్రము-అసత్యము అగు 'అహం' అనేది మొట్టమొదట ఎట్లా ఉత్పన్నమౌతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** నిర్మల-నిశ్చల జలం ఒకప్పుడు తరంగ రూపం పొందుతోంది. అయితే జలం తరంగరూపం పొందుచున్నప్పుడు తన యొక్క జలత్వము త్యజిస్తోందా? ...లేదు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అట్లాగే బ్రహ్మము మొట్టమొదట అద్వితీయమై నిర్విషయ స్వరూపమై ఉన్నది. అట్టి నిర్లిప్త-అప్రమేయ బ్రహ్మము సృష్టి యొక్క ఆదియందు తన యొక్క 'సర్వజ్ఞత్వము' అనబడే ఒకానొక ప్రభావం చేత 'స్వాత్మభూతము' అనతగ్గ 'జ్ఞానమయుడగు హిరణ్యగర్భుడు' అను రూపం దాల్చుతోంది. అట్టి ప్రప్రథమ తరంగ రూపమగు హిరణ్యగర్భుని సంకల్పానుసారంగా స్వయంగా బాహ్య-అభ్యంతర పదార్థ రూపత్వము అవధరిస్తోంది. అట్లు అవధరిస్తూనే తాను యథాతథంగా (తరంగ సమయంలో జలంలాగా)నే ఉంటోంది. ఒక వృక్షము యొక్క మూలము నుండి శాఖాగ్రము వరకు ఒకే 'సత్తా' ఉన్నట్లే... జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ... రూపమగు ఈ జగత్తునందు అంతటా నిర్వికార రూపమగు బ్రహ్మసత్త ఒక్కటే భాసిస్తోంది. ఆకాశంలో లక్షల మైళ్ళు వెళ్ళి చూచినప్పటికీ అక్కడ కూడా అంతటా నిర్మలమగు ఆకాశమే వెలయుచున్నట్లుగా... చిద్రూపం అగు బ్రహ్మం ఒక్కటే జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయ రూపమున ఈ జగత్తునందు అంతటా అఖండ రూపాలతో భాసిస్తోంది. శూన్యమే స్వరూపంగా గల ఆకాశమే అంతటా వ్యాపించి ఉన్నట్లు జ్ఞాన-జ్ఞేయాది అన్ని దశలలోను నిర్మలము-ఏకము అగు ఆత్మయే అంతటా వ్యాపించి ఉన్నది.

నేయి ఘనీభవించినప్పుడు ఘనరూపము (పొడవు–వెడల్పు మొదలైన రూపములతో) కనబడుతోంది కదా! చైతన్యము కూడా ఆ విధంగానే విషయరూపమై తనను తానే 'చిత్తము' అను రూపముగా గావించు కొంటోంది. ఆత్మ దేశ–కాలాదులు పొందటానికి మునుముందే తన స్వరూపమును ఏమఱచి చిత్తరూపముగా అగుచూ, పొందుచున్నది. వాస్తవానికి 'ఏకము' అయినట్టి ఆత్మ తన స్వరూపమునందే సదా స్థితిని పొంది ఉన్నది సుమా! అయితే... అవిద్యచే 'అజ్ఞానము' అనే స్వయంకృత కల్పితదశను పొందుతోంది. నిజానికి శుద్ధాత్మయందు అట్టి అజ్ఞానము మొదలైనవి సంభవించటానికి వీలేలేదు సుమా! అనగా జలంలో 'తరంగము' అనే ఏ పదార్థము ఎన్నటికీ ఉత్పన్నము కానట్లే (జలం జలంగానే ఉన్నట్లే) పరిశుద్ధమగు ఆత్మయందు 'చిత్తము' అనునదేదీ ఉత్పన్నమే కాలేదు!

**శ్రీరాముడు :** మరి శాస్త్రములు చిత్తమును గుర్తిస్తూ, ఆ చిత్తము యొక్క ప్రశమనము గురించి బోధిస్తున్నాయి కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఔను. బోధిస్తున్నాయి. అయితే అవిద్యా దశయందు పరస్పర బోధ కొరకై ఈ 'చిత్తము' అనబడేది కల్పించబడుతోందని గ్రహించు.

ఓ రామచంద్రా! మహానీయులగు కొందరు జ్ఞానముచే తమ అజ్ఞాన మూలాన్ని శమింప జేసుకొంటున్నారు. నేయి యొక్క ఘనీభూతరూపం (తెలుపు–పొడవు వెడల్పులు మొదలైన లక్షణాలు) నెయ్యిని కరగించినప్పుడు స్వయంగా మటుమాయమౌతున్నాయి కదా! అట్లాగే అభిమాన రహితులగు మహానుభావులు తమ ఆత్మ స్వరూపమునందు లయత్వము సముపార్జించుకొని ఆత్మకు అభేదస్వరూపులుగా అగుచున్నారు. అందుచే వారు అనంతమగు ఆత్మానందముచే పరిపూర్ణుల గుచున్నారు. శాంతులుగాను, విక్షేపరహితులుగాను అగుచున్నారు. నిరంతరము సమాధితత్పరులై మెలగుచున్నారు.

అట్టి వారికి జన్మ – కర్మలు ఆపాదించటానికే వీలుకాదు! వారికి చిత్తము చిత్త ప్రశమనము అను పాఠ్యాంశము అనావశ్యకమగుచున్నది.

❖❖❖

# IV. మనోమృగ విశ్రాంతి

## 1. సమాధి వృక్షము - చల్లటి నీడ

**శ్రీరాముడు :** 'సమాధి' అనే వృక్షం యొక్క చల్లటి నీడలో ఈ జీవునికి చక్కటి విశ్రాంతి కలుగగలదని విజ్ఞానవేత్తలు అంటూ ఉండటం విన్నాను. అట్టి సమాధి వృక్షం గురించి వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. సమాధి అనే వృక్షం 'వివేక జనులు' అనే వనంలో ఉన్నది. వివేకులకు అది సర్వదా జీవన మూలమై ఉన్నది. అతి విశాలమై, పత్ర-పుష్ప సహితమై కనిపిస్తున్న ఆ సమాధి వృక్షం గురించి విజ్ఞులు ప్రవచిస్తున్నదేమిటో చెప్పుతాను విను.

'సంసారం' అనే ఒక మహారణ్యం ఉన్నది. అందులో అనేక జీవులు అనేక సుఖ-దుఃఖాలను పరంపరగా పొందుతూ అతి దీర్ఘకాలంగా సంచరిస్తూ ఉన్నారు. 'ఆశ' అనే పాశంతో ఆయా జీవులు ఆయా చోట్ల బంధింపబడి, దిక్కు తోచక అలమటించటం మేము గమనిస్తూనే ఉన్నాం. అయితే అట్టి సంసారంలో అవిశ్రాంతంగా తిరుగాడుచున్న అసంఖ్యాక జీవులలో కొందరికి మాత్రం ఆ సంసారారణ్యం పట్ల వైరాగ్యం ఉద్భవిస్తోంది. అట్టి వైరాగ్యం ఉదయించటానికి కారణం :

1. స్వజనులచే గావించబడిన అవమానాదులు కావచ్చు... కాక,
2. ధనాదులకు సంబంధించిన వియోగ సంఘటనలు కావచ్చు... లేదా,
3. సౌభాగ్యవశం చేత కావచ్చు, కాదా...
4. మహాత్ముల ఉపదేశ ప్రభావం చేత వచ్చిన గుర్తు కావచ్చు.

కారణం ఏదైతేనేం... ఈ సంసారం కలిగించే అనేక దుఃఖాదులను గమనించిన కొందరు జీవులు ఈ సంసారం పట్ల పరమ వైరాగ్యాన్ని ఆశ్రయిస్తున్నారు. అట్టి వైరాగ్యమే సమాధి వృక్షం యొక్క బీజం. అట్టి బీజమునకు క్షేత్రం ఈ చిత్తమే! అయితే అట్టి చిత్త క్షేత్రం 'శుభకర్మలు' అనే నాగళ్ళతో దున్నబడి 'శాంతి' అనే జలముచే తడుపబడి, 'ప్రాణాయామం' మొదలైన పిల్ల కాలువ లతో నీళ్ళు పొందినదై ఆ సమాధి బీజం మొలకెత్తి సమాధి వృక్షంగా ప్రవృద్ధమౌతోంది. వివేకం చేత శుద్ధం చేయబడిన చిత్త భూమియందు వైరాగ్య సమాధి బీజం తనంతట తానే వచ్చి చేరుతుంది.

ఈ విధంగా స్వచిత్తమునందు వచ్చి చేరిన వైరాగ్య సమాధి బీజమును వృద్ధి నొందింప జేయాలి. దృఢబుద్ధితో సర్వభేద భావములను త్యజిస్తూ... ఆ వైరాగ్య బీజమును సమాధి వృక్షంగా పెంపొందించుకోవటం ఎట్లాగో చెప్పుతాను... విను.

**మనోశుద్ధి -** మనస్సును ముందుగా శుద్ధంగాను, పవిత్రంగాను, సుందరంగాను, మధురం గాను తయారు చేసుకోవాలి. 'సత్సాంగత్యం' అనే క్షీరంతో ఆ మనస్సును మరల మరల నానపెట్టాలి.

ఆ తర్వాత శాస్త్ర వాక్య మననం ప్రారంభించాలి. 'సంసార సాగరం దుఃఖమ్, జీవో బ్రహ్మేతి నాపర', నేఽ తి నేఽ తి... వంటి శాస్త్ర వాక్యముల అర్థసారాన్ని ఆ మనస్సులో నిండుగా ప్రవహింప జేయాలి. గురువాక్యాలు ఆశ్రయించాలి.

గురువు యొక్క 'హృదయం' అనే బ్రహ్మ సరోవరంలోంచి ప్రవేహించే ఆత్మజ్ఞాన వాక్యాలు వినాలి. ఆత్మతత్త్వ పరిపూర్ణులు, నిర్మలులు అగు సద్గురువులు వాక్యాలు సర్వ ద్వైతమును నిషేధిస్తూ వస్తాయి. అంతఃకరణమున సంసార శూన్యత్వను గురించి బోధిస్తూ ఉంటాయి. అమృత ప్రవాహాన్ని బోలిన ఆ గురువుల నుండి లభించే శాస్త్రార్థములను శ్రవణ-మననాదులచే గ్రోలాలి. వాటితో చిత్తములో ప్రవేశించిన వైరాగ్య బీజమును ప్రవృద్ధ పరచాలి.

అట్టి 'సంసార వైరాగ్యం'... అనే సమాధి బీజమును తీక్షణ బుద్ధితో చిత్త భూమిలో పరికించి, కనుగొని, ప్రయత్నపూర్వకంగా పరిరక్షించుకోవాలి. శరీరక-వాచిక-మానసిక తపస్సులు అందుకు దోహదపడతాయి. దాన-ధర్మాది గుణాల చేత, అమానిత్వ-అదంభిత్వాది సద్గుణ సంపత్తితో కూడిన క్రియా-ప్రయత్నాదుల చేత, పవిత్ర క్షేత్ర దర్శనాది వృత్తి విస్తార రూపకల్పనలచే ఆ సమాధి బీజమును పరిరక్షించుకోవాలి.

**వైరాగ్యము -** క్రమంగా ఆ వైరాగ్య బీజం అంకురించటం ప్రారంభిస్తుంది. అట్టి బీజాంకురాన్ని రక్షించుకునే ఉపాయాలను అతి జాగరూకతతో, నిపుణత్వంతో ఆశ్రయించి ఉండాలి. 'సంతోషము' అనే తోటమాలిని అహర్నిశలు బీజాంకురాన్ని కాపాడి ఉంచే ఉద్యోగంలో నియమించాలి.

ఆ వైరాగ్య-సమాధి బీజాన్ని హరిద్దామని కొన్ని పక్షులు కాపుకాస్తూ ఉంటాయి సుమా!ఆ పక్షులే పూర్వ వాసనలతో ఆవిర్భవించే దేహ-పుత్ర-మిత్ర-కళాత్రాదుల పట్ల కలిగే వ్యామోహాలు, అనురాగాలు మొదలైనవి. కామ క్రోధాది డేగలు దరిచేరకుండా చూచుకోవాలి. హింస-అహంకారం-దంభం-దర్పం-అభిమానం-క్రోధం-పారుష్యం-అభిజాత్యం మొదలైనవి ఆ మొలకెత్తే వృక్షాన్ని పట్టే చీడలాంటివి. వాటిని దరిజేరకుండా చూచుకోవాలి. అందుకుగాను, అహింసా ప్రధానత్వంచే మృదువైన 'యమ-నియమాలు' అనే చీపురుతో 'రజోగుణం' అనే ధూళిని చిత్త క్షేత్రం నుండి ఎప్పటికప్పుడు - ఊడ్చివేస్తూ ఉండాలి. ఇంకా, అంచిత్యమైన 'బ్రహ్మ ప్రకాశం' అనే వివేక సూర్యుని కిరణాలు ఆ వైరాగ్య-సమాధి బీజంపై నిరాటంకంగా ప్రసరించేటట్లు చూచుకుంటూ ఉండాలి. 'అజ్ఞానం' అనే చీకటి ఆవరించకుండా చిత్త క్షేత్రాన్ని కాపాడుకోవాలి. దుష్కృతాలు, క్షణ భంగురాలైన వనిత-సంపద మొదలైన భోగ వాసనలు అనే పిడుగులు ఆ సమాధి అంకురం వైపుగా రానీయకుండా చూచుకోవాలి. అందుకుగాను 'ప్రణవార్థం' అనే త్రిశూలమును ధరించి 'ధైర్యము-ఔదార్యం' అనే మంత్రాలను జపిస్తూ జప-తప-స్నాన-దానాదులచే భోగ వాసనలను సుదూరంగా ఉంచుతూ రావాలి.

**ధ్యానము :** ఈ విధంగా రక్షించబడిన వైరాగ్య బీజం క్రమంగా 'ధ్యానం' అనే మొక్కగా రూపు దాలుస్తోంది. ఆ మొక్కకు 'వివేకం' అనే నూతనమైన కొమ్మలు మొలకెత్తుచున్నాయి. అట్టి

వివేకాంకురం చే చిత్తభూమి ప్రకాశవంతంగాను, వికాసవంతంగాను, అతి శోభాయమానంగాను, రమణీయంగాను భాసిల్లగలదు. అప్పుడా వివేకాంకురం నుండి 'సచ్ఛాస్త్రములు-విచారణ-సాధు సంసర్గం' అనే ఆకులు బయల్వెడలుతాయి. ఆ చెట్టు 'సంతోషం' అనే గట్టి తోలుతో పరివేష్టితమౌతూ వస్తుంది. వైరాగ్యం అనే రసంతో ఆ వృక్షం శోభిస్తూ క్రమంగా బలమైన కాండాన్ని పెంపొందించు కొంటుంది. 'శాస్త్రములు' అనే వర్షమును పొందుతూ క్రమంగా ఆ సమాధి వృక్షం మహోన్నతిని పొందగలదు. అది ఇంకా ఇంకా శాస్త్ర విచారణ సాధు సంగమము-వైరాగ్యము అను రసములతో మరింత పరిపుష్టమగు గాక!

**రాగ-ద్వేష విదూరకం -** అట్లు పరిపుష్టమైన ఆ ధ్యాన వృక్షమునకు ఇంకెప్పుడు 'రాగ ద్వేషాలు' అనే వానరాలు కొంచెం కూడా క్షోభను కలిగించలేవు. వాటి దూకుళ్లకు అది చలించదు.

**సద్గుణముల సముపార్జన -** జ్ఞానముచే శోభితమైన ఆ వివేక వృక్షం వైరాగ్య రసంతో విశాలంగా విలాసవంతంగా ఆత్మ ప్రదేశము వరకు విస్తరించినదగుచున్నది. ఆ ధ్యాన వృక్షమును ఆశ్రయించ టానికి 'ఆత్మతత్త్వం యొక్క స్ఫుటత్వం, సత్యత్వం, ఆత్మస్థితి, ధీరత్వం, నిర్వికల్పత్వం, సమత్వం, శాంతి, మైత్రి, కరుణ, కీర్తి, ఆర్యత్వం' మొదలైన లతలు వచ్చి చేరుతాయి. 'శాంతి' మొదలైన ఆకులతో, పుష్పాలతో శోభించే ఆ సమాధి వృక్షమే యోగులకు విశ్రాంతి స్థానం. ఆ వివేక వృక్షం రోజు రోజుకు ప్రవృద్ధమై, క్రమంగా అజ్ఞానమూలాన్ని నశింపజేస్తుంది.

ఆ యోగికి సప్త భూమికా పర్యంతము విశ్రాంతిదాయకమౌతుంది. 'బ్రహ్మ సాక్షాత్కారము' అనే మహా ఫలాన్ని ప్రసాదిస్తుంది. ఉదారత్వాది గొప్ప గుణాలతో కూడిన ప్రజ్ఞను చిగురింప జేస్తుంది. శమమును, చిత్తాకాశంలోని దిక్కులన్నిటినీ శాంత పరుస్తుంది. సంసార తాపాన్ని నశింప జేసి ఆ యోగికి పరమ సుఖాన్ని ప్రసాదిస్తుంది. శమమును చిత్త స్థైర్యమును వృద్ధి పరుస్తుంది. 'ఆత్మజ్ఞానం' అనే పునాదిని గట్టి పరుస్తుంది. కైవల్యం అందిస్తుంది. హృదయవనంలో ఉద్భవించే ఈ సమాధివృక్షం హృదయం యొక్క త్రివిధ తాపాలను హరించి శీతలత్వం ప్రసాదిస్తుంది.

❖❖❖

# 2. మనో మృగము

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు అనే ఒకానొక మృగం అనేక జన్మలలో ఎన్నెన్నో దుఃఖాలను అనుభవించి ఉంటోంది. ఒకవేళ దైవయోగం చేత సన్మార్గం లభించినప్పటికీ ఆయా వాద-ఉపవాదాల కోలాహలంలో పడటం చేత సన్మార్గమున ప్రయాణించటంలో అత్యంత జాప్యం జరుగుతోంది. ఆ మృగం (మనస్సు) అనేక భూములలో తిరిగి, తిరిగి, అలసి సొలసి చివరికి ఎట్లాగో వైరాగ్య వృక్షం క్రిందకు విశ్రాంతి కొరకై వెతుకుతోంది.

**అహంకార-కామ-క్రోధ-భయ-ఉద్వేగముల నిరోధం -** ఆ మృగ చర్మం సంపాదించాలని కామ-క్రోధాలు అనే బోయవారు తరుముకు వస్తున్నారు. ఇక ఆ మనో మృగమో, 'దేహాలు' అనే ముళ్ళ

పొదలలో దాగుకొనుచు అక్కడి ముళ్లచే బాధించబడుచూ భయం–ఉద్వేగాలచే శిథిలమై ఉంటోంది. ఇంతలోనే అది 'సంసారం' అనే అరణ్యంలో 'వాసనలు' అనే ఆవేశముచే ప్రేరితమై సంచరిస్తోంది. 'ఏదో పొందాలి' అనే ఆర్తిని వదలక 'అహంకారం' అనే మృగతృష్ణా జలంవైపు పరుగులు తీస్తూ... విష పీడితమైన అంతఃకరణం కలిగి ఉంటోంది. ఆ అంతఃకరణంలో తృష్ణాదాహం అంతకంతకు అధికమౌతోంది!

**విషయ నిరోధం -** ఆహా! ఏమని చెప్పాలి. ఈ మనస్సు 'సంపదలు' అనేచోట చిక్కుకుని తత్ఫలితంగా అనేక శోక–మోహాలు పొందుతూ ఎటో తెలియరాని చోట్లకు చేరుకొని దిక్కు తోచక ఉంటోంది. ఏ దేహాలలో తాను దాగుకొన్నదో... ఆ దేహాలు శిథిలమగుచుండగా, ఇక తానే శిథిల మగుచు బహు దుఃఖాలు అనుభవిస్తోంది. శరీర సంబంధితులైన పుత్ర–పౌత్రాదులతో ఏర్పడే సంబంధ–బాంధవ్యాలను నమ్ముకొని అనేకసార్లు మోసపోతూ శోకముచే, క్షుత్‌పిపాసచే అలమటి స్తోంది. జ్ఞానేంద్రియ–కర్మేంద్రియములచే లభించే శబ్దాది విషయాలే పైకి సుముఖంగాను, చివరికి వేటగాండ్ర బాణముల వలె బాధించేవిగాను అగుచున్నాయి. పూర్వకాలిక దుఃఖానుభవములన్నీ ఆ మనస్సు యొక్క అంతరాంతరమున పేరుకొని ఉండగా వర్తమానంలో అప్పటికప్పుడు మాత్రం ప్రక్క ప్రక్కన గల 'విషయములు' అనే గడ్డి పరకలు నలుముచూ రోజులు గడుపుతోంది.

**మనోమృగం -** ఈ మనస్సే స్వర్గ–నరకాది ఉన్నత–నీచ ప్రదేశాలలో పైకి–క్రిందికి వెళ్ళు చున్నది. 'ప్రాపంచిక వికారములు' అనే రాళ్ల మీద జారిపడి గాయములు పొందుతోంది.

ఈ మనోమృగమునకు 'తృష్ణ' అనే లతలలోను, 'దేహము' అనే పొదలలోను తిరుగాడటానికి బహు ప్రావీణ్యం పొందినదై ఉంది. స్వబుద్ధిచే అనేక ఆచారములు కల్పించుకొని వాటిలో తానే బంధించబడుతోంది. అంతేగాని స్వయంకల్పితమైన మాయ ఏమిటో గ్రహించటానికి స్వబుద్ధిని ఉపయోగించటం లేదు. ఏమని చెప్పాలి?

ఈ మనోమృగం 'ఇంద్రియములు' అనే గ్రామానికి వచ్చి గ్రామసింహంలాగా (కుక్కవలె) పరుగులెత్తటం ప్రారంభిస్తోంది. అక్కడ 'కామము' అనే దుస్సాధ్యమైన–భయంకరమైన పిచ్చి ఎత్తిన ఏనుగు ఎదురుపడగా ఆ ఏనుగు కాళ్ళ క్రిందపడి నుజ్జునుజ్జు అవుతోంది.

ఈ మనోమృగం యొక్క శరీర భాగములు 'క్రోధము' అనే దావాగ్నిచే దహించబడటంచే అనేక బొబ్బలు కలిగి ఉన్నదగుచున్నది. విషయాలలో మరల మరల సంచరించటం చేత 'చింత–శోకము' అనే దీర్ఘవ్యాధులు ఆ మనస్సు యొక్క అంతఃకరణమును ఎంతగానో బాధిస్తున్నాయి.

ఈ మనోమృగం తనయందు పేరుకొనియున్న అనేక అభిలాషలచే ఉపద్రవములెన్నిటినో తెచ్చి పెట్టుకొంటోంది. భోగేచ్ఛలతో కాళ్ళు అరిగిపోయేటట్లుగా సంసారమనే ఎడారిలో పచార్లు చేస్తోంది. స్వకర్మచే ఉత్పన్నమైన అనేక దారిద్ర్యములచే పీడించబడుతోంది. పుత్ర–మిత్ర కళాత్రాదుల పట్ల వ్యామోహంచే గ్రుడ్డిదిగా అయి 'కపటములు–నీచకృత్యములు' అనే గోతులలో మ్రగ్గుతోంది. 'మానము' అనే భూతమును తనయందు ఉంచుకొని తత్ఫలితంగా అనేకసార్లు అవమానములపాలు

అవుతోంది. తాను నమ్ముకొన్నవాటినన్నిటినీ 'మృత్యువు' అనే చోట పోగొట్టుకొని అలమటిస్తూ మరల మరొక చోట ప్రయాణానికి ఉపక్రమిస్తోంది.

'గర్వము' అనే కొండచిలువ ఆ మనస్సును అనేకసార్లు దిగమ్రింగగా అదిపడే పాట్లకు అంతులేదు. అనేక కోరికలు కలిగి ఉన్న కారణంగా దీనత్వమును, యాచకత్వమును పొందుతోంది. కాసేపు ఇంపైన దేహం ధరించి, ఇంద్రియములచే మోసగింపబడినదై... ఇంతలోనే ఆ ఇంద్రియములచే ఎచ్చటనెచ్చటనో నీచ ప్రదేశములలోకి విసరివేయబడుతోంది.

ఓ రామచంద్రా! రాత్రి పూట 'అంధకారం, (మరియు) భయంకరమైన చలిచే' పీడితుడగు చున్న ఓ మనుజుడు తెల్లవారి సూర్యుడు ఉదయించగానే సుఖ శాంతులను పొందుతాడు చూచావా! అనేక దోషములను తన యందు ప్రోగు చేసుకొని ఈ సంసార ముళ్ళ పొదలలో చిక్కుకున్న ఈ మనస్సు అనేక జన్మలలో ఆర్జించుకున్న పుణ్యవశం చేత అధికారి దేహము సంపాదించుకుని 'శమము–దమము' మొదలైన సాధనలచేత మనం ఇంతకుముందు చెప్పుకొన్న వైరాగ్య–సమాధి వృక్షం క్రింద చేరిందా... ఇక పరమ విశ్రాంతి పొందగలదు. ఓ ప్రియ సభికులారా! ఈ ప్రపంచంలో కనిపించే ఆయా భోగములలో మీ మనస్సు విశ్రాంతిని పొందింప జేయటమనేది – ఒక మృగం ఎండకు తాళలేక తాటి వృక్షం క్రిందకు వెళ్ళటం వంటిది. తాటి వృక్షపు నీడ వడగాలితో కూడిన ఎండనుండి కాపాడగలదా? లేనే లేదు. 'సమాధి' అనే చోట మాత్రమే మీ మనస్సు నిరతిశయమగు విశ్రాంతి పొందగలదని, సంపాదించుకోగలదని గమనించండి.

అనేక కార్యక్రమములలో ఉంటూ కూడా, 'సమాధి'ని తప్పక అభ్యాసపూర్వకంగా. నిర్వర్తించవచ్చని ఈ సందర్భంలో సకల జనులకు గుర్తు చేస్తున్నాను. అట్టి నిశ్చల ఆత్మదృష్టిని సకల జనులకు గుర్తు చేయడానికే నా తండ్రి, జగత్పిత అయిన బ్రహ్మదేవుడు నన్ను సృష్టించటం, ఈ అవతారమూర్తి రామచంద్రమూర్తి వేంచేయడం... మొదలైనవన్నీ ఉద్దేశింబడినాయి సుమా!

❖❖❖

## 3. ధ్యానము..... ఉత్తరోత్తర స్థితులు

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ మనస్సు 'ధ్యానము' అనే సమాధి వృక్షమును సమీపించిన తర్వాత అప్పుడు ఉత్తరోత్తర స్థితులు ఎట్లా ఉంటాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** చెబుతాను విను. 'ధ్యానము' అనే వృక్షపు నీడను జేరిన మనస్సు ఇక ఆ ధ్యానమునందే ప్రీతి కలిగి మరొక వృక్షమును దేనినీ కోరుకోదు. ధ్యానమే సమాధి యొక్క రూపం. మెల్లమెల్లగా ఆ మనస్సు ధ్యాన ప్రభావం చేత 'అన్నమయ–ప్రాణమయ–మనోమయ–విజ్ఞాన మయ–ఆనందమయ' కోశములకావల ఉన్న 'ఆత్మ స్వరూపము' అనే కైవల్య ఫలముపై ధ్యాస మరలుతోంది. క్రమక్రమంగా ఉత్తరోత్తరభూమికలు పూర్ణముగా ప్రకటన మగుచున్నాయి. ఆ మనస్సు 'ఆత్మ సాక్షాత్కారం' వైపు దృష్టి సారించగానే ఇక ప్రాపంచిక వస్తువులపై విరక్తి స్వభావ

సిద్ధంగా (వేరే ప్రయత్నం ఏదీ లేకుండానే) కలుగుతోంది. మధురఫలం కనబడిన తర్వాత పచ్చికాయల వైపు నుండి దృష్టి మరలటం స్వభావసిద్ధమే కదా! ఇక ఆ మనస్సు వివేక వృక్ష – ఆరోహణం ప్రారంభిస్తోంది.

**దేహాదులను అధిగమించటం -** అట్టి మనస్సు దేహము–తత్సంబంధమైన ప్రాపంచిక వస్తువుల పట్ల అహంకార–మమకారాలు త్యజించటం ప్రారంభిస్తుంది. సంసార పదార్థాల పట్ల ఇష్టవృత్తి తొలగనారంభిస్తుంది. 'నేను–నాది అనేది భ్రమ మాత్రమే' అనే నూతనమైన అవగాహన అంకురించ నారంభిస్తుంది.

**సాంసారిక సంస్కార త్యాజ్యం -** వివేక వృక్షమును అధిరోహిస్తున్న మనస్సు 'ఆత్మ సాక్షాత్కారము' అనే మహాశయ ప్రభావం చేత నెమ్మది నెమ్మదిగా పూర్వార్జితమై సంస్కారములను త్యజించటం ప్రారంభిస్తుంది. అంతకుముందటి తన మానసిక స్థితిగతులను, విలువలను గమనించి ఇప్పుడు నవ్వుకోవటం ప్రారంభిస్తుంది.

**హసతి ఉచ్చైః పదారూఢమ్ ఆత్మానమవలోకయన్ ।**
**'ఏతావన్తమ్ అహమ్ కాలం కృపణః కో అభవంతి?' ఇతి ॥**

ఆత్మయొక్క ఔన్నత్యమేమిటో గ్రహించిన ఆ మనస్సు "అరెరే! ఇంత కాలంగా ఈ 'ఇంద్రియ విషయములు' అనే స్వల్ప విషయాలే గొప్పవనుకొని అనేక దేహ వృక్షాలలో సంచరిస్తూ... ఈ ధ్యాన వృక్షంపై గల మధురమైన 'ఆత్మావలోకనం' అనే పండును ఎందుకు ఏమరచాను? ఈ ప్రాపంచిక విషయాలు ఎంత స్వల్పమైనవి!"... అని బిగ్గరగా నవ్వటం ప్రారంభిస్తుంది.

**మైత్రి-కరుణ :** ఇక ఆ మనస్సు తదితర సహజీవులతో వ్యవహరిస్తున్నప్పుడు స్వభావ సిద్ధము–అకారణము–ఆత్యంతికము అగు మైత్రి, కరుణ ప్రదర్శిస్తూ ఉంటుంది. పూర్ణకాముడై లోభమును త్యజించినవాడై ఉంటాడు. దినదినము మనస్సు తృష్ణను జయించి ఉంటుంది.

**ఉపేక్ష-అపేక్ష రాహిత్యము:**

**ఉపేక్షతే న సంప్రాప్తం, న అప్రాప్తం అభివాంఛతి ।**
**సోమ సౌమ్యో భవతి అన్తఃశీతలః సర్వవృత్తిషు ॥**

ఆ మనస్సు ప్రాప్తించిన పదార్థాలను ఉపేక్షించదు. ప్రాప్తించని పదార్థములను అపేక్షించదు. సర్వ వృత్తులలో చంద్రుని వలె సౌమ్యమైన అంతఃకరణం కలవాడై, శీతలస్వభావుడై అతడు ఉంటాడు.

**శాస్త్రముల అర్థ పరిశీలన -** అట్టి సమాధి వృక్షముపైనే ఆసీనమై అతడు శాస్త్రార్థములోని అతిసూక్ష్మ తంతువుల శబ్దమును గ్రహిస్తూ ఉంటాడు.

ఇక ఉత్తోరత్తర భూమికలను అధిరోహిస్తూ, మనోహరమైన చిత్తవృత్తి సహితుడౌతాడు. జ్ఞానవంతుడై ఈ పుత్ర–మిత్ర–స్త్రీ–ధనాది సమస్త పదార్థములను స్వప్నములోని విషయాలవలెను, మరొక జన్మకు సంబంధించిన విశేషాలుగాను దర్శిస్తూ ఉంటాడు. అతనికి ఇక్కడ కనబడే రాగ–ద్వేష–భయ–ఉన్మాద–అభిమాన–మోహాల ఆధిక్యత నటులు ప్రదర్శించే (కృత్రిమ) నటనలాగా

కనిపిస్తుంది. వారికి ఎదురుగా ఈ సంసారము ఉన్నప్పటికీ ఇదంతా మృగతృష్ణ వలె మిథ్యగాను, నిస్సారంగాను అగుపడుతుంది. తరంగముల వలె క్షణభంగురంగాను, పిచ్చివాని చేష్టల వలె అర్థరహితంగాను కనిపిస్తుంది. ఆతడు అపూర్వము – నిత్య సంసిద్ధము అగు ఆత్మపదమునందు విశ్రాంతి పొందినవాడై జీవించియున్నను అజ్ఞానివలె లోకైషణ, దారైషణ, ధణైషణ మొదలైనవి లేకుండుటచే సాంసారిక జీవుల దృష్టికి జడునివలె ఉంటాడు.

అట్టి స్థితిలో అతడు కేవలం శుద్ధమైన, కేవలమైన, బోధమయమైన, మహోన్నతమైన ఆత్మ ఫలమునకు అర్హత సంపాదించుకొంటూ ఉంటాడు. పూర్వపు అజ్ఞాన దశల వలన కలిగిన ఆపదలను గుర్తించుకొంటూ జ్ఞాన బలంచే శ్రద్ధను వీడక ఉంటాడు. 'సంతోషము' అనే పానీయము త్రాగి భగవన్మత్తుడై ఉంటాడు. అనర్థ రూపములగు ధనాదులు నశించినప్పుడు కూడా అదంతా అతనికి సంతోషమే కలుగజేస్తుంది గాని, దుఃఖం కాదు. అది ఐదవ భూమికాస్థానం అని అంటూ ఉంటారు.

**శ్రీరాముడు :** స్వామీ! తదితరులు అతనిని బలవంతంగా భోగదాయకములగు ఆవశ్యకకార్యముల వైపుగా బలవంతంగా మేలుకొలుపుతూ ఉంటారు కదా! అప్పుడు ఆ ఐదవ భూమికలో ఉన్నవారికి ఇబ్బంది కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. ఎవరైనా భోగదాయకములగు ఆశశ్యక కార్యముల వైపుగా అతనిని ప్రోద్బలం చేస్తున్నప్పుడు, అతనికి గాఢనిద్ర నుండి బలవంతంగా మేల్కొలుపబడిన మానవునివలె అప్రసన్నంగానే ఉంటుంది. దీర్ఘమైన ప్రయాణంచేసి ఒకచోట కొంచెం నడుం వాల్చిన వానిని మరల నడకకు ఉపక్రమించడమంటే ఇబ్బందిగా అనిపిస్తుంది కదా! దీర్ఘకాలంగా జనన-మరణాలతో కూడిన సాంసారిక బాటయందు అజ్ఞానంచేత చరించిన ఆ జీవబాటసారి ఇప్పటి వివేక సమాధియందు ఉదారతతో కూడిన అబాధితమైన ఆత్మ విశ్రాంతి అవిఘాతంగా ఉండాలని కోరుకొంటూ ఉంటాడు. ప్రాణధారణచే అతడు తదితర జనులలాగానే బయటకు కనబడు చున్నప్పటికీ అతడు అంతరమున అహంకార రహితుడై కట్టెలు లేని అగ్నివలె ప్రకాశిస్తూ ఆత్మ యందు శాంతిని చవిచూస్తూ ఉంటాడు. అభ్యాసవశంగా బాహ్యపదార్థముల పట్ల విరక్తి గలిగి ఉంటూనే, యథాప్రాప్తములయ్యే వాటిని నిరాకరించటానికి కూడా చిత్తము కలిగి ఉండడు.

ఈ ప్రకారంగా పరమార్థ ఫలమును కలుగజేసే గొప్పదగు ఆత్మ పదమువైపు ప్రయాణిస్తూ క్రమంగా మాటలకు అందజాలని, అగోచరమైన ఆఱవ భూమికను పొందుచున్నాడు. ఇకప్పుడు బాటసారికి బాటప్రక్కన ఉన్న శ్మశాన భూములపై ఇష్టము కలుగనట్లుగా సర్వ భోగముల పట్ల అతడు విరక్తి కలిగి ఉంటాడు. సంసార వృత్తులన్నిటిపట్ల అతడు నిదురించి ఉంటాడు. ఆత్మానందంచే మదోన్మత్తుడు అవుతాడు. క్రమంగా పరిపూర్ణమైన మనస్సు పొంది ఒకానొక అనిర్వచనీయ స్థితిని అనుభవిస్తూ ఉంటాడు. అట్టి స్థితి యందు అతడు 'మోక్షము' అనే పరమార్థ ఫలమునకు అత్యంత సమీపంలో ఉంటాడు. ఆ తర్వాత ఏడవ భూమిక పొందుచున్నాడు. అప్పుడిక ఆకాశం వలె

విశాలరూపుడై ఉంటాడు. సమస్త వాసనలను, బుద్ధి వృత్తులను త్యజించి ఆవరణ-విక్షేప రహితుడౌతాడు. నిరతిశయానందమగు 'బ్రహ్మభావం' అనే ఫలాన్ని అస్వాదిస్తూ, అద్దానిచే అత్యంత తృప్తుడౌతాడు. ఓ రామచంద్రా! 'పరమార్థ ప్రాప్తి' అనునదే ఈ జీవుని యొక్క పరమావధి సుమా!

**సంకల్పార్థ పరిత్యాగాత్ దిన-అనుదినమ్ ఆతతా ।**
**శుద్ధ స్వభావ విశ్రాన్తిః 'పరమార్థాప్తిః' ఉచ్యతే ॥**

సంకల్పిత పదార్థాల యొక్క పరిత్యాగపు ప్రభావం చేత ఆరోజుకారోజు సంభవించే విశాల మైన 'శుద్ధాత్మ స్వభావం' నందలి విశ్రాంతియే 'పరమార్థ ప్రాప్తి' అని చెప్పబడుతోంది.

**శ్రీరాముడు :** మహాత్మా! 'బ్రహ్మము' అని దేనిని విజ్ఞులు పిలుస్తున్నారో విశదపరచండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**భేద బుద్ధిః విలీనార్థ అభేదేవ అవశిష్యతే ।**
**శుద్ధమ్ ఏకమ్ అనాద్యంతం "తత్ బ్రహ్మేతి" విదుర్ బుధాః ॥**

చూచేవాడు-చూడటం-చూడబడేది, అనుభవించేవాడు-అనుభవించటం-అనుభవించబడేది ...ఇట్టి త్రిపుటిని గూర్చిన భేదబుద్ధి విలీనం కాగా... అప్పుడు అభేదం-శుద్ధం-ఏకం-అనాది-అనంతం అగు సాక్షిమాత్ర చైతన్యం శేషిస్తోంది. అట్టి శుద్ధ చైతన్యమునే విజ్ఞులగు శాస్త్రకారులు 'బ్రహ్మం' అనే పేరుతో పిలుస్తున్నారు. అట్టి బ్రహ్మానుభవమే బ్రహ్మపదము.

**'లోకైషణా' విరక్తేన, త్యక్త 'దారైషణ' ఏన చ ।**
**'ధనైషణా' విముక్తేన తస్మిన్ విశ్రామ్యతే పదే ॥**

లోకేషణ, దారైషణ, ధనైషణ... వీటిని ఈషణాత్రయం అంటారు. అట్టి త్రివిధములైన ఈషణము లను పరిత్యజించిన మనుజునకు బ్రహ్మపదమున విశ్రాంతి లభిస్తుంది.

సర్వ భేద బుద్ధులు విలీనమైపోవాలి సుమా! అప్పుడే ఈ చిత్తము 'చిత్' ను సందర్శించగలదు.

**చిత్తశోధన -** 'దృశ్యము' యొక్క తత్త్వశోధనచే 'సత్' మాత్రము శేషిస్తోంది. 'ద్రష్ట' యొక్క తత్త్వశోధనచే 'చిత్' మాత్రము (ఎఱుక) శేషిస్తోంది.

అఖండైక్యము వలన నిరతిశయానందరూపంగా ఈ చిత్తము పరిణమిస్తోంది. అప్పుడు చిత్తము యొక్క అంతిమ సాక్షాత్కార వృత్తి చేత 'భేదబుద్ధి' నశించిపోగలదు. కోమలమగు పూల దండను ఏ ఆకారంగా పరచినప్పటికీ మరల చేతితో తీసుకోగానే యథాతథమైన ఆకృతిని పొంద గలదు కదా! అట్లాగే, ఆత్మసాక్షాత్కారము పొందిన చిత్తము ఉన్నా కూడా... ఇతఃపూర్వపు అజ్ఞాన స్థితిని ఏమాత్రం పొందదు. అదిగో! ఆ ఎదురుగా కనబడే శిలను చూడు. ఆ శిలలో ఒక శిల్పి విష్ణుమూర్తి యొక్క నాలుగు చేతులను-పాదములను తన శిల్ప లాఘవంతో చిత్రీకరించగలడు. అనగా, కాబోయే శిల్పము శిలలోనే ఉన్నది కదా! కానీ ఇప్పుడు కనబడుతోందా? లేదు. శిలలో గల అప్రకటితమైన శిల్పము (విగ్రహము) ఉండియు లేకయు (సత్తుగాని-అసత్తుగాని) కూడా

ఎట్లున్నదో ...ఆ పరమాత్మ యందు ఈ విశ్వము యొక్క స్థితి ఉన్నదని గ్రహించు. ఆత్మసాక్షాత్కారము పొందిన చిత్తమునకు జగత్తు సత్తుగాను-అసత్తుగాను కాకయే ఉన్నది.

**శ్రీరాముడు :** పరమాత్మను సాకారునిగా కొందరు కొలచుచున్నారు. మరికొందరు అతడు సాకారుడు అవటానికే వీలులేదని వాదనలు చేస్తున్నారు. ఏది యుక్తియుక్తం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సాధక భక్త జనుల సౌకర్యార్థం నీవు ఇన్ని రోజుల సంవాదానంతరం కూడా ఇట్లు ప్రశ్నిస్తున్నావని నేను గమనిస్తున్నాను. సందేహ నివృత్తి అత్యంతావశ్యకం కాబట్టి సముచితమే!నీ ప్రశ్నకు సూటి అయిన సమాధానం మరల ఒక్కసారి చెప్పుచున్నాను. విను.

**ధ్యానం నశక్యతే కర్తుం నచైతత్ ఉపయుజ్యతే ।**
**అబోధేన విబుద్ధస్తు స్వయమ్ అత్రైవ తిష్ఠతి ॥**

ఓ రామచంద్రా! చిత్తం ప్రపంచమును నమ్మియున్నప్పటి అజ్ఞాన దశయందు నిష్ప్రపంచక మగు బ్రహ్మమును గూర్చిన ధ్యానం కష్టతరం అవగలదు. అజ్ఞానం యొక్క ప్రభావం చేత ప్రపంచ రహిత బ్రహ్మము ధ్యానించటం శక్యం కాదు... అని చెప్పవచ్చు. అంతేకాదు. అది యుక్తియుక్తం కూడా కాదు. అట్లాగే, ప్రబుద్ధమైన చిత్తమును సముపార్జించుకున్న తర్వాత స్వయంగానే తత్ బ్రహ్మ భావం (నిష్ప్రపంచ బ్రహ్మం) నందు స్థితి కలుగుతుంది. అట్టి స్థితిలో తన ఆరాధ్యమును సాకార పరిమితం చేయటం కూడా కష్టమే అవుతుంది. అయితే 'బ్రహ్మమే ఈ జగత్తు రూపంలో ఉన్నది' అను పూర్ణ గ్రాహ్య స్థితిలో సాకార-నిరాకార ధ్యానాలకు సంబంధించిన విరోధ భావాలన్నీ తమంతట తామే తొలగుతాయని కూడా గ్రహించు. సర్వ దృశ్య పదార్థములపట్ల ఎవనికి సంపూర్ణ వైరాగ్యం ఉంటుందో... అతడే జ్ఞాని. ఎందుకంటే జ్ఞాని మాత్రమే దృశ్యమును త్యజించగల సమర్థత కలిగి ఉంటాడు. అజ్ఞానికి దృశ్యమును త్యజించగలిగే సమర్థత ఉండదు. దృశ్యం యొక్క సాక్షీరూప బోధయే బ్రహ్మం. అట్టి సాక్షి రూప బోధచే మాత్రమే ఈ దృశ్యం యొక్క యథార్థ స్వరూప స్థాపనకు సమాధానం. అదియే సమాధి.

సమ్యక్ ఆధానం = సమాధానం (దృశ్యం యొక్క వాస్తవ రూపాన్ని గ్రహించటమే సమాధానం) అదియే సమాధి. అట్టి బోధచే ఈ దృశ్యము నాశరహితమగు బ్రహ్మమే అగుచున్నది.

ఎప్పుడైతే ద్రష్ట (సాక్షి)-దృశ్యముల యొక్క ఐక్యముతో మనోవృత్తి ఏకమగు అఖండాత్మా కారమున స్థితి కలిగి ఉంటుందో... అదియే సమాధి యందలి విశ్రాంతి. దృశ్య స్వభావ విరుద్ధమైన ('దృశ్యము తనకు అభేదం' అను అవగాహనతో కూడిన) చిదానంద స్వభావమే బ్రహ్మజ్ఞాని యొక్క నిజ స్వభావం. 'దృశ్యము వైపుగా ఉన్ముఖమవడమే (నేను చూచే వాడిని – ఇది చూడబడేది... అనే భేద భావమే) అజ్ఞానము'... అని విజ్ఞులు పలుకుచున్నారు.

ఈ సాంసారిక విషయాలు (ద్వితీయంగా) అజ్ఞానికి మాత్రమే వాటి వాటి భేద రూపాలుగా కొన్ని స్వాదిష్టములుగా తోచుచూ ఉంటాయి. జ్ఞానికి ఇందులో ఇష్ట-అయిష్టములు ఉండవు. అమృతం తాగేవాని దగ్గరకు వెళ్ళి 'ఏవయ్యా! ఆ అమృతం త్రాగటం ఆపి ఈ పాత్రలోని కల్లు తాగకూడదా?'... అంటే అతడు ఇష్టపడతాడా? లేదు.

ఓ రామచంద్రా! ఎవడు తన హృదయంలోని 'తృష్ణ' అను మకిలిని తొలగించుకొంటాడో, లోక-స్త్రీ-ధన ఈషణాలను పరిత్యజిస్తాడో, ఆత్మనిష్ఠ అభ్యసించ నారంభిస్తాడో... అట్టివానికి 'ధ్యానం - సమాధి' అనేవి అప్రయత్నంగానే కలుగుతాయి. తృష్ణ ఉన్న చోట ఆత్మ స్వరూప-అనుసంధాన రూపమగు బోధ చలించిపోతుంది. గురువుల వాక్యములు సత్ఫలితమగు ప్రయోజనం కలిగించ లేవు. ఎవనికి తృష్ణ ఉండదో, అట్టి తత్త్వజ్ఞునకు ద్రష్ట-దర్శన-దృశ్యములనే త్రిపుటికి చోటే దొరకదు.

మరొక విధంగా... తృష్ణారహితుడైన జ్ఞాని యొక్క తృష్ణ అనంతత్వము సంతరించుకోగలదని కూడా చెప్పవచ్చు. ఏ విధంగా అంటావా? తృష్ణారాహిత్యం యొక్క ప్రభావం చేత అకృత్రిమమైన సమాధిని అవధరించిన మహనీయుడు స్వయంగా విభాగరహితమైన అనంతాత్మ స్వరూపంగా ఉదయించుచున్నాడు. అనగా, సర్వ ధ్యానములు అతనివే అగుచున్నాయి. అతని యొక్క సర్వత్రా అనురాగమే విరాగమగుచున్నది. అట్టివాని చింతనీయమగు బాహ్య పదార్థ సంబంధమైన బోధ ఎట్లా ఉన్నప్పటికీ,... అతడు తన చిత్తమును సమాధియందు లగ్నము చేసినా (లేక) చేయకపోయినా కూడా... వ్యవహార తత్పరుడు అయినా (లేక) కాకపోయినా కూడా... అతడు సంసార ధ్యాత కాడు. అతని దృష్టియందు అంతా కూడా ఆత్మరూపంగానే ఉంటుంది. కనుక అతడు సమాధిని అవధరించినవాడే అవుతాడు. ఱెక్కలు లేని పక్షికి స్వయంగా నిశ్చలత్వం సంభవించినట్లుగా... తృష్ణారహితుడగు జ్ఞానికి అనంతాత్మ యొక్క ధ్యానం స్వయంగా (వేఱే ప్రయత్నమనేదేదీ లేకుండానే) కలుగుతోంది. అతనికి శుద్ధ బోధ రూపమగు ఆత్మ సాక్షాత్తుగా అనుభూతమౌతూ ఉండగా ఇక జ్ఞాన విరోధమైనదంటూ ఏదీ ఉండదు. ప్రజ్వలిస్తున్న అగ్నిలో నెయ్యి బిందువు ఉండదు కదా!

**పరం విషయ వైతృష్ణ్యం సమాధానముదాహృతమ్ ।**
**అహృతం యేన తన్నూనం తస్మై నృబ్రహ్మణే నమః ॥**

సంపూర్ణ విషయతృష్ణా రాహిత్యమే 'సమాధి'! విషయం తృష్ణారాహిత్యాన్ని ఎవరు సంపాదించు కుంటారో, అట్టి స్వయంబ్రహ్మ స్వరూపునికి నా నమస్కారాలు సమర్పిస్తున్నాను. ఎవరికి నిజమైన విషయతృష్ణా రాహిత్యం యొక్క ప్రభావం చేత, జ్ఞానం చేత సమస్త భేదాలు నశిస్తాయో, అతనిదే 'ఉత్తమం-దృఢం' అయిన ధ్యానం. వాని ఆత్మధ్యానం తొలగించటానికి ఇంద్రాది దేవతలు, అసురులు కూడా చాలరు. ఓ ముముక్షువులారా! మీరంతా కూడా అట్టి దృఢమైన-ఉత్తమమైన (తృష్ణారహిత) ధ్యానాన్ని సంపాదించుకొనెదరు గాక! తృణ ప్రాయమైన ఇతర ధ్యానాల వల్ల ఏం ప్రయోజనం?

❖❖❖

# 4. బ్రహ్మమునందు విశ్రాంతి - ఉపాయాలు

**శ్రీరాముడు :** మహర్షీ! ప్రపంచము-ప్రపంచాధీశుడగు పరమాత్మ... అను ఈ రెండింటినీ సమగ్రంగా అవగాహన చేసుకోవటమెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'ప్రపంచం' అనే శబ్దం, అద్దాని అర్థం ప్రతిపాదించబడేదంతా అజ్ఞాని యొక్క అజ్ఞాన నాశనం కొఱకే గాని, జ్ఞాని కొఱకు కాదు. సర్వ సభికులారా! ఏ నిరతిశయానంద ప్రపంచం,

ప్రపంచాధీశుడు – ఇవన్నీ కూడా ఏకరూపమై అభిన్నంగా భాసిస్తాయో అట్టి బ్రహ్మం నందే విశ్రాంతిని పొందండి. ఎందుకంటారా? ఆత్మ తప్పితే ఇక్కడగాని, మరొక చోటగాని మరింకేదీ లేదు. 1. ఆరుక్షువుల యొక్క (సాధనపరుల), 2. ఆరూఢుల యొక్క (యోగాన్ని అధిరోహించినవారి) ... సర్వ మననాది ఆయా భూమికలన్నిటిలో ఆత్మకంటే వేరైన సత్త–అసత్తలు గాని, మరింకే ద్వైతాద్వైతములు గాని లేవు. అట్టి తదితరములైన ఏవైనా కార్యక్రమములు శాస్త్రములు ఎక్కడైనా చెప్పటం జరిగితే అవన్నీ అజ్ఞుల కొరకే గాని, విజ్ఞుల కొరకు కాదు.

**శ్రీరాముడు :** అట్టి బ్రహ్మమునందు విశ్రాంతి పొందటానికి సాధకులమగు మాకు ఏవైనా సులభోపాయలు చెప్పండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** అందుకు 3 సులభోపాయలు చెబుతాను, విను.

**ఉపాయ ఏకః 'శాస్త్రార్థో', ద్వితీయో 'జ్ఞసమాగమః' ।**
**'ధ్యానం' తృతీయం నిర్వాణే శ్రేష్ఠః తత్ర ఉత్తరోత్తరః ॥**

మొదటి ఉపాయం – నిరంతర శాస్త్రార్థములను అభ్యసించటం; రెండవ ఉపాయం – విజ్ఞులను సమీపించి, శరణువేడి వారితో సంభాషిస్తూ ఉండటం; మూడవ ఉపాయం – ధ్యానం (శాస్త్రార్థాలను వివేకంతో మననం చేస్తూ ధ్యాసను జగత్‌భ్రమ నుండి పరమాత్మవైపు తరలించడం) ...ఈ మూడు పై వరస ప్రకారం ఒక దానికంటే తరువాతది శ్రేష్ఠమైనది.

అపరిచ్ఛిన్నము, నిత్యం అపరోక్షమైనది (ప్రత్యక్షముగాని, పరోక్షముగాని కానిది) అగు బ్రహ్మ చైతన్యమే ఈ 'జీవుడు' అను రూపము పొందింది. స్వ ప్రతిబింబమే దర్పణంలో అగుపడునట్లు బ్రహ్మమే అంతఃకరణోపాధి వశంచేత పరస్పరం భిన్నం అయినట్టి ఈ జీవుడు అనబడు రూపం గ్రహిస్తోంది సుమా! ఈ జగత్తులో రాగద్వేషముల సంఘటనచే బ్రహ్మ మొదలు స్తంభము వరకు అనేక విశేషాలున్నాయి. అయితే స్వతఃసిద్ధము–శుద్ధము అగు చైతన్యమే ఈ సర్వ విశేషములందు అంతటా వ్యాపించి ఉన్నది. స్వకర్మ వైచిత్ర్యముచే ఈ కనబడే సమ–విషమ శరీర భేదములందు అంతటా ఉదయించి ఉన్నది ఆ చైతన్యమేనయ్యా! ఈ జీవుడు బ్రహ్మమే అయి ఉండి కూడా ఈ నిస్సార జగత్తులో జన్మకర్మాదులన్నీ ఆశ్రయిస్తూ సుదీర్ఘ కాలం వెళ్ళబుచ్చుచున్నాడు.

ఇట్లు సంసార చక్రంలో తిరుగాడుచున్న అసంఖ్యాక జీవులలో ఒకానొకడు సౌభాగ్యవశం చేత మోక్షమునకు అధికార యోగ్యమగు జన్మను పొందుచున్నాడు. అట్లా పొంది, శాస్త్ర జ్ఞానం, సజ్జనులతో సాంగత్యం... ఇటువంటి ఉపాయాలు ఆశ్రయిస్తున్నాడు... అప్పుడు సమస్త 'జనన–మరణ–భ్రమణ' రూపమగు ఈ 'జగత్తు' అనే ఆట యొక్క పూర్వపరాలేమిటో చక్కగా గ్రహిస్తున్నాడు. అట్లు బాగుగా ఎఱిగిన మహాత్ముడు 1. జ్ఞానం, 2. తృష్ణారాహిత్యం అనే రెండు దీపాలలో ఒకదానిని వెలిగిస్తున్నాడు. ఈ రెండింటిలో ఏ ఒక్కటి సిద్ధించినా కూడా రెండవది తనంతట తానే సిద్ధించగలదు. ఇక ఈ జగత్తు విషయమంటావా? అగ్నితో భస్మీభూతమైన దూదిప్రోగులు గాలిచే ఎగురగొట్టబడి ఆకాశంలోకి ఎగసిపోవునట్లు జగద్విషయాలన్నీ కూడా ఏదో అనామక ప్రదేశంలో

పడిపోతాయి! అట్లాగే జ్ఞానాగ్నితో భస్మీభూతమైన జగత్భావనలన్నీ ఆత్మ బుద్ధి అనే గాలిచే ఎరుగగొట్టబడి శాంతమగు పరమాత్మ అనే ఆకాశంలో ఎచ్చటనో లయమైపోతాయి.

**శబ్దమాత్ర జ్ఞానం -**

**చిత్రాగ్నినేవ బోధేన తేన జాడ్యం న శామ్యతి ।**
**నిర్మూలాపి జగత్ భ్రాంతిః ఏనాశు న విలీయతే ॥**

ఓ రామచంద్రా! కొందరు వేదాంత జ్ఞానాన్ని మాటలతో పలుకుచున్నారు గాని... అనుభవైక వేద్యం చేసుకొనే ప్రయత్నం చెయ్యటం లేదు. చిత్రపటంలోని అగ్నిచే చలిపోతుందా? పైపై జ్ఞానంచే అజ్ఞాన మూలం నశించదు. అట్టి ఆపాత జ్ఞానంచే జగద్భ్రాంతి త్వరగా తొలగిపోయినట్లే కనిపించి నప్పటికీ కూడా... వాస్తవానికి అజ్ఞానం "నిర్మూలనం కానిదే" అగుచున్నదని గుర్తు చేస్తున్నాను.

ఏ విధంగా అజ్ఞానికి అతని అజ్ఞత్వం కారణం చేత జగద్భ్రాంతి రోజు రోజుకూ అభివృద్ధి చెందుతూ ఉంటుందో... అదే విధంగా జ్ఞానికి తన యొక్క విజ్ఞాన కారణం చేత జగత్భ్రమ రోజు రోజుకూ తరుగుతూ వస్తుంది. అజ్ఞానం కలిగి ఉండకపోవటమే జ్ఞానానికి గుర్తు. అట్లు దహించివేయ బడిన అజ్ఞానం గల జ్ఞాని యొక్క దృష్టికి 'జగత్తు' శబ్దార్థ రహితమైనదిగా కనబడుతుంది. అజ్ఞానికి కనబడే జగత్తు జ్ఞానికి చిత్రపటంలోని స్వర్గ-మర్త్య-పాతాళ లోకాలుగానూ, 'శూన్యం' అనే మూల పదార్థంచే తయారుచేయబడిన బొమ్మలకొలువుగాను, నిద్రించిన వానిచే కల్పించబడిన స్వప్నదృశ్యం గాను అనిపిస్తోంది. జ్ఞాని యొక్క అనుభవమునకు ఇక్కడి చిత్తం, ఆ చిత్తం వెంటనంటి ఉండే ఇచ్ఛ, ఆ ఇచ్ఛకు కనిపించే జగత్తు ఇవన్నీ కూడా చిదాకాశముగానే తెలియవస్తున్నాయి. ఎందుకంటే బోధ ఉదయించిన తర్వాత జ్ఞానికి ఇచ్ఛా జగత్తులు రెండూ ఇక మచ్చుకనైనా ఉండజాలవు.

1. అహంకాం = "ఏకం - అఖండం-సర్వం అయిన చిదాకాశం (లేక, బ్రహ్మం) కంటే నేను వేఱుగా ఉనికి కలిగి ఉన్నాను. 'నేను'తో బాటు 'నాది' అనేది ఉంది..." అనే దర్శనం.

2. జగత్ స్థితి = 'పరమాత్మకు అన్యమై ఈ జగత్తు కలదు' అనే దర్శనం.

...పై ఉభయ దర్శనాలు పరమాత్మ గురించిన అద్వితీయ జ్ఞానం ఉదయించగానే సూర్యోదయా నంతర చీకటి తెరల వలె తొలగిపోతాయి. అట్టి జ్ఞానికి ఈ జగత్‌స్థితి పరమ ప్రకాశరూపమగు బ్రహ్మముగానే చెన్నొందుచున్నది. అది పూర్ణ ప్రబుద్ధుని స్థితి.

ఇక అర్ధ ప్రబుద్ధుని స్థితో?... అతని చిత్తమునకు ఈ జగత్ స్థితి అనుక్షణికమైన మార్పులతో కూడినదై ఉండటంచేత దీనికి 'ఇది' అని చెప్పగలిగిన రూపమేదీ కనిపించడం లేదు. అయినప్పటికీ అతనికి 1. బ్రహ్మం, 2. జగత్ స్వభావం అనబడే రెండు వేర్వేరైన తత్త్వములు ఉన్నట్లు అనిపిస్తోంది. ఆ అర్ధ ప్రబుద్ధుడు ఇంకా ఆత్మతత్త్వమును పూర్తిగా పొంది ఉండకపోవటం చేత... ఆత్మ యొక్క 'బోధాధిక్యత' చేత... ఒకప్పుడు ఈ జగత్తును 'ఏకం'గా గాంచుచున్నాడు. ఇక మరొకప్పుడు ఏమఱపు చేత దీనినంతటినీ 'అనేకంగా గాంచుచున్నాడు. ఏక రూపం-అనేక రూపాల మధ్య అతడు సంచారం చేస్తున్నాడు. అంటే బోధ యొక్క ప్రభావం చేత ఒక సమయంలో 'మైత్రి-కరుణ' మొదలైన ఉత్తమ గుణములను ఆశ్రయిస్తున్నాడు. మరొక సమయంలో ఈ జగత్తును నమ్మి

ఉండటం చేత, అజ్ఞానవశం చేత ఇక్కడ పరస్పర–వివాదాలతో తాదాత్మ్యం పొందుతూ వ్యవహరిస్తు న్నాడు. అనగా ఆ అర్ధప్రబుద్ధుడు 'జ్ఞాన–అజ్ఞానాలు' అను రెండింటిలో ఏ భాగం ఎప్పుడు తన యందు ప్రబలంగా ఉంటుందో, ఆ సమయంలో అట్లే తన్మయుడై ఉంటాడు. అతడు తన యొక్క సాధనాక్రమమును కొనసాగిస్తూ ఉండగా పరిపక్వ స్థితిని పొందగలడు. పరిపక్వ స్థితిని పొందిన జ్ఞాని ఇక ఈ జగత్తు యొక్క భావాభావాలు పొందడు. తురీయావస్థలో ఉన్నవాడు జాగ్రత్–స్వప్న–సుషుప్తులను పొందకయే ఉన్నట్లుగా... జ్ఞాని ఈ జగత్తును చూస్తూ కూడా, దానిని పొందడు.

**శ్రీరాముడు :** హే మహానుభావా! ఈ మనస్సే కదా జగత్తును పొందుచున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. మనస్సే ఈ జగత్తును పొందుతోంది, త్యజిస్తోంది కూడా!

**శ్రీరాముడు :** ఈ మనస్సు యొక్క రూపం ఏమిటి? అది నశించేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**వాసనైవ మనః సేయం స్వ విచారేణ నశ్యతి ।**
**అవస్తుత్వాదతో మోక్షో నాత్మనాశే ప్రవర్తతే ॥**

మనస్సు యొక్క రూపం వాసనలే! అయితే అట్టి వాసన 'ఆత్మ విచారణ' చే నశించగలదు. కాగా, మనస్సు అవస్తుమయమే (మాయ–అవిద్యామయమే) కదా! కాబట్టి మనస్సు (వాసనలు) అవిద్యమానమై ఉన్నంత వరకు మోక్షము సంభవించదు. వాసనలు నశించాయా, మోక్షం స్వతః సిద్ధంగానే ప్రాప్తించగలదు.

ఓ రామచంద్రా! ఈ విధంగా ముముక్షువు యొక్క మనోమృగం 'ధ్యానం' అనే వృక్షాన్ని సమీపించి అక్కడ 'బోధ' అనే ఫలం సంపాదించుకుంటోంది. పూర్ణపరిపక్వస్థితిని సంపాదించు కుంటోంది. 'పరమాత్మ బోధ స్వరూపము–పరమానంద లక్షణముతో కూడుకున్నది'... అయిన అమృత ఫలమును భుజిస్తోంది. అప్పుడు సంసార బంధనము నుండి విముక్తినొందుచున్నది.

కాబట్టి...'వివేకం–వైరాగ్యం' మొదలుగా గల సాధనల ద్వారా 'ధ్యానం' సహాయంతో మనస్సును 'జగత్తు' అనే అనేకములతో కూడిన స్థానం నుండి ఉపసంహరించి 'ఆత్మ' అను ఏకస్థానంలో లయింపజేయుటమే మోక్షప్రాప్తి. లేక "ఈ 'సంసారం'గా కనబడేదంతా సర్వదా పరమాత్మ యొక్క స్వరూప విన్యాసమే" అనే దృఢానుభవమే మోక్షం.

❖❖❖

## 5. అనురక్తి నుండి సమాధికి

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'పరమార్థ ఫలప్రాప్తి'కి సోపానములు ఈ విధంగా ఉంటాయి.

1. ప్రాపంచిక భేద విషయాలపట్ల అనురక్తి, తత్ఫలితంగా జన్మ–కర్మలు
2. అనురక్తి నుండి ... 'విరక్తి'
3. విరక్తి నుండి ... 'వైరాగ్యము'

4. వైరాగ్యము నుండి ... 'శాస్త్ర జ్ఞాన సముపార్జన'
5. అట్టి జ్ఞానము నుండి ... ధ్యానము
6. ధ్యానము నుండి ... సమాధి

ధ్యానముచే పరమార్ధ ఫలం తిన్నగా అనుభూతం కాగలదు. అప్పుడీ జీవుడు ముక్తి రూపంగా పరిణామం పొందుతాడు. అప్పటి ముక్తి రూప స్థితిలో అజ్ఞానము నశించిన కారణం చేత-అప్పటి దాకా వెంటనంటి ఉన్న చరమ సాక్షాత్కార వృత్తి రూప బోధ కూడా అసత్తుగా పరిణమిస్తుంది. అప్పుడు ఇతఃపూర్వం ఉండి ఉన్న 'మనస్సు' కేవలం పరమార్థమగు ఆత్మ స్వరూపమే అగుచున్నది. ఆ మనస్సు యొక్క పూర్వకాలికమైన విషయాన్వేషణ అనే సంస్కారం 'నూనె అయిపోయిన తర్వాత దీపం' లాగా ఎక్కడికో వెళ్ళిపోతుంది. అక్కడ ఇక అనంతమైన ఆత్మ ప్రకాశరూపమగు పరమాత్మదశ మాత్రమే శేషించుచున్నది. అనగా, ధ్యానము యొక్క పరమార్థ ఫలము సంప్రాప్తించటం చేత మనస్సు బోధ రూపత్వం చెందుతోంది. అప్పుడే మనస్సు రెక్కలు తెగిన తర్వాత పడి ఉండే పర్వతం లాగా వజ్రతుల్యమైన దృఢనిశ్చల స్థితిని అవధరిస్తోంది. విషయముల గురించి చింతించుచుండే మనోస్వభావం ఎచ్చటికో పారిపోతుంది. 'బోధ రహితం-విభాగ శూన్యం-సర్వాత్మకం-సద్రూపం' అయినట్టి నిర్మల బోధ (చిన్మాత్రం) మాత్రమే శేషిస్తోంది. మనస్సు సర్వ భేదములను త్యజించినప్పుడు ఇక అద్దానిని 'బోధ స్వరూపం' అంటారు. అంతేగాని మనస్సు అని అనరు.

పూర్వ కాలంలో ఈ మనస్సు – ఈ జడ దేహాదుల గూర్చిన అవివేకముచే – జడంగానే ఉండేది. ఇప్పుడో, జ్ఞానబలిమిచే సువివేచనచే దేహమును జడమాత్రంగా అది దర్శిస్తోంది. అట్టి దర్శన ప్రభావం చేత బోధ రూపంగా ఉదయిస్తోంది. ఇక ఆ బోధరూప సత్త 'అనాది-అనంతము-నిర్మలము' అగు ఆత్మ ప్రకాశమును కలుగజేయునదిగా అగుచున్నది. సమస్త వాంఛలు త్యజించటం చేత... 'అనాది' గాను, అనంతమగు ఆత్మ యొక్క ధ్యానముచే... 'అనంతం' గాను, సంసార దోషం తొలగటంచే 'నిర్మలం' గాను, ఆ బోధరూపచిత్కళ స్వయంగా సిద్ధిస్తోంది.

ఎంతవరకైతే ఈ ప్రపంచం పట్ల ధ్యానం ఉంటుందో అంత వరకు ఆత్మధ్యానం కుదిరేది కాదు. ఎంత వరకు జీవుడు ఆత్మధ్యానం చేత బ్రహ్మమును పొందలేదో, అంత వరకు విషయాల మననం కారణంగా పరమపదమున విశ్రాంతి లభించదు. పరమార్థమగు ఆత్మతోటి ఏకత్వం పొందిన మరుక్షణం మనస్సు ఎచటికో తుఱ్ఱుమంటుంది. ఆ మనస్సుతోటే దాని సైనికులైనట్టి 'వాసన-కర్మ-హర్షం-క్రోధం'... వీటికి సంబంధించిన మనోవృత్తులు కూడా ఎచటికో పరుగులు తీస్తాయి. ఆ స్థితియందు యోగి కేవలం ధ్యాన నిష్ఠుడై కనిపిస్తాడు. అతని ఆత్మ ధ్యాన నిష్ఠ అత్యంత దృఢతరమై ఉంటుంది. సమాధిస్థితి ఎప్పుడు సిద్ధిస్తుంది?

ఓ రామచంద్రా! యోగికి సమాధి స్వయంగా సిద్ధించగలిగేది ఎప్పుడో చెబుతాను విను.

1. సమస్త భోగములందు విరక్తి కలిగినవాడు.
2. ఇంద్రియ వృత్తులన్నీ పూర్ణముగా శమించినవాడు

3. ఈ దృశ్యం పదార్థములన్నిటి పట్ల 'అ రుచి' కలిగియున్నవాడు

4. ఆత్మనే దర్శిస్తూ ఆత్మయందే రమించే వాడు. అనగా సహజీవులందరిలోని నిర్మలాత్మను అంతరంగ దృష్టిచే అన్నివేళలా దర్శించే అభ్యాసం కలవాడు.

5. క్రమంగా ప్రాపంచిక వృత్తులన్నీ నశించినవాడు.

6. మనస్సును ప్రపంచం నుండి ఉపశమింపజేసి విశ్రాంతిని పొందింపజేసినవాడు...

...అట్టి వానికి సమాధి స్వయంగా సిద్ధిస్తుంది. అప్పుడతనికి సమస్తము బ్రహ్మరూపమే అగుచుండగా ఇక దేనిని గురించి ధ్యానించాలి? ఇక అతనికి శాస్త్రములు ధ్యాననిష్ఠ యందు నియమించవలసిన బోధించవలసిన అగత్యమే ఉండదు. ఎందుకంటే ఆతని అనుక్షణిక దర్శనం ఆత్మభావనచే పరితప్తమై, పరిశ్రుతమై ఉంటుంది.

ఎంత వరకైతే భోగములు కనబడుతూ ఉంటాయో, అంత వరకు విషయ వైరాగ్యమును యోగులు సముపార్జిస్తూనే ఉంటారు. ఎప్పుడైతే ఆత్మవంతుడగు జ్ఞానికి వాసనల యొక్క అభావ బలం చేత జగత్పదార్థములు కనబడకయే పోతాయో, అప్పుడు ఆ జ్ఞాని సమాధియందున్నట్లే! అట్టివాడు తదితర సహజీవులను ఉద్దేశించి దేహముతో కర్మలు నిర్వర్తిస్తున్నప్పటికీ అతని సమాధి స్థితికి వచ్చే లోటేమీ ఉండదు.

'గుడ పిపీలికాన్యాయం'ను అనుసరించి (బెల్లమును ఆశ్రయించిన గండుచీమ ఆ బెల్లమును వదల లేకున్నట్లు) ఆత్మానందనమును ఆస్వాదించ ప్రారంభించిన మనుజుడు ఇక తన మనస్సును ఆత్మాస్వాదన నుండి మరలించనే లేడు.

ధ్యాన యుక్తమగు చిత్తమునందు 'జ్ఞానము' ద్వారా ఏ విషయ విరక్తి అతిస్వభావికమై ఉంటుందో... అదియే 'సమాధి'. తదితరమైనదేదీ నిజమైన సమాధి కాదు. రాగాదులతో కూడిన మనస్సు ఎక్కడున్నదో అక్కడ ఎవనికీ నిజమైన సమాధి జనించదని గ్రహించు. రాగము లేని మనస్సు సమాధి స్వరూపమే అవుతుంది.

**శ్రీరాముడు :** మహర్షీ! భోగాల పట్ల విరక్తి కలిగిన తర్వాత, ఇక ధ్యానాన్ని, సాధకుడు సంపాదించు కోవటమెట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! భోగాల పట్ల విరక్తి కలిగిన తర్వాత ఇక 'ధ్యానం' అనే కార్య క్రమం, తత్సంబంధమైన బుద్ధి యొక్క అవసరం నాకేమీ కనిపించటం లేదు. భోగాల పట్ల అనురక్తి కలిగి ఉన్నప్పుడంటావా? అట్టి అనురక్తి ఉన్నంత కాలం ధ్యానం వలన ఏం ప్రయోజనం? విషయా నురక్తి ఉన్న చోట విషయధ్యాస స్వయంగానే కలుగుతుంది సుమా! కనుక ఈ సాధకుడు విషయాల పట్ల విరక్తి సంపాదించుకుంటే చాలు, ధ్యానం దానంతట అదే రూపుదిద్దుకుంటుంది. 'ఇదంతా ఆత్మ స్వరూపమే కదా!' అను దృశ్యం పట్ల ఏర్పడే దృఢమైన అభిప్రాయంతో చేసే మననమే ధ్యానం.

**దృశ్యాస్వాదనముక్తస్య, సమ్యక్ జ్ఞానవతో మునేః ।**
**నిర్వికల్పం సమాధానం అవిరామం ప్రవర్తతే ॥**

దృశ్యం యొక్క ఆస్వాదన లేనివాడు, ఉత్తమ జ్ఞానయుక్తుడు... అగు మునికి నిర్వికల్ప సమాధి నిరంతరం స్వయంగానే కలుగుతూ ఉంటుంది. ఎవనికి ఈ దృశ్యం కించిత్ కూడా రుచించకయే ఉంటుందో, అతడే 'ఉత్తమ జ్ఞాని' అని చెప్పబడుచున్నాడు. ఎందుకంటే, భోగాలు ఎప్పుడైతే రుచించవో, మరుక్షణం అతనిలో ఉత్తమ జ్ఞానం తనంతట తానే ఉదయిస్తోంది. ఎవనికైతే 'బ్రహ్మ స్వభావము' నందు విశ్రాంతి ప్రాప్తించిందో... అతనికి భోగాలలో రుచి ఎట్లా కలుగుతుంది. ఎందుకంటే బ్రహ్మ స్వభావ విరుద్ధమైన అజ్ఞానముచేతనే భోగము పట్ల రుచి ఏర్పడుతోంది. జ్ఞానంచే ఆ అజ్ఞానం తొలగిందా... అప్పుడిక భోగాల పట్ల అరుచి స్వయంగానే ఏర్పడగలదు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ మనస్సును బోధరూపంగా మలచటానికి వేదాంత శ్రవణాది ఉపాయాలు అవసరం కదా! అట్టి శ్రవణం ఎప్పుడు ముగించవచ్చు? ఎప్పటికి సమాధిలో తత్పరుడై ఉండవచ్చు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** (చిరునవ్వుతో) సాధకుడు మొట్టమొదట 1. వేదాంత శ్రవణం, 2. ఉపనిషత్తులు వంటి మోక్ష శాస్త్రాల పఠనం చేయటం, 3. ప్రణవాదుల జపం... మొదలైనవి కొనసాగిస్తూ క్రమంగా మనస్సును సమాధి యందు తత్పరం చేయాలి.

సమాధి నుండి లేచిన వెంటనే శ్రవణ-మనన-పఠన-జపాదులను అందుకోవాలి.

ఎట్లాగైనా సరే 'ఖేద రహితము-సర్వ సంశయ వర్జితము-అతి రమణీయము-సుషుప్తి వలె శాంతం-సమం-శుద్ధం' అగు చిత్తంతో నిర్వాణ రూపమగు సమాధిలో పై (ఉభయ సందర్భాల లోను) అతడు నెలకొని ఉండు గాక! యథా సమయంలో సర్వాత్మత్వానుభవం సిద్ధించిన తర్వాత అభ్యాసావశ్యకత స్వయంగానే ఉపశమించగలదు. అంతటా స్వస్వరూపమగు ఆత్మ విన్యాసమే ప్రత్యక్షమగుచుండగా ఇంక సమయాసమయములు, విధి-నిషేధములు ఎక్కడ మిగులుతాయి?

❖❖❖

## 6. ముముక్షువు - మొట్టమొదటి మెట్లు

**శ్రీరాముడు :** హే మహాత్మా! వసిష్ఠ మహర్షీ 'సమాధి గురించి మీరు ప్రవచించిన సూక్ష్మార్థం అత్యంత అమోఘమైనది. కేవలం 'మనస్సును సర్వ జగద్విషయ రహితమైన స్థానంలో ప్రతిక్షే పించటం'... అను సర్వజన-సర్వస్థితుల సుసాధ్యమైన అభ్యాసం చేత ధ్యాన-సమాధులు ఒనగూడుతాయి అనేది సర్వశాస్త్ర అమోదమైన ప్రవచనంగా నేను గమనిస్తున్నాను. అట్టి సులభతర మార్గాన్ని ప్రబోధించిన మీకు ముముక్షువులమగు మేమంతా సర్వదా కృతజ్ఞులం. స్వామీ! సంసార భారాన్ని మోస్తూ మిక్కిలి శ్రమ అనుభవిస్తూ, మరణ-మూర్ఛాది అనేక సంకటములలో దొరలుచున్న దేహికి ఆత్మలో విశ్రాంతి కలిగించగల సమాధిని సంపాదించటానికి గల వరుసక్రమమైన సోపానాలను (మెట్లను) మరల ఒకసారి ప్రవచించవలసినదిగా వేడుకొంటున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! నీవు అడిగినట్లే సోపానరూపమైన విధానం చెప్పుతాను విను.

**1. సంసారంముపట్ల వైరాగ్యం -** సుదీర్ఘ మార్గంలో ప్రయాణిస్తూ సూర్య తాపముచే ఎంతగానో ఖేదం పొందిన బాటసారులు విశాలమైన నీడను ప్రసాదించే వృక్షం కనబడగానే ఆ విశాల వృక్షం

క్రిందకు పరుగులు తీస్తారు చూచావా?అట్లాగే పూర్వ జన్మలయందు గాని, ఈ జన్మయందు గాని గావించిన జప-తప-సత్కార్యముల ప్రయోజనంగా సంసార మార్గ బాటసారియగు జీవునికి ఎప్పుడో ఈ సంసారం పట్ల అరుచి (లేక) వైరాగ్యం కలుగుతోంది. "అనుక్షణం మార్పు చెందే ఈ సంసారమును నమ్మి ఉన్నందుకు నాకీ అవిశ్రాంతమైన దౌర్భాగ్యం వాటిల్లుతోంది కదా! ఇట్లా అజ్ఞానులతో సహవాసము, సంబంధ-బాంధవ్యములు కలిగి ఉన్నందుకు నాకు అనేకసార్లు దుఃఖం-బంధం-మోహం అధికమగుచున్నాయే!"... అనే వివేకం హృదయంలో ఉత్పన్న మౌతోంది. అట్టి వైరాగ్యమయమైన వివేకపు అంకురం మనస్సులో ఉదయించగానే ఇక అతను మెల్లగా కనులు తెరచి 'సాధుత్వముచే సువిశాలమైన హృదయము గల మహనీయులు ఎక్కడెక్కడున్నారా?'... అని పరికించి చూడటం ప్రారంభిస్తున్నాడు. మునుముందుగా అజ్ఞానులతో సహవాసమును తగ్గిస్తూ త్యజించి వేయటం మొదలెడుతున్నాడు. పవిత్రులగు విద్వజ్జుల మార్గంలో స్నాన-దాన-తపో-యజ్ఞాదులు ప్రారంభిస్తున్నాడు. తనకు యోగ్యము, కోమలము, తన స్వభావమునకు అనుకూలము, తదితర జనులకు హితము, అందరికీ కూడా ఆనందకరం అగు శ్రేయో విధులను ఆశ్రయిస్తున్నాడు. పెద్దల-విజ్ఞుల అభిప్రాయాలను గౌరవిస్తూ తనయందు దురహంకారములను పారద్రోలుచున్నాడు. సర్వజన ప్రియునిగా, భవ్యశీలునిగా పరోపకారిగా తనను తాను తీర్చిదిద్దుకుంటున్నాడు. శాస్త్ర సమ్మతాలైన పవిత్ర కార్యక్రమాలకు, భగవత్ స్తోత్ర పఠనాలు-సామూహిక పూజలు వంటి భగవత్ కార్యక్రమాలకు ఉత్సాహం చూప ప్రారంభిస్తున్నాడు. అతని మాట, క్రియ, ప్రవర్తన - సౌమ్యత సంతరించుకో నారంభిస్తున్నాయి.

**2. సత్సంగం -** ఇకప్పుడు దుస్సాంగత్యం త్యజిస్తూ సత్సాంగత్యాన్ని ఆశ్రయిస్తున్నాడు. మహనీయులు, పవిత్రమైన చరిత్ర గలవారు, వివేకవంతులు అగు వారితో సాంగత్యం మహత్తరమైన ప్రభావం కలిగి ఉంటుంది. అట్టి వివేకులతోటి సాంగత్యము వలన కలిగే భయరహితమైన విశ్రాంతి ఈ 14 లోకాలలో మరెక్కడా లభించదు. అది సాధకునికి శుద్ధత్వము ప్రసాదించగలదు. విరక్తులు-సంసారాన్ని దాటి వేసినవారు అగు మహనీయులను సర్వాత్మకుడైన పరమాత్మ ముముక్షువులకు తోడుగా ఈ సంసార నామ ఎడారిలో ఒయాసిస్సులుగా ప్రసాదిస్తున్నారని గ్రహించబడుగాక! వివేకశీలురతో కొద్దిసేపు సంభాషణ అనేక జన్మలుగా వెంటనంటి వచ్చే కారుచీకటి పొరలను పటాపంచలు చేసి వేయగలదు సుమా!

**3. నిష్కామకర్మ, శాస్త్రాభ్యాసం -** క్రమంగా అభ్యసిస్తూ వస్తున్న 'నిష్కామకర్మ' బుద్ధిని శుద్ధ పరుస్తూ వస్తుంది. అట్టి శుద్ధబుద్ధికి చక్కగా పరిశుభ్రపరుపబడిన అద్దంలోని ప్రతిబింబంలాగా గురు ముఖతఃగా వినినట్టి, స్వయంగా పఠించినట్టి శాస్త్రార్థములు, ఉపనిషత్-యోగవాసిష్ఠాది గ్రంథాలలోని అంతర్లీన గానం సులభంగా హృదయస్తమౌతాయి. వివేకయుక్తమైన హృదయంలో శాస్త్రార్థ రసం ప్రవేశించుచుండగా ఉత్తమ బుద్ధి సుతీక్షణం, విస్తారమగు అవగాహన పెంపొందుతూ వస్తుంది. నిర్మలత్వంచే శోభించే బుద్ధి తనయందు శాస్త్రార్థములను పూర్తిగాను, అతి లాఘవంగాను ధరించగలుగుతుంది.

సాధు జనుల సాంగత్యంచే శుద్ధమైన చిత్తమూ, అధ్యాత్మ శాస్త్రములచే శోధితమైన బుద్ధీ, సాత్విక కార్యక్రమాలచే పరిపోషించబడిన మనస్సూ ... గలవాడు వేడినీళ్లలో పరిశుభ్రం చేయబడ్డ వస్త్రం వలె ప్రకాశిస్తాడు. అతడు సూర్యుని వలె స్వవివేక తేజంచే భాసిస్తాడు. అట్టి వాడు అభ్యాస వశం చేత తన హృదయంలోని అలోచనలన్ని శాస్త్రార్థాల గురించి, గురు వాక్యాల మహోద్దేశాల గురించి ఎక్కుబెట్టబడి ఉంటాయి. కలలో కూడా వాటినే యోచిస్తూ ఉంటాడు. క్రమంగా శాస్త్రార్థాలలో స్నానం చేస్తు తద్వారా 'రాగ ద్వేషాలు' అనే ధూళిని కడిగి వేసుకుంటూ ఉంటాడు. 'క్రోధం, అసూయ' మొదలైన దుర్గుణాలు సమసిపోతూ ఉండగా, మైత్రి-భోగాల పట్ల 'వాటిని దాటివేసినట్టి స్వభావం' మొదలైనవి అలవడుచుండగా, ఇక అతడు బోనులోంచి వెలువడిన సింహం వలె గంభీరంగా శోభిస్తాడు. 'భోగానుసరణం' అనే దౌర్భాగ్యాన్ని తన వివేకంచే పరిత్యజిస్తూ ఉండగా ఆతడు, ఆతని వల్ల వంశం, ఆతడు ఉన్న పరిసరాలు, సమాజం - శోభిస్తూ ఉంటాయి.

**4. భోగ త్యాజ్యం** - ఆతనిలో 'భోగాలు పొందలేదే? పొంది ఉన్న భోగాలు తొలగుతాయేమో?' అనే రూపంలో ఉండే దీనత్వం వివేకాగ్నిచే కాల్చివేయబడుతుంది. కేతువుచే విడువబడిన పూర్ణచంద్రునిలాగా ఆతని ముఖం నూతన కాంతులు వెదజల్లుతూ ఉంటుంది. ముల్లోకాలలోని సర్వ పదార్థములను ఆతడు తృణప్రాయంగా ఎంచుతూ ఉండటం చేత మహాత్ముల మధ్య కూడా ఆతడు కీర్తనీయుడగుచున్నాడు. ప్రారబ్ధవశం చేత ఆతనిని సమీపించే భోగాలను 'త్యాగం' అనే రసంతో తడిపి ఉంచుతాడు. 'సర్వ ద్వేషములను త్యజించిన నేను ఈ భోగాలను మాత్రం ఎందుకు ద్వేషించటం?'...అని తలచుచూ, వాటి ప్రయోజనాల పట్ల లోలోన సిగ్గును కలిగి ఉంటాడు. భోగాల ప్రాప్తిచే సిగ్గు, భోగాల అప్రాప్తిచే సంతోషం ఆతని అంతరంలో ఏర్పడుతూ ఉంటాయి. అప్పుడాతడు స్త్రీ సాంగత్యాది క్రియలలోని ఉన్మాదాన్ని గుర్తు చేసుకొని అప్పటి తన అవివేకాన్ని చూచి నవ్వుకుంటూ ఉంటాడు.

**5. సిద్ధులు-తత్ అనాదరణ-త్యాగ బుద్ధి** - అటుపై భూమిపై ఉదయించిన చంద్రుని వంటి 'వివేకి'ని చూచి ఆనందించాలనే ఉద్దేశంతో మిత్రత్వంతో గూడి సిద్ధులు ఆతనిని సమీపిస్తాయి. నిరంతరం సర్వభోగాలను అనాదరించే ఆ వివేకి ఆ సిద్ధులను కూడా తన ఉదారబుద్ధితో అత్యంత సామాన్యమైన విషయాలుగా దర్శిస్తాడు. చూచావా రామచంద్రా! జడత్వ రహితుడు-గంభీర హృదయుడు అగు వివేకి యందు, మొట్టమొదట సంసారము పట్ల 'విరసత్వం' (లేక) వైరాగ్యం జనిస్తోంది. ఆరోగ్యం కావాలనుకునే రోగి వైద్యుణ్ణి సమీపిస్తాడు చూచావా? అట్లాగే ఆ వివేకి సజ్జనులతో సాంగత్యాన్ని స్వయంగా ఆశ్రయిస్తున్నాడు. ఆ సజ్జనులు చెప్పే వాక్యాలకు ప్రభావితుడై శాస్త్రార్థములను పఠించటంలోను, శ్రవణంలో, ధారణయందు నిమగ్నుడగుచున్నాడు. అతనిలో శాస్త్రార్థముల ప్రభావంచేత త్యాగబుద్ధి వచ్చి చేరుతోంది. అట్టి త్యాగబుద్ధికి, రెండు మహత్తరమైన గుణాలు వెంటనంటి ఉండి బలవత్తరమగుచున్నాయి.

1.ఇతరుల ధనాన్ని ఆశించటంలో అరుచి, 2.తనకున్న దానితో సంతృప్తి... ఆ త్యాగం

ఇంకనూ బలవత్తరమగుచుండగా, ఇక అతడు తన దగ్గర గల ధనాదులను కూడా ఇతరుల సుఖ-సంతోష-ఆనందాల కొరకై వినియోగించటం ఆరంభిస్తున్నాడు. తనను ఎవరైనా యాచించినప్పుడు ఆ త్యాగశీలియగు వివేకి తన దగ్గర ఉన్నదేదైన ఇచ్చివేయటానికి ఉత్సుకుడౌతున్నాడు.

**దదాతి కణపిణ్యాకశాకాద్యపి హి యాచతే ।**
**తేనైవ అభ్యాసయోగేన స్వమాంసాని దదాత్య సౌ ॥**

తనను ఎవరైనా యాచించినప్పుడు తన దగ్గర మిగిలి ఉన్న నూకలను-కూరలను కూడా ఇచ్చివేయటానికి సంసిద్ధుడగుచున్నాడు. అట్టి త్యాగముయొక్క అభ్యాసంచేత ఇక తనను అర్థించినవారికి తన శరీరంలోని మాంసాన్ని కూడా ఇచ్చివేయటానికి వెనుకాడని స్థితికి వస్తున్నాడు. క్రమంగా ఆతని చిత్తము లయించనారంభిస్తుంది. చిత్తము యొక్క రూపము ప్రాపంచిక పదార్థముల పట్ల ఇష్టమే గాని, మరింకేమీ కాదు కదా! వివేకము వైపుగా పరుగులు తీస్తున్న ఆ మహనీయుని అజ్ఞానం అల్పత్వం పొందసాగుతుంది. పరుగులు తీస్తున్నవాడు అతి సులభంగా చిన్ని-చిన్ని గుంటలను దాటివేయగలుగుచున్నట్లు ఆతడు చిత్తములోని ఆయా విషయ పరంపరలను అతిసులభంగా (ఆ స్థితిలో) జయించివేయగలుగుతాడు.

**6. ధనాదుల పట్ల 'అనురక్తి' త్యజించటం** – 1.ముముక్షువు మొదట ఇతరుల ధనాదుల పట్ల విరక్తిని అభ్యసించాలి. 2.ఆ తరువాత వివేకం చేత తన దగ్గర ఉన్న ధనాదుల పట్ల కూడా అనపేక్ష, విరక్తులను పెంపొందించుకోవాలి. ...ఇక ఆపై ఆత్మయందలి పరమ విశ్రాంతి కొరకై తన యొక్క ధనాదుల విరక్తితో బాటు విరాగము అను రూపంలో ఉండే భోగత్యాగం సంపాదించుకోవాలి.

**న తాదృశం జగత్ యస్మిన్ దుఃఖం నరకకోటిషు ।**
**యాదృశం యావత్ ఆయుష్కం అర్థోపార్జన శాసనమ్ ॥**

ఈ జీవితమును ధనోపార్జనయే ముఖ్యమైన లక్ష్యంగా వెచ్చించే వారి దుఃఖములు కోట్ల కొలది నరకములు అనుభవించే వారికి కూడా ఉండవు. ఎందుకంటావా?

**ఆసనే, శయనే, యానే, గమనే, రమణే జనే ।**
**'ఆధి' చింతాపరాఏవ', నను మూఢా విదన్తు తామ్ ॥**

ధన సముపార్జనలో బుద్ధిని నియమించిన వారు ఇక కూర్చున్నప్పుడు, పరుండినప్పుడు, నడుస్తున్నప్పుడు, క్రీడిస్తున్నప్పుడు, జనుల మధ్య ఉన్నప్పుడు... అన్ని వేళలా ఆలోచనలన్నీ "ధనాన్ని సంపాదించటం, దాచటం, కాపాడుకోవటం"... అనే వ్యవహారాల పట్లనే ధ్యాసంతా కలిగి ఉంటారు. వారు తమ మనసుకి పట్టిన చింతలేమిటో తమకే తెలియకుండానే అనేక చింతలలో సతమతమౌతూ ఉంటారు.

వారు తమ-తమ చింతల గురించి ఇతరులకు చెప్పుకోలేరు. తాము భరించలేరు! వివేకంతో విచారించి చూస్తే... ధనం మహా అనర్థముల కొరకే అయి ఉన్నది. సంపదలు నిరంతర ఆపదలవైపే ఎక్కుబెట్టబడి ఉన్నాయి. భోగములు సంసార రోగముల వృద్ధి కొరకే అగుచున్నవి. ఎంతెంతవరకైతే

ఈ జీవుడు 'ధనము' అనే అనర్ధమును అభిలషించకయే ఉంటాడో, అంతంత వరకు ఈతడు 'విషయ చింతనలు' అనే సెగలచే దహించక ఉంటాడు. ఎవనికైతే 'శాశ్వతము-సర్వోత్తమము' అగు మోక్షము రుచించుచున్నదో, అంత వరకు ఆతడు ధనమును, విషయ జగత్తును గడ్డిపరక యొక్క చివరి ముక్కలాగా అతితుచ్ఛంగా గాంచగలుగుతాడు. ధనస్పృహాత్యాజ్యం సంపాదించుకొన్న వారికి ఆత్మయందే సుఖమును గాంచటం క్రమక్రమంగా అతిసులభమౌతుంది. అనేక శోక-మోహాది భావ వికారములు, అనేక దుష్కర్మలు, దీనత్వము, దుష్టచేష్టలు ఇవన్నీ కూడా ధనము పట్ల గల దురాశయే మూలముగా కలిగి ఉన్నాయని చెప్పబడుచున్నది.

**7. సంతోషాభ్యాసం -** ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో జరామరణాది చిత్త రోగములచే పూర్ణులై ఉన్న జీవులు అట్టి జరామరణాదుల నుండి విముక్తి పొందాలంటే 'సంతోషము' అనేదే ఉత్తమ ఔషధం. సంతోషమును అభ్యసించేవాని ఉత్తరోత్తర అనుభవం చక్రవర్తికిగాని, ఇంద్రలోకం పొందిన వారికిగాని లభించటం లేదు. 'సంతోషము' అభ్యసించేవాడే పూర్ణత్వముచే శోభించుచున్నాడు. 'అభిలాష' అనే దోషము గల జీవుడు నిష్కారణంగాను, అనాలోచితంగాను తన సంతోషమును కోల్పోయి, ఇక ఒక దుఃఖము నుండి మరొక దుఃఖమునకు పరుగులు తీస్తూ ఈ సంసారారణ్యంలో తిరుగాడుచున్నాడు. ఆతని పాట్లు చెప్పు క్రింద పడ్డ పురుగులాగా అతిదీనంగా ఉంటున్నాయి. 'ధనవాంఛ' అనే వికృతరూపము దాల్చిన జీవుడు ఎన్నటికీ శాంత స్థితికి చేరుకోనే లేదు సుమా!

**అర్థోపార్జన-రక్షాణాం జానన్నపి కదర్థనామ్ ।**
**యఃకరోతి స్పృహాం మూఢో, 'నృపశుం' తం న సంస్పృశేత్ ॥**

ధనము యొక్క 'ఆర్జన-రక్షణ' మొదలైన వాటిలో గల దుఃఖమును, కాలయాపనను గమనించి కూడా ఏ మూఢుడు అట్టి ఆశాపాశముల నుండి విడవడటానికి ఇష్టపడడో, అట్టి నరపశువును తాకనే కూడదు సుమా! ఎవడైతే "తృష్ణారాహిత్యము" అనే కొడవలితో మనస్సు యొక్క (1) బాహ్య విషయానుసరణము (2) అభ్యంతర సంకల్ప పరంపరలు అనే రెండు దోషాలనూ ఒకేసారి కోసివేయుచున్నాడో... అట్టి వాని హృదయక్షేత్రంలో 'ఆత్మజ్ఞానం' అత్యల్ప సమయంలో ప్రకాశించగలదు. జ్ఞాని ఈ దృశ్యవిషయ సముదాయమును స్వప్న విషయమువలె అసద్రూపంగా గమనిస్తున్నాడు. కాని అజ్ఞానులకు ఇదంతా సత్యంగా, శాశ్వతంగా, సద్రూపంగానూ అనిపిస్తోంది. అట్లా అనిపించటానికి కారణం సత్యము-నిత్యము అగు దానిపట్ల అభ్యాసరహిత్యమే సుమా!

ఓ రామచంద్రా! ఈ విధంగా - మొట్టమొదట ఈ సంసారం పట్ల వైరాగ్యం, తరువాత సత్సాంగత్యం, అటుపై అధ్యాత్మ శాస్త్రార్థముల యొక్క భావనచే భోగములను పరిత్యజించి ఉండటం, ఆపై తృష్ణారాహిత్యం యొక్క దృఢాభ్యాసం... పై సోపానముల ద్వారా జీవుడు పరమార్థమగు ఆత్మతత్త్వమును ఎఱిగి తనను తాను మోక్షార్హునిగా తీర్చిదిద్దుకుంటున్నాడు.

❖❖❖

# 7. ఈశ్వరుడు ఎక్కడున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఈ జీవుడు పరమేశ్వరుని చేరేది ఎట్లా?" అనే విషయం మనం సంభాషిస్తున్నాం కదా! అందుకు ఏమేమి ఆవశ్యకమో మరల ఒక్కసారి గుర్తు చేసుకొని ఇక ఆ పై ఆత్మ యందు విశ్రాంతి ఎట్లా సుస్థిరపడుతుందో చెప్పుకుందాం.

**ఆవశ్యకతలు**

1. సంసారం పట్ల వైరాగ్యం దృఢపడటం; 2. సాధు జనులతో సాంగత్యం సిద్ధింపజేసుకోవటం; 3. నిర్మలబుద్ధితో శాస్త్రార్థములను భావించటం; 4. భోగాల పట్ల తృష్ణను రహితం చేసుకోవటం; 5. విషయాల పట్ల విరసత్వం; 6. సద్గుణాలను అభ్యసించటం, సజ్జనత్వం సంతరించుకోవటం; 7. హృదయంలో జ్ఞాన ప్రకాశాన్ని ఉదయింప జేసుకోవటం...

ఇట్లు జ్ఞానప్రకాశం వైపు ఉన్ముఖమైన వివేకి ఇక ధనాదులను వాంఛించడు. సర్వప్రాపంచిక విషయాలను హృదయం నుండి ఊడ్చివేసి ఉంటాడు. అప్పుడాతనికి స్త్రీ-ధన-బాంధవ్యాదులు కూడా భారంగా అనిపిస్తాయి. యథాశక్తి, యథాకాలం వాటిని మనస్సుచే త్యజించి వేసి ఉంటాడు. ఇక ఈ ఇంద్రియాలు ఇంద్రియార్థములలో ప్రవర్తిస్తూ ఉన్నప్పటికీ వాటియందు ఆతడు తప్పనిసరిగా సంలగ్నం కావలసి వస్తున్నప్పటికీ... అంతరంలో పరమ శాంతచిత్తుడై ఉండటం చేత... వాటినన్నిటిని పొందకయే ఉంటాడు.

ఆతనికి ఇక ఏకాంత దశలలో గాని, సరోవరాలలో గాని, అరణ్యాలలో గాని, వనవాటికలలో గాని, పవిత్రస్థానాలలో గాని, స్వగృహంలో గాని, మిత్రులతో ఏర్పడే క్రీడావిలాసాలలోగాని, ఉత్తమ ఉద్యానాలలో గాని, భోజనాది క్రియాకలాపాలలో గాని, శాస్త్ర తర్క-వితర్కాలలో గాని.... ఆసక్తి ఉండదు. వాటిలో వేటి యందూ దీర్ఘకాలం ఉండడు.

ఆతడు ఎల్లప్పుడూ తనయందే వెలయుచూ ఉంటాడు. ఆతడిక పరమశాంతుడై ఉంటాడు. దాంతుడై (ఇంద్రియాలను జయించినవాడై) ఉంటాడు. ఆత్మారాముడుగాను, మునిగాను, విజ్ఞానైక నిరతుడుగాను ఉంటాడు. తన దేహ-ఇంద్రియాలకే సాక్షి అయినట్టి 'ప్రత్యగాత్మ' యొక్క అన్వేషణలో మాత్రమే ఉంటాడు. తాపముచే సంతృప్తుడైన మనుజుడు చల్లటి నీళ్ళతో స్నానం చేసి విశ్రాంతి పొందుతాడు చూచావా? ఆ ప్రకారంగా 'ఆత్మాన్వేషణం' అనే అభ్యాసం చేత 'శాంతుడు' అగుచున్న యోగి పరమపదమగు 'ఆత్మ' యందు విశ్రాంతిని సంపాదించుకుంటున్నాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ బాహ్య-అభ్యంతర రూపమైన దృశ్య పదార్థమంతా ఎట్లా ఉదయిస్తోంది? ఇదంతా ఏమైయున్నది? ఏమి కానున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

> **స బాహ్య-అభ్యంతరం శాన్తా జ్ఞతైవార్థ తయోదితా ।**
> **'న సంభవతి భిన్నో అర్థ' ఇత్యేవ పరమం పదమ్ ॥**

స్వాత్మ గురించిన అజ్ఞానమే ఈ బాహ్య-అభ్యంతర దృశ్య పదార్థరూపంగా ఉదయిస్తోంది! కాబట్టి అట్టి అజ్ఞానం ఆ పదార్థముల కంటే భిన్నమైనది కాదు. అనగా ఆయా దృశ్య పదార్థముల పట్ల అనుభవరూపమే అజ్ఞానం యొక్క రూపం. పదార్థములకు వేఱుగా అజ్ఞానం ఎచ్చటా సంభవించదు. కనుక ఎప్పుడైతే ఈ దృశ్యం త్యజించబడుతుందో, అట్టి త్యాగము చేత మాత్రమే అజ్ఞానం శమిస్తుంది. అట్టి దృశ్య త్యాగం చేత అద్దాని సాక్షియగు ఆత్మయందు స్థితి కలుగుతుంది. సాక్షియందు స్థితి కలిగిన తరువాత శేషించే శాంతమగు ఆత్మస్థితియే 'పరమ పదం' అయి ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! 'పరమ పదము' అనగా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎచ్చటయితే కేవల చిత్తు లేక 'బోధ' తప్ప ఇక తదితరమైన పదార్థం గాని, శూన్యత్వం గానీ మచ్చుకైనా ఉండదో... అట్టి అంతరంగము నందలి నిజానుభవ స్థితియే 'పరమ పదం' అని చెప్పబడుతోంది. ఓ రామచంద్రా! సమస్త పదార్థములు కూడా ఉపరూపమగు బోధగా పరిణమించటం జరుగగా... ఇక ఎచ్చటైతే పదార్థం గాని, పదార్థత్వం గాని, శూన్యత్వం గాని లేకయే ఉన్నాయో, అట్టి స్థితికి శాస్త్రకారులు 'పరమపదం' అనే పేరుపెట్టారు.

ఓ రాఘవా! కేవలం స్వాత్మామాత్రమున విశ్రాంతి పొందిన మనో అతీత స్వభావులగు మహాత్ములకు విషయాల పట్ల 'కించిత్' కూడా రుచి ఉండదు. బహిర్ముఖత్వ నిరోధ రూపమగు స్వభావమును సంపాదించుకున్నవాడు, మౌని, ఈ శరీరాదులందు 'ఇవి సుస్థిరం' అను అభిప్రాయం లేనివాడు, ఆత్మజ్ఞుడు అగు మహనీయుడు 'చిత్రం'లో లిఖించబడిన 'నదీజలం' లాగా నిశ్చలంగా ఆత్మ స్వభావమునందే నెలకొని ఉంటాడు.

ఇక ఆత్మజ్ఞాని యొక్క హృదయం ...సర్వ పదార్థములతో కూడుకొని ఉన్నప్పటికీ... పదార్థ రహితంగాను, విస్తారమై ఉన్నప్పటికీ... పరమాణుసదృశంగాను, అశూన్యమైనప్పటికీ... శూన్య సమంగాను ఆత్మజ్ఞాని యొక్క హృదయం భాసిల్లుతోంది. ఈ అహంభావం, జగత్తు, ఈ జగత్తు యొక్క చేష్టలు, దేశ-కాలాదుల కల్పన, జ్ఞాతృ-జ్ఞాన-జ్ఞేయములతో కూడుకున్న త్రిపుటి, శూన్య - అశూన్యములు - ఈ మొదలైనవన్నీ ఎదురుగా ఉన్నప్పటికీ ఆత్మజ్ఞాని యొక్క దృష్టిలో ఇవన్నీ "మిథ్యమాత్రం" గాను, స్వతఃగా కించిత్ కూడా 'లేనివి' గాను అగుచున్నాయి.

**మానవాకార జ్ఞాన సూర్యుడు :** దీపం వెలగగానే అంధకారం పటాపంచలైపోతుంది చూచావా?... నిర్మలమగు ఆత్మపదమనే వెలుగును అధిరోహించినట్టి జ్ఞాని యొక్క హృదయంలో దృశ్యం-రాగం -ద్వేషం-భయం అనే అంధకారానికి చోటు ఉండదు.

ఎవని రజోగుణం సంపూర్ణంగా నశించి ఉంటుందో, తన శుద్ధ సత్త్వగుణం చేత ఎవని తమోగుణం మొదలంట అధిగమించబడి ఉంటుందో, ఎవని సమక్షంలో అజ్ఞానాంధకారం ఆతని జ్ఞానప్రకాశంచే మ్రింగివేయబడి ఉంటుందో... అట్టి మానవాకార సూర్యుడు తదితర జనులందరికీ నమస్కరించుటకై అర్హుడగుచున్నాడు. భేదం సంపూర్ణంగా శమించగా అప్పుడు చిత్తం అదృశ్యమవు తోంది. అప్పుడిక అట్టి ఆత్మజ్ఞాని స్థితి ఎట్టిదో... అది వాక్కుచే చెప్పటానికి సాధ్యపడేది కాదు.

రాత్రింబవళ్ళు చాలా కాలంగా ఒనర్చిన 'పరమ భక్తి'చే సంతోషించిన ఆ ఈశ్వరుడు నిష్కల్మష-నిర్భేద హృదయుడైన వివేకికి 'నిర్వాణం' అనబడే సర్వాత్మ దర్శన స్వరూపమగు ఉత్తమ స్థితిని ప్రసాదిస్తున్నాడు.

**సర్వము ఈశ్వరమయం -**

**శ్రీరాముడు :** స్వామీ! ఈశ్వరుడు అనగా?

**ఈశ్వరఃకో? మునిశ్రేష్ఠ! కథం భక్త్యా ప్రసాద్యతే ।**
**ఏతన్మే తత్త్వతో బ్రూహి, సర్వతత్త్వ విదాంవర ॥**

తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడగు ఓ మునివరా! మీరు చెప్పిన ఆ 'ఈశ్వరుడు' అనగా ఎవరు? భక్తిచే ఆతడు ఎట్లా ప్రసన్నం అవుతాడు? దయచేసి నాకీ విషయం యథార్థంగా తెలియజేయండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీ ప్రశ్నకు సూటి అయిన సమాధానం విను!

**ఈశ్వరో న, మహాబుద్దే! దూరే, న చ దుర్లభః,**
**మహా బోధమయైకాత్మా, 'స్వాత్మైవ పరమేశ్వరః'!**

ఓ మహాబుద్ధీ! ఆ ఈశ్వరుడు ఎక్కడో దూరంగా లేడు. కొందరు 'ఆతడు అతి దుర్లభుడు. సామాన్యులకు లభించేవాడు కాదు'.... అని అంటూ ఉంటారు. అదీ నిజం కాదు. మరి? మహాబోధమయైక స్వరూపమగు స్వాత్మయే ఆ పరమేశ్వరుడు.

మహాబోధమయైక స్వరూపమగు స్వాత్మ అనగా... ఆత్మ యొక్క ప్రపంచాన్ని పొందే మనన విభాగమే మనస్సు (లేదా) మనోచైతన్యం. 'మనస్సు' నుండి ప్రపంచత్వాన్ని ప్రక్కకు పెట్టి నప్పుడు మిగిలి ఉండేదే నిర్మల చైతన్యం. అట్టి ప్రతి ఒక్కరి యొక్క నిర్మల చైతన్యమే పరమేశ్వరుని స్వరూపం.

అంటే, చైతన్యం ఎక్కడ 'దృశ్య సంబంధ తృష్ణ' అనే స్వభావాన్ని ప్రదర్శిస్తోందో, దానిని 'జీవుడు' అని పిలుస్తున్నాం. అద్దానినే 'మనస్సుతో కూడిన చైతన్యం' లేక 'మనో చైతన్యం' అని కూడా అంటున్నాం. చైతన్యం తన మనో స్వభావాన్ని అతిక్రమించి ఉన్నప్పుడు శివుడు - "శుద్ధచైతన్యం" అంటున్నాం. అట్టి శుద్ధ చైతన్యమే ఈ జీవుని నిజమైన రూపం.

మనస్సులో'జగద్దర్శనం' అనే అభ్యాసాన్ని తొలిగించి చూస్తే దానిని 'బోధ స్వరూపం' అంటాం. అట్టి బోధస్వరూపాన్ని దేహ మనో బుద్ధ్యాది పరిధులను త్యజించిస్తే 'మహాబోధ స్వరూపం' అంటాం. అట్టి మహాబోధ స్వరూపమగు స్వాత్మయే 'పరమేశ్వరుడు' అను శబ్దంచే ఉద్దేశింపబడుతోంది.

ఈ సమస్తమూ ఆ పరమేశ్వరుని కొరకే అయి ఉన్నది! ఆ పరమేశ్వరుని నుండే ఈ సమస్తం ఉత్పన్నమగుచున్నది! ఆ పరమేశ్వరుడే ఈ సమస్తం అయి, అంతటా కూడా వ్యాపించి ఉన్నాడు! సమస్త జీవుల హృదయంలో వెలుగొందుచున్నది ఆతడే! ఆ పరమాత్మయే సర్వాన్ని ఆక్రమించుకొని సర్వమయుడై ఉన్నాడు. సర్వమునందలి నిత్యుడు అతడు మాత్రమే. సర్వ స్వరూపుడు, సర్వాత్మకుడు అగు ఆ పరమేశ్వరునికి మేము నిత్యం ప్రణమిల్లుచున్నాము.

**తస్మాదిమాః ప్రసూయన్తే సర్గ ప్రలయ విక్రయాః ।**
**అకారణం కారణతో గతయః పవనాదివ ॥**

ఆ పరమేశ్వరుని నుండే ఈ 'సృష్టి-స్థితి-ప్రళయం' అనే చమత్కార విశేషాలన్నీ జనిస్తున్నాయ్! ప్రపంచంలో సర్వము కార్య-కారణ ములచే ఏర్పడుచున్నాయి. అయితే ఆ పరమేశ్వరుడో? ఆతడు స్వయంగా కారణ రహితుడు. అయినప్పటికీ ఆతడే సర్వ కారణములందు వ్యాపించి ఉన్నాడు. అంతే కాదయ్యా! సర్వ ప్రాణులలోని ప్రాణాదుల గతులన్నీ ఆతని వలననే సంభవిస్తున్నాయి. ఈ ప్రాణకోట్లంతా తాము కోరుకున్న పదార్థములను ప్రసాదిం టానికి గాను ఆయననే నిరంతరం ఆయా అన్ని చోట్లా అనేక నామ రూపాలతో పూజిస్తున్నారు. ఈ జీవులు తమ యథేష్టమగు రుచి ననుసరించి అనేక జన్మలలో ఆయనను పూజిస్తూ ఉండగా ఆయన వారి పట్ల ప్రసన్నుడగుచున్నాడు.

**ప్రసన్నః స మహాదేవః, స్వయమాత్మా మహేశ్వరః ।**
**బోధాయ ప్రేరయత్యాశు దూతం పూతం శుభేహితైః ॥**

మహాదేవుడు, పరమేశ్వరుడు, సర్వాత్మకుడు అగు ఆయన ఈ జీవులు చేసే పూజలకు ప్రసన్నుడై, 'బోధ' కొఱకై పవిత్రుడగు తన దూతను ప్రేరేపణ చేయుచున్నాడు.

**వివేక మహత్యము -**

**శ్రీరాముడు :** **ఆత్మనా పరమేశాన కోదూతః ప్రేత్యతే మునే?**
**సదూతో బోధనం వాపి కరోతి? వద మే కథమ్?**

**శ్రీరాముడు :** మునీంద్రా! ఆత్మస్వరూపుడగు ఆ పరమేశ్వరుడు ఏ తన దూతను ప్రేరేపిస్తున్నారు? ఆ దూత ఏ రీతిగా బోధ చేస్తున్నారు. వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆత్మ స్వరూపుడగు ఆ పరమేశ్వరునిచే ప్రేరేపించబడే దూత మరెవరో కాదు. ఆయన ఈ జీవులలో గల 'వివేకము'నే ప్రేరేపణ చేస్తున్నారయ్యా! హృదయంలో ప్రవేశించిన ఆ 'వివేకం' అనే దూత ఆకాశంలో ప్రవేశించిన చంద్రుని వలె అత్యంత ఆహ్లాదకారకుడగుచున్నాడు. ఆ 'వివేకము' అనే దూత వాసనామయుడగు ఆ జీవునికి క్రమక్రమంగా 'ఉద్బోధ' చేస్తున్నాడు. క్రమంగా ఆ జీవుని ఆ వివేకదూత సంసార సాగరం నుండి తరింపజేస్తున్నాడు.

**బోధాత్మై ఏషో అంతరాత్మైవ పరమః పరమేశ్వరః**
**అస్యైవ వాచకోనామ ప్రణవో వేద సమ్మతః ॥**

బోధస్వరూపుడగు ఆ 'అంతరాత్మ' యే ఉత్తముడగు పరమేశ్వరుడయ్యా! మరి ఆతని పేరు? నామరూపాలు ఆయనకి ఆపాదించటమెట్లా? అదట్లా ఉండగా, నామ-రూపాదుల సహాయం లేకపోతే ఆయనను మననం చేయటమెట్లా? అందుచేత వేద సమ్మతమైన 'ఓం' (అకార - ఉకార - మకారాలు) అనే ప్రణవమే ఆతని వాచకమై ఒప్పుచున్నది. ఈ దేవతలు, మనుజులు, నాగులు, అసురులు మొదలైన వారంతా కూడా వారి వారి బుద్ధి, ఊహ, ప్రమాణం, సంస్కారాలను అనుసరించి నామరూప సహితంగానో, లేక నామరూప రహితంగానో వారి వారి జప-హోమ-

తప-దాన-పఠన-యజ్ఞ-యాగాది ఆయా క్రియా క్రమములచే ఆ ఓంకారవాచక పరమేశ్వరునే నిత్యము ప్రసన్నం చేసుకునే ప్రయత్నంలో ఉన్నారు.

❖

స్వర్గం ఆ పరమేశ్వరుని శిరస్సు. భూమి ఆయన పాదాలు. నక్షత్రాలు ఆయన రోమ సమూహాలు. సమస్త ప్రాణికోట్లు ఆయన అస్థులు. ఆకాశం ఆయన హృదయం. చిత్స్వరూపుడైనట్టి ఆ పరమేశ్వరుడు అన్ని చోట్ల ప్రవేశిస్తున్నాడు.

**సర్వత్రైష చిదాత్మత్వాత్ యాతి, జాగర్తి, పశ్యతి,**
**తేనైష సర్వతో లక్ష్య కర-కర్ణ-అక్షి-పాదభృత్ ॥**

అంతటా నిరంకుశంగా ప్రవేశిస్తున్నాడు. సర్వదా ఆయన మేలుకొనియే ఉన్నాడు. సర్వులను గాంచుచునే ఉన్నాడు. సర్వుల లక్ష్య స్వరూపుడు అయి ఉన్నాడు. సర్వత్రా చేతులు-పాదములు-చెవులు-నేత్రములు మొదలైన ఇంద్రియములన్నీ ధరించుచున్నది ఆయనే! ఆ పరమాత్మ ఈ జీవుని ప్రార్థనాదులకు సంతోషించి ఆతనియందు వివేకము అనే దూతను ఉద్బోధిస్తున్నారు కదా! ఆ వివేక దూత హృదయంలో ప్రవేశించి 'చిత్తము' అనే పిశాచమును చంపి ఈ జీవునికి తన యొక్క మహత్తరమైన 'ఆత్మ పదము'ను పొందింపజేస్తున్నాడు.

**స్వాత్మయగు పరమేశ్వరుని శరణువేడండి!** - కాబట్టి ఓ ప్రియ జనులారా! మీరంతా మీ పురుష ప్రయత్నంచే అనర్థయుతాలైన సమస్త వికారాలను, సమస్త వికల్ప సమూహాలను త్యజించండి. సర్వ ప్రయత్నాలచే స్వయంగా ఆత్మ చేతనే ఆత్మ భూతుడగు ఆ సర్వాత్మకుని, పరమేశ్వరుని ప్రసన్నం చేసుకోండి. ఈ సంసారమనగా ఏమిటో కాస్త గమనించండి. అతి చపలమైనట్టి 'మనస్సు' అనే పిశాచంతో కూడుకొన్నదై, శోక-మోహాదులు అనే మేఘాలచే క్రమ్ముకొన్నదై ఈ సంసారం హృదయంలో వ్యాపించి ఉంది. మరిక స్వాత్మయగు పరమేశ్వరుని శరణు వేడటమే ఉపాయం. ఆయనే వివేక సూర్యుని రూపంలో ఈ సంసారాంధకారాన్ని పటాపంచలు చేయగలడు.

సంసారం ఎట్టిదో వినండి. ఇది ఒక అగాధం వంటిది. ఇందులో "మరణం పునర్జన్మ" మొదలైన దురవస్థలు-ఆవర్తాలు (సుడులు) కలిగి ఉన్నది. అతి వ్యాకులమై ఉంటోంది. 'తృష్ణ' అనే చంచల తరంగాలు యథేచ్ఛగా సంచరిస్తున్నాయి. మనస్సు అనే సుడిగాలి ఇందులో అవిశ్రాంతిగా వీస్తోంది. ఇందులో 'ఇంద్రియ విషయాపేక్షలు' అనే మొసళ్లు సంచరిస్తున్నాయి. అట్టి ఈ సంసార సముద్రాన్ని దాటటానికి ఉన్నది ఒక్కటే ఉపాయం - అదే 'వివేకం' అనే నావను ఆశ్రయించటం.

ఓ ప్రియ జనులారా! ముందుగా మీకు అభిమతమైన మార్గంలో పూజ-తపస్సు మొదలైన వాటితో ఆ పరమేశ్వరుని సంతోషింపజేయండి. ఆయన 'వివేకం' అనే పవిత్రమైన దూతను మీకు ప్రసాదిస్తున్నాడు. ఇక 'సత్సాంగత్యం, శాస్త్రాభ్యాసం' అనే పరమార్థ బోధను ప్రవృద్ధం చేసుకోండి. మీ వివేకం క్రమక్రమంగా వికసించుగాక! అప్పుడా వివేక దూత 'పరమార్థబోధ' ద్వారా ఈ జీవుని 'నిర్మలం-ఏకం-అద్వితీయం-ఆద్యం' అయినట్టి ఆత్మపదాన్ని పొందింపజేయగలడు.

❖❖❖

# 8. వివేకి యొక్క దర్శనం-మననం-అనుభవం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'వాసనలు' అనే మలాన్ని తమయందు పూర్తిగా తొలగించుకొన్నట్టి దృఢ వివేకులగు మహనీయులలో లోకోత్తరమైన ఒకానొక మహనీయత్వముతో కూడిన బుద్ధి జనిస్తోంది. వారి బుద్ధి ఔదార్యం-మహనీయత్వం-మహత్వం-గాంభీర్యత్వం-అతి సౌందర్యం సంతరించుకొంటోంది.అట్టి బుద్ధికి అగుపించే తాత్త్వికదర్శనం తదితర సామాన్య జనులకు అర్థం కానిది. అట్టి బుద్ధిని ప్రలోభపరచగలిగేదేది ఈ 14 లోకాలలో ఎక్కడా ఏదీ లేదు. ఉండజాలదు.

"ఈ జగత్తు అనబడేది చిత్తభ్రాంతి మాత్రమే!" అనే విశ్వాసం సజ్జనులలో ఉంటోంది. వారిలో బాహ్యాలైన ఈ శబ్ద-స్పర్శ-రూపాది విషయాలు గాని, అభ్యంతరాలైన సంకల్పాలు-మనస్సు-ఇంద్రియార్థాలు గాని, వాటన్నిటి వల్ల జనించే అజ్ఞానం గాని చోటు పొందలేకయే పోతున్నాయి. 'రెండవ చంద్రుడు-మృగతృష్ణ-ఆకాశంలో కేశాలు'... వంటి జగత్ భ్రాంతిని స్ఫురింపజేసే వాసనావృత్తి వారి హృదయం నుండి తొలగి, దీపం వెలిగించిన తరువాతి చీకటిలాగా, ఎచటికో తొలగిపోతున్నది. వాసనావృత్తి హృదయంలో చోటు చేసుకొని ఉండటం చేతనే 'జగత్తు' అనబడే బహువిధ విషయ-విశేషముల సముదాయం ద్యోతకమౌతుంది. వాసనావృత్తి (లేక) దృశ్యవృత్తి నశించినప్పుడు అంతటా చిదాకాశమే ఉన్నట్లు అనుభవం కాగలదు. అయితే అట్టి వాసనాశూన్యావస్థ మనస్సు యొక్క 'అభావ స్థితి' యందు మాత్రమే (అమనస్క స్థితిలో మాత్రమే) సిద్ధించగలదు. వివేకి అయినవాడు అట్టి మనో అభావ స్థితిని ఎందుకు వదలుకోవాలి?

**నాలుగవ అవస్థ - తురీయావస్థ -**

**శ్రీరాముడు :** స్వామీ! మనస్సు యొక్క అభావ స్థితి (లేక) అమనస్క స్థితి అంటే ఏమిటి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సామాన్యంగా జీవులందరికీ 1.జాగ్రదవస్థ, 2.స్వప్నావస్థ, 3.సుషుప్త్యావస్థ అనే మూడు అవస్థలే అనుభవమౌతున్నాయి. జనులందరూ ఈ మూడు అవస్థలను ఒకదాని తర్వాత మరొకదాన్ని ఆటవిడుపు లేకుండా అనుభవిస్తున్నారు కదా! వాస్తవానికి ఈ మూడు కాకుండా మరొక అవస్థ ఉన్నది. అది ఈ మూడు అవస్థలకు సంబంధించక, ఆ మూడిటిచే స్పర్శించబడక, ఆ మూడు సందర్భముల చేత అవిభాజ్యమై-అనిరోధకమై, అనుశ్రుతమై, అవిరామమై, అనునిత్యమై చెన్నొందుతోంది. ఆ అవస్థలకు శాస్త్రకారులు 'తురీయావస్థ' అని పేరు పెట్టారు.

ఉదాహరణకు... ఒకాయన ఇంట్లో ఉండటమో, వీథిలోకి వెళ్ళటమో, ఊరు వెళ్ళటమో జరిగిందనుకో. ఆయన ఇంట్లో ఉంటేనేమో 'ఇంట్లోని మనిషి' అంటాం. వీథిలోకి వెళ్ళినప్పుడు 'వీథిలోని మనిషి' అంటాం. ఊరు వెళ్ళినప్పుడు 'ఊరు వెళ్ళిన మనిషి' అంటాం. ఆ మూడు సందర్భాలలోను ఆయన ఒక్కడే-ఒకే రీతిగా ఉన్నాడు గాని మరొకటిగా అగుట లేదు కదా! ఆయన ఆయనగానే యథాతథంగా ఉన్నప్పటికీ, ఆయన గురించి చెప్పుకొనేవారి సౌలభ్యం కొరకై 'ఇంట్లోని ఆయన-వీథిలోని ఆయన-ఊరు వెళ్ళినాయన'... అనేవన్నీ వచ్చాయి. ఆయన వస్తు సంబంధంగా చూస్తే ఈ మూడిటికీ సంబంధించినవాడే కదా!

అట్లాగే తురీయావస్థ వాస్తవానికి ఒక అవస్థ కాదు. అది 'అవస్థాత్రయ సాక్షి' అని అనవచ్చు. అట్టి అవస్థాత్రయ సాక్షిత్వము సంపాదించుకొని ఉన్న వివేకియందు అజ్ఞానం నశించి ఉండటంచే వాస్తవానికి ఈ జగత్తును చూచుటయే లేదు. అయినా కూడా ప్రారబ్ధ విశేషం చేత అతడు ఈ జగత్తులో దేహాన్ని ధరించి కనబడుచున్నాడు. కాబట్టి, అతడు జగత్తును చూస్తూ ఉన్నట్లే అన్యులకు కనిపిస్తూ ఉంటుంది. అతని దృష్టి మాత్రం ఈ జాగ్రత్-స్వప్న-సుషుప్తులను అధిగమించినదై ఉంటోంది. ఆ వివేకి దృష్టి అవస్థాత్రయాన్ని తనలో కలుపుకొని ఉన్నట్టి అప్పటికీ శేషించి ఉన్నట్టి 'పరమావస్థ'ను దర్శిస్తూ ఉంటుంది.

**శ్రీరాముడు :** అనగా? వారు ప్రారబ్ధానంతరం ఈ దేహాదులు పొందరని అనుకోవచ్చా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ దేహాలకు – ఆ వివేకులకు అనునిత్యంగా అనుభవమయ్యే తురీయావస్థకు సంబంధమే లేదు. అనగా వారి అసిధారావృతమైన తురీయానుభవం శరీరాలు వచ్చినప్పుడుగాని, లేక అవి తొలగుచున్నప్పుడు గాని ఆటవిడుపు పొందేది కాదు. వారి యొక్క వ్యుత్థాన కాలమందు సమాధి నుండి మరలుటలేదు. వారు ఈ జగత్తును ఘన పదార్థములుగా (భూమి మొదలైన వివిధ వికార రూపాలుగా) చూడరు. రత్నం యొక్క వివిధ కాంతిపుంజాలు వివిధమైన దిక్కులుగా ప్రసరిస్తూ ఉన్నప్పటికీ ఆ వేర్వేరు కాంతిపుంజాలు రత్నమునకు సంబంధించినవే కదా! అట్లాగే వారికి జగత్తులో కనిపించే భేదమంతా అభాసమాత్రంగా, పరమాత్మ యొక్క కిరణపుంజాలుగా కనిపిస్తుంది. వారికి ఈ జగత్తు జగత్తుగానే కనిపిస్తూనే, మరొక ప్రక్క ఇదంతా శూన్యమాత్రంగా సుస్పష్టమౌతూనే ఉంటుంది. స్వస్వరూపచమత్కారంగా అనుభవమౌతుంది.

**న ఇహ సత్యాని భూతాని, న జగత్తా, న శూన్యతా,**
**ఇదం బ్రహ్మాఖ్యరత్నేశ ప్రభాజాలం విజృంభితమ్ ॥**

వాస్తవానికి ఇక్కడ కనిపించే భూతజాలం (జీవులు, దేహములు మొదలైనవి) సత్యం కాదు. అట్లాగే జగత్తు కూడా! ఆ రీతిగానే 'శూన్యత్వము' అనునది కూడా! అవి లేవు. మరి 'ఉన్నట్లుగా కనిపిస్తున్నాయి కదా'... అని అంటావా? అవన్నీ కూడా సర్వ శక్తిమంతుడగు 'బ్రహ్మం' అనే రత్నం యొక్క కిరణ సమూహాల విలాసం మాత్రమే! జలం అనేక తరంగాలుగా కనిపిస్తున్నప్పటికీ అన్ని తరంగాలలోనూ కనిపించేది ఒకే జలమే కదా! అనేక బంగారు ఆభరణాలలో కనిపించేదంతా బంగారం ఒక్కటే కదా! అట్లాగే అనేకత్వము వాస్తవానికి లేదు కాబట్టి, ఇక సృష్టియే లేదు. సృష్టియే లేనప్పుడు నాశనరూపమగు ప్రళయం మాత్రం ఎక్కడున్నది? అదీ లేదు.

**ఈ కనబడేదంతా స్వకీయకల్పనమే! -**

**శ్రీరాముడు :** జగత్తులో కనిపించే సృష్టి-స్థితి-లయాలు, జన్మ-జీవన-మృత్యువుల మాటేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ జీవుడు దేహం పొందవచ్చు. కోల్పోనూ వచ్చు. వాస్తవానికి ఈ జీవుడు స్వతఃసిద్ధమైన స్థితి దృష్ట్యా జన్మించటమూ లేదు, మరణించటమూ లేదు. ఇక ఇవన్నీ అంటావా? ఇవి 'కల్పన' అను చమత్కారము యొక్క విన్యాసము మాత్రమే!

అనగా, 'కల్పన'యే మూర్తివంతమై ఈ విధంగా జగత్తు రూపంగా భాసిస్తోంది. అంతేగాని ఇక్కడ మూర్తి వంతమైనదేదీ యథార్థానికి లేదు. నిరాకారమైన బంగారము రకరకాలైన ఆకారాలు ధరించి-గాజు-గొలుసు ఉంగరంగా కనిపిస్తోంది కదా! యథార్థానికి బంగారమునకు 'ఇది ఆకారం' అనునదేమున్నది? ఈ జగత్తులో కనిపించే మూర్తిత్వములన్నీ అట్టివే! ఎందుచేతనంటావా? ఈ జగత్తులో ఏఏ మూర్తిత్వములు (రూపాదులు) కనిపిస్తున్నాయో... అవన్నీ అట్లు ద్రష్ట యొక్క సంకల్ప ప్రభావం చేతనే కన్పిస్తున్నాయి. ఒకడు కళ్ళు మూసుకొని తన యొక్క మనోరాజ్యంలో అనేక వస్తువులు చూస్తున్నట్లే, కళ్ళు తెరచినప్పుడు కూడా మనోరాజ్య మాత్రంగా ఈ జగత్తును చూస్తున్నాడే గాని, యథాతథంగా చూచుటలేదని ఇక్కడ గమనించవలసిన విషయం సుమా! సంకల్పంలోనూ, స్వప్నంలోనూ కనిపించేవన్నీ నిరాకారమేనని అందరికీ తెలుసుకదా! ఈ జగత్తుగా దర్శించబడేది కూడా అట్టిదే! ఇట్టి శూన్యరూపమగు జగత్ స్థితియందు వివేకులకు రాగద్వేషాది భావాలు ఎట్లా కలుగుతాయి? ఎప్పుడో భవిష్యత్‌లో ఉండబోయే ఆకాశ వృక్షంపై ఏ పక్షి వ్రాలుతుంది? ఆకాశంలో వృక్షం ఎట్లా ఉంటుంది? అది ఎంత అర్థరహితమో... వివేకుల దృష్టిలో ఇక్కడ ఇష్ట-అయిష్ట విశేషాలు ఉండటం అంతటి అర్థరహితం.

**ఇదంతా ఆత్మాంతర్గతం! -** కాబట్టి రామచంద్రా! ఈ సమస్త జగత్తుకు గాని, ఇందలి ప్రాణులకు గాని వాస్తవానికి ఎట్టి మూర్తిత్వం లేదు. శూన్యత్వం లేదు. అందుచేత 'చిత్తం' అనునది కూడా ఎప్పుడో అస్తమించిన సూర్యుని రూపం వంటిదే! ఈ విధంగా ఎప్పుడైతే చిత్తం యొక్క రహితత్వాన్ని గమనించామో... ఇక ఆ పై శేషించేది సన్మాత్ర ఆత్మయే! అట్టి ఆత్మ 'అభావం' ఎన్నటికీ కాదు. భావాలన్నీ ఆ ఆత్మవే! అది భావనలకు ఆవల ఉండి ఆత్మభావనచే సులభ లభ్యమే అయి ఉన్నది.

తత్త్వవేత్తకు ఈ వివిధ రూపాలతో కూడిన జగత్తు ఈ వివిధరూపరహితమై, ఏకమగు ఆత్మగా మాత్రమే భాసిల్లుతోంది. సమస్తమగు అభరణములు ఏకమగు సువర్ణ పిండమున ఒదిగి ఉన్నట్లు... ఈ నానావిధ పదార్థములన్నీ ఏకమగు ఆత్మయందు అంతర్గతములై ఉన్నాయి. నిత్య సిద్ధమగు చిత్స్వభావమున 'స్థితి' కలిగి ఉన్న జ్ఞాని యొక్క దృష్టిలో ఈ అహంభావ సహిత జగత్తు, ఈ చిత్తం... ఇవన్నీ లయించిపోయినవై కనిపిస్తున్నాయి. అనగా, జగత్తు జగత్తుగా కాకుండా ఆత్మ గానే కనిపిస్తోంది. చిత్తం చిత్తంగా కాకుండా ఆత్మగానే తెలియవస్తోంది. ఈ జగత్తు-చిత్తం లయించి పోగా, అప్పుడు శేషించునట్టి 'చిదేకరసమును' వర్ణించి చెప్పటానికి అచిత్ స్వభావాశ్రయులకు కుదిరేది కాదు. జగత్ దృష్టి తొలగినపుడు మాత్రమే చిదేకరసానుభవుల దృష్టి అవగతమౌతుంది.

రామచంద్రా! ఇక్కడి ఉన్నత, అవనత విషయాల వైపుగా ఎవరి బుద్ధి పరుగులు తీస్తున్నదో... అట్టివారు పొందే క్లేశాలకు అంతూ పొంతూ ఉండటం లేదు. అందుచేత వారి బుద్ధికి సద్రూపమగు ఆత్మ భాసించటమే లేదు. వారికి అఖండ అప్రమేయ ఆత్మానుభవం ఎట్టిదో చెప్పినా, వారు గమనించ లేక పోతున్నారు. కాబట్టి కాస్త 'యుక్తి' (ఉపాయం) అభ్యసిస్తే సత్య పదార్థం తప్పక విదితమౌతుంది.

ఎవడైతే ఈ భూత-భవిష్యత్-వర్తమాన సర్వ పదార్థ రూపమగు ఈ జగత్తు యొక్క ఆవిర్భావాన్ని, దీని కార్యకారణత్వాదులను విమర్శించి చూస్తాడో... అట్టివాడు క్రమక్రమంగా ఈ

జగత్తులోని స్థూలత్వం నుండి సూక్ష్మత్వం వైపుగా పయనిస్తాడు. అనగా స్థూలంగా కనిపించేవన్నీ పదార్థాల వర్తమాన దశయేగాని, నిత్యమైన స్థితి కాదని గ్రహిస్తాడు. ఉష్ణభేదం చేత మంచు-జల-వాయు స్థితులు కనిపిస్తున్నాయి కదా! వాస్తవానికి ఈ జగత్తు యొక్క స్థూల-సూక్ష్మ స్థితులను అధిగమించి పరిశీలించినప్పుడు శేషించునది "సన్మాత్రం - అఖండబోధ రూపం" అగు ఆత్మయేనని గ్రహించబడగలదు.

అనగా, 'ఈ జీవుడు స్థూల విషయములైన దేహాదులు, తత్సంబంధమైన ఆయా విషయాలు కాదు. సూక్ష్మ భూతములైన 'భావన-మనస్సు-బుద్ధి-అహంకారం' మొదలైనవి కూడా కాదు. మరి? ఈతడు 'అఖండమగు బోధ స్వరూపుడే'... అని గ్రహించబడగలదు. అట్టి అద్వైత బ్రహ్మం నందు 'శాంతి'ని పొందినట్టి మనుజుని దృష్టియందు ఈ 'ప్రపంచం' అనేదేదీ లేనే లేదు. సద్గుణాలు గల సజ్జనునకు 'ఓర్పు-దయ-దాక్షిణ్యము' మొదలైనవి హృదయానికి హత్తుకుంటాయి చూచావా? అట్లాగే జగద్విషయముల పట్ల 'అపేక్ష'ను జయించిన జ్ఞానికి ఇప్పుడు మనం చెప్పుకునే 'జగత్తు వాస్తవానికి లేదు' అనే పాఠం అతిసులభంగా అనుభవైకవేద్యం అగుచున్నది.

❖❖❖

# 9. అనన్యం

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**పిండత్వం నాస్తి భూతానాం, శూన్యత్వంచాపి అసంభవాత్,**
**అతేవ మనో నాస్తి, శేషం 'సత్' తత్ అవస్థితిః ॥**

ఓ రామచంద్రా! మట్టిబొమ్మలో ఆకారం కనిపిస్తున్నప్పటికీ మట్టికి వాస్తవానికి ఆకారం లేదు కదా! ఎందుకంటే మట్టి ముద్దతో ఏ ఆకారం తయారుచేస్తే అదే మట్టి యొక్క ఆకారంగా కనిపిస్తోంది! ఏ ఆకారమైనా తయారవటానికి సిద్ధమగుచుండగా ఇక మట్టికి 'ఇది దీని ఆకారం'... అని ఎట్లా కుదురుతుంది? అట్లాగే ఈ ప్రాణులకి మూర్తిత్వం (ఆకారాదులు) వాస్తవానికి లేదు. మరి వీరు శూన్యరూపులా? లేదు. శూన్యమైనట్టిది ప్రాప్తించటం ఎట్లా జరుగుతుంది? ఇక 'మనస్సు' అనేది కూడా ఎక్కడా లేదు. ఈ మూర్తి-శూన్య-అమూర్తి రూపములగు కల్పనలను వదిలివేస్తే అప్పుడు శేషించేదే 'సన్మాత్రము' అని, 'ఆత్మ' అని చెప్పబడుచున్నది. అదియే నీ యొక్క, నా యొక్క ప్రతి ప్రాణి యొక్క వాస్తవ స్థితి.

**సంసారము... అనగా! -**

**శ్రీరాముడు :** ఈ జీవుడు-జగత్తులు మొదలైనవన్నీ (మీరు చెప్పినట్లుగా)... లేనప్పుడు మరి 'సంసారము' అని దేనిని పిలుస్తున్నాం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'కేవల సాక్షి చైతన్యం' అగు ప్రత్యగాత్మ ఒకానొకప్పుడు 'స్వస్వరూపానుభవ మాత్ర స్థితి' నుండి విషయముల వైపుకు ఉన్ముఖమౌతుంది. అట్టి ఉన్ముఖత్వమే సంసారము. కేవల

జ్ఞాన స్వరూపం సంసార జ్ఞానంగా ఉదయించుటయే 'సంసారం' అను అనర్థమునకు కారణం. అట్లు ఉదయించకుండుటయే 'శ్రేయము' కొరకు అయి ఉన్నది.

శీతలత్వంచే జలం ఘనీభవించి పొడవు-వెడల్పు మొదలైన ఆకారాలు కలిగిన మంచుగడ్డగా అగుచున్నది చూచావా! కేవల శుద్ధ జ్ఞానంలో ఉదయించిన సంసార జ్ఞానమే ఒకానొక సమయంలో బాహ్యత్వం పొంది మూర్తిత్వంగా ప్రాప్తించుచున్నది. ఈ జీవుడు సర్వదా ఆత్మ స్వరూపుడే! అయితే చిద్రూపమగు ఆత్మయే తన స్వరూపమును గూర్చిన 'అజ్ఞానం' చేత మూర్తిత్వమును గ్రహిస్తోంది.

ఒకడు అదమరచి నిదరపోయి, ఆ నిదురలో పొందిన స్వప్నంలో కనిపించిన ఆయా రూపాలన్నీ తనకు భిన్నములైనవని భ్రమిస్తూ ఉంటాడు చూచావా? అట్లాగే చిద్రూపమగు ఆత్మయే తన శుద్ధ జ్ఞానత్వమును ఏమఱచి పదార్థముల వలె మూర్తిత్వం తనకు అన్యంగా గ్రహిస్తోంది. అట్లా గ్రహించిన కారణంగా చిత్తత్వమును ధరిస్తోంది. అట్టి చిత్తం చేతనే ఈ దేహమును ధరిస్తోంది. అట్టి దేహం ద్వారా తదితరమైనట్లుగా శబ్ద-స్పర్శ-రూప-రసాదుల రూపంతో కూడిన 'జగత్తు' అనబడు దానిని కూడా ధారణ చేస్తోంది. అట్టి జగత్తులో అనేక ఆశాపాశములు కల్పించుకొని అనేక ఉపాధులు పొందటం, కోల్పోవటం కాలానుగతంగా చేస్తోంది.

**ఏతావతీషు అవస్థాసు బోధస్యోదేతి నాన్యతా,**

**శబ్ద కల్పనయా భేదః కేవలం పరికల్పితః ॥**

అయితే... ఆయా సర్వ అవస్థలలోనూ చైతన్యం చైతన్యంగానే ఉంటోంది గాని అన్యమైనదిగా (మూర్తిత్వం-చిత్తత్వం-దేహత్వం-విషయత్వం-జగదత్వం మొదలైనవిగా) తాను అవటమే లేదు. జలంగా, తరంగాలుగా, సుడులుగా, బుడగలుగా, బుడగరూపవృత్తంగా అగుచున్నప్పుడు జలం తన జలత్వం పోగొట్టుకొంటోందా? లేదే! మరి ఈ భేదమంతా ఏమిటంటావా? కేవలం శబ్దమాత్ర వ్యవహారంచే ఆయా భేదమంతా కల్పన చేయబడుతోంది. స్వప్న దర్శన సమయంలో మనస్సే బాహ్య-అభ్యంతర విషయరూపమున వికృతినొందుతూ భాసిస్తోంది కదా! అయితే స్వప్నద్రష్ట సర్వదా యథాతథంగానే ఉంటున్నాడు కదా! ఉంటున్నాడు కాబట్టే స్వప్న సంఘటనానంతరం మరల జాగ్రత్తులోకి వస్తున్నాడు. అట్లాగే 'ఆత్మ ఆయా విశేషములన్నీ పొందుచున్నప్పటికీ, తాను యథాతథంగానే ఉంటోంది'... అనునదే జ్ఞాన-విజ్ఞాన సారం.

బోధరూపమగు ఆత్మయందు ఎట్టి మూర్తిత్వ-చిత్తత్వ-దేహత్వాది వికారములు ఏర్పడటానికి అవకాశమే లేదు. ఆకారం లేని జలం ఒకప్పుడు తరంగాకారంగా కనిపిస్తున్నట్లు అమూర్త రూపమైన ఆత్మ ఒకప్పుడు చిత్తాకారంగా అగుపిస్తోంది. చిదాత్మ ఆకాశం వలె, కాలం వలె ఎల్లప్పుడు అవికృత రూపంగానే ఉంటోంది. స్వప్న పదార్థాలన్నీ స్వప్నద్రష్ట ఊహారూపాలే అయి ఉన్నట్లు, సమస్త పదార్థాలు చిదాకాశరూపమే అయి ఉన్నాయి. కానీ చిదాకాశం పదార్థ రూపాలుగా అవటం లేదు.

ఈ చిత్తం... చిదాకాశమే! అయితే చిదాకాశం చిత్తంగా అవటం లేదు. ఆభరణం... బంగారమే! అయితే బంగారం బంగారంగానే ఉన్నది గాని, 'ఆభరణం' అవటం లేదు. మట్టి బొమ్మలో బొమ్మగా అయినది మట్టియే! అయితే, మట్టి బొమ్మగా అవుతోందా? అవటం లేదు కదా!

**శ్రీరాముడు :** మహర్షీ! చైతన్యము ఎన్నటికీ జడపదార్థంగా (అట్లాగే, జీవుడు మొదలైనవిగా) అగుటకు అవకాశం లేదనునది యుక్తియుక్తమేనని అనుకుందాం. అయితే జడపదార్థం (అట్లాగే జీవుడు మొదలైనవి) చైతన్యముగా ఎప్పటికైనా కాకూడదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! బాహ్య జడ పదార్థం తత్త్వబోధవశంగా కూడా అభ్యంతర చిదాకాశ రూపం పొందజాలదు! ఎందుకంటావా? ఈ జడ పదార్థం 'అత్యంత అసదృశం'. "తరంగం తన ఆకారం కోల్పోయి ఎప్పటికైనా జలంగా కాకూడదా?" అనే వాక్యం ఎట్టిదో అదీ అట్టిదే! జలానికి కనబడిన తరంగాకారం అసదృశమే కాని, ఆపాదితమే కాని – వాస్తవం కాదు కదా!

ఇక ఈ దృశ్య వ్యవహారానికి వస్తే, చిదాత్మయే వివర్త భావం చేత ఈ దృశ్య జడ స్థితిని పొందుతోంది. పరమార్థమున చైతన్యం జడ భావం పొందుటయే లేదని గ్రహించు. కదిలించేది చైతన్యం, కదిలేది జడం కదా! 'కదిలించేది' కదిలేదిగా అవుతోందా? లేదు. కదిలించే చైతన్యం సర్వ అవస్థలయందునూ తన స్వస్వరూపాన్నే యథాతథంగా ఎప్పటియట్లే స్థితినొంది ఉన్నదే గాని లేశంగా కూడా అది అన్య రూపత్వం పొందడం లేదు. ఒకని బుద్ధి సప్తమభూమిక వరకు పరిణామం పొందినదై, అచ్చట అత్యంత శుద్ధబోధైక రూపమగు ఆత్మ భావనలో ఉదయిస్తోంది. అట్టి అఖండ మగు ఆత్మత్వం ఉదయించగానే బోధ–అబోధ ఇటువంటి శబ్దాల పాత్ర కూడా అస్తమించిపోతోంది.

ఓ రాఘవా! ఈ చిత్తం యొక్క దృఢ భావనచేతనే సూక్ష్మ శరీరాలకు ఈ స్థూలమైనట్టి ఆధిభౌతిక రూపం ఉదయించటం జరుగుతోంది. ఒక నటుడు నాటకంలో పిశాచ వేషం ధరిస్తాడు చూచావా? అట్లాగే ఆకాశం వలె నిర్మలమైనట్టి సూక్ష్మ చిత్తం ఈ 'మిథ్య' అయినట్టి ఆధిభౌతిక రూపం ధరిస్తోంది.

ఈ చిత్తం తన యొక్క అన్యమనన స్వభావం కారణంగా ఈ దేహ–జగత్ రూపాలన్నీ భ్రమచే పొందుతోంది. 'నేను పిచ్చివాడను కాదు. అందరిలాగానే మంచి బుద్ధి కలవాడనే'... అనే మననముచే 'ఉన్మత్తత' శమిస్తుంది చూచావా? అట్లాగే, భ్రమ రహితమగు సత్య వస్తువును గురించిన అభ్యాసం చేత ఈ దేహ–జగత్ రూపమగు భ్రాంతి తప్పక శమించగలదయ్యా!

"నేను మనో స్వరూపడను గాను, ఆత్మ స్వరూపుడను (ఆత్మయే స్వరూపంగా కలవాడను) ఈ దేహము–పంచేంద్రియాలకు విషయాలయ్యే జగత్తు... ఇవన్నీ కూడా నా యొక్క క్రీడాకల్పనచే ప్రాప్తించేవి మాత్రమే."

అని మననం, మరియు 'జ్ఞానం'చే లేక 'బుద్ధి'చే వాసన ప్రశమనం పొందగలదు. ఏది ఎంతవరకు భ్రాంతియో గ్రహించటం చేత 'జగత్తు సత్యం' అనే వాసన వివర్తిస్తుంది. ఎట్లా అంటే స్వప్నం స్వప్నరూపంగా ఎఱుగబడిన తర్వాత ఇక ఆ స్వప్నంలో కనిపించే వస్తువులు–విషయములు–స్వప్న జీవులు సత్యమేనని ఎవరూ నమ్మి ఉండరు కదా! వాసన శమించటం చేత సంసారము శమించుచున్నది. వాసనయే మహాపిశాచి సుమా! అందుకే వివేకులైన వారు ఈ వాసనను, (లేక, దృశ్యము పట్ల ఏర్పడిన సత్యత్వ బుద్ధిని) ఛేదించివేయుటయందు తత్పరులై ఉంటారు.

ఏ విధంగా అజ్ఞానం యొక్క అభ్యాసం చేత అజ్ఞానరూపమగు 'భావనా ఉన్మత్తత, పుట్టు కొస్తోందో... ఆ విధంగానే జ్ఞానం యొక్క అభ్యాసం చేత కాలక్రమంగా ఆ ఉన్మత్తత శమించి పోతోంది. భావన చేతనే ఈ స్థూల-సూక్ష్మ శరీరాలన్నీ మరలమరల ప్రవర్తిస్తున్నాయి. ఈ స్థూల శరీరం భ్రాంతి మాత్రమే. "ఇది ఉన్నా, ఊడినా, మరల వచ్చిపడినా, నేను మాత్రం యథాతథ స్వరూపుడనై ఉంటాను" అనే అభ్యాసం చేత ఈ స్థూలశరీర భావన సూక్ష్మశరీర భావనతో లయమై పోతోంది. ఆ సూక్ష్మ శరీర భావనయో (అతివాహక శరీర భావనయో)... 'బ్రహ్మ మాత్రత్వం'గా రూపుదిద్దుకొంటోంది. 'నేను స్థూల శరీరుడనై జీవిస్తున్నాను' - అను స్థితి నుండి వివేకి క్రమంగా "నా యొక్క జీవనం సూక్ష్మ దేహంగాని, ఈ స్థూల దేహంగా కానీ కాదు" అను జ్ఞానమును సుస్థిరీకరించుకుంటూ వస్తున్నాడు.

ఈ విధంగా దృఢమైన జ్ఞానాభ్యాసం చేత ఆ సూక్ష్మ దేహపదమునకు కూడా బ్రహ్మత్వము పొందింపజేయాలి. "నా యందు ఉత్పన్నమైన పదార్థములు నా రూపాలే అవుతాయి కదా! అట్లాగే సమస్త పదార్థముల ఉత్పత్తి స్థానం పరమాత్మయే కాబట్టి ఇవన్నీ పరమాత్మ స్వరూపములే" అనే ఉద్బోధ (లేక) భావన (లేక) జ్ఞానము ఎప్పుడైతే కలుగుతుందో, అప్పుడు 'సూక్ష్మ దేహం అనేది మాత్రం ఎక్కడున్నది? అది కూడా స్థూల దేహంలాగే మిథ్యయే'... అనే నిశ్చయం కలుగుతుంది. అటువంటి నిశ్చయం కలగడానికి ఉద్దేశించకుండా, ఊరకే 'హూం హూం' వంటి ఎన్ని శబ్దాలు ఉచ్చరిస్తే మాత్రం ఏం ప్రయోజనం? సంసార గ్రంథి నివర్తమౌతుందా? లేదు.

మొట్టమొదట ఈ జగుత్తు తత్కారణమైన 'ఈశ్వరుడు' ఈ ఇరువురి ఏకత్వము గ్రహించాలి. అది 'తత్' పదార్థ శోధనం ద్వారా ఎఱుగబడగలదు. ఆ తర్వాత 'త్వం' పదార్థ శోధనం ద్వారా "ఈ ప్రత్యగాత్మ వాస్తవానికి అసంగుడు. పరమాత్మ కంటే ద్వితీయుడైన వాడు కాదు (అద్వితీయుడు)"... అని ఎఱుగబడుతోంది. ఈ విధంగా తన యొక్క 'భావన+బుద్ధి' కూడా క్రమక్రమంగా 'తత్త్వ స్వరూప-ఐక్యరూపమగు అఖండాకార వృత్తి' అనదగు ఆత్మ రూపంగా పరిణమించాలి. అటువంటి అఖండాకార వృత్తి యందు ప్రత్యగాత్మ లయించినదై అట్టి ఆత్మకు అన్యమైనదేదీ ఎఱుగనంతటి అఖండ బోధ జనించుగాక! ఎంత వరకు అట్టి అఖండ బోధ జనించదో... అంత వరకు శ్రుతులు చూపించిన మార్గంగా 'తత్-త్వమ్' పదార్థ ద్వయ శోధన ద్వారా దృఢ జ్ఞానాన్ని సంపాదించు కుంటూనే ఉండాలి. బాహ్య-అభ్యంతరాలలో చోటు చేసుకొని ఉన్న ఈ 'చిత్తం' పూర్తిగా ఎప్పుడైతే శమిస్తుందో, అప్పుడు అది తన సాక్షి రూపమగు 'చిత్స్వరూపం'గా ప్రకాశిస్తుంది. 'ఆకాశం వలె నిర్మలం-శీతలం' అయినట్టి అట్టి తన చిత్స్వభావమును ఆశ్రయించి ఈ మనుజుడు శాంత స్వరూపుడై అప్పుడు ఉండగలడు.

**జ్ఞానవాన్ జ్ఞానయజ్ఞస్థో ధ్యానరూపం విరోపయన్ ।**
**జగత్ విజిత్య జయతి, సర్వత్యాగైక దక్షిణః ॥**

జ్ఞాని అయినవాడు 'జ్ఞానము' అనే మహా యజ్ఞమునందు సర్వదా నెలకొని ఉంటాడు. ఆ జ్ఞాన యజ్ఞశాలలో 'ధ్యానము' అనే దృఢమైన, ఉన్నతమైన 'యజ్ఞ స్తంభము'ను నాటుకుంటాడు.

అట్లా జ్ఞానయజ్ఞతత్పరుడై 'చిత్స్వభావము' అను అధిదేవతకు 'సర్వ త్యాగము' అనే ముఖ్య దక్షిణను ఇచ్చివేసినవాడై ఈ విశ్వమును మొదలంట జయించివేయటమే నిజమైన 'విశ్వజిత్ యాగం'. అట్టి విశ్వమునకు సాక్షియై, సర్వోత్కృష్టుడై, మాటలకు అందనివాడై ఉంటాడు. అతడు ఆత్మయందు ఏకరూపుడై ప్రకాశిస్తూ ఉంటాడు. ఇక ఆపై, అగ్ని వర్షం కురిసినప్పటికీ, ప్రళయ వాయువు వీచి నప్పటికీ, ఈ భూతలం గాలికి ఎగిరిన కాగితపు ముక్కలాగా ఎటో ఆకాశంలోకి వెళ్ళిపోవుచున్న ప్పటికీ, ఏది ఏమైనప్పటికీ అతడు సర్వదా ఆత్మయందు ఏకరూపుడుగానే ఉంటాడు. అట్టి అనుక్షణిక అఖండాత్మానుభవమే వజ్రతుల్యమగు 'దృక్స్థితి' అనికూడా పిలువబడుతోంది. అయితే...

1. తృష్ణా రాహిత్యముచే శాంతి పొందిన మనస్సు గలవాడు, 2. ఇంద్రియ విషయాలన్నిటి పట్ల నిరోధ దశను సంపాదించుకున్నవాడు... ఈ రెండూ సంపాదించుకున్నట్టి మనుజునికి మాత్రమే అట్టి అకృత్రిమ సమాధియందలి వజ్రతుల్యమగు 'దృక్స్థితి' లభిస్తుంది.

**మనో శమము -**

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ మనస్సు పూర్ణంగా శాంతించటానికి (శమించటానికి) సులభోపాయం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ మనస్సు శాస్త్రములు ప్రతిపాదించిన అభ్యాస క్రమాలచే, ఉపదేశాలచే, ఇంద్రియ దమంచే శమించగలదు. అయితే, 'బాహ్య పదార్థములన్నిటి పట్ల తృష్ణారాహిత్యం' అనే అభ్యాసంచే శమించినంత సులభంగా మరే విధంగానూ ఈ మనస్సు శమించదు. జీవుడెందుకో 'సంపత్తి పొందాలి' అను భావనకు లోను అవుచున్నాడు. అక్కడి నుండి తృష్ణ-అజ్ఞానాలు మహా వాయు వీచికల వలె బయల్వెడలుచున్నాయి. కాబట్టి 'సంపత్తి అంతా మహా అపత్తియే' అను భావనను, 'ఇవన్నీ నావి కానే కావు' అను ప్రజ్ఞచే సునిశ్చితం చేసుకోవాలి. ఏదేది 'నాది కాదు' అని గ్రహిస్తామో, అది త్యజించబడినదే అవుతుంది. ఆ విధంగా సర్వత్యాగం, తృష్ణారాహిత్యం అభ్యసిస్తూ చరమ సాక్షాత్కారమైన ఆత్మతత్త్వాన్ని హృదయంలో వెలిగించాలి. అట్టి జ్ఞానదీపంచే అజ్ఞానాంధ కారం, అద్దాని అలవాలమైన అహంకార-మమకార పిశాచాలు, ఆకారాదుల పట్ల ఏర్పడి ఉన్న ఆకర్షణ... ఇవన్నీ వాటంతట అవే తొలగుతాయి. ఆపై 'ఈ సమస్తం చిదాత్మయే. నా ఆత్మయే తన అఖండ స్వభావం చేత ఈ సర్వంగా ప్రకాశిస్తోంది' అను అవగాహన సుస్పష్టమవగలదు.

**చైతన్యం సర్వదా యథాతథం -** ఓ రామచంద్రా! పొగ ఆకాశంలో ప్రవేశించి అనేక ఆకారా లుగా కనిపిస్తుంది చూచావా? అట్లాగే, ఈ కనబడే మనుష్య-నాగ-అసురాది స్థానములు, పర్వత-గుహాది పదార్థములు ఇవన్నీ కూడా చైతన్యమే ఆయా వివిధ వైచిత్ర్యములుగా అగుచున్నదనీ, (కానీ) యథార్థానికి (పొగలాగానే) చైతన్యము సర్వదా యథాతథంగానే ఉన్నదనీ-భావన చేయి. రసరూపమగు వర్షజలం జడమగు భూమియందు ప్రవేశించి రసస్వరూపములగు ఈ వృక్ష-పుష్ప-ఫలాదులుగా అగుచున్నదే! అట్లాగే చైతన్యము బ్రహ్మాండమున ప్రవేశించి తన యొక్క ప్రాణ శక్తిచే ఆత్మ యొక్క వివర్త రూపములైన ఈ ప్రాణికోట్ల శరీరములందు చలించుచున్నది. జలంలో సంచరించే చేప ఒక రోజు వలలో చిక్కుకొని ఎటూ వెళ్ళలేక తిప్పలుపడుచున్నట్లుగా, 'చిదాకాశము'

అను దానిలో విహరించవలసిన ఈ జీవుడు 'దేహ స్వభావము' అనే మోహజాలంలో చిక్కుకొని ఆయా అగచాట్లన్నీ పడుచున్నాడు. తన ఆత్మ స్వరూపాన్ని (ఆత్మ స్థితిని) స్మరించక దృశ్యవస్తు సముదాయాన్ని స్మరిస్తూ 'తృష్ణ' అనే ఎఱ తగిలించబడిన గాలంలో చిక్కుకొని విలవిల్లాడుచున్నాడు.

ఓ రామచంద్రా! నిర్మల చైతన్యమే 'నిజ స్వరూపం' అనే ప్రాంగణంలో స్వర్గ-మర్త్య-పాతాళాలలోని అనేక పదార్థముల రూపంగా స్ఫురిస్తోందయ్యా! ఈ జీవులలో కనిపించే తేడా అంతా వాసనల యొక్క అల్ప-ఆధిక్యతలు మాత్రమే!

**సర్వ ఏవ సమా జీవా వాసనాం అన్తరేణచ**
**శుష్క పర్ణవత్ ఉడ్డీనా జడాః శ్వసన వేణవః ॥**

వాసనల యొక్క అల్ప-ఆధిక్యతలు తప్పిస్తే ఈ జీవులందరూ సమానులే! అందరూ కూడా చైతన్య స్వరూపులే! వాసనల వల్లనే వారు ఎండుటాకులవలె ఎగిరి స్వర్గ-భూ-పాతాళములలో పడుచున్నారు. ప్రాణవాయువు సహాయంతో ఆయా శబ్దములు పలుకుచున్నారు.

అందుచేత రామచంద్రా! మొట్టమొదట ఈ జీవుడు పురుషప్రయత్నం చేత సాధనా చతుష్టయ సంపత్తిని సముపార్జించుకోవాలి. ఆ తర్వాత అతని ఆత్మధ్యానమునకు విఘ్నము కలిగిస్తున్న దృశ్య ప్రకంపనములను ప్రాణయామాదుల అభ్యాసంచే జయించాలి. సమాధిచే బహిర్దృష్టిని విడనాడి నిర్వికల్ప సమాధియందు ప్రవేశించాలి. అట్లు ప్రవేశించటం ద్వారా పూర్వం సంపాదించుకొని ఉన్న వాసనా సమూహమును పారద్రోలాలి. ఈ సంసారపాశము అనే ఘనమైన పంజరమును విరగగొట్టాలి. అప్పుడాతడు పూర్ణానందైకరసమగు బ్రహ్మముగా ఉదయించగలడు. అటుపై ఇక అజ్ఞానము యొక్క ఛాయ కూడా ఉండదు. దీపం వెలిగిన తర్వాత చీకటి ఇంకా ఉంటుందా?

❖❖❖

## 10. వాసనలు - తరగతులు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ కనబడే 10 దిక్కులలోనూ ఉన్న 'మనుజ-నాగ-దేవ-గంధర్వ'... ఆదిగా గల పేర్లతో కనబడే ఈ జీవసమూహాలన్నీకూడా వాసనా భేదం చేతనే వేర్వేరుగా ఉన్నాయి. వాసనలను ప్రక్కన పెట్టి చూచామా... వాటిలో ఎటువంటి తేడా లేదు. ఈ వాసనా వైచిత్ర్యమంతా 7 రకాలుగా విభజించి చెప్పబడింది.

**వాసనావస్థలు** - 1. స్వప్న జాగ్రదవస్థ, 2. సంకల్ప జాగ్రదవస్థ, 3. కేవల జాగ్రత్తు అవస్థ, 4. చిర జాగ్రత్తు అవస్థ, 5. ఘన జాగ్రదవస్థ, 6. జాగ్రత్ స్వప్నావస్థ, 7. క్షీణ జాగ్రదవస్థ

సముద్రంలో అనేక ఆకారాలు గల తరంగాలు ఉన్నట్లుగా, ఈ సప్తవిధ జీవులు చిదాకాశంలో ఉన్నారు.

**శ్రీరాముడు :** మీరు చెప్పిన 7 విధములైన వివిధ వాసనామయ జీవుల గురించి మరికొన్ని వివరణలు ప్రస్తావించ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే వివరిస్తాను, విను.

**1. స్వప్న జాగ్రత్తు జీవులు -**

**కస్మింశ్చిత్ ప్రాక్తనే కల్పే, కస్మింశ్చిత్ జగతి క్వచిత్ ।**
**కేచిత్ సుప్తాః స్థితా దేహైః జీవా జీవిత ధర్మిణః ।**
**యే స్వప్నమ్ అభిపశ్యన్తి తేషాం స్వప్నమిదం జగత్ ।**
**విద్ధి తే హి ఖలూచ్యన్తే జీవకాః స్వప్నజాగరాః ॥**

ఓ రామచంద్రా! ఒకానొక పూర్వ కల్పమునందు... ఒకానొక జగత్తులో, ఒకానొక చోట, దేహమును ధరించి జీవించుచున్న ... ఏ కొందరో జీవులు నిద్రించుచూ... ఏ స్వప్నమును గాంచుచున్నారో... ఆ వారి యొక్క స్వప్నమే, ఈ జగత్తు అయి ఉన్నది!

ఆ స్వప్నమును గాంచుచున్న జీవులు 'స్వప్న జాగరులు' అని చెప్పబడుచున్నారు! ఆ ఒకానొక జగత్తునందు నిద్రించుచున్న జీవులకు స్వయంగా ఆవిర్భవించిన 'స్వప్న ప్రపంచం'లో మనం ప్రవేశించాం. ఎందుచేతనంటే, మనం కూడా సమాన కర్మ-వాసనాదులు కలిగి ఉండటం చేత మనం ఆ స్వప్నంలో ఉంటున్నాం. అతని స్వప్నంలోని విషయాలే మన యొక్క స్వప్న వశం చేత మనకు కూడా (అవి) విషయాలుగా అగుచున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే మనందరం అతని స్వప్నంలో మనుజులమే అవుతాం. చిరకాలత్వం కారణంగా వారి స్వప్నం ఈ విధంగా జాగ్రత్ రూపం పొందింది. కాబట్టి అట్టి అవస్థయందున్న ఆ జీవులు 'స్వప్న జాగరులు'గా పిలువబడుచు న్నారు. 'జీవనోటోపాఖ్యానం'లో ఈ విషయం గమనించాం.

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సర్వసత్తాప్రదుడు కదా! ఆ స్వప్న జాగరుడు ఈశ్వర స్వరూపుడే అయి ఉండటం చేత సర్వత్రా సర్వం సంభవిస్తోంది. ఈ విధంగా స్వప్నయుతులైన ఆ జనులకు మనమందరం స్వప్న మనుజులమై ఉన్నాం. అనగా ఆ స్వప్న జాగరుల స్వప్న సదృశ్య ఊహాస్వరూపమే మన ఈ జాగ్రత్ అవస్థ.

**శ్రీరాముడు :** మునీంద్రా! పూర్వపు ఏ కల్పమునందో ఆ స్వప్న జాగరులు స్వప్నం గాంచారని కదా, మీరు అంటున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును.

**శ్రీరాముడు :** ఆ స్వప్న జాగరుల పూర్వకాలిక స్వప్నమందలి సమస్త పదార్థాలు, దేహాలు నేటికి క్షయించిపోయి ఉండాలి కదా! ఇప్పుడు ఆ స్వప్నం నుండి మేల్కాంచిన ఆ జీవులకు మరల గడిచి పోయిన ఆ స్వప్న జగత్ కల్పంలో స్థితి ఎట్లా సంభవిస్తోంది? వారి గడచిపోయిన స్వప్నం మనకు ఎలా ప్రాప్తిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఆ స్వప్నజాగ్రతులు తదనంతర దశలను పొందుతూ ఉంటారు.

1. ఆ స్వప్న జాగరులు మన ఈ ప్రపంచరూపమగు వారి స్వప్నమైన దైవయోగం చేత తత్త్వ జ్ఞానం పొందారనుకో. అప్పుడు వారి స్వప్నభ్రమ రూపమగు సంసారం నుండి విముక్తి పొందుతారు.

(లేదా) 2. అట్లా తమ (స్వప్న సదృశ) సంసారమునుండి విముక్తి పొందకుండానే నిద్రలేచారనుకో... అప్పుడో? అప్పుడు మరల సంకల్పానుసారంగా అన్య దేహాలను ఆశ్రయించి వ్యవహరిస్తూ ఉంటారు.

దృష్టి ఉన్నంత వరకు సృష్టి ఉంటూనే ఉంటుంది. కనుక దృష్టియే సృష్టి. దృష్టి కొనసాగటం అవుతుంది. అందుచేత ఒక విధంగా చూస్తే వారి స్వప్న జగత్తు కొనసాగుతున్నట్లే! వారు ఇతః పూర్వము వలెనే అన్యములైన కల్పిత జగత్తును, కల్పమును గాంచుచూనే ఉంటారు. ఆ కల్పనలకు అంతు ఎక్కడ? ఆత్మజ్ఞానమే ఆ అంతు. చిదాకాశము అనంతం కనుక, వారి కల్పనలకు, వారివారి స్వప్నాంతర్గత విశేషములకు చోటు లేకపోయే ప్రసక్తి ఉండదు. ఆ స్వప్న జాగరులు 'సంకల్పాత్మక మైన జగత్తులు' అనే మేడి పండ్లలోని కీటకముల వంటివారు.'

**2. సంకల్ప జాగరులు** – ఈ సంకల్ప జాగరుల గురించి ఐందవోపాఖ్యానంలో చెప్పుకున్నాం. వీరు ఒకానొక పూర్వ కల్పమున ఒకానొకచోట (ఐందవుల వలె) నిద్ర మేల్కొని ఉన్నారు. అయితే, అంతరంగమున సంకల్ప పరంపరలందు తత్పరులై ఉన్నారు. నిద్ర లేచి ఆలోచనలలోపడుచున్న మనిషితో వీరిని పోల్చవచ్చు. వీరు ధ్యానము నుండి చలింపబడినవారై జీవటోపాఖ్యానంలోని జీవటునివలె మనోరాజ్యంలో ప్రవేశించి ఉన్నవారు. సంకల్పము యొక్క దృఢత్వం చేత తమ సంకల్పములకు ముందే ఉన్న స్థితి యొక్క సంధానము కోల్పోయినవారై ఉంటున్నారు.

అనగా... వీరిలో 3 లక్షణాలు మనకు కనిపిస్తాయి.

1. ఈ సంకల్ప జాగరుల సంకల్పము చిరకాలం స్థిరంగా ఉండటం చేత ఆ సంకల్ప వ్యవహారం ఘనీభూతమై జాగ్రద్రూపంగా అగుచుండటం.

2. అట్టి సాంకల్పికమైన పదార్థములందే లయించిన మనశ్చేష్ఠ గలవారై పూర్వ-పర స్థితులు లేకయే ఉంటున్నారు.

3. ఆ సంకల్పము ఎప్పటికో శమిస్తుంది. అప్పుడు మరల అదే సంకల్ప కథనాన్ని గాని, (లేక) మరొక సంకల్పమునుగాని వారు ఆశ్రయిస్తూ ఉంటారు.

వారి సంకల్పమయ దేహంలో మనమందరం సంకల్పరూపులమై ఉన్నాం. వారి సంకల్పంలో మనం, తదితర జీవులు లోకములు ఉన్నాయి కదా! కనుక వారి దృష్టియందు ఈ సర్వము సంకల్ప జాగరరూపములు మాత్రమే! వారికి మనమంతా వారి ఊహలుగా అనిపిస్తూ ఉంటుంది.

**3. కేవల జాగరులు** – వీరు దామ-వ్యాళ-కటుల వంటివారు. వీరికి పూర్వపు-ఉత్పత్తి-వికాసము మొదలైన స్వప్న సదృశ విషయాలు ఉండవు. వీరు వర్ధమానశీలమగు బ్రహ్మము నుండి మొట్టమొదటిగా శరీరము ధరించినవారు. అందుచేత వీరిని 'కేవల జాగరులు' అని పిలుస్తారు.

**4. చిర జాగరులు** – కేవల జాగరులు ఇప్పుడే జన్మకు ఉపక్రమించారు కదా! వారే మరల తర్వాత తర్వాత జన్మలు పొందినవారై... కార్యములగు జాగ్రత్, స్వప్నాలలో; కారణములగు సుషుప్తి యందును... సంచరిస్తూ ఉంటారు. అట్లా సంచరిస్తూ ప్రౌఢత్వం చెందటం చేత వారిని 'చిర జాగరులు' అంటారు.

**5. ఘన జాగరులు** – ఆ చిరజాగరులలో కొందరు దుష్కర్మ వశం చేత జడ-స్థావర తుల్యమైన అజ్ఞాన దశకు పరిణమిస్తూ ఉంటారు. అట్టి ఘనీభూత జాగ్రత్ స్థితిని పొందటం చేత వారిని 'ఘన జాగరులు' అంటారు.

పైన చెప్పిన 5 విధములగు జీవులు 'బద్ధజీవులు' సుమా! ఇక ముక్తి వైపు ప్రయాణిస్తున్న తదితర 2 రకాల జీవుల గురించి విను.

**6. జాగ్రత్ స్వప్నులు** – పై 5గురిలోని ఏ ఒక్క జీవుడైనా శాస్త్ర అభ్యాసం చేత, సత్సంగత్యం చేత బోధితుడైనాడనుకో, అప్పుడు అతనికి జ్ఞానప్రాప్తి లభిస్తుంది. అట్టి వారికి ఈ జాగ్రత్ అంతా స్వప్నతుల్యంగా కనిపిస్తుంది. దీనినే పంచమ భూమిక లేక 'జ్ఞానారంభ భూమిక' అని కూడా అంటూ ఉంటారు.

**7. క్షీణ జాగరులు** – వీరు జాగ్రత్ స్వప్నదశ నుండి సాధనను కొనసాగిస్తూ క్రమంగా పరిపూర్ణ జ్ఞానము పొందినవారు అగుచున్నారు. పరమ పదమున విశ్రాంతి పొందుచున్నవారు, సమస్త భూమికయందు ఆరూఢులైనవారు అగుచున్నారు.

**సంకల్పములకు మునుముందే స్వస్వరూపాత్మ** – రామచంద్రా! ఈ విధంగా సముద్రంలో ఉన్నదంతా జలమే అయినప్పటికీ రకరకాల ఆకారాలు గల తరంగాలు ఉన్నట్లుగా ఈ జీవ మహాసముద్రంలో మనం పైన చెప్పుకున్న 7 రకాల జీవులు అన్ని జీవజాతులలోనూ ఉన్నారు. వీటిని తెలుసుకొన్నవాడవై ఉత్తరోత్తర భూమికలయందు తత్పరుడవై ఉండుము.

నాయనా! నీవిక ఈ జగత్తును గూర్చిన 'ద్వైతబుద్ధి' అనే భ్రాంతిని త్యజించు. ఎందుచేతనంటే నీవు ఇప్పటికే పూర్ణముగా బోధైక రూప ఘనత్వమును (ఘనీభూతమైన దృక్మాత్ర రూపమును) పొంది ఉన్నావు. తరంగాలలో భేదం ఉన్నా జలం సర్వదా ఒక్కటే కదా! ద్వితీయాదుల అభావం చేత ఏకత్వ భావన కూడా అవసరం లేదు. అందుచేత 'ఏకత్వ-ద్విత్వ-శూన్యత్వ-అశూన్యత్వ'... ఆదిగాగల సర్వ ధర్మములను వదిలినవాడవై ఉండు. కల్పనలన్నింటికంటే ఆది ఏమిటో గ్రహించు. అట్టి 'ఆది' అయిన అధిష్ఠాన సన్మాత్రుడవై శేషించుము. అదియే నీ స్వభావము.

ఓ సర్వ సభికులారా! మీ అందరి యొక్క వాస్తవరూపం సర్వ కల్పనలకు ముందే ఉన్న ఆత్మ రూపమేనని గ్రహించి తత్పరులై ఉండండి.

❖❖❖

## 11. ఈ జగత్తు ఉత్పత్తి రహితము - మిథ్య - నిరాకారము

**శ్రీరాముడు :** మహాత్మా! 'ఆకాశం నుండి వృక్షం జనించింది' అనేది ఎంతటి అర్థరహితమో పర బ్రహ్మం నుండి జగత్తు జనించడం అంతే అర్థరహితమని అనిపిస్తోంది. బ్రహ్మం నుండి అకారణంగా 'నిరర్థకం-జాగ్రత్ శరీరధారణమయం' అయినట్టి ఈ జీవులంతా ఎట్లా ఉత్పన్నాలౌతున్నారు? బ్రహ్మమే వీరి స్వరూపం గదా! వీరంతా బ్రహ్మము నుండి ఎందుకు, ఏ కారణం చేత జనిస్తున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు 'అకారణంగా' అని అంటున్నప్పుడు నిజమే చెప్పావు. కారణం (లేక) కార్యము ఎన్నటికీ ఉత్పన్నం కాదు. కాబట్టి వాస్తవానికి కేవల జాగ్రత్ జీవులు ఉత్పన్నమే అయి ఉండలేదు. అగ్ని శిఖలలో ఒక్కొక్క శిఖ ఒక్కొక్క ఆకారం కలిగి ఉన్నప్పటికీ అగ్నికి ఏ సమయమందునూ 'ఇట్టిది' అన్న ఆకారమేదీ లేనే లేదు చూచావా? అట్లాగే జాగ్రత్ జీవులు వాస్తవానికి ఉత్పన్నమే కాలేదు. కాబట్టి తదితర పరిణామ ఫలితమైన తక్కిన జీవభేదం ఏనాడు సంభవించి ఉండలేదు. అంతా కూడా యథాతథంగానే ఉన్నది.

**నేఽహ ప్రజాయతే కించిత్! నేఽహ కించన నశ్యతి ।**
**ఉపదేశ్యోపదేశార్థం శబ్దార్థ కలనోదయః ॥**

ఓ రామచంద్రా! వాస్తవానికి బ్రహ్మమునందు ఈ రకరకాల జీవులు మొదలైనవి ఉత్పన్నమవటమూ లేదు, నశించుటయూ లేదు. మరి? ఈ 7 రకాల జీవుల గురించి ఎందుకు చెప్పానంటావా? ఇదంతా కూడా కేవలం శిష్యునికి ఉపదేశించటానికి మాత్రమే శ్రుత్యాదులు ఈ శబ్దార్థ కల్పనలన్నీ చేశాయి. చివరికి జీవ భేదంతో సంబంధం లేని బ్రహ్మమును బోధించటమే ఆ శ్రుతుల అంతిమ లక్ష్యం.

**శ్రీరాముడు :**

**కః కరోతి శరీరాణి, మనో బుద్ధ్యాది చేతనైః?**
**కో మోహయతి భూతాని, స్నేహరాగాది బంధనైః?**

మునీంద్రా! నాదొక చిన్న సందేహం. బ్రహ్మమునందు జీవాది విశేషములేవీ జనించటం లేదని, బ్రహ్మము సర్వదా నిర్మలత్వముచే యథాతథంగానే ఉన్నదని అనుకుంటున్నాం కదా! మరి 'మనస్సు-బుద్ధి' ఇటువంటి చేతన వస్తువులన్నీ ఉపయోగించి భోగసాధనమగు ఈ శరీరమును తయారుచేస్తున్నది ఎవరు? మరియు ఈ జగత్తులో స్నేహము-రాగము మొదలైన ఆయా బంధనములన్నీ కల్పించి ఈ ప్రాణులందరినీ మోహపెట్టుచున్నది ఎవరు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! వాస్తవానికి ఈ శరీరాలను ఎవడూ ఎన్నడూ నిర్మించటమూ లేదు. ఈ ప్రాణులందరినీ ఎవడూ మోహపెట్టటమూ లేదు. జలంలో తరంగాలు, ఆవర్తాలు మొదలైన జలాకారాలన్నీ పొంది జలమే ఆయా రూపాలుగా కనిపిస్తోంది చూచావా? అనాది-అనంతం-బోధ రూపం అయినట్టి పరమాత్మయే ఈ అనేక పదార్థ రూపాలుగా తన స్వరూపముననే ఉండి ఉంటున్నాడు.

వాస్తవానికి బాహ్యపదార్థం అంటూ ఏదీ లేదు. మరి? బీజంలోంచే వృక్షం బయల్వెడలుచు న్నట్లుగా అభ్యంతరమైన బోధ రూప హృదయం నుండే బోధయే (చైతన్యమే) బాహ్యపదార్థం వలె స్ఫురిస్తోంది.

ఒక శిలలో శిల్పం ఉన్నట్లుగా బోధ యందే ఈ 'ప్రపంచం' అనబడేది స్థితి నొంది ఉన్నది. అట్టి బోధ దేశ కాలాలచే ఏకం-అనంతం కూడా! అట్టి 'బోధ' యొక్క విస్తారమే ఈ బాహ్యాభ్యంతర జగత్తు అని గ్రహించు.

అంతేకాదు వాసనలచేతనే సిద్ధిస్తున్న బ్రహ్మలోకం మొదలైన తదితర లోకాలన్నీ కూడా పరమాత్మ యందే ఉన్నాయి. పరమాత్మయో, వాసనలన్నిటికీ ఆవల కేవలమై ఉన్నారు! కాబట్టి వాసనాక్షయమును నిరంతర భావన చేయాలి. అప్పుడు వాసనాక్షయ భావనా బలంచేత అనుభవం సిద్ధించగలదు. శాంతులగు జ్ఞానులు ఆత్మ కొఱకై ఆ లోకంలోనో ఈ లోకోంలోనో వెతకరు.

ఆత్మ అంతటా నిండి ఉండటంచేత 'ఆత్మ ఎక్కడో ఉన్నది' అనురూపమైన వాసనలు వారియందు ఎన్నటికీ జొరబడవు.

సద్రూపమగు ఆత్మయే దేశ-కాల-క్రియా-ప్రకాశ-రూప-చిత్తాదులతో కూడి ఉన్నది. అయితే వాస్తవానికి దేశ-కాల-చిత్తాదుల శబ్ద-అర్థములు ఆత్మకు లేవు. అయినప్పటికీ ఆత్మ శూన్యం కాదు.

ఎవరి దృష్టియందైతే దృశ్యము సర్వదా శమించియే ఉన్నదో... అట్టి తత్త్వవేత్తలగు ద్రష్టలకు మాత్రమే ఆత్మ పదం యొక్క బోధస్థితి అనుభవమగుచున్నది. అన్యులకు అది సుబోధకం అవటం లేదు. అహంకారం అనే పిశాచం ఈ హృదయాన్ని అవహించి ఉన్నంత వరకు ఆత్మపదం సుబోధకం కాదు. 'చంచలం-విస్తారం' అయిన 'అహంకారం' అనే గోతిలో ఎవడు పడతాడో... అట్టి వాడు ఎప్పుడూ ఆత్మ ప్రకాశాన్ని గాంచలేడు.

ఓ రామచంద్రా! ఆత్మ జ్ఞానికి ఈ 14 లోకాలు, ఇందులోని సర్వజీవులు తన యొక్క అవయవాల వలె తోచుచూ ఉంటాయి. జ్ఞానుల యొక్క దృష్టికి ఈ 'సృష్టి' అనేది ఉదయించటమూ లేదు, అస్తమించటమూ లేదు. ఎందుకంటే ఏదైనా 'కారణం' అనేది ఉంటే కదా, 'కార్యం' అనేది ఉండేది? కారణమే లేకపోతే కార్యం ఎక్కడి నుండి వస్తుంది? పరమాత్మ అకారణుడు. అతడు దేనికి కారణం కాదు. కనుక ఈ సృష్టికి కారణమే లేదు. కారణమే లేదు కాబట్టి సృష్టియే లేదు. జ్ఞానులు ఈ సృష్టిని ఉదయం గాని, అస్తమయం గాని లేనిదానిగా దర్శిస్తున్నారు.

**శ్రీరాముడు :** మరి 'పరమాత్మ నుండే ఈ సృష్టి ఆవిర్భవిస్తోంది'... అని వేద వచనం కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే, అయితే... కారణం యొక్క స్వభావమే కార్యం కూడా కలిగి ఉంటుంది కదా! కారణమగు పరమాత్మ ఎట్లు సత్-చిత్-నిరాకార రూపమే అయి ఉన్నదని జ్ఞానులు గ్రహిస్తున్నారో కార్య రూపమగు జగత్తు కూడా సత్‌చిత్ నిరాకార రూపమేనని గమనిస్తున్నారు. అజ్ఞానులో ఇదంతా ఆకార రూపంగా మాత్రమే దర్శిస్తున్నారు.

'బంగారు అభరణం' అనుదానిలో... అభరణం అనే కార్యం 'బంగారం' అనే కారణం నందే ఉన్నప్పుడు, 'ఆభరణం' అనే దానికి బంగారం కంటే వేరైన ఉనికి ఎక్కడ? అట్లాగే కారణమగు పరబ్రహ్మమునందే ఆ పరబ్రహ్మం రూపంగానే ఈ జగత్తు ఉన్నప్పుడు ఇక వేరే 'కారణత్వం' అనేది పరబ్రహ్మానికి ఏమున్నది? బంగారపు ముద్ద ఉంగరం మొ॥న ఆకారంగా ఉన్నప్పుడు ఆభరణం అంటున్నాం. ఆభరణంలో బంగారం తప్ప వాస్తవానికి మరింకేమీ లేదు కదా! అట్లాగే పరమాత్మయే సృష్టి రూపంగా కనిపిస్తోంది. అంతేగాని సృష్టికి పరమాత్మ కంటే వేరైన రూపం లేదు. ఒకవేళ

పరమాత్మ కంటే వేరుగా ఎక్కడైనా సృష్టి అనేది ఎవరికైనా అనుభవమౌతుంటే... అది అసత్తే గాని (వాస్తవానికి లేనిదే గాని) సత్తు కాదు. ఎప్పుడైతే (బంగారు ఆభరణంలో ఆభరణం వలె) అసత్తో, అప్పుడు పరమాత్మ యందు గల 'కారణత్వం' అనేది కూడా అసత్తే (లేనిదే) అగుచున్నది.

'మరి మాకు జగత్తు కనిపిస్తోంది కదా' అని ఎవరైనా అంటారా?

శాంతమగు మహా సముద్రంలో 'తరంగాలు-ఆవర్తనాలు' ఉంటున్నట్లే, శాంతము-క్షోభరహితము అగు బ్రహ్మం నందు 'జగత్తులు-చిత్తములు' ఉంటున్నాయి. ఒకే మట్టి అనేక మట్టి పాత్రల రూపంగా అగుచున్నట్లు, ఒకే బంగారం అనేక పేర్లతో పిలువబడే ఆభరణాలుగా, అగు చున్నట్లు... ఒకే బ్రహ్మం అనే పిండం అనేక జీవులుగా, జగదృశ్యములుగా, చిత్తములుగా అగు చున్నది. అయినప్పటికీ కూడా బ్రహ్మపిండం సర్వదా ఏకం-నిర్మలం అయి ఉన్నది. మట్టి ఎన్ని పాత్రలుగా అగుచున్నప్పటికీ బంగారం ఎప్పటికీ బంగారమే! అట్లాగే బ్రహ్మం సర్వదా బ్రహ్మమే!

కుండగా ఉన్నప్పటికీ... అది మట్టియే! మట్టిగా ఉన్నప్పటికీ అందులో కుండగా అవగల తత్త్వం సర్వదా ఉన్నది. మట్టి మట్టిగా ఉన్నప్పుడు, కుండగా ఉన్నప్పుడు కూడా ఉభయ స్థితులందు ఏక వస్తువును కుమ్మరి దర్శించగలడు. అట్లాగే, జ్ఞాని సహజీవుల వైపు చూచేటప్పుడు ఆ సహజీవుల వాసనాయుక్తమైన మనస్సులను వదలిపెట్టి అతీత దృష్టితో చూడగలుగుతాడు. అతని యొక్క సత్యవస్తుజ్ఞాన ప్రభావం చేత సహజీవులంతా ఆత్మ స్వరూపంగానే అగుపిస్తారు. జ్ఞానులకు ఈ జాగ్రత్ స్వప్నతుల్యంగా తెలియవస్తుంది. స్వప్నం జాగ్రత్తు వంటిదే అవుతుంది. జాగ్రత్తు స్వప్నం వంటిదే అవుతుంది.

ఆత్మ కంటే వేఱుగా ఏదైనా వారికి కనిపిస్తే అద్దానినంతా వారు స్వప్నతుల్యంగా చూస్తారు. అందుచేత వారికి అంతటా అన్నిటా ఒకే వస్తువు భాసిస్తోంది. మృగతృష్ణ 'మృగతృష్ణ'గా తెలియబడిన తర్వాత ఇక ఆ మృగతృష్ణలో కనిపించే ఒక తరంగం-మరొక తరంగం మధ్య గల తేడా భ్రమగానే తెలియవస్తుంది గాని, ఆ తేడా వాస్తవమని అనుకోం కదా! ఈ అనేక విశేషములతో కనిపించే జగత్తు చిత్త మాత్రంగా ఎఱుగబడిన తర్వాత ఇదంతా స్వప్న తుల్యంగా అనిపించటంలో ఆశ్చర్యం ఏముంటుంది? ఆకాశంలో మేఘాలు అనేక ఆకారాలతో కనిపిస్తున్నాయి. అయితే మేఘాలన్నీ జలబిందువుల యొక్క ఘనీభూతమైన హిమ (మంచు) స్థితియే కదా! ఆ మేఘాలు వర్షించాయనుకో, ఇప్పుడేమైనది? ఆ మేఘాలన్నీ జల బిందువులై నేలపై వర్షించాయి కదా! మరి మునుముందటి మేఘాకారాలన్నీ ఏమైనాయి? అట్లాగే ఆత్మ యొక్క సమ్యక్ జ్ఞానం ఉదయించగానే జ్ఞానికి ఈ కనబడే సర్వ దేహాలతోసహా సమస్తం చిత్త త్యాజ్య రూపమున త్యజించబడుతుంది. ఇదంతా ఏకము-నిర్మలము అగు ఆత్మగా సుస్పష్టంగా అనుభవమగుచున్నది.

మేఘాలు ఆవరించినప్పుడు ఆకాశం కనిపించదు. మేఘాలే కనిపిస్తాయి. మరి మేఘాలు తొలగినప్పుడో? ఆకాశం యథాతథంగా నిర్మలము-అనంతము అయి కనిపిస్తుంది. మేఘాలు ఉన్నప్పుడు తొలగినపుడు కూడా ఆకాశం సర్వదా యథాతథమే కదా! 'సత్యము' యొక్క పరిజ్ఞానం

చేత అహంకార సహితమగు జగత్తు కూడా శమిస్తుంది. ఆ స్థానంలో ఏకము-అఖండము-అనంతము-అప్రమేయము అగు ఆత్మ మాత్రమే గోచరిస్తుంది. ఆత్మ జ్ఞానము సంతరించుకొన్న తర్వాత ఆపై అనుభవించబడే శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలన్నీ కూడా మృగతృష్ణాజలం వలె మొదలే శమించియే అక్కడ ఉంటాయి. అగ్ని ప్రజ్వరిల్లుతూ ఉండగానే అందులో ఆకులు, వస్త్రములు, కట్టెలు మొదలైనవి వేశామనుకో, అవన్నీ ఏకం అయిపోతాయి కదా! అట్లాగే జ్ఞానాగ్నిచే జగత్తు-చిత్తము మొదలైనవన్నీ ఏకత్వం పొందుచున్నాయి. తెలివితేటలు గల బాలునికి చీకట్లో పిశాచాకారాలు కనిపించవు కదా! అట్లాగే జ్ఞానికి ఈ మూడు లోకములలో సాకారమంతా (మూర్తిత్వమంతా) క్రమక్రమంగా లేనిదిగా తెలియవస్తోంది.

**చిత్తే చిత్తముగా భాసిస్తోంది! -** అనంత రూపమైనట్టి 'బోధ' (చైతన్యము) తన నిజస్వరూపమున ఈ జగత్తు-చిత్తాదులుగా భాసిస్తోంది. మరి అప్పుడు బోధయందు మూర్తిత్వం (నామ-రూపాదులు) ఎచ్చటివి? ఆత్మను గూర్చిన అజ్ఞానం చేతనే 'జగత్తు-చిత్తం' అను వేర్వేరు రూపాలుగా అనిపించటం జరుగుతోంది. ఎప్పుడు ఆత్మ జ్ఞానముచే అజ్ఞానం నశిస్తుందో... అప్పుడు మూర్తిమంతం యొక్క అస్థిత్వం ఎచ్చట? అగ్నిచే బంగారం కరిగి అతి సూక్ష్మత్వం పొందుతోంది చూచావా? అప్పుడిక బంగారం యొక్క ఇతఃపూర్వపు ఆకారం ఏమయినట్లు? ఎప్పుడు ఆత్మ జ్ఞానంచే ఈ జగత్తు స్వప్న తుల్యమని ఎఱుగబడుతుందో... అప్పుడు ఈ జగత్తు మూర్తిత్వమును వీడుచున్నది. అనగా అప్పుడు ఈ జగత్తు నిరాకారమని, నామ-రూప భేదకల్పనా రహితమని ఎఱుగబడుచున్నది.

ద్రవ రూపంలో ఉన్న బంగారం క్రమక్రమంగా ఘన రూపం పొందుతూ ఉంటుంది చూచావా? అట్లాగే స్వస్వరూపమున ఉన్నట్టి బోధ రూపమగు ఆత్మ దేశ-కాలాలనేవి ఏర్పడటానికి ముందే తనయందు జాగ్రత్-స్వప్నాలను రచించుకొని ఘనత్వాన్ని పొందినదాని వలె అగుచున్నది. ఆత్మ విచారణచే జాగ్రత్-స్వప్నాలు కల్పిత మాత్రాలని, ఆ రెండింటికి 'కారణం-ఆధారం-అప్రమేయం' అయి ఆత్మ సర్వదా ప్రకాశించుచున్నదని తెలియబడగలదు. ఈ ప్రకారంగా ఆత్మ విచారణచే జాగ్రత్-స్వప్నములు తుచ్ఛములైనవని తెలియబడగానే ఇక భోగాల పట్ల అనురాగం దానంతట అదే సన్నగిల్లుతుంది.

ఈ 'దృశ్యం' అనబడేది వివేకికి అవివేకికీ కూడా విద్యమానమై ఉంటోంది. అయితే వివేకులకు ఈ దృశ్యము అత్యంత తుచ్ఛమైనదిగా కన్పట్టుచున్నది. స్వప్నంలో విద్యమాన మయ్యే పదార్థ జాలం ఏ విధంగా నమ్మకమునకు అనర్హమో, ఈ జాగ్రత్ పదార్థజాలం కూడా అంతే అనర్హం. ఎందుకంటావా? ఆత్మయందు లభించే సుఖ విశ్రాంతి ఎచ్చట? ఈ విషయాస్వాదనలు ఎచ్చట? తత్త్వజ్ఞానికి కూడా ఈ విషయాల పట్ల ప్రీతి-నమ్మకం కలుగుతుందంటే, ఇక జాగ్రత్-స్వప్నములు ఒక్కటే అవుతాయి. జ్ఞాన-అజ్ఞానాలు ఒక్కటే అవుతాయి. అది కుదిరేది కాదుకదా! కనుక తత్త్వజ్ఞానికి విషయాల పట్ల నమ్మకం ఉండదు. ఈ జగత్తు చిత్తము చేతనే సిద్ధిస్తోందని, ఇదంతా స్వప్నంలాగా భ్రాంతి మాత్రమేనని తెలియవచ్చిందో, ఇక ఆ సుజ్ఞానికి ఇక్కడి రూపం పట్ల, పదార్థాల పట్ల సత్యత్వ బుద్ధి స్వయంగా తొలగిపోతోంది. మృగతృష్ణలో జలం రుచిగా ఉంటుందని

ఆ జలం కోసం పరుగులు తీసేవాడు తెలియనివాడే గాని, తెలిసినవాడు కాదు కదా! అట్లాగే వివేకి అయినవాడు దృశ్య పదార్థముల పట్ల 'ఇవన్నీ సత్యము-నిత్యము'... అని తలచడు. బయట నుండి కిటికీ గుండా ప్రవేశించిన దీపకాంతికి ఆకారము కనబడవచ్చు గాక! అయితే మాత్రం దీపకాంతికి ఆకారం అంటూ ఏమున్నది? ఏమీ లేదు. శాంతుడగు వివేకికి ఈ జగత్తునందు ఆకారాదులు కనిపిస్తున్నప్పటికీ ఇదంతా నిరాకారంగాను, ఆకాశరూపంగాను గ్రహిస్తున్నాడు.

**జాగ్రతో వస్తుతః శూన్యాత్ పరిజ్ఞాతాత్ నివర్తతే ।**
**చిత్త భ్రమాత్మనో భ్రాన్తిర్ రూపాస్వాదన భావనా ॥**

ఒకడు మేలుకొనిన తర్వాత స్వప్నంలో కనిపించిన వస్తువుల కోసం వెతకాలని అనుకుంటాడా? అనుకోడు. ఎందుచేత? అవి అవాస్తవములని, శూన్య మాత్రములని, కేవలం భ్రమచే సిద్ధించాయని బాగా తెలుసు కనుక! అట్లాగే ఈ జగత్ పదార్థములన్నీ చిత్తం యొక్క భ్రమ-చాంచల్యములచే మాత్రమే సిద్ధిస్తున్నాయని తెలిసిన తర్వాత జ్ఞానికి వీటిని పొందాలనే ఉద్వేగమంతా మొదలంటా తొలగుతోంది. ఏ వస్తువు పట్ల అయినా గ్రాహ్య బుద్ధి (సంపాదించుకోవాలనే ఆలోచన) ఎట్లా కలుగుతుంది? ఆ వస్తువుపై గల నమ్మకం చేతనే కదా! జ్ఞానికి అదంతా స్వప్నంలో కనిపించిన బంగారు గొలుసు కావలసిందేనని కోరుకోవటం వంటిదే అవుతుంది. జ్ఞానికి సర్వదా సర్వ విశేషాల పట్ల రాగబుద్ధి తొలగుతోంది. 'ద్రష్ట-దృశ్యం' అనే దోషాన్ని అతడు తనయందు తొలగించుకొని ఉంటున్నాడు. లేదా దోష గ్రంథుల యొక్క ఛేదనం కొఱకై ప్రయత్నశీలుడై, నిమగ్నుడై ఉంటున్నాడు.

'జ్ఞాని' సకల బంధుత్వాలలో రాగ రహితుడై, దృశ్య పదార్థాల పట్ల మనన వర్జితుడై, అహంకార శూన్యుడై, ద్వేషమంటూ ఏదీ లేనివాడై, సాంసారిక ప్రయత్న రహితుడై, శాంతుడై వెలయుచున్నాడు.

**వాసనలు - అపేక్ష - ఉపేక్ష -** దీపశిఖ నశిస్తే దీపకిరణాలు నశిస్తాయి కదా! అట్లాగే భోగాలపై అపేక్ష తగ్గుచున్న కొలదీ వాసనలు సన్నగిల్లుతూ వస్తాయి. కాక, భోగాలపై అపేక్ష పెరుగుచున్నదా... వాసనలు ప్రవృద్ధమౌతూ ఉన్నట్లే. ఆపేక్ష తప్పించి వాసనలకు వేరే రూపమేదీ లేదు.

ఓ ప్రియ సహజీవులారా! ఈ జగత్తంతా గంధర్వ నగరంలాగా భ్రాంతి రూపమేనని మీరు గమనించండి! తత్త్వబోధచే ఇదంతా సూక్ష్మమైనట్టి సత్-చిత్ ఆకాశంగా గమనించ బడగలదు.

**యత్రనాఽఽత్మా న శూన్యంచ న జగత్కలనాపిచ ।**
**న చిత్త దృశ్యో ఉదయ ధీః, సర్వంచ అస్తి యథా స్థితమ్ ॥**

ఆ పరమాత్మ జీవుడు కాదు. శూన్యమా? కానే కాదు. ఆ పరమాత్మ పదమున జగత్కల్పన గాని, చిత్తం గాని, దృశ్యోదయం గూర్చిన బుద్ధిగాని లేవు. మరి? ఇదంతా కూడా యథాస్థితమగు బ్రహ్మమే అయి ఉన్నది. అజ్ఞానులకు కనిపించే సాకారమంతా జ్ఞాని దృష్టికి అతని యొక్క తత్త్వ జ్ఞానంచే లయించి పోవుచున్నది. అందుచేత దృశ్య విషయాల పట్ల ఉపేక్ష పెంపొందించుకోండి.

**శ్రీరాముడు :** అనగా అతని దృష్టికి ఈ జగత్తు అసలు కనిపించదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కనిపిస్తుంది. ఇదంతా కనిపిస్తున్నప్పటికీ ఇవన్నీ శూన్య రూపాలుగాను, లేనివి గాను అగుపిస్తాయి. 'ఈ జలానికి ఆవర్తములు ఎందుకు వచ్చాయి?'... అని అనుకొని ఎవడైనా జలంలోని ఆవర్తములను తొలగించి జలమును పరిశుద్ధపరచాలని అనుకొంటాడా? జలమునందు ఆవర్తనములు ఉన్నప్పటికీ (లేక) ఉండనప్పటికీ జలం సర్వదా యథాతథంగా ఉంటోందని జల తత్త్వం తెలిసినవాడు అనుకుంటాడు కదా! జ్ఞాని ఈ వివిధ వికారాలతో కూడిన జగత్తు ఒక ప్రక్క కనిపిస్తున్నప్పటికీ ఇచ్చట ఆత్మ ఆత్మయందే యథారూపంగా ఉన్నదని గ్రహిస్తున్నాడు. అతడు (జ్ఞాని) ఆకాశం వలె నిర్మలుడై, సౌమ్యరూపుడై, సంగరహితుడై, కేవలమూ సమాధితత్పరుడై ఉన్ననూ, లేనివాడై ఒప్పుచూ ఉంటాడు. అతని మనస్సు సర్వదా అస్తమించియే ఉంటుంది. అతడు మౌనియై, ఇంద్రియ-మననాలను అధిగమించినవాడై ఉంటాడు. సమస్త కర్మల యొక్క అంతమును సంపాదించుకొని ఉంటాడు. సంసార సముద్రమును దాటివేసి ఉంటాడు.

1. స్థూల-సూక్ష్మ-కారణ-మహాకారణ చతుర్విధ దేహముల యొక్క,
2. ఆ దేహమునకు ఆధారమై ఈ 14 లోకముల యొక్క,
3. ఆ 14 భువనములకు ఆధారమైన ఆకాశము యొక్క,
4. పర్వత సమూహముల యొక్క,
5. విషయ సాధనా క్రమముల యొక్క

... వీటన్నిటి యొక్క ఉపాదాన కారణము 'మూలాజ్ఞానమే'! అట్టి మూలాజ్ఞానం నశించిందా, ఇక ఆపై ఈ శరీరము, ఈ భూమి మొదలైనవి కనబడుతూనే అతనికి 'లేనివి' గా తెలియవస్తున్నాయి. ఈ ప్రకారంగా జ్ఞాని... శాంతమైన అంతఃకరణం కలిగినవాడౌతాడు. వికల్ప రహితుడై ఉంటాడు. స్వరూపసారమయుడై ప్రకాశిస్తాడు. పరమానందమగు 'ఆత్మానందం'తో ఎల్లవేళలా పరితృప్తుడై ఉంటాడు, నిరావరణ భూమానంద స్వరూపుడై వర్తిస్తాడు.

❖❖❖

# 12. సృష్టి - ప్రళయములు

**శ్రీరాముడు :** మునీంద్రా! చిదాత్మ వాస్తవానికి కేవల బోధ రూపం కదా! మరి ఏ క్రమం చేత అది జగత్తు వలె భాసిస్తోంది? చిత్తము యొక్క భేదనివారణ కొరకై ఈ విషయం తెలియజేయ ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! **వృక్షస్యేవ విమూఢస్య యదృష్టౌ తత్స్వచేతసి** - విత్తులోని ఒకే చేతనసత్త వృక్షం యొక్క మూలం-ఆకులు-పుష్పం-ఫలం మొదలైన ఆకారాలు పొందుచున్నది చూచావా? అట్లాగే అజ్ఞాని యొక్క అంతరంగంలోని అజ్ఞాన దృష్టియే ఇట్లు ఈ దృశ్య పదార్థాలుగా అనుభవమగుచున్నది.

**యన్నదృష్టౌ న తచ్చిత్తే భవతి అల్పతరస్మృతే** - దృష్టియందు ఉన్నదే చిత్తము నందు ఉంటోంది. చిత్తం నందు ఉన్నదే దృశ్యంగా ప్రాప్తిస్తోంది. దృష్టిలోను, చిత్తంలోను లేనిదేదీ దృశ్యంగా ప్రాప్తించుటలేదు. దృష్టిలో లేనిదేదీ కించిత్తు కూడా స్మరించబడటం లేదు, దర్శించబడటం లేదు.

అయితే, వివేకి అయిన వాడు శాస్త్రార్థముల పూర్వ-పరములను గ్రహించియే, ఆపై దర్శనం చేస్తాడు. అంతేగాని ఈ ఇంద్రియాలకు కనబడినట్లుగా కాదు. శాస్త్రములకు నిషిద్ధమైన విశేషాలను సమీపంగా ఉన్నప్పటికీ వాటిని చూడటానికి కూడా అతడు ఇచ్ఛగించడు. వీటిని గురించి ఎటువంటి చిత్త పరిశ్రమ కలిగి ఉండడు. కాబట్టి రామచంద్రా! నీవు కూడా చిత్తశుద్ధికి అనుకూల మైన అనుష్ఠానమునందు మాత్రమే తత్పరుడవై ఉండెదవు గాక! శాస్త్ర సమ్మతమైన చిత్తమును మాత్రమే పెంపొందించుకో. శాస్త్రముల యొక్క అత్యుత్తమార్థములందు మాత్రమే మననశీలుడవై ఉండు. శ్రవణములకు భూషణములైన ఈ ఉపదేశం విను.

❖

అవిద్య-దృశ్యభ్రాంతి పర్యాయపదాలే! ఈ దృశ్య సమూహం గూర్చిన భ్రాంతియే అవిద్య. ఇంతకు మించి అవిద్య అనగా ఏదీ లేదు. మృగతృష్ణలో జలం అంటూ ఏదీ లేనట్లు వేఱుగా అవిద్య అంటూ ఏదీ లేదు.

అయినా కూడా... మన ఈ ఉపదేశ్య-ఉపదేశముల కొఱకై కాసేపు 'అవిద్య అనునది ఏదో ఉన్నది' అని అనుకొని (కాసేపు అవిద్య వేరే నిజంగా ఉన్నదని అనుకొని)... ఈ నా వాక్యాలు విను. 'అవిద్య ఎట్టిది? ఎక్కడ నుండి వచ్చింది?'... మొదలైన వికల్పములను కాసేపు కట్టిపెట్టి నేను చెప్పబోయేది వింటే 'జగత్తు గాని, అవిద్యగాని లేవు' అని నీవే స్వయంగా గ్రహిస్తావు.

❖

అనేక విశేషాలతో, రకరకాల పదార్థాలతో పూర్ణమై ఉండి కనిపిస్తున్న ఈ స్థావర జంగమాత్మక ప్రపంచం 'కల్పాంతం' నందు నశిస్తోంది. కాస్త విమర్శించి చూస్తే... ఈ జగత్తు 'భూలోకం' మొదలైన విభాగాలు ఒక్కొక్కటి విశ్లేషిస్తూ వస్తే 'ఇది లేదు' అని ఆ ఒక్కొక్కటీ తొలగుతూ రాగలదు. ఒక కుండలో నీళ్లు ఉన్నాయనుకో, అందులో ఒక్కొక్క బిందువు తొలగించుతూ ఉండగా, ఆ కుండ లోని నీళ్లన్నీ ఒక నాటికి అయిపోక తప్పదు కదా! ఈ జగత్తు కూడా విమర్శచే అంతే!

**1. "ఈ జగత్తు బ్రహ్మము యొక్క అవయవమా?"** – ఈ జగత్తు బ్రహ్మం యొక్క అవయవ మనియే కొద్దిసేపు అనుకుందాం. అప్పుడు 'అవయవం' అగు ఈ జగత్తు నశిస్తే, 'అవయవి' అగు బ్రహ్మం కూడా నాశనం పొందాలి. బ్రహ్మమునకు 'నాశనం' అనే ధర్మమే ఉంటే 'ఆత్మ అనంతం' అనే వేదవాక్కుకు విఘ్నం కలుగుచున్నట్లే కదా! కాబట్టి 'ఆత్మ-చిదేకరసం-నిరవయవం' అయినట్టి బ్రహ్మమునకు ఈ జగత్తు అవయవం అవటానికి కూడా వీలు లేదు.

**2. "పరమాణువుల సంయోగంలోంచి 'నేను' వస్తోందా? వియోగంచే పోతుందా?"** – ఇక మరొక (చార్వాకుల) వాదం ఇక్కడ చెప్పుకుందాం.

"భూమి మొదలైన ఈ పంచభూతాలు స్వతహాగా జడమే. కానీ కల్లు త్రాగినప్పుడు దేహ మంతా 'నిషా' ప్రసరించినట్లుగానే ఈ పంచ భూతాలు ఒక చోట ఒక విధానంగా సమావేశం అయినప్పుడు చైతన్యం ఉదయిస్తోంది. అందుచేత ఈ దేహాలలో 'నేను' అను ప్రజ్ఞ ఉదయిస్తోంది. ఆ అణువులు విడిపోగానే 'నేను' అంతరిస్తుంది. ఇంతకు మించి ఏమీ లేదు."

ఈ వాదన మాకు సమ్మతం కాదు. ఎందుకంటావా? ఈ దేహం 'విజ్ఞానం' (ప్రజ్ఞ) పై ఆధారపడి ఉంది గాని, దేహంపై ప్రజ్ఞ ఆధారపడి లేదని మేం గమనిస్తున్నాం. ప్రజ్ఞయే దేహాన్ని నడిపిస్తోంది. అంతే గాని ప్రజ్ఞ దేహంలో 'కాలు-చేయి-జీర్ణకోశం' వలె ఒక విభాగం కాదు. చేతిని నీవు కదిలిస్తున్నావు. అంతేగాని, చేయి నిన్ను కదిలిస్తోందా? లేదు. అనగా 'నేను' అని స్ఫురించే చైతన్య అధీనంలోనే ఈ దేహం ఉన్నది. అంతేగాని దేహ అధీనంలో చైతన్యం లేదు.

**3. "యథా ద్రష్టం - తథా దృశ్యం"** - ఇక ఈ దృశ్యానికి వద్దాం. మా ఉద్దేశానుసారంగా కూడా ఈ దృశ్యం ఎట్లా ఒకనికి కనబడుచున్నదో... అది ఈ దృశ్యము యొక్క అసలు రూపం కాదు. దీని రూపం మరొకటేదీ కూడా కాదు. మరి? ఈ దృశ్యము ఎవరు ఏ దృష్టితో చూస్తే ఆ విధంగా అనుభవమౌతూ ఉంటోంది. కనుక ఇది 'అనిర్వచనీయం' అని చెప్పబడుతోంది. ఇది అవిద్యచే ఇట్లిట్లు అనుభవమౌతోంది. ఇది ఎట్లెట్లు అనుభవమౌతోందో,.. అదంతా కూడా విద్యచే తప్పక నశించగలదు. 'జగద్దర్శనము' అనేది మధ్యలో వచ్చి మధ్యలోనే పోవుచుండేది.(జగత్ = జనించి గతించేది) అందుచేత జ్ఞానముచే అవిద్యను నశింపజేయాలి. అట్లు బోధ గావించి బంధ నివృత్తికి మార్గం చూపటమే శాస్త్రముల సాఫల్యము.

**4. "జగత్తు నశించి మరల మరొకప్పుడు మరొక జగత్తుగా జనిస్తోందా?"** - ఇక మరికొందరి ప్రతిపాదనల ప్రకారం 'పూర్వ కల్పంలో ఏ ప్రపంచమైతే నశించిందో... అదే మరల తిరిగి ఉత్పన్నమైనది'... అని! 'ఇది పూర్వ కల్పంలో ఉన్నట్లే ఉన్నదా? లేక అన్యంగా ఉన్నదా?'... అనే విషయం చెప్పటానికి, నిరూపించటానికి శక్యమయ్యేది కాదు. కాబట్టి అది అనిర్వచనీయం. అయితే 'అనుభవం'ను వదిలిపెట్టి కేవలం 'ఊహ-అపోహలు' సహాయంతో ఎవరైనా ఏదైనా చెప్పితే అది ఒప్పుకోవటానికి కుదరదు కదా! అయినా, నశించిపోయినది మరల ఎట్లు (ఏ కారణం చేత) ఉత్పన్నమైనది? కారణం దొరకనంతవరకు ఈ సిద్ధాంతం నిర్ణయాత్మకం కాదు.

**5. "సాకారం నిరాకారం అయి, మరల నిరాకారంలోంచి సాకారం వస్తోందా?"** - ఇంకొక అభిప్రాయమేమిటంటే, "సాకారమగు ఈ జగత్తే 'ప్రళయం' అనే ఒకానొక సమయంలో నిరాకార మౌతోంది. అట్టి నిరాకార స్థితిలో ఆకాశరూపంగా అగుచున్నది. సాకార జగత్తు ఒకప్పటికి (ప్రళయ సమయంలో) నిరాకరం అవుతోంది కనుక ఈ జగత్తు శాశ్వతం కాదు."

ఇంత వరకు బాగానే ఉన్నది గాని, అసలు సాకారమైనది నిరాకారం ఎట్లా అవుతోంది? 'ప్రళయం తర్వాత తన రూపం ఈ జగత్తు తిరిగి పొందుతోంది'... అని అనదలచుకొంటే, అప్పుడు ప్రళయంలో కూడా నశించకయే ఉన్నది కదా! అట్లా ఉండకపోతే, (నశించిపోతే) నశించినది మరల ఎట్లా ఉత్పన్నం అవుతున్నట్లు? కనుక ప్రళయ సమయంలో కూడా ఈ జగత్తు నశించకయే ఉన్నది'... అని అనవలసిరాక తప్పదు. అనగా... "ప్రళయం" అనేది ఈ విధంగా 1. సృష్టిలోని విభాగమే ప్రళయం, 2. కారణమగు 'అవాక్యత్వము (నిర్విషయ చైతన్య తత్త్వం) కార్యమగు ఈ సృష్టి ఏ సమయమందును, వేర్వేరుగా లేవు'... అను మహావాక్యర్థము సిద్ధిస్తోంది.

ఈ సృష్టియే పరమాత్మ. అలా చెప్పుటలో మా ఉద్దేశం–

1. భావనయే 'సృష్టి' అను అనుభవమునకు మూల స్వరూపం;
2. భావన భావుకుని కంటే వేఱు కాదు;
3. భావుకుడు చిదాకాశము కంటే వేఱుగా లేదు.

కనుక ఈ సృష్టి పరమాత్మయే గాని మరింకేమీ కాదు. వేఱుగా ఎక్కడైనా ఏదైనా ఎవరికైనా కనిపిస్తుంటే, అది భ్రమ మాత్రమే! వేఱుగా కనిపించేదంతా కాలముచే మార్పు–చేర్పులు పొందుతూనే వస్తోంది.

దృష్టియే సృష్టి. దృష్టికి ఈ సృష్టి కనబడుతూనే ఉంటున్నప్పటికీ ఇది శూన్యమాత్రంగా (నిర్విషయ మాత్రంగా) ఎప్పుడు తెలియవస్తుందో... అట్టి నిర్విషయానుభవమే 'ప్రళయం'. ఇంతకు మించి 'సృష్టి నశించటం' అనేది ఎక్కడా ఏదైనా ఉంటే నాకు చెప్పు. అట్టిదేదీ లేనే లేదు.

**6. "సృష్టి-ప్రళయాలు 'ఆలోచన వచ్చి-పోయి మరొక ఆలోచన రావటం' వంటివి"** – ఈ జగత్తు ప్రళయంలో నశించి మరల ఈ జగత్తే సృష్టి సమయంలో సృజించబడుతోంది...., అని అనటం కంటే....., ఈ జగత్తు నశించుచు మరల వేరైనది జనిస్తోంది... అని అనటమే యుక్తం. ఈ సృష్టి–ప్రళయాలు ఒక ఆలోచన వచ్చి–పోయి మరొక ఆలోచన ప్రారంభమవటం వంటిది.

**7. "జగత్తు శాశ్వతం - సృష్టి ప్రళయాలు జగత్ సంఘటనలు?"** - 'ఒకే వృక్షంలో మధ్య మధ్య కొమ్మలు–ఆకులు–పూలు భేదంగా ఉన్నట్లే సృష్టి–ప్రళయాలు ఒకే జగత్తులో విభాగంగా ఉన్నాయి. జగత్తు సర్వదా ఏకైక విభాగమైనప్పటికీ అందులో సృష్టి–ప్రళయాలు ఆయా అంతర్లీన సంఘటనలవలె ఉంటున్నాయి... అనునది మరొక వాదం.

అయితే, విత్తులోని ఒకే సత్త ఆయా వృక్ష విభాగాలుగా కనిపిస్తూ ఉండటం చేత వృక్ష సత్త మరొకటిగా అవటం... అనేది వాస్తవానికి లేదు.

ఏకమగు సత్‌తత్త్వము (సత్ మాత్రము) నిజ స్వభావమున ఉంటూనే మాయచే వివిధ దేశ–కాలాదుల రూపంగా కనిపిస్తోంది. పరమార్థంగా చూస్తే ఇక్కడ నానాత్వభేదం లేదు. మా దృష్టిలో ఈ సమస్తం ఆత్మరూపమే! తత్త్వవిచారణచేతనూ, తత్త్వజ్ఞానాంతర అనుభవ ప్రమాణం చేతనూ ఇదంతా కూడా 'శాంతం–అనాది ఆకాశం వలె నిర్మలము–కేవలము–బోధ మాత్రము'... అగు పరమాత్మగానే శేషించ గలదు. అయితే, సద్రూపమగు చిదాత్మ... ఏ విధంగా అయితే అనుభవమునకు రాగలదో, ఏ విధంగా అయితే అనుభవమునకు సిద్ధించదో ...అట్టి విషయ క్రమమును వివరిస్తున్నాను. విను.

❖❖❖

# 13. మహా కల్పాంతము

**శ్రీవసిష్ఠ మహర్షి :** 'సర్వ కల్పనారాహిత్య స్థితి' అని చెప్ప తగు "మహా కల్పాంతం" అను స్థితి గురించి శాస్త్రములు ప్రతిపాదించి చెప్పుచున్నాయి. అట్టి 'మహా కల్పాంతము'న పురుగు నుండి మహాదేవుని వరకు గల మనో–బుద్ధి–కర్మ సహితమగు సమస్త దృశ్యమండలం నశిస్తోంది. ఆకాశ–వాయు–అగ్ని మొదలైన పంచభూతాలు, కాలం మొదలైన అపంచీకృత విశేషాలు కూడా శమిస్తాయి. అప్పుడు అంధకారం కూడా ధ్వంసమైపోతుంది. జలము–పృథ్వి కూడా క్షయిస్తాయి. శబ్ద–అర్థ విభాగమంతా కూడా అస్తమిస్తుంది.

అప్పుడిక బోధ రూపమగు ఆత్మ మాత్రమే శేషించి ఉంటుంది. అట్టి సర్వశేష్యము, సర్వాత్మకము అగు ఆత్మ... పరమ శాంతము, నిర్మలము; అబాధితం (అది దేనిచేత బాధింప బడజాలదు); అనాది, అనంతం, సౌమ్యం; అవ్యయం, అవాచ్యం; అవ్యక్తం, అతీంద్రియం; నామ రూప రహితం, సర్వ భూతాత్మకం; సర్వవస్తు శూన్యం, అన్య పదార్థ రహితం; సర్వలక్షణ సమన్వితం, సర్వలక్షణ విలక్షణం; పదార్థముల దృష్ట్యా అసత్తుల్యం, సన్మాత్రం, సర్వోత్తమమగు 'బోధ' రూపం.

ఇదంతా మహాకల్పాంతంలో కూడా శేషించే ఆత్మ యొక్క మాహాత్మ్యము. ఆ పరమాత్మ వాయువు కాదు. ఆకాశము కాదు. మనస్సు–బుద్ధి మొదలైనవి కాదు. శూన్యము కూడా కాదు. అది ఏ పదార్థమూ కాదు. కానీ... సర్వ రూపములూ అదే! అది అనిర్వచనీయమైన చిదాకాశం!

**తద్విదా, తత్పదస్థేన, తన్ముక్తేన అనుభూయతే ॥**

**"నేనే ఆత్మను" -** అట్టి ఆత్మ గురించి ఎఱిగినవాడు, ఆత్మ పదమును ఆశ్రయించి ఆ పదము నందే ఉన్నవాడు, సర్వ కల్పనల నుండి విముక్తుడైనవాడు మాత్రమే తత్త్వజ్ఞాని అయి ఆత్మను అనుభవానికి తెచ్చుకోగలడు! అఖండము–అప్రమేయము–సర్వము అగు ఆత్మ తానేనని గ్రహించుటే జ్ఞాన సారం! ఇక తదితరుల విషయమంటావా?

**అన్యైః కేవలమ్ ఆమ్నాతై రాగమైరేవ వర్ణ్యతే ॥** (ఆమ్నాయః = వేదం శిష్యపరంగా వర్ణించటం)

కొందరు ఆత్మ గురించి 'అది అప్రమేయం–అనంతం–నిత్యం–సత్యం–అఖండం'... ఇత్యాదిగా వర్ణించగలరు. ఏ గ్రంథంలో ఎట్లు చెప్పబడిందో, ఎవరిచే ఎచ్చోట ఏ విధమైన దృష్టాంతాలతో ఎట్లెట్లు వర్ణించబడిందో ఉపన్యసించగలరు. అనేక వాదోపవాదాలతో ఆత్మ ఎంతటిదో నిర్ణయించి ప్రవచించ గలరు. వేద ప్రమాణములు వల్లించగలరు. అవన్నీ మంచిదే కాని అంతటితో సరిపోదు.

'ఆత్మకు అన్యమైనది లేదు. కాబట్టి నేను స్వతఃసిద్ధమగు ఆత్మనే.' సహజీవులంతా నా స్వరూపులే. నేను సహజీవుల స్వరూపుడనే. స్వస్వరూపమగు నా ఆత్మ పదం జన్మ–మృత్యు–జరాదులచే గాని, మనో–బుద్ధి–అహంకారాదులచే గాని, మార్పు–చేర్పులు పొందేది కాదు. నేను కేవల స్వరూపుడను. జాగ్రత్–స్వప్న–సుషుప్తులకు కేవల సాక్షిని. జన్మ–జరా–మరణములకు కూడా సాక్షిని. ఈ దేహము–మనస్సు–బుద్ధి–అహంకారములను చూచేవాడినే గాని, అవి నేను కాదు. అవి నావి

కావు... అను అనుభవమును పుణికిపుచ్చుకున్నప్పుడే అతడు 'ఆత్మజ్ఞాని' అవుతాడు. అనుభవజ్ఞుడు కానివాడు ఆత్మను వర్ణించువాడే గాని 'ఆత్మజ్ఞుడు' కాదు.

**న కాలో, న మనో, నా௨త్మా, న సన్నాసన్న దేశ-దిక్ ।**
**న మధ్యమేతయోః నా௨న్తం న బోధో నాఅపి అబోధితమ్ ॥**

ఆ ఆత్మ కాలము కాదు. మనస్సు కాదు. జీవుడు కాదు. సత్తు కాదు. అసత్తు కాదు. సత్తు-అసత్తుల మధ్యగా ఉన్నదేదో కాదు. దేహము కాదు. దిక్కు కాదు. అంతము కాదు. తన స్వరూపము కంటే అభిన్నమైన ఏదో 'బోధ' కాదు. 'అబోధ' కూడా కాదు.

ఆత్మ సర్వదా ఆత్మగానే ఉన్నది. అద్దాని యందు తదితరమైనదేదీ లేదు. ఏర్పడజాలదు.

ఇక ఈ కనబడే అనేక జీవులు, వారి మధ్య అనిపిస్తున్న అనుకూల-ప్రతికూల-ఉదాసీన ఆదిగా గల సంబంధాలంటావా? ఇవన్నీ జలంలో కనిపించే అనేక తరంగాల యొక్క సంఘాత-విఘాత చమత్కారాల వంటివే! ఒక తరంగం మరొక తరంగమును అనుసరించటం-ఢీకొనటం-ఎదురు-బొదురు అవటం.. ఇవన్నీ జలంలోని అంతర్గత విన్యాసాలయినప్పటికీ జలము సర్వదా సర్వతరంగాతర్గతము-యథాతథము కదా! ఈ అనంత జీవ (మనో-బుద్ధి-అహంకారాది) తరంగాలన్నీ ఆత్మ యొక్క విన్యాసమే అయినప్పటికీ ఆత్మ సర్వదా యథాతథము.

**కిమప్యేవ తదత్యచ్ఛం బుధ్యతే బోధపారగైః**
**శాంత సంసార విస్తారైః పరాం భూమిముపాగతైః ॥**

అయినప్పటికీ కూడా... 'బోధ' యందు పారంగతులు, 'సంసార విస్తారము' శమించినట్టి వారు, పంచమ-షష్ఠ-సప్తమ భూమికలను అధిరోహించినవారు... అగు మహాత్ములే ఆ 'విలక్షణం-అతి నిర్మలం'... అగు ఆత్మను అనుభవముగా కలిగి ఉంటున్నారు.

ఇక జగత్తు-మనస్సు-బుద్ధి మొదలైనవి వాస్తవానికి లేవు. లేకపోయినప్పటికీ శాస్త్రాలు అవి ఆత్మబోధ కొరకై కల్పించి, విశ్లేషించాయి. శాంత సముద్రంలో అనేక తరంగాలు ఉన్నట్లు శ్రుతులలో నిషేధించిన వాటిని నిషేధించి, ఉపదేశించిన వాటిని ఉపదేశిస్తూ నేను కూడా ఈ సభలో ఇన్ని రోజులుగా ప్రవచనం చేశాను, చేస్తున్నాను. అదంతా ఆత్మబోధ కొరకై మాత్రమే. అంతేగాని మనస్సు మొదలైన వాటి ఉనికి అంగీకరించి-నిషేధించటం కానే కాదు సుమా! కనుక మనస్సు మొదలైనవన్నీ ఆత్మ పార్యాంశాన్ని బోధించటానికి, తత్ సౌలభ్యం కొరకు కల్పించి చెప్పబడేవి మాత్రమే – అని గమనించు.

అటు చూడు! ఆ పెద్ద శిల ఉన్నది. ఆ శిలలో శిల్పి అనేక శిల్పాలు చెక్కగలడు. అయితే ఆ చెక్కబోయే శిల్పరూపాలన్నీ ఈ కనబడే శిలలోనే ఉన్నాయి కదా! ఏ రూపంగా ఉన్నాయి?

**శ్రీరాముడు :** ఆ శిలలోనే శిల రూపంగానే – చిత్రీకరించబడబోయే శిల్పాలన్నీ-అప్రకటిత రూపంలో ఉన్నాయి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవునా! అట్లాగే నిజ స్వరూపముననే ఉన్న పరమాత్మయందు ఈ వివిధ జగత్తులు – జగత్ పదార్థములు ఒదిగి ఉన్నాయి.

ఈ ప్రకారంగా అధిష్ఠాన రూపము చేత మనోబుద్ధి - చిత్త - అహంకారాలు, దృశ్య వ్యవహారం, ఈ సమస్త పదార్థములు పరమాత్మయందే ఉన్నాయి. (శిల్ప రచన అంతా శిలల్లోనే ఉన్నట్లు!). అయినా కూడా దృశ్యరూపంగా చూస్తే (వేర్వేరు మృగాలు-చెట్లు-వ్యక్తులు... చిత్రీకరించ బడిన శిల్పం వలె)... దృశ్యం లేదు. (శిల్పంలో ఉన్నదంతా శిలయే కదా!)

ఆ పరమాత్మయే సర్వ స్వరూపుడు. ఈ మనో-బుద్ధి-చిత్త-అహంకారాలు, ఈ సంగతి-సంబంధ-బాంధవ్యాదులు... ఇవన్నీ కూడా "పరమాత్మాంతర్గత -పరమాత్మ స్వరూపాలే!"

కానీ అతడు తనకు తదితరమైన ఏ రూపంగానూ అగుటయే లేదు. అతడే పదార్థ రూపుడుగా అగుచున్నాడు. కానీ అతడు అపదార్థ స్వరూపుడుగానే ఉన్నాడు.

శిలయందు ఇంకా విగ్రహం చెక్కబడుతున్నప్పుడు ఆ శిలలో విగ్రహం ఉన్నదా? లేదా? ఉన్నదనీ చెప్పవచ్చు. ఎందుకంటే... శిల్పి శిల నుండే కదా... విగ్రహం తయారు చేస్తున్నాడు! లేదని కూడా అనవచ్చు. ఎందుకంటే, శిల ఎల్లప్పుడూ శిలయే కదా!

**"అంతా - అంతటా ఆత్మయే" -** అట్లాగే, ఆత్మైక్యం పొందిన మహనీయులు తమ ఇచ్ఛను అనుసరించి ఆ పరమాత్మను 'సర్వ పదార్థయుక్తుడు' గాను, 'సర్వ పదార్థ రహితుడు' గాను కూడా దర్శిస్తూ ఉంటారు.

**సర్వం సర్వాత్మకంచైవ సర్వార్థ రహితం పదమ్ ।**
**సర్వార్థ పరిపూర్ణం చ తత్ 'ఆద్యం' పరిదృశ్యతే ॥**

'సమస్తమునకు ఆది' అయినట్టి ఆ 'ఆత్మపదము'ను జ్ఞానులు 'సర్వరూపంగాను, సర్వాత్మకం గాను, సర్వ పదార్థ రహితంగాను, సర్వ పదార్థ పరిపూర్ణంగాను'... వీక్షిస్తూ ఉంటారు.

**అసంశయం - సమగ్రం -** ఎవరైనా "సర్వ పదార్థముల ఉపశమనరూపమగు 'సమ్యక్ జ్ఞానం' ఉత్పన్నం కాలేదు... అని అనటానికి గుర్తు ఏమిటి?" అని అడిగితే... అందుకు గుర్తు వారికి ఇంకా సంశయములు మిగిలి ఉండటమే సుమా! సర్వ సంశయములు శమించినట్టి జ్ఞాని దృశ్యము యొక్క అభాస లేనివాడౌతాడు. స్వభావ సిద్ధంగానే నిర్మలాంతఃకరణుడు, శాంతుడు అవుతాడు. అట్టివాడు ఆత్మ స్వభావమును అప్రయత్నంగానే పరికిస్తాడు.

బంగారం ముద్దలో రకరకాల అభరణాలు ఉన్నట్లు, ఆ పరమాత్మలో 'నేను-నీవు-వాడు-వీడు' మొదలైన త్రికాల జగద్భ్రమ అగుపిస్తోంది. బంగారానికి వేరుగా అభరణం ఎక్కడున్నదయ్యా? పరమార్థఘనమగు పరమాత్మ కంటే వేఱుగా జగత్తు కూడా లభించనే లభించదు. 'గొలుసు-ఉంగరం' మొదలైన అభరణాల పేర్ల కంటే బంగారం వేఱుగా ఉన్నట్లుగానే... 'నామ రూపమయం-ద్వైతాత్మకం-మిథ్య' అయినట్టి జగత్తు కంటే 'నిజ స్వరూపభూతుడు' అగు పరమాత్మ వేఱుగా ఉన్నాడు. అట్టి ఆత్మకు దేశ-కాల-క్రియాది శబ్ద-అర్థములు లేవు. కానీ దేశ-కాల-క్రియాదులుగా కనిపిస్తున్నదీ, ఒప్పుచున్నదీ అదే! ఇంకా... యథా స్థితమైనట్టి ఈ సమస్త జగత్తు కూడా అధిష్ఠాన రూపం చేత అద్దానియందే ఉన్నది. అనగా, దీనికి ఆత్మకు వేరైన రూపమేదీ లేనే లేదు.

ఆత్మకు వేరుగా దృశ్యం లేదు. ఆత్మ దృశ్యంగా లేదు. శాంత సముద్రంలో తరంగాదులు ఉన్నట్లు, చిత్రకారుని చిత్తంలో చిత్రం ఉన్నట్లు, మట్టిలో మట్టి పాత్రల వివిధాకారములున్నట్లు,... బ్రహ్మమున ఈ జగత్తు ఉన్నది.

ఈ విధంగా జగత్తే బ్రహ్మము. బ్రహ్మమే జగత్తు. ఈ రెండూ అభేదమై ఉన్నాయి. కాబట్టి పరమాత్మలో జగత్తు ఉన్నది. జగత్తు లేదు కూడా!

తత్త్వజ్ఞానము సంపాదించుకొన్న తర్వాత, ఇక అట్టి దృష్టిచే ఈ జగత్తు 'నిత్యము–నిర్మలము–శాంతము'... అయినట్టి పరమాత్మయందు తన్మయము (బ్రహ్మము) గాను, శాంతముగాను వెలయుచున్నదే అగుచున్నది. గొప్ప కొయ్య నందు ఇంకను చెక్కబడని విగ్రహము అప్రకటితమై ఉన్నట్లుగానే,.. ఈ స్వర్గ–మర్త్య–పాతాళ లోకములు బ్రహ్మమునందు 'నిజసాక్షి చైతన్యము' అను శిల్పికి కనిపించుచున్నాయి. కొయ్యయందు విగ్రహం ఆ కొయ్యను చెక్కినప్పుడే కదా అగుపించేది! కానీ, బ్రహ్మము విషయానికి వస్తే... బ్రహ్మము సర్వదా వికార రహితము అయినప్పటికీ,... సృష్టాత్మకమైన వివర్త రూపంగా గోచరిస్తోంది. 'నిరతిశయానందము' అను పూర్ణానందమునందు 'చిన్మయము' నుండి జాలువారినవై ఈ సృష్టులు భాసిస్తున్నాయి. కానీ అవిద్య చేత మాత్రమే ఈ సృష్టులు 'చిద్ఘనము' నందు విభాగయుక్తంగాను, క్షోభ సహితంగాను, నిజమే అయినట్లుగా ప్రకాశించుచున్నాయి. అట్లు విభాగయుక్తంగా (అజ్ఞాన దృష్టికి) కనిపిస్తున్నప్పటికీ ఈ జగత్తులకు 'ఉనికి స్థానం' అనతగిన ఆత్మ (లేక) బ్రహ్మము సర్వదా విభాజక ధర్మరహితము, క్షోభవర్జితము, స్వయంప్రకాశకము అయి ఉన్నది.

పరమశాంతమగు బ్రహ్మమున అనేక భేదములతో కూడిన ఈ జగద్దృశ్యము బ్రహ్మమునకు కించిత్తు కూడా వేఱుకాకయే ఉంటోంది. 'చిద్ఘనరూపము' అగు బ్రహ్మము నందు అణువణువునా జగత్సమూహములు భాసిస్తున్నాయి.

ఆద్యంత రహితమగు బ్రహ్మమున ఆద్యంత సహితములగు జగత్తులు భ్రమచే ఆవిర్భవిస్తున్నాయి. అయితే కూడా... బ్రహ్మము సర్వదా బ్రహ్మముగానే ఉన్నది. ఈ జీవుడు బ్రహ్మమే స్వస్వరూపముగా కలిగి ఉన్నాడు. అత్యంత నిర్మలమగు బ్రహ్మమునందు ఈ జగత్తు మొదలైనవి ఉండజాలవు.

ఓ రామచంద్రా! 'అవయవ రహితము–నిరాకారము అగు బ్రహ్మము (లేక) పరమాత్మకు ఆ ఆకాశ–వాయు–కాల ఆదిగా గల పదార్థములు అవయవ రూపములు వంటివి'... అని వర్ణించి చెప్పటం కూడా వాస్తవానికి మిథ్యా వర్ణనమేనయ్యా! 'పరమాత్మ అంతయు అధిష్ఠించియున్నవాడు' అను వాక్యార్థమును శోధించగా, పరమాత్మ సర్వదా నిరవయవుడే! ఆత్మతత్త్వము సర్వభావ వికార రహితమై ఉన్నప్పటికీ,... 'అధ్యారోపదృష్టి' (అదియే ఇవన్నీ అవధరించుచున్నది.. అను దృష్టిచే) శ్రుతులు ఆ పరమాత్మను 'సర్వ రూపుడు' (ఈ సర్వము ఆయన రూపములే)... అని వర్ణించాయి.

❖❖❖

# 14. బ్రహ్మ సత్యమ్ - జగత్ మిథ్యా

**శ్రీరాముడు :** మహాత్మా! అల్పజ్ఞులగు శిష్యులకు మహనీయులగు తమ వంటి జగద్గురువులు సుబోధకమయ్యేంత వరకు సమస్త విషయములు చర్వితచర్వణంగా బోధిస్తూనే ఉంటారు కదా!

ఇప్పుడు నా ఈ విన్నపం వినండి - ఈ జగత్తులో అనేక అసాధారణ విశేషాలు వినిపిస్తున్నాయి.

చేత్యము (స్మృతి) యందు చేతనత్వం (స్మృతిత్వం); కాలము నందు కాలత్వం; ఆకాశం నందు ఆకాశత్వం; జడమునందు జడత్వం; వాయువునందు వాయుత్వం; భూత-భవిష్యత్-వర్తమానములందు త్రికాలత్వం; స్పందనము నందు స్పందత్వం; మూర్తము (ఆకారం) నందు మూర్తత్వం; భిన్నమునందు భిన్నత్వం; అనంతము నందు అనంతత్వం; దృశ్యమునందు దృశ్యత్వం; సృష్టులలో సృష్టిత్వం... ఈ విధంగా 'స్మృతిత్వం-ఆకారత్వం-జడత్వం-వాయుత్వం-త్రికాలత్వం-స్పందత్వం-మూర్తత్వం-భిన్నత్వం-అనంతత్వం-దృశ్యత్వం-సృష్టిత్వం... మొదలైన అసామాన్యమైన విశేషాలన్నీ సర్వసామాన్య రూపమగు బ్రహ్మం నుండి ఏ క్రమంచే ఏర్పడి పరిఢవిల్లుచున్నాయో... ఆ విశేషం చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు చెప్పిన ఆ సమస్త వస్తువులకు 'ఆధారము' ఏదైతే ఉన్నదో... అయ్యది మహాచిద్ఘనము అగు బ్రహ్మమే! అట్టి బ్రహ్మము పరమాకాశమై, అవేద్యమై (తెలుసుకునేదంతా అదే కాబట్టి అది తెలియబడనిదై), చిద్రూపమయమై (ఎఱుక), శాంతమై, ఏకమై (అది ఎప్పుడూ అనేకంగా అవటం లేదు), సర్వత్రా సమమై ఉన్నది.

దృష్టిచే సృష్టి కనిపిస్తోంది. సృష్టియందు నీవు చెప్పిన జ్ఞప్తిత్వాదులు దర్శనమగుచున్నాయి. అయితే కనిపించేదానినంతటినీ అధిగమించి చూస్తే... అప్పుడు నిత్య నిర్మల-నిర్విషయ చిదాకాశం మాత్రమే శేషించి ఉంటుంది, చూడబడే సర్వమునకు ఆవల చూచేవాడు ఉన్నాడు కదా! చూడబడేదంతా అధిగమించి పరిశీలిస్తేనే దృశ్య-దర్శన రహితుడగు శుద్ధాత్మ గమనించ బడతాడు.

అట్లు అధిగమించినప్పటి పరిశీలనయే 'మహా ప్రళయం'. అట్టి మహా ప్రళయంలో సర్వ విషయాలు 'లేనివిగా' తెలియవస్తాయి.అట్టి సర్వనాశన (సర్వ రాహిత్య స్థితిలో) బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులతో సహా సర్వ నామ-రూపాలు అంతర్ధానమౌతాయి. అప్పటికీ ఏ శుద్ధ సన్మాత్రం శేషిస్తుందో ...అద్దానిలో ఈ జన్మకారకాలైన 'మాయ-మోహం-భ్రమ-పాపం' మొదలైన ఆకృతులు కలిగిన బీజాలే ఉండవు. అట్టి చిదాకాశం యొక్క ఘనత్వం ముందు ఈ అతిసూక్ష్మ మగు భౌతికాకాశం కూడా శిల వలె అత్యంత స్థూలంగా కన్పట్టుచున్నది. అట్టి పరమ సూక్ష్మం-కేవలం శాంతం -అతి నిర్మలం-ఆద్యంత రహితం-సన్మాత్రం అయి ఉన్నదానినే శాస్త్రములు 'బ్రహ్మం' అనే పేరుతో పిలుస్తున్నాయి. అది ఉన్నదా? ఉనికి లేనిదా?

**నచ 'నాస్తి' ఇతి తద్వక్తుం, యజ్యతే చిద్వపుర్యదా ।**

**నచైవ 'అస్తి' ఇతి తద్వక్తుం, యుక్తం శాంతమలం తదా ॥**

ఎప్పుడైతే ఆ చిన్మాత్ర స్థానం 'మాయ' అనే దోషము లేనిదై ఉంటుందో... అద్దానిని 'ఉన్నది–లేదు' అనే వాచ్య వృత్తిచే చెప్పలేం. ఒకానొకదానిని – 'ఉన్నది' అని 'లేదు' – అని ఇంద్రియార్థముల దృష్ట్యా (శబ్ద–స్పర్శ–రూప–రస–గంధముల దృష్ట్యా) మాత్రమే చెప్పుతూ ఉంటాం. ఆత్మయే, ఇంద్రియార్థములకు విషయం కాదు. కనుక 'లేదు' అనవచ్చేమో! కాని, ఈ ఇంద్రియార్థములు ఎద్దాని భావనచే ఏర్పడుచున్నాయో, ఎయ్యది భావనలన్నిటికీ ఆవిర్భావస్థానమో, అట్టి చిత్‌సత్తే లేకపోతే భావనలకు–ఇంద్రియార్థములకు ఉనికి ఎక్కడిది? కనుకనే "అది 'ఉన్నది–లేదు' అను చర్చకు విషయమే కాదు అని చెప్పబడుతోంది."

**శ్రీరాముడు :** శుద్ధతత్త్వమగు అట్టి శుద్ధ బ్రహ్మము మనకు అనుభవమయ్యేది ఎక్కడ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కనబడుచున్న ఈ సర్వమునకు ఆధారము, వాస్తవ సత్త అగు బ్రహ్మము ఎచ్చట ఎట్లు ఉన్నదో, సూచించటానికి ఒకటి–రెండు విశేషాలు చెపుతాను, విను.

**1. విషయం విషయం మధ్యగల నిర్విషయ చైతన్యమే బ్రహ్మము -**

**నిమేషే యోజనశతే ప్రాప్తాయామ్ ఆత్మ సంవిది**
**మధ్యే తస్యాస్తు యద్రూపం, రూపం తస్య పదస్య తత్ ॥**

నీవు ఒకచోట నిలబడి వేలాది మైళ్ళ దూరంలో ఉన్న దేనినైనా (ఉదాహరణకు చంద్రుణ్ణి) చూస్తున్నావనుకో. ఇప్పుడు జరుగుతున్నదేమిటి? నిమిషమాత్రంలో ద్రష్టయగు నీ యొక్క సంవిత్తు (జ్ఞానము) నేత్రవృత్తి ద్వారా సుదూరంగా వేలాది మైళ్ళ దూరంలో ఉన్న చంద్రబింబాన్ని చూస్తోంది కదా! అట్లా ఒక వృక్షము యొక్క శాఖల మధ్యగా చంద్రబింబాన్ని చూస్తున్నావనుకో, అప్పుడు 'వృక్ష శాఖ'ను అధిగమించిన తర్వాత... చంద్రబింబమును ఇంకనూ చేరకముందు మధ్యలో ఏ నిర్విషయ జ్ఞాన (లేక) ప్రజ్ఞ స్వరూపము ఉన్నదో... అదియే పరమాత్మపదము.

ఈ మధ్య స్థానంలో దృష్టి సంవిత్తు నిర్విషయమై ఉన్నది. ఆ నిర్విషయ ప్రజ్ఞయే ఆత్మపదము యొక్క స్థానం. ఆ ప్రదేశంలోని విషయరహితమగు శుద్ధ ప్రజ్ఞయే ఆత్మ స్వరూపం

విషయ ప్రజ్ఞ (–) విషయములు = 'శుద్ధ సంవిత్తు'

**2. నిశ్చల మనస్సు యొక్క స్వానుభవమే ఆత్మ -** ప్రతి జీవునికి 'మనస్సు' అనేది ఉన్నది కదా! అయితే ఈ మనస్సు బాహ్య–అభ్యంతర వాసనాజాలంలో చిక్కుకొని ఉన్నది. (విషయాల పట్ల అభిలాషయే వాసనల రూపం). అది విషయాల భ్రమ యందు తారట్లాడుతోంది. అనేక చింతలు కలిగి ఉంటోంది. సుఖ–దుఃఖాలను పరంపరగా పొందుతోంది. అశాంతితో చంచలమై ఉంటోంది. అవునా? అయితే... అట్టి ఈ మనస్సు సాధన యొక్క (అభ్యాసం యొక్క) యోగ బలం చేత బాహ్య అభ్యంతర వాసనాజాలం నుండి బయల్వెడలి విషయ భ్రమను శమింప జేసుకొన్నదై, చింతా రహితమై, అప్పుడే పుట్టినవానివలె జగద్విషయములేవీ లేనిదై, విషయముల గూర్చిన సుఖ–దుఃఖ మననములను త్యజించినదై, శాంతి వహించినదై, 'సమాధి' యందు (సర్వ సమత్వంలో) ఆరూఢమై వెలయుచున్నదనుకో... అట్టి నిర్మల (విషయరహిత–విషయాలను అధిగమించివేసినట్టి) నిశ్చల మనస్సు యొక్క స్వరూపమే ఆ 'ఆత్మపదము'.

**3. సత్తా సామాన్యము –** ఏ సత్తా సామాన్యము దేహ పరిమితత్వము త్యజించి సర్వ దృశ్య పదార్థములందు వ్యాపించినదై, వాటన్నిటి ఉత్పత్తికి హేతుభూతమై ఏర్పడి ఉంటుందో... ఆ స్వానుభవమగు సత్తా సామాన్యమే ఆత్మ పదము.

ఓ రామచంద్రా! ఈ ఆకారయుక్తం–భేద సహితం–సకారణంగా తోచుచూ ఏ ఈ జగత్తు స్పష్టంగా కంటికి కనిపిస్తోందో... అట్టి ఇదంతా కూడా ఆత్మ పదంలో ఉత్పత్తియే అయి ఉండలేదు. ఎందుకంటే ఆత్మయందు 'జగత్తు' అనేది ఉత్పత్తి అవటానికి కారణమే లేదు కనుక! కాబట్టి ఇదంతా వాస్తవానికి ఆకారయుక్తంగానూ లేదు. ఏకమూ కాదు. ద్వైతమూ అయి ఉండలేదు. ఏది స్వతహాగా కారణరహితమై ఉన్నదో అయ్యది ఈ జగత్తులో విషయ సత్తగా లేదు. అంతే కాదు.

ఏది స్వయంగా 'అనునిత్యానుభూత స్వరూపం' అట్టి 'చిత్'ను ఇక్కడి నుండి తొలగించటం ఎవరి తరమూ కాదు.

**శ్రీరాముడు :** 'జగత్తుకు కారణం లేదు' అనే బదులు, 'బ్రహ్మమే జగత్తుకు కారణం'... అని అనవచ్చును కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మం జగత్తుకు కారణం కాజాలదు. ఎందుకంటావా? 'బ్రహ్మం దృశ్య శూన్యం, ఆద్యంతరహితం, చిద్రూపం, నిరాకారం' అని బ్రహ్మజ్ఞుల నిత్యానుభవం, అట్టి బ్రహ్మం సాకారం, దృశ్యం, అబ్రహ్మరూపం అగు జగత్తుకు కారణం ఎట్లా అవుతుంది చెప్పు?

**తస్మాత్ తత్ర జగద్రూపం యదాభాతం తదేవ తత్,**
**స్వయమేవ తత్ ఆభాతి చిదాకాశమితి స్తితమ్ ॥**

అందుచేత, కారణ రహితమగు బ్రహ్మమునందు ఏ జగత్తు భాసిస్తోందో అది 'చిదాకాశమే ఆ రూపంగా' భాసిస్తున్నదగుచున్నది.

గొలుసుగాను, గాజుగాను బంగారమే అగుచున్నప్పటికీ గొలుసు–గాజుల భేదానికి బంగారం కారణం కాదుకదా! బంగారం దృష్ట్యా ఏ భేదం గొలుసుకు–గాజుకు అగుపిస్తోందో అది భ్రమ మాత్రమే! ఈ జగత్తు చిద్రూపమగు బ్రహ్మమే అయి ఉండటం చేత జగత్తులో వేర్వేరు ధర్మాలుగా అగుపిస్తున్న వస్తువుల మధ్య భేదం భ్రమయే! అదంతా అనేక ఆకారములు గల తరంగాల వంటిది. ఒకే లోహం యొక్క అనేక పనిముట్ల వంటిది. కావున, సర్వత్రా 'ఏకం–అజం–శాంతం–ద్వైత–ఏకత్వ రహితం, సర్వరూపం–నిర్వికారం అగు బ్రహ్మమే అంతటా నిండి ఉన్నది.

**పూర్ణాత్ పూర్ణం విసరతి, పూర్ణే పూర్ణం విరాజతే, ।**
**పూర్ణమేవ ఉదితం పూర్ణే, పూర్ణమేవ వ్యవస్థితమ్ ॥**

భ్రమ శమించిందా... అంతటా బ్రహ్మమే! అప్పుడు పూర్ణమగు బ్రహ్మము నుండి పూర్ణమగు జగత్తు ప్రసరించినదగుచున్నది. పూర్ణమగు బ్రహ్మమున పూర్ణమగు జగత్తు ఉదయించినదై విరాజిల్లుచున్నదగుచున్నది.

కాబట్టి ఓ రామచంద్రా! 'బ్రహ్మము నుండి అనేక విషయములతో కూడిన ఈ జగత్తు ఏ క్రమమును అనుసరించి ఉద యించింది?'... అని అడిగావు కదా!

మా సమాధానం విను. ఈ జగత్తంతా కూడా... సదా, సర్వ ఆకారవర్జితము, శాంతము, సమము, ఉదయ-అస్తమయరహితము, ఆకాశము వలె నిర్మలము, ఏకము, సత్-అసత్ రూపమున వ్యక్తము అగు బ్రహ్మమే స్వయముగా అయి ఉన్నది. బ్రహ్మము తప్పించి 'జగత్తు' అనబడు శబ్దార్థములు ఆత్మానుభవ దృష్టికి అగుపించటమే లేదు.

❖❖❖

# 15. జలమందు ద్రవత్వం - బ్రహ్మమునందు జగదత్వం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జగత్తు అనే నిర్మలమైన ఆకాశము సద్రూపము అయిన 'బ్రహ్మాకాశము' నందే నెలకొని ఉన్నది.

**జగత్ నామ నభః స్వచ్ఛం సత్ బ్రహ్మ నభసి స్థితమ్**
**నభో నభసి భాతీదం 'జగత్' శబ్దార్థ ఇతి అజమ్ ॥**

చిదాకాశమే చిదాకాశమునందు 'జగత్తు' అను శబ్ద-అర్థములతో నెలకొని ఉన్నది. కనుక జగత్తు కూడా చిదాకాశము వలెనే వికార శూన్యమగు బ్రహ్మమే అయి ఉన్నది. 'నీవు-నేను-జగత్తు' ఇత్యాదిగా గల శబ్దములు, వాటి అర్థములు అంతర్హిత దృష్టిచే చిదాకాశముతోటి సమముగా భాసించుచున్నవి. అవన్నీ చిదాకాశమునకు వేరై లేకయే ఉన్నది. అవి సర్వదా సద్రూపమగు బ్రహ్మమే అగుచూ, బ్రహ్మమునందే వెలయుచున్నాయి. ఈ పృథ్వి-మేఘము-పర్వతము-సముద్రము మొదలైన సమస్త పదార్థములు... ఇవన్నీ కూడా 'జన్మాది రహితము-కాష్ఠమౌన స్వరూపము' అగు బ్రహ్మమునందే ఉండి ఉన్నాయి. అట్లే....

దృశ్య స్వభావరహితుడైన ద్రష్ట, కర్తవ్య-కారణ స్వభావరహితుడైన కర్త... వీరుభయులు చిన్మాత్ర స్వభావమగు స్వాత్మ యందే స్థితి కలిగి ఉన్నారు.

ద్రష్ట యొక్క భావనచే దృశ్యం అనుభవమౌతోంది. దృశ్యము యొక్క 'అభావము' చేతనో...? 'శుద్ధచిత్' స్వభావమున జ్ఞత్వము గాని, కర్తృత్వము గాని, జడత్వము గాని, శూన్యత్వము గాని, పదార్థముగాని, ఆకాశత్వముగాని... లేకయే ఉన్నాయి. ఈ కనబడే సమస్తం కూడా ఒక పెద్ద శిల యొక్క మధ్య భాగం వలె 'సత్‌చిత్' ఘనము-ఏకము-అజము-సర్వ వ్యాపకము - శాంతము - ఆద్యంతరహితము - విధినిషేధాలలో సమాన రూపము'... అయినట్టి పరబ్రహ్మమే అయి ఉంది.

**మరణం జీవితం సత్యం అసత్యం చ శుభ-అశుభమ్ ।**
**సర్వం ఏకమ్ అజమ్ వ్యోమ, వీచిజాలజలం యథా ॥**

తటాకంలో కనిపించే రకరకాల తరంగాలు, ఆవర్తాలు, ఆ తరంగాలు లయించటం, తరంగాలు ఒకదానిని ఒకటి ఢీ కొనటం, ఒకదానికొకటి అనుసరించటం ఇవన్నీ కూడా జల స్వరూపమే గాని... అవేవీ జలానికి అన్యం కాదు కదా! అట్లాగే ఇక్కడ దృశ్య విభాగమై కనిపించే జీవనము-మరణము-సత్యము-అసత్యము-శుభము-అశుభము ఇవన్నీ కూడా స్వప్నంలో కనిపించిన నగరంలోని ఆయా విశేషాలుగా భ్రమతుల్యమే!

సృష్టికి పూర్వం మొట్టమొదటగా ఏ నిష్ప్రపంచమగు బ్రహ్మము ఉండి ఉన్నదో... అదియే ఇప్పుడు కూడా తన నిర్మల చిదాకాశమున ఈ జగద్రూపంగా స్థితినొంది ఉన్నది. స్వప్న ద్రష్టలోనే స్వప్నం ఉన్నట్లుగా చిదాకాశమునందే ఈ జగత్తు ఉన్నది. కాబట్టి సర్వాత్మకమగు ఈ సర్వ జగత్తు కూడా నిష్ప్రపంచకమగు బ్రహ్మము రూపముననే ఇప్పుడు కూడా (సృష్టికి ముందువలె) ఉన్నది. ఆ పరమాత్మ నిర్విషయం కదా! ఒక ప్రదేశపు ధ్యాస నుండి మరొక ప్రదేశపు ధ్యాస మధ్య ఏ 'నిర్విషయ చైతన్యరూపం ఉన్నదో అదియే ఆ పరమాత్మ యొక్క రూపం'.

తరంగం యొక్క ముందు-మధ్య-ఉత్తర మూడు స్థితులూ జల రూపమే కదా! అట్లాగే ఈ జగత్తు యొక్క పూర్వ-మధ్య-ఉత్తర స్థితులందు ఇదంతా శాంత రూపమగు బ్రహ్మమే కానీ, మరింకేమీ కాదు. ఏది ఆరోపిత జగత్ రూపంగా ఉదయించినట్లు అనిపిస్తోందో... అదంతా జ్ఞాన దృష్టిచే ఉదయించనే లేదు. ఒక విషయం -మరొక విషయం మధ్య ఏది మనస్సుకు నిర్విషయమై లభిస్తుందో... అట్టిది నిర్విషయ చైతన్యం కంటే భిన్నం కాదు. తరంగం-తరంగం మధ్యగల జలం జలంగా సుస్పష్టంగా కనిపించునట్లు, తరంగం కూడా జలమే అయినప్పటికీ తరంగత్వదర్శనం చేత జలంగా అజ్ఞానజ్ఞప్తికి అనిపించకపోయినట్లు... నిర్విషయ చైతన్యం విషయాస్వాదన లయించిన ప్పటి స్థితిలో ఘనీభూతమై అనుభవమౌతోంది.

ఈ విధంగా సృష్టి చైతన్యము కంటే భిన్నం కాదు. ఒకవేళ ఎవరికైనా భిన్నంగా అనిపిస్తోందం టారా? దూరంగా కుందేలు కదలుతూ ఉంటే అద్దాని చెవులు నిక్క పొడుచుకోవటం చేత కుందేటికి కొమ్ములు ఉన్నట్లు అనిపిస్తుంది. అంతమాత్రం చేత కుందేటికి కొమ్ములు ఉన్నాయా? లేవు. మరి కొమ్ములు కనిపిస్తున్నాయి కదా? కుందేలును సమీపంగా చూస్తే 'కుందేటికి కొమ్ములు ఉండవు' అని తెలియగలదు కదా! జగత్తుగా కనబడేదంతా (చైతన్యమునకు వేరై తోచేదంతా) భ్రమ మాత్రమే! 'కుందేలుకు కొమ్మలు కనబడటానికి అసలు కారణమేమిటి?'... అని వెతికామనుకో. దానికి కారణం ఏముంటుందీ... 'భ్రమ' తప్పితే? అసత్యమగు భ్రమ సత్యమెట్లా అవుతుంది.

**శ్రీరాముడు :** స్వామీ! 'భ్రమ' అని దేనిని అంటున్నాం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**యత్ అకారణం భాతి తదభాతం భ్రమాత్మకమ్ ।**
**భ్రమస్య, అసత్య రూపస్య 'సత్యతా' కథమ్ ఉచ్యతే ॥**

ఏది కారణం లేకయే భాసిస్తుందో (అనుభవమౌతోందో)... అది భ్రమాత్మకం. అది వాస్తవా నికి భాసించనిదే (అనుభవార్హత లేనిదే) అగుచున్నది. కాబట్టి అసత్యం-భ్రామరూపం అగు జగత్తు 'సత్యం' అని ఎట్లా అంటారు? బ్రహ్మమున 'జగత్తు' అనబడేది ఉండటానికి కారణమే లేదు. కారణమే లేనిదానికి 'సత్త' ఎక్కడి నుండి వస్తుంది? గొడ్రాలికి కలలో కనిపించిన కుమారుడు నిజమైన కొడుకు ఎట్లా అవుతాడు? ఏది కారణం లేకయే భాసిస్తోందో, అది "ద్రష్ట యొక్క చైతన్యమే అట్లు ఆ స్వరూపంగా విజృంభిస్తోంది" అని అనక తప్పదు. ఉదాహరణకు ఒకడు స్వప్నంలో కొన్ని

వస్తువులను చూస్తున్నాడు. ఆ వస్తులన్నీ ఎచ్చటనుండి తయారయ్యాయి? స్వప్న ద్రష్ట యొక్క 'స్వప్న చైతన్యము' చేతనే ఆ స్వప్నాంతర్గత రూపాలన్నీ రూపుదిద్దుకున్నాయని అనక తప్పదు కదా!

ఏ 'సంవిత్తు' అయితే నేత్రవృత్తి ద్వారా ఒక దృశ్యం నుండి మరొక దృశ్యం వైపుకు వెళ్ళు చున్నదో... అదియే ఆ రెండు విషయాల (దృశ్యాల) మధ్యగా దృశ్య రహిత స్థితిలో ఉన్నది కదా! అదే 1. దృశ్య వృత్తి, 2. దృశ్యరూపము కూడా ధరిస్తోంది. కనుక 'జగత్తు'గా ద్రష్టకు అనుభవమయ్యే దంతా అతని సంవిత్తే నేత్ర వృత్తి ద్వారా దృశ్యరూపము అవధరించినదై... అతనికి అనుభవమౌతోం దని సూక్ష్మ దృష్టిచే గ్రహించు. అయితే చైతన్యం దృశ్య వృత్తి ద్వారా దృశ్యం పొందుచున్నప్పటికీ చైతన్యం సర్వదా యథాతథంగానే ఉన్నదని గ్రహించుటయే పూర్ణ జ్ఞానం. ఆకాశం కంటే కూడా 'అత్యంత సూక్ష్మం' అయినట్టి బోధరూపమగు చైతన్యమే పదార్థ రూపంగా కూడా ప్రకాశిస్తోంది. అంతఃకరణంలో కలిగే 'స్వప్నం-ఊహారూపాలు'... మొదలైనవే ఇక్కడ మనకు దృష్టాంతం.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ జగత్తు చైతన్య స్వరూపుడగు ద్రష్ట యొక్క కల్పనాదర్శనమే అని అనుకుందాం. అయితే ఈ జగత్తు 'అకారణం' అని మీరు సిద్ధాంతీకరిస్తున్నారు. 'ఒక మఱ్ఱి విత్తులో భావికాలపు సువిశాలమైన మఱ్ఱివృక్షం ఉన్న విధంగా చైతన్య పరమాణువునందు జడరూపంగా ఈ జగత్తు ఉన్నది' అని ఎందుకు అనుకోకూడదు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బీజం సాకారం కాబట్టి అది ఒకప్పుడు మట్టి-జలముల సహకారి కారణం చేత కాలక్రమంగా అంకురించి సాకారమై అనేక శాఖలతో కూడిన మహా వృక్షముగా అగుచున్నది. కానీ చైతన్యము నిరాకారం కదా! నిరాకారంలో సాకారమైన ఏ సహకారి కారణం పొసగుతుంది చెప్పు? మహా ప్రళయంలో సమస్త జగత్తు నశించినప్పటి స్థితిలో జగత్తు మరల ఉత్పత్తి కావటానికి కారణం కాగల సాకారమగు బీజము ఎక్కడిది? ఆ బీజమునకు 'జగత్తు' అనే రూపంగా అంకురింపజేసే సహకారి కారణాలు ఎక్కడున్నాయి? ఎక్కడి నుండి వస్తాయి?

పైగా...'శాంతము-శుద్ధము-నిరాకారము' అగు పరబ్రహ్మమునందు ఆకారముల కల్పన ఎచ్చట? పరమా ణువు యొక్క సంబంధం ఏమున్నది? అందులో బీజం ఎట్లా ఉంటుంది?

**కారణస్యేతి బీజస్య సత్య-అసత్యైక కారిణః**
**అసంభవాత్ జగసత్తా, కథం కేన కుతః క్వ కా?**

కనుక 'సత్-అసత్' రూపమగు బీజరూప కారణమే అసంభవమైనప్పుడు ఇక చైతన్యమునందు జగత్తు యొక్క ఉత్పత్తి ఎట్లు, దేనిచే, ఎచట, ఏ రీతిగా సంభవం? సంభవం కాదు. కాబట్టి 'పరమాత్మ' అనే అణువునందు "జగత్తు కలదు" అని అనటం ఉచితం కాదు. ఆవగింజలో మేరుపర్వతం ఎట్లా దాగి ఉంటుంది? కాదు... 'జగత్తు కూడా నిరాకారమే కదా!'... అని అంటావా? సాకారమగు బీజం ఉన్నప్పుడు మాత్రమే 'కారణ-కార్య' దృష్టులు ప్రవర్తిస్తాయి. నిరాకారమగు దానిలో బీజమేమిటి? జన్య-జనక క్రమం ఎక్కడుంటుంది?

కనుక రామచంద్రా! ఏ పరతత్త్వమగు బ్రహ్మము కలదో... అదియే (మాయచే) ఈ జగత్తు

రూపంగా కనబడుచూ ఉన్నది. వాస్తవానికి ఇక్కడ ఏదీ ఉత్పన్నం కావటం లేదు, నశించటమూ లేదు. చిదాకాశమున చిదాకాశమే 'జగత్తు' రూపంగా నెలకొని ఉన్నది.

చిత్తము నందలి చైతన్యం యొక్క 'స్ఫురణ'చే ఈ 'జగత్ భ్రమ' ఉదయిస్తోంది. అశుద్ధ చిత్తం దీనిని అశుద్ధ జగత్తుగా (ఎక్కువ-తక్కువలు, జీవులు, అయినవాళ్ళు-కానివాళ్ళు మొదలైనవిగా) దర్శిస్తోంది. శుద్ధ చిత్తము దీనినంతటినీ నిత్య బ్రహ్మముగా దర్శిస్తోంది. ఇక్కడి జగద్విశేషం ఇంత మాత్రమే! ఆకాశమందు శూన్యత్వము, జలమునందు ద్రవత్వము ఉన్న విధంగానే ఆత్మయందు 'ఆత్మ వివర్తరూపము-శుద్ధము'... అగు ఈ సృష్టి రూప అన్యత్వం (అజ్ఞాన దృష్టికి) అనిపిస్తోంది.

ఇక మా సిద్ధాంతమేమిటో విను- ఈ జగత్తు సర్వదా 'శాంతం-వ్యాపకం-సత్యం-ఆద్యంత రహితం'... అగు బ్రహ్మమే అయి ఉన్నది. ఇది వాస్తవానికి ఉదయించనూ లేదు. అస్తమించబోవ టమూ లేదు. ఏ నిర్విషయ శుద్ధ చైతన్యం అంతటా ఉన్నదో అదియే ఈ ద్రష్ట-దృశ్యాలు కూడా. చిదాకాశమే అల్ప దృష్టికి ఇట్లా కనిపిస్తోంది. వాయువులో స్పందత్వం, జలంలో ద్రవత్వం, ఆకాశంలో శూన్యత్వం వాటివాటికి అభేదమై భాసించుచున్నట్లే... ఆత్మయందు ఈ జగత్తు అసంగ-అద్వయ స్వభావంతో భాసిస్తోంది. ఈ జగత్తు చిదాకాశమే అయి ఆత్మయందు స్థితి కలిగి ఉన్నది.

అట్లు స్థితి కలిగి ఉన్నదగు ఆత్మాకాశం భూతాకాశం వంటిది కాజాలదు. సూర్య రహితమై, ఆ సూర్య ఉదయ-అస్తమయాలు లేనట్టి ఆత్మయందు ఏ భూతాకాశం ఉంటుంది?... భూతాకాశం ఎక్కడా లేదు. దాని మూల రూపం బయటకు కనబడేది (కళ్ళకు-చెవులకు విషయం) కాదు.

ఈ సమస్తము ఆత్మకు స్వభావ సిద్ధమగు అంగభూతమే! ఆత్మ ఈ సమస్తము అయి కూడా, దీనంతటికీ వేరుగా ఉన్నది. కాబట్టి రామచంద్రా! నీవు సర్వ దృశ్య-నామ-రూప కల్పనను విడనాడి ఉండెదవు గాక! శుద్ధ చిదాకాశమాత్రుడవై స్థితి నొంది ఉండుము.

❖❖❖

# 16. జగత్ సర్వం అనుత్పన్నం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ భావ-అభావాలు ఈ గ్రహణ త్యాగాలు ఈ స్థూల-సూక్ష్మములు, ఈ స్థావర జంగమాలు ఇవన్నీ చిదాత్మయందు ఉదయించటానికి కారణమేమీ లేనే లేదు. ఎందుకంటే చిదాత్మ సర్వదా అకారణం కదా! అందుచేత ఇవన్నీ సృష్ట్యాదిలో ఉత్పన్నమే అయి ఉండలేదు. నిరాకారం-స్వాత్మరూపం అగు చైతన్యం ఏ సమయమందూ సాకార పదార్థము లకు 'కారణం' కాజాలదు. సాకార పదార్థం మాత్రమే సాకారమునకు కారణం కాగలదు కదా!

ఈ కారణం చేత తత్త్వజ్ఞాని సమస్త జగత్తును 'చిత్స్వభావం' గానే భావిస్తూ ఉంటాడు. తత్ఫలితంగా సర్వదా ఆత్మయందే నెలకొని ఉంటాడు.

కల్లు తాగినవాడు క్షోభచే తన నీడను చూచి తానే ప్రలాపాదులతో కూడిన "ప్రమత్తత" కలిగి ఉంటాడు చూచావా? ఆకాశరూపమగు చైతన్యం కూడా తాను ఎట్లు భావన చేస్తున్నదో... ఆ ప్రకారంగానే తన నిజరూపమగు ఈ సృష్టిని పొందుతోంది. ఎప్పుడైతే ఎదురుగా కనిపిస్తున్న

ప్పటికీ, నిర్మలమైన దృష్టికి ఇదంతా కూడా భావనామయ మాత్రమై, వాస్తవానికి ఉత్పన్నం కాకయే ఉన్నట్లు అవుతుందో... అప్పుడు ఈ జగత్తు శాంతం-సమం అగు బ్రహ్మంగానే కనబడగలదు.

జలంలో జలం యొక్క ద్రవత్వమే ప్రదర్శనమగుచున్నది కదా! చిదాకాశంలో చిదాకాశమే జగత్తుగా వర్తిస్తోంది. "చిదాత్మ వలననే, చిదాత్మ చేతనే జగత్తు పొందబడటం" అనే సంఘటనను శ్రుతులు "చైతన్యముచే ఈ జగత్తు రచించబడింది..." అని చెప్పుచున్నాయి. స్వప్నంలో స్వప్న జగత్తు ఎట్లా పొందబడుతోంది? స్వప్న ద్రష్ట తన స్వభావమును ఏమరచుటచేతనే కదా! 'కాచ' అనే రోగముతో కూడిన కళ్ళకు ఆకాశంలో వెంట్రుకలు కనిపిస్తున్నాయి. ఎందుచేత? ఆ కంటి దోషంచేతనే కదా! అట్లాగే జగత్తు అనబడేది భ్రమ చేత స్ఫురిస్తోంది. ఈ జాగ్రత్-జగత్తు స్వప్న జగత్తులాగానే చిదాకాశమునందే ఉన్నది. "సృష్ట్యాది" యందు "హిరణ్యగర్భుడు" అను సమష్టి జీవునియందలి చైతన్యము యొక్క స్వప్నమే ఇక్కడ 'జగత్తు' అనబడుతోంది. ఈ రోజు రాత్రి వ్యష్టి జీవుని (నిద్రావస్థలో పనిచేసే) ఊహా వ్యవహారమును "స్వప్నం" అని అంటున్నాం. సమష్టి జీవుడగు హిరణ్యగర్భుడు స్వస్వరూప సమక్షంలో ఆశ్రయించిన కల్పనా చమత్కారమును 'జగత్తు' అంటున్నాం. ఈ సమష్టి జీవుని జగత్ స్వప్నానికి, వ్యష్టి జీవుని జాగ్రత్ స్వప్నానికి వాస్తవానికి భేదమేమీ లేదు.

**శ్రీరాముడు :** స్వామీ! సృష్టి 'అవాస్తవం' అనుకుంటున్నాం కదా! మరి ఇక్కడ 'నియతి' ఉన్నది కదా! ఉదాహరణకు మామిడి విత్తు మామిడి వృక్షంగానే అగుచున్నది కాని, ఆముదము వృక్షం కాదు కదా! ఆవు కడుపున గేద జనించదు కదా! మరి 'నియతి' దృష్ట్యా ఇక్కడ కార్యకారణములు ఉన్నట్లే కదా! ఇక జగత్తు లేనిది ఎట్లా అవుతుంది.?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నియతి సృష్ట్యాదిలో ఎట్లా నియమించబడియున్నదో - అదియే ఇప్పటికీ కొనసాగుతోంది. పూర్వకాలంలో ప్రవర్తించిన నదీజల ప్రవాహం ఇప్పటికీ (ప్రతి సంవత్సరము ఆయా సమయములందు) అట్లే ప్రవర్తిస్తోంది. నదులయందలి జలము యొక్క "తరంగసత్త" ఆ జలసత్తా కంటే భిన్నమా? కాదుకదా! చిదాకాశమున సృష్టి రూపసత్త, అందులోని నియతి, అనియతి ఇదంతా చిదాకాశం కంటే భిన్నం కాదు!

**శ్రీరాముడు :** హే జగద్గురూ! ఈ జగత్తులో జీవుడు జనిస్తున్నాడు. పుట్టినప్పటినుండి అనేక భావాభావములు పొందుచున్నాడు. మరల ఎప్పుడో 'అభావస్థితి' అనదగు మరణము చేరుచున్నాడు. జీవించినంత కాలం సుఖ దుఃఖములు అనుభవిస్తున్నాడు. "మరి జగత్తు లేదు" అన్నది ఎట్లా యుక్తియుక్తం? అట్లా అనుకున్నంత మాత్రం చేత దుఃఖాదులు తొలగుతాయా? మృత్యువు ఏదో ఒకనాటికి అనివార్యం కదా! ఈ విధంగా జీవన-మృత్యువులు రెండూ దుఃఖప్రదములే కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**మృతస్య అత్యంతనాశశ్చేత్ తన్నిద్రా సుఖమేవతత్ ।**
**భూయశ్చ ఉదేతి సంసారః తత్ సుఖం నవమేవతత్ ॥**

మరణించిన తర్వాత అత్యంత అభావమే కలుగుతుందని కాసేపు అనుకుందాం. అప్పుడు అది కూడా గాఢ నిద్రాస్థితిలో జీవులు రోజూ పొందే నిరతిశయానంద సుఖము వంటిదే అవుతుంది

కదా! కాబట్టి మరణము అనేది కూడా చిదానంద సుఖస్వరూపమే! మరల ఆ జీవుడు దేహాది రూపముగా సంసారంలో ఉదయిస్తున్నాడనుకుందాం. ఆ నూతన దేహము, నూతన వ్యవహార పరంపరలూ సుఖస్వరూపమే. ఎందుచేతనంటే ప్రతి జీవుడు 'నేను దీర్ఘకాలం జీవించాలి. ఇంకా ఇంకా బ్రతకాలి'... అని అనుకుంటున్నాడు కదా! సుఖ స్వరూపం కాకపోతే జీవించాలని ఎందుకనుకుంటాడు? ఈ విధంగా జీవన-మరణములు రెండూ సుఖ స్వరూపములేనని అనిపించుకుంటున్నాయి. మనం అనేకసార్లు ఇప్పటివరకు చెప్పుకున్నట్లుగా జగత్‌సత్తా 'ఆత్మసత్తా' కంటే వేఱుకాదు. కాబట్టి జనన మరణభీతి జీవునికి అఖరయే లేదని... అది అజ్ఞానముచే మాత్రమే ఏర్పడుచున్నదని జ్ఞానుల ఉద్దేశం.

ఇక సుఖ-దుఃఖాలంటావా?... "దుష్కర్మలచే నాకు నరకాదుల దుఃఖం వచ్చిపడు తుందేమో...?" అనేది కూడా "సుఖసత్తా" యే మూలముగా కలిగి ఉన్నది. సుఖం లభించక పోవటమే దుఃఖం. దుఃఖం కలగక పోవటమే సుఖం. ఆ రెండిటి మూలభావం ఒక్కటే. కాబట్టి సుఖ దుఃఖములు అనేవి అవినాభావ సంబంధంచే ఏర్పడేవే గాని స్వతఃసిద్ధమైనవి కావు. సుఖ-దుః ఖములందు ఇంతకుమించి నిర్మాణ విశేషమేమీ లేదు.

దృష్టాంతానికి,...ఒక వస్తువు లభించి తద్వారా 'సుఖభావన' ఉదయించిందనుకో... తక్షణం లోనే "ఇది కోల్పోతామేమో....' అనే దుఃఖభావం వెంటనంటే ఉన్నది. ఏ కారణం చేతనో (లభించ వలసినది లభించకపోవటమో, అనుకున్నది జరగకపోవటమో, ఆశించినది సిద్ధించక పోవటమో) దుఃఖం ఏర్పడిందనుకో, "ఇది తొలగగానే నాకు సుఖం లభిస్తుంది" అనే భావన వెంటనంటే ఉన్నది కదా! అట్టి దుఃఖ భయం మరణానంతరం కూడా కొనసాగుతూనే ఉన్నది. కాబట్టే జీవుడు మరల దేహధారుడగుచున్నాడు. కనుక దేహధారణ-దేహత్యాగ స్థితులు సుఖ దుఃఖములు రెండూ అందరికీ ఒకేరీతిగా సుఖ దుఃఖ సమన్వితములై ఉంటున్నాయి.

సుఖ దుఃఖములు రెండూ వాస్తవానికి లేవు. ఆ రెండూ అనుభవించేవాడు మాత్రమే వాస్తవమైన 'సత్త' కలిగి ఉన్నాడు.

**అంతఃశీలుడు -**

**మరణం - జీవితం నాస్తు సహజే వాసనే తయోః ।**
**ఇతి విశ్రాంత చిత్తో యః సో "అన్తఃశీతల" ఉచ్యతే ॥**

మరణమైనా జీవితమైనా అవి రెండూ దేహసంబంధమైనవి గాని దేహికి సంబంధించినవి కాదు. దేహి పుట్టడు, చావడు. ఎవనికైతే జీవించటం - మరణించటం అను రెండూ కూడా స్వాభావిక బ్రహ్మసుఖ రూపములుగా ఉంటాయో..అట్టి అనునిత్య విశ్రాంత చిత్తుడగు జీవుని "అంతఃశీలుడు" అని పిలుస్తారు.

**ముక్తుడు -** వృత్తులన్నీ ఎవరియందు నశించి, ఎవడు దశ్యస్ఫురణ లేకయే ఉంటాడో... అట్టివాడు సర్వబంధ వినిర్ముక్తుడు అవుతాడు. అట్టివాడు. చిద్రూపమగు ఆత్మయందు తన్మయుడై

ఉంటాడు. అట్టివాడు “ముక్తుడు” అని అనిపించుకుంటాడు. ముక్తునికి (ఆత్మ తన్మయునికి) సుఖ దుఃఖములు, జీవన్మరణములు సమానంగానే కనబడతాయి.

అందుచేత రామచంద్రా! ఆత్మజ్ఞాన ప్రభావం చేత ఈ దృశ్యమంతా “స్వప్నతుల్యము” అను భావనా పటిమ పటిష్టమగుచున్నది. దృశ్యము యొక్క “అత్యంతాభావన” చేత (అట్టి కారణంగా) ఈ సృష్టి ఉంటున్నా లేక ఉండకపోయినా ఆ ఆత్మజ్ఞానానికి ఒక్కటే అవుతుంది.

“దేహిగా నేను ఏదై ఉన్నాను? ఈ దృశ్యము ఏమై ఉన్నది?” అను రెండు విషయాలు జ్ఞానముచే సుస్పష్ట పరచుకున్నవానికి దృశ్యము ఉన్నా కూడా లేనట్లే! జన్మ మృత్యువులు కనబడుచున్నా అవి దూరంగా ఉన్న అపరిచిత గ్రామంలోని దైనందిన సంఘటనలవలె చూడబడతాయి. జ్ఞానియందు సర్వ దృశ్యానుభవరహితమగు “శుద్ధ నిర్విషయచైతన్యము” నిత్యోదయమై ఉంటోంది. అట్టి శుద్ధ చైతన్యము దృశ్యరూపం కాదు. విషయరూపం కాదు. చేతనావృత్తి రూపం కాదు. చేతితము కాదు. అట్టి చైతన్యముతోటి ఏకత్వము పొందిన మహనీయులు సంసార వ్యవహారరహితులై ఉంటారు. వారి పట్ల సంసారము ఏదో ఉబుసుపోకకు చదివే కథలోని సంఘటనల వలె ఉంటోందిగాని సుఖ-దుఃఖ కారకము కాజాలదు.

“అతి నిర్మలము” అగు చిదాకాశమున “చైతన్యము” అను గాజు (కళ్ళజోడు) యొక్క నిరంతర స్ఫురణయే ఈ జగత్తు. కాబట్టి అంతా చైతన్యమే అయి ఉండగా, ఇక బంధ మోక్షములు ఎచట? ఈ జగత్తు చిదాకాశము యొక్క స్ఫురణమాత్రము, సంకల్ప రూపము అయి ఉన్నది. కాబట్టి ఇదంతా సత్‌చిన్మయమే గాని మట్టి-గాలి కాదు. ఇక్కడ వాస్తవానికి దేశము-కాలము-పదార్థము-క్రియ-ఆకాశము మొదలైనవి ఆత్యంతిక దృష్టిచే లేవు. ఈ జగత్తు ప్రతిభాసమాత్రంగా అన్యోన్యత్వం చేత వృద్ధి చెందనీ, చెందకపోనీ... అట్టి స్వకీయ కల్పన దృష్ట్యా (కల్పన చేత ఏర్పడి ఉంటోంది కాబట్టి) ఇది లేనిదే, అసత్తే! అధిష్ఠాన రూపం చేతనో... ఇదంతా ఆత్మయే. కనుక సత్తే.

ఈ ప్రకారంగా ఈ ‘జగత్తు’ రూపంగా కేవల ఘనమగు ఆత్మయే ప్రకాశిస్తోంది.అట్టి ఆత్మ ఆకాశము కంటే కూడా అతి నిర్మలము అయి ఉన్నది. అది శూన్యం కాదు, అశూన్యం కాదు. అది “సాకారం”గా ఉన్నట్లు తోచినప్పటికీ వాస్తవానికి నిరాకారంగానే ఉన్నది. అసత్తువలె కన్పట్టినప్పటికీ మిక్కిలి ప్రకాశవంతమై ఉన్నది. అతి శుద్ధం. స్వప్న నగరం వలె అంతులేని విస్తీర్ణం కలిగి ఉన్నది.

ఈ ప్రకారంగా చిదాకాశము యొక్క కలుషిత జగద్రూపం, వాస్తవానికి, శుద్ధవ్యాపక నిర్వాణ రూపమే అయి ఉన్నది. అట్టి నిర్వాణరూపముచే వ్యాపించబడనిదేదీ లేదు. ఆకాశంలో శూన్యత్వంవలె, జలమునందు ద్రవత్వంలాగా ఈ జగత్తు పరమాత్మ రూపమే! అంతేగాని ఇది నానావిధ రూపములుగా కూడి ఉన్నది కాదు.

❖❖❖

**శ్రీరాముడు :** నిర్లిప్తము, నిర్విషయము అగు అత్మ నుండి విషయరూపమగు మనస్సు ఉద్భవించటం చమత్కారమే కాదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎవడైతే 'సూర్య కిరణములు సూర్యుని కంటే వేరే'... అని అనుకుంటాడో, వానికి ఆ సూర్య కిరణములు అన్యమైనట్లే భాసిస్తాయి. 'బంగారము కంటే అభరణములు వేరైనవి'... అనుకునే వాని అనుభవం అట్లే (వేరైనట్లుగానే) ఉంటుంది గాని, అది 'బంగారం కదా' అని అతను అనుకోవటం లేదు. కానీ, 'సూర్యబింబము నుంచే బయలుదేరిన కిరణములు సూర్యునికి వేరైనవి ఎట్లా అవుతాయి? బంగారము కంటే ఆభరణం వేరైనదని అనటం ఎట్లా?'... అని భావించావనుకో? అప్పుడు మొదటి వానికంటే వ్యతిరిక్తమైన అనుభవమే ఉంటుంది.

తరంగములు చూచేవానికి తరంగబుద్ధియే ఉంటుందిగాని, జలబుద్ధి ఉండదు. "తరంగములు జలము కుంటే వేరు కాదు" అని తలచేవాడికో? ఇతనికి జలబుద్ధియే ఉంటుంది గాని, తరంగ బుద్ధి ఉండదు. "బంగారము యొక్క ఆకారములైన ఆభరణములందు కూడా ఉన్నది బంగారమే"... గ్రహించేవాడు మహాబుద్ధిమంతుడై ఉంటాడు. అట్టివాడు "నిర్వికల్పుడు" అని చెప్పబడతాడు. "త్రిగుణాత్మకమై కనిపించే ఈ దృశ్యాంతర్గత జీవులంతా త్రిగుణాతీతమగు పరమాత్మ యొక్క సంప్రదర్శనా విన్యాసమే" – అని గమనించడాన్నే 'నిర్వికల్పము' అను శబ్దముచే ఉద్దేశించబడుతోంది.

**పుట: 522**


రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org

CONQUER YOURSELF
ISBN 93-83972-14-2 (Set)
www.rkmath.org

Vasishta Rama Samvadam : Vol 3
ISBN 93-83972-12-8 ₹ 1000/- (set)

# శ్రీ వసిష్ఠ - రామ సంవాదము

## (శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత యోగవాసిష్ఠము)

**నాల్గవ సంపుటం**

**నిర్వాణ ప్రకరణము**

*అనుసృజన:*

**వై. హెచ్. రామకృష్ణ**

**రామకృష్ణ మఠం**

**దోమలగూడ, హైదరాబాదు-500 029**

# ప్రవేశిక

అఖండ రామాయణంలోని చివరిప్రకరణం అయిన నిర్వాణ ప్రకరణం ఇప్పుడు అధ్యయనం చేస్తున్నాం. ఆరు ప్రకరణాల్లోకీ శ్లోక సంఖ్యాపరంగా ఇది పెద్దదవటమే కాకుండా; ఇందులో చర్చించిన అంశం కూడా గంభీరమైనది. మొదటి ప్రకరణాల్లో చర్చించిన అంశాలు సూక్ష్మమైనవైతే, ఇందులో చర్చించిన విషయం సూక్ష్మతరం, సూక్ష్మాతి సూక్ష్మం అని పేర్కొనవలసి ఉంటుంది. నిజానికి అన్నింటిలో చర్చించిన విషయం ఒక్కటే ఐనప్పటికీ ఏ స్థాయినుంచి, ఏ భూమికనుంచి, ఏ కోణం నుంచి విషయాన్ని విశ్లేషిస్తున్నాం అన్న దాన్ని బట్టి చర్చించిన అంశం విభిన్నంగా వ్యక్తమవుతుంది.

ఈ ప్రపంచ మంతా ఉదయాస్తమ రహితమై, అఖండప్రకాశ రూపమై, నిర్మలమై, శిలవలె మౌనరూపమై, నిర్వికారమైనట్టి శాంతమగు బ్రహ్మయే అయిఉన్నది అంటుంది ఈ ప్రకరణం. ఇది కేవలం భావన కాదు. పరమ సత్యం. మనకు అనుభవమౌతున్న జగత్తు అవిద్యారూపం. అజ్ఞాన జనితం. బ్రహ్మానికి  వేరైన సత్తాలేనిది. కావున ఈ ప్రకరణం నుంచి మనకు, ద్రష్ట దర్శన దృశ్య త్రిపుటిని భేదించి, భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి, ఏకత్వరూపంగా మిగిలిపోవలసిందని శాస్త్రమాత ఉద్బోధము.

వాయువు, వాయు స్పందన ఏవిధంగా వేరుకావో అదేరీతిన చైతన్యం లేదా చిత్తు మరియు విషయ జగత్తు వేరు కావు. చిత్ స్పందనే జగత్తు.

చైతన్యానికి వేరుగా ఏమీ లేదని, ఇంద్రియాలు, వాటికి అధిష్ఠానమైన మనస్సు, మనోకల్పితమైన విషయ ప్రపంచంతో సహా సర్వం బ్రహ్మమయమని ఈ ప్రకరణం నుంచి జ్ఞాని గ్రహిస్తాడు. దేహం అందులోని చిత్ రెండూ వేరు కావన్న భావం కలిగిన సాధకుడు బ్రహ్మభావాన్ని పొందుతాడు. నిర్వాణ సౌఖ్యాన్ని అనుభవిస్తాడు.  సర్వం చిన్మయమని గ్రహించిన వ్యక్తి శోక మోహరహితుడై, భేదదృష్టి వీడినవాడై ఏకత్వానుభవం పొంది కేవాలానంద స్వరూపుడిగా నిలుస్తాడు.

నిర్వాణ ప్రకరణం లో చెప్పిన విషయాన్ని సులభంగా గ్రహించాలంటే ముందు ప్రకరణాల్లో పేర్కొన్న విషయాన్ని అవగతం చేసుకుని ఉండాలి. ఉత్పత్తి, స్థితి ప్రకరణాలు దృశ్యావిర్భావానికి మరియు దృశ్యానుభూతికి కారణాలు బోధించాయి అని అనుకున్నట్లైతే; నిర్వాణ ప్రకరణం సముద్రం నుండి ఉద్భవించే తరంగాలు ఏవిధంగా సముద్రానికి భిన్నం కావో అదేవిధంగా దృశ్యజగత్తు కూడా చిదభేదం కాదని ఉద్ఘాటిస్తుంది. మనోనిర్మితమైన వస్తు ప్రపంచం మనస్సుతో సహా చిత్ శక్తియే. చిద్విలాసమే. చిదాంతర్గతమే. చిద్రూపమే. చిన్మయమే. చిత్స్ఫురణయే అని తెలుపుతుంది. ఐతే జగత్తు చిదభిన్నం ఐనప్పుడు పురుష ప్రయత్నం చేయటం, మోక్షాన్ని పొందటం అన్నీ అసంగతాలు

కావా అంటే మనకు ఇంద్రియగోచర జగత్తుకు సంబంధించిన ఎరుక ఉన్నంత సేపు ఆ ఎరుక తొలగే వరకూ ప్రయత్నం చేయాల్సిందే. అంటే మొదటి ప్రకరణాల్లో చెప్పిన విచారణ అనే పురుష ప్రయత్నాన్ని అనుష్ఠించి మనస్సును పరిశుద్ధ మొనర్చుకున్న జిజ్ఞాసువు మాత్రమే ఈ ప్రకరణం లో పేర్కొన్న కేవలాద్వైతాన్ని అనుభవ మొనర్చుకోగలడు. అలా కాకుండా ఇందులోని ఉత్కృష్ట భావనలను అపరిశుద్ధ మనస్కుడికి బోధిస్తే విరుద్ధంగా, విపరీతంగా అర్థంచేసుకునే ప్రమాదముంది. అందువలన శాస్త్రంలో పేర్కొన్న విషయాన్ని అందులో పేర్కొన్న క్రమంలోనే చదవాలి.

– *ప్రకాశకులు*

❖❖❖

# విషయ సూచిక

## నిర్వాణ ప్రకరణం (ఉత్తరార్ధం)

❖❖❖

# V. పాషాణాంతర్గత బ్రహ్మాండం

## 1. సంకల్ప నిర్మిత కుటీరం - వసిష్ఠ నిర్వికల్ప సమాధి

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆకాశం ఎక్కడుంటే అక్కడ శూన్యత్వం కూడా ఉంటుంది చూచావా? జలం ఎక్కడుంటే అక్కడ ద్రవత్వం కూడా ఉంటుంది కదా! అట్లాగే చిన్మయమగు బ్రహ్మాకాశమున సర్వత్రా సర్వము సర్వవిధాలుగా నిస్సంకోచంగా సంభవిస్తున్నాయి. వాస్తవానికి అలా సంభవించేదంతా ఆకాశ శూన్యత్వంలాగా స్వచ్ఛమైనదే అయి ఉన్నది. సమస్త పదార్థములు చిన్మయరూపములే. కాబట్టి ఈ పృథివి మొదలైన సర్వ పదార్థములు చిత్ రూపములే గాని, అచిత్ అయినది ఎక్కడా ఏదీ లేదు. ఎచ్చట చైతన్యము ఉన్నదో...అక్కడ సృష్టి యొక్క శోభ కూడా ఉన్నది. స్వప్నంలో కనబడిన నగరం, పర్వతం... మొదలైనవన్నీ స్వప్న చైతన్య స్వరూపములే కదా! జాగ్రత్ నందలి సర్వ పదార్థములు కూడా ఏకమగు చిదాకాశమే అయి ఉన్నాయి.

ఈ సందర్భంలో పూర్వం నాకు స్వానుభవమై ఒకానొక విశేషం గుర్తుకొస్తోంది. ఆ నాచే పొందబడిన విశేషం పాషాణాఖ్యాయిక, అనే పేరుతో మహాశ్చర్యకరం అతివిచిత్రమైనది కూడా. భ్రమ అను రోగమునకు అమృత రసాయనం వంటిది. ఆ “ఆ పాషాణాఖ్యాయి” అను పేరుతో చెప్పబడే విశేషం విను చెబుతాను.

❖

పూర్వం ఒకానొకప్పుడు నిజాశ్రమంలో జ్ఞానార్తితో నన్ను ఆశ్రయించవచ్చిన శిష్యగణానికి ఆత్మతత్త్వాన్ని బోధిస్తూ ఉన్నాను. ఎఱుగవలసిన ఆత్మను ఎఱిగి శాంత చిత్తుడనై రోజులు గడుపు చున్నాను. ఆ సమయంలో నా బుద్ధి ఎందుకో ఏకాంతం వైపుగా మరలింది. భ్రమయుక్తము, చంచలం అగు సర్వలోక వ్యవహారాలు వదిలి ఏకాంతంగా ఉండాలనే అభిలాష కలిగింది. అప్పుడు శిష్యులను ఆయాశాస్త్ర పఠణాదులలో నియమించి విశ్రాంతి కొఱకై దేవలోకంలోని ఒకానొక ఏకాంత స్థానంలో ప్రవేశించాను. మెల్లమెల్లగా ఆత్మధ్యానతత్పరుడనైనాను. పరమ విశ్రాంతిని అనుభవించసాగాను. అయితే, ఆ ఏకాంత ప్రదేశంలోకూడా దేవతల నృత్యగీత వాద్యాదులు నా ఏకాగ్రతకు కొంచెం విక్షేపం కలిగించసాగాయి. అప్పుడు ఈ జీవులకు క్షణభంగురమైన ఆయా ప్రాపంచిక దశలు కలుగజేసే భ్రమ - విక్షేపముల గురించి ఇట్లు యోచించసాగాను.

❖

“ఆహా! ఈ ప్రపంచంలోని ఆయా విశేషాలన్నీ రమణీయంగా అనిపించటానికి కారణం? బుద్ధిమాంద్యం చేత, అవిచారణచేతనే కదా! స్థూల బుద్ధిని అధిగమించి ఆయా సర్వస్థితుల వెనుక - ముందులను పరిశీలించి చూచినపుడు ఈ ప్రపంచం యొక్క స్థితి రసహీనమే అవుతుంది. అట్టి

ఈ ప్రపంచం ఎవనికి కూడా ఏ కారణం చేతా, ఎప్పుడూ ఎక్కడా సుఖప్రదం కాదు. ఏదో పొందాలనుకోవటం, ఇంకేదో తొలగాలనుకోవటం, కొన్ని ఇష్టములు, కొన్ని అయిష్టములు – ఇంతకు మించి ఈ సాంసారిక జీవితంలో చెప్పుకో తగినవి ఏమున్నాయి? ఈ జీవునికి ఎందుకో ఈ దృశ్యవిషయాలపై అత్యంత నమ్మకం ఏర్పడి ఉంటోంది. అందుకే ఇక్కడ ఏవేవో పొందాలని ఈ ద్రష్టత్వము వహించి తద్వారా ఎన్నో ప్రయాసలు ఆశ్రయిస్తున్నాడు. ద్రష్టయగు ఈ జీవుడు ఈ ఈ లోకాలలో ఏదేదో పొందాలని చేసే తీవ్రమైన శ్రమ అంతా చివరికి దుఃఖప్రదంగాను పరిణమిస్తున్నదే తప్పించి, ఈ దృశ్యములో ఏది పొందినా ఏం ప్రయోజనం ఉండటమే లేదుకదా!

**కిమిదం దృశ్యతే? కింవా ప్రేక్ష్యతే? కోఽహమేవవా?**
**సర్వం శాంతం అజం వ్యోమ చిన్మాత్రాత్మ నిరంజనమ్ ॥**

ఈ కానిపించుచున్నదంతా ఏమిటి? దీనిని చూచునది ఏది? నేనెవరు? ఈ ప్రకారంగా వివేకంతో "విచారణ" చేసి చూచామా... ఇదంతా శాంతము–అజము–ఆకాశసదృశము–నిర్మలచిన్మాత్రం అగు ఆత్మలో వివర్తమే కదా... అని తెలియవస్తోంది. అయినా దృశ్యం యొక్క భేద దర్శనమంతా దృష్టి మొక్క విక్షేపమే కదా! ఇట్టి భ్రమాత్మకమైన దృష్టిని పొందుచున్నంత వరకూ నాకు శాంతి లేదు. అట్టి విక్షేపం యొక్క శమనం కొరకై ఒకానొక ఏకాంత స్థానంలో సమాధిని ఆశ్రయించటమే ఉచితం. అట్టి రహస్య స్థానం సమస్త సిద్ధ – ఇంద్ర – దైత్యాదులకు కూడా సమీపించరానంత రహస్య స్థానమై ఉండాలి. అట్టి స్థానంలో దాగుకొని ఇక నేను ఏ జీవికీ కనిపించకుండెదను గాక ! అక్కడ నిర్వికల్ప సమాధిలో తత్పరుడనై ఉంటాను. సర్వవృత్తులను త్యజించివేస్తాను. అతి నిర్మలం – శాంతం – సమం అయినట్టి ఆత్మపదమున సుస్థితుడనై ఉంటాను.

మరి, శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములనే ఐదు కించిత్ కూడా సంభవించనట్టి అత్యంత శూన్యమైన ప్రదేశం ఎక్కడ? అట్టి ఏకాంతస్థానం చేరెదనుగాక! ఎందుకంటే వన–జల–మేఘాదులచేత వ్యాప్తమై... సింహము–పులి–మొదలైన జంతువులు మాత్రమే సంచరించే జనరహిత పర్వత ప్రదేశం కూడా నాకు శత్రువు వలె ప్రతికూలంగానే అనేక విక్షేపములతో కూడి కనబడుతోంది. పర్వతముల మధ్య ప్రదేశం కూడా ఆయా కిరాత జీవుల సంరంభములతో నిండి ఉంది. సముద్రతీరాలు ఖాళీగా లేవు. అవన్నీ కూడా అనేక వ్యగ్రులగు జనుల సంచారాలతో నిండి ఉంటున్నాయి. సముద్రగర్భమేమో, జల జంతువుల చేత నిండి ఉన్నది. అక్కడ కూడా ఏకాంతం లభించదు. సముద్రతీరాలు, పర్వతప్రాంతాలు, లోకపాలుర గ్రామాలు, కొండశిఖరములు, పాతాళ కందరాలు, – ఇవన్నీ కూడా అనేక ప్రాణుల వ్యవహారిక సంరంభాలతో నిండి ఉన్నాయి. కొండగుహలందామా? వాటిలో సింహ – సర్పాదులు భీకర శబ్దాలు చేస్తూనే ఉంటాయి. ఇక సరస్సులందామా! అక్కడ స్నానం చేయటానికి వాళ్ళు – వీళ్ళు వచ్చిపోవటం చేత నా ఏకాంతమునకు ఎన్నో విఘ్నాలు కలుగుచున్నాయి. పైగా, అక్కడి తరంగములు శబ్దాలు చేస్తూనే ఉంటాయి. కనుక సరస్సులు ఉన్న ప్రదేశములు కూడా విక్షేప రహిత ఏకాంత మౌన స్థితిని ప్రసాదించలేవు.

కాబట్టి... సర్వదా శూన్యమే అయినట్టి ఆకాశం యొక్క సుదూరమైన ఒకానొక మూల

మనోకల్పనచే ఒక కుటీరం నిర్మించుకొంటాను. అత్యంత ఏకాంత స్థానంలో ఉత్తమమైన 'యోగము' అనే యుక్తిని అవలంబిస్తాను. ఈ చిత్తమును ఎటూ ప్రసరించకుండా సుదృఢం చేస్తాను. అక్కడ వాసనారహితుడనై సమాధి పరాయణుడను అవుతాను.

❖

ఇట్లా ఆలోచించి నేను ఆ దేవలోకంలోని ఆ ప్రదేశం నుండి బయలుదేరాను. ఖడ్గధారతో పోల్చతగిన నిర్మలమగు, అత్యంత సూక్ష్మమగు దేవలోక సంబంధమైన సూక్ష్మ - ఆకాశంలో ప్రవేశించాను. అయితే ఆ ఆకాశము యొక్క అంతరాళంలో కూడా అనేక సమాధి విఘ్నం చేయగల ఏవేవో దృశ్యలు (ఇక్కడి లాగానే) కనిపించసాగాయి.

ఆ దేవలోకాంతర్గతమైన ఆకాశం నందు... ఒకచోట సిద్ధులు సంచరిస్తున్నారు. మరొకచోట మేఘములు గర్జిస్తున్నాయి. ఇంకొకచోట విద్యాధరులు విహరిస్తున్నారు. ఇంకోచోట యక్షులు ఇష్టం వచ్చినట్లు వినాశన క్రియలను చేస్తూ కనిపించారు. ఒక ప్రదేశం గంధర్వ నగరంచే పూర్ణమై ఉన్నది. ఇంకొక ప్రదేశంలో గొప్ప యుద్ధ సంరంభమంతా సంసిద్ధమై భయానకమైన వాతావరణంతో కూడుకొని ఉన్నది. మరొక చోట మేఘాలు భయంకరంగా శబ్దాలు చేస్తూ అతి తీవ్రంగా వర్షిస్తున్నాయి. వేరొక ప్రదేశంలో యోగినులు(మంత్రగత్తెలు) ఉన్మాద రౌద్ర వృత్తులతో కూడి వర్తిస్తున్నారు. ఒకచోట దైత్యుల నగరాలు గంధర్వ నగరాలను వేగంగా ఢీకొనటం, దానితో ఆ గంధర్వ నగరాలు అందులో గంధర్వ జనులతో సహా ఆకాశంలోకి ఎగిరెగిరి పడుచుండటం కనిపించింది. ఇంకొక చోట గ్రహములు అటూ ఇటూ పక్షులలాగా ఎగురుచున్నాయి. ఒక చోట నక్షత్ర సమూహంచేత ఆ ప్రదేశమంతా వ్యాకులమై ఉన్నది. ఒక ప్రదేశం రకరకాల పక్షులతో పరిపూర్ణమై ఉన్నది. మరొక చోట హింస-హత-రోదన-గావుకేకలు పిచ్చి కేరింతలు వంటి ఏవేవో దుశ్శకున శబ్దములతో పూర్ణమై ఉన్నది. ఇంకొక చోట పిశాచాలు మొదలైన భయంకరాకారములు కలిగిన ప్రాణిసమూహాలు యథేచ్ఛగా అటూ ఇటూ సంచరిస్తున్నాయి. ఒక చోట అనేక నగరాలు, ఆ నగరములలో అనేక సంరంభములతో అల్లకల్లోలంగా ఉన్నది. ఒక ప్రదేశమంతా సూర్యరథంచే ఆక్రమించబడి ఉన్నది. వేరొక చోట చంద్రుడు, శుక్రుడు, గురుడు మొదలైన గ్రహముల రథముల రాకపోకలతో, విన్యాసాలతో కూడుకొని ఉన్నది. ఒక ప్రదేశం సూర్య తాపం కొద్దికొద్దిగా అధికమైపోతూ ఉండగా, ఆ తాపానికి క్రమక్రమంగా అనేకమంది జీవులు వినాశనం పొందుచూ కనిపించసాగారు. మఱొక ప్రదేశంలో చంద్రకళలు ప్రవేశించటంచే ప్రశాంతంగా ఉన్నది. ఇంకొక చోట భూత-ప్రేతములు అనేక హింసాక్రియలు నిర్వర్తిస్తుంటే, ఆ ప్రదేశం భయంకరంగా ఉన్నది. ఒకానొకచోట అగ్నియొక్క ఉష్ణత్వముచే అతి తీక్షణంగా ఉన్నది. ఇంకొక చోట బేతాళములు నివసిస్తున్నాయి. వేఱొక చోట భారీ శరీరములు గల పక్షులు వసిస్తున్నాయి. ఒక చోట ప్రళయ మేఘాలు. ఇంకొక చోట ప్రళయకాల ప్రచండ అగ్ని-వాయు వీచికలతో నిండి ఉన్నాయి.

నేను ఆ ప్రాణి సమూహాలన్నీ వదిలి అతి దూరంగా పయనించాను. అట్లా వెళ్ళి వెళ్ళి "అతి విశాలము, అత్యంత శూన్యము" అగు ఒక నిర్జన ప్రదేశంలో ప్రవేశించాను. అక్కడ కలలో కూడా

ఒక్క ప్రాణి లేదు. అయితే ఆ ప్రదేశంలో ఎక్కడి నుండో మెల్లగా వాయువు వీస్తోంది. అక్కడ ఎట్టి శుభ-అశుభ శకునములు లేవు. ఆ ప్రదేశం ప్రపంచ జీవులకు సాధారణంగా అప్రాప్యమైనది. అక్కడ నా మనఃసంకల్ప బలంతో ఒక కుటీరం నిర్మించాను. నాచే నిర్మించబడిన ఆ కుటీరం కమలం యొక్క మొగ్గలాగా అతిసుందరంగా ఉన్నది. గోడలకు రంధ్రాలు లేవు. లో భాగాలన్నీ స్వయంప్రకాశవంతమై ఉన్నాయి. ఆ అందమైన కుటీరమును నా సత్య సంకల్ప ప్రభావంతో నిర్మించాను సుమా! ఇక ఆ తర్వాత ఆ చుట్టు పక్కలకు ఏ సాంసారికమైన ప్రాణి రాకుండా చిత్తముచే సంకల్పించాను. ఇక అక్కడ కుటీరంలో సర్వ భూతములకు(జీవులకు) అగమ్యం అయినట్టి (చేరుటకు వీలుకానట్టి) "నిర్వికల్ప సమాధి" యందు సంస్థితుడనైనాను.

ఆ విధంగా నిర్వికల్ప సమాధిలో 100 సంవత్సరాలు గడిచిపోయినాయి. ఆ తరువాత ఎందుకో "సమాధి నుండి లేవాలి" - అనే ఒక ఆలోచన కలిగింది. అప్పటి దాకా పద్మాసనముపై కూర్చుని శాంతచిత్తుడనై మహామౌనమును అవధరించి సమాధి స్థితిని అనుభవిస్తున్నాను కదా! అప్పటి వరకు గాఢనిద్ర యందు ఉన్నవాని వలె నిశ్చలముగాను, ఆకాశం వలె నిర్మలంగాను, చిత్రంలో చిత్రింప బడిన మనుజుని వలెనూ, నా నిర్వికల్ప సమాధి కొనసాగింది. అయితే ఎప్పుడైతే "ఈ సమాధి నుండి లేచెదనుగాక" అనే స్ఫురణ కలిగిందో, అప్పుడు ముకుళించుకొన్న నా చిత్తము "వాయువు - దిశలు" వలె వికసించసాగింది. ఈ చిత్తము చిరకాలం ఏ పదార్థమును ధ్యానిస్తుందో అద్దానిని అది తక్షణం గాంచుతుంది కదా! అప్పుడు 'బోధ' అంకురించసాగింది. 'వ్యుత్థానం' నిమిత్తమై 'కర్మవీచిక' నా హృదయమున ఉదయించి విస్తార మొందసాగింది. ఇక నాయొక్క జీవ చైతన్యము వృత్త సహితమై ప్రబుద్ధం కాసాగింది.

సమాధిలో గడిపినట్టి ఆ నూరు సంవత్సరములు నాకు మాత్రం ఒక్క నిమిషం లాగా గడిచిపోయింది. ఎట్లా అంటావా? ఇందులో నీకు క్రొత్తగా చెప్పవలసిన విశేషం ఏమున్నది? ఏకాగ్రమైన చిత్తము కలవానికి సుదీర్ఘకాలం కూడా అత్యల్పంగానే తోస్తోంది కదా!

నేనిక సమాధి నుండి విరామం భావిస్తుండగా, ఒకానొక క్రమంగా నా యొక్క బాహ్య జ్ఞానేంద్రియాలు కూడా వికసించసాగాయి. ప్రాణ వాయువులు దేహమంతా ప్రసరించి పరిపూర్ణం చేయనారంభించాయి. నెమ్మదిగా ఇంద్రియ వృత్తులతో కూడి జీవచైతన్య సహితుడనైనాను. అప్పుడు నా వద్దకు 'ఇచ్ఛ' అనే పత్నితో కూడిన 'అహంకారం' అనే పిశాచం ఎక్కడి నుండో వచ్చి చేరింది.

❖❖❖

## 2. అహంకారం యొక్క అసలు రూపం

**శ్రీరాముడు :**

**త్వామపి ఉదిత నిర్వాణం అహంకార పిశాచకః**
**బాధతే కిమపి? బ్రూహి, మునే! సందేహశాంతయే ॥**

హే మహర్షీ! మీరు చెప్పింది వింటుంటే కొంచెం ఆశ్చర్యంగా ఉన్నది. నిర్వాణ స్థితి సంపాదించుకొని ఉన్నట్టి తమంతటి వారిని కూడా ఈ 'అహంకార పిశాచం' సమీపించి ఆవేశించ గలదా? నా యొక్క సందేహ నివృత్తి కొరకై ఈ విషయం విశదపరచండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇటు జ్ఞానికైనా అటు అజ్ఞానికైనా కూడా... 'అహంకారము' అనేది లేకపోతే ఆ ఇరువురికీ కూడా 'శరీర స్థితి' సంభవించజాలదు. ఎందుకంటావా? ఒక వస్తువు ఉండటానికి ఆధారం అక్కడ ఉండాలి కదా! ఆధారం లేకపోతే ఆధేయపదార్థస్థితి ఉండజాలదు కదా! కనుక శరీరం నిలబడాలంటే దానికి ఆధారమైన 'అహంకారం' ఉండక తప్పదు. అయితే జ్ఞాని – అజ్ఞానుల అహంకారం విషయంలో ఒక ప్రత్యేకమైన విశేషమున్నది. ఆ విశేష తత్వమేమిటో వింటే చిత్త విశ్రాంతి కలుగుతుంది. అహంకార పిశాచం తొలిగిపోతుంది కూడా! కనుక చెబుతాను, విను.

**అహంభావ పిశచో అయమ్ అజ్ఞాన శిశునామునా ।**
**అవిద్యామాన ఏవాన్తః కల్పతస్థేన సంస్థితః ॥**

వాస్తవానికి 'అహంభావం' అనేది లేదు. పసిపాప బొమ్మను చంకన పెట్టుకొని "నా బిడ్డ! పడిపోతాడేమో?" అని అనుకొంటుంది చూచావా? అట్లా ఒకానొక ఉద్వేగం ప్రారంభమౌతోంది. అట్లాగే, ఈ అహంభావ పిశాచం 'అజ్ఞానము' అనే బాలునిచే అంతఃకరణంలో కల్పించబడుతోంది. కల్పన చేత మాత్రమే అద్దానికి ఉనికి లభిస్తోంది. అయితే, దీపం దగ్గిర పెట్టుకున్న వానికి చీకటి సమీపించగలదా? ఏ జ్ఞాని 'విచారణ' అనే ఉద్యమాన్ని తన వెంట ఉంచుకొని ఉంటాడో అట్టి వానికి అజ్ఞానము– అహంకారముల ఛాయ కూడా సమీపించలేదు. అసలు అది ఉంటే కదా, లభించటానికి? జ్ఞానదృష్టిచే అది వాస్తవానికి లేదు.

**యథాయథా విలోక్యతే తథా తథీవిలీయతే ।**
**ఇహ అజ్ఞాతా పిశాచికా తథా విచారితా సతీ ॥**

ఎంతెంత వరకు విజ్ఞాన దృష్టితో విలోకనం చేస్తామో, అంతంత వరకు ఈ 'అహంకారం' విలీనమై ఆత్మకు అనన్యంగా రూపుదిద్దుకుంటోంది. 'విచారణ' యొక్క ఆధిక్యతను అనుసరించి ఈ అహంకార పిశాచి క్షయిస్తూ ఉంటుంది. ఒకనికి (తన బుద్ధియొక్క భ్రమచే) చీకట్లో అక్కడ ఖాళీ ప్రదేశమే అయినప్పటికి.... దేహరహిత పిశాచం కనిపిస్తూ ఉంటున్నట్లు, మూల–అవిద్య ఉన్నంత వరకు కార్య రూప అవిద్య ఉంటూనే ఉంటుంది. (కారణము "అజ్ఞానము"... కార్యము "అవిద్య")... ఆకాశంలో ఉన్నది ఒక్క చంద్రుడే అయినప్పటికీ కంటి దోషం చేత రెండవ చంద్రుడు, ఆ రెండవ చంద్రునిలో రెండవ కుందేలు ఆకారం కనిపిస్తుంది. ఈ "సృష్టి" అనే ప్రదర్శనమంతా అజ్ఞానము చేతనే ఉత్పన్నము అగుచున్నందున వాస్తవానికి ఇది 'లేనిదే' అయి ఉన్నది. ఆకాశంలో వృక్షం ఉండటానికే అవకాశం లేదు. అనంతమగు ఆకాశంలో "నీ భాగం–నా విభాగం" అనేవి ఎక్కడుంటాయి? అట్లాగే అనంతమగు చిదాకాశంలో "నీవు – నేను – నీది–నాది"....అనేవి

ఉండజాలవు. ఎక్కడైనా లభిస్తూ ఉంటే అది అజ్ఞాన భ్రమను కారణముగా కలిగి ఉన్నది. ఆదిసృష్టి నిర్వికారమై ఉన్నది. ఇప్పుడు కూడా ఎప్పటియట్లే నిర్వికారమై ఉన్నదయ్యా!

మరి ఎదురుగా కనిపిస్తున్న ఈ జగత్తు, ఈ జగత్తును అనుభవిస్తున్న 'వ్యష్టి అహంకారం' మాట ఏమిటంటావా?

నిరాకారమగు బ్రహ్మం పంచేంద్రియాలకు, వాటిని సమన్వయపరిచి ఉపయోగించే మనస్సుకు కూడా అతీతమై, కేవలసాక్షి అయి ఉన్నది. మనస్సుతో కూడిన పంచేంద్రియాలకు "విషయం" అగుచున్న ఈ సాకార జగత్తునకు కారణం మనస్సుకు అతీతమగు బ్రహ్మం ఎట్లా అవుతుంది? అవదు. ఎందుకంటే, బీజం ఉన్నచోట ఆ బీజం వల్ల 'అంకురం' అనే కార్యం ఉత్పన్న మౌతోంది. ఎచ్చట బీజమే లేదో అచ్చట వృక్షం ఎట్లా ఏర్పడుతుంది? కారణం లేనిదే కార్యం ఏర్పడ జాలదు కదా! అంతటా ఆకాశమే అయి ఉండగా "ఇది తూర్పు ఆకాశం, అది పడమర ఆకాశం" ...అనేది ఎట్లా ఏర్పడగలదు చెప్పు? "అయినా తూర్పు-పడమర ఉన్నాయి కదా?"...అని అంటావా? అది 'సూర్యోదయం' అనే ఒక విన్యాసానికి భూమికి గల సంబంధం కావచ్చునేమోగాని, ఆకాశంలో 'దిక్కులు' అనేదాని స్వకీయమైన సత్త కాదు. సంకల్పముచే ఆకాశంలో (జ్ఞప్తి రూప) వనములు కనిపించునట్లు... ఈ జగత్తు సంకల్పమయం మాత్రమే! పదార్థముగా కనిపించేది కూడా పదార్థ భావన యొక్క స్థూలానుభవం మాత్రమే! అందుచేతనే ఒకే రూపం ఒక దేహికి ప్రియంగాను, మరొకరికి అప్రియంగాను, ఇంకొకరికి ఉదాసీనంగాను అనిపించటం జరుగుతోంది. అంతేకాదు. ఈ విధంగా, ఈ జీవుడు "జగత్తును పొందటం" అనేది సందర్భ చమత్కారమేగాని, వాస్తవ స్వభావం కాదు.

"సృష్ట్యాది" యందు ఏ నిష్కంటకమగు 'బ్రహ్మాండం' యొక్క స్థితి అనుభూతమగుచున్నదో... అది కూడా శూన్యమాత్రమే అయి ఉన్నది. వాస్తవానికి ఈశ్వరుడు సృష్టి యొక్క విషమత్వము లేనివాడు. చిదాకాశస్వరూపుడు. చైతన్యమయుడు. అట్టి ఈశ్వరుడే స్వకల్పిత స్వభావపూర్వకంగా తనయందు సృష్టిరూపంగా భాసిస్తున్నాడు. 'అహంకారము' ఈశ్వర స్వరూపమే గాని ఈశ్వరునికి అనన్యమైనది కాదు. ఇందుకు దృష్టాంతం ప్రతి రోజు ప్రతి జీవికి అనుభవమయ్యే స్వప్నవృత్తాంతమే. స్వప్నంలో పర్వతాలు, నదులు, జీవులు మొదలైనవన్నీ కనిపిస్తున్నాయి. వాటన్నిటి యొక్క అసలు రూపం ఏమిటి? స్వప్నద్రష్ట చైతన్యమే, ఆయా వివిధ రూపములుగా స్ఫూర్తిస్తోంది కదా! అనగా, స్వప్నమునందు చైతన్యం యొక్క స్వభావముచేతనే సృష్టి ఉన్నట్లే భాసిస్తున్నది. అదే రీతిగా సృష్ట్యాదియందు చిదాకాశమున ఈ సృష్టి వాస్తవానికి లేకపోయినప్పటికీ, ఉన్నట్లే భాసిస్తోంది. సృష్టికి మునుముందే ఏ విషయజ్ఞానాతీత - శుద్ధ - జన్మాదిరహిత - అవ్యయ - అనాది - అనంతమైనట్టి ఆత్మతత్త్వము అప్రతిహతంగా ప్రకాశించి ఉన్నదో, ఆ అప్రతిహత ఆత్మప్రకాశమే సృష్టి సమయంలో కూడా ఈ అహంకారము - జగత్తు మొదలైన వాటితో కూడిన సృష్టి రూపంగా భాసిస్తోంది, సృష్టి రూపంగా స్థితినొంది ఉన్నదంతా అదే! ఇక్కడ వాస్తవానికి సృష్టిగాని, పృథివి మొదలైన గోళములు గాని లేవు.

అంతాకూడా... **"సర్వం శాంతం అనాలంబం బ్రహ్మైన బ్రహ్మణి స్థితమ్"** – శాంతము, నిరాలంబనము అగు బ్రహ్మమే బ్రహ్మమునందు స్థితి కలిగి ఉన్నది. కనుక 'అహంకారం' అనేది బ్రహ్మము యొక్క (లేక) ఈశ్వరుని యొక్క ఒకానొక ప్రదర్శనా చమత్కారం మాత్రమే!

ఓ రామచంద్రా! మరల మరొకసారి క్రోడీకరించి సిద్ధాంతపూర్వకంగా ప్రకటన చేస్తూ చెప్పుచున్నాను, విను.

**సర్వశక్త్యాత్మ తత్‌బ్రహ్మ యథా కచతి యాదృశమ్**
**రూపమత్యజదేవాచ్ఛం తథా భవతి తాదృశమ్ ॥**

బ్రహ్మం సర్వశక్తిమంతం. అట్టి బ్రహ్మం ఎట్లు ఎచ్చట స్ఫూర్తించనెంచుతుందో, అట్లట్లు తన శుద్ధరూపాన్ని ఏమాత్రం త్యజించకుండానే సృష్టి మొదలైన రూపాలుగా అగుచున్నది. స్వప్నద్రష్ట యొక్క చైతన్యం యథాతథంగా ఉంటూనే స్వప్నంలో అనేక పదార్థముల – వ్యక్తుల కల్పనారూపం పొందుచుండటమే ఇందుకు మనకు దృష్టాంతం. ఈ స్వప్న ద్రష్టలాగానే... సృష్ట్యాదిలో ఈ జగత్తు కూడా చిన్మాత్రం యొక్క విలాసమే అగుచున్నది. నిర్మలమగు ఆకాశంలో 'నీలివర్ణం' అనే వైచిత్ర్యం కనిపించటంలేదా? అట్లాగే శుద్ధాకాశమున అద్దాని స్వభావమే... ఆ చైతన్యం యొక్క భావన చేత సృష్టి రూపంగా స్ఫురిస్తోందని గ్రహించవలసినదిగా సర్వ సహజీవులకు నా విన్నపం.

"భావించునది – భావించబడునది – భావన" ఈ త్రిపుటి రూపాల యొక్క నిరంతర ఉత్పత్తి మొదలైనవన్నీ ...చిదాకాశమే తనలో తాను ఆ విధంగా స్థితి కలిగి ఉన్నది. కనుక చిదాకాశమే 'అహంకారం' రూపంగా కూడా తనలో తాను ప్రదర్శితమగుచున్నది. చిదాకాశమే చిదాకాశంలో స్థితి కలిగి ఉండగా ఇక సృష్టి ఎచట? అవిద్య, అజ్ఞానాలెచట? అహంకారం మొదలైనవి ఎచట?...

అంతా కూడా శాంతము, చిద్ఘనము అయినట్టి బ్రహ్మమే అయి ఉన్నది!

ఓ రామచంద్రా! ఈ విధంగా అహంకారము యొక్క వాస్తవ స్వరూపం ఏమై ఉన్నదో... నీకు వచించాను. "అహంకారం స్వతహాగా లేదు. ఆత్మయే అహంకార రూపంగా ప్రదర్శిత మౌతోంది" అని గ్రహించుటయే అహంకారం యొక్క ప్రశమనం. ఎఱుగబడిందా, ఈ అహంకారం బాలుడికి కనబడే పిశాచం (వెలుతురు ఏర్పడగానే) తొలగిపోవుచున్నట్లు తొలిగిపోతుంది. ఈ అహంకార పిశాచం యొక్క రూపం ఏమిటో పూర్ణముగా నేను ఎఱిగి ఉండటం చేత... అది నాకు ఉన్నప్పటికీ నిష్ఫలమైనదే అవుతుంది. ఆ 'కనబడేది గోడపై రంగులతో లిఖించబడిన అగ్ని చిత్ర లేఖనమేగాని నిజమైన అగ్ని కాదు' అని ఎఱిగిన తరువాత ఇక ఆ అగ్ని వల్ల చర్మం కాలుతుందేమో నన్న శంక ఎందుకుంటుంది? ఎఱుగబడిన తరువాత అహంభావం, సృష్టి మొదలైనవన్నీ నిష్ఫలమే అవుతాయి. అవి ఉన్నా, ఉండకున్నా ఆత్మ యథాతథమేనని మేము గమనించియే ఉంటున్నాం. ఈ ప్రకారంగా అహంకారం యొక్క "త్యాజ్యస్థితి" (నిర్వికల్ప సమాధి) యందు, "గ్రాహ్యస్థితి" (వ్యవహారస్థితి) యందునూ కూడా నాకు సమత్వమే ఏర్పడి ఉంటోంది. మేఘాలు లేనప్పుడూ, మేఘాలు ఉన్నప్పుడూకూడా ఆకాశం సర్వదా ఆకాశంగానే ఉంటోంది కదా! సృష్టి ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా నాయొక్క స్థితి సమముగానే ఉంటున్నదగుచున్నది.

**అహంభావస్య నైవాహం నా అహంభావో మమేతి చ ।**
**తేన విద్ధి చిదాకాశమేవేదమితి నిర్ఘనమ్ ॥**

"నేను అహంభావానికి చెంది ఉండలేదు. అహంభావము నాకు చెంది ఉండలేదు" అని సునిశ్చితం చేయి. అహంకారంతో సహా, ఈ సర్వజగత్తును "చిదాకాశ ఘనము"గా ఎఱుగుము.

నా దృష్టిలో 'అహంభావము - జగత్తు'మొదలైనవి ఎట్లా లేవో... అట్లాగే ఈ సభలోని తదితర జ్ఞానుల దృష్టిలో కూడా అవి లేకయే ఉన్నాయి.

చిత్రపటంలో సెలయేరును చూచి 'ఆ జలం నా ఆర్తిని (దాహాన్ని) తొలగిస్తుందేమో'...అని ఆశించేవారు బాలురేగాని, జ్ఞానులు కాదు. ఈ జగత్తు, అహంకారాలను "ఉన్నాయి"... అని అనటం చిత్రపటంలోని అగ్నిని ఉపయోగించి వంట చేయటానికి ఉపక్రమించటం వంటిదే అవుతుంది.

**నాఽహమస్మి ! న చ అన్యోఽస్థి !"సర్వం నాస్తి" ఇతి నిశ్చయే ।**
**ప్రకృత వ్యవహారస్త్వం శిలామౌనమయోభవ ॥**

ఓ రామచంద్రా! "వాస్తవానికి, 'నేను' గాని, మరొకడు గాని, ఈ సమస్త బ్రహాండములు గాని లేవు"... అను నిశ్చయం కలిగి ఉండు. ఇక ఆపై యథాప్రాప్తమగు వ్యవహారం ఆచరిస్తూనే అంతరమున మౌనం వహించి ఉండు. ఆ విధంగా చిరకాలం దృశ్యభావమునంతటినీ తొలగించు కుంటూ శిలామధ్యభాగంలాగా చిద్ఘనరూపుడవై ఉండు. ఆకాశం వలె నిర్మలమైన ఆకృతితో 'స్వాత్మ' రూపముననే స్థితి కలిగి ఉండు. ఎందుకంటావా? ఈ సృష్టికి ముందు, ఈ సృష్టి కాలంలో, ఈ సృష్టి శమించిన తరువాత కూడా సర్వవేళలా ఈ సమస్తం చిన్మయమగు శివరూప బ్రహ్మమే అయి ఉన్నది. "దృశ్య ప్రపంచం" అనునదేదీ లేదు.

❖❖❖

## 3. 'సర్వత్రా' ఉండి కూడా స్వతహాగా లేని సృష్టి శోభ

**శ్రీరాముడు :** ఆహాఁ ! మహాత్మా! మాయొక్క జ్ఞానైశ్వర్యము కొఱకే మీరు ఇట్టి గంభీరము- నిర్మలము-విపులము-నిశ్చలము- విశాలము అయినట్టి "ఆత్మదృష్టి" గూర్చి మరల మరల పలుకుచున్నారు. మునీంద్రా! మీరు చెప్పినదంతా పరమ సత్యమే!

**సర్వథా సర్వదా సర్వం సర్వం సర్వత్ర సర్వదా ।**
**"సత్" ఇత్యేవ స్థితం సత్యం సమం సమనుభూతితః ॥**

"సర్వ విధాలుగా-సర్వవేళలా-సర్వం-అంతటా-అన్ని సమయాలలోనూ ఇదంతా సద్రూప మగు బ్రహ్మమే" అని సెలవిచ్చారు కదా! అది సత్యమే. అట్లా ఎవరికైనా అనిపించకపోవటానికి కారణం 'విచారణ-అనుభవం' తగినంతగా లేకపోవటం చేతనే. విచారణ-అనుభవాలచే ఇదంతా అట్టి ఏకరసమగు చిన్మాత్రంగానే ఒప్పుచున్నది స్వామీ! వేదాంత వాఙ్మయంలో "అంతా పాషాణ మాత్రమే" అని అంటూ ఉన్నారు కదా! హే బ్రహ్మజ్ఞా! మాకు మరింతగా బ్రహ్మజ్ఞానం

అనుభవమయ్యేందుకుగాను మీరు ప్రారంభించిన "పాషాణాఖ్యాయిక" కొనసాగించమని నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అట్లే అగుగాక! "పాషాణాఖ్యాయిక" అను ఈ మన వర్తమాన విశేష సంవాదమునందు 'సర్వత్రా-సర్వదా-సర్వం సద్రూపమే' అను సిద్ధాంతం ప్రతిపాదించ బడుతోంది. అట్టి పాషాణదృష్టాంతం గురించి చెపుతాను... విను-

"రంధ్రములు లేనట్టి ఘనమైన శిలయొక్క మధ్యభాగంలో శిలారేణువులు అకారాదులతో ఉండి ఉన్నట్లుగా... అధిష్ఠానమై చెన్నొందుచున్న పరబ్రహ్మము నందు (శిలాంతర్భాగ శిలారేణువుల లాగా) ఈ అనేక బ్రహ్మాండములు ఉంటున్నాయి"... అని ఈ అఖ్యాయిక నిరూపిస్తోంది.

అట్లే, "మహత్తరము, స్వరూపతః శూన్యము అయిన భూతాకాశంలో అసంఖ్యాక సృష్టులు ఉన్నాయి. ఒక విత్తనంలో, ఒక లతలో, ప్రతి ఒక్క ప్రాణిలో, జడవస్తువులో, వాయువులో, అగ్నిలో, జలంలో, ఆకాశంలో, ఒక అణువులో కూడా... అనేక సృష్టులు ఉన్నాయి"... అని కూడా ఈ అఖ్యాయిక నిరూపిస్తోంది.

**శ్రీరాముడు :** స్వామీ! 'ఒక రాయిలో, గోడలో, లతలో కూడా అనేక సృష్టులు ఉన్నాయి'... అని ఇప్పుడు అంటున్నారు కదా! మరి "చిదాకాశమునందే సమస్త సృష్టులు భాసిస్తున్నాయి"... అను మీ ఇతఃపూర్వపు వాక్యమునకు, ఇప్పటి ఈ మీ వాక్యమునకు సమన్వయం ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ కనిపించే సృష్టి విషయమై... 'చిదాకాశమే చిదాకాశమున ఇట్లు సృష్టి రూపంగా కనిపిస్తోంది"... అనునది పరమసత్యం.అదియే ముఖ్యమైన పక్షము కూడా. గోడ - లతగా కనిపించేదీ చిదాకాశమే! అందులో గల సృష్టులు చిదాకాశమే! ఇది ఇట్లుండగా, అసలీ దృశ్యము 'ఆది' యందు ఉత్పన్నమే కాలేదు సుమా! మొదలే ఉత్పన్నం కానిది ఇప్పుడెక్కడి నుంచి వస్తుంది? కనుక అది ఇప్పుడు కూడా ఉండి ఉండలేదు. ఉన్నది బ్రహ్మము మాత్రమే! అయితే ఆరోప దృష్టికి ఆరూఢమై ఈ భౌతికమగు పృథ్వి - జలము మొదలైనవి అగుపిస్తున్నాయి. అట్టి ఆరోపిత దృష్టికి అనుభవమయ్యే సృష్టులు పృథ్వి యొక్క ప్రతి అణువు నందు (సృష్టి-సమూహములు) అనుభవించబడుచున్నాయి. ఎవరికి? ఆరోపిత దృష్టి కలిగియున్న జీవులకు! అపవాద దృష్టిచే వీటన్నిటి వాస్తవరూపం గమనించబడినప్పుడు ఈ 'పృథివి' అనబడేది అణు మాత్రంగాకూడా లేదు. అందులో అణువులూ లేవు, ఆ అణువులలో సృష్టులూ లేవు. అవన్నీ కూడా వాస్తవానికి చిదాకాశరూపమగు బ్రహ్మమే అయి ఉన్నాయి.

అట్లాగే... జలము-అగ్ని-వాయువు-ఆకాశం-పంచభూత కలయికలచే ఏర్పడే పదార్థాలు, బ్రహ్మదేవుని "సూక్ష్మభూత ఉపాధి"యగు "సమష్టి అహంకారాలు-సమష్టి చిత్తములు, -సమష్టి బుద్ధులు-సమష్టి మనస్సులు"... ఇవన్నీ కూడా ఆరోప - దృష్టిచే అణువణువునా ఉన్నాయి. ప్రతి అణువు అనేక బ్రహ్మాండాలు కలిగి ఉన్నది. అందులోని ప్రతి బ్రహ్మాండంలోని ఆయా పంచభూత ప్రపంచపు అణువణువులో మరింకెన్నో అసంఖ్యాక బ్రహ్మాండాలు ఉన్నాయి.

అపవాద దృష్టిచే (బ్రహ్మాండాలు... అనునవి విభాగించి 'అవన్నీ ఏమిటి?' అని పరిశీలించి చూచినపుడు) అవేవీ ఎక్కడా లేవు.

**శ్రీరాముడు :** మరి బ్రహ్మమున మనకు కనిపించే సృష్టులు ఎట్లా వస్తున్నాయి? "బ్రహ్మం, సృష్టి" అను ఈ రెండింటికీ గల భేదమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా!ఉన్నది ఉన్నట్లు ప్రకటిస్తున్నాను. విను-

**"బ్రహ్మ - సర్గాత్" తథా ఇత్యేష వాచి భేదో న వస్తుని ॥**

'బ్రహ్మము' అని పిలవబడుదానికి, సృష్టి అని చెప్పబడుదానికి ఏమీ భేదం లేదు. ఒకవేళ "నాకు భేదం గోచరిస్తోంది కదా?"... అని నీవు అంటావేమో? ఏ భేదమైతే గోచరిస్తుందో ...అది వాచిక భేదమేగాని, వాస్తవానికి వస్తుతః ఆ రెండింటికీ భేదం లేదు.

**సర్గా ఏవ పరంబ్రహ్మ పరంబ్రహ్మైవ సర్గతా**
**మనాగపి అస్తిన ద్వైవమత్ర "అగ్ని - అర్కే" ఉష్ణయోరివ ॥**

ఈ సృష్టియే ఆ పరబ్రహ్మము ఆ పరబ్రహ్మము ఈ సృష్టియే అయి ఉన్నది. "ఉష్ణము" దృష్ట్యా అగ్నికి - సూర్యునికి భేదమేమున్నది? రెండూ ఉష్ణరూపములే కదా!

"ద్రవత్వము" దృష్ట్యా జలమునకు - తరంగమునకు ఉన్న తేడా ఏమిటి? "వాయుత్వము దృష్ట్యా వాయువుకు - వాయు తరంగమునకు భేదమెక్కడ? అట్లాగే బ్రహ్మమునకు - జగత్తుకు భేదమేమీలేదు!

సృజనము అను క్రియచే 'సృష్టి' అనేది (శబ్దం) ఏర్పడింది (సృజి...ఇతి క్రియేతి సృష్టిః); వర్ధనము అను క్రియచే 'బ్రహ్మమ్' అనేది(శబ్దం) ఏర్పడుతోంది (బృంహి...ఇతి క్రియేతి బ్రహ్మమ్).

...ఈ రెండు క్రియలకు (సృజన క్రియ, వర్ధన క్రియ) పరస్పరం అభేదమే అయి ఉన్నాయి సుమా! పోనీ ఒకదానిని 'ఆధారము' అని, రెండవదానిని 'ఆధేయము' అని అందామా? అట్టి ఆధార - ఆధేయముల తేడా ఉన్నదని గాని, లేదు అని గాని నిరూపించలేము అందుకే ఆ రెండింటికి ఉన్న భేదం అనిర్వచనీయం అని అంటూ ఉంటారు. కర్త కన్నా క్రియ వేరైన స్వరూపం కాదు కదా! (ఉదాహరణకు "అతడు పరిగెత్తుచున్నాడు"... అను దానిలో అతనిని, అతని పరుగుని వేఱుచేసి చూపలేం కదా!) అట్లాగే 'బ్రహ్మము' అను దానికి సృష్టికి వేరైన ఉనికి ఎక్కడా కనిపించదు. 'సృష్టి' అనునది భావనకు వేఱుగా ఏదీ ఉండటం లేదు.

అందుకే "సృష్టి-బ్రహ్మము అను ఉభయ శబ్దముల భేదం కొయ్యచీల్చుచున్నప్పుడు వచ్చే "పర్ర్" శబ్దము వలె అర్థరహితం అని కూడా విజ్ఞులు అంటూ ఉంటారు.

ద్వైతము ("ఒకటి రెండుగా అగుచున్నది"); ఏకత్వము ("రెండూ ఒక్కటే అయి ఉన్నది")... ఈ రెండు కనిపిస్తున్న ఏ వ్యవహార దశ అయితే ఉన్నట్లున్నదో, అది కూడా 'చిన్మాత్రము' యొక్క వివర్తనమే. అందుచేత అప్పుడు కూడా "సృష్టి, బ్రహ్మం" అను ఉభయ శబ్దములు, వాటి అర్థములు వేఱువేఱు కాదు. ఇట్లు ఈ సృష్టి బ్రహ్మమే అయి ఉండగా ...ఇక ఎవనికి ఎట్లు విభిన్న రూపములు

భాసించగలవో చెప్పు? కాబట్టి రామచంద్రా! నీవు సర్వదా జ్ఞానివై ఉండు. వ్యవహారంనందు ప్రవృత్తుడైనప్పటికీ జ్ఞానికి ఈ సమస్త జగత్తు 'శిల' వలె చిద్ఘనం - శాంతం - ఏకం - అద్యంత రహితం - నిర్మలం - నిర్వికారం - మౌనస్వరూపం అగు బ్రహ్మం గానే ప్రకాశమానమగుచున్నది.

ఓ రాఘవా! ఈ "నీవు, నేను పర్వత సమూహములు, దేవతలు, అసురులు" - ఈ మొదలగు సమస్త దృశ్యమున్నూ కేవలం నిర్వాణరూపమగు 'చిదాకాశము' మాత్రమేనయ్యా! కాబట్టి ఒకడు మేల్కొనిన తరువాత తను రాత్రి కలలో చూచిన దృశ్య వ్యవహార జాలమును ఎట్లు ఉద్దేశించి ఉంటాడో ...నీవు ఆ విధంగా ఈ జగత్తును వర్తమానంలోనే (స్వప్న సదృశ్యంగా) చూడు.

❖❖❖

# 4. అనేక కోటి బ్రహ్మాండ సమూహములు

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు అట్లు ఆకాశంలోని ఒకానొక ఏకాంత ప్రదేశంలో 'కుటీరం' కల్పించుకొని 100 సంవత్సరాలు గడిపానని ఆ తరువాత జీవచైతన్య సహితులు కాగా, అప్పుడు 'ఇచ్ఛ, అహంకారం' అనేవి రెండు వచ్చి చేరాయని చెప్పారు కదా! ఆ తరువాత ఏమైందో చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇక విను చెపుతాను-

క్రమంగా నేను సమాధి నుండి ప్రబుద్ధుడనై లేచాను. అప్పుడు అతి సూక్ష్మమైన ఏదో 'ధ్వని' నా చెవులకు వినిపించింది. ఆ ధ్వని అల్పంగా వ్యక్తమైన ఏవో పదాలతో కూడుకొని అతి మనో హరంగా ఉన్నది. అయితే ఆ సన్నగా వినబడే మాటలకు అర్థమేమిటో ఏమీ తెలియలేదు. ఆ విన బడిన శబ్దాన్ని బుద్ధితో పరిశీలిస్తే ఆ ధ్వని ఒక స్త్రీ కంఠం నుండి వెలువడినట్లు నాకు అనిపించింది.

ఆ ధ్వనిని విన్న నేను "ఆ ధ్వని ఎవరిది? ఎటువైపు నుంచి వచ్చింది?" అని పరిశీలించ సాగాను. అది అతిమధురమైన ఏదో ఆలాపనలాగా ఉన్నది కాని... అది 'రోదన' వలె లేదు. పఠనం వలె కూడా లేదు. అది కమలంలో ఉన్న భ్రమరం చేసే శబ్దంలాగా ఉన్నది. అయితే ఆ 'ధ్వని' అత్యంత మృదుమధురంగా ఉన్నదని అనిపించింది. "ఆ ధ్వని ఎటునుంచి వచ్చిందా?" అని కొంచెం ఆశ్చర్యంతో దశదిక్కులా పరికించి చూచాను. నాకు ఏమీ అగుపించలేదు. అప్పుడు నేను ఇట్లా అనుకున్నాను.

❖

"చాలా ఆశ్చర్యంగా ఉన్నదే! సిద్ధులు కూడా వచ్చుటకు అవకాశము లేనంతగా లక్షల కొలది యోజనములు అతిక్రమించి ఈ ఆకాశవిభాగం స్థితి కలిగి ఉన్నది కదా! అటువంటి ఈ ఏకాంత స్థానంలో స్త్రీ గొంతును బోలిన శబ్దం ఎలా సంభవించింది? ఎంతో ప్రయత్నించి కూడా ఆ శబ్దం ఎక్కడి నుండి వచ్చిందో ...అవలోకించలేకపోయానే? ఈ నా ఎదురుగా "అనంతము, మహా శూన్యము, నిర్మలము" ...అయినట్టి ఆకాశం తప్పితే మఱింకేమీ లేదుకదా! ఇక్కడ ఒక్క ప్రాణి కూడా ఉండటానికి అవకాశమే లేదు. మరి ఈ శబ్దం ఎక్కడి నుండి వచ్చినదబ్బా?"

ఇట్లా ఆలోచిస్తూ నేను మఱల మఱల పది దిక్కులలోకి మార్చి మార్చి దృష్టి సారించి చూచాను. ఎక్కడా ఏదీ కనిపించనేలేదు.

❖

అప్పుడు నేను ఇట్లా భావించాను. "సరే! ఈ వర్తమాన ఉపాధిని త్యజించి చిదాకాశ రూపుడనయ్యెదను గాక! ఆ చిదాకాశమునందు అధ్యస్తమైయుండే 'అవ్యాకృతాకాశము' తోటి ఏకత్వము సంతరించుకొంటాను గాక! ఆ వ్యాకృతాకాశము యొక్క గుణము అయినట్టి శబ్దమును, ఆ శబ్దము యొక్క అర్థమును ఆ ఆకాశకోశమున అనుభూతం చేసుకొనెదనుగాక! నా ధ్యానబలంతో ఈ దేహాకాశమును ఉన్నది ఉన్నట్లుగా ఇక్కడే స్థాపించి ఉంచి చిదాకాశరూపుడనై... జలబిందువు జలముతో ఐక్యము పొందినట్లుగా... అవ్యాకృతాకాశముతో ఐక్యము పొందెదను గాక!

ఇట్లా అనుకున్నవాడనై దేహమును త్యజించుటకై అక్కడే పద్మాసనం అవధరించాను. సమాధిని శీలించుటకై మఱల కనులుమూశాను. ఆ తరువాత ఇంద్రియ సంబంధములైన శబ్ద-స్పర్శ-రూప - రస - గంధాది బాహ్య విషయములన్నీ త్యజించాను. అటుపై అభ్యంతరములైన 'సంకల్పములు' మొదలైనవాటిని కూడా వదిలివేశాను.

అప్పుడు "చైతన్యస్ఫురణ"చే "చిత్తాకాశరూపుడను" అయ్యాను. క్రమంగా ఆ చిత్తాకాశ రూపం కూడా త్యజించి "బుద్ధి రూపం" ను పొందాను. ఆ తరువాత ఆ బుద్ధి రూపమును కూడా త్యజించి కేవలం 'జగత్సమూహమునకు దర్పణం' అనదగు అనంతమగు "చిదాకాశము"ను అయ్యాను.

అటు తరువాత... "జలం" అనే శబ్దంలో సముద్రజలం, నదీజలం, తటాకజలం నూతిజలం, మొదలైనవన్నీ ఏకరూపం పొందుతాయి కదా! సామాన్య "సుగంధం" లో అన్ని ప్రత్యేక సుగంధాలు ఏకమై ఉంటాయే! ఆ విధంగా నేను ఆ 'చిదాకాశ స్వభావము'చే "భూతాకాశరూపము"ను పొంది దానితో ఏకత్వం సంచరించుకున్నాను. ఇక ఆపై, ఏ చిదాకాశము సమస్తమునందు వ్యాపించి "అనంతము - సర్వ వ్యాపకము" అయి ఉన్నదో... అది నేనయ్యాను. అనగా నేను సమస్తము నందు వ్యాపించి, అనంతుడనై సర్వ ఆధారునిగా నా స్వరూపమును పొందినవాడనై సర్వవ్యాపక అనుభవం పొందుచున్నవాడనైనాను. ఆకార రహితుడను - ఆధారవర్జితుడను అయి ఉంటూనే, అదే సమయంలో సర్వ పదార్థములకు ఆధారభూతుడనైనాను.

అట్టి స్థితి యందు నేను నా చిదాకాశదర్పణ దేహంలో అనేక త్రైలోక్య సమూహములను, వందలకొలది జగత్తులను, లెక్కించుటకు అలవికాని బ్రహ్మాండాలను వీక్షించాను. అయితే ఆ బ్రహాండాలన్నీ కూడా అన్యోన్య దృష్టికి (ఒకదానిచే మరొకటి) నిర్మల వ్యాకృతాకాశ రూపములుగానే ఉంటున్నాయి. అనగా ఒక బ్రహ్మాండంలోని జనులకు రెండవ బ్రహ్మాండము వాస్తవానికి లేనిదిగా శూన్య మాత్రంగా ఉంటోంది. కాబట్టి ఆ బ్రహ్మాండాలు శూన్యములు - అశూన్యములు కూడా!

చిదాకాశమున అనేక బ్రహ్మాండములు అనుక్షణం ఉత్పత్తి అవుచున్నాయి. ఇంతలోనే అనేక బ్రహ్మాండములు ప్రవృద్ధమౌతున్నాయి. ఇంకా ఎన్నో జగత్తులు నదీ ప్రవాహంలాగా కొట్టుకుపోతూ

ఉన్నాయి. ఎన్నో విద్యమానమైనములై ఉన్నాయి. మరెన్నో ఉత్పన్నములు కాబోతూ ఉన్నాయి. అక్కడి శూన్యాకాశంలో వివిధ జనులతో కూడిన జగత్తులు అసంఖ్యాకంగా కనిపించాయి. మనోరాజ్యములవంటి, చిత్ర సమూహములవంటి అనేక బ్రహ్మాండములు కనిపించాయి.

కొన్నింటికి ఆవరణములు లేవు. మరికొన్నిటికి అసంఖ్యాకములైన ఆవరణములు (ఉదాహరణకు భూతావరణ, మనో ఆవరణ చిత్తావరణ మొదలైనవి) ఉన్నాయి. కొన్ని 5 ఆవరణలు మరికొన్ని 7 ఆవరణలు కలిగి ఉన్నాయి. కొన్ని పంచీకృత + అపంచీకృత 5+5=10 ఆవరణలతో కూడి ఉన్నాయి. ఉదాహరణకు ఒక ఆవరణం కేవలం శబ్దమయం. మరొక ఆవరణం కేవలం స్పర్శమయం ఇట్లా - కొన్ని బ్రహ్మాండాలు ప్రకృతి - అహంకారము మహత్ మొదలైన 14 ఆవరణాలు కలిగి ఉన్నాయి.

ఇంకా కొన్ని (సాంఖ్యశాస్త్ర ప్రవచనానుసారం) 24 తత్త్వములు, 36 తత్త్వములు (శైవ మతానుసారం) ఆవరణములుగా కలిగి ఉన్నట్లు నాకు కనిపించాయి. కొన్ని జగత్తులు శూన్యమాత్రంగా ఉన్నాయి. మరికొన్ని జగత్తులు వివిధ ప్రాణులతో నిండి ఉన్నాయి. కొన్ని పంచ భూతమయములు. ఇంకొన్ని పంచభూతములలో ఒక్కొక్కదానితో మాత్రమే నిండి ఉన్నాయి. (ఉదాహరణకు సూర్యగోళం కేవలం అగ్నిమయం, అంగారక గ్రహం-రాతిమయం... ఇట్లా)

కొన్ని పంచభూతాలు, దిక్కులు, కాలము ...ఇట్లా సప్తమహాభూతాలతో కూడి ఉన్నాయి. కొన్ని లోకాలలో ఒకే జాతి జీవులు మాత్రమే ఉన్నారు. ఈ మానవుని జీవ దశలకు (బాల్య - యౌవన వార్ధక్యాలకు) విరుద్ధమైనట్టి దశలుగల విద్యాధరులతో నిండి కొన్ని జగత్తులున్నాయి. అక్కడి జీవుల జన్మలు వార్ధక్యంతో ప్రారంభంమై బాల్యవస్థతో ముగుస్తోంది.

కొన్ని జగత్తులు ప్రళయ సుషుప్తులనుబోలి నిర్మానుష్యమై ఉన్నాయి. కొన్ని లోకాలలో ఒక్క ప్రభువే అధిష్ఠాన దేవత అయి ఉన్నాడు. మరికొన్ని వివిధ అధిష్ఠాన దేవతల ఆరాధనతో కూడి ఉన్నవి. కొన్ని జగత్తులు వైరాగ్యమును బోధించే వేదాంత శాస్త్రములు, ఆత్మజ్ఞాన శాస్త్రపాఠములు సర్వ ప్రసిద్ధిమై ఉంటున్నాయి. కొన్ని జగత్తులలో అట్టి వేదాంత శాస్త్రం యొక్క ప్రసిద్ధతయే లేదు. వాటి పాఠము - చర్చ మొదలైనవి అగుపించటమే లేదు.

కొన్నిటిలో జీవులు మేడిపండులోని పురుగులవలె అనేక కార్య సంరంభములలో మునిగి - తేలు చున్నారు. మరికొన్నిటిలో నిత్యం నిద్రాపరవశులై ఉంటున్నారు. కొన్ని లోకములలో బ్రాహ్మణాది జాతులచే వంశపారంపర్యంగా నిర్దేశించే శాస్త్ర- ఆచార - విచారాదులు మాత్రమే అనుసరించబడుతూ కనిపించాయి. మరికొన్ని లోకములలో ఎవరికి వారే (శాస్త్రానుసారంగా కాకుండా) స్వయం నిర్ణయాభినివేశంతో వర్తిస్తున్నారు.

కొన్ని కేవలం జలం, కేవలం వాయువుచే పూర్ణమైయుండగా మరికొన్ని పంచభూతములు లేకుండా 'ప్రజ్ఞలు' మాత్రమే ప్రవర్తిస్తున్నాయి. కొన్ని నిరంతరం ఎక్కడా ఒక్కచోట ఉండకుండా ఆకాశంలో అటూ-ఇటూ సంచరిస్తున్నాయి.

కొన్ని పుడుతున్నాయి. కొన్ని ప్రవృద్ధమౌతున్నాయి. కొన్ని అనేక భోగాలతో కూడి ఉన్నాయి. కొన్నిటిలో దేవతలు మాత్రమే ఉన్నారు. కొన్ని అసురులతో నిండి ఉన్నవి. కొన్ని అల్ప బుద్ధ జీవులైన క్రిమి-కీటకములతో మాత్రమే నిండి ఉన్నవి.

అరటి పట్టలు ఒకదానిలో మరొకటి ఉంటుంది కదా! అట్లా బ్రహ్మాండంలో అనేక అణువులు, ఆ అణువులతో బ్రహ్మాండాలు, ఆ బ్రహ్మాండములలో అణువులు... ఇట్లా అంతు కనబడనంతగా ఉన్నాయి. కొన్ని బ్రహ్మాండములు ఒకే తరుణంలో ఒకేచోట ఉత్పన్నమౌతూకూడా ఒకదానితో మరొకటి ప్రక్కప్రక్కన నిదురించే సైనికుల స్వప్నముల వలె -సంబంధం లేకయే ఉన్నాయి.

ఓ రామచంద్రా! ఆ జగత్తులు (లేక బ్రహ్మాండాలు) అన్నీ కూడా వేర్వేరు క్రియలు, వేర్వేరు స్థితులు కలిగి ఉన్నప్పటికీ... ఆ వివిధ అనంతకోటి బ్రహ్మాండాలన్నీ కూడా... "చిదాకాశరూపము" అయి ఉన్నాయి.

కొన్ని పరస్పరం శాస్త్రజ్ఞానమునకు లభ్యములగుచున్నాయి. (అనగా ఒక జగత్తులోని యోగ శాస్త్రజ్ఞానులకు మరొక జగత్తు కనిపించుచున్నది.) కొన్ని ఒకే రకమైన ఆకారాలు కలిగి ఉన్నాయి.

కొన్ని బ్రహ్మాండాలు పరస్పరం పరలోకములుగాను, పరస్పరం అంతర్ధాన శక్తితో కూడిన సిద్ధ నగరములు కలిగినవిగాను ఉన్నాయి. అనగా ఒకదానిలోని కొందరు జీవులు అక్కడ మాయమై మరొక దానిలో ప్రత్యక్షం కాగలుగుచున్నారు. కొన్ని పరస్పర భిన్న దశలు కలిగి ఉంటున్నాయి. అనగా ఒక జగత్తులోని జీవులు ఒక దశ తరువాత మరొక జగత్తులో ప్రవేశం పొందుచున్నారు. కొన్ని మరికొన్నిటికి సిద్ధనగరములవలె తపోధ్యానముల ఫలితంగా పొందబడుచున్నవగుచున్నాయి. కొన్ని భిన్న భిన్న దశలు కలిగి ఉంటున్నాయి. అనగా వర్తమానంలో ఒక దశలో ఉన్న జగత్తు కొంత కాలానికి మరొక జగత్‌దశను పొందుచున్నది.

కొన్ని లోకములు ఈ మానవజాతికి అనుభవ - ప్రయత్నములకు అలభ్యములై ఉంటున్నాయి. అవి ఈ జగత్తుకు అతి సమీపంగా వచ్చినప్పటికీ మావంటి తపోశాలురచే మాత్రమే గమనించబడుచూ... మేము వర్ణించి చెప్పినా కూడా ఈ జీవుల అనుభవమునకు అందనట్లుగా, విపరీతగాథలాగా ఉంటున్నాయి.

కొన్ని చైతన్యము అను సూర్యుని యందు గల పరమాణువులవలె ఉంటున్నాయి. కొన్ని బ్రహ్మాండములలో జీవులు మోక్షస్థితిని అనునిత్యంగా అనుభవిస్తూ ఉండటం చేత ఆ బ్రహ్మాండాలు 'మోక్షము' అనే పరదేవతకు కుండలాలవలె ఉన్నాయి. అవి అటు అవ్యాకృతాకాశమునందు ఇటు భూతాకాశమునందు మేలిరతనములవలె మెరుస్తున్నాయి.

కొన్ని మామిడి వృక్షం యొక్క ఆకుల వలె పదే పదే ఉత్పత్తి, నాశనం, పునరుత్పత్తి పొందు చున్నాయి. మరికొన్ని... వాటిని బోలిన రూపంతో మరొక చోట జనిస్తున్నాయి. కొన్ని బ్రహ్మాండాలు పరస్పరం సదృశ్యంగా ఉన్నాయి. ఇంకొన్ని ఒకదాని దృష్టిలో మరొకటి (అదృశ్యంగా) లేనే లేవు.

కొన్ని కొంతకాలం ఒక రూపంతో కనబడి ఆ తరువాత మరొక రూపం సంతరించు కొంటున్నాయి. కొన్ని అల్పకాలం ఉంటున్నాయి. మరికొన్ని దీర్ఘకాలం ఉంటున్నాయి. కొన్ని దేశ

– కాల – వస్తు స్వభావనియతిని కలిగి ఉంటున్నాయి. మరికొన్నిటిలో 'సూర్యుడు' లేకపోవటం చేత కాలజ్ఞాన రహితమై ఉంటున్నాయి. కొన్ని లోకములు ఎవరి ప్రయత్నమూ లేకుండానే స్వయంగా జనించి వృద్ధి చెందుతున్నాయి. మరికొన్ని ఎవరో యోగుల సంకల్ప శక్తిచే జనిస్తున్నాయి. కొన్ని స్థిరంగాను, కొన్ని అస్థిరంగాను ఉంటున్నాయి.

❖

ఓ రామచంద్రా! ఈ బ్రహ్మాండాలన్నీ కూడా 'అజ్ఞానం' అనే దోషముచే అనాది కాలం నుండి సాక్షి చైతన్యము నందు ఆధ్యస్తములై ఉంటున్నాయి, అట్లా ఉంటున్నప్పటికీ కూడా... రూఢి పడి ఉన్న ఈ బ్రహ్మాండములన్నీ కూడా వాస్తవానికి శూన్యరూపములేనయ్యా! ఈ అనేక సముద్ర – పృథివీ – సూర్య – ఆకాశ – మేరు పర్వతాదులతో కూడిన గణింపశక్యంకాని బ్రహ్మాండాలన్నీ 'చిదాకాశం' అనే దర్పణంలో "త్రిగుణాలు" అనే దోషం చేత స్వప్న సమూహాలవలె భాసిస్తున్నాయి.

అవి అనుభవమునకు లభిస్తున్నప్పటికీ, వాస్తవానికి లేవు! నిజరూపంచే ఇవన్నీ కూడా చిదాకాశ రూపమే ! అనగా, అవి చిదాకాశం వలె సర్వదా ఉన్నాయి. అవన్నీ అనుభవానికి సత్యం వలె అనిపించవచ్చు గాక! మృగతృష్ణలో జలతరంగాలు కనిపిస్తున్నప్పటికీ అక్కడ జలతరంగాలు లేవు కదా!

❖

అవన్నీ కూడా "చైతన్యం" యొక్క సంకల్పజనితమైన ఆకాశమునందు సంకల్ప స్వభావముచే అగుపిస్తున్నాయి. వాసనచే ప్రేరితమై స్వచేష్టచే ఇటు అటు పరిభ్రమిస్తున్నాయి. చైతన్యం అనే బాలుడు 'సృష్టి' అనే క్రీడచే ఉపయుక్తుడై ఉండటం చేతనే ఈ జగత్తులన్నీ సంకల్పనగరమున ఉంటున్నాయి. తడిమట్టిచే తయారుచేసిన బొమ్మలు సూర్యకాంతి పడటంచే గట్టి పడతాయి చూచావా? అట్లా ఈ జగత్తులన్నీ అభిమానపూర్వకమగు బుద్ధి యొక్క బలముచే దృఢపడుచున్నాయి.

రాగయుక్తము, కర్మఫలదాయకమగు "నియతి" ఈ బ్రహ్మాండాలన్నిటినీ శాఖోపశాఖలుగా విస్తరింపజేస్తోంది.

**శ్రీరాముడు :** మహాత్మా!ఈ సృష్టికి అసలు కర్త ఎవరు? "సృష్టికర్త" అను శబ్దము వేద వాఙ్మయమునందు ప్రసిద్ధమై ఉండటంచేత ఈ ప్రశ్న అడుగుచున్నాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** శ్రుతులు రెండు రకములైన అభిప్రాయం ప్రకటించాయి.

**1. "పరమాత్మయే భూమి- స్వర్గము మొదలైన లోకాలన్నీ నిర్మించారు" -** ఈ అర్థమును ప్రతిపాదించే శ్రుతుల విభాగములను అనుసరించి సమస్త బ్రహ్మాండములకు కర్త చిదాకాశ రూపమగు పరబ్రహ్మమే అయి ఉన్నది. "కర్తృత్వము ఆపాదించుకొనుట చేతనే పరమాత్మచే సృష్టి భావనావ్యవహారంగా వ్యక్తీకరించబడుతోంది" అని శ్రుతులు గానం చేస్తున్నాయి.

**2. బ్రహ్మము శుద్ధమైనది. కర్తృత్వ దోషం లేనిది -** ఇట్లా వచించే శ్రుతుల విభాగములను అనుసరించి సమస్త బ్రహ్మాండములకు 'కర్త' అంటూ ఎవరూ లేరు. అనగా అవి కర్తృత్వరహితములై చిదాకాశమున స్వయంసిద్ధమైన రూపములో కలిగియున్నవి అగుచున్నాయి.

ఈ జగత్తులన్నీ పరమార్థమున బ్రహ్మస్వరూపములే అయి ఉన్నాయి. అయినా కూడా అవి అట్టి బ్రహ్మస్వరూపమునకు వేరుగా ఉన్నట్లు – బంగారు ఆభరణంలో బంగారము, ఆభరణము లాగా – ఉదయించిన వగుచున్నాయి. వాస్తవానికి చూస్తే జగత్తుగా చెప్పబడేది అలబ్ధమే (ఇది అని ఏదీ లభించనిదే అయినా లభించినట్లుగా) ఉంటున్నది! సదా ఈ జగత్తులు 'లేనివే' అయినప్పటికీ ఉన్నట్లుగా ఒప్పుచున్నాయి.

ఇక్కడి జీవులు, 14 లోకములు, ఒక్కొక్క లోకంలో అనేక జీవజాతులు... ఇవన్నీ మరల మరల (అవే) ఉత్పన్నమౌతున్నాయి. ఒక్కొక్కప్పుడు వేరైన జగత్తులుగా ఉద్భవిస్తున్నాయి.

ఈ జగత్తు కాస్త పరిశీలించి చూస్తే... ఇందలి నరక – భూస్వర్గ – పాతాళాది లోకాలు, ఇందలి బంధు – మిత్ర సమాగమాలు, ఇందలి మహాకార్య సమారంభాలు... ఇవన్నీ కూడా పరమార్థమున శూన్యరూపములే అయి ఉన్నాయి.

ఈ జగత్తులన్నీ క్షీరసాగరంలోని జలంలాగా స్నేహము, రాగము మొదలైనవి కలిగి ఉండి కూడా సముద్రజలతరంగాలలాగా క్షణభంగురములు అయి ఉన్నాయి. జగత్తుగా ఏ రూపమై కనిపిస్తోందో ఆ రూపం పరివర్తనం పొందబోతూనే ఉన్నది కదా! అందుచేతనే ఇవి "ఆత్మ అను సూర్యుని యొక్క తేజమునకు సంబంధించిన 'ఆభాస' మాత్రమే " అని అనతగి ఉన్నవి.

వాయువు యొక్క చలనముచే చెట్లు కదులుచున్నాయి. కనుక చెట్లు కదలటానికి వాయుచలనం కారణం అని మనం అనవచ్చు. మరి వాయువు ఏ కారణం చేత కదులుతోంది? వాయువు నందు చలనము స్వయంగా ఉత్పన్నమగుచున్నట్లే ఈ జగత్తులు కూడా స్వయముగానే ఉత్పన్నమౌతున్నాయి. ఈ జగత్తులు 'వృక్షములు' అని అనుకుంటే, అట్టి జగత్ వృక్షములకు బుద్ధి, అహంకారము, చిత్తము మొదలైనవి ఆకుల వంటివి. అట్టి ఈ ద్రష్టకు దర్శనమగుతున్న జగత్తు స్వప్నంలో కనిపించే ఆయా రూపాలవలె అసత్తే! పురాణ – వేద – శాస్త్రాదులతో ప్రసిద్ధములైయున్న యజ్ఞ– దాన – జప – తపాదుల కల్పనారూప స్వప్నంలో ఈ జగత్తులు మహానిద్రను అనుభవిస్తు న్నాయి. అట్టి ఈ జగత్తులన్నీ కూడా 'ఆత్మరూపజ్ఞానము' అనే మెలకువ వచ్చినపుడు అవన్నీ స్వప్నాంతర – స్వప్నములోని, స్వప్నాంతర్గత స్వప్నంలోని జనుల గతిలాగా శవరూపమును దాల్చు చున్నాయి. (అనగా ఈ జగత్తులన్నీ 'లేనివే' అగుచున్నాయి). బ్రహ్మమునందు 'మాయమోహిత చైతన్యము' అను చమత్కార పురుషునిచే ఈ జగత్తులన్నీ నిర్మించబడినవై... సూర్యుని వెలుగులో కనిపించే నగరములోని అనేక గృహముల లాగా ఆత్మ వెలుగులోనే ప్రకాశిస్తున్నాయి.

ఓ రామచంద్రా ! ఆ విధంగా ఆ సమాధి కాలంలో నాచే అవధరించబడిన అనంతమగు చిదాకాశంలో.... కారణము లేకయే జనిస్తూ, కారణము లేకయే నశిస్తూ, తిమిర దోషము (సంసార దోషము) గల కనులకు కనిపిస్తూ... వాస్తవానికి భ్రాంతి మాత్రమే అయి ఉంటున్న అనేక జగత్తులను చూచాను.

❖❖❖

# 5. బ్రహ్మాండ బుద్బుదముల పరిభ్రమణం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాఘవా! ఆ విధంగా నేను అవిచ్ఛిన్నమైన 'చిదాకాశరూపత్వం' అవధరించిన వాడనై అట్టి చిదాకాశములో వివిధములైన బ్రహ్మాండాలను గమనిస్తునే... మరొక వైపు "ఆ వినబడే శబ్దానికి కారణం ఏమిటి?" అని నలువైపుల వెతుకుచూ చాలాసేపు గడిపాను. అట్లా వెతుకుచూ ఉండగా నాకు ఆ శబ్దం క్రమంగా మృదుమధురమైన వీణానాదంగా వినబడసాగింది. క్రమక్రమంగా అది మరి కొంత స్పష్టపడుతూ 'ఆర్య' అనే ఛందస్సు రూపం సంతరించుకొన్నది. అప్పుడు ఆ శబ్దం ఏర్పడుచున్న ప్రదేశం మీద నా యోగదృష్టి పడింది. వెంటనే అక్కడ ఒకానొకచోట నిలబడి ఉన్న ఒక స్త్రీని చూచాను. ఆమె తన బంగారపు ప్రకాశంతో ఆకాశాన్ని ప్రకాశితంగా చేస్తోంది. ఆమె వస్త్రములు చిరుగాలికి కదులుచున్నాయి. ఆమె ధరించిన సుందరమైన ఆభరణాలు, చంచలమైన దీర్ఘకేశాలు, అతి రమణీయమైన వర్చస్సు, సాక్షాత్తూ లక్ష్మీదేవిని గుర్తుచేస్తున్నాయి. హాస్యయుక్తం, యౌవన శోభితం అగు ఆమె ముఖం వన దేవతవలె శోభాయమానంగా ఉన్నది. ఆమెను దర్శించిన నేను దృష్టిని కించత్ మరలించే ప్రయత్నంలో ఉండగా ఆమె నా సమీపాన్నే ఉండి 'ఆర్య' (ఛందస్సు) ను గానం చేస్తూ నా వైపే చూస్తూ పెదవులు విప్పి చిరునగవుతో పలుకసాగింది.

**ఆ స్త్రీ :** దుష్టులచే సేవించబడే రాగ - ద్వేష- కామ-క్రోధాది దోషములు ఈషణ్మాత్రంగా కూడా లేనట్టి ఓ మునీంద్రా! 'సంసారం' అనే నదిలో మునుగుచున్న మనుజులకు మీరు ఒక ఆలంబనము వంటివారు. మిమ్మల్ని సర్వశ్రేష్ఠులుగా గుర్తించిన నేను మీకు, ఇదే నమస్కరిస్తున్నాను!

❖

శ్రీ రామచంద్రా! నేను ఆమె పలికిన శబ్దములు విన్నాను. ఆమె ముఖం వైపు చూచాను. "ఆఁ! ఈమె ఒక స్త్రీ కదా! ఈమెతో నాకు పనేమున్నదిలే?" అని తలచాను. ఎందుకోగాని, అప్పుడు అత్యంత ఉదాసీనత వహించాను. ఇక అక్కడి నుండి నా దృష్టిని మరల్చసాగాను. ఆ తరువాత అనేక జగత్ సమూహములను చూచాను. "ఆహాఁ! ఈ మాయ ఎంతటి విస్తారమైనది!' అని ఆశ్చర్యపడసాగాను. అట్లా జగత్సమూహములను గమనిస్తూ, వాటిని కూడా ఉపేక్షించినవాడనై ఆకాశమున సంచరించటానికి ఉద్యుక్తుడనయ్యాను. 'మాయా జనితమైన చింతననంతా వదలి, చిదాకాశమున ఉన్న జగన్మాయ యొక్క ఉత్పత్తి స్థానమేమిటో గమనించెదను గాక' అని అనుకొని చిదాకాశ రూపమును కొనసాగించ దలిచాను. అప్పుడు నాకు కనిపించిన జగత్ సమూహములన్నీ స్వప్నములో వలె, ఊహలోలాగా, కథాజగత్తులవలె శూన్యరూపంగానే అనిపించాయి. అవన్నీ శూన్యరూపములే కాబట్టి పరమార్థమున జగత్తులనేవి ఎచ్చట ఏవీ లేవు, కాంచబడటమూ లేదు, వినటమూ లేదు. అంతే కాదు అక్కడ నాకు కనిపించటం జరిగిన జగత్తులలోని ఒకదానిలోని దేవతాది జీవులకు మరొక జగత్తు లేకయే ఉన్నది.

**శ్రీరాముడు :** అదేమిటి స్వామీ! ఒక జగత్తులోని వారికి మరొక జగత్తు 'లేనిది' గా అయి ఉండటం ఎట్లా సాధ్యం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒక గదిలో ఇద్దరు మనుజులు నిదురిస్తున్నారనుకో! ఒకడు తన స్వప్నంలో చూస్తున్న యుద్ధ విన్యాసాలు, గజబల ఘీంకారాలు ఆ ప్రక్కనే నిదురిస్తున్న రెండవ మనుజునకు వినబడవు, కనబడవు కదా! అవన్నీ రెండవవానికి అవిషయములే కదా! ఒకనికి తన ప్రియురాలితో ఏర్పడే మధురానుభూతి – ప్రేమావేశము ఆతని సోదరులకో, మిత్రులకో అనిపించదుకదా! అట్లాగే అనేక బ్రహ్మాండములలోని ఒక దానిలో జరిగే కల్పాంతాది విన్యాసాలు మరొక బ్రహ్మాండములోని జనులకు తెలియరావటమే లేదనునది నేను గమనించాను. అనగా అవి పరస్పరం ఒకదానిలోని జీవులకు మరొకటి శూన్యరూపంగా ఉన్నాయి. ఆ విధంగా కోట్ల కొలది బ్రహ్మలు, లక్షల కొలదీ విష్ణువులు, అనేక కల్పసమూహములు నాకు–ఈ గోడ మనందరికీ కనిపిస్తున్నట్లు–కనిపించాయి. ఆ పలు విధమైన జగత్తులలో కొంతవిభాగం సూర్య రహితమై, రాత్రి–పగలు తేడా లేనిదై ఉన్నది. అక్కడ కల్ప–యుగ–సంవత్సరాది కాలము కూడా లేదు. అయితే అట్టి చిద్వస్తు విభాగమునందు ఊహామాత్రం చేతనే సమస్తము యొక్క క్షయము–ఉత్పత్తి కూడా సంభవించటం నేను గాంచాను.

**శ్రీరాముడు :** స్వామీ! మీరు చెప్పే చిదాకాశమునందలి అట్టి విభాగము బహు చిత్రంగా ఉన్నదే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను.

> **చితి సర్వం చితః సర్వం చిత్ సర్వం సర్వతశ్చ చిత్ ।**
> **చిత్సత్ సర్వాత్మికేత్యేతత్ దృష్టం తత్రమయాఖిలమ్ ॥**

ఓ రామచంద్రా! సమస్తం చైతన్యముననే కలదు. సమస్తం చైతన్యం నుండే కలుగుతోంది. చైతన్యమే సమస్తము అయి ఉన్నది కూడా! అంతటా చైతన్యమే వ్యాపించి ఉన్నది సుమా! ఇన్ని మాటలెందుకు? “ఏ చైతన్యమైతే ఉన్నదో, అదియే సర్వాత్మకమై ఉన్నది” అనునది నేనచ్చట నా యోగదృష్టి సహాయముతో సుస్పష్టంగా గమనించాను. అంతేకాదయ్యా! “ఇది కుండ–అది వస్త్రము–అదేమో మానవుడు–ఇక ఇది జంతువు” అని దేనినైతే నీవు అంటున్నావో ఆ విధంగా చైతన్యమే నామ–రూపముల దృష్ట్యా చెప్పబడుచున్నది. ఈ విధంగా చైతన్యం కొంచెంగా “నామరూపాత్మకంగా అవటం” అనునదే పదార్థముల యొక్క ఉత్పత్తి – అని నేను గ్రహించాను. ఎప్పుడైతే ఆ చైతన్యము ఆకాశం కంటే కూడా అత్యంత శూన్యమైనట్టి రూపంగా చెప్పబడుతోందో (లేక, దర్శించబడుతోందో) నామరూపరాహిత్యత చేత ఆ దశయే పదార్థముల క్షయముగా చెప్పుకోవచ్చు. చిదాకాశరూపమగు ఆ శూన్యమాత్రమైన ఆకాశమే “వాయువు” మొదలైన ఆయా క్రమముల వలన ‘జగత్తు’ అని చెప్పబడుతోంది. అట్టి జగత్తులో ‘నేను–నీవు’ ఆదిగా నానాత్వమంతా ద్యోతకమౌతోంది. అట్టి నానాత్వంగా అనుభవమగుచున్న ఈ జగత్తు మహావాక్య మనన ప్రభావం చేత (“అహం బ్రహ్మాఽస్మి–తత్త్వమసి–నేహ నానాఽస్తి కించన–జీవో బ్రహ్మేతి నాపరః” మొదలైన వేద ప్రతిపాదిత మహావాక్యాల అర్థమును అంతర్గతపరచుకొను చుండగా) చిదాకాశరూపంగా పరిణతి చెందుతోంది. అనగా “అంతా చిదాకాశం మాత్రమే” అను మహానుభావంలో అనేకత్వమంతా ఒదిగి, రహితమై పోతోంది. అదియే ప్రపంచం యొక్క క్షయం.

ఓ రామచంద్రా! "ఆకాశవృక్షం యొక్క వ్రేలాడే పుష్పగుచ్ఛాలు" అనునది ఎంతగా ఊహా జనితము, మరియు భ్రమాత్మకమో... ఈ దృశ్య దృష్టి కూడా అంతగానూ కేవలం భ్రాంతిమాత్రమే అయివున్నది. సకల దృష్టులూ ఆపాదిత మాత్రం అవగా... దీని కావల గల 'దృక్' స్వరూప చిదాకాశమే నిరతిశయ సుఖ రూపమని సర్వత్రా గ్రహించియున్న నేను సమాధియందు అంతిమ సాక్షాత్కార వృత్తి రూపమైన చిదాకాశముతోటి ఏకరూపం పొందాను. నేనే ఆ చిదాకాశమైనాను. సర్వవ్యాపిని, అనంతరూపుడను అయ్యాను. నిస్సంకల్పపూర్వకంగా అక్కడి సమస్త బ్రహ్మాండ సమూహములను అస్మత్ స్వరూపంగా అనుభవం పొందాను. అనగా, ఆ బ్రహ్మాండములు, తదంతర్గతమైన దశదిశలు, అందలి దేశ-కాల-ద్రవ్య-క్రియా కల్పనలు 'నేనే' అయ్యాను. సమస్తమూ బ్రహ్మాకారరూపమేనను అనుభవం పొందసాగాను. అంతేకాదు యుగభేదములతో కూడి ప్రకాశించే అక్కడి అనేక జగములతో నావంటి రూపాలే అయినట్టి వసిష్ఠ నామధేయులైన ఉత్తములగు అనేకమంది మునీశ్వరులు కూడా నాకు కనిపించారు. శ్రీ రామావతార సహితంగా 72 త్రేతాయుగాలు నేనక్కడ చూచాను. అయితే భేద వాసన యొక్క ఉద్బోధము చేతనే ఆ సృష్టి దశలన్నీ నాకు ఆ విధంగా కనిపించాయి సుమా! ఇంతలో బ్రహ్మజ్ఞాన బలంచేత అదంతా కూడా అతి నిర్మలము-ఏకము-సర్వ వ్యాపకము అయిన చిదాకాశంగానే కూడా దర్శించగలిగాను.

నామ రూపాత్మక దృష్టికి అనేక మట్టి బొమ్మలు కనిపిస్తున్నప్పటికీ మట్టియందు అనేక రూపములు గాని, ఒక్క రూపముగాని లేవు కదా ! అట్లాగే నామరూపాత్మకం దృష్ట్యా ఈ "జగత్తు" అనేది బ్రహ్మమునందు లేదు. అయితే అన్ని మట్టిబొమ్మలలోని ఆయా నామ రూపాలన్నీ మట్టియే కదా! అధిష్ఠాన చైతన్యం దృష్ట్యా ఈ జగత్తు బ్రహ్మమే.

నామరూపాత్మకం దృష్ట్యా ఈ జగత్తు భ్రమ మాత్రమే! అధిష్ఠాన చైతన్యం దృష్ట్యా ఈ జగత్తంతా జన్మరహితం (అజం), ఆద్యంతాలు లేనిది (అనాది), అనంతమైనది అయిన బ్రహ్మమే!

ఓ రామచంద్రా! ఏ బ్రహ్మము సర్వదా ఒక శిల వలె మౌనరూపమై, నామరూపవర్జితమై, జ్యోతి స్వరూపమై ఉన్నదో... ఆ బ్రహ్మమే ఈ రీతిగా జగద్రూపమున ఉన్నది అని గ్రహించు. ఒకడు తాను నిరాకార స్వరూపుడే అయి ఉండి కూడా, తన స్వక్రీయ ఊహానిర్మిత స్వప్నమున "తన రూపాలే" అనతగ్గ అనేక ఆకార వికారాలన్నీ పొందుచున్నాడు చూచావా? ఆ విధంగానే, నిరాకార మగు చిదాకాశమున వాస్తవానికి "చేత్యం (తెలియబడేది లేక, దృశ్యం)" అనేది లేకపోయినప్పటికీ, అద్దాని కల్పనచే (స్వప్నాంతర్గత దృశ్యం వలె) నిరాకారమగు చైతన్యమే జగద్రూప దృశ్యంగా భాసించుచున్నది. ఒక దీపంలోంచి ప్రకాశం బయల్వెడలి ఆయా వస్తువులను ప్రకాశింపజేస్తోంది. అయితే జ్యోతి ప్రకాశము జ్యోతి కంటే వేఱుకాదు కదా ! అదే రీతిగా ప్రకాశమాత్ర రూపమగు చైతన్యం తన కంటే వేరుకాని రూపాన్ని జగత్తుల రూపంగా రచించుచున్నది. అంతర్గత జ్యోతి తత్త్వమగు సూర్యుడు, సూర్యకిరణం ఒక్కటే అయినట్లు, చైతన్యం-చైతన్యస్ఫురణ మాత్రమగు ఈ నామ రూప జగత్తు ఒక్కటే ! "జగత్తు అనేది రచించబడటం లేదు. చైతన్యమే జగత్తుగా (భ్రమచే) అనిపిస్తోంది"... అని కూడా చెప్పబడుతోంది.

❖

ఈ విధంగా బ్రహ్మము యొక్క వివర్త రూపములే అనతగిన అక్కడి అనేక జగత్తులందు ఒక్కొక్కటి ఒక్కొక్క విధంగా కనిపించసాగాయి.

ఒక జగత్తులో చంద్రబింబము ఉష్ణంగాను, సూర్యబింబము శీతలంగాను అనుభూత మౌతున్నాయి. అక్కడ నాకు తారసపడిన మరొక జగత్తులో జీవులు గుడ్లగూబల వలె చీకటిలో అన్నీ చూడగలుగుచున్నారు. వెలుతురులో ఏమీ చూడలేకపోతున్నారు. అట్లాగే అక్కడి ఇంకొక జగత్తులో జీవులు తమ శుభకర్మల ప్రభావం చేత వినాశనం పొందుచున్నారు. అశుభ కర్మల ద్వారా స్వర్గము మొదలైన ఉత్తమ లోకములు పొందుచున్నారు. కొన్నిచోట్ల విషమును భక్షించుటచే సుఖము, దీర్ఘ జీవనము పొందుచున్నారు. అమృత భక్షణ చేత మరణం పొందుచున్నారు.

ఆ విధంగా మనస్సు యొక్క కల్పన చేతనే అదంతా అట్లు పరిఢవిల్లుతోంది సుమా!

**శ్రీరాముడు :** స్వామీ! అదేమిటీ? ఆయా జగత్తులలో సరస్పర విరుద్ధంగా విషము జీవనంగాను, అమృతము మరణంగాను ఎందుకు ప్రయోజనప్రదాతలుగా అగుచున్నాయి?

**శ్రీ వసిష్ఠమహర్షి :** ఓ రామచంద్రా! ఈ మనస్సే అంతయు అగుచున్నది కదా! ఒకానొకటి సత్తు కావచ్చు, లేదా... అసత్తు కావచ్చు. ఏదైనా వస్తువు చిరకాలంగా "ఇది నాకు హితము" అని అభ్యసిస్తే అది అట్లే అనుభవమౌతుంది. అట్లాగే "అది నాకు అహితము" అని అభ్యసిస్తేనో, కర్మవశంగా భోగకాలంలో శీఘ్రంగా ఆ రూపముననే స్పష్టంగా ప్రకటనమగుచున్నది. మనస్సును బట్టే దృశ్యం ప్రాప్తిస్తోంది. మనస్సు లేనిచోట దృశ్యమే లేదు.

ఇంకా అక్కడ నాకు కనిపించిన వివిధ జగత్తుల యొక్క కొన్ని విశేషాలు చెబుతాను. విను. కొన్ని జగత్తులలో అనేక పుష్ప-ఫలభరిత వృక్షములతో కూడిన వనసమూహాలు ఆకాశంలో అటూ, ఇటూ గాలి పటాల లాగా ఎగురుచున్నాయి. ఇంకొన్ని జగత్తులలో విరుద్ధ పదార్థ ధర్మాలు ప్రవర్తిస్తున్నాయి. ఉదాహరణకు కొన్ని జగత్తులలో తైలయంత్రములచే ఇసుక పిండబడగా, ఆ ఇసుకలోంచి నూనె (తైలము) ఉత్పత్తి అవుతోంది.

కొన్నిట్లో కొండరాళ్ళ లోంచి కమలములు ఉద్భవించి వికసిస్తున్నాయి. కొన్నిచోట్ల శిలతో చెక్కబడిన విగ్రహములు చలనము పొంది దేవతా స్త్రీలతో కలసి నృత్యం చేస్తున్నాయి. హావభావా లతో కూడిన సంభాషణ నిర్వర్తిస్తున్నాయి.

ఇంకొక జగత్తులో ఎందరో జీవులు ఆకాశంలో పరిగెత్తే మేఘములను రెండు చేతులతోను పట్టుకొని వస్త్రములుగా మలచుకొని ధరిస్తున్నారు. కొన్నిచోట్ల ఒకే వృక్షమునకు ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క రకమైన ఫలములు ఫలిస్తున్నాయి. ఒకచోట ఒకే జాతికి చెందిన ప్రాణులతో అవయవాలు ఒక్కొక్క ప్రాణికి ఒక్కొక్క రకంగా అమర్చబడి ఉంటోంది. వాటి దేహముల రచన అనిమియతమై ఉంటోంది.

కొన్ని జగత్తులలో ఎందరో జీవులు తమ శిరస్సులతో నడుస్తున్నారు. కొన్ని జగత్తులలో అధోలోకములలోని జీవులు వేద - శాస్త్రవిహీనంగా, ఇచ్ఛ వచ్చినట్లు చరిస్తున్నారు.

కొన్నిచోట్ల జీవులకు "కామము" అనేది ఉండక, ఇక జీవులు స్త్రీకి జనించక - కేవలం గాలిలోనో, ధూళిలోనో ఉత్పన్నం అగుచున్నారు. కొన్ని లోకములలో జీవులకు దయ-దాక్షిణ్యం అంటే ఏమిటో తెలియక జీవిస్తున్నారు. మరికొన్ని లోకములలో వాయుభక్షణ చేతనే జీవులు జీవిస్తున్నారు. మరికొన్ని లోకములలో జీవులకు ధనవ్యవహారమే లేదు.

మరికొన్ని జగత్తులలో 'వ్యష్టి అహమ్' అనే భేదమే లేకుండానే ఉంటోంది. అనగా సమష్టి విరాడహమ్ భావన చేతనే సర్వదేహముల వ్యవహారం జరిగిపోతోంది. అనగా ఒక జీవుడు "ఈ చేతులు నావి. ఈ గోళ్ళు నావి"... అని అనుకొనే విధంగానే ఆ బ్రహ్మాండములలోని జీవులు తక్కిన జీవులందరినీ తమ దేహములోని విభాగమునే వీక్షిస్తున్నారు. ఏకాత్మ భావనచే తదితర సర్వజీవులను తమ వలెనే గాంచుచున్నారు.

కొన్ని జగత్తుల నిండా ఒకేవిధమైన ప్రాణులున్నారు. మరికొన్ని జగత్తులలో వివిధ రకములైన ప్రాణులు కనిపిస్తున్నారు.

ఒకానొకచోట సృష్టి గూర్చిన భేదవాసనయే లేకపోవటం చేత అదంతా కూడా అనంతంగాను, అపారంగాను, శూన్యంగాను అనుభూతమౌతోంది. ఇంతలోనే మరల సృష్టివాసనారూపమగు ఏదో ప్రయత్నము ఎక్కడినుండో బయల్వెడలి అక్కడ జగత్తులు ప్రస్ఫుటమౌతున్నాయి. మరికొంత సేపటికి అవి మరల శూన్యరూపత్వం సంతరించుకుంటున్నాయి.

ఓ రామచంద్రా! ఏది ఏమైతేనేం? "నిర్విషయ బ్రహ్మభావన దృష్టి" కి మాత్రం ఆ లోకాలన్నీ అత్యంత మిథ్యా రూపాలుగానే ఒప్పుచున్నాయి. మట్టిబొమ్మలలోంచి మట్టిని వేరుచేసి చూస్తే ఏనుగు-గుఱ్ఱం మొదలైన ఆకారాలు శూన్యమే కదా! ఆ జగత్తులన్నిటిలో గల ప్రాణుల నుండి చైతన్యమును వేఱుచేసి చూస్తే అవన్నీ - అదంతా శూన్యంకాక మరింకేమిటి?

ఇంకా ఆ జగత్తుల విశేషాలు విను. కొన్ని జగత్తులలో జ్యోతిశ్చక్రము లేకపోవటం చేత వాటిలో 'కాల కల్పన' అనేదే లేదు. మరికొన్నిటిలో జీవులు మూగ అయి, సంకేత మాత్రం చేత మాత్రమే సంభాషించుకుంటున్నాయి. కొన్ని జగత్తులలో జీవులకు నేత్రేంద్రియం లేకపోవటం చేత వాటి పట్ల సూర్య ప్రకాశం మొదలైనవి వ్యర్థమే అగుచున్నాయి. వీటికి పరస్పరం కనులలో చూచు కోవటం సాధ్యపడకపోయినా తదితర ఇంద్రియాల ద్వారా పరస్పరమైన ప్రవర్తనను నిర్వర్తించు కుంటున్నాయి. ఇంకొన్ని జగత్తులలో జీవులకు ఘ్రాణేంద్రియంగాని, తజ్జనితమైన జ్ఞానం గాని లేక అక్కడ సుగంధ-దుర్గంధములు వ్యర్థమే అగుచున్నాయి. కొన్నిచోట్ల జీవులంతా మూగవారు - చెవిటివారు అవటం చేత అక్కడ శబ్దము వ్యర్థత్వం చెందుతోంది. ఇంకొన్ని జగత్తులలో స్పర్శజ్ఞానం లేక జీవులంతా శిల వలె ఉంటున్నారు.

కొన్ని జగత్తులలో మనస్సుతోనే ఒకరితో మరొకరు ప్రవర్తిస్తున్నారు. వారు వ్యవహారయుక్తులు అయినప్పటికీ ఇంద్రియాలకు అగ్రాహ్యులై పిశాచాల వలె అనువర్తిస్తున్నారు. కొన్ని లోకాలు అంతటా పృథివీమయమే గాని కొంచెం జలబిందువు కూడా లేదు. మరికొన్ని జలమయమే గాని

"భూమి" అనేదే లేదు. ఇంకొన్ని అగ్నిమయం. మరికొన్ని వాయుమయం. కొన్నేమో సర్వకార్య సమర్థములైన సర్వ వస్తువులతో కూడి ఉన్నాయి. ఆహా ! ఏం ఆశ్చర్యం ! చిదాకాశమున చిదాకాశ రూపములే అయినట్టి అనేక చిత్ర విచిత్ర జగత్తులు అక్కడ భాసిస్తున్నాయి.

రాయిలో కప్ప జీవిస్తున్నట్లు, భూమిలో కీటకములు జీవిస్తున్నట్లు కొన్ని లోకములలో జీవులు ఆలోచన-జ్ఞానం-విచక్షణ లేకుండా జీవిస్తున్నారు. అగ్నిమయజగత్తులలో అగ్నిరూపులగు జీవులు జీవిస్తున్నారు. వాయుపూరితములగు లోకములలో వాయురూపులగు జీవులు వాయు కెరటముల వలె స్ఫురిస్తూ మనుగడ సాగిస్తున్నారు. అట్లాగే ఆకాశమయములగు లోకములలో ఆకాశమాత్ర దేహధారులగు జీవులు పరస్పర దర్శనాది ఏవేవో చిత్ర - విచిత్ర ఊహా వ్యవహారాలతో జీవనము కొనసాగిస్తున్నారు.

ఈ విధంగా సర్వజ్ఞుడను, కేవల సాక్షినియగు నాకు అక్కడ అనేక బ్రహ్మాండాలు కనిపించాయి. అవి చిదాకాశమునందు కల్పన చేయబడి దిక్కులలో అటూ-ఇటూ పరిభ్రమణం చేస్తున్నాయి. పైకి ఎగురుచున్నాయి. క్రింద పడుచున్నాయి. చైతన్య మహాసాగరమున చంచల బుద్బుదముల వలె (కదిలే నీటి బుడగల వలె) అవి చిత్ర-విచిత్ర విశేషముతో పరిభ్రమణం చేస్తున్నాయి.

❖❖❖

# 6. బ్రహ్మమును ఎఱిగామా... జగత్తులు లేవు!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జలంలో జలతరంగ ధారలు కనిపిస్తున్నాయి. జలం యొక్క దృష్టి లేనివారికి ఒక్కొక్క తరంగ ధార ఒక్కొక్క రీతిగా అనిపిస్తాయి. అట్లాగే చిత్స్వరూపమును గూర్చిన అజ్ఞానముచే చిదాకాశమున ప్రాణరూపోపాధితో కూడిన పరిచ్ఛిన్నములగు చైతన్య రూప జీవులు స్ఫురిస్తున్నారు. ఆ పరిచ్ఛిన్నచైతన్యరూపములే ఉత్తరోత్తరా అనేక సంకల్ప వికల్పములతో కూడినవై కనిపిస్తున్నాయి. అట్లు అనేకత్వపు భ్రాంతి ప్రవృద్ధమగుచూ అదియే మనస్సుగా రూపుదిద్దుకుంటోంది. వాస్తవానికి చిదాకాశ రూపాలే అయిన ఆ మనస్సులే తమయందు కల్పించు కొన్న జగద్వాసనలచే స్వయంగా అనంత జగదాకారములుగా పరిణతి పొందుచున్నాయి సుమా!

**శ్రీరాముడు :** స్వామీ ! ఈ బ్రహ్మాండములన్నీ సమష్టితత్త్వమైనట్టి హిరణ్యగర్భుని స్వప్నమువంటి సంకల్పముచే జనించినవే కదా !

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును.

**శ్రీరాముడు :** అట్టి మహాకల్పము క్షయం అయినప్పుడు ఆ హిరణ్యగర్భుడు, ఆతనిచే ఉత్పన్నమైన సమస్త ప్రాణి సమూహం కూడా ముక్తి పొందుచున్నది కదా! మరల సృష్టిని గురించిన "జ్ఞాపకం" ఎవరికి? మరల సృష్టి ప్రారంభం ఎవరిచేత ఎందుకు నిర్వర్తించబడుతోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మహాకల్పాంతమునందు పంచభూతములగు ఈ పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, వాటియొక్క అంతర్గతమైనట్టి సమస్తమైన ప్రాణికోట్లు ముక్తిని

చెందుతాయి. అయితే ఆ తదనంతరం ఈ జగత్తు ఎట్లా అనుభూతం అవటం జరుగుతుందో చెబుతాను... విను–

సమస్తము నశించినప్పటికీ వాక్కునకు అవిషయము అయిన సత్‌తత్త్వము శేషించియే ఉంటుంది. అద్దానిని 'పరమార్థఘనము–చిన్మాత్రబ్రహ్మము–శుద్ధ పరతత్త్వము'.... అని శాస్త్రములు వర్ణిస్తున్నాయి. అద్దాని హృదయరూపమే ఈ జగత్తు కనుక ఈ జగత్తు కూడా అద్దానికి వేరుకానిదై ఉన్నది. ఆ పరమాత్మ భగవానుడే తనయొక్క హృదయరూపమును జగత్తుగా ఎఱుగుచున్నాడని గ్రహించు. మాయొక్క దృష్టిలో (జీవన్ముక్తుల అనుభవంలో) ఈ జగమంతా ఊహాలోకంలాగా మిథ్యారూపమే అయి ఉన్నది. ఇది మొదలే 'కల్పన' నుండి ప్రభవించియున్న దానిగా గమనిస్తున్నాం. ఇది గ్రహించి దీనిని మేము వినోదము కొరకే పొందుచున్నాం.

విస్తవానికి ఈ జగత్తుకు "ఇదీ రూపం" అంటూ ఏదీ లేదు. కాబట్టే విచారణ చేసినప్పుడు "ఇది స్వతహాగా లేనిది" అని (విజ్ఞానదృష్టికి) తెలిసిరావటం జరుగుతోంది. విచారణ చేస్తే "ఇక్కడ ఏదీ నశించటం లేదు. జనించటంలేదు" ... అని మేము గ్రహిస్తున్నాం. కనుక పరమ కారణమగు బ్రహ్మము ఎట్లా నాశనరహితమో .... ఈ జగత్తు అనబడేది కూడా అట్లాగే నాశనరహితం.

ఎందుకంటే ఇది భావనచే ఉండటం, అభావనచే రహితమవటం జరుగుచున్నది కాబట్టి! ఇక నీవు చెప్పిన కల్ప – మహాకల్పాది కాల చమత్కారాలు కూడా కల్ప– (లేక) భావన యొక్క అవయవముల భేదము కొరకు కల్పించబడ్డాయి. అయితే నిత్యమగు బ్రహ్మమునకు అనిత్యము–కల్పితము అగు 'మహాకల్పము' మొదలైనవి అవయవాలు అవటమేమిటి? కానేకాదు. అవి భావనాకల్పనలు మాత్రమే !

కాబట్టి నశించిన కల్పములు – మహాకల్పములు మరల మరల రావటానికి – పోవటానికి శక్యములై ఉన్నాయి. దృష్టాంతానికి... ఒకనికి ఒక ఆలోచన వచ్చి, అంతర్గతమై మరల మరొక్కప్పుడు ఆ ఆలోచన బహిర్గతం కావటం అందరికీ అనుభవైకవేద్యమే కదా! ఇదీ అట్టిదే! బ్రహ్మము సర్వదా విద్యమానమై ఉండగా ఇక "కల్పములు" అనే జపమాల యొక్క పరివర్తనము "కాలచక్రం" రూపంగా సంభవించుచున్నది. కాని విచారించి చూస్తే ఆలోచనలు చేసేవాడు సర్వ ఆలోచనలకు ఆవల యథాతథంగా ఉండి ఉంటున్నట్లే వాస్తవానికి కల్పాదులు ఆత్మ దృష్ట్యా లేనివే – అని కూడా గ్రహించు.

**తస్మాత్ న కస్యచిత్ కించిత్ కదాచిత్ నశ్యతి క్వచిత్ ।**
**నచైవ జాయతే, బ్రహ్మశాన్తం దృశమ్ అజం స్థితమ్ ॥**

కనుక ఎచట ఎప్పుడూ దేనికి ఏదీ కనిపించటమూ లేదు, ఉత్పన్నమవటమూ లేదు. ఇక ఈ దృశ్యమంటావా? ఇదంతా వాస్తవానికి అజము, శాంతము అయినట్టి బ్రహ్మముగానే స్థితినొంది ఉన్నది. విస్తారమైన ఆకాశమునందు, ఒక పరమాణువు యొక్క వెయ్యవ వంతు విభాగమునందు కూడా ఏ ఒకే శుద్ధ చిన్మాత్ర సత్త కలదో ...అదియే ఆ పరబ్రహ్మము. సర్వదా, సర్వత్రా పరబ్రహ్మము

విద్యమానమై ఉండగా ఇక ఈ జగత్తు మాత్రం నశించటమనే ప్రసక్తి ఎక్కడిది? నిద్రపోవువాని చైతన్య స్వరూపమే స్వప్నంలో స్వప్న జగద్రూపంగా భాసిస్తున్నట్లు, చిదాకాశము యొక్క అంశమే సృష్ట్యాది యందు సమస్త పదార్థరూపములుగా భాసిస్తోంది.

చిదాకాశం యొక్క అవయవమే ఈ సృష్టి. సృష్టి యొక్క అవయవాలే నాశన - ఉత్పత్తులు. ఈ విధంగా సర్వము చిదాకాశమే అయిఉండగా... ఇక నశించునదేమీ?నశించని దేమున్నది? పరమార్థచైతన్యము ఛేదించబడేదికాదు, దహించబడేదికాదు, తడుపబడేది కాదు, ఎండించబడేది కాదు. తత్‌హృదయమైనట్టి ఈ జగత్తు, అట్టి జగత్తు యొక్క కారణం అయినట్టి అజ్ఞానము, అట్టి అజ్ఞానానుభవము అట్లే నశించటంలేదు, జనించటంలేదు.

**శ్రీరాముడు :** అదేమిటి మహర్షీ !"అజ్ఞానము కూడా జనించటం లేదు-నశించటం లేదు"... అని చెప్పుచున్నారు. జ్ఞాని - అజ్ఞాని వేరువేరుగా అవగాహన కలిగి ఉంటున్నారు కదా!

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును, చైతన్యం కేవలం తన యొక్క స్మరణ - విస్మరణల సూత్రం చేత ఈ జగత్తుల అనుభవము - అనుభవరాహిత్యము కూడా అనుభవిస్తోంది.

రామచంద్రా! ఒకానొక వస్తువు ఏ ముడి పదార్థం యొక్క ఒకానొక రూపమై ఉన్నదో అట్టి ముడి పదార్థం నాశరహితమై ఉన్నప్పుడు... ఇక ఆ వస్తువు కూడా నాశరహితమైనదే కదా! కాబట్టి బ్రహ్మమే స్వరూపంగా గల ఆ దృశ్యం కూడా బ్రహ్మం వలెనే అక్షయం అయి ఉన్నదని గ్రహించు. మహాప్రళయాదులు ఆ బ్రహ్మం యొక్క అవయవాలే అయి ఉన్నాయి. చిన్మాత్రం అగు పరమ చిదాకాశానికి నాశనం గాని, ఉత్పత్తిగాని ఎక్కడున్నాయి? నిరాకారమగు చిదాకాశమునకు పదార్థ సంబంధమైన ఉత్పత్తి -వినాశనాది వికారాలు ఎట్లా ఉంటాయి?

ఓ రామచంద్రా! ఈ జగత్తు చిన్మాత్ర స్వరూపమేనని మరల మరల గుర్తు చేస్తూ ఆయా దృష్టాంతాలు ఆత్మశాస్త్రజ్ఞులచే చెప్పబడుచున్నాయి.

**1. స్ఫటిక శిల - ప్రతిబింబం దృష్టాంతం -** ఒకచోట ఒక స్ఫటిక శిల ఉన్నది. అందులో చిత్ర విచిత్రమైన రంగులతో ఆయా వస్తువులు ప్రతిబింబిస్తున్నాయి. ఇప్పుడు చెప్పు! ఆ స్ఫటిక శిలలో రకరకాలుగా ప్రతిబింబిస్తూ కనిపించేవన్నీ స్ఫటికశిలారూపమేగాని మరొకటేదీ లేదు కదా! ఆ ప్రతిబింబంలో కనిపించే ఒక రూపమూ మరొక రూపమూ కూడా స్ఫటిక శిలయే కదా!

ఈ వివిధ జగత్తులు, మహాకల్పం మొదలైనవి కూడా చైతన్య బ్రహ్మం నందు తత్‌బ్రహ్మ రూపంగానే ఇమిడి ఉన్నాయి. (లేక) నెలకొని ఉన్నాయి.

**2. మనోరాజ్య దృష్టాంతం -** ఒకాయన తన మనస్సుతో ఒక రాజ్యం ఊహించి ఆ రాజ్యంలో అంతఃపురం, యువరాణి మొదలైనవన్నీ దర్శిస్తున్నాడనుకో...! అవన్నీ కూడా - అనగా రాజు, రాణి, మంత్రి, శత్రురాజు... అన్నీ కూడా - అతని ఊహ (మనస్సు) యొక్క రూపాలే కదా.

ఆ ఊహ (మనస్సు), ఆ అనుభవ రూపాలన్నీ (తదనంతరం) మనోరూపంలో కలిసిపోతాయి. అట్లాగే చైతన్యం యొక్క సంకల్పమాత్రంచే ఉత్పన్నమగుచున్న ఈ జగదృశ్యాలన్నీ కూడా నిరాకారం, నిర్మలం అగు చిన్మాత్ర రూపాన్నే పొందనున్నాయి, పొందుచున్నాయి.

**3. వృక్షము-వృక్షావయవముల దృష్టాంతం -** "అవయవి" యగు వృక్షమునకు వ్రేళ్ళు-కాండము-కొమ్మలు-ఫలములు-ఆకులు-పుష్పములు-చిగుర్లు మొదలైనవన్నీ అవయవములు కదా? అట్లాగే పరమార్థ ఘనము ఆకాశము కంటే కూడా అతి నిర్మలము-సూక్ష్మము-వాక్కుకు అవిషయము అయి ఉన్నది. బ్రహ్మము "అవయవి". ఇక ఈ ప్రళయ-మహా ప్రళయ-నాశ-ఉత్పత్తి-భావ-అభావ-సుఖ-దుఃఖ-జన్మ-మరణ-సాకార-నిరాకారాదులన్నీ ఆ అనిర్వచనీయ బ్రహ్మముయొక్క 'అవయవములు'. "అవయవి" ఏ రీతిగా వాక్కుకు అవిషయమై నాశరహితమై ఉన్నదో... అట్లాగే అద్దాన్ని అవయవములగు ఈ సృష్టి మొదలైనవి కూడా పరమార్థ దృష్టియందు నాశన రహితములేనని గ్రహించు. వాస్తవానికి "అవయవి" - "అవయవములు" అభేదములే కదా! అట్లా ఏక స్వరూపములగు దృశ్య - అదృశ్యములకు భేదమేమి ఉండజాలదు.

వృక్షము యొక్క ఉనికికి వృక్ష చైతన్యమే మూలం కదా! అట్లాగే ఈ జగత్తుకు పరమార్థ ఘనమగు చైతన్యమే మూలమైయున్నది.

బ్రహ్మము అనే వృక్షానికి... "సృష్టి" అనేది - కాండము; లోకాలు, లోకాంతరాలు - శాఖలు; జంబూ ద్వీపాదులు -ఉపశాఖలు; పర్వత, నదీ, గ్రామాదులు - పల్లవములు; చంద్ర సూర్యాదులు - దానికి పూచే పుష్పగుచ్ఛాలు; అంధకారం - ఆకుల పచ్చదనం; ఆకాశమే - దాని కణుపులు; ఇందలి జడత్వం - ఆ వృక్ష చర్మము... ఈ విధంగా ఈ జగత్తు నిరాకారమై స్వయంగా చిదాకాశరూపమై చిదాకాశమునందే వెల్లివిరిసియున్నది.

**4. నిశ్చలకాలం - చంచలకాలాంతర్గత విశేషాలు -** ఆత్మయే వివిధ కల్పనా రూపాలతో ఒకచోట భూతకాలంగానూ, మరొకచోట వర్తమాన కాలంగానూ, ఇంకొకచోట భవిషత్‌కాలం గానూ, వేరే ఒక చోట ప్రళయ-మహాప్రళయాలుగానూ స్థితిని పొందుతూ తాను సర్వదా నిశ్చలంగానే ఉన్నది. చంద్రునిలో కళంకత్వము భ్రమచే కనబడుతుంది చూచావా? అట్లాగే నిర్మల పరబ్రహ్మాకాశమున కనబడే సృష్టి-ప్రళయాది దోషాలు వాస్తవానికి భ్రమయే గాని సత్యము కాదు. నిర్మలమగు చిదాకాశమున భావ-అభావముల గురించిన రంజనము మాత్రం ఎక్కడ? అందులో "ఇది ఆది, ఇది మధ్యం, ఇది అంతం" అనబడే కల్పన ఎక్కడ? లోక లోకాంతరాల గురించిన విభ్రమములు ఎచ్చటున్నాయి. ఇవన్నీ లేనే లేవు.

❖

**శ్రీరాముడు :** మరి సంసార జీవులకు అవన్నీ ఎందుకు ఉన్నట్లుగా అనిపిస్తున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సమస్త భ్రమలకు అసలైన కారణం ఆత్మజ్ఞానం లేకపోవుట చేతనే!

**శ్రీరాముడు :** మరి ఆ భ్రమ తొలగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ సభికులారా! మీ మీ దృష్టిని సాక్షి చైతన్యమగు ఆత్మ వైపుగా ప్రసరింప జేసుకున్నంత మాత్రం చేత ఈ జగద్భ్రమంతా శమించిపోగలదు. వాయువు చేత ఉత్పన్నమై వాయువు సహాయం చేతనే వెలుగుచున్న దీపం తిరిగి వాయువు చేతనే నశించుచున్నది చూచారా?

అట్లాగే ఆత్మ స్వరూపము చేతనే తన యొక్క 'సత్త'ను సంపాదించుకున్న 'అజ్ఞానము' అనేది తిరిగి తత్త్వవిచారణచే జనించే ఆత్మజ్ఞానము చేతనే నశించుచున్నది. జ్ఞాన ప్రకాశముచే అజ్ఞానము తొలగగా "అజ్ఞానం అనేదేదీ ఎక్కడా లేదు" అనే నూతన బోధ కలుగగలదు. దీపం వెలిగిన తర్వాత చీకటి ఏమౌతోంది? బయటకెక్కడకన్నా పోతోందా? లేదు. వెలుతురు లేకపోవటమే చీకటిగాని, చీకటికి వేరుగా ఏ ఉనికీ లేదు. "సర్వమూ బంధ-మోక్ష రహితమగు బ్రహ్మమే" అనే నూతన జ్ఞానం అప్పుడు ఉదయిస్తుంది. అజ్ఞానం ఎటుపోతుందో (చీకటిలాగానే) ఏమీ చెప్పలేం!

ఓ రామచంద్రా! ఈ ప్రకారంగా ఆత్మజ్ఞానాది ఆయా ఉపాయాలను 'మోక్షము' కొఱకై మనం చెప్పుకున్నాం. 'ఆత్మ విచారణ' యందు నిరంతరము యత్నీకృతుడైన వాడు ఆత్మజ్ఞానాన్ని తప్పక సముపార్జించగలడు.

'అనాది' అనతగినట్లు ఈ 'జగత్తు' అనే జాలం ఎన్నడూ ఉత్పన్నం కానిదే అగుచున్నది. బ్రహ్మమే ఈ జగత్తు-జీవుడు మొదలైన రూపాలుగా ప్రకాశిస్తోంది. అట్లా ప్రకాశిస్తూ తనకు తానే 'మాయ'ను తెరగా ధరించి అజ్ఞానావరణ ప్రభావం చేత "నాకు భోగాలు కావాలి. నాకు మోక్షం కావాలి" అని తన ముంగిట తానే ప్రార్థనలు సల్పుచున్నది. ఇదియే మాయ యొక్క ప్రభావం. అణిమ-గరిమ మొదలుగా గల ఈశ్వరత్వము కూడా మాయామాత్రమేనని ఎఱిగి అద్దానిని కూడా తృణముతో (గడ్డిపరకతో) సమానంగా చూచుటయే ఉచితం. కనుక నిరతిశయానందయుతుడైన స్వాత్మయందే సుస్థిరుడవై ఉండెదవు గాక!

❖❖❖

## 7. మనస్సును అనుసరించే జగత్తులు కనబడుచున్నాయి!

**శ్రీరాముడు :** మహర్షీ! మీ వచన ప్రవాహం అమోఘం! స్వామీ! మీరు అప్పుడు చిదాకాశ శరీరులై అనేక జగత్సమూహములను వీక్షిస్తూ ఉన్నట్లు చెప్పుతూ వస్తున్నారు కదా! మరల ఆ కథనమును కొనసాగించవలసినదిగా నా ప్రార్థన. ఇక్కడ నాదొక చిన్న సందేహం

మీరు ఆ జగత్ సమూహములను ఒక పక్షి ఆకాశంలో సంచరించుచున్నట్లుగా అటు-ఇటూ వెళ్ళుచూ చూచారా? లేక, ఒడ్డున ఉన్నవాడు సముద్రపు అలలను చూస్తున్నట్లుగా ఒకే ప్రదేశమున స్థిరంగా ఉండియే ఆ జగత్సమూహములను గాంచటం జరిగిందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** (చిరునవ్వు చిందిస్తూ) ఓ రాఘవా! ఎప్పుడైతే నేను అనంతం, సర్వవ్యాపకం అయినట్టి చిదాకాశమే అయ్యానో, ఇకప్పుడు ఒక చోటనే ఉండటమో, లేక ఒక చోటి నుండి మరొక చోటికి ప్రయాణించటమో (గమన - ఆగమనములు నిర్వర్తించటం) అనేది ఎక్కడుంటుంది? కాబట్టి నేనప్పుడు గమనశీలుడనై ఉండలేదు.

అట్లాగే ఏదో ఒక ప్రదేశమున కూడా స్థితిని పొంది ఉండలేదు. "ఈ చోటు-ఆ చోటు" అనునవన్నీ భౌతికాకాశం యొక్క ధర్మాలు గాని... చిదాకాశ ధర్మాలు కావు కదా!

**శ్రీరాముడు :** ... మరి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అపరిచ్ఛిన్నము–నిత్య అపరోక్షము అగు నా ఆత్మయందే ఆయా జగత్సమూహం లన్నిటినీ నేను వీక్షించాను. దేహాత్మ బుద్ధితో ఈ శరీరమును పాదముల నుండి మస్తకము (నుదురు) వరకు ఈ చర్మ నేత్రములతో చూస్తాం కదా! అట్లాగే, ఈ చర్మనేత్రములతో కాకుండా చిద్రూప నేత్రాలతో అప్పుడు ఆ జగత్తులను నాయందే (స్వాత్మయందే) చూడటం జరిగింది. ఆ సమయంలో సమాధిస్థితిని అవధరించిన నేను నిరాకారంగాను, నిరవయవంగాను, నిర్మలచిదాకాశ రూపంగాను స్థితి పొంది ఉన్నాను. అందుచేత ఆ నాచే చూడబడిన జగత్తులన్నీ నా యొక్క అవయవ విభాగాలు గానే నాకు అనిపించసాగాయి. వాస్తవానికి ఆ జగత్తుల యొక్క వస్తుత్వం జనించటమూ లేదు, నశించటమూ లేదు. వాటన్నిటి (స్వస్వరూపం) యొక్క సత్తా నా యొక్క సత్తా చేతనే ఏర్పడినాయి సుమా! అనగా నా సత్తయే వాటి ఉనికికి ఆధారం. ఆ విధంగా అవి నా అవయవాల వలెనే నాకు అనిపించాయి. వాటికి స్వతఃసత్తా లేదు. కాబట్టి అవి వస్తుతత్వరహితములని కూడా గ్రహించు.

**శ్రీరాముడు :** మహాత్మా! అనగా మీకు దర్శనమైన ఆ జగత్సమూహములన్నీ మీ యొక్క స్వరూప విభాగమేనని మీ ఉద్దేశమా? చాలా ఆశ్చర్యంగా ఉన్నదే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. అవన్నీ నా స్వసత్తాపై ఆధారపడి దర్శించబడుచున్నాయి. కాబట్టి అవన్నీ నా స్వరూపానికి అభేదములే! అయితే, ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమున్నది? అందుకు మనకు దృష్టాంతం ప్రతిజీవునికి ప్రతిరోజు అనుభవమయ్యే స్వప్నమే. స్వప్నంలో కనిపించేది స్వప్నద్రష్ట యొక్క ఊహాజనిత కల్పనయే కదా! ఏది ఎవరి కల్పనయో అది వారి స్వరూపమే కాక మరింకేమిటి? స్వప్నంలో ఒకచోట నుండి మరొకచోటికి స్వప్న ద్రష్ట పరుగులు తీస్తున్నాడా? లేదు. ఎందుకంటే స్వప్నం యొక్క ఆద్యంతాలు స్వప్నం యొక్క మనో విభాగమే! మనస్సు అతని స్వరూపంలోనుంచే కదా, బయల్వెడలింది? స్వప్నదృశ్యమంతా చిదాకాశం కంటే వేఱుకానట్లే... నేనప్పుడు గాని, లేక ఎప్పుడైనా సరే – చూచే జగత్తులు–చిదాకాశ స్వరూపమే అయి ఉన్నాయి. దేహాభిమానియగు జీవుడు ఏ విధంగా ఈ కాళ్ళు–చేతులు తన దేహ విభాగంగానే అనుభవం పొందుచున్నాడో, అంతగానూ నేను ఆ జగత్తులనన్నిటినీ అవయవాలుగా గాంచాను. 'వృక్షాభిమాని' అయిన జీవుడు ఆకులు–పూలు–కొమ్మలు మొదలైనవన్నీ తన అంగాలుగా గాంచుతాడు. అనంతమగు సముద్రాభిమాని యగు జీవుడు సమస్త జలచరజీవులను, తరంగాలను ఫేనము (నుఱుగును), ఆవర్తాదులను తన స్వరూపంగా ఎఱుగుతాడు. సర్వాంతర్యామిత్వం సముపార్జించిన జ్ఞాని తదితర జీవులందరినీ తన శరీరములోని విభాగంగా దర్శిస్తాడు. అట్లాగే అక్కడ నాకు తారసపడిన బ్రహ్మాండములన్నీ నాయందే ఉన్నట్లు నాకు అనుభూతి అగుచున్నది. అవయవి ఏ విధంగా తన అవయవములను తనకు అభిన్నంగా అనుభవం పొందుచున్నాడో... అట్లాగే నేను కూడా ఆ బ్రహ్మాండాలన్నీ (ఆయా సృష్టులన్నీ) నాకు అభిన్నంగా ఉన్నట్లు నాకు అనుభూతమగు చున్నది. అంతేకాదు ఇప్పుడు కూడా సుమా! బోధరూపమగు ఆత్మతోటి ఏకత్వము పొందిన నేను

ఇప్పుడు కూడా ఈ అనేక సృష్టులతోను, ఈ దేహ-ఆకాశ-పర్వత స్థలములతోను అభేదత్వ స్థితినే గాంచుచున్నాను. మనకందరికీ ఈ విశ్వం ఎదురుగా ఎట్లా కనిపిస్తుందో... అట్లాగే ఈ సభా ప్రాంగణం యొక్క బాహ్య-అభ్యంతరాలు కూడా అనేక జగత్తులలో పూర్ణమై ఉన్నట్లు నేను ఎఱుగు చున్నాను. ఓ రామచంద్రా! జలము తనయందలి రసమును, మంచు తనయందలి శీతలత్వమును, వాయువు తనయందు చలనత్వమును గాంచుచున్నట్లు, శుద్ధబుద్ధి అయినట్టి జ్ఞాని కూడా ఈ జగత్తును తనయందు ఉన్నదానిగా ఎఱుగుచూ ఉంటాడు. నేనే కాదు, బోధస్వరూపముతోటి ఏకత్వము పొందినట్టి వివేకులందరూ కూడా నాలాగానే ఏకాత్ములై ఉంటున్నారు. నేను నా యందలి ఆత్మనే వారి ఆత్మగాను, వారు వారి యందలి ఆత్మను నా ఆత్మగాను ఎఱుగుచూ ఉంటాం. ఇదియే 'సర్వాత్మ స్వరూప దృష్టి" ...అని చెప్పబడుతోంది. ఎప్పుడైతే అట్టి సర్వాత్మస్వరూప దృష్టి పరిపక్వ మౌతుందో ...అప్పుడిక "తెలియబడేది-తెలుసుకొనేవాడు-తెలియబడటం" అనే త్రిపుటి జయించ బడి అధిగమించబడుతోంది. ఎందుకంటే విజ్ఞాన స్వరూపమగు ఆత్మతో సమస్తం యొక్క ఏకత్వం స్వభావసిద్ధంగా, అనుస్యూతంగా (ఒక్కటిగా కూర్చబడ్డ దాని వలె) సంభవిస్తుంది.

యోగాదులచే సిద్ధులు సంపాదించుకున్న యోగసిద్ధ పురుషుడు ఒక పర్వతముపై నిలబడి తన యొక్క యోగదృష్టితో కోట్లాది యోజనముల దూరం, అంతదూరములో ఉన్న బాహ్య-అభ్యంతర పదార్థములను దర్శించగలుగుతాడు చూచావా? నేను కూడా సమస్త లోకములను అట్లే గాంచాను. భూమండలాభిమాని యగు దేవత భూమి యందలి సమస్త పదార్థములను, సమస్త ధాతు-రసాదులను తనయందే ఉన్నట్లు ఎఱుగుచున్నట్లుగా - అక్కడి దృశ్యమంతా నాకంటే వేఱుగా లేనట్లు నేను అనుభవం పొందాను.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! తమవంటి చిదానంద స్వరూపజ్ఞాన సమన్వితులకు అట్టి దర్శనం యుక్తియుక్తమని, స్వభావ సిద్ధమని గ్రహించాను. స్వామీ! అప్పుడు చిదాకాశమున అనేక జగత్తుల మధ్యగాను, ఆవలగానూ పయనిస్తూ, దర్శిస్తున్న మీ సమీపంలో ఒక వనిత 'ఆర్య' ఛందస్సు గానం చేస్తూ కనబడిందని చెప్పారు కదా! ఆమె ఆ తర్వాత ఏమి చేసిందో చెప్పవలసినదిగా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ విధంగా 'ఆర్య' ఛందస్సును అత్యంత మధురంగా గానం చేస్తున్న ఆ స్త్రీ చిదాకాశస్వరూపిణియై 'దేవి' వలె ప్రకాశిస్తూ నా వెంటనంటి నా సమీపంలోనే ఉండటం అప్పుడు నేను గమనించాను. నేనట్లా చిదాకాశరూపం దాల్చానో అట్లే ఆమెకూడా చిదాకాశరూపమే కలిగి ఉన్నది. అంతేగాని ఆ సమాధికి ముందటిశరీరముచే ఆమెను గాంచలేదు. ఆ సమాధికాలంలో నేను-ఆమె-ఆ జగత్సమూహాలు చిదాకాశమాత్రంగానే ఉండి ఉన్నాము.

**శ్రీరాముడు :** మునీంద్రా! మీరు ఆమె యొక్క గానమును వింటున్నారని చెప్పుచున్నారు? 'గానం' అనేది ఉత్పన్నం కావాలంటే నాలుక-కంఠము మొదలైన కరణములు, ప్రాణవాయువు యొక్క చేష్ట ఉండాలి కదా! కానీ ఆమె ఏమో నిరాకారమైన చిదాకాశరూపధారిణి అంటున్నారు. అట్టి స్త్రీ నుండి శబ్దము ఎట్లా ఉద్భవమైనది? బాహ్యమైన రూపాదుల యొక్కయు, మరియు అభ్యంతర మానసిక

వ్యాపారముల యొక్క కలయికచే 'పాట పాడటం' మొదలైనవి సంభవిస్తాయి. మరి చిదాకాశ రూపమైన ఆత్మయందు అవి ఎట్లా సంభవిస్తాయి? చిదాకాశమున జగద్దర్శనము- పర్యావలోకనం మొదలైనవి తామెట్లా నిర్వర్తించారో, ఆమె గానం మీకెట్లా వినబడిందో, ఆ తత్త్వమును నిశ్చయముగా వచించమని వేడుకొంటున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఈ విషయం నీకు కొన్నిసార్లు సూచించాను. మరల చెప్పుచున్నాను విను. ఒకడు కలకంటున్నాడనుకో, అతనికి ఆయా స్వప్న విశేషాలు కనిపిస్తున్నాయి, వినిపిస్తు న్నాయి. అయితే అతని భౌతికమైన కళ్ళు, చెవులు, జడత్వం పొంది ఉపయోగించబడకుండానే ఉన్నాయి. కదా! మరి స్వప్నంలోని ఆకారాలు ఏ కళ్ళకు కనిపించాయి? శబ్దాలు ఏ చెవులకు వినిపించాయి? అదేరీతిగా చిదాకాశమున కూడా సమస్తమూ సంభవమే! స్వప్నంతో స్వప్నసంవిత్ – చిదాకాశమే బాహ్య అభ్యంతర పదార్థములుగా ఉదయిస్తోంది కదా! అదేరీతిగా, ఆ సమాధి యందు దృశ్యమంతా కూడా చిదాకాశరూపముగానే ఉండి ఉన్నది.

కేవలం ఆ సమాధి సమయంలో నాకు కనిపించే జగత్తులు–స్త్రీ మొదలైన దృశ్యమే కాదు. మన ఇక్కడి బుద్ధికి గోచరమయ్యే ఈ సమస్త జగత్తు కూడా నిర్మలమగు చిదాకాశరూపమే అయి ఉన్నది. ఇందులో ఎవరికీ ఏమాత్రం సందేహం ఉండవలసిన పనిలేదు. ఈ జగత్తు నిశ్చయంగా చిన్మయమై, విషయరహితమై, చిత్స్వభావము యొక్క స్వరూపమైయున్నది. స్వయముగా చిదాకాశమే ఇట్లు భాసించుచున్నది. అందుకు ప్రమాణమేమిటంటావా? స్వప్న శరీరము యొక్క కళ్ళు–కాళ్ళు– చేతులు మొ॥న కరణముల సత్తకు నీకేమి ప్రమాణమున్నది? స్వప్నము యందు దేహాదుల సత్తా ఎట్లా కలతో, అట్లే మన ఈ జగత్తు యొక్క 'సత్తా' కూడా అట్టిదే. స్వప్న జగత్తు ఎట్టిదో ఈ జాగ్రత్ జగత్తు కూడా అట్టిదే. జాగ్రత్ సత్తా ఎట్టిదో స్వప్న సత్తా కూడా అట్టిదే! అజ్ఞాన కారణంచేత అసత్తు అగు నామరూపాదులు సత్తాను పొందినట్లు అనిపిస్తున్నాయి. అంతే చమత్కారంగా నిర్విషయాత్మతత్త్వమగు సత్తు (ఆత్మతత్త్వము/ చిదాకాశము) అసత్తుగాను అప్రసిద్ధమైనదిగాను అజ్ఞానం చేత అనిపిస్తోంది.

స్వప్నంలో భూమిపై నిర్వర్తించే కృషి, మార్గాలలో చేసే ప్రయాణం, పర్వత గుహాదులలో నిదురించటం–మొదలైన సర్వ స్వప్న వ్యవహారముల చిదాకాశరూపమే అయినట్లుగా ఈ జగత్తులో కూడా నీవు–నేను–ఆ స్త్రీ–ఈ జగత్తు తదితర సమస్తం కూడా చిదాకాశ రూపమే అయి ఉన్నాము. స్వప్నంలో కనిపించిన యుద్ధ కోలాహలాలు రాకపోకలు మొదలైనవన్నీ వాస్తవానికి లేకపోయి నప్పటికీ మనుజులకు స్వప్నసమయంలో వాస్తవమైనట్లు అనుభవమగుచున్నది కదా! అట్లాగే ఈ జగత్సమూహములలో ఈ ఈ ఇంద్రియ విషయాలన్నీ కూడా అనుభవమౌతున్నాయి. 'స్వప్న మందలి ఆ దృశ్య వైచిత్ర్యం దేనివలన కలిగింది?' అని ఎవరైనా అడిగితే దానికి సమాధానమే మున్నది? ఈ జీవునకు జగత్తు అనేది ఎందుకు ప్రాప్తిస్తోంది?" అనే ప్రశ్న అంతగానూ అసమంజసమే అవుతుంది. ఎందుకంటే ఈ జగత్తు విషయంలో కూడా స్వప్నానుభవస్థితి తప్ప ఇక్కడ అన్యమైన కారణం ఏదీ అవాచ్యమై ఉన్నది. (చెప్పుటకు కుదరనిదై ఉన్నది.)

**"కథమాలక్ష్యతే స్వప్నః?" ఇది ప్రష్టుః ప్రకథ్యతే ।**
**యథైవం పశ్యసీత్యేవ! హేతుః అత్ర అస్థి! నేఽతరః ॥**

"నాకు స్వప్నంలో అది అట్లా ఎందుకు కనిపిస్తోంది?" అని ఒకాయన ప్రశ్నించాడనుకో. దానికి మనం సమాధానం ఏం చెబుతాం? "బాబూ! నీవు ఎట్లా దానిని గాంచుచున్నావో అద్దానిని అట్లే పొందుచున్నావు" ... అని మాత్రమే సమాధానం చెప్పగలం. అట్లాగే ఈ ప్రపంచం యొక్క విషయం కూడా. "ఈ ప్రపంచం నాకు ఇట్లా (నిర్మలమైన ఆత్మగా కాకుండా నామ రూపాత్మకమైన ఆయా విశేషాలతో కూడి) ఎందుకు కనిపిస్తోంది?" అని ఎవరైనా ప్రశ్నిస్తే, "అయ్యా! ఇద్దానిని నీవు నామ రూపాత్మకంగా చూస్తున్నావు కాబట్టి నామరూపాత్మకంగా కనిపిస్తోంది" అని అనక తప్పదు. దీనిని ఆత్మతత్త్వంగా చూస్తే (ఆత్మయే ఈ ఈ రూపములుగా అగుచున్నది కదా–అను దృష్టితో చూస్తే) ఇదంతా నిర్మలమగు ఆత్మగానే కనిపిస్తుంది. ఇంతకుమించి ఈ జగత్తుకు వేతే హేతువు ఏదీ లేదు. ప్రథమ సృష్టి మొదలుకొని విరాడాత్మరూపం వరకు వ్యష్టి మొదలుకొని సమష్టి వరకు చిదాకాశమే చిదాకాశంలో తన యొక్క పరస్పర సాపేక్ష చమత్కారం చేత భాసించుచున్నది.

**శ్రీరాముడు :** స్వామీ! అయితే ఈ జగత్తంతా ఒక స్వప్నం వంటిది మాత్రమేనంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**స్వప్న శబ్దేన బోధార్థం తవ వ్యవహరామ్యహమ్ ।**
**దృశ్యం త్విదం న సన్నాసన్న స్వప్నో, బ్రహ్మ కేవలమ్ ॥**

ఓ రామచంద్రా! నీకు బోధించటం కొరకు మాత్రమే స్వప్న శబ్దాన్ని (స్వప్న దృష్టాంతాన్ని) ఇక్కడ వాడాను. వాస్తవానికి ఈ దృశ్యం సత్తు కాదు. అసత్తు కూడా కాదు. స్వప్నము కాదు. మరి? ఇదంతా కేవలము బ్రహ్మమే అయి ఉన్నది. భ్రమచే వివిధ రూపములతో కూడిన జగత్తుగా అనిపిస్తోంది. భ్రమతొలగినప్పటి దృష్టికి ఇక్కడ బ్రహ్మము తప్పించి మరేమీ అగుపడుటయే లేదు జగత్తు అనబడేది (నిర్మలబ్రాహ్మీ దృష్టిచే) ఎక్కడున్నది?

❖

సరే! ఇక ఆ స్త్రీ విషయానికి వద్దాం. ఆ స్త్రీ గానం చేస్తూనే – నేను ఎటు వెళ్ళితే అటే వస్తోంది. "అనురాగవతి, దృశ్య రూపిణియగు ఈ స్త్రీ నన్ను వెంబడించటంలో ఈమె అభిప్రాయం ఏమిటో తెలుసుకొనెదను గాక!" అనే సంకల్పసంవిత్తును నేను ఆశ్రయించాను. స్వప్నంలో స్వప్నజనులతోటి వ్యవహారం సిద్ధించునట్లుగా ఆమెతో కూడా నాకు 'ప్రశ్న–సమాధానం' మొదలైన వ్యవహారము సిద్ధించింది.

**శ్రీరాముడు :** "ప్రశ్న–సమాధానం" అను రూపంలో అప్పుడు సిద్ధించుచున్నది స్వప్న సదృశమేనా? జాగ్రత్ సదృశమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మరల చెప్పుచున్నాను. స్వప్నంలోని వ్యవహారమంతా చిదాకాశ రూపమే అయినట్లు ఆ నేను, నా వ్యవహారము, ఆ జగత్తు, ఈ మనకు కనిపించే జగత్తు చిదాకాశ

రూపముగానే గ్రహించు. కాబట్టి స్వప్నము-జాగ్రత్తు సమానమే! జాగ్రత్తు యొక్క ఏమఱుపు నుండి భావించే దానిని స్వప్నమని పిలుస్తున్నాం. అట్లాగే ఆత్మత్వము యొక్క ఏమఱుపు నుండి భాసించేదానిని 'జగత్తు' అని పిలుస్తున్నాం. ఇంతకు మించి స్వప్న-జాగ్రత్తులకు వేఱే భేదమేమీ లేదు. ఎందుకంటావా? ఈ జగత్తు ఆత్మకు స్వప్నమే అవుతుంది. అయితే ఈ జగత్తు దీనియొక్క అధిష్ఠాన రూపముచే కేవలం చిదాకాశము మాత్రమే! ఈ జగత్తు దృశ్యరూపంగా (నామ రూపాత్మక దృష్టిచే) అసత్తే అయి ఉన్నది. వాస్తవానికి నిర్మలము-జ్ఞప్తి మాత్రము-సన్మాత్రము అయినట్టి బ్రహ్మమే ఈ జగద్రూపంగా స్థితి నొందియున్నది. ఓ సర్వ ప్రియ సభికులారా!

**స్వప్నస్య విద్యతే ద్రష్టా, సాకారో యుష్మదాదికః**
**ద్రష్టా తు సర్గ స్వప్నస్య చిద్వ్యోమైవామలం స్వతః ॥**

సాకారుడు ఈ జీవుడు స్వప్నము యొక్క ద్రష్టగా అగుచున్నారు. స్వప్నదృష్టానుభవం ప్రతి ఒక్కరికీ దైనందినమే కదా! అట్లాగే 'సృష్టి' అనే స్వప్నమునకు ద్రష్ట స్వయంగా నిర్మలమగు చిదాకాశమే అగుచున్నది. సుమా! స్వప్నమునందలి ద్రష్ట-దర్శనము-దృశ్యములు కూడా నిర్మల చిదాకాశమే అయి ఉన్నది. ఈ జగద్రూప స్వప్నం నిరాకారమగు చిదాకాశమునందే స్వయంగా స్ఫురిస్తోంది. చిదాకాశము నిరాకారమై ఉండగా ఈ జగత్తుకు మాత్రం సాకారత్వం ఎక్కడున్నది? కనుక ఈ జగత్తు కూడా వాస్తవానికి నిరాకారమే! ఇందలి సాకారత్వం? 'భ్రమ' ఉన్నంత వరకే అట్లు అగుపిస్తుందని గ్రహించబడుగాక! ఇంకొక విషయం. సాకారులగు జీవుల, నిర్మలమగు ఈ జగత్తు – ఈ రెండూ కూడా చిదాకాశం కాక ఏమౌతుంది? ఈ స్వప్న సదృశ జగత్తు వాస్తవంగా రచించబడకపోయినప్పటికీ గోడ లేని రంగుల చిత్రలేఖనం లాగా చిదాత్మ ఈ జగత్తును రచించబడినదానివలె గాంచుచున్నది.

'చిదాకాశము' అనే కోమలమైన మట్టితో 'హిరణ్యగర్భుడు' అను కళాకారుడు 'ఇంద్రియములు' మొదలైన వాటితో కూడిన ఈ సృష్టి మండపాన్ని నిర్మించినప్పటికీ, వాస్తవానికి ఈ జగత్తు నిర్మించబడనిదేనని గ్రహించు.

❖

ఓ రామచంద్రా! వాస్తవానికి ఇక్కడ కర్తృత్వము లేదు. భోక్తృత్వము లేదు. జగత్తులు లేవు. తదితర ద్వైతభావములూ లేవు. ఈ సర్వమునకు కేవల సాక్షియైనట్టి చిద్రూప బ్రహ్మమొక్కటే ఉన్నది. కాబట్టి నీవు అభ్యంతరమున 'శిల' వంటి మౌనాన్ని అవలంబించు. ఇక బాహ్యమునందో... యథాప్రాప్తములైనట్టి ప్రవాహపతిత కర్మలను ప్రశాంత స్వభావుడవై ఆచరించు.

ఈ దేహము ప్రారబ్ధ పర్యంతము ఉంటే ఉండనీ, ఆ తర్వాత ఉండకపోతే పోనీ, ఇందులో ఇంకే విశేషమూ లేదు.

❖❖❖

## 8. అజ్ఞాని దృష్టిలో గల అంతులేని జగత్తులు! జ్ఞాని దృష్టిలో అంతా బ్రహ్మమే !!

**శ్రీరాముడు :** ఓ మహర్షీ! "ఆ స్త్రీ యొక్క నిరాకారమగు దేహముచే తమకు సాకార సంబంధమైన వ్యవహారం ఎట్లా సిద్ధించింది?" అనే విషయంలో ఇంకా కొంత శంక నా యందు మిగిలియే ఉన్నది. అట్టి స్థితిలో జిహ్వా (నాలుక) లేదు కదా! జిహ్వా లేకుండా "క-చ-ట-త-ప" మొదలైన వర్ణనలు మీరు ఎట్లా ఉచ్చరించగలిగారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! ఆ విషయం గురించి మరల ప్రస్తావిస్తున్నావా? నీ శంక తొలగటానికి మరికొన్ని విశేషాలు ఇక్కడ ప్రస్తావిస్తాను. విను.

చిదాకాశమే శరీరముగా గలిగియున్నట్టి జ్ఞానుల యొక్క అనుభూతి (లేక) అనుభవమునకు ఈ 'క-చ-ట-త-ప' మొదలైన ఉచ్చారణ యొక్క ఆవశ్యకతయే లేదు. ఎందుకంటావా? ఆయా ఉచ్చారణా శబ్దములన్నీ వాస్తవానికి కల్పితములే కదా! శబ్దములన్నీ అర్థ కల్పిత మాత్రములే కదా! భావమును పరస్పరం ఉచ్చరించటానికి శరీరము అత్యావశ్యకమేమీ కాదు. మనం చెప్పుకున్నట్లు స్వప్నంలో శరీరము యొక్క ఆవశ్యకత లేకుండా 'మాట్లాడుకోవటం' మొదలైనవి జరుగుతున్నాయి కదా! ఒకవేళ శరీరమే మాట్లాడుతుందని అంటావా? శవం కళ్ళు-చెవులు-మొదలైనవన్నీ కలిగి ఉండి కూడా మాట్లాడటం-వినటం మొదలైనవి నిర్వర్తించలేదు కదా!

**శ్రీరాముడు :** మహర్షీ! స్వప్నంలో అనుభవమయ్యే ఉచ్చారణ, సంభాషణ మొ॥వి ఆ స్వప్న సమయంలో సత్యమువలెనే ఆ స్వప్న ద్రష్టకు అనిపించటం జరుగుతూ ఉంటుంది. ఇంతకీ స్వప్నంలో జరిగే సంభాషణ సత్యమా? అసత్యమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (చిరునవ్వు నవ్వి) రామచంద్రా! స్వప్నంలో జరిగే ఉచ్చారణే కనుక (జగత్ వ్యవహారం దృష్ట్యా) సత్యమే అయితే ఆ ఉచ్చారణ ఆ ప్రక్కనే (జాగ్రత్‌లో ఉన్న) తదితర సహజీవులకు వినిపించాలి కదా! స్వప్న ద్రష్టకు వినిపించే ఉచ్చారణ జాగ్రత్‌లో ఉన్నవానికి వినిపించటం లేదు. కనుక "సత్యము కాదు" అని అనక తప్పదు మరి? స్వప్నంలో స్వప్న ద్రష్టకు వినిపించే ఉచ్చారణంతా ఆ స్వప్న ద్రష్ట యొక్క భ్రమ మాత్రమే! కనుక "నిద్రా స్వభావబలం చేత కల్పించబడిన చిదాకాశము యొక్క స్ఫురణయే ఆ విధంగా స్వప్నంగా భాసిస్తోంది" ...అని గ్రహించు.

భ్రాంతిచే ఆకాశంలో రెండు చంద్ర బింబములు ఉన్నట్లు (కళ్ళకు సంబంధించిన తిమిర రోగ ప్రభావం చేత) అనిపించవచ్చు. ఆకాశంలో ఏవేవో ఆకారాలు ఉన్నట్లు కనిపించవచ్చు. భ్రమచే శిలా ప్రతిమ నృత్యం చేస్తున్నట్లు కనిపించవచ్చు. అట్లాగే భ్రాంతిచే స్వప్న దేహములందు చిదాకాశమే ఆయా ఉచ్చారణలతో కూడిన శబ్దరూపమును పొందుతోంది. ఆకాశంలో భ్రమచే కనిపించే ఆకారం ఆకాశం కంటే వేరుకాదు కదా! అట్లాగే స్వప్నానుభవమునందు కనిపించే జగదాకారరూపమైనట్టి చిదాకాశస్ఫురణము ఏమాత్రం కూడా చిదాకాశము కంటే భిన్నం కాదు.

స్వప్నంలో కనిపించే జగత్తులాగానే మనందరికీ ఈ ఎదురుగా కనిపించే జాగ్రత్ జగత్తు కూడా చిదాకాశ రూపమే అయి ఉన్నది.

చూచావా? ఆకాశం మొదలైనవన్నీ ఎట్లా చిదాకాశమే అయి ఉన్నాయో... అట్లాగే నా సమాధిలో నాచే గాంచబడిన జగత్సమూహములన్నీ కూడా చిదాకాశ రూపమే అయి ఉన్నాయి. అనగా, ఏ జగత్తైతే సత్యంగాను, స్థిరంగాను, మనోహరంగాను మనకందరికీ ఎదురుగా భాసిస్తోందో ...అట్టి ఇదంతా చేతనమైన చిదాకాశమే ఈ విధంగా స్థితినొంది ఉన్నది – అని గ్రహించి ఉండు.

**శ్రీరాముడు :** మహాత్మా! నాదొక సందేహం. ఈ జగత్తు స్వప్నము వంటిదేనని అన్నారు కదా! అయితే స్వప్నరూప మాత్రమైన ఈ జగత్తు జాగ్రత్ స్వప్నరూపంగా ఎట్లా అయింది? ఇదంతా అసత్యమే అయినప్పటికీ సత్యము వలె ఈ కళ్ళు మొదలైన వాటికి విషయమై ఎందుకు భాసిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! "ఈ జగత్తులన్నీ నిజానికి స్వప్నమువంటివే..." అని శాస్త్రములచే ఎందుకు సిద్ధాంతీకరించబడిందో,... చెబుతాను, విను.

❖

స్వప్నము స్వప్నద్రష్టకంటే వేరైనదా? కాదుకదా! అట్లాగే ఈ జాగ్రత్‌లో సిద్ధించుచున్న జగత్తులు కూడా ఆత్మకంటే భిన్నం కాదు. నామరూపాత్మకం దృష్ట్యా చూస్తే ఇవి వాస్తవములు కావు. స్థిరములు కావు. ఇవి సత్తు కావు. అసత్తు కావు. ఇవి అనిర్వచనీయములై ప్రతిభాస రూపమున ఆత్మ సత్తాచే స్థితిస్తూ ఉన్నాయి.

గింజలగుట్టలో కొన్ని గింజలు ఒకే రీతిగా ఉంటాయి. మరికొన్ని ఆకారం దృష్ట్యా వేర్వేరుగా ఉంటాయి. బీజములన్నీ ఒకే రీతిగా ఉన్నా, అవి వృక్షములుగా అయినప్పుడు (ఆకృతి–కొమ్మల సంఖ్య మొదలైన వాటిచే) వేర్వేరుగా ఉంటాయి. అట్లాగే చిదాకాశమున ఉన్న ఈ జగత్తులు కొన్ని ఒకే రీతిగాను, మరికొన్ని వేర్వేరు రీతులుగాను ఉంటున్నాయి. చిదాకాశమున ప్రళయానంతరం కొన్ని పూర్వంలాగానే ఉంటున్నాయి. కొన్ని సమంగాను, ఇంకొన్ని అసమంగాను ఉంటున్నాయి.

మరొక విషయం... ఒక స్వప్నంలో మరల మరికొన్ని స్వప్నములు కలుగుతూ ఉంటాయి చూచావా? అట్లాగే ప్రతి ఒక్క జగత్తులో మరల మరికొన్ని జగత్తులు ఉద్భవమగుచున్నాయి. 1. "జగత్తులో జీవులు, 2.ప్రతి జీవుడు తనదైన రీతిలో జగత్ స్వప్నం గాంచటం, 3.ప్రతి ఒక్క స్వప్నంలో ఎన్నో జగత్తులు, 4.ఆ జగత్తులలో మరికొన్ని జీవులు, 5.అట్టి ఆ జీవులలో అంతర్గత జగత్తులు–ఇట్లా ఒకదానికి మరొకటి అదృష్టములై (ఒక జగత్తుకు మరొక జగత్తు యొక్క ఉనికి తెలియరానిదై) ప్రవర్తిస్తున్నాయి కదా! "ధాన్యపు కొట్టులోని బీజరాసులు ఒక్కొక్క బీజంలో వృక్షతత్వం–ఆ బీజం మరల వృక్ష రూపంగా అనేక బీజముల ఉత్పత్తికి కారణమవటం–అట్లా ఉత్పన్నమైన ప్రతి బీజంలో అనేక తదనంతర వృక్షముల అంకురతత్త్వం" ...ఇవన్నీ ఎట్లా ఏర్పడు చున్నాయో, అట్లాగే జగత్తు–ఆ జగత్తులో అసంఖ్యాక జీవులు–అట్టి జీవాంతర్గత జగత్తులలోని ప్రతి దానిలో అనంత సంఖ్యలో జీవులు... ఇదంతా ఏర్పడి ఉంటోంది. ధాన్యపు గుట్ట నశిస్తే అందలి జీవ–జీవాంతర్గత తత్త్వము కూడా నశించునట్లు, ప్రళయంలో జగత్తులు నశిస్తున్నాయి.

ఈ విధంగా ఈ స్వప్నరూప జీవులు ఈ కనబడే జగత్తులోనే అసంఖ్యాకంగా కనిపిస్తున్నారు కదా! ఇప్పుడీ జగత్తు నశించిందనుకో, అప్పుడేమౌతుంది? జగత్తు నశించినప్పటికీ ఇందలి జీవులందరూ వాస్తవానికి చిదాకాశరూపులే కాబట్టి ఈ జీవులు చేతన రూపులుగానే ఉంటున్నారు – అంతేగాని, వీరందరు ఎన్నటికీ శూన్యరూపత్వం పొందరు. 'జీవులు' అనగా అజ్ఞానముచే ఆవరించబడిన చేతనరూపులే కదా! కనుక వీరందరు దేహము ఉన్నప్పుడు, దేహానంతరము కూడా వారివారి జగత్తులను స్వయం కల్పితంగా అనుభవిస్తూనే ఉన్నారు, ఉంటారు. ప్రక్క ప్రక్కన నిద్రిస్తున్నప్పటికీ ఒకరి స్వప్నమును మరొకరు ఎఱుగజాలనట్లుగా – ఈ జీవులు నిరంతరము పరస్పరము ఎఱుగజాలని తమ తమ జగత్తుల అనుభవమును కొనసాగిస్తూనే ఉంటారు. నిద్రించిన జీవుడు ఏం చేస్తున్నాడు? ఈ దృశ్య దేహసంబంధమైన జగత్తును వదలి స్వప్నజగజ్జాలమును పొందుచున్నాడు. అట్టి స్వప్నజగత్తుతో ఈ ఎదురుగా కనిపించే జగత్తుకు సంబంధించని–స్వయం కల్పితమైన స్వప్న జగత్తులో పగలు–రాత్రి–వ్యవహారములు మొదలైనవన్నీ ఆస్వాదిస్తున్నాడు. స్వప్న జగత్తులో కూడా త్రిలోకములు ఉంటున్నాయి. ఆ స్వప్న జగత్తులోని అసురులు, అదే స్వప్నజగత్తులోని దేవతలచే హతులు అయ్యారనుకో! అప్పుడు ఆ హతులైన రాక్షసులు ఏమౌతు న్నారు? వారు ఇంకా అజ్ఞానము కలిగి ఉండటం చేత ముక్తులు అగుటలేదు. రజో సంబంధమైన ఉత్సుకత ఉండనే ఉన్నది కాబట్టి ఇటు శిలారూపులు అగుటలేదు. దేహ సహితులూ కాదు! అట్టి స్థితిలోని దేహరహిత జీవులకు అట్టి దశయందు "స్వప్నజాగ్రత్ స్థితి" తప్ప వేరే స్థితి ఏముంటుంది?

**నిర్మోక్షా నిఃశరీరాస్తే చేతనావాసనాన్వితాః**
**దృష్టం స్వప్నజగజ్జాలం వినా చ క్వ వసంతు తే?**

"ఏ జీవులైతే మోక్షరహితులై ఉన్నారో, శరీర శూన్యులైనారో, చేతనాయుక్తులు, వాసనా సహితులు–అయి ఉన్నారో – అట్టి జీవులు జాగ్రత్తును పొందనప్పుడు ఎక్కడ ఉంటారు" అను ప్రశ్నకు నా సమాధానం విను. అట్టి జీవులు స్వప్నజగత్తులో తప్ప మఱి ఎచ్చట నివసించగలరు?

అట్లాగే నిద్రించు రాక్షసులు కూడా వారివారి స్వప్న జగజ్జాలం యొక్క వ్యవస్థను అనుసరించి వారి స్వప్న జగత్తులో వ్యవహారములు ఆచరిస్తూ ఉంటారు. ఒకవేళ వారివారి స్వప్న జగత్తులో దేవతల చేతులలో నిహతులైనారనుకో... అప్పుడు? అప్పుడు కూడా వారి యొక్క స్వప్నాంతర్గతమైన మరొక స్వప్నంలో ప్రవేశించి స్వప్నక్రియలను కొనసాగిస్తూ ఉంటారు. కాబట్టి రామచంద్రా! ఈ ప్రకారంగా స్వప్నంలో హతులైనవారు ఏం చేస్తున్నారు? వారు అజ్ఞానవశంచేత ముక్తిపొందక, చేతనరూపులవటం చేత శిలాత్వం కూడా పొందక ఉంటున్నారు. దేహం పోయిన తర్వాత మోక్ష రహితులగు జీవులు తదనంతర దేహము పొందనంతవరకు తమయందలి చేతనత్వము కారణంగా తమ తమ సంస్కారానుసారం స్వప్నజగత్తులో ప్రవేశించి ఆ స్వప్న లోకములను అనుభవిస్తున్నారు.

**శ్రీరాముడు :** మహాత్మా! దేహానంతర స్వప్నలోకములలోని ఆ మరణించినవాని జగద్దర్శనం మన ఈ శిల–కొండ–ప్రదేశాలలోని జగద్దర్శనంలాగానే ఉంటుందా? లేక మరొక రీతిగా ఉంటుందా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** మనం జాగ్రత్తులాగే ఏ విధంగా అయితే, ఈ దృశ్యమును నమ్మి 'ఇది పర్వతం- అది గ్రామం- ఇది నా దేశం-అది నీ దేశం" మొదలైనవన్నీ పొందుచున్నామో... అదే రీతిగా దేహానంతర మోక్షసిద్ధిరహిత జీవుడు కూడా అంతటి నమ్మికతోనూ, తన స్వప్నంలో పర్వత-సముద్ర- పృథ్వి-జన సమూహాదులతో కూడిన యథాస్థితమైన సమస్త దృశ్యమును చిరకాలంగా సత్యమని నమ్మి అనుభవించుచున్నాడు. కాబట్టి అతని స్వప్నము కూడా మన ఈ జాగ్రత్ స్వప్నము వంటిదే అగుచున్నది.

అతని జగత్‌స్థితి - కల్పము మనకు వలెనే ఉన్నాయి. మన జగత్‌స్థితి - కల్పము అతనికి వలెనే ఉన్నాయి. ఈ జాగ్రత్ దృశ్య జగత్తు - జగద్విషయాలు మనకు ఎంతగా అత్యంత సత్యమని అనిపిస్తోందో,... ఆ స్వప్నదృశ్యద్రష్ట అంతగానూ అది వాస్తవమేనని తలచియే అనుభవిస్తున్నాడు. ఎందుకంటే ఉభయస్థితులలోనూ ఆయా దృశ్యరూపాలుగా పరిథవించేది మనస్సే కదా!

అంతేకాదు... మనచే అనుభూతమగుచున్న ఈ జగత్తు, ఈ జగత్తులో అంతర్గతమైన మనము వారి స్వప్నములో గాంచబడటం జరిగిందా... అప్పుడు వారి స్వప్న ప్రపంచంలో మన ఈ జగత్తు కూడా ఒక విభాగమౌతోంది. అప్పుడు మనమందరం కూడా అతనికి స్వప్న పురుషులం అగుచున్నాం. అతని స్వప్న మనుజులంతా (మనమంతా) అతనికి సత్యముగానే ఉన్నారు.

**శ్రీరాముడు :** స్వామి! మీరిప్పుడు చెప్పిన చివరి వాక్యం కొంచెం ఆశ్చర్యంగా అనిపిస్తోంది. "స్వప్నం భ్రమ మాత్రమే" అనునది ప్రతి ఒక్కరి దైనందినానుభవం కదా! 'స్వప్నంలో కనిపించిన స్వప్న జనులందరూ సత్యంగానే ఉన్నారు'... అను మీ వాక్యం ఎట్లా సమన్వయించుకోవాలి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును. అందుకు కొన్ని సమన్వయ పూర్వక సిద్ధాంతాలు చెబుతాను.

1. 'స్వప్న సత్త' యొక్క చమత్కార ప్రదర్శనమే స్వప్నము.
2. 'స్వప్నసత్త' కు నిమిత్తకారణం అధిష్ఠాన సత్ - చిదాత్మయే మట్టి కుండలన్నిటికీ మట్టియే నిమిత్త కారణమైనట్లు,
3. అధిష్ఠాన చిదాత్మ సర్వగామి. అనగా, సర్వదా అంతటా ఏర్పడి ఉన్నది.

ఈ విధముగా తమయొక్క ఇతరుల యొక్క అనుభవం సమానం అవటంచేత వారి స్వప్న మనుజులు సత్యముగా ఉన్నట్లే కదా! వారి స్వప్నజగత్తులో మన ఈ జగత్తు, మన స్వప్న జగత్తులో వారి స్వప్న వివేషాలు తారసపడటం జరుగవచ్చు కూడా!

**యథా తే స్వప్న పురుషాః సత్యమాత్మన్యథా పరే**
**తథాపి స్వప్న పురుషాః సత్యమేవ తథైవ తే ॥**

ఆ స్వప్న పురుషులు వారివారి దృష్టి యందు ఏఏ విధంగా సత్యమై ఉన్నారో... ఆయా విధంగానే నా చేత, నీ చేత, ఈ సభలో సభికులందరిచేత తదితర సర్వ జీవుల చేత ప్రతి స్వప్నంలో అనుభూతులగు మనుజులంతా కూడా - స్వప్నద్రష్ట స్వరూపమైన అధిష్ఠాన ఆత్మయే అట్లు అనుభూత మగుచుండుట చేత - సత్యమే అయి ఉన్నారు. అనగా, ప్రతి ఒక్క జీవుని జాగ్రత్, స్వప్నములు స్వస్వరూప సంప్రదర్శన - సందర్శనా చమత్కారములే!

**స్వ స్వప్నపుర పౌరా యే త్వయే దృష్టాస్థథైవ తే**
**స్థితాస్తత్ర తథాద్యాపి బ్రహ్మ సర్వాత్మకం యతః**

నీవు నీ స్వప్నంలో ఏ నగరాలను, నగరవాసులను దర్శించావో... వారంతా ఆ విధంగా ఇప్పటికీ అక్కడే ఉన్నారు. ఎందుచేతనంటే బ్రహ్మం సర్వదా సర్వ స్వరూపం, సర్వాత్మకం అయి ఉన్నది కదా! స్వప్న పదార్థములు జాగ్రత్తుకు వచ్చే సరికి అవి నశించునట్లు అనుభూతమగు చున్నట్లే... అవన్నీ స్వప్నం నందు (స్వప్న సమయంలో) స్థితి కలిగి ఉన్నట్లే అనుభూతమౌతున్నాయి. స్వప్నస్థితి ఈ జాగ్రత్ వ్యవహారాన్ని నశింపజేయటం లేదు కదా! అట్లాగే జాగ్రత్‌స్థితి స్వప్నాంతర్గత ఆయా జీవాదులను నశింపజేయటం లేదు. సమస్త సత్తయు బ్రహ్మ సత్తామయమే కాబట్టి ఎద్దాని సత్తయు (జాగ్రత్ సత్త-స్వప్న సత్త) రెండవదానిని స్పృశించటం లేదు. తొలగించటం లేదు.

ఈ సమస్త జగత్తు ఆకాశం యొక్క కార్యమే! అనగా, ఆకాశమే ఇట్లు జగద్రూపంగా అనుభవ మౌతోంది. ఆకాశం నాశరహితం కదా! అట్లాగే ఇక్కడ జాగ్రత్‌నగానీ, స్వప్నమున గాని ఏదీ నశించటం లేదు, పరిధవిల్లటంలేదు. అట్లాగే సర్వము సర్వత్రా సర్వదా పరమాత్మ రూపమే అవటం చేత, ఎద్దాని రూపము కూడా ఏమాత్రమూ నశించటం లేదు. 'ఉత్పత్తి శూన్యము, ఆది-మధ్య-అంత రహితము, అనంతము' అయినట్టి 'చిదాకాశ రూప పరబ్రహ్మము' నందు అనంతములైన చిత్త సమూహములు ఉన్నాయి.

అట్టి ప్రతి ఒక్క చిత్తమునందు అసంఖ్యాకమైన జగత్ సమూహాలు ఉన్నాయి. అట్టి ప్రతి ఒక్క జగత్తు యొక్క ఆకాశంలో అనేక ప్రపంచమండలాలు ఉన్నాయి. అట్టి ప్రతి ఒక్క ప్రపంచ మండలం లోను అనేక లోకాలు ఉన్నాయి. అట్టి ప్రతి ఒక్క లోకములోను అనేక ద్వీప-ద్వీపకల్ప-పర్వత-ప్రాంత-పుర-గ్రామ-గృహాలలో అనేకమంది అసంఖ్యాక జీవులున్నారు. అట్టి ప్రతి ఒక్క జీవుని లోను, అసంఖ్యాక వత్సర-యుగాది కాల విభాగాలతో కూడిన అసంఖ్యాక జగత్తులు ఉన్నాయి.

ఒక జీవుడు జీవిస్తూ ఉండవచ్చును గాక! లేక మరణించి ఉండవచ్చు గాక! ఆ జీవుడు మోక్షమును పొందనంతవరకు అతనియందు అనంతమైన సంఖ్యలో జగత్తులు వేర్వేరుగాను, అక్షయంగాను ఉంటూనే ఉంటాయి. ఆ జీవుని వాసనల యందు మరల అసంఖ్యాక జీవులున్నారు. అట్టి వాసనలతో గల అసంఖ్యాక జీవులలోని ప్రతి ఒక్కని మనస్సులోను అసంఖ్యాక జగత్తులు ఉన్నాయి. అట్టి ఆ మనస్సులో గల ప్రతి ఒక్క జగత్తు నందలి ప్రతి ఒక్క జీవుని మనస్సునందును మరల అనేక బ్రహ్మాండములు ఉన్నాయి.

❖

ఈ విధంగా ఈ దృశ్య భ్రమ మొదలు, చివర అనేవి లేకుండానే అనంతంగా కొనసాగుచూనే ఉన్నది. దీనికి హద్దూ-అంతూ అంటూ ఏదీ లేదు. మనస్సే దాని మొదలు-మధ్య-చివర కూడా అని గ్రహించు.

కాని బ్రహ్మజ్ఞాని యొక్క దృష్టి యందు మాత్రం ఇవన్నీ కూడా బ్రహ్మరూపమే అయి ఉన్నాయి. చిదాకాశము తప్పించి వాటికి వేరే రూపమే లేదు. ఓ రామచంద్రా! ఒక గోడయందు, ఆకాశము

నందు, ఒక శిలయందు, జలమునందు, స్థలమునందు... అంతటా చిన్మాత్రమగు పరబ్రహ్మమే వేంచేసి ఉన్నది. ఈ జగత్తంతా కూడా చిన్మాత్రమే! చిన్మాత్రమే స్వప్న జగత్తు కూడా! అసలు జగత్తు అనబడే వస్తువు (పరబ్రహ్మమునకు) వేరుగా లేనే లేదు.

అట్టి చైతన్యము 'సర్వవ్యాపకం' కాబట్టి సర్వత్రా అనేక జగత్తులు ఉండి ఉన్నవే అగుచున్నాయి. అట్టి జగత్తుల సంఖ్యను లెక్కించటం ఎవరితరం అయ్యేది కాదు. అయితే... 'జ్ఞాని'దృష్టిలో మాత్రం ఈ జగత్తులన్నీ కూడా 'నిర్విశేషం, నిరతిశయానందరూపం' అయిన బ్రహ్మమే అయి ఉన్నాయి.

'అజ్ఞాని' యొక్క మనస్సుకో... అవన్నీ ఉత్తమ ఘనీభూత దృశ్యములుగానే అనుభవవానికి వస్తున్నాయి. కాబట్టి అజ్ఞానికి అతని అనర్థపరంపర ఏమాత్రం శమించటమే లేదు. జ్ఞాని వీటన్నిటినీ ఆత్మగానే దర్శిస్తున్నాడు కనుక, అతనికి అనర్థమే కనిపించటం లేదు. అజ్ఞానికి అనర్థం శమించటం లేదు. జ్ఞానికి అనర్థమేదీ కనిపించటంలేదు.

❖❖❖

# 9. విరహ గీతికలు

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు చిదాకాశంలో కల్పనా మాత్రాలైన అనేక జగజ్జాలాలను చుట్టివస్తూ ఉండగా మిమ్ములను అనుసరిస్తున్న ఆ స్త్రీ ఆర్య ఛందస్సు (వేద మంత్రాలు గానం చేసే ఒకానొక రాగం) గానం చేస్తూ ఉన్నదని అన్నారు కదా! మరి ఆమెతో మీరేమైనా సంభాషించారా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. సంభాషించాను. కమల నేత్రములతో విరాజిల్లుచున్న ఆ విద్యాధర స్త్రీ వైపుగా చూచి వినోదపూర్వకంగా నేనిట్లా సంభాషించాను.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కమలగర్భము వంటి శోభతో ప్రకాశిస్తున్న ఓ లలనా! నీవు ఎవరివి? ఇటు వైపుగా ఎందుకు వస్తున్నావు? ఎవరికి సంబంధించినదానవు? ఏమి ఇక్కడ సంచరిస్తూ నన్ను వెంబడిస్తున్నావు? ఎచటకు నీ ప్రయాణం? నీ అసలు నివాస స్థలం ఎక్కడ?

**విద్యాధర స్త్రీ :** హే మునీంద్రా! మిమ్ముల్ని అనుసరిస్తూ వస్తున్న నన్ను ఇప్పటికైనా ఇట్లా ప్రశ్నించటం నాకు సంతోషాన్ని కలుగజేస్తోంది. వినమ్రురాలనై నా వృత్తాంతమంతా ఉన్నది ఉన్నట్లుగా మీకు విన్నవించుకుంటాను. సంసారదుఃఖముచే పీడితురాలనైన నేను అట్టి దుఃఖమును, ఉపశమింపజేయ గల ఉపాయములను అర్థించే ఉద్దేశంతో మిమ్ములను అనుసరించి వస్తున్నాను. నన్ను విశ్వసించి నాపై కరుణతో నా వృత్తాంతం విని నాకు సద్గతిని ప్రసాదించే మార్గం ప్రబోధించండి.

❖

ఓ మునీంద్రా! చిదాకాశము యొక్క ఒకానొక కోణమునందు ఈ మీరు ఉంటూ ఉండే 'జగత్తు' అనే గృహం ఒక చిన్న విభాగంగా ఉన్నది. ఈ మీ జగద్రూప గృహంలో "పాతాళము-భూలోకము-స్వర్గలోకము" అనేవి 3 కూడా లోపలి గదుల వంటివి. ఈ జగత్‌గృహంలో

హిరణ్యగర్భ స్వరూపిణి (సృష్టికర్త స్వరూపిణి) యగు మాయ 'సృష్ట్యాది వైచిత్ర్య కల్పన' అనే చమత్కారం రచించింది. ఈ జగత్తు ద్వీపముల చేత, సముద్రముల చేత వలయముల వలె చుట్టబడి ఉన్నది. ఈ జగత్తుకు సప్తద్వీపములకు–సముద్రములకు ఆవల సువర్ణరంగు గల భూమి ఉన్నది. ఆ భూ ప్రదేశం 10,000 యోజనముల విస్తీర్ణం కలిగి ఉన్నది. ఆ భూప్రదేశం రాత్రులందు స్వయంగా (సూర్యాదులు లేకుండానే) ప్రకాశిస్తూ ఉంటుంది. అందులో ఈ భూభాగంలాగా ధూళి ఉండదు. ఆ భూ ప్రదేశం ఎవరు ఏది కోరితే అద్దానిని అప్పటికప్పుడే ప్రసాదించగలదు. అద్దాని శోభ ముందు మీ స్వర్గము మొదలైన లోకాలు ఎందుకూ పనికిరావు. ఎందుకంటారా? అక్కడి భూమి సంకల్పించినంత మాత్రం చేత ఏది కోరుకుంటే అది అందజేస్తూ ఉంటుంది. అది సుందర మైన భూప్రదేశం, సిద్ధులు, అప్సరసలు మొదలైన ప్రబుద్ధజీవులు లీలా విహారంగా ఆ భూప్రదేశానికి వస్తూ ఉంటారు. అట్టి ఆ విస్తార భూభాగానికి చివరగా 'లోకాలోకం' అనే ఒక ప్రసిద్ధమైన పర్వతం ఉన్నది. ఆ మహా పర్వతము యొక్క ఒక్కొక్క ప్రదేశం ఒక్కొక్క తీరుగా ఉంటుంది.

ఒకచోట మూర్ఖుని హృదయంలాగా అంధకారం. ఒకచోట సజ్జనుని మనస్సు లాగా నిత్యప్రకాశం. ఒకచోట సజ్జన సాంగత్యంలా ఆహ్లాదజనకం. ఇంకొకచోట మూర్ఖులతో సహవాసంలా దుఃఖప్రదం.

ఒకచోట బుద్ధిమంతుల చిత్తంలాగా సర్వప్రయోజన పరిపూర్ణ శోభతో గాలి, నీరు, ఫలములు లభిస్తున్నాయి. ఇంకోకచోట శుష్క–మూర్ఖ కేవల వేద పాఠకునిలా (అర్థం గ్రహించనివానిలా) నీరు, ఆహారం, పళ్ళు లభించని స్థలాలు.

ఒకచోట సూర్యకిరణాలు ప్రవేశించలేకపోతున్నాయి. మరొకచోట సూర్య, చంద్ర నక్షత్రములచే నిత్య ప్రకాశం. ఒకచోట జనావాసం. ఇంకొకచోట జనశూన్యం–జంతు, వృక్షరహితం. ఒకచోట ఉద్యానవనాలు. విద్యాధరీ గణసహితం. ఇంకొకచోట భయంకర చీకటిగుహలు. అందులో 'కుంభాండు' డనే రాక్షస జాతి నివాసం.

ఇట్లా రాక్షస–పిశాచ జనం నివసించే భయంకర స్థానాలతో, మానవ జనవాస ప్రదేశాలతో, విద్యాధర స్త్రీలు నృత్యగానాలు చేసే వీలున్న నదీతీరాలతో, వనములతో ఒప్పుతోంది.

ఆ లోకాలోక పర్వత శిఖరాలపై అనేక రత్నమయ శిలలు ఉన్నాయి. ఆ పర్వతపు ఉత్తర దిక్కు విభాగంలో గల ప్రాంతంలో అనేక పెద్ద పెద్ద గండశిలలు ఉన్నాయి. ఆ ప్రాంతపు సుదీర్ఘమైన కొండ ప్రదేశం యొక్క తూర్పువైపుగా ఒకానొక చోట గల దృఢమైన ఒక శిల యొక్క గర్భభాగమున మేము నివసిస్తూ ఉంటాము. ఆ బ్రహ్మదేవుని నియతిని అనుసరించి అక్కడ ఉన్నాము. శిలాంతర్భాగం(కొండరాయి)లో జనించాము.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఏమీ! ఆ కొండరాయిలో ఉంటున్నారా? ఎప్పటి నుండి? ఒంటరిగా ఉంటు న్నారా? ఎందుకు అక్కడ (లోకాలోక పర్వత శిఖరాలపై గల ఒకానొక కొండశిల అంతర్భాగంలో) ఉంటున్నారు.

**విద్యాధర స్త్రీ :** అవును మహర్షీ! అక్కడ నేను వసిస్తూ ఉండగా అసంఖ్యాకమైన యుగ సమూహాలు గడచిపోయాయి. ఆ శిలాగర్భ విభాగంలో నేనొక్కతినే కాదు. భ్రమరము పద్మములో సాయంకాలం చిక్కుకుని ఉన్నట్లు నా భర్త కూడా అందులోనే బద్ధుడై ఉన్నారు. మేమిద్దరం కలిసి ఉండి ఎన్నివేల సంవత్సరాల సమూహాలు గడచిపోయాయో చెప్పలేను. ఇంత సుదీర్ఘకాలం గడచిపోయినా కూడా కామవాసనా దోషముచే కాబోలు... మేము ఇరువురం మోక్షం పొందకయే ఉన్నాం. మమత్వబుద్ధి మమ్ము వెంటనంటియే ఉన్నది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ శిలాకోశ (గర్భ) విభాగం అంతా శిలా కణమయమే కదా! మీరిద్దరు అందులో వేలాది సంవత్సరాలుగా ఉండటం నాకు చమత్కారంగా ఉన్నది. సరే అయితే ఆ శిల అంతర్భాగంలో మీరిద్దరు మాత్రమే ఉన్నారా? ఇద్దరూ అందులో ఎందుకున్నారు?

**విద్యాధరి :** మేమిద్దరమే కాదు. మా పరివారమంతా కూడా అచ్చట బద్ధమై ఉన్నది. నా భర్త పురాణ పురుషుడగు (అతి ప్రాచీన కాలంగా ఉంటున్న) బ్రాహ్మణుడు. ఆయన అనేక వేల యుగాలుగా జీవించి ఉంటున్నప్పటికీ ఎక్కడికీ కదలకుండా అక్కడే ఒకే స్థానంలో ఉన్నాడు. మరింకెక్కడికీ వెళ్ళటమే లేదు.

ఆ నా పతి బాల్యకాలం నుండీ బ్రహ్మచారి అయి ఉన్నాడు. వేదము ఎఱిగినవాడు. కపటము లేనివాడు. ఇంద్రియ చాపల్యము లేనివాడు. ఏకాంతవాసి కూడా! అతని పట్ల వ్యసనురాలైన భార్యనగు నేను అతడు లేకపోతే ఒక్క నిమిషం కూడా దేహము ధరించజాల నంటే నమ్మండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అతడు మిమ్ములను ఎట్లా భార్యగా స్వీకరించాడు. మీ ఇఱువురికి స్వాభావికమైన స్నేహం ఎట్లా పెంపొందింది?

**విద్యాధరి :** కమలనేత్రుడవగు మునీంద్రా! నా భర్త అయిన ఆ బ్రాహ్మణుడు ఉత్తమ కులమున జన్మించినవాడు. బాలుని స్వభావం గలవాడు, సజ్జనుడు. చాలా వరకు జ్ఞానసంపన్నుడు. అతడు కాలక్రమంగా బాల్యం నుండి యౌవనంలో ప్రవేశించాడు. అతడు అప్పుడు ఒకసారి 'నాకు భార్యగా అగుటకు అర్హత గల ఒక స్త్రీ లభించుగాక! ఆమె నిర్మల స్థానమున వసించే కుల స్త్రీ అయి, వేదజ్ఞత్వం, వేత వేదాంగాలు గ్రహించినదై ఉండాలి. సౌందర్యవతి, సద్గుణరాశి అయి ఉండాలి' అని చిరకాలం పసిబాలుడు ఆటబొమ్మను కోరుకొనునట్లు చింతన చేశాడు. అప్పుడు చంద్రుని నుండి చంద్రిక జనించినట్లు ఆయన దేహం నుండి అనిందితం అగు శరీరం గల నేను జనించాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ విద్యాధరీ! మీరు ఎట్లా జనించారు? అతనికి సహధర్మచారిణిగా ఇతః పూర్వమే (మీరు జనించటానికి పూర్వమే) ఎవరైనా ఉండి ఉన్నారా?

**విద్యాధరి :** లేదు. అతని యొక్క శోభాయమానమగు మనస్సు నుండే నేను ఉత్పన్నమైనాను. అతని సంకల్పం యొక్క శోభ నుండి ఉద్భవించాను. ఈ విధంగా నేను అతని మానసిక భార్యను. క్రమంగా స్వాభావికమైన వస్త్రములు ధరిస్తూ సర్వ జీవుల చిత్తమును ఆహ్లాదపరుస్తూ యౌవనవతినైనాను. ఆ దశలో ఎత్తైన స్తనములతో, లేత చేతులతో, సమస్త గుణములు కలిగి ఉన్నదాననయ్యాను.

నా కళ్ళు జింక వలె పెద్దవి. నా సౌందర్యముచే సర్వ జీవుల హృదయమును హరించుదానివలె శోభించాను. సమదర్శియగు పతియొక్క మనోమయ రూపిణిని అవటం చేత నాకు కూడా 'సమత్వము' అనే లక్షణం అబ్బింది. మోహజాలమునందు పడి ఉండి కూడా సంపద–ఆపదల పట్ల భేదరహితురాలనై ఉండేదానను.

అయితే నేను లీలా విలాసములందు ప్రీతి కలిగి ఉండే దానిని. నా మనస్సు 'కౌతుకము' కలిగి ఉండేది. నాకు గాన–వాద్యములందు మిక్కిలి ప్రీతి ఉండేది.

ఓ మునీంద్రా! ఇక్కడ ఒక విషయం. నా భర్త తన సంకల్పధారణ చేత ఆ శిలాంతర్భాగంలో త్రిలోకాలు ధారణ చేస్తున్నాడు. అనగా ఆ కొండరాయిలో అతని 'ఆలోచన' లోంచి స్వర్గ–మర్త్య–పాతాళ లోకాలు ఉద్భవించి వ్యవహరిస్తున్నాయి. నేను కూడా నా భర్త యొక్క మనోమయ కల్పిత రూపిణినే కదా! కనుక నేను ఆ కొండశిలలోనే కాకుండా అక్కడ ఆయనచే కల్పించబడిన త్రిలోకములను ధారణ చేస్తూ ఉన్నాను. నేను ఆ సృష్టికర్త యొక్క కుల స్త్రీని కదా! గర్భిణి స్త్రీ తన గర్భములోని శిశువుకు పోషణను అసంకల్పితంగా అందిస్తున్నట్లుగా, నేను ఆ త్రిలోకములను పోషణ చేస్తూ ఆ త్రైలోక్యగృహం యొక్క భారము వహిస్తున్నాను.

❖

ఇది ఇట్లా ఉండగా, ఆయన మానసిక సృష్టి నుంచి జనించిన నేను ఒకప్పుడు యౌవనంలో ప్రవేశించాను. ఉన్నత స్తనములు గలదాననయ్యాను. ఆయనకు సహధర్మచారిణిగా వర్తింపటానికి ఆయన చేతనే సృష్టించబడిన నాకు వివాహితను అవటానికి సర్వ లక్షణసమన్వితను అయ్యాను. అయితే నన్ను సృష్టించిన ఆ బ్రాహ్మణుడు నన్ను వివాహం చేసుకోవటం లేదు. ఎందుకంటారా? అతడు దీర్ఘసూత్రి అయ్యాడు. పైగా అతడు వేదజ్ఞుడు. సదా తపస్సునందు ఆసక్తి గలవాడు. నేను యౌవనవతిని అయినా కూడా అతడు నా వైపు కన్నెత్తి చూడటంలేదు. ఇక నాకు అతనితో యౌవన సంపన్న భోగాలు అనుభవించాలని అత్యంత కుతూహలం. నా యౌవన కవళికలతో అతనిని ఆకర్షించ యత్నిస్తున్నప్పటికీ, అతడు మోక్షాపేక్ష వలన నన్ను పట్టించుకోవటం లేదు. అతని భోగ వ్యసన రాహిత్యం చూచి నేను అగ్ని వలె దహించుకుపోతూ ఉండేదానను. నా అవయవములు నిరంతరం అతని స్నేహము కొరకై తపిస్తూ ఉండేవి.

అతని సాంగత్యం లభించక పూర్ణవనాలు కూడా శ్మశానాలు లాగా కనబడసాగాయి. సరస్సులు నీరసంగా తోచాయి. పరిజనులైన నా ఇష్ట సఖీజనం నా దేహోపశాంతికై పుష్పశయ్యలపై పరుండబెట్టి ఊపినా కూడా అవి నాకు ముళ్ళ పొదలపై పరుండిన విధంగా బాధపెట్టసాగాయి. శీతల శిలలు నా శరీర స్పర్శకు ఉడికి మసి అవుతూ ఉండేవి. ఎక్కడైనా అందమైన ప్రకృతి దృశ్యం చూసినప్పుడు పరవశించటానికి బదులుగా నా కళ్ళు దుఃఖముతో జలపూరితమౌతుండేది. నా అశ్రుబిందువులు రాలుటచే చేతిలో ధరించిన కమలంపై ఆ బిందువులు పడి అది కాస్తా క్షణంలో శుష్కించిపోయేవి. సిగ్గుచే నా సఖీ జనంతో కూడా నా మానసిక స్థితిని చెప్పుకోలేక పోయేదానను. సారస పక్షుల జంటను చూసి అసూయతో క్రుంగిపోసాగాను. శుభసందర్భములు దుఃఖ కరములు

గాను, అశుభ సందర్భములు సుఖకరంగాను, నాకు అనిపిస్తూ ఉండేది. ఎందుకంటే ఆయా సందర్భాలలో ఎట్లా ఉంటున్నానో నాకే తెలియటం లేదు. ప్రకృతిలో రమణీయమైన పుష్పాలు, సెలయేళ్ళు మొదలైనవి శ్మశానంలో కాళ్ళకు స్పర్శించే భస్మంలాగా కనిపించసాగాయి. ఈ విధంగా నా నవయౌవన దినములు శుష్కంగా గడిచిపోసాగాయి.

❖❖❖

## 10. విరహ దశ నుండి వైరాగ్య దశ

**విద్యాధరి :** ఓ మునీంద్రా! ఆ విధంగా అతి దీర్ఘకాలం విరహం అనుభవించాను. క్రమంగా నా విషయానురాగదశ 'వైరాగ్యదశ' ను పొందింది'. మొట్టమొదట నా చిత్తములో 'విచారము' జనించ నారంభించింది.

❖

మునీంద్రా! మీకు అన్నీ తెలుసుకదా! నా భర్తయా, ఏకాంత ప్రియుడు. నీరసుడై ఉన్నవాడు. స్త్రీ స్నేహం అభిలషించనివాడు. సరళబుద్ధితో మౌనం వహించి ఉన్నవాడు. ఇక నా సౌందర్యానికి, స్త్రీత్వానికి, సౌకుమార్యానికి... అసలు నా జీవితానికి ప్రయోజనమేమున్నది చెప్పండి? అట్టి అరసికుడైన భర్తను కలిగి ఉండటం కంటే మరణమే శ్రేష్ఠమేమో? బాల్య వైధవ్యమే ఉచితమేమో! అంతకన్నా నిరంతరమైన ఆపదల మధ్య ఉండటమే మంచిదేమో! రసికుడు-కోమలమైన ప్రకృతి గలవాడు అగు యువకుడు భర్తగా లభించటమే స్త్రీ యొక్క జన్మకు సాఫల్యం. అదే అఖండసౌభాగ్యం.

అరసికుడైన భర్తను పొందిన స్త్రీ జీవితము, సంస్కారం లేనట్టి బుద్ధి, దుర్జనుల సహవాసంతో కూడి ఉన్న సిరి, వేశ్యలచే అపహరించబడిన జీవితం గల శాస్త్ర విజ్ఞాని యొక్క విజ్ఞానము – ఇవన్నీ వ్యర్థములే కదా!

పతిని అనుసరించగలిగినట్టి స్త్రీయే స్త్రీ. సజ్జనులచే పొందబడే సంపదయే సంపద. 'శమము' మొదలైన ఉత్తమ గుణములు గల బుద్ధియే బుద్ధి. 'సమబుద్ధి' సహితమైన సాధుత్వమే సాధుత్వము.

**నాఽఽధియో వ్యాధయో నైవ నాఽఽపదో న దురీతయః**
**కుర్వన్తి మనసో బాధాం, దంపత్యోః అనురక్తయోః ॥**

పరస్పరమూ అనురాగం కలిగి ఉన్న దంపతుల మనస్సుకు ఆధి-వ్యాధులు గాని, ఆపదలు గాని ఉండవు. అతివృష్టి-అనావృష్టి వంటి ఉపద్రవములు బాధను కలిగించజాలవు. దుష్టుడైన (లేక) అనురక్తి రహితుడైన పతి కలిగిన స్త్రీకి సంపదలు కూడా ఆపదలుగానే ప్రాప్తిస్తాయి. స్త్రీ ఈ ప్రపంచంలో సర్వసంపదలూ త్యజించటానికైనా సిద్ధపడుతుంది గాని, ప్రమాదవశంగా పతి మాత్రం కూడా దూరం కావటం సహించలేదు కదా!

మునీంద్రా! నా దౌర్భాగ్యం చూడండి. యౌవనంలో ఉన్న నేను భర్త సమీపంలో ఉంటునే భర్త యొక్క కరస్పర్శ, సాంగత్యము సంపాదించుకోలేక అనేక సంవత్సరాలు గడిపాను. అట్లా

దీర్ఘకాలం గడిచిపోవటంచేత క్రమంగా భోగముల పట్ల నాకున్న అనురక్తి కాస్తా విరక్తి రూపం దాల్చసాగింది. వైరాగ్య వాసన పొంది సమస్త పదార్థముల పట్ల 'విరాగము' కలదాననైనాను. ఇక 'ముక్తిని పొందాలి' అనే ఉద్దేశంతో మీ వద్ద 'ఉపదేశము' పొందదలిచాను.

ఇష్ట పదార్థములను పొందనివారికి... పరబ్రహ్మమునందు విశ్రాంతి పొందని బుద్ధి కలవారికి... మరణతుల్యములైన దుఃఖ ప్రవాహములందు కొట్టుకొని పోవువారికి... అట్టి వారికి 'జీవించటం' కంటే మరణించటమే శ్రేష్ఠం అగుచున్నది కదా!

ఇక నా పతి విషయం! రాజు సహాయంతోనే మరొక రాజును జయించుటకు ప్రయత్నిస్తారు చూచారా? అట్లా నా భర్త రాత్రింబగళ్ళు 'నిర్వాణము' గురించిన చేష్టయందు తత్పరుడై 'మనస్సు' చేత 'మనస్సు'ను జయించే ఉద్యమంలో ఉన్నారు. నన్ను ఏమాత్రం విపేక్షించక ఆత్మయందే స్థితి కలిగి ఉండే ప్రయత్నంలో నిమగ్నులై ఉన్నారు. దానితో నాకు కూడా ఈ జగత్ స్థితి యందు వైరాగ్యం కలిగింది. అట్లా వైరాగ్యం కలిగిన నాటినుండి నా యందు సంసార వాసన యొక్క ఆవేశం సన్నగిలసాగింది. అప్పుడిక 'ఖేచరీ ముద్ర' ను ధారణ చేసి, అట్టి అవలంబనచే ఆకాశగమన స్థితిని పొందాను. క్రమంగా ఆకాశ నివాసులగు సిద్ధులతో సంభాషించగల ధారణను అభ్యసించాను. ఆ తర్వాత యోగదృష్టితో నేనున్న బ్రహ్మాండము యొక్క పూర్వాపరాలను దర్శించగలిగే ధారణకు ఉపక్రమించాను. క్రమంగా అట్టి ధారణ నాకు సిద్ధించింది. ఆ తర్వాత ఆ బ్రహ్మాండము యొక్క అంతర్గతములైన సమస్త పదార్థములను దర్శించి, వాటికి అతీత్వము సంపాదించి ఆ బ్రహ్మాండము నుంచి యోగశక్తితో బహిర్గతురాలను కాగలిగాను. అట్లా బయల్వెడలి వచ్చిన తర్వాత నేనీ లోకాలోక పర్వతాలను చూడగలిగాను.

ఓ మునీంద్రా! ఇంతకాలం ఈ బ్రహ్మాండాలను చూడాలనే ఇచ్ఛ మా దంపతులిద్దరికీ కలుగనే లేదు. అయితే నేను మాత్రం ధారణశక్తిచే ఆ బ్రహ్మాండంలో నుంచి బయల్వెడలాను కదా! నా భర్త మాత్రం ఎటువంటి కోర్కెలు లేనివాడై కేవలం వేదములచే ప్రతిపాదించబడిన శుద్ధధర్మం యొక్క-పరమాత్మ యొక్క అనన్యచింతనలో మాత్రమే మునిగి తేలుచున్నారు. ఆయనకు కాలం యొక్క అంగములైనట్టి భూత-వర్తమాన-భవిష్యత్తుల ధ్యాసగాని, పదార్థముల దృష్టిగాని లేదు. అయినప్పటికీ కూడా అతడు బ్రహ్మత్వాన్ని వాస్తవంగా ఎఱుగనేలేదని నా అభిప్రాయం. విద్వాంసుడు అయి ఉండి కూడా నా భర్త బ్రహ్మ పదమును పొంది ఉండలేదు. ఈ కారణం చేత మా దంపతుల మిరువురం ప్రయత్నించి బ్రహ్మపదము యొక్క ఉపదేశం పొందాలని నిశ్చయించుకున్నాం.

కాబట్టి మహాత్మా...! బ్రహ్మజ్ఞానము కొఱకై మేమిరువురము మిమ్ములను ప్రార్థిస్తున్నాము. మా ఈ ప్రార్థనను సఫలం చేయమని మా విన్నపం. తమ ఉపదేశ ప్రభావం చేత బ్రహ్మపదము పొందాలని వాంఛిస్తున్నాం. మహనీయులను అర్థించినవారెవరూ నిష్ఫలులు కారు కదా! హే మహనీయా! ఆకాశంలో సిద్ధుల సేవలు అందుకునే నేను మీ వంటి అజ్ఞానారణ్యాన్ని భస్మీభూతం చేయగల జ్ఞానాగ్నిని మరెక్కడా చూడలేదు. తమవంటి సజ్జనులు ఏ కారణం లేకుండానే

అర్థించువారి అభీష్టములను సిద్ధింపజేస్తారని లోకప్రతీతి. కనుక మిమ్ములను శరణువేడినట్టి మమ్ము "ఉపేక్షించకండి" అని అభ్యర్థిస్తున్నాం.

❖❖❖

# 11. అవకాశమే లేని శిలాంతర్భాగంలో బ్రహ్మాండమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అలా ఆమె నాతో పలికింది. బ్రహ్మాండాకాశమున కల్పించ బడిన ఆసనంపై ఆసీనురాలై చెప్పుచున్న ఆమె మాటలన్నీ విన్నాను. ఆమెతో ఇట్లా సంభాషించాను.

❖

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ బాలా! మీ వంటి దేహధారులకు ఆ శిల లోపల స్థితి ఎట్లా సంభవించింది? ఆ శిలలో బ్రహ్మాండము-గృహాలు-బ్రహ్మాండాంతర్గత సంచలనాలు ఎలా ఏర్పడ్డాయి?

**విద్యాధరి :** మునీంద్రా! తమ యొక్క ఈ విశాలమైన జగత్తు ఎట్లా విరాజిల్లుతోందో, అదేరీతిగా ఆ శిలలో కూడా సంసారయుక్తమైన మా యొక్క జగత్తు కూడా విరాజిల్లుతోంది. ఆ మా జగత్తులో కూడా... పాతాళంలో నాగులు, దైత్యులు, దానవులు; భూమిపై పర్వతాలు, ద్వీపాలు, సముద్రాలు, ప్రాణిసమూహాలు; ఆకాశంలో వాయువీచికలు, గంధర్వనగరాలు; సముద్రంలో జలపూర్ణాలు, జల జంతువులు; జనుల రాకపోకల, పుట్టుక, చావు వ్యవహారాలు; గ్రహాలు, నక్షత్రమండలాలు; రాజులు భూమిని ఏలటాలు; నదులు సముద్రం వరకు ప్రవహించటాలు; దేవత, అసుర, మనుష్యుల సంచనాలు, వ్యవహారాలు; ఆకాశమేఘాలు, కల్పవవ, కల్పంతాలు; కాలగతి యొక్క మార్పు, చేర్పుల చమత్కారాలు; జ్యోతిష్యులచే ఎఱుగబడే ఉత్పాత, గ్రహణ, ఉల్కాపాతాలు... ఇటువంటి సర్వ వ్యవహారాలు ఆ శిలాంతర్భాగంలోని ఒక రేణువులోనే ఉండి ఉన్నాయి. స్వామీ! "ఇవన్నీ ఆశ్చర్యం కదా?" అని అంటారేమో! అట్లా అయితే, తామే దయచేసి ఆ శిల వద్దకు వచ్చి శిలాంతర్భాగ జగత్తును ప్రత్యక్షంగా వీక్షించవచ్చు. ఎందుకంటే ఏదైనా ఆశ్చర్యకరమైన విషయం తటస్థించి నప్పుడు మహనీయులు అద్దానిని పరిశీలించి అర్థం చేసుకొనే కుతూహలం కలిగి ఉంటారు కదా!

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆమె అన్న మాటలు విని ఆ శిలాంతర్గత బ్రహ్మాండమును చూడటానికి నేను ఒప్పుకున్నాను. శూన్యమగు ఆకాశంలో వీచే గాలి వీచికల వెంట సుగంధం పయనించినట్లు నేను ఆమెను అనుసరించి ప్రయాణించసాగాను. ఆకాశంలో సుదూరంగా ప్రయాణించి దేవతలు మొదలైన అనేక భూత సమూహములను అధిగమించి లోకాలోక పర్వతంపై గల ఆకాశం చేరాం. ఉత్తర దిశ యొక్క పూర్వ భాగాన గల మేఘపంక్తిలోంచి క్రిందికి దిగి బంగారపు రంగుతో ప్రకాశించే ఒక శిలను సమీపించాం. ఆ విద్యాధరి ఆ శిల వైపు 'ఇదియే నేను చెప్పిన శిల' అనే అర్థం వచ్చేటట్లు చేతివ్రేళ్ళను, కనుబొమలను కదిలించింది. ఆ శిలవైపు నేను కొద్దిసేపు ఏకాగ్రదృష్టితో చూచాను. అది మామూలు పసిమిఛాయతో కూడిన శిలగానే కనిపించింది నాకు. మరి అందులో ఆమె వర్ణించి చెప్పిన జగత్తేమీ కనిపించనేలేదు.

**నేను (శ్రీవసిష్ఠ మహర్షి) :** అమ్మా! మీరు చెప్పిన సూర్య–చంద్ర–నక్షత్రమండలాది విశేషములతో కూడిన సముద్ర–ఆకాశ–దిక్కులతో కూడిన జగత్తేదీ కనిపించడం లేదే? మీరు చెప్పిన లోకాలు–సురాసుర మానవాది జీవులు మొదలైన సంరంభమంతా ఎచట? ఇది ఒక సామాన్యమైన శిలే కదా?

నేను అడిగిన ప్రశ్న విని ఆ విద్యాధర స్త్రీ కొంచెం ఆశ్చర్యం ప్రకటించింది. నా వైపు, ఆ శిల వైపు మార్చి మార్చి చూచి, ఇట్లా అన్నది.

**విద్యాధరి :** ఓ మునీంద్రా! మీ మాటలు ఆశ్చర్యంగా ఉన్నాయే! అద్దంలో ప్రతిబింబించిన నగరం లాగా ఈ శిలలో దేవ–మనుష్య–ఆకాశ–సముద్రాదులతో కూడిన మా జగత్తు నాకు స్పష్టంగా అగుపడుతోంది. మరి మీకు కనిపించక, నాకు ఎట్లా కనిపిస్తోందంటారా?

ఈ శిలలో మా జగత్తును గాంచటం నాకు నిత్యానుభవమే అయి ఉన్నది. మీరు జగత్తును భావించటం లేదు కాబట్టి ఇక్కడి జగత్తు మీ కగుపించటమే లేదు. స్వామీ! ఇందులో మీకు తెలియని క్రొత్త విషయమేమున్నది? సర్వజీవులూ విశుద్ధ మనోమయదేహులే అయినప్పటికీ... ఈ మనస్సు అనేది వాస్తవానికి సర్వ సూక్ష్మ పదార్థములను గ్రహించగల శక్తి అంతర్గతంగా కలిగి ఉన్నప్పటికీ కూడా... సుదీర్ఘ కాలంగా అభ్యసిస్తూ వస్తున్న ద్వైత వృత్తుల కారణంగా ఒక్కొక్క సందర్భంలో సూక్ష్మ విషయాలు గమనించకయే ఉంటోంది. ఎవడు ఎట్టి దృష్టి (లేక) ధ్యాసను అభ్యసిస్తాడో అదియే దృఢాభ్యాస సంస్కార ప్రభావం చేత చిత్తము యొక్క ఘనీభూతానుభవంగా ప్రాప్తించటమనేది ఈ చిత్తము యొక్క స్వభావమే అయి ఉన్నది. చిన్నపిల్లవాడి నుండి వయోవృద్ధుని వరకు... ఏది ఎట్లు అభ్యాసపూర్వకంగా భావిస్తే అది అట్లే సిద్ధించటమనేది గమనార్హమే కదా! "ఏ సూక్ష్మజ్ఞానం (లేక) బ్రహ్మజ్ఞానం నిరంతర అభ్యాసంచే సిద్ధిస్తుందో... అట్టిది శాస్త్రాలు చదువుటచే గాని, సుదీర్ఘ తర్కాలచే గాని, ఉపన్యాసాదులు వినుటచే గాని సిద్ధించదు" అని శాస్త్రములు కూడా ఒప్పుకుంటున్న విషయమే కదా! ఇంతెందుకూ...? ఉదాహరణకు నన్నే తీసుకోండి. కొంతకాలం క్రింద నా జగత్తులో నాచే పొందబడుచున్న పరిసరాలన్నీ నా యొక్క 'విరహవేదన' కారణంగా కాబోలు, అత్యంత దుర్భరంగా కన్పట్టుచూ ఉండేవి. చిరకాలంగా వ్యర్థంగా ప్రవృత్తమైన నా పతి వృథా సంబంధమైన బాధ వలన స్వతహాగా అతి స్వచ్ఛము–వ్యాపకము అయినట్టి నా సూక్ష్మజ్ఞానం మరుగున పడింది. ఆ సమయంలో స్థూలంగా ఈ జగత్తు అభ్యస్తమై నా అనుభవంలో ఉండేది. అట్టి అప్పటి స్వకీయ జగత్తు ఇప్పుడు ఈ క్షణంలో గడిచిపోయిన స్వప్నంలాగా నశించిన దానివలె అస్పష్టమైన రూపంగా కనిపిస్తోంది. ఆకాశంలో లతను (భ్రమచే) చూచేవానికి కొంతసేపు మరొక వైపు చూచి మరల ఆకాశంలోకి చూస్తే ఆ 'లత' కనిపించదు చూచారా? అట్లా నాచే సుస్పష్టంగా ఇతఃపూర్వం గాంచబడిన ఈ శిలలోని జగత్తు ఇప్పుడు ప్రతిబింబంలాగా కొంత అస్పష్టంగా కనిపిస్తోంది. అందుకు కారణం అప్పటి అనురక్తి తరువాత క్రమంగా విరక్తి అభ్యసించి ఉండటమే!

అంతేకాదు...! ఒక భ్రమ అభ్యాసవశం చేత ఏర్పడి, ఇంతలోనే వేరైన మరొక భ్రమను అభ్యసిస్తూ వస్తున్న కారణంగా మొదటి భ్రమ క్రమంగా తొలగటం కూడా లోకంలో అందరి అనుభవమే కదా! ఉదాహరణకు బాల్యంలోని "ఆటలు" అనే భ్రమ యౌవన దశలో తొలగి,

ఇంతలోనే 'స్త్రీ సౌందర్యం-ప్రేమాకర్షణ' వంటి భ్రమలు చిత్తమును జేరుచున్నాయి. యౌవనదశలో ఆ జీవుడు బాల్య క్రీడలను "ఆ..! అవన్నీ నా భ్రమే కదా!" అని అనుకుంటూనే వర్తమానంలోని 'ప్రేమాధిక్యత' అనే భ్రమలో మునిగి తేలుతూ ఉంటాడు. క్రమంగా మరికొంత కాలానికి మధ్య వయస్సులో... యౌవన సంబంధమైన ప్రేమను ఉద్దేశించి... "ఆహా! అదంతా భ్రమే కదా!" అని తలచుచూనే వర్తమానంలోని "ధనధ్యాస-సంఘ గౌరవం" వంటి భ్రమలో ప్రవేశిస్తూ ఉంటాడు.

ఈ విధంగా ఈ జీవుని పట్ల నిరంతరం ఒక భ్రమ తొలగి మరొక భ్రమ చోటు చేసుకోవటమే ఈ సంసారం యొక్క లక్షణం కదా! అయితే ఈ జీవుడు స్వతహాగా శుద్ధజ్ఞాన స్వరూపుడు అయి ఉండి కూడా 'భ్రమపరంపరలు' అనే ఆవరణచే ఆవరించబడి ఉన్నాడు. ఇప్పుడు నా విషయమే తీసుకోండి. తమతోటి 'సంవాదం' అనే ఈ భ్రమ ఇతఃపూర్వపు నిరంతరాభ్యాసముచే జనించి ఉన్న భ్రమను చాలా వరకు జయించివేసింది. ఈ జీవుడు పొందే రెండు భ్రమలలో ఏది బలవత్తరమైతే, అది రెండవదానిని జయించి వేయటం ప్రతివారికీ దైనందినానుభవమే కదా!

కనుక ఓ మునీంద్రా! ఒక ఇష్టమైన వస్తువును కోరుకునే వారికి ఆ వస్తువు గురించి తెలిసి ఉన్నవారు అత్యంత ప్రియులు అవుతారుకదా! అట్లాగే ఈ అజ్ఞానజనిత సంసార భ్రమ తొలగాలంటే ఉత్తమ గురువు యొక్క ఉపదేశమును ఆశ్రయించి మరల మరల అభ్యసించటం తప్పించి వేఱే ఉపాయమేమున్నది? దృఢమైన అహంభావరూపం, అనాది అయినట్టి అజ్ఞాన భ్రమ శ్రవణ మననాది జ్ఞానరూప విచారణ చేత, తదభ్యాసం చేత తప్పకుండా శమిస్తుంది కదా! మరి అభ్యాసము యొక్క ప్రభావం అంతటిది!

హే మహర్షీ! నేను మీకు శిష్యురాలనై మిమ్ములను శరణు వేడుచున్నాను. అజ్ఞానకారణంగా అబలను. బాలను. అయితే, నా యొక్క అభ్యాసవశం చేతనే ఈ శిలాంతర్గమైన జగత్తును వీక్షిస్తు న్నాను. తమరు సర్వజ్ఞులగు గురువులు అయినప్పటికీ కూడా ఈ శిలయందు 'జగద్దర్శనం' అనే అభ్యాసం లేకపోవటం చేతనే నాకు కనబడుచున్న జగత్తు మీకు అగుపించటం లేదు.

ఆహా! 'అభ్యాసం' యొక్క ప్రభావం ఎట్టిదో మీకు తెలిసినదే కదా! అభ్యాసవశం చేత అజ్ఞాని జ్ఞాని అగుచున్నాడు. అభ్యాస బలం చేత గొప్ప పర్వతం కూడా మెల్లమెల్లగా పిండి పిండిగా అగు చున్నది. అభ్యాస ప్రభావం చేత ఒక విలుకాడు సుదూరంగా ఉన్న సూక్ష్మమైన లక్ష్యాన్ని బాణంతో ఛేదించగలుగుచున్నాడు. మహాదృఢం-మిథ్య అయినట్టి 'అజ్ఞానం' అనే మహమ్మారి కూడా తత్త్వ విచారణ రూపమైన అభ్యాసం చేత శమించిపోతుంది. అభ్యాసవశం చేతనే కొందరు కారపు వస్తువును చప్పరించి మహదానందంగా మ్రింగుచున్నారు. చేదు వస్తువును కొందరు ఇష్టంగా నములు చున్నారు. తీపి అయిన వస్తువు మధురంగా ఉండటానికి అభ్యాసమే కారణం. అభ్యాసవశం చేత కొంచెం కూడా పరిచయం లేని క్రొత్తవ్యక్తి కొన్నాళ్ళకు అతి సన్నిహితుడైన మిత్రుడుగా అగుచున్నాడు.

**అబంధుః బంధతామేతి నైకట్యాభ్యాస యోగతః ।**
**యాతి అనభ్యాసతో దూరత్ స్నేహో బంధుషు తానవమ్ ॥**

అట్లాగే వర్తమానంలో ఎంతో అన్యోనంగా ఉన్న అన్నదమ్ములు మొదలైన బంధువులు అభ్యాస రాహిత్యం కారణంగా కొద్దిరోజులు దూరంగా ఉండటం చేత ఒకరి గురించి మరొకరు స్నేహభావం కోల్పోతున్నారు. శుద్ధ చిదాకాశమగు సూక్ష్మ శరీరం స్వకీయ భావనాభ్యాసంచేత స్థూలత్వం (భౌతికరూపం) సంతరించుకుంటోంది.

అభ్యాసం యొక్క ప్రభావం ఇంతా అంతా కాదు. ఒక స్థూల శరీరధారి కూడా 'ప్రాణాయామం' మొదలైన అభ్యాసం చేత, ధారణ చేత పక్షివలె ఆకాశంలో ఎగురగలుగుచున్నాడు.

**పుణ్యాని యాన్తి వైఫల్యం, వైఫల్యం యాన్తి మాతరః**
**భాగ్యాని యాన్తి వైఫల్యం, న అభ్యాసస్తు కదాచన ॥**

ఓ మునీంద్రా! గొప్ప పుణ్యం నిష్ఫలం కావచ్చునేమో! తల్లి కూడా బిడ్డను ద్వేషించవచ్చునేమో! సిరులు, భాగ్యాలు నిరుపయోగం కావచ్చునేమో! కాని అభ్యాసం మాత్రం ఎన్నటికీ నిష్ఫలం కాదు.

**దుస్సాధ్యాః సిద్ధిమాయాన్తి రిపవో యాన్తి మిత్రతామ్**
**విషాని అమృతతాం యాన్తి సంతతాభ్యాసయోగతః ॥**

నిరంతరమైన అభ్యాసయోగం చేత దుస్సాధ్యాలగు కార్యాలు కూడా సుసాధ్యం అవుతాయి. శత్రువులు కూడా మిత్రులు అవుతారు. విషం కూడా అమృతంగా అవగలదు. కాబట్టి ఒకడు "నాకు అదంటే ఇష్టం. అయితే అది పొందటానికై అభ్యాసం కొఱకు మాత్రం నేను సిద్ధం కాను"... అని అనుకుంటే అతడు మూర్ఖుడే అవుతాడు. వంధ్య తన పుత్రుని ఎప్పటికీ పొందలేదు. అభ్యాసం లేకుండా అభిలషించేవాడు అభిలషిత వస్తువును ఎప్పటికీ పొందలేడు. అభ్యాసం లేకుండా అభిలషించటమనేదే ఈ సంసార జీవుని దౌర్భాగ్యం. మృత్యు పర్యంతమూ ప్రతి జీవునికీ 'బ్రతికి ఉండాలి' అనే అభిమతం ఉంటుంది. అయితే యోగులు తమ అభ్యాసం చేత యుక్తిపూర్వకంగా మృత్యు భయాన్ని తొలగించుకొని ఉంటారు.

కొందరు ధన-దారాదులు అతి ప్రియంగా అనిపిస్తూ ఉన్నప్పటికీ వైరాగ్యాభ్యాసం చేత వాటి పట్ల గల అభినివేశాన్ని యుక్తిపూర్వకంగా త్యజించగలుగుచున్నారు. యోగ్యాభ్యాసం చేత వాటి నుంచి వచ్చే మనోవ్యాకులతను దూరం చేసుకోగలుగుచున్నారు. ఆహా! ఏం ఆశ్చర్యం! ప్రతి మానవునికి అన్నింటికంటే తనంటే తనకే ఇష్టం కదా! ప్రతి ఒక్కరికీ అత్యంత ఇష్టమైన వస్తువైన 'ఆత్మజ్ఞానం' అనే అభ్యాసాన్ని త్యజించి కొందరు మనుజాధములు దేహాదులందలి అహంభావం అనే అరిష్ట వస్తువును ఆశ్రయించి అందుకు ఫలితంగా ఒక దుఃఖం నుండి మరొక దుఃఖం వైపుగా పయనిస్తూనే పోవుచున్నారే!

**తరంతి సరితం స్ఫీతాం సంసార అసార సేవినః ।**
**త ఏవ 'ఆత్మ విచారాఖ్యమ్' అభ్యాసం న త్యజన్తి యే ॥**

'ఈ సంసారం అసారం' అనే వివేకమును ఆశ్రయించి ఎవరైతే 'ఆత్మవిచారణ' అనే అభ్యాసమును త్యజించకయే ఉంటారో... వారు మాత్రమే ఈ విశాలమైన 'మాయ'ను దాటివేయ గలుగుతారు. చీకట్లో 'కుండ' ఎక్కడున్నదో తెలుసుకోవాలనుకుంటే గుడిసెలో దీపం వెలిగించి

చూస్తేనే... కుండ కనబడుతుంది. కదా! శ్రవణము-మననము మొదలైన రూపమైన నిరంతరమైన - శ్రద్ధతో కూడిన అభ్యాసములచే మాత్రమే సాధకుడు నిర్విఘ్నంగా ఆత్మ వస్తువును దర్శించ గలుగుతాడు. కల్పవృక్షం ఏది కోరితే అది ప్రసాదించగలదు. 'ఆత్మవిచారణ' అనే చిరకాల అభ్యాసంచే అతి దుర్భరమనిపించే ఇంద్రియ విషయ జనితములైన రాగ-ద్వేషములను విజ్ఞులు క్రమంగా జయించి వేస్తున్నారు. సూర్యుడొక్కడే సమస్తమునూ ప్రకాశింపజేస్తున్నట్లు... 'అభ్యాసం' అనేదే సర్వ అజ్ఞానాంధకారాలనూ పటాపంచలు చేయగలదు.

ఈ 14 లోకాలలో ఏ జీవునికైనా-ఏదైనా సరే, అభ్యాసం లేకుండా లభించడమే లేదు. అభ్యాసాలలో కెల్లా ఉత్తమ ప్రయోజనం కలిగించేది 'ఆత్మవిచారణ' అను అభ్యాసమే కదా! దానినే 'పురుష ప్రయత్నం' అని కూడా అంటారు. అది తప్పితే ముక్తికి వేరే స్థానము-మార్గము ఏమున్నది? ఎవరికైనా సరే, 'దృఢాభ్యాసము' అనే స్వప్రయత్న రూపమైన కర్మచే మాత్రమే మోక్షసిద్ధి లభిస్తోంది. అంతకుమించి వేరు త్రోవలేదు. ఓ మునీంద్రా! 'అభ్యాసము'ను ఆశ్రయించే జితేంద్రియునికి లభించని-సిద్ధించని పదార్థం ఎక్కడా ఏదీ లేదు, ఉండజాలదు. అటువంటి అభ్యాసం చేతనే కొండగుహలలో ఏకాంత ప్రదేశంలో కూడా కొండచిలువ అభయరూపంగా ఉండగలుగుతోంది.

❖❖❖

## 12. స్థూలదేహ భ్రాంతి - సూక్ష్మదేహ సత్యము

**విద్యాధరి :** హే మహర్షీ! ఈ జీవుడు అభ్యాసవశం చేతనే భ్రమమాత్రమగు ఈ స్థూల దేహభ్రాంతిని పెంపొందించు భ్రమలో చిక్కుకొని ఉంటున్నాడు. అట్టి భ్రమ ఏకానేక దుఃఖపరంపరలకు దారి తీస్తోంది. దేహాదుల పట్ల బంధుమిత్ర వ్యవహారముల పట్ల ఏర్పడిన 'స్థూల దేహభ్రాంతి' అనేది సమాధి యొక్క దృఢాభ్యాసం లేకపోతే తొలగదు. సూక్ష్మభావం కలుగదు. అందుచేత నిర్మలమగు పరమాత్మయందు సర్వజ్ఞత్వం కలుగటానికిగాను మనమిద్దరం సమాధిని అభ్యాసం నిర్వర్తించెదం గాక! అప్పుడు గాని ఈ శిలలో ఉన్న జగత్తు ప్రకటన కాదు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విద్యాధరి యొక్క యుక్తియుక్తమైన వాక్యములు విన్న నేను అప్పుడు పద్మాసనం వైచుకొని సమాధికై ఉద్యుక్తుడను అయ్యాను. క్రమంగా సమస్త పదార్థములకు సంబంధించిన భావనను త్యజించివేశాను. 'నిర్మల చిత్'ను మాత్రమే భావన చేయసాగాను. క్రమ-క్రమంగా ఆ సమయంలో నా దృష్టిలో ఏర్పడి ఉన్న స్థూల దేహసంబంధమైన భావన-సంస్కారాలను మొదలంట త్యజించివేశాను. అట్టి చిదాకాశరూపాన్ని పొందటంచేత నేను 'దివ్యదృష్టి'ని సంతరించు కున్నాను. అట్టి సత్యమగు 'పరమాత్మ' యొక్క దృఢాభ్యాసం చేత దేహసంబంధమైన ఆధిభౌతిక భ్రాంతి పూర్తిగా శమించింది. ఉదయాస్తమయ రహితం, నిత్యస్వయంప్రకాశం, నిర్మలము అగు మహాచిదాకాశము నాకు ప్రకటనమయింది.

అప్పుడు 'నిజసాక్షిచైతన్యము' యొక్క నిర్మల తేజముచే అంతకుముందు కనిపించిన శిలవైపు మరల చూచాను. అప్పుడు నాకు శిల కనిపించలేదు. ఆకాశమూ కనిపించలేదు. అంతా కూడా పరమాత్మమయంగా కనిపించింది.

**పరమార్థఘనం స్వచ్ఛం తత్ తథా భాతి తాదృశమ్ ।**
**తథా భావనయా హి ఆత్మా మదీయో దృష్టవాంస్తథా ॥**

నా ఆత్మయే ఆ శిలారూపంగా కూడా భాసించుచున్నట్లు అనుభవమైంది. అంతే కాకుండా నా ఆత్మయే తన యొక్క "శిలాభావన" చే శిలను గాంచుచున్నదని అనుభవమౌతోంది.

**శ్రీరాముడు :** మహాత్మా! ఆశ్చర్యంగా ఉన్నదే! మీ ఆత్మయే ఇటు ద్రష్టగాను-అటు దృశ్యవిభాగమగు శిలగాను అనుభవమగుచున్నట్లు మీకు అనుభూతమగుచున్నదా! ఇది యుక్తియుక్తమేనా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఎందుకు యుక్తియుక్తం కాదు? దృష్టాంతానికి ఒక స్వప్నద్రష్టకు స్వప్నంలోని గృహంలో చూడబడిన శిల స్వప్నద్రష్ట యొక్క చైతన్యరూపమే కదా! అట్లాగే స్వతఃసిద్ధం - నిర్మలం అగు స్వస్వరూపచైతన్యమే అచ్చట కూడా శిలారూపంగా స్ఫురిస్తోంది. ఒకడు జ్ఞాని అయినా, అజ్ఞాని అయినా కూడా ఆ ఇరువురికి స్ఫురించేది, అనుభవమయ్యేది కూడా చైతన్యమే. "స్వకీయ చైతన్యమే ఆ ఇరువురిపట్ల అట్లు ఆ రూపమున స్ఫురిస్తోంది" అనునది ఆత్మజ్ఞానసారం.

ఇక జ్ఞానికి అజ్ఞానికి ఉన్న భేదమేమి అంటావా? స్వప్నం గనుచున్న ఒకానొకడు ఆ స్వప్నంతో ఉంటూనే "ఇప్పుడు నాకు మెలుకువ వచ్చింది" అని తలచుచూ ఆ స్వప్నంలోనే మరొకరూపం ధరించటం ఎటువంటిదో... అజ్ఞానదశలోనే ఉండి "నేను ప్రబుద్ధుడను అయ్యాను" అని తలచు స్థితి అటువంటిది. ఎందుకంటే శాస్త్ర శబ్దమాత్రజ్ఞానం నిజమైన జ్ఞానం కాదు. "అంతటా నా స్వరూపమే తాండవిస్తోంది"... అను సుస్పష్టమైన ఘనీభూత అనుభవమే జ్ఞానం. ఏ జీవుడు తన సర్వాంతర్యామి స్వరూపమును గమనించక "నేను ఆత్మ స్వరూపుడనే" అని పెదవులతో మాత్రం చెప్తుతూ ఉంటాడో, అట్టివాడు అట్లు ఉచ్చరించి కూడా ఏం ప్రయోజనం? స్వప్నంలో శిరశ్ఛేదం జరిగినప్పటికీ ఆ స్వప్నద్రష్ట జాగ్రత్తుకు రానంతవరకు స్వప్నంలోనే ఉంటూనే ఉంటాడు కదా! అట్లాగే ఘనమైన "అజ్ఞాన రూపనిద్ర" లో ఉన్నవాడు అజ్ఞాన మూలం తొలగించుకొన్నపుడు మాత్రమే "జ్ఞానరూప జాగ్రత్" కలుగగలదు. ఇక భౌతికమైన జాగ్రత్ నిజమైన జాగ్రత్ కాదు.

**బోధః కాలేన భవతి మహామోహవతామసి**
**యస్మాత్ న కించనాపి అస్తి బ్రహ్మతత్త్వాదృతేఽక్షయమ్**

ఎందుకంటే... వాస్తవానికి జాగ్రత్-స్వప్నముల ఉభయములోనూ అక్షయమగు 'బ్రహ్మ తత్త్వము' తప్పించి మరింకేమి లేదు. జ్ఞాని అయినా, అజ్ఞాని అయినా తాను తెలిసిగాని, తెలియక గాని జగత్తుగా చూస్తున్నది తన ఆత్మస్వరూపమునే!

ఈ కారణం చేత "నిర్మలము, చిద్ఘనము" అగు చిదాకాశమే శిలాకారంగా అక్కడ నాకు కనిపించింది. అంతేకాని ఆదిభౌతిక శిలాకారంగా కాదు. సృష్ట్యాది యందు ఏ "శుద్ధ పారమార్థిక

బ్రహ్మస్వరూపం" ఉన్నదో అదియే సమస్త పదార్థముల యొక్క రూపమై ఉన్నది. అదియే తత్త్వజ్ఞులకు ధ్యాన లభ్యమగుచున్న అంతిమ సాక్ష్యాత్కారం కూడా! ఓ రామచంద్రా! "అనాది, శాశ్వతం" అగు బ్రహ్మస్వరూపమే ఈ సమస్త ప్రాణుల యొక్క యథార్థ రూపమై ఉన్నది. అదియే ఇప్పుడు అజ్ఞానులచే "మనోరాజ్యం" అని, "సంకల్ప నగరం" అని, "సంసారం" అని, "జగత్తు" అని చెప్పబడుతోంది. బ్రహ్మచైతన్యము యొక్క మాయతో కూడిన జగత్ సంస్కారసహితమగు పరమార్థ సత్తావిభాగమే "సూక్ష్మ శరీరం" అని శాస్త్రములచే పిలువబడుతోంది. అంతేకాదు. అపరోక్ష రూపమగు "శుద్ధచిత్ అంశ" యే "ఆది" అగు "చిత్ స్వరూప ప్రకాశము" అని చెప్పబడుతోంది. ప్రతి జీవి కూడా స్థూల రూపుడు కాదు సూక్ష్మరూపుడూ కాదు. అతడు "ఆది" యగు చిత్‌స్వరూపదేహుడేనయ్యా!

ఆ చైతన్య సత్తారూపమే ఈ సృష్ట్యాదిలో ఉదయించుచున్న దాని వలె ఉంటోంది. అదియే మొట్ట మొదటి సృష్టి యొక్క అధ్యక్ష రూపం అనతగు "సమష్టి జీవుని యొక్క మనో శరీరం" అని చెప్పబడే హిరణ్యగర్భ శరీరమగుచున్నది. అదియే బుద్ధియొక్క మాంద్యం చేత తన సమష్టి భావనను కూడా మరిచి వ్యష్టిత్వమును ఆపాదించుకొంటోంది. అదియే సర్వ జీవులలో ప్రత్యక్షమై ఉంటున్న మనస్సు. ఈ ప్రకారంగా "చిత్" స్వరూపం స్వయంగా సమష్టి రూపం పొందినట్లున్నదగుచున్నది కదా! అట్టి సమష్టి రూపానుభవమునే "యోగిమనః ప్రత్యక్షం" అంటారు. ఆ సమష్టిలో ఒక అల్ప విభాగం అనతగు వ్యష్టియొక్క అనుభవమును 'సామాన్యమనః ప్రత్యక్షం' అంటున్నారు. అనగా 1. "యోగి మనః ప్రత్యక్షం" గాను, 2."సామాన్య మనః ప్రత్యక్షంగాను" అగుచున్నది ఆ చిత్ సత్తాయేగాని మరొకటేదీ కాదు. అట్లా యోగి మనః ప్రత్యక్షత్వం (సమష్టి) సామాన్య మనః ప్రత్యక్షత్వం (వ్యష్టిత్వం) అను రెండూ కూడా అజ్ఞానం చేతనే ఏర్పడుచున్నాయి. ఓ రామచంద్రా! అట్లా వ్యష్టిస్థూల శరీరాది మనః ప్రత్యక్షంగా ఏది కనబడుతోందో... అది అసద్రూపమని గ్రహించు. ఇక సమష్టి సూక్ష్మ శరీరాది యోగ ప్రత్యక్షంగా కనిపించేదే ముఖ్య ప్రత్యక్షమని గ్రహించు.

ఆహాఁ! పరమాత్మ యొక్క మాయ ఎంత చిత్రమైనది! ముఖ్యమైనట్టి సమష్టి మనస్సు యొక్క ప్రత్యక్షము పరోక్షంగా కనిపిస్తోంది. అత్యంత కల్పితము అయినట్టి వ్యష్టి మనస్సు యొక్క ప్రత్యక్షము ఎదురుగా నిజమై ఉన్నట్లుగా భ్రమింపజేస్తోంది కదా!

ఓ రామచంద్రా! మొట్ట మొదటి చైతన్యంలో సూక్ష్మ శరీరం ప్రత్యక్షం అవుతోంది. అందుచేత అట్టి సూక్ష్మ శరీరమే (అతివాహక దేహమే) సత్యమని, సర్వ వ్యాపకమై ఉన్నదని గ్రహించు. ఇక ఈ భౌతికమగు స్థూల దేహమంటావా... ఇది మిథ్య మాత్రమే సుమా. బంగారు ఆభరణంలో ఆభరణం అతి స్పష్టంగా కనిపించవచ్చుగాక! బంగారమునకు వేరై 'ఆభరణము' అనేది ఎక్కడున్నది చెప్పు? ఆ ఆభరణంగా కనిపించేదంతా బంగారంకాక మరింకేమి కాదు కదా! అట్లాగే సూక్ష్మ శరీరము యొక్క "అధి భౌతికత్వము" అనేది వాస్తవానికి లేదు.

**శ్రీరాముడు :** ఈ భౌతిక శరీరము మిథ్య మాత్రమేనని మీరు ప్రవచిస్తున్నారు. కాని భౌతిక శరీరం అగుపిస్తోంది కదా! కళ్ళకు కనిపించేది అసత్యమని ఎట్లా అనటం ?

**శ్రీవసిష్ఠ మహర్షి :** కళ్ళకు కనిపించినంత మాత్రం చేత నిజమా? కనిపిస్తూ కూడా సత్యం కానివి అనేకం ఉన్నాయి. దూరం నుంచి కొండ నునుపుగా కనిపించువచ్చుగాక! అది వాస్తవమా? జలంలో తరంగాలు ఉండటమేమిటి? జలమే తరంగాలుగా కనిపిస్తోందిగా? "దిక్కులు" అనేవి భూమి-సూర్యుల ఉనికిచే కల్పించబడినవి మాత్రమే కదా! శూన్యాకాశం నీలంగా కనిపిస్తున్నప్పటికీ, అక్కడ నీలత్వమున్నదా? ఆహాఁ! ఈ జనుల యొక్క మూఢత్వం ఏమని చెప్పాలి? తత్త్వవిచారణ లేకపోవటం చేతనే జీవుడు భ్రమను అభ్రమగాను, అభ్రమను భ్రమగాను గాంచుచున్నాడు కదా!

**ఆధి భౌతిక దేహోఽయం విచారేణ న లభ్యతమే ।**
**ఆతివాహిక దేహస్తు కిల లోకద్వయే అక్షయః ॥**

"ఈ భౌతికదేహం ఉంటేనే నాకు ఉనికి, ఇది లేకపోతే నాకు ఉనికి లేదు" అని ఈ జీవుడు ఎందుకో భ్రమిస్తున్నాడు? స్వప్నంలో కూడా (స్థూలదేహం వినియోగపడుచుండనప్పటికీ) శబ్దస్పర్శ రూపాదులతో కూడిన అనుభవం ఉంటోంది. భౌతికదేహం ఉపయోగించబడకుండానే అది ప్రాప్తిస్తోంది కదా! కనుక భౌతికదేహం లేకపోయినప్పుడు కూడా "అనుభవం" అనునది కొనసాగుచూనే ఉంటుంది. అసలు, విచారణ చేసి చూస్తే "వాస్తవానికి భౌతికదేహం లేదు" అని గ్రహించబడగలదు.

**శ్రీ రాముడు :** మరి అతివాహిక (సూక్ష్మ) దేహమో?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సూక్ష్మ శరీరం మోక్షపర్యంతం ఈ ఇహ పరలోకాలో తిరుగాడుతూనే ఉంటుంది.

**శ్రీరాముడు :** మహర్షీ! "సూక్ష్మ శరీరోపహితమైన చైతన్యమునందు ఈ స్థూల రూపత్వం ప్రకటితమౌతోంది" అని అనవచ్చా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** సూక్ష్మ దేహంలో ఏ ఈ స్థూల దేహత్వం కనిపిస్తోందో... అది ఎండమావులలో కనిపించే జలతరంగాల వలె కేవలం భ్రమ (లేక) మిథ్య మాత్రమే! చీకట్లో రాయిని చూచి ఎవరో కూర్చొని ఉన్నట్లు భ్రమ కలుగుతోంది చూచావా? కంటి దోషము చేత రెండవ చంద్రుడు అగుపిస్తాడే! అవన్నీ భ్రమయొక్క అభ్యాసం చేత క్రమంగా ఘనీభూతమై ప్రాప్తిస్తున్నట్లే... స్థూల శరీరమునకు సంబంధించిన దృఢ సంస్కారంచే స్థూల బుద్ధి ప్రౌఢత్వం చెందినదై ఉంటోంది. స్థూల శరీరత్వమనేది మిథ్య. మాయా జనితము మాత్రమే అయినప్పటికీ... అది అభ్యాసవశంగా ఏర్పడి ఉంటోంది.

**యత్ అసత్... తత్ కృతం సత్యం, యత్ సత్యం... తత్ అసత్ కృతం ।**
**అహో ను మోహమహాత్మ్యం! జీవస్య అస్య అవిచారజం ॥**

ఆహాఁ! అవివేకంచే ఉత్పన్నమౌతున్న ఈ జీవుని మోహము యొక్క మాహాత్మ్యం ఎంతటిది! అతడు అసత్తును సత్తుగాను సత్తును అసత్తుగాను గాంచుచున్నాడే! ఏది ఏమైనా... యోగుల యొక్క సూక్ష్మ ప్రత్యక్షమే (యోగులకు అనుభవమయ్యే సర్వ వ్యాపకమగు సూక్ష్మ దేహానుభవమే) సత్యం. ఇక ఈ మనోస్పందము మాటేమిటంటావా? అది కించిత్ సత్యంగా చెప్పబడుతోంది. ఎందుకంటే ఈ ఇహ-పర ఉభయ లోకముల యొక్క వ్యవహార సిద్ధికి 1.సూక్ష్మ (సర్వగతమైన) శరీర స్ఫూర్తి, 2.మానసిక చేష్ట... ఈ రెండింటి చేతనే అగుచున్నది కదా!

❖

ఓ రామచంద్రా! ప్రత్యక్షము అనేది రెండు రకములు. అవి - 1. స్థూల శరీర ప్రత్యక్షము, 2. సూక్ష్మ శరీర ప్రత్యక్షము. మొదటిది భ్రమ. రెండవది సత్యం.

ఎవడైతే "ఆది" అనతగు "సూక్ష్మ శరీర ప్రత్యక్షము" ను వదలి "ఈ స్థూల దేహ ప్రత్యక్షమే సత్యం" అను బుద్ధి కలిగి ఉంటాడో... అట్టి వాడు మృగతృష్ణాజలం త్రాగి సుఖంగా ఉన్నవాడే అగుచున్నాడు. బంగారమును వదలి ఆభరణము స్వీకరించువాడు అవుతాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జీవుడు స్వతహాగా సర్వగతమగు సూక్ష్మదేహి అయి కూడా, మరి స్థూల శరీర స్వభావం (భౌతిక దేహమే నేను-అను పరిమిత/సంకుచిత తత్త్వం) అనే భ్రష్టత్వమునకు ఎందుకు లోను అగుచున్నాడు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** జీవునిలో ఎప్పుడో అజ్ఞానంతో కూడిన "సుఖాశ" ప్రవేశించటంచే అతడు క్రమంగా స్థూల దేహ పరిమితత్వం ఆశ్రయించటం, స్వస్వరూప సర్వగతత్వం ఏమరచటం జరుగుతోంది అయితే...

**యత్ సుఖం దుఃఖమేవాహుః క్షణనాశానుభూతిభిః ।**
**అకృత్రిమమ్ అనాద్యన్తం యత్సుఖమ్ తత్సుఖం విదుః ॥**

ఈ దేహములోని పంచేంద్రియములకు సంబంధించిన విషయ సుఖం క్షణభంగురమైనదని వివేకులు గమనించుచున్నారు. అందుకే వారు విషయ సుఖంగా కనిపించుచున్న దానిని "ఇది దుఃఖము కొఱకే" అని చెప్పుచున్నారు. ఇంకా, "సహజము-అనాది-అనంతము అగు ఆత్మజ్ఞాన జనిత సుఖమునే వాస్తవమైన సుఖం" అని గమనిస్తున్నారు.

❖❖❖

## 13. సూక్ష్మదేహ ప్రత్యక్షం ద్వారా సాక్షి చైతన్య దర్శనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ జనులారా!

**ప్రత్యక్షేణైవమ్ అధ్యక్షం ప్రత్యక్షం ప్రవిచార్యతామ్**
**యదాద్యం తతసత్ అధ్యక్షం తత్ప్రత్యక్షేణ దృశ్యతామ్ ॥**

మీరంతా "సూక్ష్మ శరీర ప్రత్యక్షము" చేతనే అధ్యక్ష రూపమగు "సాక్షి చైతన్య ప్రత్యక్షము" గురించి విచారణ చేయాలి. సమస్తమునకు 'ఆది' అయినట్టి సాక్షిచైతన్య ప్రత్యక్షమును శుద్ధమగు సూక్ష్మ చైతన్య ప్రత్యక్షముతో దర్శించాలి సుమా!

నాయనలారా! మూడు లోకముల అనుభవమును ప్రసాదించగల మీ యొక్క సూక్ష్మ చైతన్య ప్రత్యక్షమును వదలి,... 'ఐహికము-మాయా స్వరూపం' అయినట్టి ఈ స్థూల శరీరాది ప్రత్యక్షమును ఎవడు గ్రహిస్తాడో,... అతడి కంటే తెలివి తక్కువవాడు మరొకడు ఉండడు. ఓ రామచంద్రా! వాస్తవానికి ఈ జీవులకు సూక్ష్మ శరీరం మాత్రమే ఉన్నది. అందులో స్థూల శరీరం గురించిన వ్యాప్తి ఉండటమనేది అసత్యమైన పిశాచం ఆవహించటం వంటిది. మొదలే ఉత్పత్తి కానిది, సంకల్పానుసారంగా అనుభవమయ్యేది అగు స్థూలదేహ ప్రత్యక్షం సత్యమెట్లా అవుతుంది? అంతేగాక,... స్వయంగా అసత్యమైనవి అర్థ-క్రియ-సామర్థ్యం ఎట్లా కలిగి ఉంటుంది?

ఈ స్థూల దేహ ప్రత్యక్షం యొక్క ఉపకరణములు అనతగు ఈ కళ్ళు–చెవులు మొదలైనవే యోగుల దృష్టిలో అసత్యాలై ఉండగా... ఇక వానిచే ప్రాప్తిస్తున్న తదితర విషయాల గురించి వేఱే చెప్పేదేమున్నది? అసత్యమగు పదార్థములచే సిద్ధించేదంతా అసత్యమేగాని, సత్యమెట్లా అవుతుంది? ఈ విధంగా ప్రత్యక్షములైయున్న చెవులు–చర్మం–కళ్ళు–నాలుక–ముక్కు అసత్యములై ఉండగా, వాటి విషయములైన శబ్ద–స్పర్శ–రూప–రస–గంధములనే అనుమానముల గురించి ఇంకేమి చెప్పాలి. ఎచ్చట పెద్దపెద్ద ఏనుగులే కొట్టుకుపోతున్నాయో అచట గొఱ్ఱెల గురించి చెప్పేదేముంది? అందుచేత రామచంద్రా! ఎదురుగా సిద్ధించుచున్న ఈ దృశ్యం మొదలే లేదు. ఏది ఉన్నట్లుగా భాసించుచున్నదో... అది సద్రూపమగు సాక్షి చైతన్యము కంటే వేరుకాదు. కనుక "దృశ్యంగా కనిపించేదంతా మహాచిద్ఘనమగు బ్రహ్మమే" అను ఎఱుకను భద్రపరచుకొని ఉండు.

**శ్రీరాముడు :** స్వామీ! 'ఈ దృశ్యం లేదు' అని ప్రవచిస్తున్నారు కదా! మరి ఎదురుగా ఆ శిల ఉన్నది. అది శిలగా మీకు–నాకు కూడా కనిపిస్తోంది కదా! ఎదురుగా కనిపించేది లేదని గ్రహించటమెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఒకనికి కలలో ఒక పర్వతం కనిపిస్తోందనుకో. అతనికి అది సత్యము వలెనే తోచుచున్నది. అయితే వాస్తవానికి అతనికి కనిపించిన పర్వతం శూన్యమేకదా!

**1. స్వప్నే ద్రష్టుః ఖమేవ – అద్రిః – గృహే – నాఽన్యస్యవై యథా ॥**

ఆ ప్రక్కనే మెళుకువతో ఉన్న అతని బంధువునకు అతనికి కనిపించిన పర్వతం శూన్యం–భ్రమ–ఊహ మాత్రం కాదా! స్వప్నంలో కనిపించిన ఆకాశం, కొండ ఇల్లు, ఒకే భ్రమచే కల్పించ బడినవే కదా! అట్లాగే,

**2. తథా తద్భావనవతోరావయోః సా శిలైవ చిత్ ॥**

శిలా భావంతో కూడుకొని ఉన్న మన ఇద్దరికీ ఆ ఎదురుగా కనబడేది శిలగానే కనిపిస్తున్నప్పటికీ వాస్తవానికి అది చిద్రూపమే అయి ఉన్నది. "ఇది పర్వతం–అది ఆకాశం–ఇది జగత్తు–అది నేను" ఈ మొదలైన రూపములతో చిదాకాశము–చిన్మయము అగు ఆత్మయే తనయందు అట్లట్లుగా స్వయంగా భాసిస్తోంది. ఎందుకంటావేమో! దీనినంతా ప్రబుద్ధమగు చైతన్యమే తన యందు అట్లు గాంచుచున్నది. అప్రబుద్ధమైనదేదీ ఎచటకూడా గాంచటం లేదు. కథార్థం వినేవాడికే తెలుస్తుంది గాని, విననివానికి తెలియదు కదా! మద్యం త్రాగిన వారికి నిజంగానే చెట్లు–కొండలు నృత్యం చేస్తున్నట్లు కనిపిస్తుంది. అట్లాగే అజ్ఞాన భ్రాంతికి అనేకములుగా కనిపించే జగత్తు సత్యత్వము పొందుతోంది. అనగా అప్రబుద్ధునికి "ఇవన్నీ ఇట్లు నిజమే కదా"... అని అనిపిస్తోంది. కనుక రామచంద్రా! మరల చెప్పుచున్నాను.

యోగులకు ప్రత్యక్షమై, సర్వత్రా అప్రతిహతమై, ఏకమై, బోధ రూపమైనట్టి, "పూర్ణానందైక రసము" అగు చిత్స్వరూపమును గ్రహించకుండా ఎవరైతే తుచ్ఛమగు జగద్రూప ప్రత్యక్షమును ఆశ్రయించి ఉంటారో అట్టి మూఢులు ఆత్మవంచకులు. తృణప్రాయులు. వారి వలన ఏ శాశ్వత ప్రయోజనమూ ఉండదు. మనస్సుతో ఆత్మను ఎఱిగినవారే ధన్యులు.

ఆ విరామమగు బ్రహ్మము ఈ సమస్త బ్రహ్మాండములూ తన అవయవములుగా కలిగి ఉన్నది. అది ఈ భౌతిక సూర్య-చంద్రాదులచేత గాని, భౌతికమైన ఈ కనులకు గాని అప్రకాశితమై ఉంటోంది. అది వాస్తవానికి అదృశ్యము అయినప్పటికీ దృశ్యంగా ఉన్నదంతా అదే! అట్టి నిరామయ బ్రహ్మము సమాధి యొక్క దృష్టిచే అత్యంత స్పష్టంగా కనిపించగలదు సుమా!

అట్టి "చిదాకాశం" అనే గొప్ప అద్దంలో ఈ "పర్వత-నదీ-లోక-లోకాంతరములు, దేహదుల రాక-పోకలు, మనో-బుద్ధ్యాది అంతరంగ విభాగాలు" అనే రూపభ్రమలన్నీ భాసిస్తున్నాయి. అద్దంలో ప్రతిబింబించేవి అద్దంలో స్పృశిస్తున్నాయా? లేదుకదా! ఈ శరీర - మనో - బుద్ధి ధర్మాలు, ఈ జగత్ దృశ్య దర్శ- అదర్శనాలు ఆత్మను స్పృశించజాలవు.

❖❖❖

# 14. అన్యజగద్బ్రహ్మ దర్శనం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అప్పుడు ఆ విద్యాధరి అనిరుద్ధమైన (Unstoppable) చేష్ట కలిగినదై అక్కడి శిల యొక్క అంతర్గతమై ఉన్న సృష్టిలో ప్రవేశించింది. నేను కూడా నా యొక్క సంకల్ప సమేతుడనై ఆ సృష్టిలో ప్రవేశించాను. మేమిద్దరం ఆ సృష్టిలోని బ్రహ్మలోకం ప్రవేశించాం. ఆమె భర్త ఉన్న మందిరంలో అడుగిడాము.

**విద్యాధరి :** హే మునిశ్రేష్ఠా! ఈతడే నా భర్త. నన్ను వివాహం చేసుకోవాలనే ఉద్దేశంతో పూర్వ కాలంలో నన్ను సృష్టించారు. ఇప్పటికి ఆయన ముదుసలి అయ్యారు. అయినా కూడా నన్ను ఇప్పటిదాకా వివాహమాడలేదు. కాబట్టి నాకు వైరాగ్యం కలిగింది. నా ఈ పతి కూడా విరాగి అయినారు. ఈయన "ద్రష్ట-దృశ్యము-శూన్యత్వము" లేనట్టి నిర్మలమైన పదమును పొందాలనే అభిలాషతో ఉన్నారు. ఇప్పుడు ఈ జగత్తుకు మహా ప్రళయం దాపరించినా కూడా పట్టించుకొనే స్థితిలో లేరు. తన ధ్యానమునందే మౌనం వహించి పర్వతమువలె చలించక ఉన్నారు.

కాబట్టి స్వామీ! నన్ను నా పతిని మీ తత్త్వోపదేశముచే ప్రబోధమొనర్చి పునీతులని చేయమని నా విన్నపం. మహాకల్పము వరకు గల సమస్త సృష్టుల యొక్క మూలభూతమైన బ్రహ్మమునకు మాకు మార్గం చూపండి.

ఓ రామచంద్రా! ఇట్లా ఆ విద్యాధరి నాతో పలుకుచున్నప్పుడు ఆమె పతి సమాధిని ఆశ్రయించి ఉన్నాడు. అప్పుడామె ఆయనతో మంద్రస్వరంతో ఇట్లా పలికింది. "స్వామీ! ఈ రోజు మన గృహం పావనమైంది. మునిశ్రేష్ఠులైన వసిష్ఠ మహర్షి మన గృహానికి వేంచేశారు. వీరు మరొక బ్రహ్మాండానికి ప్రభువైనట్టి బ్రహ్మదేవుని కుమారులు. పూజార్హులు. కనుక, కనులు తెరిచి వీరికి సుస్వాగతం పలకమని ప్రార్థన. వీరిని అర్ఘ్యపాద్యాలతో పూజించండి. మహనీయులను సత్కరించటం వలన ఫలమేమిటో మీకు వేరే నేను చెప్పనక్కర్లేదు కదా!"

వీణవలె మంద్రము-సుమధురము అయిన ఆమె శబ్దజాలాలను విని మహాబుద్ధియగు బ్రహ్మ క్రమంగా స్పందించసాగారు. నిశ్చలజలంలో ఆవర్తంలాగా సమాధి నుండి లేచారు.

నెమ్మదిగా కనులు తెరిచారు. దేహమంతా మెల్లగా దృశ్యజ్ఞానం ప్రకటనమైంది. వెంటనే నా వైపు చూచారు. చిరునవ్వుతో ఆయన పెదవులు విచ్చుకున్నాయి. ఇంతలో దేవ-సిద్ధ-అప్సరస సమూహములు అచ్చటకి వచ్చి ఆజ్ఞలకై నిలుచున్నారు.

**అన్య జగత్ బ్రహ్మ :** అసారమైన సంసారము యొక్క సారభూతమైన 'ఆత్మ' ను కరతలామలకముగా గాంచుచున్న ఓ మునీంద్రా! వసిష్ఠ మహర్షీ! మీకు సుస్వాగతం. జ్ఞానామృత మహాసముద్రుడవగు ఓ మహాత్మా! మీకు సర్వదా శుభమగుగాక! మీ రాకతో మా ఈ బ్రహ్మాండ గృహం పావనమైనది. మీరు చాలా దూరంనుంచి శ్రమపొంది వచ్చారు. రండి. ఇక్కడి ఈ ఆసనంపై సుఖాశీనులు కండు.

❖

రామచంద్రా! అక్కడి గంధర్వ-ముని-విద్యాధరుల స్తోత్రాలకు చిరునవ్వుతో సమాధానం చెప్పాను. అప్పుడు ఆ అన్య జగత్‌బ్రహ్మతో ఇట్లు పలికాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** హే మహాత్మా! బ్రహ్మదేవా! మీరు భూత-భవిష్యత్-వర్తమానములకు ప్రభువు. ఈ విద్యాధరీమాత అత్యంత ఏకాంతాకాశ ప్రదేశంలో ఉన్న నన్ను సమీపించి 'జ్ఞానయుక్తములైన వాక్యాలతో మా ఇద్దరికి ఆత్మజ్ఞానం ప్రబోధించాలి' అని కోరింది. ఇది యుక్తమేనంటారా! ఎందు చేతనంటారా? మీరు సకల జ్ఞాన పారంగతులు. సర్వ భూతములకు ప్రభువు. అన్నీ ఎఱిగినవారు. ఇక నేను బోధించగలిగిన దేముంటుంది? ఇక ఈ విద్యాధరి కామదృష్టి కలిగి ఉండటం చేత బోధకు అనర్హురాలు. మరి ఈమె ఆత్మజ్ఞానము కొఱకు నన్ను ఇట్లు ఎందుకు అర్థించిందో మీరే కారణం తెలియజేయ గోరుచున్నాను. అంతేకాదు మరొక ప్రశ్న "నాకు పత్ని కావాలి" - అనే ఉద్దేశంతో మీరు ఈమెను సృష్టించారు. మరి మీరు ఈమెను భార్య స్థానమును ప్రసాదించలేదేమిటి? మఱియు ఈమెకు వైరాగ్యదశను ఎట్లా పెంపొందించారు? ఈ విషయం కూడా నా అర్హతను దృష్టిలో ఉంచుకొని నాకు తెలియజేయవలసినదిగా నా విన్నపం.

**అన్యజగత్ బ్రహ్మ :** ఓ మునీశ్వరా! ఆ వృత్తాంతమంతా ఉన్నది ఉన్నట్లు తెలియజేస్తున్నాను వినండి. సజ్జనులకు యథార్థం తెలియజేయటం ఉచితం కదా! సర్వమునకు ఆదికారణమైన 'సత్' పదం ఒక్కటి ఉన్నది. అది సర్వదా యథాతథం, జన్మాదిరహితం, జరావర్జితం, చిద్రూపం అయి ఉన్నది. అట్టి 'కేవల చిత్ ప్రకాశం' నుండి అనిర్వచనీయంగా నేను ప్రకటనమయ్యాను. చిదాకాశం నుండి ఉదయించిన నేను కూడా చిదాకాశ రూపుడనే. సదా ఆత్మయందే నెలకొని ఉన్నాను. ఈ ప్రజాసృష్టి విద్యమానమైనప్పుడు నేను ఈ ఈ జనుల దృష్టిలో "స్వయంభువు" అను పేరు కలవాడను అగుచున్నాను. ఇక "నేను-నీవు-నాది-వారు-వీరు-మన ఈ పరస్పర సంభాషణ"... ఇవన్నీ కూడా ఏకమగు సముద్రమునందు తరంగ భేదముచే జనించిన శబ్దముల వంటివి మాత్రమే!

**వస్తుతస్తు న జాతో౽స్మి, నచ పశ్యామి కించన**
**చిదాకాశశ్చిదాకాశే తిష్ఠామ్యహమ్ అనావృతః ॥**

యథార్థానికి నేను ఏ సమయమందును ఉత్పన్నము కానేలేదు. దేనినీ గాంచుటయూ లేదు. నిరావరణుడను. చిదాకాశరూపుడను అగు నేను చిదాకాశమునే స్థితి కలిగి ఉన్నాను.

ఈ విధంగా సముద్రజలంలోంచి బయల్వెడలిన తరంగంలాగా ఒకప్పుడు ఒకింత దృశ్య రూపం కలవాడనయ్యాను. కొంతకాలం గడిచింది. కాలవశం చేత మరికొంత స్వరూప విస్మరణం జరిగింది. ఆ కారణం చేత అశుద్ధమైన ఆకృతి కలవాడనయ్యాను. చిదాకాశరూపుడనగు నా యొక్క అంతఃకరణమున స్వభావంగా 'నేను-నాది' అను వాసన ఉదయించింది. అట్టి 'నేను' అనేది పరబ్రహ్మమే! నా దృష్టి యందు 'నేను'గా భాసించేది, 'మీరు' మొదలైన వాటిగా భాసించేది భిన్నం కాదు. కాబట్టి ఇతరుల దృష్టిలో నేను ఉదయించినట్లుగా ఉన్నప్పటికీ నా దృష్టి యందు చిదాకాశమున ఏదీ ఉత్పన్నము కాకయే ఉన్నది.

నేను నాశరహితమైన సత్తాస్వరూపుడను. ఏ సమయమందునూ దృశ్యరూపంగా ఉదయించని వాడను. ఆత్మస్వభావం నుండి చ్యుతి నొందనట్టి ఆకృతి కలవాడను. స్వాత్మారాముడను. స్వయం ప్రభువువై ఆత్మరూపుడనై ఆత్మయందే నెలకొని ఉన్నవాడను. ఇక ఈ విద్యాధరి అంటావా? ఆమె మీరు అన్నట్లు నా సంకల్పముచే దేవరూపిణి అయి వెలయుచున్నది. ఈమె పూర్వ-పూర్వ అహంకార స్మృతి రూపమగు 'అహం' అను భ్రాంతి, జగతి, వాసన యొక్క అధిష్ఠాత్రి అయిన దేవత!

ఈ విధంగా ఈమె వాసన యొక్క అధిష్ఠాన దేవతయే గాని ఈమె నా గృహిణి కాదు. గృహిణి కొరకై వాస్తవానికి ఈమెను నేను సృజించలేదు. అనగా, ఈమె నా అంతరంగమున "సర్వజగద్వాసన అయి ఉన్నది. స్వవాసనావశం చేత 'నేను బ్రహ్మదేవుని గృహిణిని' అను భావనను కల్పించుకొని ఉన్నది. అట్టి స్వకీయ కల్పనచే వ్యర్థంగా స్వయంగా దుఃఖమును పొందుచున్నది. ఆమె నా వాసనా స్వరూపమే గాని అందుకు వేరైన రూపమేదీ లేదు. నాకు వేరైనది కాదు.

❖❖❖

# 5. సృష్టిగా కనిపిస్తున్నది బ్రహ్మమే!

**అన్య జగత్ బ్రహ్మ :** ఓ మునీంద్రా! వసిష్ఠ మహర్షీ! ఇప్పటి వరకు అతి దీర్ఘకాలం స్వసంకల్పితమైన బ్రహ్మాండ రచనను నా వాసనా ప్రభావం చేత ఆస్వాదించాను. అనుభవించాను. ఇక ద్విపదార్థాంత కాలం సమీపిస్తోంది. నాకు ద్వితీయమైనదిగా పొందబడినదంతా ఉపసంహారం చేయబోతున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ ద్వితీయ రచన అయిన బ్రహ్మాండమును ఉపసంహరించి ఏం చేయాలను కుంటున్నారు?

**అన్య జగత్ బ్రహ్మ :** స్వయంకల్పితమైన ద్వితీయత్వమును ఉపసంహరించి అద్వితీయత్వం సంతరించుకో బోవుచున్నాను. అనగా "చిద్వివర్త రూపం, చిన్మయమైనట్టి చిత్తాకాశరూపం" కలిగి ఉన్న నేను ఈ కల్పితమైన ఆయువు పూర్తి అగుచుండుటచేత సర్వ కల్పనలు త్యజించి తిరిగి "పరము, నిరతిశయానంద రూపం, చిదాకాశం" అయిన కైవల్యస్థితిని పొందదలచుకున్నాను.

కాబట్టి స్వవాసనాకల్పితమైన ఈ జగత్తుకు మహా ప్రళయము సంభవించబోతోంది. మహా ప్రళయం సమీపించటాన్ని పురస్కరించుకొని నేను ఈ విద్యాధరిని త్యజించడం మొదలెట్టాను.

అందుచేత ఈమె వైరాగ్యం పొందింది. నేను ఈ చిత్తాకాశత్వమును త్యజించి బ్రహ్మాకాశత్వమును పొందిన మఱుక్షణం మహాప్రళయం, వాసనాక్షయం సంభవించనున్నది. ఈ కారణం చేతనే ఈ విద్యాధరి విరక్తి చెందినదై నా మార్గమగు "బ్రహ్మ జ్ఞానముచే నిర్విషయస్థితి" వైపుగా పరిణమించ ప్రారంభిస్తోంది. తనను నిర్మించిన వారిని అనుసరించటం వస్తు ధర్మం కదా! ఆభరణత్వం వీడిన ఆభరణం తిరిగి కేవలం బంగారం అవటం యుక్తమే కదా!

ఇప్పుడు చతుర్యుగాలు (కృత-త్రేతా-ద్వాపర-కలియుగాలు) చివరికి వచ్చాయి. కలియుగ అంతం సమీపించింది. అట్లాగే ప్రజాపతి-మనువు-ఇంద్రుడు-దేవతలు-కల్పము-మహా కల్పముల సంబంధమైన నా వాసన క్షయిస్తోంది. దేహాకాశం అంతం కానున్నది. సరస్సు ఎండిపోతే కమలం కూడా ఎండునట్లు, తత్సంబంధమైన సువాసనలు కూడా రహితమై పోవునట్లు, నా సర్వ వాసనలు నశించనున్నాయి.

జడమైన సముద్రంలో ఏ కారణం లేకుండానే చంచలమైన తరంగాలు పుడతాయి చూచారా? అభిమానముచే దేహములు ధరిస్తూ వస్తున్న ఈ 'వాసన' యందు ఏ బాహ్య కారణం లేకుండానే స్వభావవశం చేత 'ఆత్మ దర్శనం' గురించిన ఇచ్ఛ స్వయంగా జనించుచున్నది. నా యొక్క వాసనా స్వరూపమైనట్టి ఈ విద్యాధరి స్వయంగా ఆత్మత్త్వం బోధించగల మిమ్ములను వెతుక్కుంటూ ఈ బ్రహ్మాండం నుండి బయల్వెడలింది. ధర్మ-అర్థ-కామ-మోక్షములనే పురుషార్థములను సాధించుట యందు వ్యగ్రులైనట్టి ప్రజలు ఉండే మీ బ్రహ్మాండమును గాంచగలిగింది. ఆకాశ గమనమున తత్పర అయిన ఈమె ఈ జగత్తుకు స్థానభూతమైన లోకాలోక పర్వతంపై గల శిలను చూసింది.

**శ్రీవసిష్ఠ మహర్షి :** లోకాలోక పర్వతముపై గల ఆ శిలలో ఈ బ్రహ్మాండం ఎందుకు, ఏ కారణం చేత నిర్మించబడింది?

**అన్య జగత్ బ్రహ్మ :** అందుకు ప్రత్యేకమైన కారణం అంటూ ఏముంటుంది? మా దృష్టియందు ఆ శిల చిదాకాశరూపమే అయి ఉన్నది. ఆ మాటకు వస్తే ఏ లోకాలోక పర్వతముపై గల ఏ శిలలో ఈ బ్రహ్మాండం ఉన్నదో... అటువంటి బ్రహ్మాండాలు తదితర శిలలలో కూడా ఉన్నాయి. అటువంటి ప్రతి బ్రహ్మాండంలోనూ అసంఖ్యాక పర్వత శిలలు, ఆ శిలలలో అసంఖ్యాక బ్రహ్మాండాలు ఉన్నాయి. ఆ అనేక బ్రహ్మాండాలు భేద దృష్టి కలవారికి కనిపించవు. ఎప్పుడైతే మనం సమాధిచే 'బోధైకత్వము' పొందుతామో అప్పుడు యోగదృష్టిచే ఆ అనేక బ్రహ్మాండములను గాంచగలం. ఏ సమతత్త్వము అంతటా (అన్ని జీవులలోను) సర్వదా అభేద రూపమై ప్రకాశిస్తోందో... దాని దర్శనమే బోధైకత్వం. ఆ శిలలో బ్రహ్మాండము ఉన్నట్లే ఒక ఘటము (కుండ) యందు వస్త్రమునందు, మట్టి చెట్టునందు, ఆకాశంలోను, వాయువులోను, అగ్నిలోను, జలంలోను సర్వత్రా సదా అనేక జగత్తులు ఉన్నాయి.

అయితే మహర్షీ! స్వప్న నగరాల వలె ఆ జగత్తులన్నీ కూడా (మిథ్యా-భ్రాంతిచే) ఉన్నదెచట? వాస్తవానికి అవేవీ లేవు. భ్రాంతిచే అనుభవమౌతున్నాయి. అవన్నీ చిద్రూపమే కాబట్టి చిద్రూపము సత్యమే కాబట్టి అధిష్ఠాన చిద్రూపముచే అవి సత్యములే అగుచున్నాయి. ఇది ఇట్లా ఉండగా... ఒక జగత్తులోని వారికి మరొక జగత్తు మిథ్యయే అయి ఉన్నది.

**పరిజ్ఞాతా సతీ యేషామేషా చిన్నభసైకతామ్**
**గతాతే న విముహ్యన్తి శిష్టాస్తు భ్రమ భాజనమ్ ॥**

ఎవరైతే ఈ జగన్మాయను "అసత్తు" అని ఎఱుగుతారో వారికి ఈ జగత్తుగా కనిపించేదంతా చిదాకాశ రూపంగానే అనిపిస్తుంది. అట్టివారు ఈ జగత్తులను చూచి కూడా మోహం చెందరు. ఇక తక్కిన వారంతా (ఈ జగత్తు సత్యమేనని నమ్మి ఉంటారో) భ్రమభాజనులే అయి ఉంటున్నారు.

❖

ఓ మహర్షీ! ఈ విద్యాధరి వైరాగ్యవశం చేత తత్త్వజ్ఞానం పొందాలని అభిలషించింది. అట్టి జ్ఞానానికి అనుకూలమైన శ్రవణ-మననాదుల కొఱకై తమ ఉపదేశం సంపాదించుకోవాలనుకొంది. ఖేచరీముద్ర యొక్క ధారణాభ్యాసంచే ఆకాశమున సంచరించుచున్న మిమ్ములను సమీపించింది. ఓ మునీంద్రా! మీరు అంతా ఎఱిగినదే కదా! చిత్‌శక్తియే అజ్ఞాని విషయంలో దాటుటకు కష్ట సాధ్యమైన మాయ యొక్క రూపంగా విజృంభిస్తోంది. జ్ఞానికి ఈ సమస్తమూ అద్యంతరహితము- నిరామయము అగు బ్రహ్మం యొక్క శక్తిగాను, చమత్కారంగాను ప్రస్ఫుటమౌతోంది.

**ప్రవర్తన్తే నివర్తన్తే నేఽహ కారణి కానిచిత్**
**ద్రవ్య-కాల-క్రియాద్యోతా చితిస్తపతి కేవలమ్ ॥**

యథార్థానికి ఇక్కడ సృష్టిలేదు, లయము లేదు. ఇచ్చుట ఏ కార్యమూ ఉత్పన్నమగుట లేదు. నశించటంలేదు. అయితే, చిత్‌శక్తియే ఈ దేశ-కాల-క్రియ-ద్రవ్యాది రూపంగా అభివ్యక్తమౌతోంది. అందుచేత ఓ మునిసత్తమా! శిల్పాలన్నీ శిలారూపమే కదా! అట్లాగే ఈ దేశ-కాల-క్రియా-ద్రవ్య- మనో-బుద్ధ్యాదులన్నీ కూడా ఉదయాస్తమయ రహితమైన 'చిద్రూపం' అనే శిలచే తయారు చేయబడిన వివిధ శిల్పములేనని గ్రహించు.

చిత్ శక్తియే లోకాలోక పర్వతముపై గల శిలాకారం ధరించింది. వాయు తరంగాలన్నీ వాయువునకు చెందినవే అయినట్లు జగత్సమూహాములన్నీ చిత్‌శక్తి యొక్క అంగాల వంటివే! చైతన్యం సర్వదా ఆద్యంతరహితమైనప్పటికీ పరిచ్ఛిన్నం పొందిన దానివలె ఉంటోంది. విజ్ఞాన ఘనమగు చైతన్యం తనను తానే 'జగత్తు' రూపంగా ఎఱుగుచున్నది. స్వప్న చైతన్యమే ఆ స్వప్నంలోని గృహములు-కొండలు-శిలలు మనుజులుగా కనిపించుచున్నది కదా! అట్లాగే జాగ్రత్‌లో జాగ్రత్ చైతన్యమే ఈ జాగ్రత్‌లోని ఆయా శిల మొదలైన సర్వ పదార్థములుగా అగుపించుచున్నది.

ఓ మునీంద్రా! వాస్తవానికి ఇక్కడ నదులు ప్రవహించటం లేదు. నక్షత్రములు తరగటం లేదు. ఏ పదార్థమూ పరిణామం పొందటం లేదు. మరి? చిదాకాశము తనయందే ఈ ఈ పదార్థముల రూపాలను వివర్తితమగుచున్నది. ఈ కల్ప-మహాకల్పముల జ్ఞానం కూడా వాస్తవానికి లేనివే సుమా! సముద్రంలోని తరంగాలు సముద్రం కంటే వేఱు కాదుకదా! అట్లాగే అవన్నీ కూడా చిదాకాశమున (జలంలో జలము కంటే అభిన్నమై-భిన్నమైనట్లుగా కనిపించే తరంగాలవలె) వేరుగా భాసిస్తున్నప్పటికీ వేఱుకాదు.

ఘటంలోని ఆకాశం మరియు మహాకాశము వేర్వేరుగా కనిపిస్తున్నప్పటికీ వేర్వేరు కాదు కదా! అట్లాగే చిత్‌సత్త వలన చిద్రూపములై ఈ జగత్తులు విద్య మానమైనప్పటికీ,... చైతన్యమునకు భిన్నమగు జగత్తు అను రూపం ఎక్కడా లేదు.

కనుక ఓ వసిష్ఠ మునీంద్రా! ఇక మీరు, మీరు నివసించే బ్రహ్మాండమును జేరెదరు గాక! అక్కడ ఏకాంతమున పూర్వం మీచే కల్పించబడిన ఆసనమును అధిరోహించి విక్షేపరహితమగు ఆత్మ సుఖమును అనుభవించటం కొనసాగించెదరుగాక! ఎందుకంటే నాచే కల్పించబడిన ఈ బుద్ధి-అహంకారము-చిత్తము మొదలైనవాటితో కూడిన ఈ జగత్తు అవ్యక్తరూపమును పొంద బోవుచున్నది. మేమైతే పరబ్రహ్మపదమగు కైవల్యమును పొందబోవుచున్నాము.

బ్రహ్మదేవుడు ఇట్లా పలికి బ్రహ్మనివాసులతో సహా పద్మాసనం అవధరించాడు. మరల వ్యుత్థానం లేనట్టి 'సమాధి' యందు తత్పరుడైనాడు.

❖❖❖

## 16. భూత ప్రకృతి ఉపసంహారం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అప్పుడు ఆ అన్యజగత్ బ్రహ్మదేవుడు 'ఓం'కారము యొక్క "ఉత్తరార్ధం" అగు అర్ధమాత్రయందు* తన చిత్తమును పూర్తిగా లయింపజేశారు. తద్వారా శాంత మనస్కుడైనారు. సమస్త ఇంద్రియజ్ఞాన రహితుడైనారు. అప్పుడు చిత్తము అనే పటంలో లిఖించబడిన చిత్రం వలె నిశ్చల స్వరూపుడైనారు. ఆ 'విద్యాధరి' అనే బ్రహ్మదేవుని వాసనాస్వరూపిణి బ్రహ్మదేవుని అనుసరించింది. బ్రహ్మదేవుని వలెనే ధ్యానతత్పర అయింది. క్రమంగా పూర్ణంగా శమించిన రూపం కలదయింది. ఆకాశ రూపిణిగా సంతరించుకొన్నది.

ఆ అన్యజగత్ బ్రహ్మదేవుడు తన శరీర-ఇంద్రియాదులుగా గల సమస్తం ప్రణవం యొక్క అర్ధమాత్రముయందు లయింపజేశాడు. సంకల్పరహితుడైనాడు. స్థూల భావం నుండి సూక్ష్మ భావం పొందసాగాడు. అప్పుడిక నేను కూడా సమాధిచే "సర్వ వ్యాపకం, అనంతం" అగు రూపాన్ని సంతరించుకున్నవాడినై అక్కడ జరుగుచున్న స్థూల-సూక్ష్మ తతంగమంతా చూస్తూ ఉన్నాను.

ఆ బ్రహ్మదేవుని సంకల్పము ఏ రీతిగా క్షీణింపజొచ్చిందో, ఆ రీతిగా భూమిపై తృణముల-లతల-ధాన్యముల మొదలైన వాటి ఉత్పత్తి సన్నగిలసాగింది. విత్తనాలు అంకురించు (మొలకెత్తు) స్వభావాన్ని మెల్లమెల్లగా కోల్పోసాగాయి. పృథ్వి ఆ విరాడ్రూపుడగు బ్రహ్మదేవుని అవయవములోని ఒక విభాగము వంటిదే కాబట్టి అతని సంకల్పముతో బాటే అది చేతనారహితం, రసహీనం కాసాగింది. నిస్సారం కాసాగింది. పృథ్వి అనేక దుశ్శకునములతో నిండసాగింది. పాపులగు జనులు విపరీత ధోరణులను ప్రదర్శిస్తూ 'నరకం' వైపు త్రోవలు నిర్మించుకోసాగారు.

అనేక చోట్ల క్షామం-రాజుల క్రూర ప్రవర్తన, అగ్ని చోరాది ఉపద్రవములు-దీనత్వ-దారిద్ర్యాదుల దౌర్భాగ్యము, మర్యాదహీనమైన ప్రవర్తనములు, దుష్ట స్త్రీల ఆధిపత్యములు మొదలైన

---

*ఉత్తరార్ధం అర్ధమాత్రము = జగత్ – స్వప్న – సుషుప్తులకు ఆవల కేవల సాక్షియై వేంచేసియున్న శుద్ధ స్వస్వరూపం

దుఃఖస్థితులు ప్రవృద్ధం కాసాగాయి. పెనుగాలులు వీచుటచే ఆకాశము ధూళిచే ఆవరించబడ సాగింది. ఆ ధూళి ఆకాశంలో పేరుకు పోవటంచేత సూర్యగోళం మసక-మసకగా కనిపించ సాగింది. శీతల-ఉష్ణ వాయువులు ఒకదాని వెనుక మరొకటి తీవ్రంగా వీచటం చేత జనులు హాహాకారాలు చేయసాగారు. అనేక ప్రదేశాలు మూర్ఖులచేత, మహాదుఃఖితుల చేత, దుర్వాసనా పరుల చేత, రోగులచేత, అకారణంగా ప్రచ్ఛన్నయుద్ధమునకు ఉపక్రమించేవారి చేత నిండిపో సాగింది. ఒక గ్రామంలో అతివృష్టి, ఆ ప్రక్క గ్రామంలోనే అనావృష్టి. ఒకచోట నీరు లభించక జనులు అల్లల్లాడుచుండగా, కొద్దిదూరంలో వరదలు వచ్చి జనవాసములు కొట్టుకుపోసాగాయి. ఒక గ్రామం ప్రజలు మరొక గ్రామం ప్రజలతో చిన్నచిన్న కారణాలుగా ముఠా తగాదాలు పెంపొందించుకోవటంచేత పరస్పర సహకారం లభించక సామాన్యజనులు అష్టకష్టములపాలు కాసాగారు. జనులు అత్యంత స్వల్ప కారణాలకు ఒకరి ఒళ్ళు మరొకరు తగలబెట్టుకోవటంవంటి నీచ ప్రవృత్తులు కలిగి ఉండసాగారు.

పర్వతాలపై, నగరాలపై పిడుగులు పడటం వంటి ఆకస్మిక ఉత్పాతాలు ఏర్పడసాగాయి. శిశువులు, శ్రోత్రియులు, మాన్యులు, విద్వాంసులు గుణవంతులు మొదలైనవారు దుష్టజనుల వలన అనేక హింసలకు గురి కాసాగారు. అకస్మాత్తుగా జన సమ్మర్దమైన ప్రదేశాలలో భూ ప్రకంప నాల వల్ల అగాధకూపాలు ఏర్పడి క్షణంలో అనేకమంది జనులు భూమిలో కూరుకుపో సాగారు.

రాజులు వర్ణసంకరులగు స్త్రీల సాంగత్యంలో తమ కనీస కర్తవ్యములను ఏమరచి ప్రవర్తించ సాగారు. జనులు వర్ణాశ్రమ ధర్మములను ఉల్లంఘించి ప్రవర్తించసాగారు. రాజులు తమ దుష్ట వ్యసనాలకు అవసరమైన ధనాన్ని విచక్షణారహితమైన పన్నులు వసూలు చేస్తూ ప్రజాకంటకులు కాసాగారు.

అనేక ప్రాంతాలు దుఃఖముచే రోదన కలిగించే సమాచారాలతో పూర్ణమవసాగాయి. రక్షించ వలసిన రాజుల చేతనే జనులు బాధింపబడసాగారు. కొందరైతే దొంగలను ముఠాగా జేర్చి అపహరించటమే వృత్తిగా కలిగి జనులలో నాయకులుగా చెల్లుబడసాగారు. వారి అధర్మం ధర్మం వలె చెల్లుబాటు కాజొచ్చింది.

పండితులు-సజ్జనులు-పురోహితులు మొదలైనవారు అనాదరణ, అగౌరవాలను పొంద సాగారు. జనులు స్వధర్మమును ఏమరచి పరధర్మమును అనుసరించసాగారు. ఎల్లప్పుడు ఇతరులను పీడించటం, అవమానించటమే వృత్తిగా గల జనుల సంఖ్య అధికం కాసాగింది. దొంగలు యథేచ్ఛగా దేవాలయాలను, పవిత్ర ప్రదేశాలను ఆక్రమించి అక్కడి సొమ్మును దొంగిలించసాగారు.

భౌతిక సుఖములకే ప్రాముఖ్యమిచ్చి జనులు అల్పాయుష్కులు కాసాగారు. సోమరితనముచే, విలాసముచే జనులు సంధ్యావందనాది ఆధ్యాత్మిక క్రియలు ఏమరచసాగారు.

అంటురోగములు, ఆపదలు, ఆకస్మిక సామూహిక మరణములు ప్రవృద్ధం కాసాగాయి. అభాగ్యులగు జనుల ఆక్రందనములు వినేవాళ్ళు, వినినా పట్టించుకొనేవారు కరువయ్యారు.

ఈ ప్రకారంగా బ్రహ్మదేవుని విరాట్ దేహంలోని చైతన్యం ఉపసంహరించబడ నారంభించింది. ప్రళయం వచ్చి పడింది. పృథ్వి రసహీనం కాసాగింది. ఋతువులు వక్రించ నారంభించాయి. నేలలో నీరు ఇంకి కాటకం తాండవించసాగింది. చైతన్యము యొక్క అభావ ప్రభావం చేత సముద్రజలాలు విక్షుబ్ధం కాసాగాయి. సముద్రజలం అనియతిని పొందసాగింది. క్రమంగా తీరంలోని అరణ్యాలు సముద్రజలంలో మునిగిపోసాగాయి. అక్కడి జనులు జనావాసాలవైపు పరుగులు తీయనారంభించారు. సముద్రం ఆకాశమును ఆక్రమించ నారంభించింది. సముద్రజలం పెద్ద ఆవర్తములతో కొండ గుహలలోకి ప్రవేశించ సాగింది. మరొకవైపు నుంచి ఆ కొండలపై భీకర గర్జనతో మేఘములు వర్షించసాగాయి. కొండ గుహలలో మొసళ్ళు ప్రవేశించాయి. సింహములు ఊళ్ళ పైబడి పెంపుడు జంతువులను, మనుష్యులను అప్రతిహతంగా ఆరగించ నారంభించాయి. సముద్ర తరంగముల రాపిడికి బడబాగ్ని జనించసాగింది. జలచర జీవులు భూమిని ఆక్రమించసాగాయి. తరంగములచే కొట్టుకొని వచ్చిన రాక్షస తాబేళ్ళు వనములలోని మహావృక్షములను ఆక్రమించసాగాయి. జనులలో విపరీత వృత్తులు పొడమసాగాయి.

పుత్రులు-మిత్రులు-తదితర సహజీవులు నీళ్ళలో కొట్టుకుపోతుంటే కూడా పట్టించుకోక పోవటం సర్వసామాన్యమైపోయింది. నీటి ఏనుగుల కళేబరాలు గృహద్వారాలకు అడ్డంగా వచ్చి పడసాగాయి. దిక్కులు ప్రళయకాల మేఘ గర్జనలతో పిక్కటిల్లాయి. ఆకాశంలో అకస్మాత్తుగా తోకచుక్కలు పొడిచాయి. అగ్ని సమూహాలు ఆకాశంలో అటూ ఇటూ పరుగులు తీయసాగాయి. ఈ విధంగా బ్రహ్మదేవుని సంకల్పము యొక్క ఉపసంహరణ కారణంగా భూమి మొదలైన మహా భూతములన్నీ సంక్షోభం పొందసాగాయి. సూర్య-చంద్ర-అగ్ని-వాయు-ఇంద్ర-యమాది దేవతలు కూడా ఆ కోలాహలమునకు వ్యాకులం చెందసాగారు. ఇప్పటి వరకు అధికారము వహించిన దేవతలు అధఃపతన తత్పరులు కాసాగారు. పర్వతములు-నగరములు-జల ప్రదేశములు-అరణ్యములు మొదలైన వాటితో కూడిన అక్కడి సమస్త జగత్తు కల్పాంత వాయువుల భీకర వీచికలచే చూర్ణమగుచూ శైథిల్యం పొందసాగింది.

❖❖❖

## 17. జగత్తుగా కనిపించేదంతా నిర్మల పరబ్రహ్మమే!

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ తర్వాత ఆ విరాడ్రూపుడగు అన్యజగత్ బ్రహ్మ తన ప్రాణాలను ఉపసంహరించనారంభించారు. అప్పుడు గ్రహ-నక్షత్రాదులు తమ గతిని వీడసాగాయి. ఎందుకంటావా? అవన్నీ బ్రహ్మదేవుని ప్రాణస్వరూపాలే కదా! అట్టి ప్రాణాలు ఉపసంహరిస్తున్నప్పుడు గ్రహ-నక్షత్రాలు ఎట్లా నిలుస్తాయి? ప్రాణ వాయువులు అట్లు ఉపసంహరించబడుచుండగా భీకర సంక్షోభం ఉదయించి సూర్యులు తమతమ స్థితిని కోల్పోయారు. భోగ స్థానములగు స్వర్గాది లోకాలు తమ ఉత్పత్తి స్థానమైన కర్మమూలస్థితిని పొందసాగాయి. అప్పుడు వాయు సహితమగు అగ్ని అంతటా ఉత్పన్నం కాజొచ్చింది. నక్షత్రములు నిరాధారాలై క్రిందకు పడి

పోసాగాయి. "బ్రహ్మదేవుని సంకల్పం" అనే ఇంధనం తరిగిపోవటం చేత సిద్ధ లోకాల గతి శమించనారంభించింది. సిద్ధ సమూహాలు తమ శక్తులను కోల్పోవటం చేత దూది పింజముల వలె ఆకాశంలో పరిభ్రమించసాగాయి. ఇంద్రాది లోకములను స్థానమైన మేరు పర్వత శిఖరములు విఱిగి పడిపోసాగాయి.

**శ్రీరాముడు :** మహాత్మా! "విరాట్టు-బ్రహ్మాండ శరీరుడు" అని చెప్పబడే బ్రహ్మదేవుడు చైతన్యము యొక్క సంకల్పమాత్ర స్వరూపుడనిగదా, శ్రుతి-స్మృతి ప్రసిద్ధము? అట్టి సంకల్ప మాత్రము-నిరాకారమగు శరీరము గల బ్రహ్మదేవునికి సాకారములగు ఈ భూ-నక్షత్రాదులు అవయవములు ఎట్లా అవుతాయి? ఒకవేళ ఈ లోకములన్నీ అతని అవయవములనే అనుకొందాం. అప్పుడు ఈ భూలోకము అతని ఏ అవయవము? స్వర్గ-రసాతలాది లోకములు అతని ఏఏ అవయవములు? అతనిలో ఈ విశాల లోకములు అవయవములుగా ఎట్లా ఉన్నాయి? అట్టి అతడు 'బ్రహ్మాండము' అనే తన ఈ శరీరము లోపల సత్యలోకంలో ఎట్లా స్థితి కలిగి ఉన్నాడు? మహర్షీ! బ్రహ్మదేవుడు సంకల్పమాత్రుడనీ, నిరాకారుడనీ అంటూ ఉంటారు. మరి ఈ జగత్తేమో సాకారమని సుస్పష్టమే అయి ఉన్నది కదా! సాకార జగత్తులో నిరాకారుడు ఎట్లా ఉన్నాడు? ఒకవేళ నా ప్రశ్నలలోనే స్వతహాగానే ఏదైనా దోషం ఉన్నదా? వివరించ ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ కనబడే 'జగత్తు' అని దేనినంటున్నామో... అట్టి ఇయ్యది మొట్టమొదట సృష్ట్యాదియందు ఏ రూపంలో ఉన్నది? సృష్ట్యాదియందు ఈ జగత్తు సత్తు కాదు. అసత్తు కాదు. ఇది మొట్టమొదటి సర్వ దశదిశలను పరిపూర్ణం ఒనర్చునట్టి నిరామయమైన పరమాకాశ రూపమగు చిన్మాత్ర-బ్రహ్మమే అయి ఉన్నది. అట్టి ఆ పరమాకాశము తన పరమాకాశ స్వరూపమును ఏ సమయమందునూ త్యజించనే లేదు. అట్టి ఆ పరమాకాశమే తన యొక్క చిదాకాశత్వ స్వరూపమగు ఈ జగత్తును తనకంటే వేరైన వస్తువు వలె (లేక చేత్యము-లేక దృశ్యము లేక వలె) ఎరుగుచున్నది (లేక) చూచుచున్నది.

నిశ్చల జలంలో చంచలరూపమగు ఆవర్తములు ఏర్పడుతూ ఉంటాయి కదా! అయితే, అట్లా ఆవర్తరూపంగా కనిపించేదంతా కూడా జలమునకు వేరైనదేదీ కాదు కదా! అట్లాగే 'చిదాకాశము' అనబడు అత్యంత నిశ్చలము-శుద్ధము-అనన్యము-పూర్వాత్ పూర్వము అగుదాని యందు కారణమంటూ ఏదీ లేకుండానే జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనే ఒకానొక త్రిపుటి తనంతట తానే జనిస్తోంది. అందుకు కారణమంటూ ఏదైనా ఉంటే ఆ కారణం కూడా చిదాకాశమునకు అనన్యం అనియే చెప్పబడింది. ఆ త్రిపుటి యొక్క మననముచే 'ఘనీభావము' వలన "మనోరూప స్థితి" పొందిన చిత్ చైతన్యమే ఈ జీవుడు. ఈ రీతిగా త్రిపుటి సమూహముల యొక్క అధ్యాస పొందుచున్నప్పటికీ చిదాకాశము యథాతథంగా నిరాకారంగానే ఉన్నది గాని, అద్దానియందు సాకారమనునదేదీ లేదు. అనగా త్రిపుటి జనించటానికి ముందు, జనించిన తర్వాత కూడా చిదాకాశము తనయందు చిదాకాశముగానే నెలకొనియున్నది. ఇక ఈ త్రిపుటిగా భాసించేదంతా ఏమిటంటావా? ఇది కూడా "శివరూపమగు పరమాత్మ" కంటే వేఱు కాదు.

ఆ విధంగా త్రిపుటి ఏర్పడిన తర్వాత అట్టి విశాలమగు సంకల్పరూపమైన మనస్సు నందు అభిమాన రూపమగు భావనచేత "అహంకారం"గా స్ఫురిస్తోంది. అయితే అట్టి అహంకార రూపంగా స్ఫూరించేది కూడా వాస్తవానికి 'నిశ్చలం, నాశరహితం' అగు బ్రహ్మమే అయి ఉన్నది.

అట్టి అహంకార-సంకల్ప రూపుడగు చిత్‌స్వరూపుని 'చిదాభాసుడు' అని శాస్త్రాలు పిలుస్తు న్నాయి. ఆ చిదాభాసుడు 'నేను ఆకాశరూపుడను' అని భావించటం జరుగుతోంది. ఆ విధంగా చిదాకాశమే చిదాకాశమున "అసత్తు" అగు ఆకాశరూపంగా పొందుచున్నది. ఆ సంకల్పరూపుడగు చిదాభాసుడు శూన్యమునే దేహాకారంగా భావించటం చేత "దేహమును చూడటం, దేహమును ఎఱగటం, దేహమును అనుభవించటం"... అనునవన్నీ సంభవిస్తున్నాయి.

**శ్రీరాముడు :** శూన్యమును దేహాకారంగా భావించి దేహానుభవం పొందటం ఎట్లా జరుగుతుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఊహలో శూన్యమునందే తనకు ఎక్కడో-ఎప్పుడో పరిచయమున్న నగరంలోని వీధిగా ఊహించి ఆ ఊహలోంచి అనుభవం పొందుతారు కదా! ఒకడు తనకు ఇష్టమైన స్త్రీ యొక్క రూపమును ఊహలో (లేక జ్ఞప్తిలో) దర్శించటం జరుగుతోంది కదా! స్వప్నసంవిత్తు వాస్తవానికి శూన్యమే అయినప్పటికీ స్వప్నంలో నగరములు-ఆకారములు అనుభవానికి ప్రాప్తిస్తున్నాయి. జన్మరహితమగు చిదాకాశ స్వరూప బ్రహ్మము శూన్యమగు ఆకాశమును దేహరూపంగా గాంచుచున్నది. అయినప్పటికీ కూడా చిదాకాశమున చిదాకాశమే అనుభవించబడు చున్నదగుచున్నది. జ్ఞానము యొక్క నిర్మలత్వముచే ఆ పరమాత్మ స్వసంకల్పితమైన జగత్తును అనుభవిస్తూ మరల మరొకప్పుడు తన ఇచ్ఛ చేతనే అద్దానిని శమించజేయుచున్నాడు. ఓ రామచంద్రా! మనలో ఎవరికి ఎప్పుడు బ్రహ్మతత్త్వము యొక్క వాస్తవ పరిజ్ఞానం కలుగుతుందో... అప్పుడు అతనికి ఈ జగత్తు "దృశ్య శూన్యంగాను, వ్యాప్తము-సత్యము అయినట్టి చిదాకాశమాత్రం" గాను కనిపించుచున్నదని గ్రహించు. జగత్ వాసనలు శమించినప్పటి దృష్టికి ఇదంతా నిరాకారము-నిత్యసత్యము అగు బ్రహ్మముగానే గోచరించగలదు సుమా!

**శ్రీరాముడు :** జగత్ వాసనలు త్వరితంగా తొలిగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

1. బ్రహ్మమే పిపీలికాది బ్రహ్మ పర్యంతం సర్వదేహులుగా, సర్వతత్త్వములుగా కనబడు చున్నదను "అద్వైతతత్త్వము" చేతనూ,
2. "అహంకారం భ్రమ మాత్రమే" అను అవగాహనచే ప్రస్ఫుటమయ్యే అహంకార రాహిత్యం చేతనూ,
3. "ఈ జగత్తు యొక్క అసలైన రూపం ఏమై ఉన్నది?" అను ఉత్తమ పరిశీలన యొక్క ప్రయోజనమైనట్టి యథార్థజ్ఞానము చేతనూ,...

మనుజునకు ఈ జన్మయందే వాసన శమించిపోగలదు. ఆ తర్వాత మోక్షరూపమగు ఆత్మయే అంతటా అన్నిటా (అన్నీగా) శేషించుచున్నది.

ఓ రామచంద్రా! ఈ విధంగా "చిత్స్వరూపమగు బ్రహ్మము" అనబడునది ఏదైతే కలదో, అదే ఈ జగత్తు అయి ఉన్నది. విరాడ్రూపమగు బ్రహ్మము యొక్క దేహమే ఈ జగత్తు. చిన్మాత్ర బ్రహ్మం సంకల్పాకాశరూపత్వమును అభ్యసించినదై ఉంటోంది. అట్టి సంకల్పవశ చిన్మాత్ర బ్రహ్మానికి సంబంధించిన స్థూల శరీర భ్రాంతి ఉదయించి, అదియే ఈ జగదాకారంగా భాసిస్తోంది. అదియే "బ్రహ్మాండము" అని కూడా పిలువబడుతోంది. ఈ జగత్తంతా బ్రహ్మము యొక్క "సంకల్ప కల్పనా రూపం" మాత్రమే! అనగా అధిష్ఠాన దృష్టిచే ఇదంతా చిదాకాశము మాత్రమే! కనుక యథార్థానికి నామరూపాత్మకమైన ఈ దృశ్య జగత్తు లేదు. అహమ్-త్వమ్ ఇత్యాదులు కూడా వాస్తవానికి లేవు.

చిన్మాత్రము-నిర్మలము-వికారరహితము అగు చిన్మాత్రమునందు సాకారమగు ఈ జగత్తు ఎట్లు దేనిచే జనించగలదు చెప్పు? కాబట్టి ఈ జగత్తు మిథ్యగానే జనించినదని, మిథ్యగానే కనబడుతోందని అనక తప్పదు. మిథ్యగానే ప్రియ-అప్రియ భావములకు కారణమౌతోంది. నిష్ప్రపంచమగు బ్రహ్మమే తన "ఇచ్ఛ"చే జగత్‌శూన్యము అగు చిదాకాశమును జగద్రూపంగా చూడటం జరుగుతోంది.

వాయువు అంతటా ఉన్నప్పటికీ అది కదలుచున్నప్పుడే అద్దాని ఉనికిని మనం గుర్తిస్తున్నాం కదా! గాలి తనకు తానే కదలుచున్నట్లు చిన్మాత్రమగు బ్రహ్మం తన యొక్క అద్వితీయమగు చిదాకాశమున స్వయంగా "జగత్తు" మొదలుగా గల రూపంగా ఎఱుగుచున్నది. అందుచేత రామచంద్రా! నీవు కూడా నా వలెనే సర్వ విశేషాలు శమించినవాడవై ఉండెదవు గాక! ఈ దృశ్యం అధిష్ఠాన రూపముచే సత్యము, నిజదృశ్యరూపముచే అసత్యమయి ఉన్నది. కనుక పరమార్థమున ఈ దృశ్యమును-శూన్యము, నిర్మలము-అగు చిదాకాశముగానే ఎఱిగి ఉండు. మమత్వరహితుడవై పరమార్థమున సత్-చిత్ రూపుడవై, వ్యవహారమునందు మాత్రం దేహధారివలె ఉండు. వాసనారహితుడవు అగుము. సమాధి నుండి లేచినప్పుడు (ఈ ప్రపంచమున ప్రవేశించి ఉన్నప్పుడు) వాసనా రహితుడవై, శాంతచిత్తుడవై, మౌనివై, చపలత్వ రహితుడవై ఆయా యథాప్రాప్త వ్యవహారాలను నిర్వర్తించు. సమాధి స్థితుడవైనప్పుడు ఏ వ్యవహారాలు చెయ్యకయే విషయరహితుడవై ఉండు. ఆ రెండింటిలో ఏ ఒక్కదానియందు ఎట్టి పట్టుదల కలిగి ఉండనే వద్దు.

ఓ రామచంద్రా! మరల మరొక్కసారి ఎలుగెత్తి ప్రకటిస్తున్నాను-

1. సత్యమగు పరమాత్మ అనుభూతియే జీవించినందుకుగాను పొందాల్సిన పరమావధి.

2. అట్టి పరమాత్మ అనుభూతము కాగా అప్పుడు ఈ దృశ్యము అత్యంత స్వభావసిద్ధంగా "అనాది-నిత్యానుభవరూపము-ఏకము" అయినట్టి పరబ్రహ్మమేనని సుస్పష్టం కాగలదు.

3. దృశ్యము అనునదేదీ వేఱుగా లేనేలేదని విదితమౌతుంది.

అట్టి పరమాత్మను గురించిన అనుభవం లేకుండటంచేతనే ఈ విశాలమైనట్టి నామరూపాత్మక దృశ్యమహాదృష్టి ఈ జీవునికి ఎదురుగా మోసపూరితంగా తాండవం చేయటం జరుగుతోంది.

❖❖❖

# 18. బ్రహ్మము యొక్క భావనయే జగత్తు

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు చెప్పిన విషయాలను అనుసరించి రెండు విశేషాలు సుస్పష్ట మౌతున్నాయి.

1. ఈ బంధము-మోక్షము-జగత్తు మొదలైనవి శూన్యము గాని, సత్తుగాని కాదు.

2. ఈ దృశ్యము అనేది అవాఙ్మానస గోచరము-ఉదయాస్తమయ రహితము-ఆధిభూత వస్త్రధారి అయినట్టి పరబ్రహ్మమే!

ఈ రెండు విషయాలు మీరు ప్రవచించుచుండగా సందేహరహితంగా సుస్పష్టమౌతున్నాయి. అయినా కూడా ఈ విషయం మరికొన్ని విశేషాలతో కూర్చి మరల చెప్పవలసినదిగా నా అభ్యర్థన. ఎందుకంటారా?

**ఉపదిష్టం ఇదం బ్రహ్మమ్ త్వయా బుద్ధమలం మయా,**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మే అమృతమ్ ॥**

అమృతము వలె అతి మాధుర్యములైన మీ వచనములు ఎంతగా వినినాకూడా "ఇక చాలు" అని ఏమాత్రం అనిపించటమే లేదు. హే ప్రభూ! అటు సృష్ట్యాది సంభ్రమముల దృష్టులు గాని, ఇటు శూన్యత్వాది దృష్టులు గాని సత్యమూ కాదు-అసత్యమూ కాదు... అని నేను ఎఱుగు చున్నాను. అంతేకాక, 1) మాయతో కూడిన బ్రహ్మం, 2) నిత్య యుక్తము-సత్యము అగు బ్రహ్మం అను ఈ రెండింటి గురించి తమ అనుగ్రహంచేత నేను ఎఱుగుచున్నాను. అయితే, ఇప్పుడు బోధ యొక్క దృఢత్వము కొఱకై ప్రపంచము యొక్క అధ్యారోపక్రమమును మఱల తెలియజేయ ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ స్థావర జంగమాత్మక జగత్తు సర్వవిధముల అనేక వస్తు-విషయములతో నిండి ఉన్నదై, దేశ-కాల-క్రియా సహితమై ఎదురుగా కనిపిస్తోంది కదా! అట్టి ఈ కనిపించే స్థూల భూతములు సూక్ష్మ భూతములందు లయించటమే "జగద్వినాశనము"... అని వర్ణించబడుతోంది. అనగా...

భూమి- భూతత్త్వమునందు (ఘనం); జలము- జలతత్త్వమునందు (ద్రవం); అగ్ని- అగ్నితత్త్వమునందు (ఉష్ణం); వాయువు- వాయుతత్త్వమునందు (వాయువు); ఆకాశం - ఆకాశ తత్త్వమునందు (ఆకాశం)... లయం పొందినప్పుడు ఈ భౌతిక దృశ్యజగత్తు నశించినదగుచున్నది.

మరొకప్పుడు సూక్ష్మ భూతములు కూడా నశించి "అవ్యాకృతము" నందు లయించటం జరుగుతోంది. దానినే "మహాప్రళయం" మరియు "మహానాశనం" అని కూడా పిలుస్తూ ఉంటారు. అట్టి "మహాప్రళయం" అనే పేరుగల మహానాశనం సంభవించినప్పుడు బ్రహ్మ-ఉపేంద్ర-మరుత్-రుద్ర-మహేంద్రాదుల దేహాల యొక్క అంతిమభావవికారం తటస్థిస్తోంది. ఆ తదనంతరం ఇక ఆపై కూడా శేషించి ఉండేది శాంతం, నిర్మలం, అనిర్వచనీయం, అజం, అనాది, సన్మాత్రం అగు బ్రహ్మమేనయ్యా! ఉపమాలంకారం ఉత్ప్రేక్షాలంకారం, సాపేక్ష సిద్ధాంతాలు ఉపయోగించి "అది

ఇట్టిది” అని మాటలతో చెప్పలేం. అద్దాని పట్ల వాక్కులన్నీ అశక్తతచే వెనుతిఋగుచున్నాయి. దానికి అన్యమైనది ఉంటే కదా, అద్దానిని తెలుసుకోవటం? అనగా ఆ స్థితి అయ్యది తనను తానే పొందుచున్నది-అనుభవించుచున్నది అగుచున్నది. ఆవగింజకంటే మేరుపర్వతం అత్యంత స్థూలం కదా! అట్లాగే ఆ బ్రహ్మము కంటే ఈ శూన్యాకాశం అత్యంత స్థూలం. మహాపర్వతము కంటే త్రస రేణువులు అత్యంత సూక్ష్మమైనట్లే, స్థూలమగు ఈ బ్రహ్మాండము కంటే బ్రహ్మము అత్యంత సూక్ష్మం.

**బ్రహ్మమునందు జగత్తు -** ఆ విధంగా మహాప్రళయంలో జగద్రహితమై మౌనం, శాంత, వహించి బ్రహ్మం ఉంటుంది కదా! కాలప్రమాణహేతువగు సూర్య చంద్రాదులు కూడా విలయం పొందటం చేత... అయ్యది “ప్రమాణరహితమగు ప్రళయకాలం” నందు చిరకాలం ఉంటోంది. సౌమ్యం-కేవలీ అనుభవాత్మకం- ఆధిభూతం అయినట్టి చిదాకాశంగా శాంత స్థితి నొంది ఉంటోంది.

**అవరోహణక్రమం - బ్రహ్మము చిద్రూపముగా అగుట -** వాస్తవానికి సంకల్పరహితం, మహత్తరం, దేశకాలాలచే అపరిచ్ఛిన్నం అగు అట్టి బ్రహ్మం ఒకానొకప్పుడు తన స్వరూపం నందే “జగత్ సంస్కారం” అను “స్వప్న సదృశ కల్పిత ద్వితీయం” వైపుగా అభిముఖం అవుతోంది. తన యొక్క స్వరూపం నందే జగత్ సంస్కార రూపమగు పరమాణుత్వమును అనుభవిస్తోంది. “బ్రహ్మం” అను శబ్దం యొక్క శబ్దార్థం “వృద్ధి పొందటం” అని కదా! ఆ విధంగా సర్వత్రా వ్యాప్తమైన “నిజ చిద్రూపం” ను ఎఋగుచున్నది.

“చిత్స్వరూపము” అగు బ్రహ్మము చిద్రూపముగా అయి తనయందు నిజచిద్రూపము అగు అణుత్వ మును అనుభవిస్తోంది. అద్దానిని గాంచుచుండుటచే “ద్రష్ట” అను స్థితిని పొందుచున్నది. స్వప్న ద్రష్ట తన స్వరూపమునందే స్వప్నం పొందుచూ, ఆ స్వప్నంలో తాను మరణించినట్లు కూడా గాంచుచూ ఉంటాడు చూచావా? అనగా ఒకడు తన స్వప్నంలో తన మృతత్వమునకు తానే ద్రష్ట అయి తనకంటే తన మృతత్వమును అన్యమైనదిగా వీక్షించుచున్నాడు కదా! అట్లాగే చిదాకాశము కూడా తన నిజస్వరూపమును తనకంటే భిన్నమైనదాని వలె గాంచుచున్నది. తన అద్వైత రూపమును ద్వైతరూపము వలె గాంచుచు “ద్రష్ట-దర్శనము-దృశ్యము” అను త్రిపుటిని పొందుచున్నది. తన దేహము యొక్క రాక-పోకలకు తానే సాక్షి అయి చెన్నొందుచున్నాడు. అది అట్లు అగుచున్నప్పటికీ యథార్థానికి ఏకరూపం వలెనే ఆత్మ వర్తించుచున్నది. అనగా చిదాకాశం సర్వదా మూర్తి (ఆకార) శూన్యమై, ఏకమై, నిరాకారమై ఉన్నప్పటికీ “నిజసూక్ష్మ రూపం” అనతగిన అద్వైత రూపమున “ద్రష్ట-దృశ్యం” అను ద్వంద్వమును ద్వైత భావముచే ధరిస్తోంది. అట్టి దర్శనమును “దృష్టమాయ” అని అంటారు. అట్టి దృష్టమాయాబలముచే తన ప్రకాశరూపమగు ఆత్మను పరిచ్ఛిన్నంగా గాంచు చున్నది. అట్టి పరిచ్ఛిన్న భావనాభ్యాసంచే “పృథ్వి” మొదలైన ఆయా వివిధ వస్తు అనుభవం రూపు దిద్దుకుంటోంది. ఈ దేశ-కాల-క్రియల యొక్క అసలైన రూపము ఆత్మయే! అట్లే...

**దృక్ :** లబ్ధమగుచున్నదానిని “ద్రవ్యము” అని, ఆ ద్రవ్యమును చూచువానిని “ద్రష్ట” అని, ఆ చూచుటను “దర్శనము” అని ఆ చూచుటకు గల కారణమును “దృక్” అని చెబుతారు.

**జగత్తు :** 1. దేశ–కాల వస్తు పరిచ్ఛేదములచే పరిమితి గలది, 2. సంఖ్యా పరిణామముచే అనంతమైనది, 3. "దృష్ట–దర్శనము–దృశ్యము" అనబడు త్రిపుటిచే భేదము కలిగి ఉన్నది.

అట్టి ఈ జగత్తు యొక్క రూపవృద్ధి అసత్యముగానే భాసించుచున్నది. వాస్తవానికి ఈ 'జగత్తు' అని చెప్పబడుచున్నదంతా చిదాకాశరూపమే అయి ఉన్నదనుటలో ఏమాత్రమూ సందేహం లేదు.

**తన్మాత్ర :**

**చిదణు ప్రతిభాసే అన్తః ప్రథమమ్ నామవర్జితమ్ ।**
**తన్మాత్ర శబ్దమ్ ఏతేషామ్ ఏతత్ ఆకాశరూపి తత్ ॥**

చేతనరూపుడగు ఈ జీవుని దేహమందలి ఏ గోళక ఛిద్రము ద్వారా ఆయా వస్తువులను చూస్తున్నాడో (లేక) ఏ ఇంద్రియం ద్వారా ఈ సూర్యుడు, చంద్రుడు మొదలైన వాటిని చూస్తున్నాడో... అద్దానినే "నేత్రేంద్రియాలు" అని పిలుస్తున్నారు. ఎద్దానిచే శబ్దము వింటున్నాడో వానిని చెవులు అని పిలుస్తున్నారు. ఈ కళ్ళు–చెవులు–ముక్కు–నాలుక–చర్మముల యొక్క (ఇంద్రియాల) నామ రూపభేద కల్పనం పూర్వాపూర్వ స్థితిని "తన్మాత్రా" మాత్రం అత్యంత సూక్ష్మమై ఆకాశరూపమై ఉన్నది. "చైతన్యాణువు" అనతగు ఈ జీవుని యొక్క ప్రతిభాసరూపమగు ఆకాశమే 'తన్మాత్ర'. అట్టి తన్మాత్రయే స్థూలదేహంగా అగుచున్నది. ఈ జీవుడు రూపాదుల అనుసంధాన వశంగా పంచేంద్రియాల అనుభవం పొందుచున్నాడు. "ఏమీ తోచటం లేదు. ఎక్కడికైనా వెళ్ళాలి. ఏమైనా చూడాలి... అను ధ్యాసతో పోల్చతగినదే ఈ తన్మాత్ర యొక్క స్ఫురణ రూపము.

**స్థూల దేహం :**

**చిదణు ప్రతిభాకాశక పిణ్డ ఏవ ఘన స్థితిః ।**
**అనుసంధాన వివశశ్చ ఏతత్ "ఇంద్రియ పంచకమ్" ॥**

ఈ జీవుడు చైతన్యాణువు అనుకున్నాం కదా! అనగా చిదాకాశం ద్వితీయ భావనచే అణుత్వం పొందినప్పటి అణుస్వరూపమే ఈ జీవుడు. అట్టి ఈ జీవుని ప్రతిభాస రూపమగు ఆకాశమే తన్మాత్ర. అట్టి తన్మాత్ర ఒక సమయంలో ఘనస్థితి పొందుతోంది. అట్టి ప్రతిభ యొక్క ఘనస్థితియే స్థూలదేహంగా అగుచున్నది. మరియు అట్టి స్థూల సంబంధమైన రూపాదుల అనుసంధానం చేత పంచేంద్రియాల అనుభవం చిదణురూపుడగు ఈ జీవుడు పొందుచున్నాడు.

**దృశ్యము :** తన్మాత్ర యొక్క సుదీర్ఘమననముచే శబ్ద–రూప–రస–గంధాదుల గురించిన ఆసక్తి తీవ్రరూపం దాల్చుతోంది. అట్టి విషయాల అనుభవం ద్వారా చిదణుస్వరూపజీవుడు దృశ్యం యొక్క పుష్టిని పూర్ణంగా బడయుచున్నాడు. దృశ్యము పట్ల ఏర్పడిన తాదాత్మ్యంచే ఈ దృశ్యంతో ప్రమేయం లేని (ఈ జగద్దృశ్యానికి సంబంధించని) తన యొక్క చిదానంద రూపాన్ని ఏమఱుచుచూ, అనేక దేహాలు పొందుచూ భావనాస్థితికి లోను అగుచున్నాడు. ఇట్లు ఈ దృశ్యాన్ని అనుభవించ టంలో నిమగ్నమై ఉండగా వందల, వేల ఉపాధులు (శరీరములు) వస్తున్నాయి, పోతున్నాయి.

**చిత్తము :** ఈ జీవుడు "పొందాలి–కావాలి" అను భావావేశమును ఇంద్రియ విషయాల పట్ల కలిగి ఉంటున్నాడు కదా! వాటికి సంబంధించిన సుఖ–దుఃఖములు, ఆశ–నిరాశలు, ఉత్సాహ–

భయములు, గర్వ–ఆందోళనలు స్మృతి రూపంగా ఏర్పడి ఉంటున్నాయి. అంతరంగాకాశంలో పేరుకొని ఉన్న స్మృతుల సముదాయమే చిత్తాకాశం.

జలబిందువులు మేఘరూపం పొందినట్లుగా, అంతరమున రూపుదిద్దుకొనినట్టి చిత్స్వభావమును ఈ స్మృతి ఆవరించి ఉంటోంది. ఈ విధంగా ఇంద్రియములచే గ్రహించబడిన విషయముల యొక్క "స్మృతి" అనే భ్రమ ఆకాశమును ఆవరించిన మేఘ సముదాయము వలె స్వస్వరూపమును కప్పి ఉంచుతోంది.

చిత్తము అంటే ఇంద్రియ విషయముల స్మృతి మరియూ తత్ సంబంధమైన ఇచ్ఛావేశము. ఈ చిత్తములో అనేక ఉపాధుల "స్మృతి" సంబంధమైన జ్ఞానం శుద్ధ జ్ఞానాన్ని ఆవరించి ఉంటోంది.

**బుద్ధి :** స్మృతి దశయందలి జ్ఞానమును "చిత్తము" అని పిలుస్తున్నారు కదా! అట్లాగే "ఇది చేద్దాం, ఇది వద్దు, ఇది చూద్దాం–ఇది ఇప్పుడు వద్దు" అనే నిశ్చయ దశయందలి జ్ఞానం ప్రవర్తిస్తోంది. అట్టి నిశ్చయదశ యందలి జ్ఞానమును "బుద్ధి" అని పిలుస్తున్నారు.

**మనస్సు :** చిదణుస్వరూపుడగు ఈ జీవుడు ఇంద్రియ విషయముల ధ్యాసచే ఒక విషయమును సంకల్పిస్తున్నాడు. మరల అద్దానిని వదలుచూ, మరొక విషయమును సంకల్పిస్తున్నాడు. ఈ విధంగా అనునిత్యంగా సంకల్ప–వికల్పములను నిర్వర్తిస్తున్నాడు. అట్టి సంకల్ప–వికల్పముల పరంపరా ప్రక్రియకు "మనస్సు" అని పేరు పెట్టారు.

**అహంకారము :** "ఇది నేను–అది నాది" అను దృశ్య సంబంధమైన అభిమానము ఈ చిదణుస్వరూప జీవుడు పెంపొందించుకొని ఉంటున్నాడు. అట్టి అభిమానముచే ఈ జీవుడు "అహంకారము" అను ఒకానొక పదమును అవధరించి ఉంటున్నాడు.

**దేశ - కాల పరిచ్ఛేదము :**

**చిదణోరస్య భావస్య ప్రత్యగ్రం యత్ర వేదనమ్ ।**
**స తత్ర ఉత్తరకాలేన పూర్వాభిఖ్యాం కరిష్యతి ॥**

ఈ చిదణుస్వరూప జీవునికి ఏ చోట శబ్దాది విషయజ్ఞానం కలుగుతుందో, ఆ చోటు అతనికి "దేశము" గా అనుభవమౌతోంది. తదితర ప్రదేశము అన్యదేశము అగుచున్నది.

ఏ కాలంలో శబ్దాది విషయాల జ్ఞానం (లేక అనుభవం) కలుగుతుందో... అది వర్తమాన కాలము, అందుకు ముందుకాలం భూతకాలం, అప్పటికి తరువాతి కాలం భవిష్యత్ కాలం అగు చున్నది. ఈ విధంగా భూత–భవిష్యత్–వర్తమానాలు ఆ చిదణురూప జీవుని పట్ల ఏర్పడి ఉంటున్నాయి. దేశమునకు తూర్పు–పడమర–ఉత్తర–దక్షిణములు, కాలమునకు భూత–వర్తమా నాది ఆయా ప్రమాణములు ఆ తదనంతర కల్పన అయి ఉంటోంది.

చైతన్య రూపమగు ఆత్మ స్వయంగా ఆకాశం వలె నిర్మలం – అపరిచ్ఛిన్నం అయినప్పటికీ ఈ ప్రకారంగా దేశ–కాల–క్రియ–ద్రవ్యాది నామాలన్నీ కల్పించుకొని, క్రమంగా అర్థజ్ఞాన స్వరూపాన్ని బడయుచూ పరిచ్ఛిన్నము వలె అగుచున్నది. ఈ విధంగా చైతన్యము స్వయముగానే...

1. మొట్టమొదటి సూక్ష్మ శరీరముగా అగుచున్నది.
2. క్రమంగా... దేశ-కాల-వస్తు-విభాగము అగుచున్నది.
3. ఆపై సర్వజగత్ శరీరంగా అగుచున్నది.

అయితే వాస్తవానికి చిదాకాశం చిదాకాశరూపమే అగు జగత్తును స్వయంగా ధరించి ప్రవర్తిస్తోంది. ఈ "జీవుడు" అనబడువాని వాస్తవరూపం చైతన్యమే గాని ఈ సూక్ష్మ-స్థూల దేహాదులు కాదు. చైతన్య రూపుడగు జీవుడు తన సూక్ష్మ శరీరమునందు చిరకాలం స్థూలత్వము గురించి భావించుచు, క్రమంగా ఆ "స్థూలము" యొక్క పూర్ణ నిశ్చయమును ఆశ్రయించి ఉంటున్నాడు.

అనగా, నిర్మలమగు చిదాకాశమే తన స్వస్వరూపంలో ఈ "జగత్తు" అను చిత్రాన్ని రచించింది. ఈ నామరూపాత్మక జగత్తు భ్రమాత్మకమే అయి ఉన్నదయ్యా! వాస్తవానికి చిదాకాశం సర్వదా సద్రూపమే అయి ఉండి కూడా మృగతృష్ణాజలంలాగా అసత్తే అగు ఈ జగద్రూపంగా భాసిస్తోంది.

**దేహం :** నిర్మల చిదాకాశరూపుడగు ఈ జీవుడు క్రమంగా తన దేహమున ఒకచోట 'ఇది శిరస్సు' అనే శబ్దార్థం ఇస్తున్నాడు. 'ఇది పాదములు' అను మరొక శబ్దార్థం ఒసగునట్టి కల్పనను గావించుచున్నాడు. అట్లాగే మఱొకచోట 'ఇది వక్షస్థలం' అని, 'ఇవి భుజాలు' అని ఇట్లా శబ్దార్థ కల్పన గావించుచున్నాడు.

**భావాభావ కల్పన :** అట్లాగే భావాభావముల గ్రాహ్యము-త్యాగములను నిర్వర్తిస్తున్నాడు. చిదణు స్వరూపుడగు ఈ జీవుడు ఒక భావాన్ని గ్రహించటం-త్యజించటం, మరొక భావాన్ని ఆశ్రయించటం అనుక్షణికంగా నిర్వర్తిస్తున్నాడు.

**వస్తు కల్పన :** ఆ తరువాత 'ఇది గోవు-ఇది గుల్మము' ఇత్యాది దేశ-కాల-రూప-గుణ సంబంధమైన భేద కల్పన గావించుచున్నాడు. ఇంద్రియ సమూహముచే తెలియవస్తున్న విషయోన్ముఖత్వ కల్పనను ఈ చిదణుస్వరూప జీవుడు స్వయముగా ధరించుచున్నాడు. ఇక అతడు ఈ కాళ్ళు-చేతులు గల శరీరముతో కూడుకొనినవాడై చిత్తాదుల కల్పనతో కూడినట్టి స్వయం కల్పితమగు ఆకృతిని ఎదురుగా దర్శించుచున్నాడు.

**ఏవం సంపద్యతే బ్రహ్మా తథా సంపద్యతే హరిః ।**
**ఏవం సంపద్యతే రుద్రంః, ఏవం సంపద్యతే కృమిః ॥**

ఓ రామచంద్రా! ఈ ప్రకారంగా ప్రతి జీవునికి దేహానుభవ కల్పన ఉదయించి ప్రదర్శితమౌతోంది. బ్రహ్మా-విష్ణు-మహేశ్వరుల దగ్గర నుండి క్రిమికీటకాదుల వరకు కూడా సంకల్ప వశం చేతనే ఈ దేహాదుల కల్పన సిద్ధించుచున్నదని గ్రహించు. అయినా కూడా... యథార్థానికి ఎక్కడా ఏదీ ఉత్పన్నమే అగుటలేదు. అంతా కూడా ఉన్నది ఉన్నట్లుగా సద్రూపమే-ఆయా విశేష సద్రూపమై వెలయుచున్నది సుమా! ఈ సమస్తం కూడా... శూన్యమునందు శూన్యంగానూ, చైతన్యమునందు చైతన్యముగానూ... విజృంభించుచున్నది.

**వ్యష్టి - విరాట్ పురుషుడు** సమష్టి స్వరూపుడగు విరాట్ పురుషుడు కూడా వ్యష్టి జీవుని వలెనే స్వయంగా చిదాకాశమునందు సంకల్ప మాత్రముచే ఆవిర్భవించినవాడే సుమా! ఆ విరాట్ పురుషుడే

ఈ వ్యష్టి శరీరములన్నిటి యొక్క మూలము. ఈ స్వర్గ-మర్త్య-పాతాళములనబడే త్రిలోకములు ఒక 'లత' అనుకుంటే ఈతడు ఈ లతకు బీజమువంటివాడు. 'ముక్తి' అనే మార్గమధ్యంలో 'విషయ సృష్టి' అనే ప్రతిబంధకమును కలిగించేవాడుగా కూడా ఆ విరాట్ పురుషుని గురించి కొందరు చెప్పుతారు. "సంసారము" అనే వర్షధారకు ఆయనే మేఘమువంటివాడు. సర్వ కార్యములకు కారణం ఆ విరాట్ పురుషుడే! అతడు కూడా వ్యష్టి పురుషునివలె సంకల్ప మాత్రజనితుడే అయినప్పటికీ, యథార్థానికి అతడు "ఆవిర్భావ-తిరోభావ రహితమగు చిత్ స్వరూపుడే" అని గ్రహించు. అతని దేహము భౌతికము కాదు. అతని శరీరమునకు వ్యష్టి దేహమువలె భూమికలు మొదలైనవి లేవు. అందుచేత అతనిని ఈ భౌతికమైన చేతులతో ఎవరూ పట్టుకోలేరు.

దృష్టాంతానికి... ఒక మనుజుడు మౌనంగా నిద్రిస్తూ కలగంటున్నాడనుకో! కలలో ఆ సముద్రముల యొక్క, ఆ మేఘముల యొక్క, ఆ యుద్ధముల యొక్క, ఆ సింహగర్జనల యొక్క భీకరనాదములను వింటూనే వాస్తవానికి మౌనముగా ఉన్నవాడగుచున్నాడు కదా! అట్లాగే ఆ విరాట్‌పురుషుడు కూడా తన యొక్క చిత్ స్వరూపమునందు ప్రపంచరహితమైన స్థితిని కలిగియున్నాడు. స్వప్నంలో కనిపించిన సైనికుల కోలాహలమంతా జాగ్రత్ వచ్చేసరికి కేవలం ఒక జ్ఞాపకమాత్రంగాను, సర్వదా అసత్తు-సత్తులు కానిదిగాను ఉంటోంది కదా! ఈ ప్రపంచము యొక్క స్థితి కూడా అటు విరాట్ పురుషునికి ఇటు వ్యష్టి పురుషునికి కూడా అట్టిదే!

ఓ రామచంద్రా! స్వప్న సంవిత్ యొక్క ఒక అణువులో "విశాలము-సుదీర్ఘము అగు స్వప్న జగత్తు" అనుభవింపబడగలదు చూచావా? అట్లాగే అనేక లక్షల యోజనముల సమూహము వరకు విస్తృతమైన ప్రమాణం గల-అసంఖ్యాక దేహములుగా త్రిలోకములచే వ్యాపించిన అనేక జగత్తుల సమూహములు ఒక రోమము (వెంట్రుక) యొక్క అల్పమైన చివరి భాగంలో కూడా భాసించగలవు. 'బ్రహ్మదేవుడు' అనబడు ఈ విరాట్ పురుషుడు సమస్తమహాపర్వతములకు కూడా ఆధారమై అనేక బ్రహ్మాండ సమూహమయుడై ఉండి కూడా, ఒక మఱ్ఱి ఆకు చివరలోని ఒక ఛిద్ర భాగమును కూడా పూరించజాలడని కూడా గ్రహించు. అనేక జగత్తులను తన అతివాహిక దేహంతో పూరించునట్టి విశాలాకారుడగు బ్రహ్మదేవుడు చిదాకాశమునందు అణుమాత్ర స్వరూపుడే అవుతాడు. స్వప్నంలో కనబడిన కొండ ఏ ప్రదేశమునూ ఆక్రమించనట్లే వాస్తవానికి ఆ విరాట్ పురుషుడగు బ్రహ్మదేవుని దేహము ఏ ప్రదేశమునందూ వ్యాపించియే లేదని గమనించు.

ఈ బ్రహ్మదేవుని (విరాట్ పురుషుని)..."స్వయంభువు, విరాట్టు, బ్రహ్మాండాత్మ జగత్ శరీరుడు"... ఇట్లా పిలుస్తూ ఉంటారు. వాస్తవానికి అతడు చిదాకాశమయుడే సుమా! అంతేకాదు. అతడే 'సనాతన పురుషుడు' అని 'రుద్రుడు' అని కూడా చెప్పబడుచున్నాడు. ఇంద్ర-ఉపేంద్ర-మరుత్-మేఘ-పర్వత సమూహాదులన్నీ అతని దేహమే! అనగా అవన్నీ అతడే అయి ఉన్నాడు. పరమ సూక్ష్మమగు చైతన్యమున చేతితమొనర్చటం-ప్రకాశిత మొనర్చటం అను ఒక చమత్కారం బయల్వెడలుతోంది. అద్దాని నుండి చిత్తశరీరం ఆవిర్భవిస్తోంది. ఆ చిత్త శరీరము క్రమంగా విశాల

జ్ఞానయుక్తమై "మహత్తరమైన బ్రహ్మాండమే నేను" అను చింతన చేస్తూ చేస్తూ 'జగత్ శరీరం'గా అగుచున్నది. స్పందన జ్ఞానముచే ఆ బ్రహ్మదేవుడు ప్రాణాదుల సంచలనమును అనుభవిస్తున్నాడు. అతని ప్రాణ సంచలనమే వాయు సమూహంగా జగత్తులో నెలకొనియున్నది. అనగా, స్పందన జ్ఞానముచే బ్రహ్మదేవుడు ఏ ప్రాణ-అపానాలను అనుభవించుచున్నాడో... అద్దానినే బ్రహ్మాండ ఆకాశమున మనం "వాయు సమూహములు" అని పేర్కొనుచున్నాం.

బాలుని చిత్తముచే పిశాచం కల్పించబడి, అనుభవించబడుచున్నది చూచావా? అట్లాగే బ్రహ్మదేవుని చిత్తంచే ఈ సూర్య-చంద్ర-నక్షత్రాది రూపాలు కల్పించబడుతున్నాయి. చిత్తం యొక్క కల్పించబడిన-వాస్తవానికి లేనివే అగు-తేజఃకణములచే అవన్నీ రూపత్వం పొందుచున్నాయి.

**హృదయము :** ఈ జీవుని ఉదరం ప్రాణ-అపానాల పరివర్తనమునకు (ప్రాణం అపానదశ పొందటం, అపానం ప్రాణదశను పొందటం జరుగుచుండటం చేత) ఊయలవంటిది. ప్రాణ-అపానాల లయ స్థానమే హృదయస్థానం సుమా! అదియే జగత్తు యొక్క హృదయం.

వ్యష్టి జీవుల ప్రథమ బీజం బ్రహ్మదేవుడే! ఈ వ్యష్టి శరీరాలన్నీ ఈ జీవుల యొక్క వాసనలచే కల్పితములగుచున్నాయి. ఈ జగత్తునందు 'కల్పం' వరకు వ్యవహరించునట్టి సమస్త జీవుల యొక్క వాసనలచే కల్పితాలై ఉన్న ఈ వ్యష్టి శరీరాలకు మొట్టమొదటి బీజం బ్రహ్మ దేవుడే అయి ఉన్నాడు. ఈ జీవులందరి వాసనలు అతనిచే సృజించబడుచున్నాయి. అతని వాసనలే జగద్రూపములుగా ప్రకటితములగుచున్నాయి. ఈ అనేక దేహాల బాహ్యా-అభ్యంతరాలలో అతడు ఏకరూపం తోటి స్థితి కలిగి ఉన్నాడు. అందుచేత అతడు "చిద్రూపుడు, ఆది బీజం అగు హిరణ్య గర్భుడు"గా వర్ణించబడుచున్నాడు. అతని ఇచ్ఛచే ఇతఃపూర్వమే ఏ ఏ విధంగా ఆయా జీవులందు ఆయా వాసనలచే జగత్ పరంపర ఉదయించిందో... ఇప్పుడు కూడా అదే విధంగా ఉదయిస్తోంది.

ఆ బ్రహ్మదేవుని శ్లేష్మ-పిత్త-వాయువులే ఈ సూర్య చంద్ర-వాయువులై ఒప్పుచున్నాయి. అతని శ్లేష్మ బిందువులే ఈ తదితర గ్రహ నక్షత్రాదులుగా చెన్నొందుచున్నాయి. పర్వత సమూహములన్నీ అతని అస్థులు. మేఘములు అతని మేధస్సు నుంచి ఉద్భవించిన వ్యవహారయోచనా క్రమములే! అతని పాదములే ఈ ఊర్ధ్వ-అధో లోకాలు. ఈ బ్రహ్మాండావరణం అతని చర్మము. అతని దేహమే అంతటా ఆవరించి-ఉన్నప్పటికీ అతని అట్టి దేహమును ఈ భౌతికమైన కళ్ళతో చూడలేం.

ఓ రామచంద్రా! ఈ జగత్తును "సంకల్పరూపుడగు విరాట్ పురుషుని కల్పనామయ శరీరం"... అని ఎఱుగుము. అతని మనోకల్పనయే ఈ జగత్తు. మనస్సుతో కల్పించబడినది సత్యమెట్లా అవుతుంది చెప్పు?

కాబట్టి... ఈ ఆకాశం, పర్వతాలు, నేల, సముద్రాలతో కూడిన సమస్త జగత్తు కూడా అధిష్ఠాన రూపముచే ప్రశాంతమగు చిదాకాశమే అయి ఉన్నది. భావికుని కంటే భావన వేరు కాదు కదా! స్వప్న ద్రష్టకంటే స్వప్నం వేఱైనదా! కానేకాదు కదా!

❖❖❖

# 19. విరాట్ పురుషుని జగన్నివాసం

**శ్రీరాముడు :** మహర్షీ! మీకు లోకాలోక పర్వతంపై ఆ శిలలో విద్యాధరి బ్రహ్మాండాన్ని చూపగా మీరు అందులో ప్రవేశించి ఆయా లోకాలన్నీ దాటి బ్రహ్మలోకంలో గల బ్రహ్మదేవునితో సంభాషించటం జరిగింది కదా! ఆ బ్రహ్మదేవుడే విరాట్ పురుషుడు అయి ఉన్నాడని, మన కథాక్రమం అనుసరించి ఆ విరాట్ పురుషుడు తన బ్రహ్మాండ శరీరాన్ని ఉపసంహరించే ఉద్యమంలో ఉన్నాడని కూడా చెప్పారు. ఇప్పుడు ఆ శిలయందు గాంచబడిన బ్రహ్మకల్పమందలి బ్రహ్మదేవుని (లేక) విరాట్ పురుషుని యొక్క సంకల్పమయ బ్రహ్మాండ శరీరం గురించి మరికొంత తెలుసుకోవాలని ఉన్నది. బ్రహ్మాండ శరీరుని బ్రహ్మాండ శరీరము గురించి, అద్దాని విచిత్రాచారములతో కూడిన బ్రహ్మాండ వ్యవస్థ గురించి మరికొన్ని జ్ఞాన విశేషాలు ప్రవచించమని నా ప్రార్థన!

బ్రహ్మాండ నిర్మాణానికి ముందు ఆ బ్రహ్మాండ శరీరుని రూపము-ఉనికి ఎట్టిది? బ్రహ్మాండ నిర్మాణానంతరం అతని ఉనికి బ్రహ్మాండంలో ఎట్లు ఏ రూపంలో ఉన్నది? బ్రహ్మాండమంతా నిండి ఉన్న అతడు బ్రహ్మలోకంలో దర్శనమిస్తూ ఎట్లా ఉన్నాడు?... సాధకులమగు మా సంశయ నివృత్తి కొఱకు, చిత్తవృత్తి ప్రశాంతత కొఱకు చెప్పవలసినదని నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ కనబడే బ్రహ్మాండ సృష్టి అంతా ఒక కల్పన. కల్పనకు ముందే కల్పన చేస్తున్నవాడు ఉంటాడు కదా! కనుక విరాట్ పురుషుని మొట్టమొదటి కల్పనారహిత శరీరము "ఆది-మధ్య-అంతరహితమగు పరమచిదాకాశమే"... అయి ఉన్నది. అతని తదనంతర కల్పనా శరీరమగు ఈ జగత్ శరీరము ఆ చిదాకాశ స్వరూపము ముందు అత్యంత స్వల్ప విశేషం మాత్రమే! అనగా విరాట్ పురుషుడగు బ్రహ్మదేవుని స్వసంకల్ప శరీరమే ఈ బ్రహ్మాండం. అట్టి ఈ బ్రహ్మాండానికి వెలుపల ఆ బ్రహ్మదేవుడు చిదాకాశమాత్రుడై నిస్సంకల్ప సాక్షిగా తన ఈ బ్రహ్మాండాన్ని గాంచుచున్నాడు. ఈ విధంగా ఈ జీవుడు-ఆ విరాట్ పురుషుడు ఇద్దరూ కూడా...

1. సంకల్ప రూపులు. మరియు 2. సర్వ సంకల్పములకు మునుముందుగానే ఏర్పడి ఉన్న నిర్మల చిదాకాశ స్వరూపులు కూడా!

చిదాకాశ స్వరూపుడగు బ్రహ్మదేవునిచే (విరాట్ పురుషునిచే) గాంచబడే ఈ బ్రహ్మాండం కూడా పరమార్థ దృష్టిచే చిదాకాశమే అయి ఉన్నది. పక్షి తన నుండి జనించిన గ్రుడ్డును "పై విభాగం-క్రింద విభాగం" అని విభజనచే చూస్తుంది చూచావా? తనచే కల్పించబడిన బ్రహ్మాండాన్ని ఆ విరాట్ పురుషుడు రెండు విభాగాలుగా గాంచుచున్నాడు-

1. ఊర్ధ్వ విభాగం ఆకాశము; 2. అధో విభాగం పృథ్వి మొదలైన లోకములు. అయితే అవన్నీ ఆత్మకంటే భిన్నమైనవి కావు సుమా!

బ్రహ్మాండము యొక్క ఊర్ధ్వ విభాగము విరాట్ పురుషుని శిరస్సు. అధోభాగం అతని పాదములు. మధ్యనున్న విభాగము ఆయన ఊరువులు (తొడలు). ఊర్ధ్వ అధోభాగముల మధ్యగల

మధ్య విభాగమే అనంతము - నీలవర్ణము - శూన్య రూపము అగు ఆకాశముగా జనులకు దృగ్గోచరమౌతోంది.

అట్లాగే స్వర్గలోకం-నక్షత్రములు-సురాసురులు-మనుష్యులు, బుద్ధి-ప్రాణములు, వృత్తి భేదములు, అతని శరీర విభాగములే! భూత-పిశాచములు అతని దేహములోని క్రిములు. లోక-లోకాంతరములు ఆ విరాట్ పురుషుని కనులు. ఈ భూమండలము అతని తలదిండు. పాతాళాది లోకాలు అతని పాదాలు. సముద్రము-ద్వీపములతో చుట్టబడిన పృథ్వి అతని దేహ మధ్య ప్రదేశం. ఈ నదులు, దిక్కులు, మేఋపర్వతం, తదితర పర్వతములు, చంద్ర-సూర్యులు, అతని శరీర విభాగములే! బ్రహ్మలోకం అతని శిరస్సు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ బ్రహ్మాండమే దేహంగా గల ఆ బ్రహ్మదేవుని అసలు స్వరూపం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ బ్రహ్మదేవుడు సమష్టి మనఃస్వరూపుడు. అతడే స్వయముగా ఈ జీవుల మనస్సు అయి ఉన్నాడు. అతని మనస్సును మరొక మనస్సేదీ సృజించటం లేదు. ఈ సృష్టి ఆత్మచే కల్పించబడలేదు. ఎందుకంటే ఆత్మ కూటస్థము, అద్వయస్వరూపము కదా! ఆత్మయందు ఎవనిచే జగత్తు ఎవనికి సంభవిస్తుంది? కాబట్టి ఈ కనబడేది మనోకల్పన మాత్రమే!

ఆ బ్రహ్మదేవుడు స్వయముగా సమస్త ఇంద్రియరూపుడై ఉన్నాడు. అతని చేతనే నా యొక్క తదితరుల యొక్క ఇంద్రియముల అస్తిత్వము కల్పించబడింది. అయితే అతని ఈ ఇంద్రియ సమూహము కూడా కల్పనా మాత్రమే! (ఉదాహరణకు) అవయవి-అవయవములు ఏక శరీరమే కలిగి ఉన్నారు కదా! అట్లాగే మనస్సు ఇంద్రియములు అను ఈ రెండింటికీ ఏమాత్రం భేదం లేదు. అంతేకాదు! ఈ జగత్తునందలి సమస్త క్రియలు అతని క్రియలే అవుతాయి.

**శ్రీరామచంద్రుడు :** ఇది ఎట్లా మహర్షీ!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును.

1. బ్రహ్మదేవుడు సమష్టి మనోరూపుడు. కనుక ఈ సర్వజీవుల మనస్సు ఆయనవే!
2. మనస్సును బట్టే ఇంద్రియాలు వ్యవహరిస్తున్నాయి. కనుక ఈ ఇంద్రియాలన్నీ ఆయనవే!
3. మనో-ఇంద్రియాలకు సంబంధించినవే సర్వక్రియలు. కాబట్టి సమస్త క్రియలు అతని క్రియలే అవుతాయి.

సమస్త సంకల్పములు బ్రహ్మదేవునివే! జలమందు తరంగత్వము ఉదయించి, ఆ తరంగత్వమే అనేక తరంగములుగా ప్రదర్శితమౌతోంది కదా! తరంగములన్నీ తరంగత్వమునకు సంబంధించినవే కదా! అట్లాగే అతని సంకల్పములే సర్వజీవుల యొక్క (ఆరోపితమగు) ద్వైతవ్యవహార రూపంగా నడచుచున్నది.

**జాగతే తస్య విజ్ఞేయే నాఽన్యే అస్య మృతి-జన్మనీ ।**
**స ఏ వేదం జగత్యస్మత్ సంకలాత్మా అస్య నేఽతరత్ ॥**

సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి-వినాశనములే ఆ బ్రహ్మదేవుని జనన-మరణములని గ్రహించు. అంతేగాని ప్రత్యేక వ్యక్తివి నిజమైన జనన మరణములు కావు సుమా! ఈ ప్రపంచము యొక్క

సమష్టి రూపమే ఆ బ్రహ్మదేవుని రూపం. అందరి సంకల్పముల సమష్టియే ఆయన. నావంటి సర్వుల యొక్క సమష్టి రూపము అతడేగాని మఱెవ్వరూ కాదు. బ్రహ్మాండ శరీరుడగు విరాట్ పురుషుని సత్తయే జగత్‌సత్త.

**తత్ సత్తయా జగత్‌సత్తా, తత్‌మృత్యైవ జగత్ మృతమ్ ।**
**యాదృశీ స్పందమరుతోః సతైకా, తాదృశీ తయోః ॥**

జగత్ సమష్టి స్వరూపుడు-బ్రహ్మాండ శరీరుడు-హిరణ్యగర్భుడు విరాట్ స్వరూపుడు - సమష్టి మనోస్వరూపుడు-సమష్టి ఇంద్రియ స్వరూపుడు-సమష్టి క్రియా స్వరూపుడు-జగదుత్పత్తి వినాశన స్వరూపుడు - సర్వ సంకల్ప స్వరూపుడు" - అగు ఆ బ్రహ్మదేవుని సత్తాచేతనే ఈ జగత్ సత్తా ఏర్పడి ఉంటోంది. అతని సంకల్ప ఉపసంహారముచే జగత్తు సత్తాను కోల్పోతోంది. అతని ఉపసంహరణ రూప మరణముచే జగత్తు యొక్క మరణము సంభవిస్తోంది.

స్వప్న ద్రష్టకు-స్వప్నములో విషయాలకు భేదంలేదు కదా! జలమునకు-జలతరంగములకు భేదమేమున్నది? వాయువుకు-వాయు చలనమునకు భేదమెక్కడిది?... అట్లాగే... బ్రహ్మదేవుడు-అతనిచే కల్పితమైన జగత్తు ఒకే సత్త కలిగి ఉన్నాయి.

ఓ రామచంద్రా! బ్రహ్మములో (జలంలో ఉద్భవించే తరంగంలాగా) 'విరాట్టు' అనే మహా కెరటం ఉద్భవిస్తోంది. అదియే 'ప్రథమ స్పందన' అని కూడా అంటారు. బ్రహ్మములో ఉదయించే విరాట్టుకు బ్రహ్మమునకు (జలము-జలములోని స్పందన వలె) భేదమే లేదు. అట్టి విరాట్టుకు ఆ విరాట్టు యొక్క స్వరూపమగు ఈ జగత్తుకు భేదం లేదు. కనుక

**జగత్ బ్రహ్మ-విరాట్ చేతి శబ్దాః పర్యాయవాచకాః**
**సంకల్పమాత్రమేవై తే శుద్ధచిత్ వ్యోమరూపిణిః ॥**

జగత్తు-బ్రహ్మము-విరాట్ అను ఈ మూడు పదములు ఒకే అర్థాన్ని సూచిస్తున్నాయని గ్రహించు. ఆ మూడూ పర్యాయపదములే సుమా! ఈ విరాట్-జగత్తులు శుద్ధ చిదాకాశరూపుడగు పరమాత్మ యొక్క సంకల్ప మాత్రములే అగుటచేత ఆ రెండు బ్రహ్మరూపములే అయి ఉన్నాయి. "అధిష్ఠాన రూపముచే సర్వము బ్రహ్మమే" అని శాస్త్రములచే సిద్ధాంతీకరించబడుతోంది కదా!

**శ్రీరాముడు :** మునీంద్రా! "పరమాత్మ తన యొక్క సంకల్పముచే విరాడ్రూపియై సాకారత్వము పొందారు" అను విషయం మీ విశదీకరణచే నేను అంగీకరిస్తున్నాను. అయితే ఆ బ్రహ్మదేవుడు తన విరాడ్రూప శరీరం లోపల (తన కల్పనయగు సాకార జగత్తు లోపల) తానే ఎట్లా వసించు చున్నాడు? ఈ విషయం మరింత సుస్పష్టపరచండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీ ఇష్టదైవమైన ఆ చంద్రశేఖరుని నీ మానస పూజయందు నీ హృదయమునందు కల్పించబడిన రత్న మండలములో ఆ దేవదేవుని ఆసీనుని చేసి మనోకల్పితమైన ఛత్రచామరములచే నీవు ఆయనను పూజిస్తూ ఉంటావు కదా! నీవు నీ మనస్సు నందు ఉండి నీ ఇష్టదైవాన్ని మానసికంగా పూజిస్తున్నప్పుడు నీలో నీవే ఉంటున్నావు కదా! అట్లాగే

సంకల్ప రూపుడగు బ్రహ్మదేవుడు తన సంకల్ప - శరీరమునందు తానే వసించగలడు. అంతేకాదు "ఈ స్థూల దేహమందలి హృదయకమలమున సూక్ష్మ దేహాత్మకమగు నా యొక్క జీవరూపస్థితి ఉన్నది" అనే విషయం వివేకులందరికీ అనుభవ సిద్ధమే అయి ఉన్నది. అట్లాగే బ్రహ్మదేవుడు ఈ సమష్టి స్థూల ప్రపంచంలో సూక్ష్మదేహి అయి ఉన్నారు. ఓ రామచంద్రా! సర్వజీవుల యొక్క ఈ భౌతిక దేహములన్నీ కూడా మట్టితో నిర్మించబడిన బొమ్మలవంటివి. అద్దంలో ప్రతిబింబమువలె సర్వజీవులలోను బ్రహ్మదేవుడి చిత్తాకాశం వేంచేసియే ఉన్నది.

**యత్ర త్వమపి దేహాన్తః కర్తుం శక్తో అస్య అలం స్థితమ్,**
**సంకల్పాత్మా విభుః తత్ర బ్రహ్మ కిం న కరిష్యతి?**

నీవే నీ స్థూల దేహమునందు వసించగలిగినప్పుడు... ఇక సంకల్పరూపుడు, సర్వవ్యాపి అయిన బ్రహ్మదేవుడు ఆ విరాట్ సృష్టిలో ఎందుకు వసించలేడు చెప్పు? అనేక లక్షణాలతో ఉండి ఉండగా... ఇకప్పుడు సర్వశక్తి తత్త్వ స్వరూపుడై ఆవిర్భవించినట్టి చైతన్యకల్పాత్మకుడైన బ్రహ్మదేవుడు నిజదేహమగు ఈ బ్రహ్మాండమున ఎందుకు వసించలేడు? ఓ రామచంద్రా! చిదాకాశరూపుడే అయి ఉన్న బ్రహ్మదేవుడు ఈ బ్రహ్మాండము దృష్ట్యా సాకారరూపుడే అగుగాక! లేక... తన యొక్క సమష్టి మనోరూపముచే నిరాకారాకాశ రూపుడు అయి ఉండవచ్చు గాక! ఆ ఉభయ స్థితులందు కూడా సమస్త పదార్థముల యొక్క బాహ్య-అభ్యంతరాలలో ఆయన వెలయుచునే ఉన్నారు. అయితే వాస్తవానికి బాహ్య-అభ్యంతర కల్పన పరమాత్మ యందు లేదు. ఆ బ్రహ్మదేవుడు బాహ్యమున బ్రహ్మాండ రూపుడై ఉంటున్నారు. అభ్యంతరముననో, 'అహంత్వం' మొదలైనవన్నీ తన రూపంగా కలిగి ఉంటున్నారు. ఆత్మయందు ఆత్మారాముడై ఉంటున్నాడు. అన్ని క్రియా విశేషాలకు తానే ఒక వైపు కారణమై ఉంటూనే, మరొక వైపు కాష్ఠమౌనం వహించి కేవల సాక్షి అయి ఉంటున్నారు. అతడు జడ స్వరూపుడు కాకపోయినప్పటికీ, నిత్యోదితమగు చైతన్యస్వరూపుడే అయినప్పటికీ, ఏ మార్పు-చేర్పులు లేనివాడై (జడ విలక్షణుడై) స్వాత్మయందు విరాజిల్లుచున్నారు.

ఓ రామచంద్రా! కేవలమూ అ విరాట్ పురుషుడే కాదయ్యా! తత్త్వజ్ఞానులగువారంతా కూడా ఆయా బంధాలు ఉన్నప్పుడుగానీ, అవన్నీ లేనప్పుడుగానీ తృణం-కాష్ఠం-మనుజ విగ్రహాల వలె క్రోధ-రాగ-ఆశాదులచే స్పర్శించబడని వారై మహా మౌనస్వరూపులై ఉంటున్నారు. జల ప్రవాహం నిరోధించబడినట్లు వారు నిరోధాలు పొందవచ్చుగాక! ఈ అవయవాలు ఛిన్నాభిన్నమగు క్షణాలు సమీపించ వచ్చుగాక! వీరు తమ శాంత-అంతరంగ మౌనస్థితిని విడుచుటయే లేదు. వారు వివిధ కార్యజాలలో నిమగ్నమైయున్న సమయంలో కూడా శిలామధ్య భాగం వలె నిశ్చల స్వరూపులై, క్రోధాది చంచలత్వాన్ని పొందనివారై, శాంతచిత్తులై ఆద్యంతాలను ఎఱిగి ఉన్నవారై ఉంటున్నారు. పరమశాంత చిత్తులై సర్వ సంరంభాలను ప్రశాంత-మౌన స్వరూపంచే కేవల సాక్షిగా దర్శిస్తున్నారు.

అట్టి మహనీయు లెందరో ఈ సభకు వేంచేసి మన ఈ సంవాదమును అంగీకార పూర్వకంగా సమృద్ధి పరస్తూనే ఉన్నారు కూడా!

❖❖❖

# 20. మహాకల్పాంతాగ్ని

**శ్రీరాముడు :** ఓ మహర్షీ! ఆ లోకాలోక పర్వత శిలలో గల బ్రహ్మాండమునకు అధిపతియగు బ్రహ్మదేవుడు ధ్యానతత్పరుడైయున్నారు కదా! అప్పుడేమైనది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! ఇక కథాక్రమంలోకి వద్దాం-

బ్రహ్మదేవుడు అత్యంత మౌనముతో కూడిన ధ్యానతత్పరుడై ఉన్నారు. అప్పుడు నాకు ఎదురుగా ఇంద్రాది దేవతల నగరములు పతనమవటం కనిపించింది. మెల్లగా నా దృష్టిని నలువైపులా సారించాను. ఆకాశంలో ఊర్ధ్వంగా ప్రకాశించే మధ్యాహ్న సూర్యునికి వేఱైన మరొక రెండవ సూర్యుడు పశ్చిమంగా ఉదయించటం కనిపించింది. ఆ తరువాత నైఋతి దిక్కులోను, దక్షిణ దిక్కు, పూర్వ దిక్కులోను, ఈశాన్య దిక్కులోను, ఉత్తర-వాయవ్య దిశలలోను భిన్న భిన్న సూర్యులు ఉదయించటం చూచాను. "ఆహాఁ! ఏమి ఈ దైవ ప్రతికూలత".... అని ఆశ్చర్యపడుతూ ఉండగా ఇంతలో భూమియొక్క ఉపరితలం నుండి ఇంకొక సూర్యుడు ఉదయిస్తూ కనిపించాడు. ఆ తర్వాత దిక్ సమూహముల మధ్యగా ఆకాశంలోంచి 11వ సూర్యుడును, ఆపై మరొక సూర్యుడును-ఇట్లా ద్వాదశాదిత్యులు ఉదయించారు. 11వ సూర్యబింబమునందు సమస్త సూర్యుల ప్రతిబింబమువలె మరల ముగ్గురు సూర్యులు ఉదయించారు. ఆ సూర్య సమూహము రుద్రుని శరీరముగా ఆకారం సంతరించుకున్నాయి. ఆ రుద్ర శరీరమునందు 3 నేత్రములు ఉన్నాయి. ఆ రుద్రశరీరమే ద్వాదశాదిత్య సమూహరూపమై దిక్కులన్నీ భస్మీభూతం చేయనారంభించింది.

అటు తరువాత భూమినే శుష్కింప జేయగల గ్రీష్మఋతు పవనాలు (వాయు, వీచికలు) ఎక్కడి నుంచో వీచసాగాయి. అక్కడి నుండి అదృశ్యరూప శిఖల నుండి అగ్ని రహితమైన ఉష్ణము ఎక్కడబడితే అక్కడ ఉదయించసాగింది. అక్కడ అగ్నికి నా అవయవాలు దగ్ధమై భిన్నములవ సాగాయి. నేనిదంతా గమనిస్తూ "ఇక ఇక్కడ ఉండటం ఉచితం కాదు. క్షేమం కాదు" అని అనుకొని, నా స్థూలాన్ని వీడి ఊర్ధ్వమున సుదూరంగా గల ఆకాశప్రదేశం చేరాను. ఆ సుదూర ఊర్ధ్వ ఆకాశ ప్రదేశం నుండి ప్రచండ తేజస్సుతో ఉదయించి బంతివలె ఎగుఋచున్న ద్వాదశాదిత్య సమూహమును గమనించసాగాను. ఆ ఆదిత్య సమూహం దశ దిక్కులను తపింపజేయసాగాయి. అప్పుడు ఆయా దిశలలో వర్తులాకారముగా దిక్కులను పూరిస్తూ నక్షత్రమండలాలు కనిపించాయి.

అక్కడి ద్వాదశ సూర్య సమూహముల నుండి భీకర 'కుహ-కుహ' శబ్దాలతో బయల్వెడలిన అగ్ని జ్వాలలు లోకలోకాంతరములను, అసంఖ్యాక జీవులను దహించసాగాయి. నక్షత్రాలు ఆ వేడికి రాలసాగాయి. జీవుల హాహాకారాలు మిన్నుముట్టాయి. అసంఖ్యాక ప్రాణులు భీకర శబ్దాలు చేస్తూ మరణించసాగాయి. మహా పర్వతములు నేలమట్టం కాసాగాయి. విద్యాధర స్త్రీలు నేలకూల సాగారు. ఆ అగ్ని శిఖలచే బాధింపబడి కొందరు జీవులు ఏడుపులు - పెడబొబ్బలు పెట్టుచుండగా ... మరికొందరు జీవులు తమ యొక్క యోగబలం చేత బ్రహ్మరంధ్రమును ఛేదించుకొని

బయల్వెడలి అమరులయ్యారు. సముద్రంలోని జలచరాలు జలము ఇంకుచుండటంచే అటూఇటూ పరుగులు తీయసాగాయి. జలం ఆవిరి అగుచుండుటచే తరంగములే ఇంధనంగా కలిగి ఉండే బడబాగ్నులు ఖండఖండములు కాసాగాయి.

అటు తర్వాత "ప్రళయాగ్ని" అనే నటుడు "జ్వాలలు" అనే వస్త్రములు ధరించి కొఱివులను మాలలుగా ధరించి జగత్తు అనే కుటీరంలో నృత్యం చేయసాగాడు. ఆ ప్రళయాగ్నిచే అరణ్య-గ్రామ-నగర సమూహాలు దగ్ధం కాజొచ్చాయి. స్వర్గలోకం యొక్క ఉపరిభాగం కూడా జ్వలింప సాగింది. సిద్ధలోకములు కూడా అగ్నికి ఆహుతి కాజొచ్చాయి. దిక్కులు అగ్ని గోళాలతో ఒకటితో మరొకటి బంతులాట ఆడుకుంటున్నట్లు కనిపించసాగింది. దశదిశలు ఆ ద్వాదశాదిత్య స్వరూపుడగు రుద్రునిచే దహించవేయబడసాగాయి. ఆ రుద్రుడు కదలుతుంటే పర్వతగుహ లోంచి అగ్నిశిఖలు బయల్వెడలసాగాయి. దిక్కులు సంపత్తి రహితం కాసాగాయి. అప్పుడు జనించుచున్న ధూమసమూహం (దట్టమైన పొగజ్వాలలు) దిక్కులను మూసివేస్తున్నట్లు కనిపించాయి. సహ్య పర్వతము వంటిది అసహ్యత్వము పొందింది. ఆకాశం అగ్నిజ్వాలలతో కూడిన సరోవరరూపంగా కనిపించసాగింది. బ్రహ్మాండము యొక్క ఊర్ధ్వభాగం మూత గలదై, అధోభాగం ప్రజ్వరిల్లుచుండగా ఉడుకుచున్న అన్నపుగిన్నెవలె కనిపించింది. ఆ ప్రళయకాలం చూచిన జగత్‌లక్ష్మి గుండెలు బాదుకుంటున్నట్లు అనిపించసాగింది. సప్తసముద్రజలం కాగుచున్న నీటి బిందెలోని నీరువలె ఉడక నారంభించింది. సముద్ర జలములు ఇంకిపోవుచుండగా సముద్రా లలో కొండగుహలు కనిపించసాగాయి. లోకపాలకుల నగరాలు నేలకూలసాగాయి. మేఱుపర్వత శిఖరాలు ద్వాదశ ఆదిత్యుల వేడికి కరిగిపోసాగాయి. ఆ ప్రళయాగ్నికి అన్నీ నశిస్తూ ఉంటే ఇక సువర్ణము - ఆకాశము మాత్రమే ఆ అగ్నికి దహించక ఉన్నాయి. అవి రెండు -

1. ఆకాశం వ్యాపకమయి ఉండటంచేత, 2. సువర్ణము (శుద్ధ సత్త్వము) దోషరహితమైన దగుటచేత ప్రళయాగ్నులచే దగ్ధం కాబడలేదు. అందుచేతనే "రజస్తమో గుణములు లేనట్టి బ్రహానందదాయ కమగు శుద్ధసత్వగుణమే సుఖసారము" (సత్వమేకం సుఖం మన్యే న రజో నచవా తమః)... అని నా అభిప్రాయం.

❖

ఆ సమయంలో మేఘములన్నిటినీ దహించివేయగల ప్రళయాగ్ని మేఘం ఆకాశమంతా ఆవరించి నిప్పుల వర్షం వెదజల్లింది. నేలపై గల జలంలో ఆ నిప్పుల వాన కురుస్తున్నప్పుడు నీరు ఆవిరైపోసాగింది. ఇక నీటిలోను, నేలపైన గల చతుర్విధ ప్రాణులు ఆ అగ్నివర్షానికి ఆహుతి కాసాగాయి. దానితో జగత్తు ఆకులురాలిన వృక్షంలాగా నిర్మానుష్యం కాసాగింది. క్రమంగా అగ్ని మేఘముల తాకిడికి భస్మమైన సృష్టి వస్తువుల భస్మంకూడా కనిపించకుండాపోతుంది. ఆ ఉల్లాస సహితమగు అగ్నివర్షానికి ఒక్క కైలాసం మాత్రం దగ్ధం కాలేదు. అప్పుడు మరికొంత సమయానికి కల్పాంత కారణంగా కుపితుడైన రుద్రుని యొక్క నేత్రాగ్నిచే కైలాసం కూడా భస్మీభూతం కాసాగింది. అగ్నిజ్వాలలు ఒకదానితో మరొకటి ఢీకొంటూ ఆకాశం కనిపించింది. ఇన్ని మాటలెందుకు?

సమస్తమూ కూడా "ఎప్పుడో భూతకాలంలో సృష్టి ఉండేది" అన్నట్లుగా సృష్టి యొక్క ఛాయ కూడా మిగలకుండా కరిగిపోసాగింది.

అప్పుడు కల్పాంతం ప్రత్యక్షం కాసాగింది. మూర్ఖులకు కూడా "ఈ సంసారం అసారమే కదా" అన్నట్లుగా ఆ కల్పాంతం ప్రకటితమవసాగింది. అప్పటి ప్రళయాగ్నులు జగత్తు యొక్క నామ–రూప సమూహములను కుందేటి కొమ్మువలె ఏమాత్రం ఉండనివిగా చేసివేయసాగాయి. అగ్ని జ్వాలలు క్రమంగా శ్యామవర్ణం (నల్లటి రంగు) సంతరించుకోసాగాయి. ఇంతలో ఎక్కడి నుండో ప్రచండ వాయువులు వీచసాగాయి.

❖❖❖

# 21. పుష్కరావర్త ప్రళయ మేఘం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అప్పుడు ఆకాశంలో 'పుష్కరావర్తం' అనే కాలమేఘం ఎక్కడి నుంచో ఉదయించింది. అది పర్వతములను కంపింపజేయసాగింది. ఆ మేఘం యొక్క ప్రకంపనాలకు సాగర తరంగాలు ఆకాశంలో ఎత్తుగా లేవగొట్టబడ్డాయి. సముద్రం హద్దుదాట సాగింది. భూతలము–పాతాళము క్రమంగా నశించటం ప్రారంభించాయి. దిక్కులన్నీ శోకనిమగ్న మైనాయి. మేఘాల 'గులుగులు' శబ్దాలు అంతటా ఆవరించాయి. ఆ ధ్వని అత్యంత కోలాహలం గాను, దుస్సవహంగాను ఉన్నది. ఆ శబ్దముల భయంకర మార్మోతలు స్వర్గ–మర్త్య–పాతాళ లోకాలను నింపివేశాయి. ఆ 'ఘనా – ఘన' శబ్ద తరంగాలు క్షీర సాగర మధ్య ఘటన శబ్ద విన్యాసాలను మించిపోయాయి. అప్పుడు "అరె! ఈ ప్రళయాగ్నిలో కాలమేఘాలు ఎలా స్థితి పొందాయి"... అని విస్మితుడనయ్యాను. ఆ మేఘాలు జనించిన విధం, స్థానాలను అన్వేషిస్తూ ఒక్క అధోదిశ తప్ప మిగిలిన 9 దిశలను పరికించి చూచాను. నాకు ఏ దిక్కులోనూ మేఘాలు కనిపించ లేదు. విశాలమైన కొఅవుల యొక్క–పిడుగుల యొక్క వృష్టి మాత్రమే నాకు గోచరిస్తోంది. ఆ వృష్టి కోట్లయోజనాల వరకు ఉన్న పదార్థములన్నిటిని భస్మీభూతం చేసివేయటం మాత్రం కనిపించింది.

అటు తర్వాత ఆకాశంలో అతిదూరంగా ఊర్ధ్వము నుండి శీతల వాయువులు–అధోభాగం నుండి ఉష్ణ వాయువులు వీచుచున్నట్లుగా నా త్వగింద్రయం (స్పర్శేంద్రియం) గుర్తించసాగింది. వాటికి ఆవలగా వలయాకారంగా కల్పాంత మేఘములు ఆవరించి ఉన్నట్లు గమనించాను.

రామచంద్రా! ఆ సమయంలో మేఘాల యొక్క – అగ్నుల యొక్క సమావేశంచే ఛట ఛటా శబ్దములు ఉదయించి మహా సంగ్రామమును తలపింపజేయసాగాయి. ఆ సమయంలో (ఆ మహా ప్రళయ కాలము) పృథ్వి–జలము–అగ్ని–వాయువు అనే నాలుగు భూతములూ మహాసంక్షోభం చెందుచుండగా ఇక ముల్లోకముల విలయ స్థితి భీకరాకృతితో కనిపించింది. అప్పుడు కొంచెం త్రాణతో మిగిలి ఉన్న జీవుల ఆర్తనాదాలు మిన్నుమిట్టుచూ ఉన్నాయి. శిష్టులగు దేవతలు అతి దీనంగా విలపించటం కనిపించింది.

క్రమక్రమంగా ఒకప్పటి సృష్టి యొక్క స్థూల-సూక్ష్మ తత్త్వాల కించిత్ గుర్తు కూడా అనేకచోట్ల కనబడకుండా పోయినాయి. ఇతఃపూర్వం సృష్టి భాసించినచోట వర్తమానమున సర్వనాశనముచే (ఆ స్థానము - space) పరమ శాంతిని సంతరించుకొని అతి శోభాయమానముగా ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! సృష్టియే సర్వనాశనమైన తరువాత ఇక పరమశాంతిగా శేషించటానికి అక్కడ ఏమి ఉండదు కదా! ఇంకా "శోభాయమానంగా ఉన్నది" అంటున్నారేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సృష్టిలోపించినప్పటికీ "వాస్తవానికి ఉత్పత్తి-నాశనరహితుడు" అగు పరమాత్మ శేషించియే ఉంటాడు కాబట్టి "ఆతనిచే శోభించుచున్నది" అని పలికాను.

ప్రచండవాయువులచే ఏకముగా అయ్యే సముద్రంలాగా అక్కడ ద్వీప-పాతాళాది లోకాలన్నీ శమించుచున్నాయి కదా! ఇక అక్కడ ప్రపంచమునంతా ఏకంచేసే మహాసముద్రం మెల్లగా వృద్ధినొందసాగింది. జలవృష్టి మొట్టమొదట రోకలి ప్రమాణంలోను, తరువాత స్తంభాకారంగాను ఆ తర్వాత మహావృక్షాకారంగాను జలధారలుగా కురవనారంభించింది. ఆ తర్వాత కుంభవృష్టి కురిసింది. ఆ మహావృష్టిచే అక్కడ ప్రజ్వలిస్తున్న అతి దాహక ఉష్ణము శమించుచున్నదయింది.

ఓ రామచంద్రా! అనేక ద్వీపములు-ద్వీపకల్పములు-పర్వతములు-స్థాణువులు-జలాంతర్గత లోకములు-ఊర్ధ్వ-అధో లోకములు గలిగి ఉండే ఆ బ్రహ్మాండకోటరము ఇసుకచే బాలుడు నిర్మించిన పిచ్చికగూడులాగా వినాశనము పొందింది. అప్పటి జలప్రళయం సర్వమును ముంచెత్తివేసింది. సర్వ ప్రాణులు-పదార్థములు ఆ జలప్రళయముచే మ్రింగివేయబడ్డాయి.

❖❖❖

## 22. ఈ దేహానంతరం జీవునికి ఉనికి ఉన్నదా? లేదా?

**శ్రీరాముడు :** మహర్షీ! ఆ విధంగా కల్పాంత వాయువుల చేత, జల మహాప్రళయం చేత, రుద్రుని మూడవ కన్ను నుండి జనించిన అగ్నివర్షం చేత, లోకములన్నీ జీవ-వస్తురహితమగుచుండగా మీరు ఎక్కడ ఉన్నారు? ఎక్కడి నుండి అదంతా గమనిస్తున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! తపోలోకం వరకు ఆ విధంగా ప్రళయ సముద్రంలో మునిగి పోవుచుండగా నేను సత్యలోకమున గల ఆకాశంలో ఉండి అదంతా గమనిస్తున్నాను. అంతా లయం పొందుచుండగా ఇక నేను సత్యలోకం వైపుగా దృష్టిని సారించసాగాను. అక్కడ నాకు శిలా నిర్మిత విగ్రహం వలె నిశ్చల సమాధి యందు కూర్చుని బ్రహ్మదేవుడు కనిపించారు. ఆయనతో సమానంగా కైవల్యం పొందుటకు అధికారులగు దేవతలు, నిర్మల హృదయులగు మునులు, బృహస్పతి, ఇంద్రుడు, కుబేరుడు, యముడు, చంద్రుడు, వరుణుడు, అగ్ని, ఋషులు, దేవ-గంధర్వ సిద్ధ-సాధ్యుల నాయకులు మొదలైనవారు నిశ్చల సమాధియందు ఆసీనులై కనిపించారు. వారంతా పద్మాసనం ధరించి ధ్యాన పరాయణములైఉండి బాహ్యానికి మాత్రం నిర్జీవుల వలె కనిపించారు. ఇంతలో ద్వాదశాదిత్యులు కూడా ఆ చోటకు విచ్చేశారు. శీఘ్రంగా వారు కూడా

అక్కడి దేవ-మునుల వలె పద్మాసనమున బంధించి కూర్చున్నారు. అట్లా ముహూర్తం కాలం (48 ని) గడిచింది. స్వప్నం నుండి మేల్కొనిన మనుజుడు స్వప్నంలో తనకు అనుభవమై కనిపించిన వస్తు విశేషాలన్నీ ఇట్టే విడిచివేస్తాడు చూచావా? ఇక అతనికి స్వప్నమంతా జ్ఞాపకమాత్ర విశేషంగానే ఉంటుంది కదా !అట్లాగే ఆ బ్రహ్మదేవుని ఆత్మమాత్రపరిశేషునిగా నా ఎదుట చూచాను. ఆతనికి ఆతని ఇతఃపూర్వ సృష్టి అంతా ఇతఃపూర్వపు స్వప్నమువలె అయింది. ఆతడు 'బ్రహ్మాండ కల్పన' అనే స్వప్నం ముగించి నిదుర నుంచి లేచిన వానివలె కనిపించారు.

❖

ఆ విధంగా బ్రహ్మదేవుని అంతిమసాక్షాత్కార సమయమున అతడు, అచట ఉన్న తదితరులు విదేహముక్తిని పొందటం చూచాను. అప్పుడు బ్రహ్మలోకం కూడా జనశూన్యమైన అరణ్యం వలె గోచరించింది. అప్పటిదాకా దృశ్యరూపంగా కనిపించిన సమస్త ముని-ఋషి - విద్యాధరాదులు కూడా అదృశ్యరూపులైనారు. ఓ రామచంద్రా! వారు ఆ చోటనుండి ఎక్కడికీ పోకుండానే ఆత్మ స్వరూప విలీనులైనారు సుమా! ఎందుకంటే నేను ఆకాశమున ఉండియే, "ధ్యానముచే బ్రహ్మదేవుని వలె వారందరూ కూడా నామ రూపములను త్యజించి నిర్వాణమును పొందారు" అని నా సూక్ష్మ దృష్టిచే గ్రహించాను.

**వాసనాయాం విలీనాయామ్ 'అదర్శనమ్' ఉపాగతాః**
**స్వప్నలోకాః ప్రబుద్ధానామివ స్వం రూపమాగతాః ॥**

నిద్ర నుండి మేల్కొనినవారు మరల నిద్రకు ముందటి స్వస్వరూపమును పొందుతారు చూచావా? ఆట్లాగే, వాసనలు నశించటం చేత వారందరు భౌతిక దృష్టికి అదృశ్యులైనారు.

**శ్రీరాముడు :** మహర్షీ! అదృశ్యులై, వారు ఏ రూపమును పొందారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వారు వారి యొక్క-మనందరి యొక్క స్వస్వరూపమగు శుద్ధ బ్రహ్మరూపము యొక్క ప్రాప్తిని పొందారు. నాయనా రామచంద్రా! ఈ ఆకాశరూపమగు దేహము అనేది వాసనచే ప్రత్యక్షంగా భాసిస్తోంది. వాసన యొక్క అభావముచే భాసించకయే ఉంటుంది. స్వప్నంలో కనిపించిన ఆకాశ విశేషం మేల్కొనిన తర్వాత కనిపిస్తోందా? వాసనలు క్షయిస్తే దేహము దేహముగా కాకుండా అద్దాని అసలైన రూపమగు ఆకాశముగా కనిపించగలదు. అందుచేత జాగ్రత్తునందే వాసనలు క్షయించాయా-ఇక ఈ స్థూల-సూక్ష్మ దేహాలు రెండు భాసించకయే ఉంటాయి. అనగా అవి రెండూ కూడా చిదాకాశరూపములేనని అనుభవమౌతాయి.

**స్వప్నానుభవ ఏషో ఽత్ర దృష్టాంతత్వేన లక్ష్యతే ।**
**అబాలమేతత్ సంసిద్ధం అనుభూతం, శ్రుతం, స్మృతమ్ ॥**

ఇందుకు పసిబాలుని దగ్గర నుండి పండుముదుసలి వరకు అనుభవమౌతూ శ్రుతి-స్మృతి-పురాణాదులచే దృష్టాంతంగా చెప్పబడిన "స్వప్నమే" మనకు అతి సమీపమైన సుస్పష్టమైన దృష్టాంతం.

స్వప్న సమయంలో స్వప్నం వాస్తవము వలెనే అనుభూతమౌతోంది. కనుక వాస్తవంగానే అనుభవించ బడుతోంది. జాగ్రత్‌కు వచ్చినప్పుడో? స్వప్నం అవాస్తవంగాను భ్రమచే సిద్ధించినది గాను తెలిసిపోతోంది కదా! అట్లాగే అజ్ఞానం ఉన్నంత వరకు ఈ 14 లోకాలలో అనేక ఉపాధులు, దృశ్యాలు, సంబంధ-బాంధవ్యాలు వాస్తవ దృష్టిచే అనుభవించబడవచ్చుగాక! "నా స్వరూపము ఇటువంటిది".... అనే ఆత్మజ్ఞానము లభించిన తర్వాత ఈ స్థూల-సూక్ష్మ దేహులతో నిర్వర్తించిన-నిర్వర్తించుచున్న-నిర్వర్తించబడబోవుచున్న సర్వ వ్యవహారాలు, కార్యక్రమాలు, అనుభూతులు మొదలైనవన్నీ స్వస్వరూపమగు ఆత్మకు అప్రమేయమైనవని, ఆత్మ సర్వదా యథాతథంగానే ఏర్పడి ఉంటోందని గ్రహించబడగలదు సుమా! "స్వప్ననాశనముచే స్వప్నంలో కనిపించేవన్నీ నశించు చున్నాయి కదా! అట్లాగే, ఆత్మకు అన్యమైనవన్నీ, "స్వప్న సదృశ జగద్వ్యవహారాలన్నీ భ్రమసిద్ధమే"... అను (దృష్టాంతపూర్వక) సుజ్ఞానానుభవాన్ని ఎవరు అంగీకరించరో, అట్టి మూర్ఖుని త్యజించి ఉండటమే మంచిది. ఎవడైతే "ఇవన్నీ అనిత్యం అనటం ఒప్పుకోం. సంబంధాలు-అనుబంధాలు-సుఖాలు-దుఃఖాలు-ఇవన్నీ ఉన్నాయి. శరీరం ఉంది కాబట్టే 'నొప్పి' కలుగుతోంది" ఇత్యాది వాదములతో 1. ఆత్మయొక్క నిత్య సత్యత్వాన్ని, 2. ఈ జగత్తును పొందుచున్నప్పుడు ఇందలి భ్రమత్వాన్ని గమనించుటకు సిద్ధంకాడో... అట్టివానికి మేమేం చెప్పగలం? అట్టి మిథ్యారూపుడగు స్వప్నశీలుని (ఆత్మజ్ఞానంలో) మేలుకొలపటం ఎట్లా? మేలుకొలుపబడతగినవాడు అగుట లేదు.

ఎవరైనా... "ఈ జాగ్రత్ శరీరానికి కారణం పితృ శరీరం. స్వప్న శరీరానికి పిత్రాదుల శరీరం కారణం కాదు. కాబట్టి స్వప్నంలో వాస్తవానికి దేహం లేదు. జాగ్రత్తులోనే, దేహం ఉన్నది. కాబట్టి జాగ్రత్ అనుభవంతో స్వప్నదృష్టాంతం సరి అయినది కాదు" అని వాదిస్తారేమో? వారికి మేము చెప్పేది ఏమిటంటే... నాయనలారా! యజ్ఞయాగాది కారణములుగా పరలోకంలో ఉత్పత్తి అయ్యే శరీరములు కూడా అప్పుడు మిథ్యయే! కాబట్టి జీవుడికి ఈ దేహం తర్వాత పరలోకంలో లేనిదే అని అంటున్నట్లే అవుతుంది. అప్పుడు నీవు నాస్తికుడివే అవుతావు.

పోనీ... "దేహముచే కాకుండా తదితర కారణములచే ఉత్పన్నమయ్యే ఏ దేహమైనా సర్వదా అసత్తే!"... అని అనుకుందామా? అప్పుడు దేహముచే ఉత్పన్నముగాని బ్రహ్మదేవుని శరీరము కూడా సర్వదా అసత్తే కదా! పూర్వ కల్పాంతమున సర్వ శరీరాలు క్షయమై పోయినప్పుడు ఇక దేహాలే లేవు కాబట్టి 'సృష్టి'యే ఉండకూడదు. కానీ పూర్వ కల్పాంతానంతరం మరల సృష్టి-శరీరాలు ఎక్కడి నుండి వచ్చాయి? కనుక ఈ భౌతిక శరీరం అసలైన శరీరం కాదని, భౌతికశరీరం లేకుండా కూడా ఈ జీవుడు అనుభవాలు పొందగలడని... వాస్తవానికి ఈ భౌతిక శరీరం అతని సత్యం నిత్యం అగు ఆత్మ స్వరూపం సమక్షంలో ప్రవర్తించే ఒక ఉపకరణం మాత్రమేనని గ్రహించబడగలదు.

**శ్రీరాముడు :** మహర్షీ! దేహాల నుండియే దేహాలు ఉత్పత్తి అగుచూ, అర్థ క్రియా సమర్థములగు చున్నాయి. ఈ విధంగా – "ఈ జగత్తు ప్రవాహరూపమున అనాది-నిత్యసిద్ధము అయి ఉన్నది. "ప్రళయం అనేది ఎన్నటికీ సంభవించదు" అని (జైమినీ మతానుసారం) కొందరిచే చెప్పబడుతోంది కదా! అట్టి "సృష్టి-ప్రళయాలు లేవు" అనే అభిప్రాయంపై మీ ఉద్దేశాన్ని వివరించమని నా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** “దేహ–తదనంతర దేహాల నిత్య ప్రవాహం ఇట్లా కొనసాగుతూనే ఉంటుంది. దేహముల నుండి దేహములు వస్తున్నాయి. ఇట్లా వస్తూనే ఉంటాయి. ఇంతకు మించి సృష్టి లేదు. ప్రళయం లేదు”... అని సిద్ధాంతీకరించే (జైమినీ మతవాదుల) అభిప్రాయములో ‘జగత్తు’ అనగా ఏమిటి? ఈ కనబడే వస్తుసముదాయమేనా? అట్టి ఈ కనబడే (వారి సిద్ధాంతానికి విషయ మగుచున్న) భౌతిక జగత్తు పంచభూతాల సంయోగ రూపమే కదా! సంయోగముచే ఏర్పడే జగత్తులోని పదార్థములన్నీ వియోగం పొందుటచే నశించటం అనివార్యమే కదా! సంయోగం ఉన్నప్పుడు వియోగం కూడా ఉంటుంది. కనుక ఈ జగత్తు నాశనం అనివార్యమే అయినప్పుడు “సృష్టి ప్రళయాలు లేవు” అని ఎట్లా అనటం? ఇక్కడ మరికొందరి సిద్ధాంతకారుల సిద్ధాంతాలు పరిశీలిద్దాం.

**పాంచభౌతిక నిత్యత్వము -** మరొక సిద్ధాంతం : ఈ జగత్తుకు కారణం– పృథ్వి, జలం, అగ్ని, వాయువు – అనే భూత చతుష్టయం. అట్టి ఈ భూతచతుష్టయం ఎన్నటికీ నశించదు. కాబట్టి జగత్తు నశించనిదే అవుతుంది. వాటి మధ్య ఏర్పడే ఒకానొక మదశక్తి ఉదయిస్తుంది. ఆ మదశక్తియే ఈ “నేను” అనేది. పంచభూతములు దేహాకారంగా పరిణమించినప్పుడు అందులో ‘జ్ఞానము’ అనే ఒక గుణం ఉదయిస్తుంది. ఆ దేహాకారం పోతే జ్ఞానము పోతుంది. అంతకుమించి జీవునికి “ముందు” లేదు. “వెనుక” లేదు. (ఇది చార్వాకుని సిద్ధాంతం)

ఇది సమగ్ర సిద్ధాంతమైతే, అప్పుడు వస్తు వినాశనముగాని, చతుర్విధ ప్రళయాలు గాని, పురాణ ఇతిహాసాలు ప్రవచించే ఆయా ధర్మాధర్మ సిద్ధాంతాలు గాని, ఐహిక–పారలౌకిక, హిత–అహిత ధర్మాధర్మాలు ప్రతిపాదించే శ్రుతులు స్మృతులు, సదాచారాలు – మొదలైనవన్నీ వ్యర్థములు, అప్రమాణాలు అవుతాయి. “దేహాత్మ వాదులమగు మా మతాచార్యుల దృష్టిలో వాటివాటి వ్యర్థత్వం, అప్రమాణత్వము మాకు సమంజసమే” అని వారు అంటారంటావా? అనేకమంది శిష్టుల అభిప్రాయాలన్నీ అప్రమాణాలే అయినప్పుడు “వంధ్య అనేక సుతులను కనెను” అనే వాక్యంలాగా “పంచభూతాల కలయికలో నుంచే ఈ ‘నేను’ అనేది ఉద్భవించి నశిస్తోంది” అని చెప్పే వారి వాక్యాలు మాత్రం ఎట్లా ప్రమాణం అవుతాయి? “ఈ జగత్తు ఎప్పటికో అప్పటికి నశించటం తథ్యం”... అనునది కల్ప–మహా కల్పసంబంధమైన కాలక్రమ సిద్ధాంతం వేదాలచే, విజ్ఞులచే ప్రతిపాదించబడి ఉన్నది. “అందుచేత జగత్తు శాశ్వతం”... అను (చార్వాక) మతసిద్ధాంతం యుక్తి యుక్తం కాదు. “మద శక్తి వల్లే జ్ఞాన గుణం దేహంలో ఉత్పన్నమౌతున్నది” అను సిద్ధాంతమును ప్రతిపాదించు (చార్వాక మత) అనుయాయులారా! మరొకచోట ఎక్కడో మరణించినవాడి శరీరము నశించిపోయిన తర్వాత ఆ జీవుడు పిశాచం మొదలైన అన్య దేహముచే స్వదేశమునకు వచ్చి పరశరీర ప్రవేశం ద్వారా బంధువులతో సంభాషించటం జరుగుతోంది కదా! (“సోది” మొదలైన) కొందరు సాధకయోగుల మనస్సులోంచి చనిపోయినవారు సంభాషిస్తున్నారు కదా!

“పిశాచాలు అప్రత్యక్షములు కాబట్టి, మరణించినవారు పిశాచాది దేహాలు ధరించి బంధువులను సమీపిస్తున్నారు అనునది కల్పన మాత్రమే”అని అంటారా?... అప్పుడు పాంచభౌతికవాదులు

కూడా ఎట్టి ప్రమాణము చూపించకుండానే "పంచ-భూతముల కలయిక వలన అహంకారము ఉత్పత్తి అవుతోంది"... అని ఎట్లా అనగలరు?

"జీవుడు శరీరముతో మాట్లాడుచున్నాడు కాబట్టి అహంకారము అనేది శరీర నిర్మాణంలో ఒక భాగమని, శరీరం లేకపోతే అహంకారం లేదని చెప్పుచున్నాం" అని వారు అంటారా? నేను ఈ దేహాన్ని కదలుస్తున్నాను. అనగా నేను ఈ కాలును, చేయిని, కన్నును కదల్చుచున్నాను. అంతేగాని ఈ కాలు-చేయి-కళ్ళు నన్ను కదల్చుట లేదు కదా! కనుక కదలించుచున్న నేను కదల్చబడుచున్న ఈ కాలు-చేయి-కన్నులతో కూడిన దేహముకంటే ముందే ఉన్నానని ఎందుకు ఒప్పుకోరాదు? "మా గురువులు (చార్వాకాదులు) చెప్పారు. అందుచేత లోహాణువుల కలయికలో నుంచి అయస్కాంత శక్తి ఉద్భవిస్తున్నట్లు పంచభూతముల ఒకానొక కలయికలోనుంచి ఈ 'నేను' అనునది ఉద్భవిస్తోంది. ఆ అణువులు విడిపోగానే అయస్కాంత శక్తి తొలగునట్లుగానే ఈ దేహాణువులు విడిపోగానే 'నేను' అనేది అప్రత్యక్షమౌతుంది. ఇంతకు మించి ఎక్కడా 'నేను' అనేది లేదు."... అని అంటారా? శబ్దాలే ప్రమాణమునకు సమ్మతము అయినచో... నిర్దోష శబ్ద రూపము లగు శ్రుతులు చెప్పేది ఎందుకు ప్రమాణమని అనుకోకూడదు? ఆ శ్రుతులు ప్రతిపాదించే ఆత్మతత్త్వం పరలోకములు-స్వర్గ నరకాది స్థితులు ఉన్నాయని ప్రమాణం ఎందుకు ఒప్పుకోకూడదు? ఎందుకంటే అవి చెప్పేవి గురువు వాక్యములుగానే భావించవచ్చును కదా!

"ద్రాక్షరసం వంటి పానీయాలు సేవించినప్పుడు మత్తు వస్తోంది కదా! అట్లాగే, 'నేను' అనేది ఒక విపరీత చమత్కారంగా అనుభవమౌతోంది. కనుక నేను అనేది దేహము-ఆహారముల కలయికచే ఉత్పత్తి అయి... ఉనికిని పొందుతోంది. (ద్రాక్షరస ప్రభావం తొలగగానే మత్తు తొలగు నట్లు) దేహ-పదార్థముల అవినియోగముచే 'నేను' అనేది రహితమౌతోంది"... అని అంటారా? 'పిశాచం' అను భౌతిక దేహరహిత జీవుడు (సూక్ష్మ-కారణ దేహాలు మాత్రమే కలిగిన వ్యక్తి) మరొకని దేహమున ఆశ్రయించునట్టి అనుభవం మనం లోకంలో చూస్తున్నాము కదా! ఉదా హరణకు ఒక శిష్యుడు తన గురువు తనయందు ఆవేశించి ప్రవచనము చేస్తున్నట్లు ప్రవర్తించటం, లోకంలో చూస్తున్నాం కదా? "అట్టి పిశాచం గూర్చిన బుద్ధియే సత్యము కాదు" అని అంటారా? అది సత్యం కాకపోతే ద్రాక్షరసమువంటి పానీయాలు సేవించినప్పుడు ప్రాప్తించే 'మదశక్తి' కూడా సత్యం కాదు. ఈ విధంగా 'మదశక్తి' అనే దృష్టాంతం 'నేను' అనుదానిని దేహ విభాగంగా చెప్పటానికి సరిపోదు.

పంచభూతాలు 'జ్ఞానం' కలిగి ఉండటం మనం చూడటం లేదు. వాటి కలయికలో నుంచి మాత్రం "జ్ఞానం" ఎట్లా సిద్ధిస్తుంది? కాబట్టి దేహానంతర స్థితులుగా చెప్పబడిన పరలోకాత్మికమగు స్వర్గ-నరకాది స్థితులను నిరసించటానికి (అటువంటివేమి ఉండవని సిద్ధాంతీకరించటానికి) నీవు (చార్వాకమతవాదుడు) ఎట్లా శక్తుడవౌతావు?

"దేహనంతర స్థితి ఏ జనులకు అనుభవసిద్ధమని నిరూపించలేం కదా! 'అనుభవం' అను దానికి ప్రమాణం కాదు కాబట్టి, దేహం నశించిన తర్వాత ఈ జీవుడు ఏదైనా స్థితి కలిగి ఉంటాడు

– అనేది (అనుభవసిద్ధం కాదు కాబట్టి) మేము ఒప్పుకోం” అని అంటారా? అట్లా అయితే “గురువులు ఆవహించటం” అను అనేక జనుల అనుభవ ప్రమాణము ఒప్పుకోవాలి కదా! అది ఒప్పుకుంటే “దేహానంతరం జీవుడు ఉంటాడు. కనుక పరలోకం కలదు” అని కూడా ఎందుకు ఒప్పుకోకూడదు?

“లోకంలో స్థూల దేహ రహితులగు పిశాచ జీవులు ఆవహించటం అనేది శ్రుతి వంటి దృఢతర ప్రమాణజన్యం కాకపోయిప్పటికీ అది లోక జనులను–వారి భావాన్ని అనుసరించి అనుభవ ప్రసిద్ధము. అట్లాగే ‘జ్ఞానము’ అనేది అనుభవ ప్రసిద్ధము. కానీ పరలోకములు అనేవి అనుభవ ప్రసిద్ధము కాదు కాబట్టి శ్రుతులు అవి ఉన్నాయని చెప్పుచున్నప్పటికీ మేము ఒప్పుకోం!” అని వారు (చార్వాకమత వాదులు) అంటారా? (చార్వాకుని వంటి) మరొకరి అనుభవం మనకు ప్రామాణ్యం అయినప్పుడు అనేక మందికి అనుభవమైనట్టి శ్రుతులు, ఆ శ్రుతులు చెప్పే ఇహ లోకానంతర పరలోక స్థితి–గతులు ‘సత్యము కాదు’ అని మాత్రం ఎట్లా అనగలరు? దృఢతరమగు శ్రుతులు బోధించే కారణ సహితమైనట్టి పరలోక జ్ఞానము సత్యం కాదని ఎట్లా చెప్పగలరు?

❖❖❖

# 23. యత్భావం తత్భవతి

**శ్రీరాముడు :** మహాత్మా! కొందరు సిద్ధాంతకారులు “జీవిస్తున్నంతకాలం ఏది అనుభవమవుతోందో అది సత్యము. మరణానంతరం పరలోకం కలదు. అయితే ఆ పరలోకం మనకు స్వప్నము ఎటువంటిదో అటువంటిది.

కనుక మరణానంతరం ఏది అనుభవమౌతోందో అది సత్యము కాదు. దేహముచే అనుభవించబ డుచున్నదే సత్యము” అంటారు. ఇట్టి “జగత్ సత్యమ్–పరలోకమ్ మిథ్యా” అని చెప్పువారి మాటల గురించి మీ అభిప్రాయం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**యా అంతర్ వేత్తి యథా సంవిత్, సా తథా అనుభవత్యలమ్ ।**
**అస్తు సత్యమ్ – అసత్యమ్వా సిద్ధమ్ ఇత్యనుభూతితః ॥**

ఓ రామచంద్రా! వాస్తవానికి “ఇక్కడ ఏది సత్యం? ఏది సత్యం కాదు?”... అనేది ముఖ్యం కాదు. ఎందుకంటావా? ఏది సత్యమైనా, లేక అసత్యమైనా కూడా, ఏ సంవిత్తు (ఈ జీవుడు అనబడు జ్ఞాన స్వరూపి) ఏ వస్తువు యొక్క సత్తాను ఏ ప్రకారంగా ఎఱుగుతుందో, అది ఆ సంవిత్తుకు ఆ ప్రకారంగానే అనుభూతమౌతోంది. ఎవరూ ఏ భావనతో దేనిని చూస్తారో, వారికి ఆ భావనచే అది అట్లే అనుభూతమౌతుంది. అందుకే ఈ జగత్తు కొందరికి “పంచభూతముల కలయిక” గాను, మరి కొందరికి “బ్రహ్మదేవుని కల్పనా వ్యాసంగం” గాను, ఇంకొందరికి “పరమాత్మ స్వరూపం” గాను అనుభూతమౌతోంది. ఒకరి అనుభవాన్ని తొలగించి మరొక రకంగా అనుభూత

మయ్యేటట్లుగా ఎవరూ చెయ్యలేరు–వారికి వారు మరొక రీతిగా దర్శించటానికి సిద్ధపడినప్పుడు తప్పితే! ఏది ఎట్లు ఎఱిగితే అది అట్లే అనుభూతమగుచుండటం ఆబాల గోపాలం విదితమే! అందుకే సత్యమని ఒకరికి అనిపించినదే "సత్యము కాదు" అని మరొకరికి అనిపించటం మనం ఈ జగత్తులో చూస్తూ ఉన్నదే కదా! ...ఇక నీ ప్రశ్నకు వద్దాం.

**మృతస్య అస్తి పరోలోకో విదిత్యేవం మయా భవేత్**
**సతి వాసతి దేహేఽస్మిన్ తేన కింఽసదసచ్చ కిం?**

శ్రుతులు చెప్పుచున్న దానిననుసరించి, విజ్ఞుల ప్రవచనము అనుసరించి 1) "దేహముతో జీవించి యున్న స్థితి (ఇది అందరికీ అనుభవమగుచున్నదే కదా! 2) దేహానంతర పరలోక స్థితి అనే రెండు ఉన్నాయని ఒప్పుకొన్న తర్వాత ఇప్పుడు "వాటి వాటి అనుభవాలు ఎట్లా ఉంటాయి?" అనే విషయానికి వద్దాం. నీవు చెప్పినట్లు "మరణాంతర పరలోకానుభవం స్వప్నానుభవం వంటిది. ఈ దేహంతో అనుభవించబడేదే వాస్తవం" అని (చార్వాకమత శాఖ) కొందరు అంటూ ఉంటారు.

అయితే... "జీవించి ఉన్నవాని అనుభవం సత్యం, మరణించినవాని అనుభవం అసత్యం (స్వప్నతుల్యం)" – అని అనటం ఎట్లా! జీవించియున్నవాడు మరణించినవాని అనుభవమును స్వప్నతుల్యంగా అసత్య మైనదిగా భావించవచ్చు. అట్లాగే మరణించినవాడు జీవించియున్నవాని అనుభవమును అసత్యమైనదిగా భావించనూవచ్చు కదా!

జీవించియున్నవానికి జీవితానుభవం సత్యం. మరణించిన వానికి మరణానంతర అనుభవం సత్యం. ఉభయుల అనుభవం తిరస్కరించటానికి గాని, తొలగించటానికి గాని వీలుకాదు. "ఈ లోకంలో కూడా ఎవరు ఏది సత్యమని భావిస్తే, అది వారికి సత్యముగానే అనుభూతమౌతుంది.

అంతేగాని ఇక్కడ వేరే సత్యాసత్యాలు లేవు" – అనునది అనేక విషయాలలో అందరికీ అనుభవమే! అందుచేత సజీవుని అనుభవమే సత్యమని, మృతుని అనుభవం సత్యం కాదని సిద్ధాంతీకరించటం ఉచితం కాదు. ఇక, వేదములు ప్రమాణపూర్వకంగా "ఆత్మ"ను ప్రతిపాదిస్తున్నాయి.

**తస్మాత్ స్వభావః ప్రధమం ప్రస్ఫురన్వేత్తి సంవిదమ్**
**వాసనా కారణం పశ్చాత్ బుద్ధ్వా సంపశ్యతి భ్రమమ్ ॥**

మొట్టమొదటగా వేదాది ప్రమాణాలచే ప్రతిపాదించబడుచూ, స్వయంసిద్ధమై, జ్ఞానమే తన యొక్క స్వరూపంగా గలిగి ఉన్నదై... "ఆత్మ" ఉన్నది. అట్టి ఆత్మ స్వయంప్రకాశమైనది. అందుచేత ఈ జీవుని స్వస్వరూపమగు ఆత్మ జాగ్రత్–స్వప్నం మొదలైన సర్వ వ్యవహారాలకు మునుముందుగానే ఉండి ఉన్నది. అట్టి ఆత్మ తన యొక్క నిత్య సిద్ధమగు నిజస్వరూప జ్ఞానమును ఎఱిగియే ఉన్నది.

ఆ తర్వాత ...ఆ ఆత్మ తనయొక్క వాసనలు కారణంగా 'సూక్ష్మ శరీరము' ను ఎఱుగుచున్నది. అట్టి సమయంలో ఆ సూక్ష్మ దేహమునకు ప్రమేయంలేని ఆత్మయొక్క నిత్యత్వ – నిర్మలత్వములను ఎందుకో కించత్ ఏమరచుచున్నది.

ఆ తదుపరి... సూక్ష్మ దేహముతో ఏర్పడిన తాదాత్మ్యముచే స్థూల దేహాదిగా గల ఈ సంసార భ్రమనంతా ఎఱుగుచున్నది.

అయితే రామచంద్రా! ద్రష్ట–దర్శన–దృశ్య రూపమగు వాసనలు లయింప జేసుకున్నప్పుడు – అది అప్రతిహతంగా, అడ్డులు తొలగించుకొనినదై తన నిత్యనూతన రూపమగు ఆత్మత్త్వమును దర్శించుచున్నది. వాసనలు ఉన్నప్పుడు 'సంసారం' అనే పిశాచం ఉదయిస్తోంది. వాసనలు తొలగి నాయా ఆత్మత్త్వమే స్వభావసిద్ధమై శేషిస్తోంది. అనగా "ఆత్మత్త్వమే ఈ జీవుని వాస్తవ స్వభావం" అని గ్రహించు. ఈ వ్యవహారమంతా "ఆత్మ చైతన్యము - చ్యుతి - జగత్‌విలాసము - మోక్షభావము" అను విశేషములుగా శాస్త్రములు ప్రవచిస్తున్నాయి.

ఓ రామచంద్రా! "సృష్ట్యాది" యందు 'చిత్‌సాగర జలము యొక్క ప్రప్రథమ కెరటము' అనతగ్గ బ్రహ్మదేవునికి "జగత్తును నిర్మించాలి" అనే ఒకానొక ఇచ్ఛ జనిస్తోంది. ఆ తదుపరి "పూర్వకాలికమైన వాసన యొక్క ఉత్పత్తి" సంభవిస్తోంది. కాబట్టి... "వాసనయొక్క అస్తిత్వమే సంసార భ్రమ"... అని గ్రహించు.

❖

**శ్రీరాముడు :** స్వామీ! ఈ "వాసన" అనునది పరబ్రహ్మము నుండే జనించిందా? ఎందుకు అడుగుచున్నానంటే... "జగత్తే వాసనల రూప" మని చెప్పబడుతోంది కదా? "ఈ జగత్తు బ్రహ్మము నుండే జనించింది"... అను సిద్ధాంతము కూడా శాస్త్ర ప్రతిపాదితం కదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** బ్రహ్మము సర్వదా కూటస్థము – (మార్పు–చేర్పులు లేనిది అద్వితీయము– అద్దానికి ద్వితీయమైనదేది లేనిది) కదా! మరి అట్టి నిత్య నిర్మల పరబ్రహ్మమునుండి వాసనలు జనించటమేమిటి? కనుక ఈ వాసనలు పరబ్రహ్మము నుండి జనించలేదు.

**శ్రీరాముడు :** వాసనలు పరబ్రహ్మము నుండి జనించనప్పుడు, మరిక వాసనలు ఎక్కడి నుంచి జనించాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** "వాసనలు" అనబడే శబ్దం, దాని అర్థము కూడా అద్వితీయమగు బ్రహ్మము గురించి బోధించటానికి శాస్త్రములు కల్పించాయి. అయితే జ్ఞానోదయం అయ్యే వరకు ఈ వాసనలు ఎక్కడో–అక్కడనుండి, ఏదో ఒక కారణం చేత జనించాయనే ఒప్పుకుంటూ రావాలి. జ్ఞానము ఉత్పన్నమైన తర్వాతనో... ఈ 'వాసనలు' అనబడే వాటితో సహా (తత్ శబ్దార్థంతో సహా) ఈ సమస్త జగత్తు కూడా బ్రహ్మమేనని తప్పక గ్రహించబడగలదు.

**ఏతావత్ యత్ పరిజ్ఞానం తత్ 'నిర్వాణం' విదుర్ బుధాః ।**
**యత్ అత్రైవ అపరిజ్ఞానం తం "బంధం" విద్ధి, రాఘవ!**

ఓ రాఘవా! "ఈ సర్వము బ్రహ్మమే"... అను పరిజ్ఞానమునే తత్త్వజ్ఞులు "నిర్వాణము" అని పిలుస్తున్నారు. అట్టి బ్రహ్మము గుఱించి జ్ఞానము లేకపోవటమే "బంధము" అని గ్రహించు.

❖

'విజ్ఞాన ఘనము' అగు ఆత్మ "ప్రకాశరూపము-అప్రకాశరూపము" కూడా అయి ఉన్నది. ఎందు కంటావా? ఎఱుగబడినచో, అది స్వయముగా ప్రకారూపముగా అంతఃకరణమున స్ఫురించగలదు. ఎఱుగబడకపోయిందా, అది స్ఫురించకయే, గుర్తించబడకమే ఉంటోంది.

ఓ రామచంద్రా! "నేను బద్ధుడను" అనే భావనచే బంధం కలుగుతోంది. "నేను ముక్తుడను" అను భావన ముక్తికి దారితీస్తోంది.

**శ్రీరాముడు :** మీరు ప్రవచించే అట్టి 'ముక్తి' అను భావన కష్టతర కాదంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ముక్తి అనునది ఒక భావనయే కదా! భావన యొక్క పరివర్తనా మాత్రంచేత బంధ-మోక్షములు సిద్ధిస్తున్నాయి. విషయము ఇంతమాత్రం అయి ఉండగా, భావనామాత్రం చేత మోక్షం సిద్ధిస్తుండగా, ఇక "మోక్షం పొందటం బహుక్లేశాలతో కూడుకున్నది" అని ఎవరైనా చెప్ప దలిస్తే అది సమంజసమెట్లా అవుతుంది చెప్పు? భావనమాత్ర ప్రయత్నంచే 'మోక్షం' అనే అవగాహన లభించుచుండగా... ఇక "మోక్షస్థానం సంపాదించటం కష్టం" అని అనటం ఉచితమెట్లా?

**సంవిత్ ఉద్బోధనే "బంధః", తత్ అనుద్బోధనే "శివమ్" ।**
**అసత్ సద్వత్ జగత్ భాతి సంవిత్ ఉద్బోధనోదరమ్ ॥**

అనేక జగద్విషయముల పట్ల ఏర్పడుచున్న ధ్యాసల సమూహమును 'చిత్తము' అంటారు. అట్టి చిత్తము అనేక జన్మలలో ప్రాపంచిక విషయములపై పెంపొందించుకున్న భావావేశములచే నిర్మించబడుతోంది.

చిత్తవృత్తిని బహిర్ముఖం ఒనర్చటమే బంధం. చిత్తవృత్తి అంతర్ముఖమై ఆత్మయందు లీనం కావటమే సమాధి. అదియే మోక్షము అని కూడా చెప్పబడుతోంది.

"దృశ్య ప్రపంచ అతీతత్వము-శాంతము" అయినట్టి చైతన్య స్వరూప స్థితియే మోక్షం. దృశ్య సహితమైన స్థితి, దృశ్య పరిమిత, దృశ్యాంతర్గత చంచల స్థితిని 'బంధము' అని పిలుస్తున్నారు.

ఓ రామచంద్రా! ఈ రెండింటిలో ఏది ఉచితమో విచక్షించి అద్దానిని ఆశ్రయించు. విక్షేప రహితమగు సుఖం ఎట్టిదో గ్రహించి అట్టి అభ్యాసమును తీవ్రతరం చేయి. "వాసనారహితం-అనాది-అనంతం నిర్మలబోధరూపం-ఏకత్వ-ద్విత్వ వర్జితం-శూన్యత్వ రహితం-ఆకాశం వలె నిర్మలం" అయినట్టి బ్రహ్మ స్వరూపంతోటి ఏకస్థితిని కలిగి ఉండి, తద్ద్వారా బంధరహితుడవగుము.

❖❖❖

# 24. స్వప్న సదృశ జగత్తులు

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! మరల మనం "అన్యజగత్ ప్రళయ దర్శనం" సందర్భానికి వచ్చి, అక్కడ నేను చూచిన విశేషాల గురించి చెప్పుకుందాం.

అప్పుడు నేను సత్యలోకం సమీపంగా గల ఆకాశంలో ఆకాశరూపం దాల్చి బ్రహ్మలోకంవైపు దృష్టి సారించి చూస్తున్నాను కదా! అప్పుడు ఆ ప్రకారంగా బ్రహ్మదేవుడు, బ్రహ్మలోక నివాసులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రాది దేవతలు కూడా బ్రహ్మరూపత్వము పొందుటచే వత్తిలేని దీపం వలె

అదృశ్యులయినారు. అప్పుడు భూలోకము వలెనే బ్రహ్మలోకం కూడా ప్రకాశవంతమగు అగ్ని జ్వాలలచే భస్మీభూతం ఒనర్చివేయబడింది. ఆ తర్వాత భూమండలమును ముంచివేసిన జలప్రళయ తరంగయుక్తమగు మహాసముద్రం బ్రహ్మదేవుని నగరమును కూడా ముంచివేయుట చేత బ్రహ్మ లోకంతో సహా బ్రహ్మాండమంతా జలమయం అయింది. "పుష్కరావర్తము" అనే కాలమేఘాలు కురిపించే జలధారలకు పెద్ద పర్వత సమూహాలు ఆ జలంలో ఎండుతాటి ఆకు వలె తెలియాడుతూ, ఇంతలోనే జల సంఘట్టనచే ఛిన్నాభిన్నం కాసాగాయి. ఇదంతా గమనిస్తూ ఇక అక్కడి నుండి బయల్వెడలాలనే ప్రయత్నంలో ఉండగా అచ్చట ఒకానొక భయంకర రూపం కనిపించింది. ఒక్కసారిగా భీతిల్లాను. ఆ భీకర రూపం "కల్పాంత జగదాకారమా?"... అని అనిపించింది. తన యొక్క కృష్ణవర్ణముచే ఆకాశమును పూరించుచు "అంధకారం ఈ విధంగా మూర్తీభవించిందా...?" అన్నట్లుగా ఉన్నది. అయితే ఆ కృష్ణ (నల్లని) వర్ణరూపం లక్షల కొలది సూర్యుల తేజమును ఆభరణాలుగా ధరించినట్లుగా ఉన్నది. దేదీప్యమానమైన కాంతిచే కళ్ళు ప్రకాశిస్తున్నాయి. నోటి లోంచి అగ్నిజ్వాలా సమూహములు బయల్వెడలుచున్నాయి. ఆ ఆకారము 3 నేత్రములు, 5 ముఖములు 10 భుజాలు కలదిగా ఉండటం చేత "త్రినేత్రుడు-పంచముఖుడు-దశాబాహుడుగా" ఉన్నది. చేతిలో త్రిశూలం ధరించి ఉన్నది. అనంతాకాశంలాగా విశాలమైన ఆకృతి కలిగి ఉన్నది. ఆ ఆకారం బ్రహ్మాండం యొక్క బాహ్యమున గల ఆకాశమున స్థితి కలిగి ఉన్నది. "అంతకు ముందటి బ్రహ్మాండం ఎందులో ఏర్పడి ఉన్నదో... అట్టి దహరాకాశమే ఆ విధంగా హస్తము-పాదము మొదలైన అవయవాలతో ఆకృతి ధరించిందా!"... అని నాకు అనిపించసాగింది.

ఆ భీకర ఆకారం యొక్క ఉచ్ఛ్వాస-నిశ్వాసలు మహాసముద్రమును కూడా ప్రకంపింపజేసే టట్లు అత్యంత వేగముతోనూ, కొండలను పిండి చేయగల 'ఊఁ-ఊహూ' నినాద ధ్వనుల జనింపజేస్తూ ఉన్నాయి. ఆ భయంకరమైన ఆకారం... పురుషాకారం దాల్చిన కల్పాంత సముద్రం వలె ఉదయించింది. బ్రహ్మాండ జీవులందరి యొక్క సమష్టి అహంకార రూపం మూర్తిత్వం దాల్చి నట్లు అగుపడింది. కుల పర్వతాల మహా సమూహం వలె అత్యంత ఘనీభూతంగా ప్రత్యక్షమైనది. ఆకాశ మండలమునంతటినీ ఆక్రమించి విలయతాండవం చేస్తూ విజృంభించసాగింది.

ఆకాశంలో అగుపించిన ఆ అతి దీర్ఘమైన భీకరాకారం మూడు కనులను-త్రిశూలమును కలిగి ఉండి తాండవం చేస్తూ ఉంటే "ఓహో! ఈయనే ప్రళయకాల రుద్రుడు కదా" అని నా యొక్క యుక్తాయుక్త విచక్షణచే ఊహించాను. వెంటనే లేచి నిలబడి అత్యంత భక్తి-ప్రపత్తులతో ఆ ప్రళయకాల రుద్రునికి 'సాష్టంగదండ ప్రమాణం' చేశాను.

**శ్రీరాముడు :** హే మహాత్మా! మునీశ్వరా!

> **కిం స తాదృగ్విధో రుద్రః? కిం కృష్ణః? కిం మహాకృతిః?**
> **కిం పంచవదనః? కస్మాత్ దశబాహుః స తిష్ఠతి?**
> **కిం త్రినేత్రః? కిం ఉగ్రాత్మా? కిం ఏకః? కిం ప్రయోజనః?**
> **కేనేరితః? కిమకరో ఇచ్ఛాయాసీత్ వద కా? మునే!**

పరమేశ్వరుడగు రుద్ర భగవానుడు ఆ విధంగా కృష్ణ వర్ణాన్ని, పంచముఖాలను త్రినేత్రాలను, దశభుజాలను, ఉగ్రరూపాన్ని తనయందు ఏకరూపమున ప్రదర్శిస్తున్నారు కదా! ఏ కారణం చేత అంతటి భయంకర రూపం అవధరించారు? ఆయనే లయకారుడగు పరమేశ్వరుడా? ఆయన స్వతంత్రుడా? పరతంత్రుడా?... "స్వతంత్రుడే" అయితే పూర్ణకాముడు (పొందవలసినది గాని పొందజాలనిది గాని, కించిత్తు కూడా లేనివాడు) అగు ఆ రుద్రభగవానునికి అట్టి సంహార ప్రవృత్తి ఎందుకు?... ఒకవేళ "పరతంత్రుడు" అయితే ఎవరి ప్రేరణచే ఆయన ఆ సంహార కార్యక్రమమును నిర్వర్తిస్తున్నారు? ఏ ఉద్దేశముతో ఆ ప్రళయరూపం దాల్చారు? దయచేసి అవన్నీ వివరించి చెప్పవలసినదిగా ప్రార్థన చేస్తున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కకుత్థ్స వంశమున మణిరత్నం వలె ప్రకాశిస్తూ జనించిన ఓ రామచంద్రా! ఆ ప్రళయకాల రుద్రుడు ఎవరో, ఎందుకు విలయతాండవం చేస్తున్నారో, ఆయన ఉద్దేశం ఏమిటో?... అన్నీ వివరిస్తాను. విను–

ఆ ప్రత్యక్షమైన విలయతాండవం చేస్తున్న పరమేశ్వరుడు సృష్టి–స్థితి–సంహారాదులు గూర్చిన సంకల్పాదులకు కారణభూతమగు అహంకారమే స్వరూపంగా ధరించినవాడు. అందుకే ఆయనను "రుద్రుడు" అని అంటారు.

1. సర్వదుష్ట ప్రాణులకు రోదన మొనర్చువాడు – కాబట్టి రుద్రుడు! 2. శరణువేడిన వారి సమస్త రోగములను పారద్రోలువాడు కనుక రుద్రుడు. దుష్టజనులకు... విషయాభిమాన రూపుడు. శరణాగతుల దోషములను బాపుట కొరకై 'ఏకాభిమానరూపము' ధరించినవాడు.

వాస్తవానికి ఆయన (అసలైన) స్వరూపం చిదాకాశం మాత్రమే! సర్వసారమగు చిదాకాశమే తన స్వరూపంగా కలిగి ఉండటం చేత ఆ రుద్ర భగవానుడు "ఆకాశం వంటి ఆకారం–వర్ణం" కలవాడై, మహా ప్రకాశమయుడై చెన్నొందుచూ "ఆకాశ రూపుడు"... అని చెప్పబడుచున్నాడు.

సర్వ ప్రాణులు తన స్వరూపముగా కలవాడు–సర్వవ్యాప్తి అయి ఉండటంచే "మహాకారము"ను ధరించినవాడై ఉన్నాడు. సృష్టిలో గల పంచ జ్ఞానేంద్రియాలే ఆయన యొక్క పంచ ముఖాలు. అందుచేతనే ఈ పంచ జ్ఞానేంద్రిక్ష్మీఆలు ప్రకాశ స్వభావాన్ని కలిగి ఉన్నాయి.

ఈ సర్వుల పంచ కర్మేంద్రియాలు (వాక్కు–కాళ్ళు–చేతులు–పాయువు–ఉపస్థ) వాటి పంచ విషయాలు (వచనం–భ్రమణం–అదానం–విసర్జనం–కామం) ఈ 10 కూడా ఆయన యొక్క 10 భుజాలై ఉన్నాయి.

ఇక ఈయన ఎటునుంచి వచ్చారంటావా? ప్రజాపతి యగు బ్రహ్మదేవుడు ప్రళయకాలంలో సర్వ జీవులతో సహా "బ్రహ్మరూపత్వం" పొందారు కదా! అందుచేత చిదాకాశమున కల్పించబడిన పంచ ప్రాణ–పంచ జ్ఞానేంద్రియ–పంచ కర్మేంద్రియ వ్యవహారాలను త్యజించారు. అప్పుడు చిదాకాశ రూపుడగు రుద్రుడు కేవలాకాశ మాత్ర పరిశేషమగు కారణ రూపాన్ని అవధరించు చుండటమే ఆయన విలయ తాండవం. అనగా... బ్రహ్మాండ రచనలో ఒదిగి ఉన్న–సర్వజీవుల ఉపకరణ రూపంగా ప్రాప్తిస్తూ వచ్చిన పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచ

కర్మేంద్రియ విషయాలు ఇప్పటివరకూ సమిష్టిగా వ్యవహరించి ఇప్పుడు నిజరూపాలు సంతరించుకొని నిజస్థానం పొందుచున్నాయన్నమాట!

**శ్రీరాముడు :** మునీశ్వరా! ప్రళయమున సమస్త కార్యములు లయింపగా, ఇక ఆకాశమాత్ర పరిశేషమగు చిదాకాశ రుద్ర భగవానునికి రూపం ఏముంటుంది? ఎక్కడి నుంచి వచ్చింది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. సమస్త కార్యములు (పంచ జ్ఞానేంద్రియ-పంచ కర్మేంద్రియ-పంచ జగత్ విషయ కార్యములన్నీ) లయించగా, కారణాంశ మాత్రముచే శేషించి ఉన్న ఆ రుద్ర భగవానునికి వాస్తవానికి ఏ ఆకారమూ లేదు. అయితే కేవలం తన ఉపాసకుల యొక్క వాసనలచే వారికి 'భ్రాంతి' ద్వారా ఆయన ఆ విధంగా (నేను వర్ణించిన విధంగా) మూర్తీభవించి ఉన్నారు. ఒక వస్తువు భస్మీభూతమగుచున్నప్పుడు ఏర్పడే పొగకు కొంచెం సమయం ఏదో ఆకారం కనిపిస్తుంది కదా! ఇది కూడా అట్టిదే!

**చిదాకాశగతే స్ఫారే భూతాకాశే స తిష్ఠతి ।**
**దేహే చ సర్వ భూతానాం నిత్యం వాయురివ ఈశ్వరః ॥**

వాయువు సర్వజీవుల అంతరం-బాహ్యమున సంచరిస్తూ ప్రాణ స్వరూపి అయి సర్వకార్యాలు నిర్వర్తిస్తోంది చూచావా? అట్లాగే ఎప్పుడైతే ఆ ఈశ్వరుడు "వ్యాపకమగు చిదాకాశరూపం" పొందుతాడో, అప్పుడు భూతాకాశమునందు సర్వ దేహాలలో స్థితి పొందినవాడై ఉంటున్నాడు. అట్టి ఆ చిదాకాశ స్వరూపుడు 'ప్రళయం' అను క్షణకాలమున సమస్తం క్షోభితం చేసి సర్వ భూత రహితుడై, చిదాకాశమాత్ర దేహధారి అయి పరమశాంతిని పొందుచున్నాడు.

**త్రినేత్రములు :** త్రిగుణాలు (సత్త్వరజస్తమోగుణాలు) - త్రికాలాలు (భూత, భవిష్యత్, వర్తమానాలు) - త్రి అంతఃకరణాలు (చిత్త, అహంకార, బుద్ధులు) - ప్రణవ త్రివర్ణాలు (అ, ఉ, మ) - త్రివేదాలు (ఋక్, యజో, సామ) ... ఇవే ఆ రుద్రుని యొక్క త్రినేత్రాలై వెలయుచున్నాయి.

**త్రిశూలం తేన త్రైలోక్యం గృహీతం కరకోటరే!**

ఆ ప్రళయకాల రుద్రుని పిడికిలిలో గల త్రిశూలం ఈ స్వర్గ-భూ-పాతాళ లోకాలు సుమా!

**యస్మాత్ తత్ వ్యతిరేకేణ సర్వ భూతగణేష్వపి ।**
**అన్యత్ నవిద్యతే కించిత్, దేహాత్మైవ తతః స్థితః ॥**

ఈ సర్వభూత సమూహములలో అతనికి వేరైనది కించిత్ కూడా లేదు. ఆయన తన యొక్క జగత్ శరీరముచే అంతటా వ్యాపించి ఉన్నాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! స్వరూపతః చిదాకాశమే అయి ఉన్న ఈ సృష్టికి గల ప్రయోజనమేమిటి ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ సృష్టికి రెండు ప్రయోజనములు శాస్త్రములు వివరిస్తున్నాయి.

1. సర్వ జనులకు వారి వారి కర్మానుసారంగా విషయ ఫలములను అందించటం.
2. 'అధికారి' అయినవానికి 'జ్ఞానము' అనే ఫలమును ఇవ్వటం.

... ఈ రెండూ ఒసంగుటయే సృష్టి యొక్క స్వభావమై ఉన్నదని విజ్ఞుల అభిప్రాయం. ఇక

సృష్టి కర్త యొక్క వాస్తవ రూపం శివము-చిదాకాశ మాత్రము అయి ఉన్నది. ఆతడు తన శివ-అంతరంగ జనిత మాయాచిత్ స్వరూపముచే ప్రేరితుడై ఈ సృష్టిని నిర్వర్తించే కార్యమునందు ప్రవృత్తుడై ఉంటున్నాడు. మరియు అదే చిత్స్వరూపము చేత ప్రళయము కొఱకై కూడా ప్రేరితుడై ఒకానొకప్పుడు సమస్త జగత్తును సంహారమొనర్చి మరల శాంతించుచున్నాడు. చిదాకాశరూపుడగు ఆ పరమాత్మయే 'సృష్టి' అనే కార్యము నిర్వర్తిస్తూ ప్రజాపతి అగుచున్నాడు. నిర్మల చిదాకాశ రూపుడగు ఆ పరమేశ్వరుడే మహాకాలరుద్ర రూపమును ధరించి ఈ సృష్టి మహాసముద్రమును పానమొనర్చి పరమశాంత స్వరూపమును ప్రదర్శిస్తున్నాడు.

రామచంద్రా! ఆ విధంగా మహాకాల రుద్ర రూపాన్ని, ఆ విలయతాండవం దర్శిస్తున్నాను కదా! ఆ రుద్రరూపంతో మహా ప్రళయ సముద్రమును తన యొక్క ఉచ్ఛ్వాస వేగంతో పానం చేయటానికి ప్రవృత్తుడైనారు. ఆ రుద్రుని ప్రాణవాయువుచే ఆకర్షితమైన మహాసముద్రము జ్వాలా సమూహములచే వ్యాప్తమైయున్న ముఖంలోనికి-జలం బడబాగ్నిలో ప్రవేశించినట్లు-ప్రవేశించు చుండటం కనిపించింది. అహంకార రూపుడగు ఆ రుద్రుడు ఆ సమయమున క్రమంగా కల్పాంత సముద్రమంతా త్రాగివేశారు. అప్పుడు సర్వమూ సర్వవిశేష శూన్యంగా అయింది. అప్పుడక్కడ ఆకాశం వలె నిర్మలము-నిశ్చలము అగు ఈ నాలుగు మాత్రమే శేషించాయి.

1. ఆకాశము వలె విశాల రూపుడు, కృష్ణవర్ణయుతుడు, ఆధారరహితుడు "నిశ్చల సుగంధ మనోహర స్వరము" వలె ఉన్నట్టి రుద్రభగవానుడు

2. బ్రహ్మాండమునకు ఆ బ్రహ్మాండములో అధోభాగమున ఒకప్పుడు పర్వత-దేవతాది అనేక అడుగున గల పదార్థములతో విశేషములతో కూడుకొని ఉండేది. ఇప్పుడో? దేవతాది పృథ్వి భాగము సర్వ జీవుల సహితంగా పాతాళ-భూలోక స్వర్గలోకములు భస్మీభూతమైనాయి కదా! ఆ భస్మము జల ప్రళయంచే ముంచివేయబడింది. జలమంతా రుద్రునిచే త్రాగి వేయబడగా ఇక అచ్చోట బురదమయమై శేషించింది. అట్టి పార్థివమయమై (బురదమయమై) ఆ బ్రహ్మాండము యొక్క అధోభాగమంతా (బురదతో నిండి) కనబడుతోంది.

3. ఊర్ధ్వమున ఆకాశం అతిదూరంగాను-అత్యంత విస్తారంగాను నేత్రజ్యోతికి నిరామయము అందనిదై ఉన్నది. దుర్లక్ష్యమై ఆకాశం శ్యామవర్ణంగా (నల్లగా) ఆ బ్రహ్మాండ ఖండమునకు ఊర్ధ్వంగా కనిపిస్తోంది.

4. బ్రహ్మైకాశము బ్రహ్మాండ ఖండముల మధ్యగా ఉన్నట్టి "అనాది-అనంతము-సర్వ వ్యాప్తము" అగు బ్రహ్మాకాశము.

...ఈ నాలుగు వస్తువులు మాత్రమే అక్కడ అప్పుడు నాకు కనిపించాయి. ఇవి తప్ప మరే వస్తువూ ఎక్కడా గోచరించనే లేదు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ బ్రహ్మాండ కటాహములో భూమి-నక్షత్రములు-త్రిలోకాదులు ఉన్నాయి కదా! అట్టి బ్రహ్మాండమునకు బాహ్యమునకు ఏమేమి పదార్థములున్నాయి? వాటి తర్వాత ఏ ఆవరణలు ఉన్నాయి. నిరాధారములగు ఆ ఆవరణలన్నీ ఎచ్చట ఎట్లా స్థితి కలిగి ఉన్నాయి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ బ్రహ్మాండమునకు ఆవల ఈ బ్రహ్మాండం కంటే 10 రెట్లు విశాలమైనట్టి జలం ఉన్నది. ఈ బ్రహ్మాండ ఖండముల మధ్యగల ఆకాశము అనంతమై ఉన్నది. అట్టి ఆకాశం అనంతత్వముచే అట్టి బ్రహ్మాండ ఖండములకు లోననే గాక-బయట కూడా వ్యాపించి ఉన్నది.

అట్టి జలమునకు ఆవల ఆ జలావరణము కంటే 10 రెట్లు అధికంగా జ్వాలామయమగు అగ్ని ఉన్నది. ఆ తర్వాత ఆ అగ్నికంటే 10 రెట్లు అధికంగా నిర్మల వాయువు కలదు. ఆ వాయువుకు ఆవల ఆ వాయువు కంటే 10 రెట్లు అధికంగా విశాలము-శుద్ధము అగు ఆకాశము ఉన్నది.

అటు తర్వాత పరమ పవిత్రము-అతి నిర్మలము-అనంతము అగు బ్రహ్మాకాశము కలదు. మహేశ్వరుడు, కపిలుడు మొదలగు వేర్వేరు యోగుల యొక్క మతమును అనుసరించి... మాయా సమన్వితమైన బ్రహ్మాకాశమున 1.అహంకారం, 2.మహత్తు, 3.ప్రకృతి మొదలైనవి ఒకదాని కంటే మరొకటి 10 రెట్లు అధికంగా వర్తిస్తున్నాయి.

ఈ విధంగా పరస్పర వివాదములతో కూడుకొన్న అనేక వర్ణనలు లోకంలో ప్రసిద్ధమై ఉన్నాయి. అందుకే అవి ఉపేక్షించాను. నీవు అడిగావు కాబట్టి పై విశేషాలు చెప్పాను.

**శ్రీరాముడు :** మహర్షీ! బ్రహ్మాండ ఖండం యొక్క ఊర్ధ్వ-అధో భాగములకావల ఆ భాగాలన్నిటికీ ఆవరణగా ఉంటూ జలం ఉన్నదని చెప్పారు కదా! జలం నేలపైనే నిలుస్తుంది గాని, అంతరిక్షంలో కాదు కదా! మఱి మీరు చెప్పిన జలము ఎట్లు దేనిచే ధరింపబడుచున్నది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అమ్మ పిలిచినప్పుడు బిడ్డలు ముద్దుగా పరుగులు తీస్తారు చూచావా? అట్లాగే బ్రహ్మాండ కపాలం యొక్క పార్థివ పదార్థ విభాగం వైపుగా ఆకర్షించబడుచున్నవై ఆ చలవాయు-ఆకాశాదులు పరుగులు తీస్తున్నాయి. అట్టి 'గతి' యొక్క విశేషం చేతనే ఆ జలాదులు కూడా (గతిచే) స్థితిని పొందుచున్నాయి. 'గతి' లేకుంటే, 'స్థితి' పటాపంచలు కాగలదు సుమా! దప్పికగొన్న వాడు నీరు ఉన్న వైపుగా పరుగులు తీస్తాడు చూచావా? అట్లా బ్రహ్మాండ మహా శరీరం యొక్క 'కపాలం' వైపుగా సర్వమూ నిరంతరం పరుగులు తీస్తూనే ఉన్నాయి. ఈ తేజస్సు మొదలైన పదార్థాలన్నీ లోపల గల ఆకర్షణ శక్తిని అవలంబించి 'స్థితి' కలిగి ఉండ గలుగుచున్నాయి. శరీరమును-శరీర భాగములగు కాళ్ళు-చేతులు మొదలైన అవయవములు త్యజించనట్లే ఆ జలాదులు తమ స్థితిని త్యజించటం లేదు.

**శ్రీరాముడు :**

> **బ్రహ్మన్! బ్రహ్మాండఖండే తే తిష్ఠతః కథముచ్యతామ్?**
> **కిమాకృతీ? ధృతే కేన? కథం వా పరినశ్యతః?**

హే బ్రహ్మజ్ఞా! ఈ విధంగా ఇతరములైన జల-అగ్ని-ఆకాశాది ఆవరణలకు ఆధారమైనట్టి ఈ బ్రహ్మాండ ఖండములు ఎట్లా ఏ ఆధారంతో 'స్థితి' కలిగి ఉంటున్నాయి? ఈ బ్రహ్మాండముల యొక్క ఆకారాలు ఎటువంటివి? వాటిని ఏది ఎట్లు ధరించుచున్నది? అట్టి బ్రహ్మాండములు ఎవరి కారణంగా ఎందుకు ఎట్లా నాశనము పొందుచున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వప్నంలో స్వప్న జగత్తుకు ఆధారమేమున్నది? ఏ ఆధారం లేకపోయినా, వాటిని ధరిస్తున్న వారంటూ ఎవరూ లేకపోయినా స్వప్న జగత్తులోని పదార్థాలు ధరింపబడు చున్నాయి కదా! అవన్నీ ఏచోటా పడకపోయినా, (మరొకప్పటికి) పడి నశిస్తున్నాయి కదా! వాటికి ఏ ఆకారమూ లేకపోయినా కూడా "ఇల్లు-మనుష్యులు-ఊరు" మొదలైన ఆకారాలతో కనిపిస్తు న్నాయి కదా! అట్లాగే ఈ జగత్తు వాస్తవానికి ఎవరి చేతా ధరింపబడకపోయినప్పటికీ బాగుగా ధరించబడుచున్నట్లే స్థితి కలిగి ఉంటోంది. ఇది ఎటూ పడకపోయినప్పటికీ పడుచున్నదే అగుచున్నది. నిరాకారమే అయినప్పటికీ, సాకారముగానే ఉన్నది. ఈ మాయా మయ ప్రపంచంలో పడునదేమిటి? లేచునదేమిటి? పొందుచున్నదేమున్నది? ఎవరు ఎట్లా దేనిని ధరిస్తారు? ఆ ధరించే వారు కూడా మాయలోని విభాగమే కదా! చైతన్యము యొక్క స్ఫురణను అనుసరించే ఇదంతా ప్రకాశిస్తోంది. ఆకాశంలో కేశములు-శూన్యత్వము ఎట్లా కనిపిస్తున్నాయో, వాయువులో చలనం ఎట్లా ఉన్నదో, జలమునందు తరంగత్వం ఏ విధంగా ఉన్నదో... ఆ విధంగానే చిదాకాశంలో ఈ జగత్తు కూడా కలదు. 'సంకల్పం'లో నగరం ఉన్నట్లే, ఈ బ్రహ్మాండగృహం చైతన్యమున (లేక) చిదాకాశమున ఇట్లు నియమిత ఆకారమును ధరించనదానివలె వర్తిస్తోంది.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ కనబడే జగత్తు యొక్క అసలైన రూపమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ 'జగత్తు' అనబడేది ద్రష్ట యొక్క "అధ్యాస చమత్కారమేనయ్యా! వాస్తవానికి ఇదంతా 'సంవిత్‌మయము మాత్రమే'!

పూర్ణమగు సంవిత్తే... గమనము యొక్క అధ్యాసచే గమనశీలమున వర్తిస్తోంది. 'పతనం' యొక్క అధ్యాసచే రాత్రింబవళ్ళు 'పడుట' యందు (పతనమునందు) తత్పరమగు చున్నది. 'ధారణ' యొక్క అధ్యాసచే సదా స్థితి కలిగి ఉంటోంది.

ఊర్ధ్వ గమనమున చైతన్యముతో కూడి ఈ జగత్తు అట్టి అధ్యాసచే ఊర్ధ్వమునకు జనుచున్నది. నాశ సంవిత్తుతో కూడిన అధ్యాసచే కల్పాంతమున నశించుచున్నది. చిన్మయమగు సంవిత్‌తో కూడి సృష్ట్యాదియందు సృష్టి యొక్క అధ్యాసచే చిదాకాశమున జనించుచున్నది.

రామచంద్రా! శరత్కాలాకాశం వైపుగా దృష్టిని సారించిన మనుజునికి ఆకాశంలో అసంఖ్యాక ముత్యముల సమూహములు గోచరిస్తూ ఉంటాయి చూచావా? అట్లాగే ఈ జగత్తులు అసత్యములే అయినప్పటికీ... భ్రాంతిచే సత్యము వలె చిదాకాశమున గోచరిస్తున్న ఈ జగత్తులకు ఆధారం గణించటం ఎవరి తరం? వీటన్నిటి యొక్క మూలము మాత్రమూ "అధ్యాస" యే!

❖❖❖

# 25. జగద్రూపిణి యగు కాలరాత్రి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ తర్వాత ఆ మహాకాశంలో మదించినట్టి విశాల రూపియగు రుద్ర భగవానుడు లయమొనర్చటంలో ప్రవృత్తుడవటం నాకు కనిపించింది. అతడు ఆకాశమే

ఆకృతిగా ధరించి వచ్చారు. ఘన శ్యామవర్ణం కలిగి ఉన్నారు. తన యొక్క మహత్తరమైన ఆకారంతో దశదిక్కులు పూరించి ఉన్నారు. సూర్య-చంద్ర-అగ్నులే అతని మూడు నేత్రాలు. చలించు దశ దిక్కులు అతని వస్త్రముల వలె కనిపించాయి. ఘనమైన-దీర్ఘమైన నీలివర్ణపు కాంతి పుంజములను ఆయన వెదజల్లుచున్నారు. ఆయన నేత్రాలు, బడబాగ్ని వలె కదలుచున్నాయి. సప్త సముద్రాలు అప్పటి జలప్రళయానికి ఏకంకాగా, ఆ మహాజలమంతా అతని దేహములోనికి అతివేగంగా ప్రవేశించివేసింది.

❖

ఆ ప్రళయకాల రుద్రభగవానుడు ఆ విధంగా విలయతాండవం చేస్తూ ఉండగా, ఇంతలో ఒక చమత్కారమైన సంఘటన జరిగింది. ఆ రుద్రుని శరీరం నుండి ఒక ఛాయ బయల్వెడలి ఆతని నృత్యమును అనుకరించసాగింది. అది చూచిన నాకు చాలా ఆశ్చర్యం వేసింది! " అరె! ఏమి ఆశ్చర్యం! సూర్యుడు మొదలైన కాంతిమయ వస్తువులు లేకపోవటంచే ఆకాశమంతా అంధకారంచే ఆవరించబడి ఉన్నది కదా! నీడ ఉండాలంటే ఎక్కడి నుండైనా ఒక వస్తువుపై కాంతి ప్రసరించాలిగా! కాంతి ప్రసరించాలంటే ఏ చోటినుంచైనా సూర్యుడి వంటి కాంతిమయగోళం ఉండాలిగా! మరి అంధకారమయమైన ఆకాశంలో ఛాయ ఎట్లా స్థితి పొంది ఉన్నది?".... అనే అనుమానం నాలో ఉదయించింది. నేను ఇట్లా అనుకుంటూ ఉండగా, ఇంతలో ఆ ఛాయ అతి శీఘ్రంగా విశాలరూపం దాల్చింది. ఆ ఛాయ అత్యంత శోభాయమానంగా మూడు కన్నులు కలిగియున్నదై నృత్యం చేస్తూనే రుద్ర భగవానుని ఎదురుగా నిలబడింది.

ఆ ఛాయా రూపిణి కృష్ణ (నలుపు) వర్ణం కలిగి ఉన్నది. నాడీ రూపములగు శిథిలమైన ఛిద్రావయవములు కలిగియున్నది. విశాలమగు ఆకారముతో అగ్నిజ్వాలలచే ఆ ఛాయ యొక్క రూపం వ్యాపించి ఉన్నది. కృష్ణపక్ష రాత్రిలాగా అంధకారమే దేహరూపంగా గ్రహించి ఏతెంచి నట్లుగా కనబడింది. ఆ ఆకృతి ఆకాశమును దిగమ్రింగునంతటిదిగా ఉన్నది. ఆ ఛాయారూపిణి ముఖం అతిదీర్ఘంగాను, భయంకరంగాను ఉన్నది. తన భుజస్కంధములచే దిక్కులను ఢీకొట్టు చున్నది. నాసికతో ఆకాశమును కొలుచుచున్నట్లుగా ఉన్నది. శరీరం చూస్తేనేమో అధికమైన ఉపవాసములచే బక్క చిక్కినట్లున్నది. కృశించటంచే నిలువలేకపోతూ ఉండగా బ్రహ్మదేవుడు ఆమె స్థిరత్వం కొరకై దీర్ఘనాడులు సృష్టించి ఆ రూపం కుచించకుండా నిలుపుచున్నట్లుగా ఉన్నది. అతి దీర్ఘమైన దేహం చూచిన నేను "ఆమె శిరస్సు – పాదాలు ఎక్కడున్నాయి?"... అని వెతుకుతూ అతి దీర్ఘకాలం ఊర్ధ్వ-అధోగమనాలను సల్పవలసివచ్చింది. ఆ ఛాయారూపిణియగు భగవతి ధరించిన మాలకు సూర్య – దేవతా – అసురుల శిరస్సులు మందారపూలవలె గ్రుచ్చబడి ఉన్నాయి. ఆమె వాయువుచే ప్రదీప్తమగుచున్న అగ్నిశిఖలను వస్త్రంగా ధరించి ఉన్నది. అతి దీర్ఘములగు ఆమె చెవులు చంచలమైన సర్పాలతో శోభిస్తున్నాయి. ఆ చెవులకు చనిపోయిన అనేకమంది మనుజుల దేహములు బుట్టలోలాకుల వలె వ్రేలాడుచున్నాయి. ఆమె స్తనములు సొరతీగలాగ మోకాళ్ళ వరకు వ్రేలాడుచున్నాయి. ఆమె దంతములు అనేకమంది దేవతా సమూహములచే అలంకరించబడి

ధగధగా తెల్లగా మెఱుస్తున్నాయి. ఆమె అవయవ గ్రంథులు వాయువు యొక్క సంఘటనచే 'ఫటా-ఫటా' శబ్దములు చేస్తున్నాయి. ఆమె నృత్యం ప్రళయకాల సముద్రతరంగముల విన్యాసమును మించిపోయి ఉన్నదనిపించింది.

ఆ ఛాయాస్వరూపిణియగు దేవి ఒక సమయంలో ఒక్క భుజంతో కనిపించింది. ఇంతలోనే వేలాది భుజాలు ఎక్కడి నుండో ఉత్పన్నమైనాయి. ఆమె యొక్క అనంత సంఖ్యాకములగు భుజాలు 'జగత్తు' అనే మండపమును వ్యాకులపరుస్తున్నట్లున్నది. ఒకప్పుడు ఆమెకు ఒక్క ముఖమే కనిపించింది. కొంచెం సేపటిలో అనేక ముఖములు ధరించింది. ఇంకొంచెం సేపట్లో ముఖరహితంగా కనిపించింది. అట్లాగే ఒకసారేమో ఏకపాదం కనిపించింది. ఇంతలోనే వేలాది పాదాలు ...అట్లా చూస్తూ ఉండగానే పాదరహితం గా కనిపించింది. పురాణ కథనాలను విని ఉన్నట్టి నేను ఆమె దేహాన్ని బట్టి "ఒహో! ఈమెయే 'కాళరాత్రి'!"...అని ఊహించాను. అది నాలాగే గమనిస్తున్న కొందరు సజ్జనులు "హే కాళీమాత! కాళీ భగవతీ!"...అని గానం చేయటం నాకు వినిపించింది.

ఆ త్రినేత్రములు, జాజ్వల్యమానమగు లాలాటం, ఇంద్రనీల పర్వతంలా ప్రకాశించే చెక్కిళ్ళు, నక్షత్రములే ముత్యాలమాలగా ధరించిన ఆ మెడ, ఆమె సమీపమును ఆశ్రయించిన భయంకరమైన వాయసము (కాకి), ఆ నృత్యంలో చలించే భుజాలు, ఆ ఆకాశమును తమ రంగుతో పూరించే గోళ్ళు, మహాకాంతిని వర్షించే పిక్కలు,మహాకాశము యొక్క ఆవలను స్పృశించే ఆ కేశములు, మేఱు పర్వతములు కూడా కూకటి వ్రేళ్ళతో పెకలించగల ఉచ్ఛ్వాస-నిశ్వాసాలు... మొదలైనవన్నీ గమనించసాగాను. ఆకాశమునందు ఉన్నట్టి నేను నృత్యవశంగా వృద్ధి చెందుచున్న ఆ కాళీ భగవతి శరీర భాగములను సావధానంగా వీక్షించసాగాను. ఆమె నృత్యం చేయటమే ప్రయోజనంగా కలిగి ఉన్నట్లు కనిపించింది. ప్రళయకాలపు పుష్కరావర్త మేఘాలు ఆమె వక్షస్థలమును చుట్టుకొని కనిపించాయి. ఆమె ఉదరము నడుము, కంఠము అనేక ఆభరణములతో ప్రకాశిస్తున్నాయి. సప్త పర్వతములు ఆమెకు కంఠమాలలయ్యాయి.

ఓ రామచంద్రా! ఆ భగవతి యొక్క అంగములలో అనేక నగర-గ్రామ-ఋతు-మాస-దివస-రాత్రాది సమూహములతో కూడిన త్రిలోక పరంపరలు నాకు కనిపించాయి. ధర్మాధర్మాలు ఆమె ఇతర కర్ణ భూషణములుగా కనిపించాయి. ఆమె నాలుగు స్తనములు కలిగియుండి సకల శాస్త్రార్థ క్షీరముచే నిండి ఉన్నాయి. త్రిశూలము-పట్టిక-బాణశక్తి-ఖడ్గాది అనేక ఆయుధములు ఆమె చేతికి చుట్టుకొని ఉన్నాయి. పదునాలుగు విధములైన దేవతాది ప్రాణజాతులు ఆ భగవతి యొక్క రోమములై కనిపించాయి. ఆమె యొక్క దేహములో కనిపించిన నగర-గ్రామ-పర్వతాదులు పునర్జన్మ గురించిన ఆనందంతో ఆమె దేహంతోబాటే నృత్యం చేయసాగాయి. అంతకుముందు నశించిన స్థావర-జంగమాత్మకమైన జగత్తంతా ఆమె యొక్క 'దేహము' అనే పరలోకంలో నృత్యం చేస్తూ సుఖంగా ఉన్నట్లు కనిపించింది. ఆమె దేహంలో స్థానం పొందియున్న మేరు-హిమాలయ-మందరాది పర్వతాలు ఊయల ఊగుచున్నట్టి సుఖాన్ని అనుభవిస్తున్నాయి. బ్రహ్మాండమాలను అటూ ఇటూ త్రిప్పుచూ ఆ భగవతి చేస్తున్న తాండవ నృత్యం చేస్తుంటే "మరల మరొక ప్రళయం

ప్రారంభమైనదా?" అని అనిపించింది. సుర-అసుర-ఉరగాది (పాములు) సమూహాలతో కూడిన ఆ దేవి శరీరం ఏ ఒక్క చోటా ఆగుచున్నట్లు కనిపించటం లేదు. ఆ దీర్ఘ శరీరం ఒక చక్రంలాగా తిరుగాడసాగింది. 1. వివిధ కర్మల రూపమగు విభవములు, 2.వాని అనుష్ఠానములకు కారణములైన విజ్ఞానములు, 3. ఆ విజ్ఞానమునకు అనుష్ఠానమైనట్టి యజ్ఞములు - అనే మూడు సూత్రములు గల యజ్ఞోపవీతం ధరించి నృత్యం చేస్తున్న ఆ భగవతి వేదఘోష చేసే బ్రహ్మచారిణి వలె అనిపించింది. ఆ ప్రళయ నృత్యంచే భూమి ఆకాశంగాను, ఆకాశం భూమిగాను పరివర్తన మొందసాగాయి. కానీ... ఏదీ కూడా పరివర్తనం పొందటమే లేదు! ...ఎట్లా అంటావా?

ఆ రెండూ కూడా (భూమి-ఆకాశం) తమయందలి సమస్త పదార్థములన్నిటితో సహా క్రిందికి-పైకి తిరుగాడుచుండగా ఇక భూమి-ఆకాశాదులలో పరివర్తనం మాత్రం ఏమున్నది?

ఆ భగవతి ముక్కు నుండి వెలువడిన గాలి 'ఘుమ్‌మ్-ఘుమ్‌మ్' శబ్దాలు చేస్తున్నది. ఆమె అసంఖ్యాక హస్తములు ఆకాశమును ఆక్రమించి వ్యాప్తిని పొంది ఉన్నాయి. ఆమె అంగాలలో జనితమైన జగద్వస్తువుల యొక్క భ్రమణమును చేస్తున్నట్టి నేను-మామూలుగా స్థైర్యము కలవాడిని అయి ఉండి కూడా-యుద్ధంలో దెబ్బతిన్న సైనికులవలె కుంఠితుడను అయ్యాను. ఒక అద్దం గుండ్రంగా కదులుతూ ఉంటే అందులో ప్రతిబింబించే కొండలు కూడా కదలుచున్నట్లుగా కనబడ తాయి చూచావా? ఆమె దేహమునందు కూడా మహా పర్వతములు కూడా యంత్రముల వలె అట్లాగే చలించుచూ కనిపించసాగాయి. ఆకాశ సంచారులగు దేవతలు, సిద్ధులు మొదలైనవారు ఆమె దేహంలో అటు ఇటూ తిరుగుతూ ఆకాశంలో సంచరించే పక్షులలాగా కనిపించారు. సమస్త ద్వీపాలు, దేవతాలోకాలు సరోవర పుష్పాలలాగ ఆమె దేహంలో ప్రవర్తిల్లుతూ ప్రకాశిస్తున్నాయి. కోటి సూర్యుల ప్రభాసమానంతో వెలుగుచున్న ఆమె దేహంలో స్థావరములగు మహాపర్వతాదులు జంగమత్వం పొందుచున్నాయి. ఆమె తాండవం చేస్తూ ఉంటే ఆ మహా పర్వతాదులు కూడా ఆకాశంలో నృత్యం చేస్తూ కనిపించసాగాయి.

ఇంకా అనేక ఆశ్చర్యాలు! ఆమె దేహంలో సముద్రాలు పర్వతములపై నాట్యమాడు చున్నాయి! సూర్య-చంద్రులతో సహా ఆకాశం పృథ్వి క్రిందికి కదిలిపోవటం కనిపించింది! సముద్ర జలంలో గడ్డిపరకలు చంచలంగా తిరుగాడుచున్నట్లు జగత్-దిక్ మండలాలు ఆమె దేహంలో పరిభ్రమణం చేస్తూ కనిపించాయి. ఆ దేహంలో కనిపించిన ఆకాశంలో ప్రళయమేఘాలు పైకి-క్రిందికి ఎగురుచూ భాసిస్తున్నాయి. ఆ దేహములోని పృథ్వి-బాహ్య-అభ్యంతరములు పైకి క్రిందికి తిరుగాడుచున్నాయి.

అంతే కాదు! ఆ భగవతి యొక్క దేహంలో సృష్టి-ప్రళయాల సమూహములు దివారాత్రాల వలె అల్పములుగా (చిన్న సంఘటనల వలె) భాసించుచున్నాయి. శుక్ల-కృష్ణ పక్షములు, సూర్య-చంద్రులు, నక్షత్ర సమూహములు ఆమెకు ఆభరణముల వలె కన్పట్టుచున్నాయి. ఆ భగవతి నృత్యమునకు సకల అంతర్గత భూతజాతమంతా నిత్య భ్రమణం పొందుచున్నప్పటికీ 'అధిష్ఠాన

బ్రహ్మము' యొక్క దృష్టిచే నాకు అంతా అత్యంత సుస్థిరమైనదిగానే కూడా అనిపించుచునే ఉన్నది. గిఱ్ఱున తిరుగుచున్న మట్టి బొంగరములోని మట్టి సర్వవేళలా యథాతథం కదా!

ఆ ఛాయ స్వరూపిణియగు దేవి అప్పుడు ధరించియున్న దేహము భూత-భవిష్యత్ కాల మందలి అనంతకోటి సృష్టి-ప్రళయములతో కూడి ఉన్నది. అట్టి దేహంతో ఆ ఛాయదేవి నృత్యం చేస్తూ ఉంటే బ్రహ్మ-విష్ణు-ఇంద్రాది దేవతలు, అసురులు వారివారి అధికారములను, ప్రవృత్తులను మార్చుకుంటూ గాలిచే కదిలే దోమలవలె అస్థిరంగా వచ్చుచూ, పోవుచూ కనిపించారు. అట్టి సృష్టి-స్థితి-లయాలన్నీ నీళ్ళలో పుట్టినశించే బుడగలు-ఆవృత్తములు వలె మిథ్యా మాత్రములే! వాటి వాస్తవ స్వరూపములన్నీ స్వప్న పదార్థాలవలె మిథ్యయే! అవన్నీ పరస్పర విరుద్ధములైన "ఉత్పాత-ఉపశాంతులు, జనన-మరణములు, యుద్ధ-స్నేహాది అభావములు, రాగ-ద్వేషములు, భయ-అభయములు"- ఒకచోట పోయబడిన రత్నముల సమూహములవలె శోభిస్తున్నాయి. ఆ శరీరంలో ఒక దానిచే మరొకటి గమనించబడనట్టి సృష్టిపరంపరలు ఒక స్రవంతివలె బయల్వెడలుచూ ఇంతలోనే మటుమాయమౌతున్నాయి. కంటిదోషం కలవానికి ఆకాశంలో వెంట్రుకలు కనిపించునట్లు వాస్తవానికి చిదాకాశరూపమే అయినట్టి ఆ భగవతి శరీరంలో 'మాయావరణ' యొక్క ప్రభావం చేత అనేక సృష్టి-స్థితి-ప్రళయాలు భాసిస్తూ ఇంతలో అవన్నీ ఎటో తరలి వెళ్ళిపోతున్నాయి.

❖

ఓ రామచంద్రా! నిశ్చలమైన పర్వతం కదలుచుండే అద్దంలో చంచలంగా తోచుతుంది కదా! ఈ జగత్తు చంచలరహితమగు అధిష్ఠాన బ్రహ్మమున ఎట్టి సంక్షోభము లేనిదై ప్రదర్శితమౌతోంది. అనేక తరంగాలు, బుడగలు మొదలైనవి ప్రదర్శించే జలము సర్వదా జలత్వము దృష్ట్యా యథా తథంగానే (జలంగానే) ఉండి ఉంటోంది కదా! సంక్షోభమనేది ఏదీ-ఎక్కడా లేకపోయిప్పటికీ ఈ జగత్తు మాయాక్షోభ దృష్టిచే సంక్షుభితంగా భాసిస్తోంది. ఆ 'మహామాయ' యొక్క శరీరమున ప్రవేశించిన సమస్త జగత్ పదార్థములూ "బాలుని ఊహలోని దృశ్య వస్తువుల" వలె ప్రతిక్షణం పరిణామం పొందుతూనే ఉన్నాయి. అవన్నీ తమ పూర్వ స్థితిని త్యజిస్తూ ఇంతలోనే అన్యస్థితిని గ్రహిస్తూ ఉన్నాయి. అ భగవతి యొక్క శరీరం నిరంతరం క్రియాశక్తి-పరిపూర్ణమై కనబడుతోంది. పెసలరాశి వలె బ్రహ్మాండ సమూహాలు ఆమె దేహంలో కుప్పలు కుప్పలుగా కనిపిస్తున్నాయి. అవన్నీ ఒకసారి కలిసి ఉంటూ, ఇంతలోనే మరల విడిపోతున్నాయి. పరిణామ జగత్తులతో విరాజిల్లు తోంది. ఒక క్షణం అంగుష్ఠమాత్రంగాను, మరుక్షణం ఆకాశరూపిగాను అగుచూ కనిపిస్తోంది.

**శ్రీరాముడు :** స్వామీ! మాయాస్వరూపిణి యగు ఆ భగవతి యొక్క అసలైన రూపమేమిటి?

**యస్మాత్ సా సకలాదేవీ సంవిచ్ఛక్తిః జగన్మయీ,**
**అనన్తా పరమాకాశకోశ శుద్ధశరీరిణీ ॥**

ఆ దేవి "చైతన్యము యొక్క స్ఫురణమాత్రమగు శక్తి స్వరూపిణి"... అని మేము గ్రహిస్తున్నాము. అందుచేతనే ఆమె "జగన్మయి... అయి ఒప్పుచున్నది. వాస్తవానికి ఆ దేవి

"అనంత-శుద్ధ చిదాకాశ శరీరధారిణి" అయి ఉన్నది. ఆ భగవతి త్రికాలాలో ఉన్నట్టి పరిణామ శీలమగు జగత్రయము యొక్క అభ్యంతరమందు ఉన్నట్టి చిత్స్వరూపిణి సుమా! చిత్రకారుని విశాల చిత్తములో ఒదిగియున్న చిత్రమే ఒకగొప్ప కళాఖండంగా ప్రదర్శిమగుచున్నట్లు... ఆ భగవతియే ఆయా కర్మ-వాసనల పరిపక్వతను అనుసరించి ఈ విచిత్ర జగద్రూపంగా పరిణమించి శోభిస్తోంది. ఆ దేవి "అవిద్యావృతమగు చిత్ స్వరూపిణి" అయి ఉండటంచేత "సర్వ సంసారమయి" అయి చూపట్టుచున్నది. ఎప్పుడైతే విద్యచే అవిద్య బాధితమౌతుందో... అప్పుడు "శుద్ధచిదాకాశరూపం"గా వెలుగొందుచున్నది.

ఈ విధంగా, బద్ధుని యొక్క- ముక్తుని యొక్క దృష్టుల చేతను, నిమేష -ఉన్మేషము చేతను, అవిద్య-విద్యల చేతను... క్రమంగా సంసారమయమైనట్టి శుద్ధ-చిన్మయ-అనాది-అనంతమైనట్టి చిదాకాశమే ఆ దేవి శరీరం. ఆ దేవి యొక్క శరీరమునందు ఈ ఈ దృశ్యములన్నీ అభిన్నరూపంగా భాసిస్తున్నాయి.

❖

మహాభయంకరరూపిణి యగు ఆ దేవి తన దేహముచే ఆకాశమును పూర్ణము చేసివేసినదై భైరవరూపధారియగు ఆ కల్పాంతరుద్రుని సమ్ముఖంలో పలుగు-కత్తి-ఈోలు-రోకలి-ఫలము-కుండ మొదలైన చిత్ర విచిత్రములైన వస్తువులను మాలగా ధరించి నృత్యము చేయసాగింది. మధ్యమధ్యలో తన మెడను అలంకరించిన ఆయా వస్తు జాలములతో కూర్చిన దండను త్రెంచి నలువైపులా అద్దాని ఖండములను వెదజల్లి మరల మరొక పూలదండను ధరించుచున్నది. భగవతిచే నమస్కరించబడుచున్న వాడై ఆ భైరవ భగవానుడు ఆకాశములె విశాలరూపము ధరించి-ఆ నృత్యం చూస్తూ-తాను కూడా మహా నృత్యము చేయసాగారు.

**డింబం డింబం సుడింబం పచపచ సహసా ఝమ్య ఝమ్యం ప్రఝమ్యం**
**నృత్యన్తీ శబ్దవాద్యైః స్రజమురసిశిరః శేఖరం తార్క్ష్యపక్షైః**
**పూర్ణం రక్తావసానాం యమమహిష మహాశృంగమాదాయ పాణౌ**
**పాయాద్వో వన్ద్యమానః ప్రలయముదితయా భైరవః కాలరాత్ర్యా ॥**

ఆ కాళరాత్రీ దేవి యముని వాహనమగు దున్నపోతు యొక్క కొమ్ములను రెండు చేతులలో ధరించి "డింబం-డింబం-డిడింబం-ఝమ్య-ఝమ్య-ప్రఝమ్య" అను తాళ శబ్దములచే నృత్యం చేస్తూ వక్షఃస్థలమున శిరస్సులమాలలను ధరించినదై, గరుత్మంతుని ఱెక్కల యొక్క ఈకలను మస్తకమున ధరించినదై, ప్రళయ జగత్తును భక్షించిన సంతోషంతో ఆ భైరవ భగవానుని సమక్షంలో నృత్యం చేస్తూ ఆయనకు అనేక విధములైన సత్తులను సమర్పిస్తోంది.

అట్టి భైరవ భగవానుడు-కాళీదేవీ మనందరి యొక్క జ్ఞాన ప్రతిబంధకములను నివారించి, కాపాడి దరిజేర్చుటకై సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించెదము గాక! వారి కరుణచే మన సంసార భ్రమ తొలగిపోవును గాక!

❖❖❖

# 26. చిద్రూపమగు పరమాత్మ తత్త్వము

**అజ్ఞానముచే కలా సహితం - జ్ఞానముచే కలారహితం**

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు ఆ బ్రహ్మాండ విలయ సందర్భంలో గాంచిన కాళరాత్రీ దేవితో కూడి భైరవ భగవానుని విలయ నృత్యమునకు, వారిరువురి పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామం సమర్పి స్తున్నాను. ఇక్కడ నాదొక చిన్న సందేహం-

**కిమేతత్, భగవన్! సర్వనాశే నృత్యతి కేన సా?**

**కిం శూర్పఫల కుంభాద్యైస్తస్యాః స్రగ్ధామధారణమ్?**

**కిం నష్టం త్రిజగత్ భూయః? కిం కాల్యా దేహసంస్థితమ్**

**పరినృత్యతి నిర్వాణం కథం పునరుపాగతమ్?**

హే భగవాన్! వసిష్ఠ మహర్షీ! ప్రళయమునందు అంతా అప్పటికే నశించిపోయింది కదా! ఇక ఏ అంగాలతో ఆ కాళీ భగవతి నృత్యం సల్పుచున్నది? పదార్థములన్నీ నశించగా ఒక శూలం-ఖడ్గం-గద వంటి ఆయుధాలతో కూడిన మాలను ఆ కాళరాత్రీ దేవి ఎట్లా ధరించింది?

అసలీ మూడు లోకాలలోనూ నశించునదేది? నశించనిదేది? ఆ కాళీదేవి దేహంలో స్థితి నొంది ఉన్న లోకాలు ఎట్లా వచ్చాయి. నశించిపోయిన జగత్తు మరల వచ్చి నృత్యం సల్పుచుండటం ఏమిటి? అసలా భైరవ భగవానుడు పురుషుడా? ఆ నృత్యం ఆయన కాళీదేవితో కలిసి ఎందుకు చేస్తున్నారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ భైరవుడు పురుషుడు కాదు, స్త్రీ కాదు! ఆ నృత్యమంతా వాస్తవమూ కాదు. ఆ భైరవ-కాళీ ఆకృతులు కూడా లేనివే అయి ఉన్నాయి.

**శ్రీరాముడు :** మరి వారెవరు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వారిరువురూ కూడా "అనాది-చిన్మాత్రము-చిదాకాశరూపము-సర్వ కారణ కారణము-అనంతము-శాంతము-ప్రకాశమాత్రము-అవ్యయము-సర్వవ్యాపకము" అయినట్టి పరబ్రహ్మమే అయి ఉన్నారు. నిరతిశయానందము-సద్రూపము అగు సాక్షత్ పరబ్రహ్మమే నీలకంఠ-త్రినేత్రత్వాది ఆ శివ శివారూపము ధరించుచున్నది.

**శ్రీరాముడు :** ఎందుచేత?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఉపాసకుల యొక్క వాసనానుసారమే ఆ చిన్మాత్ర బ్రహ్మం అట్లు భైరవాకారాన్ని స్థితినొంది ఉన్నది. జగత్తు అనునది శమిస్తే ఇక ఆ భైరవాదులు చిదాకాశమే అయి ఉంటారు.

**శ్రీరాముడు :** శుద్ధ చైతన్యంలో ఒకానొకప్పుడు సృష్టి, మరొకప్పుడు ప్రళయం ఎందుకు ఏర్పడు చున్నాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** బంగారం యొక్క వేర్వేరు ఆకారాలనే "ఉంగరం-రెండు పేటల గొలుసు-వడ్డాణం- అరవంకి-పాపడ" మొదలైన పేర్లతో పిలుస్తున్నాం. బంగారానికి 'ఇది' అనే ఆకారం

ఏదీ వాస్తవానికి లేదు కదా! అయితే... బంగారం ఏదో ఒక ఆకారం లేకుండా ఉంటుందా? ఉండదు. ఏదో ఒక ఆకారం కలిగి ఉండటం బంగారం యొక్క స్వభావం కదా! మిరియపుగింజ 'కారపుదనం' కలిగి ఉండటమనేది అద్దాని స్వభావమే కదా! చెఱుకు రసం 'మాధుర్యం' లేకుండా ఎట్లా ఉంటుందో చెప్పు? మాధుర్యం లేకపోతే అది చెఱుకు రసమనియే అనిపించుకోదు.

అట్లాగే... అజ్ఞాతమగు చైతన్యము చేతనరూపం అయిఉండటం చేత తన యొక్క "సృష్టి-స్థితి-లయములు" అనే స్వభావం విడిచి ఉండజాలదు. అనగా అది తన విషయాకారాన్ని త్యజించి ఉండదు. ఏ పదార్థమైనా తన యొక్క స్వభావాన్ని విడచి ఉంటుందా? ఏదో ఒక దానికి ప్రకాశింప జేయకుండా ఉంటే చిన్మాత్రం 'చిన్మాత్రం' అని అనిపించుకోజాలదు. అట్లాగే చిదాకాశానికి 'నాశనం' అనేది ఉండజాలదు. అనగా, సత్తు ('అ'కారం) - చిత్తును ('ఉ'కారాన్ని - ఎఱుకను), ఆనందాన్ని ('మ'కారాన్ని - ఎరుగబడేదానిని - జగదత్వమును) స్వభావసిద్ధంగా కలిగియే ఉంటుంది.

**శ్రీరాముడు :** ప్రకాశరూపమగు బ్రహ్మమున ప్రకాశరూపమగు జగత్తు ఎట్లు ఉద్భవిస్తోంది? ఈ లోకాలు, లోక పాలకులు ఎట్లా ఉత్పత్తిని పొందుచున్నారు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాస్తవానికి బ్రహ్మము యొక్క స్వసత్తామాత్రము నకు 'అన్యము' అనేదేదీ లేనే లేదు. ఆ బ్రహ్మమే తన యొక్క 'అనేకత్వము' అను 'చమత్కారమైన ఇచ్ఛచే తనకంటే భిన్నంగా అనిపించే ఈ 'జగత్తు' అనే అన్యత్వమును కల్పన చేసి, అంగీకరించుచున్నది. కాబట్టి ఈ ముల్లోకముల సృష్టి-వీటి కల్పాంతము కూడా "ఆది-మధ్య-అంతరహితము-క్షోభవర్జితము-సర్వశక్తి మయము" అయినట్టి బ్రహ్మము యొక్క నిజ సత్తామాత్ర ప్రకాశమే సుమా! అదియే ఆకాశము-భూమి-దిక్కులు కూడా అగుచున్నది. అదియే ఆది-మధ్య-అంతము కూడా! నిర్మలము-వస్తు రహితము అగు ఆకాశం నీలంగా కనిపిస్తోంది చూచావా? అట్లాగే నిర్విషయ బ్రహ్మమునందు అవిద్య దృష్టిచేత ఉత్పత్తి-నాశనములు భాసిస్తున్నాయి.

**జననం మరణం మాయా మోహమ్ మాన్ద్యమ్"అవస్తుతా"!**
**వస్తుతా చ వివేకశ్చ బంధో మోక్షః శుభాశుభే**
**విద్యా అవిద్యా విదేహత్వం సదేహత్వమ్ క్షణఃచిరమ్**
**చంచలత్వ, స్థిరత్వం వా, త్వంచ అహం చేతరశ్చ తత్ ॥**

**సత్ అసత్‌చ అథ సదసన్ మౌర్ఖ్యంపాండిత్య మేవచ దేశకాల క్రియాద్రవ్య కలనా కేతి కల్పనమ్ రూపలోకనమ్ అమనస్కారః కర్మ బుద్ధిః ఇంద్రియాత్మకమ్ తేజో వారి అనిల ఆకాశ పృథివ్యాదికమ్ ఇదమ్ తతమ్ ॥**

**ఏతత్ సర్వమసౌ "శుద్ధ చిదాకాశో నిరామయః"**
**అజహద్వ్యోమతామేవ! సర్వాత్మైవ మాస్థితః!**

ఓ రామచంద్రా! జననం-మరణం-మాయ-మోహం-మందత్వం-అవస్తుత్వం, వివేకము-బంధము-మోక్షము-శుభము-అశుభము-విద్య-అవిద్య, నిరాకారత్వం-సాకారత్వం-క్షణకాలం-

చిరకాలం-స్థిరత్వము, 'నీవు' అను భావం, 'నేను' అనే భావం-'వారు-వీరు' మొదలైన అన్యత్వం, సత్తు-అసత్తు-మూర్ఖత్వము-పాండిత్యము, దేశము-కాలము-క్రియ, ద్రవ్యము-కళ-క్రీడ-కల్పన-నామ రూపములు, బాహ్య అభ్యంతర విషయములు-కర్మేంద్రియములు-జ్ఞానేంద్రియములు, ఈ అంతటా నిండియున్న పృథివి- జలము- అగ్ని-వాయువు-అకాశం అనబడు పంచ భూతములు... ఇవన్నీ కూడా నిరామయమై - చిదాకాశమే అయి ఉన్నాయి. ఆ చైతన్యము తన యొక్క "శుద్ధ చిదాకాశ రూపత్వము" ను త్యజించకుండానే సర్వరూపముగా అయి చెన్నొందుచున్నది.

ఈ సమస్త జగత్తు చిదాకాశమే అయి ఉన్నది. అత్ర న సంశయః! ఇందులో ఏమాత్రం సందేహం లేదు. చైతన్యము కంటే వేఱుగా ఏదీ లేదు. స్వప్నంలో కనిపించే ఏ పదార్థమైనా స్వప్న ద్రష్ట యొక్క స్వప్న సత్తా చైతన్యమే! అట్లాగే జాగ్రత్తులో కనిపించేదంతా జాగ్రత్ ద్రష్టా చైతన్యమే!

రామచంద్రా ! ఏ చిన్మయమగు చిదాకాశం గురించి మనం ఇప్పటి వరకూ చెప్పుకుంటు న్నామో, అదియే "సనాతనుడగు శివుడు" అని కూడా చెప్పబడుచున్నదని నీవు గ్రహించు. ఆ శివరూపుడగు పరమాత్మయే "బ్రహ్మ-విష్ణు-చంద్ర-సూర్య-ఇంద్ర-వరుణ-యమ-కుబేర-అగ్ని"... ఆదిగా గల రూపములన్నీ ధరించుచున్నాడు. వాయు-మేఘ- సముద్రాదులు గాను, సర్వభూత - భవిష్యత్ పదార్థములుగాను అగుచున్నాడు. అంతేకాదు. "అది కలదు - ఊహూఁ! లేదు" అని సంకల్పించబడు వికల్పించబడు సర్వ వస్తువులు కూడా పరమాత్మయే అయి ఉన్నాయి.

ఈ ప్రకారం... ఈ బ్రహ్మ మొదలైన సర్వపదార్థాలు కూడా, ఆయా ఉపాధుల దృష్ట్యా, చిన్మయమగు "బ్రహ్మ ప్రకాశం" యొక్క అంశరూపాలే అయి బ్రహ్మాండంగా స్ఫురిస్తున్నాయి. అనగా, పరమాత్మయే ఇట్లు బ్రహ్మ మొదలైన ఈ లోకాలలోని సర్వాకారాలుగా "అన్యథా గ్రహించటం" అను అవిద్యచే చూపట్టుచున్నది. ఈ బ్రహ్మ మొదలైన సర్వ పదార్థాలు కూడా -"స్వభావమాత్ర బోధ" ('స్వభావం - స్వభావి' అను విశ్లేషణ) చే "ఇదంతా చిన్మాత్రమే" అని తెలియబడగలదు.

రఘురామా! అన్నిటా-అంతటా-అన్ని రూపాలుగా ఉన్నది చిదాకాశం మాత్రమే! చిదాకాశా నికి 'అన్యథా' అనునది ఏదీ లేదు. చిదాకాశ బ్రహ్మమే అజ్ఞాన దృష్టిచే 'అబోధ రూపం' అగుచు 'జీవ-జగత్ రూపం' తోటి తనలో స్థితి నొంది ఉన్నది. అజ్ఞాన దృష్టి బ్రహ్మం యొక్క స్ఫురణయే కనుక బ్రహ్మానికి అభేదమే అగుచు, తద్వారా ఈ జీవ-జగత్తులన్నీ బ్రహ్మానికి అద్వితీయమగు చున్నాయి. తత్త్వదృష్టిచే ...అదే బోధ రూపంగా అగుచు, చిదాకాశం గానే తన యందు వెలయు చున్నది. అందుచేత రామచంద్రా ! "భేదము- ద్వైతము - ఐక్యము మొదలైనవి ఏవీ కూడా లేవు" - అని ఎరిగినవాడవై, శాంతుడవగుము.

**తావత్ తరంగత్వమయం కరోతి జీవః స్వసంసార మహా సముద్రే ।**
**యావత్ న జానాతి పరం స్వభావం నిరామయం తన్మయతాం ఉపేతః ॥**

జీవుడు తన స్వరూపాన్ని ఎఱుగనంత వరకు కూడా ఈ 'సంసారం' అనే మహా సముద్రంలో 'జనన-మరణ-భ్రమణ' ఆదిగాగల వివిధ కల్పనా తరంగాలను పొందటం జరుగుతూనే ఉంటుంది.

**శ్రీరాముడు :** మహర్షీ ! ఈ విధంగా జన్మ-మరణ-కర్మ-పునర్జన్మ-లోకాలోక భ్రమణాలతో కూడిన ఈ సంసార మహాసాగరమును పొందుచున్న జీవుని అవస్థల ముగింపునకు ఉపాయం లేదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఉపాయం ఎందుకు లేదు. తప్పకుండా ఉన్నది. అది తన వాస్తవస్వరూపము ఎట్టిదో తాను ఎఱుగుటయే! దానినే 'ఆత్మజ్ఞానం' అంటున్నాం. సర్వభావములకు ముందే నిర్మలమై-నిత్యబుద్ధ స్వరూపమై సర్వ విషయాతీతమై ఉన్న తన వాస్తవ స్వభావం-స్వరూపం ఎఱిగిన మరుక్షణం ఈ 'సంసారము' అనే స్వప్నసదృశ మహాసాగరం, మెళకువ వచ్చినప్పటి కలలోని సంఘటనలవలె, పటాపంచలు కాగలదు. అప్పుడు సంసారమంతా శమించగా, ఇక ఆత్మయే తానుగా శేషించినవాడై ఈ జీవుడు పరమ శాంతిని అనుభూతపరచుకోగలడు.

**జ్ఞానేతు శాన్తిం స తథోపయాతి యథా న సో అబ్ధిః, న తరంగకో ఉ సౌ ।**
**యథాస్థితం సర్వమిదం చ శాంతం, భవత్యనన్తం పరమేవ తస్య ॥**

ఓ రామచంద్రా ! జ్ఞానముకలుగగా ఇక ఆ పై ఈ జీవుడు తరంగ రహితమగు సముద్రవలె శాంతిని పొందుచున్నాడు. అప్పుడు ఆతనికి ఈ జగత్తు యథా తథంగా ఉంటూనే, ఇదంతా పరమశాంతమగు బ్రహ్మరూపమే అగుచున్నది.

❖❖❖

# 27. నిరాకారంలో సాకారం

**శ్రీరాముడు :** స్వామీ! మీరు "మహాప్రళయానంతరం ప్రళయకాల రుద్రుని విలయతాండవం" గురించి వర్ణించి చెప్పారు కదా ! "అంతా లయించిపోగా ఆ ప్రళయకాల రుద్రుడు ఎక్కడి నుండి ఎందుకు వచ్చాడు? లోకాలన్నీ ఆయనలో ఎందుకు ప్రవేశిస్తున్నాయి? ఆ తాండవం చూస్తూ ఉంటే మీకు భయం కలుగలేదా? ఆ తదనంతరం ఏమికానున్నది?" ...అను ప్రశ్నలు ఇంకా నన్ను వెంట నంటియే ఉన్నాయి. కనుక ఆ ప్రళయకాల రుద్రుడు ఎవరో, ఆయన వాస్తవ స్వరూపమేమిటో వివరించ వలసినదిగా నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** మనం ఏ "చిన్మాత్రమగు మహాకాశం" గురించి ఇంతవరకు అనేకసార్లు చెప్పుకొంటున్నామో, అదియే 'శివుడు' అని (పురాణాదులచే, ఉపాసకులచే) చెప్పబడింది. ఆ చిన్మాత్ర మహాకాశమే ఇప్పుడక్కడ రుద్రరూపం ధరించి ప్రళయ కాలమున నృత్యము చేయుచున్నది.

**శ్రీరాముడు :** 'కేవలానంద స్వరూపం' అని చెప్పబడే చిన్మాత్ర మహాకాశం ఆ విధంగా ప్రళయకాల రౌద్ర స్వరూపుడగు రుద్రుని రూపం ధరించటం ఎందుకు?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా ! ఏ భయంకరాకృతిచే రుద్ర భగవానుడు అక్కడ నాకు దర్శన మిచ్చారో, వాస్తవానికి ఆయన ఆకృతి అది కాదు. పరమ శాంతము-పరమానందము-చిద్ఘనము అగు చిదాకాశమే అట్టి రూపంగా స్ఫురించుచున్నది. నా యొక్క తత్త్వదృష్టి ప్రభావం చేత ఆ రుద్ర రౌద్రాకారమును శాంతమగు చిదాకాశంగానే వీక్షించాను. అయితే ఆ రౌద్ర స్వరూపంగా కనిపించే

రుద్రుని చిదాకాశ స్వరూపంగా దర్శించగలగటం తత్త్వదృష్టి (తత్ త్వమ్ అసి – అను దృష్టితో) మాత్రమే సాధ్యం.

**శ్రీరాముడు :** స్వామీ ! అట్టి వివేక దృష్టి ఎట్లా లభిస్తుంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ జగత్తును తత్త్వదృష్టిచే దర్శించటమే వివేకదృష్టి. అనగా "నిర్మల అప్రమేయ-నిత్య సత్య స్వరూపుడే ఈ ఈ సర్వ స్వరూపాలుగా అయి, మాయను అంగీకరించి ఇట్లు ఒకచోట, బహు ప్రజ్ఞాస్వరూపుడుగా, మరొకచోట అజ్ఞానబద్ధుడుగా కనిపిస్తున్నాడు. ఒకే జలం ఒకచోట చంచలంగా ఉన్నట్లు ఈ కనబడే సహజీవులుగా ఉన్నది, సకల లోకస్థులుగా ఉన్నది ఆ అద్వితీయ పరమాత్మయే ! ఆయనయే నా రూపంగా కూడా ఉన్నారు" అనే దృఢమైన భావనాపూర్వకమైన అవగాహనను "వివేక దృష్టి- తాత్త్విక దృష్టి" అని పిలుస్తారు. అట్టి తాత్త్వికదృష్టిని సముపార్జించు కొన్న వారు ఈ మాయా జగత్తును చూచి మోహం చెందరు. ఎవరిచేతనో కల్పించబడిన నాటకాన్ని చూస్తున్నట్లు వారు అంతరంగమున నిశ్చింత కలిగినవారై ఉంటూ, బాహ్యమున యథారీతిగా వర్తిస్తూ ఉంటారు.

అట్టి క్రమమైన అభ్యాసంచే మాత్రమే "ఇదంతా ఆత్మ యొక్క విలాసమే" అని గ్రహించబడ గలదు. అట్టి అభ్యాసము గల ఎవరైనా సరే, ఈ సంసారాన్ని అధిగమించగలుగుతారు. అట్టి దృష్టినే (అంతయూ ఆత్మ యొక్క విన్యాసం మాత్రమే, అను అవగాహన – మరియు అనుభూతిని) "ఆత్మజ్ఞానం" అని "ఆత్మయోగం" అని "ఆత్మసాక్షాత్కారం" అని విజ్ఞులు పిలుస్తున్నారని గ్రహించు. ఈ సహజీవులు, తత్సంబంధమైన సంఘటనలు ఈ కంటికి కనిపించే దృశ్యము, ఈ మనస్సుకు అనుభవమయ్యే భేద-అభేదములు పరమశాంతమగు ఆత్మకు వేరుగా అనిపించటమే సంసారము యొక్క స్వరూపం. ఇంతకుమించి వేఱే 'సంసారము' అనబడునది ఎక్కడా ఏదీ లేదు.

కనుక రుద్రతాండవం, కాళీ దేవతానృత్యం మొదలైన సర్వం, సమస్తం కూడా పరమశూన్యమైన చిదాకాశమే అయి ఉంది. ఇక ఆ ఆకారం గాని, ఆ నృత్యంగాని వాస్తవానికి లేనివే అగుచున్నాయి.

**శ్రీరాముడు :** మహర్షీ! మీ వాక్యములు పరస్పర విరుద్ధంగా లేవంటారా? ఆ "రుద్ర-ఛాయాదేవిల ప్రళయ తాండవం చూచాను" అని ఒకవైపు అంటున్నారు. ఇంతలోనే "అవేవీ లేవు" అని కూడా చెప్పుచున్నారు. దయచేసి అలా అనటంలో తమ ఉద్దేశమును విశదీకరించమని నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఈ జగత్తు వాస్తవానికి లేకపోయినా, ఉండి ఉన్నట్లే కనిపించటం జరుగుచున్నదని చెప్పటానికి మనకు అనేక దృష్టాంతాలు ఉన్నాయి.

జలంలో వేరువేరు తరంగాలు కనిపిస్తున్నాయి. కానీ తరంగాలన్నీ ఒకే జల స్వరూపం కదా! జలం సర్వదా – తరంగం ఉన్నచోట, తరంగం లేనిచోట – జలంగానే ఉంటోంది కదా !

ఒకే మట్టితో కోతి-కుక్క-రాజులు-మంత్రులు-సైనికులు మొదలైన అనేక బొమ్మలు తయారు అయినప్పటికీ అవన్నీ ఒకే మట్టి కదా! ఆకారం దృష్ట్యా అవి వేరువేరైనప్పటికీ మట్టి దృష్ట్యా ఒక్కటే కదా! మట్టికి ఆకారం లేనప్పటికీ, ఆకారాలన్నీ మట్టివే కదా!

జనులందరు రక్త-మాంస-అస్థిమయ (మఱియు) అస్థిర స్వరూపులే అయినప్పటికీ కొందరికి మరికొందరు బంధువులై ఉండటం, ఇంకొందరు బంధువులు కాకపోయి ఉండటం అనుభవానికి సిద్ధిస్తోంది కదా! ఉన్నదంతా పాంచభౌతికమైన దేహములు - తోలుబొమ్మల సమావేశమే అయినప్పటికీ... దేహముల-దేహముల మధ్య ప్రేమ - ద్వేషాది రకరకాలైన ఉద్వేగములు వేరువేరుగా వేరువేరు దేహములతో ఏర్పడుచున్నాయి కదా!

అంతా బంగారమే అయినప్పటికీ రకరకాల పేర్లుగల ఆభరణాలు సంభాషణా ప్రయుక్తమై ఉంటున్నాయి కదా! పంటభూమి అంతా ఒక్కటే అయినప్పటికీ "ఇంతవరకు మీ చేను - అది మా చేను అనునవి లోకవిదితమై ఉంటోంది కదా !

అట్లాగే ఆ ఆకారములు, ఆ నృత్యము అక్కడ కనిపిస్తున్నప్పటికీ అని వాస్తవానికి లేవని నేను గ్రహించియే అదంతా దర్శించాను. మరి ఆ ఆకారములు ఎట్లా ఏర్పడ్డాయంటావా? అదంతా కూడా, ఉపాసకుల వాసనచే ఆ భగవంతుడు అట్లు భైరవాకారంగా కానుపించుచున్నాడు.

**శ్రీరాముడు :** స్వామీ! మీరు చూచినదంతా ఉపాసకుల కల్పనా చమత్కారం మాత్రమే అయినప్పుడు, ఆ ప్రళయ తాండవం గురించి వర్ణించి చెప్పటంలో మీ ఉద్దేశం చెప్పవలసినదిగా నా విన్నపం.

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**వాచ్య - వాచక సంబంధం వినా బోధో న జాయితే**
**యస్మాత్ - తస్మాత్, త్వయి - మయా దృష్టమేవ ప్రవర్ణితమ్ ॥**

ఓ రామచంద్రా! చెప్పబడే విషయం, చెప్పటం (వాచ్యం, వాచకం) అనే సంబంధం గురించిన కల్పన లేకపోతే 'బోధ' అనునది కుదరదు కదా! అందుచేత తత్కల్పనచే నాచే గాంచబడిన ప్రళయ కాల నృత్యములను నీకు వర్ణించి చెప్పాను. ఆ ప్రళయమే కాదు, ఈ కనబడే జగదృశ్యం కూడా వాస్తవం కాదు. ఈ జగత్తు పట్ల ఏ ఆధిభౌతిక దృష్టి జీవునికి కలుగుచున్నదో... అట్టిది చిరకాల అభ్యాసంచే ప్రౌఢమై, వాక్కుచే మాత్రమే దృఢమై చెన్నొందుతోంది. అనగా ఈ జగత్తు పంచభూతాల కలయికయే కదా! ఇక తదితరంగా కనిపించే 'నా వారు, నీ వారు, నీది, నాది' అని అనిపించేది భ్రమయే! ఏదైతే "అయోధ్యా నగరం" అని, "మా నగరం!" అని అనిపిస్తోందో...అదంతా ఆధిభౌతిక భ్రమ యొక్క చమత్కారం(లేక) విన్యాసం మాత్రమే! అదంతా మాయామాత్రమే అగుచు క్షణకాలంలో సత్యత్వం పొందినదగుచున్నది. వాస్తవానికి ఆ భైరవుడుగాని, భైరవిగాని, ప్రళయంగాని, సృష్టిగాని ప్రశాంత చిదాకాశం దృష్ట్యా లేవు. అదంతా కూడా భ్రాంతి మాత్రమే. "నీడ యొక్క కదలిక" అను దృశ్యంలో 'నీడ' ఒక పదార్థమేమీ కాదు కదా! "ఛాయ యొక్క నృత్యం" అని నాచే గాంచబడినదంతా అవస్తువేనని గ్రహించు. మరి?... పరమార్థమున చిదాకాశమే ఆ ఛాయాదేవి దేహంగానూ, ఇక్కడ మనకు ఎదురుగా దృశ్య ప్రపంచంగానూ అనుభూతమగు చున్నాయని గ్రహించు.

**శ్రీరాముడు :** హే మహాత్మా ! చిదాకాశమే అయి ఉన్న ఈ జగత్తులో వేఱు వేఱు పదార్థాలు మాకు కనిపించటం ఎందుకు జరుగుతోంది? స్థావర - జంగమ భూతజాలమంతా పరస్పరం ప్రతిస్పందనలు కలిగి ఉంటూ ఉండగా "ఈ జగత్తు లేదు" అను వాక్యం ఎట్లా యుక్తియుక్తం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వప్నమంతా భ్రమ కల్పితమే అయినప్పటికీ, స్వప్నములోని కల్పిత - స్థావర జంగమ దృశ్యం యొక్క అంతర్గతంగా పరస్పర స్పందన-అనుస్పందన-ప్రతిస్పందనలు కూడా కలుగుచున్నాయి కదా! ఊహలోని యుద్ధ సన్నివేశంలో శత్రుసైనికులు మొదలైనవి అనుభూతమౌ చున్నాయి కదా! కథను వింటూ అందులోని పాత్రల పరస్పర స్పందన-ప్రతిస్పందనలు నిజమైనవై నట్లు పాఠకుడు అనుభూతి పొందుచున్నాడు కదా! మనోకల్పిత రాజ్యంలో భవనాలు, ఆ భవనాల యొక్క రంగులు కనిపిస్తున్నాయి కదా!ఈ సృష్టి ప్రళయాలు కూడా అట్టివే! ఇందాక నేను వర్ణించిన... నాకు అనుభూతమైన "భైరవ-భైరవీ నృత్యవిలాసము" అట్టిదేనని తెలిసియే, ఇంతదాకా నేను దర్శించియుండి... నీకు వర్ణించి చెప్పాను.

భ్రాంతిచే 'చిత్‌ఘనం' నందు అచిత్తు భాసిస్తోంది. నిరాకారమగు జలమునందు సాకారమగు తరంగము, నిరాకారమగు బంగారమునందు సాకారమగు ఆభరణము భాసించుచున్నట్లుగానే, నిర్విషయాత్మ యందు సవిషయమగు జగత్తు - జగద్విషయాలు భాసిస్తున్నాయి. జ్ఞానము కలిగిన మరుక్షణం "నిర్మల చిదాకాశమే స్వయముగా తనయందు ఈ జగద్రూపమున భాసించుచున్నది" ... అని ఎఱుగబడగలదు.

ఆత్మ ప్రతిజీవుని యందు నామ-రూప-గుణాత్మకంగా ఎట్లా ప్రకాశిస్తోందో, అట్లాగే అయ్యది వస్త్రమునందు, కల్పాంత వాయువులలో, ప్రళయానంతర రుద్ర నృత్యంలో కూడా ప్రకాశిస్తోంది.

ప్రియ రామా! ఈ విధంగా భైరవీదేవి విపుల నిరాకారమగు ఆకారాన్ని నేను వర్ణించి చెప్పాను. ఇప్పుడు ఆ నృత్యం యొక్క మిథ్యాత్వం ఏమిటో, ఎందుచేతనో మరొక్కసారి చెప్పుచున్నాను ... విను.

❖❖❖

# 28. ఆత్మయందు మౌనస్థితి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఒకాయన "ముత్యపు చిప్పలో వెండి ఉన్నది" అని నిర్ణయించు కొన్నవాడై ఆ వెండిని సొమ్ము చేసుకోవాలని మూటకట్టుకొని ముత్యపుచిప్పలను ఇంటికి చేర్చుకొని సంతోషించాడట! వెండి గురించి తెలిసినవాడు ముత్యపు చిప్పలో వెండి ఉండగలదని భ్రమించడు కదా! అట్లాగే జ్ఞానికి ఈ జగత్తు నిర్విషయంగాను, నిరాకారంగాను విదితమౌతోంది.

లోహానికి ఒక ఆకారమంటూ ఏదీ లేకపోయినప్పటికీ, ఏదో ఒక ఆకారం లేకుండా ఎప్పుడూ ఉండదు కదా! అట్లాగే చిన్మాత్రమగు పరమాత్మ యొక్క చేతనం ఒకింత స్పందనం లేకుండా ఉండ జాలదు. బంగారమే ఆభరణంగా పరివర్తితమగుచున్నట్లు... చైతన్యమే నిజభావనా చమత్కారంచే రుద్ర రూపమున స్థితినొంది ఉన్నది. జలం ఉన్నచోట ద్రవత్వం కూడా ఉంటుంది కదా ! అట్లాగే చైతన్యం ఎక్కడ ఉంటే అక్కడ అయ్యది 'స్పందం' అనే ధర్మం అవశ్యం కలిగి ఉంటుంది. ఎందుకంటే స్పందనం అనేది చైతన్యం యొక్క స్వభావమే అయి ఉన్నది. జలం యొక్క కదలికలే తరంగాల రూపంగా అగుపిస్తున్నట్లు... "చిద్ఘనం-శివరూపం" అగు పరమాత్మ యొక్క స్పందనగా ఏదైతే

ఉన్నదో ...అదియే మనకు స్వవాసనచే జగత్తుగాను, నృత్యం(తాండవం) ఒనర్చుచున్న "భైరవ పరమేశ్వరుడు–ఛాయాదేవి"...మొదలైనవిగానూ కనిపిస్తున్నాయి సుమా! కాబట్టి రామచంద్రా! భయంకరమైన ఆకృతిని దాల్చి స్వేచ్ఛగా నృత్యం చేస్తున్నట్టి శివరూపుడగు రుద్రుడు చిద్ఘనం యొక్క నిజస్పందనమేనని గ్రహించు.

**శ్రీరాముడు :** స్వామీ ! ఇక్కడ ఒక విషయం ప్రస్తావిస్తాను. "ప్రామాణిక దృష్టి" చే చూస్తే ... ఈ దృశ్యం కించిత్ కూడా వస్తుతః లేనే లేదు. ఇక, "అప్రామాణిక దృష్టి" చే ఏ దృశ్యం అయితే కనిపిస్తోందో... అదంతా కూడా కల్పాంతమున నశించి పోవటం జరుగుతోంది.

ఇది ఇట్లా ఉండగా 'కల్పాంతము' నందు చైతన్యము విషయరహితమై మహా శూన్యత్వం వహించు చున్నప్పుడు అట్టి చైతన్యమున ద్రష్ట (చూచువాడు) ఉండడుకదా ! అట్టి చిదాకాశము దృశ్యమాన మవటమెట్లా? పైగా, చిద్ఘనమునకు అన్యమైనదేదీ లేనప్పుడు అద్దాని ఉనికి ఎవరికి అనుభవమౌతుంది? చిద్ఘనము తనకంటే వేరైన 'క్రియ' అనునదే లేనప్పుడు అద్దానిని ప్రకాశింపజేసేది ఏముంటుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! "ప్రళయసమయమునందు 'విషయము' అనేదేదీ ఉండదు కనుక చిన్మాత్రము (లేక చిదాకాశము) అనునది 'ఉన్నది' అనటానికి సాక్షి ఎవరంటారు?".... అని కదా, నీ సందేహం? అప్పుడు "అది ద్వైతమా? ఏకత్వమా? ద్వైతమైతే చిన్మాత్రమునకు అద్దానిని దర్శించే ద్రష్ట వేఱుగా ఉంటున్నాడు కాబట్టి చిన్మాత్రాకాశము నిర్విషయం కాదు. ఒకవేళ ఏకత్వమే అయి ఉంటే ఆ ఏకత్వానికి 'ద్రష్ట' లేదు కాబట్టి అద్దాని యొక్క ఉనికి దర్శించటానికి ద్రష్ట లేదు. కాబట్టి "ద్రష్ట లేనప్పుడు నిర్విషయ చిన్మాత్రము ఉన్నట్లుగా ఎలా ఎవరు చెప్పగలరు?" అను నీ సందేహం మొదలంట తొలగవలసియున్నది. అందుచేత నీ ప్రశ్నకు నా ప్రత్యుత్తరం విను.

❖

ఓ రామచంద్రా! ఈ జగత్తునందు 1.చైత్యము అంటే తెలియబడేది (విషయాలు) (చేత్యం) 2.చేత్యత అంటే తెలుసుకొంటున్నది ...అనే రెండూ పాల్గొనుచున్నాయి కదా!

ఈ చిత్–చేత్యాలు రెండూ ఉంటేనే 'జగత్తు' అనేదో, దృశ్యం అనేదో (లేక) సుఖదుఃఖాలు అనుభవించటం అనేదో జరుగుతోంది. అయితే...

**న కించిచ్చేతతి తతః కించిత్ కించిత్ కదాచన**
**సర్వం శాస్త్రం దృషన్ మౌనం విజ్ఞానఘనమంబరమ్ ॥**

యథార్థానికి ఏ సమయంలోనూ, ఏ చోటా కూడా పైన చెప్పిన చేత్యం (అనుభవించబడే విషయాలు) గాని... (లేక) చేత (అనుభవం పొందుచున్న 'జీవుడు' అనబడునది) గాని లేనే లేవు. మరి?... ఈ సమస్తం కూడా – అనగా ఈ అనుభవం పొందేవాడు – ఈ అనుభవాలుగా ఏర్పడు చుండే విషయాలు కూడా – చిదాకాశమే అయి ఉన్నది. అట్టి చిదాకాశం సర్వదా శాంతము, శిల వలె మౌన రూపం, విజ్ఞాన ఘనంగానే ఉన్నది. అనగా... "అనుభవించువాడు– అనుభవించ

బడుచున్నది– అనుభవములు" అను మూడు ఏర్పడుచున్నప్పుడు, ఏర్పడనప్పుడు కూడా చిదాకాశం ఎట్టి మార్పు– చేర్పులు పొందటంలేదని గ్రహించు. ఓ చిదాకాశ స్వరూపులైనట్టి సర్వ జనులారా! ఈ దేహం – జగత్తు– ఈ అనుభవ పరంపరలు మొదలైనవి ఉన్న సమయంలోనూ, ఉండని సమయంలోనూ కూడా మీరు–నేను–ఈ రామచంద్రుడూ–మనమంతా కూడా సర్వదా "అప్రమేయం–నిత్య బుద్ధం–శాంతం–మహా మౌన స్వరూపం – విజ్ఞాన ఘనం" అగు చిదాకాశమే స్వస్వరూపంగా కలిగి ఉన్నామని గమనించెదరు గాక!

ఇక ఏ చేతితము[విషయములు (లేక) ప్రకాశింపబడుచున్నవి] కనిపిస్తూ ఉన్నదో... అదంతా కూడా స్వప్నమువలె చిత్స్వభావం తన యొక్క నిజసత్తయందు శాంతముగా ఉంటూనే అజ్ఞానాంగీకారముచే తనకుతానై జగద్రూపంగా స్ఫురించటం మాత్రమేనని గ్రహించండి. కనుక 'జగత్తు'గా (లేక) దృశ్యంగా, లేక 'విషయం'గా పొందబడుచున్నదంతాకూడా ఆ పొందుచున్నవానితో సహా చిదాకాశమే గాని మరేదీ కాదు. అటు ద్రష్టగా, ఇటు దృశ్యంగా స్ఫురించుచున్నట్లు (అజ్ఞానంచే) అనిపించుచున్నప్పటికీ, వాస్తవానికి చిదాకాశము యథాతథంగానే ఉన్నది, ఉంటుంది.

**శ్రీరాముడు :** "ద్రష్ట–దృశ్యం ఒక్కటే. ద్రష్ట యొక్క చిదాకాశస్వరూపమే ఒకానొక స్వకీయ విభాగము నందు దృశ్యముగా కూడా అగుచున్నది"... అని మీరిప్పుడు చెప్పుచున్న సిద్ధాంతం సమన్వయిం చుకొని గ్రహించటానికి వీలుగా మరికొంత దృష్టాంతపూర్వకంగా మాకు బోధించ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఒకడు నిదురిస్తూ స్వప్నం కంటున్నాడు. ఆ స్వప్నంలో ఆ స్వప్న ద్రష్టకు కనిపించే నగరాలు, భవనాలు వాస్తవానికి ఉన్నాయా? లేవు. మరి వాటి వాస్తవ స్వరూపమేమిటి? వాటన్నిటి యొక్క వాస్తవ స్వరూపం స్వప్న ద్రష్ట యొక్క స్వప్నచిత్స్వరూపం కాక మరింకేమి కాదు కదా! అవన్నీ (స్వప్నంలోని విశేషాలన్నీ) చిదాకాశమే "ఈ ద్రష్ట–దృశ్యము (లేక) అనుభవి– అనుభవములు అనునవి రెండూ చిదాకాశ స్వరూపమే అయి ఉన్నాయి" అనటానికి దృష్టాంతం "స్వప్నం సత్యం కాదు కదా!"... అంటావా?

అజ్ఞానికి ఈ జగత్తు ఎట్లు రసానుభూతమై అనుభవమౌతుందో, అది ఆత్మజ్ఞానికి సత్యము కాదు. స్వప్న సమయంలో స్వప్నము వాస్తవమైనదాని వలె స్వప్నద్రష్టకు అనుభవమగుచున్నట్లు... ఇక్కడ చిదాకాశమే అజ్ఞానదృష్టికి "జగత్తు" అనబడు విషయాల సముదాయంగా అనిపించుచున్నది.

శుద్ధ చైతన్యము తనయందు ఈ "జ్ఞేయము (లేక) దృశ్యము" అనబడు దానిని ఎల్లప్పుడూ ఎఱుగుచున్నప్పటికీ తనయందు తానే సర్వదా జ్ఞేయాతీతమై వెలయుచున్నది. ఒక వైపు సృష్టి మొదలుకొని ప్రళయము వరకు జగత్తును స్ఫురణగా ఎఱుగుచూనే మరొక వైపు అట్టి స్ఫురణకు ఆవల ఏకాకృతియై వెలుగుచున్నది. ఆ చైతన్యం తన యొక్క "స్వభావం" అనబడు చిత్ స్వభావాకాశంలో తనయొక్క కల్పనచే ఈ "క్షణ–కల్పన–భావన–జగత్తు" గురించిన భ్రాంతిని ధరించుచున్నది. ఆ తేజోమయ చైతన్యము తన యొక్క చిత్స్వభావాకాశమున ఈ జగత్ కల్పనలను గావించుచున్నది. కాబట్టి,

**తస్మాత్ న ద్వైతమస్తిఇహ, న చ ఐక్యం, న చ శూన్యతా ।**
**న చేతన-న అచేతనంవై మౌనమేవ న తచ్చ వా ॥**

ఇక్కడ వాస్తవానికి ద్వైతమూ లేదు, ఏకత్వమూ లేదు, శూన్యత్వమూ లేదు-అట్లాగే చైతన్య-చేతయిత (విషయాలు-విషయాలను పొందేది) మౌనం-అమౌనం మొదలైనవేవీ కూడా లేవు. ఎందుచేత నంటావా? చైతన్యం (దృశ్యం-విషయాలు-జగత్తు-తెలియబడునది) అనేది అధిష్ఠాన దృష్టిచే చిద్రూపం కంటే వేరు కానేకాదు కదా! వాస్తవానికి చైతన్యము ఏ సమయమందును దేనినీ ఎక్కడా చేతితం (ప్రకాశం) చేయటమే లేదు. కనుక చేతయిత (విషయాలను దర్శించేది/ పొందేది-అనునది కూడా) (చిదాకాశం కంటే వేఱుగా) లేనేలేదు. చైత్యం-చేత అనే రెండూ కూడా యథార్థానికి మిథ్య మాత్రమే! కనుక మౌనమాత్రమగు చైతన్యమే సర్వదా శేషించియున్నది.

ఓ రామచంద్రా! సమస్త వాఙ్మయ ప్రపంచంలోనూ, సమస్త సిద్ధాంతాల అంతిమసారం కూడా "నిర్వికల్ప సమాధి" యే అత్యంతిక సిద్ధాంతమై ఉన్నది. అట్టి సమాధి యొక్క శాంత-మౌన స్థితియే పరమావధి కనుక నీవు ఆత్మయందు మౌనముతో కూడిన స్థితిని కలిగి ఉండు. ఈ లోకదృష్టిచే ప్రస్తుతం యథా ప్రాప్తములైన రాజ్యపాలన పితృ-పితామహుల నుంచి ప్రాప్తించి క్రమమును అనుసరించి నిర్వర్తిస్తూనే "స్వదృష్టి" చే పరమార్థమౌనముతో కూడినవాడివై ఉండు. అన్నీ నిర్వర్తిస్తున్నప్పటికీ మోహములన్నిటినీ త్యజించినవాడవై, ఆకాశము వలె నిర్మలుడవై, విక్షేపములు లేనివాడవై ఆత్మయందే స్థితి కలిగి ఉండుము. జగత్తు – మౌనము – ఉభయము ఏక సమయంలో కలిగి ఉండటమనేది ఈ సభలో పాల్గొనే అనేకమంది ఆత్మజ్ఞానులకు దైనందిన విషయమే సుమా! వారంతా లోకదృష్టితో లోకమున వ్యవహరిస్తూనే ఆత్మదృష్టిచే ఘనీభూతమైన మౌనస్థితిని అంతరంగమున వహించియే ఉంటున్నారు.

❖❖❖

## 29. బ్రహ్మ సత్యం - జగన్మిథ్యా

**శ్రీరాముడు :** మహర్షీ! తమ ప్రవచనం అమోఘం, శిరోధార్యం కూడా! ఇప్పుడు మీరు చూస్తూ వస్తున్న విద్యాధరీ బ్రహ్మాండము యొక్క మహాప్రళయ సందర్భంలో చూచిన "ప్రళయ కాలరుద్రుడు-ఛాయా భగవతి" ల విలయతాండవం విశేషాలు మనం చెప్పుకుంటున్నాం కదా! ఆ కాళీదేవి "చాట-ఫలములు" మొదలైన వాటితో కూర్చబడిన మాలను ఎందుకు ధరించింది? ఏ కారణం చేత నృత్యం చేస్తోంది. ఈ విషయాలు ప్రవచించమని ప్రార్థన. ఆ కాళీదేవి ఎవరు? ఆ శివరూపుడగు రుద్రుడు ఎవరు? ఎందుకా నృత్యం? వారిరువురికి సంబంధ-భేదములు ఎట్టివి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ భైరవుడు చిదాకాశమగు శివస్వరూపుడే! ఇక ఆ కాళికాదేవి అతనికంటే వేఱుకాదు. ఆ దేవి ఆ నిర్మల చిదాకాశరూపము యొక్క స్పందన శక్తియే! అతని మనోమయరూపమే ఆ దేవి.

దృష్టాంతానికి... వాయువు–అద్దాని స్పందనము (కదలుచున్న వాయువు యొక్క కదలిక) అగ్ని–అద్దాని ఉష్ణత్వము అనునవి మొదటిదానికి రెండవది అభేదము కదా! అయినా స్పందనము చేతనే వాయువు తెలియబడుతోంది. ఉష్ణత్వముచే అగ్ని తెలియబడుతోంది. అట్లాగే చిన్మాత్రరూపుడు పరమశాంతుడు అగు శివుడు స్పందన రూపమగు మాయాశక్తి చేతనే ఎఱుగబడగలడు గాని, అన్యథా కాదు. అట్టి ఆ శివుడు బ్రహ్మం కంటే వేఱు కాదు. ఎందుకంటే శ్రుతులు, వేదాలు, బ్రహ్మ వేత్తలు 'ఆ శివుడే బ్రహ్మం' అని సిద్ధాంతీకరిస్తున్నాయి. నిరాకారమగు "ఇచ్ఛ" చే సాకారమగు చిత్ర లేఖనం, శిల్పం నిర్మించబడుచున్నాయి కదా! అట్లాగే శివుని యొక్క నిరాకారమగు స్పందన శక్తియగు ఇచ్ఛారూపిణి కాళీదేవి ఈ దృశ్యమునంతా విస్తరింపజేస్తోంది.

**శివుడు - శివేచ్ఛ - క్రియ :**

**ఈశ్వరేచ్ఛ :** నిరాకారమైనట్టి శివుని యొక్క ఇచ్ఛయే ఈ జగత్తును నిర్మించుచున్నది.

**ఆరాధనారూపం :** అట్టి ఇచ్ఛాశక్తి యొక్క అరాధనా రూపమే కాళీదేవి.

ఆ ఇచ్ఛా–క్రియా రూపిణియే సర్వజీవుల యొక్క జీవన హేతువు అయి ఉండటం చేత "జీవ చైతన్యము" అనికూడా పిలువబడుతోంది. ఈ కనబడేదంతా శివేచ్ఛయే!

ఆ శివేచ్ఛయే ఇంకా... స్వయంగా జగద్రూపంగా పరిణమించి ఉండటం చేత ప్రకృతి రూపంగా ప్రదర్శితమౌతోంది. 'దృశ్యాభాస' యందు అనుభూతమగుచు 'ఉత్పత్తి–స్థితి–వినాశనము' మొదలైన వికారములను ప్రదర్శించుచుండుటచే 'క్రియా స్వరూపిణి' అనిపించుకుంటోంది.

ఇంకా కూడా చెప్పాలంటే ఆ "శివేచ్ఛా స్వరూపిణి" యగు కాళీ భగవతియే... బడబాగ్ని స్వరూపంతో అంతయూ దహించి వేయుచుండటం చేత 'శుష్క' అని దుష్ట శిక్షణా వ్యాసంగం కలిగి ఉండటం చేత 'చండిక' అని, నీలకమల వర్ణముచే ప్రకాశిస్తూ ఉంటుంది. కాబట్టి 'సోత్పల' అని, ప్రార్థించు భక్తజనులకు జయమును ప్రసాదించటంలో 'తత్పరత' కలిగి ఉండటం చేత 'జయ' అని, 'జయంతి' అని 'విజయ' అని, మహా పరాక్రమశీలి, అయి ఉండటం చేత 'అపరాజిత' అని, గ్రహించుటకు కష్టసాధ్యమై ఉండటం చేత 'దుర్గ' అని, ఓంకారము యొక్క సారభూతమైన తత్త్వమై ఉండటం చేత... అనగా 'ఉమ'* అని, గానం చేసేవారికి (జపించే వారికి) పరమ పురుషార్థం ప్రసాదిస్తుంది. కాబట్టి 'గాయత్రి' అని, సంతతి యొక్క స్థితికి తానే కారణం కాబట్టి 'సావిత్రి' అని కర్మ–ఉపాసన–జ్ఞానము మొదలైన ఉత్తమ దృష్టులను, ప్రేరణను ఆరాధకులకు అందించుతుంది. కాబట్టి 'సరస్వతి' అని, గౌరవర్ణపు దేహంతో ధ్యానించే వారికి అభయప్రదాతగా స్ఫురిస్తుంది. కాబట్టి 'గౌరి' అని, జగదుత్పత్తికి కారణభూతుడగు భవుని అర్ధాంగి కాబట్టి (మహేశ్వరుని దేహమును అర్ధభాగం ఆశ్రయించి–ఆక్రమించుకొని ఉంటుంది కనుక) 'భవాని' అని...

---

*అ + ఉ + మ,

అ = శుద్ధ చైతన్య స్వరూపమగు శివుడు; ఉమ = ఇచ్ఛ – ప్రేరణా స్వరూపమగు శక్తి

ఈ త్రిలోకములోని సర్వప్రాణులు నిద్రిస్తున్నప్పుడూ మేల్కొని ఉన్నప్పుడు కూడా వారిలో ప్రతి ఒక్కరి హృదయంలోనూ అకార–ఉకార–మకారములకు అతీతమైన ప్రణవనాద భాగమగు శబ్ద బ్రహ్మ స్వరూపముతో 'ఉ...ం...' అను ఉచ్చారణ స్వరూపిణి అయి ఉంటోంది. అందుచేత "ఇందు కళారూపిణి" అని 'ఉమ' అని పురాణాదులచే, మంత్రద్రష్టలచే, యోగపరాకాష్ఠపరులచే పరికీర్తించబడుతోంది.

| | |
|---|---|
| ఓం కాళీభ్యాం నమః | ఓం జయంతిభ్యాం నమః |
| ఓం ఛాయారూపిణీభ్యాం నమః | ఓం విజయాయ నమః |
| ఓం ఇచ్ఛాస్వరూపిణీభ్యాం నమః | ఓం అపరాజితాయ నమః |
| ఓం స్పందస్వరూపిణీభ్యాం నమః | ఓం దుర్గాయ నమః |
| ఓం మాయాశక్తిభ్యాం నమః | ఓం ఓంకారసార ఉమాయ నమః |
| ఓం దృశ్య విస్తారకారిణీభ్యాం నమః | ఓం గాయత్రీభ్యాం నమః |
| ఓం జీవచైతన్యభ్యాం నమః | ఓం సావిత్రీభ్యాం నమః |
| ఓం ప్రకృతిమాతాభ్యాం నమః | ఓం సరస్వతీభ్యాం నమః |
| ఓం భగవతిభ్యాం నమః | ఓం గౌరియే నమః |
| ఓం శుష్కాయ నమః | ఓం అకార–ఉకార–మకారాతీతాయ నమః |
| ఓం చండికాయ నమః | ఓం ఇందుకళారూపిణీభ్యాం నమః |
| ఓం జయాయ నమః | |

ఓ రామచంద్రా! శివుడు–ఇచ్ఛాదేవి ఈ ఇరువురు ఆకాశరూపులే అగుటచే వారిద్దరు శ్యామ వర్ణ (నీలివర్ణం) శరీరులుగా ఆరాధించబడుచున్నారు. వాస్తవానికి ఇరువురు చిదాకాశరూపులే అయినప్పటికీ–అనగా, ఎట్టి వర్ణం ఆపాదించటం కుదరనిది అయినప్పటికీ – వారి శరీరాలు (ఉపాసకుల) సృష్టి సంకల్ప దృష్టిచే మాంసమయ శరీరాలు శ్యామవర్ణంగా స్ఫురిస్తున్నాయి. చిదాకాశ స్వరూపులగు వారిరువురు చిదాకాశమునందే సర్వదా స్థితి కలిగి ఉన్నారయ్యా!

వారిరువురు ఆది స్వరూపులు కదా! అతి స్వచ్ఛస్వరూపులగు వారిరువురిని ఆకాశరూపులుగా గ్రహించు. హస్త–పాద–ముఖ–శిరస్సు మొదలైనవాటిని కలిగియుండి బహుత్వ–అల్పత్వ భేదాలతో "నానాత్వం" ధరిస్తూ ఉన్నప్పటికీ వారిరివురు సర్వదా ఏకరూపులేనని మా అనుభూతపూర్వకమైన అనుభవం.

"ఆ దేవి శూర్ప (చాట)–ఫలములు మొదలైన వాటితో కూడిన మాల ఎందుకు ధరించింది?" అంటావా?

ఆ భగవతి ఒకవైపు 'అనాది, అనంతం' అయినట్టి చిచ్ఛక్తి స్వరూపిణి. అట్టి భగవతీదేవి 'స్వ–ఇచ్ఛ' చేత స్వయంగా సర్వవైదిక క్రియారూపిణి అయింది. అట్లే దాన–స్నాన–యాగాది శ్రేష్ఠ శరీరరూపిణి కూడా అయింది. ఆ దేవి యొక్క నానా ప్రకారాలైన అభినయాలతో కూడిన నర్తనములే

ఈ సృష్టులు, ఈ జరామరణాది బ్రహ్మ కల్పితములగు క్రియా ప్రదర్శనములు కూడా! ఆమె వాస్తవానికి రూపరహితయే! అయితే రూపరహితకు క్రియలు అప్రసిద్ధము కదా! అందుచేత ఆమె కల్పితాలగు క్రియా ప్రదర్శనాలు కూడా! కల్పిత అవయవి! ఆయా వస్తు గ్రామ-నగర-ద్వీప-మండల సమూహాలను తన శరీరంగా ధరించినదై క్రియా రూపత్వం ప్రకటించుచున్నది.

కాళీ భగవతి : కల = 'ధారణ' మొదలైన సర్వక్రియా వాచక ధాతువు. కల శబ్దం నుండి 'కాళీ' అనే శబ్దం ఉత్పన్నమైనది. ఆ కాళీభగవతి బ్రహ్మాండ రూపం గల బీజకోశాలను తన యందు ధరిస్తూ వాటి యొక్క ఉత్పత్తి-పాలన మొదలైన క్రియలన్నిటికీ కారణమగుచూ... స్వయంగా ఆ మొదలైన క్రియలన్నిటినీ నడుపుతోంది. స్వయంగా క్రియారూపిణి అయి ఈ దృశ్య శోభనంతో తన యందు ధరిస్తోంది. 'అనేక కోటి బ్రహ్మాండ జననీ-దివ్యవిగ్రహా' అని స్తుతించబడుతోంది. అయితే, ఈ జగత్తులన్నీ తన అవయవాలుగా కలిగి ఉన్నప్పటికీ పరమార్థమున 'శివేచ్ఛా-క్రియా స్వరూపిణి-చిద్రూపిణి' యగు ఆ దేవి ఎచ్చట కూడా ఏ సమయమందునూ అవయవ సహిత అయి ఉండనే లేదు.

**శివ - శివా :** ఓ రామచంద్రా! శివేచ్ఛా-క్రియా స్వరూపిణి యగు ఆ భగవతి శివునికంటే వేఱుగా లేదు సుమా! కనుక ఆ దేవిని శివరూపిణిగానే గ్రహించు. అంతేకాదు. ఆకాశమునకు శూన్యత్వము, వాయువునకు స్పందత్వము, చంద్రునికి ప్రకాశత్వము వాటి వాటి అంగములే కదా! అట్లాగే ఈ క్రియారూపమగు దృశ్యము కూడా ఆ భగవతీదేవికి అంగము వంటిదిగా దర్శించటం సర్వదా అభ్యసించు. అట్లు దర్శిస్తూ ఉన్నప్పుడు కూడా ఆ దేవి యొక్క స్వరూపం వాస్తవానికి శివము-శాంతము-స్వభావ సిద్ధము-అవ్యయము-నిర్మలము అగు చైతన్యమేనని ఎఱిగి ఉండు.

**నిష్క్రియాస్వరూపిణి : స్పందాస్పందాతీత -** ఆ చైతన్యమునకు కించిత్ కూడా స్పంద ధర్మంగాని, అస్పంద ధర్మంగాని లేదు. అజ్ఞానవశం చేత స్పంద-అస్పంద రహితమగు చైతన్యం క్రియారూపంగా కనిపిస్తోంది. ఎప్పుడు జ్ఞానవంశం చేత తన క్రియా స్వభావం నుండి తొలగి వాస్తవ స్వభావంతోటి వర్తిల్లునో, అప్పుడు ఆ దేవియే శివస్వరూపంగా వచించబడుతోంది.

**క్రియాస్వరూపిణి -** కూటస్థ చైతన్యశక్తి స్వరూపిణియగు ఆ దేవి తనలో తన యొక్క స్పంద-జడ భావములతో కూడి ఉంటోంది. అట్లు కూడి ఉండుటచే 'క్రియ' అను శబ్దంచే చెప్పబడుతోంది. తన స్వాభావికమైన చిన్మాత్ర స్వభావంతోటి ఉంటున్నప్పుడు ఆమెయే 'శివ స్వరూపం' అగుచున్నది.

**ఇదం జగత్ దృశ్య స్వరూపిణి -** ఆ భగవతీదేవి క్రియా రూపిణి, చిత్-శక్తి సమన్విత. మహత్తర మైన ఆకారం కలది. ఈ అనేక జన సమూహయుక్తములై, ప్రకాశితములై కనిపించే సృష్టులు, ఈ లోకాలు-ఇవన్నీ కూడా ఆ దేవికి అభిన్నములైన అవయవాలు. ఈ దేశ-దేశాంతరాలతో కూడిన భూమి, వనభూములు, పర్వతములు, సాంగ-ఉపాంగములతో కూడిన మూడు వేదాలు, విద్యాస్థాన యుక్తములైన సర్వగీతములు, విధి-నిషేధములతో కూడిన శుభాశుభ కల్పనలు, సర్వయజ్ఞములు, భక్ష్యములైన పురోడాశములు, సర్వ యజ్ఞపాత్రలు, సమస్త యజ్ఞభస్మములు, సమస్త ప్రాణికోట్లు,

సప్తద్వీపములు, 14 లోకములు-ఇవన్నీ కూడా 'కల్పితాకారధారిణి' యగు దేవి యొక్క విభిన్నములైన అభిన్నావయవములు అయి ఉన్నాయి. అట్లే మాకు అనుభూతమగుచున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! మీరు ఆ భగవతి గురించి చెప్పేటప్పుడు – ఆ దేవి శివస్వరూపిణియేనని, ఈ బ్రహ్మాండములన్నీ ఆమె దేహమేనని, జగత్ భావనావశం చేత బ్రహ్మాండములను భావనామాత్రంగా ధరిస్తోందని, ఈ జగత్ దృశ్యమునకు అభిన్నమని, జగత్ దృష్టి తొలగుటచే ఆమె శివస్వరూపిణియేకాని, శివునికి-భగవతికి భేదమే లేదని, శివుని నుండి బయల్వెడలిన ఇచ్ఛాస్వరూపమే ఆమె అని, ఇచ్ఛా క్రియల సంయోగమే ఆమె అని...

ఇట్లు పరస్పర భేద-అభేదముల కలయికతో ప్రవచిస్తున్నారు. ప్రభూ! ఇది ఇట్లా ఉండగా, ఇంతకుముందు మీరు రుద్ర-కాళీ రూపధారిణి యగు చైతన్యము యొక్క శరీరంలో కనబడిన భూత-భవిష్యత్ కాల సృష్టి-ప్రళయముల గూర్చి వర్ణించి చెప్పారు. ఇప్పుడు నా ప్రశ్నను విన్నవించుకుంటాను. ఆత్మయందు (శివుని యందు) సృష్టి-ప్రళయములు ఉన్నాయా? లేవా? అవన్నీ వాస్తవములా? అవాస్తవములా? చెప్పవలసినదిగా ప్రార్థన.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ చిత్‌శక్తి ప్రేరణస్వరూపిణియై ఈ సర్వజీవుల యందు ప్రకాశిస్తోంది. ఆ చిత్‌శక్తియే ఈ జీవుల కర్మవాసనానుసారం దేనిని గూర్చి ఎట్లు ప్రేరణ చేయుచున్నదో... అది అట్లు సత్యంగానో, (లేక) అసత్యంగానో పొందబడుచున్నది. అద్దంలో ప్రతిబింబం- ఆ ప్రతిబింబ వస్తువుల కదలికలు వాస్తవం కాకపోయినా వాస్తవంగానే కనిపిస్తాయి కదా! పూర్వ వాసనలు కారణంగా చైతన్యం విషయములందు దృశ్యములందు సత్యరూపంగానే ప్రతిబింబించి, సత్యముగానే అనుభవ ప్రాప్తి పొందుచున్నది.

వాసనాయుతులైన జీవుల అనుభవబలం చేత ఈ జగదనుభవాలు సత్యంగానే పొందబడుచున్నవి. యథార్థానికి జీవులంతా చిద్రూపులే కదా! చిద్రూపంలో అచిద్రూపం ప్రవేశించదు కదా!

కనుక ఈ సర్వ దృశ్య పదార్థములన్నీ కూడా సంకల్పనగరం వలె మిథ్యయే అయి ఉండి, వాసనా ప్రభావం చేత సత్యం వలె అనుభవించబడుచున్నాయి. అట్టి వాసనలు దృఢమైన నిర్మల చిత్‌ధ్యానం చేత మాత్రమే క్షయిస్తాయి. వాసనలు జయించిన మనుజునికి 'దృశ్యం' అనబడు ప్రసక్తియే ఉండదు. దృశ్యముగా కనిపించేదంతా అతనికి పరమాత్మ స్వరూపంగానే సుస్పష్టబడుచున్నది. స్వప్నంలో కనిపించేదంతా స్వప్న ద్రష్ట యొక్క భావనా ఊహాతరంగ పరంపరలే! కనుక స్వప్న ద్రష్టకు వేరైన సత్తా స్వప్నమునకు లేదు. అట్లాగే ఈ జాగ్రత్ దృశ్యం జాగ్రత్ ద్రష్ట యొక్క వాసనా సమూహం (లేక) వాసనా తరంగాల సాఫల్యం అయి ఉన్నది.

పరాభవం (పరా+అభవం) అంటే ఈ దృశ్యాన్ని తదితర జీవులను పరమాత్మ ప్రదర్శంగా దర్శించకపోవ పరమాత్మకు భిన్నమై ఉన్నట్లు దర్శించటం.

ఎందుకంటే... 'దృశ్యం' ఒక్కటే అయినప్పటికీ వేఱువేఱు ఆకారదర్పణాలలో (కుంభాకార, పుటాకార, రంగులతో కూడిన, ఎత్తుపల్లాలతో కూడిన, గీతలతో కూడిన-వివిధ రకాలైన దర్పణా

లలో వివిధ రీతులుగా కనిపించుచున్నది కదా! అట్లాగే పరమాత్మకు వాస్తవానికి అభేదమే అయిన ఈ దృశ్యము ప్రతిజీవుడు తన యొక్క వాసనాదర్పణమునందు ప్రతిబింబించు భావన - అనుభవాదుల ద్వారా, తదనుగుణంగా సమకూర్చి పొందుచున్నాడు.

స్వప్నాంతర్గతమైన విశేషాలు స్వప్న సమయంలో స్వప్న ద్రష్టకు వాస్తవమనియే అనిపిస్తున్నాయి. ఊహానగరం, ఊహ కొనసాగుచుండగా, అదంతా సత్యముగానే అనుభవమౌతోంది. ఎందుచేత? అవి ఆయా సమయాలలో ప్రతీతి (నమ్మిక)తో కూడిన భావనచే పొందబడటంచేత! అట్లాగే ఈ సృష్టి కూడా ఇద్దానిని గాంచుచున్న కాలంలో అర్థ-క్రియా సామర్థ్యాలను కలిగి ఉండటం చేత, అట్టి 'దృష్టి' కొనసాగుచున్న సమయంలో అర్థ క్రియాపూర్వకంగా సత్యమనియే అనిపిస్తోంది.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ ప్రపంచంలో ఆయా పదార్థములు మొదలైనవన్నీ కొందరికి ఉచ్ఛమైనవిగా, అవే పదార్థములు మొ॥వి మరికొందరికి నీచము-అల్పము అయినవిగాను అనిపిస్తూ ఉంటోంది కదా! ఇట్లా ఎందుకు జరుగుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ ద్రష్ట యొక్క వాస్తవ స్వరూపం వాస్తవానికి అనన్యమగు ఆత్మయే అయి ఉన్నది. అయినా కూడా ఒకే మట్టి అనేక నామ-రూపాలు గల బొమ్మలుగా ప్రతీతీ పొందుచున్నది కదా! అయితే అన్ని బొమ్మల వాస్తవ స్వరూపం మట్టియే కదా? మట్టిచే తయారు కాబడిన కోతి-ఆకారానికి మట్టికి సంబంధమేముంటుంది? అయినా కోతి రూపంగా కనించేదంతా మట్టియే కదా!

ఈ విధంగా ద్రష్టలందరూ దేహ-మనో-బుద్ధ్యాదుల దృష్ట్యా వేర్వేరుగా కనిపించవచ్చుగాక! అయినప్ప టికీ ద్రష్టలందరూ ఆత్మయే స్వరూపంగా కలిగి ఉన్నారు. అట్టి ఆత్మ సర్వదా యథాతథం, త్రికాలములచే అబాధ్యం అను నిస్సందేహమగు పరిజ్ఞానమే 'ఆత్మయోగం' అని, 'మోక్షం' అని 'సమాధి' అని ఆయా మొదలైన పేర్లతో పిలువబడుతోందని గ్రహించు. ఇక మనో బుద్ధ్యహంకారాలను మనం అంగీకరించినప్పటి దృష్టికి 'వేర్వేరు ద్రష్టలు' అనునది అనుభవసిద్ధమగుచున్నది. ఇక ఏ పదార్థం ఏ ద్రష్టకు ఏ ఏ అర్థ-క్రియా సమర్థమై ఉంటోందో, అతని దృష్టికి ఆ పదార్థాదులు ఆయా విధంగానే సత్యభూతాలై అనుభవమగుచున్నాయి. ఆ పదార్థాలు అట్టి ద్రష్టస్థితిని పొందనట్టి అన్యునికి ఆయా పదార్థముల పట్ల అట్టి దృష్టి ఏర్పడటమే లేదు.

**భూత-భవ్య-భవిష్యస్థాః సంకల్ప స్వప్న పూర్గణాః**
**సర్వేసత్యా పరం తత్త్వం! సర్వాత్మా కథమ్ అన్యథా?**

ఓ రామచంద్రా! ఈ భూత-వర్తమాన-భవిష్యత్తులలోని పదార్థ సమూహాలు, స్వప్నములోని-సంకల్ప రాజ్యంలోని నగరాలు మొదలైనవి-ఇవన్నీ కూడా ఆయా దశలందు సత్యమే అయి ఉన్నాయి. ఎందు కంటావా? అట్లా కాకపోతే "ఆత్మతత్త్వమే సర్వరూపం" "ఇదంతా ఆత్మయే" అనే వేదవాక్యం పొసగదు కదా!

ఈ ఈ జాగ్రత్‌లోని ఆయా నగరాలన్నీ సత్యము కాబట్టే మనం ఇక్కడి నుండి బయలుదేరి ఆయా నగరం ప్రవేశించి ఆ నగరంలో ఆయా కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నాం.

అట్లాగే స్వప్నములోని వ్యవహారం సత్యము కాబట్టే యోగులు ఇతరుల స్వప్నములో ప్రవేశించి 'బోధించటం-సూచించటం' మొదలైనవి నిర్వర్తిస్తున్నారు. అట్లాగే యోగశక్తిచే యోగులు తమ ప్రియతమ శిష్యుల మనో ఆకాశంలో ప్రవేశించి వారికి అనుభవ విషయంగా దర్శనమిచ్చి (మనం ఇతర ప్రదేశములలోని పర్వత గ్రామాలు పొందుచున్నట్లుగా) ఆయా క్రియా-వ్యవహారాలు (ఆ తదితరుల మనస్సులో) నిర్వర్తిస్తున్నారు.

**శ్రీ రాముడు :** స్వామీ! కాళీమాత నృత్యం చేస్తున్నప్పుడు ఆ జనని దేహములోని జగత్తులు ఒకదానితో మరొకటి ఢీకొనక కదలకయే ఉంటున్నాయా? ఇది ఎట్లు? ఆమె కదలికలతోబాటే ఆ జగత్తులు కూడా క్రింద-మీద పడాలికదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆమె విలయతాండవం చేస్తున్నప్పటికీ ఆమె దేహములోని జగత్తులందలి ఆయా పర్వత-నదీ-నగరాదులు ప్రకంపనము పొందకయే నాకు కనిపించాయి. ఎట్లా అంటావా? ఇప్పుడు చూడు! ఒకడు ఒక మంచంపై నిదురిస్తూ కల కంటున్నాడనుకో! అతని మంచమును మనం అక్కడి నుండి మరొకచోటికి తరలిస్తున్నప్పటికీ అతని స్వప్నములోని నగరాదులు చలింపకయే ఉంటాయి కదా! ఆ నృత్యం సమయంలో కాళీ భగవతి యొక్క దేహము చలించుచున్నప్పటికీ ఆమె యొక్క శరీరములోని జగత్-అంతర్గత నగర-పర్వతాదులు చలించటమే లేదు.

❖

ఓ రామచంద్రా! ఈ త్రిలోకముల మహారంభసంరంభమంతా ఆయా దశలందున్న మనుజులకు సత్యముగా తోచినప్పటికీ, వాస్తవానికి "భ్రాంతి మాత్రమే" అయి ఉన్నది. భ్రాంతి అయిన దానికి కదలటం ఏమున్నది? కదలకపోవటమేమున్నది? స్వప్నంలో కనిపించే మిత్రులు, గృహములు, సంపదలు సత్యముగా ఉన్నదెప్పుడు? (మెళుకువ వచ్చేసరికి అవి ఉండవు కనుక) మిథ్య కానిదెప్పుడు? ఉన్నదెపుడు? (స్వప్న సమయంలో వాస్తవంగానే అనుభూతమౌతోంది కనుక) నశించినదెపుడు? స్థితినొంది ఉన్నదెపుడు? చెప్పు? అవన్నీ ఎక్కడి నుండి వచ్చాయంటే ఏం చెపుతాం? అందుచేత బిడ్డా! ఈ ఎదుటగా కనిపిస్తున్న దృశ్యశోభ అంతా భ్రాంతి మాత్రమే! ఈ జగత్‌శోభనంతా భ్రాంతి మాత్రంగాను, అవాస్తవంగాను ఎఱిగియే ఉండెదవుగాక!

"మరి మాకు వాస్తవంగానే కనబడుతోంది కదా?" - అని ఎవరైనా అంటారేమో?

"సంకల్పము (లేక) ఊహ" తో కూడి ఉన్న దృష్టికి జగత్తు అనుభవమౌతోంది. "స్వప్నము" నందు, కథను చదువుచున్నప్పుడు, (లేక) వింటున్నప్పుడు, 'నాటకం' చూస్తున్నప్పుడు 'భ్రమ' యందు - ఆయా అనుభవములను నమ్మికతో అనుభూతిపరంగా పొందటం ఎటువంటితో, ఈ జగత్తు యొక్క "వాస్తవం" అనిపించే అనుభవం అటువంటిదే! నాటకం చూచి శోకించేవారు-నవ్వేవారు-కోపించేవారు-జాలిపొందేవారు-ఆశ్చర్యపడేవారు-మౌనంగా చూచేవారు ఉంటున్నట్లే జనులు ఈ జగత్తును చూస్తూ నవరసాల అనుభవములను పొందుచున్నారు.

❖

ఓ రామచంద్రా! వాస్తవానికి చైతన్యము-జగత్తు ఇత్యాది వ్యవస్థ లేనేలేదు. ఆకాశంలో కంటిదోషం చేత వెంట్రుకలు కనిపించునట్లు, మెల్లకన్నువాడికి ఒకే స్తంభం రెండుగా అగుపించు నట్లు ఈ 'జగదనుభవం' అనబడేది జగత్తు దృష్ట్యా భ్రాంతియే అయి ఉన్నది. కానీ చిత్స్వరూపము ఎట్టిదో ఎఱిగినప్పుడు అట్టి భ్రాంతి తొలగిపోతుంది. అప్పుడు 'ఈ జగత్తంతా, ఇందులోని నగరాలు-దేహాలు-సందర్భములు-సంఘటనలు మొదలైన వాటితో సహా సర్వదా యథాతథమై ఉన్న చిదాకాశమే' అని నిర్ద్వంద్వంగా నిస్సందేహంగా ఎఱుగబడగలదు. ఆ చిదాకాశమే నీ-నా-మన-వారి-అక్కడి-ఇక్కడి ఏకాంత-నిర్విషయ సర్వస్వరూపంగా ఆస్వాదించబడుతుంది.

ఇప్పుడు మనం ఆ భగవతీదేవి-రుద్రభగవానుల నృత్య విశేషానికి వద్దాం.

❖❖❖

# 30. ఆత్మానందం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ ప్రకారంగా ఆ దేవి తన యొక్క సుదీర్ఘమైన భుజమండలంచే ఆకాశ విభాగాన్ని భీకరారణ్యంగా చేసివేస్తూ నృత్యం చేస్తోంది. ఆ దేవి అజ్ఞాత-నిర్వికార చైతన్యశక్తితో కూడిన క్రియారూపిణి కదా! ఆ నృత్యం స్వభావ సిద్ధంగానే సల్పుచున్నది. కళా-క్షణ-ఘటిక-మాసాదులతో కూడిన కాలచక్రమంతా ఆ దేవి పమిట యొక్క విన్యాసంలా ఒప్పుచున్నది. హృదయమున ఊహా చైతన్యము, 'నగరములు' మొదలైన ఆకారములు ధరించుచున్నది కదా! ఆ భగవతి తన యందు అట్లే జగత్తులను, కాల విన్యాసమును చమత్కారంగా ఆభరణాలుగా అలంకరించుకొని అనేక నాట్య భంగిమలు ప్రదర్శిస్తోంది.

కల్పనయే జగద్రూపంగా అగుచున్నది. అట్లే, ఆ దేవియే 'జగద్రూపం' అయి ఉన్నది.

వాయువునందు స్పందము (కదలిక అను స్వభావం) ఉన్నట్లే శివుని యందు ఆ భైరవీదేవి కలదు. స్పందం వాయువు కంటే వేఱా? కాదు. శివేచ్ఛ కూడా శివుని కంటే వేఱు కాదు. కనుక శివుని వలెనే శివేచ్ఛాస్వరూపిణియగు ఆ స్పందదేవి నిర్మలం-ప్రశాంతం అయి వర్తిస్తోంది. ఆకాశం వస్తుతః నిర్వికారం. అట్టి నిరాకారమగు ఆకాశమునందు 'శబ్దము-సంచలనము' మొదలైన అడంబరమంతా ప్రకటితమగుచున్నట్లు... నిరాకారమగు నిజేచ్ఛ జగత్తును విస్తరింపజేస్తోంది.

**శివస్పర్శ -** ఆ విధంగా ఆ దేవి చిదాకాశమున నృత్యం చేస్తూ ఉన్నది. ఇంతలో ఒకానొక చమత్కారం జరిగింది. ఆ దేవి కాకతాళీయ యోగముచే ... ప్రేమవశంగా సమీపమున ఉన్న శివుణ్ణి స్పృశించింది.

ఆ స్పర్శ మాత్రం చేత తన యొక్క "ఆవరణ శక్తిని దూరీకరించుకొన ప్రారంభించింది. సముద్ర తరంగాలు తమ తరంగ శక్తిలోంచి బడబాగ్నిని సృష్టించుకొని ఇక ఆ బడబాగ్నిలో ప్రవేశించి స్వవినాశనం పొందుతాయి చూచావా? ఆ విధంగా ఆ శివ స్పర్శచే ఆ దేవి తన రూపాన్ని కోల్పోతూ క్రమక్రమంగా శివునితో ఐక్యం కాజొచ్చింది. పరమకారణమగు శివుని స్పర్శించినంత మాత్రం చేతనే మెల్లగా సూక్ష్మమగుచు తన యొక్క 'వాస్తవ స్వభావము'ను పొందనా రంభించింది.

మొట్టమొదట ఆ దేవి తన అనంతాకారమును విడచి పర్వతాకారమాత్రంగా అయింది. ఆ పిదప నగరాకారమాత్రంగా అయింది. ఆ తర్వాత సుందరమగు వృక్షాకారమాత్రంగా అయింది. ఆ తదుపరి 'అవ్యాకృతాకాశ రూపము'ను ధరించి నది సముద్రంలో ప్రవేశించునట్లు శివుని ఆకారమున ప్రవేశించింది. అప్పుడు...

**ఏక ఏవా భవదథో శివయా పరివర్జితః ।**
**శివ ఏవ శివః శాన్త ఆకాశే శమనో ఽఖితః ॥**

భవానీ లయస్వరూపుడు, సర్వసంహారకర్త, శాంతుడు భక్తులకు మంగళప్రదుడు, సర్వ ఉపద్ర వాల నుండి కాపాడువాడు అద్వైతరూపుడు అగు శివుడు మాత్రమే ఆకాశంలో ఒప్పుచున్నాడు.

**శ్రీరాముడు :** స్వామీ! శివుని స్పృశించిన మాత్రం చేత ఆ పరమేశ్వరి ఎందుచేత శమించింది? ఆ విశేషమంతా ఏమిటో, తెలియజేయ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** 'తరంగము' అనేది జలము యొక్క స్వాభావిక శక్తియే కదా! అగ్నికి 'ఉష్ణత్వము' అనేది అట్లే స్వాభావిక శక్తియే కదా! అదే రీతిగా శివుని యొక్క స్వాభావిక విశేషమే శివేచ్ఛ–క్రియా విశేషముల స్వరూపమగు ఛాయదేవి. ఆ దేవియే 'ప్రకృతి' అని, 'శివేచ్ఛ' అని, 'పరమేశ్వరి' అని

'ఆది జగన్మాయ' అని... వివిధ నామ–రూపములచే ప్రసిద్ధికెక్కి ఉంటోంది. 'ఈ ప్రకృతియే ఆ దేవి యొక్క రూపం' అనికూడా చెప్పబడుతోంది.

శివరూపధారియగు పరమేశ్వరుడు ఈ ప్రకృతికంటే పరమైనవాడు. అతడు వాయువు వలె సర్వవ్యాపి, వాయురూపుడు, పరమశాంతుడు, మేఘరహిత ఆకాశమువలె ప్రశాంతశీలుడు, పరమ పురుషుడు, శివా నందస్వరూపుడు, నిర్వికారుడు, నిత్యతృప్తుడు అయి ఉన్నాడు. అట్టి "ఆద్యంత రహితుడు–ద్వైతవర్జితుడు" అగు పరమశివుని గాంచనంత వరకు "భ్రమరూపిణి–స్పందమాత్ర స్వరూపిణి–చిత్ శక్తి–పరమేశ్వరేచ్ఛ" అగు ప్రకృతీదేవి సంసారమున పరిభ్రమిస్తూనే ఉంటుంది. వాస్తవానికి ఈ ప్రకృతీదేవి కేవలం 'జ్ఞానమాత్ర స్వరూపిణియే' అయి ఉండటంచే ఆ జ్ఞానస్వరూపిణి శుద్ధ తత్త్వమగు శివుని కాకతాళీయ యోగంచే స్పర్శించగానే, ఆ శివుని యందు పూర్ణంగా తన్మయ మగుచున్నది.

అజ్ఞానంచే ప్రకృతి పురుషునికి ద్వితీయమైనట్లుగా కనిపిస్తుంది. జ్ఞానయోగ స్పర్శచే ఆ ప్రకృతి (పురుష స్పర్శచే) అనిర్లిప్త–నిర్వికార శివునితో ఏకత్వం పొందినదై అతనిలో 'అద్వితీయత' సంతరించుకుంటోంది. అది "ద్రష్టచే దర్శించబడే దృశ్యం ద్రష్ట నుండి బయల్వెడలి తిరిగి ద్రష్టయందే లయించటం" వంటిది సుమా!

**ప్రకృతిః పురుషం స్పృష్ట్వా ప్రకృతిత్వం సముజ్ఝతి ।**
**తదన్తరేకతాం గత్వా నదీరూపమివ అర్ణవే ॥**

జలమాత్ర స్వరూపమగు నది సముద్రమునందు కలియగానే తనయొక్క ద్వితీయత్వమును త్యజించినదై సముద్రజలంతో ఏకత్వం పొందుతోంది చూచావా? లోహ మయమగు పదునైన కత్తిని

కరగించినప్పుడు తన జన్మస్థానమగు 'లోహం' గా మారి తన పదునైన ఆకృతినంతా కోల్పోవటం లేదా? శివేచ్ఛారూపమగు చైతన్యం కూడా శివరూపుడగు దేవదేవుని స్పర్శచే తన ప్రకృతిత్వం కోల్పోయి, శివ స్వరూపంగా శమించుచున్నది. ఎండలో నుండి నీడలోనికి వచ్చినప్పుడు ఆ మనుజుని ఛాయ అతని శరీరమునందు శీఘ్రంగా ప్రవేశించినదై మటుమాయమగుచున్నది కదా! వాస్తవానికి చిద్రూపమే అయి ఉండటం చేత 'చిత్ శక్తి' యగు ప్రకృతి తన నిజరూపమగు సనాతన పురుషుని పొందినదై, అజ్ఞానం నశించటం చేత–ఇక మరల సంసారమున తిరుగాడక ఆ పురుషుని యందే విలీనమగుచున్నది. ఒక సాధువు పొరబాటుగా చోరుల సమూహంలో ప్రవేశించాడనుకో! ఎప్పుడో 'వీరు చోరులు' అని గ్రహించినవాడై ఇక ఆ సమూహంలో ప్రీతిగొనక సంఘం నుండి బయటపడనెంచుతాడు చూచావా? అట్లాగే పరమ పురుషుని గాంచనంతవరకు ఆ ప్రకృతి అసద్రూపమగు ద్వైతమున రమించుచు పరిభ్రమించుచునే ఉంటుంది. ఆ పరమ పురుషుని దర్శించి స్పర్శించగానే అతనియందు ప్రకృతీదేవి తన్మయమగుచున్నది.

*నేను = పరమపురుషుడు, నాది = ప్రకృతి స్వభావం ప్రకృతీ స్వరూపం,

స్వభావం = నేను (శివుడు) + భావన (దేవి స్వరూపం)

నదిలో ఉన్నదీ జలమే కాబట్టి, సముద్రం చేరగానే ఆ నదీజలం కాస్తా సముద్ర జలరూపమే అగుచున్నది. ఈ ప్రకృతి కూడా స్వతహాగా చైతన్య స్వరూపము–పరమ పదము–నిర్వాణ రూపము అయి ఉండటం చేత ఆ పరమపురుషుని పొందిన మరుక్షణం ఆ శివరూపమే అగుచున్నది.

ఆ పరమ పురుషుని గాంచనంత వరకు "ప్రకృతి–స్వభావం–జీవత్వం" మొదలైన ఆయా పేర్లతో పిలువబడే అజ్ఞాత చైతన్యం వ్యాకులములై ఉన్న ఈ అనేక సృష్టులందు ఆయా దుఃఖ మయములైన జన్మాది దశలతోకూడి అవిశ్రాంతంగా మోహవశంచేత పరిభ్రమిస్తూనే ఉంటుంది. ఆ పరమ పురుషుని గాంచగానే తుమ్మెద తేనెను గ్రోలటంలో నిమగ్నమగునట్లు అతనియందే ఆ ప్రకృతి నిమగ్నమగుచున్నది.

ఓ రామచంద్రా! "నేను ఖండము–ఉపాధి సహితము–పరిమితము–ప్రమేయ సహితము–జన్మ జరా మరణ సహితము–ద్వితీయము దోషపూరితము అగు జీవుడను" అను దశనుండి "నేను 'అఖండము–నిరుపాధికము–అపరిమితము–అప్రమేయము–జన్మజరామరణవర్జితము–అద్వితీయము–నిర్దోషము అగు ఆత్మస్వరూపుడనే" ...అను సుజ్ఞాన స్థితి సముపార్జనమే "ప్రకృతి యొక్క లయము" ...అను రూపంగా ఉద్దేశించబడిందని కూడా సూక్ష్మబుద్ధితో గ్రహించు. అట్టి ఆత్మతత్త్వమును ఎఱిగి, స్వస్థితిని పొందిన తర్వాత ఎవడైనా అద్దానిని త్యజిస్తాడా? లేదు. 'నేను ఆత్మనే' అను ఎఱుకను పొంది సర్వకాల సర్వావస్థలయందు అనుభూతపరుడై ఉంటున్నాడు. దేనిచే జనన–మరణ–మోహమయములగు సమస్త దుఃఖములు శాశ్వతంగా శమించిపోవుచున్నాయో అటువంటి 'ఆత్మామృతము'ను గ్రోలినవాడు ఇక మరల అద్దానిని వదలి ఉంటాడా? లేనే లేదు. వదిలి ఉండజాలడు.

❖❖❖

# 31. అణువణువులోనూ అనేక సృష్టులు

**శ్రీరాముడు :** హే మహర్షీ! మహాకాశమునందు తాండవం చేస్తున్న రుద్రదేవుని దేహంలోంచి జనించిన 'కాళీదేవి' అను పేరుతో ఆరాధించబడే ఛాయ జనించి, మరల ఆ పురుషోత్తముని స్పర్శచే ఉపశాంతిని పొంది మూలస్థానమగు రుద్ర భగవానుని యందు లయమును పొందినది కదా! ఆ రుద్ర భగవానుడు తన దేహమునందలి భ్రాంతిని త్యజించి ఎట్లు శాంతించారో... ఆ కథాక్రమము వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** నేను ఆ సమయమున అట్లా చూస్తూ ఉండగానే రుద్ర భగవానుడు. కూడా చిత్రములో లిఖించబడిన మనుజుని వలె ముహూర్తకాలం (48 నిమిషాలు) ఆ ఆకాశమున నిశ్చలత్వం పొందటం జరిగింది. అప్పుడు ఆ రుద్ర భగవానుడు ఆ ముహూర్తకాలం ఆ ఆకాశమున గల ఊర్ధ్వ-అధో బ్రహ్మాండ మండలాలను రెండిటినీ అవలోకించ సాగారు. ఆ తర్వాత ఒక్క నిమిష కాలంలో తన యొక్క శ్వాస వాయువుచే ఆ ఉభయ (ఊర్ధ్వ-అధో) బ్రహ్మాండ ఖండాలను ఆకర్షించి తన ముఖమున లయం చేసుకొన్నారు. పక్వాన్నమువలె వాటిని భుజించినవారై అఖిలాకాశమున ఆకాశం వలె స్థితిని పొంది ఉన్నారు. అటు తర్వాత ఆ రుద్ర భగవానుడు మరొక మూహూర్తకాలంలో తన సువిస్తార రూపమును త్యజించి మేఘం వలె చిన్న రూపం పొందారు. తర్వాత చేతికఱ్ఱ ప్రమాణంగానే ఆపై అంగుష్ఠ మాత్రంగాను సూక్ష్మాకృతిని దాల్చారు. అటు తర్వాత ఒక చిన్న గాజు ముక్క ప్రమాణం పొందారు. ఆపై ఇక పరమాణు ప్రమాణం కావటం దివ్య దృష్టితో వీక్షించాను. అట్లా పరమాణు రూపం పొందిన ఆ రుద్ర భగవానుడు అటు తర్వాత అంతర్ధానం అయ్యారు.

ఈ ప్రకారంగా 'విస్తారజగద్దృశ్యం' నుండి 'రుద్రాకారాంతర్ధాన పర్యంతం' జరిగిన మహా సంరంభమంతా నేను చూచుచుండగానే శమించినదయింది.

ఆహాఁ! ఆకలిగొన్న జింక చిన్న చిన్న ఆకులను మ్రింగినట్లు ఆ రుద్రాకార భగవానుడు బ్రహ్మాండ కవాటాల రెండింటిని మ్రింగివేశారు. ఆ రుద్రుడు అట్లా అంతర్ధానమయిన తర్వాత అచ్చట గల ఆకాశం 'కేవల నిర్మల బ్రహ్మరూపం' గానే కనిపించింది. చూచావా, రామచంద్రా! ఆ ప్రకారంగా "అనేక రూపాలుగా భ్రమ యుక్తమైనది-అద్దములోని ప్రతిబింబమును బోలినది అగు ఆ శిలాఖండములోని మహాప్రళయ దృశ్యమును నేను ఆది-మధ్య-అంత రహితమగు చిదాకాశముగానే గ్రహించి వీక్షించాను!

ఇక ఆ తర్వాత "ఆ విద్యాధరి-ఆ శిల-ఆ బ్రహ్మాండం-ఆ మహాప్రళయం-ఆ రుద్ర భగవానుడు-ఆ కాలీలీవానీ" ఇవన్నీ స్మరిస్తూ రాజప్రసాదమును చూచిన ఒక గ్రామస్థుని వలె ఆశ్చర్యపోయాను. అప్పుడు ఎందుకో ఆ శిల యొక్క మరొక వైపునకు యథాలాపంగా చూచాను.

❖

ఆశ్చర్యం! ఆ ప్రక్క శిలయందు కూడా అంతటా నా దివ్యదృష్టికి అనేక సృష్టులు కనిపించ సాగాయి. ఓ రామచంద్రా! దివ్యదృష్టిచే సర్వత్రా స్థితి కలిగి ఉన్నదంతా సదా సుస్పష్టంగా కనిపిస్తూ

ఉంటుంది. అలా కాకుండా మామూలు దృష్టితో చూస్తే (మాంసమయమైన భౌతిక కన్నులతో చూస్తే) అది దూరంగా ఉన్న ఒక మామూలైన శిల మాత్రమే! మాంసపు కళ్ళకు సృష్ట్యాదులు భాసించవు సుమా!

ఆ విధంగా నా దివ్యదృష్టికి ఆ మరొక శిల యొక్క మరొక మూలగా కూడా ఇతఃపూర్వం నేను చూచినటువంటి సృష్టులే అనేకం కనిపించాయి. ఆ శిలకు మరొక మూలగా చూచాను. ఆ శిల యొక్క అన్ని వైపులా అనేక జగత్తులు అద్దంలో నిర్మల ప్రతిబింబాల వలె కనిపించాయి. అప్పుడు నేను కౌతుకం ఆపుకోలేక తక్కిన శిలల యొక్క ఆయా విభాగాల వైపు చూచాను. వాటిలో కూడా అనేక సృష్టులు కనిపించాయి. అంతేకాదు! అక్కడ గల గడ్డిమొక్క దగ్గర నుండి ఆయా సర్వ పదార్థములలోను వస్తువులలోను అసంఖ్యాకాలైన జగత్ సమూహాలు యథాస్థితంగా వర్తిస్తూ కనిపించాయి.

**శ్రీరాముడు :** మీకు అక్కడి ఆయా శిలలలోను, గడ్డి మొక్కలలోను, వృక్షపు ఆకులలోను, తదితర సర్వ పదార్థజాలములోను కనిపించిన అసంఖ్యాక బ్రహ్మాండములను ఈ మీ కళ్ళతోనే దర్శించారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** లేదు. ఆ అనేక విధములైన జగత్తులన్నీ కూడా ఆధిభౌతికభ్రాంతి రహితమగు – సర్వ సాక్షీభూతమైన బుద్ధికి మాత్రమే అగుపిస్తాయిగాని... ఈ భౌతికమైన కళ్ళకు కాదు.

ఆ అనేక జగత్తులలో... ఒకచోట ప్రథమ సృష్టి కొరకై ప్రజాపతి అప్పుడే జనిస్తూ ఉన్నాడు. ఇంకొక సృష్టిలో బ్రహ్మదేవుడు–సూర్యుడు–చంద్రుడు–నక్షత్రమండలం–రాత్రింబవళ్ళు–సంవత్సరాల యొక్క కల్పనచే జలధారగా సాగిపోతోంది.

ఒక బ్రహ్మాండంలో భూతలం జన సమూహంతో కూడి ఉన్నది. ఒక జగత్తులో సాగరాలు ఇంకా జన్మించక పోవటం చేత సముద్రాలు ఏర్పడవలసియున్నది. వేరొక జగత్తులో దేవతలు జన్మించారు గానీ, ఇంకా రాక్షసులు, మానవులు జన్మించలేదు. ఒక జగత్తులో గల సజ్జనులలో కృతయుగాచారములగు యజ్ఞ–యాగ–అగ్నికార్యాలు జరుగుచూ ఉన్నాయి.

మరొక జగత్తులో దుర్జనులందు 'హింస–మోసము–దగా' మొదలైనవి అంగీకార యోగ్యములగుచూ కలియుగాచారములు ప్రవృత్తములగుచున్నాయి. ఇంకొక జగత్తులో అనేక భూ–స్వర్గ పురుషులు, దైత్యనగరములు ప్రవర్తిల్లుచున్నాయి. ఒకానొక జగత్తులో భూతలం పర్వత సమూహములచే నిండిపోయి ఉన్నది.

ఒకచోట మృత్యు ఖేళిచే జనులు నశించుచుండగా క్రమక్రమంగా నిర్జనంగా కనబడుతోంది. ఒకచోట చంద్రుడు ఇంకా ఉత్పన్నమే కాలేదు. ఇంకొక జగత్తులో క్షీరసాగర మథనం ఇంకా జరుగవలసి ఉండటం చేత దేవతలు మృత్యు సహితులై కనిపిస్తున్నారు. ఆ జగత్తులోని దేవలోకంలో అమృతం, ధన్వంతరి, కామధేనువు, లక్ష్మి, కాలకూట విషము, ఉచ్చైశ్రవము (తెల్ల గుఱ్ఱము) ఇంకా జనించనేలేదు. ఒకచోట శుక్రాచార్యులు మృతసంజీవినీవిద్య కొరకై తపస్సు చేస్తూ ఉంటే ఇంద్రుడు అతని ప్రయత్నమునకు అనేక విఘ్నాలు కల్పిస్తూ కనిపించాడు.

ఒకచోట ధర్మము శ్రద్ధగా నిర్వర్తించబడుతోంది. అందుచేత ప్రజలందరూ స్వప్రకాశమాన మగు బ్రహ్మ జ్ఞానముతో కూడుకొనినవారై ఉన్నారు. కొన్నిచోట్ల పదార్థాలన్నీ మామూలుగా కాకుండా అస్తవ్యస్తంగా ఉన్నాయి. ఆకాశం క్రిందికి-భూమి పైకి ఉంటూ అక్కడి జీవులు సాధారణ రూపానికి వ్యతిరేకమైన రూపం ధరించి ఉన్నారు.

ఒక చోట జనులు అపూర్వమైన వేద శాస్త్రములను విచారణ చేసే కార్యక్రమంలో నిమగ్నమై ఉన్నారు. ఇంకొక జగత్తు కల్పాంత సంక్షోభములు లేకుండా కొనసాగుతూనే ఉన్నది. మఱొక జగత్తులో దైత్యులు దేవతల పురములను జయించి, ఆక్రమించుకొని అల్లకోల్లోలాలు సృష్టిస్తూ పోతున్నారు. వేఱొక జగత్తులో దేవలోకంలోని నందనవనంలో గంధర్వ-యక్ష-కిన్నరులు తీయగా గానములు చేస్తూ, ఆ రాగాలాపనలో తన్మయులగుచూ కనిపించారు.

...ఈ ప్రకారంగా భూత-భవిష్యత్-వర్తమానములందలి అనేక జగదాడంబరములు నాకు కనిపించ సాగాయి. వాటినన్నిటినీ నేను మహా విశ్వరూపుడగు పరమాత్మయొక్క స్వరూపంగా గాంచసాగాను.

❖

ఇంకా కొన్ని విశేషాలు విను. కొన్ని జగత్తులలో పుష్కరావర్త (ప్రళయ) మేఘాలు ప్రవృత్తం అవుతూ ఉంటే జీవులు మృత్యు భయంతో గగ్గోలు పెట్టుచుండటం కనిపించింది. ఇంకొక చోట భూతకోట్లన్నీ శాంతముగా ఉన్నాయి. వేఱొక చోట ప్రళయారంభ సంరంభంచే దేవ-దైత్య-భూలోకాలు అత్యంత సంక్షోభం పొందు చున్నాయి.

ఒక్కొక్క జగత్తులో సూర్యుడే లేక నిబిడాంధకారంతో నిండి ఉన్నది. మరికొన్ని జగత్తులలో సూర్యుడు నిత్యమూ వెలుగుచుండటం చేత ఆ జగత్తులు సదా సుందరంగానూ జ్వాలా సదృశంగాను, దేదీప్యమానంగాను వెలుగొందుచున్నాయి.

ఒకచోట నారాయణ భగవానుని నాభికమలమున మధు-కైటభులు విలీనులై ఉన్నారు. ఒకచోట భగవంతుని నాభికమలంలో జనించిన నూతన బాలకుడైన బ్రహ్మ నోటిలో వ్రేళ్ళుంచుకుని నిద్రిస్తున్నాడు. ఒకచోట కల్పాంతరాత్రి ప్రవేశించటంచే ఆ జగత్తు శూన్యమగు అంధకారంతో వ్యాప్తమై ఉన్నది. మరొక చోట మహాప్రళయసముద్రము మధ్యన గల ఎత్తైన వటవృక్షపు ఆకుపై మాధవ భగవానుడు నిదురిస్తున్నాడు.

ఒక జగత్తులో ఇంకా పృథ్వి ఉత్పన్నం కాకపోవటం చేత శిలాగర్భభాగంలాగా నిశ్చల-విశాల ఆకాశము తప్పితే మరింకేమీ లేదు. ఒకచోట జగత్తు అప్రతర్క్యమై (ఒకరితో మరొకరు 'ఇది' అని చెప్పుకోవటానికి వీలుకుదరనిదై), అవిజ్ఞేయమై 'సుషుప్తి' (గాఢనిద్ర) అన్నిటా - అంతటా ఏర్పడినదై ఉన్నది. (గాఢ నిద్ర ఎట్టిది-అని అంటే - ఏం చెప్పగలం?)

ఇంకొక జగత్తులో వజ్రాయుధాలు అటూ-ఇటూ సంచరిస్తూ ఉంటే పర్వతములు ద్రవీభూతమగుచు కనబడుచున్నాయి. ఇంకొకచోట జగత్తులో త్రిపురాసుర-వృత్రాసుర-అంధకాసుర -బలి వంటి అసురులు చేస్తున్న యుద్ధ సంరంభములచే నిండిపోయి ఉన్నది. ఒక జగత్తులోని

పాతాళములో మత్తగజేంద్రముల (ఏనుగుల)చే భూమిలోని కొన్ని కొన్ని విభాగములు కంపింపజేయబడుతూ కనిపించాయి. అవి ప్రకృతి వైపరీత్యములుగా - భూకంపములుగా భూతలముపై ప్రదర్శనమగుచుండగా, ప్రాణులు అస్తవ్యస్తంగా పరుగులు తీస్తూ కనిపిస్తున్నారు.

ఇంకొక చోట కల్పాంతమున ఆదిశేషుని శిరస్సుపై గల భూమి అటూ-ఇటూ దొర్లుతోంది. వేరొక చోట సీతను అపహరించిన నేరానికి రాముని చేతిలో రావణుడు నిహతుడగుచూ కనిపించాడు. మరొకచోట అప్పుడే సీతను అపహరించే వ్యవహారానికి రావణుడు ఉద్యుక్తుడగు చున్నాడు. ఒక జగత్తులో కాలనేమి తన పాదములతో భూమినంతా ఆక్రమించు చుండగా, శిరస్సు సుమేరు పర్వతాన్ని స్పృశించుచుండగా ఆకాశమునంతా ఆవరించి ఉండి కనిపించాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠ మహర్షీ!

**కిమహం, భగవన్! పూర్వమభవమ్? కథయేతి మే?**

**అభవం చేత్ అనేనైవ సంనివేశేన తత్కథమ్?**

స్వామీ! పూర్వ కల్పంలోనూ నేను ఇట్లాగే ఉన్నానా? ఇదే ఆకారంతోనా, లేక మరియొక ఆకారం తోటియా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జగత్తులలోని సర్వ పదార్థములు అనుక్షణం పరిణామం చెందుతూనే ఉన్నాయి, చెందుతూనే ఉంటాయి. ఒక పాత్రలోంచి ధ్యానం ఇంకొక పాత్రలోకి పోశామనుకో! అప్పుడు ఆయా ధాన్యపు గింజలలో కొన్ని పూర్తిగాను, మరికొన్ని కొంతవరకు స్థానభ్రంశం చెందుతూ ఉంటాయి. ఇంకొన్ని ఇతఃపూర్వపు వంటి స్థానమే పొందుతూ ఉంటాయి.

అట్లాగే ఈ జీవుల కల్ప-కల్పానంతర గమనాగమనములు కూడా! కొందరు జీవులు సముద్ర తరంగముల వలె ఒకప్పుడు సమాన రూపములుగా స్ఫురిస్తూ ఉంటారు. నీవు-నేను సమస్త ప్రజలు మరల మరల ఉత్పన్నములగుచూనే ఉన్నాం. సముద్రంలోని జల విభాగం ఒకసారి ఒకసారి ఒకే విధమైన తరంగాలుగాను మరొకసారి వేర్వేరుగాను వస్తూ-పోతూ ఉంటుంది చూచావా? అయితే ఏ జలం ఏ తరంగాలుగా వచ్చినా (లేక) తరంగరూపం పొందక ఆ తరంగా లకు అంతరంగా ఉన్నా... ఉన్నదంతా జలమేగాని మరేమీ కావు కదా!

పరమార్థ దృష్టిచే చిదాకాశమున ఈ జీవులు గాని, వారివారి రాకపోకలుగాని సంభవించట మనేదే లేదు. జలం సర్వదా ఆకార రహితంగానే, యథాతథంగానే ఉంటుంది కదా!

ఇక మాయా దృష్టి చేతనంటావా? సముద్రతరంగము వలె ఈ జీవులు అదే రూపముగా గాని, అన్య రూపముగా గాని స్ఫురిస్తూ ఉంటారు. సంసార భ్రమచే అనంతకోటి జీవులు మరల మరల వచ్చుచూ-పోవుచూ ఉన్నారు కదా! ఈ జగత్పదార్థములన్నీ కూడా... ఒకప్పుడు సమరూపంగాను... మరొకప్పుడు అసమ రూపంగాను ఉంటున్నాయి. ఇక నీ విషయానికి వస్తే... సర్వదా ఆత్మారాముడవైన నీవు దైవకార్య నిమిత్తం అయోధ్యారాముడుగా ప్రకటనమవటం నీ అవతార-చమత్కార విశేషం!

❖

ఓ రామచంద్రా! "జగత్తు" అనే మహా సముద్రంలో ఈ జీవులందరు బిందుకణముల వంటి వారిగా గ్రహించు. ఈ జీవులలో కొందరు మరల మరల అవియే ధన-బంధు-వయః-కర్మ-విద్యా-విజ్ఞాన చేష్టలతో కూడిన దేహములతో ప్రవేశిస్తూ-నిష్క్రమిస్తున్నారు. మరికొందరేమో వాటివాటిలో సహభాగం మాత్రమే కలిగి ఉంటున్నారు. ఇంకొందరు వాటిలో నాలుగవ వంతు మాత్రమే పరిణామస్థితిలో తోడు తెచ్చుకుంటున్నారు. కొందరు జీవులు తమ దేహానంతరం అవియే దేహములు కలిగి ఉంటున్నారు. ఇంకొందరు భిన్నమైన శరీరములు పొందుచున్నారు. మరి కొందరికి అన్ని విషయములు ఇతఃపూర్వపు దేహము వలెనే ఉంటున్నాయి. కాని కాలం మాత్రం వారి పట్ల విలక్షణంగా ఉంటోంది. ఇంకొందరు కాలమునందు సమంగాను, తక్కిన సర్వ విషయములలోను విలక్షణంగాను ఉంటున్నారు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఒక్కొక్కసారి సలక్షణంగాను, మరొక్కసారి విలక్షణంగాను ఈ జీవుల భవిష్యత్ దేహాదుల పరిణామములు ఎందుకుంటున్నాయి? వీటి వెనుక అంతర్లీనంగా ఉన్న రహస్యమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అనేక రాగ-ద్వేషాదుల చేతను, విచిత్ర ధర్మాధర్మముల ప్రసంగ-చేష్టల చేతను నింపబడిన చిత్తములే ఈ పరిణామ-విపరిణామములన్నిటికీ కారణం! ఆయా స్వకీయ నిర్మిత భావావేశములతోనూ, చేష్టలతోను కూడిన ఈ జీవులు వివిధ దేహములు ధరిస్తూ ఇక్కడి స్వర్గ-నరకాది ఊర్ధ్వ-అధో లోకాలలోనికి మరల-మరల ప్రవేశ-నిష్క్రమణములు నిర్వర్తిస్తున్నారు. అందుకే "ఈ జీవులు చంచల మహా సముద్రంలోని చక్రావర్తములందు సంచరించే జలబిందువుల వంటివారు" అని వ్యాఖ్యానించాను. మహా సముద్రంలో ఏ జలం ఆవర్తమగు చున్నది? ఏ జలం తరంగాలుగా అగుచున్నది? ఏ జలం ఎటు వెళ్ళుచున్నది? ఏ జలం ఎన్నెన్ని రూపాలు పొందుచున్నది? ...అనునదంతా వాఖ్యానించటం ఎవరి తరం? అట్టి వ్యాఖ్యానాలలో విశేషం మాత్రం ఏమున్నది?

ఈ 'భూతకోట్లు' అనే జలబిందువులు సదృశములా? (ఒకే తీరుగా ఉంటున్నాయా), లేక భిన్నములా? (వేర్వేరు తీరులుగా పరిణమిస్తున్నాయా?); తద్రూపములా? అన్యరూపములా?... అని బాగుగా నిర్ధారించటానికి సమర్థుడెవరు?

మహాజల ప్రవాహం సందర్భంలో ఏ నీరు ఎటు పోవుచున్నదో చెప్పలేకపోయినప్పటికీ... ఒక్కటి మాత్రం సత్యం. ప్రతి జలకణం జలమేగాని అన్యం కాదు.

ప్రతి జీవుడు అత్మస్వరూపుడే అయి ఉన్నాడు. ఆత్మానందమే మనందరి రూపాలుగా వెల్లివిరుస్తోంది!

❖❖❖

# 32. వసిష్ఠ దేహాంతర్గత జగత్సమూహ చమత్కారం

**శ్రీరాముడు :** స్వామీ! ఆ సమయంలో అనేక జగత్తులలో వివిధ విశేషాలు గాంచుచున్న మీరు ఏ జగత్తులో, ఏ దేహంతో ఉండి అదంతా చూచారు? మీ దేహం ఏ జగద్వస్తువుతో ఆ సమయంలో తయారై ఉన్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "అనేక సంఘటనలతో కూడిన వివిధ జగత్తులన్నీ ఆత్మ స్వరూపం మాత్రమే" అను ఎఱుకతో నేనదంతా చూస్తున్నాను కదా! అందుచేత అనంతము-నిరామయము-చిదాకాశము అగు స్వరూపముతోనే నేనున్నాను.

అక్కడ ఇంకొక చమత్కారమైన విషయం జరిగింది. అదికూడా చెపుతాను శ్రద్ధగా ఆలకించు. ఏదో కాకతాళీయంగా ఏకాగ్రచిత్తుడనై నేను నా దేహమువైపు పరికించి చూచాను. అప్పుడు నేను అనంతము నిరామయము-చిదాకాశ స్వరూపము అగు దేహమై ఉన్నాను కదా! అట్టి నా దేహంలో తడిసిన ధాన్యపు గుట్టలో ఒక గింజ అంకురించి కనబడునట్లు ఒకచోట సృష్టి కనిపించింది. ఆ జగత్తులో ఆకార యుక్తములు అనాకారయుక్తములు, చేతనములు-అచేతనములు అగు సమస్త వస్తువులు కనిపించసాగాయి. ఆహా! సుషుప్తి నుండి స్వప్న దశకు వచ్చిన మనుజునికి ఎదురుగా స్వప్న దృశ్యం ప్రకాశిస్తుందే! స్వప్న దశ నుండి జాగ్రత్ దశకు వచ్చినవానికి ఎదురుగా ఈ జాగ్రత్ జగత్తు కనిపిస్తుంది కదా! ఆ రీతిగా ఆత్మస్వరూపమును అనుభూతమొనర్చుకొని ఉన్నట్టి నా యొక్క హృదయమున సృష్ట్యాదియందు సృష్టి ఉదయించింది.

అయితే ఆ సృష్టి కూడా చిదాకాశముకంటే భిన్నం కాదు.

**శ్రీరాముడు :** హృదయాకాశమే స్వరూపముగా గల ఓ మహాత్మా! చిదాకాశరూపులగు తమయందు సృష్టి ఎట్లా ఉత్పన్నమైంది? నాకు ఇది ఆశ్చర్యంగా ఉన్నది! ఆ విశేషమంతా ఏమిటో సవివరంగా తెలియజెప్ప ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "స్వప్నంలోని నగరం" లాగా అసత్తే అయినప్పటికీ 'సత్తు' వలె సర్వజగత్ కల్పనా వ్యవహారుడగు బ్రహ్మదేవుని పదమును నేను నాయందు ఎట్లా అనుభవించానో,... యథారీతిగా వర్ణిస్తాను, విను.

❖

చిదాకాశరూపుడనగు నేను ఇతఃపూర్వం చెప్పుకొన్న శిలయొక్క వేర్వేరు భాగాలలో సృష్టులను పరికించే అభ్యాసంతో నా శరీరం వైపుగా చూచాను. అభ్యాసవశంగా నా చిదాకాశ దేహమందలి ఒకానొక విభాగమును సంవిత్తు (జ్ఞానము) + సృష్టి సంకల్పములతో కూడిన సంకల్ప దర్శనముచే జగద్వ్యవహారమును అసంకల్పితంగా, నాకు తెలియకుండానే మేలుకొలిపాను. నాయందు ఎప్పుడైతే సంవిత్తు (జగత్ సంబంధ జ్ఞానము) ఒకింత స్ఫురించిందో, ఆ మరుక్షణం నాయందు ఒకానొక చోట "ఆకాశరూపత్వము" గాంచాను.

**శ్రీరాముడు :** అద్దానిని గాంచింది కళ్ళతోనా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కాదు. గాఢ నిద్రలో కేవల-నిర్విషయ చిదాకాశమును అనుభవిస్తున్న చిదాకాశ రూపుడగు ఈ జీవుడు ఏ విధంగా గాఢ నిద్రానంతరం స్వప్న-జాగ్రత్ దశలను ఘనీభూతమైన స్వభావముచే పొందుచున్నాడో అట్లాగే అప్పుడు నాయందు ఆకాశరూపత్వం పొందాను. ఒక జీవుడు స్వప్నంలోని నగర-గృహాదులను ఏ స్వభావము అను కళ్ళతో చూస్తున్నాడో... నేను ఆ స్వభావచక్షువులతో నా యందు జగత్తును చూచాను. ఆ తర్వాత ఆ నా ఆకాశరూపమున 'దిక్కులు' గురించిన బోధ కలిగింది. 'ఆకాశము దిక్కులు' గురించి పర్యాలోచించటం చేత మొట్టమొదటగా 'చిత్తము' అనునది ఏర్పడింది.

చిత్తము నుండి ఉదయించిన "ఈ ఆకాశాదులే నేను" అను జ్ఞానమే "అహంకారము". అట్టి అహంకార జ్ఞానము యొక్క కించిత్ ఘనీభూత స్థితి "బుద్ధి". ఆ బుద్ధి "సంకల్ప + వికల్పములచే మరికొంత ఘనీభూతమగుటయే మనస్సు.

ఈ విధంగా ఆకాశత్వము-దిక్కులు-చిత్తము-అహంకారము-బుద్ధి-మనస్సు అని పిలువ బడుచున్నవన్నీ భావావేశ మాత్ర రూపంగా నాయందు గల ఆ ఒకానొక విభాగంలో క్షణంలో ఏర్పడ్డాయి. ఆ తర్వాత ఆ మనస్సు "శబ్దము స్పర్శ-రూపము-రసము-గంధము"లను ఎఱుగుట ప్రారంభించగానే పంచతన్మాత్రలు కల్పితమైనాయి. ఆ తర్వాత ఆ స్థానంలో క్రమంగా సూక్ష్మ-స్థూల పంచేంద్రియ క్రమమంతా ఉదయించసాగింది.

'సుషుప్తి దశ' నుండి స్వప్నము నందు ప్రవేశించగానే 'జగత్తు' అనే ఘనీభూత దృశ్యము అనుభూత విషయంగా..., అగుచున్నది కదా! అట్లాగే సృష్టికి పూర్వం దుఃఖ రహితమై ఉండే "శుద్ధాత్మ"... సృష్ట్యాది యందు ఎప్పుడైతే సృష్టి వైపుగా అభిముఖమౌతోందో అప్పుడు ఒక్క నిమిషంలో 'దుఃఖము' ఉదయిస్తోంది. అనంతమగు పరమాత్మయందు ఒకేకాలంలో ఈ దృశ్య సమూహమంతా ఉదయిస్తూ ఉండగా... దానిని కొందరు "ఆకాశము-ఆకాశము నుండి వాయువు -వాయువు నుండి అగ్ని"... మొదలైన ఒక క్రమమును వర్ణిస్తూ చెప్పుచున్నారు. మరికొందరు "ఒకదాని నుండి మరొకటి కాదు. సృష్టి ఏర్పడిన క్షణంలో అన్నీ ఒక్కసారిగా ఏర్పడుచున్నాయి" అని సిద్ధాంతీకరిస్తున్నారు.

కల్పనచే క్షణంలో కల్పము, పరమాణువులో దీర్ఘ ప్రదేశం అనుభవమగునట్లు నేను అచట బ్రహ్మాండరూపమగు చైతన్యాత్మను అనుభవించాను. కానీ, రామచంద్రా! యథార్థానికి నిర్మలాత్మ సదా సర్వదా చిదాకాశరూపమే అయి ఉన్నది. స్వభావంగానే వాయువు ఆకాశమున అంతటా నిరంతరం చలిస్తూ ఉంటుంది కదా! అట్లాగే మనస్సు కూడా స్వభావంగానే సర్వత్రా శరీరాదుల కల్పన గాంచుచూ ఉంటోంది. ప్రథమంగా మనస్సు యొక్క పరశక్తి జగత్తు యొక్క రూపాదుల కల్పనను ఎట్లు గావించిందో... అద్దానిని మరొకటేదీ స్వయంగా గొప్ప ప్రయత్నం చేసి కూడా మరొక విధంగా చేయజాలదు. ఆ తర్వాత నేను స్వయంగా అపరిచ్ఛిన్నుడను అయినప్పటికీ కల్పన

చేత నన్ను నేను పరిచ్ఛిన్న రూపంగా అనుభవించసాగాను. 'చిద్రూపము' నుండి 'చిత్తము' రూపమున స్థితినొందాను.

ఆ తర్వాత... 'చిత్ ప్రతిబింబము' అనదగు "చిత్తము" యొక్క ప్రాప్తిచే తేజఃకణములాగా వెలయునట్టి లింగ శరీరము (మనో-బుద్ధి-చిత్త-అహంకారములతో కూడిన శరీరము) అనుభవించసాగాను.

ఆ తర్వాత భావనా సమూహముల పరిపుష్టిచేత "స్థూల శరీరత్వం" పొందాను. ఆ స్థూల శరీరంలో "నేను చూచుచున్నాను" అను ఒకింత బోధ చేత "చూడటమనే అనుభవం" వైపుగా ప్రవృత్తుడను అగుటచే 'నేత్రములు' అను ద్వారముతో కూడుకున్నవాడనైనాను.

ఏ రంధ్రముచే నేను చూచుటకు ప్రవృత్తుడనైనానో వాటినే "కళ్ళు" అని పిలుస్తున్నారు. దేనినైతే నేను చూస్తున్నానో... అదియే "దృశ్యము" అనబడుతోంది. దర్శనమే అద్దాని 'ఫలం'. ఎప్పుడు చూస్తున్నానో.... అదియే 'క్రమము'. ఎచట చూచానో... అదియే ఆకాశము... అదియే 'దేశము'... ఈ విధంగా ఒక దృఢమైన నియతి ఆత్మకు ప్రవృత్తం కొనసాగింది.

**శ్రీరాముడు :** స్వామీ! అఖండాత్మ స్వరూపులగు మీరు ఆ విధంగా దేహధారణ చేస్తూ మీ యొక్క ఆత్మ స్వరూపాన్ని ఏమఱిచారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** లేదు. "సమస్తము చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమే" అనియు, నేను చైతన్యమేనని, అందుచేత చూడబడే అంతటికీ నేనే కారణము అనియు అనుభవం ఆ సమయంలో అనుక్షణికంగా కలిగియే ఉన్నాను. అనగా... 'నేత్రములు' అనే రెండు ద్వారముల గుండా నేను ఎప్పుడైతే చూడటం ఆరంభించానో, అపుడు "ఈ కనబడుచున్నదంతా చిదాకాశమే" అను నిర్మల బోధ యథాతథమై ఉండనే ఉన్నది.

❖

ఏ రంధ్రముల గుండా చూచానో అవి నేత్రములై వర్తించాయి కదా! ఆ తర్వాత 'శబ్దమును ఒకింత విందును కదా' అనే చిత్తవృత్తి నాకు ఉదయించింది. అట్లా ఉదయించగానే ఒకానొక ఝంఝూనాదం నాకు వినపడసాగింది. ఆ శబ్దము శంఖానాదమును బోలి ఆకాశమునకు స్వాభావికమైనదిగా అనిపించింది. అది ఇంకా చలనశీలమగు వాయువుతో కూడి రంధ్రముల గుండా (శబ్దవాయువులుగా ప్రసరించుచుండగా) వినటం జరిగిందో అవియే "చెవులు" అను పేరుతో పిలువబడుచున్నాయి సుమా! అటు తర్వాత ఏ ప్రదేశమునుండి స్పర్శ జ్ఞానమును పొందానో అవియే 'త్వక్కు' (చర్మము) అని చెప్పబడుతోంది. దేనిచే 'స్పర్శ' అనుభవించబడుతోందో అదియే 'సత్-సంవేదన' రూపమగు (లేక, స్పర్శేంద్రియ విషయమైన) వాయువు-అనబడుతోంది.

ఈ విధంగా దర్శనేంద్రియ-శబ్దేంద్రియ-స్పర్శేంద్రియ అనుభవకర్తనయ్యాను కదా! అప్పుడు "రుచి ఆస్వాద - స్వరోచ్చారణ నిర్వర్తించెదనుగాక"! అనే మరొక ఇచ్ఛ జనించింది. మరుక్షణం రస సహితమైన 'రసేంద్రియం' ఏర్పడింది. అట్లాగే ఘ్రాణేంద్రియం గురించిన సంకల్పముచే ఘ్రాణేంద్రియం సంభవించింది. చూచావా, రామచంద్రా! ఈ ప్రకారంగా వాస్తవానికి ఆకాశ

రూపుడనే అయినట్టి నాకు నా యొక్క అనంత తత్త్వములోని ఒకానొక విభాగంలో సమస్త దేహ-ఇంద్రియ-విషయ సంపత్తి నా యొక్క ఇచ్ఛా ప్రభావంచే చేకూరింది. ఇట్టిదియే ప్రతి ఒక్క జీవుని భౌతిక దేహ సంపత్తి విశేషమని గమనించు.

ఇక్కడ రెండు విషయాలు గమనించు-

1. నేను యథాతథంగా అనంతమగు చిదాకాశ స్వరూపుడనుగానే ఉండి ఉన్నాను. కాబట్టి, నా యందు ఒకానొక విభాగము అనునది "స్వప్నతుల్యము-కల్పనా మాత్రము" కనుక, వాస్తవానికి ఏదీ కూడా చేకూరనిదియే అగుచున్నది. ఒక దృశ్యమును చూస్తున్న ద్రష్ట తన స్వరూపమును యథాతథంగా కలిగి ఉంటూనే దృశ్యమును దర్శిస్తూ ఉంటాడు కదా! దృశ్యమును పొందుతూనే స్వస్వరూపతః మార్పు-చేర్పులు లేకయే ఉంటాడు కదా! ఇదియే ఇక్కడ అక్కడి నా "స్వరూప తతంగము" విషయమై మనకు దృష్టాంతం.

2. నేనే కాదు. నీవు, ఇక్కడి సభికులు, తదితర జ్ఞాన-అజ్ఞాన సమన్వితులగు భూత-వర్తమాన-భవిష్యత్ ద్రష్టలందరిపట్లా నాలాగానే తమ స్వస్వరూపమునందు ఎట్టి మార్పు-చేర్పులు లేకుండానే స్వప్నతుల్య మనదగు ఈ శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముల యొక్క భోగ జ్ఞానము. ఉదయిస్తోంది సుమా! నాకు బలాత్కరంగా దేహ-ఇంద్రియత్వం ఉదయించింది. ఆ దేహేంద్రియ విషయములను అభిమానించుచూ ఉండనారంభించాను. అట్టి అభిమానమే నీవంటి వారిచే (అనగా శాస్త్రకారులచే) 'అహంకారము' అని చెప్పబడుతోంది. అట్టి అహంకారము ఇంకొంత ఘనీభూతం కాగా 'ఇప్పుడు చూచెదనుగాక! ఇప్పుడు వినెదనుగాక! ఇప్పుడు ఆఘ్రాణించెదను గాక! ఇప్పుడు! ఇప్పుడీ స్పర్శానుభవం పొందెదను గాక! ఇక రుచిని పొందెదను గాక' అను రూపంగా ప్రవర్తన బయల్వెడలుచుండగా అదియే 'బుద్ధి' అని చెప్పబడుతోంది. ఆ బుద్ధి మరికొంత ఘనీభూతమై సంకల్ప-వికల్ప పరంపరలను పొందనారంభించింది. అట్టి సంకల్ప-వికల్పములనే 'మనస్సు' అని అంటున్నారు. ఆ మనస్సే విషయములను మరల మరల స్మరించుచుండగా 'చిత్తము' అని వ్యవహరించబడుతోంది.

❖

ఈ విధంగా వాస్తవానికి చిదాకాశరూపుడనగు నేను సూక్ష్మ శరీరధారినైనాను. అంతఃకరణ రూపు దనైనాను. అప్పుడాస్థితిలో వాయువు కంటే కూడా అత్యంత సూక్ష్మమైన ఆకృతితో కేవలం ఆకాశ మాత్రుడనుగానే ఉన్నాను. అప్పటికీ నేను నిరాకారడను అగుటచేత ఏ పదార్థము చేతనూ నిరోధించ బడనివాడనుగానూ ఉన్నాను. అట్లా పూర్వ కల్పితమైన బ్రహ్మదేవుని శరీరమును భావన చేయుచు చాలాకాలం ఉన్నాను. అప్పుడు "నేను చతుర్ముఖ దేహధారిని అవుతాను" అనే ఒకనొక వృత్తి నా యందు కలిగింది. అట్టి వృత్తిలో నలువైపులా ఎగురసాగాను. అట్లా ఎగురుచూ ఒకానొక శబ్దం ఉచ్చరించాను. అట్లు బాలరూపుడనగు నేను మొట్టమొదటగా ఏ శబ్దమును ఉచ్చరించానో-ఆ శబ్దమే మరల అక్కడి ప్రపంచమున 'ఓంకార' రూపంగా ప్రసిద్ధికెక్కి ఉన్నది.

ఈ ప్రకారంగా నేను సృష్టి కర్తను, జగద్గురువును, బ్రహ్మదేవుడను అయినాను. ఆపై మనోమయుడనగు నాచేత అనేక సృష్టులు కల్పించబడ్డాయి. ఆ రీతిగా... బ్రహ్మరూపుడనే అయిన నేను 'నిజ స్థూల శరీరము' అను ఆవరణ సహిత బ్రహ్మాండమును, ఆ బ్రహ్మాండము యొక్క బాహ్య రూపమును ఒక్కసారే గాంచసాగాను. అయితే...

**ఏవమస్మి సముత్పన్నో న తు జాతోస్మి కించన ।**

**దృష్టవానస్మి బ్రహ్మాండం, బ్రహ్మాండాంతం న కించన ॥**

వాస్తవానికి "బ్రహ్మాండము-బ్రహ్మాండము యొక్క బాహ్యము" అనబడు దృశ్యమేదియు అననిదే అయి ఉన్నది సుమా!

**శ్రీరాముడు :** మహర్షీ! "బ్రహ్మాండములు-వాటి బాహ్యము చూస్తూ ఉండినాను"... అని అంటూనే, "అట్టి దృశ్యమేదీ లేనేలేదు"... అని ఇంతలోనే వాఖ్యానిస్తున్నారు. కనబడుతూ కూడా లేకుండట మేమిటి? మీ వాక్యార్థం వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** స్వప్నంలో స్వప్న స్వభావ చమత్కారంచేత అనేక పదార్థ జాలములు కనబడవచ్చుగాక! అవన్నీ ఎక్కడున్నాయి? లేవు కదా! అట్లాగే "బ్రహ్మదేవుని స్వప్నమే ఈ జగత్తు" అని మనం ఇతఃపూర్వం సిద్ధాంతీకరించుకున్నాం కదా! అప్పటి సృష్టికర్తయగు బ్రహ్మదేవత్వము వహించినప్పటి ఆ నా ఆ బ్రహ్మాండముల కల్పన దర్శనములు అట్టివే! (స్వప్నసదృశమైనవే!)

ఆ విధంగా మనోమయుడనగు నేను జగద్రూపుడను అయ్యాను. కానీ అట్లేమియు కాకయే ఉన్నాను. ఎందుకంటే సమస్తమూకూడా దృశ్యశూన్యమగు చిదాకాశమే అయి ఉన్నది కదా!

**జగత్ మృగతృడ అంబూని భాంతి సంవిది సంవిదః ।**

**న బాహ్యమస్తి, నో బాహ్యే, ఖే తద్వ్యోమ తథా స్థితమ్ ॥**

జ్ఞానస్వరూపుడగు పరమాత్మయందు జ్ఞాన రూపములే అయినట్టి అనేక జగత్తులు మృగతృష్ణా జలతరంగాలలాగా భాసిస్తున్నాయి. వాస్తవానికి 'బాహ్యము' అనునదీ లేదు. 'బాహ్యమందలి జగత్తు' అనబడునదీ లేదు. ఇదంతా కూడా "చిదాకాశమే చిదాకాశమున" మట్టియందే మట్టి బొమ్మలు ఉన్నట్లుగా-ఉన్నట్లగుచున్నది. ఎండమావులలో జలం ఉన్నదా? లేదు. మరి జలం ఎందుకు కనిపిస్తోంది? దానికి కారణమంటూ ఏదీ లేకపోయినప్పటికీ చూచేవాని యొక్క అంతః కరణము నందు గల దాహబుద్ధియే (లేక) దృశ్యబుద్ధియే అట్లా ఎడారిలోని మృగతృష్ణయందు జలభ్రాంతిని వీక్షింపజేస్తోంది కదా!

అట్లాగే... బ్రహ్మమునందు వాస్తవానికి 'జగత్తు' అనబడునదేదీ లేదు. అయితే ఆత్మయే నిష్కారణంగా అజ్ఞానా వృతమైన సంవిత్ స్వభావం చేత ఈ జగద్భ్రాంతిని గాంచుచున్నది. అ జగత్తు అనబడేది అసత్తే అయినప్పటికీ స్వప్ననగరం వలె, మనోరాజ్యం వలె, సంకల్ప దృశ్య పరంపర వలె హృదయమున వ్యాపించి ఉంటోంది.

ఈ జగత్తు "అద్దమునందు ప్రతిబింబించిన దృశ్యము" వంటిది. అద్దంలో ఏమీ లేకపోయినా

అనేక వస్తువులు కనబడతాయికదా, బ్రహ్మమునందు జగత్తులు లేకపోయినప్పటికీ ఉన్నట్లే కనబడుచున్నాయి. వాస్తవానికి ఈ జగత్తుగా కనిపించేదంతా అసత్తే సుమా!

**శ్రీరాముడు :** మహాత్మా! ఎవరో కల్పించిన మాయా జగత్తు మా హృదయదర్పణంలో ప్రతిబింబించటం చేతనే కదా మేము అజ్ఞానంతో ఉంటున్నాం? ఇదంతా ఎందుకు జరుగుతోంది?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'జగత్ కల్పన'కు అధిష్ఠానమగు 'చిత్ శిల'లో 'జగత్‌భావన' ఉదయించినప్పుడే ఈ జగత్తును చిత్‌శిలాస్వరూపుడగు ఈ జీవుడు గాంచగలడు. 'కల్పన' అను తన ఒకానొక విభాగంలో ప్రవేశించిన తర్వాతనే జీవుడు జగత్తును పొందుచున్నాడని గ్రహించు. అట్టి కల్పనలో ఎవడు ప్రవేశించడో, అట్టివాడు 'జగత్తు' అనబడు దానికి పొందకయే ఉంటాడు. ఉదాహరణకు, మన ప్రక్కనే ఒకాయన నిదురిస్తూ ఏదో దీర్ఘమైన స్వప్నం కంటున్నాడనుకో! అతని చిత్తమునందు ప్రవేశించకుండా అతని స్వప్న విశేషములను మనం పొందజాలము కదా! అట్లాగే ఈ జీవుడు 'కల్పన' అనే బ్రహ్మదేవుని చిత్తము నందు ప్రవేశించిన తర్వాతయే ఈ జగత్తులను పొందుచూ జన్మజన్మాంతర పరంపరలను అవిశ్రాంతంగా పొందుచున్నాడని గ్రహించు.

❖

సర్వదా సర్వత్రా మూడు దృష్టులు పాల్గొనుచున్నాయని ఇక్కడ గమనించు.

**1. ఆధిభౌతిక దృష్టి (స్థూల దృష్టి) :** ఇట్టి ఆధిభౌతిక దృష్టికి పదార్థజాలం మాత్రమే కనబడు తుంది. ఏ లోకాలోక పర్వత శిలపై నాకు ఏ బ్రహ్మాండం కనిపించిందో... ఆధిభౌతిక దృష్టికి అది కేవలం 'లోకాలోక పర్వతంపై గల ఒక శిల"గా మాత్రమే కనబడగలదు. స్థూలదేహం తాదాత్మ్యంతో దర్శించేవారికి స్థూల విషయాలు మాత్రమే కనిపిస్తున్నాయి.

**2. అతివాహిక దృష్టి (సూక్ష్మదృష్టి) :** అతివాహిక దేహంతో పరమబోధ దృష్టితో చూచినప్పుడు నాకు ఆ లోకాలోకపర్వత శిలలో బ్రహ్మాండము అగుపించింది. అయితే నాకు కనిపించిన ఆ బ్రహ్మాండ సృష్టి అంతా కూడా అనేక జగద్విశేషములతో నాకు కనిపించనప్పటికీ, ఆత్మజ్ఞానులగు యోగుల దృష్టికి అదంతాకూడా నిర్మలపరమాత్మ రూపమే అగుచున్నది.

**3. ఆత్మజ్ఞాన దృష్టి (పర దృష్టి) :** జ్ఞాన దృష్టిచే ఈ జగత్తంతా కూడా సర్వత్రా నిర్వాణరూపమగు బ్రహ్మం గానే కన్పట్టుచున్నది. అట్టి దృష్టి లేనివారికి అట్లు అగుపించటం లేదు.

ఇక్కడ ఒక విశేషంఈ మూడింటిలో ఎవరిలో ఏ దృష్టి అత్యధికంగా ఉంటుందో వారికి ఆ రీతిగా ఈ జగత్తు అగుపిస్తోంది.

**యత్ పశ్యత్యవదాతా ధీః సో ఉపపత్తి విచారణా ।**
**న తత్ నేత్రైః త్రిభిః శర్వో, న ఇంద్రో నేత్రశతైరపి ॥**

ఉపపత్తి, విచారణ సహితమైన శుద్ధ బుద్ధి దేనిని గాంచుచున్నదో అద్దానిని మూడు కనులు గల శివుడుగాని, నూరుకళ్ళు గల ఇంద్రుడుగాని గాంచజాలరు సుమా!

❖❖❖

# 33. పృథ్వి తత్త్వాహంకారమును ఆశ్రయించటం (అహమ్ పృథ్వీ తత్త్వమస్మి)

**శ్రీవసిష్ఠ మహర్షి :** "ఆకాశంలాగానే పృథ్వి కూడా అనేక సృష్టులతో పూర్ణమైయున్నది కదా!" అని నేను యోగ దృష్టితో గమనించాను. అప్పుడు పృథ్వి యొక్క 'ధారణ' తో కూడిన 'ధ్యాత' ను అయ్యాను. పృథ్వి యొక్క సర్వ సూక్ష్మ-స్థూల తత్త్వములు నా స్వరూపమునకు అభిన్నమైనవేనను అనుభవం కలిగినవాడనయ్యాను.

**శ్రీరాముడు :** "నేను పృథ్వితత్త్వ స్వరూపుడుగా (పృథ్వీధ్యాతగా) అయ్యాను" అని మీరు అంటున్నారు కదా! అనగా "నేను వసిష్ఠుడను" అను దేహ-భౌతికానుభూతిని త్యజించి పృథ్వీరస స్వరూపులైనారా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** లేదు. ఒక చక్రవర్తి తన దేహంలో అహంభావాన్ని త్యజించకయే "ఈ సమస్త భూమండలము నా సామ్రాజ్యమే కదా!"... అను మమత్వం ధరించి ఉంటాడు చూచావా? అట్లాగే నా చిత్స్వరూపాన్ని గ్రహించి ఉండియే పృథ్వి యొక్క అహంభావంచే పృథ్వి రూపధారిని అయినాను. అట్టి పృథ్వి యొక్క ధారణచే పృథ్వి అభిమానినయ్యాను. అనగా అట్టి పృథ్వీ అవ్యభిమాన సమన్విత మైన బుద్ధితో తాదాత్మ్యం చెందినవాడనై ద్వీప-పర్వత-తృణ వృక్షాదులన్నీ నా శరీరమే అయి ఉన్నట్లు అనుభూతిని పొందాను. వివిధ వృక్షాలతో, పలురత్నాలతో, నగర-గ్రామ-అరణ్య-పర్వత ప్రాంతాలతో, ద్వీప-పర్వత-తృణ వృక్షాదులన్నీ నా శరీరమే అయి ఉన్నట్లు అనుభూతిని పొందాను. వివిధ వృక్షములతో, పలు రత్నములతో, నగర-గ్రామ-అరణ్య-పర్వత ప్రాంతాలతో, ద్వీప-సముద్ర వివిధ జీవులతో, ప్రాణ-అపాన సంచారములతో, దశదిక్కులతో కూడిన పృథ్వియే నా దేహంగా అనుభవం పొందాను. సర్వ జీవరాసులలోని చైతన్యమే నా నిజ చైతన్యంగా అనుభవమై ఈ పృథ్వి అంతా నా శరీరంగా నాకు గ్రాహ్యం కాసాగింది. నదీ-నద-వన-సముద్ర-పర్వత-స్థాణువుల తోను, ప్రాణుల భోగ్య పదార్థములతోను, స్థూల-ఎడారులతోను వ్యాప్తమైన భూతలరూపం పొందిన వాడనై "భూదేవత" అని చెప్పబడేది నేనే అయ్యాను. అప్పుడు కూడా చిదానందస్వరూపుడనగు నేను యథాతథంగానే ఉండి ఉన్నాను. ఇప్పుడు కూడా అట్లే ఉన్నాను సుమా!

అట్లు భూతల రూపమును పొందినట్టి నేను తదంతర్గతంగా ఏ ఏ విశేష స్థితులను అనుభవించానో,... విను. ఇవన్నీ నాయందు నేనే నా దృశ్యజగత్ శరీరంలో పొందసాగాను!

❖

ఒకచోట స్త్రీలు నృత్య-గాన-జానపదగీతాలు ఆలపిస్తూ సంతోషంతో ఉప్పొంగిపోతున్నారు. మరొక చోట మరికొందరు స్త్రీలు పతీ-పుత్రాదుల మరణమును చూచి అతిదీనంగా శబ్దాలు చేస్తూ ఏడ్చుచున్నారు. ఒకచోట జనులు గొప్ప క్షామంచే పీడింపబడుచూ దీనాలాపనలు చేస్తున్నారు. మరొక చోట జనులు ఉత్సవ వేడుకలలో మునిగి – తేలుచున్నారు. ఒకచోట ఉత్తమ స్నేహయుక్తులై సరస-సల్లాపములు ఆడుకొనుచున్నారు. ఇంకొక చోట ఒకరినొకరు వేధించుకోవటం, బాధించు

కోవటం, హింసించుకోవటం జరుగుచుండుటచే ఆ వాతావరణం ఆవేశము, భయము-దుఃఖములతో నిండిపోయి ఉన్నది.

నా యొక్క భూతత్త్వాభిమానత్వం వలన అవన్నీ నేనే పొందుచున్నవాడిని కాసాగాను. ఇంకా...

ఒకచోట "అగ్ని" దీపశిఖలుగా ప్రకాశించుచు ఆ ప్రదేశమంతా పండుగలాగా శోభింప జేస్తోంది. మరొకచోట ఆ అగ్ని యొక్క మహాదాహముచే దేహములు-గృహాలు దగ్ధం అయిపోతు న్నాయి. ఒకచోట తాటాకజలంలో జనులు స్నానాలు చేస్తూ సేదతీర్చుకొంటున్నారు. మరొకచోట జలప్రవాహంచే గ్రామాలు - గ్రామాలు మునిగి-కొట్టుకుపోతూ ఉంటే జనుల హాహాకారాలు మిన్నుముట్టుచున్నాయి.

ఒకచోట వివేకియగు రాజు యొక్క పాలనలో ప్రజలు ప్రశాంతంగా, హాయిగా రోజులు గడుపు చున్నారు. ఇంకొకచోట సామంతరాజులు ఇళ్ళపై బడి కొల్లగొట్టుచుండగా తమ మాన-ప్రాణ-ధనాదులకు రక్షణలేక, ప్రజలు భయవిహ్వాలు లగుచున్నారు.

కొన్నిచోట్ల ప్రచండ రాక్షస-పిశాచాదులు స్వైరవిహారం చేస్తున్నాయి. ఇంకొక చోట జల సమృద్ధిచే పంటలు పచ్చదనంతో రమణీయంగా క్షేత్రములుగా ఒప్పుచున్నాయి.

ఒకచోట పిల్లగాలులచే మేఘాలు నృత్య భంగిమగా కదల్చబడుచుండగా ఆ వాతావరణంలో జనులు అత్యంత ఆహ్లాదాన్ని అనుభవిస్తున్నారు. ఇంకొకచోట ప్రచండవాయువులచే మేఘములు కదలుచుండగా, పిడుగులు నేలరాలుచూ జనులను భయంకంపితులను చేస్తున్నాయి.

ఒకచోట సర్వాలంకారయుక్తంగా గృహములు ప్రకాశిస్తూ ఉంటే, మరొకచోట పడిపోతున్న గోడలను పట్టించుకునే నాథుడు లేక వెలవెలబోతున్నాయి.

ఒకచోట యుద్ధ నినాదాలు. మరొక చోట సుఖ-శాంత జీవన స్రవంతి. ఒకచోట వాయు ఝుంకారాలు మరొక చోట ప్రశాంత వీచికలు. ఒకచోట శవాలు కాలుతున్నాయి. మరొకచోట నేల మరుభూమిగా అయి బూడిదచే కప్పబడి ఉన్నది. ఒకచోట కీటకము వంటి జీవులు అనేక దుఃఖములు-వేదనలు అనుభవిస్తూ నా యొక్క ఉనికి గుర్తించి "ఓ పరమాత్మా! వసిష్ఠ మునీంద్రా! మమ్ములను కాపాడండి! మేము ఈ దుఃఖ భారములను మోయలేం!".... అని ఆక్రందనలు సలుపుచుండటం వినిపిస్తోంది. ఒకచోట వటవృక్షం మొదలైనవాటి కొమ్మలు నేల మీదికి ఉండటం చేత అక్కడి నేలపై అనేక ఫలములు వ్రాలి కుళ్ళిపోతున్నాయి. మరొకచోట ఒక్క ఫలము రాలితే చాలు, అనేకమంది జీవులు దానిని భక్షించటానికి పరుగులు తీస్తున్నారు. ఒకచోట ఎండవేడిమికి నేల నుండి సెగలు వస్తున్నాయి. మరొకచోట దట్టమైన వృక్షములు అడ్డగించుటచే సూర్యకిరణములు నేలను తాకలేకపోతున్నాయి. ఒకచోట గజముల యొక్క దంతముల ఒరిపిడికి మహా వృక్షములు శిథిలావస్థను పొంది ఏ క్షణమైనా నేలకూలటానికి సిద్ధంగా ఉన్నాయి.

ఒకచోట జనులు అనేక లౌకిక-రాజకీయ-ఆర్థిక వ్యవహారములలో మునిగి తేలుచున్నారు. అట్లు మునిగి తేలుతున్నట్లు కనిపిస్తూనే వారిలో కొందరు అంతరంగమున విషయములకు

అతీతమైన ఆత్మతత్త్వమును అనుభవిస్తూ అంతా ఒక లీలగా, క్రీడగా, మాయగా, స్వప్నతుల్యంగా, భావ చమత్కార మాత్రంగా, అసత్యంగా దర్శిస్తున్నారు.

వేరేచోట కొందరు నేత్రములు మూసుకొని సూక్ష్మమగు ఆత్మతత్త్వమును ఆస్వాదిస్తూ ఆనందపరవశులై ఉంటున్నారు. ఒకచోట ఈగలు, దోమలు ముసురుతూ మృష్టాన్నం లభిస్తున్నందుకు సంతోషిస్తూ ఉంటే, ఆ ప్రదేశమును ఏహ్యతతో మరి కొందరు జీవులు దర్శిస్తున్నారు.

కొన్ని దుష్ట భ్రమరములు (తుమ్మెదలు) ఏనుగు దేహమును బాధిస్తూ ఉండగా, ఆ ఏనుగు తొండముతో తుమ్మెదలను పారద్రోలుతూ యాతనపడుతూ ఉంటే, అది చూచి ఆ తుమ్మెదలు ఏదో 'ఆట' ను చూచినట్లు ఆనందిస్తున్నాయి.

ఒకచోట కమలము సరస్సులో ఉండి పరవశంతో సువాసనలు వెదజల్లుతూ ఉంటే.... ఆ ప్రక్కనే కొద్ది క్షణముల వరకు గర్విస్తూ నిలిచిన మరొక కమలం ఏనుగు యొక్క దుష్ట క్రియచే పెకలించబడి ఒడ్డున ఎండకు ఎండి వడలుతూ కనిపిస్తోంది.

ఒక చోట క్రిమికీటకములు జనిస్తున్నాయి. మఱొకచోట నాశనం పొందుచున్నాయి. ఒక చోట వర్షపుజల్లుకు విత్తనములు అంకురిస్తూ ఉండగా, మరొక చోట నీరు లభించక ఆ విత్తులు ఎండి వడలుచున్నాయి.

ఓ రామచంద్రా! ఈ విధంగా నా యొక్క భూతత్త్వధారణా క్రమంలో అనేక పరస్పర అనుకూల వ్యతిరిక్తాలగు వ్యవహార సరళితో కొనసాతూండటం నాకు అనుభవం కాసాగింది.

❖❖❖

# 34. జగత్తు ఊహాకల్పితం మాత్రమే !

**శ్రీరాముడు :** గురువర్యా! జగత్తులను గాంచుట కొరకై మీరు పృథ్వి యొక్క ధారణను అనుసంధించారు కదా! అనగా మీరు ఆ సమయంలో ఈ కనిపించే భూలోకాంతర్గత భౌతిక స్వరూపములుగా అయ్యారా? లేక మానసిక అనుభవ మాత్రంగా పొందారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ మృత్తిక (మట్టితో కూడిన) పాషాణమయమగు విశాల రూపంగా పొందినదంతా కూడా కల్పన! నా దృష్టిచే మనోమాత్ర వికారమే! అందుచేత అదంతా మానసికమేనని అనవచ్చు. అయితే తత్త్వదృష్టిచే (లేక) వాస్తవ దృష్టిచే చూస్తే నేను నేనుగా యథాతథంగానే సర్వత్రా ఉండనే ఉన్నాను. కాబట్టి.... నేను మృత్తికారూపమూ పొందలేదు,... మనస్సు రూపమూ పొందకయే ఉన్నాను. చమత్కారమైన ఒక నిత్యసత్య రహస్యం ప్రతిపాదిస్తున్నాను. విను.

**అమానసం మహీపీఠం న సంభవతి కించన ।**
**యత్ అసద్వేత్సి యత్ సత్వా, మనో మాత్రకమేవ తత్ ॥**

మనస్సుకు భిన్నంగా 'భూతలము' అనబడేదేది ఎవ్వరికీ, ఎప్పుడూ సంభవించుటయే లేదు. ఓ రాఘవా! సత్తు కావచ్చు, అసత్తు కావచ్చు–ఏదైనా సరే... ఎప్పుడైనా, ఎక్కడైనా ఎవరిచేతనైనా, పొందబడుచున్నదంతా కూడా మనోమాత్రమే అయి ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! "నేను యథాతథంగా ఉంటూనే,.. కల్పనా దృష్టిచే భౌతిక జగత్తుగా అయ్యాను" అని అంటున్నారు కదా! అసలు మీరెవరు? మీ అసలు స్వరూపమేమిటి? ఈ వసిష్ఠ నామధేయ రూపమే మీ అసలైన రూపమా? లేక బ్రహ్మాండముల మధ్య సంచారం చేయుచు మహా ప్రళయమునకు కూడా సాక్షిరూపమగు వేరొక రూపమేదైనా ఉన్నదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** వాస్తవానికి నేను శుద్ధ చిదాకాశరూపుడను, నేనే కాదు. నేను–నీవు–తదితరులలో ప్రతిఒక్కరూ కూడా! అట్టి శుద్ధ చిద్రూపుడనగు నేను ఒకానొకప్పుడు 'స్ఫురణ'ను కలిగి ఉండటం జరుగుతోంది. నా యొక్క స్ఫురణమేది కలదో,.. అదియే 'సంకల్పము' అనబడుతోంది.

అట్టి చిదాత్మ యొక్క స్ఫురణయే మనస్సు కూడా! అదియే భూతలం–అదియే జగత్తు! అదియే నీవు చూస్తున్న ఈ భౌతికదేహం కూడా! అదియే బ్రహ్మదేవుడు. ఊహాలోకంలో నగరాలు కనిపించునట్లు,... చిదాకాశంలో మానసికాకాశం సంకల్ప నగరం వలె స్ఫురించుచున్నది.

ఓ రామచంద్రా! ఈ విధంగా ఈ భూమండలం నా యొక్క సంకల్ప మాత్రము, మనో మయము అయి, నా యొక్క ధారణభ్యాసముచే నాకు పరిపుష్ఠం అగుచున్నది.

ఓ ప్రియ జనులారా! ఈ భూమండలం మీకు ఏఏ విధంగా కనిపిస్తోందో,... అదంతా వాస్తవం కాదు. మరి? ఎవరెవరికి ఎట్లెట్లు అనుభవ మగుచున్నదో అదంతా మనస్సు యొక్క స్వయంకృత మైన కల్పనా చమత్కారమే సుమా! ఈ విధంగా ఈ జగత్తంతా కూడా "నిర్విషయమైనట్టి చిదాకాశము యొక్క స్ఫురణ మాత్రమే"... అయి ఉన్నది.

వాస్తవానికి చిదాకాశమే అయి ఉండినప్పటికీ, ఈ జగత్తు స్థూలరూపంగా అనుభవసిద్ధ మగుచున్నది. స్వప్నంలో విశాల భూమి కనబడినప్పటికీ అదంతా తన స్వప్నత్వమును త్యజింపకయే ఆ రూపంగా ఉంటోంది కదా!

అలాగే జాగ్రత్‌లో గాంచబడుచున్న ఈ పృథ్వి మొదలైనవి 'ఇదం' అనే ప్రత్యయార్థము అయిన దృశ్య ప్రతీతికి విషయము అయి ఉండికూడా ఇది తన మానసిక రూపత్వము త్యజించటమే లేదు. ఆకాశములో బాల్యమునుండి నీలత్వము చూస్తున్నాం. ఆకాశము శూన్యస్వరూపమే కదా! ఎట్టి పదార్థము కలిగి ఉండకపోయినప్పటికీ ఆకాశం నీలంగా ఎందుకు కనబడుతోంది? చిరకాలం అభ్యాసవశం చేత. అట్లాగే, అభ్యాసవశం చేతనే మట్టి గోడను మట్టిగా కాకుండా గోడగాను, ఇనుప కత్తిని ఇనుముగా కాకుండా కత్తిగాను, బంగారపు కత్తిని కత్తిగా కాకుండా బంగారంగాను చూడటం జరుగుతోంది. ఏదైనా ఒక వస్తువును చూస్తున్నప్పుడు,.. ఆ వస్తువు యొక్క దైనందిన ప్రయోజనమును దృష్టిలో ఉంచుకునియే చూడటం అభ్యాసవశంగా, జరుగుతుంది గాని, ఆ వస్తువును యథాతథంగా చూడటం సామాన్యంగా జరగకపోవటం ప్రతి ఒక్కరి యొక్క అనుభవమే!

**ఇదం స్థిరం సుకఠినం వితతం భూమి మండలమ్**
**'అస్థి' ఇతి జాయతే బుద్ధిః, వ్యోమ్నీవ చిరవేదనాత్ ॥**

ఆకాశం యొక్క నీలత్వం మొదలైనవాటివలె చిరకాలమైన అభ్యాసం చేతనే ఈ ఎదురుగా కనబడుచున్న జగత్తు "స్థిరంగా–అతి కఠినంగా, సువిశాలంగా"... ఉన్నదాని వలె కనిపిస్తోంది.

అయితే శ్రుతి వాక్యములు ఈ జగత్తు గురించి మరొక విధంగా ప్రతిపాదిస్తున్నాయి. (ఉదా: "వాచారంభమ్–వికారో నామధేయమ్–మాట్లాడుకోవటానికి ఇక్కడ అనేక నామరూప విషయాత్మక విశేషాలు కనిపిస్తున్నప్పటికీ వాస్తవానికి ఇది మొదలే లేదు" ఇత్యాది వాక్యాలు). కనుక అజ్ఞానుల అనుభవానికి ప్రసిద్ధమై తోచే ఈ భూతలం, ఇందలి వస్తుజాలం మొదలైనవి వాస్తవానికి విజ్ఞుల దృష్టిలో లేకయే ఉన్నాయి. మరి? మనస్సు యొక్క సూక్ష్మ రూపమే జగత్తుగా మనస్సుచే పొందబడుచున్నదని గ్రహించు. ఆదిసృష్టి మనోమయమే అయి ఉన్నది. అట్టి మనోమయమగు 'ఆదిసృష్టి' యొక్క "ఆద్యము–మనోనిర్మితము–ఏకము" అయినట్టి ఏ సూక్ష్మరూపం కలదో,... ఆ సూక్ష్మరూపమే ఈ విధంగా స్థూలత్వము పొందియున్నది.

దృష్టాంతానికి 'స్వప్నం' తీసుకుందాం. స్వప్నంలో మొట్టమొదటిది అగు స్వప్నచైతన్యమే (స్వప్న స్ఫూర్తియే) స్వప్న నగరముల రూపంగా భాసిస్తోంది కదా! సృష్ట్యాదియందలి మనోచైతన్యమే ఈ విధంగా జగద్రూపంగా స్థితి పొంది ఉంటోంది. ఓ రామచంద్రా! ఈ కనిపించే భూ–స్వర్గ–పాతాళలోకాలు, ఈ కనకబడే సమస్త దృశ్యమూ కూడా ఎల్లవేళలా 'చిద్రూపము' అనే పిల్లవాని యొక్క మనోరాజ్యము–అని గ్రహించు.

**శ్రీరాముడు :** స్వామీ! చిద్రూపము సదా స్వయముగా నిర్మలము–నిర్విషయము అయి ఉండగా అద్దానికి ఈ 'దృశ్యము' అనబడు మానసికమైన వ్యవహారం, ఆ తర్వాత దృశ్యాంతర్గత అనుభవ పరంపరలు, దేహ–దేహాంతరం ఎచ్చటి నుండి ఎందుచేత ఎట్లా ప్రాప్తిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "నిర్మలము–విషయరహితము" అగు చిద్రూపము నుండి 'సంకల్పము' అనే ఒకానొక చైతన్యతత్త్వము అనిర్వచనీయ కారణంగా బయల్వెడలుతోంది. అయితే నిశ్చల జలంలో చంచల తరంగత్వము బయల్వెడలుచున్నప్పటికీ... ఆ తరంగములు జలముకంటే వేఱా? కాదు. అట్లాగే చిద్రూపమగు ఆత్మయొక్క 'సంకల్పము' అనునది ఆత్మ చైతన్యము కంటే భిన్నంకాదు. ఈ జగత్తు అనబడేది అట్టి 'సంకల్పము' యొక్క ప్రయోజనమే అయి ఉన్నది. అనగా ఈ జగత్తు అనబడేది సంకల్పమయం మాత్రమే!

వాస్తవానికి ఈ జగత్తు సంకల్ప నిర్మితమే అయి ఉండటంచేత ఇది జగత్తుగా వాస్తవం కాదు. సత్యము కాదు. ఆకారయుతం కూడా కాదు. ఇది ప్రకాశమానము (తెలియబడుటకు విషయమై ఉన్నది) కాదు. మరి ఈ దృశ్యము ఎందుకు ఎట్లా ఉంటోందంటావా?

**దృశ్యమస్తి అపరిజ్ఞాతం, పరిజ్ఞాతం న విద్యతే**
**పరిజ్ఞాతం తదేవ అస్య శృణోషి యదిదం చిరమ్ ॥**

చిన్మాత్రమగు ఆత్మ గురించిన అజ్ఞానముచేతనే ఈ జగత్తు (అజ్ఞాత దృష్టికి) ఉన్నట్లుగా అనిపిస్తోంది. నా నుండి నీవు ఆత్మ జ్ఞానమును వింటున్నావు కదా! అట్టి జ్ఞానముచే "ఈ కనబడేదంతా చిద్రూపమే"... అని గ్రహించబడుచున్నది. ఈ భూమండలం-ఆకాశం-నక్షత్రాలు-తదితర లోకాలు మొదలైన దృశ్య మంతా "అద్వైతము-ఏకము-శాంతము" అగు చిన్మాత్రమే... తనయందు తాను ఈ రీతిగా స్ఫురిస్తోంది" - అని గ్రహించాలి సుమా! "దీనికి కారణం ఎవరు?" అని సభికులెవరైనా అనుమానిస్తారేమో! అందుకే చెప్పుచున్నాను. ధగధగాయమానమైన ఒక మణి ఉన్నదనుకో, అది ఎఱుపు-తెలుపు-నలుపు కాంతి పుంజములను స్వభావ సిద్ధంగా వ్యక్తీకరిస్తోంది కదా! అట్లాగే చిదాకాశముకూడా స్వభావసిద్ధంగా ఈ 'జగత్తు' అనే ప్రదర్శనమును వ్యక్తీకరిస్తోంది. వాస్తవానికి చిదాకాశము యథాతథంగానే ఉన్నది. గాలి గాలిగానే ఉండి తనయందు తరంగములను, వాయుగుండములను వ్యక్తీకరించటం లేదా! ఇదీ అట్టిదే!

వాస్తవానికి పరమాత్మ ఏమియు చేయటంలేదు. యథాతథమయ్యే ఉంటున్నారు. తన యొక్క చిన్మాత్రస్వరూపమును త్యజించటమే లేదు. వాయువు తరంగత్వం ప్రదర్శించేటప్పుడు తన యొక్క వాయుత్వం కోల్పోతోందా? లేదే! పైగా, 'తరంగత్వం' అనునది వాయువు యొక్క స్వభావమే అయి ఉన్నదికదా!

కాబట్టి, సూక్ష్మమగు 'మానసిక రూపం' గాని, స్థూలమగు 'భూతల రూపం' గాని యథార్థానికి లేవు. అవి దృష్టి యొక్క దర్శనాచమత్కృతులే సుమా! దృష్టి ఆత్మ నుండి బయల్వెడలుచూ, ఆత్మకు అభిన్నమైయున్నది.

ఆకాశం రూపరహితం. కానీ, ఒక దిక్కువైపుగల ఆకాశమును చూస్తే, ఆ ఆకాశం అర్ధ చంద్రాకార రూపయుక్తంగా కనిపిస్తూ ఉంటుంది. అట్లాగే... చిదాకాశమే భూతల రూపంగా నిరంతరం కనిపిస్తూ ఉంటోంది. నిర్మల చిత్ ఏ స్వభావమాత్ర స్ఫురణ కలిగి ఉంటోందో... ఆ స్ఫురణమే అతి నిర్మలమగు భూమండలంగా కనిపిస్తోంది. కాబట్టి చిదాకాశమే ఇట్లు భేదరూపంగా అజ్ఞానంచేత కనిపిస్తోంది-అని అనక తప్పదు. ఓ రామచంద్రా! ఈ కనబడే భూమి, ఆధార రహితంగా ఉంటున్న భూమండలము-ఈ రెండూ కూడా స్వప్నపురంలాగా మహా చైతన్యం యొక్క స్ఫురణ (లేక) వివర్త రూపము మాత్రమేనయ్యా! ఇదీ చిదాకాశమే! నిరాధారమగు అదీ చిదాకాశమే! అజ్ఞానం చేతనే ఇవి భాసిస్తున్నాయి. జ్ఞానము చేతనో ఇది గాని, అదిగాని ఎచ్చటా లేనేలేవు.

కాబట్టి... ఈ భూత-భవిష్యత్-వర్తమాన కాలములందలి ముల్లోకములలోని సర్వప్రాణికోట్ల యొక్క స్థితి స్వప్నజగత్తు వలె, ఊహా సంకల్పనిర్మిత-నగరము వలె భ్రాంతి మాత్రమే అయి ఉన్నది. అదంతా కూడా 'మనో రాజ్యదశ' వంటిది. అవన్నీ కూడా ఆత్మ సత్తా-అధిష్ఠాన సత్తా రూపములే అయి ఉన్నాయి. అనేక తరంగాలకు-జలమునకు భేదమెక్కడిది?

అందుచేత రామచంద్రా! నేను ఇతఃపూర్వం చెప్పిన జగత్తులను ధారణ చేస్తున్నప్పుడు "ఈ జగత్తులు ఇందలి సమస్త పదార్థములు నేనే" అను ధారణను వహించినవాడనై వాటినన్నిటినీ నా

స్వరూపములుగానే గాంచాను, అనుభవించాను. తత్సమయంలో నిర్వికారమగు ఆత్మయే స్వరూపముగా కలిగినవాడనై ఉన్నాను కూడా!

ఓ ప్రియ రాఘవా! "జనన మరణ రహితము-చిన్మాత్రము" అగు పరమాత్మ తత్త్వమే... అజ్ఞాన దశయందు... తనయొక్క 'శుద్ధాత్మరూపము'ను త్యజించకుండానే... ఈ అనేక భేదములతో కూడిన యథాస్థితమగు చరాచర ప్రపంచమును... 'సద్రూపము' వలె... ధరించుచున్నది. కానీ, జ్ఞానదశయందు అట్లేమీ ధరించకయే ఉన్నది.

❖❖❖

## 35. అహంకార - జగత్తులు చిదాకాశ రూపాలే!

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠ మహర్షీ! మీరు ఇప్పుడేమో జగత్తు యొక్క 'ధారణ' చేస్తూ ప్రేమ-ద్వేషం, సంతోషం-విషాదం, సుఖం-దుఃఖం వంటి ఆయా మానసిక స్థితులన్నీ మీవిగా ధారణచేస్తూ మీ భౌతిక జగత్‌స్వరూపాన్ని మీరే అనుభవిస్తున్నారని చెప్పారు కదా! ఇంతకు ముందు మీరు లోకాలోక పర్వతంపై గల గండశిలలోను, తదితర శిలలలోను, వృక్షములలోను, ఆకులలోను కూడా అనేక అసంఖ్యాక బ్రహ్మాండాలను చూచానని చెప్పారు. ధారణాదృష్టిచే జగత్తు పొందుచున్నప్పుడు కూడా భూమండలంలోని ప్రతి వస్తువులోను అనేక బ్రహ్మాండాలు మీకు కనిపించాయా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఏ దృష్టితో చూస్తుంటే అవియే కనిపిస్తాయి. దృష్టియే సృష్టి సుమా! అందుచేత పృథ్వీధారణా దృష్టి యొక్క విశేషప్రసరణం చేత "అణువణువు అంతర్గత జగత్ సమూహ దృష్టి" అప్పటికి (పృథ్వి ధారణాదృష్టి సమయంలో) ప్రదర్శితమవటం లేదు.

నా యొక్క 'పృథ్వీధారణ' అను చమత్కారంచే... జాగ్రదావస్థ యందలి భూమండల రూపమును, స్వప్నావస్థయందలి భూమండల రూపమును రెండింటినీ పొందసాగాను కదా! అట్లు పొందుచూ 'ఈశ్వర సాక్షి' దృష్టిచే దేనిదేనిని ప్రత్యక్షంగా అనుభవించానో ఆ వివరాలు చెపుతాను.

❖

ఆ లోకాలోక పర్వత శిలలో ఎట్లా బ్రహ్మాండములను అవలోకించానో, ఈ పృథ్వి మొదలైన వాటియందు కూడా అనేక జగత్సమూహములు నాకు కనిపిస్తూనే ఉన్నాయి. అయితే రామచంద్రా! 'జగత్‌ధారణ'చే నాకు ప్రాప్తించిన దృశ్యమైనా, ఈ వర్తమానంలో మనిద్దరికీ కనిపిస్తున్న దృశ్యమైనా (లేక) ఇదంతా ద్వైతమయంగా కనిపించవచ్చు గాక! అయినా కూడా ఇదంతా కూడా అద్వైతమగు ప్రశాంత పరమాత్మ స్వరూపమే అయిఉన్నది. ఎందుచేతనంటావా?...

**జగన్తి సన్తి సర్వత్ర, సర్వత్ర బ్రహ్మ సంస్థితమ్ ।**
**సర్వం శూన్యం పరం శాంతం, సర్వమ్ ఆరంభమన్థరమ్ ॥**

ఇక్కడ సర్వత్రా జగత్తులూ ఉన్నాయి. అదే సమయంలో సర్వత్రా బ్రహ్మమే ఉన్నది. ఈ సర్వము దృశ్య శూన్యము-శాంతము అయి ఉన్నది. అదే తరుణంలో సర్వము దృశ్య సహితము, అనేక కార్యరంభములచే వ్యగ్రము కూడా అయి ఉన్నది.

**సర్వత్రైవ అస్తి పృథ్వ్యాధి, స్థూలం, తచ్చ న కించన ।**

**చిద్వ్యోమైవ యథా స్వప్నపురం పరమజాతవత్ ॥**

స్థూలములైన పృథ్వి మొదలైనవి అంతటా నిండి ఉన్నాయి. కానీ వాస్తవానికి అవేవీ లేనే లేవు. అవేవీ ఉత్పన్నమే అయి ఉండలేదు.

**శ్రీరాముడు :** ...!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. యథార్థంగా ఉత్పన్నమే అయి ఉండకపోయినప్పటికీ స్వప్న నగరంలో మనుష్యులు-భవనాలు అనుభవ విషయములుగా అగుచూ ఉండటం లేదా? ఇదీ అంతే! ఇంకొక చమత్కారం కూడా!

**నేహనానాస్తి, నో నానా, న నాస్తిత్వం, నచాస్తితా**

**"అహమ్" ఇత్యేవ నైవాస్తియత్ర, తత్ర కుతో అస్థి కిమ్?**

సముద్రంలో అసంఖ్యాక జలబిందువులు-తరంగాలు లేస్తున్నాయి. ఇంతలోనే కనబడకుండా పోతున్నాయి. మహా సముద్రంలో ఒక తరంగానికి ఉనికి ఎక్కడ? ఉత్పత్తి ఎక్కడ? వినాశన మెక్కడ? జలమునకు వేరైనది మహాసముద్రంలో (తరంగరూపంగా) ఎక్కడ ఉనికిని పొందుతోంది? అట్లాగే, ఇక్కడ ఏకమూ లేదు, అనేకమూ లేదు. అస్తిత్వమూ లేదు, నాస్తిత్వమూ లేదు. ఆ ఏక-అనేకముల అభిమానియగు 'నేను' అనబడు అహంకారమే మొట్టమొదట లేదు. 'నేను' అనబడుదాని వాస్తవరూపం బ్రహ్మమే! ఇక అట్టి అహంకారమునకు (నేను-అనుదానికి) అనుభవమయ్యే తదితర విషయ సమూహముల గురించి మనం వేరుగా చెప్పుకునే దేమున్నది? ఘనీభూతమై అనుభవమగు చున్నప్పటికీ ఈ 'నేను' మొదలైన రూపములు వాస్తవానికి లేవు. ఒకవేళ ఉన్నాయని అనుకుంటే, అప్పుడు వాటియొక్క రూపం 'నిరామయము-అజము-అప్రమేయము అగు బ్రహ్మమే అయి ఉన్నది. సృష్టికి ముందు ఈ అహంకారము-జగత్తు మొదలైనవి చిదాకాశరూపమే అయి ఉన్నాయి. వాయు తరంగత్వానికి పూర్వం ఆ తరంగం వాయురూపమే అయి ఉన్నది కదా! సృష్టి యొక్క అనంతరం ఈ అహంకార-జగత్తులు చిదాకాశరూపమే సంతరించుకోబోతున్నాయి. ఏదైతే మొట్టమొదట-చిట్టచివర చిదాకాశమే అయి ఉండుచుండగా, ఇక మధ్యలో కనిపించేదంతా స్వప్న పురము వంటిది కాక మరేమిటి? స్వప్న చైతన్యంలోనుంచి స్వప్నదృశ్యం బయల్వెడలి తిరిగి అదంతా స్వప్నచైతన్యంలోనే లయం అగుచున్నట్లుగా... ఈ జాగ్రత్ చైతన్యంలోంచి సంకల్పరూపంగా బయల్వెడలిన అహంకార-జగత్ అనుభవపరంపరంతా తిరిగి జాగ్రత్ చైతన్యంలోనే లయం కాబోవుచున్నది. కనుక అద్దాని యొక్క (అహంకారము-జగత్తుల)... 'ఉన్నది-లేదు' అనే ప్రసక్తి ఎక్కడిది? స్వప్నంలోని నగరం స్వప్నంలో ఉన్నవానికి ఉన్నది. ఆ స్వప్నము గురించి సంభాషించే మనకు లేదు. జగత్తు-అహంకారము అజ్ఞాన దృష్టికి కనబడుచున్నాయి. ఆత్మానుభవదృష్టికి స్వప్నతుల్యమగుచున్నాయి.

❖❖❖

# 35. అహమ్ జలతత్త్వమస్మి! అహమ్ రసతత్త్వమస్మి!

పృథ్వీధారణారూపిగా అయి ఆ విధంగా అనేక జగత్తులు వీక్షించాను కదా! ఆ తర్వాత జలరూపమును ధరించాను. అట్టి జలరూపధారణచే మరల అనేక జగత్తులు చూచాను. వాస్తవానికి 'చిద్రూపుడను' గానే ఉండి ఉన్నప్పటికీ జలరూపం పొంది 'సముద్రం' అనే మందిరంలో ప్రవేశించి 'గుల్-జల్' శబ్దముల ఉచ్చారణ చేశాను. తలలో పేను వసించునట్లుగా నేను చెట్లు-పూలు-ఆకులలో వాటి వాటి వలయాది ఆకారములలో రసరూపంగా విశ్రమించి కాలక్రమంగా పరిపుష్టమగు ఆకులలో నాడీ సమూహాన్ని రచించాను. జలంలోని రసరూపం ధరించిన నేను ఆ జలం త్రాగిన ప్రాణుల హృదయాలలో ప్రవేశించాను. వాత-పిత్తాది ధాతువులను స్పృశించాను. ఒకచోట వికలత్వం పొందాను. ఇంకొక చోట ఖండనం చేశాను. మంచు కణములను అధిరోహించి శయనించాను. ఒక్కొక్కసారి దీర్ఘమైన ప్రవాహంగా పయనించి, శ్రమించి ఆనకట్ట యొక్క స్పర్శచే విశ్రాంతి తీసుకున్నాను. అప్పుడప్పుడు నా యొక్క చైతన్య రూపమును మరచి ఆ ఆవర్తములలో అనేక భ్రమలకు లోనయ్యాను. "అందుకు ప్రాయశ్చిత్తార్థమా?" అన్నట్లుగా అక్కడక్కడ గోతులలోను, నూతుల ప్రక్కల పడి శిథిలమైపోయాను. పర్వత శిఖరాలపై నుండి క్రింది సెలయేరులోకి జారి పడి అనేక విభాగాలుగా చీలిపోయాను. అప్పుడప్పుడు ఆవిరిగా మారి ఆకాశంలో ప్రవేశించగా నక్షత్రములు నాకు మణిభూషణములుగా అయినట్లు కనిపించాయి. మేఘపీఠములలోంచి మరల విద్యుత్ స్పర్శచే జలబిందువులుగా మారి నేలకు చేరాను. జలస్వరూప ధారణచే నేను పిపీలీకము (చీమ) వంటి చిన్నచిన్న జీవుల సూక్ష్మనాడులలో కూడా ప్రవేశించి అక్కడి జలముతో ఏకం అయ్యాను. మధుర పానీయముల రూపం ధరించి జిహ్వ యొక్క పరమాణువులలో ప్రవేశించి జిహ్వకు ఉత్తమానుభవమును సాక్షాత్కరింపజేశాను. ఆ అనుభవమంతా జ్ఞానరూపమగు మనో బుద్ధులచే దర్శించాను కానీ... దేహ స్వరూపంగా కాదు. వాస్తవానికి, 'విషయం' (లేక) దృశ్యం అనేది ఆనంద రూపం కాదు. అందులో ఆత్మ సుఖం యొక్క లేశమైనా లభించదు. మనస్సే విషయం యొక్క రూపానికి ఆధారమై ఉన్నది. అయితే, ఈ మనస్సు ఎద్దానినైతే విషయరూపంగా ప్రకాశింపజేస్తోందో... అట్టిదంతా అసత్తున్ను, జీవులను వ్యామోహపరచేదీ అయి ఉన్నది. ఆత్మ మనస్సును స్వస్వరూపచమత్కారంగా సందర్శిస్తున్నప్పుడు మాత్రమే ఈ సర్వం ఆత్మానంద దరహాసమై అనుభవం కాగలదు.

❖

జలరూపినై నాయందలి 'నాచు' మొదలైన ఉచ్ఛిష్టములను తుమ్మెదలకు ఆహారంగా ఇచ్చి వేశాను. సర్వ ఋతువుల యొక్క రసరూపంగా గాలిలో ప్రవేశించి జలరూపంలో 14 విధములగు జీవుల అవయవముల సంధులలో ప్రవేశించి అక్కడ వసించాను. మరికొన్ని సమయములలో జలకణ రూపధారినయి వాయు తరంగములను అధిరోహించి నిర్మలాకాశమార్గంలో విహరిస్తూ జనులకు సుంగధ సుఖములను అందిస్తూ, ఆహ్లాదపరుస్తూ సంచారం చేశాను.

ఓ రామచంద్రా! ఆ సమయంలో 'పరమాణువు' లో కూడా ప్రవేశించి, అందులో గల వివిధ జగత్తులను అనుభవించాను. వాస్తవానికి సమస్త పదార్థముల అభ్యంతరమును ఎరుగునట్టి "జ్ఞాత-చిద్రూపుడను" అయి ఉండి కూడా 'జలధారణ'చే అజ్ఞాతం వలె అనేక చోట్ల స్థితిని పొందాను. ఆయా చోట్ల అనేక కోట్ల బ్రహ్మాండాల ఆవిర్భావం, తిరోభావం కూడా కాకతాళీయంగా దర్శించటం జరిగింది.

ఈ ప్రకారంగా అనేక జగత్తులు చూచాను. కానీ, వాటి భావము-అభావము-సాకారము-నిరాకారము ఇవన్నీ కూడా ఆకాశము కంటే అతి నిర్మలమగు చిదాకాశమే అయి ఉన్నాయి. ఓ రామచంద్రా! జాగ్రత్-స్వప్న-సుషుప్తులనబడే అవస్థాత్రయం గాని, ఈ దేహ-ఇంద్రియ బాహ్యప్రపంచముగాని-ఇవన్నీ కూడా వాస్తవానికి ఆత్మ దృష్ట్యా ఒకింతైనా కూడా లేకయే ఉన్నాయి. ఆ ఆత్మ చైతన్యము దృశ్య స్వభావం కాదు, అదృశ్య స్వభావం కాదు. దృశ్యాదృశ్య స్వభావం కూడా కాదు. అది అఖండాకాశరూపమే అయి ఉన్నది.

**తత్ త్వమ్ అసి!** - అదియే నీవు. (తత్త్వమ్)

**సోఽహమస్మి! తదితరమపి తదేవ!** - నేను అదియే! తదితరులందరి రూపం అదియే!

❖

కాబట్టి రామచంద్రా! "అఖండవాక్యార్థబోధ" చే సమస్త ద్వైతమును దాటివేయి. సర్వదా శుద్ధ చిదాకాశరూపుడవై ఉండు.

❖❖❖

# 36. తేజోరూప ధారణ (అహమ్ తేజోరూపమస్మి)

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా పృథ్వీ రూపధారణ, జల-రసరూప ధారణ నిర్వర్తించిన నేను తేజోరూపాన్ని ధరించి సంచరించనారంభించాను. "సూర్య-చంద్ర-నక్షత్రాల అవయవ యుక్తమగు తేజస్సే నేను" అను అనుభూతిని ఆశ్రయించి... అట్లే అయ్యాను. సత్వ ప్రధానుడనై సమస్త జగత్తునందు గల తేజము నేనే అయ్యాను. రాజుయొక్క కీర్తి అనేక గృహములలో కీర్తించబడునట్లు, అనేక ఇండ్లలోని దీపముల వెలుగునై గృహములలోని అనేక వస్తువులను ప్రకాశింపజేయసాగాను. సూర్యచంద్ర కిరణాలలో ప్రవేశించి అనేక జీవుల దృష్టిని పులకింప జేయసాగాను. పదార్థముల రూపాలను మరుగున పరిచి ఉంచే అంధకారాన్ని పటాపంచలు చేయసాగాను. సువర్ణంలోని మెఱుపురూపినయ్యాను. మాణిక్య-ముత్యములలోని తేజోపుంజాలుగా అయ్యాను. ఆ నా తేజముచే పాతాళాది అధోలోకములను కొంచెం ప్రకాశింప జేశాను. అవి స్వతహాగా తమోలోకములు కదా! భూలోకమును సగం ప్రకాశింపజేశాను. సూర్య-చంద్ర-నక్షత్ర-దేహాది అనేక విషయములను ఇముడ్చుకొన్న తేజో మహాసముద్రమే నేనయ్యాను. ధాతువులలో లోహత్వము, మనుజాదులలో పరాక్రమము, రత్నాదులలో కాంతి, వర్షాదులలో విద్యుత్ప్రకాశము, నేత్రములలో దృశ్యత్వము, స్నేహత్వము, హాస్యత్వము, శృంగారత్వము-ఇవన్నీ తేజోరూపమే కాబట్టి వీటినన్నిటికీ కారణభూతుడనై ఉండసాగాను. అంతేకాకుండా యోధులందరి వీర్యత్వము, దేవత

లందలి వరప్రదానత్వము, అసురులందలి దేవతా శత్రుత్వము, సర్వజీవులందలి బలము, స్థావరము లందలి ఉన్నత రూపత్వము–నా స్వరూపముగా అనుభవం పొందసాగాను. "అవన్నీ నావే... నేనే" ...అను అనుభూతిని పొందసాగాను. ఇంకా మరుభూమి (ఎడారి) లో నదులు (ఎండమావులు) కనిపించునట్లుగా "నేను సూర్య స్వరూపుడను" ...అనే అనుభవం ద్వారా దశదిక్కులలో నా కిరణాలతో వ్యాపించినవాడనై 'జగత్తు' అనే పక్షిని పట్టుకొనినవాడివలె అయ్యాను. చంద్రబింబమును కిరణస్పర్శచే ప్రకాశింపజేసి, తద్వారా వృక్షములకు రసస్ఫూర్తిని ప్రసాదించుచున్నవాడనై ప్రకాశించాను. ఆకాశమునందు నక్షత్ర స్వరూపుడనై జగత్తు అనే గ్రహానికి అలంకార రూపుడ నైనాను. సముద్ర గర్భంలోను, వర్తకుల త్రాసులలోనూ ప్రకాశించే రత్నముల కాంతిపుంజములు నేనయ్యాను. సముద్రగర్భంగా నా అగ్ని స్వరూపాన్ని చూచి భీతిల్లి పరిభ్రమిస్తున్న సముద్ర గర్భ (తిమింగలములు మొదలైన) జీవులను చూచి వినోదించాను. సూర్య కిరణ స్వరూపుడనై దేహధారుల దేహములను స్పర్శిస్తూ, పరవశం పొందాను. మేఘ–పర్వతాలలో ప్రవేశించి అక్కడక్కడ విద్యుత్–దావానల రూపం అనుభవించాను. అగ్నిరూపం పొంది కట్టెల నుజ్వలింపజేస్తూ సుందర దేహములను భస్మీభూతం చేశాను. యజ్ఞవాటికలో ప్రవేశించి హవిస్సులను మంత్ర ముగ్ధంగా దహింపజేశాను. కొన్ని గృహములను దహించి ఆ కుటుంబ సభ్యులను దుఃఖితులుగా చేశాను. మానవ–నాగ–గంధర్వ–అసుర స్త్రీల స్తనములపై ముత్యములలోని కాంతిపుంజములుగా తేలియాడాను. మిణుగుఋపురుగు రూపం ధరించి స్త్రీల ముఖములను స్పర్శిస్తూ ఇంతలోనే బాటసారుల పాదప్రహారానికి గురి అయ్యాను. ఇట్లు అనేక ఉన్నత–అవనత స్థితులను పొంద సాగాను. దేహగృహంలో దేవతా స్త్రీల సుందరదేహములను దర్శించాను. ఒకచోట జ్వాలారూపినై సువర్ణము–ఇనుము మొదలైన లోహములను ఖండనం చేయసాగాను. మరొకచోట కల్పాంతాగ్ని రూపం ధరించి ప్రళయ సమయంలో జగత్తును భస్మీభూతం చేసి ఆకాశమున మేఘరూపంతో కప్పివేశాను. మరొకచోట బడబాగ్ని రూపంలో సముద్ర జలమంతా త్రాగివేసి ఆ శూన్య ప్రదేశంలో నృత్యం చేశాను. అగ్నిరూపం ధరించి అనేక జీవరాశుల దేహాలను పొట్టన పెట్టుకున్నాను. ఇంకొక చోట లోహమును ఆశ్రయించి కమ్మరి యొక్క సమ్మెట ప్రహారములు స్వీకరిస్తూ అగ్ని కణముల రూపంలో నలువైపులా వెదజల్లబడ్డాను. మరొకచోట వజ్ర–వైడూర్యాది రూపము ధరించి ఎక్కడో భూగర్భంలో ఉండిపోయి ఏ ప్రాణికీ కనబడకుండా యుగములు గడిపివేశాను.

**శ్రీరాముడు :** మానప్రదుడగు ఓ మునీంద్రా! ఇక్కడ నాదొక చిన్న సందేహం. తేజోరూపియై అనేక అనుభవములను పొందినట్టి మీరు సుఖమును అనుభవించారా? లేక దుఖమును పొందారా? ఈ విషయం బోధ కొరకై చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! ఒక మనుజుడు చేతనరూపుడే అయిఉండి కూడా గాఢ నిద్రాసమయంలో జడత్వమును పొందుచున్నాడు కదా! అట్లాగే చిదాకాశము అన్యమగు ఆయా స్వరూపాదులను అనుభవించటం జరుగుతోంది. ఎప్పుడైతే బ్రహ్మము తనను తాను 'పృథ్వి' మొదలైన రూపములుగా అనుభవించనారంభిస్తుందో.... ఆ మరుక్షణం సుషుప్తునివలె, జడునివలె

తనయందు ఉంటుంది. అయినా కూడా బ్రహ్మము ఏ క్షణమందు కూడా మరొక స్థానం గాని, రూపంగాని పొందటంలేదు. అటువంటప్పుడు ఇక దానికి దుఃఖ ప్రసంగం ఎక్కడిది? వాస్తవానికి ఈ ఆకాశము-పృథ్వి-జలము-తేజస్సు మొదలైనవన్నీ అద్దాని సద్రూపములే గాని అసద్రూపములు కావు. బ్రహ్మము సర్వదా అవికారముగానే ఉంటోంది. అట్లా ఉంటూ, అయ్యది ద్రష్ట-దృశ్యములను ప్రకాశింపజేయుచు ప్రకాశించుచున్నది.

**ఏతత్ సత్యపరిజ్ఞానం యస్య ఉత్పన్నమ్ అఖండితమ్**
**న తస్య పంచభూతాని న దృశ్య - ద్రష్టృ విభ్రమః ॥**

ఇట్టి సత్యమగు 'అఖండజ్ఞానం' ఎవనికి ఉత్పన్నం అవుతుందో... వానికిక పంచభూతములు ఉండవు. ద్రష్ట-దృశ్యముల గురించిన భ్రమ ఉండదు.

❖

కనుక రామచంద్రా! ఆ సమయంలో శుద్ధమగు బ్రహ్మరూపముచేతనే అదంతా నేను అనుభవించటం జరిగింది. ఎందుకంటావేమో? ఎవరికైనా ఎక్కడైనా ఏదైనా అనుభవించబడాలంటే అయ్యది బ్రహ్మ స్వరూపం అయితేనే సాధ్యం. దృశ్యమంతా కూడా నాకు బ్రహ్మరూపంగానే కన్పట్టుచూ, బ్రహ్మానుభవంగానే అగుచున్నది. అట్లా కాకుండా ఎప్పుడైనా నన్ను నేను పంచ భూతాలుగానో, దేహము-శిల మొదలైన రూపముగానో గాంచటం జరిగిందే అనుకో! అప్పుడు? అప్పుడు నేను సర్వదా జడుడనే అవుతాను. జడమైనదానికి అనుభవమేమున్నది? స్మరణ ఎక్కడ నుండి వస్తుంది? కనుక ఓ సభికులారా! 'అనుభవము' అనునది ఉన్న కారణంగా మీరంతా కూడా నా వలెనే బ్రహ్మమే స్వరూపంగా కలిగి ఉన్నారని గ్రహించండి. నావలె తత్త్వ సందర్శనం చేయగల సామర్థ్యం కలిగియే ఉన్నారు. అంతేగాని, ఈ దృశ్యత్వం-ద్రష్టత్వం అనేది వాస్తవం కాదు. అవన్నీ ఉన్నప్పుడు కూడా ఆత్మానుభవం నుండి చ్యుతి పొందకయే ఉండండి. అచ్యుతులై ప్రకాశించండి!

**శ్రీరాముడు :** స్వామీ! ఎక్కడ బ్రహ్మము ఉంటే అక్కడ 'అనుభవము' 'స్మరణ' ఉంటాయని అంటున్నారు కదా! గాఢనిద్రా స్థితిలో ఈ జీవునికి అనుభవము స్మరణలు ఉండవు కదా! అనగా ఈ జీవుడు జడత్వము సంతరించుకున్నట్లా? ఆ సమయంలో కూడా అతడు చైతన్యరూపమగు బ్రహ్మమేనని అనవచ్చునా? అనకూడదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :**

**'సుప్తోఽస్మి' ఇతి దృఢంభావం బుద్ధవాన్ చేతనోఽపిసన్**
**నైద్రమేవైత్యలం జాడ్యం లసచ్చేతతి కిం చ న ॥**

గాఢ నిద్రలో కూడా 'నేను నిద్రపోతున్నాను' అని మనం ఎఱుగుచున్నాం కదా! ఎఱుగుచున్నాం కాబట్టే మెలకువరాగానే "ఆహా! మంచి నిద్రపోయానండి" అని చెప్పగలుగుచున్నాం. అనగా నిద్రపోతున్నప్పుడు కూడా అప్పటి అజ్ఞానమును (ఈ జాగ్రత్‌ను ఎఱుగుచున్నట్లే) స్వప్రకాశమగు ఆత్మ ఎఱుగుచునే ఉన్నది.

ఎవడైతే జ్ఞానంచే ప్రబుద్ధుడు అవుతాడో... అతడు తన ఈ ఆధిభౌతిక దేహమును శమింప జేసుకున్నవాడై నిర్మల బోధరూపమగు సూక్ష్మ దేహమున ఉదయించినవాడు అగుచున్నాడు.

ఆ సూక్ష్మ దేహమును, 'అనురూప శరీరం' (లేక) 'మహచ్ఛరీరం' అని కూడా అంటున్నాం. అట్టి జ్ఞానమయమగు సూక్ష్మమైనట్టి అనురూప శరీరంచేత, (లేక) మహమచ్ఛరీరం చేత యోగి అగు జీవన్ముక్తుడు తన ఇచ్ఛానుసారంగా మెలగుచూ ఉంటాడు. బోధరూపమగు నిర్మల సూక్ష్మ దేహంచే అట్టి జీవుడు అభేద్యములైన శిలా గర్భంలో ప్రవేశించి మరల బయల్వెడలగలడు. ఇంకా పాతాళమునందలి ఆకాశమును కూడా పొందగలడు. అందుచేతనే నేను అప్పుడు అనంతము-చిదాకాశ వాయువు-తేజము మొదలైన రూపాలన్నీ ధరించి అనుభవించాను. ఎందుకంటే చిత్స్వరూపమగు ఆత్మకు వజ్ర-శిల-పాతాళ-ఆకాశ-స్వర్గాదులందు శీఘ్రంగా రాకపోకలు నిర్వర్తించ గలగటంలో అడ్డుపడగలిగినదేమున్నది? అయితే, ఆత్మ... బోధమాత్ర శరీరముచే జడపదార్థములందు ఎంత వరకు ఉంటుందో... అంత వరకు అట్టి రూపముతోటే స్థితి కలిగి ఉంటుంది. అది ఎప్పుడు తన ఇచ్ఛచే మరొక చోటికి వెళ్ళదలచుకుంటుందో... అచ్చట 'చలనము' మొదలైన క్రియాశ్రమ లేకుండానే అప్పటికప్పుడు వెలయగలదు. ఎందుకంటే ఆత్మకు గమన-ఆగమనములు (పోక-రాకలు) కూడా 'స్థితి' వంటిదే! ఈ దేహములాగా "ఇక్కడికి రావటం-అక్కడికి పోవటం"... వంటివి కాదు.

**బోధమాత్రం విదుర్దేహమ్ అతివాహికమ్ అవ్యయమ్ ।**
**ఇదానీం త్వం తమేవ ఇహ బుధో అనుభవసి స్వయమ్ ॥**

బుద్ధిశాలివగు రామచంద్రా! బోధమాత్రమునే (నిర్విషయమగు ఎఱుక స్వరూపమునే) శాస్త్రములు అవ్యయమగు 'అతివాహిక దేహం' అని, 'సూక్ష్మ శరీరం' అని కూడా అంటున్నాయి. నీవు అనుకోవాలేగాని ఇచ్చటే, ఇప్పుడే అతివాహిక దేహం యొక్క ధారణలచే జగద్రూపమును (అనగా నీ యొక్క దేహము/ రూపం ఈ జగత్తంతా అయినట్లు) నా వలెనే అనుభవం పొందగలవు. ఓ సభికులారా! ఓ తదితర ప్రియ ముక్షువులారా! మీలో ఎవరైతే 'నా యొక్క స్వరూపము సర్వదా ఈ దేహారంభ-దేహాంతములచే స్పర్శించబడని అప్రమేయ-కేవల సాక్షీ స్వరూపమే అయి ఉన్నది. అట్టి నా స్వరూపము విషయములకు, వృత్తులకు, ఇంద్రియ విశేషములకు సంబంధించనిది' అను అవగాహనచే సూక్ష్మ దేహము అను వాహనం ధరిస్తారో... అప్పుడిక నా వలెనే జగత్ స్వరూప ధారణ తప్పక సుసాధ్యమేనని గ్రహించి ఉండండి. మీరు తత్త్వజ్ఞులయ్యెదరు గాక! తత్త్వజ్ఞులు బోధచే "సూర్యాదులందు నేను కేవలం చిన్మాత్రాకాశ రూపుడనై ఉన్నాను" అని మొట్టమొదట గ్రహిస్తున్నారు. "నేను ఈ కనబడే సర్వ సహజీవులలోను చిన్మాత్రాకాశ రూపుడనై ఉండనే ఉన్నాను" ...అను అనుభవమును పుణికి పుచ్చుకుంటున్నారు. ఆ తర్వాత వారు తమ ఇచ్ఛచే సూర్యుడు మొదలైన సమస్త జగత్తును అస్తమింపజేసి అద్దానినంతా (తదితర సహజీవులందరితో సహా) 'కేవలీ ఆత్మత్వము' తోటి స్థాపింపజేయుటలో శక్తులై ఉంటున్నారు. అప్పుడు ఈ జగత్తు ఇట్లే వారికీ విద్య మానమై ఉన్నప్పటికీ... ఇదంతా ద్రష్ట-దృశ్యరహితమగు ఆత్మ స్వరూపంగా అగుపించుచున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! జ్ఞానికి ఈ జాగ్రత్ జగత్తు ఎట్లా కనిపిస్తుంది? అజ్ఞానికి ఎట్లా కనిపిస్తుంది? వేర్వేరుగానా? ఒక్కతీరుగానా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** మన స్నేహితుడొకడు మన ప్రక్కనే నిద్రిస్తూ స్వప్నం కంటున్నాడనుకో... మన యొక్క (జాగ్రత్) దృష్టికి ఆ మన నిదురిస్తూ స్వప్నం కంటున్నట్టి స్నేహితుని స్వప్నజగత్తు అసత్తుల్యమే కదా! అదంతా మన దృష్టిలో అజ్ఞానావృతమగుటచే "అసత్తు-శూన్యము-మెలకువగా ఉన్నవానికి అలభ్యము" అని మనకి అనిపిస్తుంది కదా! కాని ఆ స్వప్నద్రష్టకు స్వప్నం సత్యంగానే ఉంటోంది. అట్లాగే జ్ఞాని యొక్క దృష్టి యందు (అజ్ఞానికి) నానా విధములుగా, సత్యముగా నిత్యముగా కనిపించే ఈ జాగ్రత్ జగత్తు కేవలం అసత్తే అయి ఉన్నది. ఒకడు తన మనోరాజ్యములో కనిపించిన అగ్ని తన దేహమును స్పర్శిస్తున్నట్లుగా ఊహించు చున్నప్పటికీ, అతని భౌతిక దేహం ఆ ఊహాకల్పిత అగ్నిచే తాకబడక యథాతథంగా ఉంటుంది కదా! అట్లాగే కొంచెం ఇచ్ఛచేత నేను శిల-అగ్ని-వాయు-జల పూర్వక ధారణ పొందుచున్నప్పటికీ... నాకేమి దుఃఖాదులు ఏమాత్రం కలుగనే లేదు. ఏ జీవుడైనా ఏది ఎట్లున్నప్పటికీ "నేను సర్వాత్మకము-నిత్య నిర్మలము-భావాతీతము-త్రిగుణాతీతము అగు ఆత్మ స్వరూపుడను. తదితర జీవులు-జగత్తులు నా యొక్క విభూదియే, విభాగమే"... అను ఆత్మజ్ఞానమును సుస్థిరీకరించుకొని ఉంటాడో-ఇక ఈ దుఃఖాదులు - తామరాకును నీరు అంటనట్లుగా - అతనిని స్పృశించనేలేవు.

ఓ రామచంద్రా! ఈ విధంగా తేజోదశ (లేక) అగ్ని రూపము పొందిన నేను ఇట్లు అనేక దేహాలలో ప్రవేశించి పరిరక్షణ-సంహారములను నిర్వర్తించాను. అనేక అరణ్యాలను దావానల స్వరూపుడనై దహించాను. దుష్టుల ఐశ్వర్యంలాగా అనేకసార్లు చంచల జ్వాలలతో ప్రవృద్ధమవటం-ఇంతలోనే ఉపశమించటం అనుభ వించాను. అట్టి నా సుదీర్ఘ సంచార సంరంభంతో పరమాణువులో కూడా ప్రవేశించి అక్కడ అనేక జగత్తుల ఉత్పత్తి-ఉనికి-వినాశనములను చవిచూచాను. సాక్షినై సందర్శించాను.

ఆ జగత్తులు, ఆ యానము-అంతా చిదాకాశము మాత్రమే. ఈ కనబడే వర్తమాన జగత్తే కూడా చిదాకాశమే! ఇందులోని వస్తువులు, సంఘటనలు, జీవులు, జడములు, రాకలు, పోకలు, ఉత్పత్తులు, వినాశనములు, నేను, నీవు, లోకములు, భూత-భవిష్యత్-వర్తమాన కాలమాన పరిస్థితులు-ఇవన్నీ "చిదాకాశమే చిదాకాశమున ఇట్లు కన్పట్టటం" అని గ్రహించు.

ఓ జనులారా! "అదేమిటి? ఇక్కడ వస్తువులు-విషయములు-సుఖములు-దుఃఖములు-బంధువులు-తదితరులు-ఆర్థిక సామాజిక స్థితిగతులు ఇవన్నీ జగత్తులో తారసపడుచుండగా-చిదాకాశమే ఇదంతా-అనునది ఎట్లా కుదిరేది?"-అని అంటారా?

ఇందుకు "స్వప్నద్రష్ట నుండి బయల్వెడలి, స్వప్న ద్రష్టలోనే ఉంటూ, స్వప్న ద్రష్టలోనే లయ మొందుచున్న అనేక వృత్తాంత పరంపరలు కలిగి ఉంటున్న స్వప్నజగత్తే" మనందరికీ దృష్టాంతం.

❖❖❖

# 38. వాయు స్వరూప ధారణ (అహమ్ వాయురూపమస్మి)

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ విధంగా పృథ్వీ రూపధారణ, జలరూపధారణ, తేజోరూపధారణ అవధరించి అనేక జగత్తులను సందర్శించిన తర్వాత కూడా ఇంకా "ఈ జగత్ వ్యవహార పరంపరను సందర్శించాలి. పరామర్శించి రావాలి!" అనే కుతూహలం నాలో కొనసాగుతూనే ఉండసాగింది. అందుచేత తేజోరూపధారణ నుండి 'వాయు స్వరూపుడను' అను ధారణను ఆశ్రయించాను. మరుక్షణం వాయురూపినై వాయువు ఉన్నంత వరకు విస్తరించిన దేహస్వరూపుడనైనాను. లతలను, దేహుల ముఖములను, పుష్పములను, సుగంధములను పరిపాలించసాగాను. అనేక చోట్లకు ప్రసరిస్తూ కొన్ని చోట్ల మంచు బిందువులను లీలావినోదంగా హరించాను. మత్తు పానీయములు త్రాగి విశ్రమించిన జీవుల సర్వాంగములను స్పృశిస్తూ మరింతగా ఆహ్లాదపరచాను. అతి నేర్పరితనంతో పూలతలను నాట్యమాడించాను. ఓషధి-లత-ఫలాదులను ఉల్లాసంగా స్పృశించి ఆనందించాను. పుష్ప సుగంధములను నా వాయు దేహముపై అలంకారముగా ధరించాను. మంగళ సమయంలో శీతల-సుందర-సుగంధములచే స్త్రీలకు ప్రీతి జనకమై ప్రవర్తించిన నేనే వినాశనసమయంలో భయంకర రూపమును ధరించి దృఢపర్వతములను కూడా ఎండుటాకులవలె పెల్లగించి మరీ ఆకాశంలోకి విసిరాను.

నా వాయు స్వరూపమునకు రంగు అంటూ ఏదీ లేకపోయినప్పటికీ స్వర్గంలోని నందనవనంపై ప్రసరిస్తూ అక్కడి మందారకుసుమములచే ఎఱుపురంగును సంతరించుకున్నాను. నరకలోకంలో ప్రవేశించినప్పుడు అక్కడి అగ్ని సమూహముల నుండి బయల్వెడలిన పొగను వెంటనిడుకొని నల్లగా కనిపించసాగాను. సముద్రపు అలలపై సుతారముగా విహరించాను. అప్పుడప్పుడు ప్రకాశమానుడగు మేఘములను మోసుకువచ్చి చంద్రబింబమును కప్పివేశాను. మరొకప్పుడు నా ప్రసరణ శక్తిచే ఆ మేఘములను తొలగిస్తూ చంద్రుని ప్రకాశమానునిగా కూడా చేశాను. నక్షత్రములను కదిలేటట్లు చేశాను. ముల్లోకములలోని సిద్ధులు విమానాలను అధిరోహించి సంచరించుటకై బయల్వెడలుచుండగా, వారి విమానములు ప్రయాణించుటకై అనుకూలంగా వాయు వీచికలను ప్రసరింపజేశాను.

ఈ చిత్తము వలెనే శీఘ్రగామినై అటు నుండి ఇటు, ఇటు నుండి అటు సంచరించసాగాను. అవయవములు లేకపోయినప్పటికీ సర్వుల అవయవములు నావే అయ్యాయి. నా శ్రమను మఱచి ఇతరుల శ్రమ పోగొట్టాను. చంద్రకిరణములలోని అమృతమును గ్రోలి తిరిగి ఆ రసమును భూమిలో ప్రవేశింపజేశాను. మేఘములను అధిరోహించి ఊయల ఊగాను. దంపతుల ముఖములను స్పృశించి వారికి కలిగిన రతిశ్రమను తొలగించాను. రహదారిపై వేగంగా ప్రసరించి అక్కడి ధూళితో ఆకాశమును కప్పి క్రమంగా ఆ ధూళిని గృహద్వారముల గుండా గృహములలో ప్రసరింపజేశాను.

సంగీత వాద్యములలో ప్రవేశించి అనేక సంగీత శబ్దములను పలికాను. జలకణములను అభరణములుగా ధరించాను. కొన్నిచోట్ల ధూళిని తొలగించి ఆ ధూళికి శత్రువువలె అయ్యాను. పుష్పములలోని పుప్పొడిని నలువైపులా వెదజల్లి తద్వారా 'జీవులను సుఖింపజేయటం' అను పుణ్యక్రియకు కారణమైనాను.

ప్రాణుల యొక్క అంగ-ఉపాంగములందు వర్తించుచు అక్కడి నాడీ మండలమునకు ప్రేరణ కలిగించాను. ప్రాణరూపినై జీవుల 'హృదయములు' అనే మర్మస్థానములను 'స్పందన'ను ప్రేరేపించి జీవులు జీవించటానికి కారణభూతుడనైనాను.

యోగుల ధారణశక్తికి, సహకరిస్తూ వారి ఆయా చక్రస్థానములలో ప్రతిక్షేపించబడినవాడినై, తద్వారా వారి అధ్యాత్మయానానికి సహకారం అందించాను. నిత్యము ఏకాంతంగా విహరిస్తూ కొన్ని చోట్ల అగ్నియొక్క ప్రజ్వలనానికి సహకారం అందిస్తూ మరికొన్ని చోట్ల అగ్ని ఆరిపోవటానికి కారణమగుచూ సంచరించాను.

విమానములకు నేను భూమిగా అయ్యాను. సంతాపములు తొలగిస్తూ జీవులకు సుఖమును అందించాను. 'ప్రాణ-అపానకళలు' అనే త్రాళ్ళరూపం ధరించి దేహరూపయంత్ర సంచాలనం నిర్వర్తించాను. సముద్ర తరంగములను నా వేగముచే ఖండించాను. ధూళిని ప్రసరింపజేసి సముద్రంలో ద్వీపములను నిర్మించాను.

మనోరాజ్యమువలె జీవులకు ఎదురుగానే వాయుమహాసముద్రంగా ఉండి వారి కంటికి మాత్రం కనబడకయే ప్రవర్తించసాగాను. తాటియాకు విసనకఱ్ఱలచే కదలించబడి, దేహములకు స్పర్శానుభవమును పొందింపజేశాను. ప్రళయకాలంలో ఒక క్షణమాత్రంలో సమస్త పర్వతములను పెకలించి వేసి సముద్ర మధ్యంలోకి విసరివేశాను.

వివిధ వర్ణములుగల ధూళిని ఆకాశంలో సమావేశపరచి ఆనందించాను. ఎండుగడ్డి పరకలు ఎగిరెగిరి పడటానికి కారణమైనాను. "సూర్యుడు-జలము-మేఘము-వర్షము" అనే యజ్ఞ కార్యక్రమంలో మంత్రోచ్చారణ వలె పాలు పంచుకున్నాను. ఆకాశంలో షికారు చేశాను. దేహయంత్రంలో త్రాణను అయ్యాను. జలములను ఎండింపజేశాను.

1.మేఘములను ధరించటం, 2.తృణములను(గడ్డిపరకలను) కదలించటం, 3.జలాదులను శోషింపజేయటం, 4.గంధమును ధారణ చేయటం, 5.తాపములను హరించటం, 6.నెయ్యి మొదలైన వాటిని పిండీకరించటం (గడ్డ కట్టింపజేయటం) అనే ఈ 6 క్రియలను ప్రళయ సమయం వరకు అవిశ్రాంతంగా నిర్వర్తిస్తూనే ఉన్నాను.

రసాకర్షణ యందు అత్యంత వేగిరం చూపసాగాను. నాడులను ప్రేరేపించటం ద్వారా దేహముల కాళ్ళు-చేతులు కదలటానికి హేతువునయ్యాను. 'శరీరం' అనే నగరంలో నిరాటంకంగా నా ప్రయాణ మార్గాన్ని నిర్మించుకోసాగాను. 'అన్నరసం' పట్టుకొని ప్రాణ-అపానముల ద్వారా దేహమంతా అందించి దేహములను సేవించాను.

శరీరములు ఒకప్పుడు నిర్మించబడటంలోనూ, మరొకప్పుడు నేలకూలటంలోనూ పాత్ర వహించాను. అన్నరసము యొక్క-మలము యొక్క-సూక్ష్మ తరములైన సారభాగముల యొక్క-రక్త మాంసముల యొక్క వాతపిత్తాది ధాతువుల యొక్క సంయోగములందు, వేఱుపరచుటయందు బహుప్రావీణ్యం ప్రదర్శించాను.

ఓ రామచంద్రా! వాయువునందు గల ప్రతి సూక్ష్మాణువు నందు అసంఖ్యాక జగత్తులు నాకు కనిపించాయి. అట్టి ప్రతి జగత్తులోనూ ఇట్లాగే భూమి-ఆకాశం-నక్షత్రాలు మొదలైనవన్నీ అతి విస్తారంగా ఏర్పడి ఉన్నాయి. ఆయా జగత్తులలో కూడా ఇప్పటిదాకా చెప్పినట్లే వాయు స్వరూపధారినై వెలయుచు సంచరించాను. అక్కడ ప్రతి పరమాణువులోనూ సృష్టి సమూహములు చలించుచున్నాయి. కానీ, పరమార్థ దృష్టియందు ఏదీ కూడా చలించకయే ఉన్నది. ఎందుకంటావా? దృశ్యశూన్యాకారమగు పరబ్రహ్మము నందు దేనికి గమనాగమనములు ఉంటాయి?

ఓ రామచంద్రా! మరల చెప్పుచున్నాను. చంద్ర-సూర్య-వాయు-అగ్ని-ఇంద్ర-వరుణ-కుబేరాది దేవతలతోను, బ్రహ్మ-విష్ణు-మహేశ్వర-గంధర్వ-విద్యాధర-మహాసర్పములతోను, సముద్ర-పృథ్వి-పర్వత-ద్వీప-ఆకాశ-మహాసముద్ర-లోకాంతర-లోకేశులతోడను, క్రియా-కాల-కళాదుల క్రమముతోను, స్వర్గ-భూమి-పాతాళ-తదితర లోకాంతరములతోను, భావ-అభావ-వృద్ధి-క్షయ-జన్మ-జరా-మరణ విభ్రమ ములతోను కూడిన అనేక జగత్తులు ప్రతి పరమాణువులోను ఉన్నాయి. నాకు కనిపించాయి. నాకు కనిపిస్తున్నాయి. ఈ బ్రహ్మాండములు ఎందులో జనించి నశిస్తున్నాయో, అట్టి స్వస్వరూపాత్మను సంతరించుకొన్న వారే.... వీటన్నిటినీ అధిగమించినవారగుచున్నారు సుమా! సర్వ భావనలకు, భావన ధారణలకు మూలము-ఆధారము అయిన ఆత్మయే నేనని ఎఱిగియే లీలగా వాయుదేహంతో అనేక జగత్-జీవుల పరంపరలను నా దేహ విభాగము వలె అనుభవించసాగాను.

❖❖❖

# 39. వసిష్ఠ విరాట్ పురుష స్వరూపం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా నేను ఆకాశము-వాయువు-జలము-అగ్ని (తేజస్సు)-పృథ్వి అనబడే పంచభూత స్వరూపధారిని అయి అచ్చట గల త్రిలోకములలోనూ విహరించాను. ఒకదాని తర్వాత మరొకటిగా, అన్ని భూతముల రూపం మార్చి మార్చి ధరించాను. పృథ్వి-జలము-అగ్ని-వాయువుల యొక్క సమూహ (పిండీకరణం) రూపం ధరించి వృక్షములలో వసించుచూ వేఱు చివరల యందుండి భూమియందలి రసమును పానం చేశాను. చంద్ర కిరణములలో ప్రవేశించి ఊయలలూగాను, ఋతువులలో ప్రవేశించి ఆయా సమయములలోని పుష్పముల సుగంధం గ్రోలాను. మేఘములపై పచార్లు చేశాను. కోమలములైన అంగములపై విశ్రమించాను. మృదు-మధుర శబ్దములు ఆలపించాను. బ్రహ్మాండ రూపుడనై ఉన్నత పర్వతముల శిఖరము నుండి నదీజలం వెంట భూమిపై గల విస్తార ప్రదేశం వరకు ప్రవహించాను.

పర్వతములు నా అంగములయ్యాయి. నదులన్నీ నాకు నాడీ మండలంగా అయ్యాయి. సిద్ధ విద్యాధరాది ప్రాణి సమూహములు నా దేహమునందు విశ్రాంతి తీసుకోసాగాయి. సూర్యుడు-చంద్రుడు-నక్షత్రములు మొదలైన రోదసీ స్వరూపాలు నా అనుగ్రహముచే శరీరములు సంపాదించుకొన్నవారై సంతోషముగా అనేక రంగులు ప్రదర్శించువారయ్యారు.

సప్త సముద్రములు - సప్త ద్వీపములు కలిగి సప్త రూపములతో వెలయు పృథ్వి నా ముంజేతికి కంకణంగా స్థాపితం అయింది. విద్యాధర స్త్రీలకు నేను కనబడకయే, వారికి హృదయ స్పర్శానందమును కలిగించి పులకింపజేయసాగాను.

నదులు నాకు రసపూరితమైన నాడులైనాయి. పర్వతములు నాకు ఆస్థికలు (బొమికలు) వలె అయ్యాయి. జీవులందరు నాకు వింజామరలుగా అయ్యారు. సూర్యచంద్రులు పరిచారకులై నా హృదయ కమలంలో వసించసాగారు. సమస్త పాతాళము నాకు పాదములుగా అయింది. భూతలమేమో పొట్టగా రూపుదిద్దుకున్నది. ఆకాశము నాకు శిరస్సుగా అయింది.

**దిక్షు సర్వాసు సర్వత్రా సర్వదా సర్వకారిణా ।**
**సర్వాత్మనాపి అసర్వేణ శూన్యరూపేణ సంస్థితమ్ ॥**

నేను సర్వదిశలందు సర్వత్రా సర్వదా సదా స్వరూపమైనాను. సర్వ కార్య నిర్వహణాధికారినై సంచరించాను. అయినా కూడా అసర్వముగానే (జగద్రహితంగానే) ఉన్నాను. సర్వ ద్వైతశూన్యమైనట్టి 'చిన్మాత్రము' గానే సర్వదా ఉండి ఉన్నాను.

పరిచ్ఛిన్నత్వము-అపరిచ్ఛిన్నత్వము; సాకారము-నిరాకారము; జడత్వము-చేతనత్వము... ఈ విరుద్ధ ధర్మముల యొక్క సముచ్చయమును నేనప్పుడు నా స్వరూపము నందే బాగుగా అనుభవించాను. మైనాక పర్వతాలలో అంతర్లీనంగా అనేక పర్వతాలు ఉంటాయి చూచావా? అట్లాగే పర్వత-నదీ-సముద్రములు, సూర్య-చంద్రులతో కూడిన అనేక బ్రహ్మాండములు నాయందే దర్శించాను. అనుభవించాను. జడమగు అద్దంలో అనేక నగరములు ప్రతిబింబిస్తాయి కదా? చిద్రూపుడనగు నాయందు ప్రకటితము-అప్రకటితము (గుప్తములు) అగు అనేక బ్రహ్మాండ పరంపరలను ధరించినవాడ నయ్యాను.

**ఏవం జల - అనిల - అగ్నిత్వం భూమిత్వం ఖాత్మనా మయా ।**
**కృతం చితేవ స్వప్నేషు! బత! మాయా విజృంభితమ్ ॥**

ఓ రామచంద్రా! ఈ విధంగా పృథ్వి-జలము-అగ్ని-వాయువు-ఆకాశముల రూపమును - స్వప్నము నందలి చైతన్యం స్వప్న నగరమును ధరించునట్లు - నేను ధరించాను. ఆహాఁ! ఈ మాయ యొక్క విజృంభణము ఎంతటి ప్రతాపం కలిగి ఉన్నది! ఎందుకంటే అట్టి స్థితిలో అగ్ని-వాయువు-పృథ్వి-జలం-ఆకాశాలలో అణువణువులోనూ అసంఖ్యాకమైన పృథ్వి-పంచభూతాలు-సూర్యచంద్రులతో కూడిన అసంఖ్యాక జగత్తులు నాకు కనిపించాయి. ప్రతి పరమాణువులోనూ ఇట్లే వ్యాప్తమగు ఆకాశము కలదు.

ఆ ఆకాశము యొక్క ప్రతి పరమాణువులోనూ మరల బ్రహ్మాండ పరంపరలు ఉన్నాయి. అట్లాగే స్వప్నంలో అంతర్గతంగా కనిపించే నగరంలోని ప్రతి అణువులోనూ అనేక బ్రహ్మాండ పరంపరలు ఉన్నాయి.

**శ్రీరాముడు :** మీరు ఆ విధంగా భూమండలం ఇత్యాది రూపాలను ఎద్దాని సహాయంతో ధరించారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ భూమండలం–తేజస్సు–ఆకాశం–జలం–వాయువు మొదలైన జగదాత్మక రూపాలన్నీ నా యొక్క "అధ్యాస" అనుదాని బలంతోనే ధరించాను. కాబట్టి సర్వ జగద్రూపుడనై ఉన్నప్పటికీ వాస్తవానికి నేను ఎచ్చట కూడా ఒకింతైనా వ్యాపించి ఉండనేలేదు. వ్యాపకరహిత చిదాత్మనే నేను కదా! అయినాకూడా మనుష్యులు మొదలైన దేహధారుల నిమిత్తమై వృక్షం–తృణం–అంకురాలను ఉత్పత్తి చేస్తూ... అంతే కాకుండా, భూమి ద్వారా వర్షాదుల జలమును ఆకర్షించాను. యుద్ధంలో శత్రురాజును జయించినట్లు నేను సర్వ ద్వైతరూప సంహార మగు బోధ రూపాన్ని సముపార్జించుకున్నాను. అట్టి శుద్ధ బోధరూపుడనగు నాలో లక్షల కొలది బ్రహ్మాండాలు (అధ్యారోపదృష్టిచే) వర్తించుచున్నాయి. అరోపిత దృష్టిచే అవేవీ నాయందు ఏ సమయమందునూ లేవు. చైతన్యమే చైతన్యమునందున్న స్వకీయమైన చమత్కృతులకు కర్త సుమా! నిజసత్తాస్ఫూర్తి రూపముచే స్వయముగా జగత్తుల రూపమున తనకు అభిన్నంగా చైతన్యమే రచించుకుంటోంది. (లేక) ప్రకటించుకుంటోంది. అట్టి చైతన్యమే నీ స్వరూపం! నా స్వరూపం! సభికులందరి స్వరూపం!

"అనుభవము", "రచన", "ఇష్టము" ఇవన్నీ ఎక్కడెక్కడుంటాయో, అవన్నీ కూడా పరమార్థ చైతన్యము యొక్క చమత్కారమే తప్ప మరింకేమీ కాదు.

❖

**అధ్యారోపదృష్టిచే :** ప్రతి వస్తువులోను స్వసత్తరూపంగా నేనే స్ఫురిస్తున్నాను కదా! కాబట్టి సర్వరూపుడను, సర్వకర్తను కూడా అయి ఉన్నాను.

**అపవాదదృష్టిచే :** సమస్తము బ్రహ్మాండరూపమే! కనుక నేను సర్వదా ప్రబుద్ధుడను, నిరామయుడను, కేవలము శుద్ధబోధ రూపుడను, బ్రహ్మరూపుడను అయి ఉన్నాను. ప్రతి వస్తువునందు, ఉన్నట్టి ప్రతి జీవునియందు ఉన్నట్టి "బ్రహ్మము" నందు సర్వసృష్టి (సర్వ జగత్తు) యొక్క అధ్యాస ఉండనే ఉన్నది. అందుచేతనే ప్రబుద్ధుని దృష్టిలో ఈ జగత్తంతా కూడా సర్వత్రా సర్వాత్మకమై, సర్వవ్యాపకమై, సర్వాశ్రయమైనట్టి బ్రహ్మమే అయి ఉన్నది.

**అరోపిత దృష్టి :** ఉన్నది ఉన్నట్లుగా గాంచుచూ, లేనిది లేనట్లుగా గమనించటం.

**అధ్యారోపదృష్టి :** లేని దానిని సహాయంగా తీసుకొని ఉన్నది నిరూపించుకొని దర్శించటం.

**అపవాద దృష్టి :** లేనిది ఎందుకు లేదో నిరూపించుకొని ఉండటం.

ఇక, ప్రబుద్ధుని దృష్టియందో... అది నేను చెప్పజాలను, ఎందుకంటే అతని దృష్టికి స్థిరత్వం లేదు. ఒకప్పుడు ప్రమోదంగా, మరొకప్పుడు విషాదంగా, ఇంకొకప్పుడు పేలవంగా, మరొకప్పుడు స్థైర్యంగా అతని అనుభవం ఉంటోంది. కాబట్టి 'ఇది ఇట్లు' అనునదేమీ లేకపోవుట చేతనే 'అతని దృష్టి ఇట్లా ఉంటుంది' అని మేము చెప్పలేకపోతున్నాం!

కనుక ఓ రామచంద్రా! ఇప్పుడు చెప్పే సారవిషయాలు విను.

**ఆకాశకోశ విశదాత్మని చిత్స్వరూపే యేయం సదా కచతి సర్గ పరంపరేతి,**
**సాన్త స్తదేవ కిలతాప ఇవాన్త రూష్మా, భేదోపలంభ ఇతినాస్తి సదస్త్యనన్తమ్ ॥**

1. చిత్స్వరూపము (పరమాత్మ) సర్వదా ఆకాశము వలె అత్యంత నిర్మలమైనది.
2. అట్టి నిర్మల చిత్స్వరూపమగు ఆత్మలో ఈ సృష్టిపరంపరలు సదా భాసిస్తూనే ఉంటాయి.
3. అట్లా జగత్తు రూపంగా భాసించేదంతా కూడా చిద్రూప బ్రహ్మమే అయి ఉన్నది.

ఒక చిన్న దృష్టాంతం– 1. తాపము, 2. ఉష్ణము... ఈ రెండు శబ్దములు వేర్వేరు అయినప్పటికీ వాటి అర్థం మాత్రం ఒక్కటే కదా! "తాపము నందు ఉష్ణము కలదు" అనే వాక్యం, లేక "ఉష్ణ తాపము" అనే శబ్దం భాషాపరంగా ఉన్నప్పటికీ ఆ రెండు శబ్దములు సమానార్థ వాచకాలే కదా!

అట్లాగే... 1. బ్రహ్మము, 2. జగత్తు... అను ఈ రెండు శబ్దములకు వాస్తవానికి భేదమేమీ లేదు. ఆ రెండింటికీ వాస్తవమైన అర్థం ఒక్కటే. వాస్తవానికి... నామరూపాత్మకమైన దృశ్యము లేదు. అనంతము – సద్రూపము అగు "బ్రహ్మము" మాత్రమే ఉన్నది.

ఓ జనులారా! ప్రియ శ్రోతలారా! సభికులారా! అట్టి అఖండ అప్రమేయ బ్రహ్మమే ఈ రామబ్రహ్మము. మీరందరు ఈ రామబ్రహ్మ స్వరూపులేనని గ్రహించండి!

❖❖❖

# 40. సిద్ధ పురుషునితో సంభాషణం

**(అశాశ్వత దృశ్య జగత్తు)**

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ విధంగా విద్యాధరి యొక్క అభ్యర్థనను అనుసరించి లోకాలోక పర్వత శిలలోని బ్రహ్మాండములో ప్రవేశించి, ఆ బ్రహ్మాండము మహాప్రళయకాలంలో లయమైపోగా, రుద్రభగవానుని నృత్యమును, కాళీదేవి యొక్క ఆవిర్భావమును, రుద్రభగవానుని స్పర్శచే ఆయనయందు లయమవటం, ఆ తర్వాత రుద్ర భగవానుడు కూడా సూక్ష్మరూపి అయి అంతర్ధానం కావటం, తదనంతరం ఆ శిలలోని తదితర భాగములలోను, తదితర శిలలలోను, ఇతర సర్వ పదార్థములందు అనేక బ్రహ్మాండములను సందర్శించటం, ఆ తర్వాత నా స్వరూపము నందే అనేక బ్రహ్మాండములు అగుపించటం, అటుపై నేను ఆకాశ–వాయు–పార్థివ–అగ్ని–జల అభిమానినై సంచరించటమూ, ఇక ఆపై విరాట్ పురుషుడనై అనేక ఇంద్ర–అగ్ని–వాయు–త్రిలోక–త్రిమూర్తులతో కూడిన బ్రహ్మాండములకు శరీరధారిని అవటము–ఇదంతా వర్ణించి చెప్పాను కదా! ఆ తర్వాత కొన్ని సిద్ధ లోకాలు కూడా సందర్శించాను.

❖

అదంతా అయిన తర్వాత... ఇక సర్వకౌతుకములను త్యజించి నెమ్మదిగా అంతకుముందు ఆకాశంలో నేను సంకల్ప బలంతో నిర్మించుకున్న ఏకాంత మండపం వైపుగా వెళ్ళటం జరిగింది.

**శ్రీరాముడు :** స్వామీ! అవునూ? మీరు అనేక బ్రహ్మాండములలో సంచరిస్తూ నిర్వికల్ప ధ్యానము కొఱకై చిదాకాశమునందు ఒకానొక విభాగమున తదితరులకు జేరవీలుకాని ఏకాంత ప్రదేశంలో మనో నిర్మిత కుటీరం చేరారు కదా! ఇప్పుడా కుటీరం తిరిగి జేరుచుండగా జరిగిన విశేష చమత్కారాలు ఏమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆ విషయాలకే ఇక వస్తున్నాను. విను–

ఆ విధంగా కౌతుకముచే ఆ జగత్తులను దర్శించిన తర్వాత అట్టి క్రియ నుండి ప్రయత్నపూర్వకముగా వైదొలగాను. ఇతఃపూర్వపు ఆకాశమున మనో నిర్మితమైన సమాధి కుటీరం క్రమంగా సమీపించాను. కుటీరంలో ప్రవేశించాను. ప్రవేశించి ఇతఃపూర్వపు నా భౌతిక శరీరము కొర్కై అటూ ఇటూ చూచాను. ఆ దేహం కనిపించలేదు. అయితే నా భౌతికదేహం ఉండవలసిన చోటుకు కొంచెము ప్రక్కగా ఎవరో సిద్ధుడు కనిపించారు. ఆయన సమాధియందు ఉన్నట్లుగా ఉన్నారు. కొంచెము సమీపంగా వెళ్ళి చూచాను.

ఔను! ఆయన సమాధియందు నిమగ్నమై ఉన్నారు. బ్రహ్మపదమును పొంది సౌమ్యత్వము వహించినట్లుగా కనిపిస్తున్నారు. సూర్య భగవానుని వలె గొప్ప తేజస్సు ఆయన ముఖంలో కనిపించింది. పద్మాసనము వైచుకొని ఉన్నారు. పరమ శాంతమూర్తియై ఇష్ట విషయము పట్ల చిత్తము స్థిరమగుటచే నిశ్చలులై ఉన్నారు. ఆయన ఆశ్రయించిన సుఖాసనమును అనుసరించి వృషణములు పాదముల చీలమండలం మధ్యగా ఉన్నాయి. ఆయన సర్వ జగద్విషయములకు ఆవల గల పరబ్రహ్మమునందు నిష్ఠ వహించి ఉన్నారని గమనించాను. ఆయన ముఖం విభూది–త్రిరేఖలతో సౌమ్యంగా, గంభీరంగా ప్రకాశిస్తోంది. భుజస్కంధములు సమముగానూ, నిలువుగానూ ఉండగా కంఠం అతి సుందరంగా శోభిస్తోంది.

ఆయన ప్రసన్నమైనట్టి సుఖముతో కూడి శిరస్సుచే అతి సుందరుడుగా కనిపిస్తున్నారు. నాభి వద్ద ఆయన అరచేతులు తెరుచుకొనిన భంగిమలో అవధరించబడి ఉన్నాయి. హృదయము బాహ్యముగా ఏతెంచు మహాతేజస్సుతో శోభిల్లుతోంది. కనురెప్పలు రెండూ మూసుకొని ఉన్నాయి. ఆయనలో బాహ్యేంద్రియ వ్యాపారములు అగుపించటమే లేదు. ఒక ప్రశాంత–గాంభీర్య సరోవరము వలె మౌనస్థితిచే ఉట్టిపడుచున్నారు. అంతఃకరణము ధీర–శాంత వృత్తిచే ప్రకాశిస్తున్నట్లుగా అనిపిస్తోంది. నిర్వికల్పమును ఆశ్రయించి ఉండటం చేత ఆయన నా రాకను గమనించే స్థితి కనిపించటం లేదు. ఆ మునివర్యుని దేహమును ఆ స్థితిలో వీక్షించి నా యొక్క శుద్ధ చిత్తముతో ఇట్లా చింతించాను.

❖

ఆహా! ఈయనెవరో మహాసిద్ధుడు అయి ఉంటారు. ఈ మహాత్ముడు నాలాగానే ఏకాంతమున విశ్రాంతి పొందాలని ఆకాశమున ఎక్కడో ఉన్న ఈ కుటీరానికి వచ్చారు. ఈయన సత్య సంకల్పుడు అయి ఉండటంచేతనే "సమాధియోగ్యమైన ఏకాంత స్థానం పొందాలి" అనే యోచనతో ఈ

కుటీరంలో ప్రవేశించి ఉంటారు. నా భౌతిక దేహమును నేను చిరకాలంగా ఉపేక్షించి ఉన్నాను కదా! అందుచేత నా శరీరమును మరణించిన దానిగా భావించి ఇక నా రాక కొరకై వేచి ఉండక, ఆ నా శరీరమును ఎక్కడో పడవైచి, తాను ఇచట ఈ సమాధి స్థితిని ఆశ్రయించి ఉంటారు.

ఆ నా స్థూల శరీరం నశించియే ఉంటుంది. ఇక ఇక్కడ నాకు పనేమున్నది? కనుక ఈ సూక్ష్మశరీరం తోనే సప్తర్షి మండలములోని నిజాశ్రమమును చేరెదను గాక...!

❖

ఈ విధంగా యోచించిన నేను సప్తర్షి మండలము వైపుగా ప్రయాణమునకు సంసిద్ధుడనైనాను. వెంటనే నా సంకల్పముచే నిర్మించబడిన ఆ కుటీరం నా యొక్క సంకల్పక్షయ ప్రభావం చేత క్షణంలో నశించిపోయి ఆ స్థానంలో శూన్యాకాశం యథాతథంగా ఉండటం జరిగింది. ఇప్పటి ప్రవృత్తి (లేక, ఆలోచన) ఇతఃపూర్వపు ప్రవృత్తి (లేక–ఆలోచన)ని తొలగించివేస్తూ ఉంటుంది కదా! ఎప్పుడైతే సంకల్ప నిర్మాణకుటీరం (నాయొక్క సప్తర్షిమండలము వైపుగా వెళ్లాలనే ఉత్కర్ష "పూర్వ సంకల్పత్యాజ్యం + నూతన సంకల్ప ఆవిర్భావం" ప్రభావం చేత) నిరాధారమై అదృశ్యమైందో, ఆ క్షణంలో సమాధినిష్ఠుడైన ఆ సిద్ధపురుషుడు నిరాధారుడై క్రింద పడసాగారు. స్వప్నం శమించగానే స్వప్ననగరం కూడా శమించునట్లు నా సంకల్ప–ఉపశమనంచే నిరాధారుడైన ఆ మునీంద్రుని దేహం మేఘమును వదలిన జలధార వలె నేలపై పడిపోవుచుండటం నేను గమనించాను. అప్పటికి నా తప్పు నేను గమనించాను.

"ఆహా! 'ఎంతకాలమైతే నేనిక్కడ ఉంటానో అంత వరకు ఈ మనోకల్పిత కుటీరం ఇట్లే ఉండుగాక!' అని సంకల్పించిన ఈ కుటీరం, నా ధ్యాస సప్తర్షిమండలం వైపుకు మళ్ళగానే, మటుమాయమైనది కదా! అరె! ఈ సిద్ధపురుషుడు ఇప్పుడు నేలపై పడుచున్నారు! ఎంత తప్పు జరిగింది! ఇప్పుడు వీరి దేహమునకు ఏదైనా హాని జరుగదు కదా?"

... అని తలచి ఉలిక్కిపడ్డాను. ఆ సిద్ధపురుషుని వైపుగా చూచాను. ఆయన దేహం క్షయించిన పుణ్యమప్పటి వైమానిక దేవత వలె, మూలము ఛిన్నమైనప్పటి మహా వృక్షము వలె ఆకాశము నుండి విడువబడిన శిలవలె క్రిందపడసాగటం చూచాను. "మహనీయుల పట్ల, సుజనుల పట్ల దోష ప్రవర్తన ఉండకూడదు" అనే ధర్మముచే ప్రేరితుడనై సూక్ష్మ శరీరముతోనే ఆ సిద్ధపురుషుని శరీరము వెంట భూతలము వైపుగా రాసాగాను.

వాయు మండలము యొక్క పరివర్తనములచే ప్రేరితమై వాయుతరంగములచే మోయబడుచూ ఆ సిద్ధుని భౌతికదేహం సప్తద్వీపములకు–సప్త సముద్రములకు ఆవల ఉన్న ఒక దేవతల క్రీడాస్థలముపై పడసాగటం అల్లంత దూరంగా గమనించాను. ఆయన దేహం యోగబలంచే వజ్ర–శిలాదుల వలె దృఢంగా ఉండటంచేతను, ప్రాణాయామధారణచే దూదిపింజమువలె అతితేలికగా ఉండటం చేతనూ అంతదూరం నుండి నేలను తాకుతున్నప్పటికి ఆ దేహమునకు ఏమీ కాలేదు. ఆయన చిత్తము అన్యత్రా తీవ్రంగా లగ్నమై ఉండటంచేత ఆయన

సమాధికి కూడా ఎటువంటి భగ్నము వాటిల్లలేదు. ముందుగా ఆయన అరికాళ్ళు నేలను తాకాయి. క్రమంగా ఆయన శరీరం నేలపై ఆసీనమైనది. ఆయన శిరస్సు ఊర్ధ్వంగాను, ప్రాణ పానములు ఊర్ధ్వగమనం కలిగి ఉండటంచేతనూ ఆయన నేలపై గల ఒకచోట ఇతఃపూర్వపు పద్మాసనంతోనే స్థానం పొందారు.

అప్పుడు నేను ఆయనను సమీపించాను. ఆ సిద్ధపురుషుడు ఇతఃపూర్వం మానసిక కుటీరంలో పద్మాసనాసీనుడై ఉన్నట్లే ఉన్నారు. సమాధి నుండి మేల్కొననే లేదు. అప్పుడు ఆయనను సమాధి నుండి మేల్కొలుపుటకై ప్రయత్నశీలుడనైనాను. అట్టి ప్రయత్నంలో భాగంగా ఆకాశంలో మేఘములను ఉత్పన్నం చేసి వర్షమును కురిపించాను. బిగ్గరగా గర్జనలు చేయసాగాను. ఆయన ఉన్న దిశగా పెద్దపెద్ద శబ్దములతో వడగళ్ళ వాన కురిపించాను. ఎట్లాగైతేనేం, కొంతసేపటికి ఆ మహాత్ముని బోధితునిగా చేశాను. సమాధి నుండి మేల్కొలుప గలిగాను. అప్పుడాయన ప్రకాశమానమైన అంగములు కలిగినవారై క్రమంగా కనులు తెరచారు. ఆ విధంగా సమాధి నుండి మేల్కొనినట్టి మహనీయుడు-సిద్ధుడు అగు ఆ మునివరేణ్యుని ఎదుట స్నేహపూర్వకంగా నిలబడి చేతులు జోడించి నమస్కరించాను. అప్యాయంగాను, నిర్మలవృత్తితోనూ ఇట్లా ప్రశ్నించాను.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ మునివర్యా! మీరు ఎవరు? ఏ చోట ఉండేవారు? ఆ మనో నిర్మిత ఆకాశ కుటీరంలో ఎందుకు ప్రవేశించారు. దయచేసి మీ వివరాలు తెలియజేయవలసినదిగా నా విన్నపం.

నేనిట్లా అడుగుతూ ఉంటే ఆ సిద్ధపురుషుడు అప్పుడే నిద్రనుండి లేచినవాని వలె నా వైపు తేరి పార చూచారు. క్రమంగా కొద్దిసేపు కనులు మూసుకొని గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించారు. ఆపై ఇట్లా అన్నారు.

**సిద్ధ పురుషుడు :** మహాత్మా! దయచేసి కొద్దిసేపు ఉండండి. నా వృత్తాంతమును స్మరించుకోనివ్వండి. ఆ తర్వాత మీకు అన్నీ వివరిస్తాను. రండి ఇటు వచ్చి సుఖాసీనులుకండి.

ఇట్లా పలికి ఆయన కొద్దిసేపు మరల కనులు మూసుకున్నారు. రోజంతా జరిగిన ఏవేవో విషయాలన్నీ సాయంకాలం జనులు గుర్తు తెచ్చుకుంటూ ఉంటారు చూచావా? అట్లా ఆయన విషయములు స్మరించటంలో నిమగ్నమైనారు. కొద్ది క్షణములలో తన పూర్వ వృత్తాంతమంతా చింతనచేసి స్మరించారు. తటాలున లేచి నన్ను సమీపించి రెండు చేతులు ప్రేమపూర్వకంగా స్పృశించారు. నేను కూడా మర్యాదపూర్వకంగా లేచి వారి కరచాలనము స్వీకరించాను. ఇద్దరం ఒకరి వైపు మరొకరం ప్రేమ పూర్వకంగా చూచి చిరునవ్వు నవ్వుకున్నాం. ఇద్దరం సుఖాశీనుల మైనాం. ఆ తర్వాత ఆయన పెదవులు విప్పారాయి. చంద్రకిరణములవలె అతిశీతలములు, ఆనందదాయకములు, అనింద్యములు, ఆక్షేపణ చేయటానికి వీలేలేనివి, సుఖోదయములు అగు మనోహర వాక్యాలు ఈ విధంగా పలికారు.

**సిద్ధ పురుషుడు :** మహాత్మా! ఇప్పుడు మిమ్ములను గుర్తించాను. సప్తర్షి మండలంలో వసిస్తూ ఆత్మజ్ఞాన బోధతో లోకపావనం చేసే మహత్‌గురువులగు వసిష్ఠ మహర్షియే మీరు కదా!

ప్రణామములు! తమ పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామములు. మొట్టమొదటిసారి మీ దర్శనమైనప్పుడు మీకు నమస్కరించనందుకు నన్ను క్షమించవలసినదిగా అభ్యర్థిస్తున్నాను. "క్షమ" యే సత్పురుషుల స్వభావం అయి ఉంటుంది కదా!

❖

మహర్షీ! నేను "ఎవరు-ఎక్కడివాడను" అనునవి పెద్దగా మీకు చెప్పతగ్గ విషయమేమీ కాదు. అయితే ఏ సాలోచనాస్థితిచే నేను అక్కడి మనోకల్పిత ఆశ్రమంలో ప్రవేశించటం జరిగిందో... ఆ విశేషాలు చెబుతాను. వినండి.

మహాత్మా! ఇంతకు చాలాకాలం ముందు ఒకప్పుడు నేను "భోగములు పొందెదను గాక" అనే కౌతుకమును చేబూని మోహ ప్రదములగు దేవతల ఉపవన భూములలో సంచరించాను. అనేక చోట్ల చిరకాలం పరిభ్రమించాను. నదిలో తరంగం అనేక చోట్లకు తిరిగి తిరిగి వస్తున్నట్లు నేను ఈ చిత్తమును ఆశ్రయించి అనేక స్థానములలో తిరుగాడుచూ సుదీర్ఘకాలం గడిపాను. ఈ సంసార సాగరంలో "దృశ్యములు" అనే తరంగములచే వ్యాకులుడనై అనేక దుఃఖములు పొందాను. వర్షం కోసం ఎదురుచూచే చాతకపక్షి ఆకాశం వైపుగా చూస్తూ అతి దీర్ఘకాలం వేదనతో గడుపుతుంది చూచారా? నేను కూడా 'ఏదేదో కావాలి... పొందాలి... దక్కాలి... లభించాలి... తారసపడాలి... చూడాలి...రావాలి...పోవాలి....చేరాలి...ఆస్వాదించాలి'... అని తలచుచూ ఈ సంసార మహారణ్యంలో సుదీర్ఘకాలంగా పచార్లు చేస్తూ అనేకసార్లు భ్రమ-విభ్రమములకు లోను అయ్యాను. ఇట్లా బహుదూరపు బాటసారిలాగా పయనించి, అలసి, సొలసిపోయాను. ఆహా! ఈ ప్రపంచంలో భోగాలలో "అజ్ఞానం" అనే ఉప్పు-చేదు తప్పించి వేరైన రమ్య వస్తువు ఏమున్నది? ఈ జగత్తు జ్ఞానము మాత్రమే సార వస్తువుగా కలిగి ఉన్నది. కాబట్టి సర్వ దుఃఖప్రదములగు వ్యవహారములను త్యజించి "ఆత్మజ్ఞాన సముపార్జన" యందే నిమగ్నం కావాలని నిశ్చయించు కున్నాను.

**శబ్ద - రూప - రస - స్పర్శ - గన్ధ - మాత్రాదృతే పరమ్ ।**
**నేఽహ కించన నామాస్తి కిమ్ ఏతావత్ అహమ్ రమే ॥**

ఈ బ్రహ్మాండఽలో ఎక్కడికి వెళ్ళినాకూడా శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములనబడే 5 తన్మాత్రలు తప్ప అన్యమైన వస్తువేమున్నది? అవన్నీ పరిచ్ఛిన్న మాత్రములే కదా! అట్టి పరిచ్ఛిన్న-దుఃఖ రూపములైన వాటియందు నేను ఎందుకు రమించాలి? పైగా, ఈ శబ్ద-స్పర్శాదులన్నీ కూడా స్వయంగా 'సత్తా' కలిగిలేవు మరి? చిదాకాశము యొక్క సత్త చేత మాత్రమే అవన్నీ సత్త కలిగి ఉన్నాయి. చిదాకాశసత్తను వేఱుచేసి చూస్తే అవి శూన్యరూపములే కదా!

లేక... సమస్తమూ చిన్మాత్రమే అయి ఉన్నది. చిన్మాత్రమునకు వేరుగా ఏదీలేదు. కనుక "అసత్తు" అగు ఆకారము కలిగియున్న ఆ ఈ శబ్దములందు నష్ట బుద్ధిచేతనే నేను వ్యామోహము, కౌతుకము కలిగియున్నాను కదా! ఈ శబ్దాది విషయములు విషము వలె "ఉన్మాదము-వైషమ్యము-మరణము" నకు దారి చూపటానికే ఉన్నాయిగాని, వాస్తవము-శాశ్వతము అగు ఆనందం కలగజేయటానికి కానేకాదు. స్త్రీలు నా యొక్క బుద్ధిమాంద్యంచేత నాకు కామవికారము

కలుగజేయటానికే తారసపడుచున్నారు. అనురాగములన్నీ చిట్టచివరకు విరసత్వమునకే దారి తీస్తున్నాయి. ఇట్టి వాటిని నమ్ముకొని వీటిలో రమించువాడు వీటిచేతనే హతుడు కాక ఏమవుతాడు? ఈ జీవితంలో "ఏదో లభిస్తుందిలే" అనుకొని వేటివేటికో ప్రయత్నములు చేస్తూ కాలం-ఆయుష్షు వృథా చేసుకొంటూ ఉండగా, ఇంతలో-నాచులో ఆహారం కోసం వెతుకులాడే చేపపిల్లకు కొంగ ఎదురగుచున్నట్లు ఎక్కడినుండో వార్ధక్యం వచ్చి వాలుతోంది. ఇక శరీరం సంగతి అందామా! సముద్రంలో బుద్బుదం బయల్వెడలి అతి శీఘ్రంగా నశించునట్లుగానే, ఈ దేహం ఎదురుగా కనబడుతూ-కనబడుతూనే ఇంతలో ఆరిన దీపంలాగా అంతర్ధానమౌతోందే!

ఈ "జీవితము" అనబడేది అనేక విక్షేపములతోను, కల్లోలములతోను కూడుకొని ఉంటోంది. దీనికి జననము ఒక తీరమైతే, మరణము మరొక తీరం.... దీనిలో సుఖ దుఃఖ పరంపరలు అనుక్షణం పాల్గొను చున్నాయి. యౌవనోల్లాసము ఒకవైపు పొంగుతుంటే, మరొకవైపు వార్ధక్యం గుంటనక్కలా దాగి ఉండి 'ఎప్పుడు క్రుంగతీద్దామా?' అని ఎదురుచూస్తూ ఉంటోంది. కాకతాళీయంగా లభించే ఇక్కడి సుఖాలు క్షణభంగురాలు, దుఃఖ మిశ్రితాలు కూడా! ఇదంతా అనేక అసమంజస వ్యవహారాల చేతనూ, మూర్ఖ ప్రలాపముల చేతనూ నిండి ఉన్నది. ఇందులో ఎటువైపు తొంగి చూచినా రాగద్వేషములే అగుపిస్తున్నాయి. ఇక్కడి మహత్తరమని చెప్పబడే కార్యక్రమములన్నీ లోభ-మోహములతో నిండి ఉంటున్నాయి. కాస్త ఎప్పుడన్నా చల్లగా (అనుకూలంగా) అనిపించినా కూడా, ఇంతలోనే అనేక తాపత్రయములు సర్వదా సంసిద్ధమగుచు అనేక దుఃఖములు జనింపజేస్తున్నాయి.

స్వామీ! నదీజలం చూచారా? ఎప్పటికప్పుడు పాతనీరు ప్రవహిస్తూ పోవటం, క్రొత్తనీరు రావటం జరుగుతుంది కదా! అట్లాగే ఈ సంసారమునందలి పుత్ర-మిత్ర-ధనాది పదార్థములన్నీ కూడా వెనుకటివన్నీ ఎటకోపోవుచూ, ఇంతలో క్రొత్తవి వచ్చిపడుతున్నాయి. ఈ విధంగా వెనుకటివన్నీ గతించుచు, క్రొత్తవి ఏతెంచుచూ ఉండగా... ఇట్టి పదార్థ సమూహముల వలన మనకు వచ్చే ప్రయోజనం ఏమున్నది చెప్పండి? అటువంటి సంబంధ-బాంధవ్యములపై నమ్మకము ఉంచి బ్రతుకును గడపటం ఎంతటి అవివేకం? బుద్ధి కలవాడెవడూ వీటిని నమ్మి ఉండడు. మహాత్మా! ఇంకా నదీజలమే నయం. ఎందుకంటారా? నదుల జలాలన్నీ ప్రవాహరూపంలో పోతున్నాయి. మరల పర్వత-మేఘాదుల సహాయంతో ఏతెంచుచున్నాయి. కానీ ఈ దేహమో! పోవటమేగాని, మరల వెనకకు రావటమనేది జరగనే జరగదు కదా! కమ్మరివాని చక్రంలాగా ఈ సంసార చక్రం మహాపరిభ్రమణం పొందుచుండగా ఇందలి వస్తువులు, జీవులు, సందర్భములు, సంబంధములు, దేహములు-ఇవన్నీ ప్రతిక్షణం అనేక పరివర్తనములు పొందుచున్నాయి. ఇక్కడ అతి భయంకరులు, శత్రురూపులు అగు "విషయములు" అనే అతి చతురులైన చోరులు నలువైపులా సంచరిస్తున్నారు. మామూలు దొంగలైతే రాత్రిపూట మాత్రమే ఇళ్ళలో ప్రవేశిస్తారు. మరి ఈ విషయచోరులో? మేము నిదురించేటప్పుడు, మేల్కొనునప్పుడు కూడా మా హృదయ గృహములలో ప్రవేశించి మా వివేకమును ఇట్టే దొంగిలించుచున్నారు.

**ఆయుషః ఖండ ఖండాశ్చ నిపతన్తః పునః పునః**
**నకశ్చిత్ వేత్తి కాలేన, క్షతాని దివసాన్యహో!**

అరెరే! ఏమి ఆశ్యర్యం! 'ఇప్పుడు ఇక్కడికెళ్ళాలి, అప్పుడు అతని సంగతి చూడాలి...' ఇటువంటి పిచ్చిపిచ్చి మాటలతో, వృథా వ్యవహారములతో అనేకమంది జనులు ఒక ప్రక్క సమయమును గడపి వేస్తున్నారు. మరొకవైపు ఏమగుచున్నదో గమనించారా స్వామీ! ప్రతిక్షణం ఆయువు రోజుల రూపంలో తరిగిపోతూ ఉంటే... ఇది ఎవరూ ఎఱుగుటయే లేదే?

**ఇదమద్య తథేదం చ తథేదమ్ ఇదమస్య మే**
**ఏవం కలనయా లోకో గతం ప్రాప్తం న వేత్త్యహో!**

"ఓహో! ఇది నేడు లభించింది. ఇక అది రేపు లభిస్తుందిలే! ఇది నాది. అది నీది. ఇదేమో వీనిది" ఈ, ఈ, మొదలైన అనేక కల్పనలలో మునిగి తేలుచున్న అనేకులు ఇటు గడచిపోతున్న ఆయువును గాని, అటు దగ్గర పడుచున్న మృత్యువును గాని గమనించటమే లేదే!

**భుక్తం పీతం అనన్తాసు, భ్రాన్తం చ వనభూమిషు**
**దృష్టాని సుఖదుఃఖాని కిమన్యదిహ సాధ్యతే?**

హే మహర్షీ! అనేక పదార్థములను తిన్నాను, త్రాగాను, అనేక చోట్ల సంచారములు సల్పాను. అనేక సుఖ-దుఃఖములు అనుభవించాను. అయితే ఎందుకు? ఇక్కడ సాధించటానికి శాశ్వతమైన ఫలము ఏది, ఎక్కడున్నది? స్వామీ! అనేక పదార్థములను అనుభవించుచూ అనేక సుఖదుఃఖాలను మేము పొందాం? వాటిలో ఆత్యంతికమైన దుఃఖ రహితమైన సుఖం ఎక్కడున్నది? పోనీ, సుఖం ఉన్నదను కొన్నప్పటికీ, అది సుఖం ప్రసాదించగలిగేది ఎంతసేపు? అసలీ పదార్థములచే లభించే సుఖం నిత్యమైనది ఎట్లా అవుతుంది? అందుచేత ఈ జగత్పదార్థముల పట్ల ఉత్కంఠ కలిగి ఉండటం అనేది అవివేకమని, అజ్ఞానమని, అనవసరమని నేను గమనించాను. ఈ సుఖదుఃఖానుభవాలను రుచిచూచి, ఇక వాటిని పరిశీలించాను. అనేక భోగాలూ చూచాను. వాటిలో ఉండే అనిత్యత్వాన్నీ చూచాను. కానీ మహాత్మా! పూర్ణ విశ్రాంతిని ప్రసాదించగలిగే ప్రదేశం గాని, పదార్థం గాని, స్థానంగాని నాకు ఈ లోకాలలో ఎక్కడా కనిపించనేలేదు. అవివేకము చేత అనేక సుఖమయ స్థానములు కనబడుచున్నప్పటికీ, అవన్నీ ఎండమావుల వంటివేనని గమనించాను. ఎత్తైన పర్వతాలు అధిరోహించి చూచాను. మేరు పర్వతము యొక్క సుందర ప్రదేశములు దర్శించాను. లోకపాలకుల నగరములలో కూడా సంచరించాను. ఎంత వెతికినా కూడా నాకు సహజమైనది-శాశ్వతమైనది అగు ఒక్క వస్తువుకూడా మచ్చుకకైనా కనిపించ లేదు. వృక్షములన్నీ... కొయ్య తో నిండి ఉన్నాయి.

ప్రాణులందరు... రక్త – మాంసములచే నిండి ఉన్నారు. భూమి అంతా మట్టియే కదా! ఈ ప్రపంచమంతా... దుఃఖములచేతను, అనిత్యత్వములచేతను వ్యాప్తమైయున్నది. అసారములగు ఇట్టివాటిని చూచి ధైర్యం ఎట్లా కలుగుతుంది చెప్పండి? "ఆఁ! అదేం లేదు. ఇక్కడ మాకు ధనం ఉన్నది. లేదా, మేం ప్రయత్నిస్తే లభిస్తుంది. మిత్రులు ఉన్నారు. సుఖములు లభిస్తున్నాయి. ఇంకేం!

ఇట్లా ఇవన్నీ అనుభవించాలే గాని ఇంక దేని గురించో ఎందుకు?"... అని కొందరు జీవులు నూతిలో కప్పలవలె రోజులు గడపటానికి మాత్రమే సంసిద్ధపడుచున్నారు. కానీ, మునీంద్రా! కాస్త వివేకంతో కళ్ళు తెరచి చూస్తేనో?

**న ధనాని న మిత్రాణి న సుఖాని న బాంధవాః**
**శక్నువంతి పరిత్రాతుం కాలేన ఆకలితం జనమ్ ॥**

'మృత్యువు' అనే పెనుభూతం క్రీనీడలాగా ఈ సంసారంలోని ప్రతి జీవుని వెంటనంటియే ఉంటోంది కదా! కాలపురుషుడు అనునిత్యంగా విలయతాండవం చేస్తూనే ఉన్నాడు. కాలునిచే ఏ క్షణమైనా మ్రింగి వేయబడటానికి బలికి తెచ్చిన మేకలవలె సిద్ధంగా ఉన్న ఈ మనుజుని దేహమును ఆ కాలతాండవం నుండి ఏ బంధుజనులు, ఏ ధనములు, ఏ మిత్రులు, ఏ సంపదలు, ఏ సుఖాలు రక్షించగలుగుతాయి? వీధిలో ఉంచబడిన ముత్యాలహారంలాగా కాలమనే దొంగ ఈ దేహమును ఎప్పుడు దొంగిలిస్తాడో ఎవరికైనా తెలుస్తోందా? ధూళి ఒకచోట ప్రోగయి ఒక ఆకారంలా కనబడు చున్నది చూచారా! అట్లా 'పరమాణువులు' అనే ధూళిచే తయారుచేయబడిన ఈ శరీరం అనేక సంబంధ-బాంధవ్యముల మధ్య కొద్దికాలం తైతక్కలాడుతోంది. ఈ మనుజ శరీరంలోని ఆ పరమాణువులు ఎప్పుడు ఎటు దారి చూచుకొనుటచే ఈ దేహం పడిపోగలదో చెప్పలేం. పర్వతాలపై పడియున్న మేఘములు క్షణ క్షణం క్షీణిస్తూ ఉంటాయి చూచారా? అట్లా అనేక విషయాలందు లీనమైయున్న ఈ మనుజుడు అనేక క్షీణదశలను పొందుచూ పైకి మాత్రం 'అది చేస్తాను, ఇది చూస్తాను' అంటున్నాడే కానీ, అభ్యంతరమున మాత్రం... పురుషార్థరహితుడై, నిష్ప్రయోజనములైన ఏవేవో కార్యవ్యవహారములను నిర్వర్తిస్తూ చివరికి ఒక రోజు మరణమును పొందుచున్నాడు.

❖

ఇదంతా పరిశీలించిన తర్వాత నాకిక సుందర స్త్రీలుగాని, ఐశ్వర్యములుగాని, రమణీయాలని అనిపించటం లేదు. ఎందుకంటే ఈ జీవితమే అతి చంచలమై ఉండగా, ఇక ఇక్కడ-అక్కడ కనిపించే ఆయా సరదా వ్యవహారాల వల్ల ఏం ప్రయోజనం? హే మహాత్మా! ఈ ప్రపంచంలో ఎచట దేనిని చూచుకొని 'ఇక ఫరవాలేదులే' అని ధైర్యం-నమ్మకం కలిగి ఉండగలమో చెప్పండి? నేడో రేపో క్రూరమృత్యువు వచ్చి శిరస్సుపై పాదాలు ఉంచి ఆపదను తెచ్చిపెట్టటం తథ్యమే కదా!

ఈ శరీరం ఎండుటాకు వలె పతనశీలమై ఉన్నది. 'జీవితం' అనబడునది శిథిలమైన స్థితిని కలిగియున్నది. ఇక ఆ నా బుద్ధిని చూస్తే... ఇది అధీరత్వముచే కుంచించుకుపోయి ఉంటోంది. ఇక్కడి రసములన్నీ నీరసములుగా కనిపిస్తున్నాయి. నీరసమైన భోగములచేతను, వాటి గురించిన కోర్కెలచేతనూ, జ్ఞాపకములచేతనూ మాత్రమే ఆయువంతా గడచిపోతోంది. అతి దీర్ఘకాలం జీవించినప్పటికీ కూడా నేను ఏ ఉత్తమ పురుషార్థమును సంపాదించుకోనే లేదు.

❖

హే మహాత్మా! ఈ విధంగా విమర్శచేయగా చేయగా... నా యందలి మోహం కొంచెం కొంచెం తొలగసాగింది.

ఈ 'దేహం' వలన ఇక్కడ ఏం పొంది ఏం ప్రయోజనం? ఎందుకంటే 'దేహి'గా ఈ దేహాన్ని ఆశ్రయించిన నేను ఒకానొకప్పుడు ఈ దేహమును ఇక్కడే త్యజించనున్నాను కదా! ఇక ఈ దేహము ఉన్నది కాబట్టి తారసపడే శబ్ద-స్పర్శ-రూప-రసాది విషయముల పట్ల నాకు ఆసక్తి ఎందుకు?

"అట్టి ఆసక్తి ఉండకపోవటమే ఉత్తమ స్థితి! ఆసక్తి కలిగి ఉండటమే అధమస్థితి"... అనే నిర్ణయానికి వచ్చాను. ఈ స్వప్నతుల్య జగత్తులో సంపదలు వచ్చిపడుచున్నప్పుడు వివేకి అయినవాడు 'ఇక ఫరవాలేదులే' అని మురిసిపోడు. "అయ్యబాబోయ్! ఈ సంపదలు నన్ను మోహింప జేయ గలవు కాబట్టి ఇది ఆపద సమయమే కదా!"... అని గ్రహించినవాడై, వాటి పట్ల అనాసక్తియే కలిగి ఉంటాడు.

ఆహా! జలము నిమ్న-ఉన్నత (పల్లము-ఎత్తు) ప్రదేశములకు ప్రవాహపతితంగా కొనిపోబడు చున్నది చూచారా? అట్లాగే ఈ జీవుడు విధి-నిషేధముల చేతను, శాశ్వత-అశాశ్వతములచేతను యథేచ్ఛగా ఎచ్చటెచ్చటికో గొనిపోబడుచున్నాడు. 'విషయాలు' అనే విషవాయువులు ప్రసరించుటచే హృదయమందలి వివేక-విజ్ఞానములు మూర్ఛిల్లుచున్నాయి.

మాయ యొక్క "ఆవరణ శక్తి"చే ...సద్రూపమగు 'పరబ్రహ్మము' అసత్తుగా కనిపిస్తోంది. అద్దాని "విక్షేపశక్తి"చే... 'అసత్తు' అగు జగత్తు సద్రూపము వలె భాసిస్తోంది. ఇదే మాయ యొక్క ఘటనాఘటన సామర్థ్యం కదా! అరెరే! రెండు తీరముల మధ్య వేగంగా ప్రవహిస్తూ ప్రవాహం సముద్రం జేరుచున్నట్లుగా... జన్మ మృత్యువుల మధ్య ప్రవహిస్తున్న ఈ జీవులు 'విషయములు' అనే మహాసముద్రం వైపుకే అతి వేగంగా పయనిస్తున్నారేగాని, 'జీవితము' అనే సందర్భమును సద్వినియోగపరచుకోవటమే లేదే!

విడువబడిన బాణం మరల వెనుకకు తిరగదు చూచారా? ...కృతఘ్నులు మైత్రిని తిరిగి వెనుకకు అందజేయరు కదా!... ఈ మనస్సు విషయములవైపు పయనిస్తూ శ్రేయోదాయకమైన ఆత్మజ్ఞానమువైపు మరలటమే లేదే?

**సుఖాన్యేవాతి దుఃఖాని, సంపదః పరమాపదః,**

**భోగా భవమహారోగా రతిరేవ పరారతిః**

పైకి సుఖాలుగా కనిపించేవన్నీ నిజానికి దుఃఖరూపాలే! సంపదలుగా కనిపించేవన్నీ ఆపదరూపాలే! భోగాలన్నీ... సంసార మహారోగాలు మాత్రమే! ఆసక్తియే..... పరమ దుఃఖం.

**ఆపదః సంపదః సర్వాః సుఖం దుఃఖాయ కేవలమ్!**

**జీవితం మరణాయైవ బత! మాయా విజృంభితమ్!**

సంపదలన్నీ ఆపదలే! సుఖం కేవలము దుఃఖము కొరకే అయి ఉన్నది. పుట్టటం చావటం కొరకే అవుతోంది. ఆహా! మాయ యొక్క విజృంభణ ప్రభావం ఎంతటిది? కాలము యొక్క మహా ప్రవర్తనముచే ఇష్టానిష్టములతో కూడి అనేక అల్ప సుఖాలు కనబడుచున్నాయి. ప్రియవస్తువును చూచి సంతోషించినంతసేపు పట్టటం లేదు... వాటి యొక్క వియోగం అట్టి వియోగం అతి దీర్ఘకాలంగా మనస్సును శిథిలం చేసి వేస్తోంది.

ఇక విషయభోగములందామా! అవన్నీ పాముయొక్క పడగల వంటివి మాత్రమే! ఎందుకంటే వాటిని కొంచెం స్పృశిస్తే చాలు... వెంటనే కరుస్తున్నాయి. విచారణ చేసి చూస్తే అవి ఆనందకరములూకావు, దుఃఖకరములూ కావు. విచారణ లేకపోతే అవన్నీ దుఃఖమార్గాలే!

ఇక్కడ కనబడే చేష్టలలో చాలా వరకు ఆయాసరహితమైన "ఆత్మ పదము" నకు దారి చూపేవిగా లేవు. పైగా ఆయా చేష్టల పరిణామం అతి కుటిలమైన ఆకారాన్నే కలిగి ఉంటున్నాయి. చివరకు భయంకరమైన కష్టములను ప్రసాదించునవి అగుచున్నాయి. ఈ విధంగా "కాలక్షేపం" (క్షిప్ = నాశనం/ వృథా) అగుచున్నది. కట్టుకంబమునకు త్రాళ్ళచే కట్టబడి ఆహారం దొరకక ఆకలితో అలమటిస్తూ క్రమంగా చిక్కి శల్యమయ్యే ఏనుగులు ఉంటాయే! ఆ రకంగా, భోగాశ యందు బంధించబడిన తృష్ణాసహితులగు మూఢ జీవులకు అడుగడుగునా అవమానములు తటస్థిస్తున్నాయి. సంపదలు-స్త్రీలు-ఇవన్నీ కూడా తరంగములవలె క్షణభంగురములైనవి. పైగా అవన్నీ సర్పము యొక్క పడగ క్రింద ఉన్న వస్తువుల వంటివి. విషసర్పపు పడగనీడలో క్రీడించాలని ఏ బుద్ధిమంతుడైనా అనుకుంటాడా? ఒకవేళ ఈ సంపదలు, ఈ స్త్రీలు మనోహరములైనవేనని నమ్మినప్పటికీ,... మదించిన స్త్రీ యొక్క కడగంటి చూపులాగా ఈ జీవితమే అతిచంచలం కదా!

**ఆపాతరమణీయేషు రమన్తే విషయేషు యే ।**
**అత్యంత విరసాన్తేషు, పతన్తి నిరయేషు తే ॥**

విచారణ చేయకపోవటంచేత మాత్రమే రమణీయములు పరిణామమున అత్యంత నీరసాలు... అగు ఈ విషయములను ఎవరు తత్పరులై సదా సంపాదించుకోవాలని అనుకుంటూ కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటారో... వారికి పతనం తప్పదు. ఈ ఆయుష్షు అనబడేదానిని ఎంతో శ్రమించి, ఎన్నో పుణ్యకార్యములు చేసి కదా, సంపాదించుకుంటున్నాం! అట్టి ఆయుష్షు శీత-ఉష్ణములు, క్షుత్-పిపాసలు (ఆకలి-దాహములు) మొదలైన ద్వంద్వములచే నిరోధించబడి చేయి జారిపోతోంది. ఇక సముపార్జనకు పైకి రమణీయంగా కనిపించే ధనము మొదలైనవి కష్టసాధ్యాలు, అస్థిరములు, దోషబుద్ధిగల వారిచే మాత్రమే సేవించబడేవి అగుచున్నాయి. అటువంటి ధనాదులు నాకెప్పుడూ సంతుష్టి కలుగజేయజాల వనునది సుస్పష్టంగా గమనించాను. అవి విచారణ చెయ్యక పోవుటచే మాత్రమే ప్రియంగా కనిపిస్తున్నాయి. తుదకు దుఃఖాన్నే కలుగజేస్తున్నాయి. క్షణకాలం విలాసంగా కనబడి, చివరకు శాంతికి భంగం కలుగ జేసేవన్నీ, మోహపూరితాలని విజ్ఞులు మాత్రమే గమనిస్తున్నారు. ఇక్కడి సముపార్జనలన్నీ కూడా ఆ పాతరమణీయాలు, శీఘ్రంగా నశించేవి, దుఃఖ-ఆపదలు కలుగజేసేవి అగుచున్నాయి. కాబట్టి వాటితో సంబంధం మోసపూరితు లగు శత్రువులతో సంబంధం వంటిదే!

ఇక యౌవనం యొక్క శోభ అందామా? అది శరత్కాల మేఘము యొక్క ఛాయ వలె నశ్వర మైనది. దాని రాక - దాని పోక అంతా చమత్కారమే! ఆరంభంలో రమణీయం-చివరికి సంతాప కరం! ఇక 'మృత్యువు' అనే సంఘటన ఎప్పుడు, ఎక్కడ, ఎట్లు ఎందుకు, ఎట్లా జరుగుచున్నదో ఏ జీవుడూ చెప్పగలిగేది కాదు. అయితే అది తప్పక వస్తుందని, అంతా హరించివేయనున్నదని

అందరికీ తెలిసినదే కదా! అయినాకూడా, వర్తమానములో అనేక అసందర్భప్రలాపాలను, అప్రస్తుత ప్రసంగాలను చేస్తూ విలువైన కాలం వృథా చేసుకుంటున్నారే! ఏది పొందినా, పొందకున్నా చివరికి మృత్యువు అన్నిటినీ తప్పక హరించివేయనున్నది కదా!

**అన్తకః పర్యవస్థాతా, జీవితే మహాతామపి,**
**చలన్తి ఆయూంషి శాఖాగ్రలంబా అంబూనీవ దేహినామ్ ॥**

ఈ సర్వ ప్రాణుల ఆయువులు వృక్షాగ్ర భాగంలో గల ఆకుల చివర వ్రేలాడే జలబిందువు కాక మరేమిటి?

**జీరన్తే జీర్యతః కేశా, దంతా జీర్యన్తి జీర్యతః**
**క్షీయతే జీర్యతే సర్వం, 'తృష్ణైవ' ఏకా న జీర్యతే ॥**

ఇక వార్ధక్యం! కేశములు, దంతములు శిథిలమైపోతున్నాయి. దేహమంతా శిథిలమగుచున్నప్పటికీ తృష్ణ మాత్రం క్షయింపక వర్తిస్తూనే ఉన్నది. ఆ తృష్ణ భావికాలపు అనేక దేహపరంపరా మహారణ్యానికి త్రోవతీయించుచున్నది కదా! ఎన్ని సంపాదించినా, ఏది పొందినా ఈ తృష్ణాగ్ని చల్లారటమే లేదు.

బాల్యము యౌవనము వలె... యౌవనము బాల్యమువలె... గడచిపోతున్నాయి. ఈ రెండు క్షణభంగురమే అవటంచేత సాదృశ్యమే (ఒకదాని వంటిదే రెండవది) అగుచున్నది. దోసిలిలోని నీరులాగా జీవితం శీఘ్రంగా నశించిపోతోంది. గడచిపోయిన జీవితం నదీ ప్రవాహంలాగా మరల వెనుకకు మరలే ప్రసక్తే లేదు కదా! ఏఏ దేహాలు ఇప్పుడు అనేక కార్య సంరంభములలో నిమగ్నమై కనిపిస్తున్నాయో... అవన్నీ కూడా మరికొంత కాలం తర్వాత అట్లా ఉండటం లేదు. లేదా, అసలే ఉండటం లేదు. రమ్యము-స్థిరము-సత్యముగా భాసించే అనేక పదార్థాలు అతి త్వరలో అరమ్యముగా, అస్థిరంగా అసత్యముగా అయి పోతున్నాయి. నిన్న ఉన్నది ఈ రోజుకు కనబడటంలేదు. ఈ రోజున ఉన్నది రేపు ఉండకయే పోవచ్చు.

ఇదంతా ఇట్లా ఉండగా... ఇదే జగత్తులో... కొందరు మహాశయులు, మహనీయులు ఉన్నారు. వారు 'జీవితము' అనే అవకాశాన్ని వాసనలను పెంపొందించుకోవటానికి కాకుండా తన ఇతఃపూర్వపు దుర్వాసనలను రహితం చేసుకోవటానికి శక్తి యుక్తులన్నీ ఉపయోగించి ప్రయత్నిస్తూ... తద్వారా వాసనారాహిత్యము వైపుగా పయనిస్తున్నారు. వారి చిత్తము క్రమంగా 'ఆత్మ విశ్రాంతి' అనే సుఖ స్థానమును సమీపించుచుండుటచే వారి ఆయుష్షు-అవకాశములు సద్వినియోగం అవుతున్నాయి. ఈ చిత్తమునకు 'వాసనారాహిత్యం'చే లభించగలిగే సుఖం-స్వర్గ-భూ-పాతాళాలలో మరెక్కడా కూడా లభించజాలదు కదా! ఏ భోగ స్థానములలోనూ మనస్సుకు, ప్రశాంతత కలుగదు. ఒక్క ఆత్మ విశ్రాంతియే అద్దానికి శరణ్యం కదా!

ఓ మాననీయా! వసిష్ఠ మహర్షీ! ఇట్లా నేను వైరాగ్యం సముపార్జించాను. సమస్త మనోహర పదార్థములను వాటి వృత్తులతో సహా జయించివేశాను. క్రమంగా అహంకార రహితుడనైనాను. అతి దీర్ఘకాలంగా అటువంటి అభ్యాసముచే నాకు స్వర్గ-మోక్షములపట్ల కూడా విరక్తి ప్రాప్తించింది.

అప్పుడిక తమవలెనే ఏకాంత ప్రదేశంలో ఆత్మవిశ్రాంతిని పొందాలని నిర్ణయించుకున్నాను. ఒక రోజు ఆకాశ సంచారం చేస్తూ ఆ ఏకాంత ప్రదేశంలో మీరు నిర్మించియున్న కుటీరం చూచాను. అది మీచే నిర్మించబడిన కుటీరమని నాకు తెలియదు. ఎవరో సిద్ధుడు ఆ గృహంలో ఉండి అప్పటికి కైవల్యం పొంది ఉంటారేమోనని అనుకున్నాను. అక్కడ ఏ జీవుడూ వచ్చే అవకాశం లేదని, నాకు ఏకాంత విశ్రాంతికి ఏమాత్రం భంగం రాదని తలచినవాడనై ఆ ఆశ్రమ మధ్య భాగంలో ఆసీనుడనై సుఖాసనం స్వీరించాను. ప్రాణ-అపానములను అనుసంధించి 'ఆత్మావలోకనము' అనే నిర్వికల్ప సమాధియందు నిమగ్నుడనైనాను.

హే మహాత్మా! వసిష్ఠ మహర్షీ! ఈ విధంగా నా వృత్తాంతమంతా మీకు నివేదించాను. మీ అనుజ్ఞ లేకుండా మీ కుటీరంలో ప్రవేశించిన అపరాధమునకు నన్ను క్షమించవేడుకొనుచున్నాను. మీ యొక్క దండనగాని, అనుగ్రహముగాని-ఏది ఉచితమని మీరనుకొంటే అది-నాకు శిరోధార్యం. మీ దర్శనం అయినందుకు సర్వేశ్వరునికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ మరల మీకు వినమ్రుడనై నమస్కరిస్తున్నాను. హే మునివరేణ్యా! మేము సిద్ధులమైనప్పటికీ కూడా (అన్ని విషయాలు చూచినంత మాత్రం చేతనే గ్రహించగలిగిన వారమైనప్పటికీ కూడా) ఎప్పుడు ఈ అంతఃకరణము ఒక విషయమున విచారణచే పూర్వాపరాలు పరిశీలించదో, అంతవరకు ప్రతికాలములందలి వృత్తాంతము గమనించదు కదా! బుద్ధిని ఏకాగ్రపరిస్తేనే ఏ విషయమైనా అవగాహనకు వస్తుంది కదా! అప్పుడే ఆ ఒకానొక విషయము యొక్క జ్ఞానం కలుగుతుంది. బుద్ధిని ఏకాగ్రపరచి పరిశీలించక పోతే ఏదీ తెలియదు. "ఎవరో సిద్ధులు ఇక్కడ ఆశ్రమం మనస్సుచే నిర్మించి ఆ తర్వాత త్యజించి ఉంటారులే"... అని అనుకోబట్టి, "ఈ ఆశ్రమం (కుటీరం) వసిష్ఠ మహర్షికి చెందినది"... అని గుర్తించటం జరుగలేదు. బ్రహ్మాదుల మనస్సు కూడా ఇట్లే ఇట్టి స్వభావమే (అభిప్రాయము ననుసరించే అవగాహన) కలిగి ఉంటుంది. ఇక సామాన్య సిద్ధుడనగు నా వంటివారి గురించి వేరే చెప్పేదేమున్నది? కనుక మీరు ఆజ్ఞాపిస్తే ప్రాయశ్చిత్తం నిర్వర్తించటానికి నేను సంసిద్ధుడనై మీ పాదాలు ఆశ్రయించుచున్నాను.

ఓ రామచంద్రా! ఆ విధంగా అత్యంత మధురమైన వైరాగ్య ప్రదమైన వాక్యాలు పలికిన ఆ సిద్ధుని ఆప్యాయంగాను, మిత్రపూర్వకంగానూ చూస్తూ చిరునవ్వుతో ఇట్లా పలికాను.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ సిద్ధ పురుషా! మీకు స్నేహపూర్వకంగా ప్రతి నమస్కారం సమర్పిస్తున్నాను. మీ వైరాగ్య వాక్యాలు అత్యద్భుతములు, పరమసత్యములు, జీవులకు సన్మార్గ సూచకములు అయి ఉన్నాయి. మహాత్మా! ఇందులో మీ దోషమేమీ లేదు. నేను కూడా ఏకాగ్రబుద్ధితో మీ గురించి విచారణ చేయలేదు. దేహధారులగు యోగులకు కూడా ఏకాగ్రబుద్ధితో విచారణ అనుసంధించక పోతే త్రికాల జ్ఞానము సంభవించదను మాట పరమసత్యము. అదియే కొంచెము సేపటి క్రితం నాపట్ల నిజమైనది. "ఈ సిద్ధ పురుషుడు ఇక్కడ నిర్వికల్ప సమాధిలో ఉండి ఉన్నారు. సరే, ఇక నేను నా నిజస్థానమగు సప్తర్షి మండలమును చేరెదను గాక"... అని ధ్యానము మరల్చాను. అట్లు

మరల్చుచున్నప్పుడు “సంకల్పము యొక్క ఉపసంహారముచే ఈ మనోనిర్మిత ధ్యానగృహం అదృశ్యమౌతుంది కదా”... అని నేను జ్ఞప్తి చేసుకోలేకపోయాను. “ఈ మహనీయుని సమాధి కొనసాగినంత వరకు ఈ మనోకల్పిత సిద్ధాశ్రమం యథాతథంగా ఉండుగాక”... అని సంకల్పించి ఉంటే మీరు ఆసీనులైన ఆ ధ్యాన గృహం యథాతథంగా ఉండేది. మీ నిశ్చల సమాధికి ఆటంకం కలిగేదే కాదు. ఈ విషయం విన్నవించుకొని మీ యొక్క క్షమను వేడుకోవాలనే ఉద్దేశంతోనే మిమ్ములను అనుసరించి, ఇటువచ్చి మిమ్ములను నిశ్చల సమాధినుండి నిదురలేపాను.

కాబట్టి నా అపరాధమును మీరే క్షమించండి. మహాత్మా! ఇక లేవండి. పోదాం. మీరు మీ సిద్ధలోకములకు, నేను నా నిజస్థానమైనట్టి సప్తర్షిలోకములకు వెళ్ళెదముగాక! ఎందుకంటే విక్షేపరహితమైన స్థితి కొఱకై మన మన స్వస్థానములను జేరటమే ఉచితము, సాధనను కొనసాగించుకోవటానికి సానుకూల్యము కదా!

❖

ఓ రామచంద్రా! ఇట్లు మేమిద్దరమూ కుశల ప్రశ్నల పూర్వకంగా పరస్పర ఆమోదములను, మర్యాదలను తెలుపుకున్నాం. ఆ తర్వాత యంత్రముచే ఆకాశమునకు విసరబడిన గులకరాళ్లవలె విశాల ఆకాశమున కొంతసేపు కలసి ప్రయాణించాం. ఆ తర్వాత పరస్పర ప్రణామపూర్వకంగా ఒకరివద్ద మరొకరం సెలవు తీసుకొని మామా అభిమత స్థానములకు బయల్వెడలాం. నేను కొన్ని సిద్ధ లోకములు, లోక పాలుర నగరములను సందర్శించి, అక్కడి సిద్ధులతో సంభాషించి, అటు తర్వాత సప్తర్షి మండలం జేరాను.

❖

ఓ రామచంద్రా! ఇదీ కథ! ఈ విధంగా నాకు స్వయంగా అనుభూతమైన ఒకానొక సంఘటనను ఆమూలాగ్రం ఈ ‘పాషాణోపాఖ్యానం’ అనే పేరుతో నీకు తెలియజేశాను. ఆ సిద్ధుడు దృశ్యజగత్తును ఎట్లు నిర్వచించారో కూడా వివరించాను.

కనుక ఓ సర్వసభికులారా! ఈ సంసారము యొక్క ఆశ్చర్యకరమైన వైచిత్ర్యమంతా గమనించి మీమీ ఆశయములను ఎక్కడెక్కడ ఎంత వరకు అవసరమో అంతవరకు తగిన రీతిని సంస్కరించుకొనెదరు గాక!

❖❖❖

# 41. పిశాచములు - ఉనికి - వ్యవహారం

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు “పాషాణోపాఖ్యానం” ద్వారా అణువణువునా జగత్తులు ఉన్నాయని, అవన్నీ భ్రాంతి చేతనే ఏర్పడి ఉంటున్నాయని, వాస్తవానికి ఆత్మకు అన్యమైనది ఎక్కడా ఏదీ లేనేలేదని సుస్పష్టపరచారు. అట్లాగే ఈ మాయ ఎంతటిదో, సంసారము ఎంతటి దుర్భరమో కూడా సిద్ధ పురుషుని వాక్యములు ఉటంకిస్తూ తెలియపరిచారు. మీ బోధ అమోఘం.

అయితే... మీరు ఆ మానసిక కల్పిత కుటీరంలో మీ దేహము ఉంచి లోకాలోక పర్వత శిలలోని బ్రహ్మాండ దర్శనం, ప్రళయకాల రుద్ర, ఛాయదేవిల విలయతాండవం తదితర బ్రహ్మాండము దర్శనం చేశారు కదా! తమ భౌతిక దేహమేమో ఆ కుటీరమునందున్న పృథ్వియందు ధూళిమయమై పోయింది. అప్పుడు మీరు సిద్ధపురుషునితో సంభాషించి వీడుకోలు చెప్పిన తరువాత ఏ దేహములతో ఏ ఏ సిద్ధలోకములకు వెళ్ళి అక్కడ సంభాషించటం మొదలైనవి నిర్వర్తించారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! ఆ వృత్తాంతం కూడా విను. అది మరచాను. ఇప్పుడు గుర్తు చేసుకుంటున్నాను.

ఆ సిద్ధ పురుషునితో సంభాషించిన సువర్ణమయమైన భూమినుండి బయలుదేరాను. 'జగత్తు' అనే గృహంలో ఆ చోట-ఈ చోట సంచరించాను. సిద్ధుల లోకములందు, లోకపాలకుల నగరమునందు తిరిగి తిరిగి ఇంద్రుని పట్టణం చేరాను. అదంతా స్థూల దేహరహితుడనగు నేనే మనోమాత్ర సూక్ష్మదేహంతోనే నిర్వర్తించాను. మనోమాత్ర దేహుడనై ఉండటంచేత నన్ను ఎవరు గాంచుటయే లేదు. అయితే నేను తదితరులను గాంచుచునే ఉన్నాను. ఆ సమయంలో చిదాకాశమయ స్వరూపుడనగు నేను ఆకాశమువలె సూక్ష్మాతిసూక్ష్మమైన ఆకృతి కలవాడనయ్యాను అప్పుడు నాకు- అధారము లేదు, అధేయము లేదు.

అట్లా ఆ సమయంలో స్థూల పదార్థములను ఎఱుగుచుండే మీ వంటివారివలె గ్రహీతగాని, గ్రాహ్యముగాని (గ్రహించువాడు-గ్రహించబడునది అనునవి గాని) లేవు. దేశకాలములచే ఈ భౌతిక పదార్థాలన్నీ మార్పు-చేర్పులు పొందుతూ ఉంటాయి కదా! ఆ నా చిదాకాశ సూక్ష్మరూపము దేశకాలములచే పరివర్ధనం అయ్యేది కూడా కాదు. అంతేకాదయ్యా! అప్పుడు నా స్వరూపము మననశీలమగు మనోమాత్రమే కదా! కనుక నాకు అప్పుడు ఈ పృథ్వి ధర్మాలు, ప్రాణ ధర్మాలు మొదలైనవేవీ లేవు. అప్పుడు నా రూపం సంకల్ప పురుషుని వంటిది. 'ఆలోచన' ఎక్కడికైనా ప్రసరించగలదు కదా! ఆ ప్రసరణను గోడలు గాని భౌతికమైన దూరాలుగాని, కాలము యొక్క పరిమితాలుగాని నిరోధించలేవు కదా! అట్లాగే నేను అప్పుడు స్థూల పదార్థ సమూహములచే నిరోధింపబడనివాడుగా ఉన్నాను.

స్వయముగా స్వానుభవము పట్ల ఉన్ముఖుడనైనవాడుగా ఉన్నాను. మనోమయమాత్రులగు ప్రాణులతోటి మాత్రమే వ్యవహరించువాడనై ఉన్నాను.

**శ్రీరాముడు :** స్వామీ!

1. స్థూల దేహరాహిత్యం
2. కేవలం మనోమయసహితులై ఉండటం
3. స్వానుభవముపట్ల మాత్రమే ఉన్ముఖులై ఉండటం
4. భౌతిక పదార్థములచే నిరోధింపబడజాలని స్వరూపం కలిగి ఉండటం
5. మనోమయులగు ప్రాణులతోటి మాత్రమే వ్యవహరించువారై ఉండటం

ఈ 5 విషయాలు ఏ విధంగా సాధ్యమో, ఎట్లా అవగాహన చేసుకోవాలో మరికొంచెం దృష్టాంతపూర్వకంగా వివరించండి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అటువంటి అనుభవమునకు ఇక్కడ "స్వప్నానుభవమే" దృష్టాంతమైయున్నది. అయితే ఎవరైతే స్వప్నానుభవమును ప్రమాణముగా అంగీకరించరో వారికి నేను నా ఆ అనుభవం గురించి చెప్పటం ఎట్లా కుదురుతుంది?

❖

ఒకడు స్వప్నంలో ఏ దేహముతో సంచరిస్తూ ఆ స్వప్నాంతర్గత జనులతో సంభాషిస్తూ స్వప్న నగరంలో విహరిస్తున్నాడు? ఏ పాదాలతో పర్వత శిఖరాగ్రములు అధిరోహించటం మొదలైనవన్నీ నిర్వహిస్తున్నాడు? అది మెలుకువతో ఉన్నవారికి, (ఆ ఇంటిలోని తదితర కుటుంబ సభ్యులకు) తెలుస్తుందా? లేదు. అట్లాగే నేను అక్కడి ఆకాశచారులగు దేవతలకు కూడా కనిపించుటయే లేదు. అయితే పృథ్వి సంబంధమైన ఆకారము కలిగి భాసించే తక్కిన ప్రాణులను నేను మాత్రం చూస్తూనే ఉన్నాను. సూక్ష్మ శరీరధారినగు నన్ను మాత్రం ఎవరూ చూడలేకయేపోతున్నారు.

**శ్రీరాముడు :** స్వామీ! నాదొక సందేహం. మీరు దేహరహితులు, ఆకాశ శరీరధారులు అగుటచేత ఆకాశచారులగు దేవతలకు కూడా కనిపించటం లేదు కదా! మరి ఆ సిద్ధ పురుషుడు సువర్ణ భూమిపై మిమ్ములను ఎట్లా గాంచగలిగారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మావంటివారు (జ్ఞాన సిద్ధులకు) "జ్ఞాన సత్య సంకల్పము"చే కల్పితములైన సర్వపదార్థములను గాంచగలరు. అయితే, ఒకడు 'సత్య సంకల్పుడు' అయినప్పటికీ అతడు సంకల్పించని వస్తువును గాంచలేడు.

వాస్తవానికి ఈ జీవులందరు మొట్టమొదట సూక్ష్మ శరీరధారులే. అయితే దేహ సంబంధమైన లౌకిక పదార్థములను, భౌతిక పదార్థములను చూచుచుండే చిరకాలాభ్యాసముచే ఈ జీవులు సూక్ష్మత్వమును ఏమఱచటం, గమనించజాలకపోవటం జరుగుతోంది. ఒకడు నిర్మలాత్ముడై, సూక్ష్మ శరీరధారణను సముపార్జించినప్పటికీ లౌకిక పదార్థాలలో–వ్యవహారాలలో నిమగ్నుడైనప్పుడు తన సూక్ష్మ రూపమును క్షణకాలంలో ఏమరుస్తూ ఉంటాడు.

ఇక ఆ సిద్ధునికి నేను ఎట్లా కనిపించానని అడిగావు కదా! దానికి కారణం విను. "ఈ సిద్ధుడు నన్ను చూచునుగాక" అని నేను సంకల్పించాను. కాబట్టే అతడు స్వసంకల్పముచే నన్ను గాంచగలిగాడు.

ఆ తరుణంలో "అయ్యెయ్యో! ఈ మహానుభావుడగు సిద్ధపురుషుడు నా మనస్సుచే కల్పించ బడిన కుటీరంలో తపస్సు చేస్తున్నాడు కదా!" అనునది ఒక్క క్షణం ఏమరచి, "ఈ సంకల్పిత కుటీరం మీరు ఉన్నంత వరకు నిలుచును గాక" అని సంకల్పించకుండా, "నేను సప్తర్షి మండలానికి మరలే వరకు ఈ కుటీరం ఇట్లే ఉండుగాక" అను ఇతఃపూర్వపు సంకల్పమును గుర్తుపెట్టుకోకుండా, నా దృష్టిని యథాలాపంగా నా నిజస్థానం వైపుకు మరల్చాను కదా! అక్కడి మనోకల్పిత కుటీరం

తన ఆలంబనం కోల్పోయింది. అప్పుడు, "ఈ సిద్ధపురుషుడు సమాధినిష్ఠలో ఉండగా ఈతని దేహమునకు హాని కలుగలేదు కదా?" ...అనే ఆదుర్దాతో "ఈయనకు నేను కనిపించెదనుగాక"... అని సంకల్పించాను. అట్లే కనిపించాను కూడా!

**శ్రీరాముడు :** స్వామీ! ఈ నా ప్రశ్నకు ఒకప్పుడు సమాధానం చెప్పారు. అయినా కూడా ఇక్కడ సందర్భానుచితం కాబట్టి మరల అడుగుచున్నాను. మామూలు జీవులు "ఇది ఇట్లా ఉండాలి. అది అట్లే ఉండకూడదు"... అని సంకల్పించినప్పటికీ... అది చాలా సందర్భములలో నెరవేరటం లేదు. మీరు సంకల్పించగానే అది అట్లే సిద్ధిస్తోంది. ఇది ఎందుచేత అట్లు జరుగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎవనికైతే చిరకాలంగా "బ్రహ్మము వేరు-నేను వేరు" అను భేదము దృఢపడి ఉంటుందో... అట్టివాడు సంకల్పించిన పదార్థములను, తదితరములను సంకల్పానుసారం పొంద లేడు. శాస్త్రార్థపరిపక్వతచే ఎవరికైతే "సర్వమునకు అంతర్యామి-బహిర్యామియగు శుద్ధ బ్రహ్మమే నా స్వరూపం కదా" అనే అనుభూతి సుస్థిరమగుచూ, జీవ-బ్రహ్మముల భేదము నశించిపోతూ ఉంటుందో... అట్టి సిద్ధుడు సత్య సంకల్ప యోగ్యుడౌతాడు. అనగా అట్టివాడు "ఇది ఇట్లు ఉండు గాక" అను సంకల్పము నిర్వర్తించుటచే అది అట్లే అనుభూతమవగలదు. ఆ సిద్ధపురుషుడు జీవబ్రహ్మైక్య భావము కలిగి ఉండటంచే "నన్ను చూచుట" అనుదానిలో సంకల్పయోగ్యుడైనాడు.

ఈ విధంగా ఆ సిద్ధ పురుషుని సంకల్పము - నా సంకల్పము - ఉభయములు యోగ్యములై మేమిరు వురము అత్యంత ఆదరపూర్వకంగా సంభాషించుకోవటానికి వీలు ఏర్పడింది.

**శ్రీరాముడు :** మహర్షీ! ఒకవేళ ఇద్దరు సిద్ధులు పరస్పర విరుద్ధమైన సంకల్పములు కలిగి ఉన్నారనుకోండి. అనగా వారిద్దరు పరస్పర విరుద్ధమైన అభీష్టములతో-ఒకరు కనబడాలని, మరొకరు కనబడకూడదని-సంకల్పించారనుకోండి. అప్పుడేమౌతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నీవు చెప్పినట్లు ఇద్దరు సిద్ధులు పరస్పర విరుద్ధ సంకల్పములు కలిగి ఉన్నారనుకో. అనగా ఒకరు "ఈతనిని నేను గాంచెదను గాక!" అని, మరొకరు "ఈతనికి నేను కనబడకుండెదను గాక"... అని సంకల్పించటం జరిగితే... అప్పుడు వారిద్దరిలో ఎవరి సంకల్ప బలము ప్రబలమై, అధిక నిర్మలమై ఉంటుందో... అతని సత్యసంకల్పమే జయించినదై తదనుకూలంగా జరుగుతుంది.

❖

ఆ విధంగా నేను సిద్ధుల స్థానములందు, లోకపాలుర పురములందు తిరుగుచూ ఉండగా నేనప్పుడు వ్యవహారాధిక్యత వలన నా యొక్క 'సూక్ష్మ రూపత్వము'ను మరిచాను. అప్పుడు నేను "కొందరితోకూడి ఆ మహాకాశమున వ్యవహరించాలి" అనే ఉద్దేశమునందు కొంచెం కొంచెం ప్రవృత్తుడనైనాను. అయితే అట్టి చంచలరూపుడనగు నన్ను అచ్చట ఎవ్వరూ (ఎంత సంకల్పించి నప్పటికీ) గాంచుటయే లేదు. ఒకసారి దేవలోకంలో నేను బిగ్గరగా అరిచాను. కాని ఏం లాభం? స్వప్నంలో స్వప్నద్రష్ట ఎంత అరచినప్పటికీ మెళకువతో ఉన్నవారికి వినిపించదు చూచావా? ఆ

విధంగా నా అభిప్రాయాలను తదితర ఆకాశవాసులకు వినిపించలేకపోయాను. మననశీలమగు మనో రూపము ధరించి నేను ఇతరులను గమనించటం, గ్రహించటం వారికి అవలంబనము ఒసగుట- ఇటువంటి వ్యాపారములలో ప్రవృత్తుడను కాగలిగాను. కానీ నన్ను గుర్తించటం-గ్రహించటంలో ఇతరులను సమర్థులుగా చేయలేకపోయాను.

ఓ రాఘవా! ఈ ప్రకారంగా నేను ఆకాశములో పిశాచమై సంచరించాను. ఆయా దేవతల అనిర్వచనీయ స్థానములలో నేను పిశాచరూపినై తిరుగాడసాగాను. సుదీర్ఘకాలం పిశాచత్వము అనుభవించాను.

**శ్రీరాముడు :** స్వామీ! వసిష్ఠ మహర్షీ! "నేనప్పుడు పిశాచినై (పిశాచత్వము వహించి) దేవతా భూములలో సంచరించాను"... అని మీ యొక్క స్వానుభవమును చెప్పుచుండగా నా మనోవీథిలో ఒకానొక సందేహం ఉత్పన్నమయింది.

**పిశాచాః సన్తిలోకేస్మిన్ కిమాకారాః? కిమాస్పదాః?**
**కింజాతీయాః? కిమాచారాః? కీదృశాః? కీదృశాశయాః?**

ఈ ప్రపంచంలో 'పిశాచములు' అనబడేవి ఉన్నాయా? ఉంటే అవి ఏ ఆకారమును కలిగి ఉంటాయి? అవి ఎక్కడ నివసిస్తూ ఉంటాయి? ఈ లోకంలో జంతు-మానవ మొదలైన అనేక జీవజాతులున్నాయి కదా! మరి పిశాచములు అనబడేవి ఏ జాతికి చెందినవి? ఏఏ ప్రవర్తనలు ఆచారములు అవి కలిగి ఉంటాయి? ఏ ఉద్దేశములు - ఆశయములు కలిగి ఉంటాయి? ఎటువంటి అలవాట్లతోగూడి వర్తిస్తూ ఉంటాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**పిశాచాః సన్తి లోకేస్మిన్, యాదృశాః తాదృశాత్ శృణు!**

ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో పిశాచములు ఎట్టివారై ఉందురో,. వారిని గురించి చెపుతాను,విను.

**న సభ్యో ఽసౌ న యో వక్తి ప్రసంగా పతితం వచః ॥**

సభ్యత్వము (లేక) సానుకూలమైన నడవడిక లేకుండా, ప్రసంగానుసారంగా మాట్లాడకుండా ఏదో ఆవేశంగా, అసందర్భంగా పలికేవాడు పిశాచజాతికి చెందినవాడే అవుతాడు.

**పిశాచాః కేచిత్ ఆకాశసదృశాః సూక్ష్మ దేహకాః**
**హస్త-పాదాది సంయుక్తాః, పశ్యన్తి త్వమివ ఆకృతిమ్**

కొందరు పిశాచములు ఆకాశమువలె సూక్ష్మ-మనోమయ దేహధారులై ఉంటారు. స్వప్నం వలె మనఃకల్పితమైన కాళ్ళు-చేతులు కలిగి ఉంటారు. వారు నీ వలెనే-నా వలెనే తక్కిన ఆకారములను గాంచకలుగుతూ ఉంటారు.

కొందరు పిశాచములు కొందరి చిత్తములలో ప్రవేశించగలుగుతారు. భ్రమ రూపము- భయదాయకము అగు తమ ఛాయచే వారలను ఆక్రమించ గలుగుతారు. వారికి వివిధ దుః ఖాదులు కలుగజేసే చేష్టలతో తమ ఆశయములను ఉద్భోధ చేస్తూ ఉంటారు.

మరికొందరు పిశాచములు, కొందరు జీవులలో ప్రవేశించి వారిని చంపుతారు కూడా! ఋణాను బంధమును అనుసరించి వారి ధాతువులను భుజిస్తారు. ఆ జీవుల రక్తాన్ని పానం చేస్తారు. వారి చిత్తమును ఆక్రమించి వారి బలమును తేజమును నశింపజేస్తారు.

పిశాచములలో కొందరు ఆకాశమువలె అతి సూక్ష్మరూపులై ఉంటారు. కొందరు కొండంత ఆకారంలో కూడా ఉంటారు. కొందరు స్వప్నమనుజుల ఆకారం ధరిస్తారు. మఱికొందరు సాకారరూపమును ధరించి ఇంతలోనే అంతర్ధానమై ఆకాశరూపులగుతారు. నిరాకారులౌతూ ఉంటారు. కొందరు పిశాచులు మేఘమువంటి రూపము కలిగి ఉంటారు. మరికొందరు వాయువువంటి రూపం కలిగి ఉంటారు. ఇంకొందరు పిశాచులు ఆయా భూతగ్రస్తులగు జీవుల భ్రమానుసారం దేహం ధరించి వర్తిస్తూ ఉంటారు.

❖

అయితే రామచంద్రా! ఈ జీవునికి మూడు దేహాలు ఉన్నాయి-
1. భౌతిక దేహం 2. మానసిక దేహం (సూక్ష్మదేహం, అతివాహిక దేహం) 3. ఆత్మ

పిశాచములకు భౌతిక దేహం ఉండదు. కానీ వారు బుద్ధిమయ-మనోమయ శరీరధారులై ఉంటారు. వారికి భౌతిక దేహము ఉండదు. కాబట్టి దేనినీ గ్రహించటానికి యోగ్యులు, సమర్థులు కారు. వారు ఆకాశమువలె శూన్యరూపధారులై తమ ఆకృతిని తామే అనుభవిస్తూ ఉంటారు. అంతేకాకుండా ఈ పిశాచులు వారిలో ఒకరినొకరిని గాంచగలుగుతూ ఉంటారు. వారికి పూర్వాభ్యాసకారణంగా దాహం వేస్తుంది. ఆకలి వేస్తుంది. కాని బాహ్య జలాదులను త్రాగలేరు. దేనినీ భుజించనూలేరు. ఏ పదార్థమునూ ఆధారముగా గైకొనుటకుగాని, తమ ఇచ్ఛవచ్చినట్లు దానము చేయుటకుగాని, గ్రహించుటకుగాని శక్యులు కారు.

**ఇచ్ఛా - ద్వేష - భయ - క్రోధ - లోభ - మోహ సమన్వితాః,**
**మన్త్ర - ఔషధ - తపో - దాన - ధైర్య - ధర్మ - వశీకృతాః ॥**

మరియు వారు ఇచ్ఛ - ద్వేషము - భయము - క్రోధము - లోభము - మోహము మొదలైనవన్నీ కలిగి ఉంటారు. మంత్రము-ఔషధము-తపస్సు-దానము-ధైర్యము-ధర్మములచే వారు వశీకృతులు అవుతూ ఉంటారు. ఒక్కొక్కచోట వారు 'సత్వావష్టంభము' అనే యోగధారణచే వశీభూతులౌతూ ఉంటారు. బీజా క్షరములచే రచించబడిన యంత్రము చేత కట్టుబడి ఉంటారు. మంత్రముచే ఆరాధింపబడి భూతవిద్య ఎఱిగిన మనుజులకు వశీభూతులై వారికి కనిపిస్తూ ఉంటారు. వారిచే (అట్టి మంత్రములను ఆశ్రయించి ఆరాధించువారిచే) ఆయా క్రియలందు, సేవలందు నియోగించబడుచూ ఉంటారు.

పిశాచములు దేవయోనికి చెందినవారే! అందుచేత వారిలో కొందరు దేవతల వలెనే అణిమ-గరిమ-మహిమ-ఈసిత్వసిద్ధి-ప్రాకామ్యసిద్ధి-ఇచ్ఛా సిద్ధి-వసిత్వ సిద్ధి-లఘిమ అనబడే అష్టైశ్వర్యములు కలిగి ఉంటారు. కొందరు శ్రీమంతులై ఉంటారు.

మరికొందరు పిశాచములు నాగముల (పాముల) లక్షణములు కలిగి ఉంటారు. మరికొందరు పిశాచములు కుక్క–నక్కలను బోలినవారై గ్రామములలోను, అరణ్యములలోను నివసిస్తూ ఉంటారు.

మరి కొందరు ఎముకలు–పెంట ప్రోగులు మొదలైనవాటితో కూడిన కల్మషస్థానములలోను, నరక సమానములైన అపవిత్ర ప్రదేశములలోను నివసిస్తూ ఉంటారు.

ఓ రామచంద్రా! ఈ ప్రకారంగా పిశాచముల యొక్క స్థానము–ఆకారము–ఆచారము గురించి చెప్పాను. దేహరహితమైన దేహాకార భావితులే పిశాచములు సుమా!

అయితే "పిశాచములు ఎక్కడి నుండి జనిస్తున్నాయి?"... అనే విషయం ఇప్పుడు వివరిస్తాను. శ్రద్ధగా విను.

❖

శుద్ధ బ్రహ్మము చేత్యరహితమై (దృశ్యరహితమై, విషయరహితమై) సర్వ దృశ్య వ్యవహారములకు మునుముందే ఉన్నది. సర్వవ్యాపకమై, సర్వశక్తియుతమై ఉన్నది. అది వాస్తవానికి అట్లే తన స్వభావ–స్వరూపములను విడువకయే, బంగారము బంగారత్వము విడువకయే ఆభరణత్వము ప్రకటించునట్లుగా, జలము జలత్వము విడువకయే తరంగత్వము ప్రదర్శించునట్లుగా, – విషయముల యొక్క సంకల్పములను స్వభావసిద్ధంగా ఆశ్రయిస్తోంది. అట్లు సంకల్పిస్తూ తనను తాను 'పురుషుడు' అను రెండవ రూపముగా గాంచుచున్నది.

"ఇది నేను –ఇది నా యొక్క ఆలోచన/ భావన" అను రెండుగా తనను తాను బ్రహ్మము గాంచటం ప్రారంభించగానే అప్పుడు అద్దానికి (అనగా అట్టి దర్శనము యొక్క వ్యవహార ప్రారంభ చమత్కారమును) శాస్త్రములు "ప్రథమాంకురము" అని, "జీవుడు" అని పేర్లుపెట్టాయి.

❖

ఇది నేను – ఇది నా ఆలోచన / భావన అనే ప్రథమాంకురమే జీవుడు అనబడువాని ప్రారంభం (సంకల్ప ప్రారంభమే జీవుని ప్రారంభం) అని అనుకున్నాం కదా! ఆ 'సంకల్పము' ప్రౌఢము అభిమానయుక్తము అగుచుండగా అద్దానిని 'అహంకారము' అని పిలుస్తున్నారు.

అహంకారము మరికొంత పరిపుష్టం కాగా అద్దానిని 'మనస్సు' అని ఆత్మజ్ఞులు పేర్కొను చున్నారు. అట్టి మనస్సుల సమష్టి రూపమే "సంకల్పాకాశరూపధారి" యగు బ్రహ్మదేవుడు. ఈ జగత్తంతా ఎవరి యొక్క 'సమాలోచన' (లేక) సంకల్పమో... ఆ ప్రథమ పురుషునికి 'హిరణ్యగర్భుడు' అని 'బ్రహ్మదేవుడు' అని, 'సృష్టికర్త' అని పేర్లు ఉన్నాయి.

కాబట్టి ఇక్కడ గ్రహించవలసినదేమిటంటే... ఈ జగత్తు వాస్తవానికి అసత్తు. అసత్తగు ఈ జగత్తునకు 'అసత్తు – ఆకార రహితము' అగు మనస్సే బీజము. ఈ ప్రకారంగా మనస్సే బ్రహ్మదేవుడై ఒప్పుచున్నారు. ఆ బ్రహ్మదేవుడు దేహవంతుడై కనిపిస్తున్నప్పటికీ వాస్తవానికి నిర్మలాకాశరూపుడే! ప్రతి జీవుని మనస్సు ఆ బ్రహ్మదేవుని రూపమే! అతడు విద్యమానుడై కనబడు

చున్నప్పటికీ స్వప్న పురుషుని (స్వప్నాంతర్గత పురుషుని) ఆకారమువలె అతడు సర్వదా తెలియబడనివాడే. బ్రహ్మదేవునికి ఈ మట్టి-గాలి మొదలైన వస్తువులతో నిర్మించబడిన ఆకారము లేదు. అతడు 'సూక్ష్మ శరీరధారి' అయి ఉన్నాడు. ఎట్లాగంటే.... ఆకాశమునకు గాని, సంకల్ప (ఊహ) పురుషునకు గాని పృథ్వి మొదలైన వాటితో చేయబడిన ఆకారం ఎక్కడిది? దృష్టాంతానికి నీ మనస్సు ఆకాశమున కల్పిత (ఊహానిర్మిత) నగరమును వీక్షించగలదు చూచావా? అట్లాగే మనస్సు తనయందు కల్పించబడిన 'బ్రహ్మ దేవత్వము'ను గాంచుచున్నది.

బ్రహ్మదేవుడు దేనిదేనిని ఏ ఏ సంకల్పితమైన దానిగా ఎఱుగుచున్నాడో... ఆయా పదార్థములన్నీ తత్ సంకల్ప ప్రయోజనంగా అట్లే సత్యము అయినట్లు గాంచుచున్నాడు, అనుభవించుచున్నాడు. ఉదాహరణకు, ఒక యువకుడు "ఆహాఁ! ఆ స్త్రీ ఎంత సుందరంగా ఉన్నది? ఆమెతో సంభాషణం ఎంత మధురంగా ఉంటుంది?"... అని భావన చేసి అదంతా ఆమెతోటి సంభాషించు సందర్భమున అట్లే అనుభవిస్తాడు కదా! ఇక వాస్తవం ఏమిటి అంటావా? "ఆ స్త్రీ దేహం కూడా రక్త-మాంస నిర్మితమైన తదితర దేహము వంటిదే" అనుకుంటే అట్లాగే అగుచున్నది. "కాదు ఇటువంటి అందమైన స్త్రీలు ఎక్కడో గాని ఉండరు"... అని అనుకుంటే అది అట్లే ప్రాప్తిస్తుంది. అట్లాగే బ్రహ్మదేవుడు తన సంకల్పితమైన జగత్తును సత్యము అయిన దానివలె అనుభవం పొందుచున్నాడు.

ఏ ఏ జీవులు కలరో వారందరి స్వరూపం కూడా ఆ చిద్వస్తువే కదా! అందుచేతనే వారందరు జ్ఞానశక్తిని కలిగియే ఉన్నారు. అందుచేత ఈ ఈ జీవులు కూడా నిజ – కల్పితములను ఎందుకు గాంచలేరు? గాంచగలరు. ప్రతిజీవుడు నిజకల్పిత విశేషములను అనుసరించే ఇక్కడ 'జగత్తు' అనబడు దానిని పొందుచున్నాడు.

ఈ జగత్తు ఎట్టిది? ఆ బ్రహ్మదేవుని "భావన-యోచన కూడా సంకల్పరూపమే" అగుటచే ఈ జగత్తు బ్రహ్మదేవుని ప్రతిభాసయే అయి ఉన్నది. చిత్రకారుడు సృష్టించిన చిత్రం చిత్రకారుని ఊహలోంచే వచ్చింది. కాబట్టి అతని ప్రతిభాసయే కదా! ఈ జగత్తు కూడా అట్టి (బ్రహ్మదేవుని) ప్రతిభాసయే! ఇది బ్రహ్మదేవుని సుదీర్ఘ-సుందర స్వప్నము మాత్రమే! అయితే చిరకాలము తదేక భావనచే ఇది ఘనీభూతమై, పరిపుష్టమై వెలయుచున్నది. వాస్తవముగా బ్రహ్మమే రూపముగా కలవాడు, మనోమాత్ర దేహధారి అగు బ్రహ్మదేవుని చిరకాల భావనచే ఆతని సృష్ట్యానుభవమే ఈ రీతిగా ఆధిభౌతిక రూపంతో (స్థూలరూపంతో) లెస్సగా ప్రకటనమయింది. ఆయన యొక్క అనేకానేక సంకల్పములు సంపుటమగుటచే ఈ జగత్తు భేద సమూహరూపములతో భాసించుచు ఇది "సృష్టి" అని చెప్పబడుతోంది.

ఆ బ్రహ్మదేవుడూ... అతని సంకల్పముచే ఉత్పన్నమైన ఈ జగత్తు... ఈ రెండు కూడా పరమార్థమున బ్రహ్మరూపములే! ఈ రెండూ (బ్రహ్మము-జగత్తు కూడా) సదా (వాస్తవానికి) ఉత్పత్తి-భేద రహితములే!

ఆకాశము-శూన్యము; వాయువు-స్పందము; జలము-తరంగము; మట్టి-బొమ్మ; బంగారము-ఆభరణము; ఇనుము-ఆయుధము ... ఇవన్నీ ఏకరూపములే కదా! వాస్తవానికి బ్రహ్మము-బ్రహ్మదేవుడు-సృష్టి ఏక రూపములే అయి ఉన్నాయి.

**శ్రీరాముడు :** హే మహాశయా! ప్రథమ సంకల్ప పురుషుడగు బ్రహ్మదేవుడు తన సంకల్ప స్వరూపమగు ఈ సృష్టిని 'సత్యము' అని ఎఱుగుచున్నారా? లేక 'అసత్యము' అని ఎఱుగుచున్నారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు నీ సంకల్ప పురుషునికి (నీ కల్పముల అనుభవమునకు కర్తృత్వము వహించే నీ యొక్క చైతన్య విభాగమునకు) సద్రూపములైన నగరాదుల పంచభూతత్వము మరొకరు తెలియజేయవలసిన పని లేకుండానే అసత్యమనియే ఎఱుగుచున్నావు కదా! అనగా, నీవు నీ ఊహలో కనిపించిన నగర వీధులు నీచే అనుభవించబడుచున్నప్పటికీ "ఇదంతా ఊహయే గాని పాంచభౌతిక సత్యం కాదు" అని నీకు నీవే ఎఱిగియే ఉంటున్నావు కదా! అట్లాగే సమష్టిమనోరూపుడు, వాస్తవానికి ఆత్మస్వరూపుడు అగు బ్రహ్మదేవుడు కూడా జగత్తు యొక్క భూతమయత్వమంతా "మిథ్యయే" అని ఎఱిగియే ఉంటున్నాడు.

బ్రహ్మదేవుడు తన చిత్‌సత్తచే పరిపుష్టములైనట్టి బ్రహ్మాండరూపమగు స్వశరీరము యొక్క ఆయా ధాతువులకు "ఇది పృథ్వి, ఇది జలము, ఇది అగ్ని/ తేజస్సు, ఇది వాయువు, ఇది ఆకాశము అను 'పంచసంజ్ఞలను' ఒసగుచున్నాడు. ఆ పంచ సంజ్ఞలు కలసి ఈ 'జగత్తు' అను రూపమున స్థితినొంది ఉంటోంది. ఇక బ్రహ్మదేవుని సత్యాసత్య భావన గురించి అంటావా...?

నీవు స్వప్నం పొందుచున్నప్పుడు ఆ స్వప్న సమయంలో ఆ స్వప్నాంతర్గత విశేషాలన్నీ అసత్యములే అయినప్పటికీ సత్యమనియే అనుకుంటున్నావు కదా! సత్యములనుకొనే అనుభవము పొందుచున్నావు. ఆ స్వప్నము అయి పోయిన తర్వాత ఎవరూ నీకు చెప్పకుండానే "అదంతా అసత్యమే కదా" అని నీకు నీవే గమనిస్తున్నావు. అట్లాగే ఒకడు ఊహాలోకంలో ఉంటూ ఆ ఊహలో కనిపించినవి అసత్యములే అయినప్పటికీ సత్యమువలె అనుభవం పొందుచున్నాడు కదా! అట్లాగే బ్రహ్మదేవుడు కూడా సంకల్ప జనితమగు ఈ జగత్తును ఇది అసత్యమే అయినప్పటికీ సత్యరూపముగనే అనుభవించుచున్నాడు.

బ్రహ్మదేవుడు అతని సంకల్పము కూడా - (తరంగం జలమే అయినట్లుగా) - పరమార్థమున చిదాకాశ రూపమే అయి ఉన్నది. అయితే, నామరూపాత్మకమగు ఈ జగత్తంతా కూడా ఆ బ్రహ్మదేవుని సంకల్ప మాత్రమే కాబట్టి "ఆ జగత్తులోని అనేక పదార్థములు-అనేక జీవులు మొదలైనవాటి దృష్ట్యా ఇదంతా స్వప్నతుల్యమే" అని కూడా తప్పక చెప్ప బడుచున్నది. కాబట్టి ఈ జగత్తు యొక్క ఉత్పత్తి-వినాశనము కూడా సంకల్పము చేతనే గావించబడినవై స్థితి నొందియున్నవి.

మనోరూపుడగు బ్రహ్మదేవుడు (లేక సృష్టికర్త) ఎంతటి సత్యమో... అంతటి సత్యమే ఈ చంద్ర-సూర్యాదులు కూడా! అవన్నీ భౌతికంగా అగుపిస్తున్నప్పటికీ బ్రహ్మదేవ మనో నిర్మితాలేనని గ్రహించు. బ్రహ్మదేవుని మనస్సువలెనే అవి కూడా అర్థక్రియా సామర్థ్యములు అగుచున్నాయి.

❖

కాబట్టి రామచంద్రా! ఈ సమస్త జగత్ సమూహములు కూడా మనోరాజ్యమనియే చెప్పబడుచున్నది. అంతేకాదు. వాస్తవానికి జగత్తు దృశ్యశూన్యము, నిరాలంబము అయినట్టి చిదాకాశమే అయి ఉన్నది. స్వప్నంలో కనిపించే పర్వతములు, నగరములు, జనులు స్వప్న ద్రష్ట యొక్క స్వరూపములే కదా! అంతకుమించి ఆ స్వప్నాంతర్గత విశేషములకు వేరే స్వరూపం ఎక్కడున్నది? స్వప్న ద్రష్ట స్వతహాగా చిదాకాశరూపుడేనాయె! ఈ విధంగా స్వప్న ద్రష్ట స్వప్నాంతర్గత విశేషాలు చిదాకాశ రూపములే అయి ఉన్నాయి. అట్లాగే బ్రహ్మదేవుడు + ఆయన స్వప్న మాత్రమైన ఈ జాగ్రత్-జగత్తు..... ఈ రెండూ కూడా నిర్మల చిదాకాశరూపములే అయి వెలయుచున్నాయి. ఈ జగత్తు స్వప్న పురమువలె అభాస మాత్రమే! ఇద్దాని యొక్క ఉత్పత్తి-స్థితి-ప్రళయము కూడా ఊహ-సంకల్పము-స్వప్నముల వలె మిథ్యగానే ఉదయించినవై ఉన్నాయి.

కానీ యథార్థానికి ఈ సమస్తము కూడా అవ్యయమగు బ్రహ్మమే అగును సుమా! ఓ రామచంద్రా! చిదాకాశ రూపములమే అగు నీ యొక్క- నా యొక్క ఈ జగత్తు యొక్క గాని ఏమి ఉత్పన్నమౌతోంది? ఏమి నశించుతోంది చెప్పు? నీ స్వస్వరూపమునకు-నా స్వస్వరూపమునకు కూడా జగత్తు ఉండటం చేతగాని, లేకుండటం చేతగాని మార్పు-చేర్పులు ఏముంటాయ్? ఏమి ఉండవు. ఇక ఇక్కడి రాగ ద్వేషములు మొదలైన వంటావా? అవన్నీ కేవలం ప్రయోజన శూన్యములు, అపార్థకములు, అనర్థకములు, స్వప్నంలోని సింహాన్ని చూచి జాగ్రత్తులో ఉలిక్కిపడటం వంటిది మాత్రమేనని కూడా గమనించెదవు గాక!

ఓ రామచంద్రా! వాస్తవానికి పరమార్థ దృష్టియందు... సృష్టి యొక్క కారణము లేదు. సృష్టి లేదు. అసృష్టి లేదు... ఏ జీవ-జగత్తులు ఒకప్పుడు భాసించి-మరొకప్పుడు భాసించకయే ఉన్నాయో...అవన్నీ కూడా సదా ఆవరణరహితమగు బ్రహ్మమే అయి ఉన్నాయి.

చైతన్యము అత్యంత శూన్యము-విశాలము-నిర్మలము అయి ఉన్నది. చైతన్యమునందు అద్దానికి ఏమాత్రం అన్యం కానట్టి, 'చిదాకాశము' ఉన్నది. ఆ చికాశమునందు చిదాకాశ స్వరూపములే అగు అనేక భూతకోట్లు ఉత్పన్నం అయిఉన్నాయి. ఉత్పన్నం కాబోతున్నాయి.

కానీ యథార్థానికి ఆ చిదాకాశమునందు క్షేత్రమూ లేదు, బీజమూ లేదు, ఏదీ నాటబడనూలేదు, ఉత్పన్నము అయి ఉండనూలేదు. మరి? మాయ చేతనే అంతయు ఇట్లు స్థితినొందియున్నది. మాయ భ్రమచేతనే నిర్మితమౌతోంది. భౌతిక రూపములుగా-సృష్టి పరంపరలుగా కనిపించేదంతా భ్రమ తొలగితే చిదాకాశముగానే కనిపించగలదు. అట్టి కల్పనా క్షేత్రంలో కనిపించే రకరకాల శిలలే దేవతలు, దేవర్షులు, మనుష్యులు, నాగాదిజాతులు, క్రిమి-కీటకాదులు మొదలైనవి. అటువంటి కల్పనా క్షేత్రంలో ఉన్నవే మరొక జాతియగు పిశాచులు కూడా! వారు మహాభారభూతులు. వారి ఆకారము పంచభూత పదార్థరహితం కాబట్టి వారు శూన్యరూపులే! వారు ఎప్పుడో ఇతఃపూర్వమే భౌతికదేహం దృష్ట్యా నశించి ఉన్నవారు. దేహరహితులై దేహాకారముగా ఉన్నవారే పిశాచులు.

**శ్రీరాముడు :** మహర్షీ! బ్రహ్మదేవుడు తన ఇచ్ఛ చేతనే ఈ రకరకాల జీవజాతులను సృష్టించుచున్నాడు కదా!... అలాంటప్పుడు ఆయన తన ఇచ్ఛచే 'దేవర్షులు' మొదలైన వారినే సృష్టించవచ్చును కదా! మరి దుష్ట జీవులగు పిశాచములు మొదలైనవి ఎందుకు సృష్టించటం?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఒక కథా రచయిత (నవలా రచయిత) పాఠకుల అభిలాషను అనుసరించి మంచి – చెడులను కలగలిపి కథారచన / నవలారచన కొనసాగిస్తాడు కదా! అట్లాగే సృష్టికర్త యొక్క సృష్టిసంబంధమైన ఇచ్ఛ కూడా జీవుల కౌతుక విశేషమును అనుసరించే ఉంటోంది.

బ్రహ్మదేవుని ఇచ్ఛపై అట్టి ఆక్షేపణ తగదు. ఎందుచేతనంటే అతని ఇచ్ఛ పూర్వకల్పము నందలి ప్రాణుల కర్మ–వాసనాదులను అనుసరించే ప్రవర్తించుచున్నదగుచున్నది. వాస్తవానికి సమస్త ప్రాణికోట్లు సమస్త మనోమాత్ర శరీరధారులు, ఇవన్నీ కూడా పృథ్వి మొదలైనవి లేనివారై ఉండి, కేవలం చిదాకాశరూపములై ఉన్నారు. అట్టి స్వతహాగా నిర్మల చిదాకాశ రూపులగు ఈ ప్రాణుల యొక్క చిరకాలాభ్యాసముచే "ఆధిభౌతిక రూపత్వము" పొందుచున్నారు. అదంతా "ఒక స్వప్నము దీర్ఘకాలం అనుభవించటంచే జాగ్రద్దశను పొందుచున్నట్లుగా" ఏర్పడి ఉంటున్నాయి. (ఉదా: లవణ మహారాజు అనుభవం ("మహేంద్రజాలం" భృగుయమ సంవాదము" గాధి వృత్తాంతం–మనోదర్పణం మొదలైనవి).

చిదాకాశమునందే దీర్ఘకాలికమైన భావపరంపరాభ్యాసంచే ఆధిభౌతికత్వం అనుభవించ బడుతోంది. అట్లాగే పిశాచ జాతులు కూడా! వారు సర్వ జీవుల వలెనే శుద్ధ చైతన్యరూపులే! అట్టి శుద్ధ చైతన్యరూపులు తమ శుద్ధత్వము ఏమరచి దీర్ఘకాలం 'సంకల్పనగరం'లో విహరిస్తూ సూక్ష్మదేహధారులైనారు. వారు మరల ఇంకనూ స్థూలదేహం పొందలేదు. ఆధిభౌతికదేహ–సూక్ష్మ దేహత్వముల మధ్య వారు సంచారము చేస్తున్నారు. అనగా (1) వారు సూక్ష్మ దేహం పొందారు. ఇంకనూ స్థూల దేహం పొందలేదు. లేదా (2) స్థూలదేహం కోల్పోయారు. సూక్ష్మదేహులై బలవత్తరమైన స్థూల దేహాభిలాష కలిగి ఉండి ఇంకనూ స్థూలదేహం పొందలేదు. ఇదివారి జాతిధర్మం. అనగా వారు సూక్ష్మ–స్థూల దేహముల మధ్య అనేకానేక ధ్యాసల మధ్య కొట్టుమిట్టాడుచున్నారు.

**పిశాచాద్యాస్తథా ఏతే తథా భూత అధిభౌతికాః**
**తిష్ఠంతి తుష్టమనసః స్వసంసార విహారిణః ॥**

పిశాచాదులు తమ యొక్క చిరకాలాభ్యాసంచే ఆధిభౌతికత్వ స్వభావాన్ని తమ స్వరూపముపై ఆపాదించుకొని ఇక ఈ సంసారమున సుదీర్ఘ విహారం చేస్తున్నారు. స్వజాతి యోగ్యమైన భోగములను పొందుచు, మరికొన్ని సందర్భములలో ఏవేవో భోగముల కొరకై ఉబలాటము–ఆందోళన–ఆర్తి–ఆవేదనలు చెందుచూ సంసారారణ్యంలో సంచారములు సలుపుచున్నారు.

వారిలో కొందరు క్రమేపీ సాధనానుకూలమైన ఆధిభౌతిక దేహం పొందుచున్నారు. కొందరు ఇంకనూ పొందుటకై ఆరాటపడుచున్నారు. మరికొందరు పిశాచత్వం ధరించి సుదీర్ఘకాలం గడపుచునే ఉన్నారు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఆ పిశాచములు కూడా స్వజాతీయమైన పరస్పర సంబంధములు-సంభాషణలు-మొదలైనవి కలిగి ఉంటాయా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** గ్రామస్థులు గ్రామస్థులను చూస్తారు చూచావా? స్వప్నలోక నివాసులు (ఉదాహరణకు గంధర్వలోకం) పరస్పరం గాంచుచూ సంభాషించుకొంటూ ఉంటారు కదా! అట్లాగే కొన్ని పిశాచజాతులు పరస్పరం వ్యవహరించుకొంటూంటారు. మరికొన్ని పిశాచజాతులు-మనుజుని యొక్క స్వప్నజీవుల వలె-పరస్పరం గాంచుచుండటంలేదు, పరస్పరం సంభాషించుకోవటం లేదు.

ఓ రామచంద్రా! ఈ పిశాచములు పరాన్నభుక్కు-పరరక్తభుక్కు-పర మనోహక్కులుగా అధికంగా ఉంటూ ఉంటాయి. ఒక్క పిశాచ జాతులే కాకుండా, అదే రీతిగా కుంభాండ జాతి జీవులు, యక్షజాతి జీవులు, ప్రేతజాతిజీవులు ఉంటారు. వారందరికి కూడా కారణం దేహం (లేక) సూక్ష్మ దేహం (లేక, మానసిక దేహం) ఉంటుంది.

**యథా తత్ర ఇహ వైనిమ్నా, జలం తత్రావ తిష్ఠతే**
**తథా యత్ర పిశాచాద్యాః "తమః" తత్ర అవతిష్ఠతే ॥**

ఎక్కడ పల్లం ఉంటే అక్కడ నీరు నిలుస్తూ ఉంటుంది కదా! అట్లాగే పిశాచాదులు ఎక్కడ ఉంటే వారి వారి పాపములు తారతమ్యమును బట్టి అధికమైన, అల్పమైన తమోగుణస్థితి కలిగి ఉంటుంది, ప్రదర్శితమౌతూ ఉంటుంది.

ఒక్కొక్క పిశాచము మధ్యాహ్న సమయంలో స్వయంగా ఒకని ఎదుట నిలబడితే అతని ఎదుట అంధకారం ఆవరిస్తుంది. ఆ పిశాచము వలన అనుభవించే అంధకారమును ఈ సూర్యుడు తొలగించలేడు. పిశాచ జీవునికి కనబడే అంధకారం అధికంగా ఆ పిశాచ స్వరూపదేహియే స్వయంగా అనుభవిస్తూ ఉంటాడు.

ఆహా! మాయయొక్క ప్రభావం ఎంతటిది! సభౌతిక దేహులమగు మనం వ్యవహరించాలంటే సూర్యుడు-చంద్రుడు తేజోమండలముల వెలుగు కావాలి కదా! పిశాచములు అదేరీతిగా వ్యవహరించటానికి "చీకటి" కావాలి. గుడ్లగూబలాగా పిశాచాదులు స్వభావంగానే వెలుతురులో నిర్బలులై ఉంటారు. అంధకారంలో ప్రబలులై ఉంటారు. ఆహా! ఏమి ఆశ్చర్యం! ఈ సృష్టిలో కొందరు జీవులకు వెలుతురు ప్రియమైతే, మరికొందరు జీవజాతులకు చీకటి ప్రియమౌతోంది!

❖

ఓ రామచంద్రా! "దేవతల-లోకపాలకుల నగరాలలో పిశాచమై సంచరించాను" అను ప్రసంగవశంగా నీవు అడిగిన ప్రశ్నకు సమాధానంగా పిశాచముల గురించిన కొన్ని విశేషాలు ఇక్కడ ప్రస్తావించాను. "శిష్యుడు అడిగిన సందేహమునకు సమాధానం గురువు చెప్పాలి" అనే సంప్రదాయాన్ని అనుసరించి ఇక్కడ పిశాచముల గురించి చెప్పానే గాని, మన సంవాదమునకు ఇంతకు మించిన వివరాలు సందర్భోచితం కాదు.

❖❖❖

# 42. ఆత్మజ్ఞానమే ముఖ్యోపాయం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ విధంగా అప్పుడు పంచభూత రహితమగు "కేవల చిదాకాశ మాత్ర దేహధారి" ని అయి పిశాచముగా ఆకాశమున అనేక స్థానములలోనూ లోకములలోనూ సంచరించానని చెప్పాను కదా! ఆ సమయంలో చంద్ర-సూర్య-ఇంద్ర-హరి-హరాదులు గాని, దేహ-సిద్ధ-గంధర్వ-కిన్నర-అప్సరస గణములు గాని నన్ను చూడజాలకుండిరి. నేను వారిని ఆక్రమించుచున్నప్పుడు కూడా నన్ను వారు ఆక్రమించలేకపోయేవారు. నా వాక్యములు వారికి వినబడేవి కావు. ఈ విధంగా మత్తును పొందిన సజ్జనునిలాగా కర్తవ్య విచార శూన్యుడనై మోహమును పొంది కొంతకాలం అట్లా గడిపాను. అట్లా సంచరిస్తూ-సంచరిస్తూ ఉండగా ఒకానొకప్పుడు కాకతాళీయంగా 'అరెఁ! ఏమిటిది? నన్ను ఎవరూ చూడలేక పోతున్నారు, వినలేకపోతున్నారు. ఇప్పుడు ఈ పిశాచత్వము తొలిగేది ఎట్లా?' ...అనే ఆవేశముతో కూడిన ఆవేదన నా యందు బయలుదేరింది. "ఈ ఒంటరితనం నేను త్యజించాలి. ఎట్లా?" ...అని యోచించసాగాను. అప్పుడు నా హృదయస్థానంలో ఒకానొక ఆలోచన తళుక్కున మెఱిసింది. "అరె! నేను ఈ విషయం ఎట్లా మఱచాను? మేము సత్యసంకల్పులం కదా! 'ఇది ఇట్లు అగుగాక' ...అని తలచగానే అతి అట్లే ప్రాప్తించగలదు కదా!" ...అనే మాట జ్ఞాపకమునకు వచ్చింది. అప్పుడు నేను దేవతాలోకంలో ఉండటంచేత "ఈ దేవతలందరు నన్ను చూచెదరు గాక!" అని మననపూర్వకంగా కొంతసేపు సంకల్పించాను. వెంటనే ఆ దేవలోకంలోని దేవతా జీవులకు ఇంద్రజాలంలో ఎదురుగా కొండలు కనిపించునట్లు-నేను అప్పటికప్పుడు జన్మించినట్లుగా కంటికి కనిపించసాగాను. అప్పుడు నేను ఆయా లోకములకు ప్రామాణ్యములైన యథా స్థితములైన ఆచారములు కలిగి ప్రవర్తించసాగాను. శంకారహితుడనై వర్తించటం ప్రారంభించాను. దేవతల గృహములలో వారితో సంభాషించటం ఆరంభించాను.

అప్పుడు నా ఇతఃపూర్వపు వృత్తాంతం తెలియని దేవతలు కొందరు, "ముంగిటయందలి పృథ్వి నుండి ప్రప్రథమంగా ఆవిర్భవించారు. కాబట్టి ఈయన పార్థివ వసిష్ఠుడు" అని చెప్పుకోసాగారు.

మరికొందరు "ఈతడు ఆకాశమున సూర్యకిరణముల నుండి వెలువడటం మేము చూచాం. కాబట్టి ఈయన 'తేజస వసిష్ఠుడు' " అని సంభాషించుకోసాగారు. అట్లాగే వాయుమండలము నుండి నేను ఉద యించటం వీక్షించిన ఆకాశవాసులగు దేవతలచే "వాత వసిష్ఠుడు" అని పిలువబడసాగాను.

కొందరు మునీశ్వరులు నేను జలము నుండి వెలవడుచున్నట్లు గాంచినవారై "ఈయనే వారి వసిష్ఠుడు" అని ప్రకటించసాగారు. ఆకాశము నుండి వినిర్గతుడవటం గాంచిన మరికొందరు ఆకాశవాసులు "ఆకాశ వసిష్ఠుడు" అని సంబోధించసాగారు.

ఈ విధంగా వివిధ కల్పనలచే నా నామము - జన్మ గురించి ఊహ-అపోహలు కల్పించబడ్డాయి. అప్పటి నుండి లోకములలో ఒకచోట పార్థివుడు అని, మరొకచోట అమ్మయుడు (జలమయుడు) అని, ఇంకొకచోట 'తైజసుడు' అని, వేరొక చోట 'మారుతుడు' అని, ఒకానొక చోట 'ఆకాశమయుడు' అని ప్రసిద్ధికెక్కాను.

ఆ తర్వాత చిరకాలాభ్యాసంచే కాలక్రమంగా నా మనస్సు పరిణతి పొందింపబడినది. అనగా క్రమంగా నాపట్ల అతివాహిక దేహము (సూక్ష్మదేహము) ఆధిభౌతిక దేహము (స్థూల దేహము) ప్రకటనమయ్యాయి. అయినా కూడా, రామచంద్రా! నా యొక్క ఆత్మజ్ఞాన బలంచేత నా దృష్టియందు... 1. అతివాహిక దేహము (సూక్ష్మ దేహము); 2. ఆధిభౌతిక దేహము (స్థూల దేహము)... ఈ రెండూ కూడా చిదాకాశరూపములుగా కన్పట్టాయిగాని ఏదో క్రొత్తది పొందినట్లుగాని, పాతదేదో త్యజించినట్లుగాని నాకు ఆ సమయమందుకూడా అనిపించనేలేదు. ఇప్పుడూ అనిపించటం లేదు. నేను ఏకాంతాకాశ ప్రదేశమున ప్రకాశించినప్పుడు, లోకాలోక పర్వతశిలలో బ్రహ్మాండమును దర్శించినపుడు, మహారుద్ర-ఛాయాదేవిల ప్రళయ తాండవం దర్శిస్తు న్నప్పుడు, పిశాచ స్వరూపినై సూక్ష్మ దేహమునకు కూడా ఆవల సంచరించుచున్నప్పుడు, "సర్వతత్త్వ రూపమగు ఆత్మయే నా స్వరూపం".... అని సుస్థిరీకరించుకొని ఉండుటచే ఇప్పుడు సూక్ష్మ-స్థూల దేహాలు పొందుచున్నప్పుడు కూడా యథాతథమైన 'ఆత్మభావన'యే పుణికిపుచ్చుకొని ఉన్నాను.

అప్పుడు-ఇప్పుడు కూడా నా చైతన్యము 'ఆత్మ భావము' తోటియే స్ఫురిస్తోంది గాని.... దేహాత్మ భావనతోటి కాదు.

❖

ఓ రామచంద్రా! 'ఆత్మజ్ఞాన బోధ' సందర్భంగా ఈ పాషాణోపాఖ్యానం అనే ఆఖ్యాయిక ద్వారా నా స్వానుభవమును సోదాహరణపూర్వకంగా వివరించాను. ఈ ప్రకారంగా, ఈ చోట నేనే ఆకాశాది పంచభూతములతోటి స్ఫురిస్తున్నప్పటికీ నిరాకారమగు పరబ్రహ్మస్వరూపమే అయి ఉన్నాను. అట్లాగే నీవుగాని, ఈ సభలో మరెవరైనా గాని నిర్మలము-సుతీక్ష్ణము-సువిశాలము అగు బుద్ధితో తమ స్వరూపమును నిరాకారమగు పరబ్రహ్మముగా తప్పక గాంచవచ్చును.

వాస్తవానికి సర్వదా నిరాకార పరబ్రహ్మ స్వరూపుడనే అయినప్పటికీ మీ అందరి ఉపదేశం మొదలైన వాటి కొఱకై నేను ఈ సాకార వసిష్ఠముని రూపం ధరించి మీ ఎదురుగా కనిపిస్తున్నాను.

**శ్రీరాముడు :** స్వామీ! మీరు జీవన్ముక్తులా? విదేహముక్తులా? ఈ ఇద్దరిలో భేదమేమైనా ఉన్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! ఈ "జీవన్ముక్తుడు-విదేహముక్తుడు" అనునవి శాస్త్రములు బోధకొరకై కల్పించి, బోధానంతరం ఆ రెండు శబ్దములు భేదమును అభేదముగా చేసివేస్తున్నాయి. శిష్యుడు పూర్ణ జ్ఞాని అగుచుండగా ఇక ఇత్యాది శబ్దముల అర్థ పరిశీలన క్రమంగా అనావశ్యకమగుచున్నది. అయినా నీవు అడిగావు కాబట్టి ఇక్కడ చెప్పుచున్నాను. విను.

❖

విదేహముక్తుడు బ్రహ్మమాత్రుడై-చిదాకాశమాత్రుడై స్థితి కలిగి ఉంటున్నాడు. అతని లోక సందర్శనము ఈ కనబడే స్థూల - సూక్ష్మములకు అతీతమైనదై ఉంటోంది.

జీవన్ముక్తుడో... వ్యవహారం ఆచరిస్తున్నప్పటికీ చిదాకాశరూపుడే అయి వెలయుచున్నాడు. ఉభయులూ కూడా తమ చిదాకాశ రూపమునే ఆయా సర్వస్థితి గతులలోను అనుభవిస్తున్నారు. ఉభయములు తమ వాస్తవతత్త్వమును ఎఱిగి అనుభూతపరచుకునియే ఉంటున్నారు. ఇక వారిద్దరి మధ్య భేదమెక్కడిది? నాకేమి అగుపించటం లేదు. బ్రహ్మముకంటే అన్యమైనదేదీ నాకు ఎక్కడా కనిపించటమే లేదు. బ్రహ్మీదృష్టి నాకు తొలగకపోవుటచే, స్థూలదేహి-సూక్ష్మదేహి-వాయుదేహి-జలదేహి-పార్థివదేహి-తేజో దేహి-ఆకాశ దేహి-పిశాచ దేహి-వర్తమాన దేహిని అగుచున్నప్పుడు, అగుచుండనప్పుడు కూడా నేను ఆత్మనే! నాకు తదితరంగా కనిపించేదంతా కూడా ఆత్మయే! స్వప్నం కంటున్నప్పుడు ఆ కలలో కనిపించే స్వప్నాంతర్గత మనుజుడు వాస్తవానికి ఆకారరహితుడే కదా! అట్లాగే నాకు ఆకారముతో కనిపించే తదితర జీవులంతా ఆత్మ స్వరూపులేనని నా దృష్టికి సుస్పష్టంగా అన్ని స్థితులలోను, పరిస్థితులలోను అనిపిస్తోంది.

ఇదంతా భౌతిక దృష్టిగలవానికి భౌతికంగాను, ఆత్మ దృష్టి గల వానికి ఆత్మతత్త్వముగాను అనుభూతమౌతుంది. అందుచేత ఓ జనులారా! మీరు ఆత్మ తత్త్వమును విని-పఠించి-గ్రహించి అప్పుడు ఈ జగత్తులను దర్శించండి. ఇకప్పుడు మీకు నా వలెనే "సర్వము ఆత్మ స్వరూపము" అను రీతిగా అగుపించకపోతే నన్ను అడగండి.

చూచావా రామచంద్రా! ఈ విధంగా బ్రహ్మదేవుని మొదలుకొని సమస్త శరీరములు, ఈ సమస్త సృష్టులు అజ్ఞాన దృష్టికి ఆధిభౌతికంగా ఉత్పన్నమయినట్లుగా అనిపిస్తోంది. కానీ యథార్థానికి అవేవీ ఏనాడు ఉత్పన్నమే అయి ఉండలేదు. ఊహ (సంకల్పము) చే బ్రహ్మదేవుడు సమష్టి సృష్టిని (మాయచే) కల్పించుచుండగా, ఊహచేతనే జీవుడు జగత్తులను అనుభవించుచున్నాడు. ఆ బ్రహ్మదేవుడు-ఈ జీవుడు కూడా వాస్తవానికి సర్వదా ఏకాత్మ స్వరూపులే! ఉభయులు ఏకస్వరూపులే!

ఈ 'ఆకాశ వసిష్ఠుడు' అని మీ అందరిచే పిలువబడే నేను నిజమనస్సు యొక్క అభ్యాసము చేతగాని, (లేక) మీ యొక్క అభ్యాసము చేతగాని, (లేక) మీ యొక్క బుద్ధిని అనుసరించిగాని ఇట్లు ఈ విధంగా ఆధిభౌతిక దేహముతో స్థితిని కలిగి కనిపిస్తున్నాను.

ఇది నా యొక్క విషయమే కాదు. ఈ సభలో నారద-వ్యాస-విశ్వామిత్రాది మహనీయులగు ఎందరో ఆత్మజ్ఞులు ఉన్నారు. వారందరు నా వలెనే 'సర్వము ఆత్మయే' అనే అనుభవమును పుణికిపుచ్చుకొనియే ఈ సభకు వేంచేసి మన ఈ అధ్యాత్మ శాస్త్ర సంవాదాన్ని వింటూ అంగీకార తేజస్సును అందిస్తున్నారు. నాకు వలెనే బ్రహ్మదేవునికి, ఈ సభలోని తత్త్వజ్ఞులకు, తదితర ఆత్మజ్ఞులగు మహనీయులకు స్వదృష్టిలో ఈ జగత్తంతా కూడా చిదాకాశ మాత్రమే అయి ఉన్నది.

❖

పరీక్షకుల దృష్టియందు ఈ సమస్తము మనోమాత్రమే అయి ఒప్పుచున్నది.

బాలుర దృష్టికి బేతాళము (వాస్తవానికి లేకపోయినా) కనిపిస్తుంది చూచావా? ఎందుచేత? అజ్ఞానముచేత కదా! అట్లాగే ఈ సమస్త సృష్టి కూడా జ్ఞానము సంపాదించని వారి దృష్టియందు వజ్రమువలె దృఢరూపమును పొంది ఉంటోంది. దూరపు దేశంలో ఉన్న బంధువు పట్ల గల బంధుత్వబుద్ధి ఆ బంధువుకు సంబంధించిన వాసన సన్నగిల్లుటచే క్రమంగా ఉపశమిస్తుంది చూచావా? అట్లాగే ఎఱుగబడుచూ-ఎఱుగబడుచూ ఉండగా అల్పకాలంలోనే ఈ సృష్టి పట్ల ఏర్పడిన ఆధిభౌతికత్వము శమించిపోగలదు. నిద్రలేచిన తర్వాత "అయ్యో! నా స్వప్నంలోని ధనం ఎవరు దొంగిలించారో?"... అనే దుఃఖం ఎవరికైనా ఉంటుందా? అట్లాగే ఎఱుగబడిన తర్వాత అహంకారరూపమగు సృష్టి యొక్క స్థూలత్వము కూడా శమించుచున్నది. అది 'ఎండమావులు' అని, ఎఱిగిన తర్వాత అందులో దాహం తీర్చుకోవాలని ఎవరూ అనుకోరుకదా! జ్ఞానదృష్టిచే దృశ్యదృష్టులు ఉపశమిస్తున్నాయి. ఈ వసిష్ఠ రామ సంవాదము అను మహారామాయణము వంటి శాస్త్రములను కొంచెం పరిశీలించినంత మాత్రం చేతనే అట్టి జీవన్ముక్తత్వము నిరంతరము లభిస్తూ ఉండగా... ఇంత మాత్రం కార్యం ఆచరించటంలో ఏమి కష్టమున్నది? కనుక 'జీవన్ముక్తత్వం' అసాధ్యం అను సిద్ధాంతం మేము ఒప్పుకోం.

**సంసారవాసనాభావరూపే సక్తా ను యస్యధీః**
**మన్దో మోక్షే నిరాకాక్షీ స శ్వా కీటో అథవా జనః ॥**

ఎవని బుద్ధి అయితే సంసారవాసనావశంచే అభావరూపములగు దేహము-ఇంద్రియము మొదలైన పదార్థములందు ఆసక్తి కలిగి ఉంటుందో, మోక్షము విషయములో ఆశయము ఉండకుంటుందో... అట్టి మనుజుడు శునకము-కీటకము తోటి సమానుడే అవుతాడు. అంతకుమించి నేనేం చెప్పగలను?

ఓ జనులారా! 'జీవన్ముక్త బుద్ధి' తో అనుభవించే శబ్ద స్పర్శాది భోగకలాపములు ఎట్లా ఉంటాయో... మూర్ఖ-అజ్ఞాన బుద్ధిచే సేవించబడే శబ్దాది భోగాలు ఎట్లా ఉంటాయో.... ఈ రెండింటికి ఉన్న భేదమేమిటో కొంచెం యోచించండి. మొదటిదేమో చిద్రూపముచే ఆనందప్రదమౌతుంది. రెండవదో... జడ రూపముచే దుఃఖ ప్రదంగానే అగుచున్నది. సుమా!

ఈ వాసిష్ఠ రామాయణము మొదలైన ఆత్మశాస్త్ర గ్రంథాలను కాస్త పరిశీలించినంత మాత్రం చేతనే సమస్త పదార్థములపట్ల అంతఃకరణ శీతలత్వం ఉదయిస్తుంది. "జీవన్ముకత్వం సుసాధ్యమే. అత్యవసరం కూడా" అని సుస్పష్టమౌతుంది.

చిత్తము యొక్క శీతలత్వమే మోక్షము- సుఖము కూడా! చిత్తము యొక్క సంతాపమే బంధం. ఆశ్చర్యం! అట్టి "చిత్తము యొక్క శీతలత్వం ఎట్లా సంపాదించుకోగలం?"... అనే విషయంలో జనులు అశ్రద్ధ కలిగి ఉన్నారే! లోకముయొక్క మూఢత్వము ఎటువంటిది? అందుకే అవతారమూర్తియగు నీ రాక జనులకు అత్యవసరమైయున్నది. ఈ మనుజులు స్వభావముచేతనే

విషయములకు వశీకృతులై ఉంటున్నారు. కాబట్టే పరస్పర యుద్ధము, చౌర్యము, స్త్రీ–ధనములను సంపాదించాలనే తీవ్రమైన పట్టుదలలు కలిగి ఉంటున్నారు. ఇట్టి భ్రాంతి–సంతాపములతో కొట్టుమిట్టాడుచూ ఒక దుఃఖము నుండి మరొక దుఃఖమునకు, ఒక భయము నుండి మరొక భయమునకు చనుచుండు జనులకు 'ఆత్మజ్ఞానము' తప్పితే ఔషధం ఏమున్నది? అట్టివారు ఈ దృశ్యముపట్ల కొంచెం విరక్తి కలిగి ఈ ముముక్షు శాస్త్రము యొక్క అర్థ విచారణ, నిధిధ్యాసాది ఉపాయములు, తత్త్వజ్ఞానుల సంవాదమును–బోధన వినటం ప్రారంభించితే అతి త్వరలో యథార్థ వస్తువగు ఆత్మను అవలోకించినవారై సుఖించగలరు.

❖

**శ్రీవాల్మీకి మహర్షి:** ఓ భరద్వాజా! శ్రీ వసిష్ఠ మహర్షి ఇట్లా పలికి 17వ రోజు సంవాదమును ముగించారు. క్రమంగా సూర్యుడు అస్తమించసాగాడు. సభికులంతా లేచి పరస్పర నమస్కారములు సమర్పించుకొని సాయం సంధ్యాది దైవీక్రియలకు ఆయత్తం కాసాగారు.

❖❖❖

## (పదిహేడవ రోజు విచారణ పూర్తి అయింది)

❖❖❖

# VI. పాషాణోపాఖ్యాన తాత్పర్యం

## 1. చైతన్యమునకు వేఱుగా జీవుడు - జగత్తులు లేవు

**శ్రీవసిష్ఠ మహర్షి :** శ్రీ రామచంద్రమూర్తికీ, సభికులందరికీ ఈ 18వ రోజు సంవాదమునకు సుస్వాగతం పలుకుచున్నాను. నిన్నటి రోజున మనం 'పాషాణోపాఖ్యానం' పేరుతో నా స్వానుభవమైన ఒకానొక విశేషాన్ని చెప్పుకున్నాం. అట్టి పాషాణోఖ్యానము యొక్క తాత్పర్యం చెప్పుకొని ఆ పై ముందుకు సాగుదాం.

ఈ పాషాణోపాఖ్యానం ద్వారా "చిన్మాత్రపూర్ణ దృష్టిచే జగత్తులు అనబడేవన్నీ (సృష్టులు అని చెప్పబడేవన్నీ) చిదాకాశమున చిదాకాశరూపంగానే నెలకొని ఉన్నాయి" అని నిరూపించుకోవటమే మన ఉద్దేశం.

**న చ స్థితం కించనాపి క్వచనాపి కదాచన ।**
**స్థితం బ్రహ్మఘనే బ్రహ్మ యథాస్థితమ్ "అఖండితమ్" ॥**

ఈ జగత్తు అనబడేది కొంచమైనా ఎక్కడా కూడా, ఎప్పుడూ కూడా ఉండనేలేదు. చిద్ఘనమైనట్టి బ్రహ్మమే బ్రహ్మమునందు అఖండరూపమున యాథారీతిగా స్థితి కలిగి ఉన్నది. ఒకనికి స్వప్నంలో కనిపించే నగరాలు 'నిజచిద్రూపం' కంటే వేరు కాదు కదా ! అవన్నీ నిజచిద్రూపములే కదా ! అట్లాగే ఈ జగత్తు అనబడేది కూడా బ్రహ్మచిన్మాత్రమేనని గ్రహించు. బ్రహ్మదేవుని చిద్రూపముతో ఈ స్థూల – సూక్ష్మ రూపమగు 'జగత్తు' అనే దృశ్యము యొక్క వ్యవస్థితి ఏర్పడినప్పటికీ కూడా – జన్మరహితమగు చిదాకాశము తన యొక్క చిత్స్వరూపమును త్యజించకయే ఉంటోంది. పరమార్థమున బ్రహ్మదేవుడుగాని, జగత్తు గాని స్వప్ననగరాలు గాని లేవు. చైతన్య మహాదృష్టిచే 'చిన్మాత్రము' ఒక్కటే కలదు. స్వప్నంలో స్ఫురించే నగరం స్వప్నానంతరం స్వప్నద్రష్టలోనే (స్వాత్మయందే) లయం అగుచున్నది కదా ! అట్లాగే ...సృష్ట్యాది నుండి ప్రళయ పర్యంతము అనుభవించబడుతున్న సమస్త జగత్తు ద్రష్టయందే లయించుచున్నది. కనుక అదంతా కూడా ద్రష్ట వలెనే బ్రహ్మరూపమే అయి ఉన్నది.

బంగారమునకు – బంగారపు ముద్దకు తేడా ఎక్కడిది? అట్లాగే చైతన్యమునకు – స్వప్న పురమునకు, చైతన్యమునకు – సృష్టికి కూడా ఒకింత కూడా భేదం సంభవించజాలదు. సువర్ణపు ముద్దయందు సువర్ణమే ఉన్నది గాని 'ముద్దత్వము' (Solidity) అనేది ఎక్కడున్నది? ఆ విధంగా కేవలము చైతన్యమే ఉన్నది. సృష్టి లేదు. స్వప్నపురంలో స్వప్నచైతన్యమే ఉన్నది గాని స్వప్న పర్వతం

– స్వప్ననగరం ఇవన్నీ లేవు. నిర్వికారమగు చైతన్యమే స్వప్నకల్పనలో నగరంలా భాసిస్తోంది. నిర్వికారమగు బ్రహ్మమే ఇక్కడ 'సృష్టి'వలె భాసిస్తోంది. అంతకు వేరుగా ఏదీ లేదు. ఈ సృష్టి అంతా కూడా "నిర్మలము– సర్వ వ్యాపకము–నిర్లేపము–అజము– అవ్యయము–అనంతము" అగు చిన్మాత్రము మాత్రమే ! వేలకొలది మహాకల్పములందు కూడా ఆ చిన్మాత్రము ఉదయించదు, అస్తమించదు. అది సర్వదా ఏకరసమయ్యే ఉంటుంది.

ఓ రామచంద్రా ! ఈ జీవుడు నీవు–నేను–ముల్లోకములు అంతాకూడా అజము–అమరము అయినట్టి చిదాకాశమే అయి ఉన్నాము. చిదాకాశమే లేకపోతే ఈ శరీరము కర్తృత్వరాహిత్యముచే నిర్జీవమౌతుంది. అట్టి చిదాకాశము దేనిచేతా ఛేదించబడదు, దహించబడదు. అది ఎన్నడూ శమించునదీ కాదు. కాబట్టి ఇక్కడ ఎదీ జనించటం లేదు, మరణించటం లేదు. చైతన్యము యొక్క స్ఫురణయే జగద్రూపంగా అనుభూతమౌతోంది. ఒకవేళ చిన్మాత్ర స్వరూపమే "మరణము" అనే రహితత్వము పొందవలసి వస్తే... ఆ చైతన్యము స్వరూపముగా గల పుత్రుడు కూడా (ఆత్మావై పుత్రనామాసి ఆత్మయే పుత్రుని రూపంగా అగుచున్నది... అను సిద్ధాంతము ననుసరించి) తండ్రితో బాటే నశించాలి. "ఒకే ఆత్మ సర్వజీవులలోనూ ఉన్నది" అను సిద్ధాంతమును అనుసరించి ఒక జీవుడు మరణిస్తే తదితర జీవులంతా మరణించాలి. అప్పుడీ జగత్తు సర్వదా ప్రాణికోటి శూన్యమైపోయేది. కాబట్టి ఈ 'జీవుడు' అనబడేవాడు శరీరము త్యజించినంత మాత్రంచేత మరణించటం లేదు. (లేక) లేకపోవటం లేదు" అని చెప్పటానికి ఈ విధంగా వివరించాను.

కాబట్టి రామచంద్రా! నేటి వరకు ఎవరి చిన్మాత్రస్వరూపము మరణించియుండలేదు. ఈ జగత్తు ఎప్పుడూ ప్రాణిశూన్యమగుటలేదు. చిన్మాత్రుడగు జీవుడు సదా నాశరహితుడు.

**ఏకం చిన్మాత్రమేవాఽహం,న శరీరాదయో మమ ।**
**ఇతి సత్య అనుసంధానే, క్వ జన్మ – మరణాదయః ॥**

"అద్వితీయము అగు చిన్మాత్రమే నేను. నాకు ఈ శరీరాదులు లేవు" ...అని ఇట్లు విచారణచే గ్రహించినవానికి ఇక జనన– మరణాలు ఎచట?

**అహం 'చిన్మాత్రమమలమ్' ఇత్యాత్మానుభవం స్వయం ।**
**అపహన్తి ఆత్మహంతారో, నిమజ్జన్తి, ఆపదార్ణవే ॥**

"నిర్మలము – ఏకము అయినట్టి చిన్మాత్రమే నేను" అనునట్టి ఆత్మానుభవమును ఎవరు స్వయముగా కుతర్కములచే ఖండిస్తారో... వారు ఆత్మద్రోహము చేసుకొన్నవారే అగుచున్నారని హెచ్చరిస్తున్నాను. ఎందుకంటే వారు 'ఆపదలు' అనే సముద్రంలో మునుగుచున్నట్లు మా విజ్ఞాన దృష్టికి కనబడుతోంది.

"నేను ఆకాశముకంటే స్వచ్ఛము నిత్యము, అనంతము, నిర్వికారము అగు చైతన్యమును. నాకు వాస్తవానికి జీవితము లేదు, మరణము లేదు. చిదాకాశరూపమగు చైతన్యమే నేనై ఉండగా ఇక నాకు శరీరాదులు ఎక్కడున్నాయి?"...అని తత్త్వజ్ఞులు అనుభూతపరచుకొని ఉంటున్నారు.

అట్టి ఆత్మజ్ఞుల అనుభవాన్ని ఎవరు తిరస్కరిస్తారో అట్టి ఆత్మ హంతకులకు ధిక్కారమగుగాక! "నేను సర్వదా నిర్మలమగు చిదాకాశాన్ని" అను ఇట్టి ప్రత్యాక్షానుభవం సముపార్జించే ప్రయత్నంలో ఉండడో, అట్టి వారి జీవితం సద్వినియోగం కానట్లేనని, వారు జీవించియు మరణించిన వారితో సమానమే అగుదురని తత్త్వజ్ఞుల అభిప్రాయం. "నేను చిన్మాత్ర స్వరూపుడను. నాకు దేహేంద్రియాలు కూడా లేవు"... అను బోధచే ఆత్మ స్వరూపమును అనుభూతమొనర్చుకొనిన వానికి 'అవిద్య' ఇత్యాది మాలిన్యము నశించిపోతుంది. కనుక అట్టి నిర్మల స్వరూపుని జనన-మరణాలు ఏమాత్రం స్పృశించలేవు, ఛేదించలేవు. గొప్ప గండశిలను బాణములు ఛేదించలేవు కదా ! అట్లాగే చిన్మాత్రము - శుద్ధము అగు ఆత్మను అవలంబించినవాని సమీపమును మానసిక వ్యధలు సమీపించజాలవు. తన యొక్క 'చిత్స్వరూపము'ను మఱచి ఎవడు శరీరాదులందు ఆసక్తి కలిగి ఉంటాడో... అట్టివాడు వాస్తవానికి మట్టిలో వెతకి-వెతకి చివరికి సువర్ణ ఖండమును అక్కడే వదలి గులకరాయిని ఇంటికి చేర్చుకున్నవాడు అగుచున్నాడు. 'నేను దేహాన్ని' అనే రూపం గల భావనచే బుద్ధి-తేజం సన్నగిల్లు తాయి. మరి "నేను చైతన్యమును"అనే భావన చేతనో... బుద్ధి-తేజములు వర్ధిల్లుతాయి సుమా. "నేను శుద్ధ చిదాకాశమగు ఆత్మను. అట్టి నా స్వస్వరూపానికి జనన-మరణాలు లేవు" అని తలచి అట్టి స్థితిలో ఉన్న వానికి లోభ-మోహ-మదములు ఎట్లా సమీపించగలవు ? సమీపించలేవు.

చిదాకాశాన్ని వదలి "ఈ స్థూల-సూక్ష్మ-కారణ శరీరాలే ఆత్మ" అనే బుద్ధితో ఎవడు జగత్తును గాంచుచుండునో, అతని కొఱకే ఈ జగత్తులో క్షోభ-లోభ-మోహములు రచించబడినాయి. "నేను దేని చేతనూ ఛేదించబడేవానిని-దహించబడేవాడిని కాను. వజ్రము వలె దృఢమైనట్టి చైతన్యమే నేను. అంతేగాని ఈ దేహమాత్రుడను ఎన్నటికీ కాదు" అను ఇట్టి నిశ్చయము ఎవఱికి ఉంటుందో ...ఆతనికి మృత్యువు కూడా తృణప్రాయమే (గడ్డిపరక వంటిది) అవుతుంది. ఆహా(! శాస్త్రజ్ఞానులగు పండితులలోకూడా ఎంతటి వ్యామోహం కనిపిస్తోంది! జడమైన ఈ దేహశకలము నశిస్తూ ఉంటే "అయ్యబాబోయ్ ! మేము నశించుచున్నాం" అని భీతిల్లుచున్నారే! మాయ యొక్క ప్రభావము ఎంతటిది? "నేను చిదాకాశమునే" అను సత్యభావన బాగుగా స్థిరపడిందా, ...ఇక వజ్రపాతము వంటి ప్రళయాగ్ని జ్వాలలు కూడా పుష్పవృష్టివలె ఉంటాయి. "జనన మరణ రహితమైన చిన్మాత్రమును నేను కాదు. కాబట్టి నేను నశించబోవుచున్నాను" అని ఇట్లు తలచి (వాస్తవానికి ఆత్మ నశించనప్పటికీ) ఎవడు ఏడ్చుచున్నాడో... అతని వచనములు - క్రియలు - భావములు అన్నీ కూడా వివేకుల దృష్టియందు పరిహాసాస్పదము - హాస్యాయుక్తము అగుచున్నాయి. "నిత్యమై, అపరోక్షమైనట్టి చిన్మాత్రమే నేను. ఈ దేహమనోబుద్ధ్యాదులు నేను కాదు" అని ఇట్లు అంతః కరణంలో ఎవడైతే సునిశ్చయం చేసుకొని ఉంటాడో అతడెన్నడూ మోహమును చెందడు.

ఓ సర్వజనులారా!... 1.నేను చిదాకాశమాత్రుడను, 2.నాకు ఎన్నటికీ నాశనము లేదు, 3.ఈ జగత్తంతా చైతన్యము చేతనే పూర్ణమైయున్నది, 4.ఈ దేహ-మనో-బుద్ధి-అహంకారములచే నేను పరిమితుడను గాను... అను ఈ నాలుగు విషయములలో మీకున్న సందేహమేమిటో నాకు చెప్పండి, వింటాను.

"మేము చైతన్యం కంటే వేరైనవారం" అని అనదలచుకున్నారా! ఓ పసిబిడ్డలవంటి ప్రియ సోదరులారా! "మేము వేరైనవారం" అను అనుభవమునకు హేతువు ఏదో అద్దానిని గమనించండి. ఆ అనుభవమునకు కూడా హేతువగు మీ ఆత్మనే మీరు ఎందుకు 'లేదు' అనుచున్నారు ?

మీరు చైతన్యమే కాబట్టి మీకెవరికీ మరణము లేదు.

"మేము చైతన్య రూపులమే అయినప్పటికీ మాకు మరణం ఉన్నది"... అని వాదిస్తారా? చైతన్యమే మరణిస్తే ఒకడు మరణించగానే... చైతన్యమే స్వరూపముగా గల తదితర జనులందరు ఆ క్షణంలోనే మరణించాలి కదా! "అందరిలోని చైతన్యము ఒక్కటే! అయినా మాకు మరణం తప్పదు" అంటారా? చైతన్యము ఒక్కటే అయితే ఒకడు మరణిస్తే కూడా జగత్తు కొనసాగుతోంది కాబట్టి స్వస్వరూప చైతన్యమునకు జనన - మరణ సంబంధం లేనట్లే కదా !

❖

**తస్మాత్ న మ్రియతే కించిత్, న చ జీవతి కించన ।**

**'జీవామీ' ఇతి 'మృతోస్మీ' ఇతి చిచ్చేతతి న నశ్యతి ॥**

కాబట్టి ఏదీ మరణించటం లేదు. ఏదీ జీవించటం లేదు కూడా! "నేను జీవిస్తున్నాను. నేను మరణిస్తున్నాను" అనే భ్రాంతి చైతన్యం అనుభవిస్తోంది. అంతేగాని చైతన్యం ఏ సమయమందును జీవించదు, మరణించదు.

"ఎవడు దేనిని ఎట్లు ఎఱుగుచున్నాడో ఆతడు అది అట్లే పొందుచున్నాడు" -అనే విషయం ఆబాలగోపాలానికి విదితమే కదా! అట్లాగే చైతన్యము కూడా దేనిని ఎట్లు ఎఱుగుచున్నదో... అద్దానిని అట్లే పొందుచున్నది. వాస్తవానికి ఈ జీవుని వాస్తవ స్వరూపమగు చైతన్యము ఎచ్చటా ఎన్నడూ నశింపకయే ఉన్నది.

**పరిపశ్యతి సంసారం, పరిపశ్యతి ముక్తతామ్ ।**

**సుఖదుఃఖాని జానాతి స్వరూపాత్ తత్ న భిద్యతే ॥**

ఆ చైతన్యము ఒకప్పుడు సంసారమును-మరొక్కప్పుడు ముక్తిని గాంచుచున్నది. అట్లే సుఖ-దుఃఖము లను ఎఱుగుచున్నది. ఆ రెండింటినీ ఏది గాంచుచున్నదో-ఎఱుగుచున్నదో, అదియే శుద్ధ చైతన్యము కదా! కనుక ఆయా భిన్న దశలందు అది తన స్వరూపము నుండి వేఱుకాకయే ఉన్నది. చైతన్యము నిజస్వరూపమును ఎఱుగకపోవుటచే (ఏమఱచుటచే) 'బంధము' అనే సంజ్ఞను, నిజస్వరూపమును ఎఱుగుటచే 'మోక్షము' అను సంజ్ఞను స్వయముగా ధరించుచున్నది. నటుడు నటనలో జీవిస్తూనే పాత్రను వేరైన వ్యక్తిగాను, వ్యక్తిగతమునకు వేరైన పాత్రలోను ఉండి ఉంటున్నాడు కదా! సర్వదా అప్రమేయమగు చైతన్యము ఒకప్పుడు 'బద్ధజీవుడు' అను పాత్రలో లీనమై ఆ నాటకమునకు వేరైన తన చిన్మయ స్వరూపమును ఏమఱచుచున్నది.

సమస్తము నిర్మలమైన చిదాకాశమే అయి ఉన్నది. కాబట్టి ఎచట కూడా ఏదీ ఉత్పన్నమవటం లేదు, నశించటమూ లేదు.

**నతత్ అస్తి న యత్ సత్యం, న తత్ అస్తి న యన్మృషా ।**
**యత్ యథా యేన నిర్ణీతం తత్ తథా తం ప్రతి స్థితమ్ ॥**

ఈ ప్రపంచంలో సర్వ పదార్థములలో కూడా "సత్యము కానిది" గాని, "మిథ్యకానిది" గానీ ఏదీ లేదు. ఏట్లా అంటావా?... ఏది ఎట్లు ఎవడు నిర్ణయిస్తే అది అట్లే సత్యముగానో, మిథ్యాగానో తెలియవస్తోంది. ఇంతకుమించి ఈ జగత్తులో సత్యమైనదిగాని, మిథ్య అయినది గాని ఏదీ లేదు.

ఓ రామచంద్రా! ఈ చైతన్యాత్మ ప్రపంచమున ఏఏ పదార్థమును ఏఏ రీతిగా ఎఱుగు చున్నదో, ఆయా రీతిగా అద్దానిని అనుభవించుచున్నది. అట్లు చైతన్యాత్మచే అనుభవించబడుచున్నదే 'జగత్తు' అనే పేరుతో జనులలో వాడుకలో ఉంటోంది.

ఇందుకు దృష్టాంతం అంటావా?... ఒకే పదార్థం (లేక) ఒకే సంఘటన దేశకాల భేదాన్నిబట్టి ఒకచోట ఇష్టమైనదిగాను, మరొక చోట కష్టమైనదిగాను ఉండటం లేదా? ఒకనికే బాల్య మిత్రుడు బాల్యంలో ప్రియంగాను, ఆ తరువాత ఎప్పుడో తారసపడినప్పుడు 'అనవసరమైన అభ్యాగతి' గాను అనిపించటం ఈ లోకంలో చూస్తూనే ఉన్నాం కదా! తనకు ఇష్టమని వివాహం చేసుకున్న స్త్రీ మరొక దేశకాలాలలో అయిష్టమై కనిపించటం కొద్దిమంది విషయంలో జరుగుట లేదా?

కాబట్టి "సమస్త పదార్థములు చైతన్యము యొక్క అనుభవానుసారమే స్థితి కలిగి ఉన్నది" అనునది ప్రసిద్ధమైన విషయమే!

**శ్రీరాముడు :** మహర్షీ! కొందరేమో "ఈ జగత్తు సంసారసాగరము. అనేక బాధలతోను, కష్టములతోను కూడుకొని ఉన్నది. ఇదంతా దుఃఖమయం. ఇంతకు మించి ఇందులో సారమేమీ లేదు" అనే అభిప్రాయం కలిగి ఉంటున్నారు. మరికొందరేమో "ఈ జగత్తు బ్రహ్మమయమే! కనులు తెరచి చూస్తే ఇదంతా బ్రహ్మానందమయం!" అని సిద్ధాంతీకరిస్తున్నారు.

ఇంకొందరు "ఈ జగత్తు ఈశ్వర కల్పితం" అంటున్నారు. మరికొందరు "సృష్టి ఈ కనబడే రూపం కాదు" అని సిద్ధాంతీకరిస్తున్నారు... ఇన్నిన్ని సిద్ధాంతాలు ఎందుకున్నాయి? అసలు ఇక్కడి వాస్తవతత్త్వ మేమిటి? గురువులు తమ శిష్యులకు వేఱువేరైన, పరస్పర వ్యతిరిక్తమైన సిద్ధాంత–ఉపసిద్ధాంతాలను ఎందుకు బోధించటం జరుగుతోంది? వీటిలో సత్యాసత్యాలు ఏమిటి?... ఈ వివరాలు వివరించవలసినదిగా ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! చాలా పెద్ద ప్రశ్నయే! ఈ చెప్పబోవు సమాధానం విను

**1. బ్రహ్మ సత్యమ్ జగత్ మిథ్యావాదులు ("జగత్తు బ్రహ్మ రూపమే") -** ఈ జగత్తు పరమాత్మ యొక్క స్వప్నభూతమే కదా! పైగా సమస్తము బ్రహ్మాకాశరూపమే అయి ఉన్నదని మనం ఇప్పటి వరకు వర్ణించుకొంటున్నాం. కనుక "ఈ జగత్తంతా మాకు బ్రహ్మరూపంగానే అనుభూతమౌతోంది"... అని ప్రకటించటం ఉచితము, సత్యమే కదా!

**2. జగత్ సత్యమ్ - బ్రహ్మ మిథ్యావాదులు (ఈ జగత్తే మాకు సత్యమని అనిపిస్తోంది) -** జగత్తు యొక్క రూపం ఎదురుగా కళ్ళకు కనిపిస్తోంది. ఇద్దానికి అధిష్ఠానము అని చెప్పబడే మహాచైతన్యము

కళ్ళకు కనిపించటం లేదు. 'మదశక్తి' (Lust) కళ్ళకు కనిపించదుగాని దాని చర్యలు కారణరూపంగా కళ్ళకు కనిపిస్తాయి. అట్లాగే చిదాత్మ అదృశ్యరూపమై ఉంటోంది. అయ్యది దృశ్యభ్రమ హేతువగు కార్య రూపముచే స్వసత్తను ఈ జగత్తుగా ప్రదర్శించుకొనుచున్నది. కనుక 'ఈ జగత్తు మాకు సత్యమనియే అనిపిస్తోంది'... అని ప్రకటించేవారికి అట్లు కనిపించటం సత్యత్వమునకు తగియే ఉన్నది కదా! (ఎందుకంటే అట్లా అనిపించటంలో ఆశ్చర్యం లేదు కదా !)

**3. జగత్‌శూన్యవాదులు (ఈ జగత్తంతా శూన్యమని మాకు అనిపిస్తోంది) -** ఈ జీవుడు 'బంధము'ను అనుభవిస్తున్న సమయంలో దృశ్యమే బంధముగా అగుచున్నది. ఆ సమయంలో "దృశ్యము ఉపశమించినట్టి మోక్షస్థితి" ఎట్టిదో తెలియవచ్చుట లేదు.

'మోక్షము' యొక్క స్థితి అనుభవమైతే గాని మహాచైతన్యము అనుభూతికి లభించదు. అట్టి ముక్తి స్థితిలో ప్రమాత (జీవుడు) అభావస్వరూపుడు అగుచున్నాడు. అనగా ఆతడు లేనివాడే అగుచున్నాడు. కనుక "పరమార్థ వస్తువునందు జగత్తు శూన్యస్వరూపమై ఉన్నది"... అనే సంజ్ఞ సత్యమనియే అనిపించుకుంటోంది.

**4. పురుష-ప్రకృతి వాదులు (అవ్యక్తరూప ప్రకృతిలోంచి ఈ వ్యక్తజగత్తు ఉత్పన్నమౌతోంది) -** ఇక ఇంకొందరు (సాంఖ్యావాదులు) ఇట్లా అంటున్నారు. చిన్మాత్రుడగు పురుషుడే అన్నింటికీ కర్త. ఆయన యొక్క సత్త వలన ఆయన నుండి 'అవ్యక్తము' ఉత్పన్నమౌతుంది. అదియే ప్రకృతి. ఆ అవ్యక్తము (లేక) ఆ ప్రకృతి త్రిగుణముల యొక్క సామ్యావస్థారూపము అయి ఉన్నది.

అట్టి అవ్యక్తములోనుంచి త్రిగుణాత్మకమగు ఈ జగత్తు ఉత్పన్నమౌతోంది. బ్రహ్మమే తనకు అద్వితీయమగు జగత్తుగా ప్రదర్శితమౌతోంది, కనబడుతోంది – అని నేనూ సిద్ధాంతీకరించాను కదా! కనుక 'పురుషుడు' అవ్యక్తము! ఆతని అభివ్యక్తీకరణమే ప్రకృతి "జగత్తు" అను వారి సిద్ధాంతమూ యుక్తియుక్తమే కదా!

**5. బ్రహ్మ వివర్తవాదులు / వేదాంతవాదులు (జగత్తులోని సర్వ పదార్థముల స్వరూపం బ్రహ్మ వివర్తమే)** - ఈ జగత్తులో అనేక స్వభావాలు, ఆకారాలు గల పదార్థములు ఉండవచ్చుగాక! కాని "కఃత్వమ్– కోఽ హమ్,నాఽ యితి" ఇత్యాది మార్గంలో విచారణ చేస్తూ పోతే "సమస్త పదార్థముల స్వరూపము బ్రహ్మము యొక్క వివర్తమే, మట్టియే అనేక బొమ్మలుగా అగుచున్నట్లుగా!" అని మరికొందరు ప్రతిపాదిస్తున్నారు. "ఈ కనబడే జగత్తంతా బ్రహ్మము యొక్క వివర్తమే" అను ఆ వేదాంతవాదుల సిద్ధాంతమూ యుక్తియుక్తమే కదా!

**6. పరమాణువాదులు (ఈ జగత్తు పరమాణువుల కలయిక మాత్రమే. అవి విడిపోతే జగత్తు లేదు) -** ఈ మతమును అనుసరించి (ఉదాహరణ : కణాదులు, గౌతములు, సౌత్రాంతికులు, వైభాషికులు, అర్హతులు– ఆయా మత గురువుల ప్రతిపాదనను అనుసరించి) ... "ఈ 'జగత్తు'గా కనిపించేదంతా పరమాణు సమూహము మాత్రమే! వారి కల్పనయు వారి అనుభవమును బట్టి సత్యమే అయి ఉన్నది. ఎందుకంటే...

1. ప్రతి వస్తువు పరమాణువుల కలయికయే అయి ఉన్నది. 2. "ఏది ఏ విధంగా ఎవరిచే ఎఱుగుబడుచున్నదో అది ఆ విధంగానే వారికి అనుభూతమగుచున్నది"... అని మనం ముందరే సిద్ధాంతీకరించుకున్నాం కదా!

భావనావాదులు, మనోకల్పనా రూప జగత్‌వాదులు, దృష్టి-సృష్టివాదులు పై సిద్ధాంతం బలపరుస్తున్నారు. "యత్ భావం-తత్ భవతి. ఈ జగత్తు ఎట్లు భావన చేస్తే అట్లే అనుభూత మౌతోంది" అనునది కూడా యుక్తియుక్తమే కదా!

**7. దృష్టి - సృష్టి వాదులు -** "ఇహలోకంలోగాని, పరలోకంలోగాని ఏది ఏ విధంగా చూడబడు చున్నదో... అది ఆ విధంగానే ఉంటోంది. ఏది ఎట్లు చూడబడదో ...అది అట్లు ఉండదు. కనుక ఈ జగత్తు సత్యము కాదు. ఇదంతా అనిర్వచనీయం. అనగా "ఈ జగత్తులో ఇది ఇట్టిది మాత్రమే" అని దేనిని ఎవరూ సిద్ధాంతీకరించలేం. ఈ జగత్తుగా కనిపించేదంతా మనోకల్పనారూపము మాత్రమే. ఇట్టి దృష్టి-సృష్టివాదుల మాట కూడా కాదనటానికి వీలులేదు.

**8. అనాత్మవాదులు (బాహ్యమున గల ఈ జగత్తు మాత్రమే ఉన్నది. అంతరంగమున ఆత్మ అనబడేదేది లేదు!) -** ఇక, వీరు అంటున్నారు కదా ..."బాహ్యమున కంటికి కనబడే ఈ నేల-నీరు-అగ్ని-వాయువు అనబడే భూత చతుష్టయం మాత్రమే ఉన్నది. దీనికి అతీతంగా అంతరంగమున 'ఆత్మ' అనేది లేదు" అను (చార్వాకుల) మతం కూడా వారి దృష్టిని బట్టి సత్యమే అయి ఉన్నది. ఎందుకంటే ఈ ఇంద్రియములకు పరమైనట్టి (వేరైనట్టి) ఆత్మ అనబడేది ఎదురుగా కనిపించడం లేదు కదా!

**9. క్షణిక వాదులు (అనుక్షణం ప్రతిది మారుతూనేవున్నది. కనుక ఈ జగత్తు క్షణికం) -** ఇక వీరి అభిప్రాయం ప్రకారం... "ప్రతి క్షణం సర్వపదార్థములు ఒక స్థితి నుండి మరొక స్థితికి ప్రవాహ తరంగంలాగా పరివర్తనం చెందుచూనే ఉన్నాయి. కాబట్టి ఈ జగత్తంతా కూడా పరివర్తనశీలమే! కనుక ఈ జగత్తు క్షణభంగురం." ఇట్లా జగత్తు గురించి నిర్వచించే క్షణికవాదుల మతము కూడా వారి అనుభవమునుబట్టి సత్యమే అయివున్నది. ఈ దృశ్య ప్రపంచంలో మార్పు చెందనిదేమున్నది?

ఆద్యమగు బ్రహ్మపదము సర్వశక్తియుక్తమై వెలయున్నది కదా! అద్దాని భావనా ప్రయోజనం చేత వారికి అది అట్లేనని అనిపించడంలో ఆశ్చర్యపడవలసిన పనేమున్నది?

**10. కలవింక - ఘట న్యాయవాదులు (ఈ జీవుడు శరీరము అనే పంజరంలో చిక్కుకున్న పక్షివంటివాడు) -** 'కలవింక-ఘటన్యాయం' "కలవింక పక్షి (ఊరపిచ్చుక) కుండలో చిక్కుకుంది. ఆ కుండ యొక్క ముఖమును తొలిచామా... ఆ ఊరపిచ్చుక తుఱ్ఱున గాలిలోకి ఎగిరిపోతుంది. అట్లాగే 'పరిచ్ఛిన్న పరిమాణంగా' ఈ జీవుడు కర్మబంధం చేత దేహాలలో ఇరుక్కొని ఉన్నాడు. కర్మ క్షయం కాగానే పరలోకానికి ఎగిఱిపోతాడు. (ఇది అర్హతలు అనే మతస్థుల జగత్ నిర్వచనం). ఈ జీవన-మరణములను చూచి వారు అట్లు సిద్ధాంతీకరించడం వారికి సత్యమనియే అనిపిస్తోంది.

**11. మరణానంతర దేహాత్మవాదులు (జీవుడు మరణించినా దేహము వెంటే ఉంటాడు) -** మరొక మతగురువుల (మ్లేచ్ఛావాదుల) సిద్ధాంతం ఎట్లా ఉన్నదో చూడు! ఈ దైహికారుడగు జీవుడు

ఈశ్వరునిచే ఉత్పన్నము కావించబడినాడు. ఈశ్వర నిశ్చయాను సారం ఈ దేహం ఒకప్పుడు శిథిలమైపోతుంది. మరణం సంభవిస్తోంది. మరణానంతరం ఆ దేహసంబంధీకుడగు జీవుడు దేహము పాతిపెట్టబడిన చోటే ఉంటాడు. ఆ తరువాత కాలానంతరం ఈశ్వరునిచే విచారించబడినవాడై ఆ ఈశ్వరుని ఇచ్ఛను అనుసరించి శాశ్వతంగా స్వర్గమునందో, నరకమునందో ఉంచబడుతాడు. వారి అనుభవాన్ని అనుసరించి అదీ దూషితం కాకయే ఉన్నది.

**12. స్వభావ వాదులు - నిరీశ్వరవాదులు (ఈ జగత్తు స్వభావముచే ఉత్పన్నమై - నశిస్తోంది) -** ఈ స్వభావవాదము ప్రతిపాదించే మతగురువుల అభిప్రాయం విను. ఈ జగత్తంతా కూడా స్వయంగా స్వభావముగానే ఉత్పన్నం అవుతోంది. స్వభావంగానే మఱొక్కప్పుడు నశిస్తోంది. దీనికి కర్తగాని, 'ఈశ్వరుడు' అనబడేవాడు గాని ఎవడూ లేడు. ప్రతి జీవుడు స్వభావాలు అనుసరించే జనిస్తూ, జీవిస్తూ, అనుభవిస్తూ, మరణిస్తున్నాడు. వీరు ఇట్లు 'నిరీశ్వరవాదం' ప్రతిపాదిస్తున్నారు. వారివారి దృష్టి కోణం నుండి ఇది వారికి సత్యమే అయివున్నది. ఎందుకంటావా?... ఎంత అన్వేషించినప్పటికీ వర్షము-వాయువు-నక్షత్రములు-సూర్యుడు-చంద్రుడు-భూమి ఇత్యాదులన్నింటి విషయంలో "దీనికి కర్త ఎవడు?" అను ప్రశ్నకు వారికి సమాధానం లభించడం లేదు కదా!

**13. ఈశ్వరవాదులు (ఏకేశ్వరుడే ఇదంతా ప్రసాదిస్తున్నాడు) -** వీరి మతాచార్యుల సిద్ధాంతం ప్రకారం ... సర్వత్రా కర్త ఒక్క ఈశ్వరుడే. ఆయనే ఇవన్నీ ప్రేమతో ప్రసాదిస్తున్నాడు. ఆయనకు కృతజ్ఞులమై ఉండడానికి ప్రతిజీవుడు యత్నించాలి. కృతఘ్నుడు కాకూడదు. ఈశ్వరార్పిత చిత్తంలో సర్వదా ఉపాసకులై ఉండాలి. వీరు తమయందు తమ ఉపాశ్యమగు ఈశ్వరుని పొందుచునే ఉన్నారు. కాబట్టి వీరికి పై నిర్వీశ్వర- వాదుల వలె "ఈశ్వరుడు లేడు"... అని అనిపించడం లేదు.

**14. ఇహ - పరలోక వాదులు (ఇహంలో పుణ్యకార్యాల వలన పరంలో సుఖం లభిస్తుంది) -** వీరి దృష్టిలో ఇహము-పరము రెండూ సత్యమే! కాబట్టి ఈ మతగురువులు తీర్థ-స్నాన-పుణ్యక్షేత్ర దర్శన-అగ్నిహోత్రాదులు మొదలైన వాటికి ప్రాధాన్యం ఇస్తున్నారు. ఇహంలో శ్రమయే అయినా పరంలో సుఖలోకప్రాప్తి కలిగిస్తాయి. ఆ అనుయాయులు అట్టి తీర్థ-క్షేత్ర-అగ్నిహోత్రాదుల శ్రమ నుండి సుఖమును తృప్తిని పొందుచూనే ఉన్నారు. కాబట్టి అవి సత్యములు కావని ఎవరనగలను? సత్యమేనని ఒప్పుకోక తప్పదు.

**15. జగత్ శూన్యవాదులు ("ఈ జగత్తంతా శూన్యమే!") -** అని (బౌద్ధులు మొదలైన) కొందరు మతగురువులు బోధిస్తున్నారు. వారి వారి అనుయాయుల భావనకు అనుభవమునకు అది సత్యమే అగుచున్నది. వారి విచారణకు 'శూన్యము' తప్ప మరింకేమీ ఇక్కడ అగుపించటం లేదు.

❖

చూచావా రామచంద్రా! ఈ విధంగా అనేక మతగురువులు అనేక సిద్ధాంతములను వారి వారి శిష్యులకు, అనుయాయులకు బోధించటం, ఆ అనుయాయులు అది ఆ రీతిగానే అనుభవంగా పొందడం అనంతకాలంగా జరుగుతూనే ఉన్నది. ఇంకా అనేకమంది మతగురువులు ముందు

ముందు కూడా రానున్నారు.అందులో కొందరు మతగురువులు పరస్పర వ్యతిరిక్తమైన సిద్ధాంతములను ప్రతిపాదించడం జరిగింది.జరుగబోతోంది.

మఱికొందరు ఇప్పటివరకూ వచ్చిన సిద్ధాంతాలను ఖండిస్తూ చెబుతున్నారే గాని "ఇది సత్యము" అని తమకుగా ఏమీ ప్రతిపాదించడం లేదు. ఇంకొందరు మతగురువులు ఇదివరకు చెప్పినదే భాషాపరంగానూ, సాధనా ద్రవ్యపరం గానూ మరొక తీరుగా ప్రతిపాదిస్తూనే "ఇతః పూర్వం ప్రతిపాదించిన సిద్ధాంతం అనుసరణీయం కాదు. ఇదియే అనుసరించండి" ...అని తమ శిష్యులకు, అనుయాయులకు బోధిస్తున్నారు.

కొన్ని కొన్ని చోట్ల గురువులు చెప్పిన సిద్ధాంతమునకు రెండు మూడు రకాలైన భాష్యములను శిష్యులు ప్రతిపాదిస్తూ-ప్రతిక్షేపిస్తూ క్రమంగా ఆ శిష్యులు వేరు వేరు పేర్లు గల శాఖలుగా విడిపోతున్నారు. అట్లా విడిపోయి వారిలో వారు కలహించుకోవడం, హింసించుకోవడం కూడా కొన్నిచోట్ల జరుగుతూ వస్తోంది. ఒక్కొక్కసారి గుఱువు దైవస్వరూపుడని కొందరు,... "గుఱువు కేవలం సిద్ధాంతకర్త / ప్రవక్త" అని మరికొందరు ప్రతిపాదిస్తూ ఇట్టి స్వల్ప వాగ్వివాదములతో ఒకే మతాచార్యుల శిష్యపరంపరలో శాఖలు ఉపశాఖలుగా విడిపోవడం కూడా జరుగుతోంది.

ఇదంతా అతి దీర్ఘ కాలంగా జరుగుచున్న విశేషాలే! ముందు ముందు కూడా ఇట్లా జరుగుచూనే ఉంటుంది.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ విధంగా పరస్పర వ్యతిరిక్త-అనుకూలములైన వేఱు వేఱు సిద్ధాంతములు, వారి అనుయాయులు సంఘర్షించుకోవడం ఇదంతా ఎందుకు జరుగుతోంది? "అవన్నీ సత్యములే అయి పరిఢవిల్లుతున్నాయి"... అని మీరు చెప్పడంలో ఉద్దేశమేమిటి?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! 'చింతామణి' గురించి విన్నావు కదా! అది ఎదురుగా కలిగి ఉన్న వారు దేనిని చింతన చేస్తే అది అట్లే పొందుతారు. కల్ప వృక్షము క్రింద ఏది కోఱుకుంటే అది కల్పనా చమత్కారంగా లభిస్తుంది. అట్లాగే చిదాకాశమగు చైతన్యము కూడా జీవులు దేనిని అభిలషిస్తే ఆయా అభిలాషలను శ్రీఘ్రముగా వారియందు అట్లే సిద్ధింపజేయున్నది. అందుకే 'ఈ జగత్తు శూన్యం' అను వారికి అంతా శూన్యంగా అగుపిస్తోంది. "ఇదంతా అశూన్యమగు భగవంతుని చేత నిండి ఉన్నది" అనుకున్న వారికి అది అట్లా అనుభవమౌతోంది. "ఈ జగత్తు శూన్యము కాదు- అశూన్యము కాదు.ఇది అనిర్వచనీయం"... అని తలచువారికి వారియొక్క భావనచే ఇదంతా అనిర్వచనీయంగా ఒప్పుచున్నది.

ఎందుకంటావా?... సర్వశక్తిమంతమగు బ్రహ్మము యొక్క మాయా శక్తి శూన్యము కాదు. అశూన్యము కాదు. ఈ రెండింటికీ విలక్షణమై, అనిర్వచనీయమై ఒప్పుచున్నది.

కాబట్టియే ఇక్కడ ఒకానొక చమత్కారం సిద్ధిస్తోంది. ఎవడు ఏ నిశ్చయమును కలిగి ఉంటాడో, ఆతడు కొంత పట్టుదలతో, మూర్ఖత్వంతో దాని నుండి తొలగని పక్షంలో అతడు ఆ నిశ్చయఫలమును తప్పక బడయగలడు.

ఆత్మజ్ఞానం పొందనంతవరకే ఆయా సిద్ధాంతములన్నీ సత్యములుగానే అనుభవమౌతాయి. ఆత్మజ్ఞానం పొందిన తరువాత ఇక ఆ జీవుడు 'ఆత్మయే సత్యము' అను అన్ని సిద్ధాంతముల ఆవల తీరం చేరి 'కేవలస్వానుభవి' అవుతాడు. అనేక మతముల సిద్ధాంతముల సారమేమిటో, పరిమితి ఏమిటో ఆతడు కరతలామలకంగా గ్రహిస్తాడు.

అందుచేత రామచంద్రా! బుద్ధిమంతుడైనవాడు వాదోపవాదములలోకి, ఖండన-రక్షణ వ్యవహారములలోకి దిగడు. ఆతడు అనేక మతముల 'కారణము'ను పండితులతో బాగుగా విచారించి క్రమంగా శ్రేష్ఠమగు 'ఆత్మవస్తువు' నందే సుదృఢమైన నిశ్చయమును పెంపొందించు కుంటాడు. ఇక దేనికీ బద్ధుడు-పరిమితుడు కాడు.

**శ్రీరాముడు :** మహాత్మా! జ్ఞానసారమగు దృఢాత్మనిశ్చయము సాధకులకు కలిగేది ఎట్లా?

**శ్రీవసిష్ఠమహర్షి :** రామచంద్రా! శాస్త్రాధ్యయనమునందు, ఉత్తమార్థమును సేకరించి స్వీకరించ టంలోను, అల్ప విశేషములను ఉపేక్షించటంలోను, బహుకుశలురైనట్టి వారికి సర్వాత్మకమగు స్వస్వరూపాత్మానుభవం సుసాధ్యమే! అట్టి మహనీయులు ఉన్నారు. ఉత్తమ సాధకుడైనవాడు వారికొరకై వెతికి అట్టి మహానుభావులను ఆశ్రయించాలి. తమ సంశయములను అణకువతో తెలియబరిచి సంశయవిభేదము గావించుకోవాలి.

**శ్రీరాముడు :** ఆశ్రయమునకు అర్హుడగు గురువులు ఎట్టి సద్గుణములు కలిగి ఉంటారు?

**శ్రీవసిష్ఠమహర్షి :** మహాత్ములగు జ్ఞాన గురువులు ఈ 5 లక్షణములు కలిగి ఉంటారని చెప్పబడుతోంది.

1. సచ్ఛాస్త్రములను అనుసరించి వ్యవహరిస్తూ ఉంటారు.
2. పరస్పరము విచారణ సలుపుతూ ఉంటారు.
3. జనులకు ఆహ్లాదము గొలుపుచూ సచ్ఛాస్త్రముల పట్ల ప్రోత్సాహం కలిగిస్తూ ఉంటారు.
4. "నీవు సాక్షాత్ ఆత్మవే (తత్త్వమసి)" అను పరమసత్యవాక్యము వైపుగా బుద్ధిని కుశలము చేస్తూ ఉంటారు.
5. నిషిద్ధములైన ఆచారములు లేనివారై ఉంటారు.

ఓ రామచంద్రా! నీరు పల్లమువైపుకే ఉరకలు వేస్తూ పరుగులు తీస్తుంది చూచావా? అట్లే జీవులంతా తమకు అభిలషితములయిన వాటివైపుకే బలవంతంగా పరుగులు తీస్తున్నారు. అయితే 'జీవితము' అనేది ఒక మహత్తరమైన అవకాశమని జనులు గ్రహించెదరు గాక! "నేను స్వీకరించాలి-నిర్వర్తించాలి" అనుకునే వాటిలో "నన్ను పురుషార్థమునకు జేర్చగలిగేదేది?" అని విచారించి, అందుకు మార్గం చూపే సామర్థ్యము గల సచ్ఛాస్త్ర-సద్గురువులను వెతికి-వెతికి పట్టుకొని సమాశ్రయించాలి. ఓ జనులారా! తృణము యొక్క చివరి భాగంలో సంలగ్నమైన జలబిందువు ఏ క్షణంలోనైనా నేల కూలటానికి సిద్ధమై ఉన్నది కదా! ఈ జీవితము అట్టిది. ఈ సంసారసాగరమున "అది పొందాలి! ఇది సంపాదించుకోవాలి! ఏదో కావాలి!" మొదలైన మనోరథములతోను,

"వారెంతటివారు? వీరి సంగతి చూద్దాం!" ఇత్యాది పిచ్చి ప్రేలాపములతోను రోజులు గబగబా గడిచిపోతున్నాయి. సమయమంతా అజ్ఞాన వ్యవహారంతో వృథా అగుచున్నది. మీనమేషాలు లెక్కకట్టుచూ కూర్చుంటే ఏమాత్రం లాభం లేదు. అతి త్వరగా సద్గురువును ఆశ్రయించడం, శాస్త్ర సారాన్ని గ్రహించడం అత్యంత ఆవశ్యకము-అవశ్యము కూడా!

❖❖❖

## 2. జీవన్ముక్తులను ఆశ్రయించకుంటే జీవితం వృథా!

**శ్రీరాముడు :** హే మహానుభావా! శ్రీవసిష్ఠ మహర్షీ! ఈ ప్రాణుల యొక్క భోగతృష్ణ శాఖోపశాఖలే అనేక జగద్రూపములుగా విస్తరించి ఉండడం (చిదాకాశమునందు) గమనిస్తున్నాం కదా! ఇందులో

1. జగత్ స్వరూప 'అనర్థము' యొక్క పూర్వ-పర విచారణ చేసి ఉన్నవారు... 2. సారాసార వివేకము చేత పరమార్థమును దర్శించినట్టి శ్రేష్ఠులగు మహాత్ములు... ఎక్కడ లభిస్తారు. "వారికై వెతకాలి! ఆశ్రయించాలి! ఇంతకుమించిన ఉపాయం (ఆత్మోద్ధరణకై) లేదు"... అని మీరు ఆజ్ఞాపిస్తున్నారు, సరే! కాని అనేక ప్రాపంచిక వ్యవహారములు అనివార్యమగుచుండగా సామాన్యులమగు మేము వారి కొరకై ఎక్కడ వెతకాలి? ఇదంతా దుర్లభం కాదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవును! నీవు చెప్పినట్లు ఆత్మ జ్ఞానాన్ని చక్కగా ఎఱిగి పరమ సత్యాన్ని ఆత్యంతికంగా -నిర్దుష్టంగా ప్రకటించగలుగుచున్న జీవన్ముక్తులు ఈ లోకాలలో లభించడం కొంచెం కష్టతరమైన విషయమే! అయినా కూడా అట్టి మహనీయులు మనుష్య-దేవతాది జాతులలో కనబడుచూనే ఉంటారు. స్వయం ప్రకాశకుడగు సూర్యునికి చీకటి-రాత్రి ఉండనట్లుగా ఆ మహనీయులకు రోజులన్నీ జ్ఞానప్రకాశమునందే గడచి పోతాయి. దుర్లభులే అయినప్పటికీ అట్టివారు ఆ పరమాత్మ యొక్క కరుణచే సృష్టియందు ఉన్నారు. సాధకులకు మార్గదర్శకులై లభిస్తున్నారు. కనుక అట్టి వారి దర్శనము కొఱకై ప్రయత్న పూర్వకంగావెతకాలి సుమా! ఇక తదితర జీవుల సంగతి చూస్తున్నావు కదా! మూఢులగు తక్కినవారంతా మోహరూపమగు ఈ సంసార సాగరమునందు అటూ ఇటూ సంచరిస్తున్నారు. భోగతృష్ణలచే క్రింది లోకములలోకి - పై లోకములలోకి దొర్లించబడుతూ అనంతకాలం ఈ సంసారమునందే తేలియాడుచున్నారు.

ఆత్మజ్ఞాన సిద్ధిచే జీవన్ముక్తత్వము సంపాదించుకొనని ఆయా జీవజాతుల స్థితి-గతులు ఎట్లా ఉన్నాయో చెపుతాను... విను. దేవతలు స్వర్గభోగములలో నిమగ్నులై ఆత్మసిద్ధి గురించి ఏమఱచినవారై అట్టి 'భోగములు' అనే అగ్నిచే లెస్సగా దహించబడుచూ ఆత్మజ్ఞానానికి ఇంకా ఇంకా సుదూరులే అవుతున్నారుగాని స్వస్వరూప దర్శన కాంక్షను కలిగి ఉండడమే లేదు.

ఇక దానవులు మదోన్మత్తులై "ఈ దేవతలే మా శత్రువులు. మామా శక్తులను వృద్ధి చేసుకొని వీరి సంపదలు ఆక్రమించబోతున్నాం".... అని తలచుచూ మదపుటేనుగులవలె అటూ ఇటూ సంచరిస్తున్నారు. 'ఆత్మజ్ఞానము' గురించి వారికి జ్ఞాపకమే వచ్చుట లేదు. చివరకి మదపుటేనుగులు

గర్తము(గోతులో)లో పడునట్లు వారు దేవతా రక్షకుడగు నారాయణుని చేతిలో నాశనము కొనితెచ్చుకొనుటకే తమ జీవితములను వెచ్చిస్తున్నారు.

ఇక గంధర్వులు అందామా... వారు " కేతము" అనే మద్యమును త్రాగి ఊహాలోకంలో కల్పిత భోగములు అనుభవిస్తూ చివరికి జింక బోయవానికి చిక్కినట్లు మృత్యుముఖులు అవుతున్నారుగాని వివేక జనితమగు ఆత్మజ్ఞానమును లేశమైనా ఎఱుగుటయే లేదు.

మరి విద్యాధరులందామా... వారు తమ విద్యలను చూచుకొని మురిసిపోతూ... ఆ మోహ పరవశంలో ఆయుష్షును గడిపేస్తున్నారే గాని బ్రహ్మవిద్యాబలంచే ప్రకాశించే ఉదారశీలురగు వివేకులను ఆదరించటమే లేదు. ఇక ఎక్కడి బ్రహ్మజ్ఞానం? ఎక్కడ బ్రహ్మజ్ఞానులను ఆశ్రయించడం?

యక్షులో... జనుల నివాసములలో ప్రవేశించి భయ-జ్వర-ఉన్మాదాది దోషములను జనింప జేస్తూ జనులను క్షోభపెట్టడంలో నిమగ్నులై ఉంటున్నారు. 'ఆహా! ఈ మా దేహములే స్థిరములు గదా!'... అని నమ్ముతూ అసహాయులై వర్తిస్తున్నారు. మణి మంత్రబల శూన్యులైనట్టి బాలురందు, వృద్ధులందు, అశక్తులందు తమ దక్షత్వము చూపుచూ "మేం ఎంతటి ప్రభావం కలవారం!" అని మురిసిపోతూ ఈ సంసారంలో సంచరిస్తున్నారే గాని... "ఆత్మజ్ఞానం సంపాదించాలి. ఆత్మ జ్ఞానులను ఆశ్రయించి వారి బోధను వినాలి"... అనే ప్రయత్నం గురించి యోచించటమే లేదు.

రాక్షసులందామా... "మామాట వినకపోతే మేం ఊరుకోం-ఎంతటి వారినైనా హింసించ గలం" అని తలచుచు స్వబలం-సంఘబలం చూచుకొని మురిసిపోవుచూ సుజనుల పట్ల శత్రుత్వం వహించి ఉంటున్నారు. ఇక వారికి మహాత్ముల కరుణ ఎట్లా లభించేది? చివరికి వారు విష్ణుమూర్తి చేతులలో హతులౌతున్నారు. ముందు అట్టి అనేకమంది రాక్షసులను నీవు సంహరించనున్నావు.

ఇక పిశాచజీవులందామా... వారు ప్రాణుల దేహములలో ప్రవేశించి రక్త-మాంసములను భక్షించాలనే యోచనలో మునిగి తేలుచున్నారేగాని 'ఆత్మజ్ఞానము' వైపు బుద్ధిసారించడమే లేదు. అంతరమున గల అగ్నిచే దినదినం దహింపబడే మహావృక్షంలాగా వారు ప్రాణులను భుజించాలనే చింతనచే చివరకు తమను తామే దహించుకొంటున్నారు. ఇక ఆత్మజ్ఞానమనే ఊసు ఎక్కడిది?

నాగులో... అజ్ఞులై జడ స్వరూపులై పాతాళమున వివేకశూన్యంగా రోజులు గడుపుతూ చివరికి ఒకనాడు మృత్యువును సమీపిస్తున్నారు. "నేనెవరు?" అనే ప్రశ్న వారి జడస్వభావమునకు క్రిందగా ఎక్కడో ఉండిపోతోంది గాని, ఆది బయల్వెడలటమే లేదు.

అసురులా... కీటకములలాగా భూతలమున గల శూన్యస్థానములను ఆశ్రయించి దీర్ఘకాలం గడిపివేస్తున్నారే గాని "వివేకము" అనే ప్రసంగమే ప్రారంభించడం లేదు.

ఈ మనుష్యులో... చీమల వలె అల్పమాత్రమైన విషయకణముల గురించిన లోభముచే ప్రతిరోజు తెల్లవారుతోంది-ప్రొద్దుగ్రుంకుతోంది. "వివేకులెక్కడ?" అనే ప్రయత్నమే వారిలో కనిపించడం లేదు. ఇక వివేకము వారిలో జనించేది ఎప్పటికో, ఎట్లో మేము గ్రహించలేకపోతున్నాం.

❖

"రామచంద్రా! ఈ అనేక భూత జాతుల యొక్క దినముల వ్యర్థములైన మహాదుష్టచేష్టలచే వ్యాకులమై గడిచిపోతున్నాయి. మత్తుగా త్రాగి బాట ప్రక్కన పరుండిన వాని పట్ల కాలం నిస్తేజంగా గడిచిపోతోంది చూచావా? అట్లా ఈ జనుల జీవితాలు వివేకరహితంగా, నిరర్థకంగా గడిచి పోతున్నాయి. అగాధంలో మునుగు వానికి వాచక శబ్దములు వినిపించజాలవు కదా! అట్లాగే సంసారమున మునుగు ఉత్సాహమును వృద్ధి చేసుకొంటున్న జనుల పట్ల వివేకుల వాక్యాలు వ్యర్థమై పోతున్నాయి. ఆ జనుల హృదయమును ఆత్మజ్ఞాన వాక్యాలు స్పృశించడమే లేదు. చేటలతో తూర్పారపట్టుచుండగా పొల్లంతా గాలికి కొట్టుకుపోతుంది చూశావా? "ఈ దేహాదుల పట్ల అభిమానము" అనే వాయువుచే జల్లింపబడినవారై ఈ జనులు ఎటో కొట్టుకుపోబడుచున్నారు. ఈ జీవులలో కొందరు అనేక తపస్సులు చేసి, ఎంతో కష్టించి మంత్రాదులను ఉపాశించికూడా చివరకు అట్టి శక్తియుక్తులను ఆత్మజ్ఞానవివేకము వైపుకు మరల్చలేకున్నారు. యోగి గణముల వంటివారు కూడా (ఒకానొక స్త్రీ దేవతా- సమూహం) సుర - రక్త - పాన - మాంసాది భోజనములందు అభిలాషను ఏర్పరచుకొన్నవారై తామసఫల భోగాలలో ఆసక్తి కలిగి, దుర్గంధములైన మడుగులలో నికృష్టములగు కీటకములవలె పడివుండగా... ఇంకేం చెప్పాలి!

అయితే రామచంద్రా! పైన మనం ఉదాహరించినట్టి, తదితరములైన ప్రతి జీవజాతిలోను అక్కడక్కడ మహనీయులు-ఆత్మజ్ఞానులు అగు మహావివేకులు ఉన్నారు. అయితే వారు ఇక్కడే ఉంటారు-అక్కడ ఉండరు" అని మనం నిర్వచించలేం. కొన్ని కొన్ని ఉదాహరణలు మాత్రమే మనం ఇక్కడ చెప్పుకోగలం. దేవతలందు... యమ-ఇంద్ర-చంద్ర-సూర్య-వరుణ-వాయు-బ్రహ్మ-విష్ణు-బృహస్పతి-శుక్రాచార్య-అగ్ని మొదలైనవారు.

ప్రజ్ఞాపతులందు... దక్షుడు,కశ్యపుడు మొదలైనవారు; దేవర్షులందరు... నారదుడు మొదలైనవారు; దేవపుత్రులందు... కుమారుడు, సనక సనందులు మొదలైనవారు; దానవులలో ... హిరణ్యాక్షుడు,బలి, ప్రహ్లాదుడు, శంబరుడు, మయుడు, వృత్రుడు, అంధకుడు, నముచి, కాశీపుత్రుడు, మురుడు మొదలైనవారు; రాక్షసులందు ... విభీషణుడు, ప్రహస్తుడు, ఇంద్రజిత్తు మొదలైనవారు; నాగులందు... తక్షకుడు, కర్కోటకుడు, మహాపద్ముడు మొదలైనవారు...

ఇట్లా ప్రతి జీవజాతిలోను జీవన్ముక్తులు-ఆత్మజ్ఞాన సంపన్నులు అయిన మహనీయులు ఎందరో ఉన్నారు. ఇట్లాగే బ్రహ్మ-విష్ణు-ఇంద్రలోకములలోను, సిద్ధ-సాధ్యులలోను మానవులలోను ముక్తస్వభావులగువారు అక్కడక్కడా తప్పక ఉన్నారు. మనుష్యులలో కొందరు రాజులు, మునులు, బ్రాహ్మణోత్తములు, తదితరులు ఆయా వివిధ మతవాదులలో కొందరు కొందరు జీవన్ముక్తులై వెలుగొందుచున్నవారు ఉన్నారు.

ఓ రఘుకుల తిలకమా! రామచంద్రా! ఇక్కడ ఒక విషయం గమనించబడుగాక! ఎవరు ఏ సిద్ధాంతాన్ని నమ్మినవారై ఉంటారో, అది వారికి అట్లే సత్యమై ఉంటుంది. ఉదాహరణకు "మరణిం చిన తరువాత దేహమును ఆశ్రయించుకునే ఉంటారు" అని నమ్మిన వారు మరణానంతరం దేహ

సమీప్యమునే అనుభవిస్తూ ఉంటారు. కనుక విజ్ఞుడైనవాడు అన్ని సిద్ధాంతాలను విశ్లేషించి ఉత్తమ మైనది ఆశ్రయించడం ఉచితం. "నేను సర్వాత్మకుడను. దేహమనోతీతుడను. సర్వులలో ఏది సాక్షి మాత్రమై ఉన్నదో అదియే నా స్వరూపం. ఈ సర్వదా సహజీవుల స్వరూపం కూడా సర్వదా అదే" …అను అవగాహనయే ఉత్తమోత్తమగు ఆత్మజ్ఞానమని మేము గ్రహిస్తున్నాం. ప్రకటిస్తున్నాం!

ఫలవృక్షాలు అనేకచోట్ల ఉంటాయి. కాని కల్పవృక్షాలు సృష్టిలో కొలదిగానే ఉంటాయి కదా! అట్లాగే దశదిశలా ప్రాణికోట్లు ఉన్నాయి. వారిలో జీవన్ముక్తులు, ఆత్మజ్ఞాన సంపన్నులు, అఖండమగు ఆత్మతత్త్వమును అనుభవిన్తూ ఉండేవారు కొలదిగానే ఉంటున్నారు.

❖❖❖

# 3. సాధువులతో సమాగమం

**శ్రీరాముడు :** మహర్షీ! మహనీయులతో సమాగమం అధ్యాత్మయానంలో అత్యావశ్యకమని మీరు సిద్ధాంతీకరించారు. అయితే వివేకులైన ఆత్మజ్ఞుల లక్షణములు ఎట్టివి? వారు ఏ సాంఘిక-లౌకిక-ఆచరణ లక్షణములతో, ఏఏ ఆచరణ-అనుష్ఠానములతో ఉంటారు? వారిని సమీపించటం ఎట్లా? వారి నుండి ఆత్మజ్ఞానాన్ని సంపాదించుకోవటానికి మా అర్హతలు ఎట్లా ఉండాలి? మేము వారి కరుణామృతానికి పాత్రులమయ్యేది ఎట్లా? ఈ ఈ విషయాలు మాపై గల కరుణతో వివరించమని నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును! సాధువులతో బ్రహ్మజ్ఞులతో సమాగమం అమోఘమైన ప్రయోజనాన్ని కలుగజేస్తుంది. అట్టి అవకాశం పట్ల అశ్రద్ధ-ఉదాశీనత ఉండకూడదు. నేనీ విషయాలు ఇతః పూర్వమే కొన్ని చెప్పి ఉన్నప్పటికీ … ఇప్పుడు కూడా సందర్భోచితం కాబట్టి మరికొన్ని విషయాలు ఇక్కడ ప్రస్తావిస్తాను. మహనీయుల గురించి సంభాషించుకోవటమే మహత్తరమైన జ్ఞాన యజ్ఞం!

❖

వివేకులు-విరక్తులు-పరమాత్మయందు విశ్రమించినవారు అగు మహనీయులు లోభ-మోహ రహితులై ఉంటారు. యుద్ధ యోధుడు శత్రు సైనికులను జయించి ఆధిపత్యం ప్రకటించునట్లు వారు లోభ-మోహ-కామ-క్రోధ-మద-మాత్సర్యాలను జయించి ఆధిపత్యము వహించినవారై ఉంటారు. వారు అధికముగా ప్రసన్నులు కారు. వారికి ఎవరిపైనా ఏమాత్రం కోపం ఉండదు. వారు దేనిపట్లా ఆసక్తి కలిగి ఉండరు. భోగ్య పదార్థముల పట్ల అభినివేశము, జనుల వలన ఉద్వేగము పొందరు. తదితర జనులను ఉద్వేగింపజేయరు.

నాస్తికత్వముతో గూడి దురాచారములు చేయరు. ఆస్తికత్వముతో గూడి అతిక్లేశకరములగు కర్మానుష్ఠానమునందు తత్పరులు కారు. మనోహరమైన, మధురమైన ఆచరణ కలిగి ఉంటారు. ప్రియముగాను-కోమలముగాను మాట్లాడుతూ ఉంటారు. వారు తమ సాంగత్యముచే జనులకు ఆహ్లాదము కలిగిస్తూ ఉంటారు. ఒక్కొక్క సమయంలో లౌకిక-వైదిక కర్మలకు పరస్పర విరోధం

కలుగగల సందర్భాలు ఉంటాయి చూచావా? అప్పుడు వారు ఆ ఉభయుల మధ్య సంకటమును నివారించి, జనుల సందేహాలను క్షణంలో తొలగించి అనుష్ఠానమును లోక కళ్యాణ పూర్వకంగా, సౌలభ్య సమనిత్వంగా అవగాహన-ఔన్నత్యములతో తీర్చిదిద్దగలరు. క్షణంలో ఉత్తమ కర్తవ్యమును నిర్ణయించగలరు.

**అనుద్వేగకరాచారా బాంధవా నాగరా ఇవా**

**బహిః సర్వ సమాచారా అన్తః సర్వార్థ శీతలాః ॥**

ప్రియమైన-శ్రేయోభిలాషులైన బంధువుల వలె ఉద్వేగరహితులై ఉంటారు. వారి ఆచారము లన్నీ సర్వులకు క్షేమము కలుగజేసే ఉద్దేశముతో రూపొంది ఉంటాయి. బాహ్యమున అందరిలోనూ సమముగా సామాన్యాచరణ కలిగి ఉంటూనే... అంతరంగంలో సమస్త కార్యములలో ప్రశాంతంగా ఉంటారు. ఇంకా... వారు శాస్త్రార్థ రసికులై ఉంటారు. జగత్తు యొక్క పూర్వ-పరతత్త్వమును ఎఱిగినవారై ఉంటారు. ఆత్మజ్ఞులై ఉంటారు. 'ఏది గ్రహించాలి-ఏది త్యజించాలి'... అనేది బాగుగా ఎఱిగినవారై, వాటి పట్ల జ్ఞానయుక్తులై ఉండి, యథాప్రాప్తములైన ఆయా ధర్మ-కర్మములను నిర్విర్తిస్తూ ఉంటారు. శాస్త్ర-లోక విరుద్ధములైన కార్యముల పట్ల విరక్తి కలవారై ఉంటారు. సదాచారముల పట్ల ప్రీతిమానసులై ఉంటారు. వారి యొక్క హృదయము అనే పుష్పం 'జ్ఞానోదయం కావించగల ఉపదేశములు' అనే కమ్మటి సువాసన సదా వెదజల్లుతూ ఉంటుంది. వారికి అతిథులై వచ్చినవారికి "వీరికి ఆశ్రయదానము-సుఖదాయకమగు భోజనము-సత్కారము ఇంతవరకే చేయగలిగానే" అనే అణకువ కలిగి ఉంటారు. స్వగృహమునకు ఏతెంచిన అతిథులతో వారికి సర్వ ప్రదాతయగు తమ ఇష్టదైవం ద్యోతకమౌతాడు. సర్వుల పాప దృష్టులను వారు క్షణంలో 'పవిత్రత' వైపుగా మరల్చగలుగుతూ ఉంటారు. తమ ఉత్తమ గుణములచే సత్పురుషుల మనస్సును హరించు సామర్థ్యం స్వభావసిద్ధంగా కలిగి ఉంటారు. జన క్షోభను తమ తపఃప్రభావం చేత, సత్కర్మానుష్ఠానం చేత నివారించి, సంకల్పమాత్రంచే జనులను సముత్సాహపరుస్తూ ఉంటారు. సంపదలలో సహ జనులను సుఖపెట్టువారై వర్తిస్తూ ఉంటారు. వారి శీతల హృదయంలో అమ్మ ప్రేమ మనకు కనిపి స్తుంది. వారున్న చోట సాత్విక భావాలు నలువైపులా వెదజల్లబడుతూ ఉంటాయి. వారు భావికాలపు సత్ఫలితాలకు హేతుభూతులై భాసిల్లుతూ ఉంటారు. మధురభాషులై అందరికి ఉల్లాసం కలిగిస్తూ ఉంటారు. అనేక మనోరథములచేత, శోకమోహములచేత, చంచల ప్రవృత్తుల చేత కలుషితమైన హృదయములకు ఆ సాధుపురుషుల వివేకోపన్యాసమే పరిశుద్ధ పరచగల అభ్యంగన స్నానం.

కాబట్టి రామచంద్రా! ఆపద సమయములందు, జరా-మృత్యు-శోక-మోహాది వ్యాకుల స్థితులయందు తదితర సంకట స్థితులందు తత్త్వజ్ఞుడగు జ్ఞాని యొక్క యోచనలు-బోధలు-అభిప్రాయములే శరణ్యమని సర్వ జనులకు గుర్తు చేస్తున్నాను.

నాయనా! రామా! ఇట్టివియు, తదితరములు అగు చిహ్నములచే విశాల హృదయములగు మహనీయులు ఎక్కడెక్కడున్నారో గుర్తించాలి. సంసార మార్గములో శ్రమగొనియున్నవాడు

అద్వయమగు బ్రహ్మమునందు విశ్రాంతిని సంపాదించుకోవటానికై అట్టి మహితాత్ములను ఆశ్రయించాలి. ఎందుకంటే ఈ సంసారసాగరం సర్పము వలె అతి భయంకరమైనది సుమా!

**వినా 'సత్సంగమ్' అన్వేన పోతకేన న తీర్యతే**

అట్టి ఈ సంసార సాగరము 'సత్సంగము' అనే పడవచే తప్ప మరి దేనిచే దాటబడగలదు?

**అస్తాం కిం మే విచారేణ? యత్ భవేత్ అస్తు తత్ మమ!**
**ఇత్యస్తః కల్కమ్ ఆసాద్య న స్థేయం గర్త కీటవత్**

"ఆ! విచారణ వలన మాకేం ప్రయోజనం? ఏది ఏమైయున్నదో అదే అట్లే మనకగు గాక! అయినా ఎవరిని నమ్మగలం? ఈ చెప్పే వారిలో తప్పులుండవా? చెప్పటం ఎవడైనా చెప్పగలడు. ఇవన్నీ మాకు తెలియవా ఏమి? ఆ! మేము చాలామందిని చూచాం. నేను ఇటువంటి వారిని – అటువంటి వారిని నమ్మను"... అనే ఏవేవో అలసత్వపు స్వభావంతో ఈ జనులు రోజులు గడిపేస్తు న్నారే గాని... "ఈ జీవితాన్ని, ఈ సందర్భాలను, అవకాశాలను సద్వినియోగ పరచుకోవటమెలా?" అని సమాలోచనకు సిద్ధమే కావటం లేదు. ఓ ప్రియ జనులారా! అట్టి అలసత్వం అంతఃకరణంలో ధరించి గుంటలోని కీటకం వలె రోజులు గడపడం శ్రేయం కాదని ముందుగా హెచ్చరిస్తున్నాను. శ్రద్ధ–ఉత్సాహం–అన్వేషణలతో సత్పురుషులను గుర్తించి, సమీపించే ఉద్యమంలో ఉండటమేశ్రేయం.

ఒకవేళ పైన చెప్పిన ఉత్తమ గుణాలన్నీ ఒకనియందే లేవనుకో! అప్పుడు ఆ ఉత్తమ గుణాలలో ఒక్కటి అయినా ఎవనియందైనా ఉన్నదని ఎఱిగినప్పుడు ఆ ఒక్క గుణం కొఱకై – మిగిలిన పనులన్నీ ప్రక్కకుపెట్టి ఆతని అన్య దోషాలను అనాదరిస్తూ (లక్ష్యపెట్టక) ఆతనిని ఆశ్రయించాలి.

బాల్యం నుండి "నా గుణ దోషములు ఏమేమి?" అని తెలిసుకోవటానికి సత్సంగము– శాస్త్రాభ్యాసం ఈ రెండింటిని సద్వినియోగపరచుకోవాలి. చిన్నచిన్న దోషములను కూడా ప్రయత్నంతో తొలిగించుకొనే ఉద్యమంలో ఉండాలి. అందుకుగాను నిత్యము సజ్జనులతో పరిచయమును, సహవాసమును ప్రవృద్ధం చేసుకొంటూ ఉండాలి. ఒకవైపు సజ్జన సహవాసం పెంపొందించుకుంటూ, మరొకవైపు స్థూలదృష్టి దోషములుగల జనులతో గల సంబంధమును క్రమంగా తగ్గించుకుంటూ ఉండాలి. దుస్సాంగత్యము సాధువులో కూడా అసాధుత్వమును ఉత్పత్తి చేయగలదని నా అభిప్రాయం. లోకంలో అట్లా చూస్తున్నాం కదా! సాధువు దుష్టత్వం పొందటం జగత్తులో అశుభ సూచకం. అందుకే ఇంత సూటిగా చెప్పుచున్నాను. దేశ కాలవశంగా పాపకార్యములచే లోకంలో గొప్ప అరిష్టాలు సంభవించటం గాంచబడుచున్నది. అందుచేత అన్ని కార్యక్రమములు త్యజించి అయినా సరే,... సజ్జన సాంగత్యమును ఆచరించాలని బాలురకు, తదితరులకు కూడా నా విన్నపం. "సజ్జనులతో సాంగత్యమే ఇహ పర శ్రేయోదాయకమైన గొప్ప సాధన" ... అని మేము తలచుచున్నాము.

ఓ రామచంద్రా! సజ్జనుల నుండి ఎప్పుడూ కూడా మనుజుడు దూరం కారాదు. మరొక విషయం. సాధువులను సమీపించునప్పుడు నమ్రత కలిగి ఉండాలి. ఆత్మజ్ఞానులు అర్థమైన వారి

ముందు మాత్రమే వివేక ప్రవచనములు చేస్తారు. సమీప ప్రాంతంలో సాధువు, ఆత్మజ్ఞాని ఉన్నాడని తెలియగానే వారిని ఆశ్రయించే యత్నంలో ఉండాలి. సాధు పురుషుల సమీపంలో ఉన్నంత మాత్రం చేత వారి సద్గుణ పుష్ప రేణువుల స్పర్శ తదితరులకు కూడా లభించగలదు.

❖❖❖

# 4. పక్షి-క్రిమి-కీటక జీవుల అనుభవం ఎటువంటిది?

**శ్రీరాముడు :** స్వామీ ! వసిష్ఠ మహర్షీ! పక్షి-క్రిమి-కీటక దేహములను పొంది కొందరు దేహధారులు ఈ జగత్తులో సంచరించటం జరుగుతోంది కదా! అట్టి జీవుల విషయమై 'వారి దుఃఖముల విషయమేమిటి?' అనే ప్రశ్న నా హృదయంలో ఏర్పడుతోంది. ఎందుకుంటారా?

**సన్తి దుఃఖక్షయే అస్మాకం శాస్త్ర-సత్సంగ యుక్తయః**
**మంత్ర-ఔషధి-తపో-దాన-తీర్థ-పుణ్య అశ్రమాశ్రయాః ॥**

మహాత్మా! మా మనుజుల వంటి వారికైతే ఈ సంసారం కలిగించ గల దుఃఖాలను తొలగించు కొనుటకై తమవంటి మహామహితాత్ములచే చెప్పబడిన శాస్త్రాదులు ఉన్నాయి. శాస్త్రాభ్యాసం, సత్సంగం, మంత్రం, ఔషధం, తపస్సు, దానం, తీర్థం, పుణ్యాశ్రమ సేవ మొదలైన ఉపాయాలు మా అజ్ఞాన దుఃఖాన్ని తొలగించుకోవటానికై ఉన్నాయి. తమ వంటి సద్గురువులు ఉన్నారు.

మరి క్రిమి కీటకాల మాట ఏమిటి? ఈ క్రిమి-కీటక-పతంగ-తిర్యక్-స్థావరాది జాతులలో దేహాలు పొందిన జీవులు ఎటువంటి మోక్షోపాయములు ఎఱుగకయే ఉన్నాయి కదా! మఱప్పుడు అవి ఎట్లా జీవిస్తున్నాయి? ఏఏ కార్యములు ఒనర్చుచున్నాయి? వాటికి దుఃఖం క్షయించేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** (లోకో రమయతేతి రామా!) సర్వ జీవుల పట్ల అవ్యాజమైన ప్రేమను కురిపించే ఓ రఘుకుల తిలకమా! రామచంద్రా! ఇప్పుడు పక్షి-క్రిమి-కీటక-తిర్యక్-స్థావర జీవుల అనుభవ విశేషాలేమిటో చెప్పుతాను. విను.

సమస్త స్థావర-జంగమ ప్రాణులు కూడా వాటి వాటికి యోగ్యములైనట్టి భోగముల 'సుఖసత్త' యందు స్థితిని కలిగి ఉన్నాయి. కొన్నిటిని 'ఇవి పొంది మేము సుఖిస్తాం' అనుకొని వాటిని అట్లే పొంది సుఖిస్తున్నాయి. అంతే కాకుండా ఏదేది ఏ జన్మయందున్నదో... అది ఆ జన్మకు తగినట్టి విషయముల యొక్క ప్రాప్తియే "మహాపురుషార్థం" అని ఎంచుచున్నది. అట్టి అల్ప ప్రాణులకు కూడా మనకు లాగానే జన్మోచితమైన 'సుఖభోగేచ్ఛ' కలదు.

అయితే, వాటికి ఏవి గొప్ప భోగములుగా కనిపిస్తున్నాయో మానవులకు అట్టి భోగముల పట్ల అల్పమైన విశ్వాసం ఉంటుంది. అందుచేత మనకు కొద్ది విఘ్నములే ఉంటున్నాయి. వాటికో? కామ-క్రోధాదుల ప్రాబల్యం చేతనూ, వివేకము లేనందుచేతనూ ఆయా అల్ప భోగములపై అధిక విశ్వాసం ఉంటోంది. అందుచేత పర్వతం వలె గొప్పవి అయిన అనేక విఘ్నములు కలుగు చున్నాయి. ఉదాహరణకు "ఆ పండును నేను ఆరగించాలి" అని నీవు అనుకుంటావనుకో. అది

లభించకపోతే? అది పెద్ద విషయంగా చూడవు కాబట్టి నీకు అది అల్పమైన విఘ్నమే అయి ఉంటుంది. అదే ఒక కీటకమైతే, ఆ పండును భక్షించాలని తలచి, అది లభించనందుకు తీవ్రమైన విఘ్నత్వం అనుభవిస్తుంది. ఈమాత్రం తేడా తప్పించి సుఖ దుఃఖములు క్రిమి కీటకాదిజాతులకు, మానవులకు ఒక్క తీరైనవే!

బ్రహ్మాండ శరీరుడగు విరాట్ పురుషుడు (విరించి, బ్రహ్మదేవుడు, సమష్టి జీవుడు) ఏ విధంగా అయితే స్వభోగము కొఱకై ప్రయత్నించుచున్నాడో... ఆ విధంగానే వెంట్రుక చివర సంచరించు చున్న 'పేను' కూడా "ఈ స్థానమే నా గృహం" అనుకుంటూ అక్కడయే ఆయా భోగానుభవముల కొరకై ప్రయత్నము సలుపుచున్నది.

ఆహా! అహంకారము యొక్క ప్రతాపం ఎంతటిదో చూచావా? ఈ జీవులందరూ శాంతమగు ఆత్మ స్వరూపులే అయివుండికూడా శాంతి కొఱకై ఎక్కడెక్కడో బాహ్యమున వెతుకుచున్నారు కదా!

**జాయన్తేచ మ్రియంతేచ నిరాధారే అంబరే ఖగా ః**
**శూన్యైక విషయాస్తేషాం ! స్వాస్థ్యం న భవతి క్షణమ్ !**

పక్షులు కేవలం శూన్య విషయాలలో అభిలాష కలిగి ఉన్నవై నిరాధారమగు ఆకాశంలో జన్మించి, మరణిస్తున్నాయి. వాటికి క్షణమైనా శాంతి లభించటమే లేదు. ఇక చీమలు మొదలైనవి ధాన్యము మొదలైన పదార్థకణములను సంపాదించుకోవడంలోను, కుటుంబము యొక్క పోషణ-పాలనకు సంబంధించిన క్రియలలోను సుదీర్ఘమైన రోజును క్షణంలాగా గడిపివేస్తున్నాయి. గరుత్మంతుని గమనమునందు ఏ వ్యగ్రత్వం కనిపిస్తోందో.... త్రసరేణువుల వలె (సూర్య కిరణాలలో కనిపించే సూక్ష్మరేణువువలె) అతి సూక్ష్మమగు ఆకారం గల 'తిమి' అను అతిసూక్ష్మమైన జీవి యొక్క గమనంలో కూడా అంతటి వ్యగ్రత్వం కనిపిస్తోంది. మానవులలో ఏ విధంగా "వీడు-వాడు-నేను-నీది-నాది-నా ఇల్లు-నా ధనం" ఇత్యాది కల్పనా పరంపరలు, భావావేశాలు, గుణాతిశయాలు వృద్ధిపొంది ఉన్నాయో, అట్లాగే క్రిమికీటకాలలో అవన్నీ ప్రసిద్ధిపొంది ఉన్నాయి.

**దేశ కాల క్రియా ద్రవ్య వ్యగ్రయా జర్జరీకృతమ్,**
**క్షీయతే వ్రణకీటానామ్ అస్మాకమివ జీవితమ్ ॥**

దేశ-కాల-క్రియా-ద్రవ్యాది విషయములు గూర్చిన చింతనచే మన జీవితం ఏ విధంగా క్షీణిస్తుందో.... అట్లాగే "వ్రణం (పుండు)" నందలి కీటకం యొక్క జీవితమూ క్షీణిస్తోంది. శిలలు ఘోరనిద్రయందున్నాయి. వృక్షములు కొంచెము జాగరూకములై ఉన్నాయి. క్రిమి-కీటకాదులు మన మనుజుల వలెనే కొంత జాగరూకముగాను, కొంత నిద్రాశీలముగాను ఉన్నాయి.

**శరీరనాశ ఏవైషాం సుఖం సంప్రతి దుఃఖ కృత్**
**అస్మాకమివ తేషాం తజ్జీవితం తు సుఖాయతే ॥**

ఏ విధంగా మనకు జీవించడం సుఖంగాను, మరణించడం దుఃఖంగాను ఉన్నదో... అట్లాగే క్రిమి-కీటకాలకు కూడా 'జీవించడం' అనేది సుఖప్రదంగాను, 'మరణించడం' అనేది దుఃఖ

ప్రదంగాను అనిపిస్తూ ఉంటోంది. క్రొత్త చోటికి వెళ్ళిన మనుజునకు అక్కడ గల పదార్థాలన్నీ క్రొత్తక్రొత్తవిగా అనిపిస్తున్నట్లే పశు-మృగాదులు కూడా ఈ పదార్థ సమూహములను కొన్నిటిని ఉద్వేగంతోను, మరికొన్నింటిని ఉదాసీనంగాను గాంచుచున్నాయి. మనకు వలెనే తిర్యక్ జీవులకు కూడా (పశు-పక్షి మొదలైనవాటికి కూడా) ఈ ప్రపంచం సుఖ-దుఃఖప్రదమై గోచరిస్తోంది. అయితే మానవులేమో గుణ-క్రియలను బుద్ధితో విశ్లేషించి పదార్థముల సంయోగ-విశ్లేషణాదులచే మరి కొంత విశ్లేషించి మరీ విషయాలను పొందుతూ వస్తున్నారు. తిర్యక్‌జాతి జీవులేమో ప్రకృతిలో లభించేదానిని యథాతథంగా అనుభవిస్తున్నాయి. ఇంతకుమించి తేడా ఏమీ లేదు. అజ్ఞానులకు పామరజనులు 'ఆత్మజ్ఞానము' నకు సంబంధించిన యోచన-ప్రయత్నము లేకుండా ఆయా ఇచ్ఛా-ద్వేషములనే త్రాళ్ళచే  బద్ధులై ఒక సమయంలో సానుకూల్యమును, మరొక సమయంలో ప్రాతికూల్యమును పొందుచూ జీవితములను గడిపివేస్తున్నారు. ఇక పశువులు మొదలైనవి ముక్కు త్రాళ్ళచే బంధించబడి.... ఆహారాదులచే సంతోషిస్తూ, అవి లభించనప్పుడు దుఃఖిస్తూ జీవిస్తు న్నాయి. ఇటు మానవులు - అటు పశువులు కూడా అంతఃకరణంలో అనేక వేదనలు, సుఖదుఃఖ అనుభూతులు కలిగియే చరిస్తున్నారు. కనుక ఉభయుల జీవితంలో భేదమేమున్నది? మానవులు-జంతువులు-కీటకాలు ఈ అందరు దేహులు కూడా ఒకప్పుడు ఈ దేహాలు పొందుచున్నారు. బాల్య-యౌవన-వార్ధక్యములు అనుభవిస్తున్నారు. కాలక్రమేణా ఆయా దేహాలను మరణంలో కోల్పోవుచున్నారు. ఇందులో విశేషమైన భేదం ఏమున్నది?

సుకుమారమైన చర్మం కలిగిన మానవులకు సుఖనిద్రా సమయంలో శీతోష్ణముల వల్ల దోమలు మొదలైన వాటి వలన దుఃఖం కలుగుచున్నట్లే, వృక్షాదులకు కూడా క్రిమికీటకాదులచే గావించబడే 'దంశం (కాటు)" వల్ల దుఃఖ వేదనలు కలుగుచూనే ఉన్నాయి. కనుక ఉభయుల సుఖ-నిద్ర-దుఃఖ-వేదనలలో మాకు భేదమేమీ కనిపించడం లేదు. దేశక్షోభ ఏర్పడగా మనం పరుగులు తీస్తున్నప్పుడు ఏ విధంగా మార్గంలోని రాళ్ళు ముళ్ళు తగిలి మరింత క్షోభను కలుగ జేస్తాయో, అట్లాగే పక్షులకు, సర్పములకు, తదితర తిర్యక్ జంతువులకు శత్రువుల వలన ప్రకృతి యొక్క వైపరీత్యము వలన క్షోభ-దుఃఖము కలుగుతూ ఉంటాయి. విక్షేపానుభవం తొలగినప్పుడు మనుష్యులకు ఆనందం కలుగుచున్నట్లే జంతువులకు కూడా విక్షోభం తొలగగానే ఆనందం కలుగుతోంది. ఆహార-నిద్ర-మైథున-విశ్రాంతి సమయాలలో ఇంద్రునికి కలిగే ప్రసన్నత ఎట్టిదో, ఒక దోమకు-ఈగకు-పేనుకు కలిగే ప్రసన్నత కూడా అట్టిదే! ఆ ఇరువురు కూడా విక్షేపమును ఒక్కొక్కసారి అధిగమించలేక నిస్సహాయతను అనుభవిస్తూ ఉండడం కూడా సమానమైనదే! రాగ-ద్వేష-భయ-ఆహార-నిద్ర-మైథున జనితములైన సుఖదుఃఖాలు, జనన-మరణ సమయాలలో ఏర్పడే భేదాల విషయంలో ఇంద్రునికి, కీటకానికి కూడా భేదమేమీ లేదు. ఇక భేదమేమిటంటావా?

మానవులకు శాస్త్రములు, అవి నిర్దేశించే పుణ్య-పాప-బ్రహ్మతత్త్వాదుల సంబంధమైన జ్ఞానం, భూత-భవిష్యత్ పదార్థముల జ్ఞానమూ ఉంటున్నాయి. ముంగిస-నక్క-పాము-ఏనుగు-ఆవు మొదలైన జంతువులకు అవి అంతగా ఉండడం లేదు. ఇక మిగతా అన్ని విషయాలలో (చావు

– బ్రతుకు – సుఖం – దుఃఖం – ఇష్టం – అయిష్టం – ఆకలి – దప్పిక – ఇష్టజీవులు – అయిష్ట జీవులు – నిద్ర – స్వప్నం – ఊహ – అపోహ – ఆశ – నిరాశ – దురాశ – ప్రేమ – క్రోధం వంటి విషయాలన్నిటిలో) మానవులకు, ఆ జంతువులకు భేదమేమీ లేదు. ఇక వృక్షాదులు నిద్రాగ్రస్తములై గాఢమైన అజ్ఞానముతో కూడి ఉంటున్నాయి. పర్వతములు–కొండలు కూడా అదే స్థితిని అనుభవిస్తున్నాయి. కాని హిమాలయము, మేరు పర్వతము మొదలైన కొన్ని పర్వతములు మాత్రం తత్వజ్ఞ సంబంధమైన అఖండ చిదాకాశమును అనుభవిస్తున్నాయి. వృక్షాదులేమో గాఢనిద్రను అనుభవిస్తున్నాయి. పర్వతాదులు అజ్ఞానయుక్తమగు స్వసత్త యందు ఉంటున్నాయని అనుకున్నాం కదా! జంగమజాతులలో అనేక జీవులు స్వప్న స్థితిలో అర్ధవికాసముతోను, జగత్తునందు పూర్ణవికాసముతోను ఉంటున్నారు. కొందరు జంగమ జీవులు మాత్రం చిదాకాశమాత్ర స్వరూపానుభవులై ఉంటున్నారు. ఏ జీవునికి ఎట్లు అనుభవమైవుంటున్నా కూడా అది 'ఎరుక' అను మూలతత్త్వమును ఆశ్రయించే ఉంటోంది. అద్దానిని ఎవరు ఏ రీతిగా ఎఱుగుచున్నారో, వారికి ఆ రీతిగా అప్పుడే అనుభవమగుచున్నది.

కనుక జ్ఞానికైనా అజ్ఞానికైనా చిదాకాశమే ఆయా రీతులుగా అనుభవమగుచున్నదని విజ్ఞుల అభిప్రాయం. 1.హిమాలయాది పర్వతాదుల అఖండ సత్త; 2.వృక్షాదుల నిద్రాసత్త ...ఈ రెండింటిలోను ద్వైతానుభవం (రెండవది అనే అనుభవం) ఉండడం లేదు. కాబట్టి ఆ రెండింటి యొక్క దృష్టికి ఈ జగత్తంతా కూడా ఏకమే అయినట్టి అజ్ఞానోపహిత చిదాకాశమే ఆయా రీతులుగా కనబడుతోంది.

ఓ రామచంద్రా! ఆత్మజ్ఞానం కలుగనంతవరకూ ఈ జీవుని దృష్టిలో జగత్తు ఉంటూనే ఉంటుంది. ఆత్మజ్ఞానం కలిగినప్పుడో... ఇక ఆ పై ఈ జగత్తుగాని, నీవు–నేను మొదలైనవిగాని, భూత–భవిష్యత్–వర్త మానములు గాని సర్వదా లేనివే అయివుంటాయి. వాస్తవానికి ఏ చిదాకాశ మైతే "అనాది–అనంతము–అపరిచ్ఛిన్నము–అజ్ఞాన నిద్రారహితము–మౌనసదృశము–శిలవలె చిద్ఘనము–సర్వదా యథాస్థతము" అయివున్నదో అట్టి చిదాకాశమే ఈ జగత్తు యొక్క వాస్తవరూపం. స్వప్నద్రష్టకు స్వకల్పితంగా స్వప్నం అగుపిస్తున్నట్లు, అజ్ఞాని యొక్క దృష్టికి నిజస్వరూపము చేతనే ఈ జగత్ వైచిత్ర్యమంతా కల్పించబడినదై అనుభవమగుచున్నది. పరమార్థంగా చూస్తే ఈ సృష్టి పూర్వం ఎట్లా ఉన్నదో... ఇప్పుడూ అట్లాగే సమముగానూ, ఏకరూపముగానూ ఉన్నది. ఇక ముందు కూడా అనంతకాలం ఇట్లే ఉండబోతోంది. ఎటొచ్చీ... అజ్ఞానికి అది నేను–నీవు మొదలైన వాటితో కూడిన అనేక రూపాలుగా అగుపిస్తోంది.

జ్ఞాని ఇదంతా ఏకం అఖండం అగు ఆత్మతత్త్వంగా సుస్పష్టంగా చూస్తున్నాడు. అట్టి శుద్ధ చిన్మాత్రమునకు "ఆకాశం–పర్వతం–ప్రపంచత్వం–శూన్యత్వం–మౌనత్వం–మౌనిత్వం" మొదలైన శబ్దార్థాలు ఆపాదించడానికి కుదరనే కుదరదు సుమా!

ఓ రామచంద్రా! నీవు–నేను ఈ సమస్తము కూడా యథాస్థితమగు బ్రహ్మమే అయివున్నాం. బ్రహ్మమునకు వేఱుగా నేను–నీవు–తదితరులు అనునవేవీ లేవు.

స్వప్ననగరంలో స్వప్న కల్పనారూపమగు పరమాకాశము తప్ప మరింకేమున్నది చెప్పు? అట్లాగే ఏదైతే కలదో... అది శాంతం-నిర్మలం-నిర్వికారం అగు చిదాకాశమే అయివున్నది. అంతటా చిదాకాశమే ఉండి ఉండగా... అందులో సుఖ దుఃఖాదులు ఎక్కడుంటాయి చెప్పు? స్వప్నంలో వస్తువులు మెలకువ వచ్చేవరకే కనిపిస్తాయి కదా! ఆ తరువాత స్వప్నంలో వస్తువులు ఏమవు తున్నాయి? ఆ ప్రశ్నే ఉచితం కాదు. ఎందుకంటే, స్వప్నంలో వాస్తవానికి వస్తువులు ఉంటే కదా... అవి పోవడం అనేమాట? అట్లాగే జ్ఞానము కలిగిన తరువాత "నీవు-నేను జగత్తు-అహంకారము" మొదలైనవి మొదలే కనిపించవు. "అట్లా ఎప్పుడైనా నాకు కనిపించి ఉంటే, అది అజ్ఞానము చేతనే"... అని జ్ఞాని గమనిస్తున్నాడు. 'జగత్తు' అనే స్వప్నం 'జ్ఞానము' అనే మెలకువచే ఎఱుగబడినదై "అంతయూ బ్రహ్మమే" అనునది కరతలామలకమైపోతోంది. అట్టి ఈ జగత్తు "అజ్ఞానపూర్వకమైన స్వప్నం వంటిది"... అని ఎఱుగబడిన తరువాత ఇక ఇందులో ఆసక్తి ఉండ వలసిన పనేముం టుంది? "గొడ్రాలి రెండవ కుమారుని రూపు రేఖలేమిటి?" ...అనే విషయంలో ఆసక్తి ఎవరికీ ఉండదు కదా! ప్రతి పరమాణువునందునూ అసంఖ్యాక జగత్తులు స్వప్నమాత్రంగా ప్రాప్తించ గలుగుచుండగా ఇక అట్టి ఈ భ్రమ ఎందుకు? "గొడ్రాలి రెండవ కుమారుని ముక్కు ఎంత వెడల్పు? ఎందుచేత?" అనే అల్పచర్చలు త్యజించి ఆత్మజ్ఞానము కొఱకై సర్వ అవకాశములను ఎందుకు వినియోగించరాదు?

ఏది అప్రబోధకాలంలో ఉన్నట్లు అగుపిస్తున్నప్పటికీ ప్రబోధకాలంలో ఉండదో... అది ఉన్నది ఎట్లా అవుతుంది? భ్రమచే ఎండమావులలో జలతరంగాలు కనిపిస్తూ ఉంటే, (భ్రమ తొలగగానే అక్కడ జలమేలేదని తెలియవస్తూవుండగా) ... ఇక ఉన్నట్లౌతుందా? ఈ జగత్తు మొదలైనవి అట్టివే సుమా! ఈ భూత-భవిష్యత్ కాలములు, జ్ఞాన-అజ్ఞానములు మొదలైనవి కూడా యథార్థానికి లేనివే! అంతాకూడా శివరూపము-పరమశాంతము అగు పరమాత్మ చేతనే ఆవరించబడివున్నది. ఇక ఈ 'చచ్చుట-చంపుట' అనబడు విశేషాల గురించి అంటావా?...

**యథా ఊర్మిణో ఊర్మ్యానిహతే న కాచిత్ పయసాం క్షతిః**
**తథా దేహేన నిహతే దేహే, నాస్తి చితేః క్షతిః ॥**

ఒక తరంగం వెళ్ళి మరొక తరంగమును ఢీకొని ఖండములుగా చేసిందనుకో!... అప్పుడు జలానికి వచ్చే నష్టమేమున్నది? అట్లాగే ఒక దేహముచే మరొక దేహము నశింపజేయబడినప్పటికీ కూడా ఆత్మకు ఏ హానీ లేదు. ఆకాశరూపమగు చైతన్యమునందే "నేను దేహమును" అనే భ్రాంతిజ్ఞానం ఉత్పన్నం అవుతోంది. కాబట్టి అట్టి భ్రాంతిజ్ఞానరూపమగు దేహము నశించనంత మాత్రంచేత చైతన్యము నశిస్తుందా! లేదు. చైతన్యమునకు (ఆత్మకు) వచ్చే నష్టమేమి లేదు.

**"జగత్తు" ప్రబుద్ధమగు చిదాకాశము యొక్క "స్వప్నం' -**

**ప్రబుద్ధస్యైవ "చిద్వ్యోమ్నః స్వప్నో" జగత్ ఇతి స్థితమ్ ।**
**పృథ్వ్యాది రహితం యస్మాత్, తస్మాత్ స్వప్నాత్మకం జగత్ ॥**

అట్టి ప్రబుద్ధ చిదాకాశము యొక్క స్వప్నమే జగత్తుగా స్థితినొంది ఉన్నది. అనగా జగత్తు అనబడేది దానిలో 'పృథ్వి-నీవు-నేను' అనేవేవీ వాస్తవానికి లేవు. ఉన్నట్లుగా ఏది కనబడుచున్నదో... అది స్వప్నాంతర్గత విశేషములు వంటివి మాత్రమే! ఎందుకంటే ఏది ఎట్లు భావించబడుచున్నదో... అది అట్లే అనుభూతమ గుచున్నదని ఇక్కడ గ్రహించబడుగాక! పూర్వ-పూర్వ సంస్కారములచే 'సృష్ట్యాది' యందు పృథ్వి మొదలైనవాటియందు వస్తు బుద్ధి ఏర్పడి ఉంటోంది. స్వప్న సమయంలో స్వప్న వస్తువులు 'ఇవి వాస్తవమే' అని అనుభవించవచ్చుగాక! అయినా కూడా స్వప్న పదార్థము లందలి సత్యత్వమును గూర్చిన భ్రాంతి కల్పనా మాత్రమే కదా! జగదనుభవం కూడా కల్పనా మాత్రమే!

ఈ ప్రకారంగా జగత్తు అనునది "అనాది ప్రవాహరూపమగు స్వప్నం యొక్క అవయవ రూపము" అగుచున్నది. ఇట్లు అసత్యమైనట్టి "జగత్‌స్థితి" యందు ఈ పృథ్వి మొదలైనవి సత్యములే అయినట్లు ఈ మూఢబుద్ధి ఒకానొక కల్పనను ఆశ్రయించుకొని ఉంటోంది. చీకట్లో 'మోడువారిన చెట్టు బేతాళము' అనేది అసత్యమే అయినప్పటికీ భ్రాంతిచే బాలుని దృష్టికి దృఢపడి ఉంటోంది చూచావా? అట్లాగే అభ్యాసవశంచే భ్రాంతి సత్యమువలె దృఢపడి కనబడుతోంది. అయితే దేనియందైతే ఇదంతా కల్పించబడి ఉన్నదో... అట్టి పరమార్థ సత్యమగు బ్రహ్మతత్త్వము మాత్రము సర్వదా అత్యంత నిర్మలమై వెలయుచున్నది. వాస్తవానికి ఈ పృథ్వి మొదలైనవి ఇతఃపూర్వం కూడా స్థితినొంది ఉండలేదు. యథారీతిగా "చిద్రూపమగు బ్రహ్మమే" అంతటా వ్యాపించిఉన్నది. మరిక పృథ్వి మొదలైనవి "స్మరించువాడు-విస్మరించువాడు".... అనునవి మాత్రం ఎట్లా ఉంటాయి?

చిన్మాత్రము యొక్క అజ్ఞానమే జగత్తు యొక్క సత్యత్వముగా భ్రమింపజేయుచున్నది. చిన్మాత్రము యొక్క అపరిజ్ఞానమే జగత్ భ్రాంతి రూప కవాటమును తెరచుచున్నది. కార్యసహితమగు అజ్ఞానం అధిగమించబడిన మరుక్షణం ఇక శేషించునదేదియో... అదియే చిన్మాత్రము. అట్లు పరిశేషించుదానిలో పృథ్వి మొదలైనవి సంభవించవు. ఈ విధంగా... ఏది ద్రష్టయో, ఏది దృశ్యమో ఈ రెండూ కూడా శివస్వరూపమగు చిన్మాత్రమే అయి ఉన్నాయి.

అద్దములో ప్రతిబింబము వలె చిన్మాత్రమునందు ఈ జగత్తు భాసిస్తోంది. అయితే అద్దము-చిన్మాత్రములో ఒక భేదమున్నది. అద్దములో బాహ్య బింబము ప్రతిబింబముగా భాసిస్తోంది. చిదాకాశమునందు బాహ్యబింబము లేకుండానే జగత్తు స్వయంగా చిదాకాశమునకు అద్వితీయమై బాసిస్తోంది. అద్దంలో వస్తుజాలమంటూ (కనబడుచున్నప్పటికీ) ఏదీ లేదు కదా! అట్లాగే చిదాకాశమునందు 'జగత్తు' అనబడునదేదీ ఎప్పుడూ ఎక్కడా లేనేలేదు.

ఏ పదార్థమైతే ప్రమాణసహితమై ఉన్నచో, అది మాత్రమే విచారణచే లభించగలుగుతుంది. విచారణచే లభించేది మాత్రమే 'పరమార్థ సత్యం' అవుతుంది. ఇక ప్రమాణ రహితమైనది కేవలం సాపేక్ష స్థితిలో ఉన్నట్లు అనిపిస్తున్నప్పటికీ అదంతా ప్రతిభాసమాత్రం అవుతుంది. అటువంటిది త్రికాలలోనూ సత్యమే కాదు. ఒక భావనచే ఉన్నట్లు కనిపిస్తూ మరొక భావన-అభిప్రాయములచే

లేదు-అని తెలియవస్తూ ఉండగా... అది ఉన్నది ఎట్లా అవుతుంది?... అయితే ఎవరైనా "ఈ జగత్తు మా దృష్టికి ప్రాప్తిస్తూ ఉండగా ఇది లేదనే సిద్ధాంతం మేము ఎట్లా అంగీకరిస్తాం?" అని అంటారేమో?

**భవేత్ భ్రమాత్మకమపి కించిత్ అర్థ - క్రియాకరమ్ ।**
**స్వప్నాంగనాపి కురుతే సత్యామర్థక్రియాం నృణామ్ ॥**

స్వప్నంలో కనిపించిన 'సుందర స్త్రీ' భ్రమయే అయినప్పటికీ జనులకు వీర్యపాతము జరుగుచుండడం ఉంటోంది కదా! అట్లాగే భ్రమమయమే అయినప్పటికీ ఈ జగత్ క్రియా పదార్థములు అర్థ క్రియా సామర్థ్యములు అగుచున్నాయి. ఈ జగత్తు యొక్క 'భావన' అను ప్రకాశము-సత్తయే చిదాకాశము యొక్క ప్రకాశము అయి ఉన్నది. కాబట్టి ఇక నేనెచట? నీవెచట? దృశ్య దృష్టి ఎచట? మహా సముద్రంలో జలమే ఉన్నదిగాని... అనేక తరంగాలు లేనట్లు చిదానందసాగరంలో ఈ నేను-నీవు అనునవన్నీ భ్రమ మాత్రమే! ఒకవేళ ఉండి ఉంటే అవన్నీ కూడా (సముద్ర తరంగాలన్నీ జలమే అయినట్లు) చిదాకాశ స్వరూపమే గాని మరింకేమీ కాదు.

**మృత్వా పునర్భవనమస్తి కిం అంగనష్టం? మృత్వానచేత్ భవనమస్తి తథాపి శాన్తిః ।**
**విజ్ఞాన దృష్టి వశతో అస్త్యథచేద్విమోక్షః తన్నేహ కించిదపి దుఃఖమ్, ఉదారబుద్ధేః ॥**

ప్రియ రామచంద్రా! విజ్ఞాన దృష్టిని అనుసరించి ఆత్మ ఉత్పత్తి-నాశరహితమైనదని ఉదార బుద్ధివగు నీకు సుస్పష్టమే అయి ఉన్నది కదా! ఇక "పునర్జన్మ ఉన్నదా? లేదా?" అనే మీమాంసతో పనేమున్నది చెప్పు? ఎందుకంటావా? విను. "మరణానంతరం మరల దేహం ఉత్పన్నమౌతోంది కదా! కనుక పునర్జన్మ ఉన్నది" అంటారా! ఈ దేహం పోవడం వలన గాని, మరొక దేహం రావడం వలన గాని ఆత్మకు హాని ఏమున్నది? మార్పు-చేర్పు లేమున్నాయి?

"ఒకవేళ మరణానంతరం మరొక దేహం లేదు" అనదలచుకుంటే అది జగత్‌రహితమగు మోక్ష-శాంత స్థితియే కదా! సర్వ ప్రపంచ లయానంతర శాంత స్థితియే అది కాబట్టి ఇక ఆత్మకు హాని ఏమున్నది?

కాబట్టి ఏ విధంగా చూచినాసరే... ఇక్కడ ఒకింత కూడా దుఃఖం లేకయే ఉన్నది. మూర్ఖునకు ఏ జనన-మరణములు అనుభవములగుచున్నాయో.... అది ఆత్మజ్ఞునకు తెలియడంలేదు. "ఈ మృగతృష్ణా జలంలో నేను చేపనై ఈదుచున్నాను" అనేది మృగతృష్ణ జలభ్రమ లేని వాడికి అంగీకారం అవదు కదా!

ఓ రామచంద్రా! మనోరాజ్యమున ద్రష్ట స్వరూపమగు ఆత్మయే అనేక రూపములుగా ప్రదర్శితమౌతోంది. అట్లాగే తత్త్వజ్ఞాని యొక్క దృష్టిలో చిదాకాశ స్ఫూర్తియే బాహ్యా-అభ్యంతరములలో 'నీవు-నేను' ఇత్యాది సర్వజగద్రూపంగా తనయందు తానే స్వప్న సదృశంగా పొందుతోంది అనేది సుస్పష్టమౌతూనే ఉన్నది.

❖❖❖

# 5. వివిధ సిద్ధాంతములు - వాదోపవాదములు

**శ్రీరాముడు :** మహాత్మా! "ఒకే జలం అనేక తరంగాలుగా కన్పిస్తున్నది! ఇదంతా చిదాత్మ తప్పితే మరింకేమీ కాదు. తదితరమైనదంతా భ్రమయే! భ్రమ తొలగితే అంతా చిదాత్మగానే అగుపించ గలదు"... అని మీరు సిద్ధాంతీకరిస్తూండగా అద్దానిలో సందేహం నాకేమీ అగుపించడంలేదు. అయితే ఇక్కడ వేర్వేరు గురువులు వేర్వేరు సిద్ధాంతాలు ప్రతిపాదించడం, వారి అనుయాయులు ఆ సిద్ధాంతములను ప్రచారం చేస్తూ వాటిని పూర్తిగా నమ్మి ఉండడం ప్రపంచంలో చూస్తున్నాం. కొందరి సిద్ధాంతం ఈ విధంగా ఉంటుంది.

**యావజ్జీవం సుఖం జీవేత్ నాస్తి మృత్యురగోచరః ।**
**భస్మీభూతస్య శాన్తస్య పునరాగమనం కుతః? ॥**

"ఎంత వరకు జీవితం ఉంటుందో... అంతవరకు సుఖంగా ఉండడమే మన పని. ఒక రోజు చావు రానేవస్తుంది కదా! ఈ దేహం భస్మీభూతమైన తర్వాత మరల రాక ఎచట?" స్వామీ! ఇటువంటి సిద్ధాంతమును నమ్మి అనేక దుఃఖములపాలగుచున్న వారి దుఃఖం శమించేది ఎట్లా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సంవిత్తు (లేక, ఈ జీవుని ప్రప్రథమ స్వరూపమగు ఆత్మ) తనయందు ఏ నిశ్చయమును ఎట్లు పూర్ణంగా ధరిస్తోందో... ఆయా స్వయం నిర్మిత నిశ్చయమును అట్లే అనుభవించడం జరుగుతోంది. ఏది ఏ భావనచే దర్శిస్తూ ఉంటే అది ప్రాప్తించడం (యత్ భావమ్ తత్ భవతి) అనునది లోకవిదితమైన విషయమే కదా! చిదాకాశము ఆకాశమువలె సర్వవ్యాపకమై శాంతమై ఉన్నది.

1. జీవుడు వేరు–దేవుడు వేరు, జీవుడూ–జీవుడూ వేరు, మానవజాతి–తదితర జాతులు వేర్వేరు... ఇటువంటి ద్వైతమూ
2. "జీవుడు దేహంతో పుడతాడు–దేహంతో ఉంటాడు–దేహంతో అంతం. అంతకుముందూ ఏమీలేదు. ఆ తర్వాత ఏమీ లేదు" అనే (చార్వాకుల మత) అభిప్రాయం.
3. వేదాంతవాదుల యొక్క అనుభవమునకు సుస్పష్టమగుచున్న అద్వైతానుభూతి.

...ఇదంతా కూడా చిదాకాశమే అయివున్నది. చిదాకాశ జగన్నాటక చమత్కారమే!

❖

సృష్టికి పూర్వం మహాప్రళయ స్థితిలో బ్రహ్మమునకు వేరుగా ఏదీ ఎక్కడా లేదు. అట్టి బ్రహ్మమునకు మరొక కారణమూ లేదు. కాబట్టి అకారణమగు బ్రహ్మమే అన్ని రూపాలుగాను, అన్ని భావనలుగాను వ్యాపించి ఉన్నది. 'మహా ప్రళయం' అనగా 'సమస్త భావనలు లయించి ఉన్నప్పటి స్వస్వరూప స్థితి"... అని గ్రహించు. అట్టి ఆదిశేష్యమగు స్వస్వరూపాన్ని తిరస్కరించువారు తమ స్వస్వరూపమును తామే ఖండించుకొనువారు అగుచున్నారు.

**సమస్తవేద శాస్త్రార్థం యే మహాప్రలయాది చ ।**
**న ఇచ్ఛన్తి తే మహామూఢాః నిఃశాస్త్రా నో మృతా ఇవ ॥**

సమస్త వేద–శాస్త్రముల యొక్క తాత్పర్యమైనట్టి బ్రహ్మమును, సర్వ ఆలోచనలకు ముందే సర్వదా ఏర్పడివున్న 'మహా ప్రళయానంతర స్వస్వరూప ఆత్మ' ను, సర్వజగత్ వ్యవహారానుభవాలకు ఆత్యంతికమైన 'మోక్షము' అను స్థితిని తిరస్కరిస్తూ, తత్సాధనములను మొదలే పెడచెవినపెట్టేవారు తత్త్వోపదేశానికి అర్హులే కాదు. అట్టి శాస్త్ర శూన్యులగు మూఢులు యోగిదృష్టిలో జీవన్మృతులే సుమా!

ఈ జనులను 3 రకాలుగా విభజించవచ్చు –

**1. మూర్ఖులు:** వీరు జగత్తునే (దృశ్యమనే) నమ్మి ఉంటున్నారు. "ఈ దేహాదుల పతనానంతరం నా స్థితి–స్వరూపము ఏమిటి?'... అను ప్రశ్నకే రావడం లేదు.

**2. భోగవాదులు :** "ఇదిగో! ఇక్కడ ఇవన్నీ ఉన్నాయి! ఆ తర్వాత ఏమైతేనేం? అప్పుడు చూచుకుందాంలే!" అని తాత్సారం చేస్తూ వీరు ఆత్మ జ్ఞానమునకు సిద్ధమే కావడంలేదు. ఇట్టివారిలో కొందరు "ఆ తర్వాత ఏమీ ఉండదు. శరీరంలో అణువుల కలయిక వలన 'నేను' అనునది కనిపిస్తోంది. ఆ అణువులు విడిపోతే 'నేను' అనేది ఎక్కడా ఏదీ ఉండదు. ఇంతకు మించి ఏమీ లేదు"... అని (చార్వాకులు) నమ్మి ఉంటున్నారు. ఇక మరికొందరు "దేహం ఉంది కనుక అనుభవిద్దాం. ఆ తర్వాత అంటారా?... అది తెలియదు. తెలుసుకోలేం. కనుక ఎవరూ ఆ ఊసు ఎత్తకండి"... అని నిర్ణయిస్తున్నారు. అట్టి వారిని శాస్త్రములు 'దేహాత్మ బుద్ధి పరిమితులు' అని అంటున్నాయి. వారు అట్లు నమ్మి ఉండగా వారికి "దేహమేమిటి? నెనెవరు?" అనే ప్రశ్నయే ఉదయించుట లేదు. కనుక వారికి ఉపదేశించటం కుదరదు. శాస్త్రోపదేశములు అట్టివారి కొరకు కాదు.

**3. జ్ఞాన సిద్ధులు :** వీరు నిత్య సత్యమగు ఆత్మను అనుభూతపరచుకొని ఉంటున్నారు! 'ఈ దేహమును, ఇంద్రియములను ప్రవర్తింపజేసే ప్రత్యగాత్మ చైతన్యము, మనస్సు మొదలైనవన్నీ 'బ్రహ్మమే' అనునదే శాస్త్రముల ముఖ్యోద్దేశం'... అని గ్రహించి ఉంటున్నారు. నేను–ఈ కనబడే వారు అంతా బ్రహ్మమే అను అనుభూతి కలిగి ఉంటున్నారు. ఉపదేశ క్రమము పై ఇరువురికి ఉద్దేశించబడలేదని గ్రహించు. ఎందుకంటే... మొదటివారు జగత్తును నమ్మి ఉంటున్నారు. రెండవ వారు సర్వము ఎఱిగి ఉంటున్నారు.

మరి ఉపదేశ క్రమము ఎవరికి? ఎవరైతే "నేనెవరు? ఈ దేహమేమిటి? ఈ జగత్తు ఎట్టిది? సత్యమేమిటి? 'నేను... అనుభవము... అనుభవించబడేది' ఈ మూడు దేనిపై ఆధారపడి వర్తిస్తున్నాయి?" ఈ రూపమైన అనుమానములు ఉదయించి యున్నాయో అట్టి సత్యాన్వేషకుల కొరకే శాస్త్ర బోధితమైన ఉపదేశ క్రమమంతా ఉద్దేశించబడి ఉంటోంది.

**శ్రీరాముడు :** వసిష్ఠ మహర్షీ! సర్వులూ సంవిత్ స్వరూపులే కదా! అయితే ఒక్కొక్క జీవుడు ఒక్కొక్క తీరైన నమ్మిక–భావన–అనుభవముతో ఉంటున్నాడు. ఇదంతా ఎట్లా ఎందుకు జరుగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**నిత్యా నిరన్తరోదేతి యాదృశీ సంవిత్ ఆశయే ।**
**భూయతే తన్మయేనైవ పుంసా దేహో–స్తు, మా అథవా ॥**

'నిత్యము-నిరంజనము' అయిన సంవిత్తు అంతఃకరణమున ఏ విధంగా (ఏ భావన కలిగి) ఉదయిస్తుందో... అది ఆ విధంగానే అక్కడ అనుభవిస్తోంది. అట్టి అనుభవము ఈ దేహము ఉన్నప్పుడు లేనప్పుడు కూడా అట్లే అంతఃకరణానుసారమే ఉంటోంది. ప్రతి జీవుడు మూడు స్వరూపాలు సర్వదా కలిగియే ఉన్నాడు.

1.ఈ దేహ స్వరూపం; 2.అంతఃకరణ స్వరూపం; 3.ఆత్మ స్వరూపము... ఈ మూడు స్వరూపాలలో మొదటి రెండూ కూడా అపాదితము, భ్రమాత్మకము, అసత్యము, ఏ ఇద్దరి జీవులలో అయినా మనకు కనిపించే భేదమంతా దేహ (మరియు) అంతఃకర సంబంధమైనది, అపాదితం, ఆత్మకు అసంబంధితమైనది కూడా! ఈ బంగారు గొలుసు ఎవరిది - అనే ప్రశ్నకు ఆ సమాధానము నకు బంగారంతో ఏమి సంబంధం? ఇక ఆత్మ స్వరూపమో...

అందరి జీవులలోనూ ఏకరూపమైనది కాబట్టి 'ఏకము'. సర్వదా ఏర్పడి ఉండేది కనుక... 'నిత్యము'. ప్రత్యక్షం-పరోక్షం కాదు కాబట్టి 'అపరోక్షం'. దేహం-అంతఃకరణాల ఉనికి లేములచే మార్పు - చేర్పులు పొందదు కాబట్టి 'అప్రమేయం'. పరిమితులు లేవు కాబట్టి... 'అనంతం'. తన సంకల్పముచే ఏది ఎట్లు సత్యమని భావిస్తే అది అట్లే పొందుచున్నది కాబట్టి...'సత్య సంకల్పి'. దేహమనో బుద్ధులకు సంబంధించిన సర్వ విషయములచే సర్వదా స్పృశించబడకయే ఉంటుంది. కనుక అద్దానికి సుఖ-దుఃఖ ప్రభావం ఉండదు. కనుక 'నిరతిశయమైన ఆనందము'.

ఈ విధంగా ప్రతి జీవుడు దేహ-మనో-ఆత్మరూపుడై ఉన్నాడు. దేహ-మనోరూపములు గౌణమైనవి. అది సందర్భోచితమైన కాలబద్ధమైన సత్యమేగాని, నిత్యసత్యం కాదు. లోహమునకు నామరూపముల వంటివి. బంగారు అభరణంలో ఆభరణరూపము-ఆభరణ నామము ఆపాదితములే కదా! అందలి బంగారు లోహత్వము మాత్రం నిత్యమైనది. అట్లాగే ప్రతి ఒక్కనిలోనూ ఆత్మత్వము అనునిత్యమై ఉండగా... ఇక దేహ-అంతఃకరణాదులు అపాదితములైనవి.

ఏ జీవుడైతే ఆనందస్వరూపమగు ఆత్మకు విరుద్ధంగా అంతఃకరణ వృత్తిచే "నేను దుఃఖిని" అని ధృఢముగా నిశ్చయించుకొని ఉంటాడో... అతడు అట్టి భావముతోటే తన్మయుడై, ఆవశ్యం దుఃఖము మొదలైనవి అనుభవించుచూ, ఆత్మయొక్క ప్రతిభను ఏమరచుచున్నాడు.

"ఈ జగత్తు చిదాకాశము యొక్క స్ఫురణము మాత్రమే" అని గ్రహించి, నిశ్చయించుకొన్న వారికి 'కూటస్థము-అద్వయము" అగు అట్టి చిదాకాశము వలన దుఃఖానుభవం ఎట్లా కలుగుతుంది చెప్పు? ధూళి ఆకాశమును అంటుతుందా? స్వప్నాంతర్గత విశేషాలు స్వప్నద్రష్టను స్పృశించగలవా? అట్లాగే జాగ్రత్ అంతర్గత విశేషాలు జ్ఞానిని స్పృశించలేవు. "సత్తు-అసత్తు" అనబడే సత్పదార్థ-అసత్ పదార్థములు ఆబాలగోపాలం విదితమైనదే!

"సంవిత్తు సత్యమా? అసత్యమా?"... అని కొందరు మీమాంస చేసుకొంటున్నారు. కొందరు (దేహాత్మవాదులు) "దేహమే సత్యం. ఆ తర్వాత అంతకు ముందు ఇంక ఏ సత్యమూ లేదు" అని బోధిస్తున్నారు.

**మరికొందరు (సాంఖ్యులు) :** "పురుషుడే (పరమాత్మయే) సత్యం. జీవుడు (జీవాత్మ) సత్యం కాదు" – అంటున్నారు.

**ఇంకొందరు (మీమాంసకులు) :** "ఈ జీవుడే సత్యం మరింకేమీ ఎక్కడా లేదు" అంటున్నారు. ఎవరు ఎల్లా ప్రతిపాదించినా... అందరి వాదుల యొక్క అభీష్టము నిర్మల స్వరూపమగు ఆత్మయేనని మాచే గమనించబడుచున్నది. ఆ సంవిత్తు ఎట్లు ఎఱుగుచున్నదో... అట్లే సంవిత్స్వరూపుడగు జీవుడు జగత్తు యొక్క అనుభవము పొందుచున్నాడు. సంవిత్తు సత్యమని అనినా, అసత్యమని అనినా... మొత్తం మీద సంవిత్ యొక్క స్వకల్పనామాత్రం చేతనే ఈ భూ–పాతాళ–స్వర్గ–నరకాది దేహాదులన్నీ అనుభవానికి వస్తున్నాయి. ఆత్మ దేనిని ఎట్లు నిశ్చయిస్తే అది అట్లే అనుభవానికి సత్యమై ప్రాప్తిస్తోంది. స్వప్నంలో కనిపించేదంతా స్వప్న ద్రష్ట యొక్క నిశ్చయము నుండి బయల్వెడలిన అనుభవపరంపరయే అవటమే ఇక్కడ మనకు దృష్టాంతము. అయినా ఆ స్వప్నద్రష్ట ఆ స్వప్న దృశ్యము ఎక్కడి నుండో వచ్చి అక్కడ కనిపిస్తోందని అనుకుంటున్నాడే గాని "ఈ స్వప్న దృశ్యము నా అంతఃకరణ కల్పనా విభాగంలోనుంచి వచ్చిన స్ఫురణ మాత్రమే" అని అనుకోవడం లేదు కదా! అట్లాగే జాగ్రత్‌గా పొందబడేదేంతా జాగ్రత్ ద్రష్ట తన అంతఃకరణము యొక్క జాగ్రత్ కల్పనా విభాగంలోనుంచే బయల్వెడలిన స్ఫురణ మాత్రమే అని గమనించడం లేదు. జ్ఞానదృష్టిచే అది సుస్పష్టమై ఉంటోంది. జ్ఞాన అజ్ఞానములు ఇంత మాత్రమే!

❖❖❖

# 6. ఆత్మజ్ఞాన ఔషధం

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచంలో (ద్వైతం–అద్వైతం–విశిష్టాద్వైతం–నాస్తికత్వం– దేహాత్మవాదం మొదలైన) అనేక సిద్ధాంతాలు, అవి ప్రబోధించే గురువులు ఉన్నారు కదా! అయితే ఆ వివిధ శాస్త్రముల ప్రామాణ్యాలన్నీ సంవిత్తు వలననే ప్రతిష్ఠితం అగుచున్నాయి. సంవిత్తే సర్వులకు పురుషార్థ హేతువు అయివున్నదని గమనించబడుతోంది. అందుచేత సంవిత్తే సర్వవాదుల సిద్ధాంతములను ఉపజీవింపజేస్తోంది. అట్టి సంవిత్తు యొక్క అద్వైత వాద సిద్ధాంతమే సర్వ సిద్ధాంతముల యొక్క 'శిరోమణి' అని మా ఉద్దేశం. (సంవిత్తు = జీవుడు, అతని అభిరుచి; సత్=ఉనికి; విత్=ఎరుక )

ఇక తదితర సిద్ధాంతములంటావా? ఏ అవిద్య స్వస్వరూపాన్ని ఏమఱింపజేస్తోందో, ఆ అవిద్యయే సర్వ వాదుల సంకల్పాలకు అనుకూలంగా పరిణామం పొందినదగుచున్నది. క్రమంగా వారివారి అనుభవం వారివారి నిశ్చయానుసారం 'అర్థక్రియ' యందు ప్రవృత్తమగుచున్నది. అదియే మరొకప్పుడు బోధితమై నిష్కళంకమైన చిదాకాశమును సంతరించుకొని 'మోక్షభాగిని' అగుచున్నది.

వేదములు ప్రతిపాదిస్తున్న (తత్త్వమ్ – సోఽహమ్ – జీవోబ్రహ్మైతినాపరః – శివోఽహమ్ ఇత్యాది) మహావాక్యములే ఈ మన ఇన్ని రోజుల సంవాదమునకు ప్రమాణం.

**శ్రీరాముడు :** ఈ అవిద్య ఎట్లా పరిణమిస్తోంది? అద్దానికి అంతు ఉండదా?

**శ్రీవసిష్ఠ మహర్షి :** అవిద్య గాని, అద్దాని ప్రయుక్తం (Appointer) అయినట్టి విక్షేప సంవిత్తుగాని తనంతట తానుగా తొలిగేదేమీ కాదు. అది స్వర్గ-పశు-పుత్రాదులకు సంబంధించిన ఇచ్ఛలు నెరవేరినంత మాత్రంచేత తరిగేది కాదు. రసాయన-మంత్ర-ఔషధాలు మొదలైన ద్రవ్యముల సముపార్జనచే ఉపశమించదు. పవిత్ర దేశ-కాలాదులందలి స్నానాదులచే గాని, ఆయా తదితర తీర్థయాత్రాది కార్యక్రమములచే కూడా తొలగదు. మరి? "ఆత్మజ్ఞానం" చేత మాత్రమే అ విద్య తొలగగలదు. ఆత్మ జ్ఞానముచే అ విద్య సంపూర్ణంగా నశించగలదు. ఇక ఆపై ఇది మరెన్నడూ ఉదయించదు. ఒకవేళ అది ఉదయించినా, మరల అది తొలగడానికి జ్ఞానమే శరణ్యమైయున్నది.

సంవిత్తే ఈ సర్వ దేహులలోని జీవుడు అయి ఉన్నది. అట్టి ఈ జీవుడు ఏ ప్రకారంగా దృఢంగా భావిస్తున్నాడో... ఆ ప్రకారంగా సుఖవంతుడుగా గాని, దుఃఖవంతుడుగా గాని అగుచున్నాడు. అట్టి జీవుని రూపంగా కనిపిస్తున్న సంవిత్తు యొక్క యథార్థమగు ప్రత్యగాత్మ స్వరూపం ఎఱుగబడటం చేత మాత్రమే సంసారబంధనం మొదలంట ఛేదించబడగలదు. కాబట్టి అట్టి ప్రత్యగాత్మయే ముముక్షువులందరికీ శరణ్యం. అదియే లేకపోతే ఈ జగత్తునందు శిల వలె మూకత్వం, అంధకారం (జడత్వం) మాత్రమే శేషిస్తుంది. మనుజుడు గాఢ నిద్ర వలన జడత్వం పొందుచున్నాడు చూచావా? అట్లే "స్వభావసిద్ధం-స్వప్రకాశం" అయివుండి కూడా జ్ఞప్తి రూపమగు ప్రత్యగాత్మ సంవిత్తు స్వకీయ-అజ్ఞానం చేతనే ఈ దృశ్య ప్రపంచాన్ని పొందుచున్నది. అందుచేత సంవిత్తే లేకపోతే "అనుభవం పొందునది" అనునది ఉండదు కాబట్టి 'జగత్తు' అనబడేది ఎవరికి?

**శ్రీరాముడు :** మహాత్మా! కొందరు ఇటువంటి అభిప్రాయాలు కలిగి ఉంటున్నారు. "ఈ ప్రపంచం దశ దిశలలోనూ అంతం లేదు. ప్రారంభం లేదు. ముగింపు లేదు. కాబట్టి ఈ జగత్తు నాశరహితమైనది. దీనికి ముందు ఎట్టి భావన మొదలైనవి ఏవీ లేవు. ఈ జగత్తుకు ముందు ఏమి లేదు. ఆ తర్వాత ఏమీ ఉండదు.

దీని తర్వాత ఎటువంటి భావనా ఉండదు. ఈ జగత్తు యొక్క "అత్యంత-అభావన" అనబడు మోక్షము మొదలైనవేవీ లేవు. ఈ జగత్తు వేరుగా ఎక్కడా ఏదీ మరొక సత్యము లేదు. "జీవుడు జగత్తులో జలబుద్బుదము వలె జనించి నశిస్తున్నాడు. జగత్తుకు ఆవల జీవునికి ఉనికి లేదు?"

అటువంటి నమ్మిక కలిగివున్న మనుజుని సంసారరోగము శమించడానికి ఎటువంటి యుక్తి అవసరమో అద్దానిని మా జ్ఞానాభివృద్ధి కొరకై ప్రవచించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** నీ ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరం ఇంతకుముందే చెప్పియున్నాను. "వేదము" తెలియబడుదాని గురించి చెప్పేది! వేదాంత విభాగం? తెలుసుకునేవాని గురించి తెలిపేది.

ప్రతి దేహంలోనూ దేహిగా ఉంటున్నట్టి "తెలుసుకొనుచున్నవాడు" గురించి చెప్పేదే వేదాంత శాస్త్రం కదా! అదియే 'అధ్యాత్మ శాస్త్రం' అని, 'భౌమా విద్య' అని, 'ఆత్మ విద్య' అని శాస్త్ర ప్రతీతి కలదు. శాస్త్రంపై విశ్వాసముంటేనే ఏ శాస్త్రమైనా ఎవరికైనా బోధించగలం. శాస్త్రంపైగాని, తనపైగాని విశ్వాసం లేనివారికి శాస్త్రం బోధించలేదు. అట్లాగే ఆత్మవిద్య (లేక) 'వేదాంతశాస్త్రం'పై విశ్వాసం లేకుంటే బోధించడం కుదిరేది కాదు.

నీవు అడిగినట్లు ఆయావాదుల దుఃఖోపశమనం గురించి ఇక్కడ చెప్పుకుందాం. నీవు చెప్పిన వివిధ భావములు గలవారి గురించి కొంత విభజనచేసి కొన్ని విషయాలు చెప్పుకుందాం.

**వివిధ భావికులు –**

**1. దేహాత్ అతిరిక్త చేతనాత్మవాది :** కదిలించేది చైతన్యం, కదిలించబడేది దేహం – ఈ దేహం జడం – దీనికి వేరైన చైతన్యం ఉన్నది. అట్టి చైతన్యం అనుభవించబడానికి, గ్రహించడానికి ఈ దేహమే 'అడ్డు' అగుచున్నది.

**2. నిత్య సూక్ష్మ దేహాత్మవాది :** ఈ జీవుని దేహరూపం వాస్తవం కాదు. ఈతనికి మరొక దేహం ఉన్నది. అదియే 'సూక్ష్మదేహం'. సూక్ష్మదేహం నిత్యమైనది. ఈ భౌతిక దేహం అనిత్యమైనది. అనిత్యమైన భౌతికదేహం (స్థూల దేహ భావనను) అధిగమించి నిత్యమైన సూక్ష్మదేహ భావన'నను సంతరించుకోవడమే జీవిత లక్ష్యం".

**3. స్థూల దేహాత్మవాది :** "కనబడే 'స్థూలదేహం' వదలి ('లేదు' అని చెప్పి) ఎవరికీ కనబడని సూక్ష్మ దేహమేదో ఉందని అనడం తప్పు. 'జీవుడు' అనగా దేహమే! దేహం తర్వాత దేహీ లేదు, ఇంకేమీ లేదు".

**4. శుద్ధ సంవిదాత్మవాది :** "ప్రతిజీవుడు శుద్ధ సంవిత్ ఆత్మస్వరూపుడే"... అను నిశ్చయమును పెంపొందించుకోవడమే జన్మాదుల సార్థక్యం. (సత్ = ఉనికి – నేను ఉన్నాను కదా!'అనే అనుభూతి, విత్ = ఎఱుక, ఆత్మ = స్వస్వరూపము – దేహి)

**5. అజ్ఞానావృత సంవిదాత్మవాది :** శాస్త్రములు చెప్పే విధి–విధానములు, సద్గుణాశ్రయము మొదలైనవి జీవుని తన యొక్క శుద్ధ సంవిత్ ఆత్మ స్వరూపాన్ని సుస్పష్టపరచుకోవడానికి ఉపకరించే సహకారిక ఉపాయములు అని ఈ సాధకుడు ఉద్దేశించి ఉండాలి. "అజ్ఞానం తొలగాలి. అది తొలగితేనే జీవునికి తన శుద్ధ సంవిత్ ఆత్మ స్వరూపం సుస్పష్ట మౌతుంది"... అను ప్రయత్నంలో ఈతడు సంశుద్ధి పొంది అజ్ఞానం తొలగించుకుంటున్నాడు.

**6. సంవిత్ అపలాపి :** "సంవిత్ అనేదేదీ లేదు. అటువంటిది ఒకటి ఉన్నది – అని తలచడమే భ్రమ."

❖

ఇట్లా ఆయా వాదములు చేయువారు ఉన్నారు.దేహాత్ అతిరిక్త చేతనాత్మవాది క్రమంగా మరికొంత విచారణాదులచే ఆత్మతత్త్వమును తప్పక అనుభూతపరచుకోగలడు. ఎందుకంటే ఈ దేహాది ఆకారరూపమగు ఉపాధి యొక్క భావనావిలయముచే క్రమక్రమంగా అతడు పరమాత్మతోటి "ఏకీభవము"ను పొందుతాడు. ఇందులో సంశయం లేదు.

ఇక నిత్య సూక్ష్మ దేహవాది అంటావా? నాశనవంతమగు స్థూల దేహమును (అన్నమయ దేహమును) నమ్మి "ఇదియే నేను" అని అనుకొంటే దుఃఖంగాని "నాశన రహితమగు సూక్ష్మదేహమే నేను" అని తలచుచున్నప్పుడు ఇక దుఃఖ మేమున్నది? కాబట్టి క్రమక్రమంగా అతడు కూడా మరికొంత ప్రబోధితుడై వాస్తవమగు ఆత్మతత్త్వమును అతిత్వరగా పుణికిపుచ్చుకోగలడు. ఇక "స్థూల

దేహాత్మవాది" అంటావా? ఆయన "అవయవ సహితమగు పదార్థం నశిస్తుంది" అనే న్యాయమును ఇంకా విచారణ చేయలేదు. అవయవముల కంటే ముందే ఉండి ఉండి, అవయవములను నియామకం చేసే తన యొక్క స్వరూప విభాగమును ఇంకనూ తగినంతగా పరిశీలించలేదు. కానీ కాలక్రమంగా అతడు కూడా ఎప్పుడో "అవయవి-అవయవములు-అవయవవినాశనం-అవయవ ఉత్పన్నం" అనే విశేషాలు విచారణ చేయడం జరుగుతుంది. ఎప్పుడైనా, ఎక్కడైనా సత్యము సర్వమునూ జయిస్తుంది కదా! 'దేహ వినాశనము' అనే మార్గంలో విచారణ కావించుచూ ఉండగా... అతనికి కూడా "దేహమునకు భిన్నంగా 'దేహి' అనే ఆత్మ ఉన్నది" అనే చైతన్యాత్మ బుద్ధి జనించగలదు. కాబట్టి "అతడు చెడిపోవుచున్నాడే!"... అనే నిరుత్సాహంగాని, అతని పట్ల అయిష్టతగాని ఉండవలసిన అవసరమేదీ జ్ఞానికి అగుపించదు.

"శుద్ధ సంవిదాత్మవాది" విషయానికి వస్తే "ఈ కనబడే ప్రతిజీవుడు వాస్తవానికి శుద్ధ సంవిత్స్వరూపుడే - అనే విషయం ఎఱిగియున్న వాడు జ్ఞాని. ఇంకనూ నిర్మల బుద్ధి సంపాదించి ఉండకపోవడం చేత అట్లు ఎఱుగనివాడు అజ్ఞాని.

జ్ఞాని-అజ్ఞాని కూడా సర్వదా నిర్మలాత్మ స్వరూపులేగాని మరింకేమీ కాదు"... అని నిర్ణయించుకొని ఉన్నవాడు. సర్వదా సర్వత్రా ఈ జగత్తును ఒక 'లీల'గా గాంచుచూ ఉంటాడు. ఆ తర్వాత క్రమంగా "మమాత్మా సర్వభూతాత్మా"... నా స్వరూపమే తదితర సర్వజగత్ జీవాదులు"... అను సర్వాత్మత్వం సంతరించుకొని అనిర్వచనీయాత్మానందం అనుభవించగలడు.

ఇక "అజ్ఞానావృత సంవిదాత్మ" అంటావా? అతని "సంవిత్తు" (ప్రజ్ఞ) ఇంకా "తత్త్వజ్ఞానం" చే తగినంతగా శుద్ధము చేయబడలేదు. ఇంకనూ కలుషితమయ్యే ఉన్నది. అందుచేత దేహం ఉన్నప్పుడు, లేనప్పుడు కూడా అతని పట్ల సంసారము ఆవశ్యము కొనసాగుచునూ ఉంటోంది. అయినా ఫరవాలేదు. ఒక్కొక్క జన్మలో ఆయా సాధనల ద్వారా సంవిత్తు శుద్ధమగుచుండగా క్రమ క్రమంగానో, కాకతాళీయంగానో అత్యున్నతమైన పరమార్థజ్ఞానం వికసించగలదు. కనుక అతడు ఒకప్పుడు శ్రేయమును గాంచుచున్నాడు. బుట్ట పదునుపెడుచున్న కొలదీ అందరిదీ సద్గతియే కానున్నది.

**శ్రీరాముడు :** మమాత్మా! "మరణానంతరం ఇక ఏమీ ఉండదు. 'ఆత్మ' అనిగాని 'సంవిత్తు' అనబడునది గానీ ఏమీ ఉండదు. "ఈ జీవుడు మరణం తర్వాత ఏ రూపంగానూ ఉండడు" - అను నిశ్చయము కలిగి ఉన్నవాడు మరణానంతరం ఎట్టి స్థితిని పొందనున్నాడు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఏది ఎట్లు భావన చేస్తే అది అట్లే సిద్ధిస్తుంది. (యత్ భావమ్ తత్ భవతి)" అనునది ఈ మనస్సు యొక్క స్వభావము అయివున్నది. కనుక "మరణానంతరం ఆత్మగాని, ఏమీగానీ ఉండదు. తదనంతరమైన 'సంవిత్తు' అనే ఉనికిగాని, స్థితిగాని ఉండదు" అనే దృఢాభిప్రాయం పెంపొందించుకొన్న జీవుడు అట్టి బోధ యొక్క ప్రభావం చేత దేహపతనానంతరం చిరకాలం విషయజ్ఞానరహితుడై, జడప్రాయుడై ఉండడం జరుగుతోంది. జీవిత పర్యంతం దృఢపడినట్టి అట్టి "నేను లేను" అను ఆత్మ తిరస్కారపూర్వకమైన జడాత్మకజ్ఞానంచే "గాఢసుషుప్తి

సదృశమైన ఆ మృత్యుస్థితినే మోక్షముగా గాంచుచూ ఉంటాడు. కొందరి సిద్ధాంతము ప్రకారం (నైయాయికులు) 'ముక్తి' అనగా అట్టి విషయరహితమగు గాఢ సుషుప్తావస్థ మాత్రమే! అయితే నిరతిశయానందానుభవరూపమగు శ్రేయమును వారు గమనించటంలేదని మేం భావిస్తున్నాం.

మరికొందరు "శుద్ధ సంవిత్ రూపమగు ఆత్మ అనేది అసంభవం అటువంటి దేదీ లేదు. ఉండ జాలదు"... అనే శూన్యవాదులు కూడా దేహపతనానంతరం జడ స్వరూపులై మహా తపస్సుచే ఆవరించబడినవారై దుర్భేద్యమైన అంధకార బంధురత్వం పొందుచున్నారు. అయితే సత్యమే అంతటా జయించనున్నది. కాబట్టి (సత్యమేవ జయతే) సత్యానుభూతి పర్యంతము పునఃపరిశీలన వారికి అనివార్యమగుచున్నది.

**క్షణికవాదులు :** "ఈ జగత్తు క్షణికం, స్వప్నపురం వంటిది" అని నమ్ముతూ, అంతకుమించి ఏమీ లేదని, ఏమీ ఆలోచించవద్దని బోధిస్తున్నారు. అట్టి పరిమిత దృష్టిని నమ్మువారి సమస్త వ్యవహారాలు సుఖ దుఃఖ మిశ్రితంగా కొనసాగుచూనే ఉంటున్నాయి. క్షణికమైనవాటికి ఆధారంగా సర్వదా వేంచేసి ఉన్నట్టి అనుక్షణికమగు "స్వస్వరూపాత్మ" కు సంబంధించిన సమాచారం పరిశీలించి, అప్పుడు నిర్ణయించుకోవలసినదిగా వారికి మా మనవి.

**స్థైర్యవాదులు :** ఈ జగత్తు శాశ్వతం-మనం అశాశ్వతం" అని బోధిస్తున్నారు. క్షణికవాదుల యొక్క స్థైర్యవాదుల యొక్క, సుఖదుఃఖములు సమానంగానే ఉంటున్నాయి. ఎందుకంటే... ఉభయులకు జగత్ వ్యవహారబుద్ధి ఉన్నంతవరకూ పదార్థములు స్థిరం అనుకొంటే ఏమున్నది? అస్థిరం అనుకుంటే ఏమున్నది? రెండూ ఒక్కటే అగుచున్నది. "స్వస్వరూపం యొక్క స్థిరత్వం గమనించండి"... అని వారికి గుర్తు చేస్తున్నాం.

**శ్రీరాముడు :** మహర్షీ! జ్ఞానుల దృష్టిలో ఈ పృథ్వి మొదలైన పంచభూతాత్మకమైన స్థూల పదార్థములు, సూక్ష్మ పంచమహాభూతములు స్థిరములైనవా? క్షణికములైనవా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ పృథ్వి మొదలైన స్థూల పదార్థములుగాని, సూక్ష్మ పంచభూతములు గాని స్థిరములైనా, అస్థిరములైనా జ్ఞానులకు ఆ విషయంలో విశేషమైన పట్టుదల ఉండదు. ఎందుకంటే, అజ్ఞానం ఎంతవరకు ఉంటుందో... అంత వరకు ముత్యపు చిప్పలో వెండి కనబడునట్లు ఈ అధ్యస్తమయిన జగత్తు కనబడుచూనే ఉంటుంది. "ఈ ముత్యపు చిప్పలో వెండి ఎప్పుడు బయలుదేరింది? ఏ మార్గంలో వచ్చి ఇక్కడున్నది"... అనే వాగ్వివాదాలన్నీ ముత్యపు చిప్పలో వెండి ఏదో ఉన్నదని నమ్మువారికే ఉంటాయి. "ముత్యపు చిప్పలో వెండి ఉండజాలదు. వెండి వలె కనిపించేది వెండి కాదు"... అని గ్రహించిన తర్వాత ఇక, "ఎక్కడి నుండి వచ్చింది? ఎందుకొచ్చింది? ఎప్పుడొచ్చింది?" అనే వాదోపవాదాలు ఏమి ఉంటాయి? జ్ఞానులకు ఈ సమస్తం కూడా అధిష్ఠానమగు చైతన్యం యొక్క ప్రకాశమే అయివున్నది.

సంవిత్తు ఏ క్షణంలోనూ క్షణికం కాదు. ఈ కాల రూప అసత్తుయగు 'క్షణికం' అనబడేది, దేశరూప అసత్తుయగు 'జడత్వం' అనబడేది సంవిత్తు (ఆత్మ) యొక్క అనుభవములోని ఒకానొక

విభాగము మాత్రమే! అందుచేత కాలమును దేశమును అంగీకరించి "అవి క్షణికమా? అనుక్షణికమా?" అని వాదోపవాదములు చేసే వారితో ఆత్మజ్ఞులకు సంభాషణ కుదిరేది కాదు.

**వేదాంత ప్రవచనం :** "చైతన్యము యథాతథంగా ఉంటూ ఉండగా, అద్దాని యొక్క వివర్త రూపమే ఈ జగత్తు" అని ఎంచువారు పురుషులలో ఉత్తములు, వందనీయులు కూడా! అట్లా కాకుండా "శరీరాదుల నుండి అట్టి శరీరాదులు వికారంచే చైతన్యం ఏర్పడుతోంది" అని తలచువారి (చార్వాకుల)తో వాదోపవాదములు చేసి కాలం వృథా చేసుకోవడం వల్ల ఏం ప్రయోజనం?

**చిద్రూపో జీవబీజౌఘ ఆకాశ కృమిజాలవత్ ।**
**ఊర్ధ్వమ్ తిర్యక్ అధో యాతి పూర్యమాణఇవ స్వయమ్ ॥**

చిద్రూపుడు, సర్వజీవుల బీజభూతుడు అయిన హిరణగర్భుడు 'జీవుల గుంపుల' వలె ఒప్పుచున్న ఈ సర్వజీవరాశుల రూపమును స్వయంగా ధరిస్తున్నాడు. నీళ్ళతో నిండుగా ఉన్న పాత్రలో గల క్రిమి జీవులు అటూ ఇటూ పరిభ్రమిస్తాయి చూచావా? అట్లాగే ఆ చిద్రూపుడగు హిరణ్యగర్భుడు 'సృష్టి' అనే పాత్రజలంలో అనేకరూపాలు ధరించి పైకి-క్రింది-ప్రక్కలకు పరిభ్రమిస్తున్నాడు.

అనగా... "హిరణ్యగర్భుడు అనబడే చిదాభానునిచే ఈ 'వివిధ జీవుల సమష్టి రూప కర్తృత్వం' అనబడేదంతా తనలో ఈ 'సృష్టి' రూపంగా ఎఱుగబడుచున్నది. ఈ ఈ వివిధ కర్తృత్వ రూపాలన్నీ అతడు తనలో స్వయంగా అనుభవించుచూ ఈ విధంగా సంసారమున తిరుగాడుచున్నాడు.

ఈ జీవుడు చిద్రూపుడే! హిరణ్యగర్భుడూ చిద్రూపుడే!

"ఎవడు ఏ విధంగా దేనిని ఎఱుగుచున్నాడో... అతడు అద్దానిని ఆ విధంగానే పొందుచున్నాడు" అనేది ఆబాలగోపాలానికి విదితమే కదా! ఉదాహరణకు "ఈ క్రియా వ్యవహారములన్నీ నేను నిర్వర్తించిరావడం నేను చేసిన పాపం"... అనుకుంటే అట్లే అది శిక్షానుభవంగా అనిపిస్తూ, పరిణమిస్తుంది. ఈ "నిర్వర్తించే క్రియలన్నీ పరమాత్మ సేవయే"... అనుకుంటేనో? సాధనరూప సేవ అగుచున్నది. "ఇది పీడ" అనుకొంటే అట్లే పీడగానే అనుభవం అగుచున్నది. క్రీడ అనుకుంటే క్రీడయే అగుచున్నది.

అట్లాగే... చిద్రూపుడగు ఈ జీవుడు దేనిని ఏ విధంగా ఎఱుగుచున్నాడో... అది ఆ విధంగానే శీఘ్రంగా పొందబడుచున్నది. 'ఇట్లు ప్రాప్తించడం' అనబడేది ఈ జీవునికి, ఆ హిరణ్యగర్భునికి ఒక్క తీరుగానే అగుచున్నదని గ్రహించు. ఆకాశంలో పొగ రకరకాల ఆకారాలుగా, రూపాలుగా అగుచూ కనిపిస్తుంది చూచావా? మహా సముద్రంలోని జలం అనేక రూపాలైన తరంగాలుగా, ఆవర్తవృత్తులుగా అగుపిస్తోంది కదా! అదే విధంగా చిదాకాశమునందు సంసారం యొక్క వివిధ వైచిత్ర్యమంతా సంభవిస్తోంది. స్వప్నమున సంవిత్తే (చిదాకాశమే) స్వప్న ద్రష్టకు మహానగరంగా కనిపిస్తోందే! అట్లాగే చిదాకాశమే సృష్ట్యాది నుండి ఇప్పటివరకూ జగద్రూపంగా స్థితినొంది ఉంటోంది. ఇక ఈ సృష్టికి సహకారి కారణాలు ఏమిటంటావా? స్వప్నంలో ఎటువంటి సహకారి కారణాలు లేకుండానే స్వప్న జగత్తంతా సంభవిస్తోంది కదా! అట్లాగే, సృష్ట్యాది యందలి జగత్‌స్థితిలో

ఈ పృథ్వి మొదలైన పంచభూతాలన్నీ ఎటువంటి సహకారి కారణాలు లేకుండానే సంభవిస్తు న్నాయి. స్వప్నంలో ఇల్లు, వాకిలి, సంఘటనలు మొదలైనవన్నీ అనుభవమగుచున్నట్లే ఈ 'జగత్తు' అనే స్వప్న నగరంలో ఇవన్నీ పరిపుష్టమై పొందబడుచున్నాయి.

వాస్తవానికి నీవు నేను, ఈ తదితర సర్వజనులు అందరూ కూడా ద్వైత-ఏకత్వ వర్జితమైన చిదాకాశ రూపములే అయివున్నాయి. అట్టి చిదాకాశమునకు మరొక దోషము, దోషాపహరణము మొదలైనవి ఎక్క డుంటాయి? ఏదేది భావిస్తోందో, భావించబడుతుందో... అదంతా చిదాకాశమే అయివున్నది. మనమంతా ఏది అయివున్నామో అట్టి చిదాకాశము త్రివిధతాప రహితమై, ఆహ్లాదభరితమై, అంతటా నలువైపులా పూరించి ఉన్నది. అట్టి చిదాకాశ ప్రకాశము యొక్క ఒకానొక స్ఫురణయే ఈ జగత్తు.

సృష్టికి పూర్వం చిదాకాశమే ఉన్నది. ప్రళయానంతరం కూడా చిదాకాశమే ఉండటం జరుగుతోంది. మధ్యలో కనిపించే ఈ సృష్టి చిదాకాశమే అయివున్నది. బ్రహ్మమే ఇట్లు నిజచైతన్యము యొక్క 'పరిచ్ఛిన్న-అపరిచ్ఛిన్న' రూపములచే, వికాస సంకోచముల ద్వారా స్వయముగా స్వప్నమువలె ఈ జగద్రూపంగా ఉదయించడం, అస్తమించడం నిర్వర్తిస్తోంది.

అందుచేత... బ్రహ్మపదమును పొందిన మహాత్ములు 'శరత్కాలాకాశం' లాగా నిర్మల చైతన్య రూపమును సంత రించుకొనియే వర్తిస్తూ ఉంటారు. అందుకు భిన్నమైన దృశ్యరూపమును పొందకయే క్రీడిస్తూ ఉంటారు.

**నిర్ మానమోహా, జిత సంగ దోషాః, ప్రవాహ సంప్రాప్త నిజార్థభాజః ।**
**తిష్ఠన్తి కార్య వ్యవహార దృష్టౌ, నిరామయ యన్త్రమయా ఇవైతే" ॥**

ఓ రామచంద్రా! ఎవరైతే అభిమాన మోహాదులను, సంగదోషములను జయించివేసి ప్రవాహ పతితమైన ఆయా కార్య-వ్యవహారాలను వ్యథారహితులై నిర్వర్తిస్తూ ఉంటారో... అట్టి మహనీయులు క్రమక్రమంగా జీవన్ముక్తత్వము సంతరించుకొనగలరు. ఇక వారు ఇతరుల కార్యవ్యవహార దృష్టియందు పురుష ప్రతిమ (పురుషాకారశిల్పం) వలె నిర్వికారులై వెలయుచూ ఉంటారు. అట్టి మహనీయుల దర్శనమే మహద్భాగ్య ప్రదమైనది.

❖❖❖

## 7. సర్వత్రా సమదర్శన ప్రయోజనం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "సర్వత్రా చిన్మాత్రమే ఆవరించి ఉన్నది"... అని మనం ఇప్పటికే అనేకసార్లు సిద్ధాంతీకరించుకొనివున్నాం కదా! ఈ పురుషుడు స్వయంగా చిన్మాత్రమే అయి ఉన్నాడు. అట్టి చిన్మాత్రమే నానా విధ కల్పితములగు సుదీర్ఘ-క్షణిక రూపముగాను, భయ-శోకాది రూపాలుగా కూడా స్థితి నొందివుంటోంది. చిన్మాత్రము తప్ప అన్యంగా ఎక్కడా ఏదీ లేదు, ఉండజాలదు. సర్వ భావ-అభావాలు శుద్ధ చిన్మాత్రం యొక్క విభూతులే సుమా!

అట్టి చిన్మాత్ర చైతన్యము ఆకాశము కంటే కూడా అత్యంత సూక్ష్మమైనది. ఇక 'ద్రష్ట-దృశ్యము' మొదలైనవన్నీ అద్దానిని యొక్క వివర్తరూపములు మాత్రమే! మరిక "గ్రహణము-తాజ్యము" ...అనే బుద్ధి వ్యవహారమంతా ఎక్కడున్నది?

**వేర్వేరు సిద్ధాంతములు - "అసంగము" -**

**క్షణిక జ్ఞానవాదులు :** వీరి సిద్ధాంతం ప్రకారం, "ఈ జగత్తు క్షణక్షణం ఏదో మార్పు చెందుతూనే ఉన్నది. కనుక అనుక్షణిక పరిణామ స్వరూపి అయిన ఈ జగత్తును ఎవరూ ఇది ఇట్టిది మాత్రమే అని చెప్పటానికి వీలే లేదు."

వీరి సిద్ధాంతము ప్రకారం మనం చూచినా కూడా, ఈ జగత్తు సర్వదా క్షణక్షణం నిర్విషయమే అయి వున్నది కదా! కాబట్టి ఇక రాగద్వేషములకు తావు ఎక్కడిది? వారు "సంవిత్తు (ఆత్మ) నిత్యము" అని ఒప్పుకోవడం లేదు. కనుక (బృహస్పతి మతాచార్యుల సిద్ధాంతమైన) క్షణికవాదం ప్రకారం కూడా అసంగమే ప్రబోధించబడుతోంది కదా!

**జగత్ స్వప్న సిద్ధాంతము** – 'స్వప్నము' అనేది ఆ స్వప్న ద్రష్ట యొక్క వివర్త రూపమే కదా! అట్లాగే "చిదాకాశము యొక్క వివర్తరూపమే ఈ జగత్తు" అని మనం చెప్పుకుంటూ వస్తున్నాం. ఈ విధంగా "చిదాకాశ స్వప్న సదృశజగత్తు" అనే అభిప్రాయం అనుసరించి కూడా ఈ జగత్తులో ఇష్టా ఇష్టములు ఉండవలసిన పనేమి? స్వప్నంలో కనిపించే వస్తువులు స్వప్నాంతంలో మటుమాయ మవుతాయి కదా! తప్పకుండా మటు మాయమయ్యే వస్తువుల గురించి దుఃఖించి ఏం ప్రయోజనం? కనుక ఈ సిద్ధాంతమును అనుసరించి కూడా ఈ జగత్తుపట్ల అసంగమే ఉచితం.

**అణు సంయోగ – వియోగమాత్ర జగత్** – ఇదే విధంగా "జగత్తు అణువుల కలయిక మాత్రమే" అని నమ్మేవారు కూడా, అణువుల సంయోగ, వియోగమగు ఈ జగత్తు యొక్క ఉనికి లేములపట్ల 'అసంగమే ఉచితం' అని ఉద్దేశిస్తున్నట్లు మాకు కనిపిస్తోంది.

ఏ విధంగా చూచినా ఈ జగత్తు పట్ల అసంగమే ఉచితం 'ఇది త్యజించ తగినది. ఇది గ్రహించవలసినది" అనే రూపంగాగల ఏ వికల్పధ్యాస కనిపిస్తోందో, అది కూడా "చిదాకాశమును చిదాకాశమే ఆ విధంగా గాంచుచున్నది".... అనునదే మా ఉద్దేశం. అవగాహన కూడా!

అనగా... నిర్మలమగు చిదాకాశమునందు ఈ జగత్తు నిర్మల చిదాకాశముగానే భాసిస్తోంది. కాబట్టి ఇక "ఇది మాకు ఇష్టం-అది మాత్రం మాకు ఇష్టం కాదు"అను దృష్టి ఎక్కడ? ఎందుకు? ఈ మనుష్యులు, ఈ దేవతలు, ఈ నాగులు, ఈ స్థావర జంగమములు-ఇవన్నీ కూడా "పరమాత్మ" అనబడు సంవిత్ మహా సముద్ర జలంలోని తరంగరూపాలే అయి ఉన్నాయి. ఆ సంవిద్రూప మహాసముద్ర తరంగాల యొక్క ఆవర్త-వృత్తులే ఇక్కడి జనన-మరణాలు కూడా! ఓ రామచంద్రా! నేను, నీవు, సమస్తజీవులు సంవిదాకాశ రూపులమే అయి ఉన్నాం. మనం ఎవరం కూడా ఎప్పటికీ మరణించని వారమే అయివున్నాము. చిదాత్మకు మరణమెక్కడ ఉంటుంది. చెప్పు?

అంతేకాదు... సర్వము సంవిత్‌మయమే కాబట్టి సంవిత్తు దేనికీ జ్ఞేయం (తెలియబడునది)... అవదు. అది 'తెలియుట' అనే సంవేద్యత్వం ప్రదర్శిస్తున్నప్పటికీ అద్దానిలో ద్విత్వ-ఏకత్వములు

ఎట్లా ఉండగలవు? ఓ రామచంద్రా! సంవిత్తు (లేక) చిదాత్మకు వేరుగా మరి ఏ సద్వస్తువు ఉన్నదో చెప్పు? ఒకవేళ సంవిత్తే మరణిస్తుందని అనుకుంటే మరి నీవు–నేను ఎలా జీవిస్తున్నాం?

**సౌగతవాదులు :** "పరమాత్మ ఎక్కడో ఉన్నారు" అని చెప్పువారు.

**లోకాయతవాదులు :** "ఈ లోకమే ఉన్నది ఇందుకు వేరైన పరమాత్మ ఎక్కడా లేదు" అని చెప్పేవారు.

ఇటువంటి సర్వుల అభిప్రాయము సంవిత్ గురించే! అంతకుమించి వారు దేనిని నమ్ము చున్నారు? చిదాకాశమే వారి వారి అభిమతానుసారంగా ఆయా విధాలుగా అనుభవగతమౌతోందని గమనించు.

అట్టి సంవిద్రూపాకాశమునే కొందరు 'బ్రహ్మం' అంటున్నారు. మరికొందరు 'విజ్ఞానము' అని పిలుస్తున్నారు. ఇంకొందరు 'శూన్యము' అని, ఇంకా కొందరు 'కల్పన లేక మత్తు శక్తి వలె సృష్టిలోని అంతర్లీన శక్తి" అని, పరిణతి చెందిన పంచభూతముల "ధర్మము" అని, ఇంకా... పురుషుడు అని, 'చిదాకాశము' అని, 'శివుడు' అని 'ఆత్మ' అని చెప్పుచున్నారు. ఈ విధంగా ఆయా వాదులచే అనేక ప్రకారములైన వికల్పములు చెప్పబడినప్పటికీ... ఆ చిన్మాత్రము మరొక రూపమేదీ పొందకయే ఉంటోంది. ఆ సర్వ వికల్పములకు, తన ఆయా కల్పిత రూపములకు తానే సాక్షి అయి, స్వయంగా తానే వాటి నన్నిటినీ ఆయారీతులుగా ఎఱుగుచున్నది. తాను సర్వదా నిర్వికల్పమే అయివున్నది. ఓ రామచంద్రా! ఈ నా అవయవాలు చూర్ణమై పోవుగాక! లేదా... మేఱుపర్వతము వలె సువిశాలముగా అగుగాక! చిన్మాత్రమే శరీరముగా గల నాకు హానిగాని, వృద్ధిగాని లేదు. మన తాతలు, ముత్తాతలు, తండ్రులు మొదలైనవారు మరణించి ఉండవచ్చుగాక! కానీ, వారి ఆత్మ రూపమగు చైతన్యము మాత్రం మరణించడం లేదు. చైతన్యమునకే మరణం ఉంటే అది మరల పునఃజన్మ పొందేదికాదు. మన ఈ దేహములు మరణించిన తర్వాత కూడా మన ఆత్మ చైతన్య రూపం నశించదు.

"దేహం రావడం, దేహం పోవడం" ఇవి దేహ ధర్మాలు గాని, ఆత్మ ధర్మాలు కాదు. ఎక్కడన్నా "ఆకాశం నశిస్తుంది అనేది కుదురుతుందా? కుదరదు. ఇక ఆకాశము కంటే కూడా అత్యంత సూక్ష్మమైనట్టి ఆత్మ చైతన్యానికి మరణం ఎక్కడిది?

**న జాయతే, న మ్రియతే సంవిదాకాశమక్షయమ్**
**భవేత్ కథం కథయ కిం కిలాకాశస్య సంక్షయః?**

ఆకాశం ఎప్పుడూ నాశరహితమే! దానికి జన్మమేమిటి? మరణమేమిటి? అట్లే చిదాకాశము సర్వదా నాశరహితమే! దానికి జన్మించడం, మరణించడం ఉండదు. ఈ విధంగా చైతన్యమునకు 'నాశనం' అనేది అసంభవం. ఈ జగత్తు అంటావా? ఈ జగద్రూపస్ఫురణ కూడా చిదాకాశమే! ఉదయాస్తమయ రహితమై, నాశనరహితమై చిదాకాశమే తనయందు తాను ఈ జగద్రూపమున స్థితి నొందియున్నది. ఆదిమధ్యాంత రహితమైన చిదాకాశము స్ఫటికంలో పర్వతంలాగా ఈ

జగత్తును తనయందు ఒకప్పుడు ధరించి ఉంటోంది. మరల మరొకప్పుడు "నిజతత్త్వ సాక్షాత్కారం"చే దగ్ధం చేసి, నిర్మలమగు తన స్వరూపమందు తానే వెలయుచున్నది. రాత్రియందు ఏర్పడిన అంధకారం సూర్యోదయం కాగానే క్రమంగా నశిస్తుంది చూచావా? "నేను జీవుడను, బద్ధుడను" అనబడే అజ్ఞానాంధకారం ఆత్మజ్ఞాన ప్రకాశము యొక్క ప్రవృద్ధిచే క్రమక్రమంగా తొలగిపోతూ వస్తుంది.

సముద్రం స్వయంగా తనయందు "ప్రవాహం-తరంగం-ఫేనము (నుఱుగు)-బుద్బుదము(బుడగ)-ఆవర్తము" కలిగివుంటుంది చూచావా! అలాగే చిదాకాశము తనయందు జగత్ భావన అనే అవయవమును ధరించి ఉంటోంది. ఈ పురుషుడు (లేక జీవుడు) చిన్మాత్రమే అయివున్నాడు. అతడు ఆకాశమువలె సదా, సర్వదా నశించకయే ఉన్నాడు. కాబట్టి "నేను నశించుచున్నాను" అని తలచి దుఃఖించటమనేది వ్యర్థమైన పని మాత్రమే!

**శ్రీరాముడు :** ఈ జనులకు మరి శోకము ఉండకుండేది ఎట్లా? మృత్యుభీతి తొలిగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ జనులారా! ఈ నా మాటలు శ్రద్ధగా వినండి.

**దేహాత్ దేహాంతర ప్రాప్తౌ నవయేవ మహోత్సవః**
**మరణాత్మని కిం మూఢా, హర్షస్థానే విషీదథ?**

నాయనలారా! 'మరణము' అనేది శిథిల దేహం త్యజించడానికి, నూతన దేహం ధరించడానికి కారణభూతం అవుతోంది కదా! అందుచేత మరణము నూతనమైన ఉత్సవమే అవుతుంది. మరింక మూఢత్వం చేత కాకపోతే... శిథిల దేహం తొలగుచున్నప్పుడు సంతోషించాలిగాని, ఈ జనులు దుఃఖిస్తున్నారేమిటి?

**మృత శ్చేత్ న భవేత్ భూయః, సో అత్రాపి ఉపచయో మహాన్,**
**భావ - అభావ గ్రహోత్ సర్గః జ్వరః ప్రశమమ్ ఆగతః!**

"ఈ దేహం పోతే మరల దేహం రాదేమో? అందుకని దుఃఖిస్తున్నాం"... అని ఎవరైనా అంటారా? ఒకవేళ మరణానంతరం మరల జన్మయే లేదంటే, అది ఇంకా మంచిది. అప్పుడు మహత్తరమైన పురుషార్థం చేకూరినట్లే అవుతుంది. ఎందుకంటే అప్పుడు ఈ "ఉత్పత్తి-నాశన-భావ-అభావ-గ్రహణ-త్యాగ" మొదలైన రూపములుగా ఉండే 'సంసారము' అనే రోగము ఉపశమించినట్లే కదా! కాబట్టి "మరణానంతరం దేహం వస్తుంది" అన్నా, లేక "ఇక దేహమే సంభవించదు" అని తలచినా... ఉభయత్రా దుఃఖమునకు కారణమే లేదు.

**మరణం జీవితం తస్మాత్, న దుఃఖ న సుఖం యతః**
**నాస్త్యేవై తత్ చిదాకాశః కిలేత్థమభిజృంభతే ॥**

ఈ విధంగా "ఈ జనన మరణములు సత్యమే".... అనుకున్నప్పుడు కూడా అది దుః ఖించడానికి విషయమే కాకుండా ఉంటోంది. ఎందుకంటే నూతన దేహం రావడం మంచిదే! లేక అసలు దేహమే ఉండకపోవడమూ మంచిదే. ఇక ఈ దేహ సంబంధమైన అల్పార్థమును ప్రక్కకు

పెట్టి పరమార్థమునకు వస్తే... ఈ జీవుడు "దేహి" గా జీవితము పొందడం లేదు. మరణము పొందడం లేదు. దేహం వస్తున్నప్పుడు, పోతున్నప్పుడు కూడా అతడు దేహిగా యథాతథంగానే ఉంటున్నాడు. కనుక పరమార్థమున చూస్తే సుఖమూ లేదు. దుఃఖమూ లేదు. చిదాకాశమే ఈ అన్నిటి రూపంగానూ విజృంభిస్తోంది సుమా!

ఓ రామచంద్రా! ఇప్పుడు మనం జీవన్-మరణముల గురించి చెప్పుకున్నది మరొకసారి సమీక్షించి చెప్పుతాను... విను.

**మృతస్య దేహలాభ శ్చేత్,... నవేఏవ తత్ ఉత్సవః**
**మృతిః నాశోహి దేహస్య, సామృతిః పరమం సుఖమ్ ॥**

మరణించిన తర్వాత మళ్ళీ దేహం లభిస్తుందని అనుకుంటే అది నూతనోత్సాహమే అవుతుంది. ఎందుకంటే శిథిలమైన దేహము నశించడమే మరణం కాబట్టి అది పరమసుఖమే కదా!

**మృతిః అత్యంత నాశశ్చేత్ – తత్ భవామయ సంక్షయః**
**భూయః శరీరలాభశ్చేత్ నవేవ తత్ ఉత్సవః**

"అత్యంత నాశనమే మరణము. ఆ తర్వాత దేహం లేదు. (పునర్జన్మ లేదు)" అని అనుకుంటే అప్పుడు ఎటువంటి పరిశ్రమ లేకుండానే సంసారరోగము ఉపశమించినదే అగుచున్నది. శరీరం నశిస్తే మరల శరీరం కలగకపోతే సంసారమే తొలగినదగుచున్నది. కాబట్టి ఎంతో సంతోషించ వలసిన విషయమే!

"కాదండీ! మాకు మరల శరీరం వస్తుందేమో?"... అని అనుకుంటే... అది నూతన దేహం కాబట్టి అదికూడా ఉత్సవంతో సమానమే! ఏ రకంగా చూచినా మరణము దుఃఖార్హం కాదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు చెప్పింది యుక్తియుక్తమే! అయితే, "మేము ఏవేవో పొరపాట్లు చేశాం. అందుచేత మాకు నరకం ప్రాప్తిస్తుందేమో?" అని కొందరు జనులు మృత్యువు పట్ల భయం కలిగి ఉంటున్నారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (చిరునవ్వుతో) ఓహో! అట్లాగా? దుష్కర్మలచే మరణానంతరం నరకాదులు ప్రాప్తిస్తాయనే ఏ భయం కలదో... అటువంటి భయం జీవించి ఉన్నప్పుడు కూడా రాజదండన మొదలైన వాటి వల్ల ప్రాప్తిస్తూనే ఉన్నది కదా! అందుచేత ఓ జనులారా! ఇహ – పర శ్రేయస్సును సిద్ధింప జేసుకోవాలనుకుంటే, దుష్కర్మలను ఆచరించకుండా ఉండండి. దుష్కర్మల ఫలితం జీవించి ఉన్నా, మరణించినా అద్దాని అనుభవం అనివార్యం. జీవించివున్నందుకు ప్రయోజనంగా ఉత్తమ కర్మలు ఆచరించండి. అంతేగాని మరణం గురించి భయపడవలసినదేమున్నది?

**మరిష్యామి! మరిష్యామి! మరిష్యామీతి భాషసే?**
**భవిష్యామి! భవిష్యామి! భవిష్యామీతి నేక్షసే?**

ఓయి! జీవుడా! "నేను చస్తాను, చచ్చిపోతాను, ఇక చావు తప్పదు".... అని పలుకుతావేమయ్యా? "చిదాకాశస్వరూపుడగు నేను ఈ దేహ పతనానంతరం కూడా ఉండియే

ఉంటాను, ఉండియే తీరుతాను. ఎల్లప్పటికీ ఉంటాను".... అని ఎందుకు అనుకోవయ్యా? పరమార్థమున నీకు జనన-మరణాలు కాని, ఉత్పత్తి-నాశనములుగాని స్వస్వరూపం దృష్ట్యా లేనేలేవు. అంతా కూడా సర్వదా చిదాకాశమే అయివున్నది. ఆ చిదాకాశము తనయందు తానే జగత్తు రూపంగానూ, జన్మ-జీవన-మృత్యు పునఃజన్మల రూపంగానూ వివర్తభావమును ఇక్కడ క్రీడవలె పొందడం జరుగుతోంది.

**సంవిదాకాశమాత్రాత్మా పిబ భుంక్ష్వాస్వ నిర్మమః**
**ఆకాశకోశకాన్తస్య కుత ఇచ్ఛేదయస్తవ?**

ఓ రామచంద్రా! నీవు చిదాకాశమాత్రుడవే గాని ఈ దేహమూ కాదు! మరొక దేహమూ కాదు! అట్లే తదితర సర్వజీవులూ కూడా! ఇదియే ఆత్మజ్ఞానము. ఆ విధంగా ఆత్మజ్ఞానం సంపాదించుకొని ఇక అటుపై మమకారరహితుడవై తిను, త్రాగు, ప్రపంచ వ్యవహారాలేవైతే ఉన్నాయో... అవి నీవు అనుకున్నట్లే నిర్వర్తించు.

ఆకాశ కోశము వలె నిర్మలమైన చిదాత్మయే స్వరూపముగా గల నీయందు ఇచ్ఛాదులకు చోటు ఎక్కడిదయ్యా? వాస్తవానికి భవ్యుడు - నిర్భయుడు అగు ఆత్మజ్ఞాని కాకతాళీయంగా వాటంతట అవిగా వచ్చిపడే దేశకాలానుగతమైన ఆయా శబ్ద స్పర్శాది లోకవ్యవహారములను నిర్లిప్తంగా ప్రశాంతంగా నిర్వికారంగా ఉంటూ అనుభవిస్తున్నాడు. మధ్యమధ్యలో దేశ కాలానుగతంగా వచ్చే దుర్భిక్షము-క్షోభ మొదలైన ఈ ప్రాపంచిక దోషములను క్రీడలో సానుకూల - ప్రతికూల సందర్భములవలె దర్శిస్తున్నాడు. వికల్పములు లేనట్టి సమాధిని అవధరించిన బుద్ధికలవాడై, ఈ జగద్విషయములన్నిటినీ అంతరంగమున అధిగమించియున్నవాడై ఉత్తమ బుద్ధితో నిశ్చితంగా ఈ లోకంలో సంచరిస్తున్నాడు.

**న దుఃఖమేతి మరణాత్, సుఖమేతి న జీవితాత్,**
**నాభివాంఛతి నద్వేష్టి స తదా అస్తే వివాసనః ॥**

అట్టి తత్త్వజ్ఞుడు మరణముచే దుఃఖము పొందడు. జీవితముచే సుఖమును పొందడు. దేనినీ వాంఛించడు. ద్వేషించడు. సర్వదా వాసనారహితుడై ఉంటున్నాడు.

ఓ రామచంద్రా! జీవన్ముక్తుడు ఇదే ప్రపంచంలో ఇచ్ఛారహితుడై ఉంటున్నాడు. వాసనావర్జితుడై ఉంటున్నాడు. ఇక్కడి జనన-మరణాది సర్వ సంఘటనలను శిథిలమైన గడ్డిపరకతో సమానంగా చూస్తున్నాడు.

ఆ "విదిత వేద్యుడు" (తెలుసుకొనవలసినది తెలుసుకొనివున్నవాడు) భయరహితుడై ఒక పర్వతం లాగా ఈ ప్రపంచమున నిశ్చలంగా వసిస్తున్నాడు.

❖❖❖

# VII. విపశ్చిత్ ఉపాఖ్యానం - పరిచయం

## 1. జ్ఞాని లక్షణములు

**శ్రీరాముడు :** మహాత్మా ! ఈ భూమిపై "ఆద్యంతరహితం, పరతత్త్వసారం" అయినట్టి బ్రహ్మవస్తువును ఎఱిగి, గుర్తించి ఆస్వాదిస్తూ ఉండే మహనీయులు కొందరు జీవన్ముక్తులై ఉన్నారు కదా! వారు ఏ ఏ లక్షణములు, స్వభావము, ఆచరణ కలిగివుండి జీవితము గడుపుచూ ఉంటారో... ఆ విశేషాలు చెప్పండి. ఈ సంసార మహారణ్యంలో వారు ఆత్మ సుఖమును ప్రసాదించగల గంధపు వృక్షము వంటివారు కదా! వారెక్కడెక్కడ ఉంటారో, ఎట్లా గుర్తించాలో తెలియజేయ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవిచ్ఛిన్నమగు ఆత్మానుభూతితో సంచరించే మహనీయులు ఈ భూమిపై ఉన్నారు. అట్టి జీవన్ముక్తులకు శిలలు కూడా స్నేహితులే! వృక్షములు కూడా బంధువులే! జంతువులు కూడా స్వజనులే! వారు సర్వజీవులందును సమదృష్టి కలిగి ఉంటారు. ఇక వారి సర్వమానవ సమదర్శనము గురించి వేరే చెప్పేదేమున్నది? ఇంకా...

అనేకమంది జనులు సమావేశమై రణగొణ ధ్వనులు చేస్తున్న ప్రదేశం వారికి ప్రశాంత - శూన్య ప్రదేశంగా ఉంటుంది. ఆపదలు కూడా వారికి సంపదలుగానే కనిపిస్తాయి. దుఃఖం కూడా మహా సుఖంగానే ఉంటుంది. అనేక వ్యవహారముల మధ్య ప్రాప్తించే అసమాధి వారికి సమాధితో సమానంగానే ఉంటుంది. వారు వ్యవహారములలో మౌనం దర్శించగలరు. అనేక కర్మలు నిర్వర్తిస్తూ అకర్మిష్ఠులై ఉండగలుగుచున్నారు.

వారికి ఈ జాగ్రత్తు కూడా సుషుప్తితో సమానంగానే అనిపిస్తుంది. సుషుప్తితో పోల్చతగిన నిర్వికల్ప స్వరూపమగు ఆత్మను సదా ఆశ్రయించి, ఆస్వాదిస్తూ ఉంటారు కదా! వారు జీవించి ఉన్నప్పటికీ శరీర భావరహితులై మృతుని మాదిరిగానే ఉంటారు. "ఈ శరీరము నేను కాదు, నాది కాదు. ఈ శరీరము నాకు సంబంధించినది కాదు. నేను దేహమునకు సంబంధించిన వాడను కాను" ...అని గ్రహించి, అట్టి అనుభవంతో ఉంటారు.

అన్ని ఆచారములు ఆచరిస్తూ కూడా ఏదీ నిర్వర్తించనివారుగా ఉంటారు. "ఇవన్నీ దేహ-మనో-బుద్ధి సంబంధిత ధర్మములు మాత్రమే! ఆత్మ స్వరూపుడనగు నా ధర్మములు కావు" అని అవగాహన కలిగి ఉంటారు. విషయముల పట్ల విషయదృష్టి కాకుండా ఆత్మ సంబంధమైన దృష్టి కలిగి ఉంటారు. వారికి బంధువుల పట్ల బంధు బుద్ధిచే కాక, ఆత్మబుద్ధిచే వాత్సల్యం ఉప్పొంగుతూ ఉంటుంది. వారిది అలౌకిక బుద్ధి కాబట్టి వారు స్నేహరహితులు కూడా! వారికి రెండవ వస్తువే కనిపించదు కాబట్టి నిర్దయులు. కానీ తదితర శరీరములను తమ శరీరము వలె సుఖ-దుఃఖాలను వీక్షిస్తారు కాబట్టి అత్యంత దయామయులు కూడా!

వారి ఆచరణ సర్వులు సంతోషించేట్లుగా ఉంటుంది. కానీ... లౌకికాచారాల దృష్ట్యా చూస్తే "సర్వ ఆచారాలు బహిష్కరించారా?" అని అనిపిస్తుంది కూడా! వారికి "శోకం - భయం - ఆయాసం - ఆశ" అనేవి కలుగటానికి ఎక్కడా తగిన కారణమేదీ అగుపించదు. కానీ అజ్ఞానుల దుఃఖం చూచినప్పుడు "ఇది తొలగేది ఎట్లా" అనునది వారికి దుఃఖకారణం అవుతుంది.

వారికి ఈ లోకం చూస్తే భీతి ఉండదు. ఈ లోకానికి వారి వలన భీతి కలుగదు. వారు ఈ ప్రాపంచిక విశేషముల పట్ల రసికులవలె అగుపించినప్పటికీ... ఆంతరంగమున పరమ వైరాగ్యము పొంది ఉంటారు.

**నాభినందతి సంప్రాప్తం, న అప్రాప్తమ్ అభివాంఛతి ।**
**అస్తే అనుభూయమానే అర్థే, నచ హర్ష-విషాదయోః ॥**

జీవన్ముక్తుడు ప్రాప్తించినదాని గురించి సంతోషించడు. అది కాలంచే వచ్చి పోయేదేనని బాగా తెలుసు. ప్రాప్తించని వాటి గురించి అఱ్ఱులు చాచడు. వాటిలోని దోష-మోహాలు ఉండకుండా పోవని గమనించియే ఉంటాడు.

సర్వదా ప్రాప్తించియే ఉన్న ఆత్మకు వేరుగా ఉండవలసినది, పొందవలసినది అతనికి క్రొత్తగా ఏమీ ఉండదు. హర్షము-విషాదము కలిగించగలిగే ఆయా వస్తువులు-సంఘటనలు వచ్చి పోతున్నప్పుడు అతడు హర్ష-విషాదములు పొందడు. దుఃఖితులతో దుఃఖ ప్రసంగం, సుఖితులతో సుఖ ప్రసంగం చేస్తున్నప్పటికీ అతని హృదయం సర్వ అవస్థలను సమంగా దర్శిస్తూనే అతీతమై, అస్పృశ్యమై, ప్రశాంతమై ఉంటుంది.

అతనికి పుణ్యకర్మలు తప్ప మరింకే కర్మలు రుచించవు. శాస్త్ర నిషిద్ధ కర్మలుగాని, పరులను వేధించే కర్మలు గాని నిర్వర్తించకపోవటం ఆతనికి స్వభావసిద్ధమై ఉంటుంది. ఆతనికి దేనిపట్ల కూడా ఆసక్తిగాని, విరక్తి గాని ఉండదు. ధనాదుల కొరకై యాచించడు. అతని యాచన ఇతరుల క్షేమము కొరకు మాత్రమే!

రాగము కలిగి కనిపిస్తూనే వీతరాగుడై ఉంటాడు. లోక వ్యవహారం కొఱకై దుఃఖ సంఘటనల పట్ల దుఃఖము, సుఖ సంఘటనల పట్ల సుఖము ప్రదర్శిస్తూ కూడా ఆయా సుఖదుఃఖాదులచే తాను స్పృశించబడకయే ఉంటాడు. ఈ సంసార నాట్యమండలిలో నటునివలె నవరసములచే స్పృశించబడకయే నవరసములు ప్రదర్శిస్తూ ఉంటాడు.

ఆతనికి తన యొక్క - తదితరుల యొక్క ధనాదులందు గాని, దారాపుత్రాదులందుగాని "ఇవి క్షణికములే కదా" ...అని గ్రహించి ఉండుటచే వాటివాటి పట్ల స్నేహము - ఆసక్తి లేకయే ...సందర్భోచితంగా విధులు మాత్రం నిర్వర్తిస్తూ ఉంటాడు. అంతరాంతరంలో స్నేహబంధం లేనప్పటికీ ప్రపంచము పట్ల ఘనీభూతమైన స్నేహంచే ఆర్ద్రత - వాత్సల్యము - ప్రేమ మొదలైన వృత్తులను స్వభావసిద్ధంగా ప్రదర్శించుచు యథాతథంగా ఉంటాడు.

❖

మూఢులగు జనులు "ఈ దేహమే నేను" అని తలచుచు అట్టి దేహాత్మబుద్ధిచే కామము – తాపము పొందుతూ, వాటిని శాంతింపజేయటానికి అత్యాశతో అనేక విషయ పరంపరలయందు లీనమై కాలయాపన చేస్తున్నారు. విషయములను పొందుచున్నప్పుడు కూడా ఏదో పైపై స్పృశించు చున్నారేగాని, వారు పూర్ణానుభవులు అగుటలేదు సుమా! అనాసక్తి చేతనే విషయానుభవం వాస్తవానికి సాధ్యం. ఆసక్తి ఉన్నచోట విశ్రాంతి ఎక్కడిది?

**శ్రీరాముడు :** స్వామీ! జ్ఞాని రాగాదులను ప్రకటిస్తాడు గాని, కలిగి ఉండడని మీరు చెప్పే గుర్తులు తప్పక అనుసరణీయములే! అయితే అజ్ఞాని కూడా దంభముగా మీరు చెప్పిన విశేషములు ప్రదర్శిస్తూ ఉండవచ్చు కదా! ఎవరు జ్ఞానియో, ఎవరు దంభముతో కూడి ఆయా గుణములు ప్రదర్శిస్తూ... వాస్తవానికి అజ్ఞానియో మేము వారిని గుర్తించటమెట్లా? ఈ లోకంలో కొందరు గుల్లములవలె బ్రహ్మచర్యము ఆచరిస్తూ కపట హృదయులై జ్ఞానులవలె నటించేవారు ఉంటారేమో కదా! ఖ్యాతి కొరకై ఉత్తమ గుణములు దాంభికంగా ప్రదర్శించేవారు ఉండవచ్చాయె! మరి మేము జ్ఞానిని గుర్తించటం, ఆశ్రయించటం ఎట్లాగో చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సత్యమో, అసత్యమో... పైన చెప్పిన లక్షణాలతో కూడిన వ్యక్తిత్వము శ్రేష్ఠమైనది. అవి ఎవరికి వారే అలవరచుకునే ప్రయత్నంలో ఉండటం ఉచితం కదా! వేదవేత్తలగు తత్త్వజ్ఞులకు అట్టి లక్షణాలు స్వభావసిద్ధంగానే ఒనగూడుతూ ఉంటాయి. వారికి దంభము – హఠములతో ప్రదర్శించవలసిన పని లేదు.

అయితే, రామచంద్రా! ప్రపంచంలో మరెవరిలోనో వాటిని వెతకటం అటుంచి, ముందుగా ఎవరికి వారే అవి తమ కొరకై తాము అభ్యసించటం ముఖ్యమని గ్రహించాలి సుమా!

ఇంకా జ్ఞానుల గురించి చెప్తాను విను. జ్ఞానికి దేనిపట్లా రాగముకాని, ద్వేషముగాని ఉండదు. వారికి ఆయా క్రియా ఫలములందు ఆసక్తి ఉండదు. కాని, వారి విధి నిర్వహణలో రాగము లోపించదు. వారికి ఈ అజ్ఞానుల ఆశ – నిరాశ – దురాశలు హాస్యపూరితంగా ఉన్నప్పటికీ, మరొకవైపు వారి వారి దీనస్థితులపట్ల కరుణ కలిగి ఉంటారు. వారు ఈ దృశ్యమంతా "చిత్తము" అనే అద్దంలో ప్రతిబింబించే దృశ్యాలాగానూ, రాత్రి కలలో చేతులతో స్పృశించిన బంగారు పాత్రలులాగాను అసత్తుగా వీక్షిస్తూ ఉంటారు.

జంతువులు దూరంగా ఉన్న చందనపు వృక్షాన్ని గుర్తిస్తాయా? లేదు కదా! అట్లాగే జ్ఞానుల అంతఃకరణంలోని శీతలత్వాన్ని అజ్ఞాని గమనించలేడు, గుర్తించలేడు. పాము అడుగుజాడలు పామే గుర్తిస్తుంది చూశావా? అట్లాగే "జ్ఞేయము" ను ఎఱిగినట్టి పవిత్ర హృదయులగు జ్ఞానులు మాత్రమే జ్ఞానులను గుర్తించగలుగుతారు. ఎందుకంటే సర్వోత్తములగు జ్ఞానులు తమ ఉత్తమ గుణాలను దాచి ఉంచుతారు తప్పితే... ప్రచారం చేసుకోరు. గ్రామాలు గ్రామాలనే కొనగలిగే చింతామణి కలవాడు దానిని రహదారిలో అందరి ముందూ ప్రదర్శిస్తాడా? ఇది కూడా అట్టిదే? తత్త్వజ్ఞులు తమ ఉత్తమ గుణములను తమయందలి గుణదోషములను తొలగించుకోవటానికే

ఉద్దేశిస్తారు గాని... పది మంది చెప్పుకోవటానికి కాదు! ఎందుకంటే ఆత్మజ్ఞులకు ఖ్యాతిపై రాగము ఉండదు. వారు వాసనాశూన్యులై, ద్వైతవర్జితులై ఉంటారు కదా!

జ్ఞానులగు మహాత్ములకు ఏకాంతం సుఖంగా ఉంటుంది. ప్రతిష్ఠ, పూజాదుల పట్ల అభావ నయే ఉంటుంది "ఇవన్నీ నా ఆధ్యాత్మిక యానంలో ప్రతిష్ఠంభనకు దారితీయవచ్చునేమో కదా" అనే శంకయే వారికుంటుంది. దారిద్ర్యం, తదితరుల వలన కలిగే అవమానం మొదలైనవి వారికి సుఖకరాలుగా తోస్తాయి. ఎందుకంటే ఆత్మానుభవ సుఖానికి పూజాగౌరవాలు విక్షేపం కలుగజేసేవి గాను, దారిద్ర్య, అవమానాదులు ఆత్మానుభవ సుఖానికి దోహదం చేసేవిగాను ఉంటాయి కదా!

ఇక ఆత్మజ్ఞుడు తన ఆత్మానుభవ సుఖము ఎట్టిదో అది ఇతరులకు చూపగలిగేది కాదు. "అది ఇట్టిది" అని అతడే నిర్వచించలేడు. ఆతడు "ఈ ప్రాపంచిక విషయములు ఆశకు, దుఃఖానికి అర్హమైనవి కావు" ...అని మాత్రం తదితర జనులకు గుర్తు చేయగలడు.

**గుణం మమ ఇమం జానాతు జనః పూజాం కరోతు మే**
**ఇత్యహంకారిణామీహా, న తు తత్ ముక్తచేతసామ్ ॥**

"నా ఈ గుణములు జనులు ఎఱిగెదరుగాక! నేను పూజింపబడెదనుగాక" ...అనే ఇట్టి భావం అహంకారులే కలిగి ఉంటారు. ముక్త చిత్తులకు ఇతరుల పూజా – ప్రశంసలతో పని లేదు.

ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విద్యలు ప్రదర్శించి పూజింపబడాలని, జనులను ఆకర్షించాలని తమ అజ్ఞానం చేత ప్రయత్నించేవారు కొందరు ఉంటారు.

అయితే... "మంత్రము – ఔషధము" మొదలైన వాటి బలంచేత ఆకాశ గమనము, సుదూర దర్శనం మొదలైన విద్యలు అజ్ఞానులకైనా సిద్ధించవచ్చు. ఎవడు దేని కొఱకై క్లేశాదులను సహించి ప్రయత్నిస్తాడో... ఆతడు ఆయా విశేషాలు కాలక్రమంగా తప్పక పొందుతాడు. అట్టి విశేషాలు జ్ఞానికైనా, అజ్ఞానికైనా సిద్ధిస్తాయి. కాబట్టి అట్టి భౌతిక విద్యలను చూచి ఒకడు జ్ఞాని అని గాని, అజ్ఞాని అని గాని మనం నిర్ణయించలేము. గంధపు చెక్కలో చందన సుగంధం అంతర్గతంగా ఉన్నట్లే ...సర్వుల హృదయాలలో వారు నిర్వర్తించియున్న విహిత – నిషిద్ధ కర్మఫలములు ఉండనే ఉంటాయి. అవి ఆయా కాలానుగతంగా ఆవిర్భవించి ఆ కర్తను ఆశ్రయిస్తాయి. కర్మల గతి అట్టిది. లోకంలో ధనాదుల వంటివే సిద్ధులు కూడా! ఎవనికైతే దృశ్యరూపాలే అయినట్టి సిద్ధులు మొదలుగా గల ఆయా వస్తు వ్యవహారముల పట్ల "ఇవి నేను కూడా పొందాలి" అనే ఆకాంక్ష – ఆవేశము – అభినివేశము పెంపొందుచున్నదో... అది సంసార రూపమే సుమా! "ఈ ఆకాశగమనాది సిద్ధి సమూహమంతా కేవలం మనస్సును భ్రమింపజేసేవి, అల్ప విషయములు మాత్రమే" అవి ఎఱిగి ఎవడు చిదాకాశమునందే లక్ష్య శుద్ధి కలిగి ఉంటాడో... అట్టి వాసనారహితుడగు తత్త్వజ్ఞునకు వాటి పట్ల అభినివేశముగాని, దంభముగాని ఎందుకు ఉంటుంది?

**నైవ తస్య కృతేనాఽర్థో, న అకృతేన ఇహ కశ్చన ।**
**న చ అస్య సర్వభూతేషు కశ్చిత్ అర్థ వ్యపాశ్రయః ॥**

ఆత్మజ్ఞానము సంతరించుకొన్న మహనీయునికి ఈ ప్రపంచంలో వేనినైనా కలిగి ఉండటం చేతగాని, కలిగి ఉండకపోవటం చేతగాని కర్మలు నిర్వర్తించటంచేత గాని, నిర్వర్తించకపోవటం చేత గాని క్రొత్తగా ప్రాప్తించవలసిన ఏ ప్రయోజనమూ కనబడదు. తదితరులైన సర్వుల పట్ల ఆతడు ఏదైనా ఆశించి నిర్వర్తించ వలసినదేదీ అగుపించదు. ఎందుకంటే ఉదారమనోవృత్త చిత్తుడగు ఆ మహనీయుని ప్రలోభపరచ గలిగే వస్తువులుగాని, స్థితి-గతులుగాని ఈ భూలోకంలో (లేక) స్వర్గపాతాళాది లోకాలలో ఏదీ ఉండజాలదు. ఎవనికైతే ఈ దృశ్య జగత్తంతా ఆత్మానుభూతి ముందు తృణప్రాయంగా అనిపిస్తుందో, ఎవనియందు రజోగుణమునకు కించిత్తు చోటు కూడా లేదో... అట్టి ధీరుడగు జ్ఞానికి ఆత్మకు అన్యంగా ఏది కనిపిస్తుంది? అయినా కూడా అతడు లోకం యొక్క సానుకూల్యతను దృష్టియందుంచుకుని ఆయా జగద్వ్యవహారములను పరిపూర్ణ చిత్తంతో ప్రేమాస్పదంగా నిర్వర్తిస్తూ "శిష్టాచారి" అయివుంటాడు. ఆతని అంతఃకరణం సర్వదా ప్రశాంతంగా ఉంటుంది. ఆతడు తదితర ధర్మానుకూలంగాని జగద్విషయాల పట్ల మౌనం వహించినవాడై ఉంటాడు. తదితర సర్వజీవులకు తన ప్రేమ సామ్రాజ్యంలో స్థానం ప్రసాదించినవాడై గంభీరము లైన, ఉత్తమములైన ఆశయాలు కలవాడై తనకు ప్రాప్తించిన ఆయుష్షును ఈ భూతలంపై గడిపివేస్తూ ఉంటాడు. అమృతంతో నిండియున్న సరస్సువలె తనయందు అనిర్వచనీయము, ఈ ప్రపంచమునకు అతీతము అగు ఆనందమును ధరించి ఉంటాడు. "వాళ్ళు అట్టి వారు, వీరు మంచివారు కాదు, వీళ్ళని నమ్మొద్దు, వారితో మాట్లాడకూడదు"... ఇటువంటి వాక్యాలు అల్పజ్ఞుల ముందర నాట్యం చేస్తాయేమోగాని, ఆత్మజ్ఞుల యెదుట అటువంటి వాక్యముల ఊసుకూడా ఉండజాలదు. ఆతడు ఎక్కడుంటే అక్కడ ఆతని సమక్షంలో ఆ పరిసరాలలో అకారణ ఆనందం తాండవమాడుతూ ఉంటుంది. అట్టి జ్ఞానుల సంభాషణచే... ఈ జనుల మనస్సు - బుద్ధి ఎట్లా విప్పారుతుందో, అట్లా విప్పారడం దేవలోకంలోని నందన వనంలో కూడా సాధ్యపడేది కాదు.

వివేకి అయినవాడు తత్త్వవేత్తల ఆశయములలోని సారము గ్రహించి తన జీవితమును సార్థకం చేసుకొంటాడేగాని, వారి భావ - అభిప్రాయాలను ఎగతాళి చేసి సంసారాగ్నులకు తనను తాను ఆహుతి చేసుకోడు. అట్టి ఆత్మజ్ఞులగు మహనీయుల వాక్యములు విన్నప్పుడు మాత్రమే తదితరులకు - "ఈ సంసారము అపారమైనది. ఈ ప్రపంచం భ్రాంతిపూర్వకము అసన్మయము" ...అనే విషయాలు తెలియవస్తాయి. వారి వాక్యములు విన్న వివేకి తప్పక క్రమక్రమంగా తన ప్రాపంచిక కోర్కెలను సన్నగిల్లజేసి శాశ్వతానందం వైపుగా మరలే ప్రయత్నమును తన ఈ మనస్సుకు నేర్పుచున్నాడు. అవివేకి సారాసారము లేమిటో తెలియక, ఆ వాక్యములు విననైనా వినకుండా తనను తాను 'సంసారం' అనే నూతి అడుగుభాగము వైపుగా త్రోసుకొనిపోవుచున్నాడు సుమా!

ఇంకా విను... 'చలి-ఉక్క' ఇటువంటి శారీరక బాధలు పొందుచున్నప్పుడు జ్ఞాని వాటిని "ఎవరిదో దేహంలో ఇవన్నీ ఏర్పడుచున్నాయి" అన్నట్లుగా ఉంటాడు. ఎందుకంటే ఆతని దృష్టిలో ఈ దేహం తానుగాని, తనదిగాని కాదు. పూలత ఇతరుల కొరకై ఫల-పుష్పాలను ధరిస్తుంది చూచావా? అట్లాగే జ్ఞాని సర్వక్రియలు తదితరుల సంతోష, సానుకూల్యతలకొఱకై సర్వదా ఉద్దేశిస్తూ

ఉంటాడు. తాను ఏదో పొందటం తనకు ముఖ్యం కాదని, తదితర జీవుల సుఖ–శాంతి–ఆనందాలే తనకు కలిగే సంపద అని ఆతడు జ్ఞాన దృష్టిచే నిర్దిష్టమైన అవగాహన కలిగి ఉంటాడు.

**వ్యవహారం యథాప్రాప్తం లోక సామాన్యమాచరన్**
**చరాచరాణాం భూతానామ్ ఉపర్యేవ అవతిష్ఠతే ॥**

ఆయా యథాప్రాప్తములైన లోక సామాన్యమైన ఆయా పనులను నిర్వహిస్తూనే... మరొకవైపు ఈ చరాచర సర్వభూతజాలమును అధిగమించిన స్థానంలో వెల్లివిరిసి ఉంటాడు. 'ప్రజ్ఞ' అనే మేడను ఎక్కి సర్వలోక వ్యవహారములను వీథిలో ప్రయాణించే వాహనములను చూచునట్లు ఉంటూకూడా, తదితర జనుల కష్టాలు చూచి దుఃఖసహితుడైనట్లు కనిపిస్తాడు. ఎత్తైన కొండ ఎక్కి క్రింద జనసమూహములను చూస్తున్న విధంగా ఇక్కడి సర్వ సంబంధ – బాంధవ్యాలను సందర్శిస్తూ ఉంటాడు. ఆతడు ఇతఃపూర్వం 'భ్రమ' అనే సముద్రంలో "కామ క్రోధములు" అనే తరంగములలో పయనించి ఉండవచ్చు గాక! ఆత్మజ్ఞాని అగుచుండగా, తీరమును పొందిన తరంగమువలె, ప్రశాంత మనస్కుడై ఉంటాడు. పూర్ణచంద్ర కిరణములను బోలిన ప్రేమమయ వాక్కులతో ఈ జగత్తులో సంచరిస్తూ ఉంటాడు. అందరినీ ఆత్మ స్వరూపులుగా ఎరిగినవాడై పరమ విశ్రాంతిని అనుభవిస్తూ ఉంటాడు. ఇప్పుడాతను తన యొక్క పూర్వకాలికమైన సంసార పరిస్థితులను, వృత్తులను జ్ఞాపకం చేసుకొని తన ఇతఃపూర్వపు అజ్ఞానం చూచి తానే నవ్వుకొంటూ ఉంటాడు. అట్లాగే తదితర అజ్ఞాన జీవులు అల్ప విషయముల కొఱకై "భ్రమ, ఆవేశం, రాగం" కలిగి ఉండటం చూచి "అయ్యో! వీరు తెలియక ఇట్లు ఖేదం చెందుచున్నారే!"... అనే కరుణను, "విషయాల అల్పత్వము, పరిమితత్వమును, దోషత్వమును వీళ్ళు గమనించటం లేదు కదా?"... అనే హాస్యమును ఒకే సమయంలో కలిగి ఉంటాడు. "ఆహాఁ! ఇంతకాలం అడవిలో దారి తప్పిన గ్రుడ్డివానిలా ఈ సంసారంలో ఎలా చరించాను? నన్ను ఈ తుచ్ఛ అల్ప విషయాలు ఎందుకు ఆకర్షించాయి? ఈ భోగ–మోహ –క్రోధాలలో ఎట్లా సంచరించాను? పోనీలే! ఇప్పటికైనా నాకు ఆత్మదృష్టి అలవడి ఈ జగత్తంతా ఆత్మ స్వరూపంగా తెలియవస్తోంది" అని జ్ఞాని విస్మయ ఆశ్చర్య వర్తమానానందాలతో చమత్కారంగా నవ్వుకుంటూ ఉంటాడు. "ఏఏ ధనాదులు గొప్ప విషయాలని ఇంతకాలం నేను భ్రమించానో అవన్నీ తృణప్రాయములని, అల్ప కాలికములని, ఆత్మజ్ఞానం ముందర 'సూర్యుని ముందటి దివిటీ' వంటివని ఇప్పటికి గమనించాను కదా!" ...అని లోలో పరమానందభరితుడై ఉంటాడు.

కానీ ఆతనికి గర్వం ఏమాత్రం ఉండదు. తనతో సహా సర్వ చరాచర జగత్తు ఆత్మ స్వరూపమని దర్శిస్తూవుండగా ఇక గర్వము యొక్క ఊసు ఎక్కడిది? తన ఆత్మస్వరూపం సర్వదా తనదే అయివుండగా, ఇప్పుడు క్రొత్తగా గర్వించవలసిన దేముంటుంది? ...ఇంత కాలం ఏమరచినందుకు కించిత్ సిగ్గు పడవలసిందిపోయి?

❖

ఓ రామచంద్రా ! ఇక "జ్ఞానులు ఎక్కడెక్కడ ఉంటారు?" ...అనే నీ ప్రశ్నకు వద్దాం.

"జ్ఞాని ఇక్కడ ఉంటాడు. అక్కడ ఉండడు" అని నిర్ధారించటం ఏమాత్రం కుదిరే విషయం కాదు. "మంచివాడు ఈ గ్రామంలో ఉంటాడు. ఆ జాతిలో ఉండడు" ...అని ఎవరైనా సిద్ధాంతీకరించగలరా? జాతి, వస్త్రధారణల వంటి విషయాలు మంచితనమును నిర్వచించలేవు కదా! జ్ఞానం కూడా అట్టిదే ! అయితే ఈ జగత్తులో జ్ఞానులు తప్పక ఉన్నారు. అట్టి ఆత్మ స్థితి అనుభవించే జ్ఞానులలో... ఒకడు పర్వత గుహలలో ఉండవచ్చు. ఒకడు పుణ్యస్థల – పుణ్యాశ్రమములలో నివసించవచ్చు. ఇంకొకడు గృహస్థాశ్రమంలో తారసపడవచ్చు. మరొకడు సంచారము సల్పుతూనో, భిక్షాటనం చేస్తూనో ఉండవచ్చు.

లేదా, ఏకాంతవాసుడుగానో, తాపసిగానో, ఉపన్యసిస్తూనో, మౌనం దాల్చియో, వ్యవహార పారాయణుడుగానో, ధ్యాన పరాయణుడుగానో, విఖ్యాత పండితుడుగానో, నిరక్షరకుక్షిగానో, వేద వేదాంగాలు ఎఱిగి పఠించు వాడుగానో, శ్రుతి–స్మృతులను శ్రవణం చేస్తూనో, బ్రాహ్మణ–క్షత్రియ –వైశ్య–శూద్రులలో ఒకడుగానో, కళాపోషకుడుగానో, పామర రూపంతోనో, రాజఠీవితోనో, ఆచారాలను శ్రద్ధగా అనుసరిస్తూనో, ఆచారాలన్నిటినీ విడచివైచినవాడు గానో, వేదవేత్తలలో అగ్రగణ్యుడుగానో, ఒక పిచ్చివాడులాగానో, సన్యాసిగానో, మరింకే రూపంగానో ఉండవచ్చు.

కాబట్టి జ్ఞాని ఇక్కడ – ఇట్లా – ఈ రీతిగా మాత్రమే ఉంటాడని మనమెవరం చెప్పలేం.

❖

'ఆత్మ' లేక 'పురుషుడు' ఈ శరీరాదులుగా అవటమే లేదు సుమా! అది ఈ మనస్సు, చిత్తము మొదలైనవి కూడా కాదు. ఈ దేహమును – చిత్తమును కదిలించే చేతనా తత్వమే ఆత్మ. అది ఎప్పుడూ జనించటంలేదు, నశించటమూ లేదు.

**అచ్ఛేద్యో ఽసావదాహ్యో ఽసావక్లేద్యో ఽశోష్యఏవచ ।**
**నిత్యః సర్వగతః స్థాణుః అచలో అసౌ సనాతనః ॥**

అట్టి చైతన్యము దేనిచేతా ఛేదింపబడదు, దహించబడదు, తడుపబడదు, ఎండించబడదు. అది నిత్యము, సర్వవ్యాపి, స్థాణువువలె నిశ్చలము, సనాతనము. అట్టి సర్వమును కదిలించే చైతన్యమే ఈ జీవుని వాస్తవరూపం. అట్టి చైతన్య పురుషుని ఎఱిగిన జ్ఞాని 'పురుషోత్తముడు' అవుతాడు. అట్టి జ్ఞాని ఎప్పుడెక్కడ ఎట్లు ఉంటాడో... అట్లే ఉండుగాక! ఈ ఈ వర్ణాశ్రమ ధర్మాలు, స్థానాలు, నియమములు ఆతనికి కలిగించే ప్రయోజన – నిష్ప్రయోజనములు ఏమున్నాయి? ఆతడు సర్వ ప్రయోజన – నిష్ప్రయోజనములకు అతీతుడై ఉంటున్నాడు.

ఓ రామచంద్రా! నిర్మలాత్ముడగు జ్ఞాని పాతాళంలో ప్రవేశించవచ్చు గాక! ఆకాశంలో ఎగురుచుండవచ్చు గాక! దిక్కులలో పరిభ్రమిస్తూ ఉండవచ్చుగాక! ఎక్కడో లోకాలోక పర్వతాలలో చూర్ణమగుచుండవచ్చుగాక! దేహము కలిగి ఉండవచ్చు! ఇప్పుడే దేహంపోతూ ఉండవచ్చుగాక! దేహరహితుడై ఉండవచ్చుగాక! ఆ చిన్మాత్రుని స్వరూపము నశించదు, మార్పు చెందదు, సర్వదా యథాతథంగానే ఉంటుంది. ఆతడు సర్వదా, సర్వ స్థితిగతులతోనూ నిరతిశయమగు చిన్మయానంద

శివపదము అధిరోహించియే ఉంటాడు. తన యథాతథ స్వస్వరూపమును సందర్శిస్తూ తెంపులేకుండా ఆనందభరితుడై ఉంటున్నాడు.

❖❖❖

## 2. చైతన్యము యొక్క నిత్యత్వము - ఏకత్వము - స్వాతంత్ర్యము

**శ్రీరాముడు :** మహర్షీ ! ఒకడు ఏది తెలుసుకొనిన తరువాత జ్ఞానిగా అగుచున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శాంతము, అఖండము, నిత్యము, ఏకము, సర్వము, నిత్య నిర్మలము, అప్రమేయము – అగు నిజచైతన్య స్వరూపమును ఎఱిగినప్పుడే ఈ జీవుడు 'జ్ఞాని' అగుచున్నాడు. ఆ నిజ చైతన్యమునే "చిన్మాత్ర పురుషుడు" అని కూడా అంటున్నారు. ఓయీ జీవుడా నీ వాస్తవ స్వరూపము ఎట్టిదో గ్రహించు ! సంసార సాగరము దాటి వేయటానికి, అజ్ఞానము తొలగటానికి అదొక్కటే మార్గము, ఉపాయము, ఆత్యంతికము కూడా! నీవు చిన్మాత్ర పురుషుడవే గాని ఈ దేహాదులు కానే కాదు సుమా!

**చిన్మాత్ర పురుషుడు -**

**శ్రీరాముడు :** అట్టి "చిన్మాత్ర పురుషుడు" అని చెప్పబడే ఈ జీవుని నిజ చైతన్య స్వరూపము ఎప్పుడు ఎందులోంచి ఉదయించింది? అట్టి ఉత్పత్తి స్థానం గుర్తించటం, గమనించటం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! సర్వజీవులు ఈ జాగ్రత్‌లో ఈ జగత్తును అనుభవిస్తున్నారు కదా! సర్వ ఆశలు, భోగాలు, మమత్వాలు (నావి, నీవి అను భావోద్రేకాలు), నిరాశలు మొదలైన అనేక భావాభావములు అనుభవిస్తున్న ఈ జాగ్రత్ అనేది జీవునియొక్క త్రివిధావస్థలలో ఒకటి మాత్రమే!

ఇక ఈతని రెండవ అవస్థ 'స్వప్నము' – ఈతడు ఈ దేహము ఈ పాంచభౌతిక ప్రపంచంలో ఉండి ఉండగానే... దీనిని నిరసించి, కేవలం మనస్సుతో జగత్ కల్పనను మనస్సులోనే నిర్వర్తించుకుని అనుభవం పొందుచున్నాడు. జాగ్రత్ సమయంలో స్వప్నం "లేనిది, అవాస్తవమైనది, కల్పిత మాత్రము" అగుచున్నది. ఆయా సమయాలలో మాత్రం ఆ యొక్క జాగ్రత్, ఆ యొక్క స్వప్నము కూడా – 'సత్యం' అను ఉద్దేశం, భావన, అనుభవాలతో కూడి జీవునిచే పొందబడుతోంది.

ఆపై మూడవ అవస్థ 'సుషుప్తి'. అందులో భావంగాని, అభావంగాని ఉండటం లేదు. ఆ జీవుడు 'ఊహ – లేక భావన' కట్టిపెట్టి తన ఒకానొక మౌన స్థితిని తానే పొందుచూ కాలము, స్థానము, ఆలోచనాదులకు అతీతమైన స్థితిని అనుభవించుచున్నాడు.

ఒకే జీవునికి ఈ మూడు అవస్థలు కలుగుచున్నాయి కదా! అనగా, ఈ జీవుని ఒకానొకతత్త్వం ఈ మూడు అవస్థలలో ప్రవేశము, నిష్క్రమణము సల్పుతున్నదన్నమాటేగా! అట్టి మూడు అవస్థలకు కేవలం సాక్షి అయి ఉంటూ, తాను మాత్రం ఆ మూడు అవస్థలకు వేరై ఉన్నట్టిదే ఈ జీవుని చిన్మాత్ర స్వరూపము.

అట్టి చిన్మాత్రము త్రివిధ అవస్థలయందు సాక్షిగానే కాకుండా, కేవలం ప్రకాశ మాత్రము. (ఆయా విషయములను ప్రకాశింపజేయుచు, తాను మాత్రం స్వయం ప్రకాశకము). అది అనాది, అనంతము, జన్మ-మృత్యు రహితము అయి ఉన్నది.

అట్టి చిన్మాత్ర స్వరూపమే ఈ పురుషుడు (జీవుడు). కాబట్టి ఈ పురుషుడు నాశరహితుడు. చిన్మాత్రమే నశిస్తే ఇక అది ఎట్లా ఉత్పన్నమౌతుంది? సాక్షియే లేకపోతే ఉత్పత్తి / సృష్టి ఎక్కడి నుండి వస్తుంది?

**శ్రీరాముడు :** అట్టి స్వస్వరూప - త్రివిధావస్థల సాక్షి చైతన్యమును ఉద్దీపించే మరొక చైతన్యమేది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్టి నిజరూప చైతన్యము స్వయం ప్రకాశకం అని చెప్పుకున్నాం కదా! దానిని ప్రకాశింపజేసే (వెలిగింపజేసే) మరొక చైతన్యమేదీ ఎవరికీ ఎక్కడా సంభవింపజాలదు సుమా! ఎందుకంటావా? ఆ చిన్మాత్ర చైతన్యం అగ్ని-దీపం వంటిది కాదు... మరొకరు వెలిగించటానికి! అట్టి చైతన్యం అనుభవమాత్రం అయివున్నది. అది భూత-వర్తమాన-భవిష్యత్తులను ప్రకాశింపజేస్తూ ఆ మూడు సమయములందు తాను యథాతథంగా స్వయంప్రకాశమానమై ఉన్నదని గ్రహించు. సర్వ అంశాలపట్ల అనుభవముల పట్ల సమానత్వముచే వర్తించే 'ఆ స్వస్వరూప చైతన్యము' నకు భిన్నమైనదేదీ ఎక్కడా లేనే లేదని గ్రహించు.

ఇక ఆ చైతన్యమునకు "ఈ జీవుడు - ఆ జీవుడు" అనే జీవాజీవ భేదం లేదు. ఏకైక చిన్మాత్ర చైతన్యమే సర్వ జీవులలోనూ సర్వజీవులుగానూ ఉన్నది. అనగా, ఒక జీవుని నిజ చైతన్యమే మరొక జీవుని నిజ చైతన్యముగా కూడా అయి ఉన్నది. ఒకనికి మంచు చల్లగాను, అగ్ని ఉష్ణముగాను, పాలు తీయగాను అనిపించినట్లే మరొకనికి కూడా అనిపించటం జరుగుతోందికదా! "చైతన్యము అందరిలోనూ ఒక్కటే"... అని అట్లే సూక్ష్మదృష్టితో గ్రహించు.

చైతన్యమునకు రూపం లేకపోయినప్పటికీ ఈ కనపడే రూపములన్నీ ఆ చిత్ చైతన్యమే! కనుక సర్వదా త్రివిధావస్థల యందే కాక సర్వజీవుల యందు 'సాక్షి' యగు చైతన్యమే తానై ఉండగా ఇక ఈ జీవుడు దుఃఖం పొందవలసిన పని ఏమున్నదో నాకు చెప్పు?

**శ్రీరాముడు :** మహాత్మా! కానీ ఈ జీవుడు ఎందుకో "ఈ దేహమే నేను! ఇది నశించిందా, నేనే నశిస్తాను"... అని మృత్యువును తలచుకొన్నప్పుడల్లా దుఃఖితుడగుచున్నాడు! "శరీరము నశిస్తే జగత్తు కోల్పోబడుతుంది"... అని భ్రమిస్తున్నాడు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**శరీరనాశే నాశశ్చేత్ చిన్మాత్రస్య తదుచ్యతామ్ ।**
**హర్షస్థానే విషాదః కిం? మరణే సంసృతి క్షయే ॥**

ఈ శరీరము నశించినపుడు ఒకవేళ తన చిన్మాత్ర దేహమే నశిస్తుందనుకొంటే (చార్వాకమతం), అప్పుడు మరణము సంసార క్షయమే కాబట్టి ఇక హర్షించవలసిన చోట ఆతడు దుఃఖించవలసిన పనేమున్నది?

అది అలా ఉంచి... ఒక భవనం నేలకూలినంత మాత్రం చేత అక్కడి ఆకాశం నశిస్తుందా? లేదు. అలాగే దేహం నశించినా దేహిచైతన్యం నశించదు, నశించేది కాదు. ఇందుకు దృష్టాంత మంటావా?... తమ బంధువు నశించినప్పుడు కొందరు (మ్లేచ్ఛులు) ఆ బంధువు యొక్క పిశాచ రూపము గాంచుచున్నారు కదా! మరికొందరు ["సోది – మంత్రద్రష్టల సాయంతో ఆ బంధువులు మరణించిన వానితో – (పిశాచదేహంతో) సంభాషణ మొదలైనవి నిర్వర్తిస్తున్నారు కదా!]

**శ్రీరాముడు :** మహనీయా! "శరీరం ఉన్నంత వరకే చైతన్యం ఉంటుంది. శరీరం నశిస్తే చైతన్యం నశిస్తుంది" అనేది లోకంలోని ఒక అభిప్రాయం కొందరు (చార్వాకులు) కలిగి ఉంటున్నారు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "శరీరం ఉన్నంత వరకు చైతన్యం ఉంటుంది" అనేదే వాస్తవమైతే శవం కదలటంలేదేమి? అక్కడ శరీరం ఉన్నది కదా? కనుక "శరీరం ఉంటే చైతన్యం ఉంటుంది. శరీరం నశిస్తే చైతన్యం కూడా నశిస్తుంది" అనునది యుక్తియుక్తం కాదు. ఎందుకంటే శరీరం కదిలేది. ఇక చైతన్యమో "కదిలించేది". తాను కదలక సర్వమును (శరీర–మనో–బుద్ధి–అహంకార –ఆలోచన–భావనాదులను) కదిలించేదే 'చైతన్యము' అను శబ్దముతో ఉద్దేశింపబడుచున్నది సుమా!

**శ్రీరాముడు :** స్వామీ! "మరణించిన పిశాచజీవునితో ఆతని బంధువులు సంభాషించటం" – అనేది వారి స్వభావ సంబంధము. వారికి ఆ మరణించిన వానితో ఉన్న అనుబంధమునుండే అటువంటి సంభాషణ మొదలైనవి భ్రమ రూపంగా జరుగుతూ వుంటాయి ...అని కొందరి అభిప్రాయం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! బంధువుతో గల సంబంధమే అట్లు మరణానంతర పిశాచ జీవునితో సంభాషణకు కారణమగుచున్నదనా వారి అభిప్రాయం? అట్లా అయితే మంత్రద్రష్టలకు మరణించిన బంధువులతోనే సంభాషణ కుదురుతుంది గాని, బ్రతికియే ఉన్న దూరదేశంలో ఉన్న బంధువుతో అటువంటి సంభాషణ కుదరటంలేదే? ఓ రామచంద్రా! దేహం నశించినంత మాత్రం చేత దేహి చైతన్యం నశించేది కాదు. చైతన్యము యొక్క భేదము (మరొక రీతిగా ఉండటం) గాని, అద్దాని వినాశనము గాని సంభవించేవి కావు.

వాస్తవానికి ఈ దేహిచైతన్యం నిత్యమైనది. అంతేకాకుండా సర్వాత్మకమైనది కూడా సుమా! అది వస్తుకృతమైన పరిచ్ఛేదముచే నియమింపబడేది కాదు. ఇక ఈ జగత్తు ఏమిటంటావా?...

ఆ చిత్ చైతన్యము దేని దేనిని ఎట్లెట్లు ఏఏ దేశ–కాల–అనుభూతులుగా నిర్వచించుకుంటూ ఎఱుగుచున్నదో అచ్చటచ్చట అయ్యది స్వస్వరూపమునే అట్లట్లు దర్శించటం జరుగుతోంది. ఆ దర్శనమే 'జగత్తు' అను పేరుకు గల నామ – రూప – అర్థాదులు సుమా!

**శ్రీరాముడు :** నిర్మలము, శుద్ధము, అప్రమేయము, అఖండము, అనంతము – అగు స్వస్వరూప సంవిత్తు – ఈ ఈ జగత్తులను పొందవలసిన అవసరమేమున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చిద్ఘనమగు సంవిత్తు (స్వస్వరూప ఘనీభూత సంవిత్తు) సత్య సంకల్పి. అనగా తాను దేనిని 'సత్యం' అని భావిస్తుందో అది అట్లే సత్యంగా పొందుతూ ఉంటుంది. అయినా కూడా ఈ జగత్తు' అనబడు "స్వయంభావిత ప్రాప్తము" చే అది సర్వదా అబాధితమే సుమా! అట్టి స్వయం

ప్రకాశక సంవిత్తు సృష్ట్యాది యందు ఏ రీతిగా అయితే స్వసంకల్పముచే అగుచున్నదో, ఆయా రీతి గానే నేటికీ అనుభూతమౌతూ ఉన్నది. ఎందుచేతనంటావా? అది అద్దాని స్వభావమే అయి ఉన్నది. బంగారమునకు ఏదో ఒక ఆకారం అనేది ఉండటం స్వభావ సిద్ధమే కదా! అట్లాగే ఇది కూడా!

ఇక ... సత్య సంకల్పయుక్తమగు బ్రహ్మ సంవిత్తునందు సృష్ట్యాదియందు ఆ బ్రహ్మ సంవిత్తు కంటే వేరుగా జగత్తుగాని, మరొకటి గాని ఉత్పన్నమవటానికి అన్యమైన కారణమేదీ సంభవించ జాలదు బ్రహ్మనికి అన్యంగా సృష్ట్యాదిలో సృష్టి కొఱకై ఏ కారణమూ లేదు. కాబట్టి బ్రహ్మం బ్రహ్మం గానే ఉన్నది. కారణరహితకార్యం ఎక్కడా ఉండదు కదా! కాబట్టి ఈ సృష్టి బ్రహ్మమే అయి ఉన్నది.

ఈ విధంగా అకారణమగు జగత్తు మొదలే ఉత్పన్నం కాలేదు. అనగా బ్రహ్మము అప్పటి సృష్ట్యాదిలో వలెనే నేడూ ఉన్నది. చిన్నది – పెద్దది అగు వికల్పత్వమేదీ సృష్ట్యాదిలో ఉత్పన్నం కాలేదు. ఉత్పన్నమయినట్లుగా కనిపించేదంతా బ్రహ్మమే! అనగా బ్రహ్మమే అట్లు స్వసంకల్పము యొక్క కల్పనా విశేషముచే రూపనామాదుల కల్పనా విశేషంగా తనకుతానై ఈ విధంగా దర్శిస్తోంది. అట్టి దర్శనమే సంసారము.

ఓ రామచంద్రా! ఏదైతే దృశ్యంగా ఎఱుగబడుచున్నదో ...అదంతా కూడా చైతన్యం యొక్క వివర్తరూపమేనయ్యా! అయితే ...ముత్యపు చిప్పలో వెండి ఉన్నదా? మృగతృష్ణలో జలం ఉన్నదా? లేదు. అయినా ఉన్నట్లే వెండి–జలం అజ్ఞాన–అపరిశీలనాత్మక దృష్టికి అగుపిస్తాయి కదా! అట్లాగే చైతన్యంలో జగత్తు అనబడునది లేకపోయిన్పటికీ... ఉన్నట్లే అజ్ఞాన దృష్టికి అనిపిస్తోంది. పాముగా కనిపించేదంతా 'త్రాడు' యే అయినట్లు ఇక్కడ జగత్తుగా కనిపించేదంతా నిర్వికారమగు నిర్మల పరబ్రహ్మమేనయ్యా! ఉత్తమమగు చిదాకాశము యొక్క చమత్కార రూప చాతుర్యమే ...ఈ దృశ్యం.

అట్టి "జగత్తు" అనబడేది జాగ్రత్–స్వప్నముల బోధకు దృశ్యమానమగుచున్నది. ఇక సుషుప్తి యందో? "బోధ" (ఎఱుక) ఉండదు కాబట్టి ఎఱుగబడటంలేదు. ఓ రామచంద్రా! బోధ, అబోధ – ఈ రెండూ కూడా నిరామయమగు చైతన్యం యొక్క రూపాలేనయ్యా! "బంగారపు ఆభరణం" లో బంగారం–ఆభరణం... ఈ రెండూ అభేదమే కదా! అట్లాగే చైతన్యం, దృశ్యం, ఈ రెండూ అభేదా లైనవే! వాస్తవానికి దృశ్యం లేదు. చైతన్యమే ఉన్నది. "మరి పదార్థముల దృశ్యత్వం ప్రాప్తిస్తోంది కదా! మాకు దృశ్యం కనిపిస్తోంది... మీరు లేదంటారేం"?... అని ఎవరైనా అంటారేమో?... ఓ ప్రియమిత్రమా! ఏ (పాదార్థిక) దృశ్య వ్యవహారం కనిపిస్తోందో... అదంతా కూడా చిత్ తత్త్వమును గూర్చిన అవిచారణచేతనే అట్లు అగుపిస్తోంది సుమా! మరి అట్టి అవిచారణచే ఏదేది అనుభవానికి వచ్చి కూర్చుంటుందో, అదంతా కూడా విచారణచే తప్పక నశించగలదు. ఆపై ఇక్కడ చైతన్యమే తాండవిస్తూ కనిపించగలదు గాని, ఇక దృశ్యం కాదు.

కాబట్టి ఓ జనులారా! మీ మీ బుద్ధి "ఆత్మజ్ఞాన విచారణ" అనుదానియందే తీవ్ర యత్నముచే నియమించబడుగాక! సర్వ ప్రయత్నములచే గావించబడే విచారణ... అనే అభ్యాసం ఇహ – పరలోకాలలో సిద్ధిదాయకం అగుచున్నది.

❖❖❖

# 3. అభ్యాసము యొక్క ఆవశ్యకత

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా!

**అవిద్య ఉపశమస్తి ఏష జాతోఽపి భవతామిహ**
**అభ్యాసేన వినా, సాధో! న సిద్ధిమ్ ఉపగచ్ఛతి॥**

సాధుపుంగవుడవగు ఓ రామచంద్రా! సర్వసభికులారా! మీరంతా ఈ వినే ఉపదేశ వాక్యములచే అవిద్య ఉపశమించవచ్చుగాక! అంతమాత్రానికి సరిపోతుందనుకుంటున్నారా? లేదు. "జీవన్ముక్తి యందు ప్రతిష్ఠ" ...అనే సిద్ధి అభ్యాసము లేకపోతే సంభవించేది కాదు.

**శ్రీరాముడు :** హే ప్రభూ ! 'అభ్యాసము' అనునది మరికొంత వివరంగా ఆజ్ఞాపించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ముముక్షువు "శమము (ఇంద్రియాలను అదుపులో ఉంచటం)" ...అనేది అభ్యసించాలి. క్రమంగా భయమును, సోమరితనమును లోకచింతనలను విడనాడాలి. విచారణ చేయాలి. గురువాక్యములపై, శాస్త్ర వాక్యములపై ఏకాగ్రతతో ధ్యానం చేయాలి. ఆత్మజ్ఞానం ప్రబోధించే ఈ మహా రామాయణ శాస్త్రమును ప్రతి రోజు కొంతసేపు విచారణ చేయండి.

**అధ్యాత్మ శాస్త్ర ప్రశంస -** సందర్భోచితం కనుక ఈ వసిష్ఠ – రామ సంవాద రూపమైన అధ్యాత్మ శాస్త్ర ప్రశంసను ఈ అయోధ్యా రాజ్య సభామధ్యంలో ఇప్పుడు సభికులందరికీ విన్నవిస్తాను.

❖

ఓ సభికులారా! ఆత్మజ్ఞానము మీలో కొందరికి తెలిసి ఉండవచ్చుగాక! అయినా కూడా దృశ్య జగత్తులోని ఈ జీవితం "అసంభావన" మొదలైన ఆయా దోషములతో కూడుకొని ఉండటం జరుగుతోంది. అందుచేత ఆత్మజ్ఞానము గురించిన నిరంతర చింతనాభ్యాసం, పరస్పరబోధకథనము మొదలైనవి సర్వదా ఆవశ్యకం! అట్టి అభ్యాసం లేకపోతే దైనందిన సంసారాభ్యాసంచేత ఆత్మజ్ఞాన విద్య మఱువబడుతూ, మఱుగునపడటం జరుగుచున్నది. అందుచేత ఈ మన సంభాషణ గ్రంథస్థమై భావికాలంలో కూడా శ్రవణానందము, శ్రవణాభ్యాసము కలిగించునుగాక!

ఒకడు ఏ వస్తువును అభిలషిస్తాడో, ఆ వస్తువు కొఱకే ఆతని ప్రయత్నము – అభ్యర్థన – భావన కొనసాగుతూ ఉండటం సహజం. అయితే శ్రమకు సిద్ధపడి ప్రయత్నమును కొనసాగించకపోయాడా ...అభిలషిత వస్తువు లభించదు కదా! అట్లాగే ఆత్మజ్ఞానం సముపార్జించాలనుకొనేవాడు ఇట్టి ఆధ్యాత్మ శాస్త్ర గ్రంథములను నిరంతరం పరిశీలిస్తూనే ఉండాలిగాని, "ఈ ఈ విషయములు తెలిశాయి కదా! ఇంకెందుకు చదవటం, పరిశీలించటం, మననం చేయటం, యోచించటం?" ...ఇటువంటి అభిప్రాయములతో 'పరిశీలన–అవగాహన' అనే ప్రయత్నములను విడచివుండటం ఉచితం కాదు. మనస్సును ఆక్రమించటానికి పూర్వాభ్యాసరూపమైన సంసార భ్రమ సర్వదా వేచి ఉంటుందని గ్రహించి ఆత్మజ్ఞానాభ్యాసమును నిరంతరం కొనసాగించటమే ఉచితమని మా అభిప్రాయం.

కాబట్టి ఓ జనులారా! క్రమక్రమంగా మీరంతా అనాత్మశాస్త్ర అభ్యాసమును త్యజించుచూ ఆత్మతత్త్వ ప్రతిపాదకాలగు సచ్ఛాస్త్రములను పఠించి విచారణ కొనసాగిస్తూనే ఉండండి. ఒకవైపుగా బద్ధకము, క్రోధము, ఆవేశము, తప్పులుచూడటం ఇత్యాది దుర్గుణములను త్యజిస్తూ మరొకవైపు సచ్ఛాస్త్ర పఠనం కొనసాగిస్తూ రాగా, అనతికాలంలో యుద్ధం చేసి జయించి విజయలక్ష్మిని చేపట్టినట్లుగా... అజ్ఞానాభిప్రాయములను శమింపజేసి శాంతిని తప్పక సొంతం చేసుకోగలరు.

**వివేకే చ అవివేకే చ వహతి ఏషా మనోనదీ,**
**యత్రైవ వాహ్యతే యత్నాత్, తత్రైవ స్థితిమృచ్ఛతి ॥**

ఈ 'మనస్సు' అనే నది వివేకము-అవివేకము అను రెండు వైపులా ప్రవహిస్తోంది. అందు ఒక వైపు ప్రవహించటాన్ని ప్రయత్నపూర్వకంగా నిరోధించామా, అప్పుడు ఈ మనో నదీజలం రెండవ వైపుగా వేగంగా తనంతటతానే ప్రవహించగలదు. మానవుడు వివేకము కొఱకై శ్రద్ధాసక్తులతో ప్రయత్నిస్తూ ఉంటే అవివేకము తనంతట తానే తొలగిపోగలదు. అట్టి వివేక సాధనలలో ఆధ్యాత్మ గ్రంథ పఠనం, పరిశీలన, మనోగతం చేసుకోవటం అనేది ఒకానొక ఉత్తమమైన సాధన.

**అస్మాత్ శాస్త్రాదృతే శ్రేయో న భూతం, న భవిష్యతి**
**తతః పరమబోదార్థమ్ ఇదమేవ విచార్యతామ్ ॥**

ఈ 'మహా రామాయణము' అని పిలువబడబోయే మన 'సంవాదమును' పఠించటం ఒకానొక ఉత్తమ సాధన కాగలదు. కనుక పరమబోధ కొరకై దీనిని జనులు చక్కగా విచారణ చేయుదురుగాక! ఇద్దాని విచారణ కలుగజేయగల శ్రేయస్సు అనిర్వచనీయం, అనన్య సామాన్యం. ఇట్టి శాస్త్రవిచారణను మించినదేదీ భూత-భవిష్యత్తులలో ఎక్కడా లేదు. ఈ శాస్త్రాన్ని విచారణ చేస్తూ రాగా, ఇక ఇద్దాని ప్రభావం చేత సంసార మార్గంలోని శ్రమ అంతా తొలగిపోగలదు. ఈ శాస్త్ర పరిశీలనా సమయంలోనే ఆత్మతత్త్వబోధ సుబోధకం కాగలదు. అంతేగాని ఇది వరశాపాదులులాగా మరింకెప్పటికో ప్రభావం కలుగజేసేది కాదు. ఓ ప్రియ జనులారా! ఏ శ్రేయస్సు అయితే తల్లిగాని, తండ్రిగాని, ఆయా కర్మ వ్యవహారాలు గాని కలిగించలేవో అట్టిది ఈ శాస్త్రము యొక్క విచారణచే ఇప్పటికిప్పుడే కలుగగలదు.

❖

ఓ రామచంద్రా! ఈ సంసార బంధం (దృశ్యమునకు సంబంధించిన అజ్ఞాన దర్శనం) ఉంది చూచావు? ఇది విషం వలె, విషజ్వరంవలె అతి భయంకరమైనది. అనేక జన్మల దురభ్యాసవశం చేత ఘనీభూతమై ఉన్నది. అజ్ఞానంచే రూపుదిద్దుకున్న సంసార మహమ్మారి ఆత్మజ్ఞానం పొందనంత వరకూ ఎన్నటికీ తొలుగగలిగేది కాదు సుమా! ఓ ప్రియజనులారా! అట్టి ఈ సంసారం - అంతరంగం నందే 'అహంకారం' అనే ఒకానొక దీర్ఘరోగం రూపంలో తిష్ఠ వేసుకొని ఉన్నది. అట్టి అహంకార రూప మహామోహం అనే మహమ్మారి ఆత్మజ్ఞానం వినా ఎన్నటికీ నశించేది కాదు. ఆకలి గొని ఉన్న సర్పం వృథాగా గాలిని నాకి, తన ఆకలి తీరకపోగా, అత్యంత శ్రమను తెచ్చిపెట్టు కొంటుంది చూచావా? శాస్త్రార్థములను భావన చేయకుండటం చేత, విచారించని కారణం చేత ఈ జీవుడు మహాదుఃఖాలన్నీ మోస్తూ జీవిస్తున్నాడు. ఓ జనులారా! శూన్య విషయ సమూహములతో

కూడిన ఈ దుర్భర - సంసారమునకు తగల్కొని జీవితమును వృథా చేసుకొనవద్దని నా మనవి. ఎందుకంటే ఈ సంసారమునకు అంతులేదని గ్రహించండి. ఆహా! ఏమి కష్టం! వృథా సంభాషణలతో, ముందు ముందు "ఖేదము" కలిగించగల వృథా చేష్టలతో రోజులు వ్యర్థంగా గడిచిపోవుచుండగా, ఈ జీవులు అది గమనించటమేలేదే! ఆయుస్సును ఎవరైనా నమ్మి ఉండవచ్చునా? మృత్యువు ఎదురుగా కాచుకొని ఉండి ఈ దేహమును ఎప్పుడు చేపట్టుకొని - నోట కరచుకొని పోనున్నదో ఎవరం చెప్పగలం?

కాబట్టి ఈ దేహం పడిపోకముందే ఆత్మజ్ఞాన ప్రదమగు శాస్త్రాలను పరిశీలించి ఆత్మతత్త్వమును అతి శీఘ్రంగా సముపార్జించుకొని ఉండటం మంచిది కదా! సమయం అతి స్వల్పమనే ప్రతి జీవుడు అనుకొని ఉండటం మంచిది. మృత్యువు సమీపించక ముందే ఆత్మజ్ఞాన శాస్త్రమును హృదయంలో పదిలపరచుకోవటం అత్యవసరం. మృత్యువు ఆసన్నమైనపుడు ఇక చేసేదేమున్నది? ఈ కాళ్ళు చేతులు కదిలించలేని స్థితిలో శాస్త్ర పరిశీలన కుదురుతుందా? లేదు, కుదురదు. ఆహా! ఏం ఆశ్చర్యం! ఈ జనులు ఘనీభూతమైన భ్రమతో కూడుకొన్నవారై ధన-జన-అభిమానముల కొరకై యుద్ధాదులలో ఈ దేహాన్ని- ప్రాణాలను కోల్పోవటానికి కూడా సిద్ధపడుచున్నారే గాని... శాస్త్రములు ప్రబోధించే శ్రవణ-మనన-వివేక- వైరాగ్యాదులను అభ్యసించి తత్త్వబుద్ధిని సంపాదించ టానికి ఉపక్రమించుటయే లేదే! జన్మ-జరా- దుఃఖ వర్జితమగు 'మోక్షము' అనే పరమశాంత స్థానము సంపాదించుకోవటానికి ఏమాత్రం సిద్ధపడటం లేదే?

ఇక్కడ వివేకులు అన్ని శక్తియుక్తులను ఉపయోగించి స్వతత్త్వ జ్ఞానమును అవధరించినవారై చిదాకాశమున సంస్థితిని సంపాదించుకుని ఉంటున్నారు. ఇక అజ్ఞానుల విషయానికి వస్తే వారు యుద్ధంలో మహావీరులై ఉండి కూడా (లేక ఆయా ప్రాపంచిక విషయములలో ప్రావీణ్యము కలిగి ఉండి కూడా) సర్వోత్కృష్టమగు ఆత్మతత్త్వశాస్త్రమును ఉపేక్షించి తమ శిరముపై అజ్ఞాన శత్రువు పాదములు మోపునట్లుగా చేసుకుంటున్నారే? యుద్ధము - కార్యనిర్వహణల యందు దక్షులై ఉండి ఈ అజ్ఞాన శత్రువు యొక్క పాదఘట్టములను పొందుతూ బాధలు పొందుచున్నారేగాని "అజ్ఞాన శత్రువును జయించటం ఎట్లా?" ...అని యోచించరాయే!

**నిర్మాన-మోహమ్-ఆపన్నా గతిం గచ్ఛత మా౭ధమామ్ ।**
**క్రియతే స్వాత్మ బోధేన మూలకాషో మహాపదామ్ ॥**

ఓ సభికులారా! మీరంతా మానమోహములనే దుష్ట మార్గంలో పయనిస్తూ అధమము - దుఃఖమయము అగు సంసారభూములను బడయకండి. తత్త్వమును గ్రహించి 'మోక్షము' అనే పవిత్ర స్థానమును జేరటమే జీవితాశయంగా కలిగివుండండి. 'ఆత్మజ్ఞానము' అనే మహత్తర ఔషధం సర్వ మానసిక రుగ్మతల నుండి, ఆపదల నుండి మిమ్ములను కాపాడగలదు.

**ప్రలపన్తమ్ అహోరాత్రమ్ యుష్మదర్థేన మామిమమ్ ।**
**యం ప్రదృశ్యేదమ్ ఆకర్ణ్య స్వాత్మనైవ ఆత్మతార్ప్యతామ్ ॥**

అందుకనే 'కంఠశోష' అనే గొప్ప శ్రమకు ఓర్చి అవతారమూర్తి అగు ఈ "రామచంద్రునికి జ్ఞాన బోధ" అనేది మిషగా పెట్టుకొని మీ కొఱకై ఆత్మజ్ఞానమును ఎలుగెత్తి గానం చేస్తున్నాను. అఱచుచు బోధిస్తున్న నన్నవలోకించి నా ఈ వచనములు శ్రద్ధగా ఆదరముతో విని, స్వయముగా ఈ దేహాదులందు ఆత్మబుద్ధిని తొలగించుకోండి.

**అద్యైవ న చికిత్సాం యః కరోతి 'మరణ ఆపదః'**
**సంప్రాప్తాయాం మృతౌ మూఢః కరిష్యతి కిం ఆతురః?**

ఎవడైతే 'మరణము' అనే అతి సమీపంలో ఉన్న ఆపదకు ఇప్పుడే 'ఆత్మజ్ఞానము' అనే ఔషధం సేవించటం ద్వారా చికిత్స పొందడో... అట్టి మూఢుడు, అనివార్యము – అకాలనిర్ణయము – అనిర్దేశ్యము అగు మృత్యువు శరీరమును ఆక్రమిస్తూ ఉండగా ఇక చేయగలిగినదేముంటుంది? అట్టి ఆత్మజ్ఞానము ప్రసాదించగల శాస్త్రములలో ఈ వసిష్ఠ రామాయణము తలమానికము వంటిదని మా మనవి. కొబ్బరినూనెను కోరేవారు కొబ్బరిని, నువ్వులనూనె కోరేవారు నువ్వులను ఆశ్రయించాలి కదా! అట్లాగే మోక్షము కోరేవారు ఈ మహారామాయణ మోక్ష శాస్త్రమును పరిశీలించటం సముచితం. ఈ గ్రంథం చీకట్లో వెలిగే దీపంలాగా మీయందు జ్ఞానజ్యోతిని వెలిగించగలదు. తండ్రి వలె బోధించగలదు. స్త్రీ వలె ఆనందింపజేయగలదు. మీలో ప్రతి ఒక్కరిపట్లా నిత్యప్రాప్తమే అయివున్న ఆత్మ గురించిన జ్ఞానం బోధించటమనేది దుర్బోధకం (బోధించటానికి కష్టముతో కూడుకొన్నది) అయివున్నది. అయినా కూడా, అట్టి ఆత్మజ్ఞానాన్ని సులభంగా తెలుసుకోవటానికి వీలుగా ఆత్యంతిక విషయాన్ని ఏమీ దాచకుండా సుస్పష్టంగా, నిర్దుష్టంగా మీ ముందు ఉంచటానికి ప్రయత్నిస్తున్నాను. "శాస్త్రముల ఉద్దేశం–లక్ష్యం" అయిన ఆత్మజ్ఞానాన్ని సుబోధకంగా విశదీకరిస్తూ వస్తున్నాను. అనాది నుంచి వస్తున్న తత్త్వవేత్తల ప్రవచనములను, అనుభవాలను, సంప్రదాయములను అనుసరించి అందుకు విరుద్ధమైనదంటూ ఏదీ లేకుండా ఈ శాస్త్ర పాఠ్యాంశమును తీర్చిదిద్దుతున్నాను. ఆత్మజ్ఞానం బోధించటమనేది కష్టతరమే అయినప్పటికీ ఈ ఆఖ్యాయికను మనోరంజకంగా ప్రతిపాదించటానికి ప్రయత్నిస్తున్నాను. ఈ శాస్త్రమును చక్కగా విచారణ చేశారా... తప్పనిసరిగా మీరు 'ఆత్మబోధ' ను పొందగలరు. ఇందులో అనుమానం లేదు. ఏ ఆత్మజ్ఞానమైతే శాస్త్రపాండిత్యము కూడా ప్రసాదించ జాలకున్నదో అట్టి ఆత్మ విద్య – బంగారుగని నుండి బంగారము లభించినట్లుగా – ఈ యోగ వాసిష్ఠ మహా గ్రంథమునందు లభించగలదు. శాస్త్రకర్తలో సంశయం ఉండనప్పుడే ఉత్తమ శాస్త్రం ఆవిర్భవిస్తుంది. యుక్తియుక్తము, స్వానుభవపూర్వకము అగు ఈ శాస్త్రం పాఠకులకు ఉపాయ పూర్వకంగా "ఆత్మానుభవం" అనే మధుర పరిమళమును ప్రసాదించగలదు. ఈ సభకు వేంచేసి శ్రోతలై పాల్గొనుచున్న ఈ విశ్వామిత్ర – నారదాది అనేక మంది మహనీయుల "స్వయమాత్మానుభవం" ఈ మన సంవాదంలో ప్రకాశిస్తూ, వారి జ్ఞానదీపం ఇద్దానిని ఎంతగానో ప్రకాశింపజేస్తోంది సుమా!

ఎవరైనా అజ్ఞానము చేతనో, మాత్సర్యము చేతనో, మోహము చేతనో ఇందలి శాస్త్రార్థసారాన్ని తిరస్కరించ పూనుకొంటే, అట్టివారు విచారణహీనులగు ఆత్మహంతకులని మా అభిప్రాయం. వారితో మైత్రి కలిగి ఉండకపోవటమే మంచిదేమో! వారి శ్రేయోభిలాషులమగు మేము వారిని

స్వాంతన – ప్రశాంతతలతో కూడిన సునిశిత చిత్తముతో ఇదంతా పరిశీలించి, అటుతరువాత స్వనిర్ణయం చేయవలసినదిగా మేము అభ్యర్థన చేస్తున్నాం.

❖

రామచంద్రా! శ్రోతలగు ఈ సభికులు, నీవు, భావిపాఠకులు ఎటువంటి అధికార విశేషణాలు కలిగి ఉన్నారో, మీ బుద్ధులు ఎంతవరకు శ్రవణ – ధారణ – అభ్యాసములకు సమర్థమై ఉన్నాయో గ్రహించియే, నేను ఈ ఆత్మజ్ఞాన శాస్త్రమును ఆయా కథన చర్చలను ఏర్చి కూర్చి ఇక్కడ మీ ముందర వివిధ రీతులుగా ప్రతిపాదిస్తున్నాను. నేను ఆత్మ శాస్త్రమును ప్రబోధించటానికై నా తండ్రిగారైన బ్రహ్మదేవునిచే నియమించబడినవాడను. జనుల భాగ్యోదయం చేతనే ఆ సర్వాంతర్యామిచే ప్రేరితుడనై ఈ ఆత్మజ్ఞాన శాస్త్రమును ఈ అయోధ్యా సభామధ్యంలో బోధించటానికి ప్రవృత్తుడనవటం జరుగుతోంది. ఇక్కడి సభికుల – భవిష్యత్ పాఠకులపై గల అవ్యాజమైన ప్రేమయే నా ఈ ఆత్మజ్ఞాన శాస్త్ర విశేషాలు పలకటానికి నా పట్ల ప్రేరేపణ అయివున్నది. "మోక్ష శాస్త్రం గ్రహించాలి. జీవిత పరమావధిని తెలుసుకోవాలి" ...అని ఎవరెవరు ఆశ్రయిస్తారో... వారి పట్ల కరుణ – దయాళుత్వం – ప్రేమ అనేది మా స్వభావం అయి ఉన్నది. లేక, మరొక విధంగా... మీ యొక్క శుద్ధము–సూక్ష్మము అగు ఆత్మయే మీ పుణ్యవశంచేత ఈ ప్రకారంగా ఈ మీ శ్రీ వసిష్ఠ రూపందాల్చి, మీతో మిత్రత్వం వహించి ఈ బోధకు కారణమగుచున్నదని కూడా గ్రహించి ఉండండి. అంతేగాని, వాస్తవానికి నేను ఒక మనిషినో, దేవతనో, గంధర్వుడనో, రాక్షసుడనో మరొక వ్యక్తియో కాదు.

ఓ సర్వజనులారా! నేను ఆత్మ స్వరూపుడను. నావలెనే మీరందరూ కూడా ఆత్మయే స్వరూపముగా కలిగివున్నవారే! మీ యొక్క నిర్మలమగు ఆత్మయే రూపముగా గల నేను మీ యొక్క పుణ్య విశేషం చేత ఈ అవతారమూర్తి రామచంద్రునితో సంవాద రూపంగా ఈ ఆత్మజ్ఞాన శాస్త్రాన్ని విడమర్చి విశదీకరించటం జరుగుతోంది. ఓ ప్రియ మమాత్మ స్వరూపులారా? మీయొక్క ఆత్మకంటే కించిత్ కూడా నేను వేరైనవాడిని కాదు.

మీ ఆత్మయే నేను. నా ఆత్మయే మీరంతా! కాబట్టి, అంధకారమయములగు ఆధి–వ్యాధులు, మరణ దినములు సమీపించక పూర్వమే నన్ను ఆప్తునిగా ఎఱిగినవారై నా ఈ వాక్యమును వినండి. సర్వ పదార్థముల పట్ల – దృశ్య వ్యవహారముల పట్ల వైరాగ్యం సంపాదిస్తూ ఆత్మ జ్ఞానమునకు అర్హులై అట్టి జ్ఞానం సముపార్జించండి.

❖❖❖

# 4. నరక వ్యాధికి చికిత్స

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ సంసార జీవుని 'వస్తు దృష్టి' అనే ఒకానొక మానసిక వ్యాధి అనేక జన్మలుగా పట్టి పీడిస్తోంది.

**ఇహైవ నరకవ్యాధేః చికిత్సాం న కరోతియః ।**
**గత్వా నిరౌషధం స్థానం స రుజః కిం కరిష్యతి ॥**

ఎవడైతే "జగత్తుపట్ల భౌతిక దృష్టి" అనే మానసిక రుగ్మతారూపమైన నరకవ్యాధికి తగిన చికిత్సను ఇక్కడ, ఇప్పుడు ఆశ్రయించడో, అట్టివాడు 'జ్ఞానము' అనే పాథ్యాంశ ఔషధం లభించని స్థానాలకు పోయి, నరక రోగ బాధితుడై ఇక ఏం చేద్దామనుకొంటున్నాడు?

**శ్రీరాముడు :** మహాత్మా! అట్టి "భౌతిక దృష్టి" అనే నరకమార్గ రుగ్మత జీవునకు తొలిగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** భౌతికమైన మనోదృష్టికి పదార్థముల పట్ల గల వాసనలే మూలం. ఎంతవరకైతే సర్వ పదార్థములపట్ల వైరాగ్యం పొందబడదో... అంతవరకు ఆయా పదార్థములకు సంబంధించిన వాసన అంతరంగంలో సన్నగిల్లదు. ఓ రామచంద్రా! ఆయా వస్తు సంబంధమైన వాసనలను సన్నగిల్ల చేయటం తప్పించి ఆత్మోద్ధరణకు వేరే ఉపాయమేదీ లేదు!

**ఆసక్తియే అనర్థం -** పదార్థములు సత్యమే అయితే వాటిపట్ల ఆసక్తి, వాసనలు యుక్తమే! కాని అవి 'కుందేటి కొమ్ములు' వలె భ్రమచే దర్శించబడుచున్నాయి. ఇక వాటి పట్ల ఆసక్తి ఎందుకు? ప్రపంచంలోని పదార్థాలన్నీ కూడా పరమాణువుల సమాగమమే కాబట్టి వాటి యందు నిత్యమైన సత్యమంటూ ఏదీ లేదు. అయితే, విచారణ చేయని కారణంగా మాత్రమే అవి రమణీయంగా అనిపిస్తున్నాయి. విచారించి చూస్తే అవన్నీ కాలక్రమేణా మరొక రీతిగా ఉండబోవుచున్నాయి. కాబట్టి వర్తమానంలో కనిపించే రామణీయకత మనోభ్రమ మాత్రమే! అందుచేత ఇక్కడి సర్వ విశేషముల పట్ల "ఇతఃపూర్వం వీటి రూపు ఏమిటి? ఇక ముందు ఏమికానున్నాయి?" ...అని పూర్వాపరములను విచారణ సల్పి వీటిలోని అనిత్యత్వం గమనించి ఉండటం మంచిది. విచారణ చేస్తే అప్పుడు రమణీయంగా భాసించేవన్నీ నీళ్ళలో ప్రతిబింబించే చందమామలాగా అసద్రూపములుగా తెలియవస్తాయి. ప్రామాణిక విచారణ చేయబడినప్పుడు ఏదైతే సత్వహోగా లేనిదే అని తెలియవచ్చుచున్నదో ...అట్టి భ్రమాత్మక వస్తుజాలం – "ఏ స్వరూపం గలిగి ఉన్నాయి? అవి ఏకవస్తు రూపములా? అనేక వస్తు రూపములా?" – ఇటువంటి ప్రశ్నలు తమంతట తామే తోక ముడుస్తాయి. సృష్ట్యాదిలో 'జగత్తు' అనబడేది ఉదయించటానికి కారణమే ఉండజాలకున్నది. ఏదైతే జగత్తుగా భాసించుచున్నదో ...అది నిర్విషయమగు బ్రహ్మమే అయివున్నది.

ఈ కనబడే జగత్తు అనబడేది మనస్సుతో కూడిన ఇంద్రియములకు విషయము. ఇక బ్రహ్మమో సర్వేంద్రియములకు మనస్సుకు అతీతమైనది. ఆధారం అయినది.

తెలియబడే విషయాలన్నిటికీ కారణం మనస్సుతో కూడిన పంచేంద్రియములు కాజాలవు. ఎందుకంటే అవి స్వతఃగా చేతనములు కావు కదా! ఆత్మ నిర్వికారము, కాబట్టి ఈ విషయాదులకు కారణము కాదు. ఈ విధంగా ఈ జగత్తు అకారణము. ఇంద్రియములకు అతీతమైన చిన్మాత్రమగు బ్రహ్మమున ఇంద్రియములుగాని, ఇంద్రియ విషయములుగాని ఉండజాలవు.

చూచావా! రామచంద్రా! నామరూప సహితమగు ఈ అనుభవమగుచున్న జగత్తుకు కారణము నామరూప రహితమగు బ్రహ్మము కాజాలదు. ఎందుకంటే వస్తువునందు అవస్తుత్వము ఉండనట్లే, బ్రహ్మమునందు పదార్థములకు చోటులేదు. సాకారమగు ఒక మట్టి విత్తనము నుండి సాకారమగు

మట్టి వృక్షం బయల్వెడలవచ్చు. నిరాకారమగు బ్రహ్మము నుండి సాకారమగు వస్తుజాలం (జగత్ వ్యవహారం) ఎట్లా ఉద్భవిస్తుంది చెప్పు? సర్వోత్కృష్ట పదమగు బ్రహ్మమునందు కార్య – కారణ – భావాదులు ఏమీ ఉండజాలవు. "కాదు. ఉన్నాయి?" అని అనిపించటమనేది అభ్యాసవశం చేత బ్రహ్మము పట్ల ఏర్పడియున్న దోషదృష్టియేనని సిద్ధాంతీకరించబడుతోంది. అట్టిది "కుందేటికి కొమ్ములు ఉన్నాయి. బంగారంలో ఆభరణత్వమున్నది. స్వప్నభవనానికి పునాదులు ఉన్నాయి"... వంటి వాక్యముల వలె వాచాలత్వం వంటిదే! మూర్ఖ బుద్ధికి "వారు, వీరు, నావారు, నీవారు, నాది, నీది, సంబంధాలు, బాంధవ్యాలు ఉన్నాయి" అని అనిపించవచ్చు గాక! అయితే అవి ఎందుచేత లేవో సుస్పష్టమయ్యే ఉంటోంది.

నిరాకార బ్రహ్మము సాకార జగత్తుకు కారణం కాజాలదు. బ్రహ్మము తప్పితే జగత్తుకు మరింకే కారణం ఉండజాలదు. దృష్టాంతంగా... మట్టిలో తయారుచేయబడిన సైనికుని బొమ్మలో – మట్టి సైనికుని ఆకారంలా అవటంలేదు. మట్టి సర్వదా మట్టిగానే ఉన్నది. సైనికునిగా కనిపించేదంతా మట్టే! మట్టిని సైనికునిగా చూచుచున్నది మనో అభ్యాసమే!

ఈ విధంగా సహకారి కారణం లేకుండా కారణము నుండి కార్యము ఎన్నటికీ కలుగజాలదు. బ్రహ్మము నుండి జగత్తు ఆవిర్భవించటానికి సహకారి కారణం లేదు. కనుక బ్రహ్మము బ్రహ్మముగానే ఉండి 'విజ్ఞత' కొఱవడిన ద్రష్టలకు బ్రహ్మముగా కాకుండా... జగత్తు అనబడు అనేక వస్తు–వ్యక్తి –సంఘటన విశేషములతో కూడి ఉన్నట్లు కనిపించటం మాత్రం జరుగుతోంది. సూర్యరశ్మి యందు ఛాయ ఉండగలదా? అట్లాగే నిరాకార బ్రహ్మమునందు సాకార జగత్తు ఉండజాలదు. అందుచేత జగత్తుగా కనిపించే దానిని బ్రహ్మముగా దర్శించటం అభ్యసించటమే సముచితం. అదియే "బ్రహ్మీ దృష్టి". అదియే "ఆత్మజ్ఞానం".

**శ్రీరాముడు :** స్వామీ! "ఈ జగత్తుకు కారణమే లేదు" అని అనే బదులు, "పరమాణువుల సమూహమే ఈ జగత్పదార్థములన్నీ. కాబట్టి, జగత్తుకు పరమాణువులు కారణం" ..... అని అనుకోవచ్చును కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! పదార్థములన్నీ పరమాణువుల వివిధ సమావేశములే అయినప్పటికీ "ప్రియము, అప్రియము, మనది, వారిది, కోరదగినది, తొలగతగినది" ...అనే హావభావాల కల్పనను సమకూర్చుకొని కదా, జనులు ఈ జగత్తును దర్శిస్తున్నారు! హావభావాలు లేకుండా 'జగత్తు' అనబడేది ఎవరూ పొందటం లేదు. అట్టి హావభావాలకు పరమాణువులు కారణమా? కాదు కదా! కాబట్టి "పరమాణువుల సమూహమే మాచే అనుభవించబడే జగత్తు" ...అని ఎవరైనా అనుకుంటే "పదార్థంలో గల రుచి – నాలుక యందు గల ఆ రుచిని ప్రియ – అప్రియములుగా నిర్ణయించి ఆస్వాదించే నాలుక"... అనునది సోదాహరణగా తీసుకుంటే పదార్థ పరమాణువుల – నాలుక పరమాణువుల ప్రియాప్రియములకు సంబంధించిన సానుకూల్య – ప్రాతికూల్యాలు ఎట్లా ఒనగూడుతున్నాయి? ఈ శరీరముల ఉత్పత్తి, ఉనికి, ప్రవృద్ధి, శిథిలం,

వినాశనాది – ధర్మాలకు కారణం కేవలం పరమాణువులే ఎట్లా కాగలుగుతాయి? కాబట్టి "పరమాణువులే ఈ జగత్తుకు కారణం" – అనే మాట "కుందేటి కొమ్ములు ఎక్కుపెట్టిన విల్లువలె ఉంటాయి" అనే వాక్యంలాగా అజ్ఞానముచే చెప్పబడేదే అవుతుంది.

**పరమాణు సమూహశ్చేత్ సంభూయ కురుతే జగత్ ।**
**యదృచ్ఛయైవ తమసి శీర్యతే చ యదృచ్ఛయా ॥**

పరమాణువులే గనుక, "తమకు ఇష్టం వచ్చినట్లుగా ఈ జగత్తును నిర్మిస్తున్నాయి" అని, "అవి తమ ఇష్టం వచ్చినట్లే ఆకాశంలో నశిస్తున్నాయి" అని అనదలచుకొంటే, అప్పుడు నీవు – నేను – వస్తుధర్మాలు మొదలైన వాటిని నిర్వచించటమెట్లా? ఒక వేళ ఈ జగత్తు యొక్క అవయవములైన పరమాణువులు ఆకాశంలో పడుతూ లేస్తూ సంచరిస్తున్నాయని అనదలిస్తే ప్రతిరోజు ఉదయం లేచి చూచేటప్పుడు ఇల్లు ఇల్లుగాను, దేశం దేశంగాను, పర్వత శిఖరం పర్వత శిఖరంగాను, దేహం దేహంగాను మాత్రమే ఎట్లా ఉంటున్నాయి?

పైగా పరమాణువుల అవయవాలు ఎవరికీ కనబడటంలేదు, కిటికీగుండా ప్రసరించే సూర్య కిరణాలలోని త్రసరేణువులు – వాటి యొక్క సమావేశ రూపమైన అవయవాలకు పోలిక ఎక్కడ?

"అవయవ రూపమగు ఈ రూపముల సూక్ష్మరూపము నిరవయవమగు పరమాణు తత్త్వమే" అని అనుమానించబడుతోంది. "నిరవయవమగు దాని ఇష్టంచే అవయవ రూపమగు వస్తుజాలం నిర్మించబడుతోంది" అని అనటానికి కారణముగాని, వ్యవహార క్రమముగాని ఎవరికీ కనపించటం లేదు కదా! అది "ఆకాశపుష్పం" అనే శబ్దం వంటిది. శూన్యాకాశంలో పుష్పం ఎక్కడిది? అతీంద్రియాలగు పరమాణు సంయోగంచే జగద్రచన కావించబడటమనేది ఎవరి కర్మ? అట్టి కర్తృత్వము సంసారిదా? అసంసారిదా?

సంసారియగు ఏ జీవుడో అది చేస్తున్నాడనటానికి అట్టి సామర్థ్యం ఏ ఒక్క జీవునికో లేదనటం సుస్పష్టమే కదా!... పోనీ 'అసంసారిది' అని అనుకుందామా? అప్పుడు అసంసారియగు పరమాత్మ జడపదార్థములను నిర్మించే మరొక జడపదార్థము వంటివాడే అగుచున్నాడు. ఈ సంసారి – అసంసారులలో అసంసారియగు పరమాత్మ నిత్యముక్తుడు కదా! అట్టి నిత్యముక్తునికి ఈ జగన్నిర్మాణం చేయటం వలన ప్రయోజనం ఏముంటుంది?

నిష్ప్రయోజన శీలుడగు పరమాత్మకు జగత్తును నిర్మించటంలో ప్రయోజనము లేదు. కనుక ఇట్టి కర్తృత్వము ఆయనకు ఆపాదించలేం. ఇక జడములగు పరమాణువులే స్వయంగా ఈ అనేక వస్తు ధర్మములతో కూడిన జగత్తును నిర్మిస్తున్నాయా? అది యుక్తియుక్తమెట్లా?

**న అబుద్ధిపూర్వకం తత్కర్మ సంభవతి అంగకస్యచిత్**
**బుద్ధిపూర్వం తు యత్ వ్యర్థం కుర్యాత్ ఉన్మత్తకో హి కః ॥**

మనస్సుచే ఊహించటం కూడా కుదరనట్టి అచింత్యమైన – అత్యద్భుతమైన రచనలతో కూడిన ఈ జగత్తు ఎవడో అబుద్ధిపూర్వకంగా రచించాడనటానికి వీలులేదు.

ఇక బుద్ధిపూర్వకంగానే ఎవడో రచించాడందామా, అంతటి బుద్ధి గలవాడు వ్యర్థంగా – ఏ ప్రయోజనమూ ఉద్దేశించకుండా ఈ చిత్ర విచిత్ర జగత్తు రచించాడంటే, ఏ పిచ్చివాడు ఇంత చిత్ర విచిత్ర జగత్తును నిష్కారణంగా రచిస్తాడు?

**శ్రీరాముడు :** స్వామీ! ఈ జగత్తు తనంతటతానే 'ప్రకృతి సిద్ధంగా జనించినదని, దీనికి ఎవరూ కర్త కాదని కొందరు మీమాంసకులు (నాస్తిక మతస్థులు) అభిప్రాయపడుచున్నారు.

**శ్రీవసిష్ఠ మహర్షి :** జడమగు వాయువుకు తనకు తానే బుద్ధిపూర్వకంగా 'చేష్ట' సంభవించదు కదా! వాయువుల చేష్ట లేకపోతే వాయి పరమాణువుల సంచయం జరుగదు. కాబట్టి పరమాణువులను దగ్గరగా ఉంచి, తద్వారా జగత్తును ప్రదర్శించబడటానికి కారణభూతమయ్యేది పరమాణువులు కాదు. ఈ విధంగా... జడములగు వాయువు పరమాణువులు మొదలైనవి జగత్తుకు కారణం కాదు. నిర్వికల్పుడు, అప్రమేయుడు, నిత్యముక్తుడు, ప్రాప్తాపాప్త ఉద్దేశములకు అతీతుడు – అగు పరమాత్మ జగత్తుకు కారణం కాదు. ఇక ప్రళయకాలంలో జీవసమూహమంతా దేహరహిత మైపోతోంది కాబట్టి సృష్ట్యాది యందు జగత్తుకు కర్తయే లేదని తెలియవస్తోంది.

ఈ విధంగా ఈ జగత్తుకు కర్తయే లేదు కాబట్టి ఈ జగత్తు సృష్టించబడనిదే అగుచున్నది. అనగా 'జగత్తు' అనబడేది ఏ ఒక్క సమయమునందు సృష్టించబడలేదని గ్రహించబడుగాక!

**శ్రీరాముడు :** హే మహర్షీ! "ఈ జగత్తుకు కర్తయే లేదు. కనుక జగత్తు అనునది ఉత్పన్నమే అయివుండలేదు" – అనేదే మనం గమనించవలసియున్నప్పుడు... ఇక, సప్తర్షి మండలములో సప్తర్షులలో ఒకరుగా విరాజిల్లే మీరెవరు? అయోధ్యా నగర చక్రవర్తి కుమారుడనగు నేనెవడను? ఈ నా సోదరులెవరు? మనమంతా ఎవరిమైయున్నాము? మనమంతా ఈ జగత్తులో ఉన్నామా? లేమా? లేని జగత్తులో ఉన్న మనమంతా ఎవరం?

❖❖❖

## 5. మనమంతా చిదాకాశ స్వరూపులమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు – నేను – తదితరులు – మనమంతా కూడా చిదాకాశ స్వరూపులమే! ఎఱుకయే మన రూపం. ఇక చిదాకాశ రూపులమగు మనం ఈ పాంచభౌతిక జగత్తులో ఉండటమంటావా? నీ స్వప్నంలో కనిపించే మనుష్యులు, ఇళ్ళు, కొండలు ఆ స్వప్నచిత్ యొక్క రూపములే అయినట్లు మనమందరమూ చిదాకాశము యొక్క స్వరూపులమే అయివున్నాం.

**తస్మాత్ న జాయతే కించిత్ విశ్వం నాఽపి చ విద్యతే ।**

**ఇత్థం చిన్నభేవాచ్ఛం ప్రకచ్ఛతి ఆత్మనాత్మని ॥**

కనుక ఓ రాఘవా! ఈ ప్రపంచమేదీ ఉత్పన్నం అవటంలేదు. విద్యమానమై (తెలియబడుచున్నదై) ఉండుటయులేదు. మరి? నిర్మల చిదాకాశమే ఈ సమస్త రూపముగా తనయందు తానే స్ఫురించుచున్నది.

దృష్టాంతం... స్వప్నద్రష్ట యొక్క చిత్-రూపమే స్వప్న విశేషములుగా స్వప్న ద్రష్టకు అగుపించునట్లు! వాయువులో స్పందం (చలనం) అభిన్నంగా ఉన్నట్లు ...జలంలో ద్రవత్వం, అభిన్నంగా ఉన్నట్లు ...ఆకాశంలో శూన్యత్వం అభిన్నంగా ఉన్నట్లు ... "చిదాకాశమున జగదాకాశం, నీయందు నీకు దర్శనమయ్యే జగత్ దృశ్యం" - ఉభయమూ చిదాకాశమునకు అభిన్నరూపంగా మహా విశ్రాంతితో ఉన్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! మనమంతా చిదాకాశరూపులమే - అనునది ఆత్యంతిక పరమ సత్యం గాను, యుక్తియుక్తంగాను ఉన్నది. అయితే, మనందరి వాస్తవ స్వరూపం అయిన "చిదాకాశము" యొక్క స్వరూపం ఎట్టిది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చిదాకాశం 'అనుభవం' అనే దానికి మునుముందే, అద్దానికి ఉత్పత్తి స్థానమై ఉన్నది. ఈ జీవుల జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల అనుభవమంతా జలంలోని తరంగంలాగా అద్దానియొక్క చమత్కార రూపమే. ఆకారంలేని జలానికి తరంగాకారం అగుపిస్తున్నట్లు, అనుభవానికి ఆవల నిరవయవి - నిరనుభవశీలియగు చిదాకాశమే అనుభవ రూపానికి అకారణంగా కారణం అగుచున్నది. ఇక అద్దాని స్వరూపమంటావా?

**దేశాత్ దేశాంతర ప్రాప్తౌ నిమేషేణ అతిదూరతః**
**సంవిదో యత్ వపుర్ మధ్యే చిత్వ్యోమ్నో విద్ధి తత్ వపుః ॥**

ఓ రామచంద్రా! ఒక ప్రదేశంలో నిలబడి ఉండగా దూరంగా ఉన్న మరొక ప్రదేశం వైపుగా మన దృష్టి క్షణకాలంలో వెళ్ళుచున్నదనుకో... ఆ రెండు ప్రదేశాల మధ్య ఉన్నట్టి నిర్విషయ సంవిత్ జ్ఞాన స్వరూపమేది కలదో ...అదియే చిదాకాశము యొక్క స్వరూపమని గ్రహించు.




అట్టి నిర్విషయ సంవిత్జ్ఞాన రూపమగు చిదాకాశమే సమస్త పదార్థముల యొక్క పరమార్థ స్వరూపమై ఉన్నదని గ్రహించు. కాబట్టి, జగత్తు యొక్క పరమార్థ రూపం చిదాకాశమే!

ఈ జగత్తు చిదాకాశ రూపమే గాని శూన్యాకాశరూపం కాదు. ఆ చిదాకాశము యొక్క తనకంటే ఏమాత్రం భిన్నంకానట్టి (తనకు అన్యము, అద్వితీయం అయిన) కించిత్ భావనా స్రవంతి

యొక్క శీఘ్ర పరివర్తనా రూపమే ఈ జగత్తు యొక్క రూపం. అనగా, చిదాకాశ రూపుడవగు నీ యొక్క అభిన్న భావనా సంబంధిత వివర్తరూపమే నీకు అనుభవమయ్యే ఈ జగత్తు సుమా! ఏ జీవుడు ఏ జగత్తులను అనుభవిస్తున్నాడో అదంతా కూడా – ఆతని చిదాకాశరూపపు అభిన్న భావనా స్రవంతి యొక్క వివర్తరూపమే ఈ "భౌతిక జగత్" ప్రాప్తి రూపంగా వివర్తం పొందుతోంది. అట్టి వివర్తత్వమనేది కూడా త్రాడును చూచి 'పాము' అనుకొని భ్రాంతి పొందటం వంటిది (సర్ప –రజ్జు భ్రాంతి). వాస్తవానికి చిదాకాశం యథాతథమేగాని, 'జీవుడు' గా వివర్తం పొందుటయే లేదు.

ఈ విధంగా వాయువు, అద్దాని స్పందముల వలె – జగత్తుకు, చిదాకాశమునకు భేదమనేది ఎన్నడూ లేదు. అట్టి చిదాకాశము రెండు విషయముల మధ్యగల దృష్టి యొక్క నిజస్వరూపమై ఉన్నది. నిర్విషయమగు "ఆ చిత్ స్వరూపమే సర్వ భూతముల యొక్క స్వభావరూపం" – అని గ్రహించి జ్ఞానులు సర్వత్రా ఆ నిర్విషయ జ్ఞాన స్వరూపాన్నే దర్శిస్తూ ఉంటారు. హరి – హరుడు వంటి మహనీయులకు కూడా! అట్టి నిర్విషయ చిదాకాశమే నిత్య ధ్యానరూపమై ఉండగా, అద్దాని నుంచి వారు చలించటంలేదు.

ఈ కనబడే ప్రపంచమంతా కూడా చైతన్యం యొక్క అభాసరూపాకాశమే అయివున్నది. "ఈ ప్రపంచం ప్రకాశించటం అనేది చిత్ యొక్క ప్రభావం మాత్రమే! కాబట్టి ఈ జగత్తు చిత్స్వభావముచే వాస్తవానికి ఆకార రహితము, అవ్యయము అని కూడా చెప్పవచ్చు. పరమార్థంగా చూస్తే ఈ జగత్తు అనేది ఎన్నడూ ఉద్భవించనూ లేదు. ఇప్పటికీ లేదు. ఇక ముందు ఉద్భవించబోదు. ఆకాశము కంటే శూన్యత్వం వేఱుకానట్లు, – ఈ జగత్తు చిదాకాశము కంటే వేరైనది కాదు.

ఏ ప్రపంచమైతే (ప్ర+పంచము = పంచభూతముల గొప్ప కలయికచే కనిపించేది) అజ్ఞాన దృష్టికి అత్యంత ఘనీభూతమై అనుభవసిద్ధమై ఉంటోందో ...అట్టి ఈ దృశ్య ప్రపంచము ఇతః పూర్వం ఉండివుండలేదు... ఇప్పుడు ఉండుటయు లేదు, ఇకముందు ఉండనూబోదు. శాంతరూపం మైనట్టి చిదాకాశమే తనయందు ఇట్లు జగత్తు రూపంగా ప్రసిద్ధమై బుద్ధికి మాత్రమే భాసిస్తోంది. స్వప్నంలో చిన్మాత్రమే జాగ్రత్‌లో చిన్మాత్రమే స్వయముగా జగత్ చైతన్యంగా స్ఫురిస్తోంది.

ఎందుకంటావా?... స్రష్ట్యాదిలో సృష్టియేలేదు కదా! అనగా పంచభూతాలు లేనప్పుడు సమస్త పదార్థముల యొక్క ఆయా భావనలే లేవు కదా! పదార్థ భావనయే లేనప్పుడు ఇక ఈ దేహం ఎక్కడున్నది? లేదు కదా!

**శ్రీరాముడు :** ఈ దేహాల సంరంభమంతా ఎక్కడి నుండి వచ్చి ఆత్మ సమక్షంలో ప్రదర్శితమౌతున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ శరీరములుగా భాసించేదంతా చిదాకాశము యొక్క జగత్ స్వప్న భ్రమ చమత్కారమే! స్వస్వరూప చైతన్యము యొక్క స్వయంకల్పనా చమత్కారమే!

మహాచైతన్యము యొక్క మొట్టమొదటి స్వప్నము 'సృష్టికర్త' అని చెప్పబడే బ్రహ్మదేవుని శరీరం. ఇక మనమంటావా? ఆ బ్రహ్మదేవుని మనో శరీరం నుండి ఆవిర్భవించిన వారం. అనగా ఆయన ప్రథమ స్వప్నంలోని అంతర్గత స్వప్న – స్వప్నాంతరములే మన ఈ శరీరాలు.

**శ్రీరాముడు :** స్వామీ! మీరంటున్నట్లు మనమంతా బ్రహ్మము యొక్క స్వప్నాంతర్గత పాత్రధారులం అయినప్పుడు బ్రహ్మముతో మనకున్న సంబంధ – అనుబంధాలు ప్రతిదినము అనుభూతంకావాలి కదా? మరి అట్లా మనకు అనిపించటం లేదు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**గండస్య ఉపరిజాతానాం స్ఫోటానామత ఏవ సః**
**పరమేణ ప్రయత్నేన న మనో నామ యాస్యతి ॥**

కంఠంపై లేచిన కురుపు కంఠంతోబాటుగా కనిపిస్తున్నప్పటికీ కంఠంతో సాక్షాత్ సంబంధం లేదుకదా! అనగా, కురుపు కంఠంయొక్క విభాగం కాదు కదా! లేక కురుపు కంఠం వంటిది కాదు కదా! అట్లాగే మనమంతా బ్రహ్మము యొక్క స్వప్నాంతర్గత రూపులం అయివున్నప్పటికీ బ్రహ్మముతో అనుభూతపూర్వక సంబంధం లేకుండా ఉండటం జరుగుతోంది. భ్రాంతి యొక్క దార్ఢ్యం చేత ఈ మన మనస్సు ప్రయత్నించినప్పటికీ ఆత్మ యందు ప్రవేశించలేకపోతోంది. స్వప్నంలోని వస్తువులు జీవులు స్వప్న దృష్టి యొక్క కల్పనయే అయినప్పటికీ స్వప్న ద్రష్ట స్వరూపంతో (స్వప్నం కొనసాగుచున్నంతవరకూ) ఏకత్వం పొందకయే ఉంటోంది కదా! స్వప్నం కంటున్నవాడు, "ఈ స్వప్నానికి వేరైన స్వప్న ద్రష్ట స్వరూపుడను" అని గుర్తుంచుకుంటున్నాడా? లేదు. స్వప్నంలో తనూ ఒకరైనట్లు, తదితర స్వప్నాంతర్గత జనులు వేరు వేరైనట్లు ఆస్వాదిస్తున్నాడా, అయితే స్వప్నాంతర్గత విషయాలు వాస్తవమా? కాదు. కానీ భ్రమచే స్వప్న ద్రష్టకంటే స్వప్నములో వివిధ రూపములుగా కనిపించుచున్నట్లు బ్రహ్మమే హిరణ్యగర్భుడు (సమష్టి సంకల్పము) – వ్యష్టి జీవుడు మొదలైన రూపాలుగా అసత్య – కల్పితమాత్ర రూపమున అగుపిస్తోంది. బ్రహ్మము హిరణ్యగర్భుని రూపం ఆశ్రయించిన మరుక్షణం బ్రహ్మమే మిథ్యారూపమగు ఈ జగత్తుగా కనిపిస్తున్నదై ఉంటోంది.

**ఆబ్రహ్మ స్తంభ పర్యంతం అలీకం జాయతే జగత్**
**యథాస్వప్నే తథా అలీకమేవమాశు వినశ్యతి ॥**

స్వప్నంలో ఏ విధంగా అనేకమంది జనం కనిపించి మరల ఇంతలోనే మటుమాయ మగుచున్నారో... బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక గడ్డిపరక వరకు ఈ జగత్ దృశ్యములు మిథ్యగా ఉత్పన్నమై మిథ్యగానే నశిస్తున్నాయి. అట్టి వినాశనము కూడా మిథ్యయేనని గ్రహించు. స్వప్నంలో చిదాకాశమే స్వప్న జగత్తు రూపంగా ధరించి అగుపిస్తోంది. అట్లాగే చిదాకాశమే జన్మాది వ్యవహార రహితమై ఉండికూడా, జగద్రూపంగా అనిపిస్తోంది.

స్వప్నద్రష్ట నిదురలేవగానే స్వప్నం నశిస్తోంది. జగత్తుగా అనుభవించేదంతా జ్ఞాన ప్రాప్తిచే రహితత్వము సంతరించుకుంటోంది.

ఈ జగత్తు అనుభూతం అవవచ్చుగాక! సత్యం వలె అనిపించవచ్చుగాక ! వాస్తవానికి ఇది మిథ్యయే! చైతన్యం తాను నిరాకారమై ఉండి స్వప్నంలో సాకారమగు స్వప్న జగత్తుగా స్థితి నొంది ఉన్నది. ఒక అణువు మేరుపర్వతం కంటే ఎట్లా అతి సూక్ష్మమో, ఈ భౌతికాకాశం కంటే చిదాకాశం

అంతకంటే వేలాదిరెట్లు సూక్ష్మం. అయితే చిదాకాశం ఈ భౌతికాకాశం వంటిదే కాదు. "అది జగత్తు వంటి స్థూలాకారం కాదు" ...అని చెప్పటానికి మాత్రమే ఇక్కడ ఆకాశాన్ని ఉపమానంగా తీసుకున్నాం.

**శ్రీరాముడు :** ఈ జగత్తు ఎప్పుడు ఎందుకు చిదాకాశంలో ఉత్పన్నమౌతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సృష్ట్యాదియందు జగత్తులేదు. చిదాకాశమే ఉన్నది. ఇక ఇప్పుడో... ఇప్పుడు కూడా (చిదాకాశం సర్వదా యథాతథం కాబట్టి) చిదాకాశంలో జగత్తు జనించటానికి కారణమూ లేదు. కారణం లేదు కాబట్టి జగత్తూ లేదు. స్వప్నంలో కనబడిన నగరానికి ఉత్పత్తి ఏముంది? వినాశనం ఏమున్నది? స్వప్నంలో కనబడే స్వప్న నగరం వంటిదే ఈ జాగ్రత్ నగరం కూడా! మాకు ఈ జాగ్రత్‌కు, స్వప్నమునకు, దృశ్యమానమై కనిపిస్తున్న ఈ అయోధ్యా నగరానికి తేడా ఏమీ కనిపించటం లేదు.

మరొక విషయం... వాయువు – అద్దాని స్పందనము, అగ్ని – అద్దాని ఉష్ణము, ఆకాశము – అద్దాని శూన్యత్వము, చైత్యము – అద్దాని జాగ్రత్ స్వప్న నగరం ...ఇవన్నీ ఒక్కటే. చిదాకాశము, జగత్ చిదాకాశము ఒక్కటే ! ఎందుచేతనంటే చిదాకాశమే ఇట్లు జగత్తుగా కనిపిస్తోంది. చిన్మాత్ర సూర్యుని ప్రకాశ విశేషమే ఈ జగత్తు.

"బంగారపు ఆభరణం" అనుదానిలో ఏది ఆభరణమో అది బంగారము, ఏది బంగారమో అదియే ఆభరణం కూడా కదా! "వాయు స్పందము" అనుదానిలో ఏది స్పందమో, అదియే వాయువు. ఏది వాయువో అదే స్పందము కదా!

అట్లాగే... "చిదాకాశ జగత్తు" అనుదానిలో ఏది జగత్తో అది చిదాకాశమే! ఏది చిదాకాశమో అదియే జగత్తు కూడా!

అనగా... చిదాకాశమే ఇట్లు 'జగత్' అను ఆకృతిగా కనిపిస్తోంది. ఇదంతా కూడా – "ఉదయ, అస్తమయములు లేనట్టిది, అఖండ ప్రకాశరూపము, నిర్మలము, శిలవలె మౌన స్వరూపము, నిర్వికారము, శాంతము " – అగు బ్రహ్మమే గాని మరింకొకటేదీ కాదు. అంతయు బ్రహ్మమే అయివుండగా... ఇక పదార్థములెచట? భావ – అభావములకు సంబంధించిన బుద్ధి ఎచట? ఏకత్వమెచట? మనమెచట? మనయొక్క పదార్థభావన ఎచట?

ఓ రామచంద్రా! నీవు నిర్వికారమగు ఆత్మజ్ఞానముచే 'అంతయు ఆత్మయే' అను ఏకత్వం వహించి ఉండు. నిత్యోదిత రూపుడవై ఉండెదవుగాక! ఈ భౌతిక దేహంతో వ్యవహరిస్తూ కూడా, తత్ సంబంధమైన వ్యవహారములతో తాదాత్మ్యము చెందవలసిన పనేమున్నది? సర్వదా అంతః కరణమున పరమ ప్రశాంతశీలుడవై, నిర్వాణరూపుడవై, నిరతిశయానంద రూపముతో ఈ జగత్తునందు సంచరించు. ఏ ఏ పదార్థముల వలన విక్షేపములు కలుగుచున్నట్లు అనిపిస్తోందో, ...అట్టి వాటి గురించి "అవి వాస్తవానికి లేవు" అని గ్రహించివుండు.

❖❖❖

# 6. ప్రతి జీవుడు మోక్ష స్వరూపుడే!

**శ్రీరాముడు :** హే మహాత్మా! నిరాకారము – నిరంజనము అగు బ్రహ్మము నుండి ఈ సాకారమగు జగత్తు ఎట్లా ఉద్భవించి పరిఢవిల్లుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** 'జగత్తు' అని చెప్పబడుచున్న నామరూపాత్మకమగు వ్యవహారమంతా వాస్తవానికి ఏ విధంగా స్వప్నతుల్యము – భ్రమాత్మకము అయి ఉన్నదో వివరిస్తాను విను.

ఈ ప్రపంచాన్ని మొత్తం 5 విషయములుగా విభజించవచ్చు– 1.శబ్దము, 2.స్పర్శ, 3.రూపము, 4.రసము, 5.గంధము. ప్రపంచంలో గల ఈ ఐదు విషయముల అనుభవం పొందటానికి తయారు చేయబడిన వివిధ విభాగ – ఉపవిభాగములు కలిగియున్న యంత్రము వంటిదే ఈ శరీరం. ఏ శరీరముననైనా జాగ్రత్ – స్వప్నములలో అనుభవమయ్యేది ఈ ఐదే! ఈ 5 విషయములనే 5 తన్మాత్రలు అంటారు.

**ఆకాశః శబ్దతన్మాత్రం -** ఆకాశము "శబ్దతన్మాత్ర" అయివున్నది. ఆకాశానికి రూపాదులు లేవు. శబ్దతన్మాత్ర యొక్క ప్రాపంచక రూపం ఆకాశం. ఆకాశాత్ వాయుః – ఆకాశము నుండి వాయువు జనిస్తోంది.

**స్పర్శ తన్మాత్రకో అనిలః -** వాయువు "స్పర్శతన్మాత్ర" అయివున్నది. వాయువు స్పర్శచే గ్రహించబడుతోంది. స్పర్శజ్ఞానం వాయువుచే జనించబడుతోంది.

**తత్సంగో ఉత్కర్షజం తేజః -** ఆకాశ – వాయువుల సంగమము (సంఘర్షణ) చే రూపతన్మాత్ర అయినట్టి తేజము (అగ్ని) ఉదయిస్తోంది.

**తచ్ఛ అన్తిశ్శేత్య అపాం స్థితిః -** తేజస్సునందలి ఉష్ణత్వము శాంతించుటచే "రసతన్మాత్ర" అగు జలము రూపుదిద్దుకుంటోంది.

**ఏష సంఘః భూ -** శబ్ద, స్పర్శ, రూప, రసముల కలయిక చేతనూ, ఉష్ణత్వము మరి కొంత శాంతించుట చేతను భూమి జనిస్తోంది.

ఈ విధంగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రల చమత్కారమైనట్టి ఆకాశ, వాయు, తేజస్సు, జలము, భూమి (పంచభూతాల) వీటి – రకరకాల కలయికయే ఈ కనబడే జగత్ వస్తుజాలమంతా! మనకు కనబడే ప్రతి వస్తువు వర్తమానరూపముగా కాలక్రమేణా ఉండదు. ప్రవహించే జలం యొక్క ఆకారంలా ఈ జగత్తులో వస్తువు ఇతఃపూర్వం ఒక రకంగా, ఇప్పుడు ఈ రకంగా, ఇకముందు ఇంకొక రకంగా ఉంటున్నాయి. ఈ వస్తు సమూహమంతా నిరాకారమగు ఆకాశంలోనే జనిస్తున్నాయని మనకు సుస్పష్టమౌతుంది. కాబట్టి ఆ కనబడేది స్వప్నతుల్యమేనని చెప్పబడుతోంది.

అయితే ఇక్కడ, "నిరాకారమగు ఆకాశం నుండి సాకారమగు తక్కిన భూతములు ఎట్లా జనిస్తున్నాయి?" – అనే ప్రశ్న మన ముందు ఉదయిస్తోంది.

నిష్క్రియమగు ఆకాశం నుండి – చలన రూపమగు వాయువు; రూపరహితమగు వాయువు నుండి – రూపయుక్తమగు తేజము (అగ్ని); రసవర్జితమైన తేజము నుండి – గంధ సహితమగు పృథివి... ఈ విధంగా ఐదు అనుభవములు ఏర్పడుచున్నాయి. అయితే ఇక్కడ మరొక ముఖ్యమైన ప్రశ్న. అనుభవము అనేది ఎక్కడి నుండి ఏర్పడుతోంది?

ఒకానొక సిద్ధాంతము యొక్క ఉద్దేశమును అనుసరించి "ఇతఃపూర్వపు జ్ఞప్తి నుండి ఇప్పటి అనుభవము, ఇప్పటి అనుభవము నుండి ముందు ముందు జ్ఞప్తి ఏర్పడుతోంది" అని సిద్ధాంతీకరించబడుచున్నది. అయితే, ఇంతా అయిన తరువాత ఈ సిద్ధాంతం ప్రకారం మనం 'జ్ఞప్తి' అను దానిపై ఆధారపడవలసి వస్తోంది. సరే ఈ 'జ్ఞప్తి' ని కొంతసేపు ఒప్పుకొంటే, జ్ఞప్తి నుండే జాగ్రత్ స్వప్నములు అనుభవమౌతున్నాయి కదా! మరి జ్ఞప్తి ఎక్కడి నుండి జనిస్తోంది?

"జ్ఞాపము" అనేది ఉదయించేది జ్ఞాపకం కలవాని నుండే కదా! ఆ జ్ఞాపకం ఎవరిదై ఉన్నదో, ఆతడే / అదే బ్రహ్మం. బ్రహ్మమే స్వరూపంగా గల స్వస్వరూపం నుండే (స్వప్న ద్రష్ట నుండి స్వప్న వస్తుజాలం వలె) ఈ సర్వజగత్ రూపం వివర్తభావనచే ధరించబడుతోంది. కనుక "బ్రహ్మమే సర్వ పదార్థ స్వరూపము అయి ఉన్నది" – అనే సిద్ధాంతం అంగీకరించటంలో లోటేమున్నది?

**జ్ఞప్తిరేవ అతివిమలా స్వరూపాత్మని భాతి యత్**
**తదేవ 'జగత్' ఇత్యుక్తం సత్యమిత్యేవ సత్యతః ॥**

"అతినిర్మలమగు 'జ్ఞప్తి' తన స్వరూపమున భాసిస్తోంది. ఆ జ్ఞప్తి అనే చైతన్యమే జగత్తుగా భాసిస్తోంది" అని వేదములు సుస్పష్టపరుస్తున్నాయి. "స్వస్వరూపమున భాసించే జ్ఞప్తి చైతన్యమే ఈ జగత్తుయొక్క అసలైన రూపం" – అనే వేదవాక్కు పరమసత్యమై ఉన్నది కనుక ...

**న క్వచిత్ సన్తి భూతాని పంచ కుట్యాదయో న వా**
**అసన్తి అపి అనుభూతాని, నను స్వప్నదశాస్వివ**

ఈ పంచ భూతములు ఎక్కడా లేవు. అయితే అసత్యములే అయినప్పటికీ అనుభూతం అవుతున్నాయి. ఉదాహరణకు స్థూలంగా ఆకారంతో కనిపించే మంచుగడ్డ ఉష్ణ ప్రభావం చేత కరిగి ఆకారం కోల్పోతోంది. మరల ఆ నీటి ఆవిరే మంచుగడ్డగా కూడా అగుచున్నది. ఏ రూపం అద్దానికి సత్యం? అనుభవమే అన్నిటికీ మూలం. ఈ విధంగా స్వప్నంలో లాగానే ఈ జాగ్రత్‌లో కూడా అసత్యములైన పంచభూతములు సత్యమువలె అనుభూతమగుచున్నాయి.

ఒక సిద్ధాంత వాక్యం విను. నేను చిదాకాశ స్వరూపుడనే! (చేతనాకాశ ఏవాఽహమ్). అట్టి చిదాకాశమే ఈ జగద్రూపంగా స్థితినొంది ఉన్నది! (తదేవ ఇదం జగత్ స్థితమ్). కాబట్టి నేను, ఈ జగత్తు ఒక్కటే ! నేను, ఈ జగత్తు కూడా ఏకమైనట్టి, విజ్ఞాన ఘనమైనట్టి చిదాకాశమే అయివున్నాం.

ఇక్కడి నేను, నీవు, జన్మ, మృత్యువు, సృష్టి, స్థితి, ప్రళయము, వివర్తము, అనువర్తము, లోకములు, లోకాంతరములు, గతి ...ఇవన్నీ కూడా నికారామగు చిదాకాశమే అయివున్నాయి.

ఓ రామచంద్రా! ఆత్మయొక్క స్వభావం ఎఱుగబడిందా, .... ఇక దేహము ఉండటం – ఉండకపోవడం ఒక విషయమే కాదు. తద్ద్వారా ఈ పంచభూతముల కలయికతో కూడిన జగత్తు

కూడా నిర్విషయమై కన్పట్టుచున్నది. అప్పుడు ఏర్పడి ఉండే దుఃఖరహితము – అక్షయము అగు భూమానంద స్వరూప స్థితినే 'మోక్షము' అని పిలుస్తున్నారు. ప్రతి జీవుడు అట్టి భూమానంద మోక్ష స్వరూపుడేనని గుర్తు చేయడానికే శాస్త్రములు ఎలుగెత్తి గానం చేస్తూ ఉద్బోధిస్తున్నాయి. అట్టి స్థితి ఈ దేహం ఉన్నప్పుడు ప్రాప్తించినా, లేక దేహం లేనప్పుడు ప్రాప్తించినా ఒక్కటే!

అట్టి నిర్మలమగు మోక్ష స్వరూపమునందు మాత్రమే ఈ జీవునకు విశ్రాంతి లభిస్తోంది.

❖❖❖

# 7. జాగ్రత్ - స్వప్నముల సారూప్యం

**శ్రీరాముడు :** మహర్షీ! "ఈ జగత్తు కల్పితమాత్రమే గాని వాస్తవం కాదు" అని స్వప్నమును దృష్టాంతంగా తీసుకొని మీరు అనేక సందర్భాలలో ప్రవచిస్తూ వస్తున్నారు. అయితే ఘనీభూతమై ఎదురుగా కనిపిస్తున్న జగత్తు స్వప్నతుల్యము మాత్రమేనని గ్రహించటం కుదిరేదెట్లా? స్వప్నమేమో ఊహ, భ్రమల విన్యాసం. మరి ఈ జాగ్రత్ జగత్తేమో పాంచభౌతిక ఘనీభూతరూపంగా రోజు తరువాత రోజుగా ప్రాప్తిస్తోందాయె!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వప్న–జాగ్రత్‌ల స్వభావమేమిటో కొంచెం ఇక్కడ విచారిద్దాం.

**జాగ్రత్ :** జాగ్రత్ ద్రష్ట తన స్వభావాన్నే (స్వప్నంలో లాగానే) – జగదాకారంగా పొందుచున్నాడు. ఈ జాగ్రత్... ప్రపంచం దృష్ట్యా సర్వదా జీవునకు ఉండియే ఉంటోంది. సుషుప్తి ఎంతటి అజ్ఞాన సమన్వితమో, అది (ఆత్మజ్ఞాన రహితులకు) అంతటి అజ్ఞాన సమన్వితము. శిలవలె, ఘనీభూతమైన చిదాకాశము వలె ఇది ఘనీభూతమై ప్రాప్తిస్తోంది. దృశ్యమును పరిశీలనగా చూస్తే అది శూన్యాకాశము వంటిదే!

ఈ జగత్తు నిజదృష్టిని బట్టి అనుభవమునకు విషయమై చెన్నొందుతోంది. దృష్టి స్వకీయమైన కల్పన నుండి బయల్వెడలుతోంది.

| ఆ | → స్వకీయకల్పన | → నిజ జాగ్రత్ దృష్టి | → జాగ్రత్ జగదనుభవం |
|---|---|---|---|
| త్మ | → స్వకీయకల్పన | → నిజస్వప్న దృష్టి | → స్వప్న జగదనుభవం |

స్వప్నంలో కనిపించే నగరం ఎక్కడి నుండి వచ్చింది? ఎట్లా అనుభవమౌతోంది?... వాస్తవానికి స్వప్నంలో నగరం వంటిది ఏదీ లేదు. ఎవరూ అక్కడ నిర్మించనూ లేదు. మరి? స్వప్నద్రష్ట స్వరూపమగు సత్‌చిత్ ఆత్మ యొక్క ప్రకాశమే స్వప్నంలో స్వప్న నగరంగా భాసిస్తోంది. ఏ విధంగా ద్రష్టయొక్క స్వప్నచిత్ స్వరూపం స్వప్నంలో స్వర్గ–మర్త్య–పాతాళ లోకాలు (స్వప్నంగా) భాసిస్తున్నాయో, అదే రీతిగా జాగ్రత్ నందు కూడా సత్‌చిత్ ఆత్మ యొక్క జ్ఞాన ప్రకాశమే జాగ్రత్ స్వర్గ–మర్త్య–పాతాళ లోకములతో కూడిన జగత్తుగా భాసిస్తోందని విజ్ఞులు సుస్పష్టంగా గమనిస్తున్నారు. కనుక జాగ్రత్ – స్వప్నములకు భేదమేమీ లేదు.

ఇంకొక అతి ముఖ్య విషయం...! వాస్తవానికి 'జగత్తు' అనబడే శబ్దముగాని, అర్థముగాని అటు స్వప్నంలోగాని, ఇటు జాగ్రత్‌లో గాని ఏమీ సంభవించటమే లేదు. బ్రహ్మదేవుడు 'నిర్మలచిత్ స్వరూపుడు' అయి ఉండి కూడా... అజ్ఞాన కృతమగు ఆకాశమున, తన యొక్క చిత్ ప్రకాశ రూపముచే... ఈ పర్వతము, భూమి మొదలైన రూపములను ధరిస్తున్నాడు.

కాబట్టి ఓ మిత్రులారా! స్వచమత్కారము అయినట్టి అజ్ఞానమే జాగ్రత్ – స్వప్నములలోని జగత్తుగా ప్రాప్తించుచున్నదని మీరు గ్రహించండి. గమనించండి!

**జగత్ న కించిదేవేదమ్ చిద్రూపం చ న కించన**
**ఏతే కించిత్ ఇవాభాతో నభశ్చిజ్జగతీ ముధా ।**

ఈ జగత్తుగాని, అట్టి ఈ జగత్తును ఎఱుగుచున్న చిద్రూపంగాని (వ్యష్టిచిత్ గాని) ఒకింత కూడా లేవు. అవి రెండూ అత్యంత శూన్యరూపములే అయి ఉండి కూడా... ఈ విధంగా బ్రహ్మము నందు అవి రెండు (జగత్తు – చిద్రూపం దృశ్యము – ద్రష్ట ) మిథ్యగానే భాసిస్తున్నాయి.

స్వప్నమంతా 'అసత్తే' అయినప్పటికీ స్వప్నంలో దృశ్యాలు భాసిస్తున్నాయి కదా! అట్లాగే జాగ్రత్ అసత్తే అయినప్పటికీ జాగ్రత్ నందు ఈ దృశ్యము భాసిస్తూ భావనా సమన్వితమై పొందబడు తోంది. వివిధ రచనలతో కూడి శోభించే స్వప్నంలో అక్రియలే క్రియలుగాను, అసత్తు సత్తుగాను శోభిస్తూ, పొందబడుచున్నాయి.

అనగా ... ఆకాశవర్జితమైన బ్రహ్మమే అతివిశాలం, అతి శూన్యం అయినట్టి ఈ ఆకాశముగా అగుచున్నది. అట్టి విషయరహితమైన శూన్యాకాశంలోంచి శబ్దతన్మాత్ర ఉదయిస్తోంది. అట్టి స్పర్శరహితమైన శబ్దతన్మాత్రలోంచి స్పర్శ తన్మాత్ర రూపమైన వాయువు జనిస్తోంది. రూపరహితమైన వాయువు నుండి రూపసహితమైన అగ్ని ఉద్భవిస్తోంది. రసరహితమైన అగ్ని నుండి రససహితమైన జలం ఉద్భవిస్తోంది. గంధరహితమైన జలంలోనుంచి గంధ సహితమైన పృథివి ఏర్పడి ఉంటోంది.

ఈ విధంగా శూన్యంలోనుంచి జనించే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు శూన్యరూపమే అయి ఉండి జాగ్రత్ – స్వప్న జగత్తులుగా పరిఢవిల్లుచున్నాయి. అందుకే ఈ "జాగ్రత్తు శూన్యరూపమే" అని సిద్ధాంతీకరించబడుతోంది.

నిర్విషయమగు ఆత్మ శూన్యవిషయమగు ఆకాశంగా అగుచుండగా, శూన్యవిషయాకాశంలో నుంచి అనేక విశేషములు – విషయములతో కూడిన పర్వత, భూమి, అరణ్యాదులుగా శూన్యాకాశమే అవతరిస్తోంది.

❖

స్వప్నంలో కనిపించిన ఒక మనిషి వాస్తవానికి జనించినప్పటికీ "గొడ్రాలి ముద్దుల కొడుకు" వలె జనించినట్లే అనిపిస్తున్నాడు కదా! జీవుడు ఎక్కడో మరణించి మరెక్కడో జనించినప్పటికీ మరణము యొక్క విస్మృతిచే తాను జనించినట్లే అనుకోవటం లేదు కదా! స్వరూపతః ఆతనికి జనన మరణాలు లేవు కాబట్టే కదా!... ఈ జాగ్రత్ కూడా జనించనప్పటికీ జనించినట్లే కనిపిస్తోంది.

**శ్రీరాముడు :** "సత్తు అసత్తుగా అవడం – అసత్తు సత్తుగా అవడం" అంటే ఏమిటో దృష్టాంత పూర్వకంగా వివరించ ప్రార్థన స్వామీ!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఒకడు గదిలో మంచంపై పరుండి కలగంటున్నాడనుకో. ఆతడు తాను శయనించిన గదిని, మంచమును ఏమరుస్తూ, మరెక్కడో ఏదో దృశ్యమును చూస్తూ అద్దానితో తన్మయం చెందుచున్నాడు కదా! ఆతనికి రాత్రియందు స్వప్నంలో అంతా విరుద్ధమైన అనుభవంగా సంభవిస్తోంది. స్వప్నంలో కనిపించేది భ్రమయే అయినప్పటికీ అదంతా 'సత్యము'వలె (సత్తుగా) అనుభవించబడుతోంది. స్వప్న ద్రష్ట వాస్తవానికి యథాతథంగా ఉండి కూడా స్వప్నంలో తాను మరణించినట్లు కలగంటున్నాడు. ఆకాశము జగత్తుగా కనిపిస్తోంది. చీకటిలో మహాప్రళయాలు అగుపిస్తున్నాయి. క్రిందపడుతూ ఆకాశంలో ఎగురుచున్నట్లు అనుభూతి పొందుచున్నాడు.

ఈ విధంగా స్వప్నంలో అసత్యరూపమైన జగత్తు ఎట్లా భాసిస్తుందో ...అట్లాగే జాగ్రత్‌నందు ఈ జగత్తు భాసిస్తోంది సుమా! "అదంతా స్వప్నతుల్య జగత్తు" ...అని భూతకాల విశేషాలను జ్ఞాపకం తెచ్చుకున్నప్పుడు అందరికీ అనిపించే విషయమే కదా! అయితే వర్తమానంలో ఆత్మజ్ఞానదృష్టి తగినంతగా రూపుదిద్దుకోకపోవటం చేత వర్తమాన దృశ్యం స్వప్న సదృశంగా కాకుండా "వాస్తవము – ఘనీభూత సత్యము" వలె అనిపిస్తోంది. ఈ విధంగా "స్వప్న – జాగ్రత్తులకు కొంచెం కూడా భేదం లేదు" అనే సిద్ధాంతం ధ్రువీకరించబడుతోంది.

నిన్న చూచిన సూర్యుడు, ఈ రోజు కనిపించే సూర్యుడు ఒక్కడే అయినట్లుగా... నిన్న కనిపించిన స్నేహితుడు, ఆతడే ఈ రోజు తారసపడినప్పుడు ఈ రోజు కనిపించిన ఆ స్నేహితుడు ఒక్కడే అయినట్లుగా ...జాగ్రత్, స్వప్నములు రెండూ ఒక్కటే! అయితే రెండూ అసత్యమే! లేదా, రెండూ సత్యమే!

❖

**శ్రీరాముడు :** స్వామీ! సద్గురూ! వసిష్ఠ మహర్షీ! నన్ను శిష్యవాత్సల్యం చేత క్షమించెదరు గాక! "జాగ్రత్, స్వప్నములు ఒక్క తీరైనవే" అని మీరు చెప్పే వాక్యం నాకు ఎందుకో ఇంకా కూడా యుక్తి యుక్తం అనిపించటంలేదు. ఎందుకంటారా...?

స్వప్నంలో ప్రవేశించినవానికి అతని జాగ్రత్ అంతా క్షణంలో తొలగిపోయి ఆతడు ఇక స్వప్నం అనుభవిస్తున్నాడు. జాగ్రత్తు యొక్క దర్శనముచే స్వప్నము క్షణంలో అంతఃకరణంలో అసత్తుగా భాసిస్తోంది.

ఇంతవరకు సరే! అయితే, జాగ్రత్‌లోని బంధువులు స్వప్నంలో కనిపించకపోయినప్పటికీ, ...స్వప్నానంతరం మరల సంబంధం బాంధవ్యాలు కొనసాగిస్తున్నారు. పైగా, జాగ్రత్‌లో అంతా దినదినం కొనసాగుచుండగా "స్వప్నం భ్రమయే" అని మెలకువ రాగానే తెలిసిపోతోంది. అంతేగాని "నిన్నటి జాగ్రత్ భ్రమయే" అని ఎవరికీ అనిపించటం లేదుకదా! కనుక జాగ్రత్ – స్వప్నములు ఒక్కతీరైనవి ఎట్లా అవుతాయి చెప్పండి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! అయితే, మరికొన్ని వివరాలు మనం సంభాషించుకుందాం.

ఒకడు స్వప్నం పొందుచున్నప్పుడు స్వప్నంలో కనబడిన బంధువులతో విహరిస్తున్నాడు. ఆ స్వప్నం ముగుస్తోందనుకో, అప్పుడేం జరుగుతోంది? ఏ స్వప్నదేహంతో స్వప్న బంధువుల మధ్య విహరిస్తున్నాడో... ఆ స్వప్న దేహం కాస్తా కనుమరుగౌతోంది. స్వప్నములో దేహనాశనం పొందిన వాడై, స్వప్న బంధువులతో వియోగం పొందినవాడై, ఆ నిద్ర నుండి విముక్తుడై ఇప్పుడు తిరిగి జాగ్రత్ దేహం ఆశ్రయిస్తున్నాడు. (లేక) జాగ్రత్ దేహంలో ప్రవేశిస్తున్నాడు. అనగా సామాన్య పరిభాషలో "ఆతడు నిద్రలేచాడు" అని మనం చెప్పుకుంటున్నాం.

అట్లాగే ఇప్పుడు దేహ – దేహాంతర ప్రాప్తి విషయాలకు వద్దాం. ఒకడు దేహమును త్యజించుచున్నప్పుడు ఏమౌతోంది? ఏఏ బంధువులతో కూడినవాడై అనేక హావ – భావాలతో సంబంధ – అనుబంధ – బాంధవ్యాలతో ఈ భూమిపై సంచరించాడో, వారందరితోటి సంబంధమును త్యజించినవాడై, మరొక దేహమును ఆశ్రయించి ఇప్పుడు వేరైన బంధువులతో కూడిన అనుబంధ – సంబంధ – బాంధవ్యాలను కొనసాగిస్తున్నాడు.

అనగా... స్వప్నంలోని బంధువులను స్వప్నంలోనే త్యజించి జాగ్రత్తుకు వస్తున్నట్లే, ఒక దేహమునకు సంబంధించిన బాంధవ్య – తదితర వ్యవహార పరంపరలను దేహముతోటే త్యజించి మరొకచోట మరొక దేహంతో మరొక రీతిగా ఈ జీవుడు బంధు సమాగమాదులు పొందుచున్నాడు కదా! స్వప్నంలోనుంచి ముక్తి పొందినంత మాత్రంచేత, "స్వప్న సంబంధాలు లేనివి" అని అనుకోదలిస్తే, జాగ్రత్‌కు సంబంధించిన ఇక్కడి వర్తమాన సంబంధాలు మృత్యువుతో ముగుస్తున్నాయి కాబట్టి ఇవి కూడా లేనట్లే కదా!

"వర్తమానంలో బంధు సంబంధం ఉండి ఉండటం – కాలానంతరం అవి లేకుండపోవటం" – అనే విషయాలను దృష్టిలో ఉంచుకుంటే "జాగ్రత్, స్వప్నాలు ఒక్క తీరైనవే"... అని సిద్ధాంతీ కరించటంలో తప్పేమున్నది? మరల చెప్పుచున్నాను ...విను.

స్వప్నద్రష్ట స్వప్నదశలో ఉన్నప్పుడు అనేక సుఖ దుఃఖ దశలను, లెక్కలేనన్ని మోహములను, రాత్రింబవళ్ళను, అనేక విపర్యయములను, శత్రు మిత్ర సంబంధములను పొందుచున్నాడు కదా! ఆ తరువాత ఆతడు స్వప్న దేహమును త్యజించి జాగ్రత్ దేహమును ఆశ్రయిస్తున్నాడు. ఇప్పుడు స్వప్న దేహ సంబంధ బాంధవ్యములకు ఏమౌతుంది? "అవన్నీ మొదలంట భ్రమ మాత్రమే"... అని జాగ్రత్ దేహంతో భావన చేస్తున్నాడు. అట్లాగే ఆతడు జాగ్రత్ దేహం త్యజించి స్వప్నదేహంతో స్వప్నలోకంలో ప్రవేశించినప్పుడు కూడా "జాగ్రత్ దేహ వ్యవహారాలన్నీ భ్రమయే" అని భావించి ఆ జాగ్రత్ వ్యవహారాలతో సంబంధం లేని స్వప్న లోకంలో క్షణంలో తన్మయమై ఆయా స్వప్నదృశ్య సంఘటనలలో విలీనమైపోతున్నాడు. స్వప్న సంఘటనలు 'సత్యమే' అనే బుద్ధితో అనుభవం పొందుచున్నాడు. స్వప్న సమయంలో జాగ్రత్ అసత్యంగా అనిపిస్తోంది. జాగ్రత్ సమయంలో స్వప్నం అసత్యంగా అనిపిస్తోంది.

**స్వప్నద్రష్టా యథా స్వప్న - సంసారే మృతిమ్ ఆప్తవాన్**
**అన్యం జాగ్రత్‌మయం స్వప్నం ద్రష్టుం భూయః ప్రజాయతే ॥**
**జాగత్ ద్రష్టా తథా జాగ్రత్ సంసారే మృతిమ్ ఆప్తవాన్**
**అన్యం జాగ్రత్‌మయం స్వప్నం ద్రష్టుం భూయః న జాయతే ॥**

జాగ్రత్ ద్రష్ట, ఈ జాగ్రత్ ప్రపంచంలో మరణించినప్పుడు ఇక్కడి సహజీవులతో - వస్తు ప్రపంచంతో సంబంధం త్యజించి మరల మరొకచోట జన్మించినప్పుడు అక్కడి నూతన సహజీవుల - వస్తు జాలములతో నూతన సంబంధములను పొందుచున్నాడు. అనగా... "ఒకచోట మరణించి అంతా వదలిపోవటం - మరోచోట జన్మించి నూతన జాగ్రత్ ప్రపంచం పొందటం" అనే వ్యవహార మంతా ఒక స్వప్నంలోనుంచి బాహ్యగతుడై మరొక స్వప్నంలోకి అంతర్గతుడు అవటం వంటిదేకదా! కనుక "జాగ్రత్ - స్వప్నములు ఒక్క తీరైనవే" అనే వాక్యం ఈ విధంగా యుక్తియుక్తమే అవుతుంది.

ఇంకా కూడా... ఇక్కడ మరొక విషయం గమనిద్దాం. ఒకడు ఒక జాగ్రత్ ప్రపంచంలో మరణించి మరొక జాగ్రత్ ప్రపంచంలో జన్మ పొందినపుడు క్రొత్త విషయాలు - సంబంధాలు జ్ఞాపకం ఉంటున్నాయి. క్రితం జన్మ జ్ఞాపకాలు ఏమీ గుర్తుకురావటం లేదు. ఎందుచేత?

దీనికి స్వప్నానంతరం మరొక స్వప్నమే దృష్టాంతం. ఎట్లా అంటావా?...

ఒకడు నిన్నటి రాత్రి ప్రాప్తించిన స్వప్నం జాగ్రత్తుకు రాగానే ఏమరుస్తున్నాడు. మరల ఈ రోజు రాత్రి వచ్చిన స్వప్నంలో క్రిందటి రోజు స్వప్నము యొక్క విశేషాలు ఏమాత్రం రావటం లేదు. ఎందుకట్లా జరుగుతోందంటే... స్వప్నంలోంచి మేల్కొంచగానే, ఆ స్వప్న ద్రష్ట "రాత్రి కలలో కనిపించినవన్నీ నాయొక్క ఊహ - భ్రమలచే కల్పనగా పొందబడినదే గాని అదంతా ఏమాత్రం వాస్తవం కాదు"... అని అసత్యత్వ బుద్ధి ఉండటం చేతనే అందులోని బంధువులను, వస్తు వాహనాది ఆయా విశేషములను, సంఘటనలను నిదురలేవగానే త్యజించివేసినవాడై ఉంటున్నాడు. మరల ఈ రోజు మరొక స్వప్నం ! ఆ నూతన స్వప్న సందర్భంలో క్రిందటి రోజు రాత్రి స్వప్న విషయాలు ఈ క్రొత్త స్వప్నానికి సంబంధించినంత వరకు విషయమే కాదు.

అట్లాగే... క్రితం జన్మ విశేషాలు వర్తమానానికి 'అసత్యము - భ్రమ మాత్రము' అను బుద్ధి ఉండటంచేతనే అవన్నీ జ్ఞప్తికి విషయం కావటం లేదు. ఇట్లా ప్రతి జీవుడు జీవించినంత కాలం పొందిన అనేక సంఘటనలు, సంబంధ బాంధవ్యములను మృతిపొందగానే ఇక్కడే వదలి మరల మరొకచోట ఉపాధి పొందటం, నూతనమైన అనుభూతి పరంపరలను ఆస్వాదించటం చేస్తున్నాడు.

ఒక స్వప్నం సందర్భంలో ఇతఃపూర్వపు స్వప్నం అవిషయము, అసందర్భోచితము, అనవసరము, అర్థరహితము - ఎట్లా అవుతుందో... అట్లాగే, వర్తమాన ఉపాధి సందర్భంలో ఇతఃపూర్వపు జాగ్రత్ దేహవ్యవహారాలన్నీ అవిషయం, అసందర్భోచితం, అనవసరం, అర్థహితం అగుచున్నాయి.

ఒకవేళ పూర్వస్వప్నము గురించిగాని, పూర్వజాగ్రత్ గురించిగాని, విశేషంగాను, తీవ్రంగాను, మనఃస్తాప యుక్తంగాను - ఎవరైనా యోచిస్తూ ఉంటే... ఆ యోచించటమనేది మూర్ఖత్వమే అవుతుంది కదా!

ఈ విధంగా... ఈ జీవుడు ప్రతిరోజు స్వప్నంలో ఉదయించి మరల వైదొలగుచున్నాడు. అట్లాగే ఒక ఉపాధిలో ఉదయించి మరల ఎప్పుడో వైదొలగుచున్నాడు.

వాస్తవానికి... ఈ జీవుడు జాగ్రత్ – స్వప్నములనబడే రెండు అవస్థలలోనూ జన్మించటమూ లేదు – మరణించటమూ లేదు. కానీ, ఆయా దేహములందలి అభిమానము దృష్ట్యా ...

**జాగ్రత్‌లో మరణించి స్వప్నంలో జన్మిస్తున్నాడు.**

**స్వప్నంలో మరణించి జాగ్రత్‌లో జన్మిస్తున్నాడు.**

అని సాంకేతికపరంగా అనవచ్చు కూడా! ఈ విధంగా ఈ రెండూ సమానస్వరూపమే కలిగి ఉంటున్నాయి. ఎట్లా అంటావా?... ఒక స్వప్నంలోనుంచి రెండవ స్వప్నంలో ప్రవేశించినప్పుడు రెండవ స్వప్నం విశేషంగా కనిపిస్తుంది కాబట్టి మొదటి స్వప్నం 'అనుభూతి' అనే తెరపై నుండి క్రమంగానో (లేక) ఒక్కసారిగానో తొలగిపోతోంది. అట్లాగే, వర్తమాన జన్మ (లేక వర్తమాన సందర్భము) విశేషంగానూ, బలవత్తరంగాను కనిపించటంచేత ఇతఃపూర్వపు భౌతిక సంబంధమైన జ్ఞాపకాలన్నీ బలహీనపడి క్రమంగా కప్పివేయబడుచున్నాయి. ప్రతిజీవునికి కూడా వర్తమాన జాగ్రత్తు దృష్ట్యా పూర్వ జాగ్రత్ స్వప్న సదృశ్యంగానే ఉంటోంది. కాబట్టి జాగ్రత్ – స్వప్నములు రెండు కూడా పూర్వ వృత్తాంత కథార్థములవలె పరస్పర ఉపమాన – ఉపమేయత్వములు సంతరించుకొనే ఉంటున్నాయి.

వర్తమాన స్వప్నం జాగ్రత్‌వలె భాసిస్తోంది. పూర్వకాలిక జాగ్రత్ స్వప్నంవలె భాసిస్తోంది.

**శ్రీరాముడు :** స్వామీ! జాగ్రత్ – స్వప్నములలో దేనిని 'సత్యం' అనవచ్చు? ఏది అసత్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ మాటకు వస్తే .... రెండూ సత్యమే అనే అనుభూతిని ఆయా సందర్భములలో ద్రష్టకు కలిగిస్తూనేవున్నాయి. ఇక ఏది సత్యమంటావా?

ఆ ఉభయ సందర్భములలోను ద్రష్ట ఒక్కడే కదా! ఆ ద్రష్ట మాత్రమే సత్యం. జాగ్రత్ స్వప్నములు రెండూ ద్రష్ట యొక్క సమ్ముఖంలో అసత్యమే! ఎందుకంటే అవి రెండూ "ద్రష్ట" అను రాజు యొక్క సంకల్పరూప చమత్కారములే అయివున్నాయి కదా!

ఓ రామచంద్రా! కేవలం చిదాకాశమే ఇలా జాగ్రత్ – స్వప్నముల రూపంలో స్ఫురిస్తోంది. కనుక జాగ్రత్ – స్వప్నములలో కనిపించేదంతా చిదాకాశమేగాని అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేదు. మట్టికుండ యందు అంతటా మట్టియే కదా ఉన్నది!

స్వప్నంలో ఒకపెద్ద కొండ కనిపించిందనుకో! ఆ కొండ స్వప్నచిత్ చమత్కారమే కదా! అట్లాగే జాగ్రత్‌లో నీకు కనిపించేదంతా, అనుభూతమగుచున్నదంతా నీయొక్క జాగ్రత్ చిత్ స్వరూపమే సుమా! ప్రాజ్ఞుడవగు రామచంద్రా! "నాకు అనుభూతమగుచున్నదంతా నాయొక్క ఆత్మ (లేక) చిత్ స్వరూపమే" .... అనే విషయం నీవు ఆత్మజ్ఞులగు ప్రాజ్ఞులతో సంభాషించి, తద్ద్వారా సుస్పష్టం చేసుకో. విజ్ఞులతో సంభాషించి, తద్ద్వారా ఉత్పన్నమగుచున్న "వివేకదృష్టి" (లేక) "తత్త్వజ్ఞాన దృష్టి" చే ఈ దృశ్యమును సందర్శిస్తే, అప్పుడు "నేను చిత్స్వరూపడను. నాచే దర్శించబడుచున్నదంతా నా స్వరూపమే" ...అని నీకు తప్పక సునిశ్చితం కాగలదు.

ఈ విధంగా... స్వప్నంలో దర్శించబడేదంతా స్వప్న ద్రష్ట యొక్క స్వస్వరూపమే అయినట్లు ...జాగ్రత్‌లో దర్శించబడేదంతా జాగ్రత్ ద్రష్ట స్వస్వరూపమే అయివున్నది.

ఆరోపదృష్టిచే – ఆత్మయే ఆరోపిత ద్రష్ట యొక్క దృష్టికి జగత్తుగా అగుపిస్తోంది. అపవాద దృష్టిచే – ఈ జగత్తు యొక్క అసలైన రూపము ఆత్మయే అయివున్నది. ఓ రామచంద్రా! మరల మరొక్కసారి ఉపమాన పూర్వకంగా చెప్పుచున్నాను. యథా...

**మృన్మయం తు యథా భాండం మృచ్ఛూన్యం న లభ్యతే,**
**శైలాత్మకం యథా భాండం శైలశూన్యం న లభ్యతే,**
**ద్రవరూపం యథా వారి ద్రవరిక్తం న లభ్యతే,**
**ఊష్మరూపో యథా వహ్నిః నిర్‌ఊష్మా నోపలభ్యతే!**
**యథా స్పందమయో వాయుః అస్పన్దో నోపలభ్యతే!**
**చిన్మయం తు తథా చేత్యం చిచ్ఛూన్యం నోపలభ్యతే....!**

స్వప్నంలో లాగానే జాగ్రత్‌లో కూడా తెలియబడుచున్నదంతా – తెలుసుకునేవాని రూపమే అయి ఉన్నది. మట్టికుండలో మట్టిని తీసేస్తే కుండ ఎక్కడుంటుంది? శిలాపాత్రలో శిలను తొలగించి పాత్రను చూడగలమా? ద్రవ్యత్వం లేని జలం ఉంటుందా? ఉష్ణరూపమగు అగ్నిలో ఉష్ణత్వం తొలగిస్తే అగ్ని ఎక్కడ? స్పంద రూపమగు వాయువు స్పందరహితంగా ఉంటుందా? అట్లాగే ... చైతన్య రహితంగా జగత్తు ఉండజాలదు. చైతన్యమున్న చోట జగత్తు (దృశ్యము) ఉండనే ఉంటుంది?

ఒక పదార్థం దేనిచే మయమైవున్నదో, ఆ మయమైన దానిని తొలగిస్తే పదార్థం ఉంటుందా? బంగారపు గొలుసులో బంగారం తొలగిస్తే గొలుసు ఉంటుందా? చైతన్యము లేకుండా జీవుడు లేడు, జగత్తు లేదు. ద్రష్టాలేడు. దృశ్యమూ లేదు.

స్వప్న ద్రష్ట లేకుండా స్వప్నం ఉంటుందా? అట్లాగే, జాగ్రత్ ద్రష్ట లేకుండా జాగ్రత్ ఉండదు. స్వప్నంలో కనిపించేవన్నీ చిదాకాశమయములే అయినవున్నట్లు జాగ్రత్‌లో కనిపించేవన్నీ చిదాకాశము యొక్క ఆభాసరూపములుమాత్రమే!

స్వప్నమూ – జాగ్రత్తూ కూడా చిదాకాశరూపములే! ఆ రెండింటినీ శోధిస్తే చిన్మాత్రమే శేషిస్తోంది. ఈ విషయంలో తదితరమైన వాదోపవాదముల వివాదమంతా వ్యర్థమే గాని మరింకేమీ కాదని మా అభిప్రాయం.

❖❖❖

# 8. చిదాకాశ స్వరూపం

**శ్రీరాముడు :** హే మహర్షీ! జాగ్రత్, స్వప్నముల కంటే భిన్నమై, ఆ రెండింటికి అప్రమేయమై, విలక్షణమైన మనందరి ఆత్యంతిక కేవలసాక్షీరూపమగు "చిదాత్మ" గురించి మీరు చెప్పుచున్న కొద్దీ ఇంకా వినాలనిపిస్తోంది. పరబ్రహ్మమగు చిదాకాశం ఎట్టిదో మరల మరికొంత బోధింప వలసిందిగా నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**సమయోః యమయోః భ్రాతోః వ్యవహారాయ నామనీ ।**

**యద్వత్ క్రియతే ద్వే తద్వత్ జాగ్రత్ - స్వప్న శిలామయే ॥**

ఓ రామచంద్రా! ఒకే సమయంలో జనించిన కవల పిల్లలకు రెండు వ్యవహార నామములు ఇచ్చి పిలుచుకుంటాం చూచావా? అట్లాగే చైతన్య స్ఫటిక శిలామయము, చైతన్యము యొక్క ప్రతిబింబరూపము వంటివి, ఉభయములు ఒకదానితో మరొకటి అయిన రెండు ఏకసమయజనిత ప్రపంచములకు ... 1.జాగ్రత్ ప్రపంచం, 2. స్వప్న ప్రపంచం అని రెండు వ్యవహార నామములు పెట్టుకుని పిలుస్తున్నాం ...అని మనం ఇప్పటిదాకా నిరూపించుకున్నాం.

ఆ తరువాత... "జాగ్రత్ - స్వప్నములు రెండూ చిదాకాశ విన్యాసములు" అని, "ఈ జీవుని వాస్తవ స్వరూపం చిదాకాశమే" అని, "తెలియబడేదంతా తెలుసుకున్న వాని యొక్క చిత్కళా ప్రతిబింబ రూపం" అని కూడా మనం మన ఈ వర్తమాన సంవాద సందర్భంలో సుస్పష్టం చేసుకుంటున్నాం.

రెండు పాత్రలలో గల ఒకే నీరు వలె, రెండు పాత్రలలో ఉంచబడిన క్షీరంలాగా జాగ్రత్ స్వప్నాల రెండింటికీ భేదమేమీ లేదని మరొకసారి నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాను. ఆ రెండు కూడా నిర్మలమగు చిదాకాశమే అయివున్నాయి. ఈ మన సిద్ధాంతంలో సందేహమేమైనా ఉన్నదా చెప్పు?

**శ్రీరాముడు :** "జాగ్రత్ - స్వప్నములు ఏకరూపమైనవే! ఆ రెండు కూడా చిదాకాశ రూపములే" అని మీ బోధామృతసార ప్రభావం చేత నా కిప్పుడు సుస్పష్టం అయింది. "అత్యంత యుక్తియుక్తం కూడా" ...అని నేను అనుభూతిపూర్వకంగా అంగీకరిస్తున్నాను. అయితే జాగ్రత్ - స్వప్నముల వాస్తవ రూపమైనట్టి చిదాకాశము యొక్క రూపమేమిటో, అద్దాని యొక్క దర్శన - గ్రహణాదులు ఎట్టివో ఇంకా నేను మరికొంత నిర్దుష్టంగా గమనించవలసి ఉన్నది. కనుక అట్టి 'చిదాకాశము' గురించి ప్రవచించండి.

**చిదాకాశము -**

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చిదాకాశము యొక్క స్వరూపము వాక్కు - మనస్సులకు కూడా అందనిది. (అవాఙ్మానసగోచరం). మన ఈ సంవాదమేమో వాక్యపరంపరలకు పరిమితమైనది. అయినప్పటికీ కూడా అనుభూతిని వాక్కుతో మనం ఒకరికొకరం కొంతవరకు చెప్పుకుంటున్నట్లుగానే, చిదాకాశము యొక్క రూపం ఉపమానపూర్వకంగా వీలైనంతవరకూ చెప్పటానికి ప్రయత్నిస్తాను.

**నిర్మల చిదాకాశ స్వరూపం, నిర్విషయ జ్ఞాన స్వరూపం -** ఈ దృష్టి ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి వెళ్ళుచున్నప్పుడు (ఒక విషయమును త్యజించి మరొక విషయాన్ని ఆశ్రయిస్తున్నప్పుడు) ...ఆ రెండు ప్రదేశాలకు, విషయాలకు మధ్య గల నిర్విషయ జ్ఞాన స్వరూపమే నిర్మల చిదాకాశం యొక్క స్థాన-స్వరూపాలు. నిర్మల(విషయరహిత) జ్ఞానస్వరూపమే 'చిదాకాశం' అని చెప్పబడుతోంది.

**నిర్మలాహ్లాద స్వరూపం -** భూమియందలి రసమును వృక్షము తన వ్రేళ్ళు-మూలము ద్వారా ఆకర్షిస్తున్నప్పుడు ఏ ఆహ్లాదమును ఆస్వాదిస్తోందో, అట్టి ఆహ్లాదము వృద్ధి - క్షయములు

పొందనప్పటి స్వరూపమే చిదాకాశ స్వరూపమని వ్యాఖ్యానించబడుతోంది. అంటే విషయ స్వీకారం జరుగుచున్నప్పటి జీవుడు పొందే ఆహ్లాదమే విషయరహితమై వృద్ధి – క్షయ రహితమై ఉంటే .... అట్టి ఆహ్లాదము యొక్క రూపం చైతన్యము యొక్క (చిదాకాశము యొక్క) రూపం అయివున్నది.

**ఇచ్ఛారహితమైన మనస్సు యొక్క సుఖశాంతి స్వరూపం -** కోర్కెలన్నీ శమించినట్టి శాంతచిత్తుడున్నాడనుకో! ఆయన యొక్క సర్వవైషమ్య రహితమైనట్టి ఏ స్వాభావిక సుఖస్వరూప అనుభవం ఉన్నదో... అట్టి వస్తు – సంఘటనాదులకతీతమైన సుఖానుభవముతో కూడిన మనః స్వరూపమే చిదాకాశము యొక్క స్వరూపం.

**స్వస్థతతో కూడిన నిర్మల చిత్త స్వరూపం -** నిద్ర యొక్క ప్రారంభ సమయంలో ఈ మనస్సు సమస్త జగత్ విషయములు త్యజించివేయగా, అప్పటి ఆ మనస్సు యొక్క ఆనందానుభవమేదైతే ఉన్నదో, అదియే చిదాకాశము యొక్క స్వరూపమని వర్ణించబడుతోంది.

**మమత్వరహిత రసభావానందం -** అట్లాగే వర్షఋతువులో చెట్లు చిగిర్చుచున్నప్పటి మమత్వరహితమైన రసానుభవానందమే చిదాకాశము యొక్క స్వరూపం.

**సంకల్పాతీతం -** ఎప్పుడైతే ఈ జీవుడు రూప – లోక – సంకల్పాదులన్నీ విడిచిపెడతాడో, వాటి నుండి అతీతత్వమును సముపార్జించుకుంటాడో, అప్పటి ఆ జీవుని యొక్క శరత్కాలముతో పోల్చతగిన స్వభావ సిద్ధమైన ఆనంద స్వరూపమే చిదాకాశముగా చెప్పబడుతోంది.

**స్వసత్తా సంస్థితి -** బ్రహ్మదేవుడు ఒక శిలకు ప్రసాదించివున్న చేష్టారహిత స్థితి వంటి మనోలయ రూపమైన 'సత్తాత్మస్థితి' ని ఏ జీవుడు సముపార్జించుకుంటాడో, అట్టి జీవుని అనిర్వచనీయ నిశ్చల – ఆత్మ స్వరూపానుభవమే ఆ చిదాకాశముగా ప్రవచించబడుతోంది.

**జాగ్రత్ - స్వప్న - సుషుప్తులకు సాక్షి -** ఎందులోనుంచి అయితే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు బయల్వెడలి మరల తిరిగి మరొకప్పుడు లయం చెందుచున్నాయో, అట్టి నిర్వికారమగు స్వస్వరూపమే 'చిదాకాశము' అను పేరుతో ఉద్దేశించబడుతోంది.

**లయ స్వరూపం -** ఏ కేవల సాక్షి స్వరూపమునుండి సర్వ పదార్థ – విషయ వాసనలన్నీ ఉద్భవమయి, ఎద్దానియందైతే అవన్నీ ఎప్పటికో అప్పటికి లయం అగుచున్నాయో, అట్టి విషయరహిత కేవల సాక్షిస్వరూపమే చిదాకాశ స్వరూపంగా నిర్వచించబడుతోంది.

**యస్మిన్ సర్వం, యతః సర్వం, యః సర్వం, సర్వతశ్చ యః ।**
**యస్య సర్వమయో నిత్యం స చిదాకాశ ఉచ్యతే ॥**

దేనియందైతే ఈ సమస్తం ఉన్నదో, దేనియందైతే సమస్తం ఉద్భవించిందో, ఈ సమస్తము ఏది అయివున్నదో, ఏది అంతటా వ్యాపించి ఉన్నదో, ఏది సర్వమయమై వెలుగుచున్నదో... అదియే 'చిదాకాశము' అని పిలువబడుతోంది.

**ప్రకాశరూపం -** ఈ భూమిపైన, అంతరిక్షంలోను, స్వర్గంలోను, సర్వ బాహ్య – అభ్యంతరము లందు, ఇతర సర్వ నామ, రూపములందును ఏదైతే సర్వదా–సర్వత్రా ప్రకాశమానమై వెలుగొందుచున్నదో అదియే 'చిదాకాశము' అని చెప్పబడుచున్నది.

**దృశ్యమంతా ఎద్దాని ఆభరణమో! -** దేనికైతే ఈ జగత్తంతా కూడా ఒకానొక అవయవంగా అయివుంటుందో, దేనియందైతే ఈ సాకార – నిరాకార రూప ప్రపంచమంతా ఆవిర్భవించి, ఆ తదనంతరం పుష్పమాలగా ధరించబడుచున్నదో... అట్టి నిర్మల సర్వాభరణ భూషిత స్వరూపమే చిదాకాశముగా సంభాషించబడుతోంది.

**సృష్టి-స్థితి-లయాలకు స్థానం -** దేనినుండైతే జలతరంగాలవలె ఈ సృష్టి – స్థితి – లయాలు అనే వికారాలు ఉద్భవిస్తున్నాయో, దేనిలో అయితే సర్వము విలీనం కానున్నదో... దేనిచే ఈ సర్వము పూర్ణమై ఉన్నదో అదియే చిదాకాశముగా గానం చేయబడుతోంది.

**అది కేవల సాక్షి -** సుషుప్తి తొలగగా ఏ కేవల సాక్షి స్వరూపము నుండి జాగ్రత్ స్వప్నరూపమగు ప్రపంచము ఆవిర్భవించి, మరల ఆ విక్షేప శక్తి తొలగటంచే ఎద్దానియందైతే నివృత్తి అగుచున్నదో అట్టి 'సాక్షి – అది' అయిన దానినే చిదాకాశముగా శాస్త్రకారులు ఎలుగెత్తి చాటుచున్నారు.

**స్వానుభవం -** ఎద్దాని యొక్క కనులు తెరవటం 'జగదావిర్భావం' గాను, కనులు మూయటం 'జగత్ తిరోభావం' గాను అగుచున్నదో, ఏదైతే సర్వదా ప్రతి జీవునికి అనుక్షణం స్వానుభవమే అయివున్నదో, .... అదియే 'చిదాకాశము' అని గమనించు.

**ఆది శేష్యము -**

**నేఽదం నేఽదం తదిత్యేవం సర్వం నిర్ణీయ సర్వథా**
**యన్నకించిత్ సదా సర్వం తత్ చిత్వ్యోమేతి కథ్యతే ॥**

"నేతి – నేతి ...ఇది కాదు – ఇది కాదు" అని ఈ ప్రకారంగా సమస్తమును – సర్వత్రా ఉన్నప్పటికీ వాస్తవానికి దృశ్యంగాగాని, ద్రష్టగాగాని అగుచుండుటయే లేదో ...అదే చిదాకాశంగా సంభాషించుకొనబడుచున్నది.

ఓ రామచంద్రా! బాహ్యమున రూపనామాదులతో, అభ్యంతరమున సంకల్పాదులతో నిర్మించ బడిన ఈ ప్రపంచమంతా తత్ చిదాకాశమే సుమా! నిర్మలమగు చిదాకాశముకంటే ఈ ప్రపంచము వేరుగా కనబడుచున్నప్పటికీ జలంలో బుడగలు లేచి లయిస్తున్నట్లుగా ఆ చిదాకాశ మహాసముద్రంలో ఈ జగత్ బుద్బుదాలు ఉద్భవిస్తున్నాయి – లయిస్తున్నాయి. బుద్బుదాలు (బుడగలు) జలస్వరూపమే అయినట్లు ఈ జగత్తులన్నీ చిదాకాశ స్వరూపమే! జలమునకు వేరుగా బుద్బుదములు దృశ్యమానమైనట్లు, అజ్ఞాన దృష్టికి చిదాకాశంలో జగత్తులు అజ్ఞాన దృష్టికి ఒకింత అగుపిస్తున్నాయి.

❖❖❖

# 9. ద్రష్ట - దృశ్యము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ దశరథరామా! ఈ ఇంద్రియాలు ఆయా పదార్థములను అనుభవించ వచ్చుగాక!

**పశ్యన్నైవ ఇంద్రియార్థాన్ నూనం నిర్వాసనాశయః ।**
**ప్రబుద్ధఏవైక ఘనః సుషుప్తావస్థితో భవ ॥**

ఈ కళ్ళు చూస్తే చూడనీ! ఈ చెవులు వింటే విననీ! ఈ ఇంద్రియాలన్నీ ఈ ప్రపంచంలో తమకు నియమించబడిన ఆయా పనులను చేసుకుపోతూ ఉండనీ. నీవు మాత్రం వాసనా రహితుడవై ఉండు. నిరతిశయానందఘనైక రూపమైనట్టి ఆత్మయొక్క జ్ఞానమును సుస్పష్టము – నిర్దుష్టము – అనుక్షణికము చేసుకున్నవాడవై ఉండు. సుషుప్తిలో ఉన్నవాడు ఎట్టి మనోచలనములేక, సుషుప్తి (గాఢ నిద్ర) ని మాత్రమే పొందుచూ ఉంటాడు చూచావా? అట్లా నీవు ఎల్లప్పుడు కేవల చిదాత్మనే దర్శిస్తూ స్వాత్మయందు నెలకొని ఉండు. వాసనా రహితుడవై, శాంతచిత్తుడవై ఉండు. జీవిస్తూవుంటూనే ఒక శిలవలె సర్వ సందర్భములలోను అంతరంగంలో మహామౌనము వహించి ఉండు. క్షీరంతో శివలింగాభిషేకం చేస్తున్నప్పుడు తెంపులేని ధారగా అభిషేకిస్తాము చూచావా? అట్లా నీవు తెంపులేని ధారగా ఆత్మానందం ఆస్వాదిస్తూనే ఈ ఇంద్రియములతో తిను, త్రాగు, మాట్లాడు, సంచరించు, తదితర వ్యవహారములన్నీ నిర్వర్తించు.

**ఇదం న సంభవత్యేవ దృశ్యం పశ్యసి యత్పురః ।**
**మృగతృష్ణా జలమివ ద్వైతమిన్ద్వావినోదితమ్ ॥**

ఈ పురము మొదలైన ఏ దృశ్యమైతే నీకు ఎదురుగా, కనబడుతోందో... ఇది వాస్తవానికి సంభవించనే లేదు. సూర్యకిరణాలే మృగతృష్ణా జలంగా కనిపిస్తోంది చూచావా? ఒక్క చంద్రబింబమే మెల్లకన్ను వానికి రెండు చంద్ర బింబములుగా కనిపిస్తోంది కదా! చిదాకాశము కంటే భిన్నంగా ఈ జగత్తు మిథ్యగా ఉదయించినట్లు కనబడుతోంది. ఎందుకంటే సృష్ట్యాది యందు చిదాకాశము నందు దృశ్యము ఉదయించటానికి కారణమే లేదు. కారణరహితమైన అద్వయ బ్రహ్మము నుండి కార్యరూపంగా కనిపించే దృశ్యం ఎట్లా ఉదయిస్తుంది చెప్పు? చిదాకాశం సర్వదా (సృష్టి యొక్క ఉదయ, ఉనికి, అస్తమయాలలో) యథాతథంగానే ఉండి ఉండగా ఇక అద్దానిలో జగత్తు ఉత్పన్న మవటమేమిటి? నశించటమేమిటి? ఇక బీజము, అద్దాని అంకురము – ఇవన్నీ కూడా నిష్క్రియము, నిరవయవము అగు చిదాకాశ రూపములే అయివున్నాయి. ఈ విధంగా ఈ ప్రపంచము, ఇందులో కనిపించే ద్రష్ట, దృశ్యములు – ఇవన్నీ చిదాకాశానికి అభిన్నములై, చిదాకాశ రూపాలే అయివున్నాయి.

చంద్రబింబం ఒక్కటే అయి ఉన్నప్పటికీ రెండవ చంద్రబింబం ఎందుకు కనిపిస్తోంది? కంటి దోషం చేత! (లేక) భ్రాంతి చేత. అంతేకదా?

అట్లాగే బ్రహ్మం (లేక) చిదాకాశం సర్వదా పూర్వపు అద్వయరూపంలోనే ఉన్నప్పటికీ ఇక్కడ 'నీవు – నేను' ఇత్యాది భ్రాంతి రూపాలన్నీ అగుపిస్తున్నాయి. కారణం? – ద్రష్ట యొక్క దృష్టిదోషంచేత! అద్వైత బ్రహ్మంలో ఏఏ జీవునికైతే ఈ జగత్తు దృఢానుభవరూపంగా కనిపిస్తోందో... అది అనాదికాలం నుండి వచ్చుచున్న భ్రాంతి రూపమగు అజ్ఞానంచేతనే అట్లు (ఆ దృష్టి) ఏర్పడి ఉంటోంది. కనుక అట్టి దృష్టికి (భ్రమచే) కనిపించే దృశ్యమంతా స్వప్నతుల్యము మాత్రమేనని చెప్పబడుతోంది.

**తస్మాత్ దృశ్యమ్ న చ ఉత్పన్నం, నైవాఽస్తి, న భవిష్యతి ।**
**న చ నశ్యతి! యన్నాస్తి తస్య కిం నామ నశ్యతి ॥**

అందుచేత ఈ అజ్ఞాన కారణంగా కనిపించే భ్రాంతిరూప భ్రమ అని చెప్పదగ్గ దృశ్యము అనేది మొదలే ఉత్పన్నం కాలేదు. అసలు ఉండియే ఉండలేదు. ఇక ముందు ఏర్పడనూబోదు. ఏది లేకయే ఉన్నదో... దానికి నాశనమేమున్నది? దృశ్యమును దృశ్యముగా కాకుండా ... "బ్రహ్మము" గా చూడటమే బ్రాహ్మీస్థితి. అదియే వాస్తవమైన సమాధి.

కాబట్టి రామచంద్రా! పరమశాంతమగు చిదాకాశము తన పరమశాంత, అప్రమేయ, అఖండ రూపము నుండి ఏమాత్రం చ్యుతిని పొందటమేలేదు. అట్లా స్వస్థముగాను, శాంతముగాను ఎప్పటి యట్లు ఉంటూనే ఈ విధంగా తనయందు జగద్రూపంగా ఆవిర్భవించినదగుచున్నది. అయితే, ఏది సృష్టికి ముందు లేదో, ... అట్టి దృశ్యము సత్యమెట్లా అవుతుంది? కనుక చిదాకాశమే ఉన్నది. దృశ్యము లేదు. దృశ్యము లేనిదే అగుచున్నది కాబట్టి ద్రష్టయు లేనివాడే అగుచున్నాడు. ఎందుకంటే దృశ్యము లేకుండా ద్రష్టత్వమా? ద్రష్టత్వం మాత్రం (చిదాకాశంలో) ఎక్కడి నుండి వస్తుంది?

**శ్రీరాముడు :**

**ఏవం చేత్ తద్వద బ్రహ్మన్ ! ద్రష్టృ - దృశ్యా అవభాసనమ్**
**కిమిదం కథమ్ ఆభాతి? భూయోఽపి వదతాం వర ॥**

వక్తలలో మహాశ్రేష్ఠుడవగు హే మహాత్మా! వసిష్ఠ మునీంద్రా! మొదలే లేనటువంటి ఈ-ద్రష్ట, దృశ్యము ఎట్లా భాసిస్తున్నాయి? మరొకసారి ఈ విషయం వివరించ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నిర్మల చిదాకాశమునందు 'దృశ్యము' అనేది భాసించటానికి కారణమే లేదు. కారణమే లేదు కాబట్టి దృశ్యము భాసించటం ఎప్పుడూ సంభవించనే లేదు.

దృశ్యమే ఉత్పన్నమై ఉండలేదు కాబట్టి, తత్ సంబంధిత మాత్రమైన దృశ్యత్వము సంభవించలేదని వేరుగా చెప్పనక్కర్లేదు కదా! ఇట్టి ప్రౌఢవాదమును అనుసరించి ఈ జగత్తు యొక్క దృశ్యత్వము లేనిదే అగుచున్నది. సద్రూపమగు పరబ్రహ్మమే మాయచే ఇట్లు ద్రష్టత్వము - దృశ్యత్వము - దృశ్యములుగా భాసించుచున్నదని చెప్పబడుతోంది.

**యదిదం భాసతే కించిత్ ద్రష్టు - దృశ్య భ్రమాత్మకమ్ ।**
**జగదాది పరం రూపం తద్విద్ధి పరమాత్మనః ॥**

ఓ రాఘవా! బ్రహ్మాత్మకమై, ద్రష్ట - దృశ్యముల రూపంగా భాసించుచున్న ఈ జగత్తును, ఇందలి పదార్థాదులను పరమాత్మ యొక్క రూపంగా దర్శించు. స్వప్నంలో కనిపించే ఆకాశము - భూమి - గ్రామాదులు - జనులు అన్నీ కూడా చిన్మాత్రమగు ఆత్మయే స్వయముగా తనయందు ఇట్లు జగద్రూపంగా భాసిస్తోంది కదా! ఇక్కడ ఆదిసృష్టి మొదలుకొని దేనికీ ఎచ్చటా కూడా ఆత్మకు వేరైనట్టి ఉపాదాన కారణమేదీ లేదు. కాబట్టి ఏదైతే భాసిస్తోందో, అది కేవలము బ్రహ్మమే అయి ఉన్నది. చిదాకాశమునందు చిదాకాశ రూపమే అయిన ఏ 'స్ఫురణ' విజృంభిస్తోందో జగదాకారంగా ఉదయించినదై భాసిస్తోంది.

భావమునకు- భావత్వమునకు, శూన్యమునకు-శూన్యత్వమునకు, ఆకార పదార్థమునకు - ఆకారమునకు... ఎటువంటి అవినాభావ సంబంధమున్నదో .... అట్టి అవినాభావ సంబంధమే

చిదాకాశమునకు – జత్తునకు ఉన్నది. ఉప్పు పొడి – ఉప్పు గడ్డకు గల సంబంధంలాగా ఈ జగత్తు చిద్రూపరసమేనయ్యా! చైతన్యమే మాయయందు ప్రతిభాసించినదై ఇట్లు 'ద్రష్ట – దృశ్య – దర్శనము' అనే త్రిపుటీ రూపంగా స్వయంగా భాసిస్తోంది. మాయను తొలగిస్తే ద్వైతం తొలగుతుంది. ద్వైతం అభావత్వం సంతరించుకోగానే... ఇక భాస్యము (ప్రకాశించేది) ఉండదు. భాస్వకము (ప్రకాశింపజేసేది) ఉండదు. అప్పుడు ఈ జగత్తు సత్తు కాదు, అసత్తు కాదు. ఇది అనిర్వచనీయమే అవుతుంది. కుమారుని "ఇతడు నా కుమారుడు" అనే దృష్టితో దర్శించే వాని దృష్టితో పోలిస్తే ఇక "ఇతడు మమాత్మయే" అనే దృష్టి అనిర్వచీనయమై ఉంటుంది కదా!

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జగత్తు ద్రష్ట – దృశ్య శూన్యము (అవి లేనివి) అయినప్పుడు మరి
1. ఈ జగత్తులో కార్య – కారణత్వాది భేదం ఎక్కడిది? ఎక్కడి నుండి వచ్చి ఉన్నది?
2. ఈ కార్యకారణ భేదం సత్యమై ఎట్లా భాసిస్తోంది?

❖❖❖

## 10. కార్య - కారణ జగద్వ్యవహారం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! ఈ స్వప్న సదృశ జగత్తులో కనబడే కార్యకారణముల వాస్తవ రూపమేమిటో చెబుతాను. విను.

నీవు, నేను, ఈ సర్వ సహజీవులు – మనమంతా స్వాత్మయగు చిత్ప్రకాశ రూపులమే! అయితే అట్టి స్వస్వరూపం యొక్క చిత్ ప్రకాశము ఎప్పుడు ఏ తీరుగా ప్రకాశిస్తుందో ఆ తీరుగానే అనుభూతి పొందుతోంది. అయ్యది కామ – కర్మ వాసనలను అనుసరించి దేనిని 'ఇది సత్యము' అని భావిస్తుందో... అది అద్దానికి సత్యంగానే భాసిస్తుంది. అంటే, ఈ జీవుడు దేనిని ఎట్లు 'సత్యం' అని తలచుచున్నాడో... అద్దానిని అట్లే 'సత్యం' గానే పొందుచున్నాడు. దాని అర్థం? సత్య – అసత్యములు ప్రతి జీవునికి స్వయం కల్పితానుసారమే వెలయుచున్నాయి. అట్టి స్వయంభావిత సత్యానుసంధానాన్ని అనుసరించి ద్రష్ట–దృశ్య భావములు ఈ జీవుని పట్ల రూపుదిద్దుకుంటున్నాయి. చిదాకాశ రూపుడగు జీవేశ్వరుడే కార్య–కారణ భావములను ధరించి దర్శిస్తున్నాడు. "ఇది స్వప్నము" – అని ఎఱుగబడిన తరువాత "ఇదంతా నాయొక్క కల్పన మాత్రమే" అని క్షణంలో సుస్పష్టంగా గమనించబడగలదు కదా? అట్లాగే "ఇదంతా నాయొక్క చిదాకాశ స్వరూపము నందే పొందబడు చున్నది" అని ఎవరు గ్రహిస్తారో... వారిక దేనికీ మోహం చెందరు. అట్లా గ్రహించకపోతే మోహం చెందుచున్నారు.

**శ్రీరాముడు :** మహర్షీ ! ఈ జీవుడు స్వాత్మబోధ సమర్థుడగు ఈశ్వర స్వరూపుడేకదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ! అందులో సందేహమే లేదు.

**శ్రీరాముడు :** అట్టి స్వాత్మబోధ సమర్థతతో కూడిన ఈశ్వర స్వరూపుడగు ఈ జీవుడు మరి 'మోహం' ఎందుకు పొందుచున్నాడు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవుడు స్వాత్మ బోధ సమర్థుడగు ఈశ్వరుడే! అందులో ఏ మాత్రం సందేహం లేదు. అట్టి ఈశ్వరుడు ఈ జీవమోహం ఎందుకు పొందుచున్నాడో నేనేమీ

చెప్పజాలను. అందుకే "ఇదంతా ఈశ్వర లీల" అని మాత్రం సిద్ధాంతీకరించబడింది. 'నేను ఉపాధికి సంబంధించిన అల్పజీవుడను' అని ఆతడు తన గురించి, ఈ దేహ దృశ్యాదుల గురించి భావించటం ఎందుచేత?" అనేది అనిర్వచనీయం. మేము సత్యమేమిటో– ఈ జీవుడు శివ స్వరూపుడేనని నిరూపిస్తూ – చెప్పుచున్నాం కదా! అయితే, అసత్యం ఎందుకు పరిఢవిల్లుతుందో ఏం చెప్పగలం? అందుచేత అది మాయ (యమా= ఏది లేకయే ఉన్నదో) అని, అవాచ్యమని విజ్ఞుల వాక్యం. అయితే ఈ జీవుడు సంవిత్ స్వరూపమగు ఆత్మయే స్వస్వరూపంగా కలిగి ఉన్నాడని జ్ఞాన బలంచే గ్రహించి మేము గమనిస్తున్నాం. అట్టి స్వస్వరూప ఏమఱుపుయే జగద్విన్యాసమై ఉన్నది.

**శ్రీరాముడు :** చిదాకాశము – జీవుడు – జగత్తు అను వాటికి గల సంబంధము ఎట్టిది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**భావాత్ భావాంతర ప్రాప్తౌ మధ్యే యత్ సంవిదో వపుః**

**తత్ చిత్ వ్యోమ, తదేవ ఇదమ్ సర్వం చ స్థితి ! నేఽతరమ్ !**

భావము, భావముల మధ్య ఏ భావరహిత చిత్ చైతన్యం ఉన్నదో... అదియే 'సంవిత్' అను శబ్దముచే చెప్పబడినది. అనగా ఒక భావము త్యజించిన తరువాత – తదనంతర భావం ఇంకా పొందక ముందు గల భావరహిత – భావాతీత స్వరూపమే సంవిత్తుగా చెప్పబడుతోంది.

అదియే చిదాకాశము అయివున్నది. అదియే ఈ జీవుని నిజ స్వరూపం. అట్టి చిదాకాశమునందే ఈ జీవుడు – జగత్తు అనునవన్నీ ఇమిడివున్నాయి. చిదాకాశమునకు భిన్నమైనదంతా ఎక్కడా ఏదీ లేదు. కనుక జీవుడు – జగత్తుగా చిదాకాశమే (లేక) సంవిత్ చైతన్యమే అజ్ఞానదృష్టికి అగుపించటం జరుగుతోంది. ఇక ఆయా దృశ్య భావాల, కార్య – కారణ భావాల మాటేమిటంటావా?... అట్టి దృష్టులన్నీ కూడా అవిద్యచే (లేక మాయచే) కల్పించబడినవి మాత్రమే!

**శ్రీరాముడు :** అట్టి అవిద్యను కల్పించుచున్నదెవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జీవునిపట్ల అవిద్య ఎవరో మరొకరు కల్పిస్తున్నారనే ఆక్షేపణ యుక్తియుక్తం కాదు. ఈశ్వర స్వరూపుడే అయిన జీవునిపట్ల ఎవరో అవిద్య – మాయ – సంసారమును ఎందుకు ఏ ప్రయోజనం ఆశించి కల్పిస్తారు చెప్పు? ఆతనికి జాగ్రత్ – స్వప్న – సుషుప్త్యవస్థలు కల్పించి వినోదించవలసిన పని ఎవరికున్నది?

**శ్రీరాముడు :** మరి ఈ మాయ (లేక) అవిద్య (లేక) సంసారము అనబడేది ఈశ్వర స్వరూపుడగు ఈ జీవునిపట్ల ఎట్లా ఎందుకు ఏ కారణంగా పరిఢవిల్లుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నీవు చెప్పే అవిద్య లేక మాయ స్వయంకల్పితమేగాని అన్యకల్పితం కాదని గ్రహించు. ఓ జనులారా! మీరు స్వయంగా – మీకు మీరై కల్పనను ఆశ్రయించి, తద్వారా ద్రష్ట – దృశ్య రూప పరంపరలను, జాగ్రత్ – స్వప్న – సుషుప్తి అవస్థాత్రయ పరంపరలను పుంఖానుపుంఖాలుగా స్వయం కల్పిత 'కల్పన' యందు పొందుచూ ఎవరినో ఆక్షేపించి, ఎవరికో ఆపాదించి ఏం లాభం?

**ద్రష్టా భోక్తా అథ కర్తా వా కశ్చిత్ స్యాత్ ఇతరో యది,**
**తత్ కథం? కిమిదం దృశ్యం? ఇతి యుజ్యేత నాఽన్యథా ॥**

ద్రష్టగాని, భోక్తగాని, కర్తగాని కల్పించువాడు గాని తనకంటే వేఱే ఎవరో అయివుంటే... అప్పుడు "ఈ ద్రష్ట-దృశ్య కల్పన ఏమిటి? ఎందుకు వచ్చి పడిందిరా బాబు? ఎటు నుంచి వచ్చింది?" - అనే ప్రశ్న కలిగివుండవచ్చు. ఇవన్నీ స్వకీయ కల్పనలోనుంచే వచ్చినప్పుడు ఇక ఎవరిని ఆక్షేపించగలం? స్వప్నంలో కనబడిన దుస్సంఘటనలకు ఎవరిని దూషిస్తావు? ఎవరినీ ఏమీ అనలేవు కదా? ఎందుకని? అది నీ కల్పనే కాబట్టి. అట్లాగే ఈ జాగ్రత్ అవిద్య ఎవరికి వారు కల్పించుకున్నదేగాని, అది మరెవరో ఎక్కడి నుండో ఇక్కడ ఇదంతా కల్పించటం లేదు సుమా! కనుక 'మాయ' అనబడేది "స్వయం కల్పితమే" అని జీవుడు గమనించినప్పుడే అద్దానిని దాటివేయగల సామర్థ్యం సముపార్జించుకోగలడని విజ్ఞుల అభిప్రాయం. స్వప్నంలో అన్యులగు ఎవరి ప్రమేయం లేకుండానే చిదాకాశమే (చిదాకాశ స్వరూపమగు జీవచైతన్యమే) అనేక పదార్థముల - బంధువుల రూపంగా విరాజిల్లుతోంది కదా! "నా స్వప్నం ఎవరో కల్పించి అందులోకి మనుష్యులను, కొండలను, గృహములను పంపారు" - అని అంటే ఎవరైనా ఒప్పుకుంటారా? లేదు! అట్లాగే ఈ జాగ్రత్ ప్రపంచము కూడా చిదాకాశమే (చిదాకాశ రూపమగు జీవ చైతన్యమే) జాగ్రత్ ప్రపంచములోని సర్వ పదార్థముల - జీవుల రూపంలో విరాజిల్లుతున్నదని గ్రహించు.

దృష్టియే సృష్టి! దృష్టియే జగత్తు. దృష్టి లేనిచోట 'సృష్టి' శబ్దముగాని, అర్థముగాని ఉండవు. దృష్టియే భ్రమ. అదియే సంసారము. అట్టి దృష్టి జీవునకు స్వయంకల్పితమై ఉండగా, "నా పట్ల ఎవరో ఈ సంసారమును (ఈ మాయను) కల్పించుచున్నారు" అని ఆక్షేపించటం ఎంతవరకు సమంజసం? దోషం దృష్టిలో పెట్టుకొని - ఊళ్ళు - లోకములు వెతికి వేసారితే ఏం ప్రయోజనం?

**శ్రీరాముడు :** అట్టి భ్రాంతిదృష్టి ఈ జీవునికి తొలిగేది ఎట్లా? అది స్వయం కల్పితమే అయినప్పటికీ అది తొలగటం ఆవశ్యకం కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను, దృష్టి యొక్క దోషం తొలగటం ఆనంద స్వరూపుడగు ఈ జీవునికి అత్యావశ్యకమే. అయితే...

**అ స్వయంభువ ఏవేయం చిన్మాత్రే భాతి సర్గభాః ।**
**పరిజ్ఞాతా సతీ సా తు బ్రహ్మైవ భవతి క్షణాత్ ॥**

బ్రహ్మదేవుడు మొదలుకొని సమస్త జీవులందు 'దృష్టి భ్రాంతి' అనేది భాసిస్తూనే ఉన్నది. ఇక అట్టి భ్రాంతి తొలగటమెట్లా అంటావా? ఎప్పుడైతే అట్టి దృశ్యభ్రాంతి "భ్రాంతియే కదా, అసత్తే కదా"...అని తెలియబడుచున్నదో... మరుక్షణం సర్వము బ్రహ్మమే అగుచున్నది.

**ఏషైవ త్వపరిజ్ఞాతా భ్రాంతిః మాయేతి కథ్యతే ।**
**జగత్ ఇత్యుచ్యతే అవిద్యా, "దృశ్యమ్" ఇతి ఉపవర్ణ్యతే ॥**

అట్టి సృష్టి భ్రాంతి (లేక) దృష్టి భ్రాంతియే!... భ్రాంతి అని ఎఱుగబడుచుండగా... 'మాయ'

అని పౌరాణికులచే పిలువబడుతుంది. 'జగత్తు' అని లోకరీతిగా చెప్పబడుతున్నది. 'అవిద్య' అని శాస్త్రములచే వర్ణించబడుతోంది. 'దృశ్యము' అని (సాంఖ్యులచే) దర్శించబడుతోంది.

చిదాకాశము యొక్క జ్ఞానముచే సమస్త భ్రాంతి తొలగిపోగలదు. అందుకు వేరే ఉపాయమేదీ లేదు. "నాతో సహా ఈ సహజీవులందరు సర్వదా చిదాకాశ స్వరూపులే" ...అనునదే చిదాకాశ జ్ఞానమైయున్నది. ఈ 'దృశ్యము' అనబడేది వాస్తవానికి "నిజచిత్ స్వభావము" అనుదాని కంటే వేఱుగా లేదు. ఎవరికి ఏది ఎట్లు తెలియబడుచున్నదో ...అది వారు తమ అంతరంగోద్దేశపూర్వకంగా అట్లా దర్శించటం చేతనే ఆ రీతిగా తెలియబడుతోందని విజ్ఞులు గమనిస్తూనే ఉన్నారు. చిన్న పిల్లవాడికి చీకటిలో గాలికి కదిలే వృక్షం 'దయ్యం' లాగా అనిపించినట్లుగా, ఇక్కడ దృశ్యముగా (అజ్ఞాన ద్రష్టచే) ఎరుగబడుతోంది. అట్టి దృశ్య పిశాచానికి సరి అయిన మందు ఆత్మదృష్టి మాత్రమే! అనగా "సర్వ జీవరాసులను ఆత్మ స్వరూపులుగా దర్శించటం" అందుకు ఔషధం. "సర్వము ఆత్మలో ఆత్మయే సర్వముగా" దర్శించటం అభ్యసించటమే ఉపాయం!

స్వప్నంలో నిరాకార స్వప్నాకాశంలో సాకారమగు ఇళ్లు – కొండలు కనిపిస్తున్నాయి చూచావా? అట్లాగే, నిరాకారమగు చిదాకాశమున చిదాకాశ చైతన్యము చేత "నేను జీవుడను, నేను రుద్రుడను నేను పర్వతమును, నేను సముద్రమును, నేను విరాట్ పురుషుడను" ...అని నామరూప విన్యాసమంతా అనుభవించబడుతోంది. మహా ప్రళయ రూపమగు చిదాకాశమున సాకార రూపమగు జగత్తును కల్పించేవారెవరు? ఒకవేళ ఎవరైనా కల్పించేవారు ఉంటే, "చిదాకాశమునకు అన్యమైనది ఉన్నది" – అని అనవలసి వస్తుంది. అట్లా అనటం వేదవాక్కుకే విరుద్ధం. కనుక –

1. చిదాకాశమునందు జగత్తు కల్పించటానికి కారణమే లేదు.
2. కారణమే లేనిచోట కార్యమూ లేదు.
3. కనుక చిదాకాశమే జగత్తుగా (అజ్ఞాన దృష్టికి) అనిపిస్తోంది.

"చిదాకాశంలో జగత్తు ఉండటానికి కారణమే లేదు" అని ఎందుకంటున్నామంటే... చిదాకాశం నిరాకారం. నిరాకార చిదాకాశంలో సాకార జగత్తును ఎవరు కల్పిస్తారు?... అట్లు కల్పించేవారు నిరాకారులా? సాకారులా?... సాకారులైతే వారికి సాకారాన్ని ప్రసాదించిందెవరు? చిదాకాశానికి అన్యమైనదే లేదు కనుక మరొకరెవరో సాకారులు వచ్చి జగత్తు అనే సాకారం కల్పించారనటం యుక్తియుక్తం కాదు.

కాబట్టి... నిరాకార – నిర్వికార చిదాకాశం అంతటా యథాతథంగానే ఉన్నది – అద్దానికి మార్పు చేర్పులు ఉండజాలవు కనుక! అట్టి నిరాకార చిదాకాశమే సాకారమువలె (జగత్తువలె) అజ్ఞానదృష్టికి అగుపిస్తోంది. సాకారానుభవానికి జగత్ దృష్టి (లేక) సాకారదృష్టియే కారణంగాని, మరొక సాకారమో – నిరాకారమో కాదు.

సృష్టిగా – దృశ్యముగా కనిపించేదంతా వాస్తవానికి సర్వదా నిర్వికార చిదాకాశమే! చిదాకాశము కారణరహితము, అవయవశూన్యము అయివున్నది. అద్దాని యందు (అజ్ఞాన దృష్టిచే) కనిపించే జగత్తు కూడా వాస్తవానికి కారణరహితము, అవయవ శూన్యము అయిన చిదాకాశమే!

ఉదాహరణకు... త్రాడులో చీకటి కారణంగా పాము కనిపిస్తోందనుకో (సర్ప రజ్జు భ్రాంతి) ఇక ఆ పామును చూచేవానికి పాము, పాము యొక్క క్రూరమైన పడగ, పాము చారలు, బుసబుసలు, అది కాటువేసినప్పుడు నోటి నుండి వచ్చే నుఱుగు, కాటు చేత గిలగిల తన్నుకొని విషము యొక్క వేదనను అనుభవించటం – ఇవన్నీ ఒకదాని వెనుక మరొకటి బాహ్యంలోను మనస్సులోను స్ఫురించి ఆ పామును దర్శించే వ్యక్తికి వణుకు పుట్టుకొస్తుంది.

వాస్తవానికి... ఆ పాముగా కనబడేది సలక్షణంగా త్రాడే కదా! అది జడంగా పడివుండేదే గాని బుసకొట్టి కాటువేసేది కాదుకదా! "సవికారంగా పాముగా కనిపించేది నిర్వికారమగు త్రాడే" అని గ్రహించేవరకు పాము లక్షణాలు పొందబడతాయి, అనిపిస్తాయి. త్రాడుగా గమనించిన తరువాత? అంతకుముందు పాముగా కనిపించినదే ఈ త్రాడు. అంతేగాని, "పాము త్రాడుగా రూపుదిద్దుకొన్నది" అని అనలేం కదా!

అట్లాగే – వాస్తవానికి సర్వము చిదాకాశమే అయివున్నది. అట్టి నిర్వికార చైతన్య రజ్జువులో "నీవు, నేను, దేహము, జన్మ, జీవనము, మరణము, నాది, నీది, రాక, పోక" మొదలైన వాటితో కూడిన 'జగత్తు' అనే సర్పము కనిపిస్తోంది.

ఎందుకు కనిపిస్తోంది? 'అజ్ఞానము' అనే చీకటిలో జన్మజన్మలుగా నడచిరావటం చేత! ఈ మనస్సు అనేక ఊహ – అపోహలను ప్రోగుచేసుకుంటూ రావటంచేత! అంతరంగంలో ఎప్పటి నుంచో అభ్యాసవశం చేత రూపుదిద్దుకుని ఉన్న – పరిపోషించుకుంటూ వస్తున్న పాముకు సంబంధించిన భావములు చీకటిలో చూచిన త్రాడుపై ఆపాదించబడుతోంది... అంతరంగంలో జన్మజన్మలుగా ఘనీభూతమై ఉన్న "భేదదృష్టి" సంస్కార బలంచేత ఇప్పుడు కనబడుచున్న దృశ్యముపట్ల భ్రాంతిని కలుగజేస్తోంది. అందుకే 'శాస్త్రము' అనే ఉపకరణం చేత 'వివేక జ్ఞానము' అనే దీపం వెలిగించి, జగత్–స్వరూపాన్ని గమనిస్తే "ఇది నిర్వికార చిదాకాశమే కదా" – అనే రజ్జువు సుస్పష్టమై, తద్వారా సర్వ భయములు తొలగి, 'శాంతి' అనే చిదాకాశరసాస్వాదన సిద్ధించుటయే ఈ "జగత్తును జయించటం" అంటే!

చూచావా రామచంద్రా! చిదాకాశ స్వరూపుడే అగు ఈ జీవుడు జడునివలె వ్యర్థంగా ఈ సంసారంలో అనేక ఉపాధులతో సంచరిస్తూ నిష్కారణంగా నానావిధ క్లేశాలను కొనితెచ్చుకుంటున్నాడు.

**శ్రీరాముడు :** ఎందుచేత?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అద్దంలో ప్రతిబింబ రూపంగా అనేక వస్తువులు కనబడునట్లు ఈ జీవుడు తన మనోదర్పణంలో స్వకీయ భావావేశములను జతజేర్చి 'జగత్తు'ను పొందుచున్నాడు. తనయందు తన చేతనే పరికల్పించబడిన జగద్భేదములకు మూలకారణం తన అజ్ఞాన దృష్టియేనని గమనించలేకపోవుచున్నాడు. విచారణ లేకుండా ఉపాధిదృష్టిని కొనసాగించటం చేతనే తన వాస్తవ స్వరూపమేమిటో గాంచుటకు సమర్థుడు కాలేకపోవుచున్నాడు. ఎవరైతే తత్త్వ విచారణ గావించుచూ వస్తారో... అట్టి ధీరుని సమీపమునకు ఆత్మానుభూతి "పరమ పురుషార్థమగు నిజాత్మ జ్ఞానరూపం" గా తనంతట తానే సమీపించగలదు.

ఓ ప్రియ సభికులారా! మీరంతా,విచారణచే జగత్తు నందలి సమస్త పదార్థముల నామరూపములను త్యజించినవారై, అప్పటికీ శేషించి ఉండునట్టి చిన్మాత్ర ప్రకాశమును అవధరించి, అట్టి చిన్మాత్ర ప్రకాశమే ఈ జగత్తు యొక్క వాస్తవరూపమని ఎఱిగినవారై, చైతన్య ఘన స్వరూపులై నిశ్చలంగా ఉండండి.

ఓ ప్రియ స్నేహితులారా! చైతన్యము కంటే భిన్నంగా కనిపించే మాయకములగు ఈ దేహాదులందు ఆసక్తి కలిగి ఉండటం ఏమాత్రం సముచితం కాదని నా మనవి. జలం తన రూపమునే ఆవర్తములుగా (కెరటములాగా) చమత్కారంగా ప్రదర్శించుచున్నట్లు, చైతన్యమే వ్యవహారరూపములను ఆశ్రయించి ఈ జగత్తులను పొందటం జరుగుతోంది.

ఓ రామచంద్రా! కల్పవృక్షం, చింతామణి ఏది చింతనచేస్తే అది ప్రసాదిస్తాయి చూచావా? అట్లాగే చైతన్య రూపుడగు జీవుడు తాను ఏది భావిస్తే అదియే సిద్ధించుకోవటం జరుగుతోంది. ఆతని అభిలషితమును అనుసరించే జగత్తు (లేక దృశ్యము) ఆతనికి ప్రాప్తిస్తోంది. ఈ విధంగా దృష్టి ఒక విషయం నుండి మరల మరొక విషయం వైపు విరామం లేకుండా పొందటమే జగత్ ప్రాప్తి. అయితే విషయము – విషయముల మధ్య ఏ నిర్వికార – నిర్విషయ స్థితి ఉన్నదో, నీలంగా అదియే చిదాకాశము యొక్క సామీప్య రూపము. అట్టి నిర్విషయ చిదాకాశమునందు ఈ జగత్తు ఉన్నది. ఇక ఈ జగత్తు ఏకమా, అనేకమా, నిర్విషయమా, సవిషయమా, ద్వైతమా, అద్వైతమా – అనే ప్రశ్నలకు తావెక్కడిది? శూన్యమగు ఆకాశము నీలంగా అగుపిస్తున్నట్లు... అవయవ వర్జితము, దృశ్యరహితము, అనంతము, ప్రకాశపూర్ణము అగు చైతన్యము యొక్క నిర్మలకాంతియే జగత్తు రూపంగా స్ఫురిస్తోంది.

కాబట్టి రామచంద్రా! చిదాకాశంలో 'సృష్టి' అనేది ఉత్పన్నమవటానికి మరొక కారణమంటూ ఏదీ లేదు. కనుక స్వప్నంలో కనిపించే దృశ్యంలాగానే ఈ జాగ్రత్ నందలి దృశ్యము కూడా ఆద్యస్వరూపమగు చైతన్యమే అయివున్నది. నిర్మల చైతన్యమునకు అన్యంగా జగత్తు అనబడేది అణుమాత్రంగా కూడా లేదు.

❖❖❖

# 11. దృశ్యమును నమ్మి ఉండటం వ్యర్థమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ రామచంద్రా । విషయ వర్జితము, చిన్మయము అగు నీ స్వరూపమే ఈ ప్రపంచమున నలుమూలలా భాసించుచున్నదయ్యా! జీవుని స్వస్వరూపమే ఆతనిచే గ్రహించబడే జగత్తు. కనుక ఇక్కడ కనిపించే ...

| "చిత్తు" (ప్రకాశింపజేసేది– తెలుసుకొనేది) | → | "చేతనము" (ప్రకాశనము– తెలుసుకోవటం) | → | "చేత్యము" (ప్రకాశ్యము– తెలియబడేది) |
|---|---|---|---|---|

ఈ మూడు కూడా (త్రిపుటి) శుద్ధ చిదాత్మరూపమే అయి ఉన్నాయి. చిదాత్మరూపము మార్పు చేర్పులు చెందేది కాదు. కనుక జీవన - మరణములు, ఆ రెండింటి మధ్య కనిపించే జాగ్రత్ - స్వప్న - సుషుప్తులు, వాటి వాటి యందు కనిపించే అనేక విషయ పరంపరలు - ఇవన్నీ కూడా ఎప్పుడో గతించిపోయిన వాటివలె స్వప్న తుల్యములు మాత్రమే.

**అతో జీవన్నపి మృత ఇవ సర్వో౽ వతిష్ఠతే**
**అసావహం చ త్వం చేతి జీవన్తో౽పి మృతా ఇవ !**

ఈ దృశ్యము నిశ్చల-నిర్వికల్ప చైతన్యము యొక్క రూపమే కాబట్టి ఇదంతా శాంతైశ్వర్య మయమే! నేను, నీవు, ఈ సభికులు - అందరూ కూడా జీవించి ఉన్నప్పటికీ ఈ సర్వ వ్యవహారములకు అతీత స్వరూపులమే, (లేక) మరణించిన వారమే అగుదుము. ఎందుకంటే జీవమునకు సంబంధించినవారమైనట్టి మన స్వస్వరూపము కాలమునకే సాక్షి అయివున్నది. మనం స్థితి పొంది ఉన్నప్పటికీ, మన స్వస్వరూపం స్థితి - గతుల సాక్షి స్వరూపమే కాబట్టి, (సర్వ సంబంధముల దృష్ట్యా మన స్వరూపం సర్వదా అతీతమైనదే కాబట్టి) మనమంతా "జీవించుచూ మరణించినవారమే అగుచున్నాము" ...అని ఇక్కడ చమత్కారంగా చెప్పుచున్నాను. ఓ రామచంద్రా! ఈ సమస్త పదార్థములు, స్థావర - జంగమ జీవ రూపధారులు, కాష్ఠమగు మౌనరూపాత్మ స్వరూపులే. ఎవరమూ జగత్ పరిమిత రూపులం కానేకాదు. బాల్యం వార్ధక్య సమయానికి స్వప్నసదృశం అయినట్లే జ్ఞానదృష్టి సంతరించుకున్న వానికి వర్తమానము కూడా స్వప్న మాత్రంగా ఎఱుగబడుచున్నది. చూచావా! రామచంద్రా! ఈ కనబడే స్థావర జంగమాత్మకమగు సమస్త పదార్థములు పైకి వ్యవహారయుక్తమై కనిపిస్తున్నప్పటికీ - అంతయూ నిర్లిప్త చిదాకాశరూపమే అయివుండటం చేత, - ఇవన్నీ కూడా మృతుని దేహము వలె, కట్టెపుల్లవలె (కాష్ఠమువలె) అత్యంత మౌనము వహించియే ఉన్నాయి. ఇవన్నీ ఆకాశమువలె సర్వదా నిరాకారములే అయివుండి సాకారమువలె కనిపిస్తున్నాయి. ఆకాశము వాస్తవానికి శూన్యరూపమే అయివుండి నీలత్వంగా కనిపిస్తోంది కదా! అట్టి నీలత్వము మిథ్యయే కదా! ఆకాశమున నీలత్వమనేది అసలు ఎట్లా ఉండగలదు చెప్పు? అక్కడ నీలపు రంగుగల పదార్థమేదీ లేదు కదా! అట్లాగే ఈ జీవులయందు, పదార్థాదులయందు, బాహ్యమందు కనిపించే వ్యవహారత్వము, గుణాదుల సంరంభము, కర్మఫలానుభవ వ్యవహారములు - ఇవన్నీ జీవుని పట్ల కనిపించటమనేది శూన్యాకాశంలో కనిపించే నీలత్వమువలె భ్రమ మాత్రమే! వాస్తవానికి ప్రతి జీవుడు "పరమశాంతము, కాష్ఠమౌనము, శవ నిశ్చలము, ఆకాశమువలె నిరాకారము" - ఇవన్నీ తన స్వభావమే అయివున్న చిదాకాశ రూపుడే అయివున్నట్లు ఆత్మీదృష్టికి సుస్పష్టమే! అట్టి శాంతి, మౌన, నిశ్చల, నిరాకార స్వరూపమును సర్వజీవులపట్ల దర్శిస్తూ ఆస్వాదిస్తూ ఉండు. అంతేగాని మిథ్యయగు ఈ గుణాదులు, వ్యవహారాదులు చూచి భ్రమ చెందవద్దు.

**శ్రీరాముడు :** స్వామీ! దృశ్య జగత్తులో సుఖ-దుఃఖాలు, మాన-అవమానాలు, జన్మ-మృత్యువులు, మంచి-చెడులు, కార్య సంరంభములు కలిగివుండి జీవులంతా సంచారాలు చేస్తున్నారు కదా! అట్టి

ఈ జగత్తు – ఇందలి జీవులంతా కూడా, (మరియు) సర్వ పదార్థములతో సహా – "శాంత – మౌన – నిశ్చల – నిరాకార" స్వరూపమని ఎట్లా సిద్ధాంతీకరిస్తున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ రెండు సిద్ధాంత వాక్యములను గమనించు.

1. చిదాకాశము సర్వదా మార్పు – చేర్పులు లేనిదై, నిర్వికారమై, పరమశాంతమై, కాష్ఠ (కొయ్యవలె) మౌనము వహించియున్నదై, పరమ నిశ్చల స్వరూపమై, గుణాదులచేత గాని – వ్యవహారాదులచేతగాని – కార్యక్రమ సంరంభములచేతగాని స్పృశించబడనిదై ఉన్నది.

2. ఈ జగత్తంతా కూడా ఇందలి సర్వజీవుల – పదార్థములతో సహా సర్వదా చిదాకాశ స్వరూపమే అయివున్నది.

"నేను నిర్వికల్ప చిదాకాశ స్వరూపుడనే" – అని గ్రహించినవానికి జగత్తు యొక్క పరమశాంత – చిదాకాశ స్వరూపం అత్యంత సుస్పష్టంగా అనుభూతమౌతుంది. (లేదా) "ఈ జగత్తు వస్తుతః సర్వదా నిశ్చల చిదాకాశ స్వరూపమే" – అని అనుభూత మొనర్చుకొనిన వానికి స్వకీయ నిర్లిప్త మహామౌన చిదాకాశ స్వరూపము అనుభవ సిద్ధమౌతుంది. ఈ రెండూ ఒకదానిచే మరొకటి, ఒకదాని వెనుక మరొకటి స్వయంగా దృష్టియొక్క పవిత్రతచే ఒనగూడుచున్నాయి.

ఇక ఈ జగత్తులో దృష్టికి కనిపించే చంచలత్వము, ద్వంద్వత్వము, వ్యవహారత్వము సుఖదుఃఖాలు, సంచిత ఆగాములు మొదలైన దృశ్య సంరంభమంతా ఎటువంటిదంటే... నిరాకారము, శూన్యము అగు ఆకాశము కేశాకారములు (వెంట్రుకల వలె గీత లేవో ఉన్నట్లు, ముత్యపు మెరుపులు) ఉన్నట్లు అగుపించటం వంటిది.

సర్వదా నిశ్చల – నిరాకార స్వరూపమే అయిన జలంలో తరంగాది ఆకార – సంరంభములు కనిపించటం వంటిది. కాబట్టి రామచంద్రా! బాహ్యమున జీవులలో కనిపించే వ్యవహార సంరంభమంతా "ఇది మిథ్యయే కదా!"... అని ఒకానొక గుణాతీత – వ్యవహారాతీతమైన దృష్టిని పెంపొందించుకున్నవాడవై "ఈ జనులు, ఈ జగత్తు పరమశాంతమగు చిదాకాశమే"... అను దర్శనమును ప్రవృద్ధపరచుకో.

**తథైవ అస్మిన్ జగత్ నామ్ని చిత్వ్యోమ్ని కచనే చితే ।**
**అనుభూతేఽపి నిఃశూన్యే కాస్థా? అస్థాభావ కశ్చ కః ॥**

ఈ దృశ్య జగత్తు కంటికి కనిపిస్తున్నప్పటికీ వాస్తవానికి ఇందులో వస్తుత్వము లేదు. ఆకాశంలో భ్రమచే ముత్యములు కనిపించవచ్చుగాక! అది నిజమా? కాదు. ఈ కనబడేదంతా చిదాకాశం యొక్క స్ఫురణరూపం మాత్రమే! అనగా చిదాకాశ స్వరూపుడగు జీవుని యొక్క స్వకీయ స్ఫురణచేత ఇది ఇట్లు స్ఫురిస్తోంది. స్ఫురణ మాత్ర రూపమై, వాస్తవానికి సర్వదా శూన్యరూపమే అయి ఉన్న ఈ జగత్తులో ఏ ఒక్కదానియందైనా భోగాసక్తి ఎందుకు? ఉండవలసిన పని ఏమున్నది? భోగాసక్తిని కలుగజేసే పదార్థాలేమి ఉన్నాయి?

ఓ చిదాకాశామృత స్వరూపులగు సహోదర జనులారా! నా ఈ వాక్యాలు జాగరూకులై వినండి. చిద్రూపం (స్ఫురణ రూపం) అనే బాలుని యొక్క ... కల్పనా జాలమే – ఈ జగత్తు!

ఇందులో కనిపించే పదార్థజాలమంతా, ఈ పృథ్వి మొదలైన వాటితో సహా .... "శూన్యరూపము, నిరర్థకము, మిథ్యాభూతము, భ్రాంతి మాత్రము" అయివున్నదని మహాశయులగు మహనీయులు మనకు గుర్తు చేస్తున్నారు సుమా! అట్టి స్వప్న తుల్య – భ్రాంతి రూప జగత్తులో "ఇది నాది ! అది నేను!" .... ఇత్యాది రూపంలో ఆసక్తి ఎందుకో చెప్పండి? అజ్ఞానియొక్క కల్పన అజ్ఞానికే రుచిస్తుంది. కాబట్టి అజ్ఞానమే అట్టి ఆసక్తికి మూలమగుచున్నదని గమనించండి.

ఎవరైనా "నాకు బంగారం కావాలి" .... అని అనుకుంటే సువర్ణ ఖనిజ ఖండాన్ని తెచ్చి అద్దానిని ప్రక్షాళనం చేస్తే (పుటం వేయటం మొదలైనవి చేస్తే) ధగధగా మెరిసే బంగారం లభిస్తుంది. అలాకాకుండా బొగ్గు ముక్కను తెచ్చి పుటం వేస్తే బంగారం లభిస్తుందా? లభించదుకదా! ఆ ప్రయత్నమంతా వ్యర్థమే కదా! అట్లాగే, స్వభావ సిద్ధమైన ఆనందమును కోరుకొనేవాడు 'వైరాగ్యము' మొదలైన సాధనలతో దృష్టిని పవిత్రం చేసుకోవాలి. అప్పుడు ఆత్మానందరూపమైన అవిచ్ఛిన్నానందం లభిస్తుంది. అట్టి సాధనలను వదలి "నాకు అవి కావాలి, ఇవి కావాలి"... అని అసత్ పదార్థ లాభం గురించి విచారించి జీవితమంతా అసత్ పదార్థములను ప్రోగుచేసి వాటినన్నిటినీ ఒకచోట పెట్టడం కొరకై జీవితమును వెచ్చించి, తద్వారా అవిచ్ఛిన్నమైన ఆనందం సంపాదించాలంటే అది లభిస్తుందా? వాస్తవమైన ఆనందం లభించకపోగా... 'జీవితము' అనే మహత్తర అవకాశం వ్యర్థమైపోవటం లేదా? ఏ జగత్తైతే చిదాకాశంలో స్ఫురింపజేయటానికి చిదాకాశము కంటే అన్యమైన కారణమే లభించటం లేదో... అట్టి అకారణమాత్రమగు జగత్తు ఎప్పుడు ఉత్పన్నమైనట్లు? ఇప్పుడు ఎక్కడ ఉన్నట్లు? ఎక్కడా లేదు... దృష్టిలో తప్పించి!

**అజాతేన, అసతార్థేన ఖేన వ్యవహరన్తియే ।**
**మూఢా మృతమజాతం వా తనయం పాలయన్తి తే ॥**

ఒకామెకు పిల్లలంటే ఇష్టం. ఎంతోకాలంగా ఆమెకు సంతానమే కలుగక ఒకప్పుడు మతి స్తిమితం తప్పింది. ఆమె ఒక కొయ్యబొమ్మను తీసుకొని "ఇది నా పాపాయి. దీనికి లాలిపోస్తాను. పాలు త్రాగిస్తాను, బజ్జో పెడతాను" ...అని బొమ్మను చంకన పెట్టుకొని ఇంటింటికి తిరుగుతూ "ఇది నా బిడ్డ" అని చూపుతూ మురిసిపోతుందనుకో! అప్పుడు ఏం అంటాం? "అయ్యో! ఈమె పిచ్చిది" అంటాం కదా!

మరొకామెకు లేకలేక కలిగిన ఏకైక కుమారుడు మరణించినప్పుడు ఒక కొయ్యచెక్కను ధరించి "ఈతడే నా కుమారుడు. ఈతనికి మధుర పానీయాలు తాగిద్దాం రండి" ...అని అందరినీ పిలుస్తుంటే ఏమంటారు? అట్లాగే,

"మొదలే ఉత్పన్నము కానట్టి – అసద్రూపములైనట్టి – శూన్యరూపములైనట్టి" – ఈ జగత్ పదార్థముల వెంటబడి దుఃఖ – శోకాది శ్రమలు కొనితెచ్చుకొనే వారిని చూచి విజ్ఞులు "ఈతడు మరణించిన శిశువు కొరకై వీథిలో తినుబండారములను వెతికే పిచ్చి తల్లి వంటివాడు" ...అని భావిస్తున్నారు.

ఎక్కడ పృథివి? ఎక్కడ పదార్థము? ఏది నాది? ఏది నేను? ఇవన్నీ ఎక్కడ పుట్టాయి? ఎక్కడి నుండి ఇక్కడికి వచ్చాయి? ఎటు పోనున్నాయి? ఈ ఇల్లు – వాకిలి – దేహము ఎవరివి? ఓ ప్రియ జనులారా! ఇదంతా కూడా – "చిదాకాశమే తనయందు ఈ జగత్ వస్తుజాలం రూపంలో స్ఫురిస్తోంది" – అని గమనించ ప్రార్థన!

ఎవరి చిత్తమైతే కార్యము – కారణము అను వ్యాకులత్వము పొందియున్నదో, – అట్టి చిత్తము గలవారి దృష్టికి మాత్రమే ఇక్కడి పదార్థజాలం సత్యమైనట్లు, నిత్యమైనట్లు 'భ్రమ' కారణంగా అనిపిస్తోంది. అట్టి పసిబిడ్డలు చెప్పే మాటలకు ప్రయోజనమేమున్నది చెప్పు?

స్వప్నంలో పృథివి – ఆకాశం మొదలైనవి లేకుండానే కనిపించే (అనుభూతమగుచున్న) జగత్తూ, ఈ జాగ్రత్‌లో పృథివి – ఆకాశం మొదలైన వాటితో కూడుకొని కనిపిస్తున్న జగత్తూ... ఈ రెండూ కూడా చిదాకాశ రూపములే అయివున్నాయి. స్వప్నంలో కనిపించే 'చిత్' అనే మణియే ఈ జాగ్రత్‌లో కూడా అట్టివేయగు 'అనుభవములు' అనే కిరణ పుంజములతో ప్రకాశిస్తోంది.

కనుక రామచంద్రా! స్వానుభవమే రూపంగా గల చిదాకాశము యొక్క నిరాకార రూపమే ఈ జగత్తు (లేక) ఈ దృశ్యము.

అట్టి నిరాకార దృశ్యము 'భూమి – ఆకాశం' మొదలైన కల్పితమైన నామములతో ఇక్కడ భాసిస్తోంది. 'నిరాకార చిదాకాశ స్వరూపుడగు ఓ రామచంద్రా! నీ చిత్ వైభవము యొక్క ఒకానొక కిరణ పుంజమే ఈ నిరాకార దృశ్యము. నీవే ఇద్దాని స్థానము. ప్రాభవము, మొదలు, మధ్య, అంతము – అంతా కూడా! ప్రతి జీవుని స్వస్వరూప వైభవం ఇట్టిదేనని నీ ద్వారా అందరికీ గుర్తుచేస్తున్నాను.

❖❖❖

# VIII. అవిద్య - అనంత జగత్తు విపశ్చిత్ ఉపాఖ్యానం

## 1. విపశ్చిత్ రాజ్యం - శత్రు రాజుల దండయాత్ర

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ దృశ్య రూపమగు జగత్తు ద్రష్ట యొక్క దృష్టిలోనే 'అవిద్య' అను రూపంగా పరిఢవిల్లుతోందని శ్రీ వసిష్ఠవాక్య సారాంశంగా నేను గమనిస్తున్నాను. ఈ విధంగా స్వప్న నగరంలాగా విద్యమానమై ఉంటూ, వాస్తవానికి చిదాకాశ రూపమే అయివున్న ఈ అవిద్య ఎటువంటిదో దృష్టాంతపూర్వకంగా మరికొంత బోధించవలసినదిగా నా విన్నపం.

ఈ దృశ్యరూప జగత్తు ఎప్పటికి నశిస్తుంది. ఇది అజ్ఞానానికి ఎంతకాలం విషయమై కొనసాగుతూ పోతుంది? ఇది ఏ రూపంగా వర్తిస్తోంది? ఈ అవిద్యా దృశ్య జగత్తు యొక్క విస్తారం ఎంతవరకు? పరిమితి ఏమిటి? అంతు ఎక్కడ?... ఈ విషయాలు తెలియజేయండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అవిద్య ఉన్నంత వరకు ఈ ఆకాశము – భూమి మొదలైన వాటితో కూడుకొని కనిపించే దృశ్యరూప ప్రాప్తి కొనసాగుతూనే ఉంటుంది. ఇక దేశతః – కాలతః చూస్తే బ్రహ్మము వలెనే ఈ దృశ్యము కూడా అనాది, అనంతము కూడా! ఈ 'దృశ్యము అనంతము' అని వేదాంత వాఙ్మయం ప్రకటిస్తోంది. ఇది నిరూపిస్తూ ఇప్పుడు నేను చెప్పబోయే విపశ్చిత్ మహారాజు చరిత్రను శ్రద్ధగా ఆలకించు.

❖

అనంత చిదాకాశము యొక్క ఒకానొక కోణంలో ఎక్కడో ఒదిగివున్న ఒకానొక వస్తువులో గల ఒక ప్రదేశంలో స్వర్గ–భూ–పాతాళాలతో కూడిన ఒక బ్రహ్మాండ జగత్తు ఉంది. మన త్రైలోక్యం లాగానే ఆ త్రైలోక్యంలో అనేక రాజ్యాలు, వ్యవస్థలు పరిఢవిల్లుతున్నాయి. ఆ జగత్తులో ఒకచోట గల ఒక భూప్రదేశంలో 'తతమితి' అనే ఒక సుప్రసిద్ధ నగరం విరాజిల్లుతోంది. ఆ నగరాన్ని, అది ఉన్న రాజ్యాన్ని 'విపశ్చిత్' అనే ఒక రాజు పరిపాలిస్తున్నాడు. ఆ విపశ్చిత్తు మహారాజు రాజులలో గొప్ప ఖ్యాతి పొంది ఉన్నాడు. అనేక శాస్త్రములలో పారంగతుడు. ఆయన సభలో గొప్ప పండితులు, కళాకారులు, విజ్ఞులు ఉన్నారని లోకవిఖ్యాతి. సరోవరంలో రాజహంస వలె ఆతడు స్వయంగా సాహిత్య, గానాదుల యందు ప్రావీణ్యుడై ఆ సభాసదనానకే ఒక మణిభూషణమై ఉంటాడని అక్కడి ప్రజలు ఆనందంగా చెప్పుకుంటూ ఉంటారు. అనేక మంది కవులు ఆయన గుణసంపత్తిని గ్రంథాల రూపంగా రచించారు. తనను ఆశ్రయించిన వారిని ఆనందింపజేసి పంపించటం ఆయనకు దైనందిన అలవాటు. ఆ విపశ్చిత్ మహారాజు యొక్క సంపద ఆతని ప్రతాప–సామర్థ్యముల ప్రాభవంచే ఎప్పుడూ ప్రవృద్ధి పొందుతూ ఉండేది.

ఆతనికి బ్రాహ్మణుల పట్ల భక్తి – ప్రపత్తులు ఉండేవి. బ్రాహ్మణ రూపుడగు అగ్నిదేవుడు ఆయనకు ఇష్టదైవం. ప్రతిరోజు క్రమం తప్పకుండా ఆయన అగ్నిదేవుని భక్తి-శ్రద్ధలతో ఆరాధిస్తూ ఉండేవాడు. అగ్నిదేవుడు తప్ప ఆతనికి మరొక దైవం తెలియదు.

ఆతని రాజ్యపు నాలుగువైపులా నలుగురు మంత్రులు సముద్రం వంటి సేనా సమూహంతో విపశ్చిత్ రాజ్యమును కాపాడుతూ ఉండేవారు. ఆ రాజు ఎంతో నిశ్చింతంగా ప్రజలకు సర్వవిధాలా సానుకూల్యంగా రాజ్యపాలన కొనసాగిస్తూ ఉండగా అనేక సంవత్సరాలు గడిచిపోయాయి.

ఒకానొకరోజు రాజమందిరంలో దేవేంద్రుని వలె ప్రకాశిస్తూ ఆ విపశ్చిత్తు పరమశాంతంగా పరిపాలనా వ్యవహారం నిర్వర్తిస్తూ ఉన్నాడు. ఇంతలో ఉత్తరదిక్కు నుండి వచ్చిన ఒక సైనికుడు రాజ మందిరంలో ప్రవేశించి రాజుగారికి ప్రణామంచేసి రాజాజ్ఞ తీసుకొని ఇట్లు చెప్ప ప్రారంభించాడు:

**ఉత్తరదిక్కు నుండి వచ్చిన దూత** : హే మహారాజా! మీకు సర్వదా దిగ్విజయమగు గాక! ఉత్తర దిక్కు సైనిక సమూహమునకు వార్తాహరుడిగా సేవలందించే నేను మీ సంతోషమును అనుకూలం కానట్టి వార్తలను మీ సమక్షంలో చెప్పటానికి అనుజ్ఞ ఇవ్వండి.

1. మీచే నియమితులై సర్వదా రాజభక్తితో మిమ్ములను సేవిస్తూ మీచే మెప్పుపొందుచూ, మిమ్ములను దైవసమానంగా ఆరాధించే మన రాజ్య ఉత్తర దిక్కు సేన యొక్క సేనానాయకుడు, మాకు ప్రియతమ నాయకుడు అయిన సామంతులవారికి అకస్మాత్తుగా విషజ్వరం సోకింది.

2. ఉత్తర దిక్కు రాజవైద్యులు వైద్యం అందించినా ప్రయోజనం లేకపోయింది. విషజ్వరం తాకిన కొద్ది గంటలలో "రాజుగారి ఆజ్ఞానుసారం యమపురిపై దండయాత్రకు వెళ్ళారా!"... అన్నట్లు దేహ రాజ్యాన్ని త్యజించారు.

3. ఉత్తర దిక్కుకు పెట్టనికోటగా తన పరాక్రమ – యుక్తులతో మనదేశపు ఉత్తర దిక్కును రక్షిస్తున్న సామంతులవారు మరణించారని తెలియగానే దీర్ఘకాలంగా సమయం కోసం వేచియున్న ఉత్తర సరిహద్దు శత్రు రాజ్యసేన అతికొద్ది సమయంలో యుద్ధ సన్నిద్ధమై దండయాత్రకు వచ్చింది.

4. అసలే నాయకుని హఠాన్మరణ సంఘటనను జీర్ణించుకోలేక విషాదగ్రస్తులై ఉన్న సైనిక పటాలాలకు అకస్మాత్తుగా యుద్ధ భేరీ నినాదాలు వినిపించాయి. ఈ వార్త మీకు జేరవేర్చే సమయం కూడా లేకుండాపోయింది. ఊహించటానికి కొంచెం ముందుగా సూచన కూడా ఇవ్వని శత్రు సైనికుల యుద్ధ సంరంభాన్ని మన సైనికులు ఎదుర్కోలేకపోయారు. ఎందరో సైనికులు మరణించారు.

5. ఇదంతా దక్షిణ దిక్కు సామంత రాజుకు తెలియవచ్చే సరికి కొంచెం కాలయాపన జరిగి పోయింది. ఆతడు యుద్ధ సన్నద్ధుడై వచ్చే ప్రయత్నంలో ఉండగా, దక్షిణ దిక్కు శత్రు రాజ్యసైన్యం హఠాత్తుగా దండయాత్ర చేయటం జరిగింది. అప్పుడు మన దక్షిణ దిక్కు సైన్యానికి అక్కడి శత్రు సైన్యానికి జరిగిన యుద్ధంలో అక్కడి మన సామంతరాజు వీరస్వర్గం పొందాడు.

6. పశ్చిమ దిక్కు సేనానాయకుడు ఇది తెలిసి బయలుదేరుతూ ఉండగా మార్గ మధ్యంలో దక్షిణ దిక్కు శత్రురాజుల సేనను ఎదుర్కొనవలసి వచ్చింది. అప్పుడు జరిగిన యుద్ధంలో పశ్చిమ దిక్కును రక్షించే మన సేనానయకుడు కూడా వీరమరణం పొందారు.

ఇట్లు పలికి ఆ వార్తాహరుడు మౌనం వహించాడు. ఇంతలో అంతఃపుర దూత రాజు సమక్షానికి వచ్చి ఇట్ల పలికాడు.

**అంతఃపుర దూత** : మహారాజులకు విజయమగుగాక! తూర్పు దిక్కున గల మన సైన్యం శత్రువులచే బాధింపబడినవారై తెగిన ఆనకట్ట నుండి వచ్చే జల ప్రవాహంలాగా ఇటువైపుకే వస్తున్నారు.

ఆ మాటలు వినగానే విపశ్చిత్ మహారాజు సింహాసనం నుండి గబుక్కున లేచి నిలుచున్నాడు. ఇక ఒక్క క్షణం కూడా వృథా చేయటం కుదరదని గమనించాడు. అప్పటికప్పుడు ఇట్లా ఆజ్ఞలిచ్చాడు.

**విపశ్చిత్ మహారాజు :** ఓ మంత్రివర్యులారా! ఈ వార్తాహరుల మాటలు విన్నారు కదా! వెంటనే యుద్ధమునకు సన్నద్ధులుకండి. సైన్యాగారం తెరచి సైనికులకు ఆయుధాలు, కవచాలు ఇవ్వండి. పదాతి సైనికులను ఎక్కడెక్కడ నియమించాలో వెంటనే నియమించండి.

ఇంతలో తూర్పు దిక్కు ఉపసేనానాయకుడు ద్వారము వద్ద వేచివున్నట్లు వార్త వచ్చింది. రాజాజ్ఞ తీసుకొని ఆతడు రాజుగారి మందిరంలో ప్రవేశించాడు. ఆతడి అంగాంగాలు గాయములతో నెత్తురోడుచున్నాయి. బలహీనంగా శ్వాస తీసుకొంటూ ఇట్లా పలికాడు.

**తూర్పుదిక్కు ఉపసేనానాయకుడు :** మహారాజా! దక్షిణ–పశ్చిమ–తూర్పుదిక్కు సైనికాధికారులు తమ దేహాలను యుద్ధయజ్ఞంలో సమర్పించి మీ సేవలో ధన్యులయ్యారు. ఇప్పుడు మన రాజ్యానికి అన్ని వైపులా శత్రు రాజ్యముల నుండి అకస్మాత్తుగా యుద్ధ విపత్తు వచ్చిపడింది. ఈ శత్రురాజు లందరినీ మీరు ఇతఃపూర్వం జయించి పాదాక్రాంతం చేసుకొన్నవారే కదా! తమకు దుర్జయమైనదేది ఉంటుంది?

ఇంతలో ఇంకొక రాజసేవకుడు మందిరంలో ప్రవేశించి వగరుస్తూ ఇట్లా అన్నాడు.

**రాజ సేవకుడు :** మహారాజా! అనేక మంది శత్రు సైనికులు నగరంలో ప్రవేశించి అల్లకల్లోలం సృష్టిస్తున్నారు. నగర రక్షణకు మీచే నియమించబడిన మహాసేనామాత్యులవారు వారిని నిరోధించటానికి అతికుశలురైన అనేక సైనికులతో వెళ్ళుచూ తమకు ఆ వార్త అందించమని నన్ను ఆజ్ఞాపించారు.

ఇంతలో మంత్రులు, రాజాంతఃపురవాసులు అంతఃపుర సేవక జనులు, తదితర నగర వాసులు అక్కడికి వచ్చారు. అట్లే ఆయుధములు ధరించిన అనేక మంది సైనికులు కూడా అంతఃపురం సమీపించి రాజుగారి ఆజ్ఞానువర్తులు కాసాగారు. జనుల ప్రవాహంచే ఆ రాజాంతఃపురం ప్రాంతమంతా కప్పివేయబడినట్లు అయింది.

❖❖❖

## 2. దేహ సమర్పణ హోమం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇంతలో మంత్రులందరు మహారాజు సమక్షంలో సమావేశమైనారు.

**మంత్రులు :** మహారాజా! ఇక ఉపేక్షించి లాభం లేదు. ఈ సరిహద్దు రాజులందరు ఆరు నెలల క్రితమే మీ పరాక్రమమును చవిచూచి వెన్నుచూపిన విషయం మరచి ఉంటారు. వారు మీకు

శరణాగతులైనప్పుడు మీరు వారిపై సోదర వాత్సల్యం కురిపిస్తూ... "వీరందరు శరణువేడారు కాబట్టి నాకు మిత్రరాజులే" అని సభలో ప్రకటించి వారితో కరచాలనం చేసి వారికి వారివారి రాజ్యములను తిరిగి ప్రసాదించిన విషయం మరచి ఈ రోజు మనపైనే దండయాత్ర చేయటం వారి కృతఘ్నుతకు తార్కాణం. అట్టి వారిని ఇక ఉపేక్షించి లాభంలేదు. వారికి వారే మీ తపోశక్తి తెలియక మనపై దండయాత్ర చేశారు. అందుచేత వారిని అంతమొందించటం ఇప్పటి మన ధర్మబద్ధమైన ప్రతిక్రియ. అందుచేత యుద్ధ సన్నాహాలకు అనుజ్ఞ ఇవ్వండి.

వీరులకు ఆజ్ఞ ఇవ్వబడునుగాక! సామంతులందరికీ కబుర్లు పంపుదాం. మీ ధనుష్టంకారాలు విని చెవులు చిల్లులు పడుతూంటేగాని వారు చేసిన తప్పేమిటో వారికి తెలిసిరాదు. అందుచేత మేము యుద్ధంలో ముందుగా ప్రవేశించటానికి అనుజ్ఞ ఇవ్వండి. ఆ సరిహద్దు శత్రురాజుల తలకాయలు తెచ్చి మీ పాదాల ముందు ఉంచటమే ఇప్పటి మా తక్షణ కర్తవ్యం.

**విపశ్చిత్ మహారాజు :** ఓ మంత్రులారా! మీ ధైర్య సాహసాలు ఎంతటివో మాకు తెలుసు. మీరు యుద్ధ భూమిలో ప్రవేశించి వారిని కొద్ది సమయం నిరోధించండి. కొంతసేపటిలో నేను నలువైపులా యుద్ధంలో ప్రవేశిస్తాను. శత్రురాజుల శిరస్సులను మన సింహద్వారానికి తోరణాలుగా తగిలిద్దాం. ముందుగా నేను స్నానం చేసి అగ్నిదేవుని పూజించి నలుదిక్కులా యుద్ధరంగంలో ప్రవేశిస్తాను.

❖

మంత్రులు వెంటనే ఆయుధాలు ధరించి అక్కడి నుండి బయలుదేరారు. సైన్యమును నలు దిక్కులకు విభాగించి యుద్ధానికి ఉపక్రమించారు. మహారాజు అక్కడి నుండి అభ్యంతర మందిరంలో ప్రవేశించి అగ్నిగుండం రగిలించి మంత్రముగ్ధంగా అగ్నిదేవుని ఆహ్వానించి సశాస్త్రీయంగా ఆదరం గాను, శక్తిశ్రద్ధలతోను పూజించాడు. అగ్ని భగవానునికి సాష్టాంగ దండ ప్రణామం చేసి పూజా క్రమం పూర్తి చేశాడు. ఆ తరువాత మోకాళ్ళపై యోగాసనపూర్వకంగా నిలబడి అగ్ని భగవానుని ఇట్లు ప్రార్థించాడు.

**విపశ్చిత్ మహారాజు :** హే అగ్నిదేవా! త్రికరణ శుద్ధిగా నా ఇష్టదైవమైనట్టి మీకు అనేక ప్రణామాలు. స్వామీ! మీకు భక్తుడనైనంతమాత్రం చేతనే నా జన్మ తరించింది. మీ కరుణా కటాక్ష వీక్షణముల ప్రభావం చేత నేను అనాయాసంగా అనేక విలాస వైభవములు అనుభవిస్తూ ఇప్పటిదాకా మీచే ప్రసాదించబడిన జీవితంతో ఆయుస్సు గడిపాను. మీరు ప్రసాదించిన బల – ఐశ్వర్యములచే అనేక మంది రాజులను పాదాక్రాంతం చేసుకొని పది దిక్కులలోను ఈ రాజ్యమును విస్తరింపజేశాను. అనేక యుద్ధయాత్రలు ప్రారంభించి మీ పూజా ప్రభావం చేత దిగ్విజయుడనయ్యాను. ఈ భూమండలం అంతా ఈ రాజ్య పతాకాన్ని ఎగురవేశాను. సుదీర్ఘకాలం ఈ రాజ్యం ప్రజారంజకంగా పాలించి ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నాను. భూనభోంతరాలలో కీర్తి ప్రసరించింది. యుద్ధంలో విజయుడనై సంపాదించిన అపార ధనరాసులతో పూజ్యులగు బ్రాహ్మణుల, మిత్రుల, సుహృత్‌జనుల, రాజ్య ప్రజల ఇళ్ళు నింపివేశాను. "ఆ రాజ్యంపై దండయాత్ర చేయాలి"... అని సభలో నిర్ణయించిన కొద్దిసేపటికే ఆ వార్త విన్న అనేకమంది రాజులు తమను తాము మా రాజ్య

సింహాసనమునకు సామంతులుగా ప్రకటించుకొని వచ్చి కప్పం కట్టిన సందర్భాలు అనేకం. అదంతా మీ చలవేగాని నా గొప్పతనం కాదు. మీ దయచే ఇంతకాలం ధర్మ-అర్థ-కామములను ఒకదానితో మరొకటి విరుద్ధం కాకుండా సంపాదించి అనుభవించాను. ఆశ్రితులకు పంచిపెట్టాను. బాల్య - యౌవనాలు తీయటి కలలుగా గడిచిపోయాయి. ఇప్పుడు ఆకు చివర వ్రేలాడే ఒక మంచుబిందువు వలె "ఎప్పుడు నేల రాలుదామా!" అను భావనచే పూత వేయబడే వార్ధక్యం ఈ దేహమునకు రానే వచ్చింది. ఈ వృద్ధాప్యంలో ఈ మనస్సు విశ్రాంతిని పొందుతూ అంతఃపురంలో ప్రశాంతంగా గడపవలసిన సమయంలో యుద్ధ నినాదాలు ఎదుర్కొనవలసి వస్తోంది. ఇంతకాలం నా బల పరాక్రమాలను చవిచూచి మా రాజ్య పతాకానికి తలవంచి, నా సుహృత్ భావంచే దేహాలు దక్కించుకున్న నలువైపుల గల సరిహద్దు రాజులు ఒక్కసారిగా కూడబలుక్కుని మా రాజ్యంపై అకస్మాత్తుగా యుద్ధ సన్నాహాలు చేస్తున్నారు. మేము ప్రమత్తులుగా ఉన్న సమయం ఎన్నుకొని అన్ని వైపుల నుండి దండయాత్ర సాగిస్తున్నారు. ఆ నలుగురు రాజులు నాలుగు దిక్కుల నుండి ఒక్కటై వచ్చారంటే ఇకవారు మాకంటే బలవంతులు, భయంకరులు, క్రూరమైన ఉద్దేశము కలవారు అయివుంటారు కదా! కనుక మాకు మాకున్న బలంతో విజయం సాధించటమనేది దుర్లభం, అసాధ్యం అని మాకు అనిపిస్తోంది. మా రాజ్యమును ఆక్రమించి మా ప్రజలపై వారికి గల పగ తీర్చుకోవటం ప్రారంభించారంటే, ఇక మా ప్రజల కష్టాలు ఎట్లా ఉంటాయో మాటలతో చెప్పలేం, ఊహాతీతం కూడా!

ఒకవేళ ఈ యుద్ధంచేసి మేము గెలిచినా కూడా ఎంతో జననష్టం ఇటు మాకు - అటు సరిహద్దు రాజ్యాలకు అనివార్యం. అతికొద్ది కాలంలో ప్రకృతి సిద్ధంగా ఈ వార్ధక్యం ముగిసి, దేహపతనం జరుగక తప్పని ఈ తరుణంలో నేను రాజుగా కొనసాగే ఏకైక ఉద్దేశము కొరకు ఇంతటి జననష్టం, ఆ తరువాతి దుర్భర పరిణామాలు నా రాజ్య ప్రజలు పొందటమెందుకు?

అందుచేత సర్వాత్మకుడవు, పవిత్రమూర్తివి, నిత్య నిర్మలుడవు, నా ఆరాధ్య దైవమగు ఓ అగ్ని దేవా! ఇటువంటి సందిగ్ధమైన పరిస్థితులలో నాకొక గొప్ప ఉపాయం తోచుచున్నది. ఈ మనుష్యులకు - దేవతలకే కాకుండా అందరికీ విజయ ప్రదాతవు, లోకాల ఉనికికి ఆధారభూతుడవు అయి అందరికీ అన్నీ ప్రసాదించే పరదైవమైన నీకు భక్తి ప్రేమపూర్వకంగా నా ఈ శిరస్సును సమర్పిస్తాను.

పూర్వం యజ్ఞంలో పురోడాశం (మేక తలకాయ మొదలైనవి) సమర్పించినట్లు ఈ రోజు ఈ నా శిరస్సును మీకు సమర్పిస్తాను. హే మహాత్మా! మీరు గనుక నా "స్వశిర సమర్పణ" అనే భక్తి పూర్వక కర్మచే సంతుష్టులైనారా... అప్పుడు మీ ప్రసాదముచే ఈ నా రెండు కోర్కెలు నెఱవేరుగాక!

1. నా శిరస్సును స్వీకరించబోయే ఈ అగ్నికుండం నుండి నాకు నాలుగు శరీరాలు ప్రాప్తించును గాక! అట్లా ప్రసాదితమయ్యే నాలుగు శరీరాలు శోభచే ప్రకాశించేవి, అతి బల సమన్వితాలు, శత్రువులకు దుర్భేద్యాలు అయివుండుగాక! ఆ నాలుగు శరీరాలతో నలు దిక్కుల నుండి దండయాత్ర చేస్తున్న శత్రు సైన్యమును ఎదుర్కొని అగస్త్య మహాముని సముద్రపానం చేసినట్లు నేను నలుదిక్కుల ఒకేసారి శత్రుసైన్య సముద్రములను పానం చేసివేస్తాను.

2. మీ దర్శనం చేసుకొనే కోర్కెతో మిమ్ములను అనునిత్యంగా ఆరాధిస్తూ ఉన్నాను కదా! కనుక పరమ పవిత్రమైన మీ తోడు, మీ దర్శనం నాకు సర్వదా లభించునుగాక !

అలా కాదా ...ఈ శిరస్సును స్వీకరించి నన్ను, నా ఉత్తర జన్మలను పునీతం చేయండి.

ఓ అగ్నిదేవా! ఇదిగో! నా శిరస్సు ప్రీతి పూర్వకంగా ఇవ్వబడుతోంది. స్వీకరించి కరుణించండి. ఇట్లా పలికి ఆ విపశ్చిత్ మహారాజు తటాలున లేచి నిలబడ్డాడు. అగ్నికుండం సమీపించి ఒక్కసారి గాలిలోకి ఎగిరాడు. దేహము గాలిలో ఉండగానే చేత ధరించిన ఖడ్గంతో శిరస్సును – బాలుడు కమలమును త్రుంచినట్లు – త్రుంచివేసి తెగిన శిరస్సుతో సహా దేహమును అగ్ని గుండంలోనికి సమర్పించివేశాడు. అప్పుడు అగ్నిదేవుడు శిరస్సును – మొండెమును హవిస్సువలె స్వీకరించినవాడై సంతుష్టుడైనాడు. మహాత్ములకు సమర్పించినదేదైనా ఒకటికి నాలుగింతలు అవటంలో ఆశ్చర్యమేముంటుంది? కొద్ది క్షణాలలో ఆ అగ్నిగుండంలోనుంచి చతుర్భుజములు, శస్త్రాస్త్రధారణతో కూడినవి, మహత్తరమైన తేజస్సు పుణికి పుచ్చుకున్నవి అయినట్టి నాలుగు శరీరాలు బయల్వెడలాయి. ఆ నాలుగు శరీరాలు సమానమైన రూపముతో ప్రకాశిస్తున్నాయి. ఆ నాలుగు దేహాలు ఒకే విధమైన కవచ-కుండలాలతో, భూషణములతో ప్రకాశిస్తూ ఒకే ఆశయము కలిగినవై ఉన్నాయి. గొప్ప తెలివితేటలు, సమాన గుణములు కలిగి ఒకే రూపముగల నాలుగు ధనుస్సులతో ఆ నాలుగు శరీరాలు విరాజిల్లుతున్నాయి. ఆ శరీరాలు నాలుగూ శత్రువుల గద-శస్త్ర-అస్త్రాదులచే ఏమాత్రం స్పృశింపబడజాలనంత ప్రభావీచికలతో ప్రకాశిస్తున్నాయి.

ఆ విధంగా నాలుగు వేదములవలె నాలుగు శరీరములు ఒకే జీవుడైన విపశ్చిత్ మహారాజు సంపాదించుకున్నాడు. దేహాలు నాలుగు అయినప్పటికీ వాటిని నడిపే జీవుడు ఒక్కడే ... అయ్యాడు.

❖❖❖

# 3. శత్రుసేనల తిరోగమనం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ విధంగా అగ్నికుండం నుండి అగ్నిదేవుని కరుణచే సంపాదించిన నాలుగు దేహములతోటీ ఆ విపశ్చిత్ మహారాజు అగ్ని భగవానునికి సాష్టాంగ దండ ప్రణామాలు చేసి "తన్నో అగ్నిః ప్రచోదయాత్" ...అని గానం చేస్తూ అక్కడి నుండి బయల్వెడలాడు. ఒక్కొక్క దిక్కు వైపుగా నడిపాడు. ప్రతి దిక్కులోని సైనికులంతా, "ఆహా! మహారాజే స్వయంగా మన దిక్కుకు నాయకత్వం వహిస్తూ ఉంటే ఇక లోటేమిటి?"... అని తలచుచూ యుద్ధ మహోత్సాహులై శత్రుసైన్యంపై విఱుచుకుపడటం ప్రారంభించారు. నాలుగు దిక్కులలోను భీకరయుద్ధం ఆరంభమైనది. జన్మార్జితంగా ఆర్జించిన తమ తమ శక్తియుక్తులన్నీ పణంగా పెట్టి అనేక మంది వీరులు తమ రాజభక్తికి, దేశభక్తికి చిహ్నంగా యుద్ధం చేసి దేహాలు తృణ ప్రాయంగా సమర్పించారు. ఆ నలు దిక్కులలో సైనికుల మస్తకాలు మందార పూబంతులవలె గాలిలోకి ఎగిశాయి. యుద్ధంకంటే జీవితమే ప్రియంగా తలచిన కొందరు సైనికులు ఆ ఘోరయుద్ధాన్ని చూడటానికి కూడా జంకుచూ వెనకడుగువేస్తూ వెనుకకు పరుగులు తీయటం ఇరు సైన్యముల వైపు కనబడనారంభించింది.

విపశ్చిత్ మహారాజు తమ సైన్యం బలహీనపడుచుండటం, ఉత్సాహం కోల్పోవటం గమనించి ఇక తాత్సారం చేయకుండా అగ్నిదేవునిచే ప్రసాదించిన నాలుగు ధనుస్సులను ఉపయోగించి నాలుగు వైపుల నాలుగు ఉపాధులతో శత్రుసైన్యంపై బాణవర్షం కురిపించి శత్రు సైనికులను చీల్చి చండాడటం ప్రారంభించాడు.

విపశ్చిత యొక్క ధనుస్సుల నుండి వెలువడిన మహాక్రేంకార చతుష్టయమువలన ఆకాశంలోని మేఘాలలో ఘీంకారనినాదాలు, దీర్ఘంగా మెఱుపులు ఉద్భవించాయి. శత్రురాజుల గుండెలు'ఝల్' అనసాగాయి. మహారాజు ధనుస్సుల నుండి బాణవర్షం కురిసింది. చేది దేశపు శత్రు సైన్యం ఆ బాణ వర్షానికి తాళలేక ఛిన్నాభిన్నమై పోయింది. మంత్రించి వదలిన మోహనాస్త్ర ప్రభావం చేత పారశీకదేశపు యుద్ధవీరులు కళ్ళు కనిపించక తమలోతామే ఒకరినొకరు ఖండించుకోసాగారు. దరద దేశపు సైనికులు ఆ శస్త్రాస్త్ర ప్రహారానికి తట్టుకోలేక దుర్దర పర్వత శ్రేణులలోగల గుహలలోకి పరుగులు తీసి దాక్కున్నారు. వారి రక్షణాకవచములు చూర్ణమైనాయి. విపశ్చిత్ రాజు అప్పుడు ప్రయోగించిన వాయువ్యాస్త్ర ప్రభావంచే జనించిన వాయు వీచికలకు శత్రు సైనికులు దూదిపింజాల వలె గాలిలోకి ఎగిరి నేలకూలసాగారు. దశార్ణ దేశ భటుల శిరస్సులు బంతులవలె ఆకాశంలో ఎగిశాయి. శకదేశపు యోధులు రాజు ధనుస్సు నుండి వెలువడిన నల్లని ఇనుప బాణ ప్రవాహం చేత క్రూరంగా హింసించబడి యుద్ధభూమి నుండి పారిపోసాగారు. రమఠ దేశీయులు దిక్కుతోచక దిక్కుదిక్కులకు పరిగెత్తసాగారు. తంగణ దేశసైన్యం శవముల గుట్టలుగా పరిణమించసాగింది. గాంధార, హోది, చీన, కిరాత, కుమారీగణ సైనికులు విపశ్చిత్ రాజుచే విడువబడిన చక్రాయుధ వర్షముచే విచ్ఛిన్నులై తలకో త్రోవగా వెనుతిరిగి పరుగులు తీయనారంభించారు. మహావీరులని పేరుగాంచిన నిలీపదేశపు ఖిండాజాతి వీరులు అప్పటి శస్త్ర ప్రయోగానికి తాళలేక ఒకరినొకరు త్రోసుకుంటూ వెనుకకు పరుగులు తీయసాగారు. ఈ విధంగా విపశ్చిత్తు యొక్క దాడులచే హూణ, శక, దశార్ణవ, అంగ, తంగణ, సాల్వ దేశ యుద్ధ భటులు శస్త్రాస్త్ర ఘాతాలకు పిచ్చివారివలె గంతులు వేస్తూ వెనుకకు పరుగులు తీయసాగారు.

❖

ఓ రామచంద్రా! ఆ విధంగా ఆ నాలుగు విపశ్చిత్తులు శత్రుసైన్యము వెంటబడి తరుముతూ చాలాదూరం ప్రయాణించారు. ఆ నాలుగు దేహాలు కూడా సమానమైన రూపాలు, అభిప్రాయాలు కలిగి ఉన్నారు. సర్వశక్తియుతుడు, నాలుగు దేహములందు సమానమైన రూపం వహించి ఉన్నవాడు, చైతన్య స్వరూపుడు అగు విపశ్చిత్ జీవుని 'ప్రేరణ' పొంది నలుగురు యుద్ధంలో నలుదిక్కుల శత్రుసైన్యంపై విజయం సాధించారు.

అట్లు జీవాత్మ ఒక్కడే అయివుండి, ఆ విపశ్చిత్ మహారాజు నాలుగు దేహాలు చేతివ్రేళ్ళవలె నడుపుతూ పరాజితులై పారిపోవుచున్న శత్రురాజుల సైనిక పటాలాలను వెంబడించాడు. ఆతని వెంట మంత్రులు కొందరు, మరికొందరు సైనికులు పరుగుతీస్తూ శత్రు సైనికులను వెంబడించసాగారు. అట్లా చాలాదూరం వెంబడించగా ఇంతలో విపశ్చిత్తు నాలుగు దేహాలతోను, మంత్రులతోను,

సైనికులతోను నాలుగు దిక్కుల చివరిగా గల నాలుగు మహాసముద్రములను సమీపించారు. అనేకులు మరణించగా కొద్దిమంది శత్రు సైనికులు విపశ్చిత్తు దేహములచే సంధించబడిన విల్లంబులకు భయపడి ఎక్కడెక్కడో దాగుకొన్నారు. ఇట్లా విపశ్చిత్తు నాలుగు దేహములు నాలుగు సముద్రపు తీరాలను చేరుకోగానే ఆతడు యుద్ధంలో దిగ్విజయుడైనట్లయినది. అగ్నిదేవుని ఆజ్ఞానుసారం తమ విధిని నిర్వర్తించి విపశ్చిత్తు మహారాజుకు విజయము చేకూర్చటం పూర్తి అయింది కనుక ఆతని శస్త్రాస్త్రములు ఉపసంహారము పొందినవై శమించినవై అంతర్ధానమైనాయి. అగ్నిదేవ ప్రసాదితమైన రథ–అశ్వ–గజ బలగమంతా అగ్నిదేవుని సంకల్పానుసారం నిజస్థానమగు ప్రకృతిలో లీనమైపోయాయి. మరికొన్ని చేష్టారహితమైపోయాయి. అయితే నాలుగు దేహాలు మాత్రం నాలుగు సముద్రముల తీరాల విజయానందముతో నిలబడివున్నాయి.

అప్పుడు ఆ నలుగురు విపశ్చిత్తులు నాలుగు సముద్రాల తీరాలను ఉన్నవారై ఎదురుగా నలుదిక్కులా విస్తరించివున్న మహాసముద్రాలను చూచారు. ఆ మహాసముద్ర తరంగాలు ఆకాశాన్ని అంటుతూ భీకర ఓంకార నినాదాలు చెయ్యటం వారు గాంచారు. అక్కడ కనిపించే వనములను, పర్వత ప్రదేశములను, ప్రకృతి సౌందర్యమును చూపుచూ మంత్రులు, సామంతులు మహారాజుకు అనేక విశేషములు వర్ణించి చెప్పసాగారు.

❖

**తూర్పు దిక్కు మంత్రులు :** చూడండి మహారాజా! ఈ మహాసముద్రపు ఉన్నత తరంగాలు ఎంత వేగంగా ఆ పర్వతప్రదేశాలను తాకుతూ ఝంకార శబ్దాలు చేస్తున్నాయో! ఆ చంద్రబింబం సముద్ర దేవత ధరించిన చూడామణిలా ప్రకాశిస్తోంది. అక్కడి ద్వీపములో సముద్ర జీవులు చంద్రకిరణాలు ఆస్వాదిస్తూ ఆహ్లాదంగా నేలపై దొర్లుచున్నాయి. ఈ కనబడే దృశ్యం – దృష్టికంటే వేరుగా లేకున్నప్పటికీ ఉన్నట్లే ప్రవర్తించునట్లు – సముద్ర జలంకంటే వేరుగాని సముద్ర కెరటాలు సముద్ర జలమును ఎంతగా సంక్షోభింపజేస్తున్నాయి.

**గుహా "గులుగులు" ఆవర్త నిర్ఘోషాశనిభీషణాన్ ।**
**భృశం భావయతో గ్రస్తాన్ అగస్త్యార్వా అనిలానివ ॥**

కొండ గుహలలోకి ప్రవేశించే సముద్ర జల ఘోష, సముద్రజలాన్ని అగస్త్య మహర్షి ఆపోశన పట్టే సమయంలో జనించిన తరంగ ఘోషను తలపిస్తోంది కదా!

**అత్రోప శైలవన వీథిషు పుష్పశయ్యా విద్యాధరీ విరచితాః పరివర్ణయన్తి ।**
**పార్శ్వద్వయస్థ పరివృత్త పదాత్ సముద్రాత్ వ్యావృత్త ముగ్ధ వనితా పురుషాయితాని ॥**

అదిగో, అటుచూడండి. అక్కడ పుష్పశయ్యలను విద్యాధరులు తమ 'రతి క్రీడ' కొరకై నిర్మించారు కాబోలు. గండశిలలపై కనిపించే ఆ పుష్పశయ్యలు, అక్కడి మిలమిల మెరిసే విద్యాధరుల పాద చిహ్నాములు చూస్తుంటే "రతిలో పురుషుడు శ్రమ పొంది ఉండగా, అది గమనించిన ముగ్ధవనిత అధో ప్రదేశం నుండి ఊర్ధ్వపు ప్రదేశానికి వచ్చి రతిక్రీడను కొనసాగిస్తున్నట్లు" కనబడటం లేదూ!

**మరొక సామంతుడు** (పడమర సముద్రపు ఒడ్డుజేరిన విపశ్చిత్తుతో) : మహారాజా! అటు చూడండి. శృంగార క్రీడలందు ఆసక్తులైన కిన్నెరులు శృంగారరస ప్రభావంచే పరిసరాలు మరచి మధురగీతాలు ఆలాపిస్తున్నారు. ఆహా! ఈ సముద్రం ఎంత విస్తారమైనది! ఒకవైపు మహావిష్ణువు, మరొకవైపు పక్షుల సమూహం, ఇంకొక వైపు పుష్కరావర్త మేఘాలు ఆక్రమించుకున్నాయి కదా!

**ఇంకొక దిక్కు సామంతుడు** (ఉత్తర దిక్కు సముద్రం సమీపించిన విపశ్చిత్తుతో) : అదిగో! ఆ కనబడే మేరు పర్వత శిఖరాలలో దేవతాలోకాలున్నాయి. మనుష్యులు అటు వెళ్ళజాలరు కదా! కనుక ఉత్తర దిక్కుగా భూమి ఉన్నంత వరకు మీరు జయించినవారయ్యారు.

**వేరొక సామంతుడు** (దక్షిణ దిక్కు సముద్రం సమీపించిన విపశ్చిత్తుతో) : మహారాజా! మనం భూమి యొక్క దక్షిణ దిక్కు అంచువరకు శత్రురాజులను దునిమి మరల మన రాజ్య స్థాపన చేశాం. వెన్నముద్దవలె శరీరం కలిగిన చంద్రుడు నక్షత్ర కాంతలతో క్షీర సముద్రంలో జలకాలాడుచున్నట్లు న్నాడు. ఇక్కడి మలయమారుతం అనేక పుష్ప సుగంధాన్ని వెంట నిడుకుని మన ముక్కు పుటాలను సుఖశ్వాసమయం చేస్తూ మనకు అతిథి మర్యాద చేస్తున్నదికదా! అటు చూడండి. ఆ శబరి స్త్రీ మదంచే లజ్జా విహీన అయి ఆ పురుషుని పదే పదే ఆలింగనం చేసుకొను చున్నది. మనను ఎంత గానో అలరించే మలయమారుతం ఆ విరహిణికి వేడిగాలుల వలె అగుచుండటం చేత ఆమె బుగ్గల నుండి నునువెచ్చని శ్వేద బిందువులు జాలువ్రాలుచున్నాయి. ఇక్కడి జనుల అనాగరకత గమనిస్తే 'నాగరకత' ఉన్నంత వరకూ మన రాజ్యం మీ బలపరాక్రమాల ప్రభావంచే విస్తరిల్లినది అగుచున్నది. "అయ్యో! తెల్లవారబోవుచున్నదే! ఈ నా ప్రియునితో సంభోగానికి విఘాతం కలుగనున్నదే" ...అనే ఆక్రోశం, ఆతురత ఆ శబర స్త్రీలలో కనపట్టుచున్నదే! వారికి జాతిరీత్యా ప్రియునితో సంభోగం నాగరకుల వలె రహస్యమైన విషయమే కాదు కాబోలు! ఈ పర్వత గుహలు బ్రహ్మదేవుని విశ్రాంతి కొరకై నిర్మించబడిన అమృత పూర్ణములగు మండపములవలె విరాజిల్లుచున్నాయి కదా! అటు ఆకాశంలోకి చూడండి. యుద్ధంలో వీరమరణం పొందిన మన యొక్క - మన శత్రురాజుల యొక్క యుద్ధ వీరులను అప్సరసలు ఆకాశమార్గంలో వీరస్వర్గానికి గొనిపోవుచున్నట్లుగా ఉన్నది.

ఇంకా ఆ నలుగురు విపశ్చిత్తులతోను తూర్పు-పడమర-దక్షిణ-ఉత్తర దిక్కుల అంచులకు వేరువేరుగా అనుసరించిన ఉపనాయకులు, సామంతులు ఇట్లా సంభాషించుచున్నారు.

**విజిగీషోః పునఃప్రాప్తే సంకటే ప్రకటే రణే ।**
**ధర్మ్యం విరాజతే యుద్ధం యౌవనే సురతే యథా ॥**

హే చక్రవర్తీ! విపశ్చిత్తు మహారాజా ! మాకిప్పుడు ఎంతగానో సంతోషంగా ఉన్నది. మన మహారాజ్యానికి అకస్మాత్తుగా ఒక్కసారిగా నాలుగువైపులా సరిహద్దు దేశముల నుండి యుద్ధ ఉపద్రవం ముంచుకొచ్చింది. అయినా కూడా మీ తపోశక్తి ప్రభావం చేత, బల పరాక్రమముల ప్రాభవం చేత మనం ధర్మయుద్ధం చేశాం. యౌవనంలో రతి ఎంతగా శోభిస్తుందో... ధర్మయుక్తంగా ఇటువంటి పరిస్థితులలో యుద్ధం చేసి విజయం సాధించటం అంతటి శోభాయమానంగా ఉంటుంది.

**లోకైః అనిందితా లక్ష్మీః ఆరోగ్యం శ్రీసమన్వితమ్ ।**
**ధర్మ్యం యుద్ధం పరార్థేన జీవితస్య ఉత్తమమ్ ఫలమ్ ॥**

1.లోకులచే అనిందితమైన సంపద, 2.సంపదతో కూడిన ఆరోగ్యం, 3.ప్రజల కొరకు ధర్మపూర్వకమైన యుద్ధం ...ఈ మూడు లభిస్తే, జీవితాలు సాఫల్యం పొందుతాయి. ఇప్పుడు మన ప్రజలకు మీ ప్రభావం చేత ఈ మూడు లభిస్తున్నాయి. ధర్మవిరుద్ధంగాని యుద్ధంలో శత్రువులకు ఎదురుగా నిలిచి పోరాడి తమ ప్రాణములను తృణప్రాయంగా సమర్పించిన మన యుద్ధవీరులే వీరస్వర్గమును పొందటానికి అర్హులౌతారుగాని, తదితరులు కాదు కదా!

**వ్యోమాద్యపి ప్రకృతి - వికృతిం నామ నాయాత్య సంఖ్యైః ।**
**అన్తః సారాశయ గుణవతాం లక్ష్యతే నో మహిమ్నః ॥**

మేఘ సమూహాలు, ప్రళయాగ్నులు, పర్వతాల రెక్కల విన్యాసాలు, నక్షత్ర గణాల సంఘర్షణలు, సురాసురుల యుద్ధ భేరీలు ...ఇటువంటి అనేక సంక్షుబ్ధములు జరుగుచున్నా ఆకాశం సర్వదా ప్రశాంతంగానే ఉన్నది కదా! ఉత్తమ గుణశీలురగు మహాత్ముల మహిమ ఈ సంసార సంరంభమును పొందుచున్నప్పుడు కూడా అంతటి ప్రశాంత శీలత్వం వహించి ఉంటుందని మన శాస్త్రములు అభివర్ణిస్తూ ఉంటాయి కదా! లోన మాలిన్యం లేనప్పుడు బయట మాలిన్యం ఏమీ చేయజాలదనటానికి ఈ ఆకాశమే దృష్టాంతం. జ్ఞాని సర్వదా సుఖవంతుడే అయివుంటాడు. ఈ సంసార పటాటోపం ఆతని అంతరాన్ని స్పృశించనైనా లేదు. ఓ ఆకాశమా! పగలు ప్రకాశమానంగాను, సాయంకాలం ఎఱుపుగాను, రాత్రియందు నల్లగానూ కనబడే నీవు ఏ సద్వస్తువు ధరించిన దానివి అయివున్నావు? నీ యొక్క రంగు, తత్త్వజ్ఞాని యొక్క చేష్ట ఎవరు అర్థం చేసుకోగలరు? హే సూర్యభగవాన్!

**న తృణ సలిలం నైవగ్రామో న నామచ పత్తనం**
**న చ దలభర స్నిగ్ధ ఛాయాతరుః న చ సత్రపా**
**తదపి గగనా ధ్వానం సూర్యః ప్రయాతి దినేదినే**
**విషమమపి యత్ప్రారబ్ధం తత్ త్యజంతి న సాత్వికాః ॥**

త్రోవలో విశ్రాంతి కొరకై పచ్చగడ్డి గల ప్రదేశంగాని, జలంగాని, గ్రామంగాని, నగరంగాని, ఫలవృక్షాలుగాని, చలివేంద్రాలుగాని, పానీయశాలలుగాని లేకపోయినప్పటికీ ఆ సూర్యుడు తన అనుదిన ప్రయాణం కొనసాగిస్తూనే ఉన్నాడు కదా! సత్త్వశీలురగు మహనీయులు ఇతరులకు కష్టమైన పనీ అని తెలిసి కూడా - తమకు ఇవ్వబడిన కార్యక్రమాన్ని 'అవి లేవు, ఇవి లేవు' అని ఎవరినీ, దేనినీ నిందించకుండా కొనసాగిస్తూనే ఉంటారు.

ఆహా! 'కాలం - క్రియ' అనే దంపతులు ఈ త్రిలోకాలను పరిపాలిస్తూ ఉండగా ...ఇక్కడ అనుక్షణం ప్రతిది మార్పు-చేర్పు పొందుచూనే ఉన్నప్పటికీ జగత్తుగా ఎల్లప్పటికీ ఉండియే ఉంటోంది.

లక్షల కొలది బ్రహ్మాండములను ధరించుచున్న ఈ ఆకాశం శూన్యమని ఎవరంటారో, ఆ పండితులు ఏమీ గమనించనివారే అవుతారు. ఈ ఆకాశంలోనే సర్వజగత్తులు ఉదయించి, ప్రవర్తించి

లయిస్తున్నాయి కదా! ఈ విధంగా ఈశ్వరుని మహదాదిలక్షణాలు గమనించాలంటే ఈ ఆకాశమునే గమనించాలి.

ఈశ్వరుడు నిర్లిప్తుడు కదా! ఆతనిలోనుంచి బ్రహ్మాండాలు ఎట్లా వస్తున్నాయి? కాదు చిదాకాశ రూపుడనగు నానుండే భూతాకాశం జనిస్తోంది. అట్టి భూతాకాశము నుండి నిప్పురవ్వల వలె ... బ్రహ్మాండాలు ఉద్భవించి లయిస్తున్నాయి. చిదాకాశంలో ఎన్నెన్ని చమత్కారాలు సంభవిస్తున్నాయి! ఆశ్చర్యమే! నేనే చిదాకాశ స్వరూపుడను!

**ఆధార మాయతతరం త్రిజగత్ మణీనామ్**
**అంగే విభర్త్యమితమ్ అన్తర శేషవస్తు**
**వ్యోమైవ చిద్వపురహమ్ పరమేవ మన్యే**
**యత్ర ఉదయ – అస్తమయమేతి జగద్భ్రమోఽయమ్ ॥**

"ఏది అనంతరూపమై, త్రైలోక్యమణులకు ఆధారమై, జగద్రూప పరంపరలకు ఉత్పత్తి – లయస్థానమైవున్నదో... అట్టి చిదాకాశరూపమగు పరబ్రహ్మమే నేను"... అని ఈ విస్తీర్ణాకాశాన్ని చూస్తున్న మనకు సుస్పష్టం – నిర్దుష్టం అగుచున్నది.

❖

మహారాజా! ఆ శునకములను గమనించారా!

**నైర్ఘృణ్యమ్ అస్థైర్యమ్ అథా అశుచిత్వమ్ రథ్యాచరత్వం పరికుత్సితత్వమ్**
**శ్వభ్యో గృహీతం కిము నామ మూర్ఖైః మూర్ఖేభ్య ఏవ అథ శునకా న జానే ॥**

నిర్దయత్వం, చంచలత్వం, అపవిత్రత్వం, నిష్కారణంగా రహదారులలో అటూ ఇటూ తిరగటం, నీచమైన అలవాట్లు, నికృష్టమైన గుణములు – వీటిని మూర్ఖుల నుండి కుక్కలు నేర్చుకున్నాయో, కుక్కల నుండి మూర్ఖులు నేర్చుకున్నారో మనం చెప్పలేం కదా!... అయితే కుక్కలలో ఉండే శౌర్యత్వం, అల్ప సంతోషం, విశ్వాసం మనిషి చూచి నేర్చుకోవలసిందే!

ఆ తుచ్ఛమైన గడ్డిపరకను చూడండి. ఓ అల్పతృణ (గడ్డి) విభాగమా! ఆహా! లోకంలో 'స్వల్ప మైనది' అని చెప్పటానికి నిన్నే కదా... దృష్టాంతంగా కవులు తీసుకుంటారు! అయితే, దృష్టాంతంగా ఎంతగానో సారస్వతంగా ఉపయోగపడుచుండగా నీవు ఇక తుచ్ఛం ఎట్లా అవుతావు? భోగ పరంపరలందు ఎంతో ఆసక్తి, నమ్మకం కలిగి ఉండి విషయలంపటులై, ప్రమత్తులై, ఉన్మత్తులై, పరులను పరుషంగా నిందించు స్వభావులై – సంసారారణ్యంలో పచార్లు చేసే కొందరు మాయాతన్మయ సోదరులారా! తత్త్వజ్ఞానముచే "దేహోఽహమ్" స్వభావమును అధిగమించి "నేను బ్రహ్మమును" అను సర్వోత్కృష్టానుభవమును సంతరించుకొని, ఇచ్ఛారహితులై సాంసారిక ఆశయములను అధిగమించిన మహనీయులు మీకు తృణప్రాయులు (ఈ గడ్డిపరకతో సమానంగా)గా కనిపిస్తున్నారా? మీరు ఎంతటి మూర్ఖులు! విషయలంపటముతో కూడిన ఇచ్ఛ సత్యమా? గొప్పయా? ప్రాపంచిక సుఖలను సత్యమని అనుకుంటే మీరు కుక్క కంటే ఏం గొప్ప? గొప్ప అని అనుకుంటే అట్టి విషయ లంపట దోషాధిక్యతచే మహనీయులగు ఆత్మానుభవుల సమక్షంలో మీరే తృణప్రాయులు కదా!

ఇంకా అటు చూడండి చక్రవర్తీ! ఆ పూపొదకు ఆవల ఒక సింహం గంభీరంగా – ప్రశాంతంగా కూర్చుని ఉన్నది. ఇటువైపు ఈ కుక్కలు మేఘ గర్జనలు విని 'భౌభౌ' అని అరుస్తున్నాయి. సింహము – కుక్క – ఈ రెండూ తిర్యక్ జంతువులే. మేఘాల నుండి వచ్చే కోలాహల శబ్దాలు ఆ రెండింటికీ సమానమే! కానీ ....

**కోలాహలః సమానేఽపి తిర్యక్త్వే క్షుబ్ధమానసైః**
**అన్యథా సహ్యతే సింహైః, మీలితైరన్యథా శ్వభిః ॥**

మేఘ గర్జనలు వింటూ కూడా సింహం వాటిని సహిస్తూ ప్రశాంతంగా కూర్చుని ఉండగా, .... ఆ కుక్క క్షోభపొంది భయంతో ఎగిరెగిరి పడుతోంది. జ్ఞాని ఈ సంసార సంరంభమును ప్రశాంత – మౌన చిత్తముతో చిద్విలాసంగా చూస్తూ ఉంటే, ఆశాదులచే కలుషితమైన బుద్ధిగల సంసార జీవులు ఎంతో క్షోభ చెందటం ఇటువంటిదే కదా! ఈ కుక్కకు ఈ క్షోభను పొందటం ఏ మూర్ఖ సంసార జీవుడు నేర్పాడో మరి !

హే విపశ్చిత్తు మహారాజా! ఆ ఊరకుక్కను చూచారా? అది నోరుతెరచి – మూస్తూ .... "ఓయీ మానవుడా! నీకంటే అధముడెవడయ్యా?" ...అని మూర్ఖులను చూచి నవ్వుకుంటున్నట్లున్నది.

**"త్వత్తః కో ఽధమ? ఇతి ఉదీరితవ తే, శ్వోవాచ హాసాన్వితం,**
**మత్తో – మౌర్ఖ్యమ్ – అమేధ్యమ్ – మాంద్యమ్ – అశుభం యః సేవతే సోఽధికః?**
**శౌర్యం – భక్తిః అకృత్రిమా ధృతిః – ఇతి శ్రీమాన్ గుణోయో అస్తి మే**
**మూర్ఖాదేశ గుణః ప్రయత్న నిచయైరన్విష్య నో లభ్యతే ॥**

ఆ ఊరకుక్క నవ్వుతూ ఏమంటోందో చూచారా? "ఓ మానవులారా! 'సరమయి' అనే దేవతా స్త్రీ శునక సంతతియగు మమ్ములను చూచి నవ్వుచున్నారా? ఇక ఆపండి. మీ మానవులలో కొందరు అజ్ఞానం, అపవిత్రత, దేహాభిమానం – విచారణారాహిత్యం అశుభ ఉద్దేశములు కలిగివుండి ఈ భూమిపై సంచరిస్తున్నారు కదా! వారికంటే అధములెవరు? శౌర్యము – సహజమగు స్వామిభక్తి – అల్ప సంతోషము మొదలైన మా ఉత్తమ గుణములు ఎందరు మానవులకు ఉన్నాయి చెప్పండి?"

❖

మహారాజా! ఆ మహావృక్షము మొదలులోగల శివలింగముపై వ్రాలి ఆ కాకి పూజాక్షతలను ఏరుకుతింటూ "కావు కావ్" ...అని అరుస్తూ ఉండటం గమనిస్తున్నారా?

**లింగస్య ఊర్ధ్వం రటత్ కాక, "ఆత్మానం దర్శయత్యయమ్**
**సర్వాధః పాతక ఉత్తుంగ గతిం పశ్యతి మామ్" ఇతి ॥**

ఓ మానవులారా! ఇదిగో నన్ను చూస్తున్నారా! ఈ "శివనిర్మాల్య భక్షణం" అనే అధోగతికి నేనెందుకు పాలయ్యాను? క్రితం జన్మలలో పుణ్యకార్యాలు మానివేసి పాపకార్యాలకు ఉపక్రమించటం చేతనే కదా! మరి మీరు పాపకార్యములు కొనసాగించి నావలె తుచ్ఛజన్మ పొందటానికి ఉపక్రమిస్తున్నారా? సిగ్గు సిగ్గు! జాగరూకులై పాపకార్యములను విరమించి పుణ్యకార్యముల కొరకై సంసిద్ధులు కండి" ...అని "కావ్ – కావ్" (కాకండి – కాకండి) అనే ఉద్దేశంగా మా కనిపిస్తోంది.

ఓ కాకమా ! ఆ ప్రక్కనే మృదుమధురంగా ఉండే లేత నూతన తామర తూడులను వదిలివేసి క్రుళ్ళిపోయిన ఈ నిర్మాల్యం భుజిస్తున్నావేం? ఓహో! మేము జ్ఞాన విశేషాదులను – భక్తి ప్రపత్తులను వదలి కామ–క్రోధములను ఆశ్రయించటం ఇట్టిది – అని మాకు గుర్తు చేస్తున్నావా? శెహభాష్!

తెల్లటి పూసజ్జలో నుంచి వస్తుంటే ఆ తెల్లపక్షిని చూచి "ఇది రాజహంస కాబోలు" అని అనుకున్నాం. తీరా అది కాస్తా వచ్చి నేలపై పురుగులను ముక్కుతో భక్షిస్తూవుంటే "ఇది రాజహంస కాదు. తెల్లకాకి" ...అని మేము గుర్తించాం. మానవులలో కొందరు పైకి పవిత్ర భావాలు కలుగజేసే వస్త్రాలు ధరించి, లోన దుష్ట సంస్కారాలు కలిగివుండటం ఇట్టిదే కాబోలు!

కోయిల సమూహంతో కలిసి కాకి కోయిలలా అనిపిస్తుంది. అది గొంతువిప్పి 'కావ్–కావ్' అని అరవటం ప్రారంభించగానే "ఇది కోయిల కాదురా బాబూ! కాకి!" ...అని తెలిసిపోతుంది. మహనీయుల సమావేశంలో మూర్ఖుడు ఇట్లా బయటపడిపోతాడు.

స్వామీ! ఆ చిటారుకొమ్మపై కాకి నిలబడి అరవటం దేవాలయ ప్రాంగణంలోగల మహావృక్షాన్ని అధిరోహించిన దొంగ ఊరంతా కలియజూస్తున్నట్లు లేదూ!

ఓ కాకమా! "ఇది కాకుల విభాగం. కాకులే తినాలి" అని మిగతా కాకులను "కావ్ కావ్" అని పిలుస్తున్నావా? మా మానవుల జాత్యహంకారం ఇటువంటిదే కదా! నీకటు శబ్దరూపమైన అరుపులు ఈ వనంలోని సుశబ్దములను వినిపించకుండా చేస్తున్నాయి! అవునులే! "వాడు అటువంటి వాడు, వీడి సంగతి చూద్దాం" ...అనే మాటలు "తత్త్వమసి" వంటి ఉపనిషత్ సంభాషణలను (మా అజ్ఞానం చేత) మాకు వినపడకుండా చేస్తుంటే మేము ఊరకొని ఉండటంలేదా? ఇదీ అట్టిదే రాజా! ఆ కోకిలను చూడండి. దంపతుల రతికలహమునకు సంధి కుదిర్చే ఆ కోయిల గీతం విననీయకుండా ఈ కాకుల క్రూరమైన కావ్ కావ్ నినాదం ఎంతబిగ్గరగా వినబడుచున్నదో!

ఓ మధురగాయని అగు కోకిలా! చూచావా! ఇక్కడ నీ మధురగానం వినే శ్రోత ఏడీ! ఇక్కడి వారికి కాకుల శబ్దాలే ప్రియంగా ఉన్నాయి. "ఈ కోయిలను మేమే పెంచాం! లేకపోతే బ్రతికేదే కాదు" ...అని నీ శ్రోతలకు ఈ కాకులు తమ గొప్పతనం చెప్పుకుంటూ నీ గానాన్ని విననీయకుండా చేస్తుంటే, ఈ కాకుల గుంపుగల ప్రదేశంలో నీ గీతం వినిపించి ఏం ప్రయోజనం?

ఓ కోకిలా! "తవ కుహూ – తవ కుహూ" అనే శబ్దం పలుకుచూ... "ఓ జనులారా! మీ సంసారం మీరే కల్పించుకొని ఉంటున్నారు. అట్టి మీ కల్పనా పరంపరలు ఇక ఆపండి. లోక వ్యవహారములు అనే కాకి కూతలు వినటం మాని మహనీయులగు ఆత్మానంద తత్పరులు వినిపించే ఆత్మానంద గానం వినండి" ...అని మాకందరికీ గుర్తు చేస్తున్నావా? భేష్! మూర్ఖజనుల మధ్య ఉన్నప్పటికీ బ్రహ్మజ్ఞాని వేరుగానే కనిపించునట్లు కాకుల మధ్య కాకి రంగు – రూపుతో ఉన్న కోయిల కాకులకంటే వేరుగా ప్రకాశమానంగా కనిపిస్తోంది. ఆహా!

కోకిల శిశువును వదలి తల్లి కోకిల ఎటో పోవటం, తల్లి కాకి కోకిల శిశువును తెచ్చి పిల్లకాకి అనుకొని పెంచటం,కొంతకాలం జరిగిపోయిన తరువాత "ఇది కోకిలగాని కాకి కాదు"

అని గుర్తించి తల్లికాకి కౌమార కోకిలను పొడిచి హింసించటం... ఇంత జరిగినా కోకిల తన గాన మాధుర్యాన్ని కించిత్ కూడా కోల్పోనేలేదు. మహనీయులు ఈ సంసార జీవుల మధ్య ఉండి అనేక హింసలపాలైనా కూడా తమ మహనీయత్వము కోల్పోరు కదా!

ఆ హంస సరోవరంలోని తామర తూడులను ముక్కున కరచుకొని తన బిడ్డల కొరకై తీసుకొనిపోవుచూ కూడా ఎంత గంభీరంగా కదలివెళ్ళుచున్నది! మహనీయులగు పరమహంసలు జగత్ కార్యక్రమము నిర్వర్తిస్తూ కూడా అంతరంగమున ఆత్మజ్ఞానగాంభీర్యులై ఉంటారనటానికి ఇదే దృష్టాంతం. ఇటు చూడండి. ఈ సరస్సు బ్రహ్మ సాక్షాత్కారముతో గూడిన మహాత్ముల మనస్సువలె ఎంత నిర్మలంగా శోభిస్తోంది! అయితే సరోవరజలం, నదీజలం, కూప జలం (నూతి నీరు) మనం దేనిని ఏ పేరుతో పెట్టి పిలిచినా జలమంతా ఒక్కటే కదా! అట్లాగే స్త్రీ – పురుషాది భేదములతో శరీరాలు వేరువేరుగా కనిపించినా ఆత్మ సర్వదా ఒక్కటే కదా!

ఈ సరస్సులో ఎన్నెన్ని కమలములున్నాయో కదా! అనేక జన్మలలో అనేక సంస్కారముల పరంపరలను నింపుకొనివున్న ఈ సంసారజీవుని భోగోత్సాహ మనస్సువలె ఈ సరస్సులోని కమలములను లెక్కించటం ఎవరి తరం?

అటువైపుగా చూస్తే పైకి ముళ్ళపొదలను, అంతరమున పుష్పములను ఆ సరోవర విభాగం కలిగివున్నది. అంతరమున ఆత్మ అనే మధుర పానీయమును దాచుకొని పైకి దృశ్య సంసారము వహిస్తున్న జీవుని మనోఫలకమువలె అది కనిపించుచున్నది కదా! ఓ మానవులారా! "అస్థిరం, జడం, ఛిద్ర సహిత, నిస్సారం అగు పైపై ప్రయోజనములను వదలి ...సారయుక్తమగు ఆత్మనే గ్రహించండి, దర్శించండి... మానవ జీవితాన్ని సద్వినియోగం చేసుకోండి" అని మనకు శాస్త్రములు బోధిస్తున్న రీతిగా ఉన్నది. ఏ కమలమైతే లక్ష్మీదేవి హస్తమును అలంకరించి విష్ణు భగవానుని హృదయంలో స్థానం పొందిందో ...అట్టి ఈ కమలము యొక్క సౌకుమార్యం, ఔన్నత్యం ఏ కవి సంపూర్తిగా వర్ణించగలడు?

ఆ తెల్లటి కమలం, నీలి కమలం చూడండి. ఆకారం చేత ఒక్కటే అయినప్పటికీ సాత్వికుని మనస్సు – మూర్ఖుని మనస్సులాగా అవి ఎంతటి భేదం కలిగి ఉన్నాయి! ఈ మామిడి వృక్షమునకు విరగకాచి పసుపుపచ్చగా పండివున్న మామిడి పళ్ళరసమును గ్రోలుచు తుమ్మెదలు – కోయిలలు ఆనందపడుచున్నప్పుడు ఈ ప్రకృతి రచయిత అగు బ్రహ్మదేవుడు తన రచనను చూచుకొని తానే ఎంత ఆనందపడుచున్నాడో?

ఓ తుమ్మెదా! నీవు ఎన్నో స్థానములలో రసమును గ్రోలికూడా ఇంకా సంతుష్టి పడకపోవట మనేది సంసారజీవుల నిత్య అసంతృప్తికి సోదాహరణమే అగుచున్నది.

ఓ రాజహంసా! నీవు చేసే మధుర "హ–హు–హూ" నాదం కొంగకు వెయ్యి జన్మలకైనా వస్తుందా? రాదు. అయితే నీవు హంసి (ఆడు హంస) వెంట పరుగులు తీసి ప్రాణాలు పోగొట్టుకోవటం మాలోని కొందరు స్త్రీ వ్యసనంచే జీవితం సర్వనాశనం చేసుకోవటం గుర్తుచేస్తోంది. నీవు కొంగలు – నీటి కాకులు మొదలైన హింసక పక్షులు నివసించే ఈ సరస్సుల్లో ఉంటున్నావెందుకు చెప్పు?

ఓ నీటి కాకీ! నీవు కూడా మా జనులలో కొందరివలె పరాన్నభుక్కువై పరులను ఇతరులను బాధించటమే వృత్తిగా కలిగి ఉన్నావే!

**ఏవం విహన్యతే లోకః స్వార్థేనేతి ప్రదర్శయన్**

**మద్గురుం మద్గురుతాం యాత ఇత్యేవం స్తౌతి దుర్జనః ॥**

"ఈ నీటికాకివలె మేమూ ఇతరులను బాధించటం, ఇతరుల ఆర్జనములను దొగిలించటం కొనసాగిస్తూ ఉంటాం! ఇందుకు ఈ నీటికాకియే మా గురువు!" ...అని దుర్జనులు నీ గురించి గొప్పగా చెప్పుకుంటున్నారు. అంతేగా మరి!

అయితే, కొంగలు, నీటికాకులు, రాబందులు, రాజహంసలు ఒకే సరస్సులో, ఒకేచోట ఉండి జీవిస్తున్నప్పటికీ ఒకరి లక్షణాలు మరొకరికి అబ్బుతున్నాయా? లేదు. అట్లాగే మూర్ఖులు, నీచబుద్ధి కలవారు, హింసయే స్వభావముగా గలవారు – సర్వం పట్ల సమత్వ బుద్ధి సముపార్జించుకొన్న మహనీయులు ఒకే ఆశ్రమంలో కలిసివుండవచ్చుగాక! ఒకరి బుద్ధి మరొకరికి అలవడేది కాదు.

అదిగో, ఆ కొంగను చూస్తున్నారా? ఒక చేపను ముక్కున కరచుకొన్నది. ఆ చేప ఒక్కసారి తన బలమంతా ఉపయోగించి ఆ కొంగ ముక్కు నుంచి విడివడి నీళ్ళలోకి దుమికింది. కాని భయం చేత గుండె ఆగి ప్రాణాలు పోగొట్టుకొని నీటిలో తేలియాడుతోంది. అవునుకదా! ప్రపంచంలో మహావిపత్తు సంభవించినప్పుడు ప్రాణాలు పోగొట్టుకోవటమే అధిక సౌఖ్యప్రదం అని కొందరు భ్రమిస్తున్నారు మరి! అదిగో, అదిగో...! అటుచూడండి. ఆ బాటసారి లేళ్ళ కళ్ళను చూచి తన ప్రేయసినేత్రాలు గుర్తుకు వచ్చి కాబోలు, నిశ్చేష్టుడై నిలుచున్నాడు. అటు ఆ నెమలిని చూస్తున్నారా! అది నేలపై నీళ్ళను ముట్టకుండా ఇంద్రుని ప్రార్థించి, ఇంద్ర ప్రసాదితమైన మేఘజలం ఆస్వాదిస్తోంది. ఇంకా దాని పోకడ చూడండి. అది నేలపై నీటిని ముట్టటం లేదు. బాగుంది కానీ, నేలపై గల పాములను మాత్రం భక్షిస్తోంది. ఔన్నత్యం సంపాదించుకుని కూడా నీచత్వం వదలలేని వారికి ఇదే తార్కాణం!

ఆ వెదుళ్ళు చేసే శబ్దం ఎంత సంగీతభరితంగా ఉన్నదో చూచారా? అవి ఏ విద్వాంసుల సేవచే అంతటి గానకౌశలాన్ని నేర్చుకున్నాయో కదా!

రాజా! ఈ ఎత్తైన తాటిచెట్టును చూస్తున్నారా? అది చాలా ఎత్తుగా ఉండటం చేత వాటిని ఎవరూ కోరరూ, కోసుకోరు. మూర్ఖుల లోభగుణం ఇట్టిదే కాబోలు.

**దీయన్తాం మణలానాం దిశిదిశి చ యథా శాస్త్రమస్త్రాణ్య వన్యా**

**రక్షాయై క్షాన్తిపూర్వం చిరమ్ అతులబలం శాన్తయా శాసనాని ॥**

మీ యొక్క నాలుగు ఉపాధుల బలపరాక్రమాల ప్రభావంచేత మనం దశదిశలలో సుదీర్ఘ ప్రదేశాలన్నీ జయించాం. ఇక రాజనీతిని అనుసరించి శాంతబుద్ధితో సమాధానపూర్వకంగా చిరకాల రక్షణ కొరకై రాజశాసనాలు, కప్పములు నియమిస్తూ అధికారము యొక్క గుర్తులను స్థాపించండి.

❖❖❖

# 4. అవిద్య - దృశ్య జిజ్ఞాస

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అప్పుడు ఆ నలుగురు విపశ్చిత్ రాజులు నాలుగు సముద్ర తీరాలలో గల నాలుగు వేరైన ప్రదేశాలలో సమావేశమైనారు. మంత్రులు ఆయా రాజ్యాంగ విశేషాలు నివేదిస్తూ ఉండగా ఆయా సామంతరాజ్య చట్టాలను, ప్రణాళికలను అప్పటికప్పుడు తయారు చేసి తుదిమెరుగులు దిద్దారు. ఇంతలో సాయంకాలం అయింది. సూర్య భగవానుడు అస్తమాద్రి చేరాడు. ఆ నలుగురు తమ సాయం సంధ్యలను ముగించుకొని నాలుగు సముద్రముల తీరాన తమతమ శయనములపై విశ్రాంతి తీసుకోనారంభించారు. ఆ నలుగురు నాలుగు వేరువేరైన సుదూర స్థానములలో శయనములపై పరుండి ఆశ్చర్యముతో కూడిన చిత్తము కలవారై తమ తమ మనస్సులలో ఇట్లు చింతించనారంభించారు.

❖

**నలుగురు విపశ్చిత్తులు** (తమ మనస్సులో) **:** "ఆహా! శత్రు రాజ్య సైన్యమును పారద్రోలుతూ అతి దూరంగా ప్రయాణించి ఇప్పుడు సముద్రల తీరాలకు చేరాం. దేవదేవుడగు అగ్నిదేవుని ప్రభావం చేత ఆయన మనకు ప్రసాదించిన దివ్య వాహనముల ప్రభావంచేత కదా, ఇంతదూరం రాగలిగాం! ఇప్పటిదాకా బాగానే ఉన్నది! ఈ సువిశాల దృశ్యము ఎంతవరకు వ్యాపించి ఉన్నది?...

ఈ జంబూద్వీపానికి ఆవల లవణ సముద్రం ఉన్నది. లవణ సముద్రానికి ఆవల రెండింతలు ఇక్షు సముద్రం (తీపి నీరు) ఉన్నది. దాని కావలి కుశద్వీపం ఉన్నది. దానికి ఇంకా ఆవల సురోద సముద్రం ఉన్నది. ఇట్లా శాస్త్రాలలో మనం చదివాం. అయితే సప్తద్వీప – సముద్రములకు ఆవల ఇంకా ఏం ఉంది? ఈ చేత్య (దృశ్య) రూపిణి యొక్క 'మాయ' ఎంతవరకు విస్తరించి ఉన్నది. ఈ వస్తు వైచిత్ర్యము యొక్క అసలైన రూపమెట్టిది?

ఈ విషయాలు తెలియాలంటే మన వల్ల కాదు. అయితే మన ఇష్టదైవమైనట్టి అగ్నిదేవుని కరుణచే మాత్రమే సాధ్యం. అందుచేత ఆయనను ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేసుకొని నాలుగు దిక్కులలో ఈ సప్తసముద్రములకు ఆవల గల విశేషములను దుఃఖరహితులమై సందర్శించి వద్దాం."

ఇట్లా నాలుగు సముద్ర తీరాలలో కూర్చుని ఆ నలుగురు విపశ్చిత్తులు ఏకకాలమున అగ్ని దేవునికి ప్రార్థనలు సమర్పించారు. ఆ నలుగురికి అగ్నిదేవుడు ప్రత్యక్షమై ఇట్లు పలికాడు.

**అగ్నిదేవుడు :** పుత్రులారా! మీ ప్రార్థనకు మెచ్చాను. ప్రసాదించటానికి సిద్ధంగా ఉన్నాను. మీ అభిలాష ఏమిటో చెప్పండి? పసిపిల్లల కోరిక తీర్చటమే తండ్రికి ఆనందం కదా!

**నలుగురు విపశ్చిత్తులు :**

> **పంచభూతాత్మకస్యాస్య దృశ్యస్య అంతం, సురేశ్వర!**
> **దేహేన, మంత్ర దేహేన, తదన్తే మనసాపి చ,**
> **యావత్ సంవేదనం, యావత్ సంభవం, యావదాత్మకమ్**
> **పశ్యేమ ఇతి నో దేవ! దీయతామ్ ఉత్తమో వరః ॥**

ఓ దేవేశ్వరా! మీ దర్శనంచే పునీతులమై సాష్టాంగ దండప్రణామములు సమర్పిస్తున్నాం. మా కోరిక ఏమిటో వివరిస్తాం. వినండి–

1. పంచభూతమయమగు ఈ దృశ్యం యొక్క అంతం ఎక్కడో... అక్కడి వరకు ఈ దేహంతో చూచెదము గాక!
2. ఆ తరువాత వైదిక మంత్ర ప్రభావంచే ఏర్పడే సంస్కార దేహంతో ఎంతవరకు పయనించ గలమో అంతవరకు వెళ్లెదము గాక!
3. ఇక ఆపై మనస్సుతో ఎంతవరకు వెళ్ళగలమో అంతవరకు వెళ్ళి చూడగలిగినంత చూచి వస్తాము గాక!

ఇట్లు... 1.ప్రత్యక్షం, 2.అనుమానం, 3.శుతి... మొదలైన అన్ని విధాలా ఈ దృశ్య జగత్తు ఎంతవరకు విస్తరించి ఉన్నదో అంతవరకు చూచిరాగల వరం ప్రసాదించండి. అనగా...

1. యోగుల యోగ ప్రభావం చేత పొందబడే మార్గం, 2.మనస్సు గాంచగలిగి నంత వరకు మేము చూచిరాగలిగే అవకాశం మాకు మీ దయచే లభించును గాక! మరణించిన తరువాత (లేక) సూక్ష్మదేహంతో మాత్రమే పోగలిగే ఉత్తరాయన, దక్షిణాయన మార్గాలలో మేము పోయివస్తాం!

**అగ్నిదేవుడు :** వత్సలారా! మీరు కోరినట్లే అగుగాక ! మీ అభీష్టానుసారమే అగుగాక !

❖

ఆ విధంగా అగ్నిదేవుడు అంతర్ధానమైన తరువాత ఆ రాత్రి గడిచింది. ఆ మరునాడు ఉదయమే ఆ నలుగురు విపశ్చిత్తులు నాలుగు సముద్రాలను దాటి ఆవల ఉన్న ప్రదేశాలు, విశేషాలు సందర్శించి రావటానికి ఉద్యుక్తులయ్యారు.

మంత్రులు, "మహారాజా! మీరు రాజ్య సంరక్షణకు, రాజ్యాంగ పరిరక్షణకు అత్యంత ముఖ్యులు. యుద్ధం ఇప్పుడే కదా ముగిసింది! అనేక విషయాలు అస్తవ్యస్తంగా ఉండి ఉంటాయి. అతి ముఖ్యమైన వ్యవహారాలు రాజనిర్ణయాలకై వేచి ఉన్నాయి. ఇప్పుడు మీరు లేకపోతే మన రాజ్యానికి అది తీరని లోటు. అందుచేత సముద్రంలో ప్రవేశించవద్దని మా మనవి" ...అని సవినయంగా ప్రార్థించసాగారు.

అయితే ఆ విపశ్చిత్తులు ఆ మాటలన్నీ వినిపించుకోనేలేదు. అప్పటికప్పుడే తమ తమ మనస్సులలో గల పుత్ర, మిత్ర, కళత్ర, జాతి, రాజ్య, రాజాంతఃపురములపై గల అభిమానము, యుద్ధము, అధికారము మొదలైన వాటి వలన రూపుదిద్దుకుని ఉన్న మాత్సర్యం, కిరీటం, రాజ సింహాసనం, అంతఃపుర శయనాభిలాష, సేవకజనం, రాజవస్త్రములు, వస్తు వాహనాలకు సంబంధిం చిన లోభం, శత్రు పరాభవం, రాజ్యపాలన, ఆజ్ఞలు పురమాయించటం, ఆయా అధికారులను గదమాయించటం... మొదలైన వాటికి సంబంధించిన అభిలాష మొదలుగా గల కర్మ – దృశ్య సంబంధమైన దోషములను ఒక్కటొక్కటిగా త్యజించారు. ఇక, సుదీర్ఘ ప్రయాణమునకు ఉద్యుక్తులై, ...నాలుగు సముద్రముల ఒడ్డు వరకు తమను అనుసరించి వచ్చిన ఆయా మంత్రులను పేరుపేరునా ఇట్లా సంబోధించారు.

"ఓ రాజాజ్ఞ పరాయణులు, దేశభక్తులు అగు మంత్రులారా! సైనికాధ్యక్షా! ప్రియ సైనికులారా! మేము ఈ సముద్రమును దాటి ఆవలగల సృష్టి విభాగమును కలియచూచి, అక్కడి విశేషాలన్నీ గమనించి తిరిగివస్తాము. మీరు త్రోవలలో గల మన సామంత రాజ్యములు సందర్శిస్తూ, అక్కడ మన రాజ్య చట్టములు, కప్పములు, దేశాభివృద్ధి ప్రణాళికలను నిర్దేశిస్తూ, అమలుపరుస్తూ, మన రాజధాని అగు తతమితి నగరం జేరండి. ప్రధాన మంత్రులవారు రాజ్యసభ యథారీతిగా నిర్వహించెదరు గాక! రాజధాని చేరగానే విజయోత్సవాలు నిర్వహించండి. మన సైనికులకు, మరణించిన సైనికుల కుటుంబాలకు కానుకలు, నష్టపరిహారాలు గాయపడిన మన సైనికుల – మనపై దండెత్తిన సరిహద్దు దేశాల సైనికులకు అవసరమైన వైద్యచికిత్సలు ప్రేమతో అందించగల వైద్యులను నియమించి, అవసరమైన ధనాది సదుపాయములను అందించండి. చెల్లించండి. మేము త్వరలో తిరిగివస్తామని ప్రజలకు విన్నవించండి. ఇక సెలవు."

❖

ఈ విధంగా పలికి ఆ నలుగురు విపశ్చిత్తులు నాలుగు దిక్కుల చివరన గల సముద్రపు ఒడ్డున పరివారాన్ని వదలి నాలుగు దిక్కులుగా దృఢ నిశ్చయంతో పాదచారులై ప్రయాణించసాగారు. తమ యొక్క మంత్రశక్తిచే "జయము" అను సిద్ధిని పొంది ఉన్న ఆ నలుగురు సముద్రజల తరంగాలపై నేలపై నడిచినట్లే అడుగులు వేసుకొంటూ నడక సాగించారు. మావటివాడు ప్రేరేపిస్తూ ఉండగా త్రాళ్ళకు కట్టిన దుంగలను లాగుచూ వెళ్ళే ఏనుగు వలె వారు ముందుకు అధిరోహిస్తూ, దిగుతూ, మరికొన్ని చిన్నతరంగములపై నాచు–జలవృక్షముల మధ్యగా అడుగులు వేస్తూ, చాలాకాలం అటు–ఇటు తిరుగుతూనే ఉన్నారు. మంత్ర విద్యాబలప్రభావం చేత అతితేజో సంపన్నులైన వారు దుర్జయులై సంచరించసాగారు. ఒక్కొక్కచోట మదించిన మొసళ్ళచే మ్రింగబడి అక్కడ అగ్నిదేవుని ప్రభావం చేత జీర్ణం అవక మరల ఉదరంలో నుంచి బయల్వెడలారు. ఒక్కొక్కసారి జలతరంగాలపై విశ్రమించి ఆ జల తరంగాలచేత వేలాది యోజనాలు నిదురలో ఉండగానే తీసుకొని పోబడేవారు. తమ రాజధానిలో ఏనుగులను అధిరోహించినట్లు వాళ్ళు నలుగురు నాలుగు సముద్ర తరంగాలను అధిరోహించి సుదూరం ప్రయాణించేవారు. ఆ తరంగాలు సముద్ర మధ్యంలో గండ శిలలను సమీపిస్తున్నప్పుడు దెబ్బ తగలకుండా లాఘవంగా తప్పించుకునేవారు. క్షణంలో సముద్రపు అడుగు భాగం జేరేవారు. ఆ సముద్రపు అంతరమున కూడా సంచరిస్తూ మొసళ్ళతోను, ఎండ్రకాయలతోను, తదితర సముద్ర జీవులతోను పరిహాసపూర్వకంగా అంగవిన్యాసములతో సంభాషిస్తూ సహవాసం చేస్తూ సంచరించసాగారు.

ఓ రామచంద్రా! ఆ ప్రకారంగా ఆ నలుగురు సముద్రమును, ద్వీపములను దాటివేయుచు "ఈ పాంచభౌతిక అవిద్యా జగత్తు ఎంత దాకా విస్తరించి ఉన్నది? అవిద్య యొక్క చివర ఎక్కడ"? అనే విచారణ యందు ప్రవృత్తులై ప్రవర్తించసాగారు. మధ్య మధ్యలో వనములు, పర్వతములు ఏవేవో జనరహిత ప్రదేశములు తారసపడసాగాయి. ఇంతలోనే అనేకానేక సంఘటనలను ఆ నలుగురు విపశ్చిత్తులు చవిచూశారు.

పశ్చిమ దిక్కు విపశ్చిత్తు మత్స్యావతారుడగు విష్ణు భగవానుని కులంలో జన్మించిన ఒక పెద్ద చేప చేత మ్రింగబడ్డాడు. అది క్షీర సముద్రంలో ప్రవేశించి "ఈ దేహమును నేను జీర్ణం చేసుకోలేను" ...అని గ్రహించినదై క్షీరసాగర మధ్యంలో క్రక్కివేసింది. అప్పుడు లేచి నడకసాగిస్తూ ఆ పశ్చిమ దిక్కు విపశ్చిత్తు క్షీర సాగరంలో అతిదూరం వెళ్ళటం జరిగింది.

దక్షిణ దిక్కు విపశ్చిత్తు ఇక్షు సముద్రంలో సంచరిస్తూ ఉన్నాడు. ఇంతలో సముద్ర మధ్యలోగల ఒకానొక యక్ష నగరంలో అనుకోకుండా ప్రవేశించాడు. అక్కడ ఒక యక్షిణి ఆతనిని చూచి తన వశీకరణ విద్య చేత కాముకుడగు భర్తగా తన వశం చేసివేసుకొన్నది.

తూర్పు దిక్కు విపశ్చిత్తు ఒక చోట సముద్రంలో గంగానదీ ప్రవేశమును గమనిస్తూ ఉండగా ఒక పెద్ద తిమింగలం మ్రింగబోవగా, దానిని గంగానదీ ప్రవాహంలోకి ఊడ్చుకు వచ్చి శస్త్రాస్త్రాలను ప్రయోగించి చీల్చి వేశాడు. ఆ ప్రయత్నంలో తీవ్ర వేగంతో ప్రవహించే గంగానదీ ప్రవాహం ఆతనిని 'కన్యాకుబ్జ' అని పిలవబడే ఒక ప్రాంతానికి త్రోసుకుపోయింది.

ఉత్తర దిగంతము చూడటానికి వెళ్ళిన విపశ్చిత్తు 'ఉత్తరకురు' అనే దేశంలో ప్రవేశించి అక్కడ దేవీసహితుడైన శివభగవానుని ఆరాధించి అణిమ-గరిమ మొదలైన ఆయా సిద్ధులు/ఐశ్వర్యములు సముపార్జించాడు. ఆ సిద్ధుల ప్రభావం చేత ఆతనికి 'గాయము-మరణము' లకు సంబంధించిన భయం లేకుండాపోయింది. ఆతడు ఆయా త్రోవలలో జలచరాల చేత మ్రింగబడి కూడా అణిమాది సిద్ధులచే క్షేమంగా బయల్వెడలి, క్రమంగా ద్వీపాంతరాలు దాటి, కుల పర్వతాలు కూడా దాటివేశాడు.

పశ్చిమ దిక్కు విపశ్చిత్తు హేమచూడ పక్షి (గరుడపక్షి) యొక్క వీపును అధిరోహించి గరుత్మంతుని ఆరాధిస్తూ క్రమంగా అనేక ద్వీప - ద్వీపాంతరాలు దాటి వెళ్ళాడు.

తూర్పు దిక్కుగా వెళ్ళిన విపశ్చిత్తు క్రౌంచద్వీపం ప్రవేశించాడు. అక్కడ గల వర్షసీమా పర్వతాన్ని అధిరోహిస్తూవుండగా ఒక రాక్షసి ఆతనిని మ్రిగింవేసింది. కాని కొద్దిసేపట్లో ఆతడు ఆ రాక్షసి ప్రేగులు చీల్చి హృదయమును భేదనం చేసి బయల్వెడలాడు.

దక్షిణ దిక్కుగా వెళ్ళిన విపశ్చిత్తు దక్ష ప్రజాపతి నగరం ప్రవేశించాడు. అనుమతి, విన్నపము లేకుండా ప్రవేశించినట్లు తెలిసి ఆ దక్ష ప్రజాపతి "నీవు యక్షుడుగా అయ్యెదవు గాక" అని శపించాడు. అట్లు యక్షుడుగా (సూక్ష్మదేహ మాత్రమైన సత్త కలవానిగా) రూపొందిన ఆ విపశ్చిత్తు శాకద్వీపం ప్రవేశించాడు. అక్కడ ఒక ఏకాంత స్థానం చేరి నూరు సంవత్సరాలు తపస్సు చేసి శాప విమోచనం పొందాడు.

ఉత్తర దిక్కుగా ప్రయాణిస్తున్న విపశ్చిత్తు, తాను సంపాదించిన సిద్ధులను వెంట నిడుకొని వేగం గలవి - చిన్నవి అగు అనేక సముద్రాలు దాటివేశాడు. ఒక సువర్ణమయ ద్వీపంలో ప్రవేశించాడు. అక్కడ గల ఒకానొక సిద్ధునకు కొంత చికాకు కలిగించాడు. ఆ సిద్ధుడు కోపగించి "నీవు శిలవైపోయెదవు గాక!"... అని శాపం ఇవ్వటం జరిగింది. ఆతడు ఆ ప్రదేశంలో ఒక శిలగా మారి నూరు సంవత్సరాలు గడిపాడు. అప్పుడు అగ్నిదేవుడు అనుగ్రహించటం చేత శపించిన ఆ

సిద్ధుడే ఆ ఉత్తర దిక్కు విపశ్చిత్తుకు శాప విమోచనం ప్రసాదించాడు. మనఃప్రీతిని పొందిన ఉత్తర దిక్కు విపశ్చిత్తు ఇంక అక్కడి నుండి బయల్వెడలాడు.

తూర్పు దిక్కుగా వెళ్ళిన విపశ్చిత్తు 'కన్యాకుబ్జ' అనే పేరు గల నగరంలో ప్రవేశించి అద్దానికి ఉత్తరంగా అనేక వందల యోజనాలు ప్రయాణించాడు. 'నాలికేరం' అనే దేశంలో ప్రవేశించి అక్కడ కొంతకాలం నివసించసాగాడు. తన పూర్వ వృత్తాంతం మరిచాడు. క్రమంగా అక్కడి రాజ్యానికి రాజయి ప్రజారంజకంగా ఎనిమిదేళ్ళు రాజ్యపాలన చేశాడు. అతిధర్మాత్ముడై ఎన్నో ప్రజారంజకమైన కార్యక్రమాలు చేపట్టాడు. ఇంతలో ఏదో సందర్భంలో ఎందుకో తన పూర్వవృత్తాంతం గుర్తుకు వచ్చింది. "అయ్యో! నేను ఇక్కడ ఉండిపోతే ఎట్లా? ఆపదలచే స్పృశించబడని నేను ఈ సృష్టి అంతు ఏమిటో–ఎక్కడో చూచి రావాలి కదా!" ...అని తలచి ఇక అక్కడి నుండి అక్కడివారికి చెప్పా–పెట్టకుండా బయలుదేరాడు.

ఉత్తర దిక్కున వెళ్ళిన విపశ్చిత్తు ఒక ద్వీపాన్ని చేరాడు. అక్కడ ఎక్కడబడితే అక్కడ కొబ్బరిచెట్లు మాత్రమే ఉన్నాయి. అతనికి ఆకలి వేసినప్పుడల్లా కొబ్బరి, కొబ్బరినీరు త్రాగుతూ ఆ ప్రదేశమును సందర్శిస్తూ కొంతకాలం గడిపాడు. అట్లా సంచరిస్తూ మేరు పర్వతమును సమీపించాడు. అక్కడ గల ఒక కల్పవృక్షం క్రింద విశ్రమించి "ఆహా! ఇప్పుడు నాకు ఒక అప్సరస సేవలు లభిస్తే ఎంత బాగు?" అని తలచాడు. అంతే! కళ్ళు జిగేలుమనిపిస్తూ ప్రపంచంలోని సౌందర్యమునంతటినీ పుణికిపుచ్చుకున్న ఒక అందాలరాశి అయిన అప్సరస అక్కడ ప్రత్యక్షమైంది. క్రమంగా ఆమెతో మాటలు కలిపి ఆమె సాంగత్యం పొందాడు. ఆమెతో సరస సల్లాపాలు, వన విహారాలు చేయ నారంభించాడు. క్రమంగా ఆమె సాంగత్యంలో పది సంవత్సరాలు గడిపిన తరువాత గాని, తానెందుకు బయలుదేరాడో ...(ఈ భౌతిక సృష్టి ఎంతవరకు విస్తరించి ఉన్నదో చూచి తిరిగి తతమితి నగరం తిరిగి వెళ్ళాలనే ప్రణాళిక), అది గుర్తుకు వచ్చి ఇక అక్కడి నుండి ఏదో సాకుతో బయల్వెడలాడు.

పశ్చిమ దిక్కుగా సంచరిస్తున్న విపశ్చిత్తు 'శాల్మలి' అనే ద్వీపం చేరాడు. ఆతడు తన "పక్షుల వశీకరణ విద్య" ప్రదర్శిస్తూ రకరకాల పక్షులను ఆకర్షించి వినోదిస్తూ ఉండేవాడు. ఇంతలో ఒక సుందరమైన ఆడు నెమలి యొక్క కులుకులకు ఆకర్షితుడై పురుషనెమలిగా దేహం ధరించి పది సంవత్సరాలు గడిపాడు. మరల ఒక రోజు ఆడు నెమలిని అక్కడే వదలి, ఇక అక్కడి నుండి బయలుదేరి మంధరపర్వతం జేరి అక్కడ గల ఒక కిన్నెర స్త్రీతో మరికొంత కాలం గడిపాడు.

తూర్పు వైపు వెళ్ళిన విపశ్చిత్తు నారికేళవనంలో నుంచి క్షీరసాగరం ప్రవేశించాడు. ఆ క్షీర సాగరంలో గల కల్పవృక్ష సమూహంలో నందనవన దేవతలతో అనేక కామములచే వ్యాకులుడై డెబ్భై సంవత్సరాలు గడిపాడు.

❖❖❖

# 5. ఒకే జీవాత్మ భిన్న దేహముల చమత్కారం

**శ్రీరాముడు :** మహాత్మా! వసిష్ఠ మహర్షీ ! ఆ విపశ్చిత్తు ఒకే జీవాత్మ కదా! మరి నాలుగు దేహములతో వేరువేరైన ప్రదేశములలో, వేరువేరైన కోరికలు, పరిచయములు, అనుబంధములు మొదలైనవి ఒకే సమయంలో ఎలా నిర్వర్తించాడు? విపశ్చిత్తు మొట్టమొదట... ఒకే సాక్షి చైతన్యముచే పరిపూర్ణుడై, ఒక జీవుడై, ఒక దేహము కలవాడై, ఒక విధమైన ధ్యాన - ప్రియ - వ్యవహారాది క్రియలు కలిగి ఉండేవాడు కదా! ఇప్పుడు - నాలుగు దేహములు...! నాలుగు విధాలైన దృష్టులు...! నాలుగు చోట్ల నాలుగు విధాలైన అనుబంధ - బాంధవ్య - వ్యవహారాదులు కలిగి ఉండట మనేది ఎట్లా యుక్తియుక్తం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ మనస్సు చిరకాలంగా ఏది ఎట్లు 'సత్యమే' అని భావించి అభ్యసిస్తూ ఉంటుందో... అది అట్లే మనస్సుకు ఘనీభూతమై అనుభవమౌతుందని మనం ఇప్పటివరకు అనేక చరిత్రలలో చెప్పుకున్నాం కదా! అట్లాగే ఈ వ్యష్టిజీవుల మనస్సు,

"ఈ ఒకేఒక దేహమే నేను. ఇదియే నా ఉనికి. ఇది భౌతికంగా ఎక్కడ ఉంటే నా పరిమితి అంతవరకే" ...అని అనేక దేహపరంపరలుగా చిరకాలాభ్యాసం నిర్వర్తించినదై ఉంటోంది. అందుచేతనే, ఈ జీవుడు "ఇదే నా రూపం, నామం, పరిమితి, ఆశయం, వ్యవహారం, చలనం" ...అని భావిస్తూ ఉన్నాడు.

ఒకే జీవుడు అనేక దేహములలో ఉండి, ఒక దేహంతో మరొక దేహానికి సంబంధంలేనట్టి - అనుభూతులు, సంబంధ బాంధవ్యములు, వ్యవహారములు, భావనలు, నమ్మికలు కలిగి వ్యవహరించటమనే చమత్కారం శ్రోతలకు యుక్తియుక్తంగా గ్రహించటానికి గాను, ఇప్పుడు స్వప్నమును దృష్టాంతంగా తీసుకొని విశదీకరిస్తున్నాను. విను.

ఒకానొక జీవుడు స్వప్నంలో అనేకమంది తదితర జీవులతో వ్యవహరించటమనేది ప్రతి ఒక్కరికీ సుపరిచితమైన అనుభవమే కదా!

ఇప్పుడు... నీకు నీ స్వప్నంలో కనిపించే వివిధ అభిలాషలు, ఆశయాలు, అనుభవాలు గల తదితర జీవుల అసలు రూపం ఏమిటి? నీ స్వప్న సత్తయే వారి రూపాలు గాను, ఆయా వివిధాలైన వివిధ వ్యక్తిత్వములుగాను ప్రదర్శిస్తోంది కదా! అంతేగాని ఆ స్వప్నంలో మరొకరెవరో ప్రవేశించి వ్యవహరించటం లేదే! అనగా... నీకు కనిపించిన మిత్రులు, పురప్రజలు, బంధువులు, శత్రువులు, పిచ్చి పిచ్చి ప్రవర్తన కలిగి ఉన్నవారు మొదలైన వారంతా స్వప్న ద్రష్టయగు నీయొక్క స్వప్న సత్తా రూపులే కదా! అనగా నీవు దాల్చిన వేఱువేఱు రూపములే కదా! ఎందుకంటే నీవు సత్తా స్వరూపుడివే గాని, దేహరూపుడవు కాదు సుమా!

స్వప్నానుభవంలో జరుగుచున్నదేమిటి?... స్వప్న ద్రష్ట స్వప్నంలో వేరువేరైన స్వభావాలు, ఆశయాలు, గుణాలు - వ్యక్తిత్వము గల రూపాలను తనకు తెలియకుండానే తాను దాల్చి, "ఈ

రూపాలన్నీ నాకు వేరైనవే!" ...అను అనుభవముతో వ్యవహరిస్తున్నాడు. అవిద్యచే వివిధ దేహాదుల కల్పన, ఆ తదితర దేహములలోని వారంతా తనకు శత్రు మిత్రులుగా వ్యవహరించటం జరగుచున్నట్లే ఈ జాగ్రత్ జగత్తులో మాత్రం ఎందుకు జరుగకూడదు? జాగ్రత్ సత్త జాగ్రత్‌లో, "వీరు బంధువులు, వీరు శత్రువులు, వీరు పురజనులు" ...అని పొందబడుచుండుటయే ఈ సంసారం యొక్క చమత్కారం! వాస్తవానికి... "చిద్ఘనాకాశమై, అవిభక్తమై, ఏకమై, సర్వ వ్యాపకమైనట్టి బ్రహ్మం మాత్రమే ఉన్నది. ఇక తదితరంగా కనిపించేదంతా కూడా అట్టి అఖండ బ్రహ్మమే ఆరోపిత దృష్టికి ఆ విధంగా కనిపిస్తోంది" ...అనునది అధ్యాత్మ శాస్త్రము యొక్క మొట్టమొదటి పాఠ్యాంశమే కదా! అవిద్యా ప్రభావం చేత ద్రష్టచే తన 'జాగ్రత్ సత్త'యే ఈ దృశ్యము యొక్క కల్పిత రూపాలుగా గాంచబడుతోంది. బ్రాహ్మీ దృష్టి సంతరించుకున్నప్పుడు "ఈ ఉన్నవన్నీ, కదలేవన్నీ నా యొక్క వివిధ ఆరోపిత రూపాలే" అని గమనించబడగలదు. ("మమాత్మా సర్వభూతాత్మా' మొదలైన) వేద ప్రతిపాదిత మహావాక్యములు ఈ అనునిత్య సత్యమును నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాయి కదా!

నిర్మల దర్పణంలో గృహ, ఆకాశ, పర్వతాదులు ప్రతిబింబిస్తున్నాయి. అట్లాగే "నిర్మల చైతన్య ఘనము" అనే దర్పణంలో ఈ నేను, నీవు, దృశ్యము మొదలైనవన్నీ ప్రతిబింబిస్తున్నాయి. ఏదేది దర్పణంలో ప్రతిబింబించినా కూడా, దర్పణానికి వాటితో సంబంధం ఉన్నదా? లేదుకదా! దర్పణం సర్వదా యథాతథమై ఉంటున్నట్లే ...మన స్వస్వరూపమగు చిదాకాశ ఘనంలో ప్రతిబింబించే దృశ్యాదులకు, ఘనచిదాకాశ స్వరూపానికి సంబంధం లేదు. అనగా దృశ్యం యొక్క ఉనికిచే గాని, లేమిచే గాని మన చిదాకాశ ఘన స్వరూపం మార్పు చేర్పులు పొందేదికాదు. అయితే ఇది జనులు గమనించటం లేదు. అంతే !

**శ్రీరాముడు :** హే మహర్షీ! మనందరి స్వరూపమూ చిదాకాశ ఘనమే కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. సర్వదేహుల వాస్తవ – ఆత్యంతిక స్వస్వరూపము చిదాకాశ ఘనమే గాని మరి ఇంకొకటేదీ కాదు.

**శ్రీరాముడు :** అటువంటప్పుడు మనమంతా ఒకరికొకరం వివిధ రీతులుగా (నేను – నీవు – నీవారు, నా వారు, జ్ఞానులు, అజ్ఞానులు, సుజ్ఞానులు, దురజ్ఞానులు, ఈ విధంగా జ్ఞానభేదాలతోను, గుణభేదాలతోను ఒకరికొకరం ఎందుకు అగుపిస్తున్నాం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! కొన్ని దర్పణములు తెచ్చి ఇక్కడ చతురస్రంగా అమర్చామనుకో, ఆ దర్పణాలన్నీ ఒకే లోహంతో తయారయినప్పటికీ, అవన్నీ ఒకదానియందు మరొకటి ఆయా వివిధ ఆకారములతోటి ప్రతిబింబిస్తున్నాయి కదా! మనమందరము సర్వకాలములందునూ చిద్రూపములమే! అయినప్పటికీ ఈ సమస్త పదార్థములు మాయాశక్తిచే వివిధ రూపములవలె మన చిత్తంలో ప్రతిబింబిస్తున్నా. ఒకరికొకరు మాయతోకూడి అనుభూతులమగుచున్నాం.

మనయందు మన స్వస్వరూపంగా అధ్యస్థమైయున్న చిద్ఘనబ్రహ్మమే ఈ భోగ్య జగదాకారంగా వివర్తితమై, ఇంద్రియ సామీప్యము పొందిన ఆయా వస్తువులను భోగార్థంగా పొందుచున్నది.

**ఇత్యనేనైవ నానేదం నానానానా చ వస్తుతః ।**
**నచ నానా నచాఽనానా నానానానాత్మకం తతః ॥**

ఈ విధంగా... బ్రహ్మము ఒక్కటే! ఒక్కటే అయివుండి అనేక రూపములుగా భాసిస్తోంది. వాస్తవానికి బ్రహ్మమునందు 'ఏక – అనేకములు' అనే రెండూ లేవు. మాయా ప్రభావం చేతనే ఈ విధంగా ఈ ఈ ఏక – అనేక రూపములుగా భాసిస్తోంది. ఏకైక స్వప్నద్రష్టా చైతన్యమే స్వప్నంలో ఏక – అనేకములుగా భాసించుటయే అందుకు దృష్టాంతము.

ఇప్పుడు మనం విపశ్చిత్తు విషయానికి వస్తే... విపశ్చిత్తు అగ్నిదేవుని వరం చేత నాలుగు దేహాలు పొంది ఒకే జీవాత్మ అయివుండి నాలుగు చోట్ల నాలుగు విధాలైన కర్మ పరిపాక విశేషాలు పొందుచున్నాడు. ఇది ఒకే వ్యక్తి నలుగురితో నాలుగు రీతులుగా (ఒక మిత్రునితో, ఒక శిష్యునితో, ఒక ఆస్తి సంబంధిత వ్యవహారంతో, ఒక కుటుంబ సభ్యునితో ఒకే సమయంలో నాలుగు రకాలైన స్వభావాలు ప్రదర్శిస్తూ సంభాసించునట్లు) ... వ్యవహరించు రీతిగా కొనసాగుచున్నది. ఆ విపశ్చిత్తు ఎక్కడ ఏ వస్తువు ప్రాప్తిస్తుంటే అక్కడ ఆ వస్తువుతో తన్మయుడై, వివశుడై ఆ చోట అట్లు వ్యవహరిస్తు న్నాడు. ప్రతి జీవుడు దృశ్య పదార్థముల పట్ల అట్లే ఎదురుగా ఏది వుంటే అద్దాని అనుసరించి ప్రవర్తనను సంతరించుకోవటం చూస్తున్నాం కదా! ఇదీ అట్టిదే.

ఇక ... "నాలుగు దేహాలతో నాలుగు చోట్ల ఆ ఎదురుగాగల విషయాలలో తన్మయానుభవం ఎట్లా పొందుచున్నాడు?" అనే విషయానికి వస్తే ... యోగులు ఒకే కాలంలో వివిధ ప్రదేశములలోను, త్రికాలములలోను ప్రత్యక్షమై వివిధ కార్యములు నిర్వర్తించటం గురించి నీకు అనేక విశేషాలు ఆశ్రమ విద్యా సమయంలో చెప్పియే ఉన్నాను కదా! యోగబలంచేత అనేక రూపములతో వివిధ ప్రదేశములలో వేరువేరు కార్యములు యోగులు నిర్వర్తిస్తూ ఉండగా... ఇక మన విపశ్చిత్తు వేరు వేరు చోట్ల వేరు వేరు దేహములతో వ్యవహరించటంలో ఆశ్చర్యమేమున్నది? అటు ఆకాశంలో మేఘాలను చూడు. అవి ఉష్ణముచే తపించే జనులను ఆహ్లాద పరుస్తున్నాయి కదా! అయితే, మేఘములన్నీ ఒక్కటే అయినప్పటికీ అవి అనేక ప్రదేశాలలో వ్యాపించి... ఒక చోట క్షాళనం (Cleaning) చేస్తున్నాయి; మరొకచోట భేదనం (Dividing) చేస్తున్నాయి; ఇంకొకచోట తటాకాలను నింపుతున్నాయి; వేరొకచోట సస్యపోషణం చేస్తున్నాయి.

ఆ మేఘాభిమానియగు జీవుడు (ఈ మేఘాలే నా శరీరం అని భావన చేస్తున్న జీవుడు) "నేను వేరు వేరుచోట్ల ప్రవేశించి వేరు వేరు వ్యవహారాలు నిర్వర్తిస్తున్నాను కదా!"... అనే అనుభవాన్ని పొందుచున్నాడు. అట్లాగే విపశ్చిత్తు కూడా "నేను వేరు వేరు చోట్ల వేరు వేరైన అనుభవాలు పొందుచున్నాను"... అను రూపంగా అవన్నీ అనుభవిస్తున్నాడు.

ఇంకా ఈ సృష్టిలో అనేక వింతవింతలైన చమత్కారములు జరుగుచున్నాయి. దేహాభిమాని అయిన సంసారబద్ధ జీవుడు, "నా పరిమితి ఈ దేహమే"... అనుకొని దేహ పరిమితత్వాన్ని అనుభవించటం కొనసాగిస్తున్నాడు.

అయితే... అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ఈశిత్వ, ప్రాకామ్య, ఇచ్ఛా, వసిత్వ - అనబడే అష్ట సిద్ధులను యోగాభ్యాసంచే సముపార్జించుకొన్న ఈశ్వర సదృశులగు యోగులు ఏక కాలంలో వివిధ దేహాలతో అసంఖ్యాకములగు కర్మ పరంపరా వ్యవహారములను, తత్ సంబంధిత జగత్ రచనా వ్యవహారములను రచించుచూ ఏకకాలంలో అవన్నీ అనుభవిస్తూపోతున్నారు.

ఒకే విష్ణు భగవానుడు నాలుగు భుజాల చేతను, వివిధ మాయా దేహాల చేతనూ... ఒక చోట యోగనిద్రలో ఉంటున్నాడు. (నిర్విషయుడై కేవలం చిద్విలాసానుభవంలో తన్మయుడై ఉంటున్నాడు). మరొక చోట గొప్ప తపస్సు కొనసాగిస్తున్నాడు. ఇంకొక చోట ఇంద్రుని సోదరుడై ఆతని కార్యక్రమములకు సహకారాలు అందిస్తున్నాడు. వైకుంఠంలో భోగములు అనుభవిస్తున్నాడు. అవతార మూర్తియై ముల్లోకములలో దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ జరుపుచున్నాడు. వైకుంఠాంతః పురంలో లక్ష్మీదేవితో సరససల్లాపములతో క్రీడిస్తున్నాడు. భక్తులకు తోడు- నీడ అయి వారి లౌకిక - పారలౌకిక వ్యవహారములలో పాల్గొనుచున్నాడు. అనేక మంది భక్తుల హృదయాలలో రమిస్తు న్నాడు. అనేక బాహువులు గల విష్ణువు రెండు ప్రయోజనములు తటస్థించినప్పుడు రెండు బాహువులతో ఆ రెండు కార్యములు నిర్వర్తిస్తున్నాడు. అనేక వ్యవహారములు తటస్థించినపుడు - అనేక బాహువులతో అనేక కార్యములు నిర్వర్తిస్తూ ఈ లోకములన్నీ పరిపాలిస్తున్నాడు.

అట్లాగే మన విపశ్చిత్తు ఒకే సంవిత్తుచే 'విపశ్చిత్తుగా' పరిపూర్ణుడై ఉండి ఇప్పుడు (ఈ కథా సమయంలో) నాలుగు దిక్కులలో నాలుగు దేహములతో అక్కడక్కడ ప్రాప్తములగుచున్న దృశ్య వ్యవహారములలో పాల్గొనుచూ, అక్కడక్కడి సుఖ దుఃఖములన్నీ తనవిగా అనుభూతి పొందుచున్నాడు.

❖

ఆ నలుగురు విపశ్చిత్తులు వేరువేరు దేహములలో వేరువేరు చోట్ల భూమిపై శయనించుచున్నారు. వేరువేరు ద్వీపములలో లభించిన వస్తువులను అనుభవించుచున్నారు. వన పంక్తులలో వ్యవహరి స్తున్నారు. పర్వత పంక్తుల మధ్యగా వ్యవహరిస్తున్నారు. సముద్రములలో పరిభ్రమిస్తున్నారు. ద్వీప సమూహములలో విశ్రమిస్తున్నారు. సముద్ర తీరములలోను, నగరములలోను క్రీడించుచున్నారు. పర్వత శిఖరములలో దాగుకొంటున్నారు. కొన్నిచోట్ల కొన్ని సంవత్సరముల కాలం గృహసంబంధము లైన - భార్యపిల్లలు, బంధువులు, తదితరులు - ఇత్యాది భావోద్రేకములు కలిగి ఉంటున్నారు. బంధువులతో వినోదిస్తున్నారు... ఇట్లా ఉన్నది, ఆ నలుగురు విపశ్చిత్తుల వ్యవహారమంతా!

❖

తూర్పు దిక్కుగా వెళ్ళి సంచారం చేస్తున్న విపశ్చిత్తు శాకద్వీపంలో ప్రవేశించాడు. ఆ ద్వీపంలో ప్రసిద్ధి అయిన ఉదయాచల పర్వతంపై ఒకానొక చోట స్నుహీ (జముడు) వృక్షములతో కూడిన ఒక భయంకరారణ్యంలో సంచరించ నారంభించాడు. అక్కడ ఆ కీకారణ్యంలోగల ఒక యక్షుడు తన మాయతో తూర్పు దిక్కు విపశ్చిత్తును తన అనేక మాయారచనలతో సమ్మోహంలో ముంచివేశాడు. అట్టి సమ్మోహంలో ఏడు సంవత్సరాలు ఆతడు నిదురించాడు. అక్కడి నుండి ఎట్లాగో బయలుదేరి ఒక విచిత్రమైన జలాశయం జేరాడు. ఆ విచిత్ర జలాశయంలో నీరు త్రాగినవారు ఏడు

సంవత్సరములు శిలారూపంగా ఎటూ కదలలేక ఉండిపోతారు. మన తూర్పు దిక్కు విపశ్చిత్తు తెలియక ఆ నీరు త్రాగి ఏడు సంవత్సరాలు ఆ తటాక సమీపంలో శిలారూపంలో ఉండిపోయాడు.

పశ్చిమ దిక్కు విపశ్చిత్తు కూడా శాకాద్వీపంలోని గల అస్తాచల పర్వతముపై గల పిశాచముల మాయకు లోబడి నెలరోజులు ఆ కామపిశాచముల మాయలో నానా అగచాట్లు అనుభవించాడు.

ఒకసారి తూర్పు దిక్కు విపశ్చిత్తు శాకాద్వీపంలో సంచరిస్తూ ఒక ముని యొక్క శిష్యులను తన యోగశక్తుల గర్వంతో బాధించనారంభించారు. అక్కడి ముని ఆశ్రమ జనాన్ని బాధిస్తున్న తూర్పు దిక్కు విపశ్చిత్తును గమనించిన ఆ ముని ఆతనిని చూచి, "ఓయీ! అగ్నిదేవుడు నీపై దయతో నీకు ప్రసాదించిన యోగశక్తులను సౌమ్యులగు ముని జనమును బాధించటానికి ఉపయోగిస్తు న్నావా? సాత్వికులను బాధించిన దోషం నిన్ను కట్టికుడుపక మానదు కదా! కనుక నీవు ఈ అరణ్యంలో ముళ్ళ చెట్టువై ఉండెదవు గాక" అని శపించాడు. ఇక ఆ తూర్పు దిక్కు విపశ్చిత్తు అక్కడే ముళ్ళపొదగా మారిపోయి నేలలోని జలం ఆహారంగా స్వీకరిస్తూ చలనం కోల్పోయి అనేక వేదనలు అనుభవిస్తూ ఉండిపోయాడు. తూర్పుదిక్కు విపశ్చిత్తుకు వచ్చిన ఆపద, ఆతని వేదన పశ్చిమదిక్కు విపశ్చిత్తుకు తెలియవచ్చింది. ఆతడు శాకద్వీపంలోనే సంచరిస్తున్నాడు కదా! విషయం తెలియగానే ఆతడు ముని ఆశ్రమాన్ని సమీపించి ఆ మునిని స్తోత్ర–సేవాదులచే సంతోషింపజేశాడు.

**ముని :** ఓ పశ్చిమ విపశ్చిత్తూ! అనేక రోజులుగా నీవు ప్రదర్శిస్తున్న సేవానిరతికి నేను ఎంతగానో సంతోషించాను. ఈ ఆశ్రమ వాసులు నీ సాత్విక భావాలను ఎంతగానో అభినందిస్తున్నారు. నీకు ఏ వరం కావాలో కోరుకో?

**పశ్చిమ విపశ్చిత్తు :** స్వామీ! మునీంద్రా! నా ఆత్మీయుడగు తూర్పుదిక్కు విపశ్చిత్తు మీ ఆశ్రమ జనాన్ని బాధించి మీకు కోపం కలిగించి మీ శాపంచే కంటక వృక్షంగా (ముళ్ళ చెట్టుగా) అయి అనేక మానసిక వేదనలచే దుఃఖితుడై ఉన్నాడు. ఆతనిని క్షమించి ఆతనికి శాప విమోచనం ప్రసాదించండి.

**ముని :** అట్లే అగుగాక! ఇప్పుడు నీకొక దోష నివారణ మంత్రం ఉపదేశిస్తాను. మంత్ర దేవతను ఉపాసించి మంత్రోచ్చారణ చేస్తూ ఆ కంటక వృక్షాన్ని ఈ అంపంతో ఖండించు. అప్పుడు నీ మిత్రునకు శుభం కలుగుతుంది.

ఆ విధంగా ముని వాక్యాలు విన్నాడు. ముని వద్ద మంత్రోపదేశం పొందాడు. మంత్రోచ్చారణ చేస్తూ తూర్పుదిక్కు విపశ్చిత్తుకు శాపవిమోచనం కలిగించి ఆపై తన సంచారం తన మార్గంలో కొనసాగించసాగాడు.

పశ్చిమ విపశ్చిత్తు మరొక సమయంలో 'శిశిరం' అనే ప్రదేశంలో ప్రవేశించి అక్కడి మధుర మైన ఫలాలను ఆస్వాదిస్తూ అక్కడి పూసజ్జలను ఖండించి గృహంగా నిర్మించి, అక్కడ నివసిస్తూ అక్కడి వన వృక్షాలను ఖండించసాగాడు. ఇది అక్కడి పిశాచ రాజుకు చాలా కోపం తెప్పించింది. అప్పుడు ఆ పిశాచపతి "ఓ ఈ మానవుడా! ఇక్కడ మా పిశాచ రాజ్యంలో ప్రవేశించి మా పిశాచ జనుల గృహములైన వృక్షములను ఖండిస్తున్నావే! ఇందుకు శిక్షగా నీవు శిలగా అయ్యెదవుగాక"

...అని శపించాడు. అంతే! ఆ పశ్చిమదిక్కు విపశ్చిత్తు అక్కడే శిలగా మారిపోయాడు. "అయ్యో!" అని మౌనంగా శోకించసాగాడు. ఆతని శోకం దక్షిణ దిక్కు విపశ్చిత్తుకు స్ఫురించింది. వెంటనే ఆతడు ఆ పిశాచ రాజ్యారణ్యంలో ప్రవేశించి గోమాంసాదులు సమర్పించి ఆ పిశాచపతిని సంతోష పరచి పశ్చిమదిక్కు విపశ్చిత్తుకు శాపం నుండి విమోచనం కలిగించాడు.

అట్లాగే మరొకసారి అస్తాచల సమీపంలోగల ఒక గోరూపధారియగు పిశాచి పశ్చిమదిక్కు విపశ్చిత్తును ఎద్దుగా మార్చి ఒక సంవత్సరం తన వెంట త్రిప్పుతుండగా దక్షిణదిక్కు విపశ్చిత్తు ఆ గోరూప పిశాచి చర్యను గమనించి తన ప్రతిమంత్రశక్తిచే పశ్చిమదిక్కు విపశ్చిత్తుకు ఎద్దు రూపం నుండి విముక్తి కలిగించాడు.

మరొక సందర్భంలో పశ్చిమదిక్కు విపశ్చిత్తు "క్షేమకము" అని పిలువబడే ప్రదేశంలో సంచరిస్తూ అక్కడ గల "అంబికేయము" అనే పర్వత శ్రేణులలో ప్రవేశించి అక్కడి పిశాచాలతో తానూ ఒక్కడిగా రూపం సంతరించుకున్నాడు. కొంత కాలానికి దక్షిణ దిక్కు విపశ్చిత్తు ఆ ప్రదేశంలో ప్రవేశించటం జరిగింది. అప్పుడు అక్కడ ఒక మఱ్ఱిచెట్టుపై దక్షిణ దిక్కు విపశ్చిత్తు మంత్రముగ్ధంగా ఆ పిశాచపతిని ఆహ్వానించి ప్రసన్నుణ్ణి చేసుకొని పశ్చిమ విపశ్చిత్తుకు పిశాచత్వం నుండి విడుదల గావింపచేశాడు.

❖❖❖

# 6. యోగి ఒక ప్రదేశంలో ఉండి త్రికాలాలలో మరొకచోట అనుగ్రహించటం

**శ్రీరాముడు :**

**ఏక దేశగతా విష్వక్ వ్యాప్య కర్మాణి కుర్వతే**
**యోగినౌ త్రిషుకాలేషు సర్వాణి, భగవన్ ! కథమ్ ?**

హే భగవాన్! వశిష్ఠ మహర్షీ ! యోగులు భౌతికంగా ఒక ప్రదేశంలో ఉండికూడా, సర్వత్రా వ్యాపించి ఆయా వేఱువేఱు ప్రదేశములలో గల శిష్యుల ప్రార్థన, విన్నపములను స్వీకరించి త్రికాలాల లోను "అనుగ్రహించటం, రక్షించటం, మార్గం చూపటం" ...వంటి వివిధ కార్యములను ఎట్లా నిర్విర్తిస్తున్నారో ప్రవచించమని నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు అడిగిన విశేషం గురించి :

1. "మా గురువు (దైవం) గొప్ప మహిమాన్వితుడు. అది ఆయనకే సాధ్యం. మరెవరూ అట్లా అనేక చోట్ల ఉండి అనుగ్రహించలేరు."; 2. "ఆ! అదంతా నిజం కాదు."

...ఇట్లా అసంపూర్ణ జ్ఞానులు – అజ్ఞానులు పరిపరి అభిప్రాయాలు కలిగివుంటున్నారు. మనం అజ్ఞానుల అభిప్రాయమును ప్రమాణంగా తీసుకోము కదా! కనుక వారివారి వేరు వేరు అభిప్రాయముల గురించి మనం ఇక్కడ చర్చించుకోవటంలేదు.

❖

ఇక తత్త్వవేత్తల దృష్టిని ప్రమాణంగా తీసుకొని చెప్పుకుందాం. "సత్తా సామాన్యమగు చిన్మాత్రము" కంటే వేరైన రూపమేదీ ఈ జగత్తుకు లేదు. ఎందుకంటే...

1. నిర్మలమైన ఆత్మజ్ఞానం కర్మ-భక్తి యోగాలు సమాశ్రయంచే క్రమక్రమంగా ప్రవృద్ధమౌతోంది.

2. అట్లు ఆత్మజ్ఞానంచే పరితప్తమైన నిర్మల బుద్ధి కలవారికి క్రమ-క్రమంగా ఈ దృశ్యం యొక్క "అత్యంత అభావము" అను బోధ ఉద్భవిస్తోంది. అనగా, దృశ్యం వారి దృష్టిలో అదృశ్యమై ఇద్దానికి ఏది ఆధారమో ...అది దర్శించబడుతోంది. స్వప్నంలో స్వప్న ద్రష్టచైతన్యముచే దర్శించబడే సర్వవిషయములకు రూపము, ఆధారము స్వప్నద్రష్టాచైతన్యమే కదా! అట్లాగే ఈ దృశ్యం ఎద్దాని రూపమైయున్నదో, ఏది ఈ దృశ్యమునకు ఆధారమైయున్నదో, ఎద్దానియందు ఈ దృశ్యం అంతర్గతమై ఉన్నదో ...అట్టి "స్వస్వరూపాత్మ" అనబడే బోధ రూపము గోచరిస్తోంది.

3. క్రమక్రమంగా ఈ సృష్టియొక్క - అద్దాని భావాభావముల యొక్క దృష్టి శమించి, "ఇదంతా అస్మత్ ఆత్మరూపమే" ...అనబడే, దివ్యదృష్టి రూపుదిద్దుకుంటోంది.

4. అప్పుడిక క్రమంగా సర్వ ఆధిభౌతిక దృష్టులు మొదలంట శమించుచుండగా, ఆ మహనీయుడు చిన్మాత్రమగు సత్తా సామాన్యమున విశ్రమించే సర్వేశ్వర స్వరూపుడు అగుచున్నాడు.

5. అట్టి పూర్ణజ్ఞానికి ఈ ప్రపంచమంతాకూడా చిద్రూపమగు ఆత్మయే అయి వెలయుచున్నది. ఆత్మకు వేరుగా ఇక దృశ్యము యొక్క ఉనికి - ఊసులు ఉండజాలవు.

అట్టి స్థితిలో సర్వము ఆత్మమయయై ఉండగా ఇక ఆపై ఏది దేనిచే నిరోధించబడగలదో చెప్పు?... (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి) ఇంతవరకు 'సాధన'లో ఉన్న ఆ మహనీయునికి - 'బ్రహ్మము' అనబడే శాస్త్ర ప్రతిపాదిత ఆత్యంతిక పరమసత్యమునకు ...ఇక భేదమే ఉండదు.

**భావించటం, భాసించటం -** సర్వ వ్యాపకము, సర్వరూపము అయినట్టి ఆత్మ ఏది ఎచ్చట ఎట్లు భావిస్తుందో... అది అట్లాగే భాసిస్తూ ఉంటుంది. సర్వస్వరూపుడు, ఆత్మానుభవి అగు ఆ చిద్రూపుడు ఇక ఆపై భూత-వర్తమాన-భవిష్యత్తులలో ఏదీ తాను కాకయే ఉంటాడు! అంతేకాదు. అంతా తానే అయి ఉంటాడు కూడా! అట్టి నిర్మలమైన భావనను సంతరించుకున్నట్టి చిద్రూపమగు ఆత్మ తనయొక్క వాస్తవ స్వరూపమును త్యజించకుండానే ... ఈ దూర, సమీప, నిమేష, కల్ప, భూత, భవిష్యత్, వర్తమాన, స్థూల, సూక్ష్మ - రూపములన్నీ తన సత్తా సామాన్య రూపమును సర్వవేళలా అవధరిస్తోంది.

**సర్వాత్మని స్థితాన్యేవ పశ్యమాయా విజృంభితమ్**
**అజాతమ్ అనిరుద్ధం చ యథాస్థితమ్ అవస్థితమ్ ॥**

ఆహా! రామచంద్రా! ఈ మాయ ఎంతటి చిత్రమైనదో గమనించావా! సర్వరూపమగు ఆత్మయందే భూత - భవిష్యత్ - వర్తమానములకు సంబంధించిన సర్వ స్థూల రూపములు - సూక్ష్మతత్త్వములు అన్నీ కూడా స్థితి కలిగివున్నాయి. ఈ జగత్తులన్నీ కూడా ఉత్పన్నము అవకుండానే, నాశనమనేది లేకుండానే ఆత్మయందు ఆత్మకు అభిన్నంగా యథాస్థితిగా నెలకొని ఉన్నాయి. కాబట్టి :

1. ఈ మూడు లోకాలలో కనిపించేదంతా కూడ విజ్ఞానఘన మగు ఆత్మరూపమే!
2. చిదాకాశం తన చిదాకాశత్వాన్ని త్యజించకుండానే ఈ రీతిగా జగద్రూపంగా కూడా స్థితినొంది ఉన్నది.

మాయతో కూడుకొనివున్న పరమాత్మ తనయొక్క ద్రష్ట – దృశ్యత్వముల కించిత్ అభ్యాసమే ఈ జగత్తు. అనగా, ఈ 'జగత్తు' అనేది స్వకీయాభ్యాసవశంగా ఉదయించుచున్నది మాత్రమే! అట్టి జగదాత్మయగు పరమేశ్వరుని యొక్క "దృక్ రూపము" నకు మార్పుచేర్పులు ఎక్కడున్నాయి? అది దేనిచేత ఎట్లు మార్పు చెందించబడగలదు? లేనేలేదు!

ఆ "దృక్‌రూప శుద్ధచిత్‌యే నేను" అని జగదతీతత్వం అవధరించి, సర్వరూపములు తానే అయి, సాధ్యాసాధ్యముల రెండింటినీ కూడా ధరించుచున్న మాయకు కూడా "ఆది" అయిన పరమాత్మకు అసాధ్యమేమి ఉంటుంది? ఆ శుద్ధ జగదాత్మయే అన్ని రూపములుగా తానే అయి వ్యవహరిస్తోంది కదా! అందుచేతనే ఆత్మసాక్షాత్కారం సంతరించుకున్న జగద్గురువులు శిష్యుల ఆరాధనకు ప్రతిస్పందించగలుగుచున్నారు

❖

ఇక విపశ్చిత్‌సంవిత్తు కూడా శుద్ధ చిత్–దృక్ రూపమే కదా! కనుక 'విపశ్చిత్' అను పేరుతో పిలువబడే సంవిత్తు ఒక్కటే అయివుండి నాలుగు ఉపాధుల ద్వారా నాలుగు చోట్ల నాలుగు విధములైన దృశ్య వ్యవహారములను అనుభవించటం జరుగుతోంది.

ఓ రామచంద్రా! 'విపశ్చిత్' అనబడే చైతన్యాంశము యొక్క వర్తమాన ధర్మ–జ్ఞాన స్థితిని ఇక్కడ వివరిస్తున్నాను. విను.

1. చైతన్యాంశయే "నేను విపశ్చిత్తును" అను జీవాహంకారమును పొందియున్నది.
2. క్రమంగా పరిమితాహంకారము నుండి ప్రబోధం పొందుతోంది.
3. అయితే ఇంకా కూడా, విపశ్చిత్తు యొక్క మనోరూప చైతన్యము పరమసత్యమగు పరమాత్మ పదమును (సర్వ జగత్తులు నా యందే ఉన్నాయి... అను జగదహంకారమునకు కూడా సాక్షి అయిన స్థానమును) పొంది ఉండలేదు.
4. ఆ విపశ్చిత్ రాజయొక్క సంవిత్తు అగ్నిదేవుని ఆరాధించి ఆయన అనుగ్రహంచేత నాలుగు ఉపాధులను ధరించి వ్యవహరింపజేసే యోగశక్తిని మాత్రం ఇప్పటికి సంపాదించుకొనియున్నది.

ఈ విధంగా విపశ్చిత్తు నాలుగు దేహములతో వ్యవహరిస్తూ ఉండటం యుక్తియుక్తమే అవుతుంది.

బోధరూపమగు ఈశ్వర మాయతో కూడికొనియున్న పరమాత్మయందు అసాధ్యమేముంటుంది? పరమాత్మార్థ బోధ పొందనంతవరకు పదార్థత్వము ఉచితమే కదా! ఒక్క దేహమైనా నాలుగు దేహములైనా – అది పదార్థత్వమే కదా!

ఈ విధంగా, కొంచెము బోధను సముపార్జించియున్న ఆ విపశ్చిత్తు నాలుగు దేహములు సిద్ధింపజేసుకోవటం ఉచితమే (యుక్తమే) అవుతోంది.

❖

ఓ రామచంద్రా! ఈ రీతిగా నాలుగు దిక్కులందు ఉన్నట్టి ఆ విపశ్చిత్తులు పరస్పరము ఒకరికొకరు చూచుకోవటం, ఒకరితో మరొకరు సంభాషించుకోవటం, సహకరించుకోవటం, ఒకరి కష్టాలలో మరొకరు తోడుకావటం నిర్వర్తిస్తూ ఉన్నారు. ఇదంతా కూడా అచ్యుతమగు చిదాకాశము తన అప్రమేయ – అఖండ స్వరూపము నుండి చ్యుతి నొందకయే కించిత్ చ్యుతి పొందినదానివలె అయి నిజస్వరూపమునకు అభిన్నమైన మనస్సును, ఆ మనస్సుచేత తనకు వేరుగా కానట్టి (కాని, అనిపించే) జగత్తును దర్శించటం వంటిదే! ఆ విపశ్చిత్తు యొక్క నాలుగు దేహముల ఏక సమయ వ్యవహారం కూడా చైతన్యము యొక్క ఒకానొక మాయా విశేషమే!

ఒక జీవుడు తన వ్యష్టిచైతన్యమును ప్రేరేపించి అనేక దేహముల ద్వారా అనేక వ్యవహారసరళులను అనేకచోట్ల నిర్వర్తించటం – అనేది యోగశాస్త్రవేత్తల పాఠ్యాంశములలో నిర్వచించబడి – విశదీకరించబడిన విషయమే! అంతేగాని, ఇప్పుడు నేను క్రొత్తగా లోకమునకు ప్రతిపాదిస్తున్న విషయమేమీ కాదు!

❖❖❖

## 7. సిద్ధులు వేరు - జ్ఞానము వేరు

**శ్రీరాముడు :** ఆ విపశ్చిత్తు జ్ఞాని అయివుండి కూడా నాలుగు దిక్కులలోను సింహం, శిల, వృక్షం మొదలైన ఆయా ఉపాధులు ఎందుకు పొందవలసి వచ్చింది? ఈ విషయం విశదీకరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ప్రబుద్ధులగు యోగులు ఒక ప్రదేశంలో ఉండియే అనేకచోట్ల అర్హులైన శిష్యులకు బోధించటం, ఆశ్రితులగు దీనజనుల కష్టాలు పోగొట్టటానికి ఆయా కార్యములు నిర్వర్తించటం, ఆర్తితో కూడిన పిలుపుకు బదులు పలకటం నిర్వర్తిస్తున్నారు కదా! ...అని నేను ప్రసంగవశం చేత చెప్పానేగాని ఆ ఒకానొక జీవుడగు విపశ్చిత్తుగాని, ఆ నలుగురు ఉపాధి విపశ్చిత్తులుగాని పరిపూర్ణజ్ఞానులు అయినారని నేను అనలేదు.

ఆ విపశ్చిత్తులలో నలుగురు జ్ఞాన అజ్ఞాన రూపములైనట్టి 1.మోక్ష చిహ్నము, 2.బంధ చిహ్నము – రెండు కనిపిస్తున్నాయి. వారు అగ్నిదేవుని కృపచే ధారణమాత్రం చేత నాలుగు దేహాలతో సంచరించ గలుగుచున్న ధారణాయోగులు మాత్రమే. అంతేగాని ఆత్మజ్ఞానులు కాదు.

**ధారణా యోగినస్తే హి, ధారణా ప్రాప్త సిద్ధయః**
**యే పరంబోధమ్ ఆయాతా యేషు అవిద్యా న విద్యతే॥**

హృదయంలో అగ్నిదేవుని యందు చిత్తమును నిలిపి ఆ అగ్నిదేవుని అనుగ్రహం చేతనే కదా, వారు సిద్ధులు పొందారు? వారు 'ధారుణా యోగులు' అనిపించుకుంటారుగాని, 'పూర్ణజ్ఞానులు' అనిపించుకోరు. ఎందుకంటే పరమబోధను పొందినవారిలో దృశ్యము విషయమై "ఇది కావాలి" ...అని గాని "అది వద్దు" ...అనిగాని ఈ జగద్విషయమై ఎట్టి పట్టుదల ఉండదు. విపశ్చిత్ విషయం అట్లా లేదు కదా!

**కిమ్ అవిద్యామ్ అవేక్షన్తే తే, తామరసలోచనా!**
**ధారణా యోగినో హి ఏతే వరేణ ప్రాప్త సిద్ధయః**
**అవిద్యా విద్యతే తేషాం తేన తేఽ తద్విచారిణః?**

"మేము అవిద్యను పరికించి చూడాలి" ...అనే అభిలాష గలవారు అవిద్యాదృష్టి కలవారే అవుతారు. పూర్ణజ్ఞానులకు అవిద్యపట్ల ఎట్టి పరిశోధనాభావం ఉండదు. భ్రమచే కనిపించేదని తెలిసిన తరువాత పరిశీలన ఆవశ్యకం ఏముంటుంది? "స్వప్నంలో కనిపించిన ఇల్లు స్వప్నకల్పనా భావ చమత్కారమే!" ...అని తెలిసిన తరువాత "ఆ కలలో అటువంటి గృహాలు ఇంకా ఎన్ని ఉన్నాయి?" ...అని పరిశీలించాలని ఎందుకనిపిస్తుంది? ఆ విపశ్చిత్తునందు "నాలుగు దేహాలతో ఈ సృష్టి ఎంతవరకు ఏఏ రూపములుగా విస్తరించివున్నదో... పరిశీలిస్తాను" ...అను రూపంగా అవిద్య ఉండనే ఉన్నది. అవిద్య పరిపాకమై ఉండగా ఆత్మజ్ఞానము పరిపుష్టి పొందదు.

ఓ రామచంద్రా! జీవన్ముక్తులు తమయొక్క జగత్‌విభాగంచే జగత్తులో సంచరిస్తూనే సమాధి విభాగమును యథాతథంగా పరిపోషించుకుంటూ ఉంటారు. అంతేగాని, జగత్తు యొక్క వ్యవహారము ఒక మామూలు విషయం అగుచుండగా, "ఈ జగత్తు ఏమిటి? అవిద్య ఎంతటిది?" ...అని పరిశీలనకు బయలుదేరవలసిన అగత్యం వారికుండదు.

❖

**శ్రీరాముడు :** మహర్షీ! "దేహమున్నంత వరకు బంధం తప్పదు. దేహము దేహికి ఐహిక మోహము. ముక్తికి దేహమే అడ్డుగా కూడా ఉంటోంది" ...అని కొందరు గురువులు దేహతత్త్వాన్ని పార్శ్యాంశంగా బోధిస్తున్నారు. ఇట్టి "దేహమును దాటివేస్తేనే ముక్తి" ...అనే సిద్ధాంతం విషయంలో మీ అభిప్రాయం సోదాహరణపూర్వకంగా, సవివరంగా ప్రసంగించవలసినదిగా నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఆలోచన" అనగా... "ఇష్టము, అయిష్టము, గౌరవభావం, అగౌరవ భావం, భయం, ఆశ్చర్యం, అనురక్తి, విరక్తి" ...ఇవన్నీ కూడా దేహధర్మాలా? మనోధర్మాలా?

**శ్రీరాముడు :** స్వామీ! అవన్నీ మనోధర్మాలుగాని దేహధర్మాలు కాదని, మనోధర్మాలు ప్రకటించటానికి ఈ దేహము ఉపకరించే ఉపకరణం మాత్రమేనని మీరు బోధించియే ఉన్నారు. మీరు బోధించినది పరమసత్యమే.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును కదా! అట్లాగే 'మోక్షం' అనేది చిత్తం యొక్క ధర్మమేగాని దేహం యొక్క ధర్మం కాదు. "చొక్కా ధరించేవారు జ్ఞానులు కాలేరు. చొక్కా లేనప్పుడే జ్ఞాని" అని ఎవరమైనా అన గలమా? జ్ఞానులు ఈ రంగు చొక్కాని ధరించి ఉండగలరని ఎవరు సిద్ధాంతీకరించగలరు చెప్పు?

**మోక్షోఽపి చేతసోధర్మః, చేతస్యేవ స తిష్ఠతి**
**న దేహే దేహధర్మస్తు, న దేహాత్ వినివర్తతే ॥**

మోక్షము చిత్తము యొక్క ధర్మము మాత్రమేనని మరల ప్రకటిస్తున్నాను. 'మోక్షము' అనేది ఏకాగ్రమైన చిత్తమునందు మాత్రమే నెలకొని ఉంటోంది. కనుక బంధింపడేది చిత్తమేగాని ఆత్మ కాదు. కనుక జీవన్ముక్తునకు ఏవేవో ప్రత్యేకమైన దేహధర్మాలు ఆపాదించటానికి వీలవదు.

**న కదాచన నిర్ముక్తం చేతో భూయో నిబధ్యతే,**

**యత్నేనాపి పునర్ బద్ధం కేనవృన్తచ్యుతం ఫలమ్?**

తొడిమ నుండి విడివడిన దోసకాయ తిరిగి తొడిమచే బంధించబడగలదా? లేదు కదా! అట్లాగే ముక్తత్వం సంతరించుకున్న తరువాత ఇక అట్టి చిత్తం మరల ఈ సంసారంచే స్పృశించబడజాలదు.

**దేహస్తు దేహధర్మేణ, జీవన్ముక్తి మతామసి ।**

**గృహత్యే తద్గతం తేషాం చేతస్తు అచలమేవ తత్ ॥**

జీవన్ముక్తులకు కూడా దేహం దేహధర్మమే కలిగివుంటుంది. కానీ బద్ధజీవుల చిత్తము నిత్య చంచలంగా ఉంటూ ఉంటోంది. ఇక జీవన్ముక్తుల చిత్తమో... "ఇదంతా పరమాత్మ శోభయే కదా" అను రూపంగా అతినిశ్చలంగా ఉంటోంది. జీవన్ముక్తుల నిశ్చలత్వం జీవన్ముక్తులకే ఎఱుక అవుతుంది. అది ఎట్టిదో చంచల చిత్తులకు తెలియబడటం లేదు. ఇక ధారణ కలిగిన యోగుల విషయమంటావా? వారు "ఈ ఈ ధారణ కలిగివున్నారు" ...అని ఇతరులు తెలుసుకోగలుగుతారు. మోక్ష ధారణ కలిగి ఉన్నవారి చిత్తానుభవం ఎట్టిదో...అది లౌకిక దృష్టికి అందేది కాదు. ఒకడు ఒక అత్యంత మధురమైన పదార్థాన్ని ఆస్వాదించాడనుకో. "అద్దాని రుచి ఇట్టిది" అని ఎంతగా చెప్పినా కూడా అది తినని వారికి పూర్తిగా తెలియవచ్చేది కాదు కదా! ఆ వింటున్న ఆయన "ఇంతెందుకు? నేను కూడా తింటాను"...అని ఆ మధుర పదార్థాన్ని ఆస్వాదిస్తే ఇక ఆతనికి ఆ రుచి గురించి మరొకరు చెప్పవలసినదేముంటుంది? జీవన్ముక్తుల మోక్షానుభవం అట్టిది. అందుకే అద్దానిని "స్వాత్మానుభవైక వేద్యము" ...అని విజ్ఞులు అభివర్ణిస్తున్నారు.

**శ్రీరాముడు :** మహాత్మా! ప్రతిజీవుడు ఆత్మస్వరూపుడేగాని ఈ దేహ స్వరూపుడు కాదు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఇక ఇందులో సందేహమేమున్నది?

**శ్రీరాముడు :** ఆత్మ సర్వదా అప్రమేయ నిర్హేతుక – నిత్యముక్త ఆనంద స్వరూపమే కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. మన ఈ సంవాదము ప్రతిపాదించే ఆత్యంతిక సత్యం అదియే కదా!

**శ్రీరాముడు :** మరి ఆత్మస్వరూపుడగు జీవునికి సుఖదుఃఖాలు ఎందుకు వచ్చి పడుచున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సుఖదుఃఖాలు మనస్సు యొక్క ధర్మాలు, జీవన్–మృత్యువులో ...దేహం యొక్క ధర్మాలు. అట్టి సుఖ–దుఃఖ, జీవన్–మృత్యు ధర్మాలు తన స్వరూపమగు ఆత్మపై ఆపాదించుకొనటం చేతనే ఆత్మ "నేను బద్ధుడను" అను రూపంలో బంధానుభవం – అనుబంధానుభవం పొందుతోంది. మనస్సు "దృశ్యతాదాత్మ్యము, దృశ్యముపై నమ్మిక కలిగి ఉండటం" అనే సుదీర్ఘవ్యాధి నుండి ఉపశమనం పొందినప్పుడు, "ఈతడు ముక్తి పొందాడురా" అని ఆత్మకు ముక్తి శబ్దం ఆపాదించబడుతోంది. అంతేగాని... ఆత్మకు ముక్తి ఇప్పుడు క్రొత్తగా వచ్చింది కాదు. సర్వజీవుల ఆత్మ నిత్యముక్తమైయున్నది.

అభ్యంతరమున సర్వవిషయ – విశేషముల పట్ల శీతలము (శాంతి) వహించిన చిత్తమే ముక్తి. చిత్తము అనేక జగత్ విషయముల పట్ల సంతప్తమై ఉండటమే బంధము.

కనుక బంధం, మోక్షం అనబడేవి చిత్తము యొక్క అధీనంలో ఉన్నవేగాని... అవి దేహాధీనాలు కావు. బంధ – మోక్షములనే రెండూ దేహంలో లేవు. జీవన్ముక్తుడు సర్వ విషయ – విశేషముల

పట్ల ఒకానొక అనిర్దేశ్యమగు అతీతత్వము సంతరించుకుని ఉంటాడు. అట్టి అతీతత్వము – ఈ దేహం యొక్క భోగములను అనుభవిస్తున్నప్పుడుగాని, లేక ఈ దేహం ఖండఖండములగు చున్నప్పుడు గాని, అనేక లోకసంబంధమైన పరిస్థితులు ఎదురగుచున్నప్పుడు గాని, నవ్వుచున్నప్పుడు గాని, దుఃఖించుచున్నప్పుడుగాని, మరింకేవైనా పొందుచున్నప్పుడుగాని, కోల్పోవుచున్నప్పుడుగాని ఏమాత్రం చెక్కుచెదరదు.

"దేహం పని దేహం చేసుకుంటోంది. మనస్సు పని మనస్సు చేసుకుపోతోంది. నేను సర్వదా యథాతథం! తదితరులుగా కనిపించేదంతా కూడా నా అవ్యక్త స్వరూపాన్ని ఆధారంగా కలిగి ఉంది.

**న దుఃఖం న సుఖం కించిత్ అంతర్భవతి తత్ స్థితమ్ ॥**

బహిరంగంలో ఏది ఎట్లా ఉన్నా కూడా, అంతరంగంలో నేను కించిత్ కూడా సుఖంగాని, దుఃఖంగాని లేనివాడనై సదా నిర్వికారుడనై ఉన్నాను కదా!"...అని ఆత్మజ్ఞాని తన ఆత్మరూపమును గమనిస్తున్నాడు.

❖

ఈ సుఖ దుఃఖాదులు దేహముచే దేహమునందు పొందుచున్నప్పటికీ "నేను సుఖిని – నేను దుఃఖిని" అని ఆత్మకు సుఖ దుఃఖాదులు అజ్ఞాని ఆపాదిస్తున్నాడు. సుజ్ఞాని "ఇవన్నీ ఆత్మకు లేవు. ఆత్మస్వరూపుడనయి ఉండటం చేత నాకు సుఖదుఃఖాలు లేవు" ...అని గ్రహించి నిశ్చలభావుడై ఉంటున్నాడు. "ఈ దేహమే నీవు" ...అని బోధించేవారు (చార్వాక–నైయాయిక వాదులు) దుఃఖా లకు నిర్వచనం గాని, ఉపశాంతినిగాని అందించలేకపోతున్నారని నా మనవి. దేహాత్మవాదం పదే పదే ఓడిపోతోంది. ఆత్మశాస్త్రం ఒక్కటే చివరికి దిగ్విజయమొందుచున్నదని పరిశీలకులకు నా మనవి.

జీవన్ముక్తులు నిత్యము, అశరీరము అగు ఆత్మస్వభావమును సుస్పష్టపరచుకొని, సంతరించుకుని ఉంటారు. వారు ఈ దేహాదుల భావన ఎప్పుడూ కలిగివుండరు. కాబట్టే... వారు జన్మిస్తూ జన్మ రహితులై ఉంటారు. జీవిస్తూ జీవాదులకు సంబంధించని వారై ఉంటారు. మరణిస్తూ మరణించనివారై ఉంటున్నారు. అనగా వారు జన్మిస్తూ – జీవిస్తూ మరణిస్తూ తమను తాము జన్మ – జీవన్ – మరణములకు అతీతమైన కేవలాత్మ స్వరూపంగా దర్శిస్తున్నారు.

**దేహాది జీవన్ముక్తానాం స్వభావాత్ న కదాచన**
**మృతోఽపి నైవమ్రియతే, రుదన్నపి న రోదతి**
**విహసన్ న హసత్యేవ జీవన్ముక్తో మహోదయః!**
**వీతరాగాః సరాగాభా అకోపాః కోపసంయుతాః**

ఆ జీవన్ముక్తులు... దేహధారులై ఉంటూనే దేహరహితులై ఉంటారు. వారి దృష్టిలో వారు దేహమాత్రులు కాదు. దేహధర్మాలైనట్టి "జన్మ–జరా–మరణ–శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయ స్మరణ–విస్మరణ" మొదలైనవన్నీ కలిగివుంటూనే, కలిగివుండనివారై ఉంటారు.

మరణము ఆసన్నమైనప్పుడు "ఇది దేహధర్మము. నా స్వస్వరూపం సర్వదా ఈ వ్యవహారానికి సంబంధించినదే కాదు. కనుక దేహం మరణించవచ్చు గాక! నేను జీవించినవాడనూ కాదు,

మరణించిన వాడనూ కాదు" ...అనే అప్రమేయానుభవం ఇప్పటికిప్పుడే కలిగివుంటారు. సర్వదా మహోదయులై ఉంటారు.

"సూర్యోదయం – సూర్యాస్తమయం" అనేవి భూప్రదేశం దృష్ట్యా ఉండి ఉంటున్నాయి కాని... సూర్యబింబానికి ఉదయాస్తమయములు ఎక్కడుంటాయి? అది స్వప్రకాశము – అన్యప్రకాశకం కాదు! అట్లే ఆత్మను ఎఱిగిన జీవన్ముక్తుడు నిత్యోదయుడై ఉంటాడు.

ఆతడు నవ్వుతూ ఉన్నప్పటికీ నవ్వనివాడై ఉంటాడు. ఏడ్చుచున్నప్పటికీ, ఏడ్వనివాడై ఉంటాడు. కోపం చూపిస్తూ, కోపం లేనివాడై ఉంటాడు. రాగసహితుడై ఉంటూ, రాగాదులు లేనివాడై ఉంటాడు.

**అమోహా మోహవలితా దృశ్యన్తే తత్త్వదర్శినః**
**'ఇదమ్ సుఖమ్ – ఇదమ్ దుఃఖమ్' ఇత్యాది కలనాస్తుతాః**
**అలం దూరగతాః తేషాం అంకురా నభపో యథా ॥**

మోహం చుట్టూ ఆవరించవచ్చుగాక! తత్త్వజ్ఞులు మోహరహితులై ఉంటారు. ఎట్లా అంటావా? "ఇది సుఖం, ఇది దుఃఖం" ...అన్న వ్యవహారమంతా వారి దృష్టిలో "స్వప్నంలోని మంచివారు – స్వప్నంలోని చెడువారు" వలె కల్పనామాత్రమై ఉంటుంది. ఆత్మజ్ఞుడగు జీవన్ముక్తుని దృష్టిలో ఈ జగత్తుకు ఒక స్వరూపమంటూ ఏదీ కనిపించదు. "ఆకాశం ఇక్కడ ప్రారంభించింది" ...అని అన గలమా? అట్లాగే వారికి ఈ ప్రపంచ వ్యవహారాలన్నీ మొదలు – చివరలేని కథాకల్పనా వ్యవహారంగా అగుపిస్తాయి. ఎవని దృష్టిలో ఈ జగత్తుగాని, అజ్ఞానం అనేదిగాని లేకున్నాయో, ఎవని అనుభూతిలో ఈ కనిపించే సర్వమూ ఆత్మస్వరూపమే అయివున్నదో – అట్టివానికి ఒకవేళ లౌకిక సుఖ–దుఃఖాలు సమీపిస్తేమాత్రం, వాటికి అర్థం ఏం ఉన్నది? జీవన్ముక్తులు శోకమోహాలన్నీ జయించి ఉండడం చేత శోకిస్తూ కూడా శోకరహితులై ఉండగలుగుచున్నారు.

తత్త్వజ్ఞులు ఈ శరీరాదులు ఛేదింపబడుచున్న సందర్భంలో కూడా "నిత్యుడగు నాకు ఈ దేహాదుల వలన పాతది పోయేదేమిటి? క్రొత్తది వచ్చేదేమిటి?" ...అని తలచుచు సర్వదా ఆత్మత్వమును అవధరించి ఉండగలుగుచున్నారు. స్వస్వరూపమే అయియున్న ఆత్మ సర్వదా అఖండము, అప్రమేయము కదా! మహనీయులు "ఈ దేహం నిర్మించబడుచున్నప్పుడు గాని, ఛేదించబడుచున్నప్పుడు గాని తాము నిర్మించబడటం లేదు. ఛేదించబటం లేదు అని గ్రహించినవారై... సర్వదా నిర్విషయులై, నిర్వికారులై, అప్రమేయులై, అతీతులై ఉంటున్నారు. అందుకు కొన్ని ఉదాహరణలు చెపుతాను విను.

**బ్రహ్మదేవుడు :** ఒకానొకసారి విధివశాత్తుగా సామగానం చేస్తున్న బ్రహ్మదేవుని నాల్గవ శిరస్సును తన కొనగోటితో కోమల పుష్పాన్ని త్రుంచినట్లు హరుడు (శివభగవానుడు) త్రుంచాడు కదా! ఆతడు శిరస్సును మరల మొలిపించగల శక్తి కలిగి ఉండి కూడా బ్రహ్మదేవుడు నిర్లిప్తుడై నిర్వికారుడై ఎట్లా ఉన్నాడు? తన స్వస్వరూపము ఈ దేహాదులకు సంబంధించినది కాదని గ్రహించి ఉండటంచేతనే సుమా! చిదాకాశముతో సమత్వము అవధరించియున్న ఆ బ్రహ్మదేవునకు వ్యర్థము – మిథ్యాభూతము అగు ఆ శిరస్సు మొదలైన అవయవములతో క్రొత్తగా ఒనగూడేదేమున్నది? అది ఖండించగా

పోయినదేమున్నది? వేదగానం చేసే వేదజ్ఞుడగు బ్రహ్మదేవుడు తనకు నాలుగు ముఖాలున్నా ఒక్కటే, లేక మూడు ముఖాలున్నా ఒక్కటేనని గ్రహించి ఉన్నాడు. "ప్రాణులకు కర్మవశం చేత ఏది ప్రాప్తిస్తుందో అదియే ప్రాప్తించు గాక! ఏదీ ప్రాప్తించకుండానూ పోవుగాక! ఇందులో ప్రత్యేకమైన విశేషమేమున్నది?" అనే అత్యున్నత భావసమాధిలో ఆత్మజ్ఞానతత్పరులు సర్వదా తేలియాడుతూంటారు.

**మన్మథుడు -** ఇంకా విను. మన్మథుని అక్షయ బాణతూణీరములచే స్పృశించబడిన శివుడు తన అర్ధభాగ శరీరం క్షణంలో పార్వతికి సమర్పించాడు. ఇక, ఆ శివుని మూడవకన్ను యొక్క అగ్నిజ్వాలలకు దేహమును సమర్పించి కూడా మన్మథుడు సదా ఆత్మతత్త్వానుభవి కనుక దేహరహితుడై దేహసహితునివలె యథాతథంగా ఉండి వ్యవహరించుచున్నాడు.

**పరమశివుడు -** పరమశివుడు వాస్తవానికి రాగరహితుడే అయినప్పటికీ ...మన్మథుని బాణాలు స్పృశించినప్పుడు మన్మథుని దహించటం – పార్వతీదేవిని గ్రహించటం అనే ఉభయ కార్యాలను నిర్వర్తించుచూ రాగాన్ని కలిగియే ఉన్నాడు. ఆయనకు ఈ ప్రపంచంలో ఏదైనా కార్యం నిర్వర్తించటం చేతగాని, లేక ...నిర్వర్తించకుండటం చేతగాని పొందే ప్రయోజనమంటూ ఏముంటుంది?

**నైవ తస్య కృతనాఽర్థో నాకృత నేహ కశ్చన**
**నచాఽస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ॥**

సమస్త లోకములకు అతీత స్వరూపుడు, అతీత స్వభావుడు అగు ఆ పరమశివ భగవానుడు సర్వభూతజాలాల పట్ల ప్రయోజన నిమిత్తమై ఆశ్రయించవలసిన పదార్థమేదీ లేకపోయినప్పటికీ, ఆయన రాగం కలిగియే ఉండి వ్యవహరిస్తున్నాడు. అనగా వారికి రాగం కలిగి ఉండటం, కలిగి ఉండకపోవటం రెండూ ఒక్కటే అగుచున్నది. ఏది ఎట్లు ఉన్నదో అది అట్లు ఉండుగాక! ఆత్మను ఎఱిగిన మహనీయుడు కాబట్టియే, రాగమును వదలనూ లేదు. విరాగి అయి శ్మశాన సంచారం మాననూ లేదు.

**శ్రీమన్నారాయణుడు -** శ్రీ విష్ణు భగవానుడు జగత్తులో ప్రవేశిస్తూ అనేక కార్యక్రమములను నిర్వర్తిస్తున్నాడు.

**కరోతి కారయశ్యు ఉచ్చైః మ్రియతే మార్యతేఽపి చ**
**జాయతే వర్ధతే ఽజస్రం జీవన్ముక్తో జనార్దనః ॥**

జీవనుక్తుడైన ఆ జనార్దనుడు... రాక్షసుల కులాంతకుడై, వారిని సంహరిస్తున్నాడు. ఇంద్రుడు మొదలైన వారిచే రాక్షసులను సంహరింపజేయిస్తున్నాడు. అనేకచోట్ల దేహములను ఆశ్రయించి 'జన్మించటం' అనే దేహచమత్కారమును నిర్వర్తిస్తున్నాడు. ధ్రువతార సమాప్తియందు మరణమును అంగీకరిస్తున్నాడు. లుబ్ధకుడు మొదలైన వారిచే సంహరించబడుచున్నాడు. అనేకచోట్ల అవతరించి భక్తులకు దిక్కై, కొంగు బంగారమై వారిని కంటిపాపవలె రక్షిస్తున్నాడు...

ఈ విధంగా అనేక కార్యములను నిర్వర్తిస్తూనే వైకుంఠంలో ప్రశాంతచిత్తుడై లక్ష్మీదేవితో ప్రణయములు ఆడుచున్నాడు. చూచావా? వారికి ప్రణయము, ప్రళయము ఒక్క తీరుగానే అగు

చున్నది. సమర్థుడే అయినప్పటికీ ప్రాణుల కర్మపరంగా సంప్రాప్తించే వ్యవహార వ్యగ్రత్వమంతా తానుకూడా స్వీకరించి వర్తిస్తున్నాడు. ఎందుచేత? వారికి ఆయా వ్యవహారములు త్యజించటం చేతగాని, నిర్వర్తించటం చేతగాని ఏ ప్రయోజనమూ లేదు. ఆత్మత్త్వమునందు విలీనుడై ఉండియే, "ఈ ప్రపంచమున ఏది ఎట్లు ఉన్నదో ...అది అట్లే ఉండుగాక" ...అని తలచి ఆయా కార్యములను సానుకూలంగా, లోకవ్యవహారములన్నీ నడిపిస్తున్నారు. నడిపిస్తూనే ఆయన సర్వదా వాసనారహితుడై, ఏ కోర్కెలు లేనివాడై, శుద్ధ చిన్మాత్రరూపధారి అయి ఉంటున్నాడు.

**సూర్యభగవానుడు -** అటు ఆ సూర్యభగవానుని చూడు. ఆయన ఈ 'జగత్తు' అనే మహత్తర వ్యవహారం చుట్టూ బంతిలాగా ప్రదక్షిణాలు చేస్తూ 'కాలము' అనే వ్యవహార కల్పనకు కారకుడై, అన్నీ కాలబద్ధంగా జరిగిపోతూ ఉంటే, తాను మాత్రం నిర్లిప్తంగా, కేవల సాక్షిగా సర్వమును గాంచుచూ ఉన్నాడు.

**నచ రోధయితుం దేహం! న, సమర్థో దినేశ్వరః**
**నిరిచ్ఛ ఏవ నిర్వాణః తథాప్యాస్తే యథా స్థితమ్ ॥**

సర్వసమర్థుడు అయిఉండి కూడా దినపతియగు ఆ సూర్య భగవానుడు ఈ 'దినచర్య' నుండి తన దేహమును నిరోధించకయే ఉన్నాడు. సర్వదా జీవన్ముక్తుడై ఉండటం చేత తనకంటూ ఏ ఇచ్ఛ లేకుండానే యథారీతిగా ఆకాశంలో వర్తిస్తున్నాడు. విహరిస్తున్నాడు.

**చంద్రుడు -** అట్లాగే చంద్రుడు స్వతహాగా జీవన్ముక్తుడై ఉండి కల్పాంతము వరకు ప్రతి నెలలోను వృద్ధి – క్షయములు అనుభవిస్తూనే ఉన్నాడు. అయితే ఆయన ఇచ్ఛారహితుడు. అందుచేత ఈ దేహ హాని – వృద్ధులు ఆయనకు సుఖ – దుఃఖాలను కలిగించటం లేదు.

**అగ్నిదేవుడు -** ఇక, పరమాత్మయగు అగ్నిదేవుడు కూడా! ఒకప్పుడు 'మరుత్తు' అనే ఆయన పన్నెండు సంవత్సరాలు యజ్ఞం చేస్తూ నిరంతరం ఏనుగు తొండమంత పరిమాణం కలిగిన ఘృత (నేయి) ధారను అగ్నికి సమర్పిస్తున్నప్పుడు, మరొక సందర్భంలో శివుడు పార్వతితో పొందిన సమాగమ సమయంలో దేవతల వలన కలిగిన విఘ్నం కారణంగా స్ఖలించిన శివతేజో వీర్యమును బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం త్రాగుటచే ఏర్పడిన దాహబాధ చేత, దేవతలకు నిరంతరం సమర్పించబడే యజ్ఞ హవ్యములను తనయందు ధరించటంచేత... ఇటువంటి ఆయా సందర్భాలలో దుఃఖాదులు ఏర్పడినప్పటికీ తాను జీవన్ముక్తుడు కాబట్టి సమస్థితిచే అవన్నీ వహిస్తూ యథారీతిగా వెలయుచున్నాడు.

❖

**బృహస్పతి, శుక్రాచార్యులు -** అదే విధంగా దేవతల గురువు బృహస్పతి – దానవుల గురువు శుక్రాచార్యులు స్వతహాగా జీవన్ముక్తులు. అయితే ఏం? వారిద్దరు తమతమ ఆశ్రితుల దిగ్విజయముల కొరకై ఒకరిని మించి మరొకరు, సామాన్య మానవులు తగాదాలు పడుచున్నట్లుగా, ఎత్తుకు – పై ఎత్తు వేస్తూనే ఉంటున్నారు. అట్టి అభిలాషలు నిర్వహిస్తూనే అంతరంగమున లోక వ్యవహారములన్నిటికీ అస్పృశ్యులై, అతీతులై, నిర్విషయ సుఖానందమును కొనసాగిస్తూనే ఉంటున్నారు.

**జనకాది జీవన్ముక్తులు -** జీవన్ముక్త మానసులైన జనకమహారాజు అనేక భయంకర యుద్ధములలో పాల్గొనుచూ ఈ జగద్విషయాలన్నీ కథా సంఘటనల వలె దర్శిస్తూ తన జీవన్ముక్తస్థితిని కొనసాగిస్తూనే ఉన్నారు. అట్లాగే జీవన్ముక్తులైన నలుడు, మాంధాత, సగరుడు, దిలీపుడు, నహుషుడు, హరిశ్చంద్రుడు మొదలైనవారు జీవితంలో అనేక దుర్భర సంఘటనలను ఎదుర్కొంటూ సుదీర్ఘకాలం రాజ్యాలు ఏలారు. వారి జీవితాలలో అందరిలాగానే అనేక కష్టాలు మొదలైనవి వచ్చి-పోతున్నప్పటికీ, సర్వదా జీవన్ముక్తత్వం అనుభూతమొనర్చుకొనియే జీవితములను కొనసాగించారు.

❖

**శ్రీరాముడు :** మహర్షీ! మరి జీవన్ముక్తునికీ, అజ్ఞానికీ గల భేదమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**వ్యవహారేయథైవ అజ్ఞః తథైవ ఖలు పండితః ।**
**వాసన - అవాసనే ఏవ కారణం భంధ-మోక్షయోః ॥**

జ్ఞాని, అజ్ఞాని కూడా వ్యవహార రీత్యా చూస్తే ఒకే రీతిగా వ్యవహరిస్తూ ఉంటారు. ఇంక తేడా ఏమిటంటావా?

జ్ఞానికి (లేక జీవన్ముక్తునికి) దృశ్య వాసన ఉండదు. అజ్ఞాని, అనేక వాసనలు కలిగి ఉంటాడు. అనగా... వాసన, వాసనా రాహిత్యములే క్రమంగా బంధ - మోక్షములకు కారణములు అగుచున్నాయని ఇక్కడ గ్రహించు.

ఇంకా విను! జీవన్ముక్తుడు, రాగవర్జితుడు అయినట్టి బలిచక్రవర్తి మూడడుగులు దానం చేస్తే బాలక బ్రహ్మచారిగా వచ్చిన విష్ణు భగవానుడు పాతాళానికి తనను అణగత్రొక్కగలడని గురువు శుక్రాచార్యులు హెచ్చరించినా, తనకు తెలిసి ఉన్నా కూడా, "కారే రాజులు, రాజ్యముల్ కలుగవే! వారేరీ?" ...అని చక్రవర్తి పదవిని తృణప్రాయంగా సమర్పించివేశాడు. అట్లాగే ప్రహ్లాదుడు, నముచి, వృత్రుడు, మురుడు, అంధకాది రాక్షసులు పైకి రాగయుక్తుల వలె జాత్యహంకారుల వలె వ్యవహరిస్తూ ఈ ప్రపంచంలో స్థితి కలిగి ఉండి, అంతఃకరణంలో, "సర్వం సర్వదా భగవదర్పితమే" ...అని గ్రహించి చరించారు.

కాబట్టి ఓ రామచంద్రా! చిదాకాశ స్వరూపము సంతరించుకొని ఉన్న మహనీయులు తాము రాగ - ద్వేషములు ప్రదర్శిస్తూ ఉన్నప్పటికీ, వారికి సచ్చరిత్రలు - దుశ్చరిత్రలు ఉండి ఉంటున్నప్పటికీ వారి మోక్ష స్థితికి వచ్చే లోటేమీ ఉండటం లేదు. చిదాకాశ స్థితికి - ఈ ప్రపంచంలో వ్యవహారాలకు సంబంధం ఉండటం లేదని గమనిస్తున్నావు కదా! ఎందుకంటావా?

జీవన్ముక్తులు పరిపూర్ణ స్వయమాత్మ స్వరూపులై ఉంటారు. చిదాకాశం వలె "శుద్ధం" అయినట్టి అంతిమ సాక్షాత్కార వృత్తి రూపమగు జ్ఞానం అవధరించి ఉంటారు. అట్టి శుద్ధ జ్ఞానంతో ఈ దేహ-మనో-ఇంద్రియ ప్రాణ ధర్మములను ఆద్యమగు పరబ్రహ్మ భావనతో దర్శిస్తూ ఉంటారు. "ఇవన్నీ కూడా, వీటిచే గాంచబడే విషయాదులతో సహా సర్వము బ్రహ్మమే కదా!" అను ఎఱుకను

దృఢపరచుకొని ఉంటారు. కనుక ఇక అట్టి జీవన్ముక్తులకు "ఇది స్వకీయం – ఇది పరకీయం" ... అనే భేదం మొదలే నశించి ఉంటుంది. ఇక వారి దృష్టికి ఈ కనబడే జగత్తంతా కూడా "మేఘము తలపై సూర్యకిరణములు ప్రసరించినప్పుడు వివిధ వర్ణములతో కనబడే ఇంద్రధనుస్సు భ్రమ సూత్రమేగాని అక్కడ ఇంద్రుడు వచ్చి ధనుస్సును స్థాపించలేదు కదా! అట్లాగే ఈ దృశ్య ప్రదర్శనమంతా అభాస మాత్రమే!" అని అత్యంత నిర్దుష్టంగా గమనించి ఉంటారు. "ఇంద్రధనుస్సు" సూర్యకిరణములు మేఘములను తాకుటచే ఏర్పడి కనబడుచున్నప్పటికీ శూన్యమాత్రమే కదా! ఈ బ్రహ్మాండములో కనిపించే పరమాణువుల సముదాయమై కనిపించే జగత్ వస్తువులన్నీ శూన్యమాత్రమే ...అని సుస్పష్టం చేసుకొని ఉంటారు. ఆకాశంలో మేఘ సముదాయంలో కనిపించే కొండ శిఖరాకారాలు ఉద్యానవనాలు, దూదిపింజాలు ...ఇవన్నీ పుట్టినదెప్పుడు? నశించేదెప్పుడు? నశించనిదెప్పుడు? అవన్నీ మేఘపుంజాల మధ్యగా ద్రష్ట స్వయంకృతమైన ఊహాకల్పనచే కనిపించేవే కదా! స్వప్నంలో కనిపించిన జనులు పుట్టినదెప్పుడు? చచ్చినదెప్పుడు? తొలగినదెప్పుడు?

**ఇదం జగత్ అసత్‌భాతి సదివ వ్యక్తిమాగతమ్**
**అజాతం అనిరుద్ధం చ యథా శూన్యత్వమ్ అంబరే ॥**

స్వప్నంలో కనిపించిన మిత్రుడు పుట్టనూలేదు, చావబోవటమూ లేదు కదా! ఊహలో కనిపించే ఒక నగర సింహద్వారానికి ఎవరు నగిషీ చెక్కారంటే ఏం చెపుతాం? అట్లాగే ఈ "జగత్తు" అనబడేది ఎన్నడూ పుట్టటమూ లేదు. ఇది నశించటమూ లేదు. అసత్తే అయినప్పటికీ స్వప్నంలో భవనం స్వప్న సమయంలో వాస్తవంగానే అనుభవమౌతోంది చూచావా? అట్లాగే ఈ జగత్తుకూడా అసత్తే అయినప్పటికీ అజ్ఞానమున్నంత కాలం సత్తువలె భాసిస్తోంది.

**సాద్యంతమపి అనాద్యంతమ్, అశూన్యమపి శూన్యకమ్**
**జగత్ జాతం తథా అజాతమరుద్ధమ్ రుద్ధమేవ చ ॥**

ఈ "జగత్తు" (లేక) "దృశ్యం" అను దానికి ఎక్కడో మొదలు – చివర ఉన్నట్లే అనిపిస్తున్నప్పటికీ ఇది వాస్తవానికి ఆద్యంతరహితం. ఇది అనాది, అనంతము కూడా! ఇదంతా పదార్థ సహితంగా కనిపిస్తున్నప్పటికీ శూన్యం మాత్రమే. ఇదంతా ఎప్పుడో ఉత్పన్నమైనట్లు కనిపిస్తున్నా కూడా, అనుత్పన్నం. ఇది నశిస్తున్నప్పటికీ నాశనరహితం. ఒక పెద్ద కొయ్య స్తంభము అంతటా కొయ్య మాత్రమే అయి ఉన్నప్పుడు అందులో మధ్యగా చెక్కబడిన ప్రతిమ కూడా కొయ్యయే కదా! అట్లాగే బ్రహ్మమునందు కనిపించే ఈ జగత్ దృశ్యము బ్రహ్మమే అయి ఉన్నది. కల్పనచే భాసించే జగద్దృశ్యం చిదాకాశమే!

ఓ రామచంద్రా! ఒకడు తన ఆలోచనలన్నీ త్యజించి నిద్రారహితమైన సమాధిని అవధరించాడనుకో! అట్టి సర్వకల్పనా వర్జితము, సర్వత్రా ఏకరసము అయిన 'కేవల చిదాకాశము"నందే ఈ 'జగత్తు' వెలయుచున్నదని గ్రహించి ఉండు.

ఒకని బుద్ధివృత్తి నేత్రేంద్రియము ద్వారా ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశమునకు వెళ్ళుచున్నప్పుడు... ఆ రెండు విషయముల మధ్యగల "నిర్విషయ సంవిత్తు" నందే ఈ జగత్తు విలసిల్లి

ఉంటోంది. మనమందరమూ చిదాకాశ స్వరూపులమే! అట్టి "చిదాత్మయందు ఏ ద్వైత – అద్వైతములు భాసిస్తున్నాయో అట్టి ద్వైత–అద్వైతములు వాస్తవానికి లేవు" ...అనునదే మా అనుభవపూర్వక నిర్ణయం. అట్టి పూర్ణానందైక స్వరూపమునందు 'శూన్యము' అనేది కూడా లేదు. నీటితో నిండిన కుండ – ఖాళీ కుండలవలె శూన్యత్వ – పూర్ణత్వ శబ్దాలు సాపేక్షకం మాత్రమే! 'ద్వైతము, అద్వైతము' అనే శబ్దాలు సాపేక్షచే సంభవించేవే. 'ఆత్మ'యందు ఏకత్వము లేదు. అనేకత్వము లేదు. ఇక ఈ జగత్తుగా కనిపించేదంటావా? ఒకడు ఒక ఖాళీ స్థలంలో భవిష్యత్తులో కట్టబోయే ఇంటిని ఊహించి "ఇది వంటగది. ఇది పూజామందిరం, ఇది పడక గది. ఇది అందరం కూర్చుని కబుర్లు చెప్పుకొనే విశాల విభాగం. ఇక్కడ కుర్చీలు ఉంటాయి"... అని చెప్పుతూ ఉంటాడు చూచావా! అట్లాగే ఈ జగత్తు కూడా భవిష్యత్ భవనంలాగా దేశ–కాలాదులతో కూడినదై కనిపిస్తోంది. వాస్తవానికి ఇదంతా 'ఆత్మయే!' ("సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ" – వేదవాక్యం లాగా) ఇదంతా సర్వదా చిదాకాశ రూపమగు బ్రహ్మమే అయివున్నది. ఎట్లా అంటావా? స్వప్న ద్రష్ట యొక్క చైతన్యం స్వప్నంలో తన స్వరూపమునే వివిధ జనులవలె, నగరాదుల వలె దర్శిస్తోంది చూచావా? అట్లాగే ఈ జాగ్రత్ ద్రష్టయొక్క చైతన్యమే జాగ్రత్‌ద్రష్ట జగత్తుగా కనిపిస్తోందని విజ్ఞులు ఎరిగియే ఉంటున్నారు.

ద్రష్ట యొక్క స్వయం స్వరూపమగు చైతన్యమే ఆ ద్రష్టకు అజ్ఞాన ప్రభావం చేత (స్వస్వరూపమును ఏమఱచుట చేత) జగత్తుగా ఇక్కడ అగుపిస్తోంది.

ఓ మహత్తరమైన ఆశయం గల మహాశయా! రామచంద్రా! ఈ దృశ్యం సర్వదా శిలాఘనం వలె మౌనంగా ఉన్నట్టి బ్రహ్మం యొక్క రూపమే! అయితే స్వాత్మయే తాను ప్రసరించి ఉన్నట్టి తన స్వస్వరూపాన్ని 'జగత్తు' అనే దానిగా దర్శిస్తోంది. ఈ దృశ్య జగత్తుకు ఇంతకుమించిన వేరే అర్థం లేదు.

❖❖❖

# 8. నలుగురు విపశ్చిత్తుల పునర్జన్మలు

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! ఇప్పటి వరకు ఒకే జీవాత్మయగు విపశ్చిత్తు నలుగురు విపశ్చిత్తులుగా అయి, ద్వీప, సముద్ర, పర్వతాదులందు సంచరిస్తూ, "ఈ పాంచభౌతిక – మనోమయ దృశ్యజగత్తు యొక్క అంతు ఎక్కడ?" ...అను ఉత్సుకతతో ప్రమాణం కొనసాగిస్తున్నారని మనం చెప్పుకున్నాం కదా! ఆ నలుగురు విపశ్చిత్తుల గురించిన తదనంతర విశేషాలేమిటో వివరించ ప్రార్థన!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లే అగుగాక!

ఆ విపశ్చిత్తులో ఒకడు ఒకనాడు క్రౌంచ ద్వీపంలో గల 'వర్షసీమ' అనే పేరుతో పిలువబడే పర్వతశ్రేణుల మధ్యగల ఒక గండశిలపై దీర్ఘ ప్రయాణపు బడలికచే ఆదమరచి నిద్రిస్తున్నాడు. ఇంతలో ఒక మదపుటేనుగు తన పాదఘట్టనతో ఆతని దేహమును పువ్వును నలిపినట్లు నలిపివేసింది.

రెండవ విపశ్చిత్తు ఒక కీకారణ్యంలో సంచరిస్తున్నాడు. ఇంతలో మహాబలవంతుడగు రాక్షసు డొకడు తారసపడ్డాడు. వారిద్దరి మధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షసునిదే పై

చేయి అయింది. కొంత సమయం తరువాత రెండవ విపశ్చిత్తు దేహం నిర్జీవం అయింది. విజేతయగు రాక్షసుడు కోపం ఆపుకోలేక మృతుడైన రెండవ విపశ్చిత్తు దేహమును భుజంపై పెట్టుకొని ఆకాశంలోకి ఎగిరి దూరంగాగల సముద్ర మధ్యంలోగల బడబాగ్నిలో పడవేశాడు. ఆ అగ్నిలో పడిన రెండవ విపశ్చిత్తు దేహం భస్మంగా మారిపోయింది.

ఇక మూడవ విపశ్చిత్తు ఒక విద్యాధరునితో స్నేహం చేసి ఆతనికి అత్యంత ప్రియుడైనాడు. ఒకనాడు ఆ విద్యాధరుడు మూడవ విపశ్చిత్తు యొక్క అభ్యర్థనను కాదనలేక తనవెంట స్వర్గలోకం తీసుకువెళ్ళాడు. ఆ ఇద్దరు ఇంద్రసభలో ప్రవేశించారు. ఇంద్రుడు సభలో వినోదిస్తూ ఉండగా ఆ ఇంద్రుని దృష్టి మూడవ విపశ్చిత్తుపై పడింది. తటాలున సింహాసనం మీద నుండి లేచి "అనర్హుడైన ఈ మానవుడు ఇక్కడికి రావటమా?" ...అని హూంకరిస్తూ "ఓయీ! నీవు ఈ క్షణమే భస్మమై పోయెదవుగాక" ...అని శపించాడు. మరుక్షణం ఆ మూడవ విపశ్చిత్తు దేహం ఆసనం మీదనే ఒక గుప్పెడు భస్మంగా అయిపోయింది.

నాలుగవ విపశ్చిత్తు "కుశ" అనే ద్వీపంలో ప్రవేశించాడు. అక్కడ ఆతనికి ఒక గొప్ప సరస్సు కనిపించింది. వెంటనే ఆ సరస్సులో జలకాలాడటం ప్రారంభించాడు. ఇంతలో సరోవర గర్భంలో నుంచి ఒక మొసలి అకస్మాత్తుగా ఆ నాలుగవ విపశ్చిత్తు దేహంపైకి దూకి ఆతని దేహాన్ని ఖండ ఖండాలుగా త్రుంచివేసింది.

ఆ విధంగా నాలుగు దేహాలు నశించగా... వారి సంవిత్తు ఆకాశరూపం పొందింది. ఆ ఆకాశం లోనే వారి వారి పూర్వ సంస్కారాలచే సంప్రాప్తమైన ప్రాపంచిక దృష్టుల ప్రభావంచేత నాలుగు రకాలైన ప్రపంచాలను (ఆకాశంలోనే) గాంచసాగారు. నలుగురు నాలుగు దేహాలను ధరించారు. సృష్ట్యారంభంలో మొట్టమొదటగా సృష్టించబడిన ప్రజాపతులు తమ దేహాలను, ఆ దేహాల ద్వారా అనేక సృష్టులను దర్శించునట్లే... ఆ నలుగురు విపశ్చిత్తుల సంవిత్తు మరల నాలుగు దేహాలను, ఆ దేహాలతో వస్తు-విషయ పరిజ్ఞానంతో కూడిన జగదనుభవాలను పొందనారంభించారు. వారి వారి మనో ప్రతిభాస మాత్రం అగు అతివాహిక దేహం (సూక్ష్మదేహం. నేను అను భావన, నావి అను అనుభూతి)ను, స్థూల దేహమును, ఆ రెండింటికీ విషయాలైన స్థూల – జడ పదార్థాదులను గాంచసాగారు. ఆకార రహితమగు జలంలో ఆకారరూపమగు తరంగాలు పరిఢవిల్లునట్లుగా ఆకాశ రహితమగు చిదాత్మలో వారు ఆకాశమాత్ర రూపులై ప్రదర్శితులై ప్రవర్తించసాగారు. అట్లా వారు నలుగురు పాంచ భౌతిక దేహాలు అవధరించగానే "ఈ పృథివి యొక్క పరిమాణం ఎంతటిదో నేను తెలుసుకోవాలి"... అనే రూపంగల ఇతఃపూర్వపు సంస్కారాలు ఆ నలుగురి మనస్సులను ఆశ్రయించాయి. ఆ నల్గురు మరల పూర్వ సంస్కార బలంచేత "భూమియొక్క విస్తీర్ణం ఎంతవరకో తెలుసుకోవాలి" ...అనే కుతూహలం కొనసాగించటానికి అనువైన భౌతిక దేహాలు పొంది పరిభ్రమణం కొనసాగించసాగారు. అవిద్య యొక్క పరిమాణం ఎంతో తెలుసుకొనే ఉద్దేశంతో ఒక ద్వీపం నుండి మరొక ద్వీపానికి ప్రయాణాలు చేయసాగారు.

❖

**పశ్చిమదిక్ విపశ్చిత్ - మోక్షసన్యాస యోగం -** పశ్చిమదిక్కు విపశ్చిత్తు ఆ విధంగా సంచారం కొనసాగిస్తూ ఒకప్పటికి సప్త సముద్రాలతో కూడిన సప్తద్వీపములను దాటివేశాడు. స్వర్ణమయమగు ఒకానొక విస్తీర్ణ ప్రదేశంలో ప్రవేశించాడు. సౌభాగ్యవశంగా ఆ ప్రదేశంలో క్రీడిస్తున్న విష్ణు భగవానుని దర్శించాడు. స్తుతించి శరణువేడాడు. స్తుతి, విన్నపం, శరణాగతులచే సంతుష్టుడైన విష్ణు భగవానుడు పశ్చిమ దిక్కు విపశ్చిత్తుకు ఆత్మజ్ఞాన బోధ ప్రసాదించారు. అది విని అనునయించుకున్న ఆ విపశ్చిత్తు క్రమంగా సమాధినిష్ఠుడై ఆ ఆకాశగర్భ ప్రదేశంలో ఐదు సంవత్సరాలు గడిపివేశాడు. ఆ తరువాత దేహము త్యజించాడు. దేహభావము మొదలంటా సమసిపోగా కేవలం చిత్తస్వరూపుడైనాడు. అట్టి స్థితిలో చిత్తము సత్వస్థితి సముపార్జించుకోగా... ఆతడు 'విదేహముక్తి'ని పొందాడు. ఇక అంతవరకు అనేక ఉపాధుల సంచలన రూప కార్యక్రమంలో అంటిపెట్టుకొని ఉన్న ఆతని ప్రాణములు ఆకాశ రూపమును పొందినవై అనంత వాయువులలో విలీనమై ప్రకాశించాయి.

**తూర్పుదిక్ విపశ్చిత్ - చంద్రలోక స్థానం -** తూర్పు దిశకు వెళ్ళిన విపశ్చిత్తు సుదీర్ఘంగా ఆకాశంలో ప్రయాణిస్తూ పూర్ణ చంద్రుని సమీపించాడు. ఆతడు క్రమంగా చంద్రబింబపు అమృత కిరణములచే ఆకర్షితుడై తన శరీరమును "శుద్ధ చంద్రరూపము"గా భావన చేయసాగాడు. అట్లా చిరకాలంగా "నా నుంచి అమృత కిరణములు ప్రసరిస్తూ భూమిలో ఔషధ శక్తిని పెంపొందిస్తూ తదితర జీవుల ందరినీ సమాహ్లాదపరచును గాక" ...అని అవిచ్ఛిన్నంగా భావన కొనసాగింది. చాలా కాలమైన తరువాత ఆతనికి శరీర భావనతో పాటు పాంచ భౌతిక దేహత్వము నశించిపోయింది. ఇక అటుపై ఆతడు చంద్రలోకంలో సంచరిస్తూ స్థితి కలిగినవాడై ఉండటం జరిగింది.

**శ్రీరాముడు :** స్వామీ! ఏమి ఆశ్చర్యం! ఒకే జీవుని భావనా రూపంగా ప్రదర్శితమైన నాలుగు విపశ్చిత్తు దేహాలలో ఒకటి విదేహముక్తి పొందటం, రెండవది చంద్రలోక నిత్యనివాసం పొందటం జరిగిందా? మరిక మరొక ఇద్దరు విపశ్చిత్తుల సంగతేమిటి? వారింకా రెండు వేరు వేరు భౌతిక దేహములు కొనసాగిస్తూనే ఉన్నారా? లేక, వారి దేహములకు కూడా ఏమైనా విశేషం జరిగిందా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ విషయాలకూ వస్తున్నాను విను.

**దక్షిణదిక్ విపశ్చిత్ - సాంసారికతన్మయత్వం -** దక్షిణ దిక్కు విపశ్చిత్తు అనేక ప్రదేశాలు సందర్శిస్తూ శాల్మలీద్వీపం జేరాడు. అక్కడి రాజ్య విశేషాలు, ధనాదిసంపత్తులు, వాహన – ఉద్యానవనాదులు చూచి "ఇవన్నీ సొంతం చేసుకొని, నేనే రాజునై ఎందుకు అనుభవించరాదు?" ... అనే కుతూహలం కలిగింది. అక్కడికక్కడే తన ఇష్టదైవమైన అగ్ని భగవానుని ఆరాధించి తన బలపరాక్రమాలు గుర్తు చేసుకున్నాడు. క్రమంగా కొద్దిమంది సైనికులను సమీకరించుకొని అక్కడి రాజుపై యుద్ధం ప్రకటించి, ఆతనిని యుద్ధంలో జయించి ఆ శాల్మలీ ద్వీపంలో చక్రవర్తి అయి రాజసింహాసనం అధిష్ఠించాడు. ఆతడు ఇప్పటికీ అక్కడ రాజ్యం పరిపాలిస్తూ అనేక వినోదాలతో కాలం గడుపుతూ సుదీర్ఘ కాలంగా ఉంటున్నాడు. "ప్రేమ, రాజ్యపాలన, అధికారం, శత్రు రాజులపై రాజకీయాలు" ...ఇటువంటి సామాన్యుల అల్పభావ పరంపరలలో మునిగి తేలుతూ అతిదీర్ఘకాలం రాజ్యం ఏలుతూనే ఉన్నాడు. "నేను విపశ్చిత్తు నామధేయుణ్ణి కదా! ఈ భూమి యొక్క, మాయ యొక్క

విస్తారం చూడటానికి బయలుదేరాను కదా!" ...అనే ఆలోచన ఆతడు ఎప్పుడో మరచిపోయాడు. ఆతనిలో తత్త్వజ్ఞానం లేకపోవటంచేత ప్రస్తుతానికి ఎదురుగా వున్న రాజ్యపాలనాది విశేషాలలో తన్మయుడై ఉంటున్నాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఇదంతా చమత్కారంగా ఉన్నది. ఒకే జీవాత్మ యొక్క సంకల్ప, ఉద్దేశ, సంభావన, ఆశయాల నుండి బయలుదేరిన నాలుగు ఉపాధులలో ఒకరు విదేహముక్తి పొందటం, రెండవ వారు ఉత్తమ లోక ప్రాప్తి పొంది ఉండటం, మూడవవారు సంసార విశేషాలలో తన్మయులై కాలం గడుపుతూ ఉండటం ...ఎంతటి ఆశ్చర్యం! సరే... ఇక ఉత్తరదిక్కు విపశ్చిత్తు ఏమేమి చేస్తూ ఉన్నాడో అది కూడా చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరే! ఇక ఆ విశేషం కూడా చెపుతాను విను.

**ఉత్తరదిక్ విపశ్చిత్ :** ఉత్తర దిక్కు విపశ్చిత్తు అనేక ప్రదేశాలు సంచారం చేస్తూ కొంతకాలం గడిచి పోయిన తరువాత అతిచంచల సంయుక్తమైన (సప్తమ) స్వాదూద మహాసముద్రం చేరాడు. అక్కడ జల స్తంభన విద్యను ఉపాసించి సముద్ర గర్భంలో సంచరించసాగాడు. అలా సంచరిస్తూ ఉండగా ఒకనాడు ప్రమాదవశాత్తు ఒక తిమింగలం కళ్ళబడ్డాడు. ఆ తిమింగలం ఆతని వెంటబడి చివరకు ఎక్కడో పట్టుకుని ఆతనిని గుటుక్కున మ్రింగివేసింది. ఆ విధంగా ఆ పెద్ద తిమింగలం పొట్టలో ఒక చోట చిక్కి ఆ తిమింగలం మాంసం భుజిస్తూ, అక్కడే నిదురిస్తూ ఒక వెయ్యి సంవత్సరాలు గడిపాడు. ఆ తరువాత ఆ తిమింగలం మరణించినప్పుడు పొట్టలోంచి ఒక పురుగులాగా బయల్వె డలాడు. ఆపై స్వాదూద మహాసముద్రంలో 50,000 యోజనాలు (1యోజనం = సుమారు నాలుగు మైళ్ళు) ప్రయాణించి ఒకానొకప్పటికి దేవతలు సంచరించే సువర్ణమయమైన ఒక భూప్రదేశం చేరాడు. కాలమహిమ మహత్తరమైనది కదా! అక్కడ కొంతకాలం తరువాత దేహశైథిల్య కారణంగా మరణం పొందాడు. ఎండు కట్టెపుల్ల అగ్నియొక్క స్పర్శచే అగ్నికణంగా మారునట్లుగా ఆతడు అక్కడ దేవతారూపం పొందాడు. ఆ విధంగా ప్రధాన దేవతారూపుడై కొంతకాలం గడిపిన తరువాత ఆతనిలో "లోక సంచారం చేసి ఈ సృష్టియొక్క అంతు తెలుసుకోవాలి" ...అనే ఇతఃపూర్వపు జన్మ యొక్క ఉత్సుకత బలోపేతంగా బయల్వెడల సాగింది. అట్టి ఇతఃపూర్వపు జన్మ జన్మార్జిత సంస్కారంచేత... ఇక... ఆ సువర్ణ భూప్రదేశంలో ఉండలేకపోయాడు. అక్కడి నుండి బయలుదేరి నలుబదివేల (40,000) యోజనముల ఎత్తుగా ఉండే లోకాలోక పర్వతం జేరాడు. ఆ లోకాలోక పర్వతం యొక్క ప్రథమ భాగం సూర్యకాంతితో విరాజిల్లుతూ జీవసంచారానికి యోగ్యమై ఉంటోంది. తతిమ్మా మూడు భాగములు అంధకారమయమై జీవులు ప్రవేశించటానికి వీలుగాలేదు. మన ఉత్తర దిక్కు విపశ్చిత్తు ఆ లోకాలోక పర్వతముయొక్క అత్యున్నత శిఖరం చేరాడు. అక్కడి నుండి తదితర భూప్రాంతాలు మొదలైనవి – మనకు నక్షత్రాలు ఎక్కడో సుదూరంగా ఆకాశంలో కనిపిస్తున్నట్లు... ఆతనికి కనిపించసాగాయి. ఆ లోకాలోక పర్వతము యొక్క ఆవలి ప్రదేశం అంధకారమయమై నలువైపులా అతి విశాలంగా విస్తరించి ఉన్నది. అక్కడికి వర్తులాకారపు భూమండలం సమాప్తమై పోతోంది. ఆవల కేవలం అంధకారమయమైన గొప్ప కందకం మాత్రం

ఉన్నది. ఆ అంధకారంలో భూమిగాని, జంగమ జీవులుగాని, ఏ ఆశ్రయంగాని లేవు. అచ్చట ఏ వస్తువు ఉండజాలదని గ్రహించు.

❖❖❖

# 9. నిరాధారమైన ఆకాశంలో భూ-నక్షత్ర మండలాలు

**శ్రీరాముడు :** హే భగవాన్! మహర్షీ! నిరాధారమగు ఆకాశంలో ఈ భూగోళం (పడిపోకుండా) ఎట్లా స్థితి కలిగివుంటోంది? నక్షత్ర మండలం దేనికీ ముడిపెట్టబడకపోయినా కూడా... ఆకాశంలో నిరాధారంగా, నియమిత స్థానంలో, నక్షత్రాలు ఒకదానితో మరొకటి ఢీ కొట్టుకోకుండా ఎట్లా ఉంటున్నాయి? ఈ రచనా చమత్కారం వెనుక ఉన్న ధారణాశక్తి ఎవరిది? ఎట్లాంటిది? "లోకాలోక పర్వతం" అని మీరు చెప్పేదానికి "లోకము, అలోకము" అనే పరస్పర వ్యతిరిక్త ద్వంద్వ సమాసశబ్దం ఎట్లా వచ్చింది? ఈ భూగోళానికి సూర్యగోళం ఆధారమనుకుంటే... సూర్యగోళానికి ఏది ఆధారం? ఈ బ్రహ్మాండ సృష్టి స్థితులు ఎట్టివో విశదీకరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! "ఈ బ్రహ్మాండంలోని భూ-సూర్య-నక్షత్ర మండలాదులు నిర్నిరోధకమైన ఆకాశంలో ఎట్లా, ఏ ఆధారంతో స్థితి కలిగి ఉన్నాయి?" ..... అనే ప్రశ్నకు 'సూటి' అయిన సమాధానం చెప్పుచున్నాను. విను.

ఒక బాలుడు పగలంతా ఆడివచ్చి, శుభ్రంగా స్నానం చేసి, భోజనం చేసి కళ్ళు మూసుకొని పడుకున్నాడనుకో, ఆతనికి 'సంకల్ప రచన' (లేక) 'ఊహాలోకం'లో ఒక బంతి చేతిలో కనిపించిందనుకో. ఆ బంతి (కందుకం) ఎక్కడ, ఎట్లా స్థితి కలిగి ఉన్నదో... అట్లాగే... హిరణ్యగర్భుడు (బ్రహ్మదేవుడు)" అని పురాణ ద్రష్టలచే పిలువబడే సమష్టి సంకల్పుని సంకల్ప నగరంలో కల్పితమై ఈ భూమి, సూర్యుడు, నక్షత్ర మండలాలు వగైరా, సంకల్పానుసారంగా స్థితి కలిగి ఉన్నాయి. బాలుని ఊహలో కనిపించిన బంతిని గుండ్రంగా తయారుచేసినది ఎవరు? అదంతా బాలుని ఊహయే కదా! ఈ మన కళ్లకు కనిపించే ఖగోళ పదార్థాలు కూడా చిన్మాత్ర బాలకుడుగా హిరణ్యగర్భుని ఊహాలోకంలో కనిపించే ఊహాకల్పిత ప్రసిద్ధ పదార్థాలు మాత్రమే! "ఊహచే కల్పించబడినవి. వాస్తవంగా ఎందుకు కనిపిస్తున్నాయి?" ...అని ప్రశ్నిస్తే, అందుకు సమాధానం ..."మన ఊహతో జతజేర్చి, వాటిని అట్లా అట్లా దర్శించటం చేతనే" ...అని అనక తప్పదు.

ఒకాయనకు ఆకాశంలో అనేక వెంట్రుకలు - నలుగురు చంద్రులు కనిపిస్తున్నాయనుకో. ఆయన "నాకు నలుగురు చంద్రులు కనిపిస్తున్నారు. వెంట్రుకాకారాలు కనిపిస్తున్నాయి. కనుక అవన్నీ ఉన్నాయి. ఉన్నాయి కాబట్టి వాటిని ఎవరో అక్కడ ఉంచి ఉంటారు"... అని నమ్ముతాడు. ఆయనను కంటి వైద్యునికి చూపిస్తే "ఇతని కంటికి తిమిరరోగం ఉన్నది. అందుచేత ఈతనికి ఈతడు చెప్పేవన్నీ కనిపిస్తున్నాయి" ...అని రోగ నిర్ణయం చేస్తాడు. అట్లాగే... అవిద్యచేత (ద్రష్ట ఆత్మజ్ఞానం కలిగి ఉండకపోవటం చేత) చిదాకాశమే సర్వదా అంతటా ఏర్పడి ఉండగా... అట్టి చిదాకాశము నందు ఈ పృథివి - నక్షత్రాలు మొదలైనవన్నీ ఏర్పడి ఉన్నట్లు కనిపిస్తున్నాయి.

అయితే... ఒకడు సంకల్ప నగరం (లేక ఊహా ప్రపంచం)లో ధరించిన (దర్శించే) వ్యక్తులు వస్తువులు, విషయాలు, సంఘటనలు 'ఊహ' కంటే భిన్నంకావు కదా! ఊహ (సంకల్పం) సంకల్పించు వాని కంటే భిన్నం కాదు. కాని, ఆ ఊహా సమయంలో ఊహాద్రష్టకు తనకంటే వేరైన వాటివలె అనుభూతి కలుగుతోంది. 1. సంకల్పం(ఊహాలోకం)లో కనిపించేవి, 2.తత్ సంకల్పం (ఊహ) – ఈ రెండూ మిథ్యయే కదా! చైతన్యం యొక్క 1.హిరణ్యగర్భ రచనా చమత్కృతి అయిన ఈ జగత్ పదార్థములు, వాటి వాటి ఆయా ధర్మాలు; 2.సంకల్ప పురుషుడగు హిరణ్యగర్భుడు – ఈ రెండూ అనుభవములను అట్టి కల్పన–అను అవగాహనతోనే దర్శించటమే ఉచితం సుమా!

చైతన్యము చిత్ అనే ఒకానొక స్వభావం కలిగి ఉంటోంది. అట్టి నిజ చిత్ స్వభావముచే చైతన్యము ఎచటెచట దేనిదేనిని ఎట్లెట్లు భావన చేస్తుందో, అదంతా అట్లట్లే అంతకాలం భాసిస్తూ ఉంటుంది. తిమిరరోగం కలవానికి (కనుగుడ్లు నిరంతరం చలించే దోషం కలవానికి) ఆయా వస్తువులు రెండు – రెండుగా కనిపిస్తున్నట్లు, అవిద్యచే చిదాత్మ ఏ భూగోళాదులను సంభావన చేస్తోందో అదంతా అట్లట్లే అనుభూతి పొందుతోంది. చైతన్యము "నీరు పల్లం వైపుగా ప్రవహించుగాక! అగ్ని ఊర్ధ్వంగా ప్రజ్వలించునుగాక!"... అని సంకల్పిస్తూ ఉండటంచేత అది అట్లే జరుగుచున్నది. అట్లాకాకుండా చిదాత్మ "నీరు పైకి ప్రవహించునుగాక! అగ్ని అధోభాగంగా జ్వలించునుగాక!" ...అని సంకల్పించి ఉంటే... అది అట్లే ఉండేదికాని, అన్యంగా ఉండేది కాదు!

❖

కాబట్టి ఆయా వాదుల బుద్ధిని అనుసరించి "ఈ భూగోళం, వస్తువులు, జనులు, నక్షత్రాదులు మొదలైనవి ఉన్నాయి"... అనేది తదనుకూలంగా (భావానుకూలంగా) అనుభవమౌతోంది. అట్లా కాకుండా "వాయువే అగ్ని అవుతోంది. అగ్నియే ద్రవంగా అవుతోంది. ద్రవమే ఘనంగా అవుతోంది. వస్తువు యొక్క వర్తమానపు నామ రూపాలు ఆ వస్తువు యొక్క ఒకానొక స్థితియేగాని, వస్తువు యొక్క వాస్తవ రూపం కాదు. అట్లాగే ఈ ప్రపంచంలో కనిపించే సర్వ వస్తుజాలం కూడా! నక్షత్రాలు – భూగోళం – తదితర పదార్థాలు అట్టివే! లోకాలు, దేహాలు కూడా అట్టివే!"... అని ఎవరైనా భావిస్తే ఇది అట్లే అనుభూతమౌతుంది. ఎవరి అనుభవం వారికి సత్యమే!

ఉదాహరణకు ...ఈ భూగోళం... కొందరికి నిశ్చలమైన సుదీర్ఘ ఖండంలా అనిపిస్తోంది. మరికొందరికి అనేక దృశ్య విశేషాలతో అగుపిస్తోంది. శాస్త్రార్థములు హృదయస్థం చేసుకొన్న ఆత్మజ్ఞానికి ఇదంతా తన రూపమమేనని అనిపిస్తోంది. ఎవరు దేనిని ఏ దృష్టితో చూస్తే వారికి అది అట్లే సత్యముగా అనుభవమౌతోంది.

❖

కాబట్టి రామచంద్రా! ఈ నక్షత్ర మండలము – భూగోళము – మనం చెప్పుకునే లోకాలోక పర్వతము ...ఇవన్నీ కూడా స్వప్నంలో కనిపించే కొండరాళ్ళవలె అసద్రూపమే అయినప్పటికీ... చైతన్యము యొక్క భావనను అనుసరించి "భూ మండలం – నక్షత్ర మండలం – వస్తుజాలం – జలాదులు" సదా భాసిస్తున్నాయి. కనుక మనం చెప్పుకునే ఆయా వస్తు సంబంధ విశేషాలన్నీ

మనకు సత్యమని అనిపించటం మనయొక్క భావనారూప దృష్టి చేతనే. దృష్టియే సృష్టిరూపంగా అనుభూతమౌతోంది.

❖

ఇక బ్రహ్మకల్పితమైన బ్రహ్మాండము యొక్క విశేషాలు కొన్ని ఇక్కడ తెలియజేస్తాను.

ఈ భూమి అతి విస్తారమై లోకాలోక పర్వతం వరకు విస్తరించి ఉన్నది. అటుపై వలయ ఆకారంగా ఉండే ఒక పెద్ద కందకం "0" ఆకారంలో ఉన్నది. ఆ కందకమంతా లోన మహాసముద్రం లాగా అంధకారం వ్యాపించి ఉన్నది. ఆ పర్వతశిఖరం మధ్యలో కొంచెం సూర్యకాంతి ప్రసరిస్తోంది.

ఆ మహా పర్వతం అత్యంత ఎత్తైనది. ఇక నక్షత్ర మండలం అద్దానికి ఉపరి భాగంలో సుదూరంగా ఉన్నది. అందుచేత అక్కడ కొంత ప్రదేశం అంధకారబంధురం, మరికొంత విభాగం ప్రకాశయుక్తమైనది. అందుకే అయ్యది "లోకాలోక పర్వతం" ...అనే పేరుతో ప్రసిద్ధమైయున్నది.

ఆ పర్వతం చివర ఆకాశమండలంలో పది దిక్కులలోను నక్షత్ర చక్రం తిరుగుతోంది. ఒక్క ధ్రువ నక్షత్రం తప్ప మిగతా నక్షత్రాలన్నీ ఆ లోకాలోక పర్వతం చుట్టూ గుండ్రంగా తిరుగుతున్నాయి. భూలోకానికి ఆకాశం రెండింతలుగా ఉంటే, నక్షత్ర మండలం నాలుగింతలు కనిపిస్తుంది.

ఓ రామచంద్రా! మాయతోకూడిన బ్రహ్మము యొక్క సత్య సంకల్పరూపమగు స్ఫురణయే బ్రహ్మాండరూప జగత్తు అయివున్నదని గ్రహించు. ఆ నక్షత్రములకు ఆవల మరికొంత ఆకాశం ఉన్నది. ఆ ఆకాశము యొక్క చివర క్రిందగా బ్రహ్మాండ కపాలము నూరుకోట్ల యోజనములు విస్తరించియున్నది. ఆకాశమునకు ఈ చివర – ఆ చివర బ్రహ్మాండ కపాలాలు ఉన్నాయి. వాటి యొక్క అంచులలో అంధకార కంధరాలు ఉన్నాయి. మధ్యలో కూడా ఆకాశం ఉన్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ బ్రహ్మాండ కపాలాలలో మొట్టమొదటిది ఏది? చిట్టచివరిది ఏది? ఆకాశ విభాగానికి అంతు ఎక్కడ?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మహాభూగోళాకారమగు ఆకాశంలో సూర్య చంద్రాదులతో కూడిన జ్యోతిశ్చక్రాలు అన్ని దిక్కులలోను స్థితిపొంది ఉన్నాయి. అట్టి అసంఖ్యాక జ్యోతిశ్చక్రాలలో ఒకనొక బ్రహ్మాండంలో ఈ భూమండలం ఒకానొక చిన్న విభాగంగా అమరి ఉన్నది. శూన్యాకారమగు ఆకాశంలో ఊర్ధ్వం ఎక్కడ? అధోభాగం ఎక్కడ? ఒకవేళ అవి ఉంటే ... అన్నీ ఊర్ధ్వమే! అన్నీ అధోభాగమే!

ఈ పృథివి మొదలైన వాటియొక్క ఉత్పత్తి, భ్రమణం, స్థితి ...వ్యవహారాలన్నీ కూడా చైతన్యము యొక్క ప్రతిభా మాత్రములేనయ్యా! అనగా... వాస్తవానికి ఉత్పత్తి – స్థితి – పతనము – గమనాగమనములు... ఇవన్నీ వాస్తవానికి లేవు. అద్వయమగు స్వస్వరూప చిదాకాశము మాత్రమే సర్వదా సర్వత్రా సర్వాతీతమై ఏర్పడి ఉన్నది.

❖❖❖

# 10. బ్రహ్మమే బ్రహ్మాండరూపంగా కనిపిస్తోంది

**శ్రీరాముడు :** హే వసిష్ఠ మహర్షీ! మీరు వర్ణిస్తున్న బ్రహ్మాండ కపాలం, జ్యోతిశ్చక్రం, లోకాలోక పర్వతం ఆ పైగల అంధకార బంధురం మొదలైనవన్నీ మీరు భౌతికంగా ప్రత్యక్షంగా, చూచారా? లేక అనుశ్రుతంగా విజ్ఞుల గ్రంథాదులనుండి విని ఉన్నారా? లేక అవన్నీ మరొకరి అనుభవాలా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అవన్నీ మేము ప్రత్యక్షంగా చూచినవే! అనుమానం మాత్రం కాదు. అయితే అవన్నీ స్థూల దేహంతో చూచినవి కావు.

**శ్రీరాముడు :** స్వామీ! వాటిని స్థూలదేహంతో చూడలేదంటున్నారు. ఇంతలోనే వాటిని స్వయంగా ప్రత్యక్షంగా చూచినవేగాని ఆ నోట – ఈ నోట విన్నవి కాదని కూడా చెప్పుచున్నారు. ఈ స్థూల దేహంతో కాకపోతే, మరి మీరెట్లా వాటిని చూచారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నేను చెప్పిన జ్యోతిశ్చక్రం – బ్రహ్మాండ కపాలం మొదలైనవన్నీ ఈ జగత్ స్వప్నంలోనే ప్రసిద్ధమై ఉన్నాయి. వాటిని మా వంటి ప్రతివాహక ధారణ యోగులు (మానసిక శరీరం ధరించి సంచరించగలిగే యోగులు) ప్రత్యక్షంగా గాంచగలిగేవే! అట్టి సందర్శనం చేసియున్న స్థూలదేహధారణాయోగులు అనేకమంది మన ఈ సభలో ఉన్నారు. వారందరికీ కూడా అనుభవైక వేద్యమే! ఇంకా అనేక బ్రహ్మాండాలు ఇటువంటి లక్షణాలతోను, మరికొన్ని ఇందుకు వేరైన లక్షణాలతోను ఉన్నాయనునది మా యొక్క దైనందిన అనుభవమే సుమా!

❖

అయితే... ఈ జగత్ స్వప్నంలోని తదితర బ్రహ్మాండముల గురించి చెప్పుకొంటూ పోతూ ఉంటే ప్రయోజనమేమున్నది? బుద్ధిమంతులు ఆత్మజ్ఞానము గురించి మాత్రమే ఆకర్షితులౌతారు గాని... ఆయా జ్యోతిశ్చక్రాది విశేషాల గురించి పెద్దగా ప్రాముఖ్యం ఇవ్వరు. స్వప్నంలో విశేషాల గురించి (అది స్వప్న మాత్రమేనని గ్రహించిన తరువాత) ఎవరూ సుదీర్ఘంగా విచారణ చెయ్యరు కదా! ఇది కూడా అట్టిదే!

ఈ బ్రహ్మాండమునకు ఉత్తరంలో మేరు పర్వతం దక్షిణమున లోకాలోక పర్వతం... ఇటువంటి చర్చనీయాంశములు... ఎవరికైతే ఈ సమస్త భూత సముదాయము పట్ల జిజ్ఞాస ఉంటుందో... వారే దానిని పరిశీలించనీ. అట్లా పరిశీలించే వారికి అవన్నీ గోచరమౌతాయి కూడా!

అయితే...ఈ బ్రహ్మాండము బాహ్యమునకు వెళ్ళి దర్శించగలిగినవారికి అవన్నీ పెద్ద విషయములు – విశేషములు కావు.

❖

ఇక మనం విచారిస్తూ ఉన్న ప్రస్తుతాంశమునకు వద్దాం. ఏ బ్రహ్మాండ కపాలం గురించి మనం చెప్పుకుంటున్నామో... అద్దానికి ఆవల పదిరెట్లు జలవిభాగం ఉన్నది. ఆ జలవిభాగాన్ని పార్థివ విభాగం తన యొక్క ఆకర్షణ శక్తిచేత ధరిస్తోంది. అనగా... జల విభాగాన్ని పార్థివ విభాగం తన వైపు ఆకర్షిస్తోంది.

ఆ జల విభాగమునకు ఆవల ఇంధన రహితమైన అగ్నివలె తేజోవిభాగం విస్తరించి ఉన్నది. ఆ తేజమునకు ఆవల అందుకు పదిరెట్లు వాయువిభాగం ఉన్నది. దాని కావల ఆకాశ విభాగం ఉన్నది. ఆ ఆకాశ విభాగమునకు ఆవల శాంతము, అనంతము అయినట్టి బ్రహ్మాకాశము ఉన్నది. ఆ బ్రహ్మాకాశము ప్రకాశము కాదు. అంధకారము కాదు. "అది నాశరహితమైన మహా చిద్ఘన రూపం"... అని కవులు వర్ణిస్తున్నారు.

ఓ రామచంద్రా! బ్రహ్మాకాశము ఆద్యంతరహితమైనది. సర్వాత్మ స్వరూపమైనది. నిర్వాణ ఘనరూపమైనది. అటువంటి బ్రహ్మాకాశంలో మనం చెప్పుకుంటున్న - చూస్తున్న బ్రహ్మాండాలు లక్షలు లక్షలుగా మరల మరల ఉత్పన్నములై పరస్పరం సంయోగ - వియోగాలు పొందుతూ, నశిస్తూ వర్తిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహాత్మా! సమము, స్వయంప్రకాశ రూపము అయినట్టి బ్రహ్మాకాశంలో ఈ అనంతకోటి బ్రహ్మాండాలు ఉత్పన్నం అవటానికి కారణం ఏమిటి? ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! బ్రహ్మాకాశంలో కనిపించే బ్రహ్మాండాలు బ్రహ్మాకాశరూపమే అయివున్నాయి. సముద్రంలో కనిపించే తరంగాలన్నీ వస్తుతః సముద్రజలమే కదా! తరంగాలకు ఆకారం ఉండవచ్చు. జలానికి ఆకారమంటూ ఏదీ లేకపోవచ్చు. అంతమాత్రం చేత తరంగాలన్నీ జలంగాక మరింకేమిటి? "సముద్ర జలంలో తరంగాలున్నాయి"... అనేది అర్థరహితం కాదా? ఎందుకంటే, సముద్ర జలమే తరంగాలుగా కనిపిస్తోంది కదా! అట్లాగే బ్రహ్మాకాశమే బ్రహ్మాండాలుగా కనిపిస్తోంది. కాబట్టి బ్రహ్మాండలుగా కనిపించేదంతా బ్రహ్మమే! దృష్టి యొక్క నిర్మలతచే "బ్రహ్మాండాలుగా కనిపించేదంతా బ్రహ్మమయములే! బ్రహ్మ స్వరూపములే! సర్వము బ్రహ్మము నందే స్థితి కలిగి ఉన్నది" అని గ్రహించబడగలదు.

ఓ రామచంద్రా! ఈ విధంగా దృశ్యానుభవము యొక్క క్రమమంతా సందార్భనుసారంగా ఉన్నది ఉన్నట్లుగా వివరించాను. ఇక మన విపశ్చిత్ రాజు కథా విశేషాలు కొనసాగిద్దాం.

❖❖❖

## 11. దృశ్యంగా కనిపించేదంతా నిర్మల బ్రహ్మమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ ఉత్తరదిక్కు విపశ్చిత్తు ఇతఃపూర్వపు "దృశ్యము యొక్క విస్తారం ఎంతవరకో తెలుసుకోవాలి" అనే అభ్యాసం చేత ప్రేరితుడై లోకాలోక పర్వత శిఖరాగ్రం జేరాడని అనుకున్నాం కదా! ఇక అటుపై ఆ శిఖరమునకు ఆవల గల అంధకారమయమైన గర్తములో కుతూహలంతో ప్రవేశించాడు. అట్లా ప్రవేశించగానే ఆ అంధకారంలో సంచరించే భయంకరమైన పరిమాణంలో ఉండే గుడ్లగూబలు ఆతని భౌతిక దేహంపై దండయాత్ర చేసి ఆ శరీరాన్ని ముక్కలు ముక్కలు చేశాయి. ఆ విపశ్చిత్తు మరణించినది అతి పవిత్రమైన ప్రదేశం అయిఉండటంచేత, ఆతని అంతఃకరణం నిర్మలత్వం సంతరించుకొన్నది. ఒక ప్రదేశం అక్కడి మహనీయుల సంచారప్రభావంచేత

పవిత్రత సంతరించుకోవటం లోకప్రసిద్ధ విషయమే కదా! ఆ విపశ్చిత్తు, "భౌతిక దేహం లేకున్నప్పటికీ నా యొక్క మనోదేహంతో [సూక్ష్మ దేహంతో (లేక) ఆలోచనామయ దేహంతో] సృష్టి యొక్క అంతు ఎక్కడో జిజ్ఞాసపూర్వకంగా సంచారం - పరిశీలన కొనసాగించగలను" అని భావించటం చేత ఇక ఇతఃపూర్వంలాగా మరొక భౌతికదేహం గురించి స్మరించనే లేదు. అనగా... ఆ ఉత్తర దిక్కు విపశ్చిత్తు స్థూల దేహమునకు పరమైనట్టి సూక్ష్మదేహము పట్ల ఆత్మబుద్ధి (నేను అది ...అను బుద్ధి) సంపాదించుకోగలిగాడు గాని, "స్థూల సూక్ష్మకారణ దేహములకు పరమైనట్టి శుద్ధ చిన్మాత్రమే నేను" ...అనే స్వస్వరూపాత్మ బుద్ధి ఇంకా సంపాదించుకోలేదు. అందుకే సూక్ష్మ (మానసిక) దేహంతో దృశ్యవిస్తార పరిశీలన కొనసాగించాలనే కార్యక్రమం కొనసాగించసాగాడు. ఆతని ఇతఃపూర్వపు దృశ్య జిజ్ఞాస (లేక) సంస్కారం చేత ఆతడు దృశ్య విస్తారం మరల జిజ్ఞాసా పూర్వకంగా సందర్శించసాగాడు.

**శ్రీరాముడు :** మహర్షీ! స్థూల దేహం లేకుండానే సూక్ష్మదేహం ప్రయాణించటం - పరిశీలించటం - సంచరించటం ...మొదలైన కార్యక్రమములను కొనసాగించగలదంటారా? మీరు చెప్పినట్లు స్థూల దేహం లేకుండానే మనోదేహం కౌతుకాదులతో సంచారం చేయగలిగినప్పుడు, ఇక సూక్ష్మ దేహం స్థూలదేహం కంటే విశేషమైనది ఎట్లా అవుతుంది? సూక్ష్మదేహం అధికమైన విశేషమైనది కాకపోతే "స్థూల దేహమునకు పరమైన మనోదేహం సంతరించుకొన్నాడు"... అని మీరు ఎందుకు అంటున్నట్లు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అంతఃపురంలోని పడకగదిలో శయనించే రాజకుమారునికి మనస్సు (లేక ఆలోచనలు) ఒక గ్రామంలో తాను చూచిన సుందర స్త్రీ యొక్క గృహం వైపుగా మరలుచూ, ఆమె సుందరమైన ముఖమును దర్శించు రీతిగా... మన ఉత్తర దిక్కు విపశ్చిత్తు యొక్క మనోదేహం దిక్-దిగంతర దర్శనంలో నిమగ్నమై ప్రవృత్తమయింది. ఎద్దానిలో అయితే "ఊహ, భ్రమ, స్వప్నం, మనోరాజ్యం" ...అనేవి ప్రవర్తిస్తున్నాయో... అదే సూక్ష్మదేహం కదా! అట్టి సూక్ష్మదేహం స్థూల విశేషాలు మననం చేయటం చేత కాలక్రమేణా సూక్ష్మదేహ విస్మరణచే అద్దాని యందు స్థూలదేహ బుద్ధి ఉదయిస్తోంది. పాము యొక్క సంస్కార బలంచేత చీకటిలో త్రాడు పాముగా అనిపించి భ్రమింప జేయుచున్నట్లు...సూక్ష్మ దేహానికి స్థూల వస్తు-దృశ్య అనుభవం వచ్చి పడుతోంది. "ఇది త్రాడే"... అని తెలియగానే పాముకు సంబంధించిన చికాకులు, వికారములు తొలగునట్లు స్థూలదేహభ్రమ తొలగితే అప్పుడు సూక్ష్మదేహ రూపం శేషించగలదు.

**ఆతివాహిక ఏషో అంగ నిపుణం ప్రవిచార్యతామ్**
**చిన్మాత్ర వ్యతిరేకేణ యావత్ అత్ర అస్యత్ అస్తి నో ॥**

అట్టి సూక్ష్మ దేహంయొక్క స్వరూప - స్వభావాలేమిటో... అతి నిపుణతతో విచారణ చేయాలి సుమా! ఎందుకంటే, ఈ మనోదేహం కూడా భౌతిక దేహంలాగానే మిథ్య మాత్రమే! చిన్మాత్రము కంటే అన్యంగా 'సూక్ష్మదేహం' అనుబడేదేదీ కించిత్ కూడా లేదు.

**శ్రీరాముడు :** మహర్షీ! స్థూల-సూక్ష్మ దేహాలు రెండూ భ్రమయేనని, వాస్తవానికి కించిత్ కూడా లేవని సిద్ధాంతీకరించుచున్నారు కదా! మరి మనందరి యొక్క వాస్తవ స్వరూపం ఏమిటి? ఈ స్థూల - సూక్ష్మ దేహాలు ఎందుకు కనిపిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కనులు తెరిచి చూచినవానికి దృశ్యం కనిపిస్తుంది. కనులు మూసుకొని ఉన్నవానికి దృశ్యమే ఉండదు కదా! అట్లాగే... అజ్ఞానికి కనిపించే స్థూల - సూక్ష్మ దేహాలు ఆత్మజ్ఞానము ఎఱిగిన తత్త్వవేత్తకు ఆత్మకు అన్యంగా కనిపిస్తున్నాయి.

ప్రతిజీవుడు సంవిత్ స్వరూపుడే! సంవిత్తును ఎట్లా సందర్శించటం?

**దేశాత్ దేశాంతర ప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః**
**చిన్మాత్రస్య అస్య తద్రూపమ్ అనంతస్య ఏకరూపిణః ॥**

చిన్మాత్రము దేహరూపమూ కాదు. మనోరూపమూ కాదు. ఇక అద్దాని రూపము ఎట్టిది? ఈ ప్రశ్నకు చిన్మాత్ర దర్శనం చేసే మహనీయుల అనుభవపూర్వక సమాధానం విను.

ఈ బుద్ధి వృత్తి ఇంద్రియముల ద్వారా ప్రసరించి ఇంద్రియానుభవములను పొందుతోంది కదా! అట్టి ఇంద్రియానుభవమే ఆ బుద్ధి వృత్తికి 'జగత్తు' అనబడుదానిగా ప్రసిద్ధమగుచున్నది.

అనగా 'జగత్తు' అనబడేది "బుద్ధివృత్తి" యొక్క ఇంద్రియానుభవములు మాత్రమే! బుద్ధి అట్టి శబ్ద-స్పర్శాది ఇంద్రియానుభవములను జాగ్రత్తులోను, స్వప్నంలోను కూడా ఒకదాని తరువాత మరొకటి అనుక్షణికంగా పొందుతోంది.

అనగా ఈ జీవుడు ఒక అనుభవము తరువాత వెనువెంటనే మరొక అనుభము... ఒక ఆలోచన తరువాత వెనువెంటనే మరొక ఆలోచన... ఇట్లు

ఒక ఆలోచన - మరొక ఆలోచన; సంవిత్తు ఒక భావన - మరొక భావన; ఒకఅనుభవం - మరొక అనుభవం... రెండింటి మధ్యగా ( ) నిర్విషయ సంవిత్తు ఉన్నది కదా! ఆ సంవిత్స్వరూపమే 'పరమాత్మ' లేక 'చిన్మాత్రము' యొక్క నిజస్వరూపం. ఇంకొక విధంగా చెప్పాలంటే...

ఈ రెండింటి మధ్యలో గల సంవిత్స్వరూపం
(సత్+విత్ స్వరూపం)

ఒకడు ఒకానొక దృశ్యమును చూస్తూ, ఒక్కక్షణాల్పవిభాగంలో ...మరొక దృశ్యము వైపుగా చూపును మరల్చాడనుకో. ఒకవైపు చూడటానికీ ...మరొకవైపు చూడటానికీ, ఒక దృశ్యం చూడటానికీ, ...మరొక దృశ్యం చూడటానికీ... ఈ రెండు చూపుల మధ్యగా ఒకానొక నిర్విషయ స్వస్వరూపం ఉన్నది. అద్దానికి "నిర్విషయ సంవిత్తు" అని పేరుపెట్టారు.

సత్ ... ఉనికి, విత్... ఎఱుక ...అట్టి విషయ రహిత సంవిత్ అనునదే చిదాత్మ శరీరం. అదియే అందరి యొక్క ఆత్మదేహం. అది విషయాలు ఉన్నప్పుడు లేనప్పుడు కూడా ఉన్నది. అనగా ఒక విషయం ('చూపు')తో ప్రారంభం కావటం లేదు. అంతకుముందే అది ఉన్నది. విషయం

(ఆ చూచే చూపు) అంతమైతే సంవిత్ అంతం కావటం లేదు. అందుచేత అది అనంతం. తెలుసుకునే విషయాలు వేరు వేరు జీవులలో వేరువేరుగా ఉండవచ్చుగాక! తెలివి, ఉనికి రూపంలో అది అంతటా సమంగా ఉన్నది. అది సర్వదా ఏకమేగాని అనేకం కాదు. అదియే సర్వ సాధనాల పరాకాష్ఠ.

**శ్రీరాముడు :** అట్టి చిన్మాత్రం అనేక చిన్మాత్ర దేహాలుగా (జీవుల రూపంలో) అవుతోందా? లేక అది సర్వదా ద్వితీయమనేది లేకుండా ఏకంగా ఉంటోందా? ఏకమా? అనేకమా? ద్వైతమా? అద్వైతమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**క్వం ద్వైతం? క్వచ వా ద్వేషః? క్వ రాగాది తు కథ్యతామ్?**
**సర్వం శివమ్ అనాద్యన్తం పరోబోధ ఇతి స్మృతః ॥**

ఓ రామచంద్రా! సమస్తము పరమాత్మ రూపమే! ఈ కనబడేదంతా ఆద్యంతరహితము, శివరూపము, పరమబోధ స్వరూపము అయినట్టి సర్వాత్ముడగు చిదానంద తత్త్వమే అయి ఉండగా ఇక ద్వైతం ఎక్కడ? అద్వైతమెక్కడ? రాగమెక్కడ? ద్వేషమెక్కడ?

**నిర్మనో మననం శాన్తమ్ ఆసితమ్ బోధ ఉత్తమః**
**ఆతివాహిక దేహస్థో, న తం బోధమ్ ఉపాగతః ॥**

మనస్సు యొక్క మననం ఉపశమించినట్టి శాంతస్థితియే ఉత్తమమగు బోధరూపం. అదియే ఆత్మానుభవం.

❖

మన ఉత్తరదిక్కు విపశ్చిత్తు "నేను భౌతిక దేహమాత్రుడను కాదు. భౌతిక దేహం లేకపోయినా నాకు ఉనికి ఉన్నది" .... అని గ్రహించి సూక్ష్మ దేహ మాత్రుడైనాడు. అయినప్పటికి ఇంకా కేవల బోధస్వరూపం (ఆత్మాఽ మ్ అనుస్థితి) సంపాదించుకోనేలేదు. అందుచేత అతడు "ఈ సూక్ష్మదేహమే నేను" అను సూక్ష్మ దేహాత్మబోధ కలిగి ఉన్నవాడై ప్రసరణశీలమగు మనస్సుతో లోకాలోక పర్వతమునకు ఆవలగల అంధకార కర్పరంలో ప్రయాణం కొనసాగించాడు.

అట్లా ఆ అంధకార కర్పరంలో సుదీర్ఘంగా ప్రయాణిస్తూ ఉండగా ఆ చివరగా ఆతనికి ఒకానొక భూవిభాగం కనిపించింది. ఆ భూవిభాగం వజ్రంవలె దృఢంగాను, సువర్ణ ఛాయలోను, కోటి యోజనాల విస్తీర్ణంగా ఒప్పుచున్నది. దానికి ఆవల ఎనిమిది రెట్ల విస్తీర్ణంలో జలవిభాగం కనిపించింది. అది కూడా దాటి దానికి ఆవల గల తేజో విభాగంలో ప్రవేశించాడు. ఆ తేజో విభాగంలో తన మానవ భావంతో కూడిన సూక్ష్మదేహంతో ప్రయాణిస్తూ క్రమంగా దాని కావల ఉన్న వాయువుల యొక్క ఆవరణను దర్శించసాగాడు.

అట్లా దర్శిస్తూ ఉండగా... "ఆహా! నాకిప్పుడు భౌతిక దేహం లేదు. కేవలం చిత్తశరీరం మాత్రమే ఉన్నది. చిత్తమాత్రుడనై ఎంతదూరం వ్యవహరించి ఏం ప్రయోజనం? ఈ భూ ఆవరణ, జలావరణ, తేజో ఆవరణ, వాయు ఆవరణల అనుభవం స్వప్నంలోని సంఘటనల దర్శనం వంటిదే కదా!"

...అని అనుకోసాగాడు. ఇట్లా అనుకుంటూనే వాయు ఆవరణ కూడా దాటి ఆ వాయు ఆవరణకు పదిరెట్లు విశాలంగా ఉన్నట్టి 'ఆకాశం'లో ప్రవేశించాడు. "అయినా సరే! ఈ ఆకాశం ఎక్కడ మొదలౌతుందో... అద్దానిని ఈ సూక్ష్మ దేహంతోనే పరిశీలించెదనుగాక!" ...అని తలచి తన సూక్ష్మదేహంతో ఇంకా ప్రయాణం కొనసాగించసాగాడు.

❖

ఆతడు క్రమంగా ...ఏదైతే ఆకాశమునకు ఆవల ఉన్నదో... దేనియందైతే ఈ సమస్తము ఆకాశాదులతో సహా ఏర్పడి ఉన్నదో... దేనియందు మహాపంచభూతాలు ఆవిర్భవిస్తున్నాయో... ఏది 'దృశ్యం' కాకపోయినప్పటికీ సమస్త దృశ్యము తానే అయి ఉన్నదో... అట్టి మాయా సమన్వితమైన బ్రహ్మాకాశంలో ప్రవేశించాడు.

ఆతడు ఆ అనంత బ్రహ్మాకాశంలో మనస్సుతో సుదీర్ఘ సంచారం చేయసాగాడు. అయితే తన పూర్వ సంస్కారాల కారణంగా మరల మరల పృథివి, జల, తేజ, వాయు ఆవరణములను వాటి సంయోగ రూపములగు అనేక జగత్తులను మనోదేహంతో సందర్శించాడు. మరల మరల సృష్టులు, ప్రపంచరచనలు, దిశలు, పర్వతాలు, ఆకాశం, దేవతలు, మనుష్యులు ఆ బ్రహ్మాకాశంలో అనేక చోట్ల అనంత సంఖ్యలో కనిపించాయి. అట్టి సంచార సమయంలో పంచభూతముల చివర ఒకానొకచోట బ్రహ్మదేవుడు నిశ్చల స్థితిలో కనిపించాడు. మరల అచ్చట బ్రహ్మాండాలు, సృష్టులు, దిక్కులు, దేవ-భూలోకాలు కనిపించాయి. వాటిలో సంచరిస్తూ మరల బ్రహ్మాకాశం పొందాడు. ఆ బ్రహ్మాకాశంలో మరల సృష్టులు, సృష్టుల కావల బ్రహ్మాకాశం... ఇట్లా చూస్తూనే... చిరకాలాభ్యాసమైనట్టి "సృష్టిక్రమం పరిశీలించాలి. వీటి అంతు ఏమిటో చూడాలి"... అనే ఉత్సుకత కొనసాగుచుండటంచేత, ఆ ఉత్తర దిక్కు విపశ్చిత్తు సూక్ష్మదేహంతో బ్రహ్మాకాశం - సృష్టులు సందర్శించటం కొనసాగిస్తూనే ఉన్నాడు. ఎంతగా వాటినన్నిటినీ దర్శించినప్పటికీ వాటిపట్ల అతనికి ఇంకా ఉత్సుకత కొనసాగుతూనే ఉన్నది కాని ఆతడు ఇప్పటికీ వైరాగ్యం పొందటమే లేదు.

ఇక్కడ ఒక పాఠ్యాంశం సభికులందరికీ మనవి చేస్తాను. ఈ జగద్రూప అవిద్యకు అంతమే లేదు. అట్టి జగత్తులలోని విశేషాలను చక్కగా మొదలంటా విచారణ చేశామా... "ఉన్నదంతా, ఉన్నదని అనిపించేదంతా బ్రహ్మమే"... అని తెలియగలదు.

వాస్తవానికి బ్రహ్మము వికల్పరహితం. అట్టి నిత్య నిర్మల బ్రహ్మమునందు "అవిద్య" అనబడేదే లేదు. ఈ దృశ్యం రూపంలోను, అవిద్య రూపంగాను స్ఫురిస్తున్నది బ్రహ్మమే! ఒకనికి ఏవేవి పదార్థ రూపంగా జాగ్రత్ - స్వప్నాలలో కనిపిస్తుందో అదంతా అట్లా కనిపించేది ఆతనియొక్క వాసనానుసారమే!

ఇతఃపూర్వం ఒకనికి కనిపించేది, ఇప్పుడు కనిపిస్తున్నది, ఇకముందు కనిపించబోయేది అంతా కూడా "బ్రహ్మమే వాసనా ప్రభావంచేత అట్లట్లు అనుభవమవటం" ...జరుగుతోంది. ఈ భూత-వర్తమాన-భవిష్యత్తు క్రమయుక్తమై ఏ జగత్తు నీకు భాసిస్తోందో... అది నీయొక్క (లేక బ్రహ్మము యొక్క) అవిద్యావిభాగమాత్రమే అయివున్నది.

కళ్ళు మూసుకుంటే కారుచీకటి కనిపిస్తున్నట్లు (యథార్థానికి ఉన్నది వెలుతురులో అయినప్పటికీ, కళ్ళు మూసుకోవటం చేత కారుచీకటి కనిపిస్తున్నట్లు)... 'ఆత్మ సుజ్ఞాన నేత్రం' మూసుకొని ఉన్న మాయాజీవుని అజ్ఞాన నేత్రాలకు (ఏది మొదలంట లేదో ...మాయా) ...అట్టి ఈ మాయా పార్థివ జగత్తు అగుపిస్తోంది.

పరమగు చిన్మాత్ర దృష్టిచే... ఈ జగత్తు "సత్తు" కాదు. ప్రతిభాసాత్మరూప దృష్టిచే (అజ్ఞానుల దృష్టిచే) ఈ జగత్తు "అసత్తు" కాదు. ఈ జగత్తు అనబడేది సత్-అసత్ విలక్షణమై అనిర్వచనీయమగు రూపము కలిగి ఉన్నది. స్వకీయమగు "భావన" ను ఆధారంగా కలిగియున్నది. ఆత్మస్వరూపుడగు ఈ జీవునికి స్వకీయమగు భావనంతా అలంకారప్రాయము మాత్రమే!

❖

కనుక రామచంద్రా! బ్రహ్మాకాశంలో సంచరించుచున్న ఆ ఉత్తరదిక్కు విపశ్చిత్తు తాను ఇతః పూర్వం గాంచినవి, వాటికి తదితరములూ అయినట్టి అనేక దృశ్య పరంపరలను వాసనానుసారంగా దర్శించటం ఇప్పటికీ కొనసాగిస్తూనే ఉన్నాడు. మహారణ్యంలో సంచరించే జింకలాగా ఆతడు స్వవాసనల యొక్క ఔన్నత్యానుసారం అనేక జగత్తులను దర్శిస్తూ మధ్యమధ్యలో తన్మయుడగుచు, ఇంతలోనే బ్రహ్మాండముల అంతును చూడాలని తిరిగి బయల్వెడలుచూ ...ఇట్లా సుదీర్ఘ సందర్శనము 'విసుగు' అనేది లేకుండా నిర్వర్తిస్తూనే ఉన్నాడు.

❖❖❖

## 12. అవిద్య కూడా బ్రహ్మమే!

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఆ విపశ్చిత్ మహారాజు అగ్ని భగవానుని వరప్రసాదంగా సంపాదించుకున్న నాలుగు దేహ విపశ్చిత్తులలో... ఒక విపశ్చిత్తు విష్ణు భగవానుని కృపకు పాత్రుడై 'ముక్తుడు' అయ్యాడు. ఇంకొక విపశ్చిత్తు బ్రహ్మాకాశంలో సూక్ష్మదేహంతో ప్రవేశించి ఇప్పటికీ అనేక మాయాజగత్తులలో సంచరిస్తూ 'అవిద్య' యందే తిరుగాడుచున్నాడు.

ఇంకా ...తూర్పు దిక్కు విపశ్చిత్తు చంద్రలోకంలో ప్రవేశించినంత వరకు చెప్పారు. దక్షిణదిక్కు విపశ్చిత్తేమో శాల్మలీ ద్వీపరాజ్యంలో రాజ్యం ఏలుచున్నంత వరకు చెప్పారు. వారిద్దరి తదనంతర విహారాదుల గురించి చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**దక్షిణదిక్కు విపశ్చిత్తు -** ఈతడు శాల్మలీద్వీపంలో రాజ్యం ఏలాడు. అయితే, అక్కడి రాజ భోగాలు. సేవకుల స్తోత్ర -వినమ్రవచనాలు రాణి వాసపు సుఖ-సరసాదులు ఒకానొక సమయంలో విసుగు కలిగించాయి. సద్వర్తునికి తుచ్ఛ నారీజన సమాగంలాగా - అవి అరుచి కలిగించనారంభిం చాయి. ప్రతి జీవుడు ఎందుకు ఏ భావావేశంతో పుట్టాడో... ఆ మార్గమే అభిరుచిగా ఉంటుంది గాని... అన్య విశేషాలన్నీ కొంతకాలం అలరించినప్పటికీ, ఎప్పటికో అప్పటికి వాటిపై విముఖత

కలుగకతప్పదు. మన దక్షిణ దిక్కు విపశ్చిత్తు కొంతకాలం తరువాత రాజ్యమును, సుందర స్త్రీలను పరిత్యజించి అక్కడి నుండి బయల్వెడలాడు. "ఈ సృష్టి ఎంతవరకు విస్తరించియున్నది?" ...అనే జిజ్ఞాసచే ఆవేశం పొందినవాడై సుదీర్ఘ ప్రయాణం కొనసాగించాడు. ఆతడు కూడా సప్తసముద్రాలను, లోకాలోక పర్వత శిఖరాలను అధిగమించి ఒకానొక చోట స్థూల దేహము త్యజించి సూక్ష్మ దేహంతో బ్రహ్మాకాశంలో ప్రవేశించాడు. ఆతడు కూడా ఉత్తర విపశ్చిత్తు లాగానే బ్రహ్మాకాశంలో అనేక బ్రహ్మాండాలను సందర్శిస్తూ సూక్ష్మదేహంతో 'అంతు' అనేది లేకుండా ఇప్పటికీ సంచారం కొనసాగిస్తూనే ఉన్నాడు. ఆతనికి 'అవిద్య' తనయందే గలదని గమనించకుండా ...ఈ "జగద్విద్య" అనే మాయాపటాటోపంలో ఎక్కడెక్కడో ప్రయాణిస్తూ అనేక అనుభవములను, అనుభూతులను పొందుతూ, త్యజిస్తూ సుదీర్ఘసంచారం (ఉత్తరదిక్కు విపశ్చిత్తులాగానే) ఇంకా కొనసాగిస్తూనే ఉన్నాడు.

❖

**తూర్పుదిక్కువిపశ్చిత్తు-** ఈతడు చంద్రమండలం ఆశ్రయించాడు కదా! చంద్రునిలోగల మృగముతో ప్రియత్వము కలవాడై ... అట్టి అధికాధికమైన స్నేహాభ్యాసం చేత అద్దానికి వశం అయినాడు. ప్రతి మాసము చంద్రునితో బాటుగా పరిభ్రమించే అనేక దేహాలు ధరించటం, త్యజించటం నిర్వర్తించాడు. కాలక్రమేణా, మృగయావినోదం చేత ఆతడు మృగమునకు సంబంధించిన సంస్కారములచే ప్రేరితుడై, ...ఒకానొకప్పుడు ఒక 'లేడి' దేహము ధరించి ఒక పర్వతముపై స్థితి– సంచారాలు పొందినవాడైనాడు.

**శ్రీరాముడు :** ప్రభూ! ఆ నలుగురు విపశ్చిత్తులు "ఈ అవిద్యా జగత్తు యొక్క అంతు ఎచట" ... అనే రూపంలో ఉండే పరిశీలనా సంస్కారం మొట్టమొదట కలిగి ఉన్నారు కదా! ఇప్పుడేమో వారికి భిన్న భిన్న మార్గములు – ఫలములు వచ్చి పడుచున్నాయేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవుడు అనేక విధములైన వాసనలు కలిగి ఉండవచ్చుగాక! అయితే బాగుగా అభ్యసించబడిన 'వాసన'లలో ఏది అల్పదృఢత్వం కలిగి ఉంటుందో, అట్టిది దేశకాల క్రియావశంగా మరొక వాసనచేత త్రోసివేయబడుతూ ఉంటుంది. వాసనల దొంతర ఏది ముందుకు వస్తుందో ...ఏది వెనకబడుతుందో... ఆ వాసనల సొంతదారు అయిన జీవునకు కూడా తెలిసేది కాదుకదా! భావాలు, అభిప్రాయాలు, అనుబంధాలు, ఆధార, నిరాధారాలు, ప్రోత్సాహకాలు, నిరుత్సాహకాలు... ఇవన్నీ మారిపోతూ ఉండటం, ఒకటి ముందుకు వచ్చి మరొక దానిని వెనుకకు త్రోయటం ప్రతిజీవుని యొక్క కొద్ది సంవత్సరముల జీవితకాలంలో అందరూ గమనిస్తున్న విషయాలే కదా! అన్నిటికీ అభ్యాసమే మూలకారణం.

భోగ్య ఫలానుకూలమైన దేశ–కాల–క్రియా యత్నములనే సామాగ్రి యొక్క ఏకత్వం చేత భిన్న వాసనల యొక్క ఏకత్వం సంభవిస్తోంది. అట్టి దేశ – కాల క్రియా యత్నములు మరొక రీతిగా భిన్న భిన్నమగుచుండగా ...ఏక రూపములైన వాసనలు భిన్నత్వం పొందుతూ ఉంటాయి.

ఒకనిలో ఒక సమయంలో రెండు మూడు వాసనలు ప్రదర్శితమగుచున్నప్పుడు వాటిలో ఏది సమయానుగతంగా ప్రబలమై ఉంటుందో... అది రెండవ దానిని వర్తమానంలో బలహీనపరుస్తూ

ఉంటుంది. ఒకప్పుడు బలహీనమైన వాసన మరొకప్పుడు ప్రబలమై... ఇతఃపూర్వపు బలవత్తరమైన వాసనను బలహీనపరచటమో... దిగజార్చటమో జరుగుతూ ఉంటుంది.

ఆ నలుగురు విపశ్చిత్తులు ఏకకాలంలో ఒకే వాసన (లేక) సంస్కారం (లేక) స్వభావంతో ఒక్క ద్రష్ట నుండి ఉత్పన్నులయినప్పటికీ... విరుద్ధములైన దేశ కాలాదులలో అభిలాషతో భోగప్రాప్తి పొందటంచేత వివిధ వాసనాయుక్తులైనారు. భిన్న భిన్న ప్రయత్నములు, ప్రవర్తనములు వాటి వాటి ప్రయోజనములను పొందారు. అందులో ఒకడు నిర్వికల్ప ఆత్మతత్త్వంలో లయం పొందాడు. ఇద్దరు బ్రహ్మాకాశంలో దృశ్యములందు తత్పరులై దృశ్యము యొక్క ఆద్యంతములను పరిశీలించే ప్రయత్నంలో మునిగి తేలుతున్నారు. నాలుగవవాడు ఒక 'లేడి' దేహము ధరించినవాడైనాడు. ఒక కొండ యొక్క ఎత్తైన శిఖరాగ్ర ప్రదేశంలో పచ్చికమేస్తూ తిరుగుచున్నాడు.

**శ్రీరాముడు :** స్వామీ! ఆ ముగ్గురు విపశ్చిత్తులు ఈ అవిద్యాజగత్తు యొక్క అంతమును ఎప్పటికి చేరగలుగుతారు? అసలీ దృశ్య జగత్తు ఎక్కడైనా అంతము కలిగియున్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీ ప్రశ్నకు మనం సమాధానం చెప్పుకోవాలంటే ముందుగా నిన్ను మరొక ప్రశ్న అడగవలసి వస్తుంది. అవిద్య అనేది దృశ్యములో ఉన్నాదా? ద్రష్ట యొక్క బుద్ధిలో ఉన్నదా?

**శ్రీరాముడు :** 'అజ్ఞానము' లేక 'అవిద్య' అనేది బుద్ధిలోనే ఉన్నది. దృశ్యములో కాదు. బ్రాహ్మీ దృష్టి కలవారికి దృశ్యము బ్రహ్మముగానే దర్శనమవగలదు. ఎవరు ఏ దృష్టితో ఈ ప్రపంచం దర్శిస్తారో వారికి అట్లే ఇది అనుభవమౌతోంది. ఈ జగత్తును దర్శించేవారు... వేఱు వేఱుగా సమన్వయించుకోవటం జరుగుతోంది.

"ఇదంతా ఇంతవరకు నాది. అంతవరకు నాది కాదు. ఇది నా అజ్ఞానము తొలగే నిమిత్తం పరమాత్మచే కల్పించబడిన పాత్ర్యాంశం. ఇది కేవలం కల్పితం. ఇది అనేక సుఖములకు ఆలవాలం. ఇదంతా నా ప్రియమైన పరమాత్మయొక్క స్వరూపం. ఆయన దేహం. ఇదంతా ఆ పరమాత్మయే! ఇదంతా ఎవరికీ అర్థంగాని ఏదో వింత మాయాజాలం." ...ఈ విధంగా ఎవరు ఏ బుద్ధితో చూస్తారో... వారికి ఆ విధంగా అనుభూతమౌతోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చాలా బాగా చెప్పావు. కనుక భ్రాంతితో కూడిన బుద్ధిగల ఆ ముగ్గురు విపశ్చిత్తులకు భ్రాంతి ఉన్నంతవరకు అవిద్యాజగత్తు అనంతరూపముగా ఏర్పడి ఉండియే తీరుతుంది. భ్రాంతిని త్యజించనంతవరకు జన్మ-మృత్యు-జరా - దృశ్య - అదృశ్య విషయములతో కూడిన ఈ అవిద్యా జగత్తుకు అంతు అనేది లేదు, ఉండదు, కనబడదు.

కనుక... అంతం కావలసింది జగత్తు కాదు. మరి ఏది?... బుద్ధిలో దాగి ఉన్న అవిద్య (లేక) భ్రాంతి.

**క్షిప్రేణ శాంతా భవతి విజ్ఞానాలోక ఆగతే ।**
**ఆమూలమేవ గలతి తిమిర శ్రీరివోదయే ॥**

ఒకడు కటిక చీకటిలో సంచరిస్తున్నాడనుకో. ఆ అంధకారానికి అంతు ఎక్కడ? సూర్యుడు ఉదయించేవరకు. సూర్యుడు ఉదయిస్తూ ఉండగానే చీకటి క్షణంలో తొలగిపోతుంది కదా! అట్లాగే “విజ్ఞానము” అనే ప్రకాశము యొక్క రాక వలన అజ్ఞానంచే ఏర్పడిన అవిద్య అతిశీఘ్రంగా నశించిపోగలదు. కాబట్టి ఓ సభికులారా!వాల్మీకి మహర్షి విరచితంగా వసిష్ఠ-రామ సంవాద (యోగవాసిష్ఠ) భవిష్యత్ పాఠకులారా! అజ్ఞానము (లేక) అవిద్య తొలగటానికిగాను మీరంతా మీయందుగల విజ్ఞాన దీపకాంతిని ప్రవృద్ధ పరచుకోండి. దృశ్యము అధిగమించటానికి ఇంతకుమించి ఉపాయం లేదు. అట్లా కాకుండా.... పాంచభౌతిక జగత్తులో ఎంతగా జిజ్ఞాసతో వెతికినా.... అవిద్యకు అంతు ఉండదు.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! పశ్చిమదిక్కు విపశ్చిత్తు విదేహముక్తి సముపార్జించుకున్నాడు కదా! ఆతడు దృశ్యమండలము నుండి విముక్తుడు ఎట్లా కాగలిగాడు? విష్ణువుచే బోధించబడటానికి అర్హుడెట్లా అయినాడు? ఇది మరల ఒకసారి క్లుప్తంగా సమీకరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** పశ్చిమదిక్కు విపశ్చిత్తు ఈ మన సంసార భ్రమకు సంబంధించిన అన్యబ్రహ్మాండము నందు గల స్వాదూద సముద్రము యొక్క ఆవలి భాగంలో గల సువర్ణమయ భూమిలో ప్రవేశించటం జరిగింది కదా! అయితే, ఆ పశ్చిమ దిక్కు విపశ్చిత్తుకు దృశ్యరూపంగా సంప్రాప్తించినది... (అట్లాగే) ఏ జీవుడికైనా ఎక్కడైనా దృశ్యరూపంగా సంప్రాప్తిస్తున్నది, (అనగా), ...ఈ దృశ్యమానమయ్యేదంతా కూడా మహాబ్రహ్మాకాశమున బ్రహ్మము రూపమే అయి ఉండి ప్రాప్తిస్తోంది. ఆ పశ్చిమ విపశ్చిత్తు ఆ సువర్ణ మండలంలో సంచరిస్తూ ఒకానొక చోట శమము, దమము, భగవత్ భక్తి... ఇత్యాది శుభగుణాలు కలిగి ఉండి జీవన్ముక్తులగు మహాత్ములు నివసించే ప్రదేశంలో ప్రవేశించి వారితో సంసర్గం పొందటం జరిగింది. వారితో పెంపొందించుకొన్న స్నేహ-సేవాదుల ప్రభావం చేత ఆ జీవన్ముక్తుల బోధకు అర్హతపొందాడు. వారి వల్ల దృశ్యతత్త్వం పూర్తిగా ఎఱిగినవాడైనాడు. విష్ణు భక్తుడై తద్వారా విష్ణు దర్శనం పొంది ఆ భగవానుని కరుణకు పాత్రుడై నిర్మలబ్రహ్మరూపత్వం పొందాడు. ఆతని యందలి ‘కామం’ అను రూపంగా సుదీర్ఘకాలం ప్రకటిత మైన ఇతఃపూర్వపు అవిద్య, ‘దేహమే నేను’ అనే దేహాత్మ భావం బ్రహ్మజ్ఞాన విభాగప్రభావం చేత మృగతృష్ణాజలంలాగా శమించిపోయాయి. (మృగతృష్ణలో జలమే ఉండదని గ్రహించబడినట్లు గమనించబడినదైనది).

“నేను ఈ దేహమాత్రుడను. నాకు ఏదో కావాలి”... అనే అవిద్య యొక్క రెండు చక్రాలు తొలగిపోవటంతో అవిద్య బుద్ధిని మోహభూములలోకి మోసుకుపోవటం సమసిపోనారంభించగా ...ఇక బుద్ధి విజ్ఞాన భూములలో వికసించింది. అందుచేత ఆతడు దేహ-కామ జాడ్యం మొదలంటా త్యజించినవాడై నారాయణ నామస్మరణాప్రభావంచేత ఆత్మజ్ఞానం పొంది దృశ్య వ్యవహారమంతటికీ అతీతత్వము సముపార్జించుకున్నాడు.

❖

ఓ రామచంద్రా! ఈ విధంగా ఆ నలుగురు విపశ్చిత్తుల యొక్క అవిద్యా దర్శన కుతూహలముతో కూడిన చరిత్ర నీకు విశదీకరించాను.

కార్యరూపమైన అవిద్య యొక్క అంతము ఆ ముగ్గురు విపశ్చిత్తులు దర్శించ జాలకున్నారు. కాబట్టి ఈ కార్యరూప అవిద్య కూడా కారణరూప బ్రహ్మమువలె 'అనంతమే' అయి ఉన్నదని గ్రహించావు కదా! కారణ రూప బ్రహ్మముచే పరిపూర్ణమై ఉండటంచే ఈ దృశ్య జగత్తు కూడా అనంతమని గమనించు.

లక్షల లక్షల సంవత్సరాల క్రియా వ్యవహారాలు ఎక్కడ మనం గమనిస్తామో... అదంతా కూడా కారణ రూప బ్రహ్మము యొక్క అతి స్వల్ప విభాగం కూడా ఆక్రమించజాలదు. బ్రహ్మము ఎఱుగబడనప్పుడు ఆ బ్రహ్మమే... అవిద్య, మిథ్య, జగత్తు - మొదలైన పేర్లతో అవిజ్ఞులకు అనిపించటం జరుగుతోంది. ఎఱుగబడినప్పుడు ఈ దృశ్య వ్యవహారమంతా పరమశాంతమై 'బ్రహ్మము'గా అనుభూతం అవుతోంది.

ఇదే మనం ఈ విపశ్చిత్ ఉపాఖ్యానంలో గమనించవలసినది సుమా!

**దృశ్యము, బ్రహ్మము -** ఓ ప్రియ సభికులారా! ఈ రెండింటికీ ఏ భేదము మీకు భాసిస్తోందో... అది స్వబుద్ధి యొక్క కల్పనా చాతుర్యమేగాని... వాస్తవమైన భేదం కాదు. ఎందుకంటే ఆ భేదంగా కనిపించేదంతా అవిద్యామయమే అయివున్నది. అవిద్యయో... బ్రహ్మం యొక్క రూపమే అయివున్నది. అవిద్యగా కనిపించేది చిదాభాసమే కాబట్టి ఆ భేదము ఒక లీల క్రీడ వలె చిద్రూపమగు బ్రహ్మం కంటే వేఱుకాదు. జ్ఞానం సముపార్జించుకోకపోవటమే అవిద్య యొక్క అనుభవానికి మూలకారణం. మన ఉత్తరదిక్కు విపశ్చిత్తు వందలకొలది యుగాలు సంచరించినప్పటికీ బ్రహ్మాండ మండప రూపమగు దృశ్యం యొక్క అంతం పొందక పోవుచుండటమే ఇందుకు మనకు దృష్టాంతము.

❖❖❖

# 13. మృగ రూప విపశ్చిత్

**శ్రీరాముడు :** వక్తలలో శ్రేష్ఠుడగు ఓ మునీంద్రా! తూర్పుదిక్కు విపశ్చిత్తు తదితర ఇద్దరు విపశ్చిత్తులలాగా బ్రహ్మాండ కవాటంలో ప్రవేశించకుండా, భూమండల భూములలో ఎందుకు ఉండిపోయాడు?

బ్రహ్మాండం, బ్రహ్మాండ కవాటం... ఈ రెండింటి భేదమేమిటో మీరు ప్రసంగంలో ప్రస్తావించ లేదు. ఈ రెండూ ఎట్లా సృజించబడ్డాయో, వాటి భేదమేమిటో విశదీకరించమని నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! పూర్వం బ్రహ్మదేవుడు జనించినప్పుడు బ్రహ్మాండములను తన యొక్క రెండు భుజాలతో రెండు విభాగాలుగా పైకి - క్రిందికి చీల్చివేశాడు. అప్పుడు... పైభాగం... పైకి, క్రింది భాగం... క్రిందకు అతిదూరంగా జరిగాయి. జలావరణ, అగ్ని ఆవరణ - ఆకాశ ఆవరణ మొదలైనవన్నీ పై-క్రింది భాగాలను ఆశ్రయించాయి. ఆ విధంగా ఉభయ కపాలములను

ఆ ఆవరణలు అంటిపెట్టుకొని ఉన్నాయి. మనకు అపారంగా కనిపించే నీలవర్ణమే రెండు ఊర్ధ్వ అధోకవాటముల మధ్య ఉన్నది. అది 'ఆకాశము' అని చెప్పబడుతోంది.

అయితే... జలాది ఆవరణములు ఆకాశములో సంలగ్నమై ఉండనూలేదు. పరమార్థమున అవి విద్యమానములై లేవు. వాస్తవానికి ఆకాశం ప్రళయకాల పర్యంతము నిర్మలమై అత్యంత శూన్యమై, కానీ ఇతర భూములకు ఆధారమై ఒప్పుచున్నది.

ఈ ఆకాశాదులు, నక్షత్రాదులు మొదలైనవన్నీ అవిద్య యొక్క పరీక్షార్థమై దీక్ష తీసుకొని ఉన్నాయా? ...అన్నట్లుగా ఏర్పడినవై ఉంటున్నాయి. అవిద్య కూడా బ్రహ్మమయమే కాబట్టి... అదికూడా బ్రహ్మమువలె అనంతమే! బ్రహ్మమును ఎఱిగిన వానిపట్ల అవి స్థితి కలిగి ఉండవు.

ఎఱిగినప్పుడు అవిద్య లేనే లేదు. ఎఱుగనప్పుడు అవిద్య పొందజాలబడకయే ఉన్నది. తెలియబడనిదై ఉన్నది.

ఆ విపశ్చిత్తులు ఏదైతే ఎఱుగబడినప్పుడు ఉనికియే ఉండదో... అట్టి వాటిని ఎఱుగుటకై సుదీర్ఘ ప్రయాణాలు కొనసాగిస్తున్నారు. ఆ విధమైన అవిద్యా అధ్యయనం కొరకై... (ఏదైతే ఎఱుగబడినప్పుడు ఉనికియే కోల్పోతుందో... ఎఱుగబడనంతవరకు తెలియకయే పోతుందో) ఆ విపశ్చిత్తులు నలుగురు వెతుకుతూ పయనిస్తూ... ఒకడు ముక్తుడైనాడు. మరొకడు మృగరూపం (లేడి రూపం) పొందాడు. ఇద్దరు పూర్వపు మహాసంస్కారాలకు వశీభూతులై పరిభ్రమిస్తున్నారు.

**శ్రీరాముడు :** స్వామీ! పై చెప్పిన వారిలో చివరి ఇద్దరు విపశ్చిత్తులు తమ సూక్ష్మ దేహాలతో అనేక బ్రహ్మాండాలు సంచరిస్తున్నారు కదా! వారు జననములు పొందుచున్న బ్రహ్మాండాలు మన ఈ బ్రహ్మాండానికి ఎంత దూరంలో ఉన్నాయి? ఏ మార్గంలో ఉన్నాయి? మనం అక్కడకు వెళ్ళవచ్చునా? లేక మీవంటి యోగులు మాత్రమే వెళ్ళగలరా? ఎందుకంటే మీరు చెప్పే వృత్తాంతమంతా అత్యంత ఆశ్చర్యకంగా ఉన్నది. అట్లాగే మృగరూపంలో ఉన్న విపశ్చిత్తు వృత్తాంతమేమిటో తెలియజేయండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (కొంచెంసేపు మౌనం. ఆ తరువాత) ఆ అవిద్యా పారదర్శకులగు ఇద్దరు విపశ్చిత్తులు ఏఏ జగత్తులలో తమ సూక్ష్మ దేహయానం కొనసాగిస్తున్నారో, ఏమేమి అనుభవములు పొందుచున్నారో... అది ఎంతగా పరిశీలించినా కూడా, నా బుద్ధికి గోచరించటం లేదు.

ఇక మృగరూపం ధరించిన విపశ్చిత్తు ఏ బ్రహ్మాండంలో ఉన్నాడో... ఆ బ్రహ్మాండము, తదంతర్గతమైన జగత్తు కూడా నా బుద్ధికి సుస్పష్టంగా గోచరం అవుతోంది.

**శ్రీరాముడు :** హే మహాధీమంతుడవగు ఓ మునీంద్రా! మృగరూపం పొందిన ఆ నాలుగవ విపశ్చిత్తు ఇప్పుడు ఏ ప్రపంచంలో ఉన్నాడు? ఆ ప్రపంచం ఇక్కడికి ఎంతదూరంలో ఉన్నది? ఆ ప్రపంచములోని మృగమును (లేడి రూపం దాల్చిన విపశ్చిత్తును) మేము చూడగలమా? మీరు మాకు ఆ లేడిని చూపించవచ్చునా?... మీ కథనంలోని మరికొంత నిరూపణకొరకై నేను ఈ అభ్యర్థన చేస్తున్నాను. మా అర్హతను అనుసరించి ఈ విషయాలు చెప్పవలసినదిగా నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (కొంచెంసేపు కనులు మూసుకొని ధ్యాననిష్ఠలో గడిపినవాడై ... చిరునవ్వుతో కనులు మెల్లగా తెరచి) ...రామచంద్రా! మృగరూపం (లేడి రూపం) దాల్చిన ఆ నాలుగవ

తూర్పుదిక్ విపశ్చిత్తు ఇప్పుడెక్కడున్నాడో... అతి స్పష్టంగా గమనించాను. ఆతడు ఈ మన త్రైలోక్య జగత్తులోనే ఉన్నాడు. ఆతడు విపశ్చిత్తుగా జన్మించిన స్థానం ఇక్కడి నుండి అత్యంత సుదూరంగా ఉన్నది. అనగా, ఆతడు లేడిగా సంచరిస్తున్న ఆ పరబ్రహ్మాకాశము ఇదే!

**శ్రీరాముడు :** స్వామీ! మీరు చెప్పేది నాకు మరికొంత ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆ విపశ్చిత్తు వేరొక జగత్తులో నుండి కదా... దిగంత దర్శనం కొరకై బయలుదేరాడు? బయలుదేరి సప్తసముద్రాలు, దిక్కులు, బ్రహ్మాండాలు దాటిపోయాడని చెప్పియున్నారు కదా! ఇప్పుడు ఆతడు ఈ మన జగత్తులోనే మృగరూపంగా ఉండటమనేది ఎట్లా సమంజసం? ఏదో మరొక అత్యంత సుదూరంగా ప్రయాణించిన ఒక బాటసారి ఇప్పుడు ఈ జగత్తు – ప్రదేశంలోనే ఉన్నాడనటం ఎట్లా కుదురుతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నీవు 'అతి దూరం' ... 'అతి దగ్గర' అనే శబ్దాలు ఉపయోగిస్తున్నావు. అయితే, ఈ 'దూరం–దగ్గర' అనే అనుభవం పరిచ్ఛిన్నాత్మదర్శులకే ఉంటుంది గాని... అపరిచ్ఛిన్నాత్మ దర్శులకు ఏ మాత్రం ఉండదని గ్రహించు.

ఉదాహరణకు... ఈ చూపుడు వేలు గోరుకు – ఈ కాలి చిటికిన వేలుకు చాలా దూరం ఉండవచ్చుగాక! అవి రెండూ నా అనుభవం దృష్ట్యా నాకు దూరమైనవిగాని, దగ్గరైనవిగాని అనలేం కదా!... అట్లాగే నేను బ్రహ్మరూపమగు నా ఆత్మయందు సమస్త బ్రహ్మాండములు ఒక్కచోట నాయందే ఉన్నట్లుగా గాంచుచున్నాను. ఒకే వస్త్రానికి అనేక రంగు–దారములున్నట్లు నా ఆత్మ అనేక బ్రహ్మాండములను అలంకారముగా కలిగినదై ఉన్నది. కనుక ఈ సర్వబ్రహ్మాండములన్నీ స్వస్వరూపంగా నేను వీక్షిస్తున్నాను. కనుక రామచంద్రా! ఆత్మదృష్టి సంపాదించుకున్నప్పుడు, ఆపై ఇక "వారు నాకు దూరస్థులు, వీరు నాకు దగ్గర వారు" ...అనేవన్నీ మౌనం వహిస్తాయి. మొదలంట రహితమై పోతాయి. ఒకే పూదండకు అనేక పుష్పములు గ్రుచ్చబడి కనిపిస్తున్నట్లు, నాకు భూత – వర్తమాన – భవిష్యత్ బ్రహ్మాండాలు నాయందే నాచే ధరించిన పూదండవలె అగుపిస్తున్నాయి.

❖

ఆ మన తూర్పుదిక్కు విపశ్చిత్తు భేదబుద్ధితో అనేక బ్రహ్మాండాలలో సంచరించి, ఇప్పుడు కాకతాళీయంగా మన ఈ బ్రహ్మాండములోని ఈ జగత్తులోనే 'లేడి' అయి సంచరిస్తున్నాడు.

**శ్రీరాముడు :** అట్లా అయితే స్వామీ! ఆ పూర్వదిక్ సంచారకుడగు విపశ్చిత్ మహారాజు 'లేడి' దేహము దాల్చి ఈ మన జగత్తులో ఏ కొండపై పచార్లు చేస్తున్నాడో... ఏఏ సస్యసంపన్నమైన వనములలో గడ్డితుంపరలను మేస్తూ శిథిల జ్ఞానయుక్తుడై సంచరిస్తున్నాడో... ఆతడు ఎప్పటికి తన యొక్క పూర్వజ్ఞానస్థితిని సంస్మరించనున్నాడో... ఆ విషయములను వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! కొద్దికాలం క్రితం నీ పుట్టినరోజు నవమినాడు త్రిగర్త భూపతి నీకు కానుకగా ఒక సుందరమైన 'లేడి'ని బహూకరించాడు కదా!

**శ్రీరాముడు :** అవును. ఆ మృగము అంతఃపురంలో నా దగ్గరే పెరుగుతోంది. నేను ఆ లేడితో కూడి మా ఉద్యానవనంలో అప్పుడప్పుడూ విహరిస్తూ అద్దాని అమాయకపు బెదురుచూపులు చూచి హాస్యంగా లాలిస్తూ ఉంటాను. ఇప్పుడు ఆ లేడి మా అంతఃపురంలోనే ఉన్నది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవునా! ఆ 'లేడి'యే మనం కథారూపంగా చెప్పుకున్న తూర్పు దిక్కు విపశ్చిత్తు అయి ఉన్నాడు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఆ మాటలు విని మన రామచంద్రమూర్తి అందమైన కళ్ళు ఆశ్చర్యంతో మిలమిలా మెఱిశాయి. వెంటనే దగ్గరగా ఉన్న కొందరు బాల స్నేహితులతో ఆ 'లేడి'ని సభకు తీసుకురావలసినదిగా అప్పటికప్పుడే పలికాడు. వెంటనే సహబాలకులు వెళ్ళి ఒక ముగ్ధ మృగమును (లేడిని) సభా మధ్యంలోకి తీసుకువచ్చారు. ఆ లేడి భయపడుచున్న చూపులతో చేయి విదుల్చుకొని అటూ – ఇటూ పరుగులు తీస్తూ ఇంతలోనే అక్కడి పచ్చల సింహాసనములను గడ్డి పరకలనుకొని ఆశపడుతూ గెంతసాగింది.

ఆ లేడిని చూచిన అక్కడి మునులు, తదితర సభికులు ఇట్లా అనుకోసాగారు. "ఆహా! పరమేశ్వరుని మాయ ఎటువంటిది! భీకర సమరంలో తూర్పు దిక్కులోని రాజాధిరాజులను, మహారథులను నిరుత్తరులను చేసివేసిన ఆ విపశ్చిత్తురాజుయొక్క నాలుగవ రూపము అయినట్టి ఈ మహనీయుడు "ఈ పాంచభౌతిక సృష్టి ఎంతవరకు విస్తరించి ఉన్నది"... అనే చిత్త భ్రమావేశంతో బయలుదేరాడు. అగ్నిదేవుని వరప్రసాదంచేత అనేక దుర్భర స్థానాలలో నిర్భయంగా ప్రయాణించి... అగ్ని–జల–వాయు ఆవరణలలో అప్రతిహతంగా సంచరించి... చివరికి తన యొక్క మనస్సుచే మోసగించబడ్డాడు. ఆ చంద్రలోక ప్రవేశం సంపాదించుకుని కూడా, చివరికి శించి కూడా అక్కడి హరిణము (లేడి)చే ఆకర్షితుడై అట్టి సుదీర్ఘ సంస్కారం కారణంగా లేడి ఉపాధిని పొందారే! ఇంత అజ్ఞాని అయి తన ఆశయములన్నీ ఏమరచినారే! మనోదురభ్యాసం ఎంతటి ప్రమాదకరం! మరి ఈ జీవులు తమ మననాభ్యాసం యొక్క తదనంతర విపత్కర పరిణామాల గురించి కొంచెం కూడా శ్రద్ధ చూపకుండా గుడ్డిఎద్దు చేనులో పడినట్లు జీవిస్తున్నారు. 'అజ్ఞానంచే పొందబోయే అగచాట్లు అతిదుర్భరమైనవి. అంతులేనివి'... అని ఈ ప్రియ వసిష్ఠ మహర్షి సంవాద సమయంలో అనేక సందర్భాలలో మనలను హెచ్చరించినదానికి ఇదే ప్రత్యక్ష సాక్ష్యం కాబోలు!"

ఇట్లా... సంభాషించుకోసాగారు. ఆ సభలోని అందరి కళ్ళు ఆ లేడిపైనే ప్రసరించి ఉన్నాయి. అది ఒకానొక బలిష్టుడైన రాజసేవకుని చేతులచే పట్టుకోబడి భయముతో కాళ్ళు చేతులు కదులుస్తూ, బిత్తర చూపులు చూస్తోంది. ఇక సభికులంతా... "ఆహా! 'ఇక మనం జ్ఞానులమైనాం లే!' అని మురిసిపోయి, మనస్సు యొక్క దృశ్య సంబంధమైనట్టి సుదీర్ఘ మననాన్ని పట్టించుకోకపోయామా... ఇక మన తదనంతర ఉపాధుల గతి ఈ విధంగానే దుర్గతి పట్టనున్నది కదా! మనకు ఆత్మజ్ఞాన సమాచారం ఎంత ఆవశ్యకం!" అని అనుకోసాగారు. మరల మరల శ్రీ మహర్షి వసిష్ఠుల యొక్క విశ్వామిత్రుల యొక్క పాదార విందములను మననము చేస్తూ, సద్గురువులై ఆత్మ జ్ఞానమును ప్రసాదిస్తున్న ఆ ఇరువురికి అంతరంగంలో కృతజ్ఞతలు చెప్పుకోసాగారు.

❖❖❖

# 14. నాలుగవ విపశ్చిత్ - పూర్వ ఉపాధి ప్రాప్తి

ఆ నాలుగవ విపశ్చిత్తును చూస్తూ ఉన్న రామచంద్రుడు కాసేపు బుగ్గలపై చూపుడు వేలు ఉంచుకొని యోచనాముద్రలో గడిపాడు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! శ్రీరామచంద్రుడు అత్యంత ఆశ్చర్యంతో "ఆహా! మహావీరుడు, అగ్నిదేవుని ఆరాధకుడు, దృశ్యజగత్తులోగల అనేక సంక్లిష్ట ప్రదేశాలలో కూడా సంచరించగల శక్తి యుక్తులు కలవాడు, దృశ్యము యొక్క విస్తారం ఎంతవరకో దర్శించాలనే కుతూహలం కలవాడు అగు విపశ్చిత్తు ఇప్పుడు ఈ లేడి దేహంతో తన్మయుడై ఉండటం ఎంత ఆశ్చర్యం! మాయయొక్క పర్యవసానం ఎంతటి చమత్కారమైనది!" ...అని తలచసాగాడు.

అటు తరువాత లోక గురువగు శ్రీవసిష్ఠ మహర్షి వైపు చూచి వినమ్రతతోను, సంభ్రమ ఆశ్చర్యాలతోను రామచంద్రుడు ఇట్లు పలుకసాగాడు.

❖

**శ్రీరాముడు :** ఓ మునీశ్వరా! మహనీయుడు, అసామాన్యమైన ఆశయశీలి అగు నాలుగవ విపశ్చిత్తు తన ఆశయమును, విజ్ఞానమును, ఉపాసనలను ఏమఱచి ఈ విధంగా లేడి దేహంతో తన్మయుడై దేహాత్మబుద్ధిచే పీడితుడగుచుండటం నాకు దుఃఖాన్ని కలుగజేస్తోంది. మృగదేహధారియగు విపశ్చిత్తు తిరిగి తన తపో శరీరం పొందటానికి ఏదైనా ఉపాయం ఉన్నదా? ఆత్మజ్ఞానము కలుగనంతవరకు జీవుడికి దుఃఖ రాహిత్యం కలుగదు కదా! నేను ప్రియంగా ఆడుకుంటూ ఉండే లేడి మృగానికి దేహతాదాత్మ్య దుఃఖం తొలిగే మార్గం చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎవడు ఏ ఉపాసనా మార్గంలో ప్రయాణిస్తున్నాడో... ఏ ఉపాసన ద్వారా అభిలషితమైనది సిద్ధించుకున్నాడో... ఆ ఉపాసనా దైవం యొక్క కృపచేతనే మరల తదనంతర అభిలషితం కూడా నెరవేరుతూ ఉంటుంది. మరొక్క విషయం! ఈ దృశ్య సంబంధమైనవేవీ జీవునికి తృప్తి – శోభ – సుఖము కలిగించలేవు. ఈతడు ఇతఃపూర్వం అగ్నిదేవుని ఉపాసించి, దిగంతమూ దర్శించాలనే అభిలాషతో ఆయన కరుణచే దివ్యశరీరం పొందాడు. అట్టి జగత్ ఆసాంత దర్శనం పూర్తి కాకుండానే స్వకీయమైన మనోభ్రమచే పరాజితుడై ఇప్పుడు "ఈ లేడి దేహమే నేను" అనే దేహాత్మ భావనలో చిక్కుకుని పరవశిస్తున్నాడు.

అందుచేత ఈతడు ఆ అగ్నిదేవుని యొక్క దర్శన ప్రవేశములచే తన ఇతఃపూర్వపు విపశ్చిత్ దేహం పొందగలుగుతాడు. కనుక ఇప్పుడు నేను అగ్నిదేవుని ఆరాధించి ఆహ్వానిస్తాను. ఆయనలో ఈతడు దేహ ప్రవేశం పొందితే తిరిగి ఆ అగ్నిదేవుని ప్రేమాస్పదమైన స్పర్శచేత పూర్వ దేహం పొందుతాడు. ఇదంతా ఇక్కడే నేను ప్రియ శిష్యుడవగు నీ అభీష్టం నెరవేర్చటానికి సిద్ధింపజేస్తాను చూడు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! బ్రహ్మర్షియగు ఆ వసిష్ఠుడు ఇట్లా పలికి కమండలంలోని పవిత్ర జలంతో అప్పటికప్పుడే ఆచమనం చేసి, అంగన్యాస, కరన్యాసాలతో అగ్నిదేవుని భక్తితో ఉపాసించాడు. సృష్టి అంతా ప్రసరించి ఉన్న ఆ అగ్ని భగవానునికి మనోకరాలతో ధ్యాన, ఆవాహనాది షోడశోపచారాలు సమర్పించాడు. ఆ భక్తి ధ్యానాదులకు సంతసించిన అగ్ని భగవానుడు ఇంధన రహితుడైన (కట్టెలు మొదలైన ఉపకరణాలు లేనట్టి) జ్యోతి స్వరూపుడై అగ్ని జ్వాలాస్వరూపుడై ధగద్ధగాయమానంగా స్వచ్ఛ స్వరూపంతో సభామధ్యంలో ప్రత్యక్షమైనాడు. జ్యోతిస్వరూపుడగు అగ్ని దేవుని సభామధ్యంలో దర్శించి సభికులందరు అగ్నిదేవునికి ప్రణామాలు సమర్పించారు.

అక్కడగల హరిణం (లేడి) ఆ అగ్నిదేవుని దర్శించింది. మరుక్షణం ఇతఃపూర్వపు భక్తి ప్రపత్తులు ప్రవృత్తమైనాయి. అగ్నిదేవతా దర్శనముచే పాపం నశించిన ఆ మృగరూపిణి అగ్నిదేవునికి ప్రణమిల్లుతూ, తన ఇష్టదైవమైన అగ్ని భగవానుని పాదాలు స్పృశించాలనే ఇచ్ఛ పొందింది. అంతే! గబుక్కున రాజసేవకునిచేతిలోనుండి సింహంలాగా ఉరికి, ఒకదాటున ఆ అగ్ని జ్వాలలో ప్రవేశించింది. అది గమనిస్తున్న సద్గురువగు వసిష్ఠ మునీంద్రుడు తన దివ్యమైన దృష్టులచే ఆ మృగాన్ని మరింతగా పావనం చేస్తూ (పాపరహితం చేస్తూ), అగ్నిదేవుని ఉద్దేశించి ఇట్లు పలికారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (లేచి నిలుచుని, సాష్టాంగ ప్రణామం సమర్పించి) ఓ హవ్యవాహనా! దేవాది దేవా! అగ్నిదేవా! మా ఆహ్వానం మన్నించి ఇంధన రహిత జ్వాలారూపుడవై ఈ సభా మధ్యానికి వేంచేసిన మీకు హృదయపూర్వక ప్రణామములు. స్వామీ! ఈ హరిణం ఇతఃపూర్వపు విపశ్చిత్తు ఉపాధిలో మిమ్ములను ఆరాధించి సేవించింది. ఇప్పుడు దేహతాదాత్మ్యముతో అనేక క్లేశములు అనుభవిస్తోంది. కరుణా సముద్రులగు మీరు ప్రేమతో ఈ జీవుని సముద్ధరించి పూర్వ సంస్కారాలతో కూడిన విపశ్చిత్ దేహం ప్రసాదించమని మిమ్ములను వేడుకుంటున్నాను.

**శ్రీ అగ్ని భగవానుడు :** మహర్షుల వాక్యము సిద్ధించునుగాక! నన్ను సుదీర్ఘకాలం విపశ్చిత్ దేహంతో ఉపాసించి ఇప్పుడు ఈ హరిణదేహం నాకు సమర్పిస్తున్న ఈ నా భక్తుడు తన యొక్క ఇతఃపూర్వపు సంస్కారములు – తదనంతర జ్ఞాపకములతో సహా విపశ్చిత్ దేహధారి అగునుగాక! మీ జ్ఞాన యజ్ఞములోని పాత్యాంశములు నిరూపణలు పొందుచున్నవై ఈ సభికులకు, భవిష్యత్ జనులకు బ్రహ్మజ్ఞాన ప్రదమై పరిఢవిల్లును గాక!

ఇదంతా సభికులంతా తన్మయులై చూస్తున్నారు. క్రమంగా 'కాష్ఠరహిత జ్వాలాగ్ని'లో ప్రవేశించిన ఆ హరిణం రామచంద్రుని అభిలాషానుసారం సద్గురువు వసిష్ఠుని చల్లటిచూపులకు పాత్రతపొంది, అగ్నిదేవుని వరప్రసాదముచే ఆ జ్వాలా గర్భంలో హరిణ దేహం త్యజించింది. ఆ అగ్నిజ్వాలలలో నుండి సుందర ఆకారయుక్తుడు, ఆజానుబాహువు, ప్రకాశవంతమైన కనులు – అవయవములు గల వాడు అగు ఒక సుందర పురుషుడు రూపు దిద్దుకున్నాడు. సూర్యమండలంలోని సూర్యునిలాగా, చంద్రమండలంలోని చంద్రునిలాగా ఆతడు ఆ అగ్నిజ్వాలలో నుండి బయల్వెడల సాగాడు. "అగ్ని అనే ఆధారం కలిగిన శక్తియే ఆ పురుషాకృతి దాల్చుచున్నదా?" ...అని అక్కడి సభికులకు ఆ దృశ్యం తలపింపజేసింది.

ఇంతలో అక్కడి ఇంధనరహిత అగ్నిజ్వాల అంతర్ధానం కాసాగింది. అట్లా అగ్నిదేవుడు అంతర్ధానం కాగానే ఆ సభా మధ్యలో - దేవాలయంలోని దేవతా ప్రతిమలాగా, తెరనుండి వెలువడిన నాయక పాత్రలాగా - ఆ మహాపురుషుడు ప్రత్యక్షమైనాడు. ఆతడు రుద్రాక్ష మాలలు ధరించి, బంగారు యజ్ఞోపవీతము కలిగి, పవిత్రమైన తెల్లటి వస్త్రధారుడై దేవతాపురుషునివలె వెలుగొందుచూ ఉన్నాడు. సభాసదులు ఆతనిని చూచి, "ఆహాఁ! ఏమి ఈతని తేజస్సు! మహా ప్రకాశమానుడగుట చేత ఈయన 'భాసుడు' అని పిలుపుకు అర్హుడు" ...అని భాస నామధేయంతో పిలువసాగారు. ఇంతలో ఆతడు తాను ప్రకటనమైనచోటే పద్మాసనంతో ఆసీనుడైనాడు. సభికులంతా ..."ఆహా! భాసుని తేజో పుంజములతో సభాప్రాంగణమంతా వెలుగొందుచున్నది కదా!" ... అని పలుకసాగారు.

ఒక ముహూర్తకాలం ఆ విధంగా గడిచిపోయింది. సభాసదులచే 'భాసుడు' అనే పేరుచే పిలువబడుచున్న ఆ నాలుగవ విపశ్చిత్తు అట్లా ధ్యానంలో కొంతసేపు గడపిన తరువాత... తన పూర్వ వృత్తాంతం స్మరించి, ఒక్కసారిగా సంభ్రమాశ్చర్యాలతో కనులు తెఱచి, లేచి నిలుచున్నాడు. నిలబడి యథాక్రమంగా ముని-రాజు-సామంతాదులతో కూడుకొనియున్న ఆ సభనంతా కలియచూచాడు. ఎదురుగా పూర్ణ చంద్రునిలాగా ప్రశాంతమైన రూపు - చూపులతో ప్రకాశిస్తూ, వసిష్ఠ మహర్షి ఎత్తుగా ఉన్న సద్గురు పీఠంపై ఆశీనులై ఉండటం గమనించి, చిన్నగా ఆయన వద్దకు అడుగులు వేయసాగాడు.

❖

**భాసుడు :** సద్గురుస్థానం అలంకరిస్తూ, జ్ఞాన సూర్యునివలె ప్రకాశిస్తూ, సూర్యభగవానుడు లోకములకు ప్రాణధారం అయినట్లు నావంటి అజ్ఞాన జీవులకు జ్ఞాన - త్రాణలను ప్రసాదించే ఓ మహాత్మా! మీకు సాష్టాంగ దండ ప్రణామములు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (ఆ భాసుని శిరస్సును వాత్సల్యపూర్వకంగా చేతి వ్రేళ్ళతో స్పృశిస్తూ) ... ఓ భాసనామధేయా! "జనవాక్యంతు కర్తవ్యమ్" ...అనునట్లుగా తేజో రూపుడవగు నీకు "భాసుడు" అని ఈ సభికులు పేరు పెట్టటం సముచితమే! నన్ను "వసిష్ఠుడు" అని పిలుస్తారు. నీవు అయోధ్యానగరం రాజసభామధ్యంలో అగ్నిదేవుని కృపచే ఇతఃపూర్వపు విపశ్చిత్ దేహం పొందినవాడవై భాసిస్తున్నావు. నీకు సుస్వాగతం. నీవు సమర్పించిన భక్తిపూర్వకమైన నమస్కారమును స్వీకరిస్తూ "అతి దీర్ఘకాలంగా పట్టి పీడిస్తున్న అజ్ఞానం తొలగుగాక!" అని ఆశీర్వదిస్తున్నాను. ఇదిగో ...ఈతడే అవతారమూర్తియగు శ్రీరామచంద్రుడు. లోక కళ్యాణార్థమై ఆశ్రితులను రక్షించి, దుష్ట శిక్షణ నిర్వర్తించే ఆశయంతో అవతరించిన ఈ పరమ పావనమూర్తి నా ప్రియశిష్యుడు, ఇక్కడి రాజకుమారుడు కూడా! అదిగో... ఆ రాజ సింహాసనంపై బ్రహ్మదేవునివలె అధిష్ఠించియున్నది సూర్యవంశ జాతకుడైన శ్రీ దశరథ మహారాజు ఈ అయోధ్యకు చక్రవర్తి.

ఇదిగో, ఈయనే బ్రహ్మర్షి - అసమాన ప్రజ్ఞా ధురంధరుడు, ఆశ్రితవత్సలుడు, ప్రేమస్వరూపుడు, లోకకళ్యాణమూర్తియగు విశ్వామిత్ర భగవానుడు. ఈయన ప్రోత్సాహంచేతనే ఇరవైరోజులుగా ఈ

అయోధ్యా సభలో, నారదాది అనేకమంది మహనీయుల సమక్షంలో 'మోక్షశాస్త్రం' ఉపాసించ బడుతోంది. మీరు కూడా సుఖాసీనులు కండి. ఆయా మోక్షశాస్త్ర సిద్ధాంతముల నిరూపన నిమిత్తమై స్వానుభవ పూర్వకమైన మీ మధుర వాక్కులు వినాలని మేమంతా ఉవ్విళ్ళూరుచున్నాం.

**శ్రీ భాసుడు :** ఓ రామచంద్రా! వసిష్ఠ మహర్షి ప్రియశిష్యా! నీ అవతార సంపదకు సర్వదా జయమగుగాక! శ్రీ దశరథ మహారాజా! నమస్కారం! మీ కుమారుడైన ఈ రామచంద్రమూర్తిని దర్శించి నేను పునీతుణ్ణి అగుచున్నాను.

**శ్రీ దశరథుడు :**

> **స్వాగతం తే అస్తు భో రాజన్! ఇదమ్ ఆసనమ్ ఆస్యతామ్ ।**
> **అనేక భవ సంభార భ్రాన్త విశ్రమ్యతామ్ ఇహ ॥**

ఓ విపశ్చిత్ చక్రవర్తీ! భాసబిరుదాంకితా! మీకు సుస్వాగతం! రండి! దయచేయండి. ఈ సింహాసనంపై సుఖాసీనులవండి. అనేక జన్మలందలి సంసార భ్రమచే మీరు అలసిపోయి ఉన్నారు. ఈ ఆసనంపై విశ్రాంతి తీసుకొనెదరుగాక!

ఓ సభికులారా! సద్గురువగు వసిష్ఠ మహర్షి ఈ రోజు "అవిద్య అంతరంగంలో ఉన్నంతవరకు అవిద్యా జగత్తులకు అంతము ఉండదు" ...అని నిరూపించటానికి ఈ విపశ్చిత్ మహారాజును ప్రత్యక్షంగా మన కళ్ళముందు చూపించటం వర్తమానపు పాఠ్యాంశానికి నిరూపణమే అవుతోంది. కట్టుకొయ్యకు కంబమునకు బలమైన త్రాడుచే బంధించబడిన మదగజంలాగా ఈ విపశ్చిత్ మహారాజు అవిద్యచే చిరకాలం దృశ్యబద్ధులవడం జరిగింది. అనేక పాంచభౌతిక దేహపురాలలోను, బాహ్య పురములలోను ప్రవేశ – నిష్క్రమణములను కొనసాగించి ఉన్నారు.

ఆహా! 'సమ్యక్ జ్ఞానం' లేకపోవటమే అవిద్య. అట్టి అవిద్యారూపమగు అల్పదృష్టి యొక్క గతి అతిభయంకరమైనది కదా! ఈ అవిద్య 'చిదాకాశము' నందు అనేక సృష్టుల ఆడంబరమును దర్శించేట్లు చేయుచున్నది. అజ్ఞాన జీవబాటసారులవంటి మనలో అనేకుల సుదీర్ఘ దేహ–దేహాంతర ప్రయాణాలు ఇట్టివే కాబోలు!

ఆహా! ఈ భాసుడు సర్వవ్యాపకము – స్వస్వరూపము కూడా అయి ఉన్న నిర్మలాత్మ యందు అనేక జగదాడంబరములను సందర్శించియున్నాడు. వాస్తవానికి చిదాత్మ జగత్ రహితం. అయితే ఏం? 'మాయ' యొక్క స్వభావం ఇట్టిదే కదా! పరమాత్మఘనమగు చిదాకాశము వాస్తవానికి శూన్యమే (జగత్తు మొదలైనవి లేనట్టిది) అయినప్పటికీ... అది అజ్ఞాన దృష్టికి అనేక జగత్తులు ధరించియున్న దానివలె భాసిస్తోందే! ఏమి ఆశ్చర్యం!

'ఈ విపశ్చిత్తు చూచిన అనేక జగత్తుల సంరంభము, ఆతడు ఆ ప్రయత్నంలో పొందిన అనేక క్లేశములు... అవన్నీ ఆత్మజ్ఞాన రాహిత్యముచే ప్రాప్తించినవి. భ్రాంతి రూపము, వ్యర్థము అయినవి' అని నేను సద్గురు శ్రీ వసిష్ఠ మహర్షి వాక్యముల ద్వారా గ్రహించుచున్నాను. 'ఈ పాంచభౌతిక సృష్టి యొక్క అంతు చూడాలి"... అనే కుతూహలం (లేక కౌతుకం) చివరికి అనేక క్లేశములకే దారి

తీయగలదని నేను ఈ 'సంవాద విభాగము' నుండి గ్రహిస్తున్నాను. 'ఆత్మజ్ఞానం' అనే ఔషధం మనం సేవించకపోతే మన ఈ వర్తమాన ఉపాధి వరకు కొనసాగిన ప్రయాణం కూడా ముందు ముందు ఇట్టిదే అత్యంత సుదీర్ఘం, అపారం, అంతులేనిది కాగలదని మనమంతా గ్రహించెదముగాక!

❖❖❖

# 15. భావనాకల్పిత జగత్తు

**శ్రీ వాల్మీకి :** ఓ భరద్వాజా! దశరథ మహారాజు అట్లా చెప్పగా, విని ఆ ప్రక్కనే ఆసీనులై ఉన్న విశ్వామిత్ర మహర్షి ప్రసంగవశంగా ఈ విధంగా పలికాడు.

❖

**శ్రీ విశ్వామిత్ర మహర్షి :** ఓ దశరథ మహారాజా! మీరు చెప్పింది పరమసత్యం. ఎవరు "ఆత్మజ్ఞానం" అనే ప్రజ్ఞను మానవ ఉపాధి చేజారకముందే తగినంతగా పెంపొందించుకోరో, సుదృఢపరచుకోరో, అట్టి వారు ముందుముందు పొందబోయే దేహ పరంపరలు ఈ రీతిగానే (ఈ మన ఈ విపశ్చిత్తు చక్రవర్తి పొందిన 'దేహ పరంరలు' అనే దౌర్భాగ్యంలాగానే) అనివార్యమై ఉండబోతున్నాయి. వాస్తవానికి అనేక మంది జీవులు ఈ ప్రకారంగానే తమ తమ వాసనలచే పరాభవించబడుచూ – భ్రాంతి రూపములైన అసంఖ్యాక జగత్తులు సందర్శిస్తూ ఉండటం మేము సర్వదా గమనిస్తున్న దైనందిన విషయమే! ప్రజ్ఞాధురంధరుడై కూడా, ఈ విపశ్చిత్తు "ఈ అవిద్యా జగత్తు యొక్క విస్తారం తెలుసుకోవాలి" అనే మొండి పట్టుదలతో అంతులేకుండా ప్రయాణిస్తూ, తత్ఫలితంగా అనేక దుర్భర స్థితులన్నీ తెచ్చిపెట్టుకొని అనుభవించినట్లే... అనేక మంది జీవులు సంసార బద్ధులై సంచరిస్తు న్నారు. అట్టి ఉపాధి పరంపరా ప్రాప్తినే 'సంసారము' అనే పేరుతో శాస్త్రాలు పిలుస్తున్నాయి.

అసలు ఈ జగత్తులు, ఈ ఉపాధి పరంపరలు పొందటానికి మూడు ముఖ్య కారణాలు కనిపిస్తున్నాయి.

1. "ఏదో పొందాలి! అనుభవించాలి" అనే కామబుద్ధి
2. "వీరు నా వారు. అవి నావి. వీరితో మరి కొంత అనుభవం కలిగి ఉండాలి" ...అనే భ్రమతో కూడిన మనో బాంధవ్యాలు.
3. "ఇదంతా ఏమి చమత్కారమో – ఎందుకో – ఎంతవరకో ఇంకా మనం తెలుసుకోవాలి" ... అనే మూర్ఖత్వముతో కూడిన కౌతుకము.

నాకు "వటధానులు" అనే పేరుగల ముగ్గురు రాజపుత్రులు తెలుసు. వారు కూడా "ఈ భూమి యొక్క అంతమును మేము చూడాలి" అనే మూర్ఖ కౌతుకమును ఆశ్రయించినవారై గత పదిహేడు లక్షల సంవత్సరాలుగా ఈ భూతలముపై తిరుగాడుచూనే ఉన్నారు. అనేక ఉపాధులలో ప్రవేశిస్తున్నారు, నిష్క్రమిస్తున్నారు. జన్మ – జరా – మరణ పరంపరలు పొందుచూనే ఉన్నారు. ఏం లాభం? వారికి ఈ భూమి యొక్క అంతు కనిపించటం లేదు. వారిలో ఆ కౌతుకం తరగటం లేదు.

"అసలీ సృష్టి యొక్క (దృశ్యం యొక్క "వాస్తవ రూపం ఏమిటి?" ...అని మనం ప్రశ్నిస్తే వచ్చే సమాధానం వినండి.

ఈ భూలోకం, భువర్లోకం మొదలైన చతుర్దశ భువనాల (14 లోకాలు)తో కూడిన మహత్తరమైన బ్రహ్మాండము వర్తులాకారంగా ఉన్నది. పైగా ఇదంతా కూడా "హిరణ్యగర్భుడు" అనే అల్లరి పిల్లవాని "ఊహలు / సంకల్పములు" అనే భావనాపరంపరలచే నిర్మితమైయున్నది. ఆతని సంకల్పములకు వేరైన రూపమేదీ ఈ బ్రహ్మాండమునకు లేనేలేదు. ఈ జీవుడు తన సంకల్ప పరంపరలచే ఆ మహాసంకల్ప పరంపరలందు ప్రవేశించి తిరుగాడుచున్నాడు.

ఓ సభికులారా! తేనె పూసిన బంతిని ఒకచోట ఉంచినపుడు పది వైపుల నుండి గండు చీమలు చుట్టుముట్టుతాయి చూచారా! అట్లాగే ఆకాశమునందు బ్రహ్మదేవునిచే ఊహానిర్మితమైన ఈ బ్రహ్మాండము అనే కందుకము (బంతి)ను ఆధారంగా చేసుకొని పది దిక్కులలోను జీవులు తిరుగాడుచున్నారు. ఇంద్రియములను వ్యామోహపరచే శబ్ద – స్పర్శ – రూప – రస – గంధాలే ఇక్కడి బ్రహ్మాండమునకు పూయబడిన తేనె.

ఈ భూలోకానికి ఊర్ధ్వ భాగంలో అనేక లోకాలు ఉన్నాయి. అధో భాగంలో మరికొన్ని లోకాలు ఉన్నాయి. అవన్నీ దశదిశలా విస్తరించి ఉన్నాయి. అవన్నీ ఈ బ్రహ్మాండము యొక్క దేహ విభాగాలని అనవచ్చు. అట్టి లోక పరంపరల యొక్క చివర ఎక్కడున్నదో చూడాలని ప్రయాణిస్తున్న వటధాన రాజకుమారులు ఇప్పటికీ ఊర్ధ్వ, అధో – పార్శ్వలోకాలలో సంచారం కొనసాగిస్తున్నారేగాని, వారికి ఈ బ్రహ్మాండము యొక్క అంతు కనబడటమే లేదు. ఈ లోకాలలోని జీవులందరు ఇట్టి స్థితినే కలిగి ఉండి అటు ఇటూ సంచరిస్తున్నారు.

అటు ఆకాశం జ్యోతిశ్చక్ర సహితంగా భూమిని గొడుగువలె ఆవరించి ఉన్నది. అంతరిక్షమునకు దశదిశలా ఊర్ధ్వ – అధోభాగాలు ఉన్నాయి. భూమికి పైన ఆకాశంలో పక్షులు ఎగురుచున్నాయి. భూమిపై అనేక లక్షల జీవ జాతులున్నాయి. భూమి యొక్క అధోభాగంలో అనేక కీటకాలు మనుగడ సాగిస్తున్నాయి.

అట్టి ఆయా అనేక లోకాలలో రకరకాల ఉపాధులు ధరిస్తూ, త్యజిస్తూ వటధానులనే ముగ్గురు రాజకుమారులు నాకు అక్కడా – ఇక్కడా తారసపడుతూనే ఉంటున్నారు. నా ఆప్తవాక్యాలు వింటూనే ఇంతలోనే యుద్ధ పిపాసులవలె కౌతుకం చంపుకోలేక ఈ మాయా జగత్తులో మరల మరల ప్రవేశిస్తున్నారు.

"ఏమయ్యా! ఎందుకీ భ్రమతో కూడిన సంచారం?" ...అని ప్రశ్నిస్తే ..."ఈ సృష్టి యొక్క అంతు చూడగలిగేంత వరకు మేము ఇకపై కూడా ఇట్లాగే సంచరిస్తాం" ...అని పలుకుచున్నారేగాని, నా ఆప్త (జ్ఞాన) వాక్యములు విని కూడా పరమార్థం గ్రహించటం లేదు. నన్ను అప్పుడప్పుడూ ఆశ్రయిస్తున్నప్పటికీ వారి హృదయములో నా జ్ఞానబోధ తగినంతగా ప్రవేశించటం లేదు.

ఓ సభికులారా! "బ్రహ్మదేవుని సంకల్ప మాత్రం – అనేక ఆడంబరములతో కూడినది" అగు ఈ మిథ్యారూప జగత్తు స్వప్న దృశ్యము వంటిది. ఇదంతా సంకల్ప జనిత అజ్ఞానం చేత అనంత

రూపంగా శోభిస్తోంది. అయితే... అట్టి ఈ కల్పనా జగత్తు చైతన్యమే అధిష్ఠానంగా కలిగి ఉన్నది. అందు ఈ 'జగత్తు' అనబడేది కూడా చిద్రూపమే అయి ఉన్నది. జలమునకు – జలతరంగాలకు, వాయువుకు – వాయువీచికలకు భేదమేమున్నది? ఆకాశమునకు – శూన్యమునకు భేదమేమున్నది? అట్లాగే చిద్రూపమునకు జగత్తుకు... తెలివి – తెలియబడేది అనే రూపంచేత ఒకదానికి మరొకటి అభేదమే సుమా! చిన్మాత్రము యొక్క ఏ స్ఫురణ జగత్తుగా భాసిస్తోందో... అదంతా కూడా చిన్మాత్రము యొక్క అంగమే కాబట్టి చిన్మాత్రమునకు వేఱుకాదు. ఈ విధంగా "ఈ కనబడే జగత్తు పరమాత్మ యొక్క దేహమే కాబట్టి పరమాత్మకు వేఱుకాదు"... అనే అవగాహనను సభికులంతా పెంపొందించుకొనెదరుగాక! ఈ సృష్టియొక్క 'ఆది' యందు ఈ జగత్తు అభావ రూపంలో ఉన్నది. ఈ జగత్తు ఇపుడు కూడా శూన్యరూపమే!

చిదాకాశమొక్కటే ఉన్నది. ఆ పరబ్రహ్మరూపమగు చిదాకాశమే ఇప్పుడు స్వయంగా ఇట్లు జగత్ రూపంగా భాసిస్తోంది. వాస్తవానికి సృష్టిగాని, అద్దాని స్థితిగాని, ప్రళయంగాని చిదాకాశము కంటే ఏమాత్రం వేఱుకాదు.

అట్టి చిద్రూపము ప్రాణుల కామ – కర్మ – వాసనానుసారం ఎట్లెట్లు కల్పన చేయబడుచున్నదో, ...అట్లట్లు అనుభూతమౌతూ ఉంటోంది. వాసనానుసారం జగత్తుగా బ్రహ్మమునందు అధ్యస్థమై అనుభవమౌతోంది. "అన్యోన్యతాదాత్మ్యము" చే ఏర్పడే దృష్ట – అదృష్టములు (కనబడే జగత్తు – చూచే ద్రష్ట), జడ – చిద్రూపములు ...అనువాటితో కూడిన జగత్తు మొట్టమొదట (జగత్తు ఉదయించినప్పుడు) ఎట్లా ఉన్నదో... ఇప్పటికీ అట్లే ఉన్నది. ఇక ఎప్పటికీ ఇట్లే ఉండి తీరుతుంది.

"చిద్రూపమగు జీవుని అంగమే ఆతనిచే దర్శించబడే జగత్తు. నాచే దర్శించబడే జగత్తు నా యొక్క దేహాంగమే"... అని మీరంతా గ్రహించండి. ఈ విషయం ఈ మహనీయులగు వసిష్ఠ మహర్షి యొక్క బోధ వాక్యములు మనందరిని తట్టి లేపి బోధించుచుండటం ఇన్ని రోజులుగా గమనిస్తున్నాం కదా! ఈ శ్రీ వసిష్ఠ మహర్షి – ఈయన ప్రవచనాలు మనకు కరుణామూర్తియగు పరమాత్మయొక్క వాత్సల్యరూపంగా మనందరికీ లభిస్తున్నాయి ఇదంతా మనందరి యొక్క జన్మజన్మార్జిత పుణ్యఫలంగా మనకు లభిస్తోంది.

'జగత్ దర్శనం' అనే సంఘటనలో రెండు పాత్రలు పాల్గొంటున్నాయి– 1. నాశనశీలమగు దృశ్యరూపం; 2. నాశనరహితమగు చిద్రూపం.

జనన మరణ రహితమగు పరమాత్మయే స్వయముగా ఇట్లు జగద్రూపంగా భాసిస్తున్నారు. వాస్తవానికి ఆతడు ఏ రూపంగానూ భాసించటంలేదు. పర్వతంలో శిలగా, బంగారంలో ఆభరణంలాగా, ఆకాశంలో నిర్మల ఆకాశాణువులలాగా... చిద్రూపమగు పరమాత్మ యందు జగదనుభవరూప పరమాణువులు స్థితి కలిగి ఉన్నాయి.

మాయావరణమును ఆభరణముగా ధరించిన పరమాత్మయందు అట్టి స్వభావముతోనే కూడిన ఈ సమస్త జగత్తులు వెలయుచున్నాయి.

మాయా శూన్యము – శుద్ధ చైతన్య రూపము అగు అట్టి పరమాత్మయందు జగత్తులనబడేవేవీ ఏ క్షణంలో కూడా లేవు.

**తదేవ 'జగత్' ఇత్యుక్తం బ్రహ్మ భారూపమాతతమ్ ।**

**పూర్వా – పర పరామర్శాత్ నిపుణం నిపుణాశయాః॥**

నిపుణతతో కూడిన విచారయుక్తులగు ఓ సభికులారా! "బ్రహ్మ ప్రకాశరూపముచే వ్యాప్తమైనట్టి ఆ పరమాత్మయే (ఆభరణానికి బంగారంలాగా) అధిష్ఠాన దృష్టికి (ఆభరణదృష్టికి) సృష్టిలాగా (జగత్తువలె) కనిపిస్తున్నారు"... అని మేము పూర్వాపర విమర్శ చేసిన తరువాత స్వానుభవమును రంగరించి చెప్పుచున్నాం.

ఈ జగత్తు యొక్క రూపం పరమాత్మయే! పరమాత్మయే 'నేను'గా ప్రదర్శితమగుచున్నాడు. జగత్తులో 'పరమాత్మ' తప్ప మరింకేమీ లేదు. పరమాత్మ సర్వదా యథాతథమేగాని 'జగత్తులు' అనబడే దోషమేదీ ఆయనయందు లేదు. పరమాత్మయే మనలో ప్రతిఒక్కరి స్వరూపం నిత్యసత్యం.

**అత్యాశ్చర్యమ్! అనష్టోఽ యమ్ పరమాత్ సదనాత్ స్వయమ్ ।**

**నానాత్వ బుద్ధ్యా నానైవ "జీవోఽ హమ్" ఇతి తామ్యతి ॥**

ఆహా! ఈ జీవుని నిజస్వరూపం పరబ్రహ్మమే! అది సర్వదా పరమాత్మతో ఐక్యము కలిగియే ఉన్నది. కానీ, ఈ జీవుడు నానాత్వ బుద్ధిచే "నేను అల్పజ్ఞుడగు జీవుడను" ...అని తలచి దైన్యము పొంది దుఃఖించుచున్నాడే! ఇది ఏమి ఆశ్చర్యం!

'భాసుడు' అని ఈ సభికులచే నామకరణం చేయబడిన ఓ విపశ్చిత్ మహారాజా! మీ చరిత్ర ఏమిటో, అనుభవములు – అనుభూతులూ ఏమిటో ఏఏ దృశ్యములు చూచారో, ఎచటెచట ఎంతెంతగా సందర్శించారో, ఆయా వృత్తాంతములలో ముఖ్యమైన విశేషాలు సంక్షిప్తంగా వివరించండి. ఇప్పటి వరకు బ్రహ్మర్షియగు ఈ శ్రీ వసిష్ఠులవారు మీ యొక్క అగ్నిదేవ ప్రసాదితమైన నాలుగు దేహాల ధారణ, అవిద్యాంతమును దర్శించే ఉబలాట–కుతూహలాలు, మీ దేహములలో ఒకటి దృశ్య విముక్తి పొందటం, రెండవ – మూడవ సూక్ష్మదేహములతో బ్రహ్మాండ కపాలముల దర్శనం ఇప్పటికీ కొనసాగించటం, నాలుగవది చంద్రమండలములో ప్రవేశించి కాలక్రమేణా ఉబలాటముల కారణంగా 'లేడి' మృగదేహం పొందటం – ఈ వివరాలన్నీ చెప్పారు. ఇక్కడ ఇప్పుడు శ్రీ వసిష్ఠ – రామ సంవాదం రూపంలో ఆత్మశాస్త్రం శ్రీవసిష్ఠులవారిచే ప్రవచించబడుతోంది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని మీ అనుభవములను సభికులకు, ఆత్మజ్ఞాన నిరూపణా సంబంధంగా వివరించండి.

❖

**శ్రీ భాసుడు :** ఓ విశ్వామిత్ర మహర్షీ! తమకు మరొక్కసారి పాదాభివందనం సమర్పిస్తున్నాను. ఓ వసిష్ఠ మహర్షీ! వినమ్రుడనై నేను సమర్పిస్తున్న సాష్టాంగ దండ ప్రణామములను కరుణతో స్వీకరించండి. ఓ దశరథ మహారాజా! మీకు, మీ అయోధ్యా రాజ్య ప్రజలకు అగ్నిదేవుని కరుణచే శుభ–శాంతి – ఐశ్వర్య – ఆనందములు సర్వదా కలుగుగాక! ఓ రామచంద్రా! నీ అవతారము లోకములకు వర్తమాన – భవిష్యత్తులందు అత్యంత శుభప్రదమగు గాక! శ్రీరామ నామం 'సంసార

జాడ్యము' అనే మనో నైర్మల్యమును తొలగించి మమ్ములను పరిశుభ్ర పరచునుగాక! ఓ సభికులారా! మీరు నాకు ప్రతిపాదించిన 'భాసుడు' అనే నామధేయమును వినమ్రుడనై స్వీకరిస్తున్నాను. ఈ వసిష్ఠ మునీంద్రుని ప్రవచనములు మీ హృదయములలో ప్రవేశించి పరిఢవిల్లును గాక! ఓ ప్రియ అగ్నిదేవా! నేను మిమ్ములను స్వల్పముగా మాత్రమే ఆరాధించియున్నాను. అయినప్పటికీ భక్త వాత్సల్యంతో నన్ను ఈ సభకు జేర్చినందుకు హృదయపూర్వకంగా హస్తద్వయంతో హృదయమును తాకుతూ నా ప్రియ ఇష్టదైవమైన మీకు నమస్కరిస్తున్నాను.

ఓ సభికులారా! ఇక వినండి. అవును. ఈ విశ్వామిత్రులవారు చెప్పినట్లుగా నేను ఈ అవ్యాకృతాకాశంలో సుదీర్ఘంగా ఎంతో దూరం ప్రయాణించాను. అనేక దేహాలు ఆశ్రయించి అసంఖ్యాకంగా సుఖదుఃఖాలు చిరకాలం అనుభవించాను. అగ్నిదేవుడు ప్రసాదించిన వరప్రభావం చేత దిగంత దర్శనం చేయాలనే దృఢనిశ్చయంతో ఈ దృశ్య జగత్తులో సుదీర్ఘ సంచారం చేస్తూ సముద్ర తరంగాలవంటి అనేక దృశ్యాలు చూచాను. ప్రవేశించిన ప్రతి బ్రహ్మాండంలోను అనేక ప్రకారములైన దేహములను ధరించి సంచరించాను. ఒక్కొక్క దేహంతో తత్సంబంధమైన వ్యవహారములందు కొంచెము సేపు తన్మయుడను అయినప్పటికీ,.... ఇంతలోనే ఇతఃపూర్వపు (దిగంతం దర్శించాలనే) ఉబలాటపు సంస్కారాలు నన్ను మరల నిదురలేపటం, నేను మరల ప్రయాణం కొనసాగించటం నిర్వర్తించాను. మరల అద్దానియందు వేగంగా మహాప్రయత్న యుక్తుడనైనాను. అట్టి సుదీర్ఘ ప్రయాణంలోని పాఠ్యాంశోపకరణమైన, సందర్భోచితమైన, సాధకజనోపయోగమైన కొన్ని విశేషాలు మాత్రం ఈ సందర్భంలో మీకు విన్నవిస్తాను.

❖

ఒకానొక ఉపాధితో మరణము పొందుచున్న సమయంలో తమోగుణ స్థితియందుండి, ఒక సుందరవృక్షాన్ని తదేకమైన చూపుతో చూస్తూ మరణించాను. నా చిత్తము యొక్క వృక్ష దర్శన వృత్తి ప్రభావం చేత, ఆ వృక్షం గురించిన సంస్కార ఫలితంగా, 'దేహమును పొందాలి' అనే రాగవృత్తి ప్రకోపించటంచేత, స్వయంకృతమైన సుకృత – దుష్కృత ఫలితంగా ఒక వృక్షంగా జన్మించాను. మహావృక్షంగా ఎదిగి వేయి సంవత్సరాల వరకు వృక్షము రూపంలోనే ఉన్నాను. ఆ వృక్ష రూపంలో ఉన్నప్పుడు నాకు బాహ్య వృత్తికి సంబంధించిన ప్రాణ చేష్టలు ఉండేవి కావు. అందుచేత అంతర్ముఖమైన వృత్తులను అనుభవిస్తూ "ఈ వృక్షమే నా దేహము" అనే వృక్ష దేహాభిమానంతో అనేక పగళ్ళు – అనేక రాత్రులు గడిపాను. ఆ వృక్ష దేహంతోనే ప్రకృతి స్పర్శలచే అనేక సుఖదుఃఖాలు అనుభవించాను. వ్రేళ్ళకు నీళ్లు లభించినప్పుడు సుఖముగా పరిపుష్టి పొంది, అవి లభించని వేసవి–కాటక సమయాలలో శుష్కించిపోతూ దుఃఖములను అనుభవించాను. కాలానికి వశుడనై పత్ర–పుష్ప–ఫలాదులను ఉత్పన్నం చేయటమొక్కటే అప్పుడు నేను నిర్వర్తిస్తున్న ప్రాపంచిక వ్యవహారం అయి ఉండేది.

ఆ వృక్ష దేహము నశించగా, అంతరంగములోని సంస్కారముల ప్రభావం చేత కాబోలు... 'లేడి' ఉపాధి పొంది ఆ అల్ప దేహంతో తృణములు భక్షిస్తూ మేరు పర్వత ప్రాంతంలో గల పచ్చిక బయలు ప్రాంతంలో సంచరించాను. "వృక్షముగా ఉన్నప్పుడు ఆ పరిసరములలోని పరమాత్మగానం

యొక్క శ్రవణం చేత ఆ తదనంతరపు లేడి రూపం” అనే ఉన్నతి పొందాను. ఇక అప్పుడు “తృణభక్షణ – దేహరక్షణ” – అనే రెండూ మహత్తర కార్యక్రమములుగా అనిపించేవి.

ఆ తరువాత ఒక అడవిదున్న దేహము ధరించి క్రౌంచ పర్వత గుహలలో నివసించాను. గడ్డి మేస్తూ గేదెల గుంపుపై దృష్టులను సారిస్తూ దేహయాత్ర సాగించాను. అటు పిమ్మట విద్యాధరుడనై విద్యాధర స్త్రీలతో స్నేహపరవశుడనై వారి కళా సౌందర్యమును ఉపాసించాను.

బ్రహ్మదేవుని హంసకు పుత్రుడనై మందాకినీ నదీజలంలో క్రీడిస్తూ ఉండగా 1500 సంవత్సరాలు గడచిపోయాయి. తరువాత మరొకసారి ‘కాలంజరము’ అనే పర్వతముపై నక్కగా పుట్టాను. అప్పుడొక ఏనుగు నన్ను మర్దించి చంపింది. సగం చచ్చిన స్థితిలో ఒక సింహపు పంజా దెబ్బకు ఆ ఏనుగు మరణించటం చూచి చచ్చాను.

సహ్యాపర్వత శిఖరంపై మానవ ఉపాధితో ఉండగా ఒక సిద్ధుని శాపం చేత నీటిలో చేపగా సంచరించాను. ఆ తరువాత దేవతా స్త్రీనై కృతయుగపు సగభాగం గడిపాను. ఒకసారి ఒక గన్నేరు చెట్టుపై వల్మీక పక్షి (క్రౌంచపక్షి) రూపంతో నూరు సంవత్సరాలు గడిపాను.

ఆ తరువాత ఒక సిద్ధుడు ప్రసాదించిన వరప్రభావం చేత, సిద్ధుడనైనాను. ఆ తరువాత “అవిద్య యొక్క అంతు ఎక్కడో చూడాలి”...అనే కుతూహలం మరల నా యందు యథాతథంగా ప్రకోపించింది. అయితే అప్పటికే శారీరకంగాను, మానసికంగాను ఎంతగానో అలసిపోయి ఉన్నాను. అందుచేత వైరాగ్యము పొందినవాడనై ఒక కొండపై ప్రవహించే సెలయేటి ఒడ్డున తాపసుడనై అనేక రోజులు గడిపాను.

❖

ఈ సందర్భంలో నేను కొన్ని అత్యాశ్చర్యకరమైన విషయాలు చూచాను. ఓ సర్వ సభికులారా! అవేమిటో చెబుతాను, వినండి.

**అనేక కోటి బ్రహ్మాండ జననీ! దివ్యవిగ్రహా! -** తపస్సును అనుష్ఠించుచున్న సమయంలో ఒకసారి ఒకచోట ఆశ్చర్యము గొలిపే ఆకృతిగల ఒక స్త్రీని చూచాను. ఆమె శరీరంలో అనేక బ్రహ్మాండాలు, ఆ బ్రహ్మాండాలలో అసంఖ్యాక జీవులు కనిపించాయి. ఆమె శరీరం నిండా అనేక లోకాలు, జల, వాయు, భూచర జనుల ఉనికిని చూచి నేను ఆశ్చర్యం పొందాను. “ఆమె దేహం పంచభూతాలతోనే తయారయిందా? లేక మరింకేదైనానా?” ...అని నాకు అనిపించింది. అద్దంలో ప్రతిబింబాల లాగా...ఆమె శరీరంలో అనేక దృశ్య విశేషాలు కనిపించాయి. అప్పుడు నేను ఇట్లా ప్రశ్నించాను.

**నేను (భాసుడు) :** ఉత్తమమైన దేహంతో కనిపించే ఓ భగవతీ! మీరెవరు? ఈ మీ దేహంలో అనేక జగత్తులు నాకు ఎందుచేత కనిపిస్తున్నాయి? నేనేమైనా భ్రమిస్తున్నానా? లేక, వాస్తవంగానే ఈ బ్రహ్మాండ సమూహములు మీ దేహాంతర్విభాగములేనా?

**ఆ స్త్రీ :** ఓ ప్రియతమా! సమస్త జీవులకు స్వస్వరూపమైన స్వప్రకాశకమైనట్టి శుద్ధ చైతన్యమే నేను. నాకు అందరూ ప్రియులే! అంతా ప్రియమే! ఈ కనబడే సమస్త మహాజగత్తులు నా యొక్క శరీరమే

అయి ఉన్నది. నీకు నేను అనేక జగత్తులు గల శరీరముతో ఆశ్చర్యం గొలుపుచున్నాను కదా! అట్లాగే జగత్తులో కనిపించే ప్రతి వస్తువు ఆశ్చర్యయుక్తం కాదా? అయితే అవివేకులు ప్రతి వస్తువునందు ఉన్నట్టి 'శుద్ధ చిత్స్వభావం' గమనించక వస్తు దృష్టితో చూస్తున్నారు. కాబట్టి వారికి ఆశ్చర్యం గొలపటం లేదు. ఎప్పుడైతే వారికి నీవలెనే 'చిత్స్వభావము' నందు దృఢత్వం కలుగుతుందో అప్పుడు వారు కూడా నీవలెనే సర్వజగత్తులు దేహముగా ఉన్నట్టి నన్ను దర్శించగలుగుతారు. నీ వంటి తపస్యులు బాహ్యజగత్తులో వినబడే ఆయా విషయాలకంటే వేరుగా అంతరము నుండి ("ఇది చేయి. ఇది చేయవద్దు" అనే సూచనలను సుస్పష్టంగా వింటున్నారు కదా! అదియే అంతరంగ జగత్తు యొక్క ఉనికికి నిరూపణ.

బాహ్య జగత్తు – బాహ్యరంగ వేదనము; అంతర జగత్తు – అంతరంగ వేదనము... ఈ రెండూ శుద్ధ చిత్ స్వరూపములే!

సమస్త పదార్థాలలో ఏ 'సత్తా' అనుగతమైయున్నదో ...అది సర్వ జగత్ సహిత సత్తా సామాన్య స్వభావమే సుమా! అనగా... సమస్త జగత్తులో అంతరంగమై ఉన్న సత్తాయే ఒకానొక పదార్థంలో కూడా ఉన్నది. ఒకానొక పదార్థంలో ఉన్న సత్తాయే, సమస్త జగత్తులను ధరించుచున్నదై ఉన్నది. ప్రతి అణువులోను సమస్త బ్రహ్మాండాలుగా ఉన్నది. భౌతిక దృష్టికి కనిపించేదంతా అణువణువూ బ్రహ్మ సత్తాచే పూరితమయ్యే ఉన్నది. అట్లాగే స్వప్నంలో కనిపించే ప్రపంచంలోని ప్రతి అణువులోనూ అనేక బ్రహ్మాండాలు ఉన్నాయి.

అందుచేత ఈ కనిపించే ఒక స్తంభము జడము కదా... అని భ్రమించరాదు. సుమా! అత్యంత జడరూపంగా కనిపించే స్తంభము నందు చేతనత్వము (వస్తు దృష్టి కలవారికి) అగుపించటంలేదు. కానీ నా దేహంలో స్తంభము – పర్వతములు కూడా సంభాషణ నిర్వర్తిస్తూ "మేమూ చేతనులమే" అని చెప్పుకుంటున్నాయి కదా! ఒకానొక పరాశక్తి చేతనేకదా, అనేక అణువులు కలసివుండి, స్తంభము–పర్వతముగా రూపమును దినదినం కొనసాగిస్తున్నాయి!

అట్లాగే చేతనమగు దేహంలో గల ఆనేక జగత్తులు (అజ్ఞాన దృష్టి) అగుపించటం లేదు. కాని ప్రతి దేహంలోను అనేక జగత్తులు ఉన్నాయి! ఈ అణువుల అంతర్గత – బహిర్గత ఆధారరూపమగు పరాశక్తినే నేను!

ఈ విధంగా ఆ స్త్రీ తన నిజస్వరూపమును నిర్వచించి అంతర్ధానం అయింది.

❖

ఓ మహాత్ములారా! అట్లాగే మరొక సందర్భంలో మరొక ఆశ్చర్యకరమైన విషయమును అవలోకించాను. అది ఏమిటంటే... నేను సందర్శించిన ఒకానొక ప్రపంచంలో స్త్రీలు లేరు. కామ రహితులగు పురుష ప్రాణులు మాత్రమే ఉన్నారు. అక్కడ జీవులు పృథివి – గాలి మొదలైన పంచభూతాల నుండి జనించి, మరల మరొకప్పుడు పంచభూతములలో లయమైపోతున్నారు.

ఒక లోకంలో జనులు మేఘాలలో జనించే మెఱుపులను (ఇంద్రధనుస్సు – మేఘ ఖండములు మొదలైన వాటిని) ఆయుధాలుగా చేపట్టుచున్నారు.

ఇంకొకచోట కొన్ని ఊళ్ళ–ఊళ్ళే గాలిలోకి లేచి ఏదో అంధకారంలోకి ప్రవేశించుచు ఉండటం, ఇంతలో మరికొన్ని ఆ అంధకారంలోంచి బయటకు వస్తూ ఉండటం, ఇంకొన్ని ఊళ్ళు మీ అయోధ్యవంటి పట్టణంలాగానే ఇళ్ళు, వీథులు, సభాప్రదేశం, అంతఃపురాలు – మొదలైనవి యథాతథంగా ఉండటం నాకు జ్ఞప్తికి వస్తోంది.

కొన్ని లోకాలలో ఒకే ఒక్క జాతి జీవులు ఉన్నారు. అక్కడ ఒక మనుష్య – దేవతా – నాగ మొదలైన జాతిభేదం లేకుండా ఉన్నది.

ఒకానొక లోకంలో సూర్య – చంద్ర – నక్షత్రాదులు లేవు. భూమి స్వయంప్రకాశమై ఉన్నది. అందుచేత అక్కడ సర్వదా పగలే, రాత్రి అనేదే లేదు.

ఇంకా ఇంకా ఎన్నో లోకాలు చూచాను. అనేక వింత వింత విశేషాలు గుర్తుకు వస్తున్నాయి. ఏది ఏమైతే ఏమున్నది? మన యొక్క విమర్శచే "అనుభవమాత్ర రూపమగు సర్వసాక్షి" లోనే ఈ జగత్తులన్నీ ఉన్నాయిగాని... మరింకెక్కడో కాదు.

జగత్తులన్నీ మన స్వస్వరూప –కేవల సాక్షి యొక్క కల్పనానుసారమే అనుభూతమౌతున్నాయి.

❖

ఓ విశ్వామిత్ర మహర్షీ! పూజనీయులగు మహనీయులారా! ఇంకా నేను అనుభవించి ఉన్న మరికొన్ని విశేషాలు చెప్పుతాను వినండి.

❖

ఒకసారి ఒక ప్రదేశంలో ఒక అప్సరస కౌగిలిలో ఆనందిస్తున్న సమయంలో అకస్మాత్తుగా ఒక నదీ ప్రవాహం వచ్చి మమ్ములను ఇద్దరినీ ఈడ్చుకు పోసాగింది. "ఓ అప్సరసా! ఇదేమిటి? మనం ప్రవాహంలో కొట్టుకుపోతున్నాం?" ... అని ప్రశ్నించాను. "అవును స్వామీ! ఇక్కడ నది పగలు జలరహితంగాను, రాత్రిపూట ప్రవాహ సహితంగాను ఉంటుంది. ఇది నేను మీపైగల వ్యామోహ ప్రభావంచేత ఏమరచాను'' .... అని చెప్పుచూ నన్ను రివ్వున ఆకాశంలోకి తీసుకుపోయింది. మేమిద్దరం ఆకాశంలోనే ఏడు సంవత్సరాలు విహరించాం.

– ఒక లోకం ఇంకా విచిత్రం! అందులో ఒక జీవునిలో అసంఖ్యాక జీవులు, ఆ జీవులలోని ప్రతి ఒక్కరిలో మరికొందరు జీవులు – ఇట్లా అరటిపట్టలవలె ఏర్పడి ఉన్నారు. అక్కడ ఒక్కజాతి జీవులే ఉన్నారు. వారు స్వయంప్రకాశకులై ఉన్నారు. అయితే, ప్రతి జీవునిలోను అసంఖ్యాక వివిధ జీవులు సంచరిస్తూ జీవనం కొనసాగిస్తున్నాయి. ఆకాశంలో సూర్య చంద్రులు, దిక్ విభాగములు, రాత్రింబవళ్ళు, వేద – వాదములు మొదలైనవి అక్కడ లేవు.

ఇంకోసారి 'అమరసోముడు' అనే పేరుగల విద్యాధరుడుగా జన్మించి 1400 సంవత్సరాలుగా గడిపాను. మరొకసారి మేఘ శరీరధారినై అనేక ప్రదేశాలు సందర్శించి అలసిపోయి నిదురించాను. ఆ నిదురలో ఇంకెన్నో లోకాలు సందర్శించాను. అనగా, నా యందే నాకు అసంఖ్యాక లోకాలు కనిపించాయి.

అనేకసార్లు ఈ సృష్టి నా దృష్టికి కనబడనంత దూరం పోవటం, "ఇక ఇదే కదా, దృశ్యము యొక్క చివర!" .... అనుకొనే లోపల మరొక సృష్టిలో ప్రవేశించటం – ఈ విధంగా జాగ్రత్ – స్వప్నాలలో అనేక దృశ్య పరంపరలు దర్శిస్తూ అనేక సంవత్సర సమూహాలు గడచిపోయాయి. కానీ ఏం లాభం? పిశాచానికి వశీభూతుడైన బాలకునిలాగా, నా హృదయమందే ఆరూఢమైయున్న ఈ 'దృశ్యము' అనే పేరుగల అవిద్యకు అంతు ఎక్కడో, ఏమిటో నేను పొందనే లేకపోయాను.

ఒక ప్రక్క "ఇది అసత్యం, భ్రమ" ...అని విచారణచే అనిపిస్తూనే ఉన్నది.

**"నేఽదం నేఽదం సత్" ఇత్యేవ విచారానుభవే స్థితమ్**
**తథాపి ఇదమిదమ్ చేతి దుర్‌దృష్టిః న నివర్తతే!**

"ఇదంతా సత్యమే కాదు" ...అని తెలుస్తూనే ఉన్నది. ఇంతలోనే, "ఇది సత్యమ్! నిజం! నిజమే!" ...అనే చిరకాలాభ్యాస ప్రభావానికి ప్రతిసారి లోను అవుతూనే వచ్చాను. 'విచారణ'ను తిరస్కరించి అనేక దేహాలు అనుభవించాను. అయితే కలకాలం ఏదీ కలిగి ఉండలేదు. ద్వైత సంస్కారం యొక్క ప్రాబల్యం చేత ఏర్పడిన "దృశ్య వస్తువుల పట్ల ఇష్టపడటం"... అనే జాడ్యం నాకు తొలగటమే లేదు. విచారణ – వివేకములను తిరస్కరించటం చేత ప్రతి క్షణం ప్రాప్తిస్తున్న సుఖదుఃఖాలచేత, ఇష్టానిష్ట జనులతో సమాగమంచేత దేశకాలాదుల భేదంగా అనేక సంసార దృష్టులు నాపట్ల రావటం – పోవటం జరుగుచునే ఉన్నది.

ఇదంతా ఇట్లా ఉండగా, ఈ విశ్వమంతా ఎద్దానిలో ఉన్నదో... అట్టి ఒక మహా పర్వతాన్ని చూచాను. ఈ విశ్వమంతా తనయందు ధరించియున్న ఆ పర్వత శిఖరంపై గల ఒకానొక ప్రదేశం తత్త్వవేత్తలకు ఆలవాలమై ఉన్నది. ఆ ప్రదేశం స్వతంత్రమై, ఏకమై, పరిమితి లేనిదై, దేశ–కాల–వస్తువులచే పరిచ్ఛిన్నం కానిదై ఉన్నది. ఆ ప్రదేశంలో తత్త్వవేత్తలు సమావేశమై ఉండడం చేత అక్కడ లభించిన దివ్యానందము ముందు బ్రహ్మలోకంలో బ్రహ్మదేవుడు పొందే ఆనందం కూడా తృణప్రాయమే!

❖❖❖

# IX. భాస - మహాశవోపాఖ్యానం

## 1. మహాశవ వర్ణనం

**శ్రీవాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! 'విపశ్చిత్' అనే రాజు అగ్నిదేవుని వరప్రసాదంతో నాలుగుదేహాలు సంపాదించి "ఈ దృశ్యం ఎంత వరకు విస్తరించి ఉన్నది? చూచి రావాలి" ...అనే కుతూహలంతో బయల్వెడలటం, అందులో ఒక దేహం దృశ్య వ్యవహారం నుండి ముక్తిని పొందటం, మరి రెండు దేహాత్మలు సూక్ష్మదేహంతో బ్రహ్మాండ కర్పరంలో ప్రవేశించి బ్రహ్మాండ పరంపరలను దర్శిస్తూనే ఉండటం... నాలుగవ దేహం 'లేడి' దేహం నుండి – (వసిష్ఠ మహర్షి యొక్క ప్రార్థనను అగ్నిదేవుడు మన్నించటం చేత) – ముక్తిని పొంది అయోధ్యా సభలో 'భాసుడు'గా రూపం పొంది తన సుదీర్ఘ దేహ–దేహాంతర ప్రయాణ విశేషాలు సభికులకు వర్ణించి చెప్పటం జరుగుతోందని మనం క్రిందట ఉపాఖ్యానంలో చెప్పుకొన్నాం. ఇప్పుడు ఆ భాసుని యొక్క ఒకానొక అత్యంతాశ్చర్యకరమైన "మహాశవ దర్శనం" ...అని పిలువబడే అనుభవాన్ని, తదనంతరం కొన్ని విశేషాలను ఈ "భాస – మహాశవోపాఖ్యానం"లో మనం వినబోతున్నాం.

❖

శ్రీవసిష్ఠ మహర్షి ఆధ్యాత్మ శాస్త్రాన్ని బోధిస్తున్న ఆ అయోధ్యాసభలో ఉచితాసనం అధిష్ఠించిన 'భాసుడు' అనే పేరు పొందిన ఇతఃపూర్వపు విపశ్చిత్ తన అనుభవాలను క్రోడీకరించి సభికులను ఉద్దేశించి ఇట్లా ప్రసంగం కొనసాగించసాగాడు.

❖

**భాసుడు :** ఓ మునీంద్రా! విశ్వామిత్ర మహర్షీ! ఓ సభికులారా! అట్లా అగ్నిదేవ వరప్రసాదిని అయివుండికూడా, "ఈ దృశ్యము యొక్క అంతు ఎక్కడో చూడాలి"... అనే అవిద్యచే అంధుడనై సంచరిస్తూ ఉన్నాను కదా! అప్పుడొకసారి ఈ కనబడే జగత్తు కంటే వేరైన మరొక జగత్తులో నాకు అత్యంతాశ్చర్యకరమైన సంఘటన ఎదురైనది, ఆ అనుభూతమైన దానిని ఇప్పుడు మీ ముందు ఉంచబోతున్నాను. సావధానులై వినమని నా విన్నపం.

ఈ జగత్తులోని జనులకు అగమ్యమైన ఆకాశంలోని ఒకానొక స్థానంలో చంద్ర–సూర్యాదుల దీప్తిచే ప్రకాశిస్తున్న ఒక బ్రహ్మాండం ఉన్నది. అయితే అది ఈ జగత్తు వంటిదే అయినప్పటికీ, ఈ జగత్‌దృష్టికి అది శూన్యమైనది. ఎట్లా అంటారా? స్వప్నం జాగ్రత్ వంటిదే (కనబడే దృశ్యం దృష్ట్యా) అయినప్పటికీ... జాగ్రత్ దృష్ట్యా స్వప్నం శూన్యమే కదా! స్వప్నం దృష్ట్యా జాగ్రత్ శూన్యమే కదా! ఈ జగత్తు దృష్ట్యా నేను చెప్పబోయే బ్రహ్మాండము అట్టిది. ఆ బ్రహ్మాండంలోని జగత్ రచన ఇట్టిదే అయినప్పటికీ అది ఈ జగత్తు దృష్టిచే అగమ్యమై ఉంటోంది.

నేను ఆ బ్రహ్మాండంలో దిగంతం చూడాలని అభిలాషతో ప్రవేశించి గొప్ప ఛాయ గల కొన్ని భూములలో సంచరించసాగాను. ఇట్లా సంచరిస్తూ ఉండగా ఆకాశంలో ఏదో రణగొణ శబ్దం వినిపించింది. వెంటనే నేను ఆకాశంలోకి తేరిపారచూచాను. ఆకాశంలో అత్యంత సుదూరంగా ఒక మానవాకారం ఎక్కడో నక్షత్ర మండలంలో కనిపించింది. అది ఒక మానవ కళేబరంలా కనిపించింది. "ఆ ఆకృతి ఎక్కడి నుండి వచ్చింది? ఏమై ఉన్నది?" అని నేనే కొంచెం ఆశ్చర్యంతో పరిశీలించసాగాను. ఇంతలో ఆ మానవ శవాకారం మహా పర్వతాకారంగా కనబడసాగింది. ఆ ఆకారంలో ఆవర్తములు (సుడి) వంటి వృత్తులు కనిపించసాగాయి. ఆ దేహం మహా పర్వతాకారంగా ఆకాశాన్ని కప్పివేయసాగింది. ఆ దేహం ఆకాశం నుండి పడిపోవుచున్నట్లున్నది. అంతటి సుదీర్ఘమైన – చూపుకు అంతుకనబడని ఆ దేహం "బహుశః బ్రహ్మదేవునిదో? బ్రహ్మాండ దేహధారియగు విరాట్ పురుషునిదో?"...అనే సంశయం కలిగింది. ఇంతలో "ఊర్ధ్వ బ్రహ్మాండ కపాలం బ్రద్ధ లయిందా" అన్నట్లుగా పెద్దశబ్దంతో సూర్యగోళం ఆకాశం నుండి నేను ఉన్న భూమివైపుగా రాలటం ప్రారంభించింది. "ఆ సూర్యగోళం యొక్క విస్తీర్ణం ఈ సముద్రములతో కూడిన అనేక భూమండ లాలను ఆ ఆకాశపతన దేహం తనలో ఇముద్చుకొన్నదేమో!" అని నాకు, అనిపించింది. ఇక "నాకు మృత్యువు ఆసన్నమయినట్లే" ...అని అనిపించి అప్పుడు నేను "ఓ స్వామీ! అగ్నిదేవా! రక్షించండి" ...అని పెద్దగా కేకవేశాను. వెంటనే ఆ ప్రక్కనే గల ప్రజ్వరిల్లే అగ్నిలోకి దుమికాను. అయితే, అనేక జన్మలుగా నేను అత్యంత ప్రియంగా ఆరాధిస్తున్న ఆ అగ్నిదేవుడు నా శరీరమును చల్లదనంతో కప్పి ఉంచి ఇట్లా పలికాడు.

**అగ్నిదేవుడు :** ప్రియభక్తుడా! భయపడకు. నిన్ను నేను ఆపదల నుండి రక్షిస్తాను.

**నేను (భాసుడు) :** ఓ మహాదేవా! అగ్నిదేవా! తమకు జయమగుగాక! ఆహాఁ! ఏమి మీ భక్త వాత్సల్యం! ప్రతి జన్మలోను మీరు శరణ్యులై నన్ను ఆపదలొచ్చినప్పుడల్లా రక్షిస్తూనే ఉన్నారు. ఇప్పుడు అకాలంగా కల్పాంతం వచ్చి పడుచున్నట్లుంది. ఇదిగో, సూర్యగోళం నేలపై వ్రాలటం చూస్తున్నారా! ఏదో మహాశవం ఆకాశమంతా ఆక్రమించి సూర్యగోళాన్ని నేలవైపుగా త్రోసుకొస్తోంది! ఎంతటి ఆపత్సమయం! ప్రభూ! నన్ను రక్షించమని పాదాభివందనం చేస్తూ శరణు వేడుచున్నాను.

**అగ్నిభగవానుడు :** ఓ పాపరహితుడా! ప్రియభక్తుడా! భయపడకు! లేఁ! మనం నా అగ్ని లోకానికి వెళ్ళెదముగాక!

ఇట్లా పలికి తన వాహనమైన చిలుక యొక్క వీపుపై కూర్చోబెట్టుకున్నారు. తన దేహంతో నేలను సొరంగంగా చేసి దాని గుండా భూమార్గం ద్వారా ఆకాశంలో ప్రవేశించారు. అప్పుడు ఆకాశం లోంచి నేల మీదకు చూచాను. పెద్ద శరీరం సూర్యగోళాన్ని కూడా త్రోసివేస్తూ నేల కూలుతోందని చెప్పాను కదా! భయంకరమైన ఆ భూతమును జిజ్ఞాసతో అవలోకించసాగాను.

ఆ మహాభూతము యొక్క కరస్పర్శ మాత్రం చేత సూర్యగోళం తన ప్రయాణ మార్గం నుండి ప్రక్క త్రోవపట్టినదై ఎటో ఆకాశంలోకి వెళ్ళిపోయింది. ఆ మహాభూతం పడిన పాటుకు భూమి

కంపించింది. నదులు మార్గం త్యజించి ప్రక్కత్రోవ పట్టాయి. ఆ దేహ స్పర్శచే భూమిపై సముద్రంతో సమానమైన గోతులు ఏర్పడ్డాయి. అన్ని వైపులా భయంకరమైన శబ్దాలు వినిపించసాగాయి. హిమాలయం మొదలుగా గల ఎత్తైన పర్వతాలు భూమిలోకి కృంగి భూగర్భంలోకి అణిగిపో సాగాయి. అప్పుడా శవం "ఇది బ్రహ్మాండం యొక్క అర్ధభాగం" అన్నట్లుగా భూమిని, ఆకాశాన్ని కప్పివేసింది. ఆ శవం వేగంగా నేలపై పడటం చేత దశదిక్కులు పిక్కటిల్లాయి. ప్రతిధ్వనించాయి. భూమి రెండు విడివిడి భాగములుగా చీలిపోయింది. ఆ శవం యొక్క సగభాగం భూగోళం పైన, మిగతా సగభాగం ఆకాశంలోను నిలిచింది. ఆ మాంసమయ శవం యొక్క ఒక్క చిన్న విభాగం కూడా సప్త సముద్రంతో కూడిన పృథ్వి చాలకున్నది. అప్పుడు నేను అగ్నిదేవునితో ఇట్లా సంభాషించాను.

**నేను (భాసుడు) :** ఓ అగ్నిదేవా! అనేక భూమండలములను ఒకచోట జేరిస్తే కూడా సరిపోనంత ఈ మాంసమయ దేహం ఎక్కడి నుండి పడింది? దానితోబాటు సూర్యుడు కూడా ఎట్లా ఆకాశము నుండి చెదిరిపోయాడు? ఇంతటి విస్తారమైన దేహం ఇతఃపూర్వం ఎక్కడ ఉండేది?

**అగ్నిదేవుడు :** ప్రియ విపశ్చిత్తూ! ఈ శవం యొక్క పతన వ్యవహారమంతా శమించనీ! భయ రహితుడవై ఆ తతంగం చూడు, అటు తరువాత అదంతా నేను సవిస్తరంగా వివరిస్తాను.

నేను "సరే" అని ఆ మహాదేహ పతన వ్యవహారమంతా ఆశ్చర్యపడుతూ దర్శించసాగాను. ఆ శవం నేలకూలింది. ఇంతలో ఆకాశంలోంచి సమస్త వస్త్ర-ఆభరణాలు ధరించిన అనేకమంది ఆకాశజీవులు ఆ చోటికి వచ్చారు. ఆ వచ్చినవారిలో సిద్ధులు, సాధ్యులు, అప్సరసలు, అసురులు, గంధర్వులు, నాగులు, కిన్నెరులు, ఋషులు, మునులు, యక్షులు, పితరులు, మాతరులు, దేవతలు వీరంతా ఉన్నారు. వాళ్ళంతా ఆ మహాశరీరం చుట్టూ నిలబడి (ఆకాశచరులు) ఆకాశం వైపుగా రెండు చేతులు ఎత్తి నమస్కరించసాగారు. వారంతా సర్వేశ్వరి, భక్తవత్సల, శరణాగత, దాక్షాయణి యగు "కాలరాత్రి భగవతి"ని ఇట్లా స్తుతించారు.

**బద్ధ్వా ఖంట్వాంగశృంగే కపిలమురజటామండలం పద్మయోనేః,**
**కృత్వా దైత్యోత్తమాంగైః స్రజమురసి శిరః శేఖరం తార్క్ష్యపక్షైః,**
**యాదేవీ భుక్త విశ్వా పిబతి జగదిదం సాద్రి భూపీఠభూతం,**
**సా దేవీ నిష్కలంకా కలిత తనులతా పాతు నః పాలనీయాన్ ॥**

ఏ దేవి అయితే... మహాకల్పాంతంలో బ్రహ్మదేవుని కపిలవర్ణమగు గొప్ప జడల సమూహాన్ని తన మంచపు కోడునకు కట్టుచున్నదో, అసురుల శిరస్సులచే కూర్చబడిన మాలను కంఠానికి ఆభరణంగా ధరిస్తోందో, గరుత్మంతుని రెక్కలను శిరోభూషణంగా చేసుకొంటోందో, సర్వప్రాణి కోట్లతో సహా ఈ నదీ పర్వతాదులతో కూడిన భూపీఠ రూపమైన ఈ జగత్తును అతి చమత్కారంగా పానం చేసివేస్తోందో... అయితే, బ్రహ్మాండము నంతటినీ పానం చేస్తున్నప్పటికీ, ఆ క్రియా విశేష లేశము కూడా అంటక, నిత్యము శుద్ధ చిద్రూపిణి అయి విరాజిల్లుతోందో, తాను దేహరహితురాలై

ఉండి కూడా భక్తుల అనుగ్రహము కొరకు మాత్రమే శరీరలతను ధరిస్తోందో... అట్టి జగజ్జనని మమ్ములను ఇప్పుడు రక్షించుగాక! సదా కాపాడుగాక! పాహిమాం! మాతా! కాళరాత్రీ దేవీ! భగవతీ! రక్షమాం!

❖❖❖

# 2. చండీగణ శవ భక్షణం

**భాసుడు :** ఓ సభికులారా! ఇంకా వినండి.

ఆ విధంగా దేవగణం ఆ మహాదేహం చుట్టూ నిలబడి, భగవతియగు చండీదేవిని స్తుతిస్తూ ఉండగా, అప్పుడు నేను ఆ మహాదేహం వైపుగా తేరిపారచూస్తూ ఉన్నాను. అయితే ఆకాశం లోంచి అగ్నివాహనమగు చిలుక రెక్కలపై అగ్నిదేవుడు తోడుగా కలిగి ఆశీనుడనై ఉన్న నాకు ఆ మహాశవం పొట్టభాగం మాత్రమే కనిపిస్తోంది. ఇక శిరోభాగం, భుజములు, తొడలు మొదలైన తదితర శరీరభాగాలు లోకాలోక పర్వతమునకు ఆవలకు విస్తరించి ఉండటం చేత వాటిని నేను చూడలేక పోయాను గాని... అగ్నిదేవుడు వాటి గురించి వర్ణించి చెప్పుచుండగా విన్నాను.

ఆ విధంగా ఆకాశచారులు ఆ చండీదేవిని భక్తి – ప్రపత్తులతో ఆదరంగా స్తుతిస్తూ ఉండగా, అప్పుడు ఆ దేవి ఆకాశంలో శుష్క శరీరంతో స్వయంగా ప్రకటితమయింది. ఆ దేవి... ఆకాశంలో దివ్యానంద జ్యోతి స్వరూపిణి అయి ప్రత్యక్షమయింది. మాతృ గణంచే లాలించబడుచున్నది. ఆమెను స్తోత్రం చేసే కుంభాండ యక్ష బేతాళాదులు ఆకాశంలో నక్షత్రాలవలె కనిపించసాగారు. అనేక శిరస్సులచే కూర్చబడిన మాల ఆమె పాలిండ్ల మధ్యగా అటూ ఇటూ ఊగుతోంది.

**అక్కడి దేవతలు :** ఓ దేవదేవీ! మీకు మా ప్రణామములు. ఈ మహాశవం మాచే కానుకగా మీకు సమర్పించబడుచున్నది. మీ పరివారంతో సహా శవమును స్వీకరించు తల్లీ! హే కాళీమాతా! మాకు సర్వ శుభములు ప్రసాదిస్తున్న నీకు కృతజ్ఞతాపూర్వకంగా ఈ మహాశవమును సమర్పిస్తున్నాం. అంగీకరించి, మమ్ము అనుగ్రహించు.

❖

ఆ దేవతా ప్రార్థన ఆ దేవి విని చిరునవ్వు నవ్వింది. ఆ తల్లి సర్వ ప్రాణశక్తి కదా! అందుచేత తన ప్రాణవాయు శక్తిచేత ఆ శవం యొక్క సారభూతమగు రక్తమును ఆకర్షించనారంభించింది. ఆ మహాశవయి యొక్క రక్తం ఆ దేవి ముఖంలోకి ప్రవేశించ నారంభించింది. ఇతఃపూర్వం సన్నగా – పొడుగ్గా ఉన్న ఆ చండీదేవి (శుష్కించి ఉన్న) దేహం ఇప్పుడు తృప్తిపొంది, పురిపుష్టి పొందేంత వరకు ఆకర్షించినంత రక్తమును త్రాగివేసింది. తత్ఫలితంగా స్థూలదేహ స్వరూపంగా కనిపించింది. వ్రేలాడుచున్న పొట్టతో, సర్పములను ఆభరణములుగా ధరించి, సమస్త ఆయుధాలను ధరించి ఆకాశంలో సగభాగాన్ని పూరిస్తూ నృత్యం చేయనారంభించింది. దేవతలు ఆ చండీదేవి నృత్యాన్ని తన్మయులై వీక్షించసాగారు. ఇంతలో ఆ దేవి అనుచరులైన పిశాచ – కుంభాండ – రూపికాది

అనుచరులు మిగిలి ఉన్న శవమును ఆస్వాదించసాగారు.

కుంభాండులచే కటిభాగం, రూపికా సమూహం చేత పొట్టభాగం, యక్షులచే పార్శ్వ – పృష్ఠ భాగాలు భక్షించబడసాగాయి. బ్రహ్మాండ కపాలానికి ఆవల పడిన శవవిభాగాలను పిశాచాలు చేరలేక పోవటం చేత... ఆ శరీర విభాగాలు కాలక్రమేణ స్వయంగా విలీనమైపోయాయి.

ఆకాశంలో చండికాదేవి నృత్యం సల్పుతోంది. భూతగణం "కచ–చక –కచ–చక–శివ–శివ" శబ్దాలు చేస్తూ శవభక్షణ చేస్తున్నారు. లోకాలోక పర్వతంపై నిలబడి దేవతలంతా ఈ తతంగాన్ని చూస్తున్నారు. భూతగణం చేసే "కచ–చక–శివ" శబ్దాలు, నాడుల – ఎముకల "ఘట–కట" ఖండన శబ్దాలు ఆకాశంలో అన్ని వైపుల నుండి వినబడుచూ మిన్నుముట్టసాగాయి.

భూమిపై అనేక చోట్ల బొమికల ముక్కల గుట్టలు ఏర్పడసాగాయి. సప్త ద్వీపాలు ఆ శవం యొక్క దుష్టావయవాల ఖండనములచే ఆక్రమించబడ్డాయి. అదంతా చూస్తూ లోకాలోక పర్వత శిఖరంపై నిలుచున్న దేవతలు ఎంతో దుఃఖితులై, ఖిన్నులై ఉన్నారు.

❖

**శ్రీరాముడు :** ఓ వసిష్ఠ మహర్షీ! ఈ మహనీయుడు చెప్పే స్వానుభవం వింటూ ఉంటే నాదొక చిన్న సందేహం. బ్రహ్మాండమును దాటి బ్రహ్మాండ కపాలం వరకూ విస్తరించి పడిన ఆ శవం యొక్క ఖండ విభాగాలు మరి మధ్యలోగల లోకాలోక పర్వతమును కూడా ఎందుకు కప్పివేయలేదు?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ఓ రామచంద్రా! ఆకాశం నుండి వాలుగా పడేటప్పుడు ఉదరభాగం సప్తద్వీపములలోను, శిరస్సు – పాదాలు మొదలైనవి బ్రహ్మాండమునకు ఆవల పడి ఉండవచ్చు. ఆ దేహ పార్శ్వభాగం, మధ్యభాగం, కటి ప్రదేశం మొదలైన వాటి కంటే లోకాలోక పర్వతం ఎత్తైనది కనుక ఖండితంగా పడిన దేహభాగాలు లోకాలోక పర్వతంపై నిలచి ఉండకపోవచ్చు.

❖

**శ్రీ భాసుడు :** (తాను చూచిన దృశ్యం యొక్క వర్ణనను కొనసాగిస్తూ) లోకాలోక పర్వత శిఖరంపై బారులు తీరి దేవతలు నిలబడ్డాడు. సర్వత్రా విస్తరించి ఉన్న అంగములతో కూడి అధోముఖంగా పడిన ఆ శవం యొక్క శేష భాగాలను భూతగణాలు భక్షిస్తున్నాయి. మాతృగణం ఆచోట – ఈచోట గుమిగూడి నృత్యం చేస్తున్నది. రక్తధారలు అన్ని వైపులా ప్రవహించసాగాయి. భూమిపై క్రొవ్వు, మాంసం విచ్చలవిడిగా వెదజల్లబడింది. ఆ దుర్గంధం అన్ని వైపులా విజృంభించసాగింది. ఇదంతా చూస్తూ కొంతమంది దేవతలు చింతాగ్రస్తులు, దుఃఖితులు అవటం కనిపించింది. ఆ చింతాగ్రస్తులైన దేవతలు ఆ భీకర దృశ్యాన్ని చూచి ఇట్లా చింతించసాగారు.

**హా కష్టం! క్వ గతా పృథ్వీ? క్వ గతా జలరాశయః?**
**క్వ గతా జనసంఘాతా? క్వ గతా ధరణీధరాః?**

ఆహా! ఏం కష్టం వచ్చిపడింది? అరె! భూమి కనబడకుండా పోయిందే! సముద్రాలన్నీ ఏమైనట్లు? జన సమూహాలన్నిటికీ ఏమయిందో కదా! సుందరమైన మలయ పర్వతం, తెల్లగా

మేటిసే ఎత్తైన హిమవత్ పర్వతం, క్రౌంచ పర్వతం, అద్దానిపైగల కల్పవృక్షం ... ఇవన్నీ చూర్ణములై రక్త - మాంసాలలో కలిసి పోయినాయి కాబోలు! ఏది ఎక్కడో కనిపించటమే లేదే? క్షీరసాగరం, నవనీత (నేయి) పర్వతాలపై ఉద్భవించిన దధి సముద్రం, నారికేళ వనమయమైన అనుకంప్య పర్వతం, మహాయోగీశ్వరులచే సేవించబడే మధుపర్వతం-ఇవన్నీ ఎటుపోయాయి? స్వాదూద సముద్రానికి సంబంధించిన ఓ పుష్కర ద్వీపమా? నీవేమైనావు? మానవులకు స్వప్నతుల్యమైన శాక ద్వీప పర్వత శ్రేణులు ఏమూల ఉన్నాయో? ఏమయినాయో? ఈ విధంగా రక్త ప్రవాహంచే, మాంస ఖండాలచే మేము విహరించే ప్రదేశాలన్నీ కప్పబడి పోయినాయే! ఇక జీవులు విశ్రాంతి పొందగల చోటెక్కడున్నది? ఈ మహా శవపు రక్త ప్రవాహంచేత మహాసముద్రాలు ఏర్పడుచున్నాయి. ఇంతెందుకు? నగరాలు, గ్రామాలు, అగ్రహారాలతో నిండి ఉండే భూమియే కనిపించకుండా పోయింది!

అంతేకాదు. మన విద్యాధరులు, తదితర దేవతలు విమానాలలో సంచరించే ఆకాశ ప్రదేశాలు క్రొవ్వులు - ప్రేగులతోనూ, వాటిని భక్షించే భూతగణముల 'కిరకిర' శబ్దాలతోనూ నిండిపోయాయి.

❖

కొంతసేపటికి భూతగణం మాంస భక్షణం చేస్తూ రక్తం గ్రోలుచుండగా భూమి కొంచెం కొంచెంగా కనిపించసాగింది. అయితే భూమి క్రొవ్వు పొరలతో కప్పివేయబడింది. ఆ శవము యొక్క అస్థులు మహాపర్వతమంత ఎత్తులో గుట్టలుగా పడి ఉండటం కనిపించింది.

భూతగణం రక్త మాంసాలను భక్షించి, క్రొవ్వును మాత్రం వదలి ఆకాశంలో నృత్యం చేయ సాగాయి. ఇకప్పుడు అనేక చోట్ల ఇంకనూ మిగిలి ఉన్న రక్తమంతా అక్కడి దేవతల సంకల్పబలం చేత ఒక ప్రవాహంగా మలచబడింది. సప్త సముద్రాలలో ఒక్క సముద్రంలోకి మాత్రమే అక్కడి రక్తమంతా మరల్చబడింది. దానిని ఆ దేవతలు తమ సంకల్ప బలంచేత "మద్య సముద్రం"గా గావించి వేశారు. అది ఆ తరువాత "మధ్యధరా సముద్రం"గా నేటికీ వెలసింది. ఆ భూతగణం ఆకాశంలో నృత్యం చేస్తూ ఆ సముద్రంలోని మద్యం త్రాగి మరల ఆకాశంలో ఆనంద నృత్యం చేయసాగాయి. వారివలెనే నేటికి కూడా భగవతియగు యోగీశ్వరి యొక్క గణములతో సహా ఆ భూతగణం సముద్రమధ్యంలో మద్యం త్రాగుతూ, ఆకాశంలో నృత్యం చేస్తూనే ఉన్నాయి.

ఆ భూతగణంచే భుజించబడగా మిగిలిపోయిన శుష్క మేదస్సు (మిగిలిపోయిన క్రొవ్వు) సమూహాలు భూమిపై విస్తరించటం చేత ఈ భూమి "మేదిని" అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది.

క్రమంగా ఆ శవము క్షయించింది. సూర్యుడు - చంద్రుడు మొదలైనవారు తమతమ స్థానములను మరల చేరుకున్నారు. మరల రాత్రింబగళ్ళు ప్రవర్తించసాగాయి.

అప్పుడు ప్రజాపతి నూతన ప్రజలను సృష్టించసాగారు. మరల భూతలంపై సృష్టి యథాప్రకారంగా వర్ధిల్లసాగింది.

❖❖❖

# 3. మశకవ్యాధుని ముని దర్శనము

**భాసుడు :** ఓ దశరథ మహారాజా! ఇదంతా నేను భగవానుడగు అగ్నిదేవుని వాహనమైన చిలుక రెక్కలపై కూర్చుని చూస్తున్నాను కదా! అప్పుడు నా ప్రియదైవమగు అగ్నిదేవుని ఇట్లా ప్రశ్నించాను.

**నేను (భాసుడు) :**

**భగవన్! సర్వయజ్ఞేశ! స్వాహాధిప! హుతాశన!**
**కిమిదం నామ సంపన్నం కథ్యతాం? కిమిదం శవమ్?**

హే మహాత్మా! సర్వ యజ్ఞములకు ప్రభువైన వాడా! స్వాహాపతీ! దేవదేవా! ఈ శవము ఏమిటి? ఇదంతా ఇట్లా ఎందుకు జరిగింది? దయచేసి చెప్పండి!

**అగ్నిదేవుడు :** ఓ రాజా! ఈ శవ వృత్తాంతమేమిటో చెప్పుతాను, విను. ముల్లోకములను ప్రకాశింపచేసేది, నాశరహితమైనది - అనంతమైనదిగా చెప్పబడే ఆత్మ చమత్కారం బోధించేది అగు ఈ శవం యొక్క విశేషమంతా ఆలకించు.

**అస్తి, "అనంతమ్, అనాకారం, పరమం వ్యోమ చిన్మయమ్"**
**యత్రేమాన్యప సంఖ్యాని జగన్తి పరమాణవః ॥**

ఏదైతే అనంతమై నిరాకారమై చిన్మయమైనదో... ఎద్దానియందైతే ఈ కనబడే జగత్తు వంటి పరమాణువులు అసంఖ్యాకంగా సర్వదా ఏర్పడి ఉన్నాయో... అట్టి 'పరమాకాశం' అనబడున దొకానొకటి ఉన్నది. అది శుద్ధ చిన్మాత్రము సర్వవ్యాపకము. సర్వము తానే అయి ఉన్నది.

అట్టి చిదాకాశమునందు ఒకానొక చోట విషయాకార జ్ఞానమయమగు 'సంవిత్తు' స్వయంగా జనిస్తోంది. అయ్యది తన జ్ఞాన స్వభావ ప్రభావం చేత భావిత పదార్థరూపం రూపొందుతోంది. తనను తాను ఒక తేజః పరమాణురూపంగా భావన చేస్తోంది.

ఎట్లా అంటావా? నీకిది అర్థం కావటానికి వీలుగా ఒక దృష్టాంతం చెపుతాను, విను. నీవు ఒక బాటసారి గురించి ఆలోచిస్తూ నిద్రపోతావనుకో. అప్పుడు స్వప్నంలో నీ స్వప్న చైతన్యమే బాటసారి అయి ఆ బాటలో అతనితో నీవు సంభాషించటం జరుగవచ్చు కదా! అట్లాగే నిర్విషయ చిదాకాశం విషయాకార సంవిత్తు రూపమును తనయొక్క అనంత రూపంలోని ఒకానొకచోట తన అజ్ఞాన స్వభావం చేత భావన చేస్తోంది. ఆ తేజః పరమాణువు తన అజ్ఞాన చిత్ స్వభావం చేత తనలో సంకల్ప రూపం, ప్రకాశవంతం అయిన అణుత్వమును దర్శిస్తోంది. ఆ తరువాత తనలో వర్ధన శీలత్వం భావిస్తోంది. అట్టి వర్ధనశీలత్వమే 'కళ్ళు-చెవులు' మొదలైన ఇంద్రియ రూపాలుగా అగుచున్నది. ఆ తరువాత ఆ ఇంద్రియాలు 'శరీరం' అను దానిలో సంలగ్నమై ఉన్నట్లుగా అనుభవాన్ని పొందుతోంది. ఆ నేత్రాదులు శబ్ద-స్పర్శాదులతో కూడిన జగత్తును దర్శిస్తున్నాయి. స్వప్నంలో పట్టణం కనిపించినట్లు నేత్రాది ఇంద్రియాలకు ఈ ఇంద్రియ విషయ జగత్తు అగుపిస్తోంది.

❖

అటువంటిదైన ఈ జగత్తులో ఒకానొకచోట అసురజాతికి చెందిన ఒకానొక జీవుడు ఉండేవాడు. ఆతడు ఎంతో స్వాభిమానంతో వర్తిస్తూ ఉండేవాడు. ఆతడు – ఆతని తల్లి–తండ్రి–తాత మొదలైన వారంతా కూడా స్వప్నంలోని మాతా–పిత–పితామహులవలె మిథ్యా ప్రతిభా స్వరూపులే సుమా!

ఆ అసుర స్వభావుడగు జీవుడు ఒక రోజు ఒకచోట ఒక ఆశ్రమం చూచాడు. దురహంకారికి ఇతరులను బాధించటం స్వభావమై ఉంటుంది కదా! తాను చూచిన ఆశ్రమము, ఆశ్రమ వాసియగు ముని ప్రశాంతంగా కనిపించటం చూచి ఓర్వలేకపోయాడు. వెంటనే తన అతిస్థూల దేహంతో ఆనందమయంగా ఉన్న ఆ ఆశ్రమ ప్రదేశాన్నంతా ఇష్టం వచ్చినట్లు త్రొక్కివేశాడు. ఇది చూచి ఆ ఆశ్రమ మునీంద్రుడు కోపగించినవాడై, "ఓయీ అసుర స్వభావుడా! నీ స్థూల దేహంతో నిష్కారణంగా ప్రశాంతమైన ఈ ఆశ్రమ ప్రదేశాన్ని నాశనం చేశావు కదా! నీ ఈ దురహంకారం శిక్షించబడక తప్పదు. అందుచేత నీవు అతి క్షుద్రమైన ఒక 'దోమ' అయి పోయెదవు గాక!" ...అని శపించాడు. ఆ శాపాగ్నిచే ఆ అసురజీవుని దీర్ఘశరీరం భస్మీభూతమయింది. దేహం నశించటం చేత ఆ అసుర జీవుని చైతన్యం ఆకాశంలో నిరాకారంగాను, ఆధారరహితంగాను అయినదై, (ఆకాశంలో) ఒక వలయం వలె అయింది. ఆ చైతన్యం సుషుప్తి – మూర్ఛస్థితులను పొందసాగింది. అవ్యాకృతమైన ఆ అసురజీవుని చైతన్యం కొంతసేపటికి సామ్యత్వం వలన భూతాకాశంతో ఏకత్వం పొందింది.

ఆ భూతాకాశము తన స్థానభూతమగు వాయువుతో ఏకత్వం పొందింది. ఆ ప్రాణవాయువు దేహమును పొందినదైనది. ఇప్పుడది అవ్యాకృత రూపం నుండి 'ప్రాణి' అని పిలువబడే స్థితికి వచ్చింది. ఆ ప్రాణి నామధేయ చైతన్య స్ఫురణ క్రమంగా పృథ్వి (Solid, Liquid, Heat, Vapour) మొదలైన అపంచీకృతములైన నాలుగు భూతాలచే వ్యాప్తమై చెన్నొందింది.

ఆ తదుపరి పంచతన్మాత్రమయినట్టి ఆ చిన్మాత్రాణువు స్పందనము (ఆకాశంలో చలనము) పొందసాగింది. అనగా క్రియాశక్తి కలిగియున్నదయింది. అద్దాని ప్రాణవాయువునందలి చైతన్యమునందు ఆ తరువాత జ్ఞానశక్తి ఆవిర్భవించింది. ఆవిర్భవించిన జ్ఞానశక్తిలో ఒకానొక విభాగంగా 'జ్ఞాపకశక్తి' రూపం పొందింది. ఆ జ్ఞాపకశక్తికి "శుద్ధుడగు ఆ ముని అసురుడనగు నన్ను 'దోమ'గా మారిపోవలసినదని శపించారు కదా!" ...అని జ్ఞాపకం వచ్చి చేరింది.

ఆ అసురుని ప్రాణమునందలి చైతన్యం 'దోమ'కు సంబంధించిన సంస్కారం సంతరించు కొన్నదయింది. దోమ యొక్క చిన్నకళ్ళు – ముఖం – కాళ్ళు – రెక్కలు మననము చేయనారంభించి తాను ఒక దోమగా వెలసింది.

చెమట నుండి జనించి, అల్ప శరీరధారి అయి, నిశ్వాస మాత్రం చేత (జనులు గాలి వదలే మాత్రం వాయువు వేగానికి) నేలకూలేందుకు సిద్ధమయ్యే దోమ యొక్క జీవిత కాలం ఈ ప్రపంచంలో రెండు రోజులు మాత్రమే కదా!

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! వసిష్ఠ మహర్షీ! ఈ ప్రపంచంలో అనేక ప్రాణులు ఉత్పత్తి అవుతు న్నాయి కదా! ఇవన్నీ కూడా ఏదో ఒక యోనిలోనే సంభవిస్తున్నాయా? లేక ఇంకొక ఏదైనా విధంగా కూడా జనిస్తున్నాయా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక గడ్డిపరక వరకు గల ఈ ప్రపంచంలో కనిపించే సమస్త జీవుల యొక్క ఉత్పత్తి రెండు విధములై ఉంటోంది.

1. భ్రాంతి జన్యమైనది, 2. బ్రహ్మమయమైనది.

**1.భ్రాంతిమయం -** ఈ జీవునిలో పూర్వ-తత్ పూర్వజన్మల అనుభవం బాగా అంతరంగంలో రూఢిపడి ఉంటోంది. అనగా, ఆయా దేహాలతో "తాదాత్మ్యం" దృఢపడుతూ వస్తోంది. తద్వారా 'జగత్ భ్రాంతి' అంతరంగంలో ఆరూఢమై ఉంటోంది. అది "దృశ్య సంగమం" చేత నిర్మితమై, తదనంతర దృశ్య సంగమానికి కారణభూతమై వస్తోంది. ఆ విధంగా భూత తన్మాత్రలతో (తన్మాత్ర = శబ్ద + స్పర్శ + రూప + రస + గంధాలతో) రంజనమై (Falsified, Illusion related) తదాకారంగా ప్రాణుల ఉత్పత్తి జరుగుతోంది. అయితే అదంతా కూడా వర్తమానం వరకు భ్రాంతి జనకమేనని గ్రహించు. అనగా ఒక భ్రాంతి నుండి, ఇంకొక భ్రాంతి వైపుగా ప్రయాణిస్తూ జీవుడు ఆ భ్రమలను పొందుచున్నాడు. మనకు కనబడే అనేక మంది జీవులు ఈ విధంగా యోనిజులై (యోనిగర్భం నందు జన్మించిన వారై) ఉంటున్నారు.

**2.బ్రహ్మమయం -** నిత్యముక్తమగు బ్రహ్మం నందు బ్రహ్మనికి అద్వితీయమైన 'భూత భావన' అనే జగత్ భ్రాంతి భాసిస్తోంది. అనగా 'సృష్టి' అనే దృశ్య వ్యవహారానికి ముందే నిత్య నిర్మలమై ఉన్న బ్రహ్మమునందు స్వయంగా వివర్తరూపంగా జగత్ భ్రాంతి భాసిస్తోంది. ఆ జగత్ భ్రాంతికి అంతర్గతమై చతుర్విధ భూత సముదాయం రూపం ధరిస్తోంది. "అట్లా ఉత్పత్తి అయినట్లుగా కనపించేదంతా బ్రహ్మమయమే" ...అని వేదోపనిషత్తులు ఘోషిస్తున్నాయి. అట్టి జగత్ వ్యవహార ఉత్పత్తికి సంబంధించిన జననం 'యోనిజం' కాదు. అట్టి "బ్రహ్మమునకు బ్రహ్మం రూపంగా ఏర్పడే జగదుత్పత్తి అనుభవం" – గొప్ప సిద్ధ పురుషులకు అనుభవయోగ్యం అవుతోంది. వారు "జగత్తుగా నాకు కనిపించేదంతా బ్రహ్మమే" ...అనే ఎఱుకను కలిగి ఉంటున్నారు. "జనించినట్లుగా అనిపించే దంతా భ్రమచేతనే. నేను జన్మరహితమగు బ్రహ్మన్ని" ...అను భావానచే పరిపుష్టులై ఉంటున్నారు.

❖

ఆ అసురుడు ఇప్పుడు దోమ ఉపాధిని ఆశ్రయించాడు కదా! ఆ దోమ తదితర దోమలతో కలిసి "జ్ జ్" శబ్దాలు చేస్తూ చెఱకు తోటలలోను, కోమలమైన రెల్లుగడ్డి ఆకుల మధ్య తన ఆయువులో అర్ధభాగం (మానవ ప్రమాణంలో ఒక రోజు) గడిపివేసింది. ఇక రెండవ రోజంతా ఒకానొక అతికోమలమైన ఒక రెల్లుగడ్డి మొక్క లేత చిగుళ్ళ మధ్యగా తన భార్యతో గడిపివేసింది.

ఆ దోమకు కునుకు పట్టింది. ఇంతలో ఆ రెల్లుగడ్డి మొక్క ఒక లేడి పాదఘట్టాలకు నేలతాకు చుండగా ఆ దోమ కాస్తా అద్దాని పాదాల క్రిందపడి చూర్ణమైపోయింది. అది లేడి ముఖం చూస్తూ ప్రాణాలు విడవటం చేత... క్రమంగా (మనం చెప్పుకున్న క్రమంలో) ఇంద్రియాదులను గ్రహించినదై... ఒక 'లేడి'గా జన్మించింది. ఆ లేడి అడవిలో సంచరిస్తూ ఒక రోజు ఒక బోయ వానిని చూచి భయంతో పరుగులు తీస్తూ ఉండగా... ఆ బోయవాని బాణఘాతం చేత మరణించి, ...బోయవాని ధ్యాస చేత, అదే సంస్కారాలు గల బోయవాడుగా జన్మించింది.

ఆ వ్యాధుడు (మృగములను వేటాడే వృత్తిగల ఆటవిక జీవుడు) ఒక అరణ్యంలో సంచరిస్తూ ...ఒకానొక మునియొక్క వనంలో ప్రవేశించాడు. పరమసాత్వికము-వేద శబ్ద భరితము అగు ఆ ప్రదేశంలో ప్రవేశించగానే అతని మనస్సు రజోతమోగుణాలను కొంచెం త్యజించింది. ఆ వనంలో ఒక చెట్టు క్రింద కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాడు. క్రమంగా ఆ మునివరేణ్యుని సమీపించి, అక్కడి పవిత్రతకు ముగ్ధుడై ... ఆ మునిని నమస్కారాదులచే, సత్ప్రవర్తనచే ప్రసన్నం చేసుకున్నాడు. సత్సాంగత్యము వల్ల వచ్చే జ్ఞాన సౌభాగ్యం మహత్తరం కదా!

తన ముందు సాష్టాంగ దండ ప్రణామం చేసి వినమ్రుడై నిలిచిన బోయవానితో ఆ మునివరేణ్యుడు ఇట్లా పలికాడు.

**మునివరేణ్యుడు :** ఓయీ! బోయవాడా! నీ వినమ్రతతో కూడిన నమస్కారం స్వీకరిస్తూ, నిన్ను "ప్రజ్ఞా సమన్వితుడవు అయ్యెదవు గాక!"... అని ఆశీర్వదిస్తున్నాను. నాయనా! ఇటొచ్చి కూర్చో! నీవు నీ ఈ ధనుస్సుతో నిరపరాధులగు మూగజీవులైన మృగాలను చంపటం మహా దీర్ఘ దుఃఖాల కొఱకేనని గ్రహిస్తున్నావా? పర్యవసానం గమనిస్తున్నావా? జగత్తు క్షణభంగురం కదా! శాస్త్రములు విన్నావా? ఇట్టి జగత్తులో జీవించేటప్పుడు "అహింస, అభయదానము" అను గుణములు మహా ఫలదాయకమౌతాయని, "ఇతర జీవులను బాధించటం, హింసించటం, భయపెట్టడం"... మొదలైనవి ఆ జీవునికి అనేక వేదన, రోదనలకు బీజభూతం అగుచున్నదని బోధిస్తున్నాయి కదా! ఓ ప్రియమిత్రుడా! ఆ జీవులను చంపుచున్నావు సరే! మరి నీవు మాత్రం కలకాలం ఉండబోవుచున్నావా? కాదే! ఆ సకల జనులకు, మూగజీవులకు, నీకు కూడా దేహం ప్రసాదించిన పరమాత్మకు కృతజ్ఞత చెల్లిస్తూ సద్గుణములను అలవరచుకొనవలసినదిపోయి... సరి అయిన ఆలోచన - అవగాహన లేకుండా... మూగజీవులను నిష్కారణంగా చంపటానికి ఉపక్రమిస్తున్నావా? వారికి దేహం నీవు ఇచ్చావా? ఇవ్వగలవా? లేదు. మరి వాటి దేహాలను నాశనం చేసే హక్కు నీకెక్కడుంది? ఆలోచించే బుద్ధి నీకున్నది. మరి ఆ బుద్ధితో ఏది నీకు శుభప్రదం; ఏది అశుభప్రదం? అని నీవు ఆలోచించాలి కదా! ఈ నీ ఆయుస్సు శాశ్వతమా? గాలిచే కొట్టబడుచున్న మేఘాల సముదాయంలోని జలబిందువు వలె నీ ఆయుస్సు క్షణభంగురం కాదా చెప్పు? ఇక్కడ గల భోగాలు అతి చంచలం కదా! నీ భార్య మొదలైన ఆయా జీవులతో గల సంబంధం శాశ్వతమా? కాదు. యౌవనం కలకాలం ఉంటుందా? ఉండదు.

యౌవనం గుప్పెట్లోకి తీసుకున్న పొగవలె చేయిజారిపోతూనే ఉన్నది కదా! ఇక నీ శరీర దార్ఢ్యం అన్నదాని గురించి చెప్పనే అక్కర్లేదు. ఈ నీ శరీరానికి ఎప్పుడు ఏ ఆపద రానున్నదో చెప్పలేం కదా! శరీరం కూలబడినప్పుడు నీ భార్యా పుత్రులు కూడా నీ ముదుసలి శరీరాన్ని చూచి ఎగతాళి చేస్తారే! పుట్టింది తిని, తాగి, చావటానికా? మరింకెందుకుంటావా? నీ తిండి కోసం సహజీవులను హింసించి, తద్వారా అనేక దుఃఖ పర్యవసానములను మూటకట్టుకుంటూ, ఈ ఆయుస్సును నిష్ప్రయోజనం - దుష్ప్రయోజనం చేసుకుంటున్నావేం? అనేక అనర్థములతో కూడిన ఈ సంసారం యొక్క గతిని చూచి భీతిల్లకుండా... గుడ్డి ఎద్దు చేలో పడినట్లు జీవిస్తున్నావా?

ఓయీ బోయవాడా! లుబ్ధకా! కనులు తెరువు. లే! “అశ్రద్ధగా జీవిస్తే ముందు ముందు నా గతి దుర్గతి కానున్నది” అని భయపడుతూ జీవించు. ఈ ‘జీవితము’ నీకు గొప్ప సదవకాశముగా గమనించు. నిరతిశయానంద రూపమగు బ్రహ్మం కొరకై అన్వేషించు. “తత్త్వజ్ఞానం” అనే అతి ముఖ్యమైన కార్యక్రమమునకు ఇప్పటికన్నా ఉపక్రమించు. “అహింస, స్నేహము, జీవకారుణ్యము గురుసేవ, శాస్త్రములు చెప్పే సాధనా క్రమము, పరమాత్మ యొక్క మననము, దేహమును ప్రసాదించిన పరమేశ్వరునికి కృతజ్ఞతలు సమర్పించటం – పెద్దలు బోధించే సారవాక్యాల ధ్యానం” ...ఇటువంటి దైవీగుణములను పెంపొందించుకొనే ప్రయత్నంలో ఉండాలి. అంతేగాని ఒక పిట్టనో – జింకనో చంపి, ఆ మాంసం ఆరగించి “ఒక ఇంతేచాలు” అని నిద్రించి, మరల తెల్లవారగానే ఆహారం కోసం విల్లు ధరించి ...ఇట్లా రోజులు వెళ్ళబుచ్చటం – పరమాత్మ ప్రసాదించిన జీవితము అనే అవకాశమును, ఆయుస్సును వృథా చేసుకోవటమే అవుతుంది. ఇది తెలివి ఉన్నవాడు చేసే పని కాదు. ఇక ఆపై నీ ఇష్టం.

❖❖❖

# 4. జాగ్రత్ - స్వప్న - సుషుప్తి స్వరూప వర్ణనం

**అగ్నిదేవుడు :** ఓ విపశ్చిత్! వింటున్నావా? ఆ మునీంద్రుడు ఇట్లా మరల బోధించాడు.

**మునీంద్రుడు :** ఓయీ బోయవాడా! నేను చెప్పిన ‘జీవిత సద్వినియోగం’ గురించి యోచన చేయి. నీకు శుభమగుగాక!

**వ్యాధుడు :** హే మునీంద్రా! నాపై కరుణతో ఈ రోజు నాకు సన్మార్గాన్ని చూపించారు. ఈ హింస మొదలైన వ్యవహారాలు దుఃఖ హేతువులని నాకు గుర్తు చేసినందుకు ఆజన్మాంతం కృతజ్ఞుడను. స్వామీ! నాపై దయతో నాకు దుఃఖ క్షయం కావటానికై నేను ఏమి చేయాలో చెప్పండి. మరీ కష్టంగా గాని, మరీ సులభంగా గాని ఉండనట్టి సాధనా మార్గమును, వ్యవహార క్రమమును ఉపదేశించండి. ఇప్పుడు మీరు ఏమి ఆజ్ఞాపిస్తే అట్లే నిర్వర్తించటానికి సంసిద్ధుడనై ఉన్నాను. మిమ్ములను సేవిస్తూ ఇక్కడే ఉంటాను.

**మునీంద్రుడు :** పుత్రా! ముందుగా ఈ ధనుస్సును, బాణాలను వదలిపెట్టు. సాత్వికమైన ఆహారాన్ని అవలంబించు. మునుల ఆచారాలైనట్టి “ధ్యానము, యమము, నియమము”లను ప్రారంభించు. నీవు ఈ ఆశ్రమంలోనూ ఉండవచ్చు. లేదా, నీ ఇంట్లోనూ ఉండవచ్చు. అది నీ ఇష్టం. అయితే, చక్కగా మంత్రోపదేశం చేస్తాను. మంత్రమును గానం చేస్తూ మనస్సును పరిశుద్ధ పరచుకో.

❖

ఆ బోయవాడు ఆ మునీంద్రుని పాదాలు స్పృశించి ప్రణామం చేశాడు. అప్పటికప్పుడే, ఆ ధనుర్బాణాలను త్యజించివేశాడు. యమ-నియమాలకు ఉపక్రమించాడు. ఆ ఆశ్రమంలోనే ఉండి, గురువులను సేవిస్తూ, వారు చేసే సత్సంగబోధనను వింటూ క్రమంగా చిత్తమును శుద్ధం చేసుకో

నారంభించాడు. శాస్త్రాలు గుర్తుచేసే నిత్యానిత్య వివేకమును క్రమంగా పెంపొందించుకోసాగాడు. ఒక రోజు ఆ బోయవాడు మునీంద్రుని సమీపించి, ఆయన సంతోషంగా ఉన్న సమయంలో ఇట్లా ప్రశ్నించాడు.

**బోయవాడు :** ఈ జగత్తు ఎవరిచే ఎందుకు ఈ విధంగా నిర్మించబడింది? ఇది ఇన్ని భ్రమలను కల్పిస్తూ ఎందుకు జీవుని గట్టిగా బంధించి ఉంచుతోంది? దీనిని దాటి చూడటమెట్లా?

**మునీశ్వరుడు :** ఈ 'జగత్తు' అనబడేది జీవునియొక్క మనోకల్పనయే సుమా! మనస్సు ఎట్లా ఉంటే జీవుడు అట్టి జగదనుభవమును పొందటం జరుగుతోంది. కనుక "ఇదంతా నీ–నా మనస్సులోనే ఉన్నది" ...అని చెప్పబడుతోంది. అనగా ఇది మనస్సుచే కల్పించబడి, ఆ మనస్సునందే ఆరూఢమై, మనస్సు చేతనే అనుభవ రూపంగా పొందబడుతోంది. ఇదంతా ప్రాణుల అంతఃకరణంలోని స్వప్నముగా చెప్పబడుతోంది.

**బోయవాడు :** మీరు చెప్పేది ఆశ్చర్యంగా ఉన్నదే! జీవుల అంతఃకరణంలోని స్వప్నం జాగ్రత్తుగా బాహ్యంలో ఎట్లా కనిపిస్తోంది? అసలు స్వప్నం ఎక్కడి నుండి వస్తోంది? నాకు రాత్రిపూట వచ్చే కలలో దృశ్యాలు ఎవరి కల్పన? ఎందుకు కల్పిస్తున్నారు? ముందుగా ఈ కల గురించి చెప్పండి?

**మునీంద్రుడు :** ఈ విషయంలో నీ యొక్క అనేక సందేహాలు నివృత్తి అవటానికి వీలుగా, నేను... ఒకానొక సంఘటన గురించి చెబుతాను. నేను చెప్పబోయేది నా స్వానుభవమే కాబట్టి నీ వివేకమును పటుతరపరచటానికి ఈ కథనం చక్కగా ఉపకరించగలదు.

❖

చాలాకాలం క్రితం, ఒకానొక తరుణంలో... అప్పుడప్పుడే నాలో వివేకం వికసిస్తోంది. ఒక రోజు, నా చిత్తంలో "ఆకాశంలో మేఘం వచ్చి పడుచున్నట్లు ఈ 'స్వప్నం (కల)' అనేది ఎక్కడి నుండి వచ్చిపడుతోంది? " ...అనే తర్కం బయలుదేరింది. ఆ కాలంలో నిరంతరం యోగసాధనలో ఉండేవాడిని. ఏమైనాసరే, 'స్వప్నం' అనేది ఎట్లా రూపుదిద్దుకుంటోందో, ఎట్లా ఎక్కడ ఏర్పడి ఉంటోందో నా బుద్ధితో యోగసాధనా బలం చేత కనిపెట్టాల్సిందే!" ...అనే నిర్ణయానికి వచ్చాను. ఇచ్ఛ యొక్క తీవ్రత చేత, ఇక ధారణకు ఉపక్రమించాను.

అప్పుడు "పరకాయ ప్రవేశం (మరొక శరీరంలో ప్రవేశించగలగటం)" ...అనే విద్యను అనుకూలింప జేసే 'బహిః కుంభధారణ'కు ఉపక్రమించాను. పద్మాసనం వేసుకొని, ఆ విధంగా బహిః కుంభధారణను అభ్యసిస్తూ సర్వజీవుల ఆత్మగా ప్రసిద్ధమైయున్న సంవిత్తునందు సుస్థిరత పొందసాగాను. అట్టి సంవిత్ స్వరూపము సంతరించుకొని ఆ నా సంవిత్ శరీరానికి ఆచ్ఛాదనగా చిత్తమును ధరించాను. ఇతరుల హృదయాలలో కూడా ప్రవేశించగల సామర్థ్యముగల ఆ చిత్తముతో ముందుగా నా హృదయంలోనే విహరించసాగాను.

అప్పుడు ...ప్రాణములకు అంతర్గతంగా ఉండే చైతన్యము యొక్క ప్రేరణచే చిత్త సహితంగా ప్రాణములను 'రేచకము' అనే శ్వాసకు సంబంధించిన ప్రజ్ఞయొక్క అభ్యాసం చేత... బాహ్యా

ప్రదేశానికి ప్రవహింపజేశాను. అనగా, చిత్తముతో కూడిన ప్రాణశక్తి 'దేహము' అనే కాలువ నుండి పిల్ల కాలువలాగా ప్రవహింపజేశానని గ్రహించు. నేను చెప్పే ఈ కార్యక్రమం ('రేచకము' అనే అభ్యాసంచే చిత్తము, ప్రాణములను బహిర్గతంగా ప్రయాణింపజేయటం) యోగాభ్యాసంలో సిద్ధహస్తులకు సుపరిచితమైన విషయమే!

❖

ఇకప్పుడు నా ప్రాణవాయువులు, చిత్త సహితంగా బాహ్యాకాశంలో ఉన్నాయి కదా! అప్పుడు బాటలో నడుచుచూ తన ఇంటి వైపుగా వెళ్ళుచున్న ఒక ప్రాణి నాకు ఎదురుగా కనిపించాడు. ఆతడు తన బంధువుల ఇంట్లో ఏదో ఉత్సవంలో పాల్గొని, సుష్టుగా తినుబండారాలన్నీ ఆరగించి ఇక ఇంటికి మరలుచున్నాడు. నేను నా యొక్క బాహ్యాకాశంలో ఉన్న నా ప్రాణవాయువులను, ఈ పాత్రలోని జలాన్ని ఆ పాత్రలోకి పోసినట్లుగా, ఆతని ప్రాణవాయువులలో కలిపివేశాను. అప్పుడు ఆతని ప్రాణవాయువులు నన్ను ఆతని హృదయంలో అంతర్భాగమును పొందింపజేశాయి. అనగా ఆతని "ప్రాణవాయువులు" అనే గుఱ్ఱం ఎక్కి ఆతని హృదయంలో ప్రవేశించాను. ఆతని ప్రాణ వాయువులు నా ప్రాణవాయువులు ఒకదానితో ఒకటి మిళితం కాగా, వాటిని అనుసరించినవాడనై నా బుద్ధితో ఆతని దేహంలో ఏఏ విశేషాలు గమనించి అనుభవించానో... చెబుతాను, విను.

❖

ఆతని హృదయపు అభ్యంతర ప్రదేశంలో అనేక చిన్న-పెద్ద నాడులు నలువైపులా ప్రసరించి ఉన్నవై కనిపించాయి. ఆ నాడులలో - పిల్ల పెద్ద కాలువలలో జలం ప్రవహిస్తున్నట్లుగా - అన్నరసం ప్రవహిస్తూ కనిపించింది. ఇంటిలో అనేక వస్తువులు అమర్చబడి ఉంటాయి చూశావా? అట్లాగే ఆతని శరీరము ఇటూ-అటూ అస్థిపంజరం చేత, "ప్లీహము-యాకృత్తులు" అని పిలువబడే మాంసవిశేషాల చేతను, రక్తంతో కూడిన మాంసపిండాల చేతను వ్యాపించి ఉన్నదై కనిపించింది.

అక్కడి హృదయ-దేహ ప్రదేశము అక్కడి 'శల-శల' శబ్దంతో ప్రవర్తించే 'జఠరాగ్ని' యొక్క వేడిచే ఆవరించబడినదై అగుపించింది. ఆ జీవుని శరీరము నిరంతరము 'జీవనము' కొనసాగించే నిమిత్తం చిత్తము-ప్రాణవాయువులచే అవధరించబడినదై ఉన్నది. అపానవాయువు యొక్క ప్రసరణచే ఏర్పడిన చల్లదనం అక్కడి వేడిని అతిశయించకుండా చేస్తోంది. అక్కడి నాడీమార్గంలో గల రక్త ప్రసరణను శ్లేష్మరూపమైన అన్నరసం తన ప్రవాహవేగంతో ఛేదిస్తూ కనిపించింది. అక్కడ గల 72000 నాడులు గాఢాంధకారం తమముందు కలిగి, (మరియు) ఉష్ణత్వంతో కూడి ఉన్నాయి. వాటిలో కొన్ని ప్రదేశములలో రక్తము, రసము, శ్లేష్మము, పిత్తము ఉబుకుతూ కనిపించాయి. ఆ నాడులు ఆయా అవయవములతో కూడిక కలిగియున్నవై కనిపించాయి. వాటిలో ప్రాణ-అపాన వాయువులు సుస్పష్టంగాను, అస్పష్టంగాను క్రీడనములు సలుపుచున్నాయి. వాటిలో సప్త ధాతువుల యొక్క స్థితి-గతి-నాశనాలను అనుసరించే భావికాలపు రోగాలు సంభవిస్తూ ....ఆ భావికాలపు రోగాలు, స్వప్నమునకు సూచనలు ఇస్తూ ఉన్నాయి. అపానవాయువు అక్కడి ఛిద్రములలో రాక పోకలు చేస్తూ ఉండగా 'కుళ్-ఖుగ్-జుగ్-బళ్' శబ్దాలు వినిపిస్తున్నాయి. హృదయ కమలమునందు

కనిపించిన రక్తనాళములందు రక్తము ప్రవహిస్తూ ఉంటే సముద్ర బడబాగ్ని వలె రంగులు విరజిల్లు చున్నాయి. కొన్ని కొన్ని నాడులు ఆయా మిళితములగు పదార్థములచే నిండి వాయు సహితంగా నెమ్మదిగా కదులుచూ కనిపించాయి.

ఇంకా... ఆ '9' ముఖ్య నాడులలోను, 72,000 ఉపశాఖ నాడులలోను అనేక విశేషాలు కనిపించాయి. ఒక చోట సాక్షియగు స్వకీయాత్మస్వభావంలాగా నిర్మలంగా ఉన్నది. మరోకచోట నిశ్చలచిత్తంలాగా సౌమ్యంగా ఉన్నది. ఇంకొకచోట నాడులలో అంతర్భాగాలు దొంగలముఠా దోపిడీలో పాల్గొనుచున్నట్లు సంక్షుభితమై ఉన్నాయి. వేరొకచోట "ఏకమాత్ర-ద్విమాత్ర-అర్ధమాత్ర" ...స్వరసంపన్నం లాగా లయ - అలయ విన్యాస ధ్వనులు ప్రదర్శిస్తున్నాయి.

ఆ దేహంలో ప్రవేశించి ప్రేగులలో పయనిస్తూ ఉండగా ఋతుపవనాలకు ఎదురు చూచే రైతులలాగా మరికొన్ని ఛిత్రజీవులు ప్రేగులమూలలో గృహనిర్మాణం చేసుకొని ఆ ఆహార పదార్థాల రసాన్ని కొంచెం కొంచెం ఆస్వాదిస్తున్నాయి.

ఆహా! ఏమి బ్రహ్మదేవుని దేహ నిర్మాణ వైశిష్ట్య చమత్కారం! ఏమి కార్యక్రమం! ఇదంతా తెలియకయే ఆ దేహి ఆదమరచి నిద్రిస్తూ ఉండి ఉంటాడు కదా! తన దేహంలో జరిగే బృహత్ కార్యక్రమం తనకే తెలియకుండా జీవుడు జగత్తులో సంచరించటం, మమకార, అహంకారాలు ప్రదర్శించటం, స్వప్నంలో ఏవేవో ఊహలలో తేలియాడటం - ఇవన్నీ ఎంత చమత్కారమైన విశేషాలు! అని ఆశ్చర్యపడసాగాను.

❖

ఈ విధంగా ఆలోచనలు చేస్తూ దట్టమైన అడవిలో సంచరించే మనుజునిలాగా చిత్త ప్రాణ దేహుడనైన నేను ఆతని దేహంలో సంచరిస్తూ క్రమంగా హృదయం యొక్క అభ్యంతర ప్రదేశంలో ప్రవేశించసాగాను. హృదయం యొక్క అభ్యతరంలో నాకు అనేక నాడీ మార్గాలు కనిపించాయి. అవన్నీ అతి దగ్గరగా ఉన్నప్పటికీ అత్యంత సుదూరంగా విస్తరించి ఉన్నట్లు అనుభూతి పొంద సాగాను. అక్కడగల జఠరాగ్ని రూపంలో గల తేజస్సును దర్శించాను. రాత్రిపూట సూర్యప్రకాశం చంద్రుని పొందుచున్నట్లు నాడీ ప్రదేశాలు కాంతివంతంగా ఉండటం గాంచాను. "తేజస్సు ఎవరిది? ఇద్దాని మూలమేమిటా?" ...అని పరిశీలనాత్మక బుద్ధితో పరిశీలించాను. "ఆహాఁ! ఈ తేజస్సుకు ఆధారమై జీవుని సత్తా నెలకొని ఉన్నది కదా!" ...అని బుద్ధితో గమనించాను. ముల్లోకాలకు దర్పణం వంటివాడు, ముల్లోకాలలోని సమస్త పదార్థములను ప్రకాశింపజేయువాడు, సర్వ వస్తువులందు సత్వస్వరూపుడై సర్వదా వేంచేసియే ఉన్నవాడు అగు జీవుడే తన చైతన్య చమత్కారం చేత అక్కడ తేజోరూపుడై వెలయుచున్నాడని గమనించాను.

**కాయే సర్వగతో జీవః స్వాఽఽమోదః కుసుమే యథా ।**
**తథాప్యోజసి కిఞ్జల్కైర్ముఖే శైత్యం వివస్వతా ॥**

సూర్యతేజస్సుచే వికసింపజేయబడిన పుష్పంలో సుగంధం, శీతలత్వం ...అంతటా ఉండి ఉన్నప్పటికీ... పూరెక్కలతో కూడిన ముఖ ప్రదేశంలో అతివిశేషంగా కనిపిస్తాయి కదా! అట్లాగే

శరీరమంతా వ్యాపించి ఉన్నప్పటికీ జీవుడు అక్కడ నాకు కనిపించిన తేజస్సుగా విశేషంగా ప్రకటనమగుచున్నట్లు అనిపించింది.

బోర్లించిన కుండచే కప్పబడిన దీపజ్యోతి కుండకుగల సూక్ష్మ రంధ్రములలోనుండి ప్రవేశించే గాలిచే పరిరక్షింపబడుచున్నట్లు, ఆ జీవుని జీవనజ్యోతి లోన ప్రవేశించే ప్రాణవాయువులచే రక్షింపబడుతోంది.

నేనప్పుడు జీవనాధారమగు చైతన్యాత్మక జీవతేజస్సులో నా అదృశ్య (కంటికి కనబడని చిత్త –ప్రాణ) రూపంతో ప్రవేశించాను. వాయువులోనికి సుగంధం ప్రవేశిస్తోంది కదా! చంద్రమండలంలోకి సూర్యతేజస్సు ప్రవేశిస్తుంది చూశావా! మట్టి పాత్ర సగం నీళ్ళలోకి ముంచినప్పుడు ఆ చమ్మ (తడి) మట్టిపాత్రయొక్క లోపలి వైపునకు ప్రయాణిస్తుందే! ...అట్లా నేను ఆ "జీవతేజస్సు యొక్క ఉపాధి రూపము" అన తగినట్టి మనోమయ కోశములోనికి, విజ్ఞానమయ కోశములోనికి, ఆనందమయ కోశములోనికి... ప్రవేశించాను.

ఆ ఆనందమయకోశం అమృతమయమగు రెండవ చంద్రుని వలె కన్పట్టింది. అది తెల్లని మేఘాల పంక్తి వలె కోమలంగా ఉన్నది. వెన్న, మీగడ, బెల్లమువలె స్నేహ–మధుర–ఆనందయుక్తంగా ఉన్నది. క్షీరసాగరం యొక్క బుద్బుదంలాగా అతి సుందరంగా ఒప్పుతోంది.

ఇంతకు ముందు శరీరంలో ప్రవేశించినప్పుడు నాకు అనుభూతమైన పరిశ్రమ ఇప్పుడు ఈ ఆనందమయ కోశంలో లేదు. చల్లటి తేజోమయ ప్రదేశంలో అత్యంత 'స్వస్థత' అక్కడ నాకు అగుపించింది. అప్పుడు ఆ ఆనందమయ కోశంలో సంచరిస్తున్న నాకు, ఆతని స్వప్న రూప ప్రపంచం తారసపడింది. ఆతని స్వప్నలోకం సూర్య, చంద్ర, పర్వత, సముద్ర, సుర, అసుర, మనుష్య సహితమై కనిపించింది. అక్కడ గ్రామాలు, పట్టణాలు ఈ భూప్రపంచంలాగానే విస్తరించి ఉన్నాయి. అవన్నీ ద్వీప – ద్వీపాంతరాలతోను, కల్ప–క్షణ కాల సమన్వితంగాను, ఋతు–కాల సంయుతంగాను, స్థావర–జంగమ ప్రాణికోట్లతోను నిండి ఉన్నది.

❖

ఆతని స్వప్న ప్రపంచమంతా నా స్వప్న ప్రపంచమే అయి దర్శనం కొనసాగించాను. జాగ్రత్తు నాకు కొనసాగుచుండగా ఆతని స్వప్న ప్రపంచ అంతర్గత విశేషాలు ఈ మన ఈ 'జాగ్రత్తు'లాగానే చూడసాగాను.

ఓ వ్యాధుడా! అప్పుడు నేనిట్లా అనుకున్నాను. "నేను నిద్రపోవటం లేదు ఒకానొకని స్వప్న ప్రపంచమును నేను ద్రష్టనై, పరస్వరూపుడనై చూస్తు ఉన్నాను కదా!" అని నేను జ్ఞానయుక్తుడనై వీక్షించసాగాను. "ఇప్పుడు ఈ కనబడే స్వప్న జగత్తు చైతన్యం యొక్క ఈశ్వర సంబంధమైన రూపమే అయి ఉన్నది" అని అనుకుంటూ ఉండసాగాను. ఈశ్వరుడు చిదాకాశరూపుడే కాబట్టి తాను దేనిని ఎట్లు భావన చేస్తే ఆయా చిత్‌రూపం తత్ అను భావానుసారం రూపం పొందినదౌతుంది కదా! అనగా, ఆయన తనను తాను "వస్త్రం, ఘటం, జగత్తు, జీవుడు" మొదలైన ఏ ప్రకారమైన భావన చేస్తాడో, ఆయా ప్రకారంగా తానే ఆయా జీవ – జగత్ ఆదిగాగల రూపంగా అగుచున్నాడు.

ఒకడు తన స్వస్వరూపం త్యజించకయే స్వప్నంలో తన యొక్క ఊహచే స్వప్నరూపమంతా దాల్చుచున్నాడు కదా! అట్లాగే చిత్స్వరూపుడగు ఈ జీవుడు కూడా తనయొక్క చిత్ స్వరూపం / చిదాకాశత్వం వదిలిపెట్టకుండానే... తన నిజస్వరూపాన్ని జాగ్రత్-స్వప్న విశేషాలుగా భావించు చున్నాడు. భావించినది అనుభవరూపంగా అనువర్తిస్తోంది. అనగా ఈ ద్రష్ట స్వ-ఇచ్ఛాపూర్వకంగా తన నిజస్వరూపము యొక్క ప్రదర్శనమును అచ్చటచ్చట అట్లట్లు జగత్తు రూపంగా గాంచుచున్నాడు.

**ఆహో త్వద్వేదమాజ్ఞాతం యదిత్థం దృశ్యతే జగత్ ।**
**తత్కథ్యతే 'స్వప్న' ఇతి స్వ చిత్కచనమాత్రకమ్ ॥**

ఓహో! ఇప్పుడు తెలిసింది. ఈ జగత్తు నిజ చిత్ స్వరూపము యొక్క స్ఫురణ మాత్రమే! ఆ స్ఫురణయే జగత్తుగా ఇక్కడ కనిపిస్తోంది. ఏ జాగ్రత్ స్ఫురణ జాగ్రత్ సమయంలో దృశ్యానుభవంగా అనుభూతమౌతుందో, ఆ స్వస్వరూపమే (నిద్రపోయినప్పుడు) ఇక్కడ 'స్వప్నం' అనే పేరుతో పిలువబడుతోంది.

**వ్యాధుడు :** స్వప్నమునకు – జాగ్రత్‌కు భేదమేమిటి? ఏది మొదటిది? ఏది రెండవది? దేని నుండి ఏది వివర్తం పొందుతోంది? అనగా, జాగ్రత్‌లోంచి స్వప్నం వస్తోందా? లేక, 'స్వప్నం' లోంచి జాగ్రత్ వస్తోందా?

**మునీశ్వరుడు :**

**చిద్ధాతోర్యత్కచనం తత్ కించిత్ 'స్వప్న' ఉచ్యతే, కించిచ్చ 'జాగ్రత్'**
**ఇత్యుక్తం! "జాగ్రత్ స్వప్నౌతు న ద్విధా !**

చిదాకాశరూపమగు 'చైతన్యము' యొక్క ఒకానొక రూపమైన స్ఫురణను ...స్వప్నం అని, మరొకరూపమైన స్ఫురణను ...జాగ్రత్ అని పిలుస్తున్నారు. అనగా, జాగ్రత్ స్వప్నములు రెండూ కూడా చైతన్యము యొక్క స్ఫురణలే!

ఈ జాగ్రత్ – స్వప్నములు భిన్నములైనవి కావు. జాగ్రత్‌ను విమర్శించి చూస్తే స్వప్నమే అవుతుంది. స్వప్నం స్వప్న సమయంలో జాగ్రత్ లాగానే అనుభూతమౌతోంది.

**స్వప్నః స్వప్నో జాగరాయామ్, ఏష స్వప్నే తు జాగరా ।**
**స్వప్నస్తు జాగరైవేతి జాగరైవ స్థితా ద్విధా ॥**

జాగ్రత్ అవస్థలో ఉన్నప్పుడు స్వప్నం "అది కల" అని స్వప్నరూపంగా ఎఱుగబడుతోంది. అట్లాగే... స్వప్న సమయంలో స్వప్నం జాగ్రత్‌లాగానే (ఇదంతా ఇట్లు స్థూలమే అని) అనుభూత మౌతోంది. స్వప్న సమయంలో జాగ్రత్ ('ఆ జాగ్రత్‌లోదంతా నా ఊహయే' అనే రూపంగా) ఇప్పటి స్వప్నంలాగానే అనిపిస్తూ ఉంటోంది.

ఓ మహామతీ! వ్యాధుడా! ఈ పురుషుడు (జీవుడు) చైతన్యరూపుడే అయి ఉన్నాడు. జాగ్రత్-స్వప్నములకు కేవలసాక్షి, రచయిత, ఆస్వాదకుడు, భోక్త, త్యాగి, అతీతుడు కూడా (ఒకే సమయంలో) అయి ఉన్నాడు.

కాబట్టి... అనేక శరీరములు మరణించినప్పటికీ కూడా... ఈతడు ఎట్లా ఎప్పుడు ఎవరికి మరణించినవాడగుచున్నాడు చెప్పు? ఒకడు "నా బంధువు మరణించాడు" అని అనుకోవచ్చుగాక! అయినా సరే... ఆ మరణించినట్లుగా లోకముచే చెప్పబడేవాడు తనను తాను త్యజించటం లేదు. తాను వస్త్రమువలె ధరించిన దేహమును త్యజించి ఉండవచ్చుగాక! అంత మాత్రం చేత ఎవడూ తనను తాను వదలి ఉండటం లేదు. కనుక మరణించిన వాని దృష్టిలో తాను మరణించకయే ఉన్నాడని సూక్ష్మదృష్టితో గ్రహించు. ఆ మరణించినట్లు చెప్పబడే వాడు మరణానంతరం తన మనస్సునందు మనస్సుచే జాగ్రత్ – స్వప్న–సుషుప్తులను కొనసాగిస్తూనే ఉన్నాడు సుమా!

ఈ జీవుని వాస్తవ స్వరూపమగు చైతన్యము... అనంతమైనది. విభాగరహితమైనది. శుద్ధ చిదాకాశము అయియున్నది. సాకార – నిరాకారములకు విలక్షణమై ఉన్నది. కానీ... భ్రాంతిచే దేహమువలె భాసిస్తోంది. ఏమి చమత్కారం!

అట్టి చైతన్యము, అమూర్త స్వభావయుక్తమైనది. (భౌతిక పదార్థమువలె ఆకారం పరిమితమైనది కాదు.) నిత్యమైనది, అనంతమైనది, నిత్యోదితమైనది. అట్టి చిత్ పరమాణువు యొక్క స్వకీయ కల్పనా చమత్కృతిచే (లేక) భ్రాంతిచే జాగ్రత్ – స్వప్న దేహములు ఎఱుగబడుచున్నాయి.

ఒక అవయవి (శరీరి) యందు విచిత్రములైన అవయవాణువులు భాసిస్తున్నాయి కదా! అట్లాగే, చిదాకాశము యొక్క అంతరమున 'జగద్భ్రాంతి' అనబడే చిదణువులు భాసిస్తున్నాయి.

**వ్యాధుడు :** ఈ జీవుడు జాగ్రత్‌లో ఇంద్రియ బాహ్యత్వము అనుభవించుచున్నాడు కదా?

**మునీశ్వరుడు :** అవును "నేను ఈ దేశంలో ఉన్నాను. ఈ ఇంద్రియ జగత్తు బాహ్యమున ఉన్నది" అని జాగ్రత్ – స్వప్నములలో భ్రమచే తలచుచున్నాడు.

జాగ్రత్తు యొక్క భోగప్రదమగు కర్మ నుండి మరలినప్పుడు జీవాధారమగు హృదయంలో ప్రవేశిస్తున్నాడు. హృదయంలోగల తన రూపమునే బాహ్య సంస్కారముల యొక్క అవరోధము స్వప్నరూపంగా గాంచుచున్నాడు. స్వప్న సమయంలో స్వప్న సంఘటనలను ఆ స్వప్న ద్రష్ట (ఈ జాగ్రత్తును సత్యమని అనుకొంటున్నట్లే) సత్యమనియే అనుభవమును పొందుచున్నాడు.

స్వప్నరూపం సంతరించుకున్నది స్వప్నద్రష్ట యొక్క చిత్స్వరూపమేగాని మరెవరో కాదు. అట్లాగే జాగ్రత్ కూడా! జాగ్రత్ ద్రష్ట యొక్క చిత్ స్వరూపమే జాగ్రత్‌లో జగత్తుగా ప్రదర్శితమగుచు చిత్ స్వరూపుడగు జాగ్రత్ ద్రష్టకు అనుభూతమౌతోంది.

**బాహ్యోన్ముఖం బహిర్ జాగ్రత్ శబ్దితం కచితం స్వకమ్**
**రూపం పశ్యతి జీవో అయమ్ అన్తస్థం స్వప్న ఇత్యపి ॥**

చిత్తము ఎప్పుడు బహిర్గతమౌతోందో అప్పుడు జీవుడు నిజస్వరూపమునే బాహ్యమున దర్శిస్తూ "ఇది జాగ్రత్తు, వీరు నా వారు, వారు కాదు" ...ఇత్యాదిగా దర్శిస్తున్నాడు. చిత్తము అంతర్గతంగా కార్యనిర్వాహకంగా ఉన్నప్పుడు, ఆ చిత్తమునకు కనిపించే నిజరూపమును "ఇది నా స్వప్నం. ఇది ఇల్లు. వీరు బంధువులు, వారు మిత్రులు, ఇది ఉత్సవ సమయం" ...ఇత్యాది దర్శనం

చేస్తూ ...అదంతా తనకు అన్యమైన దానివలె దర్శిస్తున్నాడు. ఆహా! ఏం ఆశ్చర్యం! సర్వదా ఏకరూపంగా ఏర్పడియున్న (స్థితి పొందియున్న) జీవాత్మయే బాహ్య (జాగ్రత్తులో) ...అంతరములలో (స్వప్నంలో) "ఆకాశం, భూమి, పృథ్వి, జలము, అగ్ని, వాయువు, పర్వతము, నది, దిక్కులు" ...మొదలైన అనేక రూపాలుగా ప్రసరించి ఉంటోంది.

**వ్యాధుడు :** స్వామీ! జీవుడు జీవుడుగానే ఉంటున్నాడా? లేక, జీవుడు ఆకాశ, వాయు, పర్వత, నదీ రూపుడుగా పరిణామం చెందుచున్నాడా? లేక జీవుని రూపం ఈ జగత్తా!

**మునీశ్వరుడు :**

**అర్కో ఽర్క బింబసంస్థోఽపి యథేహాపి స్థితస్త్విషా ।**
**తథా... జీవో జగద్రూపో బహిరంతశ్చ సంస్థితః ॥**

సూర్యుడు సూర్యమండలంలో సంస్థితుడై ఉండియే ఇచట కిరణ సమూహములతో వర్తిస్తున్నాడు కదా! అట్లాగే జీవుడు యథాతథమైన ఆత్మ స్థితియందు ఉంటూనే ఇక్కడ బాహ్య - అభ్యంతరములలో స్థితి కలిగి ఉన్నవాడై ఉంటున్నాడు.

ఓ వ్యాధుడా! ఇక్కడ నీకు ఒక మహత్తరమైన పాఠ్యాంశాన్ని సంబోధిస్తున్నాను, విను.

**అంతః "స్వప్నో" బహిర్ "జాగ్రత్" అహమేవేతి వేత్తి చేత్,**
**చిదాత్మకో యథా భూతం ముచ్యతే తదవాసనః ॥**

ఏ జీవుడైతే... "అంతరంలో స్వప్న రూపంతోటి, బాహ్యమున జాగ్రత్ రూపంతోటి చిద్రూపుడనై సర్వ రూపములను సంతరించుకొని నేనే వర్తిస్తున్నాను." అని కార్య-కారణయుక్తంగా యథార్థ జ్ఞానం ఘనీభూత పరచుకుంటూ ఉంటాడో... అట్టివాడు క్రమక్రమంగా వాసనారహితుడగుచు... ముక్తిని కరతలామలకం చేసుకోగలడని ఘంటాపథంగా నీ ద్వారా అస్మత్ రూపులైన సర్వ సహజనులకు మనవి చేస్తున్నాను.

**అచ్ఛేద్యోఽయమ్ అదాహ్యోఽయమ్ అపి, జీవో అన్యథా వదన్**
**ద్వైత సంకల్ప యక్షేణ ముహ్యత్యేవ శిశుర్యథా!**

ఓ సహజనులారా! పసిపిల్లవాడు చీకట్లో చెట్టుయొక్క కదలికలను చూచి "అయ్యబాబోయ్! అక్కడ దయ్యం కదులుతోంది రోయ్!" అని అనుకుని భయపడతాడు చూచారా! జీవాత్మ ఛేదింపబడేది కాదు. దహింపబడేది కాదు. అయినప్పటికీ మీరు తద్విరుద్ధంగా 'నేను పుట్టాను' "నేను చస్తాను" ...అంటూ మాట్లాడతారేమిటి?

ఈ జీవుడు... అంతర్ముఖుడైనప్పుడు తననుతానే స్వప్న జాగ్రత్ రూపంగా గాంచుచున్నాడు. బహిర్ముఖుడైనప్పుడో... తనను తానే బాహ్య జగద్రూపంగా గాంచుచున్నాడు. జీవుని యొక్క స్వప్న - జాగ్రత్తలు ఇవియే!

❖

ఓ వ్యాధుడా! ఈ విధంగా ఆ ఒకానొక సహజీవుని దేహంలో చిత్త - ప్రాణ స్వరూపుడనై ప్రవేశించి ఆనంద మయకోశంలో ప్రయాణిస్తూ ఆతని ఆనందమయకోశంలోని స్వప్నమయ

విభాగంలో ప్రవేశించి "జాగ్రత్తు - స్వప్నములు ఒక్క తీరైనవే" ...అనే పాఠ్యాంశాన్ని నేను గ్రహించాను. గమనించాను. నేర్చుకున్నాను.

స్వప్న - జాగ్రత్‌ల వాస్తవ స్వరూపం గ్రహించి తృప్తి పొందిన తరువాత, ఇకప్పుడు "మరి సుషుప్తి అనగా ఏమై ఉంటుంది?" అనే జిజ్ఞాస పొందాను. సుషుప్తి యొక్క రూపమేమిటో, స్వభావం ఎట్టిదో... అద్దాని చమత్కారం ఏమై ఉన్నదో గ్రహించాలని నిర్ణయించుకున్నాను. ఇక నేను ఆ జీవుని ఆనందమయకోశంలో సుషుప్తి యొక్క తత్త్వము గురించి అన్వేషించసాగాను.

అట్లా అన్వేషణ కొనసాగిస్తూ ఉండగా ఇంతలో నాలో 'దృశ్యము' పట్ల ఒకానొక తూష్ణీభావం ఉద్భవించింది. "ఈ జాగ్రత్ - స్వప్న దృశ్యములతో నాకేమి పని? అసలీ చిత్తములో కదా, దృశ్యాదులన్నీ పొందుచున్నాను! కనుక చిత్తరహితుడై ఉండెదనుగాక!"... అనే ఒక ఉద్దేశము రూపుదిద్దుకోసాగింది. వెంటనే చిత్తము కొంచెం కొంచెం ప్రశాంతత సంతరించుకోసాగింది. అప్పుడు విషయములు వదలి విషయరహితుడనై ఉండటం ప్రారంభమయింది.

వెంటనే అట్టి చిత్తైత్యాజ్య స్థితిలో విషయములు రహితం అవటం గమనించాను. "ఓహో! ఇప్పుడర్థమయింది"... అని ఒక్కసారి నా బుద్ధికి తోచింది. చిత్తరహితంగా అంతరంగంలో ప్రశాంతుడనై ఉండే స్థితియే సుషుప్తి. అంతకుమించి సుషుప్తి అనగా మరింకేమీ కాదు. - అని గమనించసాగాను.

అట్టి సుషుప్తి జాగ్రత్ - అహంకారంచే ఎఱుగబడటంలేదు. ఎందుకంటే సుషుప్తిస్థితిలో జాగ్రత్ - స్వప్న అహంకారం కూడా మౌనం అవటం ప్రారంభిస్తోంది. కానీ, సుషుప్తి అహంకారం నిర్విషయమై ఉంటూనే, 'సుషుప్తి' ని అనుభవరూపంగా పొందుచూనే ఉన్నది.

కానీ... అది విదిత-అవిదిత రూపమై ఉన్నది. ఎందుకంటే... సుషుప్తిలో విషయాలే లేవు కనుక ...అది అవిదితం. కానీ... ఇది "నా గాఢ నిద్రాస్థితి" అని తెలియుచూనే ఉన్నది. కనుక విదితం.

ఆ స్థితి జడము కాదు. తెలుసుకొనే చైతన్యము సాక్షియై ఉండగా అయ్యది జడం ఎట్లా అవుతుంది? సుషుప్తి చేతనము కాదు. విషయములుంటే కదా, 'కదల్చునది' అనే అర్థం సూచించే 'చేతనము' అని అనటానికి? అయితే ...జడ-చేతనములకు సాక్షి అయినట్టి చిదాత్మయందే సుషుప్తి స్ఫురిస్తూ, శోభిస్తోంది.

ఓ వ్యాధుడా! సుషుప్తి గురించి చెప్పటానికి వీలుగా మరికొంత వివరణను కొనసాగిస్తున్నాను. విను. ఈ జీవుడు ఒకానొక క్షణంలో ఇట్లా భావన చేస్తున్నాడు. "అబ్బా! ఈ జాగ్రత్ స్వప్నములలో మనోదేహంతో పరిభ్రమిస్తూ శ్రమచే అలసిపోయాను. అయినా వీటన్నిటి గురించి భావన చేసి ఏం ప్రయోజనం? ఇకచాలు. కొంచెంసేపు అన్ని ఆలోచనలు కట్టిపెట్టి 'ఆలోచన' అనే పరిశ్రమను త్యజిస్తాను. చిత్తరహితుడనై శాంతంగా ఉండెదనుగాక!" ఈ ప్రకారంగా అనుకొని సర్వ సంకల్పములను త్యజిస్తున్నాడు. అప్పుడు ఆతని అనుభూతి గాఢనిద్రాకారమై ఉంటోంది. 'ఆలోచనలు' అనే కార్యక్రమం నుండి ఆదమరచి "ఆలోచనా రాహిత్యం" ...అనే స్థితిని స్వయంగా సంతరించుకోవటమే (అట్టి పరిణామమే) సుషుప్తి. అంతకు మించి సుషుప్తికి వేరే రూపమేదీ లేదు. ఈ మనుజుడు "ఇప్పుడు

నేనేదీ ఆలోచించనే ఆలోచించను. అన్నీ వదలి నాలో నేను ప్రశాంతుడనై ఉంటాను. 'అనేక రూపములు' అనే భ్రమను వదలి ఏకరూపుడనై ఉంటాను"...అని ఎవడైనా అనుకొని సమస్త ఆలోచనలను త్యజించి ఉండటం అభ్యసిస్తూ ఉంటే ... అట్టి మనుజుడు జాగ్రత్తునందు కూడా అట్టి గాఢ రూప సుషుప్తిని స్వయంగా అనుభూతమొనర్చుకొనగలడు.

సుషుప్తియే... 'ఘనీభూతం' పొందినప్పుడు 'నిద్ర' అంటున్నాం. కొంచెం విక్షేపముచే శైథిల్యం పొందినప్పుడు 'స్వప్నం' అంటున్నాం. ఇంకొంత శైథిల్యమైన సందర్భంలో 'జాగ్రత్' ఏర్పడినదై ఉంటోంది.

**తురీయం -** ఓ వ్యాధుడా! ఆ విధంగా 'సుషుప్తి' యొక్క స్థితి – రూపములను గ్రహించాను. జాగ్రత్–స్వప్న–సుషుప్తుల స్థితి గతులేమిటో గమనించాను. అయితే ఇక ఆ తరువాత "తురీయం అనగా ఏమిటి?" అనే ప్రశ్నకు వచ్చాను. మహాప్రయత్న శీలమైన బుద్ధితో తురీయావస్థ యొక్క అన్వేషణ చేయసాగాను. ఎంతో సంచరించాను. కానీ ఏం లాభం? చీకటి ఉన్నంత వరకు వెలుగు రూపమేమిటో తెలియదు కదా! అట్లాగే అజ్ఞాన నాశకమగు "శుద్ధ సమ్యక్ జ్ఞానం" సంపాదించుకో నంతవరకు 'తురీయ స్థితి' యొక్క రూపమేమిటో కొంచెం కూడా లభించదు.

ఈ ప్రపంచం యథాతథంగా ఉండినప్పటికీ... ఇదంతా కూడా "సమ్యక్ – బోధ"చే విలీనమైపోతోంది. అనగా... ఒక ఇద్దరి పరిచితులలో ఏ భేదం వర్తమాన స్థితిలో కనిపిస్తోందో... అది కాస్తా "అంతటా సమమైయున్న సమ్యక్ జ్ఞాన సముపార్జన"చే పటాపంచలౌతోంది. అప్పుడీ ప్రపంచమంతా ఆత్మరూపంగా (అకృత్రిమంగా) అనిపించగలదు. అట్లు ఆత్మగా కనిపిస్తున్నప్పుడు ఇక్కడ వాస్తవానికి ఏదీ విలీనం కాదు. ఎవడు సమ్యక్ దృష్టిని బలోపేతం చేసుకుంటాడో ఆతడు తన స్వరూపమును జాగ్రత్ – స్వప్న – సుషుప్తులకు వేరైనదని, వాటిచే స్పృశించబడజాలదని, ఆ మూడూ ఎందులో ఏర్పడి విరామం చెందుచున్నాయో – అది తన స్వరూపంగా గమనించుచున్నాడు. కనుక... తురీయం అనేది ఒక అవస్థ కాదు. అది జాగ్రత్ – స్వప్న – సుషుప్తుల యొక్క కేవల – అప్రమేయ సాక్షీరూపం అయివున్నది.

జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు అనే మూడు స్థితులు తురీయము నందు స్థితి కలిగి ఉన్నాయి. కానీ పరమార్థంగా... వాస్తవానికి ఏదీ ఎందులోనూ స్థితి కలిగి ఉండటం లేదు.

"ఈ జగత్తు ఏ కారణం చేతనూ ఉత్పన్నమయి ఉండలేదు. శాంతము – జనన మరణ రహితము అగు బ్రహ్మమే ఇట్లు జగద్రూపంగా కనబడుతోంది." అనే బోధయే ... తురీయం.

"జన్మ కారకములగు కారణములేవీ అద్వయమగు బ్రహ్మమున ఉండజాలవు. 'సృష్టి' అనబడే ద్వైతమేదీ ఏ సమయమందును బ్రహ్మమునకు సంభవించజాలవు.

నేను బ్రహ్మమునే! (అహమ్ బ్రహ్మాస్మి)! జలమునకు తరంగత్వము వాస్తవరూపం కానట్లు ...జన్మాదులు ...జాగ్రత్ స్వప్న సుషుప్తులు నా స్వరూపమునకు ఆపాదించబడజాలవు. నేను ఏదై ఉన్నానో అది సర్వదా యథాతథమై ఉన్నది. నాకు కనిపించేవన్నీ నా యొక్క వివిధ రూపములే!"

ఇట్టి అవగాహనతో కూడిన అనిర్వచనీయ అనుభవస్థితియే "తురీయము" అను శబ్దముచే ఉద్దేశించబడుచున్నదని అత్యుత్తమ బుద్ధితో గ్రహించాను.

❖❖❖

# 5. చిత్త సర్వాత్మకత్వం

**జీవుడు, పరిశీలన -**

**వ్యాధుడు (లుబ్ధకుడు) :** మహాత్మా! మునీంద్రా! ఆ విధంగా మీరు ఒకానొక జీవుని అంతరంగంలోకి చిత్తమయ దేహంతో ప్రవేశించి మహా ప్రయత్న శీలమగు బుద్ధితో జాగ్రత్ - స్వప్న - సుషుప్తి - తురీయముల స్వరూప, తత్త్వార్థములను సుస్పష్టపరచుకొనిన తరువాత... ఇంకా ఏం చేశారు?

**మునీంద్రుడు :** ఆ విధంగా జాగ్రదాది నాలుగు అవస్థల తత్త్వవిచారణ చేసిన తరువాత మామిడి వృక్షం యొక్క సువాసన గాలిచే కొనిపోబడి ఒక కమల సుగంధంలో లీనం చేస్తున్నట్లుగా - నేను ఆ ప్రాణి యొక్క చిదాభాస రూపమగు జీవునితోటి ఐక్యం పొందటానికి ప్రవృత్తుడనైనాను. ఆ ప్రాణి యొక్క చిదాభాసుని యందు ప్రవేశించటానికై ముందుగా నా హృదయమందలి తేజో రూపాన్ని కొంచెం త్యజించసాగాను. అనగా, అప్పటి వరకు తేజోరూపాన్ని ఆశ్రయించి ఇంద్రియ రూపమును అవధరించి ఇంద్రియ వృత్తులను ఆశ్రయించాను. అప్పుడు నా సమస్త ఇంద్రియ వృత్తులు బలాత్కారంగా బహిర్ముఖ వ్యాపారము నందు ప్రవృత్తం కాసాగాయి. అట్లా బహిర్ముఖంగా ప్రవృత్తమౌతున్న వృత్తులను అభ్యంతరమునకు (లోనికి) మరల్చే ప్రయత్నమునకు సంసిద్ధుడనైనాను. అట్లా వృత్తులను అదుపులో పెట్టుకొంటూ, వాటిని చాకచక్యంగా నిగ్రహించి, క్షణకాలంలో ఆతని అభ్యంతరమున వ్యాపించినవాడనయ్యాను. అట్లా ఉపాధి వ్యాప్తిత్వముతో ఆతనిలో ప్రకాశించాను. ఆతని 'చిదాభాస సంవిత్తు'తో ఏకత్వం పొందాను.

అప్పుడు ఆతని వాసనలు, నా వాసనలు సంయోగం పొందాయి. అప్పుడు అంతః ప్రతిభాస ప్రపంచం ద్విగుణీకృతంగా కనబడసాగింది. దిక్కులు రెండింతలుగా కనిపించసాగాయి. ఇద్దరు చంద్రులు, ఇద్దరు సూర్యులు, రెండు భూమండలములు, రెండు ఆకాశములు - ఇట్లా కనిపించసాగింది.

ఒకే ముఖం రెండు అద్దములలో రెండు ప్రతిబింబాలుగా కనిపిస్తుంది చూచావా? అట్లాగే ఇరువురు చిదాభాసులు కలియటం చేత రెండు జగత్తులు (దృశ్యము రెండింతలుగా) కనిపించసాగాయి. ఓ సాధూ! రెండు వేరుశెనగ గింజలలో ఒకే తైలము ఉంటుంది చూచారా? అట్లా మా ఇరువురి చైతన్యము బుద్ధి కోశంలో ప్రతిభాసించసాగింది. బుద్ధిలో రెండు దృష్టులు భాసించాయి. వాస్తవానికి ఆతని యొక్క - నా యొక్క వాసనలు పూర్ణ సమ్మేళనం కాలేదు. అయినప్పటికీ పాలు-నీళ్ళులాగా ఒకని ప్రపంచంలో మరొకరి ప్రపంచం కలసి ఉన్నట్లే కనిపించింది. అనిపించింది.

అప్పుడు... నేను ఆ ప్రాణి యొక్క "చిదాభాస సంవిత్తు" నంతటినీ స్వసంవిత్తుచే పరిచ్ఛిన్నం చేసి అద్దానిని నా సంవిత్తుతో ఏకరూపత్వం పొందేటట్లు చేశాను. ఆతని సంవిత్తు నా సంవిత్తునందు

కలసి 'ఏకము' అయింది. అప్పుడు మా ఇద్దరి వాసనల ఏకీకరణము వల్ల పూర్ణ ఏకత్వం లభించటం చేత ...ఇదివరకు ద్విగుణీకృతంగా కనబడిన జగత్తు ఏకత్వం పొందింది.

ఆ తరువాత ఆ ప్రాణి యొక్క చైతన్యమునందు నా సంకల్పము అల్పమై .... నా సంకల్పం కూడా ఆతని సంకల్పానుసారంగా స్థితి పొందటం జరిగింది. స్వకీయమైన 'పరామర్శ'ను త్యజించ కుండానే ఆతని సంకల్పంలో నా సంకల్పం కరిగిపోయి ఉండటం జరిగింది.

ఆ పిదప అచట నేను ఆతని హృదయం త్యజించకుండానే అచట జాగ్రత్ సంబంధమైన అనుభవ విశేషాలన్నీ నావిగా అనుభవం పొందాను. ఆ జీవుడు మామూలుగా నిదురలేచి తన దినచర్యలను కొనసాగించసాగాడు. పగలంతా ఆతను చూస్తున్నవన్నీ నేను చూస్తున్నట్లుగా ఆతడు మాట్లాడేవి నేను మాట్లాడుచున్నట్లుగా ఆతని ఆలోచనలన్నీ నా ఆలోచనలుగా గాంచాను. ఆ విధంగా పగలంతా గడచింది. సాయంత్రం అయింది. అటు ఇటు పగలంతా తిరిగి ఆతడు ఇంటికి వచ్చాడు. సుష్టుగా భోజనం చేసి పడుకున్నాడు. మెల్లగా నిద్ర పోవటానికి సిద్ధమైనాడు. అప్పుడు ఆతని ధ్యాస 'రూపగ్రహణం – లోక విషయాలు విశ్లేషించటం – కోప ఇష్ట కార్యాభిలాష' ఇత్యాది ప్రపంచానుభవములనుండి ఉపశమించటం ప్రారంభించింది. చిత్తముతోసహా ఆతని ఇంద్రియ వృత్తులన్నీ మూయబడినవి కాసాగాయి. తాబేలు యొక్క అవయవములు అద్దాని శరీరంలో ప్రవేశిస్తాయి చూచావా? అట్లాగే ఆతని ఇంద్రియ వృత్తులు ఆతని హృదయకోశంలో ప్రవేశించాయి. కళ్ళు నెమ్మదిగా మూసుకున్నాయి. ఆతని వృత్తి కళ్ళస్థానం నుండి వెనుకకు మరల్చబడి హృదయ స్థానంలో ప్రవేశించింది. ఆతని శరీరం (కళ్ళు, కాళ్ళు, చేతులు, చెవులు మొదలైనవి) క్రమంగా నిష్క్రియములై మరణించినవాని అవయవములవలె తయారైనాయి. ఆతని శరీరం బాహ్యానికి– చిత్రలేఖనంలోని మనుజునివలె వ్యాపార రహితం అయింది. అప్పటిదాకా నేను కూడా ఆతడు జాగ్రత్తులో ఉన్నంత వరకు ఆతని ఇంద్రియవృత్తులు నావిగా భావించి ఆతని అనుభవములను నేను పొందాను కదా! ఇప్పుడు ఆతని చిత్తమును అనుసరించటం కొనసాగించాను. ఆతని చిత్త వృత్తితో ఆతని ఇంద్రియ గోళములను త్యజించి ఆయా నాడీ మార్గముల ద్వారా ఆతని వెనుకకు మరల్చబడిన చిత్తవృత్తులను అనుసరిస్తూ ఆతని హృదయంలో ప్రవేశించాను. ఆతని చిత్తము బాహ్యానుభవాన్ని ఉపసంహరించుకున్నది. అభ్యంతరంలో గల జీవ తేజస్సులో ప్రవేశించింది. ఆ తేజస్సులోగల, కోమలమైన ఆనంద కోశమును ఊయలలాగా అధిరోహించి సర్వ వ్యాపార శూన్యమగు సుషుప్తిని అనుభవించసాగింది. అద్దానితోబాటు సుషుప్తిని నేను కూడా అనుభవిస్తూనే అత్యంత సూక్ష్మమైన ప్రజ్ఞతో "గమనించటం" అనే నా ప్రధానోద్దేశమును కొనసాగిస్తూనే ఉన్నాను.

ఆ సమయంలో సమాన వాయువు (పంచ ప్రాణములలో ఐదవది) ఛిద్ర సహితములగు నాడులలో అన్న పానాదుల రసముల యొక్క అనేక వికారముల చేత అక్కడక్కడా నిరోధించబడుతోంది. అయినా కూడా సూక్ష్మరూపమగు గతిచే దేహమంతా సంచరిస్తూ ఉన్నది. ఎప్పుడైతే ఆ ప్రాణి యొక్క చిత్తమునకు "సుషుప్త స్థితి" సంభవించిందో... అప్పుడు ప్రాణము అద్వైత రూపమగు

ఆనందమునందు తత్పరమై ఉండటం గమనించాను. ప్రాణము "పురీతతి" అనే నాడిలో ప్రవేశించి తనతో వెంటనంటి ఉన్న చిత్తముతో సహా ఆత్మయే పురుషార్థంగా కలిగి ఉండే స్థితిని స్వాధీనపరచుకొని ఉన్నది. అదియే సుషుప్తిలో జీవునికి కలిగే సుఖ విశ్రాంతి.

ఓ వ్యాధుడా! ఒకడు పరమ స్వార్థపరుడై ఉన్నప్పుడు ఇతరుల పనులేవీ నిర్వర్తించడు కదా! అట్లాగే సుషుప్తదశలో ప్రాణములు 'ప్రత్యగాత్మ' అనే పరమ పురుషార్థమునందు తత్పరమై ఉంటు న్నాయి. అందుచేత ఆ ప్రాణములు 'ఇంద్రియములు' అనే పరవస్తు కార్యక్రమమేదీ నిర్వర్తించటం లేదు. నిరతిశయానందమైన "స్వాత్మ సత్తామయము"... అగు సుషుప్త సమయంలో జీవచైతన్యము కేవల నిరతిశయానంద రూపంతో ప్రకాశిస్తోంది. అట్టి సుషుప్త దశలో విక్షేప దుఃఖాదులేవీ కొంచెముగా కూడా భాసించుటలేదు.

❖❖❖

# 6. మనస్సుకు వేరుగా దేహమే లేదు

**శ్రీరాముడు :** హే మహర్షీ! సుషుప్తదశలో మనస్సు ప్రాణములకు అధీనములై ఇంద్రియాదుల గురించిన మననం ఏమాత్రం చేయటం లేదు కదా! మరి ఆ మనస్సు జాగ్రద్దశలో ప్రవేశించినప్పుడు ఇంద్రియాదులను (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాదులను) ఎందుకు మననం చేస్తోంది? వాస్తవానికి ప్రాణం కంటే మనస్సు అనబడే వేరైన రూపమేదీ లేదు కదా! ప్రాణాలు లేనిచోట మనస్సు ఉండదు కదా! మరి ప్రాణము సుషుప్త దశ నుండి జాగ్రత్ దశకు వచ్చి దృశ్యమననం ఎందుకు చేస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**దేహఏవాహ నాస్త్యేవ, స్వానుభూతోఽ ప్యయం నిజః**
**మనసః కల్పనాత్మేదం వపుః స్వప్నే గిరిర్యథా ॥**

ఓ రామచంద్రా! ఈ దేహము నిజంగా ఉన్నట్లుగా స్వానుభూతమగుచున్నప్పటికీ, వాస్తవానికి 'దేహము' అనబడేది లేదు. ఎందుకంటావా?... అధిష్ఠాన సన్మాత్రమును వేరుచేసి చూచామా... ఇక దేహం, మనస్సు, ప్రాణం మొదలైనవన్నీ లేనే లేవు. బంగారం లేకపోతే ఆభరణ మెక్కడున్నది? అధిష్ఠాన సన్మాత్రము ఉండి ఉన్నప్పుడు, ఇక తదితర మనో-ప్రాణ-దేహాదులు ఉండనే ఉంటాయి. బంగారం ఉన్నచోట ఆకారం కూడా ఉంటుంది కదా! జలమును ఆశ్రయించి తరంగత్వం ఉండనే ఉంటుంది కదా! స్వప్నంలో పర్వతం ఉన్నట్లుగా అగుపించవచ్చు గాక! ఆ పర్వతం ఎక్కడున్నది? అట్లాగే ఈ 'దేహము' అనబడేది మనస్సు యొక్క కల్పనా వ్యవహారం మాత్రమే! ఇక మనస్సో, ఆత్మకు (నిరాకార జలమునకు సాకార తరంగం వలె) కల్పనా వ్యవహారమై ఉంటోంది.

కాబట్టి మనస్సు నుండి వేఱుచేసి చూస్తే శరీరమే లేదు! అట్లాగే దృశ్య విషయం కూడా! సృష్ట్యాదిలో 'దృశ్యం' అనబడేది ఉత్పత్తి అవటానికి కారణమే లేదు కనుక ఆత్మకు వేరుగా 'దృశ్యం' లేనే లేదు. దృశ్యమే లేదు కాబట్టి 'చిత్తము' అనేది కూడా లేదు. మరి?

**అతః సర్వమిదం బ్రహ్మ తచ్చ సర్వాత్మకం యదా**
**తదా విశ్వమిదం విష్వగస్త్యేవ చ యథాస్థితమ్ ॥**

కాబట్టి రామచంద్రా! ఈ సమస్తము కూడా బ్రహ్మమే అయి ఉన్నదయ్యా! ఎప్పుడైతే "బ్రహ్మము సర్వాత్మకము"... అనే శాస్త్రవాక్యం మనం ఒప్పుకుంటామో... అప్పుడు బ్రహ్మమునకు వేఱైనదేదీ ఎక్కడా ఏ సమయమందూ లేనిదే అగుచున్నది. (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ!) బంగారం యొక్క ఉనికిచే ఆభరణం ఉన్నట్లు, జలం యొక్క సత్తాచే తరంగం ఉన్నట్లు... ఈ ప్రపంచము, మనస్సు, ఇంద్రియాలు, ప్రాణము... ఇవన్నీ కూడా బ్రహ్మ సత్తా చేతనే భావనారూపమై ఉంటున్నాయి.

బ్రహ్మవేత్తల దృష్టిలో చిత్తం, దేహం, దృశ్యం – అని చెప్పబడేదంతా బ్రహ్మమే అయి ఉన్నది. ఇక బ్రహ్మవేత్తలు కానివారి దృష్టి అంటావా... అది (తత్త్వవేత్తలమగు) మాకు విషయమే కాదు. ఎందుకంటే వారికి ఈ దృశ్య మనో జగదాదుల పట్ల క్షణమొకరకమైన అభిప్రాయం పుట్టుకొస్తోంది.

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు చెప్పే రీతిని బట్టి పాతాళలోకం నుండి బ్రహ్మలోకం వరకు అంతా బ్రహ్మమయమే కదా! వివిధ రూపములతో కూడిన ఈ త్రైలోక్యములు (స్వర్గ-మర్త్య-పాతాళములు) బ్రహ్మమే – అని గ్రహించటానికి వీలుగా ఆ క్రమమేమిటో వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చిన్మాత్రము నిర్మలమై అనంతమై చిదాకాశ స్వరూపమైయున్నది. అది సర్వదా సర్వరూపమైయున్నది. అది 'అద్వితీయం' అని (వేదోపనిషత్ లచే) ప్రవచించబడుతోంది. కనుక అద్దానికి వేఱుగా ఏదీ లేదు. కనుక జగత్తుగాని, దృశ్యం గాని, దృశ్యత్వం గాని ఏవీ కూడా లేవు.

ఆ చైతన్యము "ఎరుక" అను విలక్షణ లక్షణం కలిగి ఉంటోంది. అట్టి ఎరుక నుండి "ఎరుగుచున్నది – ఎరుగబడేది" అనునవి జలంలోంచి తరంగాలవలె ఏర్పడుచున్నాయి. అట్టి విలక్షణమైన విశేషమును "సర్వజ్ఞత్వం" అంటారు.

చైతన్యము తనయొక్క శుద్ధమైన – సర్వాతీతమైన – చింతాది రహితమైన చిత్స్వరూపమును కొనసాగిస్తూనే, తనయొక్క "సర్వజ్ఞత్వం" అనే విశేషం చేత మొట్టమొదటగా "మనస్సు" అనే అధ్యారోపమును స్వయంగా తనకు అనన్యంగా గావించుచున్నది. అటు తరువాత ఆ మనస్సుకు సంచారణ శీలత్వం తానే కల్పించుచున్నది. అట్టి మనస్సులో రెండు విభాగాలున్నాయి.

1. మనస్సు యొక్క తెలుసుకునే విభాగం, 2. మనస్సు యొక్క తెలియబడే విభాగం

"మనస్సు యొక్క సంచరణ శీలత్వమే ప్రాణములు" అని గ్రహించు. అనగా చైతన్యం ద్వారా మనస్సుచే కల్పించబడినదై 'ప్రాణం' అనేది అనుభూతమౌతోంది. ప్రాణం ఎట్లు అనుభూత మవుతోందో... అట్లాగే దేహేంద్రియాదులు, దిక్-కాలకల్పనాసమన్వితమైన జగత్తు కూడా అనుభూతమౌతోంది. ఈ విధంగా ఈ విశాల ప్రపంచమంతా మనోమాత్రమే అయివున్నది.

మనస్సో? చిద్రూపమగు పరబ్రహ్మమే! కాబట్టి ఈ ఎదురుగా కనబడేదంతా వ్యాపక పరబ్రహ్మమే గాని... మరింకేమీ కాదు! ఈ జగత్తు యొక్క వాస్తవ రూపమును పరిశీలిస్తే "ఇదంతా నిరాకారమై – ఆద్యంతరహితమై – అభాసశూన్యమై – నిర్వికారమై – శాంతమై – సన్మాత్రమై –

చిన్మాత్రమైనట్టి పరమబ్రహ్మమే" ... అని గమనించబడగలదు. పరబ్రహ్మము సర్వశక్తిమంతమైనది. అట్టి పరబ్రహ్మము తనయొక్క ప్రాథమిక మనశ్శక్తిచే దేనిని ఎట్లా భావన చేస్తోందో.... అది అట్లాగే ఆయా రూపాదులతో కూడుకొని అనుభవిస్తోంది.

ఒకడు తన స్వప్నంలో ప్రవేశించి ఆ స్వప్నంలో ఆయా రూపాలుగా గాంచేది తన యొక్క మనో రూపమే కదా! అట్లాగే జాగ్రత్తులో కూడా తన మనోరూపాన్నే తాను పరిపరి విధాలుగా సందర్శిస్తున్నాడు. సంకల్పాత్మకమైన "మనస్సు" అనే కార్యబ్రహ్మం తనకు తానే భూ, స్వర్గ, పాతాళ లోకాలను, కల్పించుకొని వాటియందు సుదీర్ఘ సంచారం సల్పుతోంది. ఒకడు ఊహచే సంకల్పించి ఆ ఊహలో ఏవేవో విశేషాలను దర్శించి అనుభవించటం, – అవన్నీ ఒక్కొక్కసారి 'నిజమే' అని అనుకోవటం ఆబాలగోపాలానికి విదితమైనదే కదా! అట్లాగే జాగ్రత్ – స్వప్న అనుభవాలు కూడా!

ఓ రామచంద్రా! 'ఆత్మ' అనబడే "చిదాకాశరూపుడు ఆదిపురుషుడు" – అగు పరమాత్మయే నిజకల్పితమైన మనస్సులో (తాను యథాతథంగా ఉంటూనే) ప్రవేశిస్తున్నాడు.

మనస్సు ద్వారా ప్రాణవంతుడగుచున్నాడు. ప్రాణముల ద్వారా దేహం ధరిస్తున్నాడు. దేహాదుల ద్వారా త్రిలోక రూపుడగుచున్నాడు.

ఇందుకు దృష్టాంతం స్వప్నమే! ఒకడు తాను యథాతథంగా ఉంటూనే తన ఊహారూపమును స్వప్నంలో ప్రకాశింపజేసి, ఆ స్వప్నంలో పురములను, గృహములను, మిత్రులను, శత్రువులను ఊహచే సంపాదించుకొని అనుభవించటం లేదా?

జాగ్రత్తు కూడా అట్టిదే! ఇది కూడా ఊహానిర్మితమే! స్వప్నం కూడా అట్టిదే! అదీ ఊహాకల్పితమే! "జాగ్రత్తు సంకల్పాలచే రూపుదిద్దుకుంటోంది" ...అని అనటానికి స్వప్నమే మనకిక్కడ ఒక దృష్టాంతం.

❖❖❖

# 7. మనో - ప్రాణ రథసారథ్యం

**శ్రీరాముడు :** "హే మహర్షీ! అసలీ జగత్తు యొక్క కర్తృత్వం ఎవరిది?" – అనే ప్రశ్నకు సమాధానంగా అనేక సిద్ధాంతాలు, కథనములు చెప్పబడుతూ ఉంటాయి. బ్రహ్మజ్ఞులగు మీ అనుభవం దృష్ట్యా ఈ సృష్టికి అసలైన కర్త ఎవరో, ఎక్కడుంటాడో, ఎందుకు సృష్టిస్తున్నాడో చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**చిత్తమేవ జగత్ కర్తౄ, సంకల్పయతి యద్యథా**
**అసత్ – సత్ – సదసచ్చైవ తత్తథా తస్య తిష్ఠతి ॥**

ఓ రామచంద్రా! చిత్తమే జగత్తుకు కర్త అయివున్నది. అది దేనినైతే ఎట్లు – ఇది అసత్తు, ఇది సత్తు, ఇది సదసత్తు... అని సంకల్పిస్తుందో ...అది ఆ ప్రకారంగానే సత్ – అసత్ – సదసత్‌గా స్థితి కలిగి ఉంటున్నదగుచున్నది.

ఈ చిత్తమే ప్రాణమును కల్పిస్తోంది. అట్లా కల్పించి, "ఈ ప్రాణము లేకపోతే నేనుండజాలను. ప్రాణమే నాయొక్క సమస్త వ్యవహారములను నిర్వర్తిస్తోంది" ...అని చిత్తమే కల్పన చేసింది.

అందుచేత ప్రాణము యొక్క ఆధీనంలో చిత్తము ఉండటం జరుగుతోంది? ఓ ప్రియరామచంద్రా! ఎక్కడెక్కడ మనస్సు ప్రాణముతో సహా ఈ దేహమును కల్పించుకొంటోందో... అక్కడక్కడ ఒక మాయాపురమువలె ఈ విశాల జగత్తును అనుభవిస్తోంది. మనస్సు యొక్క ద్రష్టరూపం "అహమ్" అయి ఉండగా, అద్దాని దృశ్యరూపం ఈ దృశ్య జగత్తు అయివున్నది. అనగా ద్రష్ట – దృశ్యరూపములు రెండూ కూడా మనో–అంతర్గతములే!

❖

ఆ విధంగా ప్రాణ–దేహముల కల్పనానంతరం ఈ చిత్తము "నేను ప్రాణ–దేహములు లేక పోతే మనజాలను" అని అనుకుంటోంది. అనగా, నేనే మనస్సుకు స్థానమై, మనస్సుకు అప్రమేయమై మనస్సుకు కారణ – కారణమై ఉన్న చిత్స్వరూపమును!"... అనే ఘనీభూతమైన అనునిత్య సత్యమును ఏమరుస్తోంది. అందుకే చిత్త స్వరూపమును అవధరించిన చిదాభాసుడగు ఈ జీవుడు, "నేను దేహినా? దేహమునా? దేహత్వానికి ముందే ఉన్నానా? లేనా? దేహాంతరం ఉంటానా? ఉండనా? ఉంటే ఎక్కడుంటాను? ఉండకపోతే ఏమైపోతాను"... అనే అనేక సందేహాలు కలిగియే ఉంటున్నాడు. తత్ఫలితంగా అల్పవిచారణ కారణంగా పుట్టుకువచ్చిన ప్రాపంచిక జ్ఞానముచే ఆతడు దుఃఖితుడుగా మిగిలిపోతున్నాడు. ఓ రామచంద్రా! "నేను ఈ శరీర–ప్రాణముల స్వరూపుడను"... అనే సంసార సంబంధమైన అల్పజ్ఞానం/విపరీతజ్ఞానం తొలగాలంటే తత్త్వవిచారణ తప్పితే వేరే ఉపాయం లేదు. అనగా... ఎవనికైతే "ఈ శరీర ప్రాణములు నేను! లేక, ఇవి నావి" ...అనే మిథ్యాజ్ఞానం ఉండి ఉంటుందో, ఆతని పట్ల "ఈ దృశ్యముపై గల నమ్మకం" అనే రూపంలో ఉండే 'సంసారం' అనబడే సుదీర్ఘ దృశ్య తాదాత్మ్యం ఉండియే తిరుతోంది. అట్టి సంసార జాడ్యానికి ఒకే ఒక్క పరమౌషధం "ఆత్మజ్ఞానం" మాత్రమే! అందుకిక వేరే ఉపాయం లేదు.

**న అన్యత్ర ప్రథతే జ్ఞానం మోక్షోపాయ విచారణాత్**
**ఋతే తస్మాత్, ప్రయత్నేన మోక్షోపాయో విచార్యతామ్ ॥**

ఓ సకల జనులారా! నా మాటలు జాగరూకులై వినండి. ఈ కనబడే జగత్తు, జగత్తుగా కాకుండా, మీ యొక్క ఆత్మ స్వరూపంగా కనబడటమే ఆత్మజ్ఞానం. అటువంటి ఆత్మజ్ఞానం పరోక్షమైన కథనాలతో లభించదు. కాబట్టి ఆత్మవిచారణను ప్రతిపాదిస్తున్న గ్రంథాలను పఠించండి. జీవుని యొక్క అవిద్యయే  దృశ్యమును ఆత్మకు అన్యమైన దానివలె దర్శింపజేస్తోంది.

**కిలాహమిదమ్ ఇత్యేవ నాఽవిద్యా విద్యతే క్వచిత్**
**మోక్షోపాయాదృతే నైతత్ కుతశ్చిదయతే అన్యతః?**

ఓ రాఘవా! "అవిద్య ఇక్కడ ఏ రూపంలో ఉన్నది?" అని మేము తరచితరచి పరిశోధించాం. "ఈ శరీరమే నేను – తదితర శరీరములు నాకు వేరు – ఈ గృహాదులు నావి–తదితరములు నావి కావు" ...అను రూపంగా అవిద్య ఇచ్చట తాండవిస్తోందని గ్రహించాం. అవిద్యకు "ఇదే నేను – ఇది నాది" ...అనుకోవటం తప్పించి వేరే రూపమేదీ లేదని మేము కనుగొన్నాం. అట్టి అవిద్య మోక్షోపాయం ఆశ్రయిస్తేగాని తొలగదు. అట్టి మోక్షోపాయం ప్రసాదించే "శ్రీ వసిష్ఠ రామ సంవాదము"

...వంటి గ్రంథములను /మోక్ష శాస్త్రములను పఠించి అనుభూతం చేసుకోవటం ముఖ్యమైన ఉపాయమై ఉన్నదని మేము గమనిస్తున్నాం. 'నేను–నాది' అనే జాడ్యం తొలగటానికి సరి అయిన మార్గంలో విచారించటమే ఉపాయం.

ఓ రామచంద్రా! "నాకు ప్రాణమే పరమాస్పదమైనది. అదే నా జీవనాధారం" అని ఎందుకో ఈ మనస్సు ప్రాణముల గురించి నిశ్చయమును పెంపొందించుకుంటోంది. అంతేగాని "నాకు నిత్యసత్యమగు ఆత్మయే ఆధారం" అనే విషయం గమనించటమే లేదు. "యత్ భావం, తత్ భవతి" అను మనో స్వభావ సూత్రమును అనుసరించి, (లేక) మనస్సు యొక్క కల్పనను అనుసరించి ప్రాణము అత్యావశ్యకమై అనుభవమగుచున్నది. అట్టి భావనా పరంపరల సుదీర్ఘాభ్యాసం చేత మనస్సు యజమాని అయివుండి కూడా ప్రాణములకు "దాసోఽహమ్" అంటోంది. ప్రాణములకు అధీనమగుచున్నది.

ఈ దేహం సౌమ్యంగాను, ప్రశాంతంగాను ఉన్నప్పుడు " దేహగతమైన శాంతియే ప్రాణగతమైన శాంతి" అని తలచుచు మనస్సు తదనుగతంగా "నేను హాయిగా ఉన్నాను" అని మననాది వ్యాపారాలు కొనసాగిస్తోంది. ఈ దేహం సంక్షోభం పొందినప్పుడు ఆ క్షోభ ప్రాణములలోని క్షోభగా మనస్సు భ్రమిస్తోంది. అంతేగాని ఈ దేహ ప్రాణములకు సంబంధించని అనంత శాంత స్వరూపమైన ఆత్మను మనస్సు గమనించక క్లేశపడుతోంది. ఆత్మ విచారణచే తత్త్వజ్ఞానం సముపార్జించటంలేదు. అందుచేత మనస్సు ఏదో ఒక క్షోభకు ఎల్లప్పుడు గురి అవుతోంది.

ఓ సాధక జనులారా! ఎంతెంతకాలమైతే ప్రాణము శ్వాసోచ్చారణయందు తత్పరమై ఉంటోందో ...అంతంత కాలం మనస్సు "ఏదో పొందాలి" ...అనే దాహమును కలిగి ఉంటుందేగాని... ఆత్మజ్ఞానం కొఱకై ప్రయత్నించటం లేదు. అందుచేతనే ఒకానొక ఉపాయంగా ప్రాణ నిరోధాభ్యాస బలం సంపాదించుకోవటం చేత, మనస్సుకు ఆత్మజ్ఞానం వైపుగా ప్రయాణం సిద్ధించటం సులభం అవుతోంది. మనస్సు ఆత్మజ్ఞానము వైపుగా మరలనంతకాలం అద్దానికి వివిధ రీతులతో కూడిన దృశ్యమే కనిపిస్తుందిగాని... దృశ్యమునకు ఆధారమైన స్వస్వరూపాత్మ అనుభూతమవటం లేదు. అందుచేత ప్రాణ నిరోధాభ్యాసం శాస్త్రకారులచే శాస్త్రోక్తంగా బోధించబడుచున్నది.

ఓ రామచంద్రా! ఈ ప్రాణము, మనస్సు అనబడే రెండూ ఈ విధంగా ఒకదానికి మరొకటి రథము, సారథుల వలె ఉంటూ పరస్పరం పాత్రలను మార్చుకుంటున్నాయి. ఎంత ఆశ్చర్యం! ప్రపంచంలో ఎక్కడైనా రథం రథంగానే ఉంటోంది. సారథి సారథిగానే ఉంటున్నాడు. రథం సారథిగా మారటం సారథి రథంగా మారటం మనం ఈ మనో ప్రాణముల విషయంలోనే లోకంలో చూస్తున్నాం.

ఈ ప్రకారంగా ప్రాణ–మనస్సుల పరస్పర వర్తనం ఆదిసృష్టిలో ప్రాణ – మనో రూపములు తానే అయి ఉన్న పరమాత్మయే సంకల్పించారు. అజ్ఞానుల పట్ల ఆ నియతి ఇప్పటికీ అట్లాగే కొనసాగుతోంది. ఈ విధంగా "మనఃప్రాణములు రెండూ కూడా సంకల్ప కల్పితాలు" ... అని

ఆత్మైక్యదృష్టికి సుస్పష్టంగా తెలియవస్తున్నాయి. ఏ జీవుడైతే "ఈ మనో ప్రాణములే నేను" అని తలచుచు, ఈ రెండింటికి ఆవలగల తనయొక్క అప్రమేయ – అద్వితీయ – అనంతగుణ గంభీర – నిత్య నిర్మల ఆత్మ స్వరూపమును గమనించటం లేదో... ఆతని పట్ల దేశ–కాల–క్రియా–ద్రవ్యములు కల్పితములగుచున్నాయి. అనగా ఎవరైతే తమ ఆత్మస్వరూపమేమిటో గమనించక "శరీరంతో చస్తాను. మనస్సును అనుసరించే నేనుంటాను. ప్రాణాలుంటేనే మనస్సు పని చేస్తుంది" ...అను దేహ – మనో – ప్రాణాత్మ బుద్ధి కలిగివుంటారో, వారి వారి కల్పనలో దేశ కాల క్రియ ద్రవ్యము –అనే నాలుగు కల్పితమై ఆరూఢమౌతున్నాయి. ఈ దేశ–కాల–క్రియ–ద్రవ్యములే జగత్తు రూపంగా ఆ జీవుని పట్ల ప్రసిద్ధమై ఉంటోంది.

❖

ప్రాణ – మనస్సులనే జంటకవులు ఒక్కొక్కసారి కలసి సమత్వముతో కూడిన వారై తమ కార్యములను నెరవేర్చుకుంటున్నారు. మరొకసారి వారు వేరువేరై తమతమ కార్యములను వేరువేరుగా నిర్వర్తించుకుంటున్నారు.

**స్వం ప్రాణ – మనసీ సామ్యాత్ కుర్వతీ కర్మ తిష్ఠతః ।**
**వైషమ్యాత్ విషమం చైకం శాన్తే శాన్తా సుషుప్తతా ॥**

**జాగ్రత్తు -** ఈ ప్రాణము, మనస్సు అనే రెండూ కూడా సామ్యత్వము (సమత్వము) కొంతసేపు కలిగి ఉండి తమ తమ కార్యములు నెరవేర్చుకుంటూ ఉన్నాయి. అవి రెండూ కలసి ఉండి వాటివాటి కార్యములు నెరవేర్చుకొను సమయంలో కలిగేదే "జాగ్రదనుభవం". మరొకప్పుడు ప్రాణములు ఇంద్రియ వ్యాపారము నుండి నివర్తించి ఉంటున్నాయి. అప్పుడు ఈ మనస్సు భౌతికమైన ఇంద్రియాలను పొందటం మానివేస్తోంది. ఈ విధంగా ప్రాణం, మనస్సు విసమత్వం కలిగి ఉన్నప్పుడు మనస్సు ఇంద్రియార్థములలో ప్రవర్తిస్తోంది. ప్రాణము ఇంద్రియముల పట్ల మౌనం వహించి ఉంటోంది. అప్పుడు ఏర్పడే స్థితే స్వప్నం. స్వప్నదశలో దేహము యొక్క ఇంద్రియాలు పనిచేయటం లేదు. అయితే శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాలు (ఇంద్రియార్థాలు లేక జ్ఞానేంద్రియాలు) మనస్సు యొక్క అంగములే కాబట్టి మనస్సు వాటిలో చరిస్తోంది. ప్రాణము దేహము యొక్క ఇంద్రియములపట్ల మౌనం వహిస్తోంది. అయితే జీవుడు స్వప్నదశలో అనుభూతులు – అనుభవములు మనస్సు ద్వారా కొనసాగిస్తున్నాడు.

**సుషుప్తి -** ఇంకొక సమయంలో మనస్సు విశ్రమించి ఉంటోంది. అనగా అది విషయములను త్యజించినదై తనయందు తానే మౌనంగా ఏర్పడి ఉంటుంది. అది ఆత్మలక్షణముతో పోల్చతగినట్టి విషయరాహిత్య స్థితి వహించి ఉంటోంది. సర్వ విక్షేపములు సశాంతించిన స్థితిని పొందివున్న స్థితిలో 'విక్షేపశ్రమ' లేకపోవుటచేత జీవునకు సుఖవిశ్రాంతి లభిస్తోంది.

అట్టి విక్షేపరహిత మనో మౌనస్థితియే సుషుప్తి. ఇక శారీరకంగా చెప్పుకోవాలంటే... ఎప్పుడైతే అన్న రసముల చేతనో పిత్తాదుల చేతో, పైత్య జఠరాదిరసముల పరిశ్రమ చేతనో – నాడులు

నిరోధించబడగా... ఆ స్థితిలో ప్రాణాలు దట్టముగా (చిక్కగా) మందసంచారము కలిగి ఉంటున్నాయి. అప్పటి స్థితి సుషుప్తిగా సంతరించుకుంటోంది. నాడులు అన్న రసంచే పూర్ణమై ఉండడంచేతనో, (లేక) శరీరం దీర్ఘంగా శ్రమించి ఉండటం చేతనో (లేక) ఆకలి కారణంగానో నాడులు మందమై ఉంటున్నాయి. అప్పుడు ప్రాణములు మందమైన గతిని కలిగి ఉండడం చేత సుషుప్తి ఏర్పడుతోంది.

ఇంకా చెప్పాలంటే... మర్దనాదులచే నాడుల మృదుత్వం పొందుచున్నప్పుడు, బాణాదులు దేహంలోని కొన్ని ముఖ్య ప్రదేశాలలో తాకడం చేత నాడులలో అధిక-అల్ప రక్తప్రవాహం ఏర్పడడం చేత, దేహాంతర్గతములైన ప్రాణాలు రక్తాదులచే పూర్ణమైనపుడు... ఆయా సందర్భాలలో ప్రాణాలు ఎచటనో లీనమై మందసంచారం కలిగి ఉంటాయి. అప్పుడు కూడా జీవునకు సుషుప్త స్థితి జనిస్తోంది.

సరే ఇప్పుడు మనం ఈ విపశ్చిత్ చక్రవర్తి చెప్పుచున్న ఆ వ్యాధ – మహాముని సంవాదానికి వద్దాం.

❖❖❖

# 8. స్వప్నంలో జలప్రళయం

**విపశ్చిత్ :** ఓ వసిష్ఠ మహర్షీ! ప్రియ సభికులారా! ఆ వ్యాధునితో ఆ మహాముని కొనసాగించిన సంభాషణ వినెదరుగాక!

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆ ప్రాణి యొక్క హృదయంలో ప్రవేశించాను కదా! ఆ రోజు రాత్రి సుష్టుగా భోజనం చేసినవాడై ఆతడు గాఢ సుషుప్తి రూపమగు నిద్రకు ఉపక్రమించాడు. ఆతని చిత్తముతో ఏకత్వము పొందిన నేను అప్పుడు నిజ స్వాతంత్ర్యమును త్యజించి ఆతనితో కూడా గాఢనిద్రను అనుభవించాను. కొంతసేపు అట్లా జరిగిపోయింది. అట్లా కొంతసేపైన తరువాత ఆతని ఉదరంలోగల అన్నము జీర్ణం అయింది. అప్పుడు ప్రాణము అటూ ఇటూ కొంచెం వేగంగా చలించటానికి అవకాశం లభించింది. స్వాభావికంగానే ఆతని ప్రాణము నాడీ మార్గంలో ప్రయాణించటానికి చోటు లభిస్తూవుండగా ఆతని సుషుప్తి మందగించసాగింది. ఆ విధంగా సుషుప్తి సూక్ష్మత్వం పొందుతూవుండగా ... ఆతని హృదయంలో సూర్యోదయంలాగా స్వప్నమయ ప్రపంచం ఉదయించటం గమనించాను. ఆ స్వప్న ప్రపంచం సముద్ర – పర్వత – నదీ – భూ ప్రదేశాలలో త్రిలోక వ్యవహారములతో నిండివున్నది. అట్టి స్వప్న మహా ప్రపంచంలోగల ఒకానొక స్వప్న భూప్రదేశంలో గల ఒక నగరంలోని ఒక గృహంలోగల ఒక ఇల్లాలు (గృహిణి) నా ఎదురుగా కనిపించింది. నేను ఆ ఇంటికి యజమానినై, ఆ గృహిణికి భర్తనై ఉండటం నాకు అనుభూతం కాసాగింది.

ఇక నేను ఆ భార్య – పుత్ర – బంధు – సేవకులతో ఏదేదో సంభాషిస్తూ కాలం గడపసాగాను. ఇట్లా కాలం గడుపుచూ ఉండగా, ఒకానొకరోజు ఏదో ప్రళయకాల జలప్రవాహంలాగా వచ్చి ఆ మా గృహం మొదలైనవన్నీ నేను చూస్తూ ఉండగానే,... నా ఎదుట నుండి కొట్టుకుపోయేటట్లు

చేసివేయసాగింది. ఆ గృహం, ఆ నగరంతో సహా నేను కూడా ప్రవాహంలో పడి కొట్టుకుపో సాగాను. నాలాగానే అనేకమంది నగరవాసులు ప్రవాహ వేగానికి దొర్లించబడిపోతూ హాహాకారాలు చేస్తున్నారు. స్త్రీలు తమ భర్తల – పిల్లల గతి చూస్తూ గుండెలు బాదుకుంటూ రోదిస్తున్నారు. ఎన్నో ఇళ్ళు నేలమట్టమౌతూవుంటే కొందరు స్త్రీలు మేడపై నుండి కిటికీలోంచి చూస్తూ భయంగా కేకలు వేస్తున్నారు. ఆ ఉపద్రవాన్ని చూచి నేను దీనచిత్తంతో పెద్దగా ఏడవసాగాను. నా కళ్ళముందే అనేక గృహాలు నేలమట్టమైనాయి. నా భార్య – పిల్లలతో సహా కట్టు బట్టలతో అనేక మైళ్ళు జల ప్రవాహానికి కొట్టుకుపోయాం. ఒక పర్వత సానువు చేరాం. అక్కడ రాతిబండ చప్టాపై కొంచెం విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఇంతలో మరల జలతరంగాలు మమ్ములను ఆవరించాయి. అట్లా నేను నా భార్య – పుత్ర – బంధువులతో అనేక సంకటములు పడుతూ తీవ్రవేదన అనుభవిస్తూ ఉండగా అప్పుడొక్క క్షణంలో ఒకానొక జ్ఞానకిరణం నా హృదయంలో తళుక్కుమన్నది.

"ఓహో! నేను ఆశ్రమంలో తపస్సు చేసుకుంటూ ఆ జీవుని హృదయంలో ప్రవేశించి ఈ అన్యలోకం ప్రవేశించాను. ఆ ఒకానొక ప్రాణియొక్క హృదయంలోంచి ఆతని స్వప్న విభాగంలో ఈ అనుభవము దర్శిస్తున్నాను కదా" ...అని గుర్తుకు వచ్చింది. అందుచేత వర్తమాన స్వప్న ప్రపంచం యొక్క దృఢాభ్యాసంచే జనించిన మిథ్యాజ్ఞానంతో అప్పటి నా దేహం పరిపూర్ణమయి ఉన్నదని గుర్తు చేసుకున్నాను. కాబట్టి నా ఆ స్వప్నాంతర్గత భౌతిక దేహం జలప్రవాహానికి కొట్టుకు పోతున్నప్పటికి నా యొక్క సమాధిమయ స్వరూపమును స్మరించుకొంటూ ఉండటం చేత సుఖంగానే ఉండగలిగాను. ఇకప్పటి నుండి జలంలో కొట్టుకుపోతున్న పురములను, తదితర వస్తుజాలమును, జన – ధనాదులను చూచి మృగతృష్ణా జలంలాగా మిథ్యగా గాంచసాగాను. నలువైపులా జగత్ పదార్థములు అనేకం ఖండఖండములై శిథిలం అవటం చూస్తూ ...ఇట్లా అనుకున్నాను.

"ఆహా! ఏం ఆశ్చర్యం! జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు – అనబడే త్రినేత్రములు గలిగిన ఈశ్వరుడు జీవరూపుడై ఈ మాయా మహాసముద్రంలో తృణమువలె కొట్టుకుకుని పోవుచున్నాడా! హా హతవిధీ! ఇద్దానికి నేను చేయగలిగినదేమున్నది? ఏమీ లేదు!"

❖

ఆ ప్రవాహంలో అనేక ఆభరణాలు ధరించిన గంధర్వ – కిన్నెర – మనుష్య – దేవ – నాగ జీవులు మొదలైన కొందరు ఆ ప్రళయ సముద్ర తరంగములలో తేలియాడుచూ ఉంటే.... అదంతా ఏదో క్రీడవలె ఉన్నది. ఆకాశమున విహరించే దేవతా విమానాలు ఆ జలంలో కూలిపోతూ కనిపించాయి. ఆ జలాలు బ్రహ్మలోకంలో బ్రహ్మదేవుడు ధ్యాన నిష్ఠుడై ఆశీనుడైవున్న కమలముల పత్రములను స్పృశించి మరల వెనుకకు మరలుచున్నాయి. యముడంతటివాడు మరొక యమునిచే గొనిపోబడుచున్నట్లు కనిపించాడు. సూర్యగోళం ఆ ప్రళయ జలప్రవాహంలో మునిగిపోతూ కనిపించింది. తత్త్వజ్ఞులగు మహనీయులు మాత్రం తమ శరీరములు జల తరంగములచే ఖండన – మర్దనములు పొందుతూ ఉంటే... అదంతా కూడా ఖేద రహితంగా, ఏవో ఎండు కట్టెలు నీటిలో దొర్లుచున్నట్లుగా తమ దేహములను తాము గాంచగలుగుచున్నారు. స్త్రీ సమూహం తరంగములచే

దొర్లించుకుపోతూ ఉంటే శృంగార రసాస్వాదన గురించి చర్చించే పురుషులు చేసేదేమీలేక నిస్సహాయులై అక్కడక్కడ చూస్తూ ఊరకే ఉండిపోసాగారు.

ఆహా! లోకాలన్నీ ఆక్రమించి పరిపాలించే ఇంద్రాది దేవతలవంటివారు చిరునామా దొరకుండా ఆ జలంలో అంతర్గతులై అదృశ్యులగుచున్నారే! అదంతా చూస్తుంటే పరమ వేదనాభరితంగా ఉన్నది. "ఆహా! ఈ త్రైలోక్యము, త్రిలోకాధిపతులు, స్వర్గలోక సుందర వనములు, మర్త్యలోక సంబంధ- అనుబంధ బాంధవ్యములు ...చివరికు అన్నీ నశించటానికే జనిస్తున్నాయా?" అని నేను ఎంతో పరితాపం పొందసాగాను.

❖❖❖

# 9. దృశ్యం కల్పితం-దృక్ సత్యం

**వ్యాధుడు :** మహాత్మా! మహామునీ! తమవంటి జ్ఞానయోగ సిద్ధులు కూడా ఆ మహాకష్టప్రదమగు జలప్రళయం గురించి అనేక భ్రాంతులకు లోను అయ్యారా? అదంతా భ్రాంతియేనని, స్వప్న సదృశమేనని మీరు ఎరిగియే ఉన్నారు కదా! మరి అంతటి వేదనను, దురవస్థలను అనుభవించే బదులుగా మీరు ధ్యానయోగం ద్వారా సర్వ భ్రాంతుల నుండి ఉపశమనం పొంది ఉండవచ్చు కదా! అసలు ఆ జలప్రళయం ఎక్కడి నుండి వచ్చింది?

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆకాశంలో అభాస రూపములే (భ్రమ రూపాలే) ఆయినట్టి జగత్తులు అసంఖ్యాకంగా కల్పనచే జనిస్తున్నాయి. కల్పనా రూపంగా ప్రళయాలు కూడా సంభవిస్తున్నాయి. కల్పనా రూపంగానే ఆ జగత్తులు నశిస్తున్నాయి కూడా!

కల్పాంతంలో జగన్నాశనం సంభవిస్తోంది. ఆ జగన్నాశనం ఒకొక్కప్పుడు ఒకానొక క్రమంగా సంభవిస్తోంది. మరొకప్పుడు ఒక్కసారిగా సప్త సముద్రాలు ఏకకాలంలో ఏకమై నాశనం సంభవి స్తోంది. అప్పుడిక భూత-భవిష్యత్తు-వర్తమానాల గురించి విచారించటానికి సమయమే ఉండదు. అందుచేత నేను ఏ విచారం లేకుండానే అక్కడి కల్పాంత జలప్రళయం దర్శించాను. జగత్తు కల్పనయే. కల్పాంతం కల్పనయే! ఉభయములు ఊహాలో కనిపించే ఉత్పత్తి వినాశనముల వంటివే కదా! ఇక విచారించటం దేనికి? ఇది నేను ఆ సమయంలో జ్ఞాపకం పెట్టుకొనియే ఉన్నాను.

అప్పుడు జల ప్రళయం ఎంత అకస్మాత్తుగా సంభవించిందంటే... దేవతలు బ్రహ్మదేవుని సందర్శించటానికి పోతూ ఉంటే... ఇంతలో జల ప్రళయంలో వాళ్ళంతా కొట్టుకుపోయారు. అనగా దేవతలకే పూర్వాపూర విచారణకుగాని, ధ్యానమునకుగాని అవకాశం లేదంటే... ఇక మావంటివారి విషయం వేరే చెప్పాలా? పైగా... ఈ కాలము సర్వమును నశింపజేయునదై ఉన్నది. ఏ కాలమున ఏ విషయం ఏ ప్రకారంగా అవశ్యం జరుగనున్నదో... ఆ కాలమున ఆ ప్రకారంగానే తప్పక జరిగియే తీరుతుంది. వినాశకాలం సంభవిస్తున్నప్పుడు మహాత్ములగు వారి బల-బుద్ధి-తేజములు కూడా సర్వత్రా సర్వదా విపరీత భావములు పొందుతూ ఉంటాయి. ఇంకా

చెప్పాలంటే... నీకిప్పుడు నేను వర్ణించి చెప్పుచున్నదంతా ఆ మరొక ప్రాణి చిత్తమును అనుసరించి జరుగుచున్నది కదా! ఆతని స్వప్నం నాచే గాంచబడే వృత్తాంతంగా అగుచున్నది. స్వప్నంలో సంభవించనిదేముంటుంది?... కాబట్టి జలమహాప్రళయం స్వప్న సదృశమేనని గ్రహించు.

**వ్యాధుడు :** ప్రభూ! మీరు వర్ణించి చెప్పుచున్నదంతా స్వప్న భ్రమవంటిదని, అసత్తు అయివున్నది అని మీరే ఒప్పుకుంటున్నారు కదా! అట్టి అసదృశమైన స్వప్న సదృశ కథనం నాకు ఇప్పుడు చెప్పితే ఏం ప్రయోజనమున్నది?

**మహాముని :** ఓ బుద్ధిశాలీ! వ్యాధుడా! నాకు ఆ ప్రాణి స్వప్నంలోకంలో కనిపించిన జలమహా ప్రళయం అసత్తే! అందులో అనుమానం లేదు. అయితే... అందులో నీ స్వరూపమును నీకు విశద పరచే ఒకానొక తత్త్వబోధాత్మకమైన పాఠ్యాంశం ఉన్నది. మోక్షప్రదమైన సారాంశము ఉన్నది. అందుకే నాచే దర్శించబడిన ఆ స్వప్నాంతర్గత మహాప్రళయం గురించి చెప్పుచున్నాను.

ఈ దృష్టాంతముచే... నీవు "దృశ్యమాత్రమగు ఈ ప్రపంచము స్వప్నమువలె భ్రమాత్మకము" ...అని గ్రహించగలుగుతావు. ఎప్పుడైతే కనబడే దృశ్యము భ్రమమాత్రమని, స్వప్న సదృశమని గమనిస్తావో... అప్పుడు సత్యమైన 'దృక్' రూపుడవగు నీవే శేషిస్తావు. ఈ దృశ్యం నుండి నీ యొక్క దృక్ రూపమును వేరుచేసి గమనిస్తావు. ఇప్పుడు చెప్పుచున్న స్వానుభూతపూర్వక దృష్టాంతాలన్నీ...

1. నీవు 'దృక్' స్వరూపుడవు. దృశ్యములోని విభాగము కాదు.
2. అట్టి నీ దృక్ స్వరూపమే ఆత్మ.
3. కేవల దృక్స్వరూపుడవుగా నీవు చూచే దృశ్యమునకు-సర్వ ద్రష్టల యందు సర్వదా సాక్షివై చెన్నొందుచున్నావు.
4. అట్టి కేవల సాక్షిత్వమును ఆస్వాదిస్తూ ఈ దృశ్యమును స్వప్న సదృశంగా దర్శించు.

...అని బోధించటానికే సుమా! అందుచేత నేనిప్పుడు చెప్పే కథా విశేషం శ్రద్ధగా విను.

❖❖❖

## 10. స్వప్నంలో జనజీవన స్రవంతి

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆ విధంగా ఆ ప్రాణియొక్క హృదయ తేజంలో ప్రవేశించిన నేను ఆ స్వప్నమందలి జల మహాప్రళయ సంఘటనలో తిరుగాడుచున్నాను కదా! ఇంతలో ఆవర్తములతో కూడిన అక్కడి జలమంతా ఎటో పోవటం ప్రారంభించింది. ఆ జలంతో కొట్టుకుపోవుచున్న నేను శిఖరం వంటి ఒకానొక తీర ప్రదేశానికి దైవవశంగా జేరాను. ఆ తీరాన్నే ఆశ్రయించి ఉన్నాను. జలమంతా కూడా కొన్ని క్షణాల కాలంలో అదృశ్యమైనది. అక్కడి నుండి చూస్తే ఒక చోట బురద, మరొక చోట కంకాళ అవశేషాలు, ఇంకొకచోట చిన్న నీటిగుంటలు మొదలైనవన్నీ భూమిపై అగుపించాయి.

ఆ విధంగా పర్వత శిఖరం జేరిన నేను ఒకానొక ముని ఆశ్రమంలో ప్రవేశించాను. ఎంతో

అలసిపోయి ఉన్న నేను ఆశ్రమంలో క్షణంలో నిద్రకు ఉపక్రమించాను. నా సుషుప్తి యొక్క అంతమున పూర్వ వాసనా ప్రభావం చేత ఆ ప్రాణి తేజములో చూచిన జల ప్రళయమునే నా స్వహృదయ తేజస్సులో చూచాను. అదంతా నాకు రెండింతల దుఃఖం కలిగించింది. ఆ తరువాత మెళకువ వచ్చింది. అప్పుడు మరల ఆ ప్రాణియొక్క హృదయంలో అంతకు ముందు కనిపించిన పర్వతమే మరల నాకు కనిపించింది.

మరునాడు సూర్యోదయం అయింది. సూర్యోదయం కాగానే సుందరమైన ఆకాశం, భూమి, సూర్యకాంతి కనిపించాయి. ఆ ఆశ్రమంలోంచి బయటకు వచ్చాను. అక్కడి అందమైన పూతోటను చూస్తూ పుష్పముల సువాసనను ఆహ్లాదంగా అనుభవిస్తూ రాత్రి చూచిన జలప్రళయం సంగతి కొంచెం ఏమరచాను. అక్కడి ఫల పుష్పవనాన్ని ఆస్వాదిస్తూ సంచరించసాగాను. అక్కడకు సమీపంగా గల ఒక గ్రామంలో ప్రవేశించాను. అక్కడ నాకొక ఇల్లు కనిపించింది. ఆ ఇంట్లో ప్రవేశించాను. అప్పుడు నాకు, "ఈ ఇంట్లోనే కదా, నేను పుట్టాను! ఈ ఇంట్లో నేను పుట్టి అనేక సంవత్సరాలైనది. ఈయనే నా తండ్రి, ఈమేమో నా తల్లి. ఆ ప్రక్క ఇంటివారు మాకు బంధువులు. ఈ బ్రాహ్మణ కులమే నాది" .... అని ఈ ప్రకారంగా అనుభూతితో కూడిన బుద్ధి కలిగింది. ఇక అక్కడి బంధువులతో నివసించసాగాను. అక్కడే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు అనుభవించసాగాను. క్రమంగా రోజులు గడిచిపోసాగాయి. ఆ గ్రామం, ఆ మా ఇల్లు, అక్కడి బంధువులు మొదలైనవన్నీ నాకు మనిద్దరి ఈ సంవాదంలాగానే అప్పటికి పరమ సత్యంగా తోచాయి.

కాలక్రమంగా అవిద్యాజన్యములగు అనేక సాంఘిక – లౌకిక వ్యవహారములు అనేక రోజులు అభ్యసిస్తూ ఉండడంచేత నా ఇక్కడి ముని ఆశ్రమానికి సంబంధించిన అంతకుముందటి వివేకబుద్ధి మరుగున పడిపోయింది. క్రమక్రమంగా అప్పటి దేహమునందు ఆసక్తి కలవాడనై ఉండ నారంభించాను. "ఈ దేహంతోనే నా ఉనికి" ...అనే దేహాత్మబుద్ధికి లోబడిపోయాను. "ధనం సంపాదించి నా భవిష్యత్ జీవితాన్ని పదిలం చేసుకుంటాను" ...అనే ధ్యాస పెంపొందింది. ఒక ఇల్లు కట్టడం, అద్దానిని అనేక అలంకరణలతో తీర్చిదిద్దటం, అందుకు కావలసిన ధనాదుల సముపార్జన, ఆ ఇంటి నుండి వచ్చే ఆదాయాన్ని సరిచూచుకోవటం... ఈ విషయాలలో నిమగ్నమైపోయాను. భూమిని పశుసంపదను ధనమును కూడబెట్టడం, అల్పకాలం జీవించే రంగురంగుల ఆకులు కలిగివుండే మొక్కలపట్ల ఆసక్తి కలిగివుండటం, తోటలను కౌలుకిచ్చి కౌలు వసూలు చేయటం మొదలైన పనులన్నీ నాకు బృహత్తర కార్యక్రమాలైనాయి. తీర్థయాత్రలు, కష్టములు తొలగటానికి పూజలు ఇటువంటి వ్యవహారాలన్నీ నిర్వర్తించేవాడిని. "ఇది చేయాలి, అది చేయకూడదు" ఇటువంటివన్నీ వారికీ – వీరికీ బోధిస్తూ, నేను నిర్వర్తిస్తూ రోజులు గడపసాగాను. ఇట్లా చాలా సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ ఊరిలో శ్రోత్రియులైన బ్రాహ్మణ కుటుంబంగా ప్రసిద్ధికెక్కుతూ, పేరు ప్రతిష్ఠలను కాపాడుకుంటూ సమయం గడపసాగాను. ఈలోగా భార్య, కొడుకులు, కూతుళ్ళు మనుమళ్ళు, మనుమరాళ్ళు, స్నేహితులు, ఆస్తులు, వ్యవహారాలు... ఇటువంటివన్నీ పెంపొందాయి.

❖

కొంతకాలం గడిచిన తరువాత ఒక రోజు తపస్వి – ఆత్మజ్ఞుడు అయిన ఒక అతిథి చాలా దూరం నుండి మా యింటికి వచ్చారు. ఆయనకు అతిథి మర్యాదలు సమర్పించాను. స్నానం చేసి, సంధ్యావందనం చేసి భోజనం చేసి ఆ బాటసారి మా ఇంట్లో విశ్రమించాడు. ఆ సాయంకాలం ఆయన మా కుటుంబ సభ్యులందరిని చుట్టూ కూర్చోబెట్టుకొని "ఆత్మజ్ఞానం" అనే విషయాన్ని ఉపన్యసించాడు. ఆత్మజ్ఞానం ప్రతిపాదించే ఒకానొక కథాక్రమాన్ని వివరిస్తూ. "ఓ ప్రియ సహ జీవులారా! నాకు ఈ రోజు ఆతిథ్యాన్ని ప్రసాదించిన ఈ గృహ సభ్యులారా! ఈ పరమ సత్యాన్ని ప్రకటిస్తున్నాను. వినండి–

పరబ్రహ్మ మొక్కటే సత్యం. జగత్తు రూపంగా శోభించేది కూడా ఆ పరబ్రహ్మమే! అద్దానికి ఆద్యంతాలు లేవు. ఆ పరబ్రహ్మమే నీయందు, నాయందు సర్వ జీవులయందు 'నేను–నేను' అను శబ్దముచే ప్రదర్శనమగుచున్నది. అట్టి పరబ్రహ్మమే మనందరికీ ఆరాధ్యం. తదితరమంతా కాలగతమైనదే! ఇక ఇక్కడి ఇళ్ళు – వాకిళ్ళు – బంధుత్వాలు మొదలైనవి స్వప్న సదృశం.

"ఓ దృక్ రూప పరబ్రహ్మమూర్తీ! మీరు మీ స్వరూపమును మా బుద్ధికి సుస్పష్టపరచి జన్మ మృత్యు భ్రమలో చిక్కుకున్న మమ్ములను సముద్ధరించండి!' – అని స్వస్వరూపాత్మ భగవానుని ఆరాధించటం అలవరచుకోండి. ఓ కుటుంబ సభ్యులారా! అట్టి పరిపూర్ణ – నిరాకార – అవికార – అనంత పరబ్రహ్మమును సుస్పష్ట పరచుకొనటానికే ఈ 'జీవితము' అనే అవకాశమును సద్వినియోగపరచుకోండి."

ఇట్లా సంభాషించి ఆతడు ఒక తన ప్రయాణం కొనసాగిస్తూ మా ఇల్లు విడచి తన త్రోవన తాను వెళ్ళిపోయాడు.

❖

అదంతా శ్రద్ధగా విన్న నేను పూర్వ–పూర్వ సంస్కార ప్రభావంచేత దృఢబోధైక రూపత్వం పొందాను. క్రమంగా ధారణావశంచేత "ఆశ్రమవాసినైన నేను ఇతఃపూర్వం ఒకానొక ప్రాణియొక్క అంతరంగంలో ప్రవేశించానుగదా! స్వప్నము యొక్క పూర్వాపరాలు తెలుసుకోవాలనే ప్రయత్నంలో ఉన్నాను కదా"... అనే వృత్తాంతమంతా స్మరించాను. "ఓహో! ఏ ప్రాణియొక్క ఉదరంలో (పొట్టలో) నేనున్నానో,... ఆతడు సర్వజగన్నిలయమగు విరాడ్రూపుడే అయివుంటాడు"...అనే అనుమానం నాకు వచ్చింది. "ఇక ఎట్లాగైనా ఆతని హృదయం నుండి బయల్వెడలి నిజాశ్రమం చేరాలి"... అని తలచి ఆ ప్రయత్నానికి ఉపక్రమించాను. ఇక ఆ గృహం నుండి బయల్వెడలాను. ఆ ప్రాణియొక్క ఉదరంలోగల పృథివి – నది – సముద్రములతో కూడి బ్రహ్మాండమంతా తిరుగాడాను. ఆ ప్రాణి యొక్క హృదయంలోంచి బయల్వెడలటానికి మార్గం కనుగొనలేకపోయాను. అప్పుడు అక్కడి సర్వపదార్థాలను త్యజించి ఆతని ప్రాణవాయువులలో ప్రవేశించాను. "ఈ విరాట్టు యొక్క బాహ్యం – ఈతని సృష్టికర్తయగు మరొక విరాట్టు యొక్క అభ్యంతరం కూడా చూచెదనుగాక"... అని తలచి ఆతని ప్రాణవాయువుల వెంట పుష్పంలోంచి సుగంధంలాగా బయల్వెడలాను. ఆతని ప్రాణవాయువులను రథంగా చేసుకొని – ఎట్లాగైతేనేం ఆతని శరీరంలోంచి బయటకు వచ్చాను. తిరిగి నిజాశ్రమానికి

వచ్చి ఈ దేహమును చూచాను. ఈ దేహము శిష్యులచే కంటికి రెప్పలాగా పరిరక్షించబడటం గమనించి, దేహంలో చిత్త-ప్రాణములతో సహా ప్రవేశించాను. వెంటనే నా దేహం యథాతథంగా ప్రవృత్తమయింది.

❖

అప్పటికప్పుడు నాలో ఒక జిజ్ఞాస బయలుదేరింది. "ఏ ప్రాణి అంతరంగంలో నేను ప్రవేశించానో ఆతడిప్పు డెక్కడున్నాడు?" తెలుసుకోవాలనుకున్నాను. ఆతనిని ఆరా తీస్తూ ఈ ఆశ్రమం నుండి శిష్యులతో సహా ఆ ఎదురుగా గల గ్రామంలో ప్రవేశించాను. ఏ ప్రాణి యొక్క హృదయంలో ప్రవేశించి స్వప్న వృత్తాంతమంతా పరిశోధించానో, ఆ పురుషుడు ఉన్న ఇంటికి వెళ్ళాం. ఆతడు ఆ సమయంలో ఒకానొక ఉత్సవంలో లభించిన మృష్టాన్నమును భుజించి తృప్తిగా వెల్లకిలా పడుకొని నిద్రపోతున్నాడు. నాకు ఆతని అంతరంగంలో కనిపించిన అత్యంతాశ్చర్యకరమైన వృత్తాంతమంతా మరల మరల గుర్తుకు వచ్చింది. అయినా నా శిష్యులకు ఆ విశేషాలేవీ నేను చెప్పలేదు.

❖❖❖

# 11. అగ్ని ప్రళయం - వాయు ప్రళయం

**మునీంద్రుడు :** ఓ వ్యాధుడా! ఆ ప్రాణి సుష్టుగా ఉత్సవ భోజనం చేసి గాఢంగా నిదురిస్తున్నాడని తెలుసుకుని శిష్యులతో ఆశ్రమానికి తిరిగివచ్చాను. పగలంతా నా దేహ రక్షణలో కలిగిన శ్రమచే శిష్యులంతా ఆదమరచి నిదురించారు.

అప్పుడేమైనదో తెలుసా? ఈ సంసారంలో ఏమాత్రం అజాగ్రత్తగా సంచరించినా ఇందలి మాయా వస్తుజాలములైన మమకార-అహంకారాలు మన మనస్సును తాకుతాయి కదా! ఇందుకు దృష్టాంతం విను. ప్రశాంతంగా ఆశ్రమంలో ఈనెల మంచంపై పరుండిన నాకు ఆ ప్రాణి అంతర్గత లోకంలో గల గ్రామంలో నివసించినప్పటి భార్య, పుత్రులు, మనుమలు, మనుమరాళ్ళు గుర్తుకు వచ్చారు. "నా మనుమడు నన్ను చూడకపోతే బెంగపడిపోతాడే! ఎట్లా! పోనీ ఒకసారి వాడిని చూచి, బుజ్జగించి లాలించి వద్దాం" ... అని నా మనస్సు ఉవ్విళ్ళూరసాగింది. ఇక నిద్రపట్టలేదు. మరల దేహము నుండి నా మనో ప్రాణములను ఉత్తేజపరచి బయల్వెడల జేశాను. ఆ ప్రాణి యొక్క హృదయంలో ఇతఃపూర్వం వర్ణించిన విధంగా ప్రవేశించాను. క్రమంగా పర్వత శ్రేణిని సమీపించి ఇతఃపూర్వం నేను సుదీర్ఘకాలం జీవితం గడిపియున్న గ్రామం సమీపించసాగాను.

ఇంతలో నేను ప్రయాణిస్తున్న ఆ మనో - అంతర్గతమైన బ్రహ్మాండాంతర్గతంలో భయంకరమైన యుగాంతం ప్రవృత్తమయింది. ఆ ప్రపంచమంతా ధర్మాధర్మ వ్యవస్థతో సహా విపరీతదశను పొందటం ఆరంభించింది. నేను నా బంధువులున్న గ్రామంకోసం వెతుకుతూ ఉంటే ఆ స్థానంలో అన్యములైన భూమి - పర్వతాలు - దిశలు కనిపించాయి. నా పూర్వపు గ్రామము - భూభాగం - బంధువులు అవన్నీ గాలిచే ఎగురగొట్టబడి ఎటో మాయమైపోయినట్లుగా అనిపించింది. అక్కడి

ప్రపంచమంతా మరొక రూపంగా ప్రదర్శితమైంది. అదంతా అపూర్వమైన నూతన రచనగా నాకు కనిపించింది. ఇంతలో పది దిక్కులనుండి అగ్ని గుండాలు బయల్వెడలసాగాయి. అక్కడి సముద్ర – భూజలమంతా ఆవిరి కాసాగింది. పర్వతములపై భయంకరమైన అగ్నిజ్వాలలు వెలయసాగాయి. భూమండలమంతా అగ్నిరాసి కాసాగింది. విశ్వమంతా ఒకే జ్వాలచే మండుతూ కనిపించింది. నా చుట్టూ అగ్నిజ్వాలలు ఎగసాయి. ఆ భీకరాగ్ని మధ్యంలో నేను చిక్కుకుని ఉన్నప్పటికీ "నేను సూక్ష్మమగు మనో–ప్రాణమయ దేహిని. నన్ను అగ్ని దహించలేదు" ...అను కృతనిశ్చయంతో ఉండి ఉండటం చేత అక్కడి ప్రళయాగ్ని నాకు కొంచెం కూడా బాధనుగాని, వేదననుగాని కలిగించటంలేదు. ప్రాణవాయుధారణ చేసియున్న నేను నా వాయుమయ దేహంతో ఆ ప్రళయాగ్నిజ్వాలలో అస్పృశ్యుడనై అటూ – ఇటూ సంచరించాను.

**వ్యాధుడు :** పర్వతాలను కూడా కరిగించివేసే ఆ ప్రళయాగ్ని మిమ్ములను ఎందుకు స్పృశించలేదు?

**మహాముని :** ఒకనికి స్వప్నంలో అగ్ని కనిపించినప్పటికీ, "ఇది స్వప్నమే" అని గ్రహించి ఉంటే ఆ స్వప్నాగ్ని ఆ స్వప్న ద్రష్టను ఏమీ చేయలేదు కదా! అట్లాగే ఆ ప్రళయాగ్ని జ్వాలలు నా మనో ప్రాణమయ దేహాన్ని ఏమాత్రం స్పృశించలేదు. నేను యథాతథంగా చక్రగతిలో ఆ ప్రళయాగ్నిలో షికార్లు చేయసాగాను.

**వ్యాధుడు :** స్వామీ! అప్పుడు మీకు మీ భార్య, కొడుకులు, మనుమలు భస్మమైపోయారేమో ననే దుః ఖం కలుగలేదా?

**మునీశ్వరుడు :** అప్పుడు నేను తత్త్వవేత్తనయి ఉండటంచేత సర్వదుఃఖముల నుండి కొద్ది క్షణాలలో విముక్తి పొందాను. అయితే ఆ సంచారం వలన కొంచెం శ్రమ పొందిన చిత్తం కలవాడనైయున్నాను. "ఆహా! ఏమి ఈ ప్రచండాగ్ని జ్వాలలు! ఈ అగ్నితో ఆకాశం – భూమి ఏకమై పోతోందే! ఇక ఈ భూమి కరిగిపోతుందేమో! ఆకాశం విరిగి ఒరిగిపోతుందేమో!" అని విచారణ చూస్తూ, అనుకుంటూ ఉండగా ఎంతో "ఫూ"త్కార శబ్దంతో ఎక్కడి నుండో తీవ్రమైన వాయువులు వీచసాగాయి.

**వాయు ప్రళయం -** మహా ఝంఝుమ శబ్దాలతో పర్వతాలను పెకలించివేయగల వాయు తరంగాలు పది దిక్కుల నుండి ప్రసరించసాగాయి. ఆ వాయు తరంగాల సంఘట్టనచే అగ్నికణాలు నలువైపులా వెదజల్లబడుచున్నాయి. భూమిపై నుండి అంతకు ముందు ఏర్పడిన భస్మరాసులు గాలికి పైకెగయటంచేత కారుమేఘాలు రూపుదిద్దుకోసాగాయి. అప్పుడు నలువైపులా సంధ్యాకాల మేఘాలు బయల్వెడలాయి. దానితో స్వర్గ పాతాళ లోకాలు సుదీర్ఘ మేఘ పంక్తితో కలిసిపోసాగాయి. ప్రళయ వాయువీచికలలోంచి ఉద్భవించిన అగ్నికణాలు ఆకాశంలోకి ఎగసి నేలకు నల్లటి భస్మం రూపంలో వర్షించసాగాయి.

అప్పుడు అతికష్టదాయకమగు ఆ మహాసంభ్రమంలో కొట్టుకుపోతున్న నాకు ఎంతో ఖేదం కలిగింది. "అబ్బా! ఏమి శ్రమ వేదన నాకు కలుగుతోంది! ఇదంతా ఇంతగా భరించవలసిన అవసరం నాకేమిటి? ఇదంతా మరొకని హృదయంలోని స్వప్నమే కదా! కాబట్టి ఈ అవస్థ నుండి

బయల్వెడలి నా యొక్క స్వకీయమైన జాగ్రత్ స్థితిని పొందితే పోతుంది కదా! కనుక జాగ్రత్ దశను పొందటం ద్వారా శాంతిని పొందెదనుగాక! లేకుంటే... వ్యర్థంగా నాకు ఈ దుఃఖమును పొందవలసిన అగత్యమేమిటి?" ...అని చింతించసాగాను.

**వ్యాధుడు :** హే మహాత్మా! "స్వప్నం యొక్క వ్యవహారం, వ్యవస్థ ఏమై ఉంటుంది?"... అనే సందేహం యొక్క నివృత్తి కొరకు కదా... మీరు ఆ ప్రాణి యొక్క హృదయంలో ప్రవేశించింది? మరిప్పుడేమో "ఈ స్వప్నదశ నుండి నేను నివృత్తిని పొంది జాగ్రత్తుకు వెళ్లెదనుగాక!"... అని యోచిస్తున్నారు. ఇంతకూ స్వప్నం గురించి మీరు తెలుసుకొన్నదేమిటి? ఆ ప్రాణి యొక్క హృదయంలో మహాసముద్రాలు, విస్తారలోకాలు, జలప్రళయం, అగ్ని వాయు ప్రళయాలు, ఇవన్నీ ఎట్లా ఎక్కడి నుండి సుష్టుగా భోంచేసి నిదురిస్తున్న ఆ ఒకానొక ప్రాణియొక్క స్వప్నలోకంలోకి వచ్చాయి? అసలు ఆతని హృదయంలోకి అవన్నీ ఎట్లా ప్రవేశించాయి? ఇవన్నీ నాకు అర్థమవటం లేదు. సవివరంగా, విశ్లేషణాపూర్వకంగా వివరించండి.

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆ ఒకానొక ప్రాణి యొక్క స్వప్నజగత్తు మాట అట్లా ఉంచు. ముందుగా ఈ ఎదురుగా కనబడే జగత్తు ఎక్కడున్నది? మనస్సుకు ఇది అనుభూతమౌతోంది. కనుక ఇది మనస్సును అనుసరించే ఉన్నది. 'మనస్సు' అనేది ఆత్మలో జనించటానికి కారణమేముంది? ఏమీ లేదు. ఒకవేళ కారణమంటూ ఉంటే అది ఆత్మకు వేరుగా ఉండాలి. ఆత్మకు వేరైనదేదైనా ఎక్కడైనా ఉన్నదా? లేనేలేదు. ఆత్మ అనన్యం, అన్యము లేదు – అనికదా వేదవచనం! ఆత్మకు వేరుగా మనస్సే లేదు. మనస్సుకు వేరుగా జగత్తు లేదు. కనుక "ఇతంతా మొదలే అకారణం. కాబట్టి మొదలే లేదు" అని చెప్పబడుతోంది. అందుకే సృష్టి యొక్క శబ్ద అర్థములు రెండూ కొంచెం కూడా లేవు.

అనే మేము సుస్పష్టంగా నిర్ణయించుకున్నాం. ఉదాహరణకు "నా కుమారుడు నా మాట వినలేదు. అందుకే ఈ దుఃఖం"... అని ఏ తండ్రి అయినా వాపోతుంటే "ఇది నాది... అనే మనో కల్పనయే అందుకు కారణం" అని మేము జనులకు గుర్తు చేస్తున్నాం. "నాది – అనేది భ్రమ. ఆ ముఖ్య భ్రమ నుండి 'నా కుమారుడు' అనేది ఉపశాఖా భ్రమ. ఆ తదుపరి ఆతడు ఇట్లా ఉండాలి. కాని అట్లా ఉంటున్నాడు... అనేది తదుపరి ఉపో౿ప శాఖారూపభ్రమగా చెన్నొందుచున్నాయి."

ఒకవేళ "సృష్టి అనేది కనబడుచున్నది కదా!"... అని అంటే, "సృష్టి యొక్క శబ్దం, అర్థం కూడా అజ్ఞాత సందర్శకునికి కనిపించే పరమాత్మ రూపములే అయివున్నాయి"... అని స్వానుభవ మంతా రంగరించి నీకు గుర్తు చేస్తున్నాను. ఈ జగత్తు జ్ఞాన – అజ్ఞాన రూపమై, వాస్తవానికి నిర్వికారమై, కల్పనను అనుసరించి అనుభూతమౌతోంది. ఓ మిత్రమా! ఎప్పుడైతే జ్ఞాన బలంచేత అజ్ఞానం శమిస్తుందో అప్పుడు "ఈ సృష్టి అనేది లేదు" అనే మహావాక్యార్థం సుస్పష్టమౌతుంది. ఇక మూఢులకు ఏది జగత్తుగా కనిపిస్తుందో అద్దానికి ఒక స్థిరమైన అభిప్రాయంగాని, అనుభూతిగాని లేదు. అందుచేత వారికి ఇదంతా పరిపరివిధాలుగా అనిపిస్తోంది.

ఇది వస్తువు నుండి జనించి ఉండవచ్చు (లేక) అవస్తువు నుండి జనించవచ్చు. ఎద్దాని నుండి ఏది జనించినట్లుగా భాసిస్తున్నప్పటికీ అదంతా కూడా వ్యాపకమైన చిన్మాత్రబ్రహ్మమే అయి ఉన్నది.

**క్వ శరీరం? క్వ హృదయం? క్వ స్వప్నంః? క్వ జలాదిచ?**
**క్వ బోధో? బోధ విచ్ఛిత్తిః? క్వ జన్మమరణాది చ?**

అంతా బ్రహ్మమే! (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ) బ్రహ్మమే జీవుడుగా కనిపిస్తోంది. (జీవో బ్రహ్మేతి నాఽ పరః) అంతా బ్రహ్మమే అయివుండగా, ఇక ఈ శరీరమెచట? హృదయం ఎక్కడ? స్వప్నం ఎక్కడ? జలాది పంచభూతములెక్కడ? జగత్తు ఎచ్చట? జాగ్రత్తుకు అన్యమైనది ఎచట? జనన మెచట? మరణం ఎచట?

ఈ విధంగా... చిన్మాత్రమొక్కటే ఉన్నది. ఒక పరమాణువు కంటే పర్వతం ఎంతగా స్థూలమై ఉన్నదో, అట్లా పంచభూతాలలో సూక్ష్మమైనదైన ఆకాశం కంటే చిన్మాత్రం అంతగా సూక్ష్మమైనది.

అట్టి అతి సూక్ష్మ చిదాకాశము స్వభావసిద్ధంగానే కొంచెం జగత్ రూపంగా స్ఫురిస్తోంది. అప్పుడా చిదాకాశము తన రూపమునే జగత్తుగా ఎరుగుచున్నది.

స్వప్నంలో చిదాకాశమే నగరము – నది – జనులు మొదలైన రూపాలుగా స్ఫురిస్తోంది కదా! ఆ స్వప్న నగరాదులు ఆయా నిజరూపంగా నగరాలుగా ఉన్నాయా? కాదు కదా! వాటి రూపం స్వప్న ద్రష్ట యొక్క చిద్రూపమే కదా!

అట్లాగే .... జాగ్రత్‌నందు కనిపించే నగర – నదీ – జనాదులు కూడా జాగ్రత్ ద్రష్ట చిద్రూపమే వాస్తవమైన నిజరూపంగా కలిగివున్నాయి. చిదాకాశమే చిదాకాశమున ఇట్లు జగద్రూపంగా భాసిస్తోంది.

అనగా ఓ వ్యాధుడా! నీవు చిత్‌రూపుడవు. (ఎఱుకయే నీ రూపం), ఈ కళ్ళు, కాళ్ళు మొదలైనవి నీ మాయారూపమే కాని వాస్తవ రూపం కాదు. ఇక నీ చిద్రూపమే నీచే జగత్తుగా ఎఱుగబడుచున్నది.

❖

జ్ఞాని యొక్క దృష్టిలో... ఈ సమస్త జగత్తు కూడా శాంతం – అభాసరహితం – చిన్మాత్రమునకు అభిన్నము అయివున్నది. తిమిరరోగం కలవానికి ఆకాశంలో చక్రాకారాలు కనిపిస్తున్నట్లు ... నీ యొక్క అజ్ఞాన దృష్టికి జగత్తు శాంతము – సౌమ్యము అగు "చిత్ మాత్రము" గా కాకుండా అనేక వ్యవహార పరంపరలతో కూడిన జగత్తుగా అగుపించటం జరుగుతోంది. మా యొక్క దృష్టియందు, ఈ జగత్తు వ్యావహారికము కాదు. ప్రాతిభాసికమూ కాదు. శూన్యమాత్రము కాదు... ఇదంతా కూడా కేవలం – నిరాకారం, ఆద్యంతరహితం, ఏకము అగు చిదాకాశమే అయివున్నది.

**వ్యాధుడు :** స్వామీ! ఏ కారణం చేత నిరాకారము, ఆద్యంత రహితము, ఏకము అగు చిన్మాత్రము ఈ విధంగా సాకార – వ్యావహారిక – ఆద్యంతరహిత – అనేక రూపజగత్తులుగా అగుపిస్తోంది?

**మునీశ్వరుడు :** ఏ కారణంచేతైతే ... "కారణ రహితుడు, త్రిపుటీ శూన్యుడు, శుద్ధుడు అయిన ద్రష్ట స్వప్నంలో ఆయా గృహాదులుగా, వ్యక్తులుగా, ఆకాశాదులుగా భాసిస్తున్నాడో... అదే కారణం చేత ...జగత్తునందు ఆయా కారణరహిత – త్రిపుటీ శూన్య – నిత్య పరిశుద్ధ స్వరూపుడగు ద్రష్ట తన యొక్క స్వస్వరూపమునే జాగ్రత్‌జగత్‌గా అందలి వివిధ విశేషాలుగా గాంచుచున్నాడు. ద్రష్ట

యొక్క స్వయంకల్పిత ఊహా చమత్కారంలోంచే జాగ్రత్-స్వప్నాలు ఆయా జాగ్రత్ - స్వప్న చిద్రూపంగా ప్రాప్తిస్తున్నాయి. అనగా... జాగ్రత్ జగద్రూపంగా ఉన్నది ఆ జాగ్రత్ జగత్ ద్రష్ట యొక్క చిన్మయ రూపమేనని గ్రహించటమే ఆత్మజ్ఞానం.

ఆత్మ స్వరూపమునకు వేరైనదేదీ ఎప్పుడూ లేనేలేదని వేదవాక్యం! (ఆత్మైవమేవ సర్వత్రా) "నాచే గాంచబడేది నా యొక్క చిద్రూపమే"... అని ఎరిగి ఉండటమే.

ఆత్మజ్ఞానం - బ్రహ్మజ్ఞానం. ఆత్మదృష్టి - పరదృష్టి. బ్రాహ్మీదృష్టి - ఆత్మానుభూతి. వేదాంత జ్ఞానం - స్వస్వరూపానుభూతి... ఇటువంటి ఆయా శబ్దములచే వేదాంత శాస్త్రం ఉద్దేశిస్తోంది.

శుద్ధమైనట్టి ఆ చిన్మాత్రము స్వానుభూతరూపంచే సుస్పష్టంగా భాసిస్తూనే ఉన్నది. అయినప్పటికీ అనిర్వాచ్యమై, ఆద్యంతరహితమై, ఏకమై, ద్విత్వైక్యవర్జితమై ఉన్నది.

'కాలం' ఒక్కటే అయినప్పటికీ సృష్టి - ప్రళయములు అద్దాని రూపములుగా ఏర్పడి ఉంటున్నాయి కదా! బీజం ఒక్కటే అయినప్పటికీ అద్దాని నుండి అంకుర, శాఖా, పుష్ప, ఫల, ఆకులు వెలువడు చున్నాయి కదా!... అట్లాగే బ్రహ్మము సర్వస్వస్వరూపమై ఉంటోంది.

ఒకనికి స్వప్నంలో గోడ, వీథి, బంధువులు, నగరాలు నిజమనే అనిపిస్తున్నాయి. ఆతని ప్రక్కనే కూర్చుని ఉన్నవానికి అదంతా శూన్యంగా అనిపిస్తోంది. అట్లాగే ఈ జగత్తులోని ఒక విషయం ఒక్కొక్క ద్రష్టకు ఒక్కొక్క తీరుగా కనిపిస్తోంది. అనగా జగత్తులోని ఏ విషయం కూడా "ఇది ఇట్టిదే" ...అనటానికి ఎక్కడ వీలున్నది? నిర్మలము, ఏకము, చిన్మాత్రాకాశ రూపం అయినట్టి ఆత్మ.

స్వప్నంలో జాగ్రత్‌తో సమానంగా భాసిస్తోంది. జాగ్రత్‌లో జాగ్రత్ స్వప్నరూపంగా భాసిస్తోంది. ఈ విధంగా ఆత్మయొక్క (ఉపనిషత్ వాణి అయినట్టి) అద్వైతత్వము సిద్ధిస్తోంది. ఆత్మయొక్క అద్వైత సిద్ధికి ఏకైక మార్గం ఇదియే! (కనబడేదంతా నీయొక్క ఆత్మరూపమేనని దర్శించటమే అద్వైత సిద్ధి-అమరత్వ సిద్ధి).

అదృశ్యమగు వాయువులోగల అదృశ్యమగు సుగంధం ఈ కళ్ళకు కనిపించదు. కాని ముక్కుకు అనుభూతమౌతుంది. అట్లాగే నాశరహితమగు చిన్మాత్రమునందుగాని, చిన్మాత్రము యొక్క సమక్షము నందుగాని సృష్టి - ప్రళయాలు లేకపోయినప్పటికీ, ఒకానొక (వస్తు - దృశ్య) దృష్టికి అవి సర్వదా ఉండియే తీరుతున్నాయి. దృష్టిచే సృష్టి - ప్రళయాలు ఉండి ఉన్నప్పటికీ ఆత్మ సర్వదా అన్నివేళలా ఏకమే అయివున్నది.

ఓ వ్యాధుడా! నీ మనస్సు యొక్క జగత్ మనన రూప వ్యాపారమును క్రమంగా త్యజిస్తూరమ్ము. "జగత్తుగా కనపించేది ప్రియ పరమాత్మ రూపమే" అనే భావనను క్రమక్రమంగా పెంపొందించుకో. అదియే "జగత్ మనన రూపత్యాగం అని మహనీయుల బోధ. అట్టి "సర్వము పరమాత్మయే - అసత్ పరమాత్మ విన్యాసమే!" అను భావనాపటిమచే - "నిరాకారము, బాహ్యాభ్యంతరములందు అనంతము, నిరంతరము సుస్థిరము, ఆద్యము" అయినట్టి ఆత్మరూపమున నీవు సుస్థిరుడవవుతావు. ఈ జీవుడు తన జగద్రూపమునకు ఆవల వున్న చిత్‌రూపమును గమనించి, దర్శించి సుస్పష్టంగా అనుభూతపరచుకోవటమే జగత్త్యాగం.

ఆత్మ సదా ఉండియేఉన్నది! ఈ జీవుడు ఆత్మరూపుడే! నేను ఆ ఆత్మనే! నేనే సర్వము! నేను చిన్మయ రూపుడనేగాని, మృణ్మయ రూపుడనుకాదు! కనుక ఈ తెలియబడే జగత్తంతా నా దేహం! ఇకప్పుడు ఈ రక్త – మాంస నిర్మిత భౌతికం నాకు పరిమితాలు ఎట్లా అవుతాయి?... అని గ్రహించి ఉన్నవారికి ఈ జగత్తు విషయమై ఉన్నప్పటికీ నిర్విషయంగా అనుభూతమగుచున్నది.

❖❖❖

## 12. ఆత్మజ్ఞానం అత్యావశ్యకం

**వ్యాధుడు :** స్వామీ! మునీశ్వరా! ఇప్పుడు నాకు కలుగుచున్న కొన్ని సందేహాలను మీ ముందు ఉంచుతాను.

1. ఈ మనస్సు ఆయా లౌకిక – వ్యావహారిక భగవత్ సంబంధమైన ఏవేవో ఆలోచనలు చేస్తోంది కదా! అట్టి ఈ మనస్సు పూర్వకర్మలను అనుసరించే ఈ విధంగా మననం చేస్తోందా? లేక, ఇట్టి మనన స్వభావానికి మరేదైనా (లేక) మరెవరైనా కారణమా?

2. ఏఏ ప్రాణులకు అట్టి పూర్వ – వర్తమాన భవిష్యత్ ప్రవంతిపూర్వకమైన కర్మలుఉన్నాయి? ఏఏ ప్రాణులకు కర్మలు లేవు?

3. ఒకవేళ కర్మలే లేకపోతే మనస్సుకు మననం లేదు కదా! మననమే లేకపోతే త్యాగమనేది ఎక్కడుంటుంది? అనగా 'మనోత్యాగం' అనేది ఎట్లా ఏర్పడుతుంది.

**మహాముని :** ఓ వ్యాధుడా! విను చెబుతాను.

"సృష్ట్యాది" యందు భాసించేవారే బ్రహ్మ మొదలైనవారు. వారు స్వయంభువులు. కనుక వారు స్వయంగా భాసిస్తున్నారు. వారు చిన్మాత్ర శరీరధారులు. వారికి జననం లేదు. కనుక మరణమూ లేదు. వారు జనన – మరణ రహితులు. ఇక వారి దృష్టి యందో... ఈ ప్రపంచము అనబడేదిగాని, ద్వైతముగాని, 'కల్పన' అనునదిగాని లేదు.

ఒక నవలా రచయితను, "ఏమయ్యా! మీ కథానాయకుడు ఏ ఊరు వెళ్ళితే కనిపిస్తాడు?" – అని అడిగితే సమాధానమేముంది?

**తేషామ్ అస్తి న సంసారో, న ద్వైతం న చ కల్పనాః ।**
**విశుద్ధ జ్ఞాన దేహాస్తే సర్వాత్మానః సదా స్థితాః ॥**

వారు విశుద్ధ జ్ఞాన దేహులై వున్నారు. అందుచేత, వారు సర్వాత్మత్వము వహించినవారై, సర్వాత్మత్వం నందు సంస్థితులై ఉన్నారు. అట్టి స్వయంభువు అగు బ్రహ్మ మొదలైన తత్త్వం ఎఱిగినవారి దృష్టిలో (తత్త్వజ్ఞానుల దృష్టిలో) సృష్ట్యాది యందు ఎవరికీ 'పూర్వకర్మలు' అనబడేవేవీ లేవు.

బ్రహ్మమే... సృష్ట్యాదిలో సృష్టిగా విజృంభిస్తోంది. సృష్ట్యాదిలో ఏ విధంగా అయితే బ్రహ్మ మొదలైనవారు బ్రహ్మమే రూపంగా కలవారై భాసిస్తున్నారో... అట్లాగే తక్కిన అసంఖ్యాక జీవులు కూడా భాసిస్తున్నారు. "ఇప్పుడు – అప్పుడు – ఎప్పుడు కూడా నీవు, నేను, నీవు చూస్తున్నవారు, నాకు కనబడేవారు... అంతా కూడా బ్రహ్మరూపులమై భాసిస్తున్నాం" అనునది వేదోపనిషత్ సారవాక్యం.

ఇక తక్కిన వారి అనుభవానికి వస్తే ... ఎవరైతే కేవల సత్వగుణమును ఏమరచి ఉంటున్నారో, రజః తమోగుణ మిశ్రితమైన సత్వగుణము నుండి మనో సంకల్పము దృష్ట్యా "మేము బ్రహ్మము కంటే వేరు?... అనే భ్రమను వదలకయే ఉంటున్నారో, వారు "కార్య-కారణత్వము" అనే మనో రచనలో నిమగ్నమై ఉంటున్నారు. ఏ జీవుడైతే తానే బ్రహ్మముగా ఎరుగుచున్నాడో, ఆతనిచే సర్వము బ్రహ్మముగా ఎరుగబడుతోంది. అట్లా కాకుండా "నేను బ్రహ్మము కంటే వేరు" ...అనే మనోభావనను ఆశ్రయిస్తున్నప్పుడు... ఆతనికి "ఈ ద్వైత జగత్తు సత్యమే" అని అనిపిస్తోంది. ఆతడు కర్మలు - వాటికి సంబంధించిన వాసనలలో సత్యదృష్టి కలిగి ఉంటున్నాడు. ఆ విధంగా ద్వైత జగత్తును నమ్మి ఉన్న జీవుడు అట్టి వాసనావశం చేత కర్మ సహితుడై జనన మరణాలు పొందటం కొనసాగిస్తున్నాడు.

**తే షామ్ ఉత్తరకాలం తత్కర్మభిర్జన్మ దృశ్యతే ।**
**స్వయమేవ తథా భూతైస్తైరవస్తుత్వమ్ ఆశ్రితమ్ ॥**

అట్టివారి వర్తమాన కర్మలను అనుసరించి ఉత్తరోత్తర కాలంలో జన్మలు - కలుగుచున్నాయి. ఎందుచేతనంటావా? వారు పరమార్థ వస్తువును ఏమరచి మిథ్యా వస్తువునందు ధ్యాస కలిగియుండి జడదేహాదులందు ఆత్మాభిమానం కొనసాగిస్తూ ఉండటం చేత!

బ్రహ్మ - విష్ణు - మహేశ్వర - సనకాది మహాత్ములు తమ్ము తాము బ్రహ్మము కంటే వేరుగా ఎరుగటమే లేదు. వారు సర్వదా బోధమయమగు పరమాత్మయందే నెలకొని ఉన్నారు. అందుచేత జన్మ - కర్మాది దోషాలు వారిని స్పృశించటం లేదు. ఏ జీవుడైనాసరే, లేచి నిలబడి "సర్వాత్మకము' - జనన మరణ రహితము - ఉపాధులచే పరిమితము కానిది అగు బ్రహ్మమే నా దేహం"... అని ఎలుగెత్తి గానం చేస్తేనో, అప్పుడాతడు నిర్దోష సర్వాత్మదృష్టికి సర్వదా అర్హుడే అయివున్నాడని శాస్త్ర సమ్మతంగా ప్రకటిస్తున్నాను. ఎందుకంటావా? సమస్త జీవులకు నిర్మల చిద్రూపమే స్వాభావ సిద్ధమైయున్నది. బ్రహ్మము సర్వదా తనయొక్క నిర్మల చిత్ స్వభావమునందే నెలకొని ఉన్నది. అయ్యది తన అనంత విభాగంలోని ఒకానొకమూల మలినోపాధిచే "నేను భౌతిక ఉపాధిని. నేను పొందవలసినది ఏదో ఇంకా ఉన్నది" ...అని భావనను మాయా చమత్కారంగా కలిగి ఉంటోంది.

**యత్ర వేత్తి తు జీవత్వం తత్ర అవిద్యేతి తిష్ఠతి ।**
**తత్ర సంసృతి నామ్నాత్మా ధత్తే రూపం తథాస్థితమ్ ॥**

ఎచ్చటైతే బ్రహ్మము తనను తాను "నేను ఒక జీవుడను" అని జీవరూపముతో ఎఱుగుచున్నదో, ...అచ్చట అవిద్య ఉంటోంది. అచటనే 'సంసారము' అనే పేరుతో తననుతాను ధరిస్తోంది. మరల కాలక్రమంగా అది స్వయంగా సత్సంగ - శాస్త్రీయ విజ్ఞానము సహాయంతో నిజశుద్ధ రూపమును ఎరిగినప్పుడు స్వయముగా సంసారత్వమును దాటి బ్రహ్మత్వమును అనుభూతం చేసుకుంటోంది. జలం తనయొక్క ద్రవ్యత్వం ఏమరచి 'తరంగము' అనే దేహంగా భావిస్తుండటం ఎట్లో, బ్రహ్మము తనయందు సంసారము దర్శించటం అట్టిది. తనయందు సృష్టి రూపమును దర్శిస్తున్నప్పటికీ బ్రహ్మము సర్వదా బ్రహ్మముగానే ఉన్నదని గ్రహించు.

బ్రహ్మము యొక్క అజ్ఞాత విభాగము నందు సృష్టిరూపము స్వభావమే అయివున్నదని గ్రహించు. ఓ వ్యాధుడా! ఈ సృష్టి బ్రహ్మము యొక్క స్ఫురణము మాత్రమే. యథార్థానికి స్వప్నం గాని, జాగ్రత్తుగాని ఏమీ లేవు. అవిద్య తప్పితే బ్రహ్మమునకు సృష్టి రూపత్వమెక్కడ? సర్వదా శుద్ధమే అయివున్న బ్రహ్మమునకు జన్మాంతర్గత కర్మలెక్కడున్నాయి? ఎట్లా ఉంటాయి? ఈ జీవుడు సర్వదా బ్రహ్మమే (జీవోబ్రహ్మేతి నాఽ పరః) అని వేదమహావాక్యాలు ఉద్ఘోషిస్తున్నాయి కదా!

వాస్తవానికి కర్మ లేదు, సృష్టిలేదు. అవిద్యలేదు. అవన్నీ లేకపోయినప్పటికీ ఆత్మయొక్క స్ఫురణగా(ఆలోచనగా) అవన్నీ మిథ్యగా ప్రవర్తిస్తున్నట్లు కన్పిస్తున్నాయి.

బ్రహ్మము సర్వశక్తిమంతము – సత్యసంకల్పయుక్తము. అందుచేత బ్రహ్మము స్వయంగా సృష్టియొక్క ప్రదర్శిత – ప్రదర్శన రూపములను గాంచుచున్నది. అట్టి ప్రదర్శనం తదనుసారమైన జన్మలయొక్క కల్పనను కావించుకుంటోంది. ఫలితంగా కల్పిత పదార్థములైనట్టి జగత్తు – జీవుడు మొదలైన రూపములవలె భాసిస్తోంది. ఇంత మాత్రంచేత బ్రహ్మమునకు వచ్చే లోటేమీ లేదు.

❖

ఓ వ్యాధుడా! వాస్తవానికి సృష్ట్యాదియందు ఈ జీవునకు 'కర్మ' అనేది సంభవించదు. చైతన్యము తనయందు మొట్టమొదట ఏదో క్రీడ–లీల సరదాగా 'అవిద్య'ను కల్పించుకుంటోంది. ఆ తరువాత కర్మలను, వాటియొక్క ఫలములను సముపార్జించుకుని అనుభవైకవేద్యం చేసుకుంటోంది. నాయనా! జలము తరంగాదులుగా, సుడి మొదలైనవిగా కనిపిస్తూ ఉండవచ్చుగాక! అది తన సహజ ద్రవ్యత్వమును కోల్పోయినదెప్పుడు? ఆవర్తములుగా కనిపించేది జలమేకదా! ఈ జీవుడు కూడా తన సహజ బ్రహ్మ స్వభావమును ఏ క్షణమందు కించిత్ కూడా కోల్పవటం లేదు. త్యజించటంలేదు.

**ఈ జగత్తు బ్రహ్మమే!** - పూర్వ కర్మల గురించి ప్రస్తావించావు గనుక మరొక విషయం దృష్టాంతంగా చెపుతాను. స్వప్నంలో నీకు కనిపించే జీవులకు పూర్వ – తత్ పూర్వ కర్మలెక్కడున్నాయి? అట్లాగే సృష్టియందు శుద్ధ సాత్విక శరీరులైన చిన్మాత్ర రూపులగు జీవులకు పూర్వకర్మ అంటూ ఏదీ లేదు. వారి దృష్టిలో సృష్టి అనేది "స్వస్వరూపం" యొక్క చమత్కార ప్రదర్శన రూపమే! 'సృష్టి' అనేది స్వకీయ చమత్కారమే అయివుండగా... అందుకు పూర్వకర్మల ఆవశ్యకత ఏమున్నది? ఒక వ్యక్తిలోని అంతర్భాగ విభాగమగు ఊహ "ఎట్లా వచ్చింది?" అను ప్రశ్నకు పూర్వపు ఊహలు కారణమవవలసిన పనేమున్నది? అయి ఉండటంలో విశేషంమాత్రం ఏమున్నది?

అవిద్యచే సృష్టియొక్క – కర్మలయొక్క కల్పన కావించబడిన తరువాతనే జీవునకు 'కర్మపాశం' అనేది రూపొందింది. అట్టి అజ్ఞాత భ్రమయొక్క కొనసాగింపుగా జన్మల పరంపరలు ఒనగూడుచున్నాయి. వాస్తవానికి జన్మకర్మలకు ముందే ఉన్న నిర్దోష సర్వాత్మ బ్రహ్మమే ప్రతిజీవుని వాస్తవ రూపం. ఇక ఈ జీవుడు అనేక ఉపాధులతో, వ్యవహారములతో తిరుగాడటమనేది ...ఒక వ్యక్తి తన జాగ్రత్ స్వరూపం మరచి స్వప్న ప్రపంచంలో తిరుగాడటం వంటిది మాత్రమే!

సృష్టి సృష్టిరూపం కాదు. సృష్టి బ్రహ్మరూపమే. ఇక ఏ జీవునకు ఏ కర్మబంధాలున్నాయి చెప్పు? జగత్తును నమ్మియున్న మనస్సే కర్మబంధం కల్పించుకుంటోంది. అంతేగాని, జీవునకు

మరెవరూ కర్మబంధాలు కల్పించటం లేదు. బంధము కర్మల వల్ల కలగటం లేదు. పరమాత్మ గురించిన అపరిజ్ఞాతత్వం చేతనే 'కర్మ' బంధరూపంగా ప్రాప్తిస్తోంది.

కాబట్టి అజ్ఞానమే కర్మబంధానికి బీజం. ఆత్మజ్ఞానముచే మాత్రమే అజ్ఞానం మొదలంట తొలగగలదు. ఆత్మ జ్ఞానముచే అజ్ఞానమే కాకుండా అజ్ఞానంచే కల్పితమై ప్రాప్తిస్తున్న కర్మ బంధం కూడా తొలగిపోగలదు.

ఒకనికి ఆత్మజ్ఞానము ఎంతెంతవరకైతే ప్రవృద్ధమౌతూ ఉంటుందో, ... అంతంతవరకు కర్మ బంధదాయకం అవటమనేది తొలగిపోతూ వస్తుంది.

**వ్యాధుడు :** స్వామీ! కర్మ నాశనమైతే జన్మ – జీవనాదులు కూడా వినాశనం పొందుతాయా?

**మునీశ్వరుడు :**

**యన్నామ కిల నాస్త్యేవ తచ్ఛాన్తౌ కా కదర్థనా?**
**పరమార్థాదృతే బంధః కించిన్నామ న విద్యతే?**

ఏ పదార్థమైతే వాస్తవానికి మొదలే లేదో... అట్టిది నశించటం వలన వచ్చే నష్టమేమున్నది? స్వప్నంలో కనిపించిన భవనం కూలిపోతే ఎవరికి నష్టం?

ఓ వ్యాధుడా! స్వప్నంలో ప్రాప్తించిన బంధం తొలగాలంటే జాగ్రత్‌కు రావటమే ఉపాయం కదా! సర్పమునకు సంబంధించిన భ్రాంతి తొలగాలంటే "ఇది త్రాడు మాత్రమే" అని తెలియటమే ఏకైక ఉపాయం. పరమార్థభూతమగు బ్రహ్మము యొక్క జ్ఞానముచేత మాత్రమే భ్రమ–కర్మబంధం తొలగుచున్నాయి. కర్మబంధం మరింక దేనిచేతా శమించదు. "నాకు కర్మబంధం ఉన్నది" అను భ్రమయే బంధమై ప్రాప్తిస్తోంది. ఎందుకంటావా?

బ్రహ్మము యొక్క అజ్ఞాన రూపమే బంధము. అంతే తప్ప 'బంధము' అనేది వేరుగా లేదు.

**తావత్ మాయా భవ భయకరీ పండితత్వం న యావత్**
**తత్ పాండిత్యం పతసి న పునర్యేన సంసారచక్రే**
**యత్నం కుర్యాత్ అవిరతమతః పండితత్వే అమలాత్మా**
**జ్ఞానోదారే భయమితరథా నైవ వః శాంతిమేతి ॥**

ఓ వ్యాధుడా! ఈ 'మాయ' అనేది అతిబలీయమై, భయంకరమై ఈ జీవునకు అతిదీర్ఘమైన సంసార బంధం (లేక) కర్మబంధం కలుగజేస్తోంది. శాస్త్రములు ఏమి బోధిస్తున్నాయో, అర్థానికి సంబంధించిన పాండిత్యము సంపాదించుకోకపోయామా... మాయా సంసార రూప కర్మబంధం మనపట్ల కొనసాగుతూనే ఉంటుంది. ఎద్దానిచే మరల ఈ సంసార చక్రంలో పడమో... అదియే పాండిత్యము. అందుచే నిర్మలము – ఉదారము అయినట్టి బుద్ధితో ఆత్మజ్ఞాన పాండిత్యము మనము పొందేవరకు శ్రవణ – మననాది రూపమైన ప్రయత్నములు శ్రద్ధగా కొనసాగించవలసిందే!

ఎందుకంటే 'ఆత్మజ్ఞాన సముపార్జన' అనే ఉపాయంతో తప్పితే మరింకే ఉపాయంతోనూ ఈ సంసారభయం శమించదు. కనుక ఆత్మజ్ఞానమే శరణ్యమని నా మనవి.

❖❖❖

# 13. ఆత్మజ్ఞాన పాండిత్యము - ఆత్మానుభూతి

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆకాశంలో సూర్యుడు ఉదయించగానే అంధకారమంతా పటాపంచలవుతుంది చూచావా! అట్టి సూర్యబింబం ఆకాశానికే భూషణం అవుతోంది. అట్లాగే, సమస్త ధర్మముల, కర్మ, ఐహికాముష్మిక వ్యవహారములను నిర్ణయించే సభలో ఆత్మజ్ఞాన పాండిత్యం గలవాడు శ్రోతల బుద్ధిని వికసింపజేస్తూ సందేహాలను, ఛేదించివేస్తూ సభాభూషణుడు అగుచున్నాడు. ఆత్మజ్ఞానులు ఏ గతిని చూపుచున్నారో, ఆ మార్గంలో పొందే ఆత్మజ్ఞాన మోక్ష సుఖం ముందు ఇంద్రాదుల ఐశ్వర్యాలు తృణప్రాయం (గడ్డి పరకతో సమానం) అవుతున్నాయి. ఆత్మజ్ఞాని అందించే లవలేశ ఆత్మానందం తక్కిన జీవులను సుదీర్ఘ సంసార ప్రయాణం నుండి సేద దీరుస్తోంది. కాబట్టి ఈ 14 లోకాలలో లభించే సుఖములన్నీ బ్రహ్మానంద మహాసముద్రము యొక్క ఒక జలబిందువుతో కూడా సమానం కావు. పాతాళం, భూలోకం, స్వర్గలోకం– ఏక్కడా కూడా ఆత్మజ్ఞాన పాండిత్యం కంటే అధికమైన సుఖం గాని, ఐశ్వర్యం గాని నాకు కనిపించటం లేదు. సచ్ఛాస్త్ర విచారంచే ఉత్పన్నమైన ఆత్మజ్ఞానం సంతరించుకొన్న పండితుని పరమార్థ రూపమగు బ్రహ్మమయ దృష్టి అనిర్వచనీయ ప్రభోపేతం. అది మనకు స్వాత్మయందే పరమానందాన్ని అప్పటికప్పుడే ప్రసాదిస్తోంది.

రజ్జు సర్ప భ్రాంతిలో "ఇది త్రాడే! పాము కాదు" అనే జ్ఞానముచే పాముయొక్క భ్రాంతి తొలగిపోతోంది కదా! ఆత్మజ్ఞాని యొక్క బోధచేత దేహభ్రాంతి, సృష్టిభ్రాంతి, దృశ్యభ్రాంతి, కర్మబంధభ్రాంతి క్షణంలో శమించి మనం అధిష్ఠానమగు బ్రహ్మముగా శేషించ గలుగుచున్నాం. అట్టి బ్రహ్మజ్ఞానానందము అనుభవైకవేద్యము మాత్రమే!

❖

ఓ వ్యాధుడా! బ్రహ్మము గురించి ఎక్కడో వెతకవలసిన పనిలేదు. ఎప్పటికో లభించవలసినది కూడా కాదు. అయ్యది స్వస్వభావమునందే స్వతత్త్వజ్ఞానముచే ప్రదర్శితమగుచున్నది. సర్వదా వేంచేసియున్నదే ఆత్మజ్ఞానముచే గుర్తించబడుచున్నది.

అద్దాని చేతనే అద్దాని నిజరూపములే అయివున్న శరీరము, సృష్టి, ప్రళయములు మొదలైన సంజ్ఞలు కల్పించబడుచున్నాయి. కనుక అవి కూడా బ్రహ్మం యొక్క నిజరూపాలే! కాబట్టి "దేహం – సృష్టి – మొదలైనవి బ్రహ్మము కంటే వేరు" ...అనే అభిప్రాయం సరికాదు. అయితే బ్రహ్మమునందు సృష్టి మొదలైనవి మొదలే లేవు. బ్రహ్మము సర్వదా సర్వత్రా బ్రహ్మముగానే ఉన్నది. ఇక సృష్టి, అద్దాని ధర్మములు, అద్దాని బోధకమైన పద–వాక్యాలు ఎక్కడున్నాయి? ఎట్లా ఉంటాయి? ఈ భూమి ఆకాశం మొదలైనవి వాస్తవంగా ఉండి ఉంటే... వాటికి కారణం వెతకవచ్చు. కాని పృథివి మొదలైన పదార్థాలు ఎచ్చటా లేనప్పుడు వాటికి ఏవి కారణమవుతాయి?

బ్రహ్మం యొక్క ఏ ప్రతిభాస అయితే కలదో, అదియే 'జగత్తు'గా చూడబడుతోంది, చెప్పబడుతోంది. స్వప్నంలో కనిపించిన మనుజులకు "తల్లితండ్రులెవరు? ఏ జాతివారు" అనే ప్రశ్న ఎక్కడ?

స్వప్నంలో కనిపించిన మనుజులే వాస్తవం కాదు కదా? అట్లాగే ఈ 'జాగ్రత్తు' అనే స్వప్నంలో కనిపించే మనుజుల యొక్క పిత్రాదులు, దేశకాలాదులు మొదలైనవన్నీ కల్పనా సదృశ్యం మాత్రమే! స్వప్నంలో కనిపించే మనుజులకు పూర్వ కర్మలు ఏమి ఉన్నాయి? అట్లాగే ఈ జాగ్రత్‌లో కనిపించే మనుజులకు కూడా పూర్వ – తత్పూర్వ కర్మలు లేవు. ఒకవేళ కించిత్‌దూరం ఉన్నాయి అని అనుకుంటే అది కూడా స్వప్నంలోలాగా మిథ్యా సదృశమే!

**వ్యాధుడు :** మహాత్మా! మరి ఈ జీవుల పరస్పర సంబంధ బాంధవ్యములు, వివిధ దృష్టులు ఎక్కడి నుండి వస్తున్నాయి?

**మహాముని :** ఈ జీవులందరూ మిథ్యావాసనారూపులే! స్వప్నతుల్యంగా ఈ జీవులు తమ తమ వాసనానుసారంగా జగద్విషయములను పరస్పరం గాంచుచున్నారు. ఈ జీవుల పూర్వకర్మల వ్యవహారం కూడా వాసనానుసారంగానే మిథ్యగా ప్రవర్తిస్తున్నది. పంచభూతములు – భువనము మొదలైన ఈ సృష్టులు మొదలుకొని ఈ శరీర పర్యంతము ఈ జీవులు తమ వాసనలను అనుసరించే పరస్పరం సంభాషించుకుంటున్నారు. పరస్పరం దర్శించుకుంటున్నారు. స్వప్నంలో జీవులవలెనే ఇక్కడ వాసనాస్వప్నం ప్రవర్తిస్తోంది. వాసనలు తొలగిస్తే శేషించేది ఆత్మయే! ఆత్మస్వరూపం దృష్ట్యా జీవులలో కనిపించే భేదమంతా భ్రమాత్మకమే! వాస్తవం కాదు.

కనుక వ్యాధుడా! ఈ జీవులందరు తమ తమ వాసనలను అనుసరించే ఒకరితో మరొకరు సంభాషించుకొంటున్నారని, వాస్తవానికి ఆత్మ మాత్రమే సత్యమని గ్రహించి ఈ ప్రపంచంలో చరించు. అంతేగాని గుడ్డి ఎద్దు చేలోపడి మేసినట్లు జీవించకు. స్వప్నంలో స్వప్నరూపులగు జీవుల మధ్య ఎట్లా వ్యవహారం సిద్ధిస్తోందో ...అట్లాగే ఈ జాగ్రత్ జీవుల మధ్య వాసనా చమత్కారం అనుసరించి ఇక్కడ వ్యవహారాలు సిద్ధిస్తున్నాయి. అవన్నీ అర్థ క్రియా సామర్థ్యంతో కనిపిస్తున్నాయి. ఒకడు స్వప్నంలో ఆకలితో పదార్థాలు స్వప్న కల్పనలోంచి పొంది సుష్టుగా భుజించి (వాస్తవానికి ఆ ఆహార పదార్థాలు భౌతికంగా లేకపోయినప్పటికీ) తృప్తిని అనుభవిస్తున్నాడు చూచావా? అట్లాగే జాగ్రత్‌సంకల్పములను సంవిత్తు పొందుతోంది. అయితే జాగ్రత్‌లో స్వప్నం అస్పష్టం. స్వప్నంలో జాగ్రత్ అస్పష్టం. వాటి భేదం అంతమాత్రమే! శుద్ధము – ప్రకాశశీలము అగు సంవిత్తు స్వయంగా నిజస్వభావస్థమై భాసిస్తోంది. ప్రతిజీవుడు శుద్ధ సంవిత్ స్వరూపుడే! అట్టి శుద్ధ సంవిత్తు యొక్క స్ఫురణలే లోకంలో "ఇది జాగ్రత్తు – ఇది స్వప్నము" అనే శబ్దాలతో (లేక) సంజ్ఞలతో చెప్పబడు చున్నాయి. ఈ సృష్టి – ఈ దేహము మొదలైనవన్నీ మోక్ష పర్యంతం ఈ విధంగానే స్ఫురిస్తూ ఉంటాయి. అట్టి ఈ స్ఫురణయే సృష్టి.

వాస్తవానికి – చూచువాడు – చూడబడేది, అగ్ని – ఉష్ణత్వము, వాయువు – చలనత్వము, జలము – తరంగత్వము / ద్రవ్యత్వము... వీటిలో ఒకదానికొకటి భేదం లేదు. అట్లాగే సంవిత్తుకు అద్దానిచే దర్శింపబడే జాగ్రత్ – స్వప్న దృశ్యములకు భేదం ఒకింతకూడా లేదు.

స్వప్నమంతా శాంత – సౌమ్యరూపుడగు స్వప్నద్రష్టలో బయల్వెడలిన భావనా విన్యాస చమత్కారమే కదా! ఈ సమస్తము 'నిరాకారము – శాంతము' అయినట్టి బ్రహ్మమే అయి ఉన్నది.

ఇక, ఈ జగత్ సమూహమంతా నిజ దృశ్య రూపముచే 'అసత్తు'. అధిష్ఠాన చిత్‌రూపముచే 'సన్మయము'. ఇదంతా కూడా 'నేఽతి–నేఽతి' అను నిషేధ శ్రుతి వాక్యములను అనుసరించి పరబ్రహ్మ స్వరూపముగానే తెలియబడుచున్నది.

కాని వ్యవహార దశలోనో... బ్రహ్మం జగ్రదూపంగా ఉద్భవించటం, ప్రళయరూపంగా నశించటం, దృశ్యరూపంగా అనుభవమవటం ఇవన్నీ జరుగుచున్నాయి.

కాని, పరమార్థదృష్టియందో... ఇదంతా కేవలం చిన్మాత్రమే! అజము, శాంతము, ఏకము నిర్మలము అగు బ్రహ్మమే ఇదంతా!

ఒక కుమ్మరివాడు మట్టితో కుండలను, బొమ్మలను, చక్రములను మొదలైనవి తయారుచేసి ప్రదర్శిస్తున్నాడు చూచావా? బ్రహ్మదేవుడు అనే కుమ్మరి 'హృదయము' అనే భూమిలో కల్పించిన ఆకాశము, వాయువు, పృథివి మొదలైన మూల పదార్థత్వము, వాటి కార్య కారణత్వము నేటికీ అట్లే వర్తిస్తున్నాయి. ఓ వ్యాధుడా! నీ హృదయంలో అరణ్యము, వేట, మృగాలు స్వప్నం మొ॥వన్నీ కనబడుచున్నాయి కదా! అట్లాగే బ్రహ్మదేవుని హృదయంలో ఈ సృష్టి, ఇద్దాని యందలి కార్య – కారణ భావములు మొదలైనదంతా కనిపిస్తోంది. అయితే ఇదంతా స్వప్న సదృశమే సుమా! స్వప్నంలోని కార్యకారణ భావము వంటిదే ఈ జాగ్రత్ అంతర్గతమైన కార్య – కారణాలు కూడా!

నీవు నీ స్వప్నావస్థలో ఏవి ఎట్లా కల్పిస్తావో, ఏ నగరాదులు భావన చేస్తావో...అవన్నీ అట్లాగే దర్శిస్తావు కదా! అలాగే బ్రహ్మదేవుని సంకల్పానుసారమే ఈ జగత్తు యొక్క కార్య–కారణ భావాలన్నీ ఏర్పడి ఉంటున్నాయి.

నీవు; నీ యొక్క సంకల్ప నగరంలో (ఊహాలోకంలో) ఏ విధంగా సంకల్పరూపమగు చైతన్యము ద్వారా నీ యొక్క అంతర్గతమైన ఇచ్ఛను అనుసరించి కార్యకారణ రూపమగు వ్యవస్థను స్థాపించి – పొందుచున్నావో, అదే విధంగా, ఈ సృష్టియందు కూడా అట్టి సంకల్పరూప వ్యవస్థ స్థాపించబడి వ్యవహరిస్తోంది.

సంకల్పనగరం, అందులో అంతర్గతమైయున్న వ్యవస్థ... ఈ రెండూ కూడా స్వాత్మరూపమగు చిదాకాశము యొక్క స్ఫురణయే కదా! ఈ సృష్టి కూడా హిరణ్యగర్భుని సంకల్పాంతర్గతమే! అనగా ఇదంతా చిదాకాశము యొక్క స్ఫురణయే గాని, మరింకేమీ కాదు.

ఒకడు తన సంకల్పాకాశంలో స్వయంప్రకాశమగు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, భూమి నగరం, గృహం – ఇవన్నీ ఎట్లా ఏ కార్య – కారణ వ్యవహార సరళిచే చూస్తున్నాడో ... అట్టిదే ఈ సృష్టి యొక్క పదార్థములందలి స్వభావ సిద్ధమైన కార్య – కారణ వ్యవహారంగా ఒప్పుచున్నది.

సృష్ట్యారంభంలో హిరణ్యగర్భుని చైతన్యముచే పృథివి యందు కాఠిన్య – గంధాది నియతి, జలంలో రస – ద్రవత్వాది నియతి, అగ్నిలో రూప – ఉష్ణత్వాది నియతి, వాయువులో స్పర్శ – చలనాది నియతి, ఆకాశంలో శబ్ద – శూన్యత్వాది నియతి, కాలంలో భూత – వర్తమాన – భవిష్యత్ కాల నియతి, తూర్పు – పడమర మొదలైన దిన నియతి రచించబడినట్లే ...ఇప్పటికీ అట్టి నియతియే కొనసాగటం జరుగుతోంది.

వాస్తవానికి చిదాకాశము పదార్థ రహితము. అయ్యది సర్వ విషయ – వస్తు శూన్యము అయివున్నది. అద్దానిచే నిజ సంకల్పానుసారంగా ఏది భావించబడుతోందో, అదియే కార్య–కారణ రూప వ్యవస్థగా స్థితి నొంది ఉంటోంది.

హిరణ్యగర్భుని (సమష్టి సృష్టికర్త యొక్క) మనస్సు చైతన్యము యొక్క ఒకానొక చమత్కారము మాత్రమే! అట్టి మనో చమత్కారమే సృష్టివలె భాసిస్తోంది. సంకల్పరూపమగు ఆ హిరణ్యగర్భుని మనస్సునందు 'భావతరంగములు' ఆవిర్భవిస్తున్నాయి. ఆ భావ తరంగముల ఆవిర్భావము "సృష్ట్యాది" ...అనే పేరుతో చెప్పబడుతోంది. వాయువు యొక్క చలన సత్తానుండే కదా, వాయుతరంగాలు ఆవిర్భవిస్తున్నాయి! ఆ వాయు తరంగాలు వాయువునకు అభిన్న రూపములే కదా! అలాగే 'చిదాకాశము' అను దాని యందు 'సృష్టులు' అనబడే చిదాకాశ తరంగాలు ప్రదర్శితమౌతున్నాయి. అట్టి సృష్టులన్నీ చిదాకాశమునకు అభిన్నములే! శూన్యము – నిర్మలము అగు ఆకాశంలో "నీలత్వం" ఎందుకు కనిపిస్తోంది? దృష్టి యొక్క దోషం చేతనే కదా! అట్లాగే, చిదాకాశము సర్వదా శూన్యము – నిర్మలము అయినప్పటికీ కూడా... అద్దానిలో చిదాకాశరూపమే అగు త్రిలోకములు వర్తిస్తున్నాయి.

ఒకడు చీకటిలో ఒక పామును చూచాడు. చాలా భయపడ్డాడు. ముచ్చెమటలు పట్టాయి. ఆ పాము ఆతని కాళ్ళకు చుట్టుకోబోతున్నట్లుగా అనిపించింది. విదిలించుకుంటున్నాడు. పాము కాటువేస్తే ఏమౌతుందో అతనికి తెలుసు. నోటినుండి నురుగు వస్తుంది. స్పృహ పోతుంది. శరీరమంతా విషం పాకుతుంది. ఇక ఆపై గిలగిల కొట్టుకొని చావటమే!... ఇవన్నీ గుర్తుకు వస్తున్నాయి. అతడు తబ్బిబ్బు అవుతున్నాడు. కాని ఇంతలో ఎవరో దీపం తెచ్చి చూస్తే, ... అది పాము కాదు. త్రాడు మాత్రమే! వెంటనే ఆ బాటసారి చేత్తో త్రాడును పాదముల నుండి తొలగించి తన భ్రమకు తానే నవ్వుకుంటూ ఆవలకు విసిరాడు. ఇపుడు మరలా ఆ త్రాడును చూస్తే ఇతః పూర్వంలా చెమటలు పట్టడం, భయంతో కేకలు వేయటం చేస్తాడా? లేదు. ఎందుచేత? "అది పామేమో!" అనే భ్రమ తొలగింది కనుక! అట్లాగే ఎప్పుడైతే శ్రవణ – మననాది సాధనల అభ్యాసంచేత ఈ దృశ్యము "దేశకాల వస్తు పరిచ్ఛేద శూన్యమైనట్టి బ్రహ్మము"గా ఏ జీవునకైతే భాసిస్తోందో... ఆతడు ఇక "బ్రహ్మము సర్వదా జగత్ రహితము".... అనే పరమసత్యాన్ని సుస్పష్టంగా, నిర్దుష్టంగా గ్రహిస్తున్నాడు.

**వ్యాధుడు :** మహాత్మా! ఈ దేహ పతనానంతరం ఈ జీవుడు ఏమి అవుతున్నాడు? జన్మ మరణాదులు కూడా స్వప్నతుల్యమేనా?

**మహాముని :** జన్మ – మరణాలు కూడా నిజస్వప్నతుల్యములే! ఆ విధంగా తన యొక్క స్వప్నముతో పోల్చదగిన 'మరణము' పొందిన తరువాత ఈ జీవుడు తన భావనాసంస్కారములను అనుసరించి వేరువేరైన జగత్తులను గాంచుచున్నాడు. కానీ ...ఇహలోకం – పరలోకం కూడా నిరాకారమగు చిదాకాశమే!

❖❖❖

# 14. దేహపతనానంతరం

**వ్యాధుడు :** స్వామీ! ఈ దేహం పతనం పొందిన తరువాత ఈ జీవుడు మరల సుఖ దుఃఖములను పొందటానికి మరొక దేహం పొందుచున్నాడు కదా!

ఇప్పుడు నా సందేహమేమిటో వినండి. ఈ దేహం పతనమైన తరువాత మరొక దేహం వస్తోందా? ఒకవేళ అట్లా వస్తుంటే, ఈ దేహం నశించిన తరువాత ఆ మరొక దేహం ఎట్లా ఉత్పన్నం అవుతోంది? ఆ నూతన దేహానికి ఉపాదాన కారణం ఏమిటి? అద్దాని ఉత్పత్తికి నిమిత్త సహకారి కారణాలేవైనా ఉన్నాయా? ఉదాహరణకు... కుండకు ఉపాదాన కారణం - మట్టి, నిమిత్త కారణం - కుమ్మరి, సహకారి కారణం - సాధనా సామాగ్రి.

ఒకవేళ ధర్మ-అధర్మాలే సుఖ-దుఃఖాలుగా పరిణమించి ఈ ఉపాధులకు కారణభూత మౌతున్నాయంటారా?... ఇదంతా జీవుడే తన భోగము కొరకు తయారు చేసుకుంటున్నాడా?

ఒకవేళ ధర్మ-అధర్మాలే మోక్ష - బంధములకు కారణమవుతున్నాయని అంటే ...అప్పుడు నాది మరొక ప్రశ్న. సాకారమగు ఈ శరీరంతో నిర్వర్తించబడే 'ధర్మము' మొదలైన కర్మలు సర్వకర్మల నివృత్తి రూపము -నిరాకార రూపము అగు 'మోక్షం' ప్రసాదిస్తున్నాయంటే - అది అసమంజసం కదా! ఎందుకంటే కర్మలచే నిర్మించబడేది కర్మరాహిత్యం ఎట్లా ప్రసాదిస్తుంది?

**మహాముని :** ఓ వ్యాధుడా! నీది పెద్దప్రశ్నే! సరే, జాగరూకుడవై విను.

1. సంస్కార రూపంలో ఉన్న "విహిత - నిషిద్ధ  అని అనిపించే "ధర్మాధర్మాలు".
2. అట్టి సంస్కార సమూహ రూపమగు "మనస్సు"
3. అట్టి మనస్సులో దాగివున్న "వాసనలు"
4. ఆ మనస్సు యొక్క యజమాని, చిదాభాస రూపుడగు "జీవుడు"
5. ప్రాణచేష్టలే ప్రధానంగా కలిగియున్న ఈ జీవుని "దేహం".

ఈ విధంగా "ధర్మాధర్మాలు", "మనస్సు", "వాసనలు", "జీవుడు", "దేహం" మొదలైనవన్నీ - మేఘము నందు కొండలు - లోయ మొదలైన కల్పిత దృశ్యాలు చూచేవాడిచే కల్పించబడినట్లు - చైతన్యము నందు "కల్పించబడినవి". అంతేగాని అవి వాస్తవం కాదు.

**చిదాభాసుడు -** దేహము అనేది ఒకటున్నది. అది ఈ దృశ్య ప్రపంచంలో ఉన్నది. ఈ దేహము నాది. ఇవన్నీ నావి. ఈ ఈ సంబంధ - బాంధవ్యాలు ఉన్నాయి... అనే భావనా గ్రహీతనే 'చిదాభాసుడు' అని పిలుస్తున్నారు.

ఇట్టి కథనమంతా చిత్తమే కల్పన చేసుకుంటోంది. చిత్తమే తన కల్పనలో ప్రవేశించి సంచరిస్తూ "చిదాభాసుడు" అను శాస్త్రీయ నామమునకు అర్థమౌతోంది. చిదాకాశమగు స్వాత్మయందు నెలకొనియున్న హిరణ్యగర్భుడు స్వయంగా తన కల్పనా వ్యవహారరూపంగా ఈ ధర్మ - అధర్మ, సుఖ - దుఃఖాది నామములు కల్పన గావించుకుంటున్నాడు.

సంకల్పంలో విహరిస్తున్నవాడు ఆ సంకల్పం ముగిసిన తరువాత తాను ఇతఃపూర్వ స్థితికే వస్తున్నాడు కదా! స్వప్నంలో విహరిస్తున్న స్వప్న ద్రష్ట ఆ స్వప్నం అంతమవగానే ఆ స్వప్నమునకు మునుముందే ఉన్న స్థితిని తిరిగి పుణికి పుచ్చుకుంటున్నాడు కదా!

అట్లాగే... "ఈ భౌతిక దేహం నేను కాదు" అను సుజ్ఞానమును సముపార్జించుకొనినట్టి జీవుడు దేహతాదాత్మ్యమునకు ముందుగానే ఉన్న చిదాత్మ దేహుడుగా ప్రకాశిస్తున్నాడు. దేహతదాత్మ్యము (చిదాభాసత్వం) కలిగి ఉన్నప్పుడు, అవన్నీ జ్ఞానముచే త్యజించినప్పుడు కూడా ఈతడు చిదాత్మదేహుడే!

**వ్యాధుడు :** స్వామీ! ఈ జీవుడు మరణానంతరం ఎట్టి స్థితిని – గతిని పొందటం జరుగుతోంది?

**మునీశ్వరుడు :** జీవించి ఉన్నవాని ఇహలోక బుద్ధి ఇక్కడ వస్తు – విషయ – వ్యక్తిగత సంబంధ – బాంధవ్యములన్నీ పొందుచున్నది కదా! ఈ జీవుడు మరణించిన తరువాత కూడా ఆతని పరలోక బుద్ధి స్వప్నమువలె స్వయముగా భాసిస్తోంది. ఆ పరలోక బుద్ధితో వస్తు – విషయ – వ్యక్తిగత – సమష్టిగత వ్యవహారాలన్నీ స్వప్నంలో లాగా చిరకాలం పొందుచున్నాడు.

జీవించి ఉన్నవాడు దర్శించే ఆయా వస్తు – విషయగత సంబంధాలన్నీ భ్రమ, స్వప్న సదృశము, అసత్యము అయినట్లే... మరణించినవానిచే స్వప్న సదృశంగా అనుభవించే విషయాదులలో కూడా సత్యత్వమేదీ లేదు. అవన్నీ కూడా భ్రమ – స్వప్నసదృశమే!

జీవించి ఉన్నవాడు జాగ్రత్‌ను చూస్తూ, "ఇది సత్యమే"... అని అనుభవము పొందుచున్నట్లే మరణించినవానికి కూడా తాను అనుభవించే స్వప్నసదృశ జగత్తు ఆతనికి సత్యమనియే అనిపిస్తోంది. ఈ విధంగా జీవితానుభవం, మరణానుభవం – ఉభయములూ ఏకరూపములే అయి ఉంటున్నాయి.

**వ్యాధుడు :** మహాత్మా! మరణించినవాడు తాను పొందే స్వప్న సదృశదృశ్యానుభవం తానే కల్పించుకుంటున్నాడా? లేక, ఆతని అనుభవము వలన అనుభూతులను అనుసరించి మరెవరైనా (యమధర్మరాజు మొదలైన దేవతలెవరైనా) ఆతనికి అవన్నీ కల్పిస్తున్నారా?

**మహాముని :** ఓ వ్యాధుడా! మరణించిన వాని మరణానంతర స్వప్న సదృశ జగత్ వ్యవహారమంతా కూడా మరొకరెవరైనా నిర్మిస్తూ ఉన్నారని కాసేపు అనుకుందాం. అప్పుడు ఈ జీవుని మరణానంతర జగత్తును నిర్మించి – పరిపోషించే ప్రవృత్తికి అనుకూలమైన స్మృతి ఈ జీవునికి ఎట్లా కలుగుతోంది? ఒకవేళ ఈ జీవుని స్మృతి మరొకరి వ్యవహార పరిధిలో ఉంటే ఈతడే మరల జన్మించినాడు అని అనటం ఎట్లా? మరణానంతరము ఈతనికి స్మృతి లేనప్పుడు ఒకనికి పూర్వానుభవమే ఉండదు. కనుక సర్వము ఈ జన్మలోనే అంతం అవుతుందని అనవలసి వస్తుంది. అప్పుడిక పాప–పుణ్యాలు, ఇహ–పర లోకాలు, మరణానంతర స్థితిగతులు మొదలైనవన్నీ తిరస్కరించవలసి వస్తుంది. పైగా ...జీవులందరు జన్మతః ఒకే రీతిలో ఉండాలి. కానీ జన్మించినట్టి ఒక్కొక్కరు ఒక్కో విధమైన గుణ – స్వభావ చమత్కారం చిన్నప్పటినుండే కలిగి ఉండటం మనం చూస్తున్నాం కదా! పైగా, అవన్నీ కూడా ఆ జీవుని కార్యక్రమములను అనుసరించి మార్పు – చేర్పులు చెందుచున్నాయి. "మరొకరి

స్మృతిని అనుసరించి ఈ జీవుడు వర్తిస్తున్నాడు" ...అని అనదలచుకొంటే, అప్పుడు ఈ జీవుడు అంతర్గతంగా కలిగివున్న నిరూఢమైన చైతన్యము శూన్య రూపమౌతుంది. లేక... అయ్యది స్వయం ప్రకాశకము కాకుండా పోతుంది. అది వేదవాక్య విరుద్ధం కదా!

అందుచేత ... ఇట్టి సందేహాలు నివృత్తింపజేస్తూ శాస్త్రాలు చెప్పుచున్న ఒకానొక సిద్ధాంతం ఒక్కటి ప్రస్తావిస్తాను. పరమాత్మ ఈ దేహ జగత్తులను నిర్మించి స్వయముగా అద్దాని యందు ప్రవేశించి ప్రకాశిస్తున్నాడు. ("తత్ సృష్ట్వా తదేవాను ప్రవిశత్)

కాబట్టి మనం ఈ జీవుని జీవన్ – మరణ – మరణానంతర స్థితులను గురించి ఈ విధంగా సిద్ధాంతీకరించవలసి వస్తుంది.

1. ఈ జీవుడు వాస్తవానికి కేవల చిదాత్మ స్వరూపుడు మాత్రమే! అయ్యది సర్వదా యథాతథం.

2. ఈతని జగదనుభవమంతా ఈతని స్వస్వరూపము నుండి బయల్వెడలే స్వకీయ చమత్కార రూపమగు 'చిత్తము'ను అనుసరించే ఉంటోంది.

3. ఈతని జగదనుభవమంతా స్వకీయ చిదాత్మ స్వరూపమునకు అనన్యమైనప్పటికీ అన్యమువలె స్ఫురించేదే చిత్తము.

4. చిత్తమును అనుసరించే జగదనుభవం ఉంటోంది. కనుక చిత్త స్వరూపమే జగత్ స్వరూపంగా స్ఫురిస్తోంది. ఆత్మ నుండి బయల్వెడనట్లుగా చెప్పబడుచున్నప్పటికీ ఆత్మకు వేఱుగా ఏదీ బయల్వెడలుటకు కారణం లేదు. కనుక చిత్త – జగత్తులు ఆత్మరూపములే!

5. యథార్థానికి ఈ జీవుడు మరణించిన తరువాత జనించటం లేదు. కేవలం చిత్తము చేతనే చిత్తము యొక్క స్వవాసనావశం చేత "నేను ఇప్పుడు పుట్టాను" .... అని వ్యర్థంగా కల్పన చేసుకుంటున్నాడు. ఈ దేహం పొందినప్పుడు కూడా ఆతని చిత్తమే 'నేను పుట్టాను' అనే భ్రమను కొనసాగించటం జరుగుతోంది.

6. ఈ జీవుడు స్వతహాగా చిదాకాశ స్వరూపుడు, జన్మ మొదలైన ఎట్టి వికారములు ఉండనట్టి చిదాకాశ స్వరూపమగు స్వాత్మయందే జన్మాదులు చిత్తముచే కల్పితంగా ఎఱుగబడుచున్నాయి. చిత్తమునకు ముందే ఆతని చిత్స్వరూపం యథాతథమై ఉన్నది.

7. ఈ జీవునికి చిదాకాశ స్వరూపం దృష్ట్యా ఈ జన్మలేదు. మరొక జన్మలేదు. ఇతఃపూర్వం జన్మలు లేవు. చిత్తముచే పొందబడేది కల్పనయే కాబట్టి, కల్పన ఉన్నంతవరకు జన్మాదులకు అంతం కూడా లేదు.

❖

**మృతౌ న జాయతే, తస్మాత్ చేతసైవ స కేవలమ్ !**
**ఇహాయమిత్థమేత్యేవ వేత్తి ఖే వాసనాత్మకమ్ ॥**

కాబట్టి ఓ వ్యాధుడా! ఈ జీవుడు యథార్థానికి జనించటమూ లేదు. మరణించటమూ లేదు. మరల పునర్జన్మించటమూ లేదు. ఇక ఇదంతా ఏమిటంటావా? కేవలము ఈ చిత్తము స్వవాసనావశం చేత వ్యర్థంగా వికారశూన్యమగు స్వాత్మయందే ఈ 'దేహ–జగత్' కల్పనలను

నిర్మించుకొని, అద్దానియందు ప్రవేశించి తన చిత్ దేహమును ఏమరచి ఈ విధంగా చిత్త-భౌతిక దేహములలో తన్మయమై ఉంటోంది. అనగా తనయందు అభ్యస్తమైయున్న భావనాపరంపరా వ్యవహారమునే ఈతడు దీర్ఘకాలం అనుభవిస్తున్నాడు. తన భావనానుభవం ఇట్లు “ఇదంతా సత్యమే” అనే రూపంగల ఒకానొక విశ్వాసం కలిగి ఉండటంచేత ఈ దృశ్యమే ఘనీభూతమైన పూర్ణ సత్యంగా ఎరుగుచున్నాడు. భావనకే ఉత్పత్తి స్థానమనతగు తన చిత్ స్వరూపాన్ని ఏమరచి ఉంటున్నాడు.

చిదాకాశరూపమగు స్వాత్మయందే స్వప్నతుల్యమగు దృశ్యమును అభ్యాసము గావించుచు ...అట్టి అభ్యాసవశం చేత మరల మరల స్వప్న సదృశంగా నిజ జన్మను, నిజ మరణమును నిజ జగత్తును అనుభవిస్తున్నాడు.

ఈ విధంగా ఆత్మయే చిదాకాశమునందు వ్యష్టి భావనచే మిథ్యా జగజ్జాలమంతా వీక్షిస్తోంది. తన సన్నిధానమునే ఆధారంగా పొందుచూ, తనయందే అధ్యస్తములై ఉన్న కార్యకారణములతో కూడిన జాగ్రత్-స్వప్నాలలో ధ్యాసను ప్రవేశింపజేసి, ప్రవర్తింపజేస్తోంది. సుషుప్తిలోను ప్రళయం లోను మోక్షస్థితి యందు ఆ కార్యకారణాలను తనకు తానే మ్రింగివేస్తోంది. వాస్తవానికి సుషుప్తి - ప్రళయ - మోక్షాలు దేనినీ భక్షించటం లేదు. జాగ్రత్-స్వప్నాలు దేనిచేతనూ భక్షించబడటమూ లేదు.

❖

చూచావా, వ్యాధుడా! ఈ విధంగా ప్రతి జీవుని అనుసరించి కోట్లకొలది జగత్తులు వర్తిస్తున్నాయి. అయితే... ఎఱుగబడినదా... అవన్నీ కూడా కేవలం బ్రహ్మ రూపాలే! ఎఱుగబడనంత కాలం అవి దృశ్యరూపంగానే ఉంటాయి.

మరొక విషయం... ఈ అనేక కోట్ల జగత్తులలో ఏదీ కూడా ఒకటి మరొకదానిని కప్పి ఉంచటం లేదు. ఏదీ కూడా మరొకదానిచే తెలియబడటమూ లేదు. అయితే ఏమి? ప్రతి జీవుడు “నా జగత్తే ఉన్నది. మఱొకరి జగత్తు లేదు”... అని తలచుచు జగత్తులో చరిస్తున్నాడు. వాస్తవానికి ప్రతివాడు తన యొక్క జగత్ స్వరూపంలో తానే బహుదూరపు బాటసారిలాగా సంచరిస్తున్నాడు. జాగ్రత్ (లేక) స్వప్న జగత్తులో చరించటమంటే... తన కల్పనలో తానే ప్రవేశించి సంచరించటం వంటిది. ఒకడు ఒక కథ రచించి, ఆ కథలోని పాత్రలు పడే కష్టాలు చూచి తానే విషాదం పొందటం వంటిది. (తత్ దృష్ట్వా తదేవానుప్రవిశత్... పరమాత్మ దేహాది జగత్తును నిర్మించి స్వయముగా అద్దానియందు ప్రవేశించి అద్దానికి ఉనికిని ప్రసాదించుచున్నాడు)

ఈ బ్రహ్మాండములో పంచభూతములైన ఘనము, ద్రవము, ఉష్ణము, వాయువు, ఆకాశమున్ను, అట్లాగే అండజ (గుడ్డు పొదిగితే పుట్టేవి), స్వేదజ, గర్భజ, వాయుజములైన ఆయా అనంత సంఖ్యాకమగు జీవులు ఉన్నాయి కదా! అట్లాగే ప్రతి జీవుని అంతరంగంలో అసంఖ్యాక జగత్తులు ఏర్పడి ఉండి ప్రవర్తిస్తున్నాయి.

వ్యవహార దృష్టిచేబ్రహ్మాండాలన్నీ సత్యమే! పరమార్థ దృష్టిచే అవన్నీ బ్రహ్మరూపాలే! జ్ఞాని దృష్టిలో బ్రహ్మరూపమైన సత్తు మార్పు చేర్పులు లేనిదై సర్వదా సర్వత్రా సర్వంగా ప్రకాశిస్తూంది.

అజ్ఞాని యొక్క దృష్టిచే బ్రహ్మరూపం గమనించబడటం లేదు. ఆతనికి ఈ కనబడేదంతా పాంచ భౌతిక జగత్తుగా (సాకారంగా) పరమసత్యంగా అనుభూతమౌతోంది. అజ్ఞానికి ప్రత్యక్షమై జగత్తుగా కనిపించేదంతా, జ్ఞానికి ప్రత్యక్షమగు స్వస్వరూప బ్రహ్మయే అయివుంటోంది.

చిద్రూపమునకు ఏదేది ఎట్లు భాసిస్తోందో అది జగద్రూపంగా సత్యముగానే (అజ్ఞాన దృష్టికి) అనుభవమౌతోంది. ఇవన్నీ జ్ఞానికి సద్రూపంగా (ఆత్మరూపంగా) భాసిస్తున్నాయి.

**వ్యాధుడు :** ఇంతకీ ఈ కనబడే జగత్తు సత్యమా? అసత్యమా?

**మహాముని :** "ఈ జగత్తు సత్యమా? అసత్యమా? ఇది భ్రమయా? అనునిత్య సత్యానుభవమా? ఇవన్నీ ఉన్నాయా? లేవా?" అనునది నాశరహితమగు సంవిత్తే నిర్ణయించవలసినది. అద్దాని నిర్ణయానుసారమే ఈ జగత్తులోని సంబంధ-బాంధవ్యాలు మొదలైనవి సత్యముగానో, స్వప్నతుల్యం గానో నిర్ణయించబడి... అట్లే తదనుసారమే అనుభవించబడుచున్నాయి. ఈ సంవిత్తు ఎప్పుడు ఏ ప్రకారమైన నిర్ణయం కలిగి ఉంటుందో... అది అట్లే ఆ ప్రకారంగానే భాసిస్తోంది. ఇక స్వయం నిర్ణయానుసారమే ప్రాప్తిస్తున్న ఈ జగత్తులో ఈ వస్తువుల, జీవుల ఏకత్వ, ద్విత్వాదుల గురించిన ప్రసంగం ఎక్కడిది? ఎవని బుద్ధి ఏ తీరుగా ఉంటే వానికి అట్లే ఇదంతా అనుభవమవుతోంది. అందుకే "ఇది అనిర్వచనీయం" అని నిర్ణయించబడింది. మిత్రమా! "తెలుసుకునేది – తెలియబడేది ఒకే చైతన్యము యొక్క ద్వివిధ రూపములు"... అని ఎప్పుడు గ్రహిస్తావో అప్పుడు ఈ దృశ్యము పూర్తిగా జ్ఞానరూపమే అగుచున్నది.

జ్ఞానరూపము (సంవిత్తు యొక్క తెలుసుకునే విభాగం) సత్తా కలిగివున్నది కాబట్టే... 'జ్ఞేయము' అనబడే తెలియబడేది ఉనికిని పొందుచున్నదగుచున్నది.

❖

ఈ విధంగా ఈ భూమి మొదలైన సమస్త పదార్థాలు జ్ఞాన స్వరూపములే. అనగా అవన్నీ తెలుసుకొనేవాని 'తెలివి'యే స్వరూపంగా కలిగి ఉన్నాయి.

1. తెలియబడే పదార్థాలన్నీ తెలుసుకొనేవాని 'తెలివి'ని అనుసరించే ఉండటం చేత వాటి మూలరూపం 'తెలివి'యే అయివున్నది.
2. తెలుసుకొనేవాని రూపమే తెలివి అయివున్నది.
3. ఆత్మయే తెలుసుకొనే వాని రూపంగా ఉన్నది.
4. కనుక తెలియబడేదంతా ఆత్మరూపమే!

కనుక దృశ్యము ద్రష్టరూపమే అయివున్నది. ద్రష్టయో ఆత్మరూపుడే అయివున్నాడు. ఓయీ వ్యాధుడా! నీచే దర్శించబడే దృశ్యమంతా నీ రూపమే అయివున్నది. నీవు ఆత్మయే రూపముగా కలిగి ఉన్నావు.

ద్రష్టయగు ఆత్మ స్వస్వరూప తత్త్వమును ఏమరచినదై ఉండటం చేత తన జ్ఞానస్వరూపం నుండి చ్యుతి చెంది "ఇది వేరు, అది వేరు" ...అను భావనను ఆశ్రయించి దృశ్య రూపముగా

(దృశ్యరూప విభాగంగా) "అనుభవి" అగుచున్నది. వాస్తవానికి "దృశ్యము ఆత్మరూపమే అయివున్నది". (ఆత్మోపమ్యేవ సర్వత్ర సమంపశ్యతి సయోగిః, తత్ దృష్ట్వా తద్‌వాను ప్రవిశత్, యదాత్మస్య అన్యః తదేవ మాయా, ఇదమ్ సర్వమ్ యామాః, మత్తపరః తరమ్ నాన్యత్ కించిదస్తిః ... మొదలైన ఉపనిషత్ వాక్యాలన్నీ "చూడబడేదంతా చూచేవాని రూపమే" ...అని నిరూపిస్తున్నాయి. అదియే ఇక్కడ కూడా నిరూపించబడుతోంది. అదియే ఆత్మజ్ఞానం)

**జ్ఞానం యదేవ తజ్ఞేయం! జ్ఞేయస్య అసంభవాత్ పృథక్ ।**
**యథాజ్ఞానమ్ అతో జ్ఞేయం తవోత్యాత్మానమాత్మానా ॥**

ద్రష్ట కంటే దృశ్యం వేరుగా ఉండజాలదు. జ్ఞానము కంటే జ్ఞేయము (దృశ్య సమూహం) వేరుగా ఉండటం అసంభవం. జ్ఞేయము (దృశ్యము) జ్ఞానరూపమే (ద్రష్టరూపమే) అయివున్నది.

కనుక వ్యాధుడా! "ఈ దృశ్యము ఎక్కడి నుండి వచ్చి ఇక్కడకు చేరింది? ఇదంతా ఎవరిచే కల్పించబడింది?" అనే ప్రశ్నకు మహనీయుల వాక్యములను స్వానుభవమును క్రోడీకరించి ఇక్కడ సమాధానం చెప్పుచున్నాను విను.

జ్ఞానమే 'నిజస్వరూపము' గూర్చిన అజ్ఞానముతో కూడినదై ఉండటం చేత తనకు తానే ఇట్లు జగత్తు రూపంగా విస్తరించివున్నది. ప్రదర్శించుకుంటోంది. ఆ విధంగా "తనకు తానే దృశ్యరూపంగా విస్తరించి ఉండటం" ...అనేది ప్రతి ఒక్కనికి స్వప్నంలో సాదృశానుభవమే కదా! అట్టి స్వస్వరూప స్వానుభవమే ఈ జాగ్రత్ జగత్తు కూడా! ఇది మా స్వానుభవంతో ఆత్మజ్ఞాన ప్రయోజనంగా చెప్పుచున్న అత్యంత సుస్పష్టమైన పరమసత్యం.

❖

నాయనా! తత్త్వజ్ఞుల అనుభవమే అది సుమా! అదియే ఆత్మజ్ఞానం. తత్త్వజ్ఞుడు "ఆత్మకంటే వేరుగా సృష్టులు లేవు. సృష్టులన్నీ జ్ఞాన రూపంగానే వెలయుచున్నాయి" అని గ్రహించి, తృప్తి పొందినవాడై ఉంటున్నాడు. ఆతని నేత్రములు ఈ సృష్టులను చూస్తున్నప్పటికీ, ఆతని దృష్టికి ఈ రూపనామాదులు కనిపిస్తున్నప్పటికీ "ఇవన్నీ నా ఆత్మస్వరూపమే"...అని అనిపిస్తోంది. "నాకు వేరుగా ఎక్కడా ఏదీ కింత్ కూడా లేదు" (మత్తః పరతరమ్ నాఽన్యత్ కించిదస్తి) అని గ్రహించియే దృశ్య దర్శనం చేస్తున్నాడు. ఇక మూర్ఖులకు కనబడే సృష్టి (లేక దృశ్యము) అంటావా? అది నన్ను అడగవద్దు. ఎందుకంటే అద్దానికి ఒక నిశ్చయత్వమంటూ ఏదీ లేదు. మూర్ఖుడు ఈ దృశ్యమును (సృష్టిని) చూస్తూ....

ఇది నాది– అది వారిది, వీరంతా మూర్ఖులు. వారికేమో ఏమీ తెలియదు. ఇదంతా నాదే! వీటిని ఎందుకు వదలాలి? వాటినేమో ఇక ఇప్పుడు పట్టుకోవాలి. ఇదెవ్వరో నాపై కోపంతో కల్పించారు. ఎవరు కల్పించారో తెలియదు!ఇదంతా కష్టాలమయం. వీరే నాకు కష్టాలు కలిగిస్తున్నారు? ఇక్కడ తినటం – త్రాగటమే పని. ఇది కాక ఎక్కడో ఏమున్నది? ఇంకెక్కడా ఏదీ లేదు. నేనే హాయిగా ఉండాలి. ఇందులో తప్పేమున్నది? ఎవరి గొడవో నా కెందుకు? వీరంతా నా శత్రు –

మిత్రులు. వీరిని ఉద్ధరించాలి. వారిని నమ్మకూడదు. ఇంతవరకు నాది. అది వారిది. వారితో నాకేమి సంబంధం? కొందరు నా వారు. మరికొందరు కాదు. నా వారి కోసం ఏమైనా చేయవచ్చు. కానివారి కోసం నేను ఎందుకు చేయాలి? ఇందులో పడ్డాను. ఇంకెప్పుడో పోతాను ... ఇదంతా నా కర్మ! ఇది ఇంతే!

...ఈ విధంగా పరిపరివిధాలుగా, ఒక్కొక్కసారి ఒక్కొక్కవిధంగా దృశ్యము విషయమై అనుభవం కలిగి ఉంటున్నాడు. అందుచేత అట్టి మూర్ఖుల దృష్టి మనం పరిగణలోనికి తీసుకోవలసిన అవసరం లేదు. తీసుకొని ప్రయోజనం కూడా లేదు. తత్త్వవేత్త "ఇదంతా అస్మత్ ఆత్మ స్వరూపమే" .... అని అత్యంత స్పష్టంగా, "ఆ గోడ అక్కడున్నది" ...అన్నంత సాదృశంగా, ఆత్మకు అభిన్నంగా దర్శిస్తున్నాడు. అట్టి ఆత్మసాక్షాత్కారమే మనకిక్కడ శరణ్యం. అదియే సత్యము.

ఆత్మజ్ఞానముచే ఈ సమస్త జగత్తు కూడా ఏకము – సన్మాత్రము అగు చిదాకాశమే అయి ఉన్నది. ఆత్మను ఎఱుగనట్టి అజ్ఞానులకు ఏకమగు ఆత్మయే అనేక జగద్రూపములుగా భాసిస్తోంది. ఒకే చిన్మాత్రమగు ఆత్మ స్వప్నంలో లక్షల కొలది ఆత్మరూపములను ధరించి వర్తిస్తోంది. అట్లాగే జాగ్రత్‌లో కూడా లక్షల కొలది జాగ్రత్‌జగదాత్మ రూపములను కూడా ధరిస్తోంది. ఇక సుషుప్తి యందో... ఏకైకాత్మరూపంలో చెన్నొందుతోంది.

జగత్తు అంటే చిదాకాశమున ఏ స్వప్న సంవిత్తు కలదో... అదియే "జగత్తు" అనే పేరుతో చెప్పబడుతోంది. జగత్ ప్రళయం అంటే చిదాకాశములోని సుషుప్త సంవిత్తు జగత్ వ్యవహారమును త్యజించి ఏకైకాత్మ రూపం అవధరించి ఉండటం. "ఇదంతా నా రూపమే" అని సుస్పష్టం చేసుకొని ఉండటం.

ఈ విధంగా సృష్టి – ప్రళయములనేవి ఆత్మయందలి అంతర్విభాగ విన్యాసం మాత్రమే! ఒకే సంవిత్తు... స్వప్నసంకల్పములలో లాగా... వివిధ భోగ్యరూపములను లక్షల కొలది భోక్త రూపములను (అనగా మనుష్యాది రూపములను) పొందుతోంది.

ఆ సంవిత్తే సుషుప్తిలో పదార్థ శూన్యత్వస్థితి బడయుచున్నది. కాబట్టి ఓ వ్యాధుడా! నీ యొక్క జగద్విభాగంలో నీకు అనన్యమైనప్పటికీ అన్యంగా నీచే దర్శించబడేదే జగత్తు నీ యొక్క సర్వపదార్థరహిత ఆత్మవిభాగమే సుషుప్తిగా నీకు అనుభవమౌతోంది. అనగా ఈ జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు, అందులో అంతర్గతమైవున్నట్లు తోచేవి.... అన్నీ ఆత్మరూపములే సుమా!

స్నేహితుడా! ఈ సమస్త దృశ్యమూ కూడా కేవలం "నాశరహితము – శుద్ధము" అయినట్టి చిదాత్మయే అయివున్నది. చిదాత్మ ఎచ్చట ఏ రూపంగా అనువర్తిస్తుందో ...ఆ రూపంగానే పరిణమించి దృశ్యరూపంగా అనిపిస్తోంది. – స్వప్నంలో స్వప్న సంవిత్తే స్వప్నాంతర్గతంగా ఆయా స్వప్నంలోని వస్తు – విషయ – దృశ్య – వ్యక్తిగత రూపాలన్నీ ధరిస్తున్నట్లు... సంవిత్ సంకల్పంలో కనిపించే ఆయా వివిధ నగరాది రూపాలన్నీ ధరిస్తున్నట్లు...

ఒకే నిర్వికారమగు సంవిత్తు సృష్టి యొక్క సిద్ధికొరకై ఈ భూమి – జలము – అగ్ని –

వాయువు – ఆకాశము మొదలైన రూపాలన్నీ ధరిస్తోంది. చిదాకాశ సంవిత్తే ఆయా నామరూపాలుగానూ, ఈ సర్వ జగత్తుగాను భాసిస్తోంది.

ఆ చిద్రూప సంవిత్తే నాశనవంతమగు సాకార రూపముగాను – నాశనరహితమగు నిరాకార రూపంగాను కూడా... భాసిస్తోంది. వాస్తవానికి అద్దానికి 'నాశనము' అనేదే లేదు. కానీ 'నాశనము' అను రూపంలో 'నివృత్త సంవిత్తు'యే భాసిస్తోంది.

ఓ వ్యాధుడా! నీవు నీ మనస్సుతో తూర్పు, పడమర మొదలైన దిక్కులన్నీ సంచరిస్తూ "వినబడినవి – వినబడనివి, చూడబడినవి – చూడబడనివి అనేక విషయాలు" గమనించి ఉన్నావు కదా!

ఇవన్నీ చిత్స్వరూపుడవైన నీవే నీ చిత్స్వరూపమునే ఆయా రీతులుగా ఎఱుగుచున్నావు. ఇక్కడ వస్తువులు, విషయాలు మారవచ్చు–మారకపోవచ్చు. కానీ ఇవన్నీ ఎరుగుచున్న సంవిత్స్వరూపుడ వగు నీకు నాశనము లేదు. 'ఆకారము' అనే వికారము నీకేమాత్రం లేదు. ఎందుకంటే... సంవిత్తు ఎక్కడా కూడా సాకారము పొందటం లేదు. నాశనయుక్తమయ్యేది కాదు.

**వ్యాధుడు :** స్వామీ! నేను స్వతహాగా సంవిత్ స్వరూపుడనై ఉండగా, ఈ దృశ్యముతో నాకు తదాత్మ్యము ఎందుకు కలుగుతోంది? అసలీ దృశ్యమును కల్పించినదెవరు? ఈ దృశ్య తాదాత్మ్యము నా పట్ల తొలిగేది ఎట్లా? ఎవరిని ఆశ్రయించటంచే ఈ దృశ్యత్వ బుద్ధి నా పట్ల తొలుగుతుంది? నేను దీనిని అధిగమించే అభిలాషచే అడుగుచున్నాను.

**మహాముని :** ఓ వ్యాధుడా! ఈ దృశ్యము కేవలం కల్పితం మాత్రమే!

1. 'కల్పితం' అనే స్వభావం సంతరించుకున్న ఆత్మయొక్క ఒకానొక చమత్కారమే ఈ దృశ్యము.
2. సంకల్పిత విషయములను నిరంతరం సుదీర్ఘంగా అభ్యసించటం చేతనే ఈ జగదనుభవం అనేక జన్మలుగా పరిపుష్టమై ప్రాప్తిస్తోంది.
3. ప్రమాణ సిద్ధమైన సంకల్పిత పదార్థము నుండి 'విరామం' ... అనబడేది ఉపశమన పూర్వకమైన –నిరంతరమైన అభ్యాసం చేత మాత్రమే లభించగలదు.
4. శ్రద్ధగా చిరకాలం ఉపశమన పూర్వకమైన అభ్యాసం లేకపోతే ఈ జగదనుభవం జీవుని పట్ల ఇట్లాగే నిరంతరం కొనసాగబోతోంది.
5. సంకల్పకర్త అయిన జీవుడు తన మనోరూపమునే ఆయా జగత్ పదార్థములుగా ఎఱుగుచున్నాడు.
6. ప్రతి జీవుడు కూడా, ప్రతిదీకూడా తనయొక్క సంకల్ప దృఢత్వమును అనుసరించియే పొందుచున్నాడు.
7. కేవలము సంకల్పము యొక్క దృఢత్వముచే సంకల్పానుకూలమైన దృశ్య సంపదను జనింపజేయటం మనం కొన్ని ఉపాఖ్యానాలలో గమనించాం.
8. ఎవని మనస్సు మరొక్కచోటెక్కడో లగ్నమై ఉంటుందో... అట్టివానికి ఇక్కడ ఎదురుగా దృశ్యం ఉండికూడా 'లేనిదే' అగుచున్నది.

9. ఒకడు ప్రమాణసిద్ధమైన నిజకల్పిత (లేదా) నిజసంకల్పిత పదార్థములను నిరంతరం అభ్యసిస్తున్నాడో, .... ఆతని అభ్యాసఫలంగా పొందుచున్న అనుభవం తొలగాలంటే ఆతడే తన అభ్యాసముచే శ్రమించి వేరైన అవగాహన వైపుగా మరల్చుకోవాలి.

❖

కనుక ఓ లుబ్ధక నామధేయ వ్యాధుడా (బోయవాడా!)! నీ మనస్సే నీకు సంకల్పించి అంతా ఆయా రీతులుగా నీచే అనుభవం పొందేట్లు చేస్తోంది. నీ మనస్సు తూర్పు పడమర దిక్కులుగా పోయి ఆయా పదార్థము ఎట్లు సంకల్పమును కలిగి ఉంటుందో... అట్లాగే వాటి వాటిని పొందటం జరుగుతోంది. అనగా అచ్చటచ్చట పదార్థత్వమును తన యొక్క సంకల్పత్వమును త్యజించలేక పోతోంది. ఆ మనస్సు మరొక రీతిగా మననము పొందక మొరాయిస్తోంది. అట్టి "సంకల్పిత పదార్థములుగా రూపుదిద్దుకోవాలి"... అనే సంకల్ప స్థిరత్వం పొందిన జీవునకు...

1. మొట్టమొదటగా "ప్రాతిభాసిక పదార్థ ప్రాప్తి" లభిస్తోంది. అనగా .... వాస్తవానికి ఒక పదార్థం ఎదురుగా లేకపోయినాకూడా ఉన్నట్లే తత్సంబంధమైన మానసిక అనుభవం (లేక) ఊహకు సంబంధించిన అనుభవం కలుగుతోంది.

2. అటు తరువాత సంకల్పము యొక్క మరికొంత దృఢత్వం చేత అట్లే (ఆ సంకల్పాను సారమే) "వ్యావహారిక పదార్థ ప్రాప్తి" కూడా జరుగుతోంది.*

తూర్పు దిక్కుగాపోయిన వాడు "నేనిప్పుడు ఉత్తర దిక్కుగా పోయి దర్శిస్తాను" ...అనే దృఢ సంకల్పాన్ని ఆశ్రయించటం జరిగితే అదే రీతిగా ఆతడు తూర్పు దిక్కును త్యజించి ఉత్తర దిక్కు చేరుకుంటాడు కదా! ఆ విధమైన ప్రయాణం మానసికంగా తదనంతరం శారీరకంగా సిద్ధించటం జరుగుతోంది. అట్లాగే ఈ కనబడే జగత్తులో అనేకమంది జీవుల సంకల్పాలు అనేక రీతులుగా పరిఢవిల్లుచున్నాయి. ఉదాహరణకు

నేను ఆకాశంలో 'నగరము'గా అగుదును ... నేను భూమిపై 'మృగము'గా అగుదును... అనుకుంటే అది అట్లే సిద్ధిస్తోంది. సంకల్ప రహితునికో... (లేక) మరొక విషయమున మననము కలవానికో... అందుకు వేరైన స్థిరచిత్తమును అనుసరించి అవి క్రమంగా నశిస్తున్నాయి.

ఓ వ్యాధుడా! లుబ్ధకా! ఆత్మ జ్ఞానముచే (ఆత్మజ్ఞాన సంబంధమైన సంకల్పబలంచే) ఈ కనబడే జగత్తంతాకూడా చిన్మాత్ర రూపమగు చిదాకాశమే. అయితే అజ్ఞాన కారణంగా అనేక సంవిత్తులకు వేలకొలది రూపాలుగా అనేకమంది జీవులుగా కనిపిస్తోంది.

**వ్యాధుడు :** స్వామీ! ఈ కనబడే జగత్తుయొక్క అసలైన రూపమేమిటి? ఈ జగత్తును దర్శించే ఈ జీవరూప ద్రష్ట వాస్తవరూపం ఏమిటి?

---

* ఇందుకు దృష్టాంతం ఐందవోపాఖ్యానం. ఐందవులు మొట్టమొదట "మేము సృష్టికి కర్తలం అవుతాం" .... అని ధ్యానించారు. సృష్టికి సంబంధించిన అనేక విశేషాలు వారి ఊహలలో రూపుదిద్దుకున్నాయి. అటు తరువాత ఆ ఊహ పదార్థరూపం దాల్చి బ్రహ్మాండముల రూపంలో ఏర్పడి కనిపించాయి.

**మహాముని :** ఈ జీవుని ఐహిక – ఆముష్మిక ప్రపంచమంతా స్వప్న రూపమేనయ్యా! ఇక ద్రష్టయొక్క జీవుడంటావా! ఈ శరీరం ఉండవచ్చు. ఇదిపోయి మరొకటి రూపుదిద్దుకోవచ్చుగాక! ఈ జీవుడు చిద్రూపుడే. అతనిచే దర్శించబడే దానికంటే ఆతడు వేరైవున్నాడు. ఈ మిథ్యారూప దేహాదులచేగాని, గుణదోషాదులచేగాని అధిష్ఠానమగు జీవభౌతికరూపము నశించినంత మాత్రంచేత జీవచైతన్యము నశించదు. "మరణించిన వారితో సంభాషించటం, మరణించిన వారిని ఆహ్వానించటం" ...అనే భూతవిద్య తెలిసినవారు ప్రదర్శించటం అందరూ చూస్తున్నదే కదా! అట్లాగే పూర్వజన్మకు సంబంధించిన గృహ–వ్యాపార–బంధుత్వాల గురించి ఇప్పుడు మననం చేయటం అక్కడక్కడ జరుగుతోంది కదా! "స్మృతి" యొక్క ప్రభావంచేత చిత్ స్వరూపుడగు జీవుడు పూర్వస్మృతులు కలిగి ఉండటంలో ఆశ్చర్యమేమున్నది? మరణించినవారు కొందరు దేహాలు భస్మమైనా కూడా వారి వారి బంధువులకు పూర్వజన్మ పదార్థాల గురించి వచించి, ఆ తరువాత లోకాంతరములకు వెళ్ళటం లోకానుభవమైన విషయమే కదా!

**వ్యాధుడు :** పిశాచాదులు కనిపించటం, వారితో సంభాషించటం మొదలైనవి భూతవైద్యుల యొక్క ధర్మమే గాని, సకలజనుల అనుభవంకాదు కదా!

**మహాముని :** కావచ్చు! కాని, ఆ భూతవైద్యులు చనిపోయినవారిని ఆహ్వానించటం, వారితో సంభాషించటం చేయగలరుగాని, ఎక్కడో దూరంగా వున్న బంధువులనో, చనిపోకపోయినా చనిపోయారేమోనని అనుకున్నవారిని ఆహ్వానించలేరు, వారితో సంభాషించనూలేరు కదా!

**వ్యాధుడు :** స్వామీ! చనిపోయిన వారు కనబడటం, వారు సూచనలు ఇవ్వటం, ప్రేమ ప్రదర్శించటం, వారి మనోభావాలు చెప్పటం మొదలైనవి సజీవుల "వ్యవహారభ్రమ" అయివుండవచ్చు కదా!

**మహాముని :** ఓహో! మృతజీవుల బంధువుల అనుభవాలకు (మృతుడు కనిపించటం, ప్రేమ ప్రకటించటం, ఓదార్చటం మొదలైనవి) ప్రమాణమేమిటనియా నీ ఉద్దేశం? జీవించి ఉన్నవాని యందు ఉన్న అనుభవమే మృతుని యందు కూడా ఉండవచ్చు కదా! ఆ రెండు మనస్సులలో అనుభవానికి సంబంధించిన సారూప్యత ఎందుకు ఉండకూడదు? మరణించినవాని దేహం నశించినంత మాత్రంచేత ధ్యాసలు కొనసాగకూడదనుటకు ప్రమాణమేమున్నది? ధ్యాసలు మనోధర్మాలేగాని, దేహధర్మాలు కాదు కదా! సజీవుని యందు ఏ అనుభవాలు కొనసాగుచున్నాయో, అట్టి అనుభవాలే మృతుని యందు ఉండబట్టి వారు సమానమైన న్యాయములో వర్తించటమనేది మృతజీవుని ధర్మము కూడా ఎందుకు కాకూడదు? మనం చెప్పుకుంటున్న ఈ జీవన్ – మృతుల సమాన మనోధర్మముల సందర్భంగా రెండు మూడు విషయాలు చెప్పుకుందాం.

1. స్వప్నంలో కొన్ని అనుభవాలు ఉంటున్నాయి.
2. స్వప్నాంతర్గతమైన అనుభవాలన్నీ మేల్కొనిన తరువాత అసత్తుల్యం అగుచున్నాయి.
3. స్వప్న సమయంలో మాత్రం స్వప్నాంతర్గతమైన అనుభవాలన్నీ సత్యమువలె తోచుచున్నాయి.
4. జాగ్రత్తులో "నేను, నీవు, నీది, నాది, నా వారు, నీ వారు, సంబంధించినవి, సంబంధించనివి

పదార్థములు, పరిచయాలు, మన్ననలు, అవమానాలు" ఇత్యాది అనేక విషయాలు తారసపడు చున్నాయి. ఇవన్నీ ఆయా జీవులు వారి వారి అనుభవములను అనుసరించి ఘనీభూతమైన సత్యంగా పొందుచున్నారు.

5. ఆత్మజ్ఞానం సంతరించుకొన్నవారికి మానావమానములు, బంధుమిత్రులు, కష్టసుఖములు మొదలైనవన్నీ సమానములే అయివుంటున్నాయి. అవన్నీ స్వప్నతుల్యంగాను, కాలగతిచే మరొక తీరుగా ఉండబోయేవిగాను అనుభవమౌతున్నాయి.

కాబట్టి ఓ వ్యాధుడా! ఈ జగత్తు స్వప్నతుల్యమేనని ఈ విధంగా నిరూపించబడుతోంది. ఆత్మజ్ఞానుల అనుభవమే మనకు ఇక్కడ ప్రమాణం. శాస్త్రకారుల వాక్యములు... మనకు అంతా "స్వప్నసదృశం"... అని బోధిస్తున్నాయి కదా! (ఉదా : వాచారంభం – వికారోనామధేయం)

ఈ జగద్రూప వికారమంతా మాటలు చెప్పుకోవడానికే విషయంగాని వాస్తవం కాదు. (నేఽహనానాఽస్తి కించన – ఇక్కడ అనేకత్వమనేది కొంచెం కూడా లేదు. చిద్రూపమే అనేకంగా కనిపిస్తోంది.)

స్వప్నంలో అనేకం కనిపించవచ్చు. అవన్నీ స్వప్నద్రష్ట యొక్క ఊహలే కదా! అట్లాగే జాగ్రత్ ద్రష్టకు జాగ్రత్‌లో కనిపించే విశేషాలన్నీ ఆ జాగ్రత్ ద్రష్టయొక్క ఊహా పరంపరలే! ఆ ఊహల సారూప్యమే భిన్నజీవుల పరస్పరానుభవములు. అవన్నీ మనోవికారములే కాబట్టి జీవించియున్న కొందరికి – మరణించినవారికి కొన్ని సందర్భములలో పరస్పరమైన భావసారూప్యం ఏర్పడటంలో ఆశ్చర్యం ఏమున్నది?

ఒక జనసమూహం ఒకచోట గుమిగూడి చంద్రబింబాన్ని తిలకిస్తున్నారనుకో! అందులో కొందరికి చంద్రునిలో తటాకం ఉన్నట్లు కనిపించవచ్చు. మరికొందరికి ఒక కుందేలు చంద్రబింబంలో తారట్లాడుచున్నట్లు అనిపించవచ్చు. అట్లాగే ఈ ప్రపంచంలోని ఒక సంఘటన కొందరికి ప్రత్యేక విషయంగాను, మరికొందరికి సామాన్య విషయంగాను, ఇంకొందరికి అది విషయమే కానట్లుగాను అనిపిస్తోంది. అందుకే ఈ జగత్తు "సదసత్‌రూపం" అని చెప్పబడుతోంది. ఈ జగత్తు కొందరికి సత్తుగాను, మరికొందరికి ఊహామాత్రంగాను కనబడుతోంది.

**వ్యాధుడు :** ఇంతకీ ఈ జగత్తు యొక్క వాస్తవరూపం ఏమిటి? ఇది సద్రూపమా? అసద్రూపమా?

**మహాముని :** ఈ జగత్తు యొక్క వాస్తవరూపం ఆత్మయే! అనగా, నీ ఆత్మయే నీకు జగత్తుగా కనిపిస్తోంది.

ఆత్మ – గ్రహించబడే సర్వపదార్థముల యందు "సన్మాత్రము"గా ఎఱుగబడుచున్నది. అది సర్వదా నిర్మలమైనది. అది అనుభవైక మాత్రమైనది. 'చిన్మాత్రము'. ప్రకాశమాత్ర స్వరూపమైనది. సర్వ పదార్థ వర్జితమైనది. సర్వ పదార్థమయమైనది. ఈ సమస్త జగత్తు చిదాకాశమున నిరాకారమై, నాశరహితమై, శాంతమై, నిర్మలమై, అభాస వర్జితమై వెలయుచున్నది.

❖

ఇక నీవో... నీ యందే నిజ చిదాత్మరూపంతో సుస్థిరుడవై వెలయుము. నిశ్చలమగు సంవిత్ మాత్రుడవై ఉండు. అట్టి నిశ్చల చిదాత్మయే తన మనస్సు ననుసరించి తానే మనస్సుకు ఏదేది ఎట్లు కనిపిస్తుంటే ... అట్లుగా అగుచున్నది. కాబట్టి, ఇక సత్తేది? అసత్తేది? ఈ దేహాలు, ఈ సుఖ-దుఃఖాలు, ఈ పరిచయాలు, ఈ అనుభూతులూ, ఈ అనుసంధానాలు మొదలైనవి రావచ్చుగాక! పోవచ్చుగాక! ఇవన్నీ స్వయంభావనా మాత్రములే! స్వయంపాకమే! ఇందులో పట్టుదల ఎందుకు? నీవు సర్వదా సదా పరిశుద్ధాత్మ స్వరూపుడవేనని నిర్దుష్టంగా గ్రహించి ఉండు.

ఈ జగత్తు సత్తు (సత్యము) అయినా, (లేక) అసత్తు అయినా... భావనామాత్రమైనా ... లేక మరొకటేదైనా అయినా... ఏది ఏమైనా సరే... ఇద్దానియందు 'భ్రమ' ఉండాల్సిన అవసరమేముంది?

ఓ సాధూ! వ్యాధుడా! ఇద్దానిపట్ల తుచ్ఛ ప్రయోజనములు గూర్చిన... ఫలములను గూర్చిన పట్టుదలలు కలిగి ఉండవద్దు సుమా! ఎందుకంటే... నీవు 'ఆత్మ' స్వరూపమేమిటో ఎఱుగుచున్నావు. 'ఆత్మ' అనగా నీ స్వస్వరూపమే కదా! ఈ సంసారము గురించిన "ఏమిటిది? ఎక్కడి నుండి వచ్చింది? ఎటు పోతోంది?" ... అనే ప్రశ్నలు నీకు కలత కలిగించవలసిన అవసరమేమున్నది?

❖❖❖

## 15. చైతన్యమే జగత్తుగా కనిపిస్తోంది - నిరూపణ

**మహాముని :** ఓ నిత్యాత్మానందమయ స్వరూపుడా! ప్రియబోయవాడా! నీకింకేమైనా సందేహాలున్నాయా?

**వ్యాధుడు :** స్వామీ! మీరు అంతా సుస్పష్టంగా ప్రకటిస్తున్నారు. అంతా సువిదితమే అవుతోంది. అయినప్పటికీ ఒక్క చిన్న సందేహం ఇంకా నన్ను వదలటం లేదు.

**మహాముని :** అడుగు నాయనా!

**వ్యాధుడు :** మాకు బంధమెట్లా కలుగుతోంది? ముక్తి లభించేదెట్లా? ఈ 'జగత్తు' అనే జాడ్యం మాపట్ల తొలిగేది ఎట్లా? ఈ జగత్తుకు అంతు ఎక్కడ?

**మహాముని :** (పకపక నవ్వుతూ) మరల మొదటి ప్రశ్నకే వచ్చావా? ...సరే, మంచిది. మా సమాధానం శ్రద్ధగా అతి సూక్ష్మమైన బుద్ధితో యోచిస్తూ, గ్రహిస్తూ విను.

❖

ఓ వ్యాధుడా! మనం ఇప్పటికే వివరించుకొన్న విషయాలను అనుసరించి ఈ సర్వజగత్ వ్యవహారములు, ఈ కనబడే భావాభావపదార్థములు ...ఇవన్నీ కూడా స్వప్నములోని సంఘటనల ...వంటివే కదా! వీటికి ఉత్పత్తి ఏమున్నది? వినాశనమేమున్నది? "స్వప్నంలో కనిపించే శత్రువు మరణిస్తే స్వప్నబోధ తొలగుతుంది"... అనేది ఎట్టిదో "ఈ జగత్తు తొలగితే జగత్ జాడ్యం తొలగుతుంది" అని అనుకోవటం అట్టిది. వాస్తవానికి ఎక్కడ చిత్తు ఉన్నదో అక్కడ 'ఎరుక'ను ఆశ్రయించి జగత్తు ఉంటుంది. అనగా అధిష్ఠాన దృష్టిచే చూస్తే 'జగత్తు' అనబడేదానికి నాశనమే లేదు. జగత్తు

వాస్తవానికి చిన్మాత్ర సంబంధమే కాబట్టి చిన్మాత్ర స్వరూపములే అయివుండగా, ఇక 'వినాశనం' అనునదెక్కడిది? నీవు – ఈ జగత్తు చిన్మాత్రములే అయివుండగా, ఇక బంధింపబడునదేది? ముక్తి చెందునదేది? "నాకు బంధమున్నది" ...అనేది నీవు పరిశీలించి ఇప్పటికిప్పుడే అట్టి అనుభవమును త్యజించివేయాలి సుమా!

"ఆహా! మాకు బంధం అనిపిస్తోందే?" అని అంటావా? కొందరికి కంటి జబ్బు కారణంగా కంటి గ్రుడ్లు క్షణక్షణం కించిత్ చంచలం పొందుతూ ఉండటం చేత వారివారి కళ్ళకు ఆకాశంలో కేశాలు, మెరమెర మెరిసే మణులు కనిపిస్తూ ఉంటాయి. అవి నిజానికి ఉన్నాయా? లేవు. అవన్నీ వైద్యసేవచే చంచలం త్యజిస్తే ఇక కనిపించవుకదా! అట్లాగే అధిష్ఠానమగు ఆత్మను గూర్చిన అజ్ఞానం చేత ఈ జగత్తు నిరంతరం పరిణామయుతంగా కనిపిస్తోంది. వికారవంతంగా అనిపిస్తోంది. కానీ ఆత్మజ్ఞానులకు ఇదంతా నిశ్చల చిద్రూపంగా భాసిస్తోంది. నది ఒడ్డున కూర్చుని చూస్తూ ఉంటే, జలతరంగం అత్యంత చంచలంగా కనిపించవచ్చు గాక! తరంగం ఒక రూపం కోల్పోయి మరొక రూపం అతివేగంగా పొందవచ్చునుగాక! జలం సర్వదా జలంగానే ఉంటోంది కదా!

ఏ కాలంలో ఈ భూ-జల-ఆకాశ-పర్వతాది జగత్తు క్షణంలో స్ఫురిస్తోందో, ఆ కాలమునే విద్వాంసులు బుద్ధితో లెక్కించే క్షణ-యుగ-కల్పాది కాలమాన కల్పన కూడా ప్రారంభమౌతోంది. ఎప్పుడైతే, "ఈ జగత్తు స్వప్నంలాగా అసద్రూపమే అయినప్పటికీ అనుభూతమౌతోంది" – అని గ్రహించబడుచున్నదో... ఈ జగత్తు అన్నది వాస్తవానికి (ఆత్మజ్ఞాన దృష్టికి) లేకయే ఉన్నదో... అప్పుడే ఈ సమస్తం ఆ ఆత్మజ్ఞానికి-సర్వము సర్వదా సద్రూప చైతన్యంగానే స్ఫురించగలదు.

ఓ వ్యాధుడా! మనకు ఈ ప్రసిద్ధమగు జగత్తు ఎట్లా ఉన్నట్లుగా కనిపిస్తోందో... అదే రీతిగా ఇతర అసంఖ్యాక జీవులకు వారి వారి అసంఖ్యా జగత్తులు ఆకాశంలో ఏర్పడి ఉండి కనిపిస్తున్నాయి. ఒకరి జగత్తు మరొకరికి స్ఫురించటంలేదు. ఎవరి జగత్తు వారిదే అగుచున్నది.

**వ్యాధుడు :** అదేమిటి? ప్రతి జీవునికి తన ప్రత్యేక జగత్తు ఉండటమేమిటి?

**మహాముని :** అవును. నూతిలో కప్పకు ఆ నూతిలోని అంతర్భాగమే పరిపూర్ణమగు జగత్తుగా స్ఫురిస్తోంది. తటాకంలోని కప్పకు ఆ తటాకమే మొత్తం జగత్తుగా అనిపిస్తోంది. సముద్రంలోని కప్పకు సువిశాల సముద్రం జగత్తుగా తెలియవస్తోంది. ఒకదాని జగత్తు ఏమిటో రెండవది ఒప్పుకోవటంలేదు.

**యథా జనశత స్వప్ననగరాణి ఏకమందిరే ।**
**తథా జగన్తి ఖే భాన్తి నో సన్త్యసన్తి నో ॥**

ఒకే ఇంట్లో పదిమంది సుష్టుగా భోజనం చేసి నిద్రపోతున్నారనుకో! అందులో ఒకనికి తన స్వప్నంలో ఏఏ నగరాలు కనిపిస్తున్నాయో, అవి ప్రక్కనే నిదురలో వేరువేరు కలలుగంటున్న మరొకరికి కనిపించటంలేదు కదా! అట్లాగే ఆకాశంలోని అనేక అసంఖ్యాక జగత్తులు భాసిస్తున్నప్పటికీ ఒక జగత్తులోని వారికి రెండవ జగత్తు కనిపించటం లేదు. ఎవరికి ఏ జగత్తు జాగ్రత్ సత్యంవలె

కనిపిస్తోందో, అది మరొకరికి స్వప్నతుల్యంగాను కూడా అనిపిస్తోంది. ఎందుచేతనంటావా? నీ స్వప్న సమయంలో నీకు కనబడే స్వప్నం నీకు వాస్తవమే అయినప్పటికీ నాకు స్వప్నతుల్యమేకదా! ఇదీ అట్టిదే! చూచావా? ఒకే గదిలో నిదురిస్తున్న అనేకమంది మనుజులు వారి వారికి దర్శనమగుచున్న స్వప్నమును "సత్యమే" అయివుంటున్నట్లు, ఆ ప్రక్కవారికి అది భ్రమయే అయివున్నట్లుగా... ఆకాశంలోగల అనేక బ్రహ్మాండాలన్నీకూడా సత్–అసత్ రూపంగా స్ఫురిస్తున్నాయి. అందుచేత నీకు కనబడే జగత్తును నీవు ఎట్లా దర్శించాలో చెప్పుతాను... విను.

నీకు స్ఫురించే జగత్తు నీకు ద్వితీయం కాదు. అద్వితీయమైనది. అది స్వాత్మ యొక్క అవయవరూపము వంటిది. నిజ చైతన్యము యొక్క చమత్కార మాత్రమైనది.

కనుకనే ఈ కనబడే జగత్తు ఒకనికి సాకారంగాను, మరొకరికి (జ్ఞానికి) నిరాకారంగాను, ఒకనికి కారణరహితంగాను, మరొకరికి కారణసహితంగాను కనిపిస్తోంది. తత్త్వదృష్టిచే ఈ జగత్తంతా కూడా నిరాకారమై, కారణరహితమై వెలయుచున్నది.

**వ్యాధుడు :** అయితే నాకు కనబడే జగత్తు నా జగత్ సంస్కార సంబంధమైనదేనని సిద్ధాంతీకరిస్తున్నారా?

**మహాముని :** అవును! నిర్వివాదంగా, శాస్త్ర స్వానుభవ నిర్ణయంగా – అంతే!

**వ్యాధుడు :** అయితే నా మరొక సందేహం. ఈ జీవులయొక్క జగత్ సంస్కారములు దేహ సంబంధమైనవా? చైతన్య సంబంధమైనవా?

**మహాముని :** ఈ జీవుల జగత్ సంస్కారములు... కేవలము చైతన్యమునందూ లేవు! కేవలము దేహమునందూ లేవు!

**వ్యాధుడు :** మరి?

**మహాముని :** "వానికి అటువంటి బుద్ధి పుట్టింది" అంటూ ఉంటామే! బుద్ధియే దృశ్యాకార పరిణామాన్ని ధరిస్తోంది. అది చిదాభ్యాస వ్యాప్తమై ఉంటోంది. వాస్తవానికి బుద్ధి చిత్స్వభావ యుతమే అయివున్నది. అట్టి బుద్ధియే "జగతు, సంస్కారములు, స్వభావము, ప్రకృతి" ...మొదలైన ఆయా పేర్లతో చెప్పబడుతోంది.

❖

విజ్ఞులు స్వప్నం గురించి బోధించేటప్పుడు "ఇతఃపూర్వం గాంచబడిన పదార్థములను పోలినట్టి సంకల్పిత పదార్థముల అనుభవ స్మృతియే ఆయా అనుభవాల అపూర్వత్వ కారణంగా (ఇప్పుడు జ్ఞాపకానికి రావటం చేత) స్వప్న రూపంలో ప్రదర్శనమౌతోంది"... అని నిర్వచిస్తున్నారు. ఈ జాగ్రత్ స్వప్నం కూడా అట్టిదే! ఈ జాగ్రత్‌లో "మరణం" అనేది ఈ జన్మలోని అనుభవం కాకపోయినప్పటికీ క్రితం జన్మలలో అనుభవమైన విషయమే అయివున్నది. కాబట్టి జీవన్ – మరణాదుల సంస్కారముతో కూడిన స్మృతి రూపబుద్ధియే ఈ స్వప్న మాత్ర జగత్ రూపమును ధరిస్తోందనునది సునిశ్చితమైన విషయమేగాని, ఇప్పుడు నేను క్రొత్తగా చెప్పుచున్నది కాదు. కాబట్టి ప్రతి జీవుని స్వానుభవ జగత్తు కూడా ఆతని స్వకీయ బుద్ధి రూప సందర్శనమే సుమా!

ఈ జాగ్రత్ స్వప్నం సృష్ట్యాదియందు స్వప్నమువలె విజృంభిస్తోంది. చైతన్యములోనుంచే అది బయల్వెడలుతోంది. కాబట్టి జగత్తు చైతన్యము యొక్క నిర్మల ప్రకాశమాత్ర స్వరూపమే! అంతేగాని, ఈ జగత్తు మరింకొకటేదీ కానేకాదు.

❖❖❖

# 16. బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తోంది

**మహాముని :**

**బ్రహ్మైవ భాతి జగత్ ఇత్యుక్తం ఉక్త్యానయా భవేత్ ।**
**న చ భాతం నవమ్ తచ్చ బ్రహ్మైవేదమతః స్థితమ్ ॥**

ఈ జగత్తు రూపంగా బ్రహ్మమే భాసిస్తోంది. ఇంకొక విషయం. ఇది పూర్వం భాసించక ఇప్పుడు క్రొత్తగా భాసించటం లేదు. ఇది అనాది ప్రకాశరూపమైనది. ఇది సర్వదా బ్రహ్మముతోటి ఐక్యము పొందియే ఉన్నది. "జగత్తు అనాదియగు బ్రహ్మమే" అనే దృష్టిని నీవు పెంపొందించుకొని శాస్త్ర వాక్యానుగుణంగా పరిపుష్టం చేసుకో!

ఆ పరమాత్మయే ఈ జగత్తుకు కారణము, కార్యము కూడా! ఎట్లా అంటావా? సామాన్య రూపమగు కారణమే. విశేష రూపమగు కార్యం అగుచున్నది. కార్య సంస్కారాల యొక్క ఆధారభూత మగు బీజరూపమైన కారణమే కార్యరూప సంస్కారములకు అధినేత అయివుంటోంది.

కనుక ఆత్మయే సంస్కార రూపములుగా వెలయుచున్నది. ఈ 'జగత్తు' అనే కార్యమునకు ఆత్మయొక్క సంస్కారములే కారణం. సంస్కారములు ఆత్మకు భిన్నం కాదు. జగత్తు ఆత్మయే! భిన్నం కాదు. కార్యానుకూలమగు "యత్నము"ను 'కృతి' అంటున్నాం. అట్టి కృతి రూపమగు సంస్కారం కూడా (పై పరిశీలనను అనుసరించి) ఆత్మయే అయి ఉన్నది.

❖

స్వప్నంలో ఏఏ జాగ్రత్‌లో చూచినట్టి పదార్థాల, వ్యక్తుల, సంఘటనలకు కొంత సంబంధించినవై కనిపిస్తున్నాయో... (జాగ్రత్ దృష్టాంతంగా కలిగిన వ్యవహారాదులు కనిపిస్తున్నాయో) అవన్నీ ఆ ద్రష్ట యొక్క సూక్ష్మరూప సంస్కార-వాసనాదులే గాని స్వప్నాంతర్గతమైన విశేషాలన్నీ మరింకెక్కడినుంచో వచ్చి అక్కడ చేరటంలేదు. మరింకెవరో ఈ జీవుని కొరకై కల్పించినవేవీ కావు సుమా!

స్వప్న సమయంలో స్వప్న సంస్కారాలు జాగ్రత్తులో లేకుండా పోయాయని అనుకోకూడదు. ఎందుకంటే చిత్తాకాశంలో అనేక సూక్ష్మ సంస్కారాలు సదా విద్యమానమై ఉన్నాయి. వాటిలో కొన్ని మాత్రమే జాగ్రత్తులోను - స్వప్నంలోనూ కూడా అప్పటికి సందర్భానుచితంగా, సాధ్యాసాధ్యానుచితంగా ఒక్కొక్క రోజు ప్రదర్శితమౌతూ ఉన్నాయి. ఆత్మ కేవల సాక్షీరూపంగా అటు స్వప్న సమయంలోనూ ఇటు జాగ్రత్ సమయంలోనూ కూడా ప్రత్యక్షమై ఏర్పడియే ఉన్నది. అద్దాని సమక్షంలో, అద్దానికి అప్రమేయంగా చిత్తాకాశ స్వభావంగా స్వప్న - జాగ్రత్తులు పరిఢవిల్లుచున్నాయి.

వేద – వేదాంత ప్రవచనాలు – ప్రమాణాలు అద్వితీయ సాక్షీరూప బ్రహ్మమును నిరూపిస్తూ వస్తున్నాయి. మనయొక్క కేవల బ్రాహ్మీ స్వరూపము శ్రవణ – మనన – ధారణ – నిధిధ్యాసాది సాధన చతుష్టయం చేత సునిశ్చితమై అనుభవమౌతోంది.

ఆత్మ అనుభవమగుచుండగా ద్వైత సృష్టి / ద్వైత దృష్టి స్వయంగా – వెలుతురు రాగానే చీకటి తొలగిపోయినట్లుగా – తొలగిపోతున్నాయి. అట్టి ఆత్మస్వభావమును నిశ్చయించి అనుభవజ్ఞులగు గురువులు తమ అర్హులైన శిష్యులకు శాస్త్ర ప్రమాణపూర్వకంగా, స్వానుభావపూర్వకంగా సుబోధకం చేస్తూనే వస్తున్నారు. అట్టి ఆత్మజ్ఞులు "ఇది సంసారం – దీని కావల ఆత్మ" .... అని ప్రారంభిస్తూ "సమ్యక్ విచారణచే జగత్తుగా కనిపించేదంతా ఆత్మయే. నీ స్వరూపం ఆత్మయే అయి ఉన్నది. (తత్ త్వమ్ అసి)" అని పార్యాంశం యొక్క పరాకాష్ఠగా సుబోధిస్తున్నారు. వారి ప్రబోధములను అర్థం చేసుకొనియే స్వప్న – జాగ్రత్తుల సాదృశత్వం నీకు బోధిస్తున్నాను సుమా!

**వ్యాధుడు :** స్వామీ! మునీశ్వరా! స్వప్నంలో కనిపించే దృశ్యసంస్కారమంతా జాగ్రత్ వలననే, జాగ్రత్ ఆధారంగా కలిగి ఏర్పడుతోందని కొందరి అభిప్రాయం. స్వప్నం జాగ్రత్తుకంటే భిన్నంగా ఉన్నప్పటికీ అది జాగ్రత్ యొక్క అభాసమాత్రమేనని, జాగ్రత్ యొక్క అనుభవమే స్వప్నానుభవా లన్నిటికీ ఆధారమని, కనుక జాగ్రత్ స్వప్నముకంటే విశిష్టమైనదనీ, "జాగ్రత్తు సత్యం – స్వప్నం మిథ్య" అని వారు అభిప్రాయం కలిగియుండి వాదిస్తున్నారు. అది సరైన అభిప్రాయమేనంటారా?

**మహాముని :** అది సరి కాదని మా స్వానుభవపూర్వక అనుభవం. వాయువులో చలనం అంతర్గతమై ఉన్నట్లు చిత్తములో సూక్ష్మ సంస్కారాలు అంతర్లీనమై ఉండి జాగ్రత్ – స్వప్నాలలో ఆయా అనుభవ – అనుభూతులుగా ప్రదర్శితమౌతున్నాయి. అంతకుమించి జాగ్రత్ సంస్కారాలకు వేరే కర్తృత్వం ఏముంది చెప్పు? ఒకే చిన్మాత్రము స్వప్నంలో లక్షలాది రూపములను దాల్చుచున్నది. ఆ లక్షల రూపధారి యగు స్వప్నమే సుషుప్తిగా శేషిస్తోంది. జాగ్రత్ స్వప్నంగా, స్వప్నమే సుషుప్తిగా, సుషుప్తియే జాగ్రత్ రూపంగా పరిణమిస్తున్నాయి. చిదాకాశమున ఏర్పడివున్న స్వప్నమే జగత్తుగా చెప్పబడు తోంది. సుషుప్తి జగత్తు యొక్క ప్రళయదశగా చెప్పబడుతోంది. అందుచేత ఆ మూడింటిలో సమానత్వమే (సమాన న్యాయమే) సత్యమైయున్నది.

**ఏకమేవ చిదాకాశం సాకారత్వమనేకకమ్ ।**
**స్వరూపమజహద్ధత్తే యత్స్వప్న ఇవ తజ్జగత్ ॥**

చిదాకాశంలోని స్వప్నసంవిత్తు జగత్తు అని, సుషుప్తి అని, ప్రళయము అని అనేక రూపములు ధరించటమే 'జగత్తు'గా ప్రసిద్ధమై ఉన్నది. చైతన్య పరమాణువులో వర్తిస్తున్న ఈ విశాల రూప జగత్తు... దర్పణంలో ప్రతిబింబాలు దర్పణరూపమే అయినట్లు... ఆత్మయే అయివున్నది. పరమ సూక్ష్మం, వ్యాప్తం, కాలతః మొదలు–చివర లేని చిదాకాశం యొక్క స్ఫురణయే ఈ జగత్తు.

**తస్మాత్ యత్ర చిదాకాశమ్ అనన్తం సతతమ్ స్థితమ్ ।**
**తత్ర అస్తీతి జగద్భానం తదంగానన్యరూపి యత్ ॥**

నీ అరచేయి దేహములోని విభాగమే అయి నీవెక్కడుంటే అక్కడ అది ఉండటం కొనసాగుతోంది కదా! అట్లాగే ఎక్కడ అనంతం, సద్రూపం, వ్యాప్తం అయినట్టి చిదాకాశం ఉందో, అచట అద్దాని దేహాంగం వలె అద్దాని కంటే వేరుకానట్టి (దానికి అనన్యమైనట్టి) జగత్తు యొక్క స్ఫురణ ఉంటోంది.

జగత్తు చిన్మాత్రమే! "నీవు – నేను సమస్తము చిన్మయమే" అను శాస్త్రోక్తిని అభ్యసిస్తూ ఉండగా ఈ జగత్తు చిన్మాత్రం యొక్క ఉదరమున ప్రవేశిస్తోంది.

ఓ వ్యాధుడా! "ఈ జగత్తు నా చిన్మయదేహం యొక్క ఉదరముననే ఉన్నది. కాబట్టి నాకు అనన్యం"...అనే భావాభ్యాసం చేత నీ మనస్సు స్థూలత్వం త్యజించి జనన మరణ రహితమగు చిద్రూపం సంతరించుకోగలదు.

ఓ సాధూ! "నా స్వరూపం పరమసూక్ష్మమైనట్టి ఆత్మయే అయివున్నది. ఆత్మ స్వరూపుడనైన నేనే సమస్త జగదాకారంగా కూడా వెలయుచున్నాను. ఆత్మగా సర్వత్రా స్థితి కలిగియున్నాను. పరమాణువునందు కూడా చైతన్యరూపంగా వెల్లివిరిసి ఉన్నాను. చిదాకాశ రూపంగా పరమాణువు నందు ఎంతగా ఇమిడి ఉన్నానో... అంతగానూ ఈ విశాల జగదాకారంగా కూడా స్థితి కలిగియున్నాను. నేనెక్కడుంటే నా దేహ విభాగంగా ఈ ముల్లోకాలూ అక్కడే ఉంటాయి. జలం జలంలో కలిసిపోతున్నట్లు చైతన్య రూపుడనగు నేను చైతన్య రూపమగు బ్రహ్మముతో ఐక్యము పొందియే ఉన్నాను." ఇదియే మా యొక్క ఆత్మయోగాభ్యాసమైయున్నది.

❖

ఓ వ్యాధుడా! ఏ ప్రాణి యొక్క హృదయకోశంలో మరల ప్రవేశించే కార్యక్రమంలో ఉన్నానో ...తిరిగి ఆ సంఘటనను వర్ణించటం కొనసాగిస్తున్నాను. విను.

❖

అభ్యంతరమున ముల్లోకాలు ధరించి ఉన్నట్టి నేను అప్పుడు ఆ ప్రాణి యొక్క తేజంలో ప్రవేశించి, ఆతని వాసనామయమగు జగత్తు యొక్క అనుభవరూపం వలె ఆతని తేజస్సులో ఏర్పడి ఉండటం జరిగింది. అచ్చట నా ఆత్మయందే సర్వుల యొక్క స్వర్గ, మర్త్య, పాతాళాలు భాసించాయి.

ఓ మిత్రమా! 'జగత్తు' అనబడేది బాహ్యమున కొంచెం కూడా లేదు. ఆత్మకు బాహ్యమేమిటి? అంతరమేమిటి? స్వప్నంలోగాని, జగత్తులోకాని – అభ్యంతరమున గాని ఏఏ దృశ్య జగత్తు కనిపిస్తోందో ...అదంతా కూడా నిజచైతన్య స్ఫురణ మాత్రమే కదా!

ఈ జీవునకు స్వప్నావస్థలో ఏ స్వప్నమయ జగత్తు భాసిస్తోందో... అది చిద్రూపము యొక్క విన్యాసమే! చిద్రూపాను స్వరూపుడగు ఆతని స్వప్న చైతన్య చమత్కారమే!

**వ్యాధుడు** : స్వామీ! మునీంద్రా! ఈ సృష్టి అకారణమా? సకారణమా? ఎందుకంటే ఇదంతా కూడా కొంతవరకు సకారణంగాను, మరికొంతవరకు ఎవరూ కారణం కానట్లూ అనిపిస్తోంది.

ఇది కారణ రహితమైతే దీని ప్రసిద్ధి ఎట్లా ఎర్పడి ఉంటోంది? కారణసహితమైతే... దీనికంతటికీ కారణం ఎవరు?

ఇది సకారణమందామా... వస్తువుకు వస్తుధర్మాలు ఏర్పడటానికి కారణమేమిటి? ఎవరు? ఈ ప్రశ్నకు సమాధానం లభించటం లేదు. (ఉదా : కారం నాలుకపై మంట కలిగిస్తుంది. నాలుక మండటానికి కారణం కారం కావచ్చు. కానీ, కారానికి (ఘాటు ధర్మానికి) ఏదని, ఎవరని కారణం చెపుతాం?) స్వప్నంలో "కుమ్మరి, మట్టి, కుండలు తయారుచేసే ప్రక్రియ" ...ఈ మూడు లేకుండానే కుండకు సంబంధించిన అనుభవం కలుగుతోంది. ఆ విధంగా అనుభవం సిద్ధిస్తోంది. జాగ్రత్తులో వస్తువులు భౌతికంగా ఉండి అనుభవాలన్నింటికీ కారణమౌతున్నాయి. కనుక "ఈ సృష్టి అకారణమా? సకారణమా?" అనే ప్రశ్నకు సందేహ నివృత్తి కలగటం లేదు.

**మహాముని :** ఓ వ్యాధుడా! బ్రహ్మము నిత్య నిర్మలం. విషయ శూన్యం. అద్దానియందు మొట్టమొదట అకారణంగానే "సృష్టి" అనబడే భావన ప్రవర్తిల్లుతోంది. ఇక ఆపై సమస్త కారణములు "భావము" నుండియే బయల్వెడలుచున్నాయి. అభావము నందు కూడా చిదాకాశము సర్వదా అప్రకటిత సృష్టిశక్తి సమన్వితమై స్వభావ సిద్ధంగా ఉంటోంది. ఇక జగత్తులో కనిపించే పదార్థములన్నీ కూడా పంచభూత నిర్మితం మాత్రమే కదా! పంచభూతముల శక్తి యొక్క ప్రదర్శనమే! శక్తి బ్రహ్మము యొక్క స్వభావసిద్ధ విలాసమే! ఈ విధంగా అనేక పదార్థ - రూపాదులుగా కనిపించే ఈ జగత్ సృష్టి భావానుగతంగా మాత్రమే ఉన్నది. అభావదృష్టికి ఇవన్నీ లేవు. జగత్తులోని స్థూల పదార్థములు (శక్తి యొక్క వివిధ ప్రదర్శనములే కాబట్టి) లేవని మనం అనుకొన్న తరువాత, ఇక ప్రాతిభాసిక సృష్టియొక్క అనుభవం "మిథ్యా భూతమే!" అనటానికి వెనుకాడవలసినదేమున్నది? అద్దానికి సకారణమైన నియమమంటూ ఏదీ లేదు.

కనుక ఓ సాధూ! వ్యాధుడా! లుబ్ధకా! బోయవాడా! బ్రహ్మము సర్వదా ఆద్యంతరహితము. "సృష్ట్యాది" అనే పదానికి అర్థము అదే! నిత్య ప్రకాశము - నిత్య ప్రకాశకము కూడా! అదియే ... తన యొక్క చిత్ స్వభావముచే ఇట్లు "జగద్రూపం"గా భాసిస్తోంది.

❖

కనుక ఈ విధంగా 'సృష్టి' అనబడేది బ్రహ్మమునకు వేరుగా అసంభవం. బ్రహ్మ రూపమగు 'జగత్' అనబడే ప్రతిబింబ చైతన్యమున ... "నిత్యము, నాశరహితము" అగు ఆత్మ ఔపాధికంగా అవయవరూపంచే... ఏకమైనప్పటికీ అనేకంగానూ, బ్రహ్మమే అయినప్పటికీ అబ్రహ్మరూపంగానూ, నిరాకారమైనప్పటికీ సాకారంగానూ, కాలనియతికి లోబడినట్లు స్ఫురిస్తోంది. నిరాకారమగు బ్రహ్మమే చిద్రూపత్వం వల్ల ప్రకాశమానమైన శరీరం కలిగి సాకారమువలె అయి - భాసమానరూపముతో వెలయుచు, దేవర్షి, ముని, మానవ, జంతు దేహాదులతో చెన్నొందుచున్నది.

ఈ స్థావర-జంగమ జగత్తును, క్రమంగా అద్దాని 'నియతి'ని శాస్త్రీయ విధి-నిషేధాలను, దేశ-కాల-క్రియాదులను తనకు తానే తనకు అనన్యంగా నిర్మించుకుంటోందని... తేలుతోంది.

ఇక్కడ కనిపించే భావ, అభావ, గ్రహణ, త్యాగ, స్థూల, సూక్ష్మ, చర, అచరాది - సమస్త పదార్థములు ఏదో కారణము కలిగి ఉండి కార్యరూపంగా తయారై ఉన్నాయి. అందుచేత వాటిలో

మార్పు–చేర్పులు కనబడుచున్నాయి. వాటి 'నియతి' యొక్క వ్యభిచారము మాత్రము ఎన్నటికీ సంభవించకయే ఉంటోంది. ఆ 'నియతి' యొక్క కల్పనకు తదనంతరం మాత్రం ఇక ఏ 'కారణం' లేకుండా ఏ పదార్థము యొక్క ఉత్పత్తి కూడా సంభవించదు.

1. అద్దాని 'భోక్త'యగు జీవుడు, 2. నియతి... ఈ రెండూ కూడా బ్రహ్మము యొక్క రెండు స్వయంకృతమైన అంగములవలె ప్రవృత్తములౌతూ ఉంటున్నాయి. "బ్రహ్మము తన అంగముచే మరొక అంగమనతగు నియతిని కొనసాగిస్తోంది. అద్దానిని అనుసరించే జాగ్రత్ – స్వప్నరూపదృష్టి, బుద్ధి మొదలైనవి (జలంలో తరంగాలు కాకతాళీయంగా ఉంటున్నట్లు) ఏర్పడి ప్రవర్తిస్తున్నాయి.

**వ్యాధుడు :** 'నియతి' అనగా ఏమిటి? అది ఎట్లా ప్రవర్తిల్లుతోంది?

**మహాముని :** ఒకదానికి మరొకటి కారణంగా ఉండటమే నియతి. కారణకృతంగా ఏర్పడిన కార్యం యొక్క ఆకార – రచన – లక్షణ విశేషమే నియతి. మట్టి కారణం, కుండ కార్యం. మట్టి కుండ రూపంలోనో, (లేక) ముద్ద ఆకారంగానో (లేక) చూర్ణం ఆకారంగానో, ఏదో ఒక ఆకారం కలిగియే ఉంటుంది కదా! వాస్తవానికి మట్టికి 'ఇది' అనబడే ఆకారం ఏదీ లేదు. అట్లాగే బ్రహ్మం అట్టి సంవిశేష నియతి లేకుండా ఉండజాలదు. "మట్టికి ఏదో ఒక ఆకారం కనబడుచున్నప్పటికీ వాస్తవానికి నిరాకారం. అట్లాగే బ్రహ్మము నియతిని అవధరిస్తున్నప్పటికీ వాస్తవానికి అనియతము, అప్రమేయము" అను అవగాహన మోక్ష స్థితి పొందిన ద్రష్టకు అత్యంత సులభంగా కరతలామలకమౌతోంది.

❖

ఈ విధంగా 'నియతి'కి ముందు ఆత్మ (చిత్ చైతన్యం) సర్వదా తేజోమానమై వెలుగొందుచున్నది. అయితే నియతి యొక్క కల్పనానంతరం మాత్రం... ఏ జీవునికి ఏ సమయము నుండి ఏ సృష్టిని గూర్చిన నియతి ప్రవృత్తమగునో... ఆ జీవునకు ఆ సమయము నుండియే ఆ దృశ్య మండలమంతా సదా కారణ సహితమై ఉన్నదగుచున్నది. ఆ నియతి మరొకరికి సంబంధించినది కాదు. కాలాంతర మైనది కాదు. భావికాల పదార్థములకు సంబంధించినది కాదు. ద్రష్ట యొక్క పదార్థ దృష్టియే ఆతనికి నియతి రూపంగా ప్రాప్తిస్తోంది.

బ్రహ్మము కారణరహితం. కారణ రహితమగు బ్రహ్మము అజ్ఞానికి సృష్టిరూపంగా భాసిస్తోంది. ఎవరికి బ్రహ్మము సృష్టిరూపంగా భాసిస్తోందో... వారికి మాత్రమే కార్య–కారణాలకు సంబంధించిన భ్రమ భాసిస్తోంది.

**ఈ సృష్టి కాకతాళీయం -** వివేకి యొక్క దృష్టిలో ఈ సృష్టి కాకతాళీయం. అనగా, ఒక కాకి తాటిచెట్టుపై వ్రాలగా, నేలజారిన తాటిపండు ఒకానొక నక్కను గాయపరచటానికి కారణం?... 1.కాకి 2.మండుటెండ 3.తాలవృక్షం 4.తాటిపండు 5.నక్క 6.మండుటెండకు అలసిపోయి నక్క తాటిచెట్టు క్రింద జేరటం 7.తాటిపండు నేలవ్రాలటం... ఈ విధంగా వేరువేరు కారణాలు పరస్పర అసంబంధమైనవి ఉన్నాయని చెప్పవచ్చు. ఏ ఒక్కటైనా కారణమని చెప్పనూవచ్చు. నక్కకు తాటిపండు వల్ల గాయం కావటమనేది అకారణం అని చెప్పవచ్చు. అట్లాగే ఈ సృష్టికి కారణమేదీలేదు.

ద్రష్ట యొక్క నియతిని స్వీకరించిన దృష్టి యొక్క ప్రదర్శనా చమత్కారమే సృష్టి. కుండ తయారవటానికి మట్టే కారణం అనీ అనవచ్చు. మట్టి దేనికీ కారణం కాదు. కనుక కుండ అకారణం... అనీ అనవచ్చు. కుమ్మరి మట్టి యొక్క ధర్మమును ఉపయోగించి కుండను చేశాడు. కాబట్టి కుండకు కారణం 'కుమ్మరి' అనవచ్చు. మట్టిలో 'కుండ' అనే ధర్మం ఉండబట్టే కుండ తయారు కాగలిగింది. అయితే కుండ అనబడేది ఆకార వికారమే! కనుక కుండ అనబడేదేలేదు. మట్టియే సర్వదా ఉన్నది... అని అనవచ్చు.

అట్లాగే ఈ సృష్టి కాకతాళీయం! ఇక సృష్టిలో కనిపించే నియతి ఏమిటి?" అని ప్రశ్నిస్తే "అజ్ఞాన చిత్ చైతన్యము యొక్క దర్శనాచమత్కారమే నియతి" అనికూడా చెప్పబడుతోంది.

**వ్యాధుడు :** స్వామీ! ఈ సృష్టిలో కనిపించే నియతి 'దృష్టి' యొక్క సారూప్యమేనని మీరు చెప్పుచున్నట్లు నా కనిపిస్తోంది. అయితే ఒక మామిడి వృక్షం నుండి మామిడి పండే ఉద్భవిస్తోందిగాని, సపోటా పండు ఉత్పన్నమవటం లేదే! మానవునకు మానవుడే జనిస్తున్నాడుగాని, మానవునకు పెద్దపులి జనించటం లేదు కదా! ఉత్పన్నము లగుచున్న సర్వపదార్థములకు పూర్వ-పరా క్రమమును పరిశీలిస్తే సకారణత్వమే కనిపిస్తోంది గాని, అకారణం కాదే! మరి మీరు "సృష్టి కాకతాళీయం, అకారణం" ...అని ఎలా చెప్పుచున్నారు?

**మహాముని :** సృష్టిలో కనబడే పదార్థాలు పూర్వాపర విమర్శచే ఎకారణములే కదా అని అంటావా? అయితే జాగ్రత్ స్వప్నములు సకారణమే అయి ఉండాలి కదా! ఇప్పుడు నా ప్రశ్నకు కొంచెం యోచించి సమాధానం చెప్పు.

స్వప్నంలో కనబడే పదార్థాలకు కారణమేమిటి? స్వప్నం తరువాత సుషుప్తి ఏ కారణంచేత ఏర్పడుతోంది? స్వప్న సుషుప్తుల తరువాత జాగ్రత్ ప్రపంచపు యావృత్తి ఏర్పడటానికి గల కారణమేమిటి? జాగ్రత్ - సుషుప్తుల అనంతరం స్వప్న ప్రపంచపు యావృత్తి ఎందుకు ఏర్పడుతోంది?

ఇంకా... నేను ఆ ప్రాణియొక్క హృదయ తేజములో ప్రవేశించి ఆ స్వప్న భూతలంలో జల సంక్షోభంతో గూడిన ప్రళయం నాకు కనబడటానికి నీకేదైనా కారణం కనబడుతోందా?

లేక శ్రుతులు ఎక్కడన్నా "జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో కనబడే జగత్తులకు కారణం ఇది" అని ఎక్కడైనా ప్రమాణంగా చెప్పుచున్నాయా? - లేక ఈ జగత్తుకు నీకేమైనా కారణం కనిపిస్తోందా?

లేదు. కనుక స్వప్నంలో కనిపించే జగత్తుకు ద్రష్టయొక్క వ్యావృత్తియే కారణమగుచున్నట్లు, జాగ్రత్ ద్రష్టకు జాగ్రత్ జగత్ వ్యావృత్తియే జాగ్రత్ జగత్తుకు కారణం కావచ్చునుగాని, మరింకే కారణం నిర్ధారించలేము.

వేదోపనిషత్తులు "ఏకమ్ అద్వితీయం బ్రహ్మ. బ్రహ్మమునకు వేరైనదేదీలేదు" అని పునః పునః ఉద్ఘాటిస్తున్నాయి. బుద్ధిమంతులు బ్రహ్మంతోటి ప్రపంచం యొక్క ఐక్యత ప్రతిపాదించే యుక్తులు ఆశ్రయించి వివేక దృష్టిని సముపార్జించుకుంటున్నారు. స్ఫటికంలో దృశ్యం ఉన్నట్లు ఆత్మయందే జగత్తు ప్రతిభాసిస్తోందని సిద్ధాంత-సోదాహరణపూర్వకంగా విజ్ఞులు గమనించి ప్రవచిస్తూనే ఉన్నారు.

కాబట్టి ఓ వ్యాధుడా! నీవు శాస్త్రానుసారమగు యుక్తియొక్క ఆశ్రయముచే ఈ జగత్తును ఆత్మ స్వరూపంగా ఎరుగుము.

శాస్త్రానుసారంగా యుక్తిచే "ఈ జగత్తు నా భావనా మాత్రమేగాని భౌతిక మాత్రం కాదు" ...అనేదే సర్వతత్త్వ నిర్ణయముల అంతిమసారం. సర్వవేద – వేదాంత సిద్ధాంతముల ఉత్కృష్టమగు అంతిమ నిర్ణయం. ఇక మధ్యే నిర్ణయమంటావా? సమష్టి కర్తయగు హిరణ్యగర్భుని మానసిక నిర్ణయ చమత్కారమే ఇక్కడ 'విధి' అని, "నియతి" అని ఆయా రూపాలుగా పరిఢవిల్లుతోంది.

ఈ జగత్తు పదార్థమయం కాదు. కార్యకారణమయం కాదు. అకారణమగు బ్రహ్మమే దృష్టియొక్క "అవిజ్ఞత" చేత 'ప్రపంచం'గా అగుపిస్తోంది. ఇదియే సర్వోత్కృష్టమైన శాస్త్ర ప్రమాణపూర్వక అంతిమ నిర్ణయం. ఇందులో సందేహానికి తావేలేదు. ఇక తదితరమైన 'నియతి' యొక్క పరిశోధనంతా "అనిర్వచనీయం" ...అనే స్థానానికే చేరటం జరుగుతోంది.

ఇక అజ్ఞులు పొందుచున్నట్టి భౌతిక ప్రపంచమునకు సంబంధించిన పుంఖానుపుంఖములైన అనుభవ పరంపరలంటావా? మనకు విజ్ఞుల – పారదర్శకుల – వేదవేదాంతముల ప్రవచనం ప్రమాణంగాని, ఇంద్రియ దృష్టికి పరిమితమైన అనుభవాలు ప్రమాణం కావని నా మనవి.

❖❖❖

# 17. జాగ్రత్ - స్వప్న - సుషుప్తి అనుభవములు

**వ్యాధుడు (లుబ్ధకుడు) :** మహాత్మా! ఈ జీవుడు జాగ్రత్తులో ఈ జాగ్రత్ జగత్తును గాంచుచున్నాడు. నిదురించుచూ స్వప్నలోకాలలో అనేక విధములైన భీతి–ఉత్సాహ–ప్రియ–అప్రియ–సుఖ–దుఃఖ సంబంధములైన స్వప్న దృశ్య పరంపరలు వివిధ రీతులుగా పొందుచున్నాడు. 'సుషుప్తి' యందు (జాగ్రత్–స్వప్నానుభవముల దృష్ట్యా) అనుభవరహితుడై తనను తానే ఎరుగని స్థితి పొంది ఉంటున్నాడు. ఇవన్నీ ఈ శరీరానికి ఎట్లా ఏర్పడుచున్నాయి? వీటిని ఎవరు కల్పిస్తున్నారు? జాగ్రత్ –స్వప్న–సుషుప్తులలో మొదలేది? చివర ఏది? ఏది సత్యం? ఏది భ్రమ? చిత్ర విచిత్ర మధుర–భీకర దృశ్యాలు స్వప్నంలో ఎట్లా ఏర్పడుచున్నాయి? ఇవన్నీ చూస్తున్న జీవునికి – జాగ్రత్ స్వప్న సుషుప్త దృశ్యాలకు గల సంబంధమేమిటి? ఈ జీవుడు ఎవడు? ఎక్కడి నుండి వచ్చి ఇక్కడ ఇదంతా పొందుచున్నాడు? ఈ విషయాలు విశదపరచండి.

**మహాముని :** ఈ జీవుడు "ఇంద్రియములు" తనకు అనన్యమైన విభాగంగా ధరించి ఉంటున్నాడు. ఇంద్రియాలు రెండు విభాగాలుగా ఉన్నాయి– 1.బాహ్యేంద్రియాలు, 2. అంతరింద్రియాలు

బాహ్యేంద్రియములచే బాహ్య స్వప్నమును, అంతరింద్రియములచే అంతఃస్వప్నమును ఎరుగుచున్నాడు. అనగా, ఆతని 'ఎరుక' అనే ధారణ యొక్క అవయవములు – అని అనతగు ఇంద్రియములు బాహ్య – అభ్యంతరములలో బాహ్య – అభ్యంతర జగత్తులను ఆతనికి అనుభూతం చేస్తున్నాయి.

**జాగ్రత్ -** ఎప్పుడైతే ఆతని ఇంద్రియాలు బాహ్యావ్యవహార నిమగ్నమై ఉంటాయో... అప్పుడు ఆ జీవుడు సంకల్పిత పదార్థములను స్పష్టమైన అనుభవంతో కూడి అనుభవించటం జరుగుతోంది.

**స్వప్నం -** ఎప్పుడు ఇంద్రియములు అంతర్ముఖమౌతాయో అప్పుడు అతి సూక్ష్మమైన జగత్తును కూడా స్థూలంగా తన దేహమునందే సుస్పష్టంగా దర్శిస్తున్నాడు.

❖

ఓ వ్యాధుడా! వాస్తవానికి బాహ్యజగత్తుగాని, అంతర్ జగత్తుగాని కొంచెం కూడా స్థూలం కాదు. మరి?... ఈ జీవుని యొక్క స్వచిత్ దేహంలో ఒకానొక సూక్ష్మ దృష్టి మహాంగం వలె ఏర్పడి ఉన్నది. అట్టి సూక్ష్మ దృష్టియొక్క కరణాలే ఈ ఇంద్రియాలు. అట్టి సూక్ష్మేంద్రియాల స్థూలకల్పనయే ఈ స్థూల జగత్తు. స్వప్నం చూచే స్వప్నేంద్రియ విభాగములకు స్వప్నం స్థూలంగానే అగుపిస్తోంది.

**జీవుని సూక్ష్మ శరీరం -** పంచ జ్ఞానేంద్రియాలు (త్వక్, చక్షు, శోత్ర, జిహ్వా , ఘ్రాణములు); పంచ కర్మేంద్రియాలు (హస్తపాదాలు, నోరు, ముక్కు, ఉపస్థ, గుదము); ఇచ్ఛాప్రధానమైన అంతః కరణ చతుష్టయం (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారం); పంచప్రాణాలు (ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు)... వీటన్నిటి సంఘాతరూపమగు సూక్ష్మ శరీరమే ...చిద్రూపుడగు ఈ జీవుడు. ఇది ఇట్లా ఉండగా నాశరహితము, కూటస్థము అగు చిదాకాశమే ఈతని రూపం. భావనాశరీరంచే ఈతడు 'చిదాభాసుడు' అని చెప్పబడుచున్నాడు. అయితే, చిదాకాశ రూపుడే అయివుండటం చేత ఈతడు సమస్త ఆకాశ రూపమును పొంది సర్వత్రా సర్వేంద్రియమయమై ఒప్పుచున్నాడు. ఈతడు చూచే జగత్తు నిజవాసనామయ చమత్కారమేగాని, మరింకొకటిదేదీ కాదు. మరొకరు ఆతని కొరకై కల్పించింది కూడా కాదు.

**స్వప్నానుభవం -** ఇప్పుడు స్వప్నానుభవ చమత్కారం ఎట్లా అనుభూతమౌతోందో వివరించి చెప్పుతాను, విను.

అనేక విషయముల సంఘాతమే (చిదాభాసమే) స్వరూపముగా గల ఈ జీవుడు దైనందినంగా ఒక సమయంలో బాహ్యేంద్రియ వ్యాపార రహితుడగుచున్నాడు. అప్పుడు బాహ్యేంద్రియములైన కళ్ళు, చెవులు, చర్మము మొదలైన వాటి నుండి ఉపశమించినట్టి ధ్యాస బాహ్యేంద్రియ వ్యాపార రాహిత్యం చేత సూక్ష్మములగు నాడులలో ప్రవేశిస్తున్నది.

**అన్నరస పరిపూర్ణత్వం -** అప్పుడాతడు శ్లేష్మరూపమగు అన్నరసముచే పరిపూర్ణుడై సూక్ష్మములగు నాడులలో ప్రవేశం పొందుచున్నాడు. అట్టి సూక్ష్మనాడులలో ఆతని అనుభవం ఎట్లా ఉంటుందంటే... క్షీర సాగరంలో ఎగురుచున్నట్లు, చంద్ర సహితమగు ఆకాశం చూస్తున్నట్లు, ఉద్యానవనాలలో సంచరిస్తున్నట్లు, ఉత్సవాలలో క్రీడిస్తున్నట్లు, స్త్రీ, పురుష సందోహం చూస్తున్నట్లు, అనేక పుష్పభరిత వనాలలో సువాసనలు అనుభవిస్తున్నట్లు, నదీ ప్రవాహాలలో గంతులేస్తూ సాగుతున్నట్లు, మంచుకొండలలో విహరిస్తున్నట్లు, అనేక బాటసారులతో కూడి పయనిస్తున్నట్లు, నగరాలు – ఉద్యానవనాలలో సంచరిస్తున్నట్లు, రాజసభలలో, బంధువుల గృహాలలో తానున్నట్లు,

మేఘావృతమైన ప్రదేశాలలోను, కొండలపైన చిక్కిపోయినట్లు... ఈ విధంగా తన దేహము యొక్క సూక్ష్మనాడులలో సంచరిస్తూ తనయందు తానే అవన్నీ గాంచుచున్నాడు.

**పిత్తరస పరిపూర్ణం -** నాడులు పిత్తరసంలో పరిపూర్ణమౌతూ ఉంటాయి. ఈ జీవుడు బాహ్య ఇంద్రియ వ్యాపార రహితుడైనప్పుడు హృదయస్థ తేజమున సూక్ష్మరూపం దాల్చి ఉన్నవాడై తానే పిత్తరసం యొక్క దేహాంతర్గత ధర్మములను దర్శిస్తూ మరికొన్ని స్వప్న భ్రమలు గాంచుచున్నాడు ... వాయువుచే తాను కదల్చబడి గాలిలో సంచరిస్తున్నట్లు, జ్వాలా సమూహాలను దర్శిస్తున్నట్లు, వృక్ష –లతల మధ్య విహరిస్తున్నట్లు, ఇది వరకు తాను చూడని – ఇది వరకు చూచిన ఏవేవో ప్రదేశాలలో సంచరిస్తున్నట్లు, మేఘాలు అగ్నిని వర్షిస్తున్నట్లు, సంతప్తములైన సరస్సులను ...ఇట్లా తనయందు తానే అనేక చిత్ర విచిత్ర సన్నివేశాలను దర్శిస్తున్నాడు.

**వాత (వాయు) పరిపూర్ణం -** నాడులు వాయువుతో పరిపూర్ణమైనప్పుడు సూక్ష్మరూపుడగు జీవుడు తాను వాతము (వాయువు)చే పరిపూర్ణమైన తన హృదయ తేజమునందు మరికొంత విశేషంగా దర్శిస్తున్నాడు. ఆతని బుద్ధి వాయువుచే సంక్షుబ్ధం అవటంచేత, ఇతఃపూర్వమునకు విలక్షణమైనట్టి గ్రామ–పట్టణ–ప్రదేశాదులను తన తేజమునందే గాంచుచున్నాడు.

శిలలు ఎగురుచున్నట్లు, తాను గరుడ – మేఘ – హంసాది వాహనములను ఎక్కుచున్నట్లు, భయముచే జనులు పరుగులు తీస్తున్నట్లు, ఏదో అంధకారమయమైన గుంటలో పడి చిక్కుకున్నట్లు, పర్వతాలు అధిరోహించి లోకాలు చూస్తున్నట్లు... ఈ విధంగా అనేక భ్రమలను పొందుచూ స్వప్నదర్శనం చేస్తున్నాడు.

ఒక్కొక్కప్పుడు వాత–పిత్త–శ్లేష్మములు మూడింటిచే పరిపూర్ణమైన సూక్ష్మనాడులలో ప్రవేశిస్తున్నప్పుడు... పర్వతములు వర్షంలా ఆకాశమునుండి నేలకూలుచున్నట్లు, 'శిలా వర్షం' అనే సంకటం వచ్చి పడుచున్నట్లు, వృక్ష సమూహాలు అగ్నికి ఆహుతి అగుచున్నట్లు, గుహమధ్యంలో అకస్మాత్తుగా ఘంఘమ భోంకార – మహాఘర్ఘర శబ్దాలు భయానకంగా ఉద్భవిస్తున్నట్లు, మహావృక్షాలు సంఘట్టమగుచు అగ్నిజ్వాలలు ఉదయింపజేస్తున్నట్లు, భీకరాకారంగల క్రౌంచ పక్షులు క్రేంకార కర్కశ శబ్దములు చేస్తున్నట్లు వినిపిస్తోంది. కొండలు కటకటా శబ్దాలతో భిన్నమగుచున్నట్లనిపిస్తుంది. యుగాంతంలో యుద్ధవీరులు ఒకరినొకరు సంహరించుకోవటానికి సిద్ధమౌతున్న పాదఘట్ట ధ్వనులు వినిపిస్తూ ఉంటాయి.

❖

చూచావా వ్యాధుడా! ఈ ప్రకారంగా వాత, పిత్త, శ్లేష్మ, ములచే సూక్ష్మనాడులు నిండి ఉండగా జీవుడు అంతరింద్రియములతో ప్రయాణించి వాయువులచే ఆవృతుడై జడునివలె పరిపీడితుడై ఉంటున్నాడు. మట్టిలో పురుగులాగా, రాతిలో కప్పవలె, గర్భంలో ఉన్న అపరిపక్వ శిశువులాగా, ఫలములోని బీజంలాగా, బీజంలో అంకురంలాగా, పదార్థమున అణువులాగా, కొయ్య స్తంభమున బొమ్మలాగా తన శరీరములోనే తాను ఉన్నవాడై నాడులలోని శబ్ద – రూప – జలాకారాదులను చూస్తూ తన ఊహను జోడించి అనేక స్వప్నానుభవములు పొందటం జరుగుతోంది.

**సుషుప్తి -** ఈ జీవుడు బాహ్యేంద్రియ వ్యాపారం విరమించి అంతరింద్రియ వ్యాపార రూపంగా సూక్ష్మనాడులలో సంచరిస్తూ వాత – పిత్త – కఫములను దేహముగా ఆశ్రయించి అనేక రకములైన స్వప్న దృశ్యములను తన భావనాదేహంలో పొంది అనుభవిస్తున్నాడని అనుకున్నాం కదా!

ఆతడు సూక్ష్మనాడులలో సంచరిస్తూ నాడీ పంజరమున సూర్యభాగమునందలి అస్తుల అగ్రభాగంచే ఘటితమై ఉండే హృదయమునకు సంబంధించిన అస్థి (బొమిక విభాగము)ని సమీపిస్తున్నాడు. అక్కడ సూక్ష్మనాడుల మార్గం ముగుస్తోంది. అక్కడి నుండి బొమికలలోనికి సంచరించటానికి రంధ్రమార్గమే ఉండదు. అక్కడ ప్రాణవాయు చలనము లేనివాడై ఉంటాడు. ఆతని చిత్తము ప్రయాణ నిరోధక కారణంగా వ్యాపార సమర్థమై ఉండదు. హృదయ తేజానికి శిలా మధ్యభాగమువంటి గాఢమైన అజ్ఞాన అంధకూపంలో (చీకటి నూతిలో) ప్రవేశిస్తాడు. ఆతడు అప్పుడు పొందుచున్న స్థితియే సుషుప్తి. ఆ హృదయకోశ స్థానం బొమికలచే కప్పబడిన గూడువలె ఏర్పడివున్న ప్రదేశము 'పురీతతి' అనే పేరుచే పిలువబడుతోంది.

ఆ జీవుడు ఆ 'పురీతతి'ని సమీపించి అక్కడే జడస్థితిలో తనలో తానే నిర్విషయ, నిర్భేద స్థితిలో ఉంటున్నాడు. భుజించిన ఆహారం పరిపాకంచే పరిణామం పొందగా అన్నరసజనితమగు మార్గనిరోధం తొలగటంచే ఆ జీవుడు మరొకప్పుడు సుషుప్త స్థితినుండి బయల్వెడలుచున్నాడు. అన్నరసజనితమగు మార్గనిరోధం తొలగుటచే అవకాశయుక్తమైన మార్గం తెరువబడుతోంది.

అప్పుడా జీవుడు నిర్విషయ–జడరూపమగు అజ్ఞాన స్థితి నుండి తన జ్ఞాన సంవిత్తును ఉత్తేజ పరచుకొంటూ మరల సూక్ష్మనాడుల నుండి బయల్వెడలుచున్నాడు. తన అంతరింద్రియ–బహిరింద్రియాలను ఉత్తేజపరుస్తూ 'అనుభవము' అనే కవాటమును తెరచుకుంటూ 'స్వప్న – జాగ్రత్తు'లలో ఇంద్రియానుభవ ప్రవేశం పొందుచున్నాడు. ప్రాణ సంచారముచే మనోచలనము గూర్చిన యత్నమును పొందినవాడై మరల ప్రాణములచే ప్రబోధితుడై, స్వప్నదశను గాంచుచున్నాడు.

ఆయా స్వప్నగతమైన అనుభూతులు ఏ విధాలుగా ఉంటాయనేది "సూక్ష్మనాడులలో అన్నరసం ఏ సాంద్రతతో ఏర్పడి ఉంటోంది?" అనుదానిని అనుసరించి ఉంటోంది. జీవుని తేజస్సు అనుసరిస్తూ వస్తున్న ఆ అన్నరసం కొన్ని నాడీ మండలాల నుండి మరికొన్ని నాడీ మండలాలకు ప్రవహిస్తున్నప్పుడు ...ఆ జీవుడు గొప్ప రాళ్ళ వర్షం – జడివాన మొదలైనవి స్వప్న దృశ్యంగా పొందుతూ ఉంటున్నాడు.

జఠరాగ్ని అధికంగా వ్యాప్తమై వాత – పిత్తాదులు అధికంగా సంయోగం చెందితే ...అధిక స్వప్న సంభ్రమం కలుగుతూ ఉంటోంది. వాటి సంయోగం అల్పంగా ఉంటే ...అల్ప స్వప్న సంభ్రమం ఉంటూ ఉంటోంది.

కనుక వాత–పిత్త–కఫాదులు సూక్ష్మనాడులలో అధికంగా సంక్షుబ్ధం అవుతూ ఉంటే ఆ జీవుడు అధిక దృశ్యమును పొందటం జరుగుతోంది. ఆ జీవుడు అధికంగా పృథ్వి, పర్వత, ఆకాశాదుల యొక్క చలనంగాని, గొప్ప అగ్నిజ్వాలల సంరంభంగాని పొందుతూ ఉంటాడు. ఆతనికి విపరీతమైన వస్తు – విషయ –చలన సమూహ పరంపరలు అనుభవౌతున్నాయి. వాత –

పిత్తాది ధాతువుల విషమత్వంచేత అభ్యంతరంగా అనేక ఇంద్రియవృత్తులు ఇంద్రజాలంలోని భ్రమలాగా అనుభవించుచున్నాడు. అట్టివారు జాగ్రత్తునందు కూడా అనేక విధములైన భ్రమలను చూస్తూ అనుభవిస్తున్నారు.

విషమ ధాతువులతో కూడిన దేహము గల జీవులు బాహ్య అభ్యంతరములందు అనేక విపరీత – మహా సంభ్రమ కార్యములను చూస్తున్నారు. అట్లా కాకుండా వాత – పిత్తాది ధాతువులు శరీరంలో సమరూపంగా ఉంటేనో, ... అప్పుడీ జీవుడు తన హృదయ తేజమున సమత్వముతో కూడిన లౌకిక – శాస్త్రీయ వ్యవహార స్థితిని స్వయంగా అనుభవించుచున్నాడు. అనగా అట్టి ధాతు సమత్వం చేత ఆతని స్వప్న దృశ్యము ప్రశాంతంగా – శోభాయమానంగా ప్రశాంత వాతావరణంలో ప్రయాణించే పథికుని ప్రయాణంలా ఉంటోంది. ఆతని స్వప్నానుభవం పూర్ణచంద్ర – సూర్య – నక్షత్ర – దివారాత్రులచే శోభితమై... అదంతా అసద్రూపమే అయినప్పటికీ, సద్రూపంగా భాసిస్తోంది.

❖

వింటున్నావు కదా ఓ మిత్రమా! వాయువునందు వాయుస్పందము వాయువుకు అభిన్నమే కదా! అట్లాగే చైతన్యమునందు ఈ దృశ్య ప్రాప్తి (జాగ్రత్ + స్వప్నములు) చైతన్యమునకు అభిన్నమే అయినప్పటికీ భిన్నముగాను, వాస్తవానికి అసత్తే అయినప్పటికీ సత్తుగాను స్థితిపొంది ఉంటోంది.

**శాన్తాత్ ఉదేతి సకలం జగదంబరాత్మ శాంతం న కించన న నామ 'సత్' ఇత్యుదేతి ।**
**తత్ వ్యోమనీ దృశమ్ అనన్త చితేః శరీరే భామాత్రమ్ ఆతతమ్ అనంతవపుర్ విభాతి ॥**

ప్రపంచరహితమగు బ్రహ్మము నుండియే "బ్రహ్మము రూపము, చిదాకాశరూపము"... అగు ఈ సమస్త జగత్తు ఎదురుగా కనిపిస్తోంది. కనుక, జగత్తుగా కనిపించేదంతా చిదాకాశమే అయి ఉన్నది. అయినా కూడా శాంతము, నిష్ప్రపంచము అయినట్టి బ్రహ్మం ఒకింత కూడా మరొకరూపం (జగత్‌రూపం) అగుటలేదు. కాజాలదు. ఎందుకంటే ఏది సత్తో అది సర్వదా సత్తుగానే ఉంటుంది గాని, అసత్‌రూపం పొందజాలదు. అది ఈ దృశ్యమానమగు జన్యరూపమున (జ = జనించినది) ఉత్పన్నమవటమనే మాటయే లేదు.

ఆకాశమువలె అనంతమైనట్టి చైతన్యము యొక్క శరీరమున... అద్దాని ప్రతిభాస మాత్రమే అయి ఉన్న ... అనంత శరీరధారి అయిన ఈ వ్యాప్తమగు జగత్తు భాసిస్తోంది. చిత్ బ్రహ్మమునకు వేరుగా 'జగత్తు' అనబడునదేదీ లేదు. జగత్తుగా కనిపించేది మనిద్దరి స్వస్వరూపమగు చిదాకాశమే!

❖❖❖

## 18. సుషుప్తి గురించిన విచారణ

**వ్యాధుడు :** మునివర్యా! మనం తిరిగి మీ అనుభవం విషయానికి వద్దాం. మీరు ఆ ఒకానొక ప్రాణియొక్క హృదయమునందలి తేజస్సులోకి సూక్ష్మరూపులై ప్రవేశించారు కదా! అక్కడ ఆ జీవుని స్వప్నంలో సమభాగులై సంచరిస్తూ ఉన్నట్లుగా వర్ణించారు. ఆ సమయంలో భ్రాంతి

రూపులు, నామమాత్రులు అగు తమయొక్క ఆ తరువాతి స్వప్న దర్శన వృత్తాంతంలో ఏమేమి సంభవించాయో వివరించండి.

**మహాముని :** ప్రియ వ్యాధుడా! వినండి. నేను ఆ ప్రాణి యొక్క తేజోమయ ధాతువులో ప్రవేశించాను. ఆ జీవుని లింగ శరీరంలో నా లింగ శరీరం ఏకమైంది.

ఆతని స్వప్నాంతర్గత లోకంలో భయంకరమైన ప్రళయ సంభ్రమం ఏర్పడింది. అప్పుడు ప్రసరించనారంభించిన ప్రళయవాయువు యొక్క వేగానికి పర్వతాలు గడ్డి పరకలుగా గాలిలోకి విసరబడ్డాయి. అలా ఆకాశంలోకి ఎగిరిన పర్వత సమూహాలు వర్షంలా నేలకూల నారంభించాయి.

❖

విచిత్రమేమంటే... ఆ ప్రాణి యొక్క నాడులందు ప్రవేశించిన నాకు అక్కడి అన్నరస కదలికలే పర్వత వర్షాలుగా నాకు అనుభూతం కాసాగాయి సుమా! ఆ ప్రాణి యొక్క నాడులందలి 'అన్నరస లేశము' అనే గొప్ప పర్వత ప్రవాహంచే నేను ముద్దగా చేయబడ్డాను. ముద్దగా ఆకారం కలవాడనై, నిశ్చేష్టితుడనై ఉండగా, క్రమంగా 'అజ్ఞానం' అనే అంధ తమస్సు (దట్టమైన చీకటి)తో కూడిన సుషుప్తి నాకు సంభవించింది. అక్కడ కొంత కాలం సుషుప్తిలోనే ఉండిపోయాను.

ఆ తరువాత కొంతసేపటికి నన్ను నేనే ఏమఱచి, ఏమీ తెలియని నిశ్చేష్ట–అజ్ఞాన–నిరనుభవ – నిర్వ్యాపార స్థితిలోకి ఈడ్వబడి... అట్లే ఉండిపోయాను. కాలజ్ఞానము కూడా లేకుండా, సూక్ష్మ నాడులలో ప్రాణ వాయువులు ప్రసరించటానికి ఖాళీ కనిపించింది. ఆ ప్రాణవాయువులు నన్ను స్పృశించాయి. అప్పుడు ప్రాణవాయువుల స్పర్శచే మెల్లగా 'ప్రబోధం' వైపు ఉన్ముఖుడను అయ్యాను. క్రమంగా నా యొక్క సుషుప్తి స్వప్నరూపం దాల్చ నారంభించింది. స్వప్నంలో ప్రవేశించిన నేను ఆ ప్రాణి తేజస్సులో అనేక విక్షేపాలు దర్శించాను. స్పందరహితమైన వాయువు కొంతసేపటికి తనకు అభిన్నమైన స్పందరూపం (చలనరూపం) పొందుతుంది చూచావా? అట్లాగే చిదాకాశ రూపుడనగు నేను నాకంటే భిన్నం కానట్టి దృశ్యమును పొందసాగాను.

అగ్నిలో ఉష్ణత్వమున్నట్లు, జలములో ద్రవత్వం ఉన్నట్లు, మిరియములో 'కారం' ఉన్నట్లు, స్వస్వరూప చిదాకాశమునందు ఈ జగత్తు ఉన్నది. నా చిదాకాశ రూపంలోనే స్వప్న జగత్తు గాంచసాగాను. తల్లి గర్భంలోంచి బాలుడు జనిస్తాడు చూచావా? అట్లాగే సుషుప్తి రూపదృశ్యం నుండి స్వప్న జగత్తు ఆవిర్భవించింది. అదంతా చిదాకాశ స్వరూపమే సుమా!

**వ్యాధుడు :** ఓ మహావక్తా! "సుషుప్తి రూప దృశ్యము నుండి"... అని మీరిప్పుడు పదప్రయోగం చేశారు కదా! అనగా సుషుప్తిలో కూడా కొంచెం దృశ్యం కలదని మీరు చెప్పుచున్నట్లు అవుతుంది కదా! సుషుప్తిలో ఏ దృశ్యం మీరు దర్శించటం జరిగిందో అది వివరించండి. అంతేకాదు. తాము ఆ ప్రాణి హృదయంలో ప్రవేశించి ఆతని సుషుప్తితో మీ సుషుప్తిని ఏకం చేశారు కదా! సుషుప్తి రూప దృశ్యం నుండి మరొక జగద్రూపదృశ్యం ఎట్లా జనిస్తోంది? లేదా, మరొక సుషుప్తి రూపమేదైనా జనిస్తుందా?

"సుషుప్తిలో దృశ్యం" అనేది నాకు చమత్కారంగా కనిపిస్తోంది. ఎందుకంటే "సుషుప్తిలో ఏ దృశ్యమూ ఉండదు. దృశ్య రాహిత్య రూపమే సుషుప్తి" అనేది ఈ మన జాగ్రత్‌కు అనుభూతి కదా?

**మహాముని :** మిత్రమా! (పకపక నవ్వుచూ) "దృశ్యము ...అది జనించటం?" అనే ప్రశ్న... పరమార్థమున అడుగుచున్నవా? లేక, వ్యవహారరీత్యా ప్రశ్నిస్తున్నావా?

పరమార్థమున గమనిస్తే... దృశ్యము అవస్తువే కాబట్టి అది ఇక ఉత్పన్నం అవటం ఏమున్నది? "అసలు దృశ్యమే ఉత్పన్నం కాలేదు" ...అనునది నా సూటి అయిన సమాధానం.

"మట్టిలో కుండ ఎప్పుడు పుట్టింది?" అంటే మట్టి దృష్ట్యా మట్టి మట్టిగానే ఉంది. ఇక అందులో కుండ పుట్టడమెక్కడున్నది? అయితే నీకు "సుషుప్తి దృశ్యం" అని చెప్పేటప్పుడు వ్యవహార దృష్టిని అనుసరించి చెప్పాను. అంతయూ, చిదాకాశమే అయివుండగా... అందులో 'నేను' అనేది జనించటం (మట్టిలో కుండలాగా), భాసించటం, ప్రకాశించటం జరుగుతోంది. వాస్తవానికి చిదాకాశంలో చిదాకాశానికి అన్యంగా 'నేను' అనేది జనించటానికి కారణమే లేదు. వాయువులో వాయు తరంగం లాగా... 1.'నేను' అనేది, 2.ఆ 'నేను' చే దర్శించబడే 'దృశ్యం' అనబడేది వ్యవహార రీత్యా బయల్వెడలుచున్నట్లు అనిపిస్తున్నప్పటికీ వాస్తవానికి ఆ ఉభయమూ కూడా చిదాకాశం కంటే భిన్నం కాదు. చిదాకాశానికి భిన్నమైనదేదీ ఉండజాలదు. జలతరంగం యొక్క ఆకారం జలం కంటే వేరుగా ఎక్కడుంటుందో చెప్పు? అయితే "సుషుప్తి దృశ్యం నుండి" అని నేను చెప్పేటప్పుడు మూర్ఖుల దృశ్య దృష్టి ఘనంగా కలిగియున్న కల్పనామయమగు ప్రలాపమును నీకు వచించాను.

**పండితుల అభిప్రాయం –**

**"జాత" శబ్దో హి సన్మాత్ర పర్యాయః శ్రూయతామ్ కథమ్ ।**

**పాదుర్భావే జనిసూక్తః ప్రాదుర్భావస్య భూర్వపుః ॥**

పండితుల అభిప్రాయం 'జాత' (జనించినది ఉదా॥ సుషుప్తి నుండి స్వప్న దృశ్యం పుట్టినది అనే) శబ్దము 'సన్మాత్రము' అనే శబ్దమునకు పర్యాయ పదమే అయివున్నది.

జాత సన్మాత్రము ఎట్లా అంటే ... (పాణిని మొదలైన సంస్కృత మహాకవులచే) 'జని' అనే ధాతువు యొక్క అర్థం ప్రాదుర్భవే అని వ్యాకరణ సూత్ర భావంగా చెప్పబడింది.*

కాబట్టి బ్రహ్మము (లేక) చిదాకాశము (లేక) సన్మాత్రములో ఏదీ ఉత్పన్నమవటం లేదు. నశించటమూ లేదు. అంతా కూడా శాంతము – అజము అయినట్టి "సన్మాత్ర బ్రహ్మమే!"

❖

ఓ వ్యాధుడా! బ్రహ్మము సర్వసత్తా స్వరూపమైయున్నది. అందులో స్ఫురించే జగత్తు కూడా సర్వసత్తా స్వరూపమే!

---

* ప్రాదుర్ = ప్రకటించబడినది. భవసత్త = ఉండివున్నది. భూ = (పాదుక్ + భు) = ఇప్పటికే ఉన్నది. 'భూ' ధాతువు = సత్త. ప్రాదుర్ (ఉపసర్గ) + భావ = 'సంజాత' = ఉన్నదానిలో నుంచే ఉన్నది. సర్గ = సృష్టి / దృశ్యము = సన్మాత్రమే 'సర్గము'

మరిక ఆ బ్రహ్మమునందు “జగత్తు కలదు, జగత్తు లేదు”... అని విధి-నిషేధాలకు తావెక్కడిది? ఇక బ్రహ్మంలో స్వప్న దృశ్య ఆవిర్భావం - జాగ్రత్ దృశ్య ఆవిర్భావం... అను ఉభయాలు, “ఉన్నవే అగుపించ నారంభించాయి” అనే అర్థాన్నే సూచిస్తున్నాయి. అవి రెండు వాస్తవానికి “గొడ్రాలి కవల పిల్లల” అనే పదప్రయోగం వంటివే!

ఆ బ్రహ్మమునందు ఏ మాయాశక్తి ఉందో, దాని యందే ‘కలదు, లేదు’ మొదలైన వ్యవహారాలు ఉంటున్నాయి. ఏ కారణంచేత నిర్మల బ్రహ్మము మాయాశబలితమై ఉన్నదో... ఆ కారణం చేతనే అది అజ్ఞానులకు మాయారూపమై కనబడుతోంది. మాయాశక్తి ఎట్లెట్లు ఏఏ విధంగా విజృంభిస్తోందో, ఆయా రూపంగా సర్వశక్తిరూపమై ఆత్మరూపమైన బ్రహ్మమే స్ఫురిస్తోంది. తరంగంగా స్ఫురించటానికి జలానికి కారణం లేకపోయినా అది దాని ధర్మంగా, జలమునకు అనన్యంగా తరంగం స్ఫురిస్తున్నది. అట్లాగే, పరమాత్మయే జగద్రూపంగా అజ్ఞాన దృష్టికి అనిపిస్తోంది. (దృష్టిమ్ జ్ఞానమయిమ్ కృత్వాత్ పస్యేత్ బ్రహ్మమయమ్ జగత్).

**జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది పరమార్థవిదాం విదామ్ ।**
**న విద్యతే కించిదపి యథాస్థితమ్ అవస్థితమ్ ॥**

పరమార్థమును ఎరిగిన తత్త్వవేత్తలకు - జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాదులేవీ లేవు. యథారీతి స్థితి కలిగి ఉన్న బ్రహ్మమే సర్వత్రా ఉన్నది. ఈ జీవుల అనుభవంలో “స్వప్నం, సంకల్పపురం” అనే రెండింటికీ రూపమే ఏ విధంగా అయితే లేదో... అట్లాగే సృష్ట్యాదిలో జగత్తుకు రూపమేదీ లేదు.

ఈ స్వప్న సంకల్ప పురాలు జీవోపాధి యొక్క సృష్టికి అనంతరం కదా ఏర్పడుచున్నది? వాటి యొక్క ద్రష్ట “ప్రాణము, మనస్సు” కలిగి ఉండటం చేత ఆ స్వప్న-సంకల్ప నగరాలు అనుభూత మౌతున్నాయి. కానీ ఈ ప్రాణము మొదలైనవి ఉత్పత్తి కావటానికి పూర్వమో? సృష్ట్యాదిలో “సృష్ట్యాది” యొక్క ద్రష్ట ఎవరు? నిర్విషయమై ఆకాశం కంటే నిర్మలమైనట్టి చైతన్యమే సృష్ట్యాదికి ద్రష్టగా భాసిస్తోంది.

అసలీ ‘ద్రష్ట’ను గురించిన కథనమంతా కూడా ‘సృష్టి’ని బట్టియే చెప్పబడుతోంది. వాస్తవానికి ఇక్కడ “ద్రష్ట - భోక్త - తత్సంబంధమైన త్రిపుటి” - ఇవేవీ లేవు. అంతా చిదేక రసమే!

ఏది ఏదియు కాకపోయినా సమస్తము అయివున్నదో, ఏది మహావాక్ రూపమైనప్పటికీ మౌనాత్మకమై ఉన్నదో, ఆ చిన్మాత్రమే కనబడే సమస్తము అయివున్నది.

స్వప్నములకు అంతేమున్నది? సంకల్ప పురములకు సంఖ్యానియమం ఎక్కడ? కథా రచనలు అయిపోవటమంటూ ఏమున్నది? సృష్ట్యాదిలో కారణమే లేదు కనుక చైతన్యమున ఏ వస్తువు ఎట్లు స్ఫురిస్తోందో అది ప్రళయము వరకు అట్లే ఉంటోంది.

ఒక పిల్లవాని చేతిపై పెద్దపులిని చిత్రీకరించినప్పుడు ఆ పిల్లవాడు ఆ పెద్దపులిని చూచి భీతిల్లవచ్చునేమో గాని, ప్రౌఢుడైనవాడు భయం పొందడు కదా! “ఆత్మరూపమే” అగు ద్వైతమును చూచి జ్ఞాని భ్రమపడటం లేదు. అజ్ఞాని భ్రమపడుచున్నాడు.

పరమార్థమున బ్రహ్మము ఆదిమధ్యాంత రహితమైయున్నది. అనంతము - ఏకము - అతి నిర్మలము అయివున్నది. భ్రాంతిచేత మహావికారంగాను, నానా రూపములుగాను తన నిజ స్వరూపం త్యజించకయే భాసిస్తోంది. కనుక ఈ జగత్తు అజ్ఞానముచే అశాంతముగా కనబడవచ్చునుగాక! బోధచే మహాశాంతమై, ప్రశాంతరూపమై చెన్నొందుచున్నది.

❖❖❖

## 19. సుషుప్తి నుండి స్వప్నంలోకి....!

**మహాముని :** ఓ వ్యాధుడా! సుషుప్తి నుండి వెలువడిన తరువాత ఏది ఎట్లు జరిగిందో... ఆ కథనం కొనసాగిస్తున్నాను. క్రమంగా అన్నీ నీకే విశదమవుతాయి.

సుషుప్తి నుండి వెలువడిన నాకు అప్పుడు స్వప్నమునందు జగద్దృశ్యం సంప్రాప్తం అయింది. ఆకాశంలోనుంచి ఊడిపడినట్లో, భూమి నుండి ఏదో బయల్వెడలినట్లో, చిత్తము నుండి ఊహామాత్రంగా పెల్లుబికినట్లో, కళ్ళు తెరువగానే దృశ్యం కనిపించినట్లో నాకు స్వప్న జగత్తు కనిపించనారంభించింది. ఆకాశంలో దిక్కులు కనిపించునట్లు, నిరాకారమైన మట్టి నుండి మట్టి బొమ్మలు తయారగునట్లు, మనస్సు నుండి 'ఆలోచన' వచ్చునట్లు, రంగుల సమ్మేళనంచే ఒక గొప్ప స్త్రీ చిత్రం విరచితమగునట్లుగా నా సుషుప్తి నుండి స్వప్నదృశ్యం వెలువడింది.

ఇక ఆ స్వప్నదృశ్యం... అనేక మహాప్రయత్నముతో కూడివున్నది. దృశ్యరూపంగా ఉన్నప్పటికీ అందులో 'ఇది దేశము, అది కాలము' అనునవి ఉన్నట్లే లేదు. వివిధ పదార్థములతో కూడి కూడా అద్వైతమై ఉన్నది. శాస్త్రాలలో చెప్పబడే రజ్జు-సర్ప, మృగతృష్ణా భ్రాంతులవంటి ఒకానొక భ్రాంతి రూపమే అది. ఎక్కడ ఆరంభమైనదో చెప్పలేముగాని అనేక ఆరంభ-సంరంభాలు, దేశ-కాల-క్రియా-ద్రవ్యాదులు, సుర-అసుర మనుష్యాదులతో కూడిన స్వర్గ-పాతాళ- మర్త్య లోకాలు, వేర్వేరు గదులలో వేరు - వేరు బీజములుండే దానిమ్మ పండులాగానూ ఆ స్వప్న జగత్తు కనిపించింది.

అప్పుడు నేను ఆ స్వప్న దృశ్యమండలమును చూచుటకై ప్రవృత్తుడను కాసాగాను. ఇంతలో నేను ఇతఃపూర్వం స్వప్న ప్రవేశమునకు సంబంధించిన భార్య - బంధు - పుత్రాదులతో ఒకప్పుడు నివసించియున్న ఇల్లు ఇప్పుడు కనపించింది. బంధువులు, పుత్రులు, భార్య మొదలైనవారు ఆయా ఆకార - వయస్సులతో కూడి ఉన్నారు. వారిని చూడటానికై గదా, నేను రెండవసారి బయల్వెడలాను! అప్పుడు నేను ఆ గృహంలో ప్రవేశించాను. ప్రవేశించిన మరుక్షణం అక్కడి గృహ - క్షేత్ర - బంధు - మిత్రాదులందలి అభిమాన రూపమగు 'వాసన'చే నా చిత్తము బలాత్కారంగా ఆకర్షించబడింది. ఇకప్పుడు "స్వప్నము గురించి పరిశోధించటానికి బయలుదేరిన శిష్యసమేతుడనగు ఆశ్రమవాసిని" ...అనే విషయం మరల ఇంతలోనే క్రమక్రమంగా పూర్తిగా మరచి ఆ బంధుమిత్రుల ఆలింగనాదులతో తన్మయుడనై కాలం వెళ్ళబుచ్చసాగాను. చూచావా? అద్దం ఎదురుగా ఏ దృశ్యముంటే అద్దానినే తనయందు ప్రతిబింబిస్తుంది కదా! అట్లాగే...

**బింబం తత్తత్ ఉపాదత్తే యద్యత్ అగ్రే అవతిష్ఠతి ।**
**యథా దర్శః చిదాదర్శః తథైవాయం స్వభావతః ॥**

'చైతన్యము' అనే అద్దం కూడా తనయందు వాసనచే తన ఎదుట ఏఏ వస్తువు స్థాపించబడితే అద్దాని ఆకారాన్ని స్వయంగా గ్రహిస్తోంది. ఎవడైతే "ఈ సమస్తం చిదాకాశ మాత్రమే" అను బోధ కలవాడై ఉంటాడో... ఆతడు ద్వైతముచే ఉక్కిరిబిక్కిరి కాడు. నిర్మలము, ఆత్మబోధ స్వరూపము అగు 'స్మృతి' ఎవనియందు ఘనీభూతమై తొలగకయే ఉంటుందో.... అట్టి వానిని ద్వైత పిశాచము ఆవహించదు, సరికదా ... సమీపించనుకూడా లేదు. ఏ మహాత్ముడైతే 'శ్రవణము, మననము' మొదలైన సాధనాక్రమము చేతను, సాధు జనులతో సహవాసము చేతను, సచ్ఛాస్త్రములతో సంసర్గము చేతనూ ఆత్మబోధను గురించిన బుద్ధిని ప్రవృద్ధ పరచుకుంటాడో... ఆతడు జగత్తును జగత్తుగా కాక, బ్రహ్మముగా చూడటం ఏమరువడు. ఆతడు సర్వదా – సదా – సర్వత్రా బ్రహ్మము అనుసంధానం చేతనే పరిపూర్ణుడై ఉంటాడు. అట్లా కాకుండా ఆత్మజ్ఞానము ఏమరువబడిందా... దృశ్య పిశాచం వచ్చి ఆవహించటానికి చిన్న చిన్న అవకాశాలు, కొద్ది సమయం చాలు కూడా!

నేను ఆ ఇతఃపూర్వపు 'నాది' అనుకున్న గ్రామంలోని స్వగృహంలో ప్రవేశించి భార్య, పుత్రులు, బంధువులను చూడగానే నేను అప్పటివరకు సమకూర్చుకొనియున్న ఆత్మ జ్ఞానమును ఏమరచాను. కనుకనే బంధువుల గురించిన వాసనచే అదికాస్తా జ్ఞాపకం రానంతగా కప్పబడిపోయింది.

ఇప్పుడో... నా ఈ అనుక్షణికమైన ఆత్మసాక్షాత్కార భావనాభ్యాస దృఢత్వం చేత ఏ ప్రాపంచిక విషయ – విశేషమూ "అంతయు ఆత్మయే! చిదాకాశమే"... అనే అవగాహనను తొలగించజాలదు. అందుకే దృఢమైన అభ్యాసమే శరణ్యం.

ఓ వ్యాధుడా! నీ బుద్ధి అతిదీర్ఘకాలం సత్సంగాదులు ఆశ్రయించకుండానే ఈ దృశ్య సమూహాలతో సంబంధం కలిగి ఉండి, ఆ ఈ దృశ్య సంబంధమైన అభ్యాసం యొక్క ప్రభావం కలిగియున్నది. అందుకే పూర్ణంగా శాంతిని పొందజాలకున్నది. సాధనాభ్యాసం కొనసాగిస్తూ మన ఈ ఆత్మ సంబంధమైన ఆప్త వాక్యాలు గ్రహిస్తూ ఉండగా నీ బుద్ధి కూడా తగిన సమయంలో సశాంతించగలదు.

**వ్యాధుడు :** ఓ మహామునీ! మీరు చెప్పినది సత్యం. ఎందుకంటే తమయొక్క ఇటువంటి స్వానుభవపూర్వకమైన పవిత్ర బోధలచేకూడా నా బుద్ధి సద్రూపమగు బ్రహ్మమున విశ్రాంతి పొందటంలేదు. ఏం ఆశ్చర్యం! మీరు సెలవిచ్చినట్లు నా బుద్ధి "జగత్తుపై నమ్మకము" అనే దోషముచే ఇట్లే కొనసాగుతుందేమోనని నాకు భయము – బాధ కూడా కలుగుచున్నాయి. ఆహా! అనేక జన్మలందలి అభ్యాసముచే దృఢపడి ఉన్న ఈ 'అవిద్య' ఎంతటి బలవత్తరమైనది! వాస్తవానికి 'లేనిదే' అయినప్పటికీ అనేక రూపాలుగా ప్రకటనమగుచు కొనసాగుచున్నదే గాని, ఇద్దానికి ముగింపు కనబడటమే లేదాయె!

**సత్సంగతైః పద పదార్థ విబుద్ధ బుద్ధేః సచ్ఛాస్త్ర సత్క్రమవిచార మనోహరాంగైః ।**
**అభ్యాసతః ప్రశమమేతి జగద్భ్రమోఽయం నాఽన్యేన కేనచిదపీతి వినిశ్చితిర్మే ॥**

ఓ మహామునీ! 1.సచ్ఛాస్త్ర పఠనం, 2. సద్గురు సంప్రదాయం, 3.తత్త్వ విచారణ... మొదలైన మనోహరములై అంగములతో కూడిన సత్సాంగత్యం పెంపొందాలి.

అట్టి సత్సాంగత్య ప్రభావంచేత పదపదార్థ వివేక బుద్ధి జనించాలి. అట్టి ఉత్తమమైన 'బుద్ధి' యొక్క సమాశ్రయముచే ఆత్మజ్ఞానం జనించాలి. అట్టి ఆత్మజ్ఞానం పరిఢవిల్లుతూ ఉండగా భూమికాక్రమంచేత మాత్రమే జగద్భ్రాంతి నశించగలదు. ఇతరములగు మరే ఉపాయం చేతనూ ఈ జగద్భ్రమ తొలగదని నాకు అనిపిస్తోంది.

❖❖❖

# 20. స్వప్నంలోగల సత్యాసత్యములు

**వ్యాధుడు :** ఓ మునీంద్రా! నాకొక సంశయం ఉన్నది. మీరు ఇప్పుడు రెండు విషయాలు చెప్పుతూ వస్తున్నారు. 1.స్వప్నం స్వప్నద్రష్ట యొక్క "వాసన"ని అనుసరించే ఉన్నది. 2. జాగ్రత్తు స్వప్నతుల్యమే! ...అయితే లోకంలో స్వప్నం గురించి అనేకమైన అభిప్రాయాలు ఉన్నాయి.

కొన్ని సమయాలలో వచ్చే స్వప్నాలు (తెల్లవారుజామున వచ్చేవి) సత్యమౌతాయని. కొన్ని స్వప్నాలు భవిష్యత్తును తెలిపే సూచనలని, కొన్ని వస్తువులు-సంఘటనలు స్వప్నంలో కనిపించటం శుభసూచకమని, మరికొన్ని వస్తువులు - సంఘటనలు స్వప్నంలో కనిపిస్తే అశుభ సూచకమని, కొన్ని స్వప్నాలు అవాస్తవం మాత్రమేనని, అర్థరహితమని, ఇట్లా లోకంలో ప్రతీతి ఉన్నది. మరి స్వప్నం స్వకీయ మనోచమత్కారమే అయినప్పుడు వాటిలో కొన్ని సత్యములని, మరికొన్ని అసత్యములని లోకప్రతీతి ఎందుకు ఉన్నది?

ఇంకొక సందేహం - "బ్రహ్మదేవుని సంకల్పజనిత సృష్టి (ఈ జగత్ సృష్టి) అర్థక్రియా సమర్థం అవటం చేత సత్యం. మనయొక్క సంకల్పజనిత సృష్టియగు స్వప్నం అసత్యం" అని కొందరి అభిప్రాయం. ఈ విధంగా సృష్టులలో సత్యాసత్యము లెందుకున్నాయ్? ఇట్లా చూస్తే స్వప్న - జాగ్రత్తులు వేరువేరే కదా!

"అధిష్ఠాన చైతన్యము సత్యమే కాబట్టి అద్దానిలో గల జగత్తు సత్యమే! కాని స్వతఃగా చూస్తే అసత్యం" ...అని సత్యాసత్యపూర్వకంగా ఈ జాగ్రత్ స్వప్నాల గురించి కూడా చెప్పుతూ ఉంటారు. అసలీ 1.జాగ్రత్, 2.స్వప్నములలో సమానత్వమేది? ఆ రెండింటిలో అసమానత్వమైనదేది?

అవి రెండూ "కొందరికి సత్యమనిపించటం, కొందరికి అసత్యమనిపించటం" ...అనే వైషమ్యానికి కారణమేమిటి? ఈ గొప్ప సందేహం నన్ను ఇంకా వదలకున్నది.

**మహాముని :**

**దేశ కాల క్రియా ద్రవ్యైః యా సంవిత్ నిశ్చితోదితా ।**
**కాకతాలీయవత్ భాతి సా సత్య స్వప్ననామికా ॥**

అవును! స్వప్న శాస్త్ర ప్రావీణ్యులు కొందరు పురాణాదులలోని ఆయా సంఘటనలన్నీ తీసుకొని "ఇట్టి స్వప్నమునకు ఈ ఈ ఫలితం కలుగుతుంది" ...అని చెప్పటం లోకంలో ఒక రీతిగా ఉన్నదే!

అయితే... ఆ విధంగా స్వప్నంలో కనిపించే సూచనలు, శకునాలు, "ఇట్టి స్వప్నానికి ఇదీ ఫలితం" అని చెప్పటం - ఇవన్నీ కాకతాళీయం. "వీరు ఎదురువస్తే ఈ ఈ శుభ-అశుభాలు జరుగుతాయి" అని చెప్పే శకునాల కథనాలు ఎట్లా కాకతాళీయమో, స్వప్న ఫలాలు కూడా అట్లే కేవలం కాకతాళీయం. అనగా అవి అట్లా జరిగితే ఎవరికి "ఇది ఈ అర్థం కలిగివున్నది"... అని నమ్ముతారో, వారికి అది అట్లే ఫలము కలుగజేయుచున్నది. అవి నమ్మకమునకు సంబంధించియే ఉంటాయి గాని, సశాస్త్రీయం కాదు. "తెలుసు! ఆ దుశ్శకునమే - ఆ దుస్వప్నమే ఇట్లు ఈ ఈ అశుభములుగా పరిణిమించింది" అని అలవాటుగా (సశాస్త్రీయమా? అశాస్త్రీయమా? - అని పరిశీలించకుండానే) అనుకోవటం జరుగుతోంది. అందుచేత అట్టి స్వప్న - స్వప్నఫలములు 'సత్యమే' ...అని కొందరి దృష్టిలో ప్రసిద్ధమై ఉంటున్నాయి.

**వ్యాఘుడు :** అదేమిటి స్వామీ! నమ్మిన వారికి ఫలప్రదాత అవటం, నమ్మకుంటే ఫలము ఉండకుండటం ...అని అంటున్నారు? ఫలితములు నమ్మకమును అనుసరించి ఉంటాయా?

**మహాముని :** అవును. ఉదాహరణకు మణి - మంత్ర ఔషధాది ద్రవ్యములు ఒకానొకచోట యోగ్య పురుషుని యందు సత్యములౌతున్నాయి. గురువుల స్పర్శ మాత్రం చేత ఒకడు పునీత భావము సంతరించుకుంటున్నాడు. గురువు యొక్క పవిత్రతపై అంతగా ఆరూఢత ఏర్పడని మరొకడు పునీతత్వం పొందజాలకపోతున్నాడు. "ఈ జీవుడు ఏది ఎట్లు సత్యమనుకొంటే అది అట్లే సత్యమై ప్రాప్తిస్తోంది" ... అనేది శాస్త్ర విదితమైనదేకదా! అదియే స్వప్న సందర్శన విశేషముల యొక్క ఫలాఫలముల ప్రభావ రూపమునకు వెనుకగల మూలసూత్రమగుచున్నది.

అయితే... స్వప్నంలోగాని, జాగ్రత్తులోగాని ఏదైనా సరే కాకతాళీయ న్యాయం చేతనే 'సత్యం' అయి ఉంటున్నదిగాని మరొక రీతిగా కాదు. ఏదైనా సత్యం అవటానికి మూలకారణం సంవిత్తు యొక్క దృఢనిశ్చయ స్వభావమే అయివున్నది. హిరణ్యగర్భుని (సమష్టి సృష్టి సంకల్పుని) సంవిత్తు పూర్వకాలపు ఉపాసనాదుల పరిపాకం చేత జనించినదే కదా! ఆతని సంకల్పం సత్య సంకల్పరూపమగు దృఢనిశ్చయం కలిగి ఉంటోంది. అందుచేత అది యేయే నిశ్చయాలు కలిగి ఉంటోందో... ఆయా విశేషములే ఆ రీతిగా ఈ సృష్టిలో పరిఢవిస్తున్నాయి. ఎందుకంటే ఫలయుక్తం కావటమనేది దృఢ సంవిత్తు యొక్క సంకల్ప స్వభావమే అయివున్నది.

**వ్యాఘుడు :** హిరణ్యగర్భుని సంవిత్తు యొక్క దృఢనిశ్చయము అందుకు విరోధంగా ఉండే మరొక ప్రబల నిశ్చయముచే మార్పు చేయబడటమో, నశింపచేయబడటమో జరుగగలదంటారా?

**మహాముని :** హిరణ్యగర్భుడు, "నేను జగత్తు యొక్క సృష్టికర్తను" ...అనే సంకల్పమును ఉపాసనాకాలంలో కొనసాగించటం చేత గదా, ఆతని దృఢ నిశ్చయం ఈ సృష్టి యొక్క ఫలభాగి అయింది! అట్టి శ్రుతి ప్రసిద్ధమగు దృఢనిశ్చయము ననుసరించే ఇతర సిద్ధుల సంకల్పములు

పరిఢవిల్లుచున్నాయి. అనగా బ్రహ్మదేవుని నిశ్చయమునకు అవిరోధంగానే ఆయా సిద్ధుల సంకల్పములు ఉంటున్నాయిగాని విరోధంగా కాదు.

వాస్తవానికి బాహ్యమునగాని – అంతరమునగాని 'జగత్తు' మొదలైన పదార్థము లేవీ ఎచ్చట కూడా లేవు. సంవిత్తు ఒక్కటే ఉన్నది. అట్టి స్వతంత్రమైన సంవిత్తు ఎచ్చట ఎట్లు ఇచ్ఛగిస్తుందో... అచట 'జగత్తు' ఆదిగాగల రూపాలుగా స్థితినొంది ఉంటోంది.

కాబట్టి... 'ఈ స్వప్నం సత్యమే' అనే దృఢనిశ్చయాన్ని సంవిత్తు ఎచట అంతరంగమున కలిగి ఉంటుందో ...అది అద్దానిపట్ల అట్లే సత్యమగుచున్నది. అట్లే ఈ జాగ్రత్ యొక్క విషయం కూడా! సంశయం కలిగి ఉన్న చోట, అద్దాని ప్రయోజనం కూడా సంశయముగానే ప్రాప్తిస్తోంది.

**అన్యతోఽపి ఫలం ప్రాప్తం స్వప్న సత్యత్వకల్పనాత్ ।**
**స్వప్నేన సూచితమిదం ఫలమిత్యేవ వేత్త్యయమ్ ॥**

ఒకడు ఏవేవో తదితర కారణాల చేత ఒకానొక ఫలాన్ని పొందటం జరిగినప్పటికీ "స్వప్నంలోని విశేషం సత్యమే" అనే కల్పన చేత "స్వప్నంలో సూచించబడిన ఫలమే నాకు ప్రాప్తించింది" ...అని అంతరంగంలో అనుభవించటం, భావించటం కూడా జరుగుతూ ఉంటుంది.

ఓ సాధూ! ఈ ముల్లోకాలలోను జాగ్రత్తు యొక్క సమస్త పదార్థములు ఆయా మనుజుల నిజసంవిత్తుచే చిరకాలము ఆయారీతిగా అనుభవించబడటం చేత దృఢీకృత స్వభావం కలిగినవై ఉంటున్నాయి. అయినా కూడా అవి దేశ–కాల–యత్నాదుల వలన శీఘ్రంగానో, లేక, విలంబనంగానో అన్యథాభావము పొందుచున్నాయి. ఈ జగత్తులో ప్రతిదీ ఒక స్థితి నుండి అన్యథాభావ ప్రభావంచేత అన్యత్వము పొందుచూ ఉంటోంది.

కాని చైతన్యము మాత్రం అన్యథాత్వం పొందదు. అట్టి మార్పు – చేర్పులకు విషయమే కాని ఆ చిన్మాత్ర సంవిత్తు ...తక్కిన సమస్త జగత్తును... సత్యముగానో, అసత్యముగానో; నియతముగానో, అనియతముగానో; బంధరూపంగానో, మోక్షరూపంగానో... స్థితినొంది ఉన్నట్లు ఎరుగుచున్నది. అది (చిన్మాత్ర బ్రహ్మం) ఈ జగత్తును ఎట్లా ఎరిగితే ఇది అట్లే అనుభూతమౌతోంది. ఓ వ్యాధుడా! 'చిన్మాత్రం యొక్క భావనయే ఈ జగత్తు' అని గమనించెదవుగాక! భావన భావికుని కంటే వేరుకాదు కదా! ఎప్పుడైతే ఈ సమస్తము కూడా సద్రూపము, ఏకము అగు బ్రహ్మమే అయి ఉన్నదో... మరి ఒకటేదీ అయి ఉండనేలేదో... అద్దానికి భిన్నంగా ఏది సత్యము? ఏది అసత్యము? సత్యమని తలచుటచే సత్యము గాను, అసత్యమని తలచుటచే అసత్యముగా అనుభవమవటమే ఇచ్చటి చమత్కారం. అట్లాగే స్వప్నాంతర్గత విషయముల యొక్క జాగ్రత్ సంబంధిత సత్యాసత్యాలు కూడా!

స్వప్నం కూడా (జాగ్రత్తు లాగానే) అజ్ఞానుల దృష్టియందు... ఒకచోట సంవిత్తు యొక్క దృఢత్వ భావనచే సత్యముగా అనిపిస్తోంది. మరొకచోట తత్‌వ్యతిరేక భావనచే అసత్యంగా తెలియ వస్తోంది. జ్ఞానుల దృష్టిలో స్వప్న–జాగ్రత్తులు, వాటికి గల పరస్పర సారూప్య – అసారూప్యాలు, వాటిలోకి ఒకదాని సూచనలు రెండవ దానిలో అగుపించటం... ఇదంతా సద్రూపం గాక,

అసద్రూపం గాక అనిర్వచనీయమై ఒప్పుచున్నది. కనుక స్వప్న–జాగ్రత్తుల ద్రష్టయే సత్యమని, ఇక తదితరమంతా భావనానుసారమేనని గ్రహించి ఉండు.

**వ్యాధుడు :** మునీంద్రా! ఈ ఆకారవంతమగు జగత్తుగా భాసిస్తున్నదేది?

**మహాముని :** సంవిత్తు యొక్క భ్రమయే ఈ ఆకారవంతమగు జగత్తుగా భాసించుచున్నది. ఎప్పుడైతే "నా చిత్తమే స్వయంగా భ్రాంతి రూపమైయున్నది" ...అని గమనించినప్పుడు, ఇక ఆ చిత్తమునకు విషయంగా చెప్పొందే ఈ జగత్తు భ్రాంతిగాక మరింకేమిటి? ఇందులో యథార్థమేమున్నది?

**జగత్తు -** చైతన్యము యొక్క చింతనయే చిత్తముగా అగుచున్నది. ఆ చిత్తము తనయందు తానే కించిత్ భ్రమచే పరిభ్రమిస్తోంది. అట్టి చిత్తము యొక్క భ్రమతో కూడిన పరిభ్రమణమే ఈ 'జగత్తు' అయివున్నది. ఏదైతే "ఇది జనిస్తోంది – అది గతిస్తోంది" ...అని అనుభూతి పొందుతోందో... అద్దాని చమత్కారమే 'జగత్తు'. ఇక నీవో, కేవలం సంవిత్స్వరూపుడవేనని గ్రహించు.

❖

ఓ వ్యాధుడా! స్వప్నం గాంచుచుండగా సుషుప్తి ఎట్లు అనుభూతమౌతోందో... అట్లాగే, జాగ్రత్తు అనుభవించబడిన తరువాత స్వప్నం అనుభూతమౌతోంది. కాబట్టి ఓ మహామతీ! నేయి ఘనీభూతంగా ఉన్నా, ద్రవీభూతంగా ఉన్నా పాదార్థికంగా ఒక్కటే కదా! అట్లాగే నీవు... జాగ్రత్తు స్వప్నము వంటిదేనని గమనించు.

స్వప్నము జాగ్రత్తు వంటిదేనని గ్రహించు. ఎందుకంటే ఈ రెండూ కూడా ఏకము, అజము, అగు బ్రహ్మరూపములే అయివున్నాయి. చిదాకాశము విషయ శూన్యము, ఏకము, చిన్మాత్రము, జాగ్రత్, స్వప్న, సుషుప్తుల – రూపము అయివున్నది.

వాస్తవానికి ఇక్కడ నియతి లేదు. అనియతి లేదు. మిథ్యాభూతమగు స్వప్న జగత్తులో నియతి ఏమిటి? అనియతి ఏమిటి? ఈ జాగ్రత్ అనబడే స్వప్నం విషయంలో కూడా అంతే!

ఓ వ్యాధుడా! మరల ససిద్ధాంతపూర్వకంగా ప్రకటిస్తున్నాను. విను.

1. స్వస్వరూప చైతన్యమే జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను తన సమక్షంలో కల్పించుకుంటూ, అవే తానై వర్తిస్తోంది.

2. అట్లు జాగ్రత్, స్వప్న, సుషుప్తులలో వర్తిస్తూ ఒకానొకప్పుడు తన యొక్క దివ్యం, సర్వాతీతం, స్వస్వరూపం, కేవలసాక్షి, నిర్మలం, అసంగం, సర్వగతం – అగు అప్రమేయ ఆత్మ స్వరూపాన్ని ఏమరుస్తోంది. "నేను ఈ జాగ్రత్‌లోని ఒక స్వల్ప విభాగాన్ని. స్వప్నంలోని విభాగాన్ని, దేహపరిమితుడను. విషయ బద్ధుడను"... అని మననం చేస్తూ అకించత్వాన్ని ఏమరచి కించత్వాన్ని ఆపాదించుకుంటోంది.

3. అదియే ఎప్పుడో మరొకప్పుడు శ్రవణ–మనన–నిధిధ్యాసలనబడే ప్రయత్నమునకు సమాయత్తమౌతోంది.

4. అట్టి ప్రయత్నముచే సమాధి రూపమున వెలయుచున్నది కూడా చైతన్యమే!

5. అయ్యది అజ్ఞానమును త్యజించినప్పుడు ముక్తిరూపమున స్వయముగా ప్రకాశిస్తోంది. వాస్తవానికి అది నిత్యముక్తము.

అనగా...

1. ఆ నిర్మల తనయొక్క జాగ్రదత్వమును ఇంకొకప్పుడు సంవిత్తు జాగ్రత్ సంవిత్తుగా, స్వప్న సంవిత్తుగా, సుషుప్త సంవిత్‌గా కూడా వెలయుచున్నది.

2. జాగ్రత్ సంవిత్తు తన యొక్క జాగ్రదత్వమును నిరోధించిన సమయంలో మనోవ్యాపార మాత్ర రూపమగు స్వప్న సంవిత్తుగా అవతరించి స్వప్న స్ఫురణముగా అగుచున్నది.

3. ఇంకొకప్పుడు జాగ్రత్ స్వప్న సంవిత్తుల ఉభయముల స్వకీయమైన నిరోధముచే ఆ మూలసంవిత్తు "సుషుప్త సంవిత్ స్ఫురణ"ను ఆశ్రయిస్తోంది. సుషుప్త సంవిత్తుగా అవతరిస్తోంది.

4. "జాగ్రత్ – స్వప్న – సుషుప్తులను నేను నియమిస్తున్నాను కదా!" అను ప్రజ్ఞచే నియమముచే సర్వశోక రహితమగు సమాధి స్ఫురిస్తోంది.

పై (9) విషయములు నిర్దిష్టంగా గ్రహించి, సమాధిసుఖవిశ్రాంతిని కోరిన ముని ఇతర సమస్త వృత్తులను అంతరమున నియమం చేసి వేస్తున్నాడు. కనుక సాధూ! సమస్త వృత్తులను సనియమం చేసి 'ఆత్మాకార వృత్తి'ని సముపార్జించుకోవటమే 'సమాధి'.

వాయువులో తరంగాలుండటానిక కారణమేమున్నది? అది అకారణం. సముద్రంలో ఒక తరంగం ఒకానొక ఆకారమే చెందటానికి కారణమేమిటి? అదికూడా అకారణమే. లేక యాదృచ్ఛికం. అట్లాగే సంవిదాత్మ అకారణంగా జాగ్రత్–స్వప్న–సుషుప్తులతో కూడినదై స్ఫురిస్తోంది. అట్టి సంవిత్తుకు స్వప్నము మొదలైన విషయాకార స్ఫురణరూపమగు నియతి కూడా స్వభావం కాదు. సుషుప్తిలో జాగ్రత్ స్వప్నాలు స్ఫురించకపోయినా సంవిత్తు ప్రకాశిస్తూనే ఉన్నది సుమా! స్వతంత్రము, కారణ రహితము అగు చిద్రూపమునకు (ఆత్మకు) ఏ నియతి ఎట్లుండగలదు? నియతిచే సంవిత్తు పరిమితమైనది కానే కాదు. ఈ సృష్టి అనబడేది ఈ విధంగా కారణరహితమైయున్నది. చైతన్యమునకు వేఱుకానట్టి ఈ జగత్ సంబంధిత ఆకాశాదులు చైతన్యమునకు కారణం కాదు. చైతన్యమే తన భావనాపటిమచే జగదనుభవానికి కారణం!

చైతన్యం ఏ ఉపాధియందు ఎంతకాలం ఏ రూపంతో స్ఫురిస్తుందో అచట అట్లే అనుభూత మౌతోంది. అయ్యది పారమార్థికంగానో (లేక) వ్యావహారికంగానో (లేక) ప్రాతిభాసికంగానో అట్లు వ్యవహరించటమే నియతి. ఇంతకు మించి మరొక నియతి అనునదేదీ లేదు.

వాస్తవానికి నియతి కూడా సత్యం కాదు. అసత్యం కాదు. అది కూడా అనిర్వచనీయమే! (ఉన్నదనుకుంటే ఉంటుంది. లేదనుకుంటే లేదు. అందుకే అనిర్వచనీయమని చెప్పబడుతోంది). 'నియతి' అనునది కూడా లేకయే ఉన్నది కాబట్టే స్వప్నంలో ఒకప్పుడు సత్యత్వము, మరొకప్పుడు అసత్యత్వము వర్తిస్తున్నాయి.

**కదాచిత్ సత్యథా స్వప్నే కదాచిత్ చ అపి అసత్యతా,**
**అభావాన్నియతేరేవ కాకతాలీయమేవ తత్ ॥**

స్వప్న సూచనలు – శకునాలు సత్యమవటం, అసత్యం కావటం – ఇదంతా కాకతాళీయమేగాని,

దానికి 'నియతి' అంటూ ఏదీ లేదు. అట్లాగే, మణి-తంత్ర-ఔషధాల సత్యత్వ నియతి జాగ్రత్తులో దేశ-కాల-భావనానుసారమే ఏర్పడుచున్నాయి. ఇక జాగ్రత్-స్వప్నముల మధ్యగల భేదమేమంటావా?

జాగ్రత్ - స్వప్నాలు రెండూ చిత్ ప్రకాశ మాత్రములే అయివున్నాయి. తెలివి, తెలుసుకోవటం అనే రెండింటి సంయోగమే చిత్ ప్రకాశ మాత్రంగా వ్యవహరిస్తోంది. ఆ సంయోగమే తెలియబడు దానిని కల్పన చేసుకొని ఆస్వాదిస్తోంది.

జాగ్రత్‌లో కనబడే నగరం - స్వప్నంలో కనబడే నగరం ...ఈ రెండూ కూడా వేద్య - వేదనముల స్వరూపానుభవం దృష్ట్యా... సమానమైనవే అయివున్నాయి ఎట్లా అంటావా?

జాగ్రత్ వాస్తవానికి లేదు. ఏది 'జాగ్రత్' అని చెప్పబడుతోందో ...అది జగద్రూప స్వప్నమే అయివున్నది. సుమా! ఏది 'స్వప్నము' అని చెప్పబడుతోందో...అది స్వప్న సమయంలో 'సత్యమే' అను అభిప్రాయంతోనే పొందబడుతోంది. కనుక స్వప్నము స్వప్న సమయంలో జాగ్రత్తే !

వాస్తవానికి ఆత్మ నిత్య ప్రకాశకము. నిత్య జాగరూకము. నిద్రారహితమగు ఆత్మయందు జాగ్రత్ - స్వప్నాలు రెండూ లేవు. స్వప్నము కూడా వాస్తవానికి లేనిదే అగుచున్నది. స్వప్నము - అని ఏది చెప్పబడుతోందో అది. బ్రహ్మము యొక్క సుషుప్త - అసుషుప్త రూపమగు బోధరూపమే!

**వ్యాధుడు :** స్వామీ! ఈ జగత్ - స్వప్న - సుషుప్తులు ఆత్మయందు ఏర్పడి ఉన్నాయా! 'మరణము' అంటే ఏమిటి?

**మహాముని :**

**జాగ్రత్ స్వప్నాదయోవైతే న కేచన కదాచన ।**
**దృశ్యం పశ్యతి సత్తాశు మృతి భ్రాంతేరనంతరం ॥**

ఓ వ్యాధుడా! వాస్తవానికి ఆత్మ సర్వదా నిర్విషయము - నిర్విశేషము. అందుచేత అద్దానిలో జాగ్రత్ స్వప్న సుషుప్తులు లేవు. ఉన్నట్లుగా కనిపించేదంతా కూడా... ఆత్మయే అజ్ఞాన దృష్టికి ఆయా రీతులుగా అనిపిస్తోంది. ఇక మరణమంటావా? జీవన్ మరణముల అంతరమున - బాహ్యమున కూడా చిత్‌సత్తయే ఆయా రీతులుగా ప్రకాశిస్తోంది. అలుప్త రూపమగు చిత్ సత్తయే జీవించి ఉన్నంతవరకు ఆయా దృశ్యములను చూస్తూ తన స్మృత్యనుసారం (చిత్తానుసారం) ఆయా అనుభవములను - అనుభూతులను పొందుతోంది. అటు తరువాత 'మరణము' అనే భ్రాంతి అనంతరం కూడా మరియొక దృశ్యమును శీఘ్రంగా అనుభవించుచున్నది.

అనంత సముద్రంలో తరంగాలన్నీ ఒకే జలమయమై ఉన్నప్పటికీ, వేరు వేరు కానప్పటికీ వేరు వేరుగా స్పష్టంగా అగుపిస్తున్నాయి కదా! ఆకాశమంతా ఒక్కటే అయినప్పటికీ దిగ్భ్రమచే తూర్పు-ఈశాన్యం-పడమర-దక్షిణం-వాయవ్యం-ఉత్తరం మొదలైన దిక్కులు స్పష్టంగా కనిపిస్తున్నాయి కదా! (అటు సూర్యబింబమును - ఇటు భూగోళమును రహితం చేసి దర్శిస్తే దిక్కులు ఎక్కడున్నాయి?)

అట్లాగే జాగ్రత్-స్వప్న-సుషుప్త్యాదులు, వాటి అంతర్గతంగా కనిపించే విషయాలు-దృశ్యాలు - సంఘటనలు... ఇవన్నీ బ్రహ్మం కంటే వేరుకానప్పటికీ వేరు వేరుగా ఉన్నట్లు స్పష్టంగా అనిపించవచ్చు

గాక! అయితే, జీవన్-మరణ-పునః జీవనములు కూడా అట్టివే ! ఆయా సందర్భములలోని స్వకీయ భావనానుసారంగా స్ఫురించుచున్నాయి.

ఒక శిలాకోశంలోనో, గాజుకాయలోనో గీతలున్నట్లుగా 'పరమాత్మ' అనే శిలాకోశంలో (గాజు కాయలో) ఈ సృష్టులన్నీ భిన్నభిన్న రూపాలుగా స్ఫురిస్తున్నాయి. మరింక పరమాత్మ యందు జాగ్రత్ స్వప్న - సుషుప్తులు ఉండటమనే ప్రసక్తి ఎక్కడిది? ఆత్మయే జాగ్రత్ - స్వప్న - సుషుప్త వ్యవస్థారూపమును, తత్ విరుద్ధమైనట్టి తురీయావస్థా రూపమును వహిస్తోంది. ఆకార రహితమైనప్పటికీ సర్వాకారయుక్తమై ఉంటోంది. కాలకల్పనారహితమైనప్పటికీ సృష్ట్యాత్మకమగు కాలముచే పరిచ్ఛిన్నమగుచున్నట్టి శరీరము ధరించినదగుచున్నది. దృశ్య రహితమైన చిచ్ఛరీరం ధరించినప్పటికీ దృశ్యరూపమున వ్యాపించి ఉన్నదగుచున్నది. అది దృశ్యమునందు ప్రవేశించి ఉండవచ్చుగాక! దృశ్యదర్శన తాదాత్మ్యముచే తన అప్రమేయ చిత్‌భావనను ఏమరచి ఉండవచ్చునుగాక! జాగ్రత్-స్వప్న-సుషుప్తాది దేహవస్త్రములను ధరించ వచ్చునుగాక! ఏది ఏమైనప్పటికీ అది నిజ - శుద్ధ చిదాకాశమాత్రము కంటే ఒకింత కూడా భిన్నంగా లేదు. ఉండదు.

ఓ మిత్రమా! వ్యాధుడా! ఇక్కడ నీకు కనిపించే ఆకాశ-వాయు-అగ్ని-జల-పృథ్వి-లోక-లోకాంతర-మేఘ సహిత-వస్తు సహిత-సంఘటనాసహిత దృశ్యజగత్తు అంతాకూడా సృష్ట్యాది యందు కారణరహితమైయున్నది.

అందుచేత ఈ దృశ్య జగత్తంతా హిరణ్యగర్భుని చిత్తరూపమే అయివున్నది. చిత్తమయమగు మనోరాజ్యంలో కనిపించేదంతా నామరూపరహితమే కదా! ఈ దృశ్యమంతా కూడా అట్లాగే నామరూపరహితం. ఇదంతా 'జ్ఞాన శరీరం' అనదగు మనోసాక్షితో కూడుకుని ఉన్నది. మనస్సే ఈ దృశ్యమునకు పుట్టినిల్లు. మనోలయముచే ఇదంతా కూడా శుద్ధ జ్ఞాన స్వరూపమే! వస్తుతః ఇదంతా మరింకేదీ అయి ఉండలేదు.

❖❖❖

# 21. ఈ దృశ్యంలో కారణత్వమనేది ఉన్నదా? లేదా?

(**అగ్నిదేవుడు :** భక్తుడగు నాలుగవ విపశ్చిత్‌తో మహాశవ పూర్వవృత్తాంతాన్ని విశదీకరిస్తూ...)

**లుబ్ధకుడు అనే వ్యాధుడు :** ఓ మునీంద్రా! మీరు ఆ ఒకానొక ప్రాణి హృదయంలో ప్రవేశించి, ఆతని స్వప్నలోకంలో అనేక విశేషాలు చూస్తూ ఒక గ్రామంలో, ఒక ఇంట్లో భార్య, పిల్లలు, బంధువులతో రోజులు గడుపుచున్నంత వరకు కథా క్రమమంతా చెప్పారు. ఆ తరువాత ఏం జరిగిందో చెప్పండి. మీరు చెప్పేదంతా చాలా చమత్కారంతో కూడి ఉన్నది సుమా!

**మహాముని :** ఓ వృత్తాంతాభిలాషీ! సాధూ! వ్యాధుడా! లుబ్ధకుడా! ఆ ప్రాణి హృదయతేజము నందు ఏ అపూర్వ వృత్తాంతం సంభవించినదో... అది చెప్పుతాను విను.

❖

అప్పుడు క్రమంగా ఆత్మయొక్క చమత్కారమంతా ఏమరచాను. నా పూర్వ వృత్తాంతం కూడా మరచాను. ఆ ఇంట్లో నా భార్య-పిల్లలతోను, తదితర బంధువులతోను, గృహ వ్యవహారములతోను, ధనాదులను సంపాదించే వ్యాపార వ్యవహారాలతోను నిమగ్నమై నెలలు, సంవత్సరాలు గడిచిపో సాగాయి. భార్యపట్ల అనురక్తితో, పిల్లలను పెంచుతూ, ధన సముపార్జనాది ఆయా వ్యవహారాలతో 14 సంవత్సరాలు గడచిపోయాయి. ఒక రోజు ఒక అనుకోని సంఘటన జరిగింది.

❖

ఒకానొక రోజు ఉదయమే నేను ఏదో పని మీద బయటకు వెళ్లే ప్రయత్నంలో ఉండగా ఒక బాటసారి మా ఇంటికి వచ్చాడు. వస్త్ర-వేషధారణను బట్టి ఆయనను ఒక గొప్ప తపస్విగా, పూజనీ యుడుగా, మహాజ్ఞానిగా, బోధజ్ఞుడుగా గుర్తించాను. ఆయన ఫాలభాగం మహత్తరమైన తేజస్సుతో వెలుగొందుతోంది. కళ్ళలో ఒకానొక అనిర్వచనీయమైన ప్రశాంతత కనిపిస్తోంది. అనేక గృహ కార్యక్రమాలలో అవిశ్రాంతంగా సంచరిస్తూ అలసివున్నాను కదా! అందుచేత ఆయన పుణ్యవశం చేత మా ఇంటిని పావనం చేయటానికే వచ్చి తలుపులు తట్టినట్లు నా కనిపించింది. ఆయనను సాదరంగా మా ఇంట్లోకి ఆహ్వానించి ఉచితాసనం సమర్పించాను. నేను, నా భార్య, పిల్లలు అందరం కలిసి ఆయనకు అతిథి సత్కారాలు సమర్పించి పూజించాము. ఆయన మా ఆతిథ్యం చిరునవ్వుతో స్వీకరించారు. మధ్యాహ్న భోజనం తరువాత విశ్రాంతి తీసుకోసాగారు. అప్పుడు ఆయనను సమీపించి వినమ్రుడనై నమస్కరించాను. మహనీయులగు జ్ఞానులతో సంభాషించి సంశయ నివృత్తి చేసుకోవాలని, జ్ఞాన విషయాలు తెలుసుకోవాలనే అక్కడి పెద్దలు చెప్పే వాక్యాలను మననం చేస్తూ ఆయనకు సమీపంగా ఆసీనుడనైనాను.

**ద్వితీయ ముని :** చాలా సంతోషం నాయనా! మీ అతిథి మర్యాదలకు చాలా సంతోషించాను. మీ బంధు మిత్రులందరూ సకుశలమే కదా!

**నేను (మహాముని) :** స్వామీ! మీరు క్రోధరహితులు. విషయ సుఖములందు ఏమాత్రం ఆసక్తి లేనివారు. మహాజ్ఞానంతో ప్రకాశిస్తున్నారు. మీ రాకతో మా ఇల్లు పావనం అయింది. మీరు ఈ జగత్‌స్థితిని ఎరిగినవారు కదా!......

**ద్వితీయ ముని :** బిడ్డా! మీ గృహమునకు శుభమగుగాక! ఏమిటి? ఏదో అడగాలని అనుకుంటున్నట్లుగా కనిపిస్తున్నావు? నీకేమైనా సందేహాలుంటే అడుగు. మీరు ప్రశ్నిస్తేనే కదా, మీకు మేము చెప్పగలిగేది!

**నేను (మహాముని) :** హే మహాత్మా! ఈ లోకం సంగతి మీకు తెలిసినదే కదా! ఫలాభిలాషులై ప్రయత్నశీలురగు రైతులకు శరత్కాలంలో ధాన్యాదులు లభించునట్లుగా, కర్మయుక్తులగు జీవులకు వారి వారి శుభాశుభ కర్మలచే శుభాశుభములు ప్రాప్తిస్తూ ఉంటాయి కదా!

కొంతకాలంగా ఇక్కడి నుండి కొంత దూరంగా నా భార్య పుట్టింటివారి గ్రామం ఉన్నది. మా మామగారు గొప్ప ఆస్థిపరుడు. వాళ్ళ జీవితాలు కొంతకాలం వరకు సుఖంగా జరుగుతున్నాయి.

కాని రెండు సంవత్సరాల క్రితం సమయానికి వర్షాలు లేక, వారికి పంట చేతికి రాక భూములన్నీ వట్టిపోయాయి. పెట్టుబడి కూడా చేతికి రాలేదు. ఆ ప్రాంతంలోని రైతులంతా అల్లల్లాడిపోయారు.

ఇక ఈ సంవత్సరం! చక్కగా వర్షాలు వచ్చాయి. పంట చేతికందే తరుణం వచ్చింది. "అమ్మయ్యా! ఇక కష్టాలు గట్టెక్కినట్లే" ...అని ఆ ప్రాంతపు ప్రజలంతా సంబరాలు చేసుకోసాగారు. సరిగ్గా కోతలు ప్రారంభమయ్యే తరుణంలో అకస్మాత్తుగా కుండపోత జడివానలు ప్రారంభమైనాయి. నాలుగు రోజులలో అక్కడి పంట భూములన్నీ జలమయమై పోయాయి. ఇళ్ళకు రావలసిన పంటలన్నీ జలదేవత తరలించుకుపోయింది. మరల మా మామగారి కుటుంబం వీథిన పడింది. పూర్తిగా చితికిపోయిందనే చెప్పాలి. అక్కడి రైతులంతా దేశాల వెంబడి భిక్షాటనం చేసి బ్రతకవలసిన కాలం వచ్చింది. అనేకమంది జనులకు చెప్పరాని ఇక్కట్లు తెచ్చిపెట్టిన అనావృష్టి – అతివృష్టి చూచి నాకు కొన్ని సందేహాలు వస్తున్నాయి.

**రెండవ ముని :** చెప్పు నాయనా! ఏమిటి  నీ సందేహాలు?

**నేను (మహాముని) :** ఏ ప్రాంతంలో అయితే అతివృష్టి – అనావృష్టి వచ్చి పడిందో ...అక్కడ అనేక మంది ప్రజలకు ఇక్కట్లు వచ్చిపడ్డాయి కదా! ఎందుచేత? అక్కడి ప్రజలంతా సామూహికంగా ఏమైనా అశుభకార్యాలు నిర్వర్తించటం చేతనా? (లేక) తదితర గ్రామాలు సుభిక్షంగా ఉండటానికి కారణం? వారేమన్నా సామూహికంగా శుభకర్మలు నిర్వర్తించటం చేతనా?

ఏ సామూహిక దుష్కర్మల చేత దుర్భిక్షాలు కరువు కాటకాలు వచ్చి సామూహిక వేసటలు కలుగుతాయి? ఏ సామూహిక సత్కర్మల కారణంగా అతివృష్టి – అనావృష్టి – దుర్భిక్షాలు రాకుండా ఉంటాయి? ఆ దుర్భిక్షం అనుభవించే ప్రజలంతా ఏం పాపం చేశారు?

ఈ దుర్భిక్షం ఉంది చూచారూ! అది అనేకమంది జనులచే భక్ష–అభక్ష్యాలను కూడా భుజింప జేస్తోంది. ఆ జనులలో కొందరు ఏదైనా తప్పుచేస్తే అందరికీ చుట్టుకున్నదా? అట్లా అయితే, అనేక మంది (పాపం చేయని) జనులను కొద్దిమంది చేసిన పాపం ఎందుకు బాధిస్తోంది? ఆ జను లందరికీ ఏకకాలంలో ఇంతటి సమాన దుఃఖం ఎందుకు కలుగుచున్నది? కర్మలకు, సామూహిక కర్మలకు, వ్యక్తిగత సుఖదుఃఖాలకు, సామూహిక సుఖదుఃఖాలకు లంకె ఎట్లా ఏర్పడుతోంది? ఇదీ, నా సందేహం!

❖

ఓ వ్యాధుడా! ఆ మునీశ్వరుడు నా సందేహాలన్నీ ఓపికగా, మౌనంగా విన్నారు. అంతా విని ప్రశాంతముతో కూడిన చిరునవ్వుతో అమృత ప్రవాహము – అతి సుందరము – దోషరహితము అయిన వాక్యాలు ఈ విధంగా చెప్పసాగారు.

**అన్యముని :** ఓ గృహయజమానీ! ఈ నీ – నా అంతఃకరణం చిత్తు యొక్క, చిత్తము యొక్క వివేకంతో కూడియున్నది కదా! అట్టి నీ వివేక – స్వానుభవాలన్నీ క్రోడీకరించి ముందుగా నీవే నాకు సమాధానం చెప్పు. ఇప్పుడు నిన్ను కొన్ని ప్రశ్నలు అడుగుచున్నాను.

ఈ దృశ్యం కనబడుతోంది కదా! ఏ కారణం చేత ఈ దృశ్యం ఇట్లా ఏర్పడి ఉంటుంది? ఈ దృశ్యం యొక్క కారణము సత్తా? అసత్తా?

ఆ ప్రశ్నకు నాకు సమాధానం దొరకక నేను వారి వైపు మౌనంగా చూస్తూ ఊరుకుండి పోయాను.

**అన్యముని :** ఏమయ్యా మౌనం వహించావు? ఒక్కసారి నీవు నీ సమస్త పూర్వ వృత్తాంతాలకు 'సాక్షి'గా ఉన్న 'ఆత్మ'ను స్మరించు.

నీవు ఎవరవు? ఎక్కడున్నావు? ఎక్కడి నుండి వచ్చావు? ఎందుకొచ్చావు? ఉన్నచోటే ఉన్నావా? లేనిచోటికి వచ్చావా? ఈ దృశ్యమేమిటి? ఈ దేహం నీదా? ఇది నీవా? ఇందులో సారమేమిటి? అసారమేమిటి? నీకు కలుగుచున్న దుఃఖం సంఘటనల వలన కలుగుతోందా? నీ నిర్వచనముల వలన కలుగుతోందా?

**నేను (మహాముని) :** ... (శ్రద్ధతో కూడిన మౌనం!)

**అన్యముని :** ఒకానొక విషయం నీకిప్పుడు గుర్తు చేస్తున్నాను, విను. ఈ దృశ్యమంతా స్వప్నమాత్రమే అయి భాసిస్తోంది. ఆశ్రమంలో శిష్యులతో వ్యవహరించే నీవు ...ఒకానొక సమయంలో బాటన వెళ్ళే ఒక వ్యక్తి స్వప్నలోకంలో ప్రవేశించి, ఇప్పుడు ఇవన్నీ అనుభవిస్తున్నావు. అవునా? కాదా? ఈ విషయం నీవు ఎందుకు ఎరుగటంలేదు? ఓ మిత్రమా! మహామునీ! ఈ దృశ్యమంతా ఏమిటి? నీవు నీ స్వప్నంలో నన్ను చూస్తున్నావు... నేను నా స్వప్నంలో నిన్ను చూస్తున్నాను. ఈ నీ జగత్తు, నా జగత్తు, ఆ ఒకానొక ప్రాణి స్వప్న జగత్తు... ఇవన్నీ కూడా ఎందులో ఉన్నాయి? ... యోచించు.

**జగత్తు :** వాస్తవానికి జగత్తు నిరాకారం. అనిర్వచనీయం. సర్వకల్పనా వర్జితం.

ఎందుకంటే... స్వప్నమునకు ఆకారమేమిటి? నిర్వచనమేమిటి?

**చిన్మాత్రము :** "నిరాకారం, అనిర్వచనీయం, సర్వకల్పనా వర్జితం, నీ – నా స్వరూపం" అగు చిన్మాత్రము (చిదాత్మ) అనే రత్నముయొక్క కాంతివిశేషమే ఈ జగత్తు. కాబట్టి!

అట్టి చిన్మాత్రము (ఆత్మ)నకు ఒకానొక విశేష లక్షణం ఉన్నది. అది స్వతఃగా సర్వవ్యాపకమైనప్పటికీ కూడా... అది తాను ఎచట ఎట్లు భావన చేస్తుందో, తలచుకుంటోందో అచట ఆ రూపమే అయివుంటుంది. అది అద్దాని స్వాభావిక లక్షణం.

**సకారణత్వ కలనాత్ సర్వమ్ అస్య సకారణమ్ ।**
**అకారణత్వ కలనాత్ అస్య సర్వమ్ అకారణమ్ ॥**

అద్దాని రచితమగు సమస్తము కూడా అద్దాని సంకల్పానుసారమే ఏర్పడి ఉంటోంది." – అని చెప్పబడుచున్నది. అద్దాని కల్పన అంతా – అద్దాని "సకారణత్వ కల్పన"చే సకారణమగుచున్నది. నీ యొక్క – నీ బంధువు యొక్క – నా యొక్క సకారణ – అకారణ కల్పనలే మనకు జగత్తులుగానో, మరింకేదోగానో భాసిస్తోంది కదా!

"అకారణత్వ కల్పన"చే అకారణమగుచున్నది. "సకారణత్వ కల్పన" చే సకారణమే అగుచున్నది.

ఏ ప్రాణి యొక్క హృదయతేజం నందు నీవు, నేను, నీ భార్య, నీ భార్య వైపు బంధువులు అందరమూ ఉన్నామో... ఆతడు మనందరికినీ విరాడ్రూపుడు అయి వ్యాపించివున్నాడు.

ఆతడు సామాన్య వ్యష్టిరూపుడే అయినప్పటికీ, మనయొక్క చైతన్యకల్పనావశం చేత ఆతడు 'విరాడ్రూపం' పొందినవాడగుచున్నాడు.

ఈ ప్రాణిలాగానే... మరొక ప్రాణి, మరికొందరు మనుజులకు (జీవులకు) విరాడ్రూపుడై ఉండటం సర్వవ్యాపకమగు చిదాత్మయందు చమత్కారంగా జరుగుతోంది. ఆ ప్రాణియే ఆ జీవుల సుఖ దుఃఖములకు, సంపత్ – విపత్తులకు, సుకృత, దుష్కృతాలకు భోక్తృత్వ రూపముచే 'కారణము' అగుచున్నాడు. ఆ విరాడ్రూపుని యొక్క కఫము – పిత్తము మొదలైన ధాతువులు విషమగతిని పొందినప్పుడు కలిగే వికారము వలన కలిగే దుర్భిక్షము మొదలైన సాధారణ దుఃఖములు ఆ విరాడాత్మ యొక్క అవయవ రూపమగు జన సమూహానికి సమానంగా ఉంటూ ఉంటాయి. దుర్భిక్షం, వర్షాభావం, ప్రళయం రావటం – పోవటం ఇవన్నీ జనసమూహానికి ఒకేసారిగా ఒక్కొక్కసారి సంభవిస్తూ ఉంటున్నాయి.

విరాట్‌రూపుని సత్తాయే ఈ సృష్టియొక్క సృష్టి రూప సత్తా! ఒకే కొమ్మపై నిలబడ్డ అనేకమంది మనుజులు కొమ్మ విరగగా అందరూ నేల కూలుతారు కదా! ఒక వృక్షంపై పిడుగు పడితే అందు నివసించే అనేక జీవులు భస్మీభూతులవుతారు. అట్లాగే కాకతాళీయ న్యాయంచేత ఒకే కాలంలో పరిపక్వమైన దుష్టకర్మలు కలిగినట్టి ప్రాణులందు దుఃఖాదులు వచ్చిపడుతూ ఉంటాయి. అయితే ఇక్కడొక విశేషం ఉన్నదని నీవు గమనించు.

**కర్మ కల్పనయా సంవిత్ స్వకర్మ ఫలభాగినీ ।**
**కర్మ కల్పనయోః ముక్తా న కర్మఫలభాగినీ ॥**

ఈ జీవుడు 'సంవిత్' స్వరూపుడు కదా! అట్టి సంవిత్ "నాకు కర్మలు – కర్మఫలాలు ఉన్నాయి కదా!" ...అను రూపంలో ఉండే ఒకానొక స్వకీయమైన కల్పనను ఆశ్రయించినప్పుడు మాత్రమే 'కర్మలు – కర్మఫలాలు' అనేవి ఉంటాయి. కర్మ ఫలాల కల్పనచే తదనుకూలమైన – ప్రతికూలమైన 'అనుభవం' అనేది కూడా ఉంటుంది. వాస్తవానికి సంవిత్తు కర్మలకు – కర్మఫలాలకు (తదనురూపమైన కల్పనలకు) ముందే ఉన్న శుద్ధ స్వరూపంకదా! ఎప్పుడైతే సంవిత్తు "కర్మలు – కర్మఫలాలు నాకు లేవు. నాకు సంబంధించినవి కావు" అనే నిర్ణయం పుణికి పుచ్చుకొని స్వస్వరూపాను సంధానంచే అభేద్యమై ఉంటుందో... అప్పుడు ఆ సంవిత్తు కర్మఫలభాగి అయ్యే అవకాశమే ఉండదు.

ఈ శరీరాలు, కర్మఫలాలు జాగ్రత్–స్వప్న–సుషుప్తులు రావచ్చు. రాకపోవచ్చు. సంవిత్ సర్వదా యథాతథం! కల్పనచే అనుభూతిపూర్వకమైన అనుభవం దాని వస్త్రంలాగా, ఉపకరణంలాగా రూపుదిద్దు కుంటోంది. కల్పన – అద్దానిని అనుసరించి ఉండే అనుభవం ఇవన్నీ సహేతుకమా? అహేతుకమా?

**యా యా యత్ర యథో ఉదేతి, కల్పనా అల్ప అథవా అధికా ।**
**సా సా తత్ర తథైవ అస్తే, సహేతుకమ్ – అహేతుకమ్ ॥**

ఏఏ కల్పన ఏఏ రీతిగా ఉదయిస్తుందో... అది ఆ కల్పన రూపంలోనే ఉంటుంది. – అది సహేతుకమా? అహేతుకమా? అధికమా? అల్పమా?... అని అడిగితే, సహేతుకంగా కల్పన చేస్తే సహేతుకం. అహేతుకంగా కల్పన చేస్తే అహేతుకం. అధికమనుకొంటే అధికం. అల్పమనుకొంటే అల్పం. కల్పనను అనుసరించే దేహ–మనో–జాగ్రత్–స్వప్న–సుషుప్తి అనుభవాలు, అవగాహనలు, అభిప్రాయాలు, సుఖాలు, దుఃఖాలు ఉంటున్నాయి.

వాస్తవానికి స్వప్నానుభవానికి కారణంగాని, సహకారి కారణాలుగాని లేవు కదా! కాబట్టి స్వప్నరూపంగా కనిపించేదంతా – "అనాది, శివరూపము, అజము" అయినట్టి చిద్రూపమగు పరబ్రహ్మమే అయివున్నది. స్వప్నంలో తెలివియే తెలియబడేరూపంగా కనిపిస్తోంది. జాగ్రత్ కూడా అట్టిదే! జాగ్రత్ కూడా స్వతఃగా అకారణం. కనుక చిద్రూపమగు పరబ్రహ్మమే అయివున్నది.

**నేను (మహాముని) :** స్వామీ! ఇంతకీ నా ఎదురుగా ఉన్న ఈ గృహ – బంధు – స్వదేహ – పరదేహాదులతో కూడిన ఈ దృశ్య జగత్తు సదాత్మకమా? లేక, అసదాత్మకమా?

**రెండవముని :** నీ ప్రశ్నకు సమాధానం చెప్పియే ఉన్నాను. అయినా మరల చెప్పుచున్నాను. విను. నీవు సదాత్మకంగా భావన చేస్తే ఇదంతా సదాత్మకమే. అసదాత్మకంగా భావన చేస్తే ఇదంతా అసదాత్మకం, ఊహామాత్రం!, భావనామాత్రం (యద్భావం ... తద్భవతి)!

ఇదంతా అందుకే "సదసదాత్మకం" అని చెప్పబడుతోంది. అందుకే స్వప్న భ్రమలో కొన్ని సదాత్మకంగాను, మరికొన్ని అసదాత్మకంగాను, కొన్ని సకారణంగాను, మరికొన్ని అకారణంగాను భాసిస్తున్నాయి.

స్వప్నంలో సకల వృత్తులు కాకతాళీయ న్యాయంతో భాసిస్తున్నాయి. జాగ్రత్తు కూడా స్వప్నం వంటిదే! జాగ్రత్తులో అనుభవం కూడా స్వప్నంలోని అనుభవం వంటిదే! వీటికి కూడా మూలం యావృత్తియే! ఈ వ్యాప్తమై కంటికి కనిపిస్తున్న జగత్తు స్వప్నం కంటే భిన్నం కాదు. ఏ కార్య–కారణ క్రమము స్వప్నంలో ఉదయిస్తోందో... అదంతా కూడా 'ఆది చైతన్యము' యొక్క ప్రకాశ మాత్రమే అయివున్నది. నీవో... చైతన్యమే స్వరూపముగా కలిగియున్నవాడవై ఉన్నావు. చైతన్యము యొక్క నిర్ణయమే 'జాగ్రత్' అనబడు ప్రపంచమున స్థూల దృశ్యమునకు తదర్థపూర్వకంగా కారణమౌతోంది.

ఈ కారణం చేత "ఈ సమస్తము కూడా శాంతము – నిర్మలము అయినట్టి పరబ్రహ్మమే" ...అని బ్రహ్మజ్ఞులు ఎలుగెత్తి పలుకుచున్నారు.

**మహాముని :** ఓ మహామతీ! మీరు చెప్పే దానిని అనుసరించి సమస్త పదార్థములకు సత్యమగు బ్రహ్మమే కారణమనికదా చెప్పబడుచున్నది?

**రెండవ ముని :** అవును.

**మహాముని :** అయితే ఆ పదార్థములన్నీ బ్రహ్మమువలెనే "సత్యమే" అయివుండాలి కదా!

**రెండవ ముని :** అవును.

**మహాముని :** అయితే ఈ ఈ పదార్థములన్నీ బ్రహ్మము వలెనే సత్యమేనంటావా?

**రెండవ ముని :** అయితే ...ఇక్కడ కొన్ని ప్రశ్నలు పరిశీలిద్దాం. 1. బ్రహ్మము సత్యపదార్థముల యొక్క కారణమా? 2. లేక అది మిథ్యాపదార్థముల యొక్క కారణమా? 3. లేక అది సజాతి పదార్థముల యొక్క కారణమా? 4. లేక అది విజాతి పదార్థముల యొక్క కారణమా?

...పై నాలుగు పక్షములలోను

1. (ఒకటి) మరియు (మూడు) పక్షములను అనుసరించి... సత్య పదార్థముల యొక్క – సజాతి పదార్థముల యొక్క కారణం – బ్రహ్మము. అప్పుడు బ్రహ్మము నుండి బ్రహ్మమే ఉత్పత్తి అవుతుంది గాని, జగత్తు అనబడు మరొకటేదో కాదు.

2. (రెండు) మరియు (నాలుగు) పక్షములను అనుసరించి... "మిథ్యా పదార్థములకు విజాతి పదార్థములకు కారణం – బ్రహ్మము! సత్యమగు బ్రహ్మము నుండి అసత్యమగునట్టిది ఉత్పన్న మవటమేమిటి?"

...ఈ విధంగా ఈ 'జగత్తు' అనబడే దానికి కారణమే లేదు. ఇది అకారణం (ఇక్కడ జగత్తు అంటే సజాతి – విజాతి పదార్థముల సమ్మేళనం) లేకుంటే ఇక్కడ గల ఆకాశమునకు కారణమేమిటి చెప్పు? అట్లాగే పృథివి మొదలైన సృష్టికి, అవిద్యకు, బ్రహ్మదేవునికి కూడా బ్రహ్మము నుండి వేరై ఉత్పన్నమవటానికి కారణమేమిటో చెప్పు? 'సృష్ట్యాది'లో ప్రకిటిత, అప్రకటిత, ప్రదర్శిత, అప్రదర్శిత అనుభవమాత్ర రూపములే అయినట్టి వాయువు, తేజము, జలములకు కారణమేమిటి చెప్పు?

ఈ విధంగా ఈ జగత్తులోని పదార్థములన్నిటికీ కారణం సిద్ధించటంలేదు. కనుక ఇదంతా శూన్యమే అయివున్నది. అట్లాగే ఒకడు మరణించిన తరువాత మరొక దేహం సిద్ధించటానికి కారణమేమున్నది?... లేదు... కాబట్టి... ఆరంభం నుండి సృష్టులన్నీ కూడా ఇట్లాగే ప్రవర్తిస్తున్నాయి... అకారణంగా! ఇట్లా... నిష్కారణంగా 'జగత్తు' అనునది పొందబడుచున్నది... స్వప్నంలోలాగానే!

❖

ఒకానొకడు ఒకచోట కూర్చుని ఆకాశంలోకి చూడసాగాడు. చూడగా చూడగా ఆతనికి చక్రాకారములు ఉత్పన్నమై, నశించుచున్నట్లు కనిపించసాగింది. అట్టి చక్రాకార ఉత్పన్న – నాశనములు ఆతనికి ఎందుకు కనిపించాయి? వాస్తవానికి ఆకాశంలో అవన్నీ ఉండవు కదా? ఆతనికి ఆతని దృష్టి భ్రమ చేతనే ఆకాశంలో చక్రాకారాలు కనిపిస్తున్నట్లుగానే, మిథ్యాభూతమైన ఈ జగత్తులన్నీ భ్రాంతిచే ఉత్పన్నములై, భ్రాంతిచే విలీనమైపోతున్నాయి.

నిష్కారణంగా ప్రవృత్తమై దృశ్య సంస్కార రూపమగు దృష్టియే 'సృష్టి' రూపంగా అనుభవమయ్యే హిరణ్యరూపమగు ఈ జగత్తు. అట్టి ప్రవృత్తిచే కనిపించే ఆయా వస్తుజాలంలో "ఇది పృథివి, ఇది ఇల్లు, ఇది గ్రామం, ఇది పట్టణం, ఇది నాది, ఇది నీది" ...మొదలైనవన్నీ నిష్కారణంగా చెన్నొందుచున్నాయి. బ్రహ్మమే అనేక రూపాలుగా అనుభవమౌతోంది.

మొట్టమొదట ఈ సృష్టులు చిదాకాశమున "వాయువునందు చలనం" లాగా మనోరాజ్య సదృశ్యమై (భావనారూపమై) అతి సూక్ష్మంగా భావింపబడుచున్నాయి. ఆ తరువాత చిరకాలాభ్యాసంచేత

ఆ భావనయే "స్థూలభావన"గా రూపుదిద్దుకుని స్వయముగా ఈ దేహ – కర్మ – సకర్మ – దుష్కర్మ మొదలైన కారణములను కల్పిస్తోంది.

**నియతి -** మొట్టమొదట చైతన్యము ఎచ్చట – ఎట్లు ఏ కల్పన గావించుచున్నదో ... అచట ఆ రీతిగానే 'నియతి' స్వరూపమును స్వయంగా ధరించుచున్నది. "స్వకల్పిత పదార్థాలలో స్వానుభవంచే సిద్ధించే అనుభూతి" ... అనేది ప్రతి జీవునికీ ప్రతిరోజూ అనుభవమగుచున్నదే సుమా! అనగా ఈ నీ – నా భౌతికదేహాలు కూడా చైతన్యము యొక్క కల్పిత రూపమే అయివున్నాయి.

సృష్టి వైపుగా అభిముఖమైనట్టి హిరణ్యగర్భ చైతన్యము... "నేను నా నిజచిద్రూపముచే స్వయంగా ఈ ప్రకారంగా రూపములను ధరించెదనుగాక" –అనే సూక్ష్మ మనోభావనను ఆశ్రయించి, ఏఏ ప్రకాశాత్మకమగు రూపములను ధరించుచున్నదో, అవన్నీ నేటికీ అట్లే స్థితి కలిగియున్నాయి. అదియే 'నియతి' అనే శాస్త్రార్థ శబ్దముచే ఉద్దేశించబడుతోంది. అయితే, ఏ హిరణ్యగర్భ చైతన్యము ఇట్లు భావనారూప ప్రవాహ జగత్తుగా ప్రకాశమానమగుచున్నదో, ఆ చైతన్యమే అతిమహత్తరమైన ఉత్కృష్ట ప్రయత్నంచేత (తపశ్చర్య – ఆత్మజ్ఞానము మొదలైన ప్రయత్నముల చేత) ఇదంతా మరొక విధంగా గావించటానికి కూడా సమర్థమే అయివున్నది.

ఎక్కడ చైతన్యము కారణమును కల్పించుచున్నదో, .... అక్కడ ఆ కారణము యొక్క సఫలత్వం సంభవిస్తోంది. ఎక్కడ కారణత్వం కల్పించదో... అక్కడ ఆ కారణము కూడా అకారణమే అగుచున్నది.

మొట్టమొదట వాయువునందు చలనం ఎట్లా అకారణమో... ఆ వాయువు యొక్క వ్యాప్తం వలె భాసించే ఈ భావనా వ్యాప్త జగత్తు కూడా అసద్రూపమే అయి అప్పటికప్పుడు ఈ రీతిగా భాసిస్తోంది! ఇప్పుడు కూడా అట్లాగే భాసిస్తోంది. ఓ మిత్రమా! నీ భావనామాత్రమే నీచే పొందబడే జగత్తు. నీ యొక్క 'నియతి' అనే పొట్లపాదుకు నారువేసి, నీరు పోసి పెంచి – త్రుంచుచున్నది నీవే!

నీవు 'సత్తు' అనుకుంటే ఇదంతా సత్తే! 'అసత్తు' అనుకుంటే దేహ – జన్మ – మృత్యువులతో సహా అంతా అసత్తే. ఇక సమష్టిగా వచ్చే కష్ట – సుఖాల విషయానికి వస్తే... కొందరు జీవులు కలిసియే శుభాశుభ కర్మలు నిర్వర్తిస్తూ ఉంటారు. అట్టివారు ఆ కర్మల ఫలములను కలిసియే అనుభవిస్తూ ఉంటారు. వారిలో ఎవరైతే కర్తృత్వాభిమాన రాహిత్యముచే అకర్తలైయుండి, ఆయా సర్వ సంఘటనలకు తన్మయం కాకుండా, తమ అప్రమేయ స్వస్వరూపానుభూతి యందే ఉంటూ ఉంటారో, అట్టివారు దేహ – దృశ్యాదులు నిష్కారణమైనట్లు గ్రహించినవారై సంఘటనలను 'కారణ రహితం' అని గ్రహించి ఉంటారు. అట్టివారికి ఈ ప్రపంచమంతా కల్పితమైన ఆటలో కల్పితమై నియమాదులు లాగా కనిపిస్తాయి.

"నిష్కారణంగా దేహాదులు సంభవిస్తున్నట్లే, నిష్కారణంగానే సుఖ దుఃఖాదులు, తత్సంబంధమైన ప్రారబ్ధాదులు, భావనా ప్రవాహాలు సంభవిస్తున్నాయి" ...అనేదే విజ్ఞుల అభిప్రాయం. అట్టి వాటిచే స్పృశించబడని సంవిత్స్వరూపమే ప్రతిజీవుని వాస్తవరూపం ...అనే దానిలో మాకు సందేహమే లేదు. గురువులు–శాస్త్రములు ఇది (తత్త్వమసి వంటి మహావాక్యాల ద్వారా) గుర్తు చేస్తూనే ఉన్నారు!

❖❖❖

# 22. ఈ జగత్తు సంకల్ప నిర్మితం

**మహాముని :** ఓ వ్యాధుడా! ఆ విధంగా ఆ రెండవ ముని అనేక యుక్తుల ద్వారా సుదీర్ఘకాలం నాకు ఆత్మతత్త్వాన్ని, ఆత్మజ్ఞానాన్ని ప్రబోధించారు. ఆయన బోధనచే నేను సర్వమునకు అప్రమేయ-పరిశుద్ధ స్వరూపమగు ఆత్మజ్ఞానమును పొందినవాడనయ్యాను.

ఆ తరువాత కూడా నేను ఆ రెండవ మునిని వదిలియుండనే లేదు. నా ప్రార్థనలతోను, సేవలతోను, అనునయ విన్నపాలతోను మా ఇంట్లోనే కొంతకాలం ఉండేటట్లుగా చేసుకొన్నాను. ఆయన దర్శనం కాకముందు నేను అనేక సాంసారిక భావావేశములతోను, "అయ్యో! అది అట్లా ఉన్నదే! వీరు ఇట్లా మాట్లాడారే! మరి వీరికేమౌతుందో ఏమో! ఈ ఈ వస్తువులు వ్యక్తులు మొదలైనవి ఇట్లాగే ఉంటాయో? మరెట్లా ఉంటాయో?" ...ఇత్యాది అనేక సంశయ-ఆసక్తాదుల మధ్య మృత ప్రాయుడనైయున్న నేను వారి ఆత్మజ్ఞాన బోధనా ప్రభావంచేత అతి పవిత్రుడనైనాను. "అంతా ఆత్మయే" అనే అనిర్వచనీయమైన స్వానందానుభూతిచే ప్రశాంతుడను కాసాగాను. అయితే ఓ వ్యాధుడా! నీకు చమత్కారమని అనిపించవచ్చు. అటువంటి ఒకానొక విశేషం చెప్పమంటావా?

**వ్యాధుడు :** స్వామీ! చెప్పండి!

**మహాముని :** ఏ నూతన వ్యక్తి స్వప్నలోకంలో ప్రవేశించి నేను తన్మయుడనై స్వగ్రామం, గృహము, భార్య, బంధువులు మొదలైన అనేక విషయాలలో నిమగ్నమై నా ఇతఃపూర్వపు ఆత్మజ్ఞానాన్ని ఏమరచానో, అట్టి ఆత్మజ్ఞానమును నాకు గుర్తు చేసి సుబోధను నిర్వర్తించిన మహనీయులగు ఆ సద్గురువు... అదిగో, ఆ ఆసనంపై కూర్చుని మన ఈ సంభాషణను మౌనంగా వింటున్నారే, ఆయనే!

ఆయన – పూర్వాపరాలు ఎరిగినవారు. తనయందు 'మోహం' అనే క్రీనీడ కించిత్‌గా కూడా లేనివారు. మోహ వినాశకులు. చంద్రోదయం వంటి శీతల శుభవచనాలు నాతో పలికి ఉన్నట్టి వారు. శరీరాన్ని ధరించి వచ్చి నా అనేక జన్మ సుకృతరూపుడై ఒప్పుచున్న వారు. ఈ దయాళువైన మునీశ్వరుడే నా కప్పుడు ఉపదేశం చేసిన మహాత్ముడు. వారిని దర్శించు. నమస్కరించు.

❖

అగ్నిదేవుడు (విపశ్చిత్తుతో) (మహాశవము యొక్క పూర్వ వృత్తాంతం వివరిస్తూ....)

**అగ్నిదేవుడు :** అప్పుడు ఆ వ్యాధుడు, "ఈ మహాముని ఎవరో అపరిచితవ్యక్తి స్వప్నంలో ప్రవేశించటమేమిటి? ఆ స్వప్నలోకంలో కనిపించిన ఆ రెండవముని మన మహాముని యొక్క జాగ్రత్‌జగత్తులో ఉండటమేమిటి?" ...అని ఆశ్చర్యచకితుడు కాసాగాడు. ఖిన్నుడు అవసాగాడు. ఉద్వేగం ఆపుకోలేక, ఆ మహామునిని ఇట్లా ప్రశ్నించాడు.

❖

**వ్యాధుడు :** ఓ మహామునీ! సంసార తాపమును తొలగించటంలో అతి ప్రావీణ్యులైన ఓ మహాత్మా! ఇప్పుడు మీరు చెప్పుచున్న విషయం అత్యాశ్చర్యకరమైనది, మనసు అవిశ్వసనీయమైనది కూడా!

స్వప్నంలోని మీ ఉపదేశకుడు ఇక్కడ జాగ్రత్తులో ప్రత్యక్షమై ఉన్నారనే విషయం మీరు చెప్పటం, వారు నాకు ఇక్కడ ఎదురుగా ఈ జాగ్రత్తులో కనిపించటం ...నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను. బాలుని బుద్ధిలో (లేక ఊహలోగల) బేతాళుడు (బూచివాడు) నిజంగానే ఎదురుగా కనిపించాడనటం ఎట్లాగో ...మీరు చెప్పినది అట్లే ఉన్నది. స్వప్నంలో కనిపించిన ఆ రెండవ ముని ఈ జాగ్రత్తులోకి ఎట్లా రాగలిగారు? ఏ కారణంచేత వచ్చారు? వీరు నాకు కూడా ఎట్లా కనబడుచున్నారు. అసలింతకీ ఇది నాకు స్వప్నమా? జాగ్రత్తా? ఇదంతా నాకు పరమాశ్చర్యకరంగా ఉన్నది! (అని అంటూనే లేచి ఆ ద్వితీయ మునికి పుష్పాంజలి సమర్పించి, తిరిగివచ్చి మహామునికి ఎదురుగా ఆశీనుడైనాడు).

**మహాముని :** ఓ సౌభాగ్యశీలుడా! వ్యాధుడా! ఆ ఆశ్చర్యకరమైన వృత్తాంతమంతా సంక్షిప్తంగా వివరిస్తాను. విను.

ఇందులో ఏమీ సందేహం లేదు. మన ఎదురుగా ఉన్నతాసనంపై ఆసీనులై మన ఈ సంవాదమును మౌనంగా వింటున్న ఈ మహాత్ముడే అప్పుడు నాకు తన వాక్ప్రవాహం చేత ఆత్మజ్ఞానం ప్రసాదించియున్నారు. ఈయన ఉపదేశములు వినటం చేతనే నా యొక్క అనాది సిద్ధమగు సన్మాత్ర స్వభావమును స్మరించటం జరిగింది. ఈయన గుర్తు చేసిన తరువాతయే "ఓహో! నేను శుద్ధాఃతఃకరుణుడనగు మునిని అయివుంటిని కదా" ...అని గుర్తు చేసుకున్నాను. శుద్ధ హృదయముచే స్నానం చేసినవాడనైనాను. మనం చెప్పుకొన్న సంఘటనను కొనసాగిస్తున్నాను విను.

❖

ఈ మహాముని అనేక ప్రవచనాలు విన్న తరువాత నేను నా గదిలో ఆసీనుడనై ఇట్లా ఆలోచించసాగాను.

ఒకడు ఎంతో దాహంతో సుదూర మృగతృష్ణవైపు జలం కోసం పరుగులు తీస్తే ఏమౌతుంది? దాహం తీరదు. జలం లభించే ప్రసక్తే లేదు. (అది మృగతృష్ణ కదా! జలం యొక్క భ్రమయే గాని, వాస్తవ జలం కాదు)! పైగా అనవసరమైన శ్రమ! దాహం మరింతగా బాధించటం! ఇదీ పర్యవసానం.

నేను ఆ ఒకానొక అపరిచిత వ్యక్తి స్వప్న ప్రాంగణంలో ప్రవేశించి, ఆతని స్వప్నలోకంలో గల ఒక గ్రామంలో సాంసారికమైన వ్యవహారాలలో నిమగ్నమై ఆనందం కోసం వెతకటం అటువంటిది. ఆహా! ఎంత కష్టమైన విషయం! ఒక మునిగా, అనేకులకు ఆత్మజ్ఞానం బోధించే గురువుగా ఆ ఆశ్రమంలో నివసించే నేను స్వప్నం యొక్క తత్త్వమేమిటో గ్రహించాలని ఎవరో ఆశ్రమానికి ఎదురుగా గల బాటలో వివాహ భోజనానంతరం ఇంటికి వెళ్ళుచున్న ఒక అపరిచితుని స్వప్నంలో ప్రవేశించి అజ్ఞానినై ఆయా సంబంధ బాంధవ్యములతో కూడిన గృహంలో మూఢునివలె ఉండి పోవటమేమిటి? బాలుడు భూతమునకు సంబంధించిన కథనంచే మోసగించబడినట్లు, ప్రాజ్ఞుడనై ఉండికూడా భ్రమ మాత్రము – అసత్తు అయినట్టి దృశ్యము యొక్క ప్రాప్తిచే మోసగించబడ్డానే? సర్వ ప్రయోజన శూన్యమై విజృంభిస్తూ ఉండే ఈ మిథ్యాభూతమగు దృశ్యము నందు నేను ఇట్టి శోచనీయ పరిస్థితులలో పడి ఉన్నానే! ఇంతే కాదు.

"నేను ఇది కాదు" – నా౽హమితి; "నేను అదియే"– సో౽హమ్; "ఇది వదలాలి, అది చేరాలి" – త్యాగే నైవతు కైవల్యం... ఇవి కూడా భ్రాంతిమాత్రములే గాని, సన్మయములు కావు.

అసలీ భ్రాంతులన్నీ దేనికి సంబంధించినవో, ఎవరికి సంబంధించినవో చెప్పలేకపోతున్నానే! ఆహా! "కేవల సాక్షి" రూపమగు సాక్షి చైతన్యమే నేను గాని, తదితరమేదీ అవటానికి వీలులేదే! అట్టి సాక్షి చైతన్యము ఏఏ అసద్రూపము యొక్క ఆడంబరము (నటన) గావించుచున్నదో... అందు ఎన్నెన్ని ఆశ్చర్యకరమైన విశేషాలు ఉన్నాయి!

ఈ శరీరం నేను కాదు. మాయగాని, దృశ్యముగాని లేదు. లేనిది ఉన్నట్లుగా అనిపించటమే నా భ్రమ. భ్రమ నుండి నేను తొలగాలి." "భ్రమలో చిక్కుక్కున్నాను" అనునది కూడా భ్రమయే అయివున్నది.

ఆహా! ఏమి ఈ దృశ్యం! సమస్తం మిథ్యయే అయివున్నప్పటికీ సత్తువలె స్థితి పొంది ఉన్నది కదా! ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? క్రొత్తగా రావలసినదేమిటి? పోవలసినదేమిటి? "నాకు బంధం ఉన్నది"... అనేది భ్రమయే కదా! ఈ కనబడే బంధుత్వాలు, బాధ్యతలు... ఇవన్నీ ఇక్కడి కల్పితమైనవేగాని... నావి కావు. ఈ మహనీయునితో సంభాషించకముందు, "నాకు బంధ ఛేదన సంబంధితమైన జ్ఞానాభ్యాస రూపమగు ఒకానొక ప్రయత్నం (లేక), వృత్తి బయలుదేరుతూ ఉండేది. ఇప్పుడు ఈ మహానుభావుని వాక్యాలు విన్న తరువాత ఆ "బంధం తొలగాలి" అనే బంధఛేదనా వృత్తి కూడా త్యజించివేయవలసినవేనని నా కనిపించింది. ఎందుకంటే సమస్త వృత్తి రహితమై, సమస్తమునకు జ్ఞేయమై, కేవలం జ్ఞానరూపమగు ఆత్మయందే కదా నేను సర్వదా రమించవలసినది! రమించవలసిన ఆత్మయందు సర్వదా ఉండియే ఉన్నాను కదా! తెలియబడే సర్వమును దాటివేసి కేవలము తెలియుటయే తన రూపంగా గల ఆత్మయందే రమించెదనుగాక!

**ఆస్తామేతత్ అవిద్యైషా వ్యర్థరూపా కిమేతయా ।**
**భ్రాన్త్యా భ్రాంతిః అసద్రూపా త్యక్త్వైవ ఏషా మయాధునా ॥**

ఈ జగత్తు అవిద్యా భ్రాంతి రూపమేకదా! మిథ్యయేకదా! విద్యావృత్తి లోంచి చూస్తే ఈ జగత్ యొక్క భ్రమరూపమైన "అవిద్యా వృత్తి" సర్వదా కల్పితమే అయివున్నది. ఇప్పుడు క్రొత్తగా అద్దానిని త్యజించవలసినది మాత్రం ఏమున్నది? అది ఉంటే ఉండనీ! నాకొచ్చే నష్టమేమున్నది? ప్రతిరోజు రాత్రి కలలో ఏవేవో దృశ్యాలు కనిపిస్తాయి. మెళకువ వచ్చేసరికి, "అవన్నీ భ్రాంతియే" అని తెలిసియే ఉంటోంది కదా! ఇక "నాకు కలలు రాకపోతే బాగుండును" ...అని అనుకుంటు న్నామా? లేదే! అట్లాగే "ఈ జగత్తులో భ్రాంతికి సంబంధించిన భ్రమలు తొలగిపోవాలి" ...అని మాత్రం ఎందుకు శ్రమ! నేను ఆత్మయందు రమిస్తూ ఉంటే చాలు! అవి ఉన్నప్పుడు ఉంటాయి, పోయినప్పుడు ఎటుతిరిగీ పోతాయి...! ఆహా! ఈ ముని నా యొక్క ఉపదేశకుడు. నేను ఈతని శిష్యుడను. ఈ మాట నిజమే! అయితే ...

**ఉపదేష్టామునిః అయమేషో అత్ర భ్రాంతి మాత్రకమ్ ।**
**బ్రహ్మైవాహమ్ ఇవా భాతి రూపమేతత్ ఇవా భ్రవత్ ॥**

"ఈ ముని నా ఉపదేశకుడు. నేను ఈతని శిష్యుడను" ...అనేది కూడా భ్రాంతియే! ఆకాశంలో మేఘాలు కనబడుచున్నాయి. ఆ మేఘాలు పురుష-పర్వత-వనాది అనేక ఆకారాలుగా కనబడవచ్చు గాక! అవన్నీ మేఘాలే కదా! అంతకుమించి ఆకాశంలో ఏమున్నాయి? అట్లాగే బ్రహ్మమే నాయొక్క, ఈ ముని యొక్క రూపములు దాల్చుచున్నది. బాగున్నది. అయితే ఎవని వలన అయితే నాకు జ్ఞానం ఉదయించిందో... ఆ మునికే నా అభిప్రాయం తెలుపుతాను. వర్తమానానుభవ విషయాలను జ్ఞానదృష్టితో ఆయనతోనే చర్చిస్తాను.

❖

**మహాముని :** ఓ లుబ్ధకుడా! నేను పై రీతిగా యోచన చేస్తూ, మరల ఈ రెండవ మునిని సమీపించాను.

**నేను (మహాముని) :** ఓ మునీశ్వరా! మీరు నా జ్ఞాన చక్షువులు తెరిపించారు. స్వామీ! నేను ఒకప్పుడు నా నిజాశ్రమం నుండి "ఈ బాటసారి స్వప్న జగత్తులో ప్రవేశించెదను గాక" ...అని ప్రవృత్తుడనై బయలుదేరాను కదా! ఏ ప్రాణియొక్క శరీరంలోకి నా ప్రాణ సహిత సూక్ష్మదేహంతో ప్రయాణించానో... ఆ ప్రాణి యొక్క భౌతిక దేహం ఒకసారి సందర్శించాలనుకుంటున్నాను. బయలుదేరి వెళ్లి చూడాలని నాకు కుతూహలంగా ఉన్నది.

**రెండవ ముని :** (పక పకా నవ్వు)

**నేను (మహాముని) :** అదేమిటి మహాత్మా! నా వాక్యాలు విని పగలబడి నవ్వారు?

**రెండవ ముని :** ఏమీ లేదయ్యా! ఆ ప్రాణి యొక్క - నీ యొక్క (ముని దేహం) దేహాలు ఇప్పు డెక్కడున్నాయి? అవి రెండూ ఎప్పుడో భస్మీభూతమై గాలిలో కలిసిపోయాయి.

సరే! అయినా ఎందుకు? నీవు వృత్తాంతములను ఎరుగుటలో అతిచతురుడవైన భాగ్యశాలివి కదా! నీవే స్వయంగా వెళ్ళి చూడు. ఆ వృత్తాంతమంతా స్వయంగా ఎరుగగలవేమో!

❖

అది విని నేను నా యొక్క - ఆ బాటసారి ప్రాణి యొక్క దేహముల స్థితిగతులు ఏమిటో తెలుసుకోవటానికి అక్కడి నుండి బయలుదేర నారంభించాను. నేనిప్పుడు స్వప్న దేహుడనే కదా! స్వప్నమే నా ఈ దేహరూపం కదా! అనే బుద్ధి యొక్క విచారణచే ఆ కల్పితమగు స్వప్నరూపం త్యజించాను. నా యొక్క ప్రాణోపహిత చిదాత్మ రూపమైన జీవుని-ప్రాణముల ద్వారా-వాయు సమూహంలో నియోజించాను. అట్లా ప్రయాణం ప్రారంభించేముందే ఆ మునీశ్వరునితో "ఓ మునీ! నేను నా పూర్వ దేహం చూచి వచ్చేవరకు మీరు ఈ గృహంలోనే ఉండండి. మీకు ఈ కుటుంబ సభ్యులు సర్వసేవలు నిర్వర్తించగలరు"... అని చెప్పి ఇక బయలుదేరాను. క్రమంగా 'వాయువు' అనే రథాన్ని ఎక్కి అనంతాకాశంలో పుష్పము యొక్క సుగంధంవలె పరిభ్రమించాను.

ఎంతగా అట్లా వాయువునందు పరిభ్రమించినా కూడా నేను ప్రవేశించియున్న ప్రాణి యొక్క కంఠబిలం కనిపెట్టలేకపోయాను. మరే బాహ్యామార్గం నాకు కనిపించనే లేదు. అప్పుడు ఆకాశంలో

సంచరించే నేను బాహ్యమార్గమేదీ దొరకక చాలా దుఃఖం పొందాను. "ఇక లాభం లేదు"... అని అనుకొని మరల స్వప్నంలోని ఆ గ్రామంలోగల స్వగృహం చేరాను. తిరిగి భౌతిక శరీరధారినై మహాత్ముడగు ఈ మునీశ్వరునికి సాష్టాంగ నమస్కారం చేసి ఏకాగ్ర చిత్తంతో ఇట్లా ప్రశ్నించాను.

❖

**నేను (మహాముని) :**

**కిమేతత్ భగవన్! బ్రూహి! పూర్వాపరవిదాంపర!**

**త్వం పశ్యసి యథావృత్తమ్ ఉత్తమ జ్ఞాన చక్షుషా!**

హే భగవాన్! పూర్వాపరములను ఎరుగటలో అతి ప్రావీణ్యులగు ఓ మహాత్మా! నేను సూక్ష్మ శరీరధారినై జీవాత్మను వాహనంగా చేసుకొని వాయువులో ప్రవేశించి ఆ ప్రాణియొక్క కంఠబిలం ద్వారా తిరిగి బాహ్యానికి వెళ్ళాలని ఎంతగానో ప్రయత్నించాను. కాని నాకు త్రోవ దొరకలేదు. మరి మీరు నా దేహము గురించి, ఆ ప్రాణి యొక్క దేహం గురించి "అవి నశించాయి" ...అని ఎట్లా చూచారు? ఎట్లా చెప్పగలిగారు? నేను ఎవని యందు ప్రవేశించానో... ఆతని దేహం ఎక్కడికి పోయింది? ఏ దేహం నుండి ఉత్సుకతతో బయల్వెడలానో... ఆ నా దేహం ఏమయింది? నేను వాయు తరంగాలలో ప్రవేశించి ఈ ప్రపంచంలోని స్థావరాలు మొదలుకొని మూలమూలలా గాలించాను. ప్రపంచమంతా పరీక్షించి వచ్చాను మరి ఆ ప్రాణి యొక్క కంఠ బిలంగాని, బహిర్గతమైన ఏ మార్గంగాని నాకు ఎందుకు లభించలేదు?

**రెండవ ముని :** ఓ మిత్రమా! "నేను చూచివస్తాను"... అని బయలుదేరావేగాని "అందుకు ఉపాయమేమిటి?" ...అని నన్ను అడగనేలేదు కదా! నేను ఉపాయం చెప్పకుండా నీ స్వబుద్ధితో ఆ వృత్తాంతం గమనించలేకపోయావు.

సరే! అయినా... ఆ వృత్తాంతమంతా దర్శించటానికి నీవు ఎక్కడికో వెళ్ళనక్కర్లేదే! ఒకవేళ ఆ చోటికి వెళ్ళితే మాత్రం అక్కడ ఇప్పుడేం కనబడుతుంది చెప్పు? (నీ భౌతిక నేత్రాలకు ఒకచోట ఎప్పుడో జరిగిపోయిన సంఘటన ఇప్పుడు కనిపించదు కదా!). ఆ సంఘటన (ఆ వృత్తాంతం) చూడాలనుకొంటే... యోగముచే ఏకాగ్రమైన చిత్తముతో చూడు. అప్పుడు జ్ఞాననేత్రముచే దీనినంతా సంపూర్ణంగా చేతిలోని కమలపుష్పంగా చూడగలుగుతావు.

**నేను (మహాముని) :** హే మహానుభావా! ఆ వృత్తాంతమంతా (ఆ నా యొక్క – ఆ ప్రాణి యొక్క దేహముల స్థితి – గతులను గురించి) మీరే చెప్పండి. మీరు చెప్పుచుండగా వినటంచేత నా అజ్ఞాన భ్రాంతులకు అది ఔషధమై, అవన్నీ మొదలంటా తొలగుతాయి.

**రెండవ ముని :** అయితే విను, చెపుతాను.

❖

నీ పూర్వదేహ వృత్తాంతం వినటానికి ముందుగా... మొట్టమొదట నీ జీవతత్త్వం గురించి చెపుతాను. నీకు నీ ఈ వ్యష్టి రూపం ఇప్పుడు అనుభూతమౌతోంది కదా!

అయితే... ఒకానొకప్పుడు నీవు వ్యష్టి జీవరూపుడవు కాదు సుమా! విష్ణు భగవానుడు సర్వప్రాణుల యొక్క 'పుణ్యము' అను కమలములను 'ఫలప్రదానము' ద్వారా వికసింపజేస్తూ ఉంటాడు. ఆయనయే సమస్త సుఖములకు నిలయుడు. జ్ఞానమే స్వరూపముగా కలవాడు. అట్టి కేవల సత్త్వస్వరూపుడగు విష్ణు భగవానుని నాభి కమలమునందు రజోగుణ స్వరూపంలో ఆసీనుడవు, సర్వజీవ సృష్ట్యాత్మయగు హిరణ్యగర్భుడవే నీవు.

సమష్టి రూప సృష్టి కర్తవై చరాచర సృష్టిలోని విశేషములకు రచయితవై, విదిత వేద్యుడవై, సర్వ జీవులకు – వారి మనోభావాలకు – వారి అనుభూతులకు మూలాధారం అయి చెన్నొందుతూ ఉండేవాడివి. అట్టి హిరణ్యగర్భుడవగు నీకు ఒకానొకనాడు ఒక ఆలోచన వచ్చింది.

"ఈ సమష్టిరూప సృష్టికర్తనై సుదీర్ఘకాలం గడిపాను కదా! బాగానే ఉన్నది. అయితే... వ్యష్టిరూప స్వప్నం ఎట్లా ఉంటుందో మరి!" అట్టి నీ అభినివేశము ఒక రూపుదాల్చింది. అట్టి మనోరాజ్యరూపమగు 'ఆలోచన' యందు ఒకానొక ఆశ్రమంలో తాపసుడవు అయ్యావు! అక్కడ నీ వ్యష్టిభావం క్రమంగా పరిపుష్టం కాగా... అట్టి వ్యష్టిభావ జ్ఞానంచే "స్వప్నం యొక్క రూపం ఏమిటి?" ...అనే కౌతుకంచేత ఒకానొక ప్రాణియొక్క హృదయంలో ప్రవేశించావు. ఆ ప్రాణి హృదయంలో ప్రవేశించగానే... అచ్చట విస్తీర్ణమైన, అతి విశాలమైన, పృథ్వి / ఆకాశం మొదలైన వాటితో గూడిన ఈ త్రైలోక్యమును గాంచుచున్నావు. ఈ విధంగా నీవు ఆ ప్రాణి శరీరంలో చిరకాల స్వప్న దర్శనంలో నిమగ్నుడవై – వ్యగ్రుడవై ఉన్నావు.

ఇక నిద్రించుచున్నట్టి నీ యొక్క – ఆ ప్రాణి యొక్క శరీరములు ఉన్న ఆ గ్రామం చుట్టుపట్ల గల అరణ్యం దావాగ్నిచే భగ్నమయింది. ఆ దావాగ్ని క్రమంగా నీవు నివసించిన ఆశ్రమమును, ఆ ప్రాణి నిద్రించిన గృహమును దగ్ధం చేసివేశాయి.

❖

**వ్యాధుడు :** మునీంద్రా! అక్కడ దావాగ్ని ఆశ్రమం – గ్రామం దహించవేయటానికి అనేకమంది జీవులను భస్మం చేసివేయటానికి కారణమేమైనా ఉన్నదా? తాము ప్రవేశించిన ఆ గ్రామస్థుని భౌతిక దేహం, తదితర అనేకమంది దేహాలు ఒకే సమయంలో భస్మమవటానికి 'ఇదీ కారణం' అనతగినది ఏమై ఉన్నది?

**మహాముని :** ఓ వ్యాధుడా! ఈ భౌతికంగా కనిపించే జగత్తు సంకల్ప నిర్మితం. ఏది సంకల్పం చేత నిర్మించబడినదో అది సంకల్పములచే ఉదయించటం, సంకల్పములచే క్షయించటం అనేది సహజమే కదా! ఒక వ్యష్టి యొక్క సంకల్పముల ఉత్పత్తికి – సంకల్పముల క్షయానికి ఆతని మనస్సే కారణం కదా! అట్లాగే... ముల్లోకముల యొక్క సంకల్పకుడగు బ్రహ్మదేవుని మనః స్పందమే ఈ త్రైలోక్య జగత్తు. కనుక ఈ ముల్లోకముల క్షయ–ఉదయములకు ఆతని మనఃస్పందమే హేతువై ఉన్నది. హృదయంలో కలిగే క్షోభ–అక్షోభాలందు, శాంతి–అశాంతులందు అద్దాని కారణం మనోసంచలనమే అయివున్నట్లే,... ప్రపంచంలోని అవాంతర క్షోభ–అక్షోభాలకు బ్రహ్మదేవుని మనస్సు యొక్క శ్రీఘ్ర సంచలనమే కారణమైయున్నదని వేదజ్ఞులమగు మేము గమనిస్తున్నాం.

బ్రహ్మదేవుని సంకల్ప నగరమే ఈ జగత్తు. ఆతని మనఃస్పందమే ప్రజలయొక్క ఉత్పత్తి-క్షయములకు, క్షోభ-అక్షోభలకు వర్ష-అవర్షాదులకు కారణమైయున్నది. ఇదంతా చిదాకాశం యొక్క మాయా విభాగమయి "అన్యత్ర"వలె కల్పితమైయున్నది. చిదాకాశము యొక్క కల్పనాపరంపరయందే ఈ దృశ్యము అవస్థితమైయున్నది.

"చిదాకాశమున చిదాకాశమే అజ్ఞానదృష్టికి జగద్రూపంగా స్ఫురిస్తోంది. అట్లా కాకుండా, "ఈ జగత్తు ఏ రూపంగా భౌతికంగా కనిపిస్తోందో అదే ఇద్దాని సత్యమగురూపం" అనేది మూర్ఖుల దృష్టి (అజ్ఞానుల దృష్టి) అని విజ్ఞుల ఉద్దేశం. అట్టి దృష్టి పరమార్థమున సత్యం కాదు. అది మిథ్యయే అయివున్నది.

❖❖❖

# 23. భావములకావల అభావ సంవిత్

**అన్యముని :** ఓ మిత్రమా! నీ పూర్వాశ్రమ ప్రదేశంలోగల ఆశ్రమమే కాకుండా,... అక్కడ గల నగర-గృహ-వృక్షాదులన్నీ కూడా అగ్నికి ఆహుతి అయినాయి. ఆ వేడికి ఆ ఆశ్రమం ఆ గ్రామానికి రెండు వైపులా ఏర్పడి ఉన్నట్టి రెండు మహాశిలలు ఫెటేల్‌న పేలిపోయాయి. నిద్రిస్తున్నట్టి నీ యొక్క (మరియు), - ఆ ప్రాణి యొక్క శరీరాలు దగ్ధమైపోయాయి. ఆ అగ్ని శమించిన తరువాత బూడిద మిగిలింది. అది కూడా గాలిచే చెదరగొట్టబడింది. కనుక ఇప్పుడా శరీరాలు ఎక్కడున్నాయంటే ఏమి చెప్పను? స్వప్నంలో కనిపించిన నగరం మెళుకువ తరువాత ఏమైపోయిందో తెలియనట్లే... ఇప్పుడా గృహాలు, ఆ దేహాలు ఆ తరువాత ఏమిటనేది ఏమీ చెప్పలేం!

ఒక ప్రక్క మీ ఇరువురి శరీరాలు భస్మీభూతమౌతూ ఉంటే... నీవు మాత్రం ఇక్కడ ఈ స్వప్న భ్రమలో వర్తిస్తున్నావు. అయితే, ఇక్కడ ఒక్క విషయం సర్వదా గమనించు. నీ సంవిత్తే ఇక్కడ ఈ స్వప్నమయ దేహంతో ప్రవర్తిస్తోందయ్యా!

ఇక ఆ ప్రాణి దేహం భస్మమైపోవటంచేత ఆతని కంఠబిలం నీకెక్కడ లభిస్తుంది చెప్పు? ఈ స్వప్నలోకమునకు విరాడ్రూపుడైయున్న ఆ ప్రాణి ఎచట? హృదయ తేజో యుక్తుడగు ఆ ప్రాణి యొక్క శరీరం దగ్ధమైపోయింది కదా! అందుచేత ఆ రెండు శరీరాలు నీకు లభించక ఇప్పటి ఈ అనంతమైనట్టి స్వప్నమయ ప్రపంచ రూపమగు ఈ జాగ్రత్తులో వర్తిస్తున్నావు.

ఇదంతా క్రమంగా నీ స్వప్నమే అగుచున్నది. నీ స్వప్నమే ఇచట జగత్ భావం పొంది ఉన్నది. ఇక్కడ మేమందరం నీ యొక్క స్వప్న పురుషులం! నీవేమో మా యొక్క స్వప్న పురుషుడవు.

అయితే.... చిదాకాశము తన అద్వయ స్వరూపమును ఏమాత్రం త్యజించకయే ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తులనబడే మూడు అవస్థలలో స్థితి కలిగి ఉంటోంది. మొట్టమొదట నీవు స్వప్న పురుషుడవయ్యావు. ఆ తరువాత జాగ్రత్ పురుషుడవై ఇక్కడ గృహస్థ ధర్మాలలో నెలకొని ఉన్నావు.

ఈ విధంగా నీకు అనుభూతమౌతున్న దృశ్యరూప వృత్తాంతమంతా యథారీతిగా వర్ణించి చెప్పాను. నీకు ఇంకా ఏమైనా సందేహమున్నదా? ఒకవేళ ఉంటే... నీవు కూడా ధ్యానంచే నేను చెప్పినదంతా స్వయంగా గాంచవచ్చు కూడా!

ఈ ప్రకారంగా... పరమాత్మ ఆది మధ్యాంతరహితమై, అనంతరూపమై, సంవిత్ ఘన రూపమై ఉన్నది. ఆకాశంలో సువర్ణకాంతిలాగా అట్టి పరమాత్మ "నిజ విశాల స్ఫురణశక్తి'... అనే ఆభరణం దర్శించి ఉంటున్నారు. అట్టి నిజస్ఫురణ శక్తిచే ఈ చంచల దేహధారణం చేస్తున్నారు. ఈ శరీరము ధరిస్తూ ఇచ్చట సత్-అసత్ కర్మలయొక్క, ఆ సత్-అసత్ కర్మ ఫలముల యొక్క వికసిత పుష్పరూపములగు స్థితి గతులను ఆస్వాదిస్తున్నాడు. వాస్తవానికి తన ఆత్మస్వరూపం సర్వదా యథాతథం. ఈ దృశ్య వ్యవహారమంతా స్వయంకృతమైన లీలా విశేషం. ఈ భావములన్నిటికీ ఆవలగల అభావ స్వరూపమే నీవు. అదియే నేను. అదియే సర్వజనులు కూడా!

❖❖❖

## 24. ముందు జరుగబోయేది...!

**మహాముని :** వింటున్నావా వ్యాధుడా! ఆ విధంగా ఈ అన్యముని నాతో పలికి మౌనం వహించారు. నేను ఆశ్చర్యచకితుడనయ్యాను.

నేను సమష్టిగత రూప హిరణ్యగర్భత్వమును ఏమరచి... కుతూహలంచేత వ్యష్టిగతమైన స్వప్న దర్శనం కొరకై పరుగులెత్తనా? 'మునిదేహం' అనే స్వప్నసదృశ వ్యవహారమును ఆశ్రయించటమా? ముని దేహం తదితరమైన అక్కడి దేహాలన్నీ భస్మీభూతం కావటమా? ఇప్పుడేమో స్వప్న జగత్తులో ప్రవేశించినట్టి ఈ స్వప్న జాగ్రత్ రూపమగు కుటుంబ వ్యవహారాదులలో చిక్కుకొని ఇచ్చట సుదీర్ఘకాలం గడుపుచుండటమా? ఇక్కడి ఈ గ్రామం, నా భార్య, పిల్లలు, ఈ బంధువులు, ఈ జీవితం ఇవన్నీ స్వప్న సదృశమేనా?... ఇవన్నీ నాకు యోచించగా యోచించగా నమ్మశక్యంగా అనిపించలేదు.

చాలాసేపు యోచించిన తరువాత, మరల విశ్రమించియున్న ఈ మునీశ్వరుని సమీపించి ఇట్లా అన్నాను.

**నేను (మహాముని) :** స్వామీ! భగవన్! గురుదేవా! మీరు చెప్పినదంతా నాకు చాలా ఆశ్చర్యకంగా ఉన్నది. ఇక్కడ నాకు యథార్థంగా నా ఈ కుటుంబ సభ్యులు, ప్రక్క ఇంటివారు, ఈ గ్రామం, సమీప గ్రామంలోని మా బంధువులు... చాలా కాలంగా పరిచితులైన స్నేహితులు... ఇవన్నీ ఈ విధంగా ఉండగా... ఇదంతా స్వప్నసదృశం కాదని, ఇది యథార్థమేనని నా కనిపిస్తోందే!

**అన్యముని :** మిత్రమా! నీవు కొంతకాలం క్రితం జరిగిపోయిన ఒక సంఘటనను జ్ఞాపకమునకు తెచ్చుకుంటున్నావనుకో. అప్పటి 'జ్ఞాపకం'లో చూచిన అప్పటి జాగ్రత్ సత్యమా? (లేక) అప్పటి నీ సంకల్పములను అనుసరించి మాత్రమే అది అట్లు ఉండి ఉన్నదా?

**నేను :** అప్పటి ఆ యొక్క జాగ్రత్తు సంకల్ప నిర్మితమే (ఊహానిర్మితమే) అని ఇప్పుడు అనిపిస్తోంది.

**అన్యముని :** భావన – ఊహయే కదా! కాబట్టి, ఊహచే దర్శించబడే ఈ జాగ్రత్తు ఊహకాక మరింకేమిటి? ఎప్పుడైతే జాగ్రత్తుయే ఊహామాత్రమేనని, సత్యం కాదని నిరూపించబడుతుందో, ఇక స్వప్నం గురించి వేరుగా చెప్పేదేమున్నది చెప్పు? ఈ జాగ్రత్తుయే మిథ్యాభూతమై ఉండగా ఒక 'స్వప్నం సత్యం' అనటానికి ప్రమాణమేమున్నట్లు?

ఏ విధంగా స్వప్నం భాసిస్తోందో... అట్లా సృష్ట్యాదిలో ఈ జాగ్రత్ జగత్తు భాసిస్తోంది. వాస్తవానికి ఈ జగత్తు పృథివీ (భూమి ఇత్యాది) రహితమైనప్పటికీ, (భావనామాత్రమే అయినప్పటికీ) ఇది పృథివి మొదలైనవాటితో సహా ఒప్పుచున్నది.

ఓ మునీ! ఓ వ్యాధ మహాగురూ! ఈ వర్తమాన స్వప్నసృష్టి పరమార్థమున నిర్మల చైతన్యమే అయివున్నది. స్వతహాగా నీకు కనబడే జగత్తు జగత్తు కాదు. నీ భావనా పరంపరా వ్యవహారమే నీకు కనబడే జగత్తు.

ఇక ఇద్దానికి కారణమంటావా? ఈ జాగ్రత్తుకు స్వప్న మాత్ర సత్తా కూడా లేదని చెప్పవచ్చు. ఎట్లాగంటే ఒకడు పగలంతా జాగ్రత్‌లో సంచరించి రాత్రికి స్వప్నంలో ప్రవేశిస్తున్నాడు. జాగ్రత్ నందు చూడబడిన శబ్ద – తదర్థములచే బుద్ధియందు కొన్ని సంస్కారములు ఏర్పడుచుండగా... ఆ స్వసంస్కారములు రాత్రియందు స్వప్నంలో శబ్ద – అర్థములుగా అనుభవమగుచున్నాయి. అంటే స్వప్నం సంస్కార సామాగ్రిచేత కొంతవరకు సత్యత్వంగా కనబడుతోంది. ఇక జాగ్రత్‌కు వస్తే...

ఈ జాగ్రత్ సృష్ట్యాదిలో స్వప్నరూపంగా ప్రసిద్ధమై ఉంటోంది. అయితే అది కూడా పూర్వ అనుభూతాలగు శబ్దార్థములే అయి ఉంటున్నాయి. కాని చిరకాల ప్రళయవ్యవధి చేత పూర్వ సంస్కారాలు అప్పటికే నశించి ఉంటాయి. కాబట్టే "స్వప్నం కంటే సృష్ట్యాదిగా ప్రారంభమైన జాగృత్ మరికొంత తుచ్ఛమైనది"... అని జాగ్రత్‌కు స్వప్న మాత్ర సత్తా కూడా లేదని చమత్కారంగా చెప్పబడుతోంది.

ఈ విధంగా జాగ్రత్‌యే మరికొంత మిథ్యాత్వము వహించినట్లుగా ఇక, "స్వప్నమంతా యథార్థమేనని నా కనిపిస్తోంది" ...అని నీవు అంటున్నావేమిటి? ఈ గృహము, బంధువులు... ఇటువంటి అనేక విషయాలు నీకు అనుభవానికి వస్తూ ఉండవచ్చు గాక! అయినా కూడా నా ఉపదేశాలను గ్రహించయినా, "ఇదంతా స్వప్నమే"... అనే స్వప్నధ్యానమునందు నీలో ప్రయత్న శీలత్వము ఇంకా జనించటంలేదేం?

ఇక – ఇది నీకు సత్యమనియే అనిపిస్తోందని అంటావా?... ఒకడు స్వప్నం చూచేటప్పుడు "ఇదంతా సత్యమే" అని అనుకొనియే అనుభవిస్తున్నాడు. కానీ, నిద్రలేచిన తర్వాత మాత్రం "అదంతా నా భయమేకదా! ఊహా జనితమే కదా! దానిని గురించి పట్టించుకోవలసిన దేమున్నది?" అని అనుకుంటూ వదలి వేస్తున్నాడు. అట్లాగే ఆత్మజ్ఞానం వికసించనంతవరకు "ఈ జాగ్రత్తు ఈ ఈ విశేషములతో కూడుకొని నాకు సత్యమనియే అనిపిస్తోంది" అని అనుకోవటంలో మాకేమి ఆశ్చర్యం అనిపించటంలేదు. ఆత్మజ్ఞానం సముపార్జించి సుస్పష్టం చేసుకొన్న తరువాత మాత్రం "ఈ దేహాలు,

వ్యవహారాలు, విషయాలు .... ఇవన్నీ స్వప్నసదృశమే" – అని గ్రహిస్తున్నాడని మేం సశాస్త్రీయంగా గమనిస్తున్నాం.

ఓ వ్యాధ మహాగురూ! ఈ జగత్తు అనేక విషయ పరంపరల దృష్ట్యా స్వసంస్కార రూపమే కాబట్టి అసత్యం. ఇదంతా ఆత్మరూపమే కాబట్టి ఇది నిత్య సత్యమే! కనుక, ఇక ఈ జగత్తు విషయంలో "ఇది స్వప్న తుల్యమే"...అని గ్రహించటానికి ఇంకా సందేహమెందుకు చెప్పు?

**నేను (మహాముని) :** మహాత్మా! మీ మాటలకు అడ్డువస్తున్నానని అనుకోకండేం! ఇప్పుడు మీరు నన్ను "వ్యాధ మహాగురూ!" అని రెండుసార్లు సంబోధించారేమిటి? ఈ వ్యాధమహా గురుత్వమేమిటి?

**రెండవ ముని :** అవును. అది సంక్షిప్తంగా వివరిస్తాను. ఎందుకంటే ఇటువంటివి, .... నీకు సంబంధించిన అనేక సంఘటనలకు .... అంతులేదు కాబట్టి!

❖

ఇప్పుడు చెప్పుచున్నది ముందు ముందు ఒకానొక జరుగబోయే విశేషం అయివున్నది. నీవు కొంతకాలానికి లుబ్ధకుడు అనే పేరుగల వ్యాధునికి సద్గురువు కాబోతున్నావు. అప్పటి వరకు దీర్ఘ తపస్వినగు నేను కూడా ఇక్కడే ఉండబోతున్నాను.

నాకు పూజాది సత్కారాలు నిర్వర్తిస్తూ నీవు కూడా ఇక్కడే ఉండబోవుచున్నావు. నేను కూడా అప్పటివరకూ నిన్ను త్యజించబోవటంలేదు.

కొంతకాలం గడచిన తరువాత ఇక్కడ ఒక దుర్భిక్షం రాబోవుచున్నది. ఆ సమయంలో మీ కుటుంబ సభ్యులు, మీ తదితర బంధువులు అనేకులు నశించటం జరుగుతుంది. ఆ తరువాత మదోన్మత్తులగు సరిహద్దు రాజుల యుద్ధ విన్యాసాలచే హింసించబడి ఈ గ్రామ ప్రజలంతా గ్రామం విడచి వలస వెళ్ళనున్నారు. ఇక ఇక్కడ మనిద్దరం మాత్రమే మిగిలిపోతాం. నీకు నేను, నాకు నీవు ధైర్యం చెప్పుకుంటూ ఇక్కడే రోజులు గడుపుతూ ఉంటాం. వేద్య వస్తువగు ఆత్మను ఎరిగిన వారం అవటం చేత శాంతులమై సమరూపులమై, ఏ పదార్థమునందూ కోరికలేనివారమై, ఉత్తమ ఆచరణాపరులమై ఒక వృక్ష సమూహం మధ్యగా నివసించటం ప్రారంభించబోతున్నాం. ఆత్మానుభూతి బలంచేత మనం మరణము, జీవనముల పట్ల ఆశ – భయములు లేనివారమై ప్రశాంతంగా ఆత్మానుభూతంగా కాలం గడుపుతూ ఉండబోతున్నాం. మనం నివసించబోయే వృక్షజాలమధ్య ప్రదేశం చుట్టూ అనేక తాళ వృక్షములు, లతా విశేషములు పరివేష్టించి ఉంటాయి. అప్పుడు మనం ఉండబోయే ఈ వనప్రదేశం మన తపో అభ్యాస ప్రభావంచేత స్వర్గం నుంచి భూలోకం వచ్చిన నందనవనంలాగా విరాజిల్లగలదు.

ఇట్లా చాలాకాలం జరిగిన తరువాత ఒక రోజు 'లుబ్ధకుడు' అనే పేరుగల ఒక వ్యాధుడు ఒక మృగమును వేటాడుతూ మనం తపస్సు చేసుకొనే వన ప్రదేశానికి రావటం జరుగుతుంది. ఆతడు మనం ఉండే ఆశ్రమస్థానంలో ప్రవేశించగానే తన హింసకవృత్తిని త్యజించి పూర్వజన్మార్చిత పుణ్య ప్రభావంచేత నీకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పిస్తాడు. అంతమాత్రానికే నీవు సంతోషించి

ఆతనికి అహింస - ఆయుః సద్వినియోగం గురించి గుర్తు చేస్తావు. నీవు చెప్పే పుణ్య వచనాలకు, ఇక్కడి శోభాయమానమైన ప్రశాంత వాతావరణానికి ఆకర్షితుడై ఆతడు పూర్వజన్మల సంస్కార బలంచేత ఇక్కడే తపస్సు నిర్వర్తించటం ప్రారంభిస్తాడు. నీకు ప్రియశిష్యుడై, నీకు సేవచేస్తూ ఆత్మజ్ఞాన విశేషాలు వినటానికి అర్హుడగుచూ ఉంటాడు. తపశ్చర్యా ప్రభావం చేత తన జీవహింసాస్వభావం విడనాడి శమ-దమ-తితిక్ష-ఉపరతి వంటి సాధన ద్రవ్యములను చేకూర్చు కొంటాడు. ఆ క్రమంలో ఒకానొకనాడు నిన్ను "స్వప్నం ఎట్లా ఏర్పడుతోంది? ఎక్కడి నుండి వస్తోంది? అద్దానికి రచయిత ఎవరు? ఎవరు స్వప్నాంతర్గతమైన విశేషాలకు కారణమగుచున్నారు? స్వప్నగతమైన ఆయా విశేషాలు ఎందుకు ఏ ఉద్దేశంతో, ఏ ఆశయంతో, ఎవరు, ఎట్లా కల్పిస్తున్నారు?"...మొదలైన స్వప్న వృత్తాంత విశేషాల గురించి ప్రశ్నించబోతున్నాడు. అప్పుడు నీవు స్వప్న ప్రసంగం ద్వారా పూర్ణరీతిగా ఆత్మజ్ఞానాన్ని ఉపదేశిస్తావు. దానిని విని ఆతడు ఆత్మజ్ఞానానికి యోగ్యుడు అవుతాడు.

ఓ మునీ! ఈ ప్రకారంగా నీవు వ్యాధగురువువు కానున్నావు. అందుకే యోచనావశంగా నిన్ను "వ్యాధ మహాగురువా!" అని సంబోధించాను. ఇది వినోదంగా మాటవరసకు, అన్నమాట మాత్రమే!

మిత్రమా! విన్నావు కదా! ఈ సంసార భ్రమ ఎట్టిదో నేనెటువంటివాడనో, నీవు ఎట్టివాడవో, ఇతఃపూర్వం ఏమి జరిగిందో ఇక ముందు ఏమేమి కానున్నదో ...అవన్నీ చెప్పాను. దీనితో నీ జ్ఞాన సంబంధమైన సందేహాలు తొలగివుండవచ్చునని అనుకుంటున్నాను.

❖

ఇట్లా పలికి ఆయన మరల మౌనం వహించారు. ఓ లుబ్ధక నామధేయుడగు వ్యాధుడా! ఆ అన్యముని చెప్పేదంతా విని నేను ఆశ్చర్యం చెందాను. నా శయన ప్రదేశానికి వెళ్ళాను. నాకు నిద్ర పట్టలేదు. వ్యాకులమైన బుద్ధితో ఆ మునివర్యుని గురించి, ఆయన చెప్పిన పూర్వాపర విశేషాల గురించి, ఈ దృశ్య సమూహ ప్రాప్తుల గురించి విచారించి మహావిస్మయం పొందాను.

ఆ రాత్రి అంతా ఆలోచన-మనన-విచారణలతో గడచిపోయింది. తెల్లవారగానే ఆ మునీంద్రుని పూజించి "స్వామీ! మీరు ఇక్కడే మా ఇంట్లోనే ఉండి మా సేవలు స్వీకరిస్తూ ఉండండి" ...అని దంపతి సమేతంగా అభ్యర్థించాం.

ఆ విధంగా మేమిద్దరం ఆ ఇంట్లోనే పరస్పరం స్నేహబద్ధులమై, స్థిర చిత్తులమై రోజులు గడపసాగాము. ఆయన మా ఇంట్లో ఒక సభ్యులైనారు. ఇక నాకు అప్పటిలో సంప్రాప్తిస్తూ ఉండే ఇష్టానిష్ట విశేషాలను నేను అనుభవిస్తూ ఉండగా, ఆయన మాత్రం ఏకాంత తపో-ధ్యానములు కొనసాగిస్తూ ఉండేవారు. ఆ ఈ అన్యముని సాంగత్యంలో రోజులు గడచిపోసాగాయి.

**నాభి వాంఛామి మరణం, నాభి వాంఛామి జీవితమ్ ।**
**యథాస్థితోఽస్మి తిష్ఠామి తథైవ విగత జ్వరమ్ ॥**

ఆ రోజులలో నేను మరణము కోరుకునేవాడిని కాదు. అట్లాగే జీవితమూ కోరుకొనే వాడిని కాదు. ఏ స్థితిలో ఏది ఎట్లా ఉండవలసివస్తే ఆ స్థితిలో అది అట్లే అంగీకరిస్తూ సంతాపరహితుడనై

వర్తించేవాడిని. ఇప్పటికీ అట్లే ఉంటున్నాను. అటు తరువాత నేను ఈ దృశ్య మండలము గురించి అనేక కోణాల నుండి ఆ రెండవ మునితో గూడి విచారణ చేస్తూ ఉండేవాడిని.

**తతో విచారితం తత్ర తన్మయా దృశ్యమండలమ్**
**కిం కారణమిదమ్‌తుస్యాత్కిమయమ్ వేత్తి చేతసా?**
**కోఽ యం పదార్థ సంఘాతః? కిం నామైతస్య కారణం**
**అస్త్యస్మిన్ స్వప్న సందర్శే చిత్‌వ్యోమైక స్వరూపిణి ॥**

ఈ దృశ్యమంతా ఏమిటి? దీనంతటికీ కారణమేమిటి? ఆత్మ చిత్తంతో కూడి ఏదేది ఎట్లెట్లు ఎరుగుచున్నది? ఈ పదార్థ సమూహాలన్నీ ఎక్కడి నుండి వచ్చాయి? రావటానికి కారణమేమిటి? చిదాకాశ స్వరూప 'స్వప్న వ్యవహారం' ఇప్పుడు ఈ పదార్థ రూపంగా ఎట్లా కనబడుతోంది? చిన్మాత్రాకాశమే నిజ చిద్ఘన స్వభావంతో ఈ రీతిగా పర్వత-ఆకాశ-భూ-వాయు-అగ్ని-నదీ-దిక్ స్వరూపంగా ఎందుకు కనిపిస్తూ ఉంది..?

'చైతన్యము' అనే చంద్రబింబం నలువైపులా తన స్వరూప ప్రకాశమును విస్మరిస్తూ ఉండగా అట్టి చిత్ ప్రకాశమే చిదాకాశమున ఈ జగద్రూపంగా భాసిస్తోంది కదా? ఈ పర్వత-భూ-ఆకాశ -శరీర-ఇంద్రియాదులన్నీ నా మనోరూపములేనా? వాస్తవానికి అవన్నీగాని, 'నేను' అనునది గాని లేవుకదా? ఇదంతా కూడా కేవలము చిన్మాత్రాకాశపు స్ఫురణ మాత్రమే అయి ప్రకాశిస్తోందా?

నేను చిన్మాత్రాకాశ స్వరూపుడనేనా? ఇదంతా చిన్మాత్రాకాశమే అయివుండగా ఇక ఇద్దాని కారణమేమి ఉంటుంది? జలంలో తరంగాలన్నీ జలమే అయివుండగా, "ఆ తరంగం అంత - ఈ తరంగం ఇంత" - అనురూపంగా అవటానికి కారణమేమున్నది? ఏదీ లేదు.

లోకం రీతి వేరుగా ఉన్నది. పిండ గ్రహణము - అద్దానికి కారణము లేక ఏదీ సంభవించదు. కాని చైతన్యం సర్వదా నిర్విషయమై ఉన్నది కదా! కనుక ఈ జగత్తు అకారణం! వాస్తవానికి లేనిదే! భావనచే మాత్రమే ఉన్నట్లున్నది! - అనగా, భావనారూపమే అయున్నదా?

ఒకవేళ ఇదంతా భ్రాంతి మయమనుకుంటే, అట్టి భ్రాంతికి కారణం ఏమిటి? ఆ భ్రాంతి యొక్క ద్రష్ట (లేక) మననము చేసే కర్త ఎవరై ఉన్నారు? ఆతని ఉదయానికి కారణమేమిటి? ఆ కారణం ఎచ్చట ఉన్నది? అట్టి ద్రష్టకు ఉదయాస్తమయాలు ఉన్నాయా?

నేను ఆ ప్రాణియొక్క హృదయ తేజంలో ప్రవేశించి ఈ దృశ్య వ్యవహారమంతా పొందుచున్నానో, ఆతని దేహం ఎప్పుడో నశించింది. అప్పటి నా దేహం కూడా నశించింది. అనగా, అప్పటి బయల్వెడలినట్టి నా దేహము లేదు. ఆ ప్రాణి యొక్క దేహమూ లేదు. అనగా, ఈ దృశ్యమంతా కూడా కర్తృ - కర్మ - కరణవర్జితమై, క్రమశూన్యమె, ఆద్యంతరహితమై, చిద్ఘనమైనట్టి చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమగు ఆకాశము అయివున్నది.

ఇక్కడ కనిపించే ఘట-పట-పటాదులన్నీ (కుండ-వస్త్రము-వృక్షము మొదలైనవన్నీ కూడా) చిదాకాశము యొక్క స్ఫురణ రూపములే! కాబట్టే అవన్నీ స్పష్టరూపములు ధరించినవై అగుపిస్తున్నాయి.

అయితే... "చిన్మాత్రము యొక్క స్ఫురణ" అనే శబ్దం "రాహువు యొక్క శిరస్సు" అను శబ్దము వలె వికల్పమాత్రమై ఉన్నది. (సూర్యునికి - భూమికి మధ్య వచ్చే గ్రహం వలన సూర్యగ్రహణం ఏర్పడుచుండగా అక్కడ 'రాహువు యొక్క తల' అనేది వికల్ప మాత్రమే కదా!)

కాబట్టి సర్వము చిదాకాశమే! అయితే 'యొక్క' అను షష్టీ తత్పురుష సమాస ప్రయోగం ఇక్కడ అసంభవమై ఉన్నది. అంతా చిదాకాశమే అయివుండగా... అందులో 'చిదాకాశము యొక్క స్ఫురణ' అనేది ఎక్కడున్నది?

**జలతరంగం -** సముద్ర జలంలో అలల తాకిడికి తెల్లటి నురుగు ఏర్పడుతోంది. ఆ అలలు, వాటి తాకిడికి ఏర్పడే నురుగు రంగు - ఆకారంచే భేదముండవచ్చుగాక! వాస్తవానికి ఆ అలలు, వాటి ఆకారాలు, నురుగు, అద్దాని తెల్లటి రంగు... ఇవన్నీ నిరాకార జలరూపమే కదా! "జలము యొక్క తరంగం" అనునది పూర్ణార్థం కాదు. "తరంగం జలమే" అనునదే పూర్ణార్థం. అట్లాగే, వ్యష్టి - సమష్టి జీవుడనగు నాయొక్క పూర్ణార్థం "అఖండము - అప్రమేయము" అగు పరమాత్మయే! (లేక) పరబ్రహ్మమే!

ఈ జగత్తు "చిద్రూపము" అనే సముద్రం యొక్క నురుగు అయివున్నది. ఇక చిద్రూపము కానిదేమి? అనంతమగు చిద్ఘనమగు పరబ్రహ్మమే... ప్రకాశ స్వభావముగా స్థితినొంది ఉన్నది.

బ్రహ్మము యొక్క స్ఫురణయే జగత్తు రూపంగా భాసిస్తోంది. కనుక ఇక్కడ ద్రష్టత్వం లేదు. దృశ్యము లేదు. పరబ్రహ్మము... దేశకాల, వస్తు పరిచ్ఛేద శూన్యం. అప్రమేయం. ఆదిమధ్యాంత రహితం. సర్వదా ఏకం. సర్వవ్యాపకం. కార్య-కారణ వర్జితం.

అట్టి పరబ్రహ్మము నిజసత్త చేతనే ఈ భువన - పర్వత - ఆకాశ - దిక్ మొదలైనవి నిర్వర్తించుచూ, ఏకమై అయినప్పటికీ, అనేక రూపములుగా స్ఫురిస్తోంది.

కాబట్టి... ఈ కనబడే సర్వము, సమస్తము వాక్-మనస్సులకు విషయము కానట్టి చిన్మాత్రమే! కేవల-నిర్మల-నిజసత్తామాత్ర చిదాకాశమే ద్రష్ట - దృశ్య రూపములను అవధరించి ఈ 'జగన్నాటకం' ప్రదర్శిస్తోంది! ఇంతకుమించి - ఇంతకు వేరై మరింకెక్కడా ఏదీ లేనేలేదు. ఉండబోవుట లేదు.

❖❖❖

# 25. అభ్యాసవశంగా.....!

**మహాముని :** ఓ లుబ్ధకుడా! విన్నావు కదా! నేను ఇంతవరకు వర్ణించి చెప్పిన ప్రశ్నలకు సమాధానం ఆశ్రయిస్తూ, ఆత్మ నిర్ణయాన్ని ఆశ్రయించినవాడనై సంతాపరహితుడవై ఈ దృశ్యంలో ఉంటూన్నాను.

ఇంకా... రాగవర్జితుడనై, శంకాశూన్యుడనై, అహంకార రహితుడనై, నిర్వాణ శాంతరూపుడనై, ఆధార ఆధేయరహితుడనై, అభిమాన వర్జితుడనై, ఆశ్రమ శూన్యుడనై, నిజ చిత్స్వభావమున ఉన్న వాడనై, స్వయం శాంత స్వభావుడనై సర్వదా ఉదయిస్తున్న సృష్ట్యాత్మ స్వభావుడనై వెలయుచున్నాను. యథా ప్రాప్తములైన కార్యములకు కర్తనై ఉంటూనే సర్వదా అన్నిటికీ అకర్తనై చెన్నొందుచున్నాను.

ఎందుకంటే ఏదైతే స్వయంగా నిష్క్రియమగు చిదాకాశమే అయివున్నదో ...అద్దానికి కర్తృత్వమెచట? ఈ దృశ్యము – నేను కూడా సర్వదా చిదాకాశమే అయి ఉన్నాను కదా! ఈ ఆకాశం – భూమి – వాయువు – అంతరిక్షం – పర్వతాలు – నదులు – ఈ సమస్త ప్రాణి సమూహాలు – ఇవన్నీ కూడా సర్వదా "ఏకమే" అయినట్టి ఆత్మరూపమగు చిదాకాశమే అయివున్నది కదా! ఇది గ్రహించి నేనిక శాంతుడనై, సర్వవిధములా సంతృప్తుడనై విధి, నిషేధ రహితుడనై, బాహ్య – అభ్యంతరములు లేనివాడనై నిత్య ప్రకాశితుడనై ఉంటున్నాను.

❖

అట్టి నా ముందు నీవు కొద్దికాలం క్రితం ఒక మృగమును వేటాడుతూ వచ్చి నీ హింసక్ వృత్తిని పరిత్యజించి వినమ్రుడవై నిలచి ఉండటం కాకతాళీయంగా జరిగింది.

ఓ వ్యాధుడా! లుబ్ధక నామధేయుడా!

ఈ ప్రకారంగా స్వప్నం ఎట్టిదో... మనం ఎటువంటి వారమో... ఈ జగత్తు ఎట్టిదో... నీవు ఎట్టివాడవో... ఈ దృశ్యం ఎట్టిదో... అవన్నీ కూడా నా సద్గురువగు (ఈ మన ఎదురుగా శాంత స్వరూపంగా ఆసీనులై ఉన్న) అన్యముని సమక్షంలో విశదీకరించి చెప్పాను. కనుక మిత్రమా!

ద్రష్టయగు నీవు ఎట్టివాడవు? ఈ దేహ – ఇంద్రియములతో కూడిన ఆధ్యాత్మిక చమత్కారం ఎట్టిది? ఎదురుగా కనిపించే ఈ ఆదిభౌతిక దృశ్యం ఎటువంటిది? ఈ దృశ్యంలో కనిపించే రాగ – ద్వేషాలు, గ్రహణ–త్యాగాలు, వాటికి సంబంధించిన భావపరంపరలు ఎటువంటివి? ఈ సృష్టికే కర్తయగు బ్రహ్మదేవుడు ఎక్కడివాడు? మనకు ఎదురుగా ఉన్న ఈ జన సమూహం ఎక్కడిది?

ఇవన్నీ సమగ్రంగా సుస్పష్టంగా మన ఈ సంవాదమును ఆసరాగా తీసుకుని తెలుసుకో! ఈ సమస్త దృశ్యము మిథ్యగా గ్రహించి శాంతుడవై ఉండు.

ఎందుకంటే... ఈ ద్రష్ట మొదలైనవాటి సత్త చిన్మాత్రాకాశ రూపమే అయి ఉన్నది. ఇదంతా స్వయంగా పరమశాంత రూపమై భాసిస్తోంది. ఇక్కడ పూర్వాపరముల దృష్ట్యా అశాంతమైనదేదీలేదు.

చిత్ సత్త సర్వదా శాంతరూపంగానే స్వయంగా భాసిస్తోంది. అది 'దృశ్యము' అనబడే అశాంతిగా ఎప్పుడూ అగుచుండటం లేదు. సంచలన తరంగాలుగా కనిపించేదంతా నిశ్చలజలమే కదా! దృశ్యము దృశ్యముగా కాకుండా సత్యమగు పరబ్రహ్మముగా అనిపించటమే పరమ శాంతిస్థితి. అద్దానిని నీకు నీవే సంపాదించుకో!

❖

**వ్యాధుడు : (లుబ్ధకుడు) :** ఓ మునీంద్రా! మీరు చెప్పేదంతా కంటికి కనిపించేదానికంతా వ్యతిరిక్తంగా ఉన్నది. అందుకే అంతా యుక్తియుక్తమే అయినప్పటికీ, కొంచెం నమ్మకం మాత్రం కలగటంలేదు. మీరు ప్రవచించే దానిని అనుసరించి... మీరు, నేను, సమస్త దేవతలు, మనుష్యులు – మనమందరం కూడా పరస్పరం స్వప్నంలోని ఆయావ్యక్తుల సంగమంలాగా స్వప్న పురుషులమేనంటారా? మనమంతా ఉన్నట్లే కనబడుచూ లేనివారమేనని మీ ఉద్దేశమా? సదసద్రూపులమా?

**మహాముని :** అవును. ఇదంతా కూడా పరస్పరం స్వప్నమువలె స్థితినొంది ఉన్నది. సర్వులకు పరస్పరం ఆత్మగా చూస్తే అంతా సత్తే! అన్యంగా చూస్తే అంతా అసత్తే!

**లుబ్ధకుడు (వ్యాధుడు) :** మరి ఇదంతా నీవు, నేను, ఆ ఊరివారు, ఆ దేశంవారు, నా దేశంవారు, ఆ జాతివారు, ఈ మతంవారు ...ఇవన్నీ ఉన్నట్లే నాకు అనిపిస్తోంది కదా!

నేను అజ్ఞానియగు వ్యాధుడను. మీరో ఆత్మజ్ఞానం ఎరిగిన మహామునివర్యులు. ఆయనేమో... మీకు ఆత్మజ్ఞానం గుర్తుచేసిన మీ సద్గురువర్యులు. ఆ ప్రక్కన ఉన్న జనులు మీ ఆశ్రమ దర్శనమునకు వచ్చి ఇక్కడ సేద తీర్చుకొనే బాటసారులు.

ఇవన్నీ ఇట్లా వేరు వేరుగా ఉండగా "ఇవన్నీ లేవు. ఇదంతా పరస్పరం స్వప్న సదృశం"...అని మీరు సిద్ధాంతీకరిస్తున్నారే! వరప్రసాదులగు దేవతలు కూడా పరస్పర స్వప్న విభాగులేనని చెప్పుచున్నారే? ఇదంతా నాకిట్లా అనిపిస్తూ ఉండగా, "ఇదంతా పరస్పర స్వప్న సదృశం. అసత్యం మాత్రమే!"...అని మీరు ఎట్లా చెప్పగలుగుచున్నారు?

**మహాముని :** ఓ ప్రియాత్మస్వరూపా! లుబ్ధకా! ఈ నీ ప్రశ్నకు ఇతఃపూర్వమే సమాధానం చెప్పాను. అయినా కూడా... నీవు అడుగుచున్నావు. కనుక మరల చెప్పుచున్నాను. విను.

ఈ దృశ్యం ఎవనిచే ఏ ప్రకారంగా ఎరుగబడుచున్నదో... ఆ ప్రకారం గానే ఆతనిచే అనుభవించబడుతోంది. ఈ జగత్తు అనేకమూ కాదు. ఏకమూ కాదు. ఏకానేకమూ కాదు. ఇదంతా కూడా – "ఒకే మట్టి – అనేక కుండలు" అనే వ్యవహారంలో "అనేక కుండలు"గా దృష్టి గలవాడికి అక్కడ అనేక ఆకారాలుగా గల అనేక కుండలు కనిపిస్తాయి. "ఇవన్నీ బంక మట్టితోనే కదా తయారయింది!" అనే దృష్టి గలవానికి అంతా బంకమట్టిగానే కనిపిస్తుంది. "జీవులందరూ ఆత్మయే స్వరూపంగా కలిగి ఉన్నారు" అనునది ఆత్మసాక్షాత్కారం పొందినవారి నిస్సందేహానుభవమై ఉంటోంది.

ఇక్కడ నానా రూపములు చూచేవానికి "ఏకత్వము" – అసంగతంగా, అర్థంలేని మాటగా, అసందర్భంగా కనిపిస్తుంది. "ఏకత్వము" దర్శించేవానికి అనేకత్వమనేది – అసంగతంగా, అర్థంలేని మాటగా అసందర్భంగా కనిపిస్తోంది.

తత్త్వవేత్తలకు ఇదంతా స్వప్న సదృశంగా, ఊహాజనిత వ్యవహారంగా అనిపిస్తోంది. వారికి దృశ్యమునకు ఆవలగల నిత్య నిర్మల ఆత్మ స్వరూపమే 'ద్రష్ట' అనే వేషం వేసి నటించుచున్నట్లుగా కనిపిస్తోంది. వారికి ఇదంతా "ఎప్పుడో ఏదో సందర్భంలో చూచిన నగరం" లా (జ్ఞాపకానికి సంబంధించిన ఒకానొక ఊహాఫలకంలోని దృశ్యంలా) అనిపిస్తోంది. ఆత్మ గురించి శ్రవణ,పఠణాదుల ద్వారా నిర్మల హృదయంతో ఎరిగిన వారికి ఇది జగత్తుగా కనిపించినా, ఆత్మగా అనిపిస్తోంది.

ఈ విధంగా నా అనుభవపూర్వకమైన సత్యమేమిటో నీకు వివరించి చెప్పాను. నిరంతరంగా నీకు అనేక ఆత్మజ్ఞాన విశేషాలన్నీ అనేక రోజులుగా బోధించాను. నీవు కూడా ఇంతసేపూ నేను చెప్పినదంతా ప్రజ్ఞతో ఎంతో శ్రద్ధ – ఆసక్తులతో విన్నావు. నీవు వాస్తవానికి ప్రజ్ఞావంతుడవే! నేను చెప్పిన విశేషాలన్నీ గ్రహించగలిగే సుతీక్షణమైన బుద్ధి కలవాడివే! ఇక ఆపై నీకు ఎట్లా అభిరుచియో ...అట్లే ఆచరణ కొనసాగించవచ్చు.

**వ్యాధుడు (లుబ్ధకుడు) :** మహనీయులగు తమరు అనృతము (అబద్ధము) మాట్లాడరనునది నాకు సువిదితమే! మీ అనుభవమే చెప్పుచున్నారని, నన్ను ఉద్ధరించటానికే పలుకుచున్నారని నేను గ్రహించియే ఉన్నాను. అయినా కూడా "ఈ జీవులు, ఈ దేహాలు, దేవతలు, ప్రకృతి, పర్వతాలు, నదులు, కాలము, మనో బుద్ధులు" ...ఇవన్నీ కూడా స్వప్నంలోని మనుజులవలె అసత్ మాత్రమే అనే మాట నేను నమ్మలేకపోతున్నాను. ఎందుచేతనో మరి?

**మహాముని :** ఓ వ్యాధుడా! నేను ఉన్నది ఉన్నట్లుగా బోధించాను. అయినా కూడా నీ యొక్క బుద్ధి స్వాభిమతమగు దృశ్యమునందే విశ్రాంతిని వెతుకుతోందిగాని... (జగద్దృశ్య భ్రమయందే తగుల్కొని ఉంటోందిగాని)... పరమ పదమగు ఆత్మయందు క్షణకాలం కూడా విశ్రాంతిని పొందలేకపోవు చున్నది. ఎందుకంటావా? కొయ్యను చెంబు ఆకారంగా మరల్చినపుడే అందులో నీరు నిలుస్తుంది కదా! అట్లాగే 'అభ్యాసం అనే గొప్ప ప్రయత్నము లేనంతకాలం 'ఆత్మబోధ' మనస్సులో ప్రవేశింప జాలదు. ఒకవేళ ప్రవేశించినా బుద్ధికి, అవగతమై అనుభూతిగా రూపుదిద్దుకోదు.

గురు-శాస్త్రాదుల సేవా ప్రభావంచేత, అభ్యాసము యొక్క దార్ఢ్యము చేత 'బోధ' అనేది చిత్తమునందు స్థిరపడుచున్నది. అప్పుడు ద్వైత - అద్వైత దృష్టులు శమిస్తున్నాయి. అట్టి నిర్మలత్వము పొందినప్పటి చిత్తమునే 'మోక్షము' అనే పేరుతో మహనీయులగు విజ్ఞులు పిలుస్తున్నారు.

**నిర్మామ - మోహా, జిత సంగదోషా, అధ్యాత్మనిత్యా, వి నివృత్త కామాః**
**ద్వంద్వైః విముక్తాః సుఖ-దుఃఖ గుంజ్ఞైః గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయం తత్॥**

ఓ మిత్రమా! అభిమాన, మోహములను జయించినవారు, విషయ సంపర్క దోషాలను తొల గించుకొన్నవారు, నిరంతరం ఆత్మను మాత్రమే సర్వంలో దర్శించే అభ్యాసము గలవారు, దృశ్యం పట్ల సర్వకోర్కెలను త్యజించి ఉన్నవారు, సుఖ-దుఃఖాది ద్వంద్వాలకు అతీతత్వం సముపార్జించుకున్నవారు, శాస్త్రములు ప్రతిపాదించే తత్త్వజ్ఞానాన్ని నిరంతరం అభ్యసించువారు... అట్టివారే 'నిర్వాణం' అనే ఉత్తమ పదాన్ని అధిరోహించినవారై ఉంటున్నారు. "వేలాది తరంగాలలో ఒకే జలం", "వేలాది మట్టి బొమ్మలలో ఒకే మట్టి", "వేలాది ఆభరణాలలో ఒకే బంగారం" లాగా ...వారికి ఈ అనంత సంఖ్యలో గల దేహాలుగా ఒకే ఆత్మ వ్యక్తీకరణమౌతోందని సుస్పష్టంగా గమనిస్తున్నారు.

❖❖❖

# 26. భవిష్యత్ వృత్తాంతం

**అగ్నిదేవుడు :** ఓ ప్రియ విపశ్చిత్ రాజా! నీకు ఈ శవోపాఖ్యాన వృత్తాంతమంతా చెప్పుచున్నాను కదా! ఆ తరువాత ఏమైనదో ...చెప్పుచున్నాను విను.

❖

ముని వాక్యములు విని ఆ (లుబ్ధకుడు అనే) వ్యాధుడు పరమాశ్చర్యచకితుడైనాడు. ఆశ్చర్యము యొక్క అతిశయము చేత ఆతడు నిశ్చేష్టితుడైనాడు. ఒక ప్రతిమలాగా కదలకుండా ఉండిపోయాడు.

జగత్తు స్వప్న దృశ్యం... దేహాలు – భ్రమయా?... జీవునికి – జీవునికి మధ్య... కనిపించే భేదాలు స్వయంకృత మనోకల్పితాలా!...అయితే పుణ్య–పాపాలు, దేవత–ముని–మహర్షి–త్రిమూర్తులు మొదలైనవి ఇవన్నీ స్వప్న సదృశమని, తానే మరొకరి స్వప్నంలోని స్వప్న పురుషుడనని – ఆత్మగా సర్వము సత్యమేనని ఇటువంటి వాక్యాలు తనకు ఆత్మయందు విశ్రాంతిని ప్రసాదించటానికి బదులుగా ఏదో వ్యాకులపరచసాగాయి. అభ్యాసము లేనందువలన ఆతనికి ఆత్మానందం అందించకపోగా సముద్ర తరంగాలలో కొట్టుకుపోయే బంతిలాగా ఆతని చిత్తము మహాచంచలం కాసాగింది. చక్ర యంత్రముపై ఆరూఢుడైనవానివలె, ఎవరో మాయా హస్తములతో తనను ఎటో పరుగులు తీయిస్తూ తోసుకుపోతున్నట్లు, జలాశయంలో మొసలి తన కాళ్ళు రెండూ పట్టుకొని జలాశయ మధ్యభాగానికి ఈడ్చుకొనిపోతున్నట్లు, కాళ్ళు – చేతులు కదిలించలేని స్థితిలో శత్రువు ఆయుధధారి అయి దగ్గరకు వేగంగా వస్తున్న సమయంలాగానూ వేసట చెందసాగాడు.

ఈ ముని చెప్పుచున్నదే నిర్వాణమా? లేక 'నిర్వాణము' అంటే మరొకటా? ఈతనికి 'నిర్వాణము' అంటే తెలుసా? తెలియదా? అందరిలోని ఆత్మను నేనేనా? ఈ జగత్తు దేవ, మనుష్య, భూ, ఆకాశ, జంతు, పర్వతాది అనేక విశేషాలతోను, ప్రదేశాలతోను, రకరకాల జీవ జాతులతోను, మంచి – చెడులతోను కనబడుతూ ఉంటే...

"ఇదంతా స్వప్నతుల్యం, నీవు నా స్వప్న పురుషుడవు – నేను నీ స్వప్నంలోని పురుషుడను, ఇదంతా మరొకరి స్వప్నలోకం, అంతా మిథ్య, ఆత్మయే సత్యం, నేనే ఆత్మ" ...ఇట్లా బోధిస్తున్నారేమిటి ఈయన?

ఈ విధంగా అనేక సంశయములు ఆతని హృదయంలో కొనసాగాయే కాని, ఆతనికి ఆత్మయందు విశ్రాంతి లభించనేలేదు.

❖

**విపశ్చిత్తు :** హే భగవాన్! అగ్నిదేవా! అంత చాతుర్యంగా ఆ మునివర్యునిచే ప్రవచించబడిన ఆత్మ జ్ఞాన శాస్త్రం ఆతనికి ఆత్మశాంతిని ప్రసాదించనేలేదా? ఎందుచేత?

**అగ్నిదేవుడు :** ఇందులో ఆశ్చర్యమేమున్నదయ్యా! "ఈ జగత్తుగా నాచే చూడబడేదంతా నా యొక్క అవిద్యయే" అనే శాస్త్ర వాక్యానుభవం శిష్యునిలో అంకురించనంతవరకు గురువాక్యాలు శిష్యునికి అనుభవమును ప్రసాదించజాలవు.

ఆ లుబ్ధకుడు, "ఈ జగత్తు పరమాత్మ నుంచే వచ్చింది కదా! కనుక ఇది సత్యం కాకుండా ఎట్లా పోతుంది?" ...అనియే అనుకుంటున్నాడు. జీవునియొక్క "ఈ దృశ్యము సత్యమే"...అను దృశ్య సత్యత్వ భావనయే సంసారము యొక్క రూపం. ఇంతకు మించి 'సంసార బంధము' అని చెప్పబడేదేదీ వాస్తవానికి లేదు. ఆ దృశ్య సత్యత్వ భావన నుండే తదితర సాంసారిక దృష్టులన్నీ బయల్వెడలి పరిఢవిల్లుచున్నాయి. ఆత్మోపాసకులగు విజ్ఞులకు ఇదంతా జగత్తుగా అనేక భేద విశేషాలతో కనిపిస్తున్నప్పటికీ "అందరూ ఆత్మయే స్వరూపంగా కలిగి ఉన్నారు" ...అనే అభ్యాస

బలంచేత ... "ఇదంతా ఆత్మయే" అని, "ఇదంతా నా స్వరూపమే" ...అని తప్పక అనిపిస్తోంది. ఇందులో ఏమాత్రం ఆశ్చర్యం లేదు. మనకు జ్ఞానుల దృష్టి ప్రమాణంగాని, అజ్ఞానుల దృష్టి కాదు కదా! సరే... ఇప్పుడు మనం ఆ లుబ్ధకుని (వ్యాధుని) వృత్తాంతం కొనసాగిద్దాం. విను.

❖

**అగ్నిదేవుడు :** ఓ విపశ్చిత్ రాజా! ఆ వ్యాధుడు మరల కనులు తెరచాడు. ఆకాశం, భూమి, జీవులు, అంతరిక్షం, నక్షత్రాలు, గ్రహాలు, సూర్యుడు, సద్గురువగు మహాముని, ఆయనకు గురువైన అన్యముని, ఆశ్రమం, గ్రామాలు, పట్టణాలు, నగరాలు మొదలైనవన్నీ ఎదురుగా ఉన్నట్లే కనిపించాయి. అప్పుడు ఆ వ్యాధుడు ఇట్లా యోచించాడు.

"ఇప్పుడు నేను ఎవరి స్వప్నంలోనో చిక్కుకున్నానన్న మాట! నేను ఇప్పుడు తపస్సు చేస్తాను. ఆ తపోఫలంగా అతిదీర్ఘమైన దేహం సంపాదించి ఆ అంతరిక్షం కూడా దాటిపోతాను. అట్టి అతి దీర్ఘ శరీరంలో ఈ పృథివి, ఆకాశం, అంతరిక్షం దాటి వాటికి ఆవల ఏమున్నదో ...ఎక్కడ ఈ దృశ్యమంతా ముగిసిపోతుందో చూస్తాను. చూచి ఈ జగత్తుకు ఆవల విశ్రాంతి తీసుకుంటాను"... అని ఈ ప్రకారమైన నిర్ణయమును అప్పటికప్పుడే తీసుకున్నాడు.

ఆతడు ఇప్పటికీ మూర్ఖుడుగానే ఉన్నాడని వేరుగా నీకు చెప్పక్కర్లేదు కదా! ఎందుకంటే ఆ మహాముని దృష్టాంత సహితంగా మహత్తర బోధను ప్రవచించినప్పటికీ అభ్యాసం లేకపోతే లాభముండదు కదా! అందుచేతనే ఆతనిలో 'జ్ఞానం' తగినంతగా ఉదయించలేదు. ఆ ముని యొక్క మహత్తర వాక్యాలన్నీ ఆతనిపట్ల బూడిదలో పోసిన పన్నీరు వలె ...వ్యర్థమై పోయాయి. "ఈ దృశ్యము నీ భావనయే! భావనకు ముందే ఉన్న నిత్యనిర్మలమగు ఆత్మయే నీ స్వరూపం. ఈ కనబడేదంతా నీ యోచనయే కాబట్టి నీకు అన్యమైనదిలేదు" ...అనే వాక్యం ఆతడు అందుకోలేక పోయాడు. అయితే అక్కడికక్కడే తదితర మునులతో కూడి తపస్సు చేయటం ప్రారంభించాడు. తన ఇతఃపూర్వపు మృగములను వేటాడే స్వభావం అప్పటికప్పుడు సంస్కారపూర్వకంగా పూర్తిగా త్యజించి, ఇక తపస్సు చేయటంలో నిమగ్నం కాసాగాడు. అట్లా అనేక సంవత్సరాలు తపస్సు చేసి చేసి ఒక రోజు మరల మహామునిని సమీపించాడు.

❖

**లుబ్ధకుడు (వ్యాధుడు) :** మహాత్మా! మహామునీ! నేను అనేక సంవత్సరాలు సుదీర్ఘంగా తపస్సు చేశాను. అయినా కూడా నాకు మీ వలె ఆత్మయందు విశ్రాంతి లభించటమే లేదు. ఎందువల్ల?

**మహాముని :** ఓ లుబ్ధకుడా! నీకు నేను ఏ ఆత్మజ్ఞానం ఉపదేశించానో అది నీ అజ్ఞానమును పూర్తిగా తొలగించివేయగలిగినదే కానీ... నీవు దృశ్య జగత్తుకు సంబంధించిన అజ్ఞానం వదలటానికి తగినంతగా అభ్యాసపూర్వకంగా సంసిద్ధం కాలేదు. చిన్న అగ్నికణం బండ ఇనుప కడ్డీలను కాల్చలేదు కదా! అట్లాగే, నా జ్ఞాన వాక్యాలు నీ జన్మ జన్మాంత దృశ్యభావానుభవాలను దహించలేకపోతున్నాయి. అభ్యాసం లేకపోవటంచేతనే శివరూపమగు ఆత్మయందు నీకు విశ్రాంతి లభించటంలేదు. అయితే

'తపస్సు' అనే సాధనకు ఉపక్రమించావు కదా! అట్టి ఈ తపస్సు అనే అగ్ని నీలోని జ్ఞానాగ్నిని తప్పక ప్రజ్వలింపజేస్తుంది. క్రమంగా నీ అజ్ఞానం తప్పక తొలగుతుంది. నిరుత్సాహ పడకు. త్వరలో నీకు ఆత్మానందం లభించగలదు.

**లుబ్ధకుడు (వ్యాధుడు) :** స్వామీ! మీరు ఆజ్ఞాపించినట్లే తపస్సు కొనసాగిస్తాను. అయితే ముందు ముందు నాకేమి కానున్నదో, ఎట్లా పూర్ణానందమగు ఆత్మయందు విశ్రాంతి లభించనున్నదో, అది ఇప్పుడే తెలుసుకోవాలని ఉన్నది. మహా తపస్యులగు మీరు భూత-భవిష్యత్-వర్తమానాలను ఒక్కసారే ఎదురుగా కనిపించే దృశ్యంలాగా చూడగలరు కదా! అందుచేత ముందు ముందు జరగబోయే విశేషాలు ఇప్పుడే నాకు చెప్పండి. ఎందుకంటే, నాకు ఆ విషయాలపట్ల ఎంతో కుతూహలంగా ఉన్నది. ఎంతగా భవిష్యత్ గురించి తెలుసుకోవాలని కుతూహలపడుచున్నానంటే... ఆయా భవిష్యత్ సంబంధమైన ఆలోచనలచే నాకు వర్తమానంతో తపస్సునందు ఏకాగ్రత కుదరదనంతగా...!

**మహాముని :** (పకపకా నవ్వి) ...ఇదంతా కూడా దృశ్యంపైగల కించిత్ మూర్ఖత్వంతో కూడిన "సత్యమే కదా!" అనే నమ్మకం తొలగకపోవటం, నీ ఆత్మస్వరూపము నందు నమ్మకం కలగకపోవటం చేతనే సుమా! అయినా, భవిష్యత్తు గురించి నీవెందుకు వేదన చెందటం? కానున్నది కాక మానదు కదా? వర్తమానంలో నీ తపస్సును కొనసాగించు.

**లుబ్ధకుడు :** అదంతా ఏమో తెలియదు. గురువర్యా! నాకు నా భవిష్యత్ గురించి దర్శించి చెప్ప వలసినదిగా మరొక్కసారి మిమ్ములను వేడుకుంటున్నాను.

**మహాముని :** (చిరునవ్వుతో) అయినా, ప్రియశిష్యుడవై నన్ను ఆశ్రయించావు కాబట్టి నీవు కోరినట్లుగా "అత్యద్భుతము - వినుటకు ఇంపైనది" ...అయినట్టి నీ భవిష్యత్ వృత్తాంతం చెపుతాను విను.

❖

జ్ఞానులందు అత్యంత ప్రసిద్ధమైనది, ఉత్తమ సారభూతమైనది, తత్త్వజ్ఞులకు నిత్యానుభవమైనది అగు ఆత్మను నీవు ఎరుగలేకపోతున్నావు. కాబట్టే ఇంకా సందిగ్ధ చిత్తుడవై ఉన్నావు. నీవు ఇప్పుడు కేవలం మూర్ఖుడవు కాదు. కేవలం పండితుడవు కాదు. నీవు గొప్ప తపస్సు ప్రారంభించావు. మంచిదే. అయితే... "అవిద్యారూపమైనట్టి ఈ విశాల జగత్తు పరిణామం ఎంత?" అనే నిజ మనోరథ కల్పనను ఆశ్రయిస్తూనే, ఇక మరల తపస్సు ప్రారంభిస్తావు.

ఈ ప్రకారంగా వందలకొలది యుగాలు జగత్తు యొక్క పరిణామం తెలుసుకోవటానికి, తద్వారా ఈ జగత్తును అధిగమించటానికై తపస్సు కొనసాగిస్తావు. అనేక జన్మలుగా అట్టి ఆశయంతో నీ తపస్సు కొనసాగుతుంది. తపస్సులకు ఫల ప్రదాతయగు బ్రహ్మదేవుడు దేవతా సమేతుడై నీ ముందు ప్రత్యక్షమై "నాయనా లుబ్ధకుడా! ఏమి కోరి ఈ సుదీర్ఘ తపస్సు ఆచరిస్తున్నావో... అది నెరవేర్చటానికే నీ ముందుకు వచ్చాను. ఏమి కావాలో... కోరుకో?" అని అడుగుతారు.

**నీవు (లుబ్ధకుడు) (వ్యాధుడు) :** దేవా! నమోనమః! ఈ దృశ్యము అవిద్యామయమేనని నా గురువు మహాముని నాకు తెలిపియున్నారు. ఇదంతా బ్రహ్మమునందలి ప్రతిబింబం మాత్రమే కదా! కనుక

నేను ఎక్కడ ఎట్టి దృశ్యం ఉండదో... అట్టి స్థానం చేరి విక్షేపరహితుడనై విశ్రాంతి తీసుకోవాలనుకుంటు న్నాను. కాని అట్టి దృశ్య విక్షేపరహితమైన ప్రదేశమేదీ నాకు ఇప్పటివరకూ కనిపించలేదు. ఎందుకంటే అద్దం ఎక్కడుంటే అక్కడ దృశ్యము ఆ అద్దంలో ప్రతిబింబిస్తూనే ఉంటుంది కదా! అట్లాగే చిదాకాశం ఎక్కడుంటే అక్కడ ఒక పరమాణువులో కూడా దృశ్య వ్యవహారం ప్రతిబింబిస్తూనే ఉంటుంది. ఈ విధంగా చూస్తే చిదాకాశం లేని చోటే లేదు కాబట్టి... (అద్దానిలో జగత్తు ప్రతిబింబిస్తూనే ఉంటుంది కనుక) జగత్తులేని ప్రదేశమే ఎక్కడా కనిపించటం లేదు. అవిద్య ఎక్కడ దాకా విస్తరించి ఉంటే అక్కడి దాకా అవిద్యా జనితమైన దృశ్య వ్యవహారం ఉంటూనే ఉంటుంది కదా! అయితే ఓ మహాత్మా! ఇప్పుడు నా సందేహం తీర్చవలసినదిగా మిమ్ములను వేడుకుంటున్నాను.

ఈ దృశ్యము ఎంతదూరం విస్తరించి ఉన్నది? ఈ దృశ్యమునకు ఆవల బ్రహ్మము ఉన్నది కదా! అట్టి బ్రహ్మకోశం ఎంత దూరం వరకు విస్తరించి ఉన్నది?

స్వామీ! ఆకాశం కంటే అతిసూక్ష్మమైనది, జగద్రహితమైనది అగు 'బ్రహ్మము'ను నేను ప్రత్యక్షంగా అవశ్యం చూడాలని అనుకుంటున్నాను. అందుకే మీ కొరకై ఈ తపస్సు చేయనారంభిం చాను. నా తపోఫల ప్రభావంగా తమ దర్శనం అయింది. దృశ్యమును దాటి బ్రహ్మమును చూచేందుకు తగిన శరీరం నాకు కావాలి కదా!... అందుచేత నా ఈ దేహమును, స్వేచ్ఛా మరణం కలదిగాను, రోగరహితంగాను, గరుత్మంతుని వంటి వేగం కలదిగాను, ఆకాశంలో సంచరించ గలిగేదిగాను, ఇది పెరుగుతూ ఉంటే ఎవరూ నిరోధించలేనిదిగాను...వరాన్ని ప్రసాదించండి. ఈ నా దేహం ఒక్కొక్క క్షణానికి ఒక్కొక్క యోజనం చొప్పున విస్తరించాలి. అట్లా వృద్ధి చెందిన నా దేహం కొద్ది కాలానికి ఈ మూడు లోకాలను అతిక్రమించి ఇంకా ఇంకా విస్తరించుగాక! అప్పుడు నేను మహా విశాలత్వం పొందిన ఆ నా దేహంతో ఈ దృశ్యమును దాటిపోతాను. ఆవలకు విస్తరించి చూడగలిగేంతగా ఈ శరీరం ఎదగాలి. తద్వారా ఈ దృశ్యం యొక్క అంతు ఎక్కడో, బ్రహ్మం ఎక్కడ ప్రారంభమౌతోందో – అది నేను చూస్తాను... కనుక, హే బ్రహ్మదేవా! నాకు క్షణం క్షణం ఒక్కొక్క యోజనం విస్తరించగల దేహమును ప్రసాదించండి.

అప్పుడు "వత్సా! అట్లే అగుగాక! అయితే, క్షణక్షణ యోజన ప్రవృద్ధ దేహం కోరుకుంటున్నావో, అట్టిది అట్టి దేహం వలన లభిస్తుందా? యోచించుకో! నీ అభీష్టం నెరవేరుగాక, నీకు శుభమగుగాక!" ...అని నీకు వరం ప్రసాదించి బ్రహ్మదేవుడు అంతర్ధానమౌతారు.

అప్పుడు 'తపస్సు' అనే శ్రమచే అత్యంతగా కృశించిన నీ దేహం చంద్రకాంతివలె ప్రకాశిస్తుంది. అప్పటికప్పుడు నీవు ఈ ఆశ్రమం నుండి బయల్వెడలుతావు. అప్పుడు ఆకాశంలో ఎదగనారంభించిన నీ శరీరం కారణంగా నీ ముఖం, "ఆకాశంలో రెండవ చంద్రుడా!" అన్నట్లుగా కనబడుతుంది. క్రమంగా ఇంకా ఇంకా నీ శరీరం విస్తారం కావటం ప్రారంభిస్తుంది. క్రమంగా సర్వమునకు ఆధారం, ప్రతిబంధరహితం, అనంతం అగు ఆకాశం నందు ఈ నీ శరీరం అట్లా అనుక్షణం సువిస్తారం అగుచుండగా మధ్య మధ్యలో... ఆ మహాకాశంలో... అనేక సృష్టులను చూస్తూ

చూస్తూ ఉంటావు. అవన్నీ మహాసముద్రంలోని తరంగాలవలె చైతన్య మహాకాశము అనే శూన్యత్వం నుండి జనించిన వాయుచక్రముల వంటివే కదా!

**వ్యాధుడు :** శూన్యం నుండి సృష్టి రావటమేమిటి?

**మహాముని :** స్వప్నంలో చిద్ఘనమగు ఆత్మయందు నగరాలు కనిపిస్తున్నాయి కదా! అవన్నీ చిద్ఘనమే రూపంగా కలిగివున్నాయి కదా! అట్లాగే ఈ జాగ్రత్తు కూడా! అట్లాగే నీ శరీరం పెరుగు చుండగా ప్రతిబంధ రహితములు, – చిద్ఘన రూపములు అగు అనేక సృష్టి సమూహములు నీ దృష్టికి కనిపించటం, నీవు నీ శరీర పరిణామం చేత వాటిని అధిగమించటం జరుగుతూ ఉంటుంది. అనేక సృష్టులను దృఢనిశ్చయయుక్తుడవై గాంచుతూ ఉంటావు. మరొకవైపేమో నీ శరీరం అనేక భూ – నభోంతరాలు దాటివేస్తూ ఒక్కొక్క క్షణం ఒక్కొక్క యోజనం వృద్ధి అవుతూ ఉంటుంది.

**వ్యాధుడు :** మహాత్మా! మీరు చెప్పే ఆ నా శరీరం వృద్ధి చెందుచుండగా కనబడబోయే జగత్ సమూహాలు ఇప్పటి నుంచే ఉన్నాయా? లేక అవి అప్పటికప్పుడు ఉత్పత్తి అవుతాయా? అవన్నీ ఇప్పుడెక్కడున్నాయి? అన్ని జగత్ సమూహాలకు కర్తలు ఎవరు? భోక్తలు ఎవరు? అవన్నీ అసలున్నాయా? లేవా? వస్తు రూపాలా? శూన్యరూపాలా? జ్ఞానులు వాటిని చూస్తున్నప్పుడు ఏ అవగాహనతో – దృష్టితో చూస్తూ ఉంటారు.

**మహాముని :** ఓయీ! లుబ్ధకా! ఈ 'జగత్తు' అనబడేది ఎల్లప్పుడూ ద్రష్ట యొక్క అభిలాషానుసారమే అనుభూతమౌతోందయ్యా! మహనీయులగు విజ్ఞులకు ఇదంతా సాగర జలంలో ఏర్పడే తరంగాకారాల వలె (నిరాకారమగు జలమే అనేక సాకార తరంగాలుగా కనిపిస్తున్నట్లు) నామరూప రహితము, నిరంజనము, నిత్యనిర్మలము – అగు పరమాత్మయే ఈ కనబడే చిత్ర విచిత్ర నామ, రూప, ఆకారాదులుగా కనిపిస్తున్నట్లు గమనిస్తున్నారు. ఇక అజ్ఞానదృష్టి అంటావా? ...నీకు ఒక సంఘటన ద్వారా వివరించి చెపుతాను.

ఒక రోజు ఒక రాజసౌధం నుండి కొందరు రాణివాసపు స్త్రీలు కిటికీలోంచి రాజసభలో జరిగే ఏదో సంగీత నృత్యాన్ని చూస్తున్నారు. అట్లా చూస్తూ ఉంటే సభలో నర్తకులు చేసే నృత్య భంగిమలు కనిపిస్తున్నాయి గాని వారు ఏ కిటికీలోంచి చూస్తున్నారో ఆ కిటికీ యొక్క లోహపు చువ్వలు వారి దృష్టిపథంలోనే లేవు. ఆ సభానాటకం చూచిన తరువాత, "కిటికీ యొక్క లోహపు చువ్వలు ఎన్ని ఉన్నాయి? వాటిపై ఈగలు వ్రాలాయా?" ...అనే విషయాలు ప్రశ్నిస్తే వారు చెప్ప గలరా? లేదు. ఎందుచేత? వారి దృష్టంతా సభా మధ్యంలో జరిగే నాటకంలోని సంఘటనలపైనే ఉన్నది కాని, కిటికీ చువ్వలను వారు చూడటమే లేదు.

అట్లాగే చిదాకాశ దృష్టిగల తత్త్వవేత్తలకు ఈ జగద్రూప వ్యవహారమంతా చిదాకాశ మాత్రంగానే కనిపిస్తోంది. అంతా నిర్మలాత్మస్వరూపంగానే కనిపిస్తోంది. అజ్ఞానులకో ...ఆయా వివిధ జగత్తుల రూపంగా కనిపిస్తోంది. జగత్తుల అభిలాష కలవారికి ఆత్మస్వరూపం కనిపించదు. ఆత్మను అంతటా దర్శించేవారికి జగత్తులు కనిపించటంలేదు.

నీకు కనిపించే ఆ జగత్తులనబడేవన్నీ నీ అజ్ఞాన దృష్టి యొక్క ప్రదర్శనమేనని ఇప్పటికైనా గ్రహించవయ్యా! భూమిపై అనేకమంది మనుష్యులు, గ్రామాలు, కొండలు, గుహలు, దేశాలు, రాజ్యాలు, నదులు, సముద్రాలు అగుపించవచ్చుగాక! చంద్రమండలం నుంచి భూమిని చూస్తున్నా వనుకో! ఆయా విశేషాలన్నీ వేరు వేరుగా కనిపిస్తున్నాయా? లేదు కదా! ఆతని దృష్టిలో ఈ గ్రామ – పట్టణ – దేశాది భేదాలన్నీ అసత్తు. ఇదంతా ఆతనికి భూగోళమే!

అట్లాగే... ఆత్మతో అభేదరూపస్థితి సంపాదించుకొన్న మహనీయులకు ఈ వ్యక్తిగత భేదాలన్నీ అసత్తుగా కనిపిస్తున్నాయి. ఇక అజ్ఞానికో... వీటిలో 'ఏకత్వం' అనేది ఊహకు అందటమే లేదు.

❖

ఆ విధంగా నీవు సృష్టుల రూపంలో ఉండే – చెట్టుకు అనేక ఆకులవంటి – అనేక జగత్ సమూహాలలో నీ దృష్టి అప్పుడు పచార్లు చేస్తూ ఉంటుంది.

కొన్ని సృష్టులు. ఇంతలోనే శూన్యాకాశం. మరల మరికొన్ని సృష్టులు. మరల ఆకాశం...

ఈ విధంగా సృష్టి – ఆకాశములను మార్చి మార్చి చూస్తూ ఉంటావు. ఆ విధంగా సుదీర్ఘకాలం చూస్తూ చూస్తూ ఉండగా ఒకానొకప్పుడు నీలో వైరాగ్యం ఉదయిస్తుంది. నీవు నిర్వర్తించిన, నిర్వర్తించబోయే తపోఫలంగా నీవు వైరాగ్య దృష్టితో నీ అతిదీర్ఘ శరీరాన్ని నీవే చూస్తూ ఇట్లా పలుకుతావు – "ఓ శరీరమా! ఆహా! అనేక లక్షల మేరు పర్వతములను వెంట్రుకల వలె ధరించే నీ మహాపరిణామముచే ఇప్పుడు నాకు భారముగా తోచుచున్నావు కదా! బ్రహ్మదేవుని నా తపస్సుచే మెప్పించి, చివరికి నిన్ను వరంగా పొందానా?

అరె! ఇప్పటికే ఈ శరీరం అపరిచితమైన ఆకాశమునంతా ఆక్రమించి వేసింది. ఇంకా పెరుగుతూనే పోతోంది. అనేక వేల బ్రహ్మాండములను ఈ శరీరము ఇప్పటికే తన పరిమాణంచే అధిగమించివేసిందే! ఇంకా ఇంకా ఎదుగుతూనే ఉన్నది. ఇక భవిష్యత్తులో ఇంకా ఏమి కానున్నదో కదా! ఇంతకీ ఇంతటి భారీ శరీరాన్ని ఎందుకు కోరుకున్నాను? ఈ దృశ్యాన్ని అధిగమించి ఆవల దృశ్యరహిత ఆత్మను సందర్శించాలని కదా!

కానీ ఈ భయంకరమైన అవిద్యారూప దృశ్యము అనంతమైనది. దీనిని అధిగమించి చూడాలంటే లక్షల కోట్లాది మైళ్ళు విస్తరించియున్న శరీరం కావాలనుకోవటం నా తెలివితక్కువ తనమే! సర్వభూత సమాభావపూర్వకమైన బ్రహ్మజ్ఞానం లేకపోతే ఈ దృశ్యము యొక్క అంతమును చూడగలగటం అనేది ఎప్పటికీ ఉండదని ఇప్పుడు తెలిసింది. మహాముని బోధించిన బ్రహ్మజ్ఞాన వాక్యాలు గ్రహించక ఇట్లా ఈ వక్రమార్గంలో దీర్ఘశరీరం తపస్సు చేసి మరీ తెచ్చిపెట్టుకున్నాను.

కాబట్టి ఇప్పుడు నేను ఆకాశాన్నంతా కప్పివేసి అనేక బ్రహ్మాండాలను పొట్టలో ధరించి ఉన్న ఈ అనంతదీర్ఘ శరీరాన్ని ఇప్పుడు త్యజించివేస్తాను. ఎందుకంటే... ఇంతటి భారీ శరీరంతో నాకు బ్రహ్మజ్ఞానం కొరకై సాధన ఏమి కుదురుతుంది? సచ్ఛాస్త్రాలను అధ్యయనం ఎట్లా చేయగలను? సాధు సంగం ఎట్లా ఆశ్రయిస్తాను? మోక్ష సాధనలు లేకుండా దృశ్యం ఎట్లా అధిగమిస్తాను?

ఓ శరీరమా! నీవు అనంతమై, అపారంగా వ్యాపించిన దానివై, ఆకాశంలో నిరాధారంగా వ్రేలాడుతూ ఇంకా ఇంకా విస్తరిస్తున్నావు. తత్త్వవేత్తలతో సాంగత్యం కుదరని నీతో నాకు ప్రయోజనం ఏమున్నది?... కనుక ఇప్పటికిప్పుడే నిన్ను నేను త్యజిస్తున్నాను.

❖

ఇట్లా పలికి నీవు ప్రాణరేచక ధారణకు ఉపక్రమిస్తావు. పక్షి గుజ్జును తిని గింజను వదులుతోంది చూచావా? అట్లా నీవు ఆ అతిదీర్ఘ శరీరాన్ని త్యజించి ఇందులోని ప్రాణతత్వాన్ని మాత్రం రేచక ప్రక్రియతో బయల్వెడలతీస్తావు. వాయువుకంటే కూడా అతిసూక్ష్ముడగు నీ యొక్క జీవుడు ప్రాణ సమేతంగా అతిభారీ శరీరాన్ని త్యజించి ఆకాశంలో ప్రవేశిస్తాడు. ఆకాశంలో వాయువు ఉన్నట్లు నీ జీవాత్మ ఉండటం జరుగుతుంది. అప్పుడు ఆ దేహంకాస్తా రెక్కలు తెగిన పక్షిలాగా నేలకూలుతుంది. ఆ భారీ శరీర పతనం చేత భూమిపై పర్వతాలు పిండిపిండి అయిపోతాయి. అప్పుడు శుష్కించిన శరీరియగు భగవతి తన మాతృగణంతో సహా వేంచేసి ఆ దేహశకలాలను భక్షించివేస్తుంది. దాంతో భూమి దోషరహితమై పోతుంది. ఆ మేధస్సే ఇక్కడ మృత్తికార రూపం పొంది, ఈ భూమి 'మేదిని' అని సార్థకనామం పొందగలదు.

❖

ఓ లుబ్ధకుడా! ఈ విధంగా ముందు ముందు జరుగబోయే నీకు సంబంధించిన సంఘటనలను మును-ముందుగానే దివ్యదృష్టితో దర్శించి నీకు చెప్పాను. ఇక ఇప్పుడు ప్రక్కనే గల తాళవనానికి వెళ్ళి నీ తపస్సు కొనసాగించు. ఆపై నీకేది ఇష్టమో అట్లాగే ఆచరించు!

**వ్యాధుడు :** అయ్యబాబోయ్! హే మహాత్మా! నేను ఆ విధంగా అనేక క్లేశాలు అనుభవించి తపస్సు చేసి చివరికి ఆ సుదీర్ఘ దేహం పొంది అనేక దుఃఖాలకు లోనుకావలసిందేనా? భారీశరీరం అను అనర్థం కొరకై తపస్సు అనే పురుషార్థం నిర్వర్తించి నిజసంకల్ప దోషంచే ఆ భారీ శరీరాన్ని, బ్రహ్మాండాలను పొంది అనేక వ్యాకులతలను నెత్తిన పెట్టుకుని మోయవలసిందేనా? స్వామీ! మీరు ఇప్పుడు వర్ణించి చెప్పుచున్న నా భావికాల స్థితిని ఏ ఉపాయం చేత మరొక తీరుగా మార్చుకొనగలుగుతానో... ఆ మార్గం నాకు చెప్పండి. నేను అవశ్యం అట్లాగే చేస్తాను. ఓ మునీంద్రా! భవిష్యత్తులో "సుదీర్ఘ దేహం పొంది, అనేక బ్రహ్మాండాలు అనుభవించి, చివరికి రేచక ప్రాణయోగంతో శరీరం త్యజించటం" ఇటువంటి విపత్కరమైన-దౌర్భాగ్యమైన పరిణామాలు నిరోధించటానికి మార్గం చెప్పండి స్వామీ!

**మహాముని :**

**అవశ్యం భవితవ్యో ఽర్థో న కదాచన కేనచిత్ ।**
**విధాతుమ్ అన్యథా శక్యస్తన్ న క్షరతి యత్నతః ॥**

నాయనా! అవశ్యం సంభవించబోయే భవిష్యత్తును మరొక విధంగా మార్చబడటమనేది కుదిరేది కాదు. ఎంతగా ప్రయత్నం చేసినాకూడా అది మరొక విధంగా ఉండబోదు. కుడిచేయి ఎడమచేయి నీ శరీరంలో భాగమే. అయినప్పటికీ వాటిని కుడి నుండి ఎడమకు - ఎడమనుండి

కుడికి మార్చగలమా? శిరస్సును పాదాల స్థానంలోను, పాదాలను ఈ శిరస్సు స్థానానికి తెచ్చిపెట్టగలమా? అందుకు మనకు శక్తి లేదు కదా!

**వామా వామ శిరః పాదః విపర్యయ విథౌ యథా ।**
**పుంసో న విద్యతే శక్తిః, తథాభావా అన్యథా స్థితౌ ॥**

ఎవరికీ కూడా తన భవిష్యత్తును మరొక విధంగా చేయటానికి ఏ ఉపాయమూ లేదు. జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానం చేత భవిష్యత్తు గురించి తెలియవచ్చునేమో గాని...

**జ్యోతిః శాస్త్రార్థ విజ్ఞానైః ఇహ భావ్యర్థ వేదనమ్ ।**
**భవతి అన్యదపూర్వం తు న కించన కదాచన ॥**

భవిష్యత్తు తెలిసినప్పటికీ అద్దానిని మరొక తీరుగా మార్పుచేయటమనేది కొంచెం కూడా కుదిరేది కాదు. జరగవలసింది అవశ్యం జరుగుతూనే ఉంటుంది. జరుగవలసిన దాని గురించి దిగులు ఎందుకు? అది జరుగవలసియే ఉన్నది. ఏది ఎట్లా జరగాలో అది అట్లాగే జరుగుతూపోతూ ఉండటం సృష్టి చమత్కారం. అందుచేత, విజ్ఞులు ఆయా విషయాల గురించి ఏమాత్రం చింతించరు. శ్రేష్ఠులైన మనుజులు వర్తమానంతో స్వాభావికమైన కర్మలు నిర్వర్తిస్తూనే వాటిని విధ్యుక్త ధర్మానుకూలంగా మలచుకుంటూ ఉంటారు.

శమము (మనోనిగ్రహం) – దమము (ఇంద్రియ నిగ్రహం) అలవరచుకుంటూ ఉంటారు. బ్రహ్మజ్ఞానం ప్రసాదించగల శ్రవణము – మననము మొదలైన ఉపాయాలు అవలంబిస్తూ ఉంటారు.

క్రమంగా "ఇది నేను కాదు (నాఽహమితి) – నేను అది (సోఽహమ్)" అను తత్త్వజ్ఞానం పెంపొందించుకుంటూ ఉంటారు. బ్రహ్మమే తమ రూపమని గ్రహిస్తూ ఈ జగత్తుపట్ల "ఇది ఎట్లా ఉన్నా ఒక్కటే కదా!" ...అనే నిదురను అవధరిస్తారు. ఈ శరీరాదులు దహించబడుచున్నప్పుడు కూడా నిర్వికారులై ఉంటారు. క్రమంగా మహాదుఃఖదాయకములగు, సుఖదాయకములగు సమస్త కర్మలను "ఇవి నావి కావు, నేను వీటికి చెందినవాడనుగాను" ...అను దృష్టితో చూస్తూ అప్రమేయత్వ మును అలవరచుకుంటూ ఉంటారు. మహావీరత్వముచే సర్వోత్కృష్టులై వెలయుచూ ఉంటారు. సర్వ దుఃస్సంకల్పాదులను త్యజించివైచి కేవల ఆత్మదర్శనంలో నిమగ్నులై ఉంటారు.

మిత్రమా! ఆత్మజ్ఞానం సంపాదించుకొన్నవారు మాత్రమే భావికాలపు కర్మలను, వాటి నుంచి సంప్రాప్తమయ్యే సుఖ–దుఃఖములను మునుముందుగానే జయించివేసి ఉండగలరు. ఆత్మజ్ఞానం సంపాదించుకోకపోతే ఈ సంసారం క్షణక్షణం భ్రమింపజేయగలదు.

అందుచేత ముందుముందు జరుగబోయే అనివార్య సంఘటనల గురించి విచారించవలసిన పనేమీలేదు. ఏది ఎట్లో అట్లే అగుగాక! ఆత్మజ్ఞానం సంపాదించుకొనే ప్రయత్నంలో నిన్ను నీవు నిరంతరం నియమించుకో. ఇక మిగతాదంతా జగత్ కథా విశేషంగా గమనించి ఉండు.

❖❖❖

# 27. చిత్తమును అనుసరించి ఇచ్ఛ - ఇచ్ఛను అనుసరించి దైవానుగ్రహం

**వ్యాధుడు :** మహాత్మా! అతిదీర్ఘ పరిమాణంగల నా శరీరం క్రింద పడిన తరువాత, ఇక విశాల ఆకాశంలో ఉన్న నా జీవాత్మకు ఏమి కానున్నది? ఏఏ దశలను పొందనున్నది?

**మహాముని :** శరీరం ఆ విధంగా నేలకూలగా అవ్యక్తాకాశముగా ఉన్నట్టి నీ జీవుడు ఏ దశ పొందనున్నదో భవిష్యత్తును చూస్తున్న నేను నీకు సవివరంగా చెపుతాను. శ్రద్ధగా విను.

శరీరం నేల కూలిన తరువాత ప్రాణవాయు సమేతమగు నీ జీవాత్మ విశాలమైన అవ్యక్త ఆకాశంలో సూక్ష్మమగు వాయుకణం వలె ఉంటుంది. ఆ సూక్ష్మ వాయుకణం వంటి జీవాత్మలో నీ చిత్తం ప్రవృత్తిని పొందినదై తనయందు వాసనామయమగు విశాల భూపీఠమును, జగత్తును స్వప్నంలోలాగా దర్శించటం ప్రారంభిస్తుంది.

నీ చిత్తవృత్తియే వాసనానుసారంగా జగదాకారంగా మహదత్త్వమును పొందటం జరుగుచుండటం చేత ...జగత్ రూపంగా తన సంకల్పిత పదార్థములను పొందటం జరుగుతుంది. "ఈ భూమండలానికి నేను రాజును"... అనే విషయం గాంచనారంభిస్తుంది.

"ఇదే సింధు దేశం. నేను ఈ దేశానికి రాజును. నా సామ్రాజ్యంలో ఎందరో సామంతరాజులున్నారు. ఈ శ్రీమాన్ సింధురాజును అనేకమంది సామంతులు సర్వదా సేవిస్తున్నారు. నా తండ్రి నా ఎనిమిదో ఏట ఈ చతుస్సాగరపర్యంతం తాము విస్తరింపజేసియున్న రాజ్యాన్ని నాకు అందించి తాను వానప్రస్థం వెళ్ళిపోయారు. అయితే సరిహద్దు ప్రాంతంలో 'విదూరథుడు' అనే గొప్ప ఖ్యాతి గలిగిన శత్రురాజు ఉన్నాడు. ఆతడే నా శత్రువు. ఆతనిని జయించాలంటే తేలికైన విషయం కాదు. చాలా పెద్ద ప్రయత్నం కావాలి. నేను చాలా సంవత్సరాలు ఈ రాజ్యభోగాలు అనుభవించాను. కానీ... ఈ శత్రురాజును జయించలేకపోవటం ఒక్కటే నాకు తీరనిలోటు. ఆ విదూరథుడు ఎప్పటికప్పుడు చాలా వృద్ధి చెందుచున్నాడు.

...ఈ విధంగా వాసనామయ జగత్తులో దేహ సమేతంగా ఆయా అనుభవాలన్నీ పొందటం కొనసాగిస్తూ ఉంటావు.

కొన్నాళ్ళు గడచిన తరువాత నీకు ఆ శత్రురాజు విదూరథునితో గొప్ప సంగ్రామం సంభవిస్తుంది. ఆ గొప్ప యుద్ధంలో నీవు రథం మొదలైనవి కోల్పోతావు. అయినా కూడా నీవు నీ కత్తి విన్యాసంతో ఆ విథూరథుని యుద్ధము యొక్క చివరి క్షణాల్లో సంహరించి ఆ భూమండలానికి చక్రవర్తివై విరాజిల్లుతావు. ఆ విధంగా మహా సామ్రాజ్యం ఏలుతూ ఉండగా ఒక రోజు తత్త్వజ్ఞులగు నీ మంత్రులతో ఇట్లా సంభాషించటం జరుగుతుంది.

❖

**మంత్రి :** ఓ సింధురాజా! మీరు మీ పరాక్రమంచేత అంతటి మహాబలోపేతుడైన విదూరథుణ్ణి తుదిక్షణాలలో కత్తి యుద్ధంలో జయించారు. మాకు ఇదంతా చాలా ఆశ్చర్యంగా తోస్తోంది.

**నీవు :** ఔను మంత్రీ! ఆ విదూరథుని యుద్ధంలో జయించానంటే... మీకే కాదు... మాకూ ఆశ్చర్యంగానే ఉన్నది. అది సరే! మీరు మహాజ్ఞాని, భూతభవిష్యత్తులను ఎరిగిన వారు, వస్తు తత్త్వము – సృష్టి తత్త్వము తెలుసుకున్న వారని లోక ప్రతీతి కదా! ఆ విదూరథుడు మహదైశ్వర్యము, అపారమైన సేనావాహిని, బలము, ధనములతో కూడుకొనియున్నాడు. వాస్తవానికి ఆతడు మమ్ములను రథం నుండి నేల కూల్చివేశాడు. కానీ, చివరి క్షణంలో అకస్మాత్తుగా మేము మా ఖడ్గంతో ఆతనిని త్రుటిలో సంహరించి ఇప్పుడు ఈ సింహాసనంపై కొనసాగుచున్నాము. మేము ఆతనిని ఎట్లా గెలువగలిగామో మాకే అర్థం కావటంలేదు. మహావిజ్ఞులగు మీరు ఆతనిని మేము ఎట్లా జయించ గలిగామో మీ విజ్ఞాన దృష్టిచే పరిశీలించి ఇప్పుడు చెప్పగలరా?

**మంత్రి :** ఓ మహారాజా! ఆ విదూరథునికి 'లీల' అనే భార్య ఉన్నది. ఆమె తన తపోశక్తిచేత, శ్రద్ధా భక్తులతో కూడిన ఉపాసనాబలం చేత జగత్‌ధారిణి – నిష్కళంకరూపిణి అగు సరస్వతీదేవి యొక్క వాత్సల్యాన్ని తన సొంతం చేసుకున్నది. (లీలోపాఖ్యానం). ఆ ఉపాసనకు సంతోషించిన జగదీశ్వరి, పరదేవత అగు శ్రీసరస్వతీదేవి "ఈ నా ఆశ్రితురాలికి మోక్ష పర్యంతం సర్వ విధాలా తోడై ఉండెదను గాక!" ...అని వరం ప్రసాదించింది.

**నీవు (సింధురాజు) :** అంతటి మహాశబ్ద తత్త్వస్వరూపిణియగు భగవతి శ్రీసరస్వతీ దేవికి మమ్మ్మ నశింపజేయటం ఒక లెక్క కాదుకదా! మీరు చెప్పినదానిని అనుసరించి, భార్య యొక్క ఉపాసనాబలం చేత ఆ విధూరధుడు జయించటానికి మాకు అశక్తుడై వుండాలికదా! మరి మేము యుద్ధంలో ఓటమి యొక్క అంచులో వుండి కూడా కేవలం ఖడ్గ ప్రహరణంతో ఆతనిని ఎట్లా సంహరించాం? శ్రీసరస్వతీ దేవి యొక్క అనుగ్రహం ఉండి కూడా ఆతడు ఎందుకు యుద్ధంలో జయంపొందలేదు? ఆతడు ఏదైనా కారణంచేత దేవి యొక్క ఆగ్రహానికి గురి అయినాడా?

**మంత్రి :** లేదు. వాస్తవానికి ఆతడు సరస్వతీదేవిని ఉపాసించటంలో మిమ్ములను అధిగమించి ఉన్నవాడు.

**నీవు (సింధురాజు / వ్యాధుడు) :** అట్లాగా! మీరు చెప్పేదానిని అనుసరించి ఆ విదూరథుడే మాపై గెలిచి ఉండాలి కదా! భగవతి యొక్క అనుగ్రహం పొంది కూడా ఆతడు ఎందుకు యుద్ధంలో జయించలేదు?

**మంత్రి :** (కొంచెం యోచనగా మౌనం వహించి) మహారాజా! ఆ విదూరథుడు ప్రపంచంలోని దేదీ కోరుకోలేదు. దేనిపట్లా ఆతనికి ఎటువంటి అభిలాష కూడా లేదు. "నాకు ఈ సంసారం నుండి విముక్తి కలుగుగాక" ...అనియే సర్వదా ప్రార్థిస్తూ ఉండేవాడు. ఈ కారణంచేత సత్య సంకల్ప స్వరూపిణి అయిన ఆ సరస్వతీదేవి ఆతనికి 'మోక్షము' రూపంగా కార్యసిద్ధిని ప్రసాదించింది. తదనుకూలంగా ఆతడు యుద్ధంలో స్వయంగా పరాజయం ఆశ్రయించాడు.

**నీవు :** ఓ మహామంత్రీ! నేను కూడా ఆ పరదేవతను ప్రతిరోజు శ్రద్ధగా పూజిస్తున్నాను కదా! ఆ పరమేశ్వరి నాకు మోక్షం ఎందుకు ప్రసాదించలేదు?

**మంత్రి :** మహారాజా! ఎవరి శ్రద్ధ ఏ రూపంగా ఎటువైపుగా ఉంటుందో ...వారి వారి ఆయా సాధనా పర్యవసానం అట్లే ఉండటం జరుగుతూ ఉంటుంది. ఆ చిద్రూపిణియగు భగవతి మనందరి హృదయాలలో 'జ్ఞప్తి' రూపంలో వసించుచూ "సరస్వతి" అనే పేరుతో పిలువబడుతూ ఉంటోంది. స్వాత్మహితకారిణియగు ఆ చైతన్యమూర్తి ఎవరెవరిచే ఎట్లెట్లు స్వయంగా ప్రార్థింపబడుచున్నదో, ...వారికి ఆ విధంగానే వరాలు ప్రసాదిస్తూ ఉంటుంది. ఆమె సత్య సంకల్ప చైతన్యమే వరప్రదానంచే సత్వర ఫలరూపంగా అనుభవించబడుచున్నది.

ఓ శత్రుమర్దనా! రాజా! మీరు ఆ భగవతిని పూజిస్తూ వస్తున్నమాట నిజమేకాని... ఆమెను మీరు మోక్షం కొరకై ప్రార్థించలేదు. మీ అంతరంగంలో "నా శత్రువులు నశించటమే నాకు ఇప్పుడు అవసరం" ...అని కోరుకున్నారే గాని, "ఈ దృశ్య ప్రపంచమును అధిగమించి కేవలం సాక్షీ స్వరూపుడగు పరమాత్మ స్వభావం సంపాదించి మోక్షమును పొందెదను గాక!"...అనే ఆశయం మీ అంతరంగంలో రూపుదిద్దుకొని ఉండలేదు. ఇక "బాహ్యానికి ఏది ఆరాధనా సమయంలో కోరుకుంటాము?"...అనేది పెద్ద లెక్కలోనిది కాదు కదా! "అమ్మవారి దయవల్ల ఇది ఇట్లా జరగాలి. అది అట్లా జరిగితే అంతే చాలు"...అను రూపంగా ప్రాపంచికమైన ఆశయాలు సాధకునిలో ప్రకటనమగుచూనే ఉంటాయి కదా!

**నీవు (సింధురాజు) :** తత్త్వజ్ఞానివగు ఓ మహామంత్రీ! ఆ విదూరథుడు నావలెనే... నేను ఆయన లాగానే శుద్ధ చిద్రూపిణియగు సరస్వతీ జగన్మాతను ఉపాసించాం. అయితే... విదూరథుడు నా వలెనే సరస్వతీదేవిని రాజ్య విస్తారణ కొరకు, శత్రునాశనం కొరకు ఎందుకు ప్రార్థించలేదు? నేను ఆ విదూరథునివలె 'మోక్షము' అనే ఉద్దేశంతో ఎందుకు ప్రార్థించలేదు?

ఆ సరస్వతీదేవి నాయందు నా చిత్తమునకు సాక్షిగా నా ఆత్మ స్వరూపిణి అయి సర్వదా వెలయుచున్నది కదా! మరి, నాకు 'మోక్షం' అనే ఇచ్ఛా రూపమగు జ్ఞప్తిని ప్రసాదించి సాధన సంపత్తి ద్వారా నా మోక్షం కొరకై కనికరించి ఉండవచ్చును కదా! నాకు ఆ జగజ్జనని మోక్షం అట్లా ఎందుకు ప్రసాదించలేదు? ఆ విదూరథునికి 'మోక్షము' అనే ఇచ్ఛారూపమగు జ్ఞప్తిని ప్రసాదించింది ఆ తల్లియే కదా! ఆయనకే ఎందుకు ఆ ఇచ్ఛారూప జ్ఞప్తిని ప్రసాదించింది?

**మంత్రి :** ఓ సింధు చక్రవర్తీ! జీవుని సంస్కారములను అనుసరించే 'ఇచ్ఛ' అనేది రూపుదిద్దుకుంటోంది. ఇచ్ఛను బట్టే ప్రయత్నములు ఉంటున్నాయి. ప్రయత్నాలను అనుసరించే ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయి.

మీరు అనేక జన్మలుగా "నేను శత్రువులను జయించి సమున్నతుడనై ఉండాలి. అనేకులకంటే శ్రేష్ఠుడనై కీర్తించబడాలి. అనేకులు నన్ను గొప్పవాడుగా కీర్తించాలి" ...అనే రూపంలో అశుభమైన అభ్యాసం కలిగి ఉన్నారు. ఆ అభ్యాసమును అనుసరించి మీయందు సంస్కారాలు పేరుకొని ఉన్నాయి. మీ సంస్కారానుసారమే మీ 'ఇచ్ఛ'గా ఘనీభూతమై అంతరంగమును ఆక్రమించుకొని ఉన్నది. "నేను పరమాత్మ పాదాలు చేరాలి. మోక్షం సంపాదించాలి"... అని పైకి మీరు అనుకొన్నప్పటికీ, "ఈ జగత్తును అధిగమించాలి" ...అనే ఇచ్ఛకన్నా " ఈ జగత్తులో ఏవేవో సంపాదించాలి" అనే 'జగత్ సత్యమ్' సంభావన అధికాధికంగా ఉన్నది.

ఉపాసకులు రెండు రకాలు :

1. 'జగత్ సత్యమ్' అనే సంభావన కలిగి ఉండి ఉపాసన కొనసాగించేవారు.

2. "బ్రహ్మసత్యమ్–జగన్మిథ్యా" అనే సంభావన పెంపొందించుకుంటూ ఉపాసనను ప్రవృద్ధ పరచుకొనేవారు.

"జగత్తు సత్యమే" అనుకోవటమనేదానికి "ఈ జగత్తులో ఏదో సంపాదించాలి. ఈ జగత్తు ఇట్లా ఉండాలి, అట్లా ఉండకూడదు" ...అను రూపంలోగల ఇచ్ఛయే కారణం. అనేక జన్మలలో "ఏదో జగత్ విషయాలు సంపాదించాలి" అనే అభ్యాసం కొనసాగించటంచేత మీరు ఆ దేవిని ప్రార్థించేటప్పుడు ముక్తి కొరకై కాకుండా, "శత్రురాజును జయించాలి. నా రాజ్యం విస్తరించాలి" ...అనే ఇచ్ఛ బలవత్తరంగా కలిగి ఉండి ఉపాసించారు. అది మీపట్ల అట్లే సిద్ధించింది కూడా! సృష్ట్యారంభం నుండి కూడా ఈ చిత్తము ఎట్టి వాసనలతో కూడి ఉంటుందో... ఆ విధంగానే ఈ జీవుడు తన్మయుడై ఉంటున్నాడు. అంతేకాకుండా ...భక్తుని చిత్తమును అనుసరించే దేవతలు భక్తునిపై అనుగ్రహం చూపిస్తున్నారు. అంతేకాని దేవతలు స్వతంత్రంగా ఏదీ ప్రసాదించటం లేదు.

భక్తుని చిత్తవృత్తికి అన్యంగా ఎవడూ ఏమీ చేయజాలడు. ఈ విషయం ఆబాలగోపాలానికి ప్రసిద్ధమైయున్న విషయమే! ఎవడైనా సరే, నిర్మల చిత్తంతో ఇటు ఈ రాజ్యమునో, లేక అటు మోక్షమునో కాక ఇంకేదైనా విషయమునో ఆశించి దృఢాభ్యాసం నిర్వర్తిస్తాడో... అది ఇతర వాసనలను ప్రక్కకునెట్టి ఫలీభూతం అవుతుంది.

అందుచేత... ఆశయమును శుద్ధము – సమున్నతముగా తీర్చిదిద్దుకొని, అప్పుడు ఉపాసనకు ఉపక్రమించటమే సాధకులకు ఉచితమని మా ఉద్దేశం.

❖❖❖

## 28. బ్రహ్మాండదేహుడు - వ్యష్టి దేహుడు

**సింధురాజు :** ఓ మహాజ్ఞానీ! మహామంత్రీ! తత్త్వదర్శీ! ఎద్దానికి వశమై నా పూర్వకాల సంస్కారాలు జన్మాదిగా ఉన్నాయి? ఎట్టి అనార్య శరీరములు – బుద్ధి ఇతఃపూర్వం కలిగి ఉన్నాను? నాయందు పునర్జన్మ కారణములైన ప్రాపంచిక సంస్కారములు తొలగి నా ఉపాసన సరస్వతీదేవి కరుణచే మోక్షరూపంగా ఫలధీకరణ పొందగలదా? అట్లా పొందటానికి నేనేమి చేయాలి?... ఈ విషయాలు నాకు తెలియజేయండి.

**మంత్రి :** ఓ సింధురాజా! మీ జన్మ కర్మల రహస్యాన్ని విశదీకరిస్తాను. సావధాన చిత్తులై నేను చెప్పుచున్నదంతా ప్రశాంతంగా భావోద్వేగ రహితంగా వినండి. నా వాక్యములచే ప్రేరేపించబడుచున్న మీరు అజ్ఞాన వినాశకరమగు నా ఈ వాక్య ప్రభావం చేత విజ్ఞాన స్వరూపులు కాగలరు.

ఆద్యంత రహితం, నిర్వికారము అగు 'బ్రహ్మం' అని చెప్పబడే ఒకానొక వస్తువే ఇక్కడ 'నీవు – నేను' మొదలైన రూపాలుగా ప్రవర్తిస్తోంది. ఈ విషయం శాస్త్ర విదితమే. స్వానుభవం కూడా!

ఆ బ్రహ్మమే ఒకానొకచోట ఒకానొకప్పుడు "నేను చిద్రూపమును కదా! అట్టి నేను విషయములను ప్రకాశింపజేస్తాను" ...అనే సంకల్ప సంవిత్తును స్వయంగా ధరిస్తోంది.

అది... సమష్టి రూప చిత్తముతోను, వ్యష్టిరూప చిత్తముతోను వ్యవహరిస్తోంది. అట్టి చిత్తమే ఉపాధియందు జీవదశను పొందినదై, అట్టి ఉపాధిత్వము త్యజించకుండా వర్తిస్తోంది.

చిత్తము నిరాకారమైనదే!అయితే... అట్టి నిరాకార చిత్తము ఇహ-పర లోకములుగాను, జాగ్రత్-స్వప్న-సుషుప్తులుగాను జన్మ-జీవన్ మరణములుగాను... సాకార జగత్తువలెనూ స్థితిపొంది ఉంటోంది. ఓ మహారాజా! ఒకానొక పరమసత్యాన్ని ఇక్కడ ప్రకటిస్తున్నాను.

ఇక్కడ నిరాకారచిత్తమే ఉన్నది. సాకారంగా కనిపించే 'జగత్తు' అనబడేది (చిత్తమునకు వేఋగా) లేదు. ఏది వాయువో అదియే స్పందము కదా! ఏది అగ్నియో అదియే ఉష్ణము కదా! ఏది చిత్తమో, అదియే జగత్తు. ఈ చిత్తము వాస్తవానికి ఆకాశమువలె నిర్మలమైనట్టి 'ఆతివాహిక శరీరము' అయి ఉన్నది. ఇక్కడ ఆతివాహిక దేహమే ఉన్నది. ఆధి భౌతిక శరీరము మొదలైనవేవీ లేవు. ఆకాశము-శూన్యత్వము ...ఈ రెండూ ఒక్కటే కదా! చిత్తము - జగత్తు - ఒక్కటే అయివున్నాయి. ఈ చిత్తము 'జగదాకార కల్పన' అనబడే నిరంకుశమైన సామర్థ్యము కలిగి ఉంటోంది.

చిత్తమే జగత్తు. జగత్తుగా కనిపించేదే చిత్తము. అంతేగాని, చిత్తములో జగత్తు, జగత్తులో చిత్తము... ఇటువంటి 'లోన్' అనే ప్రత్యయం ప్రాథమిక పార్యాంశములేమోగాని... పరమసత్యము కాదు. హృదయంలోగల 'వాసన'యే - అది స్వతహాగా అవస్తురూపం అయినప్పటికీ - బాహ్యమున వస్తురూపంగా 'జగజ్జాలము'వలె వర్తిస్తోంది. కనుక,

"ఈ జగత్తు వాస్తవానికి నిరాకారమగు చిత్తమే!" అని గ్రహించండి. చిత్తమునకు ఆకారం లేదు. అట్లాగే 'జగత్తు' అనబడేదానికి 'ఇది' అనతగ్గ ఏ ఆకారమూ లేదు.

ఎందుకంటే... వాసనయే 'జగత్తు'గా పొందబడుతోంది. కాబట్టి! పరమార్థ దృష్టిచే 'చిత్తము కూడా సత్యము కాదు. ఇప్పుడు మీ జన్మవృత్తాంతం చెప్పుచున్నాను, వినండి. మొట్టమొదట ప్రథమ సృష్టియందు మీరు బ్రహ్మపదము నుండి సమష్టి శరీరులుగా ఉదయించారు. 'సమష్టి'యే దేహముగాగల హిరణ్యగర్భులుగా మొదట జనించిన మీరు క్రమంగా ఇప్పటికి 'వ్యష్టిభావము' పొందినవారై ఉంటున్నారు. తామస విషయసంగముచే తామసరూపులై వర్తిస్తున్నారు.

ఎందుకంటే, ఎక్కడ మీ "ఈ సర్వము... ఈ సర్వసృష్టి నా దేహమే"... అనే భావన? ఎక్కడ ఈ వ్యష్టి దేహమును ఆశ్రయించటం చెప్పండి! "ఈ చక్రవర్తి శరీరుణ్ణి. చక్రవర్తిగానే కొనసాగుతూ, ఈ బంధువులతో సింహాసనంపై కొనసాగాలి. నా శత్రువులు నాకు తలవంచాలి".... అనే భావన ఎక్కడ? ...ఎంత అల్పస్థితి! ఎక్కడ "ఈ 14 లోకాలు నా భావనాస్వరూప చమత్కారమే!" ...అను అనుభూతి? ఎక్కడ ..."ఈ కాళ్ళు చేతులుగల ఆకారమే నా దేహం. వీరు నాకు సంబంధించిన వారు. వారంతా తదితరులు. మేమంతా మానవులం. ఇదీ మా జాతి. ఇది మా కులము. ఇవి జంతువులు. వారు దేవతలు. అనంతకోటి దేహాలలో ఈ నా దేహం ఒకటి. దీనితో పుట్టాను.

దీనితోనే చస్తున్నాను" ...అన్న భ్రమ? బ్రహ్మాండదేహుడైన మీరు ఇప్పుడు ఒకానొక క్రమం చేత వ్యష్టి దేహులై ప్రవర్తిస్తున్నారు. కారణం? "తామసతామస" గుణమును, రూపమును ఆశ్రయించటమే!

❖❖❖

# 29. ఆతివాహిక దేహం - త్రయోదశ గుణ సంజ్ఞలు

**సింధురాజు (నీవు) :** మహామంత్రీ! శుద్ధ సాత్వికుడనైన నేను ఈనాడు తామస తామస స్వభావుడనై ఈ పాంచభౌతిక దేహధారిగా సంచరిస్తున్నానని చెప్పుచున్నారు.

'తామసతామసం' అంటే ఏమిటి? సృష్ట్యాదిలో శుద్ధసత్త్వమే ఉన్నది కదా! మధ్యలో ఈ "తామసతామసం" అనే సంజ్ఞలు వ్యవహారాలు కల్పించినవారు ఎవరు? ఎందుకు కల్పించారు? ఎవరికోసం? తద్వారా వారు పొందుచున్నదేమిటి?

**మహామంత్రి :** సరే చెపుతాను, వినండి. ఈ ప్రపంచంలో జీవులంతా అవయవ సహితులై కనిపిస్తున్నారు కదా! ఈ జీవునికి ఏ విధంగా కాళ్ళు-చేతులు మొదలైన అవయవాలన్నీ అమర్చబడిన ఈ దేహం ఉన్నదో... అట్లాగే అవయవ రహితమైన ఆత్మకు ఒక సూక్ష్మ శరీరం ఉన్నది. అద్దానిని శాస్త్రములు "ఆతివాహిక దేహం" అని పిలుస్తున్నాయి. 'అపరిచ్ఛిన్నదశ' నుండి పరిచ్ఛిన్నదశయగు బ్రహ్మాండత్వము పొందిన తత్త్వమే "హిరణ్యగర్భుడు" అనే పేరు కలిగియున్నారు. ఆయన "సృష్ట్యాత్మ" అయి ఉన్నారు.

ఆయన ఆతివాహిక రూపమగు తన సమష్టిదేహమున పంచీకరణ ద్వారా ఆధి భౌతికత్వము కల్పించుచున్నారు. ఆ తరువాత అద్దాని అవయవరూపములగు తన వ్యష్టిదేహము నందు పృథివి మొదలైన సంజ్ఞలు అవధరిస్తున్నారు. ఈ విధంగా నామ రూపములు కల్పించి "సమష్టి రూపాత్మ స్వప్నము" వంటి ఈ జగత్తును కథారచయితవలె రచిస్తున్నారు. నిజసంకల్ప పరంపరచే స్వయంగా వ్యష్టిరూపంతో ఇద్దానియందు వ్యవహరిస్తున్నారు. (అట్టి హిరణ్యగర్భ స్వరూపులగు మీరు, మిమ్ములను ఉద్దేశించి సృష్టిసంకల్ప ప్రభావంచేత - వ్యష్టిరూపంతో కూడా వ్యవహరిస్తున్నారు. ఈ విధంగా మీరు ఒకే వైపు శుద్ధ సత్వస్వరూపులై, మరొకవైపు "మహాతామసరూపం" అనబడే ఈ వ్యష్టిత్వం అవధరిస్తున్నారు. అట్టి ఆ హిరణ్యగర్భ కల్పిత ఆతివాహిక శరీరజాతికి "తామసతామసీ" అని గుణత్రయవిభాగ పండితులు పేరుపెట్టారు.

ఓ మహారాజా! నిర్వికారమగు బ్రహ్మము యొక్క వికారరూపమగు జీవభావ ప్రాప్తియందు ఆయా గుణములను అనుసరించి... శాస్త్రములు 13 సంజ్ఞలుగా విభజించాయి. వాటిలో కొన్ని ఇప్పుడు చెప్పుతాను... వినండి.

**1.సాత్విక సాత్వికీ -** ఏదైతే బ్రహ్మము నందు ప్రప్రథమంగా కల్పాదియందు జీవ రూపమును పొందినదానివలె అగుచున్నదో... అద్దానిని (ఆ జీవుని) 'సాత్విక సాత్వికీ" అని పిలుస్తారు. ఆ జీవుడు ఆ జన్మయందు ఉత్పత్తి చేతనే జ్ఞానైశ్వర్యమగు బుద్ధితో కూడి ఉంటాడు. ఆయా విషయములను అనుభవించి, తిరిగి ఆ జన్మయందే ముక్తిని పొందటం జరుగుతుంది.

**2.సాత్వికీ -** ఈ జీవుడు కొంతకాలం సంసార హేతువగు అజ్ఞానంతో ఉన్నవాడై ఉంటాడు. అయితే వర్తమాన జన్మయందే జ్ఞానైశ్వర్యముతో కూడిన ఉత్తమ గుణములను పెంపొందించుకొని ముక్తిని పొందుతూ ఉంటాడు. జీవజాతుల తత్త్వమును ఎరిగిన వారిచే ఈతనికి 'సాత్వికీ' అనే పేరు పెట్టబడింది.

**3.రాజస రాజసీ -** ఏదైతే కల్పాదియందు నూతన రూపంతో వ్యక్తమై, అనేక జన్మలుగా భోగసాధనలను కొనసాగిస్తూ, క్రమంగా మరల మోక్షభాగిని అగుచున్నదో,... అట్టిది (అట్టి బుద్ధి తత్త్వముగల జీవుడు) "రాజస రాజసీ" అని చెప్పటం జరుగుతోంది.

**4.కేవల రాజసీ -** ఈ గుణ సంబంధులగు జీవులు ఉత్తమ గుణములను సముపార్జించుకుంటూ, దోష దృష్టులను పరిశుద్ధ పరచుకుంటూ భవ్యగుణముల ప్రభావంచేత మోక్షమును పొందబోవు మార్గంలో ప్రయాణిస్తూ అతి త్వరలో మోక్షార్హులగుచూ ఉంటారు. అనేక జన్మలైన తరువాత మోక్ష స్వరూపులుగా అగు జీవజాతులను "కేవల రాజసీ" అని పిలుస్తారు.

**5.తామస తామసీ -** వీరు కల్పాది మొదలుకొని అనేక స్థావర, కీటక, పశు, కిరాతాది జన్మలలో అనేక భోగాలు మొదలైనవి అనుభవిస్తూ చివరికి ఎప్పటికో మోక్ష భాగినులు అవుతూంటారు.

**6.కేవల తామసీ -** ఈ జీవులు అల్పవిశేషాలతో కూడిన పిశాచము మొదలైన జన్మలను అనుభవించి ఎప్పటికో మోక్షం పొందుతూ ఉంటారు.

ఇట్లాగే రాజస రాజసీ, రాజసతామసీ, శుద్ధ రాజసీ, తామస రాజసీ, కేవల రాజసీ, అర్ధ రాజసీ, అర్ధ తామసీ జాతి జీవులు, ఆయా అనేక జన్మ పరంపరలు పొందుచూ, పొందుచూ ఎప్పటికో మోక్ష భాగినులు అగుచున్నారు.

ఓ మహారాజా! ఈ విధంగా జాతులయొక్క అనేక భేదములు కల్పించబడ్డాయి. వాటిల్లో మీరు తామసతామసీ జాతియందు ఉత్పన్నములైనారు. మీకు అనేక చిత్ర – విచిత్రములైన జన్మలు గడచిపోయాయి. వాటినన్నిటినీ నేను ఎరుగుదును. కానీ, అవి మీ జ్ఞప్తి పథంలో లేవు. ముఖ్యంగా మహాశవ శరీరధారి అయి ఆకాశంలో సంచరిస్తూ చాలాకాలం వ్యర్థంగా గడపటం జరిగింది. ఈ విధంగా సంసార కుహరంలో (గోతిలో) పడి మీరు మోక్షార్థులు కాలేకపోతున్నారు.

**సింధురాజు (నీవు) :** మహాత్మా! మహామంత్రీ! మీరు చెప్పేదంతా అతి విచిత్రంగా ఉన్నప్పటికీ "నిజమేనేమో" ... అని నాకు స్ఫురిస్తోంది. అయితే, ఇప్పుడు ఈ "తామస తామసీ" అనే స్థితి నుండి నేను ఉద్ధరించబడేది ఎట్లా? అందుకు ఉపాయములేమిటో మీరు ప్రవచించండి. మీరు చెప్పబోయే మార్గంలో శేషించిన జీవితమంతా కూడా సర్వ విధములా ప్రయత్నశీలుడనై ఉండటానికి నేను సంసిద్ధుడనై ఉన్నాను. అసలు నాకు ఆ విదూరథునివలె మోక్షము అనబడేది ఎప్పటికైనా సాధ్యమేనా? అందుకు ఏమైనా ఉపాయాలు ఉన్నాయా?

**మహామంత్రి :** ఉపాయాలు ఎందుకు లేవు? తప్పకుండా ఉన్నాయి. దేనికైనా పురుష ప్రయత్నమే ఉపాయం. శ్రద్ధతో ఉద్వేగరహితంగా పురుష ప్రయత్నం ఆశ్రయించే వానికి ఈ మూడు లోకములలో

సాధ్యమవనిదంటూ ఏదీ ఉండదు. నిన్నటి ఏదైనా దుష్క్రియ ఈ రోజు సత్క్రియచే తొలుగుతుంది కదా! నిన్న ఎవరినైనా బాధించి ఉంటే ఈ రోజు వారిని ప్రేమతో అనునయించటంతో ఆ దోషం పోగలదు కదా! అట్లాగే ఇతఃపూర్వం మీరు 'తామస తామసీ' అనే అంధజాతిలో ఉనికిని పొంది ఉన్నప్పటికీ ఇప్పటి నుండి ఉత్తమ ఆశయముతో ప్రయత్నశీలురై సత్కార్యములకు ఉపక్రమించండి.

'ఆశయం నిర్ణయించుకోవటం' అనేది అతిముఖ్యమైన విషయం. ఎందుకంటే, ఎవడు ఏ పదార్థమును కోరుకుంటాడో ...అద్దాని కొరకై అట్లే ప్రయత్నమును కొనసాగిస్తూ ఉంటాడు. మధ్యలో ఆ ప్రయత్నము నుండి అలసత్వముచే విరమించకపోతే, తప్పక అద్దానిని పొంది తీరుతాడు. ఏ జీవుడు ఎట్టి భావమునందు తన్మయుడై ఉంటాడో... ఎట్టి దానికొరకై ప్రయత్నం కొనసాగిస్తూ ఉంటాడో... ఆతనిపట్ల అట్లే పరిణమించబోవుచున్నది.

❖

**మహాముని :** ఓ మిత్రమా! లుబ్ధకుడా! వింటున్నావు కదా! అప్పుడు నీవు ...ఆ సింధురాజుగా, నీ మంత్రి ప్రవచించినదంతా చక్కగా సమాలోచన చేస్తావు. ఉత్తమమైన బుద్ధితో రాజ్యాన్ని తృణ ప్రాయంగా పరిత్యజించి వేస్తావు. ఏకాంతంగా "మనస్సును శుద్ధ పరచుకొనెదనుగాక" ...అనే ప్రయత్నంతో తపో ధ్యానాదులకు ఉపక్రమిస్తావు. మంత్రులు నీవు ఉన్న చోటును తెలుసుకొని వచ్చి మరల రాజ్యాధికారం చేపట్టమని ఎంతగానో బ్రతిమిలాడినప్పటికీ నీవు వినిపించుకోవు.

అట్లా మహామంత్రి బోధించిన మార్గంలో నీవు అతిప్రయత్న శీలుడవై ఉండగా కొంత కాలానికి నీవు కొందరు సాధువులతో నివసిస్తూ వారి సుజ్ఞానపూర్వకమైన ప్రసంగాలు వినే అవకాశం లభిస్తుంది. ఆ వివేక ప్రసంగముల ప్రభావంచేత నీలో వివేకము ఉత్పన్నం అవుతుంది.

ఈ జన్మ ఎక్కడి నుండి వచ్చింది? జన్మ-కర్మల కంటే ముందే ఉన్నట్టి నేనెవరు? నాకు దృశ్యమునకు ఉన్న సంబంధం ఎట్టిది? ఈ జగత్తు ఎట్లా జనించింది?... ఇట్లా అనేక విశేషాలను సత్సంగపూర్వకంగా విచారణ చేస్తూ క్రమంగా జీవన్ముక్తుడవు అవుతావు. చివరికి ఎక్కడైతే బ్రహ్మదేవుని బ్రహ్మాండ మహాదైశ్వర్యం కూడా తృణప్రాయం అగుచున్నదో ...అట్టి పవిత్రమగు మోక్షపదమును పొందుతావు.

ఓ వ్యాధుడా! ఈ విధంగా నీ భవిష్యత్ వృత్తాంతమంతా జరిగిపోయిన కథ చెప్పినట్లు దివ్యదృష్టితో చూచి చెప్పాను. ఇక ఇప్పుడు బయలుదేరి నీకు ఏది ఎట్లా ఉచితమని అనిపిస్తే అది - అట్లే నిర్వర్తించు.

❖

**అగ్నిదేవుడు :** ఓ విపశ్చిత్తు మహారాజా! అంతా విన్నావు కదా! ఇదియే " మహాశవోపాఖ్యానం" అని వేదాంత వాఙ్మయంలో ప్రసిద్ధమై ఉండగలదు. ఆ మునీశ్వరుడు వ్యాధునకు ఆతని పట్ల ముందు ముందు జరుగబోయే కథనమంతా ముందుగానే దర్శించి పూసగ్రుచ్చినట్లు తెలిపాడు. ఈ సంసారము నిస్సారమని ఎవరికి తెలియదు? ప్రతి జీవునికి తెలుసు. అయితే ఏం? ఈ విధంగా (ఈ సంసారము నిస్సారమని ప్రతి జీవునికి తెలిసి కూడా), స్వయంరచితమైన సంస్కారముల

వశంచేత అవశ్యం పొందవలసినది పొందుచూనేవున్నాడు. అయితే ఆత్మ గురించి తెలుసుకొని "నేనే నిర్మల అఖండ – అప్రమేయ – అద్వితీయ –నిత్యోదిత – నిర్మలాత్మ" ...అని గ్రహించటం తక్షణ కర్తవ్యంగా నీకు గుర్తు చేస్తున్నాను.

❖❖❖

# 30. మహాశవ ప్రస్థానం

**విపశ్చిత్ రాజు :** ఓ ప్రియ భగవాన్! సద్గురూ! అగ్నిదేవా! నా ఉపాసనా దైవమా! మహాశవోపాఖ్యానంలో మీరు నాకు అనేక సూక్ష్మగత విశేషాలు అందించారు. అందుకు కృతజ్ఞుణ్ణి. ఆ వ్యాధుడు మహామునిచే భవిష్యత్తులో జరుగబోయే విశేషాలు బోధించబడి కూడా సంసారమును అప్పటికప్పుడే త్యజించి మోక్ష స్వరూపమును సంపాదించుకోవచ్చు కదా! అట్లా ఎందుకు జరగలేదో, ఆశ్చర్యంగా ఉన్నది. సరే! మరి ఆ తరువాత ఏమైనది? అంతా విని ఆ వ్యాధుడు ఏం చేశాడు? ఆ తరువాత జరిగిన కథనం తెలియజేయండి.

**అగ్నిదేవుడు :** సరే! ఆ తరువాత ఏమి జరిగిందో చెపుతాను... విను.

ఆ మహాముని ఆ వ్యాధునికి "నీవు బ్రహ్మ వరం చేత అత్యంత సుదీర్ఘదేహుడవై, తదనంతరం అద్దానిని త్యజించి, సింధురాజువై, మంత్రిచే బోధించబడినవాడివై నిర్వికల్పమగు ఆత్మయందు లయం పొందగలవు"... అని బోధించారు కదా! ఆ తరువాత అదంతా విన్న వ్యాధుడు చాలా ఆశ్చర్యం పొందాడు. పరిపూర్ణమైన చిత్తంతో కొద్ది క్షణాలు మహాముని తనకు బోధించినదంతా చక్కగా విమర్శించుకున్నాడు. "ఆహా! ఈ సంసారంలో పడి ఎంతకాలంగా కొట్టుకుంటున్నాను! సరే! దీనిని దాటవలసిందే! జగత్ పరిధులను అధిగమించటమే ఉపాయం కదా!" ...అని తలచ సాగాడు. "అవశ్యం అనుభోక్తవ్యం..." అని అనుకోసాగాడు. ఇంతలో సాయంకాలం అయింది. గురుశిష్యులిద్దరూ సాయం సంధ్యకు ఉపక్రమించటానికై అక్కడి నుండి లేచారు.

ఆ మునీశ్వరుడు, ఆ వ్యాధుడు అక్కడే శాస్త్ర విచారణపూర్వకంగా తపస్సు కొనసాగించసాగారు. కొంతకాలం గడచింది. కొలదికాలానికే ఆ మునీశ్వరుడు భౌతిక దేహమును వీడినవాడై నిర్వాణమును పొంది పరమశాంతమగు బ్రహ్మ పదమునందు విలీనుడయ్యాడు.

ఆ వ్యాధుడు ప్రియ గురువుతో కలిగిన వియోగంచే ఎంతో విషాదం పొందాడు. ఏది ఏమైతే నేం! ఎవరు ఏమనుకున్నా కూడా... ఈ కాలప్రవాహం జీవులకు సంయోగ-వియోగాలు కల్పిస్తూ ఉంటుంది కదా! అప్పుడు ఆ వ్యాధుడు తపస్సు కొనసాగించసాగాడు. ఆ విధంగా అనేక సంవత్సర సమూహములు గడచిపోయాయి. ఒకానొకనాడు ...ఆతని తపోవ్రతమునకు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "బిడ్డా! ఏమి కోరి తపస్సు చేస్తున్నావో... అది అడుగు. ప్రసాదించటానికి సిద్ధంగా ఉన్నాను" ...అని పలికారు. మన వ్యాధుడు ముక్తినే కోరుకోవచ్చు కదా! కానీ తనయందలి వాసనా వేగమును నిరోధించటానికి సమర్థుడు కాలేకపోయాడు. అందుచేత, "స్వామీ! నాకు ఈ సంసారమును

దాటివేయగల అతిదీర్ఘకాయం ప్రసాదించండి. నా దేహం ప్రతిక్షణం ఒక యోజన దూరం విస్తరించును గాక! నేను ఈ ఆకాశాదులు అధిగమించి ఆవల ఏమున్నదో చూడగలిగినంత మహాదేహం పొందగలిగే వరం ఇవ్వండి. ఆ దేహంతో ఈ ఆకాశాదులు దాటి ఆవల ఏమున్నదో దర్శిస్తాను"... అని ప్రార్థించాడు. శరీరవృద్ధి – ఆకాశగమనము కొరకై ప్రార్థించాడే గాని, సర్వమును ఆత్మకు అనన్యంగా దర్శించగలిగే ఉత్తమబుద్ధిని గురించి కోరుకోలేదు. అప్పుడు బ్రహ్మదేవుడు. "వత్సా! అట్లే అగుగాక! నీవు కోరుకొన్నంత విస్తారమైన దేహం నీకు లభించునుగాక!" అని వరం ప్రసాదించి అంతర్ధానమైనారు. అప్పుడు ఆ వ్యాధుడు తన తపస్సు యొక్క ఫలమును అనుభవించటానికై ఆకాశంలోకి పక్షివలె ఎగిరాడు. తన దేహమును వృద్ధినొందింపజేస్తూ మూడు లోకములకు ఆవల – ఈవల పూరింపజేసి చాలాకాలం గడిపాడు. మహావేగంతో పైన క్రింద – ప్రక్కలగల ఆకాశమును తన మహాదేహంతో పూరిస్తూ ఉండగా, ఆ ప్రయత్నంతో అతి దీర్ఘకాలం గడిచిపోయింది. అయినా కూడా ఆతనికి భ్రమయొక్క అంతము లభించక విసిగి, వేసారి చివరికి వైరాగ్యం పొందసాగాడు. చివరికి విరాగియై ఆ సుదీర్ఘ దేహమును త్యజించివేయాలనే ఉద్దేశం పొందాడు. ఒకానొక రోజు రేచక ప్రాణాయామముతో ప్రాణములను దేహము నుండి ఉపశమింపజేసి దేహాన్ని త్యజించివేశాడు. ఆ మహాదేహం ప్రాణములను కోల్పోయినదై క్రిందకు పడిపోయింది. ఇక ఆ వ్యాధుని ప్రాణసహితమగు చిత్తము తానున్న చోటే "నేను సింధు దేశపు మహారాజును" అని దర్శించినదై, విదూరథునితో శత్రుత్వం వహించటం, రాజ్యపాలన, విస్తరణ మొదలైన కార్యక్రమాలలో నిమగ్నమైనది. ఆ తరువాత విదూరథుని యుద్ధంలో జయించటం, మంత్రిచేత బోధింపబడటం, మోక్ష సాధనకు ఉపక్రమించి పరిశాంతమగు ఆత్మయందు లయించటం మొదలైనవన్నీ మునీశ్వరుని కథనానుగుణంగా విన్నావు కదా! అట్లే జరిగింది.

ఇక ఆ వ్యాధునిచే తపోఫలంగా పొందబడి, మూర్ఖబుద్ధిచే పెంపొందింపబడిన మహాదేహం వందలకొలది మేరు పర్వతముల ఆకారాన్ని బోలినట్టిదై ఆ వ్యాధునిచే రేచక ప్రాణాయామ ప్రక్రియచే త్యజించబడి కూలిపోయిది కదా! రెండవ పృథివి వలె అది కూలిపోగా, బ్రహ్మదేవుని యొక్క ఒకానొక జగద్భ్రమాకిరణం ఆ దీర్ఘదేహం వైపు ప్రసరించింది. ఆ మహాశవం పృథివి యొక్క ఆచ్ఛాదం వలె కన్పట్టుచూ భూమండలాన్ని పరిపూర్ణం చేసివేసింది. ఏ 'ప్రపంచం' అనే భూమండలంపై ఆ శవము పడిందో అక్కడ అది అన్ని దిక్కులా పరిపూర్ణం చేస్తూ ఉండింది. అప్పుడు శుష్కశరీరియగు చండికాదేవి ఆ శవమును భక్షించి రక్తముతోను ప్రేవులతోనూ పరిపూర్ణ అయి "రక్తవర్ణా! మాంసనిష్టా! ప్రియాన్న ప్రీతిమానసా!" ...అని ఉపాసకులచే అర్చించబడింది. ఆ శవం యొక్క క్రొవ్వుచే పూరించబడినదై ఈ పృథివి "మేధినీ" అనే పేరు కలిగినదైనది. ఆ శవం యొక్క మేధస్సే (క్రొవ్వు) క్రమంగా ఇక్కడ మేధిని అయి (భూమిగా అయి) కాలక్రమంగా మృత్తికా రూపం అయింది.

ఓ విపశ్చిత్! ఆ మహాశవం యొక్క పతనముచే నశించిన వనములు కాలక్రమంగా మరల ఎప్పుడో ఉద్భవించాయి. మరల భూమిపై నగర – గ్రామాదులు నిర్మించబడ్డాయి. ఇతఃపూర్వం

శవం యొక్క తాకిడికి చూర్ణమైన పర్వతాలు తిరిగి పాతాళం నుండి పూర్వమువలె లేచాయి. మరల జనులు, వారి వారి వ్యవహారములతో మేధిని (భూమండలం) కళకళలాడసాగింది.

❖

**అగ్నిదేవుడు :** ఓ విపశ్చిత్ రాజా! మహాశవోపాఖ్యాన కథనమంతా విన్నావు కదా! సరే! ఇప్పుడు ఈ భూమండలం ప్రస్తుత వ్యవహారాదులకు యోగ్యమై స్థిరత్వం పొందియున్నది. నీవు ఈ భూమండలమునకు వెళ్ళి నీకు అభిమతమైన దిక్కులలో సంచరించు. మరి ఇప్పుడు నాకు మంత్రోచ్చారణతో ఒక ముఖ్యమైన ఆహ్వానం వినబడుతోంది. ప్రజా సమూహమునకు ప్రభువైన ఇంద్రుడు ఇప్పుడు స్వర్గంలో 100వ యజ్ఞం చేయటానికి ప్రవృత్తుడై మంత్రపూర్వకంగా నాకు 'సుస్వాగతం' పలుకుచున్నారు. నేను అవశ్యం వెళ్ళవలసి ఉన్నది. ఓ గతి కోవిదా! మనం చెప్పుకొన్న విషయాలు దృష్టిలో పెంపొందించుకొంటూ నీకు ఏది ఇష్టమో అట్లే ఆచరించు. సెలవు.

❖

**భాసుడు :** ఓ సభికులారా! వసిష్ఠాది మహనీయులచే పవిత్రమైన ఈ సభకు మహారాజుగా ఆకాశంలో చంద్రుని వలె విరాజిల్లుచున్న ఓ దశరథ మహారాజా! తదితర పెద్దలారా! ఈ విధంగా అగ్నిదేవునిచే బోధింపబడిన ఈ మహాశవోపాఖ్యానం మీ ముందు వర్ణించి చెప్పాను.

❖❖❖

# 31. విపశ్చిత్ సంసారభ్రమ వర్ణనం

**భాసుడు :** ఓ దశరథ మహారాజా! సర్వసభికులారా! ఇంకా వినండి.

ఆ విధంగా భగవంతుడగు అగ్నిదేవుడు నాతో పలికి మానవాకారమును ఉపశమింపజేసి ఇంద్రుని యజ్ఞ కార్య సంబంధమైన ఆహ్వానం నిర్వర్తించటానికై అంతర్ధానం అయినాడు కదా! ఇక నేను "ఈ అవిద్య యొక్క అంతు ఎక్కడో చూడాలి" అనే ఇతఃపూర్వపు జన్మజన్మల సంస్కారమును చిత్తమునందు స్వయంగా ధరించినవాడనై ఆయా కర్మల సిద్ధి కొరకై 'ఆ దిక్కు, ఈ దిక్కు' సంచరించటం కొనసాగించసాగాను. ఆ పరిభ్రమలో అనేక రకములైన ఆచార-విచార-రచనాదులతో కూడిన అసంఖ్యాక జగత్తులను ఆకాశంలో నేను చూడటం జరిగింది.

ఓ ప్రియ సభికులారా! ఆ జగత్తులలో... కొన్నిచోట్ల గొడుగువంటి ఆకారం గల జీవులు ఒకరితో ఒకరు వ్యవహరిస్తూ మెల్లమెల్లగా అటూ ఇటూ సంచరిస్తూ నావంటి చూపరుల దృష్టిని ఆకర్షిస్తూ ఉన్నారు. మరికొన్నిచోట్ల ప్రాణులంతా మృణ్మయశరీరులై (మట్టిచే తయారైన దేహాలు కలవారై) పర్వతమంత దేహాలతో నెమ్మదిగా అటూ ఇటూ కదలుచున్నారు. ఇంకా కొన్నిచోట్ల ప్రాణుల దేహాలు కొయ్యతో నిర్మించబడినవై ఉన్నాయి. వేరొకచోట దేహాలన్నీ రాతితో నిర్మితమైయున్నాయి. కొన్ని కొన్ని ప్రదేశాలలో ఆ జగత్తులలో జీవులు శిలాప్రతిమలలాగా ఒకే చోట కదలక ఉండి వాక్కుతో ఒకరితో మరొకరు వ్యవహరిస్తూ ఉంటున్నారు.

ఈ ప్రకారంగా స్వచిత్తాకాశంలోనే అనేక జగత్తులు సందర్శించాను. స్వప్నంలోలాగా నా మనోమాత్ర దేహంతో చిరకాలం అనేక జగత్తులు పుట్టడం, వ్యవహరించటం, నశించటం వీక్షించాను. అయినా కూడా నాకు ఎంత కాలం గడిచిపోయినప్పటికీ అవిద్య యొక్క అంతు కనిపించనేలేదు. ఇక అట్టి దృశ్య – దర్శన విషయమై ఎంతగానో అలసిపోయాను. నా మనస్సు అలసిపోయి అనేక దర్శనముల పరిశ్రమచే మరింత దుఃఖమును కూడగట్టుకోవడం జరిగింది. అప్పుడు నేను ఒక ఏకాంత స్థానంలో ప్రవేశించి మోక్ష సిద్ధి కొరకై తపస్సు చేయటం ప్రారంభించాను. అప్పుడు ఒకానొక రోజు ఇంద్రుడు యాదృచ్ఛికంగా నా ముందు ప్రత్యక్షమైనారు.

**ఇంద్రుడు :** ఓ విపశ్చిత్‌రాజా! ఇప్పుడు మన ఇద్దరికీ మన మన చిత్తాకాశములో మృగజన్మ పొంద వలసిన సమయం ఆసన్నమైనది సుమా!

**నేను (విపశ్చిత్ / భాసుడు) :** ఇంద్రదేవా! ఏమి ఆశ్చర్యం! మీవంటి లోకోత్తరులగు మహనీయులకు కూడా చిత్తాకాశంలో మృగజన్మ పొందవలసిరావటమా? ఇది ఎట్లా సాధ్యం?

**ఇంద్రుడు :** అవును నాయనా! అయితే నీ తపస్సుకు ప్రతిఫలంగా నీకు ఏదైనా వరం ఇవ్వటానికి ప్రేరితుడనై ఇంద్రలోకం నుండి ఇటు వచ్చి ఉన్నాను. వచ్చి నీ – నా భవిష్యత్తును ఎరిగి ఉండి ఇట్లా చెప్పాను. అందుచేత మునుముందుగా నీకు వరప్రసాదం చేయవలసి ఉన్నది. ఏదైనా వరం కోరుకో. ఇక ఆ తరువాత జరుగవలసినదంటావా? అది నీకు గాని, నాకుగాని అనివార్యం కదా!

**నేను (విపశ్చిత్/భాసుడు) :** అది సరే స్వామి! మీరు మీ చిత్తాకాశంలో మృగజన్మ పొందవలసి రావటం ఎట్లా జరుగబోతోంది? మూడు లోకములు ఏలే మహనీయులే మీరు!

**ఇంద్రుడు :** నాయనా! ఎవరికైనా చేసిన సుకృత దుష్కృత కర్మఫలాలు పొందటం అనివార్యం. అయినా ఆత్మజ్ఞాన తత్పరత సముపార్జించుకున్నప్పుడు, ఇక ఈ ఉపాధి ఇంద్ర పదవి పొందేదైతే ఏమున్నది... లేక, అడవిలో ఒంటరిగా సంచరించే మృగం రూపంలో ఉంటే ఏమున్నది? ఇక... నాకు చిత్తాకాశంలో మృగజన్మ పొందవలసిన పరిస్థితి ఎందుకొచ్చిందంటావా? విను, చెపుతాను.

స్వర్గభోగములను అనుభవిస్తూ నేను మహామోహం పెంపొందించుకుంటూ అనేక దేవతా సంవత్సరాలు గడిపివేశాను. కొంతకాలం క్రితం 100వ యజ్ఞం విజయవంతంగా పూర్తిచేసి యజ్ఞ యజమానత్వ గర్వంతో వ్యవహరిస్తూ ఉండేవాడిని. అప్పుడు ఒకానొక మహాశవం ఆకాశం నుండి కూలిపోతోందని వార్త వచ్చింది. వెంటనే ఇంద్రలోకం నుండి బయలుదేరాను. త్రోవలో ఏదో దేహం నిశ్చలంగా కనిపించింది. “ఆ! ఇదేదో మృతుని దేహం ఇక్కడ మార్గమధ్యంగా పడి ఉన్నది” అని తలచి అద్దానిని పాదాలతో ప్రక్కవైపుగా తన్నాను. ఆ నిశ్చల దేహం శవంగా పొరబడ్డాను. కానీ అది దుర్వాసముని దేహమని నాకు తెలియలేదు. పాద స్పర్శచేత జాగృతుడైన ఆ దుర్వాస ముని... “ఓయీ! ఇంద్రుడా! నన్ను నీ పాదములతో శవంగా తలచి తన్నినావు కదా! ఏ భూతలము వైపుగా మహాశవము యొక్క నేలకూలే వ్యవహారం దర్శించటానికి వెళ్లుచున్నావో ఆ శవం క్రిందపడి భూతలం పైగల వస్తువులన్నింటినీ చూర్ణం చేసి వేస్తుంది. ఏ భూతలం చూచే ఉత్సాహంతో

నీవిప్పుడు వెళ్ళుచున్నావో ఆ భూతలంపై అతిత్వరలో నీ వరప్రసాదియగు విపశ్చిత్ అనే రాజుతో సహా మృగత్వం పొంది సంచరించగలవు. మీ ఇద్దరి మృగత్వమనేది మీ మనోసంకల్ప ఫలములే అయినప్పటికీ మీరిద్దరూ మృగరూపంలో తదితరులకు కనిపిస్తారు. ఇదే నా శాపం" ...అని శపించి, ఆయన తన వస్త్రములు సరిచేసుకొని ఎటో వెళ్ళిపోయారు.

కాబట్టి నీవు – నేను కూడా మన మన చిత్తాకాశంలో మృగత్వం పొంది మృగములుగా సంచరించటం ఇక తప్పే వ్యవహారం కాదు. అయితే, ఇంద్రపీఠం అలంకరించిన నేను స్వధర్మాను సారంగా నీకు నీ తపోఫలమైన ఏదైనా వరం ప్రసాదించటం ఇప్పటి నా కర్తవ్యం. కనుక నీ అభిలషితమైన ఏదైనా వరం కోరుకో.

**నేను (విపశ్చిత్ / భాసుడు) :** దేవా! నేను ఈ సంసారంలో దీర్ఘకాలంగా సంచరిస్తూ అతిఖిన్నుడనై ఉన్నాను. అందుచేత అతి శీఘ్రంగా ముక్తిని పొందేట్లు వరం ప్రసాదించండి.

**ఇంద్రదేవుడు :** నాయనా! విపశ్చిత్! నీకు శీఘ్రముక్తి లభించాలంటే ఇప్పటికప్పుడే "రూపరహితం – శుద్ధ చిత్ స్వరూపం అయినట్టి ఆత్మనే నేను" అనే జ్ఞానమును సుస్పష్టం చేసుకో. అందుకు నీవు అర్హుడవే అయి ఉన్నావు. ముక్తి ఆత్మజ్ఞానోపాసన చేత మాత్రమే లభించగలదు. ఈ విషయం నీవు అగ్నిదేవుని ముఖతః "మహాశవోపాఖ్యానం" అనే సంఘటనా వర్ణనం సందర్భంలో వినియే ఉన్నావు కదా! "నేను సర్వదా ముక్తుడనే! ఈ మానవ – ఇంద్ర – మృగ ఉపాధులచే పరిమితుడను కాను. ఉపాధి ఎట్లా ఉండవలసి వచ్చినా కూడా నేను సర్వదా ఆత్మస్వరూపుడను" అని నీకు నీవే గ్రహించాలి. అంతేగాని ముక్తి అనబడేది మరొకరిచేత నీకు ప్రసాదించబడేది కాదు. కనుక ఇంకే దైనా వరం కోరుకో!

**నేను (విపశ్చిత్ / భాసుడు) :** అయితే స్వామీ! నేను ఒక మృగం (లేడి) రూపం చిత్తాకాశంలో అనుభవించబోవుచున్నానని చెప్పారు కదా! సరే! అట్టి మృగరూపం ధరించిన తరువాత నాకేమి సంభవించనున్నది? అసలు మీకు గాని నాకు గాని మృగరూపం చిత్తాకాశంలో ధరించవలసిన అవసరం ఎందుకు వచ్చిపడుతోంది? నేను ఎప్పటికైనా ముక్తుడను కాగలనా? ఈ ఈ విశేషాలు వరదాన పూర్వకంగా తెలియజేయండి.

**ఇంద్రుడు :** ఓ రాజా! మృగం (లేడి) యొక్క సంస్కారాలు నీ అంతఃకరణంలో దాగియే ఉన్నాయి. "ఈ సంసార వ్యసనంలో పడేకంటే లేడిగా ఉండి గడ్డి పరకలతో తృప్తిపడుచూ కాలం గడపటం ఉచితం కాదా" ...అని అనేకసార్లు నీవు ఇక్కడి లేళ్ళను చూచి అనుకుంటూ ఉండేవాడివి. ఇక్కడి లేళ్ళ శృంగార చర్యలకు కించత్ ఉద్వేగంగా ఆకర్షితుడవు అయ్యేవాడవు. భావించావు. అట్టి భావనా సంస్కారాలే ముందు ముందు నీ చిత్తాకాశంలో లేడి రూపంగా సంచరించటానికి కారణం కానున్నాయి. అట్టిదే మరొక రీతిగా నా విషయం కూడా! నేను అత్యంత తీవ్రంగా ప్రేమించే దేవతా స్త్రీలు – వారితో స్నేహం కొనసాగించాలనే సంస్కారం నా యందు ప్రబలంగా ఉండటం చేతనే తదనుకూలమైన ఉపాధి పొందబోవుచున్నాను. ఇక వర – శాపాదులంటావా ...అవన్నీ

నిమిత్తకారణం మాత్రమే! ఇక ముందు ముందు జరుగబోయే విషయాలు వినాలనే కుతూహలంతో వరరూపంగా అడిగావు కదా! ఆ ప్రశ్నకు సమాధానం విను.

మృగజన్మ యొక్క సంస్కారం నీ అంతఃకరణంలో చిరకాలంగా ఉండి ఉన్నది. అది అవశ్యం సంభవించబోవుచున్నదని మాత్రమే నీకు గుర్తుచేశాను. ఆ విధంగా సంసార తప్తుడవైన నీవు 'లేడి'గా ఈ భూమిపై జన్మించి ఒకానొక రోజు శ్రీరామచంద్రునికి ప్రియమైన మృగంగా ఆయన వనంలో ప్రవేశిస్తావు. కొద్ది రోజుల తరువాత విశ్వామిత్ర మహర్షి ఆగమన సందర్భంలో శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రుని వైరాగ్యమును ఆత్మజ్ఞాన మార్గంగా సశాస్త్రీయంగా తీర్చిదిద్దే యత్నంలో ఒక రోజు నీ కథా క్రమమంతా సోదాహరణార్థం ప్రవచిస్తారు. ఆ సమయంలో ప్రత్యక్ష నిరూపణకై నీవు అయోధ్యాసభకు తేబడినవాడవై మంత్రజల సంప్రోక్ష్య ప్రభావం చేత విపశ్చిత్ దేహధారుడవౌతావు. అప్పుడు "శ్రీ వసిష్ఠ రామసంవాదము" కొనసాగుచూ ఉండగా నీవిప్పుడు అడిగియున్న ముక్తి రూపమైయున్న "నిరాకారమగు విశుద్ధ చిన్మాత్రమే నేను" ...అనునట్టి అక్షయజ్ఞానం నీలో ఉదయిస్తుంది. వసిష్ఠులవారి అనుగ్రహంచేత నిష్ప్రయోజన పూర్వకమైన సంసారజిజ్ఞాస – సంచారము మొదలైన స్వవృత్తాంతం సంస్మరించి, "సంసార జిజ్ఞాసయే నా యొక్క సంసార దోషము" అనే విషయం గమనిస్తావు. అప్పుడు నీ పూర్వ వృత్తాంతమంతా స్వప్న భ్రమలవలె, సంకల్ప నిర్మిత పదార్థమువలె, ఎక్కడో పరలోకంలో అనుభూతమైన విశేష పరంపరలవలె, ఎవరో రచించిన కథలోని కల్పిత సంఘటనలవలె సుస్పష్టం కాగలదు. ఎప్పుడైతే నీవు నీ మృగరూప భౌతిక దేహం నుండి విముక్తుడవై పురుష రూపము ధరించి విశ్వామిత్ర – వసిష్ఠాదులు వేంచేసి దశరథ మహారాజుచే అలంకారితమైన అయోధ్యా సభలో నిలబడతావో... అప్పుడు అక్కడి మహర్షి ప్రణీత జ్ఞానాగ్నిచే నీ అజ్ఞానమంతా భస్మీభూతం అవగలదు. మరుక్షణం నీ హృదయస్థమే అయివున్న ఆత్మ స్వరూపం నీకు స్ఫురించగలదు. అట్టి ఆత్మరూపము యొక్క స్ఫురణచే నీవప్పుడు నీ యందలి చిరకాలపు అవిద్యా భ్రాంతిని త్యజించి నిశ్చలవాయువువలె నిర్వాణ – సశాంత రూపుడవు కాగలవు. అప్పుడిక ముక్తి నీకు స్వభాసిద్ధమే అవుతుంది.

❖

ఆ విధంగా ఇంద్రుడు చెప్పటం జరిగింది. అప్పుడు నాకు "ఆహా! నేను లేడిని. ఆ పచ్చగడ్డి పరకలు లేతగా నాకు మృష్టాన్నంలాగా అగుపిస్తున్నాయే!"... అనే అపూర్వ బుద్ధి వ్యవహారమంతా అప్పటికప్పుడు వచ్చి పడింది. అప్పటి నుండి నేను ఆ మందర పర్వతంపై గల మందార వనంలో గరికలను భక్షిస్తూ లేడిని అయి సంచరించసాగాను. ఒకసారి మీ సామంతరాజు వేటకై నేనుండే వనంలో ప్రవేశించటం జరిగింది. నేను ఆతనిని చూచి భీతిల్లి పరుగులు పెట్టసాగాను. ఆతడు నన్ను పట్టుకొని బలవంతంగా తన ఉద్యానవనానికి తీసుకుని వచ్చాడు. మూడు రోజులు తరువాత ఆతడు నన్ను అయోధ్యా నగరానికి తీసుకొచ్చాడు. ఓ రఘుకుల తిలకమా! రామచంద్రా! ఆ సామంతరాజు లేడి జాతులలో ఉత్తమజాతి సౌందర్యాన్ని సంతరించుకున్నట్టి నన్ను మీకు క్రీడార్థం బహుమతిగా సమర్పించాడు.

చూచారా! రామచంద్రమూర్తీ! ఈ ప్రకారంగా నా వృత్తాంతమంతా జగత్తులో ప్రసిద్ధమే అయివున్న ఇంద్రజాలపు మాయవలె ఆశ్చర్యకరంగా ఉన్నది.

అనేక శాఖలయొక్క విస్తారముతో కూడినట్టి ఈ అవిద్య అనంతమైనది. అద్దానిని ఎంతగా పరిశీలించుకుంటూ పోయినప్పటికీ అది శమించదు. అది శమించాలంటే ఆత్మజ్ఞానం ఒక్కటే అందుకు ఉపాయం. ఆత్మజ్ఞానముచే, "ఈ దృశ్యమంతా వేరుగా లేదు. ఇదంతా స్వస్వరూపాత్మ యొక్క క్రీడావినోదమే! లీలావినోదమే!" అని గ్రహించి పరమశాంతిని పొందుచున్నాను.

❖

**శ్రీవాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఆ విధంగా పలికి విపశ్చిత్తు మహారాజు ప్రశాంత చిత్తముతో కొద్ది క్షణాలు మౌనం వహించారు. అప్పుడు రామచంద్రుడు విపశ్చిత్తును ఈ విధంగా ప్రశ్నించాడు.

❖

**శ్రీరాముడు :** ప్రభూ! విపశ్చిత్ మహారాజా! ఆ 'లేడి' అనేది మీ చిత్తాకాశంలోని భావనారూపమే కదా! మీ సంకల్ప మాత్రమగు ఆ లేడి అటువంటి లేడికి సంబంధించిన సంకల్పం ఏమాత్రం లేనట్టి మా ప్రియ సామంతరాజుకు ఒక భౌతికమైన లేడిగా కనిపించటమేమిటి? ఇది చాలా ఆశ్చర్యకరంగా ఉన్నదే! ఇది ఎట్లా సిద్ధించింది?

**విపశ్చిత్ మహారాజు :** ఇంద్రభగవానుడు నాకు వరప్రసాదార్థం ప్రత్యక్షమైనప్పుడు ఈ విషయం చెప్పారు. దుర్వాసముని శాపం ఇస్తున్నప్పుడు "నీవు – నీ వరప్రసాది అగు ఆ విపశ్చిత్తు కూడా మీ చిత్తాకాశంలో మృగదేహత్వం పొందుచూ ఉండగా మీరిద్దరు మృగదేహధారులై తదితర జీవులకు కూడా అగుపించగలరు" ...అని తెలియజేసినట్లు ఆ ఇంద్రభగవానుడు నాకు చెప్పటం జరిగింది. మా యొక్క మృగత్వం తదితరులకు కూడా అట్లే మృగరూపంగా కనిపించటం జరిగింది. ఓ రామచంద్రా! శ్రీవసిష్ఠ మహర్షి ఈ విషయం మీకు విశ్లేషణ పూర్వకంగా ఇన్ని రోజులుగా చెప్పియే ఉంటారు. అయినా మీరు అడిగారు కాబట్టి వారి అనుజ్ఞతో మీకు వివరిస్తున్నాను. వినండి.

మనకు ఎదురుగా ఈ వ్యావహారిక జగత్తు సత్తు కాదు. సాంకల్పిక జగత్తే జగత్తు. పాంచభౌతిక జగత్తు అసలైన జగత్తు కాదు. అటు సంకల్పరూప జగత్తుగాని, ఇటు పాంచభౌతిక జగత్తుగాని... ఈ రెండు రూపములుగా చిత్ప్రకాశమే ఉదయించటం జరుగుతోంది. కాబట్టి ఇక ఏది సత్తు? ఏది అసత్తు?

ఓ రామచంద్రా! ఈ సభలో చెప్పుకొనే యుక్తుల సందర్భంలో స్పష్టమైన బోధకొరకై మరొక యుక్తిని చెప్పుతాను వినండి.

❖

**యస్మిన్ సర్వమ్, యతః సర్వం, యత్సర్వం, సర్వతశ్చ యత్,**
**బ్రహ్మ తస్మిన్ మహాభాగ! కిం న సంభవతీహ హి?**

దేనియందైతే సమస్తము కలదో, దేనినుండైతే సమస్తము ఉత్పన్నమౌతుందో, ఏదైతే సర్వరూపము

అయి వెలయుచున్నదో అట్టిదాని యందు ఏది సర్వదా సంభవించదు? ఓ మహాభాగా! ఏది ఎట్లాగైనా సిద్ధించగలదు కదా! అసలు 'ఊహ'లో జనించిన పదార్థములు (సంకల్పిత పదార్థములు) కలుస్తూ ఉంటాయి. అవే [విషయములను, పదార్థములను సంకల్ప నగరంలో (ఊహానగరంలో) దర్శిస్తున్నప్పుడు అందులోని ఒక పదార్థం మరొక పదార్థంతో] కలువకుండాను ఉంటాయి. స్వప్నంలోని ఒక పదార్థం – మరొక పదార్థం కలుస్తూ ఉంటాయి. కలవకుండాను ఉంటాయి. అట్లాగే సద్రూపము – సర్వస్వరూపము అగు పరమాత్మయందు సత్యము కానిదిగాని, మిథ్యకానిదిగానీ ఏ పదార్థమూ లేదు. సర్వత్రా – సర్వదా – సర్వవిధములా – సర్వస్వరూపము అయినట్టి పరబ్రహ్మమునందలి అసంఘటిత – సంఘటిత సమర్థమైనట్టి మాయ అతిభయంకరమైనది. (అఘటనా – ఘటనా పటీయసీ మాయా). అట్టి మాయ మహామోహము కలుగజేయునదై ఉన్నది.

విధి – నిషేధ పదములు రెండూ ఒకే చోటనే స్థితిపొంది ఉంటున్నాయి. మరి బ్రహ్మసత్త యొక్క 'మాహాత్మ్యము' ఇట్టిదైయున్నది. ఎందుకంటే అయ్యది... తనను ... తనచే అనేక రూపములుగా సృజించుకొనుచున్నది. బ్రహ్మసత్త చేతనే పరిఢవించుచున్న మాయ




**అనాది :** బంగారమునకు 'ఇది' అనబడే ఆకారం లేదు. కానీ ఏదో ఆకారం సర్వదా కలిగియే ఉంటుంది. అట్లాగే బ్రహ్మసత్త మాయను కలిగి ఉంటూనే ఉంటుంది. అయితే అది మాయకు స్వాధీనమై ఉండేది కాదు. అందుచేత బ్రహ్మసత్త ఎట్లా అనాదియో, మాయకూడా అట్లాగే అనాది.

**సఆది :** ఏఏ పాంచభౌతిక సమ్మేళనం జగత్తుగా కనిపిస్తోందో... అందలి పదార్థాలన్నీ కూడా ఒకప్పుడు సమ్మిళితమై మరొకప్పుడు విడిపోతూ ఆది – అంతములు కలిగియే ఉంటున్నాయి కదా!

ఈ విధంగా అవిద్య జ్ఞానముచే నశించునది కాబట్టి "సాఽఽది"గాను, సాపేక్షికంగా చూస్తే సత్యమైనదిగాను అనుభూతమౌతోంది. ఈ త్రిలోకములు కూడా చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమే కాకపోయి ఉంటే మహాకల్పాంతంలో అంతా నశించగా, మరల ఈ దృశ్యాంతర విశేషాలన్నీ ఎక్కడి నుండి ఉత్పన్నం కాగలవు చెప్పు? ఈ అగ్నియొక్క – వాయువు యొక్క – భూమియొక్క పునరుత్పత్తి ఎక్కడి నుండి జరుగగలదు చెప్పు?

కాబట్టి, "చిత్స్వభావం యొక్క స్ఫురణ " కంటే ఈ జగత్తు ఏమాత్రం వేరైనది కాదు.

"ఈ కనబడే జగత్తు ఉహామాత్రమే" అనుదానికి శాస్త్రముల అంతిమసారమగు ఉపనిషత్తులు – విజ్ఞుల అనుభవమే మనకు ప్రమాణం. ఒకవేళ ఎవరైనా లోకప్రసిద్ధమైన విజ్ఞుల సిద్ధాంతమును అంగీకరించక "ఇదంతా పదార్థమయం. అంతేగాని భావనామయం కాదు. వస్తువునుబట్టే భావన ఉంటుంది. అంతేకాని... భావనను అనుసరించి వస్తువులు ఉండవు" ...అని నమ్మదలచుకొన్నారా... అట్టి అభిప్రాయం మూర్ఖాభిప్రాయమేనని నా అభిప్రాయం! నా అనుభవం కూడా!

భావనను అనుసరించే జగత్తు ఉంటోంది. భావనను అనుసరించనివానికి జగత్తు ఉండదు. ఇదే నా అనుభవసారం. అందుచేత భావనచే ప్రాప్తిస్తున్న జగత్తును బ్రహ్మభావన యందు లయింప జేయటమే ఆత్మజ్ఞుల సంవిధానం. చైతన్య దృష్టిచే సర్వభేదములు రహితమైపోతున్నాయి. తదితరమైన దృష్టి నిస్సారమైనది. విజ్ఞులు – శాస్త్రములు ఇది అనునిత్యంగా బోధిస్తున్నప్పటికీ మూర్ఖులు గ్రహించలేకపోతున్నారు. విజ్ఞులు గ్రహించగలుగుచున్నారు.

నిశ్చలవాయువే తన చంచల స్వభావముచే అనేక వాయుతరంగాలుగా అగుపిస్తోంది. ఒక వాయుతరంగానికి – ఇంకొక వాయుతరంగానికి కనబడే భేదం (ఆకారాదుల దృష్ట్యా భేదం సత్యమే అయినప్పటికీ) వాయువు దృష్ట్యా భ్రమయే కదా! అట్లాగే శుద్ధజ్ఞానరూపమగు బ్రహ్మసత్తయే "నేను అవిద్యను" అను భావనచే ఈ జగద్రూపంగా స్ఫురిస్తోంది.

**శ్రీరాముడు :** ఓ విపశ్చిత్ మహారాజా! ఈ జగత్తులో జీవులందరికీ జననము – జీవనము – మరణము సంభవిస్తూ ఉండటం చూస్తూ ఉంటాము కదా! అనుభవజ్ఞులగు మీరు వీటిపై ఎటువంటి అభిప్రాయం కలిగి ఉన్నారు?

**విపశ్చిత్ మహారాజు :**

**న కశ్చిత్ నేఽహ మ్రియతే! జాయతే న చ కశ్చన!**
**'మృతోఽహమ్' ఇదమస్తీతి ప్రతిభైవ చిదాత్మికా ॥**

వాస్తవానికి ఈ ప్రపంచంలో ఎవడూ మరణించటమూ లేదు. జన్మించటమూ లేదు. చిద్రూపం యొక్క చిత్ప్రకాశమే "నేను మరణించాను" అని ఈ విధంగా (భావనానుసరణంగా) క్రీడవలె – ఏదో ఉత్తుత్తిగా ఉదయిస్తోంది.

**శ్రీరాముడు :** మరణించినవాడు దృశ్యమును కోల్పోవుచున్నాడు కదా! కనుక దృశ్యము యొక్క అత్యంత నాశనమే మరణమని చెప్పవచ్చా?

**విపశ్చిత్ రాజు :**

**మృతిః అత్యంత నాశశ్చేత్, తత్ సా నిద్రా సుఖోపమా**
**పునః దృశ్యోపలంబశ్చేత్ నను జీవతమేవ తత్ ॥**

దృశ్యము యొక్క అత్యంత నాశనమే మరణమని మనం అనుకుంటే, అప్పుడు అట్టిది రోజూ ప్రతిజీవుడు అనుభవిస్తున్న సుషుప్తి సుఖము వంటిదే అవుతుంది కదా! లేదూ... మరణానంతరం మరల దృశ్యము ప్రాప్తిస్తోందని అనుకుంటే... అది గాఢనిద్ర నుండి మేల్కొని జాగ్రత్‌ను పొందటం వంటిదే అవుతుంది కదా! మరి... గాఢనిద్ర వచ్చినప్పుడు "ఈ జీవుడు మృత్యువును పొందాడు" అని గాని, మెళకువ వచ్చినప్పుడు "జన్మ పొందాడు" అని అనం కదా! దుఃఖించం కదా!

**తస్మాత్‌నేఽహాస్తి మరణం! తన్నైవాస్తి జీవితమ్!**
**కస్మింశ్చిన్మాత్ర కచనే ద్వయం వాప్యస్తి నైన వా**
**చేతితం ద్వయమప్యస్తి నాస్తి ద్వయమచేతితమ్ ॥**

కాబట్టి రామచంద్రా! వాస్తవానికి ఈ జగత్తులో మరణమూ లేదు. జీవితమూ లేదు. ఒకవేళ అవి ఉంటే... ఆ రెండూ కూడా ఒకే "చిన్మాత్రం"లోనే ఉండి ఉన్నాయి... లేవు కూడా అని గ్రహించండి. దృశ్య రూపంగా చూస్తే అవి ఉన్నాయి. ద్రష్టరూపంగా చూస్తే అవి లేవు. ఎద్దాని యందైతే 'ద్వైతము–అద్వైతము' అనబడే రెండూ కూడా స్ఫురణమగుచున్నాయో... అట్టి చైతన్యము సర్వదా ఏకమే అయివున్నది.

చైతన్యము (Experiencer), జగత్తు(Experiences)... సర్వసాక్షియగు ఆ చైతన్యము సదా అనంతమై, సర్వదా క్షేమ స్వరూపమై వెలయుచున్నది. అట్టి చిన్మాత్రమునకు అన్యంగా జీవితం ఏమున్నది? మరణం ఏమున్నది?

అట్టి చైతన్యం సర్వదా దుఃఖరహితమై, అక్షయ రూపమై ఒప్పుచున్నది. కాబట్టి ఇక ఎవనికి ఎచట దుఃఖము ఉన్నదో చెప్పండి? ఎందుకంటే తత్త్వదృష్టిచే వాచకము, వాచ్యం (రూపం) ... ఈ రెండూ కూడా చిదాకాశమాత్రమే అయివున్నవి. ఉన్నదంతా చైతన్యమునందే ఉన్నది. ఇక అట్టి చైతన్యమునకు అన్యమైనది కాని, అనన్యమైనదిగాని (అన్యముకానిదిగాని) ఏదీ లేనే లేదు. ఇక ద్వైతమెక్కడ? ఏకత్వమెక్కడ? జలంలో ఎన్ని తరంగాలు ఉన్నప్పటికీ ... తరంగాలు వేరు వేరు – కాని తరంగాలన్నీ జలమే – రెండూ సత్యమే కదా! అట్లాగే పరబ్రహ్మమున దేహాలు ఉన్నాయి. పరబ్రహ్మము వాస్తవానికి సర్వదా యథాతథము.

ఈ జగత్తుకు కారణం 'చిత్‌సత్తా'యే కదా! కనుక ఈ జగత్తు చిత్ సత్తా కంటే వేరుకాదు. ఈ జగత్తు చైతన్యము యొక్క ప్రకాశమాత్రమై శాంతరూపమై నాశరహితమై వెలయుచున్నదని నేను గ్రహించాను. వాస్తవానికి ఈ జగత్తు సాకారంగా కనిపిస్తున్నప్పటికీ ఇదంతా నిరాకారం. ఇదంతా పరమశాంత రూపమైనప్పటికీ అశాంతముగా నాశనవంతముగా కనిపించటమే ఆశ్చర్యం! అదంతా కూడా చిత్తము యొక్క భ్రమ విన్యాసమే అయి ఉన్నది. వాస్తవానికి ఈ జగత్తు ఇతఃపూర్వం (జన్మాదిలో) విషయము కాకయే ఉన్నది.

ఓ రామచంద్రా! స్వతహాగా వస్తురహితము – శూన్యము అగు చిదాకాశమే ఈ వర్తమానపు అనుభవమునందు దృశ్య పిశాచరూపంగా భాసిస్తోందని నేను గ్రహించాను. ఈ భూతాకాశం ఉన్నట్లే... చిదాకాశము కూడా ఉన్నది. చిదాకాశమే భూతాకాశరూపంగా తన శూన్యత్వమును కొనసాగిస్తూ స్థితినొందియున్నది.

చిదాకాశమే... ఊర్ధ్వమున ఆకాశరూపంగాను, అధోభాగంలో పృథివీరూపంగాను, తదితర ప్రదేశములందు వాయు, అగ్ని, జలరూపంగాను, దిక్కులుగాను, వృక్షాది రూపములుగాను, ఇట్లే అనేక రూపములుగా ఉండి ఉన్నది.

ఏది చిత్‌ప్రకాశమో... అదియే జగత్తు అయివున్నది. అంతకుమించి ఇక్కడ జగత్తులో ఏకత్వము గాని, ద్విత్వముగాని లేవు. తత్త్వవేత్తల దృష్టిలో ఇక్కడ సాకారముగాని, నిరాకారముగాని ఏమీ లేవు. ఈ దృశ్యమంతా కూడా నాశరహితమగు చిదాకాశమే అయివున్నదని గ్రహిస్తున్నాను.

❖

పూర్వ దృష్టి యందు ఇచట జ్ఞాన – అజ్ఞాన – సత్ – అసత్తుల భేదమేమీలేదు. నిత్య సత్యస్వరూపమగు చిద్రూపాత్మయందు సత్–అసత్తులు రెండూ సమానమే అయివున్నాయి. కాబట్టి ఇదంతా కూడా కాష్ఠరూపమువంటి చిద్రూప పరబ్రహ్మమే అయివున్నది. ఈ దృశ్యము అనంతమగు బ్రహ్మమే అయివున్నది. అట్టి అవగాహనయే 'పరమపదము' అని శాస్త్రములచే వర్ణించి చెప్పబడుతోంది. బ్రహ్మమే ఈ సమస్త దృశ్యరూపంగా స్థితి నొంది ఉన్నది.

❖

చూచారా రామచంద్రా! ఈ ప్రకారంగా చైతన్యమే జగద్రూపంగా స్ఫురించటం జరుగుతోంది. అధిష్ఠాన దృష్టిచే చూస్తే, చిదాకాశము యొక్క స్ఫురణయే నాశరహితమగు జగత్తు అయివున్నది. నా సుదీర్ఘమగు అనుభవమంతా రంగరించిన నా నిశ్చయం ఇది.

**శ్రీరాముడు :** ఓ విపశ్చిత్ మహారాజా! అసంఖ్యాకులగు మృతజీవుల తదనంతర స్థితి ఏ రూపంగా ఉంటోంది? ఏ రూపంగా కొనసాగుతోంది?

**విపశ్చిత్తు :** అసంఖ్యాకులగు మృతజీవులు కూడా సర్వత్రా అణువణువునా అసంఖ్యాకములగు సృష్టులు కలిగియే ఉంటున్నారు. అట్టివారిచే పొందబడే అనేక జగత్తులు పరస్పరం అప్రతిబంధకములై, అదృశ్యములై (ఒకదానికి మరొకటి సంబంధించనిదై), నాశరహితములై ఉంటున్నాయి. కొన్ని జగత్తులేమో ఒకదానికి మరొకటి ప్రతిబంధకములై, పరస్పరం దృశ్యములై ఉంటున్నాయి. జీవించి ఉన్న వారి విషయం కూడా అట్టిదే కదా!

(ఉదాహరణకు : మనతో సంబంధం కలిగియున్న ఒక మిత్రుని జగత్తు మన జగత్తుతో ప్రతిబంధక – దృశ్యమాన సంబంధం కలిగి ఉంటోంది. ఆ ప్రక్కనే నడచి వెళ్ళుచున్న ఒకానొక పిచ్చివాడు పొందుతున్న ఆస్వాదిస్తున్న జగత్తు మనకు అప్రతిబంధకమై, అదృశ్యమై ఉండటం జరుగుతోంది కదా!)

ఈ జగత్తులో అనేక లోకాలున్నాయి. పరస్పరం ఉత్తరోత్తర సూక్ష్మతరములైనట్టి సిద్ధలోకములు కూడా ఉన్నాయి. అవన్నీ ప్రక్క ప్రక్కనే ఉంటూ ఒకదానిచే మరొకటి దర్శించబడటం లేదు. ఏది ఏమైనప్పటికీ ఈ దృశ్యాలన్నీ కూడా ఆత్మరూపమగు చిదాకాశమే అయి ఉన్నది. స్వప్నంలో కనిపించేదంతా స్వప్న ద్రష్టకంటే వేరుకాక పోయినప్పటికీ స్వప్న ద్రష్టకు తనకంటే వేరైన దానివలె అనుభూతమగుచున్నది కదా! అట్లాగే, స్వాత్మకంటే వేరైన ద్రష్టత్వము గాని దృశ్యముగాని ఇక్కడగాని, మర్కెడాగాని లేనే లేదు.

మరొక్క ముఖ్యమైన విషయం కూడా నేను గమనించాను. ఈ దృశ్యము ఎవరు ఎట్టి సంకల్పముచే దర్శిస్తే ఇది అట్లే అనుభూతమౌతూ ఉంటుంది. ఇది చిదాకాశముగా ఎరుగబడినప్పుడు అట్లాగే యథారీతిగా చిదాకాశముగానే వెలయుచుండటం జరుగుతోంది. పరమార్థమున ఈ దృశ్యమంతా కూడా ప్రకాశమాత్ర స్వరూపమై, నిర్వాణ రూపమై ఉన్నది. మేలుకొని ఉన్నప్పటికీ కళ్ళు మూసుకొని ఉండటం చేత అంధకారమే కనిపిస్తుంది చూచావా? అట్లాగే అజ్ఞానముచేత మాత్రమే ఈ జగత్తు దృశ్యరూపముగా కనిపిస్తోంది.

వాస్తవానికి ఇది ద్రష్టరూపమే! ద్రష్ట ఆత్మరూపమే! కనుక ఇదంతా ఆత్మరూపమే! ఎప్పుడైతే జ్ఞానముచే ఈ దృశ్యమంతా అధిష్ఠాన చిద్రూపంగా తెలియబడుతుందో... ఇక ఆపై ఇది సత్తు అయినా, (లేక) అసత్తు అయినా అట్టి బ్రాహ్మీదృష్టిని పెంపొందించుకొన్నవానికి వచ్చే నష్టమేమీలేదు. దృశ్యం అప్పుడు ఉన్నా... ఉండకున్నా ఒక్కటే! ఎందుకంటే ఆత్మజ్ఞానముచే ఈ నామరూపాత్మక జగత్తు పూర్తిగా శమించినదై ఆత్మరూపంగా అనుభూతమగుచున్నది కదా!

సముద్రంలో అనేక జలబిందువులు ఒకదానితో మరొకటి ఒక క్షణంలో కలుస్తూ, మరల మరుక్షణం విడిపోతూ ఉంటాయి చూచావా? "చిద్రూప పరబ్రహ్మము" అనే మహా సముద్రంలో స్ఫురించే జీవులంతా అజ్ఞానమున్నంత వరకు పరస్పరం సంయోగ-వియోగాలు పొందుతూ ఉంటారు.

చిదాకాశమయమగు ఈ సృష్టి సృష్ట్యాదియందు ఒక స్వప్నంవలె భాసిస్తోంది. అందుచేత "అంతాకూడా శాంతమగు పరబ్రహ్మమే" అని నిరూపణకు నేను వచ్చియున్నాను.

ఓ రామచంద్రా! "అవిద్య యొక్క అంతు ఎక్కడ?" అనే నా సుదీర్ఘమైన కుతూహలంతో కూడిన ప్రయాణం అనంత వైభవములతో కూడినదైనది. అనగా అనేక జగత్తులను నా సుదీర్ఘ "అవిద్యయొక్క అంతు ఎక్కడ?"... అనే కుతూహల ప్రయాణంలో నేను చూచాను. నిజకర్మల యొక్క పరిణామమై విజృంభించిన అనేక సుఖ-దుఃఖాలు అనుభవించాను. అనేక దిక్కులలో అనేక యుగయుగాలుగా సంచరించాను.

"అంతటికీ కారణం నాయొక్క దృశ్య సంస్కారమేగాని మరింకేమి కాదు'... అని నేను గమనించాను. "ఆత్మజ్ఞానం చేత తప్ప ఈ దృశ్యదోషము మరింకే ఉపాయము చేతకూడా ఉపశమించేది కాదు"... అని సిద్ధాంతీకరించి ఈ సభలో ప్రకటిస్తున్నాను.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి:** ఓ భరద్వాజా! ఈ ప్రకారంగా లేడి ఉపాధిని త్యజించి భాసుడుగా మానవ ఉపాధిని పొందిన ఆ విపశ్చిత్ మహారాజు ప్రసంగించాడు. ఇంతలో సూర్య భగవానుడు అస్తమించడం సూచిస్తూ దుందుభులు మ్రోగాయి. దశరథుడు విపశ్చిత్తును అతిథి దేవతా రూపంగా పూజించి గృహ - ధన - స్త్రీ జనాది ఐశ్వర్యములను సమర్పించాడు.

సభ ముగిసింది. 20వ రోజు ప్రవచనం పూర్తి అగుటచే అందరూ గృహోన్ముఖులైనారు.

❖❖❖

**(ఇరవైయ్యవ రోజు విచారణ పూర్తి అయింది)**

❖❖❖

# ఇరవై ఒకటవ రోజు

## 32. పుణ్య - పాప ఫలాలు అనివార్యం

**శ్రీ వాల్మీకి మహర్షి:** ఓ భరద్వాజా! 21వ రోజు సభికులంతా సభలో సమావేశమైనారు. అప్పుడు ప్రస్తుత విషయమును అనుసరించి శ్రీ వసిష్ఠ మహర్షి ఈ విధంగా ప్రసంగం కొనసాగించారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ సభికులారా! నిన్నటి విపశ్చిత్ మహారాజు ప్రసంగం విన్నారు కదా! అనేక యుగముల కాలం అనేక ఉపాధులతో సుదీర్ఘ ప్రయాణం కుతూహలంగా కొనసాగించినప్పటికీ అవిద్య యొక్క అంతము ఆయన కనుగొనలేకపోయారు. దీని అర్థమేమిటి?

**అవిద్య చమత్కారం -** అవిద్య ఎరుగబడకపోయిందా... దేశకాలములచే అనంతమైనదై భాసిస్తుంది. అవిద్య ఎరుగబడిందా... మృగతృష్ణాజలంలాగా మొదలే లేనిదై ఉండగలదు.

ఈ భాసుని (విపశ్చిత్) అవిద్యా అన్వేషణ కథనమంతా విన్నాం. ఇక నుండి ఈతడు అవిద్య మొదలేలేదు అని గ్రహించి జీవన్ముక్తుడై చెన్నొందుచున్నాడు.

బ్రహ్మమే తనయందు ఈ 'అవిద్య' అనే సంవిత్తును ధరించినదగుచున్నది. ఈ కారణంచేతనే భ్రమచే అసత్తే అయి వున్న అవిద్య యొక్క రూపం సత్తువలె గోచరిస్తోంది.

అవిద్య అనంతమైనది. అనేక శాఖలుగా విస్తరించి ఉంటోంది. జడమైనది. మనోహరమైనది. 'ఆసక్తి' అనే రసముచే పరిపోషించబడుచున్నది. 'మోహము' అనే సమయంలో వికసిస్తోంది. అద్దాని అభ్యంతరము మాత్రం శూన్యమైనది. అనేక రూపములుగా గ్రంథయుక్తమైనది. ఆసక్తుల పరంపరచే నిర్మించబడినదై సుదీర్ఘంగా విస్తరించియున్నది. అత్యంత నిష్ఫలమైనది. అయినప్పటికీ వ్యర్థంగా అనేక ఫలముల గురించి అనేక ఆశ-సందేహములను జనింపచేసేది. అది చిత్తమును మరిపించటంలో ఎంతో ప్రావీణ్యత కలిగియున్నది. అయితే తత్త్వజ్ఞులు మాత్రం, "మొదలే లేదు. ఇక ప్రశసార్థం చెప్పుకోతగినది ఎట్లా అవుతుంది?"... అని ప్రశ్నిస్తున్నారు. ఈ అవిద్య వాస్తవానికి రూపరహితం అయినప్పటికీ అత్యంత స్థూలంగా కనబడుతూ బ్రహ్మాండమునంతా పూరించి ఉంటోంది. అనేక ప్రాణులచే వ్యాప్తమైయున్నది. అజ్ఞానంచేత ఉనికి పొంది ఉంటోంది. అతి దీర్ఘమైనది. అద్దానిని అంధకారమయమగు రాత్రితో పోల్చవచ్చు. ఇది చిత్ర – విచిత్ర – వర్ణయుక్తమై ఉంటోంది. గుణరహితం అని చెప్పవచ్చు. శూన్యంలో విశాలాకాశం ధరించియున్నట్టిది. జడత్వముచే అనేక కీడులు కల్పించగలిగినట్టిది. అది "ఆకాశంలో ఇంద్రధనుస్సు' వలె అత్యంత భ్రమయుక్తం, అవాస్తవం కూడా! ఈ అవిద్య జడ తరంగములతో పూర్ణమై ఉన్నది. "మలిన విలాసము" అనే నురుగుచే కప్పబడింది. 'ఉత్పత్తి –క్షయము' అనే చక్రావర్తనములతో వర్షాకాలపు నదివలె ప్రవర్తిస్తోంది.

కర్కశమై శ్మశాన భూమివలె అశుభప్రదమై వెలయుచున్నది. ఈ అవిద్య నిరంతరం అనేక ప్రవహించే జగత్తులను తనయందు కలిగి ఉంటోంది. 'రజోగుణము' అనే ధూళితో ఈ అవిద్యా నదీజలం బహు కల్మషమై ఉన్నది.

ఒకడు స్వప్నపురంలో ఎంతకాలం సంచరించినా కూడా అందులో నుంచి తాను పొందేదేముంది? పోగొట్టుకునేదేమున్నది? అట్లాగే ఈ జాగ్రత్ స్వప్నపురంలో చిరకాలం సంచరించినా కూడా ఇక్కడి నుండి తాను తన వెంట తీసుకువెళ్ళగలిగేది ఏదీ లేదు. ఇక్కడికి తెస్తున్నదీ లేదు.

**యాని సంకల్ప జాలాని ప్రతిష్ఠామాగతాన్యలమ్ ।**
**త్యక్త్వైత దృశ్యజాలస్థ దేహానాం దృఢచేతసామ్ ॥**

మరణకాలంలో ప్రతి జీవుడు దేహమును ఇక్కడే త్యజించి ఎటకో వెళ్ళుచున్నాడు కదా! అట్టి మరణ సమయంలో ఏ దృశ్య జగదాకార దృఢచిత్తం కలిగి ఉంటాడో... ఏఏ దృఢసంకల్పం పెంపొందించుకొని (చిత్తంలో) ఘనీభూతంగా అవధరించి ఉంటాడో... అవియే ఆతని పట్ల ఆ తదనంతరం కూడా జగత్ – దేహాది రూపాలుగా ప్రతిష్ఠ పొంది ఉంటున్నాయి. 'జగత్' అంటే ఈ పాంచభౌతిక రూపం కాదు. మనస్సు యొక్క జగత్ భావనా వైచిత్రమే అసలైన ఈ జీవునికి సంబంధించిన జగత్తు. అట్టి జగత్ మనో వైకల్యమును అనుసరించి మృత్యు తదనంతరం కూడా సంసారము ఆ జీవునిపట్ల కొనసాగుచూనే ఉన్నది.

మనస్సు యొక్క సంకల్పములే చిదాకాశమునందు ఈ నగర – భూమి – ఆకాశ – తదితర జీవుల – గుణముల – వ్యవహారముల – రూపంగా జీవునికి అనుభూతమౌతున్నాయి. అవి అసంఖ్యాకములై ఉండి ఈ సర్వ భౌతికజగద్రూపంగా అనిపిస్తున్నాయి. అట్లాగే మనోసంకల్ప పరంపరా భ్రాంతి చేతనే సిద్ధలోకములు ఆకాశంలో పరస్పరం భాసించటం, భాసించకపోవటం కూడా జరుగుతూ ఉంటోంది. ఆయా లోకాలు, వాటిలో ప్రాణిసమూహాలు, ఆయా ప్రాణుల సంబంధ బాంధవ్యములు – అంతా సంకల్ప సమూహ ప్రభావములేనని సభికులంతా గ్రహించెదరు గాక! శుభాశుభకారకములగు శాస్త్రోక్తలోకములు – అన్నీ కూడా భోగ్యకారకమైన స్థిరమైన మనస్సు యొక్క పరిణామము మాత్రమే! ఈ గోడలో ఇట్టి స్థూలత్వం దర్శించటం నుండి సిద్ధ లోకములలో భోగముల వరకు అంతా మనో పరిణామమే! స్వప్న – మనోరథాదులలో సమస్త పదార్థములు మనస్సు యొక్క పరిణామములే కదా! అట్లే జాగ్రత్ విషయం కూడా!

ఇప్పుడీ సృష్టి, ఈ దృశ్యము కంటికి పంచభూతమయంగా భాసించవచ్చు గాక! అయినప్పటికీ సృష్ట్యాదియందు ఏకైకమగు బ్రహ్మము మాత్రమే కలదు. ఇప్పుడు కూడా వాస్తవానికి బ్రహ్మమే బహువిధములుగా మనోసంకల్ప ప్రభావం చేత అనిపిస్తోంది. (సదేవ సోమ్యేఇదమగ్ర ఆసీత్–ఏకవమేవాఽద్వితీయమ్ బ్రహ్మ" అని) వేద వాక్కులు అట్లే పలుకుచున్నాయి. బ్రహ్మమునకు వేరుగా ఏదీ ఎక్కడా ఏ సమయమందునూ లేనేలేదు. ఇక జగత్తు బ్రహ్మమునకు వేరుగా ఉండి ఉండటానికి కారణమే లేదు.

ఈ అనంత జగత్తులన్నీ కూడా అసద్రూపములే! ఏఏ ప్రకారంగా ఏవేని మనస్సుచే కల్పించ బడుచున్నాయో... అవన్నీ ఆయా రీతులుగా చైతన్యమునందు (ఆ రీతిగానే) భాసిస్తున్నాయి.

ఓ సభికులారా! ఈ జగత్తు మీ ఊహకందునది కాదు. ఎందుకంటే... ఊహయే ఈ మీ జగత్తు యొక్క వాస్తవ రూపం కనుక! ఇంక ఇక్కడ విచిత్రమేమున్నది? స్వప్నంలో చిత్ర విచిత్రాలు కనబడినాయికదా అని, మనం ఆశ్చర్యపడుచున్నామా? లేదే! అట్లాగే ఈ జగత్తు కూడా!

ఐందవులు మనస్సు యొక్క మననం చేత గొప్ప గొప్ప బ్రహ్మాండాలను నిర్మించి వేశారు. అట్లాగే ఈ సభికులలో ఏ ఒక్కరైనాసరే... తీవ్ర సంవేగయుక్తమగు సంకల్పం చేత, ఏక రసాభ్యాసం చేత ఐందవన్యాయమును అనుసరించి తమతమ ఇచ్ఛానుసారంగా శూన్యాకాశంలో నగరాలు సృష్టించగలిగే మనోశక్తిని కలిగియే ఉన్నారు. అంతేకాదు. ఎవరైతే శూన్యాకాశంలో నగరాలు సృష్టిస్తారో... వారు దేహము త్యజించిన తరువాత కూడా ఆయా సంకల్ప నగరాలు (వారు ఆ విధంగా సంకల్పిస్తే) అదే రీతిగా కొనసాగగలవు.

అట్లాగే "నాకు అనుబంధాలు ఉన్నాయి" అని సంకల్పించటం చేత జగత్తులో ఆ ద్రష్టకు తదితర జనులతోటి అనేక అనుబంధాలు కొనసాగటం... ఈ దేహం ఉన్నప్పుడు – దేహానంతరం కూడా... జరుగుతోంది.

ఎవడైతే... "1.పూర్వకాలపు ఉపాసనా సిద్ధమై ఈ ప్రపంచమూ ఉన్నది. 2.ప్రపంచం భావనను అనుసరించే అనుభవమౌతోంది. కాబట్టి – స్వసంకల్పిత ప్రపంచమే అయి ప్రాప్తిస్తోంది. అనగా, నా ఊహచేతనే ఇది పొందబడుతోంది." ... అని "ఈ రెండూ ఒకే సమయంలో సత్యమే" అనుకుంటూ ఉంటాడో, ఆతడు అట్లే (ఆతని భావనానుసారంగా) పొందటం జరుగుతుంది.

పై రెండింటిలో ఒకటే సత్యమని మరొకరెవరైనా అనుకుంటూ ఉంటే అది అట్లే ఘనీభూతమై ఆతనిపట్ల సత్య – నిత్యానుభవమై తీరుతుంది. అనేక ఉత్కృష్ట పదార్థములకు – మనోశక్తులకు ఆలవాలమైన సిద్ధలోకములు కూడా అట్టివే! మనస్సు యొక్క దృఢ సంకల్పముచేతనే ఆయా లోకాలు, వాటిలో స్థానాలు సిద్ధిస్తున్నాయి.

అట్లాగే 'నరకము' మొదలైన లోకములు కూడా అనేక దుఃఖములతో కూడి కల్పన చేతనే భాసిస్తున్నాయి. ఆయా సర్వలోకాలు కూడా ఉపాసనా ఫలము... ఆయా లోకముల పట్ల సత్యత్వబుద్ధి, దృఢాభ్యాసము వలననే జనులకు సత్యముగా భాసిస్తున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! "నేను నరక లోకం చేరాలి" అని పాపకార్యములు చేసినవాడు అనుకోడు కదా! అయినా కూడా పుణ్యములు నిర్వర్తించేవానికి పుణ్య (సుఖ) లోకములు, పాపకార్యములు ఆచరించేవానికి దుఃఖకరములగు పాపపు లోకములు సంప్రాప్తిస్తున్నాయి కదా! మరి ఆయా లోకముల పట్ల సత్యత్వ బుద్ధి – దృఢాభ్యాసం వలననే ఆయా లోకాలు లభిస్తున్నాయని అంటున్నారేం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. పుణ్యలోకాలు పుణ్యలోకాల అస్తిత్వ బుద్ధి పుణ్యకార్యముల అనుష్ఠానం చేత (పుణ్యలోకాలు కావాలని కోరుకోకపోయినా) లభిస్తున్నాయి.

పాపాచరణం చేత పాపలోకముల పట్ల "అవి ఉన్నాయి" అనే అస్తిత్వబుద్ధి లేకపోయినప్పటికీ అవి సృష్టి యొక్క స్వభావముచే సిద్ధిస్తున్నాయి.

1. పుణ్యము వలన సుఖప్రదమగు లోకములు సిద్ధించటం.

2. పాపకార్యముల ప్రభావంచేత దుఃఖకరములగు పాపలోకములు ప్రాప్తించటం.

3. జ్ఞానముయొక్క అభ్యాసంచేత సర్వమునకు కేవల సాక్షిత్వము, సర్వరాహిత్యము, సర్వాతీతత్వము – అనే మోక్ష చిహ్నం రూపంగా గల మోక్ష స్థితి పొందటం ఈ '3' కూడా అప్రతిహతమైన, ప్రాకృతమైన బ్రహ్మదేవ సంకల్ప సిద్ధాంతములై అలరారుచున్నాయి.

కాబట్టి ఏదేది సిద్ధించాలనుకున్నా – సిద్ధిస్తున్నా 1.సంకల్పము 2.అందుకు సంబంధించిన ప్రయత్నము ... ఈ రెండే ఆయా ఫలములకు కారణములగుచున్నాయి. సంకల్పమును అనుసరించే సర్వము సిద్ధిస్తున్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఒకానొకడు ఒకటి సిద్ధించాలని సంకల్పించాడనుకోండి, కాని ఇంతలోనే ఈ లోకంలో ఆధి – వ్యాధులు వచ్చిపడుచున్నాయి. ఇక అన్నిటినీ మ్రింగి వేయగలిగే "మృత్యువు" అనబడే అతివిచిత్రమైన జగత్ సంఘటన ఈ జీవుని సర్వదా వెంటనంటియే ఉన్నది. ఈ విధంగా ఆతని సంకల్ప, ప్రయత్నములు మృత్యువుచే ముగింపు చేసివేయబడుచున్నాయి కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవునికి మృత్యువు వెంటనంటి ఉన్నమాట నిజమే! అయితే మృత్యువుతో ఏదీ ముగియటం లేదు. ఎట్లా అంటే, ఒకడు గాఢనిద్రకు ఉపక్రమించి కొంత సేపైన తరువాత నిద్రలేచినంత మాత్రంచేత ఆతని ఆశయములు, గుణములు – స్వభావం మొదలైనవి మారిపోతున్నాయా? లేదే! ఈ జీవుడు ఏ సంకల్పము కలిగి ఉంటున్నాడో, ఏ ప్రయత్నశీలుడై ఉంటున్నాడో... ఆతడు అద్దానినే పొందుచున్నాడు.

**యద్యత్ సంవేద్యతే కించిత్ తత్ తథాపి అనుభూయతే ।**
**సతివా అసతివా దేహే అస్మిన్ దేహ ఏవ మనోమయః ॥**

ఈ మనుజుడు దేనిని ఎంతెంత వరకు సంవేద్యత్వం నిర్వర్తిస్తూ ఉంటాడో (సంకల్పిస్తూ ఉంటాడో) అద్దానిని అనునిత్య సంకల్పనా పరంపర యొక్క ప్రభావం చేత – ఈ దేహం ఉన్నప్పటికీ, లేనప్పటికీ తప్పక అనుభవిస్తున్నాడు. ఏదైనా సరే, సత్ అనిగాని – అసత్ అనిగాని స్వసంకల్పానుసారమే అనుభూతమౌతోంది. ఇంకొక విషయం – ఈ దేహమంతా కూడా మనోమయమే అయివున్నది. భౌతికదేహానికి మరణమున్నది గాని మనోదేహానికి మరణం లేదు కదా!

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జీవునికి ఈ వర్తమాన దేహం, తదనంతర దేహం... ఇవన్నీ ఎద్దానిని అనుసరించి ఏర్పడుచున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**జీవః త్యజతి యద్భావే ఏకాం దేహమయీాం ధియమ్ ।**
**తద్భావైకమయీామ్ అన్యామాశు తత్రైవ పశ్యతి ॥**

ఈ జీవుడు ఏఏ భావాలతోటి ఒక దేహాన్ని త్యజిస్తున్నాడో... ఆ భావాల తోటియే మరొక దేహాన్ని చిదాకాశమునందు వీక్షిస్తున్నాడు. పుణ్యకార్యములు నిర్వర్తిస్తున్న చిదాకాశమయమగు జీవసంవిత్తు చిదాకాశమయములే అయివున్న శుభలోకములను అక్కడికక్కడే గాంచుచున్నది. అట్లాగే పాపకార్యములు అనుసరించినట్టి జీవ సంవిత్తు చిదాకాశములే అయివున్న అశుభ లోకములను అప్పటి కప్పుడే అక్కడే గాంచుచున్నది. వాటిని సుదీర్ఘకాలం అనుభవించుచున్నది కూడా! అనగా, సత్ కర్మ – ఉపాసన మొదలైన వాటితో శుద్ధమైనట్టి జీవచైతన్యము సూక్ష్మ రూపములగు సిద్ధలోకములు చూస్తున్నది. అదే రీతిగా పాప సంబంధమైన ఆచరణము గల జీవసంవిత్తు అక్కడికక్కడే 'నరకము' అని చెప్పబడే అనేక దుఃఖ పరంపరలను గాంచుచు వాటిని అనుభవించుచుండటం జరుగుతోంది. పాపముతో కూడిన ఆచరణముచే దుఃఖం అనివార్యమగుచున్నది.

కాబట్టి ఓ జనులారా! మీరు పాపకార్యములను సర్వదా విరమించియే ఉండాలని ఈ సందర్భంలో గుర్తుచేస్తున్నాను. ఎందుకంటే పాపంతో కూడి ఆచరణముచే అశుద్ధత్వము సంతరించుకొనే జీవచైతన్యము పొందుచున్న అనేక దుస్థితులకు అంతులేదని మేము గమనిస్తున్నాము. పాపాచరణంగల జీవులు... అనేక దురవస్థలతో కూడిన అనుభవములను పొందటం జరుగుతోంది.

రెండు తిరుగలి రాళ్ళమధ్యవలె రెండు పర్వతాకార చక్రముల మధ్య నలుగుతూ ఉండటం, అంధకారమయమగు నూతులలో ప్రవేశించి, ఇరుక్కొని ఎంత గీపెట్టినా బయల్వెడల లేకపోవటం. జలరహిత విస్తార ప్రదేశంలో అమితమైన దాహంతో చిక్కుకొనిపోవటం. భయంకరమైన బాహు సమూహములచే ప్రహారాలు (దెబ్బలు) తినటం, మేఘాలు గర్జిస్తూ ఉండగా అగ్నివర్షం కురిపిస్తూ ఉంటే దాహంతో అతిదారుణంగా తపిస్తూ ఉండటం, సలసలా కాగే ఇనుప (లోహ) స్తంభాలను కౌగిలించుకోవలసి రావటం, పాశములచే బంధించబడి నిస్సహాయులై నేలపై పడిపోవటం, అతి వేడిచే కాగే ఇనుప మూటలను నెత్తిపై పెట్టుకొని మోయటం, కాకులు పొడిచిపొడిచి బాధిస్తూ ఉంటే కదిలే సత్తువలేక పొలికేకలు వేయవలసి రావటం, ఆకలిగొన్న క్రూరప్రేత సమూహములు మీదపడి రక్తం పీల్చి పిప్పిచేయటం, అవయవములు ఛేదించబడగా కణకణలాడే కొండశిలలపై పడి ఉండటం, రక్తము – చీముల మధ్య బురదతో ఇరుక్కున్నట్లు ఇరుక్కుని కొట్టుకోవటం, ఏనుగు మొదలైన జంతువుల కాళ్ళ క్రింద పడవలసి రావటం, పక్షులు మీద పడి పీక్కుతినటం...

...మొదలైన అనుభవాలన్ని అట్టి పాపాచరణం గల జీవులు దుష్ట కర్మల ఫలితంగా పొందుచున్నారు. "ఈ దుష్ట కర్మకు ఈ దుష్ప్రయోజనం ఉంటుంది" అనునట్టి శాస్త్ర నిర్ణయంచేతనూ, పూర్వజన్మలలో చేసిన పాపకర్మల స్ఫురణ చేతనూ నిజాత్మయే నరక రూపంగా విస్తరించగా ఈ జీవుడు ఆయా వేదన రోదనలను దుష్కర్మల ఫలితంగా అనుభవిస్తున్నాడు.

ఓ రామచంద్రా! పూర్వకాలంలో ఏఏ దేహాలు భాసించాయో, భావికాలంలో ఏఏ దేహాదులు భాసించనున్నాయో, ఏవేని స్వర్గ–నరక లోకాలుగా భాసించుచున్నాయో అవన్నీ కూడా భ్రాంతి రూపమమగు కల్పనచేతనే సంభవించుచున్నాయి. అంతే కాదు. ఆయా స్వర్గ – నరకాది లోకాలు మొదలైనవన్నీ కూడా "మనోమయమే" అయి ఉన్నాయి.

అందుచేత... "చిరకాలంగా అనుభూతమగుచున్న స్వయంకల్పిత భావన చేతనే ఈ జీవుడు వివశత్వంతో అతిదీర్ఘకాలంగా ఈ సంసారంలో తిరుగాడుచున్నాడు" ...అని సునిశ్చయం అగుచున్నది కదా! పాప కార్యముల నుండి విరమించమని, లేదా వాటి దుష్ప్రయోజనములు అనివార్యమని జీవులను శాస్త్రములు అందుకే సర్వదా హెచ్చరిస్తున్నాయి.

❖❖❖

# 33. ఏతత్ దృశ్యమ్ స్వయం బ్రహ్మమ్

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ భాసుడు (విపశ్చిత్ మహారాజు) నిన్నటి రోజు మనకు మహాముని – వ్యాధుల వృత్తాంతం, శవోపాఖ్యానం, సింధురాజు – మంత్రుల సంభాషణ... ఇవన్నీ చెప్పారు కదా! ఇపుడు నాదొక చిన్న సందేహం

1. ఈ శవోపాఖ్యాన కథనం మనకు రోజూ కనిపించి జాగ్రత్ – స్వప్నాదులవలె చైతన్యమునకు అభిన్నమై కారణరహితమైనదా?

2. లేక అదంతా కారణ సహితమైనదా? అనగా... లవణుడు, గాధి మొదలైనవారి కథనం లాగా ఐంద్రజాలికుడు, దైవీమాయ – ఇటువంటి ఏమైనా కారణములు కలిగి ఉన్నదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆతనికి అనుభవమైనదంతా – మనం ఈ దృశ్యం చూస్తున్నట్లే – ఆతడు పొందాడు. ఇక, కారణాలు ఉండవచ్చు. ఉండకపోవచ్చు. ఏది ఏమైతే ఏమి? ఈ జీవుడు ముక్తిని పొందనంతవరకు "స్వాత్మ" అనే మహా సముద్రంలో "దృశ్య సమూహములు" అనే తరంగములు అనునిత్యంగా ప్రవర్తిస్తూనే ఉంటాయి. విసనకర్రతో విసరినా విసరకపోయినా గాలి మందమైన చలనములు నిరంతరం కలిగియే ఉంటుంది కదా! అట్లాగే సత్‌చిత్ పరమాత్మ రూపమగు చిదాకాశమున అద్దాని ప్రతిబింబ రూపములగు పదార్థాకారములు, జగత్ అనుభవములు సదా సకారణంగాను, అకారణంగాను కూడా ఉదయిస్తూనే ఉంటాయి. ఆ పరమాత్మ నుండి అద్దాని అవయవమే అనతగ్గ ప్రతిబింబరూప దృశ్య పదార్థం ఏ రీతిగా ఉదయిస్తోందో... అది మరొకదృశ్య రూప పదార్థంచే నశించబడనంత వరకు ఆ రీతిగానే ఉండి ఉంటోంది. అయితే,... పూతీగదేహ జీవుడే పుష్పాలలోను – ఆకులలోను ఉన్నట్లు, ఒకే జీవచైతన్యం దేహ – జగత్ పర్యంతము ఏర్పడి ఉంటోంది. దేహంలో కాళ్ళు – చేతులు – కళ్ళు దీర్ఘకాలస్థములుగా, కనురెప్పలు మూయటం – తెరవటం మొదలైన చర్యలు అల్ప కాలస్థములుగా ఉంటాయి కదా! అట్లాగే బ్రహ్మంలో భూ – ఆకాశాలు సుదీర్ఘ కాలస్థములు గాను, ఈ జీవుల దేహాలు అల్పకాలస్థములుగాను ఉండి ఉంటున్నాయి.

స్వాత్మయందు ఈ జగత్తు స్వప్నంలోని నగరంలాగా అత్యంత చమత్కారమై ఒప్పుచున్నది. ఇక ఇందులో సారమేమి? అసారమేమి? సత్తు ఏమి? అసత్తు ఏమి?

ఓ రాఘవా! జ్ఞానియొక్క ఉత్తమ దృష్టిచే ఈ దృశ్యమంతా ఆత్మరూపంగా ఎరుగబడుచున్నది. ఏది ఒక అజ్ఞాని 'జగత్తు'గా ఎరుగుచున్నాడో, అదియే ఆత్మజ్ఞాని ఆత్మసత్తా స్వరూపంగా

ఎరుగుచున్నాడు. ఇక ఈ జగత్తు సత్తు అని చెప్పాలా? అసత్తు అని చెప్పాలా? మంగళమయమగు బ్రహ్మరూపమే ఈ ప్రపంచమంతా కూడా! ఇదంతా అద్దానియొక్క స్ఫురణ మాత్రమే! ఇక ఇద్దాని యందు ఆసక్తిగాని, అనాసక్తిగాని అవసరమేమున్నది? కనుక ఏ బ్రహ్మమైతే ఈ ఈ రూపములుగా స్ఫురణ కలిగియున్నదో... అట్టి బ్రహ్మస్వరూపమునే ఆశ్రయించి ఉండండి. ఇక ఈ జగత్తు గురించి ఆసక్తి అనవసరం.

స్వాత్మ రూపుడగు పరమాత్మ భగవానుని నుండి స్వాత్మరూపమే అయివున్న ఈ దేహ - జగదాది ఆకారములు పరిఢవిల్లుచున్నాయి. సముద్ర జలం యథాతథమై ఉండగా అద్దానిలో తరంగములు ప్రదర్శితమవటం లేదా? ఇది కూడా అట్టిదే!

**ప్రతిభాస :** చిదాకాశరూపుడగు పరమాత్మ సంకల్ప సదృశమైన "నిజ స్వప్న దృష్టి"యే ఈ విశాల ప్రతిభాసారూపమైన సృష్టి. అనగా, పరమాత్మ తన 'ప్రతిభాస'ను స్వప్నరూపంగా ఎరుగుచున్నారు. కనుకనే ఇక్కడ పృథివి మొదలైన పదార్థములు లేవు. తత్సంబంధమైన భావనయే ఉన్నది. చైతన్యము యొక్క ఆభాసయే జగత్తుగా భాసిస్తోంది. వాస్తవానికి పరమాత్మ యందు ఆభాసయే లేదు. కాబట్టి జగత్తుగా ప్రసిద్ధమై ఉన్నది బ్రహ్మమే అయివున్నది. ఈ ప్రపంచంలో ఏ ఘనత్వం (భూమి మొదలైనవి) కనిపిస్తున్నాయో అది చిద్ఘనమగు పరమాత్మ చేతనే అట్లు దర్శించబడుతోంది. అంతేగాని ఇక్కడి భూమి మొదలైన వస్తుజాలం చేత కాదు.

జగత్తంతా చిదాకాశమే అయి ఉన్నది... అనునదే జ్ఞానం. అట్టి బోధ కలగటమే పరమజ్ఞానం. అట్టి బోధ దృఢపడటమే ముక్తి.

**శ్రీరాముడు :** జాగ్రత్ బాహ్యమున అనుభవమౌతోంది. స్వప్నము - అంతరమున అనుభవమౌతోంది. ఈ రెండు వేరు వేరు కదా? ఈ రెండింటిలో ఏది శ్రేష్ఠము? ఏది అప్రాముఖ్యం?

**వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "జాగ్రత్ బాహ్యప్రదేశమున అనుభూతమౌతోంది. స్వప్నం అంతరంగంలో అనుభూతమౌతోంది" ...అనే తేడా ఏమాత్రం లేనే లేదు. ఎందుకంటావా? ఈ చెప్పబోయే కారణాలవల్ల "జాగ్రత్-స్వప్నము ఒక్క తీరైనవే" ...అని నిరూపించబడుతోంది.

1. జాగ్రత్ లాగానే స్వప్నంలో కూడా స్వప్న నగరాదులు బాహ్యముననే ఉన్నట్లు స్వప్న ద్రష్టకు స్వప్న సమయంలో అనుభూతమౌతున్నాయి.

2. జాగ్రత్ దశలో జ్ఞానముచే ప్రబుద్ధుడైనవానికి బాహ్యమైనదంతా అంతరంగ రూపమగు ఆత్మయందే ఉన్నట్లు అనుభూతమౌతోంది.

3. స్వప్నం నుండి మేల్కొనగానే ఆ స్వప్నాంతర్గత పదార్థాలన్నీ రహితమై పోతున్నాయి కదా! అట్లాగే జాగ్రత్ దశలో ప్రవేశించినవాడు తిరిగి స్వప్న దశ చేరగానే జాగ్రత్ వ్యవహారాలన్నీ రహితమైపోతున్నాయి. స్వప్నము సుజ్ఞాన స్థితి కాకపోయినప్పటికీ (జడ స్థితియే అయినప్పటికీ) స్వప్న సమయంలో జాగ్రత్ అసత్యబుద్ధిత్వము పొందుతోంది కదా!

4. ఇక జాగ్రత్ దశలో ఉన్నవారికి ఈ పాంచభౌతిక దృశ్యత్వము, ఈ దృశ్యమును మననం చేసే ద్రష్టత్వము అత్యంత ఘనీభూతమైన విషయాలుగా కన్పట్టవచ్చు గాక! కానీ.... జ్ఞానముచే ప్రబుద్ధులైన మహనీయులకు ఈ విశ్వమంతా ఘనీభూతమైన స్వస్వరూపంగా (ఆత్మదృష్టిచే) అనిపిస్తోంది. అజ్ఞులకు కనిపించే పాదార్థిక దృష్టిని చూచి వారు చిరునవ్వు నవ్వుకుంటున్నారు.

5. "ప్రతిరోజు ఒక్కొక్క స్వప్నం వస్తోంది. అది అప్పటికి అంతమౌతోంది. జాగ్రత్ సుదీర్ఘంగా అనేక సంవత్సరాలు ఒకే తీరు కొనసాగుతోంది. కాబట్టి జాగ్రత్ – స్వప్నములు ఒక్కతీరైనవి కావు" ...అని అంటావా? జీవిత పర్యంతము సంభవిస్తున్న అనేక స్వప్నములకు అంతు ఉండటం లేదు కదా! ఎట్లా అనేక స్వప్నములు వచ్చి–పోతూ ఉన్నాయో... మహా అజ్ఞానమునందు అనేక జాగ్రత్తులు వచ్చిపోతూ ఉన్నాయి.

స్వప్నం చిన్న కథ అని అనుకుంటే... జాగ్రత్ సుదీర్ఘ కథ అయి ఉండవచ్చుగాక! అనేక స్వప్నములకు... అనేక సుదీర్ఘ కథలకు (ఉపాధి పరంపరల విశేషములకు) తేడా ఏమున్నది? రెండింటిలోనూ కల్పనయే ఉన్నట్లు, జాగ్రత్ – స్వప్నములలో ఒకే తీరైన స్వయంకృత కల్పనా వ్యవహారమే కొనసాగుతోందని విజ్ఞులు గమనిస్తున్నారు.

6. జనులు ఉత్పత్తి – వినాశనములతో కూడిన అనేక స్వప్నములు స్మరించటం జరుగుతోంది కదా! అట్లాగే 'జాత స్మరణవిద్య' (అనేక పూర్వ, తత్పూర్వ–గడచిపోయిన దేహములను కల్పించుకొని ఆయా భూతకాలపు సంఘటనా స్థలాలలోకి వెళ్ళి, అక్కడివారిని పరామర్శించి తిరిగిరాగల విద్య) సిద్ధింపజేసుకొన్న యోగసిద్ధులు ఉత్పత్తి – వినాశనములు గల అనేక జన్మలను సంస్మరించుకొను చున్నారు. అట్లాగే ఒక సిద్ధయోగి తన అనేకమంది శిష్యులకు ఒకేసారి అనేక ప్రదేశములలో ప్రత్యక్షమై వారికి జ్ఞానమును ప్రసాదించటం, కష్టాలు తొలగించటం చేస్తున్నారు. అనగా అనేక స్వప్నములు ఉన్నట్లే అనేక జాగ్రత్‌లు కూడా ఒక్కసారిగాను, వేరువేరుగాను కూడా సంభవిస్తోంది. ఈ రీతిగా కూడా జాగ్రత్ – స్వప్నములు ఒక్కతీరైనవే అని నిరూపించబడుతోంది.

❖

ఓ రామచంద్రా! ఈ జీవుడు వాస్తవానికి సమస్త అనుభవరూపమగు "కేవల సాక్షి" అయివున్నాడు. ఆతని స్వస్వరూప రససాగరం నుండి బయలుదేరే భావనా తరంగముల చమత్కారమే ఈ జాగ్రత్ – స్వప్నములు. సాగరజలంలో అనేక ఆకారములతో కూడిన తరంగాలు పరిఢవిల్లవచ్చు గాక! అయితే, అవన్నీ తిరిగి జలములోనే లయం అవుతున్నాయి కదా! అట్లాగే స్వస్వరూపం సత్యం. అందులో బయల్వెడలే జాగ్రత్ – స్వప్నాలు స్వస్వరూపమునకు అభిన్నం – సాగరజల తరంగాలు సాగర జలానికి అభిన్నమైనట్లుగా..! అవన్నీ స్వస్వరూపంలోనే ఒకప్పుడు ఉద్యమించి మరొకప్పుడు నశిస్తున్నాయి. "దృశ్యము"... "జగత్తు" – అనే రెండు శబ్దాలు వేరువేరుగా ఉన్నప్పటికీ నిత్యమూ ఒకే అర్థాన్ని కలిగి ఉన్నాయి. అట్లాగే "జాగ్రత్" "స్వప్నము" అనబడేవి రెండు శబ్దాలుగా వేరుగా ఉన్నప్పటికీ కూడా... ఒకే అర్థాన్ని కలిగి ఉన్నాయని సభికులంతా గ్రహించెదరుగాక!

విశాల స్వప్ననగరం చిన్మయాకాశమే అయి స్ఫురిస్తోంది. అట్లాగే ఈ విశాల జగత్తు కూడా చిన్మయాకాశమే అయి స్ఫురిస్తోంది. ఇక అవిద్య ఎక్కడున్నదో చెప్పు?

ఈ జగత్తు స్వప్నసదృశమే! స్వప్నం స్వప్నసమయంలో జాగ్రత్ సదృశమే! ఈ రెండింటికీ ఆధారం చిదాకాశమే! ఈ జీవుడు చిదాకాశ స్వరూపుడే!

ఆత్మ జ్ఞానమునకు పూర్వము జీవుని నిజకల్పనా రూపమగు దృశ్య నిర్వచనమే "సంసారము – దృశ్యము – బంధము" మొదలైన శబ్దములతో చెప్పబడుతోంది. ఈ జీవునికి బంధం ఉండవచ్చుగాక! ఆతని నిత్యోదిత చిదాకాశ స్వరూపమునకు లోటు ఏమిటి? తరంగత్వం ఉంటే మాత్రం జలానికి వచ్చే లోటు ఏమున్నది? ఈ జీవునికి నిజ చిదాకాశ స్వరూపము దృశ్యముచేతగాని, దృశ్యమునకు గాని బంధింపబడేది కానేకాదు. "తరంగము జలమును బంధిస్తోంది" అనేది యుక్తియుక్తమైన వాక్యం కాదు కదా!

❖

కాబట్టి ఓ జనులారా! బంధరహితము – నిత్యయుక్తము అయినట్టి చిదాత్మకు "బంధము ఉన్నది" అని బంధమును కల్పించకండి. ఎందుకంటే చిదాత్మ నిర్మలమగు ఆకాశము వంటిది. అది నిత్యనిర్మమై ఉండగా, నిరాకారము – నిర్లేపము – సూక్ష్మతరము అయివుండగా.... అద్దానికి బంధమెక్కడిది? ఆకాశంలో అనేకం ఉండచ్చు. అంత మాత్రానికి ఆకాశం ఎద్దానిచే బంధించబడుతుంది? ఇక ఏ అవిద్య అనే పేరుగల దృశ్యము చిన్మయాకాశము యొక్క స్ఫురణమాత్రమే అయివున్నదో... అట్టి నిరాకారమగు చిదాత్మకు బంధమెక్కడిది? నీ ఆలోచనలచే నీవు బంధించబడటమేమిటి? బంధమే లేనిచోట మోక్షమెక్కడిది?

**చినాఽ విద్యా విద్యతే నామ బంధో బంధో న కస్యచిత్ ।**
**మోక్షో న కస్యచిత్ మోక్షశ్చ అస్తి నాస్తీతి నాస్త్యలమ్ ॥**

చిదాకాశరూపుడగు జీవుని స్ఫురణయే (లేక) ఊహయే జగత్ – (లేక) దృశ్యము కదా! అనగా, అవిద్య అనునది వేరే లేనట్లే కదా! అవిద్యయే లేనప్పుడు ఒక జీవుని బంధము బంధమూ కాదు. మరొక జీవుని మోక్షము మోక్షమూ కాదు. ఎందుకంటే బ్రహ్మము కంటే వేరుగా ఏది కలదు? అసలు కలదు–లేదు అనేది కూడా సిద్ధించదు కదా! వాస్తవానికి విద్యగాని, అవిద్యగాని (చిదాకాశము దృష్ట్యా) లేనేలేవు.

చిదాకాశ రూపమగు నిజచైతన్యమే చిదాకాశమున 'సృష్టి' అనే ఆకారంగా దేహమును ధరించి స్వప్నము నందువలె వెలయుచున్నది.

**శ్రీరాముడు :** ఇక చిదాకాశ సంవిత్తు యొక్క రూపమేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "బుద్ధి వృత్తి నేత్రేంద్రియం ద్వారా ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశమునకు వెళ్ళుచున్నప్పుడు ఆ రెండింటి మధ్యలో ఏ నిర్విషయ సంవిత్తు యొక్క స్వరూపము ఉందో... అదియే జాగ్రత్ స్వప్నరూపమగు దృశ్యము యొక్క వాస్తవ స్వరూపం"... అనే నిర్ణయం సర్వదా

కలిగి ఉండు. ఆ స్వయంజ్యోతి స్వరూపమే ప్రతి ఒక్క దేహి వాస్తవరూపం. నిత్యజాగరూపమగు, సర్వదా ఏకమే అగు ఆ స్వయంజ్యోతిరాత్మ బాహ్య – అభ్యంతర దృశ్యములందు సర్వదా ప్రకాశిస్తోంది. నిద్రయొక్క అభావ దశయందు, నిద్రాస్థితి యందు ఇంద్రియ మనస్సులను – వాటి వికారములను – విషయములను – విషయ భావనలను స్పందింపచేస్తున్నదై ఉన్నది. ఈ మనస్సు జాగ్రత్‌లో ఉన్నప్పుడు, స్వప్నంలో ఉన్నప్పుడు, "అభావదశ" అనతగు గాఢ నిద్రలో ఉన్నప్పుడు... ఆ స్వయంజ్యోతి స్వరూపము సర్వదా మేలుకొనియే ఉన్నది. అది దేహాదులకు, ఆలోచనలకు, భావాదులకు పట్టుబడేది కాదు. కానీ దేహాదులుగా – ఆలోచనలుగా – భావాదులుగా ప్రకటితమగుచున్నదంతా ఆ స్వయం జ్యోతిరాత్మయేనయ్యా! కాబట్టి ఆ స్వయంజ్యోతి బ్రహ్మమే జాగ్రత్ – స్వప్నముల యొక్క పారమార్థికరూపమై ఉన్నది.

కనుక ఓ రామచంద్రా! జాగ్రత్–స్వప్నముల భేదజ్ఞానం ఏదైతే ఉన్నదో అది కూడా ఆ రెండింటి యొక్క సాక్షి అయినట్టి చైతన్యరూపమే అయివున్నది. ఎందుకంటావా? జాగ్రత్ – స్వప్న – సుషుప్తులలో ఏ భేదమున్నదో అది దర్శిస్తున్న ఆ నాలుగవవాడు ఎవడు? బయటవాడెవడో కాదు కదా? ఆ మూడింటికి సాక్షి అయి పరిజ్ఞాతమయి ఉంటున్న సాక్షి చైతన్యమే ఆ మూడింటి రూపంగాను, వాటిలో ఒకదానితో మరొకటి దానికి గల భేదరూపంగాను ఉండి ఉంటున్నాడనేది సోదాహరణపూర్వకంగా సుస్పష్టమే కదా! అట్లాగే ద్వైత – అద్వైతములు కూడా అట్టి ఏకమగు చిన్మయాకాశమై ఒప్పుచున్నాయి. ఓ రామచంద్రా! అంతాకూడా శాంతము – అఖండితము అగు చిద్రూప పరబ్రహ్మముగానే మాకు అగుపిస్తోంది.

❖

బ్రహ్మము → అంశలు → సత్ / చిత్ / ఆనందము

బ్రహ్మము యొక్క 3 అంశలలో 'సత్' అంశము బోధమయమై (జ్ఞానమయమై) ఉన్నది. బోధ (జ్ఞానము, తెలుసుకొనునది)గ్రాహ్యమయమై (దృశ్యమయమై, తెలియబడునది)ఉన్నది.

ఈ విధంగా... 1. జ్ఞాత (తెలుసుకొనునది), 2. జ్ఞేయము (తెలియబడునది)... ఈ రెండింటిలో "సత్ అంశము" అభిన్న రూపమైయున్నది. ద్రష్టయే తనకుతానే తనచే సందర్శించబడుచున్న దృశ్యముగా తనకు సాక్షాత్కారమగుచున్నాడు.

దృష్టాంతానికి– ద్రష్ట ఏ కారణం చేతనో (తనకు ఇష్టమైనవారు తీవ్ర అనారోగ్యం నుండి త్వరత్వరగా కోలుకోవటం మొదలైన ఆయా కారణాల వలన) సంతోషభరితంగా ఉంటే = దృశ్యము ఆతనికి సంతోషకరంగా ఉండటం.

ద్రష్ట అన్యకారణంగా విషాదభరితంగా ఉంటే (తెలివిగలవాడైన కుమారుడు పరీక్ష తప్పటం మొదలైనవి) దృశ్యము విషాదంగా, నిస్తేజంగా ఉండటం

ఈ రెండూ లోకవిదితమైన విషయాలే కదా! "విషయి కంటే విషయము వేరు... అని నిరూపించటం ఎవరి శక్యమూ అయ్యేది కాదు. కాబట్టి ద్వైతము – అద్వాని జ్ఞానము ఒక్కటే అయి ఉన్నాయి. ఆ రెండింటిలో చిదంశము అభిన్నమైనది. ఎప్పుడైతే ఏకము – సద్వస్తువు అగు బ్రహ్మమే సమస్త ద్వైతముగా కూడా భాసించుచున్నదని నిరూపించబడుతోందో... అప్పుడిక ద్వైత – అద్వైతముల భేదమెక్కడిది? ఆ రెండూ చిదాకాశ రూప బ్రహ్మమే అయి ఉంటున్నాయి కదా!

**నేఽతి నేఽతి వినిర్ణీత సర్వతోఽభి భవత్యపి ।**
**పశ్చాత్ త్యక్త్వా చిదాకాశే శిలాం కృత్వాస్యతామిహ ॥**

ఓ రామచంద్రా! ఓ తదితర సర్వసభికులారా! వినండి...

1. నేఽతి – నేఽతి (ఇది కాదు. ఇది కాదు) అను వేదవాక్యముల ద్వారా సమస్త నామరూపాత్మకమైన ద్వైతమూ "మిథ్యయే" అని గ్రహిస్తూ రండి.

2. అటు తరువాత క్రమక్రమంగా మిథ్య అయినదంతా త్యజిస్తూ రండి.

3. అటుపై ఉత్తరోత్తర భూమికల అభ్యాసం ద్వారా సర్వవ్యాపకము – ప్రత్యగాత్మ రూపము అగు చిదాకాశమునందు సుస్థిరులు అవండి. అప్రమేయ – నిర్మల – చైతన్యము కంటే వేరుగా "నేను – నాది – నీవు – అది – ఇది – ఆతడు – ఈతడు" మొదలైనవేవీ ఉండజాలవనే గమనికను సుస్థిరీకరించుకోండి.

4. మహాచిన్మయమగు బ్రహ్మమునందు 'పరమాత్మ పదము' అనే నిశ్చల శిలారూపం సముపార్జించుకోండి.

5. మనో సంచలనమునకు కూడా  కేవల సాక్షులై అభిమానాదులన్నీ త్యజించినవారై ఉండండి.

6. ఇక ఆపై లోకమర్యాదను అనుసరించి స్వవిభవానుసారంగా మీకు అభీష్టమైన ప్రదేశంలో విహరించండి. ఇష్టమైన దానిని తినండి, త్రాగండి. స్నేహితులతో హాస్యంగా ఉండండి. ఆపై మీ ఇష్టం. ఈ దేహ – మనో బుద్ధి – అహంకార – జగదత్వములను మీ చిత్ శరీరము యొక్క అయిదు వ్రేళ్ళవలె దర్శించండి. "ఈ 14 లోకాలు – సర్వభూత – వర్తమాన – భవిష్యత్ జగత్తులన్నీ నా శరీరమై ఉండగా... నేను ఇద్దాని కందటికీ వేరైన "నిత్య చిత్శ్శరీరధారి"నై, సర్వాధారుడనై, అనునిత్య ప్రకాశశీలుడనై ఉన్నాను"... అని గ్రహించి ఉండండి.

ఇదే మహాశిలోపాఖ్యానం యొక్క అంతిమసారం.

❖❖❖

# X. విద్య - అవిద్యోపాఖ్యానం

## 1. అవిద్యను త్యజించే ప్రయత్నం అత్యావశ్యకం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవుల ఉపభోగము కొరకై ఉద్దేశించబడే తినుబండారాలు ఆ జీవులచే భక్షించబడి (తమ రూపము కోల్పోయి) జీవుల రూపంగానే పరిణమిస్తున్నాయి కదా! అట్లాగే ఈ దృశ్యజగత్తంతా బాహ్యమందలి రూప ప్రకాశంతోను, అభ్యంతరమున సంకల్పాదుల తోను కూడి ఉండి, యథాస్థితమై ఉన్న ఈ దృశ్య జగత్తంతా కూడా చిదాకాశం యొక్క ఉపభోగం కొరకే అయివున్నది, అందుచేత ఇదంతా కేవలం చిదాకాశముగానే శేషించుచున్నది. ఒకనికి స్వప్నంలో నగరాలు కనిపిస్తున్నాయి. అవన్నీ సాక్షియగు స్వప్న ద్రష్ట యొక్క ఉపభోగము కొరకే కదా! కనుక, అవి స్వప్న సాక్షిచైతన్య చిద్రూపము కంటే వేరైనవి కావు. అట్లాగే ఈ జాగ్రత్ కూడా శాంతమగు చిదాకాశమే అయివున్నది.

**"జగత్ తస్మాత్ నభః శాంతమ్! నే ఽహ నానాఽస్తి కించన!"**

అట్టి పరమశాంతరూపమగు (చిదాకాశరూపమగు) ఈ జగత్తునందు నానాత్వము కించిత్తు కూడా లేనేలేదు. చైతన్యము సర్వదా ఏకరూపమే అయివున్నది. కానీ నానారూపాలుగా స్ఫురిస్తోంది. అట్లా నానా రూపములుగా ఏదైతే కన్పట్టుచున్నదో అట్టి నానాత్వము వాస్తవిక చిత్స్వరూపం కాదు సుమా! అది అనాత్మయే అయివున్నది. జలములో తరంగములు - బుద్బుదములు - ఆవర్తములు మొదలైనవి కనబడుచున్నప్పటికీ అవన్నీ జలం యొక్క రూపాలని, జలానికి రూప - ఆకారాదులు కలవని ఎవరమూ అనం కదా! అట్లాగే చైతన్యం తన నామరూపరహిత చిత్స్వరూపాన్ని త్యజించకయే ఈ ఈ నామరూపాదులతోటి ప్రదర్శితమగుచున్నది. ఎట్లా అంటావా? స్వప్న - సంకల్ప గంధర్వ నగరాదుల సందర్భంలో వాటికి సాక్షియగు నిజాత్మ తన చిత్స్వరూపమునందే అసత్యములగు ఆయా నానారూపాల తోటి దర్శింపజేస్తూ, ఇంతలోనే, మరొక సమయంలో ఆ స్వప్నాది విశేషాలన్నీ ఉపసంహరించి అద్వైతరూపముగా వెలయుచున్నది కదా! జాగ్రత్ ద్రష్టయగు చిదాత్మకూడా తన యందు తాను దర్శించే జాగ్రత్ దర్శన వ్యవహారం ఒకప్పుడు ఉపసంహరించుకుని అద్వైత రూపము చెందుతోంది. అయితే... జాగ్రత్ యథాతథంగా ఉండగాకూడా, అద్దాని ద్రష్టయగు చిత్ చైతన్యము అద్వైత రూపంగానే ఉంటోందిగాని ద్వైతముగా అగుటలేదని గ్రహించు. ద్వైతంగా కనిపిస్తూ కూడా ఇదంతా అద్వైతంగా అనిపించటమే 'అద్వైతానుభవం'.

❖

ఓ రామచంద్రా! ఈ జగత్తు ప్రళయకాలంలో లేదు. ఇప్పుడు కూడా లేదు. ఇదంతా స్వప్నాకాశంలో మహానగరంలాగా మొదలే వాస్తవానికి లేకపోయినప్పటికీ, అభ్యాస మాత్రంచే

ప్రాప్తిస్తున్నది. అయినప్పటికీ సత్యమైనదానివలె వెలయుచున్నది. ఈ సభలో మన ఈ సంవాదమును ఆలకిస్తూ ఇందలి ఆయా సర్వవిషయములను ఎప్పుడో సుస్పష్టంగా అనుభూతం చేసుకొనియున్న మహనీయులెందరో ఉన్నారు. అట్టి మహనీయులగు జ్ఞానులకు సత్య – అసత్య మయమగు ఈ సృష్టి యొక్క శబ్దార్థము తెలుసు. అజ్ఞానులకు అది తెలియదు. ఏది అజ్ఞానులకు ఘనీభూత సత్యముగా అగుపిస్తోందో... అది జ్ఞానులకు అట్లా అనిపించటం లేదు.

**శ్రీరాముడు :** స్వామీ! ఎందుచేత?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

> **తజ్ఞా జ్ఞయోః తయోరన్తః ప్రతిపత్తౌ తు యత్ స్థితమ్ ।**
> **న బోద్ధుం న చ వక్తుం తే జానీ తస్తౌ పరస్పరమ్ ॥**

ఎందుచేతనంటే... జ్ఞానులు కేవలం అంతర్దృష్టి కలవారై ఉంటున్నారు. అనగా, వారు తమ యొక్క తదితర సహజీవుల యొక్క – కేవల సాక్షీరూపమును ఆస్వాదిస్తూ చెక్కుచెదరని ఆనందమును అనుభూతపరచుకొని ఉంటున్నారు.

అజ్ఞానులు కేవలం బాహ్యదృష్టి నాశ్రయించి ఉంటున్నారు. అనగా, దేహ–మనో–బుద్ధి–చిత్త అహంకార పరిమితమైన దృష్టికి పరిమితులగుచున్నారు.

ఇక ఈ జగత్తో ... ఆ రెండింటి మధ్యగల బుద్ధి వృత్తియందు స్ఫురించటం జరుగుతోంది. అందుచేత ఆ జ్ఞాన–అజ్ఞాను లిరువురు ఒకరి దృష్టిని మరొకరు ఎరుగటానికి గాని, ఒకరితో మరొకరు చెప్పుకోవటానికిగాని సమర్థులు కాలేకపోతున్నారు.

ఈ జగత్తుయొక్క శబ్ద–అర్థములు ఆ ఇద్దరియొక్క వారి వారి బుద్ధియందు స్థితి నొందియున్నది. అందులో ఒకరు (జ్ఞానులు) భ్రాంతిరహితులు. రెండవారేమో (అజ్ఞానులు) భ్రాంతిసహితులు. జ్ఞాని యొక్క బుద్ధి సదా స్థిరమై.... ఆత్మ విషయంలో సదా మేల్కొనినదై ఉంటోంది. కాబట్టి అంతటా ఆత్మతత్త్వమును వీక్షిస్తోంది. "ఇన్నీగా పరమాత్మయే ప్రదర్శితమగుచున్నారు. నా మనో – బుద్ధి – చిత్తాది రూపంగాను, 'నేను' గాను వారే వెలయుచున్నారు" అని గమనించి బుద్ధి సుస్థిరత కలిగి ఉంటున్నారు. అజ్ఞాని యొక్క బుద్ధి సర్వదా అస్థిరమై ఉంటోంది. అందుచేత అది అస్థిరమగు ఈ జగత్తు యొక్క బాహ్యరూపమునే గాంచుచున్నది.

ఇక ఈ రెండింటి మధ్యయందలి బుద్ధియందున్న ప్రపంచం యొక్క స్వరూపం కేవలం అభ్యంతరగానూ లేదు, కేవలం బాహ్యంగానూ లేదు. కాబట్టి ఆ జ్ఞాని–అజ్ఞానులకు జగత్తు గురించి ఏమీ తెలియటం లేదు. (జ్ఞాని జగత్‌రాహిత్యం చూస్తుంటే, అజ్ఞాని అనుక్షణం చంచల బుద్ధి కలిగి ఉంటున్నాడు. అందుకే ఇద్దరూ జగత్తు ఎరుగుటలేదని చమత్కారంగా వ్యాఖ్యానించబడుతోంది.)

❖

ఓ రామచంద్రా! జలంలో ద్రవత్వ కారణంగా ఆకారాదులతో కూడిన తరంగాలు స్థితి పొందుచున్నాయి కదా! అట్లాగే చైతన్యం (స్వతహాగా సృష్టి మొదలైనవి తనయొక్క స్వరూపం

కానప్పటికీ) సృష్టిరూప తరంగాదులుగా స్థితినొంది ఉంటోంది. ఎట్లాగంటే స్వప్నచిత్ (లేక స్వప్నప్రజ్ఞ) తనయందు జీవులు-గృహములు మొదలైన ఆయా వస్తుజాలం కలిగి ఉండకపోయినప్పటికీ... స్వప్నంలో అవన్నీ దర్శిస్తోంది కదా! స్వప్నం అద్దాని రూపమే కదా! అట్లాగే జాగ్రత్ కూడా ద్రష్ట యొక్క [జాగ్రత్ చిత్ (లేక) జాగ్రత్ ప్రజ్ఞ యొక్క ] స్వయం ప్రకటనా చమత్కారమే అయివున్నది. అద్దంలో అద్దమునకు మార్పు చేర్పులు కలిగించకుండానే దృశ్యం – ఆ దృశ్యంలో వస్తు కదలికలు ప్రతిబింబిస్తూ ఉంటాయి కదా! అట్లాగే నిర్వికారము, నిరాకారము అగు బ్రహ్మం తన యొక్క మాయావిభాగంలో ఈ నిరాకార జగదాకారమును స్ఫురింపజేసుకుంటోంది. పిశాచమునకు సంబంధించిన సంభ్రమమంతా బాలుని స్వీయమనోవిరచితమైన భ్రమయే కదా! దేహికి దేహము పట్ల "ఈ దేహమే నేను" అను రూపముగల దేహాత్మ భావన భ్రమయే! భ్రాంతి మాత్రమే! అట్టి దేహాత్మ భ్రాంతియే సమస్త క్లేశములకు మూలమైయున్నది. ఇది మనో రాజ్యమువలె అసత్యమైనది. చంచల జలబిందువువలె క్షణికమైనది. అట్టి దేహము పట్ల "ఈ దేహమే నేను – నాది"... అనే అభిమానం ఎందుకు?

ఓ రామచంద్రా! ఈ జాగ్రత్ స్వప్నములు ఆత్మనుండే బయల్వెడలుచున్నట్లు అనిపించ వచ్చుగాక! అయినప్పటికీ ఆత్మయందు అవేవీ లేనేలేవు.

చీల్చబడుచున్న వెదుళ్ళనుండి "ఝుస్-ఝుస్" శబ్దం వస్తుంది. జలములోని తరంగముల నుండి "గుల్-గుల్" శబ్దం వినబడుతుంది. అగ్ని యొక్క జ్వాలలనుండి "ఛట్-ఛట్" శబ్దం బయల్వెడలు తోంది. వాయువు యొక్క తరంగాల నుండి 'హోర్' శబ్దం చెవులకు తాకుతుంది. కంఠం నుండి అనేక శబ్దపరంపరలు ఉచ్చరించబడుచున్నాయి.

అయితే... వాస్తవానికి వెదుళ్ళ పొట్టలోగాని, జలతరంగాలలో గాని, అగ్నిజ్వాలలలో గాని, వాయు తరంగాలలోగాని, కంఠం యొక్క లోలోపలగాని శబ్దాలు ఉన్నాయా? లేవు. అట్లాగే ఆత్మ యందు జాగ్రత్ – స్వప్న వికారాలు లేకపోయినప్పటికీ బయల్వెడలుచున్నాయి.

**శ్రీరాముడు :** సృష్ట్యాదిలో జాగ్రత్ – స్వప్న జగత్తులుగా బయల్వెడలుచున్నదేది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వప్న ద్రష్టయే స్వప్నాంతర్గత వ్యవహారరూపంగా సాధిక్యం పొందుచున్నాడు కదా! అట్లాగే స్వాత్మ చైతన్యమే సృష్ట్యాది నుండి ఈ జగద్రూపంగా స్ఫురిస్తోంది. అయితే స్వాత్మ చైతన్యమునకు వేరుగా చూస్తే జగత్తు యొక్క శబ్దముగాని, అర్థముగాని, దృశ్యముగాని లేవు. "ఈ జగత్తును అసాధారణ సరళిగా పొందుచున్న ఓ సహజీవుడా! నీ యొక్క సాధిక్యతయే నీవు పొందే జగత్తు! కనుక నీ జగత్తు నీ స్వరూపమే అయివుండగా, నీవు జగద్రహితమగు కేవల సాక్షివి"... అని మహనీయులు సర్వ సంసారజీవులకు గుర్తు చేస్తున్నారు. కనుక ఈ ఉన్నట్లుగా కనిపించే సర్వ దృశ్యము కూడా 'పరమార్థసత్త' యగు చైతన్యమే అయివున్నది. 'సత్త' కంటే వేరుగా సృష్ట్యాది యందుగాని, ఇప్పుడుగాని ఏదీ భాసించుటయే లేదు.

ఓ రామచంద్రా! "నేను శుద్ధ చిదాకాశ స్వరూపుడను. అట్టి నా స్వరూపమగు శుద్ధ చిదాకాశము సమస్త పదార్థభేదరహితమై ఉన్నది. అదియే అధిష్ఠాన దృష్టిచే చూస్తే సమస్త పదార్థసహితమై

ఉన్నది కూడా! అట్టి నేను సర్వవిధముల శాంతుడను. సుఖ స్వరూపుడను" – అని గ్రహించి ఉండు. ఈ జీవుడు తనయందే అసద్రూపంగా ఆవిర్భవించినట్టి తమస్సును, విక్షేపమును "శుద్ధబోధైక స్వరూపమగు ఆత్మ" యందలి విశ్రాంతిచే త్యజించివేయాలి. ఎందుకంటే ప్రతిజీవుడు అనునిత్యంగా పరమశాంతమగు శుద్ధాత్మయే అయివున్నాడు కదా!

**ఆత్మైవ హి ఆత్మనో బంధుః ఆత్మైవ రిపుః ఆత్మనః**
**ఆత్మాత్మనా నచేత్ త్రాతః తదుపాయోస్తి నేఽతరః**

ఆత్మజ్ఞానము కొరకు నిరంతరమైన, దృఢమైన ప్రయత్నం చేస్తూ ఉంటే... ఈ జీవుడు తనకు తానే బంధువు అవుతాడు. అట్లా ప్రయత్నంలో ఉండకపోతే తనకు తానే శత్రువు. తనను తాను ఆత్మజ్ఞానముచే రక్షించుకొనే ఉపాయం ఆశ్రయించక అనుక్షణం మార్పు – చేర్పులతో కూడుకొని ఉండే ఈ దృశ్యమును సమాశ్రయించి ఉండాలనుకొంటే... ఇక ఆతనిని స్వకల్పిత మనోవేదనల నుండి రక్షించటానికి (ఆత్మజ్ఞానం కాకుండా) మరింకే ఉపాయమూ కనబడటం లేదు.

అందుచేత ఓ సర్వసభికులారా! బాల్యం అజ్ఞానంలోను, అసమర్థత గాను; వార్ధక్యం నిస్సహాయత గాను గడచిపోతున్నాయి. ఇక ఈ మన రామచంద్రునిలాగా యౌవన దశ ప్రారంభమగుచుండగానే "శుద్ధబుద్ధి" అనే నౌక ద్వారా "సంసారం" అనే సముద్రాన్ని దాటివేయాలి. ఇప్పటికిప్పుడే "ఆత్మజ్ఞానం" అనే శ్రేయమును సంపాదించుకోవాలి.

**అద్యైవ కురు యత్‌శ్రేయో! వృద్ధః సన్కిం కరిష్యసి?**
**స్వగాత్రాణ్యపి భారాయ భవంతి హి విపర్యయే!**

ఇప్పుడు తాత్సారం ఏమాత్రం పనికిరాదు "ఆ! తరువాత ముసలివాళ్ళం అయిన తరువాత చూసుకుందాములే!"... అని ఇప్పుడు యౌవన దశలో ఏదో రోజులు గడిపివేస్తూ ఉంటే, ఇక ముదుసలి అయిన తరువాత చేసేదేమిటి? అప్పుడు ఈ కాళ్ళు – చేతులు – తదితర ఇంద్రియాలు దేహానికీ భారభూతమౌతూ ఉంటే, ఆత్మజ్ఞానానికి ఎవడైనా ఎట్లా ప్రయత్నించగలడు? బాల్య – వార్ధక్యములు జ్ఞాన సాధకములు కావు. అందుచేత ఆ రెండు దశలు పశు – పక్షిత్వ సదృశాలని, మరణతుల్యములని విజ్ఞులు గుర్తు చేస్తున్నారు. యౌవనం ఒక్కటే సరి అయిన సమయం. యౌవనంలో కూడా వివేక సముపార్జనకు సంసిద్ధం కాకపోతే ఆ బ్రతుకు కుక్కబ్రతుకే కదా! అయితే ఈ యౌవనం శాశ్వతమా? కాదు. అందుకని దొరికిన కొద్ది సమయం అత్యుత్సాహంతో శ్రద్ధగా సద్వినియోగం చేసుకోవాలి సుమా! ఈ జీవితము మెరుపు యొక్క పతనమువలె అతి చంచలమైనది. ఇక సంసారము ఒక అతిదీర్ఘరోగము వంటిది. ఇట్టి సంసారం అనే మానసిక వ్యాధి కలిగి ఉన్నామని తెలుసుకొని కూడా ఈ జీవుడు "సచ్ఛాస్త్రము, సాధు సాంగత్యం" అనే ఔషధం సేవించకపోతే ఇక అజ్ఞానమనే పంకము (బురద) తొలగేది ఎట్లా? 'అజ్ఞానం' అనే బురదలో ఆత్మ మునిగి ఉండగా అద్దానిని "శాస్త్రప్రవచనం – సాధనలు" అనే ఉపాయములతో తమను తాము ఉద్ధరించుకునే ప్రయత్నం చేయనివారు తమ పట్ల తామే ఎంతటి మహాక్రూరులు! ఎంతటి అధములు! వారి ఉత్తరోత్తర గతులను తలచుకుంటేనే మాకు "అయ్యో!" అనిపిస్తోందే!

మట్టితో తయారు చేసిన ఖిళితాళ సభను చూచి "ఇదంతా మట్టియే" అని తెలుసుకోకపోవటం చేత ఒక గ్రామవాసి ఎంతో దుఃఖం, భయం పొందుతాడు చూచావా? ఆత్మజ్ఞానం సముపార్జించుకోని జీవుడు బ్రహ్మమయమే అయిన ఈ దృశ్యమును "బ్రహ్మమే" అని గ్రహించక బహుదుఃఖితుడు అగుచున్నాడు. యథార్థజ్ఞానం కలిగినప్పుడు "ఇదంతా ఆనందమయమగు బ్రహ్మమే" అని గ్రహించి పరమానంద స్వరూపుడు కాగలడు. తత్త్వజ్ఞాన బలం చేత ఈ దృశ్యం అశాంతమయినప్పటికీ తత్త్వ జ్ఞాని యొక్క బుద్ధి సశాంతిని పొంది ఉంటోంది. అంతాకూడా ఆత్మయందు లయమై (ఆత్మరూపంగా అనుభూతమై) దృశ్యము అదృశ్యమైపోతోంది. స్వప్నాంతర్గతమైన అనేక పదార్థములు, గృహాదులు, శత్రుమిత్రులు, సంఘటనా పరంపరలు ...ఇవన్నీ కూడా "ఇది స్వప్నమే" అని తెలిసిన తరువాత అవి – మొదలంటా అసత్యములే అయి – ఏ మాత్రమూ వేదనను కలిగించకుండా ఉంటాయి కదా! అట్లాగే ఈ సృష్టి కూడా కళ్ళకు సుస్పష్టంగా అనుభూతమగుచున్నప్పటికీ, మనస్సుకు సత్యముగా తోచుచున్నప్పటికీ తత్త్వజ్ఞానముచే చిన్మయాకాశమున శూన్యరూపంగా శేషించుచున్నది.

ఓ ప్రియజనులారా! ఈ 'జీవితము' అనే అరణ్యం జన్మ–జరా–కామ–క్రోధ–లోభ–మోహాది దావాగ్నులచే ప్రదీప్తం అవుతుంటే అజ్ఞానులు ఇందులో చిక్కుకున్న లేడిసమూహంలాగా కాసేపు ఇష్ట వస్తువుల ప్రాప్తిచేతను, మరికొంతసేపు అయిష్ట వస్తువుల సంయోగము చేతనూ అటు ఇల్లు పరుగిడుతూ రోజులు గడుపుచున్నారే? ఈ ఇంద్రియములేమో మదించిన మనస్సుచే అదలించబడుచూ ప్రాణవాయువుల ద్వారా బాహ్య వస్తువులవైపు పరుగులిడుచున్నాయే! ఇక తాత్సారం ఉచితమేనా? ఒకవైపు ఇట్లా తగలబడుతూ ఉంటే "ఈ గదిలో వెచ్చగా ఉన్నది కదా" అని దుప్పటి కప్పుకుని పడుకుందా మనుకోవటం క్షేమమా? కాదు కదా! మీరు ఈ ఇంద్రియాలను జయించి జ్ఞానం ద్వారా అవిద్యను జయించ వలసిన సమయమిది. ముక్తులై జనన–మరణ చక్రమును నిరోధించ వలసిన సందర్భం ఈ జీవితమే! ఈ మహత్తరమైన 'జీవితము'ను అనేక అనవసరమైన వ్యవహారాలతోను, దిగుళ్ళతోను నేలపాలు చేసుకోకండి. కనుక ఆత్మజ్ఞానం కొరకై నడుము బిగించండి.

❖❖❖

## 2. ఇంద్రియాలను జయించటం ఎట్లా?

**శ్రీరాముడు :** స్వామీ! సద్గురూ! వసిష్ఠ మహర్షీ!

**వినా ఇంద్రియజయేనేదం నాఽజ్ఞత్వమ్ ఉపశామ్యతి ।**
**తదింద్రియాని జీయన్తే కథం కథయే మే మునే ॥**

ఈ ఇంద్రియాలను జయించకపోతే అజ్ఞానం శమించదు కదా! మరి ఇంద్రియాలను జయించటం ఎట్లాగో ఈ సందర్భంలో మాకు బోధించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును ఇప్పుడు నీ ప్రశ్న అత్యంత సమయోచితమైనదే! ఎందుకంటే దీపం వెలుగుచున్నప్పటికీ చూపు సన్నగిల్లినవానికి గదిలోని చిన్న చిన్న వస్తువులు (సూక్ష్మ వస్తువులు)

కనిపించవు కదా! అట్లాగే... అనేక విషయములందు ఆసక్తుడైనవాడు, ఈ ప్రపంచంలో తన యొక్క ఏదో గొప్పతనమును సంపాదించుకోవాలనే 'వేడుక' కలవాడు, ధనార్జనయందు "అత్యాసక్తి" కలవాడు, ఇంద్రియములను జయించే ప్రయత్నం లేనివాడు... అగు మనుజుడు శాస్త్రములు వింటున్నప్పటికీ, శాస్త్ర ప్రవచితమైన ఆయా సాధనలకు అప్పుడప్పుడూ ఉపక్రమిస్తున్నప్పటికీ కూడా అవన్నీ బ్రహ్మదర్శనమునకు ఉపయుక్తమవటం లేదు. కాబట్టి ఇంద్రియ జయమునకు యుక్తి అత్యావశ్యకం. ఇంద్రియములు జయించబడ్డాయా... ఇక ఆపై స్వల్ప ప్రయత్నం చేతనే సులభంగా మోక్ష ఫలసిద్ధి కలుగగలదు. అందుచేత ఇంద్రియ జయమునకై కొన్ని యుక్తులను ఇక్కడ ప్రతిపాదిస్తు న్నాను. సభికులంతా శ్రద్ధగా వినెదరుగాక!

❖

ఓ రామచంద్రా! ఈ జీవుడు స్వతహాగా చిన్మాత్ర స్వరూపుడే! అయితే చిత్తమునకు ప్రాప్తించే విషయాలకు ఆతని చిత్తము (ఆయా విషయములకు) అధీనం అగుచుండబట్టి ఈతనిని 'చిత్స్వరూపుడు' అని అనకుండా,.... 'జీవుడు' అని పిలుస్తున్నాం. ఈతడు తనయందు చిత్తవృత్తిచే వ్యాపించినవాడై ఆయా జగద్విషయములను అనునిత్యంగా సంకల్పిస్తున్నాడు. ఆతడు దేనిని ఈ చిత్తముతో తనయందు సంకల్పిస్తున్నాడో, అద్దానియందు (తన చిన్మాత్ర స్వరూపమును ఏమరచి) తన్మయుడగుచున్నాడు. వాటి వాటి యందు ఆసక్తి కలిగినవాడై ఉంటున్నాడు.

ఇప్పుడు ఈ చిత్తమునందు ఏర్పడి ఉన్న బాహ్యాకారత్వమును తొలగించి ఈ చిత్తమును బ్రహ్మాకారముగా మలచాలి. ఎట్లా? చిత్తమును ప్రత్యాహారము అనే ప్రయత్నం చేత అభ్యంతరమునకు ఆకర్షించాలి. "బ్రహ్మాకారత్వ ప్రబోధము" అనే అభ్యాస రూపమై సుతీక్షణమైన అంకుశము యొక్క పోట్ల చేత 'చిత్తము' అనే మదపుటేనుగును వశం చేసుకోవాలి. చిత్తమును నిరోధిస్తేగాని ఇంద్రియములు జయించబడవు.

'ఇంద్రియములు' అనే సేనకు సేనానాయకుడు చిత్తమే. పాదరక్షలు ధరించి బాటలో నడిచే వారికి నడిచే చోటంతా చర్మముచే కప్పబడినట్లే అవుతుంది కదా! ఈ 'చిత్తము' అనబడు ఒక్కదానిని జయించితే చాలు... సర్వ ఇంద్రియములపై అతి సులభంగా విజయం వరిస్తుంది.

ఎవడైతే తన జీవ సంవిత్తును (లేక చిత్తవృత్తిని) బ్రహ్మముతోటి ఏకంచేసి ఆత్మయందు స్థితి కలిగి ఉంటాడో... ఆతని మనస్సు పరమశాంతము పొందుతోంది?

చిత్తవృత్తిని బ్రహ్మముతోటి ఏకం చేయడం అంటే... "చిత్తముచే ఏఏ వృత్తి ద్వారా ఏఏ అనుభవము సిద్ధిస్తుందో... అట్టి వ్యవహారములు వ్యక్తులు – సందర్భములు – వస్తువులు సంఘటనలు అన్నీకూడా ఆ పరమాత్మయే ఆయా రూపములుగా ఉన్నారు" అనే భావన సర్వదా సర్వవేళలా అభ్యాసం చేస్తూ ఉండటమే సుమా! ఆ పరమాత్మయే సర్వరూపములుగా ఉన్నారు, ...ఒకే జలం తరంగములుగా, బుద్బుదములుగా, ఆవర్తనలుగా, సుడి రూపములుగా ఉండి ఉన్నట్లు"... అను ప్రత్యాహార రూప చిత్తవృత్తియే అద్దానియొక్క బ్రహ్మము తోటి ఏకత్వము క్రమంగా అప్పుడు "ఈ

సర్వము నాతో సహా ఆతనిదే! ఆతడే! ఆతని వ్యక్తీకరణ చమత్కారమే"... అని అంతిమ సాక్షాత్కారం క్రమంగా స్వయంగా 'ఆ బ్రహ్మాకార చిత్తవృత్తి యొక్క ప్రాభవం' చేత పరిఢవిల్లగలదు. "అంతటా బ్రహ్మమే" ...అనే దృష్టిని పెంపొందించుకున్నవాడు బ్రహ్మమునే దర్శిస్తూ బ్రహ్మమే అగుచున్నాడు. (బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి!) "తన జీవసంవిత్తును, తన చిత్తవృత్తిని బ్రహ్మమునందు ఐక్యపరచటం" ...అనగా "నావి" అని అనిపించే దృశ్య – దేహ – మనో – బుద్ధులను... "పరమాత్మవే"... అని అనుకోవటం. అట్టి ప్రయత్నం చేత ఈ చిత్తవృత్తి ఏ ప్రకారంగా శమిస్తుందో... ఆ ప్రకారంగా (అంతంతగా) తీర్థములు సేవించటం చేతగాని, అనేక శాస్త్రములు పఠించటం చేతగాని, ఆయా యోగ శక్తులను సముపార్జించటం చేతగాని, గొప్ప తపస్సులు చేయటం వలనగాని, యజ్ఞ యాగాది క్రియా సమూహములచేతగాని శమించదు సుమా!

ఓ రాఘవా! ఏయే విషయాల యొక్క స్మరణం చిత్తవృత్తిలో బలాత్కారంగా సంభవిస్తోందో... ఆయా విషయములను అధిష్ఠాన బ్రహ్మ సంవిత్తునందు లయం చేయాలి. అనగా "ఈ ఈ రూప –నామ–గుణాలు గల ఈ జీవుడు పరబ్రహ్మమే సర్వదా స్వస్వరూపంగా కలిగి ఉన్నాడు" ...అను అంతరములోని నిశ్చయమే ఆ దృశ్య విషయమును అధిష్ఠాన బ్రహ్మ సంవిత్తునందు లయంచేయటం అగుచున్నదని నీవు గ్రహించు. అప్పుడు క్రమంగా ఆయా విషయ సంస్కారములు నశించి, ప్రాపంచిక సంబంధమైన విషయముల గురించిన "స్మృతి" కలుగుచున్నది. అట్టి ప్రయత్న రూపమైన ఉపాయముచే భోగహేతువులగు విషయముల యొక్క విజయము క్రమక్రమంగా సముపార్జించబడగలదు.

ఓ ప్రియ సభికులారా! అభ్యాసముచే సర్వము సుసాధ్యమే! "ప్రియ పరమాత్మయే ఇన్నిన్ని రూపాలుగా అగుచున్నారు. నా బుద్ధికి కనిపించేదంతా వాస్తవానికి పరమాత్మ ప్రదర్శనమే!"... అను "నిజాభ్యాసం" అనే యత్నం చేత చిత్తవృత్తి "ప్రాపంచిక విషయాలు" అనే దుర్వ్యసనం నుండి కొంచెం – కొంచెం నిరోధించబడినా కూడా, ఇక అట్టి అభ్యాసమును కొనసాగిస్తూ ఉండగా తత్త్వవేత్తల అనుభవసిద్ధమైయున్న "స్వారాజ్యం" పొందబడినదే అగుచున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! వర్ణాశ్రమాది అనేక ధర్మములు మేము ప్రవాహ ఫలితంగా ఆజన్మాంతరం నిర్వర్తించవలసి వస్తుంది కదా! ఇక ఈ ఇంద్రియాలను జయించగలిగే, అధిగమించగలిగే అవకాశం మా కెక్కడిది? జితేంద్రియత్వం మీ వంటి సర్వమును త్యజించిన మహనీయులకు మాత్రమే సాధ్యం. కుటుంబ వ్యవస్థలోను, లౌకిక వ్యవహారములలోను ఉన్నట్టి మాకెట్లా సాధ్యం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (చిరునవ్వు నవ్వి) ఓ రామచంద్రా! "స్వధర్మనిరతి" అనేది వాస్తవానికి విజ్ఞులు పరమాత్మను చేరు మార్గంగా అభివర్ణిస్తున్నారు. "స్వకీయ వర్ణాశ్రమ ధర్మం యొక్క నిష్కామ పూర్వకమైన నిర్వహణ పరమాత్మ సాన్నిధ్యం సులభతరం చేస్తుంది" అనునది శాస్త్రప్రబోధయే అయివున్నది కదా! నిష్కామపూర్వకమైన స్వధర్మనిరతి చేతను, విషయాల పట్ల తృష్ణారాహిత్యం చేతనే ఈ ఇంద్రియాలను జయించి ఆత్మ పదమున వెలయుచు ఎందరో మహానుభావులు ఉన్నారు. స్వధర్మ వ్యవహారాలు పరమాత్మను చేరే సోపానాలై ఉండగా, "నిరోధకాలు" అని బద్ధకస్థులు మాత్రమే

భావన చేస్తున్నారు. సర్వధర్మ విరుద్ధములైన పదార్థములందు కోర్కెను త్యజిస్తూ, స్వధర్మమును దైవసమానంగా దర్శిస్తూ, శమ – సంతోషములను సముపార్జించుచూ ఎవడుంటాడో... ఆతడు 'జితేంద్రియుడు' అని అనటానికి సందేహమే లేదు.

**మనోశమనం -** ఎవడైతే సహజీవులను చూస్తున్నప్పుడు

అభ్యంతర సంవిత్తు అగు ఆ సహజీవుని కేవల చిత్స్వరూపము పట్ల ప్రియము / ప్రీతి

బాహ్య సంవిత్తు అగు చిత్త దేహాదులపట్ల "ఇవి ఈతని వాస్తవ రూపం కాదు కదా! జలము యొక్క తరంగము వలె భ్రమయుతము–క్షణికము కదా!" అనే ఒకానొక అభిరుచి, అప్రీతి, గాంభీర్యముతో కూడిన అతీతత్వము

కలిగి ఉంటాడో... అట్టి అభ్యాస వశంచేత ఈ మనస్సు క్రమంగా అతి త్వరలో జయించబడుతుంది. అట్టివారికి సకల సహజీవుల పట్ల "వీరు ఆత్మ స్వరూపులే" అను దృష్టి పెంపొందుచూ, క్రమక్రమంగా "మమాత్మ స్వరూపులే", "మమస్వరూపులే" అనే బుద్ధి నిశ్చలమౌతోంది. అప్పుడిక "నేనే సర్వాంతర్యామి అగు ఆత్మను" అను నిశ్చలమైన బుద్ధి ఘనీభూతంకాగలదు. అదియే "ఆత్మదృష్టి" సుమా!

**సంవిత్ ప్రయత్న సంరోధాత్ మనః స్వాయన ముజ్ఝతి ।**
**చేతః చపలతోన్ముక్తం, వివేకమనుధావతి ॥**

ఓ మిత్రులారా! 'దేహ – మనో – బుద్ధి – దృశ్య రూపములగు బాహ్య సంవిత్తు నేను కాదు. అఖండము, అప్రమేయము, నిత్యము, నిర్మలము, యథాతథము, సర్వజగత్ వాస్తవ స్వరూపము అగు అంతః సంవిత్తును నేను" ...అనే అభ్యాసమునకు తాత్సారమెందుకో, వెనుకాట ఎందుకో, మొహమాటమెందుకో నాకు చెప్పండి? అట్టి "అంతర్ సంవిత్తేవాఽహమ్" (ఆ నిశ్చల అంతర్ సంవిత్తునే నేను. అదే ప్రతిఒక్క జీవుడు) అనబడే మనో–బుద్ధుల యొక్క కొంచెం కొంచెం ప్రయత్నంచే ఈ చిత్తవృత్తి నిరోధించబడగలదు. క్రమంగా "మనస్సు దుర్వ్యసనములవైపుగా పరుగిడటం" అనే దురభ్యాసమును "అంతా పరమాత్మకు చెందినదే! పరమాత్మ స్వరూపమే" ...అనే ప్రయత్నంచే జయించబడుతుంది. ఈ మనస్సు ఎప్పుడూ ఎటో ఒకవైపుగా పరుగులు తీయటమే స్వభావంగా కలిగివున్నది. అట్టి మనస్సు యొక్క నిత్య చలనత్వమును సద్వినియోగపరచుకోవాలి. ఎట్లా అంటే... మనస్సు విషయాల వైపుగా పరుగులు తీయకుండా చూచుకోండి. "వారు అట్టివారు, వీరు ఇట్టివారు" ...అనే దృష్టిని "పరమాత్మ ఇట్లు ప్రదర్శిస్తున్నారు" ...అని మనస్సును కొంచెం సంస్కరించి, సంయోగ – వియోగాతీతంగా నియమిస్తే అప్పుడది తనకు తానే వివేకము వైపుగా పరుగులు తీయసాగుతుంది.

అట్టి వివేకమును సముపార్జించుకొన్న బుద్ధి కలవాడే 'జితేంద్రియుడు' అని పిలువబడు చున్నాడు. ఆ విధంగా "అంతరంగ సాక్షి దృష్టి"ని పెంపొందించుకొనే బుద్ధిమంతుడు ఏ పరిస్థితులలో కూడా సంసార సముద్ర వాసనల తరంగములలో కొట్టుకుపోడు.

ఓ ప్రియసభికులారా! అతి దీర్ఘకాలం వేచి ఉన్న తరువాత, అనేక ప్రయత్నములు నిర్వర్తించి ఈ 'మానవజన్మ' అనే అవకాశము పొందియున్నారని గుర్తు చేస్తున్నాను. అందుచేత ఇది సద్వినియోగ పరచుకోవాలి గాని దుర్వినియోగ పరచుకోకూడదు.

**దుర్వినియోగం -** వాసనలు అనే తరంగాల వెంటబడి ప్రాపంచిక వ్యక్తిగత – సంఘటనా గతమైన అభ్యాసముచే బుద్ధిని మరింత కలుషిత పరచుకోవటం.

**సద్వినియోగం -** ఇంద్రియ వ్యవహారములు పరమాత్మ పరంగా దర్శిస్తూ ఆత్మదృష్టి పెంపొందించుకోవటం.

ముందుగా అంతర్ సంవిత్ దృష్టిచే ఇంద్రియాలను, ఇంద్రియ ధ్యాసలను జయిస్తూ అట్టి ప్రయత్నం నిరంతరం కొనసాగిస్తూ ఉండాలి. ఆ ప్రయత్నంలోని ముఖ్యమైన విభాగంగా 1.సాధుజన సంపర్కం, 2. సచ్ఛాస్త్రముల అవలోకనంఅనే ఉత్తమ ప్రయత్నములలో నిమగ్నమగుచూ రావాలి. అప్పుడు ఇంద్రియ విషయధ్యాసలు వాటికవే సన్నగిల్లుతూ వస్తాయి. సాధుజనులతో సంభాషించటం – సచ్ఛాస్త్రములు ప్రసాదించే పాఠ్యాంశాలను హృదయగతం చేసుకోవటం అనే ఉభయ ప్రయత్నముల ద్వారా ఇక ఈ జగత్తును యథార్థ రూపముతోటి "సత్య బ్రహ్మ మాత్రము"గా జితేంద్రియుడు వీక్షిస్తున్నాడు. ఎట్లా అంటే, "అది మృగతృష్ణ. అందులో వాస్తవంగా జలం ఉండదు" ...అని తెలిసిన తరువాత కూడా "అక్కడకు నడచి వెళ్ళి, ఆ కనబడే జలం తాగి దాహం తీర్చుకుంటాను" ...అని ఎవరైనా శ్రమకు ఉపక్రమిస్తారా? లేదు. అట్లాగే సత్యవస్తువగు ఆత్మయొక్క అవలోకనముచే ...ఈ జగత్తంతా మమాత్మయే... అని గ్రహించిన తరువాత సంసార భ్రమ స్వయముగా తొలగిపోతుంది. "ఇది పొందాను (రాగం). కాని అది ఇంకా పొందలేదు (కామం). నేను అల్పుడను" ఇట్టి అల్ప ప్రలాపములు వాటంతట అవే సమసిపోతాయి.

ఈ జగత్తు విషయశూన్యము – దృశ్య రహితము అగు కేవల చిన్మాత్రమే అయి వెలయుచున్నది – అని గ్రహించి సత్యబోధ సంపాదించుకున్నవానికి ఇక బంధమెచ్చట? మోక్షమెచ్చట? తటాక జలంలో జలం అనేక చిత్రవిచిత్ర తరంగాదులు ప్రదర్శించవచ్చుగాక! ఈ నీరు ఎండిపోయినప్పుడు ఆ తరంగ సమూహాలు ఇక ఉండవు కదా! అట్లాగే ఆత్మదృష్టి రూప అభ్యాసము యొక్క వేడిమిచే ఇంద్రియ విషయరూపమగు ఈ దృశ్యం కారణరహితమై ఇక మరల ఆత్మగానే కనబడుతుంది గాని దృశ్యముగా ఉద్భవించదు. దృశ్యమును దృశ్యంగా కాకుండా క్రమక్రమంగా పరమాత్మగా దర్శించ టంలో సుఖమే ఉన్నదిగాని, కష్టం కాదు. పైగా, అది సర్వ సంసారభ్రమల యొక్క సశాంతి స్థానం.

**నేను, నీవు మొదలైనవి -** ఓ రామచంద్రా! "చిదాకాశమాత్రము' అగు సంవిత్తే అవిద్యచే, "నీవు–నేను" మొదలైన రూపములతో ఈ జగత్తును ధరించుచున్నది. అట్టి ఈ జగత్తు అనబడేది ఈ విధంగా "స్వాత్మ" యందే అధ్యస్తమైయున్నది. అట్టి ఈ "జగత్ వ్యవహారము" అనే తెరను జ్ఞానము అనే హస్తబలంతో ప్రక్కకునెట్టి ఈ అధ్యస్తమై ఉన్నదానికి భిన్నమైనట్టి "అధిష్ఠాన చిన్మాత్రమే నేను" అని గ్రహించి ఉండాలి.

| అధ్యస్తము | అధిష్ఠానము |
|---|---|
| నేను – నీవులతో కూడిన దృశ్య జగత్తు | నేను – నీవు – జగత్తులు ఎందులో (జలంలో తరంగాలలాగా) కనబడుచున్నాయో..... అట్టి స్వస్వరూపం |

ఈ 'నేను – నీవు' మొదలైన రూపములతో కూడిన ఈ జగత్తు అవిద్య మాత్రమే అయివున్నది. ఇది (దృశ్యముగా) వాస్తవానికి మిథ్యయే! అందుచేత "ఇది ఎట్లా శమిస్తుంది" ...అనే దిగులు ఎవరికీ ఉండవలసిన పనిలేదు. ఈ జగత్ భావం అనబడేది వాస్తవానికి సర్వదా శమించినదై, శూన్యమాత్ర స్వరూపము కలిగినదై చిదాకాశము నందే అధ్యస్తమై వెలయుచున్నది. ఈ జగత్తు అనబడేది చిదాకాశమునందే చిదాకాశ ప్రతిబింబమై జగద్రూపంగా (అధ్యస్తమై) భాసిస్తోంది" ...అనునది వేదోపనిషత్తులు ప్రకటించే సిద్ధాంతము. స్వప్నం అసత్తే అయినప్పటికీ సత్తువలె అనుభూతం అగుచున్నది కదా! అసత్తే అయినప్పటికీ సత్తువలె అనుభూతం అవటమనే వ్యవహారానికి ఇక్కడ స్వప్న దృశ్యమే దృష్టాంతమగుచున్నది. స్వప్నంలో కనిపించిన రాజ్య భోగ వైభవం స్వప్న చైతన్యరూపం గాక, మరింకేదీ కాదు కదా! అట్లాగే జాగ్రత్‌లో ప్రకటితమై, ప్రదర్శనమయేదంతా కూడా జాగ్రత్ చైతన్య వైభవమే అయివున్నది. స్వప్నంలో రాజ్య విలాసానికి కర్త ఎవరు? అనుభవించేదెవరు? ఏ ఇంద్రియములకు అవి అనుభూతమగుచున్నాయి?.... అట్లాగే ఈ జాగ్రత్‌లో కనిపించే ఈ విశాల జగదనుభవానికి కర్త – కర్మ – క్రియలు లేవు. ఇదంతా ద్రష్ట యొక్క దృశ్య సత్తా చైతన్య రూపమే అయివున్నది. స్వయంకృత విశేషమే అయి ఉన్నది.

**నేనెవరు? -** ఏదైతే కర్త–కర్మ–కరణములు మొదలైన సామాగ్రి లేకుండా కూడా భాసించుచూనే ఉన్నదో... అట్టి చిద్ఘన స్వరూపమే 'నేను' అయివున్నది. స్వప్నంలో స్వమరణం లేకపోయినప్పటికీ –ఒకడు తాను మరణించినట్లు, బంధువులు శోకిస్తున్నట్లు కలలో – గాంచుచున్నాడు కదా! స్వప్నంలో కనిపించేదానికి ఎవరికి కర్తృత్వం ఆపాదించగలం?

ఈ జగత్తు సృష్ట్యాదియందే కర్తృత్వ రహితమైయున్నది. దీనికి 'కర్త' అనబడువాడెవడూ లేడు. కనుక ఇది నా స్వయంప్రకాశ రూపమే అయి వున్నది. అయితే, అవిద్యా రూపమగు ఈ జగత్తు ఇట్లా విద్యమానమై ఉన్నప్పటికీ కూడా... ఇది జ్ఞానబలంచే "లేనిదే" (స్వప్న సదృశంగా) అగుచున్నది.

ఈ జగత్తు నా స్వస్వరూపమగు 'చైతన్యం' అనే మణి యొక్క ప్రకాశరూపమే! ఇదంతా చిదాత్మచే స్వాత్మయందు సంకల్పించబడినదై ఉన్నది. నాచే జగత్తుగా పొందబడుచున్నదంతా నా "సంకల్పం"... అనే రూపం తప్పితే వేరైన రూపమేదీ కలిగి ఉండలేదు. ఒక ఆలోచనకు కారణమే మున్నది? అట్లాగే ఈ జగత్తు అనబడేదంతా కారణరహితమై ఒప్పుచు కాకతాళీయ న్యాయముచే స్వయముగా (మిథ్యగా) భాసిస్తోంది.

యథార్థానికి ఈ జగత్తు కారణరహితం. కనుక నాకు వేరుగా లేదు. (నా సంకల్పం లేకుండా) భాసించటమే లేదు. ఏ చిత్ప్రకాశం చేత ఇదంతా ప్రత్యక్షంగా, వ్యక్తమై భాసిస్తోందో... ఆ చిత్ప్రకాశమే

"నేను" కూడా! ఆ చిత్ప్రకాశమును పెద్దలు, తత్త్వజ్ఞులు "పరమ పదము - చిదాత్మ బ్రహ్మము - పరమాత్మ"... మొదలైన ఆయా శబ్దాలతో ఉద్దేశిస్తున్నారు.

ఓ రామచంద్రా! శూన్యత్వంగా కనిపించేది ఆకాశమాత్రమే కదా! ఆవర్త - తరంగాదులుగా కనిపించేది జలమే కదా! అట్లాగే ... ఈ జీవుడు మొదలైన సర్వరూపాలుగా కనిపించేది / స్ఫురించేది ఆ చిద్రూపమే! ఒకానొక జీవుడు "ఒక్కడే" అయినప్పటికీ ... అవయవిగా అనేక దేహ విభాగాలుగా కనిపిస్తున్నాడు కదా! అట్లాగే వాస్తవానికి అవయవ రహితము - ఏకము అయినట్టి బ్రహ్మము "జీవుడు - జగత్తు" - మొదలైన అనేక అవయవ సహితముగా కనిపిస్తోంది.

ఒకే జీవుడు కుడికన్ను, ఎడమకన్నులతో వ్యవహరిస్తున్నట్లు సర్వదా ఏకమే అయి ఉన్న బ్రహ్మము ఈ దృశ్యములో అనేక దేహములుగాను, ద్రష్ట - దృశ్యములుగాను, జడ-చైతన్యములుగాను వ్యవహరిస్తోంది.

ప్రశాంతంగా ఉండే స్ఫటికశిలయందు ఎదురుగా ఉన్న వనములు - వృక్షములు - పక్షులు మొదలైన వాటితో కూడి మహారణ్యం అభాసమాత్రంగా ప్రతిబింబిస్తోంది చూచావా? నాశరహితము-పరమశాంతము అగు చిన్మాత్రమునందు ఈ దృశ్య జగత్తు అభాస మాత్రంగా, ప్రతిబింబమాత్రంగా ఇట్లు ఉంటోంది.

నిర్మల చిన్మాత్రమే తన స్వభావ ప్రభావం చేత ఈ జగద్రూపంగా వెలయుచున్నది. అనగా ఈ జగత్తు ఆత్మ స్వరూపమే అయివుండగా, ... అట్టి ఈ జగత్తును గూర్చి ఎవరైనా సరే విచారించవలసిన పనేమున్నది?

ఓ రాఘవా! పరమ పదమగు బ్రహ్మమునందు "ఇది మొదలు, ఇది, మధ్య, ఇది అంతము" ... అను కల్పన ఏదీ లేదు. ఇక ఈ జగత్తు, ఇద్దాని కారణరూపమగు అవిద్య - ఈ రెండూ పరమాత్మ రూపములే అయివున్నాయి. పరమాత్మకు భిన్నంగా అవిద్య అనేది లేనేలేదు. విద్యా - అవిద్యా స్వరూపుడై కనిపిస్తున్నది పరమాత్మయే! (విద్యా - అవిద్యా స్వరూపిణీ - లలితా సహస్రం)

ఇక ఈ జీవులంటావా? ఈతడు ప్రబుద్ధుడై ఉండవచ్చుగాక! ఉండకపోవచ్చు గాక! స్వప్నము నుండి జాగ్రత్తులోనికి జాగ్రత్తు నుండి స్వప్నములోనికి ప్రవేశించుచు తాను సర్వదా 'ఏకము' అయినట్టి శుద్ధ చిద్రూపముతోటియే వెలయుచున్నాడు.

సుషుప్త్యవస్థలో... అజ్ఞానావృతమైన ఆత్మ; తురీయావస్థలో... శుద్ధాత్మ

ఈ రెండూ కూడా... "అజ్ఞాన రజ్జువు - కేవల రజ్జువు" (త్రాడును పాముగా అనుకొన్నప్పటి త్రాడు - త్రాడును త్రాడుగా దర్శిస్తున్నప్పటి త్రాడు) వలె ఉంటున్నాయి. సుషుప్తిలో, తురీయావస్థలో ఏ ఆత్మ అయితే ఉన్నదో, అదే ఆత్మ జాగ్రత్ - స్వప్న సమయాలలో కూడా అదే రీతిగా ఉండి ఉన్నది.

జ్ఞాని - జాగ్రత్ స్వప్నముల సమయంలో కూడా తురీయ స్థితిని ఎరుగుచున్నాడు.

అజ్ఞాని - జాగ్రత్ స్వప్న సమయంలో తనయొక్క తురీయ స్థితిని ఏమరచుచున్నాడు.

కాబట్టి జ్ఞానికి జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు మూడు స్థితులు కూడా తురీయమే అగుచున్నాయి. ఆతనిలో అవిద్య లేనందువల్ల ఆతడు ద్వైతములో ఉన్నప్పుడు కూడా అద్వైత రూపుడై వెలయుచున్నాడు. జ్ఞానియొక్క దృష్టి – అనుభవములు 'ద్వైతము' అనే పరిమిత అవస్థను అధిగమించినదై ఉంటోంది. అందుచేత ఆతనికి – ద్వైతము – అద్వైతము – నేను – నీవు – ఇది – మొదలుకొని ఇంకెక్కడుంటాయి? ఆతడు సర్వత్రా పూర్ణత్వమును దర్శించుచుండగా ఇక ఆతనికి 'శూన్యము' అని అనిపించేదేమున్నది?

**ద్వైతాద్వైత సముత్భేదైః వాక్య సందర్భ విభ్రమైః,**
**క్రీడంతి అబుద్ధాః శిశవో! బోధవృద్ధా హసన్తి తాన్!**

అజ్ఞానులగు బాలురు మాత్రమే "కాదు, ద్వైతం – కాదు కాదు, అద్వైతం"... మొదలైన భేదములతో కూడిన వాక్య విభ్రమముతోటి క్రీడిస్తున్నారు. ఇక బోధవృద్ధులగు జ్ఞానులో... వారిని చూచి నవ్వుకుంటున్నారు.

**శ్రీరాముడు :** మరి గురువులు ద్వైత – అద్వైత ప్రవచనములు ఎందుకు సిద్ధాంతపూర్వకంగా శిష్యులకు ప్రతిపాదిస్తున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** గురువులు "శిష్యుల ప్రబోధము" అనే ఫలమును ఫలదీకరింపజేయటానికి "ద్వైతాద్వైత వివాదముల కోర్కె" అనే ఫలతీగను పెంపొందింపజేయుచున్నారు. అజ్ఞానుల హృదయాలను పరిశుద్ధపరచటానికి, విజ్ఞానమయం చేయటానికి ఆయా ద్వైతాద్వైత వాదోపదాములు ఆవశ్యకమై ఉన్నాయి. అందుచేత గురు స్థానంలో ఉన్న నేను కల్పితమైనట్టి "ద్వైతాద్వైత విచారణ" అనే చీపురును మిత్ర భావంతో వివాద రహితంగా అంగీకరిస్తూ వస్తున్నాను. గృహిణి గదిని శుభ్రంగా ఊడ్చివేసిన తరువాత ధూళిని ప్రోగుచేసి తొలగించి ఆ చీపురు మాత్రం ఒక మూల ఉంచుతుంది కదా! "జీవుల హృదయ గృహములను పరిశుభ్రపరచటం" అనే కార్యమునకు బ్రహ్మదేవునిచే ఉద్దేశించబడినట్టి బ్రహ్మ మానసపుత్రుడనగు నేను "ద్వైతాద్వైత విచారణ" అనే చీపురుచే ఆశ్రితుల హృదయాలలోని ధూళిని ఊడ్చివేస్తూ ఆ తరువాత ఆ విచారణను ఒకవైపుగా దూరంగా ఉంచుతూ వస్తున్నాను. అనుభవమును ఉద్దీపింపజేస్తున్నాను.

**తచ్చిత్తాః తద్గగత ప్రాణా బోధయన్తః పరస్పరమ్**
**కథయన్తశ్చ తన్నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥**

ఆ విధంగా "అవిద్య" అనే ధూళి తొలగిపోయిన తరువాత అధికారులగు ముముక్షువులు బ్రహ్మమునందే నెలకొని ఉంటారు. వారికిక ద్వైత–అద్వైత పార్శ్యాంశమాత్ర దృష్టి – తన విషయత్వం కోల్పోతోంది. (అది చెప్పుకోదగ్గ విషయం కాకుండా పోతోంది.) ఉదాహరణకు "ఎడమ కన్ను, కుడి కన్ను ఉపయోగించుచున్న జీవుడు సర్వదా ఒక్కడే కదా!" ...అనే దృష్టాంతాన్ని ఆత్మ వస్తుపరంగా సుస్పష్టం చేసుకొన్న తరువాత "ఎడమకన్ను – కుడికన్ను ఒక్కటా? వేరువేరా?" అనే చర్చకు ప్రసక్తి ఎక్కడిది? అవిద్య తొలగిపోయిన తరువాత అట్టి అధికారులగు ముముక్షువులు తమ ప్రాణమనస్సులను బ్రహ్మమునందే నెలకొల్పుకొని, బ్రహ్మం గురించే పరస్పరం బోధించుకుంటూ, నిత్యం

బ్రహ్మమునందే క్రీడిస్తూ పరమానందానుభవులై ఉంటారు. తృప్తి, సంతోషం కలిగి ఉన్న వారై ఉంటారు. ఇక వారి దగ్గరకు వెళ్ళి "మీది ద్వైత సిద్ధాంతమా? అద్వైత సిద్ధాంతమా?" అని అడిగితే "అసలు విషయం తెలుసుకొనిరండి. అప్పుడు మీకు చెప్పుతాం!" అని చెప్పి మౌనంగా ఉంటారు.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్**
**జాయతే బుద్ధియోగోఽ౽సౌ యేన, తే యాన్తి తత్పదమ్ ॥**

ఇట్లు నిరంతరం ప్రీతిపూర్వకంగా బ్రహ్మతత్త్వమును విచారణ చేస్తూ, సేవిస్తూ ఉంటూ ఉండగా క్రమంగా నేను చెప్పినట్టి "సారాసార వివేచనా బుద్ధి యోగం" స్వయంగా దృఢమౌతుంది. అద్దానిచే వారు 'మోక్షము' అనే బ్రహ్మపదమును పొందుచున్నారు. ఓ ప్రియ సభికులారా! శ్రోతలారా! ఈ ప్రపంచంలో ఒక గడ్డిపరక సంపాదించాలంటే కూడా అది కొంత ప్రయత్నముచేత మాత్రమే సాధ్యమౌతుంది కదా! మరి, ఈ త్రిలోకములు ఎందులో కనిపిస్తున్నాయో అట్టి బ్రహ్మముతోటి ఏకత్వము సముపార్జించాలంటే, అట్టిది ప్రయత్నం లేకపోతే ఎవరైనా పొందేది ఎట్లా? కనుక మీరంతా మహదాశయముతో ప్రయత్నశీలురై ఉండాలి. ఓ ప్రియజనులారా! ప్రతి జీవుడు సుఖము పొందాలని నిత్యము అనేక ప్రయత్నములలో నిమగ్నుమై ఉంటున్నాడు. మంచిదే! అయితే మనుష్యానందము మొదలుకొని బ్రహ్మదేవుని ఆనందము వరకు గల పది పది రెట్లు ఆనందమును ఏ బ్రహ్మానందము సమక్షంలో మహాసముద్ర జలము ముందు ఒక చుక్క నీటితో సమానంగా (ఉపనిషత్తులలో) పోల్చబడిందో... అట్టి బ్రాహ్మీ దృష్టికై ఎందుకు ప్రయత్నించి సంపాదించరాదు? మనస్సు యొక్క అంకుర స్వరూపమగు ఈ సంసారమునందలి రాజ్య సుఖం అసలు నిజమైన సుఖమా! ఆత్మానందం ముందు అది ఎంతటి అల్పమైనది? తత్త్వజ్ఞానమున పూర్ణ విశ్రాంతి ప్రాప్తించుకున్న మనుజునకు ఇంద్రుని త్రైలోక్య – ఆధిపత్యానందము ఒక తృణముతో (గడ్డిపరకతో) సమానమగుచున్నదే!

ఓ ప్రియజనులారా! అజ్ఞాన నిద్రయందున్న విషయలంపటులు దృశ్యము పట్ల ఎంతో ఆసక్తిపరులై ఉన్నారు కదా! వారెంత ఆసక్తి కనబరుస్తున్నారో... అంతగానూ తత్త్వజ్ఞులు దృశ్యము పట్ల నిదురించినవారివలె ఉంటూ... నిరతిశయమగు ఆత్మ పదమునందు మేల్కొని, సర్వదా అద్దానినే అంతటా గాంచుచున్నారు.

ఓ రామచంద్రా! మరల ప్రకటిస్తున్నాను. అట్టి నిత్య అపరోక్ష నిరతిశయానంద రూపమగు మోక్షరూప స్థితి ప్రయత్నముచేతనే లభించగలదు. "మహాభ్యాసము" అనే వృక్షము యొక్క ఫలమే పరమాత్మ పదము. కనుక సర్వజీవులారా! మీరు ఆ మార్గములో ప్రయత్నశీలురై ఉండండి.

సకల జనులపైగల అవ్యాజమైన ప్రేమ చేతనే ఈ రామచంద్రుని నిమిత్తముగా చేసుకొని లోకములకు ఈ జ్ఞాన శాస్త్రమును ప్రతిపాదిస్తున్నాను. ఒకడు, అజ్ఞాని అయినా సరే... జిజ్ఞాస – శ్రద్ధలతో యావృత్తి పూర్వకంగా ఆత్మజ్ఞాన శాస్త్రం పఠించటం, విజ్ఞుల ద్వారా ప్రవచనమును వినటం మొదలైన అభ్యాసములచే తప్పక గొప్ప ఆత్మజ్ఞాని కాగలడు. అట్లా కాకుండా, ఏదో

కొంచెం చదివి "మాకు అంతా తెలిసిపోయింది".... అని అనుకొని అభ్యాసపూర్వకంగా అధ్యయనం చేయకపోతే ఇంక వేరైన మార్గంలో "మోక్షము సులభమే! సుసాధ్యమే" .... అని తెలియజేసేది ఎట్లా? మాకు తెలియటం లేదు!

పరమ పురుషార్థమగు మోక్షఫలమును ప్రసాదించగల బ్రహ్మదేవుని నిత్యమనోగతమైన ఈ శాస్త్రమును "వేదము" వలె మరల మరల పఠించాలి. వ్యాఖ్యానం చేయాలి. పూజించాలి. ఈ శాస్త్రము నుండి ఏది లభిస్తుందో, అద్దానిని ఎరిగినచో జీవునియొక్క క్రియ – జ్ఞానములు రెండూ పవిత్రమౌతాయి. వేద తాత్పర్యమే ఈ "శ్రీవసిష్ఠ-రామ సంవాదము (యోగవాసిష్ఠము – మహారామాయణము)" అనబడెడు శాస్త్రము. ఇది వేదాంత శాస్త్రములలో ఉత్తమైనది. మీ అందరిపై గల స్వాభావ సిద్ధమైన ప్రేమచేతనే ఈ మోక్ష శాస్త్రమును మీ ముందు ఉంచుచున్నాను. మీరందరూ ఈ శాస్త్ర పఠనముచే ఆత్మానందము పొందాలనే ఉద్దేశమేగాని, మరింకేమీ కోరి ఈ ప్రవచనమును చెప్పటం లేదు. ఈ శాస్త్రమును పరిశీలించటంచే "ఈ దృశ్య సమూహం మాయ" అని గ్రహించగలరు. కనుక శ్రద్ధాసక్తులతో ఈ శాస్త్రమును పఠిస్తూ విచారణ చేయండి. ఈ "యోగ వాసిష్ఠము"ను పఠించిన తరువాత అప్పుడు తక్కిన శాస్త్రములను పరిశీలిస్తే అవన్నీ లవణము కలిపిన తరువాత పప్పులాగా అతి రుచికరంగా గోచరించగలవు. "ఆ! ఇది ఒక కావ్యం వలె చెప్పబడలేదు. అందు చేత ఉత్తమ శాస్త్రం అని అనిపించుకోదు" అని అనాదరించి, భాషాసక్తులు మాత్రమే అయి మీకు మీరే ద్రోహం చేసుకోకండని మా మనవి. మేము మా పూర్వీకులు చెప్పిన ఒక్క శాస్త్రాన్నే చదువుతాం. ఇది మాకు అక్కర్లేదు" ... ని తలచి ఈ శాస్త్రమును పరిశీలించనివారు "మా తాతలు త్రవ్విన నూతి లోని నీరే త్రాగుతాం. ఇక తదితర నదీ జలములతో మాకేమి పని?" ...అని తలచిన వారగుచున్నారని మా ఉద్దేశం.

కనుక రామచంద్రా! ఈ అఖండ రామాయణ శాస్త్ర పఠనము క్రమంగా 'ఇంద్రియ జయము' అనే ప్రయోజనమును స్వయంగా స్వభావసిద్ధంగా సిద్ధింపజేయగలదని ఋషులమగు మా ఉద్దేశం.

❖❖❖

# 3. సమస్త జీవులు చిదాకాశ స్వభావులే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తూ ఉంటే ... ప్రపంచంలో వస్తువుల యొక్క ఆకారం, నామము, రంగు మొదలైనవి దృశ్యమానమగుచున్నవి కదా! అట్లాగే బ్రహ్మము ప్రకాశిస్తూ ఉంటే... ఈ జగత్తు విద్యమానమై ఉంటోంది. జగత్తు నామ రూపాత్మక మైనప్పటికీ, ఇది బ్రహ్మం యొక్క అవయవం వలె అనిపించినప్పటికీ, బ్రహ్మం సర్వదా నిరవయవి. ఇక జీవునికి – జీవునికి గల భేదము, ఆకాశ భేదం వలె (ఆకాశంలో కనిపించే, దిక్కులు – పైన – క్రింద... మొదలైన వాటి వలె) అంతఃకరణం యొక్క దృష్టిచే కలుగుచున్నది మాత్రమే! సమస్త భేద–అభేదములు తన యొక్క ఉపాధిగా ప్రకటన సలుపుచున్నట్టి అఖండ పరిపూర్ణ బ్రహ్మమే

నేను"... అను మహావాక్య బోధనచే సర్వజగత్ దృష్టులు స్వయముగా ఉపశమిస్తున్నాయి. అట్టి అఖండ బ్రహ్మముతో తన స్వరూపము యొక్క అభేదం సుస్పష్టపరచుకొన్న మహనీయునికి జీవాజీవ భేదమిక అగుపించటం లేదు. తత్త్వజ్ఞానికి శుద్ధ బ్రహ్మమే సర్వదా సర్వత్రా విషయమగుచున్నది. అట్టి శుద్ధ బ్రహ్మము సర్వకాల–సర్వావస్థలయందును భేదకళంక రహితమై, సదా నిర్మలమై వెలయుచున్నది. అది సదా యథాతథంగానే ఉంటోంది. అంతేగాని, మరింకేదో రూపంగా అగుటయే లేదు.

ఇక తత్త్వజ్ఞానులు కానట్టి అజ్ఞానులకు అంటావా? వారికి తెలియవచ్చే "నేను, నాది, నీవు, నీది, వారు, వీరు" ...మొదలైనవాటి యొక్క వాటి–వాటి వాస్తవ రూపాలేమిటో... వారికే తెలియాలి. "ఎండమావులలో తరంగాల భేదం మాకు తెలియవస్తోంది" అనే మాట "అవి ఎండమావులే! జలం అందులో ఉండదు" ...అని తెలిసినవారికి అజ్ఞుల దృష్టితో పనిలేదు కదా! "వీడు జ్ఞాని, వాడు అజ్ఞాని, వీడు వేరు, వాడు వేరు" ...మొదలైన బుద్ధి అజ్ఞాని యందు అనునిత్యంగా అజ్ఞానికి అనుభవమగుచున్నప్పటికీ... అట్టి భేదములు జ్ఞానికి కనిపించటం లేదు. దాహంగా ఉన్నవాడికే "ఆ మృగతృష్ణలో జలం ఉండవచ్చు"... అనే భ్రమ కలుగుతుంది కదా! "ఇది విగ్రహం – ఇది పురుషుడు"... అని తెలిసినవానికి ఇక ఏది పురుషుడో ఏది స్థాణువో సంశయముండదు కదా! బ్రహ్మతత్త్వము తెలిసిన తరువాత ఇక భేదజ్ఞానములన్నీ సమసిపోతున్నాయి.

ఓ రామచంద్రా! ఈ జగత్తు పూర్వము ఉండి ఉండలేదు. ఇప్పుడు కూడా లేదు. అసలు ఉత్పన్నమే అవలేదు. ఇక ముందు కూడా ఉండబోవటం లేదు. మరి? సద్వస్తువగు బ్రహ్మమే ఈ రీతిగా జగద్రూపంగా కనిపిస్తోంది. "అట్టి జగద్రూపంగా గ్రహించబడుచున్న చిదాకాశము యొక్క స్ఫురణ వాస్తవానికి స్వాత్మయందే స్థితి కలిగియున్నట్టిది" ...అని విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. అట్టి విజ్ఞులు జగత్తును బ్రహ్మముగానే ఎరుగుచున్నారేగాని ...జడముగా కాదు. స్వప్నంలో కనిపించేదంతా ద్రష్ట స్వరూపమగు చిదాకాశమే! అట్లాగే మనోరాజ్యము యొక్క కల్పిత పురంగా కనిపించేది కూడా మనోద్రష్ట స్వరూపమగు చిదాకాశమే! అదే తీరుగా జాగ్రత్ ద్రష్ట స్వరూపమగు చిదాకాశమే ఏకము – నిర్మలము అయి చెన్నొందుచూనే జాగ్రత్ దృశ్యరూపంగా కనిపిస్తోంది.

"ఈ జగత్తుకు పూర్వము ఏకమగు చిద్వస్తువు మాత్రమే కలదు – (సదేవ సౌమ్యేఽ దమగ్ర ఆసీదేకమేవాఽ ద్వితీయమ్ బ్రహ్మ)... అని శ్రుతులు చెప్పే వాక్యములే "ఈ జగత్తు ఏ సమయమందునూ లేదు"... అని చెప్పటానికి ప్రమాణ వాక్యములైయున్నవి. "సృష్టికి పూర్వము ఎచ్చటా కూడా నిమిత్త కారణంగాని ఉపాదాన కారణంగాని లేకయే ఉన్నాయి"... అని వేదవాక్కులు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాయి.

(ఉపాదాన కారణం = మట్టి బొమ్మలోగల మట్టి; నిమిత్త కారణం = మట్టి బొమ్మ తయారు చేసే వ్యక్తి)?

ఇక జగత్తు ఎక్కడున్నది? ఇది కొంచెం కూడా ఉద్భవించనేలేదు. ఏది ఉద్భవించినట్లు తోచుచున్నదో... అది అనాదియగు పరబ్రహ్మమే అయివున్నది. సర్వదా శుద్ధమగు పరబ్రహ్మము తన యొక్క 'స్వభావము' అనే శక్తిచే, (లేక) చమత్కారముచే జగత్‌రూపంగా భాసించుచున్నది.

జగత్ ద్రష్టయగు జీవుని భావనయే జగత్తు. జీవుని భావన జీవునికి అభిన్నం. కనుక జగత్తు జీవుని స్వస్వరూపమే! కనుక... సృష్ట్యాదిలో ఇక్కడ ఏదీ ఉత్పన్నం కాలేదు. అనగా... అజ్ఞానులచే ఎరుగబడుచున్న "బ్రహ్మదేవుడు" మొదలైన సమష్టి-వ్యష్టి జీవులుగాని, వారి వారి ఉపాధులుగాని వాస్తవానికి లేకయే ఉన్నాయి. బ్రహ్మదేవుడు-ఈ జీవులు కూడా బ్రహ్మం సమక్షంలో బ్రహ్మమునకు వేఱుగా చూస్తే శూన్యరూపులే అయివున్నారు.

చిదాకాశమే... తన చిత్స్వభావముచే... 'జగత్తు - జీవుడు' అను రూపములుగా భాసిస్తోంది.

❖❖❖

## 4. జాగ్రత్ - స్వప్నములు ఒక్క తీరైనవే!

**శ్రీరాముడు :** మహర్షీ! జాగ్రత్ - స్వప్న - సుషుప్తుల రూపమేమిటో, ఎద్దాని నుండి ఏది బయల్వెడలుచున్నదో ...ఆ వివరాలు మరొక్కసారి సవివరణగా ప్రవచించమని నా ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

జాగ్రత్ → స్వప్నము → సుషుప్తి

ఈ జాగ్రత్ - స్వప్న సుషుప్తులు మూడూ కూడా పరస్పరం ఒకదానిలో మరొకటి ప్రవేశిస్తూ ఉన్నాయి. అందుచేత ఒక్కొక్కటి ప్రత్యేకంగా మూడు మూడు విధాలుగా అగుచున్నాయి.

| | | |
|---|---|---|
| జాగ్రత్ | → | జాగ్రత్ జాగ్రత్తు |
| జాగ్రత్ | → | జాగ్రత్ స్వప్నము |
| జాగ్రత్ | → | జాగ్రత్ సుషుప్తి |
| స్వప్నము | → | స్వప్న జాగ్రత్తు |
| స్వప్నము | → | స్వప్న స్వప్నము |
| స్వప్నము | → | స్వప్న సుషుప్తి |
| సుషుప్తి | → | సుషుప్తి జాగ్రత్తు |
| సుషుప్తి | → | సుషుప్తి స్వప్నము |
| సుషుప్తి | → | సుషుప్తి సుషుప్తి |

**జాగ్రత్ స్వప్నం -** ఇది మనోరాజ్య రూపం. ఇంద్రియాలు ఆ సమయంలో వ్యాపారరహితమై ఉంటున్నాయి. ఈ దశ కేవలము మనోమయత్వమై ఉన్నది. పదార్థముల యొక్క స్వప్న సాదృశ్యము వలన స్వప్నమే జాగ్రత్ దశను పొందుతోంది.

స్వప్నంలో కూడా "ఇంత కాలం నేను నిద్రించాను. ఇప్పుడు మేల్కొన్నాను"... అనే అనుభవం స్వప్నాంతర్గతమై ఉంటోంది కదా! స్వప్న జాగ్రత్ స్థితియందు స్వానుభవమగుచున్న జాగ్రత్తే జాగ్రత్ సమయంలో స్వప్నరూపంగా ఎరుగబడుచున్నది.

**స్వప్నో జాగ్రత్ ప్రవిశతి, జాగ్రత్ స్వప్నాత్ర బుధ్యతే**
**జాగ్రత్ స్వప్నం ప్రవిశతి, ప్రబుద్ధం స్వప్న జాగ్రతః ॥**

ఆత్మ జాగ్రత్ స్వప్నం నుండి మేల్కొని స్వప్న రూప జాగ్రత్‌నందు ప్రవేశిస్తోంది. అట్లాగే స్వప్నరూప జాగ్రత్ నుండి జాగ్రత్ రూప స్వప్నంలో ప్రవేశిస్తోంది. ఈ విధంగా జాగ్రత్ – స్వప్నములు రెండూ పరస్పరం ఒకదానికి మరొకటి కారణమగుచూ ఉంటున్నాయి.

జాగ్రత్ జాగ్రత్‌వంతుని స్వప్నం –– స్వప్నస్వప్నం అని; స్వప్నజాగ్రత్‌వంతుని యొక్క జాగ్రత్ ––జాగ్రత్‌జాగ్రత్ అని కూడా చెప్పబడుతోంది.

స్వప్నంలో స్వప్నమందలి జాగ్రత్తు వర్తమాన జాగ్రత్తులాగానే అనుభూతమౌతోంది. కనుక స్వప్నంలోని జాగ్రత్తు జాగ్రత్తేగాని అప్పటి అనుభవం అనుసరించి అది స్వప్నం కాదు.

అట్లాగే "జాగ్రత్ స్వప్నము" అనే మనోరాజ్యమందలి జాగ్రత్తు అనుభవముచే స్వప్నమే అవుతుంది గాని, జాగ్రత్తు కాదు.

ఇక కాలవిషయానికి వస్తే... జాగ్రత్ కాలమునందు స్వప్నము సదా అల్పకాలికమై ఉంటోంది. అట్లాగే స్వప్న కాలమున జాగ్రత్ సదా అల్పకాలికమై ఉంటోంది.

❖

కనుక ఓ రామచంద్రా! జాగ్రత్తు స్వప్నము వంటిదే! స్వప్నము జాగ్రత్తు వంటిదే! కనుక వాటిలో ఒకటి మరొక దాని నుండి బయల్వెడలటమనే ప్రసక్తే లేదు. ఎందుకంటే ఆ రెండింటికీ భేదమే లేదాయె! ఇంటియొక్క బయట – లోపల ఒకే ఆకాశం వెల్లివిరుస్తోంది కదా!

అయితే... స్వప్నము జాగ్రత్తు నందు పూర్ణముగా శమించిపోవుచున్నది. అప్పుడు స్వప్న పదార్థములు శూన్య రూపములే అగుచున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! స్వప్న సమయంలో జాగ్రత్తు శమించటం గాని, శూన్య రూపములుగా గాని అవటం లేదు కదా! జాగ్రత్‌లోని పదార్థములు మొదలైనవన్నీ స్వప్నమునకు పూర్వంలాగా స్వప్నానంతరం తిరిగి (జాగ్రత్తుకు వచ్చిన తరువాత) కొనసాగుచూనే ఉన్నాయి కదా! కానీ జాగ్రత్ అనంతరం స్వప్నంలో క్రితం రోజు (రాత్రి) స్వప్న వ్యవహారం కొనసాగటం లేదు. మరి స్వప్నము జాగ్రత్తు ఒక్కటే అని ఎట్లా అర్థం చేసుకోవటం?

అనగా... మహర్షీ!... నేడు స్వప్నంలో చూచినవి రేపటి స్వప్నంలో ఉండటం లేదు. కానీ... నేడు చూచిన జాగ్రత్తు రేపటికీ యథాతథంగా ఉంటోంది కదా? ఈ సాయంకాలపు జాగ్రతే, రేపు ఉదయం కొనసాగుతోంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కానీ రామా! ఈ విషయం మనం చర్చించియే ఉన్నాం. అయినా, మరికొన్ని విశేషాలు చెప్పుతాను.

ఈ వర్తమానపు జాగ్రత్తు మరణానంతరం పరలోక జాగ్రత్ నందు శమించి పోతోంది. లేక ఆత్మ ప్రబోధ సమయానికి సమస్త ద్వైతం శమించిపోతోంది. అది అట్లా ఉంచి ప్రతిరోజు స్వప్నానుభవ కాలంలోను, సుషుప్తి స్థితి సమయానికీ జాగ్రత్తు పదార్థములన్నీ శూన్య రూపములయిపోతున్నాయి. కనుక "జాగ్రత్ – స్వప్నములు అభేదమైనవి" అనునది ఇక్కడ సిద్ధిస్తోంది కదా!

ఈ "జీవితము" అనబడే స్వప్న సమయంలో "గత జన్మ జీవితము" అనే స్వప్నము సమసిపోయినదే అగుచున్నది కదా! అట్లాగే వర్తమాన జన్మ తదనంతర జన్మ జాగ్రత్ సమయానికి శూన్యరూపమై స్వప్నమువలె సమసిపోయినదే కాబోవుచున్నది. పరలోక జాగ్రత్ ... ఇహలోక జాగ్రత్‌లో "అవిషయము – శూన్యరూపము అగుచునే ఉన్నది కదా!

నేటి స్వప్న విషయములో జాగ్రత్‌కు సంబంధించిన సర్వ పదార్థములు శూన్యమై పోవుచున్నాయి. మరల "నానా రూపాత్మకమగు ప్రపంచంలో నేను ఇంకా జీవించియే ఉన్నాను"... అనే బోధ ప్రారంభం కాగానే జాగ్రత్ ప్రారంభమౌతోంది. జాగ్రత్ రూపుదిద్దుకోగానే ఆ రాత్రి, ఆ ముందటి రాత్రి స్వప్నాలు పరలోక జీవితము వంటివే అగుచున్నాయి. ఈ రోజు జాగ్రత్తుకు ఈ రాత్రికి కలుగబోయే స్వప్నదశ రాబోవు పరలోకమే కదా! రాబోయే స్వప్నములోని ఏ పదార్థము ఇప్పటికి ఇంకా లేనివే కదా!

అట్లాగే మరణానంతర జాగ్రత్తు ఇప్పటికి లేదు. మరణానంతర జాగ్రత్తులో ఇప్పటి జాగ్రత్తు లేదు. ఈ విధంగా జన్మకు ముందటి జాగ్రత్తు ఇప్పటికి శూన్యమగుచున్నది.

ఈ వర్తమాన జాగ్రత్తు మరణానంతర జాగ్రత్తు దృష్ట్యా శూన్యరూపమే కానున్నది. స్వప్నములో కనిపించే త్రిలోకములు చైతన్యము యొక్క చమత్కారమే కదా! అట్లాగే సృష్ట్యాది నుండి ఈ విభాగ పూర్వకమైన రెండూ కూడా (జాగ్రత్తు - ఈ జాగ్రత్తులో కనిపించే జాగ్రత్ జగత్తు) చైతన్యము యొక్క చమత్కారమే అయి, హృదయమునందు భాసిస్తోంది.

❖

ఓ రామచంద్రా! జాగ్రత్తు సమస్త పదార్థములు విశాలాకారయుక్తంగాను, స్థూలంగాను భాసిస్తున్నప్పటికీ కూడా స్వప్నంలోని భూమి–ఆకాశం మొదలైన పదార్థములలాగానే ఇవన్నీ లేకయే ఉన్నాయి. స్వప్న జగత్తు స్వప్నంలో భాసిస్తున్నప్పటికీ ఎట్లా శూన్యరూపమే అయి ఉన్నదో ...ఈ జాగ్రత్ పదార్థములు ఇంద్రియాల స్థితిని అనుసరించి పొందబడుచున్నప్పటికీ... పరమార్థమున లేకయే ఉన్నాయి! స్వప్నంలో కనిపించేదంతా చిదాకాశమే! అట్లాగే ఈ జాగ్రత్తులో కనిపించేదంతా కూడా చిదాకాశమే అయివున్నది. ఈ సూర్య చంద్రాదులతో కూడి భాసించటమనేది చిదాకాశం యొక్క స్వభావమే అయి ఉన్నది. స్వప్నంలో కనిపించిన భవనం ఏ సూర్యుని వెలుతురులో ప్రకాశిస్తోంది చెప్పు? అట్టి చైతన్యం ఆకాశం, గోడ, ఒక పరమాణువు, స్థలము, జలము, అన్నింటిలో ప్రకాశిస్తూ ఉండటమే 'జగత్తు' అనే పేరుచే పిలువబడుతోంది. అది అద్దాని స్వాభావిక చమత్కారమే!

**భ్రాన్తాః అసత్యరూపాయాం స్థితాయాం సత్యవస్తువత్ ।**
**ఆకాశమాత్ర దేహాయాం క ఇవైనాం ప్రతిగ్రహః ॥**

ఈ జగత్తు భ్రాంతి రూపమైనది. శూన్యమాత్ర రూపము కలది. అసత్యమైనది. అట్లయి ఉండి కూడా సత్య వస్తువువలె ఇంద్రియములకు అనుభూతం మాత్రం అవుతోంది. అట్టి ఈ అసత్య జగత్తు పట్ల విశ్వాసం కలిగి ఉండటమనేది మా ఉద్దేశంలో అనుచితమే! ఈ జగత్తు యొక్క రూపం

1.గ్రహీత 2.గ్రహణం 3.గ్రాహ్యం అనబడే త్రిపుటి యొక్క సంయోగ రూపము మాత్రమే! ఇది అధిష్ఠానసత్తుచే "అసత్తు" అగుగాక! లేక, నిజసత్తుచే "సత్తు" అగుగాక! ఈ విషయంలో (ఈ జగత్తు ఉన్నది – లేదు అనే విషయంలో) ఒక పక్షము స్థాపించాలనే మొండిపట్టుదల వలన మాకు ఏ ప్రయోజనమూ కనిపించకయే ఉన్నది. ఈ జగత్తు ఈ విధంగా ఉంటే ఏమున్నది? మరొక విధమైనది అయితే ఏమున్నది? అందులో ఏకపక్షం స్థాపించవలసిన పనేమిటి? ఎవరికైనా కించిత్ అవిచారణచే అట్టి ఏకపక్షాభిమానము ఉంటే ఉండవచ్చు గాక! కాని ఇప్పుడు ఈ జగత్తు యొక్క తత్త్వమేమిటో మనం ఈ శాస్త్ర సందేశము సహాయంచే గ్రహించాము కదా! కాబట్టి ఓ జనులారా! ఇట్టి కాలబుద్ధి, జగత్తు పట్ల భోగరూపమైన అల్ప ఫలములపట్ల కోర్కె అనవసరమనేది సునిశ్చితమే కదా! ఇక "ఇది సత్యమా? అసత్యమా?" అనే మీమాంసగాని, పట్టుదలగాని ఉండవలసిన అవసరమేదీ లేదనియే మా నిర్ణయం! భావనానుసారమే ఇది అనుభూతమౌతోందని మాత్రమే గమనిస్తున్నాం.

❖❖❖

## 5. ఆత్మఖ్యాతి - అఖ్యాతి - అసత్ఖ్యాతి - అన్యథాఖ్యాతి

**శ్రీరాముడు :** హే మహర్షీ! అధ్యాత్మ శాస్త్రంలో "ఆత్మఖ్యాతి, అఖ్యాతి, అసత్ఖ్యాతి, అన్యథా ఖ్యాతి" ...అని నాలుగు శబ్దములు ఉపయోగించి ...పరమాత్మ యొక్క నిర్వచనాన్ని శాస్త్రీయంగా చెప్పుతూ ఉంటారు. అవి సందర్భానుచితమని మీరు కూడా అనుకుంటే, ఆ ఆధ్యాత్మిక శాస్త్ర ప్రవచిత శబ్దార్థముల గురించి వివరించవలసినదని నా ప్రాథేయము.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఆత్మ" గురించి కొందరు గురువులు శిష్యులకు బోధించేటప్పుడు నీవు చెప్పిన నాలుగు శబ్దములు ఉపయోగించి వివరణను చెప్పటం జరుగుతోంది. అలౌకికమైనది, అఖండ తత్త్వమైనట్టిది ఆత్మ. అట్టి ఆత్మకు 4 విశేషములు పాఠ్యాంశబోధ కొరకై చెప్పబడుచున్నాయి.

**1. ఆత్మఖ్యాతి -** సృష్ట్యాదిలో పూర్ణము, వ్యాపకము (ఆకాశం వలె అంతటా వ్యాపించి ఉన్నది) అగు చిదాకాశమే ఈ ప్రకారం జగత్‌రూపంగా తనలో తాను స్ఫురిస్తోంది. అట్టి చిదాకాశం తనలో ఏ నిజచైతన్య చమత్కారం చేత జగత్తును ఖ్యాపితం ఒనర్చుచున్నదో (ప్రసిద్ధి కలిగింప జేస్తోందో)... అట్టి జగత్‌కారణం "ఆత్మఖ్యాతి" అని చెప్పబడుతోంది. అనగా, ఆత్మలో ఏదైతే జగత్తుగా ప్రకటిత మవటానికి కారణభూతమౌతోందో...'ఆత్మఖ్యాతి' అని చెప్పబడుతోంది.

**2. అఖ్యాతి -** ఏ విశేషం చేత ఆత్మ అంతటా ప్రసరింపబడినదై ఉండి కూడా తాను ఎటూ వెళ్లక – ఎటు నుంచి కూడా రాక... సర్వదా యథాస్థితమైయున్నదో అదియే అఖ్యాతి.

**3. అసత్ఖ్యాతి -** (ఏది వాస్తవానికి అసత్ అయివున్నదో వాస్తవానికి లేదో)... అట్టి 'లేనిది' ఉన్నట్లుగా అనిపించటానికి ఏది కారణమగుచున్నదో అద్దానిని "అసత్ఖ్యాతి" అని చెప్పుచున్నారు.

**4. అన్యథాఖ్యాతి -** ఆత్మయే అన్ని రూపాలుగా అగుచున్నప్పటికీ, "ఆత్మ ఎక్కడో వేరుగా ఉంది. అద్దానిని మనం ప్రయత్నించే దరి చేరాలి" అని ఏ కారణంచే అనిపిస్తోందో... అదే అన్యథా ఖ్యాతి.

ఇక్కడ మరొక్క ముఖ్యమైన విషయం విను. వాస్తవానికి ఇక్కడ నదులు మొదలైనవి ప్రవహించటమూ లేదు. వాటిలో ఏదీ మునగటమూ లేదు, తేలటమూ లేదు. ఈ జగత్తులో జరిగే వ్యవహారాలన్నీ వాస్తవం కాదు. నిష్క్రియము, చిద్రూపము అయినట్టి చిదాకాశమే ఈ సమస్త జగద్రూపముచే నిజ చిదాకాశమునందు ఇట్లు స్ఫురించుచున్నదగుచున్నది.

**ఖ్యాతి -** భాషాపూర్వకంగా అర్థం స్ఫురించటం – ఆత్మ మరొకటిలాగా తానుగా స్ఫురించటం లేదు. ఆత్మ సర్వదా ఆత్మగానే ప్రకాశిస్తోంది. ఆత్మ సర్వదా సమస్త ప్రకటనా రహితమై ఉన్నది. స్వప్రకాశకమైనది. అది అజ్ఞాన దృష్టిచే జగత్తుగా ప్రకటితమగుచున్నట్లు అనిపిస్తోంది. అయినా, "జగత్తుగా కనిపించేది ఆత్మయే! కనుక ఈ జగత్తు ఆత్మఖ్యాతియే"... అని పదప్రయోగ పూర్వకంగా – ఆత్మజ్ఞులు చెప్పుచున్నారు.

**అఖ్యాతి -** మరొక రీతిగా స్ఫురించకపోవటం – జగత్తంతా ఆత్మయే అయివున్నది. ఆత్మ ఎన్నడూ కూడా తన స్వప్రకాశం కంటే భిన్నమైన ఎద్దాని చేతనూ తనకంటే భిన్నంగా ప్రకాశింపజేయ బడటమే లేదు. తనకు భిన్నమైనట్టి దేనిని తాను ప్రకాశింపజేయటమూ లేదు. అందుచేత ఆత్మ అఖ్యాతము. ఆత్మయే ఆత్మచేత "ఆత్మకు భిన్నమా?" అన్నట్లుగా ఈ జగత్తును ప్రకాశింపజేస్తోంది. మరొకటి (ఆత్మకు భిన్నంగా ఉండి) జగత్తును ప్రకాశింపజేయడం లేదు కాబట్టి జగత్తు 'అఖ్యాతము' (దేనిచేతా ప్రకాశింపబడజాలనిది) అని చెప్పబడుతోంది.

ఖ్యా (ధాతువు) = ప్రసిద్ధి; తి (ప్రత్యయం) = సత్త; ఖ్యాతి = ప్రసిద్ధరూపమగు సత్త; ఆత్మ = ప్రసిద్ధ రూపమగు ఖ్యాతి.

కొందరు "సజ్" + "ఖ్యాతి" = అఖ్యాతి. ఆత్మ అఖ్యాతి. కనుక, ఆత్మ అనబడేదే లేదు (బౌద్ధవాదులు) అని "అఖ్యాతి" కి వ్యాఖ్యానం చెప్పుచున్నారు.

కానీ... అది సరికాదు. ఆత్మను ఆత్మకు వేరైనదేదీ ప్రకాశింపజేయదు. ఆత్మయే ఆత్మచే ఆత్మను ప్రకాశింపజేస్తోంది. కనుక ఆత్మ (బాహ్యమైన ఎద్దాని చేతనూ కూడా) "అఖ్యాతము"... అనియే అఖ్యాత శబ్దానికి అర్థంగా గ్రహించాలని మా ప్రతిపాదనం. మా అవగాహన.

**అసత్‌ఖ్యాతి -** అసత్తును కల్పించేది ఆత్మయందే! అసత్తు అంటే లేనిది ఉన్నట్లుగా కల్పించటం. అట్లా కల్పించేవారెవరు? ఆత్మకు అన్యంగా ఎవరైనా వచ్చి అట్లా ఆత్మయందు ఆత్మకు వేరైన జగత్తును కల్పించి చూపిస్తున్నారా? లేనేలేదు. ఆత్మయందు ఆత్మయే ఆత్మను ఏమరచిన దృష్టిని కలిగి ఉన్నప్పుడు 'జగత్తు' అనే పేరుతో ప్రసిద్ధమగుచున్నది. ఈ విధంగా ఆత్మయందు ఆత్మచే ఆత్మకు వేరైన దృష్టియే 'జగత్తు' అనబడు "అసత్‌ఖ్యాతి" అయివున్నది.

**అన్యథాఖ్యాతి -** సజ్ యథా ఖ్యాతి... ఖ్యాతి అంటే ప్రేరణాత్మకమైనది. ఆత్మయందు జగత్తును ప్రేరేపించేదేదీ లేదు. జగత్తు ఆత్మ చైతన్యమునకు భిన్నమైనది కాదు. భిన్నమైనదైయుంటే "ప్రేరేపించునది–ప్రేరేపించబడే జగత్తు" ఉండేవి. అప్పుడు ఆత్మ అద్వితీయం ఎట్లా అవుతుంది?

సజ్ = సద్వస్తువగు ఉనికి; యథా = ఏ విధంగా అయితే; ఖ్యాతి = కనిపింపజేస్తోందో; ఆత్మ = అది ఆత్మయే

ఆత్మయే ఆత్మను ఈ జగత్తుగా చూస్తోంది. ఈ విధంగా అసత్‌ఖ్యాతి = అసత్తును కనిపింప చేసేది. అన్యథా ఖ్యాతి = మరొకటిగా మార్చుచున్నది.

ఇవన్నీ ఏమీ లేవు. అందుచేత 1.ఆత్మ వేరు – జగత్తు వేరు, 2.ఆత్మలో జగత్తు ఉన్నది?... రెండు కూడా ఖండించబడుచున్నాయి.

**శ్రీరాముడు :** ఆత్మ – జగత్తుల సంబంధ నిర్వచనములైన "అఖ్యాతి – అన్యథా ఖ్యాతి – అసత్‌ఖ్యాతి" అనేవి స్వప్న – మనోరాజ్య – తదితర దృశ్యములవలె కల్పనా మాత్రము లేనని అనుకోవచ్చు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఆత్మ–జగత్తుల ఆ సంబంధము కల్పనామాత్రమేనని, జగత్తు చైతన్యము యొక్క చమత్కారభూతమేనని అనుకొంటే అద్దానియందు మాకు ఎట్టి అభ్యంతరమూ లేదు.

ఎప్పుడు, ఎచట– చిన్మాత్రాకాశం యొక్క ఏఏ నిర్మల విభాగాలు ఎట్లెట్లు (ద్రష్టత్వంచే) స్ఫురిస్తున్నాయో... అప్పుడు అచట – అది ఆయా ప్రకారంగానే స్థితినొంది ఉన్నదగుచున్నది.

**ఆత్మఖ్యాతిః అసత్‌ఖ్యాతిః అఖ్యాతిః ఖ్యాతిరన్యథా ।**
**ఇత్యేతాః చిత్ చమత్కృత్యా ఆత్మఖ్యాతేర్విభూతయః ॥**

కాబట్టి రామచంద్రా! లక్ష్యార్థమగు ఆత్మ యొక్క (లేక ఆత్మఖ్యాతి) యొక్క విభూతులే వ్యాఖ్యార్థమగు 1.ఆత్మఖ్యాతి, 2.అసత్ఖ్యాతి, 3.అఖ్యాతి, 4.అన్యథాఖ్యాతి అనే నాలుగు అయివున్నాయి. అనాత్మ అయివున్నది, అన్యథాగా కనిపింపజేసేది... ఇవన్నీ ఆత్మ విభూతులే! అట్టి ఆత్మ విభూతులకు వేఱే అయి సర్వదా యథాతథమై ఉన్నదేదో... అదియే ఆత్మ అనబడే ప్రతి జీవుని స్వస్వరూపం. ఆత్మకు వేరుగా ఏదైనా ఎక్కడైనా – ఎప్పుడైనా అనిపిస్తూ ఉంటే... అట్లా అనిపించటమే అనాత్మత్వం.

**చిద్రూపమగు పరబ్రహ్మము...** ఆత్మఖ్యాతి (ఆత్మయొక్క ప్రసరణం) అనునదేదీ కలిగి ఉండలేదు. అద్దానికి వాచ్యార్థముకానిది, లక్ష్యార్థమయినది ఆత్మ. అట్టి ఆత్మకు ఆద్యంతాలు లేవు! జీవ – జగత్ పరిమితాలు లేవు! ఆ చిద్రూప పరబ్రహ్మమగు ఆత్మ వాక్కుచే చెప్పబడగలిగేది కాదు! అది సర్వదా ఏకము! శిలా గర్భము వలె అత్యంత ఘనీభూతమైనది!

❖❖❖

# 6. శిలాఖ్యానం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సర్వ ద్వైత దృష్టులను నిరసిస్తూ జ్ఞానమును ప్రకాశింపజేసే "శిలాఖ్యానము" అను అధ్యాత్మ శాస్త్రములోని ఒక విశేషాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను. విను.

మాకు తెలిసియున్నట్టి, మాకు ఎదురుగా కనిపిస్తూవున్నట్టి ఒకానొక "శిల" ఉన్నది. ఆ శిల పరిణామం కొన్ని కోట్ల – కోట్ల యోజనములు. అసలు అద్దాని పరిణామమెంతో మేము చెప్పలేం. అది అన్ని వైపులా విస్తరించి ఉన్నది. ఈ కనబడే ఆకాశమునంతా ఆక్రమించిన ఒక గోడ ఉన్నదనుకొంటే, అది అత్యంత విస్తారం కదా! అట్టి లక్షలాది గోడలకంటే కూడా విస్తీర్ణమైనది. ఆ శిల అతి కఠినమైనది. కానీ బహు నిర్మలమైనది, సువిశాలమైనది.

మాకు కనబడుచున్న ఆ మహావిస్తీర్ణమైన గండశిలకు అవయవాలు లేవు. సంధులు లేవు. అది అతి దట్టమై, వజ్రంలా అతి దృఢమైనది. అతి విశాలమైనది. మిక్కిలి పరిపుష్టమైనది.

ఆ శిల యొక్క గర్భం అతి కఠినంగాను పరమ గాంభీర్యంగాను చెన్నొందుతోంది. అయినా ఆ శిలా గర్భకోశం ఆకాశంలాగా అతి నిర్మలమై ప్రకాశిస్తోంది. అసంఖ్యాక కల్ప సమూహములు గడచిపోతున్నప్పటికీ ఆ గండ శిల – అద్దాని శిలాగర్భ విభాగము ఏ మార్పులు చేర్పులు లేకయే ప్రకాశిస్తోంది. అద్దాని ఉపరితలం, దేహభాగం... ఇవన్నీ అతి రమణీయమై, ప్రశాంతమయమై, అతి నిర్మలమై, మధురాతిమధురమై అత్యంత సౌందర్యంగా ఒప్పుచున్నాయి.

"ఆ శిల ఏ జాతి శిల?" అని నేను పరిశీలించాను. అప్పుడు "అద్దానికి భిన్నంగా మరొక వస్తువే లేదు. ఇక అద్దాని విశిష్ట జాతిని ఎవరం నిర్ణయించగలం?" అని నిశ్చయానికి వచ్చాను. ఆ మహా శిల – ఏ ప్రదేశంలో ఉన్నది? ఏ కాలంలో ఉన్నది? ఏ ప్రకారంగా వర్తిస్తోంది? ఎక్కడి నుండి వచ్చింది?... అనే విషయాలు ఎన్నటికీ ఎవరికీ తెలియవచ్చేవి కావు. ఇక నాకు మాత్రం ఏం తెలుసు?

వింటున్నావుగా రామచంద్రా! అత్యంత ఘనీభూతమై, మహాకఠినమై, వజ్రమువలె అతిదృఢమై, నాశరహితమై ఉన్న ఆ శిలయొక్క అంతర్భాగంలోకి తొంగిచూచాను. ఆ శిలయొక్క గర్భమునందు (అంతర్భాగంలో) పంచ మహాభూతాలుగాని (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశంగాని), చతుర్విధ భూత సముదాయాలు గాని (అండజ, స్వేదజ, వాయుజ, గర్భజ జీవులు గాని) నాకు ఏమాత్రం కనిపించలేదు. అంతా ఘనీభూతమై, ప్రశాంతంగా ఆకాశంవలె నిర్మలత్వము, అత్యంత నిశ్శబ్దముతో కూడిన 'మౌనము' అక్కడ తాండవిస్తోంది. అట్లా ఆ శిలయొక్క గర్భ ప్రదేశంలోకి దృష్టి సారించిన నాకు, ఆ శిలాగర్భంలో, స్ఫటిక శిలలోని రేఖలలాగా అనేక స్వావయవభూతములైన (వాటికవే అవయవాలుగా కలిగియున్న) అనేక పద్మములు, శంఖములు, గదలు, చక్రాలు మాత్రం కనిపించాయి. అవన్నీ శిలా దేహములే! ఆ శిలాగర్భంలో వాస్తవానికి ఆకాశ–వాయు–అగ్ని–జల –పృథివి మొదలైనవాటిచే నిర్మించబడిన జగత్తు ఏదీ లేదు. లేదు కానీ... అందులో అనేక రేఖలు ఉన్నాయి. ఆ రేఖలలో కొన్ని ఆకాశంగాను, మరికొన్ని జీవులుగాను కల్పించబడినట్లు కనిపించాయి. వాస్తవానికి ఆ శిలా గర్భంలో ఉన్నదంతా శిలయే అయినా... ఆ రేఖలు అనేక ఆకారాలుగా కనిపించాయి. అట్లా ఆకాశాదులుగాను, జీవులుగాను కనిపిస్తున్న ఆ రేఖలను చూస్తూ ఉన్నాను.

**శ్రీరాముడు :** మహర్షీ! మీరు చూస్తున్నది శిల – అద్దాని కోశవిభాగం కదా! శిల ఎప్పుడూ జడమే కదా! ఆ శిలలో చేతనులగు 'జీవులు' అనే రేఖలు కనిపించటమేమిటి? ఇంతకీ అదంతా శిలయా? జీవులా? అందులో పంచభూతాలే లేవని అంటున్నారు కదా! ఇంతలోనే 'ఆకాశము – జీవులు' అనబడే రేఖలు కనిపించాయని అంటున్నారేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నాచే దర్శింపబడుచున్న "విశాలమైనది – ప్రశాంతవంతమైనది" అగు ఆ శిల చేతనం కాదు. జడం కాదు. అద్దానికి భిన్నంగా జడ – చేతనములే లేనపుడు మరి

అద్దానిని జడం అని చెప్పనా? చేతనము అని చెప్పమంటావా? అద్దానికంటే వేరుగా ఎవరూ ఎక్కడా లేరు.

**శ్రీరాముడు :** మునీంద్రా! దానికి వేరుగా ఎవడూ లేడా? లేకపోయినప్పుడు అద్దాని గర్భమందున్నట్టి ఆకాశ జీవులుగా కనిపించే రేఖలను చూస్తున్నదెవరు? ఆ శిలా గర్భంలో ఆ రేఖలను చిత్రీకరించిన వారెవరు? ఏ ఉలి మొదలైన సామాగ్రితో ఆ శిలా గర్భంలో రేఖలను చిత్రీకరించారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అతి దృఢమైన ఆ శిలను ఉలి మొదలైన పనిముట్లతో ఛేదించటం, చిత్రీకరించటం ఎవరివల్ల సాధ్యమయ్యేది కాదు. అద్దానిని ఛేదించగలిగిన వాడెవడూ లేడు. ఆ శిలయే తనయొక్క అపారమైన దేహంతో సర్వత్రా వ్యాపించి ఉన్నది. అయితే ఆ శిలాగర్భంలో రేఖారూపములైన వృక్ష సమూహాలు, పర్వత సమూహాలు, గ్రామ నగరాదులు నాకు కనిపించాయి. సూక్ష్మమైన సాకార – నిరాకారములగు ప్రతిమలలాగా ఆ శిలా గర్భంలో రేఖామయములైన అనేక దేవ–దానవ కోట్లు ప్రదర్శనమగుచున్నాయి. అందులో విశాలమైన "ఆకాశం" అనే ఒక పెద్ద రేఖ ఉన్నది. మధ్య మధ్యలో సూర్యుడు, చంద్రుడు మొదలైన పేర్లు గల అనేక అడ్డ దిడ్డమైన రేఖలు కూడా ఉన్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! ఆ శిలా గర్భంలో ఎప్పుడు ప్రవేశించారు? ఎందుకు ప్రవేశించారు? ఎవరు చూచారు? ఆ ఘనీభూతమైన శిలాకోశంలో ఆకాశము, మానవులు, దేవతలు, దానవులు మొదలైన జడము–చైతన్యము కూడా అయినట్టి ఆ రేఖలు ఎట్లా కనిపించాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ శిలాగర్భాంతర్గతమైన రేఖలన్నీ నేను చూచాను. కాస్త తలచుకుంటే నీవు కూడా ఆ ఆకాశ – జీవాది రేఖలను తప్పకుండా చూడలగవు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఆ శిల వజ్రము వలె అతిదృఢమని, అద్దానిని ఛేదించటం ఎవరివల్లా కాదని మీరే అన్నారు కదా! ఆ శిలాంతర్భాగంలోకి మీరు ఆ శిలను ఛేదించి ఎట్లా ప్రవేశించారు? అందలి అంతర్భాగంలో ఆ రేఖలను ఎట్లా చూడగలిగారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ! నేనెట్లా ప్రవేశించి ఆ రేఖలను చూచానా! అనియా నీ సందేహం? అయితే విను. ఆ శిలాగర్భంలో నేను ప్రవేశించనేలేదు. ప్రవేశించవలసిన అవసరమూ లేదు. ఎందుకంటే ఆ శిలా గర్భంలో గల రేఖలలో నేను కూడా ఒకానొక రేఖను అయి ఉన్నాను కాబట్టి. అందులో రేఖను కాబట్టే తదితర సర్వ రేఖలను దర్శించగలిగాను. అంతేగాని, ఆ శిలను ఛేదించటం ఎవరి తరం?

**శ్రీరాముడు :** ఓ మునీశ్వరా! అసలు ఆ శిల వాస్తవంగా ఏమైవున్నది? "ఆ శిలా గర్భంలోగల నేను కూడా ఒకానొక రేఖను"... అని మిమ్ములను గురించి మీరు చెప్పుకుంటున్నారు కదా! తాము వాస్తవానికి ఎవరు? మా గురుదేవులు వసిష్ఠులు కాదా! మీరు అందులో జడము, చైతన్యము గాని ఒక రేఖ అనేది నేను ఊహించలేకపోతున్నానే! మీరు వర్తిస్తున్నది ఎచ్చట? ఆ శిలారూపం గురించి చెప్పటంలో తమ ఉద్దేశము ఏమిటి? ఆ శిలయందు తాము ఏమేమి చూచారు? అవన్నీ వివరించండి.

❖❖❖

# 7. శిలాఖ్యాన సారాంశము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నేను "శిలాఖ్యానము" అనే ఒకానొక చమత్కారమైన కథనాన్ని వినిపించాను కదా! ఈ విశేషమును సర్వవ్యాపకమగు పరమాత్మయొక్క 'మహాసత్త' గురించి చెప్పటానికే ఉద్దేశించాను. అంతేగాని మరేదో విశాలమైన శిల గురించి కాదు. ఆ 'పరమాత్మ మహాసత్త' అనబడే శిలాఘనము యొక్క గర్భమున నీవు, నేను, ఈ సర్వసహజీవులు మనమంతా ఏర్పడి ఉన్నవారమై వర్తిస్తున్నాం. ఈ ఆకాశము, సమస్త క్రియలు, ఈ శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలు, సమస్త జీవుల వాసనలు, కాలము, సప్త సముద్రాలు, అందలి వివిధ జీవుల సంస్కారాలు... ఇవన్నీ కూడా ఆ మహాశిలాంతర్భాగపు విభాగములే సుమా! ఈ పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సర్వజీవుల మనస్సులు, బుద్ధులు, చిత్తములు, అహంకారములు... ఇవన్నీ కూడా ఆ పరమాత్మ సత్తా మహాశిల యొక్క వివిధ అంతర్భాగరేఖలే. వాస్తవానికి ఆ 'మహాసత్త' కంటే వేరుగా ఇక్కడగాని, మరెక్కడైనాగాని, ఇప్పుడుగాని, మరొకప్పుడు గాని మరింకా ఏదీ లేనే లేదు. అద్దాని కంటే మనమంతా ఏమాత్రం వేరుకానప్పటికీ అద్దానికంటే నీవు, నేను, వారు, వీరు వేరుగా ఉన్నట్లు భ్రమ చేత మాత్రమే తలచుచున్నాము. సమస్తము చిన్మాత్రైక స్వరూపమే అయివున్నది. చిన్మాత్ర సత్తకంటే ఎచ్చట ఏది ఉన్నదో చెప్పు చూద్దాం! కుండ, మట్టి, దూది, వస్త్రం... అన్నీ కూడా శుద్ధ జ్ఞానైకమాత్రమేనయ్యా!

ఒకే స్వప్నం అనేక నామరూపాలుగా వర్తిస్తున్నట్లుగా... ఒకే జలం అనేక తరంగాలు వివిధ ఆకారాలుగా కనిపిస్తున్నట్లుగా... ఒకే వాయువు అనేక తరంగాలుగా ప్రసరణ మగు వేరువేరు చోట్ల వేరు వేరు కార్యక్రమములను నిర్వర్తిస్తున్నట్లు, ఒకే సూర్యుని నుండి అనంతసంఖ్యగా కిరణాలు బయల్వెడలుచున్నట్లు. ఏకము అయినట్టి చిద్రూపం మనందరి రూపాలుగా ఈ ఈ లోకాలుగా, అనుభవాలుగా వ్యక్త-అవ్యక్తములు ప్రదర్శితమౌతున్నాయి.

**ఇదం బ్రహ్మఘనం సర్వం చిన్మాత్ర ఘనమాతతమ్ ।**
**పరమార్థ ఘనం శాంతమ్ సర్వమ్ "ఏకఘనమ్" విదుః ॥**

ఇదంతా కూడా ఇద్దాని భూత-వర్తమాన-భవిష్యత్తులతో సహా "సర్వ వ్యాపకము, చిన్మాత్ర ఘనము, పరమ శాంతము, పరమార్థ ఘనస్వరూపం, ఏకము, నిర్లిప్తము, మహా మౌనస్వరూపం"... అగు పరబ్రహ్మమే అయి ఉన్నది.

ఓ రామచంద్రా! మనకు కనిపించే జగత్తంతా కూడా... "ఏకము, ఛిద్రరహితము, అనంతము, ఆది మధ్యాంత రహితము" అయినట్టి "మహాచైతన్యము" అనబడే ఒక మహాశిల యొక్క ఉదరభాగమే! అట్టి బ్రహ్మమే తన రూపముగా గల ఆ శిల తానే "సృష్టి-జగత్తు-భువనము" మొదలైన పర్యాయ పదములచే ప్రసిద్ధమగుచున్నది. అట్టి కల్పనను స్వీకరిస్తున్నది అదియే! అందుచేత ఓ సభికులారా! "నాచే దర్శించబడుచున్న ఈ సర్వ దృశ్యమంతా ఈ ద్రష్టగా వ్యవహరిస్తున్న నాతో సహా పరబ్రహ్మము

నకు అద్వితీయమై, అభేదమై జలంలో జలతరంగాలలాగా... చెన్నొందుచున్నది"... అనే అధ్యాత్మ దృష్టిని, ఆత్మ దర్శనమును సముపార్జించుకొని తద్ద్వారా సత్యద్రష్టలు కండి.

❖❖❖

# 8. జ్ఞాని దృష్టి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇంతకుముందు నాలుగు ఖ్యాతుల గురించి చెప్పాను కదా!

1. ఆత్మఖ్యాతి : ఈ జగత్తు ఆత్మయొక్క విన్యాసం.
2. అసత్‌ఖ్యాతి : ఈ జగత్తు అసత్తు. అట్టి అసత్తు సత్తుయగు పరమాత్మ నుండే వ్యక్తమౌతోంది.
3. అఖ్యాతి : నిర్మలమైన పరమాత్మలో దోషభూయిష్ఠమైనట్టి ఈ జగత్తు ఉంది.
4. అన్యథాఖ్యాతి : పరమాత్మలో పరమాత్మకు అన్యమైనట్టి ఈ జగత్తు ఉన్నది.

ఈ నాలుగు అవగాహనలు కూడా జ్ఞానియొక్క దృష్టిలో కుందేటి కొమ్ములలాగా మొదలే లేనివగుచున్నాయి. అనగా అవి మిథ్యయే! జ్ఞానికి అసత్‌ఖ్యాతి మొదలైనవి సంభవించుటయే లేదు. ఎందుకంటే ఈ జగత్తు ఎట్లా ఉన్నప్పటికీ ఆతడు సదా శాంతము, అనిర్వచనీయము, సర్వ కల్పనలకు ఆవల ఉన్నది - చిత్తం యొక్క చేష్టలచే స్పృశించబడనిది, ఈ జీవ-జగత్తులకు అతీతమైనది, అప్రమేయమైనది... అగు ఆత్మస్వరూపమునే అంతటా స్వభావ సిద్ధంగా గాంచుచున్నాడు.

'ఆత్మఖ్యాతి' మొదలైన భ్రాంతి దృష్టులన్నీ చిన్మాత్రము నుండే ఉదయిస్తున్నాయి. అట్టి చిన్మాత్రం పరమార్థమున "మహాశుద్ధము - సర్వ కల్పనా శూన్యము" అయినట్టి చిదాకాశమే అయివున్నది. కాబట్టి సమస్త కల్పన కూడా చిదాకాశమే అయివున్నది.

**అయమాత్మా త్వియం ఖ్యాతిః ఇత్యన్తః కలనాభ్రమః ।**
**న సంభవతి అతశ్చైనం శబ్దం త్యక్త్వా భవార్థభాక్ ॥**

ఓ రామచంద్రా! ఇది ఆత్మ, ఇది ఆత్మ యొక్క ఖ్యాతి (సృష్టిరూపం) ఈ ప్రకారంగా అనిపించే దంతా కల్పనాప్రభావమే అయివున్నది. "ఆత్మ-ఆత్మకు వేరుగా సృష్టి"... అనబడే విభాగం ఎన్నడూ సంభవించటయే లేదు. కాబట్టి ఇట్టి శబ్ద విభాగమును త్యజించి 'పరమార్థభాగి'విగా అగుము. "విభాగ రహితమగు పరమాత్మ యందు పరమాత్మకు వేరుకానట్టి పరమాత్మతత్త్వమే విభాగమే నేను"... అన్న భావనను పెంపొందించుకో! ఈ జగత్తులో జీవులు రావటం, జీవులు పోవటం, భోజనాదులు, అనుభూతులు, అనుభవాలు... ఇవన్నీ జరిగిపోతూ ఉన్నప్పటికీ వాస్తవానికి ఈ దృశ్యజగత్తు వ్యాపార శూన్యమై ఉన్నది. ఆకాశమువలె ఇదంతా మహామౌన స్వరూపమై ఉన్నది. అభేద్యమగు చిన్మాత్రమే ఈ జగత్తు.

ఈ జగత్తు... అనేక శబ్దములతో కూడుకొని ఉన్నప్పటికీ, యథార్థానికి మౌనంగా వర్తిస్తోంది. నిరంతరము గమన-ఆగమనము (రాక-పోకలు) సల్పుచున్నప్పటికీ, ఇదంతా ఆకాశమువలె, ఒక పర్వతమువలె ఒకే స్థానములో ఉండి ఉన్నది.

అనేక కార్యారంభములతో కూడుకొని ఉన్నప్పటికీ, మార్పు చేర్పులు లేనట్టి ఆకాశమువలె వెలయుచున్నది. పంచభూత సహితమైనప్పటికీ, పంచభూత రహితమైయున్నది. అనేక పదార్థములతో పరిపూర్ణమై ఉన్నప్పటికీ, సర్వ పదార్థ వర్జితమై కేవలము జ్ఞానమాత్రంగా చెన్నొందుచున్నది.

స్వప్నంలో కనిపించే మహానగరంలాగా అగుపిస్తున్నప్పటికీ... సదా నిర్మల చిన్మయ స్వరూపమే అయివున్నది. అనేక ప్రయత్న సంరంభములతో కూడుకొని ఉన్నప్పటికీ... సంకల్పం (ఊహ)లో కనిపించే దృశ్యంలాగా సర్వ ప్రయత్న శూన్యమై ఒప్పుచున్నది.

అంతేకాదు ఈ 'జగత్తు' అనబడే దృశ్యము స్వప్నంలో కనిపించిన స్త్రీతో సంగమంలాగా భ్రాంతిరూపము. ప్రతిబింబ స్త్రీవలె (అనుభూతమగుచున్నప్పటికీ) వ్యర్థము అయివున్నది. ఇది అనేక అనుభవములతో కూడుకొని ఉండవచ్చుగాక! కానీ, వాస్తవానికి సర్వానుభవరహితమై వస్తుశూన్యమై వర్థిల్లుతోంది!

**శ్రీరాముడు :** హే మహర్షీ!... ఎప్పుడైతే జాగ్రత్ స్వప్న రూపమని అనతగ్గ ఈ జగత్తు "లేనిదే" (లేక) "వాసనామాత్రమే" అయి కనిపిస్తోందో... ఇకప్పుడు ఇది "స్మృతి యొక్క రూపమేనని నేను అనుకుంటున్నాను. "సద్రూప బాహ్య పదార్థముల యొక్క స్మృతియే ఈ జగత్తుకు కారణం. అంతే గాని ఈ జగత్తు భ్రాంతి కాదు" అని కొందరికి అనిపిస్తోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! చిదాకాశము నందు "అద్దానికి అభిన్నమే" అనతగిన రూపం గల 'స్ఫురణ' అనబడేది బయలుదేరుతోంది. అట్టి స్ఫురణకు, చిదాకాశము కంటే వేరైన రూపమేదీ లేదు. ఎందుకంటే చిదాకాశం కంటే వేరైనదేదీ చిదాకాశంలోనుంచి బయల్వెడలటానికి ఏ బాహ్య కారణం ఉండజాలదు కాబట్టి. అట్టి నిరాకారము – చిదాకాశ స్వరూపము అగు స్ఫురణకు కారణం లేదు. గాలియందు వాయుతరంగాలవలె, అగ్నియందు అగ్నిశిఖలకు గల ఆకారం వలె, బంగారమునకు ఆకారం వలె "చిదాకాశం యొక్క చిత్ స్ఫురణకు కారణమేమిటి?" అనే ప్రశ్నకు సమాధానం ఉండజాలదు. అందుచేత అది స్వభావసిద్ధమే!

**చిదాకాశమునందు చిత్ స్ఫురణ స్వభావ సిద్ధమే! -** అట్టి సత్తా మాత్రమైనట్టి స్ఫురణయే కాకతాళీయంగా శరీరమును ధరించినదై నిష్కారణంగా దృశ్యరూపంగా భాసిస్తోంది. అదియే భ్రాంతిరూపంగా కనిపించే ఈ జగత్తు. ఇక 'స్మృతి' అంటావా! అట్టి స్మృతియొక్క నాందీ ప్రస్తావనా రూపం స్ఫురణయే! అట్టి స్ఫురణ చిదాకాశమే! కనుక ఈ 'జీవుడు' అనబడే ద్రష్ట – ఆతని స్మృతి రూపంగా నీవు అనుకుంటున్న ఈ జగత్తు... ఉభయములూ లేకపోయినప్పటికీ, (జలానికి అభిన్నమైన... జలానికి స్వభావమే అయి ఉన్న తరంగం వలె) ఆకారం కలిగి ఉంటోంది కదా! నాశరహితం, సర్వవ్యాపకం, శాంతం, జగద్రహితం – అయినట్టి పరమాత్మలో జగద్భావ రూపమగు ఈ జగత్తు పరమాత్మకు అభిన్నమై వెలయున్నది. సర్వ రూపం, పదార్థ రహితం, పరమ శాంతం, చిదాకాశమయం – అగు పరమాత్మ ఎట్లా కారణరహితమో... అట్లాగే జగత్తు చైతన్యమునకు అభిన్నమైన కారణంగా జగత్తు కూడా అకారణమే! అట్టి పరమాత్మ చైతన్యం ఎప్పుడెప్పుడు తనలో

అవిద్య ద్వారా ఎట్లెట్లు స్ఫురిస్తోందో... అపుడపుడు అచ్చటచ్చట ఆయా ప్రకారంగానే ఈ జగత్తు భాసిస్తోంది. ఎక్కడెక్కడ చైతన్య స్ఫురణ భాసించదో... అక్కడక్కడ జగత్తు కూడా భాసించదు.

ఓ రామచంద్రా! బ్రహ్మస్వరూపమగు ఆత్మ తనయొక్క పరమాత్మ స్వరూపమును ఏమాత్రం ఏ క్షణంలోనూ త్యజించుటయే లేదు. అయ్యది సర్వ శక్తిమంతమగు చిత్స్వరూపమే కాబట్టి సర్వమునకు తానే కారణమై ఉంటోంది. తన నిర్మల స్వభావమగు బ్రహ్మ స్ఫురణకే "ఇది జాగ్రత్తు, ఇది స్వప్నం, ఇది సుషుప్తి, ఇది తురీయం, ఇది బ్రహ్మము, ఇది ఆత్మ"... ఇత్యాది నామములను తానే స్వయంగా గావించుచున్నది.

**వస్తుతస్తు అస్తి న స్వప్నో, న జాగ్రత్, న సుషుప్తతా**
**న తుర్యం, న తతో అతీతం, సర్వం శాంతం పరం నభః ॥**

కానీ రాఘవా!... వాస్తవానికి జాగ్రత్తుగాని, స్వప్నంగాని, సుషుప్తిగాని లేవు. వాటన్నిటి యందు పుష్పమాలయందు దారమువలె అనుస్యూతమై, వాటన్నిటికంటే పరమై, శాంతమగు పరబ్రహ్మ రూప చిదాకాశమే ఆ సమస్తము కూడా అయివున్నది.

లేదా... ఇదంతా కూడా (ఈ జగత్తంతా కూడా)... చైతన్యము ఏ క్షణము నిదురించదు కాబట్టి సర్వము అనునిత్య జాగ్రత్ రూపమే అయివున్నది. ఇదంతా చైతన్యము యొక్క స్వప్న మాత్రమే కాబట్టి, సర్వము స్వప్న రూపమే అయి ఒప్పుచున్నది. అంతా అవిద్య మాత్రమే కనుక... సర్వము సుషుప్తి రూపమే అయి వెలయుచున్నది.

ఈ ద్రష్ట సర్వదా అవస్థాత్రయమును దాటివేసిన తురీయరూపుడే కాబట్టి ఈ 'జగత్తు' అనబడే సర్వము తురీయ రూపమేనని కూడా మనం తప్పకుండా అనవచ్చు. ఆత్మానుభూతులగు జ్ఞానుల దృష్టి యందు 'నీవు, నేను, అది, ఇది' అనే కల్పనలు ఉండటం లేదు కనుక అంతా కూడా పరమాత్మ యందు పరమాత్మకు అభిన్నమై, పూర్ణశాంతరూపమై ఉన్నది... అన్నది కూడా ఎవరమూ కాదనలేని సత్యం.

అంతటా జలమయమైయున్న సముద్రంలోకి మనం పోయి... ఇవి తరంగాలు కాదు, తరంగాలుగా కనిపించేదంతా సముద్ర జలమే! ఇది తెల్లటి నురుగు కాదు, నురుగుగా కనిపించే సముద్ర జలమే! ఇవి బుద్బుదములు (బుడగలు) కావు, బుద్బుదములుగా కనిపించేదంతా జలమే! అయినా కూడా తరంగాలు వేరు, నురుగు వేరు. తుంపరలు వేరు. బుద్భుదములు వేరు... ఇట్లా చెప్పుకోవటం ఎట్లా ఎంతవరకు మిథ్య (మరియు) యుక్తియుక్తమో... అట్లాగే "చిదాకాశము" అనే మహాసముద్రంలో కనిపించే ఆయా విశేషాలను "ఇది జాగ్రత్. ఇది స్వప్నం. ఇది జగత్తు. ఇది ద్రష్ట"... అని చెప్పుకోవటం చిదాకాశం ద్రష్ట్యా మిథ్య – యుక్తియుక్తము కూడా అయివున్నది.

అయితే ఈ జగత్తు సత్తా? అసత్తా? అని ఎవరైనా ఇంకా ప్రశ్నించారనుకో, అపుడు, "ఒకానొకటి సత్తు అయినా, అసత్తు అయినా చిదాకాశం దేనిని ఎట్లు ఎరుగుచుండటం జరిగితే అది ఆ ప్రకారమే అనుభవమగుచున్నది"... అని చెప్పక తప్పదు. ఈ విధంగా చైతన్యం నిజ చిదాకాశమునందే

సత్-అసత్ పదార్థములను స్వయంకృతంగా అనుభవమునకు, అనుభూతికి తెచ్చుకోవటం జరుగుతోంది. కనుక ఓ రామచంద్రా! ఈ జగత్తంతా కూడా చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమే అయివున్నది. అనగా చైతన్యము ఎట్లా స్ఫురిస్తోందో... ఈ జగత్తు అట్లే భాసించుచున్నది. వాస్తవానికి చిదాకాశమునందు చిదాకాశమే జగద్రూపంగా భాసించుచున్నదగుచున్నది.

చైతన్యము చిదాకాశము యొక్క సారమేనయ్యా! అది సదా ఏకరూపమై ఉదయాస్తమయములు లేకయే వెలయుచున్నది. ఈ జీవుడు చైతన్య స్వరూపుడే! అట్టి చైతన్యము యొక్క స్వకీయమైన అవయవం వంటిదే ఈ జగత్తు. అనగా సృష్టి, మహా ప్రళయ రాత్రింబవళ్ళు, తదితర కాలవిభాగం, ఇవన్నీ కూడా చైతన్యం యొక్క అవయవ విభాగత్వముగానే ఏర్పడినవై ఉన్నాయి. అందుచేత వాయువు, వాయువు యొక్క చలనం వలె స్ఫురించేది, స్ఫురించనిది, చిద్రూపము, మాయారూపంగా భాసించేదీ... అంతా కూడా చిదాకాశం యొక్క ఒకానొక విభాగమే సుమా! దేహానికి గోళ్ళు మొదలైనవి శరీర విభాగంగానే ఉన్నట్లు జగత్తు చిదాకాశ దేహము యొక్క ఒకానొక విభాగము వంటిదే! కనుక ఇక జాగ్రత్తు ఏమి? స్వప్నం ఏమి? సుషుప్తి ఏమి? తురీయమేమి? స్మృతి ఏమి? విస్మృతి ఏమి? ఇచ్ఛ ఏమి? జగత్తు ఏమి? ఇట్టి కుదృష్టులన్నీ మిథ్యయే అయివున్నాయి.

**అన్తః సంవేదనం భాతి స్వం బాహ్యార్థతయా యతః ।**
**క్వ ద్వైతం? క్వ చ కా అర్థశ్రీః? స్మృతిరేవమతః కుతః ॥**

చైతన్యం యొక్క స్వకీయమైన అభ్యంతర స్ఫురణయే బాహ్య పదార్థాకారంగా భాసించు చుండగా... ఇక ద్వైతమెక్కడ? పదార్థములెచట? పదార్థములే లేనప్పుడు, ఇక వాటి గురించిన 'స్మృతి' ఎక్కడున్నది? నిరాధారమగు ఆకాశమున ప్రకాశించే సూర్యగోళం యొక్క ప్రకాశం దేనినీ ఆపేక్షించకుండానే అంతటా వెలుగొందుచున్నది చూచావా? భేదరహితమగు ఆత్మరూపంగా ఈ దృశ్యం భాసిస్తోంది. అట్టి ఆత్మ ప్రకాశం భౌతిక పదార్థవర్జితం. ఈ జగత్తు ఆత్మయొక్క నిజస్వరూప ప్రకాశమేగాని భౌతికం కాదు. భౌతికంగా (సాకారయుక్తంగా) లేదు.

ఈ భౌతిక పదార్థములు నిజదృశ్య రూపముచే సత్యమయివుంటే... అప్పుడు వాటికి సంబంధించిన స్మృతి సృష్టికి కారణభూతములని అనవచ్చునేమో! కానీ ఇది పంచభూత సమ్మేళనమే! ఏ దృష్టితో ఇవి చూడబడుచున్నాయో... అదంతా కూడా స్వకీయమైన ద్రష్టయొక్క కల్పనా సదృశమే! కల్పనా చమత్కారమే! సృష్ట్యాది యందు అంతా అకారణమై ఉండగా పంచభూతాలు ఉద్భవించటానికి కారణమేమున్నది? అట్టి కారణ అభావం చేత దృష్టికి వేరుగా పంచభూతములే జనించటం లేదు. ఈ రీతిగా ఈ బాహ్య పదార్థములు లేకయే ఉన్నాయి.

కుందేటి కొమ్ములు ఎవరి వలన ఏ కారణంచేత కనిపిస్తున్నాయి? ఆకాశంలో వెంట్రుకాకారాలు ఎవరి కారణంచేత మెలికలు పడిన దారమువలె అగుపిస్తున్నాయి? వంధ్యా పుత్రుడు (గొడ్రాలి కుమారుడు) వీధిలో ఎందుకు అల్లరి చేస్తున్నాడు? దూరపు కొండలు నునుపుగా ఎందుకున్నాయి? నక్షత్ర మండలం సింహము - తేలు మొదలైన ఆకారాలలో ఎందుకు కనిపిస్తోంది? ఎండమావులలో జలము ఎందుకు అగుపిస్తోంది?

ఈ జగత్తు కూడా అట్లాగే అనుభవమౌతోంది. కనుక ఈ జగత్తు వాస్తవం కాదు. ఇక 'నీవు–నేను' మొదలైన వేరు వేరైనట్లుగా కనిపించే జగత్ పదార్థములన్నీ విచారణ చేయకపోవటం చేతనే అట్లా భాసిస్తున్నాయి. విచారణ చేసినప్పుడు అవన్నీ స్వప్నంలోని 'నేను – నీవు' లాగానే లేనివే అగుచున్నాయి. ఓ రామచంద్రా! అజ్ఞానులకు మహాకారయుక్తంగా భాసించుచున్న ఈ జగత్తు తత్త్వజ్ఞుల దృష్టి యందు "మూర్తామూర్త రహితమైనట్టి అఖండ చైతన్య ఘనము. నిత్యోదితమై ఉన్నప్పటికీ... అయ్యది వ్యవహారమునందు ఎప్పుడెప్పుడు ఉదయించుచున్నదో... అప్పుడప్పుడే అట్లే ఉదయ – అస్తమయము ఉన్నదానివలె అగుపిస్తోంది. ఎప్పుడైతే జీవుడు "ఇది భూమి – అది ఆకాశం"అని ఎరుగుచున్నాడో... అప్పుడు ఆత్మ సత్తా యొక్క ప్రకాశమే అట్లు 'భూమి – ఆకాశము' మొదలైన రూపములుగా ఆతనికి కనిపించుచున్నదగుచున్నది. జన్మరహితమగు మహాచైతన్య రూప చిదాకాశము తన యొక్క స్ఫురణకు 'ఇది నేల, ఇది ఆకాశం' మొదలైన పేర్లను కల్పించి, అటు తరువాత వాటితో వ్యవహరిస్తున్నది. ఒక పసిబాలుడు తన మనోరాజ్యంలో బంధు గృహములను, ఆట వస్తువులను, సహచరులగు బాలురను దర్శిస్తాడు చూచావా? అట్లాగే నాశనరహితమగు చిన్మాత్రము తనయొక్క ఆకాశమువలె నిర్మలము, విశాలము అయినట్టి స్వరూపమునే ఈ భూమి మొదలైన సర్వ విశేషములతో కూడి దృశ్యముగా దర్శిస్తోంది. ఓ ప్రియ సభికులారా! ప్రియ పాఠకులారా! మీకు జగత్తుగా కనిపించుచున్నదంతా నాశరహితము – నిర్మలము అగు పరమానంద – చిన్మయాకాశమే! మీ మహానంద స్వస్వరూపమునకు అన్యంగా జగత్తు అనబడునది ఏదీ లేదు.

అంతా మీ చిదాకాశ స్వరూపమే అయివుండగా... ఇక స్ఫురణ ఎక్కడ? అస్ఫురణ ఎక్కడ? కనుక, "అయ్యో నాకీ జగత్ స్ఫురణ తొలిగేది ఎట్లా?" అనే వ్యర్థ భావన కూడా అనవసరమే కదా! ఎందుకంటే... వాయువుకు తరంగాలవలె! [అనగా వాయువు నిశ్చలం (అస్పందము) – వాయు తరంగాలు చంచలం (స్పందము)] వాస్తవానికి మనందరి చిత్‌స్వరూపం నిశ్చలం. మన చిదానంద స్వస్వరూపం – చైతన్య శక్తిచే నిశ్చలం. ప్రాణ మనోశక్తిచే చంచలం. నిశ్చల–చంచలములు మన ఆత్మయొక్క చమత్కారములే!

చిదాకాశము ఏ విధంగా స్ఫురిస్తోందో ఆయా ప్రకారంగానే ఈ భూమ్యాకాశాదులు భాసిస్తున్నాయి. అనగా మనకు భూమ్యాకాశాలుగా భాసించేది మనలో ప్రతి ఒక్కరి చిదాకాశ రూపమే! చిదాకాశమే చిదాకాశము నందు చిదాకాశంగా భాసిస్తోంది. చిదాకాశ స్వరూపులమగు మనయందు చిదాకాశ స్వరూపమగు మనస్సు ద్వారా చిదాకాశ స్వరూపమగు 'జగత్తు' భాసిస్తోందని వేదాంత జ్ఞానులగు మహనీయులు సుస్పష్టంగా నిర్దుష్టంగా గ్రహించియే ఉంటున్నారు.

ఓ జనులారా! "ఈ సమస్త రూపముగా రూపరహిత చిదాకాశమే ప్రకాశించుచుండగా, ఈ జగత్తు – నాతో సహా మనమందరం కూడా సర్వదా చిదాకాశరూపులమై సర్వదా ప్రకాశిస్తున్నాం!"... అను అవగాహనయే వేదాంత జ్ఞానము యొక్క పరాకాష్ఠ, ఓ రామచంద్రా! అట్టి "స్వయమేవ ఆత్మన్ ఆత్మానం వేత్థ"... స్వరూపులు, ఆత్మ సాక్షాత్కారానంద స్వరూపులగు మహనీయులు ఈ విశ్వామిత్ర – నారదాది అనేకమంది ఎందరో ఈ సభలో ఉన్నారు. "చిత్స్వరూపుడగు జీవుని

చిత్స్వరూప విన్యాసమే ఆతనికి కనిపించే జగత్తు" ... అని వారు అత్యంత నిర్దుష్టంగా యెరిగియే మన ఈ సంవాదమును ఆనందంగా ఆస్వాదిస్తున్నారయ్యా!

ఇక ఈ అనేక నామ-రూప భేదాలతో కూడిన ఈ జగత్తు అంటావా? ఇది ఎట్లా భాసిస్తుంటే అట్లాగే భాసించనీ! భాసించుచున్నదంతా వాస్తవానికి చిదాకాశ స్వరూపమే కదా! కనుక ఇదంతా సర్వదా సత్తు కాదు. అసత్తు కాదు. వస్తువు కాదు. అవస్తువు కాదు. "ఇది అనిర్వచనీయం" - అని మేము గ్రహించియే ఈ జగత్తులో క్రీడగా, లీలగా సంచారం చేస్తున్నాం.

❖

**ఇదమిత్థం అనిత్థంచ సద్వా అసద్వా యథా స్థితమ్**
**లోక పర్యాయ వృత్తాంతం ప్రాజ్ఞో జానాతి, నేఽతరః ॥**

ఓ రామచంద్రా! ఈ జగత్తు ఈ ప్రకారంగానే ఉన్నదా? మరొక విధంగా ఉన్నదా? ఇది సత్తా? అసత్తా? ఇటువంటి లోక పర్యాయవృత్తాంతం తత్త్వజ్ఞాని మాత్రమే యథార్థంగా ఎరుగుచున్నాడు. తత్త్వజ్ఞానదృష్టి లేనివాడు ఈ జగత్తు ఎట్టిదో ఎరుగనేలేదు. ఎందుకంటే, తత్త్వజ్ఞుడు "సర్వుల హృదాకాశమున నేనే ఆత్మరూపంగా వెలుగొందుచున్నాను" అనీ, "నా రూపమే వీరికి ఈ జగత్తుగా కనిపిస్తోంది" అనికూడా గ్రహించి... ఉత్తమ బుద్ధిని సంతరించుకొని ఉంటున్నాడు. అందుచేత "నా యొక్క దృశ్య సంవిత్తే అభ్యంతర మనోబుద్ధ్యాదులు అయివుండగా, బాహ్యరూప బ్రహ్మాండములుగా వెలుగొందుచున్నది" అను అవగాహనచే ఆతడు ఈ దృశ్య వ్యవహారమంతా ఆస్వాదిస్తున్నాడు.

ఓ ప్రియ జనులారా! వాస్తవానికి ఇచ్చట బాహ్యం లేదు. అంతరం లేదు. దృశ్యం లేదు. అదృశ్యం లేదు. అందుచేత రామా! ఈ శాంత - అశాంత రూపమగు సమస్తమును "ఓం" కార లక్ష్యార్థమగు "శివ రూప బ్రహ్మం" నందు లయింపజేసినవాడవై పరమశాంత స్వరూపుడవగుము.

**శ్రీరాముడు :** స్వామీ! అంతాకూడా శాంతరూప శివబ్రహ్మమే అయివుండగా, ఇక శరీర-మనో-బుద్ధి-బాహ్య-అంతరంగాదుల గురించి శాస్త్రములు ప్రతిపాదించే సంవిధానమంతా వృథా కల్పనయేనంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను! శాస్త్రీయ చర్చా సంరంభమంతా అధ్యాత్మాయానంలో ఒక చోట ఆగిపోవుచున్నాయి. అయితే... శాస్త్ర విచారణ లేకపోతే స్వయంకృత జగత్తు - సర్వాత్మకమగు సోఽహమస్మి భావం అనుభవానికి రావు.

వాచ్య - వాచక సృష్టి లేకపోతే శాస్త్ర విచారణ సంభవించదు. ఇటువంటి శాస్త్రీయ దృక్పథం, అవగాహన... శాస్త్రకారులు ప్రతిపాదించేది, ప్రబోధించేది - మొదలైనదంతా కూడా 'ఆత్మజ్ఞాన సిద్ధి' కొరకే అయివున్నది. అట్టి 'విచారణ' లేకపోతే... దీపం ఉన్నప్పటికీ కళ్ళు మూసుకున్న వానికి గదిలో ఏదీ కనబడనట్లే... ఆత్మ అంతటా సర్వదా ఏర్పడియే ఉన్నప్పటికీ, తాను ఆత్మయే అయి ఉన్నప్పటికీ అజ్ఞానం తొలగదు. "నేను ఈ దేహ పరిమిత జీవుడను" అనే చీకటి తొలగదు. అసత్తే

అయినప్పటికీ వాచ్య–వాచక వికల్ప వ్యవహారం శాస్త్ర జ్ఞానానుసారం ఆశ్రయించవలసియే ఉంటుంది. ఆ తరువాత క్రమంగా చర్చనీయాంశాలన్నీ ఎందుచేత అసత్ పరిమితమో కూడా స్వయంగా స్వభావ సిద్ధంగా గ్రహించబడుచున్నది కూడా! అందుకే మనం ఈ 'ఉత్తమ విచారణ'ను ఈ సభలో ఇన్ని రోజులుగా కొనసాగిస్తున్నాం. మన ఈ 'విచారణ'ను అనుసరిస్తూ వస్తే క్రమంగా బుద్ధి శుద్ధము, నిర్మలము, ఉత్కృష్టము అగుచూ వస్తుంది. అట్టి మధురమైన నిర్మల బుద్ధితో సంకల్పమయమగు సమస్త శారీరక–శాస్త్రీయ జనిత వికల్ప సమూహములు అంతఃకరణం నుండి పారద్రోలివేయబడగలవు. అప్పుడీ మనస్సు సకల శాస్త్రముల అంతిమసారమగు అద్వయ సచ్చిదానందాత్మ యందే నెలకొనగలదు. ఓ రామా! అట్టి తదేక నిష్ఠాపరుడవై, ఈ సంసారము ఏమిటో ఎరిగి, ఇద్దాని నుండి ఎగిరి మోక్ష గగనంలో విహరించు!

❖❖❖

# 9. అబుద్ధిపూర్వకమిదమ్ జగత్

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! వృక్షము అబుద్ధిపూర్వకంగానే కొమ్మలు, ఆకులు, కాయలు, పూలు మొదలైన విభాగములన్నీ తనయందు కలిగి ఉంటున్నట్లు... సముద్రము అబుద్ధిపూర్వకంగా తనలో ఆవర్తములు, తరంగాలు రచించుకొంటున్నట్లు... జన్మ–కర్మ మొదలైన ఎట్టి వికారాదులు లేని పరమాత్మ, ఆకాశము నిర్మలము–విశాలము అయినట్టి తన స్వరూపమునందు... శూన్య రూపములే అగు చిత్ర – విచిత్ర ప్రపంచముల యొక్క అధ్యాసలను, అనేక జాగ్రత్ స్వప్నచిత్ ప్రతిభాసములను గావించుచు... నిజ స్వరూపములగు జగదాకార సంవిత్తులకు, (లేక) చైతన్య వృత్తులకు "మనస్సు–బుద్ధి–చిత్తము–అహంకారము" మొదలైన వివిధ నామములను స్వయముగా కల్పించుచున్నాడు. చైతన్యమునకు, చైతన్యరూపమే అయి – బుద్ధిరూప చైతన్యముచే అగుపించే దృశ్యము – సముద్ర తరంగములాగా అబుద్ధిపూర్వకమే అయివున్నది.

అబుద్ధిపూర్వకంగా బుద్ధి జనిస్తోంది. బుద్ధి జనించిన తరువాత సంకల్పించబడేదంతా బుద్ధిపూర్వకం అయివున్నది.

సముద్రంలో ఆవర్త–కణ–కల్లోల–తరంగాదులు ప్రవృత్తములగునట్లు చిన్మాత్రమగు ఆత్మ నుండి మనో–బుద్ధి–చిత్త–అహంకార రూపమగు సృష్టి ప్రవృత్తమౌతోంది. గోడపై ఉలిచే లిఖించబడిన చిత్రము గోడయే కదా! అట్లాగే చిదాకాశమున అభాస మాత్రమగు ఈ జగత్తు చిదాకాశమాత్రమే అయివున్నది. చైతన్యమునందు అబుద్ధిపూర్వకంగా ప్రవృత్తిరూపంగా ఈ సృష్టి ప్రారంభము పొందిన తరువాత, ఇక బుద్ధిచే కూడుకొనినదై ప్రకృతిచేత యథాయోగ్యమగు ఆకారముగా ఒనర్పబడుచున్నది. వృక్షం జనించిన తరువాత "ఇది కాండము, ఇది కొమ్మలు, ఇవి రెమ్మలు, ఇవి పూలు, ఇవి కాయలు" ...అని ఎవరో పేర్లు పెట్టుచున్నారు కదా! వాస్తవానికి వృక్షమునకు వేరై వృక్షమునందు ఏమి ఉన్నది? అట్లాగే చైతన్యము నందు అబుద్ధిపూర్వకంగా జనించే ఈ పృథివి, ఆకాశము,

సమష్టి, సృష్టి రూపులగు హిరణ్యగర్భుడు మొదలైన ఆయా పేర్లు పెట్టుచున్నారు. పరమాత్మ నుండి అబుద్ధిపూర్వకంగానూ, అకారణంగానూ జనించిన ఈ పృథివి మొదలైన వాటితో కూడిన జగత్తు పరమాత్మ కంటే వేరుకాదు. చిదాకాశరూపమగు ఆత్మయే, వ్యష్టి జీవునివలె అయి... "ఈ చిదాకాశమునకు అనన్యము" అయినట్టి ఈ ఎదురుగా కళ్ళకు కనిపించే సృష్టిని నామరూపాత్మకం తెచ్చిపెట్టుకుంటోంది.

❖

చిద్రూప వృక్షమే ఈ ప్రకారంగా కార్యకారణ రూపమైన స్వీయాలంకారములతో స్వయంగా భాసించుచున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! కొందరు గురువులు తమ శిష్యులకు... ఇహ-పరలోకాలు ఉన్నాయి. ఇహంలో చేసిన పాప-పుణ్య ఫలాలు పరలోకంలో అనుభవిస్తారు అని బోధిస్తున్నారు. ఈ సృష్టియే లేదని మీరు ప్రతిపాదదిస్తున్నారు కదా! మరి ఇహలోక విహిత - నిషిద్ధ కర్మలు, వాటి ఫలములను అనుభవించవలసియున్న పరలోకముల గురించి మీ అభిప్రాయం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** రామచంద్రా! కర్మఫలములు, ఆ ఫలములను అనుభవించటానికి వేరే కొన్ని లోకములు ఉన్నాయనే అనుకుందాం. ఆ లోకములో అనుభవాలవంటివే ఈ ఇహలోకంలోకూడా అనుభవానికి వస్తున్నాయి కదా! ఈ జాగ్రత్‌లో పొందుచున్న సుఖ-దుఃఖాలు కూడా కర్మఫలరూపాలే అని ఎందుకనుకోకూడదు? "జగత్తు ఉన్నది" అని ఈ జీవుడు సంకల్పం కలిగి ఉన్నంతవరకు ఈ జగదనుభవములు సత్యముగానే సుఖ దుఃఖాదులుగా ప్రాప్తించటం కొనసాగుతూనే ఉంటుంది. అద్దానికి అంతు అనేదే లేదని మహాశవోపాఖ్యానంలో గమనించాము కదా!

నిరాకారమగు చైతన్యమున సాకారమగు ఈ జగత్తు చైతన్యము చేతనే సంకల్పింపబడినదై "ఇది నాకు దుఃఖం. ఇది నాకు సుఖం"... ఇటువంటి సుఖ దుఃఖ - అత్యాశ్చర్య - అతి సామాన్య రూప నిర్వచనాలన్నీ మూలముగా కలిగినదై చెన్నొందుతోంది. పుష్పానికి సుగంధంలాగా, అకాశానికి శూన్యత్వంలాగా, వాయువుకు చలనత్వంలాగా చైతన్యమునకు ఈ బ్రహ్మాండ సృష్టులన్నీ అభిన్నమై వెలయుచున్నాయి. చైతన్యమునకు వేరుగా చూస్తే ఈ సృష్టులు అత్యంత శూన్యరూపములే!

ఆకాశం కంటే శూన్యత్వం వేరుకాదు. జలముకంటే ద్రవత్వం వేరుగాలేదు. పుష్పము కంటే గంధము వేరుగా ఉండదు. వాయువుకు వేరుగా స్పందము లేదు. అగ్ని కంటే భిన్నంగా ఉష్ణము ఉండదు. మంచుకంటే శీతలత్వం వేరుకాదు.

అట్లాగే... చిదాకాశ స్వరూప పరమాత్మ కంటే జగత్తు వేరుగా లేదు. 1.సృష్ట్యాదిలో కనిపించే ఈ జగత్తు, 2.స్వప్నంలో కనిపించే దృశ్యము... ఈ రెండూ కూడా కూటస్థ చైతన్యము కంటే భిన్నం ఎట్లా అవుతాయి చెప్పు?

"చిత్ చైతన్యం కంటే చేత్య (తెలియబడే) జగత్తు వేరు కాదు" అనే సిద్ధాంతానికి దృష్టాంతం ఏమిటంటావా? స్వప్న ద్రష్ట కంటే స్వప్నము వేఱుగా ఉన్నదెప్పుడు? ఎక్కడ? అట్లాగే చిన్మాత్రము

కంటే సారరూపమైనదేదీ ఈ జగత్తులో లేదు. జగద్రష్ట చిన్మాత్ర స్వరూపుడేనని మరల మరల గుర్తు చేస్తూనే ఉన్నాను.

**శ్రీరాముడు :** మహర్షీ! 1.స్మృతి–జగత్తు 2.స్మృతి–స్వప్నము ...అను జంట విషయములలో ఇంకా కొంత సంశయం చోటుచేసుకొని ఉండటం చేత ఈ రెండింటి విషయంలో ఈ "జగత్తు యొక్క నిర్వచనం" గురించి మరొక్కసారి మాకు బోధించండి.

"స్వప్నం ఎక్కడి నుండి వస్తోంది" అనే ప్రశ్నకు సమాధానంగా... "గత స్మృతులందలి సంస్కారంలో నుంచే బయల్వెడలుతోంది. స్మృతులలో నుండి 'అది' అనబడే దత్తాంశముగా భాసిస్తోంది. జగత్తులో 'ఇది' అనే ఇదంశము రూపంలో పూర్వ స్మృతులు, వర్తమాన దృశ్యం సమ్మిళితమై జాగ్రత్ రూపంగా పొందబడుతోంది.

ఈ విధంగా బుద్ధి నుండే రెండూ జాగ్రత్ – స్వప్నాలు స్మృతి రూపంగా సంభవిస్తున్నాయి. స్మృతిలో పూర్వకాలిక పదార్థానుభవములు ఘనీభూతమై ఉండి పరోక్షంగా స్వప్నంలోను, ప్రత్యక్షంగా జాగ్రత్తలోను పాల్గొనుచున్నాయి.

కాబట్టి జాగ్రత్ స్వప్నములు రెండూ స్మృతి రూపములే అవుతాయి కదా! (లేక) ఈ జీవుని స్వస్వరూపమే (చిదాకాశరూపమే) ఎట్లా అవుతాయి?" పై విధంగా కొన్ని సిద్ధాంతాలున్నాయి. వీటికి సమాధాన పూర్వకంగా ప్రవచనం ప్రసాదించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఒకానొకడు ఉదయం అడవికి వెళ్ళి ఒక సింహమును చూచాడు. భయపడి పరుగులు తీయనారంభించి ఎట్లాగో స్వగృహం చేరాడు. ఆ రాత్రి నిదురించినప్పుడు కలలో సింహం కనిపించింది. ఇప్పుడీ జాగ్రత్–స్వప్న అనుభవములను విశ్లేషిద్దాం. రాత్రి స్వప్నంలో కనిపించిన సింహం ఆ ఉదయం చూచిన సింహమే కదా! రెండూ ఒక్కటే అయితే అడవిలో సింహం అడవిలోనే ఎందుకుంటోంది?

కనుక స్వప్నంలో కనిపించేది వస్తువు లేకుండా స్మృతియే వస్తురూపంగా కూడా కనిపిస్తోందని తేలుతోంది కదా! అయితే స్వప్న సమయంలో అది సత్యమనియే అనిపిస్తోంది కాబట్టే స్వప్నం మనకు ఇప్పుడు చర్చనీయాంశమగు విషయమగుచున్నది. అవునా?... కనుక స్వప్నంలో కనిపించేది స్వప్న సమయంలో "ఇందంశము" అగుచున్నదే గాని తదంశము అవదు కదా!

ఇక ఈ జగత్తు 'స్మృతి' అనబడే ఇతఃపూర్వ అనుభవాలు దృష్టిని ప్రేరేపించునదై 'దృశ్యము'గా అనుభూతమగుచున్నది. అయితే స్వప్న దృశ్యమునకు, జాగ్రత్ దృశ్యమునకు ద్రష్ట ఒక్కడే కదా! అనగా ఉభయ సందర్భములలోను ద్రష్ట వేరుగా అప్రమేయుడై తాను మార్పు చేర్పులు చెందక ఆ రెండింటికీ కేవలం సాక్షి అయి, అదే సందర్భములలో ఆ రెండింటికీ అర్థము ప్రతిపాదించువాడై ఉన్నాడు కదా! ఆ ద్రష్ట ఏ సమయంలో ఎద్దానిని ఏ దృష్టితో చూస్తాడో అది అట్లే అనుభవమగు చున్నది. దృశ్యం దృష్టిపైనే ఆధారపడి ఉంటోంది. దృష్టి ద్రష్ట నుండే బయల్వెడలుతోంది. ద్రష్ట ద్రష్టత్వము వహించకముందే ఎట్లున్నాడో, దృశ్య సందర్భంలో కూడా యథాతథంగా అట్లే ఉన్నాడు.

ఇక ఈ జగత్తు యొక్క స్థితి స్వప్నములోవలె కాకతాళీయంగా ఏర్పడే వృత్తి వంటిదే! జలంలో ఒకానొక తరంగం ఒకానొక ఆకారంగా బయల్వెడలటానికి ఏ విధంగా కార్య-కారణములు లేవో ...ఈ జగత్తు కార్యకారణ రహితమగు వృత్తి వ్యవహారం మాత్రమే! చైతన్యము తనయందే తనకు అవిభాజ్యము, అద్వితీయము, అభేదము అగు జాగ్రత్ స్వప్నములను, (ఆ తదనంతరం) అందరి ఆయా విశేష పరంపరలను కాకతాళీయంగా సిద్ధింపజేసుకొనుచున్నది. సముద్రంలోని తరంగాల వలె మొట్టమొదట అబుద్ధిపూర్వకంగా సృష్టి ఏర్పడుచుండగా, ఆ తరువాత అద్దాని అవయవ రచనాదుల స్థితి ప్రకృతి సిద్ధంగా బుద్ధిపూర్వకంగా సంభవించుచున్నది.

ముత్యపు చిప్పలో వెండి ఏ కారణంచేత కనిపిస్తోంది? అద్దానికి ఏ కారణమూ లేదు. కుందేటికి కొమ్ములున్నట్లు ఎందుకు (దూరం నుండి చూచినప్పుడు) కనిపిస్తోంది? అట్లాగే సృష్ట్యాది యందు ఈ జగత్తు జనించటానికి కారణం లేదు. అందుచేత ఇది ఉత్పన్నమే అయివుండలేదు. ఆద్య స్వరూపమగు బ్రహ్మమే జగద్రూపంగా కనిపిస్తూ బ్రహ్మము రూపముగానే స్థితినొంది ఉన్నది. విచారణచే "ఈ కనబడేదంతా మమాత్మకు అభిన్నం. అద్వితీయం" అని ఎవ్వరికైనా తెలియబడ గలదని మా మనవి.

రత్నమునకు కాంతులు ఎట్లా అబుద్ధిపూర్వకంగా ప్రదర్శితమగుచున్నాయో, బ్రహ్మ సత్త అట్లాగే జగద్రూపంగా అబుద్ధిపూర్వకంగా స్ఫురిస్తోంది. ఈ విధంగా మొట్టమొదట జగత్తు భావనారూపంగాను, ఆ తరువాత ఇందులో అర్థ-క్రియా సామర్థ్యము ఏర్పడుతోంది. చిదాకాశము నందు ఏ కారణం లేకుండానే, సముద్రంలో తరంగాలలాగా, స్వప్న సమూహములవంటి అతిశూన్య రూపములగు అనేక బ్రహ్మాండములు ఉత్పన్నములై విలీనములగుచున్నాయి.

కార్య-కారణత్వముల పరిధిలో కనిపించేదంతా (ఈశ్వరుడు మొదలైన సమస్తం కూడా) మాయా మాత్రాలే అవటంచేత స్వప్నాంతర్గత వ్యవహారంలాగా శూన్య రూపములే అయివున్నాయి.

**జాయతే శూన్యమేవేదం శూన్యమేవ చ వర్ధతే ।**
**నను శూన్యతయాత్యన్తం శూన్యమేవ వినశ్యతి ॥**

ఈ జగత్తు "శూన్యమే (లేనిది)" అగుచు ఉత్పన్నం అగుచున్నది. శూన్యమే అయి వృద్ధి పొందుతోంది. అత్యంత శూన్యరూపమే అయి, శూన్యరూపంగానే నాశనమును పొందుచున్నది. జలతరంగానికి ఆకారం జలంలోంచే బయల్వెడలి, జలంలో లయిస్తున్నట్లు - ఈ దృశ్యము శూన్యంలో జనించి, శూన్యంలో కనిపించి శూన్యంలోనే లయిస్తోంది. ఈ జగత్తు సర్వదా అసత్తే అయివుండి సత్తువలె అనుభూతమౌతోంది. స్వానుభవమగు స్వప్నమే ఇక్కడ మనకు దృష్టాంతం. అట్టి జగత్ స్వప్న సిద్ధాంతాన్ని తిరస్కరించటం ఎటువంటిదంటే... గొర్రెల కాపరి ఒక గొర్రెను తోడేలు ఎత్తుకు పోతుంటే "తోడేలే లేదు" అని పాటలు పాడుకోవటం వంటిది.

ఓ రామచంద్రా! చైతన్యము యొక్క చమత్కారమే స్వరూపంగా కలిగి ఈ జగత్తు అనుభవ మౌతోంది. ఇది అసద్రూపం. భ్రాంతి మాత్రమే. మహా కృత్రిమ స్వరూపం. అట్టి ఈ జగత్తు జ్ఞాని దృష్టిలో అకృత్రిమమగు బ్రహ్మంగానే భాసిస్తోందిగాని సాకారయుక్త జగత్తుగా కాదు.

ఈ సృష్టి – ప్రళయ విభ్రమమంతా చాలాకాలం కొనసాగుచున్న సంకల్ప మాత్ర స్వభావం అయివున్నది. "ఈ కనబడే సృష్టి– ప్రళయములు యథార్థము – పారమార్థికము అగు స్వస్వభావము యొక్క స్ఫురణయే!" ఇది గమనించుటయే తత్త్వజ్ఞానం. భ్రాంతిచే ఇద్దానిని జగత్తు రూపంగా (స్వస్వరూపమునకు వైరైన మరొకటేదోగా) దర్శిస్తూ ఉండటమే అజ్ఞాన విజృంభణము.

❖

మనందరికీ సుషుప్తి తరువాత ఏ కారణం లేకుండానే స్వప్నదృశ్యం అగుపిస్తోంది. అట్లాగే స్వప్నానంతరం అకారణంగానే జాగ్రత్ సంభవిస్తోంది. మరల జాగ్రత్ అనంతరం అకారణంగానే స్వప్న సుషుప్తులు అగుపిస్తున్నాయి. నిద్రించాం కాబట్టి స్వప్నం . గాఢ నిద్రవల్ల సుషుప్తి. మెళకువ వచ్చింది కాబట్టి జాగ్రత్తు. ఈ విధంగా ఈ మూడూ కూడా అంతకుమించి కారణం లేకుండానే సంభవిస్తున్నాయి కదా! అట్లాగే మాయాసహిత బ్రహ్మము ఏ కారణం లేకుండానే తనయందు ఈ దృశ్యము ఉదయించటం గాంచుచున్నది. అట్లా దృశ్యం పొందిన తదనంతరం అర్థ క్రియా సామర్థ్యం తోటి, కార్య–కారణ భావాది రూపంగానూ నియతిని పొందుతోంది. వాస్తవానికి బ్రహ్మము తన చిత్స్వభావముననే ఉన్నది. అయినా కూడా సముద్రంలో తరంగాలు అకారణంగా పరిఢవిల్లుచున్నట్లు కాకతాళీయంగా చైతన్యమునందు చిద్రూప పర్యంతం వలన దృశ్యము స్వయంగా ప్రకాశిస్తోంది. చిదాకాశ మాత్రరూపమగు చైతన్యము తన చిన్మాత్రత్వమును త్యజించకయే జగత్తుగా స్ఫురించటమనేది అద్దాని స్వభావమే అయివున్నది.

మొట్టమొదట అబుద్ధిపూర్వకమైన "దృశ్యాకార ప్రతిభాస" వలన దృశ్యరూపముగా అగుచున్న చిదాత్మ అట్లు దృశ్యరూపంగా అయిన తరువాత, తనయందు "స్మృతి – పృథివి – ఆకాశం – బుద్ధి – కర్మ – జ్ఞానం" మొదలైన సంజ్ఞలను (తన యందలి దృశ్యమునకు) కల్పన గావించుచున్నది.

ఇంతకు మించి దృశ్యమునకు వేరు కారణం లేదు. చిదాత్మయందు చిదాత్మయే చిదాత్మ రూపమగు దృశ్యమును అబుద్ధిపూర్వకంగా – అకారణంగా కాకతాళీయ న్యాయముచే నిర్వర్తించే దర్శనమే జగత్తు.

❖❖❖

## 10. దృశ్యము చిన్మయరూపమేగాని మృణ్మయ రూపం కాదు!

**శ్రీరాముడు :** హే మహర్షీ! 'జగత్తు' అనబడు ఈ ఎదురుగా కనబడే 'దృశ్యం' గురించి మీరు మాకు ప్రసాదించిన నిర్వచనం అమోఘం. ఇదంతా కూడా ఆత్మయందు ఆత్మయే కాకతాళీయంగా దృశ్య రూపంగా జాగ్రత్–స్వప్నములందు దర్శించుచున్నదనునది నిర్వివాదమైన సత్యమని అంగీకరించక తప్పదు. అయితే, ఇక్కడ నాదొక సందేహం –

ఇదంతా కూడా నిద్ర లేవగానే వచ్చిపడి, నిద్రపోగానే అదృశ్యమగు స్వప్నమువలె ప్రతిభాస యందలి కల్పనా మాత్రమేనని కాకతాళీయంగా వచ్చి కాకతాళీయంగా పోవుచున్నదని మీరు

సిద్ధాంతీకరిస్తున్నారు కదా! మీరు వ్యాఖ్యానించిన దానిని అనుసరించి అప్పుడు ఈ జగత్తుకు క్షణిక వాద దోషం సంభవిస్తుదేమో? అప్పుడు ఈ 'జగత్తు' అనే అనుభవం తాత్కాలిక కల్పన మాత్రమే అవుతుంది కదా! ఈ వర్తమాన జగద్దర్శనం 1.స్మృతి (పాత జ్ఞాపకాలు), 2.ప్రత్యభిజ్ఞానయ (ఇతః పూర్వపు సంస్కార బంధము) 3.పూర్వం అనుభూతములైన విషయాల భాగస్వామ్యం కొనసాగటం అనేవి ఉండకూడదు కదా! మరి ఆ మూడు ఇప్పటి ఈ వర్తమాన క్షణ జగత్తులో పాల్గొనుచున్నాయి కదా! "పూర్వము ఉత్పన్నమైన బుద్ధి యొక్క ప్రామాణికానుభవము చేతనే ఇప్పుడు వర్తమానంలో సంస్కారము, ఆ సంస్కారములోంచి వర్తమాన బుద్ధి, ఆ బుద్ధిచేత స్మృతి, ఆ స్మృతిలోంచి అనుభవములు వచ్చి కొనసాగుతున్నాయి" అనునది ఇక్కడి అందరి అనుభవం కదా!

మరి ఈ జగత్తు క్షణిక కల్పన, పూర్వాపర రహితం ఎట్లా అవుతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సింహము ఏనుగు పిల్లను చీల్చివేస్తుంది చూచావా! ఆ రీతిగా ఈ ప్రశ్న (లేక) ఆక్షేపమును ఛేదించివైచి అభేదరూపమగు అద్వైత తత్త్వానుభూతిని ప్రసాదించే వాక్యములు చెప్పుచున్నాను. విను!

"ఈ జగత్తు అసత్తు. క్షణికమైన ప్రతిభాసచే ఉత్పతన్నమౌతోంది" అను (బౌద్ధ) సిద్ధాంతము మనం అంగీకరిస్తే అప్పుడు నీవు చెప్పినట్లు క్షణిక దోషము ఘటిల్లగలదు. అయితే వేదాంత సిద్ధాంతము "ఇదంతా క్షణికం" అని చెప్పి ఊరుకోవటం లేదు మరి?

నిత్య బ్రహ్మ సత్తా రూపమే అగు ఈ జగత్తు ... బ్రహ్మము నందలి విశేషమగు అవిద్యావరణ విక్షేపశక్తుల ప్రభావం చేత... ఒకప్పుడు ఆవిర్భవించినదగుచున్నది. మరొకప్పుడు తిరోభావం పొందినదగుచున్నది. ఒకప్పుడు స్థిరంగాను, మరొకప్పుడు క్షణికంగాను భిన్న భిన్న రీతులుగా భాసించుచున్నది.

కాబట్టి ఈ జగత్తు అనబడుదానిపట్ల స్మృతి – ప్రత్యభిజ్ఞానము రెండూ తగియే ఉన్నాయి. కొయ్యలో చెక్కబడిన దేవతావిగ్రహం కొయ్యలోనే ఉండి ఉన్నట్లుగా ఈ జగత్ రూప దృశ్యము స్వస్వరూపమగు, చిదాకాశ చైతన్యము నందే చిత్రించబడినదై ఉంటోంది.

అయితే... ఒక కొయ్య యొక్క కొన్ని కొన్ని విభాగములను ఉలితో ఛేదించి వడ్రంగి కొయ్యను దేవతా విగ్రహంగా మలచుచున్నాడు. కాని అద్వితీయమగు చైతన్యమునందు 'జగత్తు' అనబడేది చెక్కటానికి ఉలివంటి పరికరములుగాని, వడ్రంగి వంటి నిమిత్త ఉపాదాన కారణాలుగాని లేవు. ఈ జగత్తుకు వేరుగా కర్త ఎవరూ లేరు. "కాదు బ్రహ్మదేవుడు దీనికి కర్త కదా!"... అంటావా? ప్రతి జీవునికి తన రీతిలో తన కల్పనానుసారమే జగదనుభవం ఉంటూ ఉండగా,... అద్దానికి మరొకరికి కారణం ఆపాదించటం ఎట్లా? కనుక ఈ జగత్తు వడ్రంగి వృక్ష కాండ ఖండంలో చెక్కే దేవతా విగ్రహం వంటిది కాదు.

జడమగు వృక్షస్తంభమును ఎవరో చెక్కితేగాని దేవతా విగ్రహంగా బయల్వెడలదు. కానీ, చైతన్యమున ఆ చైతన్యము యొక్క ప్రభావం చేతనే 'జగత్తు' అనే విగ్రహం పూర్ణముగా అభివ్యక్తం

అవటం, ప్రకాశించటం జరుగుతోంది. ప్రతి జీవునియందు తనకు తనయందు తాను బ్రహ్మదేవత్వము వహించియుండటం ఏర్పడియే ఉన్నది.

ఈ జగత్తు సర్వదా చిదాకాశమే! ఇది పరమార్థ స్వరూపము నుండి చ్యుతిని పొందకుండానే చిన్మాత్రత్వముచే స్వాత్మయందే నెలకొని ఉంటోంది. కాబట్టి ప్రళయ – సుషుప్తి సమయములలో ఇది సత్తామాత్ర స్వరూపం పొందినదై ఉంటోంది. అనగా ఆ సమయములలో ఇది కనబడకపోయినప్పటికీ, లేకుండా పోవటం లేదు.

సృష్ట్యాదియందు ప్రప్రథమంగా ఈ చైతన్యం నిర్వికల్పరూపంగానే ఉన్నది. ఆ తరువాత ప్రాణుల అభీష్టానుసారంగా మనో వికల్పములచే చిత్ర – విచిత్రములైన సృష్టుల కల్పనను గావించుచున్నది. అనగా ఈ రోజు కన్నకలలాగా చిదాకాశరూపమగు చైతన్యము తన హృదయంలో జగద్రూప దృశ్యపరంపరలను తానే కల్పించుకొనుచున్నది.

ఇది చిన్మాత్రముతో కూడి సత్తా సామాన్య రూపమైనట్టి, జగత్తుకే బీజరూపమైనట్టి "బ్రహ్మకళ". ఇది ఆ బ్రహ్మకళయందు ప్రతిబింబించే చైతన్యము. ఇది ప్రాణాదియుక్తమగు ప్రతిబింబ స్వరూపమగు జీవుడు. ఇది అభిమానవృత్తి ప్రధానమగు ఆ చిత్ప్రతిబింబరూపమగు అహంకారం. ఇది నిశ్చయాత్మక ప్రతిబింబ చైతన్య రూపమగు బుద్ధి. ఇది సంకల్పాత్మక ప్రతిబింబ చైతన్య రూపమగు చిత్తము. ఇది కాలము. ఇది ఆకాశము. ఇది 'వీడు, వాడు, నేను, నీవు' అనే రూపములు. ఇది క్రియ. ఇవి పంచతన్మాత్రలు. ఇవి ఇంద్రియ సమూహములు. ఇది మనో–బుద్ధి–ఇంద్రియ–చిత్త–అహంకారాది రూపమగు పూర్యష్టకము. ఇది దేహ ఇంద్రియ సమూహ మధ్యగా సంచరించే సూక్ష్మదేహం. ఇదేమో స్థూల శరీరం. నేను బ్రహ్మదేవుడను. నేను విష్ణువును. నేను మహేశ్వరుడను. నేను సూర్యుడను. ఇది బాహ్యము. ఇది సృష్టి. ఇది జగత్తు...

ఇటువంటివన్నీ చైతన్యము తనయందు సృష్ట్యాది యందు కల్పన గావించుకొనుచున్నది. అయితే... అట్టి కల్పనా సమూహమంతా కూడా సర్వదా అతి నిర్మలమగు చిదాకాశమే అయివున్నదిగాని... చిదాకాశముకంటే అన్యముగా అణుమాత్రం కూడా లేనేలేదు. కాబట్టి రామచంద్రా! ఇక అజ్ఞానులచే కల్పించబడే జడ పదార్థ సమూహమెచ్చట? స్మృతి ఎచ్చట? ద్వైత – ఏకత్వమెచట? చిదాకాశ రూపమే అగు విశాల జగత్ ఖండము కారణము లేకయే స్వప్నంలోలాగా భాసించుచు వికారయుక్తంగా ఉన్నదానివలె భాసిస్తోంది. చిన్మయమగు ఆకాశమున చిన్మయరూపమే అయి ఈ జగత్తు స్ఫురించుచున్నది. అట్టి జగత్తును ఎరుగుచున్నది కూడా చిదాత్మయే! తెలుసుకునేది తెలియబడేది కూడా చిదాత్మరూపమే అయివుండగా ఇక కల్పిత జగత్తు ఎచ్చట? ఆకాశంలో శూన్యత్వంలాగా "ఏకం, శాంతం" అయినట్టి చిదాకాశమున చిదాకాశ రూపమేయగు జగత్తు స్ఫురిస్తూ ఉంటే ఇక స్మృతి ఏమి? స్వప్నమెచట? కాలము ఎచట? అనేక బ్రహ్మాండాల కల్పన ఎచట?

ఓ రామచంద్రా! చిద్ఘనము యొక్క అంతరమున ఏ 'సత్త' కలదో... అదియే బాహ్యంగా పంచభూత రూపముగా ప్రదర్శితమౌతోందయ్యా! వాస్తవానికి బాహ్యమున గాని – అభ్యంతరమున

గాని సన్మాత్రము తప్ప వేరుగా మరేదీలేదు. ఓ వాదోపవాదములు చేయు మిత్రులారా! ఇది వినండి.

**నిరస్తావయవాచ్ఛాన్తాదనాఖ్యాద్యత్ప్రవర్తతే**
**అకారణం భవేద్భూతం తదన్ధాః కథమన్యథా?**

అవయవ రహితము, శాంతము, వాక్కునకు అవిషయము అయినట్టి చిన్మాత్రము నుండి కారణము లేకయే ఏది ఉత్పన్నమగుచున్నదో, అది మంచుశిల యొక్క ఆకారమువలె ఉత్పన్నము కాకయే ఉన్నది సుమా! అయినా, కూటస్థమగు చైతన్యమును వికారవంతం చేసేదెవరు? ఎట్లా వికారవంతమౌతోంది? అందుచేత... పరబ్రహ్మము ఎట్టి శుద్ధ చిన్మయ స్వరూపము అయివున్నదో... ఈ దృశ్య జగత్తు కూడా అట్టి చిన్మయరూపమే అయివున్నది.

కలలో ఏది ద్రష్టరూపమో అదియే స్వప్ననగరం కదా! ఏది స్వప్న నగరమో అది స్వప్న ద్రష్టరూపమే కదా! అందుచేత ఈ దృశ్యము ఒకింతకూడా లేదు. నిర్మల జలంలో ధూళి ఎక్కడుంటుంది? పరమ చిదాకాశంలో దృశ్యం లేదు. ఇక ఇక్కడ ఏది భాసించుచున్నదో ... అది విషయరహితమై, కాబట్టి స్వమాత్ర ప్రకాశమై, ప్రశాంతమైనట్టి చిన్మాత్రమే... తనయందు ఈ ప్రకారంగా జగత్తువలె స్థితిపొందినదగుచున్నది.

**పూర్ణాద్వై బ్రహ్మణః పూర్ణమప్యనుద్ధృతముద్ధృతమ్**
**ఇవేదం భాతి భారూపమాభాసం పరమాత్మకమ్ ॥**

పూర్ణమగు బ్రహ్మము నుండి పూర్ణము, ప్రకాశరూపము అగు ఏ ఈ జగత్తు వాస్తవానికి ఉత్పన్నమే కాకయున్నదో... కాని ఉత్పన్నము అయినట్లు భాసించుచున్నదో... అదంతా కూడా ప్రకాశరూపమగు పరమాత్మయే అయివున్నది. ఓ దృశ్య జగత్ రూపమగు పరమాత్మా! మాకు అనన్య స్వరూపమగు మీకు ఇవే మా సాష్టాంగ దండ ప్రణామములు!

❖❖❖

# 11. విశ్రాంత చిత్తుని జీవన్ముక్త లక్షణములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కాబట్టి ఓ సర్వసభికులారా! మీరంతా "చిదాకాశ రూపమ్ – శివోఽహమ్ శివోఽహమ్" అని గ్రహించినవారై జీవన్ముక్తులయి ఉండండి.

**శ్రీరాముడు :** మహాత్మా! "జీవన్ముక్తుడు" అనగా ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**న సుఖాయ సుఖం యస్య, దుఃఖ దుఃఖాయ యస్య నో ।**
**అంతర్ముఖమతేర్నిత్యం స ముక్త ఇతి కథ్యతే ॥**

ఓ రామచంద్రా! ప్రత్యగాత్మయందు మాత్రమే ఆసక్తి గలిగియుండి అంతర్ముఖమైనట్టి నిత్యబుద్ధిని ఏ ఆత్మజ్ఞాని సంపాదించుకుంటాడో... ఏ శుద్ధ దర్శనముచే సహజీవుల బాహ్య నామరూపాలకు అతీతంగా ఆ సహజీవులను ఆత్మదృష్టిచే దర్శిస్తూ ఆనందిస్తూ ఉంటాడో...ఏ అవగాహనాపరునికి

సుఖహేతువగు విషయ సమూహము సుఖమునుగాని, దుఃఖహేతువగు విషయ సమూహము దుః ఖమునుగాని కలిగింపజాలవో... అట్టి వ్యక్తియే "జీవన్ముక్తుడు". ఏ విధంగా అజ్ఞానుల బుద్ధి విశాలభోగవాసనలనుండి చలించకయే ఉంటుందో... ఆ విధంగానే, అంతగానూ జీవన్ముక్తుడగు జ్ఞాని యొక్క బుద్ధి చిదాకాశదృష్టిని విడజాలక అద్దానియందు నిశ్చలంగా ఉంటోంది. ఎవని చిత్తమైతే చిన్మాత్రాత్మయందు విశ్రాంతి పొందినదై, మనస్సు మరల ఈ దృశ్యమునందు ప్రీతి గొనకయే ఉంటుందో... అట్టివాడే 'జీవన్ముక్తుడు' అని శాస్త్రములచే నిర్వచించబడుచున్నాడు.

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా!

**న సుఖాయ సుఖం యస్య, దుఃఖం దుఃఖాయ యస్య నో**
**జగమేవ మునే మన్యే మానవమ్ తమచేతనమ్ ॥**

ఎవనికైతే సుఖహేతువైన విషయము సుఖమునుగాని, దుఃఖహేతువగు విషయము దుః ఖమునుగాని కలిగంచవో... అట్టి జీవుని "చేతనరహితుడు" అని అనుకోవటం కద్దు కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! శుద్ధబోధ స్వరూపుడగు జీవన్ముక్తుడు సర్వదా చిదాకాశమునందే స్థితి కలిగి వుంటాడు. అప్రయత్నముగానే ఈ లౌకిక సుఖ దుఃఖములను అధిగమించినవాడై, అతీతుడై ఉంటాడు. అట్టి విశ్రాంత చిత్తునికి శాస్త్రములు 'జీవన్ముక్తుడు' అని పేరుపెట్టాయి. ఆతని యందు స్వవివేకముచే మూలాజ్ఞానము నశించి ఉంటుంది. సమస్త జగద్విషయముల పట్ల సర్వ సందేహములు తొలగిపోయి ఉంటాయి. ఆతడు 'పరమాత్మ' అనే మహత్తరమైన శయ్యలో పరమ విశ్రాంతి పొందుతూ ఈ జగత్తులో వ్యవహరిస్తూ ఉంటాడు. వ్యవహారములు నిర్వర్తిస్తున్నప్పటికీ ఆతని అంతరంగం ఈ దృశ్యంలో ఏ ఒక్క విషయము పట్ల ప్రీతిగొని ఉండదు. ఏ విశేషముపట్లాకూడా రాగం-కామం ఉండదు. సమస్త కార్యములపట్ల ఆతని యందు కోర్కె యొక్క సంకల్పము ఉండదు. ఏది చేయవలసి వచ్చినా ఫలాపేక్ష రహితుడై ఉంటాడు. అపేక్షా రహితంగా "ఇది విధ్యుక్త ధర్మానుసారం ఇట్లే జరుగుగాక"... అని ఒకానొక అస్పృశ్య - అంతర్ముఖ దృష్టి పెంపొందించుకొని ఉంటాడు.

యథా ప్రాప్తములైన పదార్థములను అనుభవిస్తూ రాగరహితుడై "ఏదీ తనకు చెందినది కాదు" అనే అవగాహనను సుస్థిరీకరించుకొని ఉంటాడు. ఓ రామచంద్రా! ఓ సర్వజనులారా! ఈ సంసార మార్గంలో ఎక్కడా విశ్రాంతి లేదు. ఆత్మజ్ఞానం - ఆత్మ దర్శనంలో మాత్రమే విశ్రాంతి ఈ జీవునికి లభిస్తుంది. ఇదంతా (ఈ సంసార మార్గమంతా) అతిదీర్ఘము, ఆధార వర్జితము.

అలసి ఉన్న ఓ బాటసారులారా! మీరంతా జీవన్ముక్తునివలె చిన్మాత్ర దర్శనమును అభ్యసించి ఆత్మయందు విశ్రాంతిని పొందటమే ఈ సంసార రోగమునకు ఔషధమని గమనించండి. ఆత్మయందు విశ్రాంతిని అనుభవించే జీవన్ముక్తుడే సర్వోత్తముడు.

ఓ సహమిత్రులారా! ఈ సంసారమునందు చిరకాలము పరుగులుతీసి అలసిపోయి ఉన్నారని విచారించకండి. ఆత్మజ్ఞానమును సముపార్జించి బ్రహ్మీదృష్టిచే జీవన్ముక్తుని వలె బ్రహ్మపదమునందు విశ్రాంతిని ఆశ్రయించండి.

జీవన్ముక్తుడు బ్రహ్మపదమునందు విశ్రాంతిని పొందుచుండగా, ఇక ఈ జగత్తులో వ్యవహారపరుడైనప్పటికీ "సుషుప్తి" యందు ఉన్నవానివలె ఉంటాడు. అట్టి జ్ఞానులు ద్రష్ట – దృశ్య – దర్శన (త్రిపుటి) రహితమగు శుద్ధ స్వచిత్తాకాశంలో శుద్ధ చిద్రూపులై నిత్యోదిత సూర్యునివలె భాసిస్తూ ఉంటారు. వారికి ఈ సంసారము పట్ల ప్రీతి – ఆశ – నిరాశ – దుఃఖము – గర్వము మొదలైనవి ఉండవు. అట్టి ఉత్తమోత్తములగు జీవన్ముక్తులు దేహధారులై ఉండి కూడా దేహరహితులై ఉంటారు. లౌకిక వ్యవహారముల పట్ల నిద్రించుచున్న వారివలె ఉంటారు. వారు పైకి జడులుగా చూపట్టవచ్చునేమోగాని, జడులు మాత్రం కారు. అయితే, వారి దృష్టిలో ఈ జగత్తు స్వప్న సదృశమైపోవటం చేత ఇద్దానిపట్ల వారు అంతరంగంలో ఉదాశీనులై చరిస్తూ ఉంటారు. అందుచేత "వారు ఈ ప్రపంచం పట్ల నిద్రితులై ఉంటారు" అని చెప్పబడుచున్నారు. అంతేగాని, వాస్తవానికి వారు జడ నిద్రకు వశీభూతులైనవారు కానేకాదు సుమా!

వారు 'సంసారము' అనే దీర్ఘ మార్గమునందు పరిభ్రమించటం నుండి నివృత్తి పొందినవారై ఉంటారు. ఆత్మయందు సుఖ విశ్రాంతి పొంది ఉంటారు.

ఆ మహానుభావుడగు జీవన్ముక్తుడు బహిర్ముఖ వృత్తిగల అజ్ఞానులతో సంభాషించేటప్పుడు నిరతిశయానంద రూపమగు ఆత్మయందు మౌనముగా సుఖ విశ్రాంతిని కొనసాగిస్తూనే ఉంటాడు. అంతేగాని జడస్వరూపుడు కాదు.

**యా నిశా సర్వభూతానామ్ అవిద్యాన్తమయాత్మికా ।**
**పరో బోధః పరా శాన్తిః తత్రాసౌ సమమాస్థితః ॥**

అవిద్యాంధకారంలో వ్యవహరించే సమస్త జీవులకు ఏది "రాత్రి"వలె ప్రాముఖ్యం లేక అపరిశీలనాత్మకమై ఉంటోందో, వారు అద్దాని పట్ల నిద్ర వ్యవహరిస్తున్నారో... అది జీవన్ముక్తునకు పరమబోధరూపమై, పరమ శాంత రూపమగు ఆత్మస్థానము అయి ఉంటోంది. ఆ ఆత్మదర్శనయోగం ఆతనికి సర్వదా జాగ్రత్ వ్యవస్థగా కన్పట్టుచున్నది. అట్టి జ్ఞానానందమయమగు జీవన్ముక్తుడు సదా సర్వత్రా సమరూపమున వెలయుచు పరమానందముగా ఈ జగత్తులో సంచరిస్తూ ఉంటే, అట్టి సమదర్శి యొక్క పవిత్ర పాదముల స్పర్శకు భూదేవత పులకిస్తూ ఉంటుంది. దుఃఖ ప్రదమగు ఏ ఈ సంసార రూప దృశ్యమున సమస్త సంసార తన్మయ ప్రాణులు మేల్కొని ఉన్నవారై అతిజాగరూకతతో ఏదేదో వెతుకుతూ కాలం వెళ్ళబుచ్చుచున్నారో... జీవన్ముక్తుడు అద్దానియందు నిదుర కలిగి ఉంటున్నాడు. ఆతడు పరమ సుఖి అయి ఉండగా... ఇక జడుడు ఎట్లా అవుతాడయ్యా?

**యః కర్మౌఘమనాదృత్య స్వాత్మన్యేవావ తిష్ఠతే ।**
**స ఆత్మారామ ఇత్యుక్తో, న జడోఽసౌ, రఘూద్వహ ॥**

ఓ రఘుకుల శ్రేష్ఠుడగు రామచంద్రా! ఎవడైతే ఈ సంసారంయొక్క సర్వ విషయాల పట్ల విరక్తుడై సమస్త కర్మఫల సమూహాలను బుద్ధిచే త్యజించినవాడై, సర్వదా స్వాత్మయందే నెలకొని ఉంటాడో... అట్టివాడు "ఆత్మారాముడు" అని చెప్పబడుచున్నాడు. అట్టి ఆత్మారాముడు జడుడా?

కానే కాదు. ఆతడు భవ్య పురుషుడు. విదిత వేద్యుడు. తెలుసుకొనవలసింది తెలుసుకొని ఉన్నవాడు. ఈ సంసార సముద్రపు ఆవలి తీరమును జేరి విశ్రాంతి సుఖమును అనుభవించుచున్నాడు. ఆత్మనే దర్శిస్తూ, ఆత్మనే ఆరాధిస్తూ, ఆత్మయందే రమిస్తూ, ఆత్మయందే స్థితి కలిగి ఉన్నాడు సుమా! ఆతడు మాకు తారసపడినప్పుడు మహర్షులమైన మేము ఆతనికి హృదయపూర్వకంగా నమస్కరిస్తున్నాం.

❖

ఈ జీవుడు అనబడే బహుదూరపు పథికుడు (బాటసారి) సుదీర్ఘమగు సంసార మార్గంలో చిరకాలంగా సంచరించుటచే అలసిపోయి ఉన్నాడు. భోగసాధకాలగు పదార్థములను సేవించి, సంసారంచే మోసగించబడి వ్యాకులుడై ఉన్నాడు. వంచించుటలో అతి ప్రావీణ్యం చూపించే క్రూరులగు 'విషయాలు' అనే దారిదోపిడిగాండ్రచే సంసార మార్గంలో అతి బాధితుడై వేదన చెందుతూ, బయటకు మాత్రం "నాకు అది తెలుసు, ఇది తెలుసు. వీళ్ళ సంగతి నేను చూస్తానుగా" ఇట్లా తలచుచు వ్యర్థంగా కాలమును, అవకాశాలను వృథా చేసుకుంటున్నాడు. వార్ధక్యం అనే మంచువర్షానికి పీడితుడై మరల మరల లోక వ్యవహారములచే పరివంచితుడగుచున్నాడు. 'జన్మలు' అనే మహారణ్యంలో చిక్కుకున్న జింకలాగా అటూ ఇటూ తిరుగాడటంలో వ్యర్థంగా ఆసక్తుడై ఉంటున్నాడు. అనేక దుఃఖ సంకటాలచే పరిపూర్ణమై 'సుఖం' అనే నీడయే కనబడనటువంటి సంసార ఎడారిలో స్వయంగా నిస్సహాయుడై దూరదూరంగా వెళ్ళుచున్నాడు. "పాపదృష్టులు" అనే మూట భుజముపై పెట్టుకొని అడుగడుగున పడుతూ, లేస్తూ దొర్లుతూపోతున్నాడే! అర్థ-అనర్థములనే రెండు అంచులు గల బాటలో నడుస్తూ అనేక సంకటములచే బుద్ధి కలత చెందుచుండగా తన దుఃఖములు తనకే అర్థం కాకుండా మహా ప్రయాణం కొనసాగిస్తున్నాడు.

ఆ విధంగా సంసార మార్గంలో నడుస్తూ మిక్కిలి అలసిపోయినట్టి ఈ జీవుడు ఒకానొకప్పుడు సౌభాగ్యవశం చేత, అనేక జన్మలలో చేసుకొన్న పుణ్యవశంచేత సాధన చతుష్టయ సంపత్తియుక్తుడై సచ్ఛాస్త్ర - సద్గురువుల అనుగ్రహమునకు పాత్రుడగుచున్నాడు. తత్త్వమును సేవించి తత్త్వసాక్షాత్కారం సముపార్జించుకొని ప్రబుద్ధుడగుచున్నాడు. ఆత్మజ్ఞాని అయి, సంసార సముద్రమును దాటి, ఆవలి తీరం చేరి శయ్య లేకున్నా సుఖముగా, విశ్రాంతిగా ఆత్మానుభూతియందు శయనిస్తున్నాడు. అట్లు ఆత్మనే అంతటా దర్శించే దృష్టియందు శయనించువాడే జీవన్ముక్తుడు.

ఆహా! ఆ జీవన్ముక్తుని ఆత్మదృష్టిలో పొందే సుఖనిద్ర గురించి ఏమని చెప్పమంటావు? అక్కడ భౌతికమైన 'శయ్య' లేకపోవచ్చు. ఆతని ప్రాణాలు ప్రశాంతత సంతరించుకుంటున్నాయి. ఆతడు స్వప్న రహితుడై, సుషుప్తి వర్జితుడై నిత్య ఆత్మసాక్షాత్కార జాగ్రత్‌లో స్వస్వరూపానందముచే సుఖంగా విశ్రమిస్తూ ఉంటే, బ్రహ్మ ఋషులమగు మేము కూడా ఆతనిని చూచి ఆనందిస్తున్నాం. ఆ జీవన్ముక్తునికి మేము చేతులెత్తి సదా నమస్కరిస్తున్నాం. ఆహా! జాతి గుఱ్ఱంలాగా ఆ ఆత్మజ్ఞాని భుజించుచున్నప్పుడు, నడుచుచున్నప్పుడు, శ్వాస తీసుకుంటున్నప్పుడు, మాట్లాడుచున్నప్పుడు, సంసార మహారణ్యం మధ్యగా ఉండి కూడా సుఖపూర్వకంగా ఆత్మయందు సుఖ విశ్రాంతిని ఆస్వాదిస్తున్నాడు కదా!

❖

ఓ రామచంద్రా! ఈ సంసారులుకూడా ఆదమరచి కొంచెంసేపు గాఢనిద్ర అనుభవిస్తున్నారు. అయితే తత్త్వజ్ఞుల యొక్క నిద్ర సాంసారిక నిద్ర కంటే అత్యంత విలక్షణమైనది. అక్కడ విశ్రాంతి అత్యంత ఘనీభూతమై ఒప్పుచున్నది. ఎందుకంటే గట్టిగా శబ్దం అయితే చాలు, సాంసారిక జీవుని సుఖ నిద్ర విచ్ఛేదనమౌతోంది. ఇక జీవన్ముక్తుని ఆత్మసుఖనిద్ర ప్రళయ గర్జనలచేతగాని, ఈ అవయవాలు ఛేదింపబడుచున్నప్పుడుగాని, మృత్యువు ఆసన్నమై ఈ దేహాన్ని స్తంభింపజేస్తున్నప్పుడు గాని, ఈ దేహాదుల రాకపోకల చేతగాని ఏ మాత్రం చెదరటమే లేదు. ఆహా! తత్త్వజ్ఞుల ఆత్మదర్శనం అపూర్వం! మహాఘనీభూతం! అమోఘం! చిన్మాత్ర దర్శనముచే వారు ప్రబుద్ధులై ఈ బాహ్యేంద్రియాలను నిరింద్రియాలుగా దర్శిస్తున్నారయ్యా! వారు కళ్ళు మూసుకోకపోయినప్పటికీ ఈ ప్రపంచమంతా ఇందలి సర్వ సంక్షోభాదులతో సర్వదా విలీనమై ఉంటోంది. జగత్తునంతా మ్రింగివైచి, జగత్తును స్వాత్మయందు లయం చేసివేసి, ఆత్మానంద రసామృతమును గ్రోలి పరమపూర్ణత్వమును పొందినవాడై 'ఆత్మజ్ఞాని' ప్రశాంతంగా జగద్విషయములపట్ల నిదురిస్తున్నాడు. ఆత్మయందు ప్రశాంత సుఖమును, జగత్తుపట్ల సుషుప్త సుఖమును సంపాదించుకొని తృప్తుడై ఉంటున్నాడు. ఆతని నిరతిశయమగు ఆనందం ముందు విషయజనితమైన ఆనందము, – సూర్యభగవానుని సహస్రకిరణ తేజస్సు ముందు నూనె దీపం వంటిది. అట్టి ఆత్మానందముతో కూడుకొనినవాడై స్వయంప్రకాశమగు స్వాత్మ ప్రకాశముచే అద్వయము – తెంపులేనిది అగు సుఖమును అనుభవిస్తూ ఆత్మజ్ఞాని ఈ ఈ సర్వజగత్ విషయముల పట్ల మౌనరూప నిద్రాముద్రను వహించి ఉంటున్నాడు. కామ–క్రోధ–లోభ–మోహ –మద–మత్సర్యాలు అనే అరిషడ్వర్గాంధకారమునకు ఆతని హృదయంలో చోటు దొరకటం లేదు. అమూర్తమగు ఆత్మ జ్ఞాన జ్యోతి వెలుగుచుండగా కామక్రోధాది చీకట్లు ఎట్లా ఉంటాయి? ఆత్మానంద రసము గ్రోలుచూ ఆతడు "ఇక్కడ నేనేం పొందాను? నా కర్మ! నా బ్రతుకు ఇంతే!"… ఇత్యాది అల్పవాక్యములు రావు. గంభీర్యము సంతరించుకున్నవి, ఈ జగత్తులన్నీ ఆక్రమించివేసినవి అగు మహత్తర, మహనీయ, మాననీయ వాక్యములు మాత్రమే ఆతని పెదవులు ఉచ్చరిస్తాయి.

ఆతడు సుఖంగా స్వాత్మయందు శయనించి ఉండగా, ఆతని ఒకానొక విభాగం ఈ ప్రపంచంలో ఆశ – అడియాసలచే స్పృశించబడకుండానే వర్ణాశ్రమమునకు ఉచితమైన వ్యవహారము నిర్వర్తిస్తూ లోక కల్యాణార్థం (లోకమునకు ఏ విధంగా సానుకూల్యమో… ఆ రీతిగా) వ్యవహరిస్తూ ఉంటోంది. ఆతడు సర్వదా సర్వ బాహ్య పదార్థములందు అనాసక్తుడై, అభ్యంతరమున ఆత్మానందరసమునందు మాత్రమే అనురక్తుడై ఆత్మయందు విశ్రాంతి పొందుచూ ఉండగా శాస్త్రముల ఉద్దేశసారం ఆతని యందు సార్థకమై ఉంటుంది.

ఆతడు ఆత్మను సూక్ష్మ పదార్థములన్నిటికంటే అతిసూక్ష్మమైన దానిగాను, స్థూలములన్నిటికంటే అతి స్థూలమైనదిగాను దర్శించుచు 'చిదాకాశము' అనే శయ్యపై పరుండి "మమాత్మా సర్వభూతాత్మా" …అను రూపముతో కూడిన ప్రశాంతతతో నిద్ర సుఖం అనుభవిస్తూ ఉంటున్నాడు.

"జగత్తులోనో, ఆయా లోకములలోనో ఒక మూలగా ఉండే ఈ దేహము నేను కాదు. నాది చిత్స్వరూప దేహం. అట్టి నా చిత్స్వరూపదేహంలో అణువణువునా ఇటువంటి అనేక బ్రహ్మాండాలు

ఉన్నాయి. నా చిత్స్వరూపం అతి సూక్ష్మము అత్యంత స్థూలము అగుటచేత అణురూపం – విశ్వరూపము కూడా అయివున్నది. ఈ విశ్వమంతా నా దేహమే!" ...అని తలచుచు ఆతడు ఈ బ్రహ్మాండములన్నీ తన యొక్క చిత్స్వరూప దేహమునందే గాంచుచున్నాడు. ఆహా! ఆత్మజ్ఞాని అనేక సృష్టి సమూహములను సంహారం చేసివేస్తూ, వాస్తవానికి దేనినీకూడా సంహారం చేయకయే ఉంటూ మహత్తరమైన 'ఆత్మప్రకాశము' అనే శయ్యపై యోగనిద్ర అనుభవిస్తున్నాడు. ఇక ఈ ఎదురుగా కనిపించే సంసార సమూహమంతా సాంసారిక జీవునికి దాటరాని సముద్రంలా అగుపిస్తుంటే... ఆ ఆత్మజ్ఞానియగు జీవన్ముక్తునికి ఇదంతా కలలో చూచే దృశ్యంలా అసలు విషయమే కానట్లు అనిపిస్తోంది. పూర్ణ ప్రకాశముతో వ్యక్తమయ్యే ఎనిమిది దిక్కులవలె ఆతడు అంతటా అన్నివైపులా "అంతా నా ఆత్మ స్వరూపమే" అనే ప్రకాశాన్ని అనుభవిస్తున్నాడు. "నేను నా సద్రూపంచే అంతటా (సర్వత్రా) సర్వదా వ్యాపించి ఉన్నాను. సమస్త పదార్థముల స్వసత్తా సామాన్యమును సంతరించుకొనియే ఉన్నాను. అంతటా వ్యాపించియున్న ఆకాశం కూడా నా చిత్ శరీర విభాగమే అగుచున్నది. అందుచే ఆకాశము కంటే కూడా అధిక వ్యాపకుడను" అని ఆతడు తన చిత్ శరీరమును గాంచుచున్నాడు.

"ఈ పృథివి మొదలైనవి ద్రవరూపం నుండి (ఆపోరూపం) వస్తున్నాయి. ద్రవరూపాలు అగ్ని నుండి వస్తున్నాయి. అగ్ని వాయువునుండి, వాయువు ఆకాశము నుండి వస్తున్నాయి. అట్టి ఆకాశము ఎందులోంచి బయల్వెడలుతోందో, ఎందులో ఉండి ఏది ఆధారముగా కలిగి ఉంటోందో... అట్టి చిదాకాశమే నా దేహం."

అని అతడు సర్వము తనయందే గాంచుచున్నాడు. ఆతడు ఆత్మగా అంతటా అనుభూతం చేసుకొని ఉండగా, ఇక 'ఆత్మ జ్ఞాన చర్చ' అనే భాషా ప్రయుక్తితో కూడిన సుదీర్ఘ వ్యవహారంతో పనేముంది? "నిర్మల చిదాకాశ రూపుడను, సర్వదా సర్వమునకు కేవల సాక్షిని అగు నా యొక్క ఒకానొక మూల 'జగత్తు' అనబడే స్వప్న సదృశదృశ్యమును గాంచుచున్నాను కదా"... అను అనుభవముచే ఆత్మశయ్యపై నిద్రిస్తున్నప్పటి (ఇదంతా ఆతనికి) 'జగత్' అనే మధుర స్వప్నముగా అగుచున్నది. 'ఆత్మ' అనే రసముచే ఆతనికి ఇది మధుర పానీయమే అవుతోంది.

ఇక ప్రవాహ పతితమైన యథాప్రాప్తములైన వ్యవహారాలన్నిటినీ 'ఆత్మజ్ఞానము' అనే శయ్యపై శయనిస్తూనే, యోగనిద్రావశుడై ఉంటూనే నిర్వర్తిస్తున్నాడు. నిద్ర మేల్కాంచినవాడు నిద్రలో అనుభూతమైన స్వప్నమును ఎంతో ప్రయత్నం చేస్తేగాని స్మరించలేకపోవుచున్నాడు కదా! ఆత్మయందు మేల్కొనియున్న జీవన్ముక్తుడు అతి ప్రయత్నంచేత తనయొక్క బహిర్ముఖత్వమును, బాహ్య దేహత్వమును అతి కొంచెంగా వహిస్తూ ఆత్మయందే స్థితిని కొనసాగిస్తున్నాడు. ఆ పరమ చిదాకాశ రూపత్వము పొందిన ఆత్మజ్ఞాని ఆకాశమువలె విశాలమై, సూక్ష్మమైనట్టి నిజస్వరూపముయొక్క జ్ఞానమును సర్వదా కలిగి ఉంటున్నాడు. ఈ దేహాదుల వ్యవహారం 'అసత్తు' అని ఎరిగి ప్రయత్నపూర్వకంగా ఈ జీవ – జగదాది ధర్మములు లీలగా, క్రీడగా నెరవేరుస్తున్నాడు.

చూచావా రామచంద్రా! ఈ ప్రకారంగా జ్ఞాని ఆత్మయందు విశ్రాంతి పొందుచూ సదా నిదురిస్తున్నప్పటికీ, ఇక లోకప్రసిద్ధములై ఉన్న జాగ్రత్ – స్వప్నములలో ఇతరుల వలెనే మేల్కొనుచు,

నిదురించుచూ ఇక్కడ లీలామాత్రంగా ప్రవర్తిస్తున్నాడు. ఆతనికి ఈ జగత్తుతో స్వస్వరూపానుసంధాన ప్రాభవం చేత మిత్రత్వమే గాని, శత్రుత్వం ఉండదు.

సర్వ వైషమ్యములను సర్వదా ఆతడు మొదలంటా త్యజించియే ఉంటాడు. సమచిత్తుడు కాబట్టి స్వభావ సిద్ధంగానే శమము, దమము, తితిక్ష, జ్ఞాన వైరాగ్యం, సంతోషము మొదలైన మనోహరమైన వృత్తిరూపుడై ఉంటాడు.

దేహమున్నంతవరకు దేహముతోను, ఆ తదనంతరం దేహరహితంగాను (విదేహం) ఆతడు కైవల్యమునందు విశ్రమిస్తున్నాడు. అంతేగాని ఈ తుచ్ఛ జగత్ విషయ పరంపరలయందు గాదు. ఆతని మిత్రత్వం సర్వదా శ్రేయోమయమే అయి ఉంటుంది. ఇదంతా ఆతనికి క్రీడయే! దృశ్య విషయములు అనే స్వకీయ మిత్రులలో లీలగా క్రీడిస్తూ హాయిగా గడుపుతూ ఉంటాడు.

❖❖❖

## 12. తత్త్వజ్ఞాని - వ్యవహార విశేషాలు

**శ్రీరాముడు :** మహాత్మా! మహానుభావుడు, తత్త్వజ్ఞాని అగు జీవన్ముక్తుడు ఎవరెవరితో క్రీడిస్తాడు! ఆతనికి మిత్రులెవరు? ఆతని క్రీడ ఎట్టి స్వభావం కలిగి ఉంటుంది? ఆతని క్రీడ స్వాత్మస్థితి రూపమైనదా? లేక ప్రాపంచికమైనదా? ఆతడు తనయందే ప్రీతిని పదిలపరచుకుంటాడా? ఆతని ప్రీతి ఈ భోగపదార్థముల పట్ల అందరికీ ఉండే ప్రీతి వంటిదేనా? లేక ఆతని ప్రీతికి వేరే ప్రత్యేకత ఏమైనా ఉంటుందా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆతనికి ముగ్గురు కర్మ దేవతా రూపులగు దేవతలే స్నేహితులు. వారితోనే ఆతని క్రీడ!

**1. సహజకర్మ :** తాను జన్మించిన ఉపాధిని అనుసరించి కుల – వృత్తి ధర్మంగా ఆతడు నిర్వర్తించవలసిన ఏఏ కర్మలు తదితరులకు సానుకూల్యమో... ఆయా విధులు–ధర్మములు ఆతనికి సహజ కర్మ మిత్రుడు. ఆతడే ఆతని మొదటి సహచర స్నేహితుడు.

**2. శాస్త్రీయ కర్మ :** లోకకల్యాణార్థం శాస్త్రములు ప్రవచించే ఏఏ కర్మాచరణం ఉంటుందో, అద్దానిని ఆతడు ప్రయత్నపూర్వకంగా నిర్వర్తిస్తాడు. శాస్త్రములు అందరి సానుకూల్యమును అనుసరించి చేయవలసినవి – చేయకూడనివి అని చెప్తుతాయి కదా! ఆ కర్మలచే స్పృశించబడకయే వాటిని స్వధర్మనిరతిగా సంతోషంగాను, ఉత్సాహంగాను, తదితరులకు సానుకూల్యంగాను నిర్వర్తిస్తూ ఉంటాడు. ఈ విధంగా శాస్త్రీయ కర్మదేవత ఆతని రెండవ స్నేహితుడు.

**3. స్వకర్మ :** స్వప్రయత్నముచే సచ్ఛాస్త్రముల అభ్యాసము, విచారణ, సత్సంగము, శమము, దమము, తితిక్ష, ఉపరతి, శౌచము, సంతోషము, ఈశ్వర ప్రణిధానము, సంయమము – ఇవి మనస్సును శుద్ధ పరచుకోవటానికి, విస్తార పరచుకోవటానికి, నిర్మల పరచుకోవటానికి, జ్ఞాన పరిపుష్టి కొరకు నిర్వర్తిస్తూ ఉంటాడు.

అట్టి సహజ కర్మ – శాస్త్రీయ కర్మ – స్వకర్మలు అనే దేవతలను తన స్నేహితులుగా చేసుకొని వారితో ఈ జగత్ మైదానంలో క్రీడిస్తూ (జీవన్ముక్తుడు) ఉంటాడు.

నాయనా! రామచంద్రా! ముముక్షువైనవాడు ఉత్తమ కర్మలను ఆశ్రయించాలి. అట్టి "ఉత్తమ కర్మ" అనే మిత్రుడు... తండ్రి వలె ఊరడిస్తాడు. ఆత్మీయురాలగు ప్రియ పత్ని వలె, అన్న వలె దుష్కర్మల నుండి నివారిస్తాడు. మహాసంకటాలలో ప్రియస్నేహితుని వలె తోడవుతాడు. ఉపాధ్యాయుని వలె, గురువు వలె కార్యములందు సంశయములను తొలగిస్తాడు.

అగ్నిని ఉష్ణము విడువనట్లు, పుష్పమును సుగంధం వదలనట్లు ఈ జీవుని ఆతని ఉత్తమ కర్మలే సదా తోడుగా ఆతనిని సంసారలంపటం నుండి ఎప్పటికైనా ఉద్ధరించగలుగుతాయి. ఉత్తమ కర్మలు జీవునకు కాలక్రమేణా యుక్తాయుక్త–నిత్యానిత్య విచక్షణా జ్ఞానం ప్రసాదించే మహావర ప్రసాదమగు కులదైవం. ఉత్తమ కర్మలు సత్పురుషులను సేవింపజేసి వారి సాంగత్యముచే 'అజ్ఞానము' అనే జన్మజన్మార్జితమైన మహాసంకటము నుండి పరిరక్షిస్తాయి.

ఓ రామచంద్రా! ఈ జీవుని సర్వవిధాలా రక్షించేది, అధ్యాత్మ మార్గంలో తోడు అయ్యేది, ఆత్మజ్ఞానం వైపుగా ప్రేరేపించేది, మహనీయులగు ఆత్మజ్ఞుల దగ్గరకు జేర్చేది ఈ సహజకర్మ– శాస్త్రీయ కర్మ – స్వకర్మ ... అనబడే ముగ్గురు మిత్రులేనయ్యా! అందుకే ఉత్తమకర్మ నిర్వర్తించటం పట్ల మనుజుడు అత్యంత శ్రద్ధ, ఆసక్తి, పూజ్యభావన పెంపొందించుకొనటం ఆతనికి శ్రేయోదాయకం. ఇదియే తత్త్వశాస్త్రము యొక్క 'కర్మ సిద్ధాంతము' అయివున్నది. ఆత్మజ్ఞాని ఉత్తమ కర్మలయందు స్వభావ సిద్ధంగా అనునిత్యమూ ప్రేరేపితుడై ఉంటాడు.

❖

ఓ రామచంద్రా! "జీవితము" అనే అవకాశమును సద్వినియోగపరచుకొనే ప్రయత్నశీలురగు జీవులు స్వకర్మను ఆరాధిస్తూ జీవన్ముక్తత్వము వైపుగా ధృతి – ఉత్సాహాలతో ప్రయాణిస్తున్నారు. ఈ భౌతికమైన భార్య – పిల్లలు నిజమైన కుటుంబం కాదు.

స్నాన–దాన–తపో–ధ్యానములే ఆ ముముక్షువుకు పిల్లలు. అవి తదితరులను తనకు సానుకూల్యురై ఆధ్యాత్మికయానంలో తోడుగా ఉండేటట్లు ప్రేరేపించి తయారు చేస్తాయి. నిత్య సంతోషమే ఆతని భార్య. అట్టి నిత్యసంతోష కళత్రమును సంపాదించుకున్నవారు తదితరులనుకూడా అనేక రుగ్మతల నుండి వైదొలగింపజేస్తూ దర్శనమాత్రం చేతనే ఆనందిపజేస్తూ ఉంటారు.

ప్రేమ – కరుణ ఆతని చెలికత్తెలు. 'సమత్వము' ఆతని సోదరుడు. వినమ్రత, ధైర్యము, ధర్మనిరతి ఆతని బంధువులు. సర్వుల పట్ల మైత్రి ఆతని ప్రియసఖుడు.

❖

ఈ విధంగా జీవన్ముక్తుడు కోమలమైన స్వభావముతో నిత్యసంతోషము అభ్యసిస్తూ స్వభావసిద్ధంగా ప్రేమ – కరుణ – మైత్రి కలవాడై లోకకళ్యాణకారకుడై ఉంటాడు. 'స్వకర్మ' అనే మిత్రునితో వ్యవహరిస్తూ లాభాలాభములచే ప్రసన్నుడు గాక, క్రోధయుక్తుడు గాక సర్వదా

వసంతకాలపు మేఘరహిత ఆకాశంలాగా ప్రకాశిస్తూ ఉంటాడు. నిరంతరం అనేక లోకవ్యవహారములమధ్య వ్యవహరిస్తూ ఉండవలసి వచ్చినప్పటికీ ఆ జీవన్ముక్తుడు అనుక్షణం నిర్వాణ-శాంత మనస్కుడై చెన్నొందుచున్నాడు. తత్త్వజ్ఞాన-రహితమైన, సారరహితమైన, సంభాషణలు ఆతనిని సమీపిస్తున్నప్పుడు ఆతడు శిలా విగ్రహమువలె మౌనం వహించినవాడై ఉంటాడు.

అర్థులు, ఆశ్రయించినవారు తటస్థపడితే ఆతని ఆత్మజ్ఞాన వ్యాఖ్యానాలు మహా ప్రవాహంలా పెల్లుబుకుతాయి. లోకవిరుద్ధమైన కర్మల పట్ల ఆతడు శవప్రాయంగానూ, శిష్ట అభ్యాస కార్యములందు ఆదిశేషునివలె - బృహస్పతివలె అతి ఉత్సాహ - శౌర్య - బుద్ధి పరాక్రమాదులతో అనువర్తిస్తూ ఉంటాడు. ఆతని నోటి వెంట పుణ్య కథలు గంగా ప్రవాహంలా జాలువారుతూ ఉంటాయి. ఆ జీవన్ముక్తుడు "ఏది మేలు, ఏది కీడు, ఏది ఉచితం, ఏది దోషం" ఎరిగియే ఉంటాడు. ఆ సమదృష్టి కలిగి ఉండటంచేత ఆతడు క్షణంలో ఉచితానుచితములను నిర్ణయించగలుగుచూ ఉంటాడు.

ఆతడు... సమదృష్టి కలిగి, దానశీలుడై, ఉదార చరితుడై, గుణదోషములను విభజించువాడై, అతి కోమల స్వభావుడై, మధుర స్నేహయుక్తుడై, మనోహరుడై, పుణ్యకీర్తిమంతుడై, ఈ జగత్తులో విలాసంగా, క్రీడగా, ఆనందంగా విహరిస్తూ ఉంటాడు.

ఓ రామచంద్రా! పవిత్ర మాతృమూర్తియగు ఈ భూదేవత అనేకమంది జీవన్ముక్తులగు సత్పుత్రులను కలిగియే ఉన్నదయ్యా! మనం చెప్పుకున్న ఉత్తమ గుణములు సమత్వ ప్రభావంచేత జీవన్ముక్తులకు సహజములై ఉంటున్నాయి. అంతేగాని ఎవరో చెప్పారనో, ఏదో ఆశించియో వారు ఆ ఉత్తమ కర్మలను - గుణములను ఆశ్రయించవలసిన అవసరం లేదు. అగ్నికి ఉష్ణము, సూర్యునికి ప్రకాశము, చంద్రునికి శీతల కిరణములు ఎవరైనా బోధిస్తేనో, నియమిస్తేనో, చెప్పితేనో వస్తున్నాయా? కాదు కదా! జీవన్ముక్తుల సద్గుణములు అట్టివే!

❖❖❖

## 13. తత్త్వవేత్త యొక్క జగదవగాహన

**శ్రీరాముడు :** తత్త్వవేత్తలలో శ్రేష్ఠుడవగు ఓ వసిష్ఠ మహర్షీ! అందరికీ ఎదురుగా ఘనీభూతమై కనిపించే ఈ దృశ్యమును తత్త్వవేత్తలగు మీవంటి మహనీయులు ఏ రీతిగా, ఏ అర్థంగా, ఏ అవగాహనతో, ఏ రూపంగా, ఏ విధంగా, ఎట్టి భావనతో, ఏ అభిప్రాయంతో, ఏ ఉద్దేశంతో, ఏ ఆశయంతో చూస్తున్నారో .... అట్టి అవగాహన గురించి వర్ణించి చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఒక్క మాటలో చెప్పాలంటే చిదాకాశము యొక్క ఆభాసయే ఈ జగత్తు. వాస్తవానికి జగత్తూ లేదు. ఆభాసకూడా లేదు. శూన్యము లేదు. వ్యక్తి చైతన్యము లేదు. శూన్యత్వము ఆకాశము కంటే వేరా? కానేకాదు కదా! అట్లాగే 'జగత్తు' అనబడునది ఏదైతే అజ్ఞానుల దృష్టిలో వేరువేరుగా భాసిస్తోందో... అది చిదాకాశము కంటే కించిత్ కూడా వేరుకాకయే ఉన్నది.

**దేశాద్దేశాన్తర ప్రాప్తౌ మధ్యే యత్సంవిదో వపుః ।**
**తద్దృశ్యమితి భాతీదం దృశ్యమన్యన్న విద్యతే ॥**

**దేశాద్దేశాన్తర ప్రాప్తే యన్మధ్యే సంవిదో వపుః ।**
**స్వస్వభావో హి భూతానాం తత్పదం పరమాత్మకమ్ ॥**

**దేశాద్దేశాన్తర ప్రాప్తే యన్మధ్యే సంవిదో వపుః ।**
**ఏతత్తత్పరమాకాశమ్ అత్ర సర్వమ్ ప్రతిష్ఠితమ్ ॥**

**దేశాద్దేశాన్తర ప్రాప్తౌ యన్మధ్యే సంవిదోవపుః ।**
**ఏతస్యావ్యతిరేకేణ జగత్తా నాస్తి కించన ॥**

**దేశద్ధేశాన్తర ప్రాప్తౌ విద్ధి మధ్యమ సంవిదః ।**
**జగదిత్యపరం నామ స్వరూపాదచ్యుతాత్మనః ॥**

ఓ రామచంద్రా! మాకు ఈ దృశ్యము ఎట్టిదని సుస్పష్టంగా అనిపిస్తోందంటే...

(మరొక ప్రదేశము) —— బుద్ధివృత్తి —— (ఒక ప్రదేశము)

ఒక ప్రదేశం నుండి ఈ బుద్ధి వృత్తి నేత్రేంద్రియం ద్వారా మరొక ప్రదేశానికి వెళ్ళు చున్నప్పుడు, ఆ రెండు ప్రదేశముల మధ్యగా నిర్విషయమగు ఏ చైతన్య రూపము కలదో... అదే ఈ దృశ్యముగా భాసిస్తోంది. అంతకు వేరుగా ఈ దృశ్యము ఏమాత్రమూ ఏ క్షణమందు కూడా లేనేలేదు.

ఆ రెండు ప్రదేశముల మధ్యగా ఏ నిర్విషయమగు చైతన్యము యొక్క స్వరూపము కలదో...అదియే సర్వ జీవుల స్వస్వభావమైయున్నది. అదియే అందరికీ నెలవైన పరమాత్మ పదం.

ఆ రెండు ప్రదేశముల మధ్య ఏ నిర్విషయమగు చిత్స్వరూపము కలదో,.... అదియే పరమాత్మ రూపమగు చిదాకాశము. అచటనే ఈ సమస్తము ప్రతిష్ఠితమై ఉన్నది. అదియే సర్వమునకు అధిష్ఠానం. నీవు, నేను, ఈ సర్వ సభికులు, భవిష్యత్ పాఠకులు ఉన్నది ఆ నిర్విషయ చైతన్యమునందే! ఆ నిర్విషయ చైతన్యముగానే! ఆ రెండు ప్రదేశముల మధ్య ఉన్న నిర్విషయ చైతన్యము కంటే వేరుగా జగత్తు ఏమాత్రం లేనే లేదు.

సుషుప్తి సంవిత్

[జాగ్రత్ ప్రదేశం] [స్వప్న ప్రదేశం]

సుషుప్తి సంవిత్తు — సుషుప్తి సంవిత్తు

ప్రళయం

[పూర్వసృష్టి ప్రదేశము] [తదనంతర సృష్టి ప్రదేశము]

సంవిత్తు — సంవిత్తు

**సంవిత్తు** - జాగ్రత్, స్వప్నముల మధ్య గల సుషుప్తి సంవిత్ రూపమే సృష్టి – తదనంతర సృష్టి మధ్యగల సుషుప్తి సంవిత్తు కూడా!

**మూర్ఛావస్థ సంవిత్తు -**

ఆ సుషుప్త సంవిత్తే ..... జాగ్రత్ స్వప్నములను తన రూపంగా ప్రదర్శిస్తోంది.

ఆ ప్రళయ సంవిత్తే ..... పూర్వ - పర సృష్టుల రూపంగా కూడా వ్యవహరిస్తోంది.

ఆ మూర్ఛావస్థ సంవిత్తే ..... ఇహ-పర లోకాలుగా కూడా అభివ్యక్తతమౌతోంది.

ఆ సంవిత్తే సర్వకాల, సర్వావస్థల యందును యథాతథమైయున్నది. అది ప్రతిజీవుని కూటస్థ రూపం. అది ఎవరి పట్ల ఎద్దాని కొఱకు కూడా ఏమాత్రం తన స్థానం నుండి చ్యుతి పొందటం లేదు.

అట్టి చిద్రూపానకే కొందరు (అజ్ఞానులు) 'జగత్తు' అనే పేరుపెట్టారు. మహాప్రళయం తరువాత మరల ఆదిసృష్టి సంభవిస్తోంది. అయితే మహాప్రళయానికి ముందు ప్రళయం సృష్టుల మధ్యగా, సృష్టి కొనసాగు సమయంలో ముందు, ఆవల, ఈవల, ఇక్కడ, అక్కడ, ఇప్పుడు, అప్పుడు, మరెప్పుడైనా సరే... పరమాత్మ కంటే వేరుగా జగత్తుకు మరొక కారణం లేదు. జగత్తే పరమాత్మ! పరమాత్మయే జగత్తు. (సదేవ సౌమ్యే దమగ్ర ఆసీత్ - సృష్టికి పూర్వం సద్రూపమగు పరమాత్మయే కలదు!) మహాప్రళయదశలో 'జగత్తు' అనబడేదానికి బీజమే లేదు. ఇక "పరమాణువు మొదలైన వాటి నుండి ఈ మూర్తివంతమగు జగత్తు ఏర్పడుతోంది" అనే కల్పన అంతా అసంగతమే సుమా!

**ఉత్పన్నమేవ నైవాతో మూర్తం దృశ్యమిదం జగత్ ।**
**వన్ధ్యాపుత్రఇవాత్యస్తమతోఽ స్త్యేవ న దృశ్య ధీః ॥**

మూర్తివంతమై కనిపించే జగత్తు ఆత్మదృష్ట్యా ఉత్పన్నమే అయివుండలేదు. సమస్త శ్రుతులు ఈ విషయం ఎలుగెత్తి గానం చేస్తున్నాయి. శ్రుతుల తాత్పర్యం ఇదియే! కాబట్టి గొడ్రాలి రెండవ కుమారునివలె ఈ దృశ్యము అత్యంత అసత్యమై ఒప్పుచున్నది. "ఈ నలువైపులా కనిపించే దృశ్యము పరమాత్మపదమగు శుద్ధ-నిర్మల చిదాకాశమే"... అని శ్రుతి తాత్పర్యవేత్తలు ఎరిగియే ఉన్నారు.

❖

చిన్మాత్రము తన నిర్మల - నిర్వికార రూపమును త్యజించకయే సుషుప్తి నుండి స్వప్నమునకు, స్వప్నం నుండి జాగ్రత్తుకు, జాగ్రత్తు నుండి సుషుప్తికి వెళ్ళుచున్నది. అట్లాగే అయ్యది నిజచిదాకాశ రూపం త్యజించకయే సృష్ట్యాది, సృష్టి, సృష్టి అంతం పొందుచూ ఈ సృష్టిరూపంగా కూడా భాసిస్తోంది. సుషుప్తి నుండి స్వప్నదశకు వచ్చినప్పుడు ఆ స్వప్నంలో భాసించే నగరాలు మనో సంబంధమైన స్వప్న సంకల్ప రూపమే కదా! అట్లాగే చిదాకాశమే సృష్ట్యాది యందు సృష్టిరూపంగా (ఈ దృశ్య జగత్తుగా) భాసిస్తోంది. వాయువు స్పంద రూపమే ఎట్లా తన స్వరూపమునందు స్వయంగా చక్ర తరంగాది రూపములను చేష్టితం చేస్తోందో (ప్రదర్శిస్తోందో)... అట్లాగే అజ్ఞాన చిదాకాశ విభాగము కూడా సృష్ట్యాదిలో తానే స్వయంగా దృశ్యరూపమున తనయందు స్థితినొంది ఉన్నది. ఎరుగబడినప్పుడు (తత్త్వజ్ఞానము కలిగినప్పుడు) త్రైలోక్యరూపమైనట్టి ఈ దృశ్యజగత్తు దృశ్య జగత్తుగా కాకుండా పరబ్రహ్మముగానే భాసించుచున్నది. కనుక పరబ్రహ్మమే తన యందు ఈ విధంగా దృశ్యరూపంగా నెలకొనియున్నట్లు సుస్పష్టమౌతోంది కదా!

ఓ రామచంద్రా! ఈ పృథివి మొదలైనవి ఎప్పుడూ కూడా మూర్తివంతము - సాకారము కాదు. ఇవన్నీ కూడా అజ్ఞాని దృష్టికి మూర్తివంతంగాను, జ్ఞానిదృష్టికి అమూర్తివంతంగాను అగుచున్నది. ఏది ఏమైనప్పటికీ మూర్త-అమూర్తవంతంగా విరాజిల్లుచున్నది పరబ్రహ్మమే సుమా!

స్వప్నంలో కనిపించేదంతా మూర్తవంతంగా కనిపించవచ్చుగాక! మేల్కొనిన తరువాత స్వప్నంలో కనిపించిన పర్వతం ఏమైపోతోంది? అంతా రూపరహితమై శూన్యాకాశమునందు విలీనం అగుచున్నది కదా! అట్లాగే ఆత్మజ్ఞానము సంపాదించుకొని అనుభూత మొనర్చుకొన్నవారికి ఈ ముల్లోకములు కూడా శాంత చిన్మాత్రాకాశముగా అగుచున్నాయి. జ్ఞానుల దృష్టియందు ఈ జగత్తు విభాగ రహితమగు పరబ్రహ్మముగానే విరాజిల్లుచున్నది. ఇక అజ్ఞానుల దృష్టియందంటావా ... అజ్ఞానులనే అడుగు. ఎందుకంటే వారి దృష్టి క్షణ మొకరీతిగా ఉంటోంది.

❖

ఓ రామచంద్రా! నిర్విషయమగు పరమాత్మ పదము ఎట్టి రూపము కలిగియున్నదో... ఈ సత్-అసదాత్మకమగు జగత్తు కూడా అట్టి రూపమే కలిగియున్నది. ఎట్లా అంటావా?

ఈ సమస్త ప్రపంచము పంచభూతములకంటే వేరు కాదు. ఇక పంచభూతములో... తమ అధిష్ఠానమగు పరమాత్మ కంటే వేరుగా ఎక్కడినుంచీ వచ్చియుండలేదు.

అందుచేత ... బాహ్యేంద్రియములచే జనించే రూప - ప్రకాశాదులుగాని, అభ్యంతరమగు మనస్సుకు అధీనమైయుండే సంకల్పము-యోచన-భావన-వేదన గాని, ఈ సమస్త బాహ్య అభ్యంతర ప్రపంచము పరమాత్మ పదరూపమే అయివున్నది. మహాసముద్రంలో తరంగాలు, సుడులు, బుడగలు, ఆవర్తాలు మొదలైనవిలాగా... ఈ బాహ్య - అభ్యంతరాలలో అనుభవమగుచున్న సర్వము 'పరమాత్మ పదము' అనే మహాసముద్రంలోని అనన్యమగు విశేష పరంపరలేనయ్యా!

రాగము, ద్వేషము, భావము, అభావము.... ఇవన్నీ కూడా సద్రూపము త్యజింపకయే ఉన్నట్టి చిదాకాశ స్వరూపం అయివున్నాయి. తరంగములుగా ప్రదర్శితమగుచున్నప్పుడు సముద్రజలం తన ద్రవత్వము త్యజిస్తోందా? లేదు కదా!

**త్యక్త్వా పూర్వాపరే కోట్యౌ మధ్యే యత్సంవిదో వపుః ।**
**స స్వభావః పరో జ్ఞేయో జగత్వయసి సంజ్ఞితః ॥**

ఒకానొకడు ఒక వృక్ష శాఖమీదుగా ఆకాశంలో ప్రకాశిస్తున్న చంద్రుని వీక్షించుచున్నప్పుడు పూర్వవిభాగమగు శాఖను ఆ తరువాత విభాగమగు చంద్రుని... రెండింటిని విడిచిపెట్టితే మధ్యలో గల చైతన్యం యొక్క నిర్విషయమగు స్వరూపమేది ఉన్నదో... అదియే చైతన్యము యొక్క పరమోత్తమ మగు స్వభావం. మృగతృష్ణలో జలం కనిపిస్తున్నట్లు అద్దానియందే అద్దానికి అభిన్నమై 'జగత్తు' అనబడేది కనిపించటం జరుగుతోంది. వాస్తవానికి ఈ జగత్తు సృష్ట్యాది యందు జనించియే ఉండ లేదు. ఏది ఉత్పన్నమైనట్లు కనిపిస్తోందో... అది ఇంద్రజాలంలో కనిపించే వస్తు సమూహం వంటిదే!

**కష్టం! నాస్త్యేవ యద్దృశ్యం! తదపి "అస్థి" ఇతి సంస్థితమ్!**
**యదపి అస్థి పరంబ్రహ్మ, కష్ట! "నాస్థి" .... ఇతి తత్స్థితమ్ ॥**

ఆహా! ఏమి ఆశ్చర్యం! గాజును చూచి మణి అని, మణిని చూచి గాజు అని భ్రమించినట్లుగా అజ్ఞానులు ఏ జగద్దృశ్యం లేదో... అద్దానిలో "కలదు" అనే బుద్ధిని పొందుచున్నారు. ఏ పరబ్రహ్మం సర్వదా ఘనీభూతమై ఉండియే ఉన్నదో ... అద్దాని పట్ల 'లేదు' అనే బుద్ధి ఏర్పడుచున్నదే! ఇంక ఏం చెప్పాలి?

❖

ఓ రామచంద్రా! నాకు బ్రహ్మం యొక్క భావనకు వేరైనట్టి వివర్తిత జగత్తు ఎక్కడా ఈషణ్మాత్రం కూడా కనిపించటమే లేదు. కొందరు అసత్తగు ఈ దృశ్యం 'సత్తు' అని చెప్పుచున్నారు. 'సర్వదా సత్తు' అగు బ్రహ్మమును సత్తుగా వారు గమనించటం లేదు. వాస్తవానికి దృశ్యము కొంచెం కూడా ఉత్పన్నమే అయివుండలేదు. దృశ్యమనునది ఎక్కడా భాసించటమూలేదు. మరి? ఇక ఇట్లు భాసిస్తు న్నట్లుగా కనిపించే దంటావా? బ్రహ్మమే స్వయంగా ఇట్లు జగత్తు రూపంగా అజ్ఞానం చేత అనిపిస్తోంది. ఇక ఇంద్రనీలమణి, తన కంటే ఏమాత్రం వేరుకానట్టి ఇంద్రనీల కాంతులతో ప్రకాశిస్తుంది చూచావా? అట్లాగే చిదాకాశము కూడా తన కంటే ఏమాత్రం వేరుకానట్టి సృష్టిరూపంగా ప్రకాశిస్తోంది. సూర్యుడు కూడా శాంతమగు పరమాత్మ పదమునందే సద్రూపముతోటి వెలుగొందుచున్నాడు. ఆ పరమాత్మ యొక్క అవయవమే ఈ సూర్యుడు. సద్రూపుడగు పరమాత్మకంటే సూర్యుడు వేరుగా లేనే లేడు. ఈ సూర్య – చంద్రులు చిత్స్వరూపమున ఉన్నవారైనప్పటికీ తమ భౌతిక ప్రకాశముచే ఆ చిత్స్వరూపమును ప్రకాశింపజేయలేకపోతున్నారు.

ఆ పరమాత్మయే సూర్య చంద్రులను ప్రకాశింపజేస్తున్నాడు. అంతేగాని సూర్యచంద్రులు పరమాత్మను ప్రకాశింపజేయటం కాదు.

❖

ఆహా! ఆ చైతన్యము యొక్క ప్రకాశము చేతనే ఈ దృశ్య సమూహమంతా ప్రకాశిస్తోంది. ఇక "ఆ పరమాత్మ సాకారరూపుడా? నిరాకారరూపుడా?"... అనే శబ్దార్థ కల్పన "ఆకాశ పుష్పం"లాగా అసద్రూపమైనది. అటువంటి కల్పన తత్త్వజ్ఞానులలో సంభవించటమే లేదు.

సర్వులకు జీవమును ప్రసాదిస్తున్న జీవన ప్రదాత, జగద్రష్టలో సూర్యుని యొక్క తేజోకిరణంలో ఆయన అవయవరూపమగు అణువు కిటికీ ద్వారా ఎట్లా భాసిస్తోందో... అపరిచ్ఛిన్న చిత్ప్రకాశమయ మగు బ్రహ్మంలో సూర్యుడు మొదలైనవి అణువులవలె భాసిస్తున్నాయి. ఇంకో విధంగా చూస్తే, పరబ్రహ్మంలో ఏదీ భాసించుటయే లేదు. ఎందుకంటే పరబ్రహ్మం సర్వదా అతినిర్మలం, పదార్థ రహితం, నిర్విషయం అయి ఉన్నది కాబట్టి! మణికి మణికాంతులు వేరైనవి ఎట్లా అవుతాయి? అట్లాగే 'పరమాత్మ' అనే మణి యొక్క వేరువేరు కిరణ రూపములైనట్టి ఈ జీవులు, సూర్యుడు, చంద్రుడు, నీవు, నేను ... ఇవన్నీ పరమాత్మకు వేరైనవి కావు. పరమాత్మ పదము ద్వంద్వాతీతం. అందుచేత అద్దానియందు చిత్ – జడ భేదం లేదు.

అది సర్వత్రా పరిపూర్ణం. కనుక శూన్యవర్జితం. పదార్థములు అసత్తు కాబట్టి అది సర్వపదార్థ రహితం. సర్వకల్పనలకు అధిష్ఠానం అగు చైతన్యమునందు ఆరోపిత (కల్పిత) దృష్టిచే జగత్తులు ఉన్నాయి. అధిష్ఠాన దృష్టిచే అవేవీ లేవు. అట్లాగే ఈ సర్వజీవులు కూడా! మనమంతా ఆరోపిత దృష్టిచే ఆత్మయందే ఉన్నాం. అధిష్ఠాన దృష్టిచే అంతా ఆత్మయే కాబట్టి మనమెవరమూ లేము. అవయవ సహితంగా కనిపించే ఈ సర్వజీవులు, సూర్య చంద్రాది ఖగోళ పదార్థాలు, నీవు, నేను... మొదలైన మనమంతా కూడా అవయవ రహితమగు చిద్రూపంలో అవయవ రహితమగు చిద్రూపాణువులుగా ప్రకాశిస్తున్నాం. ఇవన్నీ ఆరోపిత దృష్టిచే చిద్రూపమునందే ఉన్నప్పటికీ... చిద్రూపం నిజ సత్తును త్యజించకయే ఉన్నది. ద్వైత–ఏకత్వాలు ఆ చిద్రూప నిజసత్తలో లేనేలేవు.

❖

ఓ రామచంద్రా! ఆ శుద్ధ నిర్విషయ చిత్స్వరూపము, సమక్షంలో ... "ఇది పదార్థ సహితం. ఇది పదార్థ రహితం. ఇది స్థూలం. ఇది సూక్ష్మం. ఇది అల్పం. ఇది అధికం"... ఇత్యాది కల్పనలు అతిదూరమైనవై ఉన్నాయి.

ఈ జగత్తు మాకు ఎట్లా కనిపిస్తోందంటే... ఏకం, శాశ్వతం, అనంతం, సదా అతివ్యాపకం– అయినట్టి "చిన్మాత్రాకాశసత్త" యే తనలో తాను ఈ 'జగత్తు' అను నామముతో స్థితినొంది ఉన్నట్లుగా!

ఈ బుద్ధివృత్తి ఒక విషయమును త్యజించి మరొక విషయమును గ్రహించుచున్నప్పుడు మధ్య ఉండే చైతన్యము యొక్క నిర్విషయ వృత్తిరహిత బుద్ధిరూప చైతన్యమే ఈ వివిధ జగత్ రూపములుగా ప్రకాశించుచున్నది. స్వప్నంలో జీవచైతన్యము అనేక రూపములుగా ప్రకాశిస్తున్నట్లే... జాగ్రత్ చైతన్యము ఈ వివిధ రూపములతో జగత్తుగా (వ్యాప్తరూపంగా) ప్రకాశిస్తోంది.

సుషుప్తి → స్వప్నం → [ సుషుప్తి నుండి స్వప్నంలో ప్రవేశించే చైతన్యము తన యొక్క నిజ స్వరూపమున యథారీతిగా ఉండి ఉండియే స్వప్న రూపమును పొంది వివిధ స్వప్నాంర్గత రూపములను అనుభవిస్తోంది.

ప్రళయం → సృష్టి → [ ప్రళయము నుండి సృష్టియందు ప్రవేశించుచున్న ప్రళయ చైతన్యము ఎప్పటి యట్లుగా తన అద్వైత రూపమున ఉండియే ఈ జగత్ రూపమును (వేషమువలె) ధరించినదై ఈ నానావిధ రూపములుగా ప్రదర్శనమగుచున్నది.

అనగా... చైతన్యము ఒక సృష్టి ప్రళయము నుండి మరొక సృష్టిని కల్పిస్తున్నప్పటికీ, తన స్వస్వరూపములో కించిత్ మార్పు కూడా పొందటం లేదు. అంతే కాదు! చైతన్యమే ఈ సృష్టిగా, ఇందులోని వివిధ వస్తువులుగా భాసిస్తోంది.

సుషుప్తి ఎట్లు చిద్రూపమో... అట్లాగే స్వప్నము చిద్రూపమే అయివున్నది. జాగ్రత్తు కూడా అట్లే చిద్రూపము అయివున్నది. ఇట్లు ఈ జగత్తంతా కూడా చిదాకాశరూపమై వెలయుచున్నది. ఈ

విధంగా తత్త్వవేత్తల దృష్టిలో జాగ్రత్-స్వప్న-సుషుప్తి రూపమగు ఈ సమస్త జగత్తు కూడా తురీయమే అయివున్నది. అట్టి అవగాహన తత్త్వవేత్తల సంప్రదాయమే!

ఇక మూఢులేమి తలచుచున్నారో... ఏమి ఎరుగుచున్నారో... అది ఒక రూపమంటూ ఏదీ లేకుండా పోతూ, క్షణక్షణికం అగుచున్నది కదా! అందుచేత "అట్టిది, ఇట్టిది" అని మేము చెప్ప జాలకున్నాం. వారి దృష్టిని నిర్వచించలేకున్నాం.

ఈశ్వరుడే ఈ జగత్తుల యొక్క జీవులయొక్క సమస్త పదార్థముల యొక్క అభ్యంతరము అయివున్నాడు. అంతర్యామి రూపముచే... ఈశ్వరుడు దుర్లక్ష్యమైయున్నాడు. అట్టి ఈశ్వరత్వము ప్రతి జీవుని యందు ప్రతి పదార్థమునందు అంతర్యామి రూపంలో దుర్లక్ష్యమై... మనోబుద్ధులకు లభించనిదై ఉన్నది. మనోబుద్ధులకు అతీతంగా పరిశుద్ధమగు జీవ - చైతన్య స్వరూపమై ఉన్నది.

కనుక రామచంద్రా! సమస్త పదార్థములు ఈశ్వర స్వరూపములే అయి ఉన్నాయి. ఈ విధంగా చిద్రూపుడగు ఈశ్వరుడే జగదాకారంగా ఉన్నాడని నిరూపించబడుతోంది. అట్లాగే, "నిజ దృశ్యరూపముచే  జగత్పదార్థములు సత్యములు కావు"... అని కూడా తెలియవచ్చుచున్నది కదా!

ఈ పృథివి మొదలైన సర్వ పదార్థములందు పరమాత్మ అంతర్యామి అయి సమస్తమునకు సాక్షిరూపము వహిస్తూనే సర్వమును పరిణామమొనర్చుచున్నాడు. అయితే "పరిణామము" అనే శబ్దం ఉపయోగించటమనేది లౌకికమైన వ్యవస్థను బట్టి ఉపదేశార్థమేగాని... పరమార్థంగా 'పరిణామము' అనే కించిత్ ప్రత్యయము కూడా ఎక్కడా లేనే లేదు. సమస్తము చిద్రూపమే అయివుండగా... ఇక పరిణామమనేదెక్కడ? వాస్తవానికి సాక్షిత్వ - ప్రేరణత్వాలు కూడా లేవు.

ఆదిసృష్టి మొదలుకొని ఇప్పటి దాకా సర్వదా "ఏకమే" అయినట్టి చిన్మాత్ర పరమాకాశమే మహాసత్తా రూమగు "స్వాత్మ" యందు 'జగత్' రూపంగా స్థితినొంది ఉన్నది. ఇందుకు తత్త్వవేత్తల యొక్క "పరిపూర్ణైకాత్మ" గురించిన అనుభవం, ఆ అనుభవాన్ని క్రోడీకరిస్తూ (తత్త్వమ్ - సోఽ హమ్ - జీవో బ్రహ్మేతినాపరః - అయమాత్మా బ్రహ్మ - త్వమేవాహమ్ - సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ - జీవశివః శివో జీవః - సర్వమ్ శివమయమ్ వంటి) వేద-వేదజ్ఞుల ఆప్త వాక్యములు మనకు ప్రమాణం సుమా! మహనీయుల అనునిత్యానుభవమైనట్టి సర్వవ్యాపక చైతన్యమే సర్వత్రా స్థితినొంది ఉండగా... ఇక అట్టి చైతన్యమునకు వేరుగా ఎద్దానిని చూచి "ఇది జగత్తు" అని అంటున్నారో... అది జ్ఞానదృష్టి కలవానికి ఏదీ కనిపించటం లేదు. అందుచేత "మా కనుభవమగుచున్న సర్వవ్యాపక ఆత్మ చైతన్యాన్ని చూచియే అజ్ఞులగు జనులు 'జగత్తు' పేరుతో పిలుస్తున్నారు"... అనే మేము గ్రహించి  ఉంటున్నాం.

**శ్రీరాముడు :** మరి జీవునికి (అజ్ఞాత భ్రష్టమ్) అగు దుఃఖం ఎందుచేత సుదీర్ఘంగా కొనసాగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**పరిజ్ఞాతే యథా స్వప్నే స్వాఙ్గీకారాత్సుఖం సుఖమ్ ।**
**అనఙ్గీకారతో దుఃఖం స దుఃఖమ్ భవతి క్షణాత్ ॥**

ఒకానొకడు స్వప్నంలో దృశ్యముతో తాదాత్మ్యమై అనేక వేదనలు అనుభవిస్తున్నాడనుకో! అప్పుడిక మేల్కోగానే మహాసుఖముగాను, మేల్కొననంతవరకు మహా దుఃఖంగానూ ఉంటోంది కదా! అట్లాగే, ఈ జీవుడు ఆత్మ స్వరూపమును ఎరిగిన తరువాత "నేఽ తి – నేఽ తి" సూత్రానుసారంగా అప్పటికీ శేషించు ఆత్మయొక్క అంగీకారముచే తాను అప్పటి నుంచి దర్శించే జగత్కౌతుకమంతా ఇక మహా సుఖప్రదమే అవుతుంది.

అట్లా కాకుండా "అప్రమేయ – కేవల శుద్ధాత్మ మాత్రము" యొక్క స్వరూపమును అంగీకరించక (ఎరుగక) పొందుచున్న జగత్తంతా దుఃఖప్రదమే అయి ఉంటోంది. "ఇదంతా స్వప్న సదృశమేకదా!" అని మొదలే ఎరిగియున్న కారణం చేత తత్త్వజ్ఞాని ఈ జగత్తునందు పాల్గొనుచున్నప్పుడు, ఇద్దానిని చూస్తున్నప్పుడు తనయందు "దుఃఖము" అనే విక్షేపభావమును బలపడనివ్వడు. అందుచేత ఆతడు కూర్చున్నప్పుడు, నిలుచున్నప్పుడు, మేల్కొనినప్పుడు, నిదురిస్తున్నప్పుడు... అన్ని వేళలా "ఆత్మదర్శనము" అనే సమాధి సుఖస్థితిని కొనసాగించుచున్నాడు.

ఎందుచేతనంటే... ఆతడు... మాయా నిర్మితములగు భేదములయందు వసించుచున్నప్పటికీ అభిన్నము – ఏకరసము అగు ఆత్మయందు తత్పరుడై ఉంటున్నాడు. దుఃఖాదులు ఉంటే ఉండవచ్చుగాక! ఆతడు మాత్రం నిరతిశయమగు స్వాత్మయందే వెలయుచున్నాడు. బాహ్యప్రపంచమున వ్యవహరిస్తూనే ...అంతరంగమునందు సర్వదా ముక్తుడై బాహ్యత్వము–అసత్ ప్రపంచత్వము లేనివాడై ఉంటున్నాడు. ఇక అట్టి జ్ఞానికి గ్రహించతగినదేమి? త్యజింపవలసినదేమున్నది?

ఓ రామచంద్రా! పరిజ్ఞాతమగు ఆత్మజ్ఞాని బాహ్యమున సర్వకార్యములు నిర్వర్తిస్తూనే... అంతరమున ఏదీ గ్రహించడు. త్యజించడు. ఎల్లప్పుడు సర్వకార్య వర్జితమైనట్టి బ్రహ్మమునందే స్థితి కలిగి ఉంటున్నాడు. అగ్నికి ఉష్ణత్వం ఎట్లాగో, మంచుకు చల్లదనము ఎట్లాగో... అట్లా జ్ఞానికి నిర్విషయమగు ఆత్మత్వము స్వభావ సిద్ధమే అయివున్నది. అంతేగాని అది ప్రయత్నపూర్వకంగా చేసే కార్యము వంటిది కాదు. ఎవనికైతే "నాది అంటూ ఏదీ లేదు" అని గ్రహించినట్టి గ్రాహ్య – త్యాజ్యములకు అతీతమైన బుద్ధి నిశ్చలంగాను, స్వభావ సిద్ధంగాను ఉంటుందో.... అట్టివాడు "తత్త్వవేత్త" ... అని పిలువబడుచున్నాడు. ఎవడికి "గ్రహించబడవలసిదిగాని, త్యజించబడవలసినది గాని ఏదీ ఈ దృశ్యమునందు లేదు"... అనునది స్వభావమై ఉండదో... అట్టివాడు జ్ఞాని ఎట్లా అవుతాడు? ఎందుకంటే ఆత్మకు అన్యమైనదాని పట్ల అభిలాష కలిగి ఉండటమే అజ్ఞానానికి చిహ్నామై ఉన్నది కదా! 'అజ్ఞానం' అనే ఆవరణం లేనట్టి జ్ఞాని సదా శాంతచిత్తుడై, "ఈతడు మిత్రుడు, ఈతడు శత్రువు" అను రూపంతో కూడిన వికల్పములన్నీ మొదలంటా క్షయించినట్టి వాడై, సారభూతమగు స్వాత్మ సుఖముచే పరిపూర్ణుడై, "మహాశాంతి" అనే అమృత పానముచే సంతృప్తి సంపాదించుచున్నవాడై, ఆత్మయందే సదా సర్వదా సర్వత్రా స్థితిని సుస్థిరీకరించుకొని ఉన్నవాడై, స్వయం ప్రకాశక–స్వయంజ్యోతి అయి వెలుగొందుచున్నాడు. అట్టి జ్ఞానమే సర్వుల ఆయా వివిధ సర్వసాధనముల అత్యుత్తమమగు ప్రయోజనమై ఉన్నది సుమా!

❖❖❖

# 14. మనోమాత్రమిదమ్ జగత్

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ విధంగా ఆదిప్రజాపతి అగు విరాట్ పురుషుడు కూడా "పృథివి మొదలైనట్టివి లేనిది - నిరావరణము" అగు చిదాకాశ స్వరూపుడే అయివున్నాడు. ఆతడు కేవలము మనోమాత్రుడుగాను, ఈ జగత్తు ఆతని మనోమాత్రముగాను శాస్త్రకారులు నిర్వచించియే ఉన్నారు. అట్టి సమష్టిరూప మనస్సు ఎక్కడి నుండి వచ్చింది? అది చైతన్య మాత్ర స్ఫురణయే కాబట్టి ఆతడు చిన్మాత్ర స్వరూపుడేనని నిర్ద్వంద్వంగా నిర్ణయించబడుచున్నది. ఎందుకంటే మననమే మనస్సు. జగత్తుకు సంబంధించిన మనోధర్మమగు మననాకార కల్పనకు పూర్వము ఆతడు చిన్మాత్రుడుగానే అయివున్నాడు. జలంలో తరంగాలు తదనంతరం ఏమి కానున్నాయి? జలంలోనే లయమగుచున్నాయి కదా! ఆ తరువాత జలంలోంచే తరంగాలు బయల్వెడలుచున్నాయి కదా! అట్లాగే విరాట్ పురుషుని (సమష్టి సృష్టికర్త యొక్క) మనోమాత్రమగు (భావనామాత్రమగు, సంకల్ప జనితమగు, ఊహవంటిదగు) ఈ వర్తమాన జగత్తు ఒకానొకప్పుడు ఆత్మయందే లయము పొందబోవుచున్నదగుచున్నది. ఆ బ్రహ్మదేవుడు జలంలో తరంగాలవలె తనయందుతానే 'మనస్సు' అనబడుదాని పేరుతో చైతన్య తాదాత్మ్యధ్యాస (చైతన్యము యొక్క దృశ్య సంబంధమైన ధ్యాస) ను కల్పించుకొనుచున్నాడు.

ఆ బ్రహ్మదేవుడు కేవల సత్తామాత్ర స్వరూపుడే! అట్టి సత్తాస్వరూపమునందు బుద్ధి మొదలైనవి ఎట్లా ఉంటాయి? శూన్య స్వరూపము-అనంతము అగు ఆకాశంలో మట్టి - ధూళి ఉండవు కదా! ఆ బ్రహ్మదేవుడు వాస్తవానికి శుద్ధ-బుద్ధ-స్వయమాత్మ స్వరూపుడే కాబట్టి ఆయనకు దేహముగాని, చిత్తాదులుగాని, ఇంద్రియములుగాని, వాసనలు గాని... ఇవన్నీ లేవు. జలమునకు తరంగాదుల పొడవు, వెడల్పులు జల స్వస్వభావమునకు ఆపాదితాలే గాని జలం యొక్క వాస్తవస్వరూప ధర్మములు కావు కదా! అయితే, వ్యవహార నిర్వహణార్థం కల్పిత దేహేంద్రియాదులు ఆతనిపట్ల సదా విద్యమానమై ఉన్నప్పటికీ, ఆతని స్వరూపము సర్వదా నిష్ప్రపంచము - నిర్వికల్పము అగు పరమాత్మయే! అట్టి ఆత్మకు వేరైన కారణమేమీ లేదు కదా! ఇక పూర్వ ప్రజాపతి పూర్వమే ముక్తుడైనాడు కదా! నూతన ప్రజాపతికి ఆతడు కారణం కాదు కదా! ఈ విధంగా ఆ వర్తమాన ప్రజాపతి (బ్రహ్మదేవుడు) ప్రభవించటానికి ఆత్మకు వేరుకారణమేదీ లేదు. కనుక ఆతడు ఆతని మనోవీథిలో ప్రభవించుచున్న ఈ సృష్టి ఆత్మకు అన్యమైనది కాదని (అభిన్నమని) సిద్ధాంతీకరించ బడుచున్నది. ఈ విధంగా ఉత్పత్తి స్మృతి అనునది మొదలే లేవు.

**శ్రీరాముడు :** మహర్షీ! ఇతఃపూర్వపు ప్రజాపతి (ఇతఃపూర్వపు సృష్టి యొక్క సృష్టికర్త) ముక్తుడై, ఆ తదనంతరం కించిత్ ఇతఃపూర్వ స్మృతిచేత మరల దేహోత్పత్తి పొందియుండవచ్చును కదా! ఆ విధంగా ఈ జగత్తు 'స్మృతి'యే ఆధారముగా కలిగియున్నదని అనవచ్చునా? మరి, ఈ జగత్తుకు ఆధారమే లేదు అని ఎందుకనుకోవాలి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సంసారము కొనసాగుచున్నట్టి జనన – మరణ పరివర్తన శీలురగు జీవులకు 'స్మృతి' కారణభూతమై కొనసాగుచున్నదని అనవచ్చు. అయితే శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాదు లతో కూడిన ఈ జగత్ వ్యవహారాదుల నుండి, అందుకు మూలమైనట్టి భావనాదుల నుండి ముక్తత్వము పొందిన హిరణ్యగర్భుడు (సమష్టి సృష్టికర్త) వంటి వారికి సంసార స్మృతియే ఉండదు. స్మృతియే అవిషయమై, కల్పనామాత్ర స్వరూపమై, స్వప్నసంగతమైయున్న ముక్తునకు మరల దేహోత్పత్తి ఉండజాలదు. వారికిక దేశాంతరము గాని, కాలాంతరముగాని పునరావృత్తి పొంద జాలవు. కనుక వర్తమాన ప్రజాపతి సృష్టికి పూర్వ ప్రజాపతి యొక్క 'స్మృతి' కారణం కాజాలవని సుస్పష్టీకరించబడుతోంది.

సరే! కాసేపు పూర్వపు సృష్టికర్తయగు ఆ బ్రహ్మదేవునకు పూర్వకల్ప వాసనాజన్యమగు "హిరణ్యగర్భాహంభావం"... అనే స్మృతిచే దేహాదులు ఒకింత సంభవించి ఉండవచ్చునని కాసేపు అనుకుందాం. పూర్వపు సృష్టి కేవలము మనో (ఊహా) కల్పితాలే కదా! అట్లాగే వర్తమాన సృష్టి కూడా కేవలం మానసిక కల్పితాలే. పృథివి మొదలైనవి ఏవో పదార్థముల నుండి ఉత్పత్తి కానివి, అతి తుచ్ఛములు, సర్వదా శమించినవి, సంకల్ప నగర ప్రాయములు, మిథ్యాభూతములు మాత్రమే అగుచున్నవి కదా! కలలోనో, (లేక) ఊహ (సంకల్పము)లోనో కనిపించిన పర్వతాదులు ఎట్లా పృథివీ సంబంధం కావో (మిథ్యా భూతములో), అట్లాగే విరాట్టు యొక్క శరీర రూపమున ఏ పాదార్థిక విశ్వము స్ఫుటంగా కన్పించుచున్నదో అది పృథివీరహితమే (మిథ్యయే) అయివున్నది. మంచుతో ఏర్పడిన గృహం మంచు దృష్ట్యా ఎట్లా భ్రాంతియో, ఈ ఎదురుగా కనిపించే సృష్టి కూడా స్వకీయమైన భ్రాంతి దృష్టి వ్యవహారమే అయివున్నది. "క్రితం రోజు రాత్రి స్వప్నమే ఈ రోజు రాత్రి స్వప్న విశేషాలుగా కొనసాగుతోంది" అనునది జనుల అనుభవం కాదుకదా!

ఆది సృష్టి పూర్వానుభవమే లేదు. పూర్వానుభవము యొక్క అభావం చేత పూర్వ ప్రజాపతి యొక్క 'స్మృతి' నూతన సృష్టికి నాందిగా అవజాలదు.

**శ్రీరాముడు :** కొన్ని కొన్ని వేదవాక్యములను అనుసరించి (ఉదా: ధాతా యథా పూర్వమకల్పయత్ – బ్రహ్మదేవుడు పూర్వ కల్పానుసారంగా ఈ సూర్య – చంద్ర – పృథివి మొదలైన వాటితో కూడిన జగత్తును కల్పించెను... అను శ్రుతి వాక్యముల ద్వారా) బ్రహ్మదేవునికి (వర్తమాన ఈ సృష్టి కర్తకు) పూర్వ స్మృతి ఉండి ఉంటుందని కూడా కొన్ని సందర్భాలలో శాస్త్రకారులచే సూచనగా చెప్ప బడుతోంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను! అయితే, అట్టి శ్రుతి వాక్యములు 1.లౌకికులగు అజ్ఞానుల నిమిత్తం, 2. అనాది సిద్ధమగు కర్మమార్గము యొక్క ప్రవర్తనము కొరకై, 3.ఇతరుల బుద్ధిని అనుసరించి సంహితా విభాగంలో (కర్మకాండ విభాగంలో) బోధించబడినది. అది మధ్యేమార్గ పాఠ్యాంశమే గాని అంతిమ వేదసారం కాదు. (ఉపనిషత్ అంగం యొక్క సారం గ్రహించినట్టి) తత్త్వవేత్తల యొక్క దృష్టి యందు ప్రజాపతికి "పూర్వస్మృతి" అనే ప్రసంగమే లేదు.

**శ్రీరాముడు :** స్మృతి శాస్త్రమునందు ప్రావీణ్యులలో శ్రేష్ఠులు, ఉత్తమ గుణ నిలయులు అగు ఓ మునీశ్వరా! హిరణ్యగర్భాదులు స్మృతి లేకుండా సృష్టి ఎట్లా చేస్తున్నారు. వారికి స్మృతియే లేకుంటే పూర్వకాలికమైన బ్రహ్మాండం యొక్క సమస్త గుణాలు ఈ బ్రహ్మాండమంతా ఎట్లా సిద్ధిస్తున్నాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ స్మృతిని రెండు విధాలుగా మనం ఇక్కడ చెప్పుకుందాం.

**1. మాయోపహిత స్మృతి :** ఈ స్మృతి కల్పిత విశేషములపై ఆధారపడి ఉన్నది. సత్య పదార్థ శూన్యం, కల్పితం, మొదలే భ్రాంతిమయము అయివున్నది. భ్రాంతి సంస్కారాలచే జనించినదై ఉన్నది. అద్దాని యందు మాత్రం కార్య-కారణత్వముల కల్పన సంభవమౌతోంది.

**2. సత్యవస్తు స్మృతి :** సత్య పదార్థము యొక్క (ఆత్మ వస్తువు యొక్క) అనుభవస్మృతి వాస్తవానికి సంభవించదు, సత్య వస్తువు స్మృతి కాదు. అది స్వానుభవరూపం కాబట్టి.

**ఆ బ్రహ్మ స్తమ్బపర్యన్తం దృశ్యం కించిన్న విద్యతే ।**
**యత్ర, తత్ర కథం, కీదృక్, కుతః స్యాత్ సంభవః స్మృతేః ॥**

కాబట్టి రామచంద్రా! ఎచ్చటైతే బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక గడ్డిపరక వరకు గల సమస్త దృశ్యము వాస్తవానికి కొంచెమైననూ ఆత్మకు వేరుగా లేకయే ఉన్నదో... అచ్చట ఇక ఏ స్మృతి ఎట్లు సంభవించగలదు చెప్పు? ఈ దృశ్యం గనుక వాస్తవానికి ఉత్పన్నమై, విద్యమాన దశయందు ప్రమాణములచే అనుభూతమౌతూ ఉంటే అప్పుడు దృశ్యమునకు పూర్వకాల స్మృతి కారణమగు చున్నదని అనవచ్చేమో? కానీ ఈ దృశ్యము స్వప్నదృశ్యములాగానే ఉత్పన్నము అయి ఉండనే లేదు. తత్త్వజ్ఞులకు ఇది సత్యముగా నిరూపణ కావటం లేదు. ఎవరు ఎట్టి దృష్టితో చూస్తే అట్లు అనుభూతమయ్యే ఈ దృశ్యమునకు 'ఇది సత్యము' అనునదేది? ఎక్కడ ఈ రీతిగా దృశ్యమే లేదో ...అక్కడ "స్మృతి" యొక్క కల్పన ఎక్కడిది?

**అత్యంతాభావఏవ అస్య దృశ్యస్య కిల సర్వదా,**
**సర్వం బ్రహ్మేతి సత్యార్థాం తత్ స్మృతేః కలనాః కుతః?**

ఈ విధంగా వాస్తవానికి... 1. ఈ దృశ్యం యొక్క అత్యంత అభావం (స్వతహాగా ఏమాత్రం లేనిదిగా) సిద్ధించుచున్నది. 2. ఒకవేళ; "దృశ్యం అనుభవమౌతోంది కదా!" అని అంటే... అట్లా దృశ్యంగా విద్యమానమయ్యేదంతా సదా బ్రహ్మమే అయివున్నది. ఇక బ్రహ్మమునకు వేరుగా దృశ్యం యొక్క కల్పన ఎచట?

ఈ కారణం చేత ప్రజాపతికి 'ఆదిస్మృతి'యే సంభవించనేరదు. ఎందుకంటే, శుద్ధ జ్ఞాన రూపుడగు ఆతనికి దేహమేది? దేహమే లేనివానికి స్మృతి ఎక్కడిది? బ్రహ్మదేవునికి వాస్తవానికి 'పూర్వజన్మ' ఉండి ఉంటే, అప్పటి శరీరత్వ భావనావశముచే ఇపుడు "నేను జగత్తంతా శరీరముగా కలిగియున్నవాడను"... అని అనుకుని ఉండేవాడేమో? కాని లౌకిక జీవునివలె "ఈతడు తండ్రి, ఈతడు నా తాత" మొదలైన లౌకిక స్మృతులు బ్రహ్మదేవునికి (స్మృతిచే) జనించవు కదా! లౌకికమైన పితృ-మాతాది సంబంధాలు గృహబద్ధులైన జీవులు కలిగి ఉంటున్నారు. కాబట్టి స్మృతికి యోగ్య

లగుచున్నారు. కాని, బ్రహ్మదేవుని ఉపాసనా విషయమైనట్టి ఈ జగత్తు మనోరాజ్యము వంటిది కూడా కాదు. ఎందుచేతనంటావా?

స్మృతి = (ప్రాపంచకమైన అర్థం రీత్యా) అనుభూతమైనట్టి భూతకాలిక పదార్థముల యొక్క సంస్కారముల వశంగా వర్తమానంలో ఏర్పడే స్మరణయే "స్మృతి".

ప్రజాపతికైతే (సృష్టికర్త / బ్రహ్మదేవునికి) కల్పాదియందు పదార్థములే లేవు. కాబట్టి ఆతనికి 'స్మరణము' తో కూడిన 'స్మృతి' ఎక్కడిది?

**ఏవం హి ఖల్విదం బ్రహ్మ పరమేవాచలం యతః**
**అనాది మధ్య పర్యన్తం కుతః స్మృత్యాదయస్తతః ?**

ఈ ప్రకారంగా ఈ సమస్తమూ కూడా ఆది మధ్యాంతరహితమగు కూటస్థ పరబ్రహ్మమే అయివుండగా, ఇక స్మృత్యాదులు ఎక్కడివి? ఎవరివి?

ఇక నీవు, "చైతన్యం సమస్త పదార్థముల యొక్క ఆత్మయే అయివున్నది. కాబట్టి స్మృతి కూడా చిదాకాశం యొక్క స్ఫురణయే అయివున్నది. పూర్వ ప్రజాపతి యొక్క – వర్తమాన ప్రజాపతి యొక్క ఆత్మ ఒక్కటే" అని అంటావా?... అది మేమూ (వేదాంతవాదులు) ఒప్పుకుంటున్నాం.

1."ఏది కలదో... అదంతా బ్రహ్మమే"

2. సృష్టికర్త సృష్టిరూపంగా వ్యవహరించినప్పటికీ సర్వదా ఆతడు స్వయమాత్మరూపుడుగా పరమశాంతుడై ఉన్నాడు.

"స్వప్నద్రష్ట పరమశాంత స్వరూపుడై ఉండియే, స్వప్నంలో అనేక విశేషాలు దర్శిస్తున్నాడు"... అనునదే ఇందుకు దృష్టాంతం... అని నేను చెప్పియే ఉన్నాను కదా! ఆత్మయొక్క అజ్ఞాత బ్రహ్మ స్వభావమే "స్మృతి" రూపంగా స్ఫురించటం జరుగుతోంది. "నేను బ్రహ్మమును" అనే సమగ్ర స్వస్వరూప తత్త్వమును కించిత్ ఏమరచి... "నేను సృష్టికి కర్తృత్వం వహించే బ్రహ్మదేవుడను" అనునట్టి ఉపాసనా రూపముచే బ్రహ్మరూపమగు ఆత్మయే మరల మరల అభ్యస్తమై ఉపాసనా ఫలరూపమగు బాహ్య పదార్థం వలె (ఉపాసనచే) కల్పితమైన ఆకాశం యొక్క సాదృశ్యముచే భాసిస్తోంది. అజ్ఞానోపహితమగు బ్రహ్మంచే (జీవుని ద్వారా) ఏఏ పదార్థం ఎట్లెట్లు ఎరుగబడు చున్నదో... ఆ ఆలంబనం యొక్క ఫలితంగా అట్టి ఆకారముతోడనే కూడి ఉంటోంది. అట్లు ఆ ఆకారము దర్శించు స్వభావమే 'స్మృతి' చే ఉద్దేశింపబడుతోంది.

'మృగతృష్ణ' అనే భ్రాంతియందు 'జలతరంగాకారము' అనే దృశ్యం భాసిస్తున్నట్లుగా స్మృతి యందు అవిద్యమానమైన ఆయా పదార్థములు భాసించుచున్నాయి.

స్మృతి = సత్యస్వరూపమైన సర్వాత్మకమగు పరబ్రహ్మము నందు / సమక్షంలో సాదృశము లగుచూ స్ఫురించే చైతన్య వృత్తులు.

ఈ విధంగా 'స్మృతి' అనబడేది సర్వాత్మకమగు చిద్రూప పరబ్రహ్మమునందు అద్దాని అవయవముల వలె ఉంటున్నాయి. ఈ స్మృతుల విషయముల వైపుగా ఉన్ముఖమై ఉండటం చేత పరోక్షములుగా అగుపిస్తున్నాయి. స్వతఃగా స్మృతులు కూడా చిద్రూపమునకు అపరోక్షములై ఉన్నాయి.

ఈ విధంగా ఏ సంవిత్తు కాకాతాళీయంగా (ఆకస్మికమైన ఉద్బోధవశంగా భాసించుచున్నదో, ...అద్దాని స్వరూపము పేరే "స్మృతి" సంవిత్తు అనబడేది. సర్వాత్మకమగు పరబ్రహ్మము యొక్క స్వాంగభూతమై, సద్రూపమై స్వతఃగా స్ఫురిస్తూ అభ్యస్త పదార్థము యొక్క సాదృశ్యము వలన ప్రకాశించుచున్నప్పుడు... అదియే స్మృతి.

వాయువు యొక్క చలనమునకు హేతువు ఉండవచ్చు. ఉండకపోవచ్చు. మొత్తంమీద వాయు తరంగాలు అనుభవమగుచున్నాయి కదా! అట్లాగే హేతు సహితంగానో, హేతురహితంగానో అభ్యాసముచే రూఢిపడిన పదార్థముల గూర్చిన వృత్తుల 'సాదృశము' వలన ఏర్పడుచున్న దానినే లోకంలో 'స్మృతి' అని పిలుస్తున్నారు.

ఓ రామచంద్రా! నీ మనస్సు ఒకప్పుడు చేతులలోనో, కాళ్ళలోనో, తదితర అవయవములందో సంలగ్నమైనప్పుడు... ఆయా చోట్ల సంవిత్తు అనుభవరూపంలో భాసిస్తోంది కదా! అట్లాగే... చైతన్యము యొక్క కల్పిత అవయవభూతమే "సంవిత్తు" అయివున్నది.

ఆ సంవిత్తు కాకతాళీయ న్యాయంచేత ఒకానొకప్పుడు వేరే కాలపు వ్యవహారములందు స్ఫురిస్తూ ఉంటుంది.అట్టి సంవిత్ ప్రకాశము యొక్క పూర్వ సంబంధ విషయములకే 'స్మృతి' అనే పేరు పెట్టబడినది. స్మృతికి ముందే ఆ స్మృతిని వ్యవస్థీకరించుచున్న జీవాత్మ ఉండనే ఉన్నది కదా! అదియే పరమాత్మ స్వరూపం!

ఓ రామచంద్రా! ఇక్కడ స్వప్నమును, ఇంద్రజాలమును దృష్టాంతంగా తీసుకుందాం! ఈ రోజు రాత్రి నీకు వచ్చిన కలలో ఒకానొక స్వప్న ప్రపంచం కనబడటం, అందులో నీవు విహరించి ఉండటం జరిగిందని అనుకుందాం! ఆ స్వప్నలోకంలోని ఆయా విశేషాలే కనబడటానికి కారణం? కొంత స్మృతి అయివుండవచ్చు. (లేక) పూర్తిగా స్మృతికి సంబంధించినది అయి ఉండవచ్చు. ఒక్కొక్కసారి స్మృతికి ఏమాత్రం సంబంధించకపోయి ఉండకపోవచ్చు. "స్మృతియా? విస్మృతియా? అల్ప స్మృతియా? అత్యంత నూతనమా?"... అని ప్రశ్నిస్తే ఒక్కొక్కసారి ఒక్కొక్క స్వప్నం ఒక్కొక్క రీతిగా ఉంటోందే గాని, "ఇది స్మృతియే! (లేక) స్మృతి కాదు!" అని ఏమీ చెప్పలేం. అయితే "మిథ్యా జ్ఞానంలో ఘట-వస్త్రాది ఆయా వస్తువులన్నీ కనిపించి, అవి సత్యమువలె అనుభూతమవటమే స్వప్నం"... అని మాత్రం అనగలం. ఏది ఏమైనప్పటికీ... స్వప్నంలోని పదార్థాలన్నీ ఆకస్మికంగా భాసిస్తున్నాయి కదా! అట్లాగే, ఆత్మయందు సర్వరూపములగు సంవిత్తులు కలవు. అవి ఆయా సమయములందు (స్వప్నాంతర్గత విషయములవలె) ఆకస్మికంగా భాసిస్తున్నాయి. ఈ విధంగా ఈ సృష్టి ఆకస్మికమేగాని... "స్మృతిమాత్రం" కాదు అని చెప్పబడుతోంది.

ఓ రామచంద్రా! "ఈ రోజు స్వప్నంలో ఆ భవనమే ఎందుకు కనిపించింది? ఆ వ్యక్తులే ఎందుకు కనిపించారు? ఆ సంఘటనలే ఎందుకు కనిపించాయి?"... అని స్వప్న పదార్థముల మూలమును ఎవరైనా విచారిస్తున్నారా? లేదు. ఎందుచేత? ఏది ఎట్లా కనిపించినప్పటికీ స్వప్నంలో కనిపించింది భ్రమయే కాబట్టి. స్వప్న సమయంలో అదంతా "నిజమే కదా!" అని పొరబడినప్పటికీ,

జాగ్రత్ సమయానికి స్వప్నాంతర్గత విశేషాలన్నీ అసత్యమై తెలియవస్తున్నాయి. అట్లాగే జాగ్రత్‌లోని ఆయా సంబంధాలు, బాంధవ్యాలు, అనుబంధాలు, అనుబంధ విఘాతములు, మిత్ర శత్రుభావనలు, ఇష్ట-అయిష్ట అనుభూతులు – ఇవన్నీ కూడా ఆత్మజ్ఞానం ముందుసూర్యగోళము సమక్షంలో దీపపు బుడ్డీలవలె అగుచున్నాయి. అటువంటప్పుడు భ్రమమయమగు ఈ స్మృతి పదార్థముల యొక్క మూలమును గురించి ఎందుకు విచారిస్తున్నావో చెప్పు?

జ్ఞాని యొక్క దృష్టిలో... ఈ దృశ్యమే అసంభవమైయున్నది. కనుక వాస్తవానికి "స్మృతి" అనునది మొదలే 'లేనిది' అగుచున్నది. ఆతని అవగాహన యందు ఈ జగత్తు... పరమాత్మఘనమై, చిదాకాశమాత్రమై, యథారీతి సదానిర్వికారముగానే ...ఉండివున్నది.

ఇక, అజ్ఞానియొక్క దృష్టియందో... ఈ జగత్తు దృశ్యరూపంగాను, సత్యముగాను – భాసించటం జరుగుతోంది. అందుచేతనే ఆతనికి (అజ్ఞాన దృష్టిని కొనసాగించుచున్నవానికి) భూతకాలంలో అనుభూతములైన పదార్థములూ, వాటికి సంబంధించిన స్మృతియు 'సత్యము'గా తోచుచున్నాయి. అప్పుడాతడు ఆయా సంబంధిత వర్తమాన పదార్థములందు పూర్వ-అపూర్వ అనుభవ, ఊహలను జోడించి దర్శిస్తూ తన్మయుడగుచున్నాడు. అందుచేతనే నిర్వికారుడై ఉండలేక పోవుచున్నాడు.

❖

**శ్రీరాముడు :** హే మహాత్మా! అజ్ఞాని – తత్త్వజ్ఞానుల పరస్పరానుభవం గురించి-(ఈ "స్మృతి"ని గురించి చర్చించుచున్న ఈ సందర్భంగా) మరికొన్ని విశేషాలు వివరించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**న మోక్షోపాయ కథనం న చ జానామి తత్స్థితిమ్ ।**
**సందేహాదివ జిజ్ఞాసుం తావత్ మోక్ష కథోచ్యతే,**
**యావత్ దృశ్యమ్ స్మృతిశ్చైవ సంస్మృతిశ్చాస్య శామ్యతి ॥**

ఓ రామచంద్రా! 'పూర్ణ తత్త్వజ్ఞాని'కి మోక్షోపాయము గురించిన కథన రచన చేయవలసిన ఆవశ్యకతయే ఉండదు. అజ్ఞానికి దృశ్యముపైగల నమ్మకం చేత మోక్షపాయ కథనాలు చెప్పినా లాభం ఉండదు. కనుకనే ఈ కథన రచన జిజ్ఞాసువు కొరకే!

ఇక అజ్ఞాని 'తత్త్వజ్ఞాని' గురించి ఏ రీతిగా అర్థం చేసుకుంటున్నాడనేది రెండు రకాలుగా ఉంటోంది. 1. ఈతడు పట్టించుకోవలసింది వదిలేసి చాదస్తంగా అనవసరమైనది పట్టుకొని వ్రేలాడుచున్నాడు. 2. ఈతడొక పిచ్చివాడు, అమాయకుడు, అనవసరంగా మోసగించబడుచున్నాడు. ఇదే అభిప్రాయం తత్త్వజ్ఞాని అజ్ఞాని గురించి కూడా కలిగి ఉంటున్నాడు.

అయితే ఇక్కడ ఒక విశేషం. ఆ అజ్ఞాని కూడా సౌభాగ్యవశంగా సాధన చతుష్టయ సంపత్తిని పెంపొందించుకొన్నప్పుడు ఈ దృశ్యము యొక్క తత్త్వ స్వభావముల పట్ల సందేహములు పొందినవాడై జిజ్ఞాసువు అగుచున్నాడు. అట్టి జిజ్ఞాసువు తత్త్వజ్ఞుడగు గురువును (మార్గదర్శకుని) సమీపిస్తున్నాడు. ఆత్మతత్త్వజ్ఞానమునందు అనుభవశీలుడగు ఆ గురువు ఆ ముముక్షువైనట్టి (మార్గాన్వేషి అయినట్టి)

ఆశ్రిత శిష్యునికి ఆతనియొక్క "దృశ్య సశాంతి" కొఱకై మోక్ష కథన రూపమగు మోక్ష శాస్త్రమును విశదీకరిస్తున్నాడు. అట్టి ఉపదేశము యొక్క ప్రభావముచే ఆ ముముక్షువు యొక్క దృశ్యము శమించినదై, ఇక ఆపై అవిద్యచే జనించిన "స్మృతికథనం" మొదలైనవి ఆతనిపట్ల "ఈ జగత్తు స్మృతి యొక్క ఫలమా? ఏక ఆత్మయొక్క విస్మృతియా? ఇదంతా కాకతాళీయమా? లేక ఇది కార్య-కారణ పరంపరయా?" అనే సందేహాలు పటాపంచలై పేరు లేకుండా అదృశ్యమైపోతున్నాయి.

ఏ విధంగా అయితే తత్త్వజ్ఞుల జగత్ దర్శన విశేషం ఎటువంటిదో అజ్ఞులు (దృశ్యముపై "ఇది నిజమే కదా!"... అనే మూర్ఖత్వముతో కూడిన నమ్మకము గలవారు) ఎరుగ లేకపోతున్నారో... అట్లాగే మూర్ఖత్వము - మోహములతో కూడిన అజ్ఞులకు ఏ అనునిత్యమైన సత్యము (శాశ్వతమైన విశేషం) ఈ దృశ్యములో అగుపిస్తోందో... అది తత్త్వజ్ఞులకు తెలియటం లేదు. కళ్ళు వినటం, చెవులు చూడటం జరుగదు కదా! సూర్యునికి రాత్రి అనుభవం ఉంటుందా? ఉండదు కదా! అట్లాగే తత్త్వజ్ఞుల తాత్త్విక దృష్టి అజ్ఞులకుగాని, అజ్ఞుల భోగాశ-నిరాశ-దురాశ-పరనింద-లౌకికాశయములు మొదలైన వాటితో కూడిన వస్తు దృష్టి తత్త్వజ్ఞులకుగాని తెలిసిరావటం లేదు.

**శ్రీరాముడు :** మహర్షీ! "సంసార" మని దేనిని ఉద్దేశించి అంటున్నారు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అంతఃకరణసహిత చైతన్యంలో బాహ్యవస్తు సేవనం చేత బాహ్య వస్తుస్వరూపం భాసించటం జరుగుతోంది. అట్టి బాహ్య వస్తు స్వరూపము మరల మరల వ్యవహారముల ద్వారా అభ్యస్తమై అంతరంగమున నాటుకొనుచున్న స్థానమే "చిత్తము". అట్టి చిత్తము ఇష్ట - అయిష్టాలతో కూడి వాసనారూపమై ఉండటం చేత అదియే "సంస్కార" మని శాస్త్రకారులచే పిలువబడుతోంది.

అయితే... తత్త్వజ్ఞానుల దృష్టియందు మాత్రం అట్టి "సంస్కారం, చిత్తం, మనస్సు, బుద్ధి" మొదలైన సమస్త పరికల్పిత పదార్థములు కూడా (అధిష్ఠాన దృష్టిచే) ఆత్మస్వభావ భూతములే అయి ఉంటున్నాయి. దర్పణంలో కనిపించే దృశ్యము దృశ్య దృష్టిచే దృశ్యముగా... దర్పణ దృష్టిచే దర్పణమాత్రంగా గమనించబడుచున్నది. కదా! అవన్నీ ఉన్నట్లుగా కనిపిస్తున్నప్పటికీ (జ్ఞానదృష్టిచే) దగ్ధపటన్యాయమువలె (అగ్నిచే కాల్చబడిన వస్త్రం వస్త్రాకారము కలిగియున్నప్పటికీ వస్త్రమువలె ఉపయోగపడనట్లుగా)... అభాసగా ఉండీ ఆత్మకు వేరుగా లేనట్లే అగుచున్నది. వాటి యొక్క సాదృశ్యత్వం జ్ఞానుల దృష్టి యందు మొదలే తుడిచివేయబడినదై ఉంటోంది. అందుచే తత్త్వవేత్తల దృష్టిలో దృశ్యమే లేనప్పుడు ఇక దృశ్య సంసారమెక్కడిది? అది ఎప్పుడూ సంభవించకయే ఉన్నది. మృగతృష్ణలో జలం ఉండదు. "స్వప్న పదార్థములు అసలు పదార్థములే కాదు"... అను అవగాహన వలె, జ్ఞానులకు- ఈ సృష్టి మొదలే లేనిదై, సృష్ట్యాదియందే అసలే భాసించినదై ఉంటోంది. "దృశ్యము వస్తుతః లేదు" అనే నిశ్చయమును వారు సర్వదా కలిగియే ఉంటున్నారు.

❖

పరమాత్మ రూపమగు చిదాకాశమే తనయందు ఇట్లు జగత్ రూపంగా స్థితినొంది ఉన్నది. కాబట్టి 1. చిదాకాశము, 2. సృష్టి అనబడు రెండు శబ్దములూ పర్యాయ పదములే అయివున్నాయి.

1. బ్రహ్మము తనయందు తానే ఇట్లు జగత్తురూపంగా భాసిస్తోంది.
2. (బ్రహ్మమునకు వేరైనట్లు) మిథ్యగా ఈ జగత్తు భాసిస్తోంది.
3. బ్రహ్మమే సృష్ట్యాది యందు జగత్తువలె స్థితినొందియున్నది.

అంతా బ్రహ్మము రూపమే అయివుండగా ఇక ఇందులో గ్రాహ్యం యొక్క త్యాజ్యం యొక్క భాసనమేమున్నది? బ్రహ్మరూపమే అయినట్టి జగత్ చమత్కారంలో ఆకారవంతమైనది గాని, స్మృతి సంబంధమైనదిగాని సంభవించనే సంభవించదు. పరమాత్మ యందు జగత్తు భాసించటానికి ఉపాదాన కారణమంటూ (కుండ తయారవటానికి ఉపాదాన కారణం కుమ్మరిలాగా) ఏదీ పరిశీలనకు కించిత్ కూడా లభించటం లేదు. కాబట్టి... పరమాత్మ స్వరూపమే ఇట్లు జగత్తుగా అజ్ఞానదృష్టిచే భాసించుచున్నదగుచున్నది.

**శ్రీరాముడు :** స్వామీ! సాధన కొరకై ఈ జగత్తు సాకారమను భావన ఉచితమా? నిరాకారమను భావన ఉచితమా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఈ జగత్తు సాకారము" అనే భావనను ఉపాసించే వారికి పుత్రుడు మొదలైనవారి మరణం యొక్క స్మృతియందులాగా... ఇద్దాని స్మృతి యందు కూడా దుఃఖం కలిగే అవకాశముంది. ఎందుకంటే... సాకారమైనదంతా నిరంతరం మార్పు చేర్పులు చెందుతూనే పోతోంది కదా!

ఈ జగత్తు యొక్క ఆకారము, అద్దాని స్మృతి... రెండూ కూడా మిథ్యయే! మిథ్య అయినది స్వయంగా బంధం కలిగించగలదా? లేదు. ఈ భూతాకాశమునందు కనిపించే నీలత్వంలాగా... చిదాకాశమునందు ఈ జగత్తు కూడా శూన్యరూపంగా వర్తించుచున్నది.

స్వప్నంలో విశాలమైన దిక్కులు, ఆకాశం మొదలైనవి కనబడుచున్నాయి. అవి ఎక్కడి నుండి అక్కడికి వచ్చాయి? స్వప్నంలో చిదాత్మ తనయొక్క చిదాత్మ నిజ స్వరూపమును త్యజించకుండానే ఆయా దిక్కులు, భూమి, ఆకాశము, కాలము మొదలైన వాటితో కూడిన జగద్రూపంగా భాసిస్తోంది కదా! ఎందుకంటే స్వప్న సమయంలో స్వప్నద్రష్టకంటే వేరుగా అక్కడ ఎవరూ లేరు. పోనీ, వేరుగా ఎవరైనా స్వప్న దృశ్యం కల్పించటానికి కారకులా? కాదు. కనుక స్వప్నమంతా కూడా స్వప్న ద్రష్టరూపమే! అట్లాగే పరబ్రహ్మము తన శుద్ధ సచ్చిదానంద స్వరూపమును త్యజించకయే ఈ సూర్య, చంద్ర, పర్వతాది రూపములుగా స్థితినొందియున్నది.

ఏ విధంగా తన శుద్ధ చిదాకాశ స్వరూపమును త్యజించని చిదాకాశము యొక్క అంతరమున స్వానుభవమాత్ర స్వరూపమై స్వప్న ద్రష్ట యొక్క స్వప్న పురము విద్యమానమగుచున్నదో... అట్లాగే ప్రతి జీవుడు తన చిదాకాశ స్వరూపమునందే ఈ జగత్తును గాంచుచున్నాడు. అనగా, తన స్వరూపమునకు అనన్యమైన దానియందే ఈ సర్వ దృశ్య వ్యవహారములను సందర్శించుచున్నాడు. సృష్టి యొక్క ఆదియందు కూడా (స్వప్నమందు లాగానే) పృథివి మొదలైనవి ఉత్పన్నమే కాలేదు. బ్రహ్మ సత్తయే సృష్ట్యాది యందు జగత్ రూపంగా భాసిస్తోంది.

పరమాత్మయే "హిరణ్మగర్భుడు" అనబడే సమష్టి మనోరూపమును ధరించి, స్వకీయ భావనానుసారంగా సృష్టియొక్క కల్పనను గావించి, అద్దానియందు ప్రవేశించి, "ఇది మట్టి, ఇది రాయి, ఇది గోడ, ఇది ఇల్లు"... ఇత్యాది సంజ్ఞలను గావించుచున్నాడు. అయితే పృథివి మొదలైన వాటి ఉనికియే అసంభవం. అందుచేత, ఈ జగత్తు బ్రహ్మదేవుని స్మృతి రూపమూ కాదు, సాకారమూ కాదు. భ్రాంతీ కాదు. వివర్త రూపమూ కాదు.

ఇది కేవలం బ్రహ్మమే! అట్టి బ్రహ్మము సృష్టి – ప్రళయములందు కూడా తన నిర్వికార చిత్ స్వభావమునందే వెలయుచున్నది. అదియే రమణీయమగు ఈ జగత్తుగా కూడా భాసిస్తోంది. ఈ విధంగా సృష్టి – ప్రళయ – దృశ్య రూపములుగా భాసిస్తున్నప్పటికీ ఆ బ్రహ్మము సర్వదా ఏకము – నిర్మలము – ప్రశాంతము – నిత్యోదితము అయిన చిదాకాశముగానే చెన్నొందుచున్నది.

❖❖❖

# 15. చైతన్యము యొక్క అనేక విన్యాసములు

**శ్రీరాముడు :** హే మునీంద్రా! "సర్వానుభవరూపము, అనంతము, సర్వ స్వరూపము అయినట్టి ఆత్మయొక్క చమత్కారమే ఈ జగత్తు"..... అని మీరు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నారు కదా! అంతా ఆత్మయే అయినప్పుడు అద్దానికి దేహంలోనే "అహమ్" "అనే భావన కలిగివుండటం, ఒక రాయి కొండ మొదలైన జడ పదార్థములందు అహంభావము కలిగి ఉండకపోవటం... ఎందుకు జరుగుతోంది? అన్ని వస్తువుల యందు ఆత్మ అహంభావము కలిగివుండవచ్చు కదా! జడములందు 'నేను' అనునది ఎందుకు కలిగివుండటం లేదు?

ఆ చైతన్యము చైతన్య విరుద్ధములైన గోడ–రాయి–మట్టి–ఇల్లు వంటిరూపములను జాగ్రత్–స్వప్నాలలో ఎందుకు కలిగి ఉంటోంది? చైతన్యము సర్వదా చైతన్యమే అయినప్పుడు,. జడరూపములనేవే ఉండకూడదు కదా!

రాయి, కట్టె చైతన్యరూపం కాకపోయివుంటే అవి 'లేవు' అనటానికి వీలులేదు కదా! కనుక చైతన్యమునకు వేరైనది ఉన్నట్లే కదా! మరి చైతన్యం 'అనన్యం' అనటమెట్లా? రాయి, కట్టె చైతన్య రూపములే అయివుంటే, అవి జడరూపములే కదా! చైతన్యము 'సత్' అని, అందుకే అన్యమైనది 'అసత్' అని గదా సిద్ధాంతం!

కాబట్టి "చైతన్యము సర్వరూపమైనది" అనెడి జడవస్తువుల పట్ల ఎట్లా సిద్ధిస్తుంది? ఒక శరీరంవలెనే రాయి జడమా? చైతన్యమా? చైతన్యమునకు జడత్వం కూడా (రాయిలో) సిద్ధిస్తోందా? అది ఎట్లా? (లేక) చైతన్యం కొన్ని కొన్ని చోట్ల జడంగా ఉండిపోతోందా ఏమి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓహో! మంచి ప్రశ్నే అడిగావు. "చైతన్యము చైతన్య విరుద్ధమైన జడరూపమగు రాయి, కట్టెగా కూడా అగుచున్నదా?"... అని కదా నీ ప్రశ్న? కదిలే శరీరాలు చైతన్యమనవచ్చునుగాని, కదలని రాయి, కట్టె చైతన్యము లెట్లా అవుతాయి? అవి చైతన్యము కాకపోతే, మరప్పుడు 'సర్వజగత్

చైతన్య స్వరూపమేవ'... అనే సిద్ధాంతం కుదురదు కదా! కట్టె - రాయి చైతన్యం కాకపోతే, అప్పుడు చైతన్యం కొన్నిచోట్ల జడంగా కూడా ఉంటుందా?... అని కదా నీ సందేహం?

సరే! జడంగా కనిపించే రాయి - కట్టె ఎట్లా చైతన్య స్వరూపములో వివరిస్తాను విను.

❖

| దేహధారియగు జీవుడు అనే చైతన్యం | విశ్వరూప చైతన్యం |
|---|---|
| 1. దేహధారియగు జీవునకు శరీరమంతా అహంకారం (నేను అను భావన) ఉన్నప్పటికీ కూడా చేతులలో మాత్రమే 'ఇవి నా చేతులు' అనే అహం భావం, కళ్ళ వద్ద మాత్రమే 'ఇవి నా కళ్ళు' అనే అహంభావం ఏర్పడుతోంది. పాదాల వద్ద పాదాలకు సంబంధించిన అహంభావం మాత్రమే ఏర్పడు తోంది. | 1. సర్వరూపమగు చైతన్యమునకు కూడా అట్లాగే దేహము నందు మాత్రమే దేహమునకు సంబంధించిన అహంభావం ఏర్పడుతోంది. అట్లే భూమి - ఆకాశం - రాయి మొదలైన వాటిపట్ల ...ఆయా పరిమిత అహంభావములు కలిగి ఉంటోంది. |
| 2. వృక్షాభిమానియగు జీవుడు వృక్షమంతటా 'అహం' భావము సమంగా కలిగివుంటాడు. కాని ఆకులలో ఆకులకు సంబంధించిన అహంభావం, కాండము వద్ద కాండమునకు సంబంధించిన అహంభావం కలిగి ఉంటాడు. | 2. సర్వరూపమగు చైతన్యం వృక్షంలో వృక్ష సంబంధమైన అహంకారం, పర్వతంలో పర్వత సంబంధమైన అహంకారం, మానవులో మానవ దేహాహంకారం వేరు వేరుగా కలిగి ఉంటోంది. అంతే కాని, మానవుని యందు పర్వతాహంకారం కలిగి ఉండటం లేదు. |
| 3. ఆకాశాభిమానియగు జీవునకు శూన్యత్వం నందే శూన్యత్వమును గూర్చిన అహంభావం ఉంటోంది. ఆతనికి "వస్తురూప-దేహరూప" అహంభావం ఉండటంలేదు. | 3. చైతన్యానికి శూన్యం నందు శూన్యమేవాహం భావం, మణి - సువర్ణాది ద్రవ్యముల పట్ల ద్రవ్యత్వ అహంభావం కలిగి ఉన్నదగుచున్నది. |
| 4. స్వప్నద్రష్టకు నిరాకారరూపమగు స్వప్న పురం పట్ల స్వప్న రూపత్వానికి సంబంధించిన అహం భావం ఉన్నది కదా! | 4. సర్వరూపమగు చైతన్యమునకు స్వప్నమందు స్వప్నాహంభావం, జాగ్రత్ నందు జాగ్రదహం భావం కలిగినదై ఉంటోంది. |
| 5. మహాపర్వతాభిమానియగు జీవుడు 'ఇది నా శిలారూపం, ఇది నా వృక్ష రూపం, ఇది నా జలరూపం' ... ఇత్యాది వివిధ అహంకారములు కలిగి ఉంటున్నాడు. | 5. "సర్వాత్మ" యగు చైతన్యమునకు మహా పర్వత పుర ఆదిగా అహంకారాలు ఉండి ఉంటున్నాయి. అయ్యది సర్వాహంకార రూపం (ఇదంతా నేనే - అనే అహంకారం) కలిగి ఉన్నదై ప్రదర్శితమౌతోంది. |
| 6. చేతన రూపియగు ఈ దేహి దేహమునకు "గోళ్ళు - వెంట్రుకలు మొదలైన అచేతనములు కలిగి ఉండాలి" అనే పట్టుదల కలిగియే ఉన్నాడు. | 6. సర్వరూపమగు చైతన్యము కాష్ఠ - శిలాదులపట్ల (కొయ్య-రాయి పట్ల) కాష్ఠ - శిల అవయవత్వము - జడత్వము ధరిస్తోంది. |

7. మనుజుడు చైతన్య స్వరూపుడే కదా! ఆతని దేహమో ... గోళ్ళు, వెంట్రుకలు, రక్తం, ఆకాశం ఇత్యాది ధర్మాలు కలిగి ఉన్నదై చేతన అచేతనాత్మ కమై శోభాయమానంగా వెలుగొందు చున్నది కదా!

8. జీవుడు కలలో అనేక దృశ్యాలు "వాస్తవమే కదా" అనే బుద్ధితో చూస్తున్నాడు. మెలకువ రాగానే...? స్వప్నాంతర్గతమైన స్వప్న భ్రమ క్షణంలో తొలగి పోతోంది.

9. అతిదీర్ఘమైన అనేక బీభత్సాది విషయా లతో కూడిన స్వప్నం నుండి తెల్లారి మెలుకువ రాగానే ...ఆ స్వప్నాంతర్గత విశేషాలు, స్వప్నం, ఆ స్వప్నద్రష్ట మటుమాయమై పోతున్నారు కదా! ఇక స్వప్న ద్రష్ట లేదు, స్వప్నం లేదు. ఏమయ్యారు? మౌనరూపచిన్మాత్రాకాశంగా పరిణమిస్తున్నాడు కదా!

10.సముద్రంలో అసంఖ్యాక తరంగాలు పెల్లు బుకుతున్నాయి. సముద్రంలో అటు ఇటూ సంచ రిస్తున్నాయి. ఆ తరంగాలన్నీ కాలాంతరంలో ఏమి కానున్నాయి? ఏ జలంలోనుంచి బయల్వెడలు చున్నాయో... ఆ జలంలో ఆకారాదులన్నీ త్యజించి విలీనమవుతున్నాయి.

11. సముద్రజలం తరంగాలు, బుడగలు, నురుగు, ఆవర్తాలు, సుడులు మొదలైన వివిధ రూపాలుగా ఒకే సముద్ర జలం కనిపిస్తున్నప్పటికీ .... సముద్ర జలం సర్వదా యథాతథమైయున్నది.

7. "సర్వస్వరూపుడు, శుద్ధ చైతన్య స్వరూపుడు" అగు పరమాత్మ శరీరమగు ఈ జగత్తు కూడా స్థావరజంగమాత్మకాలతో, చేతన-అచేతనాలతో కూడి శోభాయమానమై ఉన్నది. అయినప్పటికీ ఇదంతా నిరాకారం, యథాతథం.

8. ఈ జగత్తు కనిపించవచ్చుగాక. కానీ సమ్యక్ జ్ఞానముచే ఇదంతా శమించినదై జడ + చైతన్యాలుగా కాకుండా కేవల శుద్ధ చైతన్యంగా అగుపిస్తోంది.

9. అట్లాగే... ఆత్మజ్ఞానము పొందిన తరువాత ఇక ఈ దృశ్యము-ఇద్దానిని దర్శించే ద్రష్ట. ఇరువురూ కూడా చిదాకాశమాత్ర రూపులై తెలియ వస్తున్నారు. జగత్తే బ్రహ్మమగుచున్నది. ఇక జడ - చైతన్య భేదమెక్కడ? బ్రహ్మమే ఈ జగత్తు!

10. "చిదాకాశము" అనే మహా సముద్రంలో చిదాకాశానికి అనన్యమైనట్టి అనేక కోట్ల "సృష్టులు" అనే తరంగాలు ఉత్పన్నమై, కొంత కాలం కనిపించి మరల చిదాకాశమునందే విలీనమైపోతున్నాయి. అయినా కూడా, అసంఖ్యాక సముద్ర తరంగాల వలె అసంఖ్యాక సృష్టులుగా కనిపించినప్పటికీ చిదాకాశము యొక్క "ఏక రూపత్వము"నకు వచ్చే హాని ఈషణ్మాత్రం కూడా లేదు.

11.సర్వదా నిర్మల చైతన్యమున చిత్స్వరూపములే అగు అనేక సృష్టులు ప్రభవించి మరల ఎప్పుడో నిర్మల చైతన్యమునందే లయిస్తున్నాయి. అట్టి చిత్స్వరూపమున తరంగాలు - ఆవర్తాల వలె సృష్ట్యాదిగా అనేక సంజ్ఞలు రచించబడుచున్నాయి.

❖

ఓ రామచంద్రా! అజ్ఞానికి జగత్తులో తనకు సంబంధించినవి - సంబంధించనివి అనేక వస్తు - విషయ - సంఘటన - వ్యక్తుల పరంపరలు అగుపిస్తున్నాయి కదా! అయితే జ్ఞానికి ఈ జగత్తు యథాతథంగా సదా నిర్వికారమగు పరబ్రహ్మముగా విద్యమానమగుచున్నది.

జ్ఞానుల నిత్యస్వభావమగు "ఆత్మాహమ్" దృష్టిని సుస్పష్టపరచటానికి ఇక్కడ ఒక చమత్కారమైన దృష్టాంతపూర్వకమైన విశేషం చెపుతాను.

**"నాహం తరంగః, సలిలమహమ్" ఇత్యేవ యుక్తితః**
**బుద్ధం యేన తరఙ్గేణ ..... కుతస్తస్య తరంగతా?**

ఒకానొక మహాసముద్రం ఉన్నది. అద్దానియందు ఎక్కడో, ఎందుకో, ఏదో సమయంలో (సముద్ర జలంలో) ఒకానొక 'తరంగం' ఉత్పన్నమైనది. తదితర తరంగములలాగానే అది సుదీర్ఘకాలం అవిశ్రాంతంగా మహాసముద్ర జలంలో అటూ – ఇటూ సంచరిస్తూ ఎంతో చంచలత్వం, వేదన, శ్రాంతి(Restlessness), శ్రమ పొందినదయింది. అట్టి ఉద్వేగము, వేదనలను తొలగించుకోవటానికి మార్గం అన్వేషించటం ప్రారంభించింది. చివరికి ఆ తరంగమునకు ఎవరో ఉద్బోధించారు. ఏమని? ... "నీవు జలము నుండియే ఉత్పత్తిని పొందావు. ఆ జలమును చేరగానే నీవు సశాంతిస్తావు"... అని. అప్పుడు ఆ తరంగం "జలం ఎక్కడున్నది? అద్దానిని దర్శించి అద్దానియందు లయమొందే ఉపాయమేమిటి?" ... అని తీవ్రమైన ఆందోళనతో కూడిన అన్వేషణ ప్రారంభించింది. అప్పుడు అద్దానికి మరెవరో ఇట్లా బోధించారు.

ఓ తరంగమా! నీవు జలముతోనే తయారయ్యావు. జలానికి అన్యంగా నీవు లేవు. ఇక తరంగత్వమునకు సంబంధించిన నామరూపాదులు నీ యొక్క భ్రమయే! నీవు జలమునకు వేరైన క్షణమే లేదు. జలమునకు అన్యంగాని నీవు జలం కోసం వెతకటమేమిటి?

పై అంశాన్ని గ్రహించిన ఆ తరంగం పరమానందమును పరమశాంతిని పొందినదై తన జల సంచారము లీలగా, క్రీడగా కొనసాగించసాగింది.

ఇప్పుడు "నేను జలమునే" అని గ్రహించిన ఆ తరంగమునకు "నేను ఈ తరంగత్వము – అనే బంధం తొలగించుకునేది ఎట్లా?" ...అనే ఆవేదన ఉండదు కదా! "చైతన్య మహాసముద్రంలోని చైతన్య స్వరూప తరంగమే నేను" ...అని గ్రహించిన తరువాత, ఇక, "నాకు మోక్షం ఎప్పటికి? ఈ 'జీవుడు' అనబడే బంధం, ఈ దేహబంధం, ఈ దృశ్యబంధం ఇట్లాగే ఉంటాయా? తొలిగేది ఎన్నటికి?" ...అనే సంశయ –ఆవేదన – ఆందోళనలు ఉండవు.

ఈ జగత్తు 'బ్రహ్మము' అనే సముద్ర జలము యొక్క తరంగమువలె భాసిస్తోంది. తరంగం ఉన్నప్పుడు – లేనప్పుడు కూడా జలము సర్వదా జలమే అయినట్లుగా... 1.జగత్తు, 2.జగత్తు యొక్క అభావము ఈ రెండూ కూడా బ్రహ్మము యొక్క శక్తి చేతనే స్థితిని పొందినవగుచున్నాయి.

ఓ రామచంద్రా! స్వప్నంలో జడ–చైతన్య పదార్థములను గాంచుచున్న స్వప్న ద్రష్ట తన యొక్క స్వప్నమునకు అప్రమేయమైన స్వస్వరూపమును త్యజిస్తున్నాడా? లేదే! అట్లాగే, చిదాకాశము తన శుద్ధ స్వస్వరూపమును కించిత్ కూడా త్యజించకుండానే... పరస్పర ధర్మ–నియమములగు చేతనాభావం కలిగి ఉంటోంది. అట్టి చైతన్యంతో కూడిన సమష్టి భావనా స్వరూపమే "మనస్సు". ఆ సమష్టి మనస్సే "పితామహుడు, సంకల్ప పురమువలె అకారణుడు, చిన్మాత్ర రూపుడు" అగు "ఆది ప్రజాపతి".

ఇప్పుడు సువర్ణాభరణమును దృష్టాంతంగా తీసుకొందాం. ఒక బంగారు భుజకీర్తి (భుజమునకు అలంకరించే ఆభరణం) "నేను బంగారంగా అవాలి. బంగారంగా ఉండాలి"... అని ఆవేదన చెందటం ప్రారంభించిందనుకో! ఆ ఆభరణము "నేను బంగారమునే! ఈ ఆకారం ఆపాదితం, ఈ ఆకారం (భుజకీర్తిగా) కలిగి ఉన్నంత మాత్రంచేతగాని, (లేక) ఇది తొలగుటచేతగాని నేను బంగారం కాకపోవట మెక్కడిది?"... అని గ్రహించిన తరువాత, ఇక... అద్దానికి ఆభరణత్వమెక్కడిది? అట్లాగే "నేను సర్వదా చిదాకాశ స్వరూపుడనే" అని గ్రహించిన మహనీయునికి ఇక, "ఈ 'జీవుడు' అనే బంధం, ఈ అహంకారం, ఈ జన్మలు, ఈ కర్మలు నాకు తొలగేది ఎట్లా?" అనే ఆవేదన ఇంకెక్కడుంటుందయ్యా?

ఈ సృష్టికి కర్త అగు బ్రహ్మదేవుడు సంకల్ప స్వరూపుడు. చిన్మాత్రాకాశ దేహధారి. జన్మ రహితుడు. ఇక ఈ జగత్తులో భాసించే 'అహమ్' మొదలైనవి, అద్దానిని ఆధారంగా కలిగి ఉండి భాసించే తదితరములు... ఇవన్నీ కూడా బ్రహ్మదేవుని స్వరూపమే అయివున్నవి.

ఇక ఈ సృష్టి-స్థితి-లయాలంటావా? ఇవన్నీ కూడా చిదాకాశమున శూన్యరూపాలైన చైతన్య చమత్కృతులే! చిన్మాత్రాకాశము యొక్క స్వయం స్ఫురణయే బ్రహ్మదేవుడు. అట్టి స్వయం స్ఫురణ నిర్మలము, స్వప్నతుల్యము చిత్తత్త్వమాత్రము అయివున్నది. ఆద్యంతరహితమగు చిద్రూపమే స్ఫురణ మాత్రంగా సృష్టి-స్థితి-ప్రళయ విభ్రమరూపంగా స్ఫురిస్తోంది. హిరణ్యగర్భ రూప "సమష్టి మనస్సు"... "విరాట్" అని చెప్పబడుతోంది. అట్టి విరాట్ యొక్క సంకల్ప నగరం వంటి నిర్మల స్ఫురణములే ఈ భూ - భువన సమూహ సృష్టి. అనగా ఆ చిదాకాశరూపమగు విరాట్టుయే ఈ సృష్టి.

ఆ విరాట్ ఈ సృష్టిని తన రూపముగా కలిగివున్నాడు. స్వప్నద్రష్టయే స్వప్నరూపముగా అగుచున్నట్లుగా ఈ సృష్టియే ఆతని స్వప్నం. ఆ స్వప్నమే ఈ జాగ్రత్‌లోని వ్యష్టి - సమష్టి - జడాది దేహరూపములను ధరించుచున్నది. సుషుప్తియే స్వప్నానుభవంగా ఉత్పన్నమగుచున్నట్లుగా... 'అవిద్య' అనే అంధకారముచే ఆవృతమైన ఆత్మయే జగదనుభవముగా బయల్వెడలుచున్నది.

ఆ విరాడ్రూపుడగు పరమాత్మకు... కల్పాంతమందలి రాత్రి, అవాంతర ప్రళయములు చిన్న -పెద్ద కేశములవంటివి. కాలము-క్రియ-పగలు-రాత్రి ఆతని అవయవ సంధులు. అగ్ని ఆతని ముఖము. స్వర్గము శిరస్సు. ఆకాశము నాభి. భూమి పాదములు. సూర్య చంద్రులు నేత్రములు. దిక్కులు చెవులు. ఈ ప్రకారంగా మనఃకల్పనయే విరాడ్రూపంగా విజృంభించుచున్నది.

❖

ఈ విధంగా విశాలరూపుడగు విరాట్ భగవానుడు ఈ విశాల విశ్వము రూపంలో ఘనీభూతమై బాగుగా కనిపిస్తున్నప్పటికీ ..ఇదంతా స్వప్నంలో కనిపించే మహా పర్వతంలాగా స్థితినొందియున్నది. వాస్తవానికి ఈ విరాట్ పురుషుడు ప్రపంచ రహితుడైన చిదాకాశరూపుడే అయివున్నాడు.

జగత్తు = ఏదైతే చిదాకాశమున... చేతనాత్మకమగు జీవరూపమును పొంది స్వయంగా అతిశయ రూపమున ప్రకాశించుచున్నదో... అదియే - చిదాకాశ రూపమగు ఆత్మరూపజగత్తును చిదాకాశ రూపమగు ఆత్మయే పొందుచున్నదిగా - అగుచున్నది.

**విరాడ్రూపం -** సర్వవ్యాపకమైన చిన్మయాకాశమే స్వప్నంలో వ్యవహారంలాగా ఇట్లు విరాడ్రూపంగా జడ – చేతనములతో కూడి భాసిస్తోంది.

**అనుభవితైవ అనుభవం సత్యం స్వాత్మానమప్యసస్తమివ**
**అనుభవతీయత్త్వేన స్వప్ననటః స్వప్నదేశమివ ॥**

ఒకానొక నృత్య కళాకారుడున్నాడు. ఆతడు ఒక రాత్రి కలలో తాను నృత్యం చేస్తూ ఉండగా అనేక మంది ప్రేక్షకులు అభినందనలతో కరతాళ ధ్వనులు చేస్తూ ఉన్నారు. ఇప్పుడీ స్వప్నంలో జరుగుచున్నదేమిటి?... ఆ స్వప్నం, అందులోని ప్రేక్షకులు, వారి కళాభిరుచికి అనుగుణంగా నృత్యం చేసే తాను, ఆ నాటక రంగం, అక్కడి వాయిద్యములు, తదితర వాయిద్య కళాకారులు, తాళ – లయ విన్యాసం చేసే శబ్ద సూత్రధారి... ఇవన్నీ ఆ నటుని కల్పనయే అయి, ఆ నటుని స్వప్న స్వస్వరూపమే కదా!

అట్లాగే...అనుభవకర్తయగు చిదాత్మయే... అనుభవైక రసము, స్వస్వరూపము అయినట్టి స్వస్వరూప పరమాత్మమునందు– మాయావరణముచే స్వస్వరూపమును "లేనిదాని వలె" ఏమరచి, పరిచ్ఛిన్నమగు ప్రపంచమును తన స్వస్వరూపమున కల్పించుకొని, ఆ కల్పనను తనకు వేరైన సత్యము వలె ...అనుభవిస్తోంది. ఇదియే మనలో ప్రతి ఒక్కరికి – మనచే దర్శించబడే దృశ్యమునకు గల సంబంధం.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ దృశ్యము మాయా సమ్మిళితమైన స్వప్నరూపమేనని, స్వప్నంలోలాగా ఇది స్వస్వరూపమునకు వేరైనట్లు, (స్వస్వరూపము యొక్క తత్త్వమును ఏమరచిన సందర్భంలో) అన్యమగు జగత్తుగా అనిపిస్తోందని... మీరు సిద్ధాంతపూర్వకంగా ఇంతసేపూ సుస్పష్టంగా ప్రకటించుచున్నారు. మీ "ఆత్మోపమ్యేవ సర్వత్రా" అను సిద్ధాంతము అమోఘం – అప్రతిహతం. అయితే, ద్రష్టయగు జీవునికి దృశ్యమునకు గల సంబంధమును వేర్వేరు విధాలుగా నిర్వచించి వేర్వేరు గురువులు తమ శిష్యులకు వేర్వేరు రీతులుగా ప్రబోధించటం లోకంలో చూస్తూ ఉన్నాం. ఆ గురు బోధానుసారం శిష్యుల యొక్క వారి వారి అనుభవం ఉంటున్నట్లు ప్రకటించటం కూడా చూస్తున్నాం. ఇది అట్లా ఎందుకు జరుగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను. వేర్వేరు గురువులు తమ శిష్యులకు వేర్వేరు సిద్ధాంతాలు ద్రష్ట – దృశ్యముల సంబంధం గురించి నిర్వచించటం జరుగుచున్న మాట నిజమే! ఆ స్థితిని అనుభవించి గురువులు అనుభవ వాక్యములను బోధించటం ఆ శిష్యులు నిరూపణగా అనుభూతి పొందటం కూడా జరుగుతోందనే మాట నిజమే!

వేదాంతులు..... వారి గురువులు (వ్యాసులు)
అర్హతులు ....... వారి గురువులు (అర్హత)
సాంఖ్యులు ...... వారి గురువులు (కపిలముని)
సౌగతులు ........ వారి గురువులు

| | సూత్రాంతిక<br>వైభాషిక<br>యోగాచార<br>మాధ్యమికులు | → | బుద్ధులు, పాశుపతులు<br>గాణాపతులు, వైష్ణవులు, శక్తులు |
|---|---|---|---|
| అట్లాగే... | | | |

ఈ విధంగా వివిధ మతములున్నాయి. ఆయా గురువులు ఈ దృశ్యం, ద్రష్ట భావనానుసారమని, ద్రష్ట ఊహా స్వరూపమని, ద్రష్ట యొక్క స్వస్వరూపమేనని, ఇదంతా మాయా కల్పితమని, ద్రష్ట కోసం భగవంతుడు ఈ ఈ విధంగా కల్పించారని, "పరమాత్మ జగత్తులో లేదు; అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములకు ఆవల ఉన్నారు" అని, బుద్ధికి ఈవల జగత్తు–ఆవల పరమాత్మ అని, ఇహలోకంలో చేసినవి పరలోకంలో ఫలిస్తాయని, ఈ కనబడే ప్రకృతియే పరమాత్మయని, పరమాత్మ ఎక్కడా ఏ రూపంగానూ లేనే లేడని...

ఈ విధంగా ఆయా గురువులు తమ శాస్త్రములందు ఏఏ దృశ్య నిర్వచనము పొందుపరచి బోధిస్తున్నారో, వాటన్నిటి యొక్క రూపముచే అనువర్తులగు శిష్యులకు వారి వారి వాసనానుసారమే వారికి బ్రహ్మము ఆ చెప్పబడిన రీతిగానే స్ఫురిస్తోంది. ఆయా వాదుల యొక్క నిశ్చయానుకూలమగు ఐహిక – పారలౌకిక ఫలములుగా స్ఫురించేదంతా బ్రహ్మమే అయివున్నది. ఎవరు ఏ దృఢ భావన కలిగివుంటే వారిపట్ల అదియే సత్యముగా అనుభూతమవటం బ్రహ్మము యొక్క ఒకానొక చమత్కారమైన ధర్మము అయివున్నది. ఎందుకంటే ఆయా వాదులంతా (ఆయా మత గురువులంతా) తమ ఆత్మయందే ఆయా ఫలసిద్ధిని గురించి భావించి ఆయా రీతులుగా పొందియున్నారు కాబట్టి! శిష్యులు కూడా అదే భావనచే అట్టిదేయగు ఫలమును సిద్ధించుకుంటున్నారు కాబట్టి!

బ్రహ్మము యొక్క మాయా చమత్కారం సర్వాత్మకమై, సర్వుల వాసనానుసారంగా ఆయా శరీరములను ధరించి ఆయా ఫలములన్నిటినీ సిద్ధింపజేస్తోంది. బ్రహ్మము యొక్క మహిమ అట్టిది మరి!

❖❖❖

## 16. అజ్ఞానం తొలగిందా ..... అంతా బ్రహ్మమే!

**శ్రీరాముడు :** మహాత్మా! "ఈ జగత్తు సంసార రూపం. ఇద్దానిని ధ్యాన–తపో–సమాధి నిష్ఠల వంటి ప్రయత్నములచే తొలగించుకుంటేగాని బ్రహ్మము అనుభూతం కాదు. సాధకులు ఈ జగత్తును త్యజించగలిగే ఉపాయాలు ఆశ్రయించాలి" ...అని కొందరు గురువులు (జైనమతం) తమ శిష్యులకు క్రమగతిపూర్వకంగా బోధిస్తున్నారు. వారి అభిప్రాయం గురించి వ్యాఖ్యానించ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ముందుగా మా అభిప్రాయమగు ఒక పరమ సత్యమును ప్రకటిస్తున్నాను. విను.

సృష్ట్యాది యందు కేవల చిన్మాత్రమే ఈ జగత్తుగా భాసిస్తోంది, – స్వప్న ద్రష్ట యొక్క చిన్మాత్ర స్వరూపమే స్వప్నంగా భాసించుచున్నట్లుగా!

ఇది శాస్త్ర నిర్ణయం. కనుక ఈ ముల్లోకములు బ్రహ్మమే అయివున్నాయి. ఇట్టి దృఢజ్ఞానమే మోక్షోపాయ ఔషధం. 'బ్రహ్మము' అనే మహా సముద్ర జలమునకు ఈ సృష్టులు తరంగముల వంటివి. తరంగములన్నీ 'జలమే' అయినట్లు సృష్టులన్నీ బ్రహ్మమే! ఎండమావులలోని జలమునకు ద్రవత్వం ఎట్టిదో సృష్టుల అనుభవం అట్టిది.

అయితే... అజ్ఞానుల దృష్టికి దుఃఖమయమై, "ఎట్లా దాటిపోవాలిరా బాబూ!" అనిపించే జగదనుభవ వ్యవహారం జ్ఞానముచే తుడిచివేయబడుతోంది. అజ్ఞానము తొలగినప్పుడు ఈ జీవుడు జీవన్ముక్తుడగుచున్నాడు. అట్టి జీవన్ముక్తునికి వ్యవహారార్థం శేషించియుండే ఈ జగత్తు ఇక అక్కడ "అద్వైతమా? ఏకమా? అనేకమా?"... మొదలైన ప్రశ్నలు ఉండజాలవు.

❖

**శ్రీరాముడు :** స్వామీ! జీవన్ముక్తులు – విదేహముక్తులు అనే రెండు పదాలు అధ్యాత్మశాస్త్రంలో చోటుచేసుకొంటున్నాయి. కదా! వారిరువురి అనుభవం ఒకే తీరుగా ఉంటుందా? వేర్వేరు తీరులుగా ఉంటుందా? వారీ జగత్తును ఏఏ విధాలుగా దర్శిస్తున్నారు? (లేక) ఎట్లా సమన్వయించు కుంటున్నారు? వారిరువురిలో అధిక సుఖి ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జీవన్ముక్తునకు – జగత్తుగా కనిపించేది బ్రహ్మముగానే అయివున్నది. విదేహముక్తునకు – బ్రహ్మమే ఉన్నదిగాని జగత్తనబడేది లేదు.

స్వప్న – సుషుప్తులలో ఒకదానిలో దృశ్యం ఉండవచ్చు. రెండవదానిలో లేకపోవచ్చు. కానీ రెండూ నిద్రారూపములే కదా! అట్లాగే జీవన్ముక్తునికి దృశ్యము బ్రహ్మముగాను, విదేహముక్తునికి బ్రహ్మము తప్పితే... దృశ్యము మొదలే లేనిదిగాను అగుచున్నప్పటికీ... ఆ ఇరువురి చిదాకాశము యొక్క మూల నిర్వచనం ఒక్కటే! కాబట్టి.... ఆ రెండింటి సుఖస్థితి సమానమే అయివున్నది. అంతేగాని భేదమేమీ లేదు. జాగ్రత్ – స్వప్నములు ఒకే నిద్రలోని విశేషములు అయినట్లు జీవన్ముక్త – విదేహముక్తులు ఒకే ముక్తి యొక్క పరమానందభరితమైన రెండు ఆత్మసాక్షాత్కార చమత్కారాలు కలిగి ఉంటున్నారు. రాత్రి స్వప్నంలో ఒక నగరం కనబడిందనుకో. తెల్లవారి లేచిన తరువాత ఆ స్వప్న నగరం గురించి, "ఆ భవనాలు ఎవరు కట్టారు? ఎందుకొరకై కట్టారు? ఆ జనులు ఎక్కడి నుండి వచ్చారు? ఆ మన బంధువు అట్లా ఎందుకు మాట్లాడారో వారిని ఇప్పుడు కనుక్కుందామా?" ...అని మనం పరిశీలించే ప్రయత్నంలో ఉంటున్నామా? లేదు. స్వప్నానంతరం స్వప్నంలాగానే బ్రహ్మమును ఎరిగిన తరువాత ఈ దృశ్యం (స్వప్న సదృశ్యంగా) భాసిస్తుంది. అప్పుడిక ఏ వివేకి ఈ జగత్తు గురించి ఆసక్తి కలిగి ఉంటాడో చెప్పు?

తత్త్వజ్ఞుడు... సృష్ట్యాది యందు నిర్వికల్పము నిర్విషయము అగు ఆత్మయందు సృష్టి జనించటానికి కారణమేమీ లేదు. కనుక సృష్టి మొదలే ఉత్పన్నమై ఉండలేదని

సృష్టి యొక్క యథార్థ జ్ఞానం కలుగగానే స్వప్న దృశ్యంలాగా ఈ జగత్తు బాధితమై పోతోందని (జగత్తు మొదలే లేదని తెలిసిపోతోందని), అందుచేత ఇందు దుఃఖాదులు కలిగియుండటం అర్థంలేని పని అని... గ్రహించి ఉంటున్నాడు.

జాగ్రత్ దృష్ట్యా స్వప్నంలో వివిధ వాసనలచే ఆయా విశేషాలు ప్రదర్శనమయి ఉండినప్పటికీ, స్వప్నం అసత్యమేనని జాగ్రత్‌లో ఎరిగియే ఉంటున్నాడు కదా! అట్లాగే ఈ జగత్తులోని ఆయా వాసనా సమూహములు దగ్ధమైన కాగితపు ఆకారమువలె జ్ఞానికి ఏ మాత్రం క్లేశము కలిగించటం లేదు. ఈ విధంగా తత్త్వబోధచే ఈ దృశ్యం భ్రాంతిమాత్రంగా నిశ్చితమై, బాధితం అగుచున్నది. అంతేగాని, జగత్తు "పరమాణువుల సంయోగ – వియోగము" అనియో, లేక, "కర్మ వ్యవహారముల ఫలితం" అనియో, కాక "దీనికి మూల కారణం దైవము"... అనియో నిశ్చయము కలిగి ఉన్నంతకాలము భ్రాంతి తొలగిపోదని, ముముక్షువులకు నా మనవి. జగత్తు ఏదో కారణం చేత "ఉన్నది" అని గాని, "సత్యమే" అని గాని భావించినప్పుడు అది ఆ అనుభవమునకు సత్యమేనని అనిపించినప్పటికీ, జగత్ భ్రమ తొలగదు సుమా! శ్రుతులు "ఇది స్వప్న సదృశం" అని సిద్ధాంతీకరించియే ఉన్నాయి కదా! మరప్పుడు అతి సమీపమగు స్వప్న దృష్టాంతాన్ని జగత్తుకు ఎందుకు సమన్వయించరాదో చెప్పు?

"జగత్తు స్వప్నమువలె భ్రాంతియే"... అని చెప్పటానికి ఇంకొక ప్రత్యక్ష గుర్తు (ప్రమాణం) కూడా ఉన్నది. ఇది భ్రాంతి గాక సత్యమే అయివుంటే... అప్పుడు ఈ మనుజుడు తనకు ఇష్టమైన వస్తువులను స్వీకరించి, అయిష్టమైన వస్తువులను త్యజించివేసి హాయిగా సుఖంగా ఉండగలిగేవాడే! ఆకస్మిక దృశ్యమును (అయిష్టమయినప్పుడు) గాంచకయే హాయిగా ఎప్పుడూ సుఖమును కలిగి ఉండేవాడే! అట్లా జరుగుతోందా? లేదు. ప్రతి జీవుడు ఈ దృశ్యమును వెంబడించి అనేక దుఃఖాలను ఎందుకు కలిగి ఉంటున్నాడు? భ్రాంతిని భ్రాంతిగా గమనించకపోవటం చేతనే! ఈ విధంగా ఈ జగత్తు భ్రాంతి మాత్రమేనని (ఉపనిషత్ మొదలైన) వేద విభాగములచే నిర్ద్వంద్వంగా సిద్ధాంతీకరించబడుతోంది.

**సమాధి -**

**శ్రీరాముడు :** స్వామీ! కొందరు యోగులు "ఈ జగత్తు భ్రమ" అని గ్రహించి, – జన్మ జన్మలుగా అభ్యాస వశంచే సంస్కార రూపం దిద్దుకున్న ఇట్టి జగత్ భావోద్వేగం త్యజించి వేయటానికై – ఏకాంత ప్రదేశంలో జగత్యాజ్యరూపమగు జగద్రహిత సమాధిని సాధనోపాయంగా గ్రహిస్తూ ఉంటారు. ఈ జగత్తు దుఃఖమయమని, జగద్రహిత సమాధి యొక్క అభ్యాసముచే ఆనందరూపమగు ఆత్మానుభూతిని, సమాధిసేవనముయొక్క ఆవశ్యకత గురించి విశదపరచండి.

ఓ రామచంద్రా! ఈ జగత్తును ఏమరచి జగద్రహిత సమాధిని ఆశ్రయించేవారి ప్రయత్నంలో ..."ఈ జగత్తు సత్యమే!" ...అను ఒక భ్రమ కొనసాగుచునే ఉన్నది. ఈ జగత్తును ఆత్మకు అన్యమైన దానిగా తలచి కొనసాగించే జగద్రహిత సమాధి మరల జడత్వమే అగుచున్నది. పైగా "జగత్తును ఏమరచాలి" అనే ఆవేశము కలిగి ఉండి జగద్రహిత సమాధికై శక్తి యుక్తులను వినియోగించటమనేది

సవికల్ప సమాధియేగాని, నిర్వికల్ప సమాధి కాదు. అందుచేత అది సంసారమే అయివున్నది. అట్టి జగత్తును త్యజించివేయాలని తపనతో కూడిన సమాధి వలన పరమ పురుషార్థమగు మోక్షము కలుగనేరదు. "నిర్విషయక ధ్యానం" ...సంసారమే అయివున్నదని మరల గుర్తు చేస్తున్నాను. అది శిల వంటి జడస్థితయే అయివున్నది. ఇక, మోక్షమో, వికల్పాత్మకమగు సంసార రూపం కాదు. శిలవంటి జడ స్థితి కూడా కాదు. జగత్తును వదలి ఆత్మకొరకై నిర్వికల్ప ధ్యానం వలన జడస్థితి కంటే అన్యమైనదేదీ లభించదు. అట్టి సమాధి వలన ముక్తి లభిస్తుందనుకుంటే, అప్పుడు మనుజునకు గాఢనిద్ర వలన కూడా ముక్తి లభించేదే కదా?

అందుచేత రామచంద్రా! ఉత్తమ ఆత్మజ్ఞానం ద్వారా 1.జగత్తుగా ఆత్మయే భ్రాంతిచే కనిపిస్తోందని, 2.ఆత్మ సర్వదా నిరతిశయ ఆనంద సచ్చిదేకరస స్వరూపము అని నిశ్చయించుటయే ఈ జగత్తు యొక్క లయము. అదియే జగత్తు యొక్క అత్యంతాభావము కూడా!

భ్రాంతిహేతువగు "జగత్తును ఆత్మకు వేరుగా దర్శించటం" ...అనే అజ్ఞానావరణము క్షయించుటయే భ్రాంతి క్షయము.

జగత్తును ఆత్మరూపంగా దర్శించటమే ఆత్మ సాక్షాత్కారం. అట్టి (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ మొదలైన వేద వాక్యార్థమైన) నిశ్చల దృఢాభిప్రాయమే సమాధి కూడా! (సమ + అధి ). వివేకి జీవన్ముక్తత్వము అదియే! అదియే (సర్వము ఆత్మయే అను దృష్టియే) 'నిర్వికల్ప సమాధి' అని, 'అనంతమగు నిర్వాణము' అని కూడా చెప్పబడుతోంది. "స్వస్వరూపమున వికారరహితంగా ఎప్పటి యట్లు స్థితి కలిగి ఉండటం" అనబడునది కూడా అదియే! అట్టి చిత్స్వరూపమాత్ర స్థితియే అనంత సుషుప్తి అని, 'తురీయము' అని, 'నిర్వాణము' అని, 'మోక్షము' అని కూడా పిలువబడుతోంది.

అట్టి సర్వము ఆత్మరూపంగా అనిపించటమే "సమ్యక్ జ్ఞానైక ఘనత్వం". అదియే ధ్యానము. అట్టి దృశ్యము యొక్క అత్యంత ఆత్మభావపూర్వకమైన ఆత్మజ్ఞానమే పరమ పదము. "ఇదంతా ఆత్మస్వరూపమే" ...అను అత్యంత దృఢనిశ్చయమే ("మమాత్మా సర్వభూతాత్మా!"... "తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ" వంటి) వేదమహా వాక్యముల సారం కూడా!

"మోక్షస్థితి" అనబడేది... జడత్వం కాదు. ప్రకృతి విలయము వంటి సుషుప్తి కాదు. జగత్తును త్యజించిన జగద్రహిత సమాధి కూడా కాదు. సవికల్పము కూడా కాదు. అసత్, శూన్యము, నైరాత్మ్యరూపము ('ఆత్మ అనబడేది లేదు' అని తిరస్కరించి దర్శించటం వంటిది) కూడా కాదు.

ప్రియ రామచంద్రా! అది దృశ్యము పరమాత్మగా అనిపించే స్థితి. ఓ సర్వ సభికులారా! ఈ దృశ్యం సర్వదా ఆద్యస్వరూపమగు పరబ్రహ్మమే! అట్టి శుద్ధ బ్రహ్మమే నేను (అహం బ్రహ్మాస్మి) అనునట్టి దృఢభావం పొందటమే మోక్షం. ఆ బ్రహ్మము అధిష్ఠాన రూపముచే సర్వదా యథాతథమేగాని దృశ్యము కాదు. ఏ అనుభవం కూడా అట్టి బ్రహ్మం కంటే వేరుగా అనిపించని స్థితియే పరమపదము. అది నిరతిశయానంద స్థితి. ఆత్మయొక్క అట్టి ధ్యానముచే(అంతా పరమాత్మ స్వరూపమేనని ఉంటే) ఆత్మ యొక్క పరిపూర్ణజ్ఞానం తప్పక లభించగలదు. అదియే పరమ నిర్వాణం. అట్టి స్థితిలో ఈ జగత్తు ఇట్లాగానీ, మరింకెట్లాగైనాగాని కనిపిస్తున్నప్పటికీ స్వస్వరూపమగు ఆత్మగా అనిపించగలదు.

అట్టి చిద్రూప పరమాత్మయందు ఏకత్వం లేదు. అనేకత్వం కూడా లేదు. అది పదార్ధ రహితం కాదు. పదార్ధ సహితం కాదు. "అది సమస్త సత్ - అసత్ పదార్ధముల సీమాంతరము... అని చెప్పబడుతోంది. అట్టి స్వరూపస్థితియగు "నిర్వాణము" దృశ్యము యొక్క అత్యంత అసంభవపూర్వకమైనది, సర్వ విక్షేప రహితమైనది, నిరతిశయానందమయమైనది! అట్టి శుద్ధ బోధోదయమగు శాంతరూపమే పరమపదం. అదియే పరమ పురుషార్థమని గమనించు. అటువంటి "ఆత్మ స్వరూపమే ఈ దృశ్యము" అను ఉత్తమ బుద్ధి ఈ "యోగ వాసిష్ఠం" వంటి మోక్ష శాస్త్రముల పరిశీలనచే తప్పక కరతలామలకం కాగలదు. అందుచేత మోక్షోపాయమైనట్టి ఈ శాస్త్రమును విచారణపూర్వకంగా జనులు పఠించెదరు గాక! అధ్యాత్మ శాస్త్రమును విచారణపూర్వకంగా పరిశీలించుటచే ఆత్మయొక్క శుద్ధజ్ఞానము లభించగలదు.

**న తీర్థేన న దానేన న స్నానేన న విద్యయా ।**
**న ధ్యానేన న యోగేన న తపోభిః నచాధ్వరైః ॥**

1. దృశ్యము దృశ్యముగా కాకుండా స్వస్వరూపము - సత్స్వరూపము అగు చిత్స్వరూపాత్మగా అనిపించటం, 2. తానే ఆ చిత్స్వరూపాత్మగా నిర్దుష్టంగా స్వభావ సిద్ధంగా (అకృత్రిమంగా) అనుభూతం కావటం, 3. నేనే ఈ సర్వత్రా సర్వదా సమరూపమై ఉన్నాను అనే (మమాత్మా సర్వభూతాత్మా - అహం సర్వస్య ప్రభవో, మత్తసర్వమ్ ప్రవర్తతే - మత్తః పరతరమ్ నాన్యత్ కించిదస్తి - అహంహి సర్వయజ్ఞానామ్ భోక్తాచ, ప్రభురేవచ... మొదలైన ఉత్తమ వేదోపనిషత్ వాక్యాల అర్థసారం హృదయమంతా నిండిపోగా) వేదార్థ సారం సుస్పష్టం అయి, అట్టి "దృశ్యమంతా నా స్వరూపమే" అనే దర్శనం... ఈ మూడు మోక్షము యొక్క లక్షణాలు అయివున్నాయి. అట్టి మోక్షస్థితి తీర్థములను సేవించటంచేతగాని, అనేక దానములు చేస్తేగాని, స్నానాదులచేతగాని, లౌకిక విద్యల చేతగాని, ధ్యానముల చేతగాని, యోగముల చేతగాని, తపో యజ్ఞాదుల చేతగాని లభించేది కాదు. మరి? ఆత్మజ్ఞాన శాస్త్రముల యొక్క నిర్మల-నిర్దుష్ట అవగాహనచే, బుద్ధి సుసంపన్నమై ఉపనిషత్ - ఈ యోగ వాసిష్ఠాది శాస్త్రముల సారం హృదయస్థమై, అంగీకారయోగ్యమై భావనాభ్యాసాల వల్ల అనుభవజ్ఞానం రూపుదిద్దుకొనుటచే అట్టి మోక్షస్థితి లభిస్తోంది. మిగతా సర్వ ప్రయత్నములు బుద్ధిని నిర్మలం, విశాలం, పవిత్రం చేస్తాయి. అప్పుడు (ఆత్మోపమ్యేవ సర్వత్రా - సమం పశ్యతి - మొదలైన వాక్యముల అనుభవజ్ఞానంచే)... అట్టి జీవుడు సర్వము ఆత్మగా దర్శించుటచే జగత్తును జయిస్తాడు.

**భ్రాంతి మాత్రం కిలేదం సదసత్వదివ లక్ష్యతే ।**
**వ్యోమైవ జగదాకారం స్వప్నో అనిద్రే చిదంబరే ॥**

ఓ రామచంద్రా! సత్-అసత్ రూపము, అనిర్వచనీయము అయినట్టి ఈ నామరూపాత్మక జగత్తు భ్రాంతిమాత్రమే అయివున్నది. అయితే అజ్ఞానముచే సత్యముగా అనిపిస్తుంది. నిద్రారహితమగు చిదాకాశమే చిదాకాశమున ఇట్లు స్వప్నరూపమై జగదాకారముగా స్థితినొంది ఉన్నదని గ్రహించు. ఇదంతా ఆత్మకు వేరుగా అనిపించటమే భ్రమ.

**న శామ్యతి తపస్తీర్థైః భ్రాంతిర్నామ కదాచన ।**
**తపస్తీర్థాదినా స్వర్గాః ప్రాప్యన్తే, నతు ముక్తతా ॥**

"ఇది ఆత్మకు వేరైన జగత్తు" అను భ్రాంతి (లేక) మాయ తపస్సులచేగాని, తీర్థములు సేవించటంచేతగాని తొలిగేది కాదు. అవన్నీ స్వర్గాది సుఖప్రదమైన లోకములు ప్రాప్తింపజేయగలవే గాని ముక్తిని కాదు. ముక్తి కొరకై జ్ఞానమయమైన ఆత్మదృష్టి పెంపొందింపబడి, పరిరక్షింపబడక తప్పదు. (దృష్టిమ్ జ్ఞానమయమ్ కత్వా పస్యేత్ బ్రహ్మమయమ్ జగత్). భ్రాంతి పూర్తిగా తొలగాలంటే ఆత్మ జ్ఞానమయమగు మోక్షోపాయమైన "వసిష్ఠ రామ సంవాదము" వంటి శాస్త్రములను, ఆత్మ దర్శన భాగ్యం సంపాదించుకున్న మహనీయుల వాక్య – అభిప్రాయములను సేకరించి హృదయస్థం చేసుకోవటమే ఉపాయం. క్రమంగా సర్వము పరమాత్మకళామయంగా దర్శిస్తూ ఉండగా మనోబుద్ధి చిత్త అహంకారాలు పవిత్రమై అవన్నీ వాటివాటి విషయములతో సహా పరమాత్మరూపంగానే అనుభమౌతాయి. సూర్యుడు ఉదయించిన తరువాత ఇక చీకటి, ఆ చీకటిలో కనిపించిన ఆకారాది వికారముల గురించి మీమాంస ఎక్కడిది? నిర్మల జ్ఞానమును కలుగజేయగల ఆధ్యాత్మ శాస్త్రముల యొక్క అర్థముచే సాంసారిక భ్రాంతి అంతా పూర్తిగా తొలగిపోగలదు. శమించగలదు. అయితే, అందుకు అత్యవసరమైయున్న నిర్మల మనోబుద్ధులను తపస్సు – తీర్థము మొదలైనవి ప్రసాదిస్తున్నాయి. కనుక, అవి అత్యవసర సాధనములుగా శాస్త్రములు ప్రతిపాదిస్తున్నాయి.

వాయువునందు వాయుతరంగాలవలె, జలమునందు ద్రవత్వంలాగా... స్వస్వరూపమగు చిదాకాశమునందు ఈ సృష్టి–స్థితి–లయముల ప్రతిభాసలు కనిపిస్తున్నాయి. ఇవి ఉంటే ఉండనీ, లేక ఉండకపోనీ, ప్రతిభాసా మాత్రము అగు ఈ జగత్‌గా దర్శనమయ్యే దానిని ప్రక్కన ఉంచి ఇది ఏ ఆత్మయందు సర్వదా భాసిస్తోందో... అట్టి ఆత్మదర్శనము సర్వదృష్టి సంబంధమైన రుగ్మతలు వాటికవే తొలగుతాయి. అప్పుడిక (సాంసారిక భ్రాంతి "భ్రాంతి మాత్రం"గా గమనించబడిన తరువాత) ఆత్మీదృష్టి స్వభావసిద్ధమే అగుచున్నది. ఇక ఆపై తొలగవలసినదేమిటి? పొందవలసిన దేమిటి?

కాబట్టి రామచంద్రా! వటవృక్షానికి (మఱ్ఱిచెట్టుకు) ఆకులు పూయటం, రాలటం ఆ వృక్షము లోని విభాగమే కదా! వాయువులో అసంఖ్యాక తరంగాలు ఉద్భవించటం వాయువు యొక్క స్వభావమే అయివున్నది కదా! మాయా శబలితమైన చిదాకాశమునందు యథాస్థితి కలిగియున్న ఈ జగత్తుల యొక్క సృష్టి–స్థితి–లయాలు చిదాకాశమునకు వేదికీకాదు. చిదాకాశమే మాయచే జగత్తుగా కనిపిస్తోంది. కనిపించే జగత్తు స్వస్వరూపమగు చిదాకాశముగా అనిపించటమే మోక్షము, నిర్వాణము, విదేహముక్తి, ఆత్మలయం, పరమాత్మత్వం, పరమాత్మ దర్శనం, ఆత్మసాక్షాత్కారం మొదలైన ఆయా శబ్దములచే ఉద్దేశించబడుచున్నాయి.

ఆ శబ్దములన్నీ ఒక దానికి మరొకటి పర్యాయపదములేనయ్యా!

❖❖❖

# XI. బ్రహ్మగీత (బ్రహ్మాండోపాఖ్యానం)

## 1. దృశ్యమసంభవమ్

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జీవుడు సర్వదా చిదాకాశ స్వరూపుడే కదా! అట్టి ఈతనికి మరి ఈ భౌతిక దేహములు ఎందుకు, ఎక్కడినుండి, ఎట్లా, ఎవరి వలన వచ్చిపడుచున్నాయి? ఎందుకంటే, దేహికి ఈ దేహమే ఐహికభ్రాంతి కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను భ్రాంతియే! అయితే ఈ దేహమీ, దృశ్యమీ మొదలైనవి ఇప్పుడు ఉండవచ్చు మరొకప్పుడు ఉండకపోవచ్చు. అయినా కూడా దేహి సర్వదా చిదాకాశ స్వరూపుడేనని మనం నిర్ద్వంద్వంగా ఇప్పటిదాకా యుక్తియుక్తంగా నిరూపించుకున్నాం కదా! ఆద్యస్వరూపమగు చిదాకాశవీచి... స్వకల్పితమైనట్టి అవిద్యచే... స్వప్నసదృశంగా "నేను జీవరూపము ధరించాను" అని తలచి ఈ సంసారమున తిరుగాడుచూ... "నేను దేవతను. నేను మానవుడను" ...అని ఈ ప్రకారంగా ఆయా దేహములతోటి "దేహాత్మాధ్యాస" కలిగి ఉంటోంది. అట్టి "అధ్యాసచే కలిగియుండే కామ, కర్మ, వాసన మొదలైనవే ఆయా దేహములకు కారణమగుచున్నాయి. అయితే అట్టి దేహత్వమనేది స్వప్నాంతర్గత విశేషములవలె భ్రాంతియే! అయితే ఈ జీవనోపాధికి పూర్వం ఈ జీవుడు మహాప్రళయమున చిదాకాశ రూపుడే! అనగా ఈ సృష్టి-స్థితి-ప్రళయములు, ఇహ-పర లోకాలు ఆతని దేహము అవుతాయిగాని, కేవలం ఈ కాళ్ళు, చేతులు మాత్రమే ఆతని దేహం ఎట్లా అవుతుంది? ఈ జీవుని స్వస్వరూపమగు చిదాకాశము నందు దృశ్యరూప భేదం అత్యంత అసంభవం. మరప్పుడు ఈ సృష్టి రూపమగు దృశ్యము అట్టి చిదాకాశమునకు దేహమెట్లా అవుతుంది? ఇక దృశ్యమానమగు సృష్టి, పరలోకాదులన్నీ కూడా స్వప్న సంవిద్రూ కల్పనల చేతనే సిద్ధిస్తోంది. అంతేగాని స్వకీయ స్వల్పకల్పనకు నేరుగా సృష్టికి ఏ కారణం లేదు. స్వప్నంలో స్త్రీ సంగమంలాగా ఈ దృశ్యం ప్రాప్తిస్తోంది. అయితే కేవలమూ అనుభవరూపం, శాంతం అయినట్టి చిదాకాశమే స్వమాయాశక్తిచే ఈ ప్రకారంగా అసత్తైన జగద్రూపంగా భాసిస్తోంది. ఏదైతే తాను శుద్ధ రూపమైనప్పటికీ, దృశ్యశూన్యమైనప్పటికీ ఈ రీతిగా జగద్రూపంగా భాసిస్తోందో... అది ఆద్యంత రహితం, నిర్మలం అయినట్టి చైతన్య వస్తువే అయివున్నది సుమా! తెలియబడనంతవరకూ ఆ పరమాత్మయే ఈ ఈ జగత్‌రూప అవిద్యగా భాసించటం కొనసాగుచూనే ఉండగలదు. అవిద్య చేతనే "నేను వేరు - ఈ దృశ్యం వేరు - ఆ పరమాత్మ వేరు" ...అని అనుకుంటూ అజ్ఞాన ద్రష్ట అవిద్యయందు తిరుగాడుచూనే ఉంటున్నాడు. తెలియబడిన తరువాత "నేను, దృశ్యం, పరమాత్మ" అను మూడు ఏకత్వం చెందుచున్నాయి. అప్పుడు స్వకీయ ద్రష్టత్వం, దృశ్యం కూడా నిర్మల పరబ్రహ్మంగానే కానవచ్చుచున్నాయి. మేల్కొనిన తరువాత స్వప్న దృశ్యం పటాపంచలైపోతున్నట్లుగా

...ఇక ఆద్యంత రహితమగు చిదాకాశమే తనయందు – తదితరులయందు – ఈ సమగ్ర దృశ్యమునందు – ఇహ పరలోకములయందు ఆక్రమించినదై అగుపిస్తుంది. అట్టి చిదాకాశ దృష్టి అనుభూతమైన తరువాత ఇక అవిద్య ఎక్కడిది?

కాబట్టి రామచంద్రా! పరమాత్మ యొక్క దృశ్యచమత్కారముతో కూడిన అనుభవమే ఈ జగత్తు. ఇక ఈ పృథివి మొదలైనవి కారణము లేకపోవుటచే, పరమాత్మయందు ఇవి జనించనే లేదు. చిదాకాశము యొక్క 'స్ఫురణ'యే ఈ పృథివి మొదలైన భౌతికములను, మనో – బుద్ధి ఆదిగాగల సూక్ష్మ తత్త్వములను చిదాకాశమునందు పరికల్పించి పొందుచున్నది. జలంలో తరంగాలలాగా, వాయువులో చలనరూప తరంగాలలాగా అబుద్ధిపూర్వకమైన – అసంకల్పిత స్వభావ రూపమైన – నిష్కారణమైనట్టి స్ఫురణ ఉదయించి జగత్తుగా అగుచున్నది.

ఆ విధంగా ఆకస్మికంగా జగత్తు భాసించిన తరువాత ఆ స్ఫురణయే జీవరూపముతో పరమాత్మయందు ప్రవేశించి "నేను సృష్టి కర్తయగు బ్రహ్మదేవుడను"... ఇత్యాది ఐశ్వర్యమును ప్రకటించుచున్నది. ఆపై ఇక స్వయముగా బుద్ధి – మనస్సు – పృథివి మొదలైన సదసన్మయ – మూర్తామూర్త మయములతో కూడిన ఈ ప్రపంచమును కల్పన కావించుకొనుచున్నది. నిర్మలాకాశం కంటే కూడా లక్షలాది రెట్లు అత్యంత నిర్మలమైన ఆ మహాచైతన్యము నిజమాయాశక్తిచే స్వయంగా జగద్రూపంగా భాసిస్తోంది. కాబట్టే చిదాకాశమే జగత్తుగాను, జగత్తే చిదాకాశముగాను సిద్ధాంతీకరించబడుతోంది. జగత్తు – చిదాకాశము వేరు వేరు కాదు.

ప్రియ రామచంద్రా! ఈ ప్రకారంగా విచారణ దృష్టితో చూచినప్పుడు చైతన్యమునకు అన్యంగా ఏదీ భాసించటమే లేదు.

అద్వయ చిన్మాత్రమే ఈ జగత్తు వాస్తవ రూపం. తన స్వరూపముచే తాను పూర్ణమైయున్న చిదాకాశమే తన సచ్చిదానంద చిదాకాశమునందు యథాతథంగా ఉంటూనే చిత్తముగాను, ఆ చిత్తమునందు దృశ్యరూపముగాను స్వయంగా భాసిస్తోంది. నిద్రపోయేటప్పుడు నీవు నీవుగానే ఉంటూనే స్వప్న చిత్తముగాను, స్వప్నరూపంగాను భాసిస్తున్నావు కదా! ఇది కూడా అట్టిదే! ఇంతకు మించి సృష్ట్యాదియందు సృష్టికి వేరు కారణం లేదు.

చిదాకాశము చిత్తము రూపంలో భాసించటమంతా మాయారూపమే! కేవల లీలా – క్రీడా వైచిత్రమే! స్వప్నంలో కనిపించే స్వప్న దృశ్యానికి, జాగ్రత్‌లో కనిపించే ఈ జాగ్రత్ దృశ్యానికి భేదమే లేదు. అందుచేత ఈ ప్రపంచమంతా కూడా వాస్తవానికి ఆకాశమువలె పదార్థ శూన్యమైనట్టి చిదాకాశమే సుమా! స్వరూపరహితమైనట్టి పరబ్రహ్మము సర్వదా తనయొక్క సచ్చిదానంద అద్వయ రూపముతోటియే స్థితినొంది ఉన్నది. అట్లు ఉన్నప్పటికీ నిజ మాయాశక్తిచేత ఇట్లు సర్వ జగద్రూపంగా కూడా వర్తించుచున్నది.

**చిద్రూపం - సమష్టి మనోరూపం - జగత్‌రూపం -** ఓ రామచంద్రా! ప్రతిజీవుడు ప్రతిరోజు స్వప్న జీవితమును అనుభవిస్తూనే ఉన్నాడు కదా! అట్లు స్వప్నరూపంగా భాసించేది ఆత్మయే కదా!

అట్టి స్వప్నాంతర్గత జగదనుభవాన్ని దృష్టాంతంగా తీసుకొని... "ఏకము – నిర్మలము – జ్ఞానమాత్ర స్వరూపము అయినట్టి పరబ్రహ్మమే ఇట్లు నానా ప్రకారాలుగా జగత్ రూపంచే కనబడుతోంది." ...అని ఆత్మజ్ఞులు ఎలుగెత్తి ప్రకటిస్తున్నారు. బ్రహ్మమే ఎరుక రూపంగా చిద్రూపం అయివున్నది.

చిద్రూపము ఎరుగునది, ఎరుగబడుచున్నది కూడా! ఆ బ్రహ్మం తనయందు జీవత్వమును కల్పించుచున్న దానివలె ఉన్నదై, తన నిర్మల స్వభావమును కించిత్ కూడా త్యజించకుండానే – మనోరూపమును పొందిన దానివలె అగుచున్నది.

కనుక... పరబ్రహ్మమే చిద్రూపముగా, మనస్సు రూపంగా కనబడుతోంది. పరబ్రహ్మమునకు వేరైన చిద్రూపం లేదు. మనోరూపం లేదు. ఆ చిదాకాశమే సమష్టి మనోరూపముచే ఈ 'జగత్తు' అనబడు రూపమును విస్తరింపజేయుచున్న దానివలె అగుచున్నది. తాను సర్వదా నిర్వికారరూపమే అయినప్పటికీ వికారివలె అగుపించుచున్నది.

జలమునకు ఆకారం ఉన్నదా? ...లేదు. మరి తరంగమునకో... ఉన్నది. తరంగమునకు ఎక్కడి నుండి ఆకారం వచ్చింది?

జలము నిరాకారమే అయినప్పటికీ తరంగమువలె ఆకారము పొందినదానివలె కనిపిస్తోంది కదా! అట్లాగే – విషయరహితము అగు పరబ్రహ్మము చిద్రూపము, మనోరూపము, సమష్టి మనోరూపము, వ్యష్టి మనోరూపము వలె, వికారివలె – (అజ్ఞాన దృష్టికి) అగుపిస్తోంది.

సమష్టి మనస్సే బ్రహ్మదేవుడు. ఆ బ్రహ్మదేవుడే సృష్టి యొక్క హృదయం. ఆతడు సమస్త సృష్టిని స్వయంగా రచించుచు, స్వయంగా ఉపసంహరించుచున్నాడు.

**శ్రీరాముడు :** స్వామీ! సమష్టి మనోరూపుడగు బ్రహ్మదేవుడు నిరాకారుడా? సాకారుడా? నిరాకారుడైతే ఆతని నుండి సాకార జగత్తు ఎట్లా వచ్చింది? సాకారుడైతే ఆతని సాకారమును సృష్టించినవాడెవడు? ఆ బ్రహ్మదేవుని సృష్టించినవాడు సాకారుడే అవుతాడా? నిరాకారుడౌతాడా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (పకాపకా నవ్వి) స్వప్న ద్రష్ట నిరాకారుడా? సాకారుడా? దేహానికి ఆకారం ఉన్నది గాని... చిత్ స్వరూపుడగు స్వప్న ద్రష్టకు ఆకారం ఎక్కడున్నది? జీవుడు అనగా దేహి, దేహం కదా! దేహమునకైతే ఆకారమున్నది గాని, మరి దేహికి ఆకారమేది? ఒక ఆలోచన వచ్చి నీవు ఒక పని చేశావనుకో. నీవు చేస్తున్న పని తదితరులకు కనిపించవచ్చుగాని, నీ ఆలోచనకు ఆకారమేది? అది ఎవరికి కనిపిస్తుంది?

నిరాకారమగు ఆత్మయే స్వప్నంలో స్వప్న పదార్థముల రూపంగా భాసిస్తోంది కదా! అట్లాగే ..."పృథివి మొదలైనవి లేనివాడు – సమష్టి మనోరూపమే తన రూపంగా కలవాడు" అగు బ్రహ్మ దేవుడు అవయవ రహితమగు స్వహృదయమున స్థితినొంది ఉన్నవాడై... అద్దానికి వేరుకానట్టి ఈ త్రిలోకములుగా భాసిస్తున్నాడు. ఆ స్వప్న హృదయరూపమే చిదాత్మ. ప్రతిజీవుడు నిరాకారుడై చిదాత్మయగు స్వప్న హృదయం నందు చిత్ స్వరూపమగు జగత్తుగా భాసిస్తూ తనకన్నా వేరుగా ఉన్న దానివలె జగత్తును పొందుచున్నాడు.

❖

ఓ రామచంద్రా! సమష్టి మనోరూపుడగు బ్రహ్మదేవుడు వాస్తవానికి సర్వదా అద్వితీయుడు. అనగా... తనకు వేరైనదంటూ ఏదీ ఎక్కడా లేనివాడు. నిరాకారుడు. (అన్ని ఆకారాలు తనవే అయినవాడు). పరిపూర్ణ చైతన్య స్వరూపుడు. అయినప్పటికీ కూడా, ఆ సమష్టి మనోరూపుడు తన అవిద్యచే తన పూర్ణ చిత్ స్వభావము నుండి చ్యుతి పొందినవానివలె అగుచున్నాడు. (వాస్తవానికి చ్యుతియే పొందటం లేదు). అయితే... తనకు అనన్యమగు అహంకార రూపముతో గూడి... ఈ జగద్రూపములచే అనంతరూపుడై... ఈ జడ చేతనాత్మక జగత్తుగా (భ్రమచే) అగుపిస్తున్నాడు. కాని వాస్తవానికి ఇక్కడ ఈ భూమి, ఆకాశం, పదార్థాలు, దేహములు... ఇవన్నీ చైతన్యరూపములే! చైతన్యము కంటే వేరుగా ఏ దృశ్యమూ ఎక్కడా లేదు. చిదాకాశమే కల్పిత మనోరూపమై, ఈ రీతిగా (క్రమంగా) కల్పిత జగత్ రూపంగా స్ఫురిస్తోంది.

**విచార్య దృష్ట్యై తదపి న కించదపి విద్యతే**
**కేవలం భాతి చిన్మాత్రమాత్మనాత్మని నిర్ఘనమ్ ॥**

ప్రియ రామచంద్రా! విచార దృష్టితో చూస్తే... ఈ కల్పిత జగత్తుకు కొంచెం కొంచెం కూడా ఉనికి లేదు. కేవలం ఆనందమయమగు చిన్మాత్రమే తనయందు తాను ఇట్లు భాసిస్తోంది.

**యతో వాచో నివర్తన్తే, తూష్ణీంభావో అవశిష్యతే**
**వ్యవహార్యసి ఖాత్మైవ తద్వత్ తిష్ఠతి మూకవత్ ॥**

అట్టి ఈ జగత్తు ఎక్కడ దాకా కనిపిస్తుంది? వాక్–మనస్సులకు అగోచరమైనట్టి, నిరతిశయానంద రూపమై ఆత్మను గమనించనంతవరకే! ఆత్మ గమనించబడిందా, ఇక ఇది దృశ్యముగా గాని, జగత్తుగా గాని గోచరించదు. ఆత్మగానే గోచరిస్తుంది. ఇదంతా కేవలం మౌన స్వరూపంగా శేషిస్తోంది. ఓ రామచంద్రా! "నేను – నాకు కనబడే జగత్తు శుద్ధ సచ్చిదాత్మ స్వరూపమే!".... అని అనుభూత మొనర్చుకొన్న తత్త్వజ్ఞాని, ఇక ఆపై ప్రాపంచిక వ్యవహారములందు ముగ్ధుడు కాడు. సర్వవేళలా నిజ చిత్స్వరూపమునందే ఎప్పటియట్లు మౌన స్వరూపుడై ఉంటున్నాడు. తన యొక్క అట్టి నిశ్చలత్వమును ఈషణ్మాత్రం కూడా కోల్పోవటమే లేదు.

❖❖❖

# 2. ఆత్మజ్ఞాన ప్రబుద్ధుని నిత్యమౌన స్వరూపం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆత్మ స్వరూపంలో ప్రబుద్ధుడైనపుడు ఈ జీవుడే పురుషోత్తముడు అగుచున్నాడు. నిశ్చల ఆత్మరూపత్వముచే కేవలం మౌనస్వరూపముగా శేషించుచున్నాడు. అనంతము, అపారము, చిన్మాత్ర రూపము, పరమ ప్రేమాస్పదము అయినట్టి "నిరతిశయానంద ఘనత్వము" ను స్వయముగా అవధరించుచున్నాడు. జలము నందలి ద్రవత్వం చేత ఆవర్త – తరంగాదులు కల్పనచే కనిపిస్తున్నట్లు... బ్రహ్మము యొక్క అవిద్యా చమత్కారంలో చిత్తము, బుద్ధి, జగత్తుల – కల్పన స్వయంగా ప్రదర్శితమౌతోంది. ఆ ప్రబుద్ధుడు తనయొక్క , సర్వుల యొక్క చిత్త –బుద్ధి–జగత్తులను ఆత్మస్వరూప చమత్కారంగా ఆస్వాదిస్తున్నాడు.

వాయువులో వాయుతరంగాలు అబుద్ధిపూర్వకంగా స్పందన ప్రభావంచేత కనిపిస్తున్నాయి. కానీ, వాయు తరంగాలుగా అనిపించేది వాయువే కదా! అవిద్యావృతుడగు పరమాత్మచే తనకంటే వేరుకానట్టి ఈ బుద్ధి-చిత్తము-జగత్తుల కల్పన కావించబడుతోంది. వేలాది వాయుతరంగాలు వాయువుకంటే వేరుకానట్లే... చిదాభాస రూపులగు ఈ జీవులు "సాక్షి" యగు పరమాత్మకంటే ఏమాత్రం వేరు కానేకాదు.

అందుచేత... మహాప్రజ్ఞావంతుడగు ఓ రామచంద్రా! "చిదాకాశం-బ్రహ్మము-చిన్మాత్రము-జీవచైతన్యము-మహాచిద్రూపము-పరమాత్మ" ఇవన్నీ కూడా ఒకే అర్థాన్ని చెప్పే పర్యాయపదాలే! కంటిరెప్పలు మూసుకోవటం, తెరుచుకోవటం నిర్వర్తిస్తున్నట్లుగా .... అవిద్యావృతమగు బ్రహ్మము యొక్క భావనా వ్యాకోచముచే సృష్టి, భావనాసంకోచముచే ప్రళయం సంభవిస్తున్నాయి. వాయువు చలనముచే తరంగాలు, చలనరాహిత్యంచే తరంగ రాహిత్యం ప్రదర్శిస్తున్నట్లే బ్రహ్మమునందు సృష్టి - ప్రళయాలు ఉంటున్నాయి.

పరమాత్మయొక్క మహామనోవికాసమే దృశ్యము. భావన సంకోచమే... భావనా దృశ్యము యొక్క అభావం. కళ్ళు తెరవటం, మూయటం ఒకే కంటి రెప్పల చర్యయే కదా! రెప్పలు తెరిస్తే దృశ్యం. మూస్తే దృశ్యరాహిత్యం. అట్లాగే సృష్టి, ప్రళయాలు ఒకే చిన్మాత్రం యొక్క మాయా వ్యాకోచ-సంకోచాలు మాత్రమే! ఆ ఉభయాలు చిన్మాత్ర స్వరూపాలే! కాబట్టి దృశ్యం యొక్క భావ - అభావాలు రెండూ కూడా చైతన్యం నుండే స్ఫురిస్తున్నాయి.

ఈ దృశ్యము సత్తు-అసత్తు కూడా! చైతన్యమో... సర్వదా "అనునిత్యసత్త" స్వరూపమై ఉన్నది. నేత్రము యొక్క కదలికలే నేత్ర సంకోచ-వికాసాలు కదా! అందుచేత వికాసము సంకోచంకంటే వేరుకాదు. సంకోచము వికాసము కంటే వేరుకాదు. అట్లాగే సృష్టి - ప్రళయములు ఒకదానికంటే మరొకటి అభిన్నములు.

అందుచేత ఓ రామచంద్రా! ఈ సమస్త జగత్తునూ - "జన్మజరావర్జితము, సౌమ్యము, శాంతము, సృష్టి ప్రలయములందు సమరూపము" - అగు చిదాకాశముగానే దర్శించు. ఆకాశము తనయందు కల్పితమైన నీలం రంగు కలిగివున్నట్లు... చైతన్యం కూడా అచేతనమగు జగద్రూపంగా స్ఫురిస్తోంది. ఏదైతే భాసిస్తోందో... అది "జగత్ స్వరూపధారియగు చిన్మాత్రమే" అయివున్నది.

ఈ దృశ్యం వాస్తవానికి ఉత్పన్నమవటమూ లేదు. నశించటమూ లేదు. ఎవరిచేతా అనుభవించబడటమూ లేదు. కేవలం అత్యంత నిర్మలమగు చైతన్యమే తనయందు జగత్ రూపమగు చమత్కారమును భావించుచున్నది. అట్టి ఈ దృశ్యం "మహా చిదాకాశం" అనే మణియొక్క కాంతి కిరణరూపమే! సూర్యకిరణం కంటే 'కాంతి' వేరుకాదు కదా! ఈ జగత్తు తన ఉత్పత్తి స్థానమగు 'చిద్రూపమణి' కంటే వేరుకాదు. సుషుప్తియే స్వప్నంగా భాసిస్తోంది కదా! అట్లాగే బ్రహ్మమే సృష్టిగా భాసిస్తోంది. ఈ జగత్తు నానా రూపాలుగా కనబడవచ్చు గాక! కానీ, ఈ జగత్తంతా కూడా వాస్తవానికి ఏకము, శాంతము, శివరూపము, అద్వైత రూపము అగు బ్రహ్మమే! ఇక ఈ దృశ్య

వ్యవహారమంటావా? ఇది సత్తు గావచ్చు. అసత్తు గావచ్చు. చైతన్యము దేనిని ఎట్లు (సత్తుగా - లేక - అసత్తుగా) భావిస్తే అది అట్లే (చైతన్యముచే) పొందబడుతోంది.

ఓ రామచంద్రా! ఒకవేళ ఎవరైనా ఈ కనబడే జగత్తుకు పరమాత్మ కంటే వేరుగా - ప్రధాన - అప్రధాన విభాగములనో, (లేక) పరమాణు నిర్మితమనో, మరింకేదైనా అన్యకారణంగానో కల్పించ యత్నిస్తే... అదంతా స్వప్న పదార్థాల గురించి చర్చలాగా యుక్తియుక్తం కాదు. స్వప్నంలో కనబడే గృహ గ్రామాలకు కారణం ఏమున్నది... ఆత్మ ఆయారూపాలు ధరించటం తప్పించి? కనుక బ్రహ్మముయొక్క స్వకీయ భావనా విశ్వాసమే ఈ జగత్తు! ప్రమాణాలకు అతీతమై, అనిర్వ చనీయమై ఉన్నదని, వాస్తవానికి ఈ జాగ్రత్ దృశ్యము ఏ సమయమందును స్వతహాగా ఉదయించనే లేదని నిరూపించబడుతోంది.

**శ్రీరాముడు :** కానీ స్వామీ! ఏ జగత్తు స్వతహాగా లేనేలేదని మీరు సిద్ధాంతీకరిస్తున్నారో... అట్టి ఈ జగత్తు అనేక సంఘటనలతోను, వస్తు-విశ్వాసములతోను కూడినదై ఈ జీవులందరికీ పరిపరి విధాలుగా ఎదురుగా ఘనీభూతానుభవంగా ఉంటోంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును. ఎవని చిత్తము దేనియందు ఆసక్తమై ఉంటోందో... ఆతడు అద్దానినే అనుభవిస్తున్నాడు. అట్లాగే, ఎవని మనస్సు బ్రహ్మమునందే అనురక్తమై ఉంటోందో... అట్టి ద్రష్టకు ఈ జగత్తు జగత్తుగా కాకుండా బ్రహ్మము రూపంగానే గోచరిస్తోంది. అందుచేత ఓ జనులారా! ఈ జగత్తును మీ ఇష్టదైవంగా సర్వవేళలా సందర్శించటం అభ్యసించండి. ఎవని చిత్తము - ప్రాణము దేనియందు అనురక్తమై ఉంటే, అది సత్యజ్ఞాతమై అనుభూతమవటం ఈ సృష్టి యొక్క లక్షణమే సుమా! అంతేకాదు. బ్రహ్మమునందు అనురక్తి గలవానికి క్షణంలో ఇదంతా బ్రహ్మమైపోతోంది. దృఢ నిశ్చయమే అనుభవరూపం దాల్చుచున్నది. ("అనురక్తోహి జగత్ దృశ్యమ్").

**శ్రీరాముడు :** మహర్షీ! కొందరు బ్రహ్మవేత్తలగు మహనీయులు కూడా శాస్త్ర ప్రవచితములైన యజ్ఞ యాగాదులు నిర్వర్తించటం - మా వంశ పూర్వీకులగు దిలీపుడు కుకుత్సుడు మొదలైన వారిలో - మనం గమనిస్తూ ఉన్నాం కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మవేత్తలు స్వనిశ్చితమగు "సర్వము సర్వదా బ్రహ్మమే!" అని దర్శిస్తూనే, అట్టి సునిశ్చిత వస్తువుకంటే అన్యములైనట్టి శాస్త్ర మర్యాదలను అనుసరించి యజ్ఞ-యాగ-దానాదులు, సదాచారం కొరకు, తదితరుల శ్రేయస్సు కొరకు స్వభావసిద్ధంగాను, అనాసక్తి పూర్వకం గానూ నిర్వర్తిస్తూ ఉంటారు. వారి పవిత్రమైన ఆశయంచేత అదంతా ఆత్మోపాసనయే అగుచున్నది.

ఓ ప్రియజనులారా! "నా ప్రియ పరమాత్మయే ఈ ఈ రూపాలుగా ప్రదర్శితులగుచున్నారు. నా యందు నా సర్వస్వం ఆయనయే! ఆయనకు అన్యంగా, భిన్నంగా నేనుగాని, నాకు కనబడే జగత్తుగాని లేవు" అను సర్వసమర్పణ బుద్ధితో ఆత్మ సాక్షాత్కారం నిర్వర్తించే మహనీయులు ఎందరో ఈ భూమిపై వెలసియే ఉన్నారు.

నేను చెప్పుచున్న ఈ ఉపాయం ద్వారా ఈ జగత్తంతా కూడా సత్తా మాత్రంగానూ, దృక్ రూపమగు పరబ్రహ్మముగాను అతి సులభంగా అభ్యాసముచే అనుభూతమవగలదు.

ఎందుకంటే... ఇక్కడ వాస్తవానికి ద్వైత – ఏకత్వ కల్పనయే ఎప్పుడూ కూడా లేనేలేదు. దృశ్య రహితమగు బ్రహ్మమే "సత్–అసత్" "మూర్త–అమూర్త' రూపమగు దృశ్యజగత్ ఆకారము ధరించుచున్నదను కృతనిశ్చయం గలవారికి ఇక ఆపై ఇక్కడ 'కర్త'గాని, 'భోక్త'గాని, "జీవుడు ఉన్నాడు–లేడు" ... మొదలైనవి గాని భాసించవు. ఎందుకంటే వారికిక్కడ సర్వము సర్వమయంగా, బ్రహ్మమాత్రంగా, బ్రహ్మమునకు అభిన్నంగా దర్శనమగుచున్నది.

వాస్తవానికి కేవల చిద్ఘన బ్రహ్మము జగత్తు యొక్క పర్యాయరూపమై, ఆద్యంతరహితమై, మహాశాంతమై అక్కడ – ఇక్కడ, అప్పుడు – ఇప్పుడు వెలయుచున్నది. మార్గమధ్యంలో గల ఒక విగ్రహం దొంగవలె కనిపించి భయం కలిగించునట్లు, ఈ జగత్తు బ్రహ్మమే అయివుండి, అజ్ఞులకు భయోద్వేగాలు స్వకీయ కల్పనచే కలుగటానికి అవిచారణమే కారణమగుచున్నది.

❖❖❖

## 3. ఈ జీవితం మహత్తరమైన అవకాశం!

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**యదేవ బ్రహ్మ బుద్ధ్యాది తదేవైతన్నిరఞ్జనమ్ ।**
**యదేవ గగనం శాన్తం శూన్యం విద్ధి తదేవతత్ ॥**

ఓ రామచంద్రా! ఏది శాంతమైనట్టి ఆకాశమో అదియే 'శూన్యం' కూడా కదా! అంతేగాని, ఆకాశం వేరు, శూన్యం వేరు కాదుకదా! అట్లాగే ఏది నిరంజనము, దోషరహితము అగు బ్రహ్మమో... అదియే ఈ "బుద్ధి, మనస్సు, ఆలోచనలు, జగత్తు" మొదలైన వాటితో కూడిన ఈ దృశ్యం అయి ఉన్నదని గ్రహించు. ఒకనికి కంటి దోషం చేత ఆకాశంలో వెంట్రుకాకారాలు కనిపిస్తున్నాయనుకో. అవి ఉన్నాయా? కంటి దోషం లేనివానికి అవి లేవు. అగుపించవు. కంటిదోషం కలవానికో, – కనిపిస్తున్నాయి కాబట్టి... అవి ఆతనికి ఉన్నాయి. ఆ కనబడేవన్నీ ఆకాశమునకు అభిన్నమైనట్లు ...ఈ జగత్తు పరమాత్మకు అభిన్నం. పరమాత్మయందు అనంతరూప సంఖ్యలో బుద్ధులు, దేహాలు, మనస్సులు, అనుభవాలు – అనేకములుగాను, భిన్నములుగాను భాసించుచున్నప్పటికీ కూడా – వేర్వేరు వస్తువులను ప్రకాశింపజేసే ఒకే సూర్యుని అనేక కిరణాలులాగా – వాస్తవానికి అవన్నీ కూడా బ్రహ్మమునకు అభిన్నములై ఉండి వర్తిస్తున్నాయి. సుషుప్తి నుండి స్వప్నంలోకి వచ్చినప్పుడు స్వప్నంలో కనిపించే అనేక రూపములన్నీ ఏకమగు సుషుప్తి రూపములేకదా! ప్రళయము నుండి సృష్టి రూపంగా ప్రవేశించి, ఈ సృష్టిగా కనబడుచున్నట్టి బ్రహ్మమునకు ద్వైత – అద్వైతాలు లేవు.

ఓ ప్రియ సర్వజనులారా! నేను చెప్పినదే చెప్పుచున్నప్పటికీ, ఇదంతా కూడా... మీకందరికీ పరమ సత్యమును మరల మరల సుబోధకం చేయటానికే సుమా!

1. మహాచైతన్యపు స్వకీయమైన నిర్మల చైతన్యం యొక్క కాంతియే జగద్రూపంగా భాసిస్తోంది. కానీ, వాస్తవానికి అది తన నిర్మలరూపంగానే భాసిస్తోంది. అనగా, జగత్తుగా కించిత్ కూడా అవటమే లేదు.

2. చిదాకాశమున చిదాకాశమే ఉన్నది. తన యొక్క శుద్ధ చిదాకాశ స్వరూపము కొనసాగిస్తూనే స్వప్నంలోలాగా ఆ చిదాకాశము దృశ్య జగత్తుగా భాసిస్తోంది.

3. సద్వస్తువు కంటే వేరుగా మరి ఏ వస్తువు లేదు. ఉన్నదని ఎవరైనా అంటే అద్దానికి కారణమే లేదు. బాహ్యకారణమే లేనప్పుడు ఇక భిన్నమైనదెక్కడున్నది?

4. నిరాకారమగు చిదాకాశమే సృష్ట్యాది యందు జగదాకారంగా భాసిస్తోంది. అయితే అట్టి భావన స్వప్నంలోలాగా, సంకల్పంలోలాగా... మిథ్యాజ్ఞానమువలె సర్వదా భ్రమరూపమే అయివున్నది.

5. ఈ దృశ్యం స్వప్నం వలె సర్వవస్తుధర్మశూన్యమగు చిదాకాశమే అయివున్నది. చిదాకాశానికి జగత్తుకు కొంచెం కూడా భేదం లేదు. అవిద్యామలము చేత మాత్రమే చిదాకాశము ఇట్లు వికారవంతముగాను, వస్తుధర్మ సహితంగాను ప్రతీత మగుచున్నది.

6. స్వప్నాకారమగు ఈ జగత్తు చూడటానికి వస్తుధర్మసహితంగా కనబడుచున్నప్పటికీ... వాస్తవానికి సర్వధర్మరహితమై ఉన్నది. అధిష్ఠానమగు సన్మాత్ర బ్రహ్మము కంటే ఇది వేరేమీ కాదు. అజ్ఞానుల దృష్టియందు మాత్రమే ఇదంతా బ్రహ్మమునకు వేరుగా జగదాకారంగా స్థితినొందియున్నది.

❖

కలలో కనిపించే పెద్దకొండ అసలైన రూపమేమిటైయున్నది? స్వప్నాధిష్ఠానమగు స్వప్న చైతన్యరూపమే కదా! అట్లాగే అధిష్ఠానమగు జాగ్రత్ చైతన్యమునకు, ఈ కనబడే జగత్తుకు కొంచెం కూడా భేదం లేదు. ఇదంతా చిదాకాశంలాగా అతి సూక్ష్మరూపంగానే సిద్ధిస్తోంది. సర్వరూప బ్రహ్మమే సృష్టిరూపంగా స్థితినొంది ఉంటోంది.

ఇప్పుడు నీకు ఈ అయోధ్య మొదలైన నగరాలన్నీ భాసిస్తున్నాయి కదా! అయితే... స్వప్నంలోని నగరాల రూపంలో ఆత్మయే భాసిస్తున్నట్లుగా – ఈ ఈ నగరాదుల మన అనుభవమంతా మన ఆత్మ స్వరూప చమత్కారానుభవమే! స్వప్నంలో హృదయ–కంఠ–నాడీరంధ్ర ప్రదేశాలలో గృహములు – గ్రామములు – మిద్దెలు – జనులు ఉంటారా? ఉండరు కదా! కానీ వాటి యొక్క 1. ప్రత్యభిజ్ఞానము 2. సంస్కారము 3. స్మృతి స్వప్నంలో సంభవములు అగుచున్నాయి కదా! ఆ మూడూ ప్రక్కన పెట్టామనుకో....! అప్పుడు బ్రహ్మ సంవిత్తే నిద్రాదోషముచే ఆ విధంగా భాసించుచున్న దగుచున్నది కదా! స్వప్నంలో 'ఊహ'చే కనిపించిన వాటిని జగత్తులో కనిపించే పదార్థముల సాదృశ్యము వలన 'స్మృతి' యొక్క సాదృశ్యం కల్పించుకొని ఆ స్వప్న ద్రష్ట "నాకు కలలో అది కనిపించింది. ఇతను కనిపించాడు" అని స్మృత్యత్వం ఊహించుచున్నాడు. ఈ జాగ్రత్ కూడా అట్టిదే! అనేక దేహములకు సంబంధించిన ప్రత్యభిజ్ఞానము, సంస్కారములు, స్మృతి క్రోడీకరించుకొని, ఇప్పటి ఈ దృశ్యమునకు ఏదో అర్థమును ఊహించుకొని, "నేను అది చేస్తున్నాను ... ఇది చూస్తున్నాను" ... అని అనుకుంటున్నాడు.

**ప్రత్యభిజ్ఞానం -** "అప్పటి అదియే ఇది" అని తలచటం (తత్రైవ ఇతి)

**సంస్కారములు -** అనేకసార్లు నిర్వర్తించిన ఒక భావన అభ్యాసమై స్వభావంగా మారటం. 'అభిప్రాయం' అనే స్వభావం ఘనీభూతం కావటం.

**స్మృతి -** కొన్ని జ్ఞాపకముంటాయి. కొన్ని మరచిపోబడతాయి. జ్ఞాపకమున్నవి వర్తమాన అనుభవమునకు ఇచ్చే అర్థాన్ని ప్రభావితం చేయటం.

వాస్తవానికి బ్రహ్మమునందు అనేక భిన్న జగత్తులు ఎప్పటికప్పుడు మరల మరల స్ఫురిస్తూ ఉండగా... ఈ జీవుడు, ప్రత్యభిజ్ఞానము (అదియే ఇది) అనే భ్రాంతి జ్ఞానమును కలిగివుంటున్నాడు. అయితే ఆయా భిన్న జగత్తులన్నీ కూడా అధిష్ఠాన చిదాకాశము కంటే ఏమాత్రం వేరు కాదు.

ఈ కనబడే నేల, ఆకాశం – ఇవన్నీ పరమాత్మయందు ఓత–ప్రోతములై ఉన్నాయి. అందుచేత ఇక్కడ అనేకత్వం ఏమాత్రం లేదు (నేఽ హ నానాస్తి కించన). ఇక్కడి విధి – నిషేధాలన్నీ విభక్తములై, మిళితములై... అధిష్ఠాన దృష్టిచే బ్రహ్మమునందే విద్యమానములై ఉంటున్నాయి. ఇక ఆరోపిత దృష్టితో చూస్తే ఇవేవీ మొదలే లేవు.

**ఇక్కడ సంభవిస్తున్న అనేకానేక విషయాలు :** "తస్మాత్ సత్‌బ్రహ్మ సర్వాత్మకమివాత్ర న విద్యతే!" ఈ లోకంలో అనేక వ్యక్తిగత, సాంఘిక, సైద్ధాంతిక, వ్యావహారిక, సంఘటనపరమైన అనేక సంబంధాలు, అనుభూతులు, బాంధవ్యాలు, ప్రేమాస్పద స్పందనలు, అనుబంధాలు ఏర్పడుచున్నాయి. తొలగిపోతున్నాయి. ఎందుచేతనంటావా? సద్రూపమగు ఆ బ్రహ్మము సర్వాత్మకం కదా! అందుచేత అయ్యది తన నిజమాయాశక్తి చమత్కారంచేత ఇక్కడ సంఘటితం కానిదేమున్నది? ఆ బ్రహ్మ సత్తయే సర్వుల రూపమై వెలయుచున్నది. అందుచేత ఈ సమస్త జగత్తు బ్రహ్మరూపమై, సద్రూపమై ఒప్పుచున్నది.

**"పరమాత్మ - జీవుడు" గురించి వివిధ వాదముల చమత్కారం -** బ్రహ్మసత్త... సర్వాత్మకమని మనం చెప్పుకున్నాం కదా! కాబట్టే బ్రహ్మసత్త యందు వివిధ వాదుల యొక్క సమస్త కల్పనలకు ఇక్కడ అనవరోధపూర్వకంగా "నిజమే" అనే అనుభవత్వం సిద్ధిస్తోంది. సర్వకల్పనలను త్యజించినవానికి మోక్షం కూడా అట్లే సిద్ధిస్తోంది. ఎట్లా అంటావా? ఏదో ఆటలాగా ఒక బాలుడు తనచుట్టూ తాను కాసేపు తిరుగాడాడనుకో! ఆ ప్రక్కనేగల మరొక బాలుడు చూస్తూ నిలబడ్డాడనుకో! మొదటి బాలునికి తాను నిలబడిన నేల గిర్రున తిరుగుచున్నట్లు అనిపిస్తుంది. అది ఆతనికి సత్యం. ఆ రెండవ బాలునకో... అంతా ఏదీ కదలకుండా ఉన్నట్లు కనిపిస్తుంది. ఇది ఈతనికి సత్యం.

అజ్ఞానుల దృష్టిలో అజ్ఞాన భ్రమ ఉన్నది. వారికి ఈ దృశ్యము స్థిరంగా ఉన్నట్లుగా అగుపిస్తోంది. అది వారికి సత్యమే! "అయ్యో! వాళ్ళు నన్ను అంతమాట అన్నారే... ఇంత సహాయం నేను వాళ్ళకు చేసియున్నప్పటికీ కూడా?" అనునది ఆ ద్రష్టకు సత్యం. కానీ, – జ్ఞానికి ఈ వర్తమాన జగత్తు స్వప్న సదృశంగాను, మొదలే అవాస్తవంగాను అగుపిస్తోంది. అజ్ఞాని ఎంతగా సత్యమనుకుంటున్నాడో... జ్ఞాని అంతగానూ ఇది కేవలం భ్రమగా గమనిస్తూ చిరునవ్వుతో దర్శిస్తున్నాడు.

❖

**మోక్షోపాయం -** ఏది ఏమైతే ఏం? ఒకడు జ్ఞాని అయినా, లేక అజ్ఞాని అయినా... ఆత్మ స్వరూపమునందలి స్థిరత్వం (నేను సర్వదా అఖండము – అప్రమేయము – నిత్యము –నిత్యసత్యము – సర్వము అగు 'ఆత్మనే' అనే స్థిరభావం) అనే అభ్యాసం లేకపోతే ఈ దృశ్యము శమించటం కల్ల.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ దృశ్యము పట్ల ఏర్పడే అనుబంధకమునకు సంబంధించిన (ఇది సత్యమే అనే రూపంలో ఉండే) సంసారదోషం తొలగితేగాని దుఃఖం ఉపశమించదు కదా! అట్టి ఈ సంసారదోషం ఈ జీవునకు మొదలంటా తొలగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అవును. అట్టి సంసారదోషం తేలికగా పోయేది కాదు. మరి అది జన్మ జన్మార్చితం కదా! ఎట్లా పోతుంది? అయితే అందుకు ఉపాయం లేకపోలేదు సుమా! సాధక జనులు నిరుత్సాహపడవలసిన పనేమీలేదు. ఓ ప్రియ జనులారా! అట్టి మోక్షమును కరతలామలకం చేసుకొన్న మహనీయులు భూమిపై సర్వజీవజాతులలోను ఉన్నారు. ఈ వర్తమాన 'యోగవాసిష్ఠం' అని ప్రసిద్ధికి ఎక్కబోయే శాస్త్రం యొక్క శ్రవణ - మననాలు మోక్షము ఎంత సులభమో చెప్పటానికే ఉద్దేశించబడింది. అంతేగాని, "అది చాలా కష్టం" అని చెప్పి ముగించటానికి కాదు సుమా! ముందుగా విజ్ఞులగు సద్గురువులను గుర్తించండి, వారిని మీ సేవలచే మెప్పించి "మేము మోక్షశాస్త్రం వినాలని, గ్రహించాలని మీ పాదారవిందములు ఆశ్రయిస్తున్నాం. అందుకు పట్టుదల కలిగి ఉన్నాం" అని సుస్పష్టపరచండి. అప్పుడు మోక్షోపాయమైన ఇట్టి శాస్త్ర బోధ శ్రద్ధగా శ్రవణం చేయండి. ఆ తరువాత నిధి ధ్యాసనముల ద్వారా ఆ పాఠ్యాంశములను హృదయస్థం చేసుకోండి. "ఈ దృశ్యము బ్రహ్మమే! ఆత్మరూపమే! నా రూపమే"... అనే పరమ సత్యం సుస్పష్టంగా, సంశయరహితంగా అనుభూతమవటానికి అనుభవజ్ఞుల వాక్యప్రవాహం తప్పితే వేరే ఉపాయమేమున్నది? ఉండలేదు. ఉండబోదు.

**న జీవన్, న మృతం చిత్తం రోధమాయాతి సంసృతేః**
**అవినాభావిదేహత్వాత్ బోధాత్వేతన్నపశ్యతి ॥**

ఓ ప్రియ సభికులారా! ఈ చిత్తము, సంసారము అనబడే రెండూ అవినాభావమైనట్టి ఒకానొక సంబంధం కలిగి ఉంటున్నాయి. ఒకటి ఉంటే రెండవది ఉంటోంది. అయితే ఈ చిత్తము యొక్క పరిస్థితి ఏమిటి? జాగ్రత్-స్వప్నములలో గంతులు వేస్తోంది. సుషుప్తికి వచ్చేసరికి లయించి పోతోంది. జాగ్రత్-స్వప్నములలో మాత్రం అది "యోగాభ్యాసం, తీర్థాలు సేవించటం, క్రతువులు నిర్వర్తించటం" ...మొదలైన ప్రయత్నములచే నిరోధించబడినప్పటికీ, మరల "తగుదునమ్మా!" అని ఎప్పుడో బయల్వెడలి కుప్పిగంతులు ప్రారంభిస్తోంది.

అయితే... మోక్ష శాస్త్రము యొక్క అభ్యాసము చేత జనించే జ్ఞానముచే ఈ 'సంసారము' అనబడేది మొదలంటా శమించినదై, ఇక మరల చిగురించటం లేదు. (జ్ఞానేదైవ తు కైవల్యమ్). కాబట్టి ఈ శాస్త్రము యొక్క అభ్యాసం చిత్త నిరోధమునకు ఉపాయమే అయివున్నది.

ఈ చిత్తము సంసారముతో అవినాభావ సంబంధం కలిగియున్నదని చెప్పుకున్నాం కదా! అట్లాగే... ఈ చిత్త, సంసారములు శరీరముతో అవినాభావం కలిగి ఉంటున్నాయి. ఈ శాస్త్రాభ్యాసం చేత "దేహినైన నేను సర్వదా దేహము కంటే వేరై, సమున్నతుడనై, నిర్మలుడనై, అప్రతిహతమైన-సర్వాత్మకమైన-సువిశాల స్వరూపుడనై ఉన్నాను" ...అని ఆ అభ్యాసకుడు గ్రహిస్తున్నాడు. అభ్యాసకుడు

ఎవరైనా యోగవాసిష్ఠ మోక్షశాస్త్ర కథన ప్రభావంచేత ఇప్పటికిప్పుడే, ఈ జన్మయందే తత్త్వబోధచే చిత్తమును సంసార దృష్టి నుండి నివర్తింపజేసుకుంటున్నాడు. లేదా... ఆతని ప్రతిబంధకములు ఒకవేళ బహుళంగా ఉంటే మరుజన్మలో తప్పక (ఈ గ్రంథం అందించే జ్ఞాన బలంచేత) చిత్త శమనమును పొందుచున్నాడు.

వాయుచలనముచే దూదిపింజములవలె ఆకాశంలో ఎగిరే మేఘపుంజములు గాలి వీచికలు శమిస్తే ఆకాశంలో కదలక ఉంటాయి కదా! జ్ఞానముచే అవిద్యకు కారణములు శమిస్తూ వస్తాయి. ఇక ఆపై ఈ చిత్త-దృశ్య-శరీర భావములు కారణరహితమై పోతాయి. ఈ మూడు శమిస్తే ఇక శేషించేది ఆత్మతత్త్వమే! ఎందుకంటే చిత్త - దృశ్య - శరీరమేవాహంకారాలకు అజ్ఞానమే కారణం! అట్టి అజ్ఞానమో... ఒకింత సంస్కరించబడిన బుద్ధి గలవాడు ఈ శాస్త్రమును అధ్యయనం చేస్తే తప్పక శమించగలదు.

ఈ గ్రంథం పూర్వ విభాగంలో విషయాలన్నీ చర్చించబడియే ఉన్నాయి. అప్పటికీ ఏమేమి బోధపడలేదో అవన్నీ ఈ ఉత్తరార్ధం చదవటంచేత తప్పక సుబోధపడగలదు. పదపదార్థ జ్ఞానం కూడా చక్కగా అలవడగలదు. ఈ గ్రంథం తదితర గ్రంథాల కంటే కొంత విలక్షణమై ఉన్నది. సంసార భ్రమ వినాశమునకై ఉత్తమ ఉపాయం. అందుచేత పూర్వార్ధ-ఉత్తరార్ధములలో ఒక విభాగంగాని, రెండూగాని చక్కగా పఠించి విచారించండి. దీనిచే సర్వదుఃఖాలు తప్పక తొలగుతాయి.

ఒకవేళ ఎవరైనా, "ఈ శాస్త్రము వేద విభాగం కాదు కదా! వేదసారములైన ఉపనిషత్తులే మాకు రుచిస్తాయి" ...అని అంటారా! సరే, మంచిదే! ఉపనిషత్తులలో చెప్పినదే ఈ శాస్త్రంలో యుక్తి యుక్తంగా చెప్పబడింది కదా! వేదముల విభాగమైన ఉపనిషత్ సారమే ఇందులో పాఠకులకు వినపడగలదు. కాబట్టి ఉపనిషత్తులు పఠిస్తామని అన్నా కూడా మాకేమీ అభ్యంతరం లేదు. ఏది ఏమైనప్పటికీ ఒక్క విషయం నేను ఎలుగెత్తి ప్రకటిస్తున్నాను. ఓ సర్వజనులారా! ఆత్మజ్ఞానమును ప్రతిపాదించే శాస్త్రముల పట్ల బద్ధకము - అశ్రద్ధ కలిగి ఉండకండి. మీరు ఆత్మజ్ఞానం పొందుటకు మానవజన్మ అత్యంత దుర్లభమైన - ఉత్తమమైన అవకాశం అయివున్నది నాయనలారా!

**అనర్థేన అవిచారేణ వయః కుర్యాత్ న భస్మసాత్ ।**
**బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్యమాత్మసాత్ ॥**

అవిచారణ అనే అనర్థమును ఆశ్రయించి మహదవకాశమైనట్టి ఆయుష్షును బూడిదపాలు చేసుకోకూడదు సుమా! శ్రవణ-మనన-నిధి-ధ్యాసాది ఉపాయములచే తత్త్వజ్ఞానం (తత్ - త్వమ్ - నాకు ఎదురుగా కనిపించే నీవు ఆ పరమాత్మ స్వరూపమే. నా స్వరూపం కూడా పరమాత్మయే! కనుక నీవు నా స్వరూపుడవే... అనే జ్ఞానం) చేత ఈ దృశ్యమును ఆత్మయందు లయింజేసి ఇదంతా ఆత్మరూపంగా చేసివేయండి.

**ఆయుషః క్షణ ఏకోఽపి సర్వరత్నైః న లభ్యతే ।**
**నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో ॥**

ఓ ప్రియ జనులారా! "ఆ! ఇవన్నీ తెలుసుకోవటానికి మాకు చాలా సమయం ఉన్నదిలెండి. అప్పుడే ఇవన్నీ దేనికి?" అని ఆత్మజ్ఞాన సముపార్జనం విషయంలో అనేకులు అశ్రద్ధయే కలిగి ఉంటున్నారే! ఇది ఉచితం కాదు. ఆయుస్సు యొక్క ఒక్క క్షణం వ్యర్థంగా గడచిపోయినప్పటికీ, ఆ ఒక్క క్షణమును సమస్త రత్నములు ఇచ్చి కూడా సంపాదించుకోలేరని తాత్సారం చేసే వారందరికీ మా హెచ్చరిక! ఆత్మ విచారణ లేకుండా ఆయుస్సు గడపివేయటం సర్వ అనర్థములకు మూలమని, మహాప్రమాదకరమైన విషయమని మీరంతా గుర్తుపెట్టుకొని ఉండండి.

**అనుభూతమపిచ నో దృశ్యమిదం ద్రష్టృ సహితమపి ।**
**స్వప్న నిజమరణ బాంధవరోదనమివ, సదివ కచితమపి ॥**

ఓ రామచంద్రా! ఒకానొకడు నిద్ర నుండి లేచి తన మనుమడి దగ్గరికి వెళ్ళి గాభరాగా... "ఓరే! మనవడా! ఇప్పుడు నాకు ఒక భయంకరమైన స్వప్నం వచ్చిందిరా!" అన్నాడు. "తాతా, కలయా? ఏమని?" అని ఆ మనుమడు ప్రశ్నించాడు. అప్పుడా ముసలాయన, "నాయనా! నేను మరణించాను. అప్పుడు నా చుట్టూ చేరి నీవు, మీ నాన్న, మీ అమ్మ, మీ బామ్మ, మీ బాబాయి... అందరూ ఎలుగెత్తి దుఃఖిస్తున్నారు"... అని చెప్పసాగాడు.

అపుడా మనుమడు "తాతా! ఆగాగు! నీవు మరణించావు కదా! మరి ఆ స్వప్నంలో మా ఏడ్పులు నీకెట్లా వినిపించాయి?" అని ప్రశ్నించాడు. ఆ తాతకు సమాధానం దొరకలేదు. "అవును. అదంతా మిథ్యయే కదా!" అని సమీక్షించక తప్పలేదు.

'స్వప్నంలో తాను మరణించటం' అనేది, చుట్టూ బంధువులు రోదించటమనేది ఆ స్వప్న కాలంలో సత్యముగా భాసించవచ్చుగాక! వాస్తవానికి అదంతా మిథ్యయేనని జాగ్రత్ సమయంలో ఆ జాగ్రత్ ద్రష్ట ఒప్పుకోక తప్పలేదు కదా! అట్లాగే ఈ దృశ్యము ప్రత్యక్షంగా అనుభూతమవచ్చు గాక! అంతఃకరణోపహితమగు జీవుడు ద్రష్టత్వముతో కూడి ఉండవచ్చుగాక! అయినప్పటికీ "జ్ఞానదృష్టిచే" ఇదంతా మిథ్యయే అని సుస్పష్టమగుచున్నది.

❖❖❖

# 4. బ్రహ్మదేవుని జగత్ వ్యాఖ్యానం

**శ్రీరాముడు :** హే మహర్షీ! జగత్తు మిథ్య అని, జగత్తు లేదని, జగత్తు ఆత్మ రూపమేనని... ఇంకా ఆయా జగత్‌ను దర్శించే అనేక ఉపాయాలు చెప్పారు, మంచిదే! జగత్తు ఎట్టిదో అనేక కోణాల నుండి మీరు సుదీర్ఘంగా మహాశవోపాఖ్యానంలో కూడా ఉపన్యసించారు.

కానీ స్వామీ! అనేక అసంఖ్యాక జగత్ సమూహాలెన్నో గడచిపోయాయి. మరి ఇంకెన్నో జగత్తులు ముందు ముందు రానున్నాయి. ఈ 'జగత్తు లేదు' అను ప్రసంగము ద్వారా బంధము యొక్క అభావం సుస్పష్ట పరచుకోవటం ఎట్లా?

"పూర్వ జగత్తు లేదు. రాబోయే జగత్తులు లేవు" అని మీరు యుక్తియుక్తంగా చెప్పుకుంటూ

వస్తున్నారు. అయితే, పూర్వ జగత్తులు గడచిపోయాయి కాబట్టి ఇప్పుడు వాటి గురించి మనం చర్చించవలసిన పనిలేదు.

రాబోయే జగత్తులు ఇప్పటికి మనకు బంధం కాదు. భూత భవిష్యత్ జగత్తుల 'బంధము లేదు' అనునది స్వతహాగానే సిద్ధించుచున్నది. ఇప్పటి ఈ జగత్తే కదా, బంధం! కాబట్టి వర్తమాన జగత్తు మా పట్ల ఎట్లా తొలగుతుందో... అద్దాని గురించి బోధింపమని నా విన్నపం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మోక్షశాస్త్ర శ్రవణానికి నీవు అధికారివి (అర్హుడవు) అయి ఉన్నావు. అట్టి నీవు 'జగత్తు' అనబడు దాని యొక్క శబ్ద-అర్థములు, అద్దానితో జీవునికి గల సంబంధం చక్కగా ఎరిగివుంటే చాలు. ఇక మన భూత - భవిష్యత్ బ్రహ్మాండముల కథనం వ్యర్థం అవదు. ఎందుకంటే, భూత-భవిష్యత్ బ్రహ్మాండముల వంటిదే వర్తమాన బ్రహ్మాండము కూడా!

భూతకాలిక - భవిష్యత్ కాలిక బ్రహ్మాండముల గురించి (మహాశవోపాఖ్యానంలో) విచారణ చేయటంలో ఒకానొక ముఖ్యోద్దేశం ఉన్నది. అది ఏమంటే... జీవుని యొక్క ఈ వర్తమాన పదార్థ సంబంధం, భూతకాలిక వ్యవహారముతోనే ముడిపడి ఉన్నది. భూత - భవిష్యత్తుల రెండింటినీ వచించకపోతే అధ్యాత్మ శాస్త్రము నందు ప్రవృత్తి సంభవించదు.

ఒకనికి ఒక అత్యాశ్చర్యం, అత్యావశ్యకం అయిన విశేషం గురించి చెప్పదలచుకున్నామనుకో! అప్పుడు ఆ వినేవానికి ఆతనికి తెలిసిన శబ్దాలు ఉపయోగించి చెప్పితేనే ఆతడు సులభంగా ఆ విషయం గ్రహించి అవగాహన చేసుకోవటానికి, ఆనందించటానికి వీలుంటుంది కదా! కాబట్టి అధ్యాత్మ బోధలో భూతకాలిక బ్రహ్మాండ వ్యవహారాల గురించి చెప్పటంలో ఉద్దేశం అట్టిదే! ఓ రామచంద్రా! ముందుగా మరొక విషయం ప్రస్తావిస్తాను. నీవు జ్ఞేయమగు పరమాత్మను ఎరిగినావనుకో. (విదితవేద్యుడవయ్యావనుకో)... అప్పుడు త్రికాలములలో సమరూపమైయున్న నీ స్వరూపమును ఎరుగగలుగుతావు కదా! "సర్వదా సమము" అయివున్న నీ స్వరూపం గురించి బోధించటానికి భూత-భవిష్యత్-వర్తమాన జగత్తులలో ఏది తీసుకుంటే మాత్రం ఇబ్బంది ఏముంది? వాటి అన్నిటికీ అప్రమేయమైన నీ స్వస్వరూపమగు ఆత్మ గురించిన జ్ఞానము దృష్ట్యా ఆ మూడు స్వప్నతుల్యమేనని ప్రత్యక్షంగా గ్రహించటమే ఇక్కడి ఉద్దేశము సమస్తమునకు "ఆది" అగు చిన్మాత్రమే స్వయంగా స్వప్నంలో జగత్తు రూపంలో భాసిస్తోంది! భూత-వర్తమాన-భవిష్యత్ సమస్త సృష్టులకు మునుముందుగానే స్వస్వరూపమగు చిన్మాత్ర బ్రహ్మమే ఉండివున్నది. అదియే సర్వకాల జగత్తులుగా భాసిస్తోందాయే! అట్టి చిన్మాత్రమునకు అన్యమైనదంటూ ఎప్పుడూ లేదు!

ఓ రామచంద్రా! ఇక ఈ వర్తమాన జగత్ విషయానికి వచ్చాం అనుకో! ఆ పరమాత్మ యొక్క మాయాశక్తిచే ఒక్కొక్క అణువునందు అసంఖ్యాకములైన బ్రహ్మాండాలు వర్తించుచున్నాయి. అట్టి అసంఖ్యాక బ్రహ్మాండాలు లెక్కపెట్టడం ఎవరి తరం? "అణువణువులో అసంఖ్యాక బ్రహ్మాండాలు ఉన్నాయి" అనే విషయం పూర్వం ఒకసారి మా తండ్రి, సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు ఒకానొక విశేషపూర్వకమైన వివరణతో నాకు బోధించటం జరిగింది. ఆ విశేషం ఇప్పుడు వివరిస్తాను.

❖

ఒకసారి నా తండ్రి శ్రీ బ్రహ్మదేవులు పద్మమునందు జగన్మాత సరస్వతీదేవితో కూడుకొని సుఖాసీనులైన తరుణంలో, వారిని సమీపించి మాతా-పితల పాదపద్మములకు సాష్టాంగ దండ ప్రమాణమములు సమర్పించి నేను ఇట్లా ప్రశ్నించాను:

**నేను :** హే మహాత్మా! ఈ జగత్ సమూహములు దశదిశలా వ్యాప్తమై కనిపిస్తున్నాయి కదా! ఇవన్నీ ఎంత విస్తీర్ణంగా వ్యాపించి ఉన్నాయి? ఇవి అసలు ఎచ్చట భాసిస్తున్నాయి?

**బ్రహ్మదేవుడు :** ఓ ప్రియపుత్రకా! బ్రహ్మమే ఈ సర్వజగత్ రూపములుగా భాసిస్తోందయ్యా! అయితే ఇక్కడ ఒక విశేషం నీవు గమనించు. బ్రహ్మమును ఎరిగిన తత్త్వజ్ఞానులకు ఈ జగత్తులన్నీ బ్రహ్మ సత్తారూపంగానే భాసిస్తున్నాయి. అజ్ఞానులకో... ఇవి జగద్రూపములుగా కనిపిస్తున్నాయి.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇట్లా చెప్పి ఆయన ఈ వ్యష్టి – సమష్టి యొక్క సృష్టి విశేషం ఏ విధంగా ఏర్పడు తోందో చెప్పారు. చెవులకు ఇంపైనట్టి అట్టి "బ్రహ్మాండాఖ్యాయిక" అని, "బ్రహ్మాండపిండాఖ్యానము" అని చెప్పబడే ఆ విశేషాలు విను.

❖

**బ్రహ్మాండాఖ్యాయిక - బ్రహ్మాండపిండాఖ్యానము -**

**బ్రహ్మదేవుడు :** మొట్టమొదట నిష్ప్రపంచకమగు చిదాకాశ పరమాణువు మాత్రమే ఉన్నది. అది సర్వదా సర్వత్రా తనకంటే వేరైనదంటూ ఏదీ లేకయే వర్తిస్తోంది.

స్వప్నానికి దృశ్యంలాగా, ఆకాశానికి శూన్యంలాగా, వాయువుకు స్పందనలాగా ఆ చిదాకాశ పరమాణువు తనయందు 'సమష్టి జీవత్వము'ను గాంచుచున్నది. అయితే ఆకాశ సదృశమగు అట్టి సమష్టి జీవత్వము గాంచుచున్నప్పుడు తన నిర్వికార – అసంగ – పరిపూర్ణ – సూక్ష్మ చిద్రూపమును ఏమాత్రం త్యజించటమే లేదు. అట్టి ఆకాశ సదృశ సమష్టిరూప అహంకారం తనయందు 'బుద్ధి' అను దానిని గాంచుచున్నది. అట్టి బుద్ధి 'నిశ్చయము'చే నిర్మితమై ఉన్నది. అది అసత్ పదార్థముల గురించిన భ్రమ కలిగి ఉండటం జరుగుతోంది. అందుచేత అట్టి బుద్ధి మాయ యొక్క అనురూపంగా చెప్పబడుతోంది.

ఆ బుద్ధి వికల్పరహితమగు తనను వికల్ప భాసముల యొక్క ఆరోపణములచే తనే స్వయంగా క్రిందికి నెట్టుకొనుచూ, క్రమంగా స్వప్నంలోలాగా... మనస్సును గాంచుచున్నది.

ఆ మనస్సు తన దేహమునందు అసన్మయము అగు 'మనస్సు'ను గాంచుచున్నది. ఇక ఆపై ఈ త్రిలోకముల వ్యవహారమంతా అనేక అనుభూతములచేతను, స్థావర – జంగమరూపులగు అనేక ప్రాణికోట్లచేతను వ్యాప్తమై ఉన్నట్లుగా దర్శిస్తోంది. ఇక ఇందులో 'కాలము' యొక్క కల్పన, పదార్థముల పరస్పర సంగమం, కల్పించబడుతోంది.

స్వప్నంలో లాగా... త్రిలోకాలలో ప్రతి వ్యష్టి జీవుడు తనకు ప్రత్యేకంగా 1. ద్రష్ట–దర్శన –దృశ్యములు 2. భోక్తృ–భోగ–భోగ్యములు 3. కర్తృ–క్రియా–కార్యములు అను 'త్రిపుటిత్రయం' (3×3=9) రంగుటద్దం లోంచి ఈ త్రిలోకములను గాంచుచున్నాడు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇట్లా అనేక విశేషాలు వారు చెప్పారు. ఆ రోజు సంభాషణ సారాంశం నా మాటలలో చెప్పుచున్నాను. సభికులంతా వినండి.

ఓ రామచంద్రా! నీకు స్వప్నంలో పదిమంది మిత్రులు, నీ సోదరులు ముగ్గురు కనిపిస్తున్నారనుకో, వారందరు ఎవరికి వారుగా వేరువేరుగా కనిపిస్తారు కదా! అదే రీతిగా ఈ జాగ్రత్తునందు కూడా ప్రతివ్యష్టి జీవుడూ తన హృదయంలో ద్రష్ట – దర్శన – దశ్య, భోక్తృ – భోగ – భోగ్య, కర్తృ – క్రియా – కార్యములు అనే త్రిపుటీత్రయ (9) దర్పణమును హృదయాకాశంలో నిర్మించుకుంటున్నాడు. ఆ దర్పణంలో స్వర్గ – మర్త్య – పాతాళలోకములను కల్పించుకొని అనుభవ పరంపరలను కొనసాగిస్తున్నాడు.

❖

చూచావా రామచంద్రా! ఈ విధంగా చిదాకాశ పరమాణువు తన యొక్క అతి సూక్ష్మమైన ఉదరమునందు ప్రత్యేక జీవభేదములచే విభిన్నమైనట్టి (ఇందాక చెప్పుకున్న) అనేక కల్పిత – విశాల మహాజగములు కలిగి ఉంటోంది. అయితే ఏ వ్యష్టి సహిత అసంఖ్యాక మహాజగత్తులు కోకొల్లలుగా ఉన్నాయని చెప్పుకుంటున్నామో... అదంతా కూడా అవిద్యయే అయివున్నది.

ఇక అవిద్య అనగా? స్వాత్మ తత్త్వమును గూర్చిన అజ్ఞానము యొక్క రూపమే సుమా! అట్టి అవిద్య అనంతమై, అనుక్షణికమై ఒప్పుచున్నది. కానీ... ఆత్మజ్ఞానము అనే దీపకాంతిని ప్రసరింపజేసి చూస్తేనో... అంతా నిర్మల పరబ్రహ్మముగానే అగుచున్నది, కానవచ్చుచున్నది. ఈ విధంగా "ఈ కనబడే సమస్తం బ్రహ్మమే" అనబడు 'బ్రహ్మాదృష్టి' సముపార్జించుకొన్న వానిని 'తత్త్వవేత్త' అని, 'విదిత వేత్త' అని, 'బ్రహ్మయశస్వి' అని, 'జీవన్ముక్తుడు' అని, 'వేదవేద్యుడు' (తెలుసుకొనవలసిన దానిని తెలుసుకున్నవాడు) అని, 'ఆత్మజ్ఞాని' అని, 'పండితుడు' అని శాస్త్రకారులు పిలుస్తున్నారు. అట్టి తత్త్వవేత్తకు ఇదంతా స్వప్నముతో సమానమైనదే అగుచున్నది. అనుభవ స్వరూపుడగు ద్రష్టయే స్వప్న తుల్యమగుచుండగా... ఇక ద్రష్టకు సంబంధించిన దృశ్యము గురించి వేరే చెప్పేదేమున్నది?

సర్వము బ్రహ్మరూపమై, ద్రష్ట – దృశ్యములే లేవని నిర్ధారించబడుచుండగా... ఇక ద్వైతమెచట? దానికి కారణమెచట?

కాబట్టి రామచంద్రా! "కేవలము మహాశాంతము – భేదరహితము – నిర్మలము – ఆద్యంత పరివర్జితము"... అయినట్టి చిదాకాశరూపమగు బ్రహ్మమే తనయందు ఇట్లు సమస్త జగద్రూపంగా స్థితినొందియున్నదగుచున్నది. సముద్రంలో 'తరంగ వేగము' అనే కారణంచేత చంచలమై ఉంటున్న జలంలో అసంఖ్యాక పరమాణు సమూహములు వర్తిస్తున్నాయి కదా! అట్లాగే అజ్ఞానము ఉన్నంతవరకు పరమాత్మ యందు లక్షల – కోట్ల కొలది బ్రహ్మాండములు మనం చెప్పుకుంటున్న రీతిగా ఒకదానికొకటి (బ్రహ్మము రూపముచే) అభిన్నమైనప్పటికీ భిన్నమైనవాటివలె భాసిస్తున్నాయి.

అజ్ఞాన దృష్టిచే ఇట్టి ఈ జగత్తులకు అంతంలేదు. జ్ఞానదృష్టిచే జగత్తులు ఇప్పుడు లేవు. ఇతఃపూర్వం లేవు. ఇక ముందు ఉండబోవు.

తత్త్వవేత్తల దృష్టిలో ఈ అసంఖ్యాక జగత్ సమూహాలన్నీ స్వస్వరూప చిదాత్మరూపమే అయివున్నాయి. ఇక అట్టి జగత్తులకు భూతకాలమని – వర్తమానకాలమని – భవిష్యత్ జగత్తు అని చెప్పుకోవలసినది ఏమున్నది? ఉన్నదానికైతే కాలమానం. లేనిదానికి కాలమానమేమిటి? కథలో కల్పించబడిన అనగా అనగా ఒక రాజు, – "ఇప్పుడున్నాడా?".... అను చర్చకు ఉపక్రమించలేం కదా! కథ విని ఊరకుంటాం. ఈ జగత్తు కూడా అంతమాత్రమే!

❖❖❖

## 5. ఈ జగత్తులు కల్పనా దృష్టిచే కారణ సహితం ! యథార్థ దృష్టిచే కారణ రహితం!

**శ్రీరాముడు :** మహాత్మా! శ్రీ వసిష్ఠ మహర్షీ! ఈ జగత్తులు యథార్థ దృష్టిచే కారణ రహితమని మీరు ప్రవచిస్తున్నారు కదా! ఇదంతా కూడా స్వప్నంలోలాగా, సంకల్పంలో (ఊహలో) లాగా... కారణ రహితంగా బ్రహ్మము నుండి ఉత్పన్నమగుచున్నదని కదా సిద్ధాంతం! అప్పుడు ఈ జీవుడు ఏఏ వస్తువులను కోరుకొంటే ఆయా వస్తువులు తమంతట తామే అప్పటికప్పుడే కారణరహితంగా సంభవించాలి కదా! అట్లా జరగటం లేదేం? ఉదాహరణకు ఒక రైతు అత్యధికంగా ధాన్యం పండించాలనుకున్నాడనుకోండి. ఆ రైతు కార్య రూపమగు కృషి – సకాలంగా వర్షం కురియటం – ఇవన్నీ ఒనగూడితేనే సాధ్యపడుతోంది. ఈ జగత్తులో కొంచెం కూడా కారణం లేకుండా ఏదీ సంభవించటం లేదు కదా! అకారణంగా బ్రహ్మము నుండి జనించిన ఈ జగత్తులలో అనివార్యమగు కార్య–కారణ వ్యవహారం ఎట్లా ఏర్పడుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జీవుని గురించి రెండు విభాగములుగా బోధ కొరకై విభజించి చెప్పబడుతోంది. 1.నిర్మల చిదాత్మ, 2.అద్దాని భావనా వైశిష్ట్యము... ఈ విధంగా ద్రష్టాహంకారము – వ్యవహార దశ అనే రెండూ స్వప్నతుల్యంగా ఏర్పడి ఉంటున్నాయి.

**వ్యవహార దశ –** ఈ వ్యవహార దశయందు ఎవడు దృఢమైన అభ్యాసంచే... దేనిని ఎట్లు భావిస్తాడో, కల్పిస్తాడో... అద్దానిని అట్లే కల్పితమైన కార్యనియమబద్ధంగా గాంచుచూ ఉంటాడు. ఎవనికి వ్యావహారిక నియమము దృష్టియందు ఉండదో... ఆతనికి కల్పనయే ఉండజాలదు. కనుక "కల్పనామయమగు ఈ దృశ్యము ఇట్లు అనిపించటానికి కారణం దృక్ స్వరూపుడగు ద్రష్ట స్వయంకృత కల్పనా విశేషమే".... అని చెప్పబడుతోంది.

**యథేదం కల్పితం దృశ్యం మనసా యేన తత్తథా ।**
**వేత్త్యసౌ యాదృక్ అన్యేన కల్పితం, వేత్త్యసౌ తథా ॥**

ఎవడు తన మనస్సుతో ఏ విధంగా, కల్పించుకుంటాడో... దానిని ఆతడు ఆ విధంగానే పొందుచున్నాడు. అద్దానినే మరొకడు నిజకల్పనా భేదంచే మరొక విధంగా అనుభవిస్తూ ఉంటాడు.

ఉదాహరణకు... ఒకడు "అయ్యో! నేను పడే అన్ని కష్టాలు ఎవ్వడూ పడటంలేదు"... అను కల్పనను మనస్సుచే ఆశ్రయిస్తే ... ఆతనికి నిజంగానే అన్నీ భరించలేని కష్టాలుగా కనిపిస్తాయి.

మరొకాయన అవే కష్టాలుపడుతూ, "ప్రపంచంలో అందరికీ ఏవో కొన్ని కష్టాలు ఉంటాయి. నాకు కూడా అట్లాగే ఈ ఈ కష్టాలు ఉన్నాయి"... అని మనస్సుచే అనుకుంటే... ఆతనికి ఆయా కష్ట సంఘటనలు తనకు – తదితరులకు సర్వులకు సామాన్య విషయములవలె గోచరిస్తాయి.

ఇంకొకడు "నా ఇష్టదైవం నాకు ఈ దేహం ప్రేమతో ప్రసాదిస్తున్నట్లే... ఈ ఈ కష్టాలన్నీ నా అభ్యున్నతి కొరకై పాఠ్యాంశాల రూపంలో ప్రసాదిస్తున్నారు. ఇవన్నీ నాకు అవసరమే! లేకుంటే పరమాత్మ ఎందుకిస్తారు?"... అని మనస్సుతో భావన చేస్తే ... ఆతనికి అవి కష్టాలుగా కాకుండా బోధసాధనలైపోతాయి. బాధలన్నీ బోధలైపోతాయి.

వేరొకడు... "ఈ దేహాదులు నావి కావు. దేహాన్ని బట్టి ఇవి ఉంటాయి. కనుక ఈ కష్టాలు నాకు సంబంధించినవి కావు. నేను అప్రమేయమగు ఆత్మను కదా?" ... అని అనుకుంటే... సర్వ ప్రాపంచిక వ్యవహారాలు ఆతనికి ప్రక్క గ్రామంలో అపరిచితుల గృహంలో జరిగే వివాహ సందర్భపు మేళతాళాలవలె తనకు సంబంధించనివై ఉంటాయి.

ఈ కష్టాలు ఇతఃపూర్వపు నా తప్పుల ప్రక్షాళనము కొరకే" ... అని మనస్సులో భావించేవారికి అవన్నీ దేహమును పరిశుభ్రం చేసే జలంలాగా – ప్రియమైనవై పోతాయి. మనస్సును పరిశుద్ధపరిచేవిగా కనిపిస్తాయి.

❖

అయితే రామచంద్రా! "కల్పన, అకల్పన"... ఈ రెండూ కూడా ఏకమగు బ్రహ్మము యొక్క స్వభావ చమత్కారం వల్లే ఏర్పడుచున్నవగుచున్నాయి. ఇందులో... చిదంశము (అకల్పనారూపం); అచిదంశము (కల్పనారూపం)... రెండూ ఉంటున్నాయి.

ఎట్లాగంటే మనుష్యుడు చేతనాస్వరూపుడే అయినప్పటికీ... ఆతని జుట్టు, గోళ్ళు, బొమికలు మొదలైనవి అచేతనములుగాను – ఆతడు చేతన రూపుడుగాను ఉంటున్నారు కదా! ఈ దేహము చేతన, అచేతనముల కలగలపుగా ఉన్నట్లే... ఈ జగత్తు కూడా కల్పన + అకల్పన ఉభయ రూపములతోకూడి ఉంటోంది. పదార్థములన్నీ కూడా... పరమార్థ దృష్టిచే – అకారణములుగాను, కల్పనా దృష్టిచే – సకారణములుగాను... అయి వుంటున్నాయి.

బ్రహ్మము నందు ఈ రెండు ధర్మాలు అవిరోధపూర్వకంగా వర్తిస్తున్నాయి. ఎట్లా అంటావా? ...మరి... బ్రహ్మము సర్వశక్తిమంతమై అలరారుచున్నది కదా! పూర్ణజ్ఞానుల దృష్టిలో బ్రహ్మము కంటే భిన్నంగా ఎక్కడా ఏదీ లేదు. స్వప్నంలో స్వప్న ద్రష్ట యొక్క చైతన్యమునకు భిన్నంగా ఏదైనా ఉన్నదా? 'ఊహ' అనునది స్వప్న చైతన్యము నుండి జనించిన స్ఫురణయే కదా! ఆ స్ఫురణయే ఆయా 'ఇల్లు – వీధి – గ్రామము – నగరం – మిత్రులు – సంఘటనలు' మొదలైనవాటి రూపంగా వర్తిస్తోంది కదా! ద్రష్ట యొక్క స్వస్వరూపమునకు అనన్యమైనట్టి జాగ్రత్ చైతన్య స్ఫురణయే జాగ్రత్ జగత్తు రూపంగా అనుభవమౌతోందని వారు గ్రహించియే ఉంటున్నారు. "నిర్మల జ్ఞాన దృష్టిచే జగత్ రూప అనుభవాలన్నీ స్వస్వరూప విస్తరణా చమత్కారం" అని, "అట్టి స్వస్వరూపం త్రికాలాలలో

వాస్తవానికి యథాతథం" ...అని వారు సర్వదా గ్రహించియే ఈ జగత్తులో మనందరి మధ్య బాహ్యానికి మామూలుగానే అనువర్తిస్తున్నారు.

ఇక అజ్ఞానుల దృష్టిచే బ్రహ్మము కంటే భిన్నంగా ఎచటైనా ... ఎపుడైనా ఏదైనా 'ప్రతీతి' ఉంటుంటే, అది కారణము యొక్క 'వికల్పన' కలిగి ఉంటోంది. "నా తమ్ముడైయుండి, అంతమాట అంటాడా? ఎవరు దీనికి కారణం?" .... అనే విషయం, ప్రశ్న, సమాధానం మొదలైనవి కారణరూప ప్రతీతిని కలిగియున్నప్పటికీ "సర్వమూ బ్రహ్మమే అయిఉండగా... ఈ 'తమ్ముడు' అనబడేవాడు ఎక్కడి నుండి వస్తాడు? ఎక్కడ ఉంటాడు?" ... అనే జ్ఞానదృష్టి కలవానికి, ఇక అంతా కూడా చిరునవ్వుకు మాత్రమే అర్హమౌతుంది కదా!

కాబట్టి సర్వప్రియ జనులారా! మీ యొక్క సమస్త జాగ్రత్ – స్వప్న జగదనుభవములన్నీ కూడా బ్రహ్మముతో సంయోగపరచటమే సంసారమును దాటివేయటానికి ఉపాయం. అంతేగాని, కార్య – కారణముల చర్చచే... ఇది ముడిపడేది కాదు. కాదూ... ఈ కారణ వ్యవహారమే పరిశీలించుచూ పోయినా... అది అజ్ఞాన సోపాన పరంపరయే అవుతుంది. అనగా ఎక్కడో అక్కడ "అజ్ఞానమే (లేక) కల్పనయే (కాక) ఆత్మజ్ఞాన రాహిత్యమే – ఇట్టి వ్యవహారానికి మూలం"... అని చర్చ ముగించక తప్పదు.

**నేఽహ ప్రవర్తతే కించిత్, న చ నామ నివర్తతే ॥**
**స్థితమ్ ఏకమ్ – అనాద్యంతం, బ్రహ్మైవ బ్రహ్మఖాత్మకమ్ ॥**
**కిం కస్య కారణం, కేన, కిమర్థం, భవతు క్వ వా ?**
**కిం కస్య కారణం, కేన, కిమర్థం, మాఽస్తువా క్వచిత్?**

ఓ రామచంద్రా! ఈ ప్రపంచము వాస్తవానికి కొంచెం కూడా ఉత్పన్నమవటం లేదు. నశించటమూ లేదు. పరబ్రహ్మమే సర్వదా "ఏకము – ఆద్యంతరహితము – చిదాకాశ రూపము" ...అయి ఉండి ఇట్లు ఈ జగత్ రూపంగాకూడా స్థితినొంది యున్నది. పరబ్రహ్మమునకు అన్యంగా ఇక్కడ గాని, మరొకచోట గాని... ఎక్కడా ఏదీ లేదు. ఎక్కడైతే పరమార్థంగా అంతా అకారణమే అయివున్నదో... ఇక 'కారణత్వం' అనేది కేవలం కల్పన మాత్రమే అయివున్నదో... అప్పుడిక ఏది ఎచ్చట ఎందుకొరకు దేనికి కారణం చెప్పు? ఏది ఎచ్చట ఎందుకొరకు దేనికి కారణం కాకూడదో చెప్పు? ఎందుకంటే కల్పితమైన "కార్యము యొక్క ఉత్పత్తి", "కార్యము యొక్క అనుత్పత్తి"... అనే రెండూ సమానములై, అవిరుద్ధములై ఉంటున్నాయి. ఉదాహరణకు "ఈ దేహం కనబడుతోంది. కాబట్టి ఈ జీవుడు ఫలానప్పుడు పుట్టాడు" అనునది సకారణరూపంగా అగుచున్నది. "ఈ దేహి దేహమును కదల్చుచున్నవాడై దేహానికి ముందే ఉన్నాడు. అట్టి దేహి పుట్టుకకు ముందే ఉన్నప్పుడు పుట్టటమెక్కడ?"... అనేదీ యుక్తియుక్తమే అవుతోంది.

బ్రహ్మమునందు జగత్తు శూన్యత్వముగా లేదు. అశూన్యత్వముగా లేదు. ఎందుకంటే అశూన్యత్వము అనేది 'శూన్యత్వము' అనే దృష్టిలోనుంచే వస్తోంది. 'శూన్యత్వము' అనేది అశూన్యత్వం

దృష్ట్యానే చర్చనీయాంశం అవుతోంది. అట్లే బ్రహ్మము నందు సత్తుగాని, అసత్తుగాని, సదసత్తుగాని లేదు (అందు ఉన్నది గాని, లేనిదిగాని, కొంత ఒకానొక దృష్టిచే ఉండి – కొంత లేక గాని లేదు). అట్టి "పదార్థరహిత + సహిత" చిదాకాశమునందు "ఇది అవును, అది కాదు"... అనునది కూడా ఏదీ లేదు.

ఓ రామచంద్రా! సమస్తమూ దృశ్యరూపంగా ఏదీ కాదు. అధిష్ఠాన రూపముచే సద్రూపమే! ఇది దృశ్యరూపంగా చూస్తే లేదు. అధిష్ఠాన రూపంగా ఇదంతా ఉన్నది. ఎందుకంటే అధ్యారోప దృష్టిచే బ్రహ్మమే ఇదంతా! అపవాద దృష్టిచే బ్రహ్మము ఆకారరహితం. వస్తురహితం. విషయరహితం.

ఉదాహరణకు, నీ చేతికి ధరించిన బంగారు కంకణం తీసుకుందాం. బంగారం అనే ఖనిజమే ఆ కంకణమంతా అయివున్నది కదా! కంకణంగా కనిపించేది బంగారమే కదా! బంగారం దృష్ట్యా ఆ కంకణం ఉన్నది. గుండ్రటి ఆకారం ఎక్కడున్నది? ఆ బంగారం కరిగిస్తే గొలుసుగా తయారయినప్పుడు ఆ ఆకారం ఏమైనది? ఆకారంగా కనిపించేదంతా బంగారమే! బంగారానికి ఆకారం లేదు. బంగారం లేకపోతే ఆకారమే లేదు. బంగారానికి ఏదో ఒక ఆకారం ఉంటూనే ఉంటుంది. కాని "ఇది మాత్రమే" అనబడే ఏ ఆకారమూ లేదు. "ఆత్మ జగత్ సహితం. జగత్ రహితం" అనునది బంగారము యొక్క "ఆకారం – ఆకారరాహిత్యం" వంటిదే!

❖❖❖

# 6. జగత్తు కార్య - కారణ రహితం

**శ్రీరామచంద్రుడు :** హే మహర్షీ! మీరు మా అజ్ఞానుల బోధ కొరకై 1.అధ్యారోపవాదం, 2. అపవాదం స్వీకరిస్తూనే వస్తున్నారు కదా!...

అధ్యారోపవాదం = ఈ జగత్తుగా బ్రహ్మమునందే ఉన్నది.

అపవాదం = జగత్తంగా కనిపించేదంతా బ్రహ్మమే!

ఈ విధంగా ఈ జగత్తూ ఉన్నదని, బ్రహ్మమూ ఉన్నదని చెప్పుతూ కూడా వస్తున్నారు కదా! మరిక ఈ క్రింది వాదములు ఎందుకు మన పరిగణనలోకి తీసుకొని ఒప్పుకోకూడదు?

**1. ప్రధాన వాదం -** ఆత్మయే అన్నిటికన్నా ప్రధానం. అద్దాని నుండి ఆకాశం, ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలం, జలము నుండి పృథ్వి జనిస్తున్నాయి. ఈ విధంగా అవన్నీ ఒకదానికి మరొకటి కారణం.

**2. పరమాణువాదం -** పరమాణువుల సంయోగ–వియోగం చేతనే జగత్తు యొక్క నిర్మాణం, వినాశనం జరుగుచున్నాయి. కనుక జగత్తుకు ప్రళయ – మహాప్రళయాలు ఉన్నాయి. జగత్తుకు కారణం పరమాణువులగుచున్నాయి.

ఈ ప్రపంచంలో అనేక పదార్థములున్నాయి. అవన్నీ పంచభూత నిర్మితములు. ఆయా వివిధ పదార్థములు రకరకాల కలయికలచే రకరకాల వేర్వేరు ధర్మములు, గుణములు ఏర్పడు

చున్నాయి. ఉదాహరణకు మద్యము సేవించినవాడు 'మత్తు' అనే ఒక వేరైన గుణములు పొందుచున్నాడు. సాత్వికమైన ఆహారం సేవించటం చేత మరొకడు సాత్విక గుణములు కలిగివుంటున్నాడు.

ఇదంతా ఈ జగత్తులో ఇట్లా ఒక్కొక్క పదార్థం మరొకదానికి కారణమగుచూ ఉండటం మనం ప్రతిరోజు ప్రతి సందర్భంలోనూ చూస్తూనే ఉన్నాం. ఈ విధంగా ఈ జగత్తులో ప్రతిదానికి ఒక కారణం ఉండనే ఉంటోంది. ఏదీ కూడా, కారణరహితమైనది ఈ జగత్తులో ఎక్కడా కనిపించదు. మరి "సృష్ట్యాదిలో జగత్తుకు కారణమే లేదు. కనుక జగత్తు మొదలేలేదు. జగత్తుగా కనిపించేది బ్రహ్మమే!" – ఇట్టి "అద్వితీయ బ్రహ్మమాత్ర శేష్య సిద్ధాంతం" ఎట్లా ఒనగూడుతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (పకపకా నవ్వి) "ఈ జగత్తు కార్యకారణాలు కలిగి ఉన్నది"... అని చెప్పటానికి "మా అజ్ఞానుల బోధ కొరకై..." అని నీవు మొదలే సమాధాన రూపంలో ఒప్పుకున్నావు. అందుకే నాకు ఇంత నవ్వు వచ్చింది. "మొట్టమొదట పరమాత్మయే ఉన్నాడు. అయితే, అజ్ఞానుల కొరకై బ్రహ్మదేవుడు ఈ కార్యకారణ వ్యవస్థతో కూడిన జగత్తును సృష్టించాడు" ... అని కొందరు గురువులు తమ శిష్యులకు బోధించు సిద్ధాంతాలు ప్రాచుర్యంలో ఉన్నమాట నిజమే! ఎందుకంటే..."ఈ జగత్తులో కనిపించే కార్యకారణ వ్యవస్థ ఎవడో మానవుడు కల్పించింది కాదు కదా! ఈ జగత్తులో ఎవరు ఈ కార్యకారణ వ్యవస్థ కల్పించారో... వారు ఎందుకు కల్పించారు?"... అనే ప్రశ్నకు సమాధానంగా ఆయా గురువులు "అజ్ఞానుల కొరకై"... అని సమాధానం చెప్పుచున్నారు.

అయితే "ఈ అజ్ఞానులు అనబడేవారు ఎక్కడి నుండి వచ్చారు?"...అని అప్పుడు మరొక ప్రశ్న బయలుదేరుతుంది. సృష్టికి ముందే 'అజ్ఞానులు' అని, 'జ్ఞానులు' అని రెండు తెగలవారు న్నారా? అజ్ఞానులు ఎక్కడి నుండి వచ్చారు? జ్ఞానులు ఎక్కడి నుండి వచ్చారు? అందుకే ఈ మన చర్చనీయాంశానికి సమాధానంగా వేదాంత సార శాస్త్రజ్ఞులు మొట్టమొదటగా సర్వమత సిద్ధాంతా లను రెండు విధాలుగా విభజిస్తున్నారు.

| I | II |
|---|---|
| మొట్టమొదట పరమాత్మయే ఉన్నారు. ఆయన అటుతరువాత ఈ జగత్తును సృష్టించారు? ఆతడే కార్య కారణాల రచయిత! ఎందుకు....? అజ్ఞానుల కొరకు! | పరమాత్మ అనబడేవాడెవడూ లేదు ఇక ఈ కార్య–కారణాలు స్వభావసిద్ధం. పరమాత్మ ఉంటే కనబడాలిగా? ఇదంతా స్వభావమే గాని ఎవరి అధీనం కాదు. |

మొదటి సిద్ధాంతముల వ్యవస్థలో మొట్టమొదట జగత్తు లేదని, అజ్ఞానుల కొరకై పరమాత్మ ఇది రచించారని చెప్పబడుతోంది. అంటే జగత్తు లేనప్పుడు అజ్ఞానులు ఉన్నారని చెప్పటమే ఇక్కడ కనబడుతోంది కదా!

ఇక రెండవ సిద్ధాంతాన్ని అనుసరించి, ఈ జగత్తుకు రచయిత అంటూ లేడని, ఇక్కడి కార్యకారణ వ్యవస్థ దానంతటదే జనించి కొనసాగుతోందని చెప్పబడుతోంది. ఇప్పుడు సర్వ ప్రమాణములగు వేదములలోని మహావాక్యములు ప్రమాణంగా తీసుకొని చెప్పుకుందాం.

సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ॥ నేఽ హనానాస్తి కించన॥ సోఽ హమ్॥ అయమాత్మా బ్రహ్మ॥ తత్త్వమసి॥ బ్రహ్మమేవ ఇదమగ్ర ఆసీత్॥ జీవో బ్రహ్మేతి నా పరః॥ ...మొదలైన వేదసారమగు (వేదములకు తలమానికం వంటి ఉపనిషత్తుల) మహా వాక్యములుగాని, (మత్తః పరతరమ్ నా–న్యత్ కించిదస్తి, త్వమేవాహమ్) ఆప్త మహావాక్యములు గాని... మనం ప్రమాణంగా తీసుకొని పరిశీలిస్తే... ఈ సృష్టికి పూర్వం పరబ్రహ్మమే (లేక, పరమాత్మయే) కలదు... అని చెప్పబడుచున్నట్లే అవుతోంది కదా! అట్టి శ్రుతి వాక్యములను అనుసరించి సృష్టి యొక్క 'ఆది' యందు అజ్ఞానియే లేడు. ఇక "అజ్ఞాని కొరకు ఈ కార్య–కారణ రూప జగత్తును సృష్టించడం"... అనే వ్యవహారం ఎక్కడ నుండి వస్తోంది? కాబట్టి రామచంద్రా! నీవు చెప్పిన అధ్యారోపవాదం – అపవాదం మొదలైనవన్నీ బ్రహ్మమును బోధించటానికి కల్పించబడ్డాయేగాని... "బ్రహ్మము జగత్తుకు కారణం"... అని అంతిమంగా సిద్ధాంతీకరించటానికి కాదు. ఇక ఇక్కడ కనబడే పరమాణు కార్య కారణత్వం దృష్టి యొక్క పరిమితత్వపు స్థితికి ఉపాహారాలు అవుతున్నాయి. అద్వైత బోధమయులు – శాంత విజ్ఞాన ఘనరూపులు అగు జ్ఞానుల దృష్టి – ఈ కనబడే పదార్థ ధర్మాలను జీవుల పరస్పర సంబంధ బాంధవ్యాలను దాటివేసి ఉంటోంది. అందుచేత వారి పరిశీలనలో ఇవి అల్పవివరాలే అవుతున్నాయి గాని... సిద్ధాంతపరమైన ఆవశ్యకతకు అర్హమగుట లేదు. వారికి ఈ పరమాణు – వస్తు ధర్మాలకు సంబంధించిన కార్య–కారణములకు బ్రహ్మమునకు అభేదమే ప్రస్ఫుటం అవుతోంది. ఎవరి దృష్టిలో ఏది విశేషమైన విషయమో... అదియే వారికి ఇక్కడ విషయమైన రూపంగా కనిపిస్తుంది సుమా! ఒక రూపమైన "నిద్ర"కు స్వప్న – సుషుప్తులు రెండు అవయవముల వంటివి కదా! ఆ రెండింటి యొక్క రూపం నిద్రయే కదా! అంతేగాని, "స్వప్నం నిద్ర కాదు. ఏవో దృశ్యాలు"... అని ఎవరూ అనలేరు కదా! నిద్రయే స్వప్న సుషుప్తుల రూపంలో ఉంటున్నట్లు, బోధమయము – అధిష్ఠాన రూపము అగు పరబ్రహ్మము నందే జ్ఞాన – అజ్ఞానములు రెండూ వెలయుచున్నాయి. అనగా... అజ్ఞత్వమునకు 'నేను అజ్ఞానిని' అనే అనుభవం అద్దానియొక్క అంగమై భాసిస్తోంది. కాబట్టి అజ్ఞానము కూడా పరబ్రహ్మము కంటే వేరు కాదు. అజ్ఞానము – అజ్ఞాన దృష్టి – అజ్ఞాన దృష్టికి కనిపించే సమస్త జగత్తు – అధిష్ఠాన బ్రహ్మము... ఇట్లా ఇదంతా అజ్ఞానుల యొక్క బోధనార్థం వారి బుద్ధిని అనుసరించి శుద్ధ బ్రహ్మమును బోధించే నిమిత్తం మాత్రమే చెప్పబడటం జరుగుతోంది. అంతేగాని... బ్రహ్మము స్వరూపతః నిత్య – శుద్ధ – నిర్వికార – పరమానంద సత్యమే అయివున్నది. అయివుండబోతోంది కూడా!

ఇక ఈ జగత్పదార్థాలకు వద్దాం. ఇవన్నీ కూడా (ఈ కనబడే దృశ్యమంతా కూడా) కల్పనానుసారంగా కారణ రహితములు – కారణ సహితములు కూడా అయివున్నాయి. ఉదాహరణకు... "అగ్నిచే కాల్చబడటంచేత ద్రవం వాయువుగా మారగలదు" అని ద్రవం

వాయువుగా మారటానికి కారణం మనం చెప్పుకోవచ్చు. "అగ్నికి వస్తువులను దహించే శక్తి ఎక్కడి నుండి వచ్చింది?" ...అని ప్రశ్నిస్తేనో?... సమాధానమేమున్నది? ఈ ధర్మము ఏర్పడటానికి కారణం ఎవరు చెప్పగలరు? ఒకవేళ "ప్రకృతియే ఇదంతా నిర్వర్తిస్తోంది"... అని అంటే... ప్రకృతి ఎందుకు ఎవరి ఆజ్ఞకు లోబడి ఇట్లు ఈ ఈ ధర్మాలన్నీ కలిగి ఉంటోంది?... ఈ విధంగా ఈ సర్వం అకారణం. అయితే, ప్రతిదీ ఇట్లు ఉండటానికి ఏదో కారణం చెప్పవచ్చు కూడా! ఈ విధంగా సకారణంగాగాని, అకారణంగా గాని కల్పనను అనుసరించే ఈ జగత్తు ఉంటోంది. ఎందుకంటే ఈ బుద్ధిరూప సంవిత్తు ఎట్లు కల్పనచేస్తే... దానిని అట్లే నిజానుభవంగా పొందగలదు. ఒక జీవుని బుద్ధిరూప సంవిత్తు... "ఇదంతా నా ఇష్టదైవం యొక్క స్వరూపమే"... అని భావన చేస్తే, అంతాకూడా అట్లే అనుభూతవిషయమై గోచరిస్తుంది. అందుచేతనే అజ్ఞానులకు ఇదంతా స్వకీయ భావనానుసారంగా అన్యంగా అనుభూతమౌతుంటే అట్టి భావనను అనుసరించని (ఆత్మసాక్షాత్కారం పొందిన) ఆత్మజ్ఞులకు ఇదంతా స్వస్వరూపమునకు అనన్యంగా అనుభూతమౌతోంది. "దృష్టియే సృష్టి. ద్రష్ట దృష్టికి కేవల సాక్షి – అతీతుడు కూడా!"... అని గమనించి, వారు సర్వదా సాపేక్షత్వము నుండి కేవలత్వం వైపుగా అడుగులు వేస్తున్నారు.

ఓ రామచంద్రా! అవిద్యయే ఈ సమస్త జగత్తుకు కారణభూతమై ఉన్నది. అట్టి అవిద్య జ్ఞానాభ్యాసముచే నశించినప్పుడు... అట్టి అనుభవశీలురగు తత్త్వవేత్తల దృష్టిలో 'సృష్టి' అనే దానికి కారణమంటూ ఏదీ లేకుండానే పోతోంది. కాబట్టి వాస్తవానికి ఈ సృష్టి కారణరహితమై ఉన్నది.

**శ్రీరాముడు :** మహర్షీ! మహాత్మా! "ఈ జగత్తు అకారణం. అందుచేత వాస్తవానికి లేదు. భావనానుసారమే అనుభూతమౌతోంది. ఆత్మజ్ఞానము అనుభూతమొనర్చుకొన్న వారి దృష్టిలో ఇదంతా ఆత్మకు అనన్యం. ఆత్మకు వేరైనదిగా ఉండటానికి కారణమేలేదు. కాబట్టి ఇది స్వతహాగా లేదు. కల్పనచే అనుభూతమౌతోంది."... అనునది అప్రతిహతమైన, అత్యంత యుక్తియుక్తమైన మహావాక్యసారమే! ఇట్టి మహత్తరమైన 'గుర్తు'ను ప్రసాదిస్తున్న ఋషీశ్వరులగు మీకు సాష్టాంగ దండ ప్రణామములు. వేర్వేరు జీవులు వేర్వేరు అనుభవములు ఒకే విషయం గురించి కలిగి ఉండటం, ఒకే వ్యక్తి వివిధ సందర్భములలో వివిధ రీతులుగా ఈ జగత్ దృశ్య సంఘటనాదులు చూస్తూ ఉండటం "లోక విదితాయ విషయః" కదా!

ఇవన్నీ యుక్తి యుక్తమని నేను ఒప్పుకుంటున్నాను. అయితే...("సృష్టికర్త స ఈశ్వరః" "ప్రత్యేకం తమ్ ఈశ్వరమ్" "మాయాంతు ప్రకృతిం విద్ధి. మాయినంతు మహేశ్వరః" ఇత్యాది వేద పురాణ ఇతిహాస వాక్యాలచే) ఈ మాయోపహిత బ్రహ్మం కంటే వేరుగా తటస్థేశ్వరుడు ఒకరున్నారని, కొందరు అభిప్రాయం ప్రకటిస్తున్నారు. "ఈశ్వరుడు ప్రధానుడు. ఇది అప్రధానం" అని వారు అంటున్నారనుకోండి. మరికొందరు గురువులు "ఇది పరమాణువుల ప్రయోగంగా ప్రత్యక్షంగా కనిపిస్తోంది. కాబట్టి ఈ జగత్తు లేకుండా ఎందుకు పోతుంది?" .... అని ప్రశ్నిస్తూ తమ శిష్యులకు ప్రబోధిస్తున్నారు. మరి ఈ జగత్ – శరీరాలు లేవని నిర్ణయించటమెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "సంకల్పానుసారమే జగదనుభవం ఉంటోంది కాబట్టి, జగత్తుకు మూలం సంకల్పమే" అనునది విద్వజ్జుల ప్రత్యక్ష – శ్రుతి – స్వానుభవసారమై ఉన్నది. ఈ జగత్తు ఎట్లా నిర్మించబడినా, ఎవరు నిర్మించినా... ద్రష్ట మాత్రం తన దృష్టి ననుసరించి, దృష్టిలోంచి చూస్తున్నాడు కదా! ద్రష్ట సర్వ దృశ్యమునకు వేరై (స్వప్నద్రష్ట స్వప్నం కంటే వేరు అయినట్లుగా) లేడని, "కేవల తటస్థ – ప్రత్యేక రూపుడు కాదని ఎవరైనా నిరూపించగలరా? తత్త్వజ్ఞులకు "ఈ సృష్టి ఉన్నది. దీనికి ఎవరో కారణమైయున్నది" ...ఇటువంటి వాక్యాలు అజ్ఞుల బోధ వాక్యాలవలె, ఆత్యంతికమైన సత్యము కావు అని సుస్పష్టంగా తెలియవచ్చుచున్నది.

అందుచేత రామచంద్రా! "ప్రకృతి వేరు – పురుషుడు వేరు, ద్రష్ట వేరు – దృశ్యము వేరు. ఈశ్వరుడు వేరు – జీవుడు వేరు"... ఇటువంటి మాటలన్నీ జ్ఞానము యొక్క పరాకాష్ఠ సమక్షంలో "వ్యర్థవాగ్జాలమేవతత్" ...వ్యర్థ వాక్ ప్రవాహమేనని మేం అనుభవపూర్వకంగా ప్రకటన చేస్తున్నాం. అది తత్త్వజ్ఞుల హృదయానుకూలం కాదయ్యా! ఏ దృశ్యం ఘనీభూతంగా కనిపిస్తోందో.... అదంతా కూడా స్వప్నము వంటి కల్పన మాత్రమే. బాల్యంలో చూచిన గ్రామము – సహబాలుర ఆకారాలు ఒక తాతగారికి జ్ఞాపకముండవచ్చు గాక! అవి నిత్య సత్యమగుచున్నాయా? కనుక ఈ ప్రదర్శన మయ్యేదంతా స్వప్నము వంటి కల్పన మాత్రమే. అంతేగాని... ఇక్కడ స్థూలాకారమైన దృశ్య కల్పన ఏదీ లేదు. అట్టిదాని కొరకై కారణ కల్పన యొక్క అవకాశమే లేదు. అయినా రామా! "స్వప్నంలో ఆ గోడ కనిపించింది కదా! దానిని ఎవరు కట్టి ఉంటారు?"... అని మెలకువ వచ్చిన తరువాత ఎవరైనా తర్క–వితర్కములు చేస్తున్నారా? ఎందుచేత చేయటం లేదు? "స్వప్నంలో నాకు కనిపించిన ఆ భవనం నా ఊహాకల్పితమే కదా!"... అని జాగ్రత్ సమయంలో ఎరిగి ఉండటం చేత. అట్లాగే ఆత్మజ్ఞానం పరిపుష్టి పొందనంతవరకు గురువులు శిష్యులకు అనేక కథనముల కల్పన చెప్పవలసి వస్తోంది. స్వప్నంలో కనిపించిన అరణ్యాలు, గృహాలు, ఆరామాలు, వ్యక్తులు – ఇవన్నీ చిత్‌స్వభావం కంటే వేరు కాదు కదా! ద్రష్ట యొక్క నిర్మల చిత్స్వభావం కంటే వేరైతే... అప్పుడు "ఆ స్వప్న పదార్థాలు ఎట్టివో, ఎవరిచే కల్పించబడినవో, ఎందుకు కల్పించబడినవో"... ఈ ప్రశ్నలన్నీ వస్తాయి. అయితే స్వప్న పదార్థాలు "మిథ్యారూపమే కదా" అని తెలియబడనంత వరకు అవన్నీ మహామోహాన్ని కలుగజేస్తున్నాయి. "మిథ్యా రూపమే!"అని ఎరుగబడిన తరువాత ఇక దుఃఖం ఉండదు. దుఃఖాన్ని అధిగమించటానికి ఇంతకు మించి ఉత్తమమైన ఉపాయం మాకు ఇంకేమీ కనబడటం లేదు.

**శుష్కతర్క హఠావేశాత్ యద్వాపి అనుభవవోజ్ఝితమ్ ।**
**కల్ప్యతే కారణం కించిత్సా మౌర్ఖ్యాభినివేశితా ॥**

"స్వప్న దృష్టాంతం మేం ఒప్పుకోం. అయినా, స్వప్నం సంకల్పమయమే కావచ్చు గాక! స్పష్టంగా కనబడే ఈ జాగ్రత్ భ్రమ ఎట్లా అవుతుందిట? కాబట్టి ఈ సృష్టికి కర్త ఉన్నాడు. ద్రష్ట ప్రమేయం ఏమీ లేదు"... అందుచేత జగదనుభవానికి సంబంధించి ద్రష్ట సంకల్పిత దృష్టిని మేము పరిశీలించం – అని ఎవరైనా అంటారా? ...శుష్కతర్కమును గూర్చిన హఠము యొక్క ఆవేశంతో స్వప్నము, ఊహ, భావన మొదలైన మూలానుభవమును ఒప్పుకోక, "ఈ జగత్తు ఒకాయన

కల్పించారు! పరమాణువుల సంయోగమే దీనికి కారణం. కాబట్టి ఇదంతా సకారణయుతమే గానీ, అకారణము కాదు"...అని అనటం మా ఉద్దేశంలో మూర్ఖత్వంతో కూడిన పట్టుదలలే అవుతుంది.

ఒకవేళ ఏదైనా "కారణం ఏదో ఉండాలి, చెప్పండి" అని అంటే... అగ్నికి ఉష్ణత్వం కారణమైనట్లు, జలమునకు ద్రవత్వం కారణమైనట్లు, సమస్త తేజస్సులకు ప్రకాశము కారణమైనట్లు...సర్వ పదార్థములకు కూడా, అజ్ఞానోపహితమగు 'బ్రహ్మము' యొక్క 'స్వభావం' తప్ప మరింకేమి కారణం కాగలదు?

మనోరథ కల్పన (ఊహా కల్పన)లో పురాణ కథ పాత్రలు పురాణోపాసకునికి కనిపిస్తాయి చూచావా? అట్లాగే ధ్యాత కల్పనా భేదం చేతనే ధ్యేయము అగు ఈ జగత్తు ఆకార భేదం సంభవిస్తోంది. మరప్పుడు ఈ జగత్తుకంతటికీ ఏదో ఒకటే కారణమని చెప్పటం ఎట్లా కుదురుతుంది? కుదరదు. అనేక ధ్యాతల అనేక ధ్యేయములకు ఒకే కారణం ఎట్లా ఉంటుంది? ఇంకా చెప్పాలంటే... గంధర్వ నగరంలో (మనోకల్పిత లోకం గంధర్వలోకం) కనబడే మేడకు కారణం ఏది ఉంటుంది?

ఇప్పుడు కొందరి సిద్ధాంతాలను మన చర్చ – అవగాహనల కొరకై ఇక్కడ ప్రస్తావించుదాం.

**కర్మమీమాంసకులు :** వీరు "ఈ దేహం రావటానికి పూర్వకర్మలే కారణం" ...అని ఈ దేహానికి కారణం చెప్పుచున్నారు. అట్టి కర్మమీమాంసకుల యొక్క కర్మలు, కర్మఫలాలు, తద్ద్వారా ఈ శరీరం" ...అను శాస్త్ర కల్పన సంపూర్ణమైనది కాదు. ఎందుకంటావా? పరలోకమందలి ధర్మ – అధర్మములు అమూర్తములు (నిరాకారాలు) కదా! మరి ఈ దేహాదులేమో... సాకారములయ్యే! అమూర్తములగు ఇతఃపూర్వపు ధర్మాధర్మములు ఈ దేహాదులకు ఉపాదాన కారణం కావటం ఎట్లా కుదురుతుంది? దేహమునకే అవి కారణం కానప్పుడు... ఇక సువిశాలాకారయుక్తమైన సృష్టి – దృశ్యములకు కారణమెట్లా అవుతుంది? కనుక "ఈ సృష్టికి జీవుల పూర్వపూర్వ కర్మలే కారణం"... అని అనటం యుక్తియుక్తంగా లేదు. కనుక "కర్మలు, కర్మఫలాలు" అను కర్మమీమాంసకుల సిద్ధాంతం ఈ దృశ్యం/ జగత్తు యొక్క ఉత్పత్తి – ఉనికిల గురించి సమగ్రంగా నిర్వచించటం లేదని మేము భావిస్తున్నాం.

**క్షణికవాదులు :** (వీరు విజ్ఞానవాదులలో ఒక తెగవారు). వీరు మరొక తీరైన అవగాహన ప్రతిపాదిస్తున్న వారు. "ఈ జగత్తులో ప్రతిదీ ఇతఃపూర్వం ఒక తీరుగా ఉన్నది. ఇప్పుడు ఇట్లా ఉన్నది. ముందు ముందు మరొక తీరుగా ఉండబోతోంది. మహాప్రవాహం ఒకసారి ఒక క్షణంలో ఒక ఆకారాదులతో కనిపించి, మరుక్షణం మరొక ఆకారం పొందుచున్నట్లే ఈ జగత్తులో ప్రతిది క్షణికం. క్షణికం కానిదంటూ ఏదీ లేదు. జీవులు, వీరి మనోభావాలు ఎప్పటికప్పుడు మార్పు చేర్పులు పొందుతూనే పోతూవుంటాయి. కనుక జగత్తు క్షణికం."

వారి దృష్టిలో ఈ జగత్తు నిరాకారం, క్షణికం. ఇక్కడ సర్వము సర్వదా నశించటం, పునరుత్పత్తి పొందటం అనంతకాలంగా ఇట్లే జరుగుతూ పోతోందని వారి అభిప్రాయం. అయితే ఇది ఇట్లు కొనసాగటానికి ఉపాదాన కారణం ఏది? అది వారి సిద్ధాంతము చర్చించటం లేదు. కనుక క్షణికవాదుల జగత్ నిర్వచనం అసమగ్రమైనదే అగుచున్నది.

**చార్వాకులు :** వీరు... అంతా తనంతట తానే జరుగుతోందని, దీనికి వెనుక 'పరమాత్మ' అనబడే వారెవరూ లేరని చెప్పుచున్నారు. "వానకురిస్తే వస్త్రం తడుస్తోంది. విత్తనం మొలకెత్తే స్వభావం కలిగియున్నది. ఆయా వస్తువులు వస్తు స్వభావం కలిగియున్నాయి" అని వారు ప్రతిపాదిస్తున్నారు. ఇది ఈ దృశ్య నిర్వచనమునకు సరిపోదు. ఎందుకంటే...

బీజము స్వభావం = అనగా = బీజము యొక్క స్వభావం

ఇట్లా పదప్రయోగం చేయటంలోనే... షష్ఠీ తత్పురుష అగు "యొక్క" అనే పద ప్రయోగం చేస్తున్నారు కదా! వస్తువు వేరు – స్వభావం వేరని, వస్తువు స్వభావం కంటే ఉన్నతమైనదని చెప్పినట్లే కదా! "కాబట్టి స్వభావమే జగత్తుకు కారణం ఆ స్వభావం ఎవ్వరిదీ కాదు"... అనే నిర్వచనం జగత్తును అర్థం చేసుకోవటానికి సరిపోదు.

❖

కాబట్టి రామచంద్రా! ఈ సమస్త పదార్థములు, వాటి వాటికి మూలమైనట్టి పంచభూతములు ...ఇవన్నీ కారణరహితం. అయితే, అజ్ఞానదృష్టిచేత (లేక పరిమితమైన పరిశీలనచేత) కారణ సహితమైన వాటివలె భ్రాంతిచే భాసిస్తున్నాయి. జ్ఞాని దృష్టియందో... సర్వకార్యములు చిద్రూపములే అయివున్నాయి. ఎందుకంటే సర్వ పదార్థములు, ఆ పదార్థములను విషయములుగా గలిగియున్నట్టి సర్వభావాలు... అన్నీ కూడా చైతన్యమునందే, చైతన్య చమత్కారం చేత చైతన్యమునకు అనన్యంగా ఆవిర్భవించి తిరిగి చైతన్యమునందే తిరోభావం చెందుచున్నాయి. స్వప్నంలో కనిపించిన దొంగలు స్వప్నంలో చేసిన హంగామా, స్వప్నంలో బాధించటం–బాదటం–భయపెట్టటం మొదలైనవి స్వప్న సమయంలో బాధిస్తాయేమో గాని, మెలకువ రాగానే? అవి దుఃఖ కారణాలు కాదు కదా! జన్మ మృత్యువుల మధ్యగల దేహము యొక్క శబ్ద–స్పర్శ – రూప – రస – గంధ మాత్రములే అయినట్టి ముల్లోక విశేషాలు ద్రష్టయొక్క వాస్తవ చిద్రూపము ఎరిగినప్పుడు ఏ మాత్రం ఖేద–మోదాలు కలిగించవు. వాస్తవానికి ఈ దృశ్యము సృష్ట్యాదియందే ఉత్పన్నమై ఉండలేదు. చిదాకాశమే స్వప్నంలోలాగా ఇట్లు పదార్థ రూపంగా కూడా భాసిస్తోంది. చిదాకాశము కంటే వేరుగా ఇక్కడ ఏదీ ఏ సమయమందుకూడా లేనేలేదు.

ఇట్టి " చిదాకాశ జగత్ న్యాయం" కంటే వేరుగా మరొక కల్పనాయుక్తి ఏదీ ఇక్కడ కనబడటం లేదు. కాబట్టి, జగత్ కల్పన బ్రహ్మానుభవమాత్రమే అయివున్నది. అదియే బ్రహ్మీదృష్టి, బ్రహ్మానందం, ఆత్మసాక్షాత్కారం, మోక్షము మొదలైన శబ్దములచే ఉద్దేశించబడుతోంది. "ఈ జగత్తంతా బ్రహ్మ స్వరూపమే"... అనే వాక్యం మాకు (తత్త్వజ్ఞులకు) వేద–వేదాంత మహావాక్యార్థంగాను, స్వానుభవం గాను ఉభయత్రా సుస్పష్టమవుతోందని సర్వలోకులకు ఎలుగెత్తి గానం చేస్తున్నాం.

శుద్ధ జలంలో తరంగాలు – ఆవృత్తములు సాకారంగా కనిపిస్తున్నట్లు మాకు బ్రహ్మమునందు ఈ జాగ్రత్–స్వప్న జగత్తులన్నీ నిర్దుష్టంగా, సుస్పష్టంగా కనిపిస్తున్నాయి. బ్రహ్మమునందు బ్రహ్మరూపంగా ఈ సృష్టి భాసిస్తోంది. బ్రహ్మము, సృష్టి... ఈ రెండూ పర్యాయపదాలే!

నిర్మల వాయువునందు వాయుతరంగాలు, ఆవర్త - వివర్తాదులవలె (అవన్నీ వాయువే ఆయా తత్త్వములుగా అయివున్నట్లు)... 'బ్రహ్మము' అనే వాయువు నందు ఈ "సృష్టి" అనే "స్పందము" ప్రకటితమౌతోంది.

మహాకాశమునందు... 1.అనంతత్వము, 2.ఛిద్రత్వము, 3.శూన్యత్వము... ఈ మూడు ఎట్లా ప్రదర్శితమగుచున్నాయో... అట్లాగే సద్రూపమగు చిదాకాశమున బోధాత్మకమై పరాపర రూపంగా "అనంతము - ఛిద్రత్వము - శూన్యము" అగు ఈ జగత్తు వర్తించుచున్నది. స్వప్నంలోను, ఊహ (సంకల్పం)లోను ఎట్లాగైతే అసన్మయమైన పదార్థాలు చిద్రూపములుగా (స్పష్టంగా తెలియవచ్చే ఉనికి గల పదార్థాలుగా) స్పష్టంగా ఎరుగబడుచున్నాయో... అట్లాగే ఈ జాగ్రత్‌లో ఇవన్నీ తెలియ వస్తున్నాయి. ఇవన్నీ కూడా సత్‌చిత్ రూపమగు పరబ్రహ్మము కంటే ఏమాత్రం వేరుకాదు.

శుద్ధమైన గాఢనిద్ర యందు -స్వప్నము, సుషుప్తి ఎట్లా వర్తిస్తున్నాయో... అదేవిధంగా ఆత్మరూపమగు పరబ్రహ్మమందు - సృష్టి, ప్రళయములు ...వర్తిస్తున్నాయి.

ఒకడు నిద్రలో ఒక స్వప్నము నుండి... అనేక స్వప్నాంతరములు పొందుచున్నాడు చూచావా? అట్లా జన్మాదులు కించిత్ కూడా లేనట్టి పరమాత్మయే స్వసత్తయందు ఒక సృష్టి, ఆ సృష్టికి అన్యములగు అనేక సృష్టులు పొందుచూ... ఆయా సర్వ సృష్టి రూపములుగా వర్తిస్తున్నాడు.

నిర్వికారమగు బ్రహ్మాకారంలో వాస్తవానికి పృథివి మొదలైన ఆయా వస్తుజాలమంతా లేనే లేదు. కానీ... 'స్వప్నానుభవం'గా ఈ ఈ పృథివి మొదలైన వాటితో కూడినదై, (స్వప్నములోలాగా) పొందుచున్నది.

ఈ కనబడే సృష్టి పరమాత్మయందు పరమాత్మకు అనన్యమైయున్నది. అట్లాగే ఇతఃపూర్వపు సృష్టులు, ఇక ముందు ముందు సృష్టులు పరమాత్మ రూపములే! ఆ పరమాత్మకు అభిన్నం! కాబట్టి రామా!... సృష్టి, బ్రహ్మం...ఈ రెండు శబ్దాలు ఒకటి మరొకటికి అర్థముగా అయి ఉన్నాయి.

ఇక "బ్రహ్మమునందు సృష్టి"... అనే మాట ఎక్కడిది? అది కల్పిత కథా శ్రవణం కాక మరి ఇంకేమిటి? సమస్త శబ్దాలు, ఆ శబ్దాలకు అర్థాలైన దృశ్యాంతర్గత విశేషాలూ... బ్రహ్మమే! అంతా బ్రహ్మమే (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ) అయివుండగా ఇక శాస్త్రాలు శాసించేదెక్కడ? దేనిని? వేరుగా "మోక్షఫలం" అనేదెక్కడ? అప్పుడిక "ప్రాపంచిక బంధములు" ఎక్కడుంటాయి? శాస్త్రములు, అందలి కథా విచారములచే ప్రయోజనం ఏముంటుంది? (శాస్త్రానపి సంత్యజ్యతి)

**వాసనా రహితమగు "దృష్టి"యే మోక్షం -** అట్టి మనుజునకు ఈ జగత్తులో సిద్ధించవలసిన దేముంటుంది? భావాతీతమైన స్థితిలో సృష్టులే లేవు. ఈ ప్రపంచంగా కనిపించేదంతా భావాతీత చిదాకాశతత్త్వమే!

ఓ రామచంద్రా! ప్రపంచం పట్ల కలిగి ఉన్న వాసనలే స్వప్నంలో నగరాలు, తదితర దృశ్యాలుగా భాసిస్తున్నాయి కదా! అట్లాగే జగత్తులో జగత్తుగా కనిపించేదంతా ద్రష్ట యొక్క దృశ్య వాసనారూపమే!

వాసనల చేతనే బోధసత్తా స్వరూపమగు దృశ్యము పరిపరి విధములుగా అనుభూతమౌతోంది. వాసనలు లేకపోయినప్పుడు ఇదంతా కూడా చిత్ సత్తా స్వరూపమగు స్వస్వరూపాత్మయే!

❖❖❖

# 7. ఐందవోపాఖ్యాన బ్రహ్మగీత సప్రతిఘ - అప్రతిఘాన్యాయం

**శ్రీరాముడు :** మహర్షీ! నాకు ఈ సందర్భంలో "సప్రతిఘ - అప్రతిఘ" అనే ఇతఃపూర్వం నేను వినియున్న ఒకానొక విశేషం గురించి అడగాలని అనిపిస్తోంది.

హే మహాత్మా! ఈ మూడు లోకాలలోని విశేషాలన్నీ క్రోడీకరించి రెండు విభాగాలుగా విభజించవచ్చు- 1.మూర్తములు (లేక) సాకారములు (సప్రతిఘములు). 2. అమూర్తములు (లేక) నిరాకారములు (అప్రతిఘములు). వీటిలో కొన్ని ఒక దానిని మరొకటి తాకుచున్నాయి. అనగా అవి ఒకదానితో మరొకటి కూడి ఉంటున్నాయి. ఇక మరికొన్నియో... ఒకదానితో మరొకటి కూడి ఉండటమే లేదు.

ఏదైతే మరొక దానిని చలింపజేస్తోందో... అవి సప్రతిఘములని, ఏది మరొక దానిని స్పృశించటం గాని - చలింపజేయటం గాని చేయటం లేదో... అవి అప్రతిఘములని చెప్ప బడుచున్నాయి. ఈ ప్రపంచంలో సప్రతిఘ పదార్థములగు భౌతిక పదార్థములు పరస్పరం కూడి ఉండటం, చలింపజేయటం చూస్తున్నాం. అప్రతిఘములైనవి (నిరాకారాలైనవి) సాకారాలను చలింపజేయటం గాని, సాకారములతో కూడి ఉండటంగాని జరగటం లేదు. ఉదాహరణకు ... అగ్ని గడ్డిపరకను తగలబెట్టగలదు గాని, ఆకాశమును తగలబెట్టలేదు కదా! ఈ పాత్రను చేత్తో అక్కడ పెట్టవచ్చు గాని... ఒక ఆలోచనతో ఈ పాత్ర అక్కడికి వెళ్ళదు కదా!

స్వామీ! ఇక క్రమంగా నా అసలు సందేహమేమిటో చెప్పటం ప్రారంభిస్తున్నాను... వినండి. ప్రతి జీవునిలోను "సంవేదం" అని చెప్పబడే అనుభవరూపమైన (లేక) వృత్తిరూపమైన జ్ఞానం ఉన్నది. అట్టి వృత్తి జ్ఞానంతో ఒకడు ఆకాశంలో చంద్రబింబాన్ని ఇక్కడి నుండి చూస్తున్నప్పుడు... నేత్రజ్యోతిని అనుసరించు చిత్తముతో సహా బయలుదేరిన చైతన్య వృత్తులతో చంద్రబింబాన్ని చూస్తున్నాడు. అట్టి 'జ్ఞానము'నకు రూపంలేదు (అమూర్తం). ఆ చైతన్య వృత్తులు నిరాకారమై... సాకారమగు చంద్రబింబంలో సంవేదనం పొంది "ఇది చంద్రబింబ రూపం"... అనే అనుభవానికి కారణమౌతున్నాయి.

జ్ఞానమునకు రూపం లేదు. కానీ, చూపును నడిపించేది జ్ఞానం కదా! ఆ చూపులు రూపంగల చంద్రబింబం చూపగలుగుచున్నాయి. ఇది అందరి అనుభవమే కదా!

ఈ "చూపు ఒకచోట నుండి బయల్వెడలి చంద్రబింబం చేరే ప్రయత్నంలో... మొదటి వస్తువును వదలిన తరువాత... చంద్రుని ఇంకా చేరకముందు గల నిర్విషయ దృష్టి సత్తాయే ఆత్మ" ... అని మీరు ఇతఃపూర్వమే చెప్పారనుకోండి. ఆ విషయం కాసేపు ప్రక్కకు పెడదాం. ఎందుకంటే

కేవలం ప్రబుద్ధుని దృష్టిని అనుసరించిగాని, లేక కేవలం అప్రబుద్ధుని దృష్టినిగాని అనుసరించి ఇప్పుడు నేను చెప్పటం లేదు. ఒక అర్ధ ప్రబుద్ధుని దృష్టిలోంచి ఈ విషయం విశ్లేషిస్తున్నాను. అట్టి అర్ధ ప్రబుద్ధుని సంకల్ప - వికల్ప రూపమైన "ఈ జగత్తు ఉన్నది"... అని అనుకుని ఈ ప్రశ్న అడుగుచున్నాను. అంతేగాని, జ్ఞాని దృష్టి చిన్మాత్రానుభవం నుండి కాదు.

హే ప్రభూ! ప్రతి జీవునిలోను హృదయమున ఒకానొక తత్త్వము (లేక, శక్తి) ఉండి, అంతటా వెలసియున్న ప్రాణ వాయువును క్షోభితం చేసి... ఆ ప్రాణవాయువులను ముక్కు రంధ్రం నుండి లోపలికి - బయటకు చాలనం చేయిస్తోంది. అట్టి హృదయాంతర్గతమైన ప్రాణవాయు చలనం నిర్వర్తించే తత్త్వం కేవల జ్ఞాన స్వరూపమే కదా!

వింటున్నారా స్వామీ! - ఒక వ్యక్తి తన భుజముపై బియ్యపు మూటను మోస్తున్నట్లు రూప రహితమగు ఆ జ్ఞాన తత్త్వము రూప సహితమగు ఈ ప్రాణవాయువుల చాలనం చేయటం, దేహమును క్షణక్షణం రక్షించటం ఎట్లా చేస్తోంది? నిరాకారమగు జ్ఞానము సాకారమగు ప్రాణములను చలింపజేయటం ఎట్లా జరుగుతోందో... నాకు ప్రశ్నార్థకమై ఆశ్చర్యం కలిగిస్తోంది. ఒకవేళ మనందరి హృదయములోని జ్ఞానశక్తి మహత్తరమైన మాహాత్మ్యము కలిగివున్నదని అంటారా? అప్పుడు ఈ మనుజుని సంకల్పం "ఆ చెట్టు కొమ్మపై గల రంగురంగుల పక్షి నా భుజంపై వచ్చి వ్రాలాలి"... అని అనుకోగానే జ్ఞానశక్తి ప్రభావం చేత ఆ పక్షి వచ్చి భుజంపై వ్రాలాలి కదా! మరి అట్లా జరగడం లేదు కదా! ఎందుచేత?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! ఈ నీ ప్రశ్న ఈ సందర్భంలో నాకు కూడా చమత్కారంగానే కనిపిస్తోందయ్యా! సరే! విను. కమ్మరివాని కొలిమి తిత్తిలోకి అంతటా ఉన్న వాయువులోని కొంచెము విభాగం వేగంగా ప్రవేశించి... మరల ఆ కమ్మరివాని చేతుల స్పర్శ - సంవేగానికి కొలిమి తిత్తిలోంచి బయల్వెడలుతుంది చూచావా? అట్లాగే ఈ వాయువు హృదయములోకి రాక-పోకలు సలుపుతోంది. ఎప్పుడైతే హృదయ ప్రదేశంలోగల నాడి సంకోచం - వికాసం పొందుచున్నదో ... అప్పుడు ముక్కుపుటముల ద్వారా వాయువు హృదయంలోంచి బయల్వెడలటం - హృదయంలోకి ప్రవేశించటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ కొలిమితిత్తి విషయంలో అయితే,... చేతన రూపుడగు కమ్మరివాడు కొలిమితిత్తులకు చేతుల తాడనంతో వాయువు యొక్క సంకోచ-వ్యాకోచములు జరగటానికి కారణమగు చున్నాడు. మరి గుండెలో ఏ కమ్మరి ప్రవేశించి... గుండెలను అరచేతులతో మర్దించి ప్రాణవాయువులు ప్రవేశ - నిష్క్రమణములు నిర్వర్తించేటట్లు చేస్తున్నాడు?

హే మహాత్మా! మీరు ఆశ్రమంలో ఈ దేహ స్వరూప - స్వభావాల గురించి మాకందరికీ బోధించియున్నారు. ("శతంచ-ఏకాచ హృదయస్య నాడ్యః" - అను శ్రుతి వాక్యాలు సూచిస్తున్న ట్లుగా) హృదయ ప్రదేశంలో 101 నాడులు ఉన్నాయి. అందులో ప్రతి నాడి నుండి చెట్ల శాఖల వలె మొత్తం 72000 ఉపనాడులు బయల్వెడలినవై ఉంటున్నాయి. ముక్కుపుటాల నుండి హృదయం

లోకి ప్రవేశించిన వాయువు ఆ 101 నాడులలోకి, అక్కడి నుండి 72000 ఉప నాడులలోకి – గుండ్రటి రాయిపై పడ్డ కడివెడు జలంవలె ప్రసరిస్తోంది. కాబట్టే ఆ నాడులచే ఈ దేహము యొక్క సర్వాంగములు సంచలనం పొందగలుగుచున్నాయి. అంతేకాని, ఒక్కొక్క అంగము తనంతటతానే కదలగలగటం లేదుకదా! ఒక్కొక్క అంగమును కదలటానికి, ప్రవర్తించటానికి, ఈ జీవుడు తలచినట్లు ఉపయోగించటానికి ఈ వాయువు యొక్క నాడి – ఉపనాడులలో ప్రవేశ – నిష్క్రమణము అను విశేషమే కారణం.

కొన్ని నాడులు ఒక అంగము కదలటానికి కారణమౌతున్నాయి. అన్ని అంగములు చలనం పొందాలంటే దేహములోని అనేక నాడి – ఉపనాడులు కదలవలసి వస్తోంది. అవి కదలాలంటే ప్రాణ వాయువుల సంచలనం అవసరం.

హృదయంలోని జ్ఞానం (A) → వాయు సంచలనం → నాడి – ఉపనాడులలో వాయువు యొక్క ప్రసరణ – నిష్క్రమణం (B) → అంగముల సంచలనం

ఇక...

(A) జ్ఞానం నిరాకారం ⟶ నాడుల సంచలనం సాకారం (B)

ఒకవేళ... నిరాకారమగు చైతన్యము యొక్క పాత్ర లేకుండానే వాయువు యొక్క ప్రసరణము చేతనే నాడులు సంచలనం పొందుతున్నాయని అందామా? మరి అదే వాయువు యొక్క స్పందముచే రాయి – కట్టెలోకూడా సంచలనం కనిపించాలి కదా? మరి మనిషియొక్క ఇంద్రియ సంచలనంలాగా రాయి – కొయ్యలో జరగటం లేదే? అవి అచేనతములై ఎందుకుంటున్నాయి?

కమ్మరి ఊది తిత్తిని పనిచేయిస్తున్నట్లు, అదే వాయువుచే స్పర్శించబడే రాయి మొదలైన అచేతనములు ఎందుకు చలించటం లేదు! జంగము అగు ఈ దేహాలు మాత్రమే వాయు సంచలనంచే చలనం పొందుచున్నాయేం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవ చైతన్యమే ఇక్కడి కమ్మరివాడు. అదియే వాస్తవానికి కార్యకారణములను అనుశాసించే ప్రభువు. సర్వ కార్యకారణములకు భోక్త కూడా అదియే!

అట్టి జీవచైతన్యము తనయొక్క కార్య – కారణముల యజమాన్యము – భోక్తృత్వము ఏమరచి... అనాదికాలంగా ప్రవాహ పతితములైనట్టి – కామ్య, కర్మ, వాసన... ఈ మూడింటికీ దాసోఽహమ్ అగుచున్నది. ప్రాణవాయువుతో తాదాత్మ్యం అయి "ధ్యాస" పొందుచున్నదై ఉంటున్నది.

ఆ విధంగా ప్రాణవాయువుతో అభేదాభిమానము పెంపొందించుకొని ఉన్న ఆ యొక్క అభ్యంతర జీవచైతన్యము స్వతంత్రంగా... ప్రాణవాయువుల సంచలనమును, అభ్యంతర నాడీ సమూహమును, తద్ద్వారా ఈ దేహమును, ఈ దేహం ద్వారా బాహ్య ప్రదేశమును... (కమ్మరివాడు

కొలిమి తిత్తిని చలింప జేయుచున్నట్లు) చలింపజేయుచున్నది. కనుక ఇక్కడి హృదయము యొక్క ప్రాణ వాయువు యొక్క ఆగమన – నిష్క్రమణములను – ఒకడు ఈ రెండు చేతులను కదల్చుచున్నట్లు అనునిత్యంగా – అసంకల్పిత – సంకల్పిత రూపంగా జీవ చైతన్యము అనుసంధానం నిర్వర్తిస్తూ ఉన్నది. తదనుసారంగానే ఈ ప్రపంచమున సర్వులు బాహ్యమున వ్యవహరించుచున్నారు. కనుక ఈ బాహ్య జగదనుభవములకు కూడా అనుసంధాన కర్త జీవ చైతన్యమే!

**శ్రీరాముడు :** స్వామీ! అదియే నా ప్రశ్న.

ఈ దేహమునందలి వాయువులు, నాడులు... సాకారములు కదా! ఇక జీవచైతన్యమేమో ...నిరాకారం! నిరాకార జీవచైతన్యం సాకార ప్రాణనాడులను ఎట్లా చలింపజేయటం జరుగుతోంది?

అంతేకాదు! అదే జీవ చైతన్యము ఒక వైపు ప్రాణ – నాడి – ఉపనాడులను కదుల్చుచున్నప్పటికీ కూడా... "నాకు దాహం వేస్తోంది. కనుక... అక్కడ దూరంగా బల్లపై ఉన్న గ్లాసు ఆ బిందెలో మునిగి ఆ గ్లాసుడు నీళ్ళు నా సమీపానికి వచ్చుగాక!" అని అనుకుంటే ... అట్లా జరగటం లేదు. మరి ఎందుకు అట్లా జరగటం లేదు?

కాదూ! "సాకార – నిరాకార పదార్థముల యొక్క పరస్పర సంబంధం సంభవిస్తూనే ఉంటుంది" అని అంటారా? అట్లా అయితే అప్పుడు ఆ జీవచైతన్యము తనకు తానే మాట్లాడటం – గ్రహించటం – విహరించటం మొదలైన సర్వ కార్యములకు కర్త అయి ఉండి .... తానే నిర్వర్తించవచ్చు కదా! ఇక ఈ ఇంద్రియములు ఉండవలసిన పనేమున్నది? వాటి వలన ప్రయోజనమేమున్నది? కానీ ...ఇంద్రియాలు ఉంటేగాని, మాట్లాడటం – గ్రహించటం – విహరించటం జరగటం లేదు కదా!

హే మహర్షీ! ఈ బాహ్యమున ఎట్లాగైతే సాకార – నిరాకార పదార్థముల పరస్పర సంబంధం ఉండటం లేదో... అట్లాగే అభ్యంతరంలో కూడా ఈ నిరాకార – సాకార పరస్పర సంబంధం ఏర్పడటం జరగదనే నా అభిప్రాయం. అందుచేత స్వామీ! ఇంకేదైనా యుక్తి ద్వారా ఈ నిరాకారమగు జ్ఞానము సాకారమగు కార్యక్రమాలకు ఎట్లా కారణమో (లేక) ఈ సాకారములగు ప్రాణవాయువు దేహ సంచలనాలకు, జడవస్తువులను కదిలించటానికి మరింకేదైనా విశేషమున్నదేమో చెప్పండి.

లేదా? ...నా ప్రశ్న మరొక వైపునుండి అడుగుతాను. మీరు 'యోగిరాట్' కదా! అట్టి తమరు తమ అంతఃకరణంలో సాకార – నిరాకారముల పరస్పర సంబంధాన్ని మీ యోగబలంతో... ఏ ఉపాయం ద్వారా... మీరు అనుభవిస్తున్నారో... అది చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సర్వసందేహములను తొలగించగల "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అనబడు "సమస్తము యొక్క ఏకత్వము" ...యొక్క అనుభవమే నీ ఈ సుదీర్ఘమైన ప్రశ్నకు సమాధానమై ఉన్నది. తత్త్వసాక్షాత్కారం యొక్క "సమస్తము యొక్క ఏకత్వానుభావం"... గురించి ఇక్కడ ప్రసంగిస్తున్నాను... విను.

**నేఽహకించిన్న నామాస్తి వస్తు "సప్రతిఘం" క్వచిత్ ।**
**సర్వదా సర్వమేవేదం "శాంతమప్రతిఘం" తతమ్ ॥**

ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో 'సప్రతిఘం' అని నీ పదజాలంచే చెప్పబడే 'సాకారం' అనేదేదీ లేనేలేదు. ఈ కనబడేదంతా కూడా సర్వవేళలా సర్వదా శాంతము, సర్వ వ్యాపకము, నిరాకారము – అగు బ్రహ్మమే అయివున్నది. స్వప్నంలో అనేక పదార్థజాలం కనిపించవచ్చుగాక! అదంతా సాకారమా? కాదు. నిరాకారమే (అప్రతిఘమే) కదా! ఒకడు తన సంకల్పంతో దర్శించే జగద్దృశ్యం ఆ చూచే వానికి చూచేటప్పుడు సాకారంగా కనిపించవచ్చుగాని, ... వాస్తవానికి సంకల్పము నిరాకారమే కదా! అట్లాగే... ఈ కనబడే సర్వదృశ్యము... ఈ మట్టి రాయి, నేల,ఆకాశం, ఇళ్ళు, వాకిళ్ళు, దేహాలు, భావాలు, అనుభవాలు... ఇవన్నీ నిరాకారము, శాంతము, శుద్ధజ్ఞాన మయము – అయినట్టి బ్రహ్మమే! (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ). అట్టి నిరాకార శుద్ధ బ్రహ్మంలో... సాకారం (సప్రతిఘం) అయినట్టి జగత్తు ఉత్పన్నమవటానికి కారణమే లేదు. ఈ జగత్తుకు కారణమే లేదు. కాబట్టి... ఇద్దానికి ఆద్యంతములు లేకయే ఉన్నాయి. అంతేకాదు. జగత్తుగా కనిపించే ఆకాశం భూమితో కూడిన దృశ్యము భ్రాంతి రూపమే అయివున్నది. స్వప్నంలో స్వప్నద్రష్ట చైతన్యమే భాసిస్తున్నట్లుగా... ఈ సమస్త రూపముగా అప్రతిఘమగు (నిరాకారమగు) చైతన్యమే భాసిస్తోంది.

"ఈ జగత్తు నాకు ఇట్లా ఎందుకు పదార్థ రూపంగా, సాకారంగా భాసిస్తోంది?"... అని అడుగు తావా? ఇదంతా 'సాకారంగా చూడటం' అనే అభ్యాసం చేత వాసనారూపం పొంది ఈ రూపంగా అనుభవమౌతోంది. (లేక) సాకారంగా అనిపిస్తోంది. అందుకే, తత్త్వమును శ్రవణం చేసిన తత్త్వజ్ఞులగు వారు ఇది సాకారమా? నిరాకారమా? అనే చర్చను ప్రక్కకు పెట్టి మునుముందుగా "వివేక, వైరాగ్య, త్యాగ, శ్రవణ, మనన, నిధిధ్యాసన" మొదలైన ఆయా సర్వ ప్రయత్నాలను నిర్వర్తించి నిర్మలమైన, జ్ఞాన పరిపుష్టమైన దృష్టికై ప్రయత్నశీలురై ఉంటున్నారు. అట్టి సాధనముల ద్వారా... సాకారంగా అనిపిస్తున్న దృశ్యము పట్ల వాసనా సహితంగా తుడిచి వేయబడిన 'దృష్టి'ని పెంపొందించు కుంటున్నారు. ఇకప్పుడు ఈ అంతరిక్షం, నేల, వాయువు, ఆకాశం, పర్వతాలు, నది, సముద్రాలు, వాయుచలనాలు, దేహాంతర్భాగాలు... ఇవన్నీ "నిరాకారబోధ స్వరూపాలు"గా ఎరుగుచున్నారు.

❖

ఓ రామచంద్రా! ఈ సందర్భంలో "ఐందవ బ్రహ్మాండములు" గురించి చెపుతాను. విను. ఇంతకు ముందు ఉత్పత్తి ప్రకరణంలో "ఐందవ జగత్తులు" గురించి ఐందవోపాఖ్యానంలో... "జగత్తు మనోమయం. ఇదంతా క్షణోత్పత్తి ప్రదర్శనం" అని నిరూపించటానికి చెప్పటం జరిగింది. ఆ ఐందవోపాఖ్యాన విశేషాలే ఇప్పుడు కించిత్ కథా పరిచయంతో "ఈ జగత్తుగా కనిపించేదంతా నిరాకారమగు చిన్మాత్రమే" ...అని చూపటానికి, నిరూపించటానికి మరల ఉదహరిస్తాను. "నిరాకార మగు చైతన్యం (అప్రతిఘం) సాకారమగు ఈ శరీరాదులను (సప్రతిఘములను) ఎట్లా చలింప జేస్తోంది?" ...అనే నీ ప్రశ్నకు సమాధానంగా ఈ ఐందవోపాఖ్యాన సోదాహరణమును ఇచ్చుట ఉపయోగిస్తున్నాను. ఇది వింటే "ఈ నదీ–పర్వత–భూమ్యాది సహితంగా ఇదంతా ఈ దేహ– దేహాంతర్భాగములతో సహా చిన్మాత్రమే!" ...అనే విషయం అనుభూతం కాగలదు.

❖

ఈ అనంత జగత్ సమూహ–సహిత–సదృశ బ్రహ్మాండాలలో కనిపించే ఒకానొక బ్రహ్మాండం లోని ఒకానొక జగత్తులో "ఇందువు" అనబడే శ్రోత్రియుడైన బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన తపస్సు, వేదాధ్యయనము, వేదోక్తములైన కర్మానుష్ఠానములకు అందరికి ఆదర్శప్రాయుడై ఉండేవాడు. ఆయనకు కాలక్రమేణా పదిమంది పుత్రులు కలిగారు. ఆ పదిమంది కుమారులు మహాశయులై (ఉత్తమమైన ఆశయాలు కలవారై) మహాత్ముల, మహనీయుల, సజ్జనుల పట్ల సేవానిరతులై ఉత్తమమైన కర్మానుష్ఠానంతో తమ తండ్రివలె లోకప్రసిద్ధి పొందుతూ పెరిగారు. ఆ విధంగా కొంతకాలం గడిచింది. 'కాలం' ఏదీ పట్టించుకోకుండా మౌనంగా తన పనిని తాను చేసుకుంటూనే పోతుంది కదా! ఒకనాడు ఆ ఇందువు దేహం త్యజించాడు. ఆయన భార్య వైధవ్య భీతితో భర్తతో పాటే అనుగమించింది. అప్పుడు ఆ 10 మంది కుమారులు తమ మాతాపితరులకు ఊర్ధ్వదైహిక క్రియలను ఆచరించారు. ఆ తరువాత తల్లిదండ్రుల వియోగ దుఃఖంచేత వారి మనస్సు వేదన పొందింది. అందుచేత వారున్న ఆశ్రమాన్ని, ఆ వాతావరణాన్ని వదలి దూరంగా గల ఒక పర్వత ప్రదేశంజేరారు. అక్కడ గల ఒక ఏకాంతమైన గుహలో ప్రవేశించి ఒక చోట సమావేశమై చుట్టూ ఆసీనులైనారు.

"ఏదైనా సాధించాలంటే 'ధారణ' కావాలి. అయితే 'ధారణ' కుదరాలంటే... చక్కటి ఆశయం కావాలి. లేకుంటే ధారణ దానంతట అదే కుదరేది కాదు. అందుచేత ఏ ఉత్తమమైన 'సిద్ధి' కొరకై మనం ధారణకు ఉపక్రమిద్దాం?"... అని మొట్టమొదటగా ఆ సోదరులు చర్చించటం ప్రారంభించారు.

"ఏ ధారణ యందు తన్మయులమైతే మనందరం అత్యంత ఉన్నతస్థితి పొందగలం?" అనే విషయం తర్క – వితర్కించుకోసాగారు. చివరికి "సృష్టిలో ఈ సృష్టి యొక్క కర్తయగు బ్రహ్మదేవుని స్థితియే అత్యున్నతమైనది. అందుచేత మనమందరం సృష్టికి కర్తృత్వం వహించగల 'ధారణ'కు ఉపక్రమించి, తద్వారా బ్రహ్మదేవులుగా అవుదాం" ... అనే తర్క–వితర్కానంతర సుస్థిర నిర్ణయానికి ఆ 10 మంది వచ్చారు. ఇహనేం! వారు అప్పటికప్పుడే హింసక జీవులు ప్రవేశించజాలని ఒకానొక ఏకాంత ప్రదేశమును ఆ కొండ గుహలోనే ఎన్నుకొన్నారు. ఇక పద్మాసనాసీనులై ధారణకు ఉపక్రమించారు. నేత్రములు మూసుకున్నారు. నిశ్చల ధ్యానం ప్రారంభించారు. "చతుర్ముఖ బ్రహ్మచే అధిష్ఠితమైయున్న ఈ సమస్త బ్రహ్మాండము నేనే! సృష్టంతా నా స్వరూపమే! నా సంకల్పమే ఈ సర్వసృష్టి" ... అనే ధారణకు ఉపక్రమించారు. అట్టి బలవత్తరమైన ధ్యాసచే వారు, "ఈ శరీరము నాది! దీని సంరక్షణయే నా కార్యక్రమం! ఇది లేకుంటే నేను లేను" .... అన్నట్టి దేహధ్యాసను మొదలంటా క్రమంగా త్యజించివేశారు. అట్టి ధారణతో 18 నెలలు స్థూలశరీరం ఉన్నంత వరకు 'చ్యుతి' పొందకుండా ఉండిపోయారు. క్రమక్రమంగా వారి భౌతిక దేహాలు శుష్కించసాగాయి. అవి ప్రేతములచే భక్షించబడి అస్థిపంజరాలుగా అయిపోయాయి. ఆ విధంగా సూర్యరశ్మిచే ఛాయా విభాగం తొలగిపోయినట్లు భౌతిక దేహాలు నశించాయి. అయితే

"నేనే సృష్టికర్త యగు బ్రహ్మదేవుడను. సృష్టి అనే సమస్త కథా సంవిధానము నా యొక్క యోచన చేతనే రూపం పొందుచున్నది. అష్ట దిక్పాలకులు, నవగ్రహములు, సప్తఋషులు, పాప–పుణ్యలోకానుభవాలు, విహిత కర్మలు, వేద శాస్త్రములు... అంతా నా సంకల్పాకాశం నుండే

బయల్వెడలుచున్నాయి"... అనే రూపంగా ఆ 10 మంది ధ్యానమును సుదీర్ఘకాలం అక్కడే కొన సాగించారు. క్రమక్రమంగా వారి శరీర శూన్యములగు 10 చిత్తములు వారి వారి ధ్యానపరిపాకముచే వేరు వేరుగా 10 బ్రహ్మాండములైనాయి. వారు 10 బ్రహ్మాండ శరీరధారులుగా (బ్రహ్మదేవులుగా) అయ్యారు.

చూచావా, రామచంద్రా! ఆ ప్రకారంగా "అత్యంత నిర్మలము – నిరాకారము" అయినట్టి ఆ 10 మంది ఐందవుల చైతన్యమూ ఇచ్ఛారూపమై... సమస్త బ్రహ్మాండ స్వరూపములుగా అవటం అక్కడ జరిగింది. కనుక వారి చిత్త నిర్మితమైన సమస్త బ్రహ్మాండములు చిన్మయ రూపములే కదా!

అట్లాగే "ఈ భూమి – పర్వతం – ఆకాశం – ఇవన్నీ కూడా చిద్రూపమే!" అని గ్రహించు. అట్లా కాదనుకుంటే ... ఆ ఐందవుల యొక్క 10 విధములైన త్రైలోక్య సమన్విత బ్రహ్మాండములకు మరింకే రూపం కలదో చెప్పు? కాబట్టి అంతాకూడా చిదాకాశ మాత్రమేగాని.... అందుకు అన్యమైనదంటూ ఎక్కడా ఏదీ లేనే లేదు.

**విద్యతేన యథా కించిత్ తరంగః సలిలాదృతే ।**
**సంవిత్ తత్త్వాదృతే, తద్వత్ విద్యతే చలనాదికమ్ ॥**

జలంకంటే తరంగం–తరంగ కదలికలు ఎక్కడైనా వేరుగా ఉన్నాయా? ఉండవే! అట్లాగే చైతన్యము కంటే చలనాదులు వేరుగావు. ఆ ఐందవ కల్పిత 10 బ్రహ్మాండములు ఎట్లాగైతే చిన్మయరూపములే అయివున్నాయో,.... అట్లాగే ఈ జగత్తులో కూడా కాష్ఠము, లోష్ఠము, శిల ...ఇవన్నీ చిన్మయ రూపములే! ప్రజ్ఞా రూపములే! భావనారూపములే! ఆలోచనారూపములే! సంకల్పరూపములే! ఐందవుల ఆ సంకల్పముచే జగత్ రూపం పొందినట్లే... "బ్రహ్మదేవుని సంకల్పమే" అయివున్నట్టి చమత్కారమే ఈ మనకు కనబడే జగద్రూపంగా కూడా ఉన్నది. అందుచేత ఈ పర్వత – వృక్ష – మేఘ – మహా భూతములన్నీ కూడా సర్వవ్యాపకమగు చిన్మాత్రమే అయివున్నాయి.

వృక్షాలన్నీ చిద్రూపమే! ఈ భూమి అంతా చిద్రూపమే! రాళ్ళు – రప్పలు కూడా చిద్రూపమే! అంతరిక్షం కూడా చిద్రూపమే! ఆకాశం, పర్వతాలు చిత్స్వరూపములే! ఈ దేహము – ఈ దేహంలోని రక్త, మాంస, అస్థి, క్రొవ్వు... మొదలైనవాటితో సహా చిద్రూపమే అయి ఉన్నాయి!

అంతెందుకు! ఇక్కడ చైతన్యము కానిదంటూ ఏదీ లేదు.

చిన్మాత్రాకాశమున చిన్మాత్రకులాలుడు (కుమ్మరి) స్వశరీరమైనట్టి 'చిద్రూపం' అనే చంచల చక్రంపై 'స్వచిత్ శరీరం' అనే చిత్ – మృత్తిక (మట్టి)తో ఈ సృష్టిని నిరంతరం సృష్టిస్తూనే ఉన్నాడు. కానీ వాస్తవానికి ఇక్కడ ఏదీ సృష్టింపబడటమే లేదు. ఎందుకంటే చిన్మాత్రం సర్వదా యథాతథం.

❖

ఓ రామచంద్రా! "ఐందవ బ్రహ్మాండములు" అనే కథనాన్ని "ఈ దృశ్య జగత్తు కేవలం సంకల్ప నిర్మితమే!" అని చెప్పటానికి పునరుద్ఘాటించాను. ఇక ... సంకల్పనిర్మితమైన ఈ సృష్టియందు శిలలు చేతనములు కాకపోతే... మరింకే మౌతాయి? ఏది 'జడము' అని అనిపిస్తోందో..... అది

ఆ ద్రష్టయొక్క అనుభవము, స్మృతి, సంస్కారము, ఇచ్ఛల సంయోగఫలమే అయివున్నది. నిరాకారమగు జలమునకు అనేక ఆకారములు కూడా (తరంగాదులందు) కనిపిస్తోంది చూచావా?

అట్లాగే... అనుభవము, స్మృతి, సంస్కారము, ఇచ్ఛ ... ఇవన్నీ కూడా చైతన్యం యొక్క ఆకార విశేషములే అయివున్నాయి. ఇవన్నీ తనయందు చిత్స్వరూపమునే ధరిస్తున్నాయి. అంతేగాని జడస్వరూపమును కాదు! కాబట్టి అవి చిద్రూపములే అయివున్నాయి! అర్థ శూన్యులగు అజ్ఞానులకు "ఇవి జడం – ఇవి చేతనం"... అని అనిపిస్తే అనిపించవచ్చుగాక! "తత్త్వావగాహన" కలిగినట్టి కుశలురగు విజ్ఞుల దృష్టికి సర్వత్రా చిన్మాత్రము మాత్రమే అగుపిస్తోంది. ఈ విధంగా జడ చేతనాలను చక్కగా మేము విమర్శించి "చైతన్యమే ఇదంతా"... అని నిర్దుష్టంగా, సుస్పష్టంగా నిర్ణయించాం.

దృష్టిని బట్టే ఇది. దృష్టి చైతన్యరూపమే కాబట్టి... ఇదంతా చేతనమే! పరమ చైతన్య ధామమగు బ్రహ్మమే సమష్టి–వ్యష్టి చిత్తముల రూపంగా దేదీప్యమానంగా వెలుగొందుచూ... ఒకచోట కాష్ఠ – పర్వతాది రూపములుగా ఉదయిస్తోంది. మరొకచోట కదిలే దేహాలుగా వెలుగొందుతోంది. సూర్యుని కాంతి సూర్యునికంటే వేరా? కాదు కదా! అట్లాగే... ఎక్కడా కూడా ఈ తృణము, కాష్ఠము, కొండ, రాయి, రప్ప, కదిలే దేహాలు మొదలైన పదార్థాలన్నీ కూడా కార్య కారణ రహితమగు బ్రహ్మము కంటే వేరు కించిత్ కూడా కానే కాదు! సూర్యుని కాంతి సూర్యుని స్వభావమే గాని... సూర్యునికి అన్యం కాదు కదా! సూర్యుడు అప్రకాశకుడై ఉండే ప్రసక్తి ఎక్కడిది? అట్లాగే ... ఈ పదార్థ జాలము – అంతా కూడా బ్రహ్మము యొక్క స్వభావమే అయి ఉన్నది. అంతేగాని, బ్రహ్మమునకు భిన్నమై జడము లేదు. చేతనము లేదు. కనుక "ఈ సమస్తము బ్రహ్మమే" – అనునది వేద – ఉపనిషత్ – శాస్త్ర – విజ్ఞుల అనుభవం... క్రోడీకరించగా... మా దృష్టికి సుస్పష్టం అగుచుండగా... "సునిశ్చితం" అని మేము ఎలుగెత్తి గానం చేస్తున్నాం. జలం పల్లం వైపుగా ప్రవహిస్తూ ఉంటే... ఆ జలంలో ఏ కారణం లేకుండానే, ఏ స్వప్రయత్నమూ లేకుండానే స్వయంగా ఆవర్తము – తరంగము మొదలైన రూపములు ఏర్పడి, ఇక జలం అతి తీవ్రంగా ప్రవహిస్తూ ఉండటం సహజమే కదా! అట్లాగే చైతన్యము కూడా స్వభావ సిద్ధంగాను, సహజంగాను జగద్రూపంగా ప్రవృత్తమగుచున్నదగుచున్నది.

❖

ఓ రామచంద్రా! పద్మకల్పమున విష్ణు భగవానుని నాభి కమలము యొక్క లీలయే బ్రహ్మదేవుని రూపంగా అగుచున్నది కదా! ఆ లీలయే బ్రహ్మదేవుని సంకల్ప రూపంగా విలసిల్లి జగత్తుగా ప్రదర్శితమౌతోంది. విష్ణు భగవానుని కంటే ఈ జగత్తు అన్యం కాదు (విశ్వమ్ విష్ణుః). అదే రీతిగా చిన్మాత్ర బ్రహ్మము వలననే ఈ జగత్తు భాసిస్తోంది. అట్లు భాసించే ఈ జగత్తు బ్రహ్మము కంటే వేరుకాదు. చిదాకాశ రూపము – పరమ శాంతము – భావాభావ రహితము – జన్మరహితము – సన్మాత్రము – చిత్ ప్రకాశ మాత్రము అయినట్టి బ్రహ్మమే – ఈ జగత్తు రూపంగా కనిపిస్తోంది.

సంకల్పమే ఈ జగత్తు యొక్క మూలపదార్థం. సంకల్ప విరచితమగు ఈ జగత్తులో ఈ పర్వతాలు, తృణములు – కొయ్య – రాయి మొదలైనవి చైతన్య రహితమని అజ్ఞాని అనుకోవచ్చు

గాక! ఆత్మతత్త్వము గ్రహించిన జ్ఞాని మాత్రం ఆ అభిప్రాయం విని నవ్వుకుంటున్నాడు. బ్రహ్మదేవుడు ఈ జగత్తులన్నీ స్వసంకల్పమయములుగానే స్వయముగా ఎరుగుచున్నాడు. ఇదంతా ఆతని సంకల్పము చేతనే ఉత్పన్నమై ఉండటంచే... ఇదంతా కూడా మనోరాజ్యంవలె చిదాకాశరూపమే అయివున్నది.

ఓ ప్రియ సభికులారా! ఇక్కడ ఈ సందర్భంగా ఒకానొక అతి ముఖ్యమైన విషయం అందరికీ గుర్తు చేస్తున్నాను.

**యావత్ యావత్ ఇయం దృష్టిః శీఘ్రం శీఘ్రం విలోక్యతే,**
**తావత్ తావత్ ఇదం దుఃఖం శీఘ్రం శీఘ్రం విలీయతే ॥**

ఎంతెంత శీఘ్రంగా దృష్టి పవిత్రమై ఇదంతా చైతన్య స్వరూపమే .... అని చూడటం జరుగుతుందో, ... అంతంత శీఘ్రంగా సప్రతిఘరూపమగు సాకారదృష్టి విలీనమైపోతోంది. (యావత్ దృష్టిః విలోక్యతే తావత్ దుఃఖం విలీయతే)

**యావత్ యావత్ ఇయం దృష్టిః ప్రేక్ష్యతే నాచ్చిరాచ్చితా**
**తావత్ తావత్ ఇదం దుఃఖం భవేత్ ప్రతిఘనం ఘనమ్ ॥**

ఎ ంతెంత వరకైతే దృఢమగు చైతన్య దృష్టితో (వాస్తవానికి చిత్ స్వరూప మాత్రమగు) ఈ జగత్తు చూడబడదో... అంతంత వరకు జడదృష్టి కొనసాగటం చేత ఈ సంసార దుఃఖం ఘనీభూతమై ఉండియే తీరుతోంది. కాబట్టి "ఇదంతా చిత్ చైతన్య స్వరూపమే"... అన్న సమున్నత దృష్టియే ఇక్కడి సర్వ దుఃఖములకు ఉపశమనం. ఓ ప్రియజనులారా!

**దీర్ఘ దుష్కృత మూఢానాం ఇమాం దృష్టిమ్ అపస్యతామ్**
**సంసృతిః వజ్ర సారేయం న కదాచిత్ ప్రశామ్యతి ॥**

ఎవరైతే దోషదృష్టిచే మూఢులై ఈ జగత్తును జడదృష్టితో, ఇక్కడి వస్తు జాతమును భౌతిక దృష్టితో, దేహములను రక్త-మాంస దృష్టితో, తదితర జనులను వర్ణాది దృష్టితో చూడటం కొనసాగిస్తూ... ఇదంతా చైతన్య దృష్టితో వీక్షించరో... అట్టి వారి సంసారము వజ్రమువలె దృఢపడియే ఉంటుంది. అది ఎన్నటికీ శమించదు. "ఇదంతా పరమాత్మరూపమే! పరమాత్మ చైతన్యమే జగత్తులోని సర్వ రూపములుగా, సర్వ తత్త్వములుగా, సర్వ స్వభావములుగా, సర్వ దృశ్య చమత్కారములుగా అయి ఉన్నది. కానీ, నా జడదృష్టికి జడమువలె అగుపిస్తోంది"... అని గమనించి ఎవరైతే చైతన్య దృష్టిని అభ్యసిస్తూ... అట్టి చైతన్య దృష్టిని పరిపుష్టి చేసుకుంటూ వస్తారో... అట్టివారి సంసృతి (సంసారము) తనంతట తానే ఎప్పుడో తుర్రుమని తొలగిపోగలదు.

**నేఽహ ఆకృతిః న చ భవాభవ జన్మనాశాః సత్తా నచైవ న చ నామ తథాస్థి అసత్తా**
**శాంతం పరం కచతి కేవలమాత్మ నీత్థం బ్రహ్మోథవా కచన మపి అలమ్ అత్ర నాస్తి !**

ఓ రామచంద్రా! వాస్తవానికి ఇక్కడ ఆకారాదులు లేవు. భవము-అభవములు (ఉన్నవి - లేనివి) గాని లేవు. జన్మ-వినాశనాలూ లేవు. సత్త-అసత్తలూ లేవు. మరి?... శాంతమగు పరబ్రహ్మం తనయందు తానే ఇట్లు ఈ సర్వముగా ప్రకాశించుచున్నది. (లేక) పరబ్రహ్మం కంటే వేరుగా "ప్రపంచ రూపంగా ప్రకాశించటం" అనేది కొంచెంకూడా ఎక్కడా ఎప్పుడూ లేనేలేదు.

ఓ ప్రియ సభికులారా! స్ఫటికంలో స్ఫటికమే జలాకారరూపంగా కనిపిస్తుంది చూచారా? బ్రహ్మమే తనయందు సృష్టిరూప ప్రతిసమూహముచే పూర్ణమైయున్నట్లు కనిపించవచ్చుగాక! స్ఫటికంలో జలం ఉన్నదా? లేదు. స్ఫటికము సర్వదా అంతటా స్ఫటికమే! అట్లాగే జగత్తులు, వాని విభాగములు, జీవులు, లోకములు, జ్ఞానా జ్ఞానములు మొదలైన చమత్కారములన్నీ కలిగి ఉంటూనే ....ఆద్యంత రహితమగు పరబ్రహ్మము అతి స్వచ్ఛంగాను, జన్మకర్మరహితంగాను, చిదానంద ఘనైక రూపంగాను, కైవల్య రూపంగాను నిత్యము సర్వదా యథాతథంగాను స్థితినొందియే ఉన్నది.

మనమంతా అట్టి నిర్మల పరబ్రహ్మ స్వరూపులమే! ఏకమగు నిర్మల పరబ్రహ్మమే... ఇటు ముక్త – అటు అముక్త రూపములను స్వయంగా... లీలామాత్రంగా అవధరిస్తోంది. అట్టి పరబ్రహ్మము యొక్క చమత్కారమైన అముక్త రూపం జగత్ రూపముగాను – జగత్ జీవుల రూపంగాను, అసంఖ్యాక శిరములు, హస్తములు, కళ్ళు, కాళ్ళు రూపంగాను, చెవులు, కంఠములుగాను కలిగి ఉన్నదై ఒప్పుచున్నది. ఇక ముక్తి స్వరూపమో... ఆత్మాకాశరూపమై, ఉత్తమ స్తంభం వలె దృఢమైనట్టి 'సన్మాత్ర' రూపమై జన్మాది వర్జితమై, సర్వదా యథాతథమై, మౌన స్వరూపమై... వర్ధిల్లుతోంది.

అట్టి సన్మాత్ర పరబ్రహ్మరూపమే నేను అయి ఉన్నాను. ఇక తదితర వికల్పాలతో నాకేమిపని?*

❖❖❖

# 8. అనేక ద్రష్టల ఏకైక రూపం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చూచావా రామచంద్రా! ఈ విధంగా ఈ త్రిజగత్తులు కూడా 'ఏకము' అయినట్టి సచ్చిన్మాత్రమగు పరబ్రహ్మమేనయ్యా! ఇక అజ్ఞానదృష్టిచే కనిపించే సాకార భూ-జగత్తులేవీ ఇక్కడ సంభవమే అగుటలేదు. సాకారమైనదంటూ ఏదీ లేనే లేదు. ఇక ఈ సాకారమగు శరీరము మొదలైన పదార్థములెచట? ఈ కనిపించేదంతా కూడా.... నిరాకారమగు బ్రహ్మమే ఈ ఈ రూపములుగా వ్యాపించి ఉన్నది.

చిదాకాశమున – చిదాకాశమే, శాంత రూపమున – శాంతరూపమే.... సర్వవైషమ్య రహితంగా ఇట్లు స్థితినొంది ఉన్నది. ఆకాశమున – ఆకాశమే, జ్ఞానమున – జ్ఞానమే... ఈ ప్రకారంగా విజృంభించుచున్నది.

---

*అంతా రామమయం ...... ఈ జగమంతా రామమయం ॥
అండాండంబులు – పిండాండంబులు,
బ్రహ్మాండంబులు – బ్రహ్మలు మొదలుగ .... అంతా రామమయం ॥
అష్టదిక్కులును – ఆదిశేషుడును అనంతరూపులై వింతలు సలుపగ ... అంతా రామమయం ॥
నదులు వనంబులు, నానా మృగములు,
విహిత ధర్మములు – వేద శాస్త్రములు .... అంతా రామమయం ॥
ధీరుడు భద్రాచల రామదాసుకు కోరికలొసగే .... తారకరాముడు
అంతా రామమయం ..... ఈ జగమంతా రామమయం ॥ **– భక్త రామదాసు**

**సర్వం సంవిన్మయం శాన్తం సత్స్వప్నఇవ జాగ్రతి,**
**స్థితమ్ అప్రతిఘాకారం, క్వా సౌ సప్రతిఘా స్థితిః?**

స్వప్నంలో లాగానే ఈ జాగ్రత్తులో కూడా సమస్తము "నిరాకారము, చిన్మయము, శాంతము" అగు బ్రహ్మమే అయివుండగా... ఇక సాకార జగత్తు ఉన్నదెక్కడ?

**క్వ దేహావయవాః? క్వ అన్త్రవేష్టనీ? క్వ అస్థి పంజరమ్?**
**వ్యోమేవాప్రతిఘం విద్ధి దేహం సప్రతిఘోపమమ్ ॥**

ఓ రామచంద్రా! అంతా చిన్మాత్రమే అయివుండగా... ఇక దేహం యొక్క అవయవములెచట? ప్రేగులను చుట్టి ఉండే నాడులు ఎచట? అస్థిపంజరం ఎచట?

**స్వప్నతుల్యమగు ఈ దేహము నిరాకారమే! -** రెండు చేతులూ చిద్రూపమే! ఈ శిరస్సు చిద్రూపమే! ఇంద్రియ సమూహాలు చిద్రూపమే! ఇన్ని మాటలెందుకు? ఈ సమస్త జగత్తు "శాంతము, నిరాకారము" ...అగు చిన్మాత్రమే అయివున్నది. దేహంలోగాని, ఈ బాహ్యనగాని సాకారమైనదంటూ ఏదీ లేనే లేదు. చిదాకాశమగు బ్రహ్మము యొక్క స్వప్నరూపస్వభావమే ఈ జగత్ స్థితికి మూలం!

కాబట్టి ఈ సమస్తమూ కూడా ప్రత్యక్షము, ప్రమాణములకు సిద్ధమైయున్నప్పటికీ... ఇద్దాని 'ఆది' యందు ప్రమాణరహితమే! సకారణమైనప్పటికీ అకారణమే! ఇందుకు (నేఽహనానాస్తికించన ...మొదలైన) శ్రుతి వాక్యాలు, విజ్ఞుల అనుభవాలు మనకు ప్రమాణం! శ్రుతి ఈ సాకారత్వమును నిషేధిస్తూనే వస్తోంది.

బ్రహ్మము నిర్వికారమై, అద్వయమై ఉండటం చేత... ఈ 'జగత్తు' అనబడేది ఉత్పన్నమవటానికి వేరే కారణమంటూ ఏదీ లేకపోవటం చేత... ఈ జగత్తు తత్త్వ దృష్టిచే "ఉత్పన్నమే కాలేదు" అనునది తగియే ఉన్నది.

భ్రాంతి దృష్టి చేతనో... ఈ జగత్తు 'కార్యకారణ సంభవము' అగుటచేతను బ్రహ్మమే జగత్ దృష్టికి అప్రసిద్ధమగుట చేతను ఇది "ఉత్పత్తి పొందియున్నది" అని అనిపించటం అజ్ఞానదృష్టికి సహజమే కూడా! అయితే... ఇక్కడ ఒక పరమసత్యం కూడా గమనించక తప్పదు. ఏది ఎవనిచే ఎట్లు నిర్ణయించబడుచున్నదో అది వానిచే అట్లే గాంచబడుచున్నదది. భ్రాంతి దృష్టియందు కార్య-కారణములు రెండూ కూడా వారి వారి నిశ్చయమును అనుసరించి తగియే ఉంటున్నాయి.

ఇక యుక్తి దృష్టిచేతనో... ఈ జగత్తు కారణము లేకయే ఉత్పన్నమైనది. ఇది సంవిద్రూపమే! (విత్ = తెలుసుకొనుట. తెలుసుకొనే రీతిని అనుసరించే తెలియబడుతోంది).

కాబట్టి... ఈ జగత్తు అత్యంత సత్తు కాదు. అత్యంత అసత్తు కాదు. "ఉన్నదాని వలె అగుపిస్తోంది"... అని అనవచ్చు. సంవిత్తు దేనిని ఎట్లు భావించుచున్నదో... అది అట్లే సత్యంగా పొందటం మాత్రం జరుగుతోంది. "నా స్వప్నంలో ఆ పట్టణం, ఆ పట్టణంలో ఆ కొండశిల, ఆ కొండశిలపై ఆ అంతఃపురం ఎందుకు కనిపించాయి?"... అని ఒక స్వప్న ద్రష్ట తన స్వప్న విశేషం గురించి మనలను ప్రశ్నించాడనుకో! అప్పుడేం చెప్పాలి? స్వప్న చిత్ స్వరూపతత్త్వము యొక్క "చిన్మయము - సర్వరూపత్వము" అనే లక్షణ విశేషములచేత సర్వదా సర్వత్రా సర్వము సంభవమే" ...అని

అనక తప్పదు. అట్లాగే ఈ జాగ్రత్తులో కూడా ఆత్మయొక్క చిన్మయత్వ – సర్వరూపత్వ విశేషముల చేతనే సమస్తము సంభవిస్తున్నాయి. 'మాయ'తో సమన్వితమైయున్న సర్వాత్మరూప బ్రహ్మపదమున పదార్థముల సత్త ఏకము – అనేకముగా కూడా స్థితి పొంది ఉండగలదు. కల్పితదృష్టియందు కార్యసత్త కారణజన్యమై ఉన్నట్లు అనిపిస్తున్నప్పటికీ కూడా… పరమార్థ దృష్టియందు మాత్రం సర్వము కారణరహితమే అయి ఉన్నది.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ జగత్తులు వేరువేరైన అసంఖ్యాక బుద్ధులు – దృష్టులు – అనుభవములు – ఉద్దేశములు – ఆశయములు మొదలైనవి వేరువేరు దేహుల పట్ల కనిపిస్తున్నాయి కదా! ఇవన్నీ వేరువేరా! ఒక్కటే అవుతాయా? ఒక్కటే ఎట్లా అవుతాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "ఏకః సహస్రంభవతి" అని అన్నట్లుగా … ఒకే చైతన్యము అసంఖ్యాక రూపములుగా అగుచున్నది. ఐందవుల సంకల్పరహిత బ్రహ్మాండములలో ఆ ఒక్కొక్క ఐందవుని చైతన్యమే ఆ ఒక్కొక్క బ్రహ్మాండములో అసంఖ్యాక జీవుల రూపంగా అగుచున్నది కదా! ఐందవ చైతన్యం కాకుండా వారి బ్రహ్మాండంలోకి మరొకటేదీ అసంఖ్యాక రూపములు దాల్చుటం లేదే!

**సహస్రమ్ ఏకం భవతి సంవిదాంచ తథా హి యత్ ।**
**సాయుజ్యే చక్రపాణ్యాదేః సర్గైరేకం భవేత్ వపుః ॥**

జలంలో వేలాది తరంగాలు ఏమౌతున్నాయి? అవన్నీ జలమే అయి, జలంలోనే ఉంటూ జలంలోనే ఉత్పత్తి అయి, జలంలోనే నిరాకారం పొందుచున్నాయి కదా! ఈ అసంఖ్యాక 'జీవులు' అనబడే సంవిత్ తరంగాలు సంవిత్ మహా సముద్రములోని సంవిత్ స్వరూపాలే గాని, దేహ స్వరూపాలు కాదు.

వందల కొలది నదులన్నీ కలిసి చివరికి ఒకే సముద్ర జలంగా అగుచున్నది కదా! అనేక ఋతువులు – సంవత్సరాలు… అన్నీ కలిసి ఒకే కాలము యొక్క స్వరూపమే అగుచున్నది కదా!

ఒకే స్వప్నద్రష్ట యొక్క సంవిత్తు స్వప్నంలో అనేక కదిలే – కదలని జీవ – వస్తు రూపములుగా అగుచున్నది కదా! అట్లాగే… ఒకే చిదాకాశం భ్రాంతిచే ఈ దేహాది నానా రూపత్వము పొందినదాని వలె అజ్ఞాన దృష్టికి అగుపిస్తోంది. అందరికీ దైనందిన అనుభవమయ్యే స్వప్నం సాకారమా? నిరాకారమా?

స్వప్నంలో మిత్రులు – బంధువులు – గృహములు మొదలైనవన్నీ ఉన్నాయి కాబట్టి సాకారమే కదా! కానీ, స్వప్న ద్రష్ట యొక్క ఊహాకల్పితమే స్వప్నాంతర్గత విశేషాలు కదా! ఊహకు రూపమెక్కడున్నది? కాబట్టి స్వప్నం నిరాకారమే కదా!

అట్లాగే ఈ దృష్టాంతాన్ని అనుసరించి ఈ దృశ్య జగత్తు సాకారంగా కనిపిస్తున్నప్పటికీ కూడా… ఇది నిరాకారమే! అట్టి చిదాకాశ స్వరూపం వాస్తవానికి అందరికీ స్వానుభవ రూపమే అయినప్పటికీ… 'దర్శన – ద్రష్ట – దృశ్య"… ఆదిగా గల భ్రాంతి విభాగ దృష్టిచేత 'అననుభవ రూపం'గా ఇట్లు భాసిస్తోంది.

కాబట్టి వాస్తవానికి ఈ జగత్తంతా కూడా "ఏకము" అయినట్టి చిదాకాశమే అయివున్నది. నిద్ర అనేది ఒక్కటీరైనదే... అయినప్పటికి స్వప్నంలో పదార్థజ్ఞాన రూపంగాను, గాఢనిద్రా సమయంలో ఏమీ తెలియని స్థితిగాను... ఈ విధంగా రెండు విధాలుగా భాసించవచ్చు గాక! కానీ .... నిద్ర ఎల్లప్పుడూ (ఉభయ సందర్భములలోనూ)... ఏకరూపమే కదా! వాయువు తరంగముల రూపములో స్పందిస్తున్నప్పుడు... స్పందరహితమై నిశ్చలంగా ఉన్నప్పుడు కూడా వాయువు వాయువే కదా!

**చిదాకాశము - జగత్తు ఈ రెండూ ఏకరూపములే అయి ఉన్నాయి -** స్వప్నంలో పరమార్థ చిదాకాశం పదార్థ శూన్యమై ఉండి కూడా... ద్రష్ట-దర్శన-దృశ్యములుగా భాసిస్తున్నట్లే, అదే పరమార్థ చిదాకాశము జగత్ శూన్యమై ఉండి కూడా... ఇక్కడ జాగ్రత్‌లో ద్రష్ట-దర్శన-దృశ్యములుగా భాసిస్తూ, వీటన్నిటికీ కూడా సర్వదా "ప్రత్యేకము" అయి కొనసాగుచూనే ఉన్నది. ఆదిసృష్టి యందు ఈ జగత్తు అసద్రూపం. ఇప్పుడు కూడా అంతే! స్వప్నంలో కనిపించిన పులిని చూచి భయం పోవాలంటే... మెలకువ వస్తే అంతా హుళక్కి అయి, ఆ భయం అర్థాన్ని కోల్పోతోంది కదా! అట్లాగే "ఈ జగత్తంతా సర్వదా ఆత్మస్వరూపమే"... అని ఎరుగబడినట్టి ఆత్మసాక్షాత్కార సిద్ధి సముపార్జించు కున్నవానికి ఇక్కడ నామరూపత్వం ఇక శేషించదు.

స్వప్నంలో ఒకే సంవిత్తు అనేక రూపములుగా భాసిస్తున్నట్లు... సృష్ట్యాది యందు ఒకే చిదాకాశ సంవిత్తు... ఈ ఏకానేక రూపాలుగా భాసించటం జరుగుతోంది.

ఒకే దీపము (అగ్ని) అనేక గృహాలలో దీపశిఖ అయి దీపకాంతి వెదజల్లుచున్నట్లుగా... సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని ఒకే శక్తి అనేక రూపములుగా ప్రకాశిస్తోంది.

ఆకాశంలో భ్రాంతిచే చక్రాకారాలుకనిపించుచున్నట్లు... జగత్తులో పదార్థముల నామ రూపాలు, దృశ్యాలు, సంఘటనలు, సంబంధాలు, బాంధవ్యాలు ఆత్మాకాశంలో అగుపిస్తున్నాయి.

సముద్రజలంలో అనేక వింత ఆకారాలు కనిపిస్తున్నప్పటికీ... అంతా సముద్ర జలమే కదా! ఆత్మయందు ఈ వృక్ష - జంతు - మానవ దేహాలు స్ఫురిస్తున్నాయి. బ్రహ్మమహాసముద్రంలో అగుపించే ఈ సృష్టి జలకణ సహస్రాలు బ్రహ్మము కంటే కొంచెం కూడా భిన్నం కానేకాదు.

❖❖❖

# XII. బ్రహ్మగీతాంతర్గత కుందదంతోపాఖ్యానం

## 1. కుందదంత వరసిద్ధి

**శ్రీరాముడు :** హే మహర్షీ! సూర్యుడు ఉదయించగానే సర్వ అంధకారములు తొలగిపోతాయి చూచారా? అట్లా.... "సర్వ వస్తువులు బ్రహ్మమే" అనే పూర్ణబోధ కొరకై తమరు నా యొక్క ఒకానొక సంశయమును ఛేదించ ప్రార్థన. నేను మీ ముందుంచబోయే ఈ సంశయం వెనుక ఒకానొక సంఘటన కొంత వరకు కారణమై ఉన్నది. అద్దానిని ముందుగా వర్ణించి చెప్పటానికి కొద్ది సమయమును ప్రసాదించమని మిమ్ములను వేడుకుంటున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లాగే! ఆ సంఘటన ఏమిటో సవివరంగా చెప్పు. అంతా వింటాం.

**శ్రీరాముడు :** ఓ మహాత్మా! వసిష్ఠ మహర్షీ! పితృదేవులగు దశరథ మహారాజా! ఈ సభకు వేంచేసిన తదితర సర్వసభికులారా! ఈ మహర్షి ప్రవచనం సందర్భంలో నా ఈ గురుదేవుల అనుజ్ఞతో చెప్పుచున్న ఈ కుందదంతాఖ్యాయిక వినండి.

కొన్ని నెలలు క్రితం ఒక రోజు అయోధ్యలోగల విద్యాపీఠంలో విద్వాంసులగు వేద పండితుల సదస్సు జరిగింది. రాజకుమారుడుగా ఆహ్వానితుడనై మా తండ్రిగారి అజ్ఞానుసారం నేనాసభలో పాల్గొన్నాను. ఆ రోజు విద్వత్తములైన ఎందరో పండిత బ్రాహ్మణ్యులు వేద – వేదాంత విశేషములను ప్రవచిస్తూ ఉండగా సోదరులతో కూడి అత్యంత ఏకాగ్రచిత్తులమై అందరం వింటున్నాం. అట్టి సమయంలో ఆ సభకు అక్కడి కార్యకర్తలు "విదేహ దేశము నుండి ఉత్తమ బ్రాహ్మణుడు, గొప్ప శాస్త్ర విద్వాంసుడుగా లోకప్రసిద్ధి పొందినవాడు, మహా శ్రీమంతుడు, మహాతపస్వి, గొప్ప జ్ఞానైశ్వర్య కాంతులతో ప్రకాశించువాడు, దుర్వాస మహర్షి వలె దుస్సహమైన తేజోధారియగు 'కుందదంతముని' అతిథిదేవరూపులై వేంచేశారహో!" అని ప్రకటన చేశారు.

మేమంతా అప్పుడు నిజపఠితములైన వేదాంత – సాంఖ్య సిద్ధాంతవాద – ప్రతివాదములను ఆపాం. ఆ బ్రహ్మయజ్ఞ సభలో ఉన్నవారమంతా లేచి గౌరవ సూచకంగా నిలబడి నమస్కరిస్తూ ...కరతాళ ధ్వనులు చేయసాగాం. అప్పుడు మహా దీప్తివంతుడగు బ్రాహ్మణుడు మాకు ప్రతి నమస్కారాలు చేస్తూ సుపరిచితులతో కరచాలనం చేస్తూ మహారణ్యంలోంచి నడచివచ్చే గంభీర సింహంలాగా సభాగ్ర భాగంలో మేమున్న సభామండప అగ్రస్థానానికి నడచి వచ్చారు. అలవోక అయిన చిరునవ్వుతో నన్ను, మా ముగ్గురు సోదరులను పలకరించి సుఖాసీనులైనారు. అప్పుడు నేను లేచి వారి పాదములపై పుష్ప గుచ్ఛములు ఉంచి నమస్కరించాను. వారి 'ప్రియవాక్కు'ను అనుసరించి అందరం సభలో ఆసీనులమైనాం. అప్పుడు నేను కుశల ప్రశ్న పూర్వకంగా – పలకరించాను. పలకరిస్తూ ఒకానొక విషయం అడిగాను. అప్పుడు నాచే అడగబడిన విషయం

అప్పటి మా చర్చలకు సానుకూల్యము – సందర్భోచితము అయివున్నది. నేను మొట్టమొదటగా ఇట్లా పలుకరించాను.

**నేను (రామచంద్రుడు) :** బ్రహ్మ విద్యావరేణ్యులైన ఓ బ్రాహ్మణోత్తమా! కుందదంతమునీ! తమరు విదేహదేశం నుండి ప్రయాణించి ఎంతో అలసిపోయి ఉంటారు. ఆ ఆసనముపై సవిశ్రాంతులయ్యేదరు గాక! మీ రూపం బ్రహ్మ తేజస్సుతో ఉట్టిపడుతోంది. అయినప్పటికీ మీ సుందరమైన కళ్ళలో ఏదో ఆతురత నాకు కనిపిస్తోంది. అందుచేత, ఇప్పటి మీ రాక ఎచ్చట నుండో, ఏది తెలియగోరుచున్నారో ...తెలుపమని ప్రార్థన. ఈ సభికులందరి తరపున, అయోధ్యా నగర చక్రవర్తి – మా పితృదేవులైన శ్రీదశరథ మహారాజు తరపున, అయోధ్యా నగరవాసుల తరపున మీకు మరొక్కసారి సుస్వాగతం. ఇప్పుడు మీరు ఏది ఎరుగాలనే కించిత్ ఆవేశపూరితంగా కనిపిస్తున్నారో... అట్టి విశేషమును సవివరంగా ఈ పండిత సభకు ప్రకటించండి. మీరు సంభాషిస్తూ ఉంటే వినాలని ఇక్కడి సభికులంతా వేచి ఉన్నట్లున్నారు. దయచేసి మీ మనోహరమైన వాక్యపరంపర మాపై వెదజల్లండి.

**కుందదంత బ్రాహ్మణుడు :** ఓ దశరథ వర కుమారా! శ్రీరాచంద్రా! నీవు చెప్పింది నిజమేనయ్యా! అత్యంత సునిశితమైన బుద్ధి కలవాడివి కాబట్టే అట్లా పలికావు. అవును. నేనిప్పుడు మహాప్రయత్న పరుడనై ఉన్నాను. ఒకానొక అతిముఖ్యమైన కార్యము కొరకై ఈ అయోధ్యకు వచ్చాను. ఇక్కడ సత్సంగము జరుగుచున్నట్లుగా విన్నాను. నీ దర్శనం, సభలో గల అనేకమంది వేద – వేదాంగ – వేదాంత పండితుల దర్శనం కోరుకున్నవాడనై ఇటు వచ్చాను.

ఓ రామచంద్రా! ఓ సభికులారా! మీ మీ చర్చనీయాంశానికి కొంచెం విఘాతం కలిగించానేమో! కానీ... మీ అతిథిమర్యాదలకు, ఈ శ్రీరామచంద్రుని ఆప్త వాక్య ప్రియత్వానికి పులకితుడనై మీ అందరి అనుజ్ఞతో ఇప్పుడు అస్మత్ సంబంధమైన ఒకానొక జరిగిన సంఘటనను ప్రస్తావిస్తాను.

ఎందుకు ఆ నా స్వీయానుభవం చెప్పుచున్నానంటారా? ఆ సంఘటన వలన నాలో ఒక గొప్ప సందేహం బయల్వెడలింది... "భూమి, సప్తసముద్రాలు, అనేక పర్వతాలు మొదలైన విశేషాలతో కనబడే ఈ ప్రపంచం అత్యంత సువిశాలమైనది కదా! "ఇక్కడికి చాలాదూరంలో ఒకానొక చిన్నగ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఒక ఇల్లు ఉన్నది. ఆ ఇంట్లో నాకు పరచయం గల ఒక కుటుంబం నివసి స్తోంది. ఆ ఇంట్లో కొన్ని గదులు ఉన్నాయి. అక్కడి ఒక్కొక్క గదిలో ఇంతటి సువిశాలమైన ఒక్కొక్క బ్రహ్మాండం ఉండి ఉన్నది. ఇది నమ్మశక్యమైన నిజమేనా? ఇదిసాధ్యమా?

❖

ముందుగా నా జన్మ –జన్మ స్థానముల గురించి ఈ విద్వత్ సభకు విన్నవించుకుంటున్నాను. ఈ భూమిపై 'స్వర్గధామం' అని చెప్పుకునే 'విదేహం' అనే ఒక దేశమున్నది. ఆ దేశంలో ఒకానొక బ్రాహ్మణ గృహంలో నేను జన్మించాను. మా ఇంట్లోనే తండ్రి దగ్గర కుల విద్యలగు వేదపారాయణ – వేదాంత విద్యలు బాల్యం నుండి అభ్యసించాను. నా దంతములు పుట్టినప్పటి అతిబాల్యం నుండి తెల్లటి స్వచ్ఛమైన ప్రకాశమును విరజిమ్ముచుండటం చేత మా పితామహులు "కుందదంతుడు" అనే నామధేయం నిర్ణయించారు. (కుందం = మొల్లపూవు)

నేను నా విద్యాభ్యాసం ముగించుకొని ఆ తరువాత ఈ జగత్తు యొక్క నిత్యానిత్యాలు విచారణ చేయసాగాను. క్రమంగా, వైరాగ్యవంతుడనయ్యాను. 'సంసారం' అనే శ్రమ సశాంతించటానికై గొప్ప ప్రయత్నశీలుడై అనేక మున్యాశ్రమాలు, బ్రహ్మజ్ఞుల గృహాలు సందర్శించి అనేక తత్త్వజ్ఞాన విషయాలు సేకరించసాగాను. అట్లా సంచరిస్తూ సంచరిస్తూ, ఒకసారి దక్షిణ దిక్కుగా ఉన్న శ్రీశైలం వెళ్ళాను. అక్కడ పర్వత ప్రాంతంలో మున్యాశ్రమం నిర్మించుకొని చాలాకాలం వరకు కోమలమైన తపస్సు ఆచరించాను. ఆ మున్యాశ్రమం సమీపంలో దట్టమైన ఒక అరణ్యం ఉన్నది. ఒకసారి నేను కాకతాళీయంగా ఆ అరణ్యంలో ప్రవేశించి సంచరించసాగాను.

అట్లా తిరుగుతూ ఉంటే, అక్కడకు అల్లంత దూరంగా నాకు విస్తారమైన కొమ్మలు – శాఖలు గలిగి... 7–8 అడుగుల ఎత్తు మాత్రమే ఉండే పొట్టిదైన ఒక వృక్షం కనిపించింది. అది కోమలమైన లేత ఆకులతో సుకుమారమైన కొమ్మలతో చాలా ప్రత్యేకమైన ప్రకాశంతో ఆకర్షణీయంగాను, ఆహ్లాదంగాను అగుపించింది. అది చూచి, నేను దూరం నుండే ఆకర్షితుడనై కాసేపు విశ్రాంతి కొరకై ఆ వృక్షమును సమీపించాను.

ఆశ్చర్యం! ఆ వృక్షము యొక్క ఒక శాఖకు పాదాలు త్రాళ్ళతో బంధించబడి క్రిందకు వ్రేలాడే శరీరము – శిరస్సులతో పవిత్రమైన ఆకారంతో ప్రకాశిస్తూ ఒక మానవ దేహం కనిపించింది.

ఆ సమయంలో ఆ ఏకాంత ప్రదేశంలో ఆ వృక్షానికి తలక్రిందులుగా వ్రేలాడే ఆ దేహము కనిపించటం నాకు ఆశ్చర్యజనకం అయింది. "ఏమిటిరా ఇది" ...అని అనిపించింది. "కొంపదీసి ఈ అఘాయిత్యాన్ని ఎవరైనా దుర్మార్గులు చేసి ఉంటారా?" ...అని అనుకోసాగాను. నెమ్మదిగా ఆ వృక్షాన్ని బాగా సమీపించి చూచాను. అతడెవరో శ్రోత్రియ బ్రాహ్మణుని వలె వీబూదితో ప్రకాశిస్తు న్నారు. కళ్ళు మూసుకుని ఉన్నారు. "అరె! ఇంకా ఈయనకు జీవకళ ఉన్నట్లే ఉన్నదే! ఏమి ఆశ్చర్యం!"... అని తలచుచు మరింత సమీపించాను. ఆతడు ఉచ్ఛ్వాస – నిచ్ఛ్వాసములు నిర్వర్తిస్తూ ఉండటం గమనించి, "ఈతడు నిర్జీవికానేకాదు. సజీవియే!" ...అని గ్రహించాను. ఇంకా ఇంకా సమీపించి చేతులతో ఆతని మణికట్టు, కణత విభాగం – గుండె సున్నితంగా స్పృశించాను. ఆతడు నా చేతి స్పర్శను ఎరుగుచున్నారని గమనించాను. నేలకు రెండు – మూడు అడుగుల ఎత్తులో మాత్రమే ఆతని శిరస్సు వ్రేలాడుచున్నది.

ఇక ఆ క్షణం నుంచి సమాధిలో ఉన్న ఆ వ్యక్తికి పరిశుభ్రం – హస్త స్పర్శ మొదలైన వాటితో సేవిస్తూ కొన్ని రోజులు గడిపాను. నేను సేవించటం ఆ వ్యక్తి గమనిస్తూనే 'ధ్యాననిష్ఠ'ను కొనసాగిస్తు న్నారని నేను గ్రహించి... వారితో సంభాషించాలనే ఉత్సుకతతో ఆ సేవానిరతిని కొన్ని రోజుల వరకు కొనసాగించాను. క్రమంగా ఆయనకు నాపై విశ్వాసం కలిగినట్లున్నది.

ఒక రోజు నావైపు కొంచెం కళ్ళు తెరచి చూచారు. అప్పుడు నేను, "మహాత్మా! మీరెవరు? ఈ లక్ష్య–అలక్ష్య రూపమగు జీవితము కలవారై ఇక్కడ ఈ దారుణమైన తపస్సు ఎందుకు కొనసాగిస్తున్నారు?" అని అత్యంత అనునయంగా ప్రశ్నించాను. అప్పుడాయన, పెదవులు విప్పి

"బాబూ! నా యొక్క కుల–దేశ–తపః ప్రయోజనాలు తెలుసుకున్నందువల్ల నీకు ఏమి ప్రయోజనం చెప్పు? ఏదైనా ప్రయోజనముంటేనే ప్రాణులకు ఆయా విచిత్రములైన కోర్కెలు సంభవిస్తాయి. నా గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస వలన నీకు ఒరిగేదీ లేదు. జరిగేదీ లేదు. కనుక... నీవు వెళ్ళి నీ యథాతథ జీవితం కొనసాగించు" ...అని చిరునవ్వుతో చెప్పి వెంటనే కనులు మూసుకున్నారు. నేనప్పుడు "ఈయన విషయం, చరిత్ర, ఆశయము తెలుసుకోవాల్సిందే!" ...అని మరింత జిజ్ఞాస పొందాను. వారిని అట్లాగే సేవిస్తూ, పైన కొమ్మ వద్ద త్రాడుతో బంధింపబడిన పాదముల ఉపరితలమును అక్కడి ఔషధ రూప ఆకులతో సేవనం చేస్తూ మరికొన్ని రోజులు గడిపాను.

మరొక రోజు ఎప్పుడో ఆయన సేవాసంతుష్టి ప్రదర్శిస్తూ కనులు తెరిచారు. నేను మరల నా ప్రశ్నను పునరుద్ఘాటించాను. అప్పుడాముని మృదుమధురంగా, సౌమ్యంగా ఇట్లా పలికారు.

**చెట్టుకు రెండు పాదములు కట్టివేయబడి తపస్సు కొనసాగిస్తున్న ఆ ముని :** "ఓ అకారణ మిత్రమా! బాటసారీ! నేను మధురా నగరంలో పుట్టాను. మా తండ్రిగారి శాస్త్రబోధచే పదపదార్థ జ్ఞానయుక్తుడ నైనాను. క్రమంగా యౌవన దశ పొందాను. అక్కడ నా తోటిమిత్రులు "అయితే చక్రవర్తిగానే పుట్టాలి. చక్కగా అన్ని భోగాలు అనుభవించటం జరుగుతుంది కదా!" అని చెప్పగా... "ఆహా! నేను సప్త ద్వీపాలతో కూడిన రాజ్యమునకు రాజునై, నన్ను అర్థించ వచ్చిన జనులకు ఏది కావాలంటే అది ఇవ్వగలిగే సమర్థత ఎప్పటికి పొందుతాను?" ...అని చిరకాలం చింతించసాగాను. ఆ విధంగా ఈ భూమికంతటికీ చక్రవర్తిని కావాలనే ఆశయంతో ఇక్కడికి వచ్చి 12 సంవత్సరములుగా ఈ తపస్సు కొనసాగిస్తున్నాను. ఓ మిత్రమా! విషయం ఇది... విన్నావు కదా! ఇక నీకు ఎటు ఇష్టమో అటు వెళ్ళు. నేను నా అభీష్టం నెరవేరే వరకు ఇట్లాగే తపస్సు కొనసాగిస్తాను."

అది విని... నేను "ఓ సాధూ! మీరు మీ అభీష్ట సిద్ధిని పొందేవరకూ మీకు సేవచేస్తూ మీ రక్షణ అనే రూపంగా నా తపస్సు నేనూ కొనసాగిస్తాను" ...అని పలికాను. అది విన్న మరుక్షణం శమశీలుడగు ఆ తాపసి శిలవలె మౌనం వహించి, కనులు మూసుకొని, బాహ్య చేష్టలు త్యజించి తపస్సు నిర్వర్తించసాగారు. నేను అక్కడ కాలకృత్యమైన శీతోష్ణములను సహిస్తూ... భయ – చింతారహితుడనై "ఈ తాపసి యొక్క తపోసమయ భౌతికదేహ సేవయే నా తపస్సు" అని అనుకుంటూ సేవానిరతిని కొనసాగించాను. అట్లా 6 నెలలు గడచిపోయాయి.

❖

ఒక రోజు సూర్యబింబం నుండి జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూ ఒక కాంతి పురుషుడు ఆ తపస్వికి ఎదురుగా నిలచాడు. అప్పుడు మేమిద్దరం వారికి ప్రణమిల్లాం. మనోవాక్కాయములతో వారికి పూజ సమర్పించాం. ఆ సూర్యకాంత పురుషుడు అమృతప్రాయంగా ఇట్లు పలికాడు.

**సూర్యతేజో పురుషుడు :** వృక్ష శాఖకు వ్రేలాడుతూ సుదీర్ఘంగా తపస్సు చేయటంలో తత్పరుడవై ఉన్న ఓ బ్రాహ్మణుడా! ఇక నీ తపస్సు చాలించి, నీ అభిమతం ఏమిటో... ఆ వరమును స్వీకరించు.

**దీర్ఘ తపస్వి :** ఓ ఆదిత్య పురుషుడా! మీరు సర్వాత్మ స్వరూపులు. నా అభీష్టం మీకు తెలియనిది

కాదు. అయినా చెప్పుచున్నాను. నాకు సప్త మహాద్వీపములతో కూడిన భూ సామ్రాజ్యానికి చక్రవర్తిని అవాలని కోరిక ఉన్నది.

**సూర్యతేజో పురుషుడు (ఆదిత్య పురుషుడు) :** ఓ బ్రాహ్మణుడా! అట్లాగే నీవు ఈ శరీరంతో నిర్వర్తించిన తపస్సుకు ఆదిత్య హృదయులమగు మేము మెచ్చాం. ఇట్టి తపస్సు యొక్క పుణ్యంచేత నీవు సప్త సముద్రములచేత – సప్త ద్వీపముల చేత కూడియున్న భూమిని చక్రవర్తివై 7000 సంవత్సరములు పాలించగలవు.

❖

ఈ విధంగా పలికి ఆ ఆదిత్య పురుషుడు అంతర్ధానం అయ్యాడు. అప్పుడా దీర్ఘతపస్వితో నేను ఇట్లా అన్నాను– "హే మహాత్మా! మీ అభిమతం నెరవేరింది కదా! మీ పాదముల నుండి ఈ కట్టు త్రాళ్ళను విప్పి వేయమంటారా? ఇక ఇక్కడి నుండి మీరు మీ గృహం చేరవచ్చు కదా!"

అప్పుడా తపస్వి "అట్లాగే" అని అనగానే, ఆయన సుతిమెత్తని పాదాలకు కట్టి ఉన్న కట్టుత్రాళ్ళను విప్పి ఆయనను నెమ్మదిగా భూమిపై జేర్చాను. అప్పుడా బ్రాహ్మణుడు ఆ ప్రక్కనేగల సెలయేరులో స్నానం చేసి అఘమర్ష మంత్రమును జపించారు. ఆ చెట్టు ఫలాలతో అప్పుడే పరమాత్మను నైవేద్యాది సేవలతో మంత్ర యుక్తంగా జపించారు. ఆ వృక్షం నీడలోనే ఇద్దరం కూడా క్షోభవర్జితులమై ఆ వృక్ష ఫలాలు భుజిస్తూ ఆతని పాదపీడనం యొక్క నివృత్తి అయ్యేవరకు 3 రోజులు అక్కడే ఉన్నాం.

❖❖❖

## 2. వరములు - శాపములు

**కుందదంతుడు :** ఓ రామచంద్రా! ఓ సభికులారా! 3 రోజుల తరువాత ఉదయమే అక్కడి నుండి ఇక మధురాపురమునకు సూర్య చంద్రులవలె సంతోషాంతరంగులమై బయలుదేరాం. పగలంతా నడుస్తూనే ఉన్నాం. సాయంకాలం "త్వరగా ఏదైనా సురక్షిత ప్రదేశమునకు చీకటి పడకముందే చేరుదాం" అని అనుకున్నాం. అట్లా పోతూ పోతూ మార్గమధ్యంలో "రోధ" అనే పేరుగల గ్రామం చేరాం. అక్కడి మామిడి తోటలలో రెండు రోజులు విశ్రాంతి తీసుకొని, ఇక అక్కడి నుండి అనేక సజల భూములు, నదీ ప్రాంతాలు, సెలయేళ్ళు, సరస్సులు దాటివేసి... ఆ రాత్రికి ఒక ప్రదేశంలో గల అరటితోటలో ప్రవేశించి విశ్రాంతి తీసుకున్నాం. ఆ తరువాత మరల 3 రోజులు ప్రయాణించి ఒక అరణ్య ప్రదేశం చేరాం. అప్పుడు ఆ దీర్ఘ తపస్వి నాతో ఇట్లా అన్నారు.

**దీర్ఘ తపస్వి :** మిత్రమా! మనం చక్కగా చాలాదూరం ప్రయాణించి ఇక్కడికి వచ్చాం. అయితే, ఇక్కడి నుండి ఈ మధురానగరం వెళ్ళే మార్గాన్ని వదలి వేరే మార్గంలో 'గౌర్యాశ్రమము' అనే చోటికి పోదాం. ఎందుకో తెలుసా? ఆ గౌర్యాశ్రమంలోకి మనం ప్రవేశించటంలో నాకు రెండు ఉద్దేశాలు ఉన్నాయి.

1. గౌర్యాశ్రమం అత్యంత మనోహరంగా ఉంటుంది. నన్ను సేవించినట్టి నీకు ఆ సుందరమైన ఆశ్రమ దర్శనసుఖం లభించాలని నా వేడుక. అక్కడ అనేక మంది మహనీయులు వచ్చి తపస్సు

చేసుకుంటూ ఉంటారు. తపస్సుకు సానుకూల్యంగా పర్ణశాలలు ప్రకృతి సిద్ధంగానే నిర్మితమై ఉంటాయి. సెలయేళ్ళు అత్యంత ఆహ్లాదజనకంగా ఉంటాయి. అక్కడి చిలకలు కూడా వేదగానం చేస్తూ ఉంటాయి. బ్రహ్మలోకంతో సమానమైన ఆ ఆశ్రమ దర్శనం చేత చిత్తము యొక్క సర్వదోషములు శమిస్తాయి. అక్కడి తత్త్వదర్శనంచే పూర్ణ మనోహర చిత్తులగు మునుల దర్శనభాగ్యం కొరకు, సేవాభాగ్యం కొరకు, సుదూర ప్రాంతం నుండి కూడా ముముక్షువులగు జనులు వచ్చి వెళుతూ ఉంటారు. ధీరులు, విద్వాంసులు అగు మహనీయులతో సంభాషించటం కొరకు వెళ్ళే మనవంటి వారి విషయం ఇక వేరే చెప్పేదేమున్నది?

2. మరొక్క ముఖ్యమైన విషయం. "మేము 8 మంది అన్నదమ్ములం. అందరం కూడా "ఈ భూమికి చక్రవర్తి కావాలి"... అనే ఆశయంతో ఆ గౌర్యాశ్రమం వచ్చి తపస్సు ప్రారంభించాం. 6 నెలలు తరువాత నేను మాత్రం శ్రీశైలం వచ్చి నా ఇచ్ఛానుసారంగా అక్కడి అరణ్యంలో తపస్సు చేయటం జరిగింది. బహుశః మా సోదరులు కూడా తపఃస్సిద్ధి పొందుతూ ఉండవచ్చు. ఇప్పుడు వారు ఎట్లా ఉన్నారో కూడా పరామర్శించవచ్చు.

❖

అది విని నేను ఆ దీర్ఘ తపస్వితో "సరే! తమ అభీష్టానుసారంగా అట్లే జరుగునుగాక! మనం ఇప్పుడు గౌర్యాశ్రమం వెళ్ళుదాం" ...అని అన్నాను. అప్పుడు ఆయన చెప్పినట్లు మేము 'గౌర్యాశ్రమం' అనే ప్రదేశం చేరాం. అయితే ఆ దీర్ఘ తపస్వి ... ఆ ప్రదేశమంతా శూన్యంగా ఉండటం చూసి, "ఇదేమిటి? ఇక్కడ 12 సంవత్సరాల క్రితం గొప్ప వనం ఉండాలే! ఇప్పుడిదంతా శూన్యంగా ఉన్నదే!" అని ఆశ్చర్యపోయారు. ఎందుకంటే, అక్కడ వృక్షాలు గాని, ప్రకృతి నిర్మితమైన కుటీరాలుగాని, పొదలుగాని, మనుజులుగాని, మృగములుగాని, ఆ బ్రాహ్మణ సోదరులుగాని కనిపించలేదు. ఆ విశాలారణ్య ప్రాంతం కేవలం శూన్యమై ఉండగా వేడిమిచే సర్వత్రా సంతప్తమైన కొండరాళ్ళతో కనిపించింది. "అరె! ఏమి కష్టం! నా ఏడుగురు సోదరులు ఏమైనారు?" అని ఆ తాపసుడు కంగారుపడుతూ ఉండగా, మేమిద్దరం ఆ ప్రదేశమంతా ఏవైనా వృక్షములు కనిపిస్తాయేమోనని వెదుకసాగాం. అట్లా వెతకగా – వెతకగా చాలా సేపటికి ఒకచోట కొంత దూరంలో ఒక వృక్షం కనిపించింది. మేము ఆ వృక్షమును సమీపించాము. ఆ వృక్షం దట్టమైన కొమ్మలు ఆకులు కలిగినదై మనోహరంగా ఉన్నది. ఆ వృక్షపు మొదట్లో ఒక వృద్ధ తపస్వి సమాధి పరాయణుడై కనిపించారు. ఆ వృద్ధుడు సమాధి నుండి లేచేంత వరకు అక్కడే ఉండాలని నిర్ణయించుకొని ఎదురుగా గల ఒక ప్రదేశంలో ఆసీనులమైనాం. కొంత సమయమైన తరువాత నేను ఉద్వేగం ఆపుకోలేక చపలచిత్తుడనై "ఓ మునీశ్వరా! ఇక మీరు సమాధి నుండి లేవండి"... అని బిగ్గరగా పలికాను. అప్పుడు మేఘగర్జనచే సింహం మేల్కాంచినట్లుగా ...నా గొంతుక చేసిన శబ్దానికి ఆ మునివర్యులు సమాధి నుండి మేల్కొని కనులు తెరిచారు.

**గౌర్యాశ్రమముని :** ఓ సాధువులారా! మీరెవరు? (చుట్టూ ఒకసారి పరికించి, కించిత్ ఆశ్చర్యంగా) ...అరె! గౌర్యాశ్రమం ఏమైనది? నన్ను ఇక్కడికి ఎవరు తెచ్చారు? ఇప్పుడు ఏ కాలం కడుస్తోంది?

**నేను (కుందదంతుడు) :** హే మహాత్మా! ఈ విషయాలు మాకుకూడా తెలియవు. తమరు సర్వజ్ఞులు. యోగబలం కలవారు. మీరే విశేషాలు దివ్యదృష్టిచే వాటిని గమనించగలుగుతారు కదా!

❖

అప్పుడా గౌర్యాశ్రమముని మరల కనులు మూసుకొని, ధ్యానపరాయణులై తన యొక్క - మా యొక్క వృత్తాంతమంతా దివ్యదృష్టితో యోగబలంచేత వీక్షించసాగారు.

❖

**గౌర్యాశ్రమముని :** ఓ ఆర్యులారా! కార్యవేత్తలారా! ఈ వృత్తాంతం ఏమి ఆశ్చర్యకరం! ఈ కదంబ (కడిమి) వృక్షమే మొదటి నుండి కూడా నా నివాస స్థానమై కొనసాగుతోంది. నేను గౌర్యాశ్రమం విడచి మరెక్కడా లేను.

ఒకసారి ఏదో ఒక కారణం చేత గౌరీదేవి సరస్వతీ రూపమును ధరించి, సమస్త ఋతువులచే సేవించబడుచూ ఇక్కడ 12 సంవత్సరాలు ఉండటం జరిగింది. ఆ కారణం చేతనే, ఈ ప్రదేశం ఒకప్పుడు అనేక వృక్షములచే దట్టమై విస్తరించటం జరిగింది. అనేక సరస్సులతోను, మున్యాశ్రమాల తోను ఈ ప్రదేశము ఒకప్పుడు 'గౌరీవనము' అనే పేరుతో ప్రసిద్ధికెక్కియున్నది. అందుచేతనే ఈ వనం ప్రకృతిదేవత మనోహరంగా తీర్చిదిద్దిన సౌందర్యలహరివలె ప్రకాశిస్తూ ఉండేది. అప్పట్లో ఆ గౌరీదేవి ఈ కదంబ వృక్షపు నీడలోనే వసించేది. ఆ భగవతి కరస్పర్శచేతనే ఈ వృక్షం వృద్ధాప్యం పొందక నిత్యయౌవనంతో విరాజిల్లుతోంది. ఆ గౌరీ భగవతి ఈ స్థానమును విడచివెళ్ళిన తరువాత ప్రదేశమంతా ఫల-పుష్ప-కాష్ఠాదులు అమ్ముకొని జీవించే జనులకు ఆశ్రయమై సామాన్యమైన వనంగా మారిపోయింది. ఆ గౌరిదేవికి మాత్రం "కదంబవనవాసినీ" అనే పేరు సార్థకమైనది.

ఇక నా గురించి. ఇక్కడికి సుదూరంగా 'మాలవము' అనే రాజ్యానికి నేనొకప్పుడు పూర్వాశ్రమంలో రాజును. ఒక సమయంలో వైరాగ్యపూర్వకంగా ఆ రాజ్యమును త్యజించి మునులచే పరివేష్టితమైన ఈ గౌర్యవనానికి వచ్చాను. ఇక్కడి ఆశ్రమవాసులచే సుస్వాగతుడనై కదంబ వృక్షం క్రింద ధ్యాన పరాయణుడనైనాను. కొంతకాలం తరువాత ఈ తాపసుడు, ఈతని ఏడుగురు సోదరులు తపస్సు చేసుకోవటానికి ఇక్కడికి ఆశ్రమానికి వచ్చి ఈ ప్రదేశపు తదితర తాపసువలెనే తమతమ తపస్సులు ప్రారంభించారు. ఒక 6 నెలలు తరువాత నీవు శ్రీశైల ప్రదేశపు అడవులలో తపస్సు చేసుకోవటానికి బయలుదేరావు కదా!

రెండవవాడు కార్తికేయస్వామి ఉండే ప్రదేశానికి, మూడవవాడు కాశీపుర ప్రాంతానికి, నాలుగవవాడు హిమాలయ పర్వత ప్రాంతానికి... తపస్సు కొరకై తమకు ప్రియమైన ప్రదేశాలకు వెళ్ళారు. మిగతా నలుగురు ఇక్కడే తపస్సు కొనసాగించారు. మీ 8 మంది సోదరుల ఆశయం కూడా "ఈ పృథివి కంతటికీ చక్రవర్తి కావాలి!" ...అనియే కదా! మీ సోదరులందరూ ఇష్టదేవతా దర్శనముచే వరసిద్ధి పొందారు. నీవు ఇంకనూ తపస్సు కొనసాగిస్తూ ఉండగా... తక్కిన వారంతా మీ ఇల్లు చేరారు.

"మేము ఈ పృథివికి ప్రభువులం కావాలి. మా పాలనలో ప్రజలందరూ అసత్యమును త్యజించి ధర్మనిరతులై ఉండాలి. జనులందరు వారి వారి ఆశ్రమ ధర్మములు చక్కగా నిర్వర్తిస్తూ ఉండాలి." – అని మీ సోదరులు ఆశయము కలిగి, తమ తమ ఇష్టదేవతలను ప్రసన్నం చేసుకొని, అది అట్లే వరంగా పొందారు.

ఆ తరువాత – తరువాత ... ఇక్కడి చుట్టుప్రక్కల పట్టణంలోని ధనికులు ఇక్కడి ప్రదేశములను ఆక్రమించుకోవటం చేత ఇక్కడి 'వనము' శిథిలం కాసాగింది. ఇక్కడి ఆశ్రమవాసులంతా వేరే వేరే ప్రదేశాలకు తరలి వెళ్ళిపోకతప్పలేదు. నేను మాత్రం ఒంటరిగా ధ్యానమునందే లగ్నమైన చిత్తము కలవాడనై... గౌరీదేవి యొక్క కరస్పర్శచే పవిత్రమైయున్న ఈ కదంబ వృక్షము క్రిందే పర్వతం వలె నిశ్చలంగా ఉండిపోయాను. ఇక కాలం ఋతు – సంవత్సర రూపంగా గడచిపోతూ ఉంటే ఈ వనమంతా అట్లా సమీప జనుల చేత ఛేదించబడినదయింది. ఈ కదంబ వృక్షమును మాత్రం "ఇది సరస్వతీ స్వరూపం" ...అని తలచి జనులు పాడుచేయలేదు. ఇక్కడి సమాధిలో నిమగ్నుడైన నన్ను పూజిస్తున్నారు. అందుచేతనే ఈ ఒక్క వృక్షం యథాతథంగా మిగిలిపోయింది. ఆ తరువాత కొద్ది నెలలకు మీరిద్దరూ ఇక్కడికి వచ్చారు. ఓ ప్రియ మిత్రులారా! ఈ విధంగా నేను ధ్యాన నిష్ఠయందు చూచినదంతా మీకు చెప్పాను.

ఓ సుదీర్ఘ బాటసారులారా! ఇక మీరు మీ మీ గృహములకు వెళ్ళవచ్చు. అక్కడ ఈతని ఏడుగురు సోదరులు ఇప్పటికే ఇల్లు చేరి అక్కడి భార్య – పిల్లలు మొదలైన విశేషాలతో మునిగి తేలుచున్నారు. వారితో మరల కలయిక కలుగగలదు.

❖

ఓ శ్రీరాముడు మొదలుగాగల ఆర్యులారా! అప్పుడు నాకు కలిగిన ఒక సందేహం గురించి యోచిస్తూ నేను ఈ విధంగా ప్రశ్నించాను.

❖

**నేను (కుందదంతుడు) :** హే మహాత్మా! యోగిపుంగవులగు మీ సమక్షంలో నాకు ఇప్పుడో గొప్ప సందేహం వచ్చింది. కుందదంత నామధేయుడను, విదేహ సామ్రాజ్య వాసిని అగు నేను తమకు విధేయుడనై మీ పాదములు స్పృశిస్తూ నాకు వచ్చిన సందేహమును మీ ముందుంచుతాను. నివృత్తింపజేయ వేడుకొంటున్నాను.

**కదంబ తాపసుడు :** సరే! తప్పక అడుగు. నాకు తెలిసినంత వరకు నీ సందేహమును నివర్తింప జేయటానికి నేను సిద్ధమే!

**నేను (కుందదంతుడు) :** "ఇప్పుడీ 8 మంది అన్నదమ్ములు సప్తద్వీప – సప్త సముద్ర సహిత పృథివికి చక్రవర్తులం కావాలి" ...అనే వరాలను తమతమ ఇష్ట దేవతల నుండి సిద్ధింపజేసుకొన్నారు కదా! మరి ఈ 8 మంది పొంది ఉన్న వరముల ఫలితాలు ఒక్కసారే ఈ పృథివిపై ఎట్లా సిద్ధి స్తాయి? ఒకే ఒరలో 8 కత్తులుండవు కదా! ఒకే భూమికి 8 మంది చక్రవర్తులు ఎట్లా కానున్నారు?

**కదంబ తాపసుడు :** ఓహో! ఇదేనా నీ సందేహం? అయితే ఈ వ్యవహారంలో ఇంతకన్నా అసమంజస మైన మరొక విషయం (వీరి కుటుంబంలో) ఏర్పడి ఉన్నది. అదేమిటంటే, ఈ 8 మంది సోదరుల దేహాలు నశించిన తరువాత ...వారు తమ గృహంలోనే, తమ తమ పడక గదులలో సప్తద్వీప సమన్వితమగు భూమిపై 7000 సంవత్సరాలు చక్రవర్తులై ఒకేసారి రాజ్యం ఏలబోతున్నారు.

**నేను (కుందదంతుడు) :** ఆశ్చర్యమే! వారు తమ పడకగదులలోనే సప్తద్వీపములతో గూడి ఈ భూసామ్రాజ్యాన్ని ఎలా ఏలటం జరుగుతుంది? అటువంటి సందర్శనం, అగత్యము ఎట్లా వచ్చాయి?

**కదంబ తాపసుడు :** ఆ విశేషమేమిటో కూడా... చెపుతాను విను.

❖

ఈ 8 మంది సోదరులకు అష్టతారల వలె ఉత్తమ గుణ సంపన్నులగు 8 మంది భార్యలు ఉన్నారు. తమ భర్తలు చిరకాలం తపస్సు చేయటానికి వెళ్ళినప్పుడు వారు ఎంతో దుఃఖం పొందారు. భర్తకు దూరంగా ఉండటమనేది ఏ స్త్రీకైనా దుస్సహమైన విషయమే కదా! అందుచేత దుఃఖనివారణం కొరకై ఆ 8 మంది తోడికోడళ్ళు "శతచాంద్రాయణం" అనే కఠోరమైన తపస్సు ఆచరించారు. వారి తపస్సుకు మెచ్చినదై భగవతియైన పార్వతీదేవి పూజ జరుగుచున్న సమయంలోనే అశరీరవాణిగా, ఆ 8 మందితో విడివిడిగా, "ఓ బిడ్డా! నీకేం వరం కావాలో కోరుకో"అని పలికింది. ఆ వాక్యాలను విని "చిరంటిక" అనే పేరుగల మృధుభాషిణి యగు పెద్ద కోడలు ఈ నీ మిత్రుని అర్ధాంగి.... భగవతి యొక్క కరచరణాలపై మనోకల్పితమైన పుష్పగుచ్ఛాలు ఉంచి, దేవికి స్తవనం సమర్పించింది.

**చిరంటిక :** దేవీ! దేవాదిదేవుడగు శ్రీశంకరుల పట్ల నీకు ఏ రీతిగా ప్రేమ గలదో... ఆ రీతిగా నా భర్త పట్ల కూడా నాకు ప్రేమ! అటువంటి నా భర్త మృత్యురహితుడై ఉండుగాక! ఇది వరంగా ప్రసాదించు!

**శ్రీ పార్వతీదేవి :** ఓ సువ్రతీ! చిరంటికా! నీ భర్తకు మృత్యువే ఉండకూడదనియా... నీవు కోరుకొనేది? అయితే సృష్ట్యాది నుండి ప్రవృత్తమై ఉన్న నియతి (లేక) ఈశ్వరాజ్ఞ యొక్క దృఢత్వం అనివార్యం. ఏ జీవునికైనా ఎప్పటికో అప్పటికి ఈ భౌతిక దేహం నశించవలసినదే! తపోధ్యానాదులచే మృత్యు రాహిత్య పదవి లభించజాలదు. ఇంకొక వరమేదైనా కోరుకో!

**చిరంటిక :** ఓ దేవదేవీ! అంబికా! సరే, అట్టి అమరత్వ పదవి లభింపకపోతే ... నా భర్త ఎప్పుడు మరణించునో... అప్పుడు నా భర్త జీవచైతన్యం, మేము ఉండే పడకగదిలోనే, నా గృహంలోనే ఉండాలి. బయటకు పోనే కూడదు! ఈ వరం దయతో అనుగ్రహించు.

**దేవి :** పుత్రీ! అట్లే అగుగాక! మీరున్న గృహంలోనే మీ పడగకగదిలోనే నీ భర్త సప్త ద్వీపములకు ఆధిపత్యం వహించటం జరుగుతుంది. ఆ తరువాత, ఈ నీ దేహానంతరం మరల నీవు ఆతని ప్రియురాలివగు భార్యవు అవుతావు. నీకు ఆనందమగుగాక!

❖

**వృద్ధ తాపసుడు :** విన్నావా? కుందదంతా! ఇట్లా పలికి ఆ గౌరీదేవి అంతర్ధానం అయింది. అదే

రీతిగా మిగతా ఏడుగురు భార్యలు అటువంటి వరాలే పొందారు. ఆ తరువాత ఈతని ఏడుగురు సోదరులు కూడా మహావరాలు పొందినవారై ఇంటికి జేరారు. ఈ పెద్ద సోదరుని గురించి అక్కడ వీరి కుటుంబ సభ్యులందరూ ఎదురు చూస్తున్నారు. ఈతడు తన భార్యయగు చిరంటిక వద్దకు వెళ్ళును గాక! ఈ సోదరుల – బంధువుల సమ్మేళనం ఆ విధంగా జరుగుచున్నది. కనుక వారు ఆ గృహంలోనే వారి వారి పడక గదులలో ఒకేసారి సప్త సముద్ర సహిత మహాసామ్రాజ్యాలకు ఒకే సమయంలో వేరు వేరుగా ఆధిపత్యం వహించనున్నారు.

ఇది ఇట్లా ఉండగా... అక్కడ ఇంకొక సంఘటన కూడా జరిగింది. అది కూడా చెప్పమంటావా?

**నేను (కుందదంతుడు) :** స్వామీ! మీరు చెప్పింది ఇంకా ఆశ్చర్యం. ఈ 8 మంది సోదరులు ఒకే గృహంలో వారి వారి పడక గది ఆకాశాలలో 8 సప్త సముద్రములతో కూడిన మహా భూమండలాలకు వేరువేరుగా ఒకేసారి సుదీర్ఘంగా చక్రవర్తులై ఆధిపత్యం వహించచున్నారా? ఇదంతా ఎలా సాధ్యం? అది అలా ఉండి... ఇది కాక వీరి కుటుంబంలో మరొక విశేషం కూడా జరిగిందని అంటున్నారు కదా! అది ఏమిటో చెప్పండి.

**వృద్ధ తాపసుడు :** అట్లాగే విను. చెపుతాను.

ఈ 8 మంది సోదరులు తపస్సుకు తరలి వెళ్ళిన క్రొత్తలో తమ 8 మంది కోడళ్ళ యొక్క భర్తృవిరహ దుఃఖం చూడలేక వారి తల్లిదండ్రులు, ఆ కోడళ్ళకు అత్తమామలు అయినట్టి ఆ వృద్ధ దంపతులు తమ కోడళ్ళతో సహా తీర్థయాత్రలకు బయలుదేరారు. త్రోవలో అనేక తీర్థములు, మున్యాశ్రమములు సందర్శించటం జరిగింది. ఒకసారి ఆ పుణ్య దంపతులు శరీరం యొక్క శ్రమను కూడా లెక్కచేయక, తమ పుత్రులు కార్యక్రమ దిగ్విజయం కొరకై "కలాప" అనే తీర్థమునకు కోడళ్ళతో సహా బయల్వెడలారు. అట్లా నడుస్తూ ఉండగా ఒకచోట బాటప్రక్కగా ఊర్ధ్వ జటాధారియగు ఒక మనుజుడు కూర్చుని ఉన్నాడు. ఆయన తెల్లటి దేహంతో, పొట్టిగా అవయవములకు బూడిద పూసుకుని కనులు మూసుకొని ఉన్నాడు. కొందరు ఆతనికి నమస్కరిస్తూ వెళ్ళుచున్నారు. ఈ మన వృద్ధ దంపతులు ఆ మనుజుని చూచారు. కానీ "ఈతడు ఎవరో సామాన్యుడగు వృద్ధ బాటసారి అయి ఉంటాడులే" ...అని అనుకొని నమస్కరించక కొంచెం నిరాదరణ దృష్టి కలిగి ఉన్నవారై త్వరత్వరగా నడువసాగారు. అప్పుడు వారి పాదముల తాకిడికి బాటపైగల కొంచెం ధూళి గాలికి లేచి ఆ బాట ప్రక్కనున్న మనుజునిపై పడింది. ఆయన మరెవరో కాదు. శివాంశ సంభూతుడగు దుర్వాస మహాముని. ఆ ధూళి తనపై పడటం గమనించి ఆ మహాముని కోపంతో కళ్ళు తెరచాడు.

**దుర్వాస మహాముని :** పత్నీ–కోడళ్ళు–వియ్యంకుల సమేతంగా తీర్థయాత్రలకు బయలుదేరిన ఓ మూర్ఖుడా! దుర్వాసుడనగు నాకు నమస్కరించకుండా ధాటిగా దాటిపోతున్నావు కదా! అయితే నీ 8 మంది కుమారులు – 8 మంది కోడళ్ళు కలిసి తమ తమ తపస్సులచే ఏఏ వరములు పొందనున్నారో... వాళ్ళంతా మహా వరములు సముపార్జించినప్పటికీ కూడా... అవి విపరీత దుఃఖ ఫలములనే ఒసంగుగాక! అవి నిష్ప్రయోజనమగు గాక! వారి పట్ల వరం శాపముగా అగుగాక!

ఇది విన్న ఆ వృద్ధ దంపతులు జరిగిన ప్రమాదం గుర్తించి ఆ మునికి సాష్టాంగ ప్రణామములు సమర్పించే లోపే ఆ దుర్వాసముని అంతర్ధానమయ్యారు. అప్పుడా వృద్ధ దంపతులు చాలా దుఃఖితులయ్యారు. "ఇదేమి కర్మరా బాబూ? ఆయన దుర్వాసముని అని మాకు తెలియదు కదా! ఎవ్వరో సామాన్యులైన బాటసారి అని అనుకున్నాం. ఇంత మాత్రానికి ఇంత శాపమా?" ...అని కృశించినవారై. దీనముఖులై, నిరాశ చెందినవారై యాత్ర నుండి తిరిగి గృహానికి చేరారు.

చూచావా కుందదంతా! ఒకరు సప్త సముద్రములతో కూడిన రాజ్యముపై ఆధిపత్యం పొంది చక్రవర్తి కావాలని వరం కోరుకోవటం. ఇంకొకరు ఆ వరభోక్త తమ ఇంట్లోనే ఉండాలని వరం పొందటం. మరొకరు వారి వరం నిష్ఫలమై దుఃఖమాత్రం కావాలని శాపం పొందటం.

కాబట్టే వీరి కుటుంబ సభ్యుల వృత్తాంతమంతా ఒక అసమంజసం కాదు... అనేక అసమంజసాలతో కూడుకొని ఉన్నదని నేననటం జరిగింది. "కంతముపై వాపు, ఆ వాపుపై కురుపు, ఆ కురుపు పగలటం" ...ఇట్లా అనేక అసమంజసమైన విషయాలు వీరి గృహంలో సమకూడుకొని ఉన్నాయి. ఇదేమంత విచిత్రమేమీ కాదు. ఎందుకంటావా?

శూన్యరూపమైన ఆకాశంలో గంధర్వనగరం వంటి భూప్రదేశాలు, అందులో ఉల్కాపాతాలు, ఇంకా ఎన్నో దృశ్య విజృంభణములు సంభవించటం లేదా? చిదాకాశము యొక్క సంకల్ప రచితమగు ఈ జగద్రూప మహాపురములలో చిత్ర – విచిత్రములైన అసమంజస విశేషాలకు కొదవ ఏమున్నది?

❖❖❖

## 3. వర - శాపముల సంవాదము

**నేను (కుందదంతుడు) :** ఓ రామచంద్రా! ఓ వేదవేత్తలతో కూడిన ప్రియ సభికులారా! వింటున్నారు కదా! అప్పుడు నేను ఆ గౌర్యాశ్రమ వృద్ధ తాపసుని మరల ఇట్లా ప్రశ్నించాను.

❖

**నేను (కుందదంతుడు) :** హే తాపసేశ్వరా! మీరు చెప్పే చమత్కారమైన విషయం ఎట్లా సంభవించు చున్నదో నాకు ఇప్పటికీ ఏమాత్రం బోధపడనేలేదు.

1. ఇచ్చట సప్త ద్వీపవతియగు పృథివి ఒక్కటే ఉన్నది కదా! మరి ఏకకాలంలో 8 మంది ఎట్లా సప్త ద్వీప ప్రభువులు కానున్నారు?

2. ఈ జీవులు వారియొక్క దేహములు పతనమైన తరువాత కూడా వారంతా ఆ గృహాంతర్గత ప్రదేశాన్ని విడవకుండానే .... సప్తద్వీప సమేత సామ్రాజ్యాన్ని 7000 సంవత్సరాలు ఎట్లా ఏలనున్నారు?

3. "ఆ వరములు నిష్ప్రయోజనం అవుతాయి" అన్న శాపం ఎట్లా కార్యోన్ముఖం కాగలదు? అర్ధరాత్రి సూర్యుడు ఉదయిస్తాడా?

వరదాతలచే ఒసగబడిన వరములు శాపప్రదాతలచే ఒసగబడిన శాపములచే ఆ కుటుంబం విరుద్ధ ఫలితాలు ఎట్లా పొందనున్నది? పరస్పర విరుద్ధములైనట్టి ఈ వరములు – శాపములు

ఒకే ధర్మం పట్ల ఒకే తరుణంలో విరుద్ధ ధర్మాలు ఎట్లా ప్రదర్శించ గలుగుతాయి? ఒకవేళ వర శాపములు శుభ – అశుభ ధర్మములు ఒకదానికి మరొకటి ఆశ్రయంగా కలిగియున్నాయందామా? ఎక్కడన్నా ఆధారమే ఆధేయం కాగలదా? నేలపై నడిచేవాడు నేలకే ఆధారం అవుతాడా, ఎక్కడన్నా? లేదుకదా!

**గౌర్యాశ్రమ వృద్ధ తాపసి :** ఓ సాధూ! వీటన్నిటిలో ఏ అసమంజమైనది నీకు కనిపిస్తోందో... నాకేమీ అర్థం కావటం లేదు. అయితే... ముందు ముందు ఏమి కానున్నదో అది చెప్పుతాను... విను. ఇందులోని చమత్కారం నీకే అర్థమౌతుంది.

**భవిష్యత్‌లోని సంఘటనలు -** ఈ రోజు నుండి 8వ రోజుకు ఇతడు మధురానగరం జేరనున్నాడు. అక్కడ స్వబంధువులతో కొంతకాలం గడచిపోనున్నది. ఈతని రాకచే వీరి గృహాలలో అందరూ చాలా సంతోషంగా కొన్ని రోజులు గడుపుతారు. ఆ తరువాత కొన్నాళ్లకి ఈ 8 మంది సోదరులు ఆ గృహంలో మరణించటం జరుగుతుంది. అప్పుడు బంధువులు ఆ దేహాలకు దహన క్రియలు నిర్వర్తిస్తారు. అటు తరువాత ఆ ఈ 8 జీవచిత్ సంవిదాకారములు అదే గృహంలో వేరువేరుగా స్థితి పొందియున్నవై... 4 ఘడియల కాలం సుషుప్తిని పొంది జడస్థితియందు ఉంటాయి. అప్పుడు ఒక చమత్కారమైన విషయం జరుగుతుంది.

❖

ఆ 8 మంది సోదరుల జీవ సంవిత్తులు వీరి మరణానంతరం కొంత సమయం జడస్థితిని అనుభవిస్తూ ఉంటాయని చెప్పాను కదా!... ఆ సమయంలో వారి వరరూప కర్మలు శాపరూప కర్మలు అవశ్యం ఫల దాతృత్వం చేసే నిమిత్తమై సంసిద్ధమై వీరి చిత్తాకాశాలలో ఒకచోట సమావేశ మౌతాయి. ఆ వర కర్మలు – శాపకర్మలు ఆయా ఫలములను ప్రసాదించే అధిష్ఠాన రూప దేవతా రూపములు దాల్చుతాయి. వేర్వేరు శరీరములు రచించుకుంటాయి.

వరరూప దేవతలు – ఉత్తమ సౌభాగ్యశీలురై, చేతులలో పుష్పాలు, బ్రహ్మదండాలు ధరించి అతి శుభ్రమైన అవయవాలు కలిగి విష్ణురూపధారులై అక్కడికి వస్తారు. శాపరూప దేవతలు – త్రినేత్రులై, చేతిలో శూలం ధరించి, భయంకరాకారాలతో మేఘం వంటి నల్లని భుజాలతో క్రోధ ముఖులై వస్తారు.

❖

**వర దేవతలు :** ఓ శాపములారా! ఇక మీరు దూరంగా పోండి. మేము ఫలించనున్నాము. మమ్ములను క్రియత్వమునుండి ఆపటానికి సమర్థులెవరూ లేరు.

**శాపములు :** ఓ వరములారా! ఇది మేము ఫలించే సమయం. మీరే దూరంగా పోవలసి ఉన్నది.

**వరములు :** మీరు దుర్వాసమునిచే సంకల్పించబడ్డారు. ఇక మేమో? సూర్య భగవానునిచే నియమించబడ్డాం. మునుల కంటే ముందే బ్రహ్మదేవుడు సూర్య భగవానుని సృష్టించారు. కాబట్టి మునుల కంటే సూర్య భగవానుడే అధికుడు.

**శాపములు :** (క్రోధంగా) ఓ వరములారా! మీరు సూర్యునిచే సంకల్పించబడ్డారు. నిజమే. కాని మేము రుద్రభగవానుని అంశభూతుడగు దుర్వాసునిచే నియమించబడ్డాం. అందరు దేవతలలోను రుద్రుడే అధికుడన్నది లోక విదితమే కదా! (అని తమ శూలాలను వరాలపై గురిపెట్టుట జరుగుతుంది.)

**వరములు :** (పకపకా నవ్వుచూ) ఓ శాపములారా! మీరు పాపరూపమగు అనుచితత్వమును కాస్త ఆపండి. ఈ సందర్భమేమిటో కొంచెం విచారణ చేయండి. ఎందుకంటే... కలహమంతా ముగిసిన తరువాత ఏది కర్తవ్యమై ఉంటుందో... దానిని మొట్టమొదటే విచారణ చేయటం ఉచితం. కలహం కొనసాగించినా చివరికి మనకు బ్రహ్మదేవుని నిర్ణయమే శిరోధార్యం అవుతుంది కదా! ఆ పని మొదటే చేస్తే పోలా? కాబట్టి మనం బ్రహ్మదేవుని దర్శించి వారు ఏది నిర్ణయిస్తే అది అనుసరిద్దాం.

ఇది శాపములకు సానుకూల్యమైన యుక్తిగానే అనిపించింది. సందేహ నివారణ కొరకై మహానుభావులే సర్వదా శరణ్యం కదా! అందుచేత శాపాలు "సరే! అట్లాగే చేద్దాం"... అని ఒప్పుకున్నాయి. అప్పుడు వరములు, శాపములు బ్రహ్మలోకం జేరి బ్రహ్మదేవుని దర్శించి తమ తమ వృత్తాంతములు, తమకు "క్రియాశీలత్వంలో ఎవరు ముందు?" ...అనే విషయంలో వచ్చిన అభిప్రాయ భేదం సవివరంగా విన్నవించుకున్నాయి. అదంతా ప్రశాంతంగా విని బ్రహ్మదేవుడు ఇట్లా పలికాడు.

**శ్రీబ్రహ్మదేవుడు :** వత్సలారా! వర-శాపాధిపతులారా! ఇందులో వివాదం ఎందుకు? మీలో ఎవరు లోన సారత్వం కలిగి ఉన్నారో, ఎవరు సంకల్పం యొక్క సుదృఢత్వం కలిగియున్నారో... వారే క్రియాశీలురు కాగలరు. ఒకరి హృదయం మరొకరు పరిశీలించి చూచుకోండి. ఎవరి ప్రయోజనము అసారమో, వారు ఉపేక్షించండి. సారసహితులైనవారు అపేక్షను కొనసాగించండి.

❖

అప్పుడు ఒకరి సారత్వం మరొకరు పరిశీలించటానికై ఆ వర - శాపములు ఒకరి హృదయంలో మరొకరు పరిశీలించసాగాయి. దేని పట్టుదల, సాధన, ఉద్దేశము ఎంతవరకు బలవత్తరమో పరిశీలించాయి. అట్లా ఒకరినొకరు చక్కగా పరిశీలించుకున్న తరువాత .. ఎద్దానియందు 'ఉద్దేశము' అనే సారము బలవత్తమో ... క్షణములలో ఒక అవగాహనికి వచ్చి... అప్పుడు మరల బ్రహ్మదేవుని సమక్షానికి వచ్చారు.

**శాపములు :** ఓ ప్రజానాథా! బ్రహ్మదేవా! మేమే ఓడిపోయి మా ఓటమిని అంగీకరిస్తున్నాం. మేము లోన సారత్వం కలవారం కాము. ఈ వరాలే బలసమన్వితమై, వెనుక బలవత్తరమైన ఉద్దేశంతో కూడిన ప్రయత్నంచే సారభూతమై ఉన్నాయి.

హే మహాత్మా! వరరూపులం - శాపరూపలం అగు మేము సంవిత్ యొక్క సంకల్పరూపులమే కదా! సంవిత్ (బుద్ధి) చైతన్య రూపమే అయివున్నది. కనుక చైతన్యం - చైతన్య సంవిత్‌లకు వేరుగా మాకెట్టి రూపమూ లేదు.

వరదుడు – వరలబ్ధుడు... ఈ ఇద్దరూ ఒకే చైతన్య సంవిత్తు యొక్క రెండు ప్రదర్శనములే కదా! అట్టి సంవిత్తు యొక్క 'స్ఫురణ'యే విజ్ఞాన రూపత్వము దాల్చుచున్నది.

వరము ప్రసాదించువాని యొక్క సంవిత్తు "నేను వరం ప్రసాదిస్తున్నాను" అనే రూపం కలిగి ఉన్నది. వరము స్వీకరించువాని యొక్క సంవిత్తు "నేను వరం పొందుచున్నాను" అనే రూపం కలిగి ఉంటోంది. అట్టి విజ్ఞాన రూపమే... తన యొక్క సుఖభోగ భావనాబలం చేత శరీరత్వమును నిర్మించుకొంటోంది. అట్టి శరీరత్వధారణా సంవిత్తు క్రమంగా దేహాకారంగాను, దేశ – కాలాది అనేక భ్రమలకు అర్హముగాను అగుచున్నది. అట్టి భ్రమ సంవిత్తు క్రమంగా భ్రమచే ఆయా భోగ్య పదార్థములను గాంచుచూ, అనుభవించుచూ, భుజించుచూ కాలబద్ధం అవుతోంది.

ఆ 8 మంది అన్నదమ్ములు దృఢ సంకల్పముచే "మేము తపస్సు చేసి చక్రవర్తులం కావాలి" అని దృఢభావన ఆశ్రయించటం చేత క్రమంగా తపోఫల సంవిత్తు దినానుదినంగా దృఢత్వం పొందటం జరిగింది. ఆ వర కల్పనారూప చైతన్యం కాలాంతరంగా ఫలావస్థ వైపుగా పరిపుష్టి పొంది ఉన్నది. సశాస్త్రీయమైన తపోయత్నమే ఆ పరిపుష్టికి కారణం. అందుచేతనే... ఆ 8 మందిలో సప్త ద్వీప భూమండలమునకు చక్రవర్తిత్వము సార్థకత పొందింది. కనుకనే "వరములు మా కంటే అధికంగా సారత్వము కలిగి ఉన్నాయి" ...అనే నిర్ణయానికి మేము వచ్చాం.

వరము కోసం శాస్త్రీయ ప్రయత్నం (వరార్థి వరఫలం కోసం సుదీర్ఘంగా ప్రయత్నించి ఉండటం); వరము ప్రసాదించేవారు అది ప్రసాదించటం (వరప్రదాత వరదానమును సుదీర్ఘంగా అభ్యసించి ఉండటం)... రెండు చిరకాలాభ్యాసముచే ఫలవంతమవటానికి ఎంతో సారసహితమై ఉన్నాయి. ఆశయము పట్ల లక్ష్య శుద్ధి అత్యధికంగా కలిగి ఉన్నాయి.

ఏ సంవిత్తు చిరకాలము బాగుగా అభ్యసింపబడుచున్నదో ...అదే సారవంతం. అదే దృఢత్వం పొందుతోంది. అదే అధికంగా ఫలవంతమగుచున్నది. హే జగద్గురూ! బ్రహ్మదేవా! శాపములగు మేము, వరములు, వరశాపములు ప్రసాదించేవారు, వర శాపములు పొందేవారు, మీరు... మనమంతా సంవిత్ స్వరూపములమే కదా!

ఈ దృశ్యజగత్తులో ప్రయత్నము – ప్రయోజనములకు సంబంధించిన భేదముండవచ్చుగాక! ఏమైతేనేం? వరప్రదాత, వరము, వరాలబ్ధుడు, శాపప్రదాత, శాపము, శాపగ్రస్తుడు... ఈ ఆరుగురు ఒకే సంవిత్తు యొక్క స్వరూపములే!

శుద్ధ సంవిత్‌లందు ఏది అధికంగా శుద్ధమై (అభ్యాసపూర్వకంగా) ఉంటోందో ... అదియే తక్కిన సంవిత్తులకంటే అధికంగా ప్రబలమై ఉంటుంది. అశుద్ధ సంవిత్తులందు ఏది (అభ్యాస పూర్వకంగా) అధిక ప్రబలమై ఉంటుందో... అదియే తక్కిన అశుద్ధ సంవిత్తులను జయిస్తూ ఉంటుంది.

అట్లాగే కాలదృష్టితో ఏది జ్యేష్ఠమైతే (ఏది అధిక కాలం అధికంగా అభ్యసించటం జరిగితే)... అదియే తక్కిన వాటిని జయించటం న్యాయమే కదా! అల్పకాలం మాత్రమే అల్పమైన శ్రద్ధతో అభ్యసించింది, మరి, అధికాభ్యాసంతో కూడిన దానిని జయించి వేయటం న్యాయం ఎట్లా అవుతుంది?

శుభ – అశుభ కర్మలు తత్ఫలములగు వర – శాపములు ఒకదానితో మరొకటి "ప్రమాణము – అభ్యాసము"లకు సంబంధించి సామ్యత్వం ఉన్నప్పుడైతే... అప్పుడు పాలు–నీళ్ళు కలిసినట్లు ఆ శుభ–అశుభ కర్మలు కలిసిపోయి మిశ్రమ ఫలములిస్తాయి. ఎక్కడ శుభ – అశుభ కర్మలు ఒకదానితో మరొకటి సామ్యత్వం ఉండదో – అప్పుడు ఆ రెండింటి ఫలములు సామ్యత్వం కలిగి ఉండవు. ఎచ్చటైతే ఏకకాలంలోనే వేరు వేరైన కర్మఫలములుగా వర–శాపములు ఫలీకృతం అవుతాయో ...అక్కడ ఆ జీవుడు ఒకే సమయంలో వేర్వేరు ఉపాధులతో వర–శాపముల ఫలమును పొందటం కూడా జరుగవలసి ఉంటోంది. ఎట్లా అంటే, ...నగర రూపధారియగు చైతన్యము ఆయా ఫలములను సామూహికంగా ఆ నగర జనులతో కూడిన అనేక రూపములతో పొందటం లేదా! ఇదీ అంతే.

హే ప్రభూ! తమ వద్ద మేము నేర్చుకొన్నదే... తమకు అప్పజెప్పుచున్నాం. అంతేగాని.... మీకు క్రొత్తగా తెలియజేయగల వారం కాదు. తమ సంకల్పమే మా రూపం కదా! కాబట్టి మా దుష్టత్వ రూపమగు అపరాధం చేత అల్పసార రూపమగు మేము అధికసార రూపమగు ఈ వరదేవతలను నిరోధించ యత్నించినందుకు క్షమించండి. మీకు సాష్టాంగ దండ ప్రణామములు. ఇక మాకు సెలవు ఇప్పించండి.

ఇట్లా పలికి ఆ శాపములు సిగ్గుపడుతూ తమను తామే శపించుకుంటూ – తిమిర రోగం వలన ఆకాశంలో కనిపించే కేశములు (దృష్టిదోషం పోయినప్పుడు) మటుమాయయినట్లు – అప్పటికప్పుడే ఎటో వెళ్ళిపోతాయి.

❖❖❖

# 4. ఆధిభౌతిక భ్రాంతి

**కుందదంతుడు :** ఓ రామచంద్రా! ఓ పండిత సభా–మన్యులారా! ఆ 8 మంది సోదరుల యొక్క (ఆ గౌర్యాశ్రమ వృద్ధ తాపసి చెప్పుచున్న) సప్త ద్వీప సమేత భూమికంతటికీ చక్రవర్తులు కావాలనే వరం ఫలీకరించే సమయంలో జరుగబోవు విశేషాలు మీకు చెప్పుచున్నాను కదా! ఇంకా ఆ వృద్ధతాపసి తన సంభాషణమును ఇట్లు కొనసాగించారు.

**గౌర్యాశ్రమ వృద్ధ తాపసి :** ఓ కుందదంతా! ఆ విధంగా శాపములు అంతర్ధానమైన తరువాత ఇప్పుడు ఇరువురు వర పురుషులు పరమాత్మయగు బ్రహ్మదేవుని సమక్షంలో తమకున్న భేదాభిప్రాయాలను ఉటంకిస్తూ నిలబడతారు.

1. ఎనిమిది మందికి విస్తార భూమండలానికి చక్రవర్తిత్వము ప్రసాదించు మొదటి వరదేవత.
2. వారి భార్యలకు "మీ భర్తలు మీ పడక గదులలోనే ఉంటారు" ...అను రూపంలో ప్రసాదింపబడినట్టి రెండవ వరదేవత.

మొదటి దేవత సూర్య పురుష సంకల్ప నిర్మితము. రెండవ దేవత గౌరీ వర ప్రసాదరూప వరదేవత. గౌరీ వరప్రసాద దేవత అంతకు ముందు శాపములు నిలబడ్డ స్థానంలోకి వచ్చి నిలబడి బ్రహ్మదేవునితో ఇట్లా విన్నవించుకుంటారు.

**గౌరీ వరప్రసాద దేవత :** హే దేవేశ్వరా! మేము ఆ 8 మంది భార్యల వ్రత పుణ్యఫలం చేత గౌరీదేవిచే సంకల్పించబడ్డాం. మా విధిని అనుసరించి ఆ 8 మంది జీవ సంవిత్తులను ఆ గృహం నుండి బయటకు వెళ్ళనీయకుండా చేస్తాం. ఇక "ఆ గృహంలోంచి బయల్వెడలకుండా సప్త ద్వీప సమేత సామ్రాజ్యానికి ఎట్లా ఆధిపత్యం వహిస్తారు?"... అనే ప్రశ్నకు మాకు సమాధానం తెలియదు.

ఈ సూర్య పురుష వరదేవత ఎట్లా ఫలమును ప్రసాదిస్తుందో... అది మాకు సంబంధించిన విషయం కాదు కదా! ఈ సూర్య దత్త వరదేవతేమో ఆ 8 మంది జీవులను సప్తద్వీపేశ్వరులుగా, యుద్ధంలో దిగ్విజయ యుక్తులుగా గావించటానికి ఆ గృహం నుండి తీసుకుని వెళ్ళే ప్రయత్నంలో ఉంది. మేమేమో ఆ గృహం నుండి వారు బయటకు వెళ్ళకుండా నిరోధిస్తున్నాం.

ఓ బ్రహ్మదేవా! జగద్గురూ! గౌరీ వరరూపులగు మాకు సూర్యదేవ వరరూపియగు ఈ వరదేవతతో విరోధము అనివార్యమౌతోంది. ఇప్పుడు ఏది శ్రేయమో... అది ఆజ్ఞాపించండి.

**శ్రీబ్రహ్మదేవుడు :** ఓ సప్త ద్వీపేశ్వర ప్రదాతయగు వరదేవతలారా! మరియూ ...ఆ గృహము నుండి బహిర్గతం కాకుండా నిరోధించే వరదేవతలారా! మీరు ఒకరితో ఒకరు నిరోధించి తద్వారా విరోధం పొందవలసినది ఇక్కడ ఏమీ లేదు. మీరు పరస్పరం అపేక్షత్వమే పొందండి. ఒకరి కార్యమును మరొకరు దృష్టిలో ఉంచుకునే ప్రవర్తించండి. మీ ఇరువురి ప్రయత్నము ఇప్పుడు నెరవేరుతూనే ఉన్నది. ఎందుకంటే... ఆ 8 మంది సోదరులు మరణించిన మరుక్షణం నుండి చిరకాలంగా ఆ గృహంలో ఉండియే సప్తద్వీపేశ్వరత్వం వహించియే ఉన్నారు.

**ఉభయ వరదేవతలు :** హే మహాత్మా! బ్రహ్మదేవా! మీరు చెప్పేది ఎట్లా సాధ్యం? వారి 8 భూమండలాలు, ఆయా సప్త ద్వీపాలు, ఆ విధమైన ఐశ్వర్యములు ఒకే భూ మండలంలో ఎట్లా ఉంటాయి? ఇక అవన్నీ ఒకే గృహంలో ఉండటం అసాధ్యమని వేరే చెప్పక్కర్లేదు కదా! ఒక కలువ పువ్వులో 100 ఏనుగులు సంచరిస్తూ, నృత్యం చేస్తూ ఉంటాయా ఎక్కడన్నా?

హే పరంధామా! మేము ఒక్క భూమండలం గురించే విని ఉన్నాం. చూస్తున్నాం. అందులో ఒకేసారి 8 మంది సప్తద్వీపేశ్వరుల ఆధిపత్యం ఎట్లా ఒకనగూడుతుంది. అదీ వారంతా ఒకే గృహంలో ఉండి ఉండగానా?

**శ్రీ బ్రహ్మదేవుడు :** ఓ సూర్యదేవత సంకల్పిత – గౌరీ సంకల్పిత వరదేవతలారా! ఇందులో ఆశ్చర్యం ఏమున్నది? ఇందులోని విశేషం ఏమిటో మీకు చెపుతాను... వినండి! మీతోను... మాతోను గూడియున్నట్టి ఈ సృష్టి – సమష్టి సహిత సమస్త జగత్తు వాస్తవానికి చిదాకాశమాత్రమే కదా! ఇదంతా చైతన్య పరమాణువు నందు స్థితినొందియుండగా... ఇది అద్దానియందు స్వప్నంలో దృశ్యంలాగా అనుభూతమౌతోంది. ఒక్క చైతన్య పరమాణువులో అసంఖ్యాక బ్రహ్మాండములు ఏర్పడి ఉంటూ ఉండగా, కించిత్ స్వప్న స్ఫురణలో సువిశాల స్వప్న జగత్ దృశ్యం సదృశ్యమగు చుండగా ...వారి గృహంలో ఆ 8 మందికి వేరువేరైన 8 భూమండలాలు అనుభూతం కావటంలో ఆశ్చర్యమేమున్నది? వారు మరణించిన మరుక్షణమే... "సచ్చిదానంద ఘనాకారము – పదార్థ

శూన్యము” అయినట్టి చైతన్యమే... యథారీతి స్థితి కలిగి ఉన్న జగత్తుగా వారికి భాసించనారంభించింది. ఏ జీవుడైనా సరే, ఏదేది ఎట్లెట్లు పొందుచున్నాడో... అదంతా తన స్వయంకృత స్ఫురణ యొక్క చమత్కారంచేత స్వస్వరూపమగు చిదాకాశమునందే, చిదాకాశం పట్ల పొందటమే జరుగుతోందని ఒకప్పుడు మీకు బోధించియే ఉన్నాను కదా! ఇక ప్రస్తుత క్రమంలో గల ఆశ్చర్యం ఏమున్నది? వారు మరణించి, వారి వారి పడక గదులలో స్వస్వరూప చిదాకాశమునందే – వేరు వేరుగా – భూమండలమును దర్శించి, వాటికి మహా నాయకత్వం వహిస్తున్నారు.

ఓ వరస్వరూపదేవతలారా! ఏదైతే ఈ కనబడే జగత్తుగా... మీకుగాని, నాకుగాని, మరెవరికైనా గాని... భాసిస్తోందో... అది చైతన్య తత్త్వమే అయివున్నది. వాస్తవానికి ఈ జగత్తు మూర్తము(సాకారం) కాదు. ఆ గృహంగాని, ఆ 8 మంది ఇప్పుడు పొందుచున్న భూమండలం గాని సాకారం కాదు. సర్వమూ నిరాకారమే! ఆకాశం శూన్యరూపంగా భాసిస్తున్నట్లు చిన్మాత్రమే జగత్ రూపంగా భాసిస్తోంది. గృహము–భూమండలము నిరాకారమగు చిదాకాశ స్వరూపములే అయినప్పుడు ఒకదానిలో మరొకటి అమరి ఉండటం – అమరిక ఉండకపోవటం అనే ప్రసక్తి ఎక్కడిది? ప్రతి జీవుడు ప్రతిరోజు చూస్తున్న స్వప్నములలో ఏది ఎందులో ఇమడదు? గదిలో నిదురించే స్వప్న ద్రష్ట స్వప్నంలో మహానగరములు చుట్టి వస్తున్నాడు కదా!

ఓ వరదేవతలారా! మీరు ఆధిభౌతిక భ్రాంతిని త్యజించండి. తత్త్వ విచారణచే ఈ ఈ భౌతిక రూపములకు సంబంధించినదై ఉన్న సూక్ష్మ (అతివాహిక) దేహములను గమనించండి. ఆ సూక్ష్మ దేహములకు కూడా ఆధారమైయున్న చిదాకాశ స్వరూపమును సంస్మరించండి. ఇక మీరు వెళ్ళి మీ మీ విధ్యుక్త ధర్మాలను నెరవేర్చెదరు గాక!

❖

ఓ కుందదంతా! ఆ ప్రకారంగా సర్వ వరదుడగు బ్రహ్మదేవుడు “అంతా సర్వదా చిదాకాశమే! చిదాకాశం యొక్క స్ఫురణ విశేషమే ఈ బ్రహ్మాండములు”... అని విశదీకరించి చెప్పినదంతా ఆ ఉభయ వరదేవతలు శ్రద్ధగా వింటారు. అప్పటికప్పుడే తత్త్వవిచారణచే ఆధిభౌతిక భ్రాంతిని త్యజించివేస్తారు. సూక్ష్మ దేహధారులై పరమాత్మయగు బ్రహ్మదేవునికి ప్రణామం చేసి... ఆయా 8 మంది సోదరుల మనోకల్పితములైనట్టి సప్తద్వీప మండలములలో ప్రవేశించి తమ తమ వరప్రసాద సంకల్పిత ఫలములను ప్రసాదించ నారంభిస్తారు.

ఇక ఆ 8 మంది సోదరులు పరస్పరం తమ సప్తద్వీపేశ్వరత్వం (ఒకరిది మరొకరికి) తెలియకయే ఉండగలరు. ఎందుచేతనంటే తత్త్వజ్ఞానం లేకపోవటం చేతనే! ఒకరి స్వప్నంలోని విశేషాలు ఆ ప్రక్కనే నిదురిస్తూ కలలుగనే మరొకరికి కనబడవు కదా! అయితే, వారి వారి స్వస్పందనరూప భూమండలములో మాత్రం అన్యోన్య బంధువులతో అన్యోన్యహిత తత్పరులై మనుగడ సాగించగలరు.

❖

**కుందదంతుడు :** ఓ రామచంద్రా! ఆ గౌర్య వన వృద్ధ తాపసి ఆ విధంగా ఆ 8 మంది సోదరుల

భవిష్యత్ కథనములను నా “అసమంజసము కదా!” అనే సందేహం నివృత్తింపజేయటానికి నాకు చెప్పారు. అప్పుడు నేను ఆయనతో ఇట్లా అన్నాను.

❖

**నేను (కుందదంతుడు) :** స్వామీ! మీరు చెప్పినదంతా విన్న తరువాత కొంత వరకు నా సందేహాలు తొలగాయి. అయితే, సాంసారిక దృష్టి నాకు మీ వలె ఎంతగానో తొలగవలసి ఉన్నది కాబోలు. హే మహాత్మా! ఆ వర – శాప దేవతలు బ్రహ్మలోకం నుండి బయల్వెడలారు కదా! వరదేవతలు ఆయా వరములను సిద్ధింపజేయటానికి వెళ్ళినప్పుడు ఆ 8 మంది బ్రాహ్మణోత్తముల సంవిత్ (జీవ) చైతన్యములు ఏమేమి పొందుతూ ఉంటాయో... అది కూడా చెప్పండి.

**గౌర్యవన వృద్ధ తాపసి :** సరే! అది కూడా, ఒకానొక సమయానికి ఏదిట్లా ఉండబోవుచున్నదో... చెపుతాను విను.

1వ సోదరుడు : యౌవనావస్థ యందు ఒప్పుచు ఉజ్జయినీ మహాపట్టణంలో విస్తారమైన రాజ్యం పరిపాలిస్తూ సుఖవంతుడై ఉంటాడు.

2వ సోదరుడు : శాకద్వీపవాసి “నాగలోకం జయించాలి” అనే కోర్కెతో సర్వ దిక్కులలో విజయం పొందటానికై యత్నశీలుడై సముద్ర గర్భంలో సంచరిస్తూ ఉంటాడు.

3వ సోదరుడు : కుశ ద్వీప రాజధానిలో మనోవ్యధారహితుడై సుఖంగా సమస్త ప్రజలతో కూడుకొని ఉండి ఉంటాడు. అప్పటికే దిగ్విజయుడై రాజపత్ని కౌగిలిలో సుఖంగా నిదురిస్తూంటాడు.

4వ సోదరుడు : శాల్మలి ద్వీప మహా పర్వత శిఖరంపై గల నగరంలో గల సరోవరంలో విద్యాధర స్త్రీలతో కూడి జలక్రీడాతత్పరుడై ఉంటాడు.

5వ సోదరుడు : దండయాత్రలు నిర్వహించి సప్త ద్వీపాల నుండి కొనిరాబడిన మహాసంపద లచే క్రౌంచ ద్వీపంలో 8 రోజులు అశ్వమేధయాగం నిర్వర్తించే సంరంభంలో ప్రవృత్తుడై ఉంటాడు.

6వ సోదరుడు : ద్వీపాంతరంలో ఒక రాజుతో యుద్ధం చేసే వ్యవహారంలో ప్రయత్నశీలుడై ఉంటాడు.

7వ సోదరుడు : గోమేధ ద్వీప నివాసి అయి, గొప్ప సైన్యం కలిగి ఉండి, పుష్కర ద్వీపరాజును జయించి, అక్కడి రాజకుమారిని కామదృష్టిచే బంధించి తన వెంట రథంలో తీసుకునిపోతూంటాడు.

8వ సోదరుడు : పుష్కరీ ద్వీపవాసి మిత్రుడగు లోకాలోక పర్వత ప్రదేశపు రాజదూతతో భూమిలోగల ధన నిక్షేపములను గుర్తించటానికి బయల్వెడలుతూ ఉంటాడు.

ఓ కుందదంతా! ఈ ప్రకారంగా వారిలో ప్రతి ఒక్క సోదరుడు ఆ గృహాకాశంలోనే తమ బుద్ధికి యోగ్యం అయినట్టి సప్త ద్వీప ప్రభుత్వాధిపత్యం పొందే మార్గంలో ఉంటారు. అప్పుడు ఆ వరదేవతలు బ్రహ్మలోకం నుండి వచ్చినవారై తమ తమ సూక్ష్మ దేహాలను కూడా త్యజించి ఆ 8 మంది సోదరుల జవ సంవిత్తులతో ఏకత్వం పొందటం జరుగుతుంది. ఆ తరువాత ఆ 8 మంది సోదరులు తమ అభిమతములను పొందినవారై... సంతుష్టులై... సప్త ద్వీపేశ్వరులై చిరకాలం వెలయగలరు.

చూచావా కుందదంతా! దీనినిబట్టి మనం గ్రహించవలసినది ఏమిటి? సాక్షి చైతన్యము యొక్క అభ్యంతరమున దృఢ నిశ్చయ రూపంగా ఏది స్ఫురిస్తుందో... అదియే బాహ్యానికి ప్రదర్శిత మౌతూ ఉంటుంది. కనుక, ఎవ్వడు ఎద్దానిని కోరుకుంటాడో – అందుకు ఉచితమైనట్టి తపస్సు, జపము, ధ్యానము, తదితర యత్నములు, కర్మలు కొనసాగిస్తే – ఈ జగత్తులో పొందరానిది ఏముంది?

❖❖❖❖

# 5. ఒక గృహంలో వేలాది జగత్తులు సంభవమే!

**కుందదంతుడు :** ఓ రామాది సభిక శ్రేష్ఠులారా! ఆ విధంగా కదంబ వృక్షము క్రింద ఉన్న ఆ వృద్ధ తాపసుడు ఆయా భూత–భవిష్యత్ విశేషాలన్నీ చెప్పగానే ... మరల నా సందేహం తీరక నేను ఇట్లా ప్రశ్నించాను.

**నేను (కుందదంతుడు) :** స్వామీ! ఇంకా నాకు కొంత సందేహంగానే ఉన్నది. "ఒక్కొక్కటి 50 కోట్ల యోజనములు విస్తీర్ణంగల సప్తద్వీపములతో కూడిన 8 భూములు అల్ప విస్తీర్ణంగల ఒక గృహంలో ఎట్లా ఉండగలుగుతాయి?"... అనే ప్రశ్నకు నా బుద్ధికి సమాధానం కుదరటం లేదు.

**కదంబవన వృద్ధ తాపసి :** ఓ సాధూ! మనందరి వాస్తవ స్వస్వరూపమే అయివున్న సర్వవ్యాపక చైతన్యము వాస్తవానికి ప్రపంచ శూన్యమైనది. అట్లా అయివుండి కూడా... తాను ఎచటెచట ఉనికిని అనుభూతపరచుకొంటే అచటచట స్వయంగా తనయందు తనను... త్రైలోక్య రూపంగానో, సుషుప్తి రూపంగానో, తురీయ రూపంగానో... సందర్శనము, అనుభవము కలిగి ఉంటుంది.

పరమార్థమున అయ్యది తన శుద్ధ తత్త్వరూపమును ఏమాత్రం త్యజించటమే లేదు. తరంగ ఆకారంగా అగుచున్న జలం తాను జలత్వం త్యజిస్తోందా? కోల్పోతోందా? లేదే! తరంగత్వం జలం యొక్క స్వభావమే అయివున్నది. నిర్మల చైతన్యత్వం జీవుని వాస్తవ స్వభావమే అయి ఉన్నది.

**నేను (కుందదంతుడు) :** మహాత్మా! "ఏకం, నిర్మలం, శాంతం, మంగళకరం, పరమకారణం అయినట్టి పరబ్రహ్మము నందు... అట్టి తత్త్వమునకు – స్వభావమునకు విరుద్ధ స్వభావంగా ఈ ఈ నానా రూపత్వ స్థితి ఎట్లా కలుగుచున్నది?

**కదంబవన వృద్ధ తాపసి :** బిడ్డా! ఈ ఈ నానారూపత్వం వాస్తవం కాదు. ఇది భ్రాంతి మాత్రమే!

**సర్వం శాంతం చిదాకాశం నానాస్తీఽహ న కించన ।**
**దృశ్యమానమపి స్ఫారమావర్తాత్మా యథా అంబసి ॥**

సమస్తము శాంతమగు చిదాకాశమే! ఈ జగత్తు అనేక వస్తు – విశేషాదులతో సువిశాలమై ఉండవచ్చు గాక! ఇదంతా సర్వదా సత్ – చిత్ – ఆనందమే! ఏ తరంగం మొదలే జలము అయి ఉండలేదు? తరంగము యొక్క ఆకారమువలె అసత్యములైనప్పటికీ సత్యములవలె కనిపించే ఈ జగత్ పదార్థములన్నీ కూడా చిదాకాశము యొక్క నిజ నిర్మల యథార్థ స్వరూపమే! స్వప్నంలో కనిపించేదంతా స్వప్నద్రష్ట సంవిత్ స్వరూపమే అయినట్లు... జాగ్రత్ కూడా అట్టిదే!

అయితే ... సర్వస్వరూపమగు పరమాత్మ వాస్తవ స్వరూపంలో సృష్ట్యాది స్వభావములూ లేవు. పదార్థములూ లేవు. ఇక సృష్ట్యాది యందు బ్రహ్మదేవునిచే ఏది ఎట్లు స్ఫురిస్తోందో... అది అట్లే స్థితినొందియున్నది. చిదాకాశమగు పరబ్రహ్మము యొక్క స్వరూపం... ప్రకాశాత్మకమూ కాదు, అప్రకాశాత్మకమూ కాదు. పదార్థరూపం కాదు. అచిద్రూపం కాదు. అది కేవలమూ శుద్ధ చిద్రూపములోనే స్థితినొందియున్నది. (చిద్రూపము = ఎరుగుటకు ముందే ఏర్పడియున్న నిర్మలమైన 'ఎరుక' స్వరూపం)

ఓ సాధూ! కుందదంతుడా! ఒకే స్వప్న చైతన్యము స్వప్న సైన్యంలో లక్షలాది సైనికుల రూపంగా అగుచున్నది కదా! అయినప్పటికీ ఆ చైతన్యము నిత్యనిర్మలం, సర్వమునకు పరము, అప్రమేయము కదా! ఒకే జాగ్రత్ చైతన్యము జాగ్రత్‌లో అనేక పదార్థముల రూపంలో అగుపిస్తూ కూడా తాను నిత్యనిర్మలమై ఉన్నది.

చిదాకాశము స్వతహాగా నిర్మల స్వరూపి అయి కూడా ఏఏ రూపములుగా స్ఫురిస్తోందో... ఆ స్ఫురణాకారమును స్వతహాగా తానే జగత్ రూపంగా అనుభవిస్తోంది.

స్వప్నంలో అగ్ని కనబడిందనుకో! అక్కడ వాస్తవానికి అగ్ని ఉన్నదా? స్వప్న చైతన్యమే ఉష్ణరూపంగా భాసిస్తోంది. కదా! స్వప్నంలో స్తంభము కనిపించిందనుకో! అది స్వప్నద్రష్ట బుద్ధి రూపమేగాని... వాస్తవమైన స్తంభం కాదు కదా! అట్లాగే జాగ్రత్‌లో కూడా 'సంవిన్మాత్రము' అగు చిదాకాశమున నిజస్వరూపమే నానారూపత్వంగాను, పదార్థాకారంగాను భాసిస్తోంది. చైతన్యంకంటే భిన్నమైనదేదీ ఎక్కడా లేదు.

ఆదిసృష్టియందు ఈ పదార్థములన్నిటి రూపము, నిర్మల చిద్రూపమే! అప్పుడు చిదాకాశము ఏ పదార్థమును ఏ అర్థంతో ఎరుగుట జరిగియున్నదో... అది నేటి వరకు ఆ రీతిగానే వర్తిస్తోంది. ఓ కుందదంతా! వృక్షమే పుష్పమునందు, ఆకుల యందు, పండ్లయందు, కాండమునందు వ్యాపించి ఉన్నట్లే... ఈ జగత్తంతా సర్వత్రా సర్వరూపమగు పరబ్రహ్మమే అయివున్నది. చిద్రూప మహా సముద్రంలో సృష్టి పరంపరలు జల తరగములవంటివి. తరంగాలన్నీ జలమే కదా! జలానికి వేరుగా తరంగాలు ఎక్కడున్నాయి? పరమార్థ మహాకాశమున ఈ సృష్టి ప్రతిభాసలు శూన్యరూపములే! 'తత్త్వబోధ' అనే పవిత్ర పాఠ్యాంశము ఎరిగితే... 1.సృష్టి, 2.పరమార్థ చిద్రూపము (చిత్ చైతన్యం) ...ఈ రెండూ పర్యాయపదములే! ఇక అజ్ఞానము చేత... ఏది ద్వైతముగా (సృష్టి వేరు – ఆత్మ వేరు అను రూపంగా) తెలియబడుచున్నదో... అదంతా కూడా దుఃఖము కొరకే అగుచున్నది.

**పరమార్థో – జగచ్ఛేదమ్ 'ఏకమ్' ఇత్యేవ నిశ్చయః**
**అధ్యాత్మ శాస్త్ర బోధేన భావేతై ్సషా హి ముక్తతా!**

అధ్యాత్మ శాస్త్ర జ్ఞానం చేత..."పరమార్థము – జగత్తు ఒక్కటే" అనే నిశ్చయం తప్పక కలుగుతోంది. అట్టి అవగాహనయే ముక్తి. అదే అపరోక్షానుభూతి.

**సంకల్పస్య వపుర్బ్రహ్మ, సంకల్పకచిదాకృతేః**
**తదేవ జగతో రూపం, తస్మాత్ బ్రహ్మాత్మకమ్ జగత్ ॥**

సంకల్పించువాడు బ్రహ్మమే. సంకల్పము కూడా బ్రహ్మమే! ఆ సంకల్పముచే అనుభూతమయ్యే జగత్తు కూడా బ్రహ్మమే! కనుక ఈ జగత్తు బ్రహ్మాత్మకమే సుమా! ఇదంతా బ్రహ్మోత్సవం! నీ ఆలోచనయే ఈ జగత్తు రూపం. నీ ఆలోచన నీ రూపమే కదా! కనుక, ఈ జగత్తు నీ రూపమే!

**యతో వాచో నివర్తన్త, న నివర్తన్త ఏవవా**

**విధయః ప్రతిషేధాశ్చ భావాభావదృశస్తథా ॥**

ఎద్దానిని పొందజాలక "వాక్కులు,విధి నిషేధాలు, భావాభావ దృష్టులు" ఇవన్నీ వెనుకకు మరలుచున్నాయో... కాని సర్వమునకు అధిష్ఠానమే అయి ఉండటం చేత ఆ వాక్కులు - విధినిషేధాలు - భావాభావ దృష్టులు అద్దాని నుండి వెనుకకు మరలకయే ఉన్నాయో... అదియే బ్రహ్మము.

**అమౌనమౌనం జీవాత్మ యత్ పాషాణవత్ ఆసనమ్**

**యత్సదేవా సదాభాసం తద్బ్రహ్మాభిధముచ్యతే ॥**

మౌన - అమౌనముల మధ్యగల జీవస్వరూపము యొక్క చిద్ఘన స్థితియే బ్రహ్మము. సద్రూపమైనప్పటికీ ఈ శరీరము మొదలైన అసద్రూపముల 'తాదాత్మ్యాధ్యాస' చే అసత్తు వలె భాసించుచున్నట్టిది.

ఓ సాధూ! సర్వరూపము ఏకము - మహాచిద్ఘనము - నిర్వికారము అయినట్టి బ్రహ్మమునందు ఈ భావాభావ రూపపదార్థముల సృష్టి ఏమి? ప్రళయమేమి?... ఒకే 'నిద్ర'లో విచిత్రంగా స్వప్న - సుషుప్తులు భాసిస్తున్నట్లు ఇక్కడ జాగ్రత్ - స్వప్నాలు నిరంతరం భాసిస్తున్నాయి కదా! అట్లాగే చిదాకాశ సత్తయందు ఈ సృష్టి - ప్రళయములు విచిత్రంగా భాసిస్తున్నాయి.

'జగత్తు' అంటే ఏమిటి?... ప్రాణుల అంతఃకరణమున అభివ్యక్తమైన ప్రమాత అనే చిత్సారం ఈ నేత్రాదుల ద్వారా బాహ్యమునకు బయల్వెడలి వస్తు ఆకారావృత్తులతో ఏకమై "ద్రష్ట - దర్శన - దృశ్యములు" అనే త్రిపుటిలో 'జగత్తు' అనే కార్యము సిద్ధింపజేసుకుంటోంది. ఈ దృశ్యములోని సర్వ పదార్థములు తమ అధిష్ఠానమగు చైతన్యమునకు అధీనమై అట్టి సత్తా స్ఫూర్తితో సదా చిత్సారములే అయి ఉన్నాయి.

ద్రష్ట, దృశ్యము... ఈ రెండూ చిత్ స్వరూపములే! రెండింటిలో ఒకే చిన్మాత్రము వెలయుచు ...ఒక దానిచే రెండవది ఉనికి కలిగి ఉంటున్నాయి. అట్టి చిన్మాత్రము యొక్క ద్రష్ట - దృశ్య ఏకత్వము సృష్ట్యాది యందు ఎట్లు వెలయుచున్నదో... ఇప్పుడు అట్లే వెలయుచున్నది. సమస్త పదార్థ శక్తులూ చిన్మాత్రమునందే వెలయుచు, చిన్మాత్రమును అనుసరించే స్థితి కలిగి ఉంటున్నాయి.

అవి నిశ్చలము - అమనస్క రూపము అయి ప్రకాశిస్తూ చైతన్యము యొక్క స్ఫురణచేతనే స్ఫురిస్తున్నాయి.

❖

ఓ కుందదంతా! బ్రహ్మ - విష్ణు - రుద్రాది సహితంగా ఈ జగత్తు లేనిదే అయి ఉండి కూడా ... స్వప్నం వలె కనిపించుచు అనుభూతం అవుతోంది. 'చిద్రూపము' అనే జలంలో "హర్షము,

క్రోధము, విషాదము, ఆశ, నిరాశ, ఆశయము, వాంఛ, కామము" ...మొదలైన విచిత్ర స్పందరూప తరంగాలు స్వప్నంవలె కనిపిస్తున్నాయి.

ఆహా! ఏమని చెప్పాలి? అజ్ఞాన చిత్స్వభావనిష్ఠ రూపమగు విక్షేప శక్తిచే ఈ జగత్సమూహములు చమత్కారంగా స్ఫురిస్తున్నాయి. ఇందు సత్వ – రజ – తమో గుణములు, జనన – మరణములు అనే భ్రమతరంగ విన్యాసములు సత్యమును మరుగు పరచి... ఎంతటి భేదమును కలిగిస్తున్నాయో!

తిమిరరోగ యుక్తమైన దృష్టికి ఆకాశంలో ఏవో వెంట్రుకలు వ్రేలాడుచున్నట్లు కనిపిస్తాయి. అట్లాగే.... అజ్ఞానావృత చైతన్యదృష్టికి నిజ చిదాకాశమున జగద్భ్రాంతి భాసిస్తోంది.

"ఓ మిత్రమా! కుందదంతా! ఈ జగత్తు మొదలే లేదు. కానీ... సంకల్పం ఉన్నంత వరకు ఆ సంకల్పానుసారంగా జగత్తు ఉంటూనే ఉంటుంది.

**యావత్ సంకల్పితం తావత్, యథా సంకల్పితం తథా ।**
**యథా సంకల్ప నగరం కచతీదం జగత్తథా ॥**

సంకల్పం ఉన్నంతవరకు సంకల్పంలో దృశ్యం కనిపిస్తూనే ఉంటుంది కదా! ఎంతవరకు సంకల్పించబడుతుందో... అంతవరకు సంకల్ప నగరంలాగా జగత్తు స్ఫురిస్తూనే ఉంటుంది. ఇది అసద్రూపమే అయినప్పటికీ... సంకల్పమును అనుసరించే సత్యమువలె అనుభవము వర్ధిల్లుతోంది.

అనగా, అనగా ఒక రాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు... అనే కథలో "ఎందుకు ఏడుగురు కొడుకులు ఉన్నారు? ఆరుగురో ఎనిమిది మందో ఉండవచ్చుగా?" అని ప్రశ్నిస్తే? "అది అట్లా సంకల్పించబడింది కాబట్టి" – అనేగా సమాధానం! ఈ దృశ్యం అట్టిదే.

ఇక వస్తు ధర్మములంటావా? బ్రహ్మదేవుడు తన సంకల్పములచే నియత పదార్థములకు ప్రసాదించియున్న ఆ "సంకల్పరూప నియతి" యే ఇప్పుడూ కొనసాగుతోంది. ముందు ముందు కూడా అదియే కొనసాగబోతోంది. ఆ 'నియతి'ని అనుసరించే ఈ స్థావర–జంగమాది ప్రాణి సమూహమంతా ఈ ఈ నియతి రూపస్థితిని పొందియున్నాయి.

అట్టి నియతిని అనుసరించే... జంగమ ప్రాణి జంగమ ప్రాణి నుండి, స్థావరము స్థావరము నుండి ఉత్పన్నమౌతున్నాయి. జలం పల్లమునకు, అగ్ని ఊర్ధ్వమునకు చనుచున్నాయి! ఈ శరీరములు అనే యంత్రములు నడుస్తున్నాయ్! జ్యోతిర్మయములగు సూర్యగోళములు, నక్షత్రములు అనునిత్యంగా తపిస్తున్నాయి! వాయువు నిత్యం గమనశీలమై ఉన్నది! పర్వతాదులు స్థిరంగా ఉన్నాయి! కాలచక్రం దక్షిణాయన–ఉత్తరాయణములు ప్రదర్శిస్తూ ఉన్నాయి. వర్షఋతువులో వర్షం కురుస్తోంది. కాలము రాత్రి–పగలు–నెలలు–సంవత్సరాలు–యుగములు అనే చక్రరూపంలో తిరుగుతోంది. భూమి ద్వీపభేదములచే మధ్యమధ్యలో సముద్రాలు పర్వతాలు కలిగియున్నది! పదార్థములు ఉత్పత్తి, వృద్ధి, నాశనము, గ్రహణము, త్యాగము మొదలైన స్వభావములు కలిగియున్నాయి! ఇదంతా బ్రహ్మదేవుని నియతియే! ఇట్టి బ్రహ్మదేవుడు చిదాకాశ స్వరూపుడే! కనుక ఇదంతా చిదాకాశ స్వరూపమే!

**నేను (కుందదంతుడు) :** స్వామీ! గురుదేవా! ఇప్పుడొక సందేహం తమకు విన్నవించుకొని, మీ అమృత వచనములచే సంసార రోగము నుండి ఉపశాంతి పొందుతాను.

ఏ జీవుని విషయంలోనైనా పూర్వము అనుభవించినవే స్మరణకు వస్తూ ఉంటాయి కదా! ఇక నా వంటి సామాన్య జనుల వ్యవహారాలన్నీ బ్రహ్మదేవుని సంకల్ప రూపనియతి చేతనే వ్యవస్థితమై ఉన్నాయి. అయితే సృష్ట్యారంభంలో ఈ సృష్టికి పూర్వానుభవ సంస్కారాలే కారణమయి ఉంటున్నాయని, పూర్వానుభవ జన్యమైన సంస్కారాలు తప్పితే వేరే కారణం ఏదీ ఈ సృష్టికి ఉండదని నాకు అనిపిస్తోంది. అట్టి ఆదిసృష్టి యందు బ్రహ్మదేవునికి సంస్కారాలు ఎట్లా సిద్ధించాయి? పూర్వ జగత్ అనుభవాలు లేకపోతే... బ్రహ్మదేవునికి ఈ జగత్తు ఎట్లా భాసించ గలుగుతుంది?

**శ్రీ కదంబవన తాపసి :** ఈ జగత్ సృష్టి సిద్ధించటానికి పూర్వ సంస్కారాలు – పూర్వ జ్ఞాపకాలు అవసరమని నీవు ఎందుకనుకుంటున్నావో నాకు అర్థం కావటం లేదు. స్వప్నంలో ఒక్కసారిగా అనేక విశేషాలు ముందుగా అనుకోకుండానే అనుభూతమవటం జరుగుతోంది కదా! వాటిలో కొన్ని పూర్వానుభవాలకు సంబంధం ఉండవచ్చు. ఉండకపోవచ్చు కూడా కదా! కనుక ఓ కుందదంతా! బ్రహ్మదేవుడు స్మృతి – సంస్కారాదులు – జ్ఞాపకములు మొదలైనవాటి ఆవశ్యకత లేకయే, అప్పటికప్పుడు దివ్యజ్ఞానముచే ఒక్క క్షణంలో అనాగతమైన ఈ సమస్త జగత్తును దర్శించుచున్నారు. ఇదంతా అపూర్వంగానే కనిపిస్తోంది. తత్ఫలితంగా చైతన్య వివర్తరూపమే అయివున్న సంకల్పిత దృష్టి ప్రవర్తించనారంభిస్తోంది. మరల అచ్చోటే అభ్యాసవశంగా "ఇదంతా పూర్వం నాకు తెలిసినదే! నేను చూచినదే"... అని ఈ విధంగా స్మృతియొక్క అధ్యాసకూడా అఆతనికి సంభవిస్తోంది.

చిదాకాశము స్వయంగా చిద్రూపం కూడా కదా! అందుచేత ఈ జగత్తు చిదాకాశముచే సంకల్ప నగర రూపంగా, చిదాకాశమునందే దర్శించబడుతోంది. ఒకప్పుడు భాసించుచున్న ఈ జగత్తు మరొకప్పుడు భాసించటం లేదు. ఏ జగత్తు నీకిప్పుడు కనబడుతోందో... అది నీకు గాఢ నిద్రా సమయంలో అగుపించకపోవటమే ఇందుకు దృష్టాంతం. ఈ విధంగా ఈ జగత్తు ఒకప్పుడు భాసించి... మరొకప్పుడు భాసించకయే ఉంటోంది కనుక... ఇది సత్తు కాదు. అసత్తు కాదు.

బిడ్డా! స్మరణము అనేది లేకుండానే... ఈ జీవునకు చైతన్య ప్రభావం చేత స్వప్నంలోను – సంకల్పములందు కల్పనామాత్రమైన అనుభవాలు కలుగుచున్నాయి కదా! ఇక శుద్ధ చిదాకాశమునకు సంకల్ప మాత్రముచే జగద్రూపం స్ఫురించడంలో నాకేమీ ఆశ్చర్యం అనిపించటం లేదు. జ్ఞాపకములకు వెనుకగా స్వభావం ఉంటోంది. స్వభావమునకు వెనుకగా 'చిదాత్మ'యే వేంచేసి ఉన్నది.

**నేను (కుందదంతుడు) :** ఈ జగత్తు ప్రారబ్ధ వేగము చేతనే ప్రవర్తిస్తోంది. ప్రవాహ పతితమైన మార్గంలో ఈ జనులు చనుచున్నారని కొన్ని శాస్త్రములు శాస్త్రీకరిస్తున్నాయి కదా!

**శ్రీ కదంబవన వృద్ధతాపసి :** "ఈ జగత్తు సత్యమే" అని భావన కలిగి ఉండటమే సంసారము. అట్టి వారికి ప్రారబ్ధ – ఆగామి – సంచిత కర్మల గురించి బోధించవచ్చుగాక! తత్త్వజ్ఞులు జగత్తే స్వప్న తుల్యంగా గమనిస్తున్నారు. అప్పుడు ప్రారబ్ధ – ఆగామి – సంచిత కర్మలు కూడా స్వప్నతుల్యమే

కదా! అయితే 'నియతి' అనునది తత్త్వజ్ఞులపట్ల అయినా, అజ్ఞులపట్ల అయినా ఒకే రీతిగా ప్రవర్తిస్తోంది. ఈ జగత్తులో ఆత్మజ్ఞానమునకు ప్రయత్నించని జనులు జగత్తును చూస్తూ హర్ష, క్రోధ, సుఖ, దుఃఖాది భావాలు పొందుచున్నారు. ఇక తత్త్వజ్ఞులో?... వారు గుణదోషాల అస్మరణ స్థితిని ప్రజ్ఞతో అభ్యాసవశంగా సముపార్జించుకుంటున్నారు. ఇక వారిపట్ల ప్రారబ్ధ కర్మలు ఏమగుచున్నాయంటావా? వారు కుమ్మరివాని చక్రంలాగా ప్రారబ్ధ వేగమును పొందుచూ కూడా వాటిచే స్పృశించబడకయే ఇదంతా స్వప్నతుల్యంగాను, అధిష్ఠానముచే ఆత్మరూపంగాను ఒకేసారి దర్శిస్తున్నారు.

**నిద్రావ్యపగమే స్వప్ననగరే యాదృశం స్మృతౌ ।**
**చిద్వ్యోమాత్మ పరం విద్ధి తాదృశం త్రిజగత్ భ్రమమ్ ॥**

ఓ కుందదంతా! బిడ్డా! నిద్రలో నీకు ఒక భవనంలో కొందరి మిత్రులతో సమాగమం కనిపించిదనుకో! మెళకువ వచ్చేసరికి అదంతా ఒక 'స్మృతి'గా మాత్రమే మిగులుచున్నది కదా! అంతేగాని "ఆ భవనం నాది! నాది కాదు! వాళ్ళు నా వాళ్ళు! స్వప్నంలోని ఆ ప్రక్కవారు నా వారు కాదు." ఇటువంటి మమత్వాదులు స్వప్నానంతరం ఉంటాయా? ఉండవు కదా! మమత్వాదులు ఉండవు కాబట్టి "స్మృతి కాదు" అని కూడా అనవచ్చును కదా! అట్లాగే జ్ఞానికి త్రైలోక్యభ్రమ నశించియే ఉంటుంది. కనుక ఆతనికి త్రైలోక్య స్మృతి ఉన్నప్పటికీ... అది స్మృతి కాకయే ఉంటుంది. ఆతడు సర్వమును అధిష్ఠాన మాత్రమగు చిదాకాశముగానే ఎరుగుచున్నాడు.

చైతన్యము యొక్క 'స్ఫురణ' లేక 'అభాస' మాత్రమే ఈ జగత్తు. అట్టి స్ఫురణ కూడా చిదాకాశమే! మాకు చైతన్యమునకు అన్యంగా ఏదీ విషయమవటమే లేదు. నీ రూపము – నా రూపము వాస్తవానికి చిదాకాశమాత్రమే నని మేము ఎరిగియే ఉంటున్నాం.

**యస్మిన్ సర్వమ్, యతః సర్వం, యత్సర్వం సర్వతశ్చ యత్ ।**
**సర్వం సర్వతయా సర్వం తత్సర్వం సర్వదా స్థితమ్ ॥**

**(తస్మై సర్వాత్మనే నమః)** దేనియందైతే ఈ సమస్తము కలదో... దేని నుండి ఈ సమస్తము ఆవిర్భవిస్తోందో... ఏది సర్వరూపమై సర్వత్రా సర్వదా వ్యాపించియే ఉన్నదో... అట్టి చిద్రూపమే ...సదా...సర్వదా... సర్వరూపముగా స్థితినొందియున్నది. అట్టి సర్వాత్మకునికి సాష్టాంగ దండ ప్రణామములు.

ఓ ప్రియ సాధువులారా! ఈ విధంగా... బ్రహ్మదేవునిచే రచించబడిన ఈ సృష్టి ఎట్టిదో... ఈ దృశ్యము యొక్క రూపము, భావన ఎట్టివో... తనకి, ఈతని తదితర 7 గురు సోదరులకు ఏమేమి సంభవించుచున్నదో... ఇవన్నీ యోగదృష్టితో పరిశీలించి చెప్పాను. ఒక మీరిరువురు లేవండి. మీమీ గృహములకు వెళ్ళండి. అచ్చట మీక అభిమతములైన సత్కర్మలను త్వరత్వరగా ఆచరించండి. సత్కర్మలు వాయిదా వేస్తే ఉత్తమ భక్తి – జ్ఞానములు ఎట్లా అలవడతాయి?

ఇక నా విషయమంటారా? నేను సమాధిశీలిని కదా! ఇప్పటికే చాలా సమయం సమాధిని అభ్యసించక మీ కొరకై ఆయా విషయాలు దర్శించి చెప్పటం చేత నాకు అలసటగా ఉన్నది. కించిత్

ఖేదముగా ఉన్నది నా ఖేదం తొలగాలంటే... దుఃఖపరిహారము కొరకై తిరిగి సమాధిలో ప్రవేశించి చిరకాలం ఉండాలని నిర్ణయించుకున్నాను. మీకు శుభమగుగాక! ఇక సెలవు!

❖

**కుందదంతుడు :** (అయోధ్యలోని ఆధ్యాత్మిక సభలో) ఓ రామచంద్రా! ఈ విధంగా పలికి ఆ వృద్ధ గౌరీవన తపస్వి ధ్యానమునందు ప్రవేశించటానికై కనులు మూసుకొన్నారు. ఆయన మనస్సు – ప్రాణములు బాహ్య చేష్టా రహితమైనాయి. అప్పుడు మేమిద్దరం అనేక అనునయ వాక్యాలతో మరల మరల ప్రార్థించినప్పటికీ... ఆయన మాకు ప్రత్యుత్తరం ఇవ్వనేలేదు. ఎందుకంటే బాహ్యావృత్తిని ఉపశమింపజేసుకొని ఉండటం చేత మా శబ్దాలు ఆయనకు వినబడటం లేదు. ఆయన చిత్రము నందు లిఖించబడినవానివలె నిశ్చల స్వరూపులైనారు. అమృతతుల్యమైన ఆయన వాక్కు – ఆ వాక్కు అందించే మహత్తర జ్ఞాన విశేషాలు – వీటికి దూరం కావలసినందులకు మేము ఎంతో దుఃఖం పొందాం. ఆ మహనీయుని వాక్కులు ఆమాత్రమైనా వినగలిగిన మహత్ భాగ్యం ప్రసాదించిన మా ఇష్టదైవములకు కృతజ్ఞతలు తెలుపుకున్నాం. వారికి సాష్టాంగ దండ ప్రణామములు ఆచరించి మా వద్ద ఉన్న కొన్ని పుష్ప గుచ్ఛాలను వారి పాదాలకు సమర్పించి ఇక అక్కడి నుండి బయలుదేరి మేం మధురానగరం చేరాం. అక్కడి నుండి మా మా గృహాలు చేరాము. సుదీర్ఘకాలం తరువాత మా రాకచే మా మా కుటుంబ సభ్యుల నయనములు ఆనందమయం అయ్యాయి. ఆ తరువాత దేవతా పూజతో కూడిన ఉత్సవములు మా ఇంట్లోను, ఆ ఆ మిత్రుని ఇళ్ళలోను పండుగవలె జరిగాయి.

ఆ విధంగా వారి గృహంలోను, మా గృహంలోను ఆనందపూర్వకంగా రోజులు గడవసాగాయి.

❖❖❖

# 6. కుందదంత ప్రబోధం

**కుందదంతుడు :** ఓ శ్రీరామచంద్రాదిగాగల సభ్యులారా! ఆ తరువాత విశేషాలు కూడా ఇక సంక్షిప్తంగా చెపుతాను – వినండి.

కాలం మహత్తరమైనది కదా! కాలముచే మ్రింగబడనిదేమున్నది? అయినా సరే... మనకు అతిప్రియమైన బంధుమిత్రులు మన వెంటే ఉంటారులే" అని అనుకుంటూ రోజులు గడుపుతాం. ఇంతలో వియోగ దుఃఖాలు వచ్చిపడుతూనే ఉంటాయి కదా!

కొంతకాలం గడచిన తరువాత ఆ 8 మంది సోదరులలో నా మిత్రుడు తప్ప మిగతావారంతా కొద్ది కాల వ్యవధిలోనే దేహములు త్యజించారు. నా మిత్రుడు తన సోదరుల పట్ల గల మమకారంతో దుఃఖితుడైనాడు. అప్పుడు నేను సాంత్వన వచనాలతోను, జ్ఞాన విశేషాలతోను ఓదార్చాను. ఇంతలో ఒక రోజు ఆ మృత్యుదేవత నా మిత్రుని కూడా నా నుంచి దూరం చేసివేసింది. ఇక నా దుఃఖానికి అంతులేకుండా పోయింది. నేనైతే నా మిత్రుని ఆతని సోదర వియోగం విషయంలో ఓదార్చానుగాని, ...నన్ను ఓదార్చే వారు నాకు లభించలేదు. అంతటి దుఃఖంలో జ్ఞాన వచనాలు ఏవీ నాకు గుర్తుకు

రావటం లేదు. అత్యంత దుఃఖితుడనై ఉన్న నేను "నాకు జ్ఞాన వచనాలు ప్రసాదించిన సద్గురువులగు ఆ గౌరీవన వృద్ధాతాపసియే శరణ్యం" ...అనే నిర్ణయానికి వచ్చి ...ఇక మా నగరం నుండి బయలుదేరి గౌర్యవనానికి వచ్చాను. అచ్చట వృద్ధ తాపసి సమాధిలో ఉన్నారు. "వీరిని నా కొరకై సమాధి నుండి విరమింపజేయటం ఉచితం కాదు. వీరు సమాధి నుండి బహిర్గతులై కనులు తెరచే వరకు ఇక్కడ వేచి ఉంటాను" అని... ఇక ఆ మహనీయుని సమక్షంలోనే వారిని ఆరాధిస్తూ, సమాధిని అనుభవించే ఆయన భౌతిక దేహాన్ని సేవిస్తూ... అక్కడే ఉండిపోయాను. 3 నెలలు గడచిపోయాయి. ఒక రోజు వారు కనులు తెరచి నన్ను చూచి ఆదరపూర్వకంగా చిరునవ్వు వెదజల్లారు.

**నేను (కుందదంతుడు) :** హే సద్గురూ! మీకు సాష్టాంగ దండ ప్రణామములు. స్వామీ! ఏమి చెప్ప మంటారు? నా మిత్రుడు దేహం చాలించాడు. ఇది నాకు ఎంతో దుఃఖం కలిగించింది. మీరు చెప్పి ఉన్న ఆప్తవాక్యాలను నా ప్రియ మిత్రునితో ఏర్పడిన వియోగ దుఃఖం కప్పివేసింది. ఇక దిక్కుతోచక మీ అమృతతుల్యమగు మధుర వాక్కులు వినాలని అనిపించింది. హే మహాత్మా! నాకీ దుఃఖం రావటానికి కారణమేమిటి? ఇది తొలగేది ఎట్లా? ఈ జగత్తుకు నాకు ఉన్న సంబంధం ఏమిటి? మీరు చెప్పినట్టి జ్ఞానవాక్యాలు నా మిత్రునికి బోధించానుగాని... నాకు మాత్రం దుఃఖం తొలగనేలేదు. ఈ దుఃఖం తొలగేది ఎట్లాగో చెప్పండి.

**గౌర్యాశ్రమ వృద్ధ తాపసి :** బిడ్డా! నీకు బోధించవలసినది సవివరంగా బోధించియే ఉన్నాను. ఇప్పుడు నేను సమాధిని చాలించి ఒక్క నిమిషం కూడా ఉండలేను. కాబట్టి కొద్ది క్షణాలలో నేను తిరిగి సమాధియందు ప్రవేశించనున్నాను.

నాయనా! నీకు పరమార్థోపదేశం అప్పుడు చేశాను కదా! కానీ ఏం లాభం? అభ్యాసం తగినంతగా లేకపోవటం చేత పరమార్థోపదేశం నీకు అంటటంలేదు. అందుచేత నీవు మరొక జ్ఞానప్రాప్త్యుపాయం చేపట్టక తప్పదు.

**కుందదంతుడు :** హే మహాత్మా! నేనిప్పుడు ఏ జ్ఞానప్రాప్త్యుపాయం చేపట్టాలో సెలవియ్యండి. మీ ఆజ్ఞను శిరసావహించి ఆత్మజ్ఞానిగా నన్ను నేను తీర్చిదిద్దుకుంటాను.

**గౌర్యాశ్రమ వృద్ధ తాపసి :** బిడ్డా! కుందదంతుడా! ఆత్మజ్ఞాన వాక్యాలు వినటానికి ముందుగా మనస్సును కొంత నిర్మలం చేసుకోవటం అత్యావశ్యకం. ధూళికప్పిన దర్పణంలో మన ముఖం సరిగ్గా కనిపించదు కదా! అందుచేత నీ ఇష్టదైవమగు ఆ శివభగవానుని స్తోత్రం చేస్తూ, పూజాది కర్మలు నిర్వర్తిస్తూ కొంతకాలం నీకు ఇష్టమైన ప్రదేశంలో గడుపు. ఆ తరువాత ఏం చేయాలో... నీకు ఒక గొప్పఉపాయం చెప్పుచున్నాను, విను.

అయోధ్యానగరం గురించి నీవు వినియే ఉన్నావు కదా! అచట దశరథ మహారాజు ఉంటారు. ఆయనకు "శ్రీరామచంద్రుడు" అనే లోక ప్రసిద్ధుడైన కుమారుడు ఉన్నారు. నీవు ఆతని దగ్గరకు వెళ్ళు. ఆతని కొరకై ఇక్ష్వాకు కుల గురువు, సప్తఋషులలో ఒకడు, బ్రహ్మ మానసపుత్రుడు అయిన

శ్రీవసిష్ఠ మహర్షి నిండు సభలో 22 రోజులు మోక్షశాస్త్రాన్ని లోక కల్యాణార్థం ప్రవచించనున్నారు. దివ్యమైన ఆ మోక్షోపాయ కథ విన్నావంటే... నీవు కూడా నా వలెనే పరమపావనమైనట్టి బ్రహ్మపదాన్ని పొంది చిరకాలం విశ్రాంతి పొందగలవు. ఇప్పుడు నాకు సమాధి యందు ప్రవేశించవలసిన సమయం ఆసన్నమైనది. ఇంతకన్నా అధికంగా నీతో సంభాషించలేను. నీకు శుభమగుగాక! "సద్గురూ!" అని సంబోధించియుండుటచే నా ఆశీర్వాదం నీ జ్ఞానమార్గ ప్రయత్నాలకు తోడుగా ఉండగలదు. సెలవు. ఇక వెళ్ళిరా!

ఓ రామచంద్రా! ఓ ప్రియ వేదవరేణ్యులగు సభికులారా! నేను ఆ తరువాత విదేహ దేశం వచ్చి కొన్నాళ్ళు గురు ఆజ్ఞానుసారం పూజ - ధ్యానము - గానము వంటి కార్యక్రమములతో పరమేశ్వరుడగు శివ భగవానుని అర్చించి ఈ రోజు అయోధ్యకు వచ్చాను. ఈ శ్రీరామచంద్రుడు ఈ సభకు వచ్చియున్నారని తెలిసి సభలో ప్రవేశించి మీ ముందు నా గత కథావిశేషాలన్నీ చెప్పాను. ఈ సమయమును కేటాయించి నా విన్నప సమన్వితమైన వాక్యములు విన్న సభికులకు, ఇక్కడి కార్యకర్తలకు, ఈ ప్రియ శ్రీరామచంద్రునికి ఇవే నా కృతజ్ఞతలు.

❖

**శ్రీరాముడు :** హే మహర్షీ! సద్గురూ! వసిష్ఠ మునీంద్రా! ఒకానొక రోజు విద్వత్ వరేణ్యుల సభలో ప్రవేశించిన కుందదంతుడు చెప్పినదంతా పూసగుచ్చినట్లు చెప్పాను. ఈ విషయాలు చెప్పటానికి అనుజ్ఞ ప్రసాదించిన మీకు కృతజ్ఞతలు.

హే మహర్షీ! ఇదంతా ఎందుకు చెప్పానంటారా?... వినండి. ఆ సభలో ప్రసంగించిన కుందదంత నామధేయ బ్రాహ్మణుడు మరెవరో కాదు. ఇదిగో... ఈ ఆ ప్రక్కన ఆసీనుడై ఉన్న ఈతడే ఆ కుందదంతుడు. ఈతడు 21 రోజులుగా మీరు మహత్తరంగా ప్రవచించిన మోక్షోపాయ మంతా చక్కగా శ్రవణం చేశారు. అందుచేత స్వామీ! ఈ సంహితను వినిన తరువాత "వీరికి సందేహ నివృత్తి అయిందా? లేదా?" అనే విషయం ఈతనినే చెప్పమంటే మన సంవాదమునకు సముచితమవుతుందని మీకు ప్రార్థనాపూర్వకంగా విన్నపం చేస్తున్నాను.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! శ్రీరాచంద్రుడు ఈ విధంగా పలికి వినయంగా లోక గురువగు శ్రీ వసిష్ఠ మహర్షి వైపుగా ప్రణామపూర్వకంగా నిలుచున్నాడు. ఆ శ్రీరామచంద్రుని మాటలు విని, వక్తలలో శ్రేష్ఠులు, మునివర్యులు, లోకకల్యాణమునకై కంకణం కట్టుకున్నవారు అయిన శ్రీ వసిష్ఠ మహర్షి చిరునవ్వుతో... శ్రీరామచంద్రుని ప్రేమాస్పదమైన కన్నుల కదలికచే సుఖాసీనుని చేశారు. అటు తరువాత కుందదంతుని చూచి ఇట్లు పలికారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** పాపరహితుడవు, ఉత్తమ బ్రాహ్మణుడవు అగు ఓ కుందదంతా! ఈ శ్రీరామచంద్రుడు నీవు చెప్పినదంతా వివరించాడు. నేను చెప్పుకుంటూ వస్తున్న మోక్షశాస్త్రాన్ని 21 రోజులుగా విన్నావు కదా! ఇప్పుడు నిర్మోహమాటంగా చెప్పు. తెలుసుకోవలసిన వాటిలోకెల్ల

అత్యుత్తమమైనది, ప్రశాంతతను ప్రసాదించేది అయినట్టి బ్రహ్మ పదమును నీవు తెలుసుకొన్నావా? గ్రహించావా? ఇప్పుడు నీకేమనిపిస్తోందో సూటిగా - సంక్షిప్తంగా చెప్పవచ్చు.

**కుందదంతుడు :** మహాత్మా! వసిష్ఠ మహర్షీ! మీ పాదములకు సాష్టాంగదండ ప్రణామములు. శ్రీవసిష్ఠ - రామ సంవాదమునకు నాందీ వచనములు పలికిన బ్రహ్మర్షియగు విశ్వామిత్రుల సుందర పాదపద్మములకు హృదయపూర్వక నమోవాక్కులు.

హే మహర్షీ! ఇప్పుడు ఒకానొక అనిర్వచనీయమైన విశ్రాంతి సుఖమును ఆస్వాదిస్తున్నాను. సర్వ సంశయాలు ఛేదింపబడగా, నా చిత్తం అజ్ఞాన వీచికలను జయించివేసి దిగ్విజయానందమును పొందుతోంది. నా సమస్త సందేహాలు నశించాయి. నాయందు, సర్వులయందు జాజ్వల్యమానంగా వెలుగొందుచున్న భేదరహితమగు జ్ఞేయవస్తువైన ఆత్మానందమును, "ఆత్మను అంతటా దర్శిచ గలుగుట" అనబడు ఆత్మ సాక్షాత్కారమును మీ వాక్యములు విన్నటువంటి మహద్భాగ్యం చేత నేను పొందాను. ఈ 21 రోజులు వేలాది జన్మలలోని పుణ్యఫలం అని, నా ఇష్టదైవమగు శివదేవుని కృప అని, మద్గురువులు అగు గౌర్యవన వృద్ధతాపసి యొక్క కరుణా కటాక్ష వీక్షణమని నేను అనుకుంటున్నాను. హే మహాశయా! ఏమి ఈ నా భాగ్యం!

**జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలం, దృష్టం ద్రష్టవ్యమక్షతమ్ ।**
**ప్రాప్తం ప్రాప్తవ్య మఖిలం, విశ్రాంతోఽస్మి పరే పదే ॥**

ఇప్పుడు నేను తెలుసుకొనవలసిన నిర్మల వస్తువు గురించి తెలుసుకున్నాను. ఏది పొందాలో ...అది పొందాను. ఉత్తమమగు బ్రహ్మ పదమునందు నేను విశ్రాంతి సుఖమును అనుభవిస్తున్నాను. హే మహాత్మా! నిజ చిదాకాశము కంటే ఇతఃపూర్వపు ఇప్పటి, ఇక ముందటి జగత్తులు ఏ మాత్రం వేరు కానేకాదు. మహా పదార్థ ఘనమైనట్టి ఆత్మ చైతన్యమే నా స్వరూపమని ఇప్పుడు ఘంటాపథంగా ఎరుగుచున్నాను. నాచే పొందబడిన, పొందబడుచున్న, పొందబడబోవు జగత్తులన్నీ నా చిత్ చైతన్య స్వరూపాలే! ఇక అవి నాకు వేరుకానప్పుడు నన్ను దుఃఖింపజేయటమనే మాట ఎక్కడిది?

**సర్వాత్మకతయా సర్వరూపిణః సర్వగాత్మనః ।**
**సర్వం సర్వేణ సర్వత్ర సర్వదా సంభవత్యలమ్ ॥**

సర్వాత్మకమై... సర్వాత్మకం కాబట్టి సర్వరూపిణి అయి, సర్వరూపిణి కాబట్టి సర్వ వ్యాపకమై, సర్వవ్యాపకము కాబట్టి స్వస్వరూపమే అయి వెలయుచున్న పరమాత్మ యందు సర్వత్రా సర్వదా సర్వ విధములా సమస్తము సంపూర్ణముగా సుసంభవమే!

**సంభవన్తి జగన్త్యన్తః సిద్ధార్థ కరకోటరే ।**
**న సంభవన్తి చ యథా జ్ఞాతమేతత్ అశేషతః ॥**

ఒక ఆవగింజ యొక్క లేశము (చిన్న విభాగము) నందు కూడా సర్వశక్తియుతమగు చైతన్య సత్త వేంచేసియే ఉన్నది. అట్టి చైతన్య సత్త ఉండి ఉండటం చేత ఆ ఆవగింజ అవశేష విభాగంలో అనేక బ్రహ్మాండములు సంభవించగలవు. కానీ... అలా సంభవించగలిగినప్పటికీ కూడా... పరమార్థ

దృష్టిచే ఏదీ సంభవించకయే ఉన్నది. ఈ విషయం మీ బోధచే సుస్పష్టంగా, నిర్దుష్టంగా నేను ఎరుగుచున్నాను.

**గృహేఽన్తః సంభవత్యేవ సప్తద్వీపా వసుంధరా**
**గేహంచ శూన్యమేవాస్తే సత్యమేతత్ అసంశయమ్ ॥**

ఒక గృహంలో ఒకే సమయంలో సప్తద్వీపములతో కూడిన 8 విస్తార భూములు సంభవమే! ఇక నాకు సందేహం లేదు. కాని, వాస్తవానికి ఆ గృహము శూన్యరూపమే అయివున్నది. ఈ విషయం కూడా అత్యంత నిర్దుష్టమైన సత్యమే! ఇందులో కూడా ఏమాత్రం సంశయం లేదు.

ఏఏ వస్తువు ఎచ్చటెచ్చట ఎపుడెపుడు ఏఏ ప్రకారంగా భాసిస్తోందో... మరియు జీవులకు అనుభూతమౌతోందో... అది అచట అప్పుడు ఆ ప్రకారంగా... మహాచిద్ఘనము, ఆద్యంత రహితము ముక్త స్వరూపము అయినట్టి బ్రహ్మమే... ఆ విధంగా వర్తించుచున్నదగుచున్నది! బ్రహ్మము కంటే భిన్నంగా ఎవనికీకూడా ఎక్కడాకూడా ఏదీ, ఏమాత్రంకూడా అనుభూతం అవటం లేదు.

అనుభూతమయ్యే సర్వము బ్రహ్మమే! బ్రహ్మము సర్వ అనుభూతులకు మునుముందుగానే ఏర్పడి ఉన్నది. అట్టి బ్రహ్మమే నేను. ఈ సభికులంతా కూడా నా బ్రాహ్మీ స్వరూపులే! అట్లాగే సభలోని, సభ వెలుపలి ప్రతి ఒక్క జీవుని పరబ్రహ్మ స్వరూపమే నేను!

❖❖❖

# 7. జడ చేతనముల నిత్య ఏకత్వం

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! కుందదంతుడు ఈ ప్రకారంగా చెప్పి మౌనం వహించగా... అప్పుడు శ్రీవసిష్ఠ మహర్షి పరమార్ధ యోగ్యమైన మరికొన్ని విశేషాలు ఈ విధంగా చెప్పసాగారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆహా రామచంద్రా! ఇది సంతోషకరమైన విషయం. మహాత్ముడగు కుందదంతుడు కరతల ఆమలకంలాగా (అరచేతిలోని ఉసిరికాయ వలె) ఈ ప్రపంచమును ఎటువంటి సందేహాలు లేకుండా, ప్రత్యక్షంగా "బ్రహ్మరూపముగా" దర్శిస్తున్నారు. ఓ సభికులారా! "అయ్యో! మాకు భ్రాంతి తొలగటం లేదే! జగత్తులోని సంబంధాలు మొదలైనవి మేము కలిగి ఉంటున్నామే!" అని నిరుత్సాహ పడే బదులు... "భ్రాంతి కూడా బ్రహ్మరూపమే"... అనే దృష్టిని అలవరచుకోండి. భ్రాంతాత్మకమగు ఈ ప్రపంచం కూడా వాస్తవానికి జన్మ రహితమగు బ్రహ్మరూపంగానే భాసిస్తోంది. కనుక సమస్తము కూడా "శాంతము, ఏకము, నిర్వికారము"... అయినట్టి బ్రహ్మయే! ఇది గమనించండి.

**యద్యథా యేన యత్రాస్తి యాదృగ్యావద్యదాయుతః**
**తత్తథా తేన తత్రాస్తి తాదృక్తావత్తదా తతః**

ఏది, ఏ ప్రకారంగా, ఎట్లు, ఎంతగా, ఎప్పుడు, ఏ కారణం చేత, ఎచట ఉన్నదో... అది – ఆ ప్రకారంగా దానిచే, అట్లు, అప్పుడు, ఆ కారణం వలన, అచట బ్రహ్మమే ఆ రూపంగా వర్తిస్తోంది.

**శివం శాంతం అజం మౌనమ్ అమౌనమ్ అజరం తతమ్ ।**
**సుశూన్యా శూన్యమభవమ్ అనాది నిధనం ధ్రువమ్ ॥**

సమస్తము తానే అయి ఉన్న బ్రహ్మము - ఇక ఈ సర్వముకూడా అయి, - శుభప్రదము శుభరూపము, పరమశివరూపము, జన్మాది వికారములు లేనిది, మౌన స్వరూపము, జడత్వ వర్జితము, జరత్వం (వార్ధక్యం) అనేది లేనిది, పదార్థ శూన్యము, ప్రపంచ వర్జితము, అనాది, సుస్థిరముగా ప్రకాశిస్తోంది.

ఈ జగత్తు బ్రహ్మము యొక్క కల్పనా విభాగమే! బ్రహ్మము సర్వదా యథాతథం. అద్దానికి అనన్యం అయినట్టి మాయా స్ఫురణ చమత్కార విభాగం ఏఏ విషయమును - విశేషమును దృఢ సంకల్పంతో భాసింపజేస్తోందో... ఆయా విశేషముగా విస్తారంగా అట్లే కనిపిస్తోంది.

ఈ బ్రహ్మాండమంతా చిదాకాశమునందే ఉన్నది. సముద్రంలో ఒక జలకణం ఉన్నట్లుగా... ఈ బ్రహ్మాండమంతా చిదాకాశములో పరమాణువై ఉన్నది. అంతేకాదు. తనయొక్క అభ్యంతరమున జగత్తును కలిగియుండటం చేత ... చిదాకాశమే బ్రహ్మాండమైయున్నది. అనగా... ఈ బ్రహ్మాండమే ...చిదాకాశము. చిదాకాశమే... ఈ బ్రహ్మాండం. ' రెండు వేరువేరు' అని చూచే దృష్టి భ్రమయే!

కాబట్టి రామచంద్రా! ఈ సమస్త జగత్తూ కూడా - ఆది మధ్యాంత రహితము, పరిపూర్ణము - శాంతము... అగు చిదాకాశమే! ఇది గమనించమని సభికులందరికీ పదే పదే గుర్తు చేస్తున్నాను. 'ఈ శరీరం నేను' మొదలుగాగల వైచిత్ర్య రూపములగు బంధములు నశించినవారై, కేవలము - నిర్వికారము నిర్వాణరూపము - యథాస్థితము అగు బ్రహ్మరూపులై ఉండండి.

మీరంతా దేహమనోస్వరూపులు కాదు. కేవల బ్రహ్మస్వరూపులే! (తత్త్వమసి)!

**స్వయం దృశ్యం స్వయం ద్రష్టృ స్వయం చిత్తం, స్వయం జడమ్ ।**
**స్వయం కించిన్న కించిచ్చ బ్రహ్మాత్మన్యేవ సంస్థితమ్ ॥**

వ్యవహార దృష్టిచే... బ్రహ్మమే ద్రష్ట-దృశ్య, చిత్-జడ, దృశ్య-అదృశ్య రూపములుగా స్థితినొందియున్నది. కానీ, పరమార్థ దృష్టిచే... ఇదంతా పదార్థరూపం కానేకాదు. అద్వితీయ "స్వయం ప్రకాశానందైక స్వరూపము" అగు ఆత్మయందే ఆత్మకు అభిన్నంగా స్థితినొంది ఉన్నదై ప్రకాశిస్తోంది. అట్టి బ్రహ్మము... ఇచట ఆ రూపంతో వర్తిస్తోంది. అయినా కూడా నిజ చిదాకాశమునందు తన యథార్థ 'సత్‌చిత్' స్వరూపమును ఏ మాత్రం త్యజించటం లేదు. త్యజించకయే ...ఇట్లు వర్తిస్తోంది.

**బ్రహ్మ దృశ్యమితి ద్వైతం న కదాచిత్ యథా స్థితమ్**
**ఏకత్వం ఏతయోర్విద్ధి! శూన్యత్వాకాశయోరివ ॥**

ఓ రామచంద్రా! ఓ ప్రియ సభికులారా! "బ్రహ్మము మాయచే జగద్దృశ్యముగా అగుచున్నది"... అని మీరు తలచకండి. జ్ఞానము యొక్క వర్తమానపు చర్చనీయాంశమగు స్థితిలో అటువంటి ద్వైతవాక్యాలకు (బ్రహ్మం వేరు - జగత్తు వేరు... అనే ద్వైత వ్యవహారానికి) తావు లేదు.

"ముత్యపు చిప్ప వెండిలా భాసిస్తోంది" అని చెప్పినప్పుడు, "అక్కడ వెండి ఉన్నది" అని అర్థం కాదు కదా! నిర్వికారమగు ముత్యపు చిప్ప అట్లే ఉన్నది. అది ఏమాత్రం మారటంలేదు.

అట్లాగే నిర్వికారమగు బ్రహ్మము ఈ దృశ్యముగా భాసించుచున్నట్లు ప్రాపంచిక దృష్టికి అనిపించినప్పటికీ... బ్రహ్మము సర్వదా తనయొక్క "పారమార్థిక నిర్వికార రూపము" తోడనే సర్వత్రా వెలయుచున్నది. ఆకాశము – శూన్యత్వము... రెండూ ఒక్కటే కదా! అట్లాగే

**బ్రహ్మము, దృశ్యము ఒక్కటే -**

**దృశ్యమేవ పరంబ్రహ్మ, పరంబ్రహ్మైవ దృశ్యతా**
**ఏతత్ న శాంతం నాశాంతం నానాకారం నచాకృతిః॥**

కనబడే దృశ్యమే పరబ్రహ్మము. పరబ్రహ్మమే ఈ దృశ్యమైయున్నది. అట్టి పరబ్రహ్మము... జగత్తుగా కూడా అయి ఉండుటచే 'శాంతము' కాదు. సర్వదా యథాతథము – నిర్వికారము కాబట్టి 'అశాంతము' కాదు.

సర్వ ఆకారాలు అద్దానివే. కాబట్టి సాకారమే! "అద్దాని ఆకారం ఇది" అని అనలేం కదా! కనుక నిరాకారం. అది సర్వత్రా అనురాగము కలిగి ఉంటోంది. కనుక సరాగ స్వరూపమే! సర్వత్రా అనురాగమే విరాగం. కాబట్టి అది నిత్యవిరాగి!

**శ్రీరాముడు :** మహర్షీ! అయితే, ఈ జగత్తు సాకారంగానే కనిపిస్తోంది కదా! బ్రహ్మమో.... నిరాకారం కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నిద్రలో స్వప్నం సాకారమే. అయితే ఏం? స్వప్నద్రష్ట నిరాకారుడే కదా! నిద్ర లేవగానే? స్వప్నంలో కనిపించిన పదార్థాలన్నీ నిరాకారములుగానే భాసిస్తున్నాయిగా! అట్లాగే...

ఆత్మజ్ఞానం బుద్ధియందు ఉదయించనంతవరకు... ఈ జాగ్రద్దేహం సాకారం. ఆత్మజ్ఞాన ప్రాప్తికి అనంతరమో... ఈ జాగ్రత్‌ద్దేహం నిరాకారం.

స్వప్నంలో చిన్మాత్రాత్మ స్వయంగా సాకారంగా అనుభూతమైనప్పటికీ, వాస్తవానికి అట్టి ఆకారములన్నీ అసన్మయములే కదా! అట్లే జాగ్రత్‌లో కనిపిస్తున్న ఈ దేహాది ఆకారములన్నీ కూడా అనుభూతములైనప్పటికీ అసన్మయములే అయి ఒప్పుచున్నాయి. అయినా కూడా... నీ ప్రక్కన ఉన్న ఆ నీ మిత్రుడు కుందదంతుడు. దేహీ, దేహముల కలయికయే కదా! 'మిత్రమా' అని సంబోధిస్తున్నది, దేహినేగాని ఈ దేహమును కాదు కదా! దేహమునకు ఆకారము ఉన్నట్లుగా అ అనిపించవచ్చు గాక!

ఆకారం స్థిరం కాదు కదా! అది అట్లా ఉండగా, ఇక దేహికి ఆకారం ఎక్కడున్నది?... ఇక ఈ ప్రపంచంలోగల జడ – చైతన్యములంటావా? ఈ జీవుడు చేతన స్వరూపుడే! చిన్మయుడే! అయితే ఏం? కాన ఈతడు సుషుప్తి (గాఢనిద్ర) యందున్నప్పుడో? జడుడే అగుచున్నాడు కదా! చేతన రూపుడగు ఈ జీవుడు గాఢనిద్రా సమయంలో జడుడై ఉంటున్నట్లే... చైతన్యమే స్థావరంగా కూడా కనిపిస్తోంది.

సుషుప్తి దశనుండి జీవుడు... స్వప్న దశలకు వస్తున్నాడు. అప్పుడు జాగ్రత్ కల్పనలతో కూడి ఉంటున్నాడు. అట్లాగే... చైతన్యం సమక్షంలో ఘనీభూతమైన జడము ఒకానొకప్పటి ఆ జడమగు స్వతత్త్వము నుండి జంగమ – చేతన దశను పొందుతోంది.

ఓ సహ పరబ్రహ్మ స్వరూపులగు సభికులారా! బుద్ధికి ముక్తి కలుగనంత వరకు ఈ పృథివి, జలము, అగ్ని, వాయువు ఆకాశములందు అణువణువునా "స్వప్నతుల్యమైన – శూన్యరూపమైన' అనేక జగత్తుల అనుభూతులు, అనుభవాలు, స్థితిగతులు భాసిస్తూనే ఉంటాయి.

ఈ మనుజుడు జాగ్రత్ నుండి గాఢనిద్ర యొక్క అధ్యాసను పొందుచున్నట్లుగా (గాఢనిద్రను ఆస్వాదించ సంసిద్ధుడై జగత్ రాహిత్యమును ఆస్వాదిస్తున్నట్లుగా)... చైతన్యము జడత్వము యొక్క అధ్యాసమును కావించుచున్నది. జడత్వమగు (ద్రష్టయొక్క) అధ్యాస చేతనే అది జడరూప వస్తు సముదాయంగా కూడా అగుపిస్తోందే గాని... వాస్తవానికి చైతన్యము జడత్వమును ధరించటమే లేదు. స్వప్నంలో జడమగు ఇల్లు, రహదారి, రాయి, కొండ మొదలైన జడవస్తువులు కనిపించినంతమాత్రమే... స్వప్న ద్రష్ట జడముగా అగుచున్నాడా? లేదే! అవన్నీ కూడా స్వప్నద్రష్ట యొక్క స్వప్నచైతన్య ప్రదర్శనములే కదా!

'జడత్వము'ను అనుభవించే జీవుని చైతన్య విభాగమే స్థావర శరీరమును నిర్మించుచున్నది. అట్లాగే చైతన్యము అనుభవించే జీవుని చైతన్య విభాగం చేతనములను నిర్మించుచున్నది. ఓ రామచంద్రా! గాఢనిద్రను ఒక జీవుడు అనుభవిస్తూ ఉండగా... ఇప్పుడు ఆతడు జడమా? ఆతడు అచేతనుడై వాక్ మనోరహితుడై ఉండవచ్చుగాక! ఆతని చైతన్య విభాగమే జడత్వమును ఆశ్రయించి ఉన్నది కాబట్టి ఆతడు చేతనుడుగా కొనసాగుచున్నట్లే కదా! ఆ జడమే జాగ్రత్ స్వప్నములకు ఉత్పత్తి స్థానం కాబట్టి ఆతడు జాగ్రత్ – స్వప్న సమయములలో కూడా జడరూపుడే కదా! ఈ విధంగా జడ – చేతనములు మా దృష్టిలో ఏకత్వమునే సంతరించుకున్నవై ఉంటున్నాయి.

చేతనములైనట్టి చేతులు, కాళ్ళు, కళ్ళు మొదలైనవి, అచేతనములగు గోళ్ళు, కేశములు (జట్టు) మొదలైనవి ఒకే దేహంలో సమావేశమై ఉంటున్నాయి కదా! అన్నిటినీ కలిపే 'దేహము' అని పిలుస్తున్నాం. అయితే వాస్తవానికి దేహి రూపరహితుడు కదా! అట్లాగే నిరాకారమగు చైతన్యము నందు స్వాధ్యస్తములై కనబడే ఈ జగత్ శరీరుని జగత్ శరీర సమస్త స్థావర జంగమములు ఏక శరీర రూపములే అయి ఉన్నాయి.

సంకల్పమే బ్రహ్మదేవుని ప్రథమ సృష్టికి హేతువు. ఆ సంకల్పమే చిద్రూపమున (స్వప్నంలో లాగానే) స్థావర – జంగమాత్మక జగత్తుగా వ్యక్తీకరణమౌతోంది. అదే ప్రకారంగా ఇప్పటికీ స్థితినొందియున్నది. ఇట్లా ఈ జగత్తు చిరకాలంగా జడరూపంతో ఉన్నప్పటికీ... వాస్తవానికి ఇదంతా చిన్మయయే! ఇంతెందుకు? ఇదంతా సత్యము – శాంతము – నిరాకారము అయినట్టి బ్రహ్మమేనని మేము గమనిస్తున్నాం. ఈ రీతిగా జగత్తును జగత్తుగా కాకుండా... చిన్మయ బ్రహ్మముగా దర్శించటమే 'సృష్టి నశించటం– సృష్టి అంతము' అని చెప్పబడింది. ఎందుకంటే

పారమార్థికంగా చూస్తే ఈ జగత్తు ఎప్పుడూ లేనేలేదు. లేదు కాబట్టి "బ్రహ్మమునందు జగత్తు వ్యక్తీకరణమవటం"... అనునది జరగటమే లేదు. జగత్తుగా కనిపించేదంతా బ్రహ్మముగా అనిపించటమే 'జగత్ వినాశనం' అయివున్నది. ఈ మార్గంగానే ఈ జగత్తు "బ్రహ్మము"గా (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ) అయివున్నది. జగత్తుగా అనిపించటమే 'జగదుత్పత్తి'. ఇంతకు మించి ఉత్పత్తి – ప్రళయాలు ఎక్కడా లేవు.

ఓ రామచంద్రా! నిద్రాకోష్ఠము నందే స్వప్నం యొక్క "ఆది–అంతము" కల్పించబడు చున్నాయేగాని, జాగ్రత్ కోష్ఠమున కాదు కాబట్టే జాగ్రత్ దృష్ట్యా స్వప్నము మిథ్యయే అయి ఉంటోంది. అట్లాగే... త్రికాలములందు కూడా 'లేనిదే' అగు ఈ జగత్తు యొక్క ఆది – అంతముల గురించిన కల్పన (జ్ఞాన సూర్యుని ఉదయానంతరం) మిథ్యయే అయివుంటోంది.

ఓ సభికులారా! ఆద్యంత రహితము – పరమాత్మ ఘనము అగు చైతన్యమొక్కటి తప్ప తదితరమైనదేదీ ఎక్కడా లేదు. అందుచేత పేరుకు కూడా సృష్టి – స్థితి – లయములు మా దృష్టికి అగుపించటం లేదు. ఆ సృష్టి, స్థితి, లయముల రూపంలో బ్రహ్మమే మాకు ప్రదర్శితమగుచున్నది. ఇక వాటి రూపమగు ఈ జగత్తుల గురించి వేరుగా చెప్పేదేమున్నది? చిత్ర లేఖనంలో సుందర స్త్రీ నిజమైన స్త్రీయా? కాదే! అట్లాగే సృష్టి – స్థితి – లయాలు, ఆ మధ్యలో జగత్‌దృష్టికి ఈ జగత్తులు కనిపిస్తున్నాయి. ఇవి ఆత్మకంటే వేరుకాదు. (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ).

ఎవరో అతిప్రావీణ్యుడైన చిత్రకారుడు కొన్ని రంగులను మేళవించి శుభ్రమైన తెల్లటి వస్త్రముపై రచించిన ఆ యుద్ధ సేనా చిత్రమును చూడు. అందులో అనేకమంది సైనికులు, రథములు, ఆయుధములు ఆ చిత్రకారుడు రచించాడు కదా! అందులో రచించిన యుద్ధ విన్యాసం, ఆ రథములు, ఆ ధూళి, ఆ ఆయుధములు, ఆ శత్రు, మిత్ర సేనలు ఇవన్నీ కూడా... అతికౌశలం గల చిత్రకారుని ఊహకంటే వేరుకాదు కదా! అట్లాగే... సాకారము, నానారూప సమన్వితము అగు ఈ సృష్టి – ఇద్దానిని సృజించు వాని యొక్క – ఇద్దానిని దర్శించు వానియొక్క "చిత్తముల యొక్క సారూప్యము" మాత్రమే! ఇదంతా చిత్తము కంటే ఏమాత్రము వేరుకాదు.

**ఈ జగత్తంతా అద్వైత రూపమే అయి ఉన్నది -** చిద్ఘనము సర్వదా 'విభాగరహితం'. అయినప్పటికీ విభాగించబడిన దానివలె అగుపిస్తోంది. 'అవిద్య' అనే సుషుప్తి రూప ఆవరణచే వాస్తవ రూపం .... అగు 'మోక్షము' అనే ప్రసిద్ధమగు విభాగమును మరుగున పరచి ఉంచుతోంది. తాను చిత్తరూపంగా అయి ఈ జాగ్రత్ – స్వప్న విభాగములను దర్శింపజేస్తోంది. అయినా కూడా, "ఇది సృష్టి – ఇది ప్రళయము – ఇది స్వప్నము – ఇది జగత్తు" ...అనునవన్నీ కూడా – నిరాకారము – ప్రజ్ఞాన ఘనము – అనేక చిద్రూప కిరణ సమాహితము – అగు "ఆత్మ" అనే మహాసూర్యుని ప్రకాశ భేదములే అయివున్నాయి.

చైతన్యము యొక్క వాసనా రూపమగు స్వప్న విభాగము ఉపాధి అంశ ప్రాధాన్యముచే "చిత్తము" అని పిలువబడుతోంది. చిదంశ ప్రాధాన్యమే "జీవుడు" అని పిలువబడుతోంది.

ఆ జీవుడే దేవ – మనుష్య ఆదిగా గల అధికార దేహములను పొంది 'తత్త్వజ్ఞానము'చే అవిద్యను పారద్రోలివైచి 'ముక్తుడు' అగుచున్నాడు. అనగా, ఆతడు 4వ 5వ భూమికలను అభ్యసిస్తూ, 6వ భూమికలో స్వయంగా అంతయు ఆత్మరూపంగా అన్వయించుకుంటున్నాడు. అప్పుడిక 7వ భూమికయందు ప్రవేశించి మోక్షరూపుడగుచున్నాడు"... అని మోక్షము గోరువారికి గురువులచే చెప్పబడుతోంది.

"అట్టి మోక్ష శాస్త్రము యొక్క 'మోక్షము' అనే శబ్దానికి అర్థం ఈ దృశ్యమును ఆత్మరూపంగా దర్శించటమే" అయివున్నది.

❖❖❖

# 8. చిత్త విన్యాసం

**శ్రీరాముడు :** హే మహాత్మా! నిర్మలమగు ఆత్మ నుండి వాసనా విభాగరూపంగా ఉపాధి అంశ ప్రాధాన్యముచే చిత్తము బయల్వెడలుతోంది కదా! అట్టి చిత్తము "దేవతలు, అసురులు, మానవులు" మొదలైన భేదములచే ఎంత పరిమాణము కలిగియున్నది? ఆ చిత్తము స్థితి ఎట్టిది? నిద్రానిద్ర స్వరూపమగు చైతన్యము నందు ఈ జగత్తు ఎంత పరిమాణము కలిగియున్నది? ఈ జగత్తు ఎంత కాలం ఉండబోతోంది? చైతన్యము యొక్క గర్భంలో ఈ జగత్తు ఎట్లా స్థితి కలిగి ఉన్నది? దయచేసి ఈ జగత్తు గురించి ఈ ఈ విషయాలు చెప్ప ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అవును. ఈ మనుష్య, దేవ, అసుర, స్థావర, స్త్రీ, పురుష, నాగ పర్వత, పిశాచ, రాక్షస, పక్షి, కీటకాదులన్నీ... 'చిత్తమే' అని ఎరుగు. అట్టి ఈ చిత్తం పరిమాణం అనంతం. అద్దాని యందు బ్రహ్మదేవుని నుండి స్తంభం వరకు గల ఇటువంటి జగత్తులు అసంఖ్యాంగా ఉన్నాయి. చిత్తమే ఇదంతా! ఈ నేత్ర జ్ఞానము ఊర్ధ్వమునకు పోయి సూర్య గోళమును కూడా దాటివేసి ఎంత దూరం పోగలదో... అదంతా చిత్తమే అయివున్నది. చిత్తము "అంతులేనంత విశాలం" అనునది అందరికీ అనుభవమైన విషయమే! ఇది ఇట్లా ఉండగా, ఈ చిత్తం అనేక దుస్సహ సంసార దుఃఖములచే పరిపూర్ణమై ఉండటం చేత అతిభయంకరమై ఒప్పుతోంది కూడా!

అయితే... ఈ చిత్తము వాస్తవానికి చైతన్య రూపమే! ప్రదర్శనా చమత్కారమే! ఎప్పుడైతే చిత్తము సమష్టి రూప విభాగంలో బ్రహ్మాండ కల్పన వలన లోక సమూహాలు కల్పనా మాత్రంగా వచ్చి చేరుచున్నాయో... అప్పుడు "చిత్తం నుండి సృష్టులు వచ్చినాయి" అని చెప్పబడుతోంది.

ఆద్యంత రహితమగు ఈ చిత్తమే "జీవుడు". అన్ని కుండలలో ఆకాశం ఉన్నట్లు... ఈ చిత్తము సర్వదేహములందు కలదు. ఈ సర్వదేహములు బ్రహ్మదేవుని ఇచ్ఛయే కాబట్టి "ఈ ఈ దేహాలలో చిత్తము లేదు. చిత్తములోనే ఈ ఈ దేహాలు ఉన్నాయి"... అని కొందరనటం కూడా యుక్తి యుక్తమే! నదీ ప్రవాహం సర్వ ప్రదేశాలలోనూ త్యజిస్తూ పోతున్నట్లు ఈ చిత్తము కూడా అనేక ఉత్తమ – అధమ దేహాలను గ్రహిస్తూ – త్యజిస్తూ ఉంటుంది. "మృగతృష్ణలో జలం ఉండదు"

...అని తెలిసిన తరువాత ఇక "అక్కడి జలం దాహం తీరుస్తుంది" .... అనే భ్రమ కూడా తొలగుతుంది కదా! ఆత్మ స్వరూపమును ఎరిగిన మరుక్షణం ఈ చిత్తము యొక్క దేహాది భ్రమ అతిశీఘ్రంగా నశించగలదు.

ఈ సువిశాల జగత్తును తన గర్భంలో ధరించుచున్నది ఈ చిత్తమే! అయితే ఏం? అనేక జగత్తులను కూడా తనయందలి స్వల్ప విభాగంలో ధరించగలిగి ఉండగలదో, అట్టి ఈ చిత్తము అణుప్రమాణము మాత్రమే!

అణుప్రమాణమై వుంటూకూడా, అది సర్వదా అభౌతికం. అట్టి అణు స్వరూపమగు చిత్తమే జీవుడు. కాబట్టి జీవుని అభ్యంతరముననే ఈ జగత్తు వెలయుచున్నది. స్వప్న భూముల వలె ఈ కనిపించే దృశ్యమంతా కూడా చిత్తమే అయివున్నది. ఆ చిత్తమే జీవుడు కూడా కదా! ఈ విధంగా జీవునికి - జగత్తుకు భేదం లేదు.

అయితే... చైతన్యమునకు అన్యమైన దేనికీ సత్తయే లేదు కదా! కాబట్టి ఇక్కడ పదార్థములే సంభవించవు. కనుక ఈ పదార్థ సమూహమంతా కూడా చిత్స్వరూపమే!

స్వప్నంలో స్వప్నదృశ్య వ్యవహారం ఉన్నట్లు... బంగారమునందు ఆభరణ విశేషం ఉన్నట్లు... సముద్రమునందు ఏకరూపమగు జలమున తరంగ - ఆవర్తాది భిన్న భిన్న రూపములు సర్వత్రా స్ఫురిస్తున్నట్లు... ఈ పదార్థ సమూహమంతా చైతన్యమునకు అభిన్నం. చిద్రూపమగు బ్రహ్మము నందు తదభిన్నరూపంగా అనేక దృశ్యరూప పదార్థములు స్ఫురించుచున్నాయి.

సముద్ర ఉదరంలో విద్యమానమగుచున్న "జలము - ద్రవత్వము" అభిన్న రూపములే కదా! పరమాత్మ యందు పదార్థ సమూహాలు చైతన్యము కంటే వేరుకాకయే స్ఫురిస్తున్నాయి. ఈ జగత్ పదార్థాలన్నిటికీ చైతన్య అనుభూతియే ఆధారం. చైతన్యము - అద్దాని అనుభూతి అభేదం. కనుక ఈ జగత్తు - చైతన్యము అభేదం.

యథారీతిగా స్థితి కలిగియున్న ఈ జగత్తంతా కూడా... తన యొక్క శాంత చిత్స్వరూపమును త్యజించకుండానే.... స్వప్నరూపంగా చిదాకాశమున వ్యవస్థితమై విద్యమానమగుచున్నది. ఒక స్తంభము, అందులో శిల్పలేఖన రూపంగా రచించబడిన దేవతాప్రతిమ ఒక్కటే కదా! అట్లాగే... సమత్వం, సత్యత్వం, సత్త, ఏకత్వం, నిర్వికారత్వం, పరస్పర ఆధార ఆధేయత్వము అను వీటన్నిటియందూ జగత్తు - చైతన్యములు సాదృశ్యమైనవే! (ఒకదాని వంటిదే రెండవది అయి వున్నది.)

స్వప్నము - సంకల్పము; వరము - శాపము; సరోవరజలం - నదీజలం... ఇటువంటి ప్రతిభాసలన్నీ ఏకరూపమే కదా! అట్లాగే... జగత్ - చైతన్యములకు వ్యవహార సమర్థమైన భేదం ఉండవచ్చుగాక! వస్తుతః పరమార్థమున భేదం లేదు.

బంగారపు ప్రక్కపిన్నుకు - బంగారమునకు సాదృశ్యమే యుక్తియుక్తం కదా!

❖❖❖

# 9. వర - శాపముల కార్య - కారణత్వం

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ ప్రపంచంలో ఏదైనా జరగాలంటే "ఉపాదాన కారణం" అనేది ఉండాలి కదా! మరి వర–శాపముల విషయంలోనో? ఒకడు వరం పొందాడనుకోండి. లేక, శపించబడ్డాడనుకోండి. అప్పుడు ఏ ఉపాదానకారణం లేకుండానే ఆ వరమో, ఆ శాపమో ఎట్లా క్రియాశీలకం కాగలుగుతోంది?

ఉదాహణకు... ఇంద్ర పదవిలో ఉన్న నహుషునకు "నీవు సర్పమువై అరణ్యంలో సంచరిస్తావు గాక!" అని సప్త ఋషీశ్వరుడు శపించగా, ఆతని దేహం చంద్రామృత భాగం కోల్పోయి... పాంచ భౌతికమగు సర్పంగా అప్పటికప్పుడు పరిణమించటం. నంది (గోవు)కు "ఈశ్వరత్వము" వరంగా ఇవ్వబడగా, ఆ నంది భౌతిక దేహం పోయి చంద్రకిరణామృత నిర్మితమగు నందీశ్వరత్వం ప్రాప్తించటం... ఇవి ఉపాదాన కారణాలు లేకుండా ఎట్లా సంభవిస్తున్నాయి? అనేది ఇక్కడి ప్రశ్న.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! సముద్రంలో జలము యొక్క స్ఫురణమందు తరంగాలు ఆవర్తాలు కనిపిస్తున్నాయి. అంతా జలమే! కానీ అవన్నీ ఆకారయుక్తంగా అగుపిస్తున్నాయి. జగత్ స్ఫురణ చిదాకాశము నుండే బయల్వెడలుతోంది కదా!

కాబట్టి... అతి నిర్మలమగు చిదాకాశము యొక్క తత్త్వజ్ఞానము నుండి బయల్వెడలిన 'సత్య సంకల్పము'ను అనుసరించి ఏర్పడిన స్ఫురణయే జగత్తు. అందుకే ఇది సత్యముగా కనిపిస్తోంది. అట్టి సత్య సంకల్ప రూపులగు వర – శాప ప్రదాతల సంకల్పనాశక్తియే ఘనీభూతమగు శాప–వర భోక్త యొక్క అనుభవంగా రూపుదిద్దుకుంటోంది. ఈ జగత్తంతా సంకల్ప రూపమే కదా!

సముద్రజలంలోంచి ధ్వనులు బయల్వెడలుచున్నాయి చూచావా! బ్రహ్మదేవుని యొక్క "స్వాత్మ చైతన్యము" నందు "చిద్రూపములే" అగు జగద్భావములు అకస్మాత్తుగా భాసించుచున్నాయి. అట్టి భావములకే శ్రుతులు "సంకల్పములు" మొదలైన నామములు కల్పించుచున్నాయి. ఈ జగత్తు యొక్క మూల పదార్థము ఆ సంకల్పములే! అట్టి సంకల్పముల అనుభవం అజ్ఞాన దృష్టికి 'సంసారము' రూపంగా ప్రాప్తిస్తోంది. అదియే బంధము. అజ్ఞాన దృష్టి తొలగితే బంధమూ లేదు. మోక్షమూ లేదు. "దృశ్యమునకు సంబంధించిన ఆశ – నిరాశ – పూర్వాపూర్వ విషయముల మననము – గుణదోషములు – అభియోగదృష్టితో చూడటం... ఇదియే సంసారము. ఈ జీవుడు ఆత్మస్వరూపుడై ఉండి కూడా (ఆనందస్వరూపుడై ఉండి కూడా)... దుఃఖము పొందటానిక కారణం ఆత్మదృష్టి కొరవడటం తప్పితే వేరుకారణం లేదు. "తత్త్వదృష్టి అను శాస్త్రీయ ప్రతిపాదితమగు దివ్యౌషధమే అందుకు తరుణోపాయం. అభ్యాసయోగం చేతను, తత్త్వవిచారణ చేతను, శత్రు – మిత్రాదుల సమదర్శనము చేతను, నిర్మల సాత్విక భావములచేతను, భక్తి తత్పరతచేతను, ఈ సంసార దోష భూయిష్ఠుడగు జీవుడు సమ్యక్ జ్ఞానవంతుడు, యథార్థ తత్త్వదర్శి అగుచున్నాడు.

"యథార్థ తత్త్వదర్శి" యగు జ్ఞానియొక్క బుద్ధి ద్వైత – ఏకత్వ వర్జితమై ఉంటోంది. చిన్మాత్రరూపమై, ఆవరణ రహితమై, చిద్బ్రహ్మరూపమై, కేవల చిత్ప్రకాశమాత్ర స్వరూపమై, దేహాదేహ

వర్జితమై, అత్యంత నిర్మలమై ఉంటోంది. అట్టి నిర్మల బుద్ధి – నిరావరణ జ్ఞానము పొందినట్టి మనుజుడు ఏదేది సంకల్పిస్తాడో... అద్దానినంతా కూడా ఆతడు స్వాత్మయొక్క స్ఫురణగాను, ప్రశాంత రూపంగాను, పరమార్థ చిద్రూపముకంటే ఏమాత్రం వేరుకానట్టిదిగాను దర్శిస్తూ ఉంటాడు.

ఈ జగత్తంతా కూడా అట్టి శుద్ధ నిరావరణ హిరణ్యగర్భ చైతన్యము సంకల్ప చమత్కారమే అయివున్నది. ఇదంతా సంకల్ప చమత్కారమే కనుక.... సంకల్ప నగరము, స్వప్నాంతర్గతమైన మహాపురము అయి కూడా, భౌతికంగా (ఘనీభూతమైన అభ్యాసవశంచేత) ఇట్లా కనిపిస్తోంది.

ఈ సృష్టికి కర్తయగు బ్రహ్మదేవుని (హిరణ్యగర్భుని) వలెనే శుద్ధాత్ములగు తదితరులు కూడా వర–శాపముల రూపములచే దేనిని ఏ ప్రకారంగా సంకల్పిస్తారో..... అది తదితరులపట్ల ఆ విధంగానే శీఘ్రంగా అగుచున్నది. నిర్మల హృదయులు ఏది ఎట్లు సంకల్పిస్తే అది అట్లే ఈ సంకల్ప నిర్మిత జగత్తులో సంభవిస్తూ ఉంటోంది.

ఒక బాలుడు తన ఊహాలోకంలో "శిలలు ఎగురుచున్నాయి" అని ఊహించి, అది అట్లే సత్యముగా అనుభూతిపొందుతూ ఉంటాడు. అట్లే శీఘ్రంగా అనుభవము పొందుతూ ఉంటాడు చూచావా? అదే ప్రకారంగా .... హిరణ్యగర్భుడు మొదలైన నిరావరణ విజ్ఞాత్ములు వరము – శాపము – మొదలైన 'నిజ సంకల్పము'ను తమకు అభిన్నమైన సత్యముగా ఎరుగుచున్నారు. ఒక పిల్లవాడు స్వప్నంలోనో, సంకల్పంలోనో "నేను ఇసుకను గుప్పిటలో తీసుకొని నలుపుతుంటే తైలం ధారగా కారుతోంది" .... అని ఊహిస్తూ ఉంటే,... అది అట్లే ఆ పిల్లవానికి అనుభూతమౌతుంది చూచావా? అట్లాగే కల్పనా జనితములగు సృష్ట్యాది సంకల్పముల చమత్కారంచే 'వరము–శాపము' ఇక్కడ సిద్ధిస్తున్నాయి. శుద్ధాత్మజ్ఞాన బుద్ధిగలవాని సంకల్ప రూపమైన వరము–శాపము ఇక్కడ సిద్ధిస్తోంది. అట్లా కాకుండా... ఆవరణ సహితమైన జ్ఞానము (ఉదా : నా వారు, నీ వారు, నాది, నీది, పాపులు, పుణ్యులు, మంచివారు, చెడ్డవారు... ఈ రూపంలో) కలవారికి భేదబుద్ధి నశించటం లేదు. వారు ద్వైతభావముతో కూడి ఉంటున్నారు. అట్టివారి ద్వైత సంకల్ప వాసనలు కారణంగా వారి వర – శాపాలు సిద్ధించటం లేదు.

నిరావరణ యుక్తులగు బ్రహ్మదేవుడు మొదలైన సృష్టి సంకల్ప దృఢకల్పన పూర్వము ఎట్లా ఉన్నదో... ఇప్పుడూ అట్లాగే ఉన్నది. అది అంతటి మరొక దృఢకల్పనచే ప్రయత్నపూర్వకంగా కావించబడనంతవరకు... ఆ సంకల్ప ఫలప్రదమైనదంతా అట్లే కొనసాగుతూ ఉంటుంది.

ఓ రామచంద్రా! అవయవసహితమగు ఈ శరీరాది పదార్థములకు ఏ విధంగా అయితే అవయవక్రమము స్థితి కలిగి ఉంటుందో... అట్లాగే అవయవ రహితము – స్థిరము అయినట్టి బ్రహ్మమునందు ఈ ద్వైత – ఏకత్వాదులు, వర – శాపాదులు స్థితి కలిగి ఉన్నాయి.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఆవరణ రహితమగు జ్ఞానము కలవారు, తపో ధర్మాది నిరతులు అగు వర –శాపములు ఎట్లా ప్రదర్శిస్తున్నారు? అవి ఎట్లా సత్యములగుచున్నాయి? ఈ విషయాలు తెలియ జేయమని మరల ప్రార్థిస్తున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చిద్రూపము, నిర్మల బ్రహ్మ స్వరూపము అగు బ్రహ్మదేవుడు ఏ రీతిగా అయితే సృష్ట్యాది యందు "తపస్సు – ధర్మము మొదలైనవాటి ప్రభావం చేత వరశాపాదులు సత్యములగుగాక!" ...అని దేనిని సంకల్పించారో .... అది ఆత్మ అట్లే అనుభవించుచున్నది. అద్దానికి ఎట్టి ప్రతిబంధకము ఉండటం లేదు. ఆ ప్రజాపతియగు బ్రహ్మదేవుడు ఆత్మరూపము – సత్యము అగు బ్రహ్మమును అనుభవ – అనుభూతి పూర్వకంగా ఎరిగియుండుటచే... ఆతడు సత్య సంకల్పయుక్తుడై వెలయుచున్నాడు. కానీ... ద్రవత్వము కంటే జలము వేరుకాదు కదా! బ్రహ్మదేవుడు బ్రహ్మము కంటే వేరుకాదు. కాబట్టి ప్రథమ ప్రజాపతియగు బ్రహ్మదేవుడు దేనిని ఎట్లు సంకల్పిస్తున్నాడో... అది శీఘ్రంగా అట్లే అవుతోంది.

తదేదం కల్పనమ్ జగత్ – ఈ జగత్తు ఆతని కల్పనయే అయివున్నది. అయితే ... ఒక్క విషయం.

**నిరాధారం నిరాలంబం వ్యోమాత్మ వ్యోమ్ని భాసతే ।**
**దుర్దృష్టేరివ కేశోఽణ్డ్రం దృష్ట ముక్తావలీవచ ॥**

కంటికి దోషం కలవారికి ఆకాశంలో కేశముల ముత్యముల సమూహం కనబడుతూ ఉంటుంది చూచావా? నిరాధారము – నిరాలంబము అయినట్టి చిదాకాశమే చిదాకాశమున జగదాకారంగా భాసిస్తోంది.

❖

ఆ ప్రజాపతియగు బ్రహ్మదేవుడే ప్రజలు – ధర్మము – దానము – తపస్సు – సౌశీల్యము మొదలైన సాత్విక గుణములను, 4 వేదములను, షట్ శాస్త్రములను, సమస్త జీవజాలమును, సాంఖ్య – యోగ – పశుపతి – వైష్ణవ – ఆత్మ అనబడే పంచజ్ఞానోపదేశములగు మతములను సంకల్పించారు. ఆ తరువాత "వేదవేత్తలగు తాపసులు వాదములతోగాని, (లేక) సహజ వృత్తిచేతగాని యేది సందర్శించి చెప్పుదురో... అది వారివారికి అట్లే అగుగాక"... అని కూడా సంకల్పించారు.

మరల... ఆ బ్రహ్మదేవుడే, చిద్రూపమగు బ్రహ్మము... ఛిద్ర స్వభావయుక్తమగు ఆకాశముగా అగుగాక! చలన స్వభావయుక్తమగు వాయువుగా అగుగాక! ఉష్ణ స్వభావమగు అగ్నిగా అగుగాక! ద్రవ స్వభావమగు జలముగా ఏర్పడుగాక! కఠిన స్వభావమగు పృథివిగా అగుగాక!...ఈ ప్రకారంగా సమస్త పదార్థముల స్వభావములను ఆ బ్రహ్మదేవుడే తన మనోవీథిలో సంకల్పించియున్నారు. అట్టి సమస్త కల్పన కూడా "ప్రజాపతి వేషధారి" అగు చైతన్యము చేతనే నిర్వర్తించబడుతోంది. అట్టి ప్రజాపతిరూప చిదాకాశముచేత కల్పించబడినదే ఈ జగత్తులో ప్రతి జీవియు అనుభవించడం జరుగుతోంది. అదియే నీ చేత – నా చేత అందరి చేత పొందబడుతోంది.

ఓ రామచంద్రా! ఒక స్వప్న ద్రష్ట తన స్వప్న చైతన్య రూపమును అసద్రూపములే అగు స్వప్న పదార్థములుగా సద్రూపమువలె పొందుచున్నాడు కదా! అట్లాగే చిదాకాశము ఏ వస్తువును ఎట్లు ఎరుగుచున్నదో... అట్లే పొందుచున్నది. సంకల్ప నగరంలో శిల్పం గాలిలోకి లేచి నృత్యం

చేస్తున్నదని అంటే అందులో ఆశ్చర్యం ఉండదు కదా! 'జగత్తు' అనే సంకల్ప నగరంలో బ్రహ్మదేవుని అధికార ప్రారబ్ధ భోగ రూపమైన ఇచ్ఛ 'సత్యము' గానే భాసిస్తోంది. శుద్ధ చిత్ స్వభావము దేనిని ఏ రీతిగా ఎరుగునో అద్దానిని – ఏ అశుద్ధచిత్ స్వభావము మరొక తీరుగా మరల్చజాలదు.

అశుద్ధ చిత్ స్వభావుడు – మాయాగ్రస్తుడు అగు జీవుడు... వర్తమాన జాగ్రత్‌నందు, స్వప్నమునందు కూడా... తన అభ్యాస దార్ఢ్యముచే 'సమస్తము సత్యము' అను రూపముననే గాంచుచున్నాడు. ఎందుచేతనంటావా? "నేను అల్పుడను, స్వల్పుడను, దేహమాత్రుడను"... ఇత్యాదిగా అస్వతంత్ర కల్పన యొక్క చిరభ్యాసంచేత "ఇది కల్పనా మాత్రము" అనబడు సత్యానుభవమునకు విరుద్ధ కల్పన గురించిన స్వాతంత్ర్యము లేకయే ఉన్నాడు. "నేను కర్మలచే – పరిస్థితులచే – వ్యవహారములచే – జన్మమృత్యువులచే – పాపపుణ్యములచే బద్ధుడను"... అను రూపంగా దృఢమైన బంధమును అనుభవించుచున్నాడు. అట్టి బంధమునే స్వప్నంలో కూడా అనుభవిస్తున్నాడు.

కానీ... ఏకము – సత్యము అయినట్టి చిదాకాశమే సదా ద్రష్ట – దర్శనము – దృశ్యము అగు త్రిపుటీ రూపమును గాంచుచు... ఈ రీతిగా జగదాకారంగా భాసిస్తోంది. అంతేగాని ఈ జీవుడు చిదాకాశమునకు వేరైనవాడు కాదు. అంతేకాదు.

ద్రష్ట, దృశ్యము... ఈ రెండూ కూడాఏక రూపమే అయివున్నాయి. ఎట్లా అంటావా?... ఏకము – సర్వవ్యాపకము అగు 'చిత్‌సత్త' చేతనే అవి రెండూ కూడా (ద్రష్ట – దృశ్యము కూడా) ఉపజీవింపబడుచున్నాయి. కాబట్టి... చిదాకాశము తన ఇచ్ఛానుసారమే ద్రష్టత్వము – దృశ్యత్వము గాంచుచు... తాను దానిని సత్యముగానే పొందుచున్నది.

వాయువునకు చలనమే అవయవ రూపం. జలమునకు ద్రవత్వమే అవయవ రూపం. బ్రహ్మమునకు మాయా శక్తిత్వమే అవయవ రూపం! ఈ రీతిగా ఈ జగత్తు విరాట్ పురుషుని అవయవమే అయివున్నది. అట్టి విరాట్ పురుషునకు "నేను బ్రహ్మమునే" అను నిర్మలానుభవం ఉండనే ఉన్నది. ఈ జగత్తో ... విరాట్ పురుషుని శరీరమే కదా! కాబట్టి ఆకాశము – శూన్యత్వముల వలె... బ్రహ్మమునకు – ఈ జగత్తుకు భేదమే లేదు.

అందుచేత... పర్వతము పై భాగం నుండి క్రిందకు గంగాజలధారలు పడుచున్నప్పుడు జలతుంపరలు గాలిలోకి ఎగసి తిరిగి జలంలోనే లయం అవుతూ ఉంటాయి. చూచావా? అట్లా లయంకాక ముందో? ... జలకణములు గాలిలో భాసిస్తూ ఉంటాయి. ఈ విచిత్ర జగద్భేదములన్న అట్టివే! ఎందుకంటే ఇవన్నీ బ్రహ్మమునందే బయల్వెడలి మరల ఎప్పుడో విలీనం అవుతూ ఉన్నాయి. కాకపోతే... ఈ ఉపమాలంకారం ఒక్క భేదం మాత్రం కలిగి ఉన్నది. జలకణములేమో మనోబుధ్యహంకార రహితములై ఉన్నాయి. ఇక బ్రహ్మ సంవిత్తో ... స్వయంగా నిజశరీరములందు మనస్సు – బుద్ధి – అహంకారముల కల్పనను గావించుకొని... తనకు భోగ్యమగుచున్న ఈ సృష్టిని (జలం ద్రవత్వమును అంగీకరిస్తున్నట్లుగా) అంగీకరిస్తోంది. ఓ రామచంద్రా! మనో–బుద్ధి జనితమైన అజ్ఞానము యొక్క "దుద్బోధ" చేతనే ఈ జగత్తు ఆత్మకు వేరైనదన్నట్లుగా విద్యమానమౌతోంది.

నేను అట్టి దుర్బోధరహితుడను. నా యొక్క దృష్టియందు ... జగత్ నిర్మాణ కర్మ కేవలము కారణ వర్జితము, అద్వైత రూపము. (ఇది సర్వదా బ్రాహ్మమే కాబట్టి) ఇతఃపూర్వంగాని, ఇప్పుడుగాని, ఇక ముందుగాని ఏమాత్రం జనించనిదే అయివున్నది. మొదలే జనించని ఈ జగత్తును "బ్రహ్మదేవుడు ఎందుకు సృష్టించాడు?"... అనే ప్రశ్నయే ఉండదు. (స్వప్నంలో) "నేను, నీవు, మీరు, మేము, వీరు, వారు, ఇది, అది, ఇక్కడ, అక్కడ, ఇప్పుడు, అప్పుడు, ఇటు, అటు, ఎందుకు, ఇందుకు, అందుకు"... అని దేనిని ఎట్లు ఎరుగుచున్నామో అట్లే అసద్రూపములైనప్పటికీ సద్రూపములవలె నీ స్వప్నంలో నీవు, నా స్వప్నంలో నేను ఎరుగుచున్నాము కదా! అట్లాగే... సృష్ట్యాదిలో బ్రహ్మదేవ వేషధారియగు చిదాకాశము ఏది ఎట్లు ఎరుగుచున్నదో అది అసద్రూపమైన్పటికీ సద్రూపముగా ఎరుగుచున్నది. ఇక వ్యష్టిరూప వేషధారిఅగు చిదాకాశము "జగన్నాటకము"... అనే సందర్భంలో తత్ సానుకూల్యంగా "ఇది సద్రూపమే"... అని అంగీకారత్వం వహించి మాయానాటకంలో పాత్రధారి అగుచున్నాడు.

ఇది ఇట్లుండగా... పరమాత్మ యొక్క సత్తా మనోబుద్ధ్యాది రహితమై, నిర్విక్షేపమై నిశ్చల దీపకాంతివలె సదా చిద్రూపముగా అలరారుచున్నది. ఏ విధంగా ఈ శరీరమున మనోబుద్ధి రహితమగు మృతావస్థ – సంభవిస్తోందో... ఏ విధంగా శిలలందు జడసత్త విక్షేప రాహిత్యము కనబడుతోందో... చిద్రూపము యొక్క మనోబుద్ధి రాహిత్యము – విక్షేప రాహిత్యము అటువంటిది. అనగా (అవగాహన కొరకై) వాటితో పోల్చవచ్చు.

ఒకే నిద్రయందు స్వప్నం, సుషుప్తి ఉన్నట్లే... ఏకైక బ్రహ్మమునందు సృష్టి, ప్రళయం ఉన్నాయి. చేతన రూపుడే అయివుండి కూడా ఈ మనుజుడు గాఢనిద్రా సమయంలో "సుషుప్త స్థితి – ఒక శిలయొక్క స్థితి"ని అనుభవిస్తున్నాడు చూచావా? అట్లాగే పరమాత్మ కూడా ఈ జడ పదార్థముల స్థితి అనుభవించుచున్నాడు.

ఒకడు ఎక్కడో మరొక విషయం పై ఏకాగ్రతతో కూడిన ధ్యాస కలిగియున్నప్పుడు (అనగా) ఆతని ధ్యాస ప్రీతిపూర్వకంగా మరెక్కడో సంలగ్నమై ఉన్నప్పుడు తన బొటన వ్రేలును గాని, భుజములనుగాని తాకుచున్న పిల్లగాలుల – వస్తువుల స్పర్శ – అనుభవమునకు రావు కదా! అట్లాగే శిలలందు ఆత్మ విద్యమానమై ఉండికూడా అవిద్యమానప్రాయమే అగుచున్నది. ఆకాశము – శిల – జలాదులు ఆయా ఆకాశ దేవత – శిలాదేవత – జలదేవతలకు "ఇదంతా మా శరీరమే" అని అనుభూతం అగుచున్నది. అట్లాగే చిత్త రహితులగు మాకు సృష్టికాలంలో "ఈ సృష్టి అంతా మా శరీరమే" ... అనురూపంగా అనుభూతమౌతోంది. అఖండము – అనంతము అగు కాలమునందు రాత్రి – పగలు – అసంఖ్యాకంగా ఏర్పడుచున్నట్లుగా... అనంత స్వరూపుడగు పరమాత్మ యందు అసంఖ్యాకములగు సృష్టి – ప్రళయములు భాసిస్తున్నాయి.

**ఆలోక రూప మనన అనుభవ ఈషణ ఇచ్ఛా ముక్తాత్మని స్ఫురతి వారి ఘనే స్వభావాత్**
**ఆవర్త వీచి వలయాది యథా తథాయం శాంతే పరే స్ఫురతి సంసృతి సర్గపూగః ॥**

ఓ రామచంద్రా! ఈ దృశ్యాది వ్యవహారములు ఉండటంచేత కలత చెందవలసినదేమున్నది? ఆత్మ సర్వదా యథాతథం కదా! సముద్రమంతా శాంతమగు జలమాత్రమే అయినప్పటికీ... స్వభావ సిద్ధంగానే ఆ సముద్ర జలంలో జలమునకు అనన్యంగా ఆవర్తములు - తరంగములు - వలయములు - బుడగలు మొదలైనవన్నీ ఏర్పడుచూ స్ఫురిస్తున్నాయి కదా! అట్లాగే పరమాత్మయొక్క స్వరూపము పరమశాంతము - నిర్లేపము - నిర్లిప్తము అయివుండగా, అద్దానియందు స్వభావసిద్ధంగానే విషయముల యొక్క దర్శనములు, వాటి వాటి యొక్క రూపములు, మననములు, అనుభవములు - ఈషణములు - ఇచ్ఛలు - ఇవన్నీ ఏర్పడుచున్నాయి. జలము సర్వదా నిరాకారమేగా! - అదేవిధంగా ఆత్మయందు ఇవన్నీ లేవు. ఒకవేళ ఉంటే అవి ఆత్మకు అభిన్నం. సృష్టి లయములతో సహా సర్వము ఆత్మయొక్క స్వభావమే అయి ఉండి, ఆత్మకు అభిన్నమే అయివుండి, ఆత్మ సర్వదా వీటన్నిటికీ అప్రమేయమై, అతీతమై అనునిత్య నిర్మలమైయున్నది. ప్రతిజీవుడు స్వతహాగా, నిర్ద్వంద్వంగా ఆత్మస్వరూపుడే అయివున్నాడు. ఇందులో సందేహించవలసిన దేమీలేనే లేదు.

ఓ సర్వజనులారా! మీరంతా నిర్మలము, అఖండము, జగత్తుచే అస్పృశ్యము - అగు ఆత్మయే స్వరూపముగా కలిగియున్నారు. అట్టి ఆత్మయే పరమసత్యమై ఉండగా ఇక తక్కిన సృష్టి-ప్రళయాలు ఆత్మయొక్క లీలావిన్యాసములు మాత్రమే! స్వభావమే అయి వున్నాయి! ఆత్మయే మీ స్వభావం! ఈ జగత్తు మీ శరీరమైనప్పటికీ, శరీరమునకు శరీరి వేరే అయివున్నట్లు... మీరు నిశ్చలము - సర్వగతము అగు ఆత్మ స్వరూపములే అయివున్నారు. ఆ మీ ఆత్మ స్వరూపమును సర్వదా ఆస్వాదించి ఉండెదరుగాక! అట్టి మీ ఆత్మ స్వరూపమును ఋషులమగు మేము సదా ఉపాసిస్తున్నాం.

❖❖❖

## 10. ప్రతి జీవుని అనంతాత్మలో అసంఖ్యాక జగత్తులు

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ అసంఖ్యాక పదార్థముల యొక్క నియతి (కార్యకారణ భావాది నియమము)... ఎట్లా సంభవిస్తోంది? "అగ్నికి ఉష్ణత్వం, జలమునకు ద్రవత్వం, తదితర పదార్థములకు ఆయా స్వభావం"... ఇవన్నీ ఒకే విధంగా, సుస్థిరంగా, సుదీర్ఘంగా ... ఏ కారణం చేత స్థితి పొంది ఉంటున్నాయి? ఎందుకంటే... జాగ్రత్ పదార్థాలలో నియతి కనిపిస్తోంది. కాని స్వప్నంలోను - మనోరథంలోను (ఊహాలోకంలోను) అటువంటి నియతి కనబడటంలేదు కదా! జాగ్రత్ పదార్థాలకు ఎట్లా ఈ నియతి ఏర్పడుతోంది? ఉదాహరణకు అసంఖ్యాకులగు దేవతలు ఉన్నప్పటికీ... అందు సూర్యుడు మాత్రమే మహా ప్రచండ ప్రకాశయుక్తుడై వర్తిస్తున్నారు. దివారాత్రములు సమయ నిర్ణయం (రోజుకు 24 గంటలు... ఇట్లా) ఏర్పడి ఉంటోంది. ఈ నియతి ఎట్లా ఏర్పడి ఎట్లా కొనసాగుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! స్వప్నంలో ఏఏ పదార్థములు ఏఏ రూపంచే భావిస్తున్నాయో ...అదంతా కాకతాళీయ న్యాయంచే అట్లా భాసిస్తోంది కదా! అట్లాగే బ్రహ్మదేవునికి ఆదిసృష్టి

యందు కాకతాళీయ న్యాయం చేత ఏ పదార్థము ఏ రీతిగా స్వయంగా భాసిస్తోందో... అదే ప్రకారంగా అర్థ – క్రియాదులతో నియతమై నేటివరకు స్థితినొంది ఉండటం జరుగుతోంది. అట్లా నియతమై, కార్య–కారణ రూపంతో యథారీతిగా వర్తిస్తున్న దానినే "జగత్తు" అని పిలుస్తున్నాం. కనుక, పదార్థముల యొక్క స్వభావములకు బ్రహ్మదేవుని ఇచ్ఛయే హేతువు!

ఓ రామచంద్రా! ఈశ్వరుని యొక్క ఇచ్ఛయే ఈ కనబడేదంతా! సర్వశక్తిమంతుడగు ఈశ్వరుని "సత్య సంకల్ప సంవిత్తు"... యొక్క చమత్కారమే ఇది. ఆ సత్య సంకల్ప సంవిత్తుచే ఏఏ పదార్థము ఏఏ ప్రకారంగా 'సృష్ట్యాది' యందు భాసించిందో... అదియే ఈ ప్రకారంగా "నియతి" రూపంగా ఉంటోంది. అయితే... సంవిత్తు యొక్క భావనా మాత్రమే కదా ఇదంతా? ఆలోచనలచే ఆలోచించు వాడు బంధింపబడటమేమిటి? "ఒకని భావనచే ఆ భావికుడు బంధించబడుచున్నాడు!"... అనునది ఎంత అర్థరహితమో... "నిర్విషయమగు సంవిత్తు నియతిచే బద్ధము"... అనునది అంతే అర్థరహితం! మాయారూప మాత్రమైన ఈ జగత్తు బ్రహ్మమునందు యథారీతిగా ఈ స్థితిని కలిగియుండి... చిరకాలం అద్దాని చైతన్య శక్తిచే భాసిస్తూ... ప్రళయకాలంలో ఇది సూక్ష్మత్వం పొందినదై 'భాసించనిదే' అగుచున్నది. నిద్ర లేవగానే అనేక ప్రాపంచిక విషయాలు అనుభవ మగుచుండగా... గాఢనిద్రా దశలో అవన్నీ సూక్ష్మస్థితిని పొంది 'రహితం' అవటం ప్రతిజీవునికి దైనందిన అనుభవమే కదా! ఇదీ అట్టిదే! ఈ విధంగా సర్వ వస్తువుల యొక్క "అర్థ క్రియాశక్తి" ఆత్మ యొక్క విలక్షణ లక్షణమే కాబట్టి, ఆత్మవలెనే ఇది కూడా అనాదియే అయివున్నది. ఆత్మయొక్క అనాదియగు జగత్ కల్పనా సందర్శన విశేషమే 'నియతి' అనే శబ్దముచే ఉద్దేశింపబడుతోంది.

ఏ బ్రహ్మమైతే స్వయంగా "ఇది అగ్ని–ఉష్ణము, ఇది జలము– శీతలము" ... ఈ ప్రకారంగా భాసిస్తోందో... అట్టి సృష్టి – సంహార రూపధారియగు బ్రహ్మమే 'నియతి'గా అనుభూతమగుచున్నది. 'నియతి' అని వర్ణించబడేది అదియే!

ఓ రామచంద్రా! జలం కంటే ద్రవత్వం వేరా? కానేకాదు కదా! ఏ స్ఫురణ అయితే జాగ్రత్ లోను, స్వప్నంలోను, సుషుప్తిలోను స్వయంగా సంభవిస్తోందో... అది "నిర్మలం, ఏకం" అయినట్టి చిద్రూప బ్రహ్మం కంటే వేరుకాదు సుమా! ఆ స్ఫురణయే నియతి అనుభూతిని సిద్ధింపజేస్తోంది.

**యథా శూన్యత్వమ్ ఆకాశే, కర్పూరే సౌరభం యథా,**
**యథౌష్ణ్యమాతపే, సాన్యజ్జాగ్రదాది తథా చితి ॥**

ఆకాశమునకు శూన్యత్వం, కర్పూరమునకు సుగంధం, అగ్నికి ఉష్ణత్వం...ఎట్లా సహజమో, ఏ విధంగా అయితే, ఆ శూన్యత్వ, సుగంధ, ఉష్ణత్వాదులు – ఆకాశ, కర్పూర, అగ్నులకు వేరైనవి కాకయే ఉన్నాయో... అట్లాగే జాగ్రత్ – స్వప్న –సుషుప్తులు చైతన్యమునకు వేరైనవి కావు. చిన్మాత్రాకాశ స్వరూపము – ఏకము అగు బ్రహ్మమునందు ... అద్దానికి అభిన్నమైన సత్త కలిగి ఈ సృష్టి – స్థితి – ప్రళయములు అనాది ప్రవాహ రూపంగా ఏర్పడి ఉంటున్నాయి. కాబట్టే... ఇద్దాని యందు ఇవన్నీ "నియతము" అనబడే అర్థ క్రియా సామర్థ్యము కలిగియున్నవై ఉండగలుగుచున్నాయి.

**సృష్టి -** చైతన్యము తన యొక్క స్ఫురణ దేనినైతే "ఇది సృష్టి కదా" … అని ఎరుగుచున్నదో అదియే సృష్టి రూపమున అలరారుచున్నది. అదియే 'నియతి' రూపమున ప్రదర్శితమౌతోంది.

**క్షణ - కల్పములు -** చైతన్యము యొక్క స్ఫురణ దేనిని చూచి "ఇది కల్పము" అని ఎరుగుచున్నదో …అది వాస్తవానికి క్షణమే అయినప్పటికీ 'కల్పము' రూపము అయి ఆ చైతన్య స్ఫురణచే పొందబడుతోంది.

అట్లాగే, ఈ చైతన్యము దేనిపట్ల ఏ ఉద్దేశముతో కూడినదై ప్రసరిస్తోందో అదియే సంసారము, బంధము, స్వస్వరూపము, మంచి, చెడు, అభియోగము, వాస్తవము, అవాస్తవము, స్వల్పము, దుర్లభము, ఇది, అది, ఇట్లు, అట్లు, ఇట్లు కాదు, అట్లు కాదు… ఈ విధంగా ఆయా రూపములుగా (ఆ చైతన్యం యొక్క ఉద్దేశ స్ఫురణయే) అగుచున్నది. అట్టి చైతన్య స్ఫురణ ఏఏ రూపాలుగా దాల్చుచున్నదో… అదియే "నియతి".

**"సర్గోయఽమ్ ఇతి" తద్బుద్ధం క్షణం యత్కచనం చితః ।**
**"కల్పోయఽమ్ ఇతి" తద్బుద్ధం క్షణం యత్కచనం చితః ॥**

చితః (చిత్ స్ఫురణ)… దేనినైతే "ఇది సృష్టి" అని భావన చేస్తోందో… అది 'జగత్తు'గా అనుభవమౌతోంది. అది క్షణమును 'కల్పము' అని తలిస్తే అది కల్పము అవుతుంది. కల్పమును "ఇది క్షణికం" అని భావిస్తే అది క్షణికమాత్రమే అవుతుంది. కాబట్టి… రామచంద్రా! చైతన్యము యొక్క స్ఫురణను అనుసరించే సర్వ నియమ వ్యవస్థ వర్తించటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** స్వామీ! మహర్షీ! మీరు చెప్పేది ఆశ్చర్యంగా ఉన్నదే! ఈ జగత్తులో కనిపించే వస్తు – వ్యావహారిక – కాల – పరస్పర సంబంధములు మొదలైన వాటితో కూడిన "నియతి" అనేది స్వకీయమైన చైతన్యము యొక్క స్ఫురణ (లేక) 'ఎరుక' యొక్క చమత్కారమేనంటారా? ఇది మీరు చెప్పిన విధంగా అనిపించటం లేదే?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వప్నంలో కాలము, నియతి ఇవన్నీ కనిపిస్తున్నాయి కదా! ఆ కాలమును నియమించిందెవరు? స్వప్న ద్రష్టయే కదా! ఆ స్వప్నంలోని సంఘటనలు, వాటికి అర్థాలు కల్పిస్తున్న దెవరు? స్వప్నకల్పనచేసే స్వప్న ద్రష్టయొక్క స్వప్న చైతన్య స్ఫురణ కాకుండా మరొకరెవరో ఆకాశంలో ఉండి నీ స్వప్నంలో వస్తువు, క్రియ, కాలము, వ్యవహారము, భయము, ఆశ్చర్యము, దుఃఖము – మొదలైనవి కల్పించటం లేదే! స్వప్నంలో ఏ చిన్మాత్ర స్ఫురణ కలదో… అదే కాలము. అదే క్రియ. అదే ఆ స్వప్నంలోని తదితరములన్నీ కూడా కదా! స్వప్నంలోని ఆకాశం–ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం కూడా అదియే! ఇంతెందుకు? "స్వప్నంలో కనిపించేదంతా కూడా ఆమూలాగ్రం స్వప్న చైతన్య స్ఫురణచే కల్పించబడి, ఆ స్వప్న చైతన్య స్ఫురణచే ఆయా రూపములుగా 'నిజమే' అన్నట్లుగా అనుభవించబడుతోంది" …అనేమాట ఎవరైనా కాదనగలరా?

ఇప్పుడు జాగ్రత్తుకు వద్దాం. ఇక్కడి బాహ్యమందలి రూపాదులు, అభ్యంతరమందలి మనః సంకల్పాదులు, ఇక్కడ అనుభూతమగుచున్న దేశ – కాల – క్రియాదులు… ఇవన్నీ కూడా అదే చైతన్య స్ఫురణ యొక్క 'జాగ్రత్ కల్పన'లోని విభాగములే!

ఏ 'కాలము' చైతన్యముచే స్ఫురింపజేయబడుచున్నదో, ఏఏ 'పదార్థములు' చైతన్యముచే 'ఇది ఇట్లు' అని కల్పన గావించబడుచున్నదో ... అదియే 'నియతి'.

అట్టి 'నియతి' యొక్క రూపమంతా కూడా చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమే అయివున్నది. ఒక నిమిషము మొదలుకొని ఒక కల్పము వరకు ఉండునట్టి ఏఏ పదార్థములైతే ప్రదర్శితమగు చున్నాయో... అవన్నీ కూడా (ఉదా: అగ్నికి ఉష్ణత్వం, జలమునకు శీతలత్వం మొదలైనవి) ఏ ఏకైక స్ఫురణచే అట్లట్లు పొందబడుచున్నాయో... అదియే "స్వభావము" – అని స్వభావ తత్త్వమును బాగుగా ఎరిగిన విశాల బుద్ధులగు మహనీయులు నిర్వచిస్తున్నారు. ఒకే అగ్ని దేశ – కాల భేదములచే అనేక ప్రకారములుగా స్థితినొంది ఉండవచ్చుగాక! అయితే ఏం? అది తన యొక్క 'ఉష్ణత్వము – ప్రకాశత్వము' అనే సహజ లక్షణాలు త్యజించి ఉంటోందా? లేదు కదా! అట్లాగే – చైతన్యము అంశరూపుడగు ఒకే జీవుడు అనేక దేశ –కాలములలో మనుష్య – దేవ – పశు – పక్షి ఇత్యాది అనేక రూపములుగా స్థితి పొంది ఉంటే ఉండవచ్చుగాక! ఆ జీవుడు వాస్తవానికి సర్వానుగతమైన తన చిత్స్వరూపమును ఏమాత్రం త్యజించటమే లేదు.

చైతన్య స్ఫురణచే జగత్ నియతి పొందబడుచుండగా... చైతన్య స్ఫురణ నిర్విషయ చైతన్యము కంటే వేరు కాదు.

**స్వభావము :** ఏఏ పదార్థముల స్వభావము ఇట్లు కనిపిస్తోందో... అదంతా కూడా, ఎటువంటి దంటే... చిన్మయమగు పరబ్రహ్మమున, అట్టి పరబ్రహ్మముచే... 'స్వదేహం'తో పోల్చతగ్గ వృత్తి భేదములందు. ఏ ఏ వృత్తులకు ఏఏ ఆకార కల్పన గావించబడిందో... ఆ ఆకార కల్పనయే ఈ పృథివి – ఆకాశం మొదలైన వాటియొక్క స్వభావం అయివున్నది. "చిన్మయ – సంకల్పవృత్తి" అనునది కాకుండా ఈ భూమి–ఆకాశం మొదలైన వాటికి వేరే రూపాలే లేవు!

వాస్తవానికి నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశముల పారమార్థిక స్వభావం అధిష్ఠానమగు చిదాకాశమే అయివున్నది. క్రమంగా ఆ పృథివి – నీరు మొదలైనవి అనేకమైనట్టి వేరు వేరు కార్యములకు (పదార్థాలకు) కారణరూపమై ఉంటున్నాయి. స్వప్నంలోని వస్తు ఆకారములకు కారణకారణంలాగా స్వప్న చైతన్యమే ఏర్పడి ఉండటం లేదా? ఈ నేల – ఆకాశం మొదలైనవాటి కారణ కారణం చిదాకాశ స్ఫురణయే!

ఈ విధంగా ఈ నేల – ఆకాశం మొదలైనవి స్వప్న సదృశమే! అట్టి స్వప్న సదృశ పదార్థములలో ఒకటైన సాకార కఠిన పదార్థం అగు ఈ భూమి సర్వ జనులకు నివాసయోగ్యమై, "మహత్తరమైన పీఠభూమి" అయి మహారాజువలె సర్వ జీవప్రదంగా చెన్నొందుతోంది. అట్లాగే... అన్నిటికీ ఆదికారణం చైతన్యము – చైతన్యము యొక్క జాగృత్ విభాగ చమత్కారం.

గంగ మొదలైన నదీ జలములకు – సముద్రం కారణం, అగ్ని మొదలైన తేజోమయ పదార్థములకు – సూర్యుడు కారణం, చలనములన్నిటికీ – వాయువు కారణం, శూన్యత్వమునకు – ఆకాశము కారణం... ఇవన్నీ కార్య–కారణములుగా అయి చెన్నొందుచున్నాయి. ఈ పంచ

భూతముల కలయికలచే రకరకాల పదార్థాలు – దేహాలు – ఆకారాలు, వాటి–వాటి ధర్మాలు ఈ దృశ్యంలో తాండవిస్తున్నాయి. ఈ విధంగా ఈ కనబడే సర్వమునందు బ్రహ్మమే అనుగతమైనట్టి 'సత్స్వభావం' అయివున్నది. మరింక "సూర్యగోళం ఎట్లా ఏర్పడింది? చంద్రబింబం ఎక్కడి నుండి వచ్చింది?"... అనేవి పెద్ద విశేషాలెట్లా అవుతాయి?

చైతన్యము స్వయంప్రకాశము, సర్వప్రకాశకము, సర్వజ్ఞము కూడా! అట్టి చైతన్యము యొక్క సంవిత్తు సర్వ వ్యాపకమై, సర్వరూపమై, స్వస్వరూపంగాకూడా (దృశ్యము, ద్రష్టగా కూడా) సర్వదా ఏర్పడి ఉంటోందని విజ్ఞులు ఎరిగియే ఉన్నారు. చిదాకాశమే తనయొక్క స్వరూపంగా కలిగియున్నట్టి "చతుర్ముఖ బ్రహ్మ" అనే చిన్న పిల్లవానియొక్క చిలిపి ఊహలే ఈ సర్వ దృశ్యాంతర్గత సర్వ విశేషాలు కూడా! ఆతని స్ఫురణ రూపమే ఈ ఆకాశము – భూమి.... ఇవన్నీ కూడా! ఆటలో అంతా కల్పించబడి... ఆట ముగియగానే అందులో సర్వ విశేషాలు మటుమాయమౌతాయి చూచావా? అట్లాగే... ఎప్పుడైతే సర్వజ్ఞుడు – సంవిత్స్వరూపుడు అయిన ఆ బ్రహ్మదేవుని భావనా సంరంభం అయినట్టి ఈ స్థూల – సూక్ష్మ ప్రపంచము ఉపసంహరించబడుతుందో... అప్పుడు (ఇక్కడి సంవిత్ స్వరూపము యొక్క అంగవిన్యాసము వంటి) ఈ జగత్ చమత్కారం (ఏ ఆత్మయందు బయల్వెడలినదో)... అద్దాని యందే లయమై పోవుచున్నది.

సాలెపురుగు తన సంకల్ప బలంచేత బాహ్య సాధనములు లేకుండానే కళాత్మకంగా 'సాలెగూడు' అనే చిత్ర విచిత్రాకారమైన వల కల్పించుచున్నది చూచావా? అట్లాగే బ్రహ్మదేవుని సంకల్ప రచనగా ఈ జ్యోతిశ్చక్రము రచించబడింది. ఆ జ్యోతిశ్చక్రంలో సూర్యగోళం యొక్క గతిభేదం, ఉత్తరాయన – దక్షిణాయనాలు, రాత్రింబవళ్ళు... ఇవన్నీ అల్పకాలిక – దీర్ఘకాలిక విశేషాలతో కూడిన కాలచక్రంగా ప్రవర్తిస్తోంది. వాస్తవానికి చిదాకాశమే ఈ సమస్త జ్యోతిశ్చక్రము మొదలైన సర్వ దృశ్యరూపంగా భాసిస్తోంది. అట్టి చిదాకాశ కల్పితమైన (కానీ, చిదాకాశరూపమే అయిన) జ్యోతిశ్చక్రంలో... కొన్ని సుదీర్ఘంగా మహాప్రకాశ శీలములై ఉంటున్నాయి. (ఉదా: సూర్యగోళం, నక్షత్రాలు మొదలైనవి)

మరికొన్ని అల్ప ప్రకాశశీలకములై ఉంటున్నాయి. (ఉదా: చంద్రబింబం మొదలైనవి). ఇంకొన్ని స్వయం ప్రకాశరహితములై ఉంటున్నాయి. (ఉదా: భూమి మొదలైనవి). ఈ విధంగా ఈ కనబడే పదార్థాలన్నీ చిత్ర విచిత్రములుగా భాసిస్తున్నాయి.

అయితే రామచంద్రా! జ్ఞాని యొక్క "ఆత్మౌపమ్యేవ సర్వత్రా" దృష్టికి... ఇక్కడ ఈ పదార్థ సమూహమంతా ఉత్పన్నమే అయివుండనిదై, వాస్తవముకానిదై ఉన్నది. మట్టితో తయారు చేయబడిన అనేక బొమ్మలు చూచి "మట్టి మాయమై ఈ బొమ్మలు ప్రత్యక్షమైనదెప్పుడు?" ...అనే ప్రశ్న ఎవరికి ఉదయిస్తుంది?

మంచుగడ్డ యొక్క ఆకారం చూచి "ఇది నీరు కాదు. నీరు నీటి ఆవిరి కాదు. నీటి ఆవిరి ఆకాశ స్వరూపం కాదు. మంచుగడ్డ యొక్క చతురస్రాకారము సత్యమే"... అని ఆపః ధర్మాలు

(జలము యొక్క ధర్మాలు) తెలిసియున్నవాడు అనుకుంటున్నాడా? ఆకాశమే వాయు రూపంగా అవుతోంది. కనుక వాయువు ఆకాశరూపమే! ఆ వాయు విభాగమే నీటి ఆవిరి. ఆ నీటి ఆవిరి రూపమే జలము. ఆ జలమే ఈ మంచుగడ్డ... అని విజ్ఞుడు గ్రహించయే ఉంటున్నాడు. అదే, ...మంచుగడ్డ యొక్క వివిధ స్థితులు తెలియనివాడో.... రూపముతో కూడిన "ఈ మంచుగడ్డ రూపరహితమగు వాయువు ఎట్లా అవుతుంది? అవదు. ఆ వాయువు గుణరహితమగు ఆకాశం ఎట్లా అవుతుంది? కానే కాదు!"... అని అనుకుంటున్నాడు. అయితే, జ్ఞానికి ఈ సమస్త దృశ్యము కూడా (మంచుగడ్డ యొక్క ఆకారమువలె) అనుత్పన్నమైనదై, స్వప్న సదృశ్యమై "చిదాకాశరూపం"గా భాసిస్తోంది.

ఈ జగత్ దృశ్యము ఇట్లు చిదాకాశమే అయివుండగా... ఇక ఈ "నీవు – నేను" అనే జగత్తులో అంతర్గతంగా కనిపించే వస్తువులను పరిశీలిద్దాం.

నీవు – నేను అనురూపంగా (మనలో ఒక్కొక్కరికి స్వస్వరూపంగా) అనుభూతమగుచున్నది చిన్మాత్రమే! అదియే నీవు – నేను ఇత్యాదులుగా భాసిస్తోంది. ఇక మనోబుద్ధి చిత్తాది అంతరంగ విభాగాలు గురించి వేరే చెప్పేదేమున్నది? ఏ చిదాకాశం 'నీవు– నేను' అయినట్లుగా కనిపిస్తోందో, ఏ 'నేను–నీవు'ను ఆశ్రయించి మనోబుద్ధి చిత్తాదులు కనిపిస్తున్నాయో... ఇవన్నీ కూడా జ్ఞానికి కేవలం చిన్మాత్ర రూపంగా యథాతథమై కనిపిస్తున్నాయి. ఈ నేను – నీవు మొదలైనవి దేహములు నశించినప్పుడు తాము కూడా నశిస్తున్నాయని "ఘనీభూత జగత్ దృశ్య" దృష్టిచే అనిపిస్తే అనిపిస్తోందేమో! మంచు కరిగితే ఆకారంతో సహా ఆ పదార్థం నశించిందా? లేదే! అది జలరూపంగానో, వాయురూపంగానో మారవచ్చుగాక! 'వినాశనము' అనేది ఎక్కడిది? ఏ చిన్మాత్రము 'నేను–నీవు' ఇత్యాదులుగా కనబడుతోందో.... అయ్యది వాస్తవానికి దృశ్యరూపంగా భాసించటమూ లేదు, నశించటమూ లేదు.

అనగా... స్వప్నంలో దృశ్యంలాగా... చిదాకాశమే చిదాకాశమునందు చిదాకాశ సంకల్పం చేతనే జగదాకారంగా భాసిస్తోంది. ఈ జగత్తుకు చిదాకాశం కంటే వేరైన మరింకే రూపమూ లేదు! అట్టి ఆ చైతన్యమునకు 'సృష్ట్యాది' యందు ఏ పదార్థం ఏ రూపంగా స్ఫురిస్తోందో, అది ఆ ప్రకారంగానే అద్దానికి అనుభూతమౌతోంది. ఎంతవరకు ఏదేది వస్తురూపంగా విద్యమానమై ఉన్నదో అంతవరకు వాటివాటితో తాదాత్మ్యం నొందినదై స్ఫురించిన రూపము కలిగియున్నదగుచున్నది.

చైతన్యము యొక్క స్వకీయ స్ఫురణయే "స్వభావము". చైతన్యము యొక్క స్ఫురణయే "నియతి". బ్రహ్మదేవుని భావనయే సృష్టికి మూలం. కనుక ఇదంతా భావనారూపమే! ఆ బ్రహ్మ సత్త... చిదాకాశరూపుడగు బ్రహ్మదేవుని యొక్క సంకల్ప – భావనా శరీరంలో శబ్దతన్మాత్ర స్థితిచే ...ఆకాశంగానూ స్పర్శ తన్మాత్ర స్థితిచే ...వాయువుగానూ... ఈ విధంగా విత్తనంలోంచి మహావృక్షం లాగా అగుచూ... మహాప్రశాతంగా (బ్రహ్మసత్తయే అయి–బ్రహ్మ సత్తగానే) స్థితి నొంది ఉన్నది.

శబ్దతన్మాత్ర నుండి (ఆకాశం నుండి)... స్పర్శ తన్మాత్ర (వాయువు), స్పర్శ తన్మాత్ర నుండి

...తేజోతన్మాత్ర (అగ్ని), తేజో తన్మాత్ర నుండి...రసతన్మాత్ర (జలము), రసతన్మాత్ర నుండి... పృథివీ తన్మాత్రా... ఈ విధంగా భూతభౌతికాత్మికమైన ఈ జగత్తు క్రమంగా ఉత్పన్నమైనదగుచున్నది.

అయితే... రామచంద్రా! "ఆకాశాత్ వాయుః-వాయురగ్నిః - అగ్నిరాపః - ఆపః పృథివీ" ...ఇత్యాది ఈ 'క్రమము'ను గూర్చిన కల్పన అజ్ఞానుల యొక్క తత్త్వబోధ కొరకై మునులచే ప్రతిపాదించబడుతోంది. అంతేగాని "ఈ సృష్టి వాస్తవమైన సత్యము"... అని ప్రతిపాదించటం కొరకై వారి ఉద్దేశంకాదు. ఈ సృష్టి నామరూపాత్మకమైన సత్యత్వము మూర్ఖులగువారిచేత మాత్రమే వెతకబడుతోంది. ఎందుకంటే....

**నాస్తమేతీహో నో దేతి తత్క్వాచన కించన**
**శిలాజఠరవత్ శాన్తం ఇదం నిత్యం సదప్యసత్ ।**

బ్రహ్మసత్త జగత్తుగా ఉదయించదు. మరల జగత్‌రూపంగా అస్తమించదు. శిలయొక్క గర్భమువలె అది సదా పరమశాంతరూపము వహించియే ఉన్నది. ఈ జగత్తంతా పరమార్థ సత్తచే సత్యము, నామరూపాది వ్యవహారములచే అసత్యము అయి ఉన్నది.

"అవయవి" అగు పరమాత్మ యొక్క అవయవ రూపమగు ఈ దృశ్యము అనంతరూపమై ఉన్నది. తదవయవ ప్రాయములగు ఈ జగద్రూపాణువులు, అట్టి ప్రతి ఒక్క జగద్రూపాణువులో అసంఖ్యాక ప్రాణి సమూహములు అట్టి ప్రతిప్రాణి యొక్క అణువణువున అనేక జగత్తులు... ఇవన్నీ అనంత సంఖ్యారూపములుగా అయి చెన్నొందుచున్నాయి. సముద్రంలో తరంగాలు - ఆ తరంగాలలో జల బిందువులవలె, ఆ జలబిందువులలో జలపరమాణువుల వలె.... అసంఖ్యాక బ్రహ్మాండములు - అట్టి ప్రతి ఒక్క బ్రహ్మాండములో అసంఖ్యాక జగత్తులు, అట్టి ప్రతి ఒక్క జగత్తులో అసంఖ్యాక జీవులు, ఆ ప్రతి ఒక్క జీవునిలో అసంఖ్యాక జగత్తులు - ఇవన్నీ కూడా పరమార్థమున అనంతరూపములే! అవన్నీ పరమాత్మయందు ఉదయించక - అస్తమించక వెలయుచున్నాయి. ఆకాశమున ఆకాశము ఉన్నట్లు 'బ్రహ్మము' అనే చిదాకాశమున జగత్తు అనే చిదాకాశము కలదు. బ్రహ్మ సత్తకంటే వేరుగా 'జగత్ సత్త' లేదు. ఈ జగత్తు చిద్రూపమే అయివుండగా, ...ఇక ఇది ఉదయించటం ఏమున్నది? అస్తమించటం ఏమున్నది?

❖❖❖

## 11. సత్ నుండి అసత్ చమత్కారం - మణిదీపన్యాయం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "మణిదీపన్యాయం"... అనే ఒకానొక దృష్టాంతం అధ్యాత్మ శాస్త్రంలో ప్రసిద్ధమైయున్నది. అది ఇప్పుడు ఉదహరిస్తున్నాను. విను.

చైతన్యము వస్తుతః అనంత ప్రకాశరూపము - సర్వ వ్యాపకము అయివున్నది. అట్టి 'చైతన్యము' అనే మణి కాంతి ప్రసరణయే సత్తామాత్రము (సత్ అనుభవం). ఆ చైతన్య మణియొక్క అసంఖ్యాక కాంతిపుంజములే ఈ అసంఖ్యాక 'జగత్తులు - జీవులు' కూడా! అట్టి చైతన్య సత్తా మాత్రము యొక్క స్ఫురణరూపమే స్వభావము.

ఆ చైతన్యము, తనయొక్క 'సత్తా మాత్ర యథార్థ స్వభావము'ను కొంచెము ఏమరచి, అద్దాని విస్మరణముచే స్వయముగా కించిత్ విషయాభిముఖం అయినదానివలె అగుచున్నది. అద్దానిని 'అజ్ఞాన సంవిత్' అని పిలుస్తున్నారు.

అట్టి అజ్ఞాన సంవిత్తు అన్యథా భావము ఆశ్రయించినదగుచున్నది. అట్టి అన్యథా భావముచే పరామర్శపూర్వకంగా భావికాల ప్రపంచము యొక్క నామ–అర్థ కల్పనలతో వ్యవహరించ నారంబిస్తోంది. అయితే, ఆ కల్పనల రూపంగా తానే అగుచున్నది. అట్టి నామ–అర్థ కల్పనలతో ఆకాశము కంటే కూడా అతి సూక్ష్మము – శుద్ధము అయినట్టి రూపము ధరించి సర్వ పదార్థముల గూర్చిన భావి కాలపు నామ – రూపముల యొక్క 'పర్యాలోచన' నిర్వర్తిస్తోంది.

ఆ తరువాత అట్లు పర్యాలోచించినదానిని ప్రకాశింపజేయటానికి అభిముఖమగుచున్నది. (చేత యతీతి చిత్ – ప్రకాశింపజేసేదే చిత్). ఇప్పుడిది 'చిత్ చైతన్యము' అనే పేరుతో పిలువబడటానికి అర్హమగుచున్నది. ఆ తరువాత చిత్ చైతన్యము శరీరాదులందు ఘనీభూతమగు అభిమానము కలిగి ఉంటోంది. ఆ అభిమానముతో కూడిన ఆత్మసత్త భావికాలపు 'జీవుడు' మొదలైన సంజ్ఞలుగా అగుచున్నది.

అట్లు 'జీవుడు' అనే సంజ్ఞను పొందిన దేహాభిమానియగు ఆత్మసత్త మరల ఎప్పుడో క్రమంగా ఆధికారికమైన జన్మలను పొంది తిరిగి మరల పరమపదరూపమగు బ్రహ్మముగా అగుచున్నది.




చిదాకాశమును కప్పి ఉంచే అవిద్యచే ⟶ తన చిదాకాశత్వము ఏమరచి జగత్ భావంతో ప్రదర్శించుకుంటోంది.

అయ్యది జ్ఞాన లాభము చేతనో .... తాను బ్రహ్మము కంటే వేరుకానిదై భాసిస్తోంది.

అయితే, ఆవృతజీవదశయందు మాత్రం దేహ – ఇంద్రియములతో 'తాదాత్మ్య ధ్యాస' చే అనేక ఉపాధులతో వివిధ జన్మలందు తిరుగాడటానికి అభిముఖం అవుతోంది. అందుచేత అది శుద్ధరూపము యొక్క ఏమరపుచే జనించినన మలిన కర్మల రజోగుణము ధరించినదై ఉంటోంది.

❖

ఓ రామచంద్రా! ఈ విధంగా ఆ అద్వితీయమగు బ్రహ్మసత్త-శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాది ఆయా గుణములను-తన గర్భమున ధరించినదై... "సవికల్ప చిద్భావన"చే సూక్ష్మ పంచభూతమగు చున్నది. ఆ సూక్ష్మ పంచభూతములే ఆకాశము మొదలైన నామముల యొక్క అర్ధ ప్రవృత్తికంతటికీ కారణభూతమౌతున్నాయి. ఆ సూక్ష్మభూత రూపమగు 'బ్రహ్మసత్త' నుండి లింగశరీరము (సూక్ష్మ శరీరము) యొక్క ప్రాణ సంచారక్రియ రూపుదిద్దుకుంటోంది. అట్టి లింగ శరీర ప్రాణసంచార క్రియచే ప్రేరితమైన అహంకారము కాలసత్తతో సహా ఉదయిస్తోంది. ఆ అహంకార-కాలసత్తలే ఈ జగత్తు యొక్క స్థితికి ముఖ్యబీజములై ఉంటున్నాయి.

"పరాచిత్‌శక్తి"... యొక్క "నిజస్ఫురణ మాత్రము"... అయినట్టి ఈ అపద్రూప జగత్ సమూహం "అధిష్ఠాన చైతన్యము" వలననే సత్తువలె స్థితి నొంది ఉంటోంది. "సంకల్పము" అనే మహా వృక్షమునకు బీజము చైతన్యమే సుమా! అట్టి చైతన్యము 'అహంత్వము'ను భావించుచు క్షణంలో అహంత్వరూపమై పోవుచున్నది. "హిరణ్యగర్భుడు"... అనే శాస్త్రీయ నామంతో పిలువబడే ఆ చైతన్యము "ఉత్పత్తి - వినాశనము" అనే భ్రమలతో కూడుకొనియున్నదై - జలము జలమునందే పరిభ్రమిస్తున్నట్లు - బ్రహ్మము నందే పరిభ్రమిస్తోంది.

భావన → సూక్ష్మభూతముల భావన → ఘనీభూతం ఒనర్చబడగా → స్థూల భూతముల రూపం

ఆ చైతన్యమే ఆ తరువాత తరువాత "నామ - రూప - శబ్దార్థము" అనే రూపం దాల్చుచున్నది. ప్రతి ఒక్క జీవుని వాస్తవ - నిజ స్వరూపమగు ఆ శుద్ధ చైతన్యమే వేద - శాస్త్రములకు పద - వాక్య - ప్రమాణములచే ఉద్దేశార్థమై చెన్నొందుతోంది. వేద శబ్దములకు ఆధారభూతమగు ఆ చైతన్యము నుండియే ఈ సమస్త జగత్తు ఉదయిస్తోంది. శబ్దము నుండి అర్ధభూత జగత్తు జనిస్తోంది. (సభూరిత వ్యాహరత్ భువమసృజత - ఆ చైతన్యము నుండి జనించిన 'భూః' శబ్దం చేత భూమి సృజించబడింది... ఇత్యాది).

ఈ ప్రకారంగా "విచిత్ర సంకల్పములు" నిర్వర్తిస్తున్న బ్రహ్మమే హిరణ్యగర్భుడు. ఆ హిరణ్యగర్భ బ్రహ్మము ఆ తరువాత అనేక సంజ్ఞల (శబ్దార్థముల)తో కూడిన రకరకాల ప్రాణి సమూహములకు బీజము. ఆ హిరణ్యగర్భ బ్రహ్మమునుండే ఆకాశమంతా వ్యాప్తమై 14 లోకములకు సంబంధించిన 14 విధములైన ప్రాణి సమూహములు దీపమునుండి కాంతిపుజముల వలె బయల్వెడలుచున్నాయి.

చైతన్యము → హిరణ్య గర్భ చైతన్యము బ్రహ్మదేవుడు / ఈ సృష్టికి కర్త → స్పందన రూపమైన (చలనరూపమైన) చిన్మాత్రము

**1. వ్యాప్తత్వము :** ఆ చైతన్యము నుండే వ్యాప్తరూపమగు 'ఆకాశము' బయల్వెడలినదై వ్యాప్తత్వ ధర్మము అవధరించుచూ... తన యందు 14 లోకములను, 14 ముఖ్య విధములైన ప్రాణి

సమూహాలను చైతన్యము యొక్క ప్రసరణరూపంగా కలిగి ఉంటోంది. ఈ విధంగా అంతవరకు కూడా శబ్ద వ్యహారము, శరీరాదుల వ్యవహారములైనట్టి హిరణ్యగర్భ చైతన్యము అకస్మాత్తుగా, కాకతాళీయంగా తన యందు తనకు అనన్యమైనట్టి వ్యాప్తత్వ ధర్మం ప్రదర్శిస్తోంది.

**2. స్పందత్వము :** అంతవరకూ నిశ్చల సత్‌రూపంగా ఉన్న హిరణ్యగర్భ (సృష్టికర్త) చైతన్యము తనయందు స్పందమును (చలనమును) కల్పించుకొంటోంది. ఆ స్పందము, వాయు సమూహమునకు బీజమై త్వక్ (చర్మ సంబంధమైన స్పర్శ) అనే తన్మాత్ర రూపముగా అగుచున్నది. సమస్త ప్రాణుల సంచలన హేతువగు వాయువు జనించుచున్నది.

**3. ప్రకాశత్వము :** ఆ హిరణ్యగర్భ చైతన్యస్పందము నుండి వాయురూపమును పొందిన హిరణ్యగర్భ చైతన్యము చిద్విలాసంగా 'ప్రకాశము' నకు సంబంధించిన అనుభవం ఆశ్రయిస్తోంది. అదియే 'రూపతన్మాత్ర'గా అగుచున్నది. భావికాలపు 'తేజము' అనే శబ్దమునకు అర్థక్రియా కర్తృత్వము వహిస్తోంది.

ఓ రామచంద్రా! 'తేజము'లో ఏ ప్రకాశమున్నదో... అది చైతన్య ప్రకాశమే! అట్లాగే... స్పర్శ జ్ఞానమూ చైతన్యమే! చైతన్యమునకు అన్యంగా తేజము – స్పర్శ జ్ఞానము మొదలైనవి మరెక్కడి నుండో వచ్చి ఉండలేదు. అట్లాగే ... ఆకాశకోశమున చైతన్యమే స్వయంగా శబ్దరూపమై 'శబ్దజ్ఞానము'ను అనుభవిస్తోంది. చైతన్యమునకు అన్యంగా శబ్దజనకమైనదంటూ ఏదీ లేదు.

కాబట్టి... సృష్ట్యాది యందు సమష్టి దశయే ఉన్నది కదా! సమష్టిదశయందు చైతన్యమునకు అన్యంగా మరొక ఏదైనా కారణం చేత శబ్ద తన్మాత్ర – స్పర్శతన్మాత్ర – రూపతన్మాత్ర – రసతన్మాత్ర – గంధతన్మాత్ర ఏర్పడటం జరుగుతోందా? లేదు! తన్మాత్రలన్నీ కూడా చైతన్యము నుండే, చైతన్య రూపంగా – చైతన్యమునకు అనన్యమై జనించాయి. అవి చైతన్యరూపములే!

అట్లాగే, ఇప్పుడు ఈ సృష్టి దశయందు కూడా ద్వైత – ఏకత్వములకు క్రొత్తగా స్థానమెక్కడిది? అందుచేత సమష్టి నుండి వ్యష్టి వరకు కూడా చైతన్యమే సర్వపదార్థ రూపముగా వెలయుచున్నది. ఈ ఈ "శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు" అనబడే 5 తన్మాత్రలు స్వప్నమువలె అసత్యములే అయినప్పటికీ... వీటి మూలరూపము చైతన్యమే కాబట్టి... సత్యమువలె అనుభూతమగుచున్నాయి. తేజోరూపము పొందిన సూర్యుడు మొదలైన ప్రకాశ వస్తువులకు ఉత్పత్తి స్థానం అవుతోంది.

ఆ చైతన్యము ఈ ఈ రూపభేదములతోటి ప్రపంచము ఆ చైతన్య మణిదీప తేజమునుండే ప్రసరిస్తోంది. 'రంగు' అనే వికారమే ఉండనట్టి ఆకాశమునందు నీలంరంగు కనబడుతోంది చూచావా? అట్లాగే నిర్వికారమగు ఆ తేజోరూప చైతన్యము నుండే రసతన్మాత్ర జనించి జలముగా రూపుదిద్దుకుంటున్నది. అన్నపానాదుల యొక్క 'మాధుర్య సంవిత్తు' ఆ 'రసతన్మాత్రము'యే సుమా! ఆ హిరణ్యగర్భుడు అనే జీవుడు భవిష్యత్ పదార్థముల గూర్చి సంకల్పించువాడు కదా! సమస్త కార్య – కారణ రూపుడగు ఆతడు ఆ పిమ్మట గంధతన్మాత్రను కల్పించుచున్నాడు. ఆ గంధ తన్మాత్రయే సర్వులకు – సర్వమునకు ఆధారమైన ఈ 'భూమి'కి బీజముగా అగుచున్నది.

❖

ఈ విధంగా... ఈ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రల సమూహమంతా వాస్తవానికి ఉత్పన్నము కాకయే ఉన్నప్పటికీ... ఉత్పన్నమైన వాటివలె ఉంటున్నాయి. వాస్తవానికి ఇదంతా నిరాకారమే అయినప్పటికీ చైతన్యము యొక్క మాయా విభాగ కల్పనావశం చేత సాకారమువలె అనుభవమగుచున్నది.

చైతన్య రూపమగు ఈ తన్మాత్ర సమూహం కాకతాళీయంగా... ఏ స్థానం నుండి రూపమును ఎరుగుచున్నదో... అదే 'నేత్రం'. ఏ స్థానం నుండి శబ్దమును ఎరుగుచున్నదో... అదే 'చెవులు'. ఏ స్థానం నుండి స్పర్శను ఎరుగుచున్నదో... అదే 'చర్మేంద్రియం'. ఏ స్థానం నుండి రసము (రుచి)ని ఎరుగుచున్నదో... అదే 'జిహ్వ' (నాలుక). ఏ స్థానం నుండి గంధము (వాసన) ఎరుగుచున్నదో... అదే 'ఘ్రాణేంద్రియం' (ముక్కు).

ఈ విధముగా ఆ తరువాత నియమితమగు ఆకృతి పొందిన ఈ జీవుడు "ఇవి దిక్కులు – ఇవి కాలము" మొదలైన ఈ ఈ భేదములన్నీ కల్పించుకుంటున్నాడు. ఆతడు వ్యష్టిభావమును పొందినవాడై "నేను ఈ దేహముతో సహావేరు – వీరు ఈ ఈ దేహములతో సహా నాకంటే వేరు వేరు" అనే కల్పనను ఆశ్రయించి ఎక్కడి కక్కడ పరిమిత రూపత్వ దోషమును పొందుచున్నాడు. అట్టి "పరిమితరూపత్వదోషము" చేతనే... కళ్ళతో చూస్తున్నాడు గాని ఆఘ్రాణించలేకపోతున్నాడు. అదే రీతిగా తదితర వేరువేరు దేహములచే వేరు వేరు భోగ్యములను ఎరుగుటలేదు.

ఓ రామచంద్రా! ఈ విధంగా ప్రతిజీవుని ఆత్మయందు అనంతమైన జగత్తుల కల్పన ఉండియే ఉన్నాయని గమనించు. కళ్ళతో వినలేనట్లే, ఈ జీవుడు "నేను ఈ దేహమే పరిమితిగా కలవాడను"... అను కల్పనను కాలగతంగా ఆశ్రయించి ఉంటున్నప్పటికీ ఈతని ఆత్మయందు అంతులేని జగత్తులున్నాయని ఈ వివరణ సారముగా అందరూ గ్రహించండి.

ఈ అనంత జగత్తు ఆత్మకంటే వేరు కాదు. ఇదంతా ఆత్మభూతమే అయి ఒప్పుచున్నది. కాబట్టి ఈ ఈ జగత్తులు పరమార్థమున ఉదయించటమూ లేదు. అస్తమించటమూ లేదు. ఇదంతా కూడా... శిల్పము యొక్క గర్భ ప్రదేశమువలె... సచ్చిదానంద ఘనమగు మౌనరూపంగానే స్థితినొంది ఉన్నది.

"చైతన్యము" అనే మణి నుండి అనుక్షణికంగా ప్రసరిస్తున్న కాంతిపుంజములే ఈ జీవులు – జగత్తులు – బ్రహ్మాండములు – తన్మాత్రలు – దేహములు – భావములు – సుఖదుఃఖములు – జ్ఞానాజ్ఞానములు వగైరా! ఇందులో ప్రతి ఒక్క జీవుడు చైతన్య రూపమగు "మణి" అయి "మణి, దీపన్యాయము" అనే తాత్త్విక స్థితి అవధరించియే ఉన్నాడు. అట్లాగే, సర్వాత్మకమగు చిత్ చైతన్యమణి కాంతిపుంజము కూడా అయి ఉన్నాడు!

❖❖❖

# 12. జీవో బ్రహ్మేతి నా పరః

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీకు ఇంతవరకూ కూడా శుద్ధ చైతన్యము హిరణ్యగర్భ చైతన్యము, సమష్టి తత్త్వములైన ఆకాశ – వాయు – తేజములు, అద్దాని అంగములైన శబ్ద – స్పర్శ – రూప – రస –గంధ తన్మాత్రలు, వాటి నుండి ఉదయించిన జీవుడు, ఆ జీవునిచే కల్పించబడిన దిక్ సత్త – కాల సత్తలు ... ఈ ఈ వరుస క్రమమంతా ఎందుకు చెప్పానో తెలుసా? "ఈ జీవుడు పరబ్రహ్మము కంటే వేరుకాదు" అని నిరూపించటానికి ప్రారంభ పరిచయంగా అవి చెప్పాను. అంతేగాని "ఈ జీవునికి ఉత్పత్తి – వినాశనాలు ఉన్నాయి"... అని చెప్పే ఉద్దేశంతో చెప్పినవి కావు. ఈ విధంగా "ఆత్మ యొక్క అకృత్రిమ అవయవరూపుడు – విషయాభిముఖుడు" అగు అద్దానిని 'చిదాభాసుడు' అని "పరమాత్మ యొక్క అంశరూపుడు" అని పిలుస్తున్నారు.

ఆ చిదాభానుడే "జీవుడు" అనే పేరుతో కూడా పిలువబడుచున్నాడు. ఆ చిదాభాసునికే అనేక పేర్లు...!

జీవనము (ప్రాణము), కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు ధరించటం చేత "జీవుడు" అని; విషయాభిముఖుడై ఉండటంచేత 'చిత్తము' అని; ఆయా విషయములు ఎరుగుచుండుటచే 'చిత్' (ఎరుక) రూపుడు అని; "ఇది ఇట్టిది కదా!" అనే బోధ కలిగియుండటం చేత "బుద్ధి" అని; సంకల్పించటంచే, ఊహ–అపోహలకు సంబంధించిన జ్ఞానం కలిగి ఉండటంచేత "మనస్సు" అని; 'నేను' ఉన్నాను అనే అభిమానపూర్వకమైన వృత్తితో కూడి ఉండటం చేత 'అహంకారము" అని; చైతన్య పరిపూర్ణమగు ఆత్మ వస్తుస్వరూపుడే అయి ఉండటంచేత "చిత్స్వరూపుడు" అని; దృఢమైన సంకల్ప సమూహముచే పూరితుడై ఉండటం చేత "పుర్యష్టకము" అని; సృష్ట్యాదికాలంలో ప్రథమంగా (ప్రకృతిరూపుడై) విద్యమానుడై ఉండటం చేత "ప్రకృతి" అని; ఉపాధిపరుడై ఉండటంచేత "ఔపాధికుడు" అని; తత్త్వజ్ఞానం విషయంలో ఏమరచి ఉండటం చేత (అవిద్యమానుడై ఉండటం చేత) "అవిద్యా స్వరూపుడు" అని... ఈ విధంగా శాస్త్రములచేత, శాస్త్రకారులచేత 'చైతన్యమణి' అనతగు కేవల చిత్ స్వరూపుడగు ఈ వ్యష్టి రూపుడు 'చిదాభాసుడు' అని, 'జీవుడు' అని వర్ణించి చెప్పబడుచున్నాడు.

అయితే... ఈ జీవుడు వాస్తవానికి నిరాకారుడు, నిర్వికారస్వరూపుడు. కాని, తన లింగ శరీరము యొక్క కల్పనచే "నాకు ఆద్యంతాలు ఉన్నాయి"... అని భ్రమను ఆశ్రయించి ఉంటున్నాడు. అట్లాగే స్వప్నము – సంకల్ప నగరము – వంటిదే ఈ త్రిలోకములతో కూడిన జగత్తు కూడా! భ్రమరూపమగు ఈ త్రైలోక్య జగత్తు అర్థ క్రియా సమర్థమై ఉన్నప్పటికీ కూడా... వాస్తవానికి ఇది శరీర రహితము, పదార్థ శూన్యము, నిరాకారము అయి భాసిస్తోంది.

కాబట్టి ఓ సర్వ సభికులారా! ఈ లింగ శరీరం (సూక్ష్మ శరీరం) చిదాకాశమే! ఈ చిత్త శరీరం వాస్తవానికి ఆకాశం కంటే కూడా అత్యంత శూన్యం! అయితే ఈ చిత్త శరీరమే 14 లోకములకు ఉత్పత్తి స్థానం. అట్టి ఈ 'చిత్త శరీరం' ఉదయించటమూ లేదు, అస్తమించటమూ

లేదు. ఎప్పటి యట్లే ఇట్లు స్థితినొందియున్నది. కాలానుగుణంగా విత్తనము వృక్షమై ఫలములు, పుష్పములు, ఆకులు మొదలైనవి ప్రదర్శిస్తూ ఉంటుంది. చూచారా? అట్లాగే... 'చిత్తం' అనే భూమిలో లక్షల-కోట్లకొలది ప్రాణులు ఉద్భవించాయి. ఉద్భవిస్తున్నాయి. ఉద్భవించబోతున్నాయి.

అద్దము తనయందు ప్రతిబింబమును ధరిస్తుంది కదా! అట్లాగే ఈ చిత్తదేహము బాహ్య - అభ్యంతరములలో అనేక జగత్తులు ధరించి ఉంటోంది. అయినప్పటికీ కూడా... అది ఆకాశములె 'శూన్యరూపమే' అయివున్నది. "ప్రాకృత ప్రళయం" అనబడే మహాకల్పము యొక్క అంతిమ క్షణంలో సర్వదృశ్యము సర్వనాశనమునకు సంసిద్ధమగుచున్నది. అప్పుడిక నిర్వికారమగు బ్రహ్మాత్మపదము మాత్రమే శేషించబోవు క్షణాలలో... మరల చైతన్యమున, శుద్ధచిత్‌స్వరూపమును కొంచెము కప్పిపుచ్చు 'అజ్ఞానం' చేత, చిదాకాశము స్వయంగా (ఇంతకు ముందు చెప్పిన క్రమంలో) సూక్ష్మ శరీరమును కల్పిస్తోంది. అట్టి బ్రహ్మము యొక్క ఒకానొక స్వల్ప విభాగము 'జీవ రూపము' అగు సూక్ష్మ శరీరమును ధారణ చేస్తోంది. "జగత్తును అవలోకించటం" అనే ఒకానొక ప్రకాశమును కలిగి ఉంటోంది. అద్దానికే "బ్రహ్మదేవుడు" అని, 'విరాట్టు' అని శాస్త్రములు పేరు పెట్టాయి. అట్టి సూక్ష్మరూపుడగు పరమాత్మ యొక్క ఒకానొక విభాగమును "సనాతన పురుషుడు" అని, వేరొక విభాగమును "శ్రీమన్నారాయణుడు" అని, మరొక విభాగమును "ప్రజాపతి" అని శాస్త్ర పురాణ - ఇతిహాస ద్రష్టలు పేర్లు పెట్టడం జరుగుతోంది. ఈ 'జీవుడు' అనబడేవాడు కూడా బ్రహ్మము యొక్క విభాగమే అయి, బ్రహ్మమునకు అద్వితీయుడై ఉన్నాడు. అనన్యమై ఉన్నాడు.

ఓ రామచంద్రా! ఈ దృశ్యమంతా కాకతాళీయ న్యాయం చేతనే ఏర్పడి ఉంటోంది. కాకతాళీయ న్యాయముచే ఏఏ విభాగమందు ఏఏ ప్రకారంగా పంచేంద్రియ సంవిత్తులు భాసిస్తున్నాయో... ఆ ప్రకారంగానే ఇంద్రియార్థములు, ఇంద్రియ విషయములు స్థితినొంది ఉంటున్నాయి. ఈ ప్రకారంగా ఈ విశాల దృశ్యము పొందబడుచున్నప్పటికీ... ఇదంతా స్వస్వరూపమునకు అనన్యమే అయివుండటం చేత... వాస్తవానికి ఇది పొందబడకయే ఉన్నది. సూర్య కిరణాలు ఆయా ఆకారాదుల ద్వారా ప్రసరించి, ఆయా 'కిటికీ-ద్వారము' వంటి ఆకారములు పొందుచున్నప్పటికీ వాస్తవానికి సూర్య కిరణాలు ఏ ఆకారమూ పొందటమే లేదు కదా! సర్వత్రా వ్యాప్తమైయున్న ఆత్మతత్త్వము సర్వదృశ్య శూన్యమే అయి వెలయుచున్నది.ఆద్యంతరహితమగు పరబ్రహ్మము సత్తు కాదు. అసత్తు కాదు. అయితే, అదియే సర్వరూప సాక్షాత్కారము - సర్వరూప సాక్షాత్కార రహితము అయి... ఇట్లు సత్ - అసత్ రూప జగదాకారంగా స్థితినొందియున్నది.

ఓ రామచంద్రా! స్త్రీ సంగమధ్యాస కలవానికి కలలో స్త్రీ కనబడుతుంది చూచావా? అట్లాగే సూక్ష్మశరీర రూపుడగు ఆ బ్రహ్మదేవుని అనుభవముచే... ఆతని సంకల్పమే స్వయంగా ఇట్లు 'జగత్' రూపంగా పరిపుష్టమై ఉంటోంది. స్వప్నంలో కనబడేదంతా ఆకార రహితమే అయినప్పటికీ ...చెట్లు, గృహాలు, గ్రామాలు, పట్టణాలు, అయినవాళ్ళు, కానివాళ్ళు - ఇవన్నీ కనిపిస్తున్నాయి కదా! 'ఊహ' అనే సంకల్పలోకంలో ఆ ఊహననుసరించి మిత్రుల ముఖాలు, ఇష్టమైన పదార్థాలు, ప్రదేశాలు (ఆ ఊహలో) అగుపిస్తాయి కదా!

ఈ 'జాగ్రత్' నందు కూడా ఈ నిజదేహము - ఈ జగత్తు కూడా వాస్తవానికి ఆకార రహితమే అయినప్పటికీ (ఒక ఊహయందువలె) అనుభూతం అవుతున్నాయి.

ఆ చిదాకాశము నిరాకారమై, పదార్థశూన్యమై ఉన్నప్పటికీ... స్వప్న జగత్తులాగానే అర్థక్రియా సమర్థమగుచున్నది. కఠినమైన ఆకారం కలిగి ఉంటోంది. ఇంతెందుకూ? ఈ జీవుని రూపమే అందుకు మనకు సుస్పష్టమైన దృష్టాంతం. ఈ జీవుడు స్థూలరూపంగా కనిపిస్తున్నాడు కదా! అయితే, ఈతనికి సూక్ష్మ శరీరం అనేది సుస్పష్టమే కదా! దేహానికి రూపముండవచ్చు! సూక్ష్మశరీరము ఏ ఆకారం? స్థూల - సూక్ష్మ దేహాల అనుభవం పొందే ఈ అనుభవమునకు ఆకారమెక్కడున్నది? అట్టి సూక్ష్మ శరీరరూపుడగు ఈ జీవుడు "నిరాకార శూన్య స్వరూపుడు - స్వప్న సదృశుడు" అయిన ప్పటికీ స్వయముగా - క్రమంగా ఆకారమును పొంది అద్దానిని అనుభవిస్తున్నాడు.

'సూక్ష్మ శరీరరూపుడు' అయినట్టి ఈ జీవుడు ఈ 'స్థూల దేహము'ను కల్పించుకొనుచున్నాడు. ఇక ఈ స్థూలదేహం ఎముకల అమరికచే ఆకారము పొందినదై, కాళ్ళు - చేతులు కలిగియున్నదై వెంట్రుకలు - గోళ్ళు - మాంసము - చర్మములతో కూడినదై ఈ ఆకారము కలిగివుంటోంది. అట్టి ఈ దేహమునందు... జన్మ - కర్మల అనుభవం పొందుచున్నాడు. దేహం వయస్సునుబట్టి పరిణామ స్థితిని పొందుచున్నాడు. దేశ-కాలముల విస్తారముతో కూడిన అనేక కాలగత అనుభవాలను కలిగి ఉంటున్నాడు.

పదార్థముల భోగము కొరకై అనేక ఊహ - అపోహలతో కూడిన భ్రమ పరంపరలను రచించుకొంటున్నాడు. వార్ధక్య - మరణాలను, అనేక గుణదోషములను ధరించినవాడై ఉంటున్నాడు. దశదిక్కులా సంచరిస్తూ 'నాది - నీది' మొదలైన అనేక హావ - భావ - అభావములు చమత్కారంగా కలిగి ఉంటున్నాడు. జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయములు అనే త్రిపుటిని చేతిలో ధరించి ఇక్కడ సంచరిస్తున్నాడు. అనేక పదార్థముల జ్ఞానమును సముపార్జించి... వాటి వాటి ఆది - మధ్య - అంతముల పట్ల హర్ష - దుఃఖములను పెంపొందించుకొని కాలమును వెళ్ళబుచ్చుచున్నాడు.

"ఈ తరువాత ఏమిటి? - ఇంతకు ముందు ఏమిటి?" అన్న ప్రశ్నకు పరిమితమైన దృష్టులతో పరిమిత అవగాహన కావించుకొని "ఈ బొమికలు - రక్తము - మాంసము - చర్మములతో కూడిన ఈ ఆకారమే నాది" .... అని తలచి ఈ జగత్తును దర్శిస్తూ "ఇంతకుమించి ఈ జగత్తు లేదు - ఇద్దానికి వేరుగా నేనూ లేను. ఇంకేదీ ఎక్కడా లేదు" అని తలచుచు 'దృశ్యబద్ధుడు' అగుచున్నాడు.

ఓ రామచంద్రా! ఈ విధంగా సనాతన పురుషుడగు పరమాత్మ సూక్ష్మ దేహరూపత్వము పొందినవాడై 'మనో - బుద్ధి - చిత్త - అహంకారాలు' అనే చతుర్ముఖములు కలవాడై "వ్యష్టి - సమష్టి - స్థూలదేహము" ..... లను నిర్మించుకొంటున్నాడు. వాటి నిమిత్తమై స్వయంగా పృథివి - ఆకాశ - జల - సూర్య - జన సమూహ - నగర - వ్యవహార - శిఖర ..... ఆదిగాగల అనేక పదార్థ రూపుడగుచున్నాడు.

"ఈ కనబడే జగత్ పదార్థములే నాకు ఆధారములు. నేను వీటి యొక్క అధేయుడను." ఇటువంటి భ్రాంతిమయ సంసారమును గాంచుచు తన స్వస్వరూపమును తానే ఏమరచి తిరుగాడుచున్నాడు.

❖❖❖

# 13. అద్వయ బ్రహ్మమునందు దృశ్యము అసంభవం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చూచావా రామచంద్రా! ఈ దృశ్యము కల్పన చేతనే ఏర్పడి, కల్పన చేతనే అనుభవమగుచున్నది. అనగా ఇద్దాని యొక్క సృష్టి కర్తయగు ఆది ప్రజాపతి బ్రహ్మదేవుడు (ఆది స్రష్ట – ఆది ద్రష్ట) – దృశ్యమును అనుభూతమొనర్చుకొనే ఈ 'జీవుడు' అనే ద్రష్ట … ఈ ఇద్దరూ కూడా తమ స్వకీయ కల్పనల మేళనము చేతనే దృశ్య సమన్వితము అయిన ఈ జగత్తును తయారు చేసినవారగుచున్నారు. ఇంకా చెప్పాలంటే … "ఆది ప్రజాపతి" (సృష్టికి ఆదియందు ఉన్నవాడై ఈ జగత్ కల్పనకు కారకుడగు బ్రహ్మదేవుడు) తనయొక్క మహాసూక్ష్మ శరీరము (చతుర్ముఖ శరీరము –మనో–బుద్ధి–చిత్త–అహంకారములు) యొక్క విస్తారం చేతను, సత్య సంకల్పమగు తనయొక్క సంవిత్స్వభావము చేతను కాకతాళీయ న్యాయంచే…. దీనికి కారకుడై ఉంటున్నాడు. అట్టి ఆదిప్రజాపతిచే ఏది ఏ రీతిగా కాకతాళీయంగా సంకల్పించబడిందో… అది ఆ రీతిగానే చిరకాలం స్థితిని పొందినదగుచున్నది. ఆహా! ఆశ్చర్యమే మరి! ఎందుకంటే… అట్టి సంవిత్తు యొక్క సంకల్ప మాత్రం చేతనే ఈ జగత్తు భాసిస్తోంది. ఇక "ఇట్టి జగత్తు సత్యము కాదు"… అని అనటంలో ఆశ్చర్యమేమున్నది? ఊహచే, కల్పనచే రచించబడింది సత్యమెట్లా అవుతుంది?

ఒకడు రచించిన కథలోని "ఒక రాజుగారికి ఇద్దరు భార్యలు. ఒక రోజు ఐదుగురితో వ్యాహ్యాళికి బయలుదేరాడు" అనే వాక్యం చదివి, "ఇప్పుడు రాజుగారికి ఇద్దరు భార్యలా? ఐదుగురు భార్యలా? ఏది సత్యం? ఏది కాదు?"… అనునది ఎటువంటి సత్యాన్వేషణయో…ఈ జగత్తు యొక్క సత్యాసత్యములు అట్టివే! మొదలు రాజుగారు – భార్యలు, అనునదే కల్పన కదా! ఇక ఆపై చర్చించటం, వాదించటం కల్పనా వ్యవహారములు కాక మరింకేమిటి? ఈ "ద్రష్ట – దర్శనము – దృశ్యము"… అనే మూడింటి సంయోగమైనట్టి త్రిపుటి మొదలే అసత్యమైయున్నది. లేదా… అధిష్ఠాన రూపముచేత… ఈ సమస్తమూ కూడా 'వ్యాపక బ్రహ్మమే' కనుక… ఇవన్నీ సత్యములే! అందుచేతనే, "ఇది సత్యమే"… అనుకున్న వారికి ఇదంతా ఘనీభూత సత్యంగాను, "భ్రమయే" అనుకునే వారికి 'కేవలం భ్రమ'గాను ఈ దృశ్యమంతా అవగతం అవుతోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ సృష్టి అంతా 'ఆది ప్రజాపతి' ఊహా (సంకల్ప) నిర్మితమైన సూక్ష్మ శరీరమేనని మనం కాసేపు అనుకుందాం. అట్టి సూక్ష్మ శరీరము సంకల్ప మాత్రము – భ్రాంతిమయము కదా! అంతా భ్రాంతిమయమే అయినప్పుడు మరి ఈ కొండలు – నేల కఠినంగా ఎట్లా కనబడుచున్నాయి? నదులు, నగరాలు…. ఇవన్నీ ద్రవరూపంగా ఎందుకు అనుభవ

మౌతున్నాయి? ఇవన్నీ కూడా ఘనీభూత రూపంగా వస్తురూపంగా ఎట్లా అగుచున్నాయి? నేను ఒక కొండగుహను ఊహిస్తే, ఆ కొండగుహ నాకు ఎదురుగా కనిపించగా... అందులో ప్రవేశించి పచార్లు చేయగలనా? కుదరదు కదా? స్వప్న పదార్థములు సత్యత్వం పొందటం, క్రియాసమర్థం అవటం ఎట్లా జరుగుతుంది? కాని, ఈ జాగ్రత్ జగత్తులో అన్నీ క్రియాసమర్థమై ఉంటున్నాయి కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇందులో ఆశ్చర్యమేమున్నది? సూక్ష్మ శరీరసంకల్పము నిరంతరము ఎడతెగకుండా స్వయంగా అనుభూతమగుచు, అదియే చిరకాలాభ్యాసముచే ఘనీభూతమైనదానివలె భాసిస్తోంది. ఐందవుల చిరకాల మనో అభ్యాసమే బ్రహ్మాండముల రూపం పొందలేదా? హరిశ్చంద్రుని సుదీర్ఘ స్వప్నమే ఆతనికి ఘనీభూతమై భౌతిక రూపంగా (శ్మశాన దృశ్యము మొదలైనవిగా) కనిపించలేదా? స్వప్నం కూడా చిరకాలాభ్యాసంచేత పరిపుష్టి పొంది అతి సత్యముగా అనుభవమవటం మనం మన ఈ సంవాదములో అనేక చరిత్రలలో గమనించాం కదా! అట్లాగే సూక్ష్మ శరీరము యొక్క సంకల్ప వ్యవహారం చిరకాలపు అభ్యాసం చేత 'సత్యమే' అన్నట్లుగాను, ఘనీభూతమైనట్లుగాను కనిపిస్తోంది. అట్టి సూక్ష్మ శరీరం యొక్క చిరకాల అనుభవంలో 'స్థూలత్వ బుద్ధి' జనించటం... మృగతృష్ణలో జలతరంగాలు కనిపించటం వంటిదే!

"స్వప్న భ్రమ" వలె, "మృగతృష్ణాజలం" వలె స్థితి నొంది ఉన్నట్టి ఈ జగత్తు "సత్యమే" అనే విశ్వాసము కలిగించుచు భాసించవచ్చుగాక! కానీ ఇది 'అసత్యమే' అయివున్నది. ఇవన్నీ స్థూలంగా కనిపిస్తున్నప్పటికీ ... వాస్తవానికి ... ఈ వస్తుజాలము సూక్ష్మతత్త్వరూపములే అయివున్నాయి. సూక్ష్మ – సంకల్పమయ పదార్థములకు స్థూలత్వం అత్యంత అసత్యమే అయినప్పటికీ కూడా... అవివేకులు ఇద్దానియందు స్థూలత్వం స్వకీయమైన ఊహచే కల్పించుకొని, తన్మయులై... తమ ఆసక్తిచే... ఆ స్థూలత్వమును స్వీకరిస్తున్నారు. "ఇవి శరీరములు – ఇది నా శరీరం – అది వాడి శరీరం – ఇది నేను – అది ఆమె – ఇది ఈతడు – వీరు నాకంటే వేరు – ఇది భూమి – అది ఆకాశము – వీరు నా పుత్రులు – వారు నా సోదరుని పుత్రులు – వీళ్లేమో వేరే వారు – అది పర్వతం – అవి దిక్కులు" .... ఈ విధంగా స్వప్నంలో ప్రకాశమానమయ్యే వస్తుజాలంలాగా, ఈ జగత్ రూపమైనటువంటి "మిథ్యాభ్రమ" అంతా భాసిస్తోంది. అనగా... "ఆది స్రష్ట" అయినటువంటి బ్రహ్మదేవుని యొక్క సూక్ష్మ శరీరము చిరకాలమైన దృఢాభ్యాసంచేత తన యందు తానే స్థూలత్వమును, ఈ పిండాకారమైన (స్థూలాకారమైన) భూమి – చెట్లు – కొండలు మొదలైన రూపమును గాంచుచున్నది. చిదాకాశమే "నేను బ్రహ్మమును"... అను తనయొక్క యథార్థ స్వస్వరూపమును ఏమరచినదై, 'కల్పన'ను అనుసరించినదై "ఈ మనుష్యుడు మొదలైన దేహమే నేను. ఈ భూమి మొదలైనవే నాకు ఆధారం"... అని... ఈ విధంగా గాంచటం యందు ఆసక్తిని కలిగి ఉంటోంది.

ఓ ప్రియ సభికులారా! అసత్యములు అయినట్టి ఈ శరీరము మొదలైనవాటి యందు "ఇవే నాకు సంబంధించిన సత్యం. ఇవి లేకపోయాయా... ఇక నా గతి చెప్పలేను"... అను రూపంగా

ఈ జీవుడు వాటిపట్ల సత్యబుద్ధితో కూడిన భావన కలిగి ఉంటున్నాడు. అట్టి భావనకు బద్ధుడగుచున్నాడు. అద్దానిని అనుసరిస్తూ అట్లే సుదీర్ఘకాలం దేహపురములలో మహాప్రయాణం కొనసాగించుచున్నాడు.

మొట్టమొదట ఆదిపురుషుడు – ఆది ప్రజాపతి అగు బ్రహ్మదేవుడు శబ్ద స్వరూపుడై వైదిక – లౌకిక శబ్దములను సృజించుచున్నాడు. అటు తరువాత వాని యొక్క ఆయా ఉపాధివంతములైన అర్థములందు సంకేతముల ద్వారా సంజ్ఞలను రచిస్తున్నాడు. "ఓం" అని ఉచ్చరించి ఆ తరువాత శబ్దరాశి భూతములైన 'వేదములు' రచన చేస్తున్నాడు. ఆ వేదశబ్దములచే శీఘ్రంగా ఈ ప్రపంచ వ్యవహారమంతా కల్పించుచున్నాడు. అంతా మనోకల్పనయే సుమా! ఈ మనస్సు దేనిని కల్పించుచున్నదో... అద్దానితో తన్మయమగుచున్నది. ఎవడు దేనియందు తన్మయుడౌతాడో... ఆతడు అద్దానిని దర్శించకుండా ఎందుకుంటాడు? ఈ విధంగా ఈ జగత్‌భ్రాంతి అసత్యమే అయినప్పటికీ ...ఇదంతా దృఢత్వం పొందినదై ఉంటోంది. బ్రహ్మదేవుడు మొదలుకొని ఒక గులకరాయి వరకు ఈ జగత్తంతా కూడా చిరకాల స్వప్నము – ఇంద్రజాలములవలె మిథ్యగానే భాసించుచున్నది. ఇక ఇందలి స్థూలత్వమంటావా? సూక్ష్మ దేహము యొక్క స్థూలత్వము – దృఢ సంకల్పము యొక్క పర్యవసానమే ఇదంతా అయివున్నది.

వాస్తవానికి 'స్థూలత్వం' అనేదేదీ ఎక్కడా కూడా కించిత్ కూడా లేనేలేదు. సూక్ష్మ రూపమే అభ్యాసముచే ఇట్టి స్థూలత్వభావనను పొందుతోంది. మిథ్యానుభవాత్మకం అయినట్టి ఈ జగత్తు యొక్క స్థూలత్వ రూపమంతా కూడా... మోహమునకు మూలరూపుడైనటువంటి 'ఆదిస్రష్ట' యగు బ్రహ్మదేవుని వద్దనుండే వచ్చింది సుమా! అందుచేత తత్త్వవేత్తకు కూడా 'జగత్ దర్శనము' అనే భ్రమ ప్రారబ్ధ క్షయం అయ్యేవరకు ఉండియే ఉంటోంది. అయితే... రామచంద్రా! చిదేకరసరూపము అగు బ్రహ్మమునకు 'జగద్రూపము' అనే దశ ఎట్లా ఉంటుందయ్యా? లేదు. ఈ సమస్త జగత్తు కూడా స్వప్న ద్రష్ట యొక్క స్వప్న సామ్రాజ్యంలాగా భ్రాంతి మాత్రమే అయివున్నది. లేదా... బ్రహ్మమే లీలార్థం 'నిజశక్తి'చే జగత్తు – జీవుడు మొదలైన ఈ రూపములుగా భాసించుచున్నదని అనక తప్పదు.

నిర్మలము – శాశ్వతము అగు బ్రహ్మము కంటే వేరుగా ఇట్టి జగత్తుకు మరొక కారణమేదీ లేనేలేదు. కార్యమే లేనపుడు కారణం ఎక్కడి నుండి వస్తుంది? "నిర్వికారము – కూటస్థము – చిదానందము – అద్వయము" – అగు బ్రహ్మమునందు కార్య – కారణాలు ఎట్లా సంభవిస్తాయి? కాబట్టి ఈ జగదాకారములుగా కనిపించేది దృష్టి యొక్క భ్రాంతియేగాని బ్రహ్మము సాకార జగత్తుగా అగుచుండటం కాదు. కనుక, ఈ జగత్తు ఈ వస్తు – గుణ – సాకారాదుల దృష్ట్యా సత్యము కాదు. పరబ్రహ్మముగా పరమ సత్యమూ, అత్యంత మాధుర్యమూ కూడా!

❖❖❖

# XIII. రామ పరిప్రశ్న

## 1. భ్రమ తొలగినప్పుడు అంతా బ్రహ్మమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ జగత్తును విజ్ఞులు రెండు భాగాలుగా విభజించారు. అట్లా విభాగించి దర్శించటమే "యోగం" గాను, జగత్తును బ్రహ్మ రూపంగా గాంచగలుగు ఉపాయం గాను చెప్పబడుతోంది. 1.తెలుసుకుంటున్నది (జ్ఞానము), 2.తెలియబడుచున్నది (జ్ఞేయము)... ఈ రెండింటి యొక్క అవినాభావ సంబంధమే జగత్తు. అట్టి ఈ జగత్తు భ్రమయే అయివున్నది. అట్టి జగత్ భ్రమ తొలగటమే దివ్యౌషధ రూపమైన ఉపాయం.

జ్ఞానము యొక్క 'జ్ఞేయ రూపత్వ ప్రాప్తి'యే బంధం! (జ్ఞేయము– జగద్ విషయాలు) అట్టి జ్ఞేయ రూపత్వం (జగత్ విషయాల) సశాంతించటమే ... "కేవల జ్ఞాన రూపస్థితి" – అయివున్నది. అట్టి కేవల జ్ఞానరూపస్థితియే 'మోక్షము' – అని చెప్పబడుతోంది. ఇంతకు మించి 'మోక్షము' అనబడేదానికి వేరే ఏ అర్థమూ లేదు.

**శ్రీరాముడు :** మహాత్మా! జ్ఞానం యొక్క విషయ రూపత్వమే జ్ఞేయం కదా! అట్టి "విషయ రూపత్వం" అనే దోషం తొలగేది ఎట్లా? ఎందుకంటే జ్ఞేయత్వం అనేది దృఢంగా అభ్యస్తమై ఉన్నది కదా! "విషయత్వ బుద్ధి" అనేది 'తొలగవయ్యా బాబూ' అంటే కూడా తొలగటం లేదే! అది నివర్తించేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్టి "విషయరూపత్వ భ్రాంతి" తొలగాలంటే సమ్యక్ జ్ఞాన ప్రబోధమే ఉపాయం. "నాకు వేర్వేరుగా కనిపిస్తున్నదంతా అనేక బొమ్మలలోని మట్టిలాగా, అనేక ఆకారములైన ఆభరణములలోని బంగారంలాగా ఏకమేగాని, అనేకం కాదు. అనన్యమై ఉన్న పరమాత్మ రూపమే ఇది. ఈ జగత్తుకు ఆధారము – ఆధేయము కూడా అదియే"... అను దర్శనమే సమ్యక్ జ్ఞాన ప్రబోధం. అయితే అట్టి ప్రబోధం కలగాలంటే... శమము, దమము, ఈశ్వర ప్రణిధానము, భక్తి మొదలైన సాధనలు తీవ్రంగా అభ్యసించాలి. సశాస్త్రీయంగా అట్లా అభ్యసిస్తూ ఉండగా అట్టి శాస్త్ర గురుబోధిత సాధనముల క్రమము చేత సమ్యక్ జ్ఞాన ప్రబోధం కలుగుతోంది. అప్పుడు ఈ విషయరూపత్వ భ్రాంతి స్వయంగా వైదొలగుతోంది. భ్రాంతి నశించడంచేత, ఇకప్పుడు నిరాకారము, సత్యము, శాంతము అయినట్టి "ఆత్మస్వరూప ప్రాప్తి" అనబడే ముక్తి స్వయంగా ప్రవర్తించుచున్నది. "అంతా – అన్నిటా నేనే – నాయందే" అనే అనుభూతి – సమ్యక్‌జ్ఞానం స్వయంగా సిద్ధిస్తోంది.

**శ్రీరాముడు :** మహర్షీ! దేనిచే ఈ జీవుడు ఇక సర్వదా బంధవిముక్తుడు అవుతాడో ... అట్టి నిర్మల బోధస్వరూపమగు "సమ్యక్ జ్ఞానసిద్ధి"... అనగా ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "సమ్యక్ జ్ఞానం" అనగా అభ్యంతరమందలి ఒకానొక సునిశ్చితరూపమే సుమా!

జ్ఞానము అనబడు నిర్మల స్వస్వరూప సంస్థానమునకు విషయత్వ రూపమైన జ్ఞేయము (తెలియబడేది) అనబడే దోషమే లేదు. జ్ఞాన స్వరూపుడను నేను. (తెలుసుకొనుటయే స్వరూపముగా కలవాడను).'తెలుసుకొనుట' అనే విశేషముగా గల నా యొక్క జ్ఞానరూపమునకు తెలియబడేది ఎట్లా దోషపూరితం చేయగలుగుతుంది? సూర్య కిరణం ఏదైనా వస్తువుపై ప్రసరించినంత మాత్రం చేత సూర్య కిరణానికి ఆ వస్తుదోషాలు అంటవు కదా! సూర్యుడు సూర్యకిరణ స్వరూపుడు కదా! జ్ఞాన కిరణ స్వరూపుడనగు నాకు తెలియబడే విషయముల దోషము అంటగలిగే ప్రసక్తే లేదు.

తెలియబడేది ఎట్లా అయినా ఉండవచ్చు. లేదా, అసలు ఉండకయే పోవచ్చుగాక! నేను సర్వదా నిర్మల జ్ఞాన (తెలివి) స్వరూపుడనే! నాతో సహా ఈ సర్వద్రష్టలు నిర్మల (జ్ఞేయరహిత) జ్ఞాన స్వరూపులే! ఈ ప్రకారమైన అభ్యంతర దృఢనిశ్చయమే "సమ్యక్ జ్ఞానం"... అని చెప్పబడుతోంది.

**శ్రీరాముడు :** మునీంద్రా! చిదేకరసము – కేవల జ్ఞాన స్వరూపము అగు ఆత్మయందు అందుకు భిన్నమైన ఈ "జ్ఞేయము (తెలియబడేది)" అనబడేది ఎట్లా, ఎక్కడి నుండి వచ్చింది?

**జ్ఞానస్య జ్ఞేయతా భిన్నత్వస్తః కేతి, మునే! వద!**
**ఉత్పాద్యో జ్ఞాన శబ్దశ్చ భావే వా కరణేఽథ కిమ్?**

జ్ఞానము అనే శబ్దము యొక్క వ్యుత్పత్తి "జ్ఞప్తి". అనగా "జ్ఞప్తి మాత్రమగు చైతన్యమే జ్ఞానము" ...అని కదా! జ్ఞప్తి మాత్ర చైతన్యమే జ్ఞానమా? లేక, దేనిచే ఎరుగబడుచున్నదో... అది జ్ఞానమా? (జ్ఞాయతే అనే నేతి జ్ఞానమ్) ఓ మహర్షీ! జ్ఞానమంటే జ్ఞప్తియా? దేనిచే తదితరమైనదంతా తెలుస్తోందో... అట్టి తెలివియా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** "జ్ఞానము" అనే శబ్దము యొక్క వ్యుత్పత్తి గురించి విను. భావము సాధనముగా అయినప్పటి బోధ రూపమే 'జ్ఞానం'. ఇక "తెలియబడేది" అనబడునది కూడా భావసాధకమే (భావనచే పొందబడేదే) కదా! ఈ దృశ్యం యొక్క రూపము జ్ఞానము యొక్క మాయచే వికల్పమైనదే! కాబట్టి వాస్తవానికి జ్ఞానము (తెలుసుకోవటం) – జ్ఞేయము (తెలియబడేది) అనే రెండు శబ్దములకు భేదమేమీ లేనేలేదు. జ్ఞానమునకు వేరుగా జ్ఞేయం లేనే లేదు.

**శ్రీరాముడు :** మహాత్మా! సరే! "జ్ఞేయరూపమగు ఈ దృశ్యము వాస్తవానికి మొదలే లేదు" .... అని కొంతసేపు అనుకుందాం. అయితే కుందేటి కొమ్ములాగా ఈ దృశ్యము, ఈ రూప భ్రమ అసలు ఎట్లా సిద్ధించింది? పైగా, ఇదంతా ప్రత్యక్ష ప్రమాణములచేత, భూత – వర్తమాన – భవిష్యత్ విభాగముల చేత ...అత్యంత నిర్దుష్టంగా వ్యవహార సమర్థమై ఎట్లా ఇక్కడ కనబడుతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (పక పకా నవ్వుచూ) ఓ రామచంద్రా! దృష్టి యొక్క బాహ్యా వ్యవహార భ్రాంతిని అనుసరించే ఇక్కడ విషయాకార బుద్ధి రూపంగా ఇదంతా ఇట్లు (నామరూపాత్మకంగా) అనిపిస్తోంది. దృష్టికి దృశ్యం నామరూపాత్మకంగా అభ్యాసవశం చేత అనిపించటమే 'జగత్తు'. అదే 'సంసారము'. అట్లా అనిపించటానికి వేరుగా జగత్తు ఎక్కడా లేదు. ఎందుకంటావా? వాస్తవానికి బాహ్యమునగాని, అభ్యంతరమున గాని ఆత్మకంటే భిన్నంగా ఏ పదార్థమూ ఎక్కడా సంభవించజాలదు.

**శ్రీరాముడు :** మునీంద్రా! ఈ ఎదురుగా 'నీవు-నేను' మొదలైనవి కనబడుచున్నాయి. జీవుడు, శరీరము, భూమి, ఆకాశం, పుట్టుక, చావు, బాల్యము, యౌవనము, వార్ధక్యము, కొండలు, సముద్రాలు మొదలైనవన్నీ ఎదురుగుండా ప్రత్యక్షంగా అనుభవమగుచుండగా... "ఈ జగత్తు లేదు" - అనునది ఎట్లా యుక్తియుక్తం? ప్రత్యక్షము - అనుభవ సిద్ధము అగుదాని పట్ల "ఇవి లేవు" అనే సిద్ధాంతం ఎట్లా కుదురుతుందో చెప్పండి? ఎదురుగా కనబడేవాటిని 'లేవు' అనుకుంటే మాత్రం ఏం ప్రయోజనం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మొట్టమొదట ఆత్మయే కలదు. అట్టి కేవలాత్మలో విరాడ్రూపం మొదలుగా గల పదార్థములేవీ మొదలే ఉత్పన్నములయి ఉండలేదు. అట్లాగే ఇప్పుడు కూడా ఏ పదార్థము ఉత్పన్నమయి, (వాస్తవానికి) లేవు. కాబట్టి "జ్ఞేయము" (తెలియబడేది) అనే దృశ్య జగత్తు ఏమాత్రం సంభవించదు. దృష్టాంతంగా... ఒక చోట మూడు కుందేళ్ళు వేటగాడిని చూచి పరుగు లంకించుకున్నాయి. అవి అల్లంత దూరంగా పరుగులు తీస్తూ ఉండగా వెనుక నుండి పరిగెత్తే ఆ వేటగానికి ఆ 3 కుందేళ్ళ చెవులు నిక్కబొడుచుకొని కొమ్ములవలె కనిపించాయి. ఆ వేటగాడు తన ప్రక్కనున్న సేవకునితో "ఆ ముందు పరిగెత్తే కుందేటికి ఆ కొమ్ములు పొడుగ్గా, నిటారుగా ఉన్నాయేం? ఆ రెండవ కుందేలుకు కొమ్ములు కొంచెం సన్నగా ప్రక్కవైపుగా ఒదిగి కనిపిస్తున్నాయేం? మూడవ కుందేలుకు కొమ్ములు పొట్టిగా లావుగా కనిపిస్తున్నాయేం? ఎందుచేత?" అని ప్రశ్నించాడు. అందుకు సమాధానంగా "అయ్యగారూ! కుందేటికి కొమ్ములుండవు కదా! మనం కొన్ని వేల సంఖ్యలో కుందేళ్ళను వేటాడాం?" అన్నాడు. అప్పుడా వేటగాడు, "కుందేటికి కొమ్ములు కనిపిస్తున్నాయి కదా! నా ప్రశ్నకు సమాధానం... ఆ కుందేటి కొమ్ములు తేడాగా ఎందుకు కనిపిస్తున్నాయో చెప్పు! అది చెప్పకుండా... కుందేటికి కొమ్ములు ఉంటాయా?... అని అడుగుతావేం?" అని కసురుకున్నాడు. కుందేటికి కొమ్ములు ఉండవన్నమాట పచ్చినిజం. అది వదలి, చెవులు నిక్కించుకుంటే "కుందేటికి కొమ్ములు కనిపిస్తున్నాయి కదా!"... అని నిర్ణయించి, "ఇక మరి ఎందుకు తేడాలుగా ఉన్నాయి?"... అని ఎరుగుటకు యత్నించటం తెలివితక్కువే కదా!

"కుందేటికి కొమ్ములు కనిపిస్తున్నప్పటికి, ఉండటానికీ వీలుకాదు" అనునది ఎంతగా సత్యమో, ... "ఇక్కడ మొదలే జ్ఞేయము లేనే లేదు" అనునది అంతగానూ సత్యమే! లౌకిక దృష్టిచే ఇక్కడ ప్రత్యక్షంగా ఉంది కదా అంటావా? (నేహ నానాస్తి కించన... ఇక్కడ కించిత్ కూడా అనేకత్వమనేది లేనే లేదు మొదలుగా గల) శ్రుతి యుక్తులను అనుసరించి ఇక్కడ దృశ్యము లేనే లేదు. ఇదంతా స్వప్నంలోలాగా భ్రమాత్మకమే! "స్వప్నమే భ్రమ అయినప్పుడు ఇక అందులో 'మంచివారు ఎందుకున్నారు? చెడ్డవారు ఎందుకున్నారు? ఆ భవనం అంత ఎత్తుగా కట్టారేం? ఈ గుడిసె ఊరికి ఇంత దూరంగా ఉన్నదేం" అనే ప్రశ్న - సమాధానం కూడా భ్రమయే కదా! మృగతృష్ణలో మొదటి తరంగం రెండవ తరంగం తేడాగా కనిపిస్తున్నాయేం?" అనేది (మృగతృష్ణయే భ్రమ కాబట్టి) ఆ సమాధానం కూడా భ్రమయే కదా! ఆకాశంలో కేశాలు కొన్ని పొడవుగా - కొన్ని గుండ్రంగా ఎందుకు కనిపిస్తున్నాయి? ఆకాశంలో కేశములే ఉండవు. ఉన్నట్లుగా కనిపించటం దృష్టి దోషమే

కదా! అట్లాగే జాగ్రత్ – స్వప్నములలో కనిపించే 'నీవు– నేను' మొదలైనవి వాస్తవానికి ఉత్పన్నము కాకపోయినప్పటికీ భాసిస్తున్నాయి. తత్త్వజ్ఞానముచే అవన్నీ నివారితమై పోగలవు.

**శ్రీరాముడు :** స్వామీ! ఈ 'నేను–నీవు' మొదలైనవి అసలే లేవు అని, ఈ జగత్తు మొదలే జనించలేదని, కనుక అవన్నీ ఇప్పుడూ లేవని మేం నిరూపణ పొందటమెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అందుకు అధ్యాత్మశాస్త్రం మనకు కార్య–కారణ సిద్ధాంతం ప్రతిపాదిస్తోంది. కారణము నుండియే... కార్యము జనిస్తోంది. అంతేగాని కార్యము కారణము కంటే వేరైనదై ఉండజాలదు. సృష్ట్యాది యందు సర్వ కారణాలు శమించియే ఉంటాయి కదా! మరి సృష్టి జనించటానికి కారణం ఎక్కడినుండి వస్తుంది? కారణమే లేనప్పుడు 'సృష్టి' అనే కార్యము ఎక్కడిది? కారణమే లేదు కనుక ఈ జగత్తు సృష్ట్యాదిలో జనించనే లేదు. సృష్ట్యాదిలో లేనిది ఇప్పుడు మాత్రం ఎక్కడి నుండి వస్తుంది? కనుక, ఈ జగత్తు స్వప్న సదృశమే గాని వాస్తవం కాదు.

**శ్రీరాముడు :** హే మునీంద్రా! 'మహా ప్రళయం' సంభవించిన తరువాత ఇక ఆపై జన్మ రహితము – అవ్యయము అగు బ్రహ్మమే శేషిస్తుంది కదా! "అట్టి బ్రహ్మమే సృష్టికి కారణం" అని ఎందుకు అనకూడదు? ఈ సృష్టి 'కారణరహితం' అనే బదులు బ్రహ్మము దీనికి కారణమనవచ్చును కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** 'కారణము' నందు ఏ కార్యము అయితే ఉంటుందో... అదియే కార్యరూపంగా ఉత్పన్నం అవుతుంది గాని, కారణములో లేనిది కార్యరూపంగా రాదు కదా? ఘటంలోంచి వస్త్రం రాదు కదా! బ్రహ్మము చిదేక రసమై, కేవలం జ్ఞానరూపమై ఒప్పుచుండగా... అద్దాని యందు జ్ఞేయరూపమగు దృశ్యం ఎక్కడున్నది? బ్రహ్మము నిర్విషయం. కనుక అద్దాని నుండి విషయ రూపజగత్తు ఉద్భవించజాలదు. మేఘాలలో కొండలేదు. మరి మేఘాలలో ఆ పెద్ద కొండ – ఈ చిన్న కొండ ఎట్లా వచ్చాయి?... అంటే అది దృష్టి భేదమే గాని, వాస్తవం కాదు కదా?

**శ్రీరాముడు :** ఈ జగత్తు సూక్ష్మరూపంలో బ్రహ్మమునందే ఉంటోంది కదా! కనుక "ఈ జగత్తు తిరిగి బ్రహ్మము నుండియే బయల్వెడలుతోంది" అని అనటం ఎందుకు సరికాదు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ మహాబుద్ధీ! రామచంద్రా! మహాప్రళయంలో సృష్టి యొక్క బీజ సత్త చూస్తున్నవాడెవడు? చూస్తున్నవాడు ఉంటే సృష్టి ఉన్నట్లే కదా? కాబట్టి మహాప్రళయంలో చూచువాడు లేడు కనుక సృష్టియే లేదు. ఈ విధంగా సృష్టికి ముందు (సృష్టి ఏర్పడటానికి కారణములైన) సాధకాలు లేవు. బాధకములు లేవు. "మొట్టమొదట ఈ సృష్టి లేదు. బ్రహ్మము మాత్రమే ఉన్నది" అనేది ఆయా పరిభాషలలో అన్ని సిద్ధాంతాలు ప్రతిపాదిస్తున్న విషయమే! అట్టి నిర్విషయ బ్రహ్మములో సృష్టి యొక్క బీజ సత్త ఎక్కడిది? మరొకటి ఏదైనా జగత్ బీజ సత్తను ప్రవేశింపజేస్తోందని అందామా? అప్పుడు... బ్రహ్మమునకు వేరుగా మరొకటి ఉన్నట్లౌతుంది. అప్పుడు "బ్రహ్మము ఏకము – అద్వితీయము (– బ్రహ్మమేవ ఇదమగ్ర ఆసీత్ – ఏకమేవా ద్వితీయం బ్రహ్మ"... మొదలైన) వేద – వేదాంత మూల వాక్యాలకు తిరస్కారం జరుగుతుంది కదా! అందుచేత మొట్టమొదట "సృష్టి – దర్శకుడు – దర్శనము – నేను – నీవు" మొదలైనవి జనించటానికి కారణమే లేదు. ఇప్పుడు కూడా

"నేను-నీవు-జగత్తు" జనించటానికి కారణం లేదు. కనుక ఈ సృష్టి దృష్టియే కాని, వాస్తవం కాదు. అంతేగానీ, బ్రహ్మము నందు ఉండే జగత్-బీజసత్తలు ఎట్లాంటివి? ఎట్లా ఉంటాయి... చెప్పు?

**శ్రీరాముడు :** మహర్షీ! బ్రహ్మమునందు బ్రహ్మవేత్తలచే జగత్ రహిత స్థితిలో జ్ఞప్తి రూపమగు సత్తయే అనుభవమౌతుందని నా అభిప్రాయం. కాబట్టి 'జ్ఞప్తి' అనే సూక్ష్మతత్త్వం స్వప్రకాశ చిద్రూపమునకు అభిన్నంగా మహా ప్రళయంలో ఉంటుంది. అప్పటి "జ్ఞప్తి రూప సత్త" ఈ మాయాకాశ రూపము వంటిది కాదు. మాయాకాశ రూపము అసత్స్వరూపం అవటం చేత .... అసత్స్వరూపమైన మాయాకాశం నుండి సద్రూపంగా సృష్టి ఆవిర్భవించటమనేది అసంగతవాక్యం అవుతుంది. ఈ విధంగా చిద్రూపమగు బ్రహ్మమే జగత్తు యొక్క బీజసత్తా కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కేవల చిద్రూపము (ఎరుగుట అనే విషయాలకు ముందే ఉన్నట్టి".... స్వసత్తా స్వరూపం) అగు బ్రహ్మమే ఈ జగత్తు యొక్క బీజ సత్త అనీ, అది జ్ఞప్తి మాత్ర రూపంగా స్వసత్తయందు మహాప్రళయ సమయంలో ఉన్నదని కాసేపు అనుకుందాం. అప్పుడు ఈ ముల్లోకములు కూడా జ్ఞప్తి రూపమే అవుతాయి కదా! ఎందుకంటే "విశుద్ధ జ్ఞాన స్వరూపుడు - సచ్చిదానంద ఘనము" ...అగు ఆత్మకు జనన మరణాలు ఎట్లా ఉంటాయి? లేవు కదా!

జగత్తుగా కనిపించేది ఆత్మ యొక్క జ్ఞప్తి రూపమే! ఆ జ్ఞప్తికి మునుముందే కేవల జ్ఞాన స్వరూపుడగు జగత్ ద్రష్ట జగత్ రహితుడై ఉండనే ఉన్నాడు. ఆతని స్వప్న సందర్శన చమత్కారమే ఈ త్రిలోక జగత్తు. ఆతడు తనను తాను ఎరిగినపుడు ఈ ముల్లోక జగత్తు లేదు. లేక, ఇది "నిర్మల స్వకీయ జ్ఞప్తి రూపం" మాత్రమే!

**శ్రీరాముడు :** మహాత్మా! "సృష్టి మొట్టమొదటి నుండి ఉన్నది కాదు. మొట్టమొదట కేవల బ్రహ్మము మాత్రమే ఉన్నది!" అనేది మనం సిద్ధాంతీకరించుకున్నా మనుకుందాం సరే! ఈ జగత్తు మీరు చెప్పి నట్లు భ్రాంతి రూపమే అయివుండవచ్చు గాక! అయితే అట్టి జగత్ భ్రాంతి ఎక్కడి నుండి వచ్చింది? భ్రాంతి ఎక్కడి నుండి వచ్చిందో తెలిస్తే ...అది తొలగించుకోవటం సులభం అవుతుంది కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వాయువులో తరంగాలు, ఆ తరంగాలన్నీ వేరువేరుగాను, ఒక్కొక్క తరంగానికి ఒక్కొక్క ప్రాకృత ధర్మాలు ఉంటే ఉండవచ్చు. వాయుతరంగం వాయువు కానిదెప్పుడు? బ్రహ్మము సర్వదా బ్రహ్మమే! అందులో సృష్టి లేదు. ప్రళయము లేదు. ఇక ఈ జగద్దృశ్యానికి వస్తే...

ఏది ఎరుగబడుచున్నదో... ఎవనిచే ఎరుగబడుచున్నదో... ఏమని ఎరుగబడుచున్నదో అట్టి జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ రూపమగు ఈ త్రిపుటి ... ఇదంతా కూడా స్వాత్మయగు బ్రహ్మమే! అయిఉన్నది.

**శ్రీరాముడు :** మహర్షీ! ఒక యంత్రము జడమే అయినప్పటికీ... అద్దాని అంతర్గతంగా గల యంత్రశక్తిచే చేతనమువలె చలిస్తూ ఉంటుంది చూచారా? అట్లాగే ఈ జడమాత్ర శరీరం ఇందలి కార్య-కారణ సంఘాత శక్తిచే ఆయా విశేషాలు ఎరుగుచుండుటమేమిటి? సర్వద్రష్ట అయిన ఈశ్వరుడు ఈ జడమగు దృశ్య రూపత్వం పొందటమేమిటి? రెండు ఆశ్చర్యకరమే! "కట్టెపుల్ల అటూ ఇటూ తిరుగుతూ త్రోవలో అగ్ని కనబడగానే ఆ కట్టెపుల్ల ఆ అగ్నిని తగలబెట్టింది"... అనే

వాక్యం ఎంతటి విపరీతము – అర్థరహితమైన వాక్యమో, “సర్వద్రష్ట అయిన ఈశ్వరుడే ఈ జడ జ్ఞేయ స్వరూపంగా అయ్యాడు” ...అనేది అంతటి అర్థరహితం కాదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను! నీ దృష్టాంతం ఆశ్చర్యమును గొలుపగలదు. అయితే దృశ్యము మొదలే అసంభవము. అట్టి మొదలంట అసంభవమైన దృశ్య రూపములను ఆ ఆత్మ సంతరించుకోవటమనే ప్రసక్తి ఎక్కడిది? అయితే ఒకవేళ ‘దృశ్యము’ వేరుగా కనబడుచున్నదంటావా... “దృక్ మాత్రము – చిద్ఘనాకారము – సర్వాత్మకము” ...అయినట్టి చిదాత్మయే “ద్రష్ట, దర్శనము, దృశ్యము” అనబడే త్రిపుటీ రూపంతో నిజమాయాశక్తిచే భాసించుచున్నదగుచున్నది.

**శ్రీరాముడు :** హే మహాశయా! “అనాది – అనంతము” అగు శుద్ధ చిదాత్మయే జగత్తును కల్పించటం వలన ఈ జగత్తు భాసిస్తోంది. అంతేకాని, మరింకేదీ ఈ జగత్తుకు కారణంగా లేదు”... అనేది ఒప్పుకుంటున్నాను. అయితే, అట్టి ‘సృష్ట్యాది’ సమయంలో ఇచ్చట చిద్రూప బ్రహ్మమునందు చేత్యము (దృశ్యము – అనేది ఎట్లా సంభవించింది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శుద్ధ చిద్రూపము నందు ‘దృశ్యము’ అనబడునది ఏర్పడటానికి కారణమే లేదని నీవు ఒప్పుకున్నావు కదా! అందుచేత ‘కారణము యొక్క అభావము’ చేత చేత్యము అనబడే దృశ్య జగత్తు ఒకింతకూడా సంభవించదు. శుద్ధ చిదాకాశానికి వేఱుగా ఇంకేదీ కారణరూపంగా ఉండజాలదు. ఈ విధంగా చైతన్యమునకు (బ్రహ్మమునకు) వేఱుగా దృశ్యము లేదని తేలిపోతుంది కదా! కాబట్టి చైతన్యమునకు రెండు లక్షణాలు ఇక్కడ నిరూపించబడుచున్నాయి.

1. ఆత్మ నిత్యముక్త స్వరూపం, 2. చేత్య విషయములగు (దృశ్యాంతర్గత విశేషాలే అయినట్టి) వాక్ – మనస్సులకు ఆత్మ అగోచరమైనది.

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు “ఆత్మ సర్వదా ముక్తమే అయివున్నది. అది దేనికీ పట్టుబడేది కాదు” అని సిద్ధాంతీకరించుచున్నారు. అది బాగానే ఉన్నది. అయితే, ఆత్మ ‘నిత్యముక్తము’ అయి ఉన్నప్పుడు మరి ఈ అహంకారము మొదలుగా గల రూపమగు ఈ జగత్తు ఎలా ఉదయించింది? ఎచట నుండి ఉత్పన్నమయింది? అట్టి జగత్తులో ప్రవేశించి జీవుని యొక్క “ఊపిరి పీల్చుకోవడం” అనే ‘స్పందము’ నుండి, ఆయా ‘సర్వ విషయముల జ్ఞానం’ ఎట్లా కలుగుతోంది? “ఆత్మ సర్వదా ‘నిత్యముక్తము’, ‘చేత్యమునకు (దృశ్యమునకు)’ అతీతము” అయినప్పుడు ఇక గురువులు, శాస్త్రములు, సాధనములు, నియమములు, మహదాశయములు, జీవితం, దీనిని సద్వినియోగ పరచుకోవటం... ఇటువంటి విషయాలతో పనేమున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** శాస్త్రముల ఉద్దేశసారము “ఆత్మ నిత్యముక్తము” అని నిరూపించటమే! “ఓయీ జీవుడా! నీ దృశ్యాతీత స్వస్వరూపమే ఆత్మ! అది సర్వదా సర్వమునకు అతీతమై కేవల సాక్షిగా ఉండి ఉండగా దుఃఖం ఎందుకు?” (తత్త్వమసి – జీవో బ్రహ్మేతినా పరః – సోఽహమ్ – విశ్వమ్ విష్ణుః – అశోచ్యానవ్య శోచస్త్వమ్ మొదలుగా గల) అనేక సూచన వాక్యములను శాస్త్రాలు నిర్ద్వంద్వంగా ప్రకటిస్తూనే ఉన్నాయి కదా! ఆత్మకు ‘జగత్తు, దృశ్యము, చేత్యము’ ...అను పర్యాయ పదములతో

చెప్పబడే 'అన్యము' ఏర్పడటానికి మొదలే కారణం లేదు. అనగా ఆత్మకు ఇది అనన్యం. ఆత్మకు అన్యమైన కారణమేదీ లేదు. కాబట్టి సృష్ట్యాది యందు ఈ జగత్తు కించిత్ కూడా ఉత్పన్నమగుటయే లేదు. ఇకప్పుడు 'దృశ్యము' అనబడేది (ఆత్మకు అన్యమైనది) ఎక్కడిది?

ద్రష్ట - దృశ్యము - దర్శనము; దృశ్యమునకు ఈవల - ఆవల; సృష్ట్యాది యందు - సృష్టి మధ్యలో - సృష్ట్యాంతము నందు... సర్వము - సర్వదా - సర్వత్రా శాంతమగు పరబ్రహ్మమే అయివున్నది.

ఇక ఆత్మకు అనన్యంగా కాకుండా, ఏదైనా దృశ్యము - జగత్తు కనిపిస్తూ ఉంటే... అట్టి సృష్టి కేవలము భ్రమ మాత్రమే! అట్టి కేవల స్వకీయ భ్రమయే - కలలో స్వకీయ కల్పితమైన పులివలె - బంధము కల్పిస్తోంది. అనగా ద్రష్ట ఏ దృష్టితో ఈ జగత్తు పట్ల దర్శనము చేస్తున్నాడో... అద్దాని యందు చోటు చేసుకొన్న భ్రమయే ఇక్కడి బంధము! స్వప్నంలో పులికి స్వప్న ద్రష్ట అతీతుడే కదా! అయితే... అలా చెప్పటంలో "స్వప్నంలోని స్వప్నద్రష్ట పులికంటే బలవంతుడు"... అని చెప్పటం ఉద్దేశం కాదు. స్వప్నంలో ద్రష్ట ఉన్నాడనునదే భ్రమ. పులితో సహా స్వప్నమంతా స్వప్న ద్రష్ట తనకు తాను కల్పించుకొన్న భ్రమ.

అందుచేత స్వప్నద్రష్ట స్వప్నాంతర్గత విషయములచే బద్ధుడెట్లా అవుతాడు? అట్లాగే జాగ్రత్ కూడా జాగ్రత్ ద్రష్ట యొక్క జాగ్రత్ కల్పనయే! కానీ ఆ ద్రష్ట (ఈ జీవుడు) "నేను బద్ధుడను" అని వేదన చెందుచున్నాడు. ఆ వేదనను తొలగించి ఆతనిచే ఆతని ప్రశాంత - నిర్మల - ఆత్మానంద రూపం అనునిత్యంగా అనుభవింపజేయటమే శాస్త్రముల, సాధనముల మహోద్దేశం. అదే గురువుల ప్రయత్నమంతా! జగత్ భ్రమ తొలగటమే గురు - శాస్త్రాదుల ప్రయోజము.

**శ్రీరాముడు :** హే మహాత్మా! మనమందరం సర్వదా ఏ స్వరూపమై ఉన్నామో... అట్టి నిర్మల పర బ్రహ్మమునకు చలనాదులు లేవు. వాక్కుకు, మనస్సుకు ఆవల ఉన్నది. మనోవాక్కులకు అవిషయమై ఉన్నది. సదా స్వప్రకాశ రూపమై ఉన్నది. నిర్మలము, నిత్యముక్తము అయివున్నది - అని మీరు సశాస్త్రీయంగా ప్రకటిస్తున్న సత్యమునకు మేము సదాంగీకారపూర్వకంగా జేజేలు పలుకుచున్నాం.

ఈ జగత్తు ఆ పరబ్రహ్మమునందే అనన్యంగా - కానీ భ్రమరూపంగా అనుభవమగుచున్నది కదా! బ్రహ్మమునందు ద్వైతమే లేనప్పటికీ... ఈ 'భ్రమ' అనే ద్వైతం - ఏ కారణం చేత, ఎవనికి, ఎందుకు కలుగుతోంది? ఈ విషయం చెప్పమని నా ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** నాయనా! రామచంద్రా! బుద్ధి దోషయుక్తంగా ఉన్నప్పుడు దృష్టిలోని ద్వైతమే జగత్ - దర్శన రూపంగా ప్రదర్శితమౌతోంది. శాస్త్రములు చెప్పిన సాధనలచే బుద్ధి నిర్మలమవగా అప్పుడు గురువాక్యాలు ఆ బుద్ధిలో సారూపత్వం పొందగలవు. అట్టి బుద్ధి యొక్క వికాసముచే బ్రహ్మతత్త్వము పొందినవాని దృష్టి యందు బ్రహ్మమునకు వేరైన కారణమే రహితమై పోతోంది. అట్టి - నిర్మల - శాస్త్ర విజ్ఞాన పరిపుష్ట - గురువాక్యమనన శీలక - "బుద్ధి" యొక్క దృష్టిలో ఈ జగత్తు మొదలే ఉత్పన్నము కానిదిగా అగుచున్నది. మొదలే లేనిది, ఉత్పన్నము కానిది ఇక

తొలగవలసి రావటమెక్కడున్నది? కాబట్టి జగత్ భ్రమయే మొదలంటా తొలగగా... ఇదంతా (జగత్తంతా, దృశ్యమంతా) బ్రహ్మముగానే (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ) అనుభవమౌతోంది. కాబట్టి రామా! ఈ "నేను-నీవు-దృశ్యము"లతో కూడిన జగత్తంతా కూడా "శాంతము - నిర్వికారము - ఏకము" అగు ఆత్మయే అయివున్నది. ఎండమావులలో "జలమే ఉండదు" అని గ్రహించిన తరువాత ఇక "ఎండమావులతో జలం ఎందుచేత కనిపించింది?" అనే ప్రశ్న యొక్క అగత్యం ఏమున్నది?

❖

**శ్రీ వాల్మీకి మహర్షి:** ఓ భరద్వాజా! అప్పుడు రామచంద్రుడు ప్రశ్నలు అడగటం మానివేసి, మౌనంగా, ఏదో యోచన చేస్తూ కనిపించాడు. అప్పుడు సభలో నిశ్శబ్దం తాండవిస్తోంది. శ్రీరాముడు ప్రశ్నించటం మానివేసి యోచనాపూర్వకమైన మౌనము వహించటం శ్రీ వసిష్ఠ మహర్షి గమనించి, కించిత్ ప్రశ్నార్థకమైన చిరునవ్వుతో రాముని వైపు చూచారు. అది గమనించిన రాముడు ఇట్లా అంటున్నాడు.

❖

**శ్రీరాముడు :**

**బ్రహ్మన్! భ్రమమివాపన్నః స్రష్టుం! జానామి నాఽధికమ్ ।**
**నాత్యన్తం చ ప్రబుద్ధోస్మి! పృచ్ఛామి కిమిహాధునా ॥**

హే బ్రహ్మర్షీ! ఇప్పుడు నేను "ఏదో భ్రమను పొంది ఇట్లా అడుగుచున్నానా?"... అని అనిపిస్తోంది. ఇక ఎంతగా ప్రశ్నించినా ఎందుకో ఏదో భ్రమ ఇంకా తొలగటం లేదేమో? నేను మీవలె అత్యంత ప్రబుద్ధుడను కాను. ఇంకా ఇంకా ప్రశ్నిస్తే మాత్రం "ఈ దృశ్యము ఎట్లా ఏర్పడుతోంది?"... అనే నా భ్రమపూర్వకమైన ప్రశ్న నన్ను విడచి వెళ్ళటంలేదు. ఇక ఏం ప్రశ్నించను?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సమాధానం నీకు అందక నిరుత్తరుడవుగా అగుచున్నప్పటికీ, ప్రశ్నించటం నుండి విరమించవద్దు. ప్రశ్నకు కారణం సంశయం కలిగి ఉండటమే కదా! ఒరిపిడి రాయితో మెరుపును పరీక్షించి మరల అగ్నిని పుట్టించటానికై ఒరిపిడి కొనసాగిస్తాం చూచావా? అట్లాగే ప్రశ్నకు కారణమైయున్న 'సంశయము' సారాసారత్వ పరీక్షకు లోను అగుచున్నప్పటికీ, అవిద్య క్షయించే వరకు నిరాటంకంగా ప్రశ్నిస్తూనే ఉండాలి.

ప్రశ్నకు కారణం - సంశయం. సంశయమునకు కారణం - అవిద్య. ప్రశ్నలచే క్రమంగా అవిద్య క్షయిస్తూ చివరికి అది తప్పక మటుమాయమౌతుంది. అవిద్య పూర్తిగా క్షయించిన తరువాత స్వభావ సిద్ధంగానే వాక్కుకు అతీతమైనది (వాక్కుతో చెప్పనలవి కానిది) - సర్వోత్తమ స్వభావము అగు ఆత్మయందు స్వయంగా విశ్రాంతిని పొందగలవు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! అప్పుడు రామచంద్రుడు తనలో, "అవును! నాలో సందేహం ఆమూలాగ్రం తొలగి ఆత్మయే, ఈ దృశ్యం" అని బుద్ధి అనుభూత పరచుకునే వరకు ప్రశ్నించాల్సిందే కదా! పైగా బ్రహ్మర్షి శ్రీ వసిష్ఠులవారు నాకు ఎదురుగా జ్ఞానాగ్ని రూపంలో సర్వ సందేహాలు

మొదలంటా భస్మం చేసే ఉద్యమంలో ఉన్నారాయె! ఇక ఈ సమయ – సందర్భాలను సద్వినియోగం చేసుకోవటమే ఉచితం కదా!" ...అని తలచి, తలపైకెత్తి ఇట్లు మరల సంభాషించసాగాడు.

❖

**శ్రీరాముడు :** మహాత్మా! ఆత్మయందు మొట్టమొదట – ఆత్మకు వేరైన కారణమే లేదు కాబట్టి – సృష్ట్యాది యందు ఈ సృష్టి ఉత్పన్నమే కాకయున్నదనే సిద్ధాంతం నేను గ్రహించాను. కానీ "చైత్య – చేతన విభ్రమం (ద్రష్ట – దృశ్యముల భ్రమ) కలుగుచున్నదెవరికి? ఎందుకు? ఎట్లు" అనే సంశయం ఇంకా పూర్తిగా తొలగటం లేదు. అందుచేతనే నేను కొంచెంసేపు ఊరకొని ఉండిపోయాను. దయయుంచి చెప్పండి. ఈ సంశయ విభ్రమం తొలగేది ఎట్లా? ద్రష్టత్వం పొందుచున్నదెవరు? ఆత్మయా? జీవుడా? ఆత్మ నిత్యనిర్మలం కాబట్టి అద్దానికి దృశ్యత్వము ఉండదు కదా! ఇక "జీవుడు దృశ్యమును పొందుచున్నాడు" ...అని అంటే ఆత్మకు వేరుగా 'జీవుడు' అనబడే దృశ్యద్రష్ట ఉన్నాడా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఈ దృశ్యము మొదలే ఉత్పన్నమయి ఉండలేదు" అని నేను సిద్ధాంతీకరించినది గ్రహించానని అన్నావు కదా! అంటే... మొదలే ఆత్మయందుగాని, ఆత్మకుగాని 'జగత్తు' అనబడేది జనించటానికి కారణమే లేనట్లు కదా! కారణమే లేదు కాబట్టి... ఈ జగత్తు ఎప్పుడూ లేనిదే! సర్వత్రా ప్రశాంతమగు పరమాత్మయే సర్వముగా ఏర్పడియున్నది. ఇక భ్రాంతి అంటవా... భ్రాంతి కూడా లేనిదే అయివున్నది. ఏది 'భ్రాంతి' అని, భ్రాంతి ఉన్నదని నీకు అనిపిస్తోందో ... అది "శుద్ధ పరమాత్మ సర్వత్రా సర్వముగా కలదు" ... అనే అభ్యాసం లోపించటం చేత మాత్రమే అట్లా అనిపిస్తోంది. అట్టి దృఢజ్ఞానం నీకు ఇంకా కలగకపోవటం చేతనే "ఆత్మ వేరు – దృశ్యము వేరు"... అని అనుకొంటున్నావు. దశ్యమే లేనప్పుడు ద్రష్ట ఆత్మకు వేరుగా లేదని వేరే చెప్పాలా? "దీపం లేకపోవటం చేతనే చీకటిగా ఉన్నది"... అని చెప్పిన తరువాత "దీపం ఉంటే చీకటి ఉండదు"... అని వేరుగా చెప్పనక్కరలేదు కదా! "అంతా ఆత్మ స్వరూపమే"... అని గ్రహించి తద్రూపంగా పరిశుద్ధ దర్శన శీలత్వంతో దృష్టి పరిపుష్టి పొందనంతవరకు విశ్రాంతి లభించదు. అట్టి అవిశ్రాంతియే వ్యర్థంగా నానా సంశయములను కలిగించటం జరుగుతోంది.

**శ్రీరాముడు :** స్వామీ! "అభ్యాసము లేకపోవటం చేత" అని అంటున్నారు కదా! జగద్భ్రాంతికి కారణమే లేనప్పుడు ఇక అభ్యాసము – అనభ్యాసం అనేవి ఎక్కడి నుండి సంభవిస్తాయి? అసలీ అభ్యాసము యొక్క అవసరము కలిగిస్తున్న భ్రాంతి ఎట్లా సంభవించింది? 'నేను–నీవు–ఈ దృశ్యము' – అనే భ్రాంతి (ఇవన్నీ ఆత్మయే అయివుండికూడా,) తత్‌వ్యతిరిక్తంగా మాకు ఎందుకు అనిపిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వాస్తవానికి ఏ భ్రాంతీ లేదు. ఆత్మకు వ్యతిరిక్తమైనదంటూ ఎక్కడా ఏదీ లేదు. పరమాత్మ అనంతరూపుడవటం చేత నిజమాయచే ఇట్లు అనంతంగా భాసించుచున్నాడు. జీవన్ముక్తుని దృష్టికి సర్వదా సర్వత్రా సర్వరూపములుగా పరబ్రహ్మమే తాండవిస్తున్నట్లు అనుభూతమగుచూ ఉండగానే... ఇక ఆపై సమస్త జీవులతోటి యథాతథంగా అందరిలాగానే ప్రవృత్తి కలిగి ఉంటున్నారు. చిద్ఘనము, నాశరహితము అగు పరమాత్మయే 'నేను–నీవు–జగత్తు'లుగా భాసిస్తున్నదని ఎరిగి ఉండి వ్యవహారములలో పాల్గొనుచున్నాడు. మీ వంశమునకు ఆది పురుషుడగు రఘువు, (అట్లాగే)

జనక మహారాజు మొదలైన వారెందరో... (అట్లాగే) సభయందు పాల్గొనుచు మన ఈ సంవాదమును ఆలకిస్తున్న అనేకమంది జీవన్ముక్తులు వ్యవహారరీత్యా జగద్విషయములందు పాల్గొంటూనే "భ్రాంతి బ్రహ్మము యొక్క చమత్కారమే! అంతా పరబ్రహ్మమే!" అని నిర్దుష్టంగా, సుస్పష్టంగా నిర్మల దర్శనము కలిగియే ఉంటున్నారు. "సమస్తము పరమార్థమున చిద్ఘనమే" అని ఎరిగియే సమస్త వ్యవహారములందు జీవన్ముక్త ప్రవృత్తిని నీవుకూడా కలిగియుండెదవు గాక!

**శ్రీరాముడు :** స్వామీ! వాస్తవానికి భ్రాంతి అనబడునదే లేదని అంటున్నారు కదా! అట్లా అయితే, మీరేమో జీవన్ముక్తులై జగత్ భ్రమ శమించగా, ఇప్పుడు ఈ అధ్యాత్మ రూప శబ్ద సంపత్తిచే మాకు, ప్రసాదిస్తున్నారు. తెలిసీ – తెలియని మేము మీ యొక్క ఉపదేశమునకు అర్హత పొందినవారమై మీ ఉపదేశ మహాప్రసాదమును పొందుచున్నాం.

అనగా ఈ జగత్తునందు తమవంటి భ్రాంతి రహితులగు జీవన్ముక్తులు – మావంటి అల్ప అభ్యాసపరులగు భ్రాంతి దృష్టి కలవారు ఉన్నట్లే కదా! మరి, భ్రాంతియే లేదని అనటం ఎట్లా? భ్రాంతియే లేకపోయి ఉంటే, ఉపదేశము చేయటానికి, "భ్రాంతిని తొలగించటం" కాకుండా మరింకే కారణం లేదు కదా? కనుక భ్రాంతి ఉన్నట్లే కదా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవన్ముక్తుల దృష్టిలో ఉపదేశించువాడు – ఉపదేశించబడువాడు ...ఇరువురు, అట్లాగే తదితరము అంతాకూడా – ఈ సమస్తముకూడా – బ్రహ్మమే అయివున్నది. ఇదంతా బ్రహ్మమునందే నెలకొనియున్నది. బోధస్వరూపమగు పరమాత్మయందు బంధ – మోక్షములు ఎట్లా ఉంటాయి? 'ఉండవు' అనునది సునిశ్చిత విషయమే అయివున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! ఆత్మయందు ఆత్మకు వేరుగా సర్వ పదార్థములు అసంభవమై ఉన్నాయి కదా! మరి అజ్ఞానుల దృష్టియందు ఇక ఈ దేశ–కాల–క్రియ–ద్రవ్య భేదములతో కూడిన ఈ జగత్‌సత్త అంతా కూడా ఎట్లా స్థితినొందియున్నది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (పకపకా నవ్వుచూ) రామయ్యా! "అజ్ఞానుల దృష్టి యందు" – అని అంటున్నావు కదా! నీ ప్రశ్నకు సమాధానం నీ ప్రశ్నలోనే ఉన్నదయ్యా!

**దేశకాల క్రియాద్రవ్య భేద వేదన చేతసామ్**
**అజ్ఞానమాత్రాదితరాసత్తా నాఽన్యాస్తి నో పురా!**

దేశ–కాల–క్రియ–ద్రవ్యాదిగా గల భేదమును చూచుచున్న అజ్ఞానుల దృష్టి యందు జగత్ సత్త స్థితి పొంది ఉండటానికి కారణం అజ్ఞానం తప్ప మరింకేమీ కాదు.

**శ్రీరాముడు :** మహాత్మా! తత్త్వదృష్టిచే "ఆత్మయందు జగత్తు ఏర్పడటానికి కారణమే లేదు"... అనే సిద్ధాంతమును అనుసరించి ఇక్కడ ద్వైత – ఏకత్వములు రెండూ అసంభవం కాబట్టి "బోధింపబడునది – బోధింపబడువాడు – బోధించువాడు" ...అనే మూడింటికీ అభావమే సిద్ధిస్తుంది కదా! అభావం సంభవిస్తే శాస్త్రములు బోధించటమెట్లా? అనగా "దృశ్యమునకు అతీతమైన బోధత్వము"... "నిర్మల బోధ స్వరూపమే ఆత్మ" ...అను శాస్త్ర పాఠ్యాంశాలు సమకూరటం మొదలైనవి ఎట్లా సంభవం?

“ఈ జీవుడు అకర్మకమగు బోధ రూపమును సంతరించుకోవటమే మోక్షం”... మొదలైన నిర్వచనాలు అర్థరహితమంటారా? “అజ్ఞాని – జ్ఞానమును సంతరించుకోవటం”... లేవంటారా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**బోధేన బోధతామేతి బోధ శబ్దస్తు బోధ్యతామ్**
**భవద్విషయమేవాయమ్ ఉచితో! న అస్మదాదిషు ॥**

అజ్ఞాతమగు బ్రహ్మము “నేను అజ్ఞానిని”... అని తలచిన సందర్భంలో అట్టి “అజ్ఞానము యొక్క క్షయము”... అనే ఫలమును ఆశ్రయిస్తోంది. అట్టి బోధ కర్మత్వమును పొందుచున్నది. అప్పుడు ఆ ‘బోధ’ అనే శబ్దం ఫలరూపమగు సకర్మత్వము పొందుతోంది. అయినాకూడా, “జ్ఞాతము – అజ్ఞాతము” – ఈ ఉభయములు బ్రహ్మమేగాని మరి ఏదీకాదు.

అయితే బోధసాధనలు బోధత్వం సాధనానంతరం పొందటం... ఇవన్నీ కూడా అజ్ఞాన యుక్తులగు వారి కొరకు మాత్రమే! అజ్ఞానము క్షయించినట్టి మా వంటి వారి యందు బోధ సాధనములు – బోధరూపము పొందటం ... ఇవన్నీ ఆత్మకు భిన్నమై లేవు. జగత్తులో పదార్థములన్నీ బ్రహ్మముగా కనిపిస్తున్నట్లే మాకు ఆయా బోధ సాధనలు, సాధనానుసారం బోధ స్వరూపం సంతరించుకోవటం... ఇవన్నీ బ్రహ్మమునందే బ్రహ్మము రూపంగానే అగుపిస్తున్నాయి. బ్రహ్మమునకు భిన్నమై ఎప్పుడూ ఏదీ లేదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఇప్పుడు మీరు జీవన్ముక్తుల దృష్టిని ఉద్దేశించి “మా వంటి వారి యందు ఆత్మకు భిన్నమై ఎక్కడా ఏదీ ఉండదు”... అని అంటున్నారు కదా! ఇట్టి “మావంటివారియందు” అని పదప్రయోగం చేస్తున్నారు కనుక... జీవన్ముక్తులలో కూడా ‘అస్మత్’ (నాకు సంబంధించినది) ...అనే ప్రవృత్తికి నిమిత్త భూతము అగు అహంత్వము మీచే గమనించబడుచున్నది కదా! అనగా... ఇక్కడ 3 విశేషాలు కనబడుచున్నాయి.

1. జీవన్ముక్తులలో అజ్ఞానం ఉండదు. (తదితరులలో ఉన్న అజ్ఞానదృష్టి జీవన్ముక్తులకు ఉండదు).

2. అయితే జీవన్ముక్తులలో “నేను” అనే మూలపదార్థంతో తయారైన “అహంత్వం” ఉంటుంది.

3. జీవన్ముక్తులు జ్ఞానులై ఉన్నారు. అందుచేత ఈ అహంత్వము (నాకు సంబంధించినది – అనబడేది) అజ్ఞాన కార్యము కాదు. అది అజ్ఞాన కార్యమే అయివుంటే... అది జీవన్ముక్తులలో ఉండేది కాదు కదా?

4. “బోధ” లేక “శుద్ధజ్ఞానం” తానే ఈ అహంత్వము రూపంగా పరిణామం పొందుచున్న దగుచున్నది.

ఇంతవరకూ బాగానే ఉన్నది. అట్టి ‘బోధ’ (నిర్మల బోధసత్త) నుండి ఉత్పత్తి అయివున్న ‘అహంత్వం’ – బోధరూపం కంటే భిన్నమైన రూపం కలిగి ఉండటమే ఇక్కడ మాకు దుర్భరంగా అనిపిస్తోంది. స్వామీ! ‘అహంత్వము’ అనగా? ఈ జీవుని రూపము అహంత్వమే కదా!

మీరు జీవన్ముక్తులై “పరము – అనంతము – భూత్ భవిష్యత్ వర్తమానములలో యథాతథము – జాగ్రత్ స్వప్న సుషుప్తులనబడే త్రివిధములైన పరిచ్ఛేదములు లేనిది – అతినిర్మలము” అయినట్టి

శుద్ధ చిన్మాత్ర స్వరూపము ధరించినవారై ఉన్నారు కదా! అట్టి చినాత్ర స్వరూపులగు తమయందు 'అహంత్వము' అనేది ఉండటం ఎట్లా కుదురుతుంది? జాగ్రత్‌లో ఉన్నవానికి స్వప్నం ఉండదు కదా? సూర్యకాంతిలో చీకటి ఎక్కడుంటుంది? అట్లాగే జీవన్ముక్తులగు మహనీయులలో అహంత్వము ఉండటానికి వీలేలేదు కదా? శుద్ధ చిన్మాత్ర స్వరూపం ధరించిన తరువాత కూడా 'మా వంటివారు' అనే రూపంలో ప్రదర్శితమయ్యే అహంత్వము ఎట్లా ఉండగలదు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! వాయువే వాయు స్పందరూపమగు వాయు తరంగాలుగా అగుచున్నది కదా! జలమే జలతరంగములుగా కనిపిస్తోంది కదా! అట్లాగే 'బోధ' యొక్క ఏ బోధరూపము కలదో... అదియే 'అహంత్వము' అనే పేరుతో కూడా చెప్పబడుచున్నది. కాబట్టి మాకు అనుభవమగుచున్న "నేను-అహమ్" అనునది 'ఆత్మకంటే భిన్నం కాదు.

బోధ, మరియూ బోధరూపత్వములే... జీవన్ముక్తులలో ఉండే అహంత్వము. అహంత్వము, మరియు, అభిమానములే అజ్ఞానుల అహంత్వము.

ఈ విధంగా జగత్తుకు సంబంధించిన అభిమానరహితమైన అహంత్వము బోధరూపమే అయివుండి, జీవన్ముక్తులలో కనబడుతోంది. అజ్ఞానులలో అహంత్వం దృశ్యమునకు సంబంధించిన అభిమానముతో కూడుకొని కనిపిస్తోంది. ఇంతకుమించి ఈ అహంత్వమునకు భిన్నత్వమేదీ జీవన్ముక్తులకు కనిపించటం లేదు. దృశ్యమునకు సంబంధించిన అభిమానము కూడా బ్రహ్మమునకు అభిన్నమైనదిగా మాకు అనుభూతమౌతోంది. కనుక 'జీవన్ముక్తులు' అని చెప్పబడుచున్నాం.

**శ్రీరాముడు :** స్వామీ! శాంతి రూపమగు సముద్రజలమే తరంగముల రూపం ధరిస్తున్నట్లుగా... జీవన్ముక్తుల దృష్టిలో చిన్మాత్ర స్వరూపమగు ఆత్మయే అహంత్వము, జగత్తు : తెలుసుకొనువాడు (బోధ్య-బోధం-బోధ) అనే త్రిపుటి... అయినట్టి ఈ రూపాలుగా ధరిస్తున్నదని తేలిపోతోంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బాగా చెప్పావు. కాబట్టి "అనంతము - శాంతము - ఏకము - పరిపూర్ణము" ...అయినట్టి కేవల పరబ్రహ్మమే సర్వదా పరమపదము అయి ఉండి... సర్వరూపంగా స్థితినొంది ఉన్నదగుచున్నది కదా! అనగా ...జగత్తుగా ఏది కనిపిస్తోందో... అది పరబ్రహ్మమే అయివున్నట్లే కదా! అప్పుడిక జగత్తు - అహంకారాలను గురించిన అద్వైత హానిదోషం ఇంకెక్కడిది? "అహం - జగత్తుల వాస్తవ రూపం సర్వదా నిర్మల పరబ్రహ్మమే"... అనే నా సిద్ధాంతం దిగ్విజయంగా - నిర్ద్వంద్వంగా జయప్రదమైనట్లే కదా!

**శ్రీరాముడు :** హే మహాత్మా! మీరు చెప్పుచున్నట్లు శుద్ధ - అద్వైత పక్షమే సరి అయినప్పుడు... మరి, దేనిమూలంగా ఈ అనంత సంసార భ్రమ విజృంభిస్తోందో... అట్టి "అహంత్వముఅనే వికల్పమును కల్పిస్తున్నదెవరు? ఆ కల్పించిన వ్యవహారమును అనుభవిస్తున్న "అనుభవి" అనబడే ఆ రెండవవారు ఎవరు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**జ్ఞేయ సత్త అవబోధే హి బంధనమ్ సచ్చ నాస్త్యలమ్**
**జ్ఞప్తేః సర్వార్థరూపత్వాత్, బంధమోక్షావతః కుతః?**

ఓ రామచంద్రా! "పరబ్రహ్మము కంటే భిన్నంగా దృశ్య పదార్థములు అనబడే జ్ఞేయ శక్తి ఉన్నది" అను రూపముగల అభినివేశము చేతనే "బంధము' అనేది కలుగుతోంది. తత్త్వవేత్తలలో ఇటువంటి (దృశ్యము ఆత్మకు వేరుగా ఉన్నది – అను రూపంలో ఉండే) అభినివేశం ఏమాత్రం కించిత్ కూడా ఉండటం లేదు. వారికి జ్ఞాన స్వరూపమగు పరమాత్మయే తనతోసహా సర్వ పదార్థాకారములుగా, సర్వ పదార్థ ధర్మములుగా భాసిస్తున్నట్లు అగుపిస్తోంది.

జ్ఞానమే ... జ్ఞేయము, తెలుసుకుంటున్నదే ... తెలియబడురూపంగా ఏర్పడి ఉన్నది.

అందుచేత తత్త్వవేత్తల దృష్టిలో బంధ మోక్షముల కల్పనయే ఉండటం లేదు. అంతా యథా తథంగా ఆత్మగా అనిపించటమే సర్వశాస్త్ర సాధనముల అంతిమ ప్రయోజనం. అట్టి ప్రయోజనం సిద్ధించుకున్న తరువాత "జ్ఞానమునకు భిన్నంగా జ్ఞేయం లేదు" అని స్వభావ సిద్ధంగా సుస్పష్టమౌతుంది.

"జ్ఞాని – అజ్ఞాని కూడా ఆత్మస్వరూపుడే! జ్ఞానాజ్ఞానములు ఆత్మయొక్క లీలావినోదం మాత్రమే. దృశ్యము, ఆ దృశ్యమును దర్శిస్తున్న అహంప్రత్యయము, ఆ అహంప్రత్యయమునకు సాక్షి అయినట్టి 'ఆత్మ' – ఈ మూడు వేరు కాదు. ఆత్మయే అహంస్వరూపమై వెల్లివిరుస్తోంది. అహంప్రత్యయమే దృశ్యముగా తనను తాను విస్తరింపజేసుకొని ఆస్వాదిస్తోంది." అనునదే అద్వైతసిద్ధి!

**శ్రీరాముడు :** స్వామీ! ఇక్కడ మీరు చెప్పే ఒక్క విషయం నేను కించిత్ ఇంకా ఒప్పుకోలేకపోతు న్నాను. ప్రకాశరూపుడగు సూర్యుడు ఎప్పుడైనా తాను ప్రకాశింపజేసే వస్తువుల రూపం అవుతాడా? దీపం వస్తువులను – రూపములను ప్రకాశింపజేస్తుంది. అంతేగాని ఆ దీప కాంతి తానే వస్తురూపంగానూ, ఆకారాదులుగానూ ఎక్కడైనా అవుతుందా?... లేదే! అట్లాగే జ్ఞానరూపమగు జ్ఞప్తి ఈ సర్వ పదార్థరూపంగా ఎట్లా అవుతుంది? అవకూడదు కదా!

జ్ఞాన స్వరూపమగు పరమాత్మ యొక్క 'సత్త' చేతనే ఈ బాహ్యమున ఉన్న సర్వ పదార్థాలు స్థితిని పొందుచున్నాయని నేనూ, ఒప్పుకుంటున్నాను. అయితే, తెలుసుకొను తత్త్వ స్వరూపమగు జ్ఞానమే తెలియబడే ఇదమ్ స్వరూపమగు జ్ఞేయము (దృశ్యము)గా అగుచున్నదనునది ఎట్లా యుక్తియుక్తం? చూచే నేను – చూడబడే ఈ దృశ్యము అత్యంత నిర్దుష్టంగా వేరువేరుగా వెలయుచు, సిద్ధించుచుండగా "నేనే బాహ్య పదార్థ రూపుడనై ఉన్నాను" అని, "ద్రష్టయే దృశ్యరూపుడు కూడా" ...అనే సిద్ధాంతం ఈ వర్తమానానుభవం దృష్ట్యా ఎట్లా పొసగుతుంది?

❖❖❖

## 2. దృశ్య రూపమంతా ద్రష్టా స్వరూపమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "శుద్ధ జ్ఞాన స్వరూపమగు పరమాత్మ సత్త చేతనే ఈ సర్వ దృశ్య వస్తువులు 'సత్తా' పొందుచున్నప్పటికీ... జ్ఞాన స్వరూపమగు ద్రష్ట వేరు – జ్ఞేయ స్వరూపమగు దృశ్యము వేరు. ద్రష్ట దృశ్యరూపుడు కాజాలడు. ప్రత్యక్షానుభవమే ఇందుకు తార్కాణం" ...అని నీవు అంటున్నావు కదా! అయితే, "ఈ గొడ్రాలి (వంధ్యా) రెండవ పుత్రుడు ఏ దారి నుండి మన

ఊరికి వచ్చాడు?" అనే ప్రశ్నలో "గొడ్రాలికి పుత్రుడెట్లా ఉంటాడు?" అనే మీమాంస చేత ఆ ప్రశ్న మొదలే శూన్యస్వరూపమగుచున్నది కదా! ఆకాశం మొదలైన ఈ సర్వ బాహ్య పదార్థాలు అగుపిస్తున్నాయే... అవన్నీ కారణ శూన్యములు. సర్వదా ఆత్మ ఒక్కటే అంతటా ఉండి ఉండగా ...అవన్నీ ఎక్కడి నుండి వస్తాయి? అందుచేత ఇవన్నీ కూడా వంధ్యా పుత్ర సదృశములే (గొడ్రాలి రెండవ కుమారుని వంటివే) అయివున్నాయి. ఇక "ఇవి ఘనీభూత సత్యముగా భాసిస్తున్నాయి కదా!" ... అని అంటావా? ముత్యపుచిప్పలో వెండి యొక్క ప్రకాశము కనబడవచ్చుగాక! ముత్యపు చిప్పలో వెండి ఉన్నదా? లేదు కదా! 'శుక్తి రజతన్యాయం'గా ముత్యపు చిప్పలో వెండి ఉండటం ఎంతగా సత్యమో... ఈ దృశ్యము అంతే సత్యము. ఈ భూమి, ఆకాశం, దేహాలు, వస్తు సముదాయం... ఇవన్నీ కేవలం భావనారూప భ్రాంతి మాత్రమే అయి ఉన్నాయి. అంతేగాని, సత్యము గాదు. ఎవరైనా... "ఇవన్నీ ఈ ఈ రూపాలుగా సత్యమే!"... అనుకోదలిస్తే అనుకోనీ! అది సత్య దృష్టిచే, జ్ఞానదృష్టిచే (లేక) పరిపక్వ దృష్టిచే అనుభూతము అవగల "ఆత్మజ్ఞాన వికాసము" చే క్రమంగా తొలగగలదని మాత్రం ఇక్కడ మనవి చేయగలను. ఇందులో సందేహమే లేదు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! జీవన్ముక్తులు, కార్యకారణ తత్త్వవేత్తలు అగు మీ దృష్టిలో ఈ దృశ్యమంతా గొడ్రాలి రెండవ కుమారునివలె, ముత్యపు చిప్పలో వెండిలాగా అసత్యమే అయివుండవచ్చు. మరొక 'అపరిపక్వ దృష్టి' తో కూడిన ద్రష్టకు ఇదంతా సుస్పష్టమైన సత్యంగా అనిపించవచ్చుగాక! ఏది ఎట్లైతేనేం? ఈ దృశ్యము దుఃఖమును మాత్రం కలుగజేస్తోంది కదా! "స్వప్నము సత్యమా? అసత్యమా?"...అనునది వేరే విషయం. ముందు... అది దుఃఖాన్ని కలుగజేస్తోంది కదా! అట్లాగే ఈ జగద్భ్రాంతి కూడా అనేక దుఃఖాలను కలుగజేస్తోందే! ఇది సత్యమనండి, అసత్యమనండి. ముందుగా, ఈ దుఃఖాలకు నివారణోపాయం ఏమిటో... అది చెప్పమని నా ప్రార్థన. ఈ జగద్భ్రమ తొలగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (పకపకా నవ్వుతూ) నీ ప్రశ్న చమత్కారంగా ఉన్నదయ్యా!

> **ఏవం తావత్ యథాస్వప్నః తథేయం చేత్ జగస్థితిః ।**
> **తత్ పిండగ్రహతార్థానాం సర్వైవ భ్రాన్తితోదితా! ॥**

ఎప్పుడైతే "ఈ జగత్తు స్థితి స్వప్నము వంటిది"... అని నీవు ఒప్పుకుంటావో, ఇక ఆపై పెద్దగా చెప్పవలసినదేమున్నది? "జగత్ భ్రమ : జగత్ భ్రాంతి"... అని నీవే అంటున్నావు కదా! స్వప్నంలో స్వప్న ద్రష్టను బాధిస్తున్న పదార్థాలు, సంఘటనలు, సందర్భాలు మెళుకువ రాగానే ఏమౌతున్నాయి? క్షణంలో అవన్నీ శూన్యరూపమైపోవటం లేదా? అప్పుడిక స్వప్నంలో కలిగిన దుఃఖం ఏమాత్రం (మెళుకువ తరువాత) ఉండటం లేదు కదా! అట్లాగే ఈ జాగ్రత్‌లో జగత్ ద్రష్ట జగత్తు యొక్క పిండత్వము చేత (సాకారత్వం – నామ రూపాత్మకత్వంచే) బాధింపబడవచ్చు గాక! ఆత్మజ్ఞానముచే ఈ సమస్త జగత్ పిండత్వము అద్దాని యొక్క నామరూపాత్మకత్వం కోల్పోతోంది. అప్పుడు అంతకుముందటి సమస్త దుఃఖములు సమసిపోతున్నాయి. శమించిపోతున్నాయి.

ఓ రామచంద్రా! స్వప్నంలో లాగానే... ఈ జాగ్రత్‌లో కూడా... సమస్త పదార్థముల యొక్క సత్యత్వము భ్రాంతి చేతనే ఉదయించినదగుచున్నది. భ్రాంతి తొలగిన మరుక్షణం ఇక దుఃఖమునకు విషయమే ఉండదు. కాబట్టి స్వస్వభావమగు 'ఆనందము'నకు తలుపులు తెరుచుకుంటాయి. కనుక 'భ్రాంతి' ని ముందుగా తొలగించుకోవాలి. అందుకు ఔషధమే ఆత్మజ్ఞానం.

**శ్రీరాముడు :** మీరు చెప్పేది వినటానికి చాలా బాగున్నది. కానీ మహాత్మా!

**కిమ్ ఏతావతి సంపన్నే సంపన్నం భవతి ప్రియమ్?**
**కథంచ శామ్యతి అర్థానాం స్వప్నాదౌ పిండరూపతా?**

ఒక నిరుపేదవాడు "నాకు చాలా డబ్బు ఉన్నదిలే" అని అనుకుంటే ధనికుడైపోతాడా? "ఈ జగత్తు మిథ్య మాత్రమే"... అని అనుకుంటే మాత్రం ఏం ప్రయోజనం? అంత మాత్రం చేత ఆనందం కలుగుతుందా? "దృశ్యము కేవలం మిథ్యయే" అనే జ్ఞానమాత్రం చేత స్వప్న - జాగ్రత్తులలోని పదార్థముల స్థూలరూపత్వం ఎట్లా శమిస్తుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! అధ్యాత్మ శాస్త్ర పరిశీలన ద్వారా పూర్వాపర విచారణచే 'జ్ఞానము' ఉదయించగలదు. అట్టి జ్ఞానాగ్నిచే ఇక్కడ కనిపించే స్థూలత్వం భస్మీభూతమై నివర్తించగలదు. ఎట్లా అంటే, స్వప్నంలోంచి మేల్కొనగానే స్వప్నంలో కలిగిన స్థూలభావన, 'అవన్నీ సత్యమే' అనే బుద్ధి నివర్తితం కావటం లేదా? ఇదీ అంతే!

**శ్రీరాముడు :** హే గురుదేవా! ఎవనికైతే పూర్వ - పర విచారణచే ఈ జగత్తు యొక్క స్థూలత్వము సన్నగిల్లుచున్నదో... ఆతడు జీవన్ముక్తుడు కదా! అట్టి జీవన్ముక్తుడు ఈ ప్రపంచమును ఏ ప్రకారంగా చూస్తున్నారు? ఆతనిపట్ల ఈ సంసార కూపరూపమగు భ్రమ ఎట్లా శమిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వాసనారహితుడగు జీవన్ముక్తుడు ఈ ప్రపంచమును సర్వదా నశించినదాని వలె, అసత్తుగాను, గంధర్వ నగరంలాగా కల్పనామాత్రంగాను, వర్షముచే తుడిచివేయబడబోవుచున్న చిత్రలేఖనం వంటిదిగాను చూస్తున్నాడు.

**శ్రీరాముడు :** వాసనలు నశించగా, స్వప్నము వంటి ఈ జగత్తు యొక్క పదార్థములందు స్థూలత్వబుద్ధి శమిస్తోంది. అటు తరువాత ఆ మనుజునకు ఏమి కలుగుతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సంకల్పరూపమగు ఈ జగత్తును గూర్చిన స్థూలబుద్ధి నశించగా... అప్పుడు బుద్ధి సూక్ష్మరూపం పొందుతోంది. అట్టి వానికి ఉత్తరోత్తర భూమికా పరిపాకము చేత క్రమంగా సూక్ష్మ వాసనలు కూడా నశిస్తూ వస్తున్నాయి. అట్లు సర్వవాసనా రహితుడగు జీవుడు 'ఆత్మానుభవం' పొందుచున్నాడు. అట్టి వాసనారాహిత్యముచే రూపుదిద్దుకున్న ఆత్మానుభవంచే ఆతడు పరమశాంతిని పొందుచున్నాడు.

**శ్రీరాముడు :** అయితే మహర్షీ! ఈ జగత్తు స్థూల దర్శనమునకు వాసనలే కారణమై ఉన్నాయి. ఈ వాసనలు అనేక జన్మలందు బాగా దృఢపడి ఉన్నాయి కదా! దృఢమైన మూలము - విస్తృతమైన శాఖలు ఈ వాసనావృక్షం కలిగియున్నది.

**అనేక జన్మ సంరూఢా శాఖా ప్రసవశాలినీ,**
**భవ బంధకరీ ఘోరా, కథం శామ్యతి వాసనా?**

అట్టి వాసనలే ఘోరమైన సంసార బంధములన్నీ కలుగజేస్తున్నాయి. అట్టి అతి భయంకరమై ఒప్పుచున్న ఈ వాసనలు తొలిగేది ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! భ్రాంతిమాత్రమగు ఈ దృశ్యం 'ఆత్మ జ్ఞానం' అనే పవిత్రమైన అవగాహనచే మాత్రమే స్థూలరాహిత్యం పొందగలదు. అట్టి జ్ఞానంచే స్థూలత్వం తరుగుచూ ఉండగా ...అప్పుడు వాసనాక్షయం కూడా క్రమంగా దానంతట అదే, స్వయంకృతంగా కలుగగలదు.

**శ్రీరాముడు :** ఓ మునీశ్వరా! జగత్‌దృశ్యచక్రము క్రమంగా స్థూలత్వరహితం కాగా... అప్పుడు ప్రాప్తించేదేమిటి? అట్టి వానికి పూర్ణశాంతి ఎట్లా లభిస్తుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఎప్పుడైతే జగత్తుయొక్క స్థూలత్వమును గురించిన భ్రమ క్రమంగా ఉపశమిస్తూ వస్తుందో... అప్పుడిక దృశ్యమంతా కూడా చిత్త మాత్ర స్వరూపం పొందుతోంది. ఈ జగత్తు నిరోధ భార రహితమౌతోంది. అంతా కూడా అతి సూక్ష్మత్వం సంతరించుకుంటోంది. అప్పుడా మనుజునకు సర్వ భోగాలలో ఆసక్తి శమిస్తోంది. ఆతడు స్వభావ సిద్ధంగానే పరమవైరాగ్యవంతుడు అగుచున్నాడు.

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఒక బాలుడు అతికోమలుడు, ప్రకాశశీలుడు అయివుండి కూడా ఇంత లోనే ఆయా కనబడే వస్తు – విషయాదులపట్ల ఏర్పడుచున్న సంకల్పముల పరంపరల చేత అనేక దుఃఖాదులు కొనితెచ్చుకుంటున్నాడు. అట్లాగే ఒక యువకుడు కూడా తెలివికలవాడై కూడా దృశ్యమునకు సంబంధించిన అనేక సంకల్ప – వికల్పాలు తనయందు పెంపొందించుకుని తద్వారా అనేక ఆవేదనలను దుఃఖాలను కొనితెచ్చుకుంటున్నాడు. అట్టి సంకల్ప పరంపరల వలన పుట్టుకొస్తున్న దుఃఖాదులకు తరుణోపాయం ఏమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఈ జగత్తు సంకల్పమాత్రమే!" అని గ్రహించిన తరువాత, ఇక ఆపై దుఃఖం దేనికి? అవిచారణచే "ఈ జగత్తు నా ఊహా సంకల్పచమత్కారం మాత్రమే"... అని గ్రహించకపోవటం చేతనే బాలునికి (ఇదంతా స్థూలంగా నమ్మడం వల్ల) దుఃఖం కలుగుతోంది. మరి నీవో! మన ఈ చర్చనీయాంశం యొక్క సారమును గ్రహించి ఉండటంచేత "ఇదంతా సంకల్పమాత్రమే" అని గమనించియే ఉంటావు కదా! అట్టి సంకల్పము చేతనే జగత్తు అనుభూత మౌతోందని గ్రహించినప్పుడు, ఇక ఆపై (ఈ జగత్తు నశిస్తున్నప్పుడు కూడా) ఏమాత్రం దుఃఖం కలుగదు. ఈ విషయమై నీవు " చిత్తము ఎట్టిది?" అనే విషయం పదేపదే విచారణ చేస్తూ ఉండాలి.

**శ్రీరాముడు :** మహర్షీ! ఈ చిత్తము యొక్క స్వరూపము ఎటువంటిది? అద్దాని గురించి విచారణ చేయటం ఎట్లా? అద్దాని గురించి బాగుగా విచారణ చేస్తే అప్పుడు లభించేదేమిటి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**చితః చేతో ఉన్ముఖత్వం యత్‌తత్ "చిత్తమ్" ఇతి కథ్యతే ।**
**విచారణ ఏష ఏవాస్య వాసనానేన శామ్యతి ॥**

చిత్తము యొక్క స్వరూపము – చైతన్యము విషయముల వైపుగా అభిముఖం కావటం. అట్టి విషయాభిముఖత్వం తప్పించి చిత్తమునకు వేరు రూపమూ లేదు, అంతకు వేరుగా చిత్తమూ లేదు. మన ఈ "వసిష్ఠ-రామ సంవాదం (యోగ వాసిష్ఠం)" రూపంలో ఏ మహారామాయణం శ్రవణం చేస్తున్నామో... ఇదంతా కూడా చిత్తము యొక్క విచారణయే అయివున్నది సుమా! ఇటువంటి విచారణ చేత వాసనలు తప్పక క్షయిస్తాయి.

**శ్రీరాముడు :** ఒక ప్రక్క ఈ చిత్తము విద్యమానమై ఏదో రకంగా విషయోన్ముఖత్వం అవుతూనే ఉన్నదే! ఏదో కొద్ది సమయం నిరోధించినా కూడా, మరల ఎప్పుడో మాకు తెలియకుండానే మమ్ము లను మరపించి విషయాల వైపుకు పరుగులు తీస్తోంది! ఏమిటి చేయటం? మరి ఇది విషయాలను పొందకుండా ఎంతవరకు ఊరకుంటుంది? అట్టి చిత్తం యొక్క అచిత్తత్వ స్థితి ఉదయించటమెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** వాస్తవానికి ఈ దృశ్యమే అసంభవమై ఉన్నది. మొదలే లేని దానిని చిత్తము ప్రకాశింపజేయటమనే మాట ఎక్కడిది? కనుక, "దృశ్యమే లేదు. కనుక ఇద్దానిని ధరించే చిత్తము మొదలే లేదు" అని భావించటం చేత చిత్తము లేకయేపోతుంది. దృశ్యము లేదని అభ్యాసం నిర్వర్తించటమే చిత్త వినాశనమునకు ఉపాయం.

**శ్రీరాముడు :** మహాత్మా! ప్రత్యక్షంగా అందరిచేతా అన్ని సమయములలోను అనుభవించబడుచున్నట్టి ఈ దృశ్యజగత్తు "లేనిదే" ఎట్లా అవుతుంది? స్వామీ! ప్రత్యక్షంగా అందరికీ అనుభవమగుచున్నదానిని మీరు ఎట్లు నిషేధిస్తున్నారో ముందుగా నాకు చెప్పండి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఇక్కడ ఏ సాకార జగత్తు అయితే అజ్ఞానులకు అనుభమౌతుందో ...అది సత్యము కాదు. ఇక జ్ఞానులకు ఏది అనుభూతమౌతోందో... అది వాక్కుకు అతీతము – అద్వయము – పరమ సత్యము అగు పరబ్రహ్మమే అయివున్నది.

**శ్రీరాముడు :** మహర్షీ! 1.అజ్ఞానులకు ఈ త్రైలోక్య జగత్తు ఎట్లు భాసిస్తోంది?2.అది సత్యము ఎందుకు కాదు? 3.జ్ఞానులకు ఈ జగత్తు ఎట్లు భాసిస్తోందో, అది చెప్పటానికే ఎందుకు వీలుకాదు? ఎందుకు వారి అనుభవం వాక్కుకు విషయం కాదు?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అజ్ఞానులకు ఈ జగత్తు... ఆద్యంత సహితంగాను, దేశ-కాల-వస్తు పరిచ్ఛేదయుక్తంగాను, ద్వైతరూపంగాను భాసిస్తోంది (అనిపిస్తోంది). ఇక జ్ఞానులకు ఆ రూపంగా ఇది భాసించటం లేదు. వారికి ఇదంతా కూడా... ఆరంభం నుండి ఎప్పుడూ కూడా ఉత్పన్నము కానిదియే గాను, గొడ్రాలి రెండవ కుమారుని గుణగణములవలె ఏ కాలమందునూ అసలు సంభవించనిదానివలె, అసద్రూపంగాను భాసిస్తోంది (అనిపిస్తోంది).

**శ్రీరాముడు :** హే బ్రహ్మన్! ఏ జగత్తైతే ప్రారంభం నుండి ఉత్పన్నమే అయివుండలేదో, ఎప్పుడూ కూడా ఏమాత్రం సంభవించనిదై ఉన్నదో, అసద్రూపం మాత్రమే అయివున్నదో, మొదలే భాసించనిదై ఉన్నదో... అట్టి ఈ జగత్తు సర్వులకు అర్థక్రియా సమర్థముగా ఎట్లా అనుభూతమౌతోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వప్నంలో అనేక విశేషాలు కనిపిస్తున్నాయి కదా! అవన్నీ కారణ శూన్యము

– ఉత్పత్తి రహితము – అసద్రూపమే అయివున్నాయి కదా! అయినప్పటికీ కనబడటం, అర్థ–క్రియా సమన్వితంగా అనిపించటం జరగటం లేదా? అట్లాగే... ఈ జగత్తు కూడా స్వప్నమువలె ఉద్భవించినదై... అర్థ క్రియా సమర్థంగా అనుభూతమౌతోంది.

**శ్రీరాముడు:** స్వామీ! స్వప్నంలోను, మనోరాజ్య కల్పనయందు ఏ దృశ్యం అనుభవించబడుచున్నదో, ...అదంతా కూడా జాగ్రత్ వ్యవహారము యొక్క అనుష్ఠాన – అనుభవములచే కలిగిన సంస్కారము వలన అనుభవించబడుచున్నదే గాని, మరింకేమీ కాదు కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** (చిరునవ్వుతో) ఓ రామచంద్రా! అయితే నా ప్రశ్నకు మొట్టమొదట సమాధానం చెప్పు. స్వప్నంలోను, సంకల్పములోను, మనోరాజ్యములోను ఏఏ పదార్థములు అనుభవించబడు చున్నాయో... అవి ఈ జగత్తులో ప్రసిద్ధమై కనిపించే పదార్థములేనా? (లేక) వేరే అన్యమైనవా?

**శ్రీరాముడు :** మహర్షీ! స్వప్నంలోను, కల్పనాదులందు, మనోరాజ్యంలోను ఏఏ పదార్థాలు భాసించుచున్నాయో... అవన్నీ కూడా – జగత్ ప్రసిద్ధములైన పదార్థములే స్వప్నంలో భాసిస్తున్నాయి – అని నా అభిప్రాయం.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లాగా? సరే! ఒకవేళ నీవు చెప్పినట్లు జాగ్రత్ పదార్థములే స్వప్నంలో భాసిస్తు న్నాయనే అనుకుందాం. మరి రాత్రి స్వప్నంలో ఒక భవనం నేలమట్టం అయినట్లుగా కల వచ్చిన ప్పటికీ, తెల్లవారి లేచేసరికి ఆ భవనం నేలమట్టం కాకుండా యథాతథంగానే ఎందుకుంటోంది?

**శ్రీరాముడు :** మహాత్మా! మీరు చెప్పింది నిజమే! స్వప్నంలోను, సంకల్పాదులందు... ఏ జగత్తు భాసిస్తోందో... అది ఈ జాగ్రత్ జగత్తు కాదు. బ్రహ్మమే అక్కడ స్వప్నంలోను సంకల్ప నగరం (ఊహారాజ్యం) లోను ఆయా విధాలుగా పదార్థరూపంగా భాసించుచున్న దగుచున్నదని మీ అభిప్రాయం నేను గమనిస్తున్నాను. కానీ, ఆ బ్రహ్మము అపూర్వమైన (ఇంతకు ముందు లేనట్టి) జగత్తు వలె ఎందుకు భాసిస్తోందో చెప్పండి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** జగత్తులో చిత్తముచే అనుభవించబడే పదార్థాలన్నీ కూడా... కొన్ని పూర్వము అనుభవించబడియో, సందర్భపడియో ఉండటంచేత అపూర్వములు కాకయే ఉంటున్నాయి. మరి కొన్ని పూర్వం అనుభవించబడకయే, పరిచయం లేనివే అవటం చేత అపూర్వములై ఉంటున్నాయి.

అయితే అవన్నీ కూడా దృష్టి యొక్క ఆది–అంతము–మధ్యలలో ఏ ఆకారములుగా అభ్యసిస్తే ఆయా ఆకారములుగానే భాసిస్తున్నాయి. కాబట్టి అభ్యాసమును అనుసరించే అనుభవం ఉంటోంది. "ఇవన్నీ బ్రహ్మాకారమే"... అని బాగుగా అభ్యసిస్తే బ్రహ్మముగానే భాసిస్తున్నాయి. ద్రష్ట యొక్క అభ్యాసమునకు వేరుగా ఈ జగత్తుకు ఏ ఆకారమూ లేదు. ఎవరికీ ఏ ఆకారం ఎచ్చట అనుభవమగు చున్నదో అది అట్టి సుదీర్ఘమైన అభ్యాసం చేతనే ఆ విధంగానే సిద్ధించినదగుచున్నది.

**శ్రీరాముడు :** మహాత్మా! మీరు ఈ విధంగా బోధిస్తూ ఉండగా, మీ పరమోత్కృష్టమైన బోధనా ప్రభావంచే బోధితుడను అగుచున్నాను. "ఈ జాగ్రత్ జగత్ కూడా పూర్వాపూర్వముల కలయికచే స్వప్నం వలె మిథ్యగానే భాసిస్తోంది" అనే విషయం ఇప్పుడు నేను మరింత నిర్దుష్టంగా ఎరుగున్నాను.

కాని "గ్రహం పట్టిందా?"... అన్నట్లుగా 'సంసార స్వప్నము' అనే పిశాచం నన్ను ఇంకా బాధిస్తూనే ఉన్నది. దీనికి చికిత్స ఏమిటో... అది చెప్పండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ "సంసార స్వప్నము" అనే కార్యమునకు కారణం ఏమిటో మొట్టమొదట విచారణ చేయి. కారణము యొక్క నాశనముచే కార్య రూపమగు ఈ సంసార భ్రమ తనంతటతానే తొలగిపోగలదు.

**శ్రీరాముడు :** స్వప్న రూపములగు ఈ జగత్ పదార్థములకు హేతువు (కారణం) ఈ చిత్తమేనని నాకు అనిపిస్తోంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కాబట్టి అనుభవమగుచున్న సర్వ జగత్ పదార్థములు చిత్తము యొక్క రూపములే! అందుచేత అసారమగు ఈ ప్రపంచము వాస్తవానికి "ఆద్యంతరహితము – నిర్వికారము" అగు బ్రహ్మమే అయివున్నది.

చిత్తము చిత్ రూపమే! దృశ్యము చిత్త రూపమే! కనుక, దృశ్యము చిత్ రూపమే!

అందుచే స్వప్నం – జాగ్రత్తు మొదలైనవి బ్రహ్మము కంటే భిన్నంగా కొంచెము కూడా లేవు.

**శ్రీరాముడు :** మహాత్మా! ఈ జగత్తు బ్రహ్మము ఒక్కటేనని మీరు అంటున్నారు కదా! అయితే... అవయవియగు వృక్షము – అవయవములగు కొమ్మలు ఒక్కటేగానూ అయి, వేరు వేరుగానూ అయి ఉంటున్నాయి కదా! అట్లే బ్రహ్మము – జగత్తులు అవయవి – అవయవములవలె ఏకభావంగాను, వేరువేరుగా కూడా ఉన్నాయని ఎందుకు అనుకోరాదు? "జగత్తు యొక్క ఆది సమష్టి చిత్తము. ఆ సమష్టి చిత్తము చిత్తుకు అవయవమువంటిది" అయివుండవచ్చా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అటువంటి కల్పన సంభవించునదే కాదు. ఎందుచేతంటావా? జగత్తు ప్రారంభం నుండే ఉత్పన్నమయి ఉండలేదు. మొదలే లేనట్టి ఈ కల్పనామాత్ర జగత్తుకు బ్రహ్మముతో భేదాభేద సంబంధంగాని, అవయవ – అవయవీ సంబంధంగాని ఏమాత్రం సంభవించదు. కాబట్టి జగత్తంతా కూడా "శాంతము, జన్మజరా వర్జితము, అఖండము" అగు పరబ్రహ్మమే అయివున్నది.

**శ్రీరాముడు :**

**కాకతాలీయవత్ మన్యే సర్గాద్యన్తాదయో భ్రమాః**
**భ్రాంతిః ద్రష్టత్వ – భోక్తృత్వసహితాః పరమే పదే ॥**

ఓ మహాత్మా! మహర్షీ! ఇప్పుడు నాకు ఏమి అనిపిస్తోందంటే... ఈ ద్రష్టత్వము – భోక్తృత్వము భ్రాంతి మాత్రమే. అట్టి ద్రష్టత్వ – భోక్తృత్వ సహితంగా ఈ సృష్టి యొక్క ఆది – మధ్య – అంతము అనే భ్రమలు కాకతాళీయంగా, అకస్మాత్తుగా పరబ్రహ్మము నందే స్థితి కలిగియున్నాయి.

"అయితే, బ్రహ్మమునకు వేరుగా ఈ జగత్తు అనబడే దంతా ఉండటానికే ఏమాత్రం వీలు లేదు" – సమా!

❖❖❖

# 3. తాత్త్విక దృష్టి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఈ ప్రపంచంలో 3 విధములైన దృష్టులు ప్రసిద్ధములై ఉన్నాయి.

**1. పామర దృష్టి / భౌతిక దృష్టి :** వర్తమానంలో కనిపించే ఈ ఈ వస్తు ఆకారాలు – నేను – నీవు అనునవి – ఈ ఈ రూపంగానే సత్యమై ఉన్నాయని దర్శించే దృష్టి.

**2. యౌక్తిక దృష్టి (యుక్తితో కూడినది)/ తార్కిక దృష్టి :** ఈ జగత్ కార్యమునకు (దృశ్యానుభవమునకు) ఏ 'చిత్తము' అనబడే సూక్ష్మ సత్త కారణరూపంగా ఉన్నదో అద్దానిని గమనించే "దృష్టి".

**3. తాత్త్విక దృష్టి :** సశాస్త్రీయ గురుబోధచే ఈ నేను, నీవు, దృశ్యము, జగత్తు, సర్వదా నిర్మలము, అఖండము, అప్రమేయము, కాలాతీత సత్యము అగు బ్రహ్మమే సర్వదా అయివున్నదను "ఆత్మసాక్షాత్కార దృష్టి".

ఈ 3 దృష్టులలో మొదటిది రెండవ దృష్టి చేత, రెండవది మూడవ దృష్టి చేత నిరాకరించబడుతోంది. నేను ఇంతవరకు – సారాసార విచారులు ఉత్తమ దృష్టి యందు బహు సమర్థులు, ప్రమాణ – ప్రమేయముల తత్త్వమును పరిశీలించిన వారు, పండితులు అగువారి దృఢవ్యాపార రూపమైన యౌక్తిక దృష్టిని అవలంబించి అనేక విశేషాలు చెప్పాను. అట్లాగే అధ్యాత్మ శాస్త్రముల శ్రవణ – మనన నిధిధ్యాసచే సిద్ధించే పరతత్త్వమును, ఆ పరతత్త్వము యొక్క అపరోక్ష స్ఫురణము, ఆ అపరోక్ష స్ఫురణము యొక్క చరమ సాక్షాత్కార వృత్తి యందు కనిపించే జీవన్ముక్తులలో ప్రసిద్ధమైయున్న తత్త్వదృష్టిని అనుసరించి కూడా అనేక విషయాలు చెప్పాను. ఈ తత్త్వదృష్టిచే ఈ ద్రష్టలు, దృష్టులు, జీవులు, త్రికాలములు చైతన్యాత్మ రూపమే అయివున్నాయో.... వివరించాను. నిత్య–అపరోక్ష–బ్రహ్మాత్మైక్య వస్తు స్థితి వరకు, ఈ జగత్తు ఏ విధంగా వస్తురూపం గాని, శూన్యరూపంగాని కాదో... అవన్నీ వివరించి చెప్పాను. "నీ ఆత్మరూపమే నీకు తదితర జగత్తుగా కనిపిస్తోంది" అని గమనించటమే నా ఉపదేశసారం.

**శ్రీరాముడు :** అవును స్వామీ! కాబట్టి ఈ జగత్తంతా కూడా పరమార్థ భూతమగు బ్రహ్మము యొక్క వివర్తమే అవుతుంది. ఇక సదా స్వస్వరూపమై, సర్వ స్వరూపమై వెలయుచున్న బ్రహ్మము ఏ సమయమందూ ఉదయించటం లేదు. అస్తమించటం లేదు. తార్కికదృష్టిచే (యౌక్తిక దృష్టిచే) – భ్రాంతియే ఇట్లు జగత్తు రూపంగా భాసిస్తోంది... అని తెలుస్తోంది. అనగా అవిద్య చేతనే ఈ దృశ్యము బ్రహ్మముగా కాకుండా, అనేక విశేషములతో కూడిన జగత్తుగా అనిపించటం జరుగుతోంది. తత్త్వదృష్టితో చూస్తే ఆ భ్రాంతి కూడా లేదు. కేవలం "బ్రహ్మసత్త" మాత్రమే కలదు!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఔను! చాలా చక్కగా చెప్పావు. బ్రహ్మము స్వయంగా తన యందు కాకతాళీయ న్యాయంచే ఏ రూపంగా (అవిద్యచే) భాసించుచున్నదో... అదియే జీవభూతము అయి, స్వయంగా 'జగత్తు' అనబడు దానిని ఎఱుగుచున్నది.

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! ఇదంతా చాలా ఆశ్చర్యంగానే ఉన్నది! అయితే బ్రహ్మము నిత్యప్రకాశము కదా! త్రికాలములందు యథాతథము కదా! మరి... మహాప్రళయంలోను, సృష్టి ఇంకా ప్రారంభమే కానప్పుడు (సృష్ట్యాదియందు), మోక్షదశ యందు ఆకాశము – ఈ భూమి – ఈ దిక్కులు ఇవన్నీ ఉండవు కదా! మరి ఇవన్నీ లేనప్పుడు అపరిచ్ఛిన్నమైన చిత్ప్రకాశము ఎట్లా ప్రకాశించగలుగుతుంది? ఎందుకంటే, గోడ మొదలైన ఏవైనా వస్తువుల అవలంబనం ఉంటేనే దీపకాంతి ప్రకాశిస్తుంది కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును! పరమాత్మ యొక్క వస్తు – విషయ రహిత ప్రకాశ స్వరూపం అత్యంతాశ్చర్యకరమైనదే! అయితే అది నీకు నీవే నీ విచారణ దృష్టితో దర్శించు. సూర్యుడు మొదలైన ప్రకాశ వస్తువు లన్నిటినీ ప్రకాశింపజేసేది చిత్ప్రకాశమే! కాబట్టి అది అంధకారమును కూడా ప్రకాశింపజేస్తోంది. అందుకే అది సర్వప్రకాశ్యకం. (తమేవభాన్తమ్ అనుభాతి సర్వమ్! తస్యభాసా సర్వమిదం విభాతి!)... అని శ్రుతులు ఆ విషయం గానం చేస్తూనే ఉన్నాయి కదా!

సూర్యకాంతి గోడయొక్క అపేక్ష లేకయే అద్దానియందు ప్రవేశిస్తోంది. అంతేగాని గోడ ఉండటం చేత సూర్యకాంతి జనించటం లేదు కదా! పైగా... గోడ – అద్దానిని ప్రకాశింపజేసేది రెండూ కూడా ఆత్మ ప్రకాశము చేతనే సిద్ధిస్తున్నాయి. అంతేకాదు. గోడను ఇంకా స్పృశించనప్పటికీ ఆకాశంలో కాంతి ఉన్నది కదా! అట్లాగే సృష్ట్యాది యందు, ప్రళయము నందు, మోక్ష దశయందు, వక్త – శ్రోత స్వరూపమగు ఆత్మ విషయరహితమై ప్రకాశించుచున్నది. అయితే అద్దాని "విషయరహిత స్వయం ప్రకాశకత్వం" గురించి నేను చెప్పగలిగేది కాదు. ఆ విషయం స్వయంగా ఎవరికి వారే గమనించవలసినది. కనుక నీకు నీవే విషయరహిత – అహం – త్వమ్ రహిత చిత్ప్రకాశమును నీకుగా దర్శించు. అద్దాని గురించిన సూచనఅంతా మన ఈ సంవాదము నందు తప్పక లభిస్తూఉంటుందని గుర్తు చేస్తున్నాను.

❖

అందుచేత రామచంద్రా! ఈ ద్రష్ట – దర్శన – దృశ్యములనబడే త్రిపుటి కొంచెం కూడా వాస్తవానికి లేదు. సృష్ట్యాదియందు చిత్ప్రకాశమే స్వయంగా ప్రకాశించునదిగా – ప్రకాశింపజేసేదిగా అగుచున్నది. దృష్టాంతానికి స్వప్న చైతన్యమే స్వప్నంలో స్వప్న ద్రష్ట – స్వప్న దర్శనము – స్వప్న దృశ్యము అగుచుండటం ప్రతి జీవునికి అనుభవైకవేద్యమే కదా! అట్లాగే ఇక్కడ కూడా ఒకే చైతన్యం ద్రష్ట – దృశ్యములుగా కూడా ప్రకాశిస్తోంది. ఈ విధంగా ప్రకాశింపజేసేది – ప్రకాశించునది – ప్రకాశము...ఈ మూడూ చిత్ప్రకాశమే అయివున్నది. ఇక సృష్ట్యాది యందు 1.ద్రష్ట, 2. దర్శనము, 3.దృశ్యము అనే మూడు రూపాలుగా అయి సృష్టివలె భాసిస్తోంది సుమా! ఈ విధంగా ప్రకాశమానమై "జగత్తు (దృశ్యము)" రూపంగా ప్రకాశించటమనేది ఆ చైతన్యం యొక్క మాయాశక్తి ప్రధానమగు స్వభావమే అయివున్నది.

అన్నిటికీ మును–ముందే సత్‌స్వరూపమైయున్న చిత్ప్రకాశమే దృశ్యరూపంగా కనబడటం స్వప్నంలోను, సంకల్ప నగరంలోను అందరికీ అనుభూతమగుచున్న విషయమే కదా!

ఆద్యంతరహితమైనట్టి చిదాకాశమే చిదాకాశమున... జగత్తు (దృశ్య) రూపంగా భాసిస్తోంది. చిదాకాశము యొక్క సృష్టి రూపంగా భాసించే చమత్కామే ఈ సృష్టి స్వరూపం.

ఈ జగత్తు అజ్ఞానులకు ఆశ్చర్యంగా కనిపించవచ్చు గాక! (శుద్ధజ్ఞానులమగు) మాకు ఆశ్చర్యమేమీ లేదు. మాకు ఇదంతా బ్రహ్మము యొక్క స్వభావంగానే అగుపిస్తోంది. మాకు ఎప్పుడైనా కాకతాళీయంగా త్రిపుటీజ్ఞానం (ద్రష్ట – దర్శనము – దృశ్యము వేరువేరుగా) స్ఫురించినప్పటికీ... మా యొక్క తత్త్వానుసంధానం చేత ఆ త్రిపుటి (చూచువాడు వేరు. చూడటం వేరు – చూడబడేది వేరు అని అనిపించటం) వెనువెంటనే మటుమాయమై పోతోంది.

అందుచేత...“సృష్టికి పూర్వం త్రిపుటి లేదు. ప్రకాశ్యము లేదు. ప్రకాశ్యకము లేదు. ఆ తరువాత మిథ్యాజ్ఞానవశం చేతనే పరమాత్మ యందు ఈ జగత్తు (నా దృష్టి దోషంచే) ఉదయించింది. అక్కడ ఉన్న మోడు (కొమ్మలు లేని ఎండిపోయిన వృక్షము) అయినప్పటికీ పసిపిల్లవానికి చీకట్లో ఎవరో మనిషి ఉన్నట్లు అనిపిస్తుంది కదా! అట్లా నాకు “నేను – నీవు – దృశ్యము”లతో కూడిన జగత్తు భ్రమచే అనిపిస్తోంది” – అని తత్త్వజ్ఞులు అనుసంధానం చేస్తున్నారు. అదియే తత్త్వానుసంధానం.

❖

ఆత్మయందు ‘ద్వైతము’ యొక్క భాసనము వాస్తవానికి లేనేలేదు. మరి? ఈ ద్వైతము చిత్తమునందు మాత్రమే భాసించటం  జరుగుతోంది. సృష్ట్యాది యందు ఈ ప్రకాశించబడే (ప్రకాశ్యకమగు) జగత్తు లేదు. కానీ చిదాత్మమాత్రం అవశ్యం ఉన్నది. చిదాత్మ ద్వైతంగా భాసించటానికి బాహ్యమైన హేతువు (కారణం) లేదు. కనుక, చిదాత్మయే ద్వైతరూపంగా భాసించుచున్నదగుచున్నది. కాబట్టి ఈ జగత్తంతా కూడా చిదాకాశ రూపమే! అట్లా కాకుండా శుద్ధ చైతన్యమున సృష్ట్యాది యందు ఏ కారణం (హేతువు) చేత జగత్తు ఉత్పన్నం కాగలదో చెప్పు?

ఎప్పుడైతే ఎవరైనా సరే... పవిత్రమైన ఆత్మదృష్టితో పదార్థముల యొక్క అభావము సముపార్జించుకుంటారో... వారికి “చైతన్యమే జగదాకారంగా భాసిస్తోంది”... అనునది క్షణంలో సుస్పష్టమైపోతోంది. అందుచేత ఈ జగత్తంతా కూడా జాగ్రత్ – స్వప్న – సుషుప్తి రహితమగు తురీయ బ్రహ్మ స్వరూపమే అయివున్నది.

స్వప్న రూపమగు ఈ దృశ్యము వాస్తవానికి సంభవించజాలదు. కేవలము బ్రహ్మమే దృశ్యముగా భాసిస్తోంది. సృష్ట్యాది యందు కూడా చిన్మాత్రాకాశమే ఇట్లు జగద్రూపంగా స్ఫురిస్తోంది. జగద్రహిత మగు చిన్మాత్రాకాశము నిజస్వరూపముననే జగత్తుగా ఎరుగుచున్నది. తాను ఎరుగు జగత్తుగా తానే అగుచున్నది. ప్రకాశ రూపమగు పరబ్రహ్మమే ఈ జగత్తు! ఆకాశమునకు – శూన్యత్వమునకు భేదమేమున్నది? అట్లాగే ఈ జగత్తుకు బ్రహ్మమునకు ఏమాత్రం భేదం లేదు.

ఓ రామచంద్రా! ఇదియే నాచే ఇన్ని రోజులుగా సుదీర్ఘంగా చెప్పబడుచున్న తత్త్వానుసంధానం. అట్టి తత్త్వానుసంధానంచే ఆత్మతత్త్వమును ఎరుగుచూ ఉండు. సప్త భూమికలలో ఒక్కొక్కటి అధిగమిస్తూ ఉండు. స్వానుభవం దృఢపడే వరకు తత్త్వాను సంధానమును ఆశ్రయిస్తూనే ఉండు,

క్రమంగా వికల్పరహితుడవై, వాక్ – ఇంద్రియ వ్యాపార నిరోధము ద్వారా శిలవలె మౌనమును ధరించినవాడవగుము. నిర్వికల్ప సమాధి యందు స్థితిని సముపార్జించుకో! అజ్ఞాన దశయందు నీ చేత – తదితరులగు జీవులచేత అనాదిగా ఈ సంసారము మరల మరల అనుభవించబడియే ఉన్నది. క్రమంగా వైరాగ్య బలంతో బాహ్య విషయములన్నీ ఆత్మానుసంధానముచే లయింపజేయి. అప్పుడు "బాహ్య విషయములు పొందుము" ...అని అజ్ఞులు ఎలుగెత్తి చెప్పుచున్నా సరే... మరల ఈ జగత్తును దృశ్యరూపంగా గ్రహించవద్దు. ఈ కనబడే విషయ సుఖములవైపుగా నీ దృష్టిని సారించనే వద్దు. ఎందుకంటే విషయ సుఖము సమాధికి విఘాతం కలిగిస్తూ ఉంటుంది. అయినా కూడా ఈ జగత్తులో తిను – త్రాగు – మాట్లాడు – పలకరించు – వ్యవహరించు. తదితరులవలెనే సర్వము నిర్వర్తించు.

"నేను – నీవు – దృశ్యము ... అంతా బ్రహ్మమే"... అను ఆత్మానుసంధానమే సంసారమునకు దివ్యౌషధం. అట్టి ఆత్మానుసంధానమును అనుక్షణికంగా, అప్రతిహతంగా కొనసాగిస్తూ ఉండు!

❖❖❖

# XIV. శ్రీరామ ప్రవచనం (శ్రీరామ హృదయం)

## 1. "భ్రాంతి కూడా బ్రహ్మము రూపంగా దర్శించటం" అనే విశ్రాంతి

**శ్రీరాముడు :** హే మునీంద్రా! హే జగద్గురూ! ఓ సంసారరోగ దివ్యౌషధ స్వరూపుడవగు ఓ శ్రీ వసిష్ఠ మహర్షీ! ఏమి ఆశ్చర్యం!

**అహోను సుచిరం కాలం సంభ్రాంతా వయమన్తరే ।**

**అపరిజ్ఞాత మాత్రేణ సంసారపరమాంబరే ॥**

సంసార రూపమగు ఈ అనంతాకాశములో గల ఈ చిన్న బ్రహ్మాండమందలి ఈ అతిచిన్న ప్రదేశంలో... ఆత్మతత్త్వము యొక్క అపరిజ్ఞానమాత్రంచేత మేమందరమూ చిరకాలంగా ఈ విధంగా పరిభ్రమిస్తున్నాం! ఇది ఆశ్చర్యమే మరి! మీ బోధచే ఆత్మతత్త్వము బాగుగా బోధపడగా... "ఈ జగత్తు అనేది భ్రమ మాత్రమే! ఇది కించిత్ కూడా పూర్వము ఉండి ఉండలేదు. ఇప్పుడూ లేదు. ఇకముందు ఉండబోవటమూ లేదు"... అని మేము తెలుసుకున్నాం.

**సర్వం శాంతం నిరాలంబం విజ్ఞానం కేవలం స్థితమ్,**

**అనంతం చిద్ఘనం వ్యోమ నీరాగమపకల్పనమ్!**

ఈ జగత్తంతా కూడా... "శాంతమై, నిరాలంబమైనట్టి (ఆలంబనమంటూ ఏదీ లేనిదై) కల్పనా రహితమైనట్టి  రాగ వర్జితం అయినట్టి కేవల పరబ్రహ్మముగానే సర్వదా స్థితినొంది ఉన్నది. ఇదంతా ఎంత ఆశ్చర్యం! ఎందుకంటారా?...  పరమ చిదాకాశమే అజ్ఞాన మాత్రం చేత జగద్రూపం పొందినట్లుగా మాకు భాసించటం ఆశ్చర్యమే కదా! పరమ నిర్మలమగు చిదాకాశమే మలినరూపం పొందిన దానివలె ఉన్నదై... ఈ విధంగా ద్వైతరూపంగా లోకాలు, పర్వతాలు కలిగి ఉన్నట్లు అగుపిస్తోంది!

❖

అవును! మీరు చెప్పినట్లు సృష్ట్యాదియందు, ఈ లోకమునందు, పరలోకమునందు, స్వప్నం లోను, మనోరాజ్య కల్పనయందు కూడా చిద్రూపమగు పరమాత్మయే దృశ్యరూపంగా భాసిస్తోంది. కాబట్టి ఇక చైతన్యమునకు వేరుగా దృశ్యం ఎక్కడిది? చైతన్యమునకు వేరుగా ఏదైనా కనిపిస్తే... అది అట్లా అనిపించటమే భ్రాంతి. "నేను ఇప్పుడు స్వర్గం చేరాను. నేనిప్పుడు నరకానికి పోతున్నాను"... అని ఏ విభ్రాంతి కలిగియుంటామో... అదే నరకప్రాయం. ఈ దృశ్యమంతా వాస్తవానికి సర్వదా, సర్వవేళలా, అంతటా చిన్మయ స్వరూపమే అయివున్నది. కాని, మృణ్మయ స్వరూపం కానే కాదు.

**నేఽదం దృశ్యంచ, ద్రష్టా న సర్గో న జగన్నచిత్**

**న జాగ్రత్ స్వప్న సిద్ధాది, కిమపీదం తదప్యసత్ ॥**

వాస్తవానికి ఈ దృశ్యముగాని, ద్రష్టగాని, సృష్టిగాని, చిదాభాసుడు గాని (జీవుడుగాని) జాగ్రత్తుగాని, స్వప్నంగాని లేవు. అనిర్వచనీయం అయినట్టి ఈ అవిద్యంతా కూడా అసత్తే అయివున్నది.

ఓ మునీంద్రా! "ఈ భ్రాంతి ఎక్కడి నుండి ఉత్పన్నమైనది?" అనేది – విచారణకు కూడా అయోగ్యమై ఉన్నది. వెలుతురు లేకపోవటమే చీకటి కదా! ఇక "ఈ చీకటి ఎక్కడి నుండి వచ్చింది?" అనే ప్రశ్న ఎక్కడిది? భ్రాంతి అసద్రూపమే కదా! ఇక "ఎట్లా వచ్చింది? ఎక్కడి నుండి?" – అని చింతన చేయటం అప్రస్తుతం, అసందర్భం కూడా! అది వ్యర్థమైన పనే! "నిర్వికారము – తత్త్వజ్ఞాన స్వరూపము"... అయిన ఆత్మయందు భ్రాంతి సంభవించజాలదు. పైగా... అట్టి భ్రాంతి జ్ఞానం కూడా చిత్స్వరూపమగు పరమాత్మయే గాని అన్యమైనదేదీ కాదు. స్వప్నదర్శనం స్వప్నద్రష్ట యొక్క స్వీయకల్పనా చమత్కారమే అయివుండగా, ఇక స్వప్నంలోని విశేషాలకు కార్య–కారణాలు ఎక్కడుంటాయి? అంతరాళమనేదే లేని స్ఫటిక శిలా గర్భంలోనూ, ఆద్యంత రహితమైన ఆకాశంలోను, తత్త్వజ్ఞాన ప్రదమైనట్టి ఆత్మ యందు ద్వైత భేద కల్పన చేయువాడెవడుంటాడు?

**మిథ్యైవ అనుభవో భ్రాంతేః స్వప్నే స్వమరణోపమః**
**యదనాలోకనం నామ శామ్యతీదం విలోకనాత్ ॥**

విచారణ చేసియుండకపోవటం చేతనే 'భ్రాంతి' అనేది ఉండి ఉండవచ్చుగాక! స్వప్నంలో ఒకనికి "నేను మరణించాను"... అని కల వచ్చినట్లుగా... భ్రాంతి మిథ్యయే అయివున్నది. కాబట్టే అది విచారణచే నశించుచున్నది. మృగతృష్ణలో జలం, రెండవ చంద్రుని రూపం... వీటిని గురించి ఎంతగా విచారిస్తే మాత్రం లభిస్తాయా? అవి భ్రమయే కదా! అట్లాగే జ్ఞానము యొక్క ప్రాప్తి తరువాత అవిద్యాభ్రమ ఎటో మటుమాయమైపోతోంది. ఇక దాని గురించి వెతకటమెందుకు?

బాలునికి చీకట్లో బేతాళము కనిపిస్తున్నట్లుగా ఈ భ్రాంతి జాగ్రత్తులో ప్రత్యక్షంగా కనిపిస్తున్నప్పటికీ... ఇది (జగత్తుగా) యథార్థం కాదు. ఈ భ్రాంతి... అవిచారణచే వర్ధిల్లుతూ దృఢమవుతోంది. విచారణ చేత నశించిపోతోంది.

ఓ మునీంద్రా! ఇక "భ్రాంతి ఏ కారణం చేత కలిగినది?" అనే ప్రశ్నయే శోభించదని గ్రహించాను. ఎందుచేతనంటారా? 'సత్తు' యొక్క విచారణ చేతనే మనకు లాభముంటుంది. గాని... అసత్తు గురించి ఎంత విచారణ చేసి ఏం లాభం? ఈ భ్రాంతి యొక్క మూలం అజ్ఞానమే కదా! అజ్ఞానం అసత్తే అయి ఉండటంచే అది విచారణకు యోగ్యమే కాదు. ఏ వస్తువైతే ప్రామాణిక మైన విచారణచే లభించదో... అది అసత్తే అయి ఉన్నది. "ఆ కథలో ఆతడు అట్లా ఎందుకు మాట్లాడాడు?" అనేది విచారణ చేయటం అసంతగతమైన పనియే కదా! కథ మొదలే కల్పన కదా! అట్లాగే ఈ జగత్తు యొక్క మూలము అజ్ఞానమే అయివున్నది. అది అనుభవముచే భ్రమ రూపమేనని తెలియవచ్చుచుండగా... ఇక అద్దాని గురించి విచారణ చేసి ఏం ప్రయోజనం?

శ్రుతి ప్రమాణముచే బాగుగా విచారించిచూడగా ఈ జగత్తు లేకయే ఉన్నది. కాబట్టే పరిచ్ఛిన్నరూపమై వర్ధిల్లుతోంది. ఆకాశంలో ఆకాశపుష్పం కోసము, కుందేలు యొక్క కొమ్ముల

కోసం వెతికితే దొరకుతాయా? అసద్వస్తువగు ఈ జగత్తును ఎంత పరిశీలిస్తే మాత్రం ఏం ప్రయోజనం? ఇద్దాని నుండి సద్వస్తువు ఎట్లా లభిస్తుంది? ఏదైతే అంతటా ఎంతగా చూచినప్పటికీ ప్రమాణములచేతగాని, కారణముల చేతగాని లభించుటయే లేదో, అట్టి దాని సత్త ఎటువంటిదని చెప్పాలి? గొడ్రాలి కుమారుల గుణగణముల గురించి వివరాలు అడగటం వల్ల ఏం ప్రయోజనం?

భ్రాంతి అనబడేది ఏదీ లభించనిదే అయి ఉన్నది. ఇక్కడ భ్రాంతి లేదు. జగత్తు లేదు. దృశ్యం లేదు. నిరావరణ విజ్ఞాన ఘనరూపమగు ఆత్మయే ఈ సమస్త జగద్రూపంగా వ్యాపించి ఉన్నది. ఏ జగత్తైతే ఇక్కడ ఇట్లా భాసిస్తోందో... అది పరబ్రహ్మ రూపమే అయివున్నది.

నిరతిశయానందముచే పరిపూర్ణమగు బ్రహ్మ స్వరూపమున, అపూర్ణమగు బ్రహ్మమే, ఈ విధంగా స్వమహిమయందు స్థితి కలిగియున్నది. 'జగత్తు'గా అజ్ఞులకు, 'కేవల పరబ్రహ్మమే'గా విజ్ఞులకు అనుభూతమౌతోంది. ఇక్కడ 'జగత్తు' అనబడునదేదీ ఒకింత కూడా ఏ సమయమందునూ భాసించటమే లేదు. భాసించకపోవటమూ లేదు. నిర్మలము – శాంతము అయినట్టి పరబ్రహ్మమే ఇట్లు జగద్రూపంగా వెలయుచున్నది.

మహాత్మా! వసిష్ఠ మహర్షీ! ఆ పరబ్రహ్మమే ఇట్లు జగద్రూపంగా భాసిస్తోంది. అట్టి పరబ్రహ్మము ఇట్లు జగత్తుగా భాసిస్తున్నప్పటికి కూడా... పరబ్రహ్మము... సదా నిత్యనిర్మలమై ఉన్నది. జరామరణ రహితమై ఉన్నది. అది ఎవరిచేతా అపహరించబడజాలదు. ఉత్తములచే గౌరవింపబడేది అదియే! వికార రహితము – నిరామయము అయివున్నది. సర్వత్రా సర్వదా పరిపూర్ణమై ఉన్నది. అహంభావ బోధచే నిరహంభావమై ఉదయిస్తోంది. సర్వవ్యాపకము – పరిశుద్ధ ప్రభువు అయివున్నది. అనేక రూపములై ఉండి కూడా సర్వదా ఏకరూపమే అయివున్నది. ఆవరణ రహితము అయివుండటం చేత సర్వత్రా ప్రకాశించుచునే ఉన్నది. ఆ పరబ్రహ్మమే నేను! అట్టి రామ బ్రహ్మ స్వరూపమే జగత్తు! మీ అందరి స్వరూపుడను నేనే! నామ – రూప – ఆవరణ రహితుడనగు నేనే సర్వదా – సర్వత్రా – సర్వముగా ఉదయిస్తూ ఉదయాస్తమములు లేనివాడనై సర్వదా యథాతథంగా ప్రకాశిస్తున్నాను. మీ అందరియొక్క స్వస్వరూపమే నేను. సర్వమునందు సర్వదా ప్రమేయ – అప్రమేయ స్వరూపమగు ఆత్మారామమే అయివున్నాను.

❖❖❖

## 2. అజ్ఞాన నిద్ర నుండి మెలకువ!

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! వసిష్ఠ మహర్షీ! కర్మోపాసనాసిద్ధులగు దేవతలు గాని, తపఃసిద్ధులగు మునులుగాని ఏ ఆదిమధ్యాంత రహితమగు పరబ్రహ్మమును ఎరిగే ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నారో... అట్టి పరబ్రహ్మమే జగద్రూపంగా భాసిస్తోంది. కాబట్టి అద్దానికి వేరుగా జగత్తు ఎక్కడ? దృశ్యమెక్కడ? ఇక, "ఇదంతా ద్వైతమా? అద్వైతమా? ఈ జగత్తు సాకారమా? నిరాకారమా!'... ఇటువంటి చర్చల అనుసంధానం చేతను, వాటిచే మనస్సులో ఉత్పన్నమవ గల

భేదభావాలతో కూడిన సందేహములతోను మాకు ఏ పనీ లేదు. అటువంటి విభ్రమములను స్వీకరించవలసిన అవసరమే ఇప్పుడు మాకు కనపించటం లేదు. హే మహర్షీ! ఆద్య స్వరూపమై, సృష్టికి పూర్వమే ప్రసిద్ధమై, సర్వదా శాంతము – నిర్వికారము అయినట్టి ఏ బ్రహ్మము కలదో, అదియే ఇప్పుడు కూడా మనందరి నిత్య స్వరూపమై ఉన్నది. మనందరి రూపంగా భాసిస్తున్న ఆ బ్రహ్మమే ఈ దృశ్య – సృష్టి రూపంగా కూడా భాసిస్తోంది. ఆకాశమున నీలత్వము – కేశత్వము (వెంట్రుక ఆకారాలు కనిపించటం) – అనంతత్వము ఏ విధంగా అభేద రూపమే అయివున్నాయో, ...అట్లాగే చిదాకాశమున ఈ త్రైలోక్య జగత్తు అభిన్నరూపంగా ఉన్నది. మట్టికి బొమ్మ ఆకారం కల్పించటం చేత ఆ ఆకారము మట్టిని మరొక తీరుగా చెయ్యదు కదా! నిరాకారమైన మట్టియే సాకారమైన మట్టి బొమ్మ ఆకారంలో ఉన్నది. అంత మాత్రానికి ఆ ఆకారము మట్టియొక్క స్వస్వభావాన్ని మారుస్తోందా? లేదే! ఇదివరకు మేము దృశ్యముతో తదాత్మ్యము పొంది ఉండవచ్చుగాక! అంత మాత్రం చేత మా ఆత్మ స్వరూపానికి వచ్చిన లోటేమీ (అప్పుడుగాని, ఇప్పుడుగాని, మరొకప్పుడుగాని) లేనేలేదు.

ఆకాశమున ఆకాశతత్వము (శూన్యత్వము) లాగా, శిలయొక్క ఘనత్వంలాగా, మట్టి యొక్క దేవతాకారంలాగా, జలం యొక్క జలత్వంలాగా... చిద్ఘన బ్రహ్మమునందు ఈ ప్రపంచం వర్ధిల్లు చున్నది! అట్టి ఈ ప్రపపంచము ఎక్కడి నుంచీ రావటంలేదు. ఎటువైపుకీ పోబోవటం లేదు. బ్రహ్మమే అభ్యాసవశం చేత జగత్తుగా కనిపిస్తోంది. మీ వాక్య ప్రభావం చేత మేము కొంచెం కొంచెంగా "ఇది బ్రహ్మమే కదా"... అని అభ్యసిస్తూ వస్తే అంతా సర్వదా బ్రహ్మమేగా అనుభూత మౌతోంది. ఈ 'నేను–నీవు' మొదలైన అహంత్వాది సహితంగా ఈ దృశ్య జగత్తు ఆకాశమునందు దిక్కులందు ప్రసరించి అతి విశాలమై ఉంటే ఉండవచ్చుగాక! అయినప్పటికీ ఇదంతా పరమ శాంతము – పదార్థ శూన్యము అగు చిదాకాశమే అయివున్నది. అట్టి మహాచిదాకాశము సర్వదా అపరిచ్ఛిన్నమే! ఎవనికైనాసరే... ఈ జగత్తు అఖండ పరబ్రహ్మముగా బోధపడిందా... ఆ మాత్రపు ఆత్మ సాక్షాత్కారం చేత ఈ సంసార పిశాచము మరుక్షణం అనుక్షణికంగా శమించినదే అవుతోంది. ఈ జాగ్రత్‌దృశ్యం ఉండటం చేతగాని, ఇది తొలగి స్వప్నదృశ్యరూపు దిద్దుకోవటం చేతగాని, అది కూడా తొలగి నిర్విషయ సుషుప్తి అనుభవగతమవటం చేతగాని... ఆత్మత్వమునకు వచ్చే హాని, మార్పుల చేర్పులు లేవు. ఏ ఆత్మ వస్తువునందు జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు కల్పిత రూపంగా వచ్చి – పోతున్నాయో... అట్టి నిర్మల – నిర్విషయ – అప్రమేయ చిదాత్మయే మనందరి రూపమై ఉన్నది. ఆత్మ విచారణచే మూఢునికి కూడా ఈ "సంసార పిశాచము" శమించిపోగలదు. ఇక సాధనపరుల విషయం వేరుగా చెప్పనక్కర్లేదు కదా! చిద్రూపమును సంతరించుకొనియున్న జ్ఞాని ఆయా వ్యవహారములందు ఎంతగానో తత్పరుడై ఉన్నప్పటికీ, తరంగానికి – తరంగానికి జలం దృష్ట్యా భేదమే లేనట్లుగా, ఆతనిపట్ల సర్వ భేదములు సమసిపోతున్నాయి. చీకటి తొలగినప్పుడు అంతా విదితమైపోతుంది. చూచారా? అట్లా "ఆత్మసాక్షాత్కార దృష్టి"చే అన్ని భేదాలు ఎటు వెళ్ళిపోతు న్నాయో కూడా చెప్పజాలకున్నాను. 'అజ్ఞానము' అనే మండుటెండ అతి భీకరంగా కార్చిచ్చులాగా

సెగలు కొల్పుచుండగా వచ్చే బాధలన్నీ... భ్రమ అనే సూర్యుడు అస్తమించగానే సమసిపోతున్నాయి. "ఆధిభౌతికము – ఆధిదైవికము – ఆధి ఆత్మికము" అనే త్రివిధతాపములు తొలగిపోగా... ఇక విషయ తృష్ణ నశించి పోతుంది. "ఏదో పొందాలి! లేకుంటే నా గతి ఇంత మాత్రమే"... అనే భ్రమ, "జ్ఞానము" అనే చంద్రోదయంచే ప్రశాంతపడుచున్నది. "సంసార సత్త" అనే పగలు అస్తమించగా, ఇక 'మోక్ష సుఖము' అనే అతి ప్రశాంత సమయమగు రాత్రి వచ్చి ఆహ్లాదపరుస్తోంది.

❖

ఓ మహర్షీ! ఈ ఉత్పత్తి – వినాశనములు, కార్యాకార్యములు, జన్మ – జరా – మరణములు వ్యవహార విక్షేపము కలిగించవచ్చు గాక! ఇవన్నీ పొందుచూ కూడా జ్ఞాని ఏదీ పొందనివాడై ఉంటున్నాడు. జ్ఞాని వాటియందు వర్తించనివాడే అగుచున్నాడు. అన్నిటా అన్నివేళలా స్వస్వరూపాత్మ జ్ఞానియే నిశ్చితంగా ఈ సంసారమును నందనవనము వలె అత్యంత ప్రశాంతముగా దర్శించగలుగు చున్నాడు. మిగతావన్నీ ఏదీ ఎట్లున్నా, అవన్నీ దుఃఖమును తొలగించజాలవని నేనిప్పుడు అత్యంత ప్రత్యక్షంగా గమనించగలుగుచున్నాను.

ఓ మునీశ్వరా! వాస్తవానికి ఇక్కడ సుఖం లేదు. దుఃఖం లేదు. అవిద్య లేదు. విద్య – అవిద్యలు, ఈ సుఖ దుఃఖాలు... ఇవన్నీ బ్రహ్మమే స్వరూపముగా కలిగి ఉన్నాయి. ఎరుగబడినదా, ...ఇదంతా నిర్మల పరబ్రహ్మ స్వరూపమే! ఇక్కడ బ్రహ్మమునకు వేరుగా తెలియందిగాని, తెలియవలసింది గాని ఏమీ లేదు. బ్రహ్మమునకు తన స్వరూపము కానిదంటూ ఇక్కడ ఏదీ లేదు.

హే మహర్షీ! మీ ప్రవచనము అనే పవిత్ర గంగాజలంలో స్నానంచేసిన ప్రభావం చేత నేనిప్పుడు ప్రబుద్ధుడను అయ్యాను.

**ప్రబుద్ధోఽస్మి ప్రశాంతా మే సర్వ ఏవ కుదృష్టయః,**
**శాంతం సమమ్ సోఽహమ్ ఇదం ఖం పశ్యామి జగత్త్రయమ్ ॥**

నా సర్వ కుదృష్టులు, సమస్త భ్రాంతులు బాగుగా శమించాయి. ఇప్పుడు ఈ త్రిలోకములు 'ద్వైతము' అనే విషమత్వము త్యజించినవై, పరమశాంతరూపంగా నాకు కనిపిస్తున్నాయి. ఈ సమస్త జగత్తులు నా స్వస్వరూపమే! ఇదంతా చిదాకాశముగా గాంచుచున్నాను!

బాగుగా ఎరుగబడినదా... ఈ జగత్తంతా కూడా కేవలం పరబ్రహ్మమే అగుచున్నది. స్వామీ! ఇదిరవకు అజ్ఞాత స్థితిలో ఒక రూపంగాను, ఈ సమయంలో మరొక రూపంగాను ఉన్నానని, ఇప్పుడు నేను అనుకోవడం లేదు. ఆత్మ – అప్రాప్త స్థితిలో – అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు. నేను సర్వదా ఆత్మారాముడనే గాని, దేహ – మనో – బుద్ధి రూపుడను కాను. ఎటొచ్చీ, అప్పుడు నేను ఆత్మస్వరూపుడనని గమనించి ఉండకపోవచ్చు! ఇప్పుడు మీ 'బోధ' అనే మాధుర్య ప్రభావం చేత (నేను సర్వదా సర్వస్వరూపమగు ఆత్మయేనని) గమనిస్తున్నాను. ఏ బ్రహ్మము ఇతఃపూర్వం నా యందు తన ఆత్మను ఎరుగక ఉండటం జరిగిందో... ఆ బ్రహ్మమే ఇప్పుడు తన ఆత్మను ఎరిగినదై స్వస్వరూపమున నెలకొనియున్నది.

హే మహర్షీ! ఒకే ఆకాశము శూన్యత్వంగాను, నీలత్వంతోను, ఏకత్వంగాను... ఒకే సమయం లోను, సర్వవేళలందు కూడా నెలకొనియున్నది కదా! అట్లాగే బ్రహ్మము తనకంటే భిన్నమైన అజ్ఞాన – జ్ఞానములు లేనిదై ఉన్నది. జన్మ – జరామరణ వర్జితమైయున్నది. జ్ఞాత – అజ్ఞాత రూపమంతా బ్రహ్మమే! ఓ సభికులారా! మీరు నా పరంగా చూస్తున్నదంతా మీ ఆత్మ స్వరూపమే అయివున్నది! నా రూపమున మీరు, మీ రూపమున నేను ఆత్మయందే... ఆత్మగానే వెలయుచున్నాము.

ఓ మునీశ్వరా! ఇట్టి జ్ఞానోదయంచేత నేను పునీతుడనయ్యాను. నిర్వాణరూపుడనయ్యాను. అజ్ఞానము యొక్క రూపమును తెలుసుకొని జ్ఞానిని అయ్యాను. ఇప్పుడు నాకు ఎటువంటి సందేహాలూ లేవు. ఇక ఈ దృశ్యము ఎట్లా ఉండాలంటే అట్లే ఉండుగాక! నాకిప్పుడు ఏ కోరిక కూడా లేదు! కోరికలు తొలగాలనే విక్షేపమూ లేదు. విక్షేపరహితమగు ఆత్మ సుఖమందు నెలకొనియున్నాను. వేద–వేదాంగములు "యథాస్థితం – నిత్యం – అనంతం – సర్వమ్ – అధికస్య అధికం – అల్పస్య అల్పం" ...అని అనేక విశేషములు చెప్పే ఆ ఆత్మ నేనే! నేనే ఆత్మారాముణ్ణి! మీలోను – నాలోను – ఆకాశంలోను – భూమిలోను – నా రూపమే సర్వదా నెలకొనియున్నది. మీ వాక్ప్రవాహ మహిమచే అజ్ఞానం ఎప్పుడైతే తొలగిందో ...అప్పుడిక నా స్వరూపమగు బ్రహ్మమునందు ఈ సర్వము నెలకొనియుండకేం చేస్తుంది? బ్రహ్మమే నా స్వస్వభావం కదా! అది క్రొత్తగా వచ్చింది కాదు. ఇతఃపూర్వం ఎప్పుడూ నేను అదే కదా! కాబట్టి "ఇతఃపూర్వం లేనిది ఇప్పుడు వచ్చింది"... అని ఏదో సంతోషించవలసిన అవసరం గాని, "ఇతరులకు లేనిది ఇప్పుడు నాకే లభించింది"... అనే న్యూనాధిక భావాలు పొందే సందర్భంగాని లేదు. ఎందుకంటే తెలియని వారు – తెలిసినవారు ...అంతా ఆత్మ స్వరూపులే కదా!

**సర్వం సదైవాహం అనంతమేకమ్ న కించిదేవాపి అథవాతిశాంతః ॥**
**సర్వం న కించచ్చ సదేకమస్మి నచాస్మి చేతీయమహో ను శాంతిః ॥**

నేనే సర్వదా సర్వరూపమైయున్నాను. అనంతము, ఏకము అని శాస్త్రములు బ్రహ్మము గురించి చెప్పేది నా గురించే! అంతే కాకుండా... సర్వ ఉపద్రవ రహితుడనై, కొంచెము కూడా పదార్థ రూపము కానివాడనై, సర్వమునకు ఆధారమై అద్వితీయమైనట్టి 'సద్రూపం'గా సర్వదా వెలయుచున్నాను! ఈ సభలోని సభికులందరి రూపము నా రూపమే! బ్రహ్మాండాకార రహితుడనగు నేను సర్వ బ్రహ్మాండ రూపుడనై రామబ్రహ్మమునై వెలయుచున్నాను.

దేశ – కాల – ఆధార – అధేయములు లేనివాడనై ఉండటంచేత వాస్తవానికి నేను ఎచటనూ లేనేలేను. అంతా నేనే! కాబట్టి అంతటా ఉన్నది నేనే! నేను ఏదీ కాదు. అంతయూ నేనే! ఆహో! గురుసత్తమా! ఇట్టి నిర్వాణము పరమశాంత రూపమై, పూర్వానుభవముల దృష్ట్యా పరమాశ్చర్యకరము అయివున్నది.

**అధిగతమధిగమ్యం ప్రాప్తమప్రాప్తమన్యైః    గతమిద మలమస్తం వస్తుజాతం సమస్తమ్**
**ఉదితముదిత బోధం తాదృశం యత్ర భూయోః అస్తమయ సముదయానాం నామ నామాపి నాస్తి**

హే మునీంద్రా! హే మహానుభావా! ఇప్పుడు నేను పరమ పురుషార్థరూపమగు బ్రహ్మ తత్త్వమును తెలుసుకున్నాను. అజ్ఞానమునకు సుదూరమైయున్న మోక్ష సుఖమును పొందాను. ఇక ఈ సంసారానర్థరూపమగు వస్తు సమూహమంతా కూడా నాకు పూర్ణముగా నశించినదైపోయింది.

ఎచ్చటైతే మరల మరణం, దుఃఖం ఇటువంటి అనర్థముల ఊసు కూడా ఉండదో... అట్టి చరమ సాక్షాత్కారం నుండి ఉదితమైన ప్రబోధ రూపమే నా పట్ల ఉదయించినదగుచున్నది. నా ఈ ఇతఃపూర్వపు, ఇక ముందటి దేహాలన్నీ నా స్వస్వరూప మహాసముద్రంలోని పిల్లతరంగాలు మాత్రమే!

❖❖❖

## 3. ఆత్మారామోస్మి సర్వదా!

**శ్రీరాముడు :** హే మహాత్మా! ఆ స్వయంప్రకాశమగు చిదాత్మ ఈ సమస్త జీవులపట్ల ఏ ఏ జీవుని మనోవృత్తులందు ఎప్పుడెప్పుడు ఏ ఏ భోగాభిలాషచే వివర్తభావము పొందుచున్నదో, ... అప్పుడప్పుడు ఆయా ప్రకారంగానే అద్దానికంతటికీ "భోక్త – భోగము – భోగ్యము అను త్రిపుటీ రూపంగా (ఆత్మయే స్వయముగా రూపం) దాల్చుచున్నది.

కొన్ని రత్నాలు ఒకచోట ఒక గదిలో ప్రోగుచేసి ఉంచామనుకోండి! ఇప్పుడు ఆ వివిధ రత్నముల కాంతి పుంజములు సమ్మిళితంగాను – అసమ్మిళితంగాను ఆ గదిలో కనిపిస్తాయి చూచారా? అట్లాగే "ఏకము, అవయవరహితము, పరమ సూక్ష్మము"... అగు పరబ్రహ్మమునందు ఒకే అధ్యాస ఒకే సమయంలో అనంత సృష్టుల సమ్మిళితమై ఉంటోంది. అయినప్పటికీ కూడా ... ప్రత్యేక జీవునకు ప్రత్యేక బ్రహ్మాండ... భువనాదులు అతి విస్తీర్ణము కలవై అనుభూతమౌతున్నాయి. అట్టి దృష్టులన్నీ ప్రత్యేకంగా ఉన్నట్లుండి సమ్మిళితములు అగుచున్నాయి.

ఈ సృష్టులు బ్రహ్మమునందు తాదాత్మ్య ధ్యాస చేతనే మనుగడ సాగిస్తున్నాయి. స్వాత్మయందు దేనికీ అవరోధం లేదు. అవకాశమూ లేదు! స్వాత్మ యొక్క స్వరూపమునకు వాటితో ప్రమేయమూ లేదు! విశాలమగు 'పరబ్రహ్మము' అనే రత్నము నుండి ఈ కంటికి కనబడే – కంటికి కనబడని అనేక జగత్ సృష్టులు రత్నము యొక్క కిరణ పుంజముల వలె పరస్పరము సంబంధ – అసంబంధపూర్వకంగా వస్తున్నాయి – పోతున్నాయి.

ఒక గదిలో ఒకే సమయంలో అనేక దీపాలు వెలుగుచుండగా... సమాన నేత్రేంద్రియములు గల జీవులందరికీ ఒకే తీరుగా పరస్పరము అనుభవమగుచున్నట్లు.... సమాన కర్మ – వాసనలచే అధ్యస్తులైన అనేకమంది జీవులకు పరస్పరము సృష్టుల అనుభవం కలుగుతోంది. వేరువేరు కర్మ – వాసనలు గల జీవులకు వేరు వేరు సృష్టుల అనుభవం కలుగుతోంది. ఇంతకు మించి జీవులకు వేరుగా సృష్టులు లేవు. జగత్తులూ లేవు.

అనేక తరంగములతో కూడుకొన్న సముద్రజాలంలోని ప్రతి నీటి బొట్టునందలి లవణ సంబంధమైన రసం ఉన్నది కదా! అట్లా సృష్టియొక్క ప్రతి అణువునందు అనేక బ్రహ్మాండాలు

ఉన్నాయి. ఆ ప్రతి బ్రహ్మాండములోను అసంఖ్యాకంగా అణువులున్నాయి. ఆ అణువులలోని ప్రతి ఒక్క అణువులోను అసంఖ్యాక బ్రహ్మాండాలు ఉన్నాయి. అయితే ఆత్మయొక్క పరమార్థము దృష్ట్యా ఆ అణువుల క్రమమూ లేదు. ఆ బ్రహ్మాండములూ లేవు.

**సర్వత్ర సర్వతోనిత్యం చిద్ఘనస్యాంబు వేదనమ్**
**సంఖ్యాతుం కేన శక్యంతే సర్గాధార పరంపరాః?**

సముద్రమునందలి జల పరమాణువుల యందలి రసమువలె చిద్ఘన పరమాత్మయే సర్వత్రా వెలయుచున్నది. సర్వవ్యాపకము, నిత్యము అగు ఆ చిద్ఘన పరమాత్మ యందు వర్తించుచున్న సృష్టి పరంపరలను లెక్కించటం ఎవరి తరం అవుతుంది?

అవయవి యొక్క వేరువేరు అవయవాలు పేరుకు వేరువేరు కావచ్చుగాక! కాని అన్నిటియందు (కళ్ళయందు, చెవుల యందు, చర్మమునందు వగైరా)... ఒకే అవయవి ప్రసరించి ఉన్నాడు కదా! అట్లాగే ఒకే పరమాత్మ సర్వసృష్టులందు, మనందరి యందు సృష్టి శరీరుడై (జగత్ శరీరుడై) ప్రసరించి ఉన్నారు. ఆతడు 'ఏకం' అయివుండి కూడా మాయచే అనేక, అనంతరూపుడై ఒప్పుచున్నారు.

ఆత్మ స్వభావంగానే 'ఏకము' అయినప్పటికీ... స్వభావ సిద్ధంగానే 'అనేక – అనంత' రూపమై ఒప్పుచున్నది. అద్దాని జగదత్వము అద్దాని స్వభావమే గాని, అందుకు మరొక కారణమేదీ లేదు. అందుచేత ఈ జగత్తు వాస్తవానికి ఉదయించటమూ లేదు. అస్తమించటమూ లేదు. ఈ జగత్తంతా కూడా ఆత్మరూపమే అయి వెలయుచున్నది. సూర్యకిరణములు "మేమే వస్తువులను ప్రకాశమానం చేస్తున్నాం" అని అనుకోకుండానే, (ఎటువంటి కర్తృత్వము వహించకుండానే)... ఈ జగత్ పదార్థములను ప్రకాశమానం చేస్తున్నాయి కదా! అట్లాగే ఆత్మకు భిన్నం కానట్టి అఖండ రూపమగు జ్ఞప్తియే తాను స్వయం ప్రకాశమానంగా స్వయంగా ప్రకాశిస్తూ... తన యొక్క జ్ఞేయ రూపంగా (తెలివియే తెలియబడే రూపంగా)... ఈ సర్వ దృశ్యమును ప్రకాశింపజేస్తోంది.

చూచారా స్వామీ! మీరు ఈ 21 రోజులుగా మావంటి అజ్ఞానులకు అందించిన జ్ఞాన సుధారసం చేత ఈ దృశ్యమంతా ఇప్పుడు బహుమాధుర్యంగా, ఆత్మకు అనన్యంగా అగుపిస్తోంది. ఆత్మతత్త్వజ్ఞానము యొక్క మాహాత్మ్యం చేత ఇదంతా పదార్థ రూపంగా కాకుండా.... స్వయమాత్మ రూపంగా అనుభవమౌతోంది. ఈ విధంగా "జ్ఞానమే జ్ఞేయరూపం"... అను మీ మహావాక్యాలు మాకు ప్రస్ఫుటం అవుచున్నాయి. మాకు ఇతఃపూర్వం జాడ్య రూపంగా అభ్యాసమైన 'తృష్ణ' తొలగిపోవటం చేత "నేను – నీవు – అంతా ఆత్మ రూపమే" ... అను దర్శనం స్వభావసిద్ధమగుచున్నది.

స్వామీ! ప్రతి జీవుడు రెండు విభాగములుగా స్వరూపము (లేక) స్వభావము కలిగియున్నాడు.

**శశ్వరమ్ -** మార్పు చేర్పులు లేనట్టి స్వరూపం / (సత్‌చిత్ ఆనందం)

**నశ్వరము -** అనుక్షణికంగా మార్పు చేర్పులు చెందుచున్నట్టి స్వరూపం (ఈ దేహ మనోబుద్ధుల అంతర్గత విశేషాలు)

ఈ విధంగా ఈ జీవునికి సంబంధించినవై, స్థిరము – చంచలము ... ఈ రెండు కలిసివుంటున్నాయి. మీ బోధచే మాకందరికీ నశ్వర పదార్థముల "తాదాత్మ్యాధ్యాస" సన్నగిల్లినదగుచున్నది. క్రమక్రమంగా

మా అక్షయ స్వరూపం జ్ఞాపకానికి వస్తోంది. ఇంతవరకూ క్షయ స్వరూపములగు విషయములే మా స్వరూపమని భ్రమించాం. కాదు. మేము అక్షయము – అఖండము అగు ఆత్మయే స్వరూపంగా కలిగివున్నాం! ఏ మా అక్షయస్వరూపం మా యొక్క సర్వ శ్రేష్ఠ స్వభావమే అయి ఉన్నదో... అదే సర్వ విక్షేప శూన్యమగు "సమాధానము". అద్దాని నిత్యానుభవమే సమాధి. అదే సంసృతి (సంసారము) యొక్క 'ఆవలివొడ్డు' అయినట్టి నిరంకృతి (శాంతి) స్వరూపం. అదియే నిర్వాణం.

సమస్త అధ్యాసపరంపల యొక్క 'సమాప్తి' చే శేషించే నిర్వాణ స్థితియే ఆ "పరమ పురుషార్థం". అట్టి పరమ పురుషార్థమగు "అఖండాత్మాహమ్" అనునది బుద్ధిచే అనుభూతమవటమే నిర్వాణ స్థితి. అట్టి స్థితికి మేము ఎక్కడికీ వెళ్ళక్కర్లేదు. ఏదో క్రొత్తగా సంపాదంచుకోవలసినదీ కాదు. అయితే "అట్టి పరమ పురుషార్థమగు నిర్వాణస్థితి (లేక) మాయొక్క ఈ దృశ్యమంతా ఏ ఆత్మ స్వరూపమయి ఉన్నదో... అట్టి మా శాశ్వతాత్మానందాత్మ స్వరూపం ఇప్పుడు ఈ బుద్ధితోనే అనుభవిస్తున్నాం. కనుక ఈ బుద్ధియే "పరమ పురుషార్థ ప్రయోజనం". అయితే, "చరమ సాక్షాత్కారబుద్ధి ముక్త స్థితియందు ఆవశ్యకము" అని ఎవరైనా అంటారేమో! అది కూడా సరికాదు. ఎందుకంటారా?... ఈ 'బుద్ధి' అనునది కూడా జడమే!

**న బుద్ధ్యా బుద్ధ్యతే బోధో, బోధా బుద్ధేర్న బోధ్యతే**
**న బుద్ధ్యతేవా తేనాపి, బోధ్యో బోధః కథం భవేత్?**

ఈ బుద్ధి జడమే! కాబట్టి ఇది "పరమ పురుసార్థము – బోధరూపము" అగు ఆత్మను ఎరుగజాలదు. (ఇక్కడ బౌద్ధుల "బుద్ధియే ఆత్మ" అనునది కూడా దాటివేయబడుచున్నది). మా యొక్క సర్వాత్మ స్వరూపం బుద్ధికి కూడా అవిషయమే! బుద్ధిని ఈ దేహమువలె 'నాది' అనవచ్చు గాక! అది నేను కాదు. కొందరు – "నిద్రిస్తున్న రాజును వైతాళికులు (వందిమాగధులు) నిదుర లేపుచున్నట్లుగా బోధరూపమగు పరమాత్మ స్వరూపం బుద్ధిచే మేల్కొలుపబడుచున్నది"... అని అనుకుంటే అనుకోనీయండి. ఎందుకంటే, నిదురిస్తున్న రాజును (బుద్ధి అనే) వైతాళికుడు మేలుకొలుపుటకు ప్రవర్తిస్తున్నప్పటికీ... 'మెలుకువ' అనబడేది వందిమాగధుల రూపం కాదు కదా!

ఈ బుద్ధి బోధరూపం, సర్వాత్మకం, అనునిత్యము అగు నా ఆత్మ స్వరూపమును ఎరుగజాలదు. తానే ఎరుగని నా యొక్క బుద్ధి నా "బోధ" రూపమును నాకు ఎట్లా తెలియజేస్తుంది? మరి?... బోధ చేతనే బోధ ఎరుగబడుతోంది. ఆత్మ చేతనే ఆత్మ అనుభూతమౌతోంది.

వాస్తవానికి ఆత్మచేత ఆత్మ తెలియబడటం కూడా... అంతిమ సత్యం కాదు. ఎందుకంటే ఆత్మ సర్వదా నిష్క్రియం కదా! ఆత్మ నిర్వికారము నిష్క్రియము అయివుండగా... అద్దాని యందు బోధించటమనే కర్తృత్వ భోక్తృత్వాలు ఎక్కడుంటాయి?

❖

అందుచేత హే మహర్షీ! ఆత్మ సర్వదా స్వయంప్రకాశమే! అది ఎల్లప్పుడు స్వప్రకాశత్వముచే ప్రబుద్ధమే అయి, సర్వదా బోధరూపమే అయి ఉన్నది. మేఘములు ఆవరించటం చేత సూర్యుడు

కనబడకుండా ఉంటారు చూచారా? మేఘాలు తొలగితే... సూర్యుడు ఆకాశంలో జాజ్వల్య ప్రకాశమానుడై కనిపిస్తాడు. మేఘాలు ఆవరించి ఉన్నప్పుడు సూర్యుడు స్వయంప్రకాశస్వరూపుడు కాకుండా పోయినాడా? లేదే! అట్లాగే అజ్ఞానావరణచే మా ఆత్మయొక్క స్వయంప్రకాశత్వము మేము గమనించక 'సంసారము' అనే జాడ్యం పొందాం! మీరు ఝంఝామారుతంగా జ్ఞాన వీచికలు మీ ప్రవచన రూపంగా ప్రసరింపజేయటంచేత అజ్ఞాన మేఘాలు ఎటో పరుగులు తీశాయి. ఫలితంగా మా జ్యోతిస్వరూప ఆత్మ ప్రకాశం అంతటా ప్రసరిస్తూ కనిపిస్తోంది.

❖

మహాత్మా! ఇంకా నాకు ఏమి అవగతమైనదో చెప్పుచున్నాను. వినండి.

**సర్వకర్మ వితృష్ణానాం శాన్తేచ్ఛానాం ప్రబోధతః**
**సతామనిచ్ఛతామేవ నిర్వాణం సంప్రవర్తతే ॥**

సర్వ కర్మలందు (వాటియొక్క ఐహిక-పారలౌకిక ఫలాలపై)... అపేక్ష త్యజిస్తూ ఉన్నవారు, సకల కోర్కెలు నశింపజేసుకొనుచున్నవారు, వాసనలు సన్నగిల్ల జేసుకొంటున్నవారు... సజ్జనుల బోధచే తాము ప్రత్యేకంగా కోరుకోకపోయినప్పటికీ... నిర్వాణ స్థితిని సులభంగా పొందుచున్నారు.

'మోహము' అనే నిద్ర నుంచి మేల్కొన్నవాడు, చిదాత్మ స్వరూపమును సుస్పష్టపరచుకొనే ధ్యాననిష్ఠను ఆశ్రయించినవాడు, కేవల చిత్స్వభావమున వర్తించువాడు అగు మహాత్ముడు... ఈ దృశ్యము విషయంలో ఏదీ గ్రహించడు. దేనినీ త్యజించడు. అట్టివాడు ఆయా వ్యవహారములందు తత్పరుడై ఉండవచ్చుగాక! మనస్సుతో లోక వ్యవహారములను మననము చేయవలసినప్పటికీ... అంతరంగమున విషయములందు ఆసక్తి ఉండదు. కనుక ఆతడు అమనస్కుడే! దీపం వెలుగుచూ అంతా చూస్తున్నప్పటికీ... ఏదీ చూడనిదై ఉంటోంది కదా! ప్రకాశించుచు - ప్రకాశింపజేస్తున్న దీపం అక్రియమై ఉంటున్నట్లే... ఆత్మజ్ఞుడు క్రియావంతుడైనప్పటికీ, నిష్క్రియుడై ఉంటున్నాడు.

వ్యుత్థాన కాలంలో (సాధి నిర్విషయ ధ్యానము నుండి లేచిన తరువాత) ఆతనికి ఈ సృష్టి కనిపించవచ్చుగాక! ఆతనికి ఇదంతా బ్రహ్మముగాను, అసృష్టిరూపంగాను, సత్యస్వరూపమగు చిన్మాత్రముగాను సర్వత్రా భాసిస్తోంది.

ఎవడైతే, సమాధియందలి "కేవల బోధ"యే ఉత్థాన కాలంలో దృశ్యరూపంగా కనిపిస్తోందని గమనిస్తూ, "బోధ - సద్రూప" స్వరూపానుభవమునందే స్థితి కొనసాగిస్తూ ఈ ప్రపంచమున ఉదాసీనవృత్తితో వీక్షిస్తూ ఉంటాడో... ఆతడు సర్వ సంసార విక్షేపములను జయించినవాడే అవుతాడు.

సమాధి - వ్యుత్థానములలో సమాన బోధ సంతరించుకొని ఉండటమే ఇక్కడి ఉపాయం. అట్టి బోధయే స్వభావమైనవాడు సంసార పరిశ్రమలనుండి విముక్తుడైనవాడగుచున్నాడు.

❖

శూన్యత్వము ఆకాశము కంటే భిన్నమైనదా? కాదు. అట్లాగే .... ఈ జగత్ పదార్థ సమూహమంతా కూడా "ఆత్మ" కంటే వేరుకాదు. ఆత్మ యొక్క బోధరూపమే జగద్రూపంగా

కనిపిస్తోంది. అందుచేతనే మహాత్ములు“సాక్షి చిన్మాత్ర సాక్షాత్కార రూపము”ను సంతరించు కొనియే ఈ జగత్తులో వర్తిస్తూ ఉంటారు. అనంతబోధ రూపమగు కేవలాత్మ స్వరూపులై ‘తత్‌సత్త’ అను సమస్వరూపం సర్వదా సంతరించుకొని ఉంటారు. అఖండార్ధ వాక్యముల (తత్‌త్వమ్ – సోఽహమ్ – అహమ్ సర్వస్య ప్రభవో, జీవో శివః శివో జీవః – సర్వమ్‌ఖల్విదమ్ బ్రహ్మ... ఇటువంటి మహావాక్యముల) అర్థమే తాము అగుచున్నారు. వారు తమ స్వరూపమును బ్రహ్మ సన్మాత్రముగాను, సర్వ జీవుల రూపంగా (మమాత్మా సర్వభూతాత్మా) దర్శిస్తున్నారు. ఓ సద్గురూ! నా ఆత్మయే ఈ సర్వసభికుల స్వరూపం! వీరందరి యొక్క స్వస్వరూపమే నేను! అట్టి సర్వాత్మ స్వరూపం వాక్కుతోను, సంజ్ఞలతోను నేను ప్రకటించజాలను. కేవలం అనుభవమే అగుచున్నది. అట్టి అనుభవమును వ్యక్తీకరించటానికి వాక్కు సరిపోదు.

“నా స్వస్వరూపము సర్వదా సర్వుల అనంత రూపమునకు సమర్పించబడియే ఉన్నది.” అట్టి బ్రహ్మభావముతో స్థితి పొందినట్టి అనుభూతియే ఆత్మజ్ఞానం. అట్టి ఆత్మజ్ఞానముచే అపూర్వమైన పరమాత్మ సత్తాగా శేషిస్తున్నాను. అట్టి సర్వాత్మ స్థితిగా, నేను శేషించి ఉంటున్నానా? నేను శేషించకయే ఉంటున్నానా? చెప్పనలవికాదు. అది వాక్కుకు అవిషయమని ముందే చెప్పాను కదా! పరబ్రహ్మము వాక్కుకు అతీతము కావచ్చుగాని... అది అనుభవైకవేద్యమే! ఆ కనబడే గోడకంటే కూడా నా పరబ్రహ్మ స్వరూపమే నాకు మరెంతెంతగానో సుస్పష్టమైయున్నది.

❖❖❖

# 4. దృశ్యం .... మమ స్వరూపంచ!

**శ్రీరాముడు :** హే మహాత్మా! మీ ప్రవచనమంతా వినుచుండగా... నాకు నా స్వరూపం పట్ల – ఈ దృశ్యము పట్ల ఏ అభిప్రాయం దృఢపడిందో... అది మీ ముందు విద్యార్థినై విశదీకరిస్తున్నాను. మీ అనుజ్ఞచే నా అనుభవాన్ని పరిమిత సాధనమైన వాక్కులో ప్రకటిస్తున్నాను. మరికొంత వినండి.

❖

‘తత్’ అని పిలువబడే ఆ పరమాత్మ సర్వుల సత్తామాత్ర స్వరూపుడై ఉన్నాడు. ఇక్కడ మీ పాదపద్మములను స్పృశిస్తూ ఆ రామానంద తత్ స్వరూపమే ... ఈ పలుకులు పలుకుచున్నది.

ఏ సత్తా సామాన్యము యొక్క స్వరూపము ఏ ‘తత్ పదార్థము’ అయిన ఆత్మ అయివున్నదో... ఆ సత్తాసామాన్యమే ఈ ‘త్వమ్’ – ‘అహమ్’ కూడా అయివున్నది. నాకు కనబడే త్వమ్ (నీవు – మధ్యమ పురుష) ఇత్యాది వ్యవహారమంతా నా స్వరూపమే! ఈ ఆకాశము – భూమి – సూర్యచంద్రులు మొదలైన జాగృత్ – ఊహారూపమైన స్వప్నము – నిర్లిప్త స్వరూపమైన సుషుప్తి... ఇదంతా నా నుండే, నా రూపంగానే బయల్వెడలుచున్నాయి. జగత్తంతా అస్తి – భాతి – ప్రియ రూపమగు అనుభవమే కదా! నా అనుభవమే ఈ దృశ్యము. నా అనుభవం నా స్వరూపమే కదా! కనుక ఈ “శోధితత్వమ్” అనబడే దృశ్యము నేనే! ఇదంతా నా సద్రూపమే!

**సమస్తము కూడా శాంతము - నాశరహితము అగు ఆత్మరూపమే! -** ఇదంతా కూడా నిర్వాణ రూపమే! అనగా... ఈ దృశ్య సత్తా, నిర్వాణరూపము, తృష్ణారహితము, అత్యంత స్వచ్ఛము, పరమశీతల సుఖ స్వరూపము – పరమ ప్రేమాస్పదము అయినట్టి – ఆత్మసత్తయేగాని, మరింకొకటేదీ కాదు! సర్వము ఆత్మ స్వరూపంగా, ఆత్మబోధమాత్రంగా దర్శించుటకై బ్రహ్మ – విష్ణు – మహేశ్వరులు కూడా వాంఛిస్తూ ఉంటారు. వారికి సర్వదా – "శుద్ధము – స్వప్రకాశరూపము – సర్వులకు సదా ప్రేమాస్పదము" – అగు చైతన్యమే అనుభవైక విషయమగుచున్నది. అట్టి శుద్ధ చైతన్యమే సర్వపదార్థ రూపంగా కూడా ఉదయిస్తోంది.

చైతన్యమే ద్రష్ట రూపం! చైతన్యమే దృశ్య రూపం! దృశ్యము చైతన్యరూపమే కాబట్టి "దృశ్యము నశించటం"... అనునదేదీ లేదు. దృశ్యమును దృశ్యరూపంగా దర్శిస్తే... అదియే సంసారము. దృశ్యము సంసారరూపంగా దర్శిస్తే... ఇదంతా దుఃఖప్రదమే! దీనిని నిర్వాణరూపంగా, (లేక) బోధరూపంగా (లేక) ఆత్మరూపంగా దర్శిస్తే... ఇదంతా నిరతిశయ పరమానందరూపమే! అట్టి నిర్వాణరూపమే (ఆత్మరూపమే) అంతటా దృశ్యరూపంగా కూడా ఉన్నది. సంసారము కల్పితమే కాబట్టి... లేనేలేదు!

ఒక శిల్పి తన బుద్ధి (లేక) యోచనను అనుసరించియే శిల్పమును చెక్కుచున్నాడు కదా! శిల్పియందు శిల్పరూపం బుద్ధియందు ఉన్నట్లే, అఖండ పరిపూర్ణ బ్రహ్మము నందు జగత్తంతా కూడా ఉండి ఉన్నది. జలాశయంలోని శాంత జలం నుండే తరంగ సమూహములు స్ఫురిస్తున్నాయి! ఏ తరంగమైనా కూడా తనయొక్క జలత్వము కోల్పోయినదెప్పుడు? కోల్పోనే లేదు కదా! ఆ తరంగాలన్నిటిలో జలమే ఆకాశాదులుగా ఏర్పడి ఉన్నది కదా! నాశరహితమగు మహాచైతన్యమే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములలో... ఆయా పంచకోశములుగా స్ఫురిస్తూ దృశ్యరూపముగా కూడా అనుభూతమౌతోంది.

వాస్తవానికి చిదాకాశము అవిభక్తము అయివున్నది. అట్లు అవిభక్తం అయివుండి కూడా ... అజ్ఞానావృతము – జడప్రాయము అయినట్టి అనేక కృత్రిమ వేషములను ధరిస్తోంది. చిదాకాశము విభక్తమైనదానివలె భ్రమచే అగుపిస్తోంది. అది ఏ ఏ జీవులచే ఏ ఏ ప్రకారంగా చిరకాలం భావించబడుచున్నదో, వారి వారికి ఆయా ప్రకారములుగానే – భోగ – మోక్షరూపమై ప్రాదుర్భవిస్తోంది.

**మృతేవాపి అమృతేబన్ధౌ, స్వప్నే స్వప్న విబోధినః**
**న యథోదేతి సత్యాఖ్యా, తథా దృశ్యేషు తద్విదః ॥**

ఒకనికి స్వప్నంలో తన బంధువు చచ్చిపోయినట్లు కల వస్తూ ఉన్నదనుకోండి. ఆ స్వప్న ద్రష్ట దృష్టిలో స్వప్న సమయంలో ఆ బంధువు చనిపోయినప్పటికీ... వాస్తవానికి ఆ బంధువు మరణించనేలేదు కదా! స్వప్న సమయంలో "ఈ స్వప్నంలో కనిపించిన బంధువు చావు నిజమైన చావు కాదు"... అని గ్రహించకుండానే బంధు మరణం అనుభవిస్తున్నాడు. అట్లాగే అజ్ఞానికి "ఈ

దృశ్యము ఈ ఈ రూపములు వాస్తవమే"... అని అనుకుంటున్నాడు కాబట్టి, "దుఃఖములకు అర్హుడను" అని అనుకుంటున్నాడు. ఇక తత్త్వవేత్తకో... దృశ్యముపట్ల సత్యత్వబుద్ధి ఉదయించటమే లేదు. అందుచేత ఆతనికి హర్షంగాని, శోకంగాని కలగటమే లేదు! ఎవనికైతే ఈ దృశ్య జగత్తంతా కూడా "శాంతం – శివం" అగు పరబ్రహ్మ స్వరూపమే అయివున్నదో – అట్టి భావన అత్యంత దృఢ తరంగా అగుచున్నదో... అట్టి వానికి ఇక 'భ్రాంతి' అనేది ఎక్కడుంటుంది? ఎక్కడినుండి పుడుతుంది?

ఒకనికి రాత్రి స్వప్నంలో ఒక తాటి ఫలవృక్షం కనిపించింది. ఆ పళ్ళు కోసుకొని తినాలని ప్రయత్నించసాగాడు. కాని తాడిచెట్టు ఎక్కలేక, ఆ తాటి పళ్ళు కోసుకోలేక, వాటిని వదలలేక ఎంతో ప్రయాసపడుచున్నాడు. ఇంతలో ఆతనికి మెలుకువ వచ్చింది. "అయ్యో! ఆ తాటిపళ్ళు కోసుకొని రుచి చూడనేలేదే ఈలోగా, ఏమిటో, ఈ పాడు మెలుకువ రానేవచ్చింది?"... అని ఆతడు దుఃఖాన్ని పగలంతా కొనసాగిస్తున్నాడా? లేదే! అట్లాగే "అఖండము – అప్రమేయము అగు ఆత్మయే నేను"... అను రూపంలో పూర్వజ్ఞానం ఉదయించిన తరువాత ఇక ఆపై దేహ సంబంధములైన భోగాలో, వాటికి సంబంధించిన ఉపాయాలలో 'తృష్ణారాహిత్యం' జనించటమనేది స్వభావ సిద్ధమే!

తృష్ణారాహిత్యం చేత ఆత్మజ్ఞానం వర్థిల్లుతోంది. ఆత్మజ్ఞానముచే తృష్ణ వైతొలగుతోంది.

**వైతృష్ణాత్ వర్ధతే బోధో, బోధాత్ వైతృష్ణ్య వర్ధనమ్,**
**పరస్పరేణ ప్రకటే, ఏతే కుడ్య ప్రకాశవత్**

వెలుతురు వల్ల గోడ కనిపిస్తుంది. గోడ ఉండటం వలన దిశ యొక్క వెలుతురు కనిపిస్తుంది. అట్లాగే ఆత్మజ్ఞానం – తృష్ణరాహిత్యం ఒకదానివలన మరొకటి వర్థిల్లుచున్నాయి. ఎక్కడ తృష్ణారాహిత్యం వృద్ధి చెందుచూ వస్తుందో .... అక్కడ జడదృష్టి యొక్క అభావం పెంపొందుతూ వస్తుంది.

ఎంతెంతగా జడత్వం తొలగుతూ ఉంటే,... ఇదంతా అంతంతగా "ఆత్మ చైతన్యరూపంగా" ఈ దృశ్యము ప్రస్ఫుటమవుతూ వస్తోంది. అంతే కాకుండా... ఎక్కడ ధన – దార – పుత్రాదులయందు తృష్ణ వృద్ధి చెందుతూ వస్తుందో... అచ్చట అదేరీతిగా జడదృష్టి ప్రవృద్ధమై, అంతంతవరకు బోధ దృష్టి (ఇది బోధరూపమే... అనుభవజ్ఞుని స్వకీయమైన అనుభవ రూపమే ... అనే దృష్టి) సన్నగిల్లుతూ వస్తోంది. "బోధ" యొక్క "బోధత్వము"... అనే పాండిత్యము తృష్ణారాహిత్యమే అయివున్నది. ఇక మూర్ఖత్వము యొక్క స్వరూపమో... తృష్ణ కలిగియుండటమే అయివున్నది.

ఓ సభికులారా! "1. తృష్ణా రాహిత్యం (వాసనాక్షయం), 2. బోధయొక్క ఆధిక్యత ... ఇవి రెండూ పరస్పరం వృద్ధి చెందుచున్నప్పటికీ... ఇవి రెండూ దృశ్య సంబంధమైనవే కదా! ఆత్మ యొక్క అదృశ్య స్వరూపం వల్ల మాకు ఆత్మానుభవం లభిస్తుందా?"... అని మీమాంస పొందకండి. ఆత్మత్వము పొందటానికి మరెక్కడో వెతకకండి. దృశ్య సంబంధమైన కోరికలు తగ్గించుకొనే ప్రయత్నంలో ఉంటే చాలు... ఆత్మానుభూతి దానంతట అదే మీ గుమ్మం తొక్కుతుంది. అంతేగాని దృశ్య సంబంధమైన కోరికలను కొనసాగిస్తూ "మాకు అఖండాత్మానుభూతి, ఆత్మ సాక్షాత్కారం లభించదే?"... అని అనుకుంటూ ఉంటే... లాభమేమున్నది?

**పరమాబోధ వైతృష్ణ్య సంపత్తి : 'మోక్ష' ఉచ్యతే**
**తత్రానన్తే పదే శాంతే వసతా చ న శోచ్యతే ॥**

ఎందుకంటారా? ఆత్మజ్ఞాన సమాచారం తృష్ణా రాహిత్యానికి సహకరిస్తోంది. తృష్ణ వలననే సర్వ దుఃఖాలు వచ్చిపడుచున్నాయి. తృష్ణా రాహిత్యమే స్వయంగా దుఃఖ క్షయ స్వరూపం. తృష్ణా రాహిత్యమే మహనీయుల దృష్టిలో ఉత్తమోత్తమ సంపద. కనుక 'తృష్ణారాహిత్యం' అనే ఔషధం అత్యవసరం అయివున్నది. అనంతము - పరమశాంతము అగు మోక్షపదము అధిరోహించిన జీవునకు ఇక శోకమంటే ఏమిటో కూడా తెలియదు!

❖

హే మహర్షీ! ఇప్పుడు నాకు మీరు – మా తండ్రిగారు – సభికులు – భూత భవిష్యత్ సర్వ జీవరాసులు – నేను .... అంతా బ్రహ్మము రూపంగా భాసిస్తున్నారు.

**గతం గమ్యం, కృతం కార్యం, దృష్టం దృశ్యమశేషతః**
**యావత్ సర్వ శివం శాంతం ఏకమ్ ఆద్యమ్ అనామయమ్ ॥**

బోధ (నిర్మల ప్రజ్ఞా) స్వరూపుడనగు నేను ఈ బోధ్యరూపంగా (తెలియబడే ఈ సర్వముగా) వెల్లివిరిసి ఉన్నాను. ఆహా! ఏదైతే పొందతగినదో అది పొందినవాడనయ్యాను. చూడవలసినది పరిపూర్ణంగా చూస్తున్నవాడనై ఉన్నాను. ఈ సమస్తమూ కూడా ఇప్పుడు నాకు శివరూపమై, శాంతమై, ఏకమై, ఆద్యమై, నిర్వికారమైనట్టి బ్రహ్మముగానే భాసిస్తోంది. ఇప్పుడు నేను ఆత్మారాముడను, అధ్యాత్మరాముడను అయ్యాను! పరమశాంతమును పుణికి పుచ్చుకున్నాను. తృష్ణా రహితుడను, అహంకార వర్జితుడను అయ్యాను! ఇప్పటికి నా అంతరంగం సంకల్ప రహితమై, ఆకాశమువలె అతి నిర్మలమైయున్నది.

❖

మహాత్మా! ఎందుకో ఈ జీవులలో అనేకులు ఆత్మజ్ఞానం విషయంలో అశ్రద్ధ గలవారై అనేక దుఃఖములకు అనవసరంగా ఎర అగుచున్నారే! ఏమి ఆశ్చర్యం! ఈ ఇంద్రియ విషయాలలో వారు ఏవేవో వెతుకుచూ మోసపోవుచూ... అవకాశములను వృథా చేసుకుంటున్నారు. తెలుసుకోవలసినది తెలుసుకోకుండా... అందుకు వేరైన దృశ్య విశేషాలు ఎన్ని తెలుసుకొని ఏం ప్రయోజనం?

**సహస్రేభ్యః సహస్రేభ్య కశ్చిత్ ఉత్థాయ వీర్యవాన్ ।**
**భినత్తి వాసనా జాలం పంజరం కేసరీ యథా ॥**

చాలామంది ఈ దృశ్య సంస్కారాలను జయించే ప్రయత్నమే చేయటం లేదు. 'తృష్ణ'ను ఆశ్రయించి, అనేక జన్మలుగా... ఈ దృశ్యంలో ఏదో పొంది, ఎప్పటికో ఆనందించాలని అనుకుంటూ పరుగులు కొనసాగిస్తూనే ఉన్నారు. వారి దుఃఖాలు తొలగటమే మన ఈ సంవాదం ప్రయోజనం కదా!

అట్లా విషయ తృష్ణలను జయించాలని కొంతమంది మాత్రమే ప్రయత్నిస్తున్నారు. ఆ విధంగా ప్రయత్నించే వారిలో కొద్దిమంది మాత్రమే విషయతృష్ణను జయించి వీర్యవంతులనిపించుకుంటున్నారు.

అట్టి వీర్యవంతులు పంజరమును ఛేదించిన సింహంలాగా వాసనా జాలమును ఛేదించి "ఆత్మానందము" అనే సువిశాల భూమిలో ప్రవేశించి ఆనందిస్తున్నారు. మన ఈ సంవాదము అనేకులకు వాసన ఛేదమునకు మార్గదర్శకమగుగాక!

ఆ విధంగా శుద్ధ బోధయుక్తుడు, వాసనాక్షయం సముపార్జించుకున్నవాడు, అభ్యంతరమున పరమ ప్రకాశయుక్తుడు, ఆత్మజ్యోతిని సముపార్జించుకున్నవాడు .... స్వయంగా పరమశాంతిని పొందుచున్నాడు. జ్ఞేయమగు ఆత్మను ఎరిగినవాడై, ఆతడు సంకల్పములకు ముందే ఉన్న తన స్వరూపమును అంతటా అన్నిటా దర్శిస్తున్నాడు.

సర్వ సంకల్పములను అతిక్రమించిన ఆశయము కలవాడై ఉంటున్నాడు... ఇక ఆపై వాయువు ఉద్దేశరహితంగానే దేహములలో ప్రవేశించి ఉజ్జీవింపచేయటం, చెట్ల ఆకులను కదల్చటం... ఇవన్నీ నిర్వర్తిస్తుంది చూచారా! ఆ విధంగా వాసన వర్జితుడై, ఈ జగత్తులో చేష్టలను సలుపుచూ ఉంటున్నాడు. సమస్త పదార్థముల పట్ల తత్త్వమననం ('తత్ త్వమ్ అసి' – అని మరల మరల సంభావించటం) చేస్తూ ఉంటాడు కదా! అందుచేత, ఆత్మకు వేరుగా ఎప్పుడైనా అనిపిస్తే ... అది భ్రమయేనని గమనించియే ఉంటాడు. "సమస్త పదార్థములు ఆత్మ స్వరూపమే! కేవల చైతన్యమాత్రమే" ...అను నిర్మల దృశ్యరహిత భావనయే "వాసనారహిత స్థితి" అయివున్నది.

అట్లాగే, వాసనారహిత భావన ఉదయించినప్పుడు సర్వము పరబ్రహ్మ స్వరూపంగా అనిపించటం అత్యంత స్వభావసిద్ధమైయున్నది. ఆతనికి "ఈ సర్వము బ్రహ్మమే" అని అనిపించటమే ముక్తి! అదియే స్థిర నిర్వాణ పదము. అట్టివాని పట్ల సర్వ సంసార ప్రశమనము స్వయంగా ప్రకటితమౌతోంది.

❖❖❖

## 5. శిష్య పరీక్షార్థ ప్రశ్నలు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు ప్రబుద్ధుడవు అయ్యావయ్యా! నీవిప్పుడు చెప్పిన వాక్యాలు అజ్ఞానుల పామరదృష్టులను హరించేవై ఉన్నాయి. అనుభవసిద్ధములు, యుక్తియుక్తములు కూడా! అందుచేత జ్ఞానులకు ఆనందమును గొలుపుచున్నాయి. నీవు చెప్పినదంతా పరమ సత్యమే! ఈ దృశ్య జగత్తు అసత్తే అయినప్పటికీ... సంకల్పముల కారణంగానే ఈ ఈ రూపములుగా భాసించుచున్నదగుచున్నది. నిస్సంకల్పము చేతనో... ఇదంతా సర్వదా మొదలంట శమించినదే అగుచున్నదది. ఆత్మగా అనిపించటమే దృశ్యము యొక్క శమనము. ఆత్మగా అనిపించగానే సర్వము సశాంతి పొందుచున్నది. అదియే పరమార్థము. నీవు చెప్పినట్లుగా... "చలనము – చలన రహిత స్థితి" ఈ రెండూ కూడా వాయువు యొక్క రూపములే అయి ఉన్నాయి కదా! అట్లాగే... కల్పనా రూపమగు బంధము, అకల్పనా రూపమగు మోక్షము... ఈ రెండూ కూడా పరబ్రహ్మము యొక్క రూపములే అయివున్నాయి. అంతేగాని అవి మరొక రూపం కాదు. పరబ్రహ్మమునందు ఏకత్వము

లేదు. ద్వైతమూ లేదు. ప్రబుద్ధుడైన మనుజుడు 'సమాధి – వ్యవహారము' – ఈ ఉభయ సందర్భాలలోనూ ఒకానొక అనిర్వచనీయమైన శిలాగర్భము వంటి నిశ్చలస్థితి వహించి ఉంటున్నాడు. అట్టి నిర్వాణ పదమునందు నిశ్చల స్థితి కలిగి ఉండి జీవన్ముక్తులు వ్యవహారములోను – సమాధి యందు కూడా సమాన రూపంగా వర్తిస్తున్నారు. అట్లాగే ప్రబుద్ధులగు బ్రహ్మ – విష్ణు – మహేశ్వరులు, తదితర జీవన్ముక్తులు కూడా ఇటు వ్యవహారమునందు – అటు సమాధి యందు నిత్య చిద్ఘన పదమునందు సదా వెలయుచున్నారు. నీవు కూడా మావలెనే చిన్మయ పదమును సముపార్జించుకుని జీవన్ముక్తుడవై ఉండెదవుగాక!

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జగత్తు బ్రహ్మమునందు బ్రహ్మమే అయి, – అసద్రూపంగాను, ఉత్పత్తి రహితంగాను, అప్రకాశరూపంగానూ, ఆరంభమే లేనిదానిగానూ, ఆకార శూన్యంగానూ మిథ్యగానూ భాసిస్తోంది. మృగతృష్ణలో జలం, ఆ జలంలో ఆవర్తములు కనిపిస్తాయి చూచారా? బంగారంలో ఆభరణం కనిపిస్తోంది కదా! స్వప్న – సంకల్పములలో పర్వతములు, ఇళ్ళు, వాకిళ్ళు ఎప్పుడో చూచిన, ఎప్పుడూ చూడని నగర వీథులు అగుపిస్తాయే! అట్లాగే పరబ్రహ్మమునందు ఈ జగత్తు భాసిస్తోంది!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బిడ్డా! రామచంద్రా! నీ వాక్యాలు మృధుమధురములు. పరమ సత్యములు. అయితే నోటితో చెప్పగలగటం వేరు, అనుభూతి / అనుభవం వేరుకదా! అందుచేత నీ బోధాభివృద్ధి కొరకు, (అంతే కాకుండా) మన ఈ సంవాదము మరికొన్ని విశేషాలు ముముక్షువులకు అందించటానికి వీలుగాను, శిష్య పరీక్షార్థము కొన్ని ప్రశ్నలడుగుతాను. సర్వ సభికులకు నీ సమాధానాలు సంశయములన్నిటినీ తొలగించటమే నా ఉద్దేశం.

ఈ దృశ్యము అందరికీ ఎదురుగా ప్రత్యక్ష ప్రమాణములచే దృఢీకరించబడినదై, అర్థక్రియా సామర్థ్యంతో కూడినదై ఉంటోంది కదా! నెత్తి మీద కూర్చుని ఉన్నదానివలె అగుపిస్తోంది. అట్లు మహాప్రకాశశీలమై ఉన్నప్పటికీ... ఈ 'జగత్తు' అనే అభాస లేకపోయేవున్నదని ఎట్లా చెప్పగలవు?

**శ్రీరాముడు :** మహాత్మా! సర్వ జగదనుభవములకు ముందుగా అనుభవజ్ఞుడు ఉండాలి కదా! అనుభవజ్ఞుడు (అనుభవాలు ఎరుగువాడు) ముందుగానే ఉండి ఉండకపోతే అనుభవాలకు నాంది ఎక్కడిది? అట్టి అనుభవజ్ఞుడు సర్వానుభవాలకు మునుముందుగా ఆత్మ స్వరూపుడే అయివున్నాడు. అట్టి కేవలాత్మ స్వరూపుని సమక్షంలో 'జగత్ దృశ్యము' అనబడే బాహ్యత్వము జనించటానికి కారణము కాగలిగినదేమి ఉన్నది? ఏదీ లేదు. కారణమే లేనప్పుడు కార్యము ఎక్కడుంటుంది? కనుక ఈ జగత్తు ఉత్పన్నమే అయివుండలేదు. గొడ్రాలి రెండవ కుమారుడు – మూడవ కుమార్తెల ఆస్తి తగాదాలు ఎక్కడుంటాయి? ఈ జగత్తు ఈ రీతిగా భ్రమయే అయివున్నది.

స్వప్న ద్రష్టకు వేరుగా స్వప్నము లేనట్లే, జాగ్రత్ ద్రష్ట యొక్క స్వకీయ తాత్పర్యమునకు వేరుగా జాగ్రత్ దృశ్యము కూడా లేదు. దేని నుండి ఈ జాగ్రత్ భ్రాంతి ఉత్పన్నమైనదో... అట్టి దానికి ఆత్మకు వేరుగా కారణమెక్కడున్నది?

పోనీ కారణము ద్రష్ట స్వస్వరూపమగు బ్రహ్మమని అందామా? అది కుదరదు. బ్రహ్మము సదా నిర్వికారము – జరామరణ రహితము కదా! అట్టి నిర్వికార బ్రహ్మము దృశ్యమునకు కారణం ఎట్లా కాగలదు? అవజాలదు. బ్రహ్మమే కాకుండా దృశ్యము యొక్క కల్పనకు మరొక కారణమెక్కడిది? మరొకటేదైనా ఉండి ఉంటే ఆత్మ "అనన్యం" ఎట్లా అవుతుంది? దృశ్యమునకు 'ఇది' అనతగిన రూపమెక్కడిది? పైగా, సవికారమైన ఏ వస్తువైనా సరే... ఒకానొక పూర్వావస్థ నశిస్తేనే వర్తమాన అవస్థ పొందుతోంది కదా! సృష్ట్యాదిలో సర్వము పదార్థ శూన్యము అయివుండగా... కేవలము చైతన్యం మాత్రమే శేష్యమైయుండగా... ఏ పూర్వావస్థ నుండి ఈ జగత్ పదార్థముల ఉత్పన్నమవగలవు?

❖

అవాచ్యము (వాక్కుచే చెప్పబడలేనిది) – నిర్వికారము అగు బ్రహ్మమే, త్రాడు పాముగా కనిపిస్తున్నట్లుగా ఈ రీతిగా జగదాకారంగా విజృంభిస్తోందని అందామా? అప్పుడిక జగత్తు యొక్క శబ్ద అర్థములు సత్యములై లభించనట్లే కదా? "రజ్జు సర్పభ్రాంతి"లో సర్పము మొదలే లేదు కదా! "త్రాడు 'సర్పము' అనే రూపమును దాల్చింది"... అనేది (రజ్జు – సర్పభ్రాంతిలో) అయుక్తం కదా!

కాబట్టి... అవాచ్యము, శాంతము అయినట్టి బ్రహ్మపదమున బ్రహ్మమునకు అనన్య స్వరూపుడగు "హిరణ్యగర్భుడు" అనే (జలంలోని ప్రథమ తరంగం వంటి) ప్రప్రథమ చైతన్యతరంగము... కొంచెం నామరూపాత్మకమైన సూక్ష్మశరీరం ధరిస్తోంది.

స్వప్నంలో కొద్ది సమయం తన స్వల్ప కల్పనా శరీరములో తనకు అనన్యమైన స్వప్న దృశ్యమును ప్రతిజీవుడు తనకు అన్యమైనదానివలె చూస్తూనే ఉన్నాడు కదా! అట్లాగే ప్రప్రథమ చైతన్య స్వరూపుడగు హిరణ్యగర్భుడు కూడా ఒకింతకాలం వివర్తరూపమగు సూక్ష్మశరీరం ధరించినవాడై ఉంటున్నాడు. అట్టి స్వప్న సదృశ సూక్ష్మశరీరం... ఈ జీవుని స్వప్నంలా కాకుండా... బహుదీర్ఘకాలం కొనసాగవచ్చు గాక! కానీ, ఈ ముల్లోక జగత్తు ఆ హిరణ్యగర్భుని సుదీర్ఘ స్వప్నమే అయివున్నది. సత్య సంకల్ప రూపుడగు ఆ బ్రహ్మదేవునకు దేశ – కాల – క్రియాది సమన్వితమగు ఈ జగత్తంతా కూడా చిదాకాశమునందే స్వయంగా భాసిస్తోంది.

**తస్మిన్ మిథ్యోపసంపన్నే స మిథ్యాపురుషస్తతః**
**మిథ్యైవ తత్సమాచారం కుర్వన్తి విపరివర్తతే ॥**

మిథ్యా భూతమగు ఈ జగత్తునందు,మిథ్యా రూపుడే అగు ఆ బ్రహ్మదేవుడు... మిథ్యగానే ఈ భూత – భువనాది సర్వ సమాచారములను గావించుచు ... వివర్త భావమును పొందుచున్నాడు.

ఆయనే అనర్థరూపములైనట్టి అనేక పదార్థ సంరంభముల గూర్చిన భ్రమను కల్పిస్తున్నారు. స్వకల్పితములగు లోకములలో ప్రవేశించి వ్యష్టి జీవరూపంతో పుణ్య – పాపభోగార్థం తన కల్పిత త్రిజగత్తులందు తానే తిరుగాడుచున్నారు. ఆతని సంకల్పము యొక్క పూర్వస్థితి ఎట్టిదో ... ఇప్పటి

స్థితి కాకతాళీయంగా అట్టిదే అయివుంటోంది. ఆతని సంకల్పము చేతనే జగత్తునందు ఈ ఎదురుగా కనిపించేదంతా సుస్థిరస్థితి వలె అగుపిస్తుంది. అట్టి సంకల్ప నిర్మితమైన ఈ దృశ్య జగత్తు మిథ్యగానే స్థితినొందియున్నది.

**శిలా -వన్ధ్యాసుత న్యాయం -**

**శిలా వన్ధ్యాసుతముఖే వ్యోమ చూర్ణేన రంజనమ్**
**కరోతి ఇత్యాదివత ఇదం, మిథ్యాజగదుపస్థిమ్ ॥**

ఒకానొక ప్రదేశంలో ఒకచోట శిల ఉన్నది. ఆ శిల ఒక సమయంలో కామవికారం పొంద సాగింది. ఇకప్పుడు తనకు తగిన ఒక ప్రియుని కొరకై వెతకసాగింది. వెతకగా, వెతకగా ... ఆ శిలకు ఒక గొడ్రాలి పెద్దకుమారుడు నవయౌవనుడై కనిపించాడు. ఆ శిల ఆ గొడ్రాలి కుమారుణ్ణి సమీపించింది. తన హాస – విలాస – విన్యాసాలతో ... ఆ గొడ్రాలి కుమారునికి తన ప్రేమను తెలియజేసింది. అప్పుడు ఆ వంధ్యా పుత్రుడు కూడా ఆమె అంటే ఎంతో ఇష్టపడ్డాడు. అనేక ఇబ్బందులను, అడ్డులను అధిగమించి వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకున్నారు. వివాహానంతరం తన పతి సౌందర్యం చూచి ఆ శిల మురిసిపోయింది. అప్పుడు ఆ శిల తన ప్రియుని ముఖంలోకి చూచి, కించిత్ ఆదుర్దాగా, "అయ్యో! అదేమిటీ! నీ ముఖానికి బొట్టు లేదేం"? అని వయ్యారంగా పలికింది. అప్పుడు ఆ గొడ్రాలి కుమారుడు తన ప్రియ సఖియగు ఆ శిలను చూచి, "ఓ ప్రియురాలా! నీ కోసం నేనేమైనా చేస్తాను! ఇక బొట్టు మాత్రం ఎందుకు ధరించను? నీవే నా నుదుటికి బొట్టు అలంకరించు...." అని అనునయంగా పలికాడు. అప్పుడా శిల తన చేతులతో ఆకాశమును చూర్ణం చేసి, చూపుడు వ్రేలుతో తిలకంగా చేసి తన ప్రియుడగు ఆ వంధ్యా పుత్రుని నుదిటిపై ఆ తిలకంతో కళ్యాణపు బొట్టును పెట్టి, అలంకరించి ఎంతో సంతోషించింది. అప్పుడొక మహోత్సవం జరిగింది. ఆ మహోత్సవానికి భూమిపైగల వంటపాత్రలు చాలక ... చంద్రమండలం నుంచి కూడా మరికొన్ని వంటపాత్రలు తెప్పించారు.

... ఇటువంటి వాక్యముల అర్థసారంలాగా (ఆద్యంతమూ ఏమాత్రం సమకూడని విధంగా) ఈ జగత్తు మిథ్యగానే స్థితినొంది ఉన్నది. వాస్తవానికి ఈ జగత్తు "ఆకాశ కోశము"వలె అతి స్వచ్ఛమై, శిలయొక్క గర్భభాగంలాగా చిద్ఘనమై, పరమ మౌన – శాంతరూపమై, నాశరహితమై వెలయుచున్నది.

జగత్తు = సర్వాకారుడు – సర్వ సంకల్పధారుడు – చిన్మాత్రరూపుడు అయిన విరాట్ పురుషుని యొక్క "సూక్ష్మ శరీరము" నందు గల విషయాభిముఖమైన స్ఫురణము. అట్టి స్ఫురణమే ఈ జగద్రూపంగా భాసిస్తోంది.

❖

ఈ ప్రకారంగా ఈ సమస్తము కూడా సర్వదా – 'విషయత్వము' మొదలైన దోషములు లేని బ్రహ్మమే! ఇదంతా దోషరహితమైన, సచ్చిదానందరూపమై, శాంతము – ఏకము – ఆద్యంత

వర్జితము అగు బ్రహ్మాకాశమే అయివున్నది. ఇక 'జగత్తు' అని దేనిని అనగలం? జలంలో అనేక తరంగముల ఉత్పత్తి – వినాశనములు సంభవించవచ్చుగాక! వాటిలో ఏ తరంగం జలంకన్నా భిన్నం? అట్లాగే బ్రహ్మమునందు ఈ జగత్తు యొక్క సృష్టి – స్థితి – ప్రళయముల మాత్రంచేతకూడా బ్రహ్మము కంటే ఈ జగత్తుకు భిన్నత్వం ఏమాత్రం లేదు! శుద్ధ జలబిందువు శుద్ధ జలంలా స్వభావ సిద్ధంగా లయమొందుతుంది, చూచారా? అట్లాగే.... సారాసారములను గూర్చిన వివేకము గల తత్త్వజ్ఞానులు కొందరు ఈ సభలో ఉండియున్నారు. వారు 'శుద్ధ బ్రహ్మము' అనే ఏకరసత్వము పొందియే ఉన్నారు.

ఆహా! ఏమి ఆశ్చర్యం! ఈ జగత్తు పరబ్రహ్మం యొక్క అవయవమా అన్నట్లుగా, (లేదా) పరబ్రహ్మం యొక్క కార్యమా అన్నట్లుగా బ్రహ్మమునకు భిన్నమైన దానివలె భాసిస్తోంది! కాని విచారించి చూస్తేనో?... ఈ జగత్తు బ్రహ్మమే అయివున్నది! ఎందుకంటే శాంతం, నిర్మలం, నిష్క్రియం అగు బ్రహ్మమునందు, బ్రహ్మం చేతగాని, మరింకే కారణం చేతగాని జగత్తు ఏర్పడజాలదు.

స్వప్న పదార్థములన్నీ... స్వాత్మరూపమే అయివున్నాయి! దృశ్యరూపములన్నీ ... బ్రహ్మమే అయివున్నాయి. మృగతృష్ణగా కనిపించేదంతా... ఎడారి భూములే కదా! ఎరుగబడిన తరువాత స్వప్నాదులందు ఎవరికి సత్యత్వబుద్ధి ఉంటుంది? అట్లాగే... ఈ జగత్ దృశ్య విషయం కూడా!

శ్రోత్రియుడగు బ్రాహ్మణునకు మద్యము మత్తు ఏమిటో తెలియదు కదా! అట్లాగే జ్ఞాని ఈ దృశ్యము ఏమిటో...బాహ్య రూపమగు ఈ ప్రపంచపు భోగరసము యొక్క విశేషరుచి ఏమిటో ఎరుగుటలేదు. ఈ సంస్పర్శజనిత భోగములు వస్తుతః పైకి ఆకర్షితంగా కనిపిస్తున్నప్పటికీ... ఇవి దుఃఖ ప్రదములే! ఇట్టి విషయోన్ముఖత్వము భ్రమచేతనే రూపుదిద్దుకుంటోంది. అందుచేత ఈ దృశ్యము స్వకీయమగు ఆత్మరూపంగా ఎరుగుటచేతను, నిజశుద్ధ రూపంగా దర్శించటం చేతను నిత్యముక్తమగు ప్రశాంతాత్మానుభవం సిద్ధిస్తోంది.

ప్రియజనులారా! మీరంతా అట్టి స్వస్వరూప ప్రశాంతాత్మత్వ దృష్టిచే మీకు కనబడుచున్న ఈ వారి దృశ్యమును పునీతం చేసుకొనెదరు గాక!

❖❖❖

# 6. శ్రీరామ జగద్దర్శనం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మరొక ప్రశ్న. బీజంలో అంకురం ఉంటుంది చూచావా? ఆ విధంగా కారణభూతమగు బ్రహ్మమున కార్యభూతమగు ఈ 'జగత్తు' అనబడే దృశ్యము విద్యమానమగుచున్నదని అనుకోవచ్చు కదా! కనుక ఈ జగత్తు సత్తాస్వరూపమే అవుతుంది కదా? అంతేగాని, ఈ జగత్తు స్వతహాగా లేదని ఎందుకు సిద్ధాంతీకరించాలి?

**శ్రీరామచంద్రుడు :** మహాత్మా! బీజమునందు అంకురము (మొలకెత్తే వృక్షము) అంకుర రూపంలో ఉండి ఉంటే... అప్పుడు మనం "అకురం బీజం పొట్ట చీల్చుకొని బయల్వెడలుతోంది"... అనవచ్చు

నేమో! కానీ, మనం బీజమును ఛేదించి చూచామనుకోండి. అప్పుడు అందులో అంకురం లభిస్తుందా? లేదే! బీజము అంటే ఏమిటి? బీజము నందలి అంకుర సంబంధమైన సత్తా విభాగమే బీజము. అంతేగాని బీజము ఆకారమో, పై చర్మమో బీజం కాదు కదా! కనుక బీజమే అంకురంగా పరిణతి పొందుతోంది! ...అనునది ఇక్కడ సిద్ధిస్తోంది.

కానీ... బ్రహ్మమునందు జగత్ సత్త అట్లా లేదు. బ్రహ్మమే జగత్తు వలె సర్పరజ్జుభ్రాంతి విశేషంగా అనిపిస్తోంది. బ్రహ్మము నందు జగత్తు ఎక్కడున్నది? అది సదా దాగివుండటం, ఒకానొకప్పుడు బయల్వెడలటం... ఇది యుక్తీయుక్తం కాదు. అందుచేత బ్రహ్మము – జగత్తులకు బీజాంకుర న్యాయము ఏమాత్రం తగియుండటమే లేదు.

స్వామీ! నిర్వికారమగు దాని నుండి సవికారమగు వస్తువు, నిరాకారమైన దానినుండి సాకారమైనది ఉత్పన్నమవటం ఎట్లా కుదురుతుంది? అట్టిది నేను విని ఉండలేదు. చూచి ఉండలేదు. కాబట్టి నిర్వికారమై, అవయవ రహితమైన బ్రహ్మమునందు సాకారము – సావయవము అయినట్టి జగత్తు ఉండజాలదు. ఆవగింజలో ఏనుగుల గుంపు ఎక్కడైనా ఉంటుందా?

"ఒక పెట్టెలో (పేటికలో) రత్నము ఉన్నట్లుగా ఈ జగత్తు బ్రహ్మమునందు కలదు" ...అని కొందరు చేస్తున్న ప్రతిపాదనకూడా నా ఉద్దేశంలో వృథా ప్రేలాపనవంటిదే! ఎందుకంటారా? నిరాకారమగు దానియందు గొప్ప సాకార జగత్తు ఉన్నదనటం ఎట్లా పొసగుతుంది?

కొందరు "సాకార జగత్తుకు బ్రహ్మమే ఆధారం" అని అంటున్నారు. అది కూడా కుదిరేది కాదు. ఎందుకంటే, సర్వ వస్తు రహితము – పరమ శాంతము అగు పరబ్రహ్మము సర్వ వస్తు సహితము – అశాంతము అగు జగత్తునకు ఆధారం ఎట్లా అవుతుంది? ఆధారము – ఆధేయము కొంత సమాన ధర్మములు కలిగినవై ఉండాలి కదా! అందుచేత ఈ కనబడే దృశ్యమునకు బ్రహ్మమే ఆధారం అనటం కూడా ఏమాత్రం యుక్తియుక్తం కాదు.

"ఒకడు నిదురించగానే స్వప్న దృశ్యం ఉత్పన్నమౌతోంది కదా! అట్లాగే... బోధ (ఆత్మ)యే క్షణిక సాకారయుక్తంగా ఉత్పన్నమగుచున్నది" అనే సిద్ధాంతం కూడా కుదిరేది కాదు. ఎందుచేత నంటారా? జాగ్రత్తునందు బాగుగా అనుభవించబడి బాగుగా, అభ్యస్తమైనట్టి పదార్థములకు (దృశ్యమునకు) సంబంధించిన సంస్కారములే స్వప్నంలో స్వప్నరూపంగా సాక్షాత్కరిస్తున్నాయి. ఇది అందరికీ తెలిసినదై, అనుదినం అనుభవమగుచున్న విషయమే కదా! ఇక ఈ సృష్టియో... పూర్వకాలమున అనుభవించబడినది కాదు కదా! ఇప్పటికిప్పుడు ప్రత్యక్షంగా, కళ్లకు ప్రమాణ రూపంగా అగుపిస్తోంది. కనుక ఇది 'స్వప్నమాత్రము' కాదు. కాబట్టి ఏది జాగ్రత్తో... అదియే స్వప్నము అను (బౌద్ధుల) సిద్ధాంతము కథనంకూడా యుక్తము కాదు. జాగృత్ – స్వప్నము ఒక్కటే అయివుంటే స్వప్నంలో మరణించిన బంధువు జాగ్రత్తులో కూడా మరణించాలే గాని, జీవించివుండకూడదు కదా! కానీ ఆతడు ఆ మరునాడు తెల్లవారగానే ఎట్లా కనిపిస్తాడు? కాబట్టి ఈ జాగ్రత్ జగత్తు క్షణికమాత్ర స్వప్నము వంటిదని అనవీలులేదు.

ఇక మరొక సిద్ధాంతము (చార్వాకులు) ను అనుసరించు “ఈ జీవుడు స్థూల శరీరుడే! ఈ దేహము నశించిన తరువాత జీవుడు కూడా నశిస్తాడు! ఈ జీవునకు స్థూల శరీరమే ఉన్నదిగాని, ఆ తదనంతరంగాని, ఇప్పుడుగాని, (శరీరము ఉన్నప్పుడు గాని) ఆతనికి మరొక సూక్ష్మ శరీరమేదీలేదు”... అని చెప్పటం కూడా సముచితం కాదు. ఎందుకంటే... ఈ జగత్తులో పిశాచా దులు, వాటి యొక్క స్వప్నము వంటి స్థితులు లోక ప్రసిద్ధమే అయి వున్నాయి కదా!

కాబట్టి హే మహర్షీ! ఆత్మ చైతన్యము సర్వదా నిరాకారమే అయి, తన చిత్స్వరూపముననే స్థితి కలిగియున్నది. స్వప్న ద్రష్ట నిరాకారుడైనప్పటికీ స్వప్నం సాకారంగా కనిపిస్తోంది. వాస్తవానికి స్వప్నము కూడా నిరాకారమే! అట్లాగే ఆత్మ చైతన్యమే ‘సృష్టి’ అనబడే వివిధాకారములుగా అజ్ఞాన దృష్టికి అగుపిస్తున్నది. జ్ఞానదృష్టిచే – సాకరమగు జగత్తు నిరాకారమగు పరమాత్మయే అయివున్నది” ...అను సిద్ధాంతం ఇక్కడ ఒనగూడుచున్నది.

స్వప్నంలో చైతన్యమే తనయందు తాను పర్వతాది ఆయా ఆకారములుగా స్థితి కలిగి ఉండటం సుస్పష్టమైన విషయమే కదా! అట్లాగే సర్వజీవులలోని సాక్షి చైతన్యము సర్వసంబంధరహితమగు బ్రహ్మమే అయివున్నది. ఆ సాక్షి చైతన్యముచే జగత్ రూపంగా అజ్ఞానంచేత పొందబడుచున్నది. (లేక దర్శించబడుతోంది) స్వప్న దృశ్యం ఉన్నదా? లేదా? స్వప్నద్రష్టకు ఉన్నది. మరొకరికో, ఆ స్వప్నదృశ్యం లేదు. స్వప్నము మిథ్యయేనని మేల్కొనిన తరువాత ఆ స్వప్నద్రష్ట గమనిస్తూనే ఉన్నాడు కదా! అట్లాగే అజ్ఞానదృష్టిచే ఈ జగత్తు ఉన్నది. జ్ఞాన దృష్టిచే ఇది పరమాత్మ స్వరూపమే అయివున్నది. ఇదియే ఇక్కడి బ్రహ్మము – జగత్తుల సత్ – అసత్ సంబంధం! అనగా... ఈ జగత్తు సత్–అసత్ రూపంగా విజృంభించుచున్నదై, అనిర్వచనీయమై, స్వానుభవవేద్యమై, అజ్ఞాన దశయందు అనుభవించ బడుచున్నది. ఆత్మజ్ఞానము ఉదయించినప్పుడో... ‘జగత్’ అనబడునది అనుభవించబడకయే (పొందబడకయే) పోతోంది. అనగా ఇదంతా జ్ఞానిచే బ్రహ్మముగానే దర్శించబడుతోంది. ఈ భావ – అభావాలన్నీ కూడా జ్ఞాని దృష్టిలో సర్వదా ఆత్మ ప్రకాశ రూపమును సంతరించుకుంటున్నాయి. భావము అభావ రూపంగాను, అభావము భావరూపంగాను (ఆత్మ నిత్యానుభవంగాను, జగత్తు మిథ్యానుభవంగాను) అగుచున్నది.

**బృంహతి బ్రహ్మణి బ్రహ్మ వ్యోమ వ్యోమని వర్ధతే**
**నచోపపద్యతే కించిత్ బ్రహ్మ వ్యోమ్ని విబృంహణమ్**

బ్రహ్మాకాశమున బ్రహ్మాకాశమే జగత్‌రూపంగా వర్ధిల్లుతోంది!... కానీ, వాస్తవానికి నిర్వికారమగు బ్రహ్మాకాశమున ‘జగత్తు’ అనబడేది వర్ధిల్లటానికి అవకాశమే లేదు. ఈ ద్రష్ట – దర్శనము – దృశ్యము – వీడు – వాడు – నేను – నీవు ... ఇత్యాదిగాగల ఈ సృష్టి విభ్రమమంతా కూడా... శాంత స్వరూపమగు చిదాకాశము యొక్క అనన్యవిస్తార స్వరూపమే! కాబట్టి ఈ జగత్తుకు సాకారత్వం వాస్తవానికి లేదు! ఏ విధంగా స్వప్నంలోను, సంకల్పం (ఊహ)లోను కనిపించే నగరము – భవనము వగైరా సత్యమే కాదో, .... అట్లాగే సాకారంగా పొందబడినప్పటి ఈ జగత్తు సత్యమే కాదు! ఇదంతా కూడా శాంతము – ఏకము – నిర్వికారము అగు బ్రహ్మమే అయివున్నది.

**పూర్ణం హి పరమం శాన్తమిదమ్ సర్వమఖండితమ్**
**అనిఙ్గనమ్ అనాభాసం అనాద్యంతం అచేతితమ్ ॥**

ఈ కనబడే ప్రపంచమాతా కూడా "పూర్ణము - పరమశాంతము - నిష్క్రియము - విషయాభాస రహితము - ఆద్యంత శూన్యము - స్వప్రకాశ రూపకము - అఖండము - అద్వితీయము"... అయినట్టి బ్రహ్మమే అయివున్నది.

❖

హే మహాత్మా! జనన మరణ రహితము - పరమశాంతము - ఆద్యంత వర్జితము - మహత్తరము - ఉపాధి వర్జితము - నిరాకారము అయినట్టి స్వాత్మపదమునును మీ అనుగ్రహంచేత నేను దర్శిస్తున్నాను. గమనిస్తున్నాను. అనుభవం పొందుచున్నాను. ఈ నా వాక్యము సత్యము .... సత్యము... సత్యము! అంతఃకరణం ఏ వృత్తిరూపం పొందితే అదియే ఈ వాక్యప్రవాహంగా ఇప్పుడు ఉదితమౌతోంది. ఏ బీజమును భూమిపై నాటితే అది ఆ రూపంగానే అంకురించునట్లు, మీరు ఏ పాఠ్యాంశం మాకు ప్రకటించి ఉన్నారో,... అదియే మాకు మా స్వస్వరూపానుభవము యొక్క మాధుర్యాన్ని చవిచూపుతోంది. ఈ జగత్తును స్వస్వరూపంగా ప్రత్యక్షానుభవం ప్రసాదిస్తోంది.

**శుద్ధ జ్ఞానమయైకాత్మా ద్వైతైక్య పరివర్జితః**
**మనాగపి నజానామి ద్వైతైక్య కలనాకలామ్ ॥**

శుద్ధ జ్ఞానమయము - ద్వైతైక్య రహితము అయినట్టి ఆత్మ నేనే అయివున్నాను. ద్వైతైక్య కల్పన నాకు లేనిదే అగుచున్నది. ఇక ఈ కనబడే జీవులంతా కూడా... నా దృష్టియందు శాంత స్వరూపులే! సర్వేంద్రియ వ్యాపార రహితులు! సర్వక్రియా వర్జితులు! వీరందరి స్వరూపము బ్రహ్మమే! కనుక అందరు కూడా సదా జీవన్ముక్తులై ఆకాశమున శూన్యత్వంలాగా బ్రహ్మమునందు బ్రహ్మముగానే స్థితినొందియున్నారు. ఈ జగత్తు శబ్ద - స్పర్శ - రూప - రస - గంధాది అనేక విశేషములతో వివిధములైన కార్యారంభములతో కనిపించవచ్చు గాక! అయినా కూడా నా దృష్టిలో ఇప్పుడు ఇదంతా గోడపై రంగులతో చిత్రించబడినట్టి "తుపానుగాలికి సముద్ర మధ్యంలో చిక్కుకున్న ఓడ" వలె మౌనస్వరూపము, ఆభాసమాత్రము, మనో రాజ్యము వంటిది అయివున్నది. శిలయందు చెక్కబడిన శిల్పంలాగా, కథలోని రకరకాల పాత్రలలాగా, ఆకాశంలో శంబరాసురుని మాయచే కల్పించబడిన ఇంద్రసభలాగా స్వప్నమువలె ఉదయించి భాసించుచున్నదే అగుచున్నది! హే మహాత్మా! ఏదైతే సృష్ట్యాదియందే స్వప్నమువలె ఉదయించినదై ఆలంబన రహితంగా, నిరాకారంగా భాసించి ఇప్పటికీ కొనసాగుతోందో... అట్టి ఈ దృశ్యమునందు సత్యత్వమనేది ఎక్కడిది?

ఈ జగత్తు అజ్ఞానియొక్క దృష్టియందు సత్యమే! కానీ... వివేకి యొక్క దృష్టిలో మిథ్య మాత్రమే! ఇక... బ్రహ్మ స్వరూపంగా గాంచువాని దృష్టిలో ఇది బ్రహ్మమే అయివున్నది. భూమికలను అధిగమిస్తూ వచ్చిన ఉత్తమ సాధకుడగు మనుజునియందు ఇదంతా క్రమంగా శమించినదై చివరికి మహాకాశమువలె శూన్య స్వరూపంగా పర్యవసించినదై ఒప్పుచున్నది. పూర్ణ జ్ఞాని దృష్టియందు "నాతో సహా" ఈ స్థావర జంగమాత్మక జగత్తంతా కూడా చిదాకాశరూపమే అయివున్నది.

ఓ గురువర్యా! నేను చిదాకాశ రూపుడనే! మీరుకూడా చిదాకాశరూపులే! ఈ జగత్తంతా కూడా చిదాకాశమే! నా ఈ వాక్యమును పరీక్షించటానికై మీరు చిదాకాశ స్వరూపముతో ఏకత్వం పొంది నా చిదాకాశరూపమును నిరభ్యంతరంగా, దర్శించవచ్చు! హే మహర్షీ! మనుజులలో పరమ శ్రేష్ఠులు, బ్రహ్మాకాశ స్వరూపమును సంతరించుకున్నవారు అయిన మీ నిజస్వరూపమును ఆకాశమువలె నిర్మలము, శుద్ధ జ్ఞానానందము, సర్వాత్మకము, పూర్ణానందైక బ్రహ్మమునకు అభిన్నము అయినదానిగా ఎరుగుచున్నారు. ఆత్మజ్ఞానమును ప్రసాదించినట్టి తమ పాద పద్మములకు సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించుకుంటున్నాను.

❖

సూర్యుడి నుండి కారణము లేకయే కిరణములు అనేక ప్రదేశములపై ప్రసరించి ఆయా వస్తుజాలమును విద్యమానంగా చేసివేస్తున్నాయి కదా! అట్లాగే కారణము లేకయే చిద్రూపము నుండి ఈ జగత్తు ఉత్పన్నమగుచు... మరల చిద్రూపమునందే లయించుచున్నది. కాబట్టి ఇది నిర్మల చిదాకాశ రూపమే అయివున్నది!

ఓ మునీంద్రా! మీరు నాకు చిదాకాశరూపులే అయి కనిపిస్తున్నారు! అట్లే ఈ సభికులంతా కూడా! అట్టి మనందరి కేవల చిదాకాశరూపము సమస్త శాస్త్రయుక్తులను అధిగమించినదై ఉన్నది. సర్వ పదములకు అతీతమైయున్నది. ద్వంద్వవర్జితమై ఉన్నది. మీరు నా స్వరూపులే! ఈ సర్వజనులు సర్వదా నా స్వరూపులే! (తత్త్వమసి అను) వేదవాక్యముల భావార్థం నాకిప్పుడు సుస్పష్టంగా ద్యోతకమౌతోంది. నేను, నా కాళ్ళు, – చేతులు – కళ్ళు మొదలైన సర్వ అవయవములు, బాహ్యమందలి ఈ ఘట–వస్త్రాది సర్వ వస్తువులు, ఈ సమస్త జగత్తు... ఇదంతా నామరూపాదుల దృష్ట్యా వాస్తవం కాదు. ఇవన్నీ ... ఇదంతా అతి నిర్మలము – మహాసూక్ష్మము అయినట్టి చిదాకాశరూపమే అయివున్నది.

❖

హే మహాత్మా! శ్రీ వసిష్ఠ మహర్షీ! ఈ విధంగా ఈ దృశ్యజగత్తు పదార్థసహితం కాదు! కేవలము బ్రహ్మమే "నేను, నీవు, దృశ్యజగతు, మనోబుద్ధి చిత్త అహంకారాలు, దేహాలు, దేశాలు – పంచభూతాలు, సప్త సముద్రాలు, ఇంద్రియాలు, ఇంద్రియ విషయాలు, జన్మ మృత్యు పునర్జన్మాదులు స్వర్గ భూపాతాళ లోకాలు, త్రిమూర్తులు, స్త్రీ పురుషులు, ఆకాశం, భూమి, గ్రహాలు, ఆరామాలు, బాహ్యము, అంతరము, పైన – క్రింద, దిక్కులు, గ్రామాలు, పట్టణాలు, నేడు, నిన్న, మొన్న, క్షణాలు, యుగాలు, సుఖదుఃఖాలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులు" ...ఈ విధంగా ఏకానేక విశేషాలుగా కనిపిస్తోంది. ఇవన్నీ వస్తురూపంగా పొందబడడం అట్టిది భ్రమమాత్రమే! వాస్తవం కాదు. అయితే బ్రహ్మమే ఇవన్నీ! కాబట్టి, తరంగములు జలమునకు వలె, స్వప్నము స్వప్న ద్రష్టకువలె, ఆలోచన ఆలోచించువానికివలె ...ఇవన్నీ బ్రహ్మమునకే చెందినవై, బ్రహ్మమునకు అభిన్నమై, బ్రహ్మమునకు పర్యాయపదములై ఉన్నాయి.

హే మహాత్మా! మీరు – నేను – మా తండ్రిగారు – మా ముగ్గురు తల్లులు – నా సోదరులు – ఈ సభికులు – నేను ముందు ముందు సంహరించబోయే దుర్జనులు – నేను రక్షించబోయే సజ్జనులు – నన్ను భక్తితో ఆరాధించబోవువారు – అందరూ బ్రహ్మమే! నాకు సమర్పిస్తున్న నమస్కారం బ్రహ్మమునకే చెందుతుంది!

ఒక్కమాటలో చెప్పాలంటే ... బ్రహ్మమే అజ్ఞానముతో కూడిన అవగాహనచేత ఈ సర్వజగత్తుగా కనిపిస్తోంది. విజ్ఞానంచేత జగత్తుగా కనిపించేదంతా బ్రహ్మముగా అనిపిస్తోంది. బ్రహ్మముగా ఇదంతా సత్యమే! నామరూప పాదార్థాత్మికంగా కనిపించినా కూడా ఆబ్రహ్మస్తంభ పర్యంతము (బ్రహ్మదేవుని నుండి ఒక జడమగు స్తంభము వరకు) బ్రహ్మమే!

స్వామీ! నా అనుభవము – అనుభూతి – దర్శనములను ఈ విధంగా ఉన్నది ఉన్నట్లుగా ప్రకటించాను. అయితే ఇక్కడ ఏ పదార్థముల అభావత్వము నేనిప్పుడు ప్రకటిస్తున్నానో... అది తార్కికవాదుల సభలో నచ్చవచ్చు. నచ్చకపోవచ్చు. "ఈ దృశ్యము పదార్థ రహితమగు కేవల బ్రహ్మమే" ...అనే నా సుస్పష్టమైన అనుభూతిని తార్కికుల సభలో "వితర్కము" ...అని అనుకో వచ్చునేమో మరి. "నా తల్లి గొడ్రాలు. నా నోట్లో అసలు నాలుకే లేదు" ... ఇటువంటి వాక్యాలవలె ఆ తార్కికులకు నింద్యముగాను, వారి వాదోపవాదముల దృష్ట్యా లభించకపోవచ్చునేమో? కానీ ఏ సభలో ఆత్మజ్ఞానము గురించి విచారణ జరుగుతోందో, "పరమ పురుషార్థమగు జ్ఞానము ఏది?" ...అని తీవ్రమైన పరీక్ష జరుగుచున్నదో... అట్టి వారి సభలో నా ఈ అనుభూతి – అనుభవ వాక్యాలు తప్పక శోభిస్తాయి.

ఎందుకంటారా?... సమస్త పదార్థముల యొక్క 'అభావము' లేకపోయిందా?... ఆత్యంతికమైన 'అనర్థ నివృత్తి' రూపమగు నిరతిశయానందము సిద్ధించదు!" అని నా అభిప్రాయము, నా సమాధానం కూడా! బ్రహ్మము వాదోపవాదములచే లభించేది కాదు. (యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహా, బుద్ధిగ్రాహ్యం – అతీంద్రియమ్, తదంగీకార సూచనం మౌనం, స్వానుభవంతు కేవలం ...మొదలుగా గల) వేదోపనిషత్తు అభిప్రాయములను అనుసరించి బ్రహ్మము వాదోపవాదాలకు విషయం కాదు. అందుచేత కాష్ఠమౌనరూపమగు "సర్వ పదార్థ అభావము" ...అనబడే కేవలీస్థితి వాదములచే ప్రతిపాదించి నిరూపించటం సాధ్యపడేది కాదు. శుష్క వాదములచే ఆత్మజ్ఞానం ఉదయించదేమో! నిర్మల విచారణ మాత్రమే అందుకు మార్గం, ఉపాయం కూడా! ఏదైతే ఈ ప్రత్యక్షాది ఇంద్రియములకు విషయమే కాదో, ప్రమాణములచే పొందబడజాలదో, ఎద్దానియందు ఏ చిహ్నము ఏమాత్రం లేనేలేదో... అట్టి స్వానుభవరూపమగు బ్రహ్మము వాదములతో నిరూపించి చెప్పలేమని ఇక్కడ నా అభిప్రాయం. అయితే అందుకు అనుభవమే ప్రమాణము.

ఇక్కడున్నదంతా చిద్రూప బ్రహ్మమే! అందుకు వేరైనదంటూ ఎక్కడా ఏదీ లేదు. బ్రహ్మముకంటే వేరుగా ఏది ఎక్కడ అనిపించినా అది భ్రమయే మూలముగా కలిగియున్నది. అట్టి ఈ జగత్తుగా (భ్రమచే) అనిపిస్తున్నట్టి (వాస్తవానికి పదార్థ రహితం అయినట్టి) ఇదంతా కూడా జగత్‌నామధేయ

పరబ్రహ్మమే అయివున్నది. ఈ దృశ్య జగత్తు ... సమస్త శాస్త్రార్థముల యొక్క ఆత్యంతికసారం బ్రహ్మమే అయివున్నది. అనుభవమే ప్రమాణముగా కలిగియున్నట్టిది. అది చిహ్నరహితం. అతి నిర్మలము. కేవల చిదాకాశరూపము. ఏకము – జన్మవర్జితము – ఆద్య స్వరూపము. నామరూప రహితము – శుద్ధము – కల్పనా శూన్యము.

పరబ్రహ్మమే దురభ్యాసవశం చేత అనుభవమాత్రమగు దృశ్యజగత్తుగా అనిపిస్తోందేమో! అనగా, నాకు జగత్తుగా కనిపించేదంతా బ్రహ్మముగా అనిపిస్తోంది. చిద్రూప పరబ్రహ్మమునకు అనన్యమైనదేదీ ఎక్కడా లేదు. ఎందుకంటే ఆ పరబ్రహ్మము అనన్యము – అద్వితీయము కదా! అట్టి నిర్మల పరబ్రహ్మమే అంతటా ఉండి ఉండగా, ఇక "ఆ బ్రహ్మమునందు జగత్తు ఉన్నదా! లేదా?" ఇటువంటి వికారాది నామరూపాదుల గురించిన, దోషాదుల గురించిన శంక వలన ఏం ప్రయోజనం? శంక ఎందుకుండాలి?

❖❖❖

# XV. "దారు - వైవధిక" ఆఖ్యానం

## 1. కట్టెల కోసం పోయి చింతామణి తెచ్చుకోవటం

**శ్రీ వాల్మీకి మహర్షి:** ఓ మహాబుద్ధీ! భరద్వాజా! ఈ విధంగా శ్రీరామచంద్రుడు "ఈ దృశ్యముగా కనపించేదంతా బ్రహ్మమే కాబట్టి, బ్రహ్మముగా దర్శించే దృష్టిని పెంపొందించుకోండి"... అని సంవాదసారమును మనకందరికీ ప్రకటించాడు. బ్రహ్మానందమున ప్రవేశించి పరమాత్మ పదమున విశ్రమిస్తూ కనులు మూసుకున్నాడు. సభ అంతా నిశ్శబ్దం తాండవించింది. సభికులంతా కూడా రామచంద్రమూర్తి యొక్క ఆత్యంతికమైన "ఇదమ్ సర్వమ్ పరబ్రహ్మమేవ"... అను పాఠ్యాంశసారాన్ని మృధుమధురంగా ఆస్వాదిస్తూ రామచంద్రునివలె మౌనం వహించారు. సభంతా నిశ్శబ్దం తాండవించింది. ఆ విధంగా రెండు ఘడియలు (24 mts x 2) గడచిపోయాయి.

నెమ్మదిగా రామచంద్రుని పద్మనయనములు విచ్చుకున్నాయి. ఆతని ముఖంలో పరబ్రహ్మానందం తాండవిస్తోంది. తనకు అంతా తెలిసికూడా గురుముఖతః విని ఆనందించాలని కొంచెము కుతూహలత్వమును స్వయంగా ఆహ్వానించి... లీలా పూర్వకంగా బ్రహ్మర్షియగు శ్రీవసిష్ఠులను ఇట్లు ప్రశ్నించాడు.

❖

**శ్రీరామచంద్రుడు :** సంశయమనే మేఘములను తొలగించగల ఝంఝామారుత స్వరూపులగు ఓ గురువర్యా! ఇప్పుడు మనస్సులో జనించిన ఒక తుచ్ఛమైన సందేహమును మీముందుంచుతాను. తద్వారా మీ వాక్ప్రవాహ మాధుర్యాన్ని ఈ సర్వ సభికులతో సహా, ముందు ముందు ముముక్షువులతో సహా... మేమంతా ఆస్వాదిస్తాము.

హే మునీంద్రా! "పరమాత్మ సమస్త వాక్కులకు అతీతమైయున్నది"... అనునదే సంసార సముద్రమును దాటించగల మహాజ్ఞానమైయున్నది కదా! ఆ సద్రూప బ్రహ్మము... "స్వానుభవమాత్ర నిశ్చయరూపం. అవాచ్యము. మహాత్ముల వాక్కునకు కూడా విషయం కాలేకపోతోంది" అని చెప్పబడుతోంది. మనం అది గమనించాం. అది జ్ఞేయరూపం. సర్వ సంకల్పవర్జితం. స్వానుభవరూపం. జాగ్రత్ – స్వప్న – సుషుప్తులనబడే అవస్థాత్రయమునకు అతీతం. అయ్యది తురీయ స్వప్రకాశ వస్తుమాత్రంగా లభించవలసిందే! మరి ఈ శాస్త్రాదులలో, ... ఇవన్నీ కూడా జాగ్రత్‌కు మాత్రమే అంతర్గతమై ఉన్నాయి. విధంగా జాగ్రత్ మాత్ర విషయాలైనట్టి గురు – శాస్త్రాదులకు ఆ పరబ్రహ్మము "దుర్జ్ఞేయం అని... అనవలసి వస్తోంది మరి!

**ప్రతియోగి–వ్యవచ్ఛేథ సంఖ్యా భేదైషినాం కిల?**
**కథం శాస్త్ర పదైః తుచ్ఛైః సవికంపైరవాప్యతే?**

జాగ్రత్ పరిమితములగు ఈ శాస్త్రాదులు, సవికల్పరూపములే కదా? మరి బ్రహ్మమో... నిస్సంకల్ప - నిర్వికల్ప రూపమై ఉన్నది.

ప్రతియోగి ... "జగత్తు పరమాత్మయందు లేదు"

వ్యవచ్ఛేదము ... "పరమాత్మకంటే భిన్నంగా ఏ పదార్థము సత్యము కాదు"

భేదము ... "పరబ్రహ్మం అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ పంచకోశముల కంటే విశిష్టము - విభిన్నము అయివున్నది"

సంఖ్య ... ఏకమైన బ్రహ్మమే కలదు.

ఇటువంటి సవికల్పరూపములగు వాక్య, వాదోపవాద, సిద్ధాంతములచే వాక్కుకు-మనస్సుకు అతీతమైయున్న పరబ్రహ్మము ఎట్లా లభ్యమౌతుంది చెప్పండి? ఇటువంటి సిద్ధాంతాలు - వాదోప వాదాలు, ప్రవచన, ఖండనాలు వికల్పరూపాలే కదా! వికల్పాలతో కూడిన శబ్దాలతో శాస్త్రాలు నిర్మించ బడ్డాయి. అటువంటి శబ్దజాలంతో కూడిన శాస్త్రాలు నిశ్శబ్ద రూపమగు బ్రహ్మాన్ని ఎట్లా అందిస్తాయి? అందించవేమోనని అనిపిస్తోంది. మరి అటువంటప్పుడు "వివిధ వికల్ప సహితం, భ్రాంతి పరంపరా రూపం" అగు గురుబోధలు, శాస్త్ర ప్రతిపాదనలు... ఇవన్నీ ఎందుకు కల్పించబడుచున్నాయి?

**గురు శాస్త్రాది విజ్ఞానే కారణంవా? అస్తి అకారణమ్?**
**తదత్ర నిశ్చయం, బ్రహ్మన్! బ్రూహి మే వదతాంవర!**

ఓ మహావక్తా! బ్రహ్మర్షీ! ఈ కారణంచేత... ఆత్మజ్ఞానం విషయంలో గురు - శాస్త్రాదులు కారణం కాగలవా? కారణం అవజాలవా? ఈ నా సంశయమునకు మీ నిర్ణయం ఏమిటో ప్రవచించమని ప్రార్థన!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ మహాబాహో! రామచంద్రా! నీవు చెప్పినది యథార్థమే!

**ఏవమేతత్ మహాభావో! న శాస్త్రం జ్ఞానకారణం।**
**నానా శబ్దమయం శాస్త్రం అనామ చ పరం పదమ్ ॥**

శాస్రాదులు బ్రహ్మజ్ఞానమునకు సాక్షాత్ కారణం కాజాలవు. ఎందుకంటే... శాస్త్రములన్నీ నానావిధములైన శబ్ద వికల్పములతో కూడుకొని ఉన్నాయి. ఇక బ్రహ్మపదమో... అది 'అనామయము' అయివున్నది. కానీ...

**తథాపి, రాఘవశ్రేష్ఠ! యదైవతద్ధేతుతాం గతమ్**
**శాస్త్రాద్యుత్తమ బోధస్య తత్సమాసేన మే శృణు ॥**

అయినప్పటికీ కూడా... గురు... శాస్త్రాదులు ఉత్తమ బ్రహ్మజ్ఞానము యొక్క బోధకు కారణమౌతున్నాయి. అంతేకాదు అవసరమగుచున్నాయి. తత్ఫలమైనట్టి మోక్షమునకు కారణం కూడా అగుచున్నాయి. ఈ విషయాన్ని విశదీకరిస్తూ ఆధ్యాత్మ శాస్త్రంలో "దారు - వైవధికన్యాయం" అనే ఒకానొక దృష్టాంతపూర్వకమైన సిద్ధాంతం చెప్పబడుచూ ఉన్నది. అద్దాని గురించి సంక్షిప్తంగా ఇప్పుడు చెపుతాను విను.

❖

**దారు - వైధక న్యాయం -** ఒకానొక కొండ ప్రాంతంలో 'కీరక' అనే పేరుగల ఆటవికుల దేశము వర్ధిల్లుతోంది. ఆ కీరకజాతి ఆటవికులలో కొందరు కావడి మోస్తూ జీవించే సంచార జాతికి చెదిన వైవధిక తెగ ప్రజలు ఉండేవారు. ఆ కావడి మోసేవారు (వైవధికులు) క్రమంగా కాలమహిమచేత దేశంలో నెలకొన్న యుద్ధ వాతావరణం కారణంగా వారి వారి జీవనోపాధులను కోల్పోయారు. కటిక దారిద్ర్యం అనుభవించసాగారు. వారంతా బ్రతికి చెడ్డవారు అవటం చేత ఆ పేదరికం వారిని ఎంతగానో బాధించసాగింది. శిథిలమైన వృక్షంలాగా వారు దుఃఖముచే, దుర్బలత్వంచే కృశించ సాగారు. మహా దారిద్ర్యముతో చినిగిన బొంతలు కప్పుకుంటూ పూరి గుడిసెలలో పేదరికంలో దీనముఖాలు పొందారు. "ఇంతటి పేదరికం అనుభవిస్తున్నామే! దీనికేమిటి ఉపాయం?"... అని ఆ వైవధికులంతా గుమిగూడి ఒక చెట్టుక్రింద ఒక సాయంకాలం కూర్చుని యోచన చేయసాగారు. వారిలో ఒక తెలివైన యువకుడైన వైవధికుడు లేచి నిలుచుని ఇట్లు ప్రసంగించసాగాడు.

ఓ వైవధిక (కావడి మోసే జాతి) మిత్రజనులారా! మీరంతా ఎందుకు ఇంతగా విచారిస్తున్నారో నాకేమీ అర్థం కావడం లేదు. మనం కావడి మోసే పని కోల్పోయి ఉండవచ్చుగాక! అంత మాత్రం చేత మనం దిగులు ఎందుకు పడాలి! మన ఒంట్లో చేవ చావలేదే! పరమాత్మ మనకు దారుఢ్యమైన దేహాలు ప్రసాదించారు కదా! మనం కాయకష్టం చేసి బ్రతికేవాళ్ళమే కదా! నేను అంతా ఆలోచించాను. ఆలోచించగా ఆలోచించగా... నాకు గడచిన రాత్రి ఒక గొప్ప ఆలోచన వచ్చింది. మన ఈ వైవధిక కుగ్రామానికి సమీపంగా దట్టమైన అడవులు ఉన్నాయి కదా! మనం ఆ అడవులలో కట్టెలుకొట్టి, ఆ కట్టెలను ఈ దగ్గరలో గల పట్టణంలో అమ్ముకుని, అక్కడే నిత్యాహార వస్తువులు కొనుక్కుని తెచ్చుకుందాం! ఇక మనకు ఏ బాధా ఉండదు. మనం మరెక్కడికీ వలస పోనక్కర్లేదు!

ఈ ఆలోచన అక్కడి వైవధిక జాతి పెద్దలందరికీ బాగా నచ్చింది. ఇక మరెటువంటి ఆలోచనా చేయకుండా ఆ ఆలోచనను అమలుచేశారు. వారంతా జట్టులు జట్టులుగా కలసి అడవిలో ప్రవేశించి కట్టెలు కొట్టి, అవి మోసుకొని పట్టణం చేరి అమ్ముకోసాగారు. ఆ లభించిన డబ్బుతో ఇళ్ళు గడవటానికి కావలసినవి కొని తెచ్చుకొని జీవించసాగారు. క్రమంగా వారి తిండి - బట్టల కరువు తొలగింది. "కష్టే-ఫలీ" అన్నారు కదా!

అట్లా కొంతకాలం జరిగింది. అయితే ఆ సంచార జాతి వైవధికులలో కొన్ని జట్లకు కట్టెలు కొట్టటం మాత్రం చేత తృప్తి కలగలేదు. వారు ఇట్లా అనుకున్నారు.

"మనం కొన్ని రోజులుగా కట్టెలు కొడుతున్నాం. బాగానే ఉన్నది. మనకు ఇప్పుడు తిండి-బట్టకు లోటేమీ లేదు. అయితే ఈ అడవిలో అనేక రకాలైన సంపదలు ఉన్నాయి. మనమేమో ఏరోజుకారోజు కట్టెలు కొట్టి ఆ పూట మాత్రమే గడుపుకొంటున్నాం. పగలంతా కట్టెలు కొట్టి, వాటిని మోసుకొని ఆ మరునాడు సంతలో అమ్మితే మనకు ఏమంత గొప్పగా ధనం లభించటం

లేదు కదా! రెండు రోజులు తిండి మాత్రమే లభిస్తోంది. అందుచేత మనం ఈ అడవిలో మరికొంత లోపలిగా వెళ్ళితే, అక్కడ చందన వృక్షాలు, గంధపు చెట్లు లభిస్తాయి. వాటిని కొట్టి అమ్ముకుంటే తక్కువ శ్రమ ఎక్కువ ధనం లభిస్తుంది. అప్పుడు మనం ఇళ్ళు కట్టుకొని మరికొన్ని వసతులు కల్పించుకొని హాయిగా ఉండవచ్చు కదా!"

ఇట్లా యోచన చేశాయి. తదితర జట్లతో ఈ విషయం ప్రస్తావించాయి. కానీ చాలామంది అందుకు ఒప్పుకోలేదు. "ఈ కట్టెలు కొట్టటానికి మనం అలవాటు పడ్డాం! ఇంతకుమించి మన కెందుకు? ఏదో గుడిశలలో నివశిస్తున్నాం. ఇది మనకు చాలదా? ఇంకా అడవికి లోపలగా ప్రవేశించటం యెందుకు? అక్కడ చందన వృక్షాలు ఉంటాయో? ఉండవో? ఒకవేళ ఉన్నా... వాటిని ఛేదించటంలో ఏమేమి ఇబ్బందులు ఉంటాయో! అక్కర్లేదు. మేము రాము. ఈ అడవిని మేము మామూలు వంటచెరకుకు ఉపయోగించి కట్టేలే కొట్టడం కొనసాగిస్తాం"... అని భీష్మించుకొని కూర్చున్నారు.

చివరికి కొన్ని జట్లు "గంధపు వృక్షములు ఉండే ప్రాంతం కనిపెట్టడానికి ఆ అడవిలో మరింత దూరం ప్రయాణిద్దాం"... అని నిర్ణయించుకొని బయలుదేరాయి. వారి ప్రయత్నం ఫలించింది. వారికి ఆ అడవిలో కొంతదూరం తరువాత చందన వృక్షాలు చాలా కనిపించాయి. ఇక వాటిని కొట్టి, వాటిని పట్టణం తెచ్చి మంచి ధరలకు అమ్ముకోసాగారు. వారంతా మొదటి వారి కంటే ధనికులు కాసాగారు. మంచి ఇళ్లు కట్టుకున్నారు.

ఆ విధంగా చందన వృక్షములను ఛేదించి అమ్ముకుంటున్న జట్లవారు ఒకచోట ఒక రోజు సాయంకాలం సమావేశమైనారు. అందులో ఒక వైవధికుడు లేచి నిలుచున్నాడు.

"ఓ తెలివైన వైవధికజాతి రత్నములారా! మనం ఈ మహారణ్యంలో సుదూరప్రాంత సందర్శించి చందన – గందపు వృక్షముల ప్రదేశములు కనిపెట్టి ధనికులం అయ్యాం. ఇళ్ళు కట్టుకున్నాం. కానీ ఈ అడవి యొక్క సంపద ఇంతమాత్రమే అనుకోకండి. పట్టణంలో నాగరకులకు కూడా ఊహకు అందనంతటి సంపద ఈ అడవులలో దాగివున్నదని నా ఉద్దేశం. అందుచేత మనం ఇంకా ఇంకా దట్టమైన అడవులలో సుదూర ప్రదేశాలలో ప్రవేశించుదాం. అక్కడ విలువైన సంపద దొరకవచ్చు. ఏమేమి దొరుకుతుందో, ఇప్పుడు నేను చెప్పలేకపోవచ్చు. కాని కచ్చితంగా విలువైనవి లభిస్తాయని నా నమ్మకం. అందుచేత ఈ అడవులలో సుదూరంగా ప్రయాణించటానికి మీరంతా సంసిద్ధులవండి!"

ఆ సమావేశమైన వైవధికుల జట్లలో కొంతమందికి ఈ ఆలోచన ఏ మాత్రమూ నచ్చలేదు. "మనం ఇప్పుడు కొంత ధనికులం అయ్యాం కదా! ఇంతకంటే దేనికి? అడవులలో విలువైన వస్తువులు ఉండవచ్చు! ఉండకపోవచ్చు కూడా! పెళ్ళాం బిడ్డలను వదులుకొని అంతదూరం మేము రాము. మాకు ఇది చాలు. ఈ మాత్రంతో మా కుటుంబంతో మేము హాయిగా ఉంటాం! అట్లా సుదీర్ఘంగా అడవిలో ప్రవేశించి, వెతకటం అనవసరం. అసందర్భం కూడా!"... అని చాలామంది

ఆ సమావేశాన్ని వదలివెళ్ళిపోయారు. బహుకొద్దిమంది మాత్రం "ఇంకా ఇంకా ఈ అడవులలో ఏమేమి సంపద ఉన్నదో అది చూచి, సొంతం చేసుకొని వద్దాం"... అని అప్పటికప్పుడే నిర్ణయించుకున్నారు. వారట్లా ప్రయత్నం కొనసాగిస్తూ ఉండగా, వారిలో కొందరికి అనేక రత్నాలు, బంగారం, గుప్తములైన ధనరాసులు, వారి వారి అదృష్టాన్ని బట్టి లభించాయి. అట్లా ఏవో పొందిన కొందరు వెనుకకు మరలి ఇంటికి చేరారు. భార్యాబిడ్డలను ఆ సంపదతో ఆనందింపజేస్తూ ఇంటి వద్ద ఉండిపోయారు.

ఇక కొద్ది జట్లు మాత్రం ఆ అరణ్యంలో ఏవైనా విలువైన వస్తువులు కోసం ఇంకా ఇంకా అన్వేషించసాగారు. అట్లా వెతుకుతూ వెతుకుతూ ఉండగా వారికి ఒకచోట "చింతామణి" లభించింది. ఆ చింతామణి ఏది కోరితే అది అప్పటికప్పుడే ప్రసాదించ గల మాహాత్మ్యం కలిగి ఉన్నది. ఆ చింతామణి వలన ఆ కొద్దిమంది సమస్త ఐశ్వర్యములు పొందినవారై అచ్చటే సుఖ – శాంతి – ఐశ్వర్యములు అనుభవిస్తూ ఇప్పటికీ హాయిగా నిశ్చింతగా – ఆనందంగా కాలం గడుపుచున్నారు. వారు ప్రపంచంలో అత్యధిక సంపద కలిగిన వారిలొ ఒకరుగా అయ్యారు.

❖

చూచావా రామచంద్రా! ఆ కీరక జాతి ప్రజలలోని వైవధికులలో అరణ్యమును ఆశ్రయించి ఒక్కొక్కరు ఒక్కొక్క తీరైన సంపద సంపాదించుకున్నారు. కొందరు భాగ్యహీనులై రోజువారీగా కట్టెలు తెచ్చుకొని, అమ్మి, పొట్ట పోసుకుంటూ ఏ రోజుకారోజే మరల ఆ పనికి సిద్ధమగుచు గుడిశలలో రోజులు గడుపుచున్నారు. వారికి రెక్కాడితేగాని డొక్కాడటం లేదు.

మరికొందరు విలువైన గంధపు – చందనపు చెక్కలు సంపాదించి అమ్ముకుంటూ ఇళ్ళు కట్టుకున్నారు. ఇంకొందరు బంగారము, రత్నాలు మొదలైన విలువైన సంపద ఇంటికి తెచ్చుకొని మంచి భవనాలు నిర్మించుకొని సుఖిస్తున్నారు. అంతటితో తృప్తి చెందుచున్నారు.

బహుకొద్దిమంది మాత్రం ఇంకా ఇంకా తిరుగాడి 'చింతామణి'ని సంపాదించుకొని మహాదైశ్వర్యములు అనుభవిస్తున్నారు. రాజభవనాలు నిర్మించుకొని గొప్పగొప్ప సంపదలతో తులతూగుచున్నారు.

ఎవవరికైతే 'చింతామణి'యే లభించిందో, వారు మొట్టమొదట దినభత్యముల కొరకై కట్టెలు కొట్టుకుని రావడానికే వెళ్ళారు కదా! కానీ అనేక ప్రయత్నముల ఫలంగా చివరికి వారికి చింతామణి లభించింది. వారు ఇప్పుడు స్వర్గలోకంలో ఉండే దేవతలవలె మహాదైశ్వర్యములు సంపాదించుకొని సుఖంగా నివసిస్తున్నారు.

ఓ రామచంద్రా! ఆ కావడి మోసేవారు కట్టెలకోసం చేసిన ప్రయత్నం వల్లనే... (అందులో కొందరు) మహత్తరము, అనితర సాధ్యము అయినట్టి "చింతామణి"ని సంపాదించుకొని స్వర్గ సౌఖ్యములు అనుభవించ గలుగుచున్నారు. కట్టెల కోసమై ప్రయత్నం ప్రారంభించకుండా ఉండి ఉంటే, వారికిప్పుడు చింతామణి లభించేదా? లేదు కదా! ఆ చింతామణి సంపాదించుకొన్న

వైవధికులు ఇప్పుడు భయ – మోహ – విషాద రహితులై జీవితమును ఆనందముగా ఆస్వాదిస్తున్నారు. వారి బుద్ధి పరిపూర్ణమై, ఆనందంతో కూడి ఉంటోంది. వారికి అన్ని దిగుళ్ళు సమసిపోయాయి. ఇక వారికి ఇతర లాభములు వేటితోనూ పనిలేకుండా పోయింది.

వారంతా కట్టెలకోసం వెళ్ళి చింతామణిని సంపాదించుకొని ఇప్పటికీ హాయిగా ఉన్నారు.

❖❖❖

## 2. కాష్ఠ - వైవధిక న్యాయ తాత్పర్యం

**శ్రీరాముడు :** హే మాననీయా! మునిశ్రేష్ఠా! ఈ "కాష్ఠ – వైవధిక న్యాయం" సంబంధించిన కథా విశేషం యొక్క తాత్పర్యం ఏమిటో, ఏ ఉద్దేశంతో ఈ సందర్భంలో మీరు చెప్పారో... అవన్నీ వివరించ ప్రార్థన!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** చెపుతా! విను. ఇక్కడ 'వైవధికులు' అంటే ప్రపంచమున గల సకల మానవులు. 'వైవధికుల దారిద్ర్యం' అంటే ఈ జనుల అజ్ఞాన జనితమైనట్టి ఆధిభౌతిక – ఆధి దైవిక – ఆధ్యాత్మిక రూపమైన త్రివిధ తాపములు. 'మహారణ్యం / దట్టమైన అడవి' అంటే గురు, శాస్త్రాదులచే చెప్పబడే సాధనముల క్రమము.

"వైవధికులు 'జీవనోపాధి ఎట్లా?' అని యోచించి ఉపాయము ఆశ్రయించటం" అంటే ఈ జనులు "ఏదో సంపాదించాలి" అని భోగాల కొరకై శాస్త్రములలో చెప్పి ఉపాయములను ఆశ్రయించటం.

అల్పబుద్ధి గల మనుజులు, "నాకు భోగ సమూహములు సిద్ధించుగాక" అనే అల్పబుద్ధితో గురువులను, శాస్త్ర సాధనములను ఆశ్రయిస్తున్నారు. మరికొందరేమో "మాకు ఈ భౌతిక కష్టాలు తొలగాలి"... అని కోరుకున్నవారై శాస్త్ర సాధనములను, శాస్త్ర పఠనములను, పురాణాది కథా శ్రవణాలు, గురువులను ఆశ్రయించటం – ఇవన్నీ చేస్తున్నారు. వారంతా ఆ విధంగా భోగం కొరకై, (లేదా) కష్టములు తొలగటం కొరకై శాస్త్ర సాధన క్రమములందు ప్రవృత్తులగుచుండగా, వారిలో కొందరు క్రమంగా కష్టాలు తొలగటంచేతనో భోగలాభ ఫలం కారణంగానో, అంతటితో ఆగకుండా, గురువులపై, శాస్త్రాభ్యాసములపై ఆసక్తి కొంత కొంతగా విశ్వాసం కలిగి అది క్రమంగా పెంపొందుతోంది. ఆ విశ్వాసం దృఢపడుతోంది. జిజ్ఞాస ప్రవృద్ధమౌతోంది. దాంతో వారు మరికొంతగా సాధనలను, గురుదర్శనములను కొనసాగిస్తున్నారు. క్రమక్రమంగా ఆ సాధనల యొక్క అభ్యాసం చేత ఆ శాస్త్రముల "పరమ తాత్పర్యం" అయినట్టి మోక్ష ప్రదమగు "బ్రహ్మము"ను గురించి విచారణ చేయటం ప్రారంభిస్తున్నారు. కట్టెల కోసం అడవికి వెళ్ళటం ప్రారంభించినప్పటికీ ఆ వైవధికులు చింతామణిని పొందగలిగారు చూచావా? అట్లాగే భోగాల కొరకై శాస్త్రములను అవలంభించిన మనుజుడు కూడా... క్రమక్రమంగా ఒకానొకప్పటికి పరమపదమగు మోక్షమును తప్పక సంపాదించుకుంటున్నాడు.

**కింస్యాచ్ఛాస్త్ర విచారాభ్యాసమితి సందేహలీలయా**
**కశ్చిత్ ప్రవర్తతే, పశ్చాత్ ఆప్నోతి పదముత్తమమ్ ।**

చాలా మంది "ఈ శాస్త్ర పఠనం, శాస్త్ర విషయముల వలన మనకేం లాభం ఉంటుంది? లాభం లేదులే!" అనుకొని అసలు శాస్త్ర పఠనం, శాస్త్ర విచారణ, శాస్త్ర సాధనములను ఆశ్రయించటం మొదలే పెట్టడంలేదు వారు ఈ జీవితమంతా జీవించి ఏం పొందాలనుకుంటున్నారో, వారి మానసికమైన ఋగ్మత ఎట్లా తొలగుతుందని వారు అనుకుంటున్నారో... అది నాకు తెలియదు. వాళ్లనే వెళ్ళి అడుగు.

ఇక కొంతమంది "ఈ శాస్త్ర పఠనం వలన, శాస్త్ర విచారణ వలన, పురాణాదుల శ్రవణం వలన, గురువులను ఆశ్రయించటం చేత ఏదైనా శుభం కలుగుతుందంటారా? చూద్దాం"... అనే కుతూహలంతో అట్టి శాస్త్ర, శ్రుతి సాధనలలో ప్రవర్తించటం ప్రారంభిస్తున్నారు. వీరు క్రమంగా ఎప్పటికో అప్పటికి అత్యుత్తమమైన మోక్షపదం కూడా సంపాదించుకొంటున్నారు. చూచావా? ఒకడు మొట్టమొదట "బ్రహ్మపదమును గాంచనివాడే" అయినప్పటికీ... విషయ భోగాల కొరకు కొంతగా శాస్త్రాదులందు ప్రవృత్తుడై (మోక్షపదం ఆతని ఆశయం అయి ఉండనప్పటికీ) కూడా, క్రమంగా ఎప్పటికో అప్పటికి పరబ్రహ్మస్వరూపమునే ఎదురుగా గాంచుచున్నాడు!

ఈ జనులు వివిధమై వాసనలు కలిగి ఉంటున్నారు కదా! అట్టి వాసనలను అనుసరించేవారు "పరమార్థము"నకు భిన్నమైనట్టి భోగఫలములను వాంఛిస్తున్నారు. వారి వాంఛల ఫలదీకరణము కొరకై శాస్త్రములందు – సాధనములందూ ప్రవేశించి, ఆ తరువాత (చింతామణిని పొందినట్లుగా) వారు నిరతిశయానందమగు మోక్షఫలమును అంది పుచ్చుకుంటున్నారు.

**సాధువు -** అయితే రామచంద్రా! ఈ ప్రపంచములో కొందరు మహనీయులు తాము ఏది నిర్వర్తించినా కూడా పరోపకారము కొరకే ఉద్దేశిస్తూ ఉంటారు. "మా వలన తదితరులకు ఏదో ఒక మంచి, సంతోషము, సుఖము కలిగితే మాకు అంతేచాలు. మా ఈ జీవితం వృథా కాదు" అనే ఆశయంతో జీవిస్తూ ఉంటారు. వారు శాస్త్రములను ఆశ్రయించేటప్పుడు కూడా... ఏదో తాము పొందాలని కాకుండా... సహజీవుల సుఖ సంతోషాలే ఆశయంగా కలిగి ఉంటారు. ఈ విశ్వామిత్రుని వంటి అట్టి మహాత్ములు ఈ సభలో కొందరు ఉన్నారు.

**పరోపకారే అవిరతం, స్వభావేన ప్రవర్తతే**
**యః, స "సాధుః" ఇతి ప్రోక్తః । ప్రమాణం తస్య చేష్టితమ్ ॥**

ఓ రామచంద్రా! ఎవడైతే స్వభావ సిద్ధంగానే సహజీవులకు ఉపకారం చెయ్యటమే ఆశయము, ఉద్దేశములుగా కలిగి శాస్త్రములందుగాని, తదితర కార్యములందు గాని వ్యవహరిస్తూ ఉంటాడో... ఆతడే "సాధువు" అని చెప్పబడుచున్నాడు. ఆతని ఆచరణయే సర్వలోకములకు ప్రమాణం. "పరోపకార కారిణ్యే – పరావర్తిపరతప్తయా బుద్ధయేవ – సుఖంమన్యే" అని మొట్టమొదటి రోజు నీవు అన్నావు కదా! తమ కొరకై ఏదో పొందాలని శాస్త్రములందు, తదితర వ్యవహారములందు ప్రవృత్తులయ్యేవారు – వారి శాస్త్ర వాసనలు లోకానికి ఉత్తమ ప్రమాణం కాజాలవు.

ఓ సాధూ! ఈ విధంగా సజ్జనుడు సాధు ఆచరణ కొరకు, “ఈ భోగముల వలన నాకు ఉత్తమ ప్రయోజనమేమున్నది?” ...అనే అల్పాశయాన్ని అధిగమించి “శాస్త్రాచరణం ద్వారా లోక కళ్యాణమగుగాక!” అను ఆశయంతో శాస్త్రములను ఆశ్రయిస్తున్నాడు. ఒకడు భోగముల కొరకై మొట్టమొదట శాస్త్ర విచారణ – శాస్త్రములు చెప్పే మార్గంలో ఆచరణ ప్రారంభించవచ్చు! సాధువు లోకహితైషి అయి శాస్త్రములను ఆశ్రయించవచ్చు! ఏది ఏమైనా శాస్త్రములు అనుభవాలు ప్రవచనాలు, లోక కళ్యాణము కొరకు ఉద్దేశించబడినవి కాబట్టి... వాటిని ఆశ్రయిస్తూ ఉండగా భోగ మోక్షములు రెండూ లభిస్తున్నాయి. కట్టెలు కొట్టుకొని జీవించటానికి అడవికి వెళ్ళిన ఆ కావడిమోయు తెగవారిలో అందరికి జీవనోపాధి లభించగా, ఉత్తమ పరిశ్రమ–ఆశయాలచే కొందరు చింతామణినే సంపాదించు కున్నారనటంలో ఉద్దేశం అదే! ఆ కట్టెపుల్లల కొరకై అరణ్యంలో ప్రవేశించిన వారిలో కొందరు కట్టెలను, కొందరు, పూలు–చందనపు చెక్కలను, ఇంకొందరు సామాన్యమైన రత్నాలను సంపాదించు కుంటున్నారని చెప్పాను కదా! అందులో ఉద్దేశం... శాస్త్రములను – శాస్త్రముచే చెప్పబడే విధి నిషేధములను గురువులలో కొందరు ధర్మము కొరకు, మరికొందరు ధర్మార్థముల కొరకు, ఇంకొందరు ధర్మార్థ కామముల కొఱకు శాస్త్రములను ఆశ్రయిస్తున్నారు!” ...అని చెప్పటం కోసమే!

❖

ఓ రాఘవా! ఏ శాస్త్రములు “ధర్మార్థ కామములు” అనే వర్గత్రయయమునకు ఉపాయాలు అగుచున్నాయో... అవే శాస్త్రములు మోక్షం కొరకు కూడా మార్గదర్శకాలు అగుచున్నాయి. అయితే శాస్త్రాదులందు వర్గత్రయం గురించి వాచ్యవిశేషాలే అత్యధికం. ఎందుకంటే శాస్త్రములు వాచ్యవృత్తిచే నిర్మించబడినవే కదా! ఇక బ్రహ్మప్రాప్తి వాక్కునకు అవిషయమైయున్నది. బ్రహ్మమును ప్రతిపాదిస్తున్న శాస్త్రములు కూడా లక్షణావృత్తిచే మోక్షమునకు మార్గమును చూపగలుగుతాయిగాని, కేవలం వాచ్యవృత్తిచేకాదు. వసంత కాలం వస్తే వృక్షాలు తమకు తామే చిగురించి పుష్ప–ఫలాలు ప్రదర్శిస్తాయి చూచావా? సమస్త వేదాంత వాక్యార్థములున్నూ బ్రహ్మప్రాప్తి యొక్క లక్షణ వృత్తిని గుర్తు చేయగలవు. అంతమాత్రమే అవి! వసంతకాలంలో పుష్పం చిగురించినట్లు... శాస్త్ర సాధనలు... గురుబోధల ప్రభావం చేత తగిన సమయంలో ధర్మ–అర్థ–కామాలను అధిగమించినట్టి నిర్మలమైన మనస్సు వాటిని ఆశ్రయించటం ఒనగూడుతోంది. జలముతోను, వస్త్రంతోను అద్దముపై దట్టంగా కప్పబడిన ధూళి శుభ్రంగా తుడిచి వేస్తే ... అప్పుడు ఆ అద్దంలో ముఖం అత్యంత స్పష్టంగా – యథాతథంగా కనిపిస్తుంది చూచావా! అట్లాగే

శాస్త్రం అనే జలంతోనూ, ‘గురుబోధ’ అనే వస్త్రంతోనూ, మనస్సు అనే దర్పణాన్ని “శాస్త్రాలచే – గురువులచే చెప్పబడే సాధనలు” అనే అను నిత్య ప్రయత్నాలతో (భక్తి–జ్ఞాన–కర్మ ఫల సమర్పణ, సహజీవుల సేవ, పరోపకారం, సాత్వికమైన భావాలు, పూజ, తపస్సు, ధ్యానం, తీర్థ యాత్రలు, పారాయణలు, నామస్మరణ... మొదలైన దైనందిన అభ్యాస పూర్వకమైన కార్యక్రమాలచే మనోదర్పణాన్ని పరిశుభ్రం చేసే కార్యక్రమాలతో)... మనస్సును పరిశుభ్ర పరిస్తే... అప్పుడు ‘ఆత్మ’ అనే స్వస్వరూప ముఖ దృశ్యం అత్యంత సుస్పష్టంగా కనిపిస్తుంది.

అనగా దర్పణమును పరిశుభ్ర పరచటం ఎటువంటిదో... శాస్త్రములను–గురువులను ఆశ్రయించటం, వారు చెప్పే సాధనములను శ్రద్ధతో అన్వయించుకొని నిర్వర్తించటం అటువంటిది. “జలము – వస్త్రము నేరుగా నీ ముఖమును ధూళితో కప్పబడిన దర్పణంలో సుస్పష్టంగా చూపగలవా?” అని ఎవరైనా అడిగితే ఏం అంటావు? “అయ్యా! జలమును – వస్త్రమును ఉపయోగించుకుంటాం. ఉపయోగించి దర్పణము (అద్దము) పై ధూళిని ఈ చేతులతో తుడిచి తుడిచి పరిశుభ్రం చేస్తాం. అప్పుడు దుమ్ము – ధూళి తొలగగా ఆ అద్దంలో ముఖం చూచుకుంటాం!”... అని అంటావు కదా! జలము – వస్త్రము లేకపోతే నీ ముఖం అద్దంలో కనిపించదు. ఎందుచేత? అద్దమును ధూళి బహుదట్టంగా కప్పి ఉండటంచేత! శాస్త్రములు – శాస్త్ర సాధనలు – గురువులు లేకపోతే అనేక జన్మలుగా అనేక దుష్ట సంస్కారముతో – అభ్యాసములతో కప్పబడిన ఈ మనస్సు నందు సచ్చిదానంద స్వస్వరూపమగు నిజాత్మ స్పష్టంగా ప్రతిబింబించదు. అనగా... శాస్త్రములు స్వయంగా ఆత్మానుభూతి కలిగించటం లేదు. అవి లేకపోతేనో, ఆత్మానుభవం స్వయంగా కలుగనే కలుగదు.

ఆత్మ స్వానుభవమే! అది మనందరి స్వస్వరూపమే కదా! మన స్వస్వరూపమును ఇప్పుడు శాస్త్రములుగాని – గురువులుగాని క్రొత్తగా తెచ్చి అక్కడ పెట్టడం లేదు. ప్రతి ఒక్క జీవుని యందు ‘ఆత్మజ్ఞానము’ ఉండనే ఉన్నది. ప్రతి ఒక్క జీవుని స్వరూపము ఆత్మయే కదా? అయితే అద్దానిని అజ్ఞానము కప్పి ఉంచింది. ఇప్పుడు ‘శాస్త్రములు’ అనే నిర్మల జలంతో ఆ కప్పి ఉంచిన అజ్ఞానమలమును తొలగిస్తున్నాం. ఇంతే!

అయితే రామచంద్రా! అర్హత కలిగియున్న జనులకు శాస్త్రములు అత్యంత త్వరితంగా ఆత్మానుభూతిని తప్పక కలిగిస్తున్నాయి. సాధనాక్రమం చేత స్వయంగా అర్హత లభిస్తోంది. బ్రహ్మజ్ఞానం అగు “ఆత్మ లక్షణములు, ఆత్మ తత్త్వ నిర్ణయము” మొదలైన ఉపాయములతో శాస్త్రములు సర్వదా సంసిద్ధమే అయివ ఉండి నిర్మల బుద్ధిగల జనులకు – సాధనా సమయంలోనే ఆత్మసాక్షాత్కారము లాభింపజేస్తున్నాయి.

❖

కాబట్టి రామచంద్రా! గురు – శాస్త్రాదులు – సాధనలు అత్యంతావశ్యకం! అయితే అవి నేరుగా ఆత్మయందు విశ్రాంతిని కలిగించలేవు. ఆత్మయందు విశ్రాంతికి అవి కారణం కాగలవు.

**న శాస్త్రాత్, న గురుర్వాక్యాత్ న దానాత్, న ఈశ్వరార్చనాత్**
**ఏష సర్వపదాతీతో బోధః సంప్రాప్యతే పరః ॥**

సమస్తమునకు అతీతమైన అత్యుత్తమమగు “బ్రహ్మబోధ” (లేక) “ఆత్మసాక్షాత్కారం” (లేక) “సర్వము స్వస్వరూపముగా దర్శించటం”... అనునది శాస్త్రములచేతగాని, గురు వాక్యములచేతగాని, దానముల చేతగాని, ఈశ్వరార్చనల చేతగాని నేరుగా (సాక్షత్తుగా) కలగటం లేదు. అవన్నీ నేరుగా కారణములు కాకపోయినప్పటికీ అవి ఆత్మజ్ఞానమునకు తప్పక దారితీయునవిగా, కారణముగా అగుచున్నాయి. అద్దాని క్రమము ఎట్లాగో... చెపుతాను. విను.

1. ఈ జగత్తు – దృశ్యములచే దుఃఖాదులు పొందిన మనస్సు "విశ్రాంతి ఎక్కడ?"... అని వెతకసాగుతుంది. "పోనీ! శాస్త్రములు నాకు మార్గం చూపగలవేమో?" అనే ఆశతో కూడిన కించిత్ సంశయం ప్రారంభమౌతుంది.

2. అప్పుడు అర్థ–కామముల కొరకై ఆ జీవుడు శాస్త్రములను – అందలి సాధనములను – గురువులను – వారు బోధించే సాధనా క్రమములను ఆశ్రయిస్తున్నాడు.

3. శాస్త్రాభ్యాసముచే చిత్తము కొంచెము కొంచెమూ విశ్రాంతి పొందనారంభిస్తోంది.

4. ఆ కొంచెము విశ్రాంతి ప్రసాదించే ప్రశాంతత యొక్క రుచిచే ఆకర్షితుడై ఆ జీవుడు శాస్త్ర – సాధనములను మరింతగా ఆశ్రయించి, క్రమంగా క్రమంగా చిత్తమును శుద్ధ పరచుకోనారంభిస్తున్నాడు.

5. శాస్త్రాభ్యాసముచే కాలక్రమంగా చిత్తము మరికొంత శుద్ధత్వము పొందనారంభిస్తోంది.

6. చిత్తము శుద్ధత్వము పొందుచుండగా క్రమంగా కొంత కొంత నిశ్చలత్వం సంతరించుకోవటం ప్రారంభమౌతోంది.

7. చిత్తము నిర్మలము – నిశ్చలము అగుచుండగా .... క్రమంగా "ఏదో పొందాలి! ఇంకేదో కావాలి" .... అనే భ్రమతో కూడిన తపన "వాళ్ళు అట్టివారు – వీళ్ళను నమ్మకూడదు" మొదలైన దురభిప్రాయములు సన్నగిలనారంభిస్తున్నాయి.

8. క్రమక్రమంగా ఈ చిత్తము తనయందలి భోగేచ్ఛలను బయటకు పంపుచుండగా శాస్త్రములు – గురువులు చెప్పే పవిత్రాశయము సంతరించుకొన్న ఆప్త వాక్యములు చిత్తములో ప్రవేశించి వికాసము పొందనారంభిస్తున్నాయి.

9. అట్టి చిత్తము ప్రతిరోజు కొంచెం కొంచెం అందరిలోనూ – అందరుగానూ వేంచేసియున్న 'ఆత్మ'ను ఆస్వాదించ నారంభిస్తోంది.

10. అప్పుడా జీవుడు అద్దాని అంతిమ ప్రయోజనంగా సాత్వికచిత్తుడై అంతటా తన స్వరూపమగు ఆత్మనే దర్శిస్తూ వాక్కుకు అతీమగు (అనిర్వాచ్యమగు) బ్రహ్మపదమును అధిరోహిస్తున్నాడు.

అంతటా అన్నిటా బ్రహ్మమును దర్శిస్తూ ... ఇక ఆ బ్రహ్మమే తానుగా అయి శాస్త్రముల అంతిమ ఉద్దేశమును ఫల ప్రదం చేసుకుంటున్నాడు.

**ఏతచ్ఛాస్త్రాదవిద్యాయాః సాత్వికోభాగ ఉచ్యతే ।**

**తామసః సాత్వికేనాస్యా భాగేనాయాతి సంక్షయమ్ ॥**

ఓ రామచంద్రా! శాస్త్రముల సూచిస్తున్న సాధనముల 'అభ్యాసము' వలన అవిద్యయొక్క 'సాత్విక భాగము' వృద్ధి చెందనారంభిస్తుంది. ఆ సాత్విక భాగం క్రమంగా అవిద్యయొక్క రాజసిక – తామసిక భోగములను క్షయింపజేస్తోంది.

ఓ రామచంద్రా! మరొక్కసారి ప్రకటిస్తున్నాను. నేను శాస్త్రములను శాస్త్ర సాధనములను, గురు ప్రబోధిత సాధనా క్రమములను తిరస్కరించటంలేదు సుమా! పైగా, అవి అత్యావశ్యకమని గుర్తు చేస్తున్నాను. ఈ 'సంసారం' అనే నూతిలోని అంధకారంలో చిక్కుకున్న మనుజునికి గురు - శాస్త్రములే దిక్కు. అవి ప్రసరించే వెలుగే ఉపాయం.

**నూనం మలం ప్రధానేన క్షాలయత్ శాస్త్ర రూపిణా ।**
**పురుషః శుద్ధతామేతి పరమాం వస్తు శక్తితః ॥**

"శాస్త్రం" అనే జలంతో చిత్తం యొక్క మాలిన్యాన్ని (శాస్త్రములు చెప్పే సాధనలు ఆశ్రయించిన) మనుజుడు కడిగివేసుకొంటున్నాడు. అవే శాస్త్రముల ప్రభావం చేత వాటిచే బోధించబడుచున్న "నిత్య శుద్ధాత్మ"ను గ్రహిస్తూ క్రమంగా పరమ శుద్ధత్వము పొందుచున్నాడు. సముద్రంలో సూర్యబింబం లేకపోయినప్పటికీ, సూర్యుడు ఉదయించినప్పుడు సముద్రజలంలో (సముద్రం తానుగా కోరుకో నప్పటికీ) సూర్యబింబం ప్రతిబింబిస్తుంది చూచావా? అట్లాగే...ముముక్షువు శాస్త్రములతో సంబంధం కలిగి ఉండటంచేత ఆ పరస్పర సంబంధం క్రమంగా ఇంద్రియ సంబంధమైన జ్ఞానములకు అతీత మైనట్టి 'ఆత్మజ్ఞానం' జనించటానికి స్వభావ సిద్ధంగా కారణమగుచున్నది. సూర్యుడు వేరు, సముద్రం వేరు. కాని ఆ రెండింటిని చూస్తున్న మనకు సముద్రంలో సూర్యబింబం కనిపిస్తోంది. అట్లాగే శాస్త్ర జనితమైన జ్ఞానంచేత ఉపాధిరూపమగు ఈ దేహంలో సర్వోపాధి రహితమైన... జ్ఞేయ రూపమగు ఆత్మను గురించిన జ్ఞానం ఉదయిస్తోంది.

ఒక బాలుడు "ఈ ధూళితో కూడిన అపరిశుభ్రమైన చేతులు శుభ్రం చేసుకోవాలి" అని అనుకున్నాడనుకో! అప్పుడేం చేస్తాడు? చెరువు దగ్గరకు పోయి, అక్కడ ఉన్న మట్టిని చేతికి రాసుకొని, అంతకు ముందున్న అపరిశుభ్రమైన ధూళిని - ఇప్పుడు రాసుకొన్న మట్టితో సహా అక్కడి నీళ్ళతో కడిగి - రెండు చేతులూ పరిశుభ్రం చేసుకుంటాడు కదా! ఇంటి ఇల్లాలు రాత్రి వంట చేసుకొనియున్న వంట పాత్రలను 'బూడిద' మొదలైన నైర్మల్య వస్తువులతో తోమి, అటు తరువత ఆ బూడిద - ఆ పాత్రయొక్క మసి... ఈ రెండింటినీ నీటితో కడిగివేస్తున్నది కదా! అట్లాగే శాస్త్రములు కల్పించే విచారణ వికల్పములతో 'భ్రాంతి'చే పుట్టుకొచ్చిన"ప్రపంచ (దృశ్య) సంబంధమైన వికల్పములు" - మరల మరల తొలగించబడగా... అప్పుడు 'ఆత్మతత్త్వ పరిశీలన' అనబడే స్వకీయమైన విచారణను చిత్తము సంతరించుకొనుచున్నదగుచున్నది. చిత్తము దోషరహితమైనప్పుడు ఆ చిత్తము అంతటా ఆత్మను సందర్శించటం స్వభావసిద్ధమే! శుభ్రమైన దర్పణంలో దృశ్యము సుస్పష్టంగానూ - ఉన్నది ఉన్నట్లుగానూ కనబడటంలో ఇక ఆశ్చర్యమేమున్నది?

ఓ రామచంద్రా! చెరకు గడలో మాధుర్యం ఉన్నమాట నిజమే! అయితే ఆ రసం నేరుగా లభిస్తుందా? లేదు. దానిని చెరకుయంత్రంలో ఉంచి, చక్రాన్ని త్రిప్పుతూ ఒరిపిడి కలిగించి, తద్వారా పిండింపజేస్తే చెరకు రసం లభిస్తుంది. ఆ చెరకు రసం త్రాగితే ఇక ఆ మాధర్యం అనుభవమౌతుంది. అట్లాగే... ఉపనిషత్తులు, ఈ యోగ వాసిష్ఠము మొదలైన శాస్త్రముల యొక్క....

శ్రవణం (బాగుగా వినటం), మననం (విన్నది ఆకళింపు చేసుకోవటం), నిధిధ్యాసనం (ఆత్మ దృష్టిని అవలంభించి తానేఆత్మ స్వరూపుడై ఉండటం) ...వంటి ఉపాయాలు ఆశ్రయిస్తూ ఉండగా "తత్త్వమసి" (నాకు ఎదురుగా కనిపిస్తున్న నీవు ఆ పరమాత్మ యొక్క రూపమే!") ...అనే మహావాక్యము యొక్క (వాచ్యార్థము నుండి) అఖండార్థం లభిస్తుంది. అనగా వాచ్యార్థ్యం క్రమంగా లక్ష్యార్థంగా పరిణమిస్తుంది. అప్పుడు అవరోక్షానుభవం క్రమంగా సిద్ధించగలదు.

ప్రత్యక్షానుభవం - ఇంద్రియాలకు కనిపించేది,

పరోక్షానుభవం - ఇంద్రియాలకు కనిపించకుండా అనుభవమయ్యేది,

అపరక్షానుభవం - ఇంద్రియములకు విషయం కాకుండానే అత్యంత సుస్పష్టంగా నిర్మలమైన అవగాహనకు అనుభవమయ్యే ఆత్మానుభవం!

అట్టి అవరోక్షానుభవమగు "ఆత్మ జ్ఞానం" మనుజునకు స్వానుభవం చేతనే లభిస్తోంది.

అద్దంలో ముఖం ప్రతిబింబిస్తున్నప్పటికీ అద్దానిని చూచి గుర్తించేది నీవే కదా! శాస్త్రముల సహకారంతో స్వానుభవం చేతనే ఎవరైనా స్వాత్మజ్ఞానం పొందగలుగుతారు. గురువులు తను అనుభవాన్ని చెప్పుచుండగా శిష్యుడు ఆ గురువులాగానే తానుకూడా స్వాత్మను దర్శిస్తున్నాడు. అట్లా కాకుండా, "ఓ గురువుగారు! మీరు చెప్పుతూ ఉండండి! నేను చూడను. కాని నాకు చూపండి!" అని అంటే ఏ గురువు (లేక) ఏ శాస్త్రము కేవలాత్మానుభవం కలిగించగలడు? తనంతట తానుగా అవగాహనను పరిపుష్టం చేసుకోవటానికి సంసిద్ధపడని శిష్యునికి గురువు ఆత్మానుభూతి ఎట్లా కలిగించగలడో చెప్పు? అట్లా గురుశాస్త్రములు ఆత్మానుభూతి కలిగించలేవు. ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ వస్తువులపై కాంతిని ప్రసరింపజేస్తున్నంత మాత్రాన నీకు కనిపిస్తాయా? నీవు కళ్ళు తెరచి చూస్తేనే కనిపిస్తాయి కదా! సూర్య ప్రకాశము - గోడ యొక్క సంయోగముచే స్ఫుటంగా నీవు చూస్తేనే నీకు అనుభూతమౌతోంది కదా! అట్లాగే నిత్య ప్రకాశరూపమగు ఆత్మజ్ఞానము.

శాస్త్రము యొక్క - గురువుల యొక్క - శాస్త్రములను అభ్యసించు వాని యొక్క సాంగత్యంచే స్పష్టంగా అనుభూతమౌతోంది.

ఓ రామచంద్రా! "త్రివర్గము" అను పిలువబడే ధర్మ-అర్థ-కామముల సిద్ధి కొరకు మాత్రమే నిర్వర్తించబడుచు... మోక్షము కొరకు ఉద్దేశించబడని శాస్త్ర శ్రవణము శాస్త్ర శ్రవణమే కాదు! శాస్త్రము యొక్క కథా విషయములు, చారిత్రక వివరణలను శ్రవణ-మననములను నిర్వర్తిస్తే అంతమాత్రం చేత శాస్త్రమును పఠించినట్లు అవదు. ఆ శాస్త్రము ఏ శాశ్వతమైన ఆత్మతత్త్వ జ్ఞానమునకు సూచనలు ఇస్తోందో... ఆ సూచనలను పరిశీలించి హృదయస్థం చేసుకొన్నప్పుడు మాత్రమే శాస్త్రములను అధ్యయనం చేసినట్లు అవుతుంది.

జ్ఞానము కొరకు ఎప్పుడు ఏది పఠనం, శ్రవణం చేస్తామో... అదియే పఠణము, శ్రవణము అని అనిపించుకుంటుంది. దేనిని (ఏ ఆత్మ గురించిన శ్రవణముచే) సర్వత్రా సమదర్శనం ప్రవృద్ధి పొందుతూ ఉంటుందో అదియే జ్ఞానము. ఏ శాస్త్ర విభాగముచే "నిర్వికల్పమగు ఆత్మ రూపస్థితి"

అగు (జాగ్రత్ సుషుప్తి వంటి) సర్వ విషయాతీత స్థితి జనిస్తుందో... ఆ సమత్వస్థితియే ఆత్మజ్ఞానం యొక్క నిదర్శనరూపమై ఉన్నది. చూచావా రామచంద్రా! ఈ ప్రకారంగా శాస్త్రాలలో సమస్తం లభిస్తోంది.

**ఏవంహి సర్వమేతత్ సచ్ఛాస్త్రాదేః సమవాప్యతే**
**తస్మాత్ సర్వప్రయత్నేన శాస్త్రాత్ అభ్యాసమాచరేత్ ॥**

శాస్త్రములలో ధర్మ – అర్ధ – కామ – మోక్షములనబడే నాలుగు పురుషార్థాలు లభిస్తున్నాయి. అందుచేత సర్వ ప్రయత్నములతో శాస్త్రాదుల అభ్యాసమును తప్పక కొనసాగించాల్సిందే సుమా!

ఓ రామచంద్రా! శాస్త్రములు చెప్పే అర్థాన్ని భావించటం చేత... గురువుల ఉపదేశ సారాన్ని జీవితంలో దైనందిన నిత్యానుభవములలోకి క్రమ క్రమంగా తెచ్చుకొని అనుసరిస్తూ ఉండటంచేతను... (గృహములోనివారు – వృత్తాస్థలంలోనివారు పరమాత్మస్వరూపములేనని భావన చేయటం చేతను), సత్సాంగత్యము చేతను... నియమ, శమముల చేతను... ఇట్టి మార్గంలో అడుగులు వేసేవానికి...

సర్వప్రపంచ పదముల కంటే అతీతమైనది, బ్రహ్మలోకము వరకు గల సమస్త సుఖముల కంటే అత్యుత్తమమైనది, దృశ్యమంతా ద్రష్టస్వరూపముగా మార్చివేయగలిగినది. ఆద్యంత రహితమైనది. సమస్తమునకు 'ఆది' అయినది, పరమ పావనము అయినది... అగు 'మోక్షము' అనే సుఖం సులభంగా కరతలామలకమగుచున్నది. కనుక ఓ జనులారా! వర్తమాన జన్మను నేను చెప్పుమార్గంలో సద్వినియోగ పరచుకోవలసినదిగా నామనవి!

❖❖❖

# 3. సర్వత్రా సమదృష్టి

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ సభికులారా! బోధ యొక్క "దృఢత్వం" కొరకై మరల ఈ సందర్భంలో ఒకానొక విషయం గురించి గుర్తుచేస్తూ ప్రసంగిస్తున్నాను. ఈ విషయాలు ఇంతకుముందు చెప్పే ఉన్నాను సుమా! అయినా కూడా మన ఈ సంవాదము చివరికి వస్తున్నప్పటి ఈ సందర్భంలో మరల మరల చెప్పుకోవటం చేత ఈ ఈ విషయాలు హృదయంలో బాగుగా నాటుకుంటాయనే ఉద్దేశంతో మరల చెప్పుచున్నాను. అంతా వినండి.

❖

ఓ సహ కేవలాత్మ స్వరూపులారా! ఇతఃపూర్వం మనం చెప్పుకున్న ఉత్పత్తి – స్థితి ప్రకరణములలో "ఈ జగత్తు భ్రాంతి మాత్రమే అయి, భ్రాంతి యందు భ్రాంతిచే ఉత్పన్నమై, భ్రాంతి యందే స్థితిని పొందినదైయున్నది" అని మనం అనుకున్నాం కదా! ఆ తరువాత ఉపశమన ప్రకరణంలో "ఈ 'జగత్తు' అనే భ్రాంతి మన మనస్సుల నుండి ఉపశమించేది ఎట్లా?" అను విషయంగా అనేక యుక్తులు మనం చెప్పుకున్నాం. అందుకు అతి ముఖ్యమైన ఉపాయంగా "ఈ ప్రపంచము – ఈ దేహమును పొందినట్టి ఈ జీవుడు శాంతుడై, 'సమదర్శి' అయి వుండటం మరల మరల అభ్యసించాలి"... అని నిర్ణయించుకున్నాం. ఆ విధంగా ఉపశమన ప్రకరణములో

చెప్పబడినట్లే క్రమక్రమయుక్తంగా సారరూపంగా "సర్వత్రా సమదర్శనం"... అనే అభ్యాసంచే మీరందరు పరమశాంతియుతులు అయ్యెదరుగాక! సంతాప రహితులై నిర్వాణ సుఖమునందు వర్తించెదరు గాక! ఓ ప్రియ సభికులారా! "(ప్రాప్తవస్తువు (ఇప్పటికి ప్రాప్తించి ఉన్నదే)" అగు ఆత్మను పొందినట్టి జ్ఞాని ఈ ప్రపంచ వ్యవహారములలో ఎట్లా వ్యవహరించాలి"... అనే విషయం మనమంతా మరొక్కసారి మననం చేయటం ఉచితమని నేను అభిప్రాయపడుచున్నాను. కనుక ఆ విషయాలు ప్రస్తావిస్తాను! వినండి.

❖

ఈ ప్రపంచంలో జన్మను పొందినట్టి ఈ మనుజుడు బాల్యం నుండే ఈ జగత్తు యొక్క స్థితిని – ఇది వస్తుతః భ్రాంతియేనని – ఎరిగి ఉండటం మంచిది. క్రమంగా మనం ఇప్పుడు ఈ చెప్పు కోబోయే తీరుగా సంతాపములను జయించి విక్షేపరహితుడై జీవితము కొనసాగించటం ఉచితం.

**సర్వసౌహార్ద జననీం, సర్వస్యాశ్వాసకారిణీమ్**

**సమతా – అమలమ్ ఆశ్రిత్య విహర్తవ్యమ్ ఇహా! అనఘ!**

జ్ఞాని యగువాడు స్వభావసిద్ధంగా సర్వత్రా ఒకానొక "సర్వ సమత్వం" సర్వదా కలిగి ఉంటాడు. అందుచేత మీరంతా అట్టి సర్వసమత్యమును అభ్యసించువారై ఉండండి. "సర్వ సమత్వం" సర్వ సహజీవుల పట్ల మిత్రత్వం కలుగజేయునదై ఉన్నది. సమస్త ప్రాణులను ఊరడించునదై ఉంటుంది.

సర్వ సమత్వం అంటే సహజీవులను ఒకే ఆత్మ యొక్క వేరువేరు స్వరూప చమత్కారములుగా దర్శించటం. ఒకే గంగాజలం అనేక గంగాజల తరంగాలుగా కనిపిస్తున్నట్లు సర్వత్రా ఒకానొక సమత్వంతో కూడిన స్వభావమును పెంపొందించుకొని ఉండటం. సర్వ వైషమ్యరహితమగు బ్రాహ్మీ దృష్టిని అవలంబించి ఉండటం.

కనుక ఓ ప్రియ సభికులారా! మీరంతా "నాకు కనిపించే ఈ జగత్తులోని సర్వ రూపాలు ప్రియమైన పరమాత్మ రూపములే" అని పిల్లలకు చిన్నప్పటి నుంచే అలవాటు చేస్తే వారికి ఎంతో శ్రేయస్సు కలిగించినవారౌతారు. అంతేగాని "వాళ్ళు మంచివాళ్ళు కాదురా! ఆ కులం, ఈ ప్రదేశం వారిని నమ్మకండిరా!" ఇటువంటి మాటలతో ఆ పిల్లలు పొందవలసిన ప్రశాంతత్వమును చిన్నప్పటి నుండే భంగ పరచకండి. "సర్వ సమత్వ భావన" అనేది సమస్త సంపదలలో అత్యుత్తమమైనది. సర్వ సద్గుణాలను పెంపొందింపజేసేది. 'జీవితం' అనే వృక్షమునకు "సర్వ సమత్వం" అనే ఫలం కాయటం అత్యంత పవిత్రమైన విశేషం సుమా! పిల్లలకు పెద్దలు చేయగలిగే కొంచెం ఉపకారం అదే!

ఓ రాఘవా! 'సమత్వము' అనే స్వభావమును పెంపొందింపజేసుకొని, సర్వజీవుల హితము కొరకై, ఆచరణ కలిగియుంటూ యథాప్రాప్తములైన వ్యవహారములను నిర్వహిస్తూ ఉండే మనుజులను సర్వైశ్వర్యముల స్వయముగా ప్రేమపూర్వకంగా ఆశ్రయిస్తాయి. "సమత్వము" అను అభ్యాసముచే ఏ నాశరహితమైన ఉత్తమ సుఖం లభిస్తుందో... అట్టి సుఖం గొప్ప గొప్ప రాజ్యాలు ఏలే వారియందు గాని, అనేక మంది వనితాజనముచే గాని లభించేది కాదు. లభించదు. అట్టి సమత్వముచే సర్వ

ద్వంద్వములను అలవోకగా నశింపజేసుకొనటం సాధ్యపడుతుంది. అది భయ–జ్వరాలను దరి చేరనీయదు. సమస్త దుఃఖతాపాలకు క్షణంలో జయించివేయగల ప్రావీణ్యత సంపాదించి పెడుతుంది. ఓ రామచంద్రా! శత్రువులు కూడా సమదృష్టిచే మిత్రులుగా కనిపిస్తారు. అచిరకాలంలో తత్త్వదర్శనం అతిసులభము, స్వభావ సిద్ధము అవుతుంది. అట్టి 'సమత్వం'చే పరిపూర్ణులైన మనుజులు ముల్లోకాలలో అక్కడక్కడగాని కనిపించటం లేదు. "సర్వ సమత్వం" పుణికి పుచ్చుకున్న మానవులను చూచి మహర్షులమగు మేము అల్లంత దూరంగా ఉండగానే ప్రపత్తితో చేతులెత్తి నమస్కరిస్తూ ఉంటాం.

జ్ఞాని యొక్క ప్రబుద్ధము అగుచున్న నిజచిత్తం నుండి 'సర్వ సమత్వం' అనే చంద్రుడు అమృతకళలతో స్వయంగా బయల్వెడలుచున్నాడు. అద్దాని అమృత కళలచే జ్ఞాని హృదయమంతా అమృత మాధుర్యంతో నిండి ఉంటోంది. ఓ రామచంద్రా! రాజులు, చక్రవర్తులు మొదలైన వారిలో కూడా కొందరు అనేక లౌకికమైన బాధ్యతలు నిర్వహిస్తూనే 'సర్వసమత్వం' అనే రసమును ఆస్వాదిస్తున్న 'జనకుడు' మొదలైన తత్త్వజ్ఞులు ఎందరో ఉన్నారు. సమత్వము అభ్యసిస్తున్న జీవునియొక్క నిజ కామము, క్రోధము, లోభము మొదలైన దోషాలు కూడా క్రమంగా "శాంతి, ఉదారత్వం" మొదలైన ఉత్తమ గుణములుగా మారిపోతాయి. అట్టివానికి దుఃఖము కూడా సుఖ రూపముగా అగుచున్నది. మరణము కూడా జీవితంలాగా మధురంగానే (జీవిత సదృశంగా) అగుచున్నది. "మైత్రి – కరుణ – తితిక్ష – క్షమ – ప్రేమ" మొదలైన సద్గుణములు తమంతట తామే "సర్వసమత్వం" అభ్యసించేవాని హృదయంలోనికి సొంత ఇంటికి వచ్చినట్లుగా – వచ్చి చేరుతాయి. ఎవరిలో "సమదర్శనత్వము" పూర్ణముగా ఉదయిస్తుందో, వారికి చింతలే ఉండవు. ఉత్తమ గుణములు – అభ్యాసములు వాటికవే వచ్చి చేరుతాయి. ఆతనికి ఈ ప్రపంచములో ప్రాప్తించని సంపద అంటూ ఏదీ ఉండజాలదు.

**సర్వ సమత్వము యొక్క విశేష లక్షణములు -** అట్టివాడు "ఇది నాకు ఉపయోగించే పని – అది వారికి ఉపయోగించే పని"... అనే తేడా లేకుండా సమాన దృక్పథంతో వర్తిస్తూ ఉంటాడు. 'క్షమ, ఉదారత్వము' స్వభావ సిద్ధంగా కలిగిఉంటాడు. యథా ప్రాప్తములైన ప్రస్తుత వ్యవహారమును నిశ్చింతగా – నిస్వార్థంగా – లోకహితైషి అయి, సమజీవులపట్ల ప్రేమాస్పదమైన ఉద్దేశములతో నిర్వర్తిస్తూ ఉంటాడు. త్యాగశీలియై ఉంటాడు. సహజనులందరినీ సహజమైన ప్రేమ వీక్షణములతో సమాదరిస్తూ ఉంటాడు. ఉదారమైన ప్రవర్తన – చరితము కలిగినవాడై ఉంటాడు. తదితరులకు "ఈతడు ఆప్తుడు – శ్రేయోభిలాషి – ప్రేమ స్వరూపుడు"... అనే ఆనందం కలిగింపజేస్తూ ఉంటాడు.

ఆతడు ఎక్కడుంటే అక్కడ 'చింతామణి' వంటివాడై, ఎవరికి ఏది అవసరమో వారికి ఆ రీతిగా సహకారాలు అందించే స్వభావం కలిగి ఉంటాడు. సదాచార తత్పరుడై ఉంటాడు. సర్వ జనులకు శ్రేయోభిలాషి అయి వారికి శుభము – హితము కలుగజేయాలనే తపన – స్వభావము కలిగి ఉంటాడు. సర్వ స్వతంత్ర స్వభావుడై అనేకులకు సానుకుల్యుడై ఉంటాడు. అట్టి "సర్వ సమత్వము"తో కూడిన మనుజుని తదితర మానవులు – దేవతలు కూడా తమ మధ్యగా ఉండాలని కోరుకొంటూ ఉంటారు.

ఓ రామచంద్రా! సమచిత్తుడైన మనుజుని అగ్ని దహించజాలదు. జలము తడుపజాలదు. అవన్నీ ఆతనికి దుఃఖం కలిగించజాలవు. ఆతడు స్వభావ సిద్ధంగానే ఏ కార్యమును ఎట్లా నిర్వర్తించాలో అట్లాగే నిర్వర్తిస్తూ – హర్ష విషాదములు లేనివాడై ఉంటాడు. సమస్త కార్యములను 'సమత్వము' అనే స్వభావముతో కూడి ఆచరించే మహనీయుల విలువ కొలవటం ఎవరితరం అయ్యేది కాదు!

**మిత్రాణి బంధురిపవో రాజానో వ్యవహారిణః**
**సమ్యక్కారిణి తత్త్వజ్ఞే విశ్వసన్తి మహాధియః ॥**

"సమత్వము – ఉత్తమ ఆచరణ" పెంపొందించుకొనియున్న మనుజుని పట్ల మిత్రులు, బంధువులు, శత్రువులు, రాజులు, తదితర వ్యవహారవేత్తలు, గురువులు, విజ్ఞులు .... వీళ్ళంతా గొప్ప విశ్వాసము కలిగి ఉంటారు.

**న అనిష్టాత్ ప్రపలాయన్తే నేష్టాదాయాన్తి తుష్టతామ్**
**ప్రకృతక్రమ సంప్రాప్తాః తత్త్వజ్ఞాః సమదర్శినః ॥**

వారు వారికి నియమించిన ప్రస్తుత వ్యవహారమును శ్రద్ధ – నమ్రతలతో ఆచరిస్తూ ఉంటారు. ఆ సమదర్శులగు మహనీయులు (తత్త్వజ్ఞులు) అనిష్టములు సంప్రాప్తించినప్పుడు భయపడి పారిపోరు. ఇష్టములు ప్రాప్తించినపుడు ఉబ్బిపోరు.

వారు సమత్వముతో కూడిన నిర్లోభగుణ విశేషం కారణంగా – ఇతరులు వదిలి పెట్టటానికి ఏమాత్రం సిద్ధంగాని "ఇళ్ళు, సంపదలు" మొదలైనవి – తదితరుల కొరకై అవసరమైతే త్యాగం చేయటానికై సంసిద్ధులై ఉంటారు. స్వభావంగానే 'సంతోషము' అనే ఉత్తమ వృత్తిని అవధరించి ఉంటారు. వారి యొక్క 'సమత్వం' అన మనోబలం కారణంగా దుఃఖములు వారిని సమీపించజాలవు. వారు దుఃఖరహితులై, ప్రసన్నచిత్తులై అనేక భేదభావములు కలిగియుండి, తద్వారా అనేక మానసిక వేదనలలో నిష్కారణంగా చిక్కుకొని ఉన్న వారిని చూచి, – "వీరు సమత్వమును అభ్యసిస్తూ ఉంటే ఎంత బాగు"... అని తలుస్తూ ఉంటారు. అందుకు సూచనలను అందించే ప్రయత్నంలో ఉంటారు. – తమ ఉపదేశాదులతో సహజీవులను ఉత్తేజపరుస్తూ ఉంటారు.

ఓ రామచంద్రా! ఏ జీవుడు 'సర్వసమత్వము'ను అభ్యసించి తన స్వభావంగా మలచు కొంటాడో... అట్టి వానిని దేవతలు కూడా పూజిస్తూ ఉంటారు. అట్టి 'సర్వ సమత్వము' సంస్కారంగా స్వభావంగా కలవాని 'కోపం' కూడా అమృత ఫలములనే కలిగిస్తుంది కాని, లోకానికి క్షోభ కలిగించేది అయివుండదు.

**యత్కరోతి యదశ్నాతి యదాక్రామతి నిన్దతి**
**సమదృష్టిస్తదస్యేయం స్తౌతి నిత్యం జనావలిః।**

సమదృష్టిగల మనుష్యుడు ఏది నిర్వర్తిస్తాడో, ఏది భుజిస్తాడో, ఎక్కడికి వెళతాడో, ఏది 'అనుచితం' అని నిందిస్తాడో... ఆయా కర్మలన్నిటినీ... జనులు నిత్యం స్తుతిస్తూ ఉంటారు. ఆతను జేసేది శుభముగాని, అశుభముగాని, శీఘ్రంగా గాని నెమ్మదిగా గాని... అదంతా జనులచే

ప్రశంసించబడుతూ ఉంటుంది. సమదృష్టి గల మహాత్ములు చిరకాల ఘోర సంకటములు సంప్రాప్తించినా కూడా భీతిల్లరు. వారి సమదృష్టి ఆ సంకటములను కూడా హాస్యపు జల్లుగా మార్చివేయగలుగుతుంది.

❖

ఓ రామచంద్రా! అట్టి "సర్వ సమదృష్టి"ని కలిగివున్నారు కాబట్టే శిబిచక్రవర్తి తనను శరణువేడిన పావురము యొక్క ఆపత్తు తొలగటానికి గ్రద్దకు తన శరీరము నందలి మాంసమును కోసి ఇచ్చివేశారు. అట్టి సమచిత్తుడై ఉండటం చేత ఒకానొక అంగదేశ భూపాలుడు తన ప్రాణానికి ప్రాణమైన భార్యను శత్రువులు బాధిస్తున్నప్పటికీ చిత్తవైకల్యము పొందక ఉండగలిగాడు.

ఒక త్రిగర్తరాజు ఎంతో తపస్సు చేసి పొందిన తన కుమారుణ్ణి కూడా జూదంలో ఓడిపోయి ఒక రాక్షసునికి ఇచ్చి వేసేటప్పుడు "సర్వసమత్వ అభ్యాసం" చేత దుఃఖం పొందకుండా ఉండగలిగాడు.

అంతేకాదు. జనక మహారాజు ధనధాన్య సమృద్ధితో కూడిన మిథిలా నగరం తగలబడు చున్నప్పుడు తన సమరస భావమును వీడనివాడై చింతా రహితుడై ఉండగలిగాడు.

అట్లాగే సాళ్వరాజు "నీవు ఏది కోరితే అది దక్షిణగా ఇస్తాను" ...అని మాట ఇచ్చి, ఒక బ్రాహ్మణుడు తన శిరస్సును కోరినప్పుడు, తన "సమత్వము" అనే సమరసాభ్యాసము చేతనే తన శిరస్సును కూడా ఛేదించి ఆ బ్రాహ్మణునకు సమర్పించాడు.

అదేవిధంగా, సౌవీరదేశరాజు ఒకాయన ఇంద్రుని జయించి ఐరావతం సంపాదించి, యజ్ఞం ప్రారంభించబోతూ, ఋత్విక్కుల కోరికను అనుసరించి ఆ ఐరావతాన్ని ఇంద్రునికి ప్రేమ పూర్వకంగా ఇచ్చివేశాడు. అది ఎట్లా సాధ్యం? 'సమత్వము' చేతనే!

కదంబవనంలో నివసించే ఒక క్రూరరాక్షసుడు గురువాక్యానుసారం మాంసాహారం మానివేశాడు. అది అతనికి సమత్వాభ్యాసం చేతనే సుసాధ్యమయింది.

బాలచంద్రునివలె శుద్ధుడై జన్మించిన జడభరతుడు తనయొక్క 'సమత్వము' అనే సాధన బలంచేత భిక్షపాత్రలో అగ్నిని చెఱుకురసం త్రాగినట్లు త్రాగివేశాడు.

సమబుద్ధి చేతనే ధర్మవ్యాధుడు (భారతంలోని వ్యాధగీత యొక్క ప్రవక్త) మాంసమును అమ్ముకొనే వృత్తి నిర్వర్తిస్తూ కూడా పరమపదమగు 'మోక్షము'ను సొంతం చేసుకున్నాడు.

సమత్వబుద్ధి సంపాదించుకొని ఉండటం చేతనే "కపర్ధనుడు" అనే రాజర్షి ఒకసారి నందన వనంలో ప్రవేశించి శృంగారరూపులు అగు దేవతా స్త్రీలను చూచికూడా కామవివశుడు కాలేదు.

ఓ రామచంద్రా! హరిశ్చంద్రాది అనేకమంది రాజర్షులు ఏవేవో సందర్భాలలో రాజ్యములను త్యజించి కాటికాపరిగా అయినప్పుడు కూడా ఎటువంటి మనో వైకల్యం పొందకయే వున్నారు.

ఈ సభలో అనేకమంది గొప్ప ఋషులు, మునులు, సిద్ధులు... వీరంతా దేవతలంటి వారిచే పూజింపబడుచున్నప్పుడు కూడా – అనేక మానావమానములను పొందుచున్నప్పుడు కూడా, గొప్ప సిద్ధులుండి కూడా, ఉద్వేగులు అవటమే లేదు. అనేమంది రాజులు, సామాన్యులు కూడా సర్వ సమదృష్టి" అనే పురుషకారం చేత మహనీయులకు కూడా పూజనీయులైనారు.

అంతేకాదు. ఉత్తమ ధీమంతులైనవారు ఇహ – పరసిద్ధి కొరకై, ఆత్మజ్ఞానము యొక్క ప్రవృత్తిని సంపాదించుకోవటం కోసం మొట్టమొదటగా "సమబుద్ధి'ని ఆశ్రయించటం ఆవశ్యకం. "సర్వ సమత్వమును అలవాటుగా చేసుకుంటూ గురుముఖతః మోక్ష శాస్త్రాన్ని అభ్యసిస్తూ అనుసరించాలి అని సర్వజనులకూ నా విన్నపం.

**అభివాంఛేత్ న మరణం, అభివాంఛేత్ న జీవితమ్,**

**యథాప్రాప్త సమాచారో విచరేద విహింసకః ॥**

కనుక ఓ ప్రియసభికులారా! మీరు "సర్వ సమత్వము" అనే పవిత్రదృష్టిని సముపార్జించుకోండి. అట్లా సంపాదించుకున్న తరువాత, ఇక మరణము – జీవితము రెండింటినీ కోరుకొననివారై... యథాప్రాప్తములైన వ్యవహారములను ఆచరిస్తూ అహింసాతత్పరులై ప్రేమాస్పదమైన దృక్పథముతో సర్వసమత్వమును పుణికిపుచ్చుకొని... ఈ లోకమున విహరించండి.

ఓ రామచంద్రా! "సమదర్శనము" అనే మనోబలంచేత – గుణదోషములను సమభావముతో చూస్తూ, ఉత్కృష్ట–నికృష్ట జన్మలందలి సుఖ–దుఃఖములను సమముగా దర్శిస్తూ, మానావమానముల పట్ల సమభావము కలిగివుంటూ... ప్రస్తుత వ్యవహారమను అనాసక్తి పూర్వకంగా, త్యాగబుద్ధితో జ్ఞాని ఆచరిస్తూవున్నాడు. అట్టి పవిత్రమూర్తి – ప్రకాశశీలుడగు జీమన్ముక్తుడు లోకోపకారము కొరకు మాత్రమే ప్రపంచంలో సంచరిస్తూ ఉంటున్నాడు.

❖❖❖

# 4. ముక్త పురుషుల లోకకళ్యాణ కారకములగు కర్మలు

**శ్రీరాముడు :** ఓ మునీంద్రా! మోక్షశాస్త్రం యొక్క పునశ్చరణకై ఈ ప్రశ్నవేస్తున్నాను. జీవన్ముక్తులు అనునిత్యం ఆత్మజ్ఞాన పరాయణులై ఉంటారు కదా! సదా ఆత్మారాములై వెలయు వారు "కర్మత్యాగం" చేయాలి కదా? (త్యాగేనైవతు కైవల్యమ్) మరి ఆయా జీవన్ముక్తులు కర్మలు వదలకయే ఉన్నారేం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జీవన్ముక్తులకు "ఇది గ్రహించాలి" అనే దృష్టి ఎట్లాగైతే ఉండదో... అట్లాగే "ఇది త్యజించాలి" అనే దృష్టి కూడా ఉండదు. వారికి ఏదైనా త్యజించటం చేతగాని, గ్రహించటం చేతగాని క్రొత్తగా రాగలిగిన ప్రయోజనమేదీ ఉండదు. జ్ఞానికి ఇక్కడ త్యజించవలసిన దుఃఖకరమైన కర్మగాని, స్వీకరించి అవశ్యం ఆచరించవలసిన సుఖకరమైన కర్మగాని ఏదీ లేదు. వారికి గ్రాహ్య – త్యాజ్య ప్రయోజనాలేవీ ఉండవు. కాబట్టి వర్ణాశ్రమమునకు ఉచితమైన ప్రవాహ పతితమైన ఆయా కార్యములను ఆ రీతిగానే ఆచరిస్తూ ఉంటారు.

**యావత్ ఆయురియం రామ, నిశ్చితం స్పందతే తనుః**

**తద్యథా ప్రాప్తమ్ అవ్యగ్రం స్పన్దతామపరేణ కిమ్?**

ఓ రామచంద్రా! ఆయుస్సు ఉన్నంతవరకు ఈ దేహం చేష్టలు కలిగి ఉంటుంది. అది దేహధర్మమే అయివున్నది కదా! కాబట్టి ఈ దేహము యథాప్రాప్తములైన ధర్మ పూర్వక వ్యవహారములు

నిశ్చితంగా నిర్వర్తించనీ! దానివలన నష్టమేమున్నది? అట్లా కాకుండా మరొక విధంగా చేయటం వలన వచ్చే ప్రయోజనం మాత్రం ఏమున్నది? అగత్యమేమిటి?

జీవన్ముక్తునకు "అశాస్త్రీయ - సశాస్త్రీయ" కర్మలు రెండూ ఒక్కటే అయినప్పటికీ... శాస్త్రీయ సదాచారమునందు దోషం లేదు కాబట్టి... ఇక తమ ధర్మపూర్వక వ్యవహార క్రమము వదలి మరెక్కడికో వెళ్ళి ఏదో నిర్వర్తించవలసిన పని ఏమి? ఎవనికైనా సొంతిల్లు బాగానే ఉండి ఉండగా... అది వదలి ఎక్కడికో వెళ్ళి ఏదో ఇంకొక గృహంలో ఉండవలసిన పనేమున్నది చెప్పు?

ఓ రామచంద్రా! ఒకడు కార్యము యొక్క "సిద్ధి-అసిద్ధి"ల యందు సమము, నిర్మలము, నిర్వికారము - అయినట్టి బుద్ధితో ఏది ఎట్లు చేసినా కూడా... అది ఆతనిపట్ల సదా దోషరహితమే అవుతుంది! ఈ పృథివిపై అనేక శాస్త్ర - లోక రహస్యములు తెలిపినవారున్నారు. వారు వారియొక్క బుద్ధి - తెలివితేటలతో లోకోపకారములు ఆశయంగా కలిగి ఉండటమే ఉచితం కదా! అట్లాగే ఈ బుద్ధి - నేర్పరితనము లోకదేవతలు ప్రసాదించినదే కాబట్టి, ఈ లోకము యొక్క శ్రేయమునకై సద్వినియోగపడుగాక!

కొందరు జీవన్ముక్తులు సంగ రహితమగు బుద్ధితో యథాప్రాప్తములైన కర్మలు నిర్వర్తిస్తూ లోకసేవ - సంఘసేవ చేస్తున్నారు. మరికొందరో... గృహస్థాశ్రమ ధర్మములు నిర్వర్తిస్తూ ఈ ప్రపంచంలో వర్తిస్తున్నారు. అట్లాగే నీవంటి కొందరు రాజర్షులు ఆత్మారామస్వరూపులు రాగరహితంగా - సంగరహితంగా ఉత్తమ బుద్ధితో "తత్త్వజ్ఞులు - సంతాపరహితులు" అయి ప్రజారంజకంగా రాజ్యములను ఏలుచున్నారు.

మరికొందరు జీవన్ముక్తులు వేదార్థములను ఆశ్రయించి కర్మసన్యాస యోగమును అభ్యసిస్తూ ప్రస్తుత కర్మలను దైవ సమర్పణ బుద్ధితో నిర్వర్తిస్తూ ఉన్నారు. ఇంకొందరు యజ్ఞములు లోకకళ్యాణార్థం నిర్వర్తిస్తూ నిత్యాగ్నిహోత్రులై ఉన్నారు. ఇంకా కొందరు నాలుగు వర్ణాశ్రమములందు ఉన్నవారై తమ తమ ఆశ్రమములకు యోగమ్యములైన ధ్యానము - దైవార్చన మొదలైనవి నిర్వర్తిస్తూ నిజాశ్రమ ధర్మాలను కూడా కొనసాగిస్తున్నారు.

కొందరైతే, మహాశయులై ఉంటూ, అంతరంగంలో మాత్రం సర్వ కర్మఫల త్యాగము గావించివైచి... పైకి మాత్రం నిత్యము కర్మ తత్పరులై ఉంటున్నారు. అనగా అంతరంగంలో పూర్ణాత్మ జ్ఞానులై ఉండియే బాహ్యానికి మాత్రం తదితరులవలెనే ఏవేవో విహిత కర్మలు నిర్వర్తిస్తూ ఉన్నారు.

ఇక కొందరు జీవన్ముక్తులైతే, మామూలు మనుష్యులకు కలలో కూడా కనిపించనట్టి నిర్జన ప్రదేశాలలో ఏకాంత ప్రదేశంలో ఉంటూ లేళ్ళు మొదలైన మృగాలు తప్పించి, జనులే ప్రవేశించని ఆ ప్రదేశాలలో ధ్యానపరాయణులై ఉంటున్నారు. కొందరేమో... పుణ్యాత్ములగు సాధుజనులచే సేవించబడే మున్యాశ్రమాలలోను, పుణ్యతీర్థ ప్రదేశాలలోను వసించుచు ప్రశాంత మనస్కులై లోకులకు జ్ఞాన ప్రవచనాలు ప్రసాదిస్తున్నారు.

మరికొందరో... సమచిత్తులై బంధుజనం మధ్యగా కలిగే అనేక విక్షేపాలను, స్వదేశమును,

స్వగృహమును వదలి మరొక ఏదో ప్రదేశం ఆశ్రయించి ఆత్మధ్యాన పరాయణులై కాలం వెళ్ళబుచ్చుచున్నారు.

ఇంకా కొందరో... ఎక్కడా ఒకచోట ఉండకుండా... సంచారం చేస్తూ ఒక వనంలోంచి ఇంకొక వనంలోకి, ఒక నగరం నుండి మరొక నగరంలోనికి ప్రవేశిస్తూ కాలం గడుపుచున్నారు.

అట్లాగే కొందరు తత్త్వజ్ఞులు తాపసులై కాశీ–ప్రయాగ–శ్రీశైలం–బదరికాశ్రమం ... మొదలైన తీర్థ స్థలములలోను, పర్వత శిఖరములపైన, వన సమూహములలోను, నదీ ప్రాంతపు ఏకాంత ప్రదేశాలలోను నివసిస్తూ ఆత్మారాధన కొనసాగిస్తున్నారు.

కొందరు సన్యాసవిధిని స్వీకరించి ఇంతకు ముందటి వర్ణాశ్రమ ధర్మాలను త్యజించినవారై ఉంటున్నారు. బ్రహ్మ చర్యాశ్రమ ధర్మములను స్వీకరించుచూ వర్తిస్తున్నారు. కొందరైతే సర్వము తెలిసిన ఆత్మజ్ఞానులై ఉండి కూడా... ఎవరితోనూ ఎట్టి సంబంధము కలిగి ఉండకుండా ఉన్మత్త వేషధారణతో "పిచ్చివారేమోలే".... అన్నట్లుగా వీథులలో పచార్లు చేస్తూ కాలం వెళ్ళబుచ్చుచున్నారు.

కొందరు స్వస్థానమును త్యజించి మరొక ప్రదేశమును ఎన్నుకొని ఆత్మతత్త్వమును ప్రజలకు బోధిస్తున్నారు. మరికొందరు స్వస్థానమునందే ప్రీతి కలిగియున్నవారై ఉంటున్నారు. కొందరు సదా సంచారము చేస్తూ బోధలు సలుపుచున్నారు.

❖

చూచావా! రామచంద్రా! ఈ విధంగా స్వర్గంలోను, పాతాళంలోను, భూలోకంలోను అనేక స్థావరములలో లోకస్థితిని ఎరిగి, సమ్యక్ జ్ఞానముచే 'నిర్మలమైన దృష్టిని' కలిగియుండి దృశ్యము యొక్క పరాపరములను గాంచివారై ఉన్నారు. "అట్టివారు – ఇక్కడే, ఇట్లాగే ఉంటారు. అక్కడ ఆ తీరుగా ఉండరు"... అని మనమెవరమూ నిర్ణయించి చెప్పటానికి వీలు కుదరదు.

అట్లాగే జనులలో కొందరు అల్ప బుద్ధులు అయివుండటంచేత కొంచెము అటూ – కొంచెము ఇటు ఊగే చిత్తము కలవారై ఉంటున్నారు. వారిలో కొందరు పాపాచరణము త్యజించి క్రమంగా సజ్జనుల మార్గం అనుసరిస్తూ వస్తున్నవారున్నారు. అట్లాగే కొందరు అర్ధ ప్రబుద్ధులు "మేము బ్రహ్మ స్వరూపులమే కదా! శాస్త్రాలు చెప్పుచున్నాయి కదా! కాబట్టి నిషిద్ధమైన ఆచరణ కలిగివున్నా తప్పేమిటి? అది మమ్ములను ఏం చేయగలదు?" ... అని అనుకుంటూ ఈ ప్రకారంగా గర్వముతో కూడుకొని ఉన్నవారై సదాచారములను త్యజించి వేస్తున్నారు. అది ఉభయ భ్రష్టత్వమునకు దారితీయగలదని అట్టి జనులకూ నా హెచ్చరిక!

ఓ రామచంద్రా! ఈ విధంగా ఈ జన సమూహంలో అనేకమంది ఈ జనన – మరణ సముద్రమును దాటివేయాలని అభిలషిస్తున్నారు. అయితే, వివిధ రీతులలో అనేక దృష్టులతో కూడి ఉంటున్నారు. వారిలో కొందరు శాస్త్రీయ సాధనకు ఉపక్రమిస్తున్నారు. మరికొందరేమో మీన మేషాలు లెక్కపెట్టుకుంటూ ప్రయత్నమునకు ఉపక్రమించటం లేదు. అందుచేత... రామచంద్రా!

**సంసారోత్తరణే తత్ర న హేతుర్వనవాసితా ।**
**నాఽపి స్వదేశవాసిత్వం, న చ కష్టతపః క్రియాః ॥**

సంసారమును దాటివేయటానికై వనవాసముగాని, (లేక) స్వదేశవాసముగాని, (లేక) కష్టదాయకమైన తపఃక్రియలుగాని... కారణము కాజాలవు. అట్లాగే... కర్మ పరిత్యాగంగాని, కర్మ పరిగ్రహణంగాని, వివిధములై కార్యాచరణములుగాని, వాటిచే కలిగే కార్యసిద్ధిగాని, ఖ్యాతి-లాభము-ఐశ్వర్యము - వరము - కార్యసామర్థ్యము మొదలైన ఆయా పుణ్య - పాపవ్యవహారాది సమూహములుగాని సంసార నివృత్తికి కారణం ప్రత్యక్షకారణం కాదు. మరి?

**స్వభావః కారణం నామ సంసారోత్తరణం ప్రతి**
**అసంసక్తం మనో యస్య స తీర్ణో భవసాగరాత్ ॥**

తనయొక్క శుద్ధ సత్‌చిత్ భావనయందలి స్థితియే సంసార సాగరమున దాటివేయటానికి కారణం అగుచున్నది. ఎవని మనసైతే... తత్త్వజ్ఞానము సంపాదించుకున్నదై ఈ ఎదురుగా కనిపిస్తున్న సర్వసాంసారిక విషయములందునూ అంతరంగంలో అనాసక్తి పెంపొందించుకొని ఉంటుందో, ...ఆతడు మాత్రమే ఈ సంసార సాగరమును దాటి వేసినవాడు అగుచున్నాడు. అయితే... శుభ కార్యములను ఆచరించటం, అశుభకార్యముల నుండి మనస్సును పరిహరించటం నిర్వర్తిస్తూ వుంటాడు. అది జీవన్ముక్తుని స్వభావమే అయివున్నది.

"అసంగచిత్తుడు"... అయినట్టి జీవన్ముక్తుడు మరల సమసారమును పొందడు. ఆతనికి మరల ఈ సంసారమునందు సంగము, అభినివేశము ఉదయించవు. అట్లా కాకుండా, సంగంతో కూడినవాడై శుభాశుభకార్యములు నిర్వర్తించినా, (లేక) నిర్వర్తించకున్నా కూడా విషయములందు ఆసక్తి కలిగియున్న చిత్తముగల మూర్ఖుడు సంసారమున మగ్నుడై ఉంటున్నాడు. ఈ బుద్ధి విషయ రసములను ఆస్వాదిస్తూ పోతూఉంటే, అవి అనేక దుఃఖ పరంపరలను కలుగజేస్తూనే ఉంటాయి. అట్టి దుఃఖములకు అంతూ పొంతూ కూడా ఉండదు. "బుద్ధి తత్త్వాభ్యాసం" లేకపోతే ఈ బుద్ధి ఇంద్రియ - దృశ్య విషయముల నుండి మరలదు.

అయితే ఈ జీవుడు సాధన చతుష్టయం ఆశ్రయిస్తూ ఉండగా, ఒకానొకప్పుడు సౌభాగ్యవశంగా కాకతాళీయ యోగంచేత చిత్తము నిర్మలం కావటం ప్రారంభిస్తుంది. చిత్తము ఆత్మసాక్షాత్కార సిద్ధికొరకై శ్రవణము - మననము మొదలైన ఉపాయములను ఆశ్రయించినదై, క్రమంగా ఆత్మావలోకనమునకై ప్రవృత్తిని పొందుచున్నది. నిర్మలత్వమును సంతరించుకున్న ఆ బుద్ధి అప్పుడు ఆత్మ దర్శనమునకై తత్త్వమును ఎరుగుచున్నది. ద్వంద్వరహితమగుచున్నది. అనాసక్త - నిర్వికారము పొందిన చిత్తమే బ్రహ్మము. అనగా అప్పుడు చిత్తమే 'చిత్‌రూపి' అయి బ్రహ్మమే అయివుంటోంది. అందుచేత ఓ రామచంద్రా!

**అచిత్తత్వం ప్రయాతేన సత్త్వరూపేణ చేతసా**
**సమోభూత్వా సుఖం తిష్ఠ పరాకాశాంత రూపభృత్ ॥**

నీ చిత్తము సత్వము రూపమును పొందుగాక! సత్వరూపమగు చిత్తముతో సమదర్శివై, సర్వత్రా ఆత్మనే దర్శిస్తూ ఉండు. సర్వ ప్రపంచమునకు అధిష్ఠాన రూపమైనట్టి చిదాకాశ రూపమును

ధరించినవాడవై సుఖముగా వెలయుము! ఇప్పుడు నీవు "పరమార్థతత్త్వము'ను పొందినవాడవయ్యావు. రాగదోష రహితుడవైనావు. నిత్యోదితమైన ఆత్మారామ స్వరూపుడవైనావు. సమబుద్ధిచే మహాత్ముడవైనావు. కాబట్టి ఇక దుఃఖరహితుడవే! ఇంక నీకు సంశయములతో పని ఏమున్నది? కాబట్టి సంశయరహితుడవు అయ్యెదవు గాక! ఎందుకంటావా

**ఏకో జనన మరణముక్తం పావనం తత్పదం త్వమ్!**
**అధిగత పరమార్థః త్యక్త రాగాది దోషః**
**సమమతిః ఉదితాత్మా, త్వం మహాత్మా! మహాత్మన్,**
**రఘుతనయ! విశోకః తిష్ఠ నిఃశంకమేకో!**
**జనన - మరణ ముక్తం పావనమ్ 'తత్పదం' త్వమ్ ॥**

ఏకము, జన్మ-జరామరణ వర్జితం, పరమ పవిత్రం- అయినట్టి బ్రహ్మపదం నీవే అయి ఉన్నావు. ఈ జగత్తంతా కూడా నిర్మల పరబ్రహ్మ స్వరూపమే అయివున్నది! ఇక ఈ జగత్తులో ప్రకృతి రూపంగాని, మలరూపం గాని, వికారరూపం గాని, ఉపాధి రూపంగాని, ఆ ఉపాధి యొక్క బోధ రూపంగాని, అద్దాని యొక్క ఇచ్ఛ, గ్రహణం, త్యాగం, భోగం మొదలైనవి గాని ఇంకెక్కడున్నాయి? ఇవన్నీ లేనే లేవు. అంతటా కూడా "సుస్పష్టం, అకృతం" అగు చిన్మయ బ్రహ్మమే ఉన్నది! స్వానుభవముచే "ఆ బ్రహ్మమే నేను (సోఽహమ్)" అని ఎరిగినవాడవై, పాము కుబుసమును విడచినట్లు సర్వ సంశయాలను త్యజించివేయి. అద్వైత రూపముతో అంతటా నీవే అయి ప్రకాశించు!

ఓ రామచంద్రా! నీకు ఇంతకంటే ఎక్కువగా జ్ఞానం కొరకై చెప్పవలసినదేమీ లేదు. ఎందుకంటే, ఇప్పటికే "ఆద్యస్వరూపం, అక్షయం" అయినట్టి "జ్ఞానసారం" నీ హృదయంలో ఉదయించింది. నీవిప్పుడు వేద్య వస్తువగు ఆత్మ స్వరూపాన్ని ఎఱిగినవాడవయ్యావు. ఆత్మారాముడవై స్వయంప్రకాశ యుక్తంగా భాసిస్తున్నావు.

❖

**ఓ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! మునిశ్రేష్ఠుడగు శ్రీవసిష్ఠ మహర్షి ఇట్లా పలికి చిరునవ్వుతో మౌనం వహించారు. అప్పుడు శ్రీరామచంద్రుడు నిర్మలమైన, పవిత్రమైన బుద్ధిచే మధురమగు బ్రహ్మపదాన్ని ఆస్వాదించసాగాడు. సమస్త కోర్కెలు నశించినవాడయ్యాడు. సభికులంతా కూడా పుష్పంలోని తేనె గ్రోలి మౌనం వహించిన తుమ్మెదలాగా... బ్రహ్మరసాస్వాదన తత్పరులై మౌనం వహించి ఉన్నారు.

❖❖❖

# 5. గురు పూజా మహోత్సవం

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ భరద్వాజా! ఆ విధంగా శ్రీ వసిష్ఠ మహర్షి యొక్క "నిర్వాణము" గురించిన వాక్యము పరిసమాప్తములైనాయి. వాక్య ప్రవాహం విరామం పొంది ఆయన మౌనం వహించారు. అప్పుడు ఆ సభలోగల దేవ-మనుష్య-ఋషి సమూహాలు "నిర్వికల్ప సమాధి" ద్వారా "బ్రహ్మైక రసత్వం" నందు సమత్వమును ఆస్వాదించారు. శాంతం, స్వచ్ఛం అగు "మనోవృత్తి" కలవారు

అయ్యారు. వారంతా "స్వకీయ నిర్మల కేవలసాక్షి చైతన్యము" నందు అనిర్వచనీయమైన విశ్రాంతిని అనుభవించారు. అప్పుడు ఆకాశవాసులగు సిద్ధులు – సనకాదులు శ్రీ వసిష్ఠమహర్షిని ఉద్దేశించిన స్తుతివాక్యాలతో ఆకాశమును నింపివేశారు. తత్త్వజ్ఞులగు విశ్వామిత్ర మహర్షి మొదలైనవారి ప్రశంసావాక్యాలు దిక్కులన్నీ విస్తరించాయి. దేవ దుందుభులు ఆకాశంలోను, భూమి మీద ప్రతిధ్వనించాయి. ఆకాశం నుండి ఆ మహర్షి మస్తకంపై పుష్పవర్షం కురిశింది. ఆ సభికులు అదంతా ఆశ్చర్యచకితులై ఆత్మానందభరితంగా చూడసాగారు. అక్కడి వాతావరణమంతా సభికుల జయజయ ధ్వానములతో వ్యాప్తమైనది. పుష్ప వృష్టిచే ఆ దశరథ మహారాజు సభ శోభాయమాన మైనది. కొంత సమయమైనతరువాత పుష్పవర్ష కోలాహలం కొన్ని క్షణాలలో ఉపశమించినది. అప్పుడు సిద్ధులు ఇట్లా పలికారు.

❖

**సిద్ధులు :** ఓ సభికులారా! కల్పారంభం నుండి మేము ఈ సృష్టిలో జరుగుచున్న అనేక సంగతి – సంఘటన – సందర్భాలను అంతా చూస్తూనే ఉన్నాం. మా సిద్ధ సంఘములు మోక్షోపాయములగు అనేక గ్రంథముల వ్యాఖ్యానం విన్నాయి. మేమే అనేక సందర్భాలలో వ్యాఖ్యానించికూడా ఉన్నాం. కానీ... ఇంతటి మహద్రూపమైనట్టి "శ్రీవసిష్ఠ–రామ సంవాదము" "యోగవాసిష్ఠము" – "మహా రామాయణము" వంటిది ఇంతకు ముందు మేమెప్పుడూ వినియుండలేదు! శ్రీవసిష్ఠ మహర్షి యొక్క ఈ ప్రవచనము వినటంచేత పశువులు, పక్షులు మొదలైన తిర్యక్ జీవులు, స్త్రీలు, బాలురు, పాములు కూడా పరమశాంతిని పొందగలవు! ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. అనేక దృష్టాంతాలచేత–హేతువుల చేత – యుక్తుల చేత, ఈ వసిష్ఠ మునీంద్రుడు ఈ అందమైన బాలుడగు శ్రీరామచంద్రమూర్తికి ఈ విధంగా ఇప్పుడు బోధించారో, ఆ విధంగా ఆయన తన ధర్మపత్నియగు అరుంధతీదేవికి కూడా బోధించియున్నారో, లేదో మరి? మోక్షోపాయమగు ఈ మహారామాయణ గ్రంథమును ఎవరు కొంచెం శ్రద్ధగా, ఓపికతో శ్రవణం చేస్తారో... అట్టి పశుపక్ష్యాదులు కూడా సంసార రోగ రహితులవగలవంటే... ఇక ఈ మనుజులు విముక్తులు కాకుండా ఎందుకుంటారు? ఓ సభికులారా! ఈ మహర్షి ప్రవచనాన్ని చెవులారా విని ఆనదించాం! పరమతృప్తిని పొందాము. నూతనమైన శోభను సంతరించుకున్నాం!

❖

సభికులంతా ఆ సిద్ధుల వాక్యాలు విన్నారు. స్తుతి వాక్య గానాలతో నిండిపోయిన ఆ సభను చూస్తూ అక్కడి జనులు శ్రీవసిష్ఠ మునీంద్రుని పాదపద్మాలను మనస్సులలో ప్రతిష్ఠించుకొని నమస్క రించసాగారు. అక్కడి సభలోని రాజులు లేచి మహర్షిని సమీపించి పాదాలపై పుష్పాలు సమర్పించారు.

**శ్రీదశరథ మహారాజు :** అరుంధతీ నాథుడవగు ఓ శ్రీవసిష్ఠ మహర్షీ! మీ దివ్యమైన ఉపదేశం ఎడారిలో చిక్కుకున్న బాటసారిపై జడి వానలాగా మాకు లభించింది. మీ బోధచే "వృద్ధి, క్షయ రహితం, మార్పు చేర్పులు లేనిది, నిర్వికారం, నిరతిశయానంద రూపం" అయినట్టి మా యొక్క స్వస్వరూపమగు ఆత్మ యొక్క అనుభవం మాకు లభించింది. జీవాత్మబద్ధులమైన మాకు

పరమాత్మజ్ఞానామృతం ప్రసాదించి మమ్ములను సముద్ధరించారు. మా అంతఃకరణంలో పరమోత్కృష్ట మగు పూర్ణత్వం ఉదయించింది. హే మునీశ్వరా! ఇటువంటి పురుషార్థమును ప్రసాదించిన పరమ పూజ్యులగు మీకు గురదక్షిణగా సమర్పించుకోగలిగిన అర్హమైన వస్తువేదీ ఈ భూ-పాతాళ-స్వర్గములలో లేదు. అయితే "గురు దక్షిణ" అవశ్య కర్తవ్యం కదా! శాస్త్ర లోక ప్రసిద్ధం కదా! లేకపోతే గురుపూజా క్రమం సఫలం కాదుకదా! అందుచేత గురుదక్షిణ గురించి ఒక చిన్నప్రార్థన! కోపగించక ఆలకించండి.

మీరు మాకు ప్రసాదించిన ఆత్మతత్త్వ జ్ఞానం అమోఘమై అనేక జన్మల జాడ్యం తొలగిస్తూ మాకు మహోపకారం చేస్తోంది. అద్దాని విలువ ఇంతని చెప్పలేం. అందుకు మీకు ఏది గురుదక్షిణగా ఇచ్చినా సరే, ఇంకా ఇంకా ఋణపడియే ఉంటాం. అందుచేత నేను ఇవి వినమ్రుడనై ఈ విధంగా సమర్పించుకుంటున్నాను.

1. నేను పత్నుల సమేతంగా నిర్వర్తించి ఉన్న అనేక యజ్ఞముల ఫల - సుకృతములను మీకు కృతజ్ఞతతో వినమ్రుడనై ఇచ్చుకుంటున్నాను.

2. ఈ సువిశాల అయోధ్యా సామ్రాజ్యపు చక్రవర్తిత్వమును మీకు సమర్పించుకుంటున్నాను. ప్రభూ! నాతో సహా ఈ సమస్త సామ్రాజ్యం ఇప్పుడు తమకు సమర్పించబడి, తమ అధీనం అయినది. మీరు దీనికంతటికీ ప్రభువులై ఈ రాజసింహాసనం అలంకరించి మీ భృత్యులగు మమ్మ, ఈ రాజ్యాన్ని శాసించండి పరిపాలించండి.

ఇప్పుడు మీరు మా ప్రభువులు. అందుచేత ఆజ్ఞాపించండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ దశరథ మహారాజా! చాలా సంతోషం! అయితే బ్రహ్మయతులమగు మేము నమస్కరించినంత మాత్రంచేత సంతుష్టి పొందుతాం. అట్టి హృదయపూర్వక నమస్కారం మీరు చేతులు జోడించి సమర్పించియే ఉన్నారు. ఈ రాజ్యమును లోకరంజకంగా పాలించటం, ఈ ప్రజలను రక్షించటం, సేవించటం క్షత్రియులగు మీకు మాత్రమే తెలుస్తుంది. ఈ రాజ్యము మీకే శోభిస్తుంది. కనుక ఇదంతా తిరిగి మీకే ఇస్తున్నాను! మా వంటి యతులు రాజులైనదెక్కడా లేదుకదా! కనుక ఈ రాజ్యపాలన ధర్మము మీరే నిర్వర్తించెదరు గాక!

**శ్రీ దశరథ మహారాజు :**

**కియన్మాత్రం తు రాజ్యం స్యాత్? ఇతి లజ్జామహే మునే**
**ప్రకర్షేనాత్ర తేనేశ, యథాజానాసి తత్కురు ॥**

హే మహర్షీ! సప్తద్వీపములకు చక్రవర్తి అయిన ఒక మనుష్యుని ఆనందం కంటే గంధర్వానందం నూరురెట్లు అధికం. మనుష్య-గంధర్వుల ఆనందం కంటే దేవగంధర్వానందం నూరురెట్లు అధికం. ఆ ప్రకారంగా... అన్నిటి కంటే హిరణ్యగర్భానందం అత్యున్నతమైనదని ఉపనిషత్తులు అంటూ ఉంటాయి. ఇక మీరు ఇప్పుడు మాకు ప్రసాదించియున్న "దృశ్యమును స్వాత్మానందరూపంగా దర్శించగలగటం" అనే బ్రహ్మానంద సాగర సమక్షంలో హిరణ్యగర్భానందము కూడా మహాసాగరము యొక్క ఒక నీటి తుంపరతో (జలకణంతో) సమానమగుచున్నది. అంతటి ఆత్మానందము మాకు

అందించిన మాకు జన్మజన్మల జాడ్యమును తొలగించి మహోపకారం చేసిన మీకు ఈ తుచ్ఛ సామ్రాజ్యాన్ని, ఈ తుచ్ఛ దేహాన్ని గురుదక్షిణగా ఇవ్వటానికి సిద్ధపడినందుకు నాకు ఇది చాలా సిగ్గు కలిగించే విషయమగుచున్నది. ఇక మీ ఆజ్ఞానువర్తినై మీ సేవగా భావించి ఈ దేహమును కలిగియుండటం, ఈ రాజ్యమును పాలించటం నిర్వర్తిస్తాను! మీ ఆజ్ఞ ఎట్లో అట్లే అగుగాక! 'నాది' అనిపించేదంతా ఇక మీకే చెందినదై, మీ సేవకుడిగా నియమించబడిన వాడనగుచున్నాను.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఇట్లు పలికి ఆ దశరథ మహారాజు మరల సింహాసనం నుండి లేచి గురుచరణాలను రెండు అరచేతులతో స్పృశించి, కళ్ళకద్దుకొని, పుష్పాంజలి సమర్పించారు. "నేను సద్గురువగు వసిష్ఠ మహర్షికి చెందిన సింహాసనముపై వారి భృత్యుడనై వారి ఆజ్ఞానుసారంగా "ఆసీనుడనవటం" అనే సేవ చేస్తున్నాను'... అని ప్రకటించి మరల సింహాసనముపై ఆసీనుడైనాబీరి.

అప్పుడు శ్రీరామచంద్రుడు గురుదేవులను సమీపించి నుదుటితో వారి సుందర పాదపద్మములకు మరల సాష్టాంగ నమస్కారం చేసి పుష్పాలు సమర్పించి, అందులో ఒక పుష్పాన్ని తన కళ్ళకద్దుకుని కిరీటము యొక్క ఊర్ధ్వమున అలంకరించుకున్నారు. ఆ తరువాత శత్రుఘ్నుడు, లక్ష్మణుడు మొదలైన ప్రముఖులు గురుదేవులు శ్రీ వసిష్ఠ మహర్షి పాదపద్మములకు పుష్పములు సమర్పించి వారి పాదాలను హస్తస్పర్శచే స్పృశించి కళ్లకు – హృదయానికి హత్తుకున్నారు. సభలో దూర దూరం కూర్చున్న అనేక మంది రాజులు, సామంతులు సభా మర్యాదను అనుసరించి ఒక్కరొక్కరుగా నిలబడి గురుస్తోత్ర కవచాలు పలుకుచూ కతజ్ఞతతో కూడిన దృష్టులతో పుష్పాంజలులు సమర్పించారు.

ఈ విధంగా గురుపూజా మహోత్సవం అత్యంత శోభాయమానంగా ఆ సభలో జరిగింది. క్రమంగా ఆ కార్యక్రమం ముగిసింది. సభలో మరల ప్రశాంతత నెలకొన్నది. శ్రీవసిష్ఠ మహర్షి ఆజ్ఞానుసారం పుష్పగుచ్ఛాలు అక్కడి నుండి, ఆ సభలో వేరు వేరుచోట్ల అలంకరించబడ్డాయి.

అప్పుడు శ్రీ వసిష్ఠ మహర్షి "నా ఈ ఉపదేశము బుద్ధియొక్క మాలిన్యముచే దోష యుక్తమైనదా? లేక బుద్ధి నిర్మలత్వముచే నిర్దోషయుక్తమైనదా? ఈ విషయం ఈ సభకు వేంచేసియున్న మునీశ్వరులను అడుగుదాం!" ...అని యోచన చేశారు. మధురస్వర యుక్తంగా ఇట్లు పలికారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** గాధి కుల కమలమగు ఓ విశ్వామిత్ర మహర్షీ! ఓ వామదేవ–నిమి–క్రతు భరద్వాజ–పులస్త్య–అత్రి–ఋషి–నారద–శాండిల–భాస–భృగు–భారండ–వత్స్య–వాత్సాయనాది మహాత్ములారా! కేవలాత్మానంద పరిపూర్ణులగు మీ యొక్క సమక్షంలో ఈ సంవాదం మీ ప్రభావ వీచికలచే మాధుర్యం పొంది లోకకళ్యాణకారకం అయింది. మహాత్ములారా! మహామాన్యులగు మీరంతా నాపై దయతో ఇన్ని రోజులు సంవాదం విన్నారు. కొండ ముందటి గులకరాయి వలె మహాజ్ఞానులగు మీ సమక్షంలో అల్పుడనగు నేను ఇన్ని రోజులుగా ఉపన్యసించాను. ఈ అల్పజ్ఞాని వాక్యములన్నీ విన్నారు కదా! ఈ నా వాక్యములలో ఏదైనా అనుచితమైనది గాని, దోషయుక్తమైనది

గాని, దుష్టార్థయుక్తమైనది గాని, లోపముతో కూడినదిగాని ఏదైనా ఉంటే, అద్దానిని నాపై అనుగ్రహంతో తెలుపవలసినదిగా మిమ్మల్నందరినీ అభ్యర్థన చేస్తున్నాను.

❖

అప్పుడు మహామాననయులగువారంతా లేచి నిలుచున్నారు. ఇట్లు పలికారు.

**మునిపుంగవులు :** ఓ సర్వ సభికులారా! మహాత్ముడగు ఈ వసిష్ఠ మునీంద్రుని వాక్యములలో అసంగతమైన వాక్యం ఒక్కటి కూడా లేదు! "దోషవాక్యం ఉన్నదా?" అనే సందేహమే మాకు ఎక్కడా కలుగలేదు. బంగారమును పుటం వేసినప్పుడు అగ్ని యొక్క స్పర్శచే అందలి మాలిన్యం తొలగిపోతుంది చూచారా? అట్లా సభికుల మనస్సులను ఈయన వాక్యాలు పరమపావనంగా తీర్చిదిద్దాయి. తరతరాలుగా ఈ శ్రీ వసిష్ఠవాక్యమననం అనేకమంది ముముక్షువులకు మోక్ష మార్గమై వర్ధిల్లగలవు.

ఓ వసిష్ఠ మహర్షి : అనేక జన్మరూప దోషములచే కూడబెట్టుకొనియున్న మా మనస్సుల మాలిన్యము మీచే తొలగింపబడినదై, ఇప్పుడు మా మనస్సులు పుటం వేయబడి స్వచ్ఛమైన బంగారం లాగా ఆత్మానందంతో కూడి ప్రకాశిస్తున్నాయి ప్రభూ!

చంద్రుడు ప్రకాశించగానే కలువలు వికసిస్తాయి చూచారా! బ్రహ్మ ప్రకాశకములగు తమ వచనములచే మా మనస్సులు ఆత్మ ప్రకాశముతో కూడి మరింత మహత్తరంగా వికసిస్తున్నాయి. మహాత్మా! మీరు సర్వతత్త్వస్వరూపమగు "బ్రహ్మజ్ఞానము" అనే మహాబోధను ప్రసాదించటంలో మహా సమర్థులు. "మోక్షము అనేది ఇంతటి సులభసాధ్యమా!" అని, అన్ని తరగతుల సాధకులకు ఆశ్చర్యచకితులను చేశారు. అందుచేత పరమ గురువులు మీరు! మీ వాక్యములు భావితరములలో అనేకులకు ఆత్మజ్ఞానము శుద్ధాత్మానుభవం ప్రసాదించగలవు.

అట్టి మీకు వినమ్రులమై నమస్కరిస్తున్నాం! అభినందనలు పలుకుచున్నాం!

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! అప్పుడు మరల ఆ సభ్యులంతా లేచి "హే వసిష్ఠ మునీంద్రా! మహత్తరమైన ఆత్మతత్త్వాన్ని ముముక్షువులకు మహా ప్రసాదంగా అందించిన మీకు నమస్కరిస్తూ జయ జయ ధ్వనులు పలుకుచున్నాం!" అని చేతులతో లయపూర్వకంగా చప్పట్లు పలికించారు. ఆ తరువాత సిద్ధులు దశరథ మహారాజుతో, విష్ణావతారమగు శ్రీరామచంద్రునికి ప్రశంసావాక్యాలు పలికారు.

**సిద్ధులు :**

**నమామ చతురాత్మానం నారాయణమివారపమ్**

**రామం! సభ్రాతరం! జీవన్ముక్తం! రాజకుమారకమ్ ।**

చతురశీలుడు, రెండవ నారాయణుని వంటివాడు, సోదర సమేతుడు, దశరథ మహారాజు కుమారుడు, జీవన్ముక్తుడు అగు ఈ శ్రీరామచంద్రమూర్తికి మేము నమస్కరిస్తున్నాం. త్రికాలములలోను ఉత్తమ రాజచిహ్నములు కలిగి ఈ చతుఃస్సముద్ర వేలాయుతమైన మహాసామ్రాజ్యాన్ని పాలించే శ్రీరామచంద్రుని తండ్రి శ్రీ దశరథ మహారాజుకు నమస్కరిస్తున్నాం.

**మునిసేనాధిపం భూపం భాస్కరం భూరితేజసమ్ ।**
**వసిష్ఠ సుప్రవాదాఢ్యం విశ్వామిత్రం తపోనిధిమ్ ॥**

మునిసేనానాయకుడు, మహాతేజస్వి, సూర్యునివలె మహా ప్రకాశమానుడు, మోక్ష కథన ప్రవచనంలో అత్యంత ప్రావీణ్యులు అగు ఓ అరుంధతీ పతియగు శ్రీ వసిష్ఠ మహర్షీ! మీకు మా హృదయ కుసుమాంజలీపూర్వక నమస్కారాలు.

తపోనిధియగు ఓ శ్రీ విశ్వామిత్ర మహర్షీ! ఈ వసిష్ఠ మహర్షి మీ అభ్యర్థనను అనుసరించే ఈ ఇన్ని రోజుల ప్రవచనము లోక కళ్యాణార్థం సమర్పించారు. అట్టి మీరు మా యొక్క హృదయపూర్వక పాదాభివందనములకు సమార్హులగుచున్నారు. మీకివే మా నమస్కారములు. ఆహాఁ! నేడు మా జీవితములు ధన్యములైనాయి. ఈ దశరథ శ్రీరామచంద్ర – విశ్వామిత్రుల ప్రభావము వలననే "జ్ఞానయుక్తి పరమైనది – సమస్త సంసార భ్రమ సమూహమును నశింపజేయునది" …అగు ఈ వసిష్ఠ మునీంద్రుల వాక్యములు మేము వినగలిగాం!

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఈ విధంగా పలికి ఆ సిద్ధులు అభినందనపూర్వకంగా మరల పుష్పవర్షం కురిపించారు. అక్కడి సభికులు కూడా అనేకులు ఒకరినొకరు పుష్పాంజలులు సమర్పించుకొని సన్మానించుకున్నారు. మెల్లగా ఆ సభలో స్తోత్ర వాక్యాలు శమించాయి. జ్ఞానోపదేశం పొందిన అక్కడి సభలోని అనేకమంది రాజులు వికసిత హృదయులయ్యారు! సంసార భ్రమ తొలగుటచే అక్కడి సభికుల చిత్తములు స్వయంగా బ్రహ్మ జ్ఞానానుభవము వైపుగా పరుగిడసాగాయి. వారు ఆత్మయొక్క యధార్థ తత్త్వమును ఎరిగినవారై ఇంతకు ముందటి తమ యొక్క అజ్ఞాన చరిత్రను చూచి చిరునవ్వు నవ్వుకోసాగారు. అక్కడి సభ్యుల చిత్తము ప్రత్యగాత్మ పారాయణముచే బ్రహ్మానందం అనుభవించ సాగింది. చిత్త వికాసముచే జనించిన వివేకముచే ప్రశాంత చిత్తులు కాసాగారు. ఇక శ్రీరామచంద్రుడు సోదర సమేతంగా గురువు యొక్క పాదాల వద్ద అంజలిఘటిస్తూ, కూర్చుని ఉన్నారు. సింహాసనముపై ఆసీనులై ఉన్న దశరథ మహారాజులు కనులు తెరిచియే ధ్యానము నందు ఉన్నవానివలె కనిపిస్తున్నారు. "ఆది మధ్యాంత రహితం, అనిర్వచనీయం, పరమ పావనం" అయినట్టి జీవన్ముక్త స్థితిని ఆస్వాదిస్తూ ఉన్నట్లున్నారు. శ్రీవసిష్ఠ మహర్షి అక్కడి సభికుల పూజలను స్వీకరిస్తూ చిరునవ్వుతో మౌనం వహించి ఉన్నారు.

❖❖❖

# 6. ఆత్మోపమ్యేవ సర్వత్ర

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఆ విధంగా గురుస్తోత్ర కార్యక్రమం ముగిసింది. అప్పుడు సభంతా ప్రశాంత రూపమగు ఆత్మానందం తాండవిస్తోంది. మరల అంతా నిశ్శబ్దమయింది. అప్పుడు శ్రీవసిష్ఠ మహర్షి ఇట్లా పలికారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** కమల నేత్రుడవగు ఓ రామచంద్రా! ఇప్పుడింకా నీవేమైనా వినదలచుకొంటే, ...స్వేచ్ఛగా అడుగు. అంతేకాదు. ఇప్పుడు నీవు ఎట్టి స్థితిని స్వయంగా అనుభవిస్తున్నావో... ఈ జగత్తు యొక్క "ఆభాస"ఎట్లు దర్శిస్తున్నావో... అది కూడా నీవు ఈ సభకు చెప్పవచ్చు

**శ్రీరామచంద్రుడు :**

**త్వత్ప్రసాదేన యాతోఽస్మి పరాం నిర్మలతాం, ప్రభో ।**
**శాంతాశేషకలంకాంకమ్ శరదీవ నభస్తలమ్ ॥**

హే ప్రభూ! శ్రీ వసిష్ఠ మహర్షీ! శరత్ ఋతువులో మేఘాలన్నీ తొలగిపోగా నిండు పౌర్ణమినాడు పూర్ణచంద్రుడు ప్రకాశిస్తూ ఉంటే ఆకాశము ఎంత ప్రశాంతంగాను, ప్రకాశవంతంగాను ఉంటుందో, ...ఇప్పుడు నేను మీ అనుగ్రహంచేత అంత ప్రశాంతంగా నిర్మలంగా ప్రకాశమానంగాను అగుచున్నవాడనై ఉన్నాను. సంసార ప్రదమగు సర్వభ్రమలు నాకు తొలిగాయి. నిర్మలమగు ఆత్మ స్వరూపుడనై స్వచ్ఛముగా వెలయుచున్నాను. హృదయ గ్రంథులన్నీ నశించగా... నేనిప్పుడు సర్వ విశేషరహితుడనయ్యాను! స్ఫటికంలో స్ఫటికము యొక్క అంతర్భాగం స్ఫటికరూపమే అయి ఉంటుంది

చూచారా! అట్లాగే... నిర్మల బ్రహ్మరూపమగు ఈ జగత్తు పట్ల నిర్మల బ్రహ్మరూపమగు బుద్ధితో స్థితి పొందియున్నాను. ఈ జగత్తు జగత్తు రూపంగా కాకుండా నాకు ఆత్మ స్వరూపమై దర్శనమిస్తోంది. ఆత్మ స్వరూపుడగు నేను ఆత్మ స్వరూపమగు ఈ జగత్తును ఆత్మగా అనుభవం పొందుచున్నాను.

స్వామీ! ఒకప్పుడు నా మనస్సు సర్వవేళలా ఏవేవో విషయాల గురించి, వ్యవహారాల గురించి, విషయభోగాల గురించి, విషయభోగాల పర్యవసానం గురించి అభిలాషతో మననం చేస్తూ అనేక సంగతుల మధ్యగా అవిశ్రాంతంగా తిరుగాడుతూ ఉండేది. అట్టి అతి చంచలమగు ఆ మనస్సు నాకు అనుక్షణం ఏదో దిగులు, ఆవేదన, శ్రమ, ఉద్వేగము సంపాదించి తెచ్చిపెడుతూ ఉండేది. మరి ఇప్పుడో! నా ఈ మనస్సు మీరు అందించిన ప్రబోధ ప్రభావంచేత విషయ స్మరణమును త్యజించినదైనది. అందుచేత విషయ భోగములందలి అభిలాషను పూర్తిగా త్యజించింది. "అభిలాష"యే సంకల్పమునకు పుట్టినిల్లు కదా! అందుచేత ఇప్పటి నా మనస్సు సర్వ సంకల్పములను త్యజించినదై... ప్రశాంతతతో ఒప్పుచున్నది. ఫలితమేమిటంటారా? జాగృత్ జగత్ స్థితియందు నేను మానసిక – ఇంద్రియ సంబంధమైన సర్వ విషయ విచారరహితుడనై పరమశాంతిని, స్వాభావికమైన తృప్తిని పొందినవాడనై ఉన్నాను. అందుచేత జాగ్రత్ స్థితియందు కూడా సుషుప్తి యందువలె నిర్వికారుడనై ప్రకాశిస్తున్నాను.

హే మహాత్మా! ఇతఃపూర్వం దేహాత్మ బుద్ధి కలవాడనై అనేక రకములైన విషయముల గురించిన ఆశలతో వ్యాకులత్వం పొందినప్పటి స్థితి జ్ఞాపకం వచ్చి నా కిప్పుడు పకపకా నవ్వు వస్తోంది. ప్రకాశ శీలములగు తమ ఉపదేశ వాక్యములచే సర్వ సందేహాలు తొలగిపోయాయి. అందుచేత స్వస్థుడనయ్యాను. ఆత్మ స్వరూపమునందు స్వభావసిద్ధంగా స్థితి కలిగియున్నాను. ఇంకా ఎట్లా ఉన్నదో చెప్పమంటారా?

**నోపదేశేన నాఽర్థేన న శాస్త్రైః న చ బంధుభిః**
**త్యాగేన చ నచైతేషామధునా మమకారణమ్ ॥**

స్వామీ! ఇప్పుడు ఉపదేశములచేగాని, పదార్థములచేగాని, శాస్త్రములచేగాని, బంధువులచే గాని... అవి కలిగియున్నందువల్ల (లేక) వాటిని త్యజించటం వల్ల నాకు క్రొత్తగా వచ్చే ప్రయోజనమేదీ కనిపించటంలేదు. నా చిత్తము సర్వమును పరమాత్మ స్వరూపంగా దర్శించటంలో ప్రతిష్ఠ పొందటం చేత ఇప్పుడది నాశరహితమగు జీవన్ముక్త స్థితిని అనుభవించుచున్నది. ఇదంతా ఈ కళ్లకు నామరూపాత్మకంగా కనిపిస్తూనే... ఆత్మరూపంగా అనిపిస్తోంది. ఈ జగత్తు నిర్మల చిదాకాశమే గాని జడాత్మకం కాదు! "ఇదంతా పరమార్థమున చిదాకాశమే" అను మీ ప్రారంభవాక్యం నాకిప్పుడు సునిశ్చితమై పోయింది. "దృశ్యము" అనే పేరుగల "ఈ సర్వజగత్తు యొక్క అనుభవం' అనే మోహ నిద్ర మీరు ప్రసాదించిన "ఆత్మ జ్ఞానము" అనే వైతాళిక గానంచేత ఎచటకో తొలగిపోయింది. చిత్స్వరూపుడనగు నేను సదా మేల్కొనియే ఉన్నాను.

**యథాకామం యథాప్రాప్తం యథాస్థితమవస్థితమ్**
**యద్వక్తి తదవిఘ్నేన కరోమ్యపగతైషణమ్ ॥**

హే మునీంద్రా! ఇప్పుడు నాకు "అయ్యో! ఇది చేయవలసి వస్తోందే! మరి, అది చేయలేక పోతున్నానే?"... ఇటువంటి దిగుళ్ళన్నీ తొలగిపోయాయి. యథా ప్రాప్తమైన భవిష్యత్ కార్యములను తమరు ఎట్లా చెప్పితే అట్లా గురువాక్యానుసారం, శాస్త్ర ఉద్దేశానుసారం (అట్లాగే) నిశ్చింతగా నిర్వర్తించటానికి, ఆచరించటానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఏది ఎట్లో అట్లే అగుగాక! నేను సర్వదా ఆత్మరూపుడనై, సర్వుల యందు – సర్వమునందు ఆత్మత్వమును అనుభవిస్తూ ఆత్మయందే రమించు చున్నవాడనై ఉన్నాను.

**న తుష్యామి! న హృష్యామి! న పుష్యామి రోదిమి!**
**కార్యం కార్యం కరోమ్యేకో భ్రాంతిః దూరంగతా మమ!**

స్వామీ! "ఏదో క్రొత్తగా వచ్చి అప్పుడు మాత్రమే నేను పూర్ణుడను అవుతాను!"... అనే భ్రమ తొలగింది. ఈ ప్రపంచంలో ఇష్ట వస్తువులు వస్తే రానివ్వండి! రావా... రాకపోనివ్వండి! ఇష్టప్రాప్తిచే క్రొత్తగా సంతుష్టుడను, ప్రసన్నుడను, పరిపుష్టుడను అయ్యేదీ లేదు. అనిష్ట వస్తువుచే దుఃఖము పొందవలసిన అవసరమూ కనిపించటం లేదు. ఎందుకంటే ఈ "ఇష్టప్రాప్తి – అనిష్టప్రాప్తి" అనేది మనస్సు యొక్క సాంసారిక దోషము మాత్రమే కదా! ఆ మనస్సుకు "ఆది – ఆవల" అయినట్టి ఆత్మయే నా స్వరూపం! ఇక ఈ ప్రపంచంలో అవశ్యము చేయవలసిన లౌకిక–వైదిక కార్యములంటారా! అవి ఎట్లా విహితమో... అట్లాగే నిర్వహిస్తాను. "చేయాలి, చేయనక్కర్లేదు – ఇదే ఎందుకు చేయాలి – అది ఎందుకు చేయటం లేదు'... ఇటువంటి సంశయము నాకు నా పట్ల, తదితరుల పట్ల కూడా మొదలంట సమసిపోయాయి. నా కిప్పుడు భ్రమ తొలగిపోయింది! ఇక ఈ దృశ్యము – సృష్టి సంగతేమిటంటారా? ఇదంతా ఇట్లాగే ఉన్నా సరే! లేక ఏ ప్రళయ వాయువీచిక చేతనో ఇది తొలగవలసి వచ్చినాసరే! అనగా, దృశ్యము ఉన్నాసరే! ఉండకపోయినా సరే! ద్రష్టయగు నేను

అప్రమేయము, నిర్లిప్తము, నిత్య నిర్మలము, సర్వవిషయాతీతము అగు ఆత్మ స్వరూపుడనే కదా! అందుచేత ఇదంతా ఇట్లాగే ఉన్నా, (లేక) మరొక రీతిగా ఉన్నా, (లేక) అసలు ఉండకపోయినా... నాకు వచ్చే సందిగ్ధంగాని, అనర్థంగాని ఏమీ లేదు. నేను సర్వదా అప్రమేయము, నిత్యము, సర్వగతము అగు ఆత్మనై ఉండగా... ఇక ఇదంతా ఇంద్రియ దర్శనమాత్రమే కదా! అందుచేత నేనిప్పుడు స్వాత్మయందు నిర్విక్షేపముగా స్థితినొంది ఉన్నాను! - పరమవిశ్రాంతుడనై ఉన్నాను.

ఈ బాహ్యేంద్రియములకుగాని, మనస్సుకుగాని పరిలక్షింపబడే వాడిని (విషయాన్ని) కాదు కదా! ఈ విధంగా అలక్షితుడనై, నిర్వికారుడనై ఉన్నాను. ఎవరైనా చేతులతో ఆకాశమును పట్టుకొని జేబులో పెట్టుకోగలరా? అట్లాగే నేను ఇంద్రియ-జగత్ విషయములచే పట్టుబడనివాడనై ఉన్నాను.

వృక్షము నుండి పుష్ప సుగంధం ఆకాశంలో ప్రవేశించి ఆకాశంలో ఆకాశరూపంగా ఉంటుంది చూచారా? అట్లాగే ఈ దేహమందున్న నేను దేహము కంటే అతీతమైనట్టి చిదాకాశంలో ప్రవేశించి చిదాకాశమునందు సమరూపుడనై వెలయుచున్నాను.

ఇది నా లోక విహరణ అంటారా? జ్ఞానులు - అజ్ఞానులు అగు రాజులంతా రాజ్యపాలన మొదలైన కార్యములలో ఎట్లా విహరిస్తున్నారో... నేను నా నియమిత కార్యములందు అట్లాగే విహరిస్తాను. అయితే, అజ్ఞాని వలె కాకుండా... హర్ష విషాద రహితుడనై, స్థిరబుద్ధి కలవాడనై, సమదర్శినై, సంశయరహితుడనై... ఆత్మయందు స్థితిని కొనసాగిస్తూనే... ఈ అయోధ్యానగర న్యాయశాస్త్రమునకు సానుకూల్యంగా నిర్వర్తిస్తూ, బాహ్యమునకు ఈ ప్రాప్తాప్రాప్త కర్మలను యథారీతిగా నిర్వహిస్తూ, అంతరంగమున సమరస భావనచే దర్శిస్తూ ఉంటాను. ఇక ఈ జగత్తులో ఏది ఎట్లో అట్లే జరుగుగాక!

**సర్వస్యోపర్యపి సుఖీ సుఖమ్ నేహామి మే ప్రభో ।**
**జనసామ్యేవ తిష్ఠామి యథేచ్ఛం మాం నియోజయ ॥**

ఓ జగద్గురూ! సమస్త విషయాలకంటే అతీతము అయినట్టి "బ్రహ్మానందము"చే నేను ఇప్పుడు సుఖిని అయ్యాను. కనుక నాకు ఈ దేహమునకు చెందిన విషయ వాంఛలు గాని, జగత్ సంబంధమైన దృశ్య సంగతమైన అభినివేశములు గాని లేవు. నేనేమీ పొందటమూ లేదు. కోల్పోవటమూ లేదు. ఇదంతా యథాతథంగా నా ఆత్మ స్వరూపమే కదా! ఇక లౌకిక దృష్టిచే నేను ఎవరినీ, దేనినీ వదలటమూ లేదు. పట్టుకోవటమూ లేదు. అయితే, 'సమత్వము'ను గ్రోలినవాడనై సర్వుల పట్ల సమస్థితిని కలిగి ఉంటున్నాను. ఇక, "ఈ జగత్తులో నేనేం చేయాలి?" అని నాకు ఏ శంకా ఉదయించటమే లేదు. నాకుగా 'ఇది చేయాలి' అని నాకు ఏదీ కనిపించటం లేదు. అస్మత్ గురువులగు మీ ఇచ్ఛానుసారంగా నన్ను సేవా కార్యములందు వినియోగించవచ్చు. ఇక ఈ దేహం విషయం అంటారా? ఒక చిన్న పిల్లవాడు ఏ విధంగా అన్నీ మరచి ఆటలలో పాల్గొంటాడో... అట్లా ఈ దేహం ఉన్నంతవరకు నిర్మల దృష్టితో యథా ప్రాప్తమైన ప్రపంచ స్థితిని పాలిస్తాను. దేహం ఉండటం చేతగాని, దేహం లేకపోవటంచేతగాని నా స్వరూపానికి క్రొత్తగా వచ్చేదీ - పోయేదీ ఏదీ లేదు.

**భుంజే పిబామి తిష్ఠామి పాలయామి నిజక్రియామ్**
**జాతోఽ హం విగతా శంకః త్వత్ప్రసాదాన్మునీశ్వర ॥**

హే ఆప్తగురూ! తమ అనుగ్రహం చేత నేనిప్పుడు సందేహరహితుడనయ్యాను. ఇప్పుడిక సమదృష్టిచే ఏది ఎట్లు నిర్వర్తించాలో అది అట్లాగే మా పితృదేవులు చెప్పినట్లు తమ సేవగా భావించి ఆచరిస్తాను. భోజనం, పానీయం, నివాసం – ఇటువంటివన్నీ ఏది ఎట్లో అట్లే అగుగాక!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మహాసంతోషకరమైన విషయం! ఏ నిర్మలపదము సముపార్జించుకున్న తరువాత ఇక ఆపై శోకించడో... అటువంటి "పరమ పవిత్రము – ఆది మధ్యాంత రహితము"... అగు పదమును నీవు పొందావు. "సర్వత్రా సర్వదా సమరూపము, అతి విశాలము, దుఃఖ రహితము, నిరతిశయానంద రూపము" – అగు బ్రహ్మ పదమును స్వావలంబనం చేసుకొన్న వాడవయ్యావు. శాంతమగు ఆకాశమున శాంతాకాశము ఏర్పడియున్నదగుచున్నట్లు, ...నీవు ఇప్పుడు "సర్వదా సమరూపము – అతి విశాలము – దుఃఖ రహితము – నిరతిశయానంద రూపము అయినట్టి "స్వాత్మ" యందు స్వయముగా విశ్రాంతిని సంపాదించుకొని ఉన్నావు.

**దిష్ట్యా జాతో విశోకస్త్వం! దిష్ట్యా సమ్యక్ అవస్థితః।**
**దిష్ట్యా లోకద్వయే అనర్థ, శంకౌ తే శమమాగతా ॥**

ఆహాఁ! ఏమి సౌభాగ్యం! నీవు ఇప్పుడు దుఃఖ రహితుడవయ్యావు! మహత్ సౌభాగ్యం చేత బ్రహ్మపదమునందు మహత్తరంగా స్థితి పొందియున్నావు. ఇహ – పరముల గురించిన సర్వ శంకలు తొలగిపోయాయి! సౌభాగ్యవశం చేతనే నీవు ఆత్మవేత్తవై నీ రఘువంశము యొక్క భూత –భవిష్యత్తులను పరమపావనం చేస్తున్నావు.

కాబట్టి రామచంద్రా! ఇక నీవు లోకకళ్యాణమూర్తియగు ఈ విశ్వామిత్ర మహర్షి యొక్క "యజ్ఞ విఘ్న నివారణము"... అనే ఆశయమును సఫలీకృతం చేయి! తండ్రి ఆజ్ఞను అనుసరించినవాడవై సాత్వికులను బాధించే స్వభావంగల లోకకంటకులగు రాక్షసులను సంహరించి లోక కళ్యాణము కావించెదవు గాక! ఈ భూమండలమును చక్రవర్తివై పాలించి "రామరాజ్యము" అను లోక కళ్యామగు ప్రసిద్ధిని సముపార్జించెదవు గాక! నీ బంధువులు – మీ రాజ్యంలోని ప్రజలు, సైనికులు, తిర్యక్ జంతువులు రఘువంశీయుడగు నీ వలన రోగరహితులై, భయ వర్జితులై, అభ్యుదయముతో కూడియున్నవారై వెలయుదురుగాక!

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! శ్రీవసిష్ఠ మహర్షి యొక్క ఆ వాక్యాలు అక్కడి సభికుల హృదయాలను అమృత వర్షంలాగా పరమానందపరచాయి. ఆ శ్రీరామచంద్రుని ముఖం పూర్ణచంద్రుని శోభవలె మనోహరమై అమృతపూర్ణమై శోభించసాగింది. అక్కడి సభలోని మునిజనులు "ఆహాఁ! ఏమి ఈ సౌభాగ్యం! ఈ వసిష్ఠ మునీంద్రుని ఈ కొద్ది రోజుల ప్రసంగం అమోఘం! శుద్ధ – ఆత్మజ్ఞానజనకం కదా!" అని తమలో తాము ఆనంద వచనాలు చెప్పుకోసాగారు. దశరథ మహారాజు సంతోషముచే పులకాంకితుడై కనిపించసాగాడు. శాంతమనస్కుడై నూతన శోభతో ప్రకాశించసాగాడు.

ఆ విధంగా జ్ఞేయమగు ఆత్మను గురించిన సాధు ప్రవచనం పరిసమాప్తమయింది. అప్పుడు శ్రీరామచంద్రుడు అతి సుకుమారమగు పెదవులు విప్పి అతి మధురము – గంభీరము అగు స్వరముతో ఇట్లా పలుకసాగాడు.

❖

**శ్రీరాముడు :** ప్రభూ! శ్రీ వసిష్ఠ మహర్షీ! మహాత్మా! బంగారమును పుటం వేస్తే మహాప్రకాశవంత మౌతుంది చూచారా! అట్లాగే మీ జ్ఞాన ప్రసంగంచే మా అజ్ఞానమును సంపూర్ణంగా తొలగించివేశారు. హే ఆత్మబంధో! ఇంతకాలం పరిచ్ఛిన్నమగు ఈ దేహమునే ఆత్మగా సంభావిస్తూ వచ్చాం. ఇప్పుడో ...ఈ సర్వ జగత్తును ఆత్మగా దర్శించుచున్నాం! ఇప్పుడు నేను సర్వత్రా సర్వదా పరిపూర్ణుడనైనాను. శారీరక–మానసిక వ్యథారహితుడను అయ్యాను. నిర్వికారుడను, సంశయరహితుడను, జ్ఞానయుక్తుడను అయి ఆత్మయందు మేల్కొన్నాను. ఆనంద స్వరూపుడనై ఇక శాశ్వత సుఖవంతుడనైనాను. శాశ్వతమగు పురుషార్థము మీ కరుణచే నాకు లభించినది. జ్ఞానయుక్తమగు మీ ప్రవచనముచే నా హృదయము ఆనందైశ్వర్యమును స్వభావంగా సముపార్జించుకున్నది. నా స్వరూపము – ఈ దృశ్యము కూడా నా కిప్పుడు అమృతప్రాయమై మధురానుభూతిని అనుక్షణికంగా అందిస్తున్నాయి. తమ అనుగ్రహంచేత నా కిప్పుడు ఆత్మ సామ్రాజ్యపదవి లభించింది. సమస్త దుఃఖములు తొలగిపోయాయి. పరమశోభను పొందాను. మీరు ప్రవహింపజేసిన జ్ఞాన తరంగాలు నా మూలాజ్ఞానమును ఎటో కొట్టుకుపోయేటట్లు చేశాయి. నిర్మలమగు స్వాత్మ యందు నిరతిశయానందమును పొందుచున్నాను. నా సాక్షి చైతన్య దర్శనం నాకు అయింది. స్వతఃసిద్ధమగు పరమ నిర్మలత్వము పొందినవాడనైనాను.

నిర్మలము – పరమశాంతము – అనంతము – సర్వము – నిత్యము – పరమానందమయము అయినట్టి నా ఆత్మ స్వరూపమునకు పునః పునః ఇవే నా నమస్కారములు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! శ్రీరాముడు ఇలా పలుకుచుండగా... అప్పుడు మధ్యాహ్నసమయ సూచకంగా శంఖారావాలు మార్మోగాయి. "శ్రీ వసిష్ఠ రామ సంవాదాన్ని వినిన ఆనందం చేతనా!" ...అన్నట్లు సూర్య భగవానుడు నడినెత్తిన ప్రవేశించాడు. ఆ సూర్యకాంతులు విరజిమ్ముచుండగా ఆ సభలోని మణులు మరింత ధగధగాయమానంగా ప్రకాశించసాగాయి. అప్పుడు దశరథమహారాజు సింహాసనం నుండి లేచి నిలుచున్నాడు. సభలోగల దేశాధిపతులు, సామంతరాజులు మొదలైనవారంతా కూడా తమ ఆసనాల నుండి లేచారు. అక్కడి రాజులు తదితర మునులు మొదలైనవారు పరస్పరం అభివాదాలు తెలుపుకుంటూ సభా ప్రాంగణం నుండి బయల్వెడలసాగారు. వినమ్రుడై చేతులు జోడించి నిలుచున్న రామచంద్రుని ఆనంద నేత్రాలతో చూస్తూ శ్రీ వసిష్ఠ మహర్షి ఇట్లా పలికారు.

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ప్రియ రాఘవా! ప్రియ రాఘవా! వినతగినదంతా ఇప్పుడు నీవు విన్నావు. తెలుసుకొనవలసినదంతా చక్కగా తెలుసుకొన్నావు. ఇంకా నీకు కొత్తగా చెప్పవలసినదేదీ లేదు. నీకు నేను ఏమేమి ఉపదేశించానో... శాస్త్రములు నీకు ఏది తెలియజేస్తున్నాయో... ఏ శ్రేష్ఠమగు

దానిని నీవు స్వయంగా అనుభవముగా పొందుచున్నావో ... అద్దానినంతా శ్రేష్ఠమగు ఏక వాక్యరూపం చేసివేయి.

ఓ ప్రియ రామచంద్రా! ఇకలేఁ! మధ్యాహ్న స్నానాదులకు ఉపక్రమించు. ఓ మంగళస్వరూపా! ప్రియ రఘురామా! రేపు ఉదయం మనం మరల సమావేశమౌదాం. ఈలోగా మనం చెప్పుకొన్న విషయాలన్నీ... అందలి సార విశేషాలను మననం చేయి. మనన–నిధిధ్యాసల ద్వారా బాగా పరిశీలిస్తూ పర్యాలోచన చేయి. ఆ తరువాత కూడా... నీవు ఏదైనా అడుగదలచుకొన్నావా... "చివరి రోజు" అయిన రేపు ఉదయం అడిగి స్వసందేహ నివృత్తి చేసుకో! సందేహాలు కొంచెం మిగిలినా సరే... రేపు తప్పక అడుగు. సందేహాల విషయంలో ఉపేక్ష మాత్రం చేయకు! సందేహాలన్నీ తొలగిపోయాయా... ఇక అంతకన్నా సంతోషమేమున్నది!

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఆ విధంగా ఆ రోజు సభ ముగిసింది. శ్రీ దశరథ మహారాజు లేచి మంగల జలముతో మహనీయుల పాదపద్మములు కడిగి జలశేషమును శిరోధార్యం చేశారు. మహనీయులను పూజించిన తరువాత అనేక మంది బ్రాహ్మణులను ఆభరణ, ధన, దివ్యపుష్పాదులతో సత్కరించారు. ఆ సభకు వేంచేసిన వారందరికీ స్నానాన్నపానాదులు షడ్రసోపేతంగా సమకూర్చ బడ్డాయి. ఆకాశచరులగు దేవతలు ఆ సభలో మరల – మరల పుష్ప వృష్టి కురిపించారు.

ఆ సభా ప్రాంగణమంతా మధుమధురమైన జ్ఞానానందయుక్తమైన పరస్పర సంభావన – సంభాషణలతో మహోన్నతంగా ప్రకాశించింది. అనంతరం వసిష్ఠాది మునీంద్రులంతా దైనందిన మధ్యాహ్న క్రియలు ముగించుకొని ఫల – మధురాన్నాదులు స్వీకరించారు.

❖

ఆ రోజు రాత్రంతా శ్రీరామచంద్రుడు శ్రీ వసిష్ఠ మహర్షి ప్రవచితమైన అనేక విశేషాలన్నీ పునశ్చరణ చేస్తూ జాగరణలో గడిపివేశాడు. అట్లాగే అక్కడి అనేకమంది సభికులు కూడా తమ తమ విశ్రాంతి స్థానములలో మహర్షి యొక్క వాక్యసారాన్ని తమలో తామూ – తదితరులతోను పునశ్చరణ చేస్తూ జాగరణ చేశారు.

అవును మరి ! అంతటి జ్ఞాన సారాంశాన్ని వినే సందర్భాలు ఈ సుదీర్ఘ కాలవిన్యాసంలో అతి అరుదు కదా! సారాంశాన్ని మననం చేసుకోకపోతే మరచిపోయే ప్రమాదం ఉన్నది కదా!

❖❖❖

# ఇరవై రెండవ రోజు

# XVI. శ్రీ ప్రజ్ఞప్తి - శ్రీ వసిష్ఠ సంవాదము

## (మహా ప్రశ్నలు - సమాధానాలు)

## 1. కృతకృత్యోఽస్మి

**శ్రీ వాల్మీకి మహర్షి:** ఆ మరునాడు సుమంత్రుడు, మహారాజు మొదలైనవారంతా ప్రపత్తి వాక్యములు పలుకుచుండగా శ్రీవసిష్ఠ మునీంద్రులు అయోధ్యా సభలో ప్రవేశించి ఉన్నతాసనంపై ఆసీనులైనారు. అప్పుడు కమలనేత్రుడు, మహాధీమంతుడు అగు శ్రీరామచంద్రుడు కోమలమైన శబ్దములతో ఇట్లా పలికాడు.

❖

**శ్రీరామచంద్రుడు :**

**భగవన్! సర్వధర్మజ్ఞ! సర్వజ్ఞానమహార్ణవ!**
**సర్వ సందేహ పరశో! పరశోకభయాపహా!**
**శ్రోతవ్యమ్ అపరం కిం మే విద్యతే వేద్యమేవ వా**
**శ్రోతవ్యం విద్యతే యద్వా తత్సర్వం వక్తుమర్హసి!**

ఓ భగవాన్! ఓ వసిష్ఠ మహర్షి! సర్వధర్మజ్ఞా! సర్వ జ్ఞానమహాసముద్రా! సర్వ సందేహములకు గొడ్డలి పెట్టువంటివాడా! సర్వజీవుల శోకములను పటాపంచలు చేసే మహాత్మా! మీ ప్రసంగమంతా రాత్రంతా మా సోదరులు, మిత్రులతో కూడి తరచి తరచి గుర్తు చేసుకొని ఆస్వాదించాం. మహదానంద భరితులమయ్యాము. నాకు ఏదీ సందేహంగా ఏమాత్రం అనిపించలేదు. మహత్తరమైన (సోఽహమ్ అనే) ఏకవాక్యము నిర్ద్వంద్వంగా నిరూపణ అయింది. అయితే, "మీ వాక్యామృతం ఇంకా ఇంకా గ్రోలితే బాగుండు" ...అని మాత్రం అనిపించసాగుచున్నది. అందుచే మహాత్మా! మహర్షీ! మేము ఇంకా ఏది వింటే శుభప్రదమో... ఏది ఎరిగితే కళ్యాణ ప్రదమో... అద్దానిని పలుక వలసినదిగా మా ప్రార్థన, విన్నపం!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీకిప్పుడు 'భౌతికబుద్ధి' తొలగినదై... ఆత్మబుద్ధి ప్రాప్తించింది. కాబట్టి నీవింక వినతగినదంటూ నాకింకేమీ కనిపించటం లేదు. నీవు పొందతగిన వస్తువు పొందావు. కతకృత్యుడవైనావు. నీ బుద్ధి ఈ జగత్తును ఆత్మగా దర్శిస్తూ స్వాత్మయందు నెలకొనినదై

ఉన్నది. ఇప్పుడు నీవు 'స్వబుద్ధి'తో విచారణ చేసి నీ అంతఃకరణమున నీవు ఎట్టివాడవని నీవు అనుకుంటున్నావో నీకు ఇంకా వినదగినదేదైనా శేషించియున్నదని నీవు అనుకుంటున్నావో... ఆ రెండు విశేషాలు నీవే ఈ సభకు చెప్పు. ఇది ఆఖరి రోజు కాబట్టి పునశ్చరణ ఉచితమే అవుతుంది కదా!

**శ్రీరామచంద్రుడు :**

**బ్రహ్మన్నేవమహం మన్యే యథాహం కృతకృత్యధీః**
**నిర్వాణోఽస్మి, ప్రశాంతోఽస్మి నాకాంక్షామమ విద్యతే!**

ఓ వసిష్ఠ మహర్షీ! జగద్గురూ! అమృత మాధుర్యముతో కూడిన మీ వాక్యములు విన్న తరువాత నేనిప్పుడు కృతకృత్యుడను అయ్యాను. పరమానందమగు నా స్వరూపమునందు నెలకొనియున్నాను. నా స్వరూపము ప్రశాంతమై అంతటా ఆక్రమించినదైయున్నది. ఈ సర్వమూ నాయందున్నదే అగుచున్నది. "ఏదో కావాలి" అనునదేదీ నాకికలేదు. మీరు చెప్పవలసినదంతా నాకు చెప్పారు. అద్దాని ననుసరించి నేను ఎరుగవలసినదంతా ఎరిగాను. మీరు 21 రోజులు సుదీర్ఘంగా మాపై కరుణతో శ్రమ తీసుకొని ప్రసంగించారు. మీ వాక్యాలు సఫలమైనాయి.

హే మహర్షీ! పొందవలసిన బ్రహ్మ వస్తువును నేనిప్పుడు సర్వదా పొందబడినదానిగా దర్శిస్తున్నాను. "ఈ జగత్తు బ్రహ్మమే"... అనేది నా దృష్టికి సుస్పష్టంగా గోచరమౌతోంది. "జీవుడు – బ్రహ్మము" ఇటువంటి ద్వైతరూప భ్రమ నశించింది. దృశ్యభేదమంతా బ్రహ్మమయానుభవంలో విలీనమైపోయింది. మీరు చెప్పుచున్నదంతా విచారిస్తూ ఉండగా "ఈ దృశ్యము దృశ్యముగా సత్యమే"... అనే సంసార సత్యత్వబుద్ధి నశించింది. వెలుతురు రాగానే చీకటి ఎటుపోతోంది? అట్లాగే జ్ఞాన వాక్య శ్రవణం చేత నా ఇతఃపూర్వపు అజ్ఞానం ఎటు వెళ్ళిందో ఏం చెప్పను?

❖❖❖

# 3. అభ్యాసము యొక్క ఆవశ్యకత

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు చెప్పే వాక్యాలు విని "నా వాక్కుకు ప్రయోజనం సిద్ధించింది"... అని నేను ఎంతగానో ఆనందిస్తున్నానయ్యా! అయితే, అద్దం మరల మరల తుడిచి అనునిత్యమూ పరిశుభ్రంగా ఉంచుకుంటాం కదా!

**భూయ ఏవ మహాభావో! శృణు మే పరమం వచః! ।**
**ఆదర్శో రాజతేఽత్యర్థం పౌనః పున్యేనమార్జితః ॥**

అట్లాగే ఈ ఉత్తమ వాక్యములు మరల విను. ఈ దృశ్యము గురించి విశదీకరించటానికి వీలుగా మహనీయులగు ఆత్మ శాస్త్రజ్ఞులు ఇద్దానిని రెండు విధాలుగా విభజిస్తున్నారు.

1.రూపాత్మకమైన సంకేతములు, 2.నామాత్మకమైన సంకేతములు.




ఈ పదార్థము గురించి చెప్పబడే జాతి – గుణ – క్రియ – సంస్థానములు నాలుగూ కూడా శబ్ద భేద ప్రవృత్తిచే కల్పించబడినవే! అవి భ్రాంతి సంకేతములు. వాస్తవం కాదు. ఉదాహరణకు నీ మెడలో ప్రకాశించే ఆ బంగారు ఆభరణం ఉన్నదనుకో...!

1. ఈ బంగారు ఆభరణం ఖరీదైనది.

2. ఈ బంగారు ఆభరణము యొక్క ఆకారం చూచారా? ఎంత బాగున్నది?

3. ఇది ముత్యములతో బారుగా కూర్చబడి మెడలో ధరిస్తాం.

4. ఇది మా తండ్రిగారు ఇచ్చారు. ఆయనకు మరొక రాజుచే బహుమతిగా ఇవ్వబడింది.

5. ఇది ధరిస్తే చాలా అందంగా కనిపిస్తాం.

6. ఇది మా అంతఃపురంలోనుంచి తీసుకువచ్చాను.

ఇవన్నీ పదార్థమునకు చేయబడిన కల్పనలే గాని వస్తు విభాగాలు కాదు, ఇవన్నీ భ్రమ రూపములే అవటం చేత వాస్తవవమైన వస్తు ధర్మాలు కావు. కనుక అవన్నీ లేవు. వస్తుతః చూస్తే? బంగారము ఒకానొక ఖనిజము. ఈ విధంగా 'పదార్థము'నకు కల్పించబడే అర్థము మొదలే లేకపోయినప్పుడు ఇక అద్దాని గురించి జనులు అనుకునేదంతా తరంగ శబ్దములవలె నిరర్థకమే!

ఈ విధంగా ఇక్కడి సర్వపదార్థముల యొక్క రూపాత్మకమైనదంతా ఎప్పుడైతే తొలగించి చూస్తామో... అప్పుడిక నామాత్మకమైనది కూడా తనకు తానే నిషేధించబడుతోంది. ఈ రెండూ తొలగించితే ఈ దృశ్యము వాస్తవానికి లేనిదే అగుచున్నది. అప్పుడు ఇదంతా కూడా చైతన్యము యొక్క అభాస మాత్రమే అగుచున్నది. అనగా... ఈ దృశ్యమంతా కూడా స్వప్నమువలె అగుచు, స్వప్నమువలె వర్తించుచున్నదే అయి ఉంటోంది! ఇప్పుడిక 'జగత్తు' అనబడేది ఎక్కడున్నది?

ఎప్పుడైతే ఈ భావావేశంతో కూడిన స్మరణం వంటి జాగ్రత్తులో కనిపించేదంతా ఈ విధంగా "మిథ్యయే" అయివున్నదో... ఇక స్వప్నము గురించి ఏమనాలి? స్వప్నము జాగ్రత్తు యొక్క స్మరణ వంటిది మాత్రమే కదా! ఆత్మయే స్వప్నంలో స్వప్న దృశ్యరూపంగా అగుపిస్తోందని చెప్పటం అతిసులభం కదా! అనగా, అక్కడ చిద్రూపమగు ఆత్మయే అన్య పదార్థ ఆకారంగా వ్యాపించి ఉన్న దనియే అర్థమౌతోంది. స్వప్నంలో చైతన్యమునకు అన్యంగా కించిత్ కూడా ఎక్కడా ఏదీ లేదు కదా!

ఏ విధంగా స్వప్న నగరం 'ప్రత్యగాత్మ'లో నిర్మల చిదాకాశమాత్రమే అయి ఉన్నదో...ఆ విధంగానే ఈ ముల్లోకాలు కూడా రూపసహితంగా (స్వప్నంలో లాగానే) ద్రష్ట యొక్క ఉద్దేశం – భావన – అవగాహనలను అనుసరించి మాత్రమే అనుభూతమౌతున్నాయి. వాస్తవానికి ద్రష్ట – దృశ్యములు రెండూ చిదాకాశ రూపములే అయివున్నాయి.

**శ్రీరాముడు :** స్వామీ! చైతన్యము సర్వదా పరమ నిర్మలము కదా! మరి నిర్మల చైతన్యమునందు ఈ 'జడత్వం' ఎట్లా రూపం పొందింది? భూమి మొదలైన వైచిత్ర్యమంతా ఎట్లా ఏర్పడింది? ఈ ఎదురుగా జగత్తులో కనబడుచున్న ఈ పర్వతాలు, జలము, శిలలు, అగ్ని, వాయువు, క్రియ, కాలము, శూన్యము, చిత్తాకాశము... ఇవన్నీ ఎట్లా సంభవిస్తున్నాయి?

హే మహర్షీ! ఇవన్నీ మీరు ఇతఃపూర్వం సవివరంగా చెప్పియే ఉన్నారు. నేను మీ ప్రవచనాను సారం ఎరిగియే ఉన్నాను. అయినా కూడా 'ఆత్మాసంభావన' తొలగి 'ఆత్మ సంభావన' మరింతగా పరిపూర్ణం అవాలనే ఉద్దేశంతో ఈ ప్రవచనం ముగియవస్తున్న సమయంలో మరల మీ వాక్కు వినాలని అనిపించి అడుగుచున్నాను. కనుక బోధాభివృద్ధికై మరల మీ అమృత వాక్కును ప్రసాదించమని వేడుకుంటున్నాను.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అట్లాగే! అయితే, నీకీ విశేషాలు చెప్పటానికి ముందుగా నిన్ను ఒక ప్రశ్న అడుగుతాను. సరేనా?

**శ్రీరాముడు :** స్వామీ! అట్లే అగుగాక!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** స్వప్నంలో కూడా మహానగరము, భూమి, ఆకాశము, జలము, అగ్ని, వాయువు, దిక్కులు, కాలము, క్రియ, కార్యకారణ వ్యవహారం కనిపిస్తున్నాయి కదా! ఆ స్వప్న సమయంలో అవన్నీ "నిజమే" అనుకొని నీవుగాని, మరొకరుగాని అనుభవించటం జరుగుతోంది కదా! ఇప్పుడు చెప్పు! అవన్నీ కూడా ఎట్లా ఏర్పడి అక్కడికి వచ్చాయి? వాటిని స్మరించిన వారెవరు? వాటిని అక్కడి నుండి ఎవరు మళ్ళీ తొలగిస్తున్నారు? ఎందుకు తీసుకొచ్చి అక్కడ ఉంచినట్లు? ఎవరు రచన చేశారు? వాటిని ఆయా విధాలుగా ప్రకాశయుక్తం చేస్తున్నదెవరు? అవన్నీ ఏ పద్ధతిని అనుసరించి ఉత్పన్నం అయినాయి? ఆ స్వప్నం యొక్క ఆచారమంతా ఏమైయున్నది? అందులో కనిపించిన నగరాదుల యొక్క అసలు స్వరూపం ఏమిటి?

**శ్రీరాముడు :** స్వామీ! అర్థమయింది! ఈ జగత్తు కూడా స్వప్న రూపం వంటిదే! స్వప్నరూపమగు ఈ జగత్తు యొక్క స్వరూపం కేవలం "నిరాకారము – నిరాశ్రయము" అయినట్టి చిదాకాశమే అయివున్నది. ఈ కనబడే భూమి, పర్వతాలు, ఆకాశం, నగరాలు, దేహముల నామరూపాలు... ఇవన్నీ సత్యము కాదు. "నిరాకారము, నిరాధారము"... అగు చిదాకాశమే ఆ అన్ని రూపాలుగా కనిపిస్తోంది. నిరాకారమైన చిదాకాశమునకు మరొక ఆధారము యొక్క ఆవశ్యకతయే లేదు!

**న కించిదేతత్ సంపన్నం సద్యథైతన్న సంవిదః ।**
**ఏతత్ చిత్కచనం నామ మనఏవ తథా స్థితమ్ ॥**

మనస్సే స్వప్నరూపమై ఉంటోంది కదా! అట్లాగే,... స్వప్నదృశ్యంలాగానే ఈ దృశ్య జగత్తు కూడా వాస్తవానికి ఒకింత కూడా లేదు. చైతన్యము యొక్క ఒకానొక చమత్కారమైన స్ఫురణయే (స్వప్నంలాగానే) ఈ జగత్తులో ఈ జగదాకారంగా స్థితి పొందినదై ఉన్నది! అంతేగాని ఈ జగత్తుగా కనిపించేదంతా మరింకొకటేదో అయివుండలేదు. ఎవరో కల్పించి (సృష్టించి), ఏర్చి–

కూర్చి ఇక్కడ అమర్చినదీ కాదు. తత్త్వజ్ఞానమును ఎరిగి అనుభూతమొనర్చుకొన్నవారికి ఇక్కడి ఆకాశ – భూ – జల – నగర – ప్రాణ – దేహాదులన్నీ చైతన్యము యొక్క స్ఫురణ మాత్రంగానే నిస్సందేహంగా కనిపిస్తున్నాయి. చైతన్యమే శూన్యరూపం. చైతన్యమే ఆకాశం. చైతన్యమే కఠినరూపమై శిలగా కనిపిస్తోంది. అదియే ద్రవరూపమై జలంగా వర్తిస్తోంది.

**వస్తుతస్తు న భూమ్యాది కించిత్ తత్ న చ దృశ్యతా,**
**చిదాకాశమ్, అనన్తం తత్సర్వమేకం తదాత్మకమ్ ॥**

వస్తుతః చూస్తే భూమి మొదలైనవిగాని, దృశ్యము మొదలుగా గలిగినవి గాని కించిత్ కూడా లేనేలేవు. ఇదంతా కూడా "ఏకము, అనంతము" అగు చిదాకాశమే అయివున్నది. చిదాకాశరూపంగానే ఇది వర్తిస్తోంది. నిర్మల సముద్ర జలమంతా ఏకరూపమే అయినప్పటికీ "తరంగము, బుడగలు, నురుగు, ఆవర్తనము, సుళ్ళు" ...ఈ విధంగా ఏకానేక రూపాలుగా కనిపిస్తోంది కదా! అట్లాగే... చిదాకాశము సర్వదా ఏకమే అయివుండి కూడా... తన యందు ఈ జగత్తు రూపంగా నానా విధములుగా భాసిస్తోంది. అయినా కూడా, చైతన్యము తన యొక్క పరమార్థ రూపమును ఏమాత్రం కూడా ఎక్కడా త్యజించటమే లేదు. ఆవర్తములుగా కనిపిస్తున్నప్పటికీ జలము తన జలత్వ – ద్రవత్వ ధర్మములను కోల్పోతోందా? లేదు కదా! అట్టి చిదాకాశమే తన యొక్క కాఠిన్యమును గూర్చిన అనుభవంతోటి భూమి–పర్వతాది రూపంగాను, శూన్యమును గూర్చిన అనుభవంతోటి ఆకాశాదులు గాను, ద్రవత్వం గురించిన అనుభవంతో జలాదులుగాను, స్పందత్వమును గూర్చిన అనుభవంతోటి వాయువుగాను, ఉష్ణత్వమును గూర్చిన అనుభవంతో అగ్నిరూపంగాను తనను తాను ఎరుగుచున్నది. ఈ విధంగా "నిష్కారణంగా నామ రూపములతో స్ఫురించటం"... అనేది చిదాకాశము యొక్క స్వభావమే అయి వున్నది.

జలానికి వేఱుగా సముద్రమునకు మరొక రూపమేదీ లేదు కదా! శూన్యత్వమునకు వేరుగా 'ఆకాశము' అనబడేది ఎక్కడున్నది? అట్లాగే చిదాకాశమునకు వేరుగా 'జగత్తు' అనబడేది ఎక్కడా ఏదీ లేనే లేదు! అద్దానికి (చిదాకాశమునకు) వేరుగా రూపమూ లేదు. జలమునకు వేరుగా తరంగం ఎక్కడ? తరంగాకారమెక్కడ?

**న తు చిత్ గగనాత్ అన్యః న సంభవతి కించన ।**
**"ఇదం–త్వమ్–అహమ్" ఇత్యాది, తస్మాత్ ఆశాంతమాస్యతామ్ ॥**

"ఇది – నీవు – నేను" ఇత్యాది రూపములతో కూడిన చిదాకాశము కంటే వేరుగా ఏదీ సంభవించజాలదు. కాబట్టి ఓ సర్వసభికులారా! మనమంతా కూడా చిదాకాశ రూపులమే! అట్టి చిదాకాశమాత్ర రూపముగా పరమ శాంతముతో వెలయుదముగాక! ప్రశాంత స్వరూపులమై ఉండెదము గాక! ఎందుకంటే, మనందరి వాస్తవరూపం చిదాకాశమే కాబట్టి!

ఓ సహ చిదాకాశానంద స్వరూపులారా! మనమంతా రోజు స్వప్నం చూస్తున్నాం. అట్టి స్వప్నంలో దేహం లేకుండానే, నిరాకార రూపులమై అగ్ని, కొండ, ఇల్లు, వాకిలి ... ఇవన్నీ మనకు

మనమే రచించుకొని తత్సంబంధమైన అనేక క్రియలను నిర్వర్తిస్తున్నాం కదా! అట్లాగే ... నిరాకారమైన చిదాకాశము జాగ్రత్తునందు ఈ సాకారములగు అగ్ని-ఆకాశ-పర్వతాది నానా విధములైన ప్రదర్శనములను నిర్వర్తిస్తూ వాటియందు ద్రష్టగా తానే ప్రవేశించినదై దర్శన-స్పర్శ-సంచారాది ఆయా క్రియలన్నీ నిర్వర్తిస్తోంది. ఈ విధంగా సర్వజీవులు చిదాకాశరూపులేగాని, భౌతికదేహ పరిమితులు కాదు.

స్వప్నంలో భౌతిక దేహం లేకుండానే స్వప్నద్రష్ట చైతన్యము దేహాకారమువలె ప్రకటన మగుచున్నట్లే... సృష్ట్యాది యందు చిదాకాశము జగదాకారంగా ఉదయించుచున్నదగుచున్నది. వాస్తవానికి చిదాకాశం జగదాకారంగా అగుటయే లేదు. జగత్తుకు కారణమనేదే లేదు. అందుచేత... అజ్ఞానం చేత చైతన్యమే జగదాకారంగా కనిపిస్తోంది. జగదాకారంగా కనిపించేదంతా సుజ్ఞానం చేత చైతన్యంగా అనిపిస్తోంది... అని మనం అందరం ఈ మహర్షి వాక్యమననంచేత గమనిస్తూ ఉందాం.

ఓ సహసభికులారా! ఈ మనస్సు, బుద్ధి-చిత్తము-అహంకారాలు, పంచభూతాలు, పర్వత - నగరాదులు, ఈ 10 దిక్కులు, యథాస్థితిలో కనిపించే సమస్త ప్రపంచం - ఇవన్నీ, ఇదంతా శిలయొక్క అంతర్భాగమువలె మహా మౌనమయమై ఉన్నాయి. ఇవన్నీ కూడా వాక్కుకు విషయమే కానట్టి చిదాకాశమే అయివున్నది.

**ఏవం న కించిత్ ఉత్పన్నం, నష్టం న చ న కించన**
**యథాస్థితం జగద్రూపం చిద్బ్రహ్మాత్మని తిష్ఠతి ॥**

ఈ ప్రకారంగా... వాస్తవానికి ఇక్కడ ఏదీ కూడా కొంచెం కూడా ఉత్పన్నమనటంలేదు. నశించటమూ లేదు. యథారీతిగా స్థితి కలిగి ఉన్న... ఈ జగత్ రూపమంతా కూడా... చిద్బ్రహ్మాత్మలో సద్బ్రహ్మ రూపంగానే వెలయుచున్నది. చైతన్యంలో గల ఈ జగత్స్వరూప స్ఫురణమే ఇదంతా! "చిత్ స్వరూపం" యొక్క విజృంభణమే ఈ జగత్తు. జలం-ద్రవంలాగా చైతన్య-జగత్తులు ఏకరూపమే అయివున్నాయి. ఇక పొందవలసినదేమున్నది? తొలగవలసినదేమున్నది? నా గురుదేవులగు వీరు - ఈ మన సభికులు - ముందు ముందు నాకు భక్తితో నమస్కరించువారు - ఈ వాక్యములు చెప్పే నేను... మనమంతా కేవల చిదాకాశ స్వరూపులమే! మనకు కనబడే జగత్తు మన స్వభావమే అయివున్నది. జగత్తును కలిగి ఉండగాను, తొలగిపోయినప్పుడు కూడా మన చిదాకాశ స్వరూపానికి లోటేమీ లేదు?

ఓ మునీంద్రా! "యథార్థ సందర్శనము" అనే పవిత్రదృష్టిని కలిగి ఉన్న జ్ఞానియొక్క దృష్టిలో ఈ జగత్తు భాసిస్తూ కూడా భాసించనిదే అగుచున్నది. ఇదంతా ఆతనికి దృశ్యశూన్యమగు పరమార్థ చిదాకాశముగానే గోచరిస్తోంది. ఇక అజ్ఞానుల దృష్టియందు ఏది ఎట్లా ఉంటే మాత్రం ఏమున్నది? అద్దానిని గురించి మనం ఇప్పుడు విచారించవలసిన పనేమున్నది? మనకేం ప్రయోజనం? అందుచేత జ్ఞానుల దృష్టితోనే నేను చూస్తున్నాను. ఇదంతా దృశ్యరహిత - నిర్వికార చిదాకాశమే! అనునదే నా ప్రస్తుతానుభవం! ఇంతకు మించి ఏ విశేషమూ ఎక్కడా లేదని నేను తృప్తిపొందాను.

❖❖❖

## 3. జగత్తుకు ఉత్పత్తి లేదు. స్థితి లేదు. ఇక ఉపశమనమెక్కడిది?

**శ్రీరాముడు :** హే మహాత్మా! సందేహాలన్నీ తొలగితే... ఇక ఆపై "స్వప్నంలో దృశ్యము చిదాకాశమే అయినట్లుగా... ఈ జాగ్రత్తులో దృశ్యం కూడా అట్లాగే చిదాకాశరూపమే" అని సుస్పష్టంగా తెలియవస్తోంది. అందుకు ఏవైనా సందేహాలు ఉంటే, వాటిని తొలగించుకోవటమే ఆధ్యాత్మ శాస్త్రము యొక్క అధ్యయనోద్దేశం.

మీరు అన్నీ సవివరణగా చెప్పారు. ఇంక సందేహమంటూ ఏదీ మిగలనే లేదు. అయినప్పటికీ మరికొంత మీ వద్దనుండి వింటే బాగుంటుందని మా మనస్సు ఇంకా ఉత్సాహపడుతోంది. అందుచేత మాత్రమే ఇక్కడ ఒక ప్రశ్నను మన ఈ సంవాదములోనికి కొనితెస్తున్నాను.

చిన్మాత్రము, దేహరహితము, కూటస్థము - అద్వయము కదా! అట్టి చిన్మాత్రము జాగ్రత్ - స్వప్న - సుషుప్తి సమయాలలో జాగ్రత్ దేహం - స్వప్నదేహం ఎందుకు ధరిస్తోంది? ఈ ప్రశ్నకు సమాధానం ప్రసాదించ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! జాగ్రత్ - స్వప్నములలో రెండింటితో కూడా... దృశ్యము కారణరహితమై ఉత్పన్నం అవుతోంది. కాబట్టి ఇదంతా శూన్యమే ఆధారముగా కలిగియున్నది. అనగా... శూన్యరూపమే అయివున్నది. అట్టి 'శూన్యము'నకు ఆధారమేమిటి? పరబ్రహ్మమే గాని, మరింకొకటేదీ కాదు! కాబట్టి ఈ "జగద్రూప వివర్తము" వల్ల బ్రహ్మం యొక్క అద్వైత తత్త్వమునకు వచ్చే హాని ఏదీ లేదు! సృష్ట్యాదిలో పరబ్రహ్మమునకు వేరుగా మరింకేదీ శేషించియే ఉండదు. బ్రహ్మమున వేరై "పంచభూతాలు" అనే కార్యం సంభవించజాలదు. పంచభూతాలే లేనప్పుడు, ఇక ఈ భూమి-దేహములు ఎక్కడివి? కాబట్టి, పంచభూత సమూహంగా కనిపిస్తున్న ఈ దేహాలన్నీ సృష్ట్యాదినుండి చిదాకాశ రూపములే అయివున్నాయి. చిదాకాశమే "స్వస్వరూపమాత్ర స్ఫురణము అను మాయా గుణముచే ఆకారవంతముగా విక్షుబ్ధమై ఈ జగత్తు యొక్క "ఆభాస"ను తనయందు తానే గాంచుచున్నది.

చిదాకాశము యొక్క ఆభాస (లేక) స్ఫురణయే... స్వప్నదర్శనం. జగదాకారమగు చిదాకాశం యొక్క "ఆభాస" యే "స్వప్నము - వివర్తము - జగత్తు" ... ఇటువంటి శబ్దములతో చెప్పబడుతోంది.

జాగ్రత్ = చిదాకాశమునందు స్వకీయమైన భావావేశం చేత స్థూలరూపంగా భాసించే నామరూపాత్మక వస్తుతత్వం.

స్వప్నము = చిదాకాశమునందు సూక్ష్మరూపంగా భాసించే జగద్రూపం.

వాస్తవానికి ఈ రెండు కూడా నిర్మల చిదాకాశరూపములే అయివున్నాయి. చిద్రూపమే తనయొక్క 'వ్యాపము' అనే "చిత్స్వభావ స్ఫురణ"... యందు ఈ భిన్న విభిన్నములైన "ఆకాశం-భూమి-గ్రామం-నగరం"... ఇత్యాది (భిన్న భిన్న) నామములన్నీ కల్పించుకుంటోంది.

ఈ ప్రకారంగా...

1. "చిదాకాశము యొక్క స్ఫురణ"యే "స్వప్న జగత్ రూపం", "జాగ్రత్ జగత్ రూపం" అనే శబ్దములచే చెప్పబడుతోంది.

2. అట్టి "స్ఫురణ" అనబడేది అధిష్ఠాన దృష్టిచే ఆ చైతన్యము యొక్క స్వభావమే అయివున్నది.

ఓ సభికులారా! ఈ స్వప్న – జాగ్రత్తులు జనించనప్పుడు – జనిస్తున్నప్పుడు – నశిస్తున్నప్పుడు కూడా చిదాకాశం యథాతథం. ఆ మన చిదాకాశ స్వరూపం జనించదు. నశించదు. శూన్యత్వము ఆకాశమునందు వర్తిస్తోంది చూచారా? అట్లాగే బ్రహ్మాకాశమునందు బ్రహ్మరూపములే అగు భిన్నభిన్న సృష్టులు జనిస్తున్నాయి. ఉంటున్నాయి. నశిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహాత్మా! మీరు ఆయా (లీలోపాఖ్యానం మొదలైన) ఉపాఖ్యానాలు చెప్పుచున్నప్పుడు అనేక రకములైన బ్రహ్మాండముల గురించి చెప్పియున్నారు. అందులో కొన్ని భౌతికములు, మరికొన్నేమో మానసికములు. కొన్ని వాయుగోళములలోను, కొన్ని తేజః కోశంలోను, కొన్ని ఒక శిలలోను... ఇట్లా ఇంకా ఎక్కడెక్కడో ఉన్నాయి కదా! ఈ భూమి ఊర్ధ్వంలో పాదములు – అధోభాగంలో శిరస్సు కలిగి ఉన్నదై అనేక జీవరాసులతో నిండి ఉన్నది. ఆయా బ్రహ్మాండాలు కొన్ని గృహాకాశంలోను, మరికొన్ని పక్షులవలె ఆకాశంలో వ్రేలాడుతూ ఉన్నాయి. స్వామీ! అటువంటి అనేక సృష్టులలో మనం ఉన్న ఈ బ్రహ్మాండము ఏ రీతిగా స్థితి కలిగి ఉన్నదో... అది తెలుప ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

> **యత్ అపూర్వం, అదృష్టం వా, నాఽనుభూతం న వా శ్రుతమ్ ।**
> **తద్వర్ణ్యతే సుదృష్టాంతైః గృహ్యతే తే చ తదూహ్యతే ॥**

ఓ రామచంద్రా! మన సంభాషణకు ముఖ్య విషయం బ్రహ్మ వస్తువు కదా! అట్టి బ్రహ్మము... అనునిత్యమైనది పూర్వం లేనిది – ఇప్పుడు క్రొత్తగా లభించేది కాదు. అదృష్టం భౌతికమైన కళ్ళకు కనిపించేది కాదు. నాఽనుభూతం ఇంద్రియములకు అనుభూతమయ్యేది కాదు. మనస్సుకు కూడా అది విషయం కాదు. నవాశ్రుతమ్ ఎవరైనా చెప్పితే తెలిసేది కాదు. అది ప్రత్యక్షము, అనుమానము, ఆగమము మొదలైన అన్నీ ప్రమాణములకు అతీతమైనది.

అట్టి పరబ్రహ్మమును ఉత్తమ గురువు అనేక దృష్టాంతముల సహాయంతో బోధిస్తున్నారు. ఉత్తమ శిష్యుడు శ్రవణ–మనన–నిధిధ్యాసలచే చింతించుచూ, క్రమంగా గ్రహిస్తున్నాడు.

ఇక ఈ మన బ్రహ్మాండం గురించి అంటావా? ఈ బ్రహ్మాండం గురించి జ్యోతిష్యాది శాస్త్రాలు అనేక విశేషాలు విశదీకరించి చెప్పుచున్నాయి. అట్లాగే మునులచేత, దేవతలచేత అనేక వర్ణనముల ద్వారా విశదీకరించబడుతోంది. అవన్నీ నీవు విద్యాధ్యయన సమయంలోను, మన ఈ సంవాదము సందర్భంగాను అనేక విషయాలు వినటం జరిగింది. కనుక నీవు ఎరిగియే ఉన్నావు. ఇక ఈ బ్రహ్మాండం ఏ ప్రకారంగా స్థితి కలిగియున్నదో, అదంతా క్రొత్తగా ఇప్పుడు చెప్పవలసినదేమీ లేదు. ఈ బ్రహ్మాండము చిదాకాశ స్వరూపమే! అట్లాగే తదితర బ్రహ్మాండములు కూడా! ఇటువంటి

బ్రహ్మాండముల వ్యవహారమంతా కూడా పరబ్రహ్మము యొక్క స్వభావమే అయి, పరబ్రహ్మమునకు అనన్యమై ఉన్నాయని మాత్రం ఇప్పుడు గ్రహించు.

**శ్రీరాముడు :** అయితే హే మహర్షీ! చిదాకాశ రూపమగు బ్రహ్మము ఈ బ్రహ్మాండాకారంగా ఎట్లా అగుచున్నదో... అది చెప్పండి. ఈ బ్రహ్మాండము ఎంతటి పరిమాణము కలిగి ఉన్నదో, ఎంత కాలం వరకు ఇది ఈ ప్రకారంగానే ఉంటుందో... అట్టి వివరాలు తెలుప ప్రార్థన!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! బ్రహ్మము ఆది మధ్యాంత రహితము. నిత్యము, అవ్యయము. అట్టి బ్రహ్మరూపమగు బ్రహ్మాకాశమునకు "ఆది-మధ్య-అంతము"... అనునవేవీ లేవు. అద్దానియందు 'ఆకారము' అనే వికారమే లేదు. అట్టి బ్రహ్మాకాశము అనాది-అనంతము-అవ్యయము-సర్వవ్యాపకము అయివున్నది. ఇక ఈ జగత్తంటావా... ఇది బ్రహ్మమే అయివున్నది. కాబట్టి ఈ జగత్తు కూడా ఆద్యంతరహితమై, సర్వవ్యాపకమై వెలయుచున్నది. ఆ పరమ చిదాకాశము "తన యందలి – తన యొక్క" స్ఫురణమునకు తానే స్వయంగా 'జగత్తు' అనునదిగా పొందుచున్నది. అయితే, 'జగత్తు' అనబడేది చిదాకాశమునకు అన్యంగా మిథ్యయే! మనుజునకు స్వప్నంలో ఒక నగరం కనిపించటం ఎటువంటిదో... ఈ దృశ్యం కూడా అటువంటిదే! "చైతన్యం యొక్క స్ఫురణయే ఈ జగత్తు" అని విజ్ఞులు సుస్పష్టంగా నిర్వచిస్తున్నారు. అట్టి చిదేక స్వభావమగు బ్రహ్మమునందు అందుకు విరుద్ధములైన పర్వత కాఠిన్యములు, జలద్రవత్వములు... ఇవన్నీ లేవు. అయితే అవ్యయమగు చైతన్యం మాయతో కూడుకొని ఎద్దానిని ఎట్లు ఏ రీతిగా ఎరుగుచున్నదో... అది అట్లే ఆ రీతిగా (పర్వతాది రూపాలుగా) స్థితి నొందియున్నదగుచున్నది.

అట్టి చైతన్యం 'శిల – ఆకారము' మొదలైనవిగా తాను అగుచుండకపోయినప్పటికీ స్వప్నంలో శిలను, ఆకాశమును దర్శిస్తోంది కదా! స్వప్నద్రష్ట స్వప్న పదార్థములుగా అగుచున్నాడా? లేదు. ఆతడు పదార్థ రూపుడుగా కాకపోయినప్పటికీ అవన్నీ అనుభవముగా పొందుచున్నాడు కదా! అట్లాగే... చైతన్యము తాను దృశ్యము కాకపోయినప్పటికీ జాగ్రత్తు నందు దృశ్య జగత్ రూపంగా ఈ సర్వము తనయందు తనకు అనన్యంగా పొందుతోంది.

నిరాకారము, పరమశాంతము అగు చైతన్యము తన యొక్క నిజ స్ఫురణచే స్వప్నము వంటి దృశ్యమును ఎరుగుచున్నది. చైతన్యము యొక్క నిజస్ఫురణమగు స్వకీయ దర్శనమే ఈ "జగత్తు" అనే పేరుతో ప్రసిద్ధమైయున్నది.

కాబట్టి మనకు కనిపించే ఈ జగత్తంతా కూడా చైతన్య రూపమే! చైతన్యము వలెనే ఇది కూడా నిరాకారము, సద్రూపము అయి ఒప్పుచున్నది. ఈ విషయం నేను అనేకసార్లు సిద్ధాంత పూర్వకంగా చెప్పియే ఉన్నాను కదా!

వాయువు యొక్క స్పందం (చలనం తరంగాలు) సదా వాయురూపమే అయి వాయువునందే ఉండి ఉన్నాయి కదా! వాయువులో తరంగాలు పుట్టటమెక్కడ? నశించటమెక్కడ? వాయువుకు వేరుగా తరంగాలు ఉన్నదెక్కడ? అట్లాగే బ్రహ్మము నందు ఈ జగత్తుగాని, మరొక జగత్తుగాని ఉదయించక – అస్తమించక వెలయుచున్నాయి.

ఓ రామచంద్రా! వాయువునందు వాయుతరంగత్వం ఎట్లా ఉన్నదో... జలమునందు ద్రవత్వం ఎట్లా ఉన్నదో... ఆకాశమునందు శూన్యత్వం ఎట్లా ఉన్నదో... వస్తువునందు వస్తుత్వం ఎట్లా ఉన్నదో... అట్లాగే... బ్రహ్మమునందు జగదత్వం ఉన్నది.

**న ప్రయాతం న వా యాతమకారణమకారణాత్ ।**

**న చ నాస్తి నవాస్తీదం భిన్నం బ్రహ్మపదే జగత్ ॥**

బ్రహ్మము సర్వదా కారణరహితం! ఈ జగత్తు కూడా మొదలే కారణరహితం! అందుచే ఈ జగత్తు సృష్టికాలంలోనే బ్రహ్మమున ఆవిర్భవించి ఉండనే లేదు. ఇక మధ్యలో మాత్రం ఎక్కడున్నది? ఇక ఇది ప్రళయకాలంలో నశించటమనేది ఎక్కడ?

అంతే కాదు!... ఇది బ్రహ్మమున "ఉన్నది" అని గాని, "లేదు" అని గాని చెప్పటానికి వీలే లేదు. జగత్తుకు కారణం ఎక్కడిది? ఎందుకంటే "అనాది – అభాసవర్జితము – నిరాకారము" అగు చిదాకాశము జగత్తుకు కారణమెట్లా అవుతుంది? అవజాలదు.

❖

కాబట్టి రామచంద్రా! ఒక "అవయవి"కి ఈ అవయవములు ఎట్లాగైతే "నిజస్వరూపములే" అయివున్నాయో... 'వేరు' కాకయే ఉన్నాయో... అట్లా... అవయవరహితము, నిరాకారము, చిదాకాశ రూపము అగు బ్రహ్మమునందు "చిదాకాశరూపమే" అగు ఈ జగత్తు (బ్రహ్మమునకు అభిన్నమై) స్థితినొంది యున్నది.

**సర్వం శాంతం నిరాలంబం జ్ఞప్తిమాత్రం అనామయమ్**

**నేహ సత్తా న వాసత్తా న చ నానాస్తి కించన॥**

ఈ జగత్తుగా కనిపించేదంతా కూడా "శాంతం, నిరాధారం, నిర్వికారం" అయినట్టి చిన్మాత్ర బ్రహ్మమే అయివున్నది. ఇక్కడిక బ్రహ్మం కంటే వేరైన 'సత్త' గాని, 'అసత్త' గాని, ఏకత్వ– అనేకత్వాలు గాని కించిత్ కూడా లేవు (నే ఽ హనానాస్తి కించన –శ్రుతివాక్యం). సంకల్పాలోని దృశ్యంలాగా, స్వప్నంలోని నగరంలాగా ఈ జగత్తంతా కూడా "సమం, శాంతం, జన్మరహితం, అవ్యయం, సర్వవ్యాపకం" అగు చిదాకాశమే! చిదాకాశం గానే చిదాకాశమునందు స్థితి కలిగి ఉన్నదైయున్నది.

ఓ రామచంద్రా! "స్వచ్ఛం, ప్రకాశరూపం, సారభూతం" అయినట్టి చిదాకాశ స్వరూపం తన యొక్క చిత్స్వభావం వలన భ్రాంతిచే జగత్తుగా... స్ఫురిస్తోంది. అట్లు తన కల్పాంతం వరకూ స్వకల్పితమగు తన రూపమునే తన జగత్తుగా ఎరుగుచున్నది.

❖❖❖

# 4. ప్రజ్ఞప్తిరాజు - మహాప్రశ్నలు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఈ 'జగత్తు' అనబడేది కారణము లేకయే చిదాకాశమునందు భాసిస్తోంది. కనుక ఇది వాస్తవానికి కించిత్ కూడా లేదు. పరమార్థమగు బ్రహ్మమే యథార్థానికి

ఇట్లు (నామ రూపాత్మకంగా) స్థితి నొందినట్లుగా ఉన్నది. ఈ విషయమే ఒకానొక సమయ - సందర్భములలో నన్ను అడిగితే, నేను ఆ ఒకానొక మహాప్రశ్నకు చెప్పిన సమాధానం ఇప్పుడు చెపుతాను. సమ్యక్ - జ్ఞానము యొక్క పుష్టి కొరకై విను.

❖

కుశద్వీపమున 'జల' అనే పట్టణమును రాజధానిగా కలిగి "ప్రజ్ఞప్తి" అనే మహారాజు ఒకాయన పాలిస్తూ ఉండేవారు. ఏదో కారణవశంగా నేనారాజును దర్శించటం జరిగింది. ఆయన నాకు పుష్ప - అర్ఘ్య - ఆచమనీయాదులతో పూజించి ఉత్తమ ఆసనం సమర్పించారు. ఆ తరువాత ఏదో ప్రసంగ సందర్భంలో నన్నిట్లా ప్రశ్నించారు.

**శ్రీ ప్రజ్ఞప్తి మహారాజు :** మహాత్మా! శ్రీ వసిష్ఠ మునీంద్రా! ఇప్పుడు నాకుగల కొన్ని సందేహాలను ప్రశ్నల రూపంలో మీ ముందు ఉంచుతాను. ప్రళయ కాలంలో సర్వనాశనం సంభవిస్తోంది కదా! అప్పుడు ఈ భూమి మొదలైనవన్నీ నశిస్తున్నాయి. అంతా శూన్యమైపోగా, ఇక అనిర్వాచ్యము అగు చిదాకాశం మాత్రమే శేషిస్తోంది కదా! ఆ తరువాత మరల సృష్టి యొక్క ఆరంభానికి మూలకారణం (ఉపాదాన కారణం) ఏదై ఉన్నది? సహకారి కారణాలు ఏవి? సర్వము నశించియే పోగా ఇక సహకారి కారణాలు ఎక్కడి నుండి వస్తున్నాయి.

ఉదాహరణకు... కుండ తయారవటానికి మూలకారణం- మట్టి. సహకార కారణం - కుమ్మరి, సారె మొదలైనవి. సృష్టియే లేనట్టి సమయంలో ఏ కుమ్మరి ఏ మట్టితో ఏ సారెను ఉపయోగించి ఈ సృష్టి అనే కుండను తయారుచేస్తున్నాడు?

హే మహర్షీ! ఈ జగత్తు వాస్తవానికి ఏమైయున్నది? "సృష్ట్యాది' నుండి "ప్రళయాంతము" వరకు ఇది ఏ ఏ వికారములు పొందుతోంది? ఈ సృష్టులలో కొన్ని నిరంతరం చీకటితో నిండి ఉన్నాయి. కొన్ని ఆకాశము, సముద్రములను కలిగియుండి అనేక క్రిమి-కీటకములకు ఆలవాలమై ఉన్నాయి. మరికొన్ని ఆకాశకోశంలో ఉన్నాయి. ఇంకొన్ని శిలలయొక్క గర్భభాగంలో ఏర్పడినవై ఉన్నాయి. అసలీ వైచిత్రమంతా ఏమిటి? దీనికంతా కారణమేమిటి?

ఈ భూమి మొదలుగా గల పంచభూతాలు ఎక్కడి నుండి వచ్చాయి? అటువంటి ఈ భూమిపై అండజ-బీజజ - వాయుజ - శ్వేదజ - గర్భజాది ఆయా విధములై ప్రాణి సమూహాలు ఎట్లా వచ్చాయి? ఎట్లా ఉద్భవించాయి? ఇవన్నీ వాస్తవానికి ఏమైయున్నాయి?

ఇది ఇట్లా ఉండగా, ప్రతి జీవునియొక్క అంతఃకరణ రూపములైనట్టి ఈ మనస్సు-బుద్ధి-చిత్త-అహంకారాలు ఒక్కొక్క జీవునికి ఒక్కొక్క రీతిగా ఎట్లా రూపం దిద్దుకుంటున్నాయి? లోకాలన్నిటికీ కర్త ఎవరు? ద్రష్ట ఎవరు? దేని యొక్క ఆధార - ఆధేయత్వములచే ఇవన్నీ సంభవిస్తున్నాయి?

వేద - శాస్త్ర - పురాణముల అర్థమును అనుసరించి ఈ ఈ ప్రాణులన్నీ కూడా తమ ఇతః పూర్వపు కర్మలను బట్టే వ్యవహారములలో ప్రవర్తిస్తున్నాయి కదా! ఈ తతంగమంతా ఎట్లా ప్రవర్తిస్తోంది? ఆ కర్మల ప్రయోజన ప్రదాత ఎవరు? ఎక్కడుంటారు? ఆయనను సృష్టించిందెవరు? ఆయన ఇదంతా ఎందుకు నిర్వర్తిస్తున్నారు?

ఈ జగత్తులకు 'మహానాశనము' అనబడేది ఏదైనా నిజంగా ఉన్నదా? లేదా? "జ్ఞానమును అనుసరించే అనుభవములు కలుగుచున్నాయి!" ...అని కొందరు శాస్త్రవేత్తలు అంటున్నారు కదా! అనగా, జ్ఞానమే దేహాదులకు కారణమా? లేక, ఈ దేహాదుల నిర్మాణమునకు మరొకటేదైనా కారణం ఉన్నదా? 'జ్ఞానమే' ఈ ఉపాధులకు కారణమని అనుకుంటే... అప్పుడు ఆ జ్ఞానము నిత్యమా? అనిత్యమా? ఒకవేళ 'జ్ఞానము' నిత్యమే అయితే, అది కూటస్థమే అగుచున్నది కదా! అట్టి దానినుండి వికారవంతములగు ఈ దేహాదులు ఎట్లా కలుగుచున్నాయి?

అలా కాకుండా "జ్ఞానము అనిత్యము" అని అంటారా? అట్లా అయితే అద్దాని ఉత్పత్తికి కారణమేమిటో చెప్పవలసి ఉంటుంది! ఆ కారణము ఏమిటో జ్ఞానము లేకపోతే గుర్తించబడజాలదు కదా? జ్ఞానము దేహమునకు కారణమా! దేహమే జ్ఞానమునకు కారణమా?

దేహమే జ్ఞానమునకు కారణమైతే దేహముతోపాటే జ్ఞానము కూడా నశించాలికదా? అనగా దేహానంతర లోకములుగా చెప్పబడే స్వర్గ – నరకాదులు లేవనియా? ఉన్నాయని కొన్ని పురాణాలు ప్రతిపాదిస్తున్నాయి కదా? జ్ఞానము లేకపోతే మరణానంతరం అవి అనుభవానికి రావు కదా?

సరే! కాసేపు దేహానంతర లోకాలైన స్వర్గ – నరకాదులు ఉన్నాయని అనుకున్నామనుకోండి. మాత – పితాది కారణాలు లేకుండానే అనుభవమయ్యే స్వర్గ – నరకాదులు ఈ జీవుడు మరణించిన తరువాత ఏ దేహంతో అనుభవిస్తున్నాడు? వాటికి ఉపాదాన – సహకారికి కారణాలేమై ఉన్నాయి?

ధర్మ – అధర్మాలు రూపరహితం కదా! అవి మూర్తిమంతములగు ఈ దేహాదులకు కారణాలు అగుచున్నాయా? అవటం లేదా? అయితే ఎట్లా అగుచున్నాయి? ఈ దేహాలు నిర్మిస్తున్నదేది? అట్లా నిర్మించేది పదార్థ రహితమా? అవేవన్నా దేహాదుల నిర్మాణానికి కారణమౌతూ ఉంటే... మరి మాతా – పితల పాత్ర ఏమిటి? పదార్థ రూపమే ఈ దేహం కదా! అట్టి పదార్థమునకు తండ్రి ఎవరు? తల్లి ఎవరు?

ఈ శరీరాలు ఎవరు నిర్మిస్తున్నారు? ఈ దేహాదులు నిర్మితమటానికి మరింకేదైనా కారణము లున్నాయా? ఈ పదార్థాలన్నీ ఎట్లా సంభవిస్తున్నాయి? "ధర్మాధర్మములు లేవు" అనే నాస్తికుల మతం సరియైనదా? కాదా? 'పరలోకం' అనేది ఉన్నదా? పరలోకం ఉండి ఉన్నదనుకొంటే, ఈ జన్మ పూర్వజన్మకు పరలోకమే కదా? అయితే ఈ జన్మ "సంవేదము (లేక) జ్ఞానము"ను అనుసరించే ఉన్నది కదా! కనుక జ్ఞానమే ఇహలోక – పరలోక రూపములు కదా?

"పరలోకము లేదు" అని నాస్తికులు చెప్పేది వేదాదులకు, లౌకికానుభవానికి అసమంజసమని, విరుద్ధమని అనిపిస్తోంది. ఇంతకీ పరలోకం ఉన్నదా? లేదా? ఉంటే ఈ బ్రహ్మాండంలోనిదా? వేరే మరొక బ్రహ్మాండంలోనిదా? ఈ జన్మకు పూర్వజన్మ ఉన్నదా? ఉంటే అప్పటి కర్మలు ఇప్పటి ప్రయోజనాలకు కారణ మౌతాయా?

వరములు – శాపములు ఎట్లా ప్రభావితమై ఉంటున్నాయి? శాస్త్రములు "ఇది చేయండి – ఇది చేయకండి" అని విధి నిషేధములు ప్రకటిస్తున్నాయి. కొందరు "ఈ విధి – నిషేధములు

పాటించాలి! లేకపోతే ముందు ముందు దుష్ఫలితాలు ఉంటాయి" అని అనుకుంటున్నారు. మరి కొందరో... "విధి-నిషేధములు శాస్త్ర కల్పితాలు. అవి అనుసరించకపోయినా ఏమీ కాదు. పాప పుణ్యాలు లేవు"... అని విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారు. విధి-నిషేధములు, పాప-పుణ్యములు ముందు ముందు ఫలవంతములు అవుతాయా? అయితే ఎట్లా అవుతాయి? శాస్త్రములు చెప్పే విధి-నిషేధముల ప్రయోజనం ఏమిటి?

కొందరు మహనీయుల ఆశీర్వాద మాత్రంచేత ధనధాన్యములు లభిస్తాయని కొందరనుకొంటూ వుంటారు. అట్లా మునులు మొదలైనవారు ఆశీర్వదించినంత మాత్రం చేత ధనాదులు నిజంగా లభిస్తాయా? ఎట్లా లభిస్తాయి? కష్టాలు, విఘాతాలు, నిరోధాలు తొలగుతాయంటారు. ఎట్లా తొలగుతాయి?

శ్రుతులలో కొన్ని కొన్ని పరస్పర విరుద్ధములైన అర్థములు ప్రతిపాదించే కొన్ని మూల సూత్రములను వేరు వేరు చోట్ల చెప్పుచున్నాయి.

*మాయాంతు ప్రకృతింవిద్ధి! మాయి నంతు మహేశ్వరమ్* – ఈ జగత్తు / ప్రకృతి 'మాయ' అయి ఉన్నది.

*అసదేవేః దమగ్ర ఆసీత్ తతో వైనద జాయతే* – సృష్టికి పూర్వం 'అసత్' మాత్రమే ఉన్నది. అద్దాని నుండి సత్ స్వరూపమగుఈ జగత్తు జనిస్తుంది.

*ఏకమేవాద్వితీయం బ్రహ్మ* – ఈ జగత్తంతా కూడా ఏకము, సద్రూపము అయినట్టి 'బ్రహ్మమే' అయి ఉన్నది.

*నాసదాసీన్నోసదాసీత్తదానీమ్* – ఈ సృష్టికి పూర్వం సత్తుగాని, అసత్తు గాని లేదు.

*సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్* – ఈ సృష్టికి పూర్వం 'సత్' మాత్రమే ఉన్నది.

...ఇవన్నీ పరస్పరం అసంగతంగాను, పరస్పరం విరుద్ధంగాను ఎందుచేత శ్రుతులలో (వేదములలో) చెప్పబడ్డాయి.

సృష్ట్యాదిలో అంతా పదార్థశూన్యం కదా! అట్టి పదార్థ శూన్యమగు చిదాకాశం నుండి సాకారుడు, గుణ సమన్వితుడు అగు బ్రహ్మదేవుడు ఎట్లా ఉత్పన్నమైనాడు? చిదాకాశానికి "బ్రహ్మదేవుడు ఉదయించటం" అనే చమత్కారం కలిగియే ఉన్నదంటారా? అట్లా అయితే చిదాకాశము సర్వత్రా, సర్వదా వర్తిస్తోంది కదా! మరి సర్వస్థానముల నుండి బ్రహ్మదేవుడు ఉత్పన్నం అవటం లేదేం?

'చిదాకాశము' సర్వదా ఏకము, ఏకైకము కదా! అద్దాని నుండి ఉదయించిన ఓషధులు (ఆమ్ల – క్షార లక్షణములుగల మొక్కలు) భిన్నభిన్నములుగా ఉంటున్నాయేం? చిన్న చిన్న బీజములను ఉత్పన్నం చేసే వేరు వేరు స్వభావములు కలిగి ఉంటున్నాయేం? అట్లాగే అగ్ని ఉష్ణంగాను, జలము శీతలంగాను పరస్పర విరుద్ధ స్వభావములు ఎట్లా ఏర్పరచుకొని ఉంటున్నాయి?

"ఈ జగత్తంతా మనోభావనా మాత్రము, ఏ జీవుడు దేనికై తీవ్రంగాను, సుదీర్ఘంగాను భావన చేస్తే అది అట్లే పొందుతూ ఉంటాడు" ... అని ఉపనిషత్తులు మొదలైన వేద – వేదాంత

విభాగాలు చెప్పుచున్నాయి. ఒక వ్యక్తి తీర్థములను - ఇష్ట దైవమును సేవిస్తూ "ఈ నా శత్రువు నశించాలి" అని కోరుకుంటున్నాడనుకోండి. అదే వ్యక్తి ఆతని బంధువు "ఈతడు కలకాలం జీవించాలి' అని కోరుకొంటూ ఇష్టదైవమును - తీర్థములను సేవిస్తున్నాడనుకోండి. ఇప్పుడు ఆ శత్రు - బంధువుల విరుద్ధ స్వభావముతో కూడిన కార్యములు ఎట్లా సంభవించ గలుగుతాయి? అసలు తీర్థములు సేవిస్తే అనుకున్నవి అనుకున్నట్లుగా జరుగుతూ ఉంటాయా? ఎట్లా జరుగుతుంది?

ఎప్పుడు ఎట్టి భావన చేస్తే అది అట్లే అగుచున్నది. (యద్భావం - తత్భవతి)... అని శ్రుతి వాక్యం కదా! ఇప్పుడు "ఆకాశంలో నేను పూర్ణ చంద్రుడుగా అగుదును గాక!" - అని అనేకమంది ఉపాసనా విధిని అనుసరించి ధ్యానిస్తే... అప్పుడు ఏకకాలంలో వారంతా అనేక చంద్రులుగా అయి ఆకాశంలో కనిపిస్తారా? అప్పుడు ఈ ఆకాశంలో అనేక చంద్రబింబాలుంటాయా?

ధ్యానము ఆశయమును సిద్ధింపజేస్తుందని... అంటారు కదా! అనేకమంది ఒకే స్త్రీని ఉద్దేశించి "ఈమె నా భార్య కావాలి"... అని ధ్యాన - ఉపాసనలకు ఉపక్రమించారనుకోండి. అప్పుడు ఆ వేలాది మంది ధ్యానం ఎట్లా ఫలిస్తుంది? భిన్న భిన్న గృహములలో వేరువేరుగా అయి ఆమె వారందరికీ గృహిణిగా వర్తించజాలదు కదా! ఇది ఇట్లా ఉండగా, ఆ స్త్రీ "నేను బ్రహ్మచారిణిగా ఉండాలి" అని తపస్సు - ధ్యానములకు ఉపక్రమించిందనుకోండి. ఇప్పుడు ఆమె బ్రహ్మచారిణిత్వము - బహు భర్తృ భోగ్యత్వము రెండూ ఎట్లా పొందగలుగుతుంది?

ఒక దంపతులలో భార్య "ఈతడు ఈ గృహం నుండి ఎప్పటికీ బయటకు వెళ్ళకూడదు" అని, భర్తేమో "నేను సప్త ద్వీపములతో కూడిన ఈ భూమండలమునకు చక్రవర్తి కావాలి" అని ఒకేసారి ఉపాసనకు ఉపక్రమించి తపోధ్యానములు ప్రారంభించారనుకోండి. అప్పుడు ఆ ఇద్దరి ఆశయము ఒకేసారి సిద్ధించటమెట్లా? ఆ భార్య కోరికను అనుసరించి భర్త ఇంట్లోనే ఎట్లా ఉంటాడు? భర్త తన ఆశయం అనుసరించి సప్తద్వీపములతో కూడిన భూమండలం ఎట్లా పరిపాలిస్తాడు.?

కొందరు వారి వారి తండ్రి - తాతలను ఉద్దేశించి పితృకార్యాలు నిర్వర్తిస్తున్నారు. దాన - ధర్మ - తపస్సులు సమర్పిస్తున్నారు. అటువంటి ఔర్ధ్వ దేహిక కర్మల ప్రయోజనం వారు నిర్వర్తించిన చోటే ఉత్పత్తి అవుతాయి కదా! అట్టి క్రియా ఫలాలు పరలోకం ఎట్లా ప్రయాణిస్తాయి? ఊర్ధ్వలోకాలలో గల పితృ దేవతలను ఎట్లా జేరుతాయి?

ఈ శరీరాలు కనబడుచున్నాయి. మరి పుణ్యపాపాలు కనిపించటం లేదు. కంటికి కనబడని (అదృష్టములగు) పుణ్య-పాపాలు కంటికి కనిపించే దేహాలపై ప్రభావం ఎట్లా చూపుతాయి? ఈ జీవుడు ఇహ-పర లోకములలో అమూర్తిమంతుడై (ఆకార రహితుడై) ఉన్నాడు. దేహికి ఆకారం లేదు కదా! ఇక దేహం ఆకారం కలిగివున్నది. ఏ దేహంతో పాపపుణ్యాలు చేస్తున్నాడో... ఆ దేహం ఇక్కడే నశిస్తోంది. ఆకార సహితమైన దేహముతో చేసే పుణ్యపాపాలు దేహం నశించిన తరువాత ఆకార రహితుడగుదేహిని వెన్నంటి పరలోకములకు ఎట్లా ప్రయాణిస్తాయి?

అసలీ పుణ్యపాపాలు మరణానంతరం దేశాంతరంలో కాలాంతరంలో ఫలాలు ఎట్లా ఇవ్వగలుగుచున్నాయి?

హే మహాత్మా! వసిష్ఠ మహర్షీ! నాకు ఇక్కడ అనేక అసమంజసమైన విశేషాలు కనిపిస్తున్నాయి. ఇవన్నీ నాకు అనేక సందేహములను కలుగజేస్తున్నాయి. హే మహానుభావా! మీ అమృత తుల్యమైన వాక్కుచే నా ఈ సందేహాలు తొలగించండి. ఇవన్నీ నేను చాలా మందిని అడిగాను. అయితే సందేహాలు తీరలేదు. స్వామీ! "పరమాత్మ వస్తువు యొక్క ఉపదేశం పొందితే అన్ని అనుమానాలు అవే పోతాయి" అని మా రాజ్యంలోని పెద్దలు అంటూ ఉంటారు. అద్దానిచే ఉభయ లోకములలో శ్రేయస్సు లభిస్తుందని విన్నాను. "ఆత్మతత్త్వము యొక్క ఉపదేశము గ్రహిస్తే విరుద్ధ ఫలములన్నీ అవిరుద్ధంగా అయిపోతాయి"... అని విని ఉన్నాను. కాబట్టి నాకు "పరమాత్మవస్తువు" అగు బ్రహ్మమును గురించి బోధించండి. ఎందుకంటే తమ వంటి మహా పురుషులతో ఈ కొద్దిసేపు సాంగత్యం వృథా కాకూడదు కదా! మీతో ఈ సాంగత్య సంభాషణలు నాకు మహత్తరమైన ప్రయోజనమును ప్రసాదించగలవని ఎరిగియే ఉన్నాను. అందుకే మీ పాదములను స్పృశిస్తూ ఈ "పరస్పర విరుద్ధ విషయములు" అనే మహాప్రశ్నలను మీ ముందు ఉంచాను. మీ సమాధానం శ్రద్ధగా ఆలకించి పునీతుడను కాగలను.

❖❖❖

## 5. జగత్తుగా భాసించేదంతా చిదాకాశమే!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! ఆ ప్రజ్ఞప్తిరాజు వినిపించిన "పరస్పర విరుద్ధములు" గురించిన మహా సందేహములన్నీ విన్నావు కదా!

**శ్రీరాముడు :** విన్నాను స్వామీ! అందుకు మీరిచ్చిన ప్రత్యుత్తరమేమిటో వినాలని కుతూహలంగా ఉంది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అయితే, ఇక విను.

❖

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఇప్పుడు నీకు ఆత్మతత్త్వము స్పష్టమయ్యేటట్లుగా విశదీకరిస్తాను. ఇది వింటే నీ సందేహాలన్నీ ఒక్క వ్రేటితో నిర్మూలనమై పోతాయి.

ఈ "జగదనుభవమంతా ఏమిటి?" అనేది అర్థం చేసుకోవటానికి వీలుగా ముందుగా ఈ మొత్తాన్ని రెండుగా విడదీసి చూద్దాం.

1. అనుభవము పొందుచున్నవాడు (అనుభవజ్ఞుడు "సంవిత్తు")
2. అనుభవరూపంగా పొందబడుచున్నది. (అనుభవములు "సంవేదము")

ఈ జీవుడు సంవిత్ స్వరూపుడే! అట్టి ఈ జీవుని (లేక సంవిత్తు) యొక్క అనుభవమును అనుసరించే ఈ జగత్ పదార్థాలన్నీ కూడా అనుభవమౌతున్నాయి.

"ఇది ఉన్నది"... అని ఆయన అనుకుంటే ఇది సద్రూపము అవుతోంది. "ఇది లేదు"... అని ఆయన అనుకుంటేనో... ఇదంతా అసద్రూపమే అగుచున్నది.

అనగా... సంవిత్తు ఎట్టి భావనచే దేనిని దర్శిస్తాడో... అది ఆ రూపంగానే అనుభవం అగుచుండటమే ఈ దృశ్యము యొక్క చమత్కారం. (యద్భావం – తద్భవతి).

అనగా... సంవిత్ స్వరూపుడగు ఈ జీవుడు "ఇది కుండ, ఇది గోడ, ఇది నీలము (కాబట్టి వ్యవహార శీలము), ఇది ఎరుపు (కాబట్టి ప్రమాద సూచకము), ఇది ఇల్లు"... విధంగా దేనిని దృఢనిశ్చయంతో ఏ దృష్టితో చూస్తే అది అట్లే అనుభూతమౌతోంది. ఇక "ఇది సత్తా? అసత్తా?" అనే ప్రశ్న ఎక్కడిది? ఏది 'అసత్తు' అని తలిస్తే అది అసత్తుగాను, ఏది 'సత్తు' అని తలిస్తే అది 'సత్తు' గాను ఈ వస్తువులన్న సంప్రాప్తిస్తూ వస్తున్నాయి. "తలిస్తేనే తెలుస్తోంది" – అనునది గమనించు.

**దేహం -** మొట్టమొదట ఈ దేహం విషయానికి వద్దాం. ఈ 'జీవుడు' అనబడే సంవిత్తు తన యొక్క 'చిత్స్వరూపము' నందు దేహమును గురించిన భావన చేయటమనేది ఆ సంవిత్తు యొక్క స్వభావమేనని చెప్పబడుతోంది. ఆ సంవిత్స్వరూపం "దేహమే నా స్వరూపం" అని భావించి దేహముగా అభివ్యక్తమౌతోంది. ఈ విధంగా అయ్యది తనయొక్క 'నిర్మల సంవిత్ ధర్మము'ను ఏమరచి తనయందు దేహ ధర్మమును 'అధ్యాస'గా చేసుకుంటోంది. అందుచేతనే అజ్ఞాన యుక్తులగు జనులు "ఈ దేహమే నేను" అని జాగ్రత్ స్వప్నానుభవాలు పొందుచున్నారు. అనగా నిర్మలము, అపరిమితము, సర్వగతము అగు సంవిత్తు యొక్క ఒకింత (స్వస్వరూపము గురించిన) ఏమరపుతో కూడిన "దేహధర్మ అధ్యాస" యే శరీరత్వం. అంతేగాని ఈ భౌతికంగా కనిపించే శరీరం ఈ జీవుని వాస్తవ శరీరం కాదు. "నేను దేహ ధర్మములు స్వరూపంగా కలవాడను" అను ఒకానొక పరిమిత దృష్టియే దేహత్వం.

సృష్ట్యాదియందు జగత్తుకు సంబంధించిన కారణము లేనేలేదు. నిజమే! సంవిదాత్మయే తన అధ్యాసచే తన యందు జాగ్రత్, స్వప్న ద్రష్టత్వం వహించి, తానే తద్వారా జాగ్రత్–స్వప్న దృశ్యరూపంగా భాసిస్తున్నాడు. కనుక సంవిదాత్మయే ఈ జగత్తు యొక్క స్వరూపం! ఇక ఈ జాగ్రత్ జగత్తులో స్వప్నం కంటే విలక్షణమైనదేదీ లేదు. బ్రహ్మం అను పేరుగల నిర్మల సంవిత్తు మాత్రమే ఉన్నది. అదే జగత్ రూపంగా కూడా భాసిస్తోంది. కనుక ఈ జగత్తుకు బ్రహ్మం కంటే అన్యత్వమైనదేదీ లేదు.

ఈ ప్రకారంగా... "అవికారం, సర్వదా ఏకరసం" అగు బ్రహ్మమే జగత్ రూపంగా స్థితినొంది ఉన్నదనే విషయం బ్రహ్మవేత్తల ప్రవచనములు విన్న తరువాత, వేద – వేదాంగముల అధ్యయనం చేసిన తరువాత మేము అనుభూతం చేసుకొని ఉన్నాము. అదే నీకిప్పుడు ప్రకటిస్తూ చెప్పుచున్నాను. ఇక్కడ లోకప్రచారములైయున్న రెండు సిద్ధాంతాలు మన సంవాదము కొరకై ఉదహరిస్తాను.

**1. దేహమే దేహి (నైయాయికులు) :** "దేహోఽహమ్" సిద్ధాంతం – ఇది కొందరు సిద్ధాంత పూర్వకంగా చెప్పుచున్నారు. వీరి (నైయాయికులు) సిద్ధాంతమును అనుసరించి... "దేహము వేరు", "దేహి వేరు" అని మేమూ ఒప్పుకోము. అయితే దేహము ఉంటేనే, 'నేను' అనేది ఉంటుంది. దేహము నశించినప్పుడు 'నేను' అనేది కూడా నశిస్తోంది. దేహము పతనమైన తరువాత ఇక 'నేను' అనేది ఎక్కడా ఉండజాలదు. దేహ పదార్థములకు సంబంధించిన ఒకానొక రసాయనిక ఉత్పత్తియే ఈ నేను అనునది!

కనుక దేహంలోనే దేహంతోనే 'నేను' పుడుతుంది. దేహముతోనే ఆ 'నేను' అనేది నశిస్తోంది. దేహమునకు వేరుగా 'సంవిత్' (సత్ = ఉనికి; విత్ = ఎరుక) అనేది ఉండదు. కాబట్టి ఈ జీవుడు సంవిత్ స్వరూపుడని, అటువంటి సంవిత్ స్వరూపం దేహం కంటే విలక్షణమై, శాశ్వతమై, దేహంతో పుట్టక – దేహంతో నశించక ఉంటోందంటే మేము ఒప్పుకోము.

**2. జగత్ సత్యమ్ - సంవిత్ మిథ్యా (చార్వాకులు) :** ఇక (చార్వాకులు) ఈ విధంగా అంటున్నారు. జగత్తు ఎప్పటికీ ఇట్లాగే ఉంటుంది. నీళ్ళలో బుడగలలాగే ఈ జీవులు పుడుతూ ఉంటారు. చస్తూ ఉంటారు. "దేహి – శరీరి – సంవిత్తు" ... ఇటువంటివేవీ లేవు. శరీరం అనేది కొన్ని పదార్థాల కలయిక. 'నేను' అనేది ఆ పదార్థాలు కలిసినప్పుడు ఉంటుంది. అవి విడిపోతే లేకుండా పోతుంది. ఈ ఎదురుగా కనిపించే జగత్తు తప్పితే మరొక జగత్తు లేదు. అనుభవం లేదు. దేహానంతరం మరింకేమీ ఉండదు. కనుక పాపము, పుణ్యము ఇవన్నీ ఎవరో కల్పించారు. అవన్నీ లేవు. వేరే లోకాలు లేవు. పుట్టుకకు ముందు ఏమీ లేదు. చచ్చిన తరువాత ఏమీ మిగలదు. కనుక తినండి, తాగండి, ఇంకేమీ ఆలోచించకండి!

పై రెండు సిద్ధాంతాలు ఇంచుమించు ఒకే తీరైనవే! వారు "దేహి లేదు – దేహమే ఉన్నది" అని చెప్పుచున్నారు. దేహంతోబాటే దేహి కూడా నశిస్తాడని, ఆ తదనంతరం మరింకేమీ లేదని వారి ఉద్దేశం. అయితే... ఈ రెండు సిద్ధాంతాలు మా అనుభవంలో – ఉద్దేశంలో "పిల్లలు చెప్పే అమాయకపు మాటలు" వంటివేగాని అనుభవసిద్ధమైన వాక్యాలు కావు. మా ఉద్దేశం – అనుభవం – మహాత్ముల ప్రవచనం ఏమిటో చెప్పుతాను. విను.

ఈ జగత్తు వస్తురూపం కాదు! అనుభవరూపమే! ఈ జీవుడు అనుభవి స్వరూపుడు!

అనుభవి = సత్ (ఉనికి) + చిత్ (ఎరుక)

సమస్త ప్రాణులకు "నేను ఉనికి, ఎరుకల స్వరూపుడను"... అనేది నిత్యానుభవమే అయివున్నది. దృఢానుభవసిద్ధియే అయివున్నది. ఈ 'జగత్తు' ఎరుక యొక్క స్వరూపం అయివున్నది. ఈ జగత్తంతా కూడా సత్త స్వరూపమే! అటువంటి జగత్తు యొక్క నిత్యసత్తా స్వరూపం ఏమరచి "వర్తమానపు నామరూపములే జగత్తు"... అని అనుకొని వర్తమానపు దృశ్యాన్ని ప్రమాణంగా తీసుకోవటం చిన్నపిల్లల భ్రమ వంటిదేనని మా ఉద్దేశం.

"చైతన్యము నిత్యం కాదు. శరీరమే సంవిత్తు (ఈ జీవుని ఉనికి – ఎరుకలకు) కారణం." అట్లా అనుకోవటం మోహముచే స్వీకరించబడేదే అవుతుంది. జడమగు దేహమే చైతన్యరూపమమగు 'నేను'కు కారణం... అని అనుకోవటం 'కూపస్థ మండూకం'తో సమానం (నూతిలో ఉన్న కప్ప నూయ్యే సర్వ జగత్తు అని అనుకోవటం వంటిది). అట్లా అనుకోవటం ఉన్మత్తతయే! అట్లా "శరీరంలో నుంచే 'నేను' వస్తోంది. శరీరంతో 'నేను' నశిస్తోంది"... అని వాదించే వారు ఆధ్యాత్మిక బోధకు అర్హులు కాలేకపోతున్నారు. ఎట్లా అంటే ఒక ఉన్మత్తునికి (పిచ్చివానికి) – విచక్షణా జ్ఞాన సహితునికి వివేకమైన సంభాషణ ఎట్లా కుదురుతుంది? అట్లాగే దృశ్యమును నామరూపాత్మకంగా నమ్మి ఉండే వానికి – ఎరుక రూపంగా పాత్యాంశము కలిగి ఉన్న జ్ఞానికి సంభాషణ కుదరటంలేదు.

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఏ పండితుడైనా సరే... అతను చెప్పే కథనం చేత సమస్త సందేహాలు తొలగితేనే మనం అద్దానిని ఉత్తమ సిద్ధాంతంగా ఒప్పుకోగలం. కొన్ని సందేహాలు మిగిలియే ఉంటే అది మూర్ఖకథనమే అవుతుంది సుమా! "ప్రత్యక్ష దృశ్యాత్మ సిద్ధాంతం" ప్రకారం ఎదురుగా ఏది కనబడితే అది మాత్రమే సత్యం. 'అనుమానము'ను ఆతడు స్వీకరించటం లేదు. ఆతడు పూర్వ–పరము వదలివేసి "ప్రత్యక్షమే మాకు ప్రమాణం. ఎవరో చెప్పితేనో, (లేక) శ్రుతులలో చెప్పబడిందనో ప్రమాణంగా తీసుకోమంటే మేమేమీ ఒప్పుకోం"... అని చెప్పి "ఈ శరీరం తరువాత ఎవరు ఏమౌతున్నారో తెలియదు. అందుచేత దేహం నశిస్తే ఆ జీవుడు ఇక లేనట్లే"... అని చెప్పటం మా ఉద్దేశంలో యుక్తి రహితమనే చెప్పాలి. అట్లా వాదించేవాడు "శరీరమునకు వేరుగా నేను లేను" అని తనను తానే తిరస్కరించుకొన్న వాడగుచున్నాడు. అట్టి ప్రవచనం విజ్ఞుల చెవులకు కఠోరంగా ఉంటోంది. అందుచే అద్దానిని "అంధకూప మండూక న్యాయం (చీకటి నూతిలోని కప్ప యొక్క అనుభవం వంటిది)" అని విజ్ఞులు భావిస్తున్నారు.

ఇక తత్త్వజ్ఞుల అభిప్రాయం చెప్పుచున్నాను విను. "ఈ జగత్తు జీవుని యొక్క అనుభవ రూపమేగాని నామరూపాత్మకం కాదు"... అని, సర్వ అనుభవములకు ముందే అనుభవజ్ఞ (అనుభవములను ఎరిగే) ప్రజ్ఞారూపం ఏర్పడియే ఉన్నదని, "ఆ అనుభవజ్ఞ రూపం జాగ్రత్ – స్వప్న సందర్భములన్నిటికీ కేవల – నిర్మల సాక్షి అయివున్నది"... అని, అద్దానికి జాగ్రత్ స్వప్నాను భావములచే మరొకటిగా మార్పు చేయజాలదని, "అదియే భాషానుకూలం కోసం "ఉనికి, ఎరుక (సత్ + విత్) = సంవిత్తు"... అని చెప్పబడుచున్నదని, "ప్రతి జీవుడు సంవిత్ స్వరూపుడే"... అని, "ఆతని అనుభవ విభాగమే ఆతనికి జగత్తుగా ప్రదర్శితం అవుతోంది" అని, "ఆతని అనుభవము ఆతని భావన చేతనే ఏర్పడుతోంది"... అని, "ఆతని భావనకు వేరుగా జగత్తు (లేక) దృశ్యము అనబడేది ఎక్కడా ఈషన్మాత్రం కూడా లేదని నిర్ద్వంద్వంగా నిరూపించబడుతోంది.

కాబట్టి ఈ జగత్తు సంవిత్ స్వరూపమే! ద్రష్ట యొక్క రూపమే దృశ్యము!

**ప్రజ్ఞప్తి మహారాజు :** ప్రత్యగాత్మ యొక్క సంవిత్తే ఈ 'జగత్తు' అయినపుడు మరణించిన శవమును ఆ సంవిత్స్వరూపుడగు జీవుడు ఎందుకు కదల్చలేకపోతున్నాడు? మరణించిన శవం మరల జీవించటం లేదు కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** బ్రహ్మమే ఈ జగత్తు యొక్క సమష్టి సృష్టికర్తయగు "హిరణ్య గర్భుడు" అనేవేషం ధరిస్తోంది. ఒకడు ఒక నాటకంలో ఒక వేషం వేస్తూ ఉంటే, ఆతడు ఆ పాత్రగా కనబడుతూ కూడా, ఆ పాత్రకు వేరైన తన వ్యక్తిత్వం కలిగియే ఉన్నాడు కదా! ఆ విధంగా బ్రహ్మమే 'బ్రహ్మదేవుడు' అనబడు 'హిరణ్యగర్భుడు' అనే వేషధారణం చేస్తోంది. అనగా బ్రహ్మదేవుని వాస్తవరూపం బ్రహ్మమే! ఆతని ఊహయే ఈ సృష్టి. నీకు నీ స్వప్నంలో స్వప్ననగరం ఎట్లా భాసిస్తోందో... అట్లాగే బ్రహ్మదేవుని సంకల్ప నగరం ఈ సృష్టిగా వ్యాపించి ఉన్నది.

అయితే... ఏ విధంగా బ్రహ్మదేవుడు బ్రహ్మమే తన వాస్తవ రూపంగా కలిగివున్నాడో...

అట్లాగే నీ యొక్క – నా యొక్క... తదితర సర్వజీవుల యొక్క వాస్తవ స్వరూపం కూడా బ్రహ్మమే అయివున్నది! అంతేగాని, మనమంతా ఈ భౌతిక దేహరూపులం కాదు.

నీ యొక్క స్వప్ననగరం, బ్రహ్మదేవుని సంకల్పనగరం... రెండూ నిరంతరం చిన్మాత్రాత్మయే అయివున్నది. ఎరుకయే నీ స్వరూపమైనప్పటికీ స్వప్నంలో అనేక స్వప్న దృశ్యాలు ఎరుగుచున్నావు కదా! నీవు నీ స్వప్నంలో ఒకానొక రూపంగా అగుచున్నావా? లేదు. స్వప్నం నీది. స్వప్నంలో నీవున్నావు. మరి స్వప్నంగా కనిపించే దృశ్యమంతా ఏమిటి? నీ యొక్క ఊహ నీచే స్వప్న దృశ్యంగా పొందబడుతోంది కదా! "నాకు వేరుగా స్వప్నం సత్యమై ఉన్నది"... అనే భ్రాంతి ఎవరూ (మెలుకువ తరువాత) పొందటం లేదు కదా! అట్లాగే "శరీరము, శవము" మొదలైన జడవస్తు భ్రాంతి కూడా (నీ గురించి నీవు ఎరిగిన తరువాత, ఇక) లేవు. స్వప్నంలో కనిపించిన ఆకాశం, భూమి, భవనము, మిత్రులు, బంధువులు, తదితర వ్యక్తులు... వారంతా ఎవరు? ఏ రూపమై ఉన్నది? అదంతా చిదాకాశ రూపమే! ఇందులో నీకేమీ సందేహం ఉండనక్కర్లేదు.

**ప్రజ్ఞప్తి మహారాజు :** ఔను స్వామీ! నా స్వప్నంలో కనిపించేది నా ఊహయే! నా ఊహకు వేరుగా స్వప్న దృశ్యం లేదు. నా భావనకు వేరుగా ఊహలేదు. నా ప్రజ్ఞకు వేరుగా నా భావన లేదు. కనుక భావన చేయు నా చిత్ స్వరూపమునకు వేరుగా ప్రజ్ఞ లేదు. ఈ విధంగా స్వప్నంలో కనిపించేదంతా చిదాకాశ రూపమే! ఇది నాకు స్వానుభవసిద్ధమే అగుచున్నది.

**శ్రీ వసిష్ఠ మహర్షి (నేను) :** అట్లాగే... బ్రహ్మం చిదాకాశ ఘనమై ఉన్నది. అద్దాని సంకల్ప నగరమే విరాట్టు (సమష్టి భావనా స్వరూపుడగు హిరణ్యగర్భుడు (లేక) బ్రహ్మదేవుడు. ఆయనయే శుద్ధ సంవిన్మయుడు అయివున్నాడు. ఆతని భావావేశ రూపమగు ఈ సృష్టి ఈ విధంగా శుద్ధ సంవిన్మయ మేనని చెప్పబడుతోంది.

**బ్రాహ్మే సంకల్పనగరే యద్యత్ సంకల్పితం యథా ।**
**తథానుభూయతే తత్తత్ త్వత్ సంకల్పపురే యథా ॥**

నీ సంకల్పపురంలో నీవు ఏది సంకల్పిస్తే అది నీకు (సంకల్పసమయంలో) నీకంటే వేరైనట్లుగా (దృశ్యమువలె) అనుభూతమౌతుంది కదా! అట్లాగే బ్రహ్మము యొక్క "సంకల్పపురం" అన తగినట్టి ఈ జగత్తు ఆ సంకల్పించువానికి వేరైనదైనట్లుగా ఈ ప్రకారంగానే అనుభవించబడుచున్నది.

అనగా... బ్రహ్మము యొక్క "సంకల్పనగరము" అయినట్టి ఈ జగత్తునందు ఏ పదార్థము ఏ ప్రకారంగా సంకల్పించబడుతోందో ఆ పదార్థం ఆ ప్రకారంగానే (నీ యొక్క సంకల్ప నగరంలోలాగా) స్థితినొందియున్నది. అదియే నియతి. కాబట్టి ఈ 'దేహము' యొక్క నియతి యందు బ్రహ్మరూపమగు చైతన్యము ఎట్లు కల్పించిందో

అట్లాగే, జీవిత శరీరమునకు చలనము... మృత శరీరమునకు అచలనము... ఈ రకంగా చలన – అచలనములు అనుభూతమౌతున్నాయి. అంతేగాని బ్రహ్మము రూపముగాగల చైతన్యము యొక్క 'నియతి'కి వేరుగా ఎక్కడా ఏదీ మరొక రీతిగా ఉండటం లేదు. అనగా ఈ జగత్తు యొక్క

వ్యవహారమంతా బ్రహ్మము యొక్క సంకల్పమాత్రమే! సంకల్పము సంకల్పించువానికంటే వేరే రూపం కలిగి ఉండలేదు కదా! ఆ విధంగా ఈ జగత్తు బ్రహ్మమే అయి వున్నది.

**ప్రజ్ఞప్తి మహారాజు :** హే శ్రీ వసిష్ఠ మహర్షీ! మహా ప్రళయంలో సమస్తము రహితమైపోతోంది కదా! సమస్త కారణముల యొక్క అభావంచేత అప్పుడిక సృష్టియొక్క ఆరంభమునకు పదార్థమే ఉండదు కదా! కానీ... చమత్కారం చూచారా? మరల సృష్టి ప్రవర్తిస్తూనే ఉన్నది! ఎట్లా ప్రవర్తిస్తోంది? ప్రళయమునకు ముందే ఈ సృష్టికి కర్తయగు బ్రహ్మదేవుడు ముక్తిని పొందుతాడు కాబట్టి ప్రళయానంతరం ఆతని 'స్మృతులు' అంటూ ఏవీ ఉండవు కదా! మరల జగత్తు ఆవిర్భవించటానికి కారణం ఏమిటి? పూర్వ బ్రహ్మదేవుడికి ముక్తితోబాటే పూర్వ స్మృతులు కూడా తొలగుతాయి కదా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇప్పుడు నీవు చెప్పినది యుక్తియుక్తమే! అందుచేత పూర్వ సృష్టి అంతా రహితమై పోగా... మరల నూతన సృష్టి – వ్యవహారం ఎవరి స్మృతిలోంచి, (లేక) ఎవరి కల్పనను అనుసరించి ఆవిర్భవిస్తోంది? నీ ప్రశ్న " సృష్టి స్మృతి యొక్క ఫలితం కాదు!"... అని నిరూపిస్తోంది. అనగా ఇది ఎవరి స్మృతీ కానట్లే కదా! కనుక స్వయంజ్యోతి స్వరూపమగు బ్రహ్మమే జగత్తుగా స్వయంగా భాసిస్తోంది. బ్రహ్మమే జగత్తుగా (అజ్ఞాన దృష్టికి) అనిపిస్తోంది. ఆత్మజ్ఞుల దృష్టికి ఇదంతా బ్రహ్మముగా అనిపిస్తోంది... కనిపిస్తోంది. కనుకనే "ఇదంతా బ్రహ్మమే (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ)" అని చెప్పబడుతోంది.

బ్రహ్మమే జగత్తుగా భాసిస్తోంది. బ్రహ్మానికి వేరుగా 'జగత్తు' అనబడేది ఏదీ లేదు. బ్రహ్మమే మొట్టమొదటగా బ్రహ్మదేవుని రూపంగా భాసిస్తోంది. అది నిష్కారణమని (అకారణమని) చెప్పబడింది.

చిదాకాశరూపుడగు ఆ బ్రహ్మదేవుడు తన చిత్ స్వరూపమును "సంకల్పం" అను చమత్కారముతో కూర్చి దర్శిస్తున్నారు. అది కూడా నిష్కారణమే! అట్టి తన యొక్క సంకల్ప నగరమున చిత్ స్వరూపమును జగత్తుగా ఎరుగుచున్నారు. అదీ అట్లాగే నిష్కారణం.

కనుక ఈ జగత్తు వాస్తవానికి చిదాకాశరూపమే!నామ రూపాత్మకంగా (జగత్తుగా) దర్శించటమే పరబ్రహ్మం యొక్క స్వభావం. కనుక ఈ జగత్తు పరబ్రహ్మం యొక్క స్వయంకల్పిత ఊహా చమత్కారమే! నీ ఆలోచన నీ రూపమే అయినప్పుడు, ఆ నీ ఆలోచనకు అనిపించేది కూడా నీ రూపమే కదా!

**యథా సంకల్పనగరం చిన్మాత్రం భాతి కేవలమ్ ।**
**తథైవ అకారణం భాతి చిన్మాత్రోన్మేషణం జగత్ ॥**

ఏ విధంగా సంకల్ప నగరం చిన్మాత్రమే అయి, చిన్మాత్రమే అట్లు భాసిస్తోందో... అట్లాగే ఈ జగత్తు చిన్మాత్రము యొక్క స్ఫురణయే అయి నిష్కారణంగా జగత్తుగా భాసిస్తోంది! ఈ జగత్తు ఈ విధంగా చిన్మాత్రమే అయివున్నది? చిన్మాత్రమే నిష్కారణంగా జగత్తు అయివున్నది. జగత్తే నిష్కారణంగా చిన్మాత్రము.

**శరీరమస్తు వామాస్తు యత్ర యత్రాస్తి చిన్నభిః ।**
**వేత్త్యాత్మానం తత్రతత్ర ద్వైతాద్వైతమయం జగత్ ॥**

"ఈ శరీరం ఉన్నప్పుడే జగత్తు ఉంటుంది. శరీరం లేకపోతే జగత్తు ఉండదు"... అని అనుకుంటున్నావా? లేనే లేదయ్యా! శరీరంతో (భౌతికమైన ఇంద్రియాలతో) సంబంధం త్రెంచివేసుకొని కూడా స్వప్న సమయంలో ఈ జీవుడు స్వప్న దృశ్యం (స్వప్న జగత్తు) పొందుచూ... "ఇది నిజమే!" ...అని అనుభవిస్తున్నాడా!... లేదా?

**ప్రజ్ఞప్తి మహారాజు :** అవును. అనుభవిస్తున్నాడు!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అదే మనకు దృష్టాంతం. ఈ శరీరము ఉండవచ్చు! ఉండకపోవచ్చు! ఎచటెచట చిదాకాశము ఉంటుందో అచటచట అయ్యది తన స్వరూపమును స్వరూపమునందే ద్వైత - అద్వైతమయమగు జగత్తుగా ఎరుగుచున్నది.

**మరణానంతర జగత్తు -**

**తస్మాత్ యథా స్వప్నపురం, యథా సంకల్ప పత్తనమ్**
**తథా పశ్యతి చిద్వ్యోమ మరణానంతరమ్ జగత్ ॥**

కాబట్టి చిదాకాశ రూపుడగు ఈ జీవుడు ఈ శరీరం ఉన్నప్పుడు ఎట్లా స్వప్న - సంకల్ప పురములను గాంచుచున్నాడో, అట్లాగే ఈ శరీరం పతనమైన తరువాత కూడా (మరణానంతరం కూడా) తనను తాను జగద్రూపంగా గాంచుచున్నాడు.

మరొక రకంగా చెప్పాలంటే... చిదాకాశము స్వప్న - సంకల్ప పురములను (బ్రహ్మదేవుని రూపందాల్చి / సంకల్పించినదై) - ఆ బ్రహ్మదేవుని స్వప్న రూపంగా (జగత్తును) గాంచుచున్నది. అట్లాగే, ఈ దేహాదులు లేనప్పుడు కూడా చిదాకాశము సర్వదా ఉండియే తీరుతుంది. కాబట్టి (అది సత్ స్వరూపం కాబట్టి) తనను తాను జగద్రూపంగా దేహం వున్నప్పుడు - లేనప్పుడు కూడా గాంచుచున్నది. జగత్తుగా కనిపించేది చిదాకాశమే కాబట్టి చిదాకాశము యొక్క జగత్ దర్శనముచే గాని, జగత్ అదర్శనముచేగాని (ఉదాహరణ : గాఢనిద్ర) చిదాకాశము యొక్క స్వరూప - స్వభావాలు మారునవేకావు. ఇక లోటేమున్నదో చెప్పు?

సృష్ట్యాదియందు చిదాకాశము భూమి-ఆకాశం మొదలైనవి లేనప్పటికీ, అది భూమి - ఆకాశాదులతో కూడిన జగత్తుగా నిష్కారణంగా భాసిస్తోంది! అందుచేత భూమి - ఆకాశరూపములై కనిపించేదంతా నిర్మల చిదాకాశ రూపములే! ఏది ఈ దేహరూపంగాను - దృశ్యరూపంగాను - ద్రష్టరూపంగాను భాసిస్తోందో... చిదాకాశమే అట్లు ఆయా చమత్కారములుగా భాసించుచున్నది. జ్ఞాన దృష్టికి అవన్నీ చిదాకాశమాత్రం! అజ్ఞాన దృష్టికి నేను చెప్పేదేమున్నది?

చిదాకాశంలోంచి బయల్వెడలి సంకల్ప చమత్కారంలో ఈ దేహములు- దేహముల ద్వారా కనిపించే దృశ్య జగత్తులు - దేహ వినావన / రాహిత్యములు వున్నాయి. అంతేగాని, చిదాకాశము దేహములచే పరిమితి కల్పించబడేది కాదు. ఏ విధంగా సృష్ట్యాది యందు చిదాకాశము... భూమి - ఆకాశములతో కూడిన జగత్తువలె భాసిస్తోందో... అట్లాగే ఈ జీవుని మరణం తరువాత కూడా ఆ చిదాకాశమే సర్వ జగద్రూపంగా భాసిస్తోంది.

ఒకాయన సుదీర్ఘ స్వప్నంలో అనేక దృశ్యాలు చూచాడనుకో! మేల్కొనిన తరువాత "నీవు చూచిన ఆ విస్తార జగత్తు ఎంతవరకు ఎక్కడ ఎట్లా విస్తరించి ఉన్నది చెప్పు?" అని అడిగామనుకో! ఏమంటాడు? "అయ్యా! అదంతా నా స్వప్నం! అక్కడ జగత్తు లేదు! అది విస్తరించీ లేదు!"... అని చిరునవ్వు నవ్వుతాడు కదా! అనగా స్వప్న జగత్తులో విస్తారంగా కనపించిన దీర్ఘ దేశ-కాలములు జాగ్రత్ దృష్టిలో కొంచెం కూడా ఏమాత్రం వ్యాపించి లేవుకదా! అట్లాగే ఈ దేహపతనానంతరం పరలోకం పొందినవానికి ఈ ఇహలోక దేశ-కాలములు ఒకింతగా కూడా వర్తించటం లేదు.

ఆతనికి ఆ స్థితిలో ప్రదర్శితమగుచున్నదే అప్పటికి ఇహలోకమగుచున్నది. అట్లాగే...

**ఇదం ప్రబుద్ధవిషయే స్వానుభూతమపి స్ఫుటమ్ ।**
**జగన్నవిద్యతే, కించిత్ కారణం గగనే యథా ॥**

ఈ జగత్తు (ఈ దృశ్యము) ప్రత్యక్షంగాను, స్పష్టంగాను, స్వానుభవంగాను కనబడవచ్చు గాక! ఆకాశంలో అరణ్యం - వృక్షాలు - జంతువులు ఉంటాయా? అట్లాగే జ్ఞానియొక్క దృష్టిలో ఇదంతా జగత్‌రూపంగా (నామరూపాత్మకంగా) ఏ మాత్రం ఉండి ఉండలేదు. అప్రబద్ధునికి ఎంతగా ఆకాశము, భూమి, తదితర జీవులు, నాది, నీది, దేహము, జన్మ, కర్మ, మరణము... ఇత్యాది జగద్రూపంగా కనిపిస్తోందో అదియే ప్రబుద్ధునికి అంతగా ప్రత్యక్షంగానూ కేవల - నిర్మల చిదాకాశంగా తెలియవస్తోంది.

"ఈ జగత్తు పరమాత్మ స్వరూపమే" అను వాక్యార్థం అదే కదా! నిదురించినవానికి స్వప్నంలో అసద్రూపమే అయినప్పటికీ జగత్తు ఎట్లా ప్రకాశమానమై ఉంటోందో... అట్లాగే ఈ దేహం పతనమైన తరువాత కూడా పరలోకమున చిదాకాశమే సృష్టివలె భాసిస్తోంది. ఆతనికి కనిపించే భూమ్యాకాశాలు, వస్తు సముదాయం, సంబంధ బాంధవ్యాలు ఎట్లా స్వప్నదృశమో... అట్లాగే ఈ వర్తమానంలో దేహంతో అనుభమయ్యే భూమ్యాకాశాలు, వస్తు సముదాయం, సంబంధ బాంధవ్యాలు మొదలైనవన్నీ స్వప్న సదృశమేనని గ్రహించు.

స్వప్నంలో ప్రవేశించేవానికి ఆ స్వప్నంలోకమంతా అంతకు ముందే అక్కడ సంసిద్ధమైనట్లుగాను, ఆతనిచే అది అప్పుడే ప్రవేశించబడినట్లు భావించబడుతోంది కదా! అట్లాగే పరలోకమున ప్రవేశించినవానికి అక్కడి ఆకాశ-భూమి-యమలోకాదులు అంతకు ముందే తయారైనవి కాకపోయి నప్పటికీ పూర్వసిద్ధము అయినట్లుగా అనిపిస్తూ ఆతనిచే పొందబడుతోంది. అనుభవించబడుతోంది. అట్లా విశాల జగద్రూపంగా (మరణానంతరం) భాసించేది చిదాకాశమే సుమా!

అట్లాగే ఇప్పుడు ఇక్కడ ఈ రీతిగా భాసిస్తూ నీకు-నాకు కనిపించేది కూడా చిదాకాశమే!

**మృతోఽయం పునరుత్పన్నో యమలోకే శుభాశుభమ్**
**భుంజేహఽమ్, ఇత్యతిఘనం మృతో భ్రాంతిం ప్రపశ్యతి ॥**

ఇప్పుడు నేను మరణించాను. మరణించి యమలోకంలో ప్రవేశించాను. ప్రవేశించి నరకలోక నివాసిని అయ్యాను. ఇక ఇక్కడ శుభ - అశుభములు అనుభవిస్తున్నాను"... ఇత్యాది రూపంగా

మరణించిన జీవుడు అజ్ఞానము కొనసాగించటంచేత మహాభ్రాంతిని గాంచుచున్నాడు. అట్టి మహాభ్రాంతి ఈ జీవుడు ఈ దేహం పొందకముందు, దేహం పొందిన తరువాత, ఈ దేహ పతనానంతరం కూడా కొనసాగుచూనే ఉన్నది!

**ప్రజ్ఞప్తి మహారాజు :** హే మహర్షీ! అయ్యో! ఏమి ఈ భ్రాంతి! ఎక్కడి నుండి వచ్చింది? ఎట్లా పోతుంది? దేనికి 'అంతు' అనేది లేదా?

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ ప్రజ్ఞప్తి మహారాజా! మోక్షోపాయమును అనాదరిస్తున్నంత వరకు ఈ జీవునికి ఇటువంటి మోహపరంపరలు అంతు లేకుండా కొనసాగుతూనే ఉంటుందయ్యా! అయితే... ఈ జీవుడు వాస్తవానికి నిర్మల – కేవల చిదాకాశ స్వరూపుడేనని మరల గుర్తు చేస్తున్నాను. అసలీ "నామ రూపాత్మక జగత్ దర్శనం" అనేది ఎక్కడి నుండి వచ్చింది? అభ్యాసంచే ఏర్పడిన వాసనా ప్రభావం చేతనే కదా! ఇప్పుడీ మోహం తొలగాలంటే రెండే ఉపాయాలు.

1. బ్రహ్మజ్ఞానం సంపాదించుకోవటం.
2. ఇదంతా నిర్మల పరబ్రహ్మముగా, పరమాత్మ స్వరూపంగా, పరమాత్మకు అభిన్నంగా దర్శించే అభ్యాసం కొనసాగించటం.

ఈ జీవుడు మానవదేహం పొందినందుకు ప్రయోజనంగా "ఇదంతా నిర్మల చిదాకాశమగు పరబ్రహ్మమే"... అని అభ్యసించటం ఉత్తమమైన ఔషధం అని మా ఉద్దేశం! బ్రహ్మజ్ఞానం వలన వాసనారాహిత్యం (ఇదంతా నామ రూపాత్మకమైన దృశ్యంగా దర్శించే అభ్యాసం తొలగటం) కలుగుతుంది. వాసనా రాహిత్యంచే ఇదంతా పూర్తిగా శమించినదై (సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ మొదలైన) వేదోపనిషత్ ప్రవచితమైన మహావాక్యానుభవం తప్పక లభించగలదు.

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఈ 'జగత్తు' అంటే ఏమిటో నిర్వచిస్తున్నాను విను. అప్రబద్ధుని యొక్క... ధర్మ, అధర్మ... వాసనారూపమైనది.

విహిత (చేయవలసినది), నిషిద్ధ (చేయకూడనిది) ఆచరణ యొక్క అనుభవ రూపమైనదగు "సంవిత్తు" ఈ జగదాకారముగా స్థితినొందియున్నది.

అనగా... ఇది చేయాలి, ఇది చేయకూడదు. ఇది పొందాలి – ఇది పొందకూడదు. ఇది ఇట్లా ఉండాలి – అది అట్లా ఉండకూడదు... ఇటువంటి స్వకీయ భావనారూప జీవసంవిత్తే ఈ జీవునిచే జగత్తు రూపంగా పొందబడుతోంది! వాస్తవానికి ఈ జగత్తు చిదాకాశమే! జగదనుభవరచయిత అగు ఈ జీవుడో,... సర్వదా చిదాకావ స్వరూపుడే!

చిదాకాశమే చిదాకాశమున ద్రష్ట – దర్శన – దృశ్యరూపంగా ప్రభవిస్తూ ప్రకాశిస్తోంది!

**ప్రజ్ఞప్తి మహారాజు :** హే మహర్షీ! ఈ జగత్తు అనగా ఏమో, ఏదై ఉన్నదో, ఏది కాకయే ఉన్నదో.... అట్టిది మరొక్కసారి సంక్షిప్తంగా నిర్వచించి చెప్పండి.

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** అయితే సంక్షిప్తంగా ఏక శ్లోకంగా చెపుతాను విను.

**న శూన్యరూపం న చ సత్స్వరూపం బ్రహ్మేభిదం భాతి జగత్స్వరూపం**
**తచ్ఛ అపరిజ్ఞానవశాత్ అనర్థభూతం పరిజ్ఞాతవతః శివాత్మ॥**

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఈ జగత్తు శూన్యరూపం కాదు! సత్స్వరూపం కూడా కాదు! అనగా "ఇక్కడ ఏదీ లేదు" అనిగాని, "అంతా ఉన్నది" అనిగాని అనటానికి వీలు లేదు. మరి? బ్రహ్మం అను పేరుగల చైతన్యమే 'జగత్' స్వరూపంగా భాసిస్తోంది! ఈ జగత్తుగా ఉండేదంతా కూడా... అజ్ఞానవశం చేత అనర్థభూతమై ఉన్నది. జ్ఞాన వశంచేతనో, ఇదంతా కూడా...శివానందలహరీ స్వరూపం! పరమ కళ్యాణ రూపం! నిరతిశయానందాత్మకం! ఆనందైశ్వర్యమగు నీ ఆత్మస్వరూపమే!

❖❖❖

## 6. పరబ్రహ్మము పదార్థ రూపం - పదార్థ రహితం కూడా!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! "ఎప్పుడో-ఎక్కడో-ఏదో సందర్భంలో చేసియున్న అమూర్తములు (భౌతికమైన ఆకారం లేనట్టి) పుణ్య - పాప ఫలములు ఇప్పుడు ఇక్కడ ఇంట్లో ఉండగా ఎట్లా ఫలప్రదాతలగుచున్నాయి?" అనే ఆ ప్రజ్ఞప్తి రాజు యొక్క మహాప్రశ్నలలోని మరొక విభాగం గురించి నేను చర్చించటం ప్రారంభించాను. అది విను.

❖

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ ప్రజ్ఞప్తి మహారాజా! "పుణ్య-పాపాలు ఎప్పుడో ఎక్కడో నిర్వర్తించబడి ఉన్నవి కదా! వాటి ఫలాలు అమూర్తములు కదా! అవి ఆ తరువాత మరెప్పుడో మరెక్కడో ఎట్లా ప్రయోజన కారకాలు అవుతున్నాయి?" అనే నీ ప్రశ్నకు ఇప్పటికే సమాధానం లభించి ఉండవచ్చు. అయినా కూడా ఈ విషయం మరి కొంత స్పష్టంగా వివరిస్తున్నాను విను.

బ్రహ్మమే... అజ్ఞానం వల్ల దృశ్యబోధయే దృశ్యంగా కనిపిస్తోంది. జ్ఞానంచే బ్రహ్మబోధయే బ్రహ్మంగా అనిపిస్తోంది. తెలియవస్తోంది. కనుక, ఈ జగత్తు బ్రహ్మం యొక్క సంకల్పనగరమే అయి ఉన్నది సుమా!

ఓ రాజా! నీ యొక్క సంకల్ప నగరంలోని ప్రజలు నీ సంకల్పానుసారంగానే ఉంటారు కదా! అట్లాగే... బ్రహ్మం యొక్క "సంకల్ప నగరమే" అయివున్నట్టి ఈ జగత్తు నందు జీవులంతా కూడా బ్రహ్మం యొక్క 'సంకల్పము'ను అనుసరించే ఇట్లు స్థితి కలిగయున్నారు. నీవు ఏది ఎట్లా సంకల్పిస్తే అట్లాగే నీ ఊహా ప్రపంచంలో అంతా జరుగుచున్నట్లే, 'బ్రహ్మం' యొక్క సంకల్పానుసారమే ఇదంతా నియమించబడినదగుచున్నది. కనుక నియతి బ్రహ్మం యొక్క సంకల్పానుసారమే ఉంటోంది. మునుల యొక్క యమ-నియమాదుల ప్రభావం చేత శుద్ధ సంవిత్తు వర-శాప రూపాదులుగా వ్యవహారార్థం సమర్థం అవటం కూడా ఆ నియమ విభాగరూపమే! అనగా, "తపస్సులచే వర-శాపముల సమర్థత సిద్ధించుగాక!" అనునది బ్రహ్మము యొక్క కల్పనా (లేక భావన) ప్రయోజనమే అయివున్నది. కాబట్టి వరశాపములు సిద్ధించటమనేది బ్రహ్మము యొక్క సత్య సంకల్ప రూపమే!

అట్లాగే... శాస్త్రములచే చెప్పబడే "విధి – నిషేధముల, ధర్మ – అధర్మ ఆచరణముల చేత జనులకు సుఖదుఃఖాలు ఫలములుగా లభిస్తూ ఉంటాయి" అనేది బ్రహ్మము యొక్క "సంకల్ప కల్పన"యే అయివున్నది. "ఈ ప్రపంచంలోగల ప్రాణులంతా సృష్టికి పూర్వం లేరు. జగత్ సృష్టి ప్రారంభమైన తరువాత ఉంటారు" అనేది కూడా సంకల్ప కల్పనా విభాగమే! ఓ ప్రజ్ఞప్తి మహారాజా! "ఈ జగత్తు వాస్తవానికి అసత్తే అయినప్పటికీ ఒకింతకాలం సత్తువలె భాసించటం" అనేది కూడా చిద్రూప బ్రహ్మము యొక్క సంకల్పవశంచేతనే సుమా! కాబట్టి బ్రహ్మము యొక్క సంకల్ప మాత్ర – భావనామాత్రమగు వికాస – సంకోచములే ఈ జగత్తు యొక్క సృష్టి, ప్రళయములు అయివున్నాయి.

"విధి–నిషేధాలు, పుణ్య–పాపములు, వాటివాటి తదనంతర ప్రయోజనములు" – ఇవన్నీ కూడా "ఉపాది యొక్క ప్రారంభం, ఒక ఉపాధి తరువాత మరొకటి"... అను దీర్ఘ కథలో కల్పిత కథాం తర్విభాగములే సుమా!

**ప్రజ్ఞప్తి రాజు :** ఓ వసిష్ఠ మహర్షీ! మీరు చెప్పినట్లు బ్రహ్మము యొక్క సంకల్ప వశం చేతనే ఈ జగత్తు–ఇందలి విశేషాలు 'సత్తు'గా అగుచున్నాయనే అనుకుందాం. మరి అట్టి ఈ జగత్తు గాఢ నిద్రలో ఉన్నప్పుడు లభించటం లేదేం! ప్రళయంలో ఈ జగత్తు లేకుండా పోతోందే! జాగ్రత్ కాలం లోను, సృష్టి సమయంలోను మాత్రమే ఎందుకు లభిస్తోంది? మరొక సందేహం. సదా వికారవంతమే అయినప్పటికీ, జగత్తు సుస్థిరరూపంగా ఉన్నట్లుగా ఎట్లా భాసిస్తోంది?

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** మరి చిదాకాశము యొక్క మాయా సంబంధమైన సంకల్ప నగర స్వభావం అట్టిది! జాగ్రత్ స్వప్నములందు అనుభూతములతో కూడినదై... సుషుప్తి –ప్రళయాలలో సర్వ అనుభవాల పట్ల మౌనం ప్రకటించుచున్నదై... మరల ఇంతలోనే క్షణకాలం జాగ్రత్తులోను, మరొక క్షణంలో స్వప్నంలోను ఆవిర్భవిస్తూ ఉండటం చిదాకాశ మాయావిభాగ సంకల్ప తత్త్వం యొక్క స్వభావమే అయివున్నది! ఆహాఁ! ఆటలాడుకునే బాలుడు తన సంకల్పపురంలో (ఊహా నగరంలో) ఆయా దృశ్య–అదృశ్య విశేషాలు సందర్శిస్తున్నట్లుగా... ఆకాశంలో కేశాలు–ముత్యాలు (భ్రమచే) అగుపిస్తున్నట్లుగా, చిదాత్మలో ఈ సత్ – అసత్ రూపములైన సృష్టులు భాసిస్తున్నాయి.

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! నీవు నీయొక్క ఊహ (సంకల్ప నగరం)లో ఒక గొప్ప నగరమునో, కట్టడాన్నో ఊహించి... మరల అద్దాని యొక్క దృశ్య విశేషమును సంకల్పవశంచేతనే నశింపజేయ గలుగుచున్నావు కదా! అదంతా కూడా నీ యొక్క స్ఫురణను అనుసరించి, స్ఫురణను ఆధారంగా చేసుకొనియే ఉంటోందిగా! అట్లాగే "చిదాకాశం యొక్క సంకల్పనగరం (ఈ సృష్టి) యొక్క ఉత్పత్తి –ఉనికి–వినాశనములు కూడా చిదాకాశము యొక్క నిర్మల స్వభావమే!"... అని ఎరుగుము! కాబట్టి ఈ దృశ్యాంతర్గత విభగాములైనట్టి మూడు లోకాలు కూడా ఆద్యంతరహితమైనట్టి చిద్ఘన బ్రహ్మాకాశమే అయి ఉన్నాయి. చిదాకాశ స్వరూపుడగు ఆ పరమేశ్వరుడు జీవరూపంతో ఏదేది చేయటం జరుగుతుందో... ఏదేది ప్రకాశింపచేయటం జరగుతుందో... ఆ క్రియలు, ఆ పుణ్య పాప ఫల సందోహాలు, ఆవరణ రహితమగు ఆ పరమేశ్వరుని సత్యంకల్ప బలం చేత అసంఖ్యాక

యోజనముల దూరం, అనేక యుగముల కాల వ్యవధిగా విస్తరించి ఉండగలదు. ఆ సత్య సంకల్పమే వర్తమాన కాలమువలె పూర్వ-పూర్వ కర్మ ఫలములకు (ఇప్పుడు) రూపం ఇస్తోంది. అద్దాని సంకల్పాను సారమే స్వర్గ - నరక - భోగైశ్వర్య - బాధా పరితప్త కార్యములన్నీ ఏర్పడి ఉంటున్నాయి. వేరువేరు ప్రదేశములలోను - వేరువేరు కాలములలోను కర్మ - తత్ఫలితముల అధిష్ఠాన భూతమగు ఆవరణరహిత చైతన్యము వాస్తవానికి ఏకమే, అఖండమే అయివున్నది కదా! అందుచేత కర్మ + కర్మ ఫలములు నిత్యము సమీపమున ఉన్నవే అగుచున్నాయి. కాబట్టి కర్మయొక్క ఫలమును ఎట్లా పొందకుండా ఉండగలుగుతాడు? అవిదూరంగా ఎక్కడో ఉన్నవి అవవు!

ప్రకాశించుచున్న మణి యందు. అద్దాని ప్రకాశము చేతనే కాంతి పుంజములు ఆవిర్భవించటం, తిరోధానం పొందటం జరుగుతోంది కదా! అట్లాగే "చిదాకాశము" అనే మణియందు నిజ ప్రకాశం వలననే సృష్టి-ప్రళయాలు, కర్మ-కర్మఫలాలు... ఇవన్నీ పరావర్తన రూపంగా ఏర్పడినవై ఉంటున్నాయి. కనుక ఓ రాజా! వేద శాస్త్రముల యొక్క విధి-నిషేధములు కలుగజేయునట్టి విధి -విధానం (లేక) నియతి (లేక) సృష్టి చమత్కారం బ్రహ్మమునందు రూఢిపడియే ఉన్నది. అద్దానిని అనుసరించే ఈ జీవుడు మరణించిన తరువాత కూడా పరలోకములందు ఆతని సుకృత - దుస్కృత కర్మల ఫలములు కల్పించబడినవై ఉంటున్నాయి.

అయితే... వాస్తవానికి ఆత్మకు జనన, మరణాలు లేవు. అది ఏ సమయంలోనూ ఉదయించేదీ కాదు. అస్తమించేదీ కాదు. అది సర్వదా చిద్రూపమగు స్వాత్మ యందే నెలకొని ఉంటోంది. ఇక ఈ జనన-మరణాలు ఎట్టివంటావా? అవి భ్రమ చేతనే కల్పించబడినవై ఉంటున్నాయి.

జగత్తు అంటే చైతన్యము "కల్పిత ద్రష్ట, కల్పిత దృశ్యము" లతో కూడుకొనినదై ఉండటం!

"ద్రష్ట, దృశ్యము" ఈ రెండూ కలిసి భాసిస్తే అప్పుడు "జగత్తు ఉత్పన్నమైనది" అని చెప్పబడుతూ ఉంటోంది. ఏ సమయంలో ఆ రెండూ కలసి భాసించవో... అదియే ప్రళయం. ఇంతకు వేరుగా సృష్టి ప్రళయాలు లేవు. ఇంతకు వేరుగా 'జగత్తు' అనబడేది వాక్కు యొక్క కల్పనా మాత్రమే!

జగత్ ఉపశమనం అంటే చిదాకాశ - ఏక రూపమగు బ్రహ్మం 'నిజ స్వభావం' నుండి తన యొక్క స్ఫురణను ఉపసంహరించుకొన్నదై స్వాత్మ యందే నెలకొని ఉండటం.

వాస్తవానికి కళ్ళు తెరిస్తే... దృశ్యం కనబడటం, కళ్ళు మూస్తే సృష్టి కనబడక పోవటం వంటిదే ఈ సృష్టి-ప్రళయాల వ్యవహార చమత్కారం సుమా! "స్థిరంగా ఉండడం, సంచలనం కలిగి ఉండటం"... ఈ రెండూ కూడా ఒకే వాయువు యొక్క స్వభావాలు అయివున్నాయి కదా! వాయువు కంటే స్థిర-చలనాలు వేరుగా ఉన్నాయా? లేదు కదా! అట్లాగే... దృశ్యాకారమగు స్ఫురణ, దృశ్య రహితమగు అస్ఫురణ... ఈ రెండూ కూడా చిదాకాశం యొక్క నిర్మల-అక్షయ స్వభావమే సుమా!

ఈ సర్వ పదార్థముల స్వభావం బ్రహ్మం యొక్క సత్య సంకల్పమే! వార్ధక్య - మరణాదులను నిరోధించే మణి-మంత్ర-ఔషధాల యొక్క పదార్థ (భౌతిక) ధర్మములు "ఈ మంత్ర - ఔషధాదులు ఇటువంటి ప్రయోజనం - ప్రభావము కలిగి ఉండుగాక!"... అను బ్రహ్మం యొక్క సత్యసంకల్పమే!

నీ సంకల్ప నగరంలో కనిపించే వస్తు ధర్మాలు నీ సంకల్పం చేత నిర్మించబడి నీ చేతనే పొందబడు చున్నాయి కదా! బ్రహ్మమే తన సంకల్పిత పదార్థ ధర్మమునకు తానే ద్రష్ట రూపంగా కూడా ఉండి నదై, పొందుతోంది. అదే 'ఈశ్వరాజ్ఞ', "ఈశ్వర సంకల్పం" అని ప్రపంచంలో ప్రసిద్ధమై ఉన్నది.

అయితే 'ఈశ్వరేచ్ఛ' అనే బ్రహ్మం యొక్క సంకల్పం ప్రతిక్షణం ప్రతి వస్తువులోను ప్రవేశించి ఈ జగత్తులో స్వభావ సంకల్పం చేస్తూ వుంటుంది. అట్లాగే, ఒక బాలుడు క్రీడలో అనేక నియమ – విధానాలు ఒకేసారి సంకల్పించునట్లుగా ఈశ్వరుడు "ఈ వస్తువులు ఇట్లు ధర్మములు కలిగి ఉండగాక"... అని ఒకేసారి సంకల్పించుచున్నారు. ఆ ప్రారంభ సంకల్పమును కొనసాగిస్తూ వస్తువులు ఆయా ధర్మములను కల్పాంతము వరకు కలిగియున్నవై ఉంటున్నాయి.

❖

ఆ చిద్ఘన పరమాత్మ క్షణకాలంలో ఎచ్చటెచ్చట ఏ పదార్థములను ఏ ప్రకారంగా సంకల్పిస్తు న్నారో, అచ్చటచ్చట ఆయా పదార్థములన్నీ కూడా వాటివాటి శక్తి–కార్యముల భేదంచే ఆయా కార్య పరంపరలను అట్లాగే జరుపుచూ కొనసాగుచున్నాయి. ఇదంతా పరమాత్మ యొక్క స్వభావమే అయివున్నది. ఈ విధంగా సంకల్ప కల్పిత పదార్థములన్నీ కూడా స్వభావంగా నానా రూప – ధర్మ – స్థితి – గతులు కలిగి ఉన్నప్పటికీ కూడా... ఇవన్నీ "అధిష్ఠాన దృష్టి"చే ఏకమగు చిద్రూపముగానే భాసిస్తున్నాయి. అనగా ఈ ఈ కనబడే సర్వ పదార్థములు వివిధాకారాలు, ధర్మములతో వెలయుచూ వాస్తవానికి 'ఏకం, చిద్రూపం' అగు పరమాత్మ రూపంగానే స్థితినొంది ఉన్నాయి. ప్రతి ఒక్క పదార్థం యొక్క తత్త్వంలో (అస్తి–భాతి–ప్రియం రూపంచే)... బ్రహ్మ చిన్మాత్రత్వమే నిండి ఉన్నది. ఎందుచేత నంటే... సర్వరూపమగు ఆ చైతన్యమే ఎచ్చట ఏ ప్రకారంగా ఉంటే ఆ ప్రకారంగానే భాసిస్తూ ఉండటమే స్వభావంగా కలిగి ఉంటోంది.

**అనాదిమధ్యాన్తం, అనంత వీర్యం, కించిచ్చ కించిచ్చ సదప్యసత్యమ్,**
**స్థితం యథాయత్ర తథాత్మ తత్ర సర్గాత్మ భూర్భూత తృణాది జాతౌ॥**

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఈ విధంగా "ఆది మధ్యాంతరహితం, అపరిచ్ఛిన్న శక్తి యుక్తం" అయిన బ్రహ్మం పదార్థ రూపంగానూ ఉంటోంది. పదార్థ రహితంగానూ ఉంటోంది. పదార్థ సహితం గానూ ఉంటోంది. సత్తుగాను, అసత్తుగా కూడా స్థితిని కలిగినదై ఉంటోంది. (సత్యంచానృతాంచ సత్యమభవత్ – శ్రుతివాక్యం). ఆ పరబ్రహ్మము సర్వ స్వరూపమై ఉన్నది!

అందుచేతనే సర్వప్రాణులయందు, తృణముల నుండి (చిన్న గడ్డి పరకల నుండి)... బ్రహ్మదేవుని వరకు ఎచ్చటెచ్చట ఏ స్వభావంతో ప్రసిద్ధమై ఉంటోందో... అచ్చటచ్చట స్వయముగా ఆ స్వభావమే అయి స్థితినొంది ఉన్నదగుచున్నది.

❖❖❖

# 7. విరుద్ధ సంకల్పములు - విరుద్ధ కర్మ ఫలములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఆ తరువాత, ఒకడు – "ఒకనికి శుభం జరగాలి" అని, మరొకడేమో "అతనికి అశుభం జరగాలి" అని ఒకానొక వ్యక్తి గురించి కోరుకున్నవారై తీవ్ర ధ్యానపరులైతే (తపస్సువంటివి నిర్వర్తిస్తే).... వారి వారి విరుద్ధ పరస్పర–వ్యతిరిక్త కర్మఫలాలు ఎట్లా ప్రయోజనకారి అవుతాయి?"... అనే ప్రశ్నకు ఇట్లా సమాధానం చెప్పటం ప్రారంభించాను.

❖

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ ప్రజ్ఞప్తి మహారాజా! అర్హతను అనుసరించి ఫలము ప్రసాదించే ప్రయోజనం సమస్త క్షేత్రములందు (తీర్థ ప్రదేశములందు), తపస్సు–వ్రతము–పూజ మొదలైన వాటిలో సృష్ట్యాదిలో బ్రహ్మచే తన సంకల్ప నగరము వంటిదగు ఈ సృష్టియందు కల్పించబడియున్నది. అనగా శాస్త్రానుకూలమైన స్నాన–దాన–తపో–యజ్ఞ–పూజ–వ్రతాదులు, ప్రయాగ మొదలైన పవిత్ర స్థానములతో దేహపతనములు మరణాదులు మొదలైనవి విధి పూర్వకంగా ఆచరించుటచే అవన్నీ అవశ్యం ఆయా రీతులుగా అనుకున్న ఫలములు ప్రసాదించటం బ్రహ్మ యొక్క సంకల్పానుసారమే అయి ఉన్నాయి. మహాపాపియగు ఒకానొకడు శ్రద్ధాళుడై (ప్రయాగాది) పవిత్ర తీర్థ క్షేత్రంలో వార్ధక్యములో దేహమును త్యజించు సమయంలో చైతన్యము యొక్క విభాగమగు ఆ పుణ్యక్షేత్ర మహిమచే ఆతని సమస్త పాపములుగాని, కొంత విభాగంగాని ఉపశమించటం కూడా చైతన్యము యొక్క సంకల్ప రూపనియతియే అయివున్నది. శాస్త్రానుసారము నడుచు మనుజుని పాపము అల్పము అయివుంటే ఆతనికి ఆయా ప్రయోజనాలు ఆయా కోరుకున్న వ్రత–నియమ–తపో–నామ స్మరణాదుల ఫలాలు మరింత తక్కువ వ్యవధిలో మరింత వేగంగా ప్రయోజనకారి అవటం కూడా బ్రహ్మదేవుని సంకల్ప నియతియే అయివున్నది. ఆయా క్షేత్రములలో మనుజుడు ఆర్జించిన ధర్మము ఆతని పాపమునకు సమానం అయివుంటే అప్పుడు ఆ రెండింటి యొక్క భోగము కొరకై రెండు శరీరములు, ఈ రెండు శరీరముల కొరకై ఇరువురు (2) చిదాభాసులు స్ఫురించటం కూడా జరుగుచూ ఉంటాయి కూడా! చూచావా రాజా! ఈ విధంగా అల్పము – అధికము అగు పుణ్య – పాపముల యొక్క మహత్ఫలం బ్రహ్మము యొక్క సంకల్పముచే ఏఏ ప్రకారంగా స్ఫురిస్తోందో... ఆయా ప్రకారంగానే అది వ్యవస్థితమై ఉంటోంది.

ఆ చిద్వస్తువు అగు బ్రహ్మమే 'హిరణ్యగర్భుడు' వంటి సమష్టి జీవులుగాను, నీవు – నేను వంటి వ్యష్టి జీవులుగాను కూడా రూపం దాల్చుచున్నది. అది ఎచటెచట ఏఏ ప్రకారంగా సంకల్పిస్తే అచటచట ఆయా ప్రకారంగానే స్థితినొంది ఉంటోంది.

బ్రహ్మము యొక్క సంకల్పమే ఈ జగత్తు బ్రహ్మం యొక్క 'సంకల్పం' అనే నియతిని అనుసరించే పాపం చేసి ఉన్న వానికి "నేను నరకం చేరుచున్నాను" అనే బుద్ధి ఉదయిస్తోంది. బ్రహ్మం యొక్క సంకల్పానుసారమే 'పుణ్యక్షేత్ర దర్శనము' పుణ్యఫల రూపంగా అనుభూతమౌతోంది.

❖

**ఏకాత్మనాహమద్యైష, మృతోఽమీ మమ బాంధవః**
**రుదంతీమే పరంలోకం ప్రాప్తోఽయమహమేకకః ॥**

మరణము పొందిన తరువాత జీవునకు "ఇప్పుడు నేనొక్కడినే మరణించాను. వారు, వీరు, నా బంధువులు. నా భార్య, భర్త, పిల్లలు, తల్లిదండ్రులు మొదలైన వారంతా నా కొరకై ఏడ్చుచున్నారు. ఇప్పుడు ఏకాకినై నేను పరలోకం పొందాను" ఇటువంటి బుద్ధి అంతా (మరణానంతరం) ఉదయి స్తోంది. మరణానికి ముందు కూడా "వాతం, పిత్తం" మొదలైన ధాతువుల యొక్క క్షోభచే దేహంతో తదాత్మ్యం చెంది ఉన్న బుద్ధిలో అనేక భ్రమలు ఉదయిస్తున్నాయి. అప్పుడాతని పాప-పుణ్య ఫలాల భావన చైతన్యం యొక్క కల్పనావశంచేత ఆతనికి కలగటం జరుగుచూనే ఉన్నది. నిగ్రహానుగ్రహ ద్రష్టలగు మహాత్ములు మాత్రమే ఒక జీవుని యొక్క పాప-పుణ్య దేహములు (భౌతిక దేహమునకు అన్యంగా) చూడగలగటం కూడా చైతన్యం యొక్క కల్పనాచమకృతియే! ఇక ఆ మరణించిన దేహం చుట్టూ వున్న ఆతని బంధువులు ఆతనిని అచేతనునిగాను, శవముగాను, మృతునిగాను మాత్రమే చూడగలుగుచున్నారు. వారు ఆతని జీవిత విశేషాలను గుర్తు చేసుకొంటూ ఏడుస్తూ శ్మశానం వరకు వెళ్ళి ఆతని భౌతిక దేహమును దహనం చేస్తున్నారు. ఆతని మనోకల్పితమైన పాప-పుణ్యభావనా సరంభం వారు గాంచలేక పోవుచున్నారు. అది కూడా చిదాకాశ సంకల్ప నియతియే!

ఇక నీ ప్రశ్నకు వద్దాం. ఒకే మనుజుని గురించి ... మిత్రుడు- "ఈతడు సుఖంగా జీవించుగాక" అని కోరుకొనినవాడై కోరికలు ప్రసాదించే క్షేత్రంలో, ఆ ధ్యాసతో, ఏకాగ్రతతో, ఆరాధనతో ధ్యానిం చటం!; శత్రువు- "ఈతనికి మరణము సంభవించుగాక" అని అట్టి కోరికలు ప్రసాదించే క్షేత్రములలో ధ్యానించటం.... ఈ రెండు ఒకేసారి జరిగాయనుకో! అప్పుడేమౌతుందని ప్రశ్నించావు కదా! విను. అప్పుడు...

1. ఆ మనుజుని సంవిత్తు మిత్ర సంవిత్తు యొక్క సంకల్పబలం చేత "సుఖజీవస్థితి"ని ఆ వర్తమానపు దేహంతో ఎరుగుచున్నది.

2. సంవిత్తు యొక్క మిత్రసంకల్ప బలం అంతగా లేకపోతేనో? అప్పుడు ఆతని సంవిత్తు యొక్క శతృ సంకల్పం ఆతనిపై ప్రభావం చూపునదై, ఆతని మరణానుభవమునకు కారణమౌతుంది.

ఆ మిత్ర-శత్రువుల సంకల్ప బలాలకు ఆతని సంకల్పబలం (ఆతని ధైర్య - అధైర్య, నమ్మక - అపనమ్మకాలు) తోడై... ఆ సంయోగంలో ఏది బలవత్తరమైతే అది ప్రభావం చూపుచున్నది. కవచం ధరించిన వానిని శస్త్ర ప్రయోగం ఏమీ చేయలేదు చూచావా? అట్లాగే సాత్విక భక్తి పెంపొందించుకొన్న వానిని తదితరుల దుష్ట సంకల్పాలు స్పృశించి కూడా ఏమీ చేయ జాలవు. అట్లా కాకుండా ఆత్మ స్వరూపంపై సాంసారిక దృష్టుల అభ్యాసం చేత అపనమ్మకం గల వానికి శత్రువుల దుష్ట (హాని కలగాలనే ఉద్దేశంతో పుణ్య క్షేత్రములలో నిర్వర్తించిన ప్రార్థనలతో కూడిన) సంకల్పం అధిక బలం కలిగినదై అది అట్లా బలవత్తరంగా ప్రభావం చూపుతుంది.

ఇది ఇట్లా ఉండగా..."సంవిత్తు యొక్క దృఢమైన, తీవ్రమైన అధ్యాసతో కూడిన సంకల్పం వృథాకాదు"... అనే సిద్ధాంతమును అనుసరించి, ఆతని బంధువులకు ఆతడు సలక్షణంగా జీవిస్తూ

కనిపిస్తూనే... ఆ బంధువులకు కంటికి కనిపించని శరీరంతో ఆతడు మరణానుభవమును కూడా (శత్రువు యొక్క ఆ ధ్యాసతో కూడిన దృఢ సంకల్పం కారణంగా)... పొందుతూ ఉంటాడు! ఈ విధంగా ఒకడు ఒకే కాలంలో జీవితము, మరణముల అనుభవం పొందటం కూడా జరుగవచ్చు! ఇది ఆశ్చర్యకరమైన విశేషమేమీ కాదు! ఎందుకంటే ఈ జీవన్మరణాలతో కూడా కలిపి ఈ ముల్లోకాలలో ఏ విపరీతమైన విశేషమైనా సరే... సంభవించటంలో ఆశ్చర్య పడవలసినదేమున్నది? స్వప్నంలోను, భ్రమతో కూడిన సంకల్ప పట్టణంలోను ఏది సంభవించదు? ఊహలో ఏది ఎట్లాగైనా అవవచ్చు కదా! ఓ ప్రజ్ఞప్తి మహారాజా! నీవు ఒక విషయం గమనిస్తున్నావా?

**సంకల్ప స్వప్న పురయోః యా భ్రాంతిః అనుభూయతే**
**తతో ఽధికోఽయం న న్యూనాత్ జాగ్రత్ స్వప్నే అనుభూయతే ॥**

సంకల్ప – స్వప్న నగరాలలో ఏ భ్రాంతి పొందబడుచున్నదో – అంతకంటే ఎంతో ఎక్కువగా భ్రాంతి ఈ జాగ్రత్ స్వప్నంలో (కనబడే జాగ్రత్తులో) అనుభవమౌతోంది. ఇదేమీ చిన్నదైన భ్రాంతి కాదు.

**ప్రజ్ఞప్తి మహారాజు :** స్వామీ! శ్రీ వసిష్ఠ మహర్షీ! ధర్మ–అధర్మములే దేహమునకు కారణమౌచు న్నాయని అంటూ ఉంటారు కదా! ధర్మ – అధర్మాలు ఆకారరహితం కదా! ఈ జీవుడు చనిపోయిన తరువాత నిరాకారములైన 'ధర్మాధర్మాలు' ఆ చనిపోయిన వానియొక్క మరొక దేహమునకు కారణం ఎట్లా అగుచున్నాయి? అవి సాకార శరీరానికి కారణమగుచున్నాయని అనటం ఎట్లా యుక్తియుక్తం?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ మహాబుద్ధీ! ప్రజ్ఞప్తి మహారాజా! ఈ జగత్తంతా కూడా బ్రహ్మం యొక్క సంకల్ప నగరమే కదా! ఊహలో ఊహ కారణంగా జరగనిది ఏముంటుంది? అటువంటి బ్రహ్మం యొక్క "ఇది ఇట్లు ఉండుగాక"... అను సత్య సంకల్పమే ఈ మూర్తములైన – అమూర్తములైన చమత్కారముల యొక్క పరస్పర సంబంధమును కూడా "నియతి". రూపంగా సంప్రాప్తిస్తోంది. అయినా, అమూర్త రూపమగు ప్రేమ – కోపం – ఆవేశం మొదలైనవి మూర్త రూపమగు దేహంలో ప్రస్ఫుటం అవుతూనే ఉన్నాయి కదా!

**యథైవ సంకల్పపురే యన్న సంభవతీహ హి**
**తన్నాస్త్యేవ తదేతస్మిన్ కింవాస్తు బ్రహ్మకల్పనే ॥**

సంకల్ప పురంలో క్షణంలో ఎక్కడైనా ఏదైనా సంభవమే కదా! "ఒకని స్వప్నంలో పదిమంది బంధువులే ఉంటారు. పదకొండు మంది ఉండలేరు. ఒకనికి స్వప్నంలో రెండు ఇళ్లే ఉంటాయి. ఐదు ఇళ్ళు ఉండజాలవు"... అనే నిర్ణయమే ఉన్నది? అట్లాగే బ్రహ్మ కల్పనా జగత్తులో ఏది ఎట్లైనా ఉండవచ్చు కదా! స్వప్నంలో ఒకే స్వప్నద్రష్ట జీవ చైతన్యము (లక్షల కొలది సైనికులను స్వప్నంలో చూస్తున్నప్పుడు) లక్షల కొలది సైనికుల రూపంగా అగుచున్నది కదా! ఆ స్వప్న ద్రష్ట "గాఢనిద్ర (సుషుప్తి)"లో ప్రకాశించగానే స్వప్నంలో కనిపించి ఉన్న ఆ లక్షల కొలది సైనికులంతా ఏమైనారు? ఆ ద్రష్ట యొక్క ఏకరూపమును పొందుచున్నారు కదా!

అట్లాగే... చిదాకాశమాత్రం, అనుభవరూపం" అగు ఈ జగత్తు నందు కూడా... అప్పుడు కలలో కనబడిన సేనయే "ఈ జాగ్రత్తులో కనబడే సేన. (లేక) అక్కడ జాగ్రత్తులో కనబడిన సేనయే ఇప్పుడు ఈ కలలో కనిపిస్తోంది", "అప్పటి అనుభవమే ఇప్పుడు సిద్ధిస్తోంది"... అని అనుకుంటున్నట్లే "అప్పటి నా పుణ్యపాపాలే ఇప్పుడు ఇక్కడ ఇట్లా సిద్ధిస్తున్నాయి'... అనే కల్పన కొనసాగుచున్నది. అటువంటి చిదాకాశ కల్పనామయ జగత్తులో ఒకడు మరణించిన తరువాత "నా పుణ్య – పాపకర్మలే నన్ను వెంటాడుచున్నాయి".... అనే కల్పన కలిగివుండి, వాటి సుఖ – దుఃఖానుభవములను పొందటం జరుగుతోంది. "ఇది సుఖము, ఇది దుఃఖము" అనే కల్పన ఉన్నంతకాలం కార్య కారణ వ్యవస్థ యొక్క కల్పన కూడా ఈలాగే కొనసాగుతుంది.

కాబట్టి ఓ రాజా! "జగత్ రూపభ్రాంతి కూడా చిదాకాశ రూపప్రకాశమే".... అని గ్రహించు. ఇక సత్తుగాని, అసత్తుగాని, సదసత్తుగాని ఇక్కడ లేవు. ఎందుచేతనంటావా?

**యథా అనుభూయతే యద్యత్ తత్తథా తత్త్వదర్శినః**
**ప్రబుద్ధస్యాత్ర కిం నామ తత్స ఏవాంఙ్గతేత్యలమ్**

ఎవరెవరికి ఏఏ పదార్థం ఏ ప్రకారంగా అనుభూతమౌతోందో... అదంతాకూడా ఆ ప్రకారంగా చిదాకాశమే వివర్తము పొందుచున్నదగుచున్నది. కాబట్టి ప్రబుద్ధుడగు "తత్త్వదర్శి" యొక్క దృష్టికి ఇక్కడ అసమంజసమైనదంటూ ఏదీ కనిపించదు. ఓ రాజా! నీవు కూడా తత్త్వదర్శివై "ఇక్కడ ఏది ఎట్లు కనిపిస్తున్నా అదంతా కూడా చిదాకాశమే (లేక పరమాత్మయే) అట్లు వివర్త రూపము పొందిన దానివలె నాకు అగుపిస్తోంది" (అనిపిస్తోంది)... అని గ్రహించి ఉండు.

ఒకడు పురాణాదులలో "స్వర్గము" మొదలైన లోకముల గురించి పఠిస్తున్నాడనుకో! "స్వర్గలోకం ఉన్నది. అక్కడ అత్యుత్తమ భోగ వస్తువులు, అమృతముతో నిండిన సరోవరములు, మధుర సువాసనతో కూడిన పుష్పములు, అత్యంత సుందరమైన వనములు, అప్సరసలు ఉంటారు. అక్కడ అంతా సుఖమే గాని, ఇక దుఃఖమనేదే ఉండదు! అయితే ఇక్కడ వ్రతములు, ధర్మములు, దానములు చేస్తే అవి నాకు లభిస్తాయి" అని పురాణాలలో చెప్పినట్లు యజ్ఞ కార్యములు, దాన–ధర్మములు మొదలైనవి చేస్తే, అప్పుడాతనికి ఆ స్వర్గలోకం, అందులో శాస్త్రములచే చెప్పబడే సుఖమయ వస్తువులు తప్పక లభిస్తాయి. అవన్నీ అట్లాగే అనుభూతమౌతాయి.

అట్లా కాకుండా, "ఇదంతా కూడా ఇక్కడ, అక్కడ కూడా మిథ్యయే కనుక అసమంజసమే అయివున్నది"... అనే బుద్ధిని మరొకడు కలిగి ఉన్నాడనుకో! అప్పుడు ఈతనికి ఈ లోకం, ఈ లోకంలో నిర్వర్తించే కర్మానుష్టానం, దీనిచే ఫలప్రదాలగు సుఖ స్వరూపాలగు స్వర్గాది లోకాలు, అచట గల భోగ్యవస్తువులు... ఈ వ్యవహారమంతా కూడా సంకల్పపురం వలె అసమంజసమే అవుతుంది.

ఈ దృశ్యము వాస్తవమేనా?... ఈ ఘనీభూతమై ప్రతి జీవునికి కనిపిస్తున్న దృశ్యం స్వతహాగా వాస్తవమా? ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఈ జీవులు – ఈ భూములు ఇవన్నీ కూడా వాస్తవం కాదు. అవాస్తవం! అయితే 'దృశ్యం' అనేది సంభవిస్తోంది. వాస్తవమే కానప్పుడు దృశ్యము ఎక్కడి నుండి

సంభవిస్తోంది? దృశ్యమే స్వతఃగా లేనప్పుడు ఇక అద్దానిలో సమంజసమైనదేమున్నది? అసమంజస మైనదేమున్నది?

**ప్రజ్ఞప్తి మహారాజు :** ఈ దృశ్యము ఎదురుగా కనిపిస్తూ ఉంటే "ఈ దృశ్యమే లేదు! ఇక ఇందులో సమంజసమైనదీ లేదు! అసమంజసమైనదీ లేదు" అని మీరు సిద్ధాంతీకరిస్తున్నారు. అట్టి మీ సిద్ధాంతం ఎట్లా యుక్తియుక్తం?

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఈ దృశ్యమునకు "ద్రష్ట" అగు నీవు – సంవిత్ స్వరూపుడవే! సంవిత్ (సత్ + విత్ = ఉనికి +ఎరుక) స్వరూపుడవగు నీ యొక్క సంవిత్ స్వరూపమే నీకు దృశ్యముగా అనుభూతమౌతోంది.

"చిదాకాశమే దృశ్య జగత్ రూపంగా వివర్తము పొందుతోంది" అని అంటే దాని అర్థం ఏమిటి? "కేవలం సంవిత్ స్వరూపుడగు ద్రష్టయే... స్వకీయమైన దృశ్యకల్పనచే... దృశ్యరూపంగా వివర్తము పొందినవాడై... ఈ దృశ్యమున తనకంటే వేరైన దానివలె కల్పనను ఆశ్రయించి... ఈ దృశ్యమును పొందుచున్నాడు!" ...అని కదా!

"ఈ దృశ్యము లేదు"... అని నేను సిద్ధాంతీకరించటంలోని సారవిషయం అదే! "ద్రష్ట యొక్క కల్పనకు వేరుగా దృశ్యము అనుభవమవదు. ఆతని కల్పనను అనుసరించే ఆతనికి దృశ్యము ఎట్లెట్లో అట్లట్లు అనుభూతమౌతోంది"... అని విశదీకరించటమే నా ఉద్దేశం.

"అందరికీ అనుభూతమగుచున్న స్వప్నంలోను, సంకల్ప నగరంలోను సమంజసమైనదీ లేదు. అసమంజసమైనదీ లేదు, అన్నీ సమంజసమే! అన్నీ అసమంజసమే" అని ఒప్పుకుంటావు కదా! ఏ కల్పనా న్యాయం స్వప్న – సంకల్ప నగరాలలో వర్తిస్తోందో... అదే కల్పనాన్యాయం "స్వప్న జాగ్రత్ దృశ్యం" (లేక) "జాగ్రత్ స్వప్నదృశ్యం" అనబడు ఈ వర్తమానంలో నీకు కనిపించే దృశ్యంలో కూడా వర్తిస్తోందని గ్రహించు. అనగా నీ యొక్క కల్పనను అనుసరించే దృశ్యం అనుభవమౌతోంది. నీకు కల్పనయే లేనప్పుడు దృశ్యమే లేదు. "స్వర్గలోకాలు ఉంటాయి! అవి పుణ్యకార్యముల ద్వారా సంపాదించుకోవాలి" అని నీవు కల్పనను ఆశ్రయిస్తే అప్పుడు "పుణ్యకార్యములు – అవి నిర్వర్తించటం, తద్వారా స్వర్గ లోకాలలో ఆయా సుఖాలు పొందటం" ఇవన్నీ సంభవిస్తాయి! అనగా, "అవన్నీ సమంజసమే"... అనే రూపంలో ఈ దృశ్యాన్ని పొందుతావు. అట్లా కాకుండా, "ఇదంతా బ్రహ్మమే! పరలోకాలు బ్రహ్మమే! బ్రహ్మమే సత్యము! నేను సర్వదా సర్వకల్పనలకు ఆవల మార్పు–చేర్పులు లేని బ్రహ్మమే స్వరూపంగా కలిగి ఉన్నాను. ఈ జీవులు – ఈ లోకములు బ్రహ్మమే స్వస్వరూపముగా గల నా కల్పన చేతనే ఏర్పడి, కల్పన తొలగితే నా రూపమే అగుచున్నాయి"అనే దృఢ భావన కలిగి ఉన్నవానికో? ఆతనికి ఇక్కడ లేనివి, స్వర్గంలో లభించేవి ఏవీ ఉండవు. అనగా ఆతనికి ఇహలోకమూ లేదు! పరలోకమూ లేదు! ఆతడు సర్వదా అంతటా ఆత్మనే ఆత్మకు అభిన్నమైనదిగానే పొందుచున్నాడు.

కనుక ఓ రాజా! స్వప్నంలోలాగానే ఈ జగత్తులన్నీ కూడా బ్రహ్మ స్వరూపమగు చైతన్యము యొక్క సంకల్పమే అయివున్నాయి.

❖

మరల చెప్పుచున్నాను! నీ సంకల్ప నగరంలో నీకు అసంభవం, అసమంజసం అయినది ఏదీ ఉండనట్లే... "బ్రహ్మం యొక్క సంకల్ప నగరమే" అయి ఉన్నట్టి ఈ జగత్తు యొక్క సమస్త పదార్థములందు కూడా "అసంభవం, అసమంజసం"... అనేదేదీ లేదు! అట్లాగే స్వప్నంలోలాగానే ఇక్కడ సంభవం, సమంజసం అయినది కూడా ఏదీ లేదు. బ్రహ్మం యొక్క సంకల్పం (అనగా ఈ జగత్తు) నందు ఏ వస్తువు ఏ ప్రకారంగా కల్పించబడిందో ...అది ఆ ప్రకారంగానే అట్టి ఆకారం, లక్షణం, ధర్మములతో కూడియే ఆ స్వభావమున స్థితినొంది ఉన్నదగుచున్నది! అట్టి ఆకార-స్వభావ-నియమాలను అనుసరించే జ్ఞానేంద్రియాలు (కళ్ళు-చెవులు-చర్మము-నాలుక-ముక్కు) ఆయా వస్తువులను ఆయా రూపాలుగా పొందుచూ "ఇది జగత్తు"...అని నీచే అనుభవరూపంగా పొందబడుచున్నాయి. అట్లాగే కర్మేంద్రియాల వ్యవహారం కూడా కొనసాగు తోంది! చైతన్యం యొక్క పూర్వ కాలపు అనుభవ స్థితి ఉత్తర కాలమున చైతన్యం యొక్క మరొక రీతి అయిన ప్రయత్నం చేతనే అన్యధాభావం పొందటం జరుగుచున్నది.

బ్రహ్మమే హిరణ్యగర్భుని వేషం ధరిస్తోంది. ఆ హిరణ్యగర్భుని సంకల్పము చేతనే వస్తుధర్మాలు, లోకాలు, కర్మ ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయి. ఇది ప్రళయము వరకు ఇట్లాగే కొనసాగటం కూడా జరుగుతోంది. మరల ప్రళయానంతరం ఆ కల్పన యొక్క చైతన్యము – ప్రయత్నమును అనుసరించి 'అన్యధా భావము' పొందటం జరుగుతోంది. ప్రతిజీవునికి చైతన్యము నందు స్వప్నము, ఆ స్వప్నంలో స్వప్ననగరం, ఆ స్వప్న నగరంలో ప్రియ – అప్రియ రూపాలు, పరస్పర సంబంధాలు – అనుభూతులు ఎట్లా ప్రాప్తిస్తున్నాయో... అవన్నీ తొలగి మరునాటి స్వప్నంలో మరొక రీతిగా అవి పొందబడు చున్నాయో... అట్లాగే బ్రహ్మం యొక్క సంకల్ప రూపమగు ఈ జగత్తులు, కల్పములు, కల్పాంతములు, ప్రళయములు, పునః జగత్తులు మాయా పూర్వకంగా సంభవిస్తున్నాయి. అయితే వాస్తవానికి స్వయముగా బ్రహ్మమే అయి భాసిస్తున్నాయి. కాబట్టి...

1. బ్రహ్మము యొక్క "సంకల్ప నగరమే" అయివున్న ఈ జగత్తు నందు "సంభవించనిది" అంటూ ఏదీ లేదు. "అసమంజసం"గా ఏదీ లేదు.

2. సంకల్పము సంకల్ప కర్త రూపమే కదా! – 'ఊహ' ఊహించుకొనువాని స్వరూప – స్వభావమే కదా!

స్వప్నం స్వప్న ద్రష్ట యొక్క స్వరూప చమత్కారమే కదా! అట్లాగే, ఇదంతా బ్రహ్మము సంకల్ప రూపమే కనుక బ్రహ్మమే అయివున్నది (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ). నీచే పొందబడుచున్నదంతా నీ "స్వభావము" యొక్క అంతర్గత విభాగమే అయివున్నది.

❖❖❖

## 8. వ్యక్తిగత జగత్ - బ్రహ్మాండానుభవాలు

**శ్రీ ప్రజ్ఞప్తి రాజు :** హే మహర్షీ! ఎంతటి సుదినం! మీ వాక్ప్రవాహంచే నా అజ్ఞానాంధకారమంతా పటాపంచలు అవుతోంది.

స్వామీ! మరొక సందేహం, ఇతఃపూర్వం అడిగినదే... మరొక్కసారి మీ ముందు ఉంచుతాను. " ఆకాశంలో పూర్ణ చంద్రరూపుడను అయి ఉండెదను గాక!"... అని ఒక వంద మంది ఆ ఫలప్రాప్తికై శాస్త్రీయంగా ప్రయత్నశీలురైనప్పుడు... ఆకాశంలో వంద మంది చంద్రులు ఆవిర్భవిస్తు న్నారా! లేదు కదా! ఆకాశంలో ఎప్పటికైనా ఒక్క పూర్ణచంద్రబింబమే ఉంటుంది కదా! అటువంటి అనేకమంది యొక్క ఒకే రీతి అయిన అభీష్టాలు ఒక్కసారే ఎట్లా నెరవేరుతాయి?... అని ప్రశ్నించి యున్నాను. అప్పుడీ కనిపించే చంద్రబింబం ఏమౌతుంది?

**నేను (శ్రీ వసిష్ఠ మహర్షి) :** "ఒకేసారి అనేకులు పూర్ణ చంద్రబింబ స్వరూపులు కావాలని ఉపక్రమిస్తే అప్పుడు ఆకాశం నిండా పూర్ణచంద్రబింబాలు ఏర్పడతాయా?"... అనే నీ ప్రశ్నకు సమాధానంవిను.

నీవు చెప్పిన ఏ వందమందైతే "మేము పూర్ణచంద్రబింబ స్వరూపం కావాలి'...అనే ఉపాసనకు ఉపక్రమించారో... ఆ ఫలం యొక్క ప్రాప్తి అనివార్యమే కాబట్టి వారందరు చంద్రబింబస్వరూపులుగా ఒకే సమయంలో కూడా అవవచ్చు! అయితే వారు ఈ ఆకాశంలో ఈ చంద్రబింబ స్వరూపులుగా అవరు. కనుక ఈ ఆకాశానికి, ఈ చంద్రబింబానికి వచ్చే ప్రమాదమేదీ లేదు. ఎందుకంటే ఒకరు ఒక కలకంటూ ఉంటే అందులోకి రెండవ వాని స్వప్నం ప్రవేశించి ఆ కలలోని విశేషాలకు విఘ్నం కలిగించటం లేదు కదా! నీ ఊహలో నేను ప్రవేశించి అందులోని భవనాలను తొలగించి గుడిసెలు కట్టడం లేదు కదా! అసలు... సంకల్పపురంలోని వీథులు, గృహాలు, సహజీవులు... ఇవన్నీ ఆ సంకల్పమును నిర్వర్తించే జీవులలోనే ఉన్నాయిగాని, మరెక్కడో లేవు! కాబట్టి నీవు చెప్పిన వంద మంది పూర్ణ చంద్రోపాసకులు వారి వారి సంకల్ప సృష్టులలోని ఆకాశములలో వేరువేరుగా పూర్ణ చంద్ర స్వరూపులై వెలుగొందగలరు. ఏ ధ్యాత (ధ్యానం చేయువాడు) అయితే "రాత్రిపూట వెలుగొందుచున్న ఈ చంద్రబింబంలో ఇప్పుడు నేను ప్రవేశిస్తున్నాను" అనే ధ్యానమును పరిపూర్ణ పరచుకొంటాడో... ఆతడు అట్లాగే ఆత్మజ్ఞాన సుఖరహితుడై, ఈ చంద్రుని యందు ప్రవేశించగలడు. అట్లా కాకుండా, "నేను ఆకాశంలో చంద్రబింబంలో ప్రవేశించి ప్రత్యేక చంద్రబింబ సుఖం అనుభవిస్తాను" అని తలచి ప్రయత్నిస్తే వారు అనంత సంఖ్యాకంగా ఉత్పత్తి కాగల భూమండలాలలో చంద్రబింబ రూపం ధరించగలరు. ఈ మనుజుడు ఏ స్వభావంతో ఏ రీతిగా దృఢ సంకల్పము కలిగియున్నవాడై ధ్యానమును ఆశ్రయిస్తాడో... ఆ స్వభావమునే... ఆ రీతిగానే ఆతని సంవిత్తు అనుభవిస్తూ ఉంటుంది.

ఆ విధంగా వేరు వేరు ధ్యాతలు వేరు వేరుగా పూర్ణచంద్రమండల రూపాలను ధ్యానిస్తూ వేరు వేరు చంద్రమండల రూపములను తమతమ సంకల్ప జగత్తులలలో పొందుచున్నట్లే... ఒకే స్త్రీని గూర్చిన ధ్యానముచే అనేకమంది తమ తమ సంకల్ప నిర్మిత జగత్తులలో వేరువేరుగా ధ్యానించటంచే ఆ స్త్రీని అనేకులు తమ సంకల్ప జగత్తులో పొందుతూ ఉండటం కూడా జరుగగలదు. అదంతా వారి సంకల్పానుసారమే నిర్మించబడుచున్నదని నీవు గ్రహించు! ద్రష్ట యొక్క సాక్షి చైతన్యమే ప్రియత్వముచే ప్రియమైన రూపాదులుగా అయి ఆ రూపాదులన్నీ పొందుతుంది.

అట్లాగే "నేను ఈ గదిలోంచి బయటకు వెళ్ళకుండానే సప్తద్వీపములకు చక్రవర్తినై చక్రవర్తి సింహాసనం అధిష్ఠించి సప్తద్వీపవాసులను శాసించాలి"... అనే ధ్యానము గల ధ్యాత, తన ఉపాసన తీవ్రతచే ఆ గదిలోనే స్వచిత్తాకాశంలో కల్పనా సిద్ధమైయున్న సప్తద్వీప సమన్వితమైన మహా సామ్రాజ్యాన్ని సుదీర్ఘంగా సంచారము చేస్తూ పరిపాలించగలడు. ఎందుకంటే ఆతని సాక్షి సంవిత్తే ఆతని ఉపాసన ప్రయోజన రూపం కూడా దాల్చుచున్నది కనుక!

**శ్రీ ప్రజ్ఞప్తి రాజు :** మీరు చెప్పినట్లే గదిలోనే సప్తద్వీపములు – సూర్యచంద్ర – నక్షత్ర మండలాలతో కూడి సిద్ధించియే ఉన్న మహాసామ్రాజ్యం ఆతనికి ఎలా లభ్యం అవగలుగుతుంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇందులో అంతగా ఆశ్చర్యపడవలసినదేమున్నది? మనకు దృశ్యరూపమై కనిపించే జగత్తంతా కూడా... "ఆద్య స్వరూపుడు – సర్వజ్ఞుడు" అగు బ్రహ్మదేవుని (హిరణ్యగర్భుని) కల్పనామాత్రమే కదా! అనగా? 'కల్పన' మాత్రమే కదా! 'కల్పన' అనేదది (అది హిరణ్యగర్భునిది అయినా, (లేక) నీది, నాది, మరొకరిది అయినా కూడా)... శూన్యరూపమే కదా! నిరాకారమే కదా! అట్టి ఊహ (లేక) కల్పనలో ఈ భౌతిక పదార్థాలన్నీ సమకూడినవై నామ – రూపాత్మకంగా ఉండటం లేదా? అప్పుడిక ఉపాసకుల కల్పనా జగత్తులో కల్పిత జగత్తులు ఏర్పడటంలో మనం "అసమంజసము"... అని అనుకోవలసినదేమున్నది?

❖❖❖

## 9. ఇహలోక కర్మములు - పరలోక ఫలములు

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**దానౌర్ధ్వదేహిక తపో జపాదీనాం పరత్ర యత్ ।**

**అమూర్తానాం ఫలం మూర్తం, తదిదం కథ్యతే శృణు ।**

ఓ ప్రజ్ఞప్తి మహారాజా! ఇక, "ఈ ప్రపంచంలో ఒకడు తనకు ప్రియమైన వారిని ఉద్దేశించి నిర్వర్తించే దానము, (లేక) పితృ దేవతలను ఉద్దేశించి చేసే శ్రాద్ధము మొదలైన ఊర్ధ్వదేహిక క్రియలు, తపస్సు, జపము, పూజ, దేవతా పూజలు... ఇటువంటి అమూర్తములు (నిరాకార క్రియా ఫలములు) ఎక్కడో దూరంగా ఉన్నవారిపట్లా, ఊర్ధ్వలోకాలలో ఉన్న వారిపట్లా ఎట్లా ఫలప్రదమౌతాయి?" అనే ప్రశ్నకు కూడా సమాధానం చెప్పుచున్నాను... విను.

పరలోకంలో ఉన్న అమూర్తులు భౌతికదేహం కలిగి ఉండనప్పటికీ మనోరూప సూక్ష్మదేహం కలిగియే ఉంటారు. దానాదులచే చిహ్నితమైన బుద్ధి కలిగియే ఉంటున్నారు. ప్రతిజీవుడు భౌతికదేహం ప్రక్కకు పెట్టి అమూర్తంగానే స్వప్నంలో అనేక దృశ్యములు – అనుభవాలు పొందుచూనే ఉన్నాడు కదా! అట్లాగే చైతన్యము యొక్క ప్రభావం చేతనే మూర్తమగు దేహాదులతో చేసిన కర్మల ఫలములు దూర ప్రదేశాలలో నివసించే బంధువులు, అమూర్తమగు ఊర్ధ్వలోకాలలోని పితృ దేవతలు పొందటం జరుగుతోంది. సర్వత్రా సర్వదా వేంచేసియున్న చైతన్యము యొక్క ప్రభావం చేతనే... ఒకడు తన

ప్రియమైన వారి ఆనందము – సంక్షేమము కొరకై ఉద్దేశించి నిర్వర్తించిన శుభకర్మలు ఆ దూరంగా ఉన్నవారి పట్ల ఫలప్రదం అవుచున్నాయి. అయితే ఇక్కడ ముఖ్యమైన విషయం నీవు గమనించు.

మనస్సు చేతనే జ్ఞానేంద్రియాలు పనిచేస్తున్నాయి. మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు కలయికయే ఈ శరీరము. మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాల ద్వారా ఏదేది ఎవరెవరిచే భావనయొక్క పుష్టిచే పొందబడుచున్నదో... అదియే వారి వారికి 'జగత్తు' అను శాస్త్రీయ నామమై ప్రసిద్ధమై ఉంటోంది.

అంతేగాని, 'జగత్తు' అనగా ఈ ఆకాశము, భూమి, గ్రామము, పట్టణము, ఇల్లు, వాకిలి, దేశము, కొండలు, గుహలు కాదు. మనస్సు చేత, జ్ఞానేంద్రియముల చేత చిన్మాత్రమునకు వేదనం –అవేదనం (తెలియటం, తెలియకపోవటం) ఆకార రూపమగు 'భ్రాంతి' కలుగుతోంది.

అట్టి భ్రాంతియే "విషయప్రాప్తి" కొరకై తన కల్పనారూప జగత్తునందు సుదీర్ఘంగా సంచరిస్తూ అనేక దేహములు పొందటం, త్యజించటం చేస్తోంది. అనగా ఆ చిన్మాత్రము (కేవల చిత్ స్వరూపమే అయివుండి కూడా) మనస్సుతో కూడిన కర్మేంద్రియములను స్వరూపంగా దర్శిస్తూ చలన – అచలన భావములన్నీ పెంపొందించుకొని పొందుచున్నది.

ఈ విధంగా ప్రతి ద్రష్ట వాస్తవానికి కేవల – నిర్మల చిత్ స్వరూపుడే అయివున్నాడు. ప్రతి ఒక్కరి స్వస్థానము (లేక) జన్మస్థానము చిదాకాశమే అయివున్నది. మనస్సు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ జనితమైన ఆ 'భ్రమ' శమించిందా... ఇక ఆ ఉపాసకుడు (ఆత్మనే సర్వత్రా ఉపాసించువాడు) శాంతము, నిర్మలము అగు ఆత్మగానే శేషించుచున్నవాడగుచున్నాడు.

ఇక... శాస్త్రజ్ఞులు, "ఈ లోకమున అనుష్ఠింపబడిన దానములు, ధర్మములు, మంత్రములు మొదలైనవి చిత్ప్రతిభాస రూపుడే అగు దూరంగా ఉన్నట్టి (లేక) పరలోకంలో ఉన్నట్టి మరొక జీవునికి సత్ఫల రూపంలో ప్రతిఫలిస్తాయి"... అని శాస్త్రపూర్వకంగా చెప్పుచున్నప్పుడు, "అవి సంకల్ప రూపంగా నిరాకారమే కాబట్టి సాకార ఫలాలను ప్రసాదించవు" ... అని వాదించవలసిన పనేమిటి? అనుభవజ్ఞులగు జ్ఞానులు చెప్పే శాస్త్ర మర్యాదను అనుసరించి అవి అట్లా సత్ఫలాలను ఇవ్వగలవని గ్రహించియే ఉండు.

"కల్పనామయమే అయివున్నట్టి ఈ ప్రపంచమునకు ఆధారము అగు చిన్మాత్రమే సంకల్ప ప్రతిభాసచేత దాన–వ్రత–తపస్సు–పూజల భోగైశ్వర్య ఫలరూపంగా ఆయా ఉద్దేశించబడిన జీవులకు బాధానివారణ రూపంగాను, దారిద్ర్యాలను తొలగించే విధంగాను ఇహ–పరలోకాలలో ప్రయాణించ గలవు" – అనుదానికి విరోధమేమున్నది చెప్పు? మనోశక్తి భౌతిక శక్తికంటే సూక్ష్మం, విస్తారం కదా!

ఓ రాజా! ఈ విధంగా నీవు అడిగిన దానికి సమాధానపూర్వకంగా, రెండు విషయాలు క్రోడీకరించి మరల చెప్పుచున్నాను.

1. ఈ జగత్తంతా నిరాకారము, 2. ఇది చైతన్యము యొక్క కల్పనా స్వరూపం

**ప్రజ్ఞప్తి మహారాజు :** మహాత్మా! చైతన్యము మొట్టమొదట దేహరహితము - నిరాకారము కదా! అట్టి దేహ రహితమగు చైతన్యముచే సృష్ట్యాది యందు ఈ దేహకల్పన అంతా ఎట్లా భాసిస్తోంది? వెలుతురులో వస్తువు ఉంటేనే చూడగలంగాని వస్తువు లేనప్పుడు వెలుతురు చూడలేం కదా! అట్లాగే చైతన్యం దేహం ఉన్నప్పుడే అభివ్యక్తం అవుతోంది. దేహం లేనిచోట చైతన్యము అభివ్యక్తం కావటం లేదు కదా! ఇది ఎందుచేత?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రాజా! "దేహము" అనే శబ్దానికి ఏ జడమైన వస్తువు రూపంగా నీవు అర్థం గ్రహిస్తున్నావో.. అట్టిదాని విషయంలో తత్త్వజ్ఞానికి అట్టి అర్థం కనబడటంలేదు. జ్ఞాని దృష్టిలో అంతా బ్రహ్మమే అయివున్నది. ఏది 'బ్రహ్మం' అనే శబ్దానికి అర్థమై ఉన్నదో... అదియే "దేహము" అనే శబ్దానికి కూడా అర్థమై యున్నది. జలం, నీళ్ళు ...ఈ రెండింటికీ ఒకే అర్థం ఉన్నట్లుగా... బ్రహ్మం, దేహం అను రెండు శబ్దములకు అర్థం ఒక్కటే!

ఇక నీ దృష్టికి వద్దాం. స్వప్నంలో కనిపించిన దేహం స్వప్నరూపమే కదా! అట్లాగే ఏ ఈ దేహమును నీవు చూస్తున్నావో... అది చిద్రూపబ్రహ్మమే అయివున్నది.

నాయనా! "స్వప్నం" అని నేనప్పుడు నీకు దృష్టాంతము కొరకు సర్వజనుల పరిభాషగా ఆ శబ్దాన్ని ఉపయోగిస్తున్నాను. అంతేగాని, వాస్తవానికి ఆ స్వప్నము స్వప్నము కాదు. మరి? బ్రహ్మమే అయివున్నది! స్వప్నం నీకు అనుభూతమగుచున్న విషయం కనుక అద్దానిచే నీకు బోధ నిర్వర్తిస్తున్నాను. వాస్తవానికి స్వప్నము - సృష్టికి సాదృశ్యం లేదు. ఎందుకంటే?

స్వప్నంలో స్వప్నం వేరు, స్వప్న ద్రష్ట వేరు ...అని అనిపిస్తోంది కదా! జగత్తులో సృష్టి - ద్రష్ట కూడా చిద్రూపముగానే (జ్ఞాన దృష్టిచే స్వకీయాత్మ స్వరూపంగానే) భాసిస్తోంది. అందుకే 'సాదృశ్యం లేదు' అని అంటున్నాను. ఎప్పుడైతే అంతాకూడా కేవల బ్రహ్మమే అయి ఉన్నదో... అప్పుడిక అచట దేహమెక్కడ? స్వప్న పదార్థములు ఎవనికి? స్వప్న బుద్ధి ఎక్కడిది? 'స్వప్నం' అనే మిథ్యారూప భ్రమచే జ్ఞాని అజ్ఞానికి బోధిస్తున్నాడు. అంతకు మించి వాస్తవానికి బ్రహ్మానికి వేరుగా స్వప్నం లేదు. బ్రహ్మపదంలో జగత్తు లేదు. స్వప్నం లేదు. సుషుప్తి లేదు. మరింకొకటేదీ లేదు.

బ్రహ్మమే అన్నిటా... అంతటా తానై ఉన్నది. అనిర్వచనీయము, చిదాకాశ మాత్రము, మౌన రూపము, "విరాట్టు - చిత్తాకాశము - అహంకారము" అనే మూడు లయించగా కూడా శేషించునది, 'తురీయము' అనే పేరుతో చెప్పబడేది, 'ఓం' కారము యొక్క లక్ష్యార్థము, పరమ పురుషార్థము అగు బ్రహ్మమే ఇట్లు జగత్తు రూపంగా భాసిస్తోంది. ఏ ఈ జగత్తు నీవు భాసిస్తున్నదని అనుకుంటున్నావో (నీకు కనబడుతోందో)... అది వాస్తవానికి భాసించకయే ఉన్నది. జాగ్రత్ స్వప్నాదులు వాస్తవానికి లేవు. అతి నిర్మలమగు బ్రహ్మం మాత్రమే కలదు.

**ప్రజ్ఞప్తి మహారాజు :** మహర్షీ! అసలీ దృశ్యంగా భాసించేదంతా ఎందులో భాసిస్తోంది?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**దేశాద్దేశాంతర ప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః**
**తన్మయం సర్వమేవేదం ద్వైతమద్వైతమేవ చ ॥**

నీయొక్క బుద్ధి వృత్తి నీ నేత్రేంద్రియం (కళ్ళు) ద్వారా ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు వెళ్ళుచున్నదనుకో.

బుద్ధివృత్తి → నేత్రేంద్రియం
↓
ఒక దృశ్య విషయం నుండి
↓
మరొక విషయం వైపుగావెళ్ళుచుండడం

| ఆ రెండు దృశ్యవిషయముల మధ్య గల చైతన్యం యొక్క నిర్విషయ స్వరూపం | మరొక దృశ్య విషయం వైపు వెళ్ళుచుండటం. |
|---|---|

ఆ రెండు దృశ్యవిషయముల మధ్యగా → [ ] ← గల చైతన్యం యొక్క నిర్విషయ స్వరూపము ఏదైతే కలదో... అద్దాని చేతనే, అద్దాని యందే పరిపూర్ణమై ఈ ద్వైతాద్వైతరూపమగు జగత్తంతా కూడా వెలయుచున్నది.

అజ్ఞానికి ఆతని దృష్టియందున్న ఈ జగత్తును స్వప్నంతో సాదృశ్యంగా చేసి బోధించబడుతోంది. జ్ఞానియొక్క దృష్టిలో ఈ "ద్వైత-అద్వైత-శుభ-అశుభ" రూపమగు స్వప్న-జాగ్రత్ జగత్తులు చిన్మయ రూపాలే! కాబట్టి అజ్ఞానికి "ఇదంతా మాయయే" అని బోధిస్తున్నప్పటికీ, జ్ఞానికి బోధించే టప్పుడు "ఈ సమస్తం మృణ్మయం కాదు. చిన్మాత్రాకాశమునకు సాదృశ్యమైనదే!" అని బోధించ బడుతోంది. శూన్యం, పదార్థ ప్రాప్తి, పదార్థముల భావన, పదార్థముల ప్రకాశం (సృష్టి), పదార్థముల అభావం లేక అప్రకాశం (ప్రళయం)... అంతా కూడా పరమ చిదాకాశమే అయి వున్నది.

**పూర్ణాత్ పూర్ణం ప్రసరతి, పూర్ణమేవ స్థితం జగత్**
**న చ భాతం న చాభాతం శిలాబద్ధోదరోపమమ్ ॥**

పూర్ణమగు పరబ్రహ్మము నుండి పూర్ణమే అగు ఈ జగత్తు ప్రసరించుచున్నది. ఈ జగత్తు పరిపూర్ణ పరబ్రహ్మముగానే స్థితినొంది ఉన్నది. (పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్ పూర్ణముదచ్యతే! పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥) వాస్తవానికి బ్రహ్మం బ్రహ్మంగానే ఉన్నదిగాని అద్దాని యందు 'జగత్తు' అనబడునదేదీ భాసించటమే లేదు. భాసించకయూ లేదు. శిలయొక్క ఘనీభూతమగు మధ్యభాగమువలె ఇదంతా కూడ చిద్ఘనమే అయివున్నది.

ఈ జగత్తు చైతన్యం యొక్క స్ఫురణ మాత్రమే కదా! అందుచేత ఇదంతా కూడా నిరాకారమగు చిదాకాశరూపమే అయి వెలయుచున్నది. అంతేకాదు. ఎచ్చటెచ్చట చిన్మాత్రము ఉంటుందో... అచ్చటచ్చట అద్దాని చమత్కారమే అగు స్ఫురణ రూపజగత్తు ఉండనే ఉంటుంది.

చిదాకాశం సర్వత్రా ఉన్నది. ఆ చిదాకాశమే సర్వజగత్ రూపంగా వర్తిస్తోంది. ఇది 'జగత్తు' అని చెప్పబడుచున్నప్పటికీ, ఇదంతా కూడా సర్వదా నిర్వికారమగు బ్రహ్మమే అయివున్నది.

ఓ రాజా! పరమపురుషార్థమయినట్టి 'మోక్షము' పట్ల మాత్రమే ఇచ్ఛగల శ్రోతలకు ఏదో యుక్తితో బ్రహ్మమును విశదీకరించటానికి "ఇది జగత్తు, ఇది స్వప్నము, ఇది బ్రహ్మం" అని మొట్ట మొదట చెప్పుచున్నాం. "జగత్తుగా కనిపించేదంతా బ్రహ్మమే కాబట్టి జగత్తు లేదు. బ్రహ్మమే ఉన్నది" అని అతిత్వరగా బోధించటానికి మేము ఉత్సాహవంతులమౌతున్నాం. యుక్తితో ఆగిపోకూడదు. అనుభవమే అన్నిటికీ ప్రమాణం అందుచేత నా అనుభవాన్ని అనుసరించి ఈ జగత్తుగా కనిపించేదంతా బ్రహ్మమే! (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ); నేను బ్రహ్మమే స్వరూపముగా కలవాడను! (అహమ్ బ్రహ్మాఽస్మి); ఈ జగత్తంతా నా రూపమే! (సోఽహమస్మి); నీవు నా స్వరూపమగు బ్రహ్మమే అయివున్నావు! (త్వమేవాఽహమ్).

జగత్తుకు అతీతమైన నేను (పరమాత్మ), జగత్తులోని నేను (జీవాత్మ), జగత్ సంబంధమైన నాది (అహంకారం), జీవాత్మ యొక్క ఇంద్రియాలు (ఉపకరణాలు), ఈ జీవాత్మ యొక్క 'త్వమ్' ప్రత్యయం (ఇంద్రియ విషయాలు, దృశ్య జగత్తు) – ఇవన్నీ కూడా సదా, సర్వదా ఏకైక స్వస్వరూప బ్రహ్మమే అయివున్నాయి.

**యథాస్థిమ్ ఇదం విశ్వం తథా సంస్థమ్ అనామయమ్**
**బ్రహ్మైవ నిరవద్యాత్మ చిత్సంకల్పపురాకృతి ॥**

ఈ జగత్తు యథాతథంగా చైతన్యము యొక్క సంకల్పనగరాకాశం కలిగియున్నదై, నిర్వికారమై సర్వదా బ్రహ్మమునకు (మొదలే) అభిన్నమై వెలుగొందుతోంది. ఈ జగత్తే కాదు. స్వప్న జగత్తు కూడా అంతే! అదంతా కూడా బ్రహ్మమే! ఇప్పటి ఈ జగత్తే కాదు! ప్రతి జీవునికి కనిపించే భూత – వర్తమాన – భవిష్యత్ జాగ్రత్ స్వప్న జగత్తులు, వాటి యొక్క ద్రష్టలు... ఇవన్నీ కూడా సర్వదా బ్రహ్మమే అయివున్నాయి. ఎవ్వరైనా ఎక్కడైనా మరింకేదైనా జగత్తుగా దర్శిస్తుంటే... "వారు బ్రహ్మమునే అట్లట్లుగా దర్శిస్తున్నారు"... అని గ్రహించినవాడివై ఉండు.

**ప్రజ్ఞప్తి మహారాజు :** మహర్షీ! మరి ఈ జగత్తును అధిగమించి బ్రహ్మమును పొందటం ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :**

**లోకే శాస్త్రేఽథ వేదాదౌ యత్సిద్ధం సిద్ధమేవ తత్**
**సదస్త్వ సద్వాత్మని తద్ధాతుం శక్యం న వా క్వచిత్ ॥**

ఓ రాజా! ఎవరు ఏ భావనతో ఎట్లు దర్శిస్తే అది వారికి అట్లే బ్రహ్మమే సర్వదా అనుభవ మౌతోంది. లోకాచారాలు గాని, శిష్టాచారాలుగాని, శాస్త్రములందు ఏది చెప్పబడుచున్నదో... వేదాలలో ఏది సిద్ధాంతీకరించబడుతోందో... అది అట్లే వారికి స్వకీయ భావనానుసారమే సత్యమైన దగుచున్నాయి. సత్యమగు బ్రహ్మము గురించిన అద్వైత సిద్ధాంతం కావచ్చు. ద్వైతము గురించిన సిద్ధాంతం కావచ్చు... ఇవన్నీ ఏవీ త్యజించబడవు. అనగా... ఈ జగత్తు ఇతఃపూర్వం ఇట్లాగే ఉన్నది. ఇప్పుడు, మరొకప్పుడు కూడా ఇట్లాగే ఉండటం జరుగుతోంది. అయితే, నీ దృష్టి పవిత్రమై నప్పుడు... ఇది జగత్తుగా కాకుండా బ్రహ్మముగానే అగుపిస్తోంది. అనగా జ్ఞాన ప్రాప్తికి పూర్వం (అబ్రహ్మపరంగా) కనిపించిన జగత్తు 'చరమసాక్షాత్కార వృత్తి' రూపమగు ఆత్మ జ్ఞానమునందు

లయించగా "ఈ జగత్తే బ్రహ్మం" అని అనుభూతమౌతోంది. కనుక "ఈ జగత్తులోని ఏది త్యజించాలి? ఈ జగత్తును ఎట్లా జయించాలి?" అనే ప్రశ్న అసంగతమైనదే కదా! నీ దృష్టిని పవిత్రము, సూక్ష్మము, విస్తారము సమున్నతము చేసుకొన్నవాడివై "ఇదంతా బ్రహ్మమే" అనేది గమనిస్తూ దర్శిస్తూ ఆస్వాదించు (దృష్టిమ్ జ్ఞానమయమ్ కృత్వాత్ పశ్యేత్ బ్రహ్మమయమ్ జగత్). ఇంతకుమించి నేను బోధించగల ఉత్కృష్టమైనదేదీ లేదు. "దేహమే బ్రహ్మము. బ్రహ్మమే ఈ దేహము" అను నా ఈ వాక్యము యొక్క పరమార్థమును గ్రహించి జీవన్ముక్తుడవై ద్రష్ట – దృశ్యములను (నీవు – నీకు కనబడే దృశ్యములను) భ్రమభావం నుండి బ్రహ్మభావమునకు తరలించు. ఈ కనబడే "జీవుడు, దృశ్యం, జీవన్ముక్తి". మొదలైన సమస్త జగత్తు బ్రహ్మమే! నేను చెప్పిన ఈ న్యాయం (సిద్ధాంతం)పరమ పురుషార్థోపాయం అయివున్నది. కనుక గ్రహించుటకు యోగ్యం అయివున్నది."ఈ దృశ్యం దృశ్యంగా కనిపించటం" అనేది అపరిజ్ఞాత యొక్క దృష్టి మాత్రమే! అపరిజ్ఞాతాత్మమాత్ర రూపమగు ఈ 'జగత్తు' అనే మహావృక్షంలో పరిజ్ఞాతాత్మకమగు చిదాకాశమునకు వేరుగా ఒక అణువు కూడా లేదు.

పరిజ్ఞాతాచిదాకాశమంతా నేను అయివున్నాను. నేనుగా ఉన్నది సర్వదా ఆ పరిజ్ఞాతా చిదాకాశమే! అపరిజ్ఞాతంగా ఉన్నది కూడా పరిజ్ఞాత చిదాకాశమే. ఈ మూడు లోకములు – ఈ బంధ మోక్షములు... ఇవన్నీ నేనే అయివున్నాను.

**యథాస్థితమిదం దృశ్యం పరిజ్ఞానాత్ విలీయతే**
**తజ్జస్యాత్ సంగతస్యైవ శిలామౌనం తు శిష్యతే ॥**

యథారీతిగా స్థితి కలిగి ఉన్న ఈ దృశ్యమంతా కూడా 'జ్ఞానము' అనే వెలుగు ప్రసరించగానే పరిపూర్ణంగా లయించిపోతోంది. చీకట్లో పిశాచాకారంగా కనిపించిన మోడుబారిన చెట్టు యొక్క పిశాచాకారం వెలుతురు పడగానే ఏమౌతోంది? వెలుతురులో ఆ చెట్టుపట్ల ఏర్పడిన పిశాచదృష్టి క్షణంలో తొలగిపోతుంది కదా! "ఇది జగత్తు, ఇది దేహం, ఇది దృశ్యం"... మొదలుగా గల వ్యవహారమంతా కూడా ఆ విధంగానే జ్ఞానమునందు లయించిపోతోంది. అట్టి జ్ఞానికి ఇక ఆపై ఇదంతా కూడా... (ఇద్దాని దృశ్యరూపమంతా) నశించిపోగా... అప్పుడు వాక్కుకు అగమ్యమైనట్టి 'దృక్' మాత్రమైన 'చిద్ఘనాత్మ'గా అనుభవమౌతోంది.

ఓ మహారాజా! వేదములచేత, శాస్త్రములచేత, జీవన్ముక్తులచేత ఏ దృష్టిచే "ఇదంతా బ్రహ్మమే (సర్వం ఖల్విదమ్ బ్రహ్మ)" అని ఎలుగెత్తి చాటబడుచున్నదో... అట్టి దృష్టిని సముపార్జించుకొని, ఆ వాక్యమును స్వానుభవం చేసుకోవటమే నీ పరమావధి అగుగాక! అదియే పరమ పురుషార్థమగు మోక్షము. అది ఇప్పుడే ఇక్కడే సముపార్జించుకో!

**ప్రజ్ఞప్తి మహారాజు :** స్వామీ! 'సర్వము బ్రహ్మము' అనే జీవన్ముక్తుల మోక్షరూప దృష్టిని నేను సముపార్జించుకోవటమెట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఇతరములైన పదార్థ–దేహ–భౌతిక దృష్టులన్నీ త్యజించి బ్రహ్మమునే చిరకాలం భావించు. "నాకు కనబడే ఇష్ట – అయిష్ట జనుల రూపము బ్రహ్మమే" అని మననం చేస్తూ ఉండు. చిరకాల భావనచే బ్రహ్మం ఎవరికైనా ఎక్కడైనా తప్పక అనుభూతం కాగలదు. అసత్యం అభ్యాసవశం

చేత 'సత్యం'గా అనుభవమౌతూవుంటే... ఇక సత్యం సత్యంగా ఎందుకు అభ్యాసవశంచేత అనుభూతం కాకుండా ఉంటుంది? కనుక లౌకికమైన పదార్థాలు కూడా అనన్య భావనచే సదాశివ బ్రహ్మంగా తప్పక దర్శించబడగలవు. ఎందుకంటే... లౌకికత్వం అసత్యం, బ్రహ్మం సత్యం అయి ఉన్నది కదా! ఆ రెండింటి భేదం అంత మాత్రమే! సాధన, ప్రయత్నం, తత్ఫలానుభవాలలో ఆ రెండింటికీ ఏమాత్రం భేదం లేదు. ఎవడు ఏది సత్యమనుకుంటే అది ఆతనికి సత్యంగా అనుభవ మౌతోంది. నీవు మాత్రం "బ్రహ్మ సత్యమ్ – జగన్మిథ్య" అను సారవాక్యమును గ్రహించి అభ్యసించు. ఓ మహాబుద్ధీ! మహాత్మా! ప్రజ్ఞప్తి మహారాజా! ఈ ప్రకారంగా నీ మహాప్రశ్నలకు సమాధానం చెప్పాను.

ఈ సమాధానాలు సుదీర్ఘ విచార ఫల నిర్ణయాలై ఉన్నాయి. నేను చెప్పిన మార్గంలో "అంతా బ్రహ్మమే" అను అభ్యాసముచే నీవు శారీరక – మానసిక వ్యధారహితుడవు కాగలవు. ఏ దృశ్యవ్యసనమూ లేక... సర్వోత్కృష్టుడవు అవుతావు!

❖❖❖

# 10. పునః స్పష్టం – పునః స్పష్టం! జగత్ బ్రహ్మైవ కేవలమ్!

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ ప్రియ రామచంద్రా!ఈ ప్రకారంగా ఆ కుశద్వీపంలోని ఐలావతీ నగరంలో ఒకానొక సమయంలో నాచే ఆ ప్రజ్ఞప్తి మహారాజుకు జ్ఞానోపదేశం చేయటం జరిగింది. నీ యొక్క పవిత్ర దృష్టి యొక్క పరిపుష్టి కొరకై ఈ సందర్భంలో చెప్పాను. ఆ తరువాత, ఆతడిచే పూజింపబడిన వాడనై తిరిగి దైవకార్య నిమిత్తం అక్కడి నుండి స్వర్గలోకం చేరడం జరిగింది. అట్టి ఉత్తమ జ్ఞాన దృష్టిచే నీవు ప్రశాంత మనస్కుడవు కాగలవు. కేవల చిదాకాశ స్వరూపుడవై ఉండగలవు.

**బ్రహ్మైవ తదిదం సర్వం నిర్నామైవామలం నభః**
**కిమస్యేవాజమాశాంతమ్ ఆదిమధ్యాంత వర్జితమ్ ॥**

ఓ రామచంద్రా! ఈ సమస్తం కూడా. ఆది మధ్యాంత రహితం, జన్మాది వర్జితం, మహాశాంత స్వరూపం, అనిర్వచ నీయం, శబ్దశూన్యం (నిశ్శబ్దరూపం), ఆకాశం వలె నిర్మలం, అగు చిద్రూప బ్రహ్మమే అయివున్నది! 'పరమాత్మ'కు 'బ్రహ్మం' అనే శబ్దం కూడా కల్పితమైనదే అవుతుంది. ఎందుకంటే 'కూటస్థం' అయిన దానికి 'బృహత్' అనే శబ్దార్థమైనట్టి వృద్ధి మొదలైనవి లేనేలేవు. శబ్దరహితమగు ఆ నిర్మల పరమాత్మ పదాన్ని "చిన్మాత్రం" అని, 'పరాత్పరం' అని శాస్త్రములు శబ్దార్థ పూర్వకంగా అందిస్తున్నాయి.

**శ్రీరాముడు :** మహాత్మా! సిద్ధులు, సాధ్యులు, యముడు, బ్రహ్మదేవుడు, విద్యాధరులు, దేవతలు – మొదలైన వారికి ఆధార భూతాలైన లోకాలు మనకు కనబడతాయా? ఏ ఉపాయంతో కనిపిస్తాయి?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు చెప్పిన ఆ లోకాలన్నీ కూడా ప్రతి రాత్రి – ప్రతి పగలు, ముందు – వెనుక, పైన – క్రింద అందుకు సంబంధించిన ధ్యానము– ఏకాగ్రతలను ఆశ్రయించి, ఎవరైనా "చూడాలి" అని అనుకుంటే చూడగలరు. లేకపోతే చూడలేరు.

**ఈ సిద్ధుల లోకములు రెండు విధములు -**

1. దూరస్థ లోకాలు (మహర్లోకం, తపోలోకం, సత్యలోకం మొదలైన దూర లోకాలు).
2. సర్వత్రా వెలయుచు సర్వ ప్రసిద్ధమైయున్న సంకల్ప లోకాలు.

...ఈ రెండింటిచేతా ఈ బ్రహ్మాండమంతా వ్యాపించి ఉన్నది. 'ధారణాభ్యాసము'చే ఆ రెండు విధాలైన లోకాలు సందర్శించవచ్చు. ధారణాభ్యాసం లేకపోతే వాటిని ఎవరూ దర్శించలేరు.

అయితే... సిద్ధుల లోకాలు కల్పనామాత్రమే! అట్లాగే ఈ మనలోకం కూడా కల్పన చేతనే సిద్ధించినదై ఉన్నది. వాయువు కల్పనారూపమే అయినప్పటికీ సర్వత్రా పరిభ్రమిస్తోంది కదా! అట్లాగే వారి లోకాలు కూడా కల్పనామాత్రమే అయివుండి సర్వత్రా పరిభ్రమిస్తున్నాయి. ఇక ఆ సిద్ధ లోకాలు ఎటువంటివంటావా? నీకు నీ 1.సంకల్పలోకం, 2.స్వప్నలోకం ఎట్లా రాత్రింబవళ్ళు భాసిస్తున్నాయో... అట్లాగే ఆయా ఇతర లోకాలన్నీ కూడా ఆయా కల్పనా పురుషులచే మనో కల్పనగా రచించబడినవై భాసిస్తున్నాయి. అట్లాగే నీవు కూడా నీ యొక్క యోగసాధనచే 'స్థిరము' చేయబడిన 'ధారణ' ద్వారా స్వసంకల్పితంగా ఆయా లోకములకు 'స్థిరత్వం – నిశ్చలము' ప్రసాదిస్తే అప్పుడు అటువంటి లోకాలు నీ పట్ల స్థిరత్వం పొందగలవు. అదే విధంగా ఏ ధ్యాత అయినా సరే ...దృఢతరమైన "సంకల్పభావన"తో కూడివుంటే అప్పుడాతడు కూడా ఆయా సిద్ధుల వలెనే తన కల్పిత లోకాలలో తనకు అభిమతమైనట్టి విస్తారమైన సంపదలతో కూడివున్నవాటినిగా స్థిరములుగా గాంచగలుగుతాడు. అయితే ఇక్కడ ఒక విశేషం మాత్రం ఉన్నది. అదేమిటంటే... ఆయా సిద్ధ లోకాలు పొందినట్టి పూర్వపుణ్య సంపత్తి చేత ఆయా సిద్ధులచే ఆయా లోకాలన్నీ అనాయాసంగా పొందబడుచున్నాయి.

అట్లా కాకుండా వర్తమానపు 'ధారణ' అనే అభ్యాసంచేత ఏ యోగి అభిలషిస్తాడో ఆతడు అట్టి లోకాలు శ్రమచే స్థిరముగా చేయుచున్నాడు! ఈ జగత్తు, ఆ లోకాలు... అన్నీ కూడా సదా "శాంతం, నిరాకారం" అయినట్టి చిదాకాశమే! ఈ జీవుడు దృఢ నిశ్చయంతో కూడుకొని ఉంటాడో... ఆతనికి చిదాకాశమే ఆ విధంగా భాసిస్తోంది. అంతకు మించి వేరే ఏమీ లేదు.

**శ్రీరాముడు :** ఏ నిశ్చయమూ లేని మనుజునకో?...

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఏ నిశ్చయము, ఏ సంకల్పము లేని మనుజునకు ఏ లోక–దృశ్య సంబంధమైన తర్క –వితర్కములు ఉండవు. విషయత్వము ఉండదు. కనుక ఆతనికి ఈ సమస్త జగత్తు దృశ్యశూన్యము, నిరాకారము, ప్రతిబంధ రహితము అగు చిదాకాశముగానే గోచరిస్తోంది.

అనగా... దృఢ నిశ్చయముచే ఏదేది భాసిస్తోందో... అదంతా కూడా చిత్స్వభావం వల్లనే ప్రకాశమానమై గోచరిస్తోందని గ్రహించు! వాస్తవానికి ఈ దృశ్యరూపమగు ఆ సంవిత్తునందు దృశ్యాభిమానము లేదు. చిత్ సత్తావ్యాప్తి లేదు. ఇట్లు భాసించేది మిథ్య (లేక) దృష్టియే! ఉద్దేశమును అనుసరించే దృష్టి, దృష్టిని అనుసరించి దృశ్యము అనుభూతమౌతున్నాయి.

ఇక చిదాకాశము పట్ల 'కార్య–కారణ' ప్రసంగమే లేదు. ఎందుకంటే 'అనంతము' అయినట్టి చిదాకాశంలో ఏది ఎట్లు జనించగలుగుతుంది? మరిక ఈ "జీవులు–భూములు" మొదలుగాగల

ఏదైతే ఉత్పన్నమైనట్లుగా భాసిస్తోందో...అదంతా కూడా, "చిదాకాశమే చిదాకాశమున అట్లు అభ్యాసవశం చేత అగుపించటం" అగుచున్నది. ఈ ప్రకారంగా రూపరహితమైన ఆ చిదాకాశమే అంతటా అన్నీ అయివుండగా (ఈ లోకము, సిద్ధలోకములు కూడా అయివుండగా) ఇక అద్దానిలో ద్వైత-ఏకత్వాల కల్పన ఎక్కడిది? అద్దానిలో కార్యకారణ భావన ఎక్కడిది? స్వప్నంలో చిదాకాశమే 'పర్వతం' రూపంగా కనిపించినప్పటికీ... వాస్తవానికి చిదాకాశం నిర్వికారంగానే వెలయుచున్నది కదా! అట్లాగే జాగ్రత్తులో కూడా చిదాకాశమున ఏదీ ఉత్పత్తి వినాశనములు కలిగి ఉండనప్పటికీ... అదియే ఈ వివర్తరూపమునకు అధిష్ఠానమై ఉండటం చేత... సర్వదా నిర్వికారమేఅయి, స్థితినొంది ఉన్నది. స్వప్నంలోను, సంకల్పంలోను చిత్తమే ఆకారాన్ని కల్పించి ఆయా పర్వతాదుల రూపం దర్శిస్తు న్నట్లుగా, (అందులో పర్వతాలు, ఆకాశం వాస్తవానికి లేనట్లే) బ్రహ్మమునందు ఈ జగత్తు లేనేలేదు. కాబట్టి మహాబుద్ధిమంతులగు జీవన్ముక్తులు ఈ ప్రపంచంలో వాక్ ఇంద్రియాలతో వ్యవహరిస్తున్నప్పటికీ అంతరంలో శిలా విగ్రహంలాగా మహామౌనాన్ని అవధరించి నిర్వ్యాపారులై వెలయుచున్నారు.

జలము, జలతరంగం ఒకదానికి మరొకటి అభిన్నమే కదా! తరంగాలు పరివర్తనం పొందినా కూడా జలం యథాతథమే కదా! అట్లాగే బ్రహ్మంలో ఈ సృష్టులు బ్రహ్మానికి అభిన్నాలై వెలయు చున్నాయి. వాయువులో వాయుతరంగాలు, ఆకాశంలో శూన్యం అభిన్నంగా మూర్త - అమూర్తంగా వెలయుచున్నట్లు బ్రహ్మంలో సృష్టులు మూర్తామూర్తంగా బ్రహ్మమునకు వేరు కానివై వెలయు చున్నాయి. సంకల్ప నగరం వాస్తవానికి శూన్యం, నిరాకారం అయినప్పటికీ సాకారంగా ఎదురుగా కనిపిస్తూ ఉంటున్నట్లే, బ్రహ్మంలో ఈ జగత్తు కనబడుతోంది. అట్లాగే యమలోకాది తదితర జగత్తులు కూడా! ఈ త్రిలోకాలు దీర్ఘకాలంగా అనుభూతం అయినప్పటికీ... లౌకిక-పారలౌకిక కార్య సమర్థమై ఉంటున్నప్పటికీ... ఇదంతా కూడా శూన్యం, నిరాకారం అయి ఒప్పుచున్నది. చిత్త రూపమే స్వప్నాంతర్గత విశేషాలన్నీ అయినట్లు, ఈ జగత్తుగా కనిపించేదంతా చిత్తం యొక్క రూపమే!

ఒకడు తాను మరణించగా, బంధువులు ఏడ్చుచు తన దేహమును శ్మశానంలో కట్టెలతో కాల్చినట్లు కలకంటూ ఉంటాడు. తానే మరణిస్తే స్వప్నం ఎక్కడిది? స్వప్న బంధువులు ఎవరు? వారెవరూ లేనేలేరు కదా! అట్లాగే ఈ జగత్ పదార్థములు కొంచెము కూడా లేవు! ఈ జగత్తు (సృష్టి) - ఇద్దాని అభావం (ప్రళయం)... ఇవి రెండూ నిర్మల పరమాత్మ రూపాలే అయివున్నాయి. అధిష్ఠాన రూపంచే పరమాత్మ రూపాలు. ఆరోపిత రూపంచే అవి సత్యములే కావు. త్రాడే పాముగా కనిపించినప్పటికీ... త్రాడునందు పాము లేదు కదా! పాముగా కనిపించేది త్రాడేకానీ, పాము సత్యం కాదు కదా!

ఓ రామచంద్రా! ఈ విధంగా నాచే చెప్పబడుచున్నట్లు సిద్ధలోకములు కల్పనా మాత్రమే అయివుండవచ్చు. లేక మరొకరు చెప్పునట్లు అవి వారి దృష్టిలో నిజంగా ఉండివుండవచ్చు. కాదా, మరొక విధంగా మరొకరు అనుకోవచ్చు. ఏది ఏమైతేనేం? జీవన్ముక్తునికి వాటి పట్ల ఆదరణ ఉండవలసిన పనేమున్నది? ఓ రామచంద్రా! ఓ సభికులారా! నశ్వరములైన (శాశ్వత ఫలములు

కానట్టి, ఎప్పటికైనా నశించబోవునట్టి) సిద్ధులు – సిద్ధ లోకములు... ఇటువంటి వాటి గురించిన అభిలాషచే పరమ పురుషార్థము వదలి ఉండకండి. కొండను సొంతం చేసుకొన్న తరువాత గులకరాయి కావాలి అని ఆశయము, పురుషార్థము ఎవడు కలిగివుంటాడు? ఓ సభికులారా! ఓ రామచంద్రా! మీరంతా నాచే బోధించబడి బ్రహ్మతత్వమును ఎరిగిన వారై ఉన్నారు. అందుచేత, "మాయా మాత్రములైన సిద్ధ లోకముల ఐశ్వర్యములను ఎరుగుట" అనే శ్రమ వలన వచ్చే ప్రయోజనం ఏమున్నది? కనుక అట్టి శ్రమతో మీకుగా పనిలేదని నా అభిప్రాయం!

❖❖❖

## 11. అజ్ఞానం దుఃఖ కారణం

**శ్రీరాముడు :** హే మహర్షీ! ఈ జగత్తు వాస్తవానికి కల్పనా మాత్రమే అయినప్పటికీ.... ఈ జీవుడు ఇందులో ప్రవేశించి అనేక దుఃఖ పరంపరలను పొందటం మాత్రం జరుగుతోంది. ఈ జీవునికి సర్వ దుఃఖాలు మొదలంటా ఉపశమించేది ఎట్లా? అందుకు ఉపాయంకాగల పాఠ్యాంశమును సంక్షిప్తంగా తెలియజేయండి.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! మొట్టమొదట చిదాకాశరూపమగు బ్రహ్మము మాత్రమే ఉన్నది. ఇప్పుడు కూడా కేవలం బ్రహ్మమే ఉన్నది. ఇక ముందు కూడా సర్వదా బ్రహ్మమే సర్వత్రా ఏర్పడి ఉండబోవుచున్నది. అట్టి బ్రహ్మము సదా-సర్వదా-సర్వత్రా ఆనందమయమేగాని దుఃఖ మయం కాదు. అద్దానియందు జగత్తు కల్పితదృష్టియేగాని వాస్తవం కాదని నేను అత్యంత సుస్పష్టంగా వ్యక్తీకరించి ప్రకటించియున్నాను కదా! వాస్తవానికి లేని జగత్తు దుఃఖకారణం ఎట్లా అవుతుంది? "ఈ జీవుడు అజ్ఞాన దృష్టిచే దృశ్యమును సరిఅయిన రీతిగా అన్వయించుకోవటం చేతనే దుఃఖం పొందటం జరుగుతోంది" అని మనం చెప్పుకోక తప్పదు. "ఈ సృష్టి ఎక్కడి నుండి వస్తోంది? ఈ దృశ్యమునకు జనన స్థానం ఏమిటి?" అనే ప్రశ్నలకు ఇక్కడ సమాధానం మరల గుర్తుచేస్తాను. అది గ్రహిస్తే సర్వదుఃఖాలు తమంతట తామే తోక ముడుస్తాయి, విను.

చిదాకాశమగు బ్రహ్మము 'చిత్ (ఎరుగుట) అనే ఒకానొక స్వభావము స్వతఃగా కలిగి ఉన్నది. బ్రహ్మమే చిదాకాశము. అట్టి 'చిత్ స్వభావము'తో "నేను సమష్టి జీవరూపుడను" అను సమష్టి అహంకార రూపంగా తనను తాను ఎరుగుచున్నది. కనుక ఆ సమష్టి జీవాహంకారము చిత్ స్వభావ రూపమే! చిత్ స్వభావము బ్రహ్మమే కదా! కనుక సమష్టి జీవాహంకారపురుషుడగు బ్రహ్మదేవుడు (లేక) హిరణ్యగర్భుడు స్వతఃగా బ్రహ్మమే అయివున్నాడు. ఆతని సంకల్ప రూపమగు సమష్టి అహంకారము కూడా బ్రహ్మమే!

అట్టి సమష్టి అహంకారము యొక్క రూపకల్పనయే ఈ జగత్తు. కాబట్టి ఈ జగత్తుగా కనిపించే సమష్టి జీవాహంకారుడగు హిరణ్యగర్భుని (బ్రహ్మదేవుని) జగత్ దేహం స్వతఃగా బ్రహ్మమే అయివున్నది. కనుక...

పరబ్రహ్మం → స్ఫురణరూప జ్ఞానం → హిరణ్యగర్భరూపత్వం → జగత్తు

ఈ నాలుగు పర్యాయపదములే! అభేదములే! వేరు వేరు కావు.

బ్రహ్మము యొక్క సంకల్పమాత్రమే ఈ సమస్తం అయివున్నది. నీవు – నీ ఊహలో స్ఫురించే ఒక కొండ వేరువేరా? కాదు కదా! నీ ఊహలో కనిపించిన కొండ నీకు వేరుగా పుట్టినదెప్పుడు? తొలగేదెప్పుడు? మొదలే అది ఊహ కదా! అట్లాగే ఈ సమస్తము ఏదైవున్నదో... అట్టి బ్రహ్మము నందు వాస్తవానికి బ్రహ్మదేవుడుగాని, జగత్తుగాని ఒకింతకూడా జనించనే లేదు. అంతా కూడా ఇతఃపూర్వం లాగానే యథారీతిగా నిర్వికారము – జన్మరహితము అగు పరబ్రహ్మమే అయివున్నది. అయితే అజ్ఞానం కొనసాగుచున్న జీవునికి మాత్రం ఇదంతా 'జగత్తు'గా భాసిస్తూ ప్రతిభాసిక సత్యంగా ఒప్పుచున్నది. ఇది దృశ్యరూపంగా పారమార్థిక సత్యము కాదు! "ఇది కనిపిస్తోంది కదా! కనుక ఈ జగత్తు మాకు సత్యమే" అని ఎవరైనా అనుకొంటే, వారిని... "దూరంగా కొండలు నునుపుగా కనిపిస్తున్నాయి కదా! అవి నునుపేనని మీరు అనుకుంటున్నారా? ఎండమావులలో జలతరంగాలు కనిపిస్తున్నాయి కదా! అవి నిజమైన జలతరంగాలని మీరు అనుకుంటున్నారా?"... అని ప్రశ్నించు. లేదు కదా! అట్లాగే ఈ జగత్తు అనేక భేదరూపములతో కనిపించవచ్చుగాక! వాస్తవానికి ఇదంతా అభేదరూప బ్రహ్మమే! ఈ దృశ్యరూపం, సృష్టికాలం మొదలుగా – భ్రాంతిచే ఉదయించి భ్రాంతిచేతనే కొనసాగుచున్నది. వాస్తవానికి ఇది ఉదయించనే లేదు. "పుట్టని బిడ్డకు పేరు పెట్టటం" వంటిదే ఈ జగత్ దృశ్య చమత్కార ప్రాప్తి. ఎందుకంటే, అంతా కూడా నిర్వికార మగు బ్రహ్మమే అయివుండగా... అద్దానియందు 'భ్రాంతి' అనబడునది మాత్రం ఎక్కడున్నది? భ్రాంతి కూడా బ్రహ్మమే! అనేక తరంగాలు జలమునకు వేరుగా లేవు కదా! వేరుగా లేనట్టి తరంగాలకు ఏకత్వమెక్కడిది? అనేకత్వమెక్కడిది? నిరాకార జలం – సాకార జలతరంగాలకు భేదమే లేదు కదా! అట్లాగే, నిరాకార బ్రహ్మం – ఆ బ్రహ్మమునందు కనిపించే సాకార జగత్తుకు మొదలే భేదం లేదు. భేదమే లేనిదాని పట్ల ఏకత్వ–అనేకత్వ శబ్దాలు ఎట్లా పొసగుతాయి? చెప్పు!

కాబట్టి ...ఈ సమస్తం 'మహాశాంతము' అయినట్టి బ్రహ్మఘనమే అయివున్నది. విశాలమగు ఆకాశం తనయందలి శూన్యత్వమును అప్రయత్నంగాను, స్వతః సిద్ధంగాను ప్రదర్శించునదై ఉంటోంది కదా! అట్లాగే శుద్ధము, శాంతము అగు పరబ్రహ్మం కూడా తనయందు స్వతః స్సిద్ధంగాను, అప్రయత్నంగాను తనయొక్క 'చిత్స్వభావము' అను స్వతఃస్సిద్ధమైన విశేష భాగం చేత "సమష్టి అహంకారము"ను ఎరుగుచు అద్దానిని స్ఫురింపజేస్తోంది. ఇక ఈ వ్యష్టి అహంకారము కూడా సమష్టి అహంకారము యొక్క "స్వభావ సిద్ధము – అప్రయత్నపూర్వకము", అగు ప్రదర్శనమే అయివున్నది. కాబట్టి బ్రహ్మమే తనను తాను వ్యష్టి అహంకారముగాను, ఆ వ్యష్టి అహంకారమునకు ప్రాప్తిస్తున్న దృశ్య విభాగ చమత్కారంగాను వెలుగొందుచున్నది. వాయువు–చలనము, అగ్ని–ఉష్ణత్వము, పూర్ణచంద్రుడు–శీతలత్వము స్వభావసిద్ధమే అయినట్లు బ్రహ్మము–చిత్స్వభావము, హిరణ్యగర్భుడు–సమష్టి అహంకారం, సమష్టి–వ్యష్టి ఇవన్నీ స్వభావ సిద్ధంగానే ఏర్పడి ఉంటున్నాయి.

కనుక 'జగత్తు' ఒక పీడగా కాకుండా, క్రీడగాను, బ్రహ్మంగాను జీవన్ముక్తులు దర్శిస్తున్నారు. అందుచేత వారికి ఇక్కడ తొలగవలసినది గాని, క్రొత్తగా పొందవలసినదిగాని ఏదీ ఎక్కడా కనిపించ టమే లేదు. వారికి ఈ పదార్థ సత్తా సహజమైనది గాను, శుద్ధబ్రహ్మరూపంగాను అగుపిస్తోంది.

**శ్రీరాముడు :** హే మహర్షీ ఈ బ్రహ్మ చైతన్యము "అహంకారము, పదార్థ సత్త" మొదలైన వాటిని ఏ ఏ సమయాలలో స్ఫురింపజేయకుండా ఉంటోంది?

అట్టి పరబ్రహ్మము సదా "నిరావరణము, ఆద్యంత రహితము, అనునిత్యము" అయి వెలయున్నది కదా! అది సర్వదా వర్తించుచుండగా "అది సృష్ట్యాది యందు పదార్థములను స్ఫురింపజేస్తోంది"... అని మీరు ఎట్లా సిద్ధాంతీకరిస్తున్నారు.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రామచంద్రా! నీవు చెప్పినది సత్యమే! యౌక్తిక దృష్టితో (జగత్తు కలదు – ఇది ఎట్లా వచ్చింది? అనే దృష్టితో) చూస్తే... బ్రహ్మ చైతన్యము – "అహంకారము, జగత్తు" మొదలైన వాటిని నిజచైతన్య రూపంగా ఎల్లప్పుడూ ప్రకాశింపజేయుచునే ఉన్నది. అది స్వభావమేనని అనుకున్నాం కదా! అయితే, 'అనాది, జన్మరహితము' అగు పరబ్రహ్మమునకు – స్వరూప చైతన్యముచే ఏర్పడే స్వరూప ప్రాప్తియందుగాని, అవిద్యచే ఏర్పడే అహంకారము మొదలైన పదార్థముల స్ఫూర్తియందుగాని, మరొకదానియందుగాని ఎట్టి అపేక్ష ఉండదు. కనుక పరబ్రహ్మం నందు అజ్ఞానం చేత కనిపించే భావ–అభావములు (సృష్టి ప్రళయములు) చిదాకాశరూపములే అయివున్నాయి. "సృష్టి–స్థితి–లయములు" అనే మూడింటిలోనూ ఆ నిర్మల పరబ్రహ్మము సదా సర్వత్రా యధాతథంగా అప్రమేయమై వెలయుచున్నది.

అవిద్యాదృష్టిచే ఈ జగత్తు యొక్క యధార్థ తత్త్వమేమిటో ఎరుగబడటం లేదు. విద్యా దృష్టి చేతనో, ఈ జగత్తు ఒకింత కూడా లేనిదే అగుచున్నది. అంతా కూడా చిద్రూపమే! మిశ్రమ దృష్టిచే బ్రహ్మము, జగత్తులు ఒకదానికొకటి అభిన్నమై ఉన్నాయి. కాబట్టి "బ్రహ్మము, అహంకారాదులతో కూడిన జగత్తు" – ఉభయము అభిన్నరూపములై ఉన్నాయి. ఇక పరబ్రహ్మమో, సర్వదా స్ఫురించు చున్నదే అగుచున్నది. అది అంతటా అన్నిటా సర్వదా వేంచేసియు ఉన్నది.

❖

ఈ ప్రపంచసత్త దేహము కంటే భిన్నం కాదు. అది సమష్టి – వ్యష్టి జీవ కల్పనానుసారమే ఉన్నది కదా! అట్టి ఈ ప్రపంచము నిర్వికారము, ఆద్యంతరహితము అగు బ్రహ్మమే అయివున్నది.

ఓ రామచంద్రా! నీవు అద్వయమగు బ్రహ్మ జ్ఞానము కలిగివున్నప్పటికీ కూడా... అజ్ఞానమును తాత్కాలికంగా స్వీకరించావు. నా ఉపదేశ శబ్దములను ఆసక్త చిత్తుడవై మిశ్రమ దృష్టియగు ప్రపంచము, నిష్ప్రపంచములను పొందుచున్నావు. వాస్తవానికి తత్త్వదృష్టిచే బ్రహ్మము – జగత్తు అనబడు రెండూ లేవు. మిశ్రమ దృష్టిచే కూడా బ్రహ్మము సర్వస్వరూపము అయివున్నది కదా! అద్దానిలో ఏదైతే ఒకింతగా 'జీవుడు' అనే రూపంతో ప్రకాశింపజేయుచున్నదో... ఆ జీవరూపమును ప్రకాశింపజేసేది – ప్రకాశించుచున్నది బ్రహ్మమే అయివున్నది. కాబట్టి బ్రహ్మం ఎల్లప్పుడూ సమస్తముగా

ప్రకాశించుచునే ఉన్నది. ఇక నిర్విశేష దృష్టిచే బ్రహ్మము బ్రహ్మముగానే ఉన్నది. అది దేనినీ (అహంకారము మొదలైన వాటిని) ప్రకాశింపజేయటం లేదు. అహంకారాదులుగా అవటంలేదు. అయితే, సర్వుల అహంకార రూపంగా కనిపించేదంతా బ్రహ్మమే అయి వున్నది.

ఓ రామచంద్రా! "బద్ధజీవుడు" అని చెప్పబడేవాని దృష్టికి ఏ త్రిలోకములు కనిపిస్తున్నాయో... వాటి యొక్క వాస్తవరూపం బ్రహ్మమే! "బ్రహ్మమే సదా-సర్వదా నా స్వరూపంగాను - దృశ్యరూపంగాను భాసిస్తోంది" ...అనునదొక్కటే సర్వబంధములకు, సర్వదుఃఖములకు, సర్వ వేదనలకు ఔషధ రూపమైయున్నది. ఇక ముక్తుని దృష్టియందో... త్రిలోకములుగాని, నానాత్వముగాని ఒకింత కూడా భాసించటమే లేదు! అంతటా అన్నిటా సర్వత్రా పరబ్రహ్మమే సర్వాత్మకమై, ద్రష్ట - దృశ్య స్వరూపమై, సర్వదా నిర్మలము, అపరిచ్ఛేదము, అప్రమేయము అయి వెలుగొందుచున్నది.

ఓ రామచంద్రా! ఆకాశంలో వృక్షాలు - కొండలు ఉండవు కదా! అట్లాగే బ్రహ్మమునందు జగత్తులు జనించటం లేదు. నశించటం లేదు. జీవన్ముక్తులు ఈ విషయము ఎరిగి ఉన్నవారై పరమశాంతులై ఉంటున్నారు. అయితే ఇక నీవు మాత్రం "ఉపదేశము, ఉపదేశక్రమము" యొక్క ప్రవృత్తి కొరకు మాత్రమే "సందేహము" నివృత్తి అయ్యేవరకు, తత్త్వజ్ఞానము హృదయస్థం కానంతవరకు భేదమును నమ్ముము. అయినా కూడా "నేను అభేద దృష్టిని సముపార్జించాలి"... అనే ఆశయమును మాత్రం ఏమరువవద్దు. ఆ తదనంతరం భేదదృష్టి యుక్తియుక్తంగా తొలగుతూ ఉండగా, ఉత్తమమైన ఆత్మజ్ఞానం ఆవిర్భవిస్తోంది. అట్టి ఉత్తమోత్తమ ఆత్మజ్ఞానం ఆవిర్భవించిన తరువాత శబ్దబుద్ధిగాని, అహంకారము గాని, అద్దాని సంకల్పమాత్రమగు జగత్తుగాని, బ్రహ్మదేవుని సృష్టి విశేషాలుగాని, శాస్త్రములలో కనిపించే చర్చ - మీమాంసలు గాని నీ నిజస్వరూపము నందు స్థానము పొందజాలవు! స్వప్నంలో కనిపించిన ఇల్లు - కొండ నీ స్వరూపములోని (లేక దేహము యొక్క) విభాగాలౌతాయా? అవవు కదా! అట్లాగే ఈ దృశ్యము నీ స్వరూపములోని విభాగమని కూడా అనిపించుకోదు.

❖

**శ్రీరాముడు :** హే మహర్షీ! మీరు చెప్పేదంతా అత్యంత సముచితము, శ్లాఘనీయము, అత్యద్భుతము, యుక్తయుక్తము, అనుసరణీయము, సులభ గ్రాహ్యము అయివున్నది. ఇప్పుడిక "సమష్టి అహంకారం" అర్థం చేసుకోవటానికి వీలుగా మాకు బోధించండి.

మునీంద్రా! ఆ పరబ్రహ్మమునందు 'అహంత్వము' అనేది మొట్టమొదటగా ఎట్లా స్ఫురిస్తోంది? స్ఫురించిన తరువాత మరింకా ఏమగుచున్నది? సర్వజ్ఞులగు తమరు మాపై జ్ఞానామృతాన్ని వెదజల్లుచున్నారే! మీ మృదుమధుర ప్రసాద వాక్యాలు నాకు ఇంకా ఇంకా మరికొంత వినాలని కుతూహలం కొనసాగుచునే ఉన్నది.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** సరేఁ! జగత్తు యొక్క పురాణేతిహాస పూర్వక సృష్టిక్రమం చెప్పుచున్నాను విను.

ఆ పరబ్రహ్మమున 'అహంత్వము' స్ఫురించిన తరువాత 'ఆకాశసత్త' ప్రవర్తిస్తోంది. ఆ తరువాత 'దిక్ సత్తా', 'కాలసత్త' స్ఫురించి ప్రవర్తిస్తున్నాయి. ఆపై దేశ - కాల - వస్తుభేదసత్త ప్రవృత్తమౌతోంది.

ఇక ఆపై సమష్టి – వ్యష్టిత్వములు ప్రవర్తిస్తున్నాయి. ఇక అటు తరువాత 'చిదాకాశమయములే' అయివున్న దేశ – కాలాది సత్తల పరస్పర భేదములయినట్టి జాతి – గుణ – క్రియాదుల గూర్చిన భేదసత్త కల్పన ఏర్పడుతోంది. అనగా భేదమునకు సంబంధించిన అధ్యాస రూపుదిద్దుకుంటోంది. అయితే ఆ భేద వ్యవహారమంతా చిదాకాశమే సుమా!

ఆత్మకు ఎప్పుడైతే ఈ దేహాదులందు "ఇచ్చట నేను ఉన్నాను" అనునది ఏర్పడుతోందో, ఆ మరుక్షణమే "అచ్చటచ్చట (మరొకచోట) నేను లేను" అని కూడా అప్పటికప్పుడే భాసిస్తోంది. స్వాత్మయే... వస్తుకృత పరిచ్ఛేదము, దేశకృత పరిచ్ఛేదము... అను ఉభయ రూపములుగా (ద్వైత రూపంగా) ఉదయించుచున్నదై ఉంటోంది. ఆ చిదాకాశ మయములగు దేశ – కాలాది – సత్తల పరస్పర భేదములైన జాతి, గుణ, క్రియాదులతో గూర్చిన కల్పనచే ఈ నామరూపాత్మక జగత్తు యొక్క భేద అభ్యాసం సంభవిస్తోంది. వాస్తవానికి ఇదంతా చిదాకాశమే! ఈ ప్రకారంగా నిరాకారమగు "పరబ్రహ్మపదము" నందు 'అహంభావము' ద్వారా దేశ – కాలాదుల కల్పన సంభవిస్తూ ఉండగా, 'దృశ్యము' అనే పేరుగల ఈ జగత్తు ప్రకాశరూపంగా భాసిస్తోంది. అట్లా భాసించుచున్నదంతా బ్రహ్మము కానట్టి క్షణము ఎప్పుడూ లేదు. అనగా, శాంతము, జన్మరహితము, ఏకము, ఆది మధ్యాంతములనేవే లేనిది. జీవుడుగా, జగత్తుగా ఏమాత్రం భావన పొందనిది... అగు చిదాకాశమే

| | |
|---|---|
| జీవుడు 'అనుదానిని' తన యందు కల్పించుకుంటోంది. | ఆ జీవునికి ఉపాహారమగు 'దృశ్యము'గా తానే ప్రత్యక్షమై సుదీర్ఘంగా నామ రూపాత్మకంగాను, మార్పు చేర్పులతోను కొనసాగుతోంది. |

అనగా ఆ చిదాకాశమే ద్రష్టయగు జీవుని రూపముగా అయి, ఆ జీవాహంకారము నుండి తనయందే – అనగా నిరావరణమగు జీవసాక్షి రూపమైన చిదాకాశమునందే అతి విశాలమగు ఈ దృశ్యము దర్శిస్తోంది. ఆత్మజ్ఞానము కలుగనంతవరకు అట్టి చిదాకాశ ద్రష్టాహంకారము యొక్క చిదాకాశ మాత్ర దృశ్యదర్శన భ్రమ కొనసాగుచూనే ఉంటోంది. అయితే... చిదాకాశము సర్వదా యథాతథమే కాని దృశ్య రూపముగా గాని, ద్రష్ట రూపముగా గాని పరివర్తమవకుండానే, భావనా చమత్కారముచే ఈ జగన్నాటకమును నడిపిస్తోంది.

❖❖❖

## 12. ప్రాక్తన / పూర్వకల్ప శ్రీ వసిష్ఠ రామ సంవాదము

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ శత్రుమర్దనా! శ్రీ రామచంద్రా! ఇప్పుడు నీవు ఏ 'జగత్ తత్త్వం' గురించి, 'ఆత్మతత్త్వం' గురించి నన్ను అడిగావో... ఈ విషయమే పూర్వం జరిగిపోయిన కల్పములలోని ఒకానొక కల్పంలో రామావతారమున నన్ను అడిగావు. ఆ పూర్వకల్పంలో గురువైన నేను శిష్యుడ వగు నీకు ఎట్లా సమాధానం చెప్పటం జరిగిందో అది ఇప్పుడు మరల యథాతథంగా పునరుచ్చరిస్తాను.

**శ్రీరాముడు :** స్వామీ! ఇతఃపూర్వం కూడా మీరు నాకు బోధించియున్నారా? ఎప్పుడు? ఎట్లా?

**శ్రీ వసిష్ఠ మహర్షి :** అవును ఆ పూర్వకల్పంలో కూడా నీవు శ్రీరాముడవై ఉన్నావు. నేను వసిష్ఠుడనై ఉన్నాను. అప్పుడు కూడా నీకు ఇట్లాగే వైరాగ్యం కలుగగా నేను నిన్ను సమీపించటం జరిగింది. ఇద్దరం ఒకానొక ఆశ్రమంలో సమావేశమైనాము. గురు-శిష్య సంవాదరూపంలో మనిద్దరి మధ్య ప్రశ్న - సమాధానాలు కొనసాగాయి. నాకైతే ఆ చిత్ చమత్కారమంతా ఇప్పుడే కొద్ది క్షణాల క్రితం జరిగినట్లుగా గోచరిస్తోంది. అప్పుడు నీవు నన్ను ఇట్లా ప్రశ్నించావు.

❖

**ప్రాక్తన శిష్యుడు :** హే మహాత్మా! ఈ కనబడే సమస్త జగత్తు విషయమై నాకొక గొప్ప సంశయం ఏర్పడుతోంది. ఆ సంశయమును ఛేదింప వేడుకొనుచున్నాను. 'మహాకల్పము' యొక్క అంతము సమయమున ఏది నశిస్తోంది? ఏది అప్పటికీ కూడా నశించక - శేషించియే ఉంటోంది?

**ప్రాక్తన గురువు :** బిడ్డా! ఒకడు ఒక సుదీర్ఘమైన కల కంటున్నాడనుకో! అప్పుడు ఆతడు గాఢనిద్రలో (స్వప్న రహిత సుషుప్తిలో ప్రవేశించినప్పుడు)... ఏది నశిస్తుంది? ఏది శేషిస్తుంది? స్వప్న దృశ్యమంతా నశించినదై ఆత్మమాత్రంగా శేషిస్తోంది కదా! అట్లాగే మహాప్రళయమందు కూడా... దృశ్యమంతా నశిస్తోంది. దృశ్యమున్నప్పుడే ద్రష్ట కదా! దర్శనమే లేకపోతే ద్రష్టగాని దృశ్యముగాని ఉండవు కదా! అట్లాగే... దృశ్యమంతా ద్రష్టతో సహా నశించిపోగా... అవన్నీ ఎద్దానియందు లయము పొందుచున్నాయో... అట్టి దృక్ స్వరూపమగు ఆత్మ మాత్రమే శేషిస్తోంది? అనగా ఇప్పుడీ దృశ్యంలో అంతర్గతమై ఉన్న ఈ భూమి, ఆకారం, పది దిక్కులు, క్రియ, కాలక్రమము, సమస్త భూతములు (జీవులు)... ఇవన్నీ నశించినవై, కొంచెము కూడా ఏ మాత్రం మిగలనివై 'అవ్యాకృతాకాశము' నందు లయించిపోతున్నాయి. సముద్ర జలతరంగాలు సముద్ర జలంలోనే లయిస్తున్నట్లు ఈ సర్వం అవ్యాకృతాకాశంలో విలీనమై పోతున్నది. ప్రళయంలో భోక్త ఉండదు. ఇక భోగ్యం ఎట్లా ఉంటుంది? అట్లాగే కారణములన్నిటికీ కారణరూపములగు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్రాదుల పేర్లు కూడా ఆ మహాకల్పాంతంలో ఇక ఉండజాలవు. ఓ ప్రియశిష్యా! ఈ దృశ్యం త్రిమూర్తులతో సహా అవ్యయమగు చిద్వస్తువు యొక్క వివర్త రూపాలే కదా! అట్టి ఈ దృశ్య జగత్తు నశించిపోగా అప్పుడు కేవలము నిర్మల చిదాకాశమే శేషిస్తోందని అనుమానించ బడుతోంది. ఎందుకంటావా? ఈ సృష్టులన్నీ అధ్యస్తమై ఉన్నది, ఈ సృష్టుల అనుభవమునకు సర్వదా హేతువై ఉంటున్నది కూడా కేవల సాక్షియగు చిదాత్మయే కదా! అట్టి చిదాత్మచేతనే సర్వ ప్రపంచ శూన్యరూపమగు ప్రళయము కూడా సిద్ధిస్తోంది. ఏ సాక్షి చిదాకాశము నుండి ఈ దృశ్య జగత్తు ఆవిర్భవించిందో... అట్టి సాక్షి చిదాకాశం యొక్క సాక్షిత్వ ప్రకర్షణయగు ఈ దృశ్య జగత్తు ఇక ఆపై నిర్మల, కేవల చిదాకాశముగా శేషిస్తుందనటంలో (అనుభవం అవటంలో) ఆశ్చర్యమేమున్నది?

**ప్రాక్తన శిష్యుడు :**

> **నాఽసతో విద్యతే భావో, నాఽభావో విద్యతే సతః**
> **ఇదం తత్కథమాభోగి విద్యమానం క్వ గచ్ఛతి?**

గురువర్యా! అసత్ పదార్థానికి ఉనికియే లేదు. సత్ పదార్థానికి 'లేమి'యే లేదు కదా! కాబట్టి ఈ విశాలంగా విద్యమానమై ఉంటున్న ఆకాశము – భూమి – సముద్రాలు – నక్షత్రాలు – జీవులు మొదలైన అనేక విశేషములతో కూడిన జగత్తు ప్రళయంలో ఎక్కడికి వెళ్ళుచున్నది? ఏం రూపం పొందుతోంది?

**ప్రాక్తన గురువు :** ప్రియ శిష్యా! శ్రుతులు మాయచే ఎదురుగా కనిపిస్తున్న నామరూపాత్మకమైన మాయాజగత్తు యొక్క అభావమును (జగత్తు జగత్తుగా లేదు. దీనికి అధిష్ఠానమై ఉన్న ఆత్మవస్తువును దర్శించండి అని) సూచన చేస్తున్నాయి. దర్శింపజేస్తున్నాయి. అంటే సత్యమగు జగత్తు (జగత్తు ఆత్మయే కనుక) సత్యమగు ఆత్మ యొక్క అభావమును కాదు. ఈ పదార్థముల యొక్క భ్రమత్వము ప్రత్యక్ష ప్రమాణములచే శాస్త్రములచే ప్రసిద్ధమయ్యే ఉన్నది."మాయా జగత్తు యొక్క నాశనము" అని శాస్త్రములు ప్రతిపాదించేది "మాయచే దర్శించు జగత్తు వాస్తవానికి లేదు" .... అని సుస్పష్ట పరచటం మాత్రమే! వాస్తవానికి ఈ జగత్తు స్వతఃగా లేదు. కాబట్టి నీవు చెప్పినట్లు

అసత్తు అగు దానికి ఉనికియే లేదు. ఉనికియే లేని దానికి నాశనం మాత్రం ఎక్కడిదో చెప్పు?

సత్తు అగుదానికి 'లేమి' అనునదే లేదు. ఈ కనబడే జగత్తు బ్రహ్మముకాని క్షణమే లేదు. బ్రహ్మము ఈ కనబడే జగత్తుగా అయిన క్షణము కూడా లేదు. ఏదైతే వాస్తవానికి ఉన్నదో (సత్ స్వరూపమగు ఆత్మ) అది అసత్తు ఎన్నటికీ కాదు. (అది లేకపోవటం, మరొకటిగా అవటం అనేది ఎప్పుడూ ఎక్కడా జరుగదు) సత్తుకు నాశనమనేదేదీ లేదు. ఎక్కడైనా మృగతృష్ణాజలం స్థిరమై ప్రతిష్ఠ కలిగినదై కొంతకాలంగాని, అల్పకాలంగాని, దీర్ఘకాలం గాని ఉన్నదా? మృగతృష్ణలో మొదలే జలం లేదు కదా! ఇక అది ఎంతకాలం జలరూపంలో ఉంటుందన్న ప్రసక్తి ఎక్కడిది? రెండవ చంద్రుని గురించిన భ్రమ స్థిరంగా ఉన్నదెప్పుడు? ఆకాశంలో (భ్రమచే కనిపించే) కేశాలు ఎక్కడున్నాయి? అంతెందుకూ? భ్రమ సిద్ధమగు అనుభవానికి స్థిరత్వం ఎక్కడున్నది? "సర్ప – రజ్జుభ్రాంతి"లో "త్రాడు పాముగా ఎంతకాలం ఉంటుంది?" అని అడిగిన వారికి సమాధానం ఏమి చెప్పాలి? "త్రాడును త్రాడుగా తెలుసుకోనంతవరకు"... అని మాత్రమే అనగలం కదా!

ఓ పుత్రా! ఈ దృశ్యమంతా భ్రాంతి మాత్రమే!

అసన్మయము (స్వతఃగా లేనిది, భ్రమచే అనుభవమగుచున్నది) అయివున్నది. స్వప్నంలో పురంలాగానే ఈ జాగ్రత్ దృశ్యమంతా భాసిస్తోంది. కాబట్టి ఇది (భ్రమ తొలగగానే) నశించకుండా ఎట్లా ఉంటుంది? అసత్తుకు భ్రమ తొలగటం చేత వినాశనము అనివార్యమైయున్నది. జాగ్రత్తుకు వచ్చేసరికి స్వప్నం నశించటం లేదూ? స్వప్నంలో ప్రవేశించే ద్రష్టపట్ల జాగ్రత్తు స్ఫురణలో లేకపోవటం ప్రతి జీవునియొక్క దైనందిన అనుభవమే కదా! అట్లాగే ఏది వర్తమానంలో ఘనీభూత దృశ్యముగా అనుభూతమౌతోందో,.... అదంతా కూడా "ఆత్మజ్ఞానము" అనే మెలుకువచే సర్వత్రా సర్వదా సంపూర్ణంగా శమించి పోతోంది. జ్ఞానము వికసించినప్పుడు ఈ జగత్తంతా ఎక్కడికి పోతోందంటావా?

జాగ్రత్తులోకి రాగానే ఆ జీవుడు అంతదాకా దర్శించిన స్వప్న దృశ్యం ఎటుపోతోంది? అట్లాగే ఈ దృశ్య జగత్తు కూడా ఆత్మ జ్ఞానముచే మొదలంట్లా శమించినదై ఎటకో శీఘ్రంగా పోవుచున్నది. (లేక) ఆత్మయందే లయిస్తోంది. జగద్దర్శనమంతా ఆత్మదర్శనంగా విరాజిల్లుతోంది.

**ప్రాక్తన శిష్య రాముడు :** మహాత్మా! ఈ దృశ్యము కొంచెము కూడా లేనట్లయితే...మరి, కొంచెము కాలము ఈ దృశ్యముగా కనిపిస్తున్నదేది? మరల జ్ఞానప్రాప్తి తరువాత భాసించకుండా ఉంటున్నదేది? అసలు ఈ "భాసించటం, భాసించకపోవటం" అనేది దేని రూపమైయున్నది? చిదాకాశమే ఈవిధంగా జగత్తుగా భాసించటం, జ్ఞాన ప్రాప్త్యానంతరం జగత్తుగా భాసించకపోవటం నిర్వర్తిస్తోందా ఏమి?

**ప్రాక్తన గురువు :** బిడ్డా! ముత్యపు చిప్ప (శక్తి)లో అద్దాని చాకచక్యం చేతనే వెండి (రజితము)వలె స్ఫురిస్తోంది కదా! అట్లాగే నిర్మలమగు చిదాకాశమే నిజ 'చిత్ స్వభావం' చేత ఈ విధంగా 'జగత్తు' రూపంగా స్ఫురిస్తోంది. అంతేగాని జగత్తు అనబడేది వేరుగా ఎక్కడా లేదు. ఆ నిర్మలచిత్తు తన నిర్మలచిత్‌స్వభావమును త్యజించకుండానే ఈ విధంగా విశాల జగత్తుగా భాసించటం అద్దాని స్వభావమే అయివున్నది. ఆకాశం నీలంగా కనిపించటం అద్దాని స్వభావమే కదా! అవయవి యొక్క అవయవములు ఆతని స్వభావమే కదా! అట్లాగే, దృశ్యరూప 'స్ఫురణ – అస్ఫురణ', 'సృష్టి – ప్రళయములు' – ఇవన్నీ కూడా చిదాకాశము యొక్క స్వరూప చమత్కారములే అయివున్నాయి.

నీవు నిర్మలమైన జలాశయం సమీపించావనుకో! అందులో నీకు వినీలాకాశం ప్రతిబింబితమై కనబడుతోంది. స్నానం చేద్దామనో, (లేక) ఆ ప్రతిబింబ వినీలాకాశాన్ని పరిశీలిద్దాం అనో ఆ నీళ్ళలో ప్రవేశించావనుకో! అప్పుడేమౌతుంది? నీటి యొక్క కదలికచే ఆ ప్రతిబింబాకాశము జలాశయంలో కనిపించక క్షయిస్తుంది. ఆ ప్రతిబింబాకాశం ప్రతిబింబిస్తున్నప్పుడు, క్షయిస్తున్నప్పుడు కూడా వాస్తవాకాశం అక్షయమై యథాతథంగా ఒకే రూపంతో ఏర్పడి ఉంటోంది కదా! అట్లాగే నిర్మలమగు బ్రహ్మము కూడా సృష్టి – ప్రళయములందు అక్షయమై, ఏకరూపమై సర్వదా యథాతథంగా వెలుగొందుచున్నది. ఓ రామా! అట్టి నిశ్చల, ఏకరూప, అక్షయ చిదాకాశరూపుడవే నీవు కాని... సాకార ప్రతి బింబమాత్రమగు భౌతిక రూపుడవు, (లేక) మనోరూపుడవు కాదు!

స్వప్నమునందు – సుషుప్తి యందు నిద్ర సదా ఏకరూపమే అయివున్నది కదా! అట్లాగే సృష్టి – ప్రళయములందు అక్షయమగు చిద్రూప బ్రహ్మము సదా ఏకరూపముగానే ఏర్పడినదై ఉంటోంది. స్వప్నంలోని జగత్తు మెలుకువ వచ్చేసరికి ఏ విధంగా పూర్ణంగా శమిస్తోందో... అట్లాగే ఈ మన దృశ్య జగత్తు కూడా 'జ్ఞాన బోధ'చే బోధ దశయందు సంపూర్ణంగా శమించినదగుచున్నది. మనం స్వప్న జగత్తును ఏమని చెప్పుకుంటాం? "అది శూన్యము" అని అంటాం కదా! ఎందుకు? మెలుకువ రాగానే స్వప్నంలోని వస్తువులేవీ ఇక్కడ జగత్తులో కనిపించటం లేదు కాబట్టే కదా! అంతేగాని "నాకు కనిపించిన స్వప్నంలోని జగత్తు ఎక్కడో అంతదూరంలో ఉన్నది"... అని ఎవరూ అనుకోవటం లేదే? లేక, "ఆ స్వప్నంలోని జీవులు అది అట్లా అనుభవించటం కొనసాగుచుండగా నేను మాత్రం ఇటు వచ్చేశాను"... అని ఎవరైనా అనుకుంటున్నారా? లేదే! ఎందుచేత? ఎందుచేతనంటే, మన

వాసనామయ ప్రపంచమున మన వాసనలే ఆయా రూపాలుగా స్వప్నంలో కనిపించటం జరుగుతోందని మనకందరికీ తెలుసు కాబట్టే! మన వాసనామయ ప్రపంచం మన జీవాకాశంలోనే సంభవమౌతోంది గాని, అది అన్యులకు సంబంధించినది కాదని తెలుసు గనుక!

ఓ రామచంద్రా! ఇక్కడ ఒకానొక ముఖ్య విశేషం చెప్పుతాను! సునిశితమైన బుద్ధితో విను. మన చిదాకాశమునందు చిదాకాశమే మనకు జగత్తుగా స్ఫురించటమే "సృష్టి". మన చిదాకాశము నందు సృష్టిగా స్ఫురించిన జగత్తు జ్ఞానదృష్టిచే చిదాకాశముగా అనిపించటమే ప్రళయము.

ఇది గ్రహించావా? ఇప్పుడు మరొక ప్రశ్న. మనకు స్ఫురించే జగత్తు మనకు చిదాకాశ రూపంగా కనిపించవచ్చుగాక! కాని తక్కినవారి (అప్రబద్ధుల) జగద్రూప స్ఫురణ మనవలెనే చిదాకాశ రూపంగా అవవలసిన పనేమీ లేదు కదా! మన ప్రళయము వారి 'జగత్ రూప స్ఫురణ' యందు ప్రవేశించవలసిన అగత్యం లేదు. మనకు తొలగిన జగత్తు తక్కిన వారిలో (మనవలెనే ఆత్మదృష్టిగా) స్ఫురించకపోవటం మనకు ప్రమాణ. అ ప్రమాణములు కావు.

**ప్రాక్తన శిష్య రామచంద్రుడు :** మహాత్మా! మీరు చెప్పిన ప్రకారంగా మన సంవిత్తు యొక్క సృష్టి – ప్రళయములు మరొకని సంవిత్తులో ప్రవేశించదు కదా! అనగా ఒకడు నిద్రించటం, మరొకడు మెలుకువతో ఉండటం ఒకే గదిలో జరుగుతోందనుకోండి. అప్పుడు నిద్రపోయే వాని స్వప్న జగత్తు మెలుకువగా ఉన్నవాడు పొందడు. మెళకువగా ఉన్నవాని జాగ్రత్ జగత్తు నిద్రపోయేవానికి ఉండదు. అనగా అదే దృష్టాంతం తీసుకొని పరిశీలించగా... ఇప్పుడు నాకు అనిపిస్తున్నదేమిటంటే... ఒకడు ప్రళయం పొందుతూ ఉంటే, అది రెండవానికి సృష్టిరూపంగా భాసించవచ్చు.ఒకడు జగత్ సృష్టి పొందుచుండగా మరొకడు 'ప్రళయము'ను పొందుచున్నవాడవవచ్చు. అదేసమయంలో ఒకనికి జగదాది బుద్ధి, మరొకనికి ప్రళయబుద్ధి ఏర్పడి ఉండవచ్చునని నాకు అనిపిస్తోంది!

**ప్రాక్తన వసిష్ఠుడు :** ఓ మహాప్రాజ్ఞుడవగు శ్రీ రామచంద్రా! నీవు చెప్పింది సత్యమే! చైతన్యము చైతన్యముగానే వుంటోంది గాని, జగత్తుగా ఈ జగత్తు (నామరూపాత్మకంగా చూస్తున్నప్పుడు) చైతన్య స్వరూపమే అయివుంటే... అది సర్వసాధారణమై ఒకే రూపము కలిగి ఉండేది. కాని ఇది అట్లు ఉండటం లేదు. ఎట్లా అంటావేమో? ఒకానొక సుందర స్త్రీ బాటలో వెళ్ళుచున్నదనుకో!

ఒక బాటసారికి శృంగార భావాలు కలుగవచ్చు. మరొకరికి తన చనిపోయిన సోదరి గుర్తుకురావచ్చు. ఇంకొకరికి "ఇది కూడా పాంచభౌతిక శరీరమే"... అని అనిపించవచ్చు. వేరొకరు పరమాత్మ యొక్క సహస్రాది రూపాలలో ఇది కూడా ఒకానొకటి కదా... అని అనుకొని మననం చేస్తూ ఉండవచ్చు.

మరింకొకరికి "నా ఆత్మయే ఈ కనబడే రూపంలోని ఆత్మ. కనుక ఇదంతా నా భావనరూపమే కాబట్టి నా రూపమే"... అని అనిపించవచ్చు. కాబట్టి... ఈ రీతిగా చైతన్యమున అధ్యస్తమైయున్న ఈ జగత్తును చూచువారికి వారి వారి సంకల్పానుసారంగానే ఇదంతా భాసిస్తోంది. ఒకరికి ఎట్లా కనిపిస్తోందో.... ఆ రీతిగా మరొకరికి కనిపించటం లేదు. అనగా, ఈ జగత్తు ఎవరికి వారికి వారి సంకల్పానుసారంగా స్వరూప వ్యవస్థ కలిగి ఉంటోందని నిరూపించబడుతోంది కదా!

**న భాతి న చ తత్కించిన్న చ తత్కించిదేవ సత్**
**తచ్చిదాకాశకచనం కే తత్ర సదసద్దృశౌ ॥**

ఈ జగత్తు జనులందరికీ ఒకేరీతిగా భాసించటంలేదు. కాబట్టే 'ఇది తుచ్ఛం' అని చెప్పబడుతోంది. ఇది ఒకింత కూడా సత్తు కాదు. ఇదంతా కూడా ఆయా జీవులయొక్క 'స్ఫురణం' మాత్రమే అయివున్నది. కాబట్టి ఇక్కడ "ఇది సత్తు – ఇది అసత్తు"... అని ఎక్కడున్నది? ఒకవేళ "ఈ జగత్తు అధిష్ఠాన చిదాకాశ రూపముచే కలదు" అని అందామా? అట్లా అయితే బంగారం నిరాకారమే అయినప్పటికీ, ఏదో ఒక ఆకారం కలిగియే ఉంటున్నట్లు, చిదాకాశము ఉన్నచోట జగత్తు విద్యమానమై ఉండియే ఉంటోంది. ఇక దృశ్య రూపముగా ఇది ఒకింత కూడా ఎచ్చటా ఎప్పుడూ లేనేలేదు!

బ్రహ్మము పరమార్థరూపముచే 'సత్తు'గాను, వృత్తులచే కప్పబడి ఉండడంచేత 'అసత్తు'గాను ఉండటంచేతనే ఈ జగత్తంతా కూడా "సత్, అసత్' రూపమై భాసిస్తోంది. చిదాకాశరూపమగు బ్రహ్మము నాశరహితమే అయివుండటంచేత, చిదాకాశమయము అయివున్న ఈ జగత్తు కూడా నాశరహితమే అయివున్నది.

'సద్వస్తువు' అగు చిదాకాశమే సృష్టి – ప్రళయరూపములుగా కూడా అయివున్నది. ఆ చిదాకాశము ఎరుగబడనప్పుడు దుఃఖప్రదమగు సంసారముగా ప్రాప్తిస్తోంది. ఎరుగబడినప్పుడో... పరమశాంత రూపమగు మోక్షానుభవము కూడా అగుచున్నది.

**విద్యతే సర్వథైవేదం సర్వం సర్వత్ర సర్వదా**
**న విద్యతే సర్వథా చ సర్వం సర్వత్ర సర్వదా ॥**

'చిదాకాశాత్మతత్త్వము'ను ఎరిగిన జ్ఞానియగు మహనీయునికి బ్రహ్మమే సర్వదా సర్వరూపమై సర్వత్రా సదా సర్వదా వెలయుచున్నదగుచున్నది. అజ్ఞానికో... అది (బ్రహ్మము) ఎన్నడూ ఎచ్చటా ఏ రూపంగానూ లేనిదిగా అనిపిస్తోంది.

బ్రహ్మమే దేవతలుగా , ఘటముగా, పర్వతముగా, వస్త్రముగా, సకల వస్తు సమూహంగా, తటముగా, వృక్షముగా, గడ్డిగా, అగ్నిగా, స్థావరముగా (కదలనివిగా), జంగమముగా (కదిలేవిగా) – సమస్తములుగా అయివున్నదయ్యా!

కలదు–లేదు–శూన్యము. క్రియ–కాలము–భూతవర్తమాన భవిష్యత్తులు. భూమి–ఆకాశము–దిక్కులు. భావము–అభావము–భావాతీతము. జన్మ–నాశనము–ఐశ్వర్యము. శుభము–అశుభము–కర్మల యొక్క భవిష్యత్ ఫలములు.

ఈ మొదలైనవన్నీ కూడా ఆ పరబ్రహ్మమే అయివున్నది. ఏకం, నిత్యం అయినట్టి పరమాత్మ లేని పదార్థము, పరమాత్మ కాని పదార్థము ఈ బాహ్య అంతరములందుగాని, ఆది–మధ్య–అంతరములందుగాని, భూత–వర్తమాన–భవిష్యత్ (కాలత్రయం) లందుగాని ఎక్కడా ఏదీ లేనేలేదు.

**సర్వం సర్వేణ సర్వత్ర, సర్వదైవాత్ర విద్యతే ।**
**సర్వం సర్వేణ సర్వత్ర సర్వదా అత్ర న విద్యతే ॥**

ఆ అధిష్ఠాన రూపమగు పరబ్రహ్మమునందు సర్వంలో సర్వరూపాలచే, సర్వదా, సర్వత్రా జగత్తు కలదు. దృశ్యరూపందృష్ట్యా అంటావా... ఆ పరబ్రహ్మంలో ఏదియు ఏ రూపమున కూడా ఎన్నడూ ఎచ్చటాకూడా ఏమాత్రం లేనేలేదు! స్వప్నంలో అన్నీ ఉన్నాయి! కానీ ఏవీ లేవు కదా! స్వప్న చైతన్యము స్వప్నంలోని ఏ కించిత్ విభాగంలో వేంచేసిలేదు? అంతటా ఉన్నది. ఈ విధంగా స్వప్న నగరముల దృష్టాంతముచే సర్వము బ్రహ్మమయమే! కనుక సమస్తము యథాతథమే!

**తృణం కర్తృ, తృణం భోక్తృ, బ్రహ్మాత్మత్వాత్ తృణం విభుః**
**ఘటః కర్తా, ఘటో భోక్తా, ఘటః సర్వేశ్వరేశ్వరః ॥**

ఆ “గడ్డి పరక” కూడా బ్రహ్మమే అయివున్నది. అందుచేత అది కర్త – భోక్త – సర్వ వ్యాపకము అగు ఈశ్వరుడు కూడా! అట్లాగే ఈ కుండ కూడా బ్రహ్మమే కాబట్టి ఇది కర్త – భోక్త – ఇంద్రాది ఈశ్వరులకు కూడా సర్వేశ్వరుడు కూడా అయివున్నది.

**పటః కర్తా పటో భోక్తా, పటః సర్వేశ్వరేశ్వరః, దృశిః కర్తా దృశిర్భోక్తా దృశిః సర్వేశ్వరేశ్వరః,**
**గిరిః కర్తా, గిరిర్భోక్తా, గిరిః సర్వేశ్వరేశ్వరః, నరః కర్తా, నరోభోక్తా నరః సర్వేశ్వరేశ్వరః ॥**

ఈ విధంగా వస్త్రములు, నేత్రములు, పర్వతములు, మనుజులు ఇత్యాది... అన్నీ కూడా పరబ్రహ్మ స్వరూపమే కనుక దేనికి దానికే ప్రత్యేకంగా కర్త–భోక్త–ఈశ్వరేశ్వరుడు కూడా అయి వెలయుచున్నాయి. ఈ విధంగా సమస్తము బ్రహ్మస్వరూపమే అయివున్నది.

అందుచేత ప్రతి ఒక్క వస్తువునందు, అద్దాని యొక్క ప్రతి ఒక్కొక్క విభాగము నందు కూడా కర్త–భోక్త–ఆది మధ్యాంత రహితుడగు పరబ్రహ్మమూర్తి వేంచేసియే ఉన్నారు. ఈ తృణ (గడ్డిపరక) – ఘటములు (మట్టికుండ) ఆదిగాగల పదార్థాలన్నీ కూడా నిజసాక్షి అయి, సర్వవ్యాపకమైనట్టి ప్రత్యగాత్మ రూపముతోనే స్థితిని కలిగియున్నాయి. అంతేకాదు. దేనియందు అద్దానియొక్క ఉత్పత్తి–ఉనికి–వినాశనము భాసిస్తోందో... ఆ సమస్త రూపంగా సర్వవ్యాపకమగు బ్రహ్మమే అట్లు వెలయుచున్నది.

ఎవరి దృష్టిలో అయితే, “ఇదంతా కూడా ఎరుక (లేక) విజ్ఞానమునకు భిన్నమైనవి. ఇవి పాంచభౌతికము. ఇదంతా స్వకీయ లక్షణములతో కూడుకొని ఉన్నవి” అని అనిపిస్తోందో (వైశేషికులు, సౌతాంత్రికులు), అట్టి వారికి ఆ విజ్ఞానేతరమై సర్వేశ్వరతత్వమే కర్త – భోక్త కూడా అయి ఉంటోంది. ఎట్టి వాదులకు ఏఏ దృష్టిచే ఏమేమనిపిస్తోందో... అదంతా బ్రహ్మమే! బ్రహ్మమునందు బ్రహ్మమే అట్టి ద్వితీయ దృష్టిని ప్రదర్శించుకొనుచున్నదగుచున్నది. విజ్ఞాన వాదులకు (బౌద్ధులు) విజ్ఞానమే కర్త–భోక్త అగుచున్నది.

శూన్యవాదులకు – ఈ జగత్తుకు కర్తలేదు. అంతా శూన్యమే అయివున్నది. పాశుపతాదుల మతమునందు – ఈశ్వరుడే కర్త ఈశ్వరుడే భోక్త.

చూచావా రామచంద్రా! ఈ ప్రకారంగా “సర్వశక్తిమంతము” “సర్వరూపము” సర్వోత్కృష్టము” అగు బ్రహ్మమునందు సమస్తము సంభవిస్తున్నాయి. ఆ బ్రహ్మమునందు ఆయా మతవాదులకు

అభిమతమై ఉంటున్న పరస్పర విలక్షణములలైన విధి-నిషేధములు, తాత్పర్య-అతాత్పర్య వాక్యములు, జగత్ ఉత్పత్తి - వ్యావహారిక భాష్యములు అజివరోధపూర్వకంగా ఆయా మత గురువుల అభిప్రాయాలు ఆశ్రయించిన శిష్యులకు అట్లే అనుభూతమౌతున్నాయి. సమస్త వివర్తములకు అధిష్ఠానమైయున్న ఆ చిదాకాశమున సంభవించనిదేమున్నది? చిదాకాశమే 'శుద్ధస్వాత్మ' యందు ఆయా ఉపాధులలో ఆయా వాసనలను అనుసరించి... ద్రష్ట వలె అయివుండటం, దృశ్యమును భావన చేయటం, జగద్రూపమును దర్శిస్తూ ఉండటం జరుగుతోంది. అట్లా జరుగుచూ ఉన్నప్పటికీ ఆ చిదాకాశము సర్వదా నిర్వికారరూపముతోనే స్థితినొందియున్నది.

ఓ రామచంద్రా! సమస్త జీవులు పరస్పరం విలక్షణమైన దృష్టులు కలిగి ఉంటున్నారు. స్వానుభవసిద్ధములైన పదార్థానుభవాలు కలిగి ఉంటున్నారు. వారి వేరు వేరైన వివిధ రీతులైన విధి - నిషేధముల గూర్చిన అభిప్రాయములు, వివిధములైన సంకల్ప - అనుభవవిశేషములు కలిగినవారై వాసన - కామ్య - కర్మలను అనుసరిస్తూ ఆయా వ్యవహారములందు పాల్గొనుచున్నారు. వారి వారి కామ - కర్మ - వాసనలను అనుసరించి ఈ జగత్తులోని ఆయా విశేషాలు అర్థ - క్రియా సమర్థములు అగుచున్నాయి. వేరు వేరు దృష్టులు గల జీవులకు వేరు వేరైన విశేషాలు సత్యమని, మరొకరి దృష్టులు అసత్యములనీ అనిపిస్తూ వస్తోంది. ఈ విధంగా ఈ జగత్తులో అనేక అర్థ - క్రియ - కామ్య - వ్యవహారాదులన్నీ ఆయా జీవుల వాసనలను అనుసరించి పరిఢవిల్లుచున్నాయి. ఓ రామచంద్రా! ఆత్మదృష్టిచే వేరువేరుగా తమ తమ అనుభవముల దృష్ట్యా కనిపిస్తున్నదంతా "కుందేటి కొమ్ము" వలె అసత్యమే! పరబ్రహ్మమే సర్వరూపమై, సర్వానుభవములకు కారణమై తానుమాత్రం అప్రమేయమై ఉంటూనే ఈ జగత్ రచనకు ఆధారభూతమై ఉంటోంది. ఒక కథా రచయిత రచించిన కథలోని పాత్రలో తాను ఒకడు కాకపోయినప్పటికీ, .... కథలోని పాత్రలన్నీ ఆతని రచనా వ్యాసంగ చమత్కారమే అయివున్నాయి కదా! పరబ్రహ్మమే వస్తువుల యొక్క రూపమైయున్నది. జీవుల నిజ సంకల్పానుసారమే ఈ జగత్తు అనుభవమౌతోంది. ఈ విధంగా ద్రష్ట - దృశ్యముల వాస్తవ రూపం పరబ్రహ్మమే!

❖

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ దశరథరామా! ఈ విధంగా ఇతఃపూర్వం కాలగర్భంలో కలిసిపోయివున్న ఒకానొక కల్పమునందు - 'నీకు గురువునై నీకు నేను బోధించటం జరిగింది. అట్టి ప్రబోధచేకూడా అప్పుడు నీవు పూర్ణ ప్రబుద్ధుడవు అయివుండలేదు. అందుచేత మరల త్రేతాయుగంలో ఇచట దశరథ మహారాజు యొక్క ఈ అయోధ్యా సభలో నీ సమక్షంలో మరల ప్రబోధించటం జరిగింది. ఇక్కడ జన్మించి నీవు మరల అవే ప్రశ్నలను అడగటం, నీవు వాటికి ధన్యవాదాలు చెప్పటం ఈచిరవైరెండు రోజులుగా జరిగింది.

ఈ జన్మయందు నాచే ఉపదేశించబడినట్టి జ్ఞానమునంతా నీవు విన్నావు. నీ ద్వారా జనులకు ఈ మోక్షశాస్త్రాన్ని మరొక్కసారి సంపూర్తిగా అందించడం జరుగుతోంది. ఈ మన గురు-శిష్య సంవాదము మా తండ్రి బ్రహ్మదేవుని ఉద్దేశమును అనుసరించి ఆత్మజ్ఞాన శాస్త్ర నిరూపణ కొరకే

అయి వున్నది. ఈ మన సంవాదము ఆధ్యాత్మ శాస్త్రమును ప్రతిపాదించటంలో ఉత్తమమైనది. పరమార్థ వస్తువును శ్రోతలకు – పాఠకులకు గోచరింపజేసేది. సంసారము అనే సుదీర్ఘమైన రాత్రి యొక్క అంధకారమును, తాపమును పటాపంచలు చేయగలిగినది. బాధిస్తున్న సంసారాంధకారానికి పూర్ణ చంద్రబింబము వంటిది. అనేక మంది అభిప్రాయములను అనుభవములను క్రోడీకరిస్తూ, స్వానుభవమైన దానిని – విజ్ఞుల అనుభవమును నేను ఇప్పుడిక్కడ విస్తారంగా అనేక దృష్టాంతాల సహాయంతో బోధించాను.

ఈ నా చెప్పబడిన వాక్యములు విశ్వామిత్ర–నారదాది అనేకమంది సభికులగు మహనీయులైన శ్రోతలకు స్వానుభవము – నిత్యానుభూతియే అయివున్నది.

ఈ మన 'యోగవాసిష్ఠము' అనబడే శ్రీ వసిష్ఠ – రామ సంవాదముచే అనేకులు అజ్ఞానమును విశేషముగా తొలగించుకున్న వారగుచున్నారు. నిరతిశయానందరూపమగు "మోక్షము" అనే పరమ పురుషార్థమును సముపార్జించుకున్నవారగుచున్నారు. అట్లాగే నీవు అభ్యుదయమును పొంది నిర్మల బోధైక రూపుడవు అయి ప్రకాశిస్తున్నావు. ఈ ప్రకారంగా కృతకృత్యుడవైనావు.

ఇదంతా ఈ సభలో ప్రస్తావించుటచే నేను కృతకృత్యుడనైనాను. ఇదంతా ఈ సభకు వేంచేసిన అనేకమంది – శ్రీవిశ్వామిత్ర – వామదేవ – నిమి – క్రతు – భరద్వాజ – పులస్త్య – అత్రి – ఘృషి – నారద – శాండిల – భాస – భృగు – భారండ – వాత్స్య – వాత్స్యాయనాది మహనీయుల సంత్సాంగత్యవీక్షణా ప్రయోజనంగా భావిస్తున్నాను.

జగతఃపితరులు – నా పితృదేవులగు బ్రహ్మదేవుని ప్రసన్న వీక్షణములుగా స్వీకరిస్తూ వారికి ప్రణామాలు – జేజేలు పలుకుచున్నాను. వారిపాద పద్మములకు సాష్టాంగదండ ప్రమాణపూర్వకంగా సమర్పిస్తున్నాను.

❖

ఓ రామచంద్రా! ఇక, నీవు నీకు యథాప్రాప్తమైనట్టి అయోధ్యా సామ్రాజ్యానికి చక్రవర్తివై రాజ్యాధికారము నిర్వర్తిస్తూ సుఖముగా ఉండెదవు గాక! నిర్మల స్వభావ యుక్తము – సర్వత్రా ప్రకాశమానము – సర్వరూపము... అగు పరమ్మాత పదమునందు 'స్థితి'ని ఆస్వాదిస్తూ ఉండు.

సర్వ దృశ్యపదార్థ రహితుడవై ప్రకాశించెదవు గాక! నిర్వాణరూపమగు నిరతిశయానందమున ప్రశాంతుడవై ఉండెదవు గాక! తత్ఫలితంగా శాంతచిత్తుడవై, ఆకాశ కోశము వలె మనోహరుడవై దీపించెదవు గాక! తృష్ణా వర్జితుడవై సమదృష్టితో ధర్మపూర్వకంగా రాజ్యపాలన నిర్వర్తించెదవు గాక! సర్వాత్మకుడగు పరమాత్మకు సాష్టాంగదండ ప్రణామములు. లోకకళ్యాణమగుగాక. శ్రీరామావతారము లోకకళ్యాణకారకమై, శ్రీరామనామము తరతరాలుగా భక్తులకు సులభ – మోక్షమార్గమై చతుర్దశభువనాలలో ఆచంద్రార్కం వెల్లిలిరియునుగాక! స్వస్తి!

❖❖❖

# XVII. మహోత్సవం

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! ఆ విధంగా శ్రీ వసిష్ఠ మహర్షి అమృతముచే పరిపూర్ణమగు మేఘమువలె గంభీరంగా ప్రవచనం పూర్తిచేసి చిదానంద స్వరూపులై చిరునవ్వుతో వాక్యములు ముగించారు. అప్పుడు దేవతల దుందుభులు మ్రోగాయి. వెనువెంటనే ఆకాశం నుండి మరల పుష్పవృష్టి కురిసింది. అది "పుణ్యదేవతల నగరం నుండి ఆ ఉత్సవమును వీక్షించటానికి పుష్పగుచ్ఛాలు వేంచేసినాయా" అన్నట్లున్నది. ఆ సభలోని మునిగణం అక్కడ కురిసిన దివ్య పుష్పములను గైకొని శ్రీవసిష్ఠ మహర్షి పాదములకు సమర్పించారు. ఆ సభలోని సభ్యులు మహర్షి పాదములను శిరస్సును పుష్పాలంకారం చేయసాగారు. జనన – మరణాది అనేక జన్మల దుఃఖములను తొలగించగల శ్రీ వసిష్ఠమహర్షి మహావాక్యములను మననం చేస్తూ నెమ్మదిగా ఒకరితో మరొకరు సంభాషించుకోసాగారు. ఇంతలో శ్రీ దశరథ మహారాజు సింహాసనం నుండి లేచి నిలబడ్డారు. సభంతా నిశ్శబ్దం అయిన ఆయన చెప్పబోయేదది వినటానికి అందరూ సంసిద్ధులైనారు.

❖

**శ్రీ దశరథ మహారాజు :** హే మహాత్మా! అరుంధతీపతీ! సప్తర్షి మండల ప్రభూ! శ్రీవసిష్ఠ మహర్షీ! ఆకాశం నుండి పవిత్ర గంగాజలం జాలువారినట్లు మీ ముఖతః వచ్చిన ఆత్మజ్ఞాన స్రవంతి 'సంసారము' అనే వ్యవహారాణ్యంలో దారి – తెన్నుగాంచక సంచరించే మాకు అమృతప్రాయంగా ప్రాప్తించింది. ఈ రఘువంశంలో జన్మించి ఇంతకాలంగా శ్రమతో రాజ్యం ఏలినందుకు పరమ ప్రయోజనంగా మీ వాక్యాలు మాకు లాభించాయి. తమ అనుగ్రహంచేత మేమంతా "ఆత్మ తత్త్వమునందు ప్రవేశించడం సులభమే" అని గ్రహించిన వారమై ఉత్తమ ఆత్మ పదమునందు శాశ్వతమైన విశ్రాంతిని సముపార్జించుకొన్న వారమగుచున్నాము. హేభగవాన్! ఎంతగానో ఎదురు చూచినతరువాత పిల్లలకు ఆటవస్తువు లభిస్తే ఎంత ఆనందంగా ఉంటుందో, 'ఆత్మ' అనే క్రీడా స్థలం లభించగా మా మనోబాలకులు అంతగా కేరింతలు కొడుతున్నారు. "పరమ పురుషార్థ సిద్ధికై అవశ్యం ఆచరించవలసినదేమిటి? ఈ "మానవజన్మ"ను వరప్రసాదంగా మలచుకోవటం ఎట్లా? "జీవితము" అనే అవకాశమును సద్వినియోగపరచుకోవటం ఏమార్గంలో?"... అనే విశేషాలు మీ నుండి తెలుసుకున్నాం.

**కర్మణామవధిః పూర్ణో, దృష్టః సీమాన్త ఆపదామ్!**
**జ్ఞాతం జ్ఞేయమశేషేణ విశ్రాన్తాః స్మః పరే పదే॥**

మా కర్మల యొక్క అవధి ఏమిటో మాకిప్పుడు తెలియ వచ్చింది. జన్మ పరిపూర్ణమయింది. కృతకృత్యులమైనాము. ఆపదలు ఎక్కడ ముగుస్తాయో... అట్టి పరమావధి లభించింది. మీ యొక్క వాక్ప్రవాహమహిమచే 'జ్ఞేయము' అగు ఆత్మవస్తువును సంపూర్ణముగా ఎరిగినవారమైనాము.

పరమపదమున విశ్రాంతిని అనుభవిస్తున్నాం. ఆహాఁ! ఏమి ఆశ్చర్యం! కొన్ని కొన్ని ఉపమానములను ఉపకరణములుగా తీసుకొని మా దృశ్య దృష్టిని తొలగించివేశారు కదా!

– 'ధ్యానము'చే కల్పించబడిన మరొక ఆకాశములోని చిరకాలానుభవములైన భ్రమలను గురించిన ఉపదేశములు (లీలోపాఖ్యానం),

– యోగధారణచే సర్వాధారమగు బ్రహ్మము నందలి విశ్రాంతి ద్వారా ఈ దేహభావమును త్యజించటం (ఉద్దాలకోపాఖ్యానం మొదలైనవి),

– సంకల్పం స్వప్నములోని జగత్తువంటిదే ఈ వర్తమాన జాగ్రత్ జగత్తు అని నిరూపించటం,

– ముత్యపు చిప్పలో వెండిలాగా ఈ జగత్తులో ఏదో కావాలని – పొందాలని – అభిలాషోద్వేగం కలిగి ఉండటం భ్రమయేనని గుర్తుచేయటం,

– 'స్వప్నంలో స్వమరణం' దృష్టాంతంతో ఈ జగత్తుకు వేరుగా ఉన్నట్టి మా యొక్క స్వస్వరూపమును నిరూపించి చూపటం,

– వాయువు – వాయు తరంగముల అభిన్నత్వము ద్వారా ఈ జగత్తుగా కనిపించేది పరమాత్మ స్వరూపమేనని నిర్వచించటం,

– జలద్రవముల దృష్టాంతము ద్వారా జగత్తు ఆత్మయొక్క చమత్కారము – ఆత్మకు ధర్మమే అయివున్నదని చెప్పి మనో సంసారవేదనదృష్టిని ఉపశమిపజేయటం,

– ఇంద్రజాలంలో భ్రమలాగా జగత్తు అనేకత్వముగా కనిపిస్తున్నదని మా కనులకు దర్శింపజేయటం,

– మాయా పూర్ణములైన విశాలపురము యొక్క వర్ణన ద్వారా "ఈ జగత్తు దృష్టిలోనే ఉన్నది"... అని మాకు బోధించటం,

– మృగతృష్ణ దృష్టాంతము ద్వారా అసత్యము – నశ్వరము అయినట్టి జగద్ విభాగమును విడమర్చి విశదీకరించటం.

– "ఆకాశంలో రెండు చంద్రబింబాలు కనిపించటం" అనే దృష్టాంతము ద్వారా దృష్టి యొక్క దోషముచే అహంకార రూపములగు సంబంధ బాంధవ్యాలు అగుపిస్తున్నట్లు బోధించటం,

– "జీవుల ప్రాణములు సంస్కారపు పెట్టెలను మోసుకొని ఆకాశంలో ప్రకాశించటం" – అనే ఆకాశ జగత్ నగర దృష్టాంతముద్వారా ప్రతి జీవుడు తనయందు అనేక జగత్తులను అజ్ఞాన దృష్టితో కలిగియే ఉన్నాడని అజ్ఞానాన్ని ఎత్తి చూపించటం,

– భ్రాంతిచే పిల్లవానికి గోచరించే భూకంపము వంటిదే అజ్ఞానదృష్టికి కనిపించే ఆశ – దురాశ – నిరాశల జగత్ వ్యవహారమని మమ్ములను సంస్కరించటం.

– 'ఆకాశములో కేశములు' అను దృష్టాంతంద్వారా భ్రమచే కనిపించే జగత్ విషయ పరంపరల నుండి మమ్ములను బోధచే సముద్ధరించటం.

ఈ ప్రకారంగా అనేకమంది మహాత్ముల అనుభవములను, మీ స్వానుభవములను, అనేక దృష్టాంతములను, సోదాహరణములను పరికరములుగా తీసుకొని మా యొక్క జన్మజన్మార్జిత

దృశ్యదృష్టిని కడిగివేశారు. అట్టి మీకు మేము ఏమి ఇచ్చుకొని మీ ఋణం తీర్చుకోగలం? మీ పాదాలకు శతధాసహస్రధా సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించుకుంటున్నాను. నా సర్వస్వము ఇక సర్వదా మీ కనుసన్నలలోనే ఉండునట్లుగా నియమితుడను అగుచున్నాను.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఈ విధంగా అత్యంత కృజ్ఞతాపూర్వకంగా కనులు చెమర్చుచుండగా శ్రీ దశరథ మహారాజు పలికిన పలుకులకు "ఔను! అట్లే అగుగాక! మా సర్వస్వము శ్రీ వసిష్ఠ మహర్షి పాదములకు సమర్పించబడినవై ఉండుగాక" అని సభికులు లేచి కరతాళ ధ్వనులు చేశారు. కొన్ని క్షణాలు గడచిపోయాయి. అప్పుడు శ్రీరామచంద్రుడు లేచి నిలబడి సద్గురువగు శ్రీ వసిష్ఠ మహర్షికి హస్తమస్తకంగా వినమ్రుడై నమస్కరించాడు. అప్పుడు "ఆహాః! ఈ బాలకుని వలన కదా, మనం ఈ కాలంలో ఈ ఆత్మజ్ఞాన విశేషాలు శ్రీ వసిష్ఠ మహర్షి ముఖతః వినియున్నాం! ఈతడు ఋషులు చెప్పినట్లు జీవన్ముక్తుడే అయినప్పటికీ మన సందేహాలన్నీ స్వామియగు శ్రీ అరుంధతీపతి ముందు ఉంచాడు! ఈతడే మంటాడో విందాం!"... అని తలచారు. సభంతా మరల నిశ్శబ్దం అయింది.

❖

**శ్రీరాముడు :**

**నష్టోమోహః పదం ప్రాప్తం, త్వత్ప్రసాదాత్, మునీశ్వర!**
**సంపన్నోఽహమహం సత్యమత్యన్తమ్ అవదాతధీః ॥**

ఓ మునీశ్వరా! 'ఆత్మబోధ' అనే అమృతవర్షంచేత నేను పునీతుడనైనాను. తమ అనుగ్రహంచేత నా మోహము – అజ్ఞానము నశించాయి. ఆత్మ పదమును పొందాను. అత్యంత శుద్ధమైన బుద్ధిని పొందినవాడనై, నేను ఇప్పుడు సాక్షాత్ బ్రహ్మస్వరూపడనైనాను. మీ దయచే ఈ దశరథ రాముడు ఇప్పుడు "శ్రీరామబ్రహ్మము" అయి ప్రకాశిస్తున్నాడు.

**స్థితోఽస్మి గత సందేహః! స్వభావే బ్రహ్మరూపిణి!**
**నిరావరణ విజ్ఞానః। కరిష్యే వచనం తవ ।**

గురువర్యా! ఇప్పుడు నేను సందేహరహితుడను అయ్యాను! ఆవరణ రహితమగు "పరమాత్మ విజ్ఞానము"ను మీ వాక్ప్రవాహ ప్రభావంచే సంపాదించుకున్నాను. బ్రహ్మ స్వభావమున స్థితిని పొందినవాడనయ్యాను. ఇక తమ ఆజ్ఞను అనుసరించి ఆసక్తిరహితుడనై రాజ్యపాలన అయినా, అరణ్యవాసమైనా మరింక ఏమి ప్రవాహపతిత నియమిత కార్యములైనా నిర్వర్తించటానికి సంసిద్ధుడనై ఉన్నాను.

**స్మృత్వా స్మృత్వా అమృతానేక సౌఖ్యదం వచనం తవ**
**అర్థితోఽపి చ శ్రాంతోఽపి హృష్యామీవ ముహుర్ముహుః ॥**

హే మహాత్మా! మీ వాక్యములు అమృతముచే తడుపబడినట్లు అత్యంత మధురంగాను, సౌఖ్యప్రదంగాను ఉన్నాయి. అట్టి మీ వచనములు మరల మరల స్మరించి ఆనందిస్తూనే ఉంటాను.

ఇకపై నేను పూజించబడినను, అవమానించబడినను, నాపట్ల హర్ష – శోకములు ఉదయించజాలవు. ఒక్కమాటలో చెప్పాలంటే "పరమ శాంతుడనై ఆనందం పొందుచున్నాను."

దేవా! ఇప్పుడు నాకు ఈ ప్రపంచంలో ఏవైనా నిర్వర్తించుటచే గాని, నిర్వర్తించకుండటం చేతగాని ప్రయోజన – నిష్ప్రయోజనములు లేనివాడనైనాను. పూర్వం ఎట్లా వ్యవహారమునందు స్థితి కలిగి ఉంటున్నానో, అది అట్లే కొనసాగుగాక! అట్టి వ్యవహారములచే ఇతఃపూర్వం ఏ సంతాపం జనిస్తూ ఉండేదో... అట్టి సంతాపము ఇప్పుడు నాకు లేకయేపోతోంది. సంతాప రహితుడనై ప్రశాంతమును స్వభావ సిద్ధముగా పొందుచున్నవాడనగుచున్నాను. తమ వచనములతో నాకు ఎటువంటి విశ్రాంతి, ఉపాయం లభిస్తుందో, .... అట్టి విశ్రాంతిగాని, ఉపాయముగాని మరింకెక్కడా ఉండజాలదు. ఆహాఁ! నేనిప్పుడు అపరిచ్ఛిన్నమగు విశ్రాంతి భూమిపై అడుగులుంచినవాడనయ్యాను. ఇప్పుడు నాకున్నది ఒకే ఒక విచారం.

తమ ఉపదేశము పొందనట్టి ప్రాణులయొక్క జనన మరణములతో కూడిన అనర్థమగు సంసార దశ ఎంత భయంకరమైనది! వారి దుఃఖ శమనమునకై నా సర్వస్వము సహకరించునుగాక!

మహాత్మా! నా కిప్పుడు శత్రువు అనేవాడు ఎవడూ లేడు! మిత్రుడూ లేడు! క్షేత్రము (శరీరము దృశ్యము) కూడా లేదు. దుర్జనుడుగాని, సజ్జనుడుగాని ఎవరూ లేరు. స్వాత్మ చైతన్యమే అజ్ఞానం ఉన్నంత వరకు సంక్షుబ్ధమై దుఃఖప్రదమగు జగత్తునందు వర్తిస్తోంది. ఇప్పుడు మీ కరుణా కటాక్ష వీక్షణ చేత అట్టి అజ్ఞానం బోధితమైనది కదా! అందుచేత ఇప్పుడు నా మనస్సు – బుద్ధి కూడా ప్రశాంతముగాను, సర్వార్థ సుందరంగాను వెలయుచున్నాయి.

గురువర్యా! తమ అనుగ్రహం లేకపోతే ఇటువంటి శుద్ధమగు ఆత్మదృష్టి మేము ఎట్లా ఎరుగగలం? ఈ జనులు తమ ఆత్మోన్నత్యమును ఎట్లా ఆస్వాదించగలరు? అందుచేత మన ఈ సంవాదము అనేకమంది సంసార పరితప్తులగు దీనజనుల చెవులకు చేరి వారిని ఆత్మానుభవమునందు స్నానము చేయించునుగాక! నావ లేనిదే ఎవడూ సముద్రమును దాటలేడు కదా! మీ 'బోధ' అనే నావ సంసార సముద్రమును అనేక మంది జనులచే దాటివేయించగలదు. సద్గురువులగు మీకు సర్వదా కృతజ్ఞుడను.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** ఓ భరద్వాజా! అప్పుడు అక్కడి సభికుల కరతాళ ధ్వనులు ఆకాశాన్ని అంటాయి. అప్పుడు శ్రీరామచంద్రుని సోదరుడు లక్ష్మణుడు లేచి నిలబడ్డాడు. సభంతా మరల నిశ్శబ్దమయింది.

❖

**లక్ష్మణుడు :**

> **జన్మాంతరోపచిత సంశయ నాశనేన, జన్మాంతరోపచిత పుణ్యశతోదితేన,**
> **జాతోఽద్యమే మునివచః పరిబోధనేన, జాతోఽద్యమే మనసి చంద్రఇవ ప్రకాశః ॥**

మహాత్మా! శ్రీ వసిష్ఠ మహర్షీ! మాలో అనేక జన్మలుగా సంచితమొనర్పబడిన దుర్వాసనలు మా దృష్టిని అపవిత్రం చేసియున్నాయి. ఈ ఇరవై రెండు రోజులు ఎంతటి సుదినములు! తమ యొక్క అనుగ్రహం చేత "మా ఆధ్యాత్మిక మార్గంలో ఉన్న అడ్డులు తొలగించుకోవటం సులభమే అని నిరూపించి చూపారు". "మోక్షము సులభమే" అని చెప్పేవారు సద్గురువులు. "చాలా కష్టం సుమా!" – అని చెప్పవారు సద్గురువులనిపించుకోరు. హే సద్గురూ! మా సంచిత కర్మలు మా పట్ల కొండలవలె, మహావృక్షములవలె అనేక సంశయములను నిలబెట్టాయి. మా సంశయాలన్నీ మీరు మీ ప్రవచనములతో కూకటివ్రేళ్ళతో సహా తొలగించివేశారు. అనేక జన్మల సంచితమైన మా పుణ్య కార్యములు ఈనాడు మీ రూపం దాల్చి మమ్ములను కనికరించినట్లైనది. ఆహాఁ! ఇప్పుడు ఈ వసష్ఠి మునీంద్రుల వారిచే కావింపబడిన బోధచే ఉత్పన్నమైనట్టి ఆత్మ విచారణ నా మనస్సులో నిండు పున్నమి చంద్రునివలె అత్యంత ఆహ్లాదంగా ప్రకాశిస్తోంది. హే మునీంద్రా! మీ ఉపదేశము వలన ఎంతటి నిరతిశయానంద రూపమగు ఆనందం లభిస్తున్నది! మీరు ప్రతిపాదించిన "ఆత్మ దృష్టి" మహత్తరము, సులభసాధ్యము, మధురాతిమధురం కూడా! అయ్యో! ఈ జనులు దౌర్భాగ్యం చేత మాత్రమే ఇట్టి బోధను వినటానికి సిద్ధపడటం లేదే! మహాత్ముల సేవ, శుశ్రూష లేనివారై జనన–మరణాది అనేక కొయ్యలచే దహించబడుచున్నారే! అట్టివారు ఈ వసిష్ఠ – రామ సంవాదమును పఠన – శ్రవణ – మననాదుల ద్వారా ఉపాసించి సంసారలంపటము నుండి తరించటానికిగాను నా జన్మజన్మార్జిత పుణ్యమంతా ధారపోస్తున్నాను! ఇట్టి మహత్తరమైన విజ్ఞానరాజమును లోకములకు ప్రతిపాదించిన మీకు సాష్టాంగ దండ ప్రణామములు.

**శ్రీ వాల్మీకి మహర్షి :** అప్పుడు శ్రీ విశ్వామిత్ర మహర్షి పెదవులు విప్పి ఇట్లు పలికారు.

❖

**శ్రీ విశ్వామిత్ర మహర్షి :**

> **అహో! బత! మహత్పుణ్యం । శ్రుతం జ్ఞానం మునేర్ముఖాత్!**
> **యేన గంగా సహస్రేణ స్నాతా ఇవ వయం స్థితాః ॥**

ఆహా! ఏమి సంతోషకరమైన విషయం! ఈ బ్రహ్మర్షి వసిష్ఠ మునీంద్రుని ముఖతః అతి పవిత్రమైన జ్ఞాన సారమును మనం విన్నాం! మనమందరం ఎంతటి పుణ్యం చేసి ఉంటామో మరి! వేలకొలది గంగా స్నానాలు చేస్తే ఎంతటి పవిత్రులం కాగలమో, ఈ మహర్షి వాక్యముల శ్రవణముచే మనం అంతటి పవిత్రులం అయ్యాం!

**శ్రీరాముడు :** హే గురువర్యా! సమస్త సంపదల యొక్క సర్వశాస్త్రముల యొక్క సర్వ సంసార దృష్టుల వినాశనము యొక్క మహావాక్యార్థముల అర్ధ పరిశీలన యొక్క ఉత్తమ అవధి ఏమై ఉన్నదో... అద్దానిని మీ ప్రవచనసారమగు ఆత్మజ్ఞాన రూపంగా మేము పొందాం, తృప్తిపడ్డాం!

**శ్రీ నారద మహర్షి :**

> **యన్నశ్రుతం బ్రహ్మలోకే స్వర్గే భూమితలే తథా ।**
> **కర్ణే తజ్ఞా సమాకర్ణ్య యాతౌ మేఽ ద్య పవిత్రతామ్ ॥**

హే మహాత్మా! అరుంధతీపతీ! బ్రహ్మర్షీ ఏ జ్ఞానమైతే బ్రహ్మలోకంలోగాని, స్వర్గలోకంలోగాని, భూతలంపై గాని ఇంతవరకు నేను వినివుండలేదో... అట్టి జ్ఞానమును నేడు విన్నాను. నా చెవులు పరమ పవిత్రత్వం సంతరించుకున్నాయి. హే మహర్షీ! మీకు కృతజ్ఞతాపూర్వకమైన ప్రణామాలు!

**లక్ష్మణుడు :** మునివర్యా! బాహ్య-అభ్యంతరములందలి 'అజ్ఞానం' అనే అంధకారాన్ని మీ యొక్క జ్ఞాన వాక్య కిరణాలచే పటాపంచలు చేశారు. మీ ప్రవచనం మహోత్కృష్టం! అమోఘం! మోక్షము అనే మహత్తరమైన వస్తువును సశాస్త్రీయంగాను సులభంగాను ప్రసాదించగలుగునదై ఉన్నది.

**శత్రుఘ్నుడు :**

**నిర్వృతోఽస్మి! ప్రశాంతోఽస్మి! ప్రాప్తోస్మి పరమం పదమ్!**
**చిరాయ పరిపూర్ణోఽస్మి! సుఖమాసే చ కేవలమ్ ॥**

మహాత్మా! మీ అనుగ్రహముచే మీ ముఖ కమలంనుండి జాలువారిన బోధామృతమును గ్రోలి నేను పరమతృప్తిని పొందాను. ప్రశాంతుడనైనాను. పరమాత్మ పదమును పొందినవాడనయ్యాను! శాశ్వతముగ పరిపూర్ణుడను అయ్యాను. నేనిప్పుడు కేవలము నిరతిశయానంద స్వరూపమగు ఆత్మస్వరూపమున సుఖముగా వెలయుచున్నాను.

**శ్రీ దశరథ మహారాజు :** ఓ సభికులారా! మన ఈ అయోధ్యాసభ పరమపవిత్రమైనది! అనేక జన్మలందు లభించిన పుణ్యము చేతనే మనకు ఈ ధీరుడగు శ్రీ వసిష్ఠ మహర్షి యొక్క అత్యంత మధురము, పరమపవిత్రము అగు బ్రహ్మజ్ఞానోపదేశం లభించింది. దానిచే మనం పరమపవిత్రులమైనాం. హే మహర్షీ! మీకు ఏమి సమర్పించుకొని మేము తృప్తిపడగలమో,.... మీ ఆజ్ఞకై మేము వేచియున్నాము.

**శ్రీ వసిష్ఠ మహర్షి :** ఓ రఘుకుల చంద్రుడా! ప్రియ దశరథ మహారాజా! నేనిప్పుడు ఏది చెప్పు చున్నానో... అది ఆచరిస్తే నాకు సంతోషం. ఈ సభలో ఇప్పుడు జరిగిన సంవాదం మనోహరమై అనేక మంది భవిష్యత్ జనులకు జ్ఞానప్రసాదతమై వారి సంసార దుఃఖములను తొలగించుగాక!

ఈ యజ్ఞము దిగ్విజయంచేయు విధంగా బ్రహ్మనిష్ఠులను నీవు పూజించి సత్కరించెదవుగాక! పవిత్ర వేద – శాస్త్రజ్ఞులగు బ్రాహ్మణ సమూహములను సంభావన – సమారాధనలలో సంతోషింప జేయుము.

ఈ వసిష్ఠ రామ సంవాద యజ్ఞము ముగించు సమయములలో వేద – వేదాంగవేత్తలనుండి వేదగానం శ్రవణం చేసి, వారిని బహువిధములుగా సత్కరించెదవుగాక! మోక్షోపాయమగు ఈ గ్రంథ కథ యొక్క పరిసమాప్తి యందు అతిదరిద్రుడు కూడా తన శక్తి కొలది వేదవేత్తలగు బ్రాహ్మణులను సత్కరించాలి. ఇక మహారాజువగు నీకు వేరే చెప్పేదేమున్నది?

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** అప్పుడు ఆ వాక్యములు విని శ్రీదశరథ మహారాజు రాజగురు ఆజ్ఞానుసారం దూతల ద్వారా అయోధ్య – మధుర – సౌరాష్ట్ర మొదలైన ఆయా దేశములలోగల శ్రేష్ఠులగు

వేదవేత్తలైన బ్రాహ్మణులను ఆహ్వానించి సముచిత రీతిగా సత్కరించారు. అప్పుడు సర్వోత్తముడగు బ్రాహ్మణుని నుండి సామాన్యుడగు బ్రాహ్మణుని వరకు లక్ష మంది బ్రాహ్మణులకు సమారాధన జరిగింది. సభలో వేంచేసిన సభ్యులందరికీ మంత్రివర్యులు ఉచితరీతిగా జ్ఞాపికలు సమర్పించి పూజించారు. అట్లాగే నగరవాసులను, దీనులను, అంధులను, దరిద్రులను, ధన – దాన్యాదులు మొదలైన వాటితో సంతోషింపజేశారు.

నృత్యగీతాదులతో వేద ప్రవచనములతో అయోధ్యా నగరంలో ఏడు రోజులు ఉత్సవాలు జరిగాయి.

లోకాసమస్థాః సుఖినోభవంతు.

❖

**శ్రీ వాల్మీకి మహర్షి :** మహాబుద్ధిమంతుడవు – ప్రియశిష్యుడవు అగు ఓ భరద్వాజా! ఈ ప్రకారంగా శ్రీ వసిష్ఠ మహర్షి యొక్క బోధను శ్రవణం చేసినవారై శ్రీరామచంద్రుడు మొదలైనవారంతా జ్ఞేయమగు ఆత్మను ఎరిగి దుఃఖరాహిత్యమును పొందారు.

అట్లాగే నీవు కూడా ఉత్తమమగు “పూర్ణ బ్రహ్మాత్మదృష్టి”ని దృఢంగా అవలంబించి రాగరహితుడవు కమ్ము. దుఃఖ వర్జితుడవై ఉండు. ప్రశాంతమగు బుద్ధిని ప్రవృత్తపరచుకొన్న వాడవు కమ్ము! జీవన్ముక్తుడవై వెలుగొందుచూ సుఖముగా ఉండు! ఓ భరద్వాజా! నీ బుద్ధి కూడా శ్రీరామచంద్రుడు మొదలైనవారి బుద్ధివలెనే భోగములతో సంగము లేకుండా ఉన్నది. ఎవరి బుద్ధి సర్వజగత్ విషయములతో సంగము తొలగునట్లుగా అభ్యాసమును అనుసరిస్తుందో .... అప్పుడట్టివాడు ఆయా లౌకిక – సాంసారిక పరిస్థితులు సమీపించినప్పటికీ సంసారమునందు తగుల్కొనడు. మరింకెన్నటికీ మోహము పొందడు.

ఓ భరద్వాజా! శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునికి చెప్పినట్టి విశేషాలన్నీ పూసగ్రుచ్చినట్లుగా నీకు చెప్పాను. ఆ విషయాలన్నీ మననం చేస్తూ స్వవిచారణ చేయి. వాస్తవానికి ఇతఃపూర్వమే నీవు నిర్మల బుద్ధిని తపోధ్యానాది ప్రయత్నములచే సంపాదించుకొనియే ఉన్నావు. ఇప్పుడు ఈ అఖండ రామాయణము అనబడే ‘వసిష్ఠ రామ సంవాదము’ అనే మోక్ష సంహిత (యోగ వాసిష్ఠము)ను శ్రవణం చేసిన తరువాత మరింత అధికంగా ముక్తత్వమును సుస్పష్టము – పదిలము చేసుకొన్న వాడవయ్యావు. ప్రత్యక్షానుభవం కలుగజేయునట్టి ఈ పరమపవిత్రమైన మోక్ష కథనము వింటే బాలుడు – మందాధికారి కూడా ఆత్మజ్ఞానం సంపాదించు కుంటున్నాడు. ఇక నీవంటి మహావైరాగ్య సంపన్నులు, (తపోధ్యానముల దృష్ట్యా) ఉత్తమాధికారుల విషయం వేరే చెప్పేదేమున్నది? వసిష్ఠ మునీంద్రుని వాక్యములు నీ హృదయంలో ప్రవేశించటంచే, తత్ప్రభావం చేత సర్వ సంశయములు నశించుగాక! అజ్ఞానము నశించగా శ్రీరామచంద్రుడు మొదలైనవారివలె నీవు కూడా పవిత్రమైన జీవన్ముక్త పదమును పొంది దుఃఖ రహితుడవు అయ్యెదవుగాక!

ఆద్యము, నిత్య సిద్ధము అగు బ్రహ్మభావాన్ని పుణికి పుచ్చుకొని సుఖముగా ఉండెదవు గాక!

శ్రీవసిష్ఠ మునీంద్రుని సాంగత్యము చేత శ్రీరామచంద్రుడు మొదలైనవారంతా ఆత్మతత్త్వమును ఎరిగినట్లే... సజ్జనులగు మహాత్ముల శిక్షణ చేత ఆత్తతత్త్వ జ్ఞానము లభించగలదు.

ఉత్తమ ధర్మనిరతి – సేవలచేతను తత్త్వజ్ఞులగు వారిని ఆదరణపూర్వకంగా ప్రశ్నించి బోధోపాయయుక్తములగు కథనముల శ్రవణము చేతనూ – అప్రమత్తమైన ఉత్తమ బుద్ధి కలవారు ఆత్మతత్త్వమును పొందుచున్నారు.

ఓ తదితర ప్రియశిష్యులారా! ఓ సర్వ జనులారా! మీరంతా మోక్షమార్గమును, అందుకు ఉపయోగపడే కథనములను వినండి. మననము చేయుటయందు ఏమాత్రం ప్రమత్తులై ఉండకండి! అశ్రద్ధ – బద్ధకము అతిప్రమాదకరమైనవి సుమా! ఒక్కసారి ఈ జీవితమును పరికించి చూడండి. ఈ మానవజన్మ అనేక పుణ్యఫలముల ప్రయోజనంగా లభించింది. మరి ఇటువంటి సదవకాశాన్ని సద్వినియోగపరచుకోనక్కర్లేదా? జీవితమును తినటానికి – త్రాగటానికి వెచ్చించివేస్తే ఇంతటి మహత్తరమైన అవకాశము కోల్పోయినట్లే అవుతుంది. కదా! అయ్యో! శ్రీరామచంద్రుడు లోకములకు విశదీకరించి చెప్పినట్లుగా... బాల్యావస్థ అంతా క్రీడలందు ఆసక్తితో అజ్ఞానంగానే గడచిపోతోందే?

ఇక ప్రౌఢ వయస్సు రాగానే 'తృష్ణ' అనే వికారము జన్మజన్మార్జితమై ఉన్నందువల్ల అది బయలుదేరి అనేక గృహ – పుత్ర – దారా – ధనాదుల పట్ల మమత్వరూపంగా ప్రకటితమై, యౌవనమంతా బూడిదపాలు చేసివేస్తోందే!

ఇక వార్ధక్యము నిస్సత్తువ – నిస్సహాయత – నిష్ప్రయోజనమైన కోపము – తాపము – ఆవేశములతో నిండిపోయి ఉంటోందే!

ఇటువంటి పరిస్థితులలో అశ్రద్ధ – బద్ధకము ఎంత ప్రమాదకరమైనవి! కాబట్టి లేవండి. లేచి నడుము బిగించండి. ఉత్తమ కర్మలను – సాధనములను ఆశ్రయించండి. విజ్ఞులగు ఆత్మవేత్తలను ఆశ్రయించండి. మీ స్వరూపముపైగల మీ మీ సందేహములను తొలగించుకోండి! మోక్షోపాయ కథనములు పారాయణం చేయండి. శ్రీ వసిష్ఠ మహర్షి ప్రవచనములు బుద్ధితో హృదయస్థం చేసుకొని, మీ "అప్రమేయము, నిత్యము, సమున్నతము, అఖండము" అగు ఆత్మయొక్క స్వరూప, స్వభావములలో ప్రవేశించినవారై ఈ జగత్తులను మీ ఆత్మసంకల్పమాత్రదేహం గాను, మీ ఆత్మచే ఆకర్షించబడిన భావనాకల్పనామాత్రంగాను దర్శించి తరించండి. సర్వ జీవులలో వేంచేసియున్న ఆత్మతో ఏకత్వము పొందినవారై, సర్వాత్మకులై ఆత్మానందమును ఆస్వాదించండి.

**మోక్షోభ్యుపాయాన్సు మహానుభావాన్! జ్ఞాస్యన్తి యే తత్త్వవిదాం వరిష్ఠాః**
**పునః సమేష్యన్తి న సంసృతిం తే కోఽర్థః సుతా అన్యేన బహూది తేన ॥**

ఓ భరద్వాజా! ఇక ఎక్కువగా చెప్పవలసినదేమున్నది? మందాధికారులకు కూడా శ్రీ వసిష్ఠ రామ సంవాదము (యోగవాసిష్ఠము – మహా రామాయణము) అజ్ఞాననాశనమునకై ఉత్తమ ఔషధమైయున్నది. ఈ మహత్తరమగు మోక్షోపాయం స్వయంగాకానీ, గురుముఖతః కానీ శ్రద్ధగా

శ్రవణం చేస్తే మహత్తరమైన ప్రయోజనం సిద్ధించగలదు. అట్లా శ్రద్ధగా శ్రవణం చేసేవారు తత్త్వవేత్తలలో శ్రేష్ఠులై మరల సంసారమును పొందనివారై ఉండగలరు.

ఏ సజ్జనులైతే మోక్షోపాయ గ్రంథమును విద్వాంసులగు గురువుల సమక్షంలో చక్కగా విచారణ చేసి ఇందలి సంవాదము యొక్క పరమార్థాన్ని హృదయస్థం చేసుకొని తదితరులగు ముముక్షువులకు బోధించుతూ ఉంటారో … అట్టివారు పునర్జన్మరహితులౌతారు. మరల అజ్ఞానమున పడరు. అట్టి బ్రహ్మజ్ఞానమునకు తదితరములైన వాక్యముల వలన ఏమి ప్రయోజనం?

**పారాయణం** – అర్థం తెలియకపోయినప్పటికీ ఎవరైతే ఈ మోక్షోపాయ గ్రంథమును పారాయణం శ్రద్ధగా చేస్తూ ఉంటారో, ఏ ఆపేక్ష లేకుండానే ఇతరులకు వ్యాఖ్యానం చెప్పుచూ ఉంటారో… అట్టివారు –

– సకాములైతే రాజసూయ యజ్ఞఫలమును పొందినవారై సర్వసంపదలు పొందుతారు. స్వర్గలోకంలో ఉత్తమ సుఖములకు అర్హులౌతారు.

– అకాములైతే ఉత్తరోత్తరా ఉత్తమ జన్మలు పొందుచూ క్రమంగా ఆత్మ సాయుజ్యం పొందగలరు.

ఓ భరద్వాజా! దివ్యదృష్టితో శ్రవణం చేయబడి నాచే రచించబడిన ఈ మోక్ష సంహితను పూర్వము అచింత్య రూపుడగు బ్రహ్మదేవుడు మునుల సమాజమును ఉద్దేశించి వ్యాఖ్యానించటం జరిగింది. ఆ బ్రహ్మదేవుడు "సత్యవక్తలగు శ్రీ వసిష్ఠ మునీంద్రుని యొక్క – శ్రీ వాల్మీకి మహర్షి యొక్క వాక్యములు ఎన్నటికీ అసత్యం కాదు"… అని ప్రోత్సహాశీర్వచనం పలికియున్నారు.

**మోక్షోభ్యుపాయాఖ్య కథా ప్రబంధే, యాతే సమాప్తిం సుధియా ప్రయత్నాత్**

**సువేశ్మ దత్వాఽభిమతాన్నపాన దానేన విప్రాః పరిపూజనీయాః**

నమామ వేదమాతః! వేదమాత యొక్క అనుగ్రహంచేతనే నేను శ్రీ వసిష్ఠునికి – శ్రీరామచంద్రునికి జరిగిన సంవాదమును జ్ఞానేంద్రియములతో శ్రవణం చేసి గ్రంథస్థం చేయగలిగాను. అందుచేత ఈ మోక్షోపాయ కథ సమాప్తియందు ఉత్తమ అన్న – పాన – దానములతో విప్రులను పూజించి ఉత్తమ ఫలములు పొందుదురుగాక! అట్లు దానాదులు చేయువాడు తాను కావించిన సుకృత ఫలమును శాస్త్రానుసారం అవశ్యం పొందుతాడు. కనుక అది ముందుముందు పుణ్యఫలములను సమృద్ధి పరచుకొన్నట్లే అగుచున్నది.

ఓ భరద్వాజా! ఈ ప్రకారంగా…అనేక ఉపాఖ్యానాలతో అలంకరించబడినది, అనేక దృష్టాంత – యుక్తులతో సమకూర్చబడినది. అగు బ్రహ్మ తత్త్వ ప్రతిపాదకమగు "మోక్షోపాయము" అనే ఈ పవిత్రమైన శాస్త్రమును నీకు బోధకొరకై ఇప్పుడు మరల చెప్పటం జరిగింది. నీవిక జీవించియున్నంత కాలం 'విముక్తి భావము'తో కూడుకొని యున్నవాడవయ్యెదవుగాక! లోకశ్రేయస్సును ఉద్దేశించినవాడవై ఇతఃపూర్వంలాగానే జ్ఞాన – తపః క్రియా యుక్తమగు కర్మలు, కార్యక్రమములు కొనసాగించు. శ్రీ వసిష్ఠ మహర్షి ప్రవచనమును మననం చేస్తూ బుద్ధితో హృదయస్థం చేసుకొంటూ ఉండు. క్రమంగా

దేహసహితుడవై ఉండి కూడా దేహరహితుడవై, దేహమునకు అతీతమగు 'దృక్' రూపమును అవధరించినవాడవై ఉండగలరు. శాశ్వతము – ప్రశాంతము – నిరతిశయానంద రూపము అగు ముక్తిని పూర్ణముగా సంప్రాప్తించుకొన్నవాడివై స్వయంజ్యోతి స్వరూపుడవై ప్రకాశించగలవు. ఈ శాస్త్రపాఠకులకు అట్టి ఫలము స్వభావ సిద్ధమై చెన్నొందగలదు.

❖

**శ్రీ వాల్మీకి :** ఓ అరిష్టనేమి రాజా! ఈ ప్రకారంగా ఆ వసిష్ఠ మునీంద్రుడు శ్రీరామచంద్రునికి బోధించినది, అగస్త్య మునీంద్రుడు ఆ సభలో ఉండి విని సుతీక్ష్ణునకు ఉపదేశించినది అగు 'మోక్షోపాయం' అనే మోక్షశాస్త్రమును సుభాషితంగా నీకు మరల చెప్పాను. తత్త్వమార్గమును బోధిస్తున్నట్టి ఈ గ్రంథము ద్వారా నీవు తప్పక బ్రహ్మపదమును పొందగలవు.

**అరిష్టనేమి రాజు :**

**సద్గురు – జగద్గురు శ్రీ వసిష్ఠం నతాస్మః ।**

మహాత్మా! వాల్మీకి మహర్షీ! ఆహాఁ! ఏమి మీ పాద స్పర్శ మహిమ! తమ కృపాకటాక్షముచే నా సంసారబంధమంతా నశించిపోయినదయింది.

కేవలం మీరు చెప్పుచుండగా వినినంత మాత్రం చేతనే నేను సంసార సముద్రమును దాటివేయగలిగానే!

❖

**దేవదూత :** ఓ అప్సరసా! అప్పుడు ఆ అరిష్టనేమి రాజు వికసించిన నేత్రముతో విరాజిల్లుచూ నా వైపు తిరిగి మధురమైన వాక్కుతో ఇట్లా పలికారు.

**అరిష్టనేమి రాజు :** ఓ ప్రభూ! దేవదూతా! నన్ను ఉద్ధరించటానికి ఈ శ్రీ వాల్మీకి మహర్షి సమక్షమునకు కొనితెచ్చినందుకు మీకు సర్వదా కృతజ్ఞుడను. నా పాదాభివందనం స్వీకరించండి. మీకు సర్వదా సకుశలమగుగాక!

"సజ్జనులతో ఏడు అడుగులు నడిస్తే, ఏడు మాటలు మాట్లాడితే చాలు... మహత్తరమైన ప్రయోజనం ఉంటుంది" ...అని పెద్దలు చెప్పుచున్నది మీరిప్పుడు పరమసత్యమని నిరూపించారు. స్వామీ! ఇప్పుడు మీరు మీ స్వస్థానమగు ఇంద్ర లోకమునకు వెళ్ళి రండి! మీకు సర్వదా శుభమగుగాక! నేనిప్పుడు మహాత్ముడు, మహనీయుడు, మాననీయుడు అగు శ్రీ వాల్మీకి మహర్షి దివ్యమైన పెదవుల నుండి జాలువారిన శ్రీ వసిష్ఠ – శ్రీరామ సంవాద రూపమగు 'యోగవాసిష్ఠము' అనబడే అఖండ రామాయణము శ్రవణం చేసి పునీతుడనైనాను. శాంతిని, పరితృప్తిని నిరతిశయానంద లాభమును పొంది మహాప్రసన్నుడనై ఉన్నాను. వీరి వద్దనుండి నేను వినిన దానిని మననం చేస్తూ అర్థము యొక్క విచారణ చేస్తూ సంతోషభరితుడనై ఇచ్చటనే ఉండెదనుగాక!

❖

**దేవదూత :** ఓ మంగళ స్వరూపిణీ! అప్సరసా! ఆ విధంగా ఆ అరిష్టనేమి మహారాజు నాతో పలుకగా, ఆతని వినయము-వైరాగ్య గుణములు చూచి నేను ఆశ్చర్యపడకుండా ఉండలేక పోయాను! ఇంతకు ముందు నేను ఎప్పుడూ సత్సంగముచే ఇటువంటి జ్ఞానసారమును వినియుండలేదు. నా పూర్వపుణ్య వశంచేతనే అరిష్టనేమి మహారాజును శ్రీ వాల్మీకి మహర్షి వద్దకు కొనిపోయి పరిచయం చేయమని మన ప్రభువు ఇంద్రదేవులు ఆజ్ఞాపించటం జరిగింది. అటువంటి మన ఇంద్రదేవులకు ఇవే నా కృతజ్ఞతలు.

పాపరహితవగు ఓ అప్సరసా! ఆ విధంగా అరిష్టనేమి మహారాజుచే సంబోధింపబడినవాడనై, శ్రీ వాల్మీకి మహర్షి వద్ద సెలవు తీసుకొని ఇటు వస్తూ ఉండగా నీవు నన్ను ఆపి "నీ ముఖంలో ఆ సంతోషం అంతగా ఎందుకు వెల్లివిరుస్తోంది?" ...అని ప్రశ్నించావు. కాబట్టి ఉన్నదున్నట్లుగా అంతా చెప్పాను. ఆహాఁ! నీ దయచే ఇప్పుడు శ్రీ వసిష్ఠ రామసంవాదమును మననం చేసుకున్నందుకుగాను నీకు అభివందనములు!

**అప్సరస :** మహాభాగ్య శీలుడవగు ఓ దేవదూతా! మీకు హృదయపూర్వకంగా నమస్కరిస్తున్నాను. మీరు వినిపించిన ఈ శాస్త్రార్థ విజ్ఞానముచే నాకు పరమశాంతి కలుగుతోంది.

**కృతార్థా వీతశోకాస్మి స్థాస్యామి విగతజ్వరా**
**ఇదానీం గచ్ఛ భద్రం తే య థేచ్ఛం శక్ర సన్నిధౌ ॥**

ఓ దేవదూతా! ఇప్పుడు నేను కృతార్థురాలనైనాను. నా దుఃఖం మొదలంటా శమించింది. సంతాపవర్జితురాలనైనాను. ఇక మీరు మీ ఇచ్ఛానుసారం ఇంద్రదేవుని సన్నిధికి వెళ్ళిరండి. మీకు సర్వదా శుభమగుగాక!

❖

**అగ్నివేశ్యుడు :** ప్రియ పుత్రకా! కారుణ్యా! ఈ విధంగా శ్రీ వసిష్ఠ మునీంద్రుని ఉపదేశమంతా నీకు వినిపించాను. అందలి విశేషాలన్నీ బాగుగా విచారణ చేయి. "మోక్షసాధనకు 'కర్మ-జ్ఞానము' అనే రెండూ కూడా బండికి రెండు చక్రముల వంటివి" అని గ్రహించు. ఒకటి వదలితే రెండవది ఆశయము సిద్ధింపజేయలేదని గ్రహించావు కదా! ఇక ఆపై నీకు ఎట్లు ఇష్టమో, అట్లు ఆచరించు. 'జీవితము' అనే అవకాశము యొక్క "ఆశయము" ఏమిటో గమనించినవాడివై వర్తించు.

**కారుణ్యుడు :** తండ్రీ! మీరు వివరించిన శ్రీ వసిష్ఠ మహర్షి యొక్క ప్రబోధము అత్యద్భుతము. నాకు అత్యుత్తమంగా మార్గదర్శకము.

భూత - భవిష్యత్ - దూరస్థ పదార్థముల యొక్క స్మృతి, వాక్ వ్యవహార రహస్యం!

వర్తమాన విషయములను గూర్చిన దృష్టిసత్త యొక్క స్వప్నత్వం.

ఇన్నెందుకు! ఈ సంసార స్థితి అంతా కూడా నా కిప్పుడు తత్త్వజ్ఞాన ప్రభావంచేత 'స్వప్న ప్రాయం' అనే అనుభవం లభించింది. 'వంధ్య యొక్క రెండవ కుమారుడు' అనే వాక్యమువలె,

"మరు భూమిలోని మృగతృష్ణాజలం"లాగా ఈ దృశ్యము మిథ్యామాత్రంగాను, నిర్విషయంగాను, అధిష్ఠాన దృష్టిచే "ఆత్మయే ఈ సర్వముగా కనబడుతోంది" అని కూడా నాకు విదితమైనది.

పూజ్యులగు పితృదేవా! ఇప్పుడు నాకు ఈ ప్రపంచంలో కర్మలు చేయటంచేతగాని, చేయకుండటం చేతగాని ఏ ప్రయోజనమూ లేదు. అయితే "శ్రీరామచంద్రుని లాగానే యథా ప్రాప్తములైన వర్ణాశ్రమ ధర్మములు నాచే నిష్కామంగాను, నిర్వికారంగాను నిర్వహించబడుగాక!" ...అనే నిర్ణయానికి వచ్చాను. కర్మాచరణము – కర్మత్యాగము (అకర్మ) ... ఈ రెండూ సమానమే అయినప్పటికీ... కర్మత్యాగము పట్ల నాకు పట్టుదల ఉండవలసిన పనేమి ఉన్నది? లోకకళ్యాణార్థమై విహిత కర్మలు నిశ్చింతగా నిర్మలబుద్ధితో నిర్వర్తించటానికి సంసిద్ధుడనై ఉన్నాను.

❖

**అగస్త్య మహాముని :** ఓ సుతీక్ష్ణా! జ్ఞానముచే కృతార్థుడైనట్టి ఆ అగ్నివేశ్యుని కుమారుడు కారుణ్యుడు ఆ విధంగా పలికి అటు తరువాత తండ్రి వద్ద 'కర్మాధికారము' పొందినవాడై యథోచితమైన స్నాన –దాన–అగ్నిహోత్రాది యథాప్రాప్తములైన కర్మలను ధర్మవిధి పూర్వకంగా ఆచరించనారంభించాడు.

**సందేహో అత్ర న కర్తవ్యః సుతీక్ష్ణ! జ్ఞానకర్మణి ।**
**సంశయాత్ భ్రశ్యతే స్వార్థాత్, సంశయాత్మా వినశ్యతి ॥**

కాబట్టి ఓ సుతీక్ష్ణా! జ్ఞానము – కర్మల విషయంలో ఇక నీవు ఎటువంటి సందేహము కలిగివుండకు! "జ్ఞానము ప్రాప్తించుటకు కర్మలు బంధం (అడ్డు) అవుతాయి" అని సందేహించవలసిన పనిలేదు సుమా! సంశయముచే ఈ మానవుడు నిజప్రయోజనం నుండి చ్యుతి చెందుతాడు. సంశయములు కొనసాగించువాడు లక్ష్యప్రాప్తి పొందలేకపోతాడు. శ్రీ వసిష్ఠ మునీంద్రుని ప్రవచనం అనేక విహిత ధర్మములతో ఒకానొక 'అవిరోధము'ను ప్రసాదిస్తోంది కదా!

ఆత్మానందము యొక్క సులభత్వము – సహజత్వము నిరూపించి చూపుతోంది. అప్పుడు అది విని సుతీక్ష్ణుడు వినయముతో కూడుకొన్నవాడై లేచి నిలబడ్డాడు. గురువర్యులగు అగస్త్యమునికి సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించాడు. ఇట్లా పలికాడు.

**సుతీక్ష్ణుడు :**

**నష్టమజ్ఞాన తత్కార్యం ప్రాప్తం జ్ఞాన మనుత్తమమ్**
**సాక్షిణి స్ఫురితాభాసే ధ్రువే దీప ఇవ క్రియాః**
**సతి యస్మిన్ ప్రవర్తన్తే చిత్తేహాః స్పందపూర్వికాః**

హే సద్గురూ! అగస్త్య మహామునీ! మీ బోధ ప్రభావంచేత నా అజ్ఞానం తత్కార్య–కారణసహితంగా నశించింది. సర్వోత్తమమగు ఆత్మజ్ఞానం లభించింది.

దీపం వెలుగుతూవుంటే అద్దాని, ప్రకాశంలో నాట్యరంగంపై నర్తకుల నృత్యం కొనసాగుతూ ఉంటుంది కదా! ఆ నృత్యము యొక్క భంగిమలలోని లోపాలోపములతో దీపమునకు పనేమున్నది? సంబంధమేమున్నది? అట్లాగే పరమాత్మ సర్వసాక్షి అయి, స్వయంజ్యోతి స్వరూపమై, స్థితినొంది

ఉండగా, .... అద్దానిచే ప్రకాశింపబడుచున్న ఈ దేహము, ఈ చిత్తము, వాటి వాటి చేష్టలు, సమస్త లౌకిక – వైదిక క్రియలు వర్తిస్తున్నాయి.

అంతేకాకుండా... బంగారముచే చేయబడ్డ ఉంగరము – గాజులు – జడబిళ్ళ – గొలుసు – భుజకీర్తులు – వడ్డాణం మొదలైన వేరువేరు ఆభరణములన్నీ బంగారమే కదా! ఆ విధంగా బంగారంలో వివిధ ఆభరణములు స్ఫురిస్తున్నట్లుగా .... పరమాత్మ యందు ఈ వివిధ నామ – రూప సమన్వితమైన జగత్తు స్ఫురిస్తోంది. తరంగాలు వేరువేరైనా అన్ని తరంగాలలోని జలం ఒక్కటే కదా! అనేక దేహములలోని దేహి ఒక్కటే! ఈ కనబడే దృశ్య జగత్తంతా పరమాత్మ స్వరూపమే అయివున్నది. ఇది పరమాత్మ కంటే ఒక అణువు కూడా భిన్నం కాదు. పూర్ణమగు ఈ జగత్తు పూర్ణమగు పరమాత్మ యందే నెలకొనియున్నది.

**యథా ప్రాప్తోఽ నువర్తామి, కోఽలజ్ఘయతి సద్వచః?**

మహాత్మా! అగస్త్య మహామునీ! ఈ విధంగా నిశ్చయించుకున్నవాడినై యథా ప్రాప్తములైన కర్మలు నిర్వర్తించెదను. తమవంటి సజ్జనుల సద్వచనములు నాకు శిరోధార్యం! ఎవరైనా మీ వంటి పెద్దల ఆజ్ఞ ఎట్లా ఉల్లంఘించగలరు?

**భగవన్! త్వత్ ప్రసాదేన జ్ఞాతజ్ఞేయోఽస్మి సంస్థితః**
**కృతార్థోఽహం సమస్తేఽస్తు దండవత్పతితో భువి!**

మహాత్మా! తమ అనుగ్రహంచే నేనిప్పుడు 'జ్ఞేయము' అగు ఆత్మను ఎరిగినవాడనైనాను. కృతార్థుడనైనాను. అనేక దుష్ట సంకటముల పరంపరలకు త్రోవతీయగల సంసారము నుండి నన్ను ఈనాటికి పరిరక్షించిన తమకు భూమిపై సాష్టాంగ దండ పూర్వకమైన ప్రణామములు సమర్పించు కుంటున్నాను. పరమ పురుషార్థప్రదమగు ఆత్మజ్ఞానమును ఉపదేశించిన గురువుకు... అట్టి మహోపకారముతో సమానమైనది ఏది శిష్యుడు ఇచ్చుకోగలడు? అందుచేత నా మనోవాక్కాయ కర్మలచే ఆత్మనివేదనము గావించుకొంటున్నాను. ఈ జగత్తులో 'నాది' అయినదంతా తమకు సమర్పించినదిగా అగుగాక! "ఆత్మ నివేదనము"చే అంతటా ఆత్మగాను, అంతా ఆత్మగా దర్శించువాడనై మీ ఆశయమును మీవాక్య సారాంశమును నెరవేర్చగలగటమే... మీకు గురుదక్షిణగా నా నుండి సమర్పించబడుచున్నదై ఉండుగాక! అప్పుడే కదా గురువుకు తృప్తి!

స్వామీ! తమ అనుగ్రహంచేత సంసార సముద్రమును దాటి వేసిన వాడనైనాను. నా యొక్క పూర్ణానంద రూపముచే బ్రహ్మాండ సమూహమునంతా ముంచివేయుచు వెలయుచున్నాను.

❖

**యత్సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి చ స్ఫుటమ్**
**శ్రుత్వా హ్యుదీర్యతే సామ్ని, తస్మై బ్రహ్మాత్మనే నమః ॥**

ఏ బ్రహ్మము సామవేదముచే (సర్వం ఖల్విదం బ్రహ్మ – తజ్జలానితి శాంత ఉపాసీత – ఈ ప్రపంచమంతా బ్రహ్మమునందే లయించుచున్నది అని) గానము చేయబడుచున్నదో... అట్టి ఆ

బ్రహ్మమే ఈ జగత్తు. అట్టి బ్రహ్మమే ముముక్షువులందరికీ (ఎవరు ఏ పేరుతో పిలిచి నివేదనము సమర్పించినా సరే) ... ఉపాసనా వస్తువు అయివున్నది. ఈ విషయం శ్రుతి – స్మృతి ప్రవచనముల సారవాక్యమే అయివున్నది. అట్టి బ్రహ్మమునకు నమస్కారం.

**బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం జ్ఞానమూర్తిం,**
**ద్వంద్వాతీతం, గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం**
**ఏకం, నిత్యం, విమలం, అచలం, సర్వధీసాక్షి భూతం**
**భావాతీతం త్రిగుణ రహితం శ్రీ వసిష్ఠం నతాః స్మః ॥**

బ్రహ్మానంద రూపులు, జ్ఞానోపదేశముచే ఆత్మ సుఖమును ప్రసాదించువారు, కేవలము జ్ఞాన స్వరూపులైనవారు. ద్వంద్వములన్నిటికీ అతీతులైనవారు, ఆకాశమువలె నిర్మల – అఖండ స్వరూపులు, "ఓ బిడ్డా! నీవే బ్రహ్మమవు" అనే ఆశయమును కలిగియుండి ప్రతివాక్యము బోధించువారు, ద్రష్టలందరి యొక్క ఏకైక స్వరూపులు, భూత – వర్తమాన – భవిష్యత్తులందు యథాతథమగు అఖండాత్మ స్వరూపులు, అత్యంత నిర్మల స్వరూపులు, సర్వచలనములకు ఆధారభూతమై తాను మాత్రము చలనాదులు కలిగియుండనట్టి నిశ్చల – కూటస్థ స్వరూపులు, సమస్త ప్రాణులయొక్క బుద్ధివృత్తులకు సాక్షి అయినవారు, భావముల కంటే ముందే ఉన్నట్టి భావాతీత స్వరూపులు, త్రిగుణములచే స్పృశించబడనివారు అగు... వసిష్ఠ మహర్షి స్వరూప పరబ్రహ్మమునకు మేమందరము నమస్కరించుచున్నాము.

❖❖❖

# నిర్వాణ ప్రకరణం సమాప్తం

బ్రహ్మార్పణమస్తు – లోక కళ్యాణమస్తు

ఓం తత్‌సత్

❖❖❖

## శ్రీ వసిష్ఠ - రామ సంవాదము
## (యోగవాసిష్ఠము - అఖండ రామాయణము -మహా రామాయణము)
## సంపూర్ణమ్

❖❖❖

శ్రీ సద్గురుభ్యోం నమః

ఏ పరమాత్మ రామ – కృష్ణ – శివ – యహోవా – అల్లా – బుద్ధ – సాయి – ఈశ్వర – పరమేశ్వర – లలిత – అనసూయ ఇత్యాది అనంతనామ స్వరూపుడై ఆరాధించబడుచున్నారో... అట్టి సర్వాత్మకుడు – అస్మత్ స్వరూపుడు అగు పరాత్పరునకు ఆయన కిరణ స్వరూపుడనగు నేను ఆత్మ నివేదనపూర్వకంగా ఈ సర్వము సమర్పించుకుంటున్నాను.

సర్వ జనులకు శుభమగు గాక!

ప్రపంచ శాంతి వెల్లివిరియునుగాక!

ప్రేమాస్పదుడగు పరమాత్మను సర్వే సర్వత్రా దర్శించు మహనీయుల పాదపద్మములకు ఈ నా నమస్కార కుసుమము స్పృశించునుగాక!

'బ్రహ్మానంద స్వరూపులు – మమాత్మ స్వరూపులు అగు పాఠక మహాశయులు చదివి – విని ఆత్మానందభరితులయ్యెదరుగాక!'

లోకకళ్యాణమస్తు

ప్రపంచశాంతి వెల్లివిరియునుగాక!

**ఆపదాం అపహర్తారమ్ దాతారం సర్వసంపదామ్ ।**
**లోకాభిరామమ్ శ్రీరామమ్ భూయో భూయో నమామ్యహమ్ ॥**

❖❖❖

**కృతార్థోస్మ్యహమ్, దండవత్ పతితోభువి యేలేశ్వరపు హనుమ రామకృష్ణ**

❖❖❖

**॥ శ్రీరామకృష్ణార్పణమస్తు ॥**

❖❖❖

ఓ రామచంద్రా! ఈ ప్రపంచంలో ఆశ్చర్యకరమైన విద్యలు ప్రదర్శించి పూజింప బడాలని, జనులను ఆకర్షించాలని తమ అజ్ఞానం చేత ప్రయత్నించేవారు కొందరు ఉంటారు.

అయితే... "మంత్రము - ఔషధము" మొదలైన వాటి బలంచేత ఆకాశ గమనము, సుదూర దర్శనం మొదలైన విద్యలు అజ్ఞానులకైనా సిద్ధించవచ్చు. ఎవడు దేని కొఱకై క్లేశాదులను సహించి ప్రయత్నిస్తాడో... ఆతడు ఆయా విశేషాలు కాలక్రమంగా తప్పక పొందుతాడు. అట్టి విశేషాలు జ్ఞానికైనా, అజ్ఞానికైనా సిద్ధిస్తాయి. కాబట్టి అట్టి భౌతిక విద్యలను చూచి ఒకడు జ్ఞాని అని గాని, అజ్ఞాని అని గాని మనం నిర్ణయించలేము. గంధపు చెక్కలో చందన సుగంధం అంతర్గతంగా ఉన్నట్లే... సర్వుల హృదయాలలో వారు నిర్వర్తించియున్న విహిత - నిషిద్ధ కర్మఫలములు ఉండనే ఉంటాయి. అని అయా కాలానుగతంగా ఆవిర్భవించి ఆ కర్తను ఆశ్రయిస్తాయి. కర్మల గతి అట్టిది. లోకంలో ధనాదుల వంటివే సిద్ధులు కూడా! ఎవనికైతే దృశ్యరూపాలే అయినట్టి సిద్ధులు మొదలుగా గల ఆయా వస్తు వ్యవహారముల పట్ల "ఇవి నేను కూడా పొందాలి" అనే ఆకాంక్ష - ఆవేశము - అభినివేశము పెంపొందుచున్నదో... అది సంసార రూపమే సుమా! "ఈ ఆకాశగమనాది సిద్ధి సమూహమంతా కేవలం మనస్సును భ్రమింపజేసేవి, అల్ప విషయములు మాత్రమే" అని ఎఱిగి ఎవడు చిదాకాశమునందే లక్ష్య శుద్ధి కలిగి ఉంటాడో... అట్టి వాసనారహితుడగు తత్త్వజ్ఞునకు వాటి పట్ల అభినివేశముగాని, దంభముగాని ఎందుకు ఉంటుంది?

**వసిష్ఠ మహర్షి**

**పుట : 522**

CONQUER YOURSELF
ISBN 93-83972-14-2 (Set)

**రామకృష్ణ మఠం**
దోమలగూడ, హైదరాబాదు-29
email : publication@rkmath.org

www.rkmath.org

Vasishta Rama Samvadam : Vol 4
ISBN 93-83972-13-5 ₹ 1000/- (set)